మహాభారతం నూరుపర్వాల గ్రంథమనీ, లక్షశ్లోకాల విస్తృతిని సాధించిందనీ ప్రసిద్ధి. నన్నయభట్టు చెప్పిన వివరాలు ఈ సత్యానికి దగ్గరగా ఉన్నాయి. (చూడండి ఆదిపర్వంలోని పర్వానుక్రమణిక) వివరణకు ఈ పట్టిక గమనించండి.

| పర్వంపేరు - | ఉపపర్వాలసంఖ్య - | సంస్కృతభారతంలో - శ్లోకాలసంఖ్య | ఆంధ్రభారతంలో - ఆశ్వాసాల సంఖ్య | పద్యగద్యసంఖ్య |
|---|---|---|---|---|
| 1. ఆదిపర్వం | 18 | 9,984 | 8 | 2,084 |
| 2. సభాపర్వం | 9 | 4,311 | 2 | 618 |
| 3.అరణ్యపర్వం | 16 | 13,664 | 7 | 2,894 |
| 4. విరాటపర్వం | 4 | 3,500 | 5 | 1,624 |
| 5. ఉద్యోగపర్వం | 11 | 6,998 | 4 | 1,562 |
| 6. భీష్మపర్వం | 5 | 5,884 | 3 | 1,171 |
| 7. ద్రోణపర్వం | 8 | 10,919 | 5 | 1,860 |
| 8. కర్ణపర్వం | 1 | 4,900 | 3 | 1,124 |
| 9. శల్యపర్వం | 4 | 3,220 | 2 | 827 |
| 10.సౌప్తికపర్వం | 3 | 2,874 | 2 | 376 |
| 11. స్త్రీపర్వం | 5 | 1,775 | 2 | 376 |
| 12. శాంతిపర్వం | 4 | 14,525 | 6 | 3,093 |
| 13. అనుశాసనికపర్వం | 2 | 12,000 | 5 | 2,148 |
| 14. అశ్వమేధ పర్వం | 2 | 4,420 | 4 | 976 |
| 15. ఆశ్రమవాసపర్వం | 3 | 1,106 | 2 | 362 |
| 16. మౌసలపర్వం | 1 | 300 | 1 | 226 |
| 17. మహాప్రస్థానిక పర్వం | 1 | 120 | 1 | 79 |
| 18. స్వర్గారోహణపర్వం | 1 | 200 | 1 | 97 |
| 19. హరివంశపర్వం, భవిష్యపర్వం | 2 | -(వదలబడినవి) | | |
| మొత్తం : | 100 | 1,00,500 | 63 | 21,507 |

మహాభారతంలో ముఖ్యపర్వాలూ, ఉపపర్వాలూ కలిసి నూరున్నాయి. అందులో హరివంశపర్వం, భవిష్యపర్వంతో కలిసి ఇమిడి ఉన్నది. కొందరు దానిని ఖిలవంశపురాణ మని అంటారు; స్వతంత్ర ప్రతిపత్తి గల గ్రంథంగా పరిగణిస్తారు. నన్నయ హరివంశాన్ని తన గ్రంథప్రణాళికలో చేర్చలేదు. తిక్కనాదులు నన్నయ నిర్ణయాన్ని అనుసరించారు. ఎఱ్ఱన హరివంశాన్ని వేరే గ్రంథంగానే రచించాడు. నన్నయ సంస్కృత మహాభారతంలోని శతపర్వాలనూ వాటి శ్లోక సంఖ్యలనూ పేర్కొన్నాడు. తాను విభక్తం చేసి చూపిన అష్టాదశపర్వాలలో గల అంశాలను పర్వసంగ్రహంలో నిర్దేశించాడు. ఉపపర్వవిభాగాన్ని తెలుగులో పొందుపరచలేదు. ఈవిధంగా నూరు ఉప పర్వాల సంస్కృత మహాభారతం తెలుగులో అష్టాదశ ముఖ్య పర్వాల మహాభారతమై అవతరించింది.

## ఆంధ్రుల ఆదికావ్యం నన్నయ భారతం

సంస్కృత సాహిత్యంలో వాల్మీకి ఆదికవి; కన్నడ సాహిత్యంలో పంపడు ఆదికవి; తెలుగు సాహిత్యంలో నన్నయ ఆదికవి అని ప్రసిద్ధి, నన్నయ ఆరంభించిన ఆంధ్రమహాభారతం తెలుగులో ఆదికావ్యం. నన్నయ ఆది సభాపర్వాలను, ఆరణ్యపర్వంలోని నాలుగో ఆశ్వాసంలో కొంతభాగం (క్రీ.శ. 1054-61 సం॥ల మధ్య) రచించి దివంగతుడైనాడు. ఆ తరువాత 13వ శతాబ్దంలో తిక్కన విరాటపర్వం నుండి స్వర్గారోహణ పర్వం వరకు పదిహేనుపర్వాలను ప్రబంధమండలిగా సంతరించాడు. ఆ తరువాత 14వ శతాబ్దంలో ఎఱ్ఱాప్రెగ్గడ ఆరణ్యపర్వశేషాన్ని పూరించాడు. ఈవిధంగా దాదాపు రెండున్నర శతాబ్దాల కాలంలో పదునెనిమిది పర్వాల మహాభారతం కవిత్రయంచేత తెలుగులో రచింపబడింది. ముగ్గురు మహాకవులు విభిన్నకాలాలలో రచించినా ఒకే మహాకవి ఏకకాలంలో రచించిన కావ్యాన్ని చదివినప్పుడు కలిగే ఒక మహానుభూతిని ఆంధ్రమహాభారతం అందించటం ఆంధ్రావళి అదృష్టం!

నన్నయభట్టారకుడు వేంగిని పాలించిన తూర్పుచాళుక్య ప్రభువైన రాజరాజనరేంద్రుని (క్రీ.శ. 1022 - 1061) ఆస్థానంలో కులబ్రాహ్మణుడనే మంత్రిగా ఉండేవాడు. రాజకీయాలలో విద్యాసాంస్కృతిక విషయాలలో రాజుకు తోడ్పడేవాడు. రాజశాసనాలను పద్యగద్యాత్మకంగానూ, సంస్కృతాంధ్రాలలోనూ రచించేవాడు. ఆనాటి వేంగీదేశ పండితకవులలో నన్నయ హిమవన్నగశిఖరం వంటివాడు. తెలుగువారికి కావ్యభాషాభిక్ష పెట్టగలిగిన వాగనుశాసనుడు, మహాకవి, యుగకర్త.

తూర్పుచాళుక్యులు వేంగీ దేశాన్ని క్రీ.శ. 7వ శతాబ్దంనుండి 11వ శతాబ్దం చివరివరకు పాలించారు. తూర్పుచాళుక్యుల రాజ్యం ఉత్తరాన విశాఖపట్టణ మండలంలోని చీపురుపల్లి మొదలుకొని దక్షిణాన నెల్లూరు వరకు, పశ్చిమాన కర్నూలు మండలంలోని మార్కాపురం మొదలుకొని తెలంగాణంలోని కుక్కునూరు వరకునూ, తూర్పుసముద్రాన్ని అంటి వ్యాపించి ఉండేది. వేంగికి ఉత్తరాన కళింగ ఓఢ్ర రాజ్యా లుండేవి. పశ్చిమోత్తరంగా పశ్చిమచాళుక్యుల రాజ్యాలు ఉండేవి. దక్షిణాన చోళరాజ్యం ఉండేది. ఈ రాజ్యాల మధ్య జరిగే యుద్ధాలలో వేంగి క్రీ.శ. 10వ శతాబ్ది చివరివరకూ అడపా దడపా అస్థిరంగానే ఉంటూ ఉండేది. క్రీ.శ. 999లో చోళరాజు కేసరివర్మ వేంగిని ఆక్రమించి శక్తివర్మను రాజుగా నిలిపాడు. అతడు 1011వరకు పాలించాడు. శక్తివర్మ కుమారుడు విమలాదిత్యుడు (క్రీ.శ. 1011-18) రాజమార్తాండుడుగా ప్రసిద్ధుడైనాడు. అతనికి ఇద్దరు భార్యలు. చోళచక్రవర్తి యైన రాజరాజు పుత్రిక కుందవాదేవి మొదటి భార్య. ఆమెవలన రాజరాజనరేంద్రుడు జన్మించాడు. రెండవభార్య తెలుగుచోళుల ఆడబడుచు మేళవ. ఆమెవలన విజయాదిత్యుడు పుట్టాడు. విమలాదిత్యుని తరువాత రాజరాజు క్రీ.శ. 1019లో రాజైనాడు. కాని, విజయాదిత్యునికీ అతనికీ పడలేదు. విజయాదిత్యుడు కర్ణాట (పశ్చిమ) చాళుక్యుల సాయంతో రాజరాజుపై దాడిచేశాడు. రాజరాజు తన మేనమామ అయిన మొదటి రాజేంద్రచోళ చక్రవర్తి సాయంతో విజయాదిత్యుడిని ఓడించి, మేనమామకూతురు అమ్మంగదేవిని వివాహమాడి క్రీ.శ. 1022 ఆగష్టు 22వ తేదీన బెజవాడలో పట్టాభిషిక్తుడైనాడు.

క్రీ.శ. 1031లో విజయాదిత్యుడు కర్ణాట చాళుక్యుల సాయంతో వేంగిమీద మరల దండెత్తి బెజవాడను ఆక్రమించాడు. రాజరాజు చోళదేశానికి పారిపోయి మరల క్రీ.శ. 1035లో చోళులసాయంతో బెజవాడను స్వాధీనం చేసికొని వేంగిరాజ్యాధిపతి అయినాడు. అలాగే కర్ణాటక చాళుక్యులు క్రీ.శ. 1044లో వేంగిని మరల ఆక్రమించటం, తిరిగి రాజరాజు క్రీ.శ. 1047లో వేంగిని గెలుచుకోవటం జరిగింది. రాజరాజు వేంగీ రాజధానిని రాజమహేంద్రవరానికి మార్చుకొన్నాడు. క్రీ.శ. 1053 వరకు వేంగి కొంత శాంతియుతంగానే ఉన్నది. కాని, 1053లో జరిగిన కొప్పం యుద్ధంలో అప్పటి చోళదేశాధిపతి ప్రథమ రాజాధిరాజు మరణించటంతో రాజరాజుకు చోళుల సహాయం అందటం ఆగిపోయింది. అందువలన పశ్చిమచాళుక్యులతో తన

జీవితకాలమంతా మైత్రితో ఉండేటట్లు సంధి చేసికొన్నాడు. ఆ సంధిని సాధించటంలో నన్నయభట్టు రాయబారిగా కృషి చేశాడు. అతనికి సహాధ్యాయుడైన పశ్చిమచాళుక్య మంత్రి నారాయణభట్టు సహాయపడ్డాడు. పశ్చిమచాళుక్యులస్థానాపతిగా వేంగికి వచ్చిన నారాయణభట్టుకు రాజరాజు అగ్రహార మిచ్చి గౌరవించాడు. ఆ తరువాత - అంటే 1054 - 1061 సం॥రాల మధ్యకాలంలో - నన్నయ భారతరచన చేపట్టి నిర్వహించి ఉంటాడు. నారాయణభట్టు నన్నయకు విలువైన సలహాల నిస్తూ, కురుక్షేత్రయుద్ధంలో నరునికి నారాయణుడు తోడ్పడ్డట్లుగా సహాయం చేసి ఉంటాడు.

రాజరాజనరేంద్రు డెదుర్కొన్న రాజకీయ పరిస్థితుల వెనుక మత విషయకమైన కారణాలు ఉండటం గమనింపదగిన అంశం. 11వ శతాబ్ది ప్రారంభంనాటికి తీరాంధ్రంలో బౌద్ధమతం క్షీణదశలోకి వచ్చింది. జైనం ప్రాబల్యం కోసం ప్రాకులాడుతున్నది. పశ్చిమ చాళుక్యులు జైనులు. వారు వేంగిమీద దండెత్తడానికీ, విజయాదిత్యునికి తోడ్పడటానికీ జైనమతం కూడా ఒక బలమైన కారణం కావచ్చు. విమలాదిత్యుడు చివరిరోజుల్లో వైదికధర్మాన్ని వదలి జైనమతాన్ని స్వీకరించాడు. అతడు పెండ్లాడిన ఇద్దరు రాణులలో మేళవ జైనమతాభిమానం గల రాణి. చోళరాజకన్య కుందవ వైదికధర్మ మార్గావలంబ, శివభక్తురాలు. ఆ యిద్దరు రాణులకు పుట్టిన పుత్రులు కూడా తల్లులు అభిమానించిన మతాలనే తమ ధర్మాలుగా గ్రహించి జీవితాలను సాగించారు. ఈ వాతావరణాన్ని పట్టి చూస్తే రాజరాజనరేంద్రునికీ, విజయాదిత్యునికీ నడుమ జరిగిన యుద్ధాలకు మతప్రాతిపదికలు కూడా ఉన్నాయని స్పష్టమౌతున్నది.

అయితే, తూర్పుచాళుక్య ప్రభువులలో చాలమంది వైదికధర్మాన్ని స్వీకరించి, దానిని పోషించినవారే. దానికితోడు ఆంధ్రభాషా సాహిత్యాలపై అమితమైన అభిమానాన్ని ప్రకటించి శాసనభాషగా, ప్రజాభాషగా, కావ్యభాషగా తెలుగును అభివృద్ధి చేసి, మహాకావ్యనిర్మాణానికి దోహదం చేసినవారే. వైదికధర్మాభిమానం తూర్పుచాళుక్యులకు ముందున్న పల్లవ, శాలంకాయన, విష్ణుకుండినుల కాలంనుండే కొనసాగుతున్నది. ఆ యుగాలలో రాజులు అశ్వమేధాది క్రతువులు చేయగా, తూర్పుచాళుక్యులు క్రతువులను మాని వేదవిద్యను ఘటికాస్థానాలద్వారా, గ్రామవిద్యాపీఠాల ద్వారా వ్యాపింపజేశారు. వైదికధర్మాన్ని దేవాలయ వ్యవస్థల ద్వారా విస్తరింపజేశారు. చాళుక్యులు నిర్మించిన దేవాలయాలు, వారి శిల్పరీతి, పౌరాణికాది వృత్తుల నేర్పరచిన తీరు తెలుగువారి చరిత్రలో ఒక క్రొత్త ఒరవడిని సృష్టించాయి.

వర్తమాన ఆంధ్ర సంస్కృతికి మొదటిసారి ప్రాతిపదికలు బలంగా పడింది తూర్పు చాళుక్యుల కాలంలోనే అని చారిత్రకులు పేర్కొన్నారు. చాళుక్యులు దేవాలయాలను గ్రామీణ సంస్కృతికి కేంద్రాలుగా పోషించారు. ప్రజలకు ధార్మికవిద్యను, సంస్కృతిని ప్రబోధించటానికి పౌరాణికులను నియోగించారు. వేదవిద్వాంసులకు అగ్రహారాలను విరివిగా దానం చేశారు. భారతీయ విజ్ఞాన నిధు లైన వేద, శాస్త్ర, పురాణాలను ప్రజలలో వ్యాపింపజేయటానికీ, వర్ణాశ్రమధర్మాలనూ, ముఖ్యంగా జైన బౌద్ధ ధర్మాల వలన శిథిలమైన గార్హస్థ్యాది ఆశ్రమ ధర్మాలనూ పునరుద్ధరించి వైదికధర్మాశ్రితమైన జీవనవిధానాన్ని ప్రజలలో వ్యాపింపజేసి సామాజికవ్యవస్థను పునర్నిర్మించాలని ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో భాగంగానే పంచమవేదమని ప్రసిద్ధిగాంచిన ఆంధ్రమహాభారతాన్ని "కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థం" ఏర్పడేటట్లుగా తెలుగులో నిర్మింపజేసి, తెలుగులోనే వైదికధర్మాన్ని తెలుగువారికి చెప్పించాలని కంకణం కట్టుకొన్నారు. సాంస్కృతికమైన సముద్ధరణానికి భాషాపోషణం చేపట్టి, ప్రజలభాషలోనే ఉదాత్తసాహిత్యాన్ని నిర్మించే యత్నం చేశారు తూర్పుచాళుక్యులు. దాదాపు మూడు శతాబ్దాల కృషి రాజరాజ నరేంద్రుని కాలంలో ఫలించి నన్నయభారతంగా అవతరించింది.

వ్యాసుడు జయవాక్యాన్ని వ్రాసినప్పుడూ, ఆయన శిష్యులు దాన్ని మహాభారతంగా విస్తరింప జేసినప్పుడూ ఎటువంటి మతసామాజిక పరిస్థితులు ఆయా కాలాలలో వాటికి ప్రేరక శక్తులుగా ఎట్లా పనిచేశాయో, తెలుగులో కవిత్రయం మహాభారతాన్ని

రచించటానికి కూడా ఆనాటి మత సామాజిక పరిస్థితులు అట్లా కారణా లయ్యాయి. వాటికి తోడు సాహితీపరిస్థితులు కూడా ఆంధ్రమహాభారత రచనకు విశేషంగా కాలికస్పృహను కల్పించాయి. నన్నయ భారతావతరణకు మతకారణా లెంత బలమైనవో అంతకంటె మిన్నగా సాహితీపరిస్థితుల ప్రేరణలు బలవత్తరాలైనవిగా కనపడుతున్నాయి.

తూర్పుచాళుక్యులు తెలుగును రాజభాషగా చేసి ప్రజలభాషను గౌరవించారు. సంస్కృతభాషతోపాటు తెలుగులో కూడ శాసనాలు వేయించారు. శాసనాలలో పద్యాలను వాడారు. సంపూర్ణచ్ఛందోబద్ధ శాసనాలు కూడా తూర్పుచాళుక్యులే వ్రాయించారు. ఆ కాలంలో వెలువడిన పండరంగని అద్దంకి శాసనంలో (క్రీ.శ. 849) ఒక తరువోజ వాడబడి ఉన్నా, అదే కాలంలోనే వేయించిన గుణగ విజయాదిత్యుని కందుకూరు శాసనం మొత్తం సీసపద్యమయంగా ఉండటం గమనించదగింది. ఆ తరువాత యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో అయిదు మధ్యాక్కరలు వాడబడినవి. మొత్తంమీద క్రీ.శ.తొమ్మిదవశతాబ్దంలో వేసిన తెలుగుశాసనాలలో జాతులో, ఉపజాతులో ప్రసిద్ధంగా ప్రయోగింపబడ్డాయి. క్రీ.శ. 1000 ప్రాంతంలో నిలిపిన విరియాల కామసాని గూడూరు శాసనంలో మూడు చంపకమాలలు, రెండు ఉత్పలమాలలు కనబడుతున్నాయి. అంటే 11వ శతాబ్దినాటికి చంపకమాలాది సంస్కృత వృత్తాలూ, మధ్యాక్కర, సీసం,తేటగీతి, ఆటవెలది, కందం మొదలైన దేశిచ్ఛందస్సులూ శాసనాలలోకి ఎక్కాయంటే పద్యకవిత్వం ప్రజలకు బాగా దగ్గరగా చేరి ప్రచారంలో ఉండేదన్నమాట! శాసనపద్యాలలో నన్నయ పద్యశైలితో పోలిన రచన ఒకింత గోచరించటం వలన నన్నయకుముందు దాదాపు రెండు మూడు వందల యేండ్లనుండి తెలుగుపద్యకవిత్వం ప్రజాదరణం పొంది ఉన్నదని తెలుస్తున్నది.

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ, దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్".

అని నన్నెచోడుడు తన కుమారసంభవ కావ్యావతారికలో పేర్కొన్నాడు. సంస్కృతసాహిత్య సంప్రదాయాల ననుసరించి వ్రాసే కవిత్వం మార్గమనీ, దేశభాషాసాహిత్య స్వభావాలను సంవదించుకొన్నది దేశి అనీ స్థూలంగా వివేచించవచ్చును. తూర్పు చాళుక్యులు దేశభాషలలో కవిత్వం రచింపచేసే ప్రయత్నం చేశారు. నన్నయకూడా తూర్పుచాళుక్యులు సాగించిన సాహిత్యోద్యమంలో భాగంగా ఆంధ్రమహాభారత రచనను చేపట్టాడని స్పష్టం. ఆయనకు రాజూ, విద్వత్పరిషత్తులూ అండగా ఉన్నాయని 'అవతారిక' చెపుతున్నది.

నన్నయకు ముందు కన్నడంలో క్రీ.శ. 940 నుండి పంపమహాకవియుగం సాగుతున్నది. పంపడు వేంగీమండలంలో పుట్టిన తెలుగువాడైనా, జైనమతాన్ని స్వీకరించి, కన్నడ చాళుక్యుల నాశ్రయించి, వేములవాడలో అరికేసరి ఆస్థానంలో స్థిరపడ్డాడు. అతడు జైనుల ప్రథమ తీర్థంకరుడైన వృషభదేవుని చరిత్రను 'ఆదిపురాణం' గా రచించాడు. మహాభారత కథను జైనమతానుగుణంగా మార్చి, 'విక్రమార్జునీయ' మనే కావ్యాన్ని నిర్మించాడు. ఒక మత పురాణం, ఒక మత కావ్యం వ్రాసే సంప్రదాయాన్ని పంపడు కన్నడ సాహిత్యంలో ప్రారంభించాడు. అతనికి "ప్రసన్న గంభీర వచన రచన చతుర కవితా గుణార్ణవు' డనీ, 'దేశి మార్గ సంయోగ' రూపమైన కావ్యశైలిని నిర్మించిన 'ఆదికవి' అనీ బిరుదు లుండేవి. పంపడు తన కావ్యాలలో ఉత్పలచంపకాదులనూ, కన్నడ దేశిచ్ఛందాలనూ వాడాడు. నన్నయకు ముందు పంప మహాకవి ప్రారంభించిన యుగాన్ని కన్నడ సాహిత్య చరిత్రకారులు స్వర్ణయుగంగా కీర్తించారు.

నన్నయ పంపని కావ్యశైలి వంటి కవితాశైలిని స్వతంత్రంగా తెలుగులో నిర్మించుకొన్నాడు. అయితే, పంపనిది రీతి ప్రధానమైన శైలి. నన్నయది గుణప్రధానమైన శైలి. అయినా, పంపకవివలెనే తెలుగులో మార్గదేశిపద్ధతులను మేళవించి

దేశీయమైన కావ్యమార్గాన్ని ఏర్పరిచాడనీ, అందుకే నన్నయను పంపకవి వలె 'ఆదికవి' అని పిలుస్తారనీ చరిత్ర సాక్ష్యం చెపుతున్నది. కన్నడంలో పురాణాలనూ, కావ్యాలనూ మతప్రచారస్పృహతో వ్రాసే సంప్రదాయం పంపడు ప్రచారంలోకి తెచ్చాడు. నన్నయ మత ప్రచార స్పృహకంటె సాహిత్యస్పృహను ఎక్కువగా రచనలో పాటించాడు. మతముద్ర వేసికొన్న పురాణప్రక్రియను, కావ్యప్రక్రియను వదలి, ఇతిహాసమైన మహాభారతాన్ని ఎన్నుకొన్నాడు. మానవజీవితంలోని చతుర్విధ పురుషార్థసాధన సమగ్ర చిత్రణం, దానికి సంబంధించిన శాస్త్రబోధనం చేయగల భారత సంహితను ధర్మదృష్టితో కావ్యకళాస్పృహతో నిర్మించాడు. దక్షిణాది భాషాసాహిత్యాలలో దేనికీ లేని ఒక విశిష్టమైన వ్యక్తిత్వం తెలుగు సాహిత్యానికి ఆంధ్రభారత రచనవలన నన్నయ కలిగించాడు.

నన్నయకు ముందు తెలుగులో ప్రజలు పాడుకొనే పాటలు ఉన్నాయి, పద్యరచన ఉన్నది కాని, ఒక మహాకావ్యశైలితో కూడిన కవిత్వం లేదు. నన్నయ దానిని చంపూపద్ధతిలో నిర్మించాడు. నన్నయ చంపూమార్గాన్నే తెలుగులో పద్యకావ్య ఫణితిగా ప్రవర్తిల్లజేశాడు. అందువలన తెలుగులో 'చంపూకావ్యం' అనే పారిభాషికపదం మృగ్యమై పోయింది. అదికారణంగా తిక్కన నిర్వచన కావ్యప్రక్రియను ఆపేరుతో ప్రత్యేకంగా చెప్పుకోవలసి వచ్చింది. సంస్కృతంలోనూ ఇతర దక్షిణభాషాసాహిత్యాలలోనూ నిర్వచన కావ్యప్రక్రియ అనే పేరు లేదు. ఇటువంటి విశేషాలు నన్నయ తిక్కనాదులు తెలుగు సాహిత్యప్రక్రియలకు కల్పించిన ప్రత్యేకతకు పతాకలుగా నిలిచిఉన్నాయి.

కవియొక్క కవితాశైలి అతని సాహిత్యదర్శనం నుండి, వ్యక్తిత్వం నుండి పుట్టుతుంది. 11వ శతాబ్దపు సామాజిక పరిస్థితులకు తగిన వస్తువు మహాభారతేతివృత్త మైతే ఆ కాలానికి అత్యంత ఆధునికమైన కవితాదృక్పథం నన్నయది. క్రీ.శ. 11వ శతాబ్దం నుండి 18వ శతాబ్ది వరకు గల కాలాన్ని అఖిలభారతదేశంలో సాహిత్య దర్శనపరంగా 'ధ్వన్యనంతరయుగ' మని సాహిత్య విమర్శకులు వ్యవహరిస్తున్నారు. అందులో మమ్మటాదుల నుండి జగన్నాథ పండితరాయల వరకూ అనేకమంది లాక్షణికులు అనుసరించిన ధ్వనిమార్గాన్నీ రసమార్గాన్నీ సమర్థించే శాఖ ఒకటి. దానికి అనుగుణంగా కావ్యశైలిని నిర్మించే పద్ధతికి తెలుగులో శ్రీకారం చుట్టాడు నన్నయభట్టారకుడు. అతనిది ప్రధానంగా ధ్వనిప్రస్థానం. ఆ తరువాత తిక్కన, ఎఱ్ఱనలు నన్నయ ననుసరించారు. కవిత్రయంలో నన్నయ వస్తుధ్వనిని, తిక్కన రసధ్వనిని, ఎఱ్ఱన అలంకార ధ్వనిని ప్రధానంగా పోషించారు. సాహిత్య ప్రస్థానాలలో ఉత్తమమైనదిగా ఈనాటికీ పరిగణింపబడే ధ్వనిప్రస్థానం ఆదికవి నన్నయ కవితాశైలికి ప్రాతిపదిక కావటంచేత ఆంధ్రమహాభారతం తెలుగులో వెలువడిన ఉత్తమ సాహిత్య రచనగా నేటికీ సాహితీవేత్తలచేత పరిగణింపబడుతున్నది.

## రాజరాజనరేంద్రుడు - కృతిశ్రోత, కృతిభర్త

రాజరాజనరేంద్రుడు మహావిద్వాంసుడు. ఆయన భారతీయ సాహిత్యాలను మథించాడు. పురాణాలను పక్షపాత రహితమైన బుద్ధితో విన్నాడు. అర్థ ధర్మ శాస్త్రాలను స్వయంగా చదివి తెలిసికొన్నాడు. ఉదాత్తరసాన్విత కావ్య నాటకాలను, వాటి వివిధ ప్రయోగ విధానాలను నిశితంగా పరిశీలించాడు. ప్రసన్నం చేసికొన్నాడు. ఈశ్వరాగమాలలో మనస్సును భక్తితో నిలిపాడు. అయినా, ఆయనకు వాటన్నింటికంటె శ్రీమహాభారతంలోని పరమార్థాన్ని వినాలనే అభిలాష ఎప్పుడూ మెండుగా ఉండేది. అంటే - భారతీయ శాస్త్ర సాహిత్య గ్రంథాలన్నింటిలో మహాభారతమే శ్రేష్ఠ మైనదని ఆయన నిశ్చితాభిప్రాయమన్నమాట!

రాజరాజనరేంద్రుని మనస్సుకు అయిదంశాలు అపరిమితమైన ప్రీతి కలిగిస్తాయి. అవేమంటే - బ్రాహ్మణోత్తములను పూజించాలనే అభిలాష, భారతాన్ని వినాలనే ఆసక్తి, పరమేశ్వరుడిని ఆరాధించాలన్న మహోత్సాహం, ఎల్లప్పుడూ అడిగినవారికి లేదనకుండా దానం చేయాలనే స్వభావం, సదా మంచివారల సాంగత్యంలో ఉండాలనే అభిలాష, వీటిలో భారత శ్రవణాసక్తి భారతరచనను ప్రోత్సహించింది.

చంద్రుడు మొదలుకొని క్రమంగా పూరుడు, భరతుడు, కురుమహారాజు, పాండురాజు వంశకర్తలుగా ప్రసిద్ధి చెందిన తన వంశంలో నిర్మలగుణశోభితులైన పాండవుల ఉత్తమచరిత్ర ఎప్పుడూ వినాలనే అభిలాష ఆయనను నన్నయచేత ఆంధ్రమహాభారతాన్ని రచింపచేయటానికి ప్రేరేపించింది.

భారతం వింటే బంగారు తొడుపులతో కపిలగోవులను నూరింటిని విప్రులకు దానంచేసిన పుణ్యం కలుగుతుందని రాజరాజు విశ్వాసం. అనేక భాషలలో, అనేక ప్రక్రియలలో అనేకమంది జనులవలన భారతకథను వింటూ అందులో ఆసక్తిని పెంచుకొనే వారికి అనేక యజ్ఞాలు చేసిన పరమఫలం లభిస్తుందని రాజరాజు నమ్మకం. అందువలన సంస్కృత మహాభారతంలో వేదవ్యాసుడు ఏ తాత్పర్యాన్ని, ఏ ధర్మతత్త్వాన్ని, ఏ సందేశాన్ని నిబద్ధించి నిరూపించాడో దానినే తెలుగులో వినాలని కుతూహలపడి రాజరాజ నరేంద్రుడు నన్నయభట్టును ఆంధ్రమహాభారతాన్ని రచించి వినిపించుమని కోరాడు. అయితే, ఆయన ఎక్కడా భారతాన్ని తనకు అంకిత మిమ్మని కోరలేదు. నన్నయకూడా అంకిత మిస్తున్నట్లు వాచ్యం చేయలేదు. ఆ మర్యాదలలో ఒకటైన షష్ఠ్యంతాల వంటి వేమీ వ్రాయలేదు. అయినా రాజరాజుకే తన భారతాన్ని వినిపించాడు. కృతిని అంకితం తీసికొనేవాడు కృతిభర్త. వినేవాడు కృతిశ్రోత. ఈ రెండుసంప్రదాయాలూ కావ్యజగత్తులో ఉన్నాయి. వాటిని ఒకేకావ్యంలో విడివిడిగా పాటించే పరిపాటికూడా ఉన్నది (కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్షం అందుకు ఉదాహరణం). ఆదికవి అయిన నన్నయ ఆంధ్రమహాభారతంలో కృతిభర్తృ శ్రోతృ సంప్రదాయాలను ఏకంచేసి అద్వైతస్థితిని పాటించారు. నన్నయ భారతభాగానికి కృతిశ్రోత అయిన రాజరాజనరేంద్రుడు కృతిభర్త కూడా. తిక్కన భారత భాగానికి కృతిభర్త అయిన హరిహరనాథుడు కృతిశ్రోత కూడా!

### నన్నయ గురుపద్యవిద్యకు ఆద్యుడు

ఉ. "ఆదరణీయసార వివిధార్థగతి స్ఫురణంబు గల్గి య
ష్టాదశ పర్వనిర్వహణ సంభృతమై పెనుపొందియుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్". **(విరా. 1.6.)**

అని తిక్కన సోమయాజి నన్నయభట్టును ప్రస్తుతించాడు. మహాభారతంలో ఆదరింపదగినవీ, సారవంతమైనవీ అయిన బహువిధాలైన అర్థాలు ప్రతీయమానాలౌతుంటాయనీ, వాటి స్ఫురణను పసికట్టి దక్షతతో తెలుగున నన్నయ నిర్వహించాడని చెప్పటం ఒక యెత్తు. ఆంధ్రకవిత్వానికి ఒక బాటను చూపి గురువుగా, గురుపద్యవిద్యకు ఆద్యుడుగా గౌరవింపదగిన విశారదునిగా నన్నయను పేర్కొనటం మరొకయెత్తు. 'విద్యాదయితుండు' అని ప్రశంసించటం మరింకొక యెత్తు. ఆంధ్ర పద్యవిద్యకే కాక కావ్యవిద్యకు కూడా ఎన్నో శ్రీకారాలను తెలుగువారికి అందించిన ప్రతిభామూర్తి నన్నయ. అందువల్లనే ఆయన మహితాత్ముడు. తెలుగులో కావ్యరచనం చేసే ప్రతికవీ ముందుగా నమస్కారం చేయదగినవాడని నన్నయను తిక్కన ప్రశంసించాడు. అది సత్యం!

రాజరాజనరేంద్రుడు కూడ ఆంధ్రమహాభారతాన్ని తెలుగులో నిర్మించగలిగిన మహితాత్ముని లక్షణాలూ, మహాకవి లక్షణాలూ నన్నయలో దర్శించాడు. నన్నయ భారతావతారికలోని 'తన కులబ్రాహ్మణుడు' (1.9.) అనే పద్యం అందుకు సాక్ష్యం. అందులో నన్నయకు వేసిన విశేషణాలను రెండు రకాలుగా విభజించవచ్చును. అవి - 1. నన్నయ వ్యక్తి వివరాలు. 2. నన్నయ సాహితీ వ్యక్తిత్వపు వివరాలు. మొదటి రకానికి చెందినవి -1. నన్నయ రాజరాజనరేంద్రునికి 'కులబ్రాహ్మణుడు'. అంటే వంశపారంపర్యంగా నియమింపబడే పురోహితుడనే మంత్రి. 2. అనురక్తుడు. అంటే రాజుకు ప్రియమిత్రుడు. 3. అవిరళజపహోమ తత్పరుడు. అంటే వేదవిహితమంత్రతంత్ర కర్మలు ఆచరించేవాడని అర్థం. (జపం మంత్రాలకు సంబంధించింది. హోమం

యజ్ఞకర్మవిధులకు సంబంధించింది.) 4. సంహితాభ్యాసుడు అంటే వేదాధ్యయన అధ్యాపనాలలో సమర్థుడు. 5. పాత్రుడు - దానగ్రహణానికీ, ప్రశంసలకూ యోగ్యుడైనవాడు. 6. ఆపస్తంబసూత్రుడు 7. ముద్గలగోత్రజుడు - ఈరెండూ నన్నయ ధార్మిక జీవనపద్ధతికీ వంశౌన్నత్యానికీ సంబంధించినవి. 8. సద్వినుతావదాతుడు. 9. నిత్యసత్యవచనుడు 10. బుద్ధిలో బృహస్పతివంటివాడు. 11. సుజనుడు (ఉత్తముడు, మంచివాడు) - ఈ గుణాలన్నీ నన్నయయొక్క ఉత్తమశీలాన్ని, ఉత్తమవ్యక్తిత్వాన్నీ, బుద్ధిశక్తినీ తెలుపుతున్నాయి.

ఇక నన్నయ సాహితీవ్యక్తిత్వాన్ని తెలిపే విశేషణాలు. 1. విపుల శబ్దశాసనుడు - తెలుగులో మొదటి కావ్యం వ్రాయవలసిన కవికి సంస్కృతాంధ్ర శబ్దపరిజ్ఞానం విస్తారంగా ఉండాలి. ఆ అర్హతను ఈ విశేషణం సూచిస్తున్నది. 2. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడు - అష్టాదశ మహాపురాణాలలోని వివిధ వేదశాస్త్ర విశేషాలు తెలిసి ఉంటే తప్ప 'పంచమవేద' మైన మహాభారతాన్ని వ్రాయటం సాధ్యంకాదు. 3. లోకజ్ఞుడు - కవికి లోకవ్యుత్పత్తి వ్యవహార విజ్ఞానాన్నీ, పాత్రచిత్రణ నైపుణ్యాన్నీ కలిగిస్తుంది. 4. ఉభయభాషాకావ్యరచనాభిశోభితుడు - సంస్కృతాంధ్ర భాషలలో కావ్యరచనం చేయగల సమర్థుడే మహాభారత రచనకు అర్హుడు. 5. సత్ప్రతిభాభియోగ్యుడు - నవనవోన్మేషశాలిని అయిన ప్రజ్ఞతో, అపూర్వనిర్మాణక్షమమైన ప్రజ్ఞతో ప్రకాశించేవాడు కాబట్టే తెలుగు భారతాన్ని అనువాదంగా కాక అనుసృజనంగా తీర్చిదిద్దగలిగాడు. మహితాత్ముడైన మహాకవియే మహాభారత రచనకు సమర్థుడని నన్నయవ్యక్తిత్వం ఋజువు చేస్తున్నది.

నన్నయ తాను చేసిన పూర్వకవిస్తుతిలో తన కవితావ్యక్తిత్వాన్ని ధ్వనింపజేశాడు. నన్నయ వాల్మీకి వ్యాసులను మాత్రమే కీర్తించాడు. దానికి కారణం ఆ యిద్దరి కవుల లక్షణాలూ నన్నయలో ఉన్నవి కాబట్టి. వాల్మీకిని 'గురుపద్యవిద్య'కు ఆద్యునిగా ప్రశంసించాడు. తెలుగువారు పద్యమనే పదాన్ని శ్లోకానికే కాదు లయబద్ధమైన ఎటువంటి కవితాభివ్యక్తికైనా వాడవచ్చుననే స్ఫూర్తిని నన్నయ నుండే గ్రహించారు. 'వచనపద్య' మనే నేటి వ్యవహారం గమనార్హం. ఈవిధంగా సంస్కృతంలో వాల్మీకి వలె తెలుగులో నన్నయ పెద్దదైన (అనంతకాలంగా సాగే) పద్యవిద్యకు ఆద్యుడు. యతిప్రాసల నియమాలతో కూడిన తెలుగు పద్య శిల్పం ఎంత కళయో, అంత శాస్త్రవిద్య. దాని కొక సమగ్రరూపాన్ని ప్రసాదించిన ప్రజ్ఞామూర్తి నన్నయ. నన్నయ వాడిన ఛందస్సులలోనే ఇప్పటికీ పద్య కావ్యకవులు రచనలు చేస్తూ ఉండటం అందుకు సాక్ష్యం. తెలుగుజాతి చిత్తవృత్తికి అనువైన ఛందస్సులను ఎన్నుకొని శిథిలం కాని మార్గాన్ని చూపిన పద్యవిద్యాచార్యుడు నన్నయ. 'గురుపద్యవిద్యకు నాద్యున్' అనే విశేషణానికి 'గురున్, పద్యవిద్యకు ఆద్యున్' అనే పాఠాంతరం ఉన్నది. అప్పుడు ''గురుఁబద్యవిద్యకు నాద్యున్'' అని ఉండాలి. ఆ అర్థం కూడా నన్నయకు అక్షరాలా అన్వయిస్తుంది. తెలుగు కవులకు నన్నయ ఆదిగురువు. వాల్మీకిని బ్రహ్మకల్పు డన్నాడు నన్నయ.తెలుగులో కావ్యశైలికి నన్నయకూడా బ్రహ్మకల్పుడే. 'ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి' అనే విశ్వనాథవారి ప్రశంస ఇక్కడ స్మరింపదగినది.

నన్నయ వ్యాసమహర్షిని విజ్ఞాన భాస్కరుడిగా కీర్తించాడు. భారత భారతీ వినీలాకాశంలోని అజ్ఞాన తిమిరాలను పోగొట్టి, పండితుల మనఃపద్మాలను వికసింపజేసే వ్యాసమహర్షిని ఒక జ్ఞానిగా భావించాడు. నన్నయ వాల్మీకి వంటి కవి, వ్యాసుడివంటి జ్ఞాని. అందువలననే శాస్త్రేతిహాసమైన సంస్కృత భారతాన్ని తెలుగులో కావ్యేతిహాసంగా నిర్మించగలిగాడు. పూర్వకవిస్తుతిలో ఎన్నుకొన్న వాల్మీకి వ్యాసుల వ్యక్తిత్వాలు తన సాహితీ వ్యక్తిత్వంలో ప్రతిఫలించి ఉండటంచేతనే నన్నయ ఆత్మాశ్రయ స్ఫూర్తితో వాటిని ఆవిష్కరించాడు.

### ఆంధ్రమహాభారతం అనువాదం కాదు; అనుసృజనం

''జననుత కృష్ణద్వైపా
యనమునివృషభాభిహిత మహాభారతబ

ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్.'' **(ఆది.1.16)**

అని నన్నయను రాజరాజనరేంద్రుడు కోరినప్పుడు వ్యాసమునిచేత మహాభారతంలో ప్రతిపాదింపబడి నిరూపింపబడిన పరమార్థం తేటపడేటట్లు అధికమైన బుద్ధిశక్తితో తెలుగున రచింపుమన్నాడేకాని, మూలానికి నకలుగా తెలుగుచేయుమని, అంటే అనువదించుమని కోరలేదు. అందువలన నన్నయభారతం - ఆమాటకు వస్తే కవిత్రయభారతం - అనువాదం కాదు. అనుసృజనం, పునస్సృష్టి.

**ఈ క్రింది అంశాలు ఈ నిర్ణయాన్ని బలపరుస్తాయి -**

1. మూలంలోని హరివంశాన్ని తెలుగులోకి తేకుండా మహాభారతేతిహాసానికి ఆదిపర్వంనుండి స్వర్గారోహణపర్వం వరకూ సాగిన ఇతివృత్తంతో ఇతిహాసస్వరూపాన్ని సుసంఘటితంచేయటం. శ్రీకృష్ణనాయకమని అన్వయించటానికి అవకాశం తగ్గించి పాండవనాయకంగా ఆంధ్రభారతాన్ని స్థిరీకరించటం.

2. ధ్వన్యాలోకకర్త అన్నట్లు సంస్కృతమహాభారతం 'శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయి'; కావ్యమీమాంసాకర్త వివేచన ననుసరించి శాస్త్రేతిహాసం. అంటే వ్యాసమహర్షి చతుర్విధ పురుషార్థవ్యుత్పత్తిని వేదతత్త్వానుకూలంగా శాస్త్రీయంగా మిత్రసమ్మితంగా చెప్పాలని భావించి దానికి ఆలంబనగా చంద్రవంశచరిత్రను చేపట్టాడు. అందువలన వ్యాసమహర్షికి శాస్త్రప్రతిపాదన దృక్పథం, ప్రబోధ ప్రవృత్తీ ప్రధానంగా ఉన్నాయి. అంటే కావ్యస్పృహకంటె శాస్త్రస్పృహ వ్యాసుడికి ఎక్కువ అన్నమాట! నన్నయ వ్యాసభారతం కంటె వేరైన ప్రక్రియా దృక్పథంతో ఆంధ్రమహాభారతం నిర్మించాడు. ఆనందవర్ధనుని మాటల్లో మలిచి చెప్పాలంటే నన్నయ ఆంధ్రభారతాన్ని 'కావ్యరూప శాస్త్రచ్ఛాయాన్వయి'గా రూపొందించాడు. మూలతాత్పర్యాన్ని కావ్యస్పృహతో ఆవిష్కరించాడు. అందువలన నన్నయరచన కావ్యేతిహాసంగా మారింది. మూలప్రక్రియ మారితే అది పునస్సృష్టియే అవుతుందికాని, అనువాదం అనిపించుకోదు.

3. ఆనందవర్ధనుని అన్వయం ప్రకారం వ్యాసమహాభారతంలో రసం శాంతం. మరి, నన్నయతో ఆరంభింపబడి తిక్కన ఎఱ్ఱనలతో ముగింపబడిన తెలుగు భారతంలో రసం ధర్మవీరం. రససమన్వయసూత్రం మూలభారతానికి ఒకవిధం; ఆంధ్రభారతానికి మరొకవిధం. ఈ రకంగా రసనిర్వహణలో స్వతంత్రదృష్టి సారించిన నన్నయ చేసింది అనుకరణంకాని, అనువాదంకాని కాదు. అనుసృజనం ఔతుంది.

4. వేదం శబ్దప్రధానం; ఇతిహాస పురాణాలు అర్థప్రధానాలు; కావ్యం ఉభయప్రధానం. వ్యాసభారతం అర్థప్రధానమైన శాస్త్రేతిహాసం. కవిత్రయభారతం ఉభయప్రధానమైన కావ్యేతిహాసం. కావ్యస్వభావాన్ని ఇతిహాసానికి జోడించి ఉత్తమమిశ్రప్రక్రియగా రూపొందించాడు నన్నయ. నన్నయ చూపించిన మిశ్రప్రక్రియాపరికల్పనం తెలుగుసాహిత్య ప్రయోగాలకు ఒక విశిష్టప్రస్థానాన్నే ప్రసాదించింది. ప్రాచీనాంధ్ర సాహిత్యవికాసచరిత్రమంతా దానికి సజీవసాక్ష్యం. మహాకవులు భారతాన్ని మహాకావ్యమంటారు. అందుకే. అర్థప్రధానమైన రచనను ఉభయప్రధానంగా మార్చటం అనువాదధోరణి కాదు. పునస్సృష్టి వైఖరి.

5. సంస్కృత మహాభారతంలోని శ్లోకరచనాశైలికంటె విశిష్టమైనదీ, రసవ్యంజకమైనదీ నన్నయ పద్యరచనాశైలి. నన్నయ శబ్దగుణప్రధాన రచన చేశాడు; తనదైన పద్యశైలి ఉదాత్తమైన ఒరవడిలో రూపొందించాడు; ధ్వనిభేదాలలోని వస్తుధ్వనిశిల్పాన్ని కవితాప్రవృత్తిగా పరిపోషించాడు. వ్యాసశైలికీ, నన్నయ (కవిత్రయ) శైలికీ సామ్యం లేదు. నన్నయపద్యశిల్పం మూలంకంటె విలక్షణ మైనది; స్వయంప్రకాశమైన దేశీయవ్యక్తిత్వం కలిగినది. నన్నయశైలి ఆంధ్రమహాభారతానికి జీవితం. శైలితో స్వంతముద్రవేసికొన్న తెలుగురచన అనువాదం కాదు; అనుసృజనమే.

6. అనువాదమని భావించేవారుకూడా నన్నయది (కవిత్రయంవారిది) శబ్దానువాదం, భావానువాదం కాదనీ కథానువాదమనీ, స్వతంత్రానువాదమనీ వివేచించటం గమనింపదగిన అంశం. మూలభారతం భిత్తిక వంటిది; దానిమీద సాగే వర్ణచిత్రలేఖనం వంటిది నన్నయరచన.

7. నన్నయ తన కవిత్వానికి ప్రత్యేకంగా లక్షణాలను చెప్పుకొన్నాడు. ఆ లక్షణాలలో కథాకథనశిల్పానికి సంబంధించింది ఒకటి; పద్యరచనాశయ్యకు సంబంధించింది ఒకటి; ప్రజలనాలుకలమీద బ్రతుకగలిగిన సుభాషితాలను కవితామయంగా చిత్రించే కావ్యస్వభావానికి సంబంధించింది మరొకటి. క్రమంగా-అవి-ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తినిధిత్వం- అనేవి. ఇవి సంస్కృతభారతంకంటె ఆంధ్రమహాభారతానికి గల ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ప్రపంచిస్తున్నవి. వస్తువు మృత్తికవంటిది, నన్నయకవిత పాత్రను రూపొందించే వృత్తినైపుణ్యం వంటిది. మట్టి వ్యాసునిదైనా రూపొందించిన పాత్ర మాత్రం నన్నయది.

8. బహుభాషల, బహువిధముల, బహుజనులు చెప్పినా శ్రవణాసక్తితో భారతకథను వినే ప్రవృత్తి రాజరాజనరేంద్రునిది. అతనిది తాత్పర్యదృష్టి. అంటే అర్థప్రధానదృష్టి, నన్నయ రాజరాజనరేంద్రుని శ్రవణాసక్తికి కావ్యశక్తిని కూడ జోడించి సాహితీసృష్టి చేశాడు. రూపాన్ని రాజరాజు నిర్దేశించలేదు. నన్నయకు ఆ స్వేచ్ఛను కల్పించాడు. దానిని చక్కగా ఉపయోగించుకొని చంపూ కావ్యరూపాన్ని ఇచ్చాడు. వస్తు వెంత ముఖ్యమో, పరమార్థోపదేశ మెంత ముఖ్యమో, అది చెప్పే కవితాభివ్యక్తికూడ అంతముఖ్యమని నన్నయ చాటిచెప్పాడు. ఇవన్నీ తెలుగులో పునస్సృష్టిచేయగల ప్రతిభావంతుడు ప్రదర్శింపగలిగిన ప్రజ్ఞావిశేషాలు. కాబట్టి ఆంధ్రమహాభారతం అనువాదం కాదు; అనుసృజనం.

**ఆదిపర్వం - భారతాఖ్యాన కథాబీజం**

నాటకంలో ప్రథమాంకం, కావ్యంలో ప్రథమాశ్వాసం, ఇతిహాసంలో ఆదిపర్వం వృక్షానికి బీజంవంటి పాత్రను నిర్వహిస్తాయి. పుట్టి, పెరిగి, విస్తరించి, ఫలించే వృక్షంయొక్క జీవశక్తులన్నీ, మూలాధారాలన్నీ బీజంలో నిక్షిప్తమై ఉంటాయి. అట్లాగే, మహాభారత కథా పారిజాతవృక్ష మూలశక్తుల నిక్షేపమే ఆదిపర్వ ప్రాధాన్యం.

నన్నయ తన మహాభారత ప్రణాళికను పరోక్షంగా రాజరాజనరేంద్రుని నోట చెప్పించాడు. ఆ కథను ఎట్లా వినాలోకూడా వ్యంగ్యంగా నిర్దేశించాడు.

“హిమకరుఁదొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్. **(ఆది.1.14)**

వేదధర్మాన్ని ఆచరించి, ఆచరింపజేసిన ఆదర్శప్రభువుల వంశచరిత్రలను సూర్యచంద్రవంశగాథలుగా పురాణాలు, ఇతిహాసాలు వర్ణిస్తాయి. పాండవులు చంద్రవంశజులు. అంటే వారి వంశానికి మూలపురుషుడు చంద్రుడన్నమాట! ఒక్కొక్క వంశంలో వంశకర్తలని కొందరు ప్రసిద్ధి పొందుతారు. వారి పేర్లమీద ఆ వంశజులు పిలువబడుతూ ఉంటారు. చంద్రవంశంలో ఒక్కొక్కరు ఒక్కొక్క విశిష్టధర్మాన్ని పాటించినవారని పేరుపొందినవారు - వరుసగా పూరుమహారాజు, భరతమహారాజు, కురుమహారాజు, పాండుమహారాజు, వారు నలుగురూ ఆ వంశకర్తలు. తండ్రికొరకు నిండుయౌవనాన్ని త్యాగం చేసిన ధీరుడు పూరుడు. అఖండ రాజ్యాన్ని ఆదర్శవంతంగా పాలించిన ధర్మమూర్తి భరతుడు. యజ్ఞయాగాదుల నిర్వహించి ధర్మకర్మపరిరక్షణం చేసిన కర్మవీరుడు కురుమహారాజు. దిగ్విజయయాత్రలు చేసి రణపాండిత్యాన్ని ప్రకటించిన వీరుడైకూడా భ్రాతృప్రేమను ప్రదర్శించిన ఉదాత్త

యుద్ధవీరుడు పాండురాజు. ఆ నలుగురి పేర్లమీదా ఆ వంశజులు ప్రసిద్ధికెక్కారు. పాండవులను - పౌరవులనీ, భారతులనీ, కౌరవులనీకూడా అందువల్లనే పిలుస్తూ ఉంటారు. మహాభారతంలోని విశేషమేమంటే - చంద్రవంశంలో పుట్టిన పాండవులు తమకు పూర్వం తమ వంశంలో పుట్టిన వంశకర్తల ఉత్తమగుణాల నన్నింటిని తమలో పండించుకొన్నారు. అందువలన చంద్రవంశం ధర్మాచరణలో పాండవచరిత్రయందే పరిపూర్ణతను పొందింది. కాబట్టి పాండవుల చరిత్రను సవిస్తరంగా వింటే భరతవంశచరిత్ర అంతా విన్నట్లే.

ఆదిపర్వంలోని ప్రథమ ద్వితీయాశ్వాసాలలో - సూతుడు శౌనకాది మునులకు మహాభారత కథను వినిపించటానికి ఏర్పడిన పరిస్థితులు, తత్కథా ప్రారంభాన్ని తెలిపే వృత్తాంతం వర్ణింపబడి ఉన్నవి. జనమేజయుడు చేసిన సర్పయాగంలో భారత కథాకథనం మొదలైనది. అందులో మొదటి ఘట్టం - వైశంపాయనుడు జనమేజయుడికి సర్పయాగశాలలో భారతకథను చెప్పటం ప్రారంభించటం. అందువలన ఆ సర్పయాగం ప్రవర్తిల్లటానికి కారణాలైన అంశాలను చెప్పటానికి ఈ రెండాశ్వాసాలూ వెచ్చింపబడ్డాయి. అందుకై ఆదిపర్వంలో వరుసగా సరమవృత్తాంతం, ఉదంకోపాఖ్యానం, ఉదంకుడు జనమేజయుడికి సర్పయాగం చేసే బుద్ధిని కలిగించే వృత్తాంతం చెప్పబడ్డాయి. సర్పయాగంలో సర్పకులం హుతం కావటానికి కారణ మేమిటన్న శౌనకాదుల ప్రశ్నకు వివరణగా భృగువంశ చరిత్రలో చ్యవనుని చరిత్రం, సహస్రపాదుని వృత్తాంతం, కద్రూవినతల వృత్తాంతం, సముద్రమథనం, సౌపర్ణోపాఖ్యానం, జరత్కారువృత్తాంతం, తక్షకవిషాగ్నిచేత పరీక్షిత్తు దగ్ధుడుకావటం, జనమేజయు డారంభించిన సర్పయాగాన్ని ఆస్తీకుడు ఆపించటం అనే కథార్థాలు వెలువడ్డాయి. అంటే - సర్పయాగ సంకల్పం ఉదంకునిది. సర్పయాగం చేసినవాడు జనమేజయుడు, దాన్ని నివారించినవాడు ఆస్తీకుడు. వారిముగ్గురి కథలు ఆఖ్యానకాలు. సర్పయాగం ఆగిన తరువాత ఆయాగశాలలోనే భారతకథాకథనం మొదలైనది. ఈ విధంగా భారతకథాకథనారంభ పూర్వరంగాన్ని చెప్పటం మహాభారతకథకు పూర్వరంగం. ఇది మొదటిరెండాశ్వాసాలలో నిర్వహింపబడింది.

ఆతరువాత - ఆదిపర్వంలోని తృతీయ, చతుర్థ, పంచమాశ్వాసాలు చంద్రవంశంలో ప్రసిద్ధి చెందిన వంశకర్తల చరిత్రలు చెప్పటానికి వినియోగించటం గమనింపదగిన అంశం. జనమేజయుడు వైశంపాయనుడిని పాండవధార్తరాష్ట్రుల విభేదాలకు కారణాలను వివరించుమని కోరాడు. దానితో వైశంపాయనుడు చెప్పే భారతాఖ్యానం మొదలయింది. ఆ ముని భారత మహిమను గురించి మొదట చెప్పి, పాండవధార్తరాష్ట్రుల నడుమగల భేదకారణాలను పేర్కొంటూ కురుక్షేత్రయుద్ధం జరిగినదాకా సాగిన కథను సంగ్రహంగా, టూకీగా ముందు చెప్పాడు. కురువంశంలో పుట్టిన మహావీరులందరూ దేవదానవాంశ సంభూతులనీ, కురుక్షేత్ర యుద్ధం దేవదానవ ప్రవృత్తుల మధ్య జరిగిన మహాసంఘర్షణమనీ వ్యాఖ్యానించాడు. దానితో భారతకథామూలతత్త్వం తేటతెల్లమౌతున్నది. ఇది కథాబీజమూలశక్తులలో ముఖ్యమైనది.

వేదవ్యాసరచిత భారతం కమనీయ ధర్మార్థకామమోక్షాలకు ఉత్తమసాధనమనీ, శ్రోతలకు అభిమతశుభాలను కలిగించే దనీ, త్రికరణాలతో చేసిన మహాపాపాలను కూడా తొలగించేదనీ, సత్యవాక్ప్రబంధమనీ, శతసహస్రశ్లోక సంఖ్యాపరిమాణం కలిగిన దనీ, సర్వలోకపూజ్య మైనదనీ నన్నయ వర్ణించాడు. (ఆది. 3.9).

ప్రసిద్ధ పరాక్రములు, ధృత వివేకులు, సత్యనిష్ఠులు, యశోధనులు, కృతజ్ఞులు, ఉత్తమధర్మపరులు, శరణాగతరక్షణ వ్రతులు అని ప్రసిద్ధు లైన భారతవీరుల సద్గుణకీర్తనమే వస్తువుగా కలిగిన భారతం సభలలో రక్తికట్టుతుం దనీ నన్నయ ప్రశంసించాడు.

భారతభారతీ వ్యక్తిత్వాన్ని పద్యసూక్తంగా చెప్పిన వాక్య మిది -

"ఆయుష్యం, బితిహాసవస్తుసముదాయం, బైహికాముష్మిక
శ్రేయఃప్రాప్తి నిమిత్త, ముత్తమ సభాసేవ్యంబు, లోకాగమ

న్యాయైకాంతగృహంబు నాఁ బరఁగి నానావేద వేదాంత వి
ద్యాయుక్తం బగుదానిఁ జెప్పఁదొడగెం దద్భారతాఖ్యానమున్.'' **(ఆది. 3.11)**

మహాభారతం ఇతిహాసవస్తుసముదాయ మని చెప్పిన లక్షణం దాని కథాస్వభావాన్ని వివేచించటానికి తోడ్పడుతుంది. ''ఇతిహాసః పురావృత్త'' మ్మని అమరసింహుడు. ''ఇతిహాసః - ఇతిహ పారంపర్యోపదేశ ఆస్తే అస్మిన్ ఆస ఆధారే ఘఞ్. ధర్మార్థకామమోక్షాణాం ఉపదేశసమన్వితమ్ । పూర్వముక్త కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే ॥ ఇత్యుక్త లక్షణే పురావృత్త ప్రకాశకే భరతాదిగ్రంథే'' - అని శబ్దకల్పద్రుమం. ఈ నైఘంటిక నిరుక్తులను ఆధారంగా చేసికొని - ఇతిహాసం పరంపరాగతంగా చెప్పకోబడుతున్న పూర్వచరిత్ర వస్తువు కలదై, ఉజ్జ్వలోపదేశాత్మకమై ఉంటుందని ఏర్పడుతున్నది.

అభినవగుప్తపాదుడు నాట్యశాస్త్రవ్యాఖ్యానంలో కర్మఫలసంబంధస్వభావం గల ఆగమికార్థాలు ఎందులో ప్రత్యక్షపరిదృశ్యమానా లౌతుంటాయో అదే ఇతిహాసమని పేర్కొన్నాడు. (ఏవం ప్రకారాః ప్రత్యక్షపరిదృశ్యమానాః ఆగమికార్థాః కర్మఫలసంబంధస్వభావాః యత్ర ఆసతే తేన ఇతిహాసేన......) అంటే ఆ యా పుణ్యపాపకర్మలకు ఆ యా ఫలాలు లభిస్తాయని ఆగమాలలో చెప్పబడిన వాక్యతాత్పర్యాలు కళ్ళయెదుట కనబడుతున్నట్లు ఇతిహాసంలోని ఇతివృత్తం చిత్రింపబడా లన్నమాట!

విద్యారణ్యసాయణాచార్యులు ''దేవాసురాస్సయంయత్తా ఆసన్'' అని పూర్వం జరిగినదట అన్నట్లు పూర్వప్రసిద్ధ వృత్తాలను చెప్పేది ఇతిహాసమని తమవేదభాష్యంలో చెప్పారు. ఉదాహరణబలాన్నిబట్టి దేవాసురుల ప్రవృత్తుల మధ్య జరిగే సంఘర్షణం చిత్రించటం ఇతిహాసలక్షణమనికూడా భావించవచ్చును.

''పరిక్రియా పురాకల్ప ఇతిహాస గతి ర్ద్విధా,
స్యా దేకనాయకా పూర్వా, ద్వితీయా బహునాయకా''.

అని కావ్యమీమాంసాకర్త రాజశేఖరుడు పేర్కొన్నాడు. ఇతిహాసం ప్రవర్తిల్లే విధానాన్నిబట్టి రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి-పరిక్రియ. అది ఏకనాయకం. రెండు- పురాకల్పం. అది బహునాయకం, రామాయణం పరిక్రియ. మహాభారతం పురాకల్పం - అని తాత్పర్యం. రాజశేఖరు డీ శబ్దాలను దార్శనికుల పరిభాషనుండి గ్రహించినట్లున్నాడు. దార్శనికులు పరిక్రియా పురాకల్పాలనేవి అర్థవాదాలుగా పేర్కొన్నారు. అవి నిందా, ప్రశంసా, పరకృతి, పురాకల్పాలని నాలుగు విధాలు. మహాపురుషు డొకడు పూర్వం జరిగిన ఒక అంశాన్ని ప్రమాణంగా చూపించటం పరకృతి. ఉదాహరణకు 'అగ్ని అనేవాడు సర్వభక్షకుడు కాగోరి అగ్నిదేవుడిని ఆరాధించి సర్వభక్షకు డైనాడు' - అని ఒక పూర్వప్రవర్తిత ఐతిహ్యాన్ని ప్రమాణంగా చూపించటం పరకృతి. పూర్వం ఒకరిచేత చెప్పబడిన అర్థాన్ని ప్రతిపాదించేది పురాకల్పం. 'పూర్వం హోమాలు మోయటం ఇష్టంలేక అగ్ని నీటిలో దాగాడు. దేవతలు అగ్నిని అన్వేషిస్తున్నారు. అగ్ని నీటిలో దాగి ఉన్నాడని చేపలు వారికి చెప్పాయి. తన రహస్యాన్ని బయటపెట్టినందుకు అగ్ని ఆగ్రహించి చేపలను - 'లోకులు మిమ్మల్ని ఇష్టంవచ్చినట్లెల్లా చంపుతారుగాక!' అని శపించాడు - అనే పరవక్తృక అర్థప్రతిపాదన పురాకల్పం. (తైత్తిరీయసూత్రం). ఈ లక్షణాలను సూక్ష్మంగా గమనిస్తే పరక్రియ ఏకవక్తృకమనీ, పురాకల్పం బహువక్తృకమనీ తేటపడుతుంది. వస్తుతః ఈరెండూ అతీతార్థప్రధానాలే. అయినా, పరకృతి అద్యతనభూతార్థం. ప్రాచీనోదంతం ప్రప్రథమంగా ఒకవక్తచే చెప్పబడినది పరకృతి. పారంపర్యకథనంగా బహువక్తలచేత చెప్పబడినది పురాకల్పం. బహుశః మీమాంసకులు చెప్పే ఈ అర్థవాద భేదాలను రాజశేఖరుడు గ్రహించి వాటి లక్షణాలైన ఏకవక్తృక, బహువక్తృకత్వాలను మార్చి ఏకనాయక బహునాయకత్వాలుగా నిబంధించి ఉంటాడు. 'పరక్రియా' శబ్దాన్ని 'పరిక్రియా' గా మార్చి ఉంటాడు. ఇతిహాసం పారంపర్యోపదిష్టమే కాబట్టి మీమాంసకుల అభిప్రాయం తద్విరుద్ధం కాదు. భారతాన్ని వ్యాసుడు మొదట చెప్పాడు. ఆతరువాత ఆయన శిష్యులు, వారి పుత్రులు, ప్రశిష్యులు పరంపరగా చెప్పతూ వచ్చారు. కాబట్టి ఇది బహువక్తృకం. పాండవులే కాక, భీష్మాదివీరుల వృత్తాంతాలు

స్వయంసమగ్రాలై పురుషార్థసాధన ప్రవృత్తితోపాటు కర్మఫలరూపస్వభావాన్నికూడా ప్రకటిస్తూ ఉండటంచేత మహాభారతం బహునాయకమైన పురాకల్ప మనీ చెప్పవచ్చును. ఈ విధంగా బహువక్తలవలన, బహునాయకులవలన ఏర్పడే ఇతిహాసాల సముదాయం మహాభారతమని నన్నయ అభివర్ణించాడు. భారతకథలోని సంశ్లిష్టత దీనివలన సూచిత మౌతున్నది.

అన్నదమ్ములైన పాండవధార్తరాష్ట్రుల నడుమ కురుక్షేత్ర ఘోరసంగ్రామం ఎందుకు జరిగింది? అంతమంది ఆ రణంలో ఎందుకు నిహతులైనారు? ఆ కాలంలో శ్రీకృష్ణుడివంటివారున్నా ఆ యుద్ధాన్ని ఎందుకు వారించలేకపోయారు? - వంటి ఎన్నో ప్రశ్నలు జనమేజయుడు - మనవలెనే - గుప్పించాడు. దానికి వేదవ్యాసుడు చెప్పిన సమాధానాలు వైశంపాయనుడు చెప్పాలి. అందువలన ముందుగా వ్యాసోత్పత్తిని గురించి చెప్పి, ఆ తరువాత దేవదానవాంశలతో పుట్టిన భీష్మాదులను పరిచయం చేశాడు. దేవదానవ ప్రవృత్తుల సంఘర్షణను ప్రతీకాత్మకంగా నిరూపించి చెప్పటం భారతేతిహాస కథాతాత్పర్యమని వైశంపాయనుడు వివరించాడు. దీనితో పౌరవవంశవివరణకు నాందీప్రస్తావనలు నిర్వహించినట్లైనది.

అసలుకథ ఇక్కడినుండి మొదలౌతుంది. అందులోనూ వంశకర్తల కథలు చెప్పటం మొదటిఘట్టం. పాండవులు చంద్రవంశజులైనా, చంద్రునినుండి వంశం ఏ విధంగా విస్తరించిందో వివరంగా చెప్పటం వ్యాసతాత్పర్యం కాదు. ఆ వంశ ప్రతిష్ఠకు మూలకారకులైన వంశకర్తల ప్రశంస చేయటమే వ్యాసభారత కథా హృదయం. దాన్ని నన్నయ ఎంతో స్పష్టంగా, ప్రసన్నంగా పేర్కొన్నాడు. ఈ పద్యం అందుకు సాక్ష్యం.

"నిరుపమ ధర్మమార్గ పరినిష్ఠితులై మహియెల్లఁ గాచుచుం
బరఁగిన తొంటి పూరుకురుపాండు మహీశులపేర్మిఁ జేసి భూ
భరవహనక్షమం బగుచుఁ బౌరవ కౌరవ పాండవాన్వయం
బురుగుణసంపదం బెరిఁగి యొప్పె సమస్త జగత్ప్రసిద్ధమై. **(ఆది. 3.88)**

ఈ పద్యంలో (అంటే భారతంలో) వంశకర్తలు ముగ్గురే చెప్పబడ్డారు. మహాభారతకాలానికి నలుగురయ్యారు. భరతుడు రెండో వంశకర్తగా నన్నయకూడా పేర్కొన్నాడు. ఆ నలుగురి వంశకర్తల కథలు చెప్పటం 3వ ఆశ్వాసంలో 88వ పద్యంనుండి పంచమాశ్వాసంలో 161వ పద్యం వరకు సాగుతుంది. వంశకర్తల చరిత్ర వర్ణించేటప్పుడు పూరు భరతేశుల తల్లిదండ్రుల చరిత్రలు విపులంగా చెప్పి వారి జీవితతత్త్వఫలాలుగా ఆ యిద్దరినీ వర్ణించే పద్ధతిని పాటించటం ఒకవిశేషం. కురుమహారాజు తపతీసంవరణుల కుమారుడు. ఆ దంపతుల ప్రణయగాథ పురాణప్రసిద్ధం. కాని, దానిని ఇందులో వివరించకుండా కురుమహారాజు వంశకర్త అనీ, అతనిపేరుమీద, కురుక్షేత్రం ప్రసిద్ధమైనదనీ మాత్రమే చెప్పి ఊరుకొన్నాడు. అయితే తపతీసంవరణుల కథ సప్తమాశ్వాసంలో మరొక సందర్భంలో చెప్పబడింది. నాల్గవవాడైన పాండురాజు పుట్టుకకు వ్యాసుడే కారకుడు. పాండురాజు చరిత్రం పాండవ చరిత్రానికి పాదువంటిది. దాన్ని ఇతిహాస కథకు పీఠంవలె వివరంగా చెప్పటం అవసరం. నన్నయ అట్లాగే చెప్పాడు. కాబట్టి అందులో ఔచిత్యంకూడా కనబడుతున్నది.

పాండుపుత్రులు, ధార్తరాష్ట్రులు హస్తినాపురంలో కలిసి ధృతరాష్ట్రుని మందిరంలో పెరగటాన్ని వర్ణించే ఘట్టంనుండి (5-162) పాండవ వృత్తాంతం మొదలై పద్దెనిమిది పర్వాలూ సాగుతుంది. ఈ కథారంభంలోనే వేదవ్యాసుడు సత్యవతికి ఏకాంతంలో చెప్పిన మాటల్లోని ఈ పద్యాలు భారతకథాతత్త్వసారాన్ని సూచిస్తున్నాయి.

క. "మతిఁ దలఁపఁగ సంసారం
బతిచంచల మెండమావు లట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు;
గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్.

క. క్రూరులు విలుప్తధర్మా
చారులు ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని
ష్కారణ వైరులు వీరల
కారణమున నెగ్గు పుట్టుఁ గౌరవ్యులకున్.

వ. దాని ధృతరాష్ట్రుండు తాన అనుభవించు. **(ఆది. 5.159 -161)**

పాండవచరిత్రలో వ్యాసుడు చెప్పదలచుకొన్నవి ముఖ్యంగా మూడంశాలు. అవి - 'వాసుదేవస్య మాహాత్మ్యం', 'పాండవానాం చ సత్యతా', దుర్వృత్తం ధార్తరాష్ట్రాణాం' - అనేవి. "అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే" అన్న న్యాయంచేత దుర్వృత్తులైన ధార్తరాష్ట్రులు నశించటానికి కారణం వారు స్వయంగా చేసికొన్న పాపకర్మయే. వాటికి సాక్షి, పోషకుడు ధృతరాష్ట్రుడు. తనవారందరూ పోగా తత్ఫలమైన అనంతశోకాన్ని అనుభవించేది ధృతరాష్ట్రుడు. పాండవులు తమ సత్కర్మలకు ఫలాన్ని ఇహపరాలలో అనుభవిస్తారు. కర్మకూ, కర్మఫలానికీ అతీతుడూ, సాక్షీభూతుడూ అయిన సాక్షాత్ పరమాత్మ శ్రీకృష్ణుడు. కర్మఫలరూపమైన భారతకథకు ఈ ముగ్గురూ మూడు ముఖాలు. మూడు మెట్లు. వాటిని ముమ్మూర్తులా, ముప్పేటగా ప్రదర్శించేది మహాభారతేతిహాసం.

ఆదిపర్వంలోని మరొకవిశేషంకూడా గమనింపదగింది. ధార్తరాష్ట్రుల దుర్వృత్తం ఎంత బలంగా చిత్రింపబడితే పాండవుల సద్వృత్తం అంత ఉజ్జ్వలంగా ప్రకాశించటానికి వీలౌతుంది. ఇది భారతకథలో సర్వత్రా పాటించే కథామర్మమే. అయితే, దానికి బీజప్రాయమైన కథాంశాలు ఆదిపర్వంలో స్థాపింపబడ్డాయి. వాటిలో పేర్కొనదగినవి -

1. దుర్యోధనుడు భీముని బలాన్ని సహించలేక అతడిని చంపే యత్నాలు చేయటం.
2. అర్జునుడు విలువిద్యలో అనన్యవీరుడుగా ప్రకాశిస్తూ ఉండగా, అతనికి ప్రత్యర్థిగా కర్ణుడిని అంగరాజుగా చేసి దుర్యోధనుడు ప్రోత్సహించటం.
3. దుర్యోధనుడు కణికనీతి నాశ్రయించి ధృతరాష్ట్రుని అండదండలతో, శకునికర్ణాదుల సలహాలతో పాండవులకు ఎగ్గుచేయాలని తలపెట్టటం, లాక్షాగృహదహనయత్నం చేయటం.
4. పాండవులు హస్తినాపురంలో ఉంటే తనకు రాజ్యాధికారం దక్కటం అసాధ్యమని భావించి దుర్యోధనుడు తండ్రిని ప్రేరేపించి వారిని ఇంద్రప్రస్థానికి పంపించటం.

పాండవేతివృత్తంలో ధర్మరాజాదులు ధార్తరాష్ట్రుల కుతంత్రాలనుండి తప్పించుకొనే అధ్యాయాలు కొన్ని, స్వీయపరాక్రమాదులను ప్రదర్శించి తమ ఆస్తిత్వాన్ని స్థాపించుకొనే సన్నివేశాలు కొన్ని, ఎట్టికష్టాలలోనైనా ధర్మాన్ని పాటించే సచ్ఛీలాన్ని ప్రదర్శించే సన్నివేశాలు కొన్నీ - కలసి పాండవ నాయక లక్షణాలను ప్రకాశింపజేస్తూ ఉంటాయి.

కురుక్షేత్ర సంగ్రామంలో ప్రజ్వలించే ప్రతీకారజ్వాలలకు ఆదిపర్వంలోనే అంకురారోపణం జరిగింది. భీమదుర్యోధనుల, కర్ణార్జునుల ద్వంద్వయుద్ధాలే కురుక్షేత్ర యుద్ధ పతాకలు. పాండవులు ధర్మానికి తలలొగ్గి కష్టాలకు ఓర్చుకోవటం, అజ్ఞాతంగా మారువేషాలలో నివసించటం, శత్రువులకు అసాధ్యమైన అస్త్రశస్త్రాలను తపస్సుతో యశస్సుతో సాధించటం, అపూర్వవిజయాలతో స్వీయకల్యాణాన్నీ, లోకకల్యాణాన్నీ సాధించటం, శ్రీకృష్ణుని మైత్రివలన దైవానుకూల్యాన్ని సంపాదించుకోవటమూ అనే ప్రధానాంశాలు ఆదిపర్వంలోనే ప్రదర్శితాలై భావిపాండవ కథా జీవితానికి ప్రాతిపదికలుగా పరిఢవిల్లుతున్నాయి. వీటన్నిటి తాత్పర్య మేమంటే ఆదిపర్వం భారతకథకు అన్నివిధాలా బీజభూతం !

**ఆంధ్రమహాభారతం - అమృతత్వసాధనం**

"న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగే నైకే అమృతత్వ మానశుః।
పరేణ నాకం నిహితం గుహాయామ్
విభ్రాజతే తద్యతయో విశంతి॥"

ఇతిహాసాలు, పురాణాలు, మహాకావ్యాలు కాలక్షేపానికి చదివేవి కావు. అవి అందించే మహోపదేశాలను మననం చేసికొనటానికి అధ్యయనం చేసేవి. పంచమవేదమైన మహాభారతం మానవలోకానికి ఒక మహత్తరమైన సందేశాన్ని ఇస్తుంది. మానవుడు జీవితంలో సాధించవలసింది అమృతత్వమే అన్నది ఆ భారతసంహిత అందిస్తున్న జీవన సందేశం.

**అమృతత్వసాధన మంటే?**

మహాభారతంలో మొదలూ, ముగింపూ - మానవుడు అమృతత్వసిద్ధి కోసం చేసే సాధనయొక్క ప్రారంభ పరిణతావస్థలను తెలుపుతూ ఉన్నాయి. ఆదిపర్వంలో ఉదంకోపాఖ్యానం చూచినా, క్షీరసాగర మథనోపాఖ్యానం గమనించినా, సర్పయాగ ఘట్టాన్ని చదివినా మానవుడు విషాదులవలన కలిగే మరణాన్ని జయించాలన్న కోరిక బలంగా కనబడుతుంది. శుక్రాచార్యుడు సాధించిన 'మృతసంజీవని'-యుద్ధంలో చనిపోయినవారిని బ్రతికించే ఒక మహామంత్రం. ఆ మంత్రం వెనుక మానవులు, దానవులు, దేవతలు మృత్యువుబారి పడకుండా తప్పించుకొనే ఉపాయంకోసం ప్రయత్నించిన ఒక ప్రస్థానం మనకు ప్రత్యక్షం అవుతుంది. కచుని చరిత్ర, యయాతి చరిత్ర శుక్రాచార్యునితో ముడిపడి ఉన్నాయి. శుక్రాచార్యుడి కూతురు దేవయాని. ఆమె మొదట వలచినవాడు బృహస్పతి కుమారుడు కచుడు. రాక్షసు లతనిని చంపినా, బూడిదచేసి మద్యంలో కలిపి శుక్రునిచేత త్రాగించినా మృతసంజీవని ప్రభావం చేత దేవయాని కచుడిని బ్రతికింపజేస్తుంది. మహాభారతకథకు మృతసంజీవని ఒక మహారంభం. మానవుని అమృతత్వసాధనకు అదొక శుభారంభం.

లోకంలో మరణం, లేదా మృతి ఒకవాస్తవంగా ఉన్నది. దేహి ప్రాణత్యాగం చేసినప్పుడు, దేహం పొందే జడత్వం మృత్యువు. పుట్టిన జీవి గిట్టటం సహజం. జన్మ ఎత్తిన ప్రాణి మృత్యువు పొందక తప్పదు. మానవుడు ఈ రెండింటిని జయించాలని తీవ్రంగా ప్రయత్నం చేస్తూ వచ్చాడు. ఈ ప్రయత్నాన్ని ఆధ్యాత్మిక ప్రస్థానం అంటారు. మరణం లేకుండా ఉండే స్థితిని పొందితే అమరత్వం అనాలి. జన్మ ఎత్తకుండా ఉండే నిత్యస్థితిని మోక్ష మన్నారు. పుట్టినజీవి మరణం లేకుండా బ్రతకటం ఒక ఎత్తు. అసలు పుట్టుక లేకుండా బ్రహ్మస్థితిలో నిలవటం మరొక ఎత్తు. మొదటి మార్గానికి ఫలం స్వర్గం. రెండవ ప్రస్థానానికి ఫలం బ్రహ్మత్వం. ఈ రెండు రకాల సాధనలలో మొదటిది సామాన్యంగా కర్మమార్గాన్ని అనుసరించేవారికి లభ్యమౌతూ ఉంటుంది. జ్ఞానమార్గం అనుసరించే వారికి బ్రహ్మానందస్థితి గమ్యమౌతూ ఉంటుంది. భక్తిమార్గ ప్రస్థానంలో ఉభయసిద్ధులకు అవకాశం ఉన్నది. మహాభారతం ఈ మూడు మార్గాలను ముచ్చటగా మేళవించింది. ఆ సమన్వయానికి పాండవులు ఆదర్శోదాహరణాలు. అయితే, వారు ప్రధానంగా ధర్మ, కర్మ మార్గంలో నడిచిన వారు. దానికి పోషకంగా భక్తిని జ్ఞానాన్ని పొందుపరచుకొన్నారు. యక్షప్రశ్నలకు సమాధానం చెప్పగలిగిన దక్షుడు జ్ఞాని అయిన ధర్మరాజు. ద్రౌపది అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగిన వాడూ ధర్మరా జొక్కడే అని కురుసభలో భీష్మాదులచే ప్రశంస లందుకొన్నవాడు. ధర్మరాజు ధర్మతరువువంటివాడని శ్రీకృష్ణునిచేత కీర్తింపబడినవాడు. పంచమవేదమైన మహాభారతంలో ప్రతిపాదింపబడిన జ్ఞానాని కంతటికీ ఆచరణ రూపమైన ఆదర్శోదాహరణంగా నిలిచినవాడు - ధర్మరాజు. అతడు వస్తుతః జ్ఞాని. ఏకాగ్రచిత్తంతో స్మరించి, ధ్యానించి, తపించి యమ, సూర్య, అగ్ని, ఇంద్రాది దేవతలను సుముఖులుగా చేసికొన్న ఉత్తమ భక్తశిఖామణి ధర్మరాజు. అయితే అంతటి జ్ఞానాన్ని, అంతటి భక్తిని ఆచరణంలో

ప్రదర్శించి చూపటమే ఆయన ధ్యేయం. ధర్మరాజు జీవితంలో కర్మకు వన్నెపెట్టే భక్తిజ్ఞానాలే ప్రకాశిస్తూ ఉంటాయి. అందువలన ధర్మరాజు ధర్మ కర్మ వీరుడుగా ప్రసిద్ధిపొందాడు.

భీముడు ప్రచండ బలవీరుడు. పాండవుల పురుషార్థత్రయసాధనకు భీముడు బలమైన ప్రతినిధి. ధర్మరాజు సాధింపదలచుకొన్న లౌకికకార్యాలన్నీ భీమునిసాయంతోనే నెరవేర్చుకొంటాడు. భీమునికి ధర్మరాజు ధర్మమూర్తి. అతని మాట ధర్మశాసనం. అతని ఆజ్ఞ వేదం. అన్న మాటను జవదాటకుండా ఆచరించే ఆదర్శ కర్మవీరుడు భీముడు. అతనికి భ్రాతృ భక్తియే వ్రతం. అదియే అతని ధర్మానురక్తి. అతనికి అన్నయే జ్ఞానం. అన్నయే భక్తి. అతడిని అనుసరించటమే కర్మ. కప్పను, నీటిని గర్భంలో ధరించిఉన్న శిలామూర్తి వలె భక్తిజ్ఞానాలను గుప్తంగా దాచుకొన్న కర్మఠుడు భీముడు.

అర్జునుడు యుద్ధవీరుడు. నరనారాయణులలో నరు డాతడు. నారాయణభక్తియుక్తుడు. ధర్మరాజు దైవకార్యాన్ని సాధింపవలసి వచ్చినపుడు అర్జునుడిని దివ్యోపకరణంగా వాడుకొంటాడు. ఇంద్రుని సాయం కావాలన్నా, పరమేశ్వరునుండి పాశుపతాస్త్రం పొందాలన్నా, సాక్షాత్ నారాయణుడైన శ్రీకృష్ణునితో అనుసంధానం పెంచుకోవాలన్నా అర్జునుడే అనువైన వాహిక. కృష్ణునిపట్ల అనన్యచిత్తంతో భక్తిని ప్రసరించే పరమయోగి అర్జునుడు. భగవద్గీతను శ్రీకృష్ణభగవానునిచేత స్వయంగా విన్న మహాజ్ఞాని. అతని భక్తి. అతని జ్ఞానం- అతని గాండీవ పాండిత్యాన్ని ప్రదర్శించడానికి పోషకంగా నిలిచాయి. అతడు యుద్ధాలలో విజయుడు. సాటిలేని మేటి వీరుడు. కర్మమార్గాన్ని అనుసరించినా జ్ఞానాన్ని గౌరవించినవాడూ. భక్తిని పండించుకొన్నవాడు.

నకుల సహదేవులు జంట వీరులు. వారికి అన్నలే దేవుళ్లు. వారి సేవయే భక్తి. వారు చెప్పిన పని చేయటమే కర్మ. వారు సేవాతత్పరులైన కర్మవీరులు.

ద్రౌపది పాండవ ధర్మపత్ని. అబల రూపంలో అవతరించిన అహంకారశక్తి. ధర్మరాజుయొక్క జ్ఞానశక్తిని, భీమాదుల క్రియాశక్తిని తన ఇచ్ఛాశక్తితో నడిపించ గలిగిన నారీమూర్తి. ఒక్కసారి పిలిస్తే చాలు ఎక్కడ ఉన్నా భగవంతుడు ఆమెకు ప్రసన్నుడౌతాడు. కురుసభలో కోక లందించిన శ్రీకృష్ణుడు, విరాటనగరంలో అంగసంరక్షణ చేకూర్చిన సూర్యభగవానుడు ఆమె భక్తి శక్తికి ప్రత్యక్ష సాక్ష్యంగా నిలిచిన భగవద్రూపులు. ఆమె ప్రధానంగా కార్యశూరురాలు. అగ్నినుండి పుట్టిన అయోనిజ. జ్వాలవలె తనలో భక్తిజ్ఞానాలను పండించుకొన్న పరిణతమూర్తి, సాధ్వి. పతుల సేవ ఎట్లా చేయాలో, సత్యభామకు బోధించిన అనుభవజ్ఞానశీలి. భక్తిజ్ఞానాలున్నా, అవమానాగ్నితో అనవరతం జ్వలిస్తూ, శత్రుశేషం లేకుండా సంహార యజ్ఞం సాగించిన సాహసురాలు. కర్మమార్గావలంబిని ద్రౌపది.

ఈవిధంగా పాండవులు ప్రధానంగా ధర్మకర్మప్రవృత్తులకు ప్రతీకలుగా భారతంలో కనబడతారు. వీరందరిలో అగ్రగణ్యుడు ధర్మరాజు. ఆయన యమధర్మరాజు అంశతో పుట్టిన అపూర్వ ధర్మమూర్తి. మృత్యుదేవతయొక్క అనుగ్రహంతో పుట్టిన ధర్మరాజు మృత్యువును జయించటం మహాభారత కథలో ఫలితాంశం. బొందితో స్వర్గానికి వెళ్లాడు- అనే వాక్యానికి కొద్ది మంది మాత్రమే ఉదాహరణప్రాయంగా నిలువగలరు. వారిలో ధర్మరాజు అగ్రగణ్యుడు. సశరీరస్వర్గం కర్మమార్గాన్ని అనుసరించే ధర్మవీరుడు సాధించగలిగిన సమగ్రఫలం. దానినే అమరత్వం అంటారు. స్వర్గ నరకాలను దర్శించిన తరువాత ధర్మరాజు ఆకాశగంగలో మునిగి, స్వస్వరూపస్థితిని పొందాడు. మరణావస్థకు గురి అయ్యే దేహాన్ని ధరించినన్నాళ్లు అమరలోకాన్ని అందుకొన్నా, అమృతత్వసిద్ధి లభించదనీ, నశ్వరమైన దేహాభిమానాన్ని వదలి అనశ్వరమైన ఆత్మస్థితిలో నిలిచినప్పుడే అమృతత్వస్థితి అందుకొన్నట్లనీ, సశరీర స్వర్గానంతరం స్వసంకల్పంతో దేహత్యాగాన్ని చేసి ఆత్మ స్థితిలో నిలవటమే అమృతత్వమనీ, ఆంధ్ర మహాభారత కథ ప్రబోధిస్తున్నది. అమృతత్వసాధనలో ఇది ఒక పరిణతస్థితి. దీన్ని అందుకోవటానికి మహాభారతకథలో సాగిన మానవయత్నాలను మనం గమనిస్తే ఆ ప్రస్థానవైఖరి రసరమ్యంగా ప్రసన్నమౌతుంది.

### అమృతత్వసాధనలో ఆదిమదశ 'మృతసంజీవనీ' విద్య

వృషపర్వుడనే దానవరాజుకు శుక్రాచార్యుడు గురువు. దేవదానవ యుద్ధాలలో దానవులు చనిపోతే వారిని బ్రతికించటానికి శుక్రాచార్యుడు 'మృతసంజీవని' అనే విద్యను కనిపెట్టాడు. ఆ విద్యవలన యుద్ధంలో చనిపోయిన దానవులందరూ బ్రతుకుతూ ఉండేవారు. ప్రతిరోజూ శుక్రుడు అసంఖ్యాకంగా దానవులను పునర్జీవితులుగా చేస్తుండేవాడు. ఇది దేవలోకంలో కలవరం రేకెత్తించింది. మృతసంజీవనీ విద్యను ఏవిధంగానైనా పొందాలని దేవతలు యోచించారు. వారిలో బృహస్పతి బుద్ధికుశలుడు. ఆయన పుత్రుడు కచుడు. అతడిని పిలిచి శుక్రాచార్యుడివద్దకు వెళ్ళి మృతసంజీవనీ విద్యను ఏవిధంగానైనా పొందుమని దేవతలు కోరారు. 'నియమవ్రత శీలుడవై శుక్రుడిని సేవించి, అతని ప్రీతికి పాత్రుడవై, అతడి మనసు కరిగి దయతో నీ కా విద్యను బోధించేటట్లుగా ప్రయత్నించు' మని ప్రేరేపించారు. 'శుక్రాచార్యుడికి దేవయాని అనే కూతు రున్నది. ఆమె అంటే ఆయనకు చెప్పలేనంత మమకారం. ఆమె మాటను ఆయన జవదాటడు కాబట్టి ఆమెను ముందుగా సుముఖురాలిని చేసుకో. శుక్రాచార్యుడిని భక్తితో సేవించు. నీ కిష్టసిద్ధి కలుగుగాక! అని దీవించి కచుడిని శుక్రాచార్యుడివద్దకు పంపారు దేవతలు.

### కచదేవయాని కథ

కచుడి సుకుమారత్వానికీ, మృదు మధురవినయ ప్రియవచనాలకూ, నియమవ్రతశీలానికీ శుక్రాచార్యుడు ఎంతో సంతోషించి అతనిని దరికి చేర్చుకొన్నాడు. శుక్రుడిని బృహస్పతివలె భావించి కచుడు సేవించాడు. శుక్రుని ఆశ్రమంలో గురుశుశ్రూషలు కచుడు విధి తప్పకుండ నిర్వర్తించాడు. శుక్రాచార్యుడికి ప్రియశిష్యుడై మెలగజొచ్చాడు. అది దానవులకు కన్నుకుట్టింది. దేవతలమీద, బృహస్పతిమీద ఉన్న కోపంతో కచుడిని సంహరించాలని భావించారు దానవులు.

ఒకనాడు కచుడు హోమధేనువులను కాస్తూ ఒంటరిగా వనానికి వెళ్లాడు. అదే తగిన సమయమని భావించి దానవులు కొందరు అతడిని చంపి మద్దిచెట్టుకు బంధించి వెళ్ళిపోయారు. సాయంకాలం అయింది. హోమధేనువులు ఒంటిగా ఇంటికి తిరిగి వచ్చాయి.

అప్పటికే కచుడిమీద వలపు తొలిరేకులు విచ్చుకొంటున్న హృదయంతో దేవయాని తండ్రితో ఇట్లా అన్నది :

"వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె, ధేనువుల్
నేఁ డిట వచ్చె నేకతమ, నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁబడియెఁ, బ్రొద్దును బోయెఁ, గచుండు నేనియున్
రాఁడు, వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో." **(ఆది. 3. 112.)**

మనసులో బాధపడుతూ దేవయాని చెప్పిన మాటలు శుక్రాచార్యుని హృదయాన్ని ద్రవింపజేశాయి. దివ్యదృష్టి సారించి అసురుల చేత చంపబడిన కచుడిని గమనించాడు. మృతసంజీవనిని పంపి అతనిని సంజీవితుడిని చేసి తనవద్దకు పిలిపించుకొన్నాడు. దేవయాని అందుకు మనసులో ఎంతో సంతోషపడింది. మనసులోని కోరికను మాత్రం బయట పెట్టకుండా దాచుకొన్నది.

ఒకనాడు కచుడు పూజకై పూలు తీసికొనిరావటానికి అడవిలోకి ఒంటరిగా పోయాడు. అదను కనిపెట్టి అసురులు అతడిని పట్టిచంపి అగ్నిలో పడవేసి, కాల్చి, బూడిదచేసి దానిని మద్యంలో కలిపి శుక్రాచార్యుడి కిచ్చి అతనిచేత త్రాగించారు. శుక్రాచార్యుడికి సహజంగా ఉన్న సురాపానమోహంచేత పూర్వాపరాలు గమనించక ఆ సురను త్రాగాడు. సాయంకాలం అయింది. కచుడు తిరిగి రాలేదు. దేవయాని కనులవెంట నీరు పెట్టుకుంటూ కచుడు రాలేదని తండ్రిని ఎలుగెత్తి అడిగింది.

"సంజీవనీ విద్య తమ వద్ద ఉన్నదని అసురులు గర్వాంధులై ఆ కచుడిని సంహరించటానికి చూస్తున్నారు. ఒకవేళ ఆ విధంగా అతడు చనిపోతే ఉత్తమ గతులు పొందుతాడు. నీ వెందుకు అతనికొరకు దుఃఖిస్తావు?" అని శుక్రుడు దేవయానిని అడిగాడు. "మతిలోకోత్తరుడు, బృహస్పతి సుతుడు. నీ శిష్యుడు. బ్రహ్మచర్యాశ్రమసంపన్నుడు అయిన ఆ కచుడు అకారణంగా దనుజులచేత సంహరింపబడితే నేను అతని కొరకు శోకించకుండా ఎట్లా ఉండేది? ధర్మచ్యుతిని సహించని మీరు ఈ అధర్మాన్ని ఎట్లా సహిస్తారు? కచుడు కనపడితే తప్ప నేను ఆహారం ముట్టను"అని దేవయాని ఎక్కిళ్లుపెట్టి ఏడుస్తూ కూర్చున్నది. చాలాసేపటికి గాని శుక్రుడు ప్రసన్నం కాలేదు. యోగదృష్టితో లోకాలన్నీ చూచాడు. ఎక్కడా కచుడు కనపడలేదు. సురాసమ్మిశ్రిత భస్మమయుడై తన ఉదరంలోనే ఉన్న కచుడిని చివరికి చూచాడు. అప్పుడు సురాపానంవలన ఎంత చేటు కలుగుతుందో స్వయంగా తెలిసికొన్నాడు. ఆవేశంతో, పలువురు వినేటట్లుగా ఇట్లా ప్రబోధించాడు.

"మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్
పరఁగఁ బెక్కు సేసి పడయఁబడిన
యట్టియెఱుక జనుల కాక్షణమాత్రన
చెఱుచు; మద్యసేవ సేయ నగునె?"
"భూసురు లాదిగఁ గల జను
లీసుర సేవించిరేని యిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితు లగుదురు;
చేసితి మర్యాద; దీనిఁ జేకొనుఁడు జనుల్." **(ఆది. 3.120-120)**

శుక్రుడు నాటినుండి సురాపానాన్ని మహాపాతకంగా శపించాడు. తన కడుపులో ఉన్న కచుడిని సంజీవితుడిని చేశాడు. ఉదరంలో నుంచే కచుడు శుక్రుడిని ఇట్లా ప్రార్థించాడు.

"ఓ పుణ్యాత్ముడా! నాకు తనువును ప్రాణాన్ని సత్వాన్ని ప్రసాదించావు. నీ ఉదరంలోనుండి వెలువడే మార్గాన్ని నాకు చూపించుము". ఆ మాటలు విని శుక్రుడు ఇట్లా అన్నాడు. "నీవు నా ఉదరాన్ని చీల్చుకొని గాని బయటకు రాలేవు. అట్లా వస్తే అప్పుడు నేను మరణిస్తాను. నన్ను సంజీవితుడిని చేయాలి నీవు" అని శుక్రాచార్యుడు కచుడికి సంజీవని ఉపదేశించాడు. ఆ తరువాత ఉదయాద్రిదరీముఖంనుండి ఉదయించిన పూర్ణచంద్రబింబంవలె కచుడు శుక్రునిగర్భంనుండి వెలువడ్డాడు. శుక్రాచార్యుడు విగతజీవుడై పడిపోయాడు. శుక్రుడిని కచుడు మృతసంజీవనీ విద్యచే పునరుజ్జీవితుడిని చేశాడు. ఉచ్చారణదక్షునిచేత అభిహితమైన శబ్దం వలె శుక్రాచార్యుడు సంజీవితుడై ప్రకాశించాడు. కచుడు అట్లా సంజీవనీవిద్యను పొంది చాలాకాలం శుక్రాచార్యుడిని సేవించి, ఒకనాడు అతని అనుమతితో దేవలోకానికి ప్రయాణమయ్యాడు.

అమరావతికి తిరిగి వెళ్ళుతున్న కచుడిని చూచి వియోగదుఃఖంతో దేవయాని ఇట్లా అన్నది.

"నీవును బ్రహ్మచారివి వినీతుఁడ, వేనును గన్యకన్, మహీ
దేవకులావతంస! రవితేజ! వివాహము నీకు నాకు మున్
భావజశక్తి నైనయది, పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రు దయఁ, జేయుము నాకుఁ బ్రియంబు నావుడున్." **(ఆది- 3. 129.)**

దేవయాని మాటలకు కచుడు విషాదాకులచిత్తు డయ్యాడు. 'గురువులకు శిష్యులు పుత్రులు. లోక ధర్మ పథంలో ఇది అనుసరింపవలసిన పరమార్థం. నీవు నాకు గురుపుత్రివి. అంటే నాకు సహోదరివి. లోకనింద్యమైన ఈ తనూసంగమాన్ని నీవు భావించటం తప్పు. పలకటం మరింత తప్పు' అని హితబోధ చేశాడు.

దేవయానికి అపరిమితమైన కోపం వచ్చింది. 'నా కోరిక తీర్చని నీకు, నీ యందు సంజీవని పనిచేయకుండ ఉండుగాక!' అని శాపం పెట్టింది. కచుడు ధీరుడై ఇట్లా సమాధానం చెప్పాడు: "నేను ధర్మపథాన్ని తప్పిన వాడిని కాను. నీ శాపం వలన సంజీవని నాయందు పనిచేయకపోయినప్పటికీ, నాచేత ఉపదేశం పొందిన వారిపట్ల అది ఫలిస్తుంది. 'మరి నీవు ధర్మవిరోధంగా భావించావు, ప్రవర్తించావు. కాబట్టి నిన్ను బ్రాహ్మణుడు వివాహ మాడకుండుగాక!" అని ప్రతిశాపం ఇచ్చాడు కచుడు. అతడు అమరావతికి తిరిగి వెళ్ళిపోయాడు.

## ధార్మిక దృక్పథం అమృతత్వ సాధనం

'జాతస్య మరణం ధ్రువం' అన్నది సత్యోక్తి. మృత్యువును జయించాలనే లక్ష్యంతో మానవుడు చేసే ప్రయత్నం అమృత ప్రస్థానం. అందులో శుక్రాచార్యుడు సాధించింది మృతసంజీవని. అంటే దేశ కాల పాత్ర పరిధిలో ఒక జీవి మరణిస్తే అదే స్థితిలో అతడు పునర్జీవితు డౌతాడు. అందులోను యుద్ధంలో మరణించినవారే పునర్జీవితులు కావటం ఈ కథలోని వాస్తవం. ఒకవేళ అందరూ బ్రతుకుతా రని భావించినా జరారోగ భయాలు ఈ విద్యచేత నివారింపబడవు. వయస్స్తంభనం ఈ విద్యవలన అసాధ్యం. సహజ మృత్యు దశను కూడా ఈ విద్య నివారిస్తుందని స్పష్టంగా లేదు. ఒక వేళ ఈ విద్యయే లభిస్తే అది యౌవనదశలోని వారికి వరప్రసాదం. తదితరుల కంత ప్రయోజనకారి కాకపోవచ్చును. దీనివలన శరీరాని కున్న అనిత్యత్వం నివారించబడటం లేదు. మృతసంజీవని అమృతత్వం కాదు. కాని, ఆవైపులో మానవుడు సాధించిన మొదటి మెట్టు.

విశేష మేమంటే ఈ విద్య దానవలోకగురు డైన శుక్రుడు సాధించింది. అమృతత్వ సాధనలోని తామసిక లక్షణం ఇందులో ఉన్నది. పడిపోయిన శరీరం ప్రాణవంతం కావటమే ఇందులోని పరమార్థం. శరీరం శిథిలం కాకుండా శాశ్వతంగా నిలిపే ప్రక్రియ ఇందులో లేదు. ఇది శరీరధారికి సాధ్యమవుతుందా? అన్న ప్రశ్నకు మృతసంజీవనీ విద్య మానవలోకానికి మిగిల్చింది.

మృతిని శరీరం వరకే భావించటం అసుర ప్రవృత్తి. శరీరం యొక్క అనిత్యత్వం గుర్తించి మానవునికి అమృతత్వాన్ని అందించేది ధర్మం ఒక్కటేనని తెలిసికొని అనుసరించటం దేవతల లక్షణం. ఆ తెలివిడితో అనిత్యమైన దేహంతో నిత్యమైన ధర్మసాధన ప్రస్థానం తెలిసి సాధించటం మానవత్వం. కచుడు దేవలోకానికి సంబంధించినవాడు. భస్మమైన అతని శరీరం తిరిగి రూపు కట్టడానికి తోడ్పడింది మృతసంజీవని. నిజానికి రాక్షసులు కాల్చిన శరీరం బూడిద అయినా అతడు మరలా బ్రతకగలిగాడు. ఆ కచుడే సోదరిగా భావింపదగిన దేవయానిని శరీరవ్యామోహంతో భార్యగా స్వీకరించినట్లయితే ధర్మంతోపాటు బూడిద పాలై పోయిఉండేవాడు. ధర్మచ్యుతుడైన వ్యక్తికి పునర్జీవితం లేదు. దానవులకు మృతసంజీవని విద్య. దేవతలకు ధార్మికనిష్ఠ విద్య. దానవవిద్య పరిమిత ప్రయోజనం కలిగిందే. ధార్మికవిద్య దేహానికి మృత్యువు కలిగినా మనిషికి ధర్మంతో జీవించే అమృతయోగాన్ని అందించే విద్య. దేహస్పృహ కలిగిన దేవయానికి ఆత్మస్పృహను కలిగించి, అసురలోకంలో అమృతయోగానికి నాందిని ఆలపించాడు కచుడు.

ఆంధ్రమహాభారతం గార్హస్థ్యధర్మం ద్వారా మానవులు సాధించే అమృతతత్వాన్ని ప్రబోధించటానికి పుట్టిన పంచమవేదం.

"శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీ పుంస యోగోద్భవామ్,
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషోత్త మామ్బుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే". **(ఆది. 1.1)**

అన్నది మంగళశ్లోకం. ఇందులో కీర్తింపబడిన త్రిమూర్తులు సతీసహితులు, గార్హస్థ్య ధర్మ పరతంత్రులు. స్త్రీ పుంస యోగ రూపమైన లోకానికి శ్రేయస్సును చేకూర్చటం ఈ శ్లోకంలోని ఆకాంక్ష.

సమాజంలోని సర్వధర్మాలు గార్హస్థ్యధర్మం కేంద్రంగా పరిభ్రమిస్తూ ఉంటాయి. ఇల్లు చక్కగా ఉంటే ఇలాతలం అంతా సుభిక్షంగా ఉంటుంది. ఆశ్రమ ధర్మాలు అక్షయంగా సాగుతాయి. సృష్టిలో స్త్రీ పురుష సంబంధాలలో ధర్మస్పృహ అక్షయంగా నిలిస్తే సమాజంలో శాంతి అమృతప్రదంగా అందగిస్తుంది. దేవయాని కచుడిని కోరటంలో లౌకిక స్త్రీ పురుష సంబంధాన్ని మాత్రమే పరిగణించింది. అతడు బ్రహ్మచారి అని, తాను కన్య అని వాదించింది. మన సిదివరకే అతనికి దత్తమై ఉండటం వలన వివాహం నిశ్చితమని నిరూపించటానికి యత్నించింది. లౌకిక స్త్రీ పురుష సంబంధాలను పరిగణనంలోకి తీసుకుంటే దేవయానివాదంలో లౌకికన్యాయం ఉన్నది. కాని, కచుడు అది ధర్మబద్ధం కాదని త్రోసిరాజన్నాడు.

దేహసంబంధమైన దేవయాని వాదం శుక్రాచార్యుడి మృతసంజీవని వంటిది. కచుడి ధార్మికదృక్పథం దేవతల అమృతత్వ సాధనం వంటిది.

ఈ ఉభయ లోకాల చైతన్యాల నడుమ ధర్మసాధన మార్గంగా సాగేది మానవ ప్రస్థానం. చంద్రవంశజు డైన యయాతి ఈ ప్రస్థానానికి మార్గదర్శి. కచుడిచేత పరిత్యక్తురా లైన దేవయాని యయాతిజీవితంలో ప్రవేశించింది. చనిపోయినవారిని బ్రతికించే విద్యకు గురువైన శుక్రాచార్యుడి కుమార్తె దేవయానికి చంపటం తెలుసు. చావటం తెలుసు. కాని, పునర్జీవింపచేయటం తెలుసునా? అనే ప్రశ్న ఉదయింపజేస్తుంది.

దేవయానితో గార్హస్థ్య జీవితాన్ని సాగించటానికి మొదలు పెట్టిన యయాతి, మానవుడు సాధించే అమృతత్వసాధనలో త్యాగమనే మహాగుణం అమృతత్వానికి అపరరూపమే అని తలపింప జేసే ఫలితాలను అందించాడు. ఈ గాథ మరొక మధురమైన సాధన దశ.

## త్యాగేనైకే అమృతత్వ మానశుః

దేవయానికి ప్రాణ స్నేహితురాలు వృషపర్వుని కూతురు శర్మిష్ఠ, వాళ్ళిద్దరూ కలిసి స్నేహానురాగాలతో విహరిస్తూ ఉండేవారు. ఒకసారి వేయిమంది కన్యకలతో కలిసి శర్మిష్ఠ దేవయానిని కలుపుకుని ఒక సరోవరంలో స్నానం చేయటానికి వెళ్ళింది. ఆ కన్యకలందరూ తమ చీరలను ఒడ్డుమీద ఉంచి నీటిలో దిగి జలక్రీడలాడటం మొదలుపెట్టారు. అంతలో ఒక సుడిగాలి వచ్చింది. ఒడ్డుమీద ఉన్న గుడ్డలన్నింటినీ కుప్పగా కలిపివేసింది. కన్యకలందరూ జలక్రీడ చాలించి ఒడ్డుకు చేరారు. ఎవరి దుస్తులు వారు వెతుక్కుంటూ గుర్తించి కట్టుకొంటున్నారు. శర్మిష్ఠ తొందరలో దేవయాని చీరను కట్టుకొన్నది. దేవయానికి శర్మిష్ఠ చీర మిగిలింది. ఆ చీర కట్టుకోటానికి దేవయాని ఇష్టపడలేదు. 'లోకోత్తరచరిత్రుడైన శుక్రాచార్యుని కుమార్తెను, నీకు పూజ్యురాలిని, భూసురకన్యను, నేను నీవు విడిచిన బట్టలను కట్టుకోవచ్చునా చెప్పు?' అని దేవయాని గద్దించింది.

శర్మిష్ఠ తెల్లవోయింది. 'మానాన్నగారి దగ్గర మీ నాన్నగారు పనిచేస్తారు. వారు మా తండ్రిని దీవించి వారికి హితం చేకూరుస్తుంటారు. వారిద్దరి మధ్య తేడాలు లేవు. మనిద్దరి మధ్య ఎందుకు? మీనాన్న గొప్పతనం గురించి నీ గొప్పతనం గురించి ప్రత్యేకించి నాకు వేరుగా చెప్పాలా? నేను కట్టుకున్న చీర నీకు కట్టుకోడానికి అంత పనికిరాదా?' అని అభిమానంతో క్షత్రియవనితగా పలికింది.

దేవయాని తన పట్టు వీడలేదు. శర్మిష్ఠ తనరోషం మానలేదు. కట్టిన చీర విప్పటం క్షత్రియ వనితకు అవమానం అనుకొన్నది శర్మిష్ఠ, ఒకరు విప్పిన చీరను తాను కట్టుకోవటం బ్రాహ్మణవనితకు తగదనుకొన్నది - దేవయాని, మాటలు

పెరిగాయి. శర్మిష్ఠ, దేవయానిని ఆ ప్రక్కనే ఉన్న పాడుబడ్డ బావిలోకి త్రోసి, వేయిమంది కన్యకలతో ఇంటికి తిరిగి వెళ్ళిపోయింది. అదేసమయంలో నహుషపుత్రుడు అయిన యయాతి వేటకై ఆ ప్రాంతానికి వచ్చాడు. ఆ సరోవరంలో నీరు త్రాగటానికి ఆ తీరానికి చేరుకొన్నాడు. ప్రక్కనే ఉన్న పాడుబడ్డబావిలో దేవయాని ఆర్తనాదం విన్నాడు. లతల నడుమ చిక్కుబడి ఉన్న ఆ లలితాంగిని చూచాడు. ఎవరైనా తనను రక్షిస్తారేమోనని ఎదురుచూస్తూ కన్నీరుకారుస్తూ ఉన్నది. ఆ విషాదమూర్తిని విలోకించాడు. వరుణదేవుని భార్యయే, భర్తమీద అలిగి జలనివాసం విడిచి భూస్థలానికి వచ్చిందా అన్నట్లు ఆర్తమూర్తి అయిన దేవయానిని కన్నారా చూశాడు. నూతిలో ఉన్న ఆమెపట్ల సానుభూతి ప్రకటించాడు.

''నీవెవరివి? ఇట్లా ఒంటరిగా ఈ పాడుబడ్డ బావిలో ఎందుకున్నావు?'' అని ఎలుగెత్తి అడిగాడు.

## యయాతి వృత్తాంతం

దేవయాని యయాతిని గుర్తించింది. ఇదివరలో ఎన్నోసార్లు వేటకొర్కై వచ్చి తన తండ్రిని చూచి వెళ్ళినవాడే. మాటను పోల్చుకొన్నది. రూపును పోల్చుకొన్నది. తాను శుక్రాచార్యుడి కూతురునని చెప్పుకొన్నది. ప్రమాదవశాత్తు బావిలో పడ్డానని పేర్కొన్నది. తనను బయటికి తీసి రక్షించుమని వేడుకొన్నది. ఆమెదయనీయస్థితిని చూచి యయాతి దయాంతరంగుడైనాడు.

తనకుడిచేతిని చాచి దేవయాని కుడిచేయి పట్టి లాగి, ఆమెను బావినుండి పైకితీసి యయాతి తననగరానికి తిరిగి వెళ్ళాడు. దేవయానిని వెతుక్కుంటూ 'ఘూర్ణిక' అనే చెలికత్తె అక్కడికి వచ్చింది. ఇంటికి రమ్మని దేవయానిని కోరింది. దేవయాని కోపంతో అగ్నిజ్వాలగా మండిపోయింది.

''ఆ శర్మిష్ఠ చేసిన ఈ అవమానాన్ని నేను సహించలేను. ఆమె కన్నతండ్రి వృషపర్వుడు పాలించే ఈ నగరంలో నేను ప్రవేశించను. ఈ సంగతి మా తండ్రి శుక్రాచార్యులకు చెప్పి ఆయన్ని ఇక్కడకు పిలిపించు'' మని ఘూర్ణికను ఆజ్ఞాపించింది.

శుక్రాచార్యుడు దేవయాని దగ్గరకు ఆత్రుతతో వచ్చాడు. కోప ఘూర్ణిత బాష్పపూరిత అయిన దేవయానిని చూచాడు. క్రోధంవలన కలిగే అనర్థాలను మనస్సులో భావించాడు. కుమార్తెకు బోధించాడు -

'అమ్మా ! దేవయానీ! లోకంలో కోపాన్ని అణచుకొన్నవారు ఎంతో ఉత్తములని కీర్తింపబడుతారు. అనేక నియమాల కోర్చి, అపారదక్షిణల నిచ్చి, వేల యజ్ఞాలు చేసిన వారికంటె కోపం లేనివారు గొప్పవారని తత్త్వవేత్తలు చెపుతారు. ఎదుటివారు కోపగించినా తాము కోపగించుకోనివారు, ఎదుటివారు ఎగ్గులు పలికినా నిర్లిప్తంగా ఉండి, మారుపలకని వారు, అవమానాలపాలైనా, పగసాధించక ఓర్పు వహించేవారు, ధర్మజ్ఞులని లోకులు కీర్తిస్తారు. కాబట్టి బుద్ధిగలవారికి క్రోధం మంచిది కాదు. శర్మిష్ఠ రాజుకుమార్తె. చిన్న పిల్ల. దానితో నీకు పంత మెందుకు? ఇంటికి పోదాం రా' అని శుక్రాచార్యుడు దేవయానిని అనునయించాడు.

'అనురాగం, నేర్పు, సాహసం కలవారిని లెక్కచేయకుండా అవమానించే అవివేకులవద్ద ఉండటంకంటె కష్టం మరే దైనా ఉన్నదా? ఈ వృషపర్వనగరంలో నే నిక ప్రవేశించేది లేదు. ఎక్కడికైనా వెళ్ళిపోతాను' అని బెదరించింది దేవయాని. శుక్రుడికి దేవయాని అంటే ప్రాణం. ఆమే గతి అని నమ్ముతాడు. అందువలన ఆమెతో తాను కూడా వస్తానని చెప్పి ఆమెను ఒప్పించే ప్రయత్నం చేస్తున్నాడు. ఈ సంగతి వృషపర్వుడు గూఢచారులవలన తెలిసికొన్నాడు. శుక్రాచార్యులవద్దకు వచ్చాడు, వినయంతో నమస్కరించాడు. శుక్రాచార్యుల మృతసంజీవనీవిద్యా ప్రభావంతో దేవతలను మించే సంపదను దైత్యులు సంపాదించగలిగారనీ, ప్రాణాలతో బ్రతకగలిగారనీ, దానవ చతురంగబలమంతా శుక్రాచార్య వరదత్తమనీ ప్రశంసించి, దేవయాని

మనసుకు ఏది ఇష్టమైతే దానిని తప్పక ఇస్తానని వృషపర్వుడు పేర్కొన్నాడు. ఆ మాటలు విని దేవయాని ఆనందపడింది. సమయం వచ్చింది కదా అని వేయిమంది కన్యకలతో కూడిన శర్మిష్ఠ తనకు దాసిగా ఉండాలని కోరింది. ఆ మాటను కాదనలేక వృషపర్వుడు అంగీకరించాడు. శుక్రుడు సంతోషించాడు. శర్మిష్ఠ కన్యకాసహస్రంతో ప్రతిరోజూ దేవయానిని సేవిస్తుండేది.

ఒకనాడు అందరూ కలిసి ఉద్యానవనానికి వెళ్ళారు. ఆ సమయంలో యయాతి సమీపారణ్యంలోకి వేటకై వచ్చి ఆ వనంలో ప్రవేశించాడు. దేవయానిని చూచి అతిథిసత్కారాలను పొందాడు. ఆమెప్రక్కనే 'అతిశయ రూప లావణ్య గుణసుందరి' అయిన శర్మిష్ఠను ఆమె చెలికత్తెలను చూచి వారిని పరిచయం చేసికొన్నాడు. అప్పుడు దేవయాని యయాతియందు అనురక్తురాలై తనను వివాహం చేసుకొమ్మని అడిగింది. నన్నయ ఆ సందర్భాన్ని ఎంతో గొప్పగా చిత్రించాడు.

"నిగ్రహ మేది నన్నుఁ దరణిప్రభ! కూపము వెల్వరించునాఁ
డుగ్రమయూఖుసాక్ష్యముగ నున్నతదక్షిణపాణిఁ జేసి భూ
పాగ్రణి! నాదు దక్షిణకరాబ్జము వట్టితి కాన మున్న పా
ణిగ్రహణంబు సేసి; తది నీ యెడ విస్మృతిఁబొందఁ బాడియే."
"నన్ను వివాహమై నహుషనందన! యీలలితాంగిఁ దొట్టి యీ
కన్నియ లందఱున్ దివిజకన్యలతో నెన యైనవారు నీ
కున్నతిఁ బ్రీతి సేయఁగ, నృపోత్తమ! వాసవుఁ బోలి లీలతో
నిన్నరలోకభోగము లనేకము లందుము నీవు నావుడున్."

**(ఆది. 3. 160-161)**

దేవయాని మాటలకు యయాతి అభ్యంతరం చెప్పాడు. క్షత్రియులు బ్రాహ్మణ కన్యలను వివాహమాడటం ధర్మవిరుద్ధమని పేర్కొన్నాడు. దేవయాని తన వాదనను వీడలేదు. 'సకలలోకపూజ్యు డైన శుక్రాచార్యుడు ఈ వివాహాన్ని అంగీకరిస్తే, నన్ను నీ దాన్నిగా స్వీకరిస్తావా?' అని దేవయాని యయాతిని అడిగింది. శుక్రాచార్యుడు ఇది ధర్మవిరుద్ధం కాదని చెప్పితే తన కభ్యంతరం లేదని యయాతి పేర్కొన్నాడు. దేవయాని వెంటనే శుక్రాచార్యుడిని పిలిపించింది. 'తేజోమూర్తి అయిన శుక్రుడు వారి ఎదుట ప్రత్యక్షం అయ్యాడు. అందరూ ఆ మునికి నమస్కరించారు.

దేవయాని శుక్రాచార్యుడితో ఇట్లా అన్నది: 'ఈ యయాతి మహారాజు నన్ను నూతినుండి వెలికి తీస్తున్నప్పుడే నా కరగ్రహణం చేశాడు. అందువలన ఆయన ఈ జన్మకు నాకు భర్త అయినాడు. ఒకరు పట్టిన నా చేతిని మరొకరికి ఇవ్వటం న్యాయమా? కాబట్టి నాకు యయాతియే భర్త. మీ రంగీకరిస్తే నన్ను వివాహం చేసుకొంటానంటున్నాడు. నన్ను వివాహం చేసుకోవటంవలన యయాతికి ధర్మవిరోధం కలుగదని మీరు అనుగ్రహించాలి.'

ఈ మాటలు విన్న శుక్రుడు పుత్రికావ్యామోహంతో ఆమె వివాహాన్ని సమర్థించటానికి పూనుకొన్నాడు. అపక్రమదోషం లేకుండా వర మిచ్చాడు. వారిద్దరికీ వైభవంగా వివాహం చేశాడు. దేవయానితో పాటు సహస్రకన్యా పరివృత అయిన శర్మిష్ఠను అరణంగా అందించాడు. వారందరికీ అన్నపాన భూషణాది సౌకర్యాలను యయాతి కల్పించాలనీ, శర్మిష్ఠతో కలిసి శయనించటం పరిహరించాలనీ ఆజ్ఞాపించాడు.

యయాతి దేవయానినీ, శర్మిష్ఠనూ, కన్యాసహస్రాన్నీ వెంట తీసికొని నిజనగరానికి వెళ్ళాడు. దేవయానిని అంతః పురంలో మహారాణిభవనంలో ఉంచాడు. ఆమెఅనుమతితో శర్మిష్ఠను అశోక వన సమీపంలోని ఒక గృహంలో నివాసముంచాడు. దేవయాని యందు యయాతి యదు, తుర్వసులనే ఇద్దరు కుమారులను సంతతిగా పొందాడు.

దేవయాని అహంకారవతి. తా ననుకొన్న పని ఏ విధంగానైనా సాధించుకొనే గండ్రగొండి. తన మనసు కచుడిమీదనే లగ్నమైనది కాబట్టి అతడే తన భర్త అని మొదట వాదించింది. అతడు ధర్మాన్ని చూపి ఆమెవలపు అధర్మమని నిరూపించేసరికి పడగచితికిన పాము తోకతో కాటేసినట్లు కచుడిని శపించి పగ దీర్చుకొన్నది. ప్రేమ త్యాగాన్ని, సహనాన్ని కోరుతుంది కాని పగనూ శాపాలనూ రెచ్చగొట్టదు. దేవయాని స్వార్థపరురాలైన అహంకార ప్రణయిని. ఆమె స్వార్థంముందు పితృభక్తి, రాజభక్తి, స్నేహానురక్తి. భర్త్రనురాగప్రవృత్తి అన్నీ దాసోఉహ మనవలసిందే.

యయాతి ధర్మపాలకుడైన ప్రభువు. రక్షించుమని కోరిన దేవయానిని బావినుండి పైకి తీసి కాపాడాడు. తన ధర్మం తాను నిర్వహించినట్లు నిజపురికి తిరిగి వెళ్ళాడు. దేవయానిసౌందర్యంమీద అతడు చూపు నిలుపలేదు - అది అతని ధర్మ ప్రవృత్తికి చక్కని నిదర్శనం.  దేవయాని యయాతిని వివాహం ఆడటానికి 'పాణిగ్రహణం' అనే - ఒక పారిభాషిక పదం ఎన్నుకొన్నది. చేయి చేయి కలిసింది కాబట్టి యయాతితో తనకు పెళ్లైపోయిందని వాదించింది. అది వితండవాదం అనటానికి వీలులేదు కాని 'సమయానుకూలవాదం' అనవచ్చును. దాని నొకధర్మంగా ప్రతిపాదించింది. ఆమె చూపించిన ఆ ధర్మం అధర్మం అని భావిస్తున్న యయాతికి శుక్రాచార్యుడిచేత అది ధర్మమని చెప్పించి ఒప్పించాలనే ప్రయత్నం చేసింది. తండ్రిని తన అభిప్రాయానికి అనుకూలంగా మాట్లాడుమని కోరింది. ఆ వివాహంలో ఉన్న అపక్రమదోషాన్ని శుక్రాచార్యుడు శాస్త్రసమ్మతంగా సమర్థించలేక పోయాడు కాని, ఆ వివాహం వలన అటువంటి దోషం యయాతికి కలుగకుండా ఉండేట్లు వరమిచ్చి ఊరకున్నాడు. శుక్రాచార్యునిమీద దేవయాని తీవ్రప్రవృత్తిప్రభావం ఎంత బలంగా ఉండేదో ఆ సన్నివేశంవలన తెలుస్తున్నది.

శుక్రాచార్యుడు శర్మిష్ఠను సహస్రకన్యా సమేతంగా యయాతినగరానికి పంపాడు. కాని, మహారాణి అయిన దేవయానికి కలిగే శయనసౌఖ్యం మాత్రం ఆమెకు కలుగకూడదని శాసించాడు. ఈ మాటలు అంటున్నప్పుడు శుక్రుడు దేవయానితండ్రిగా కనపడతాడే కాని స్వతంత్రవ్యక్తిత్వంతో భాసించడు. పుట్టింట్లో తన తండ్రిని తన చుట్టూ త్రిప్పుకొన్న దేవయాని, అంతఃపురంలో యయాతిని కూడా తన చుట్టూ రంగులరాట్నంవలె త్రిప్పుకోవాలనే ప్రయత్నం చేసింది. భర్తకు తనకు తాను సమర్పించుకోవటానికి బదులు భర్తయే తనకు సమర్పితం కావాలని కోరుకొన్నది. పరస్పరానురాగబద్ధమైన ప్రణయంగా కాక దేవయాని అహంకారాగ్నికి ఆహుతి అర్పిస్తున్న సవనక్రియగా యయాతి సంసారాన్ని మార్చివేసింది. యయాతితో కలిసిఉన్న అనుక్షణం దేవయాని తాను శుక్రాచార్యుని పుత్రికనని జ్ఞాపకం చేస్తున్నట్లుండేది. ఆమెపట్ల అపరాధం జరిగితే పైన శుక్రాచార్యుడు ఉన్నాడని భయపెడుతున్నట్లుగా ఉండేది. ఆభిజాత్యంరీత్యా కూడా యయాతికంటె తానే ఉన్నతమైనదానని జాత్యహంకారాన్ని ప్రదర్శించుకొంటుండేది.

గార్హస్థ్యధర్మం సతీపతుల అద్వైత ప్రణయ సిద్ధికి ఫలరూపం కావాలి కాని అహంకారాల అనంత సంఘర్షణలకు రణరంగం కారాదు. ఒకరిలో ఒకరు కరిగి జాలువారుతున్నట్లు ఉండాలి కాని ఒకరికై ఒకరు జాగరణ చేస్తున్నట్లు ఉండకూడదు. దేవయాని గార్హస్థ్యధర్మం ఉండకూడని విధంగా సాగింది. అందువలన కొడుకులు పుట్టినా, ధర్మం క్రమంగా కొడిగట్టటం మొదలయింది. యయాతికి ఆత్మతృప్తి లేదు. సంసారంవలన ఏ అమృతాన్ని కోరుకొన్నాడో అది అతనికి లభించలేదు. అతని గార్హస్థ్యధర్మంలో దేవయాని బడబాగ్నిలా ప్రజ్వలించింది. క్రమంగా మృతిచెందుతున్న మానసిక గార్హస్థ్య ధర్మం యయాతిలో మరలా పునర్జీవింపచేసిన శక్తి శర్మిష్ఠ. శర్మిష్ఠ యౌవనవతి అయింది. అనన్యసామాన్య మైన సౌందర్యంతో వెలిగిపోతున్నది. ఆ వయసులో పతిని పొంది సుతులను పడసి సుఖించాలని ప్రతి యువతీ కోరుకొంటుంది. ఆమెకు అంతరాంతరాలలో అటువంటి గాఢమైన అనురాగం ఉండేది. దేవయాని ఏ విధంగా యయాతిని కోరి వరించి సాధించుకొన్నదో అట్లాగే తానూ ఆ మహారాజును పొందాలని ఆశపడుతూ ఉండేది. అదృష్టవశాత్తు ఒకనాడు యయాతి అశోకవనవిహారానికి ఆవైపు వచ్చాడు. ఒంటరిగా ఉన్న శర్మిష్ఠను చూచాడు. ఆమెయందు ప్రసన్నచిత్తు డయ్యాడు. ఆమె వినయ సంభ్రమాలతో రాజుకు నమస్కరించింది. తగిన సమయం దొరికిందని ఆ రాజుతో ఇట్లా మాట్లాడింది:

"నీలగళోపమాన! కమనీయగుణోన్నతిఁ జెప్పఁ జాలు న
న్నేలిన దేవయానికి నరేశ్వర! భర్తవు గాన నాకునుం
బోలఁగ భర్త వీవ; యిది భూనుత ధర్మపథంబు; నిక్కువం;
బాలును దాసియున్ సుతుఁడు నన్నవి వాయని ధర్మముల్ మహిన్". **(ఆది. 3.174.)**

'ఆ దేవయానిని పరిగ్రహించినపుడే ఆమెతో అరణంగా వచ్చిన నేనుకూడా నీకు పరిగ్రహయోగ్యురాలినే కాబట్టి నీవు కరుణించి నన్ను కూడా నీ సతిగా స్వీకరించు' మని ప్రార్థించింది.

యయాతి శుక్రాచార్యుడు విధించిన నియమాన్ని పేర్కొంటూ 'ఆ మహాముని మాటలకు నే నంగీకరించాను. ఇప్పుడు నేను అబద్ధమాడలేను' అన్నాడు శర్మిష్ఠతో. అప్పుడు శర్మిష్ఠ ఒక ఆపద్ధర్మాన్ని జ్ఞాపకం చేసింది. 'ప్రాణంమీదకు వచ్చినపుడు, సర్వసంపద అపహరింపబడేటప్పుడు, విప్రవధ జరిగేటప్పుడు, వధూజనసంగమ సమయంలోనూ, వివాహ సమయాలలోనూ అసత్యమాడినా, ఆదోష ముండదని మునివచనప్రమాణం ఉన్నది. నీవు వివాహసమయంలో ఈ నియమానికి అంగీకరించావు. కాబట్టి నీకు అసత్యదోషం కలుగదు' అని నచ్చచెప్పింది. యయాతి శర్మిష్ఠకు అనుకూలుడై, ఆమె అభిమతాన్ని అంగీకరించాడు. అతనివలన ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. దేవయానికి ఆ సంగతి తెలిసి, శర్మిష్ఠ దగ్గరకు వచ్చి సంతానలబ్ధికి కారణం అడిగింది. శర్మిష్ఠ, ఒక మహాముని వరం వలన పుత్రుడు జన్మించాడని పేర్కొన్నది. దేవయాని నిజనివాసానికి వెళ్ళిపోయింది. ఆ తరువాత యయాతి శర్మిష్ఠయందు అనురక్తుడై వ్యవహరించాడు. వారిద్దరికీ ముగ్గురు కొడుకులు పుట్టారు. ద్రుహ్యుడు (ద్రుహ్యి), అనువు, పూరుడు - వారి పేర్లు.

ఒకనాడు ఆ ముగ్గురు కొడుకులు కలిసి త్రేతాగ్నులవలె ఆడుకొంటున్నారు. ఆ సమీపంలో యయాతి మహారాజు కూర్చున్నాడు. దేవయాని ఆ ప్రదేశానికి వచ్చింది. యయాతి ప్రతిరూపాలుగా ఉన్న ఆ కుమారులను చూచింది. వా రెవ్వరని యయాతిని ప్రశ్నించింది. అతడు మారు మాట్లాడలేదు. దేవయాని ఆ బిడ్డలను అడిగింది. శర్మిష్ఠా, యయాతులు తమ తల్లిదండ్రులని చెప్పారు. తనకు తెలియకుండ యయాతి శర్మిష్ఠ వలన సంతానాన్ని పొందటం తెలిసికొని కోపదుఃఖతాడిత యై శుక్రాచార్యుని ఆశ్రమానికి హుటాహుటిగా బయలుదేరింది. తండ్రిపాదాలమీద పడి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. యయాతి కూడా ఆమె వెంట శుక్రాచార్యుని ఆశ్రమానికి చేరుకొన్నాడు. దేవయాని గద్గదకంఠంతో, ఇచ్చినమాటను తప్పి యయాతి శర్మిష్ఠయందు ముగ్గురు కొడుకులను పొందిన కథనంతా తండ్రికి వివరించి, యయాతి తనకు తీరని అవమానం చేశాడని మొరపెట్టుకొన్నది. శుక్రుడు యయాతి మాటను వినే ఓపికను గాని, తీరికనుగాని ప్రకటించలేదు. తన ప్రియమైన పుత్రికకు యౌవనగర్వంతో రాగాంధుడై యయాతి అప్రియం చేశాడు కాబట్టి అతడు జరాభారపీడితుడు కావాలని శపించాడు.

యయాతి వినయంతో ఇట్లా అన్నాడు: 'ఋతుమతి అయి పుత్రార్థం పతిని కోరితే భార్యకు ప్రతికూలుడై ఋతు విఫలత్వం చేస్తే అతనికి భ్రూణహత్యాదోషం వస్తుందని పండితు లంటారు. దానికి భయపడి శర్మిష్ఠా ప్రార్థనాన్ని అంగీకరించి, క్రమంగా ఆమెయందు సంతానాన్ని పొందాను. దీనికి మీవంటి దివ్యమునీంద్రులు కోపగించటం, శపించటం న్యాయమా? నాకు దేవయానియందు కూడా విషయోపభోగవిరక్తి ఇంకా కలుగ లేదు. మీ శాపం వలన కలిగే జరాభారం నాకే కాదు. మీ కుమార్తెకు కూడా దుఃఖదాయకమే. కాబట్టి ఈ శాపాన్ని మీరు నివారించాలి" అని ప్రార్థించాడు.

శుక్రుడు యయాతి ప్రార్థనకు కరగిపోయాడు. శాపోపసంహారాన్ని సూచించాడు. శాపంవలన కలిగిన జరాభారాన్ని యయాతికొడుకులలో ఎవరైనా ధరిస్తే, అతని యౌవనాన్ని గ్రహించి యయాతి విషయోపభోగాలనూ, రాజసుఖాలనూ పొందవచ్చుననీ, భోగ తృప్తిని పొందిన తరువాత యయాతి, జరాభారాన్ని తీసికొని తన కొడుకు యౌవనాన్ని తిరిగి ఇవ్వవచ్చుననీ,

యయాతిముసలితనాన్ని ఆ విధంగా భరించిన పుత్రుడు ఆయన తరువాత రాజ్యానికి అర్హుడౌతాడనీ, వంశకర్తకూడా అవుతాడనీ శుక్రుడు ఆదేశించాడు. యయాతి దేవయానీ సహితుడై తన పురానికి తిరిగివచ్చాడు.

శుక్రుని శాపం వర్తించింది. యయాతి జరాభారాన్ని తాల్చాడు. కొడుకులను పిలిపించి క్రమంగా అందరినీ జరాభారాన్ని తీసికొని యౌవనాన్ని ఇమ్మని అడిగాడు. ఒక్క పూరుడు తప్ప మిగతావారంతా ముక్తకంఠంతో యయాతికోర్కెను త్రోసిరాజన్నారు. 'విధివశాత్తు కలిగిన రోగాన్ని కాని, ముసలితనాన్ని కాని ఎవరైనా భరిస్తారు కాని, తెలిసి తెలిసి ఎవరైనా జరాభారాన్ని తలమీద వేసికొంటారా? తల నరసిన తరువాత సాక్షాత్తు మన్మథుడినైనా తరుణులు దరికి చేరనివ్వరు. ముసలితనంతో క్రుంగిపోయిన సాక్షాత్తు కుబేరుడినైనా అభీష్టభోగాలకు బాహ్యునిగానే భావిస్తారు' అని తండ్రిమాటను మొదటి నలుగురు కొడుకులూ తిరస్కరించారు. అందుకు యయాతికి కోపం వచ్చింది. యదువంశంవారు రాజ్యానికి అయోగ్యులని శపించాడు. తుర్వసు వంశం వారు ధర్మాధర్మ విచక్షణారహితు లైన కిరాతకులకు రాజు లవుతారని శపించాడు. ద్రుహ్యు వంశంవారిని జలప్రాయమైన అరణ్య ప్రదేశాలకు రాజులయ్యేటట్లు శపించాడు. అనువువంశంవారిని అల్పాయుష్కులుగా తనువు చాలించేటట్లు శపించాడు.

## వంశకర్త పూరు మహారాజు

చివరకు శర్మిష్ఠమూడవకొడుకు పూరుడు తండ్రిని దర్శించాడు. తల్లిదండ్రులు ప్రత్యక్ష దైవాలని కీర్తించాడు. తను విచ్చిన తల్లిదండ్రులకు తను విచ్చుకోవటం తనయుల సుకృతమని పేర్కొన్నాడు. తన యౌవనాన్ని తండ్రికోసం త్యాగమూర్తిగా దానం చేశాడు. యయాతి అతని యౌవనంతో సహస్రవర్షాలు అభిమతసుఖాలు అనుభవించి తృప్తుడై, పూరుని యౌవనాన్ని తిరిగి ఇచ్చి తన జరాభారాన్ని తాను స్వీకరించి పూరునకు పట్టాభిషేకం చేసి వంశకర్తగా వెలుగొందే మహత్తును కల్పించాడు. పూరుని త్యాగమే యయాతి గార్హస్థ్యధర్మానికీ, గార్హస్థ్య ధర్మంలో ముఖ్యమైన పుత్రధర్మానికీ త్యాగగుణంవలన కలిగే అమృతత్వసిద్ధికీ మూలకారణ మౌతున్నదని స్పష్టమౌతున్నది.

'త్యాగేనైకే' అమృతత్వ మానశుః-' అనే ఉపనిషత్ వేదసూక్తికి పూరుమహారాజుచరిత్రం ఉన్నతమైన ఉదాహరణం. మానవులు గార్హస్థ్యధర్మంలో త్యాగంవలననే అమృతత్వాన్ని సాధించగలుగుతా రన్నది వంశకర్తయైన పూరుడు ప్రబోధిస్తున్నాడు.

గార్హస్థ్య ధర్మ పీఠానికి నాలుగు పాదా లున్నాయి. ఒకటి - యజమాని లేదా గృహస్థుడు; రెండు - ఇల్లాలు లేదా గృహిణి; మూడు - పుత్రుడు లేదా సంతానం; నాలుగు- ధర్మం. ఇది సత్య ధర్మ త్యాగ శాంతి ప్రేమ అహింసాది భేదాలతో ఎన్నో రకాలుగా భాసించవచ్చు. వాటన్నింటిలో త్యాగరూపధర్మంవలన అమృతత్వసిద్ధి సత్వరంగా లభిస్తుంది.

యయాతి కథలో మానవలోకం అమృతత్వాన్ని గురించి దర్శింప వలసిన మార్గం సూచింపబడింది. దానవులకు శరీరం ముఖ్యం; చనిపోయిన శరీరం మరలా బ్రతకటం ముఖ్యం. బ్రతకటంమీద ఉన్న ఊనిక ఎట్లా బ్రతకాలి అన్న జీవన విధానం మీద లేదు అసురులకు. మానవునికి ముఖ్యం - ఎలా చచ్చా డన్నది కాదు, ఎలా జీవితాన్ని సాగించా డన్నది. మనిషి చనిపోయినా అతడిని బ్రతికించేది ధర్మం. అందులోనూ శ్రేష్ఠమైన ధర్మం త్యాగం. అందువలన మానవజీవితంలో మరణాన్ని భౌతికంగా జయించే పద్ధతికంటె ధార్మికంగా జయించే పద్ధతికి ప్రాముఖ్యం ఏర్పడింది.

మానవ జీవితంలో మృత్యు వొక అనివార్యవాస్తవం. కాని, చనిపోయే దేహం నిర్వహించే ధర్మం అజరామరం. దానిని సాధించటమే మానవ జీవన గమ్యం. దేవయాని వివాహధర్మాన్ని భౌతికధర్మంగా గ్రహించింది. అందువలన ఆమె శరీర సుఖం భర్త ముసలితనంతో మృగ్యమయ్యే పరిస్థితి ఏర్పడింది. ఆమె తన గృహాన్ని అహంకారంతో కూలగొట్టుకొన్నది; కోపంతో బుగ్గిచేసికొన్నది. ఆమెకు స్వార్థం తప్ప పరార్థం లేదు. పరమార్థం ఆమెకు తెలియదు. ఇటువంటి ప్రవృత్తి గల యిల్లాలు గార్హస్థ్యధర్మాన్ని చంపగలదు.

అయితే, శర్మిష్ఠ ప్రేమతో, తనను తాను భర్తకు సమర్పించుకొనటంతో; ధర్మంతో గార్హస్థ్యధర్మానికి మరలా ప్రాణం పోసింది.యయాతి దేవయానివలన యజమానిగా మృతప్రాయుడయ్యాడు; శర్మిష్ఠ వలన మరల యజమానిగా పునరుజ్జీవితుడైనాడు. గృహిణీత్వం దేవయానివలన ప్రాణచైతన్యాన్ని కోల్పోయింది; శర్మిష్ఠవలన పంచప్రాణాలతో పల్లవించింది. దేవయాని కొడుకులు తల్లిదండ్రులపట్ల భౌతికధర్మం పచరించేవారు. శర్మిష్ఠ కొడుకులలో చివరివాడు పుత్రధర్మాన్ని రక్షించినవాడు. గార్హస్థ్య ధర్మంలో మూడవ పాదం సంతానం. అది యదువు మొదలైనవారిలో నిర్వీర్యమై పోయింది; పూరునిలో పునర్జన్మ ఎత్తింది. పూరుని ధర్మం త్యాగం. త్యాగమే యయాతి గార్హస్థ్య ధర్మానికి అమృతత్వసిద్ధి నిచ్చింది. దానికి ఫలంగా పూరునికి సామ్రాజ్యంతోపాటు, వంశకర్త అయ్యే యోగ్యత కలిగింది.

## శకుంతలాదుష్యంతుల వృత్తాంతం

భరతుడు శకుంతలా దుష్యంతుల పుత్రుడు. యయాతి కథలో గార్హస్థ్యధర్మం ఒక గృహిణి చేత మూర్ఛితమైతే, మరొక గృహిణి పునరుద్ధరించిన కథ చిత్రింపబడింది. అందుకు యయాతి కూడా ఒక బలమైన హేతువైనాడు; దోహదశక్తిగా నిలిచాడు. వారిరువురి ప్రయత్నాలు విఫలమైనప్పుడు వారి గార్హస్థ్యధర్మాన్ని నిలిపింది పుత్రుడైన పూరుడు.

దుష్యంతుని చరిత్ర యయాతి చరిత్రకంటె ఒక అడుగు ముందుకు వేసింది. దుష్యంతుడు గాంధర్వ వివాహధర్మంతో శకుంతలను వివాహమాడాడు. ఆమెను అంతఃపురానికి తీసికొనిపోతానని మాట ఇచ్చాడు. కాని, మాట తప్పాడు, శకుంతల భర్త ఎదుటకు పుత్రునితో కలిసి వచ్చింది. అత డామెను భార్యగా గుర్తించలేదు. దానితో వివాహధర్మంతోపాటు, సత్యం కూడా కుప్పకూలిపోయింది. శకుంతల గార్హస్థ్యధర్మంలో యజమానికి, భార్యకు, సుతునికి, సత్యానికి ఉన్న ప్రాధాన్యాన్ని భర్తకు నిండుకొలువులో వివరించి చెప్పింది. దుష్యంతుడు ఆమె మాటలను పెడచెవిని పెట్టాడు. అప్పుడు ఆకాశవాణి నిజం బైట పెట్టింది. అపవాదభీతితో అబద్ధమాడానని దుష్యంతుడు నిండుసభలో అంగీకరించి, శకుంతలను పట్టమహిషిగా స్వీకరించి, భరతుడికి యౌవరాజ్యాభిషేకం చేశాడు.

గార్హస్థ్య ధర్మం నాలుగు పాదాలతో నడవాలంటే ఆ ధర్మాన్ని నిర్వహించే వారికి అంతఃకరణశుద్ధి ఉండాలని దుష్యంతుడి కథ బోధిస్తుంది. చిత్తశుద్ధి లేకపోతే సత్యం ప్రకటితం కాదు; సత్యం నిలువకపోతే సంసార వ్యవస్థ అస్తవ్యస్త మౌతుంది. ఇల్లాలికి అన్యాయం జరుగుతుంది; పుత్రునికి అస్తిత్వం లేకుండా పోతుంది. యజమాని అసత్యదోషంతో అంతరించి పోతాడు. కాబట్టి గార్హస్థ్య ధర్మానికి అమృతత్వం కలిగించేది సత్యధర్మనిరతి అన్న సత్యాన్ని సర్వాంగసమృద్ధంగా చాటే ఆఖ్యానకం శకుంతలా దుష్యంతుల వృత్తాంతం.

దుష్యంత మహారాజు కథను దుష్యంతోపాఖ్యానమనీ, శకుంతలోపాఖ్యానమనీ పిలుస్తూ ఉంటారు. ఆ రెండు పేర్లూ ఆ కథకు సార్థకాలే.

ఆ కథలో ఆ రెండు పాత్రలకూ ప్రాధాన్యం ఉన్నది. దుష్యంతుడు లౌకిక ధర్మానికి ప్రాతినిధ్యం వహిస్తాడు. శకుంతల ఆత్మ ధర్మానికి ప్రతీకగా నిలబడుతుంది. అతడు ఒక అవస్థలో చిక్కుకొన్న వ్యక్తి. స్వీయధర్మాన్ని రక్షించుకోటానికి యత్నిస్తాడు. ఆమె గార్హస్థ్య వ్యవస్థా ధర్మాన్ని పరిరక్షించుకోటానికి ప్రయత్నిస్తుంది. వ్యక్తిధర్మం లోకాపవాద భీతితో వ్యవస్థాధర్మాన్నీ గార్హస్థ్య ధర్మాన్నీ నిరాకరిస్తే ఏర్పడే ధర్మసంకటస్థితిని చిత్రించేది ఈ కథ. ధర్మసంకటాన్ని కలిగించేది లౌకికవ్యవస్థకు అధిపతి అయిన దుష్యంత మహారాజు. ధర్మస్థితి నిలుపుకొనేది ''ధర్మో రక్షతి రక్షితః'' అనే సత్యాన్ని కాపాడిన శకుంతల.

ఈ కథలోనిది ధర్మ సమస్య. రాజు వర్ణాశ్రమ ధర్మ రక్షకుడు. క్షత్రియ ధర్మోచితంగా రాజ్యాన్ని బాహుబలంతో పాలిస్తున్నాడు. అతడు వేటకు పోవటం కూడా క్షత్రియ ధర్మమే. అరణ్యంలో మహర్షిని దర్శించడానికి ఒంటరిగా వెళ్ళటం

అతని రాజోచిత ధర్మమే. ఆశ్రమంలో శకుంతల కనబడుతుంది. ఆమె యందు అతని మనసు లగ్నమౌతుంది. ఆమె ముని కన్య అయితే తనకు  వివాహయోగ్యురాలు కాదు కదా అని భావించడం కూడా అతని వర్ణ ధర్మ రక్షణ చిత్త ప్రవృత్తియే. శకుంతల మేనకా విశ్వామిత్రుల పుత్రిక అని తెలిసిన తరువాత ఆమెను వివాహమాడ నిశ్చయించటం కూడా వర్ణ ధర్మమే. గాంధర్వ విధిని శకుంతలను చేపట్టటం కూడా క్షత్రియ ధర్మమే. ఆమెకు పుట్టిన పుత్రుడికి యౌవరాజ్య పట్టాభిషేకం చేస్తానని అతడు మాట ఇవ్వటం కూడా క్షత్రియ ధర్మమే. అయితే, గాంధర్వ వివాహంలో కర్తలు ఫల భోక్తలు భార్యాభర్తలే.

దుష్యంతుడు మొదట వ్యక్తి, ఆపై రాజు, ఆ తరువాత శకుంతలాపతి, ఆపై ఆమెకుమారుని తన వారసునిగా ప్రకటించిన తండ్రి. ఈ నాలుగు అవస్థల నడుమ సంఘర్షణ రాకుండ చూచుకోవలసిన బాధ్యత ఆయన కున్నది. గాంధర్వ వివాహ ధర్మాన్ని రక్షించి శకుంతల వివాహాన్ని రహస్యంగా, అమంత్రకంగా చేసికొన్న సత్యాన్ని ప్రజలముందు, అమాత్యులముందు ప్రకటించవలసిన బాధ్యత అతని కున్నది. కాని, లోకాపవాదభీతిచేత ఆ ధర్మాన్ని నిర్వహించలేక పోయాడు. అతని వర్తనం ధర్మసంకటాన్ని, ధర్మగ్లానిని కలిగించే స్థితిని కల్పించింది. దానిని శకుంతల భక్తి వారించింది. ఆకాశవాణి సత్యాన్ని ప్రకటించి, ధర్మాన్ని రక్షించి, గార్హస్థ్య ధర్మవ్యవస్థను భూతలంమీద నిలిపింది.

ఈ ఉపాఖ్యానతత్త్వం లౌకికధర్మం ఆత్మధర్మాన్ని ఆదరించినప్పుడే సత్యం నిలుస్తుందని బోధిస్తున్నది. ఆ మహార్థాన్ని చెప్పడానికి అనువుగా కథ నడుస్తుంది. ఎలాగంటే -

(అ) కణ్వ మహర్షి ఆశ్రమంలో లేని తరుణంలోనే దుష్యంతుడు శకుంతలను గాంధర్వవిధిని వివాహమాడి, ఆ తరువాత అమాత్యులను మహర్షివద్దకు పంపి ఆమెను అంతఃపురానికి రప్పించుకొంటానని ఊరట పలికి వెడలిపోయి మిన్నకున్నాడు. దుష్యంతుడు మాట నిలువ బెట్టుకొనే కనీసప్రయత్నం చేయలేదు. అతడు వంచనకు పాల్పడ్డాడని స్పష్టమౌతుంది.

(ఆ) కణ్వుడు జరిగినదంతా దివ్యదృష్టితో చూచి వివాహం ధర్మబద్ధమైనదని అంగీకరించి,  కూతురు కోరిన వరా లిచ్చి ఆమె యోగక్షేమాలను చూస్తాడు. వంశకర్త అయిన భరతుడు పుట్టి, సర్వదమనుడుగా పెరిగి, యౌవరాజ్యపట్టాభిషేకయోగ్యత వచ్చేంతవరకు కణ్వమహర్షి ఆశ్రమంలో శిక్షణ పొందుతాడు. కణ్వుడు దాదాపు రెండు దశాబ్దాలు నిశ్శబ్దంగా ఉండి చేసిన పని అపూర్వం. దుష్యంతుడి వంటి బలం భరతుడు పుట్టుకతో తెచ్చుకొన్న గుణం. కాని, జీవితమంతా యజ్ఞదీక్షలతో గడిపే వంశకర్త సంస్కారం భరతుడు కణ్వమహర్షి శిక్షణలో పెంచుకొన్న గుణం. దుష్యంతుని వారసునిలో లౌకికధర్మంకంటె ఆత్మ ధర్మం బలంగా ప్రతిష్ఠాపింపబడింది.

(ఇ) ఈ ఉపాఖ్యానంలో భరతుడు నిశ్శబ్ద పాత్ర. తల్లితో కలసి హస్తినాపురం చేరి నిండుసభలో దుష్యంతుడిని దర్శిస్తాడు. తల్లిదండ్రుల నడుమ జరిగిన సంభాషణ వింటాడు. తల్లిని తండ్రి నిరాకరిస్తున్నా, తనను పుత్రునిగా మన్నించక పోయినా భరతుడు కోపాన్ని ప్రకటించడు; పల్లెత్తి మాటాడడు. తనకు రావలసిన యౌవరాజ్య పట్టాభిషేకం సంగతి పట్టించుకోడు.  ఆవు వెంట లేగదూడవలె తల్లి వెంట నడుస్తాడు. ఈ సహనం, ఈ శాంతి కణ్వసంస్కృతి; విరుద్ధ సత్త్వాల నడుమ గూడ స్నేహ శాంతులను దర్శించగల ఆశ్రమ సంస్కృతి. నన్నయ ఈ అంశాలన్నీ చెప్పకుండానే చెప్పినట్లు కథ నడిపాడు.

(ఈ) గార్హస్థ్యాశ్రమంలోని స్త్రీవ్యక్తిత్వానికి సజీవరూపకల్పన శకుంతల. గాంధర్వ వివాహ పద్ధతి ననుసరించి శకుంతల దుష్యంతుడిని వివాహమాడింది. తాను కులసతి అయింది. కణ్వు డామె వివాహాన్ని మన్నించాడు. కణ్వాశ్రమ సంస్కృతిలో ఆమె కులసతివ్యక్తిత్వాన్ని పరిపూర్ణంగా సాధించింది. గార్హస్థ్య ధర్మానికి భార్య, భర్త, సంతానం, సత్యం అనేవి నాల్గు స్తంభాలుగా నిలబడాలని, వాటిమీద ఆ వ్యవస్థ పదిలంగా నిలవాలని ఆమె నేర్చుకొన్నది. దానినే ఆచరించింది. దుష్యంతుడి సభలో

దానినే బోధించింది. భార్య 'గృహనీతి విద్యకు ఆచార్యకము' అనే సూక్తికి ఆమెయే ఆదర్శంగా నిలిచింది. సత్య ప్రాతిపదిక లేని సంసారం నిస్సారమని దుష్యంతుని వర్తనం ఋజువు చేసింది. ఆమె ఆశలు, ఆశయాలు కుప్పగూలిపోయే పరిస్థితి యేర్పడింది. కాని, ఆమె దైవభక్తురాలు కావటంచేత భగవంతునిపై భారం వేసి ప్రార్థించింది. ఆకాశవాణి నిజం చెప్పి ఆమె గార్హస్థ్యధర్మాన్ని నిలిపింది. భారతదేశంలో గార్హస్థ్యధర్మం స్త్రీలవలననే ప్రధానంగా రక్షించబడుతుందన్న విశ్వాసాన్ని వాస్తవం చేసింది శకుంతల.

గృహస్థాశ్రమంలో స్త్రీ భార్యగా, తల్లిగా, తనయగా, ఉపాధ్యాయినిగా, వివేకవతిగా, ధర్మోద్ధారకురాలుగా వివిధ భూమికలను నిర్వహించి తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటుంది. అంతఃపురానికి పిలిపించుకొంటానని ఊరడింపు మాటలు పలికి రాజధాని కేగి తిరిగి చూడని భర్తను పల్లెత్తు మాట కూడా అనకుండా ధర్మబుద్ధితో పుట్టింట నిలిచింది శకుంతల. పుట్టింట తండ్రి ఆనతిని జవదాటక జీవితం  సాగించింది. తండ్రి అత్తవారింటికి పంపితే వెళ్లింది. నిండుసభలో దుష్యంతుని యెదుట గార్హస్థ్య ధర్మం నిలువబడే నాలుగు స్తంభాలను గురించి గంభీరంగా ధర్మోపన్యాసం చేసి తనసతీత్వాన్ని తన మాతృత్వాన్ని సమర్థించుకొని దుష్యంతుని పతిత్వాన్ని సత్యంతో ప్రకటించుకొమ్మని హెచ్చరించింది. కణ్వమహర్షికుమార్తె ధర్మబోధ చేసినట్లుంటుంది ఆమె ధర్మబోధ. ఆశ్రమ సంస్కృతి నాగరక కుహనా సంస్కృతిని మందలిస్తున్నట్లుంటుంది. వ్యాసుడు శకుంతల వాక్యాలలో ధ్వనిస్తాడు. ఋషి వంటి నన్నయ ఆమె మాటలలో నానారుచిరార్థ సూక్తి నిధిగా దర్శనమిస్తాడు. పఠిత ఆమె పాత్రలో పరవశించి ఉపదేశాన్ని పొందుతాడు. శకుంతల నిజంగా భరతమాత!

## వంశకర్త భరతుడు

భరతుడు విశాలరాజ్యాన్ని పాలించాడు. అనేక యాగాలు చేసి భూరిదక్షిణలతో భూసురులను సంతోషపెట్టాడు. ఇది ఈ వంశకర్త విశిష్ట లక్షణం. ఈ గుణాన్ని ధర్మరాజు తన జీవితంలో పండించుకొన్నాడు. చక్రవర్తి చేయ గలిగిన రాజసూయ యాగాన్ని, అశ్వమేధ యాగాన్ని చేసి తన ప్రభుత్వాన్ని యజ్ఞదీక్షలతోనే గడిపాడు. లౌకికధర్మంలో కూడా ఆత్మధర్మం ఆవిష్కృతమయ్యేటట్లు జీవితయాత్ర సాగించి ఆదర్శవంతుడైన- ఇతిహాసనాయకు డయ్యాడు. భరతుడిశీలం ధర్మరాజులో ప్రతిఫలించింది. ఇది ధ్వనింపజేయటమే ఉపాఖ్యానానికీ, ఆఖ్యానానికీ ఉన్న సంబంధం.

మహాభారతంలో పాండవులు అక్షరాలా పౌరవులనీ, భరతవంశీయులనీ అనిపించుకొన్నారు. పాండవులు గార్హస్థ్యధర్మాన్నీ, క్షత్రియ ధర్మాన్నీ, మానవ ధర్మాన్నీ, అసిధారావ్రతంగా రక్షించారు. ద్రౌపది గృహిణీ ధర్మానికి పరిపూర్ణ ప్రతీకగా నిలిచింది. ఆమె అడుగడుగునా కౌరవాదులచేత అవమానాలు పొందినా ఆమెను రక్షించింది గార్హస్థ్య ధర్మం, గృహిణీధర్మం, సత్యధర్మం. ఎన్ని ఇక్కట్టులు వచ్చినా ధర్మాన్ని ఆ దంపతులు వీడలేదు. వారి గార్హస్థ్య ధర్మానికి త్యాగం, సత్యం అనేవి రెండు చక్రాలు. ఒకటి పూరు మహారాజు నిల్పిన వంశధర్మం; మరొకటి భరతచక్రవర్తి నిలిపిన వంశధర్మం. ఆ రెండూ పాండవులలో పరిపూర్ణత చెందాయి; అమృతత్వసిద్ధిని సంపాదించాయి.

## వంశకర్త లైన కురు పాండు మహారాజులు

కురు మహారాజు, పాండు మహారాజు చంద్రవంశంలో వంశకర్తలుగా ప్రసిద్ధి చెందిన మహావీరులు. విపుల రాజ్యాలను జయించి, గడించిన అపారసంపదను యజ్ఞయాగాదులలో ప్రజలకు పంచిపెట్టే వితరణరూప త్యాగగుణం కురుమహారాజుకు అమృతత్వసిద్ధిని కలిగించింది. పాండవులు కూడా కురుమహారాజు సంప్రదాయాన్ని కాపాడారు. ధర్మజుడు రాజసూయయాగం, అశ్వమేధయాగం చేసి తన సార్వభౌమత్వాన్ని జీవితం తొలిదశలో, మలిదశలో కూడా ప్రతిష్ఠించుకొని, అపార ధనరాసులను వితరణంగా త్యాగంచేసి కీర్తి నార్జించి వంశకర్తల కీర్తికి పరిపూర్ణత్వాన్ని అమృతత్వాన్ని సాధించి పెట్టారు.

పాండు మహారాజు అపార బలపరాక్రమశాలి. దిగ్విజయపరంపరతో కురుభీష్మాది వీరులను మరిపించిన మహాయోద్ధ. అతడెంత పరాక్రమవంతుడైనా ఆవంత అహంకారం లేనివాడు; గురుజనభక్తి ఆయన జన్మవ్రతం. కుటుంబంలో ఉన్న వారి నందరినీ చీలిపోకుండా ఒక్కటిగా అట్టి పెట్టాలన్న ఉదారాశయం కలవాడు. గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుని మనస్సు నొప్పింపక గౌరవించిన అనుంగుతమ్ముడు. గార్హస్థ్య ధర్మంలో వంశరక్షణమనే ఒక సంప్రదాయానికి ఆయన నారు వేసి నీరు పోసి రక్షించాడు. పాండవులు తండ్రి తమ కిచ్చిన ఈ వారసత్వాన్ని తమ జీవితంలో అసిధారావ్రతంలా పాటించారు.

ధర్మజుడు వంశనాశనాన్ని కోరలేదు. శాంతిని ఆకాంక్షించాడు. శ్రీకృష్ణునిచేత ఆ పరమధర్మాన్ని కురుసభలో అందరికీ అందింపజేశాడు. కాని, వంశధర్మాన్ని మూలమట్టం చేసినవారు దుర్యోధనుడు, ధృతరాష్ట్రుడు. దానికి తగిన ఫలాన్ని వా రనుభవించారు. వంశకర్తలు నిర్మించిన త్యాగం, సత్యం, వితరణం, వంశరక్షణం అనే విశిష్ట ధర్మాల నన్నింటినీ మృతికి పాలు చేసి తాము మృత్యువు పాలైనారు ధృతరాష్ట్ర నందనులు. వాటి నన్నింటినీ రక్షించి వంశాన్నీ, వంశగౌరవాన్నీ, ధర్మాన్నీ పోషించి తాము అమృతత్వసిద్ధిని పొందారు పాండవులు.

అందువలననే ధర్మజుడు సశరీరస్వర్గం పొందాడు. ఇది వంశకర్తలు ప్రవర్తిల్ల చేసిన ధర్మానికి ధర్మజుడు కల్పించిన అమృతత్వం. అమృతమైన ధర్మమే మానవుని అమృతత్వసాధనం!

**ఆఖ్యానకాలూ - ఉపాఖ్యానాలూ : ఆఖ్యానంతో అనుబంధాలూ**

కావ్యపరిభాషలో అఖ్యానమనీ, ఆఖ్యానకమనీ, ఉపాఖ్యానమనీ, అఖ్యాయిక అనీ లాక్షణికులు వేరువేరు అర్థాలలో వాడుతూ ఉంటారు. వాటిని ఇతిహాస ప్రక్రియాపరంగా సమన్వయించుకొని సమీక్షించుకోవాలి.

ఇతిహాస మంటేనే పరంపరగా చెప్పబడే కథ. అందులో ప్రత్యక్షంగా ఒక కథకుడు శ్రోతలకు కథ చెప్పుతూ ఉంటాడు. కథకుడు ఆఖ్యాత. అతడు చెప్పే కథ ఆఖ్యానం. ఆఖ్యానానికి సూర్యరాయాంధ్ర నిఘంటువు పూర్వవృత్త కథనమనీ, ప్రత్యుత్తరమనీ, భారతాది ఆర్షమహాకావ్యాలలో నడుమ వచ్చే కథావిశేష మనీ, కథ అనీ అర్థాలు ఇచ్చింది. ఆఖ్యానంకంటె చిన్నకథను ఆఖ్యానక మని పేర్కొన్నది. ఇతిహాసంలో ప్రధానకథ ఆఖ్యానం అనటం సమంజసం. ఆఖ్యానకం దాన్ని అనుసరించి అనుబంధంగా సాగే కథనంగా గ్రహించటం సముచితం.

పురాణప్రక్రియకు సంబంధించిన పరిభాషలో 'పంచాంగాని పురాణేషు ఆఖ్యానక మితి స్మృతమ్' (మత్స్యపురాణం-2-23). పురాణాలలోని సర్గ ప్రతిసర్గాదులకు సంబంధించిన కథనాలను ఆఖ్యానకం అంటారు. ఇతిహాసాలకు సంబంధించిన పరిభాషలో 'స్వయందృష్టార్థకథనం ప్రాహు రాఖ్యానకం బుధాః' (శ్రీధరస్వామి విష్ణుపురాణటీక). స్వయంగా చూచిన చెప్పిన కథనాన్ని ఆఖ్యానక మంటారు. మహాభారతంలో ప్రధానకథ వ్యాసుడు చెప్పగా, అందులో జనమేజయాదులు అడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరరూపంగా వైశంపాయనుడు స్వీయానుభవపూర్వకంగా చెప్పే కథలు ఆఖ్యానకాలు. నాయకులవెంట అనునాయకులు వర్తించేటట్లు ప్రధానకథనమైన ఆఖ్యానంతో కలిసి తత్పోషకంగా సాగే అనుబంధ కథనాలను ఆఖ్యానకా లనవచ్చును.

ఆఖ్యానకంకంటె భిన్నమైనది ఉపాఖ్యానం. "శ్రుతస్యార్థస్య కథన ముపాఖ్యానం ప్రచక్షతే" (శ్రీధరస్వామి విష్ణుపురాణటీక). ఇతరులవలన విన్నదానిని చెప్పటం ఉపాఖ్యానం. ఉపాఖ్యానం స్వయంసమగ్రంగా ఉండి ప్రధానకథలో ఏదో ప్రయోజనాన్ని సాధించటానికి చెప్పబడుతుంది. రామాయణంలో రాముడు నాయకుడు. లక్ష్మణాదులు అనునాయకులు. వారిగాథలు రాముని

కథకు అనుబంధంగానే ఉంటాయి. వాటినిగురించి వివరాలన్నీ రామకథలో భాగంగానూ, పోషకంగానూ ఉంటాయి. రామాయణంలో ఉపనాయకులు విభీషణ, సుగ్రీవాదులు, వారికథలు వారివి. కాని, అవి రామకథతో ముడివడి స్వీయప్రయోజనాన్ని సాధించుకొంటూ ప్రధానకథాప్రయోజనాన్ని కూడా సాధించిపెట్టుతాయి. అట్లాగే ఆఖ్యానకాలు ఆఖ్యానానికి అంగాలై దానిని సమగ్రం చేస్తుంటాయి. వాటికి స్వతంత్రప్రతిపత్తి ఉండదు. ఉపాఖ్యానాలు స్వీయప్రయోజనంతోపాటు కథాప్రయోజనాలనుకూడా సాధించిపెట్టుతూ సహకరిస్తూ ఉంటాయి. ఒక్కమాటలో చెప్పాలంటే - ఆఖ్యానానికి అండ (పార్శ్వం) వంటిది ఆఖ్యానకం ; దండ(ప్రాపు)వంటిది ఉపాఖ్యానం. ఈ రెండూ ఉంటేనే ఆఖ్యానం నిండుగా ఉండేది. ఇతిహాసం దండిగా పండేది !

ఆదిపర్వంలోని మొదటి రెండాశ్వాసాలలోని ఆఖ్యానకాలు సౌతి శౌనకాదిమునులకు ప్రత్యక్షంగా చెప్పినవి. మూడో ఆశ్వాసంనుండి వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పిన కథార్థాలుగా చెప్పినవి. ఇందులో వైశంపాయనుడు చెప్పినదే ఆఖ్యానం. సౌతి చెప్పినవి ఆఖ్యానకాలుగా పరిగణింపదగినవే. ఎందుకంటే అవన్నీ మహాభారత ప్రధాన కథకు పూర్వరంగాన్ని సిద్ధంచేసేవేకాబట్టి. అంతేకాదు మహాభారతంలో జనమేజయుడు కాకుండా శౌనకాదిమునులు అడిగిన ప్రశ్నలకు సౌతి చెప్పిన కథలన్నీ ఆఖ్యానకాలుగానే పరిగణించాలి. వైశంపాయనుడు చెప్పిన భారతంలోకూడా ఎన్నో ఆఖ్యానకాలు ఉంటాయి. కాబట్టి అమితాఖ్యానకశాఖలతో మహాభారతం విస్తరించింది.

ఆఖ్యానకాలు ప్రధానకథలోని పూర్వాపరాలను అనుసంధించేవిగానో, కార్యకారణసంబంధాన్ని చెప్పేవిగానో, కర్మఫలసంబంధాన్ని నిరూపించేవిగానో, పూర్వవృత్తాంతకథనాలుగానో, ప్రధానకథాతాత్పర్యసూచకాలుగానో, వ్యంజకాలుగానో, బీజభూతాలుగానో ఉంటాయి. స్వరూపంలోనేకాక స్వభావంలోకూడా వైవిధ్యాన్ని వెలార్చేవి ఆఖ్యానకాలు.

ఆదిపర్వంలోని పరమవృత్తాంతం-

"తగు నిది తగదని యెదలో
వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్." **(ఆది. 1.85)**

అనే సత్యాన్ని చెప్పటానికి ప్రవర్తిల్లిన ఆఖ్యానకం. మహాభారతంలో కౌరవుల దుర్నీతి లోకానికి అందించే గుణపాఠాన్నంతా సరమ ఒక్క చిన్నకందపద్యంలో చెప్పింది. కథ అణువంత అయినా భారతనీతిని బ్రహ్మాండంగా ప్రదర్శించింది. ఇది కథాతత్త్వ వ్యంజకమైన ఆఖ్యానకం.

జనమేజయుడు సర్పయాగం మొదలుపెట్టడం, దానిని ఆస్తీకుడు మధ్యలో మాన్పటం, ఆ యాగశాలలో వైశంపాయనుడు భారతకథనం ప్రారంభించటం అనే కథార్థాలకు పూర్వవృత్తాంత కథనాలుగా సాగే ఆసక్తికరమైన ఆఖ్యానకాలున్నాయి. అవి సాధించే ప్రయోజనాలలో కూడా వైవిధ్యం కనబడుతుంది.

ఉదంకునికథ సర్పయాగప్రవర్తనానికి బీజభూతమైన ఆఖ్యానకం, ఉపాఖ్యానం. తక్షకుడు ఉదంకునికి చేసిన అపకారానికి ప్రతీకారం చేయాలనే కక్షలోనుండి పుట్టింది సర్పయాగసంకల్పం. ఆ యజ్ఞంవలన ఉదంకునికి పగసాధింపువలన కలిగే తృప్తి మిగులుతుంది అయితే, ఆ యజ్ఞాన్ని తాను స్వయంగా చేయకుండా జనమేజయుడిచేత చేయించటంవలన ఉదంకుడి కథ ఒకవైపు ఉపాఖ్యానంగా మరొకవైపు కార్యకారణసంబంధంగల ఆఖ్యానంగా రాణిస్తున్నది. స్వీయప్రయోజనం సాధించుకొంటూనే

భారతకథా ప్రగతికి ఉదంకోపాఖ్యానం తోడ్పడింది. అంతేకాదు ఉదంకుని మాటలలో తక్షకుడు ప్రధానకథలోని దుర్యోధనుడుగా శ్రోతలచిత్తాలలో స్ఫురిస్తాడు. ఈ పద్యం అందుకు సాక్ష్యం:

"ప్రల్లదుఁడైన యొక్కకులపాంసను చేసినదానఁ దత్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము? గావునన్ మహీ
వల్లభ! తక్షకాధము నెపంబున సర్పములెల్ల నగ్నిలోఁ
ద్రెళ్ళఁగ సర్పయాగ మతిధీయుత! చేయుము విప్రసమ్మతిన్." **(ఆది. 1,125)**

సర్పయాగం భవిష్యత్తులో జరుగబోయే కురుక్షేత్ర యుద్ధాన్ని తలపిస్తున్నది. ఉదంకోపాఖ్యానం ప్రధానకథకు కారణకార్య సంబంధాన్ని, ప్రేరణప్రేరకసంబంధాన్ని కలిగిఉన్న శక్తిమంతమైన ఆఖ్యానకం.

లోకాలను దహింపచేసే విషాగ్నిని వెదజల్లే సర్పరాజులు ఏ కారణంవలన సవనాగ్నిలో పడి నశింపవలసివచ్చిందో చెప్పుమని శౌనకాదులు అడిగారు. దానికి సమాధానంగా సర్పకులానికే తల్లి అయిన కద్రువ తనకొడుకులకు శాపం పెట్టిన కథ చెప్పటం ప్రారంభించాడు సౌతి. కథా ప్రారంభంలో పోలికకోసం సౌతి ఈ విధంగా అన్నాడు - పూర్వం రురుడు చేసే సర్పఘాతాన్ని సహస్రపాదుడు మాన్పినట్లుగా జనమేజయుడు చేసే సర్పయాగాన్ని జరత్కారుతనయుడైన ఆస్తీకుడు మాన్పాడని చెప్పాడు. శ్రోతృజనాపేక్షవలన ఉపమాన ఉపమేయస్థానాల్లో ఉన్నవారి కథ లన్నీ వివరంగా చెప్పవలసివచ్చింది. అందువలన రురుని పూర్వీకుని కథగా భృగుని వృత్తాంతం, సర్పకులం మీద కక్షకట్టిన రురుని కథ, హింస ఉత్తమ బ్రాహ్మణస్వభావం కాదని బోధించి సహస్రపాదుడు రురుని సర్పహింసాప్రవృత్తిని మాన్పటం - అనేవి పూర్వవృత్తాంతకథనా లైన ఆఖ్యానకాలుగా అవతరించాయి.

కద్రూవినతల కథలు విడదీయలేని జంటవంటివి. అందువలన సర్పవృత్తాంతంతోపాటు సౌపర్ణోపాఖ్యానం, అనూరుని కథ ఆఖ్యానాలుగా చోటుచేసికొనవలసి వచ్చింది. అందులో గరుడుని వృత్తాంతం అఖ్యానకంలోని ఉపాఖ్యానం. అందులోని సముద్రమథనం, దేవదానవ యుద్ధకథ, శేషుని ఉదంతం అంతర్గాథలు.

ఆస్తీకుడి జనకు డైన జరత్కారుడి వృత్తాంతం పూర్వవృత్తాంతరూపమైన ఆఖ్యానకం. పరీక్షిత్తు శాపవృత్తాంతం ప్రధానకథకు కార్యకారణసంబంధంతో పోషకంగా నిలిచే ఆఖ్యానకం. దాదాపు అన్నిరకాల ఆఖ్యానకాలనూ, ఉపాఖ్యానాలనూ ప్రధానకథకు, వ్యంజకాలుగా పోషకాలుగా అనుసంధించే నేర్పు మొదటి రెండాశ్వాసాలలో ప్రదర్శితమయ్యేటట్లు రచించాడు నన్నయభట్టారకుడు.

వైశంపాయనుడు చెప్పిన కథలో ఆఖ్యానకాలనూ, ఉపాఖ్యానాలనూ ఈ విధంగా గుర్తించవచ్చును:-

1. పూర్వాపరసంబంధం చెప్పేవి :- కచదేవయాని కథ; అంగారపర్ణ వృత్తాంతం.
2. కార్యకారణ సంబంధాన్ని చెప్పేవి - ధృష్టద్యుమ్న ద్రౌపదుల జననవృత్తాంతాలూ, పంచేంద్రోపాఖ్యానం.
3. కర్మఫలసంబంధాన్ని చెప్పేవి - భీష్మజనన వృత్తాంతం, మాండవ్యోపాఖ్యానం, ఇంద్రసేన వృత్తాంతం, పంచతీర్థంలోని మొసళ్ళకథ.
4. పూర్వవృత్తాంత కథనాలు - ఉపరిచరవసువు చరిత్ర, మత్స్యగంధి వృత్తాంతం, వేదవ్యాస జననం, కృపద్రోణుల జన్మవృత్తాంతాలు.
5. ప్రధానకథాతాత్పర్య వ్యంజకాలు - దేవదానవాంశలతో భీష్మాదులు జన్మించినట్లు చెప్పిన ఉదంతం మొదలైనవి.

**ఉపాఖ్యానాలు** : దీర్ఘతముని వృత్తాంతం, వ్యుషితాశ్వుని వృత్తాంతం, వశిష్ఠుని వృత్తాంతం, సుందోపసుందుల కథ, శ్వేతకేతు వృత్తాంతం, మందపాలోపాఖ్యానం, ఏకలవ్యుని కథ.

**అంతర్గాథలు** : బకాసుర వృత్తాంతం, శక్తికల్మాషపాదుల కథ, ఔర్వుని కథ.

ఆదిపర్వకథలలో మహాపురుషు లెందరున్నా స్త్రీశక్తులే కథలను నడుపుతారు. యయాతి, దుష్యంతుడు, శంతనుడు, భీష్ముడు, పాండురాజు వంటి ప్రముఖులందరూ స్త్రీ ప్రాముఖ్యానికి తలలొగ్గినవారే. ఈ అంశాన్ని తిరుపతి వేంకటకవులు 'పాండవజననము' అనే నాటకంలో ఇట్లా అన్నారు:

"పేరు పూరుషులకుఁ దారసించునె కాని
కార్యనిర్వహణము కామినులది
వెన్నెలయె జగంబు వెలయింపవలెఁ గాని
చంద్రుఁడేమి సేయు? జలజనయన!"

ఈ దృష్టితో గమనిస్తే ఈ పర్వంలో దేవయాని, శకుంతల, మత్స్యగంధి లేదా సత్యవతి, గంగ, అంబ, అంబాలిక, గాంధారి, కుంతి వంశోద్ధరణంలో నిర్వహించే కీలకమైన పాత్రల ప్రాధాన్యం స్పష్టమౌతుంది. వంశకర్తలైన మహాపురుషులు మాతృమూర్తులచేత దిద్దితీర్చబడిన వ్యక్తులుగా కనపడతారు. పాండవులు కుంతీవాక్యబద్ధులు. ఆ తరువాత ద్రౌపదీరాగబద్ధులు. అయినా, వారి పూర్వీకులతో పోల్చుకొంటే పాండవులే స్త్రీశక్తిని నియమించగలిగిన పౌరుషోపేతులు, వీరనాయకగుణ సమగ్రులు. ఈ పరిణామాన్ని చిత్రించటంలోకూడా ఆదిపర్వం భారతకథాబీజభూతంగా నిలిచింది.

పంచమాశ్వాసంలో పాండవులకథ మొదలౌతుంది. ఆ ఆశ్వాసం చివరికే భీమార్జునులు అజేయులై రాణిస్తారు. షష్ఠాశ్వాసంలో భీమపరాక్రమం రాక్షససంహారంతో రాణించి దుర్నిరీక్షంగా ప్రకాశిస్తుంది. సప్తమాశ్వాసంలో అర్జునుడు అద్భుతవీరుడుగా నిలిచి మత్స్యయంత్రాన్ని భేదించి ద్రౌపదిని పాండవపత్నిగా పొందగలుగుతాడు. అష్టమాశ్వాసంచివరకు నరనారాయణులమైత్రి ఫలించి, వారు దివ్యాస్త్రాయుధాలను సాధించి జగద్విఖ్యాతులై నిలుస్తారు. మహాభారతకల్పవృక్షం కృష్ణార్జునోత్తమనానాగుణకీర్తనార్థఫలంకదా! ఆ లక్షణం ఆదిపర్వంలోనే అంకురించింది!

**మహాభారతం ఒక మహాకథ**

"ఏయది హృద్య? మపూర్వం
బేయది? యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు? నఘనిబర్హణ
మేయది? యక్కథయ వినఁగ నిష్టము మాకున్!" **(ఆది. 1.30)**

సూతుడిని శౌనకాది మహామును లడిగిన ప్రశ్న యిది. ఎవరైనా, ఎప్పుడైనా, ఎక్కడైనా మంచికథ వినదలచుకొన్నవారు అడుగవలసిన ప్రశ్న యిది.

కథ హృద్యంగా ఉండాలి. అంటే - మనసును ఆకట్టుకొనేటట్లు ఉండాలి. అపూర్వంగా ఉండాలి. అంటే- అంతకుముందు చెప్పబడనిదై ఉండాలనీ, లేదా, 'ఇంతగొప్పకథ ఎన్నడూ వినలే' దని అనిపించేటట్లు ఉండాలనీ భావం. కథ

వింటే జ్ఞానం సమగ్రంగా కలగాలి. జ్ఞానమంటే - ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను సాధించి జీవితాన్ని సార్థకం చేసికొనటానికి తగిన తెలివిని కలిగిఉండటం. జీవిత లక్ష్యాన్ని సాధించగలిగే సమగ్రజీవనధర్మపరిజ్ఞానమే ఎఱుక సమగ్రమై ఉండే కథాపరిజ్ఞానం. కథ పాపాన్ని తొలగించాలి. అంటే కథ విన్నతరువాత శ్రోతమనసులో ఒక ఉత్తమ పరిణామం రావాలి. జీవితంలో అధర్మప్రవృత్తిని తొలగించుకోగలిగే ఒక సంస్కారం ఏర్పడాలి. తనను తాను ఉద్ధరించుకొనే ఆత్మధర్మం పుణ్యం. దానికి విరుద్ధమైనది పాపం. పాపాన్ని ప్రక్షాళనం చేసికొనే ప్రజ్ఞను కథ శ్రోతకు, పఠితకు ప్రసాదించాలి. అది కథాతత్త్వం. ఈ లక్షణాలన్నీ ఉన్నకథ మహాభారతమని సూతమహర్షి పేర్కొన్నాడు.

'తింటే గారెలు తినాలి. వింటే భారతం వినాలి' అని తెలుగుసామెత. మానవులలో ఎన్నిరకాల ప్రవృత్తు లుంటాయో అన్నిటికీ, జీవితంలో ఎదురయ్యే సమస్యలకూ, ధర్మసంఘర్షణలకూ భారతం నిలువుటద్దం పట్టుతుంది. అందువలన అది హృద్యం. అపూర్వవ్యక్తుల, అపూర్వసన్నివేశాల అపూర్వసంగమం మహాభారతేతివృత్తం. శ్రీకృష్ణునివంటి దివ్యాదివ్యులూ, వ్యాసునివంటి మహాజ్ఞానులూ, భీష్మునివంటి ధర్మవ్రతులూ, కర్ణునివంటి త్యాగధనులూ, అభిమన్యునివంటి సాహసవీరులూ, పాండవులవంటి పరిణతప్రవృత్తులూ, సంసారయజ్ఞసంరక్షులవంటి మహిళామూర్తులూ కలిసి, ఆదర్శానికీ ఆచరణకూ మధ్య అన్వయాలను అందించే అపూర్వకథాప్రపంచం భారతం. పాండవుల సమగ్రజీవితం చిత్రింపబడిన భారతం పురుషార్థసాధన విజ్ఞానసర్వస్వం. అందువలన భారతం జీవనధర్మవేదం. అది వింటే ఎఱుక సమగ్రం కావటంలో అనుమానం లేదు. భారతం పుణ్యకథ. కథ వింటే పుణ్యం కలుగుతుందని అనిపించేది పుణ్యకథ. పుణ్యకథలకు ఫలశ్రుతి చెప్పటం పురాణసంప్రదాయం. భారతం వింటే ఎటువంటి ఫలం కలుగుతుందో పెక్కుచోట్ల ఈ గ్రంథంలోనే చెప్పబడింది. మచ్చుకు. ఆది - 1.34 పద్యాన్ని గ్రహించవచ్చును.

మహాభారతాఖ్యానం చదివితే పుణ్యం కలుగుతుందని చెప్పటమే కాకుండా ఇందులో కొన్ని ఆఖ్యానకాలూ, ఉపాఖ్యానాలూకూడా పుణ్యకథలని బోధపడేట్లు వాటికి ఫలశ్రుతులను ప్రత్యేకంగా చెప్పటం భారతకథాకథనవిశేషం. ఆదిపర్వంలో అటువంటివి- సౌపర్ణోపాఖ్యానం (ఫలశ్రుతి 2-122); ఆస్తీకుని చరితము (ఫలశ్రుతి 2-234, 235). ఇవి వట్టికథలు కావు. వేదార్థబృంహితాలైన ఆఖ్యానకాలు. సుపర్ణుడు మంత్రాధి దేవత. ఆస్తీకుడు హింసలేని యజ్ఞకర్మను బోధించే మంత్రద్రష్ట, సర్గప్రతిసర్గాదుల తత్త్వం చెప్పే ఆఖ్యాయిక సమస్తభూత సంభవకథ. ఫలశ్రుతి (3.72) కల పుణ్యాఖ్యానక మిది. సురాసురులు సముద్రమథనం చేసి సాధించిన అమృతాన్ని పురుషయత్నంతో గరుడుడు సాధించాడు. అమృతాన్ని పంచిన విష్ణువుకు వాహనమైనాడు. అమృతం త్రాగకుండానే దాని మహిమలను అలౌల్య (అనాసక్తయోగ) మనే గుణంతో సాధించిన మహితాత్ముడు. అమృతత్వమంటే 'అనాసక్తియోగం' 'స్వేచ్ఛ' (జీవన్ముక్తి) అని గరుడుడూ, 'అహింస' అని ఆస్తీకుడూ బోధించిన ఆఖ్యానకాలవి. పుణ్యకథల పేటిక, పుణ్యకథావాటిక మహాభారతం! అది ఆమూలాగ్రం అద్భుతం! తిక్కన కథను ముగిస్తూ అన్నమాటలు ఇందుకు నిదర్శనం.

"అతఁ డింతటిది మహాభా
రతంబ! యను నిశ్చయము దిరంబుగ మతి సం
గత మగుడు నమ్మహాత్ముల
కతివిశదము గాఁగ నిమ్మహాకథ చెప్పెన్!" (స్వర్గా.1.78)

ఇంతటిదా మహాభారతకథ! అని ఆశ్చర్యం కలిగించే మహాకథ ఈ పంచమవేదం!

**నన్నయకవితావైభవం**

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తి లో
నారసి మేలునా, నితరు లక్షరరమ్యత నాదరింప, నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్". **(ఆది. 1.26.)**

నన్నయ కవిత్వంలో సారమతులైన మహాకవులు బాగా బుద్ధితో భావనచేసి మెచ్చుకొనే గుణం ప్రసన్నకథాకలితార్థయుక్తి. అంటే ప్రసన్నమైన కథతో కూడుకొన్న అర్థాల (వాచ్య లక్ష్య వ్యంగ్యార్థాల) సంయోజనం. ప్రసన్న మైన కథ అంటే పఠితమనస్సుకు ప్రత్యక్షమైనట్లు అనుభూతి నందించే కథ. దానిని ప్రసిద్ధార్థ పదప్రయోగంవలన కలిగే ప్రసాదగుణంవలన నన్నయ కల్పిస్తాడు. అటువంటి కథను చెప్పాలంటే వాచ్యలక్ష్యవ్యంగ్యార్థాలను గుణవ్యంజకంగా సంయోజనం చేయాలి. ఎక్కడ కథార్థాలను వాచ్యం చేయాలో, ఎక్కడ లక్ష్యార్థంలో, ఎక్కడ వ్యంగ్యార్థంలో చెప్పాలో ఆ శిల్పమర్మాలను తెలియాలి. తెలిసి చేసిన అర్థసంయోజనంలోని ప్రౌఢిమను లోనారయటంవలన కథ మనసుకు ప్రసన్నమై ప్రత్యక్షమౌతుంది. అర్థశక్తి తెలిసినవారే దానిని అనుభవించగలరు. మహాకవులు ఆ గుణాన్ని భావనామయంగా దర్శించి అనుభవించి ప్రశంసిస్తారు.

'ప్రసన్నకథాకవితార్థయుక్తి' అని మరొక పాఠం ఉంది. అంటే ప్రసన్నమైన కథయొక్క, కవితయొక్క అర్థసంయోజనమని భావం. లేదా, ప్రసాదగుణంతో కూడిన కథాకవిత్వంలోని వాచ్యలక్ష్యవ్యంగ్యార్థాల సంయోజనం అనికూడా చెప్పవచ్చును. నన్నయ కథాకథన కవిత్వపద్ధతిని అభిమానించేవాడు. కథాసన్నివేశానికి తగిన కవితాశైలిని ప్రదర్శించేవాడనీ చెప్పవచ్చును. లేదా కథను ప్రసన్నంచేయటానికి కథనశిల్పంలో వ్యంగ్యాద్యర్థాలను సంయోజనంచేసి ప్రయోగిస్తాడనీ చెప్పవచ్చును. ఏమైనా ఇదికూడా సారమతు లైన కవితాశిల్పమర్మజ్ఞులకే ప్రసన్నం కాగల కవితాలక్షణం.

రెండవది సామాన్యులను ఆకర్షించేది. అది అక్షర రమ్యత. ఈ సమాసానికి 'అక్షరాలను రసభావవ్యంజకంగా ప్రయోగించటంవలన కలిగే సౌందర్యం - లేదా - ఆస్వాదయోగ్యత' అని కానీ, క్షరంకాని రచనాసౌందర్యం, తనివితీరని ఆస్వాదమాధుర్యం అనికానీ చెప్పవచ్చును. మొదటి అర్థం కావ్యశయ్యకు సంబంధించింది. రెండవది పద్యరచనా సౌందర్యానికి సంబంధించింది. మొత్తానికి అక్షరరమ్యతవలన రచనకు శ్రవణానందం కలిగించే గుణం అలవడుతుంది. అర్థం తెలియకపోయినా పద్యరచనలోని నాదమాధుర్యాన్ని సామాన్యులుకూడా తరుగని ఆసక్తితో ఆనందిస్తారు. నన్నయ కవిత్వాన్ని సామాన్యులచేత చదివింపచేసేదీ, వినిపింపచేసేదీ అయిన ధారామాధుర్యగుణం అక్షరరమ్యత.

నన్నయభట్టుకవిత్వంలో పండితపామరుల కందరికీ నచ్చేదీ, ఆయనవాక్కుకు సహజమైనదీ అయిన లక్షణం 'నానారుచిరార్థసూక్తినిధిత్వం'. అనేకరకాలైన ఉచితాలైన, కాంతిమంతాలైన అర్థాలను అందించగలిగే సూక్తులకు నన్నయ నిధివంటివాడు. సూక్తు లంటే సుభాషితాలనికానీ, అంద మైన కవితాభివ్యక్తులనికానీ పేర్కొనవచ్చును. ఈరెండూ కలిసినవీ కావచ్చును. ఇది కలకాలం జనుల నాల్కలపై కవిత్వాన్ని నిలపగలిగే లక్షణం.

సుభాషితాలైన సూక్తులు నానావిధాలైన అర్థాలను - అంటే వివిధ ప్రయోజనాలను - సాధిస్తాయి. లోకనీతిని, రాజనీతిని, ఆధ్యాత్మిక ప్రబోధాలను, ధర్మప్రబోధాలను, లోకజ్ఞతా విశిష్టాలైన అనుభవాలను సూక్తులు ప్రదర్శిస్తూ ఉంటాయి. నన్నయకవితలో ఇటువంటివి కోకొల్లలు. మచ్చుకు ఒక్కటి -

"నిండుమనంబు నవ్యనవనీత సమానము, పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు, నిక్క మీ
రెండును రాజులందు విపరీతము, గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మరింపఁగన్." **(ఆది. 1.100)**

బ్రాహ్మణక్షత్రియుల స్వభావాన్ని గురించి చెప్పిన ఈపద్యం తెలుగునాట లౌకికప్రసంగాలలో లోకోక్తిగా వాడుకోవటం ఇప్పటికీ ఉన్నది. నన్నయకవిత ప్రజల పలుకుబడిలో సూక్తిసుధామాధుర్యంతో జీవిస్తుంది అనటానికి ఇది సాక్ష్యం.

"సూక్తియనగా రుచిరమైన చమత్కారయుక్తమైన కూర్పు. ఈ చమత్కారము ఒక్కొక్కపదమునందు, పదబంధమునందు, సమాసమునందు, కారకమునందు, వాక్యమునందు బహుభంగుల చూడవచ్చు" నని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు భావించారు. ఇవన్నీ అందమైన కవితాభివ్యక్తుల జాడలు.

నన్నయ ప్రధానంగా గుణవాది. శబ్దగుణ సంయోజన శిల్పంతో కవితలో సౌందర్యాన్నీ, ఆస్వాదనీయతనూ కల్పించటంలో ఆయన సిద్ధహస్తుడు. గుణవ్యంజకాలైన స్వరాలనూ, అక్షరాలనూ రచనలో కూర్చి రమ్యతను కల్పించటం ఆయన పద్యరచనా శిల్పం. నన్నయకు శబ్దగుణ మంటే ఇష్టం. రమణీయార్థ ప్రతిపాదక శబ్దాన్ని ఎన్నుకొని దానిని అక్షరసుందరంగా ఆవిష్కరిస్తాడు నన్నయ. ఉదంకోపాఖ్యానంలో చేసిన నాగస్తుతి ఇందుకు ఉదాత్తమైన ఉదాహరణ -

"బహువనపాదపాబ్ధి కులపర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్ర సహస్ర ఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్య యైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్." **(ఆది. 1-104)**

విభావ స్వభావ వ్యంజక మైన శబ్దగుణం, అక్షరరమ్యత ఇందులోని రచనాసౌందర్య రహస్యం. బంధౌజ్జ్వల్య మనే కాంతిగుణం ఈ రచనలోని ప్రాణచైతన్యం. 'మహామహీభరా'న్ని మొదటి పాదంలోని అక్షరసంవిధానంతో భావ్యమానం చేశాడు. భూభారాన్ని మోస్తున్న ఆదిశేషుని శ్రమను సూచించే 'సహస్రఫణాళి' బుసలను ఊష్మాక్షరాలతో వ్యంజింపచేశాడు. పద్యరచనలో ఓజస్సునుండి క్రమంగా ప్రసాదానికి పరిణమించిన రచన అనంతుడు ఆగ్రహం వీడి ప్రసన్నత భజించాలన్న ఉదంకుని కామనకు అనువుగా అమరింది. XiViii

బంధంలోని వికటత్వమనే ఉదారతాగుణాన్ని అక్షరసౌందర్యంతో నన్నయ మేళవించే మెలకువ అనన్యసామాన్యం.

"వివిధోత్తుంగ తరంగ ఘట్టిత చలద్వేలావనైలావలీ
లవలీలుంగ లవంగ సంగత లతాలాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం దత్తీరదేశంబునం
దవదాతాంబుజ ఫేనపుంజనిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్." **(ఆది. 2.29)**

పద్యపూర్వార్ధంలో రమణీయమైన లతావనాల పారవశ్యం కలిగించే సౌందర్యం-పద్యం చివరిపాదంలో తెల్లగా అబ్బురపాటు కలిగించే అశ్వసాక్షాత్కారం. మధ్య ధవళాక్షులు కళ్ళప్పగించి చూస్తున్న దృశ్యం నాదమాధుర్యంతో స్వరదర్శనంతోపాటు స్వరూపదర్శనంకూడా చేయించాడు నన్నయభట్టారకుడు.

గుణప్రధానమైన రచనలో ఒక వైలక్షణ్యం గోచరిస్తుంది. అది రీతిని పోషిస్తే రచనలోని గతిగాంభీర్యానికి ప్రాధాన్యం ఏర్పడుతుంది. వృత్తులను రూపొందిస్తే సాక్షాత్ రసస్ఫూర్తికి దోహదకారి అవుతుంది. నన్నయ గుణాలతో రీతుల కంటె వృత్తుల నెక్కువగా వ్యక్తీకరిస్తాడు.

"దాని శరీరసౌరభము దాని విలోలవిలోకనంబులున్
దాని మనోహరాకృతియు దాని శుచిస్మితవక్త్రకాంతియున్
దాని విలాసముం గడుముదంబునఁ జూచి మనోజబాణసం
తానహతాత్ముఁ డై నృపతి దానికి నిట్లనియెం బ్రియంబునన్". **(ఆది. 4.172)**

ఇందులోని సమతాగుణం మాధుర్యగుణం సత్యవతీపాత్రగత మైన సమవిభక్త శరీర స్వరూప సౌందర్యాన్నీ శృంగార రసవృత్తులనూ వ్యక్తీకరిస్తూ ఉండటం సహృదయహృదయైకవేద్యం.

"చందనతమాలతరులందు నగరుద్రుమములందుఁ గదళీవనములందు లవలీమా
కంద తరుషండములయందు ననిమీల దరవిందసరసీవనములందు వనరాజీ
కందళిత పుష్పమకరంద రసముం దగులుచుం దనువు సౌరభము నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందము లలందురఁగ మందమలయానిల మమందగతి వీచెన్." **(ఆది. 5.139)**

మలయానిలవర్ణనం చేసిన నన్నయ సౌకుమార్యమనే శబ్ద గుణాన్ని ప్రసాదంతో మిళితం చేసి ప్రయోగించాడు కాని, దాన్ని అలంకృతం చేసి గాఢతరం చేయలేదు. ఈపద్యంలో శబ్దాలంకారం ఉన్నట్లు భాసించినా, రచన అలంకార ప్రధానం కాదు. అది వస్తుతత్త్వ వ్యంజకం. మలయానిల స్వభావాన్ని గుణవద్రచనం చేత ధ్వనింపచేయటంవలన నన్నయ కవిత్వంలో గుణమే వస్తువును వ్యంజింపచేసే విశిష్టకవితాగుణ మని తీర్పుచెప్పిన ట్లైనది. నన్నయ వస్తువునూ, పాత్రల స్వరూప స్వభావాలనూ, అభినయాలనూ, రసభావాలనూ గుణవ్యంజకాలుగా చేసి మెప్పించే కవితాశిల్పాన్ని ఆంధ్రభారతికి సహజాలంకారంవలె సమకూర్చాడు.

'ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తి' అనే కవితాలక్షణాన్ని దర్శింపగలిగిన నన్నయ తప్పక ధ్వనిసంప్రదాయానికీ, అందులోనూ వస్తుధ్వని పార్శ్వానికీ చెంది ఉంటాడు. ఆయన రచనలో అడుగడుగునా కనబడే ఈస్వభావానికి ఎన్నైనా ఉదాహరణ లివ్వవచ్చును. కాని రెండుమూడు మాత్రం.

నన్నయ రచనలో పఠిత ఒక కథను ప్రమాణంగా తీసికొని పరిశీలించాలి: ఆఖ్యానకమైనా, ఉపాఖ్యానమైనా వాటికి తగిన కావ్యకథాశిల్పంతో లఘుకావ్యాలుగా రాణిస్తూ ఉంటాయి. ఉదాహరణకు ముందుగా ఉదంకోపాఖ్యానాన్ని గ్రహిద్దాం.

ఉదంకుని కథలో రెండు భాగా లున్నాయి. మొదటిది - గురుపత్నికి పౌష్యపత్నికుండలాలను తెచ్చియిచ్చినకథ. అందులోనే అతడు తక్షకుని అపకారానికి గురిఅయినాడు. రెండవది - అతడు జనమేజయునిచేత సర్పయాగాన్ని మొదలు పెట్టించిన కథ. అందులో తక్షకునిపై ప్రతీకారం తీర్చుకొనటానికి ప్రయత్నించాడు. ఈ రెండుభాగాలూ రెండుకార్యాలతో కూడిఉండటంచేత కథలజంటగా కనిపిస్తాయి. ఒక్కొక్కదానిలో దానికి తగిన కావ్యశిల్పనిర్వహణం స్వయంసమగ్రంగా ఉన్నది. అందువలన మచ్చుకు మొదటికథను పరిశీలిద్దాం.

కథలో వాచ్యలక్ష్యవ్యంగ్యార్థాల సంయోజనం సహజంగా శక్తిమంతంగా ముప్పేటగా సాగింది. కథలో వాచ్యంగా చెప్పబడుతున్న అంశాలు ఒకపేట. ప్రతీకలతో చెప్పబడిన అంశాలు లక్ష్యార్థాలవంటివి అవి ఒకపేట. వాచ్యమైన అర్థాల నాధారంగా చేసికొని ప్రతీయమాన మయ్యే వ్యంగ్యార్థాలు మూడవపేట. కథారంభంలోనే పైలశిష్యుడైన ఉదంకుడు పంకజసన్నిభుడనీ, అఘపంకక్షాళన మహాతపస్సలిలుడనీ, అనాతంకమతి అనీ, అపరిమిత నిష్ఠాపరుడనీ, అణిమాది అష్టసిద్ధులు కలవాడనీ వర్ణించాడు నన్నయ. కథానాయకుడి గుణాలన్నీ ఒకచోట చెప్పటంవలన కథ వాచ్యమై పలచబడిపోయినట్లు పైకి అనిపించవచ్చును. కాని, కథామర్మజ్ఞులు అవన్నీ కథలో ఎలా వినియోగపడతాయో పర్యాలోచిస్తారు. ఉదాహరణకు తక్షకుడు బిలంద్వారా పాతాళానికి వెళ్లాడు. ఉదంకుడు కూడా ఆ బిలంలో ప్రవేశించి పాతాళానికి చేరాడు. అయితే, అక్కడ ఉదంకుడు లఘురూపాన్ని ధరించి బిలంలో దూరాడని నన్నయ వివరించడు. అణిమాదిసిద్ధులుండటం చేత ఆ పనిచేయగలిగాడని లోనారసి గమనిస్తే కథ ప్రసన్నమౌతుంది. అట్లాగే మిగతా విశేషణాలన్నీ కథలో జరిగే సన్నివేశాలకు శిల్పపరమైన అన్వయసూత్రాలుగా తోడ్పడతాయి. ఇదంతా కథను ప్రసన్నంచేసే ప్రక్రియలో వాచ్యార్థాలను పూర్వాపరసమన్వయ సంకేతాలుగా నిబంధించే కథాకథనశిల్పం.

కథలో తారసిల్లే - మహోక్షాన్నెక్కి వచ్చిన దివ్యపురుషుడు, వృషభగోమయం, సితాసితతంతుసంతాన పటాన్ని అల్లే ఇద్దరు స్త్రీలు, ద్వాదశారచక్రాన్ని త్రిప్పే ఆరుగురు కుమారులు, అతిప్రమాణతురంగాన్ని ఎక్కిన దివ్యపురుషుడు - వీరందరూ కథను సాగిస్తారు కాని, వారెవరో చివరకు గురువు వివరించేంతవరకు ఉదంకుడితోపాటు పఠితకూ తెలియదు. వాచ్యార్థానుపపత్తి ఏర్పడినప్పుడు అనువైన లక్ష్యార్థాన్ని చెప్పుకొన్నట్లుగానే కథలో తమ రహస్యాన్ని బయటపెట్టక చివరివరకూ ఉత్కంఠనూ, ప్రతీకాత్మకతనూ పోషించే ఈ పాత్రల కథ లక్ష్యార్థసంయోజన శిల్పాన్ని వెలారుస్తున్నది. ప్రతీకాత్మకతలో అర్థం తెలిసేంతవరకు ఉత్కంఠ; తెలిస్తే ప్రసన్నత!

ఉదంకుని కథలో ఇంద్రుడు అమృతాన్ని అతనిచేత ఎందుకు తినిపించాడు? పర్జన్యదేవుని సాక్షాత్కారం ఎందుకు కలిగింది? అగ్ని ఎందుకు సహాయం చేశాడు? పౌష్యునిభార్య పవిత్రులకు మాత్రమే కనపడట మంటే ఏమిటి? అన్నింటినీ మించి అసలు ఆ కుండలా లంటే ఏమిటి? మొదలైన అంశాలు వాచ్యార్థాలనుండి ప్రతీయమాన మయ్యే వ్యంగ్యార్థాలవలననే తెలుస్తాయి. అంతదాకా ఎందుకు? ఉదంకునిలో ఒక క్రోధమూర్తి ఉన్నాడన్న సంగతి పౌష్యునికి అతడు శాపమిచ్చినప్పుడు మాత్రమే బయటపడుతుంది. నివురుగప్పిన నిప్పువలె ఉన్న అతని క్రోధం సర్పయాగానికి బీజమని లోనారసి చూస్తే తప్ప గోచరించదు. ఈవిధంగా పరిశీలిస్తే నన్నయ ఉపాఖ్యానాలు నిస్తులమైన వస్తుధ్వనికి కౌస్తుభరత్నాలు!

ఉపాఖ్యానాలనేకాక ఆఖ్యానకాలను కూడ స్వయంసమగ్ర మైన కావ్యాలవలె తీర్చిదిద్దటం నన్నయ కథాకథనశిల్పంలో ఒక లక్షణం. అటువంటి వాటిల్లో ఉత్తమమైనది శకుంతలాదుష్యంతుల కథ. భరతవంశకర్తకు కారకులైన దంపతులు వారు కావటంచేత ఆ కథను సర్వాంగసుందరంగా మలచాడు నన్నయ. అందులో ప్రతి అంశమూ ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తికి రమణీయోదాహరణమే కాగలదు. మచ్చుకు ఒకటి రెండు -

1. మూలంలో లేని కొన్ని కల్పనలకు తెలుగులో క్రొత్తగా చేసి, కథకు ప్రసన్నతను కలిగించటంతోపాటు, వ్యంగ్యార్థసంయోజనంతో వస్తుధ్వనిని నన్నయ సాధించాడు.

(అ) దుష్యంతుడు కణ్వాశ్రమంలో శకుంతలను చూచినప్పుడు అమూలకమైన ఈక్రింది కల్పనను కాళిదాసుని అభిజ్ఞానశాకుంతల నాటకం ఆధారంగా గ్రహించి పొందుపరిచాడు నన్నయ. ''అసంశయం క్షత్త్ర పరిగ్రహక్షమా - యదార్య

మస్యా మభిలాషి మే మనః'' - అన్న కాళిదాసు శ్లోక తాత్పర్యాన్ని గ్రహించి ''ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీలలితాంగి యందు నా, హృదయము తద్దయుం దవిలె ; నిప్పలు కింకను నమ్మనేరనయ్యెద'' (4.30) అని దుష్యంతునిచేత అనిపించాడు. ఆతరువాత ''భవహృదయ సాభిలాషం సంప్రతి సందేహనిర్ణయో జాతః'' అనే శ్లోకభావాన్ని ''ఇది మునినాథకన్యయని యెంతయు నిస్పృహవృత్తి నున్న'' (4.51) అనే పద్యంలో నిబంధించాడు. నన్నయ ఈ కల్పనలవలన కథ ప్రసన్నమయ్యే వ్యంగ్యార్థ సంయోజనం సాధించాడు. ఎట్లాగంటే - దుష్యంతుడు శకుంతలను గాంధర్వవిధిని వివాహమాడి, హస్తినాపురికి వెళ్ళి, ఆమెను అంతఃపురానికి పిలిపించుకోలేదు. పుత్రుడు పుట్టితే అతనికి యౌవరాజ్యపట్టాభిషేకం చేస్తానని మాట యిచ్చి దానిని స్మరించలేదు. నిండుకొలువులో శకుంతలను, భరతుడిని, భార్యాపుత్రులుగా గుర్తించలేదు. దానికి లోకాపవాదభీతిని హేతువుగా చూపించాడు తరువాత. ఆ ప్రవర్తనవలన దుష్యంతుడు ఉదాత్తు డనిపించుకోడు. పైపెచ్చు కపటిగా, కఠినుడుగా, అసత్యవాదిగా గోచరిస్తాడు. కాని, చివరకు ఆకాశవాణి నిర్దేశం ప్రకారం నిజాన్ని అంగీకరించాడు. ఆ హఠాత్ పరిణామానికి తగిన చిత్తసంస్కారం అతనిలో ఉన్నట్లు మూలకథలో ఎటువంటి సూచనా లేదు. నన్నయ దానిని కల్పించి, భావికథార్థవ్యంజకమైన కల్పనతో కథను ప్రసన్నం చేశాడు.

దుష్యంతుడు కణ్వమహర్షియొక్క తపోవనంలోకి పోయే ముందు ఖాండవవనాన్ని తలపించే సుందరవనాన్ని చూచాడు. అందులో సంతోషంగా ప్రవేశించాడు. అప్పుడు అక్కడి లతాలలనలు కుసుమాక్షతలను రాజుమీద చల్లినట్లూ, తుమ్మెదనాదాలే ఆశీస్సులుగా వినపడ్డట్లూ సన్నివేశాన్ని నన్నయ చిత్రించాడు. (4.17). ఈ రూపకాలంకార వర్ణనం దుష్యంతునికి త్వరలో జరుగబోయే గాంధర్వ వివాహాన్ని ధ్వనింపజేస్తున్నది.

కణ్వమహర్షి తపోవనవర్ణనం (4.23) వస్తుధ్వనికి చక్కని ఉదాహరణం. మునిశక్తివలన సహజవిరోధిజంతువులు సైతం తమవైరవృత్తిని మాని స్నేహంతో కలిసి జీవిస్తున్న ప్రకృతిని దుష్యంతుడు చూచి ఆశ్చర్యపోయాడు. ప్రకృతిమీద పురుషుని ప్రభావాన్ని వర్ణించే అపూర్వవర్ణన మది. శకుంతలాదుష్యంతుల గాంధర్వవివాహం విరుద్ధప్రవృత్తుల విశిష్ట స్నేహమే. అయినా, అక్కడి శాంతియే ఫలించింది. కణ్వమహర్షి వ్యక్తిత్వాన్ని ఆశ్రమవర్ణనం వ్యంగ్యంగా ప్రసన్నం చేసింది. దుష్యంతుని వర్తనానికి ముని కోపించడు. ప్రాణంగా పెంచిన తండ్రియొక్క అనుమతి లేకుండా స్వయంనిర్ణయంతో వివాహం చేసికొన్న శకుంతలను, ఆమె చేసినపని ధర్మవిరుద్ధం కాదని భావించి, మందలించడు. పైపెచ్చు, ఆమె గర్భంలో పెరుగుతున్న భరతుడు దుష్యంతునివలె కాకుండా వంశకర్త కాదగినవానిగా పెంచి, పెద్దచేసి, విద్యాబుద్ధులు నేర్పించాడు. నిశ్శబ్దంగా భావిభారతచక్రవర్తికి తగిన వ్యక్తిత్వాన్ని నిర్మించి యువరాజు కాదగిన వయసులో భరతుడిని శకుంతలవెంట హస్తినాపురానికి పంపాడు. కణ్వుని శాంతప్రవృత్తియే శకుంతలోపాఖ్యానంలోని ఆత్మశక్తి. దానిని నన్నయ ప్రసన్నం చేశాడు వ్యంగ్యార్థభరితమైన తపోవనవర్ణనంతో. ఇది నన్నయ సాధించిన అమూలకమైన మహాశిల్పం.

ఇటువంటివి ఎన్నెన్నో, మరికొన్నింటిని భావిపర్వపీఠికలలో సమీక్షించటం జరుగుతుంది.

నన్నయపద్యం ధారామధురంగా సాగుతుంది. పద్యం మొదలుపెట్టిన దగ్గరినుండి ముగిసేంతవరకూ సెలయేరువలె ప్రవహించినట్లుంటుంది. వింటే ముందుగా శ్రవణానందం కలిగిస్తుంది శబ్దసౌందర్యంతో. ఆలోచించినకొద్దీ ఆలోచనామృతం అందజేస్తుంది అర్థగాంభీర్యంతో. తత్సమపదభూయిష్ఠమైనా తెలుగుదనం రచనలో తొణికిసలాడుతూ ఉంటుంది. తెలుగువారు అందమైన ఆకారాన్నీ, అమందమైన భావావేశాన్నీ గౌరవిస్తారు. వారిచిత్తవృత్తికి అద్దంపట్టేది నన్నయపద్యశైలి. కృతిపతిప్రశంస చేసే మొదటి తెలుగు పద్యం నన్నయశైలికి అక్షరావతారం!

"రాజకులైకభూషణుఁడు, రాజమనోహరుఁ, డన్యరాజ తే
జోజయశాలిశౌర్యుఁడు, విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ, డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్". **(ఆది. 1.3)**

ఓజస్సులో ప్రసాదం కలిపితే వచ్చే ఒక మధురమైన శైలి ఇది. ఉదాత్తవర్ణనలో నన్నయ కలం ఈరీతిగా లాస్యంచేస్తుంది. ప్రసాదం సర్వగుణ సమర్థనీయమనీ, అక్షరరమ్యత దాని సహజగుణమనీ, ధారామాధుర్యంతో కూడిన ఈవర్ణనంలో రాజరాజుకూ, ధర్మరాజుకూ సమానధర్మం పాటింపబడిందనీ గ్రహిస్తే నన్నయ కవితాలక్షణాలు మూడింటికీ ముచ్చటైన ఉదాహరణంగా దీనిని గుర్తించవచ్చును! నన్నయపద్యాలలో ఎన్నో భద్రగజాలు నడుస్తాయని ప్రసిద్ధి. అందుకే నన్నయనే భద్రగజంగా కీర్తించాడు ఎఱ్ఱన.

ఉ. "ఉన్నతగోత్రసంభవము, నూర్జితసత్త్వము, భద్రజాతి సం
పన్నము, నుద్ధతాన్యపరిభావిమదోత్కటమున్, నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి చొప్పడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుటఁ బ్రస్తుతించెదన్." **(హరివంశము 1.6)**

### కవిత్రయభారతం - వ్యాఖ్యానం

ఆంధ్రమహాభారతానికి ఆమూలాగ్రం వ్యాఖ్య ఇంతవరకు వెలువడలేదు. కొన్ని పర్వాలకు, కొన్ని ఆశ్వాసాలకు ఎడనెడ గచ్ఛత్ వ్యాఖ్యలు, సరళవ్యాఖ్యలు వచ్చాయి కాని ఒక సమగ్రతను సాక్షాత్కరింపచేసే వ్యాఖ్యానం రాలేదు. ఆ లోపాన్ని తిరుమల తిరుపతి దేవస్థానంవారు తీర్చి అటు ధర్మప్రచారానికీ, ఇటు సాహిత్య ప్రసారానికీ ఎనలేని సేవచేస్తున్నారు. కవిత్రయభారతం తెలుగులోకి అవతరించి దాదాపు వేయేళ్లు (దాదాపు 950 సం॥) అవుతున్న తరుణంలో ఈ సమగ్రవ్యాఖ్య వెలువడటం ఆంధ్రులు చేసికొన్న అదృష్టం. ఈ వాఙ్మయ యజ్ఞంలో కర్తలైన టి.టి.డి.బోర్డు ఛైర్మన్, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ మొదలైన అధికారులూ, సంపాదకులూ వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, ప్రోత్సాహకులుగా కృషిచేసినవారూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్సులు. కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు సలహామండలి సభ్యులకూ, సంపాదకమండలి సభ్యులకూ, ఈ ప్రచురణ విషయంలో విశేష శ్రద్ధ తీసికొన్న తిరుమల తిరుపతి దేవస్థానం సంపాదకులకూ, కంట్రోలర్ ఆఫ్ పబ్లికేషన్స్ గారికీ, సహాయకులైన వారి సిబ్బందికీ నా ధన్యవాదాలు.

విద్వద్వరేణ్యులైన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఆదిపర్వంలోని మొదటి మూడు ఆశ్వాసాలకు వ్యాఖ్యను సరళ గ్రాంథికభాషలో రచించారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి నిర్ణయం ప్రకారం వారివ్యాఖ్యను శిష్టవ్యావహారికంలోకి పరివర్తనం చేయటం జరిగింది. నాలుగవ ఆశ్వాసానికి ప్రధానసంపాదకులే శిష్టవ్యావహారికంలో వ్యాఖ్యను సమకూర్చారు. డా॥ అప్పజోడువేంకటసుబ్బయ్యగారు తొలుత తాము సరళ గ్రాంథికభాషలో రచించిన ఆదిపర్వం 5,6,7,8 ఆశ్వాసాల వ్యాఖ్యను సంపాదకమండలి సలహానుసరించి వారే శిష్టవ్యావహారికంలోనికి పరివర్తనంచేసి ఇచ్చారు. శిష్టవ్యావహారికశైలిలో పాటించవలసిన మార్గదర్శక సూత్రాలను సంపాదకమండలి రూపొందించింది. వాటి ననుసరించి కవిత్రయ మహాభారత వ్యాఖ్యానం మొత్తం శిష్టవ్యావహారికంలోనే సాగటం విశేషం.

వ్యాఖ్యాతలు చెప్పిన అంశాలకు మరికొన్ని విశేషాంశాలను చేర్చి, ప్రతి సంపుటికీ ఒక పీఠికను కూర్చి, ఈ సరళవ్యాఖ్యకు వీలైనంతవరకు సమగ్రతను, ఏకవాక్యతను, కథార్థ ప్రసన్నతను, కావ్యశిల్పతత్త్వ సమన్వయాన్నీ సంతరించి, ఎక్కువమంది సహృదయులకు సమ్మోదాన్ని కలిగించే దిశగా ప్రధాన సంపాదకుడి కృషి సాగింది. ఇది మొత్తంమీద అందరికీ అందుబాటులో ఉండే సరళ వ్యాఖ్య. విశేషాంశాలు భారతంలోని కొన్ని గంభీర విషయాలను దర్శించటానికి తోడ్పడే గవాక్షాలు మాత్రమే.

పద్మావతీసహిత శ్రీవేంకటేశ్వరస్వామివారు నాకు ఈ మహాభారత వ్యాఖ్యానసంపుటుల ప్రధాన సంపాదకత్వబాధ్యతలు ప్రసాదించటం నా పూర్వజన్మపుణ్యవిశేషం. ఆ పురాణ దంపతుల పాదపద్మాలకు భక్తితో సహస్ర ప్రణామాలు. ఈ ప్రచురణ సర్వధర్మ సారసత్యస్వరూపు డైన ఆ భగవానుని దివ్యచరణారవిందాలపై ఉంచుతున్న భక్తి పారిజాత పూజాకుసుమం!

హైదరాబాదు
బహుధాన్య శ్రావణ పూర్ణిమ
8-8-1998

**జి.వి. సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు
కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు
తిరుమల తిరుపతి దేవస్థానం.

# ఆదిపర్వ కథాసారం

## (మొదటి భాగం)

మహాభారత యుద్ధానంతరం కౌరవవంశానికి అంకురంగా నిలిచినవాడు ఉత్తరాభిమన్యుల పుత్రుడు పరీక్షితుడు. పాండవుల తరువాత హస్తినాపుర సింహాసన మెక్కి అరవైయేడేళ్ళు నిరాఘాటంగా పరిపాలించాడు. ఒకనాడు పరీక్షిన్మహారాజు వేటకు వెళ్లాడు. ఒక మృగంమీద బాణం వేశాడు. అది ఆ గుచ్చుకున్న బాణంతోనే పరుగెత్తటం మొదలు పెట్టింది. రాజు దాని వెంటపడ్డాడు. అది కనుమరుగైపోయింది. ఆ అరణ్యంలో శమీకుడనే ముని కనపడ్డాడు. అతడిని మృగాన్ని గురించి అడిగాడు. ఆ ముని ధ్యానంలో మౌనవ్రతంలో ఉండటంచేత మాట్లాడలేదు. పరీక్షిత్తుకు కోపం వచ్చింది. ప్రక్కన చచ్చిపడి ఉన్న ఒక పామును వింటి కొప్పుతో ఎత్తి ఆ మునిమెడలో వేసి హస్తినాపురికి తిరిగి వెళ్ళాడు.

శమీకుడు సమాధిలో ఉండటంచేత పాము మెళ్లోపడ్డా ఒళ్లు తెలియలేదు. అతనికి శృంగి అనే కుమారుడున్నాడు. అతడు తపస్వి అయినా మహాకోపి. తండ్రికి జరిగిన అవమానాన్ని ఒక ముని వలన విని, ఆగ్రహోదగ్రుడై, 'ఏడురోజుల్లో తక్షక విషాగ్ని దగ్ధుడై పరీక్షిత్తు ప్రాణాలు కోల్పోవుగాక!' అని శపించాడు.

శృంగి తండ్రి దగ్గరకు వచ్చాడు. పామును తండ్రి మెడనుండి తొలగించాడు. శాపాన్ని తండ్రికి తెలియజెప్పాడు. శమీకుడు కోపంవలన ఎన్నో అనర్థాలు కలుగుతాయనీ, క్షమాగుణం తపస్వికి అలంకారమనీ కొడుకునకు బోధించి శాపాన్ని క్రమ్మరించుమని కోరాడు. శృంగి దానికి అంగీకరించలేదు. శమీకుడు విచారపడ్డాడు. ఒక శిష్యునితో శాపవృత్తాంతాన్ని రాజుకు తెలియపరిచాడు.

శాపవృత్తాంతం విని పరీక్షిత్తు భయపడ్డాడు. మంత్రులతో మంతనాలు సలిపి ఒంటికంబపు మేడ కట్టించుకొని అందులో విషాన్ని విరిచే మహామంత్రాలు జపిస్తూ రాత్రింబవళ్ళు వైద్యులు, భటులు కాపలా కాస్తూ ఉంటే, వారంరోజుల గడువును కంటికి కూరుకు లేకుండా సాగిస్తూ ఉన్నాడు.

పూర్వం బ్రహ్మదేవుడు కశ్యపుడనే బ్రహ్మర్షికి, 'సంజీవని'ని ఉపదేశించాడు. పరీక్షిత్తును తక్షకుడు కాటేసి చంపితే అతనిని తిరిగి బ్రతికించి తన విద్యాబలాన్ని ప్రభువుముందు వెల్లడించాలని కశ్యపుడు బయలుదేరాడు. అతన్ని త్రోవలో తక్షకుడు కలిసికొన్నాడు. కశ్యపుని శక్తిని పరీక్షించటానికి తక్షకుడు ఒక మర్రిచెట్టును కాటేసి దగ్ధం చేశాడు; వెంటనే కశ్యపుడు ఆ చెట్టును బ్రతికించాడు. అతని విద్యాబలం తెలిసికొని ఎంతో ధనాన్ని అతనికి పారితోషికంగా ఇచ్చి హస్తినాపురం చేరకుండా అతడిని తిరిగి పంపించివేశాడు. పరీక్షిత్తుకు మృత్యువు తథ్యమని తేలింది.

తక్షకుడు నాగకుమారులతో కలిసి బ్రాహ్మణవేషాలతో వెడలి ఏకస్తంభహర్మ్యానికి చేరుకొన్నాడు. వేదఘోషతో వచ్చిన ఆ విప్రులను రాజు పూజించాడు. ఏడవరోజు సూర్యాస్తమయం అవుతున్నది కదా అని, ఆ విప్రులు తెచ్చిన పండ్లలో ఒకదానిని తినటానికి పరీక్షిత్తు ఉద్యుక్తుడైనాడు. ఆ పండులో క్రిమిగా తక్షకుడు తలయెత్తి విషాగ్నిని గుప్పించాడు. మేడతో సహా పరీక్షిత్తు దగ్ధుడైపోయాడు.

పరీక్షిత్తు చనిపోయేనాటికి అతని కుమారుడు జనమేజయుడు బాలుడు. పిన్ననాటనే రాజ్యభారాన్ని స్వీకరించవలసి వచ్చింది. తండ్రికి తక్షకునివలన కలిగిన అపకారాన్ని ఉదంకునివలన తెలిసికొని పాములజాతిమీద మండిపడ్డాడు. సర్పయాగం

చేసి తక్షకాదుల నందరినీ అగ్నిలో ఆహుతి చేయాలనుకొన్నాడు. యాగం ఆరంభమయింది. అగ్నికుండంలో పాములు వరుసగా వచ్చి పడుతున్నాయి. అప్పుడు ఆస్తీకుడనే విప్రుడిని వాసుకి మొదలైన నాగముఖ్యులు సర్పయాగాన్ని మాన్పించుమని ప్రార్థించారు. ఆస్తీకుడు సముచితమైన స్తుతులను చేసి జనమేజయుడిని మెప్పించి సర్పయాగం మాన్పించాడు.

ఆ తరువాత ఒకనాడు జనమేజయుడు విద్వద్గోష్ఠిలో ఉండగా వైశంపాయనాది శిష్యులతో వ్యాసమహర్షి అక్కడకు వచ్చాడు. జనమేజయ మహారాజు వ్యాసమహర్షిని అర్ఘ్య పాద్యాది విధులతో పూజించి వినయంతో నమస్కరించి ఇట్లా అడిగాడు-

'ఓ మహర్షీ! మీరూ, భీష్మాది కురువృద్ధులూ కలిసి రాజ్య సంపదను విభాగం చేసి ఇచ్చినప్పటికీ కూడా, సుఖశాంతులతో వాటిని అనుభవించకుండా అటు పాండవులూ, ఇటు కౌరవులూ ఏ కారణంవలన ఇంత ప్రజాక్షయమైన భారతయుద్ధం చేశారు? ఈ వంశ కలహం అసలు ఎందుకు కలిగింది? మీ ఆజ్ఞలను వారెందుకు పాటించలేదు? లేదా మీరు తెలిసి తెలిసి వారిని ఎందుకు వారించలేదు? పాండవధార్తరాష్ట్రుల విభేదన కథ వినాలని ఉన్నది. వినిపించండి' - అని జనమేజయుడు వేడుకొన్నాడు. వ్యాసమహర్షి శ్రీ మహాభారత కథాఖ్యానం చెప్పటానికి తన శిష్యుడైన వైశంపాయనుడిని నియోగించాడు. అందువలన కథకుడు - వైశంపాయనుడు. శ్రోత - జనమేజయుడు.

## వ్యాసుని జననం

మహాభారతాన్ని రచించిన వేదవ్యాసులవారే పాండవుల చరిత్రలో ఒక ప్రధాన పాత్ర నిర్వహించారు. అందువలన ఆయనను గురించి ముందు తెలుసుకొందాం.

దాశరాజుకు మత్స్యగంధి అనే కూతురు ఉన్నది. అద్రిక అనే అప్సరస బ్రహ్మశాపంవలన యమునలో చేపగా తిరుగుతున్నప్పుడు, ఆమె ఉపరిచరవసువు వీర్యంవలన పుట్టింది. ఆమెను దాశరాజు కన్నబిడ్డవలె పెంచుకొంటున్నాడు. చేపకడుపున పుట్టటం వలన ఒళ్లల్లా చేపవాసన కొడుతుండేది ఆమెకు. అందువలన మత్స్యగంధి అని పిలిచేవారామెను. ఆమెకు యౌవనం వచ్చింది. యమునానదిమీద పడవ నడుపుతూ యాత్రికుల సేవ చేసుకోమని తండ్రి మత్స్యగంధిని నియోగించాడు. ఆమె శ్రద్ధాభక్తులతో ఆ పనిచేస్తున్నది.

వసిష్ఠమహర్షి మనుమడు, శక్తిపుత్రుడు, మహాతపస్వి అయిన పరాశరముని యమునానది దాటటానికి పడవరేవుకు వచ్చి మత్స్యగంధిని చూచాడు. ఆమె శరీర సౌందర్యం ఆ మహర్షి మనస్సును దోచుకొన్నది. అతడు తన కోర్కెను ఏకాంతంగా ఆమెకు తెలియజెప్పాడు. మునిమాట కాదంటే శాపమిస్తాడనే భయంతో పరాశరునితో మెల్లగా మత్స్యగంధి ఇట్లా అన్నది :

'మహర్షీ! నేనా కన్యకను, పైపెచ్చు నా మేనెల్లా చేపలకంపు; మీ మాట నే నంగీకరిస్తే నా కన్యకావ్రతం ముగిసిపోతుంది. అప్పుడు మా తండ్రిగారింటికి నేనెట్లా వెళ్లగలుగుతాను? కాబట్టి, నాకెటువంటిదోషం రాకుండా నీవు అనుగ్రహిస్తే నాకేమీ అభ్యంతరం లేదు' అని అన్నది మత్స్యగంధి.

పరాశరుడు ఆ మాటలు విని, సంతోషంతో ఆమె కన్యాత్వానికి లోపం లేకుండా వరమిచ్చాడు. ఆమె శరీరంలోని చేపలకంపు పోయి ఒక యోజనదూరం వరకూ పరిమళించే సుగంధాన్ని సహజశరీర వాసనగా ప్రసాదించాడు. దానితో ఆమె 'గంధవతి'గా, 'యోజనగంధి'గా పేరుపొందింది. ఆమెకు దివ్యాంబర భూషణాలు అందించాడు మహర్షి. పడవ నది నడుమ నున్న దీవికి చేరింది. పట్టపగలు - బట్టబయలు ఎట్లా సంగమం సాధ్యం? అని అనుమానించింది యోజనగంధి. పరాశరుడు పట్టపగలును చిమ్మచీకటిగా మార్చాడు. ఆ ముద్దరాలి అనురాగాన్ని అనుభవించాడు. ఆమెకు సద్యోగర్భంలో సూర్యతేజుడైన

వ్యాసుడు ఉదయించాడు. పుట్టగానే సద్యోయౌవనుడైనాడు. సమస్తజ్ఞానం ఆయనకు స్వాధీనమైనది. పరాశరుడు మత్స్యగంధికి మరికొన్ని వరాలిచ్చి వెళ్లిపోయాడు. నల్లని యమునాద్వీపంలో పుట్టటంవలనా, కృష్ణుడు - అంటే - నల్లనివాడు కావటంచేత వ్యాసుడు కృష్ణద్వైపాయనుడు అయినాడు. కృష్ణాజినం, కాషాయాలు, కపిలజడలు, దండకమండలాలూ సహజంగానే ధరించి వ్యాసుడు తల్లికి నమస్కరించాడు. 'మీకు నా అవసరం ఎప్పుడు ఉంటే అప్పుడు నన్ను తలుచుకొండి; ఆక్షణమే మీ యెదుట ఉంటాను' అని చెప్పి తపోవనానికి వెళ్లాడు. ఘోరతపస్సు చేసి, ఆత్మ సాక్షాత్కారాన్ని పొంది, చిక్కుపడిఉన్న వేదాలను విడదీసి లోకంలో వెలయించాడు; వేదవ్యాసుడైనాడు. మహాభారతంలో తానూ ఒక పాత్రగా జీవించి చివరకు ఆ కావ్యాన్ని తానే రచించాడు. యోజనగంధి అసలు పేరు సత్యవతి. కౌరవ వంశ చరిత్రలో తరువాత కీలకపాత్ర నిర్వహించింది.

## భీష్మప్రతిజ్ఞ

వ్యాసుని తరువాత పాండవ కథలో మరో ప్రధానవ్యక్తి భీష్ముడు. శంతను మహారాజుకూ గంగాదేవికీ పుట్టిన మహాబలుడు. వసిష్ఠుని శాపంవలన భూతలం మీద పుట్టి, బ్రహ్మచారిగా, దీర్ఘాయువుగా, మహావీరుడుగా జీవించిన సత్యవ్రతుడు. యౌవరాజ్య పట్టాభిషేక యోగ్యుడై తండ్రియైన శంతనుమహారాజుగారి వాత్సల్యాన్ని చూరగొంటున్నాడు.

ఇట్లా ఉండగా ఒకనాడు శంతనుడు గంగానదీ తీరంలో యోజనగంధిని చూచాడు. ఆమెపై మరులు కొన్నాడు. ఆమె తండ్రి అయిన దాశరాజుకు తనకోరిక తెలిపాడు. దాశరాజు అందుకు అంగీకరించాడు కాని, ఒక నియమం పెట్టాడు. శంతనుడికీ సత్యవతికీ కలిగిన పుత్రునికే పట్టాభిషేకం చేయాలి; అప్పుడే సత్యవతితో వివాహానికి అంగీకరిస్తానన్నాడు. శంతనుడు భీష్ముని మీది అభిమానంతో సత్యవతి సంబంధాన్ని అంగీకరించలేక హస్తినాపురానికి తిరిగి వెళ్లాడు. కాని, సత్యవతీ విరహంతో కుమిలిపోతూ ఉన్నాడు. భీష్ముడు తండ్రి మనస్సును తెలిసికొంటాడు. దాశరాజు దగ్గరికి వెళ్ళాడు. అతని నియమాన్ని అంగీకరించాడు. దానికోసం రెండు భీషణ ప్రతిజ్ఞలు చేశాడు : ఒకటి - తాను రాజ్యం స్వీకరించకుండా శంతనునికీ సత్యవతికీ కలిగిన సంతానానికే రాజ్యం లభించేటట్లు చేస్తానని. రెండు - భవిష్యత్తులో తనకు పుట్టే బిడ్డలు సింహాసనానికి పోటీ పడకుండా ఉండటానికి వీలుగా ఆమరణ బ్రహ్మచర్యవ్రతాన్ని స్వీకరిస్తానని. ఈ ప్రతిజ్ఞలు విని దేవతలు పూలవాన కురిపించారు. 'భీష్ముడు' అని ప్రశంసించారు. తండ్రి అతనికి 'స్వచ్ఛందమరణాన్ని' వరంగా ఇచ్చాడు.

భీష్మునివలననే సత్యవతికీ శంతనునికీ వివాహమైనది. వారిద్దరికీ చిత్రాంగద, విచిత్రవీర్యులనే పుత్రులు పుట్టారు. వారి చిన్నప్పుడే శంతనుడు కన్నుమూశాడు. వారిద్దరి రక్షణభారంతోపాటు రాజ్యరక్షణభారాన్ని కూడా భీష్ముడు స్వీకరించాడు. చిత్రాంగదుడికి పట్టాభిషేకం చేశాడు. అతడు గర్వాంధుడై విహరించాడు. మనుజ గంధర్వాదులను ఆక్షేపించాడు. చిత్రాంగదుడనే ఒక గంధర్వపతికి కోపం వచ్చి అతడిని ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించాడు. చిత్రాంగదు లిద్దరూ ఘోరంగా యుద్ధం చేశారు. శంతనుని పుత్రుడు చిత్రాంగదుడు యుద్ధంలో చనిపోయాడు. ఆ తరువాత భీష్ముడు విచిత్రవీర్యునికి హస్తినాపుర పట్టాభిషేకం చేశాడు. అతనికి కాశీరాజు కూతుళ్లను ముగ్గురిని స్వయంవరంలో బలవిజితలుగా తెచ్చి వివాహం చేయబోయాడు. వారిలో పెద్దది అంబ సాల్వుడిని వరించింది కావున భీష్ముడామెను సాళ్వదేశానికి పంపాడు. మిగిలిన ఇద్దరూ అంబిక, అంబాలికలను విచిత్రవీర్యుడికి కట్టబెట్టాడు. అతడు ఆ భార్యలతో అహోరాత్రాలు భోగించి నిర్వీర్యుడై అసువులను కోల్పోయాడు. దానితో హస్తినాపురికి నాథుడు లేకుండా పోయాడు.

అదొక విచిత్రమైన పరిస్థితి. కురువంశపుత్రులలో మిగిలింది భీష్ముడొక్కడే. సత్యవతి అతణ్ణి రాజ్యానికి పట్టాభిషిక్తుడవు కమ్మనీ, వివాహమాడి సంతానవంతుడవై వంశాన్ని నిలుపుమనీ వేడుకొన్నది. భీష్ముడు తన భీష్మప్రతిజ్ఞను జ్ఞాపకం చేసి,పంచభూతాలు వాటి ధర్మాలు తప్పినా నేను నా మాటను తప్పనని స్పష్టం చేశాడు. అప్పుడు భీష్ముడు నిండు సభలో ఒక

ఆపద్ధర్మాన్ని ప్రతిపాదించాడు. రాజవంశాలలో సంతానం లేకుండా రాజులు మృతులైనప్పుడు దేవరన్యాయంతో రాజులు సంతానాన్నిపొందే ఆచారాన్నీ, అది అప్పటిసమాజంలో పొందిన ప్రామాణికత్వాన్నీ వివరించి చెప్పాడు. అది అందరికీ అంగీకారమైనది. సత్యవతి వేదవ్యాసుని తలచి, అతడు తన కోడండ్రైన అంబిక, అంబాలికలయందు పురుషసంతానాన్ని కలిగించేటట్లు భావించింది.

ఆ దేవర న్యాయంవలన అంబికయందు వేయి యేనుగుల బలం గల ధృతరాష్ట్రుడు పుట్టాడు. కాని, అతడు పుట్టుగ్రుడ్డి. అందువలన వ్యాసుడు అంబాలికయందు మరొక పుత్రుణ్ణి అనుగ్రహించాడు. అతడు మహాపరాక్రమశాలి కాని, పాండు వర్ణం కలవాడు కాబట్టి పాండురాజయ్యాడు. సలక్షణ సంతానం కలుగలేదన్న అసంతృప్తితో అంబికను మరొకపుత్రుడిని కనుమని కోరుతుంది సత్యవతి. కాని, వ్యాసుని కపిలగడ్డం, కపిల జడలు, నల్లని పొడుగైన రూపం చూచి రెండవసారి పొందలేక అంబిక ఒకదాసిని తనస్థానంలో ఉంచింది. ఆమె వ్యాసుని హృదయాన్ని మెప్పించి ఒక సుతుడిని పొందింది. అతడే ధర్మవిదుడైన విదురుడు. వారినిపెంచి, పెద్దవారిని, విద్యావంతులను చేసి, వివాహితులను చేసే బాధ్యత కూడా భీష్మడే స్వీకరించాడు.

ఇది ఆదిపర్వ కథాసారంలో మొదటిభాగం.

**జి.వి. సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపుటము - 1

## ఆదిపర్వము

### మొదటి భాగము (1,2,3,4 ఆశ్వాసములు)

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము



*****

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆదిపర్వము -ప్రథమాశ్వాసము

### మంగళశ్లోకము

**శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే**
**లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్**
**తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై**
**ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరా శ్శ్రేయసే.** 1

**ప్రతిపదార్థం:** యే= ఏ విష్ణు బ్రహ్మ శంకరులు; శ్రీ, వాణీ, గిరిజాః= క్రమంగా లక్ష్మీ సరస్వతీ పార్వతులను; చిరాయ= చిరకాలంనుండి; వక్షః, ముఖ, అఙ్గేషు= రొమ్ముననందూ, మొగమునందూ, దేహమునందూ; దధతః= ధరిస్తున్న వారై; స్త్రీ, పుంస, యోగ+ ఉద్భవామ్= స్త్రీపురుషుల సంయోగంవలన పుట్టిన; లోకానామ్= లోకములయొక్క; స్థితిమ్= స్థిరత్వాన్ని (నిలకడను); అవిహతామ్= అవిచ్ఛిన్న మైనదానినిగా; ఆవహన్తి= చేస్తున్నారో; వేద, త్రయ, మూర్తయః= ఋగ్యజుస్సామా లనే మూడు వేదాల రూపాలు గలవారున్నూ; సురైః= దేవతలచేత; సంపూజితాః= పూజింపబడినవారున్నూ అయిన; తే= పురుషోత్తమ+అమ్బుజభవ, శ్రీకన్ధరాః= విష్ణువు, బ్రహ్మ, శివుడు - అనబడే; త్రి, పురుషాః= త్రిమూర్తులు; వః= మీకు; శ్రేయసే= మేలుకొరకు (మేలు చేసేవారుగా); భూయాసుః= అగుదురు గాక!

**తాత్పర్యం:** ఏ విష్ణు బ్రహ్మ శంకరులు చిరకాలంనుండి క్రమంగా రొమ్ముననందూ, ముఖమునందూ, దేహమునందూ లక్ష్మీ సరస్వతీ పార్వతులను ధరిస్తున్నవారై, స్త్రీపురుషుల సంయోగంవలన పుట్టిన లోకాల సుస్థిరత్వాన్ని అవిచ్ఛిన్నంగా కలిగిస్తున్నారో, మూడువేదాలరూపం కలవారున్నూ, దేవతలచేత పూజింపబడినవారున్నూ అయిన ఆ విష్ణు బ్రహ్మ శంకరు లనబడే త్రిమూర్తులు మీకు శ్రేయస్సును కలిగించేవా రౌతారు గాక!

**విశేషం:** కావ్యారంభ పద్యాన్ని శ్రీకారంతోనూ, మగణంతోనూ ప్రారంభించటం మంగళకరం. అందువలననే ఇది మంగళశ్లోకం. ఇది నాటకంలోని నాందివంటిది. కావ్యారంభంలో ఆశీర్వాదాన్ని కాని, నమస్కారాన్ని కాని, వస్తు నిర్దేశాన్ని కాని చేయా లని లాక్షణికుల నిర్దేశం.'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్'. ఈ శ్లోకంలో ఆశీర్వచనం ఉన్నది. నన్నయ మహాభారతాన్ని తెలుగులో రచిస్తున్నప్పటికీ సంస్కృతం అమరభాష కావటంచేత ఆశీఃపూర్వకమైన మంగళశ్లోకాన్ని సంస్కృతంలోనే వ్రాసి ఉన్నాడు. శ్రీకంధరుడు అంటే విషం కంఠంలో కలవా డని వ్యుత్పత్తి. ఆశీర్వచనంలో శ్రీకంధరశబ్దాన్ని ఎందుకు వాడినా డని కొందరికి సందేహం కలుగవచ్చు. శివుడు హాలాహలభక్షణం చేయటం లోకరక్షణంకొరకే కాబట్టి అది శుభాన్నే సూచిస్తుంది. వేదత్రయమూర్తు లనేపదం భారతం పంచమవేద మని సూచిస్తున్నది. పురుషోత్తమశబ్దం శ్రీకృష్ణుడినే కాక ధర్మజార్జున భీష్మాదులను కూడ జ్ఞప్తికి తెస్తున్నది. 'వక్షోముఖాఙ్గేషు' అనేది సమాహారద్వంద్వం కదా! అది ఏకవచనంలో కాక బహువచనంలో ఉండటానికి హేతు వేమి టని కొందరు ప్రశ్నిస్తారు. ఆ వక్షోముఖాంగాలు ఒక్కరివి కాక ముగ్గురివి కావటం అందుకు కారణం.

భార్యలను చిరకాలంనుండీ ప్రేమిస్తున్న ధర్మమూర్తులు త్రిమూర్తులు వేదత్రయంలో చెప్పబడిన గృహస్థధర్మానికి ప్రతీకలు. వారు స్త్రీపుంసయోగోద్భవ మైన లోకానికి అవిచ్ఛిన్నతను ప్రసాదిస్తా రనటంవలన భారతంలో వేదసమ్మతమైన గృహస్థధర్మం ప్రధానప్రతిపాద్యాంశం అని ధ్వని. ఇది సంస్కృతభారతారంభంకంటె విలక్షణమైనదని గమనించాలి. కావ్యతాత్పర్యాన్ని సూచించటం వస్తునిర్దేశంలోని భాగం. అలం: క్రమం.

నన్నయ ఋషితుల్యుడు. అతని నోట త్రిమూర్తులు అనే పదం రావటంచేత లోకాలస్థితిని త్రిమూర్తులు కొనసాగిస్తున్నట్లు ఆంధ్రమహాభారతాన్ని కూడా త్రిమూర్తితుల్యు లైన ముఖ్యరుకవులు రచించి పూర్తి చేస్తా రనే సూచన అప్రయత్నంగా కలిగిందని కొంద రంటారు. 'నన్నయ' పదం నారాయణ శబ్ద భవం; తిక్కన 'కవిబ్రహ్మ', ఎఱ్ఱన 'శంభుదాసుడు', అందుచేత కవిత్రయం వారు త్రిమూర్తులవంటివా రనటం సమంజసంగానే ఉన్నది. ఇది శార్దూలవిక్రీడితం. ఇందులో తెలుగుపద్యాలలోవలె ప్రాస కాని, అక్షరమైత్రితోకూడిన యతి కాని లేవు. సంస్కృతశ్లోక మర్యాదలే ఇందులో ఉన్నాయి.

**అవతారిక**

**వ. అని సకలభువనరక్షణప్రభువు లై యాద్యు లైన హరిహరహిరణ్యగర్భ పద్మోమావాణీపతుల స్తుతియించి, తత్ప్రసాదసమాసాదిత నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్యవిభవుండును, నిజభుజవిక్రమ విజితారాతి రాజనివహుండును, నిఖిలజగజ్జేగీయమాన నానాగుణరత్న రత్నాకరుండును నై పరఁగుచున్న రాజరాజ నరేంద్రుండు 2**

**ప్రతిపదార్థం:** అని= పైశ్లోకంలో చెప్పబడినప్రకారం; సకల, భువన, రక్షణ, ప్రభువులు+ఐ= సర్వలోకాలను రక్షించటంలో సమర్థులై; ఆద్యులు+ఐన= సృష్టికి మొదటివా రైన; హరి, హిరణ్యగర్భ, పద్మా+ఉమా, వాణీపతులన్= విష్ణువు, శివుడు, బ్రహ్మ అనెడి లక్ష్మీ పార్వతీ సరస్వతీ భర్తలను; స్తుతియించి= పొగడి; తత్, ప్రసాద, సమాసాదిత, నిత్య ప్రవర్ధమాన, మహత్, మహీ, రాజ్య, విభవుండును= ఆ త్రిమూర్తిదంపతుల అనుగ్రహంచేత పొందబడిన దై, సంతతం వర్ధిల్లుతున్న గొప్పభూరాజ్యవైభవం కలవాడున్నూ; నిజ, భుజ, విక్రమ, విజిత+అరాతి, రాజ, నివహుండును= తన బాహువుల పరాక్రమంచేత జయింపబడిన శత్రురాజుల సమూహం కలవాడున్నూ; నిఖిల, జగత్+జేగీయమాన, నానా, గుణ, రత్న, రత్నాకరుండునున్= సమస్త జగత్తులచేత (లోకాలచేత) స్తుతింపబడుతున్న పలువిధాలైన సుగుణా లనెడి మణులకు సముద్రుడున్నూ; ఐ; పరఁగుచున్న= ఒప్పుతున్న; రాజరాజనరేంద్రుండు= తూర్పుచాళుక్యవంశానికి చెందిన రాజరాజనరేంద్రు డనే రాజు. (ఇతడు క్రీ.శ. 1019 (1022) నుండి 1062 వరకు వేంగీరాజ్యాన్ని పాలించాడు.)

**తాత్పర్యం:** అని సర్వలోకాలను రక్షించటంలో సమర్థులై సృష్టికి మొదటివారైన విష్ణువు, శంకరుడు, బ్రహ్మ అనబడే లక్ష్మీ పార్వతీ సరస్వతీ భర్తలను పొగడి, వారి అనుగ్రహంచేత పొందబడి, నిరంతరంగా అనుభవిస్తున్న గొప్పదైన ధరణీరాజ్యవైభవం కలవాడున్నూ, తన బాహువులపరాక్రమంచేత జయింపబడిన శత్రువులసమూహం కలవాడున్నూ, ఎల్ల జగత్తులచేత (లోకులచేత) స్తుతింపబడుతున్న పలువిధా లైన మంచిగుణా లనే మణులకు సముద్రుడున్నూ అయి ఒప్పుతున్న తూర్పుచాళుక్యవంశానికి చెందిన రాజరాజనరేంద్రుడు.

**విశేషం:** మొదటి శ్లోకంలో విష్ణు బ్రహ్మ శంకరులు అనే క్రమం చెప్పబడింది. ఈ వచనంలో హరిహరబ్రహ్మలు అనే వరుసక్రమం చెప్పబడింది. భారతాన్ని నన్నయ తరువాత తిక్కన, ఆ పిమ్మట ఎఱ్ఱన పూర్తి చేసి ఉన్నారు. భారతంలోని కథావిషయక్రమాన్నిబట్టి చూస్తే మొదట నన్నయ, పిమ్మట ఎఱ్ఱన, అనంతరం తిక్కన వస్తారు. శ్లోకంలో మొదటిక్రమాన్నీ, వచనంలో రెండోక్రమాన్నీ ఋషివంటి నన్నయ సూచించా డని ఊహించవచ్చును. అలం: వృత్త్యనుప్రాసం, అంత్యానుప్రాసం, రూపకం.

**ఉ. రాజకులైకభూషణుఁడు, రాజమనోహరుఁ, డన్యరాజతే**
**జోజయశాలిశౌర్యుఁడు, విశుద్ధయశశ్శరదిందుచంద్రికా**
**రాజితసర్వలోకుఁ, డపరాజితభూరిభుజాకృపాణధా**
**రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్. 3**

**ప్రతిపదార్థం:** రాజ, కుల+ఏక, భూషణుఁడు= చంద్ర (క్షత్రియ) వంశానికి (రాజులసమూహానికి) ముఖ్యఅలంకార మైనవాడు; రాజ, మనోహరుఁడు= చంద్రునివలె అందమైనవాడు; అన్య, రాజ, తేజస్+జయశాలి, శౌర్యుఁడు= పరరాజుల పరాక్రమాలను జయించటంచేత ప్రకాశించే శౌర్యం కలవాడు; విశుద్ధ, యశస్+శరత్+ఇందు, చంద్రికా, రాజిత, సర్వ, లోకుఁడు= నిర్మలమైన కీర్తి అనే శరత్కాల చంద్రుడి వెన్నెలచేత ప్రకాశింపచేయబడిన సమస్త జగత్తును కలవాడు; అపరాజిత, భూరి, భుజా, కృపాణ, ధారాజల, శాంత, శాత్రవ, పరాగుఁడు= ఓటమి ఎరుగని పెద్దదైన భుజమునందలి ఖడ్గముయొక్కవాదర అనే నీటిచేత శమింపచేయబడిన శత్రువులనెడి ధూళి కలవాడు; అయిన; రాజమహేంద్రుఁడు= రాజరాజనరేంద్రుడు; ఉన్నతిన్= ఔన్నత్యంతో (మీది పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** చంద్రవంశానికి (క్షత్రియవంశానికి, రాజసమూహానికి) ముఖ్యాలంకార మైనవాడు, చంద్రుడివలె అందమైనవాడు, పరరాజుల పరాక్రమాన్ని జయించటంచేత ప్రకాశించే శౌర్యం కలవాడు, నిర్మలమైన కీర్తి అనే శరత్కాలచంద్రుడివెన్నెలచేత ప్రకాశింప చేయబడిన సమస్తలోకాలు కలవాడు, ఓటమి యెరుగని దీర్ఘమైన బాహువునందలి ఖడ్గముయొక్కవాదర అనే నీటిచేత అణగింపబడిన శత్రువు లనే ధూళి కలవాడు అయిన రాజరాజనరేంద్రుడు పెంపుతో.

**విశేషం:** అలం: రూపకం, వృత్త్యనుప్రాసం. 1. ఈ పద్యంలో రాజరాజనరేంద్రుడి ఆభిజాత్యాన్నీ, సౌందర్యాన్నీ, శౌర్యాన్నీ, నిర్మలమైన కీర్తినీ, బాహుపరాక్రమాన్నీ కవి వర్ణించాడు. ఈ గుణాలు ఉత్తమనాయకత్వవ్యంజకాలు. ఈవిశేషణాలు భారతనాయకుడైన ధర్మరాజుకు కూడా వర్తింపచేయటానికి అనువుగా ఉండటం విశేషం. 2 కావ్యావతారికలో కృతిపతి వర్ణనం అనేది ఒక ముఖ్యమైన అంగం. కృతిపతులు సామాన్యంగా రెండురకాలు-(1) కృతిని అంకితం తీసికొనేవారు (2) కృతిని వినగోరేవారు. వినగోరే వారిని కృతిశ్రోత అంటారు. రాజరాజనరేంద్రుడు కృతిశ్రోత. అతడి వర్ణనం ఇందులో వస్తువు. 3. ఇందులో రూపకాలంకారం ప్రయోగింపబడింది. ఉపమానానికి, ఉపమేయానికి అభేదాధ్యవసాయం చేయడం రూపకాలంకార లక్షణం. "విశుద్ధయశశ్శరదిందుచంద్రికా..." అన్నపుడు. "భూరి భుజా కృపాణ ధారాజల శాంతశాత్రవ పరాగుఁడు" అన్నపుడు- యశస్సుకు చంద్రికకూ, కృపాణధారకు జలానికీ, శత్రువులకు పరాగానికీ, అభేదం చెప్పటంవలన రూపకాలంకారమైనది. 4. నాందీశ్లోకంలో చంద్రప్రశంస ఉండా లని లాక్షణిక నిర్దేశం. 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' అన్న శ్లోకంలో చంద్రప్రశంస లేదు కాని, మొదటిసారి ఎత్తుకొంటున్న ఈ తెలుగుపద్యంలో 'రాజ' శబ్దం శ్లేషార్థంలో ప్రయోగించడం విశేషం. 'రాజ' శబ్దం పునరావృత్తం చేయటంవలన ఈపద్యరచనకు అక్షరరమ్యత ఏర్పడింది. 5. చంద్రప్రశస్తి అర్థాంతరంలో వస్తున్న ఈపద్యాన్ని ఉత్పలమాలలో రచించటం విశేషం. రాజు అంటే చంద్రుడు, భూపతి, క్షత్రియుడు అనే అర్థాలున్నాయి. చంద్రప్రశస్తి ఇందులో వచ్చింది. ఉత్పలం (అంటే నల్లకలువ) చంద్రుడిని చూస్తే వికసిస్తుంది. అట్లాగే 'రాజ' వర్ణనంతో ఈపద్యం అక్షరమైన రమ్యతా భావాన్ని పొందుతూ ఉన్నది. 6. నన్నయశైలి ప్రసాదగుణ భూయిష్ఠమైనది. తత్సమపద బహుళమైనది. సంస్కృతశబ్దాలు వాడినా తెలుగు తియ్యందనానికి గానీ, తెలుగువారి వ్యావహారికతకుగానీ, జాతీయతకు గానీ భంజకం కాకుండా పోషకంగా ఉండటం ఈపద్యంలో విశేషం. 7.(ఉత్పలమాలను) ఏచరణానికి ఆచరణం విరిగిపోయేటట్లు వ్రాయటంకంటె ఒకచరణం మరొక చరణంతో అల్లుకొని పోయినట్లు వ్రాయటం నన్నయ కవితాశిల్పం. ఈపద్యం దానికి చక్కని ఉదాహరణం.

8. కృతిభర్తను వర్ణించే పద్ధతులు మూడు (1) వాస్తవికంగా చేసే వర్ణన (2) ఆలంకారికమైన వర్ణన (3) మిశ్రమ వర్ణన. నన్నయ మూడోపద్ధతి ననుసరించాడు. ఇందులో ఆలంకారికమైన వర్ణనం చేయబడింది. ముందుపద్యాలలో ఒక్కొక్కదానిలో క్రమంగా వాస్తవిక అలంకారిక వర్ణనపద్ధతులను నన్నయ పాటించాడు. (సంపా.)

**క. విమలాదిత్యతనూజుఁడు, । విమలవిచారుఁడు, కుమారవిద్యాధరుఁ, డు**
**త్తమచాళుక్యుఁడు, వివిధా । గమవిహితశ్రముఁడు, తుహినకరుఁ డురుకాంతిన్. 4**

**ప్రతిపదార్థం:** విమలాదిత్య, తనూజుఁడు= విమలాదిత్యుఁడు అనే చాళుక్యరాజు యొక్క (క్రీ.శ. 1011-1019) కుమారుడు; విమల, విచారుఁడు= నిర్మలమైన ఆలోచనలు కలవాడు; కుమార, విద్యాధరుఁడు= ఈ సమాసానికి నన్నయ ఊహించిన అర్థమేమో స్పష్టంగా తెలియటం లేదు. విద్యాధరులు దేవయోనివిశేషులు, గంధర్వులవంటివారు, పదమునుబట్టి వారు సంగీతాదికళలలో ప్రవీణు లని భావించవచ్చును. అందుచేత, కుమారవిద్యాధరు డంటే బాలగంధర్వాదులవలె బిరుదనామ మని తలంపవచ్చును. కుమారస్వామి దేవసేనాపతి. అస్త్రవిద్యలో ఆరితేరినవాడు. అందుచేత, అతనివిద్య అస్త్రవిద్య అనీ, దానిని ధరించినవాడు అస్త్రవిద్యలో నేర్పరి అనీ చెప్పవచ్చును. చాళుక్యులు కుమారస్వామి (స్కంద) భక్తులని ప్రతీతి. కుమారస్వామికి సంబంధించిన విద్య కుమారతంత్రం. దానిని ధరించినవాడు - అంటే అందులో నేర్పుకలవాడు - కుమారవిద్యాధరు డని చెప్పవచ్చును. మొత్తంమీద దీనికి సంగీత సాహిత్యాలలో నేర్పరి అనియో అస్త్రశస్త్రవిద్యాప్రవీణు డనియో చెప్పవలెను. ఉత్తమ, చాళుక్యుఁడు= శ్రేష్ఠుడైన చాళుక్యరాజు; వివిధ + ఆగమ, విహిత, శ్రముఁడు= పలువిధా లైన శాస్త్రాలలో (దేవపూజావిధానాలను తెల్పే పవిత్ర గ్రంథాలలో ) చేయబడిన పరిశ్రమ కలవాడు; ఉరు, కాంతిన్= అత్యంత శరీరలావణ్యం (శోభ)లో, తుహినకరుఁడు= (మంచుకిరణాలు కలవాడు) చంద్రుడు- రాజరాజనరేంద్రుడు.

**తాత్పర్యం:** విమలాదిత్యుడికి రాజరాజచోళుడి కూతు రైన కుందవాంబయందు జనించిన పుత్రుడు, నిర్మలమైన ఆలోచనలు కలవాడు, కుమారస్వామివలె అస్త్రవిద్యలో నేర్పరి, శ్రేష్ఠు డైన చాళుక్యవంశపు రాజు, అనేకశాస్త్రాలలో పరిశ్రమ చేసినవాడు, దేహకాంతిలో చంద్రుడు అయిన రాజరాజనరేంద్రుడు.

**విశేషం:** వైష్ణవ శైవ శాక్త మతాలకు సంబంధించిన పూజావిధానాలు తెలిపే గ్రంథాలకు 'ఆగమము' అని పేరు. తంత్రగ్రంథాలను, వ్యాకరణాది శాస్త్రాలను, వేదాలను కూడ 'ఆగమము' లంటారు. విహితశ్రముఁడనేపాఠానికి విజితశ్రముఁడనే పాఠాంతరం ఉన్నది. విజితశ్రము డంటే పలువిధాలైన ఆగమగ్రంథాలను చదవటంలో జయింపబడిన శ్రమకలవాడు అని అర్థం. శ్రమను లెక్కచేయకుండ పఠించినవా డని భావం. విజితశ్రము డనే పాఠంకంటె విహితశ్రము డనే పాఠమే ఉచితంగా ఉన్నది. అలం: రూపకం.

**చ. ఘనదురితానుబంధకలికాలజదోషతుషారసంహతిం**
**దన యుదయప్రభావమున దవ్వుగఁ జోపి జగజ్జనానురం**
**జన మగు రాజ్యసంతతవసంతనితాంతవిభూతి నెంతయుం**
**దనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మనిబద్ధదయార్ద్రబుద్ధి యై. 5**

**ప్రతిపదార్థం:** చళుక్య, మన్మథుఁడు= చాళుక్యరా జయిన రాజరా జనే మన్మథుడు; ఘన, దురిత + అనుబంధ, కలికాలజ, దోష తుషార, సంహతిన్= గొప్ప పాపాలతో సంబంధం కల కలికాలంలో పుట్టిన దోషా లనే మంచుసముదాయాన్ని; తన, ఉదయ, ప్రభావమునన్= తన పుట్టుక (ఉదయించటం) యొక్క మహిమచేత; దవ్వుగన్= దూరంగా; చోపి= తరిమి; జగత్,

జన+అనురంజనము+అగు= లోకంలోని జనులను రంజింపజేసే దైన; రాజ్య, వసంత, నితాంత, విభూతిన్= రాజ్య మనే నిరంతర మైన వసంతర్తువుయొక్క అధిక మైన ఐశ్వర్యంతో; ధర్మ, నిబద్ధ, దయా+ఆర్ద్ర, బుద్ధి+ఐ= ధర్మానికి కట్టుబడినట్టి (స్థిరమైనట్టి) దయతో మెత్తనైన (తడసినట్టి) బుద్ధి కలవాడై; ఎంతయున్= మిక్కిలి; తనరున్= ఒప్పారుతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** చాళుక్యవంశానికి చెందిన రాజరాజనే మన్మథుడు గొప్ప పాపాలతో సంబంధం కల కలికాలంలో పుట్టిన దోషా లనే మంచుసముదాయాన్ని తనపుట్టుకయొక్కమహిమతో దూరంగా త్రోలి, లోకంలోని జనులను ప్రీతి నొందించే రాజ్య మనే నిరంతరమైన వసంతర్తువుయొక్క దట్టమైన ఐశ్వర్యంతో ధర్మంపట్ల లగ్నమైనట్టిదీ, దయచేత మృదు వైనట్టిదీ అయిన బుద్ధికలవాడై మిక్కిలి ప్రకాశిస్తూ ఉన్నాడు.

**విశేషం:** అలం: రూపకం, వృత్త్యనుప్రాసం. రాజరాజును మన్మథుడితో పోల్చటంచేత అతడి అపారసౌందర్యం వెల్లడి ఔతున్నది. కృతత్రేతాద్వాపర కలియుగా లని యుగాలు నాలుగు. వాటిలో కలియుగం దోషాలతో కూడి ఉంటుంది. ఉత్తము డైన రాజు ఉదయిస్తే ఆదోషాలను తొలగించి ధర్మాన్ని నెలకొల్పుతాడు. ఆరుఋతువులలో చివరిది శిశిరఋతువు. అప్పుడు మంచు విస్తారంగా ఉంటుంది. తరువాత నూత్నసంవత్సరారంభంలో వసంతర్తువు వస్తుంది. అది రాగానే మంచు తగ్గిపోతుంది. ప్రకృతి సౌందర్యమయమై ఎల్లప్రాణులకు ఆనందకరంగా ఉంటుంది. అప్పుడు మన్మథుడు విజృంభిస్తాడు. అతడికీ వసంతుడికీ మిక్కిలి స్నేహం. మన్మథుడు వసంతరాజ్యానికి అధిపతి. 'రాజ్య సంతత వసంత' మన్నచోట సంతతశబ్దం సాభిప్రాయం. వసంతర్తువు రెండునెలలే ఉంటుంది. రాజ్య మావిధంగా కాకుండా నిత్య మై ఉంటుంది. ధర్మాన్ని అనుసరించేవాడు ఒకప్పుడు దయను విడిచి కఠినంగా వర్తించవలసి వస్తుంది. రాజరాజు ధర్మాన్ని పాలించినా దయను విడువలే డనే భావం - 'ధర్మనిబద్ధదయార్ద్రబుద్ధి యై' అనే విశేషణంవలన వ్యక్తమౌతున్నది.

'తుషారసంహతిన్ దవ్వుగఁజోపి', 'ఉదయప్రభావము', 'వసంతవిభూతి' అనే పదాలు రాజరాజునందు సూర్యత్వాన్ని కూడ స్ఫురింప జేస్తున్నవి. అప్పుడు చళుక్యభాస్కరుడు అనికూడ అనవచ్చును. రాజరాజునందు మన్మథత్వం, కలికాలదోషాల యందు తుషారసంహతిత్వం, రాజ్యమునందు వసంతత్వం ఆరోపించబడినవి. ఇచ్చట రూపకం సావయవంగానే ఉన్నది కాని అప్పుడు చివరి విశేషణానికి అప్రసిద్ధమైన అర్థం చెప్పుకోవలసి వస్తుంది. ధర్మమంటే ధనుస్సనే అర్థం కూడ ఉన్నది. వసంతంలో మన్మథుడు విల్లెక్కుపెట్టినా దయమాలి క్రూరంగా వర్తించలే దని ఊహించాలి. కృతిపతిని పుణ్యాత్ముడిగా వర్ణించిన కవితామయ మైన పద్యమిది. దీర్ఘాక్షరబహుళ మైన తత్సమపదాలప్రయోగాన్నీ, బిందుపూర్వక పరుషాక్షర పునఃప్రయోగాన్నీ చేసి ఔన్నత్యాన్నీ మాధుర్యాన్నీ అక్షరరమ్యతతో పోషించాడు నన్నయ.

**ఉ. ఆశ్రితపోషణంబున, ననంతవిలాసమునన్, మనీషివి**
**ద్యాశ్రమతత్త్వవిత్త్వమున, దానగుణాభిరతిన్, సమస్తవ**
**ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్, మహి నొప్పు సర్వలో**
**కాశ్రయుఁ, డాదిరాజనిభుఁ, డత్యకలంకచరిత్రసంపదన్. 6**

**ప్రతిపదార్థం:** సర్వ, లోక+ఆశ్రయుఁడు= ఇది చాళుక్య రాజులకు కులక్రమాగతమైన బిరుదం; (ఎల్లజనులకును అండ అయినవాడని అర్థం); అతి+అకలంక, చరిత్ర, సంపదన్= మిక్కిలి నిర్మలమైన శీల మనెడి సంపదయందు; అది, రాజ, నిభుఁడు= తొల్లింటి రాజులైన మను, నల, నహుషాదులతో సమానుడైన రాజరాజనరేంద్రుడు; ఆశ్రిత, పోషణంబునన్= తనను ఆశ్రయించినవారిని పోషించటంచేతను; అనంత, విలాసమునన్= అధికమైన విలాసం చేతను; మనీషి విద్యా, శ్రమ, తత్త్వ, విత్త్వమునన్= పండితుల విద్యలందలి పరిశ్రమయొక్క సత్యస్వరూపాన్ని తెలిసికొనటంచేతను, (విత్+త్వము=విత్త్వము);

దాన, గుణ+అభిరతిన్=దానమనే గుణమునందలి ఆసక్తిచేతను; సమస్త, వర్ణ+ఆశ్రమ, ధర్మ, రక్షణ, మహత్, మహిమన్= అన్ని వర్ణాల యొక్కయు, ఆశ్రమాల యొక్కయు, ధర్మాలను రక్షించటంలో గొప్పమహత్త్వంచేతను, మహిన్=భూమియందు; ఒప్పున్= ప్రకాశిస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** 'సర్వలోకాశ్రయు' డనే కులక్రమాగతబిరుదంతో కూడినవాడున్నూ, మిక్కిలి నిర్మలమైన శీలసంపదలో మనువు, నలుడు, నహుషుడు మొదలైన పూర్వపురాజులతో సమానుడున్నూ అయిన రాజరాజు తన నాశ్రయించిన వారిని రక్షించటంచేతను, అధికమైన విలాసంచేతను, పండితుల విద్యలయందలి పరిశ్రమయొక్క యాథార్థ్యాన్ని తెలిసికొనటంచేతను, దానగుణంలోని ఆసక్తిచేతను, అన్ని వర్ణాల ఆశ్రమాల విధ్యుక్తధర్మాలను రక్షించటంలోని గొప్పమహిమచేతను, భూమియందు ప్రకాశిస్తూ ఉన్నాడు. పైన పేర్కొనబడిన గుణాలన్నింటిలో పూర్వరాజులతో సమాను డై రాజరాజు భూమియందు ప్రకాశిస్తా డనికూడ చెప్పవచ్చును.

**విశేషం:** బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య, శూద్ర వర్ణాలు నాలుగు. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసా లనే ఆశ్రమాలు నాలుగు. ఆ యా వర్ణాలకూ, ఆశ్రమాలకూ ఉచితా లైన ధర్మాలు స్మృతులలో చెప్పబడినవి. ఆ ధర్మాలను రక్షించటం యోగ్యుడైన రాజువిధి. మనువు, నలుడు, నృగుడు, నహుషుడు, రంతిదేవుడు, భగీరథుడు, రాముడు మొదలైనవారు ఆదర్శప్రాయు లైన తొల్లిటిరాజులు. రాజరాజు వారితో సమానుడు.

**సీ.** **నిజమహీమండలప్రజఁబ్రీతిఁ బెంచుచుఁ, । బరమండలంబుల ధరణిపతుల**
**నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును, । బలిమి నీయని భూమివలయపతుల**
**నుక్కడఁగించుచు, దిక్కులఁ దనయాజ్ఞ । వెలిఁగించుచును, విప్రకులము నెల్లఁ**
**బ్రోచుచు, శర ణన్నఁ గాచుచు భీతుల, । నగ్రజన్ములకు ననుగ్రహమునఁ**

**ఆ.** **జారుతరమహాగ్రహారంబు లిచ్చుచు, । దేవభోగముల మహావిభూతిఁ**
**దనరఁజేయు, చిట్లు మనుమార్గుఁ డగు విష్ణు । వర్ధనుండు వంశవర్ధనుండు.** **7**

**ప్రతిపదార్థం:** నిజ, మహీ, మండల, ప్రజన్= తన భూచక్రంలోని జనులను; ప్రీతిన్= ప్రేమతో; పెంచుచున్= వృద్ధి పొందిస్తూ; పర, మండలంబుల, ధరణిపతులన్= ఇతర (శత్రు) రాజ్యాలలో ఉన్న రాజులను, అదిమి= అణచి; కప్పంబులన్= ధనాలను; ముదముతోన్= సంతోషంతో; కొనుచును= గ్రహిస్తూ; బలిమిన్= బలంచేత; ఈయని= కప్పాలను ఈయని; భూమి, వలయపతులన్= భూమండలాల రాజులను; ఉక్కు+అడఁగించుచున్= గర్వ మడగగొట్టుతూ; దిక్కులన్= అన్ని దిక్కులలోను; తన, ఆజ్ఞ= తన ఆనతి; వెలిఁగించుచును= ప్రకాశింపచేస్తూ; విప్రకులమున్ + ఎల్లన్= బ్రాహ్మణ సమూహాల నెల్ల; ప్రోచుచున్= రక్షిస్తూ; శరణు+అన్నన్=రక్షింపు మని శరణాగతి చేస్తే; భీతులన్=భయపడినవారిని; కాచుచున్= రక్షిస్తూ; అగ్ర, జన్ములకున్= బ్రాహ్మణులకు; అనుగ్రహమునన్= దయతో; చారుతర, మహత్, అగ్రహారంబులు= మిక్కిలి అందమైన అగ్రహారాలను (బ్రాహ్మణులకు రాజులు దానాలుగా ఇచ్చే గ్రామాలు); ఇచ్చుచున్= ఇస్తూ; దేవ, భోగములన్= దేవాలయాలలోని దైవతాలకు చేసే ధూప దీప నైవేద్యాదులను, ఉత్సవాలను; మహత్, విభూతిన్=గొప్ప వైభవంతో; తనరన్, చేయుచున్=ఒప్పునట్లుగా చేస్తూ, కొనసాగిస్తూ; ఇట్లు= పైన పేర్కొనబడిన విధంగా; వంశ, వర్ధనుండు= వంశాన్ని వృద్ధి పొందించేవాడున్నూ; మను, మార్గుఁడు+అగు= సూర్యవంశ రాజులలో మొదటివాడూ, ఆదర్శప్రాయుడూ అయిన మనువు అనుసరించిన పరిపాలనక్రమం కలవాడున్నూ అయిన; విష్ణువర్ధనుండు= రాజరాజనరేంద్రుడు (మీది వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** తన రాజ్యభూభాగంలోని జనులను ప్రేమతో వృద్ధిపొందిస్తూ, ఇతరరాజ్యాలను ఏలే రాజులను అణచి సామంతరాజు లిచ్చే ధనరూపమైన పన్నులను సంతోషంతో గ్రహిస్తూ, బలగర్వంచేత కప్పాలను ఈయ నిరాకరించిన భూమండలాధిపతుల (రాజుల) గర్వ మడగిస్తూ, అన్ని దిక్కులలోనూ తన ఆజ్ఞను సాగేటట్లు చేస్తూ, బ్రాహ్మణసమూహా న్నెల్లా రక్షిస్తూ, భయంతో శరణాగతు లైతే అట్టివారిని కాపాడుతూ, భూసురులకు దయతో అందమైన అగ్రహారాల నిస్తూ, దైవాలకు జరుగవలసిన ధూపదీప నైవేద్యోత్సవాది కైంకర్యాలను గొప్పవైభవంతో కొనసాగిస్తూ, ఈవిధంగా వంశాన్ని పెంపొందించేవాడూ, పూర్వం మనువు అనుసరించిన మార్గాన్ని అనుసరించేవాడూ అయిన రాజరాజ నరేంద్రుడు.

**విశేషం:** రాజరాజుపరిపాలనవిధానం ఈపద్యంలో వర్ణింపబడింది. అతని ఆజ్ఞ అన్నిదిక్కులలో అప్రతిహతంగా చెల్లుతూ ఉన్నది. అతడు దేవబ్రాహ్మణులయందు భక్తి కలిగి ఉన్నాడు. వేదవేత్తలైన బ్రాహ్మణులు విప్రులు. విష్ణువర్ధన నామం చాళుక్యరాజులలో చాలమందికి ఉన్నది. అది ఒక బిరుదు వంటిది. విష్ణుశర్మ అనే బ్రాహ్మణుడు తొల్తటి చాళుక్యరాజుకుమారుడిని రక్షించటంచేత కృతజ్ఞతాపూర్వకంగా ఆ వంశపురాజులు విష్ణువర్ధననామాన్ని వహించా రని చెప్పుతారు.

ఇది నన్నయ రచించిన మొదటి సీసపద్యం. అతడు సీసపద్యాలలో కొన్ని ప్రత్యేక నియమాలు పాటించాడు. ఇందులో పండ్రెండుచోట్ల ప్రాసయతియే పాటింపబడింది. దీనిని 'సర్వప్రాససీసం' అంటారు.

ఇచ్చు ధాతువుకు కొన్నిచోట్ల ఈ అనేఆదేశం వస్తుంది. ఈ+ము అనునదే ఇమ్ము అయింది. ఇండు అనే రూపం కూడా ఇట్లా ఏర్పడిందే. వ్యతిరేకార్థక రూపాలలో కూడ ఈ వస్తుంది. ఈని=ఈయని; చిన్నయసూరి ఈయ రూపాన్ని కూడ అంగీకరించి పై నన్నయప్రయోగాన్నే ఇచ్చాడు. నన్నయకూడ ఈయ అనే రూపాన్ని మరెచ్చటనూ వాడి ఉండలేదు. (ఈయ అనేదే ఇయ్య రూపాన్ని పొందుతుంది.)

**వ. అఖిలజలధివేలావలయవలయితవసుమతీవనితావిభూషణం బైన వేంగీదేశంబునకు నాయక రత్నంబునుం బోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబున ననవరత మహామహీ రాజ్యసుఖంబు లనుభవించుచు, సకలభువనలక్ష్మీవిలాసనివాసం బయిన రమ్యహర్మ్యతలంబున మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధాన సామంత విలాసినీపరివృతుం డయి యపారశబ్దశాస్త్రపారగులైన వైయాకరణులును, భారత రామాయణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులును, మృదుమధుర రసభావభాసుర నవార్థవచనరచనా విశారదు లయిన మహాకవులును, వివిధతర్కవిగాహిత సమస్త శాస్త్రసాగరగరీయఃప్రతిభు లైన తార్కికులును నాదిగాఁ గలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలుచుచుండ విద్యావిలాసగోష్ఠీసుఖోపవిష్టుం డయి యిష్టకథావినోదంబుల నుండి యొక్కనాఁడు. 8**

**ప్రతిపదార్థం:** అఖిల, జలధి, వేలా, వలయ, వలయిత వసుమతీ, వనితా, విభూషణంబు + ఐన= సమస్త సముద్రాల గుండ్రని చెలియలికట్టలచేత చుట్టబడిన భూమిఅనేస్త్రీకి అలంకార మైన; వేంగీ, దేశంబునకున్= పూర్వం తూర్పుచాళుక్యులు పరిపాలించిన వేంగీదేశానికి; నాయకరత్నంబునున్+పోని= హారాన నడుమన ఉండే పతకాన మధ్య ఉండే రత్నాన్ని పోలిన (శ్రేష్ఠమైన పట్టణమని అర్థం); రాజమహేంద్రపురంబునందున్; మహేంద్ర, మహిమతోన్= ఇంద్రునియొక్క మహిమ (మహత్త్వం) వంటి మహిమతో; పరమ+ఆనందంబునన్= అధికమైన సంతోషంతో; అనవరత, మహత్, మహీ, రాజ్య, సుఖంబులు= ఎడతెగని గొప్ప భూరాజ్యమువలని సౌఖ్యాలు; అనుభవించుచున్= పొందుతూ; సకల, భువన, లక్ష్మీ, విలాస, నివాసంబు+అయిన=

సర్వలోకాలలోని లక్ష్మి(సంపద)యొక్క విలాసానికి(లీలకు) నెలవైన; రమ్య, హర్మ్య, తలంబునన్= సుందరమైన సౌధప్రదేశంలో; మంత్రి, పురోహిత, సేనాపతి, దండనాయక, దౌవారిక, మహత్+ప్రధాన, సామంత, విలాసినీ, పరివృతుండు+అయి= మంత్రులచేతను, పురోహితులచేతను, సేనానాయకులచేతను, దండనాథులచేతను (వీరుకూడ సేనాపతులే కాని సేనానాయకుల క్రిందిహోదావారు), ద్వారపాలకులచేతను, మహా(ముఖ్య)మంత్రులచేతను, సామంతు లనబడే కప్పముకట్టే రాజులచేతను, సుందరులచేతను, చుట్టబడినవాడై; అపార, శబ్దశాస్త్ర, పారగులు+ఐన= అంతం లేని వ్యాకరణశాస్త్రాన్ని తుదిముట్ట చదివినవారైన (పారగులు= అవ్వలిఒడ్డుచేరినవారు); వైయాకరణులును= వ్యాకరణపండితులును; భారత, రామాయణ+ఆది+అనేకపురాణ ప్రవీణులు+ఐన= భారతం, రామాయణం మొదలైన పెక్కు పురాణాలయందు నేర్పరులైన; పౌరాణికులును= పురాణంచెప్పే పండితులును; మృదు, మధుర, రస, భావ, భాసుర, నవ+అర్థ, వచన, రచనా, విశారదులు+అయిన= లలితాలూ, తియ్యనివీ అయిన శృంగారాది రసభావాలతో ప్రకాశించేవీ, క్రొత్త అర్థాలు కలిగినవీ అయిన వాక్యాల నిర్మాణంలో నిపుణు లయిన; (వచనశబ్దం ఇప్పుడు 'గద్యము' అనే అర్థంలో వాడబడుతున్నది. దానికి వాక్కు, వాక్యం అనే అర్థాలుకూడా ఉన్నవి. అది పద్యమయంకాని, గద్యమయంకాని కావచ్చును); మహత్+కవులును= గొప్పకవులును; వివిధ, తర్క, విగాహిత, సమస్త, శాస్త్ర, సాగర, గరీయః, ప్రతిభులు+ఐన= పలువిధా లైన తర్కాలలో (చర్చాగోష్ఠులలో) మునిగిన(నిమగ్నమైన), సర్వశాస్త్రా లనెడి సముద్రాలు కల, మిక్కిలి అధిక మైన ప్రజ్ఞ కలవారైన; తార్కికులును= తర్కశాస్త్రపండితులును; ఆదిగాన్, కలుగు= మొదలుగాకల; విద్వత్+జనంబులు= పండితజనులు; పరివేష్టించి= బలసి (చుట్టునుకూడి); కొలుచుచుండన్= సేవిస్తూ ఉండగా; విద్యా, విలాస, గోష్ఠీ సుఖ+ఉపవిష్టుండు+అయి= విద్యలకు సంబంధించిన లీలతోకూడిన (సంతోషకరమైన) చర్చలతో సుఖంగా కూర్చుండి; ఇష్ట కథా, వినోదంబులన్= ప్రియములైన కథలతోనూ, వేడుకలతోనూ; ఉండి; ఒక్కనాఁడు= ఒకరోజున

**తాత్పర్యం:** నాలుగుసముద్రాల గుండ్రనిచెలియలికట్టలచేత చుట్టబడిన భూమి అనెడి స్త్రీకి అలంకారమైన, తూర్పుచాళుక్యులు పాలించే వేంగీదేశానికి- హారానికి నడుమనుండే నాయకమణిని పోలిన (వేంగీదేశానికి ముఖ్యపట్టణమైన) రాజమహేంద్రనగరంలో ఇంద్రుడివైభవంవంటి వైభవంతో అధికమైనసంతోషంతో ఎడతెగని గొప్పభూరాజ్యంవలన కలిగే సుఖాలు అనుభవిస్తూ, సర్వలోకాలలోని సంపదయొక్క విలాసానికి స్థాన మైన, సుందరమైన సౌధప్రదేశంలో మంత్రులు, పురోహితులు, సేనానాయకులు, ద్వారపాలకులు, మహామంత్రులు, సామంతరాజులు, సుందరాంగులు చుట్టూ కొలువుదీరి కూర్చుండిఉండగా, అంతంలేని వ్యాకరణశాస్త్రాన్ని తుదిముట్ట అభ్యసించిన వ్యాకరణపండితులున్నూ, భారతం, రామాయణం మున్నగు పెక్కుపురాణాలను ప్రవచించటంలో నేర్పరులైన పురాణపండితులున్నూ, లలితములును, తియ్యనివియును, శృంగారాది రసాలతోను, భావాలతోను ప్రకాశించే క్రొత్తఅర్థాలు కలిగినట్టివి అయిన వాక్యాలను రచించటంలో నిపుణులైన గొప్పకవులున్నూ, పలువిధాలైన తర్కశాస్త్రశాఖల సాహాయ్యంతో ప్రవేశించబడిన సర్వశాస్త్రాలనెడి సముద్రాలు కల అధిక ప్రజ్ఞావంతులైన తర్కశాస్త్రపండితులున్నూ, మొదలుగాగల పండితజనులు చుట్టూ చేరి సేవిస్తూ ఉండగా, విద్యలకు సంబంధించిన లీలలతో కూడిన చర్చలతో (చర్చలు వింటూ) సుఖంగా కూర్చుండి ప్రియము లైన కథలతోను, వినోదాలతోను ఉండి ఒక్కనాడు.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ. రాజమహేంద్రనగరం వేంగీదేశానికి రాజధాని. అందలి సుందరహర్మ్యం సర్వలోకసంపదలతో విరాజిల్లుతూ ఉన్నది. మంత్రిపురోహితాదులు రాజోద్యోగులు. రాజరాజనరేంద్రుడిసభలో గొప్పవ్యాకరణపండితులూ, పురాణప్రవచనం చేసేవారూ, మహాకవులూ, తర్కశాస్త్రసాహాయ్యంతో సర్వశాస్త్రాలను అవగాహనచేసికొని మహాపండితు లైన విద్వాంసులూ ఉన్నారు. ఇందులో పేర్కొనబడిన మహాకవులు సంస్కృతభాషాకవులై ఉంటారు. తెలుగుకవులుకూడ ఉండవచ్చును.

వారు మృదుమధురాలు, నూత్నార్థశోభితాలు అయిన వాక్కులు పల్కటంలో నేర్పరులు. రాజరాజనరేంద్రు డప్పుడప్పుడు వివిధరాజోద్యోగులతోనూ, కవిపండితులతోనూ నిండు కొలువుండి విద్యాగోష్ఠులతో వినోదిస్తూ ఉండేవా డని తెలుస్తున్నది. అతడు కావ్యగీతప్రియుడుకదా! విద్యావిలాసగోష్ఠి- అనే సమాసానికి విద్యకు సంబంధించిన, కళలకు సంబంధించిన చర్చాగోష్ఠి(సమావేశం, సదస్సు)అనే అర్థంకూడా చెప్పవచ్చును. రాజసభలో మంత్రిసామంతులతోపాటు ఉన్నవారు విలాసినులు. విలాసినులు అంటే వేశ్య లనే అర్థం కంటె కళాకోవిదలనే అర్థం చెప్పటం సమంజసం. దేశంలోని విద్యలను, కళలనుగురించి, వాటిని పెంపొందించే అంశాలనుగురించి ఇష్టాగోష్ఠిగా చర్చించిన సభ అది. దానికి అధ్యక్షుడు రాజరాజనరేంద్రుడు. ఆ సభలో తీసికొన్న నిర్ణయాలను అమలుజరిపించేవాడు రాజు. ఆ గోష్ఠి కొన్నాళ్లు సాగింది. ఒకనాడు రాజు నన్నయను పిలిచి భారతం వ్రాయుమని కోరాడు. ఈవచనానికీ తరువాతిపద్యానికీ నడుమనున్న కథ సారమతులు లోనారసి భావించతగింది. విద్యావిషయంలో భాగంగా ఆంధ్రమహాభారత రచన జరగాలని సభ నిర్ణయించిఉంటుంది. ఆ రచన చేయగల దక్షుడు నన్నయయే అని తీర్మానించి ఉంటుంది. దానికి తగిన అర్హత లన్నీ ఉన్నవాడతడే అని వివేచించి ఉంటుంది. రాజరాజసంకల్పం, విద్వత్సభా నిర్ణయం ఏకవాక్యత పొందటంచేత నిండుసభలో నన్నయను రాజు స్వయంగా కోరాడు. భారతాన్ని తెలుగులో నిర్మించటం కష్టసాధ్యమైన పని అయినా రాజరాజనరేంద్రుడి అనుమతం వలనా, విద్వత్సభ అనుగ్రహం వలనా దానిని సాధిస్తానని నన్నయ అంగీకరించాడు. కథను పూర్తిగా చెప్పకుండా ధ్వనిమయం చేయటం నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తిలో ఒక శిల్పం.

**సీ. తనకులబ్రాహ్మణు, ననురక్తు, నవిరళ । జపహోమతత్పరు, విపులశబ్ద**
**శాసను, సంహితాభ్యాసు, బ్రహ్మాండాది । నానాపురాణవిజ్ఞాననిరతుఁ,**
**బాత్రు, నాపస్తంబసూత్రు, ముద్గలగోత్ర । జాతు, సద్వినుతావదాతచరితు**
**లోకజ్ఞు, నుభయభాషాకావ్యరచనాభి । శోభితు, సత్ప్రతిభాభియోగ్యు,**

**ఆ. నిత్యసత్యవచను, మత్యమరాధిపా । చార్యు, సుజను నన్నపార్యుఁ జూచి**
**పరమధర్మవిదుఁడు, వరచళుక్యాన్వయా । భరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ.** 9

**ప్రతిపదార్థం:** తన= తనయొక్క; కుల, బ్రాహ్మణున్= వంశపారంపర్యంగా వస్తున్న బ్రాహ్మణుడిని; అనురక్తున్= అనురాగంకలవాడిని; అవిరళ, జప, హోమ, తత్పరున్= నిరంతరం జపం చేయటంలోనూ, అగ్నియందు హవిస్సును వేల్చటం లోనూ, ఆసక్తుడైనవాడిని; విపులశబ్ద, శాసనున్= విస్తృతంగా శబ్దాలస్వరూపాన్ని నిరూపించినవాడిని; సంహితా+అభ్యాసున్=వేదంలోని మంత్రభాగం (వేదము) యొక్క అధ్యయనం కలవాడిని; బ్రహ్మాండ+అది, నానా, పురాణ, విజ్ఞాన, నిరతున్= బ్రహ్మాండ పురాణం (అష్టాదశపురాణాలలో ఇది ఒకటి) మొదలైన పలుపురాణాలలోని విశేషమైన జ్ఞానమునందు ప్రీతికలవాడిని; పాత్రున్= అర్హుడిని; ఆపస్తంబసూత్రున్= ఆపస్తంబమహర్షి రచించిన సూత్రాలలోని ధర్మాలను అనుసరించేవాడిని (ఇతరమహర్షులు రచించిన సూత్రాలుకూడ ఉన్నవి); ముద్గల, గోత్ర, జాతున్= ముద్గలమహర్షి మూలంగా గల గోత్రంలో పుట్టినవాడిని; సత్, వినుత+అవదాత, చరితున్= పండితులచేత (సజ్జనులచేత) నుతింపబడిన నిర్మలమైన వర్తనం కలవాడిని; లోక జ్ఞున్= లోకవ్యవహారం తెలిసినవాడిని; ఉభయ, భాషా, కావ్య, రచనా+అభిశోభితున్= సంస్కృతాంధ్రా లనే రెండుభాషలలోనూ కావ్యాలను రచించటంచేత ప్రకాశించేవాడిని; సత్, ప్రతిభా+అభియోగ్యున్= మంచి ప్రతిభతో (నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞతో) కూడినవాడిని (గొప్ప ప్రతిభాపాండిత్యాలు కలవాడిని); నిత్య, సత్య, వచనున్= ఎల్లప్పుడూ సత్యంతో కూడిన వాక్కు కలవాడిని, (ఎప్పుడూ సత్యమే పలుకువాడిని); మతి+ అమరాధిప+ ఆచార్యున్= బుద్ధిలో ఇంద్రునిగురు వైన బృహస్పతివంటి వాడిని; సుజనున్= మంచివాడిని; నన్నప+ఆర్యున్= పూజ్యుడైన నన్నయభట్టును; చూచి; పరమ, ధర్మ, విదుఁడు= ఉత్తమమైన ధర్మాన్ని తెలిసినవాడు (గొప్పధర్మవేత్త); వర, చళుక్య+అన్వయ+ఆభరణుఁడు= శ్రేష్ఠమైన చాళుక్యవంశానికి అలంకారమైన రాజరాజనరేంద్రుడు; కరుణతోడన్= దయతో; ఇట్టులు= క్రింద చెప్పబడేవిధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** తనవంశంలో తండ్రితాతలనుండి పారంపర్యంగా వస్తున్న బ్రాహ్మణుడున్నూ, తనయందు ప్రీతికలవాడున్నూ, నిరంతరం జపహోమాలు చేయటంలో ఆసక్తికలవాడున్నూ, విస్తృతంగానూ విశదంగానూ శబ్దాలస్వరూపాన్ని నిర్ధారణ చేసినవాడున్నూ, వేదమంత్రభాగాన్ని అధ్యయనం చేసినవాడున్నూ, బ్రహ్మాండపురాణం మొదలైన అనేకపురాణాలలోని విజ్ఞానంపట్ల ఆసక్తికలవాడున్నూ, అర్హుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ, ముద్గలమునిగోత్రంలో పుట్టినవాడున్నూ, సుజనులచేతనూ పండితులచేతనూ నుతింపబడిన నిర్మలమైన శీలం కలవాడున్నూ, లోకజ్ఞత కలవాడున్నూ, ఎల్లప్పుడు సత్యమే పలికేవాడున్నూ, బుద్ధిలో బృహస్పతివంటివాడున్నూ, సజ్జనుడున్నూ అయిన నన్నయభట్టును చూచి పరమధర్మవేత్తా, శ్రేష్ఠమైన చాళుక్యవంశానికి అలంకార మైనవాడూ అయిన రాజరాజనరేంద్రుడు దయతో ఈవిధంగా పలికాడు.

**విశేషం:** ఆంధ్రమహాభారతంలో నన్నయనుగురించి ఏకొంచెమైనా తెల్పేపద్యం ఇది ఒక్కటే. ఇందులో అతడి గుణగణాలూ ప్రతిభాపాండిత్యాలూ సంగ్రహంగా చెప్పబడినవి. కులవిప్రు డంటే పురోహితు డని అర్థం ఉన్నది. కాని, నన్నయ వట్టి పురోహితుడు కాడు. చాళుక్యుల పంచామాత్యులలో కులబ్రాహ్మణుడు కూడ ఒకడు. నన్నయ అట్టి కులబ్రాహ్మణుడు. రాజరాజూ, నన్నయభట్టూ, కొంచెం ఇంచుమించుగా సమవయస్కులు, మిత్రులు అయిఉంటారు. అనురక్త పదం వారికి ఒండొరులయెడ కల అనురాగాన్ని సూచిస్తున్నది. నన్నయ సంహితాభ్యాసుడు. సంహిత అంటే వేదంలోని మంత్రభాగం. ఇచ్చట సామాన్యంగా వేదమంతా అధ్యయనం చేసినవా డని చెప్పుకోవలెను. సంహితాపదం ధర్మశాస్త్రాదులందుకూడ వర్తిస్తుంది. మనుధర్మశాస్త్రాన్ని మనుసంహిత అనికూడ అంటారు. అతడు నిత్యజపహోమాది వైదికకర్మలందు ఆసక్తి కలవాడు. కవినామగోత్రాదికథనం అవతారికలో ఒక ప్రధానాంగం.

నన్నయకు పూర్వం తెలుగుభాషకు విస్తృతి కాని, స్థిరమైనరూపం కాని లేదు. అది ఒక్కొక్కప్రాంతంలో ఒక్కొక్కవిధంగా ఉండేది. విభక్తిప్రత్యయాలు అన్నీ లేవు. అవ్యవస్థితంగా ఉన్న అట్టిభాషకు స్థిరమైనరూపాన్ని ఇచ్చి, సంస్కృతపదాలను తత్సమాలుగా తెలుగులో వాడటానికి తగిన ప్రణాళిక ఏర్పరచి, దానిని కావ్యరచనకు తగినదానినిగా చేశాడు. అతడు ఆంధ్రశబ్దచింతామణి అనే వ్యాకరణాన్ని రచించలేదని కొందరు అంటారు. అయినా, అతడు పైవిధంగా తెలుగుభాషకు కలిగించిన అభివృద్ధియే అతడిని విపులశబ్దశాసన నామానికి అర్హుడిగా చేసింది. పురాణాలు పదునెనిమిది. సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరాలు, వంశానుచరితం అనే పంచలక్షణాలు కలవి పురాణాలు. బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, భాగవత, నారద, మార్కండేయ, అగ్ని, భవిష్యత్, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, స్కంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండా లనేవి పురాణాలపేర్లు. ఈ పురాణాలన్నింటిని నన్నయ చదివి అనేకవిధాలైన విజ్ఞానాన్ని సంపాదించాడు. పాత్రశబ్దంచేత అతడికి కావ్యరచనలోనే కాక వివిధవిషయాలలోకూడ ఉన్న అర్హత సూచించబడుతున్నది. అతడు నిర్మలశీలం, సౌజన్యం కలవాడు. అతడికి లోకజ్ఞత తప్పక ఉండాలి. నన్నయ సంస్కృతభాషలో రచించిన కావ్య మేదీ లభించటంలేదు. అతడు భారతారంభాన మంగళశ్లోకాన్ని సంస్కృతంలోనే రచించాడు. రాజరాజు నారాయణభట్టుకు నందమపూడిగ్రామాన్ని అగ్రహారంగా ఇచ్చాడు. ఆశాసనకావ్యాన్ని నన్నయయే రచించాడు. అది సంస్కృతంలో ఉన్నది. ఆంధ్రశబ్దచింతామణికర్త అతడే అయినా, కాకపోయినా అతడి సంస్కృతకావ్యరచనాకౌశలానికి పైరెండే చాలును. చింతామణి శాస్త్రమే కాని కావ్యం కాదు. నన్నయ నిత్యసత్యవ్రతుడు, బుద్ధివైభవంలో దేవగురువైన బృహస్పతిని పోలినవాడు. నన్నయ అనేశబ్దంచివర 'అయ్య' అనేపద మున్నది. అయ్యకు బదులు అప్ప అనికూడ వాడచ్చును. దానికి రూపాంతరం అప.

ఇది సర్వప్రాససీసం- (పన్నెండుచోట్ల ప్రాసయతియే పాటింపబడినది). ఈసీసంలో మహాకవికి ఉండవలసిన లక్షణా లన్నీ తెల్పబడినవి. నన్నయ ఋషితుల్యుడు. నాఽనృషిః కురుతే కావ్య మ్మనే సూక్తి ఉన్నది. అట్టి ఋషితుల్యుడు కానివాడు

పంచమవేదమైన భారతాన్ని రచించటానికి అర్హుడు కాడు. నన్నయ ఈపద్యాన్ని ప్రథమపురుషలోరచించి ఒక క్రొత్తఒరవడి పెట్టాడు. ఇది అతడి వినయగుణాన్ని వ్యక్తీకరిస్తుంది.

**చ. విమలమతిం బురాణములు వింటి ననేకము, లర్థధర్మశా**
**స్త్రములతెఱం గెఱింగితి, నుదాత్తరసాన్వితకావ్యనాటక**
**క్రమములు పెక్కుసూచితి, జగత్పరిపూజ్యము లైన యీశ్వరా**
**గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్. 10**

**ప్రతిపదార్థం:** విమల, మతిన్= నిర్మలమైన మనస్సుతో; అనేకములు= పెక్కు; పురాణములు= బ్రహ్మాండాది పురాణాలు; వింటిన్; అర్థ, ధర్మ, శాస్త్రముల, తెఱంగు= కౌటిల్యాదులు రచించిన అర్థశాస్త్రాల, మన్వాదులు రచించిన ధర్మశాస్త్రాల విధం; ఎఱింగితిన్= తెలిసికొంటిని; ఉదాత్త, రస+అన్విత, కావ్య, నాటక, క్రమములు= గొప్పవీ, రసంతో కూడుకొన్నవీ అయిన కావ్యనాటకాల రీతులు; పెక్కు= అనేకం; చూచితిన్= తిలకించాను; జగత్, పరిపూజ్యములు+ఐన= లోకంచేత పూజింపదగినవైన; ఈశ్వర+ఆగమముల+అందున్= శివుడిని పూజించే విధానాలు తెల్పే గ్రంథాలయందు; ప్రకాశముగాన్= ప్రసిద్ధంగా; హృదయంబు= చిత్తం; భక్తితోన్ = శ్రద్ధతో; నిల్పితిన్= ఉంచితిని (చదవితిని).

**తాత్పర్యం:** నిర్మలమైన మనస్సుతో పెక్కుపురాణాలు విన్నాను. అర్థశాస్త్రాల ధర్మశాస్త్రాల పద్ధతిని తెలిసికొన్నాను. ప్రౌఢాలు, రసభరితాలు అయిన రఘువంశాది కావ్యాలయొక్కయు, శాకుంతలాది నాటకాలయొక్కయు తీరులు అనేకం చవిచూచాను. లోకానికి మిక్కిలి పూజనీయా లైన శైవాగమశాస్త్రాలయందు ప్రసిద్ధంగా చిత్తాన్ని భక్తితో స్థిరంగా ఉంచాను.

**విశేషం:** ఈపద్యం రాజరాజు విజ్ఞాన వివేకాలను తెలుపుతున్నది. అతడు పౌరాణికులు చదివి వినిపిస్తూ ఉంటే పెక్కుపురాణాలు విన్నాడు. రాజులు అర్థధర్మశాస్త్రాలను తప్పక చదవాలి. అర్థశాస్త్రం దేశఆర్థికస్థితిగతులను పెంపొందించటానికి తోడుపడేది. ధర్మశాస్త్రం ధర్మాలకు, ఆచారవ్యవహారాలకు సంబంధించింది. రాజరాజుకు పూర్వం తెలుగులో కావ్యాలు కాని, నాటకాలు కాని లేవు. అతడు తమిళ కన్నడ భాషలలోని కావ్యాలను (విక్రమార్జునవిజయాదులు కన్నడకావ్యాలు. పెరిందేవనారు రచించిన భారతాదులు తమిళకావ్యాలు) సంస్కృతంలోని కావ్యనాటకాలూ చదవి ఆనందించి ఉంటాడు. రాజరాజు శివభక్తుడు; అందుచేత శివపూజావిధానాలను తెలిపే శాస్త్రాలను శ్రద్ధతో చదవిఉంటాడు. శివశక్తివిష్ణుపూజాక్రమాలను వివరించే ఆగమగ్రంథాలు పెక్కు ఉన్నాయి. "ఆగతం పంచవక్త్రాత్తు, గతం చ గిరిజాననే, మతం చ వాసుదేవస్య, తస్మా దాగమ ముచ్యతే'- శబ్దకల్పద్రుమము. శివముఖంనుండి వచ్చి, పార్వతిముఖం చొచ్చి, విష్ణువుకు ఇష్టం కావటంచేత ఆగమానికి ఆపేరు వచ్చింది. కావ్యార్థసూచన మనే ప్రస్తావనాంగం ఇందులో ఉన్నది.

**వ. అయినను నాకు ననవరతంబును శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు పెద్ద యై యుండు. 11**

**ప్రతిపదార్థం:** అయినను= శాస్త్రకావ్యనాటకాగమాదులను పఠించినా; నాకున్ = రాజరాజనరేంద్రుడికి అని భావం; అనవరతంబును= ఎల్లప్పుడున్నూ; శ్రీ, మహత్, భారతంబునందలి= శోభాయుక్తమైన వ్యాసరచిత మహాభారతంలోని; అభిప్రాయంబు= భావం, తాత్పర్యం, తత్త్వం; పెద్ద+ఐ= అధికమై; ఉండున్= ఉంటుంది.

**తాత్పర్యం:** శాస్త్రకావ్యనాటకాగమాదులను చదివినప్పటికీ నాకు శ్రీమత్ మహాభారతంలోని తాత్పర్యం, తత్త్వమే వాటిన్నింటికంటె గొప్పదిగా అనిపిస్తుంది.

**విశేషం:** 'అయినను నాహృదయంబును ననవరతంబును శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయైయుండు' - అని కొన్ని ప్రతులలో కనపడుతున్నది. అంటే- నే నర్థధర్మశాస్త్రాలను, కావ్యనాటకాగమాలను చదివినప్పటికీ నాచిత్తంలో వ్యాసుడు రచించిన బహువిషయశోభితమైన మహాభారతేతిహాసంలోని భావాన్ని వినటానికి కోరిక అధిక మై ఉంటుంది అని భావం. ఈపాఠం రాజరాజు హృదయంలోని అభిలాషను సూచించేది. అతడికి 'భారత శ్రవణాసక్తి' ఇష్టమైన అంశాలలో ఒకటని రాబోయే పద్యంలో సూచించబడుతున్నది. దానికి అనుగుణంగా ఈపాఠం ఉన్నది. కాని, రాజరాజుకు గల నిశ్చయభావాన్ని ప్రస్తుత పాఠం సూచిస్తున్నది. పురాణాలు, అర్థధర్మశాస్త్రాలు, ఉదాత్తరసాన్విత కావ్యనాటకాలు, ఈశ్వరాగమాలు మొదలైన గ్రంథాలన్నింటిలో చెప్పిన తాత్పర్యం కంటె మహాభారతబద్ధ నిరూపితార్థం గొప్పదని రాజరాజు నిశ్చయం. అది అతడి విజ్ఞతను సూచిస్తున్నది. పూర్వపద్యభావంతో అన్వయిస్తున్నది. అది అతడి అభిలాషకు మూలకారణమైన నిశ్చయభావం. అందువలన ప్రస్తుతపాఠమే సముచితం. 'ఇందుల' రూపం యతిస్థానంలో కనపడుతున్నది (1-6-248, 2-1-188) కాబట్టి 'అందుల' అనేరూపం నన్నయ ఇక్కడ వాడిఉంటాడు.

**మ. ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబు లై యుండుఁ బా**
**యవు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్. భారత**
**శ్రవణాసక్తియుఁ, బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో**
**త్సవమున్, సంతతదానశీలతయు, శశ్వత్సాధుసాంగత్యమున్. 12**

**ప్రతిపదార్థం:** భూదేవ, కుల+అభితర్పణ, మహీయస్+ప్రీతియున్= బ్రాహ్మణులసముదాయాన్ని తృప్తిపొందించటంలో మిక్కిలి అధికమైన ఆసక్తియున్నూ; భారత, శ్రవణ+ఆసక్తియున్= భారతాన్ని వినటంలోని ప్రీతియున్నూ; పార్వతీపతి, పద+అబ్జ, ధ్యాన, పూజా, మహత్, ఉత్సవమున్= పార్వతిభర్త అయిన శివునియొక్క పద్మాలవంటిపాదాలను ధ్యానించటంలోను, పూజించటంలోను(కల) గొప్పవేడుకయున్నూ; సంతత, దాన, శీలతయున్= నిరంతరం దానం చేసే స్వభావం కలిగి ఉండటమున్నూ; శశ్వత్, సాధు, సాంగత్యమున్= ఎల్లప్పుడును సత్పురుషులతోడి సహవాసమున్నూ; ఇవి ఏనున్= అనే ఈ అయిదున్నూ; నా, ఎడన్= నాహృదయమందు; కరంబు= మిక్కిలి; ఇష్టంబులు+ఐ= ప్రీతికరాలై; ఉండున్= ఉంటాయి; పాయవు= తొలగవు.

**తాత్పర్యం:** ఈ అయిదున్నూ నాహృదయంలో మిక్కిలి ప్రీతికరా లై ఉంటాయి; తొలగవు. అవి ఏవంటే- 1. బ్రాహ్మణులసముదాయాన్ని తృప్తిపొందించటంలో మిక్కిలిగొప్పప్రీతి. 2. భారతాన్ని వినటంలో ఆసక్తి. 3. పద్మాలవంటిశివుడిపాదాలను ధ్యానించటంలో, పూజించటంలో ఉండే గొప్పవేడుక. 4. ఎల్లప్పుడూ దానం చేసే స్వభావం కలిగిఉండటం. 5. నిరంతరం సత్పురుషులతోడి సహవాసం చేయటం అనేవి.

**విశేషం:** ఇందులో రాజరాజుహృదయానికి మిక్కిలి ప్రీతికరా లైన ఐదు విషయాలు పేర్కొనబడినవి. వాటిలో మహాభారతం వినవలెననే కోరిక ఒకటి. అది ఆంధ్రమహాభారత రచనకు ప్రేరకమైన ప్రధాన కారణం. కావ్యరచనా కారణం చెప్పటం అవతారికలోని ఒకఅంగం. నన్నయ అయిదు అనటానికి ఏను అనే పదాన్నే వాడుతాడు. మహత్ అను విశేషణముయొక్క 'తర' భావాన్ని సూచించేపదం మహీయః. మహిష్ఠ 'తమ' భావాన్ని సూచిస్తుంది.

**వ. మఱి యదియునుంగాక. 13**

**తాత్పర్యం:** అంతేకాకుండా.

**విశేషం:** రాజరాజు తనకు భారతంపట్ల ప్రీతి అధికంగా ఉండటానికి మరికొన్ని కారణాలు తెల్పుతున్నాడు. ఈ వచనం కొన్ని ప్రతులలో లేదు.

**చ. హిమకరుఁ దొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్**
**క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయవం**
**శమునఁ బ్రసిద్ధులై, విమలసద్గుణశోభితు లైన పాండవో**
**త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్. 14**

**ప్రతిపదార్థం:** హిమకరున్= చంద్రుని; తొట్టి= మొదలుకొని; పూరు, భరత+ఈశ, కురుప్రభు, పాండుభూపతుల్= యయాతికుమారుడైన పూరువు, శకుంతలాదుష్యంతులకుమారు డైన భరతచక్రవర్తి, కౌరవవంశాని కాపేరు రావటానికి హేతు వైన కురు వనే రాజు, పాండురాజు అనేవారు; క్రమమునన్= వరుసగా; వంశకర్తలు+అనఁగాన్= వంశాన్ని స్థాపించి కొనసాగించినవారు కాగా; మహిన్= భూమియందు; ఒప్పిన= ప్రకాశించిన; అస్మదీయవంశమునన్= మావంశమునందు; ప్రసిద్ధులు+ఐ= మిక్కిలిప్రఖ్యాతి పొందిన వారై; విమల, సద్గుణశోభితులు+అయిన= నిర్మలము లయిన మంచిగుణాలతో ప్రకాశించిన; పాండవ+ఉత్తముల= యోగ్యులైన పాండవులయొక్క (ధర్మరాజాదులైన పాండురాజు కుమారులయొక్క); చరిత్ర= వృత్తాంతం; నాకున్; సతతంబున్= ఎల్లప్పుడు; వినంగన్= వినటానికి; ఎంతయున్= మిక్కిలి; అభీష్టము= కోరిక, సమ్మతం, ఇష్టం.

**తాత్పర్యం:** చంద్రుడు మొదలుకొని పూరువు, భరతుడు, కురురాజు, పాండురాజు లనేవారు వరుసగా వంశాన్ని స్థాపించి కొనసాగించిన వారు కాగా భూమియందు అలరారిన మావంశంలో మిక్కిలి ప్రఖ్యాతు లై స్వచ్ఛమైన, యోగ్య మయిన గుణాలతో ప్రకాశించిన సజ్జను లైన పాండవులయొక్క చరిత్ర వినటం నాకెల్లప్పుడూ ప్రీతికర మై ఉంటుంది.

**విశేషం:** తొట్టు అనగా మొదలుకొను. తెలుగుకావ్యాలలో ఈధాతువుయొక్క క్త్వార్థకరూపం ఒక్కటే కనబడుతున్నది. కౌరవపాండవవంశం చంద్రవంశం. దీనికి మూలపురుషుడు చంద్రుడు. తరువాత ఆ వంశంలో ఎందరో మహారాజులు పుట్టి భూమిని పరిపాలించారు. వారిలో ముఖ్యు లైనవారిని మాత్రం నన్నయ ఈ పద్యంలో పేర్కొని ఉన్నాడు. వంశకర్త అనగా వంశాన్ని స్థాపించి దానిని కీర్తితో ధర్మమార్గంలో కొనసాగించినవాడు. అతడి తరువాత అతడి పేరుమీద అతడివంశస్థులు పిలువబడేవారు. ధర్మరాజాదులు పౌరవులు, భారతులు, కౌరవులు, పాండవులు అని పిలువబడటం వంశకర్తల ప్రాభవంవలననే.

**చ. అమలసువర్ణశృంగఖుర మై కపిలం బగు గోశతంబు ను**
**త్తమబహువేదవిప్రులకు దానము సేసిన తత్ఫలంబు త**
**థ్యమ సమకూరు భారతకథాశ్రవణాభిరతిన్, మదీయచి**
**త్తము ననిశంబు భారతకథాశ్రవణప్రవణంబ కావునన్. 15**

**ప్రతిపదార్థం:** అమల, సువర్ణ, శృంగ, ఖురము+ఐ= నిర్మలమయిన, బంగారంతో కూడిన కొమ్ములును, గిట్టలును, కలదై; కపిలంబు+అగు= గోరోజనంవంటి రంగు గల (ఎర్రని); గోశతంబును= ఆవులవందను; ఉత్తమ, బహు, వేద, విప్రులకున్= యోగ్యులైన పలువురు వేదాలుచదివిన బ్రాహ్మణులకు; దానము, చేసిన; తద్+ఫలంబు= ఆ ఫలితం; తథ్యము+అ= నిజంగా; భారత, కథా, శ్రవణ+అభిరతిన్= మహాభారతంలోని కథను వినే ఆసక్తిచేత; సమకూరున్= కలుగుతుంది; మదీయ, చిత్తమున్= నాహృదయంకూడ; అనిశంబున్= ఎల్లప్పుడు; భారత, కథా, శ్రవణ, ప్రవణంబు+అ= భారతంలోని కథను వినటంలో ఆసక్తికలదే; కావునన్= కాబట్టి. (తరువాతి పద్యంతో కలిపి చదువుకోవాలి).

**తాత్పర్యం:** పరిశుద్ధ మైన బంగారపు తొడుగుతో కూడిన కొమ్ములును, గిట్టలును కల కపిలవర్ణం కల వందఆవులను యోగ్యులు, వేదం అధ్యయనం చేసినవారు అయిన పలువురు బ్రాహ్మణులకు ('బహువేద' అనునప్పుడు నాలుగువేదాలు

చదివిన అనికూడ అర్థం చెప్పవచ్చును.) దానం చేసిన ఆ ఫలితం భారతకథను వినే ఆసక్తిచేత తప్పక కల్గుతుంది. నాహృదయంకూడ భారతకథను వినాలి అని కుతూహలపడుతూ ఉంటుంది. కాబట్టి.

**విశేషం:** గోవులలో కపిలగోవు శ్రేష్ఠమైనది. వేదాధ్యయనం చేసిన విప్రులు దానానికి మిక్కిలి పాత్రులు. పాత్రదానంవలన ఎక్కువఫలం చేకూరుతుంది.

**క. జననుత కృష్ణద్వైపా । యనమునివృషభాభిహిత మహాభారతబ**
**ద్ధనిరూపితార్థ మేర్పడఁ, । దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్. 16**

**ప్రతిపదార్థం:** జననుత= ప్రజలచేతకీర్తింపబడేవాడా! (నన్నయకు సంబోధనం); దీనిని జనులచేత స్తుతింపబడిన అని వ్యాసుడికి విశేషణంగా కూడ చెప్పవచ్చును. అప్పుడు అంతయు ఒకేసమాస మవుతుంది; కృష్ణద్వైపాయన, మునివృషభ+అభిహిత, మహత్, భారత, బద్ధ, నిరూపిత+అర్థము= వ్యాసు డనే మునిశ్రేష్ఠునిచే చెప్పబడిన మహాభారత మనే ఇతిహాసంలో కూర్చబడి నిరూపించబడిన (స్థిరంచేయబడిన) అర్థం- అంటే తాత్పర్యం, ధర్మతత్త్వం, ప్రబోధం, రసం మొదలైనవాటి సారవంతమైన అభిప్రాయమన్నమాట; ఏర్పడన్= స్పష్టమయ్యేటట్లు; తెనుఁగునన్= తెలుగుభాషలో; అధిక, ధీయుక్తిమెయిన్= గొప్పబుద్ధియొక్క కూడికతో; రచియింపుము= వ్రాయుము.

**తాత్పర్యం:** జనులచేత కీర్తింపబడే ఓనన్నయకవీ! వ్యాసమునిశ్రేష్ఠునిచేత చెప్పబడిన మహాభారతంలో తెల్పబడి నిరూపింపబడిన అర్థం తేటతెల్ల మయ్యేటట్లు అధికమైన బుద్ధిసంపద అలరారగా తెలుగుభాషలో వ్రాయుము.

**విశేషం:** వ్యాసుడు పరాశరమునికీ దాశరాజకన్యకూ ద్వీపంలో పుట్టాడు. అతడు నల్లనివాడు. అందుచేత కృష్ణద్వైపాయను డనే పేరు కలిగింది. సింహ, వృషభ, శార్దూల, కుంజరాదిశబ్దాలు సమాసంలో ఉత్తరపదాలై శ్రేష్ఠతను సూచిస్తాయి. ఈ పద్యంలో తెనుఁగుశబ్దం నకారమధ్యమముగా వాడబడింది. ఈ నకారం ప్రాసస్థానంలో ఉన్నది. నన్నయనాడు తెనుఁగుశబ్దమే వాడుకలో ఉన్నదికాబోలును. తరువాత 'తెలుఁగు' అనురూపంకూడ వచ్చింది. రాజరాజు నన్నయను భారతంలోని అర్థం ఏర్పడేటట్లుగా వ్రాయుమన్నాడే కాని, యథాతథంగా అనువాదం చేయు మని అడిగిఉండలేదు.

నన్నయకుముందే పంపకవి కన్నడంలో 'విక్రమార్జునవిజయం' అనే పేర భారతకథను కావ్యంగా వ్రాసిఉన్నాడు. అట్లే పెరిందేవనారు తమిళంలో భారతం వ్రాసిఉన్నాడు. పంపకవి జైనమతానికి చెందినవాడు. అందుచేత అతడికావ్యంలో ఆ మతానికి అనుగుణంగా వ్యాసభారతంలోని కథను, వర్ణనలను అక్కడక్కడ మార్చాడు. అది ఎరిగినవాడు కావటంచేత రాజరాజు నన్నయతో వ్యాసుడు భారతంలో నిరూపించిన తాత్పర్యాన్నే, తత్త్వాన్నే తేటపడేటట్లుగా తెనుగున భారతాన్ని రచింపు మని చెప్పాడని విమర్శకులు భావిస్తున్నారు.

**క. బహుభాషల బహువిధముల । బహుజనములవలన వినుచు భారతబద్ధ**
**స్పృహు లగు వారికి నెప్పుడు । బహుయాగంబులఫలంబు పరమార్థ మిలన్. 17**

**ప్రతిపదార్థం:** బహుభాషలన్= అనేకభాషలందు; బహువిధములన్= పలురీతులుగా; (అనగా కావ్యనాటకపురాణాదివివిధప్రక్రియలలో అని భావం); బహుజనములవలనన్= పలువురు జనులవలన; వినుచున్= వింటూ; భారత, బద్ధ, స్పృహులు= భారతకథయందు కట్టుబడిన కోరిక కలవారు; అగు, వారికిన్= అయిన జనులకు; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; ఇలన్= భూమియందు; బహు, యాగంబుల, ఫలంబు= అనేకయజ్ఞాలు చేయటంవలన కలిగే ఫలితం; పరమ+అర్థము= గొప్ప ప్రయోజనం (సత్యం).

**తాత్పర్యం:** అనేకభాషలలో, అనేక ప్రక్రియలలో పలువురు జనులవలన భారతకథను వింటూ అందులో అధికమైన ఆసక్తిని పెంచుకొన్నవారికి అనేకయజ్ఞాలు చేయటంవలన కలిగేఫలం గొప్ప ప్రయోజనంగా సమకూరుతుంది.

**విశేషం:** పరమార్థము+అగున్- అని పాఠాంతరం; అంటే తప్పక కలుగుతుంది అని అర్థం. అలం: వృత్త్యనుప్రాసం.

**వ. అని యానతిచ్చిన విని యక్కవివరుం డి ట్లనియె. 18**

**ప్రతిపదార్థం:** అని; ఆనతి+ఇచ్చినన్= రాజరాజు ఆజ్ఞాపించగా; విని; ఆ+కవి, వరుండు= కవిశ్రేష్ఠు డైన నన్నయభట్టు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పల్కెను.

**తాత్పర్యం:** అని రాజరాజు ఆజ్ఞాపించగా విని కవిశ్రేష్ఠు డైన నన్నయ క్రిందివిధంగా పలికాడు.

**చ. అమలినతారకాసముదయంబుల నెన్నను, సర్వవేదశా**
**స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను, బుద్ధిబాహువి**
**క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము**
**ద్రముఁ దఱియంగ నీఁదను , విధాతృన కైనను నేరఁబోలునే. 19**

**ప్రతిపదార్థం:** అమలిన, తారకా, సముదయంబులన్= నిర్మల మైన నక్షత్రాలసముదాయాలను; ఎన్నను= లెక్కించటానికిన్నీ; సర్వ, వేద, శాస్త్రముల, అశేష సారము= అన్ని వేదాలయొక్కయు, శాస్త్రాలయొక్కయు సంపూర్ణ మైన సారాంశాన్ని; ముదంబునన్= సంతోషంతో; పొందను= పొందటానికిన్నీ; బుద్ధి, బహు, విక్రమమునన్= మతి అనే భుజాలయొక్క బలంచేత; దుర్గమ+అర్థ, జల, గౌరవ, భారత, భారతీ, సముద్రమున్= పొంద శక్యం కాని అర్థమనే నీటియొక్క మహత్త్వంతో కూడిన భారతంలోని వాక్కనే సముద్రాన్ని; తఱియంగన్= దాటేటట్లుగా; ఈఁదను= ఈదటానికిన్నీ; విధాతృనకున్+ఐనను= బ్రహ్మకైనను; నేరన్+పోలునే= తెలిసికొనటానికి శక్య మౌతుందా? (కాదని భావం).

**తాత్పర్యం:** ఆకాశంలోని నక్షత్రసమూహాలను లెక్కించటానికీ, అన్నివేదాల శాస్త్రాల సంపూర్ణసారాన్ని సంతోషంతో గ్రహించటానికీ, బుద్ధి అనే భుజబలంతో పొంద శక్యం కాని (దిగటానికి అలవికాని) అర్థ మనే నీటియొక్క విస్తృతితో కూడిన భారతవాఙ్మయసముద్రాన్ని దాటేటట్లుగా ఈదటానికీ (సముద్రపు ఆవలిఒడ్డు చేరటానికీ) బ్రహ్మకైననూ శక్య మౌతుందా? కాదు.

**విశేషం:** ఈపద్యం నన్నయవినయగుణాన్ని సూచిస్తున్నది. అతడు మహాపండితుడైనప్పటికిన్నీ పంచమవేద మైన భారతాన్ని తెలుగులో వ్రాయటం తనకు అసాధ్య మని చెప్పుతున్నాడు. ఇందులో అతడు పేర్కొన్న విషయా లన్నీ అసాధ్యాలైనవే. మరియు, ఆరోజుల్లో తెలుగుభాష ఇంకను అభివృద్ధి చెంది ఉండ లేదు. అటువంటి భాషలో మహాభారతంవంటి గొప్పగ్రంథాన్ని రచించటం అసాధ్యమని అతడి భావం. అలం: రూపకం. అవతారికలో పఠితలకు ఆసక్తి కలిగేటట్లు కావ్యమహత్త్వాన్ని కీర్తించటం ఉన్ముఖీకరణంలోని భాగం. నన్నయ దానిని నిపుణంగా అలంకారసుందరంగా అక్షరరమ్యంగా నిర్వహించాడు. ఈ పద్యంలో కవి ప్రౌఢోక్తిచేత సిద్ధమైన అలంకారం వలన కలిగే వస్తుధ్వని ఉన్నది. భారతభారతీ సముద్రాన్ని తరించటం బ్రహ్మకుకూడ సాధ్యం కాదనటంలో భారతరచన ఎంత దుష్కరమైనదో రూపకాలంకారంవలన ప్రతీయమాన మౌతున్నది. 'అమలిన తారకాసముదయంబులన్' ఎన్నను' అన్నప్పుడు సముదాయార్థక శబ్దంమీద ఉన్న బహువచనప్రత్యయం, చుక్కలను

గుంపులుగుంపులుగా లెక్కపెట్టటంకూడా సాధ్యంకాని పని అని ధ్వనింపచేస్తున్నది. అంతేకాక, ఇందులో ప్రకృతం భారతభారతీసముద్రాన్ని దరియంగ నీదటం. తారకాసముదాయాలను ఎన్నటం, సర్వవేదశాస్త్రముల అశేషసారాన్ని పొందటం అనేవి అప్రకృతాలు. ఈ ప్రకృతాప్రకృతాలకు 'విధాతృనకైనను నేరబోలునే' అనేదానితో ధర్మైక్యం చెప్పబడింది. ఇది దీపకాలంకారలక్షణం. ఇది వాచ్యం. నన్నయకువలెనే బ్రహ్మకుకూడా సాధ్యంకాదనే అర్థం స్ఫురించటంచేత ఉపమానం ప్రతీయమానం అవుతున్నది. ఉపమాలంకారంలో ఉపమేయంకంటె ఉపమానం ఉదాత్తంగా ఉండాలి. దీపకంలో ఆలక్షణం లేదు. కాబట్టి తారకాగణనాదులకంటె భారతసముద్రం ఈదటమే గొప్పగా చెప్పబడే దీపకాలంకారమే మిక్కిలి చమత్కారవంతంగా ఉంటుంది. వ్యంగ్యమయ్యే ఉపమాలంకారం గుణీభూతం కావటం ఇక్కడ విశేషం. దీనివలననే మహాభారతరచనలోని దుష్కరత్వం ఔచితీశోభితంగా ప్రతీయమానమయ్యేటట్లు వస్తుధ్వని పద్యంలో రమణీయంగా నిర్వహింపబడింది. (సంసా.)

**వ. అయినను దేవా! నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద నని. 20**

**ప్రతిపదార్థం:** దేవా= ప్రభూ!; అయినను= అసాధ్యం అయినప్పటికీ; నీ, అనుమతంబునన్= నీసమ్మతిచేతనున్నూ; విద్వత్+జనంబుల= పండితజనులయొక్క; అనుగ్రహంబునన్+చేసి= దయచేతనున్నూ; నా, నేర్చు, విధంబునన్= నాకు తెలిసినరీతిని (కర్తృపదప్రథమకుషష్ఠి) నేను ఎరిగిన రీతిలో; ఈ కావ్యంబు= ఈ మహాభారతకావ్యాన్ని; రచించెదన్= వ్రాస్తాను; అని= అని పలికి.

**తాత్పర్యం:** 'ప్రభు వయిన రాజరాజా! భారతాన్ని రచించటం అసాధ్యమే అయినా, నీసమ్మతి (ఆజ్ఞ) చేతనూ, పండితజనుల దయచేతనూ నాకు తెలిసినవిధంగా యథాశక్తిగా ఈ మహాభారతకావ్యాన్ని రచిస్తాను' అని పలికి.

**విశేషం:** ఈవచనంకూడ నన్నయ వినయగుణాన్ని సూచిస్తున్నది. రాజరాజు రచించు మని ఆనతివ్వటంచేత పండితజనులు దయతో తోడుపడటంచేత యథాశక్తిగా భారతకావ్యాన్ని రచించగల నని నన్నయ చెప్పుతున్నాడు. సంస్కృతభారతం ఇతిహాసం. నన్నయ దానిని రసాలంకారపూరిత మైన కావ్యంగా రూపొందించ దలచా డని కావ్యశబ్దప్రయోగంవలన తెలుస్తున్నది. 'రచియించెదనని తొడంగి' అని పాఠాంతరం. తొడంగి= పూని. కావ్యావతరణాన్నీ(కవి రచించటానికి పూనుకోవటం), కావ్యస్వభావాన్నీ సూచించటం అవతారికాంగం.

**తరలము.**

**హరిహరాజగజాననార్కషడాస్యమాతృసరస్వతీ**
**గిరిసుతాదిక దేవతాతతికిన్ నమస్కృతి సేసి దు**
**ర్భరతపోవిభవాధికున్, గురుఁ బద్యవిద్యకు నాద్యు, నం**
**బురుహగర్భనిభుం, బ్రచేతసుపుత్త్రు భక్తిఁ దలంచుచున్. 21**

**ప్రతిపదార్థం:** హరి, హర+అజ, గజానన+అర్క, షట్+ఆస్య, మాతృ, సరస్వతీ, గిరిసుతా+ఆదిక, దేవతాతతికిన్= విష్ణువు, శివుడు, బ్రహ్మ, ఏనుగుమోముగలవినాయకుడు, సూర్యుడు, ఆరుముఖాలుకలకుమారస్వామి, లక్ష్మి, సరస్వతి, హిమవంతుని కూతురైనపార్వతి మొదలైన దేవతలసమూహానికి; నమస్కృతి+చేసి= (గసడదవాదేశం) నమస్కారంచేసి; దుర్భరతపస్+విభవ+అధికున్= అధికమైన తపస్సుయొక్క వైభవంచేత గొప్పవాడున్నూ; గురున్= గొప్పవాడున్నూ, ఆచార్యుడున్నూ, అజ్ఞానాన్ని పోగొట్టేవాడున్నూ; పద్యవిద్యకున్= పద్య(శ్లోక) రచనాసంప్రదాయజ్ఞానానికి; ఆద్యున్= మొదటివాడున్నూ(ఆదికవి); అంబురుహగర్భ,

నిభున్= బ్రహ్మతో సమానుడైనవాడున్నూ, అయిన; ప్రచేతసు, పుత్త్రున్= ప్రచేతసుని కుమారు డైన వాల్మీకిని; భక్తిన్= భక్తితో; తలంచుచున్= స్మరిస్తూ.

**తాత్పర్యం:** విష్ణువు, శివుడు, బ్రహ్మ, వినాయకుడు, సూర్యుడు, కుమారస్వామి, తల్లి యైన లక్ష్మి, సరస్వతి, పార్వతి మొదలైన దేవతలసమూహానికి నమస్కారం చేసి, అధికమైన తపస్సంపదచేత గొప్పవాడున్నూ, అజ్ఞానాన్ని తొలగించే ఆచార్యుడున్నూ, పద్య(శ్లోక)రచనాసంప్రదాయాన్ని ప్రవర్తింపచేయటంలో ఆదికవియున్నూ, బ్రహ్మతో సమానుడున్నూ అయిన ప్రచేతసుడి కుమారు డైన వాల్మీకిని భక్తితో స్మరిస్తూ.

**విశేషం:** కావ్యారంభంలో త్రిమూర్తులను, వారిభార్యలను, విఘ్నేశ్వరుడు మొదలైన దేవతలను భక్తితో స్మరించటం కవులకు పరిపాటి. ఈ సంప్రదాయానికి సంగ్రహంగా నయినా మార్గదర్శకు డయింది నన్నయయే. అతడు సూర్యుడినీ, కుమారస్వామిని కూడ స్మరించాడు. 'మాతృ' శబ్దానికి సప్తమాతృకలు, లేదా, అక్షరమాతృకలు అనే అర్థాలను కూడా చెప్పవచ్చును. తరువాతివారు వీరిని స్మరించటం అరుదుగా కనబడుతుంది. సంస్కృతంలో రామాయణం రచించిన వాల్మీకి ఆదికవిగా పరిగణింపబడుతున్నాడు. "మానిషాద ప్రతిష్ఠాం త్వమ్" అనేది అతడు చెప్పిన మొదటిశ్లోకమని అంటారు. అంతకుముందు వెలసిన ఉపనిషత్తులలో కొన్నిశ్లోకాలు ఉన్నవి. అవి వైదికాలు. లౌకిక సంస్కృతంలో మొట్టమొదట శ్లోకం వ్రాసినవాడు వాల్మీకియే కావచ్చును. ప్రచేతసుడు ఒక ఋషి. ప్రచేతసు డంటే వరుణుడు అనే అర్థంకూడ ఉన్నది. అలం: ఉపమ.

గురుపద్యవిద్యకు ఆద్యున్ అనే పాఠాంతరం ఉన్నది. గొప్పదైన పద్య(శ్లోక) రచనా సంప్రదాయానికి మొదటివాడని దీనికర్థం. ఇదే ఉచితపాఠమని తోస్తున్నది. 'గురుపద్యవిద్యకుఆద్యుడు' అనేవిశేషణం వాల్మీకికి ఎంత వర్తిస్తుందో నన్నయకూ అంతే వర్తిస్తుంది. వాల్మీకి సంస్కృతంలోనూ, నన్నయ తెలుగులోనూ గురుపద్యవిద్యకు ఆద్యు లైన ఆదికవులు. వాల్మీకిమహాకవిఅంశ నన్నయ్యలో ఉన్న దని ఈవిశేషణం ధ్వనింపచేస్తున్నది."మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అనే భోజుడిప్రశంస వాల్మీకితోపాటు నన్నయకు కూడ సార్థకంగా వర్తిస్తుంది. ఇష్టదేవతాస్తుతి, పూర్వకవిస్తుతి అనబడే అవతారికాంగాలను నన్నయ ఈపద్యంలో నిర్వహించాడు.

తరలవృత్తానికి ప్రతిపాదంలోనూ- న, భ, ర, స, జ, జ, గ అనేగణాలు ఉంటాయి. 12వ అక్షరం యతిస్థానం. ఇందులోని మొదటిరెండు లఘువులను ఒకగురువుగా మారిస్తే 'మత్తకోకిల' ఔతుంది. విశేషవృత్తాలలో ఈ రెండింటినే నన్నయ ఎక్కువసంఖ్యలోవాడాడు.

**ఉ.** **భారతభారతీశుభగభస్తిచయంబులఁ జేసి, ఘోరసం**
**సారవికారసంతమసజాలవిజృంభముఁ బాచి, సూరిచే**
**తోరుచిరాబ్జబోధనరతుం డగు దివ్యుఁ బరాశరాత్మజాం**
**భోరుహమిత్త్రుఁ గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.** **22**

**ప్రతిపదార్థం:** భారత, భారతీ, శుభ, గభస్తి, చయంబులన్, చేసి= భారతంలోని వాక్కు లనే మంగళకరాలైన కిరణాలయొక్క సముదాయంచేత; ఘోర, సంసార, వికార, సంతమస, జాల, విజృంభమున్= భయంకరమైన సంసారంలోని దుర్గుణాలు(వికృతులు) అనే గాఢ మైన చీకట్లసముదాయంయొక్క అతిశయాన్ని; పాచి= పోగొట్టి; సూరి, చేతస్+రుచిర+అబ్జబోధనరతుండు+అగు= పండితులహృదయా లనే ఒప్పిదమైనపద్మాలను వికసింపచేయటంలో ఆసక్తికలవా డైన; దివ్యున్= దేవతాతుల్యు డైన వాడిని; మునిపూజితున్= మునులచేత పూజింపబడినవాడిని; భూరి, యశస్+విరాజితున్= అధిక మైన కీర్తితో ప్రకాశించేవాడిని; పరాశర+ఆత్మజ+అంభోరుహమిత్త్రున్= పరాశరుడి కుమారు డైన వ్యాసు డనే(పద్మాలకు మిత్రు డైన) సూర్యుడిని; కొల్చి= సేవించి.

**తాత్పర్యం:** భారతంలోని వాక్కు లనే మంగళకరా లైన కిరణసముదాయాలచేత భయంకర మైన సంసారంలోని వికృతులు అనే దట్ట మైన చీకట్లయొక్క అతిశయాన్ని పోగొట్టి, పండితుల హృదయా లనే ప్రకాశించేపద్మాలను వికసింపచేయటంలో ఆసక్తికలవాడున్నూ, యోగ్యుడున్నూ, దేవతాతుల్యుడున్నూ, మునులచే పూజింపబడినవాడున్నూ, అధికమైనకీర్తిచేత ప్రకాశించేవాడున్నూ అయిన వ్యాసు డనే సూర్యుడిని సేవించి.

**విశేషం:** 'మునిపూజితు, భూరియశోవిరాజితున్' అనేవాటిని సూర్యుడికికూడ విశేషణాలుగా చెప్పవచ్చును. 'పాచి' అనేచోట 'పాపి' అనే పాఠాంతరం ఉన్నది. రెండింటికిని అర్థం సమానమే. 'పాయు' అనే ధాతువుకు 'పాచు' 'పాపు' అనేవి ప్రేరణార్థకరూపాలు. 'దివ్యపరాశరాత్మజాంభోరుహమిత్రు' అని సమాసరూపమైన పాఠాంతరంకూడ ఉన్నది. 'పరాశరాత్మ జాంభోరుహమిత్రుఁ గొల్చి' అని వ్యాసవిశేషణాలను సమాప్తిచేసి తిరిగి 'మునిపూజితు భూరియశోవిరాజితున్' అని విశేషణాలను వేయటంచేత సమాప్త పునరావృత్తదోషం ఏర్పడుతుందని కొందరు భావింపవచ్చును. కాని, ఉత్థితాకాంక్ష మైన సమాప్త పునరావృత్తం దోషం కాదని తెలిసికొనాలి.

ఈపద్యంలో రూపకాలంకారం ఉన్నది. వ్యాసునికీ సూర్యునికిన్నీ, భారతవాక్కులకూ సూర్యకిరణాలకున్నూ, సంసారవికారాలకూ చీకట్లకున్నూ, పండితమనస్సులకూ పద్మాలకున్నూ పోలిక చెప్పబడింది. త్రిమూర్తులు మొదలైన దేవతలను కొల్చినట్లే కావ్యారంభంలో తమకు పూర్వ మున్న కవులనుకూడ ప్రశంసించటం కవులకు పరిపాటి. నన్నయ తనకుముందు చెప్పదగిన తెలుగుకవులు ఎవ్వరూ లేకపోవటంచేతకాబోలు సంస్కృతంలో ఆదికవు లైన వాల్మీకిని వ్యాసుడిని మాత్రమే స్మరించాడు.

సంస్కృతకవులలోకూడ వాల్మీకివ్యాసులనే ఎన్నుకొనటంలో ఒకప్రత్యేకత ఉన్నది. నన్నయ తనలో వాల్మీకిలోని కవిత్వాంశ, వ్యాసునిలోని జ్ఞానాంశ కల వనీ, అందువలననే తాను మహాభారతాన్ని కావ్యేతిహాసంగా దిద్ది తీరుస్తున్నట్లూ సూచిస్తున్నాడు.

**వ. మఱియును. 23**

**తాత్పర్యం:** అంతేకాక, ఇంకనూ.

**విశేషం:** దేవతలను, కవులను మాత్రమే కాక నన్నయ ఆ కాలంలో ఉన్న పండితపరిషత్తులనుకూడ ప్రశంసిస్తూ ఉన్నాడు.

**చ. పరమవివేకసౌరభవిభాసిత సద్గుణపుంజవారిజో**
**త్కరరుచిరంబు లై, సకలగమ్యసుతీర్థము లై, మహామనో**
**హరసుచరిత్రపావనపయఃపరిపూర్ణము లైన సత్సభాం**
**తరసరసీవనంబుల, ముదం బొనరం గొనియాడి వేడుకన్. 24**

**ప్రతిపదార్థం:** పరమ, వివేక, సౌరభ, విభాసిత, సత్‌గుణ, పుంజ, వారిజ+ఉత్కర, రుచిరంబులు+ఐ= గొప్పజ్ఞాన మనే సువాసనతో ప్రకాశించే మంచిగుణాలసమూహ మనే పద్మాలసముదాయంచేత అందమైనవి అయి; సకల, గమ్య, సుతీర్థములు+ఐ= అందరికీ పోదగిన (చేరదగిన) (మంచిరేవు లనే) సత్పురుషులు (పూజ్యులైన పండితులు) కలవై; మహత్+మనోహర, సు, చరిత్ర, పావన, పయస్+పరిపూర్ణములు+ఐన= మిక్కిలి హృద్యములు (ఆనందకరములు) అయిన మంచిశీలములు అనే

పవిత్ర మైన జలాలతో నిండిన వైన; సత్, సభా+అంతర, సరసీ, వనంబులన్= పండితుల సభలమధ్యభాగా లనే సరస్సుల సమూహాలను; ముదంబు+ఒనరన్= సంతోషం కలిగేటట్లుగా; వేడుకన్= కుతూహలంతో; కొనియాడి= ప్రశంసించి.

**తాత్పర్యం:** గొప్పజ్ఞాన మనే పరిమళంతో ప్రకాశించే మంచిగుణాల సమూహ మనే పద్మాలసముదాయంచేత అంద మైనవి యై, అందరికిని దిగటానికి తగిన (చేరదగిన) మంచిరేవు లనే పూజ్యు లైన పండితులు కలవై, మిక్కిలిప్రీతికరా లైన మంచివర్తన లనే పవిత్రజలాలతో నిండిన వైన పండితులసభలమధ్యభాగా లనే సరస్సులసమూహాలను సంతోషమలరారగా ప్రీతితో ప్రశంసించి.

**విశేషం:** అలం: రూపకం. నన్నయకాలంలో విద్యాగోష్ఠులు జరిగే పండితసభ లుండినట్లు తెలుస్తున్నది. ఆ సభలలోని పండితులమెప్పు పొందినప్పుడే పండితులకుగాని, కవులకుగాని, వారి రచనలకుగాని గౌరవసత్కారాలు జరిగేవి. ఇట్టి పండితపరిషత్తులు తమిళదేశంలో ఉండే వని వింటాము. ఆచోళ సంప్రదాయాన్ని తూర్పుచాళుక్యులు వేంగిలో పోషించారు. నన్నయ అట్టి పండితసభలనుకూడ కొనియాడినాడు. తరువాతికవులకృతుల అవతారికలలో పండితసభలప్రశంస కనబడదు.

**ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా**
**రాయణునట్లు, వానసధరామరవంశవిభూషణుండు నా**
**రాయణభట్టు, వాఙ్మయధురంధరుఁడుం, దన కిష్టుఁడున్, సహా**
**ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్.** **25**

**ప్రతిపదార్థం:** పాయక= విడువక; పాకశాసనికిన్= ఇంద్రుడి కుమారు డైన అర్జునుడికి; భారత, ఘోర, రణంబునందున్= భారతంలో జరిగిన భయంకరమైన యుద్ధంలో (భారతవీరులకు జరిగిన భయంకరమైన యుద్ధంలో); నారాయణు+అట్లు= కృష్ణుడివలె; వానస, ధరామర, వంశ, విభూషణుండు= వానస అనేపేరు గల బ్రాహ్మణవంశానికి అలంకార మైనవాడు; వాఙ్మయ, ధురంధరుఁడున్= సంస్కృతకర్ణాటఆంధ్రాది సారస్వతాలలో మిక్కిలి సమర్థుడున్నూ; తనకున్= నన్నయభట్టుకు; ఇష్టుఁడున్= ప్రియమిత్రుడున్నూ; సహాధ్యాయుఁడున్= అతనితో కలిసి చదువుకొన్నవాడున్నూ; ఐనవాఁడు= అయినట్టివాడు; నారాయణభట్టు= నారాయణభట్టు అనేపేరు గల గొప్పపండితుడు; అభిమతంబుగన్= సమ్మతంగా; తోడు+అయి= సహాయు డై; నిర్వహింపఁగన్= నెరవేర్పగా.

**తాత్పర్యం:** భారతవీరులమధ్య జరిగిన భయంకర మైన కురుక్షేత్రసంగ్రామంలో సారథి యై విడువక అర్జునుడికి కృష్ణుడివలె, వానస అనే బ్రాహ్మణవంశానికి అలంకారమున్నూ, అనేకసారస్వతాలలో సమర్థుడున్నూ, తనకు ప్రియమిత్రుడున్నూ, సహపాఠియున్నూ అయిన నారాయణభట్టు అనే పండితుడు అనుకూలంగా సహాయుడై నెరవేర్పగా.

**విశేషం:** నారాయణభట్టూ, నన్నయభట్టూ కలిసి కంచిలో ఒక గురువుకడ సహపాఠకు లైచదువుకొన్నారనీన్నీ, తరువాత నారాయణభట్టు పశ్చిమచాళుక్యులమంత్రి అయినా డనిన్నీ చెప్పుతారు. విజయాదిత్యుడనే రాజరాజుసవతితమ్ముడు పశ్చిమచాళుక్యచక్రవర్తిసాహాయ్యంతో రాజరాజును వేంగీరాజ్యసింహాసనంనుండి తొలగించి తానే రాజు కావటానికి పలుసార్లు ప్రయత్నించాడు. నన్నయభట్టు తనమిత్రుడైన నారాయణభట్టు సాహాయ్యంతో పశ్చిమచాళుక్యులకూ రాజరాజుకూ మైత్రి కలిగించాడు. అప్పటినుండి రాజరాజుకు శాంతిచేకూరింది. అతడు కృతజ్ఞతాపూర్వకంగా నారాయణభట్టుకు నందమపూడిగ్రామాన్ని

అగ్రహారంగా ఇచ్చాడు. ఆ దానశాసనకావ్యాన్ని నన్నయభట్టే రచించాడు. అందులో అతడు నారాయణభట్టు సంస్కృత, కర్ణాట, ప్రాకృత, పైశాచికాంధ్రభాషలలో కవిరాజశేఖరు డని ప్రసిద్ధిపొందినట్లున్నూ, 'కవీభవజ్రాంకుశ' బిరుదాన్ని వహించినట్లున్నూ వ్రాసియున్నాడు. కొన్నిప్రతులలో 'వానస' అనటానికి బదులు 'వాసిగ' అనే పాఠాంతరం కనపడుతున్నది. దానికి 'ప్రసిద్ధిగ' అని అర్థం. నారాయణభట్టు ఇంటిపేరు వానసవా రని తేలింది.

కృష్ణుడు భారతయుద్ధంలో అర్జునుడికి సారథిగా ఉన్నాడు. అతడు దుర్యోధనుడున్నూ అర్జునుడున్నూ మొదట తనను సాయంకోరటానికి వచ్చినపుడు, యాదవసైన్యాన్ని రెండువిభాగాలుగా చేసి తానొక్కడునూ ఒకభాగమనిన్నీ, తాను యుద్ధం చేయక, వాక్సహాయంమాత్రం చేస్తూ ఉంటా ననిన్నీ, రెండవభాగ మైన పదివేలమందినారాయణగోపాలురు యుద్ధం చేస్తా రనిన్నీ, అర్జునుడు వెనుక వచ్చినా తా నతడిని ముందు చూడటంచేతనున్నూ, వయస్సులో పిన్నవాడుకావటంచేతనున్నూ అతడే ముందు కోరుకొంటాడని తెల్పాడు. అర్జునుడు శ్రీకృష్ణుడినే కోరుకొన్నాడు. దుర్యోధనుడు సంతోషిస్తూ వెడలిపోయాడు. కృష్ణుడు భారతయుద్ధంలో పాండవులకు అప్పుడప్పుడు వాక్సహాయం చేశాడే కాని ఆయుధం పట్టి యుద్ధంచేయలేదు. భీష్ముడిధాటికి పాండవసైన్యం ఆగలేనప్పుడు యుద్ధం చేయటానికి చక్రంపట్టాడుకాని తరువాత అర్జునుడిప్రార్థనచేత విరమించుకొన్నాడు. పైకథను పురస్కరించుకొని 'అర్జునుడికి కృష్ణుడివలె' అనే ఉపమానాన్నిబట్టి నారాయణభట్టున్నూ నన్నయభట్టుకు సంస్కృతభారతంలోని ఏయేభాగాలను తగ్గించవలెనో, వేటిని పెంచవలెనో, వేటిని తొలగించవలెనో, తెలుగున రచించేటప్పుడు ఎటువంటిభాషను వాడవలెనో, కన్నడంలో పంపమహాకవి ఎట్లు చేసినాడో- మొదలైనవాటినిగూర్చి తెలిపి వాక్సాహాయ్యంమాత్రం చేశాడని విమర్శకులు భావిస్తున్నారు. అలం: ఉపమ.

**ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తి లో**
**నారసి మేలునా, నితరు లక్షరరమ్యత నాదరింప, నా**
**నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా**
**భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్. 26**

**ప్రతిపదార్థం:** కవి+ఇంద్రులు= కవిశ్రేష్ఠులు; సార, మతిన్= ప్రశస్తమైనబుద్ధితో; ప్రసన్న, కథా, కవితా+అర్థ, యుక్తి= ప్రసాదగుణంతో కూడిన కథలయందును, కవిత్వమునందును (లేక కథాకవిత్వమునందు. నన్నయకు పూర్వంశాసనపద్యాత్మక మైన కవిత్వమే కాని కథారూప మైనకవిత్వం లేదు. కౌరవపాండవులకథతో కూడిన అట్టికవిత్వం రచించిన మొదటికవి నన్నయయే.) కల అర్థముతోడి కూడికను; లోన్+ఆరసి= లోపల బాగుగా పరిశీలించి, హృదయమం దాలోచించి (అర్థముయొక్కఆంతర్యాన్ని అంటే అంతరార్థాన్ని గ్రహించి); మేలు, నాన్= శ్రేష్ఠమైనది అంటే, మేలుమే లని ప్రశంసించగా; ఇతరులు= కవీంద్రులు కాని సామాన్యపాఠకులు; అక్షర, రమ్యతన్= వర్ణాలకూర్పునందలి సౌందర్యాన్ని; ఆదరింపన్= మెచ్చుకొనగా; నానా, రుచిర+అర్థ, సు+ఉక్తి, నిధి= వివిధము లైన హృద్యము లైన అర్థాలతో కూడిన మంచిమాటలకు (సుభాషితాలకు) నిధాన మయిన; నన్నయభట్టు; తెనుంగునన్= తెనుగుభాషలో; జగత్+హితంబు+కన్= లోకానికి శ్రేయస్సు కలిగేటట్లుగా; మహత్+భారత, సంహితా, రచన, బంధురుఁడు= మహాభారతం అనే వేదాన్ని (వేదంలోనిమంత్రభాగం సంహిత ఇక్కడ వేదం అనే సామాన్యార్థాన్ని గ్రహించటం ఉచితం. మహాభారతానికి పంచమవేదమనే ప్రశస్తి ఉన్నది) రచించటంలో ఒప్పిదమైనవాడు; అయ్యెన్= అయ్యెను, అయినాడు.

**తాత్పర్యం:** కవిపుంగవులు ప్రశస్తమైన బుద్ధితో ప్రసాదగుణంతో కూడిన కథలందును, కవిత్వమందును (కథాకవిత్వమందు) గల మనోహరాలైనఅర్థాలతోడి కూడికను (అర్థసంహితత్వాన్ని) లోపల తరచి తరచి గ్రహించి బాగుబాగు అని ప్రశంసించగా, అన్యులు(సామాన్యులు) వీనులకు విందు చేకూర్చే అక్షరాలకూర్పులోని సౌందర్యాన్ని

మెచ్చుకోగా, హృద్యమైన అర్థాలతో కూడిన వివిధసుభాషితాలకు (నీతులకు, జాతీయాలకు, నానుడులకు)-లేదా- అనేకవిధాలైన రమణీయార్థ ప్రతిపాదకాలైన సుందరకవితాభివ్యక్తులకు నిధాన మైన నన్నయభట్టు లోకానికి శ్రేయస్సు కలిగేటట్లు మహాభారతం అనే వేదాన్ని రచించటంలో ఒప్పిదమైనవాడు (రచించటంచేత లోకప్రీతికరుడు) అయినాడు.

**విశేషం:** 'ప్రసన్న, కథా, కలిత, అర్థ, యుక్తి'- అనెడి పాఠాంతరం ఉన్నది. ప్రసాదగుణముతో కూడిన కథలందు ఉన్న అర్థాలకూడికను- అని అర్థం. ప్రసాదం, ఓజస్సు, మాధుర్యం మొదలైనవి కవితాగుణాలు. ప్రసాదం అంటే ఝటితిస్ఫూర్తి; చదువగానే అర్థమయ్యేగుణం. ఇది సర్వరససమర్పకం. ప్రసాదగుణం రసగ్రహణానికి తోడ్పడుతుంది. 'లోనారసి' అనేపదం సాభిప్రాయం. కొందరుపండితులు కవులు మొదలైనవారు కావ్యాన్ని చదివేటప్పుడు త్రచ్చి త్రచ్చి హృదయంలో అంతరార్థాన్ని గ్రహించి ఆనందించి రచయితను ప్రశంసిస్తారు. సామాన్యులు ఆ విధంగా చేయలేరు. పైపై విషయాలనుమాత్రమే గ్రహించి ఆనందిస్తారు. కావ్యానికి అర్థం లోపలిగుణం. శబ్దంబాహ్యగుణం. ఈపద్యంలో నన్నయకవిత్వంలోని మూడుగుణాలు(లక్షణాలు) పేర్కొనబడినవి. 1.ప్రసన్నకథాకవి(లి)తార్థయుక్తి; 2. అక్షరరమ్యత; 3. నానారుచిరార్థసూక్తినిధిత్వం. 'సంహితారచనబంధురుఁ డయ్యె'- అనేవాక్యాన్ని ఆధారంగా చేసికొని నన్నయకవితలో 'రచనాబంధురత్వం' నాల్గవలక్షణ మని కొందరంటారు. విశిష్టపదరచనగల వైదర్భ్యాదిరీతులతో కూడిన 'పదవృత్త్యసహిష్ణు' వైనపదరచనారూపమైన శయ్య రచనాబంధురత్వమని అంటారు. అయితే, ఈ అంశాన్ని పండితు లంతగా పట్టించుకొనలేదు.

ఇక నన్నయ పేర్కొనిన తనకవితాలక్షణాలు సాపేక్షాలేకాని, సర్వసామాన్యాలు కావు. అందువలననే ఈలక్షణాలకు నిర్వచనాలు ఏ సంస్కృతలక్షణగ్రంథాలలోనూ లభించవు. కాబట్టి విమర్శకు లీలక్షణాలకు వివిధ వ్యాఖ్యానాలు చేశారు. అందులో 'ప్రసన్నకథాకలితార్థయుక్తి'కి 'ప్రసన్నమైనకథతో కూడికొనియున్న అర్థములసంయోజనం' అనిన్నీ, 'ప్రసన్నకవితార్థయుక్తి' అనేసమాసానికి 'ప్రసన్నకథయొక్కయు, కవితార్థముయొక్కయు,యుక్తి-అనగా కవితార్థములో ప్రసన్నమైనకథయుండుట, ప్రసన్నమగుట' అనిన్నీ విశ్వనాథ సత్యనారాయణగారిచ్చిన వివరణలే బహుళప్రచారంలో ఉన్నవి. ప్రసన్నమైన కథాకవితార్థయుక్తికి- 1. 'ప్రసన్నమైనకథయొక్కయు, కవిత్వముయొక్కయు, అర్థముయొక్కయు కూడిక' అనిన్నీ, 2. 'ప్రసన్నమైన కథాకవితయందలి అర్థముయొక్కకూడిక' అనిన్నీ, 3. 'ప్రసన్నమైనకథయందలి కవిత్వముయొక్కయు, అర్థముయొక్కయు కూడిక' అనిన్నీ, 4. 'ప్రసన్నమైన కథాకవితార్థముల కూడిక' అనిన్నీ అర్థాలు చెప్పుకోవచ్చు. అర్థ శబ్దానికి వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థాలనీ, ఉపరంజన ఉపదేశాలనే కావ్యప్రయోజనాలనీ, వస్తు, నేతృ, రసఫలౌచిత్యాలనే కావ్యార్థాలనీ విమర్శకులు వ్యాఖ్యానించారు.

'అక్షర రమ్యత' లో రమ్యత అంటే రామణీయకమనీ, సౌందర్యమనీ, ఆస్వాదయోగ్యత అనీ అర్థం చెప్పుకొనవచ్చు. అక్షర మంటే కేవలం అక్షరం కాదు. సముచితవర్ణవిన్యాసం. కాబట్టి, వర్ణవిన్యాసంవలన కలిగే నాదసౌందర్యం అక్షరరమ్యత అనీ, క్షరంకాని దైన పద్యరచనాసౌందర్యమనీ, మొక్కవోవని ఆస్వాదమాధుర్యమనీ అర్థాలు చెప్పుకొనవచ్చును. అక్షరరమ్యతను అక్షరచ్ఛందోరమ్యతగా కవితా(కావ్య)గుణాలవలన ఏర్పడే రమ్యతగా, సంగీతపరమైన, పూర్వమీమాంసాతత్త్వపరమైన అక్షరసౌందర్యంగాకూడా వ్యాఖ్యానించారు విమర్శకులు.

'నానారుచిరార్థసూక్తినిధి'- అనే విశేషణం సాక్షాత్తుగా నన్నయకు వేసింది. అది అతని వాక్కుకు సహజమైన లక్షణం. సూక్తిఅంటే రుచిరమై చమత్కారయుక్తమైన కూర్పు అని అర్థంచెప్పారు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. ఈచమత్కారం ఒక్కొక్క పదంలోనూ, పదబంధంలోనూ, సమాసంలోనూ, కారకంలోనూ, వాక్యంలోనూ బహుభంగుల చూడవచ్చునని వారు వివరించారు. సూక్తులంటే అందమైన కవితాభివ్యక్తులనీ, ప్రియమైన మాటలనీ, శ్రేష్ఠములైన మాటలనీ, మృదుమధురమైన మాటలనీ, సుభాషితాలు, నీతులు, జాతీయాలు, లోకోక్తులు, నానుడులు మొదలైనవనీ విమర్శకులు వివేచిస్తున్నారు.

అర్థసూక్తులు-సమాసం ద్వంద్వమని కొందరు భావించారు. రుచిరార్థమంటే రమణీయార్థప్రతిపాదకమనీ, కావ్యసందర్భంలో ఒప్పిదాలై భాసించే లక్ష్యవ్యంగ్యార్థాలనీ కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. సూక్తిని అలంకారపర్యాయవాచిగా కొందరు భావిస్తున్నారు.

నానారుచిరార్థసూక్తినిధిత్వం నన్నయకవితలో కానవచ్చే సాధారణలక్షణం. కాగా, సారమతులైన కవీంద్రులు లోనారసిమెచ్చుకొనే లక్షణం ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తి. ఇది పండితులైన సహృదయులను, అక్షరరమ్యత కవితారసికులైన సామాన్య సహృదయులను ఆకర్షించటానికి ఉద్దేశింపబడినవి. పండిత పామర(Class and mass) జనులను రంజింపజేస్తూ ప్రజలనాల్కలమీద నిలిచేకవిత నన్నయది. అర్థ శబ్దాన్ని వాడుతున్న నన్నయ ధ్వనిమార్గ సమర్థకుడు. అతడికి అక్షరంకూడ వ్యంజనాశక్తికి సాధకమౌతుంది. రుచిరార్థ(రమణీయార్థ) ప్రతిపాదకమైన కవిత్వాభివ్యక్తియే అతడి కవిత్వానికి జీవితం. వస్తుధ్వని అతడి ప్రధానమార్గం. క్రీ.శ. 11- 18 శతాబ్దాలనడుమ భారతాలంకార చరిత్రలో ప్రవర్తిల్లిన ధ్వన్యనంతరయుగంలో తెలుగుసాహితీరంగంమీద ధ్వనిని. రసాన్ని సమర్థించినవారు నన్నయాదులు; అలంకారమార్గాన్ని సమర్థించినవారు నన్నెచోడాదులు; మూలరసవాదాలను సమర్థించినవారు పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు, పోతనాదులు. ధ్వనినీ రసాన్నీ సమర్థించిన నన్నయమార్గం ఉత్తమప్రస్థానం. ధ్వనిలో నన్నయ వస్తుధ్వనిని, తిక్కన రసధ్వనిని, ఎర్రన అలంకారధ్వనిని విశేషించి పోషించారు. ముగ్గురూ మూడుధ్వనులను ప్రధానంగా పోషించినా ప్రస్థానం ఒకటేకాబట్టి కవిత్రయకవితలో ఆంధ్రమహాభారతం ఒకేకవి రచించిన కావ్యేతిహాసంవలె రాణిస్తున్నది. (సంపా.)

వేదంలో సంహిత(మంత్రభాగం), బ్రాహ్మణము(యజ్ఞాలలోవేదమంత్రవినియోగాన్నిగురించి ఒక్కొక్కప్పుడు వాటి అర్థాలను కథోదాహరణపూర్వకంగా తెలిపేభాగం), ఆరణ్యకంకూడ బ్రాహ్మణాలకు సంబంధించినదే, (అరణ్యమున కూర్చబడినదో, అధ్యయనం చేయదగినదో అగుటచేత దీనికి ఆపేరు కలిగింది), ఉపనిషత్తు (వేదాంతభాగం, జ్ఞానబోధకం) అనే మూడుభాగాలు ఉంటాయి. ఇచ్చట సంహితాశబ్దం వేద మనే అర్థంలో వాడబడింది. నన్నయ ఋషితుల్యుడు. అందుచేత సంహితారచనకు అర్హుడు.

ఈపద్యంతో అవతారిక పూర్తి ఔతున్నది. పాత్రప్రవేశసూచన మనే ప్రస్తావనాంగం ఇందులో వ్యంగ్యంగా నిబంధించబడింది. ఇదంతయు ప్రథమపురుషలో వ్రాయబడింది. అవతారికలో స్వీయవిషయంకూడ ఉండటంచేత ఆత్మస్తుతిదోషం కలుగుతుం దేమో అని నన్నయ దీనిని ఈవిధంగా వ్రాసిఉంటాడు. నన్నయ పేర్కొన్నగుణాలు అతనిరచనలో స్పష్టంగా గోచరిస్తాయి. ఈ అవతారిక కవితావిషయంలోనే కాక సత్యకథనవిషయంలోకూడ సాటిలేనిది.

### భారతకథాప్రస్తావన (సం. 1-1-8)

**వ. తత్కథాప్రారంభం బెట్టి దనిన. 27**

**ప్రతిపదార్థం:** తత్, కథా, ప్రారంభంబు= ఆ భారతంలోనికథకు ఆరంభం; ఎట్టిది+అనినన్= ఎటువంటిది అనగా.

**తాత్పర్యం:** ఆ మహాభారతంలోని కథకు మొదలు ఎటువంటిది అనగా.

**సీ. నైమిశారణ్యపుణ్యక్షేత్రమునఁ గుల । పతి శౌనకుం డను పరమమౌని,**
**బ్రహ్మర్షిగణసముపాసితుం డై సర్వ । లోకహితార్థంబు లోకనుతుఁడు**
**ద్వాదశవార్షికోత్తమసత్త్రయాగంబు । మొగిఁ జేయుచున్న నమ్మునులకడకు**
**వచ్చి, తా నుగ్రశ్రవసుఁ డను సూతుఁడు । రౌమహర్షణి సుపౌరాణికుండు**

**ఆ. పరమభక్తితోడఁ బ్రణమిల్లియున్న న । క్కథకువలన మునినికాయ మెల్ల**
**వివిధపుణ్యకథలు వినువేడ్క నతనిఁ బూ । జించి రపరిమితవిశేషవిధుల. 28**

**ప్రతిపదార్థం:** నైమిశ+అరణ్య, పుణ్యక్షేత్రమునన్= నైమిశం అనే పేరుగల అడవిఅనే పవిత్రక్షేత్రంలో; కులపతి= పదివేలమందిశిష్యులకు భోజనం పెట్టుతూ చదువు చెప్పేవాడు; శౌనకుండు+అను= శౌనకుడు అనే పేరు కల; పరమ, మౌని = గొప్పముని; బ్రహ్మ+ఋషి గణ, సముపాసితుండు+ఐ= బ్రహ్మర్షులసముదాయంచేత సేవింపబడినవా డై; లోక, నుతుఁడు= ప్రజలచేత స్తుతింపబడినవాడు; (శౌనకునకు విశేషణం); సర్వ, లోక, హిత+అర్థంబు= సకలజగత్తుయొక్కమేలుకొరకు; ద్వాదశ, వార్షిక,+ఉత్తమ, సత్ర, యాగంబు= పన్నెండు సంవత్సరాలు జరిగే శ్రేష్ఠ మైన సత్రము అనే యజ్ఞాన్ని; మొగిన్= పూనికతో; చేయుచున్నన్= చేస్తూఉండగా; ఆ+మునుల, కడకున్= ఆ శౌనకాదిమునులచెంతకు; వచ్చి; తాను; రౌమహర్షణి= రోమహర్షణుడు అనే సూతునికుమారుడు; సు, పౌరాణికుండు= లెస్సగా పురాణాలను ఎరిగిన(చెప్పేవాడు); ఉగ్రశ్రవసుఁడు, అను, సూతుఁడు= ఉగ్రశ్రవసుడు అనే పేరు గల సూతవంశానికిచెందినవాడు, పరమ, భక్తితోడన్= గొప్పభక్తితో; ప్రణమిల్లి+ఉన్నన్= నమస్కరించి ఉండగా; ఆ కథకువలనన్= ఆ పౌరాణికుని(కథలుచెప్పువాని)వలన; వివిధ, పుణ్య, కథలు= అనేక పవిత్రకథలు; విను, వేడ్కన్= వినాలనే ఆసక్తితో; ముని, నికాయము+ఎల్లన్= మునులసముదాయం అంతయున్నూ; అతనిన్= ఆ ఉగ్రశ్రవసుడిని; అపరిమిత, విశేష విధులన్= అధికమైనపూజావిధానాలతో; పూజించిరి= అర్చించారు.

**తాత్పర్యం:** కులపతి అయిన శౌనకుడు అనే మహాముని బ్రహ్మర్షులసముదాయంచేత సేవింపబడినవాడై, ఎల్లలోకాల శ్రేయస్సుకొరకు పన్నెండుసంవత్సరాలు జరిగే శ్రేష్ఠ మైన 'సత్త్రము' అనే యాగవిశేషాన్ని చేస్తూఉండగా, ఆ మునులచెంతకు వచ్చి రోమహర్షణు డనేవానికుమారుడున్నూ, మంచిపురాణకథకుడున్నూ అయిన ఉగ్రశ్రవసుడు అనేసూతుడు మిక్కిలిభక్తితో నమస్కరించి ఉండగా, మునులసమూహమంతా కలిసి ఆ కథకుడివలన వివిధపవిత్ర (పుణ్యం కలుగజేసే) కథలను వినవలె ననే కుతూహలంతో అతడిని అధికమైన పూజావిధానాలతో పూజించారు.

**విశేషం:** 'మునీనాం దశసాహస్రం యోఽన్నదానాది పోషణాత్ । అధ్యాపయతి విప్రర్షిరసౌ కులపతిః స్మృతః ॥' అనేది కులపతినిర్వచనం. 'సత్త్రము' అనేది ఒకయాగవిశేషం. ఇది 13 నుండి 100రోజులవరకుగాని అంతకు ఎక్కువకాలంగాని జరుగవచ్చును. రోమహర్షణుడనే సూతుడు, వ్యాసుడిశిష్యుడు. అతడి కుమారుడు ఉగ్రశ్రవసుడు సౌతి. క్షత్రియకాంతకు వైశ్యుడివలన పుట్టినవాడు సూతుడనిన్నీ, పురాణకథలు చెప్పటం అతనివ్యాపార మనిన్నీ నిఘంటువులలో ఉన్నది. సూతశబ్దానికి రథసారథి అని సామాన్యార్థం. కాని, ఇచ్చట కథకుడు అని చెప్పటం యుక్తంగా ఉంటుంది. అందుచేతనే మునులు అందరూ అతడివలన పుణ్యకథలు వినా లని అభిలషించి అతడిని పూజించారు.

**వ. అక్కథకుండ వెండియు నమ్మునిసంఘంబునకు నమస్కారంబు సేసి, 'యే ననేకపురాణపుణ్యకథా కథనదక్షుండ, వ్యాస శిష్యుండైన రోమహర్షణునకుఁబుత్త్రుండ; నావలన నెక్కథ విన వలతు?' రనిన, నమ్మును లతని కి ట్లనిరి. 29**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= పౌరాణికుడు అయిన ఆ ఉగ్రశ్రవసుడు; వెండియున్= మరల; ఆ+ముని, సంఘంబునకున్= శౌనకుడు మొదలైన ఆ మునిసముదాయానికి; నమస్కారంబు; చేసి; ఏను=నేను; అనేక, పురాణ, పుణ్య, కథా, కథన, దక్షుండన్= పెక్కుప్రాచీనా లైన(పురాణాలలోని), పవిత్రాలైన కథలను చెప్పటంలో సమర్థుడను; వ్యాస, శిష్యుండు+ఐన= వ్యాసునికి శిష్యు డైన; రోమహర్షణునకున్= రోమహర్షణుడు అనే పేరు కల సూతునకు; పుత్త్రుండన్= కుమారుడను; నావలనన్; ఏ+కథ; వినన్, వలతురు= వినగోరుతారు?; అనినన్= అని అడుగగా; ఆ+మునులు; అతనికిన్= ఉగ్రశ్రవసునితో; ఇట్లు+అనిరి= ఈవిధంగా అన్నారు.

**తాత్పర్యం:** పౌరాణికు డైన ఆ ఉగ్రశ్రవసుడు మరల ఆమునుల సముదాయానికి నమస్కరించి, 'నేను అనేకపురాణాలలోని పుణ్యం కలిగించేకథలను చెప్పటంలో సమర్థుడిని; వ్యాసమహామునిశిష్యుడైన రోమహర్షణుడు అనే పరమపౌరాణికుని, కుమారుడిని; నానుండి మీ రేకథ వినాలని కోరుతున్నారు?' అని అడుగగా ఆ మునులు ఉగ్రశ్రవసుడితో ఈవిధంగా పలికారు.

**క. ఏయది హృద్య, మపూర్వం । బేయది, యెద్దాని వినిన నెఱుక సమగ్రం**
**బై యుండు, నఘనిబర్హణ । మే యది? యక్కథయ వినఁగ నిష్టము మాకున్. 30**

**ప్రతిపదార్థం:** ఏ, అది= ఏది; హృద్యము= మనోహరమో; ఏ, అది= ఏది; అపూర్వంబు= క్రొత్తదో; ఏ+దానిన్= దేనిని; వినినన్= వినటంచేత; ఎఱుక= జ్ఞానం; సమగ్రంబు+ఐ= సంపూర్ణమై; ఉండున్=ఉండునో; ఏ+అది=ఏది; అఘ, నిబర్హణము= పాపాలను తొలగించేదో; ఆ+కథ+అ= అట్టికథయే; వినఁగన్= వినటానికి; మాకున్; ఇష్టము= ప్రియం.

**తాత్పర్యం:** ఏకథ మనోహరమో, ఏది క్రొత్తదై వింతగా ఉంటుందో, దేనిని వింటే సంపూర్ణమైన జ్ఞానం కలుగుతుందో, ఏది పాపాలను తొలగిస్తుందో అటువంటి కథయే వినటం మాకు ప్రీతికరం.

**విశేషం:** ఈపద్యం భారతకథకు ఉన్న గుణాలను, గొప్పతనాన్ని, దానిని వినటంవలన కలిగే లాభాలనూ చక్కగా తెల్పుతూ ఉన్నది. పూర్వలాక్షణికులు చెప్పిన కావ్యప్రయోజనాలు కొన్ని ఇందులో సూచింపబడినవి. "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే, శివేతరక్షతయే సద్యఃపరనిర్వృతయే, కాంతాసమ్మితతయోపదేశయుజే'' అని మమ్మటుని కావ్యప్రకాశం. నన్నయ ధ్వనిరససంప్రదాయాలను సమర్థించేవాడు కాబట్టి వర్ణాన్నీ, శబ్దాన్నీకూడా తన రచనలో వ్యంజకాలుగా ప్రయోగిస్తాడు. ఈపద్యంలోని 'యత్, 'తత్' అర్థక శబ్దాలటువంటివి. 'యత్తదోర్నిత్యసంబంధః' అనిప్రమాణం. "ఏయది'' అన్నప్పుడు యదర్థకంతో అంతకుపూర్వం ప్రారంభించబడినదానిని తదర్థకం పరామర్శిస్తుంది. అప్పుడు తదర్థకం 'ప్రక్రాంతపరామర్శకం' అనబడుతుంది. హృద్యం, అపూర్వం మొదలైన లక్షణాలు కల కథ ఏదైతే ఉంటుందో అటువంటి లక్షణాలు కల కథ వినాలనే కోరిక ఇందులో ఉన్నది. లక్ష్యలక్షణవిశిష్ట మైన వస్తుస్వభావం ఇందులో శబ్దమూలక వస్తుధ్వని.

**వ. అనిన నుగ్రశ్రవసుం డట్లేని 'మీకు నభిమతం బైన పుణ్యకథఁ జెప్పెద, దత్తావధానుల రై వినుం' డని శౌనకాదిమహామునుల కిట్లని చెప్పందొడంగె: 'కృష్ణద్వైపాయనుండను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతంబు లై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి, తన శిష్యులయిన పైలవైశం పాయన సుమంతు జైమినులం బంచి క్రమంబునఁ జతుర్వేదసూత్రంబులఁ జేయించి, వేదవ్యాసుండై నిజతపోమహత్త్వంబునం జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుం డై యష్టాదశ పురాణంబులును, నీతిధర్మ శాస్త్రార్థతత్త్వంబులును జతుర్వేద వేదాంతాభిప్రాయంబులును, జతుర్వర్గవర్గాను బంధబంధుర కథేతిహాసంబులును, జతుర్యుగ మహర్షి రాజవంశచరితంబు లును, జతుర్వర్ణాశ్రమధర్మక్రమంబులును, జతుర్ముఖప్రముఖనిఖిలసురముని గణపూజితుం డైన శ్రీకృష్ణునిమాహాత్త్వంబును, బాండవాది భారతవీరుల మహాగుణంబులును దనవిమల జ్ఞానమయం బైన వాగ్దర్పణంబునం దేర్పడి వెలుంగుచుండ. 31**

**ప్రతిపదార్థం:** అనినన్=మునులు ఈ విధంగా పలుకగా; ఉగ్రశ్రవసుండు= సౌతి(కథకుడు); అట్లు+ఏని= అట్లైనచో; మీకున్; అభిమతంబు+ఐన= ఇష్టమైన; పుణ్య, కథన్= పవిత్రమైనకథను; చెప్పెదన్; దత్త+అవధానులరు+ఐ= (ఈయబడిన) ఏకాగ్రతకలవారై; వినుండు; అని; శౌనక+ఆది, మహత్, మునులకున్= శౌనకుడు మొదలైన గొప్పమునులకు; ఇట్లు+అని= ఈవిధంగా; చెప్పన్+తొడంగెన్= చెప్పటానికి ఆరంభించాడు; కృష్ణద్వైపాయనుండు+అను= కృష్ణద్వైపాయనుడు అనేది వ్యాసునిపేరు; బ్రహ్మ+ఋషి= వేదతత్త్వజ్ఞానం కలముని; తొల్లి= పూర్వం; వేదంబులు= ఋగ్వేదం మొదలైనవి; ఏకీభూతంబులు+ఐ= ఒకేరూపం కలవై (విభజింపబడక ఒకేరాశిగా) ఉండి; ఏర్పడక+ఉన్నన్=తేటపడక (వేఱుపడక) ఉండగా; ఋక్, యజుస్, సామ+అథర్వంబులు, కాన్= ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం అనే నాల్గువేదాలు అయ్యేటట్లుగా, విభాగించి= విభజించి (వేరుపరచి); తన, శిష్యులు, అయిన, పైల, వైశంపాయన, సుమంతు, జైమినులన్= పైలుడు, వైశంపాయనుడు, సుమంతుడు, జైమిని అనేవారిని; పంచి= ఆజ్ఞాపించి; క్రమంబునన్= వరుసగా (పైలునిచేత ఋగ్వేదానికి, వైశంపాయనునిచేత యజుర్వేదానికి, సుమంతునిచేత సామవేదానికి, జైమినిచేత అథర్వవేదానికి); చతుర్+వేద సూత్రంబులన్= నాలుగువేదాలకు సంబంధించిన జ్ఞాపక ముంచుకొనటానికి వీలుగా ఉండే సంక్షేపవాక్యాలను (నియమాలను); చేయించి= చేసేటట్లుగా చేసి (వ్రాయించి), వేద, వ్యాసుండు+ఐ= వేదాలను విభజించినవాడు కావటంచేత వేదవ్యాసుడు అనే ప్రసిద్ధి కలవాడై; నిజ, తపస్, మహత్త్వంబునన్, చేసి= తనతపస్సుయొక్క గొప్పతనంచేత; బ్రహ్మచేత, అనుజ్ఞాతుండు+ఐ= ఆజ్ఞాపింపబడినవాడై; అష్టాదశ, పురాణంబులును= పదునెనిమిదిపురాణాలున్నూ; నీతి, ధర్మ, శాస్త్ర+అర్థతత్త్వంబులునున్= నీతిశాస్త్రముయొక్క, ధర్మశాస్త్రముయొక్క అర్థమున్నూ స్వభావమున్నూ; చతుర్+వర్గ+అనుబంధ, బంధుర, కథా,+ఇతిహాసంబులును= ధర్మార్థకామమోక్షా లనే నాలుగుపురుషార్థాలతోను, కామక్రోధాదు లగు ఇతరాలైన తెగలతోను, సంబంధం కల అందమైన కథలున్నూ, పూర్వకథలున్నూ; చతుః, యుగ, మహర్షి, రాజ, వంశ, చరితంబులును= కృతత్రేతాద్వాపరకలియుగాలందలి గొప్పఋషుల యొక్కయు, రాజులయొక్కయు వంశాలయొక్క చరిత్రలున్నూ; చతుర్+వర్ణ+ఆశ్రమ, నాలుగు ఆశ్రమాలయొక్కయు ధర్మాల యొక్క విధములున్నూ; చతుర్+ముఖ, నిఖిల, సుర, గుణ, పూజితుండు+ఐన= నాల్గుముఖాలు కల బ్రహ్మ మొదలైన ఎల్లదేవతలసమూహాలచేత పూజింపబడిన; శ్రీకృష్ణుని మహాత్మ్యంబును= శ్రీకృష్ణుడిమహత్త్వమును; పాండవ+ఆది, భారత, వీరుల, మహత్, గుణంబులును= పాండవులు మొదలైన భారతవీరుల(పరాక్రమవంతుల) గొప్పగుణాలును; తన, విమల, జ్ఞానమయంబు+ఐన= తనయొక్క నిర్మల మైన జ్ఞానంతో నిండిన; వాక్, దర్పణంబు+అందున్= వాక్కు అనే అద్దంలో; ఏర్పడి= తేటతెల్లమై; వెలుంగుచున్, ఉండన్= ప్రకాశిస్తూ ఉండగా.

**తాత్పర్యం:** మునులు ఆవిధంగా పలుకగా సౌతి(ఉగ్రశ్రవసుడు)'అట్లైతే మీకు ప్రియ మైన పవిత్రకథను చెప్తుతాను; ఏకాగ్రచిత్తు లై వినండి' అని శౌనకుడు మొదలైన మునులకు ఈవిధంగా చెప్పటానికి ఆరంభించాడు- కృష్ణద్వైపాయనుడు అనే పేరు కల వేదతత్త్వజ్ఞుడైన ముని పూర్వం వేదాలన్నీ కలిసి వేరువేరుగా లేకుండటంచేత వాటిని ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం అని నాలుగువేదాలుగా విభజించాడు. తనశిష్యు లైన పైలుడు, వైశంపాయనుడు, సుమంతుడు, జైమిని అనేవారిని ఆజ్ఞాపించి వరుసగా ఆ నలుగురిచేత నాలుగువేదాలను ధారణలో ఉంచుకొనటానికి వీలుగా సంక్షేపసూత్రాలను చేయించాడు. వేదాలను విభజించినవాడు కావటంచేత వేదవ్యాసు డని ప్రఖ్యాతిపొందినవాడై, తన తపోమహిమవలన బ్రహ్మచేత ఆజ్ఞాపింపబడి పదునెనిమిది పురాణాలను, నీతిశాస్త్రధర్మశాస్త్రాలయొక్క అర్థాన్నీ స్వభావాన్నీ, నాలుగువేదాలయొక్క, వాటికి సంబంధించిన ఉపనిషత్తులయొక్క భావాలనూ, ధర్మార్థకామమోక్షాదులతోనూ, ఇతరాలైన అరిషడ్వర్గాదులతోనూ సంబంధం గల హృద్యాలైనకథలను ఇతిహాసాలను, కృతత్రేతాద్వాపరకలియుగాలలోని గొప్పమునులయొక్కయు, రాజులయొక్కయు వంశాలచరిత్రలను, బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లనే నాలుగువర్ణాలయొక్కయు, బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థసన్న్యాసాశ్రమాలలోని ధర్మాలయొక్కయు (చేయవలసినవిధుల) విధానాలను, నాలుగుమొగములబ్రహ్మమొదలైన సర్వదేవతలయొక్కయు,

మునులయొక్కయు సమూహాలచేత పూజింపబడిన శ్రీకృష్ణునిమహత్త్వమును, పాండవులు మొదలైన భారతశూరుల గుణగణాలును, నిర్మల మైన జ్ఞానంతో నిండిన తనవాక్కనెడి అద్దంలో తేటతెల్లంగా ప్రకాశిస్తూ ఉండగా- (భారతాన్ని రచించాడని తరువాతిపద్యంతో అన్వయం).

**విశేషం:** పురాణశబ్దానికి అనేకనిర్వచనాలు ఉన్నవి. ప్రాచీనమైనదైనను క్రొత్తగా ఉండేది అని ఒక నిర్వచనం ఉన్నది. సర్గం, ప్రతిసర్గం (ప్రళయాంతంలో మరల చేసేసృష్టి), వంశం (దేవాసురమునీంద్రాదులవంశాలచరిత్రలు), మన్వంతరం, వంశానుచరితం (సూర్యచంద్రాదివంశాలకు చెందినరాజులచరిత్రం) అనేవి పురాణానికి ఉండే ఐదులక్షణాలు. ఇతి+హ+ఆస= ఇట్లుండెను (ఇట్లా జరిగిందని చెప్పబడిఉన్నది) అని ఇతిహాసశబ్దవ్యుత్పత్తి. ధర్మార్థకామమోక్షాలకు సంబంధించిన ఉపదేశాలతో కూడిన కథతో కూడిన పూర్వవృత్తం ఇతిహాసం.

**సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని, । యధ్యాత్మవిదులు వేదాంత మనియు**
**నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని, । కవివృషభులు మహాకావ్య మనియు,**
**లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని, । యైతిహాసికు లితిహాస మనియుఁ,**
**బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ । యం బని, మహిఁ గొనియాడుచుండ.**

**ఆ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ । డాదిముని పరాశరాత్మజుండు**
**విష్ణుసన్నిభుండు విశ్వజనీన మై । పరఁగుచుండఁ జేసె భారతంబు. 32**

**ప్రతిపదార్థం:** ధర్మ, తత్త్వజ్ఞులు= ధర్మముయొక్క నిజమైన స్వభావాన్ని ఎరుగువారు; ధర్మ, శాస్త్రంబు, అని= ధర్మాన్ని తెలిపే శాస్త్రగ్రంథ మనిన్నీ; అధ్యాత్మ, విదులు=పరమాత్మకూ జీవాత్మకూ గల సంబంధాన్ని తెలిసిన వేదాంతులు; వేద+అంతము+అనియున్= వేదాంతశాస్త్ర మనిన్నీ; నీతి, విచక్షణుల్= నీతియందు నేర్పుకలవారు; నీతిశాస్త్రంబు+అని= నీతులు తెల్పే శాస్త్ర మనిన్నీ; కవి, వృషభులు= కవిశ్రేష్ఠులు (సింహ,కుంజర,వృషభాది పదాలు సమాసాలలో ఉత్తరపదా లైతే శ్రేష్ఠతను సూచిస్తాయి); మహత్, కావ్యము అనియున్= గొప్పకావ్యం అనిన్నీ; లాక్షణికులు= రసం, ధ్వని, కావ్యం, అలంకారాలు మొదలైనవాటి లక్షణాలు తెలిసినవారు; సర్వ, లక్ష్య, సంగ్రహము; అని= అన్నిలక్ష్యముల సముదాయంఅనిన్నీ (నిర్వచనం లక్షణం. లక్షణానికి ఉదాహరణం లక్ష్యం); ఐతిహాసికులు= పూర్వం జరిగిన వృత్తాంతాలు తెలిసినవారు; ఇతిహాసము, అనియున్= పూర్వకథాగ్రంథ మనిన్నీ (చరిత్ర అనియు); పరమ, పౌరాణికుల్= ఉత్తములైన పౌరాణికులు (పురాణవిజ్ఞానం తెలిసినవారు, పురాణాలు చెప్పేవారు); బహు, పురాణ, సముచ్చయంబు+అని= పెక్కుపురాణాల సముదాయ మనిన్నీ; మహిన్= భూమియందు; కొనియాడుచున్+ఉండన్= పొగడుతూఉండగా; వివిధ, వేద, తత్త్వవేది= పలువిధాలైన వేదాల సత్యస్వభావాన్ని ఎరిగినట్టి వాడున్నూ; వేదవ్యాసుఁడు= వేదాలను విభజించినవాడున్నూ; ఆదిముని= ప్రాచీనులైన మునుల్లో ఒకడున్నూ; విష్ణుసన్నిభుండు= విష్ణువుతో సమానమైనవాడున్నూ,; అయిన; పరాశర+ఆత్మజుండు= పరాశరుడికి దాశకన్యయందు పుట్టిన కుమారుడు, కృష్ణద్వైపాయనుడు; విశ్వజనీనము+ఐ= సర్వజనులకును హిత మై; పరఁగుచున్, ఉండన్= ఒప్పుచుండేటట్లుగా; భారతంబు= భరతవంశీయులవృత్తాంతాన్ని తెలుపు భారత మనే మహాగ్రంథాన్ని; చేసెన్= రచించాడు.

**తాత్పర్యం:** ధర్మస్వభావం తెలిసినవారు ధర్మశాస్త్రగ్రంథ మనిన్నీ, పరమాత్మ జీవాత్మలసంబంధం తెలిసిన వేదాంతులు వేదాంతశాస్త్ర మనిన్నీ, నీతివిషయాలయందు నేర్పుకలవారు నీతులను తెల్పే శాస్త్ర మనిన్నీ, కవిశ్రేష్ఠులు గొప్పకావ్య మనిన్నీ, లక్షణం తెలిసినవారు పెక్కులక్ష్యాల సంపుటి అనిన్నీ, పూర్వకథలు తెలిసినవారు ఇతిహాస మనిన్నీ, ఉత్తమపౌరాణికులు పెక్కుపురాణాల సమూహ మనిన్నీ, భూమియందు పొగడుతూ ఉండగా సర్వవేదాల

సత్యస్వరూపాన్ని ఎరిగినవాడున్నూ, వేదాలను విభజించివేదవ్యాసు డనే పేరు పొందినవాడున్నూ, ప్రాచీనమునియున్నూ, విష్ణువుతో సమానుడున్నూ అయిన పరాశరునికుమారుడు (కృష్ణద్వైపాయనుడు) సర్వజనులకు హితమై ఒప్పేటట్లుగా సంస్కృతంలో భారత మనే గ్రంథాన్ని రచించాడు.

**విశేషం:** అలం: ఉల్లేఖం. 'య ది హాస్తి త దన్యత్ర య న్నే హాస్తి న త త్క్వచిత్' అని భారతాన్నిగురించి చెప్పుతూ ఉంటారు. ఇందులో ఉన్నది వేరేచోట ఉండవచ్చును. ఇందులో లేనిది మరెచ్చటా ఉండదు అని ఈ శ్లోకభావం. ఈ విషయాన్నే నన్నయ పై పద్యంలో తెల్పిఉన్నాడు. భారతంలో ధర్మాలు, వేదాంతం, నీతులు, రసపాత్రపోషణాదు లైన కావ్యలక్షణాలు, వివిధలక్షణాలకు లక్ష్యాలు, పూర్వకథలు, పురాణవృత్తాంతాలు మొదలైనవన్నీ ఉంటాయి. ఇది ఒకవిజ్ఞానకోశం. కృష్ణద్వైపాయనుడు పరాశరు డనేమునికీ దాశకన్యకూ యమునాద్వీపంలో పుట్టాడు. ఆ వృత్తాంతం ముందు చెప్పబడుతుంది. 'వ్యాసో నారాయణో హరిః ' అని సూక్తి. భాగవతంలో చెప్పబడిన విష్ణువు ఎత్తిన ఇరువదియొక్క అవతారాలలో వ్యాసుడు ఒకడు. అందుచేత విష్ణుసన్ని'భుడు అని చెప్పబడినాడు. భారతం అన్నిమతాలవారికిన్నీ, సర్వజనులకున్నూ హితం చేకూర్చేది. పంచమవేద మని ప్రసిద్ధిచెందింది. శాస్త్రకారులు ముందు లక్షణం చెప్పి తరువాత దానికి లక్ష్యం ఉదాహరణంగా చెప్పుతారు. ధర్మనీతి వేదాంతవ్యాకరణాదిశాస్త్రాలలో చెప్పబడిన లక్షణాలకు లక్ష్యాలు భారతంలో ఉంటాయి. కావ్యానికి అనేకనిర్వచనా లున్నవి. రసాత్మకమైనవాక్యం (వాక్యం రసాత్మకం కావ్యమ్.) అనేది వాటిలో ఒకటి. ఇతిహాసం చరిత్ర. జరిగిన వృత్తాంతాన్ని అది చెప్పుతుంది. సంస్కృతమహాభారతం శాస్త్రేతిహాసం. ఆంధ్రమహాభారతం కావ్యేతిహాసం.

## పర్వానుక్రమణిక - (సం. 1-2-34)

**వ.** **అదియునుంబౌష్యంబు, పౌలోమం, బాస్తీకం, బాదివంశావతారంబు, సంభవపర్వంబు, జతుగృహదాహంబు, హైడింబంబు, బకవధ, చైత్రరథంబు, ద్రౌపదీస్వయంవరంబు, వైవాహికంబు, విదురాగమనంబు, రాజ్యార్ధలాభం, బర్జునతీర్థయాత్ర, సుభద్రాకల్యాణంబు, హరణహారిక, ఖాండవదహనంబు, మయదర్శనంబు, సభాపర్వంబు, మంత్రపర్వంబు, జరాసంధవధ, దిగ్విజయంబు, రాజసూయం, బర్ఘ్యాభిహరణంబు, శిశుపాలవధ, ద్యూతం, బనుద్యూతం, బారణ్యంబు, కిమ్మీరవధ, కైరాతం, బింద్రలోకాభిగమనంబు, ధర్మజతీర్థయాత్ర, జటాసురవధ, యక్షయుద్ధం, బాజగరంబు, మార్కండేయోపాఖ్యానంబు, సత్యాద్రౌపదీసంవాదంబు, ఘోషయాత్ర, ప్రాయోపవేశంబు, వ్రీహిద్రోణకాఖ్యానంబు, ద్రౌపదీహరణంబు, కుండలాహరణం, బారణేయంబు, వైరాటంబు, కీచకవధ, గోగ్రహణం, బభిమన్యువివాహం, బుద్యోగంబు, సంజయయానంబు, ధృతరాష్ట్రప్రజాగరణంబు, సానత్సుజాతంబు, యానసంధి, భగవద్యానంబు, సేనానిర్యాత్ర, యులూకదూతాభిగమనంబు సమరథాతిరథసంఖ్యానంబు, కర్ణభీష్మవివాదం, బంబోపాఖ్యానంబు, జంబూఖండవినిర్మాణంబు, భూమిపర్వంబు, భీష్మాభిషేకంబు, భగవద్గీత, భీష్మవధ, ద్రోణాభిషేకంబు, సంశప్తకవధ, అభిమన్యువధ, ప్రతిజ్ఞాపర్వంబు, జయద్రథవధ, ఘటోత్కచవధ, ద్రోణవధ, నారాయణాస్త్రప్రయోగంబు, కర్ణపర్వంబు, శల్యపర్వంబు, హ్రదప్రవేశంబు, గదాయుద్ధంబు, సారస్వతంబు, సౌప్తికపర్వం, బైషీకంబు, జలప్రదానంబు, స్త్రీపర్వంబు, శ్రాద్ధపర్వంబు, రాజ్యాభిషేకంబు, చార్వాకనిగ్రహంబు, గృహప్రవిభాగంబు, శాంతిపర్వంబు, రాజధర్మానుకీర్తనం, బాపద్ధర్మంబు, మోక్షధర్మం, బానుశాసనికంబు, భీష్మస్వర్గారోహణం, బాశ్వమేధికం, బనుగీత,**

**యాశ్రమవాసంబు, పుత్త్రసందర్శనంబు, నారదాగమనంబు, మౌసలంబు, మహాప్రస్థానికంబు, స్వర్గారోహణంబు, హరివంశంబు, భవిష్యత్పర్వంబు నను శతపర్వంబులు గలిగి. 33**

**వివరణ:** అనుక్రమణిక అంటే విషయసూచిక. ఇది ఒకగ్రంథంలో ఏ విషయం తరువాత ఏ విషయం వస్తుందో క్రమంగా తెల్పుతుంది. సంస్కృతభారతంలో నూరు ఉపపర్వాలు ఉన్నవి. వాటిలో 98 ఉపపర్వాలను భారత కవిత్రయంవారు 18 పర్వాలుగా రచించారు. హరివంశ భవిష్యత్పర్వాలను ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశ మనేపేరుతో అనువదించాడు. అందులో విష్ణుపర్వంకూడా ఉన్నది. నన్నయ దానిని నూరుపర్వాలలో పేర్కొని ఉండలేదు. సంస్కృతభారతంలోని నూరుపర్వాలలో దేనితరువాత ఏది వస్తుందో ఈ పర్వానుక్రమణికలో తెల్పబడింది.

**ప్రతిపదార్థం:** ఆదియున్= ఆవ్యాసుడు రచించిన భారతమును, 1. పౌష్యంబు= ఉదంకుడు గురుపత్నికొరకు పౌష్యుడనే రాజుదేవికుండలాలను తెచ్చిన వృత్తాంత మీపర్వంలో ఉంటుంది. 2. పౌలోమంబు= పులోము డనే రాక్షసుడు భృగుపత్ని యైన పులోమ నెత్తుకొనిపోతూఉండగా ఆమెగర్భంనుండి జారి చ్యవనుడు జన్మించినవృత్తాంతంతో కూడింది; 3. ఆస్తీకంబు= ఆస్తీకు డనే జరత్కారుకుమారుడు జనమేజయుడు చేసే సర్పయాగాన్ని మాన్పించినకథ ఇందులో ఉంటుంది; 4. ఆది, వంశ+అవతారంబు= మొదటివంశాలపుట్టుక; ఇందులో వ్యాసుడిజన్మం, దేవతలు దైత్యులు, దానవులు, మునులు, యక్షులు, పక్షులు, గంధర్వులు మొదలైనవారిపుట్టుక, వారిఅంశాలతో పుట్టినవారిచరిత్ర, రాజవంశోత్పత్తి మొదలైన వృత్తాంతాలు ఉంటాయి; 5. సంభవపర్వంబు= భీష్ముడు, చిత్రాంగద విచిత్ర వీర్యులు, ధృతరాష్ట్రపాండురాజులు, విదురుడు, పాండవకౌరవులు, కృపద్రోణులు మొదలైన వారి జన్మవృత్తాంతాలతో కూడినపర్వం; 6. జతుగృహదాహంబు= లక్కయింటిని తగులబెట్టటం; 7. హైడింబంబు= విదురుడు ఉపదేశించినమార్గంలో పాండవులు వారణావతంనుండి వెలువడి వెడలటం, భీముడు హిడింబాసురుడిని వధించి హిడింబను వివాహమాడటం మొదలైన వృత్తాంతాలు ఇందులో ఉంటాయి; 8. బకవధ= ఏకచక్రపురంలో భీముడు బకాసురుడిని చంపటం; 9. చైత్రరథంబు= అంగారపర్ణుడనే గంధర్వుడు దగ్ధరథు డై చిత్రరథుడనే పేరుంచుకొని అర్జునుడితో సఖ్యంచేయటం, వసిష్ఠోర్వోపాఖ్యానం, తపతీసంవరణోపాఖ్యానం చెప్పటం, అతనిఉపదేశం అనుసరించి పాండవులు ధౌమ్యుడిని పురోహితునిగా వరించటం ఇందులో ఉన్నవి. 10.ద్రౌపదీస్వయంవరంబు= ద్రుపదుడు ద్రౌపదీస్వయం వరాన్ని చాటగా అందులో అర్జునుడు మత్స్యయంత్రాన్ని భేదించటం, ద్రౌపది అతడిని వరించటం, ఇందులో ఉన్నవి. 11. వైవాహికంబు= పాండవులు ద్రౌపదిని వివాహమాడటం. 12. విదుర+ఆగమనంబు= విదురుడిరాక; ధృతరాష్ట్రుడు అర్ధరాజ్య మివ్వటానికి నిశ్చయించి పాండవులను తోడితెమ్మని విదురుడిని పంపగా, విదురుడు ద్రుపదుడినగరానికి రావటం ఇందుంటుంది. 13. రాజ్య+అర్ధ, లాభంబు= పాండవులు అర్ధ(సగం)రాజ్యం పొందటం; 14. అర్జున, తీర్థ, యాత్ర= నారదుడు చేసిన నియమాన్ని అనుసరించి ద్వాదశమాసికవ్రతాన్ని పాటించటానికై అర్జునుడు తీర్థయాత్రలు సేవించటానికై పోవటం; 15. సుభద్రా, కల్యాణంబు= సుభద్రయొక్కవివాహం, సన్న్యాసివేషంలో అర్జునుడు ద్వారకకు వెళ్ళటం, కృష్ణుడిసాయంతో సుభద్రను తీసికొనిపోవటం, సుభద్రార్జునులవివాహం ఈ పర్వంలో ఉన్నవి. 16. హరణ, హారిక= వివాహకాలంలో అల్లుడికీ, ఆడుబిడ్డకూ ఈయబడే ధనం హరణం. దీని వికృతి అరణం. బలరామకృష్ణాదులు సుభద్రకు అరణం తెచ్చిఇవ్వటం ఈ పర్వంలో ఉన్నది. 17. ఖాండవ, దహనంబు= అగ్నిదేవుడికోరిక ననుసరించి అర్జునుడు ఇంద్రుడిఖాండవవనాన్ని దహించటం. 18. మయ, దర్శనంబు= మయుడిని చూడటం, మయుడు నముచి అనే దానవుడి తమ్ముడు, దానవ విశ్వకర్మ. ఖాండవదహనసమయంలో ఇతడు అర్జునుడిని శరణుపొందగా అర్జునుడు ఇతనిని రక్షించాడు. మయుడు, అశ్వసేనుడు, మందపాలసుతులైన నలుగురు శార్ఙ్గకులు- ఈఆరుగురే ఖాండవదహనసమయంలో రక్షింపబడ్డారు. ఈపదునెనిమిదీ ఆదిపర్వంలోని ఉపపర్వాలు. 19. సభాపర్వంబు= ధర్మరాజుకు మయుడు అపూర్వ మైన సభను నిర్మించి ఇవ్వటం, నారదుడు అరుగుదెంచి దిక్పాలకులసభలను వర్ణించి చెప్పటం ఇందులో ఉన్నవి. 20. మంత్ర, పర్వంబు= ధర్మరాజు రాజసూయయాగాచరణాన్ని గురించి కృష్ణుడితో

ఆలోచించటం ఇందులో ఉన్నది. 21. జరాసంధవధ= కృష్ణుడు భీమార్జునులతో వెళ్ళి భీమునిచేత జరాసంధుడిని చంపించటం ఇందులోని విషయం. 22. దిక్, విజయంబు= రాజసూయయాగాచరణానికి ముందు భీమార్జునాదులు సర్వదిక్కులలో ఉన్నరాజులను జయించి ధనం తేవటం; 23. రాజసూయంబు= ధర్మరాజు రాజసూయయాగం చేయటం; 24. అర్ఘ్య+అభిహరణంబు= అర్ఘ్యము - అంటే పూజకు తగినవస్తువు; అభిహరణము= తెచ్చుట; భీష్మునిఉపదేశప్రకారం రాజసూయయాగంలో ధర్మజుడు అర్ఘ్యాన్ని శ్రీకృష్ణుడికి ఇవ్వటం; 25. శిశుపాల, వధ= శిశుపాలుడు అధిక్షేపించి నిందించగా కృష్ణుడు శిశుపాలుడిని వధించటం; 26. ద్యూతంబు= మయసభను చూచి అసూయతో కృశించిన దుర్యోధనుడిని 'జూదంలో ఓడించి పాండవరాజ్యమంతా నీకు వశమయ్యేటట్లు చేస్తా' నని శకుని ఓదార్చటం, విదురుడు ఇష్టంలేకపోయినా ధృతరాష్ట్రుని ఆజ్ఞచేత ధర్మరాజును ద్యూతానికి తీసికొని రావటం, ధర్మజుడు శకునితో జూదమాడి సర్వస్వాన్నీ ఒడ్డి ఓడిపోవటం ఇందలి విషయాలు. 27. అనుద్యూతంబు= తిరిగి జూదమాడటం, ధృతరాష్ట్రుడు ద్రౌపదికి కోరినవరా లివ్వటం, ధర్మరాజు శకునితో రెండవమారు జూదమాడి ఓడిపోవటం ఇందులో ఉన్నవి. ఈ తొమ్మిదీ సభాపర్వంలోని ఉపపర్వాలు. 28. ఆరణ్యంబు= పాండవులు ద్రౌపదితోకూడి అరణ్యవాసానికి వెళ్ళటం. 29. కిమ్మీర, వధ= అరణ్యంలో భీముడు కిమ్మీరు డనేరాక్షసుడిని వధించటం; కిమ్మీరుడు బకాసురుడి తమ్ముడు, హిడింబుడిమిత్రుడు; 30. కైరాతంబు= కిరాతరూపంలో ఉన్న శివుడికి సంబంధించింది. అర్జునుడు దివ్యాస్త్రాలు పొందటానికై తపస్సుచేయటానికి పోవటం, కిరాతరూపంలో ఉన్న శివుడితో పోరి అతడిని మెప్పించి పాశుపతాస్త్రాన్ని పొందటం అనేవిషయాలు ఇందులో ఉన్నవి. 31. ఇంద్ర, లోక+అభిగమనంబు= పాశుపతాస్త్రలాభానంతరం అర్జునుడు ఇంద్రుడి ఆహ్వానాన్ని మన్నించి మాతలి తెచ్చిన రథంమీద ఇంద్రలోకానికి (స్వర్గానికి)వెళ్ళటం; 32. ధర్మజ, తీర్థయాత్ర= రోమశుడు అర్జునుడి కుశలవార్త తెలిపినపిమ్మట ధర్మజుడు వివిధతీర్థాలను దర్శించటానికి పోవటం; 33. జటాసురవధ= సౌగంధికాపహరణం తరువాత బ్రాహ్మణవేషంతో పరశురామశిష్యుడ నని వచ్చి తమ కపకారం చేసిన జటాసురుడిని భీముడు వధించటం; 34. యక్షయుద్ధంబు= పాండవులు మాల్యవంత మనే పర్వతంమీద విహరించేటప్పుడు ద్రౌపదికోరిక తీర్చటానికి పంచవర్ణసురభికుసుమాలను తీసికొనిరావటానికి కుబేరనగరానికి వెళ్ళి మణిమంతుడు మొదలైన యక్షరాక్షసులతో యుద్ధం చేయటం; 35 ఆజగరంబు= అజగర మంటే పెద్దపాము, కొండచిలువ. దానికి సంబంధించిన పర్వం. మునిశాపంవలన అజగర మైన నహుషుడు భీముడిని పట్టుకొనగా, ధర్మరాజు వెదకటానికి వెళ్ళి, నహుషప్రశ్నలకు సమాధానాలు చెప్పి, అతనివలన అధ్యాత్మరహస్యాన్ని తెలిసికొనటం. 36. మార్కండేయ+ఉపాఖ్యానంబు= మార్కండేయమహర్షి పాండవులయొద్దకు వచ్చి బ్రాహ్మణప్రభావాన్నీ, వివిధఉపాఖ్యానాలను చెప్పటం; 37. సత్యా, ద్రౌపదీ, సంవాదంబు= సత్యభామకూ, ద్రౌపదికీ జరిగిన సంభాషణం; ద్రౌపది సత్యభామకు పతివ్రతాధర్మాలను చెప్పటం; 38. ఘోషయాత్ర= ఘోషమంటే గొల్లపల్లె, ఆవులమంద, కర్ణసౌబల దుర్యోధనాదులు పాండవులను అధిక్షేపించటానికై ఆవులమందను చూచే నెపంతో ద్వైతవనానికి పోవటం; 39. ప్రాయోపవేశంబు= మరణించటంకొరకు ఆహారాది సర్వకర్మలను విడిచి కూర్చుండటం; అవమానం పొందిన దుర్యోధనుడు ప్రాయోపవేశం చేయగా అతడిని కృత్య పాతాళానికి తీసికొనిపోవటం; 40. వ్రీహి, ద్రోణక+అఖ్యానంబు= వ్రీహి అంటే ధాన్యం(వడ్లు), ద్రోణకం అంటే తూము(కొలమానం), ఆఖ్యానం అంటే కథ; వ్యాసుడు ధర్మరాజుకు ముద్గలు డనే విప్రుడు ఉంఛవృత్తిచేత పాడ్యమిమొదలు పదునాలుగుదినాలు ఒక్కొక్కగింజచొప్పున తూమెడువడ్లు సమకూర్చి పర్వదినాన వండించి దేవతలకూ, పితరులకూ పూజలుచేసి, అతిథులకు అన్నంపెట్టి మిగిలినఅన్నంతో సకుటుంబంగా దేహయాత్ర నడపుతూ ఉండగా దుర్వాసుడు అరుదెంచి ఆరుపర్వములు భుజించి అతనియందు ఏ లోపాన్నీ కనలేక 'మేనితో స్వర్గానికి ఏగుదు' వని చెప్పి వెడలినకథ తెల్పటం. 41. ద్రౌపదీ, హరణంబు= సైంధవుడు ద్రౌపదిని బలాత్కారంగా ఎత్తుకొనిపోవటం. 42. కుండల+ఆహరణంబు= పాండవులకు హితం చేయవలె ననే కోరికతో ఇంద్రుడు బ్రాహ్మణవేషంతో వచ్చి కర్ణుడికుండలాలను గ్రహించటం; 43. అరణేయంబు= త్రచ్చి నిప్పుపుట్టించే కొయ్యకు అరణి అని పేరు. చెట్టుకొమ్మకు తగిలించిన తన అరణిని ఒకమృగం కొనిపోగా దానిని తెచ్చిఇమ్మని ఒకబ్రాహ్మణుడు వేడగా ధర్మజాదులు ఆ మృగాన్ని తరుముకొని పోవటం. అది అదృశ్య మవటం, యక్షప్రశ్నలు - అనేఅంశాలు ఈ పర్వంలో ఉన్నవి. ఈ విధంగా ఆరణ్యపర్వంలో

గల ఉపపర్వాలసంఖ్య పదహారు(16). 44. వైరాటంబు= విరాటునికి సంబంధించినది; పాండవులు అజ్ఞాతవాసం చేయటానికి విరటుడినగరానికి వెళ్ళటం; 45. కీచక, వధ= సైరంధ్రిగా ఉన్న ద్రౌపదిని వలచిన కీచకుడిని భీముడు సంహరించుట; 46. గో, గ్రహణంబు= దుర్యోధనాదులు విరాటుడి గోవులను గ్రహించిపోతూ ఉండగా అర్జునుడు ఉత్తరుడితో వెడలి కౌరవసేనలను ఓడించి గోవులను మరల్చటం; అంతకుముందు దక్షిణగోగ్రహణం; 47. అభిమన్యు, వివాహంబు= అభిమన్యుడు విరాటనందన ఐన ఉత్తరను పెండ్లాడటం. ఈవిధంగా విరాటపర్వంలో నాలుగుఅంతఃపర్వాలు ఉన్నవి. 48. ఉద్యోగంబు= ప్రయత్నం; ఉద్యోగపర్వంలో మొదట సంధికొరకు ప్రయత్నం, చివర యుద్ధంకొరకు ప్రయత్నం జరిగినవి; 49. సంజయ, యానంబు= సంజయుడు సంధికై ఉపప్లావ్యంలో ఉన్నపాండవులకడకు పోవటం; 50. ధృతరాష్ట్రప్రజాగరణంబు= సంజయుడు పాండవులయొద్దనుండి వచ్చి ధృతరాష్ట్రుడి ఉపేక్షయే యుద్ధోపద్రవానికి కారణ మని చెప్పి మరునాడు వివరాలను తెలుపుతా నని చెప్పి వెడలిపోతాడు; భయంచేత ధృతరాష్ట్రుడికి నిద్ర పట్టలేదు; అతడు మేల్కొనిఉండి విదురుడిని పిలిపించి నీతులు బోధింపుమన్నాడు. ప్రజాగరణ మంటే నిద్రపోకుండా మేల్కొని ఉండటం; 51. సానత్సుజాతంబు= సనత్సుజాతుడు అరుదెంచి ధృతరాష్ట్రుడికి ధర్మతత్త్వాన్ని బోధించటం; ఇదే సనత్సుజాతీయం; 52. యాన, సంధి= శ్రీకృష్ణుడు హస్తినాపురానికి వెళ్ళి పాండవులసంధియత్నాన్ని కురుసభలో వివరించవలె నని ధర్మరాజాదులు ప్రార్థించే విషయాలు ఇందులో ఉన్నవి; 53. భగవత్, యానంబు= భగవంతుడైన శ్రీకృష్ణుడు సంధికొరకు హస్తినాపురానికి పోవటం; 54. సేనా, నిర్యాత్ర= సేనల సమీకరణం; 55. ఉలూక, దూత, అభిగమనంబు= ఉలూకుడు శకునికుమారుడు; అతడు దూతగా ధృతరాష్ట్రుడు పంపగా పాండవులకడకు అరుదెంచటం; 56. సమరథ, అతిరథ, సంఖ్యానంబు= ఒకవిలుకాడితో సమంగా నిలిచి పోరగలిగిన యోధుడు సమరథుడు. పలువురువిలుకాండ్రతో పోరగలిగిన యోధుడు అతిరథుడు. కౌరవపాండవపక్షాలలో సమరథు లెవరో, అతిరథు లెవరో లెక్కించటం; 57. కర్ణ భీష్మవివాదంబు= భీష్ముడు కర్ణుడిని అర్ధరథుడిగా లెక్కించగా కర్ణుడు కలహించి భీష్మ డున్నంతవరకు యుద్ధం చేయ నని శపథంచేయటం; 58. అంబా+ఉపాఖ్యానంబు= కాశీరాజుకూతులలో పెద్దదైన అంబకథ; ఈ విధంగా ఉద్యోగపర్వంలో పదకొండుఉపపర్వా లున్నవి. 59. జంబూ, ఖండ, వినిర్మాణంబు= మేరుపర్వతంచుట్టూ ఉన్న ఏడుఖండాలలో జంబూఖండ మొకటి. ఆ ఖండముయొక్కనిర్మాణాన్ని గురించి సంజయుడు ధృతరాష్ట్రుడికి ఎరిగించటం; 60. భూమి, పర్వంబు= ఈ పర్వంలో భూమివిస్తారం వివరించబడింది; 61. భీష్మ+అభిషేకంబు= భీష్ముడిని కౌరవసేనకు నాయకునిగా అభిషేకించటం; 62. భగవత్, గీత= కౌరవపక్షాన ఉన్న గురుబంధుమిత్రాదులను చూచి, వారితో పోరాటం చేయజాలనని విషాదాన్ని పొందిన అర్జునుడికి కృష్ణుడు తత్త్వాన్ని బోధించి అతడిని యుద్ధోన్ముఖుడిని చేయటం; భగవంతుడైన శ్రీకృష్ణుడిచే బోధింపబడటంచేత ఈభాగానికి 'భగవద్గీత' అనే పేరు వచ్చింది. అది ఉన్న పర్వం ఇది. 63. భీష్మ, వధ= భీష్ముడిని సంహరించటం (నిజంగా ఇచ్చట భీష్మవధ జరుగలేదు. అర్జునుడు శిఖండిని రథంలో ఉంచుకొని యుద్ధానికి రాగా భీష్ముడు యుద్ధవిముఖుడై శరతల్పగతు డైనాడు). ఈ విధంగా భీష్మపర్వంలో అయిదు ఉపపర్వాలు ఉన్నవి. 64. ద్రోణ+అభిషేకంబు= ద్రోణుడిని సేనానాయకుడిగా అభిషేకించటం; 65. సంశప్తకవధ= (సమ్యక్ శప్త మంగీకారో యస్య సః సంశప్తకః) యుద్ధంనుండి తిరుగ నని శపథం చేసి యుద్ధంచేస్తూ ఇతరులను యుద్ధంచేయకుండా ఆటంకపరిచేవాడు సంశప్తకుడు. అభిమన్యువధకు ముందు అర్జునుడు సంశప్తకులు తొమ్మిది మందితో యుద్ధంచేయటానికి పోయి వారిని వధించటం. 66. అభిమన్యు, వధ= ద్రోణాదులు పలువురు కూడి పద్మవ్యూహాన్ని భేదించిన అభిమన్యుడిని వధించటం; 67. ప్రతిజ్ఞాపర్వంబు= జయద్రథుడు సైంధవుడు. అతడిని చంపుతానని అర్జునుడు శపథం చేసినపర్వం. 68. జయద్రథవధ= సైంధవుడిని వధించటం; 69. ఘటోత్కచవధ= భీముడి కుమారు డైన ఘటోత్కచుడిని వధించటం; 70. ద్రోణవధ= ద్రోణుడిని వధించటం; 71. నారాయణ+అస్త్ర, ప్రయోగంబు= కర్ణుడు సేనానాయకుడుగా ఉన్నాడు. అప్పుడు జరిగిన యుద్ధంతో కూడిన పర్వం. 73. శల్యపర్వంబు= శల్యుడు ఒక్కపగలు సేనానాయకుడుగా ఉన్నాడు. అప్పుడు జరిగిన యుద్ధంతో కూడిన పర్వం. 74. హ్రదప్రవేశంబు= దుర్యోధనుడు జలస్తంభనవిద్యచే మడుగులోకి ప్రవేశించటం; 75. గదాయుద్ధంబు= భీమదుర్యోధనులకు గదాయుద్ధం జరగటం; 76. సారస్వతంబు= సరస్వత్యాది పుణ్యతీర్థసంకీర్తనం; ఈ విధంగా శల్యపర్వంలో నాలుగు ఉపపర్వాలు

ఉన్నవి. 77. సౌప్తికంబు= సుఖంగా నిద్రిస్తున్న ధృష్టద్యుమ్నాది పాంచాలురను, ప్రతివింధ్యాది ద్రౌపదేయులను (ఉపపాండవులను), పాండవామాత్యులను అశ్వత్థామ వధించటం 78. ఐషీకంబు= అశ్వత్థామ, అర్జునుడు పరస్పరం బ్రహ్మ శిరోనామకాస్త్రాలను ప్రయోగించుకోవటం. 79. జలప్రదానంబు= యుద్ధంలో చనిపోయినవారికి జలతర్పణం ఇవ్వటం; (ఇది తెలుగున స్త్రీపర్వం మొదట్లో ఉన్నది). ఈ విధంగా సౌప్తికపర్వంలో మూడుఉపపర్వాలు ఉన్నవి. 80. స్త్రీ, పర్వంబు= యుద్ధంలో మరణించిన వీరులభార్యలు విలపించినపర్వం; 81. శ్రాద్ధపర్వంబు= మృతు లైనకౌరవవీరులకు సంస్కారోదకప్రదానాదికర్మ లొనరించటం; 82.రాజ్య+అభిషేకంబు= ధర్మరాజును రాజుగా అభిషేకించటం; 83. చార్వాక, నిగ్రహంబు= ధర్మరాజును మోసగించటానికై సన్న్యాసివేషంలో వచ్చిన చార్వాకుడనే రాక్షసుడిని బ్రాహ్మణులు హుంకారంతో చంపటం; 84. గృహ, ప్రవిభాగంబు= ధర్మజుడు తనకు పరిపాలనలో తోడ్పడుటకు భీమాదులకు ఆయా బాధ్యతలను విభజించి ఒప్పగించటం. ఈ విధంగా స్త్రీపర్వంలో ఐదు ఉపపర్వాలు ఉన్నవి. వీటిలో చివరి మూడూ తెలుగుభారతంలో శాంతి పర్వంలో మొదట చెప్పబడినవి. 85. శాంతిపర్వంబు= బంధువధచే నిర్వేదం పొందిన ధర్మరాజు శ్రీకృష్ణుడివచనాలు విని శాంతు డైన పర్వం; 86. రాజ, ధర్మ+అనుకీర్తనంబు= శరతల్పగతుడైన భీష్ముడు ధర్మజుడికి రాజుల కందరికి హితా లైన ధర్మాలను చెప్పటం. 87. ఆపత్+ధర్మంబు= ఆపత్ సమయాలలో అనుష్ఠింపదగిన ధర్మాలను భీష్ముడు  చెప్పటం; 88. మోక్ష, ధర్మంబు= మోక్షప్రాప్తిహేతువు లైన ధర్మాలు చెప్పటం; ఈ విధంగా శాంతిపర్వంలో నాలుగు ఉపపర్వాలు ఉన్నవి. 89. అనుశాసనికంబు= భీష్ముడు ధర్మరాజుకు వివిధధర్మాలు తెల్పటం; 90. భీష్మ, స్వర్గ+ఆరోహణంబు= భీష్ముడు కృష్ణునిఅనుజ్ఞ తీసికొని స్వర్గానికి ఏగటం;- ఈ రెండున్నూ అనుశాసనికపర్వంలోని ఉపపర్వాలు. 91. ఆశ్వమేధికంబు= ధర్మరాజు భీష్మాదులను చంపినపాపం పోవటానికై వ్యాసప్రబోధితు డై అశ్వమేధయాగం చేయటం; 92. అనుగీత= యుద్ధసమయాన చెప్పిన గీతాతత్త్వాన్ని మరచిన అర్జునుడిని మందలించి కృష్ణుడు మరల తత్త్వోపదేశం చేయటం;  ఈరెండున్నూ అశ్వమేధపర్వంలోని ఉపపర్వాలు. 93. ఆశ్రమవాసంబు= ధృతరాష్ట్రుడూ, గాంధారీ రాజ్యాన్ని విడిచి సంజయునితోకూడి ఆశ్రమంలో నివసించటానికి వనానికి పోవటం; 94. పుత్రసందర్శనంబు= యుద్ధనిహతు లైన పుత్రపౌత్రులనందరిని ధృతరాష్ట్రుడు వ్యాసవరప్రసాదంవలన చూచి విగతశోకుఁ డయి పరమసిద్ధికి వెడలటం; 95. నారద+ఆగమనంబు= నారదుడిరాక- ఈ విధంగా ఆశ్రమవాసపర్వంలో మూడుఉపపర్వాలు ఉన్నవి. 96. మౌసలంబు= ముసలము అంటే రోకలి; దానికి సంబంధించింది. యాదవులు మదిరాపానమత్తులై సముద్రతీరాన తమలో తాము పోరి మరణించటం; 97. మహత్+ప్రస్థానికంబు= పరీక్షిత్తుకు రాజ్యాభిషేకం చేసి పాండవులు ద్రౌపదీసహితు లై పరమసిద్ధికి వెళ్ళటం. 98. స్వర్గ+ఆరోహణంబు= పాండవాదులు స్వర్గానికి పోవటం; 99. హరివంశంబు; 100. భవిష్యత్పర్వంబు- ఈ రెండింటికి ఖిలపర్వం అనిపేరు. నన్నయ విష్ణుపర్వాన్ని పేర్కొనలేదు. ఎట్లైన ఇందులోని కొంతభాగాన్ని పూర్వార్ధంలోనూ, కొంతభాగం ఉత్తరార్ధంలోనూ చేర్చి హరివంశం రచించాడు. కేసరిమోహన్‌గంగూలిగారు తమ ఆంగ్లానువాదంలో విష్ణుభవిష్యత్ పర్వాలు రెండున్నూ ఖిలవంశ పురాణ మనబడు నని తెల్పియున్నారు. అను, శతపర్వంబులు= పైన పేర్కొనబడిన నూరుపర్వాలు; కలిగి= కలిగియుండి.

**తాత్పర్యం:** స్పష్టం.

**సీ.** **ఆయురర్థులకు దీర్ఘాయు రవాప్తియు । నర్థార్థులకు విపులార్థములును**
**ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తియు । వినయార్థులకు మహావినయమతియుఁ**
**బుత్త్రార్థులకు బహుపుత్త్రసమృద్ధియు । సంపదర్థుల కిష్టసంపదలును**
**గావించు నెప్పుడు భావించి వినుచుండు । వారికి నిమ్మహాభారతంబు**

**ఆ.** **భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ । వల్లభుండు భక్తవత్సలుండు**
**భవభయంబు లెల్లఁ బాచి యిష్టార్థసం । సిద్ధిఁ గరుణతోడఁ జేయునట్లు.** **34**

**ప్రతిపదార్థం:** ఈ, మహత్, భారతంబు= ఈ మహాభారతేతిహాసం; ఎప్పుడు= ఎల్లప్పుడున్నూ; భావించి= ధ్యానించి(తలంచి); వినుచున్+ఉండు, వారికి; భక్తి, యుక్తులు+ఐన= భక్తితోకూడిఉండిన; భాగవతులకున్= భగవద్భక్తులకు; భక్త, వత్సలుండు= భక్తులయందు ప్రీతికలవాడు; అగు= అయిన; శ్రీ, వల్లభుండు= లక్ష్మీభర్త అయిన విష్ణువు; భవ, భయంబులు+ఎల్లన్= సంసారం(పుట్టుక) వలని భయాలన్నీ; పాచి= పోగొట్టి; కరుణతోడన్= దయతో; ఇష్ట+అర్థ+సంసిద్ధి= కోరబడిన ప్రయోజనాలయొక్క అధిక మైన లాభాన్ని; చేయు+అట్లు= కలుగజేసేవిధంగా; ఆయుః+అర్థులకున్= ఆయువు కోరేవారికి; దీర్ఘ+ఆయుస్+అవాప్తియున్= దీర్ఘమైన ఆయువుయొక్క పొందుటయున్నూ; అర్థ+అర్థులకున్= ధనం కోరేవారికి; విపుల+అర్థములును= అధికమైనధనాలున్నూ; ధర్మ+అర్థులకున్= ధర్మాన్ని కోరేవారికి; నిత్య, ధర్మ, సంప్రాప్తియున్= శాశ్వత మైన(ఎల్లప్పుడున్నూ) ధర్మముయొక్క లాభమున్నూ; వినయ+అర్థులకున్= వినయం కోరేవారికి; మహత్+వినయ, మతియున్= గొప్పవినమ్రతతోకూడిన బుద్ధియున్నూ; పుత్ర+అర్థులకున్= కొడుకులను కోరేవారికి; బహు, పుత్ర, సమృద్ధియున్= పలువురు కొడుకులయొక్క సంపదయున్నూ; సంపద్+అర్థులకున్= సంపదను(ఐశ్వర్యాన్ని) కోరేవారికి; ఇష్ట, సంపదలును= కోరబడిన సంపదలున్నూ; కావించున్= కలిగించును.

**తాత్పర్యం:** ఈ మహాభారతం ఎల్లప్పుడున్నూ తలంచి వింటుండేజనులకు, భక్తితో కూడి ఉండే భక్తులకు భక్తులయందు ప్రీతి కల లక్ష్మీప్రియు డైన విష్ణువు దయతో సంసారభయాలన్నింటిని తొలగించి కోరినఫలాల లాభాలను కలుగజేసే విధాన- ఆయుర్దాయాన్ని కోరేవారికి దీర్ఘమైనఆయువుయొక్కలాభాన్నీ, ధనాన్ని కోరేవారికి అధికమైన ధనలాభాలనూ, ధర్మాన్ని కోరేవారికి సంతతధర్మలాభాన్నీ, వినయాన్ని కోరేవారికి గొప్పవినయంతోకూడిన బుద్ధినీ, కుమారులను కోరేవారికి పలువురుకుమారులసంపదయున్నూ, ఐశ్వర్యం కోరేవారికి అభీష్టసంపదలున్నూ కలుగజేస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ. మహాభారతం పంచమవేదం అవటంచేత ఆదరంతో వినేవారికి ఆయురైశ్వర్యపుత్రాదిసంపదలను కలిగిస్తుంది. అట్టిశక్తి అన్నిగ్రంథాలకూ ఉండదు. భారతకథ పుణ్య కథ. దానిని వింటే అఘనిబర్హణ మౌతుంది.

## పర్వసంగ్రహము (సం. 1-2-71)

**వ.** **మఱియుఁ బౌష్యోదంకమాహాత్మ్యంబును, భృగువంశకీర్తనంబును, నాగగరుడసంభవంబును, సముద్రమథనంబు, నుచ్చైశ్శ్రవోజన్మంబును, సౌపర్ణోపాఖ్యానంబును, నాస్తీకచరితంబును, జనమేజయ సర్పయాగంబును, శ్రీమహాభారతకథాశ్రవణప్రవృత్తియు, వ్యాసజన్మంబును, దేవదైత్యదానవముని యక్షపక్షిగంధర్వాది నానావిధభూతసంభవంబును, దదంశావతారంబును, రాజవంశానుకీర్తనంబును, యయాతిచరితంబును, భారతవంశానుకీర్తనంబును, గంగాశంతనుసమాగమంబును, వసూత్పత్తియు, స్వర్గగమనంబును, దదంశసంఘాతంబున గాంగేయజన్మంబును, దద్రాజ్యనివర్తనంబును, బ్రహ్మచర్యప్రతిజ్ఞాపరిపాలనంబును, సత్యవతీవివాహంబును, జిత్రాంగదావిచిత్రవీర్యజన్మంబును, జిత్రాంగదరాజ్యాభిషేకంబును, జిత్రాంగదమరణానంతరంబున భీష్ముండు విచిత్రవీర్యుం గౌరవరాజ్యంబున నభిషిక్తుం జేయుటయు, వానిపరోక్షంబునఁ గృష్ణద్వైపాయనమునివలన ధృతరాష్ట్రపాండురాజుల జన్మంబు, నాణిమాండవ్యో పాఖ్యానంబును, ధర్ముండు మాండవ్యశాపంబున శూద్రయోనియందు విదురుం డై పుట్టుటయును, ధృతరాష్ట్రపాండురాజుల వివాహంబును, బాండవధార్తరాష్ట్ర సంభవంబును,**

**బాండునిర్యాణంబును, గృపద్రోణజన్మకథనంబును, గుమారాస్త్రవిద్యాగ్రహణంబును, గుమారాస్త్ర సందర్శనంబును, గర్ణార్జునుల పరస్పరక్రోధంబును, ద్రుపదగ్రహణమోక్షణంబును, యుధిష్ఠిరు యౌవరాజ్యాభిషిక్తుం జేయుటయు, దుర్యోధనుదుర్మంత్రంబును, వారణావత యాత్రయు, జతుగృహదాహంబును, విదురోపదిష్టద్వారంబునఁ బాండవాపక్రమణంబును, హిడింబాదర్శనంబును, హిడింబువధయును, ఘటోత్కచసంభవంబును, బాండవుల కేకచక్రపురంబున విప్రగృహంబున నజ్ఞాతచర్యయు, బకవధయు, ధృష్టద్యుమ్నద్రౌపదీ జన్మకథనంబును, గృష్ణద్వైపాయన సందర్శనంబును, గంగాతీరంబున నంగారపర్ణు నర్జునుండు జయించుటయుఁ, దాపత్యవసిష్ఠౌర్వోపాఖ్యానంబును, బాండవులు పాంచాలదేశంబునకుం జనుటయు, ద్రౌపదీస్వయంవరంబును, బంచేంద్రోపాఖ్యానంబును, ద్రౌపదీవివాహంబును, విదురాగమనంబును, గృష్ణసందర్శనంబును, రాజ్యార్థలాభంబును, ఖాండవప్రస్థ నివాసంబును, సుందోపసుందోపాఖ్యానంబును, నారదువచనంబున, ద్రౌపదియందు సమయ క్రియయును నర్జునుతీర్థాభిగమనంబును, నులూపీసమాగమంబును, జిత్రాంగదయందు బభ్రువాహను జన్మంబును, ద్వారకాగమనంబును, వాసుదేవానుమతంబున నర్జునుఁడు సుభద్రను వివాహం బగుటయు, సుభద్రాహరణంబును, హరణహారికయు, నభిమన్యుసంభవంబును, గాండీవదేవదత్త దివ్యరథాశ్వ లాభంబును, ఖాండవదహనంబు, నగ్నిభయంబువలన మయభుజంగమోక్షణంబును, మందపాలోపాఖ్యానంబును నను వృత్తాంతంబుల నొప్పి తొమ్మిదివేలుం దొమ్మన్నూటయెనుబదినాలుగు శ్లోకంబులు గలిగి. 35**

**ప్రతిపదార్థం:** ఈవచనంలో ఆదిపర్వంలోని వివిధవిషయాలు చెప్పబడినవి. పౌష్య+ఉదంక, మాహాత్మ్యంబును= పౌష్యు డనే రాజుయొక్కయు, ఉదంకుడనే పైలశిష్యుడియొక్కయూ, మహత్త్వాన్నీ; భృగువంశ, కీర్తనంబును= భృగు వనే మహర్షియొక్క వంశస్తుతియున్నూ; నాగ, గరుడ, సంభవంబును= పాములయొక్కయూ, గరుత్మంతుని యొక్కయూ పుట్టుకయున్నూ; సముద్ర, మథనంబున్= దేవదానవులు సముద్రాన్ని త్రచ్చుటయునూ; ఉచ్చైశ్శ్రవస్+జన్మంబును= ఉచ్చైశ్శ్రవ మనే పేరుగల ఇంద్రుడితెల్లనిగుఱ్ఱంయొక్కపుట్టుకయున్నూ; సౌపర్ణ+ఉపాఖ్యానంబునున్= గరుడునికి సంబంధించినకథయున్నూ; ఆస్తీక, చరితంబును= ఆస్తీకుడు అనే జరత్కారువుకుమారు డైన మునిచరిత్రమున్నూ; జనమేజయ, సర్ప, యాగంబును= పరీక్షిత్తుకుమారుడైన జనమేజయుడు చేసిన సర్పయజ్ఞమున్నూ, (ఇందులో పాములు అగ్నిలో హోమం చేయబడతాయి); శ్రీ, మహత్, భారత, కథా, శ్రవణ, ప్రవృత్తియున్= శోభాయుక్త మైన మహాభారతంయొక్క వినుట అనే వృత్తాంతాన్నీ; వ్యాస, జన్మంబును= వ్యాసమహర్షియొక్క పుట్టుకయున్నూ; దేవ, దైత్య, దానవ, ముని, యక్ష, పక్షి, గంధర్వ+ఆది, నానా, విధ, భూత, సంభవంబును= దేవతలు, దైత్యులు, దితిపుత్రు లైన రాక్షసులు, దనుసంభవు లైన రాక్షసులు, మునులు, యక్షులు అనే దేవయోని విశేషాలూ, పక్షులు, గంధర్వులు అనే దేవయోనివిశేషాలు మొదలైన పలువిధా లైన జీవుల పుట్టుకయున్నూ; తద్+ అంశ, అవతారంబును= దేవదానవులఅంశాలచేత భూమిపై పుట్టినవారిక్రమాన్నీ; రాజ, వంశ+అనుకీర్తనంబును=(వైవస్వతమనువు, వేనప్రముఖు లైన రాజులు, పురూరవుడు, ఆయువు, నహుషుడు, యయాతి, పూరువు మొదలైనవారితోకూడిన) రాజవంశాలయొక్క వివరణాన్నీ; యయాతి, చరితంబును= నహుషపుత్రుడైన యయాతిచరిత్రయున్నూ; భారతవంశ, అనుకీర్తనంబును= శకుంతలాదుష్యంతుల కుమారు డైన భరతుడికి సంబంధించిన భారతవంశంయొక్క స్తుతియున్నూ, (చెప్పటమన్నమాట); గంగా, శంతను, సమాగమంబును= గంగానదీశంతనులకూడికయున్నూ; వసు+ఉత్పత్తియున్= అష్టవసువుల పుట్టుకయున్నూ; స్వర్గ, గమనంబును= వారు స్వర్గానికి పోవటమున్నూ; తత్+అంశ, సంఘాతంబునన్= వసువులఅంశలసమూహంచే(కలయికచేత);

గాంగేయ, జన్మంబును= గంగాపుత్రుడైన భీష్ముడిపుట్టుకయున్నూ; తద్+రాజ్య, నివర్తనంబును= అతని రాజ్యంనుండి మరలటమున్నూ; (భీష్ముడు రాజ్యాన్ని విడవటం); బ్రహ్మచర్య, ప్రతిజ్ఞా, పరిపాలనంబును= భీష్ముడు పెళ్ళిచేసికొనకబ్రహ్మచర్యాన్ని అనుష్ఠిస్తానని ప్రతినచేసి దానిని పాటించుటయున్నూ; సత్యవతీ, వివాహంబును= సత్యవతీశంతనులపెండ్లియున్నూ; చిత్రాంగదా, విచిత్రవీర్య, జన్మంబును= శంతనుడికి సత్యవతియందు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అనే కుమారుల పుట్టుకయున్నూ; చిత్రాంగద, రాజ్య+అభిషేకంబును= శంతనుడి అనంతరం చిత్రాంగదుడిని, రాజ్యానికి రాజుగా అభిషేకించుటయున్నూ; చిత్రాంగదు, మరణ+అనంతరంబునన్= చిత్రాంగదుడిమృతి జరిగినపిమ్మట; భీష్ముండు; విచిత్రవీర్యున్= విచిత్రవీర్యుడిని; కౌరవరాజ్యంబునన్= కౌరవరాజ్యమునందు; అభిషిక్తున్, చేయుటయున్= అభిషేకింపబడినవాడినిగా (రాజుగా) చేయుటయున్నూ; వాని, పరోక్షంబునన్= ఆవిచిత్రవీర్యుడి మరణానంతరం; కృష్ణద్వైపాయన, మునివలనన్= వ్యాసమునివలన; ధృతరాష్ట్ర, పాండురాజుల; జన్మంబున్= పుట్టుకయున్నూ, ఆణిమాండవ్య+ఉపాఖ్యానంబును=ఆణి అంటే ఇరుసుచివర ఉండే చీల; మాండవ్యు డనేమునిని దొంగ అని భ్రమించి రాజు శూలప్రోతుడిని కావించి, తరువాత తనతప్పును తెలిసికొని, శూలాన్ని తీసివేయటానికి యత్నించాడు, కాని, దాన్ని తీయటానికి వీలుకలుగలేదు. అప్పుడు రాజు దానిమొదలు నెమ్మదిగా ఖండింపజేశాడు; శూలశేషం మాండవ్యుని కంఠపార్శ్వంలోపల ఉండిపోయింది. అందుచేత అతనికి ఆణిమాండవ్యు డనే పేరు కలిగింది. అతనికథయున్నూ; ధర్ముండు= యముడు; మాండవ్య, శాపంబునన్= మాండవ్యుడిచ్చినశాపంచేత; శూద్రయోనియందున్= శూద్రగర్భంలో; విదురుండు+ఐ; పుట్టుటయును; ధృతరాష్ట్ర పాండురాజుల; వివాహంబును= పెండ్లియున్నూ; పాండవ, ధార్తరాష్ట్రసంభవంబును= పాండురాజకుమారు లైన ధర్మరాజాదులయున్నూ, ధృతరాష్ట్రునికుమారు లైన దుర్యోధనాదులయున్నూ, పుట్టుక; పాండు, నిర్యాణంబును= పాండురాజు మృతియున్నూ; కృప, ద్రోణ, జన్మకథనంబును= కృపాచార్యుడియొక్కయు, ద్రోణుడియొక్కయు పుట్టుకలు చెప్పుటయున్నూ; కుమార+అస్త్ర, విద్యా, గ్రహణంబును= ధర్మరాజ దుర్యోధనాది రాజకుమారులు అస్త్రవిద్యను గ్రహించుటయున్నూ (అభ్యసించుటయున్నూ); కుమార+అస్త్ర+సందర్శనంబును= పై రాజకుమారులఅస్త్రవిద్యను చూడటమున్నూ; కర్ణ+అర్జునుల, పరస్పర, క్రోధంబును= కర్ణునియొక్కయు అర్జునునియొక్కయు అన్యోన్యకోపమున్నూ; ద్రుపద, గ్రహణ, మోక్షంబును= అర్జునుడు ద్రుపదుడిని పట్టుకొని రాగా ద్రోణుడు విడిపించుటయున్నూ; యుధిష్ఠిరు= ధర్మరాజును; యౌవరాజ్య+అభిషిక్తున్, చేయుటయున్= యౌవరాజ్యపదవియందు అభిషేకింపబడినవాడినిగా చేయటమున్నూ; దుర్యోధను, దుర్మంత్రంబును= దుర్యోధనుడి చెడ్డఆలోచనయున్నూ; వారణావత, యాత్రయున్= వారణావత మనే నగరానికి పాండవులు వెళ్ళటమున్నూ; జతు, గృహ, దాహంబును= లక్కయింటిని తగులపెట్టుటయున్నూ; విదుర+ఉపదిష్ట, ద్వారంబునన్= విదురుడిచేత ఉపదేశింపబడిన ద్వారంనుండి; పాండవ, అపక్రమణంబును= పాండవులు తొలగిపోవుటయున్నూ; హిడింబా దర్శనంబును= హిడింబ అనే రాక్షస స్త్రీని చూచుటయున్నూ; హిడింబు, వధయును= హిడింబఅన్నయైన హిడింబుడిని చంపుటయున్నూ; ఘటోత్కచ, సంభవంబును= హిడింబయందు ఘటోత్కచుడు పుట్టుటయున్నూ; పాండవులకున్, ఏకచక్రపురంబునన్= ఏకచక్రపుర మనే నగరంలో; విప్ర, గృహంబునన్= బ్రాహ్మణునిఇంటియందు; అజ్ఞాత, చర్యయున్= ఇతరులచేత తెలియబడకుండ చరించుటయున్నూ; బక, వధయున్= బకాసురుడిని భీముడు చంపుటయున్నూ; ధృష్టద్యుమ్న, ద్రౌపదీ, జన్మ, కథనంబును= ధృష్టద్యుమ్నునియొక్కయు ద్రౌపదియొక్కయు పుట్టుకలను చెప్పుటయున్నూ; కృష్ణద్వైపాయన, సందర్శనంబును= వ్యాసుని చూచుటయున్నూ; గంగా, తీరంబునన్= గంగానది ఒడ్డున; అంగారపర్ణున్= అంగారపర్ణుడనే గంధర్వుడిని; అర్జునుండు; జయించుటయున్= జయించుటయున్నూ; తాపత్య, వసిష్ఠ, ఔర్వ+ఉపాఖ్యానంబును= తపతీసంవరణులకు కురువు పుట్టాడు. అతడు తాపత్యుడు. అతనియొక్కయు, వసిష్ఠునియొక్కయు, ఔర్వుని (ఒకభృగుపత్నికుమారుడు) యొక్కయు కథలున్నూ; పాండవులు; పాంచాల, దేశంబునకున్= ద్రుపదు డేలే పాంచాలదేశానికి; చనుటయున్= వెళ్ళుటయు; ద్రౌపదీ, స్వయంవరంబును= ద్రౌపది స్వయంవరమున్నూ (తనంత తాను మగని వరించే వివాహాన్ని); పంచ+ఇంద్ర+ఉపాఖ్యానంబును= ఐదుగు రింద్రులు పాండవులుగా జన్మించినకథయున్నూ; ద్రౌపదీ, వివాహంబును= ద్రౌపదియొక్క పెండ్లియున్నూ; విదుర+ఆగమనంబును= విదురునియొక్కరాకయున్నూ; కృష్ణ, సందర్శనంబును= కృష్ణుడిని

చూచుటయున్నూ; రాజ్య+అర్ధ, లాభంబును= రాజ్యంలోని సగంభాగాన్ని పొందుటయున్నూ; ఖాండవప్రస్థ, నివాసంబును= ఇంద్రప్రస్థపురంలో నివసించుటయున్నూ; సుంద+ఉపసుంద+ఉపాఖ్యానంబును= సుందుడు, ఉపసుందు డనే సోదరుల కథయున్నూ; నారదు, వచనంబునన్= నారదునిమాటచే (మాటననుసరించి); ద్రౌపదియందున్= ద్రౌపదివిషయంలో; సమయ, క్రియయును= ప్రతిజ్ఞచేయుటయున్నూ; అర్జును, తీర్థయాత్ర+అభిగమనంబును= సమయభంగం జరగటంచేత అర్జునుడు తీర్థాలను సేవించటానికి పోవటం; ఉలూపీ, సమాగమంబును= అర్జునుడు ఉలూపి అనే నాగకన్యను కూడుటయున్నూ; చిత్రాంగదయందు; బభ్రువాహను, జన్మంబును= బభ్రువాహను డనే కుమారుడి పుట్టుకయున్నూ; ద్వారకా, గమనంబును= ద్వారకానగరానికి అరుగుటయున్నూ; వాసుదేవ+అనుమతంబునన్= కృష్ణుడిసమ్మతిచేత; సుభద్రను= సుభద్రను; వివాహంబు+అగుటయున్= పెండ్లిఅగుటయున్నూ; సుభద్రా, హరణంబును= అర్జునుడు సుభద్రను కొనిపోవుటయున్నూ; హరణ, హారికయున్= కృష్ణబలరామాదులు సుభద్రకు అరణాన్ని తెచ్చుటయున్నూ; అభిమన్యు, సంభవంబును= అర్జునుడికి సుభద్రయందు అభిమన్యు డనే కుమారుడు పుట్టుటయున్నూ; గాండీవ, దేవదత్త, దివ్య, రథ+అశ్వ, లాభంబును= అర్జునుడు గాండీవ మనే ధనస్సును, దేవదత్త మనే శంఖాన్నీ; దేవతాసంబంధు లైన రథాన్నీ, గుఱ్ఱాలనూ పొందుటయున్నూ; ఖాండవ, దహనంబును= ఖాండవవనాన్ని దహించుటయున్నూ; అగ్ని, భయంబువలనన్= అగ్నివలనిభయంనుండి; మయ, భుజంగ, మోక్షణంబును= మయు డనే నముచితమ్ముడిని, తక్షకుడికుమారు డైన అశ్వసేనుడిని విడిపించుటయున్నూ; మందపాల+ఉపాఖ్యానంబును= మందపాలు డనే మునికథయున్నూ; అను, వృత్తాంతంబులన్= అనేకథలతో; ఒప్పి= అలరి, అందమై; తొమ్మిదివేలున్, తొమ్మన్నూట, ఎనుబది, నాలుగు= 9984; శ్లోకంబులు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** స్పష్టం.

**విశేషం:** నన్నయ తాను అనుసరించిన భారతప్రతిలో ఏపర్వంలో ఎన్నిశ్లోకా లున్నవో తెల్పియున్నాడు. ఈ లెక్క తరువాత సంస్కృతభారతాన్ని పరిశోధించినవారికి మిక్కిలి ఉపయోగకర మైనది.

**క.** **మదిఁ బౌష్యపర్వ మాదిగఁ బదునెనిమిదిపర్వములను బర్వి మనఃప్రీ**
**తిద మగుచు నాదిపర్వం । బది వినఁగా నొప్పు భారతాద్యం బగుచున్. 36**

**ప్రతిపదార్థం:** మదిన్= మనస్సులో; పౌష్యపర్వము+ఆదిగన్= పౌష్యపర్వం మొదలుగా; పది+ఎనిమిది, పర్వములను= పదునెనిమిది(18)పర్వాలతో; (ఇవి సంస్కృతభారతంలోని 18 ఉపపర్వాలు. తెలుగుభారతంలో ఆదిపర్వము అనే పేరేకాని ఈ ఉపపర్వాలపే ర్లుండవు); పర్వి= ఒప్పి; మనస్+ప్రీతి, దము+అగుచున్= మనస్సుకు ప్రీతి నిచ్చేది ఔతూ; ఆది, పర్వంబు+అది+ ఆ ఆదిపర్వం; భారత+ఆద్యంబు= భారతంలోని మొదటిది; అగుచున్; వినగాన్= వినటానికి; ఒప్పున్= అలరారును, తగును.

**తాత్పర్యం:** మనస్సులో పౌష్యపర్వంమొదలుగా గల పదునెనిమిదిఉపపర్వాలతో ఒప్పి, పఠితలమనస్సులకు ప్రీతిని కలిగించేదియున్నూ, భారతంలోని మొదటిపర్వమున్నూ ఔతూ ఆ ఆదిపర్వం వినటానికి ఇంపుగా ఉంటుంది.

**విశేషం:** 'మదిన్' అనేమాట సంస్కృతభారతంలోని పేర్లనుబట్టి ఆ పదునెనిమిది పర్వాలను మనస్సులో ఊహించవలె నని సూచిస్తున్నది.

**వ.** **మఱియు ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ, గింకరదర్శనంబును, నారదువలన లోకపాలసభాశ్రవణంబును, రాజసూయమహాధ్వరారంభంబును, జరాసంధవధయును, గిరివ్రజనిరుద్ధు లైన రాజులఁ గృష్ణుఁడు**

**విడిపించుటయును, దిగ్విజయంబును, రాజసూయంబు, నర్ఘ్యాభిహరణంబును, శిశుపాలవధయును, రాజసూయవిభూతికి దుఃఖితుం డై సభాస్థలితుం డై యున్న దుర్యోధనుం జూచి ద్రౌపదీభీమసేనులు నగుటయును, దత్కారణంబున జూదం బాడుటయు, నందు శకునికైతవంబున ధర్మరాజపరాజయంబును, ద్యూతదుఃఖార్ణవమగ్ను లైన పాండవులం బాంచాలి యుద్ధరించుటయును, బునర్ద్యూతపరాజితు లై పాండవులు వనవాసగతు లగుటయు నను వృత్తాంతంబుల నొప్పి నాలుగువేలున్ మున్నూటపదునొకండు శ్లోకంబులు గలిగి.** **37**

**ప్రతిపదార్థం:** మఱియున్; ధర్మరాజునకు; సభాప్రాప్తియున్= సభాలాభమున్నూ; కింకర, దర్శనంబును= రాక్షసకింకరులను చూచుటయున్నూ (మయుడు తాను నిర్మించినసభను ఎనిమిదివేల రాక్షసకింకరులచేత మోయించుకొని వచ్చాడు); నారదువలనన్; లోక, పాల, సభా, శ్రవణంబును= ఇంద్రాదిలోకపాలకులయున్నూ, బ్రహ్మయొక్కయున్నూ సభలనుగూర్చి వినుటయున్నూ; రాజసూయ, మహత్, అధ్వర, ఆరంభంబును= రాజసూయ మనే గొప్ప యజ్ఞంయొక్క ప్రారంభమున్నూ; జరాసంధ, వధయును= జరాసంధు డనే మగధరాజును సంహరించుటయున్నూ; గిరివ్రజ, నిరుద్ధులు+ఐన గిరివ్రజపట్టణంలో జరాసంధుడిచేత బంధింపబడిన; రాజులన్; కృష్ణుండు; విడిపించుటయును= బంధవిముక్తులనుచేయుటయున్నూ; దిక్, విజయంబును= భీమాదులు నాలుగుదిక్కులను జయించుటయున్నూ; రాజసూయంబును= రాజసూయయాగమున్నూ; అర్ఘ్య+అభిహరణంబును= కృష్ణుడు పూజాద్రవ్యాలను గ్రహించుటయున్నూ, శిశుపాల, వధయును= అతడు చేదిపతియైన శిశుపాలుడిని చంపుటయున్నూ; రాజసూయ, విభూతికిన్= రాజసూయయాగవైభవానికి; దుఃఖితుండు+ఐ= అసూయచేత శోకించినవాడై; సభా, స్థలితుండు+ఐ, ఉన్న= మయసభలో జారిపడి ఉన్న; దుర్యోధనున్; చూచి; ద్రౌపదీ, భీమసేనులు= ద్రౌపదియు, భీముడున్నూ; నగుటయును= పరిహసించుటయున్నూ; తద్, కారణంబునన్= (వారు నవ్వినారనే) ఆహేతువుచే; జూదంబు+ఆడుటయున్; అందున్= జూదంలో; శకుని, కైతవంబునన్= దుర్యోధనుడిమేనమామ ఐన శకుని కపటం వలన; ధర్మరాజ, పరాజయంబును= ధర్మరాజు ఓడుటయున్నూ; ద్యూత, దుఃఖ+అర్ణవ, మగ్నులు+ఐన= జూదంవలన కలిగిన దుఃఖ మనే సముద్రంలో మునిగినవారైన; పాండవులన్; పాంచాలి= పాంచాలరాజు కూతురైనద్రౌపది; ఉద్ధరించుటయును= పైకితీయుటయున్నూ; పునర్+ద్యూత, పరాజితులు+ఐన= మరల ఆడినజూదంలో ఓడిన; పాండవులు; వన, వాస, గతులు+అగుటయున్= అడవిలో నివసించటానికి వెడలినవా రగుటయున్నూ; అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి= అలరి; నాలుగు, వేలున్, మూడు+నూట, పది+ఒకండు= 4311; శ్లోకంబులు; కలిగి.

**తాత్పర్యం:** సుగమం.

**విశేషం:** సభాపర్వం చిన్నదైననూ భారతకథకు ఆయువుపట్టు. ఇందులో జరిగిన దుర్యోధనపరాభవ ద్యూత ద్రౌపదీవస్త్రాపహరణాదులే కురుక్షేత్రసంగ్రామానికి కారణా లైనవి.

**క. పర్వి సభాప్రభృతిగ నవ । పర్వములను విస్తరిల్లి, పండితచేతో**
**నిర్వృతిఁ జేయుచు రెండవ । పర్వము నా రమ్య మగు సభాపర్వ మిలన్.** **38**

**ప్రతిపదార్థం:** పర్వి= ఒప్పి; సభా, ప్రభృతిగన్= సభాపర్వం మొదలుగా గల; నవ, పర్వములను= తొమ్మిది ఉపపర్వాలతో; విస్తరిల్లి= వ్యాపించి; పండిత, చేతః, నిర్వృతిన్= పండితులమనస్సులకు ఆనందాన్ని; చేయుచున్= కలిగిస్తూ; రెండవపర్వము; నాన్= అనగా; సభా, పర్వము; ఇలన్= భూమియందు; రమ్యము+అగున్= సుందర మగును, (అందంగా అమరి ఉంటుంది).

**తాత్పర్యం:** పై వచనంలో పేర్కొనబడిన ఉదంతాలతో ఒప్పి (సభా, మంత్ర, జరాసంధవధ, దిగ్విజయ, రాజసూయ, అర్ఘ్యాహరణ, శిశుపాలవధ, ద్యూత, అనుద్యూతా లనే) తొమ్మిది ఉపపర్వాలతో వ్యాపించి, పండితులమనస్సుల

కానందం కలిగిస్తూ రెండవపర్వంగా సభాపర్వం లోకంలో సుందరమై విరాజిల్లుతున్నది. పదునెనిమిది పర్వాలలో సభాపర్వం రెండవది. ఉపపర్వాలలో పందొమ్మిదవది.

**వ.** **మఱియు మహారణ్యంబునందుఁ గిమ్మీరవధయును, గృష్ణపాంచాలాగమనంబును, సౌభకాఖ్యానంబును, యుధిష్ఠిరభీమసేనసంవాదంబును, గురూపదేశంబున నర్జునుండు దివ్యాస్త్రంబులు వడయఁ దపశ్చరణంబు సేయుటయు, నీశ్వరుతోడియుద్ధంబును, లోకపాలసందర్శనంబును, దివ్యాస్త్రలాభంబును, స్వర్గగమనంబును, నిట బృహదశ్వుండను మహామునిం గాంచుటయు, యుధిష్ఠిరాదులపరిదేవనంబును, నలోపాఖ్యానంబును, దమయంతీ పతివ్రతాస్తుతియు, యుధిష్ఠిరాదులకు నర్జునుకుశలవార్త రోమశుండు సెప్పుటయును, ధర్మజుతీర్థాభిగమనంబును, జటాసురవధయును, బాంచాలీనియుక్తుం డై భీముండు సౌగంధికపుష్పాహరణార్థంబుగంధమాదనంబునందలికొలనికిఁజని యందు మణిమంతుఁడు మొదలుగాఁ గల యక్షరాక్షసులం జంపుటయు. నాజగరంబు, నగస్త్యోపాఖ్యానంబును, వాతాపిభక్షణంబు, నపత్యార్థం బగస్త్యమహాముని లోపాముద్ర నభిగమించుటయు. శ్యేనకపోతంబు లైన యింద్రాగ్నులు శిబిమాంసంబు గొనుటయు, ఋష్యశృంగుచరితంబును, బరశురామచరితంబును, గార్తవీర్యవధయును, మాంధాతృజన్మంబును, సౌకన్యాఖ్యానంబును, భార్గవుండయిన చ్యవనుండు శర్యాతియజ్ఞంబున నాశ్వినుల సోమపీథులం జేసి వారిచేత జవ్వనంబు వడయుటయు, జంతూపాఖ్యానంబును, యజ్ఞపుత్త్రుం డైన సోమకుండు బహుపుత్త్రార్థంబు యజ్ఞంబుసేసి పుత్త్రశతంబును బడయుటయు, వంద్యష్టావక్రుల వివాదంబును, సముద్రంబును జయించితిత్తిరియను మహర్షి తనతండ్రిం బడయుటయు, దివ్యాస్త్రంబులు వడసి యర్జునుండు హిరణ్యపురనివాసు లయిన పౌలోమ కాలకేయ నివాతకవచాదులం జంపుటయు, గంధమాదనంబున కందఱుం గూడవచ్చుటయు, మార్కండేయబహువిధోపాఖ్యానంబును, గృష్ణసందర్శనంబును, సత్యాద్రౌపదీసంవాదంబును, ఘోషయాత్రయుఁ, జిత్రసేనాదిగంధర్వులఁ బెక్కండ్ర జయించి దుర్యోధనుని విడిపించుటయు, దుర్యోధనుని ప్రాయోపవేశంబును, వ్రీహిద్రోణకాఖ్యానంబును, గలియుగధర్మంబును, వామ్యాశ్వహరణంబును, నింద్రద్యుమ్నోపాఖ్యానంబును, సరస్వతీగీతయు, ధుంధుమారుచరితంబును, జయద్రథుం డాశ్రమాంతరంబున ద్రౌపది నపహరించుటయు, భీముండు వానిం బరిభవించుటయు, నుద్దాలకోపాఖ్యానంబును, వైన్యోపాఖ్యానంబును, శ్రీరామాయణకథయును, సావిత్ర్యుపాఖ్యానంబును, బాండవులు క్రమ్మఱ ద్వైతవనంబునకు వచ్చుటయుఁ, గర్ణుకవచకుండలంబు లింద్రుండు గొనుటయు, నారణేయోపాఖ్యానంబును, యముండు ధర్మజు ననుశాసించుటయు, యమువలన వరంబులు వడసి పాండవులు పశ్చిమదిక్కునకుం జనుటయు ననువృత్తాంతంబుల నొప్పి పదుమూఁడువేలు నాఱునూటయఱువదినాల్గు శ్లోకంబులు గలిగి.** **39**

**ప్రతిపదార్థం:** మఱియున్; మహత్+అరణ్యంబునందున్= గొప్పఅడవిలో; కిమ్మీర, వధయును= బకాసురునితమ్ముడైన కిమ్మీరుడిని భీముడు సంహరించుటయున్నూ; కృష్ణ, పాంచాల+ఆగమనంబును= కృష్ణుడున్నూ, పాంచాలురున్నూ (యాదవాదులుకూడ) పాండవులను చూడటానికి వచ్చుటయున్నూ; సౌభక+ఆఖ్యానంబును= శిశుపాలుడి తమ్ముడు సాల్వుడు. అతనికి కామగమనం గల సౌభక మనే నగరం ఉన్నది. దానితో వచ్చి సాల్వుడు ద్వారకను ముట్టడించిన కథయున్నూ;

యుధిష్ఠిర, భీమసేన, సంవాదంబును= ధర్మరాజుకూ భీముడికీ జరిగిన సంభాషణ సమాచారమున్నూ; గురు+ఉపదేశంబునన్= వ్యాసుడు, ధర్మరాజు మొదలైన పెద్దలఉపదేశంచేత; అర్జునుండు; దివ్య+అస్త్రంబులు= దేవతాసంబంధా లైన అస్త్రాలను; పడయన్= (గసడదవాదేశము) పొందటానికి; తపః+చరణంబు= తపస్సును ఆచరించటం; చేయుటయున్; ఈశ్వరుతోడన్, యుద్ధంబును= (సమాసములందు చేత తోడ వలనల కిత్వం బగును, తోడన్=తోడి) శివునితో యుద్ధమున్నూ; లోక, పాల, సందర్శనంబును= ఇంద్రయమవరుణకుబేరాదిదిక్పాలురను చూచుటయున్నూ; దివ్య+అస్త్ర, లాభంబును= దేవతాసంబంధ మైన పాశుపతాస్త్రంయొక్క ప్రాప్తియున్నూ; స్వర్గ, గమనంబునున్= అర్జునుడు స్వర్గానికి పోవుటయున్నూ; ఇట= ధర్మరాజాదు లున్నచోట; బృహదశ్వుండు+అను; మహత్+మునిన్= గొప్పమునిని; కాంచుటయున్= చూచుటయున్నూ; యుధిష్ఠిర+ఆదుల= ధర్మరాజు మొదలైనవారి; పరిదేవనంబును= దుఃఖించుటయున్నూ; నల+ఉపాఖ్యానంబును= నలునికథయు; దమయంతీ, పతివ్రతా, స్తుతియున్= దమయంతి అనే పతివ్రతను పొగడుటయున్నూ; యుధిష్ఠిర+ఆదులకున్= ధర్మరాజు మొదలైనవారికి; అర్జును, కుశల, వార్త= అర్జునునిక్షేమవృత్తాంతం; రోమశుండు= రోమశు డనే పేరుగల దేవర్షి; చెప్పుటయున్నూ; ధర్మజు= ధర్మరాజుయొక్క; తీర్థ+అభిగమనంబును= నదీపుణ్యక్షేత్రాలనుగూర్చి వెళ్ళుటయున్నూ; జటాసుర, వధయును=జటాసురు డనే రాక్షసుణ్ణి భీముడు చంపుటయున్నూ; పాంచాలీ, నియుక్తుండు+ఐ= పాంచాలరా జైన ద్రుపదునికూతు రగు ద్రౌపదిచే పంపబడినవాడై; భీముండు; సౌగంధిక, పుష్ప+ఆహరణ+అర్థంబు= సౌగంధిక మనే తామరపూవును తెచ్చే నిమిత్తం; గంధమాదనంబునందలి= గంధమాదన మనే పర్వతంలో ఉన్న; కొలనికిన్= సరస్సుకు; చని= వెళ్ళి; అందున్= అచ్చట; మణిమంతుఁడు, మొదలుగాన్+కల= మణిమంతుడుమొదలైన; యక్ష, రాక్షసులన్= యక్షులను, రాక్షసులను; చంపుటయున్; ఆజగరంబున్= అజగరమనగా పెద్దపాము, కొండచిలువ. నహుషుడు అగస్త్యునిశాపంచేత అజగర మైనాడు. ఆపాము భీముడిని పట్టుకొనగా ధర్మరాజు అతడిని వెదకుతూ వెళ్ళి అతనిని విడిపించిన కథయున్నూ; అగస్త్య+ఉపాఖ్యానంబును= అగస్త్యమహర్షికథయున్నూ; వాతాపి, భక్షణంబున్= అగస్త్యుడు వాతాపి అనే రాక్షసుడిని తినుటయున్నూ; అపత్య+అర్థంబు= సంతానంనిమిత్తం; అగస్త్య, మహా, ముని; లోపాముద్రన్= లోపాముద్ర అనే తనభార్యను; అభిగమించుటయున్= పొందుట(రమించుట)యున్నూ; శ్యేన, కపోతంబులు+ఐన= గ్రద్దయొక్కయు, పావురముయొక్కయు రూపాలు తాల్చిన; ఇంద్ర+అగ్నులు= ఇంద్రుడున్నూ, అగ్నియున్నూ; శిబి, మాంసంబు= శిబిచక్రవర్తియొక్క మాంసాన్ని; కొనుటయున్= గ్రహించుటయున్నూ; ఋష్యశృంగు, చరితంబును= విభాండకుని కుమారు డైన ఋష్యశృంగునికథయు; పరశురామ, చరితంబును= పరశు వనగా గొడ్డలి. పరశువు ఆయుధంగా కలవా డగుటచేత అతనికి ఆపేరు వచ్చింది. పరశురాముడు విష్ణువుఅవతారాలలో ఆరవఅవతారం, అతని కథయున్నూ; కార్తవీర్య, వధయును= పరశురాముడు కార్తవీర్యుడిని సంహరించుటయున్నూ; మాంధాతృ, జన్మంబును= యువనాశ్వుని కుమారు డైన మాంధాత పుట్టుకయున్నూ; సౌకన్యా+ అఖ్యానంబును= సుకన్యకు సంబంధించిన కథయున్నూ; భార్గవుండు+అయిన= భృగుమహర్షికుమారు డైన, చ్యవనుండు; శర్యాతి, యజ్ఞంబునన్= సుకన్య తండ్రి యైన శర్యాతి చేసిన యజ్ఞంలో; ఆశ్వినులన్= అశ్వినీదేవతలను; సోమ, పీథులన్= సోమరసం త్రాగినవారిని; చేసి; వారిచేతన్= అశ్వినీదేవతలచేత; జవ్వనంబు= యౌవనం; పడయుటయున్= పొందుటయున్నూ; జంతు+ఉపాఖ్యానంబును= సోమకు డనే రాజర్షికుమారు డైన జంతువనే వాడి కథయున్నూ; యజ్ఞ, పుత్రుండు+ఐన= యజ్ఞునికుమారుడైన; సోమకుండు; బహుపుత్ర+అర్థంబు= పలువురుపుత్రులనిమిత్తం; యజ్ఞంబు; చేసి; పుత్రశతంబును= నూర్గురు కుమారులను; పడయుటయున్= పొందుటయున్నూ; వంది+అష్టావక్రుల= (వంది వరుణపుత్రుడు, అష్టావక్రుడు ఏకపాదుని కుమారుడు, అష్టావక్రుడు జనకునియజ్ఞంలో వందిని ఓడించాడు) వందియొక్కయు, అష్టావక్రుడియొక్కయు; వివాదంబును= శాస్త్రాదులయందలి వివిధవిషయాలను గురించి చర్చించుటయున్నూ, తగవున్నూ; సముద్రంబును; జయించి= ఓడించి; తిత్తిరి, అను; మహా+ఋషి= గొప్పముని; తన, తండ్రిన్; పడయుటయున్= పొందుటయున్నూ; దివ్య+అస్త్రంబులు= దేవతాసంబంధు లైన ఆయుధాలను (బాణాలను); పడసి= పొంది; అర్జునుండు; హిరణ్య, పుర, నివాసులు+ఐన= హిరణ్యపుర మనే పట్టణాన్ని ఇంద్రుడు సముద్రమధ్యంలో నిర్మింపజేశాడు. రాక్షసులు తపోబలంతో దానిని ఆక్రమించారు; ఆపట్టణంలో నివసించేవా రైన; పౌలోమ, కాలకేయ, నివాతకవచ+ఆదులన్= పులోమ అనే రాక్షసస్త్రీకుమారులు పౌలోములు, కాలక అనే

రాక్షసస్త్రీకుమారులు కాలకేయులు. వీరిమొత్తంసంఖ్య అరువదివేలు; పౌలోములు, కాలకేయులు, నివాతకవచులు(నివాతకవచుల సంఖ్య మూడు కోట్లు) మొదలైనవారిని చంపుటయున్నూ; గంధమాదనంబునకున్= గంధమాదనపర్వతానికి; అందఱున్, కూడన్= అన్నదమ్ములందరును కలియ(సమాగమశ్చ పార్థస్య భ్రాతృభి ర్గంధమాదనే- అని భండార్కరు సంస్కృతమూలము); వచ్చుటయున్= అర్జునుడు వచ్చుటయున్నూ; మార్కండేయ, బహు, విధ, ఉపాఖ్యానంబును= మార్కండేయుడు ప్రళయప్రకారం, వైవస్వత మను వృత్తాంతం మున్నగు అనేకవిధాలైన కథలను ధర్మరాజు చెప్పుటయున్నూ; కృష్ణ, సందర్శనంబును= కృష్ణుని చూచుటయున్నూ; సత్యా, ద్రౌపదీ, సంవాదంబును= సత్యభామకును ద్రౌపదికిని జరిగిన సంభాషణమున్నూ; ఘోషయాత్రయున్= ఘోష మనగా గొల్లపల్లె. దుర్యోధనాదులు పాండవులను అపహసించటానికై గోవులను సంరక్షించే నెపంతో ద్వైతవనానికి అరుగుటయున్నూ; చిత్రసేన+ఆది, గంధర్వులన్= చిత్రసేనుడు మొదలైన గంధర్వులను; పెక్కండ్రన్= పలువురిని; జయించి= ఓడించి; అర్జునుడు; దుర్యోధనునిన్= గంధర్వుల చేచిక్కిన దుర్యోధనుడిని; విడిపించుటయున్; దుర్యోధనుని ప్రాయోపవేశంబును= సర్వకర్మలను విడిచి మరణానికి సిద్ధపడి కూర్చుండుటయున్నూ (మరణపర్యంతం ఉపవసించటం); వ్రీహి, ద్రోణక+ ఆఖ్యానంబును= వ్రీహి అంటే ధాన్యం; ద్రోణక మంటే తూము(కొలమానం తూమెడుధాన్యం.) ముద్గలుడు అనే విప్రుడు ఉంఛవృత్తి చేస్తూ పాడ్యమి మొదలు పదునాలుగురోజులు ఒక్కొక్కగింజ చొప్పున ఏరి పర్వదినాన వండించి దేవపిత్రతిథివర్గానికి సమర్పించి మిగిలిన అన్నాన్ని తాను దారపుత్రాదులతో తింటూ కాలం గడుపుతూ ఉండేవాడు. దుర్వాసుడు అతడిని పరీక్షించి సంతృప్తుడై సశరీరస్వర్గాన్ని పొందుతా వని వరమిచ్చి వెళ్ళాడు. తూమెడు ధాన్యానికి సంబంధించిన ముద్గలుని కథయున్నూ; కలి, యుగ, ధర్మంబును= కలియుగానికి సంబంధించిన ధర్మాన్ని; వామ్య+అశ్వ, హరణంబును= వామదేవుని గుఱ్ఱాలను శలుడు అనేఅయోధ్యాపతి అయిన పరీక్షిత్తుకుమారుడు దొంగిలించటం; ఇంద్రద్యుమ్న+ఉపాఖ్యానంబును= మార్కండేయుడికంటె వృద్ధతము డైన ఇంద్రద్యుమ్నుడనే రాజుకథయున్నూ; సరస్వతీ, గీతయున్= తార్క్ష్యుడనే మునికి సరస్వతీదేవి ధర్మస్వరూపాన్నీ, పురుషుడు పరమపుణ్యు డైపుణ్యగతి పొందే మార్గాన్నీ చెప్పుటయున్నూ,(ఆధ్యాత్మికమతవిషయాలనుగురించి శ్లోకరూపంలో జరిగే సంభాషణం గీత అనబడుతుంది); ధుంధుమారు, చరితంబును= మధుకైటభులకుమారు డైన ధుంధుమారు డనే పేరుపొందిన కువలయాశ్వు డనే బృహదశ్వునిపుత్త్రుడి కథయున్నూ, జయద్రథుండు= సైంధవుడు; ఆశ్రమ+అంతరంబునన్= ఆశ్రమంనడుమ; ద్రౌపదిన్, అపహరించుటయున్= దొంగిలించికొని పోవుటయున్నూ; భీముండు; వానిన్= సైంధవుడిని; పరిభవించుటయున్= అవమానించుటయున్నూ, ఉద్దాలక+ఉపాఖ్యానంబును= ఉద్దాలకు డనే ఋషికథయున్నూ, (ఉద్దాలుడనికూడ అంటారు); వైన్య+ఉపాఖ్యానంబును= వేణు(ను) డనబడే రాజకుమారు డైన పృథుచక్రవర్తికథయున్నూ, ఇతడినిబట్టియే భూమికి పృథివి అనేపేరు కలిగింది; శ్రీ, రామాయణ, కథయును= శోభాయుక్త మైన రామాయణ (శ్రీరాముని) కథయున్నూ; సావిత్రీ+ఉపాఖ్యానంబును= సావిత్రికథయున్నూ; పాండవులు; క్రమ్మఱి= తిరిగి; ద్వైత, వనంబునకున్; వచ్చుటయున్; కర్ణు, కవచ, కుండలంబులు= కర్ణుడియొక్క కవచం(మైమరువు), కుండలాలు(కర్ణాభరణాలు), ఇవి అతనికి సహజాలు; ఇంద్రుండు; కొనుటయున్= గ్రహించుటయున్నూ; ఆరణేయ+ఉపాఖ్యానంబును= అరణి అనగా త్రచ్చి నిప్పు పుట్టించే కొయ్య, దానికి సంబంధించిన(ఆరణీయ) కథయున్నూ; యముండు; ధర్మజున్= ధర్మరాజును; అనుశాసించుటయున్= పొగడుటయున్నూ (బోధించుటయున్నూ); యమువలనన్= యమునినుండి; వరములు= కోరికలు; పడసి= పొంది; పాండవులు; పశ్చిమ, దిక్కునకున్= పడమటిదెసకు; చనుటయున్= వెళ్ళుటయున్నూ; అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి=అలరి; పదుమూడు, వేలున్, ఆఱు, నూట, అఱువదినాల్గు= 13664; శ్లోకంబులు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** స్పష్టం.

**విశేషం:** ఈ వచనంలో చెప్పబడిన వృత్తాంతాల క్రమానికిన్నీ తెలుగులోని ఆరణ్యపర్వంలోని వృత్తాంతాల క్రమానికిన్నీ వ్యత్యాసం ఉన్నది. ఉదాహరణకు అగస్త్యుని చరిత్రం. జటాసురవధ, సౌగంధికాపహరణం మొదలైనవాటిని గ్రహించవచ్చును.

**క. ఆరణ్యపర్వ మనఁగా । నారణ్యప్రముఖ షోడశాంతఃపర్వా**
**ధార మయి సకలసూరిస । భారమ్యం బగు తృతీయపర్వము వెలయున్. 40**

**ప్రతిపదార్థం:** ఆరణ్య, పర్వము= పాండవులు అరణ్యంలో నివసించటానికి సంబంధించిన పర్వం; అనఁగాన్; ఆరణ్య, ప్రముఖ, షోడశ, అంతః, పర్వ+ఆధారము+అయి= ఆరణ్యాపర్వం మొదలుగా గల పదునారుఉపపర్వాలకు ఆశ్రయమై(16 ఉపపర్వాలు కల్గి); సకల, సూరి, సభా, రమ్యంబు+అగు= సర్వపండితుల సభలయందునూ అందమగు; తృతీయ, పర్వము= మూడవ దైన ప్రధానపర్వం; వెలయున్= ప్రసిద్ధ మై ఉంటుంది.

**తాత్పర్యం:** ఆరణ్యంమొదలు పదునారుఉపపర్వాలు కలిగి ఎల్లపండితులసభలందునూ అంద మై ఆరణ్యాపర్వమనే పేర మూడవ దైన ప్రధానపర్వం ప్రసిద్ధిపొందింది.

**విశేషం:** నన్నయ పండితసభాప్రశస్తిని పర్వసంగ్రహంలో పలుచోట్ల చేస్తూ ఉంటాడు.

**వ. మఱియు విరాటనగరంబునకుం జనుచుండి తత్సమీపశమీవృక్షంబునఁ బాండవులు తమయాయుధంబులు నిక్షేపించి తమ్మెవ్వరు నెఱుంగకుండ విరాటుం గొలిచి యునికియు, నందు భీముండు సింహబలుం దొట్టి సకలకీచకుల వధించుటయు, గోగ్రహణంబునఁ గురుబలంబుల నెల్ల నొక్కరుండ జయించి ధనంజయుండు గోగణంబులఁగ్రమ్మఱించుటయు, విరాటరాజపుత్త్రియైన యుత్తర నభిమన్యుండు వివాహం బగుటయునను వృత్తాంతంబుల నొప్పి మూడువేలు నేనూఱుశ్లోకంబులు గలిగి. 41**

**ప్రతిపదార్థం:** మఱియున్; విరాట, నగరంబునకున్= విరటుడిపట్టణానికి; చనుచుండి= వెళ్లుతూ; తద్, సమీప, శమీ, వృక్షంబునన్= ఆనగరానికి చెంత ఉన్న జమ్మిచెట్టుమీద; పాండవులు; తమ, ఆయుధంబులు= పాండవులు ధరించే గద, గాండీవం మొదలైన శస్త్రాలను; నిక్షేపించి= ఉంచి; తమ్మున్= పాండవులను; ఎవ్వరున్= జను లెవ్వరున్నూ; ఎఱుఁగక+ఉండన్= తెలిసికొనకుండ; విరాటున్= విరాటరాజును; కొలిచి= సేవించి; ఉనికియున్= ఉండుటయున్నూ; అందున్= విరాటనగరంలో; భీముండు; సింహబలున్, తొట్టి= కీచకునిమొదలుకొని; సకల, కీచకులన్= అందరుకీచకులను (ఉపకీచకులను); వధించుటయున్= చంపుటయున్నూ; గోగ్రహణంబునన్= దుర్యోధనాదులు విరాటుడిగోవులను ముట్టడించి కొనిపోయేసమయంలో; కురు, బలంబులన్, ఎల్లన్= కౌరవసేనలను అన్నింటిని; ఒక్కరుండు+అ=ఒక్కడే; జయించి=ఓడించి; ధనంజయుండు= అర్జునుడు (భూమినంతను గెల్చి ధనాలను పొందియుండటంచేత అతనికి ఆపేరు కలిగింది); గోగణంబులన్= ఆవులమందలను; క్రమ్మఱించుటయున్= మరల్చుటయున్నూ; విరాట, రాజ, పుత్త్రి= విరాటరాజు కూతురు; ఐన; ఉత్తరన్= ఉత్తర అనే కన్యను; అభిమన్యుండు= అర్జునుడి కుమారుడైన అభిమన్యుడు; వివాహంబు+అగుటయున్= పెండ్లి ఆడుటయున్నూ; అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి= అలరి; మూఁడు, వేలున్, ఏను, నూఱు= మూడువేలకు పైని అయిదువందల (3500); శ్లోకంబులు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** సుగమం.

**క. పర్వుచు వైరాటాదిక । పర్వచతుష్టయమునను సభారంజన మై**
**సర్వమనోజ్ఞము నాలగు । పర్వమునాఁ దగి విరాటపర్వము వెలయున్. 42**

**ప్రతిపదార్థం:** పర్వుచున్= వ్యాపిస్తూ; వైరాట+ఆదిక, పర్వ, చతుష్టయమునను= విరాటునకు సంబంధించిన వైరాటము మొదలుగా గల ఉపపర్వాలు నాల్గింటితో; సభా, రంజనము+ఐ= పండితసభలను సంతోషపెట్టునది అయి; సర్వ, మనః,

జ్ఞము= అందరికి మనోహర మై; నాలుగు+అగు= నాల్గవది అయిన; పర్వము; నాన్= అనగా; తగి=ఒప్పి; విరాట, పర్వము=ప్రధాన మైన విరాటపర్వం; వెలయున్= ప్రసిద్ధి కెక్కును.

**తాత్పర్యం:** వ్యాపిస్తూ వైరాటం మొదలుగా నాలుగు ఉపపర్వాలతో పండితసభలను రంజించేదై అందరికి (అన్నింటికంటె) మనోహరమైనదై నాల్గవపర్వ మయి ఒప్పి విరాటపర్వం ప్రకాశిస్తుంది.

**విశేషం:** నాలుగుశబ్దమున వృత్తియందు 'గు' లోపిస్తుంది; నాలు+అగు; నన్నయ 'అవ' కు బదులు 'అగు' అనుదానినే వాడుతూ ఉంటాడు- నాలగు.

**వ. మఱియు భారతరణోద్యోగు లైన పాండవు లుపప్లావ్యంబున విడియుటయు, నర్జునదుర్యోధనులు ద్వారకానగరంబునకుం జని శ్రీకృష్ణునిం గని సహాయత్వంబునకుం బ్రార్థించుటయు, నారాయణుండు వారి నాశ్వాసించి నారాయణగోపాలబలంబుల నిరూపించి వారలం గోరికొం డనుటయు, నారాయణ గోపాల బలంబుల దుర్యోధనుండు గోరికొనుటయు. నారాయణుని నొక్కని నర్జునుండు గోరికొనుటయు, ధృతరాష్ట్రుండు వనుప నుపశమనార్థం బుపప్లావ్యంబున సంజయుండు పాండవులకడకుం బోవుటయు, వాసుదేవసహితులైన పాండవులరణప్రారంభంబు విని ధృతరాష్ట్రుండు నిద్రాహారంబులు విడిచి చింతా క్రాంతుండగుటయు, హితవచనుం డైన విదురుపల్కులు వినమియు, ధృతరాష్ట్రునకు మనస్తాపోప శమనంబుగా సనత్సుజాతుం డధ్యాత్మకథలు సెప్పటయు, వాసుదేవార్జునుల యత్యంతసాంగత్యం బెఱింగి వచ్చిసంజయుండు సకలరాజసమక్షంబున విస్తరించుటయు, సర్వభూతహితుం డైన శ్రీకృష్ణుండు పాండవధార్తరాష్ట్రులకు సంధి గావింపం దలంచి హస్తిపురంబునకుం జని యందుఁ గర్ణాదిదుష్టశిక్షితుండైన దుర్యోధను దుర్మంత్రం బెఱింగి విశ్వరూపంబుఁ జూపుటయుఁ, గృష్ణుండు కర్ణునిం దనరథం బెక్కించుకొని యుపాయంబున ననునయించి యొడంబఱుపనేరక కర్ణుచేతం బ్రత్యాఖ్యాతుం డయి క్రమ్మఱి వచ్చుటయు, బలాతిబలసంఖ్యానంబు, నెల్లి యుద్ధంబు సేయవలయు నని కురుపతి పనుప నులూకుం డను దూత పాండవులపాలికి వచ్చి పరుసంబులు వలుకుటయు, సమరథాతిరథ సంఖ్యానంబు, నర్ధరథులలోనం గలయం ద న్నెన్నిన నలిగి కర్ణుండు భీష్మపదిదినంబులు సమరపరాఙ్ముఖుం డగుటయు, రామభీష్ముల యుద్ధకీర్తనంబు, నంబోపాఖ్యానంబును, సంక్రందనోపాఖ్యానంబును, శ్వేతాభిషేకంబు నను వృత్తాంతంబుల నొప్పి యాఱువేలుం దొమ్మన్నూట తొంబదియెనిమిది శ్లోకంబులు గలిగి. 43**

**ప్రతిపదార్థం:** మఱియున్; భారత, రణ+ఉద్యోగులు+ఐన= కురుక్షేత్రయుద్ధమునందు ప్రయత్నం కలవా రైన; పాండవులు; ఉపప్లావ్యంబునన్= ఉపప్లావ్యనగరంలో; విడియుటయున్= ఆగుటయున్నూ; అర్జున, దుర్యోధనులు= అర్జునుడున్నూ, దుర్యోధనుడున్నూ; ద్వారకా, నగరంబునకున్; చని= వెళ్ళి, శ్రీకృష్ణునిన్; కని= చూచి; సహాయత్వంబునకున్= తోడ్పడటానికి; ప్రార్థించుటయున్= వేడుటయున్నూ; నారాయణుండు= కృష్ణుడు; వారిన్= అర్జునదుర్యోధనులను; ఆశ్వాసించి= ఓదార్చి; నారాయణగోపాల, బలంబులన్= నారయణు లనే పేరు గల గోపాలకులసేనలను; నిరూపించి = చూపి, నిరూపణచేసి; వారలన్= అర్జునదుర్యోధనులను; కోరికొండు= తననుగాని నారాయణగోపాలురను గాని కోరుకొనండి; అనుటయున్= అని

చెప్పుటయున్నూ; నారాయణ, గోపాల, బలంబుల; దుర్యోధనుండు; కోరికొనుటయున్= తనకు కావలె నని కోరుటయున్నూ, నారాయణునిన్, ఒక్కనిన్, అర్జునుండు, కోరికొనుటయున్= శ్రీకృష్ణుడిని ఒక్కడినే అర్జునుడు కోరుకొనుటయున్నూ; ధృతరాష్ట్రుండు; పనుపన్= పంపగా; ఉపశమన+అర్థంబు= శాంతించుటకొరకు; ఉపప్లావ్యంబునన్= పాండవులు విడిసిన ఉపప్లావ్యనగరంలో; సంజయుండు= ధృతరాష్ట్రుండు దూతగా పంపిన సూతుడు; పాండవుల, కడకున్= పాండవులచెంతకు; పోవుటయున్= వెళ్ళుటయున్నూ; వాసుదేవ, సహితులు+ఐన= కృష్ణునితో కూడినవారైన; పాండవుల; రణ, ప్రారంభంబు= యుద్ధంకొరకు ప్రయత్నం; విని; ధృతరాష్ట్రుండు; నిద్రా+ఆహారంబులు= నిద్రను భోజనాన్ని; విడిచి; చింతా+ఆక్రాంతుండు+అగుటయున్= శోకంచేత ఆక్రమింపబడినవాడు (దుఃఖితుడు) అగుటయున్నూ; హిత, వచనుండు+ఐన= మేలు కలిగించే వాక్యాలు కలవాడైన; విదురు, పలుకులు= విదురుడిమాటలు; వినమియున్= వినకుండుటయున్నూ; ధృతరాష్ట్రునకున్; మనః తాప+ఉపశమనంబు, కాన్= మనస్సులోని దుఃఖానికి శాంతికలిగేటట్లుగా; సనత్సుజాతుండు= సనత్సుజాతు డనే ముని; అధ్యాత్మ, కథలు= తత్త్వంతో కూడిన విషయాలు (వృత్తాంతాలు) చెప్పుటయున్నూ; వీనికి సనత్సుజాతీయ మని పేరు. తిక్కన దీనిని అనువదింపక ఊరక పేర్కొని విడిచివేశాడు. వాసుదేవ+అర్జునుల= కృష్ణుడియొక్క, అర్జునుడియొక్క; అత్యంత, సాంగత్యంబు= అధిక మైన స్నేహం; ఎఱింగి= తెలిసికొని; వచ్చి; సంజయుండు; సకల, రాజ, సమక్షంబునన్= రాజులందరి యెదుట, విస్తరించుటయున్= వివరించి చెప్పుటయున్నూ, సర్వ, భూత హితుండు+ఐన= ఎల్లజీవులకును మేలుకోరువాడైన శ్రీకృష్ణుడు; పాండవ, ధార్తరాష్ట్రులకున్= పాండుధృతరాష్ట్రపుత్రులకు; సంధి= పొందు; కావింపన్, తలంచి= చేయటానికి కోరి; హస్తినాపురంబునకున్ = హస్తినాపురానికి; చని= వెళ్ళి; అందున్= ఆ హస్తిపురంలో; కర్ణ+ఆది, దుష్ట, శిక్షితుండు+ఐన= కర్ణుడు మొద లైన దుర్జనులచేత బోధింపబడినవా డైన; దుర్యోధను; దుర్, మంత్రంబు= చెడ్డఆలోచన; ఎఱింగి= తెలిసికొని; విశ్వ, రూపంబున్= సర్వప్రపంచం తనలో ఉన్న రూపాన్ని; చూపుటయున్; కృష్ణుండు; కర్ణునిన్; తన, రథంబు; ఎక్కించుకొని= ఎక్కేటట్లుచేసి; ఉపాయంబునన్= నేర్పుతో; అనునయించి= ఓదార్చి; ఒడంబఱుపన్; నేరక= పాండవపక్షానికి వచ్చేటట్లు అంగీకరింపజేయజాలక; కర్ణుచేతన్= కర్ణునిచేత; ప్రత్యాఖ్యాతుండు+అయి= తిరస్కరింపబడినవాడై;క్రమ్మఱి= తిరిగి, వచ్చుటయున్; బల, అతిబల, సంఖ్యానంబున్= సేనయొక్కయు, ఎక్కువబల మున్న సేనయొక్కయు గణనమున్నూ; ఎల్లి= రేపు; యుద్ధంబు; చేయవలయున్+అని; కురు, పతి= కౌరవనాథు డయిన దుర్యోధనుడు; పనుపన్= పంపగా; ఉలూకుండు+అను, దూత= శకునికుమారు డైన ఉలూకు డనే దూత; పాండవులపాలికిన్= పాండవులచెంతకు, వచ్చి; పరుసంబులు= పరుషవాక్యాలు; పలుకుటయున్; సమరథ, అతిరథ, సంఖ్యానంబున్= సమరథులయొక్కయు (ఒకవిలుకానితో సరిగా నిల్చి పోరే యోధుడు సమరథుడు), అతిరథులయొక్కయు (రథంలో ఉండి అప్రతిమానంగా పోరాడే యోధుడు, లేదా అనేకులతో పోరాడే యోధుడు అతిరథుడు- అమితాన్ యోధయే ద్యస్తు స ప్రోక్తో౽తిరథస్తు సః) పరిగణనం; అర్ధరథులలోనన్= (ఒక్కవిలుకానితో సరిగా నిలిచి పోరలేని యోధుడు అర్ధరథుడు) అటువంటివారిలో; కలయన్= కలయునట్లుగా, తన్నున్= కర్ణుని; ఎన్నన్= గణింపగా; అలిగి= కోపించి; కర్ణుండు; భీష్మ, పదిదినంబులు= భీష్ముడు సేనానాయకుడుగా ఉన్న పదిరోజులున్నూ; సమర, పరాక్+ముఖుండు+అగుటయున్= యుద్ధంపట్ల విముఖుడు కావటమున్నూ; రామ, భీష్ముల, యుద్ధకీర్తనంబున్= పరశురామభీష్ములయుద్ధముయొక్క పొగడ్తయున్నూ, అంబా+ఉపాఖ్యానంబును= కాశీరాజుకూతులలో పెద్దదైన అంబకథయున్నూ; సంక్రందన+ఉపాఖ్యానంబును= ఇంద్రుడియొక్క కథయున్నూ; శ్వేత+అభిషేకంబున్; అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి= అలరి; ఆఱు, వేలున్, తొమ్మన్నూట, తొంబది, ఎనిమిది, శ్లోకంబులు= 6998 శ్లోకాలు; కలిగి= వహించి.

**క. విదితం బై యుద్యోగము । మొదలుగఁ బదునొకఁడు పర్వముల నెంతయు నొ**
**ప్పిద మై యేనగు పర్వం । బిది నా నుద్యోగపర్వ మిమ్మగు సభలన్. 44**

**ప్రతిపదార్థం:** విదితంబు+ఐ= తెలియబడినదై; ప్రసిద్ధ మై; ఉద్యోగము= ఉద్యోగమనే ఉపపర్వం; మొదలుగన్= మున్నుగా; పది+ఒకఁడు, పర్వములన్= పదకొండుపర్వాలతో; ఎంతయున్= మిక్కిలి; ఒప్పిదము+ఐ= అంద మై; ఇది; ఏను+అగు=

ఐదవదగు; పర్వంబు, నాన్= పర్వ మనగా; ఉద్యోగ, పర్వము= ఉద్యోగ మనే ప్రధానపర్వం; సభలన్= సభలలో; ఇమ్ము+అగున్= ఇంపగును.

**తాత్పర్యం:** ప్రసిద్ధ మై ఉద్యోగం మొదలుగా గల పదకొండు ఉపపర్వాలతో అంద మై ఇది ఐదవపర్వ మనగా ఉద్యోగపర్వం సభలలో ఇంపొందుతుంది.

**విశేషం:** భారతంలోని ప్రధాన మైన పదునెనిమిదిపర్వాలలో ఐదవది ఉద్యోగపర్వం. ఉద్యోగ మంటే ప్రయత్నం. ఈ పర్వంలో మొదట సంధికొరకున్నూ, తరువాత యుద్ధంకొరకున్నూ ప్రయత్నం చేయబడింది.

**వ. మఱియు జంబూఖండవినిర్మాణంబు సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పుటయు, భూవిస్తారంబును, భీష్మాభిషేకంబును, బాండవమధ్యమవిషాదంబును, వాసుదేవుండు మోక్షదర్శనహేతువులం జెప్పి యర్జును మోహభ్రాంతిఁ జెఱుచుటయు, శిఖండిం బురస్కరించుకొని యర్జునుండు భీష్ముని వధించుటయు నను వృత్తాంతంబుల నొప్పి యైదువేలునెనమన్నూటయెనుబదినాలుగు శ్లోకంబులు గలిగి. 45**

**ప్రతిపదార్థం:** మఱియున్; జంబూఖండ, వినిర్మాణంబు= మేరుపర్వతం చుట్టూ ఉన్న తొమ్మిదిఖండాలలో జంబూఖండ మొకటి. జంబువు అంటే నేరేడుచెట్టు లేక నేరేడుపండు. జంబూఖండనిర్మాణాన్ని; సంజయుడు; ధృతరాష్ట్రునకున్; చెప్పుటయున్= వివరించుటయున్నూ; భూ, విస్తారంబును= భూమివిస్తీర్ణాన్నీ; భీష్మ+అభిషేకంబును= సేనానాయకుడిగా భీష్ముడిని అభిషేకించుటయున్నూ; పాండవ, మధ్యమ, విషాదంబును= పాండవులలో నడిమివాడైన అర్జునుడి దుఃఖమున్నూ; వాసుదేవుండు= కృష్ణుడు (వసుదేవుడికుమారుడు); మోక్షదర్శనహేతువులన్= మోక్షం పొందటానికి గల కారణాలను; చెప్పి= వివరించి; అర్జును= అర్జునుడి యొక్క; మోహ, భ్రాంతిన్= అజ్ఞానంవలన కలిగిన భ్రమను; చెఱుచుటయున్= పోగొట్టుటయున్నూ; శిఖండిన్= ద్రౌపదిసోదరు డైన శిఖండిని; పురస్కరించుకొని= ముందుంచుకొని; అర్జునుండు, భీష్ముని, వధించుటయున్= చంపుటయున్నూ అను, వృత్తాంతంబులన్= అనేకథలతో; ఒప్పి= అలరి, ఐదు, వేలున్, ఎనమన్నూట, ఎనుబది, నాలుగు, శ్లోకంబులు= 5884 శ్లోకాలు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** స్పష్టం.

**విశేషం:** భూవిస్తారం, భీష్మాభిషేకం అనేఅంశాలు సంస్కృతమూలంలో లేవు.

**క. జంబూఖండవినిర్మా । ణం బాదిగ హృదయరోచనము లగు నేన్ప**
**ర్వంబులను భీష్మపర్వము । పంబి వినం బొలుచు షష్ఠపర్వం బగుచున్. 46**

**ప్రతిపదార్థం:** జంబూ, ఖండ, వినిర్మాణంబు= జంబూఖండాన్ని నిర్మించుట అనే విషయంతోకూడినపర్వం; ఆదిగన్= మొదలుగా, హృదయ, రోచనంబులు+అగు= హృదయాన్ని వికసింపచేసే వైన; ఏన్, పర్వంబులను= ఐదుపర్వాలతో; పంబి= అతిశయించి; వ్యాపించి; భీష్మపర్వము=భీష్మపర్వ మనే ప్రధానపర్వం; షష్ఠ, పర్వంబు+అగుచున్= ఆరవపర్వం ఔతూ; వినన్, పొలుచున్= వినటానికి ఒప్పుగా ఉంటుంది.

**తాత్పర్యం:** జంబూఖండవినిర్మాణం అనే ఉపపర్వం మొదలుగా గల చిత్తాన్ని వికసింపజేసే అయిదుఉపపర్వాలతో ఒప్పి భీష్మపర్వం ఆరవప్రధానపర్వం ఔతూ వినటానికి ఇంపుగా ఉంటుంది.

**విశేషం:** తెలుగుప్రతులలో జంబూఖండం అనటానికి బదులు జంబూషండం అని ఉన్నది.

**వ. మఱియు ద్రోణాభిషేకంబును, సంశప్తకు లర్జునుం బాపికొనిపోయి యేకతంబు యుద్ధంబు సేయుటయు, నర్జునుచేత సుప్రతీకగజంబుతోడన భగదత్తుచావును. ద్రోణకర్ణాదులు పెక్కండ్రు గూడుకొని యధర్మయుద్ధంబున నభిమన్యుం జంపుటయు, నర్జునుప్రతిజ్ఞయు, నభిమన్యు వధకుం గ్రుద్ధుండై యర్జునుం డే డక్షౌహిణులబలంబుల నొక్కరుండ చంపి సైంధవుం దునుముటయును, దొమ్మిదికోట్లు సంశప్తకుల నర్జునుండు నిశ్శేషంబు సేయుటయు, నలంబస శ్రుతాయు జలసంధ సోమదత్త భూరిశ్రవో బాహ్లిక విరాట ద్రుపద ఘటోత్కచ ధార్తరాష్ట్ర నారాయణగోపాలాదివధయును, ద్రోణవధయు, నశ్వత్థామ నారాయణాగ్నేయాస్త్రకీర్తనంబును, గృష్ణార్జునులమాహాత్మ్యంబును నను వృత్తాంతంబుల నొప్పి పదివేలుందొమ్మన్నూట పందొమ్మిది శ్లోకంబులు గలిగి. 47**

**ప్రతిపదార్థం:** మఱియు; ద్రోణ+అభిషేకంబును= ద్రోణుని సేనానాయకుడిగా అభిషేకించుటయున్నూ; సంశప్తకులు= యుద్ధంలో ఎప్పుడూ వెనుకంజ వేయక ఇతురులపోరాటాన్ని ఆపటానికి నిల్చబడినవారు; అర్జునున్; పాపికొనిపోయి= దూరంగా తీసికొనిపోయి; ఏకతంబు= ఒంటరిగా; యుద్ధంబు; చేయుటయున్, అర్జునుచేతన్; సుప్రతీక, గజంబుతోడన్+అ= సుప్రతీక మనే పేరుకల ఏనుగుతోకూడ, భగదత్తు, చావును= భగదత్తుడు నరకాసురునికుమారుడు, బాష్కళునిఅంశానపుట్టినవాడు, అతడు చనిపోవుటయున్నూ; ద్రోణ, కర్ణ+ఆదులు= ద్రోణుడు కర్ణుడు మొదలైనవారు; పెక్కండ్రు= పలువురు; కూడుకొని= కలిసి; అధర్మ, యుద్ధంబునన్= ధర్మరహితమైనయుద్ధంలో; అభిమన్యున్= అర్జునుడికుమారుడిని; చంపుటయున్; అర్జును, ప్రతిజ్ఞయున్= అర్జునుడియొక్కశపథమున్నూ; అభిమన్యు, వధకున్= అభిమన్యుడు చంపబడినందుకు, క్రుద్ధుండు+ఐ= కోపాన్ని పొందినవాడై; అర్జునుండు; ఏడు+అక్షౌహిణుల, బలంబులన్= 21870 రథాలను, అన్నిఏనుగులను, 65610 గుఱ్ఱాలు, 109350 కాల్బురున్నూ గల సేనావిశేషం ఒకఅక్షౌహిణి. అటువంటి ఏడు అక్షౌహిణులసేనలను; ఒక్కరుండు+అ= ఒక్కడే; చంపి; సైంధవున్; తునుముటయును= చంపుటయున్నూ; తొమ్మిది, కోట్లు, సంశప్తకులన్, అర్జునుండు; నిశ్శేషంబు, చేయుటయున్= మిగులకుండ చేయుటయున్నూ(చంపుటయున్నూ); అలంబస, శ్రుతాయు, జలసంధ, సోమదత్త, భూరిశ్రవః, బాహ్లిక, విరాట, ద్రుపద, ఘటోత్కచ, ధార్తరాష్ట్ర, నారాయణగోపాల+ఆది, వధయును= అలంబసు డనే రాక్షసుడు, శ్రుతాయువు, జలసంధుడు, సోమదత్తుడు, భూరిశ్రవుడు, బాహ్లికుడు, విరాటుడు, ద్రుపదుడు, ఘటోత్కచుడు, ధృతరాష్ట్రునికుమారులు, నారాయణగోపాలురు మొదలైనవారి సంహారమున్నూ; ద్రోణ, వధయున్= ద్రోణుడినిచంపుటయున్నూ; అశ్వత్థామ; నారాయణ+ఆగ్నేయ+అస్త్ర, కీర్తనంబును= అశ్వత్థామ ప్రయోగించిన నారాయణాస్త్రముయొక్కయు ఆగ్నేయాస్త్రముయొక్కయు స్తుతియున్నూ; కృష్ణ+అర్జునుల, మాహాత్మ్యంబును= కృష్ణుడి యొక్కయు, అర్జునుడి యొక్కయు మహత్త్వమున్నూ; అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి= అలరి; పది, వేలున్, తొమ్మన్నూట, పందొమ్మిది శ్లోకంబులు= 10919 శ్లోకాలు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** సుగమం.

**క. విన నే డగుపర్వము మే । లనఁగా ద్రోణాభిషేక మాదిగఁ గల య**
**య్యెనిమిదిపర్వములను న । త్యనుపమ మై ద్రోణపర్వ మమరున్ సభలన్. 48**

**ప్రతిపదార్థం:** వినన్= వినుటకు; ఏడు+అగు, పర్వము= ఏడవపర్వం; మేలు= శ్రేష్ఠమైనది; అనగా; ద్రోణ+అభిషేకము= ద్రోణుడిని సేనానాయకుడిగా అభిషేకించటం (ఇది ద్రోణపర్వంలోని మొదటిఉపపర్వం); ఆదిగన్= మొదలుగ; కల; ఆ+ఎనిమిదిపర్వములనున్= ఆ ఎనిమిది పర్వాలతో; అతి+అనుపమము+ఐ= మిక్కిలి సాటిలేని దై; ద్రోణపర్వము= ద్రోణపర్వ మనే ప్రధానపర్వం; సభలన్= పండితసభలలో; అమరున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** వినటానికి ఏడవపర్వం శ్రేష్ఠ మనగా ద్రోణాభిషేకం మొదలుగా గల ఎనిమిదిఉపపర్వాలతో సాటిలేని దై ప్రధాన మైన ద్రోణపర్వం పండితసభలలో ఒప్పారుతుంది.

**వ. మఱియుఁగర్ణాభిషేకంబును, గర్ణునకు రథంబు గడప శల్యుం బూన్చుటయుఁ,ద్రిపురదహనోపాఖ్యానంబును, గర్ణశల్యుల పరస్పరవివాదంబును, హంసకాకీయోపాఖ్యానంబును, యుధిష్ఠిరార్జునుల పరస్పర క్రోధవచనంబులు, నర్జునానునయంబును, వృషసేనువధయును, దుశ్శాసనుం జంపిభీముండు తద్వక్షోరక్తం బాస్వాదించుటయు, విప్రశాపనిమిత్తంబునఁ గర్ణురథచక్రంబు భూమియందుఁ గ్రుంగుటయు, నాగాస్త్రభయంబును, నర్జునురథంబు శ్రీకృష్ణుండు భూమియందుఁ జొనుపుటయు, నింద్రాదిత్యుల పరస్పరసంవాదంబును,గర్ణువధయును నను వృత్తాంతంబుల నొప్పినాలుగువేలుందొమ్మన్నూఱుశ్లోకంబులు గలిగి. 49**

**ప్రతిపదార్థం:** మఱియున్; కర్ణ+అభిషేకంబును= సేనానాయకుడిగా కర్ణుని అభిషేకించుటయున్నూ; కర్ణునకున్; రథంబు; కడపన్= నడుపుటకు; శల్యున్= మద్రరాజైన శల్యుడిని; పూన్చుటయున్= వహింపజేయుటయున్నూ; త్రిపుర, దహన+ఉపాఖ్యానంబును= మూడు పురాలను దహించటంతో కూడుకొన్న కథయున్నూ (శివుడు త్రిపురాలను దహించినకథ); కర్ణ, శల్యుల; పరస్పరవివాదంబును= ఒండొరులతో తగవున్నూ; హంస, కాకీయ+ఉపాఖ్యానంబును= హంసకునూ కాకికినీ సంబంధించిన కథయున్నూ; యుధిష్ఠిర, అర్జునుల; పరస్పర, క్రోధ, వచనంబులున్= ఒండొరుల కోపంతో కూడిన వాక్యాలున్నూ; అర్జున+అనునయంబున్= అర్జునుడిని బుజ్జగించటమున్నూ వృషసేనువధయును= కర్ణునికుమారు డైన వృషసేనుడిని చంపుటయున్నూ; దుశ్శాసనున్= దుర్యోధనుడి తమ్ము డైన దుశ్శాసనుడిని; చంపి; భీముండు; తద్, వక్షః రక్తంబున్= ఆ దుశ్శాసనుని రొమ్ములోని నెత్తురును; ఆస్వాదించుటయున్= చవిచూచుటయున్నూ; విప్ర, శాప, నిమిత్తంబునన్= బ్రాహ్మణునిశాప మనే కారణంచేత; కర్ణు, రథ, చక్రంబు; భూమియందున్; క్రుంగుటయున్= దిగబడుటయున్నూ; నాగ+అస్త్రభయంబునన్= సర్పాస్త్రభయంచేత; అర్జును, రథంబు= అర్జునుడి రథాన్ని; శ్రీకృష్ణుండు; భూమియందున్; చొనుపుటయున్= చొచ్చునట్లు చేయుటయున్నూ; ఇంద్ర+ఆదిత్యుల, పరస్పర, సంవాదంబును= ఇంద్రసూర్యులు పరస్పరం వాదించుకొనుటయున్నూ; అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి= అలరి; నాలుగు, వేలున్, తొమ్మన్నూఱుశ్లోకంబులు= 4900 శ్లోకాలు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** సుగమం.

**క. అనుపమబలు లగు కర్ణా। ర్జునవీరుల శౌర్యమహిమ శోభిల్లంగా**
**నెనిమిది యగు పర్వం బిది। యనఁ బరఁగుం గర్ణపర్వ మతిహృద్యం బై. 50**

**ప్రతిపదార్థం:** అనుపమబలులు= సాటిలేని బలం కలవారు; అగు; కర్ణ+అర్జున, వీరుల= వీరు లైన కర్ణునియొక్కయు, అర్జునునియొక్కయు; శౌర్యమహిమ= పరాక్రమమహత్త్వం; శోభిల్లంగాన్= ప్రకాశింపగా; ఇది; ఎనిమిది, అగు=ఎనిమిదవ; పర్వంబు; అనన్= అనగా; కర్ణ, పర్వము= కర్ణపర్వ మనే ప్రధానపర్వం; అతిహృద్యంబు+ఐ= మిక్కిలి మనోహర మై; పరఁగున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** సాటిలేనిబలం కలవారైన వీరు లైన కర్ణార్జునుల పరాక్రమమహత్త్వం ప్రకాశింపగా ఇది ఎనిమిదవపర్వం అనగా కర్ణపర్వ మనే ప్రధానపర్వం మిక్కిలి మనోహర మై ఒప్పుతుంది.

**వ. మఱియుభారతవీరు లెల్లఁబరలోకగతులైన శల్యుండు రణభారంబుపూనుటయుఁ, గురుకుమారవధయును, ధర్మజురోషంబున శల్యుమరణంబును, గురుముఖ్యులవధయును, సహదేవునిచేత సపుత్త్రకుం డైన శకునిచావును, సంజయగ్రహణమోక్షణంబును, హ్రదప్రవేశంబును, భీమదుర్యోధనుల గదాయుద్ధంబును సరస్వత్యాదిపుణ్యతీర్థకీర్తనంబు నను వృత్తాంతంబుల నొప్పి మూఁడువేలు నిన్నూటయిరువది శ్లోకంబులు గలిగి. 51**

**ప్రతిపదార్థం:** మఱియున్ భారతవీరులు= భరతవంశానికి చెందిన వీరులు; ఎల్లన్= అందరున్నూ; పరలోక, గతులు+ఐనన్= స్వర్గలోకాన్ని పొందినవారు కాగా; శల్యుండు= మద్రరా జైన శల్యుడు; రణభారంబు= యుద్ధముయొక్కబాధ్యతను; పూనుటయున్= వహించుటయున్నూ; కురు, కుమార, వధయును= కురువంశానికి చెందిన కుమారులసంహరణమున్నూ; ధర్మజు, రోషంబునన్= ధర్మరాజుయొక్కకోపంచేత; శల్యుమరణంబును= శల్యునియొక్కచావున్నూ; కురుముఖ్యుల= ముఖ్యు లైన కురువంశస్థుల; వధయును= చంపుటయున్నూ; సహదేవునిచేతన్; సపుత్రకుండు+ఐన= కుమారునితో కూడిన; శకునిచావును= కౌరవులమేనమామ ఐన శకునిమరణమున్నూ; సంజయుగ్రహణమోక్షణంబును= సాత్యకి సంజయుడిని పట్టుకొనగా వ్యాసుడు ప్రత్యక్షమై విడిపించుటయున్నూ; హ్రదప్రవేశంబును= దుర్యోధనుడు మడుగులో చొచ్చుటయున్నూ; భీమదుర్యోధనుల= భీమునియొక్కయు దుర్యోధనునియొక్కయు; గదాయుద్ధంబును= గదలతో చేయబడిన యుద్ధమున్నూ; సరస్వతీ+ఆది, పుణ్య, తీర్థకీర్తనంబును= సరస్వతి మొదలైన పుణ్యనదుల స్తుతియున్నూ; అను, వృత్తాంతంబులన్= అనేకథలతో; ఒప్పి= అలరి; మూఁడు, వేలున్, ఇరు+నూట, ఇరు+పది, శ్లోకంబులు= 3220 శ్లోకాలు; కలిగి= వహించి.

**తాత్పర్యం:** స్పష్టం.

**ఆ. సభల విస్తరిల్లి శల్యాదికము లైన । నాల్గుపర్వముల వినంగఁ జాలి**
**నవమపర్వ మనఁగ నవ్యార్థరమణీయ । మగుచు శల్యపర్వ మతిశయిల్లు. 52**

**ప్రతిపదార్థం:** సభలన్= సభలయందు; విస్తరిల్లి= వ్యాపించి; శల్య+ఆదికములు+ఐన= శల్యపర్వం మొదలైన; నాల్గుపర్వములన్= నాలుగుఉపపర్వాలలో; వినంగన్= వినటానికి; చాలి= తగి; నవమపర్వము= తొమ్మిదవపర్వం; అనఁగన్= అనగా; నవ్య+అర్థ, రమణీయము+అగుచున్= క్రొత్త వైన అర్థాలతో ఒప్పిద మౌతూ; శల్యపర్వము= శల్యపర్వ మనే ప్రధానపర్వం; అతిశయిల్లున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** సభలలో వ్యాపించి శల్యపర్వం మొదలైన నాలుగుఉపపర్వాలతో వినటానికి తగి తొమ్మిదవపర్వ మనగా నూత్నార్థసుందర మౌతూ శల్యపర్వం అనే ప్రధానపర్వం ఒప్పారుతుంది.

**వ. మఱియు భీముగదాభిఘాతంబున దుర్యోధనుండు తొడలు విఱిగి పడినఁ, బాండవులు రణం బుపసంహరించి చనిన నాఁటిరాత్రి కృపకృతవర్మాశ్వత్థామలు పాండవశిబిరంబుపయింజనుటయు, నం దశ్వత్థామ కోపోద్దీపితుండైతనప్రతిజ్ఞదీఱ ధృష్టద్యుమ్నపురోగములైన సర్వపాంచాలురను బ్రతివింధ్యాదిద్రౌపదేయులను బాండవామాత్యులను సుఖసుప్తులయినవారి వధించుటయు, నందు శ్రీకృష్ణప్రసాదంబునఁ బాండవులేవురు సాత్యకియుం దప్పుటయుఁ, బుత్త్రభ్రాతృవధ దుఃఖిత యై పాంచాలి యనశనంబు సంకల్పించుకొనుటయుఁ, దద్వచనంబున భీముం డశ్వత్థామపిఱుందం జనుటయు,**

**భీమసేనభయార్తుండయి యశ్వత్థామ యపాండవం బయ్యెడుమని శరమోక్షణంబుసేయుటయు, నట్లుగాకుండెడు మని శ్రీకృష్ణుండు దానింబరిహరించుటయు, దానిం దునియ నర్జునుండు తనదివ్యబాణంబున నేయుటయు, వ్యాసాశ్వత్థామల యన్యోన్యశాపంబులు, నశ్వత్థామశిరోరత్నంబుఁ బాండవులుగొనుటయు నను వృత్తాంతంబుల నొప్పి రెండువేలునెనమన్నూటడెబ్బది శ్లోకంబులు గలిగి. 53**

**ప్రతిపదార్థం:** భీము, గదా, అభిఘాతంబునన్= భీమునిగదయొక్క దెబ్బచేత; దుర్యోధనుండు; తొడలు, విఱిగి, పడినన్= తొడలు విరిగి పడిపోగా; పాండవులు; రణంబు= యుద్ధం; ఉపసంహరించి= చాలించి; చనినన్= వెళ్ళిన; నాఁటి, రాత్రి; కృప, కృతవర్మ, అశ్వత్థామలు= కృపాచార్యుడున్నూ, కృతవర్మయున్నూ, అశ్వత్థామయున్నూ; పాండవశిబిరంబుపయిన్= పాండవులు విడిసిన ప్రదేశంమీదికి; చనుటయున్= వెళ్ళుటయున్నూ; అందున్= ఆ ముప్పురిలో, (అచట); అశ్వత్థామ= ద్రోణుడికుమారు డైన అశ్వత్థామ; కోప+ఉద్దీపితుండు+ఐ= కోపంచేత మిక్కిలి మండిపడినవాడై; తనప్రతిజ్ఞ= తనశపథం; తీఱన్= ముగిసేటట్లుగా; ధృష్టద్యుమ్నపురోగములు+ఐన= ద్రుపదుని కుమారు డైన ధృష్టద్యుమ్నుడు ముందుగా కలవా రైన; సర్వపాంచాలురను= సకలపాంచాలదేశీయులను; ప్రతివింధ్య+ఆది ద్రౌపదేయులను= ప్రతివింధ్యుడు మొదలైన ద్రౌపదికుమారులను; పాండవ+అమాత్యులను= పాండవులమంత్రులను; సుఖసుప్తులు+అయినవారిన్= సుఖంగా నిద్రించినవారిని; వధించుటయును= చంపుటయున్నూ; అందున్= వారిలో; శ్రీకృష్ణప్రసాదంబునన్= శ్రీకృష్ణునిఅనుగ్రహంచేత; పాండవులు+ఏవురున్= పాండవులైదుగురున్నూ; సాత్యకియున్= సాత్యకియున్నూ; తప్పుటయును= చావక మిగులుటయున్నూ; పుత్త్ర, భ్రాతృ, వధ, దుఃఖిత+ఐ కుమారులయొక్కయు, సోదరులయొక్కయు సంహరణంచేత శోకించిన దై; పాంచాలి= పాంచాలరాజగు ద్రుపదుడి కూతు రైన ద్రౌపది; అనశనంబు= భోజనంలేకుండటం (ఉపవాసం); సంకల్పించుకొనుటయున్= నిశ్చయించుకొనుటయున్నూ; తద్, వచనంబునన్= ఆ ద్రౌపదియొక్క మాటచేత; భీముండు; అశ్వత్థామ, పిఱుందన్= అశ్వత్థామవెనుక; చనుటయున్= వెళ్ళుటయున్నూ; భీమసేన, భయ+ఆర్తుండు+ఐ= భీమసేనుడివలనిభయంచేత దుఃఖితు డై; అశ్వత్థామ; అపాండవంబు= పాండవులు లేకుండే స్థితి; అయ్యెడున్+అని= అగుగాక అని; శరమోక్షణంబు= బాణాన్ని విడుచుట; చేయుటయున్, అట్లు= ఆవిధంగా, అపాండవం; కాక, ఉండెడున్+అని= కాకుండు గాక అని; శ్రీకృష్ణుండు; దానిన్= ఆ బాణాన్ని; పరిహరించుటయున్= తప్పించుటయున్నూ; దానిన్= ఆబాణాన్ని; తునియన్= ఖండిత మయ్యేటట్లు; అర్జునుండు; తనదివ్యబాణంబునన్= తనయొక్కదేవతాసంబంధమైన అస్త్రంచేత; ఏయుటయున్= కొట్టుటయున్నూ (ప్రయోగించుటయున్నూ); వ్యాస+అశ్వత్థామల= వ్యాసునియొక్కయు, అశ్వత్థామయొక్కయు; అన్యోన్యశాపంబులున్= ఒండొరులను శపించుకొనుటయున్నూ; అశ్వత్థామశిరః+రత్నంబున్= అశ్వత్థామయొక్క శిరోమణిని; పాండవులు; కొనుటయున్= గ్రహించుటయున్నూ; అను వృత్తాంతంబులన్= అనే కథలతో, ఒప్పి= అలరి; రెండు, వేలున్, ఎనమన్నూట, డెబ్బదిశ్లోకంబులు= 2870 శ్లోకాలు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** సులభం.

**విశేషం:** చిన్నయసూరి 'ఆశీశ్శాపార్థంబులందు ఎడు, త అనుప్రత్యయము లగు' నని, 'అచ్చుపరమగునపుడు వాని ద్రుతమునకు మవర్ణక' మగు ననీ చెప్పాడు. కాని, వ్రాతప్రతులలో 'ఎడున్' అనేదానికి బదులు 'ఎడమ' అనే రూపమే కానవస్తున్నది. కేతనకూడ దీవెనకు 'ఎడమ' ఔతుం దని చెప్పాడు. ఎడమ+అని= ఎడమని.

**క. నుతసౌప్తికాదిపర్వ। త్రితయంబునఁ దనరి వసుమతీసురవరస**
**మ్మత మై సౌప్తికపర్వము। ప్రతిభ వినం బొలుచు దశమపర్వం బగుచున్. 54**

**ప్రతిపదార్థం:** నుతసౌప్తిక+ఆది= పొగడబడిన 'సౌప్తికము' మొదలైన; పర్వత్రితయంబునన్= పర్వాలమూడింటితో, తనరి= ఒప్పి; వసుమతీ, సుర, వర, సమ్మతము+ఐ= బ్రాహ్మణశ్రేష్ఠులకు ఇష్ట మై; సౌప్తికపర్వము, సౌప్తికపర్వ మనే ప్రధాన పర్వం; దశమపర్వంబు+అగుచున్= పదవప్రధానపర్వం ఔతూ; ప్రతిభన్= ప్రజ్ఞతో; వినన్, పొలుచున్= విన సొంపుగా ఉంటుంది.

**తాత్పర్యం:** పొగడబడిన సౌప్తికం మొదలైన మూడు ఉపపర్వాలతో ఒప్పి, బ్రాహ్మణశ్రేష్ఠులకు ఇష్ట మై సౌప్తికపర్వం పదవపర్వ మౌతూ విన నింపుగా ఉంటుంది.

**వ. మఱియు వీరపత్నీవిలాపంబును, గాంధారీధృతరాష్ట్రుల కోపప్రసాదంబులును, ధర్మజుండు రణనిహతు లైన పితృపితామహభ్రాతృ పుత్త్రభృత్యామాత్యమాతులాచార్యమిత్త్రాదులం బరీక్షించి యథావిధి సంస్కరింపందగు వారలం బంచుటయు, భారతవీరుల కుదకదానంబు సేయుటయుఁ, దత్సమయంబునఁ గుంతీదేవి పాండవులకుఁ గర్ణుండు గూఢోత్పన్నుం డని యెఱింగించుటయు, ధర్మజువిలాపంబును, ధర్మజురాజ్యాభిషేకంబును, చార్వాకనిగ్రహంబును, గృహప్రవిభాగంబును నను వృత్తాంతంబుల నొప్పి వేయునేడునూటడెబ్బదియైదు శ్లోకంబులు గలిగి. 55**

**ప్రతిపదార్థం:** మఱియు; వీర, పత్నీ, విలాపంబును= కురుక్షేత్రసంగ్రామంలో వీరులభార్యలయేడ్పున్నూ; గాంధారీ, ధృతరాష్ట్రుల= గాంధారియొక్కయు, ధృతరాష్ట్రునియొక్కయు; కోప, ప్రసాదంబులును= కోపమున్నూ అనుగ్రహమున్నూ (ఉపశమనమున్నూ); ధర్మజుండు= ధర్మరాజు; రణ, నిహతులు+ఐన= యుద్ధంలో చంపబడిన; పితృ, పితామహ, భ్రాతృ, పుత్త్ర, భృత్య+అమాత్య, మాతుల, ఆచార్య, మిత్ర+ఆదులన్= తండ్రులు, (తండ్రి తండ్రులు) తాతలు, సోదరులు, కుమారులు, సేవకులు, మంత్రులు, మేనమామలు, గురువులు, స్నేహితులు మొదలైనవారిని (ఇందులో చెప్పబడిన బంధుత్వసంబంధాలు కొన్ని వరుసకు చెప్పబడినవి); పరీక్షించి= పరిశీలించి; యథావిధిన్= శాస్త్రాన్ని అతిక్రమించకుండ, సంస్కరింపన్= దహనంచేయటానికి; తగు, వారలన్= తగినవారిని; పంచుటయున్= పంపుటయున్నూ; భారత, వీరులకున్= భరతవంశానికి చెందినవీరులకు; ఉదక, దానంబు= తిలోదకా లివ్వటం; చేయుటయున్; తత్, సమయంబునన్= జలదాన మిచ్చేవేళ; కుంతీదేవి; పాండవులకున్; గూఢ+ఉత్పన్నుండు+అని= హిందూధర్మశాస్త్రాన్ని అనుసరించి చెప్పబడే పన్నెండుగురు సుతులలో గూఢోత్పన్నుడు ఒకడు. భర్త పరోక్షంలో స్త్రీకి రహస్యంగా పుట్టినవాడు; ఒక్కొక్కప్పుడు నిజ మైన తండ్రి ఎవ్వరో తెలియదు; (గృహే ప్రచ్ఛన్న ఉత్పన్నో గూఢజస్తు సుతః స్మృతః - యాజ్ఞవల్క్యస్మృతి 2-129); ఎఱింగించుటయున్= తెల్పుటయున్నూ; ధర్మజు= ధర్మరాజుయొక్క; విలాపంబును= దుఃఖమున్నూ; ధర్మజు, రాజ్య+అభిషేకంబును= ధర్మరాజును రాజ్యసింహాసనంమీద అభిషేకించుటయున్నూ; చార్వాక, నిగ్రహంబును= (దుర్యోధనుని సఖుడైన చార్వాకు డనే రాక్షసుడు విప్రసన్న్యాసివేషంలో వచ్చి ధర్మజునిగూర్చి నిరుత్సాహవాక్యాలు పలుకగా బ్రాహ్మణులు హుంకారాలు చేశారు. అతడు ఘోరాకృతితో నేల కూలాడు) చార్వాకుడిని విప్రులు శిక్షించుటయున్నూ; గృహ, ప్రవిభాగంబునున్= ప్రాసాదంలోని (రాజగృహంలోని) ఆయాభాగాలను భీమాదులకు విభజించి ఇచ్చుటయున్నూ అను; వృత్తాంతములన్= కథలతో; ఒప్పి= అలరి; వేయున్, ఏడు, నూట, డెబ్బది, ఐదు, శ్లోకంబులు= 1775శ్లోకాలు; కలిగి= వహించి, పొంది.

**తాత్పర్యం:** స్పష్టం.

**విశేషం:** ధర్మజరాజ్యాభిషేక, చార్వాకనిగ్రహాది వృత్తాంతాలు తెలుగులో శాంతిపర్వప్రథమాశ్వాసంలో ఉన్నవి.

**క. పర్వుచు స్త్రీపర్వాదిక। పర్వంబుల నే నిటం గృపాయుత మై స్త్రీ**
**పర్వంబు పదునొకం డగు। పర్వము నా వెలయు సుకవిపండితసభలన్. 56**

**ప్రతిపదార్థం:** పర్వుచున్= వ్యాపిస్తూ; స్త్రీ, పర్వ+ఆదిక, పర్వంబులన్= స్త్రీపర్వం మొద లైన ఉపపర్వాలలో; ఏనిటన్=ఐదింటితో; కృపాయుతము+ఐ= దయతో (జాలితో) కూడిన దై; స్త్రీ, పర్వంబు= స్త్రీపర్వ మనే ప్రధానపర్వం; పది+ఒకండు+అగు, పర్వము= పదునొకండవపర్వం; నాన్= అనగా; సుకవి, పండితసభలన్= మంచికవులయొక్కయు, పండితులయొక్కయు సభలందు; వెలయున్= ప్రసిద్ధమై ఉంటుంది.

**తాత్పర్యం:** స్త్రీపర్వం మొదలైన ఉపపర్వా లైదింటితో వ్యాపిస్తూ, జాలితో కూడిన దై స్త్రీపర్వ మనే ప్రధానపర్వం పదునొకండవపర్వంగా ఉత్తమకవిపండితులసభలలో ప్రసిద్ధమై ఉంటుంది.

**వ. మఱియు బంధువర్గంబు నెల్ల వధియించి పరమనిర్వేదనపరుం డై కృష్ణువచనంబుల శాంతుం డై యున్న ధర్మజునకు శరతల్పగతుం డైన భీష్ముండు ధర్మవిదు లయిన రాజులకెల్ల హితంబుగా రాజధర్మంబులు, నాపద్ధర్మంబులు, నేవాని నెఱింగిన సర్వజ్ఞానసంపన్ను లగుదు రట్టి మోక్షధర్మంబులుఁ జెప్పటయు నను వృత్తాంతంబుల నొప్పి పదునాలుగువేలునేనూటయిరువది యైదుశ్లోకంబులు గలిగి. 57**

**ప్రతిపదార్థం:** మఱియున్; బంధువర్గంబున్= చుట్టాలసముదాయాన్ని; ఎల్లన్= అంతటిని; వధియించి= చంపి; పరమనిర్వేదన, పరుండు+ఐ= అధిక మైన దుఃఖంలో తగుల్కొన్నవా డై; కృష్ణు, వచనంబులన్= శ్రీకృష్ణునివాక్యాలచేత; శాంతుండు+ఐ+ఉన్న= శాంతి పొంది ఉన్న; ధర్మజునకున్= ధర్మరాజుకు; శరతల్పగతుండు+ఐన= అంపశయ్యను పొందిన; భీష్ముండు; ధర్మవిదులు+అయిన= ధర్మం తెలిసినవా రైన; రాజులకున్+ఎల్లన్= రాజులందరికిన్నీ; హితంబు+కాన్= మేలు కలిగేటట్లుగా; రాజధర్మంబులున్= రాజులనుసరింపవలసిన ధర్మాలను; ఆపత్+ధర్మంబులును= సామాన్యంగా కాక ఆపదసమయాలలో అనుసరింపవలసిన ధర్మాలను; ఏవానిన్= వేనిని; ఎఱింగిన= తెలిసికొన్నచో, సర్వ, జ్ఞాన, సంపన్నులు= అన్నివిధాలైన జ్ఞానంతో కూడినవారు; అగుదురు= అగుదురో, అట్టి= అటువంటి, మోక్షధర్మంబులున్= జన్మరాహిత్యాన్ని కలిగించే ధర్మాలను; చెప్పుటయున్= తెల్పుటయున్నూ; అను, వృత్తాంతంబులన్= అనేకథలతో; ఒప్పి= అలరి; తగి; పదునాలుగు, వేలున్, ఏను, నూట ఇరువది, ఐదుశ్లోకంబులు= 14525 శ్లోకాలు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** స్పష్టం.

**క. సకలహితం బై శాంత్యా । దికపర్వచతుష్కమున విదిత మై సమబు**
**ద్ధికిఁ బండ్రెం డగు పర్వం । బ కడున్ మే లనఁగ శాంతిపర్వము వెలయున్. 58**

**ప్రతిపదార్థం:** సకలహితంబు+ఐ= అందరికిని మేలు కలిగించే దై; శాంతి+ఆదిక పర్వచతుష్కమునన్= శాంతి మొదలైన ఉపపర్వాలు నాల్గింటితో; విదితము+ఐ= ప్రసిద్ధమై; సమబుద్ధికిన్= పక్షపాతం లేని సమమైనబుద్ధికి; పండ్రెండు+అగు= పండ్రెండవ, పన్నెండవ; పర్వంబు+అ= పర్వమే; కడున్= మిక్కిలి; మేలు+అనఁగన్= శ్రేష్ఠ మనగా; శాంతి పర్వము= శాంతిపర్వమనే ప్రధానపర్వం; వెలయున్= ప్రసిద్ధ మై ఉంటుంది.

**తాత్పర్యం:** అందరికిని మేలు కలిగించే దై, శాంతిమొద లైన నాలుగుఉపపర్వాలతో ప్రసిద్ధమై, నిష్పక్షపాతబుద్ధికి పన్నెండవపర్వమే మిక్కిలిశ్రేష్ఠ మైన దనగా శాంతిపర్వ మనే ప్రధానపర్వం ప్రకాశిస్తుంది.

**వ. మఱియుఁ బితామహుం డగు గాంగేయువలన సర్వధర్మనిశ్చయంబును, దానివిధులును, నాచారవిధులును ధర్మరా జెఱుంగుటయుఁ, బుత్త్రానుశాసనంబును, భీష్మస్వర్గారోహణంబు నను వృత్తాంతంబుల నొప్పి పండ్రెండువేలశ్లోకంబులు గలిగి. 59**

**ప్రతిపదార్థం:** మఱియున్; పితామహుండు+అగు= తాత అగు; గాంగేయువలనన్= గంగానందను డైన భీష్ముడివలన; సర్వధర్మనిశ్చయంబును= అన్నిధర్మాలయొక్క నిర్ణయాన్ని; దానవిధులును= దానం చేసే విధానాలను; ఆచారవిధులును= సర్వవర్ణాలవారును అనుసరించవలసిన ఆచారాలయొక్క విధానాలను; ధర్మరాజు; ఎఱుంగుటయున్= తెలిసికొనుటయున్నూ; పుత్ర+అనుశాసనంబును= భీష్ముడు తన కుమారుడగు ధృతరాష్ట్రుని దగ్గరకు పిలిచి హితమును ఉపదేశించటం. ఇదే పుత్రానుశాసనం. ఇదే భీష్ముడు చేసిన చివరి అనుశాసనం; భీష్మ, స్వర్గ+ఆరోహణంబున్= భీష్మునియొక్క స్వర్గాన్ని అధిష్ఠించుటయున్నూ (భీష్ముడుస్వర్గస్థుడు అగుటయున్నూ); అను, వృత్తాంతంబులన్= అనే, కథలతో; ఒప్పి= వెలసి, పం(డెండువేలశ్లోకంబులు=12,000 శ్లోకాలు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** స్పష్టం.

**క. ఒనరుఁ ద్రయోదశపర్వం । బనఁగా ననుశాసనాద్య మగు పర్వయుగం**
**బున మే లై । విబుధశ్రే । ణినుతం బై యానుశాసనిక పర్వ మిలన్. 60**

**ప్రతిపదార్థం:** అనుశాసన+ఆద్యము+అగు= అనుశాసన మనే ఉపపర్వం మొదటిదిగా గల; పర్వయుగంబునన్= ఉపపర్వాలజంటచేత; మేలు+ఐ= శ్రేష్ఠమై; విబుధ, శ్రేణి, నుతంబు+ఐ= పండితుల సముదాయంచేత పొగడబడిన దై; త్రయోదశపర్వంబు+అనఁగాన్= పదమూడవపర్వ మనగా; ఆనుశాసనికపర్వము= ఆనుశాసనిక మనే ప్రధానపర్వం; ఇలన్= భూమిపై; ఒనరున్= వెలయును.

**తాత్పర్యం:** సుగమం.

**వ. మఱియు నశ్వమేధారంభంబును, సంవర్తమరుత్తీయోపాఖ్యానంబును, స్వర్ణకోశసంప్రాప్తియు, నుత్తరగర్భంబున నశ్వత్థామాస్త్రదగ్ధుం డై శ్రీకృష్ణుచేత సంజీవితుం డయిన పరీక్షితుని జన్మంబు, నర్జును నశ్వానుసరణంబు, నెడనెడరాజులతోడి యుద్ధంబును, జిత్రాంగదపుత్త్రుండైన బభ్రువాహనుం డాహవంబున నర్జునుం బరిభవించుటయు, నశ్వమేధమహాయజ్ఞంబునందు నకులోపాఖ్యానంబును, ననుగీతయు, బ్రాహ్మణగీతయు, గురుశిష్యసంవాదంబును నను వృత్తాంతంబుల నొప్పి నాల్గవేలునన్నూటయిరువది శ్లోకంబులు గలిగి. 61**

**ప్రతిపదార్థం:** మఱియున్; అశ్వమేధ+ఆరంభంబును= అశ్వమేధయజ్ఞముయొక్క ప్రారంభమున్నూ; సంవర్త, మరుత్తీయ, ఉపాఖ్యానంబును= సంవర్తునియొక్కయు, మరుత్తునకు సంబంధించినదియున్నూ అగు కథయు; స్వర్ణ, కోశ, సంప్రాప్తియున్= బంగారముయొక్కయు, ధనముయొక్కయు లాభమున్నూ (పొందుటయున్నూ); ఉత్తర, గర్భంబునన్= అభిమన్యునిభార్య ఐన ఉత్తరకడుపున; అశ్వత్థామ+అస్త్ర, దగ్ధుండు+ఐ= అశ్వత్థామయొక్క బ్రహ్మాస్త్రంచేత కాల్చబడిన వాడై; శ్రీకృష్ణునిచేత; సంజీవితుండు+అయిన= బ్రతికింపబడినవా డైన; పరీక్షితుని= అభిమన్యునియొక్క కుమారుని; జన్మంబున్= పుట్టుకయున్నూ; అర్జున+అశ్వ+అనుసరణంబున్= అర్జునునియొక్క అశ్వమేధాశ్వాన్ని అనుసరించుటయున్నూ; ఎడన్, ఎడన్= అక్కడక్కడ; రాజులతోడన్+ యుద్ధంబును= రాజులతో యుద్ధమున్నూ; చిత్రాంగద, పుత్త్రుండు+ఐన= అర్జునునిభార్య యైన చిత్రాంగదకు కొడుకైన; బభ్రువాహనుండు; ఆహవంబునన్= యుద్ధంలో; అర్జునున్= అర్జునుడిని; పరిభవించుటయున్= అవమానించుట యున్నూ; అశ్వమేధ, మహత్, యజ్ఞంబునందున్= అశ్వమేధ మనే గొప్ప దైన యజ్ఞంలో; నకుల+ఉపాఖ్యానంబును= ముంగిసయొక్కకథయున్నూ; అనుగీతయున్= కృష్ణు డర్జునుడికి మరల చెప్పిన గీతయున్నూ (దీనిని స్వర్గలోకంనుండి వచ్చిన బ్రాహ్మణుడు చెప్పాడు); బ్రాహ్మణ, గీతయున్= బ్రాహ్మణుడు భార్యకు చెప్పినతత్త్వంతో కూడుకొన్న గీతయున్నూ; గురు,

శిష్య, సంవాదంబును= గురువునకూ, శిష్యుడికీ జరిగిన సంభాషణయున్నూ; అను, వృత్తాంతంబులన్= అనే, కథలతో; ఒప్పి= అలరి; నాల్గు, వేలు, నలు+నూట, ఇరువది, శ్లోకంబులు= 4420 శ్లోకాలు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** సుగమం.

**విశేషం:** రాజులతోడన్+యుద్ధంబు= సమాసములందు చేత, తోడ, వలనలకు ఇత్వ మౌతుంది, రాజులతోడియుద్ధము.

**తే. అభిమతం బగు నశ్వమేధాదికద్వి । పర్వయుత మై చతుర్దశపర్వ మనఁగ**
**నాశ్వమేధికపర్వ మత్యంత నిబిడ । వస్తువిస్తార మై బుధవరుల సభల. 62**

**ప్రతిపదార్థం:** అశ్వమేధ+ఆదిక, ద్వి, పర్వ, యుతము+ఐ= అశ్వమేధం మొదలైన రెండుఉపపర్వాలతో కూడిన దై; చతుః, దశ, పర్వము+అనఁగన్= పదునాల్గవ పర్వ మనగా; అత్యంత, నిబిడ, వస్తు, విస్తారము+ఐ= మిక్కిలి దట్ట మైన విషయాలవిస్తృతి కలదై; బుధ, వరుల, సభలన్= పండితశ్రేష్ఠులసభలలో; అభిమతంబు+అగున్= సమ్మత మౌతుంది.

**తాత్పర్యం:** అశ్వమేధం మొదలుగాగల రెండుఉపపర్వాలతో కూడిన దై, పదునాల్గవపర్వ మనగా ఆశ్వమేధిక మనే ప్రధానపర్వం మిక్కిలిదట్ట మైన విషయాలవిస్తృతి కలదై, పండితశ్రేష్ఠులసభలందు సమ్మత మౌతుంది.

**వ. మఱియు ధృతరాష్ట్రుండును గాంధారియు రాజ్యంబు విడిచి విదురసంజయసహితంబుగా నాశ్రమవాసంబునకుఁజనుటయు, సకలరాజ్యభారధౌరేయులైనకొడుకులవిడిచి కుంతీదేవి గురుశుశ్రూషాపరయయి వారిపిఱుందన పోవుటయు, సమరనిహతు లైన పుత్త్రపౌత్త్రుల నెల్ల ధృతరాష్ట్రుండు వ్యాసవరప్రసాదంబునఁ గాంచి విగతశోకుం డయి గాంధారీకుంతీవిదుర సంజయులతోఁ బరమసిద్ధికింజనుటయుఁ, బాండవులు నారదువలన నిఖిలయాదవవ్యసనం బెఱుంగుటయు నను వృత్తాంతంబుల నొప్పి వేయునూటయాఱుశ్లోకంబులు గలిగి. 63**

**ప్రతిపదార్థం:** మఱియున్; ధృతరాష్ట్రుండును; గాంధారియున్; రాజ్యంబు; విడిచి; విదుర, సంజయసహితంబుగాన్= విదురుడితోనూ, సంజయుడితోనూ కూడుకొని; ఆశ్రమవాసంబునకున్= అడవిలోని ఆశ్రమంలో నివసించుటకుగాను; చనుటయున్= వెళ్ళుటయున్నూ; సకలరాజ్య, భార, ధౌరేయులు+ఐన= సర్వరాజ్యముయొక్క బరువును వహించువా రైన; కొడుకులన్= ధర్మరాజాదులను; విడిచి; కుంతీదేవి; గురు, శుశ్రూషా, పర+అయి= పెద్దలను సేవించటంలో ఆసక్తి కలదై; వారి, పిఱుందన్+అ= ధృతరాష్ట్రాదుల వెనుకనే; పోవుటయున్; సమర, నిహతులు+ఐన= యుద్ధంలో చంపబడిన; పుత్త్ర, పౌత్త్రులన్, ఎల్లన్= కొడుకులను, కొడుకులకొడుకులను అందరిని; ధృతరాష్ట్రుండు; వ్యాస, ప్రసాదంబునన్= వ్యాసునిఅనుగ్రహంచేత; కాంచి= చూచి; విగత, శోకుండు+ అయి= పోయినదుఃఖం కలవా డై; గాంధారీ, కుంతీ, విదుర, సంజయులతోన్; పరమ, సిద్ధికిన్= మోక్షానికి; చనుటయున్= వెళ్ళుటయున్నూ; పాండవులు; నారదువలనన్= నారదమునివలన, నిఖిల, యాదవ, వ్యసనంబు= యాదవులందరియొక్క ఆపదను (మరణాన్ని); ఎఱుంగుటయున్= తెలిసికొనుటయున్నూ; అను, వృత్తాంతంబులన్= అనేకథలతో; ఒప్పి=అలరి; వేయు నూట, ఆఱు, శ్లోకంబులు= 1106 శ్లోకాలు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** సులభం.

**క. అమితార్థయుక్తితో నా । శ్రమవాసాదిత్రిపర్వసహితం బయి యా**
**శ్రమవాసపర్వ మత్యు । త్తమ కథలను వెలయుఁ బంచదశపర్వం బై. 64**

**ప్రతిపదార్థం:** అమిత+అర్థ, యుక్తితోన్= అధికమైన అర్థముయొక్క కూడికతో; ఆశ్రమవాస+ఆది, త్రి, పర్వ, యుక్తంబు+అయి= ఆశ్రమవాసం మొదలుగా గల మూడు ఉపపర్వాలతో కూడిన దై; ఆశ్రమవాస, పర్వము=ఆశ్రమవాస మనే ప్రధానపర్వం; పంచదశ, పర్వంబు+ఐ= పదునైదవపర్వ మై; అతి+ఉత్తమ, కథలను= మిక్కిలి శ్రేష్ఠ లైన కథలతో; వెలయున్= ప్రసిద్ధ మౌతుంది.

**తాత్పర్యం:** అధిక మైన అర్థంతో కూడుకొన్న ఆశ్రమవాసం మొదలుగా గల మూడు ఉపపర్వాలతో కూడిన దై ఆశ్రమవాసం అనే ప్రధానపర్వం మిక్కిలిశ్రేష్ఠ లైన కథలతో పదునైదవపర్వమై ప్రసిద్ధి కెక్కుతుంది.

**వ. మఱియు యాదవు లెల్ల మదిరాపానపరవశు లయి శాపనిమిత్తంబున సముద్రతీరంబునఁ దమలోఁ బోరి పొడిచికొని పరలోక గతు లగుటయు, దాని నెఱింగి రామకృష్ణాదియాదవ విరహితం బయిన ద్వారవతి కర్జునుం డరిగి విషణ్ణచిత్తుం డయి వసుదేవాదియాదవుల నెల్ల సంస్కరించి, యాదవకళత్రంబుల నెల్లఁ దోడ్కొని వచ్చుచో గాండీవదివ్యబాణంబులశక్తి దఱిఁగిన వనచరభయంబువలనఁ దత్కళత్రంబుల రక్షింపనోపమియు, నర్జునుండు ధర్మరాజుకడకు వచ్చి వ్యాసవాక్యప్రబోధితుం డై సన్న్యసించుటయు నను వృత్తాంతంబుల నొప్పి మున్నూరుశ్లోకంబులు గలిగి పదియాఱవపర్వం బై మౌసలపర్వంబునాఁ బరఁగె; మఱియుఁ బరీక్షిద్రాజ్యాభిషేకంబును, రాజ్యపరిత్యాగము సేసి పాండవు లేవురు ద్రౌపదీసహితు లై పరమసిద్ధికిం జనుటయు నను వృత్తాంతంబుల నొప్పి నూటయిరువదిశ్లోకంబులు గలిగి పదియేడవపర్వం బై మహాప్రస్థానికంబునాఁ బరఁగె; మఱియుఁ గర్ణునరకప్రాప్తియుఁ దన్మోక్షణంబును, స్వర్గంబున భారతవీరులసంగమంబును, గర్మపరిపాకోపభోగంబు నను వృత్తాంతంబుల నొప్పి యిన్నూఱుశ్లోకంబులు గలిగి పదునెనిమిదవపర్వం బై స్వర్గారోహణంబు నాఁ బరఁగె; ని ట్లష్టాదశపర్వంబులు గలిగి. 65**

**ప్రతిపదార్థం:** మఱియున్; యాదవులు+ఎల్లన్= యాధవులందరున్నూ; మదిరా, పాన, పరవశులు+అయి= మద్యం త్రాగటంచేత పరాధీను లై(వశముతప్పినవారై); శాప, నిమిత్తంబునన్= ముని లిచ్చిన శాపం కారణంచేత; సముద్ర, తీరంబునన్= సముద్రపుఒడ్డున; తమలోన్= తమలోతాము; పోరి= యుద్ధంచేసి; పొడిచికొని= ఆయుధాలతో గ్రుచ్చుకొని పరలోక, గతులు+అగుటయున్= మరణించుటయున్నూ (ఇతరలోకాలకు అరుగుటయున్నూ); దానిన్= వారు మరణించటం; ఎఱింగి= తెలిసికొని; రామ, కృష్ణ+ఆది, యాదవ, విరహితంబు+అయిన= బలరాముడు, కృష్ణుడు మొదలుగాగల యాదవులు లేని; ద్వారవతికిన్= ద్వారకకు; అరిగి= వెళ్ళి; విషణ్ణ, చిత్తుండు+అయి= దుఃఖంతో కూడిన హృదయం కలవా డై; వసుదేవ+ఆది, యాదవులన్+ఎల్లన్= వసుదేవుడు మొదలుగాగల యాదవులందరిని; సంస్కరించి= దహనంచేసి; యాదవకళత్రంబులన్, ఎల్లన్= యాదవులభార్యలందరిని, తోడ్కొని= తనవెంట తీసికొని; వచ్చుచోన్= వచ్చునప్పుడు; గాండీవ, దివ్య, బాణంబుల, శక్తి= గాండీవధనుస్సుయొక్కయు, దేవతాసంబంధు లైన బాణాలయొక్కయు బలము; తఱిఁగినన్= తగ్గగా; వన, చర, భయంబువలనన్= అడవియందు సంచరించే ఆటవికులవలని భయంవలన; తత్, తత్, కళత్రంబులన్= వారివారిభార్యలను; రక్షింపన్+ఓపమియున్= కాపాడజాలకపోవుటయున్నూ; అర్జునుండు; ధర్మరాజు, కడకున్= ధర్మరాజుచెంతకు; వచ్చి; వ్యాస, వాక్య, ప్రబోధితుండు+ఐ= వ్యాసముని చెప్పిన వాక్యాలచేత జ్ఞానం కలిగింపబడినవాడై; సన్న్యసించుటయున్= సన్న్యాసాశ్రమం

గ్రహించుటయున్నూ (సంసారాదులను విడుచుటయున్నూ) అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి= అలరి; మూడు+నూరు, శ్లోకంబులు= 300 శ్లోకాలు; కలిగి= వహించి; పది+ఆఱవ, పర్వంబు+ఐ= పదునారవపర్వ మై; మౌసల, పర్వంబు= (మౌసలము అంటే రోకలికి సంబంధించింది) మౌసలము అనే ప్రధానపర్వం; నాన్= అనగా; పరఁగెన్= ఒప్పింది; మఱియున్; పరీక్షిత్, రాజ్య, అభిషేకంబును= అభిమన్యునికుమారు డైన పరీక్షిత్తుయొక్క(ను) రాజ్యమునందు అభిషేకించుటయున్నూ; రాజ్య, పరిత్యాగము= రాజ్యముయొక్కవిడుచుట; చేసి; పాండవులు+ఏవురున్, పాండవు లైదుగురును; ద్రౌపదీ, సహితులు+ఐ= ద్రౌపదితో కూడిన వారై; పరమ, సిద్ధికిన్= మోక్షానికి; చనుటయున్= వెళ్ళుటయున్నూ; అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి= అలరి; నూట, ఇరువది, శ్లోకంబులు= 120 శ్లోకాలు; కలిగి= పొంది; పది, ఏడవ= పదునేడవ; పర్వంబు+ఐ= ప్రధానపర్వ మై; మహత్, ప్రస్థానికంబు= మహాప్రస్థానికపర్వం (మహాప్రస్థాన మంటే ఇహజీవితాన్ని విడిచి పోవటం); నాన్= అనగా; పరఁగెన్= ఒప్పింది. మఱియున్; కర్ణ, నరక, ప్రాప్తియున్= కర్ణునియొక్క(కర్ణుడు) నరకలోకాన్ని పొందుటయున్నూ; తద్+మోక్షణంబును= (కర్ణుడిని) అతడిని నరకంనుండి విడిపించుటయున్నూ; స్వర్గంబునన్= స్వర్గలోకంలో; భారత, వీరుల= భరతవంశానికి చెందిన యోధులయొక్క; సంగమంబును= కలిసికొనుటయున్నూ; కర్మ, పరిపాక+ఉపభోగంబులన్= కర్మలయొక్కఫలాన్ని అనుభవించుటయున్నూ; అను; వృత్తాంతంబులన్= కథలతో; ఒప్పి= అలరి; ఇరు+నూరు; శ్లోకంబులు= 200 శ్లోకాలు; పొంది; పది+ఎనిమిది+అవ= పదునెనిమిదవ; పర్వంబు+ఐ= ప్రధానపర్వమై; స్వర్గ+ఆరోహణంబు= స్వర్గానికి ఎక్కటం (స్వర్గానికి పోవటం) స్వర్గారోహణం; నాన్= అనగా; పరఁగెన్= ఒప్పింది; ఇట్లు= ఈవిధంగా; అష్టా, దశ, పర్వంబులు= పదునెనిమిది పర్వంబులు; కలిగి= పొంది.

**తాత్పర్యం:** విస్పష్టం.

**విశేషం:** ఉపపర్వాలు లేని ప్రధానపర్వాలకు నన్నయ వేరుగా ఇతరపర్వాలకువలె పద్యాలు వ్రాయలేదు.

### భారతసంహితా నిర్మాణ ప్రశంస (సం. 1-1-63)

**మ. అమితాఖ్యానకశాఖలం బొలిచి, వేదార్థామలచ్ఛాయ మై,**
**సుమహద్వర్గచతుష్కపుష్పవితతిన్ శోభిల్లి, కృష్ణార్జునో**
**త్తమనానాగుణకీర్తనార్థఫల మై, ద్వైపాయనోద్యానజా**
**త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్య మై. 66**

**ప్రతిపదార్థం:** అమిత+ఆఖ్యానక, శాఖలన్= పెక్కుకథ లనేకొమ్మలతో; పొలిచి= ఒప్పి; వేద+అర్థ+అమల, ఛాయము+ఐ=వేదాలలోని అర్థ మనే నిర్మల మైన నీడ కల దై; సు, మహత్, వర్గ, చతుష్క, పుష్ప, వితతిన్= మంచిగొప్పధర్మార్థకామమోక్షా లనే పురుషార్థచతుష్టయం(నాలుగు) అనే పూవులసముదాయంతో; శోభిల్లి= ప్రకాశించి; కృష్ణ+అర్జున+ఉత్తమ, నానా, గుణ, కీర్తన, అర్థ, ఫలము+ఐ= కృష్ణుడు, అర్జునుడు అనేవారియొక్క యోగ్యాలైన అనేకగుణాలప్రశంసవలని మేలు అనే(అందలికోరికలు అనే, ఉద్దేశముఅనే) పండ్లు కలదై; ద్వైపాయన+ఉద్యాన, జాత, మహాభారత, పారిజాతము= వ్యాసు డనే ఉద్యానవనంలో పుట్టిన మహాభారతం అనే కల్పవృక్షం; ధాత్రీసుర, ప్రార్థ్యము+ఐ= బ్రాహ్మణులకు (భూదేవతలకు) వేడదగిన దై; అమరున్= ఒప్పారుతుంటుంది.

**తాత్పర్యం:** అనేక ఉపాఖ్యానాలు (కథలు) అనే కొమ్మలతో, ఒప్పి, వేదాలలోని అర్థ మనే నిర్మల మైన నీడ కలదై, మంచి గొప్ప నాల్గుపురుషార్థాలు అనే పూవులసముదాయంతో ప్రకాశించి, కృష్ణార్జునుల యోగ్యాలైన వివిధసద్గుణాలను

కీర్తించటంవలని మేలు (ఉద్దేశం) అనే పండ్లు కలదై, వ్యాసు డనే ఉద్యానవనంలో పుట్టిన మహాభారతేతిహాసం అనే కల్పవృక్షం బ్రాహ్మణులకు ప్రార్థింపదగిన దై అలరారుతుంది.

**విశేషం:** అలం: రూపకం. సుమహావర్గ- అనే పాఠాంతరం గ్రహింపదగింది. స్వర్గంలోని పారిజాతం సురప్రార్థ్యం. మహాభారతం ధాత్రీసురప్రార్థ్యం, సర్వజనప్రార్థ్య మనియే భావం. మహాభారతం పారిజాతం అనటంవలన సర్వపురుషార్థ విజ్ఞానఫల ప్రదానం చేయగలదని తాత్పర్యం. (వివరాలకు చూడు: పీఠిక.)

**వ. ఇట్టి మహాభారతంబు ననేకవిధపదార్థప్రపంచసంచితంబు నుపపర్వమహాపర్వోపశోభితంబు నుపద్వీపసంభృతం బయిన భువనం బజుండు నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు నిఖిలలోకహితార్థంబు దత్తావధానుం డై సంవత్సరత్రయంబు నిర్మించి, దాని దేవలోకంబునందు వక్కాణింప నారదుం బనిచెఁ; బితృలోకంబున వక్కాణింప నసితుం డైన దేవలుం బనిచె; గరుడ గంధర్వయక్ష రాక్షసలోకంబులందు వక్కాణింప శుకుం బనిచె; నాగలోకంబునందు వక్కాణింప సుమంతుం బనిచె; మనుష్యలోకంబున జనమేజయునకు వక్కాణింప వైశంపాయనునిం బనిచె; నే నా వైశంపాయన మహామునివలన విని వచ్చితిఁ; దొల్లి కృతత్రేతావసాన సమయంబుల దేవాసుర రామరావణ యుద్ధంబులునుంబోలె ద్వాపరాంతంబునం బాండవధార్తరాష్ట్రులకు మహాఘోరయుద్ధం బయ్యెఁ; నందు. 67**

**ప్రతిపదార్థం:** ఇట్టి= పైన పేర్కొనబడిన గుణాలు కల; మహత్, భారతంబున్= మహాభారత మనే గ్రంథాన్ని; అనేక, విధ, పదార్థ, ప్రపంచ, సంచితంబున్= పలువిధాలైన శబ్దాలయొక్కయు, అర్థాలయొక్కయు సముదాయంతో కూడినదానిని; ఉపపర్వ, మహత్, పర్వ+ఉపశోభితంబున్= మహాభారతంలో ప్రధానపర్వాలు పదునెనిమిది ఉన్నవి. అవి మహాపర్వాలు. ప్రతిమహాపర్వంలోను కొన్ని ఉపపర్వాలు ఉన్నవి. వీటిసంఖ్య నూరు. అటువంటి ఉపపర్వాలతోను, మహాపర్వాలతోను ప్రకాశించేదానిని; ఉపద్వీప, మహత్, ద్వీప, సంభృతంబు+అయిన= చిన్నద్వీపాలతోను, పెద్దద్వీపాలతోను కూడిన (ద్వీప మంటే దీవి. నీటినడుమ గల భూభాగం); భువనంబు= జగత్తును; అజుండు= బ్రహ్మదేవుడు; నిర్మించిన+అట్లు= తీర్చి దిద్దినవిధంగా; కృష్ణద్వైపాయనుండు= వ్యాసమహాముని; నిఖిల, లోక, హిత+అర్థంబు= సర్వలోకాల (ప్రజలు) మేలుకొరకు; దత్త+అవధానుండు+ఐ= ఈయబడిన ఏకాగ్రత కలవాడై (ఏకాగ్రతతో కూడినవాడై); సంవత్సర, త్రయంబు= మూడేండ్లు; నిర్మించి= సృజించి (వ్రాసి); దానిన్= ఆ మహాభారతాన్ని; దేవలోకంబునందున్= దేవలోక మైన స్వర్గంలో; వక్కాణింపన్= చెప్పడానికి; నారదున్= నారదమునిని; పనిచెన్= పంపాడు; పితృలోకంబునన్= పితృదేవతలలోకంలో; వక్కాణింపన్= చెప్పటానికి; అసితుండు+అయిన= నల్లనివాడైన (అసితుడు అనే మారుపేరు కల); దేవలున్= దేవలుడు అనే మునిని; పనిచెన్; గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస, లోకంబులందున్= గరుడుని యొక్కయు, గంధర్వుల యొక్కయు, యక్షుల యొక్కయు, రాక్షసులయొక్కయు లోకాలలో; వక్కాణింపన్= చెప్పటానికి; శుకున్= తన కుమారు డైన శుకమహర్షిని; పనిచెన్; నాగలోకంబునందున్= పాములలోకంలో (పాతాళలోకంలో); వక్కాణింపన్= చెప్పటానికి; సుమంతున్= సుమంతు డనే శిష్యుడిని; పనిచెన్; మనుష్యలోకంబునన్= మర్త్యలోకంలో; జనమేజయునకున్= పరీక్షిత్తుకుమారు డైన జనమేజయుడికి; వక్కాణింపన్= చెప్పటానికి; వైశంపాయనునిన్= వైశంపాయను డనే మరియొక శిష్యుడిని; పనిచెన్; ఏను= నేను; ఆ వైశంపాయన, మహా, మునివలనన్= ఆ వైశంపాయను డనే గొప్పమునినుండి; విని= మహాభారతకథను విని; వచ్చితిన్; తొల్లి= మున్ను; కృత, త్రేతా+అవసానసమయంబులన్= కృతయుగముయొక్కయు, త్రేతాయుగముయొక్కయు చివరికాలాలలో; దేవ+అసుర, రామ, రావణ, యుద్ధంబులున్, పోలెన్= కృతయుగంచివర దేవతలకున్నూ రాక్షసులకున్నూ, త్రేతాయుగంచివర రాముడికిన్నీ రావణుడికిన్నీ జరిగిన యుద్ధాలవలె (క్రమాలంకారం); ద్వాపర+అంతంబునన్= ద్వాపరయుగంచివర; పాండవ, ధార్తరాష్ట్రులకున్= పాండురాజధృతరాష్ట్రకుమారులకు; మహత్, ఘోరయుద్ధంబు= గొప్పభయంకర మైన యుద్ధం; అయ్యెన్= జరిగింది; అందున్= ఆయుద్ధంలో.

**తాత్పర్యం:** పైన పేర్కొనబడిన గుణాలు కల మహాభారత మనే గ్రంథాన్ని పలురకాలైన శబ్దార్థాలసముదాయంతో కూడినట్టిదిన్నీ, నూరుఉపపర్వాలతోనూ పదునెనిమిదిమహాపర్వాలతోనూ ప్రకాశించేదిన్నీ అయినదాన్ని, చిన్నద్వీపాలతోనూ, పెద్దద్వీపాలతోనూ కూడినజగత్తును బ్రహ్మ సృజించినట్లు కృష్ణద్వైపాయను డనే వ్యాసమహాముని సర్వలోకప్రజలమేలుకొరకు ఏకాగ్రచిత్తు డై మూడుసంవత్సరాలు రచించాడు; ఆమహాభారతాన్ని స్వర్గలోకంలో చెప్పటానికి నారదమహామునిని, పితృదేవతాలోకంలో చెప్పటానికి అసితు డైన దేవలమునిని, గరుడగంధర్వ యక్షరాక్షసలోకాలలో చెప్పటానికి తనకుమారు డైన శుకమహర్షినీ, సర్పలోక మయిన పాతాళంలో చెప్పటానికి తనశిష్యు డైన సుమంతుడినీ, మానవలోకంలో పరీక్షిత్తుకుమారు డైన జనమేజయుడికి చెప్పటానికి వైశంపాయను డనే మరియొక శిష్యుడిని పంపాడు. నే నా వైశంపాయనమహామునివలన మహాభారతకథను విని వచ్చాను. పూర్వం కృతయుగాంతంలో దేవతలకూ రాక్షసులకూ, త్రేతాయుగాంతంలో రాముడికీ రావణుడికీ జరిగిన యుద్ధాలవలె ద్వాపరయుగంచివర పాండవులకున్నూ కౌరవులకున్నూ మిక్కిలి భయంకర మైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో.

**విశేషం:** మహాభారతాన్ని చెరకుగడతో పోలుస్తారు. చెరకుగడలో కనుపు లుంటాయి. పర్వమంటే కనుపు, గ్రంథభాగము. సముద్రంలో అనేకద్వీపా లుంటాయి. అందులో కొన్ని చిన్నవి. కొన్ని పెద్దవి. మహాద్వీపాలు నాలు గని కొందరు. ఏడని కొందరు, తొమ్మి దని కొందరు, పదమూ డని కొందరు, పదునెనిమి దని కొందరు చెప్పుతారు. ఇవి పూవుచుట్టూ రేకు లున్నట్లు మేరుపర్వతంచుట్టూ ఉంటాయి. ద్వీపానికీ ద్వీపానికీ నడుమ సముద్రం ఉంటుంది. సాధారణంగా ద్వీపాలు ఏడని ప్రసిద్ధి. అవి- జంబువు, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము, శాల్మలము, పుష్కరము అనేవి. వీటి నడుమ జంబూద్వీపం ఉంటుం దనీ, దానిలోనే భరతఖండం ఉన్నదనీ చెప్పుతారు. గరుడుడు పక్షులరాజు. గరుడులు అనే దేవయోనివిశేషాలుకూడ ఉన్నట్లు కనబడుతున్నది. గంధర్వయక్షులు దేవయోనివిశేషాలు. జైమిని, పైలుడు, సుమంతుడు, వైశంపాయనుడు- అనేవారు వ్యాసుడి నలుగురుశిష్యులు. కృత, త్రేతా, ద్వాపర, కలియుగా లని యుగాలు నాలుగు. ఇందులో వ్యాసుడి జయకావ్యం మహాభారతంగా రూపొందిన దశలు పేర్కొనబడ్డాయి. అలం: ఉపమ.

**తరలము.**

> **పదిదినంబులు భీష్ముఁ డాహవభారకుండు, గురుండు పం**
> **చదివసంబులు, గర్ణుఁడున్ దివసద్వయంబు, దినార్ధమం**
> **దుదితతేజుఁడు శల్యుఁ, డత్యధికోగ్రవీరగదారణం**
> **బది దినార్ధము గాఁగ నిట్లు మహాభయంకరవృత్తితోన్.** **68**

**ప్రతిపదార్థం:** భీష్ముడు; పది, దినంబులు= పదిరోజులు; ఆహవభారకుండు= యుద్ధంయొక్క భారాన్ని వహించేవాడు (సేనానాథుడు); గురుండు= ద్రోణుడు; పంచ, దివసంబులు= ఐదురోజులు; (సేనానాయకుడు); కర్ణుఁడున్= కర్ణుడుకూడ; దివసద్వయంబు= రెండురోజులు; ఉదిత, తేజుఁడు= ఉన్నతమైన పరాక్రమం కలవాడు; శల్యుఁడు= మాద్రిసోదరు డైన మద్రరాజు; దిన+అర్ధమందున్= రోజులోనిసగంభాగంలో (అంటే మధ్యాహ్నం వరకు); అతి+అధిక+ఉగ్ర, వీర, గదారణంబు+అది= కడుంగడు భయంకర మైన వీరరసంతో కూడిన (భీమదుర్యోధను లనే వీరులయొక్క) గదలతో చేయబడినయుద్ధం; దిన+అర్ధము కాఁగన్= రోజులో సగంభాగం (అంటే మధ్యాహ్నంనుండి సూర్యాస్తమయంలోగా) ఇట్లు= ఈవిధంగా; మహత్+భయంకరవృత్తితోన్= మిక్కిలి భయాన్ని కలిగించే వ్యాపారంతో.

**తాత్పర్యం:** పదునెనిమిదిరోజులు జరిగిన కురుక్షేత్రసంగ్రామంలో పదిరోజులు భీష్ముడు సేనానాయకుడుగా ఉన్నాడు. గురు డైన ద్రోణుడు ఐదురోజులు సేనానాయకుడుగా ఉన్నాడు. కర్ణుడు రెండురోజులున్నూ, దినంలో సగంభాగం అధికమైన పరాక్రమం గల శల్యుడున్నూ సేనానాయకులుగా ఉన్నారు. మిక్కిలి భయంకరమైన వీరుల(భీమదుర్యోధనుల) గదాయుద్ధం మిగిలిన సగందినంలో జరిగింది. ఈ విధంగా మిక్కిలి భయంకరమైన మానసికవ్యాపారంతో.

**విశేషం:** ఈ పద్యంతరువాత "పదిదినము లైదుప్రొద్దులుఁ బదపడి రెన్నాళ్ళు నొక్కపగలున్‌రేయున్, మదమున రణ మొనరించిరి, నదిసుత గురుకర్ణశల్యనాగపురీశుల్" అనే కందపద్యం కనబడుతుంది. ఇది ప్రక్షిప్త మని పలువురు భావిస్తున్నారు. ఈతరలవృత్తంలోని భావమే ఈ పద్యంలో ఉండటంచేత అది లేకపోవటంవలన కథకు బాధ లేదు. తరల మనేవృత్తం అతిధృతిచ్ఛందంలో పుట్టింది. ప్రతిపాదంలోనూ వరుసగా- న, భ, ర, స, జ, జ, గ- అనే గణా లుంటాయి. 12వ అక్షరంతో యతిమైత్రి.

**శా. ఏడక్షౌహిణు లెన్నఁ బాండవబలం; బేకాదశాక్షౌహిణుల్**
**రూఢిం గౌరవసైన్య; మీ యుభయమున్ రోషాహతాన్యోన్య మై**
**యీడంబోవక వీఁక మైఁ బొడువఁగా నేపారు ఘోరాజి న**
**ల్లాడెన్ ధాత్రి శమంతపంచకమునం దష్టాదశాహంబులున్. 69**

**ప్రతిపదార్థం:** ఎన్నన్= గణింపగా; పాండవ, బలంబు= పాండవులసేన; ఏడు+అక్షౌహిణులు= ఏడు అక్షౌహిణులు; కౌరవసైన్యము= కౌరవులసేన, రూఢిన్= (రూడిన్‌పాఠాంతరం) ప్రసిద్ధితో; ఏకాదశ+అక్షౌహిణుల్= పదకొండు అక్షౌహిణులు; ఈ, ఉభయమున్= ఈరెండుసేనలును; రోష+ఆహత+అన్యోన్యము+ఐ= కోపంచేత కొట్టబడిన (చంపబడిన) ఒండొరులను కలిగినవై; ఈడన్+పోవక= వెనుదీయక; వీఁకమైన్= ఉత్సాహంతో; పొడువఁగాన్= పోరాడగా; ఏపు+ఆరు= అతిశయించు, విజృంభించు, ఘోర+ఆజిన్= భయంకర మైన యుద్ధంలో; శమంత, పంచకమునందున్= శమంతపంచక మనేప్రదేశంలో; అష్టాదశ, అహంబులున్= పదునెనిమిది రోజులును; ధాత్రి= భూమి; అల్లాడెన్= చలించింది.

**తాత్పర్యం:** పాండవసేనసంఖ్య ఏడక్షౌహిణులు, కౌరవసేనసంఖ్య పదకొండక్షౌహిణులు. ఈరెండుసేనలున్నూ తీవ్రకోపంతో ఇరువైపుల నున్న రథగజాదులను, వీరులను చంపుకొంటూ వెనుదీయక పరాక్రమంతో పోరాడగా, అతిశయించిన భయంకరయుద్ధంచేత పదునెనిమిది రోజులు శమంతపంచక మనేప్రదేశంలో భూమి కంపించిపోయింది.

**విశేషం:** శమంతపంచకానికి ఆ పేరు ఎట్లు వచ్చిందో డెబ్బైతొమ్మిదవ వచనంలో చెప్పబడింది. కొన్ని వ్రాతప్రతులలో 'అక్షోహిణి' అనేరూపం ఉన్నది.

**వ. ఇట్టి మహాభారతంబు కృష్ణద్వైపాయనమహాముని విరచితం బై ప్రవర్తిల్లుచుండు. 70**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఇటువంటి; మహత్+భారతంబు= మహాభారతగ్రంథం; కృష్ణద్వైపాయన, మహత్, ముని, విరచితంబు+ఐ= వ్యాసమహామునిచేత రచింపబడిన దై; ప్రవర్తిల్లుచున్+ఉండున్= ఒప్పుతూ ఉంటుంది.

**తాత్పర్యం:** ఇటువంటి మహాభారత మనే గ్రంథం వ్యాసమహామునిచేత రచింపబడి ఒప్పారుతూ ఉన్నది.

సీ. ఇమ్మహాభారతం బిమ్ములఁ బాయక । విహితావధాను లై వినుచునుండు
వారికి విపుల ధర్మారంభసంసిద్ధి । యగుఁ బరమార్థంబ యశ్రమమున
వేదముల్ నాలుగు నాదిపురాణముల్ । పదునెనిమిదియుఁ దత్ప్రమితధర్మ
శాస్త్రంబులును మోక్షశాస్త్రతత్త్వంబులు । నెఱిఁగిన ఫల మగు, నెల్లప్రొద్దు

ఆ. దానములను బహువిధక్రతుహుతజప । బ్రహ్మచర్యములను బడయఁబడిన
పుణ్యఫలముఁ బడయఁబోలు, నశేషపా । పక్షయంబు నగు, శుభంబుఁ బెరుఁగు. 71

**ప్రతిపదార్థం:** ఈ+మహత్, భారతంబు= ఈమహాభారతాన్ని, ఇమ్ములన్= సుఖంగా, ఆమూలంగా; పాయక= విడువక, విహిత+అవధానులు+ఐ= విధింపబడిన ఏకాగ్రత కలవా రై, వినుచుండువారికిన్= వింటూ ఉండే జనులకు; విపుల, ధర్మ+ఆరంభ, సంసిద్ధి= విస్తార మైన ధర్మంతో కూడిన ప్రయత్నాలలాభం; అగున్= కలుగుతుంది; పరమార్థంబు+అ= తథ్యంగా; అశ్రమమునన్= శ్రమలేకుండ; వేదముల్, నాలుగున్= ఋగ్యజుస్సామాథర్వవేదాలు నాలుగున్నూ; ఆది, పురాణముల్, పది+ఎనిమిదియున్= ప్రధానాలైన పదునెనిమిది పురాణాలున్నూ; తద్, ప్రమిత, ధర్మ, శాస్త్రంబులును= వాటిచే తెలిసికొనబడు ధర్మాన్ని బోధించే శాస్త్రాలను; మోక్ష, శాస్త్రతత్త్వంబులు= మోక్షమార్గాన్ని సూచించే శాస్త్రాల యథార్థస్వరూపాలను; ఎఱిఁగిన= తెలిసికొనిన; ఫలము= లాభం; అగున్= కలుగును; ఎల్ల, ప్రొద్దున్= సర్వకాలాలలో; దానములనున్= దానాలచేతనూ; బహు, విధ, క్రతు, హుత, జప, బ్రహ్మచర్యములను= పలువిధా లైన యజ్ఞాలలో చేయబడిన హోమాలచేతనూ, జపాలచేతనూ; బ్రహ్మచర్యవ్రతంచేతనూ, పడయన్+పడిన= పొందబడిన; పుణ్య, ఫలమున్= పుణ్యముయొక్కలాభం; పడయన్, పోలున్= పొందశక్య మౌతుంది; అశేష, పాప, క్షయంబున్= సర్వపాపాలయొక్క నాశంకూడ; అగున్= జరుగుతుంది; శుభంబున్= శుభంకూడ; పెరుఁగున్= అభివృద్ధి ఔతుంది, వర్ధిల్లుతుంది.

**తాత్పర్యం:** ఈ మహాభారతాన్ని సమగ్రంగా (స్పష్టంగా) విడువక ఏకాగ్రచిత్తు లై వింటూ ఉండే జనులకు అధిక మైన ధర్మకార్యాలలాభం కలుగుతుంది; తథ్యంగా శ్రమలేకుండ నాలుగువేదాలున్నూ, ప్రధాన మైన పదునెనిమిది పురాణాలున్నూ, వాటిచేత నిరూపింపబడిన ధర్మాన్ని బోధించే శాస్త్రాలున్నూ, మోక్షమార్గాన్ని తెలిపే శాస్త్రాల యథార్థ స్వరూపాన్నీ తెలిసికొన్న ఫలం కలుగుతుంది; ఎల్లకాలాలలో చేయబడిన దానాలచేతను, వివిధ యజ్ఞాలలో చేయబడిన హోమాలచేతను, జపాలచేతను, బ్రహ్మచర్య వ్రతంచేతను పొందబడిన పుణ్యం యొక్క లాభం పొందశక్యమౌతుంది. సకల పాపాల నాశనం జరుగుతుంది; శుభం వర్ధిల్లుతుంది.

**విశేషం:** ఈ పద్యంలో మహాభారతాన్ని శ్రద్ధతో వినేవారికి కలిగే లాభాలన్నీ చెప్పబడినవి. దీనివలన దాని మహత్త్వం వ్యక్తమౌతుంది. బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, భాగవత, నారద, మార్కండేయ, అగ్ని, భవిష్యత్, బ్రహ్మ వైవర్త, లింగ, వరాహ, స్కంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ పురాణా లనే మహాపురాణాలు పదునెనిమిది. సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశాను చరితము అనేవి పురాణంలో ఉండే పంచలక్షణాలు.

ఉ. సాత్యవతేయ విష్ణుపద సంభవ మై, విబుధేశ్వరాబ్ధి సం
గత్యుపశోభితం బయి, జగద్విదితం బగు భారతీయ భా
రత్యమరాపగౌఘము నిరంతర సంతత పుణ్యసంపదు
న్నత్యభివృద్ధి సేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్. 72

**ప్రతిపదార్థం:** ఈ పద్యంలో నన్నయ మహాభారతాన్ని ఆకాశగంగగా వర్ణిస్తూ శ్లిష్టరూపకం చేశాడు. కాబట్టి విశేషణాలను భారతపరంగానూ, గంగాపరంగానూ అన్వయించుకోవాలి. సాత్యవతేయ, విష్ణు, పద, సంభవము+ఐ= సత్యవతీపుత్రుడైన వ్యాసుడనే నారాయణుడియొక్కవాక్కు(పదాల)నుండి(భారతార్థం), పాదంనుండి(గంగార్థం)పుట్టినదై; లేదా వ్యాసుడనే ఆకాశం(విష్ణుపదం)నుంచి పుట్టినదై; విబుధ+ఈశ్వర+అబ్ధి, సంగతి+ఉపశోభితంబు+అయి= (భారతపరంగా) పండితశ్రేష్ఠులనే సాగరముయొక్క స్నేహ మనే సంగమంచేత ప్రకాశించినట్టిదై; లేదా పండితరాజులనే దేవేంద్రులు అనే సాగరంయొక్క స్నేహసంగమంచేత ప్రకాశించినట్టిదై; లేదా (గంగపరంగా) దేవతలరాజైన ఇంద్రుడికి సంబంధించిన(తూర్పు) సముద్రంయొక్క సంగమంచేత ప్రకాశించినట్టిదై; జగత్+విదితంబు+అగు= విశ్వానికంతటికి తెలియబడినట్టిదగుతున్న; భారతీయ, భారతీ+అమర+ఆపగా+ఓఘము= మహాభారతముయొక్క వాక్స్వరూపం(సరస్వతి) అనే దేవనదీ(గంగా)ప్రవాహాన్ని; వినినన్, కొనియాడినన్= చెప్పగా వినినప్పటికినీ, స్వయంగా ప్రశంసచేసినప్పటికినీ; ఎల్లవారికిన్= సర్వప్రజలకును; నిర్+అంతర, సంతత, పుణ్య, సంపద్+ఉన్నతి+అభివృద్ధి, చేయున్= ఎల్లప్పుడును విస్తారమైన సుకృతరూపమైన వైభవాతిశయముయొక్క సమృద్ధిని కలిగిస్తుంది.

**తాత్పర్యం:** సత్యవతీ(యోజనగంధి)పుత్రుడైన వ్యాసుడనే నారాయణుడియొక్క వాక్కునుండి, పాదంనుంచి పుట్టినదై; లేదా వ్యాసుడనే ఆకాశంనుండి పుట్టినదై; పండితశ్రేష్ఠ(రాజు)లనే సాగరముయొక్క స్నేహమనే సంగమం(కలయిక)చే శోభింపబడినట్టిదై; లేదా, పండితరాజులనే దేవేంద్రులు అనే సముద్రంయొక్క స్నేహసంగమంచేత శోభింపబడినట్టిదై; లేదా, దేవతలరాజైన ఇంద్రుడికి సంబంధించిన(తూర్పుదిక్కునందలి) సముద్రముయొక్క స్నేహసంగమంచేత శోభింపబడినట్టిదై; విశ్వానికంతటికిని తెలియబడిన దయిన మహాభారతముయొక్క వాక్స్వరూపం(సరస్వతి)అనే దేవనది(ఆకాశగంగ)యొక్క ప్రవాహాన్ని(పౌరాణికులుచెప్పగా)వినినప్పటికిన్నీ, (స్వయంగా ఇతరులతో) ప్రశంసచేసినప్పటికిన్నీ, సర్వప్రజలకు ఎల్లప్పుడును, విస్తారమైన పుణ్యసంపదయొక్క అతిశయమైన అభివృద్ధిని (భారతవాక్కు అనే గంగ) కలిగిస్తుంది.

**విశేషం:** అలం: శ్లిష్టరూపకం. ఇటువంటి అలంకారసంకరప్రయోగాన్ని ప్రబంధకవులు విరివిగా చేశారు. 'నానారుచిరార్థసూక్తినిధిత్వానికి' ఈపద్యాన్ని ఉదాహరణగా చూపవచ్చును. సూక్తులు అంటే కేవలం నీతులు సుభాషితాలు అనిమాత్రమే అర్థం కాదు, అనేకవిధాలుగా రుచిరాలైన అర్థాలను ఇచ్చే మంచిమాటల, అలంకృతవాక్కులకూర్పు అనికూడ అర్థంచేసికొనాలి. విబుధేశ్వరాబ్ధి(తూర్పుసముద్రముయొక్క)సంగతిని భారతమనే గంగకు ముడిపెట్టటంలో ఔచిత్యం ఉన్నది. రాజరాజనరేంద్రుడిరాజ్యం తూర్పుసముద్రంచేత చుట్టబడినట్టిది కావున 'భారత' గంగావ్యాప్తిని(నన్నయరాజరాజుల) వేంగీదేశంవరకూ సూచించటం సమంజసంగా ఉన్నది. అదీకాక గంగానది(లేదా దక్షిణగంగ అయిన గోదావరి) తూర్పుసముద్రంలోనేకదా కలిసేది. రాజరాజనరేంద్రుడే భారతాన్ని ప్రస్తావించి దానిరచనకు నన్నయను పురికొల్పటం, భారతవంశీయులు, తనవంశీయులని చెప్పుకోవటం-ఇవన్నీ తూర్పుసముద్రంతోడి 'భారతగంగాసంగతి'కి విషయాలే. 'సాత్యవతేయ విష్ణుపదసంభవమై' అనేమాటలో సత్యవంతమైన, సర్వవ్యాపకమైన(విష్ణు) వాక్స్వరూపంనుండి పుట్టిందనే అర్థాన్నికూడ సంభావించవచ్చును. అట్లే 'భారతీయభారతి' అనేచోట 'భారతదేశవాఙ్మయస్వరూపం' అనే అర్థాన్నికూడ భావించవచ్చును. భారతీయభారతిని గంగాప్రవాహంతో రూపకంచేయటంవలన భారతసాహిత్య పావిత్ర్యం, మహిమ ప్రకటితా లౌతున్నాయి. ఇటువంటి నానార్థాలుకల పద్యాలను నన్నయ చాలాఅరుదుగా మాత్రమే రచించాడు. శబ్దంయొక్కశక్తి ఇట్లా ఉంటుందని చూపటానికే నన్నయ అక్కడక్కడా ఇట్లాంటి రచనను చేశాడని గ్రహించాలి.

**వ. అనిన విని శౌనకాది మహామునులుశ్రీమహాభారత కథా శ్రవణ కుతూహల పరు లయి యక్కథకున కిట్లనిరి. 73**

**ప్రతిపదార్థం:** అనినన్= సౌతి అట్లా చెప్పగా; విని; శౌనక+ఆది, మహత్, మునులు= శౌనకుడు మొదలైన గొప్పమునులు; శ్రీ, మహత్, భారత, కథా, శ్రవణ, కుతూహల పరులు+అయి= శోభాయుక్త మైన మహాభారతంలోని కథ యొక్క వినటంలోని ఉత్సాహంలో ఆసక్తు లై; ఆ+కథకునకున్= కథ చెప్పే ఆ సౌతికి; ఇట్లు= ఈ విధంగా; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** అని సౌతి చెప్పగా విని శౌనకుడు మొదలైన గొప్పమునులు మహాభారతంలోని కథను వినటంలో ఉత్సాహం కలవా రై కథకు డైన ఆ సౌతితో ఇట్లా అన్నారు.

### శమంతపంచ కాక్షౌహిణీ సంఖ్యా కథనము (సం.1-2-1)

**మ. అనఘా! మున్ను శమంతపంచకము నయ్యక్షౌహిణీ సంఖ్యయున్**
**వినఁగా మా కెఱిఁగించి భారత కథావిర్భూతికిం గారణం**
**బును దద్భారత విస్తరోక్తి విభవంబుం బాండవాడంబరం**
**బును భీష్మాదికురు ప్రవీర చరితంబుం జెప్పు ముద్యన్మతిన్. 74**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! సౌతీ!; మున్ను= ముందు, శమంత, పంచకమున్= శమంతపంచక మనే ప్రదేశాన్ని గూర్చియున్నూ; ఆ+అక్షౌహిణీ, సంఖ్యయున్= ప్రసిద్ధమైన అక్షౌహిణిలో ఎన్నెన్ని రథగజాదు లుంటాయో ఆ లెక్కయున్నూ; వినఁగాన్= వినేటట్లుగా; మాకున్; ఎఱిఁగించి= తెలిపి; భారత, కథా+ఆవిర్భూతికిన్= భారతంలోని కథ పుట్టటానికి; కారణంబును= హేతువును; తద్, భారత, విస్తర+ఉక్తి, విభవంబున్= ఆ భారతంలోని విరివితో కూడిన పల్కుల వైభవమున్నూ, పాండవ+ఆడంబరంబును= పాండు కుమారుల విజృంభణమున్నూ, కోపమును; భీష్మ+ఆది, కురు, ప్రవీర= భీష్ముడు మొదలైన కురువంశంలోని గొప్పవీరుల చరిత్ర (కథ) యున్నూ; ఉద్యత్+మతిన్= (ఉదయిస్తున్న) ప్రకాశిస్తున్న బుద్ధితో; చెప్పుము.

**తాత్పర్యం:** పాపరహితుడ వైన ఓ రౌమహర్షణీ! ముందుగా మాకు శమంతక పంచక మంటే ఏమిటో, అక్షౌహిణి అనే సేనావిభాగంలో రథగజాదులు ఎన్నెన్ని ఉంటాయో (ఏయే పక్షాన ఎన్నెన్ని అక్షౌహిణులు పోరాడెనో) ఆ సంఖ్యయున్నూ స్పష్టంగా తెలిపి, మహాభారతంలోని కథయొక్క పుట్టుకకు కారణమున్నూ, ఆ భారతంలోని విస్తృతితో కూడిన పల్కుల వైభవమున్నూ, పాండవుల విజృంభణాన్నీ, భీష్ముడు మొద లైన కురువంశంలోని గొప్పవీరుల ఉదంతాన్ని ప్రకాశించే బుద్ధితో చెప్పుము.

**క. అనిన విని రోమహర్షణ। తనయుం డమ్మునుల కతిముదంబున వినయా**
**వనతుఁ డయి గురులఁ దనహృ। ద్వనజంబున నిలిపి కొలిచి వాగ్గణపతులన్॥ 75**

**ప్రతిపదార్థం:** అనినన్=శౌనకాదిమునులు అట్లా అడుగగా; విని రోమహర్షణ, తనయుండు= రోమహర్షణు డనే సూతుడి కుమారుడు, ఉగ్రశ్రవుడు; ఆ+మునులకున్= ఆ శౌనకాది మునులకు; అతి, ముదంబునన్= అధికమైన సంతోషంతో; వినయ+అవనతుఁడు+అయి= వినయంతో వంగి నమస్కరించినవా డై; గురులన్= తండ్రి, వ్యాసుడు మొదలైన గురువులను; తన, హృద్, వనజంబునన్= పద్మం వంటి చిత్తంలో; నిలిపి= ఉంచి (స్మరించి); వాక్, గణపతులన్= సరస్వతిని, వినాయకుడిని; కొలిచి= సేవించి.

**తాత్పర్యం:** శౌనకాదిమునులు అట్లా అడుగగా విని రోమహర్షణుడికుమారు డైన సౌతి ఆమునులకు మిక్కిలి సంతోషంతో వినయంగా మ్రొక్కి, వ్యాసాదిగురువులను (పెద్దలను) తనచిత్తపద్మంలో (మనస్సులో) స్మరించి, వాగ్దేవి యైన సరస్వతిని, విఘ్నవినాశకు డైన వినాయకుడిని భజించినాడు.

**విశేషం:** సౌతి భారతేతిహాసాన్ని చెప్పబోతున్నాడు కాబట్టి గురువులను స్మరించి, సరస్వతిని, వినాయకుడిని భజించాడు. మునులకు మ్రొక్కటం ఆతడి వినయాన్ని సూచిస్తుంది.

**ఉ. ఇంబుగ సర్వలోకజను లెవ్వనియేని ముఖ్యామృతాంశుబిం**
**బంబున నుద్భవం బయిన భారతవాగమృతంబు కర్ణరం**
**ధ్రం బను నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోకవం**
**ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్. 76**

**ప్రతిపదార్థం:** ఇంబుగన్= ఒప్పుగ (ఇమ్ముగ రూపాంతరం); సర్వ, లోక, జనులు= అన్ని లోకాలందలి ప్రజలును; ఎవ్వని, ఏని= ఏవ్యాసునియొక్క; ముఖ+ (అమృత+అంశు) అమృతాంశు, బింబంబునన్= ముఖ మనే (అమృతమయ కిరణాలు గల) చంద్రుని యొక్క మండలంలో; ఉద్భవంబు+అయిన= పుట్టిన; భారత, వాక్+అమృతంబు= భారతంలోని వాక్కులు అనే అమృతాన్ని; కర్ణ, రంధ్రంబు+అను= చెవిలోని బిలం (కన్నం) అనెడి; అంజలిన్= దోసిలితో; తవిలి= ఆసక్తులై; త్రావుదురు= త్రాగుదురో; అట్టి= అటువంటి; ముని+ఇంద్ర, లోక, వంద్యున్= మునీశ్వరుల సముదాయాలకు నమస్కరింప దగిన వాడిని; పరమున్= శ్రేష్ఠుని; పరాశరసుతున్= పరాశరకుమారు డైన వ్యాసుడిని; కరంబున్= మిక్కిలి; భక్తితోన్, ప్రణమిల్లి= నమస్కరించి.

**తాత్పర్యం:** సమస్తలోకంలోని జనులును ఒప్పుగా ఏవ్యాసమునీంద్రుని ముఖ మనే చంద్రబింబంనుండి పుట్టిన భారతవాక్కు లనే అమృతాన్ని చెవులరంధ్రా లనెడి దోసిళ్ళతో ఆసక్తులై త్రాగుతారో అట్టి మునీశ్వర సముదాయాలకు నమస్కరింప దగిన వాడున్నూ శ్రేష్ఠుడున్నూ పరాశరుడి కుమారుడున్నూ అయిన వ్యాసుడికి మిక్కిలి నమస్కరించి,

**విశేషం:** అలం: రూపకం; ఈపద్యం యత్తదర్థకాలతో (ఎవని-అట్టి) కూడి సంస్కృత వాక్యయోజనను సూచిస్తున్నది. యదర్థకం తరువాత 'ఏని' అనేది నన్నయరచనలో కనిపిస్తుంది.

**వ. అమ్మును లడిగిన కథ యథాక్రమంబున సవిస్తరంబుగాఁ జెప్పందొడంగె. 77**

**ప్రతిపదార్థం:** ఆ మునులు= ఆ శౌనకాది మునులు; అడిగిన; కథ= భారతకథను; యథా, క్రమంబునన్= క్రమాన్ని అతిక్రమించకుండ; స, విస్తరంబుగాన్= విస్తృతితో కూడ (వివరంగా); చెప్పన్, తొడంగెన్= సౌతి చెప్పటానికి ఆరంభించాడు.

**తాత్పర్యం:** శౌనకాదిమునులు తనను చెప్పు మని అడిగిన భారతకథను సౌతి వరుస తప్పకుండ చెప్పటానికి ఆరంభించాడు.

**శా. త్రేతాద్వాపర సంధి నుద్ధత మదాంధీభూత విద్వేషిజీ**
**మూతోగ్రశ్వసనుండు రాముఁ డలుకన్ ముయ్యేడుమాఱుల్ రణ**

**ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెం బల్వురన్ దీర్ఘని**
**ర్ఘాత క్రూరకుఠారలూన నిఖిలక్షత్త్రోరుకాంతారుఁ డై. 78**

**ప్రతిపదార్థం:** త్రేతా, ద్వాపర, సంధిన్= త్రేతా ద్వాపరయుగాల మధ్యకాలంలో; ఉద్ధత, మద+అంధీభూత, విద్వేషి, జీమూత+ఉగ్ర, శ్వసనుండు= అధిక మైన గర్వంచేత గ్రుడ్డివా రైన (మిక్కిలి మదించిన) శత్రువు లనే మేఘాలకు భయంకర మైన వాయు వగు; రాముఁడు= పరశురాముడు; అలుకన్= కోపంతో; మూఁడు, ఏడు, మాఱుల్= ఇరువది యొక్కసార్లు; రణప్రీతిన్= యుద్ధమునందలి ప్రీతితో; వైరి, ధరాతల+ఈశ్వరులన్= శత్రురాజులను; పల్వురన్= పెక్కుమందిని; దీర్ఘనిర్ఘాత, క్రూర, కుఠార, లూన, నిఖిల, క్షత్త్ర+ఉరు, కాంతారుఁడు+ఐ= పొడవైన, వజ్రంవలె కఠిన మైన గొడ్డలిచేత చంపబడిన సర్వక్షత్రియు లనే గొప్ప అడవి కలవాడై; చంపెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** త్రేతాద్వాపరయుగాల మధ్యకాలంలో మిక్కిలి మదించిన శత్రువులనే మేఘాలకు, భయంకరవాయు వైన పరశురాముడు యుద్ధమందలి ప్రీతిచేత ఇరువది యొక్క పర్యాయాలు పొడవైన వజ్రంవలె కఠిన మైన గొడ్డలిచేత ఖండింపబడిన సర్వక్షత్త్రియవంశ మనే పెద్ద అడవి కలవా డై శత్రురాజులను పెక్కుమందిని చంపాడు.

**విశేషం:** అలం: రూపకం. శత్రువులు మదాంధీభూతులైనందువలన వధ్యులైనారని వస్తుధ్వని.

**వ. అప్పరశురాముండు నిజనిశిత కుఠారధారా విదళిత సకల క్షత్త్రరుధిరాపూర్ణంబులుగా నేను మడుంగులు గావించి తద్రుధిరజలంబులఁ బితృతర్పణంబు సేసి తత్పితృగణప్రార్థన నుపశమితక్రోధుం డయ్యె; దాననచేసి తత్సమీప ప్రదేశంబు శమంత పంచకంబునాఁ బరఁగెఁ; మఱి యక్షౌహిణీసంఖ్య వినుండు. 79**

**ప్రతిపదార్థం:** ఆ+పరశురాముండు; నిజ, నిశిత, కుఠార, ధారా, విదళిత, సకల క్షత్త్ర, రుధిర+ఆపూర్ణంబులుగాన్= తన వాడి యైన గొడ్డలి వాదరచే ఖండింపబడిన సర్వక్షత్రియుల నెత్తురుచేత పూర్తిగా నిండినవి అయ్యేటట్లుగా, ఏను=ఐదు; మడుంగులు= కొలకులు (హ్రదాలు); కావించి= చేసి; తద్, రుధిర, జలంబులన్= ఆ రక్త మనే నీళ్ళతో; పితృ, తర్పణంబు= పితృ దేవతల తృప్తి; చేసి; తద్, పితృ, గణ, ప్రార్థనన్= ఆ పితృదేవతల వేడుకోలుచేత; ఉపశమిత, క్రోధుండు= శాంతించిన కోపం కలవాడు; అయ్యెన్; దానన్+అ, చేసి= అట్లా చేయటం చేతనే; తద్, సమీప, ప్రదేశంబు= అతడు అట్లా క్షత్రియుల నెత్తురుచేత ఐదు మడుగులు కావించి దానిచే పితృతర్పణం చేసిన చోటికి చెంత నున్న స్థలం; శమంత, పంచకంబు= శమంత పంచకం; నాన్= అనగా; పరఁగెన్= ఒప్పెను; మఱి= ఇంక; అక్షౌహిణీ, సంఖ్య= అక్షౌహిణి అనే సేనాభాగంలోని రథ గజాదులలెక్క; వినుండు.

**తాత్పర్యం:** ఆ పరశురాముడు తనవాడి యైన గొడ్డలి వాదరచేత ఛేదింపబడిన సర్వక్షత్రియుల రక్తంచేత పూర్తిగా నిండేటట్లుగా ఐదు హ్రదాలను ఏర్పరచి, ఆ రక్త మనే నీళ్ళతో తన పితృదేవతలకు తృప్తికావించి, ఆ పితృదేవతల వేడుకోలుచేత శాంతించిన కోపం కలవా డైనాడు. ఆ కారణంచేత ఆ చోటికి చెంత నున్న స్థలం శమంత పంచకం అనే పేరుతో ఒప్పారింది. ఇంక మీ రడిగిన అక్షౌహిణి అనే సేనావిభాగంలోని రథగజాదుల లెక్క చెప్పుతాను. ఆలకించండి.

**సీ. వరరథ మొక్కండు వారణ మొక్కండు । తురగముల్ మూఁడు కాల్వురును నేవు**
**రను సంఖ్య గల యది యగుఁ బత్తి, యది త్రిగు । ణం బైన సేనాముఖంబు, దీని**

**త్రిగుణంబు గుల్మంబు, దీని ముమ్మడుఁ గగు । గణము, తద్గణము త్రిగుణిత మైన**
**వాహిని యగు, దాని వడి మూఁట గుణియింపఁ । బృతన నాఁ బరఁగుఁ, దత్పృతన మూఁట**

**ఆ. గుణిత మైనఁ జము వగున్, మఱి దాని ము । మ్మడుఁ గనీకినీ సమాఖ్య నొనరు,**
**నదియుఁ బదిమడుంగు లైన నక్షౌహిణి । యౌ నిరంతర ప్రమాను సంఖ్య. 80**

**ప్రతిపదార్థం:** వర, రథము= శ్రేష్ఠమైన రథం; ఒక్కండు= ఒకటి; వారణము= ఏనుగు; ఒక్కండు= ఒకటి; తురగముల్= గుఱ్ఱాలు; మూఁడు; కాల్బురునున్= పదాతులు (కాలిబంట్లు); ఏవురు= ఐదుగురు; అను; సంఖ్య=లెక్క; కల+అది= కలది (సేనావిభాగం) పత్తి; అగున్= పత్తి అనేది ఔతుంది; అది= ఆ పత్తి; త్రిగుణంబు+ఐనన్= మూడు రెట్లైన (మూడు రథాలు, మూడు ఏనుగులు, తొమ్మిది గుఱ్ఱాలు, 15 మంది కాలిబంట్లు అయితే); సేనాముఖంబు= సేనాముఖ మనబడుతుంది; దీని= సేనాముఖం యొక్క; త్రిగుణంబు= మూడురెట్లు; (9 రథాలు, 9 ఏనుగులు, 27 గుఱ్ఱాలు, 45 మంది కాల్బురు కలది); గుల్మంబు= గుల్మ మనే సేనావిభాగం; దీని= గుల్మం యొక్క; మూఁడు+మడుఁగు= మూడురెట్లు; (27 రథాలు, 27ఏనుగులు, 81 గుఱ్ఱాలు, 135 మంది కాల్బురు)గణము= గణ మనే సేనావిభాగం; అగు; తద్, గణము= ఆ గణం; త్రి, గుణితము= మూడుచే గుణింపబడింది (81 రథాలు, 81 ఏనుగులు, 243 గుఱ్ఱాలు, 405 మంది కాల్బురు); ఐన: వాహిని= వాహిని అనే సేనావిభాగం: అగున్; దాని= వాహినిని; వడిన్= వేగంతో; (లేక బలంతో); మూఁటన్= మూడుతో; గుణియింపన్= గుణింపగా (243 రథాలు, 243 ఏనుగులు, 729 గుఱ్ఱాలు, 1215 మంది కాల్బురు); పృతన, నాన్= పృతన అనే సేనావిభాగ మనగా; పరఁగున్= ఒప్పును; తద్, పృతన= ఆ పృతన; మూఁటన్= మూడుతో; గుణితము+ఐనన్= గుణింపబడితే (729 రథాలు, 729 ఏనుగులు, 2187 గుఱ్ఱాలు, 3645 మంది కాల్బురు); చమువు= చమువు అనే సేనావిభాగం; అగున్; మఱి= ఇంక; దాని=ఆచమువు యొక్క; మూఁడు+మడుఁగు= మూడురెట్లు; అనీకినీ, సమాఖ్యన్= అనీకిని అనే పేరుతో; ఒనరున్= ఒప్పుతుంది (2187 రథాలు, 2187 ఏనుగులు, 6561 గుఱ్ఱాలు, 10935 కాల్బురు); అదియున్= ఆ అనీకిని కూడ; పది, మడుంగులు, ఐనన్= పదిరెట్లు అయితే (21870 రథాలు, 21870 ఏనుగులు, 65610 గుఱ్ఱాలు, 109350 కాల్బురు); నిరంతర, ప్రమా, అను, సంఖ్య=దట్ట మైన లెక్కను (యథార్థజ్ఞానాన్ని) అనుసరించిన సంఖ్యతో; అక్షౌహిణి= అక్షౌహిణి అనే సేనా విభాగం; ఔన్= ఔతుంది.

**తాత్పర్యం:** శ్రేష్ఠ మైన రథం ఒక్కటి. ఏనుగు ఒక్కటి, గుఱ్ఱాలు మూడు, కాలిబంట్లు ఐదుగురు - అనే సంఖ్య గల సేనా విభాగం 'పత్తి' ఔతుంది. ఆ పత్తి మూడింటితో గుణింపబడితే 'సేనా ముఖం' అనే సేనావిభాగం ఔతుంది; దీని మూడు రెట్లు 'గుల్మం'; గుల్మం యొక్క మూడురెట్లు 'గణం ఔతుంది; ఆ గణం మూడుచేత గుణింపబడితే 'వాహిని' ఔతుంది; దాని బలాన్ని మూడు చేత గుణిస్తే 'పృతన' అని ఒప్పారుతుంది; ఆ పృతన మూడుతో గుణింపబడితే 'చమువు' ఔతుంది. ఇంక దాని మూడు రెట్లు 'అనీకిని' అనే పేరుతో ఒప్పుతుంది; ఆ అనీకినికి పదిరెట్లైన దట్టమైన లెక్క ననుసరించిన సంఖ్యతో 'అక్షౌహిణి' ఔతుంది.

**విశేషం:** నిరంతర మంటే ఎడతెగని అనికాని దట్ట మైన అనికాని అర్థం. ఇక్కడ తప్పులేని - లేదా - భేదం లేని అని చెప్పవచ్చును.

**వ. ఇరువది యొక్కవేయు నెనమన్నూట డెబ్బది రథంబులు, నన్ని యేనుంగులు, నఱువదేనువేలు నాఱునూటపది గుఱ్ఱంబులు, లక్షయుం దొమ్మిదివేలున్ మున్నూట యేఁబండ్రు వీరభటులును గలయది యొక్క యక్షౌహిణి యయ్యె; నట్టి యక్షౌ హిణులు పదునెనిమిదింట సన్నద్ధులై కురుపాండవులు యుద్ధంబు సేయుటం జేసి యా శమంతపంచకంబు కురుక్షేత్రంబు నాఁబరఁగె; నట్టి కురుక్షేత్రంబునందు. 81**

**ప్రతిపదార్థం:** ఇరువది, ఒక్క, వేయున్, ఎనమన్నూట, డెబ్బది, రథంబులున్= 21,870 రథాలున్నూ; అన్ని= 21,870, రథాలతో సమానసంఖ్య కల; ఏనుంగులున్= ఏనుగులున్నూ; అఱువది+ఏను, వేలున్, ఆఱు, నూట, పది= 65.610; గుఱ్ఱంబులున్= గుఱ్రాలున్నూ, లక్షయున్, తొమ్మిదివేలున్, మూడునూట, ఏఁబండ్రు, వీర, భటులును= 1,09,350 మంది వీరు లైన యోధులును (కాల్బలంవారును); కల+అది= కలసేనావిభాగం; ఒక్క, అక్షౌహిణి; అయ్యెన్; అట్టి= పైని పేర్కొన్న రథ గజ తురగ పదాతులతో యుద్ధానికి సంసిద్ధులై; కురు, పాండవులు= కౌరవులున్నూ, పాండవులున్నూ; యుద్ధంబు; చేయుటన్+చేసి= చేయటం చేత; ఆ, శమంతక పంచకంబు= శమంతక పంచక మనే ఆ ప్రదేశం; కురు, క్షేత్రంబు, నాన్= కురుక్షేత్ర మనగా; పరఁగెన్= ఒప్పారింది; అట్టి= అటువంటి, కురుక్షేత్రంబునందున్= కురుక్షేత్ర మనే ఆ ప్రదేశంలో.

**తాత్పర్యం:** శమంతకపంచక మని పిలువబడే ఆ ప్రాంతానికి - కురుపాండవులయుద్ధం అక్కడ జరగటంచేత కురుక్షేత్రం అనే పేరు వచ్చింది.

**చ.** **ప్రతిహతశత్రువిక్రముఁడు పాండవవంశ వివర్ధనుండు సు**
**వ్రతుఁడు పరీక్షిదాత్మజుఁ డవద్యవిదూరుఁ డుదారకీర్తిని**
**ర్మిత వివిధాధ్వరుండు జనమేజయుఁ డన్ జనపాలుఁ డుత్తమ**
**స్తుతమతి దీర్ఘసత్త్ర మజితుం డొనరించె శుభాభికాంక్షి యై.** **82**

**ప్రతిపదార్థం:** ప్రతిహత, శత్రు, విక్రముఁడు= అడ్డగింపబడిన (ఓడింపబడిన) శత్రువులయొక్క పరాక్రమం కలవాడు; పాండవ, వంశ, వివర్ధనుండు= పాండవులయొక్క వంశాన్ని మిక్కిలి వృద్ధి పొందించినవాడు; సు, వ్రతుఁడు= మంచి వ్రతం (పుణ్యకర్మలు) కలవాడు; పరీక్షిత్+ఆత్మజుఁడు= పరీక్షిత్తుయొక్క కుమారుడు; అవద్య, విదూరుఁడు= దోషాలకు (పాపాలకు) మిక్కిలి దూరంగా ఉండేవాడు; ఉదార, కీర్తి, నిర్మిత, వివిధ+అధ్వరుండు= గొప్ప కీర్తితో చేయబడిన పలువిధా లైన యజ్ఞాలు కలవాడు; ఉత్తమ, స్తుత, మతి= సజ్జనులచేత పొగడబడిన బుద్ధి కలవాడు; అజితుండు= జయింపబడనివాడు; అగు; జనమేజయుఁడు, అన్= జనమేజయుడు అనే; జన, పాలుఁడు= జనులను పాలించేవాడైన రాజు; శుభ+అభికాంక్షి+ఐ= శుభాన్ని (మంగళాన్ని) కోరేవాడై; దీర్ఘ, సత్త్రము= దీర్ఘకాలం సాగే యజ్ఞాన్ని; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** శత్రువుల పరాక్రమానికి అడ్డకట్ట వేసినవాడున్నూ, పాండవ వంశాన్ని మిక్కిలి వృద్ధి పొందించిన వాడున్నూ, మంచి పుణ్యకార్యాలలో నిష్ఠ కలవాడున్నూ, పరీక్షిత్తుకు కుమారుడున్నూ, పాపాలకు దూరుడున్నూ, కీర్తిదాయకాలైన వివిధయజ్ఞాలు చేసినవాడున్నూ, సజ్జనులచేత కీర్తింపబడిన బుద్ధికుశలత కలవాడున్నూ, ఓటమిని ఎఱుగని వాడున్నూ అగు జనమేజయు డనే రాజు తనకును ప్రజలకును దేశానికిని శుభాన్ని కోరువాడై దీర్ఘకాలం కొనసాగే యజ్ఞాన్ని చేశాడు.

**విశేషం:** ఇక్కడినుండి భారతకథ ఆరంభ మౌతుంది.

## సరమ వృత్తాంతము - జనమేజయుని పురోహిత వరణము (సం. 1-3-1)

**వ.** **ఆ ప్రదేశంబునకు సరమ యను దేవశునికొడుకు సారమేయుం డను కుర్కురకుమారుండు క్రీడార్థంబు వచ్చి క్రుమ్మరుచున్న నలిగి జనమేజయు తమ్ములు శ్రుతసేనుండును భీమసేనుండును నుగ్రసేనుండును ననువార లా సారమేయు నడిచిన, నది యఱచుచుం బఱతెంచి తన తల్లికిం జెప్పిన, నా సరమయు నతికోపాన్విత యై జనమేజయునొద్దకు వచ్చి యి ట్లనియె.** **83**

**ప్రతిపదార్థం:** ఆ, ప్రదేశంబునకున్= జనమేజయుడు యజ్ఞం చేసే ఆ స్థలానికి; సరమ, అను= సరమ అనే పేరు గల; దేవశుని కొడుకు= దేవతల ఆడుకుక్క కొడుకు; సారమేయుండు, అను= సారమేయుడు అనే పేరు కల (సరమయొక్క కుమారుడు సారమేయుడు); కుర్కుర కుమారుండు= బాలశునకము, కుక్కపిల్ల; క్రీడా+అర్థంబు= ఆట నిమిత్తం; వచ్చి; క్రుమ్మరుచున్+ఉన్నన్= తిరుగుతూ ఉండగా; అలిగి= కోపించి; జనమేజయు తమ్ములు, శ్రుతసేనుండును, భీమసేనుండునున్, ఉగ్రసేనుండునున్, అనువారలు= శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అనే పేరు గలవారలు; ఆ సారమేయున్= సరమకుమారు డైన ఆ కుక్కను; అడిచినన్= కొట్టగా; అది= ఆ కుక్క; అఱచుచున్= ఏడుస్తూ; పఱతెంచి= వచ్చి; తన తల్లికిన్= తన తల్లియైన సరమకు; చెప్పినన్= తెల్పగా; ఆ, సరమయున్= తల్లిఐన ఆసరమకూడ; అతికోప+అన్విత+ఐ= మిక్కిలి కోపంతో కూడినదై; జనమేజయు+ఒద్దకున్= జనమేజయుడి చెంతకు; వచ్చి; ఇట్లు= ఈవిధంగా, అనియెన్= పలికింది.

**తాత్పర్యం:** జనమేజయుడు యజ్ఞం చేసే ఆ ప్రదేశానికి సరమ అనే పేరుకల దేవతలకుక్కకొడు కైన సారమేయు డనే పేరు గల కుక్కపిల్ల ఆటనిమిత్తం వచ్చి తిరుగుతుండగా కోపించి శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడు అనే పేర్లు కల జనమేజయుడి తమ్ముళ్ళు దానిని కొట్టగా, అది ఏడుస్తూ వచ్చి తన తల్లియైన సరమకు తెల్పింది. ఆ సరమ కూడ మిక్కిలికోపంతో కూడినదై జనమేజయుడి చెంతకు వచ్చి ఇట్లా పలికింది.

**విశేషం:** జనమేజయుడితమ్ముడు సారమేయుడిని కొట్టడానికి యజ్ఞం చేసే చోటికి కుక్క రాకూడదు అనే భావమే కారణ మై ఉంటుంది.

**క. క్షితినాథ! కడు నకరుణా । న్వితు లై నీతమ్ము లతివివేకవిదూరుల్**
**మతిఁ దలఁపక నా పుత్త్రకు । నతిబాలకు ననపరాధు నడిచిరి పెలుచన్. 84**

**ప్రతిపదార్థం:** క్షితినాథ= భూమికి పతి వైన ఓ జనమేజయా!; అతి, వివేక, విదూరుల్= మిక్కిలి జ్ఞానహీను లైన; నీతమ్ములు= శ్రుతసేనాదులు; కడున్= మిక్కిలి; అ కరుణా+అన్వితులు+ఐ= నిర్దయతో కూడిన వారై (దయలేని వారై); మతిన్= మనస్సులో (గౌరవాన్ని); తలఁపక= ఆలోచింపక; అతిబాలకున్= మిక్కిలి చిన్నవాడిని; అనపరాధున్= నేరం లేనివాడిని; నా, పుత్త్రకున్= నా కుమారుడిని; పెలుచన్= కోపంతో; అడిచిరి= కొట్టారు.

**తాత్పర్యం:** ఓరాజా! మిక్కిలి జ్ఞానహీను లైన నీ తమ్ములు ఏమియు దయలేనివారై చిన్నవా డని కూడా మనస్సులో ఆలోచించక మిక్కిలి చిన్నవాడున్నూ, ఎట్టి నేరం చేయనివాడున్నూ అయిన నా కుమారుడిని కోపంతో కొట్టారు.

**విశేషం:** సరమ అభిప్రాయాన్ని అనుసరించి దేవశునికొడు కగుటచేత సారమేయుడు యజ్ఞం చేసేచోటికి పోయినను నేరం కాకపోవచ్చును. అదిగాక, ఆ కుక్క అక్కడ తిరుగుతున్నదే కాని మరే తప్పు చేసియుండలేదు.

**క. తగు నిది తగ దని యెదలో । వగవక, సాధులకుఁ బేదవారల కెగ్గుల్**
**మొగిఁ జేయు దుర్వినీతుల । కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్. 85**

**ప్రతిపదార్థం:** ఇది= ఇట్లా చేయటం (ఈపని); తగును= యుక్త మౌతుంది; తగదు= యుక్తం కాదు; అని; ఎదలోన్= మనస్సులో, వగవక= తలపక; పేదవారలకున్= అశక్తులైనవారికి, బీదవారికి; సాధులకున్= సజ్జనులకు (మంచివారికి); ఎగ్గుల్= కీళ్ళు; మొగిన్= పూనికతో; చేయు= చేయునట్టి; దుర్వినీతులకున్= నీతి హీనులకు; అనిమిత్త+ఆగమంబులు+అయిన= కారణం లేకుండానే రాక గల (కారణం లేకుండానే కలిగే); భయంబుల్; అగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** ఈపని యుక్తమైనది, యుక్తమైనది కాదు అని మనస్సులో ఆలోచించకుండానే బీదవారికీ, అశక్తులైనవారికీ, మంచివారికీ అపకారాలు కావాలని చేసే నీతిరహితులకు కారణం లేకుండానే ఆపదలు వస్తూ ఉంటాయి.

**విశేషం:** నన్నయ రుచిరార్థసూక్తినిధిత్వానికి ఇది ఒక ఉదాహరణం.ఈ సూక్తి ధార్తరాష్ట్రుల దుర్వృత్తాన్నీ, వారిదుర్గతినీ ధ్వనింపచేస్తున్నది.

ఒక ప్రతిలో ఈపద్య మిట్లున్నది -

**"తగు నిది తగదిది యని యెడ । వగవక సాధులకుఁ బెద్దవారికి నెగ్గుల్**
**మొగిఁజేయు దుర్వినీతుల । బగి నుండఁగ వచ్చు ఘోరపాపభయంబుల్."**

'అనిమిత్తంబులైన కష్టచయంబుల్' అనికొన్నిప్రతులలో పాఠాంతరం కనబడుతున్నది.

**వ. అని సరమ యదృశ్యయైన, నతి విస్మితుండై జనమేజయుండు కొన్ని దినంబులకు దీర్ఘసత్త్రంబు సమాప్తంబుసేసి హస్తిపురంబునకుం జని, యందు సుఖం బుండి, యొక్కనాఁడు దేవశునీవచన ప్రతీకారార్థంబు శాంతిక పౌష్టిక క్రియలు నిర్వర్తింప ననురూపపురోహితు నన్వేషించుచు ననేక మునిగణాశ్రమంబులకుం జని యొక్కమునిపల్లెం గని, యందు శ్రుతశ్రవసుం డను మహామునిం గని నమస్కరించి యి ట్లనియె. 86**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లాపలికి; సరమ= దేవశుని; అదృశ్య+ఐనన్= కంటికి కనబడకుండా తిరోహిత కాగా; అతి, విస్మితుండు+ఐ= మిక్కిలి ఆశ్చర్యపడిన వాడై; జనమేజయుండు; కొన్ని దినంబులకున్= కొన్ని రోజులకు; దీర్ఘసత్త్రంబు= తాను చేస్తున్న దీర్ఘకాలం కొనసాగే యజ్ఞాన్ని; సమాప్తంబు+చేసి= ముగించి (పూర్తి చేసి); హస్తిపురంబునకున్= రాజధాని యైన హస్తినాపురానికి; చని= వెళ్ళి; అందున్= ఆపురంలో, సుఖంబు+ఉండి= సుఖంతో ఉండి; ఒక్కనాఁడు= ఒక్కరోజున; దేవశునీ, వచన, ప్రతీకార+అర్థంబు= దేవతల కుక్క యైన సరమ పలికిన 'భయం కలుగుతుంది' అనే పలుకులకు మారుచేత (ప్రతిక్రియ) చేయటంకొరకు; శాంతిక, పౌష్టిక, క్రియలు= ఆపదలకు ఉపశాంతి కల్గించేవియున్నూ, శ్రేయస్సును వృద్ధిపొందించేవియున్నూ, అయిన కర్మలు; నిర్వర్తింపన్= చేయటానికి; అనురూప, పురోహితున్= తగిన పురోహితుడిని; (పురోహితు డంటే ముందు మేలు కలిగించే కుటుంబానికి కావలసిన కర్మకలాపాల నన్నింటిని చేయించేవాడు); అన్వేషించుచున్= వెదకుతూ; అనేక, ముని, గణ+ఆశ్రమంబులకున్= పెక్కుమునుల సముదాయాల యొక్క ఆశ్రమాలకు; చని= వెళ్ళి; ఒక్క; మునిపల్లెన్= మునులు నివసించే పల్లెను; కని= చూచి; అందున్= ఆ మునిపల్లెలో; శ్రుతశ్రవసుండు+అను= శ్రుతశ్రవసుడు అనే పేరు కల; మహా+మునిన్; కని= చూచి; నమస్కరించి= మ్రొక్కి; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పలికెను.

**తాత్పర్యం:** అని పలికి దేవశుని యైన సరమ కనబడకుండ పోగా మిక్కిలి ఆశ్చర్యపడి, జనమేజయుడు కొన్ని రోజులకు దీర్ఘ మైన ఆయాగాన్ని పూర్తిచేసి హస్తినాపురానికి వెళ్ళి, అక్కడ సుఖంగా ఉండి, ఒకరోజున 'ఆపదలు కలుగుతాయి' అని చెప్పిన సరమపలుకులకు ప్రతిక్రియ చేసేనిమిత్తం శాంతిని శ్రేయస్సును కలిగించే కర్మలు చేయటానికి తగిన పురోహితుడిని వెదకుతూ మునులు నివసించే అనేక ఆశ్రమాలకు వెళ్ళి, ఒక మునిపల్లెను చూచి, దానిలో శ్రుతశ్రవసు డనే ఒకగొప్పమునిని చూచి మ్రొక్కి ఇట్లా పలికాడు.

**విశేషం:** సుఖము+ఉండి= ఇక్కడ ప్రథమావిభక్తి తృతీయార్థంలో వాడబడింది. ఆపదలను తొలగించి శ్రేయం చేకూర్చే కర్మకలాపాలను శాంతిక, పౌష్టిక క్రియలు అంటారు.

**క. కరుణించి యిండు నాకుం । బురోహితుఁడు గాఁగ మీసుపుత్త్రుఁ బవిత్రుం**
**బరమతపోనైష్ఠికు భా । సురయమనియమాభిరాము సోమశ్రవసున్. 87**

**ప్రతిపదార్థం:** కరుణించి= దయయుంచి; పవిత్రున్= పరిశుద్ధు డైన వాడిని; పరమ, తపః, నైష్ఠికున్= గొప్ప తపస్సు (చే)నందు నిష్ఠ కలవాడిని; భాసుర, యమ, నియమ+అభిరామున్= ప్రకాశించే ఇంద్రియ నిగ్రహంచేతను, విధి విహిత నియమాలచేతను మనోహరు డైనవాడిని; మీ, సు, పుత్త్రున్= యోగ్యు డైన మీ కుమారుడిని; సోమశ్రవసున్= సోమశ్రవసు డనే పేరు కలవాడిని; నాకున్; పురోహితుఁడు, కాఁగన్= పురోహితు డయ్యేటట్లుగా; ఇండు= ఇవ్వండి.

**తాత్పర్యం:** పవిత్రుడూ, గొప్ప తపస్సులో నిష్ఠ కలవాడున్నూ, ప్రకాశించే ఇంద్రియ నిగ్రహంచేత నియమాలచేత ఒప్పేవాడున్నూ, సోమశ్రవసుడు అనే పేరు కలవాడున్నూ అయిన యోగ్యు డైన మీకుమారుడిని దయయుంచి నాకు పురోహితుడిగా సమర్పించండి.

**విశేషం:** యోగాంగాలు ఎనిమిది. వాటిలో మొదటి రెండు - యమము, నియమము అనేవి.

**వ. అని యడిగి వాని యనుమతంబున సోమశ్రవసుం దనకుం బురోహితుం గావించుకొని వాని నభీష్ట సత్కారంబుల సంతుష్టునిం జేసి తదుపదేశంబున. 88**

**ప్రతిపదార్థం:** అని=మీకుమారుడిని నాకు పురోహితుడిగా ఇమ్మని; అడిగి; వాని, అనుమతంబునన్= శ్రుతశ్రవసుని అంగీకారంతో; సోమశ్రవసున్= అతని కుమారు డైన సోమశ్రవసుడిని; తనకున్; పురోహితున్; కావించుకొని= అయ్యేటట్లు చేసికొని; వానిన్= ఆ సోమశ్రవసుడిని; అభీష్ట, సత్కారంబులన్= అతనికి ఇష్టము లైన సన్మానాలచేత; సంతుష్టునిన్= సంతోషించిన వాడినిగా; చేసి; తద్+ఉపదేశంబునన్= అతనియొక్క హితవచనంచేత

**తాత్పర్యం:** 'మీ కుమారుడిని నాకు పురోహితుడిగా ఇ' మ్మని జనమేజయుడు శ్రుతశ్రవుడిని అడిగి అతడి అంగీకారంతో సోమశ్రవసుడిని తనకు పురోహితుడిగా చేసికొని ప్రియములైన సన్మానాలచేత అతడిని సంతోషపెట్టి అతని హితవచనంచేత.

**ఉ. ఆయతకీర్తితో వివిధయాగములన్ సుర ధారుణీసురా**
**మ్నాయము నాహితాహుతి సమంచితదక్షిణ లిచ్చి తన్పుచుం**
**జేయుచునుండె రాజ్యము విశిష్ట జనస్తుత వర్ధమాన ల**
**క్ష్మీయుతుఁ డుత్తముండు జనమేజయుఁ డాదినరేంద్రమార్గుఁ డై. 89**

**ప్రతిపదార్థం:** విశిష్ట జన, స్తుత, వర్ధమాన, లక్ష్మీ, యుతుఁడు= మిక్కిలి ఉత్తములైన జనులచేత నుతింపబడిన, వృద్ధి పొందుతున్న సంపదతో (రాజ్యలక్ష్మితో) కూడినవాడు; ఉత్తముండు= శ్రేష్ఠుడు అయిన; జనమేజయుఁడు; ఆది, నర+ఇంద్ర, మార్గుఁడు+ఐ= ఆదికాలంలోని మనువు మొదలైన రాజులయొక్క మార్గం (విధానం) వంటి మార్గం కలవాడై; ఆయత, కీర్తితోన్= విస్తార మైన కీర్తితో; వివిధ, యాగములన్= పలురకాలైన యజ్ఞాలలో; సుర, ధారుణీ, సుర+ఆమ్నాయమున్=

దేవతల యొక్కయు, బ్రాహ్మణుల యొక్కయు సముదాయాన్ని; ఆహిత+ఆహుతి, సమంచిత, దక్షిణలు= చేయబడిన హోమద్రవ్యాలను (దేవతలకు), ఉచిత మైన సంభావనలను (బ్రాహ్మణులకు); ఇచ్చి; తన్పుచున్= తృప్తినొందిస్తూ; రాజ్యము; చేయుచున్; ఉండెన్.

**తాత్పర్యం:** ఉత్తమజనులచేత స్తుతింపబడిన వృద్ధినొందుతున్న సంపదతో కూడినవాడున్నూ, శ్రేష్ఠుడున్నూ అయిన జనమేజయ మహారాజు పూర్వపుమహారాజులు అనుసరించిన మార్గాన్ని అనుసరిస్తూ, విశాల మైనకీర్తితో పలువిధా లైన యాగాలలో అగ్నియందు వేల్వబడిన హవిస్సులతో దేవగణాలనూ, భూరిసంభావనలతో బ్రాహ్మణ సముదాయాలనూ తృప్తిపొందిస్తూ రాజ్యం చేస్తూ ఉన్నాడు.

**విశేషం:** అలం: క్రమాలంకారం. జనమేజయుడు దేవతలను ఆహుతులచేతను, బ్రాహ్మణులను విశేష దక్షిణలచేతను తృప్తిపరుస్తూ పలువిధాలైన యాగాలు చేస్తూ ఉన్నాడు.

**వ. ఇట్లనవరత శాంతిక పౌష్టిక క్రియలు నిర్వర్తించుచు గురుదేవ మహీదేవతర్పణాభిరతుం డై యుండు నంత. 90**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; అనవరత, శాంతిక, పౌష్టిక క్రియలు= ఎడతెగకుండ ఆపదలకు ఉపశాంతి కలిగించేవి, శ్రేయస్సును వృద్ధి పొందించేవి అయిన కర్మలను; నిర్వర్తించుచున్= చేస్తూ; గురు, దేవ, మహీదేవ, తర్పణ+అభిరతుండు+ఐ= గురువులను (పెద్దలను), దేవతలను, బ్రాహ్మణులను తృప్తి పొందించటంలో ఆసక్తి కలవాడై; ఉండు+అంతన్= ఉండగా.

**తాత్పర్యం:** ఈవిధంగా ఎల్లప్పుడున్నూ ఆపదలను తొలగించేవీ, శ్రేయస్సును వృద్ధి పొందించేవీ అయిన కర్మలను చేస్తూ గురువులను దేవతలను బ్రాహ్మణులను తృప్తిపరచటంలో ఆసక్తికలవాడై ఉండగా.

### ఉదంకుండు పౌష్యమహాదేవికుండలంబులం దేఁబోవుట (సం. 1-3-86)

**క. పంకజభవసన్నిభుఁ డఘ। పంకక్షాళన మహాతపస్సలిలుఁ డనా**
**తంకమతి పైలశిష్యుఁ డు। దంకుం డను మునివరుండు దద్దయు భక్తిన్. 91**

**ప్రతిపదార్థం:** పంకజభవ, సన్నిభుఁడు= పద్మంలో పుట్టిన బ్రహ్మతో సమానుడు; అఘ, పంక, క్షాళన, మహత్, తపః, సలిలుఁడు= పాప మనే బురదను కడిగివేసే గొప్ప తప స్సనే నీరు కలవాడు; అనాతంక, మతి= భయం లేని మనస్సు కలవాడు; పైల, శిష్యుఁడు= పైలు డనే మునిశిష్యుడైన; ఉదంకుండు+అను= ఉదంకుడు అనే పేరు కల; ముని, వరుండు= మునిశ్రేష్ఠుడు; తద్దయున్= మిక్కిలి; భక్తిన్= భక్తితో.

**తాత్పర్యం:** బ్రహ్మతో సమానుడున్నూ, పాపమనే బురదను కడిగివేసే గొప్పతపస్సనే నీరు కలవాడున్నూ, భయం లేని మనస్సు కలవాడున్నూ అయిన పైలుడిశిష్యు డైన ఉదంకు డనే మునిశ్రేష్ఠుడు మిక్కిలిభక్తితో, (తరువాతిపద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: రూపకం, ఉదంకుడు వేదుడి శిష్యు డని సంస్కృతభారతంలో ఉన్నది. పైలుడు వ్యాసుడి ప్రధానశిష్యులలో ఒకడు. నన్నయ సంస్కృతభారతంలో మొదట గల ధౌమ్యశిష్యులవృత్తాంతాన్ని విడిచివైచి ఉదంకోపాఖ్యానంతో తెలుగు భారతాన్ని ఆరంభించాడు. జనమేజయుడిని సర్పయాగానికి ప్రేరేపించినవాడు ఉదంకుడే.

**క. గురుకులమునందు గురులకుఁ । బరిచర్య లొనర్చి తా నపరిమిత నిష్ఠా॥**
**పరుఁ డై జ్ఞానము వడసెను । గురుదయ నణిమాదికాష్టగుణములతోడన్. 92**

**ప్రతిపదార్థం:** గురు, కులమునందున్= ఆచార్యుడి ఇంటిలో; గురులకున్= పెద్దలకు (గురువులకు); పరిచర్యలు= సేవలు; ఒనర్చి= చేసి; తాన్=తాను; అపరిమిత, నిష్ఠాపరుఁడు+ఐ= అధిక మైన దీక్షయందు (భక్తిలో ఆసక్తి కలవాడై); గురుదయన్= గురువుల దయచేత; అణిమ+అదిక+అష్టగుణములతోడన్= అణిమ మొదలైన ఎనిమిది సిద్ధులతోకూడ; జ్ఞానము; పడసెను= పొందినాడు.

**తాత్పర్యం:** గురుగృహంలో పూజ్యు లైన పెద్దలకు సేవలు చేసి అధికమైన భక్తియందు ఆసక్తికలవా డై గురువుల దయతో అణిమ గరిమ మొదలైన ఎనిమిదిసిద్ధులతోకూడ జ్ఞానాన్ని సాధించాడు.

**విశేషం:** అణిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, మహిమ, ఈశిత్వం, వశిత్వం, కామావసాయిత అనేవి ఎనిమిదీ అష్టసిద్ధులు. అణిమ అంటే చిన్నరూపం పొందటం; కామావసాయిత అంటే కోరికలను అరికట్టటం. ఈపద్యంలోని వివరాలు అతని స్వభావాన్ని తెలపటమే కాకుండా భావికథలో ఆపాత్రను అర్థం చేసికొనటానికి సార్థకాలుగా తోడ్పడతాయి. కథను ప్రసన్నం చేసే కథాశిల్పంలో భాగంగా సార్థకవిశేషణాలను వాడటం నన్నయరచనలో కానవచ్చే ఒకవిశేషం.

**వ. అయ్యుదంకుండు గురుహిత కార్యధురంధరుం డయి గురుపత్నీనియోగంబునం బౌష్యుం డను రాజుదేవి కుండలంబులం బ్రతిగ్రహించి తేరంబూని, వనంబులో నొక్కరుండ చనువాఁ డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్క దివ్యపురుషుం గని, వాని పన్నిన వృషభగోమయ భక్షణంబు సేసి, యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి, యతిత్వరితగతిం జని, పౌష్యమహారాజుం గాంచి, దీవించి, గృహీతసత్కారుం డై యి ట్లనియె. 93**

**ప్రతిపదార్థం:** ఆ+ఉదంకుండు; గురు, హిత, కార్య, ధురంధరుండు+అయి= గురువు గారికి ఇష్టమైన పని యొక్క భారాన్ని వహించే వాడై; గురుపత్నీ, నియోగంబునన్= గురువుగారి భార్యయొక్క ఆజ్ఞచేత; పౌష్యుండు+అను, రాజుదేవి= పౌష్యు డనే రాజుభార్యయొక్క; కుండలంబులన్= కర్ణాభరణాలను; ప్రతిగ్రహించి= పుచ్చుకొని; తేరన్, పూని= తేవటానికి యత్నించి; వనంబులోన్= అడవిలో; ఒక్కరుండు+అ= ఒక్కడే; చను, వాఁడు= వెళ్లేవాడు; ఎదురన్= తన ఎదుట; ఒక్క, మహత్+ఉక్షంబున్= ఒక పెద్ద ఎద్దును; ఎక్కి; చనుదెంచువానిన్= వచ్చేవాడిని; ఒక్క దివ్యపురుషున్; కని= చూచి; వాని, పన్నిన= (కర్తృపద ప్రథమకుషష్ఠి) అత డేర్పరచిన; వృషభ, గోమయ, భక్షణంబు= ఎద్దుపేడను తినటం; చేసి; ఆ, మహాత్మ+అనుగ్రహంబు= మహానుభావు డైన ఆదివ్యపురుషుడి దయ; పడసి= పొంది; అతి, త్వరితగతిన్= మిక్కిలి వేగంతో కూడిన గమనంతో; చని= వెళ్ళి; పౌష్య, మహా, రాజున్= పౌష్యుడనే పేరు కల ఆ గొప్పరాజును; కాంచి= చూచి; దీవించి= ఆశీర్వదించి; గృహీత, సత్కారుండు+ఐ= గ్రహింపబడిన సన్మానం కలవాడై; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ ఉదంకుడు గురువుగారి కిష్టమైనపనిని నెరవేర్చేవా డై, గురువుగారిఆజ్ఞచేత పౌష్యు డనే మహారాజు యొక్క దేవేరికర్ణాభరణాలు దానంగా పుచ్చుకొని తేవటానికి పూనుకొని, అడవిలో ఒక్కడే వెళ్ళుతూ తన ఎదుట ఒక పెద్దఎద్దునెక్కి వస్తున్న ఒక దేవతాపురుషుడిని చూచి, అతడు నియోగించిన ఎద్దుపేడ తిని, ఆ మహానుభావుడి దయ పొంది మిక్కిలివేగంతో కూడిన గమనంతో వెళ్ళి పౌష్యమహారాజును చూచి ఆశీర్వదించి, అత డిచ్చిన అర్ఘ్యపాద్యాదిసత్కారాలు గ్రహించి ఇట్లా పలికాడు.

**విశేషం:** "ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేచ్చీః'' (గురువు కోరిన అర్థాన్ని గురుదక్షిణగా ఇచ్చి వంశాభివృద్ధికి తోడ్పడుము) అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నవి. గురువుకు కోరిక లేదు. అందువలన గురుపత్ని ఉదంకుడిని నియోగించింది. గురువుగారికి భార్యయందున్న అనురాగం, శిష్యుడియందున్న వాత్సల్యం ఈ సన్నివేశంలో వస్తుధ్వని, గురుకార్యనిర్వహణానికి పూనుకొన్న ఉదంకుడు ధర్మవీరుడు. అతడి ఉత్సాహానికి మెచ్చి వీరరసాధిదేవత అయిన ఇంద్రుడు ప్రత్యక్షమై అమృతసేవనం చేయిస్తాడు. ధర్మసాధనమే మానవులకు అమృతత్వసిద్ధి అని దివ్యపురుషుడి వృత్తాంతం ధ్వనింపజేస్తున్నది. కథచివరకు తెలిసే ఈసత్యం నన్నయగారి ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తికి ఉదాహరణం. మూలంలో దివ్యపురుషుడు గోమయభక్షణం చేయుమంటే మొదట ఉదంకుడు అంగీకరించలేదు. 'మీ గురువుకూడా ఈ గోమయభక్షణం చేసినవాడే' అని దివ్యపురుషుడు చెప్పి ఒప్పించిన తరువాత ఉదంకుడు సమ్మతించాడు. నన్నయ దీనిని వదలివేసి ఉదంకుడి ఉపజ్ఞను ఉద్దీపింపజేశాడు.(సంసా.)

**తే. ఏను గుర్వర్థ మర్థి నై మానవేశ! । కడఁగి వచ్చితి నిపుడు నీకడకు వేడ్క;**
**దండితారాతి! నీ దేవికుండలమ్ము । లిమ్ము నా పూన్కి యిది సఫలమ్ము గాఁగ. 94**

**ప్రతిపదార్థం:** మానవ+ఈశ= ఓ రాజా!; ఏను= నేను; గురు+అర్థము= గురువుగారి నిమిత్తం; అర్థిని+ఐ= యాచించేవాడినై; కడఁగి= పూని; ఇపుడు; నీకడకున్= నీచెంతకు; వేడ్కన్= సంతోషంతో; వచ్చితిన్; దండిత+అరాతి!= శిక్షింపబడిన శత్రువులు కలవాడా!; నా, పూన్కి+ఇది= ఈ నా ప్రయత్నం; సఫలమ్ము, కాఁగన్= ఫలంతో కూడినట్లు అయ్యేటట్లుగా; నీ, దేవి కుండలములు= నీరాణి ధరించే కర్ణాభరణాలు; ఇమ్ము.

**తాత్పర్యం:** ఓ రాజా ! నేను గురువుగారిప్రయోజనంకొరకు యాచకుడ నై పూని ఇపుడు సంతోషంతో నీచెంతకు వచ్చాను. శిక్షింపబడిన శత్రువులు కల ఓ రాజా! నా ఈ కోరిక (ప్రయత్నం) సిద్ధించేటట్లుగా నీ రాణి ధరించే కర్ణాభరణాలు నా కిమ్ము.

**విశేషం:** గురు+అర్థము= గుర్వర్థము - యణాదేశసంధి.

**వ. అనినం బౌష్యుం డిట్టి మహాత్మున కీఁ గాంచితిఁ గృతార్థుండ నైతి నని సంతసిల్లి యుదంకున కి ట్లనియె: 'నయ్యా! మదీయ ధర్మపత్ని యక్కుండలంబులు దొడిగి యున్నయది; మద్వచనంబున వాని నిప్పించుకొ' మ్మనిన నుదంకుం డంతఃపురమునకుఁ జని పౌష్యమహాదేవిం గానక క్రమ్మఱి పౌష్యుపాలికి వచ్చి. 'నీదేవి నందులం గాన నీవ 'యక్కుండలంబులు దెప్పించి యి' మ్మనినఁ బౌష్యుం డి ట్లనియె. 95**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ఉదంకుడు పలుకగా; పౌష్యుండు; ఇట్టి, మహత్, ఆత్మునకున్= ఇటువంటి మహానుభావుడికి (గొప్ప మనస్సు కలవాడికి), ఈన్, కాంచితిన్= కుండలాలు ఈయ జాలినాను; కృత+అర్థుండన్+ఐతిన్= ధన్యుడ నైనాను; అని; సంతసిల్లి= సంతోషించి; ఉదంకునకున్; ఇట్లు= ఈవిధంగా; అనియెన్; అయ్యా= ఆర్యా! (ఉదంకుడికి సంబోధన); మదీయ, ధర్మ పత్ని= నాయిల్లాలు (యథావిధిగా గృహస్థ ధర్మాన్ని నిర్వహించటానికి పెండ్లాడిన భార్య); ఆ+కుండలములు; తొడిగి, ఉన్న, అది= ధరించి ఉన్నది; మత్+వచనంబునన్= నామాటచేత (నేను ఇమ్మన్నా నని;) వానిన్= ఆ కుండలాలను, ఇప్పించుకొమ్ము= ఇచ్చేటట్లు చేసికొనుము; అనినన్= అని పౌష్యుడు పలుకగా; ఉదంకుండు; అంతఃపురమునకున్= రాణివాసపుస్త్రీలు ఉండే సౌధభాగానికి; చని= వెళ్ళి; పౌష్య, మహా, దేవిన్= పౌష్యుని పట్టమహిషిని; కానక= చూడక; క్రమ్మఱి= తిరిగి; పౌష్య, పాలికిన్= పౌష్యుని చెంతకు; వచ్చి; నీ, దేవిన్= నీరాణిని; అందులన్= అంతఃపురంలో; కానన్= చూడను (ఆమె కనబడలేదు);

నీవు+అ= నీవే; ఆ+కుండలంబులు; తెప్పించి= తెచ్చేటట్లు చేసి; ఇమ్ము; అనినన్= అని ఉదంకుడు పలుకగా; పౌష్యుండు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అని ఉదంకుడు అడుగగా పౌష్యుడు 'ఇట్టి మహానుభావుడికి (పాత్రునికి) అడిగిన కుండలాలను ఈయజాలినాను; ధన్యుడ నైనాను' అని సంతోషించి ఉదంకుడితో 'ఆర్యా! నా దేవేరి ఆ కుండలాలను ధరించి ఉన్నది. నామాటగా వాటిని ఆమెనుండి గ్రహించండి' అని పలుకగా, ఉదంకుడు రాణి నివసించే అంతఃపురానికి వెళ్ళి పౌష్యుని పట్టమహిషి కనబడక తిరిగి పౌష్యమహారాజుచెంతకు వచ్చి 'నీదేవేరిని అంతఃపురంలో చూడలేకపోయాను; నీవే ఆ కుండలాలను నాకై తెప్పించి యిమ్ము' అని పలుకగా పౌష్యుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇచ్చునకు ప్రేరణార్థకరూపం ఇప్పించు; కొనుము= మధ్యమపురుషమందలి ము, డు ప్రత్యయములు పరము లయ్యేటపుడు కొనునకు కో బహుళంగా ఔతుంది. కొమ్ము; తరువాత దీర్ఘమునకు హ్రస్వమును ముప్రత్యయమునకు ద్విత్వమును వస్తాయి. అక్కుండలంబులు దొడిగియున్నయది' - అనేపాఠానికి 'అక్కుండలంబులు దొడుగనవసరంబై యున్నయది' అనే పాఠాంతరం ఉన్నది.

**క. భూవినుత! నిన్నుఁ ద్రిభువన । పావను నశుచి వని యెట్లు పలుకఁగ నగు? న**
**ద్దేవి పవిత్ర, పతివ్రత । గావున నశుచులకుఁ గానఁగా దనవద్యా! 96**

**ప్రతిపదార్థం:** భూ, వినుత= భూమియందలి జనులచేత స్తుతింపబడేవాడా!; అనవద్యా= దోషరహితుడా!; త్రి, భువన, పావనున్= ముల్లోకాలను పవిత్రం చేసేవాడిని; నిన్నున్; అశుచివి+అని= శుద్ధుడవు కావని; ఎట్లు= ఏవిధంగా; పలుకఁ గన్+అగున్= పలుక వచ్చును? (పలుక రాదు అనిభావం); ఆ+దేవి= ఆ నాదేవేరి; పవిత్ర= పవిత్రురాలు; పతి వ్రత= (భర్తయే వ్రతంగా కలది) పతిభక్తి కల ఇల్లాలు; కావునన్= అగుటచేత; అశుచులకున్= అపవిత్రులకు; కానన్, కాదు= చూడరాదు (కనబడదు).

**తాత్పర్యం:** భూప్రజలచే స్తుతింపబడేవాడా! దోషరహితుడా! ముల్లోకాలను పవిత్రంచేయ గల నిన్ను అపవిత్రుడ వని చెప్పటం ఎట్లా? చెప్పరాదు. ఆ నాదేవి పవిత్రురాలు. పతిభక్తి కలది. కావున అపవిత్రులకు చూడ శక్యం కాదు.

**విశేషం:** ఉదంకుడు పరమ పవిత్రుడు; పౌష్యునిదేవి పరమ పవిత్ర. మహాపతివ్రత. అపవిత్రులకు కనబడదు. ఉదంకుడికి కనబడలేదు. అతడిని అపవిత్రు డని ఎట్లా చెప్పటం? అని పౌష్యునిభావం. ఇందులో అర్థాంతరసంక్రమితవాచ్యధ్వని ఉన్నది. (సంపా.)

**వ. అనిన విని యుదంకుం డప్పుడు దలంచి 'యావృషభగోమయభక్షణానంతరంబున నాచమింపమి నైన నా యశుచిభావంబునఁ గా కేమి యప్పరమ పతివ్రత మదీయదృష్టిగోచర గాకున్నదయ్యె' నని పూర్వాభిముఖుం డయి శుద్ధోదకంబులంబ్రక్షాళితపాణిపాద వదనుండయి యాచమించి పౌష్యానుమతంబున నద్దేవియొద్దకుం జనిన, నదియును నమ్మహామునికి నమస్కరించి కుండలమ్ము లిచ్చి యి ట్లనియె. 97**

**ప్రతిపదార్థం:** అనినన్= పౌష్యు డావిధంగా పలుకగా; విని; ఉదంకుండు; అప్పుడు= పౌష్యు డావిధంగా పలికినప్పుడు; తలంచి= ఆలోచించి(వెనుకటి విషయాలను స్మృతికి తెచ్చుకొని); ఆ, వృషభ, గోమయ, భక్షణ+అనంతరంబునన్= దివ్యపురుషుడు

చెప్పినట్లు ఆ ఎద్దుపేడ తినిన తరువాత; ఆచమింపమిన్= (చూపుడువేలు పొడవుగా నిల్పిన పుడిసిటి జలాన్ని మూడుసార్లు గ్రహించటమే ఆచమించటం) అట్లా చేయకపోవటం చేత; ఐన= కలిగిన; నా= నాయొక్క; అశుచిభావంబునన్, కాక+ఏమి= అపవిత్రత్వం వలన కాక మరేమి కారణాన; ఆ+పరమపతివ్రత= గొప్ప పతిభక్తి కల ఆ పౌష్యునిదేవి; మదీయ, దృష్టి, గోచర= నాచూపునకు కనబడేది; కాక+ఉన్నది+అయ్యెన్= కాకుండ ఉన్నది అయినది (నాకు కనబడలేదు) అని; పూర్వ+అభిముఖుండు= తూర్పుదిక్కుకు ఎదురుగా ముఖం కలవాడు; అయి; శుద్ధ+ఉదకంబులన్= పవిత్రమైన నీళ్ళతో, ప్రక్షాళిత, పాణి, పాద, వదనుండు+అయి= కడుగబడిన చేతులు, కాళ్ళు ముఖం కలవాడై; ఆచమించి= పవిత్రత కొరకు మూడుసార్లు జలం త్రాగి (వార్చి); పౌష్య+అనుమతంబునన్= పౌష్యునియొక్క అంగీకారంతో; ఆ+దేవి+ఒద్దకున్= ఆ రాణిచెంతకు; చనినన్= వెళ్ళగా; అదియును= ఆ దేవికూడ; ఆ+మహత్, మునికిన్= గొప్పముని అయిన ఆ ఉదంకుడికి; నమస్కరించి= మ్రొక్కి; కుండలంబులు= కర్ణాభరణాలు; ఇచ్చి; అతనికి ఇచ్చి; ఇట్లు= ఈవిధంగా; అనియెన్; పలికింది.

**తాత్పర్యం:** పౌష్యుడు ఆవిధంగా పలుకగా విని ఉదంకుడు ఆలోచించి, దివ్యపురుషుడు చెప్పినట్లు ఎద్దుపేడ తినినతరువాత పరిశుద్ధికై ఆచమనం చేయకపోవటంచేత కలిగిన అపవిత్రతచే కాక మరేకారణాన ఆమహాపతివ్రత (పౌష్యునిదేవి) నాచూపునకు కనబడ దని తలంచి, తూర్పుదిక్కుగా తిరిగి పవిత్రమైన జలాలతో కడుగబడిన చేతులు, పాదాలు, ముఖం కలవా డై ఆచమనం చేసి, పౌష్యమహారాజుఅనుమతితో అతడి దేవేరిచెంతకు పోగా, ఆ దేవి మహాముని అయిన ఉదంకుడికి నమస్కారంచేసి తన కర్ణాభరణాలు ఇచ్చి ఇట్లా పలికింది.

**క. తక్షకుఁ డీ కుండలము ల । పేక్షించుచు నుండు వాఁ డభేద్యుఁడు మాయా**
**దక్షుండు వానివలన సు । రక్షితముగఁ జేసి చనుము రవినిభతేజా ! 98**

**ప్రతిపదార్థం:** రవి, నిభ, తేజా= సూర్యుడితో సమాన మైన కాంతి కల ఓ మహామునీ!; తక్షకుఁడు= తక్షకు డనే పేరు కల సర్పరాజు; ఈ+కుండలములు= నేను ధరించే ఈ కర్ణాభరణాలను; అపేక్షించుచున్+ఉండున్= కోరుతూ ఉంటాడు; వాఁడు= ఆ తక్షకుడు; అభేద్యుఁడు= భేదించటానికి (జయించటానికి) శక్యం కానివాడు; మాయా, దక్షుండు= మాయ (వంచన) యందు మిక్కిలి సమర్థుడు; వానివలనన్= ఆ తక్షకుడివలన; సురక్షితముగన్= లెస్సగా కాపాడబడిన వాటినిగా; చేసి= ఈ కుండలాలను భద్రపరిచికొని; చనుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** సూర్యుడితో సమానమైన తేజం గల ఓ ఉదంకమహామునీ! నేను ధరించే ఈ కుండలాలను తక్షకు డనే సర్పరాజు తాను పొందాలని కోరుకొంటూ ఉంటాడు. అతడు భేదింపశక్యం కానివాడు, మాయయందు మిక్కిలి సమర్థుడు. ఈ కుండలాలను ఆతడు అపహరించకుండ లెస్సగా భద్రపరచికొంటూ వెళ్ళుము.

**విశేషం:** పౌష్యుడిదేవి కుండలాలవిషయంలో జాగరూకుడవై ఉండు మని ఉదంకుడిని ముందే హెచ్చరించింది.

**వ. అనిన నుదంకుం 'డట్ల చేయుదు' నని యద్దేవి వీడ్కొని పౌష్యుపాలికిం బోయిన, నతం 'డయ్యా! నీ వతిథివి మాయింటఁ గృతభోజనుండవై పొ' మ్మని క్షణియించిన, నొడంబడి యుదంకుండు గుడుచుచో నన్నంబు కేశదుష్టం బైన రోసి, కరం బలిగి 'యి ట్ల పరీక్షితం బైన యశుద్ధాన్నంబు పెట్టినవాఁడ వంధుండ వగు' మని శాపం బిచ్చిన, నల్గి 'యల్పదోషంబున నాకు శాపం బిచ్చినవాఁడవు నీ వనపత్యుండ వగు' మని ప్రతిశాపం బిచ్చిన, నుదంకుండు 'నే ననపత్యుండఁ గా నోప, దీనిఁ గ్రమ్మతింపు' మనినఁ బౌష్యుం డి ట్లనియె. 99**

**ప్రతిపదార్థం:** అనినన్= దేవి ఆవిధంగా పల్కగా; ఉదంకుండు; అట్లు+అ= అట్లే; చేయుదున్+అని; ఆ+దేవి= ఆరాణిని; వీడ్కొని= పోయివస్తా నని చెప్పి విడిచి; పౌష్య, పాలికన్= పౌష్యమహారాజుచెంతకు; పోయినన్= వెళ్లగా; అతండు= ఆ పౌష్యుడు; అయ్యా= నీవు; అతిథివి= అతిథిగా వచ్చినవాడవు; మా, ఇంటన్= మాయింటియందు; కృత, భోజనుండవు+ఐ= చేయబడిన భోజనం కలవాడ వై; పొమ్ము+అని= వెళ్ళు మని; క్షణియించినన్= భోజనార్థం కోరగా; ఒడంబడి= అంగీకరించి; ఉదంకుండు; కుడుచుచోన్= భోజనం చేస్తున్నప్పుడు; అన్నంబు; కేశ, దుష్టంబు+ఐనన్= వెంట్రుకచేత అపవిత్రం కాగా; రోసి= అసహ్యించుకొని; కరంబు= మిక్కిలి; అలిగి= కోపించి; ఇట్లు= ఈవిధంగా అపరీక్షితంబు+ఐన= పరీక్షింపబడని; అశుద్ధ+అన్నంబు= అపవిత్ర మైన అన్నాన్ని; పెట్టినవాడవు; అంధుండవు= గ్రుడ్డివాడవు; అగుము+అని; కమ్మని; శాపంబు, ఇచ్చినన్= శాప మీయగా; అల్గి= కోపించి; అల్ప, దోషంబునన్= చిన్నతప్పుచేత; నాకున్; శాపంబు+ఇచ్చినవాడవు; నీవు; అనపత్యుండవు= సంతానం లేనివాడవు; అగుము= కమ్ము; అని ప్రతిశాపంబు+ఇచ్చినన్= అని తిరిగి శాపం ఈయగా; ఉదంకుండు= ఉదంకుఁడు; నేను; అనపత్యుఁడన్= సంతానంలేనివాడను; కాన్, ఓపన్= కాజాలను; దీనిన్= ఈ శాపాన్ని; క్రమ్మఱింపుము= తొలగింపుము; అనినన్= అని పలుకగా; పౌష్యుండు; ఇట్లు ఈవిధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** దేవి ఆవిధంగా పలుకగా ఉదంకుడు 'అట్లే చేస్తా' నని ఆ దేవివద్ద సెలవు తీసికొని పౌష్యుని చెంతకు వెళ్ళగా పౌష్యుడు 'ఆర్యా! నీవు అతిథివి. మా ఇంటిలో భోజనం చేసి వెళ్ళు' మని కోరగా అంగీకరించి ఉదంకుడు భోజనం చేసేటప్పుడు అన్నం వెంట్రుకచేత అపవిత్రం కాగా ఏవగించుకొని మిక్కిలి కోపించి 'ఈవిధంగా పరీక్షింపబడని అపవిత్ర మైన అన్నం పెట్టావు. గ్రుడ్డివాడ వగుము' అని పౌష్యుడికి శాప మిచ్చాడు. అంతట పౌష్యుడు కోపగించి 'చిన్నతప్పునకు నాకు శాప మిచ్చావు, నీవు సంతానం లేనివాడ వగుము' అని మారుశాపం ఇచ్చాడు. అప్పుడు ఉదంకుడు నేను సంతానం లేనివాడను కాలేను. ఈ శాపాన్ని ఉపసంహరించుము' అని పల్కగా పౌష్యుడు, ఈవిధంగా అన్నాడు.

**విశేషం:** పౌష్యోదంకులు ఆవేశంతో పరస్పరం శాపాలిచ్చుకొన్నవారివలె పైకి కనపడతారు. 'లోనారసి' చూస్తే వారిచర్యలకు హేతువులు గోచరిస్తాయి. అపరీక్షితమైన అన్నం పెట్టినందుకు పౌష్యుడిని గ్రుడ్డివాడయ్యేటట్లు శపించాడు ఉదంకుడు. పరీక్షించేవి కళ్ళుకాబట్టి, వాటిని ఉపయోగించలేదని గ్రుడ్డితనం రావాలని శపించాడు. గురుదక్షిణ నిచ్చిన శిష్యుడికి సత్సంతానం కలుగుతుందని ఉపనిషద్వాక్యం. ఉదంకుడు గురుదక్షిణనిచ్చి సేవచేస్తే అతనికి కలిగేది వంశాభివృద్ధి. అతనికి అదిలేకుండా పౌష్యుడు అతనికి సంతానం కలుగకుండా ఉండే శాపాన్ని పెట్టాడు. ఉదంకుడు ఆశాపాన్ని భరించలేక, దానిని ఉపసంహరించుకోమని పౌష్యుడిని ప్రార్థించటం తన గురుశుశ్రూషాఫలం నిష్ఫలమైపోయిందన్న నిర్వేదంతోనే. ఈవివరాలు నన్నయ కథలో చెప్పడు. సారమతులైనవారు లోనారసి తెలిసికొనేవి అని భావించాడు. ఇది వస్తుధ్వని. ప్రసన్నకథాకలితార్థయుక్తి. (సంపా.)

**ఉ.** **నిండుమనంబు నవ్యనవనీతసమానము, పల్కు దారుణా**
**ఖండలశస్త్రతుల్యము జగన్నుత! విప్రులయందు; నిక్క మీ**
**రెండును రాజులందు విపరీతము; గావున విప్రుఁ డోపు, నో**
**పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్.** **100**

**ప్రతిపదార్థం:** జగత్+నుత= లోకంచేత స్తుతింపబడినవాడా!; విప్రులయందున్= బ్రాహ్మణులందు; నిండు, మనంబు= పూర్ణమైన హృదయం; నవ్య, నవనీత, సమానము= కొత్తగా తీసిన వెన్నతో సమానం; పల్కు= మాట; దారుణ+అఖండల,

శస్త్ర, తుల్యము= భయంకర మైన ఇంద్రుడిఆయుధ మైన వజ్రంతో సమానమైనది; నిక్కము= నిజం; ఈ రెండును= హృదయం, పల్కు అనే రెండున్నూ; రాజులందున్= క్షత్రియులందు; విపరీతము= విరుద్ధం (అంటే హృదయం వజ్రసమానం, పల్కు వెన్నతో సమానం); కావునన్= అందుచేత; విప్రుఁడు= బ్రాహ్మణుడు; శాపము= ఇచ్చిన శాపాన్ని; క్రమ్మఱింపఁగన్= తొలగించటానికి; ఓపున్= శక్తుడౌతాడు; అతిశాంతుఁడు+అయ్యున్= మిక్కిలి శాంతస్వభావంతో కూడిన వా డైనప్పటికి; నర, పాలుఁడు= రాజు; ఓపండు= శాపం తొలగించటానికి శక్తుడు కాడు.

**తాత్పర్యం:** లోకంచేత స్తుతింపబడినవాడా! ఉదంకమహామునీ! బ్రాహ్మణులలో వారి నిండుహృదయం అప్పుడే తీసిన వెన్నతో సమానంగా మిక్కిలి మృదువుగా ఉంటుంది, మాట భయంకరమైన ఇంద్రుని వజ్రాయుధంతో సమానంగా ఉంటుంది, పరుషమైనది. ఇది నిజం. మనసూ, హృదయమూ అనే ఆ రెండున్నూ రాజులలో అందుకు విరుద్ధంగా ఉంటాయి. అంటే రాజులందు మనస్సు వజ్రతుల్యంగానూ, పల్కు నవనీతంగానూ ఉంటాయి. కాబట్టి బ్రాహ్మణుడు ఇచ్చిన శాపాన్ని ఉపసంహరించుకొనటానికి శక్తు డౌతాడు. మిక్కిలి శాంతస్వభావం కలవా డైనా రాజు ఉపసంహరించుకోవటానికి శక్తుడు కాడు.

**విశేషం:** అలం: కావ్యలింగం. ఈపద్యం సుప్రసిద్ధ మైనది. మనోవాక్కుల విషయంలో బ్రాహ్మణులకు రాజులకూ ఉండే భేదాన్ని ఇది వివరిస్తున్నది. రాజు మనస్సు కఠినం కాబట్టి తా నిచ్చిన శాపాన్ని ఉపసంహరింపజాల నని పౌష్యుడు చెప్పాడు. నన్నయ రుచిరార్థసూక్తి కిది ఉదాహరణం. మూలంలో విప్రులపల్కు మంగలికత్తితో పోల్చబడింది. నన్నయ ఔచిత్యాన్ని పాటించి 'దారుణాఖండల శస్త్రతుల్య' మని ఉపమించాడు. నన్నయరచనలో శబ్దగుణా లెక్కువ. వాటిల్లోకూడా ప్రసాదగుణం విస్తారంగా ప్రయోగింపబడుతుంది. బంధశైథిల్యం, అర్థనైర్మల్యం అనే శబ్దార్థగుణాలను రెండింటినీ పోషించిన పద్యమిది. అందువల్లనే ప్రసిద్ధమై ప్రజలనాల్కలమీద నిలిచింది. (సంపా.)

### తక్షకుండు కుండలంబు లపహరించుట (సం. 1-3-136)

**వ. 'కావున నా కశక్యంబు నీ యిచ్చిన శాపంబు గ్రమ్మఱింపు' మనిన నుదంకుం 'డట్లేని నీకు నల్పకాలంబున శాపమోక్షం బగు' నని పౌష్యునకు ననుగ్రహించి, 'మగుడి నేఁడ పోయి గురుపత్నికిఁ గుండలంబు లీఁగంటి' నని సంతోషించి చనువాఁ డెదుర నొక్క జలాశయంబు గని శుచిప్రదేశంబునఁ దనచేతి కుండలంబులు పెట్టి యాచమించుచున్నంతఁ దనతోడన వచ్చి తక్షకుండు నగ్నవేషధరుండై యక్కుండలంబులు గొని పాఱిన, నుదంకుండును వాని పిఱుందన పాఱి పట్టికొనుడు. 101**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి (రాజులహృదయం వజ్రకఠినం కాబట్టి); నాకున్; అశక్యంబు= (శాపం తొలగించటానికి) శక్యం కాదు; నీ ఇచ్చిన= (కర్తృపద ప్రథమకు షష్ఠి) నీ విచ్చిన; శాపంబు; క్రమ్మఱింపుము= తొలగింపుము; అనినన్= అని పౌష్యుడు పల్కగా; ఉదంకుండు; అట్లు+ఏని= నీకు శాపం ఉపసంహరించటానికి శక్తి లేకపోతే; నీకున్; అల్పకాలంబునన్= కొలదికాలంలోనే; శాప+మోక్షంబు= శాపం వలన విడుదల; అగున్+అని; పౌష్యునకున్= పౌష్యుడిని; అనుగ్రహించి= కరుణించి; మగుడి= తిరిగి; నేఁడు+అ= ఆరోజే; పోయి= వెళ్ళి, గురుపత్నికిన్= గురువుగారిభార్యకు, కుండలంబులు= ఆమె తెమ్మనిన కర్ణాభరణాలు; ఈన్, కంటిన్, అని= ఈయజాలితిని అని; సంతోషించి= ఆనందించి; చనువాఁడు= వెళ్ళువాడు, ఎదురన్= తన ఎదుట; ఒక్క; జల+ఆశయంబు= సరస్సును; కని= చూచి, శుచి, ప్రదేశంబునన్= శుద్ధ మైన స్థలంలో; తన చేతి, కుండలంబులు= తన చేతిలో ఉన్న కర్ణాభరణాలను; పెట్టి= ఉంచి; ఆచమించుచున్, ఉన్న+అంతన్= ఆచమనం చేస్తూ ఉండగా; తనతోడన్= తనవెంటనే; వచ్చి; తక్షకుండు= తక్షకుడు అనే పేరు కల సర్పరాజు; నగ్న, వేష, ధరుండు+ఐ=

దిగంబర వేషాన్ని ధరించినవాడై; ఆ కుండలాలు= పౌష్యుని దేవి ఇచ్చిన కుండలాలు, కొని= తీసికొని; పాఱినన్= పరుగెత్తిపోగా; ఉదంకుండును= ఉదంకుడు కూడ; వాని, పిఱుందన్+అ= ఆ తక్షకుని వెనుకనే; పాఱి= పరుగెత్తి, పట్టికొనుడున్= అతనిని పట్టుకొనిన అనంతరం.

**తాత్పర్యం:** 'కాబట్టి శాపం తొలగించటం నాకు శక్యం కాదు; నీ విచ్చిన శాపమే తొలగింపుము' అని పౌష్యుడు పలుకగా ఉదంకుడు 'అట్లైతే నీకు కొద్దికాలంలోనే శాపంనుండి విముక్తి కలుగుతుం' దని (గ్రుడ్డితనం పోతుందని) పౌష్యుడిని కరుణించి, 'తిరిగి ఈరోజే వెళ్ళి గురువుగారిభార్యకు ఆమె కోరినట్లు కుండలాలను ఈయగలిగాను' అని సంతసించి వెళ్ళుతూ తన ఎదుట ఒకసరస్సును చూచి, పవిత్రస్థలంలో తనచేతిలో ఉన్న కుండలాలను ఉంచి ఆచమనం చేస్తూ ఉండగా, అతని వెంటనే వచ్చి తక్షకు డనే సర్పరాజు దిగంబరవేషం ధరించి ఆకుండలాలు గ్రహించి పరుగెత్తాడు ఉదంకుడుకూడ ఆ తక్షకుడివెనుకనే పరుగెత్తి అతడిని పట్టుకొన్నాడు. తరువాత.

**విశేషం:** పౌష్యునకు+అనుగ్రహించి= ఇటువంటి చోట్ల నన్నయ ద్వితీయావిభక్తికి బదులుగా షష్ఠీవిభక్తివాడుతూ ఉంటాడు. అప్పటికిని, ఇప్పటికిని ఉన్న కారకభేద మిది. పట్టికొనుడు - 'డు' అనే ప్రత్యయం ఆనంతర్యార్థాన్ని సూచిస్తుంది. చేతి - అనేది చేయి యొక్క ఔపవిభక్తికరూపం.

**క.** **విడిచి దిగంబరవేషము । విడువక మణికుండలములు విషధరపతి యే**
**ర్పడ నిజరూపముతో న । ప్పుడ యహిలోకమున కరిగె భూవివరమునన్.** **102**

**ప్రతిపదార్థం:** విష, ధర, పతి= సర్పరాజు (తక్షకుడు); దిక్+అంబర, వేషము= దిక్కులే వస్త్రంగా గల నగ్నవేషం (గుడ్డలు లేని రూపం) విడిచి; మణి, కుండలములు= రత్నమయా లైన చెవికమ్మలను; విడువకు= విడిచిపెట్టక; ఏర్పడన్= తేటపడేటట్లుగా (తాను సర్పరాజని స్పష్టపడేటట్లు); నిజరూపముతోన్= తన సహజమైన రూపంతో; అప్పుడు+అ= వెంటనే; భూవివరమునన్= భూమియందలి కన్నంద్వారా; అహి, లోకమునకున్= నాగలోకానికి (పాతాళలోకానికి), అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** సర్పరాజైన తక్షకుడు నగ్నరూపం విడిచి, రత్నమయాలైన కుండలాలను మాత్రం విడువక, తనసహజ మైన తక్షకరూపంతో వెంటనే భూమిలోని రంధ్రంద్వారా నాగలోకానికి వెళ్ళాడు.

**వ.** **ఉదంకుండును వానితోడన తగిలి యవ్వివరంబున నురగలోకంబున కరిగి నాగపతుల నెల్ల నిట్లని స్తుతియించె.** **103**

**ప్రతిపదార్థం:** ఉదంకుండును= ఉదంకుడు కూడ; వానితోడన్+అ= ఆ తక్షకుడితోనే; తగిలి= వెంబడించి; ఆ+వివరంబునన్= ఆ రంధ్రంలో (ద్వారా); ఉరగలోకంబునకున్= నాగలోకానికి; అరిగి= వెళ్ళి; నాగపతులన్, ఎల్లన్= పాములరాజులనందరిని; ఇట్లు+అని= ఈవిధంగా; స్తుతియించెన్= పొగడినాడు.

**తాత్పర్యం:** ఉదంకుడు కూడ తక్షకుడిని వెంబడించి, ఆ రంధ్రంద్వారా నాగలోకానికి వెళ్ళి, పాములరాజుల నందరిని ఈవిధంగా స్తుతించాడు.

**విశేషం:** మూలభారతంలో తక్షకుడిని వెంబడించి పట్టుకొనటానికి ఉదంకుడు నేలను త్రవ్వి అలసిపోయాడనీ, ఇంద్రుడు అతడి త్రవ్వుకోలలో వజ్రాయుధశక్తిని ప్రవేశపెట్టాడనీ, దాని మహిమవలన ఉదంకుడు నేలను త్రవ్వి నాగలోకంలో ప్రవేశించాడనీ

ఉన్నది. నన్నయ దానిని స్పృశించలేదు. తక్షకుడి వెంట ఉదంకుడు కలుగులోదూరి నాగలోకం చేరినట్లు చెప్పాడు. 1.92వ పద్యంలో గురువు దయవలన ఉదంకుడికి అణిమాద్యష్టసిద్ధులు కలిగాయని నన్నయ వర్ణించాడు. ఉదంకు డా సిద్ధుల ప్రభావంతో ఆ కలుగులోదూరి వెనువెంటనే వెడలగలిగాడని వస్తుధ్వని. పూర్వాపర కథార్థసంవిధానంవలన 'ప్రసన్నకథా కలితార్థయుక్తి' ద్యోతకమౌతుంది. (సంపా.)

**చ. బహువన పాదపాబ్ధి కులపర్వత పూర్ణ సరస్సరస్వతీ**
**సహిత మహామహీభర మజస్ర సహస్ర ఫణాళిఁ దాల్చి దు**
**స్సహతర మూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్య యైన య**
**య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 104**

**ప్రతిపదార్థం:** బహు, వన, పాదప+అబ్ధి, కులపర్వత, పూర్ణ, సరస్+సరస్వతీ సహిత, మహత్, మహీ, భరము= పెక్కు అడవులతోను, చెట్లతోను, సముద్రాలతోను, కులపర్వతాలతోను, నీటితో నిండిన తటాకాలతోను, నదులతోను కూడిన గొప్ప భూమియొక్క బరువును; అజస్ర, సహస్ర, ఫణ+ఆళిన్= నిరంతరం వేయిపడగల సముదాయంతో; తాల్చి= ధరించి; దుస్సహతర, మూర్తికిన్= మిక్కిలి సహింపశక్యం గాని విగ్రహం కల; జలధిశాయికిన్= సముద్రంలో నిద్రించే నారాయణుడికి; పాయక= విడువక; శయ్య+ఐన= సెజ్జ ఐన; ఆ+అహిపతి= ఆ నాగరాజు; దుష్కృత+అంతకుఁడు= పాపాలను పోగొట్టేవాడైన; అనంతుఁడు= అనంతు డనే పేరుకల నాగరాజు; మాకున్= మాయెడ; ప్రసన్నుఁడు= ప్రసాదం (అనుగ్రహం) కలవాడు; అయ్యెడున్= అగుగాక!

**తాత్పర్యం:** పెక్కు అడవులతోను, చెట్లతోను, సముద్రాలతోను, కులపర్వతాలతోను, నీటితో నిండిన సరస్సులతోను, నదులతోను కూడిన గొప్ప భూమియొక్క బరువును ఎల్లప్పుడూ వేయిపడగల సముదాయంతో ధరించి మిక్కిలి సహింపశక్యం కాని విగ్రహం గల నారాయణుడికి విడువక శయ్యగా ఉండి, పాపాలను అంతరింపజేసే అనంతు డనే పేరుగల ఆ నాగరాజు మా పట్ల అనుగ్రహం కలవాడు అగుగాక!

**విశేషం:** మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, గంధమాదనం, వింధ్యం, పారియాత్రం అనే ఏడున్నూ కులపర్వతాలు. విష్ణువు సముద్రంలో ఆదిశేషువుమీద పవళించి ఉంటాడు. ఉదంకుడు ఋషి కాబట్టి 'మాకు' అని బహువచన ప్రయోగం చేశాడు. ఉదంకుడు నాగరాజులను నాలుగు పద్యాలలో స్తుతించాడు. వాటిలో ఇది మొదటిది. ఈ నాల్గు పద్యాల చివరన "మాకు ప్రసన్నుఁడయ్యెడున్" అనే పదాలు ఉన్నవి. తరువాత పలువురు కవులచేత వ్రాయబడిన సమానమకుటం గల శతకాలకు ఈ నాలుగు పద్యాలున్నూ మార్గదర్శకా లయిన వని విమర్శకులు చెప్పారు. మూలంలో లేకపోయినా అనంతవాసుకుల స్తోత్రాలను నన్నయ తెనుగున అధికంగా చేర్చి ఉన్నాడు. నాగరాజులలో శ్రేష్ఠు లవటంచేత వారినికూడ స్తుతించటం ఉచిత మని అతడు భావించి ఉంటాడు. 'మాకు' అనేబహువచనం తనను, తనగురుకులాన్ని మనసులో ఉంచుకొని ఉదంకుడు ప్రయోగించాడు. ఈపద్యంలో నన్నయ అక్షరరమ్యత రమణీయంగా దర్శనమిస్తుంది. భూభారాన్నీ, దానిని మోసే ఆదిశేషుడిని సహస్రఫణాల బుసలను, అనంతునికి శయ్యగా శేషుడు అనంతభారాన్ని మోస్తున్న అంతస్సత్త్వాన్ని ఊష్మాక్షరాలతో, అంతస్థాలతో ధ్వనింపచేయటం ఇందులోని అక్షరరమ్యత. అక్షరరమ్యతను విభావవిస్ఫూర్తికి వ్యంజకంగా వాడటం నన్నయ రచనాశిల్పం.

**చ. అరిది తపోవిభూతి నమరారులబాధలు వొందకుండఁగా**
**నురగుల నెల్లఁ గాచిన మహోరగనాయకుఁ డానమత్సురా**

**సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే**

**శ్వరునకు భూషణం బయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 105**

**ప్రతిపదార్థం:** అరిది= దుర్లభమైన; తపః, విభూతిన్= తపస్సుయొక్క వైభవం చేత; అమర+అరుల= దేవతలయొక్క శత్రువు లైన రాక్షసుల; బాధలు; పొందక, ఉండఁగాన్= పొందకుండ ఉండేటట్లుగా; ఉరగులన్, ఎల్లన్= పాములనందరిని; కాచిన= రక్షించిన; మహత్+ఉరగనాయకుఁడు= గొప్ప పాములరాజు; ఆనమత్, సుర+అసుర, మకుట+అగ్ర, రత్న, రుచి, శోభిత, పాదునకున్= తనకు నమస్కరించే దేవతలయొక్కయు, రాక్షసులయొక్కయు కిరీటాల పైభాగంలో ఉన్న మణులకాంతితో ప్రకాశించే పాదాలు కలవాడికి; అద్రినందన+ఈశ్వరునకున్= హిమవత్పర్వతానికి కూతు రైన పార్వతికి భర్త అయిన శివుడికి; భూషణంబు+అయిన= అలంకారమైన; వాసుకి= వాసుకి అనే పేరుగల సర్పరాజు; మాకున్= మాయెడ; ప్రసన్నుఁడు= అనుగ్రహం కలవాడు; అయ్యెడున్= అగుగాక!

**తాత్పర్యం:** చేయ శక్యంగాని తపస్సుయొక్కవైభవంచేత రాక్షసులు పెట్టేబాధలు పొందకుండేటట్లుగా నాగులనందరినీ రక్షించిన గొప్ప సర్పరాజున్నూ, వంగి నమస్కరించే దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు కిరీటాలపైభాగాల నున్న మణులకాంతిచేత ప్రకాశించే పాదాలు కల పార్వతీపతి యైన శివుడికి అలంకార మైన వాసుకి అనే సర్పరాజు మాయెడ అనుగ్రహం కలవాడు అగుగాక!

**విశేషం:** ఈపద్యంలో నన్నయ అక్షరరమ్యత సార్థకంగా ఆవిష్కరించబడింది. సర్పకులాన్ని రక్షించిన ఉదారుడూ, శివుడి కంఠాభరణంగా నిలిచిన ఉదాత్తుడూ అయిన వాసుకి స్వభావాన్ని ఊష్మాక్షరాలకంటె అంతస్థాలతోనూ, నాదాక్షరాలతోనూ ధ్వనింపజేయటం ఇందులోని రచనాశిల్పం.

**ఉ. దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచున్ విపులప్రతాపసం**

**భావితశక్తిశౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర**

**త్పావకతాపితాఖిలవిపక్షులు నైన మహానుభావు లై**

**రావతకోటి ఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్ను లయ్యెడున్. 106**

**ప్రతిపదార్థం:** దేవ, మనుష్య, లోకములన్= దేవతలయొక్కయు మనుష్యులయొక్కయు లోకాలందు; త్రిమ్మరుచున్= తిరుగుతూ; విపుల, ప్రతాప, సంభావిత, శక్తి, శౌర్యులున్= అధికమైన తేజస్సుచేత సన్మానింపబడిన (ఊహింపబడిన) సామర్థ్యాన్ని, పరాక్రమాన్ని కలవారున్నూ; అపార, విష+ఉత్కట, కోప, విస్ఫురత్, పావక, తాపిత+అఖిల, విపక్షులున్= అంతం లేని విషంచేత అధికమైన కోపంచేత ప్రకాశించే అగ్నిచేత తపింప చేయబడిన సర్వశత్రువులు కలవారున్నూ; ఐన; మహత్+అనుభావులు= గొప్ప ప్రభావం కలవారు; ఐరావత కోటి, ఘోర ఫణిరాజులు= ఐరావతులు (ఐరావత మనే పేరుగల గొప్ప నాగవంశం ఉన్నది. అందులో పలువురు నాగులు ఉంటారు) అనే కోటి సంఖ్యగల (అనేకులైన) భయంకరు లైన సర్పరాజులు; మాకున్= మాయెడ; ప్రసన్నులు= అనుగ్రహం కలవారు; అయ్యెడున్= అగు గాక!

**తాత్పర్యం:** దేవతల మనుష్యుల లోకాలలో తిరుగుతూ అధికమైన తేజస్సుచేత పూజింపబడిన సామర్థ్యం, పరాక్రమం కలవారున్నూ, అనంతవిషంచేత అధిక మైన కోపంతో ప్రకాశించే అగ్నిచేత తపింపజేయబడిన సర్వశత్రువులు కలవారున్నూ అయిన మహాత్ములు ఐరావత నాగవంశంలోని కోటిసంఖ్యాకు లైన భయంకర సర్పరాజులు మాపట్ల అనుగ్రహంకలవారు అగుదురుగాక!

**విశేషం:** కోపం వచ్చినప్పుడు పాములు విషం కక్కుతాయి. ఆ విషం నుండి అగ్ని ఉప్పతిల్లుతుంది. పాత్రస్వభావ వ్యంజకమైన అక్షరరమ్యత ఇందులో సముచితంగా సంతరించబడి ఉన్నది. ఘోరఫణిరాజులను వర్ణించే ఈపద్యంలో ఊష్మాక్షరాలతోపాటు, పరుషాక్షరాలను, స్థిరాక్షరాలనూ వాడటం విశేషం.

**ఉ. గోత్రమహామహీధర నికుంజములన్ విపినంబులం గురు**
**క్షేత్రమునం బ్రకామగతి ఖేలన నొప్పి, సహాశ్వసేనుఁ డై**
**ధాత్రిఁ బరిభ్రమించు బలదర్ప పరాక్రమదక్షుఁ డీక్షణ**
**శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 107**

**ప్రతిపదార్థం:** గోత్ర, మహత్, మహీ, ధర, నికుంజములన్= గొప్ప కులపర్వతాల యొక్క పొదరిండ్లలోనూ; విపినంబులన్= అడవులయందును; కురుక్షేత్రమునన్= కురుక్షేత్రంలోనూ; ప్రకామ, గతి, ఖేలనన్= ఇచ్చవచ్చినట్లుగా పోవటంలోని (సంచరించటంలోని) క్రీడతో; ఒప్పి= అలరి; సహ+అశ్వసేనుఁడు+ఐ= కుమారుడైన అశ్వసేనునితో కూడినవాడై; ధాత్రిన్= భూమియందు; పరిభ్రమించు= తిరుగాడు. బల, దర్ప, పరాక్రమ, దక్షుఁడు= బలంలోను, గర్వంలోను శౌర్యంలోను సమర్థుడు; శూరుఁడు= పరాక్రమవంతుడు; (ఐన) ఈక్షణశ్రోత్రవిభుండు= కన్నులే చెవులుగా గల పాములఱేడు; తక్షకుఁడు; మాకున్= మాయెడ; ప్రసన్నుఁడు= అనుగ్రహం కలవాడు; అయ్యెడున్= అగుగాక!

**తాత్పర్యం:** గొప్ప కులపర్వతాల పొదరిళ్ళలోను, అడవులలోను, కురుక్షేత్రంలోను ఇచ్చవచ్చినట్లు సంచరించే క్రీడతో అలరి, కుమారు డైన అశ్వసేనుడితో కూడి భూమిమీద తిరుగుతూ బలంలోనూ, గర్వంలోనూ, శౌర్యంలోనూ సమర్థుడైన పరాక్రమవంతుడూ పాములకురాజూ అయిన తక్షకుడు మాయెడ అనుగ్రహం కలవాడు అగుగాక!

**విశేషం:** స్తుతికి ప్రసన్నుడు కాని దేవు డుండడు. ఆ భావంతో ఉత్తమ సర్పమూర్తులనూ, భయంకరసర్పరాజులనూ, చివరకు కుండలాలను హరించిన తక్షకుడినీ ఉదంకుడు కార్యార్థి అయి ప్రస్తుతించాడు. అందరిలో తక్షకుడు అభేద్యుడూ, దుష్కరుడూ కాబట్టి అతడిని దుష్కరప్రాసతోకూడిన పద్యంలో స్తుతించటం విశేషం. నన్నయపద్యరచనలోని అక్షరరమ్యతకు ఇది ఉదాహరణం. నన్నయ పైనాలుగు పద్యాలలో అనంతుడినీ, వాసుకినీ, ఐరావతకోటి ఫణిరాజులనూ, తక్షకుడినీ మాత్రమే ఎందుకు కీర్తించా డనే అంశం లోనారసి తెలిసికొనదగినది. నాగమాత అయిన కద్రువకు జన్మించిన సర్పాలలో మొదటి నలుగురిపేర్లు - అనంతుడు, వాసుకి, ఐరావతుడు, తక్షకుడు (చూడు. ఆది. 2.4). అందువలన ఆవరుసలో ఉదంకుడు వారిని స్తుతించాడు. భావికథలో జనమేజయుడు చేసే సర్పయాగానికి కారకుడు కాబోతున్నాడు. ఉదంకుడు. ఆ కథంతా చదివితే తెలిసే విశేషమేమంటే దుష్టపన్నగాలు అగ్నిలో పడి నశించటానికే ఆయజ్ఞం తోడ్పడిందని. అనంతుడు, వాసుకి ధర్మాత్ములై పుణ్యాత్ములై తపస్సులుచేసి నారాయణ పరమేశ్వరుల సేవాభాగ్యాన్ని పొందారు. దుష్టులు కాని ఫణిరాజులు సర్పయాగంలో దగ్ధులు కాకుండా తమ పుణ్యవిశేషాలతో బ్రతికిపోయారు. మాయాదక్షుడైన తక్షకుడు ఇంద్రుడిని ఆశ్రయించటంవలన చావుతప్పి బైటపడ్డాడు. అగ్నిలో పడబోతున్న తక్షకుడిని పడకుండా ఆస్తీకుడు ఆపాడు. అంటే దుష్టసర్పకులంలో హుతంకాకుండా చివరకు మిగిలింది తక్షకుడే అన్నమాట. ఆ తరువాత అతడు ఇంద్రునికి స్నేహితు డయ్యాడు. ఇంద్రుడి ఖాండవవనంలో నివసించాడు. అతడిని ఇంద్రుడు సదా రక్షిస్తూ ఉండేవాడు. పైకిచూస్తే, ఉదంకుడి కథలో తక్షకుడిని స్తుతించటం సందర్భోచిత్యం. కథనంతా గాఢంగా భావిస్తే మూలంలో లేని అనంతుడిని, వాసుకిని నన్నయ ఉదంకుడిచేత ఎందుకు స్తుతింపచేశాడో, ఫణిరాజులనూ, తక్షకుడినీ ఎందుకు ప్రశంసింపచేశాడో పఠితకు అంతరార్థం ప్రసన్న మౌతుంది. ప్రసన్నకథాక(వి)లితార్థయుక్తి కిది చక్కని ఉదాహరణం. (సంపా.)

**వ. అనియి ట్లురగపతుల నెల్ల స్తుతియించి 'యందు సితాసితతంతు సంతానపటంబు ననువయించుచున్నవారి నిద్దఱ స్త్రీలను, ద్వాదశారచక్రంబుం బరివర్తించుచున్న వారి నార్వురఁ గుమారుల, నతిప్రమాణ తురంగంబు నెక్కినవాని మహాతేజస్వి నొక్క దివ్యపురుషుం గని విపులార్థవంతంబు లైన మంత్రంబుల నతిభక్తియుక్తుం డై స్తుతియించినం బ్రసన్నుం డై యద్దివ్యపురుషుం డయ్యుదంకున కి ట్లనియె. 108**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; ఇట్లు= ఈవిధంగా; ఉరగపతులన్+ఎల్లన్= నాగరాజులనందరిని; స్తుతియించి= పొగడి; అందున్= నాగలోకంలో; సిత+అసిత, తంతు, సంతాన, పటంబున్= తెల్లని, నల్లని, దారాల సముదాయంతో కూడిన వస్త్రం; అనువయించుచున్+ఉన్నవారిన్= నేస్తున్న వారిని; ఇద్దఱ స్త్రీలను= ఇరువురు ఆడవారిని; ద్వాదశ+అర చక్రంబున్= పంద్రెండు (పన్నెండు) ఆకులు గల చక్రాన్ని; పరివర్తించుచు, ఉన్నవారిన్= త్రిప్పుతున్న వారిని; ఆర్వురన్, కుమారులన్= ఆరుగురు యువకులను; అతి, ప్రమాణ, తురంగంబున్= మిక్కిలి ఎత్తైన గుఱ్ఱాన్ని; ఎక్కిన వానిన్; మహత్, తేజస్విన్= గొప్ప తేజస్సు కలవాడిని; ఒక్క దివ్యపురుషున్= ఒక దేవతాపురుషుడిని; కని= చూచి; విపుల+అర్థవంతంబులు+ఐన= అధికమగు అర్థం కలవైన; మంత్రంబులన్= మంత్రాలతో; అతి, భక్తి, యుక్తుండు+ఐ= మిక్కిలి భక్తితో కూడినవాడై; స్తుతియించినన్= పొగడగా; ప్రసన్నుండు+ఐ= ప్రసాదం (అనుగ్రహం) కలవాడై; ఆ+దివ్యపురుషుండు= ఆ దేవతా పురుషుడు; ఆ+ఉదంకునకున్= ఆ ఉదంకమహామునితో; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని ఈవిధంగా నాగరాజులందరిని పొగడి పాతాళలోకంలో తెల్లని నల్లని దారాల సముదాయంతో కూడిన వస్త్రాన్ని నేస్తున్న ఇద్దరు స్త్రీలను, పంద్రెండు (పన్నెండు) ఆకులు గల చక్రాన్ని త్రిప్పుతున్నవారిని ఆరుగురు యువకులను, మిక్కిలి ఎత్తైన గుర్రాన్ని ఎక్కిన గొప్ప తేజస్సు కల ఒక దివ్యపురుషుడిని చూచి, అధికము లైన అర్థాలు గల మంత్రాలతో మిక్కిలిభక్తితో కూడినవాడై స్తుతించగా, ఆ దేవతాపురుషుడు అనుగ్రహం కలవా డై ఉదంకుడితో ఈ విధంగా పలికాడు.

**విశేషం:** నల్లని, తెల్లని దారాలతో కూడిన వస్త్రం విషయాన్నీ, ఇరువురు స్త్రీల విషయాన్నీ, ద్వాదశార చక్రాన్ని త్రిప్పుతున్న ఆరుగురు కుమారుల విషయాన్నీ, ఉత్తమ అశ్వాన్ని ఎక్కిన దివ్యపురుషుని విషయాన్నీ ముందు తెలియపరచటం అవుతుంది. (చూడు:1.118)

**క. మితవచన! నీయథార్థ । స్తుతుల కతిప్రీతమానసుఁడ నైతి ననిం**
**దిత చరిత! నీకు నభివాం । ఛిత మెయ్యది దానిఁ జెపుమ చేయుదు ననినన్. 109**

**ప్రతిపదార్థం:** మితవచన= పరిమిత మైన వాక్కులు కలవాడా!; అనిందిత, చరిత!= నిర్మల మైన వర్తనం కలవాడా! ఓ ఉదంకమహామునీ!; నీ= నీయొక్క, యథార్థస్తుతులకున్= సత్య మైన స్తోత్రాలకు; అతి, ప్రీత, మానసుఁడన్= మిక్కిలి ప్రీతి పొందిన మనస్సు కలవాడిని; ఐతిన్= అయినాను; నీకున్; అభివాంఛితము= కోరబడింది (కోరిక); ఏ+అది= ఏదో; దానిన్= ఆ కోరికను, చెపుము+అ= తెలుపుము; చేయుదున్= నెరవేరుస్తాను; అనినన్= అని ఆ దివ్యపురుషుడు పలుకగా.

**తాత్పర్యం:** పరిమితమైన వాక్కులు, నిర్మల మైనవర్తనం కలిగినట్టి ఓ ఉదంక మహామునీ! సత్యాలైన నీస్తోత్రాలచేత మిక్కిలి ప్రీతి పొందిన మనస్సు కలవాడ నైనాను. నీకు ఏ కోరిక కలదో దానిని చెప్పుము; నేను నెరవేరుస్తాను - అని దివ్య పురుషుడు పలుకగా

**వ. ఉదంకుండు గరంబు సంతసిల్లి 'యిన్నాగకులం బెల్ల నాకు వశం బగునట్టులుగ ననుగ్రహింపు' మనిన నప్పురుషుం 'డట్లేని నీయశ్వకర్ణరంధ్రాధ్మానంబు సేయు' మనిన వల్లె యని తద్వచనానురూపంబు సేయుడుఁ దత్క్షణంబ. 110**

**ప్రతిపదార్థం:** ఉదంకుడు; కరంబు= మిక్కిలి; సంతసిల్లి= సంతోషించి; ఈ+నాగకులంబు+ఎల్లన్= ఈ పాముల సముదాయం అంతయున్నూ; నాకున్, వశంబు, అగు, అట్టులుగన్= అధీన మయ్యేటట్లుగా (వశపడేటట్లుగా); అనుగ్రహింపుము= దయచూపుము; అనినన్= అని ఉదంకుడు పలుకగా; ఆ+పురుషుండు= ఆ దివ్యపురుషుడు; అట్లు+ఏనిన్= నీ కటువంటి కోరిక ఉన్నట్లయితే; ఈ, అశ్వ, కర్ణ, రంధ్ర+ఆధ్మానంబు= నే నెక్కిన ఈ గుర్రం యొక్క చెవియందు ఊదుట; చేయుము+అనినన్= చేయు మని ఆ దివ్యపురుషుడు పలుకగా; వల్లె= అట్లే; అని; తద్, వచన+అనురూపంబు= ఆ దివ్యపురుషుడి వాక్కునకు తగింది; చేయుడున్= చేసిన అనంతరం; తద్+క్షణంబు+అ= ఆ క్షణంలోనే, వెంటనే.

**తాత్పర్యం:** ఉదంకుడు మిక్కిలి సంతోషించి 'ఈ పాముల వంశమంతా నా కధీన మయ్యేటట్లు కరుణించు' మని పలుకగా ఆ దివ్యపురుషుడు 'అట్లైతే ఈ గుర్రంయొక్క చెవికన్నంలో ఊదు' మని అన్నాడు. ఉదంకుడు అట్లే అని అంగీకారం సూచించి, ఆ దివ్యపురుషుడు పలికిన వాక్కులకు తగినట్లు చేయగా వెంటనే.

**విశేషం:** మూలంలో ఇచ్చట గుర్రంయొక్క అపానంలో ఊదు మని దివ్యపురుషుడు చెప్పినట్లు ఉన్నది. ఋషి అట్లా చేయటం ఉచితంగా ఉండ దని నన్నయ అపానాన్ని తొలగించి దానికి బదులు కర్ణరంధ్ర మని వ్రాశాడు.

**శా. పాతాళైకనికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గ వినిర్గతోగ్ర దహనార్చుల్, పన్నగవ్రాతముల్
భీతిల్లెన్, భుజగాధినాథు మనమున్ భేదిల్లెఁ గల్పాంత సం
జాతప్రోద్ధత బాడబానల శిఖాశంకాధికాతంక మై. 111**

**ప్రతిపదార్థం:** తద్+అశ్వ+అఖిల, స్రోతస్+మార్గ, వినిర్గత+ఉగ్ర, దహన+అర్చుల్= ఆ గుఱ్ఱముయొక్క సర్వఇంద్రియాలమార్గాల నుండి బయల్వెడలిన భయంకర మైన అగ్నియొక్క జ్వాలలు; పాతాళ+ఏక, నికేతన+అంతరమునన్= నాగలోక మనే ముఖ్యమైన(సాటిలేని) భువనం యొక్క మధ్య భాగంలో; పర్వెన్= వ్యాపించినవి; పన్నగవ్రాతముల్= పాముల సముదాయాలు; భీతిల్లెన్= భయపడినవి; కల్ప+అంత, సంజాత, ప్రోద్ధత, బాడబ+అనల, శిఖా, శంకా, అధిక+ఆతంకము+ఐ= ప్రళయకాలంలో పుట్టి విజృంభించిన బడబాగ్ని యొక్క జ్వాలలనే సందేహంవలన అధికమైన భయం కలదై; భుజగ+అదినాథు= సర్పరాజు యొక్క మనమున్= మనస్సుకూడ; భేదిల్లెన్= బ్రద్దలైనది.

**తాత్పర్యం:** పాతాళ మనే ముఖ్యమయిన భువనమధ్యంలో ఆ గుఱ్ఱముయొక్క సర్వేంద్రియ ద్వారాలనుండి బయల్వెడలిన భయంకరమైన అగ్నిజ్వాలలు వ్యాపించినవి. పాముల సముదాయాలు భయపడినవి; ప్రళయకాలంలో పుట్టి పైకెగసిన బడబాగ్నిజ్వాల లనే సందేహంవలన కలిగిన అధిక మైన భయం కలదై పాములరాజుయొక్క హృదయం కూడ బ్రద్దలయింది.

**విశేషం:** అలం: నన్నయ రచనలోని అక్షరరమ్యత కీపద్యం ఉదాహరణం. ఇందులో భయానకరసం స్ఫురిస్తుంది. దానిని పోషించేటట్లు - మార్గ, వినిర్గత, అర్చివంటి ద్విత్వాక్షరాలనూ, భ, ధ, భ, వంటి మహాప్రాణాలనూ వాడుతూ సమాసభూయిష్ఠమైన రచనతో ఓజోగుణాన్ని పోషించి బడబానలజ్వాలలవంటి అగ్నిజ్వాలల భయంకరరూపాన్ని అక్షరరమ్యంగా నన్నయ ఆవిష్కరించాడు.

**తక్షకుండు కుండలంబులం దెచ్చి యుదంకున కిచ్చుట (సం.1-3-158)**

**క. శంకరనిభుఁ డగు విప్రుభ । యంకరకోపాగ్ని యొక్కొ! యనుచును జాతా**
**తంకుఁ డయి కుండలంబు లు । దంకునకును దెచ్చి యిచ్చెఁ దక్షకుఁ డంతన్. 112**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; తక్షకుడు; శంకరనిభుఁడు+అగు= శివునితో సమాను డైన; విప్రు= బ్రాహ్మణుడియొక్క; భయంకర, కోప+అగ్ని, ఒక్కో= భయం కలిగించే కోప మనే అగ్నియేమో; అనుచును= అని భావిస్తూ; జాత+ఆతంకుఁడు+అయి= పుట్టిన భయం కలవాడై; ఉదంకునకును= ఉదంక మహామునికి; కుండలంబులు= కర్ణాభరణాలు; తెచ్చి; ఇచ్చెన్= తెచ్చి ఇచ్చాడు.

**తాత్పర్యం:** అంత తక్షకుడు శివుడితో సమాను డైన బ్రాహ్మణుడి భయంకర మైన కోప మనే అగ్నియేమో! అని తలుస్తూ భయంతో కూడినవాడై కుండలాలను ఉదంకమహామునికి తెచ్చి ఇచ్చాడు.

**విశేషం:** అలం: రూపకం; ఉత్ప్రేక్ష.

**వ. ఇట్లు నాగలోకంబున కెల్ల మహాక్షోభంబు గావించి తక్షకుచేతఁ గుండలంబులు గొని యుదంకుఁ డాత్మగతంబున. 113**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నాగలోకంబునకున్+ఎల్లన్= పాతాళలోకాని కంతటికి; మహాక్షోభంబు= గొప్ప కలత; కావించి= చేసి, కలిగించి; తక్షకుచేతన్= తక్షకుడి నుండి (వలన); కుండలంబులు= కర్ణాభరణాలు; కొని= గ్రహించి; ఉదంకుఁడు; ఆత్మగతంబునన్= తనలో.

**తాత్పర్యం:** ఈ విధంగా సర్పలోకాని కంతటికి గొప్పకలత కలిగేటట్లు చేసి తక్షకుడి (వలన) నుండి కుండలాలు గ్రహించి ఉదంకుడు తనలో.

**విశేషం:** ఆత్మగత మనేమాట నాటకంలో స్వగత మనే అర్థంలో రంగస్థల సూచనగా వాడుతుంటారు. పైకి వినబడని భాషణం ఆత్మగత మని సాహిత్యదర్పణం.

**సీ. 'కుండలమ్ములు వేగ కొనిరమ్ము నాలవ । నాఁటికి నని పూని నన్నుఁ బనిచె**
**గురుపత్ని; నేఁడ యక్కుండలంబులు దొడ్గ । దివస; మీ దివస మతిక్రమింప**
**కుండంగఁబోక యె ట్లొడఁగూడు? ని న్నాగ । భవన మెప్పాట వెల్వడఁగఁ బోలు?**
**నేఁడు పోవనినాఁడు నిష్ఫలం బిమ్మహా । యత్నమంతయు' నని యధికచింతఁ**

**ఆ. దవిలియున్న నయ్యుదంకు నభిప్రాయ । మెఱిఁగి దివ్యపురుషుఁ డిట్టు లనియె:**
**'నీహయంబు నెక్కి యేఁగుమ; యిది వడి । గలదు మనముకంటె గాడ్పుకంటె'. 114**

**ప్రతిపదార్థం:** గురుపత్ని= గురువుగారి భార్య; నాలవ నాఁటికిన్= నేటికి నాల్గవరోజుకు; కుండలంబులు= చెవికమ్మలు; వేగ= వేగంగా; కొనిరమ్ము= తీసికొనిరమ్ము; అని; పూని= పట్టుదలతో, కడగి; నన్ను; పనిచెన్= పంపింది; నేడు+అ= నేడే; ఆ

కుండలంబులు= ఆ కర్ణాభరణాలు; తొడ్గ= ధరించే; దివసము= రోజు; ఈ దివసము= ఈ రోజు; అతిక్రమింపక, ఉండంగన్= దాటిపోకుండ; పోక= పోవటం; ఎట్లు= ఏవిధంగా; ఒడన్, కూడున్= సమకూరుతుంది?; ఈ నాగభవనము= ఈ సర్పలోకం; (నుండి) ఏ+పాటన్= ఏవిధంగా; వెల్వడఁగన్, పోలున్= బయటకు పోవటానికి వీలౌతుంది?; నేఁడు= ఈరోజు; పోవనినాఁడు= వెళ్ళకపోతే; ఈ+మహత్ యత్నము+అంతయున్= నేను చేసిన ఈగొప్పయత్నమంతా; నిష్ఫలంబు= ఫలం లేనిది (నిష్ప్రయోజనం) అని; అధికచింతన్= పెనుదిగులునందు; తవిలి ఉన్నన్= చిక్కి ఉండగా; ఆ+ఉదంకు+అభిప్రాయము= ఆ ఉదంకునియొక్కభావం; ఎఱిఁగి= తెలిసికొని; దివ్యపురుషుఁడు= (గుర్రాన్ని ఎక్కి ఉన్న) దేవతా పురుషుడు; ఇట్టులు= ఈవిధంగా; అనియెన్= అన్నాడు; ఈ హయంబున్= ఈ గుర్రాన్ని; ఎక్కి; ఏఁగుము+ఆ= వెళ్ళుము; ఇది= ఈ గుర్రం; మనముకంటెన్= మనస్సుకంటె; గాడ్పుకంటెన్= గాలికంటె; వడి, కలదు= వేగం కలిగి ఉన్నది.

**తాత్పర్యం:** 'నేటికి నాల్గవరోజున కుండలాలను వేగంగా తీసికొని రమ్మని గురువుగారిభార్య పట్టుదలతో నన్ను పంపింది. ఆ కుండలాలు ధరించే దినం ఈనాడే. ఈరోజు దాటకుండ నేను అక్కడికి పోవటం ఏవిధంగా సమకూరుతుంది? ఈ నాగలోకంనుండి ఎట్లా బయటికి వెళ్ళవచ్చును? నేను వెళ్ళకపోతే నేను చేసిన ఈ మహాప్రయత్నమంతా నిష్ప్రయోజన మౌతుంది' - అని మిక్కిలి విచారంతో కలతనొంది యున్న ఆ ఉదంకుడిభావం తెలిసికొని తురగారూఢు డైన దివ్యపురుషుడు ఇట్లా పలికాడు: 'నీ వీ గుర్రం ఎక్కి వెళ్ళుము. ఇది మనస్సుకంటె గాలికంటె వేగం కలిగినది'.

**విశేషం:** మనస్సు, గాలీ వేగం కలవాటిలో ప్రసిద్ధా లైనవి. కథాకథనానికి ఉపయోగపడే ఇటువంటి సీసాలను కొందరు 'గునుగు' సీసాలంటారు.

**వ. అనవుడు నద్దివ్యపురుషువచనంబున నత్తురంగంబు నెక్కితత్క్షణంబ యయ్యుదంకుండు గురుగృహంబునకు వచ్చె; నిట గురుపత్నియు శుచిస్నాత యై నూతనపరిధానశోభిత యై యక్కుండలంబులు దొడువ నవసరం బైనఁ దదాగ మనంబు గోరుచున్నయది యప్ప డయ్యుదంకుం గని తద్దయు సంతసిల్లి, తదానీతరత్నకుండల భూషిత యై, బ్రాహ్మణులం బూజించి నిజసంకల్పిత మహోత్సవం బొనరించె; నట్లు గురుకార్యంబు నిర్వర్తించియున్న యుదంకుం జూచి గురుం డి ట్లనియె. 115**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనిన తరువాత; ఆ+దివ్య, పురుషు= ఆ దేవతాపురుషుడి యొక్క; వచనంబునన్= మాటచే (మాటప్రకారం); ఆ+తురంగంబున్= ఆ గుర్రాన్ని; ఎక్కి; తద్+క్షణంబు+అ= ఆ క్షణమే, వెంటనే; ఆ+ఉదంకుండు; గురు, గృహంబునకున్= గురువుగారి ఇంటికి; వచ్చెన్; ఇట= ఇక్కడ గురుగృహంలో; గురుపత్నియున్= గురువుగారి భార్యయున్నూ; శుచి, స్నాతయున్= పవిత్రతకొరకు స్నానంచేసినది; ఐ=అయి;. నూతన, పరిధాన శోభిత+ఐ= క్రొత్తవస్త్రాలతో ప్రకాశించినదయి; ఆ+కుండలంబులు= ఆ కర్ణాభరణాలు; ధరింపన్= ధరించటానికి; అవసరంబు= సమయం; ఐనన్= కాగా; తద్+ఆగమనంబు= ఉదంకునిరాక; కోరుచున్న+అది= కోరుతున్నది; అప్పుడు; ఆ+ఉదంకున్= ఆ ఉదంకుని; కని= చూచి; తద్దయున్= మిక్కిలి; సంతసిల్లి= సంతోషించి; తద్, ఆనీత, రత్న, కుండల, భూషిత, ఐ= అతనిచేత తేబడిన మణిమయ కర్ణాభరణాలచేత అలంకరింపబడిన దై; బ్రాహ్మణులన్; పూజించి= పూజ చేసి; నిజ, సంకల్పిత, మహత్, ఉత్సవంబు= తనచేత సంకల్పింపబడిన గొప్పదైన వేడుక; ఒనరించెన్= చేసెను; అట్లు= ఆవిధంగా; గురుకార్యంబు= గురువుగారి పని (గురుపత్ని కార్య మైనా గురుకార్యమే); నిర్వర్తించి= చేసి; ఉన్న=ఉండిన; ఉదంకున్; చూచి; గురుండు= గురు వైన పైలుడు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దివ్యపురుషుడు ఆ విధంగా పల్కిన తరువాత ఆతనిమాట ప్రకారం ఆ గుర్రాన్ని ఎక్కి ఉదంకుడు వెంటనే గురువుగారింటికి వచ్చాడు. గురుగృహంలో గురువుగారిభార్య పవిత్రస్నానం చేసి క్రొత్తబట్టలు కట్టుకొని వెలుగొందుతూ కర్ణాభరణాలు ధరించే సమయం ఆసన్నంకాగా, శిష్యుడైన ఉదంకుడి రాకకొరకు ఎదురుచూస్తున్నప్పుడు ఆ ఉదంకుడు రాగా చూచి, మిక్కిలి సంతోషించి, అతడు తెచ్చిన మణిమయకుండలాలను ధరించి, విప్రులను పూజించి, తాను సంకల్పించిన మహోత్సవాన్ని జరుపుకొన్నది. ఆ విధంగా గురువుగారిపని చేసి ఉన్న ఉదంకుడిని చూచి గురు వైన పైలుడు ఈవిధంగా పలికాడు.

**క. ఈయున్న పౌష్యపాలికిఁ । బోయి కడుంబెద్దదవ్వు పోయిన య ట్ల**
**త్యాయత విమల తపోమహి । మా! యిన్ని దినంబు లేల మసలితి చెపుమా! 116**

**ప్రతిపదార్థం:** ఈ, ఉన్న= ఇచ్చటనే ఉన్న 'ఈ' సామీప్యాన్ని సూచిస్తుంది). పౌష్య, పాలికిన్= పౌష్యమహారాజు చెంతకు; పోయి= వెళ్ళి; కడున్= మిక్కిలి; పెద్ద= అధికమైన; దవ్వు= దూరం; పోయిన, అట్లు= పోయినవిధంగా; అతి+ఆయత, విమల, తపః, మహిమా= మిక్కిలి అధికమైన నిర్మలమైన తపస్సుయొక్క మహత్త్వం కలవాడా!; ఇన్ని, దినంబులు= ఇన్ని (నాలుగు) రోజులు; ఏల= ఏకారణంచేత; మసలితి(వి)= ఆలస్యం చేసినావు?; చెపుమా= తెలుపుము.

**తాత్పర్యం:** మిక్కిలి అధిక మైన నిర్మలమైనతపస్సుయొక్కమహిమ కలవాడా! ఇక్కడికి అతిసమీపంలో ఉన్న పౌష్యమహారాజుచెంతకు పోయి, చాలాదూరం పోయినవిధంగా ఏకారణంచేత ఇంతఆలస్యం చేశావో తెలియజెప్పుము.

**విశేషం:** పౌష్యునిపురం దగ్గరగానే ఉన్నది. నీవు గొప్ప తపస్సంపన్నుడవు. నీవు అచ్చటికి పోయి రావటానికి నాల్గురోజులు పట్టింది. ఇంత ఆలస్యం కావటానికి కారణ మేమి టని గురువు అడిగాడు. 'అత్యాయత విమల తపోమహిమా!' అనే సంబోధనం సాభిప్రాయం. తపోమహిమతో ఎటువంటి కార్యమైననూ సులభంగా చేయవచ్చును. 'ఈయున్న' అనే ఎత్తుగడ సంభాషణ సహజత్వం ఉట్టిపడేటట్లు నుడికారపు సొంపును ప్రదర్శిస్తున్నది.

**వ. అనిన నుదంకుం డి ట్లనియెః 'నయ్యా! మీ యానతిచ్చినట్ల మసల వలవదు; తక్షకుం డను దుష్టోరగంబు సేసిన విఘ్నంబున నింత మసలవలసె; వినుఁడు: మిమ్ము వీడ్కొని చనువాఁడ నెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్కదివ్యపురుషుం గని, వాని పన్నిన వృషభగోమయ భక్షణంబు సేసి చని పౌష్యమహాదేవి కుండలంబులు ప్రతిగ్రహించి వచ్చుచోఁ దక్షకుచేత నపహృతకుండలుండ నై వాని పిఱుందన పాతాళలోకంబునకుం బోయి నాగపతుల నెల్ల స్తుతియించి, యందు సితాసితతంతు సంతానపటంబు ననువయించుచున్నవారి నిద్దఱ స్త్రీలను, ద్వాదశారచక్రంబుఁ బరివర్తించుచున్నవారి నార్వురఁ గుమారుల, నతిప్రమాణతురగారూఢుండైన యొక్క దివ్యపురుషుం గని, తత్ప్రసాదంబునఁ గుండలంబులు వడసి, తదాదేశంబున నత్తురంగంబు నెక్కివచ్చితి; నిది యంతయు నేమి? నా కెఱింగింపుఁ' డనిన గురుం డిట్లనియె. 117**

**ప్రతిపదార్థం:** అనినన్= గురువు అట్లనగా; ఉదంకుండు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పల్కెను; అయ్యా= ఆర్యా!; మీ, ఆనతి, ఇచ్చిన, అట్లు+అ= మీరు సెలవిచ్చిన విధంగా (కర్తృపద ప్రథమకు షష్ఠి); మసల, వలవదు= ఆలస్యం చేయ నవసరం లేదు; తక్షకుండు+అను; దుష్ట+ఉరగంబు= చెడ్డపాము; చేసిన; విఘ్నంబునన్= ఆటంకంచేత; ఇంత= ఇంతకాలం; మసల,

వలసెన్= ఆలస్యం చేయవలసి వచ్చింది; వినుఁడు; మిమ్మున్= (గురువుగారిని); వీడ్కొని= విడిచి (మీదగ్గర సెలవు తీసికొని); చను, వాఁడన్= వెళ్ళువాడను; ఎదురన్= నా ఎదుట; ఒక్క, మహత్, ఉక్షంబున్= గొప్ప (ఉన్నతమైన) ఎద్దును; ఎక్కి; చనుదెంచు, వానిన్= వచ్చువాడిని; ఒక్క, దివ్య, పురుషున్= ఒక దేవతాపురుషుడిని; కని= చూచి; వాని, పన్నిన= (కర్తృపద ప్రథమకుషష్ఠి) అతడు ఏర్పరచిన; వృషభ, గోమయ, భక్షణంబు= ఎద్దుపేడ తినటం; చేసి; చని= వెళ్ళి; పౌష్య, మహా, దేవి= పౌష్యుడి దేవేరియొక్క; కుండలంబులు; ప్రతిగ్రహించి= దానంగా తీసికొని; వచ్చుచోన్= వచ్చేటప్పుడు; తక్షకుచేతన్= తక్షకుడనే సర్పరాజుచేత; అపహృత, కుండలుండను+ఐ= దొంగిలించబడిన కుండలాలు కలవాడ నై; వాని, పిఱుందన్+అ= అ తక్షకుడి వెనుకనే; పాతాళ లోకంబునకున్= నాగలోకానికి; పోయి= వెళ్ళి; నాగ, పతులన్, ఎల్లన్= సర్పరాజుల నందరిని; స్తుతియించి= పొగడి; అందున్= ఆ పాతాళంలో, సిత+అసిత, తంతు, సంతాన, పటంబున్= తెల్లని నల్లని దారాల సముదాయంతో కూడిన వస్త్రాన్ని; అనువయించుచున్+ఉన్నవారిన్= నేస్తూ ఉన్నవారిని; ఇద్దఱు, స్త్రీలను= ఇరువురు ఆడువారిని; ద్వాదశ+అర, చక్రంబున్= పండెండ్రు (12) ఆకులు కల చక్రాన్ని; పరివర్తించుచున్+ఉన్న, వారిన్= త్రిప్పుచున్న వారిని; ఆర్వురన్, కుమారులన్= ఆర్గురు బాలకులను; అతి, ప్రమాణ, తురగ+ఆరూఢుండు+ఐన= మిక్కిలి ఎత్తైన గుర్రాన్ని ఎక్కినవాడిని; ఒక్క, దివ్యపురుషున్= ఒక దేవతా పురుషుడిని; కని= చూచి; తద్, ప్రసాదంబునన్= ఆ దివ్యపురుషుడి అనుగ్రహంచేత; కుండలంబులు; పడసి= పొంది; తద్+ఆదేశంబునన్= ఆ పురుషుడి ఆజ్ఞచేత; ఆ+తురంగంబున్= ఆ గుర్రాన్ని, ఎక్కి; వచ్చితిన్; ఇది, అంతయున్= పైన పేర్కొనబడిన దంతయున్నూ; ఏమి= ఏమిటి?; నాకున్; ఎఱింగిం పుఁడు= అంతరార్థం తెల్పండి; అనినన్= అని ఉదంకుడు అడుగగా; గురుండు= పైలుడు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని గురువుగారు అడుగగా ఉదంకుడు ఈవిధంగా చెప్పాడు: 'ఆర్యా! మీరు సెలవిచ్చినట్లు ఆలస్యం చేయవలసిన అవసరం లేదు. కాని, తక్షకుడు అనే పేరు గల దుష్టు డైన నాగరాజు చేసిన ఆటంకంచేత ఇన్ని రోజులు ఆలస్యం చేయవలసి వచ్చింది. నేను మిమ్ము వీడి వెళ్ళుతూ ఎదుట ఒక పెద్దఎద్దు నెక్కి వచ్చేవాడిని ఒక దేవతాపురుషుడిని చూచి అత డేర్పరచిన ఎద్దుపేడ తిని వెళ్ళి, పౌష్యమహారాజుదేవేరికర్ణాభరణాలు పుచ్చుకొని వస్తూ ఉన్నాను. వస్తూ ఉండగా తక్షకుడిచేత కుండలాలు అపహరింపబడ్డవి. నేను ఆ తక్షకుడి వెనుకనే నాగలోకానికి పోయి సర్పరాజులనందరిని పొగడి, ఆపాతాళలోకంలో తెల్లని నల్లని దారాలతో కూడిన వస్త్రం నేస్తున్న ఇద్దరు స్త్రీలను, పంట్రెండాకులు కల చక్రాన్ని త్రిప్పుతున్న ఆరుగురు బాలురను (యువకులను); మిక్కిలి ఎత్తైన గుర్రాన్ని ఎక్కిన ఒక దివ్యపురుషుడిని చూచి, అతని అనుగ్రహంచేత కర్ణాభరణాలు పొంది, అత డాజ్ఞాపించిన విధంగా ఆ గుర్రం ఎక్కి వచ్చాను. ఇదంతయు ఏమిటి? దీని అంతరార్థం నాకు తెలపండి' అని అడుగగా గురువైన పైలుడు ఈవిధంగా పలికాడు.

**సీ.** **అప్పురుషుం డింద్రుఁ, డయ్యుక్ష మైరావ । తంబు, గోమయ మమృతంబు, నాగ**
**భువనంబులోఁ గన్న పొలఁతు లిద్దఱు ధాత । యును విధాతయు, వారి యనువయించు**
**సితకృష్ణతంతురాజిత తంత్ర మది యహో । రాత్రంబు, ద్వాదశారములు గలుగు**
**చక్రంబు మాసాత్మ సంవత్సరంబు, కు । మారు లయ్యార్వురు మహితఋతువు,**

**ఆ.** **లత్తురంగ మగ్ని, యప్పురుషుండు ప । ర్జన్యుఁ డింద్రసఖుఁడు సన్మునీంద్ర ।**
**యాది నింద్రుఁ గాంచి యమృతాశి వగుట నీ । కభిమతార్థ సిద్ధి యయ్యెనయ్య!** **118**

**ప్రతిపదార్థం:** సత్+ముని+ఇంద్ర= మంచి మునిశ్రేష్ఠుడా! ఉదంకా!; ఆ+పురుషుఁడు= ఎద్దు ఎక్కివచ్చిన పురుషుడు; ఇంద్రుఁడు; ఆ+ఉక్షము= ఆ ఎద్దు; ఐరావతంబు= దేవేంద్రుని వాహన మైన ఏనుగు; గోమయము= పేడ; అమృతంబు; నాగ, భువనంబులోన్= నాగలోకంలో; కన్న= నీవు చూచిన; పొలఁతులు, ఇద్దఱు= స్త్రీలు ఇరువురు; ధాతయును; విధాతయు; వారి, అనువయించు= వారు నేసెడి; సిత, కృష్ణ, రాజిత, తంత్రము+అది= తెల్లని నల్లని దారాలతో ప్రకాశించే ఆ మగ్గం; అహః, రాత్రము= పగలు, రాత్రి; ద్వాదశ+అరములు= పండ్రెండు (12) ఆకులు; కలుగు; చక్రంబు= చక్రం; మాస+ఆత్మ, సంవత్సరంబు= నెలల రూపమైన సంవత్సరం; కుమారులు, ఆ+ఆర్వురు= చక్రాన్ని త్రిప్పుతున్న ఆ ఆర్గురు బాలురు; మహిత, ఋతువులు= గొప్ప వసంతాదు లైన ఋతువులు; ఆ+తురంగము= ఆ గుర్రం; అగ్ని; ఆ+పురుషుండు= ఎత్తైన గుర్రాన్ని ఎక్కి కనబడిన ఆ పురుషుడు; ఇంద్ర, సఖుఁడు= ఇంద్రుడి మిత్రు డైన; పర్జన్యుఁడు= వర్షాధిదేవత; ఆదిన్= మొదట; ఇంద్రున్= ఇంద్రుడిని; కాంచి= చూచి; అమృత+ఆశివి+అగుటన్= అమృతాన్ని తిన్నవాడవగుటచేత; నీకున్; అభిమత+అర్థ, సిద్ధి= కోరబడిన ప్రయోజనం యొక్క ఫలం (నెరవేరటం); అయ్యెన్+అయ్య= కలిగినదయ్యా!

**తాత్పర్యం:** ఓ మంచిముని శ్రేష్ఠుడా! ఉదంకా! ఎద్దు నెక్కివచ్చిన ఆ పురుషుడు ఇంద్రుడు. అత డెక్కిన ఎద్దు దేవతల ఏను గైన ఐరావతం. పేడ అమృతం. పాములలోకంలో ఉన్న ఇద్దరు స్త్రీలు ధాత, విధాత అనేవారు. వారు నేసే తెల్లని నల్లని దారాల మగ్గం దినరాత్రి రూపం. పండ్రెండాకులు గల చక్రం నెలలరూప మైన సంవత్సరం. దానిని త్రిప్పే ఆర్గురు యువకులు గొప్పఋతువులు (వసంతం, గ్రీష్మం, వర్షం, శరత్తు, హేమంతం, శిశిరం). ఆ గుర్రం అగ్ని. దాని నెక్కిన దివ్యపురుషుడు ఇంద్రుడి మిత్రు డైన పర్జన్యుడు. మొదట ఇంద్రుడిని చూచి అమృతం తిన్నవాడ వగుటచేత నీకు వాంఛితార్థసిద్ధి కలిగింది. నీవు కోరినపని నెరవేరింది. కుండలాలు లభించాయి.

**విశేషం:** పర్జన్యుడు వర్షాధిదేవత. ఇంద్రుడినే పర్జన్యు డని అంటారు. ఇక్కడ అతడు ఇంద్రమిత్రుడిగా చెప్పబడినాడు. పర్జన్యుడంటే విష్ణువు అనే అర్థం కూడ ఉన్నది. పర్జన్యము= గర్జించే మేఘం, మేఘు డని కూడ చెప్పవచ్చు.

**క.** **కర మిష్టము సేసితి మా । కరిసూదన! దీన నీకు నగు సత్ఫలముల్;**
**గురుకార్యనిరతు లగు స । త్పురుషుల కగు టరుదె? యధికపుణ్యఫలంబుల్.** **119**

**ప్రతిపదార్థం:** అరి, సూదన= శత్రువులను సంహరించేవాడా! ఉదంకా! మాకున్= నాకు, నా భార్యకున్నూ; కరము= మిక్కిలి; ఇష్టము= ప్రియం (కోరబడింది); చేసితి(వి); దీనన్= ఇట్లు చేయటం చేత; నీకున్; సత్+ఫలముల్= మంచిఫలాలు, అగున్= కలుగుతాయి; గురు, కార్య, నిరతులు= గురువుగారి పనియందు ఆసక్తికలవారు; అగు; సత్, పురుషులకున్ యోగ్యు లైన జనులకు; అధిక, పుణ్య, ఫలంబుల్= గొప్ప పుణ్యాల ఫలితాలు; అగుట= కలగటం; అరుదు+ఎ= అపూర్వమా? ఏమీ కాదు.

**తాత్పర్యం:** శత్రువులను సంహరించువాడా! మాకు మిక్కిలి ప్రియాన్ని (కుండలాలను తెచ్చి ఇవ్వటం) కలిగించావు. ఈవిధంగా చేయటంవలన నీకు మంచిఫలితాలు కలుగుతాయి. గురువుల పనులందు ఆసక్తులయ్యే సజ్జనులకు గొప్పపుణ్యాలు చేసిన ఫలాలు కలగటంలో వింత లేదు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. నన్నయ నానారుచిరార్థ సూక్తినిధి, అతడి సూక్తులలో ఇది ఒకటి. గురుసేవ చేసి, వారిని సంతోషపెట్టటంవలన దేవతలు ప్రసన్నులౌతారని- ఆర్యోక్తి. "అథసేవామనిచ్ఛంతం గురు మర్థేన తోషయేత్! గుర్వర్థే యతమానం తం అనుగృహ్ణంతి దేవతాః" (సేవకు అంగీకరించని గురువును ధనంతో సంతోషపెట్టాలి. గురుదక్షిణకోసం పాటుపడే శిష్యుడిని దేవతలు అనుగ్రహిస్తారు) అనే తాత్పర్యాన్ని ఉదంకోపాఖ్యానం బోధిస్తుంది.

**వ. 'నీవలనం బరమ సంప్రీత హృదయుండ నయితి; నీవును గుర్వర్థంబునందు ఋణవిముక్తుండ వయితివి; నిజేచ్ఛనుండు' మనినఁ, దదనుజ్ఞ వడసి యుదంకుం డనేకకాలంబు దపంబు సేసె; నట్టి యుదంకుండు తక్షకు చేసిన యపకారంబునకుం బ్రతీకారంబు సేయం జింతించి యొక్కనాఁడు జనమేజయ మహీపాలుపాలికిం బోయి యి ట్లనియె. 120**

**ప్రతిపదార్థం:** నీవలనన్= నీయెడ; పరమ, ప్రీత, హృదయుండన్, అయితిన్= మిక్కిలి ప్రీతి పొందిన హృదయం కలవాడ నైనాను; నీవును= నీవుకూడ; గురు+అర్థంబు+అందున్= గురువుగారి ప్రయోజనం విషయంలో (గురు కార్యనిర్వహణంలో); ఋణ, విముక్తుండవు= ఋణంవలన విడువబడినవాడవు; అయితివి; నిజ+ఇచ్ఛన్= నీ(తన)కోరికను అనుసరించి; ఉండుము+అనినన్= అని గురువు పలుకగా; తద్+అనుజ్ఞ= గురువుగారి అనుమతి; పడసి= పొంది; ఉదంకుండు; అనేక, కాలంబు= చాలాకాలం; తపంబు, చేసెన్= తపస్సు చేశాడు; అట్టి; ఉదంకుండు; తక్షకు, చేసిన= (కర్తృపద ప్రథమకు షష్ఠి) తక్షకుడు చేసిన; అపకారంబునకున్= కుండలాల అపహరణరూపమైన అపకారానికి; ప్రతీకారంబు= మారుచేత; చేయన్; చింతించి= చేయటానికి ఆలోచించి; ఒక్క, నాఁడు= ఒకరోజున; జనమేజయ, మహీపాలు, పాలికిన్= జనమేజయ మహారాజుచెంతకు; పోయి= వెళ్ళి, ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** నీయెడ నాహృదయం మిక్కిలి ప్రీతి పొందింది. నీవు కూడ గురువుగారి ప్రయోజనం (కార్యం) నెరవేర్చటంలో ఋణవిముక్తుడ వైనావు. ఇంక నీ ఇష్టం వచ్చినట్లు ఉండుము అని గురువు పలుకగా ఉదంకుడు అతని అనుమతి పొంది చాలకాలం తపస్సుచేశాడు. అట్టిఉదంకుడు తక్షకుడు కుండలాలను అపహరించి తనకు చేసిన అపకారానికి మారుచేత చేయటానికి తలంచి, ఒకరోజున జనమేజయమహారాజుచెంతకు వెళ్ళి ఈవిధంగా పలికాడు.

**విశేషం:** ఉదంకుడు ఎంతటి తపస్సు చేసినా తక్షకుడు తనకు చేసిన అపకారాన్ని మరవలేకపోయాడు. అది అతడి విచిత్రప్రవృత్తి. ఎంతటి మహర్షి అయినా తీవ్రమైన కోపాన్ని అతడు జయించలేకపోయాడు. చిన్నతప్పుకే పెద్దశాపాన్ని ఇచ్చి పౌష్యుడివద్ద తన స్వభావాన్ని బైటపెట్టుకొన్నాడు. దానికి తగిన శాపాన్నికూడ పొందాడు. అయినా అతడి కోపం చావలేదు. అంతటి తీవ్రస్వభావు డని నన్నయ ముందే కథలో ధ్వనింపచేశాడు. అతడి అంతర్గత తీవ్రకోపస్వభావమే భావికథలో సర్పయాగానికి కారణమైనది. దానికి బీజం పౌష్యునివద్ద కనబడుతుంది; ఆరంభం ఇక్కడ ప్రత్యక్షమౌతుంది. కాబట్టి ఇక్కడ కార్యారంభం సూచింపబడింది. (సంపా).

### ఉదంకుండు జనమేజయునకు సర్పయాగబుద్ధిఁ గలిగించుట (సం.1-3-177)

**చ. మితహితసత్యవాక్య! జనమేజయ! భూజనవంద్య! యేను సు**
**స్థితి గురుదేవకార్యములు సేయఁగఁబూను టెఱింగి, వంచనో**
**న్నతమతి యై యకారణమ నా కపకారము సేసెఁ దక్షకుం**
**డతికుటిలస్వభావుఁడు పరాత్మవిశేషవివేకశూన్యుఁ డై. 121**

**ప్రతిపదార్థం:** మిత, హిత, సత్య, వాక్య= పరిమితాలైనవి, మేలు కలిగించేవి, సత్యంతో కూడినవి అయిన వచనాలు కలవాడా! భూ, జన, వంద్య= భూమియందలి జనులచేత నమస్కరింప దగినవాడా! జనమేజయ= జనమేజయ మహారాజా! ఏను= నేను; సు స్థితిన్= మంచిస్థితితో; గురు, దేవ, కార్యములు= గురువులయొక్కయు, దేవతలయొక్కయు పనులు; చేయఁగన్,

పూనుట= చేయటానికి యత్నించటం; ఎఱింగి= తెలిసికొని; వంచన+ఉన్నత, మతి+ఐ= మోసమునందు అధికమైన బుద్ధి (మోసంతో కూడిన బుద్ధి) కలవాడై; అకారణము+అ= కారణం లేకుండానే; అతి, కుటిల, స్వభావుఁడు= మిక్కిలి వక్రమైన (కపటంతోకూడిన) స్వభావం కలవాడు; అగు; తక్షకుండు; పర+అత్మ, విశేష వివేక, శూన్యుఁడు+ఐ= ఇతరులయొక్కయు, తనయెక్కయు అతిశయము (గొప్పతనం) నందలి జ్ఞానం లేనివాడై; అపకారము= హాని; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** పరిమితాలు, హితకరాలు, సత్యయుక్తాలు అయిన మాటలుమాటాడేవాడా! భూమియందలి జనులచేత నమస్కరింప దగినవాడా! జనమేజయమహారాజా! నేను మంచిస్థితిలో గురువుల దేవతల పనులు చేయటానికి యత్నించటం తెలిసికొని మోసంతో కూడిన బుద్ధి కలవా డై మిక్కిలికపటంతో కూడిన స్వభావం కల తక్షకు డనే సర్పరాజు ఇతరులయొక్కయు తనయొక్కయు మహత్త్వం తెలిసికొనే (ఇతరులకూ, తనకూ కల భేదం తెలిసికొనే) జ్ఞానం లేనివాడై కారణం లేకుండానే నాకు హాని చేశాడు.

**విశేషం:** మితహిత సత్యవాక్యాలు నన్నయకు ప్రియమైనవి. అతని రచనలో కూడా మితహితసత్యవాక్యత్వం కనిపిస్తుంది.

**వ. అదియునుం గాక. 122**

**తాత్పర్యం:** అదికాక; మరియు.

**విశేషం:** అదియున్+కాక= ఇక్కడ ద్రుతంమీద మరొక ద్రుతం వాడబడింది. అదియునున్ కాక. తరువాత ద్రుతకార్యం.

**చ. అనవరతార్థ దాన యజనాభిరతున్, భరతాన్వయాభివ**
**ర్ధను, సకల ప్రజాహిత విధాను, ధనంజయ సన్నిభున్, భవ**
**జ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్మuఁ డసహ్య విషోగ్రధూమకే**
**తనహతిఁ జేసి చేసె నతిదాంతుఁ గృతాంతనికేతనాతిథిన్. 123**

**ప్రతిపదార్థం:** అనవరత+అర్థ, దాన, యజన+అభిరతున్= ఎల్లప్పుడూ ధనాన్ని దానం చేయటంలోను, యజ్ఞాలు చేయటంలోను ఆసక్తి కలవాడిని; భరత+అన్వయ+అభివర్ధనున్= భరతునియొక్క వంశాన్ని వృద్ధిపొందించేవాడిని; సకల, ప్రజా, హిత, విధానున్= ఎల్ల ప్రజలకున్నూ మేలు కలిగించే విధానం కలవాడిని; ధనంజయ, సన్నిభున్= అర్జునుడితో (అగ్నితో) సమానుడిని; అతి, దాంతున్= మిక్కిలిదమం (అంతరింద్రియ నిగ్రహం) కలవాడిని; భవత్+జనకున్= నీతండ్రి అయిన; పరీక్షితున్= పరీక్షిన్మహారాజును; భుజగ, జాల్ముఁడు= క్రూరు డైన తక్షకు డనే పాము; అసహ్య, విష+ఉగ్ర; ధూమకేతన, హతిన్, చేసి= సహింప శక్యం కాని విషం నుండి పుట్టేభయంకర మైన అగ్నియొక్క దెబ్బచేత; కృతాంత, నికేతన+అతిథిన్= యమునియొక్క గృహానికి అతిథినిగా; అనగా మరణించిన వాడినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఎల్లప్పుడూ ధనాన్ని దానం చేయటంలోను, యజ్ఞాలు చేయటంలోనూ ఆసక్తి కలవాడున్నూ, భరత వంశాన్ని అభివృద్ధి పొందించేవాడున్నూ, ప్రజలందరికినీ మేలు చేసేవాడున్నూ, అర్జునుడితో సమానుడున్నూ, నీజనకుడున్నూ, మిక్కిలి అంతరింద్రియనిగ్రహం కలవాడున్నూ అయిన పరీక్షిన్మహారాజును క్రూరు డైన తక్షకుడు (సర్పరాజు) సహింపశక్యం కాని విష మనే భయంకర మైన అగ్నియొక్క దెబ్బచేత యమునిగృహానికి అతిథిగా (అంటే మరణించిన వాడిగా) చేశాడు.

**విశేషం:** ఇందులో అర్జునుడి మనుమ డైన పరీక్షిత్తు గుణాలు వర్ణింపబడ్డాయి. తాతగుణాలు మనుమడికి రావటం సహజం. అందువలన అతడు ధనంజయ సన్నిభుడు. చివరిపాదంలోని 'చేసి' అనేది తృతీయావిభక్తి ప్రత్యయం. 'చేసెన్' అనేది చేయుధాతువు యొక్క భూతకాల ప్రథమైకవచన రూపం.

**ఉ. కాదన కిట్టిపాటి యపకారముఁ దక్షకుఁ డేకవిప్రసం**
**బోధనఁ జేసి చేసె నృపపుంగవ! నీవు ననేకభూసురా**
**పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా**
**కోదరసంహతిన్ హుతవహోగ్ర సమగ్ర శిఖాచయంబులన్. 124**

**ప్రతిపదార్థం:** నృప, పుంగవ= రాజశ్రేష్ఠుడా!; కాదు+అనక= చేయరాదు అనకుండ; ఇట్టి, పాటి= ఇంత పరిమాణం గల (అధికమైన); అపకారము= హాని; తక్షకుండు= తక్షకు డనే సర్పరాజు; ఏక, విప్ర, సంబోధనన్, చేసి= శృంగి అనే ఒక బ్రాహ్మణుడి ప్రేరణచేత; చేసెన్= చేశాడు; నీవున్= నీవుకూడ; అనేక, భూసుర+ఆపాదిత, సర్ప, యాగమునన్= పలువురు బ్రాహ్మణులచేత చేయబడిన పాములను ఆహుతిచేసే యజ్ఞంలో; తక్షక+అది, కాకోదర, సంహతిన్= తక్షకుడు మొదలైన పాముల సముదాయాన్ని; హుతవహ+ఉగ్ర, సమగ్ర, శిఖా, చయంబులన్= అగ్నియొక్క భయంకరమైన సమస్తమైన (బాగా మండుతున్న) జ్వాలలసముదాయంచేత; భస్మము+చేయుము= బూడిద చేయుము.

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠుడా! ఇది చేయరా దని నిరాకరించకుండా, శమీకుడిపుత్రు డైన శృంగి అనే ఒక బ్రాహ్మణుడి ప్రేరణచేత (పిలుపు చేత) తక్షకుడు ఇంతపెద్దకీడు చేశాడు. (నీ తండ్రిని కాటేసి చంపాడు). దానికి ప్రతీకారంగా నీవుకూడా పలువురు బ్రాహ్మణులచేత నిర్వహింపబడే సర్పయాగంలో అగ్నియొక్క భయంకర మైన సమస్త జ్వాలల సముదాయంచేత తక్షకుడు మొదలైన పాములసమూహాన్ని బూడిద చేయుము.

**ఉ. ప్రల్లదుఁ డైన యొక్కకులపాంసను చేసినదానఁ దత్కులం**
**బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము? గావునన్ మహీ**
**వల్లభ! తక్షకాధము నెపంబున సర్పము లెల్ల నగ్నిలోఁ**
**ద్రెళ్ళఁగ సర్పయాగ మతిధీయుత! చేయుము విప్రసమ్మతిన్. 125**

**ప్రతిపదార్థం:** మహీ, వల్లభ= రాజా!; అతి, ధీ, యుత= అధిక మైన బుద్ధితో కూడినవాడా!; ప్రల్లదుఁడు+ఐన= దుష్టు డైన; ఒక్క కుల, పాంసను= కులాన్ని దూషించేవా డైన (కులానికి అపకీర్తి తెచ్చేవా డైన); తక్షకుని (కర్తృపద ప్రథమకు షష్ఠి); చేసిన దానన్= చేసిన పనిచేత; తద్+కులంబు+ఎల్లను= ఆ కులమంతయున్నూ; దూషితంబు+అగుట= నిందింపబడటం; ఏమి+అపూర్వము= ఏమంత ఆశ్చర్యం? (కాదని భావం); కావునన్= అందుచేత; తక్షక+అధమ= హీను డైన తక్షకుని; నెపంబునన్= మిషచే (కారణంచేత), సర్పములు+ఎల్లన్= పాములన్నియునూ; అగ్నిలోన్= అగ్నియందు; త్రెళ్ళఁగన్= పడేటట్లుగా; విప్ర, సమ్మతిన్= బ్రాహ్మణుల అంగీకారంతో; సర్పయాగము= పాములను ఆహుతి చేసే యజ్ఞాన్ని; చేయుము.

**తాత్పర్యం:** మిక్కిలి బుద్ధిమంతుడ వైన ఓ రాజా! దుష్టు డైన ఒక కులదూషకుడు చేసిన చెడ్డపనిచేత ఆ కులమంతా నిందింపబడటం (హింసింపబడటం) ఏమంత వింత? కాబట్టి నీచు డైన ఆ తక్షకుడు కారణంగా పాములన్నీ అగ్నిలో పడి హతమయ్యేటట్లుగా బ్రాహ్మణుల అంగీకారంతో సర్పయాగం చేయుము.

**విశేషం:** కులంలో దుష్టుడు ఒక్క డుంటే చాలు. అతడివలన ఆ కులమంతా హాని పొందుతుంది- అనే వాక్యం గమనిస్తే దుష్టుడైన ఒక దుర్యోధనుడు కారణంగా కౌరవవంశ మంతా పలువురురాజులతో సహా మరణిస్తా రని కావ్యార్థం సూచింపబడుతున్నది. ఇది నన్నయ ప్రతిభాసంపదకు, అతని కవితలోని వస్తుధ్వనికి నిదర్శనం.

**వ. అని యి ట్లయ్యుదంకుండు జనమేజయునకు సర్పయాగంబునందు బుద్ధి పుట్టించె ననిన విని శౌనకాది మహామును లక్కథకున కి ట్లనిరి. 126**

**ప్రతిపదార్థం:** అని=అని పలికి; ఇట్లు= ఈవిధంగా; ఆ+ఉదంకుండు= ఉదంకు డనే పైలశిష్యుడు; జనమేజయునకున్= పరీక్షిత్తు కుమారుడైన జనమేజయుడికి; సర్ప, యాగంబునందున్= సర్పయాగం చేయటంలో; బుద్ధి= తలంపు; పుట్టించెన్= కలిగించాడు; అనినన్= అని సౌతి చెప్పగా; విని; శౌనక+ఆది, మహత్, మునులు= శౌనకుడు మొదలైన మహర్షులు; ఆ+కథకునికిన్= కథ చెప్పే సౌతికి; ఇట్లు= ఈవిధంగా; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** అని బోధించి ఈవిధంగా ఆ ఉదంకు డనే ముని జనమేజయమహారాజుకు సర్పయాగం చేయాలనే తలంపు కలిగించా డని సౌతి చెప్పగా విని, శౌనకుడు మొదలైన మహర్షులు అతనితో ఈవిధంగా అన్నారు.

**చ. అమితజగద్భయంకరవిషాగ్నియు నప్రతిహన్యమాన వీ**
**ర్యముఁ గలయట్టి సర్పముల కా జనమేజయు చేయు సర్పయా**
**గమున నుదగ్రపావకశిఖాతతులం దొరఁగంగఁ గారణం**
**బమలచరిత్ర! యేమి చెపుమయ్య వినం గడు వేడ్క యయ్యెడున్. 127**

**ప్రతిపదార్థం:** అమల చరిత్ర= నిర్మల మైన ప్రవర్తనం కలవాడా! సౌతీ!; అమిత, జగత్, భయంకర, విష+అగ్నియున్= అధికంగా లోకాలకు భయం కలిగించే విష మనే అగ్నియు; అప్రతిహన్యమాన, వీర్యమున్= అడ్డగింపబడని పరాక్రమాన్ని; కల+అట్టి= కలిగినటువంటి; సర్పాలకు; ఆ, జనమేజయు, చేయు= ప్రసిద్ధ డైన జనమేజయ మహారాజు చేసే; సర్పయాగమునన్= పాములను వ్రేల్చే యజ్ఞంలో, ఉదగ్ర, పావక, శిఖా, తతులన్= భయంకరమైన అగ్నియొక్క జ్వాలల సమూహంలో; తొరఁ గంగన్= పడటానికి; కారణము+ఏమి= హేతు వేమిటి?; చెప్పుము+అయ్య= చెప్పవయ్యా (ప్రార్థనార్థకం); వినన్= వినటానికి; కడున్= మిక్కిలి; వేడ్క= కుతూహలం; అయ్యెడున్= ఔతున్నది.

**తాత్పర్యం:** నిర్మల మైన చరిత్ర గల ఓసౌతీ! లోకాలకు అధికంగా భయాన్ని కలిగించే విష మనే అగ్నియు, అడ్డగించటానికి వీలులేని పరాక్రమమూ కల పాములకు జనమేజయమహారాజు చేసే సర్పయాగంలో భయంకర మైన అగ్నిజ్వాలలసమూహాన పడటానికి హేతు వేమిటో తెల్పుమా! వినటానికి చాల కుతూహలం ఔతున్నది.

## భృగువంశ కీర్తనము - భృగు వగ్నికి శాప మొసంగుట (సం. 1-5-3)

**వ. అని యడిగిన వారికి నక్కథకుం డి ట్లని చెప్పెఁ 'దొల్లి సర్పకుల జనని యైన కద్రువ శాపంబు కారణంబునం జేసి జనమేజయు సర్పయాగంబున సర్వభక్షకుం డైన యగ్నియందు సర్పంబుల కెల్ల నకాండప్రళయం బైన, దాని భృగువంశజుండైన రురుండు గావించు సర్పఘాతంబు సహస్రపాదుండుడిగించినట్లు జరత్కారుసుతుం**

**డైన యాస్తీకుండుడిగించె; దీని సవిస్తరంబుగాఁ జెప్పెదవినుం' డని భృగువంశకీర్తనంబు నాస్తీకు చరితంబును జెప్పం దొడంగె. 128**

**ప్రతిపదార్థం:** అని, అడిగినన్; వారికిన్= శౌనకాది మునులకు; ఆ+కథకుండు= కథ చెప్పే సౌతి; ఇట్లు+అని= ఈవిధంగా; చెప్పెన్; తొల్లి= పూర్వం; సర్ప, కుల, జనని, ఐన= పాముల సమూహానికి తల్లి అయిన; కద్రువ= కద్రువ అనే కశ్యపునిభార్య యొక్క; శాపంబు= శాప మనే; కారణంబునన్+చేసి= హేతువుచేత; జనమేజయు, సర్ప, యాగంబునన్= జనమేజయుడు చేసే సర్పయాగంలో; సర్వ, భక్షకుండు+ఐన= అన్నిటిని తినేవా డైన; అగ్ని+అందున్= అగ్నిలో; సర్పంబులకున్+ఎల్లన్= పాముల కన్నిటికిని; అకాండ, ప్రళయంబు+ఐనన్= అకస్మాత్తుగా (తలవని తలంపుగా) నాశనం కాగా; దానిన్= ఆ ప్రళయాన్ని; భృగు, వంశజుండు+ఐన= భృగుమహాముని వంశంలో పుట్టినవా డైన; రురుండు= రురుడు అనేవాడు; కావించు= చేసే, సర్ప, ఘాతంబు= పాములను చంపేక్రియను; సహస్రపాదుండు= సహస్రపాదుడు అనే ముని; ఉడిగించిన, అట్లు= మాన్పించినట్లుగా; జరత్కారు, సుతుండు+ఐన= జరత్కారు దంపతుల కుమారు డైన; ఆస్తీకుండు= ఆస్తీకుడు అనే వాసుకి మేనల్లుడు; ఉడిగించెన్= మాన్పించెను; దీనిన్= ఈవృత్తాంతాన్ని; స, విస్తరంబుగాన్= వివరాలతో కూడుకొని ఉండేటట్లుగా; చెప్పెదన్; వినుండు+అని; భృగువంశ, కీర్తనంబున్= భృగుమహర్షి వంశంయొక్క స్తుతియున్నూ; ఆస్తీకు, చరితంబును= ఆస్తీకుని వృత్తాంతమున్నూ; చెప్పన్, తొడంగెన్= చెప్పటానికి ఆరంభించాడు.

**తాత్పర్యం:** అని శౌనకాదిమునులు అడుగగా కథకు డైన సౌతి ఈవిధంగా చెప్పాడు. పూర్వం పాముల సమూహానికి తల్లి అయిన కద్రువ ఇచ్చిన శాపం కారణంగా జనమేజయుడు చేసిన సర్పయాగంలో సర్వభక్షకు డైన అగ్నియందు పాముల కన్నింటికిని ఆకస్మిక మైన నాశం కలుగగా, ఆ నాశంనుండి భృగువంశసంజాతు డైన రురుడు చేసే సర్పమారణాన్ని సహస్రపాదు డనే ముని మాన్పించినట్లుగా జరత్కారు దంపతుల కుమారు డైన ఆస్తీకు డనేముని మాన్పించాడు. ఈ వృత్తాంతాన్ని విపులంగా చెప్పుతాను. వినండి. అని భృగుమహామునివంశంయొక్క కీర్తనాన్నీ, ఆస్తీకునికథనూ చెప్పటం ఆరంభించాడు.

**సీ. భృగుఁ డను విప్రుండు మగువఁ బులోమ యన్ । దాని గర్భిణిఁ దన ధర్మపత్ని**
**నగ్నిహోత్రమునకు నగ్నులు విహరింపు । మని పంచి యభిషేచనార్థ మరుగ,**
**నంతఁ బులోముఁ డన్ వింతరక్కసుఁ డగ్ని । హోత్రగృహంబున కొయ్య వచ్చి,**
**యత్తన్విఁ జూచి, యున్మత్తుఁడై 'యెవ్వరి । సతి యిది సెప్పుమా జాతవేద!'**

**ఆ. యనఁగ, నగ్నిదేవుఁ డనృతంబునకు విప్ర । శాపమునకు వెఱచి'శాపభయము**
**దీర్చుకొనఁగఁ బోలుఁ, దీర్పరా దనృతాబ్ధి । భాషణమున నైన పాపభయము.' 129**

**ప్రతిపదార్థం:** భృగుఁడు+అను; విప్రుండు= బ్రాహ్మణుడు; పులోమ, అన్, దానిన్= పులోమ అనే పేరు కలదానిని; మగువన్= (స్త్రీని) భార్యను; గర్భిణిన్= గర్భవతిని; తన; ధర్మ, పత్నిన్= వేదోక్తధర్మాన్ని అనుసరించి పెండ్లాడిన భార్యను; అగ్నిహోత్రమునకున్= అగ్నికార్యానికి; అగ్నులు; ఆహవనీయం, దక్షిణాగ్ని గార్హపత్యం అనే త్రేతాగ్నులను, విహరింపుము+అని= ప్రజ్వలింపచేయుము అని; పంచి= ఆజ్ఞాపించి; అభిషేచన+అర్థము= స్నానం చేసే నిమిత్తం; అరుగన్= వెళ్ళగా; అంతన్= అప్పుడు; పులోముఁడు+అన్= పులోముడు అనే పేరు కల; వింత, రక్కసుఁడు= అరుదైన రాక్షసుడు (అతడు వరాహరూపంలో రావటంచేత వింత పదం వాడబడింది); అగ్నిహోత్ర, గృహంబునకున్= అగ్నులను ఉపాసించే గృహభాగానికి; ఒయ్యన్= మెల్లగా; వచ్చి; ఆ+తన్విన్= పులోమ అనే ఆ స్త్రీని; చూచి; ఉన్మత్తుండు+ఐ= మోహించిన వాడై; జాతవేద= ఓ అగ్నీ!; ఇది=

ఈమె; ఎవ్వరి, సతి= ఎవరి భార్య?; చెప్పుమా= తెల్పుమా; అనఁగన్= అని అడుగగా; అగ్ని దేవుఁడు= దేవుడైన అగ్ని; అనృతంబునకున్= అసత్యానికిన్నీ; విప్రశాపంబునకున్= బ్రాహ్మణు డైన భృగువు పెట్టే శాపానికిన్నీ; వెఱచి= భయపడి; శాప, భయము= శాపంవలని భయాన్ని (హానిని); తీర్చుకొనఁగన్+పోలున్= తొలగించుకోవచ్చును; అనృత+అభిభాషణమునన్= అసత్యం పల్కటంచేత; ఐన= కలిగిన; పాప, భయంబు= పాపంవలనిభయం; తీర్పన్, రాదు= తొలగింపరాదు.

**తాత్పర్యం:** భృగు వనే బ్రాహ్మణుడు గర్భవతియు, తన ధర్మపత్నియు అయిన పులోమ అనే సతిని అగ్నికార్యానికి అగ్నులను ప్రజ్వలింపజేయు మని నియోగించి స్నానం చేయటానికై వెళ్ళగా, అపుడు పులోముడు అనే పేరుగల వింతరాక్షసుడు అగ్నిగృహానికి మెల్లగా వచ్చి ఆ వనితను చూచి మోహితు డై 'ఓ అగ్నీ! ఈమె ఎవ్వరి భార్యయో చెప్పు' మని అడుగగా, అగ్నిదేవుడు అటు అసత్యం చెప్పటానికీ, ఇటు భృగు విచ్చే శాపానికీ భయపడి, 'శాపం వలన కలిగే హాని తొలగించుకోవచ్చును; అసత్య మాడటంవలన కలిగే పాపాన్ని తొలగింపరాదు'.

**విశేషం:** ఇందులో అసత్యభాషణంవలన కలిగే పాపం ఎంత అధికమైనదో సూచింపబడింది. ఇది నన్నయ సత్యనిష్ఠకు నిదర్శనం' అందుచేతనే అతడు 'నిత్యసత్యవచను' డనటం.

**వ. అని విచారించి యప్పరమపతివ్రత భృగుపత్ని యని కలరూపుఁ జెప్పిన, నప్పులోముండు 'నిది నాకుఁ దొల్లి వరియింపంబడిన భార్య, పదంపడి భృగుండుపెండ్లియయ్యె' నని వరాహరూపంబున నాసాధ్వినతిసాధ్వసచిత్త నెత్తికొని పర్వం బర్వం, దద్గర్భంబున నున్న యర్భకుండు గరం బలిగి కుక్షిచ్యుతుం డై చ్యవనుండు నాఁ బరఁగె నమ్మునికుమారుని. 130**

**ప్రతిపదార్థం:** అని; విచారించి= ఆలోచించి; ఆ+పరమ, పతివ్రత= ఆ గొప్ప పతివ్రత (భర్తయే వ్రతంగా కలది); భృగుపత్ని= భృగుమహర్షి యొక్క భార్య; అని; కల, రూపున్= ఉన్న విధం (యథార్థం) చెప్పినన్= తెల్పగా; ఆ+పులోముండున్= ఆ పులోము డనే రాక్షసుడున్నూ; ఇది= ఈమె; నాకున్= నాకొరకు; వరియింపబడిన= కోరబడిన (ఎన్నబడిన); భార్య; పదంపడి= పిమ్మట; భృగుండు= భృగుమహాముని; పెండ్లి, అయ్యెన్= వివాహ మాడినాడు; అని= అని తలచి; వరాహ, రూపంబునన్= పంది రూపంలో; ఆ, సాధ్విన్= ఆ పతివ్రతను; అతి, సాధ్వస, చిత్తన్= మిక్కిలి భయంతో కూడిన హృదయం కలదానిని; ఎత్తికొని= చేత గ్రహించి; పర్వన్, పర్వన్= వేగంగా చాలదూరం పరుగెత్తగా; పరుగెత్తగా (పఱచు ధాతువు యొక్క తుమున్నర్థక రూపం. పర్చు - పర్వన్); తద్+గర్భంబునన్= ఆమె గర్భంలో; ఉన్న; అర్భకుండు= శిశువు; కరంబు= మిక్కిలి; అలిగి= కోపించి; కుక్షి, చ్యుతుండు+ఐ= గర్భంనుండి జారినవాడై; చ్యవనుండు, నాన్= చ్యవనుడు (జారినవాడు) అనగా; పరఁగెన్= ఒప్పెను; ఆ+ముని, కుమారునిన్= ఆ భృగుమునియొక్క కొడుకును.

**తాత్పర్యం:** అని ఆలోచించి ఆ మహాపతివ్రత భృగుమహర్షిభార్య అని యథార్థం చెప్పగా ఆ పులోముడు 'ఈమె పూర్వం నాకై ఎన్నబడిన భార్య. తరువాత ఈమెను భృగుమహర్షి పెండ్లాడాడు' అని తలంచి పందిరూపంతో మిక్కిలి భయంతో కూడిన హృదయం గల ఆ పతివ్రతను గ్రహించి చాలాదూరం పరుగెత్తగా ఆమె గర్భంలో ఉన్న శిశువు మిక్కిలి కోపించి గర్భంనుండి జారి చ్యవను డనే పేరుతో ఒప్పారాడు. ఆ మునికొడుకును.

**విశేషం:** కుక్షిచ్యుతుడు కావటంచేత అతడికి చ్యవను డనే పేరు కలిగింది. పర్వన్ పర్వన్ అనే ద్విరుక్తి వలన చాల దూరం, కాలం సూచింపబడుతున్నవి!

## చ్యవనునివలనఁ బులోముఁడను రాక్షసుండు చచ్చుట

**క. సముదిత సూర్య సహస్రో । పమ దుస్సహతేజు జగదుపప్లవ సమయా**
**సమదీప్తి తీవ్ర పావక । సముఁ జూచుచు నసుర భస్మసాత్కృతుఁ డయ్యెన్. 131**

**ప్రతిపదార్థం:** సముదిత, సూర్య, సహస్ర, ఉపమ, దుస్సహ, తేజున్= ఉదయించిన సూర్యుల వేయిమందితో సమానమైన సహింపశక్యం కాని కాంతి గలవాడిని; జగత్, ఉపప్లవ, సమయ, అసమ, దీప్తి, తీవ్ర, పావక, సమున్= లోకాలయొక్క ప్రళయకాలంలోని అప్రతిమాన మైన (సాటిలేని) కాంతి కల తీక్ష్ణ మైన అగ్నితో సమాన మైనవాడిని (మునికుమారుడిని); చూచుచున్; అసుర= రాక్షసుడు (పులోముడు); భస్మసాత్కృతుఁడు= బూడిదగా చేయబడినవాడు; అయ్యెన్= అయినాడు.

**తాత్పర్యం:** ఉదయించిన వేయిమంది సూర్యులతో సమాన మైన సహింపశక్యం గాని తేజస్సు కలవాడున్నూ, ప్రపంచానికి ప్రళయం కలిగే సమయంలో సాటిలేని కాంతిగల తీక్ష్ణ మైన అగ్నితో సమానమైన వాడున్నూ అయిన మునికుమారుడిని (చ్యవనుడిని) చూస్తూ పులోముడు దగ్ధ మై బూడిద అయినాడు.

**విశేషం:** ప్రళయాలు పలురకాలు. అగ్నిప్రళయంలో తీవ్రతేజస్సు గల అగ్నిచేత జగత్తంతా దగ్ధ మై బూడిద ఔతుంది. అసుర శబ్దం వైకల్పికంగా స్త్రీసమం. అసుర, అసురుడు, సంస్కృతసమాసంలో కాదు. రావణాసురుడు అలం: ఉపమ.

**వ. పులోమయు నక్కొడుకు భృగుకులవర్ధను నెత్తికొని నిజాశ్రమంబునకు వచ్చె; నంతకు ముందఱ నా రక్కసునకు వెఱచి యక్కోమలి యేడ్చుచుం బోయినఁ దద్బాష్పధారాప్రవాహంబు మహానది యై తదాశ్రమసమీపంబునం బాఱిన దానికి వధూసర యను నామంబు లోకపితామహుండు సేసె; నంతఁ గృతస్నానుం డై భృగుండు సనుదెంచి బాలార్కుండునుంబోని బాలకు నెత్తికొనియున్న నిజపత్నిం జూచి యసుర సేసిన యపకారంబున కలిగి, 'యయ్యసుర ని న్నె ట్లెఱింగె? నెవ్వరు సెప్పి' రనినఁ బులోమ యి ట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** పులోమయున్= ఆ పులోమకూడ; భృగు, కుల, వర్ధనున్= భృగుమహామునియొక్క వంశాన్ని వృద్ధి పొందించే; ఆ+కొడుకున్= ఆ కుమారుడిని; ఎత్తికొని; నిజ+ఆశ్రమంబునకున్= తన ఆశ్రమానికి; వచ్చెన్; ఆవచ్చుటకు, ముందఱన్= ఆ రావటానికి ముందే; ఆ రక్కసునకున్= పులోము డనే ఆ రాక్షసునికి, వెఱచి= భయపడి; ఆ+కోమలి= ఆ కాంత (పులోమ); ఏడ్చుచున్, పోయినన్= ఏడుస్తూ పోగా; తద్, బాష్ప, ధారా, ప్రవాహంబు= ఆమె కన్నీటి ధారలయొక్క ప్రవాహం; మహత్, నది, ఐ= గొప్పనది యై; తద్, ఆశ్రమ, సమీపంబునన్= ఆ ఆశ్రమం చెంత; పాఱినన్= ప్రవహింపగా; దానికిన్= ఆ నదికి; లోక, పితామహుండు= లోకానికి తాత అయిన బ్రహ్మ; వధూసర, అను, నామంబు= వధూసర అనే పేరు; చేసెన్= పెట్టాడు; అంతన్= పిమ్మట; కృత, స్నానుండు+ఐ= చేయబడిన స్నానం కలవాడై (స్నానం చేసిన వాడై); భృగుండు= భృగుమహర్షి; చనుదెంచి= వచ్చి; బాల+అర్కుండునున్+పోని= లేతసూర్యుడిని పోలిన; బాలకున్= కుమారుడిని; ఎత్తికొని, ఉన్న; నిజపత్నిన్= తన భార్యను; చూచి; అసుర+చేసిన= రాక్షసుడు చేసిన; అపకారంబునకున్= కీడునకు; అలిగి= కోపించి; ఆ+అసుర= ఆ రాక్షసుడు; నిన్నున్, ఎట్లు+ఎఱింగెన్= నిన్ను ఏ విధంగా తెలిసికొన్నాడు?; ఎవ్వరు, చెప్పిరి; అనినన్; పులోమ; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** భృగుమహర్షివంశాన్ని పెంపొందించే ఆ కుమారుడిని ఎత్తుకొని పులోమ తన ఆశ్రమానికి వచ్చింది. ఆమె రావటానికి పూర్వమే ఆ రాక్షసుడికి భయపడి ఆ పులోమ ఏడుస్తూ పోగా ఆమెకన్నులనుండి కారిన కన్నీళ్ళ

ధారలయొక్క ప్రవాహం గొప్పనది యై ఆ ఆశ్రమంచెంత ప్రవహింపగా, ఆనదికి లోకానికే తాత అయిన బ్రహ్మదేవుడు వధూసర అనే పేరు పెట్టాడు. పిమ్మట స్నానం చేసి భృగుమహర్షివచ్చి లేత సూర్యుడి వంటి కుమారుడిని ఎత్తుకొని ఉన్న తనభార్యను చూచి, రాక్షసుడు చేసిన హానికి కోపించి, 'ఆ రాక్షసుడు నిన్ను ఎట్లా తెలిసికొన్నాడు?' 'నీజాడ ఎవ్వరు చెప్పారు?' అని అడుగగా పులోమ ఇట్లా పలికింది

**విశేషం:** అలం: ఉపమ. వధూసర అంటే వధువును (స్త్రీని) అనుసరించేది అని అర్థం.

**క. ఈ యగ్నిదేవుఁ డసురకు । నో యన చెప్పుటయు విని మహోగ్రాకృతితో**
**నాయసుర నన్ను సూకర । మై యప్పుడ యెత్తుకొని రయంబునఁ జనుచోన్. 133**

**ప్రతిపదార్థం:** ఈ+అగ్నిదేవుఁడు= దేవు డైన ఈ అగ్ని; అసురకున్= రాక్షసునికి; ఓ, యనన్ - ఒయ్యనన్= మెల్లగా; చెప్పుటయున్= నన్నుగూర్చి తెలుపగా; విని; మహత్, ఉగ్ర+ఆకృతితోన్= గొప్ప భయంకర మైన ఆకారంతో; ఆ+అసుర= ఆ రాక్షసుడు; నన్నున్; సూకరము+ఐ= పంది యై; అప్పుడు+అ= వెంటనే; ఎత్తికొని= గ్రహించి; రయంబునన్= వేగంతో; చనుచోన్= వెళ్ళేటప్పుడు.

**తాత్పర్యం:** ఈ అగ్నిదేవుడు పులోమరాక్షసుడికి మెల్లగా నన్నుగూర్చి చెప్పగా విని, చాల భయంకర మైన ఆకారంతో ఆ రాక్షసుడు పంది యై నన్ను వెంటనే ఎత్తికొని వేగంతో వెళ్లే ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'కుక్షిచ్యుతుఁడై సుతుఁ డా । రాక్షసు భస్మంబు సేసి రాజితశక్తిన్**
**రక్షించె నన్ను' నవవుడు । నక్షణమ మునీంద్రుఁ డగ్ని కతిరోషమునన్. 134**

**ప్రతిపదార్థం:** సుతుఁడు= పుట్టిన కుమారుడు; కుక్షి, చ్యుతుఁడు+ఐ= గర్భంనుండి జారినవాడై; రాక్షసునిన్= రాక్షసు డైన పులోముడిని; భస్మంబు, చేసి= బూడిద చేసి; రాజిత, శక్తిన్= ప్రకాశించే శక్తితో; నన్నున్; రక్షించెన్= కాపాడెను; అనవుడున్= అనిన తరువాత; ఆ, క్షణము+అ= తత్ క్షణమే, వెంటనే; ముని+ఇంద్రుఁడు = ముని శ్రేష్ఠు డైన భృగువు; అగ్నికిన్; అతి, రోషమునన్= మిక్కిలి కోపంతో.

**తాత్పర్యం:** 'గర్భంలోని కుమారుడు గర్భంలోనుండి జారి ఆ రాక్షసుడిని బూడిద చేసి ప్రకాశించే మహిమతో నన్ను కాపాడాడు, అనిన అనంతరం మునిశ్రేష్ఠు డైన భృగువు వెంటనే అగ్నికి అతికోపంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఆ క్షణము అని పాఠాంతరం. త్రికముమీది అసంయుక్త హల్లునకు ద్విత్వం వస్తుంది. క్ష- అసంయుక్తం కాదు. అప్పుడు 'ఆ' హ్రస్వం కాదు, కాని క్షణమైనా వ్యవధానం లేకుండా అని అర్థం చెప్పవచ్చును.

**వ. 'నీ వతిక్రూరుండవు సర్వభక్షకుండవు గ' మ్మని శాపం బిచ్చిన నగ్నిదేవుం డి ట్లనియె. 135**

**ప్రతిపదార్థం:** నీవు; అతి, క్రూరుండవు= మిక్కిలి దుష్టుడవు; సర్వ, భక్షకుండవు= అన్నింటిని తినేవాడవు; కమ్ము= అగుము; అని; శాపంబు+ఇచ్చినన్= శపించగా; అగ్నిదేవుండు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'నీవు మిక్కిలి దుష్టుడవు, అన్నిటిని తినువాడవు కమ్ము' అని భృగువు శపించగా అగ్నిదేవుడు ఈవిధంగా అన్నాడు.

**క. తన యెఱింగిన యర్థం బొరుఁ । డనఘా! యిది యెట్లు సెప్పు మని యడిగినఁ జె**
**ప్పనివాఁడును సత్యము సె । ప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడున్. 136**

**ప్రతిపదార్థం:** ఒరుఁడు= ఇతరుడు; తన, ఎఱిఁగిన, అర్థంబు= తాను తెలిసికొనిన విషయాన్ని; అనఘా!= ఓ పాపరహితుడా!; ఇది, ఎట్లు, చెప్పుము= ఇది ఏవిధంగా జరిగిందో తెలుపుము; అని అడిగినన్= అని అడుగగా; చెప్పనివాఁడును= తెలుపని అతడును; సత్యము= నిజం; చెప్పనివాడును= తెలుపని అతడును; ఘోర, నరక, పంకమునన్= భయంకరమైన నరక మనే బురదలో; పడున్= పడతాడు.

**తాత్పర్యం:** తనకు తెలిసిన విషయాన్ని ఇతరు డెవరైనా 'ఓ పుణ్యాత్ముడా! ఇది ఎట్లా జరిగిందో తెలుపు' మని అడిగితే చెప్పటానికి నిరాకరించే వాడున్నూ, నిజం చెప్పక అబద్ధం చెప్పేవాడున్నూ భయకంర మైన నరక మనే బురదలో పడతారు. (ఇక్కడ బురదవంటి నరకంలో పడతా రని కూడ చెప్పవచ్చును. అప్పు డది ఉపమాన ఉత్తర పద కర్మధారయం).

**విశేషం:** ఇక్కడ కర్తృపదంలో రెండు శబ్దా లున్నప్పటికి వారు వేరే వ్యక్తులు కావటం చేత క్రియాపదం ఏకవచనంలోనే వాడబడింది. చెప్పనినాఁడును, అని పాఠాంతరం, చెప్పనప్పుడును అని అర్థం. అలం: రూపకం.

**వ. కావున నే నసత్యంబునకు వెఱచి యక్కోమలి భృగుపత్ని యని కల రూపుఁ జెప్పితి; నఖిల జగత్కర్మసాక్షినై యుండి యసత్యం బెట్లు పలుక నేర్తు? నది నిమిత్తంబుగా నీవు నాకు శాపం బిచ్చిన, నే నలిగి నీకుఁ బ్రతిశాపం బీనోపనివాఁడను గాను; వినుము. 137**

**ప్రతిపదార్థం:** కావునన్; ఏను= నేను; అసత్యంబునకున్= అబద్ధం పల్కటానికి; వెఱచి= భయపడి; ఆ+కోమలి= ఆస్త్రీ; భృగుపత్ని= భృగుమహర్షియొక్క భార్య; అని; కల, రూపున్= ఉన్న విధాన్ని (సత్యవిషయాన్ని); చెప్పితిన్= తెలిపితిని; అఖిల, జగత్, కర్మ, సాక్షిని+ఐ= ఎల్ల లోకాలలోని జనుల పనులకు సాక్షి నై, ఉండి; అసత్యంబు= అబద్ధం; ఎట్లు= ఏ విధంగా; పలుకన్, నేర్తున్= చెప్పజాలుదును?; అది, నిమిత్తంగా= నేను సత్యం చెప్పటం కారణంగా; నీవు; నాకున్; శాపంబు+ఇచ్చినన్; ఏను= నేను; అలిగి= కోపించి; ప్రతి శాపంబు= తిరిగి శాపం; ఈన్, ఓపనివాఁడను, కాను= ఇవ్వటానికి శక్తిలేనివాడను కాను, వినుము.

**తాత్పర్యం:** కాబట్టి, నేను అబద్ధం చెప్పటానికి భయపడి, ఆ సాధ్వి భృగుమహర్షిభార్య అని నిజ మైన విషయం ఉన్నది ఉన్నట్లు తెలిపినాను. ఎల్లలోకాలలోని ప్రజలు చేసే పనులను చూచేవాడనై ఉండి అబద్ధం ఏవిధంగా చెప్పజాలుతాను? అది కారణంగా నీవు నన్ను శపించగా నేనుకూడ కోపించి నీకు తిరిగి శాపం ఈయలేనివాడను కాను. వినుము.

**విశేషం:** శాపభయం కంటె, అసత్యభయానికే ప్రాధమ్యం.

చ. అడిచినఁ, దిట్టినన్, మఱి మహాపరుషంబులు పల్కి యల్కతోఁ
బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు; వారల కెగ్గు సేసినం
జెడు నిహముం బరంబు, నిది సిద్ధము గావు టెఱింగి, భక్తి నె
ప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు, నల్గ నోడుదున్. 138

**ప్రతిపదార్థం:** అడిచినన్= కొట్టినప్పటికిన్నీ; తిట్టినన్= తిట్టినప్పటికిన్నీ; మఱి= ఇంకను; మహత్+పరుషంబులు= అతి కఠిన వాక్యాలు; పల్కి; అల్కతోన్= కోపంతో; పొడిచినన్= పిడికిలి మొదలైన వాటితో కొట్టినప్పటికిన్నీ; ఉత్తమ, ద్విజులు= శ్రేష్ఠులైన బ్రాహ్మణులు; పూజ్యులు= పూజింపదగినవారు; వారలకున్= ఆ బ్రాహ్మణులకు; ఎగ్గు= హాని; చేసినన్= చేస్తే, ఇహమున్, పరంబున్= ఈ లోకంలోని సౌఖ్యమున్నూ, పైలోకంలోని సౌఖ్యమున్నూ; చెడున్= చెడిపోతాయి. ఇది= ఇట్లా చెడిపోవటం; సిద్ధము, కావుట= యథార్థం అగుట (నిర్ణయింపబడింది కావటం); ఎఱింగి= తెలిసికొని; భక్తిన్= భక్తితో; ఎప్పుడున్= ఎల్లప్పుడును; ధరణీసుర+ఉత్తములన్= శ్రేష్ఠులైన బ్రాహ్మణులను; పూజలన్= పూజలతో; తన్పుదున్= తృప్తి పొందిస్తాను;అల్గన్, ఓడుదున్= కోపించటానికి జంకుతాను.

**తాత్పర్యం:** కొట్టినా, తిట్టినా, ఇంకను అతికఠినా లైన వాక్యాలు పలికి కోపంతో పోట్లాడినా శ్రేష్ఠ లైన బ్రాహ్మణులు పూజించదగినవారు. అట్టి బ్రాహ్మణులకు హాని చేస్తే ఇహపరాలు చెడిపోతాయి. ఈవిషయం నిశ్చితమని ఎఱిగినవాడను కావటంచేత ఎప్పుడును శ్రేష్ఠ లైన బ్రాహ్మణులను భక్తితో పూజించి తృప్తి పొందిస్తాను. వారిపై కోపించటానికి భయపడతాను.

**విశేషం:** ఇక్కడ ఉత్తమద్విజులు అనే పదంలోని ఉత్తమ అనే విశేషణం గమనింపదగినది.

వ. 'నీవు బ్రాహ్మణుండవు నీ వెద్ది సేసిన నీక చను; లోకహితుండ నయిన నాకు శాపం బిచ్చి లోకంబుల కెల్లఁ జెట్ట సేసితి; వ దెట్లనిన వేదోక్తంబు లయిన నిత్యనైమిత్తిక బలివిధానంబులందు మహాద్విజులచేత నాయందు వేల్వంబడిన హవ్య కవ్యంబులు నాముఖంబునన దేవపితృగణంబు లుపయోగింతు; రట్టి యేను సర్వభక్షకుండ నై యశుచి నైనఁ గ్రియానివృత్తి యగుఁ; గ్రియానివృత్తి యైన లోకయాత్ర లేకుండు' నని యగ్నిభట్టారకుండు నిఖిలలోకవ్యాప్తం బైన తనతేజోమూర్తి నుపసంహరించిన. 139

**ప్రతిపదార్థం:** నీవు; బ్రాహ్మణుండవు; నీవు; ఎద్ది, చేసినన్= ఏది చేసినా; నీకున్+అ= నీకే; చనున్= తగును; లోక, హితుండన్+అయిన= జగత్తుకు మేలు చేసే వాడిని అయిన; నాకున్= శాపంబు+ఇచ్చి; లోకంబులకున్+ఎల్లన్= సర్వజగత్తులకున్నూ; చెట్ట, చేసితివి= కీడు చేశావు; అది= ఆ కీడు; ఎట్లు+అనినన్= ఏవిధంగా అనినన్; వేద+ఉక్తంబులు+అయిన= వేదాలయందు చెప్పబడిన వయిన; నిత్య, నైమిత్తిక, బలి, విధానంబులందున్= నిత్యం చేయదగినవియున్నూ; నిమిత్తంవలన చేయదగినవియున్నూ అగు పూజాపద్ధతులందు; మహా; ద్విజులచేతన్= గొప్ప బ్రాహ్మణులచేత; నాయందున్; వేల్వంబడిన= హోమంచేయబడిన, హవ్య, కవ్యంబులు= దేవతల కీయదగినవియున్నూ, పితృదేవతల కీయదగినవియున్నూ అయిన అన్నం మొదలైన పదార్థాలు; నా, ముఖంబునన్+అ= నా ద్వారానే; దేవ, పితృ, గణంబులు= దేవతలయొక్కయు, పితృదేవతలయొక్కయు సముదాయాలు; ఉపయోగింతురు= అనుభవిస్తారు,; అట్టి, ఏను= అటువంటి నేను; సర్వభక్షకుండను+ఐ= అన్నింటిని తినేవాడినై; అశుచిని, ఐనన్= అపవిత్రుడిని అయితే; క్రియా, నివృత్తి= కర్మలయొక్క లోపం (అప్రవృత్తి); అగున్= ఔతుంది; క్రియా, నివృత్తి, అయినన్= కర్మల అప్రవృత్తి అయితే; లోక, యాత్ర= లోకంయొక్క ప్రవర్తనం; లేక, ఉండున్; అని; అగ్ని

భట్టారకుండు= పూజ్యు డైన అగ్ని; నిఖిల, లోక, వ్యాప్తంబు+ఐన= అన్నిలోకాలయందును వ్యాపించిన; తన, తేజః, మూర్తిన్= తన యొక్కకాంతిరూప మైన మూర్తిని; ఉపసంహరించినన్= మరలించగా, తొలగించగా.

**తాత్పర్యం:** నీవు బ్రాహ్మణుడవు. నీ వేది చేసినా నీకే తగుతుంది; లోకాలకు మేలు చేసేవాడ నైన నాకు శాపమిచ్చి లోకాల కన్నింటికి కీడు చేశావు. అది ఎట్లాగంటే వేదాలయందు చెప్పబడిన నిత్యం చేసేవీ, నిమిత్తంవలన చేయదగినవీ అయిన పూజాపద్ధతులందు గొప్పబ్రాహ్మణులచేత నాయందు హోమం చేయబడిన వై దేవతలకూ పితృదేవతలకూ ఇచ్చే అన్నాది వస్తువులు నాద్వారానే దేవతల పితృదేవతల సమూహాలు ఉపయోగిస్తారు. అటువంటి నేను అన్నింటిని తినేవాడనై అపవిత్రుడిని అయితే కర్మలలోపం ఔతుంది. కర్మలలోప మైతే లోకగమనం సాగకుండా ఉంటుంది. అని పలికి పూజ్యు డైన అగ్ని అన్నిలోకాలలో వ్యాపించిన తనకాంతిమయ మైన రూపాన్ని లేకుండ చేయగా.

**విశేషం:** దేవతలకు ఈయదగిన అన్నాదులు హవ్యాలు, పితృదేవతలకు ఈయదగిన అన్నాదులు కవ్యాలు. నిత్యకర్మలు ప్రతిదినం చేయదగినట్టివి. సంధ్యావందనాదులు. వీటిని చేయకపోతే పాపం కలుగుతుంది. ఏదైన నిమిత్తంవలన చేయదగిన కార్యాలు, తీర్థయాత్రాదులు నైమిత్తికాలు, "అగ్నిముఖావై దేవతాః" అని శ్రుతి.

**సీ.** **త్రేతాగ్ను లెల్లను దేజరిల్లమిఁ జేసి । క్రతుకృత్యములు వినిర్గతము లయ్యెఁ;**
**నగ్ని హోత్రములందు నౌపాసనాది సా । యంప్రాతరాహుతు లంత నుడిగె;**
**దేవతార్చనలందు దీపధూపాది స । ద్విధులు వర్తిల్లక విరతిఁ బొందెఁ;**
**బితృకార్యములఁ బితృపిండయజ్ఞక్రియ । లడఁగె విచ్ఛిన్నంబు లై ధరిత్రి;**

**ఆ.** **నంత జనులు సంభ్రమాక్రాంతు లై మహా । మునులకడకుఁ జనిరి, మునులు నమర**
**వరులకడకుఁ జనిరి, వారును వారును । బ్రహ్మకడకుఁ జనిరి భయము నొంది.** **140**

**ప్రతిపదార్థం:** త్రేత+అగ్నులు+ఎల్లను= ఆహవనీయం, దక్షిణాగ్ని, గార్హపత్యం అనే మూడు అగ్నులున్నూ; తేజరిల్లమిన్+చేసి= ప్రకాశింపక పోవటంచేత; క్రతు, కృత్యములు= యాగకర్మలు; వినిర్గతములు+అయ్యెన్= లోపించినవి; అంతన్= అప్పుడు; అగ్నిహోత్రములందున్= అగ్నులలో; ఔపాసన+ఆది, సాయం, ప్రాతన్+ఆహుతులు= గృహస్థులైన బ్రాహ్మణులు చేసే అగ్ని ఉపాసన మొదలైన సాయంకాలాలలో ఉదయాలలో చేయదగిన హోమాలు; ఉడిగెన్= ఆగినవి; దేవతా+అర్చనలందున్= దేవతలకు చేసే పూజలలో; దీప, ధూప+ఆది, సత్, విధులు= దీపం, ధూపం మొదలైన మంచి విధానాలు; వర్తిల్లక= జరుగకుండ; విరతిన్, పొందెన్= విరామాన్ని పొందినవి (ఆగిపోయినవి); పితృ, కార్యములన్= పితృదేవతలకు చేయవలసిన శ్రాద్ధాది కృత్యాలలో; పితృ, పిండ, యజ్ఞ, క్రియలు= పితృదేవతలకు ఈయదగిన పిండాలును, యజ్ఞకార్యాలును; ధరిత్రిన్= భూమియందు; విచ్ఛిన్నంబులు+ఐ= భగ్నాలై (కొనసాగకుండినవై); అడఁగెన్= లోపించినవి; అంతన్= అప్పుడు; జనులు; సంభ్రమ+ఆక్రాంతులు+ఐ= వేగిరపాటుచేత ఆక్రమింపబడినవారై; మహా, మునుల, కడకున్= గొప్పమునులచెంతకు; చనిరి= వెళ్ళారు; మునులున్= ఆ మునులుకూడ; అమరవరుల కడకున్; దేవతాశ్రేష్ఠుల చెంతకు; చనిరి; వారును, వారును= ఆ మునులూ, దేవతలూ; భయమున్, ఒంది= భయపడి; బ్రహ్మకడకున్= బ్రహ్మచెంతకు; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ఆహవనీయం, దక్షిణాగ్ని, గార్హపత్యం అనే ఈమూడు అగ్నులున్నూ ప్రకాశించక పోవటంచేత యాగకార్యాలు లోపించినవి. అప్పుడు అగ్నులందు ఉపాసనం మొదలైన సాయంకాలాలలో ఉదయకాలాలలో చేసే హోమాలు లేకుండ పోయినవి; భూమియందు పితృకర్మలందు పితృదేవతలకు ఈయదగిన పిండాలు, యజ్ఞకార్యాలు

భగ్నాలై నశించినవి; అప్పుడు ప్రజలు వేగిరపాటుతో కూడిన వారై మునులచెంతకు వెళ్ళారు. మునులుకూడ దేవతా శ్రేష్ఠులచెంతకు వెళ్ళారు. ఆ మునులూ, దేవతలూ భయపడి బ్రహ్మదేవుడి చెంతకు వెళ్ళారు.

**విశేషం:** అగ్ని తనరూపాన్ని ఉపసంహరించటంవలన కలిగే నష్టాలన్నీ ఇందులో చెప్పబడినవి.

**వ. బ్రహ్మయు భృగుశాప నిమిత్తంబున నగ్నిభట్టారకు నుపసంహారంబును, సకలలోక వ్యవహార విచ్ఛేదంబును నెఱింగి, యగ్నిదేవు రావించి యి ట్లనియె. 141**

**ప్రతిపదార్థం:** బ్రహ్మయున్= బ్రహ్మకూడ; భృగు, శాప, నిమిత్తంబునన్= భృగుమహర్షి శాపం అనే హేతువుచేత; అగ్ని, భట్టారకు+ఉపసంహారంబును= పూజ్యుడైన అగ్ని తన రూపాన్ని లేకుండ చేయటమున్నూ; సకల, లోక, వ్యవహార, విచ్ఛేదంబునున్= ఎల్ల లోకాలలోని వ్యాపారాల భంగాన్నీ; ఎఱింగి= తెలిసికొని; అగ్ని, దేవున్= దేవు డైన అగ్నిని; రావించి= రప్పించి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** బ్రహ్మకూడ భృగుమహర్షి ఇచ్చిన శాపం కారణంగా పూజ్యు డైన అగ్ని తన తేజోరూపాన్ని లేకుండా చేయటమున్నూ, ఎల్లలోకాలలోని కర్మల కేర్పడిన భంగమున్నూ తెలిసికొని అగ్నిదేవుడిని రప్పించి ఈవిధంగా పలికాడు.

**విశేషం:** భట్టారకు+ఉపసంహారంబు= షష్ఠీ తత్పురుషంలో ఉకారానికి అచ్చుపర మైతే 'ను' ఆగమంగా వస్తుంది; భట్టారకు నుపసంహారము.

**చ. ప్రకటిత భూత సంతతికి భర్తవు నీవ, చరాచర ప్రవృ**
**త్తికి మఱి హేతుభూతుఁడవు, దేవముఖుండవు నీవ, లోకపా**
**వకుఁడవు నీవ; యిట్టి యనవద్య గుణుండవు నీకు విశ్వభా**
**రక! భువనప్రవర్తనపరాఙ్ముఖభావముఁ బొందఁ బాడియే? 142**

**ప్రతిపదార్థం:** ప్రకటిత, భూత, సంతతికిన్= వెలయింపబడిన (వ్యక్తమౌతున్న) ప్రాణుల సముదాయానికి; నీవు+అ= నీవే; భర్తవు= అధిపతివి; మఱి= ఇంకను; చర+అచర, ప్రవృత్తికిన్= చేతనాలు, అచేతనాలు అయిన వస్తువుల ప్రవర్తనకు; హేతు భూతుఁడవు= కారణ మైన వాడవు (నీవే); దేవముఖుండవు= దేవతలకు ముఖమైన వాడవు (అగ్నిలో వేల్వబడిన పదార్థాలు అగ్నిద్వారా దేవతలకు అందుతాయి. అందుచేత అతడు దేవముఖు డని చెప్పబడినాడు); నీవు+అ= నీవే; లోక, పావకుఁడవు= లోకాలను పవిత్రం చేసేవాడవు; నీవు+అ= నీవే; ఇట్టి= ఇటువంటి; అనవద్య, గుణుండవు= ప్రశస్త గుణాలు కలవాడవు (ఇక్కడ అనవద్యగుణుండు+అవు - అని కూడ విడదీయ వచ్చును); నీకున్; విశ్వభారక= ప్రపంచాన్ని భరించేవాడా! భువన, ప్రవర్తన, పరాఙ్ముఖభావమున్= లోకాన్ని ప్రవర్తింపచేయటంలో వైముఖ్యాన్ని; పొందన్= పొందటం; పాడియే?= న్యాయమా? కాదు.

**తాత్పర్యం:** వ్యక్తమైన భూతాల సముదాయానికి అధిపతివి నీవే; చేతనాచేతనాల ప్రవర్తనానికి కారణ మైన వాడివి నీవే; దేవతలకు ముఖమైనవాడవు నీవే; లోకాలను పవిత్రం చేసేవాడవు నీవే; ఇటువంటి ప్రశస్త గుణాలు కలవాడవైన నీకు ప్రపంచాన్ని భరించే ఓ అగ్నీ! లోకాన్ని ప్రవర్తింపచేయటంలో విముఖత్వం పొందటం న్యాయమా?

**విశేషం:** పరాక్+ముఖ= పరాఙ్ముఖ; వర్గాక్షరాలకు న, మ అనే అనునాసికాలు పరమైనపుడు అవి తమ వర్గానికి చెందిన అనునాసికాక్షరాలుగా మారుతాయి. ఇచ్చట కకారం ఙకారంగా మారింది. ఇది అనునాసికసంధి.

**వ. 'అమ్మహాముని వచనం బమోఘంబు గావున నీవు సర్వభక్షకుండ వయ్యును శుచులయం దెల్ల నత్యంతశుచి వై, పాత్రులయం దెల్లఁ బరమపాత్రుండ వై, పూజ్యులయం దెల్ల నగ్రపూజ్యుండ వై, వేదచోదిత విధానంబుల యందు విప్రసహాయుండ వై భువనంబుల నడుపు' మని, విశ్వగురుండు వైశ్వానరుం బ్రార్థించి నియోగించి భృగువచనంబు ప్రతిష్ఠాపించె; నట్టి భృగునకుఁ బుత్త్రుం డై పుట్టి పరఁగిన. 143**

**ప్రతిపదార్థం:** ఆ, మహత్, ముని= ఆ గొప్పముని (భృగుమహాముని) యొక్క; వచనంబు= వాక్యం; అమోఘంబు= వ్యర్థం కానిది; కావునన్; నీవు; సర్వభక్షకుండవు+అయ్యునున్= అన్నియు తినేవాడ వైనప్పటికిన్నీ; శుచులయందున్+ఎల్లన్= సర్వపవిత్రులయందున్నూ; అత్యంత, శుచివి+ఐ= మిక్కిలి పవిత్రుడవై; పాత్రులయందున్+ఎల్లన్= అర్హులైన వారి అందరి యందున్నూ; పరమ, పాత్రుండవు+ఐ= మిక్కిలి అర్హుడ వై; పూజ్యులయందున్+ఎల్లన్= పూజింపదగినవారి అందరియందున్నూ; అగ్రపూజ్యుండవు+ఐ= మొదట పూజింపదగిన వాడవు అయి; వేద, చోదిత, విధానంబులయందున్= వేదాలలో చెప్పబడిన కర్మపద్ధతులలో; విప్ర, సహాయుండవు+ఐ= బ్రాహ్మణులకు తోడ్పడేవాడ వై; లేక, బ్రాహ్మణులు తోడ్పడేవారుగా కలవాడవై; భువనంబులన్= లోకాలను; నడుపుము+అని= ప్రవర్తింప చేయుము అని; విశ్వ, గురుండు= లోకాలకు పెద్ద అయిన బ్రహ్మదేవుడు; వైశ్వానరున్= అగ్నిని; ప్రార్థించి= వేడి; నియోగించి= భువన ప్రవర్తనంలో నియమించి (ఆజ్ఞాపించి); భృగు, వచనంబు= భృగుమహర్షి యొక్క వాక్యాన్ని; ప్రతిష్ఠాపించెన్= స్థిరం చేశాడు. అట్టి భృగునకున్= అటువంటి భృగుమహర్షికి; పుత్త్రుండు+ఐ= కొడుకై; పుట్టి; పరఁగిన= ఒప్పారిన.

**తాత్పర్యం:** 'ఆ భృగుమహామునియొక్క వాక్యం వ్యర్థం కాదు. కాబట్టి నీవు అన్నియు తినేవాడవయినప్పటికీ, పవిత్రులందరిలో మిక్కిలి పవిత్రుడ వై, అర్హులందరిలో మిక్కిలి అర్హుడవై; పూజింపదగినవా రందరిలో మొదట పూజింపదగినవాడ వై, వేదాలలో చెప్పబడిన కర్మకలాపాలలో బ్రాహ్మణులకు తోడ్పడే వాడవై లోకాలను ప్రవర్తింపచేయు' మని లోకపిత అయిన బ్రహ్మ అగ్నిని వేడి, లోకప్రవర్తనంలో నియమించి భృగువుయొక్క వాక్యాన్ని స్థిరం చేశాడు. అటువంటి భృగుమహర్షికి కొడు కై పుట్టి ఒప్పారిన. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. చ్యవనునకు సుకన్యకు ను । ద్భవ మయ్యె ఘనుండు ప్రమతి; ప్రమతికి నమృతో**
**ద్భవ యగు ఘృతాచికిని భా । ర్గవ ముఖ్యుఁడు రురుఁడు పుట్టెఁ గాంతియుతుం డై. 144**

**ప్రతిపదార్థం:** చ్యవనునకున్= చ్యవన మహర్షికిన్నీ; సుకన్యకున్= శర్యాతి పుత్త్రిక అయిన సుకన్యకున్నూ; ఘనుండు= గొప్పవా డైన; ప్రమతి= ప్రమతి అనేవాడు; ఉద్భవము+అయ్యెన్= పుట్టాడు; ప్రమతికిన్; అమృత+ఉద్భవ+అగు= సముద్ర మథనంలో అమృతంతో పాటు పుట్టిన; ఘృతాచికిని= ఘృతాచి అనే అప్సరసకున్నూ; భార్గవముఖ్యుఁడు= భృగువంశంలో పుట్టిన వారిలో ప్రధాను డయిన; రురుఁడు= రురుడు అనేవాడు; కాంతియుతుండు+ఐ= కాంతితో కూడినవా డై; పుట్టెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** భృగుపుత్రు డయిన చ్యవనుడికిన్నీ శర్యాతిమహారాజుకొమార్తె అయిన సుకన్యకున్నూ గొప్పవా డైన ప్రమతి అనేవాడు పుట్టాడు. ఆ ప్రమతికిన్నీ అమృతంతోపాటు పుట్టిన ఘృతాచి అనే అప్సరసకున్నూ భృగువంశంలో పుట్టినవారిలో శ్రేష్ఠు డైన రురుడు కాంతితో కూడినవా డై జన్మించాడు.

**విశేషం:** చ్యవనుడు సుకన్యను వివాహమాడినవృత్తాంతం ఆరణ్యపర్వంలోని తృతీయాశ్వాసంలో ఉన్నది.

### ప్రమద్వర సర్పదష్ట యై చచ్చి మరల బ్రదుకుట (సం.1-8-1)

**వ. అట్టి రురుం డను మునివరుండు విశ్వావసుం డను గంధర్వరాజునకు మేనకకుం బుట్టినదాని, స్థూలకేశుం డను మునివరునాశ్రమంబునఁ బెరుఁగుచున్న దాని, రూపలావణ్య గుణంబులఁ బ్రమదాజనంబులయం దెల్ల నుత్కృష్ట యగుటం జేసి ప్రమద్వర యన నొప్పచున్న కన్యక నతిస్నేహంబున వివాహంబుగా నిశ్చయించి యున్నంత. 145**

**ప్రతిపదార్థం:** అట్టి; రురుండు+అను, మునివరుండు= ప్రమతికిన్నీ, ఘృతాచికిన్నీ పుట్టినట్టి రురుడు అనే మునిశ్రేష్ఠుడు; విశ్వావసుండు+అను= విశ్వావసుడు అనే పేరు కల; గంధర్వరాజునకున్= గంధర్వుల రాజుకున్నూ (గంధర్వులు దేవయోని విశేషాలు; ఆటపాటలలో ఆరితేరినవారు); మేనకకున్= మేనక అనే అప్సరసకున్నూ; పుట్టిన దానిని= జన్మించిన దానిని; స్థూలకేశుండు+అను, మునివరు, ఆశ్రమంబునన్= స్థూలకేశుడు అనేపేరు కల మునిశ్రేష్ఠుని తపోవనంలో; పెరుఁగుచున్న, దానిన్= పెద్దదవుతున్న దానిని; రూప, లావణ్య, గుణంబులన్= రూపంలోనూ సౌందర్యంలోనూ గుణాలలోనూ; ప్రమదాజనంబులయందున్+ఎల్లన్= స్త్రీజనాలందరిలో కెల్ల; ఉత్కృష్ట= శ్రేష్ఠురాలు; అగుటన్+చేసి= కావటంచేత; ప్రమద్వర, అనన్, ఒప్పుచున్న= ప్రమద్వర అనే పేరుతో అలరారుతూ ఉన్న; కన్యకన్= కన్యను; అతి, స్నేహంబునన్= మిక్కిలి ప్రేమతో; వివాహంబు, కాన్= పెండ్లి ఆడటానికి; నిశ్చయించి, ఉన్న అంతన్= నిర్ణయం చేసికొని ఉండగా.

**తాత్పర్యం:** ప్రమతికిన్నీ ఘృతాచికిన్నీ పుట్టిన రురుడు అనే మునిశ్రేష్ఠుడు- విశ్వావసుడు అనే పేరుగల గంధర్వరాజుకున్నూ మేనక అనే అప్సరసకున్నూ పుట్టి స్థూలకేశుడనే మునిశ్రేష్ఠుని ఆశ్రమంలో పెరుగుతూ ఉన్నట్టిదియున్నూ, రూపంలోనూ, సౌందర్యంలోనూ, గుణాలలోనూ స్త్రీలందరిలో శ్రేష్ఠురాలు కావటంచేత ప్రమద్వర అనే పేరుతో అలరారుతున్నదియున్నూ అయిన కన్యను మిక్కిలిప్రేమతో పెండ్లి ఆడటానికి నిర్ణయం చేసికొని ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. కన్నియలతోడ నాడుచు నున్నదానిఁ । బాదమర్దిత మై యొక్క పన్నగంబు**
**గఱచెఁ గన్నియ లందఱు వెఱచి పఱచి । యఱచుచుండఁ బ్రమద్వర యవనిఁ ద్రెళ్ళె. 146**

**ప్రతిపదార్థం:** కన్నియలతోడన్= తోడికన్యలతో (కలసి); ఆడుచున్, ఉన్నదానిన్= ఆడుతూ ఉన్న ప్రమద్వరను; పాద, మర్దితము+ఐ= పాదాలచేత త్రొక్కబడినదై; ఒక్క, పన్నగంబు= ఒకపాము; కఱచెన్; కన్నియలు+అందఱున్= కన్యలందరూ; వెఱచి= భయపడి; పఱచి= పరుగెత్తి; అఱచుచున్+ఉండన్= ఏడుస్తూ కేకలు వేస్తూ ఉండగా; ప్రమద్వర; అవనిన్= నేలపై; త్రెళ్ళెన్= పడింది.

**తాత్పర్యం:** తోడికన్యలతో ఆడుతున్న ఆ ప్రమద్వరను ఆమె పాదాలచే త్రొక్కబడిన దైన ఒకపాము కరచింది. అంత ఇతర కన్యలందరూ భయపడి పరుగెత్తి ఏడుస్తూ కేకలు వేస్తూ ఉండగా ఆ ప్రమద్వర నేలపై పడింది.

**వ. దాని నెఱింగి కరుణాకలిత హృదయు లై గౌతమ కణ్వ కుత్స కౌశిక శంఖ మేఖల భరద్వాజ వాలఖిల్యోద్దాలక శ్వేతకేతు మైత్రేయ ప్రముఖులు ప్రమతియు రురుండును స్థూలకేశాశ్రమంబునకు వచ్చి విషవ్యపగతప్రాణ**

**యై పడియున్న యక్కన్యం జూచి దుఃఖితు లై యుండ, నచ్చోట నుండనోపక రురుండు శోకవ్యాకుల హృదయుం డై యేకతంబ వనంబునకుం జని. 147**

**ప్రతిపదార్థం:** దానిన్= ప్రమద్వర పాముకాటుకు గురి అయి నేలపై పడటాన్ని గురించి; ఎఱింగి= తెలిసికొని; కరుణా,కలిత, హృదయులు+ఐ= దయతో కూడిన చిత్తాలు కలిగినవారై; గౌతమ.... మైత్రేయ, ప్రముఖులు= గౌతముడు, కణ్వుడు, కుత్సుడు, కౌశికుడు, శంఖుడు, మేఖలుడు, భరద్వాజుడు, వాలఖిల్యులు, ఉద్దాలకుడు, శ్వేతకేతుడు, మైత్రేయుడు మొదలైన వారున్నూ; ప్రమతియు, రురుండును; స్థూలకేశ+ఆశ్రమంబునకున్= స్థూలకేశుడియొక్క ఆశ్రమానికి; వచ్చి; విష వ్యపగత, ప్రాణ+ఐ= పాముయొక్క విషంచేత పోయిన ప్రాణాలు కలదై; పడియున్న= నేలపై పడియున్న; ఆ+కన్యన్= ఆ ప్రమద్వరను; చూచి; దుఃఖితులు+ఐ= శోకించిన వారై; ఉండన్= ఉండగా; ఆ+చోటన్= ఆ కన్యక పడియున్నచోట; ఉండన్+ఓపక= ఉండలేక; రురుండు; శోకవ్యాకుల, హృదయుండు+ఐ= చింతచేత కలత పొందిన చిత్తం కలవాడై; ఏకతంబు+అ= ఒంటరిగా; వనంబునకున్= అడవికి; చని= వెళ్ళి.

**తాత్పర్యం:** పాముకాటుచేత ప్రమద్వర నేలమీద పడి ఉన్న విషయాన్ని తెలిసికొని, దయతో కూడిన హృదయాలు కలవా రై గౌతముడు, కణ్వుడు, కుత్సుడు, కౌశికుడు (విశ్వామిత్రుడు), శంఖుడు, మేఖలుడు, భరద్వాజుడు, వాలఖిల్యులు, ఉద్దాలకుడు, శ్వేతకేతుడు, మైత్రేయుడు మొదలైన వారున్నూ, ప్రమతియు, రురుడున్నూ స్థూలకేశుని ఆశ్రమానికి వచ్చి విషంచేత చచ్చి నేలపై పడి ఉన్న ప్రమద్వరను చూచి దుఃఖితు లై ఉండగా, రురుడు అక్కడ ఉండలేక శోకంతో కలత చెందినహృదయం కలవాడై ఒంటరిగా అడవికి వెళ్ళి.

**విశేషం:** ప్రమద్వరను పాము కరచిం దని తెలియగానే ఋషులందరు రావటం వారి దయాపరత్వానికీ, ఐకమత్యానికీ నిదర్శనం. రురుడు ప్రమద్వరను ప్రేమించి యుండటంచేత ఆ దృశ్యాన్ని చూడలేక శోకాతిశయంతో ఒంటరిగా అడవిలోకి వెళ్ళాడు. ఋషులను పేరు పేరున పేర్కొంటూ నన్నయ రచించటంవలన ప్రమద్వర ఎందరి ఋషుల ఆదరాభిమానాలను చూరగొన్నదో వ్యంగ్యంగా నిర్దేశించాడు. ఆమె పునరుజ్జీవిత కావటానికి తగిన యోగ్యతను వ్యంగ్యంగా నిబంధించాడు.

**చ.** **అలయక యేన దేవయజనాధ్యయన వ్రత పుణ్యకర్మముల్**
**సలుపుదునేని, యేన గురుసద్ద్విజభక్తుఁడనేని, యేన య**
**త్యలఘుతపస్వినేని దివిజాధిప భూసురులార! మన్మనో**
**నిలయకు నీ ప్రమద్వరకు నిర్విష మయ్యెడు నేఁడు మీదయన్. 148**

**ప్రతిపదార్థం:** దివిజ+అధిప, భూసురులు+ఆర= ఓ దేవతాప్రభువులారా! బ్రాహ్మణులారా!; అలయక= అలసట చెందక; ఏను+అ= నేనే; దేవ, యజన+అధ్యయన, వ్రత, పుణ్య, కర్మముల్= దేవతలను పూజించటం (దేవతలనుగురించి యజ్ఞాలు చేయటం), వేదాలు పఠించటం, వ్రతాలు చేయటం అనే పుణ్యకర్మలు; సలుపుదున్+ఏని= చేసేవాడిని అయితే; ఏను+అ; గురు, సత్+ద్విజ, భక్తుఁడన్+ఏని= గురువులయొక్కయు, ఉత్తమవిప్రులయొక్కయు భక్తుడ నైన ట్లయితే; ఏను+అ; అతి+అలఘు, తపస్విన్+ఏని= మిక్కిలిగొప్పతపస్సుకలవాడి నైనట్లయితే; మత్+మనస్+నిలయకున్= నామనస్సేనివాసంగా గల (నాప్రాణనాయికకు) ఈ ప్రమద్వరకు; మీ, దయన్= మీకరుణచే; నేఁడు= ఈరోజున; ఇప్పుడు; నిర్విషము= విషములేకుండేటట్లు; అయ్యెడున్= అగుగాక.

**తాత్పర్యం:** ఓ దేవతాప్రభువులారా! బ్రాహ్మణులారా! నేను అలసటలేకుండా దేవతలను పూజించటం, యజ్ఞాలను ఆచరించటం, వేదాలను పఠించటం, వ్రతాలను ఆచరించటం అనే పుణ్యకార్యాలను చేసేవాడనైతే, నేను గురువులకు, ఉత్తమబ్రాహ్మణులకు భక్తుడ నైతే, నేను గొప్పతపస్సు కలవాడ నైతే నేడు నామనస్సే నిలయంగా గల నా ప్రాణనాయిక అయిన ఈ ప్రమద్వర మీదయచేత విషవిముక్తురాలు అగుగాక!

**చ.** **అపరిమితాజ్ఞఁ జేసియు మహాపురుషుల్ విషతత్త్వసంహితా**
**నిపుణులు మంత్రతంత్రములు నేర్చి విధించియు దీనికిన్ విష**
**వ్యపగత మైన జీవ మిది వచ్చునుపాయము సేయరొక్కొ! నా**
**తపముఫలంబు నధ్యయనదానఫలంబులు నిత్తు వారికిన్.** **149**

**ప్రతిపదార్థం:** మహత్+పురుషుల్= మహాత్ములు; అపరిమిత+ఆజ్ఞన్, చేసియున్= అధికమైన ఆజ్ఞచేతను, లేదా, ఆజ్ఞ కావించియు; విష. తత్త్వ, సంహితా, నిపుణులు= విషం యొక్క వాస్తవస్థితిని తెల్పే శాస్త్రంలో నేర్పరులును; మంత్ర, తంత్రములు= మంత్రాలను, ఉత్తమా లైన ఔషధాలను (ఉపాయాలను); నేర్చి= తెలిసికొని; విధించియున్= ఏర్పాటు చేసియు; దీనికిన్= ఈప్రమద్వరకు; విషవ్యపగతము+ఐన= విషంచేత తొలగిపోయిన; జీవము+ఇది= ఈప్రాణం; వచ్చు, ఉపాయము= తిరిగివచ్చే మార్గం; చేయరు+ఒక్కొ= చేయరా; వారికిన్= అట్లా చేసేవారికి; నా, తపము, ఫలంబున్= నా తపస్సుయొక్క ఫలితాన్నీ; అధ్యయన, దాన, ఫలంబులున్= వేదపఠనంయొక్కయు, దానాలయొక్కయు ఫలాలను ఇస్తాను.

**తాత్పర్యం:** మహాత్ములు మహిమాన్విత మైన ఆజ్ఞ చేసికాని, విషతత్త్వాన్ని తెలిపే శాస్త్రంలో నేర్పరు లైనవారు మంత్రతంత్రాలు ఉచ్చరించి ప్రయోగించి కాని, విషంచేత ప్రాణాలు కోల్పోయిన ఈ ప్రమద్వరకు అవి తిరిగి వచ్చే ఉపాయం చేసిపెట్టరా? ఆ విధంగా చేసిన వారికి నాతపఃఫలాన్నీ, వేదాధ్యయనఫలాన్నీ, దానాలఫలాన్నీ ఇస్తాను.

**విశేషం:** కొందరు సిద్ధవాక్కులు పాము కరచినవారివద్దకు వెళ్ళి 'విషమా! దిగి తొలగిపొమ్మ' అని ఆజ్ఞాపిస్తే అది తొలగిపోతుంది. అట్లే మంత్ర తంత్ర ఔషధాదులచేత కూడ సర్పదష్టులైన వారిని బ్రతికించవచ్చును. ఈ పద్యంలో రురుడికి ప్రమద్వర ఎడగల నిర్మలమూ అధికమూ ఐన అనురాగం వెల్లడి ఔతున్నది. అతడు ఆమెను బ్రతికించటానికి ఎటువంటి త్యాగమైనా చేయటానికి సిద్ధమై ఉన్నాడు. కాబట్టి రురుడి ప్రేమ ఇందులో అసంలక్ష్యక్రమధ్వనిచేత ప్రతీయమాన మౌతున్నది.

**వ.** **అని దీనవదనుం డై యాక్రోశించు వానికి నాకాశంబుననుండి యొక్కదేవదూత యిట్లనియె: 'నయ్యా! కాలవశంబయిన నెవ్వరికిం దీర్పఁ దరంబుగా; దొక్కయుపాయంబు గలదు; చేయనోపుదేనిఁ జెప్పెద వినుము; నీ యాయుష్యంబునం దర్ధం బిక్కన్య కి' మ్మనిన రురుం డట్ల చేయుదు నని తన యాయుష్యంబునం దర్ధం బక్కన్య కిచ్చిన నక్కోమలి దొల్లింటికంటె నధికశృంగారసమన్విత యై విషనిర్ముక్త యయ్యెఁ; నట్లు దేవదూత ధర్మరాజానుమతంబునఁ దనచెప్పిన యుపాయంబునం బ్రమద్వరను బంచత్వంబువలనం బాపె; రురుండును దాని వివాహం బై యిష్టోపభోగంబుల ననుభవించుచు నుండె.** **150**

**ప్రతిపదార్థం:** అని; దీన, వదనుండు+ఐ= ఆర్తితో కూడినముఖం కలవాడై; ఆక్రోశించు వానికిన్= బిగ్గరగా విలపించే వానికి; ఆకాశంబునన్+ఉండి= ఆకాశంలోనుండి; ఒక్క, దేవ, దూత= ఒక దేవతల దూత (దేవతలచే పంపబడిన పురుషుడు); ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పలికాడు; అయ్యా= ఆర్యా! (రురునికి సంబోధనం); కాల, వశంబు+అయినన్= కాలానికి

స్వాధీన మైనది (మరణం) అయినచో; ఎవ్వరికిన్; తీర్పన్, తరంబు, కాదు= చక్కబరుప (తొలగింప) శక్యం కాదు; ఒక్క, ఉపాయంబు= సాధనం (తొలగించే విధం); కలదు; చేయన్+ఓపుదు(వు), ఏనిన్= చేయజాలుదువేని; చెప్పెదన్= తెలుపుతాను; వినుము; నీ, ఆయుష్యంబునందున్= నీ ఆయుర్దాయంలో; అర్ధంబు= సగం; ఈ+కన్యకున్= ఈ ప్రమద్వరకు; ఇమ్ము; అనినన్= అని చెప్పగా; రురుండు; అట్లు+అ= అట్లే; చేయుదును= చేస్తాను (ఇస్తాను); అని= అని పల్కి; తన, ఆయుష్యంబునందున్= తన ఆయుర్దాయంలో; అర్ధంబు= సగం; ఆ+కన్యకకున్= ఆ ప్రమద్వరకు; ఇచ్చినన్= ఈయగా; ఆ+కోమలి= ఆ సుందరి; తొల్లింటికంటెన్= మునుపటికంటె; అధిక, శృంగార, సమన్విత+ఐ= ఎక్కువ అందంతో కూడినదై; విష, నిర్ముక్త= విషమువలన విడువడింది; అయ్యెన్; అట్లు= ఆ విధంగా; దేవదూత= దేవతలు పంపిన పురుషుడు; ధర్మరాజ+అనుమతంబునన్= యముని అనుమతిచేత; తన, చెప్పిన= తాను చెప్పిన; ఉపాయంబునన్= సాధనంచేత, వెరవుచే; ప్రమద్వరను; పంచత్వంబు వలనన్= (దేహం పంచభూతాత్మకం, మరణించినప్పుడు మరల పంచభూతాలలో కలిసిపోతుంది) చావునుండి; పాపెన్= తొలగించాడు; రురుండును= రురుడు కూడ; దానిన్= ఆ ప్రమద్వరను; వివాహంబు+ఐ= పెండ్లాడి; ఇష్ట+ఉపభోగంబులన్= ప్రీతిని కలిగించే భోగాలను (విలాసాలను); అనుభవించుచున్+ ఉండి= పొందుతూ ఉండి.

**తాత్పర్యం:** అని దైన్యంతో కూడిన ముఖం కలవా డై ఎలుగెత్తి ఏడుస్తున్న రురునకు ఆకాశంనుండి ఒకదేవదూత ఇట్లా పలికాడు: 'ఆర్యా! కాలగోచరత్వం (మరణం) కలిగితే ఎవ్వరికిన్నీ తొలగింప శక్యం కాదు. అయినను ఒక మార్గం ఉన్నది. చేయగలిగినట్లైతే చెప్పుతాను వినుము. నీ ఆయుర్దాయంలో సగం ఈ బాలికకు ఇమ్ము' అని దేవదూత పలకగానే రురుడు అట్లే చేస్తా నని తన ఆయువులో సగాన్ని ఆ బాలికకు ఈయగానే ఆ సుందరి ముందటికంటె ఎక్కువ సౌందర్యం కలదై విషంనుండి విముక్తిచెందింది. ఆ విధంగా దేవదూత యముడి అనుమతితో తాను చెప్పిన ఉపాయంచేత ప్రమద్వరను మృత్యువునుండి ఉద్ధరించాడు. రురుడుకూడ ఆ ప్రమద్వరను పెండ్లాడి ప్రీతికరాలైన భోగాలను అనుభవిస్తూ ఉండి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తనసతి కపకారము సే । సిన పాముల కలిగి బాధ సేయుదు నని చి**
**క్కని దండము గొని పాములఁ । గనినప్పుడు యడువఁ దొడఁగె గహనములోనన్. 151**

**ప్రతిపదార్థం:** తన, సతికిన్= తన భార్యకు; అపకారము= హాని; చేసిన; పాములకున్= పాములపై; అలిగి= కోపించి; బాధ= దుఃఖం; చేయుదున్= కలిగిస్తాను; అని; చిక్కని, దండము= దిట్టమైన కఱ్ఱ; కొని= గ్రహించి; పాములన్; కనిన+అప్పుడు+అ= చూచిన వెంటనే; గహనములోనన్= అడవిలో; అడువన్= కొట్టటానికి; తొడఁగెన్= ఆరంభించాడు.

**తాత్పర్యం:** తనభార్యకు హాని చేసిన పాములపై కోపించి వాటికి బాధకలిగిస్తా నని రురుడు దిట్టమైన కఱ్ఱను గ్రహించి అడవిలో పాములను చూచిన వెంటనే వాటిని కొట్టటానికి ఆరంభించాడు.

**విశేషం:** పాములకున్+అలిగి= ఇటువంటిచోట్ల నన్నయ షష్ఠీవిభక్తి వాడుతూ ఉంటాడు. కారకవిశేషం.

**చ. తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు పాముల రోసి రోసి ని**
**ష్ఠురతర దీర్ఘ దండమున డొల్లఁగ వ్రేయుచు, వచ్చి వచ్చి య**
**య్యిరవున డుండుభం బను నహిం గని వ్రేయఁగ దండ మెత్తుడున్**
**'హరి హరి' యంచు డుండుభమహాహి భయంపడి పల్కు భార్గవున్. 152**

**ప్రతిపదార్థం:** తిరుగుచున్= అడవిలో తిరుగుతూ; పుట్టలన్= పుట్టలలోనూ; పొదలన్= పొదలలోనూ; త్రిమ్మరు= సంచరించే; పాములన్= సర్పాలను; రోసి, రోసి= వెదకి, వెదకి; నిష్ఠురతర, దీర్ఘ, దండమునన్= మిక్కిలి కఠినమైనదీ, పొడవైనదీ అయిన కర్రతో; డొల్లఁగన్= పడు (చచ్చు)నట్లుగా; వ్రేయుచున్= కొట్టుతూ; వచ్చి, వచ్చి= తిరిగి తిరిగి వచ్చి; ఆ+ఇరవునన్= ఆ స్థలంలో; డుండుభంబు+అను= విషం లేని డుండుభం అనే; అహిన్= పామును; కని= చూచి; వ్రేయఁగన్= కొట్టటానికి; దండము= కఱ్ఱ; ఎత్తుడున్= పైకెత్తినతోడనే; హరి, హరి= ఏదైన చెడ్డపని జరిగేటప్పుడు కృష్ణ కృష్ణ, హరి హరి అని హరినామాన్ని ఉచ్చరించటం పరిపాటి; అంచున్= అని పల్కుతూ; డుండుభ, మహత్, అహి= డుండుభ మనే ఆ పెద్దపాము; భయంపడి= భయపడి; భార్గవున్= భృగువంశస్థు డైన రురునితో; పల్కున్= అన్నది.

**తాత్పర్యం:** రురుడు అడవిలో తిరుగుతూ పుట్టలలో పొదలలో తిరిగే పాములను వెదకి వెదకి మిక్కిలి కఠినమైన పొడుగాటి కర్రతో చచ్చిపడేటట్లుగా కొట్టుతూ వచ్చివచ్చి ఒకచోట విషహీన మైన డుండుభ మనే పామును చూచి కొట్టటానికై కర్ర పైకెత్తగా, డుండుభ మనే ఆ పెద్దపాము భయపడి హరినామాన్ని ఉచ్చరిస్తూ భృగువంశ్యు డైన రురునితో ఈవిధంగా పలికింది.

**విశేషం:** అయ్యిరవున అనేచోట - అయ్యేరవున, ఒక్కిరుకున, అయ్యేరనొక, అయ్యిరవున, అయ్యిరుగున, వచ్చి యొక్కచో నిరుకున; వచ్చి యొక్కచో నెరనొక - అనే పాఠాలు అనేకము లున్నవి. ఎడ అనే పాఠం గ్రహిస్తే రడలకు నన్నయ ప్రాస మంగీకరించిన ట్లౌతుంది. ఇఱుకున - అంటే శకటరేఫం ఉండాలి. రఱప్రాసం కూడ నన్నయకు సమ్మతం కాదు. సూర్యరాయాంధ్ర నిఘంటువులో అయ్యేరన్= ఆవ్యసనంతో అనే అర్థం చెప్పబడింది. పాములను చంపటానికై తిరగటంకూడ ఒక వ్యసనమే. అందుచేత ఈ పాఠం ఉచితంగా కనబడుతున్నది. వ్యవహారంలో ఎరకు ఆ అర్థం ఉన్నట్లు అందులో సూచింపబడింది.

**మత్తకోకిల.**

> **'ఏమి కారణ మయ్య పాముల కింత యల్గితి? వీవు తే**
> **జోమయుండవు బ్రాహ్మణుండవు సువ్రతుండవు' నావుడుం**
> **'బాము లెగ్గొనరించె మత్ప్రియభామ; కేను రురుండ ను**
> **ద్దామసత్త్వుఁడ' నిన్ను నిప్పుడు దండతాడితుఁ జేసెదన్.** **153**

**ప్రతిపదార్థం:** ఏమి, కారణము, అయ్య= ఏమి హేతువయ్య? (అయ్య ప్రశ్నార్థకం); పాములకున్= పాములయెడ; ఇంత= ఇంత అధికంగా; అల్గితివి= కోపించినావు; ఈవు= నీవు; తేజః, మయుండవు= తేజస్సుతో కూడినవాడవు; బ్రాహ్మణుండవు= బ్రహ్మజ్ఞాన సంపన్నుడ వైన విప్రుడవు; సు, వ్రతుండవు= మంచివ్రతం కలవాడవు; నావుడున్= అని డుండుభం పల్కిన అనంతరం; (రురుడు ఈవిధంగా పలికాడు); మత్, ప్రియ, భామకున్= నా ప్రియురా లైన భార్యకు; పాములు; ఎగ్గు= హాని; ఒనరించెన్= చేసినవి; ఏను= నేను, రురుండన్= రురుడు అనే పేరు కల భార్గవుడను; ఉద్దామ, సత్త్వుఁడన్= అధిక మైన బలం కలవాడను; నిన్నున్; ఇప్పుడు+అ= ఈ క్షణమందే; దండ, తాడితున్= కర్రతో కొట్టబడిన వాడినిగా; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** 'పాములపై ఇంత అధికంగా కోపించినావు; అందుకు ఏమి కారణమయ్యా! నీవు గొప్పతేజస్సుతో కూడినవాడవు. బ్రాహ్మణుడవు. మంచి వ్రతం కలవాడవు' అనిన అనంతరం రురుడు ఈవిధంగా పల్కాడు. ప్రియురా లైన నాభార్యకు పాములు హాని చేసినవి (కరచి ఆమెను చంపినవి). నేను అధికబలం కల రురు డనే

భార్గవుడను. నిన్ను ఈ క్షణంలోనే దండంతో కొట్టి చంపుతాను.

**విశేషం:** తేజోమయాది విశేషణాలు కోపరహితుడవై ఉండవలసిన వాడ వని సూచిస్తున్నవి. కాబట్టి ఇక్కడ అర్థాంతర సంక్రమితవాచ్యధ్వని ఉన్నది. మత్తకోకిలంలోని ప్రతి పాదానికీ ర స జ జ భ ర అనే ఆరుగుణాలు (18 అక్షరాలు) ఉంటాయి. 11వ అక్షరం యతిస్థానం. ఇందులోని మొదటి గురువును రెండు లఘువులుగా చేస్తే తరలం ఔతుంది.

**వ. అని రురుం డలిగి కృతాంతకర దండంబుం బోని తనదండం బెత్తికొనుడుఁ దత్క్షణంబ డుండుభంబు ముని యై యెదుర నిలిచినం జూచి రురుం డి ట్లనియె. 154**

**ప్రతిపదార్థం:** అని= అనిపలికి; రురుండు; అలిగి= కోపించి; కృతాంత, కర, దండంబున్, పోని= యముని చేతిలోని దండ మనే ఆయుధాన్ని పోలిన; తన, దండంబు= తన చేతిలోని కర్రను; ఎత్తికొనుడున్= పైకెత్తగా; తద్+క్షణంబు+అ= ఆ క్షణమందే; డుండుభంబు= డుండుభ మనే పాము; ముని+ఐ= ఋషియై; ఎదురన్= తన ఎదుట; నిలిచినన్= నిలబడగా; చూచి; రురుండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని పల్కి రురుడు యమునిచేతిలో ఉండే దండాయుధాన్ని పోలిన తనచేతిలో ఉన్న కర్రను పైకెత్తగా వెంటనే (ఆ క్షణమందే) డుండుభ మనే ఆ పాము మునిరూపం ధరించి తన యెదుట నిలబడింది. ఆ మార్పు చూచి రురుడు ఈ విధంగా పలికాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'ఉరగమ వై యుండి మునీ । శ్వరవేషము దాల్చి యున్నవడు వెంతయు న**
**చ్చెరు; విది యెట్టులు?' నావుడు । రురునకు ని ట్లనియె మునివరుం డనురక్తిన్. 155**

**ప్రతిపదార్థం:** ఉరగమవు+ఐ= పామువై; ఉండి; ముని+ఈశ్వర+వేషము= ముని నాథుని వేషం (రూపం); తాల్చి, ఉన్న= ధరించి ఉన్న; వడువు= విధం; ఎంతయున్= మిక్కిలి; అచ్చెరువు= ఆశ్చర్యం; ఇది= ఇట్లు కావటం; ఎట్టులు= ఏ విధం?; నావుడున్= అనిన అనంతరం; మునివరుండు= మునిశ్రేష్ఠు డైన; సహస్రపాదుఁడు; రురునకున్; అనురక్తిన్= అనురాగంతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఇంతవరకు పామురూపంతో ఉండి ఇప్పుడు మునిశ్రేష్ఠుడిరూపం ధరించియున్నతీరు మిక్కిలి వింతగా ఉన్నది. ఇది ఏవిధంగా జరిగింది? అని అడిగిన అనంతరం సహస్రపాదు డనే మునిశ్రేష్ఠుడు రురునితో ఈ విధంగా చెప్పాడు.

## సహస్రపాదుని వృత్తాంతము (సం. 1-10-6)

**వ. 'ఏను సహస్రపాదుం డను మునిముఖ్యుండ; నా సహాధ్యాయుండు ఖగముం డను మునిముఖ్యుం డగ్నిహోత్ర గృహంబున నున్న నే నపహాసార్థంబు తృణమయసర్పం బమ్మునిపై వైచిన, నతం డులికిపడి నా కలిగి. 'నీవు నిర్వీర్యంబైన యురగంబ వగు' మని శాపం బిచ్చిన. నేనును 'మేలంబు సేసిన నింత యలుగ నేల? క్షమియింపు' మనినం, బ్రసన్నుం డై ఖగముండు నావచనం బమోఘంబు గావునఁ గొండొకకాలంబు డుండుభంబ వై యుండి, భార్గవకులవర్ధనుం డైన రురుం గనిన యప్పుడు శాపవిముక్తుండ వగుదు వనె'**

**నని సహస్ర పాదుండు రురునకుఁ దనవృత్తాంతం బంతయుం జెప్పి వెండియు ని ట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; సహస్రపాదుండు+అను= సహస్రపాదు డనే పేరు గల; ముని; ముఖ్యుండన్= ముని శ్రేష్ఠుడను; నా, సహాధ్యాయుండు= నా సహపాఠి (నాతోకూడ విద్యాభ్యాసం చేసినవాడు); ఖగముండు+అను= ఖగముడు అనే పేరు గల; ముని, ముఖ్యుండు= మునిశ్రేష్ఠుడు; అగ్నిహోత్ర, గృహంబునన్= అగ్నులను ఉపాసన చేసే గృహంలో; ఉన్నన్= ఉండగా; ఏన్= నేను; అపహాస+అర్థంబు= వేళాకోళం కొరకు; తృణమయ, సర్పంబు= గడ్డితో చేయబడిన పామును; ఆ+మునిపైన్= ఆ ఖగము డనే మునిపై; వైచినన్= వేయగా; అతండు= ఆ ఖగముడు; ఉలికిపడి= భయపడి; నాకున్+అలిగి= నాపై కోపించి (నన్నయ ఇట్టిచోట్ల షష్ఠీ విభక్తి వాడుతుంటాడు); నీవు; నిర్వీర్యంబు+ఐన= శక్తి రహితమైన; ఉరగంబవు= పామువు; అగుము+అని; శాపంబు+ఇచ్చినన్= శాపం ఈయగా; ఏనును= నేనుకూడ; మేలంబు+చేసినన్= పరిహాసం చేయగా (గసడదవాదేశం); ఇంత= ఇంత అధికంగా; అలుగన్+ఏల= కోపగించటం ఎందుకు? క్షమియింపుము= మన్నింపుము; అనినన్= అని నేను పలుకగా; ప్రసన్నుండు+ఐ= శాంతుడై; ఖగముండు: నా, వచనంబు= నా పలుకు; అమోఘంబు= వ్యర్థం కానిది; కావునన్= అందుచేత; కొండొక, కాలంబు= కొంత కాలం; డుండుభంబవు+ఐ= విషం లేని పామువై (నిర్విషా, డుండుభాః స్మృతాః); ఉండి; భార్గవకుల వర్ధనుండు+ఐన= భృగువంశాన్ని వృద్ధిచేసేవాడైన; రురున్= రురు డనే వాడిని; కనిన+అప్పుడు = చూచినప్పుడు; శాప, విముక్తుండవు+అగుదువు= శాపంవలన విడిచిపెట్ట బడినవాడవు ఔతావు; అనెన్= అని పల్కాడు; అని; సహస్రపాదుండు; రురునకున్; తన, వృత్తాంతంబు+అంతయున్= తనకథ అంతయు; చెప్పి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** నేను సహస్రపాదు డనే పేరుగల మునిశ్రేష్ఠుడను; నాకు సహపాఠి అయిన ఖగము డనే పేరు గల మునిశ్రేష్ఠుడు అగ్ని గృహంలో ఉండగా నేను పరిహాసానికై గడ్డితో చేయబడిన పామును ఆ మునిపై వేశాను. అతడు భయపడి, నాపై కోపించి, 'నీవు శక్తి లేని పామువు అగు' మని శాప మివ్వగా, నేను వేళాకోళం చేస్తే ఇంతగా కోపించట మెందుకు? మన్నింపు మని వేడుకోగా, శాంతు డై ఖగముడు 'నా పలుకు వ్యర్థం కాదు కాబట్టి కొంత కాలం విషం లేని పామువై ఉండి, భార్గవవంశాన్ని వృద్ధినొందించే రురుడు అనేవాడిని చూచినప్పుడు శాపంనుండి విముక్తుడవౌతా' వని పలికాడు- అని సహస్రపాదుడు రురునకు తన కథనంతా చెప్పి, మరల ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** సహస్రపాదుడికి శాపమిచ్చిన సహాధ్యాయుడి పేరు 'ఖగముఖుడు' గా వావిళ్ళ ప్రతిలో ఉన్నది.

**ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టుడుఁ దోడన పుట్టు నుత్తమ**
**జ్ఞానము, సర్వభూతహిత సంహిత బుద్ధియుఁ జిత్తశాంతియున్,**
**మానమద ప్రహాణము, సమత్వము, సంతతవేదవిధ్యను**
**ష్ఠానము, సత్యవాక్యము, దృఢవ్రతముం, గరుణాపరత్వమున్. 157**

**ప్రతిపదార్థం:** భూనుతకీర్తి= భూమిచేత (లోకులచేత) పొగడబడిన కీర్తిగల (ఇది రురునకు సంబోధన మైనా కావచ్చు); బ్రాహ్మణుఁడు; పుట్టుడున్= పుట్టిన అనంతరం; తోడన్+అ= వెంటనే; ఉత్తమ, జ్ఞానము= శ్రేష్ఠ మైన జ్ఞానం; సర్వ, భూత, హిత, సంహిత, బుద్ధియున్= ఎల్లజీవులయొక్క మేలునందు స్థిర మైన బుద్ధియున్నూ; చిత్త, శాంతియున్= హృదయమునందలి శాంతియున్నూ; మాన, మద, ప్రహాణమున్= కోపమును గర్వాన్ని విడుచుటయున్నూ; సమత్వమున్= సమానత్వమున్నూ; సంతత, వేద, విధి+అనుష్ఠానమున్= ఎల్లప్పుడును వేదములందు చెప్పబడిన కర్మలను చేయటమున్నూ; సత్య, వాక్యమున్=

సత్య మైన వచనమున్నూ (సత్యం మాటలాడటం); దృఢవ్రతమున్= నిశ్చల మైన వ్రతమున్నూ; కరుణాపరత్వమున్= దయయందు తత్పరు డై ఉండటమున్నూ; పుట్టున్= కలుగును.

**తాత్పర్యం:** భూజనులచేత నుతింపబడే కీర్తి గల బ్రాహ్మణుడు పుట్టిన అనంతరం వెంటనే శ్రేష్ఠ మైన జ్ఞానమున్నూ, ఎల్లజీవులమేలునందు స్థిరమైనబుద్ధియున్నూ, హృదయశాంతియున్నూ, కోపగర్వవర్జనమున్నూ, సమానత్వమున్నూ, ఎల్లప్పుడు వేదములందు చెప్పబడిన కర్మల నొనరించటమున్నూ, సత్యవచనమున్నూ, స్థిర మైన వ్రతమున్నూ, దయాపరత్వమున్నూ పుట్టుతాయి.

**విశేషం:** బ్రాహ్మణుడికి ఉండవలసిన లక్షణాలన్నీ ఇందు పేర్కొనబడినవి.

**వ. 'అయ్యా! నీవు బ్రాహ్మణుండవు, భృగువంశ సముత్పన్నుండవు, సర్వగుణ సంపన్నుండ; విది యేమి దొడంగి? తిట్టి దారుణ క్రియారంభంబు క్షత్త్రియులకుం గాక బ్రాహ్మణులకుం జనునే? బ్రాహ్మణు లహింసాపరు; లొరులు సేయు హింసలు వారించు పరమకారుణ్య పుణ్యమూర్తులు: జనమేజయుం డను జనపతి చేయు సర్పయాగంబునందుఁగద్రూశాపంబున నయ్యెడు సర్పకుల ప్రళయంబును, భవత్పితృశిష్యుం డయిన యాస్తీకుండను బ్రాహ్మణుండ కాఁడె యుడిగించె' నని చెప్పి సహస్రపాదుండు రురునకు సర్పఘాతంబునం దుపశమన బుద్ధి పుట్టించె ననిన విని శౌనకాదిమహామును లక్కథకున కి ట్లనిరి. 158**

**ప్రతిపదార్థం:** అయ్యా!= ఆర్యా! (ఇది రురునకు సంబోధనం); నీవు; బ్రాహ్మణుండవు; భృగు, వంశ, సముత్పన్నుండవు= భృగుమహర్షి యొక్క వంశంలో పుట్టిన వాడవు; సర్వ, గుణ, సంపన్నుండవు= అన్ని సద్గుణాల సంపదతో కూడినవాడవు; ఇది, ఏమి= ఇదేమి?; తొడంగితి(వి)= చేయటానికి ఆరంభించావు?; ఇట్టి= ఇటువంటి; దారుణ, క్రియా+ఆరంభమ్ము= ఘోరమైన పనియందలి ప్రయత్నం; క్షత్త్రియులకున్, కాక= క్షత్త్రియులకే కాక; బ్రాహ్మణులకున్= విప్రులకు; చనునే= తగునా?; (తగదు అని భావం); బ్రాహ్మణులు; అహింసాపరులు= హింస చేయకుండ ఉండటంలో ఆసక్తి కలవారు; ఒరులు+చేయు= (గసడదవాదేశం) ఇతరులు చేసే; హింసలు= బాధలు, లేక, వధలు; వారించు= నివారించు (అడ్డగించు); పరమ, కారుణ్య, పుణ్య, మూర్తులు= అధిక మైన దయతోను, పుణ్యంతోను కూడిన రూపాలు కలవారు; జనమేజయుండు+అను జనపతి= జనమేజయు డనే రాజు; చేయు; సర్ప, యాగంబునందున్= పాములను ఆహుతి చేసే యజ్ఞమందు; కద్రూశాపంబునన్= కద్రువ అనే కశ్యపుడి భార్య ఇచ్చిన శాపం చేత; అయ్యెడు= కలుగు; సర్ప, కుల, ప్రళయంబును= పాముల కులం యొక్క నాశమున్నూ; భవత్, పితృ, శిష్యుండు, అయిన= నీతండ్రికి శిష్యు డయిన; ఆస్తీకుండు+అను; బ్రాహ్మణుండు+అ+కాఁడు+ఎ= బ్రాహ్మణుడే కదా!; ఉడిగించెన్= తొలగించాడు; అని, చెప్పి; సహస్రపాదుండు= సహస్రపాదు డనే ముని; రురునకున్, సర్ప, ఘాతంబునందున్= పాములను హింసించటంలో; ఉపశమన, బుద్ధి= ఓర్పుతో కూడిన బుద్ధి; పుట్టించెన్= కల్గించెను; అనినన్= అనగా; విని; శౌనక+ఆది, మహత్, మునులు= శౌనకుడు మొదలైన మహర్షులు; ఆ కథకునకున్= కథ చెప్పే ఆ సౌతికి, ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** అయ్యా! రురూ! నీవు బ్రాహ్మణుడవు, భృగుమహర్షివంశంలో పుట్టినవాడవు, సర్వసద్గుణసంపదతో కూడినవాడవు. ఇదేమి, ఇటువంటిపని చేయటానికి ఆరంభించావు? ఇట్టి ఘోర మైన పనియందలి ప్రయత్నం క్షత్రియులకు తగును గాని, బ్రాహ్మణులకు తగునా? బ్రాహ్మణులు హింసచేయకుండ ఉండటంలో ఆసక్తి కలవారు.

పైపెచ్చు ఇతరులు చేసే హింసలను తొలగించే గొప్ప దయకున్నూ పుణ్యానికిన్నీ రూపుకట్టినవారు. జనమేజయుడనే రాజు చేసే సర్పయాగంలో తల్లి యైన కద్రువ ఇచ్చిన శాపంచేత కలిగే నాగవంశ వినాశనాన్ని నీ తండ్రికి శిష్యు డైన ఆస్తీకు డనే బ్రాహ్మణుడే కదా వారించింది! అని చెప్పి ఆ సహస్రపాదు డనే ముని రురుడు అనే భృగువంశ బ్రాహ్మణుడికి పాములను చంపేయత్నం మానివేసే బుద్ధిని కలిగించా డని కథకుడు చెప్పగా విని శౌనకాది మహర్షులు కథకు డైన ఆ సౌతిని ఈ విధంగా అడిగారు.

**ఆ. ఒరులవలనఁ బుట్టు నోటమియును నెగ్గుఁ । బొరయకుండ నరసి పుత్త్రవరులఁ**
**దగిలి కాచునట్టి తల్లి సర్పములకు । నేల యలిగి శాప మిచ్చె నయ్య! 159**

**ప్రతిపదార్థం:** ఒరులవలనన్= ఇతరులవలన; పుట్టు= కలుగు; ఓటమియున్= భయాన్నీ; ఎగ్గున్= కీడునూ; పొరయక+ఉండన్= పొందకుండేటట్లుగా; అరసి= చూచి (విచారించి); పుత్త్రవరులన్= కుమార శ్రేష్ఠులను; తగిలి= ఆసక్తి కలిగి; కాచు+అట్టి= కాపాడునటువంటి; తల్లి; సర్పములకున్= పాములకు; అలిగి= కోపించి; ఏల= ఎందుకు; శాపము+ఇచ్చెన్+అయ్య!= శాప మిచ్చింది? అయ్య అనేది కథకుడికి సంబోధనం.

**తాత్పర్యం:** కథకుడ వైన ఓ సౌతీ! ఇతరులవలన కలుగు భయాన్నీ, కీడునూ, పొందకుండ పరిశీలించి ఉత్తము లైన కుమారులను వెంటబడి కాపాడునటువంటి తల్లియే పాములపై కోపించి ఎందుకు శాప మిచ్చింది? చెప్పుము.

**విశేషం:** ఉదంత తద్ధర్మ విశేషణానికి అచ్చు పరమైనపుడు నుగాగమం ఔతుంది. పుట్టు+ఓటమి= పుట్టునోటమి; కాచు+అట్టి= కాచునట్టి.

**వ. అని సౌపర్ణాఖ్యాన శ్రవణ కుతూహలపరు లై యడిగిన. 160**

**ప్రతిపదార్థం:** అని; సౌపర్ణ+అఖ్యాన, శ్రవణ, కుతూహల, పరులు+ఐ= గరుడునికి సంబంధించిన కథను వినా లనే ఉత్సాహంలో ఆసక్తు లై; అడిగినన్= శౌనకాది మహాముని లడుగగా.

**తాత్పర్యం:** అని గరుడునికి సంబంధించిన కథను వినుటయందు ఆసక్తి కలవారై శౌనకాది మహాముని లడుగగా. (తరువాతి ఆశ్వాసంలోని 'అక్కథకుండు' అనేదానితో అన్వయం.)

### ఆశ్వాసాంతము

**ఉ. రాజకులాగ్రగణ్య! మృగరాజపరాక్రమ! రాజరాజ! వి**
**బ్రాజితశుభ్రకీర్తి పరిపాండుర సర్వదిగంతరాళ! ఘో**
**రాజి ముఖోపలబ్ధ విజయ ప్రమదాశ్రిత బాహుదండ! ని**
**స్తేజిత వైరివీర! కులదీప! మృడప్రియ! విష్ణువర్ధనా! 161**

**ప్రతిపదార్థం:** రాజ, కుల, అగ్రగణ్య!= చంద్రవంశంలో మొదట గణింపదగిన వాడా (శ్రేష్ఠుడా!); మృగరాజ, పరాక్రమ=

సింహం యొక్క పరాక్రమం వంటి పరాక్రమం కలవాడా! రాజరాజ= రాజరాజ నరేంద్రా! (రాజులకుకూడ రాజు మైన చక్రవర్తీ); విభ్రాజిత, శుభ్ర, కీర్తి, పరిపాండుర, సర్వ, దిక్, అంతరాళ!= ప్రకాశించే నిర్మల మైన కీర్తిచేత తెల్లనైన అన్నిదిక్కుల మధ్యభాగాలు కలవాడా!; ఘోర+ఆజి, ముఖ+ఉపలబ్ధ, విజయ, ప్రమదా+ఆశ్రిత, బాహుదండ!= భయంకర మైన అని మొనలో పొందబడిన విజయమనే స్త్రీ చేత ఆశ్రయింపబడిన దండముల వంటి భుజాలు కలవాడా!; నిస్తేజిత, వైరి, వీర!= తేజోహీనులుగా చేయబడిన శత్రువీరులు కలవాడా!; కులదీప!= కులానికి దీపం వంటివాడా! కులాన్ని ప్రకాశింపజేసేవాడా!; మృడప్రియ= శివుడికి ప్రీతిపాత్రు డైన వాడా!; విష్ణువర్ధనా!= విష్ణువర్ధనుడు అనే బిరుదు కలవాడా!

**తాత్పర్యం:** చంద్రవంశశ్రేష్ఠుడా! సింహపరాక్రముడా! రాజరాజ! ప్రకాశించే నిర్మల మైన కీర్తిచేత తెల్ల నైన అన్ని దిక్కుల మధ్యభాగాలు కలవాడా! భయంకరమైన రణరంగంలో పొందబడిన విజయమనే స్త్రీ చేత ఆశ్రయింపబడిన దండములవంటి భుజాలు కలవాడా! ఓడింపబడిన శత్రువీరులు కలవాడా! కులాన్ని ప్రకాశింప చేయువాడా! శివుడికి ప్రీతిపాత్రుడైన వాడా! విష్ణువర్ధన బిరుదాంకితుడా!

**విశేషం:** అలం: రూపకం.

**క. ఆదిక్షత్త్ర చరిత్ర! ధ । రాదేవాశీఃపరంపరావర్ధిత ని**
**త్యోదయ! సత్యోదిత! విమ । లాదిత్యతనూజ! విక్రమాదిత్యనిభా! 162**

**ప్రతిపదార్థం:** ఆదిక్షత్త్ర చరిత్ర= ఆదికాలంలో ఉన్న మనువు మొదలైన క్షత్రియుల చరిత్రవంటి చరిత్ర కలవాడా!; ధరా, దేవ+అశీః, పరంపరా, వర్ధిత, నిత్య, ఉదయ= బ్రాహ్మణులయొక్క ఆశీర్వాదాలసమూహంచేత వృద్ధి పొందింపబడిన సంతతమైన అభ్యుదయం కలవాడా!; సత్య+ఉదిత= సత్యంలో అధికుడా! (సత్యవాక్కులు కలవాడా); విమలాదిత్య, తనూజ= విమలాదిత్యుడి కుమారుడా!; విక్రమాదిత్య, నిభా= విక్రమాదిత్యు డనే ప్రసిద్ధు డైన రాజుతో సమానుడా (విక్రమంలో సూర్యునితో సమానుడా!).

**తాత్పర్యం:** ఆదికాలంలో ఉన్న మనువు మొదలైన క్షత్రియులచరిత్రవంటి చరిత్రకలవాడా! బ్రాహ్మణుల ఆశీర్వాదాల సమూహం చేత పెంపొందిన నిరంతర మైన అభ్యుదయం కలవాడా! సత్యవాక్కులు కలవాడా! (సత్యాధిక అని పాఠాంతరం), విమలాదిత్యుని కుమారుడా! విక్రమాదిత్యునితో సమానుడా!

**విశేషం:** అలం: ఉపమ.

**తోటకము.**

**నిరవద్య! నరేశ్వర! నిత్యనిరం । తర ధర్మమతీ! గుణధామ! జగ**
**త్పరిపూరిత కీర్తి విభాసి! విభా కరతేజ! నృపోత్తమ! కాంతినిధీ! 163**

**ప్రతిపదార్థం:** నిరవద్య= దోషరహితుడా!; నర+ఈశ్వర= రాజా!; నిత్య, నిరంతర, ధర్మ, మతీ= ఎల్లప్పుడున్నూ అవిచ్ఛిన్నంగా ధర్మమునందు బుద్ధి కలవాడా!; గుణ, ధామ= సద్గుణాలకు నిలయమా!; జగత్, పరిపూజిత, కీర్తి, విభాసి= లోకాలన్నింటిలో నిండిన కీర్తితో ప్రకాశించేవాడా! విభాకర, తేజ= సూర్యుడియొక్క తేజం వంటి తేజం కలవాడా!; నృప+ఉత్తమ= రాజులలో శ్రేష్ఠుడా!; కాంతి, నిధీ= కాంతికి నిధానమా!

**తాత్పర్యం:** దోషరహితుడా! మానవాధిపా!, ఎల్లప్పుడు ఎడతెఱిపి లేకుండా ధర్మం చేసే బుద్ధి కలవాడా! సద్గుణాలకు నిలయమా! లోకాలన్నింటియందునూ నిండిన కీర్తితో ప్రకాశించేవాడా! సూర్యుడితేజం వంటి తేజం కలవాడా! రాజశ్రేష్ఠుడా! కాంతినిధానమా! రాజరాజనరేంద్రా!

**విశేషం:** తోటకవృత్తంలో ఒక్కొక్క పాదానికి నాలుగేసి సగణాలు ఉంటాయి. తొమ్మిదవ అక్షరం యతిస్థానం, ప్రాసనియమం ఉన్నది.

**గద్యము.**

**ఇది సకల సుకవి జన వినుత నన్నయభట్ట ప్రణీతం బైన శ్రీ మహాభారతంబునం దాదిపర్వంబున ననుక్రమణికయును, పౌష్యోదంక మాహాత్మ్యంబును, భృగువంశకీర్తనంబు నన్నది ప్రథమాశ్వాసము. 164**

**ప్రతిపదార్థం:** ఇది, సకల, సుకవి, జన, వినుత, నన్నయ, భట్ట, ప్రణీతంబు+ఐన= మంచికవులందరిచేత స్తుతింపబడిన నన్నయభట్టు అనే పేరుగల కవిచేత రచింపబడిన; శ్రీ, మహత్, భారతంబునందున్= శోభాయుక్త మైన మహాభారతమనే గ్రంథంలోని; ఆది, పర్వంబునన్= ప్రధానమైన పదునెనిమిది పర్వాలలో మొదటిదైన ఆదిపర్వంలో; అనుక్రమణికయును= కావ్యంలోని విషయాల సూచికయున్నూ, పౌష్య+ఉదంక, మాహాత్మ్యంబును= పౌష్యుడనే రాజుయొక్కయు, ఉదంకునియొక్కయు మాహాత్మ్యమున్నూ; భృగు, వంశ, కీర్తనంబును= భృగుమహర్షి వంశాన్ని కీర్తించటమున్నూ; అన్నది= అనేవాటితో కూడినది; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది సుకవులందరిచేత కీర్తింపబడే నన్నయభట్టుచేత రచింపబడిన శ్రీమహాభారతంలోని ఆదిపర్వంలో అనుక్రమణిక (భారతపర్వాల విషయసూచిక,) పౌష్యుడు, ఉదంకుడు అనే వారి మహత్త్వాన్ని చెప్పేకథ, భృగువంశాన్ని కీర్తించే కథ కల ప్రథమాశ్వాసం.

ఆదిపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం.



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆదిపర్వము -ద్వితీయాశ్వాసము

**శ్రీవనితావల్లభ! వేం । గీవిషయాధీశ! కావ్యగీతప్రియ! నా**
**నావనినాథకిరీటత । టీవిలసద్రత్నసంఘటితపదకమలా!** 1

**ప్రతిపదార్థం:** శ్రీ, వనితా, వల్లభ= లక్ష్మి అనే కాంతకు ప్రియుడా!; వేంగీ, విషయ+అధీశ!= వేంగి అనే దేశానికి ప్రభువా!; కావ్య, గీత, ప్రియ!= కావ్యాలలో, గీతాలలో ఆసక్తికలవాడా!; నానా+అవని, నాథ, కిరీట, తటీ, విలసత్, రత్న, సంఘటిత, పద, కమలా!= పలువురురాజులయొక్క కిరీటాలప్రదేశాలలో ప్రకాశిస్తున్న మణులచేత కూర్చబడిన పద్మాలవంటి పాదాలు కలవాడా!

**తాత్పర్యం:** లక్ష్మి అనే కాంతకు ప్రియుడా! (నా౽విష్ణుః పృథివీపతిః అనే సూక్తిని అనుసరించి, రాజులలో విష్ణువుయొక్క అంశం ఉంటుంది. ఇక్కడ శ్రీఅంటే రాజ్యలక్ష్మి అనికూడ చెప్పవచ్చు); వేంగీదేశానికి రాజా! కావ్యాలలో, గీతాలలో అసక్తికలవాడా! బహుదేశరాజులకిరీటతటాలలో ప్రకాశించేమణులచేతకూర్చబడిన పద్మాలవంటిపాదాలు కలవాడా! రాజారాజనరేంద్రా!

**విశేషం:** ఇది రాజరాజనరేంద్రుడికి సంబోధన. ఇతడు కృతిపతి, కృతిశ్రోత.

### గరుడోపాఖ్యానము

### కద్రూవినతలు పుత్రులం గోరి పడయుట (సం. 1-14-5)

**వ.** **అక్కథకుండు శౌనకాదిమహామునులకుంజెప్పె: నాదియుగంబునం గశ్యపప్రజాపతిభార్యలయిన కద్రువయు వినతయు ననువారలు పుత్త్రార్థినులైయనేక సహస్రవర్షంబులు కశ్యపు నారాధించినం, గశ్యపుండు ప్రసన్నుం డై 'మీకోరినవరంబు లిచ్చెద వేఁడుం' డనిన.** 2

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు (త్రికసంధి)= రోమహర్షణు డనే సూతుడికుమారు డయిన ఉగ్రశ్రవసుడు; శౌనక+ఆది, మహత్, మునులకున్= శౌనకుడు మొదలయిన మహామునులకు; చెప్పెన్; ఆది, యుగంబునన్= కృతయుగంలో; కశ్యప, ప్రజాపతి, భార్యలు+అయిన= కశ్యపబ్రహ్మభార్య లయిన; కద్రువయు, వినతయున్, అను, వారలు= కద్రువ, వినత అనేవారు; పుత్త్ర+అర్థినులు+ఐ= కొడుకులను కోరేవారై; అనేక, సహస్ర, వర్షంబులు= పెక్కువేలఏండ్లు; కశ్యపున్, ఆరాధించినన్= కశ్యపుడిని సేవించగా; కశ్యపుండు; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహం కలవాడై; మీ, కోరినవరంబులు= మీరు కోరినవరాలను (కర్మపదప్రథమకు షష్ఠి); ఇచ్చెదన్= ఇస్తాను; వేఁడుండు= కోరుకొనండి; అనినన్= అని అనగా.

**తాత్పర్యం:** కథకుడైన ఉగ్రశ్రవసుడు శౌనకుడు మొదలయినమహామునులకు ఇట్లా చెప్పాడు: కృతయుగంలో కశ్యపబ్రహ్మయొక్క భార్య లయిన కద్రువ, వినత లనేవారు కుమారులనుకోరినవారై, పెక్కువేలఏండ్లు కశ్యపుడిని సేవించగా, అతడు అనుగ్రహం కలవా డై 'మీరు కోరినవరాలను ఇస్తాను కోరుకొనండి' అని పలుకగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తరలము.**

**అనలతేజులు, దీర్ఘదేహులు నైనయట్టి తనూజులన్**
**వినుతసత్త్వులఁ గోరెఁ గద్రువ వేవురం గడువేడ్కతోఁ;**
**వినత గోరె సుపుత్త్రులన్ భుజవీర్యవంతుల, వారికం**
**టెను బలాధికు లైన వారిఁ, గడిందివీరుల, నిద్దఱన్.** **3**

**ప్రతిపదార్థం:** కద్రువ; అనల, తేజులు= అగ్నియొక్కప్రకాశంవంటి ప్రకాశం కలవారు; దీర్ఘ, దేహులు= పొడవయినశరీరం కలవారు; ఐన, అట్టి; తనూజులన్= కుమారులను; వినుత, సత్త్వులన్= ప్రసిద్ధిపొందినబలం కలవారిని; వేవురన్= వెయ్యిమందిని; కడు, వేడ్కతోన్= మిక్కిలిఆసక్తితో; కోరెన్; వినత; భుజ, వీర్యవంతులన్= బాహువులయొక్క బలంకలవారిని; వారి కంటెను= ఆకద్రువకొడుకులకంటె; బల+అధికులు+ఐనవారిన్= బలంలో గొప్పవారిని; కడింది, వీరులన్= ఇతరులకు జయింపశక్యం కాని అధికవీరులను; సుపుత్త్రులన్= మంచికుమారులను; ఇద్దఱన్= ఇరువురిని; కోరెన్= కోరింది.

**తాత్పర్యం:** అగ్నివలె ప్రకాశించేవారున్నూ, పొడవయినదేహాలుకలవారున్నూ ప్రసిద్ధిపొందిన బలం కలవారున్నూ అయిన వెయ్యిమందికుమారులను కద్రువ మిక్కిలిసంతోషంతో కోరింది. వినత, ఆ కద్రువకుమారులకంటె బలంలో గొప్పవారున్నూ, బాహువులబలం కలవారున్నూ, అయిన ఇద్దరు మంచికుమారులను కోరింది.

**విశేషం:** తరల వృత్తానికి ప్రతిపాదంలోనూ న, భ, ర, స, జ, జ, గ - అనే గణాలుంటాయి. 12వ అక్షరం యతి. పాదానికి 19 అక్షరాలుంటాయి.

**వ.** **కశ్యపప్రజాపతి తొల్లి పెద్దకాలంబు తపంబు సేసి, పుత్త్రకామేష్టిఁ జేసెఁ గావునఁ గద్రువకు వేవురుకొడుకులను, వినతకు నిద్దఱుకొడుకులను వారికోరినయట్ల యిచ్చి, గర్భంబు లిమ్ముగా రక్షింపంబనిచిన నయ్యిద్దఱును దద్దయు సంతసిల్లి యున్నంత, గర్భంబులు గొండొకకాలంబునకు నండంబు లైన, నయ్యండంబులు ఘృతకుండంబులం బెట్టి రక్షించుచున్నంత, నేనూఱేండ్లకుఁ గద్రూగర్భాండంబులు తరతరంబ యవిసిన నందు శేష వాసుక్యైరావత తక్షక కర్కోటక ధనంజయ కాళియ మణినాగాపూరణ పింజర కైలాపుత్త్ర వామన నీలానీల కల్మాష శబలార్య కోగ్రక కలశపోతక సురాముఖ దధిముఖ విమలపిండ కాప్త కర్కోటక శంఖవాలి శిఖి నిష్ఠానక హేమగుహ నహుష పింగళ బాహ్యకర్ణ హస్తిపద ముద్గర పిండక కంబలాశ్వతర కాళీయక వృత్త సంవర్తక పద్మశంఖముఖ కూష్మాండక క్షేమక పిండారక కరవీర పుష్పదంష్ట్ర బిల్వక బిల్వపాండర మూషకాద శంఖశిరః పూర్ణభద్రహరిద్రకాపరాజిత జ్యోతిక శ్రీవహ కౌరవ్య ధృతరాష్ట్ర శంఖపిండ వీర్యవ ద్విరజస్సుబాహు శాలిపిండ హస్తిపిండ పిఠరక సుముఖ కౌణపాశన కుఠర కుంజర ప్రభాకర కుముద కుముదాక్ష తిత్తిరి హలిక కర్దమ బహుమూలక కర్కరాకర్కర కుండోదర మహోదరు లాదిగాఁగల వేవురు నాగముఖ్యులు పుట్టిన.** **4**

**ప్రతిపదార్థం:** కశ్యప ప్రజాపతి= కశ్యపబ్రహ్మ; తొల్లి= పూర్వం; పెద్దకాలంబు, తపంబు, చేసి; పుత్త్ర, కామ+ఇష్టిన్= పుత్త్ర, కామ మనే యజ్ఞాన్ని (కుమారులుకలగాలనే కోరికతో చేసే యాగాన్ని); చేసెన్; కావునన్= అట్లా యజ్ఞం చేయటంవలన;

కద్రువకున్; వేవురన్, కొడుకులను= వెయ్యిమందికుమారులను; వినతకున్, ఇద్దఱన్, కొడుకులన్; వారి, కోరిన, అట్లు+అ= వారు కోరిన విధంగానే; ఇచ్చి; గర్భంబులు= కడుపులోని పిండాలను; ఇమ్ముగాన్= ఉపాయంగా; రక్షింపన్, పనిచినన్= రక్షించటానికి నియమించగా; ఆ+ఇద్దఱును= ఆ కద్రూవినతలిద్దరును; తద్దయున్= మిక్కిలి; సంతసిల్లి, ఉన్నంతన్; గర్భంబులు= కడుపులోనిపిండాలు; కొండొక, కాలంబునకున్= కొంతకాలానికి; అండంబులు+ఐనన్= గ్రుడ్లుగా మారగా; ఆ+అండంబులు= ఆ గ్రుడ్లు; ఘృత, కుండంబులన్= నేతికుండలలో; పెట్టి; రక్షించుచున్న, అంతన్= రక్షిస్తూఉండగా; ఏను, నూఱు+ఏండ్లకున్= అయిదువందల సంవత్సరాలకు; కద్రూ, గర్భ+అండంబులు= కద్రువయొక్క గర్భంనుండి పుట్టిన గ్రుడ్లు; తరతరంబు+అ= ఒకదానితర్వాత ఒకటిగా; అనిసినన్= పగలగా; అందున్= ఆ గ్రుడ్లలో; శేషుడు, వాసుకి, ఐరావతుడు, తక్షకుడు, కర్కోటకుడు, ధనంజయుడు, కాళియుడు, మణినాగుడు, ఆపూరణుడు, పింజరకుడు, ఏలాపుత్రుడు, వామనుడు, నీలుడు, అనీలుడు, కల్మాషుడు, శబలుడు, ఆర్యకుడు, ఉగ్రకుడు, కలశపోతకుడు, సురాముఖుడు, దధిముఖుడు, విమలపిండకుడు, ఆప్తుడు, కర్కోటకుడు, శంఖుడు, వాలిశిఖుడు, నిష్టానకుడు, హేమగుహుడు, నహుషుడు, పింగళుడు, బాహ్యాకర్ణుడు, హస్తిపదుడు, ముద్గరుడు, పిండకుడు, కంబలుడు, అశ్వతరుడు, కాళీయకుడు, వృత్తుడు, సంవర్తకుడు, పద్మడు, శంఖముఖుడు, కూష్మాండకుడు, క్షేమకుడు, పిండారకుడు, కరవీరుడు, పుష్పదంష్ట్రుడు, బిల్వకుడు, బిల్వపాండరుడు, మూషకాదుడు, శంఖశిరుడు, పూర్ణభద్రుడు, హరిద్రకుడు, అపరాజితుడు, జ్యోతికుడు, శ్రీవహుడు, కౌరవ్యుడు, ధృతరాష్ట్రుడు, శంఖపిండుడు, వీర్యవంతుడు, విరజుడు, సుబాహువు, శాలిపిండుడు, హస్తిపిండుడు, పిఠరకుడు, సుముఖుడు, కౌణపాశనుడు, కుఠరుడు, కుంజరుడు, ప్రభాకరుడు, కుముదుడు, కుముదాక్షుడు, తిత్తిరి, హలికుడు, కర్దముడు, బహుమూలకుడు, కర్కరుడు, అకర్కరుడు కుండోదరుడు, మహోదరుడు; ఆదిగాన్, కల= మొదలుగా గల; వేవురు= వెయ్యిమంది; నాగముఖ్యులు= సర్పశ్రేష్ఠులు; పుట్టినన్= పుట్టగా.

**తాత్పర్యం:** పూర్వం కశ్యపబ్రహ్మ ఎక్కువకాలం తపస్సుచేసి, కుమారులను పొందగోరేవారు చేసే పుత్రకామేష్టి అనే యాగాన్ని చేశాడు. అట్లా చేయటంవలన కద్రువకు వెయ్యమందికొడుకులను, వినతకు ఇద్దరుకొడుకులను వారు కోరినట్లుగా ఇచ్చి, గర్భాలను ఉపాయంతో కాపాడటానికి ఆజ్ఞాపించగా, వారిద్దరూ మిక్కిలిసంతోషించారు. కొంతకాలానికి గర్భాలు అండాలుగా మారాయి. వాటిని నేతికుండలలో ఉంచి రక్షిస్తూండగా అయిదువందల సంవత్సరాలకు కద్రువగర్భంలోని అండాలు, ఒకదాని తరువాత ఒకటిగా పగిలి, శేషుడు, వాసుకి, ఐరావతుడు, తక్షకుడు మొదలయిన వెయ్యిమంది సర్పశ్రేష్ఠులు పుట్టగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

### అనూరుఁడు జనించి వినతకు శాప మిచ్చుట (సం. 1-14-14)

**క. తన గర్భాండంబులరెం । టను బ్రియనందనులు వెలువడమి, నతిలజ్జా**
**వనత యయి వినత పుత్త్రా । ర్థిని యొకయండంబు విగతధృతి నవియించెన్. 5**

**ప్రతిపదార్థం:** తన, గర్భ+అండంబుల, రెంటను= తనయొక్కకడుపునుండి పుట్టిన పిండరూపా లయిన గ్రుడ్లు రెండింటిలోను; ప్రియ, నందనులు= ప్రీతికరు లైన (కూరిమి)కొడుకులు; వెలువడమిన్= బయటపడకుండటంచేత; అతిలజ్జా+అవనత, అయి= మిక్కిలి సిగ్గుచేత క్రుంగిన దై; పుత్త్ర+అర్థిని= కొడుకులను కోరేటి; వినత; ఒక, అండంబున్= ఒక గ్రుడ్డును; విగత, ధృతిన్= పోయిన ధైర్యంతో; అవియించెన్= పగులగొట్టింది.

**తాత్పర్యం:** తన గర్భంనుండి పుట్టినగ్రుడ్లు రెండింటినుండి ముద్దుకుమారులు బయల్పడని కారణాన, మిక్కిలిసిగ్గుచేత క్రుంగినదై, కొడుకులను కోరే వినత ధైర్యం కోల్పోయి ఒకగ్రుడ్డును బ్రద్ద లయ్యేట్లు చేసింది.

**క. దాన నపరార్ధకాయవి । హీనుఁడు, పూర్వార్ధతనుసహితుఁ డరుణుఁ డనం**
**గా నుదయించె సుతుండు, మ । హానీతియుతుండు తల్లి కప్రియ మెసఁగన్. 6**

**ప్రతిపదార్థం:** దానన్= బ్రద్దలు చేయబడినగ్రుడ్డునుండి; అపర+అర్ధ, కాయ, విహీనుఁడు= క్రింది సగం శరీరం లేనివాడు; పూర్వ+అర్ధ, తను, సహితుఁడు= మీదిసగంశరీరంతో కూడినవాడు; అరుణుఁడు+అనంగాన్= అరుణు డనే పేరుతో; తల్లికిన్= తల్లి అయిన వినతకు; అప్రియము= అనిష్టం; ఎసఁగన్= అతిశయించగా; మహత్, నీతి, యుతుండు= గొప్పనీతితో కూడినవాడైన; సుతుండు= కుమారుడు; ఉదయించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** ఆగ్రుడ్డునుండి క్రిందిసగందేహం లేనివాడున్నూ, మీది సగందేహంతో కూడినవాడున్నూ అయినకుమారుడు అరుణు డనే పేరుతో గొప్పనీతితోకూడినవాడు తల్లికి అనిష్టం అతిశయించేటట్లు పుట్టాడు.

**వ. ఇట్లు వికలాంగుం డై పుట్టిన యనూరుండు వినతకు నలిగి 'నన్ను సంపూర్ణశరీరుం గానీక యండం బవియించిన యవినీతవు కావున నీవు నీసవతికి దాసివై యేనూఱేం డ్లుండు' మని శాపం బిచ్చి, 'యింక నీ రెండవయండంబు తనకుఁ దాన యవియునంతకు నుండని; మ్మిందుఁ బుట్టెడు పుత్త్రుండు మహాబలపరాక్రమసంపన్నుండు నీ దాసీత్వంబు వాపు' నని సెప్పి సూర్యరథసూతుండయి యరిగె; వినతయు నయ్యండం బతిప్రయత్నంబున రక్షించుకొనియుండె; నంత. 7**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వికల+అంగుండు+ఐ= సంపూర్ణం కాని శరీరం కలవాడై; అనూరుండు= తొడలు లేనివాడు- ఇది అరుణుని నామాంతరం; వినతకున్, అలిగి= తల్లి అయిన వినతపై కోపించి (నన్నయనాడు ఇట్టిచోట్ల షష్ఠీవిభక్తి వాడబడుతూ ఉండేది. ఇది కారకభేదం); సంపూర్ణ, శరీరున్, కానీక= సమగ్రమయిన శరీరం కలవాడిని కానీయకుండ; అండంబు= గ్రుడ్డును; అవియించినన్= బ్రద్దలు చేయగా; అవినీతవు= నీతి లేని దానివి; కావునన్= ఆకారణంచేత; నీవు; నీసవతికిన్= నీ సవతి అయిన కద్రువకు; దాసివి+ఐ= సేవకురాలివై; ఏను, నూఱు+ఏండ్లు+ఉండుము, అని= అయిదువందలేండ్లు ఉండు మని; శాపంబు+ఇచ్చి= శాపాన్నిచ్చి; ఇంకన్= ఇకముందు; ఈ, రెండవ, అండంబు= వినత గర్భంనుండి వెలువడిన వేరొకగ్రుడ్డు; తనకున్, తాను+అ= తనంతట అదే; అవియు, అంతకున్= బ్రద్దలయ్యేంతవరకు; ఉండన్+ఇమ్ము; ఇందున్= ఈ రెండవగ్రుడ్డునుండి; పుట్టెడు, పుత్త్రుండు= పుట్టబోయే కుమారుడు; మహత్, బల, పరాక్రమ, సంపన్నుండు= గొప్పబలంతోను, శౌర్యంతోను కూడినవాడు; నీ, దాసీత్వంబు= నీదాసితనాన్ని; పాపున్= పోగొడతాడు; అనిచెప్పి; సూర్య, రథ, సూతుండు+అయి= సూర్యునియొక్కరథానికి సారథి అయి; అరిగెన్= వెళ్ళాడు; వినతయున్= వినతకూడ; ఆ+అండంబు= ఆ రెండవగ్రుడ్డును; అతి, ప్రయత్నంబునన్= మిక్కిలి ప్రయత్నంతో; రక్షించుకొని, ఉండెన్= కాపాడుకొని ఉండింది; అంతన్= ఆపైన.

**తాత్పర్యం:** పూర్తిగా ఏర్పడనిశరీరంతో పుట్టిన అనూరుడు, వినతపై కోపగించుకొని 'నన్ను పూర్తిశరీరం కలవాడిని కానీయకుండ గ్రుడ్డును బ్రద్దలుచేసిన నీతి లేనిదానివి. కావున నీ సవతి అయిన కద్రువకు దాసిగా అయిదువందలసంవత్సరాలు ఉండు' మని శపించి రెండవగ్రుడ్డు తనకుతానుగా పగిలేవరకు ఉండనిమ్ము. ఈ గ్రుడ్డునుండి పుట్టబోయే కుమారుడు గొప్పబలంతోను, పరాక్రమంతోను కూడినవాడు. అతడు నీదాసితనాన్ని పోగొడతాడు' అని తెలిపి సూర్యుడికి రథసారథిగా వెళ్ళాడు. వినతకూడ మిక్కిలి జాగరూకతతో ఆగ్రుడ్డును రక్షించుకొని ఉండింది. ఆ పైన (తరువాతి పద్యంతో అన్వయం.)

## దేవాసురు లమృతమును బడయఁగోరి సముద్రమును మథించుట (సం.1-15-5)

క. **అమరాసురవీరులు ము । న్నమల పయోరాశిఁ ద్రచ్చి, యమృతము వడయన్**
**సమకట్టి, సురేంద్రపురో । గము లై హరిహరహిరణ్యగర్భులతోడన్.** 8

**ప్రతిపదార్థం:** అమర+అసుర, వీరులు= వీరులయిన దేవతలు, రాక్షసులు; మున్ను= పూర్వం; అమల, పయోరాశిన్= నిర్మలమయిన పాలసముద్రాన్ని; త్రచ్చి= మథించి; అమృతము+పడయన్= అమృతాన్ని పొందటానికి; సమకట్టి= సిద్ధపడి; సుర+ఇంద్ర, పురోగములు+ఐ= దేవతల రాజయిన ఇంద్రుడు ముందు కలవారై; హరి, హర, హిరణ్యగర్భులతోడన్= విష్ణువు, శివుడు, బ్రహ్మ అనేవారితో.

**తాత్పర్యం:** పూర్వం వీరులయిన దేవతలూ, రాక్షసులూ పాలసముద్రాన్ని మథించి అమృతాన్ని పొందటానికి పూని ఇంద్రుడిని ముందుంచుకొని విష్ణుశంకరబ్రహ్మలతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

ఉ. **మేరుమహామహీధరముమీఁదికి నందఱుఁ బోయి, 'యేక్రియన్**
**వారిధిఁ ద్రచ్చువారము? ధ్రువంబుగ దానికిఁ గవ్వ మెద్ది? యా**
**ధారము దాని కెద్ది?' యని తద్దయు వెన్బడియున్న, నచ్యుతాం**
**భోరుహగర్భులిద్దఱును బూనిరి సర్వము నిర్వహింపఁగన్.** 9

**ప్రతిపదార్థం:** మేరు, మహత్, మహీధరము, మీఁదికిన్= మేరు వనే గొప్పపర్వతంమీదికి; అందఱున్+పోయి= దేవతలు రాక్షసులు అందరును వెళ్ళి; ఏక్రియన్= ఏవిధంగా; వారిధిన్= సముద్రాన్ని, త్రచ్చువారము= మథించగలం; ధ్రువంబుగన్= స్థిరంగా; దానికిన్= ఆకార్యానికి; కవ్వము; ఎద్ది= ఏది; దానికిన్= ఆకవ్వానికి; ఆధారము= అవలంబం; ఎద్ది= ఏది; అని; తద్దయున్= ఎక్కువగా; వెన్బడి, ఉన్నన్= చింతిస్తూ వెనకాడుతుండగా; అచ్యుత+అంభోరుహ, గర్భులు+ ఇద్దఱున్= విష్ణువు, బ్రహ్మ, ఇద్దరును; సర్వమున్= కార్యాన్నంతటిని; నిర్వహింపఁగన్= సాధించటానికి; పూనిరి= సమకట్టినారు.

**తాత్పర్యం:** దేవాసురు లందరూకలిసి మేరుపర్వతంమీదికి పోయి, 'ఏవిధంగా సముద్రాన్ని మథిద్దాము? మథించటానికి స్థిరమైన కవ్వం ఏది? ఆకవ్వానికి క్రింద ఆధార మేది?' అని మిక్కిలి చింతించి వెనుకాడుతుండగా బ్రహ్మవిష్ణువులిద్దరూ, ఆ మథనకార్యాన్నంతటినీ సాధించటానికి సమకట్టారు.

చ. **అరుదుగ సర్వశైలములయంత తనర్పును నార్జవంబు సు**
**స్థిరతయు నోషధీరసవిశేషతయుం గల దుత్తమంబు మం**
**థరకుధరంబు గవ్వ మగు దానికి నంచును నిశ్చయించి, య**
**య్యిరువురుఁ బంపఁగాఁ బెఱికి యెత్తె ననంతుఁడు తద్గిరీంద్రమున్.** 10

**ప్రతిపదార్థం:** అరుదుగన్= అపూర్వంగా; సర్వ, శైలముల, అంత, తనర్పును= అన్ని పర్వతాలంత పొడవును; ఆర్జవంబు= సరళత్వాన్ని (వంకరలేనితనాన్ని); సుస్థిరతయున్= మంచి స్థిరత్వాన్ని; ఓషధీ, రస, విశేషతయున్= మూలికలయొక్క రసంయొక్క అతిశయం కలిగి ఉండటాన్ని; కలది= కలిగి ఉన్నది; ఉత్తమంబు= శ్రేష్ఠమైనది అయిన; మంథర, కుధరంబు= మంథరపర్వతం; దానికిన్= ఆమథించేకార్యానికి; కవ్వము+అగున్; అంచును; నిశ్చయించి= నిర్ణయించి; ఆ+ఇరువురును= ఆబ్రహ్మవిష్ణువులిద్దరూ; పంపఁగాన్= ఆజ్ఞాపింపగా; అనంతుఁడు= శేషుడు; తద్, గిరి+ఇంద్రమున్= ఆపర్వతశ్రేష్ఠాన్ని; పెఱికి= పెళ్ళగించి, ఎత్తెన్= ఎత్తాడు.

**తాత్పర్యం:** అపూర్వంగా అన్నిపర్వతాలు కూడితే ఎంతపొడవుంటుందో అంతపొడవున్నూ, వంకరలేనిఎత్తున్నూ, మిక్కిలిస్థిరత్వాన్నీ కలిగి, మూలికలరసంయొక్క అతిశయత్వంతో కూడి శ్రేష్ఠమైనది అయిన మంథరపర్వతం, క్షీరసాగర మథనానికి కవ్వ మవుతుందని నిర్ణయించి ఆ బ్రహ్మవిష్ణువు లిరువురూ ఆజ్ఞాపించగా, శేషుడు ఆ పర్వతశ్రేష్ఠాన్ని పెళ్ళగించి పైకెత్తాడు.

**వ. ఇట్లు పదునొకండువేలయోజనంబులతనర్పును, నంతియపాఁతునుం గల మంథరనగం బనంతుం డనంత శక్తిం బెఱికి యెత్తిన, నందఱును నప్పర్వతంబు దెచ్చి, సముద్రంబులో వైచి, దానిక్రింద నాధారంబుగాఁ గూర్మరాజు నియమించి, యోక్త్రంబుగా వాసుకి నమర్చి. 11**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; పదునొకండు, వేల, యోజనంబుల, తనర్పును= పదకొండువేల ఆమడల(నాలుగుక్రోసులు) పొడవున్నూ; అంతియ, పాఁతునున్= పదకొండువేలయోజనాల భూమిలోపలిభాగాన్నీ; కల; మంథరనగంబు= మంథరపర్వతాన్ని; అనంతుండు= ఆదిశేషుడు; అనంత, శక్తిన్= అధికమయినశక్తితో; పెఱికి= పెల్లగించి; ఎత్తినన్= ఎత్తగా; అందఱును= దేవాసురులందరూ; ఆ+పర్వతంబు+తెచ్చి= ఆమంథరపర్వతాన్ని తెచ్చి; సముద్రంబులోన్; వైచి= వేసి; దానిక్రిందన్= ఆపర్వతానికి అడుగున; ఆధారంబుగాన్= అవలంబంగా; కూర్మరాజు= ఆదికూర్మాన్ని (తాఁబేటిని); నియమించి= నియోగించి, యోక్త్రంబుగాన్= కవ్వపుత్రాడుగా; వాసుకిన్= వాసుకి అనే సర్పరాజును; అమర్చి= ఏర్పరచి.

**తాత్పర్యం:** ఈవిధంగా పదకొండువేలయోజనాల పొడవున్నూ, అంతే (అంటే పదకొండువేలయోజనాల) భూమిలోని భాగాన్నీ కలిగిన మంథరపర్వతాన్ని ఆదిశేషుడు అధిక మైన శక్తితో పెళ్ళగించి ఎత్తగా, దేవాసురులందరున్నూ ఆమంథరపర్వతాన్ని తెచ్చి, సముద్రంలో వేసి, దిగబడిపోకుండ దానిక్రింద ఆధారంగా ఆదికూర్మాన్ని నియోగించి, కవ్వపుత్రాడుగా వాసుకి అనే పేరున్న సర్పరాజును ఏర్పాటుచేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**శా. క్షోణీచక్రభరంబు గ్రక్కదల దిక్కుల్ మ్రోయఁగా నార్చి, య**
**క్షీణోత్సాహసమేతు లై రయమునన్ గీర్వాణులుం, బూర్వగీ**
**ర్వాణవ్రాతము నబ్ధిఁ ద్రచ్చునెడఁ దద్వ్యాకృష్టనాగానన**
**శ్రేణీప్రోత్థవిషాగ్నిధూమవితతుల్ సేసెం బయోదావలిన్. 12**

**ప్రతిపదార్థం:** క్షోణీ, చక్ర, భరంబు= భూమియొక్కభారం, గ్రక్కదలన్= మిక్కిలి కదలగా; దిక్కుల్= దిక్కులు; మ్రోయఁగాన్= ప్రతిధ్వనించగా; ఆర్చి= బొబ్బలిడి; అక్షీణ+ఉత్సాహ, సమేతులు+ఐ= అధికమయిన ఉత్సాహంతో కూడినవా రై; రయమునన్= వేగంతో, గీర్వాణులున్= దేవతలున్నూ; పూర్వగీర్వాణ, వ్రాతమున్= రాక్షసుల యొక్కసమూహమున్నూ; అబ్ధిన్= సముద్రాన్ని; త్రచ్చు+ఎడన్= మథించేటప్పుడు; తద్, వ్యాకృష్ట, నాగ+ఆనన, శ్రేణీ, ప్రోత్థ, విష+అగ్ని, ధూమ వితతుల్= వారిచేత లాగబడిన వాసుకి అనే సర్పంయొక్క ముఖాలవరుసనుండి బయల్వెడలిన విష మనే అగ్నియొక్క పొగలసముదాయాలు; పయోద+ఆవళిన్= మేఘాల పంక్తిని, చేసెన్= సమకూర్చాయి (కలిగించాయి).

**తాత్పర్యం:** గుండ్రని భూమి అంతయూ మిక్కిలి కదలగా, దెసలు మారుమ్రోయగా, కేకలువేస్తూ, అధిక మయిన ఉత్సాహంతో కూడినవారై, వేగంతో దేవతలున్నూ, రాక్షససముదాయమున్నూ సముద్రాన్ని మథించేటప్పుడు వారిచే లాగబడిన వాసుకిసర్పంయొక్క ముఖాలవరుసనుండి బయల్వెడలిన విష మనే అగ్నియొక్క పొగలగుంపులు మేఘపంక్తిని కల్పించాయి.

**విశేషం:** ప్రయోగదక్షుడైనకవి కవితలో వాడే వర్ణాలూ, పదాలూ ఏ విధంగా రసాదివ్యంజకా లౌతాయో, అట్లాగే సమాస సంఘటనలుకూడ విభావాదులను, రసాదులను వ్యంజింపచేస్తాయి. క్షోణీచక్రము, అక్షీణోత్సాహసమేతులు, గీర్వాణులు, పూర్వగీర్వాణులు అనే సమాసాలలో మూర్ధన్యము, అనునాసికమూ అయిన ణ వర్ణపునఃపునరావృత్తి వారు చేసే నాదాన్ని ధ్వనింపచేస్తున్నది. వాసుకి ముఖంనుండి వినిర్గతమైన విషాగ్నిధూమతతులను ఈపద్యంలో మిగిలిన సమాసాలకంటె దీర్ఘమైన సమాసంగా సంఘటించటంచేత వాసుకి ధైర్యం, విషానలధూమవ్యాప్తీ అక్షరరమ్యంగా ధ్వనింపజేయబడుతున్నాయి. (సంపా.)

**క. ఉరగపతితలలవల నురు । తరజవమున నసురు లూఁది, తత్పుచ్ఛము ని**
**ర్జరవరు లూఁది మహామ । త్సరమున వడిఁ ద్రచ్చి త్రచ్చి జవమఱియున్నన్. 13**

**ప్రతిపదార్థం:** ఉరగపతి, తలల, వలను= సర్పరా జయిన వాసుకియొక్క తలలవైపు; ఉరుతర, జవమునన్= మిక్కిలి అధిక మయిన శక్తితో(వడితో); అసురులు= రాక్షసులు; ఊఁది= పట్టుకొని; తద్, పుచ్ఛము= ఆవాసుకియొక్కతోకను; నిర్జరవరులు= దేవతాశ్రేష్ఠులు; ఊఁది; మహత్, మత్సరమునన్= అధికమయిన చలంతో; వడిన్= వేగంతో; త్రచ్చి, త్రచ్చి= మథించి మథించి; జవము+అఱి, ఉన్నన్= శక్తి నశించి ఉండగా.

**తాత్పర్యం:** రాక్షసులు సర్పరాజయిన వాసుకితలలవైపును అధికమైనశక్తితో పట్టుకొని, దేవతలు దానితోకను పట్టుకొని మిక్కిలి పట్టుదలతో మథించి మథించి (మిక్కిలిగా మథించి) శక్తి తగ్గి ఉండగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. నారాయణుండు వారి క । వారితజవసత్త్వములు ధ్రువంబుగ నిచ్చెన్;**
**వారును దొల్లిటికంటె న । పారప్రారంభు లై రపరిమితశక్తిన్. 14**

**ప్రతిపదార్థం:** నారాయణుండు= విష్ణువు, వారికిన్= ఆ దేవరాక్షసులకు; అవారిత, జవ, సత్త్వములు= తగ్గని వేగాన్ని, శక్తిని; ధ్రువంబుగన్= స్థిరంగా; ఇచ్చెను; వారును= ఆదేవరాక్షసులున్నూ; అపరిమితశక్తిన్= అధికమయినశక్తితో; తొల్లిటికంటెన్= మునుపటికంటె; అపార, ప్రారంభులు+ఐరి= అంతం లేని ప్రయత్నం కలవా రయ్యారు.

**తాత్పర్యం:** విష్ణువు, ఆ దేవరాక్షసులకు తగ్గనివేగాన్నీ, శక్తినీ స్థిరంగా ఇచ్చాడు. వారు అధికమయిన శక్తితో పూర్వంకంటె మేర లేని ప్రయత్నం గలవా రయ్యారు.

**చ. ఉడుగక యొండొరుం జఱచి యొక్కబలంబున దేవదానవుల్**
**వడిగొని వార్ధి నిట్లు దరువం దరువన్ విష ముద్భవిల్లి నల్**
**గడలను విస్ఫులింగములు గప్పఁగఁ బర్విన, దానిఁ జెచ్చెరన్**
**మృడుఁడు గడంగి పట్టుకొని మ్రింగి గళంబున నిల్పెఁ బొల్పుగన్. 15**

**ప్రతిపదార్థం:** ఉడుగక= మానక; ఒండు+ఒరున్= ఒకరినొకరిని; చఱచి= అరచేతకొట్టి; ఒక్కబలంబునన్= ఏకధాటిగా; దేవ, దానవుల్= దేవతలును, రాక్షసులును; వడి, కొని= వేగంవహించి; వార్ధిన్= సముద్రాన్ని; ఇట్లు= ఈవిధంగా; తరువన్, తరువన్= మథించగా, మథించగా; విషము; ఉద్భవిల్లి= పుట్టి; నల్గడలను= నాలుగుదిక్కులలోనూ; విస్ఫులింగములు= నిప్పుకణాలు; కప్పఁగన్= ఆవరించేటట్లుగా, పర్వినన్= వ్యాపించగా; దానిన్= ఆవిషాన్ని; మృడుఁడు= శివుడు; చెచ్చెరన్= శీఘ్రంగా; కడంగి= పూని; పట్టుకొని; మ్రింగి; గళంబునన్= కంఠంలోపల; పొల్పుగన్= పొందికగా; నిల్పెన్= ఉంచాడు.

**తాత్పర్యం:** దేవాసురులు మానక ఉత్సాహంతో ఒండొరులను చేతులతోచరచుకొంటూ ఏకధాటిగా వేగం పెంచి సముద్రాన్ని ఇట్లా మథించగా, మథించగా విషం పుట్టి నాలుగుదిక్కులా నిప్పుకణాలు ఆవరించేటట్లు వ్యాపించగా, దాన్ని వేగంతో శివుడు పూని పట్టుకొని మ్రింగి పొందికగా అందంగా ఉండేటట్లు కంఠంలోపల నిలిపాడు.

**విశేషం:** సముద్రమథనంవలన విషం పుట్టింది. నాలుగుదిక్కులా నిప్పురవ్వలు గుప్పింది. నిజానికి విస్ఫులింగాలు కావవి విషబిందువులు. కాని, కవి ప్రౌఢోక్తిచేత వాటిని విస్ఫులింగాలంటున్నాడు. అప్పుడది రూపకాలంకారం కావాలి. ఉపమేయాన్ని చెప్పకుండా ఉపమానాన్నే చెపుతున్నాడుకాబట్టి అతిశయోక్తి కావాలి. విషం అగ్నివలె దాహకంగా ఉన్నదని ఇక్కడి విస్ఫులింగశబ్దం స్ఫురింపజేస్తున్నది. కాబట్టి ఇక్కడ కవి ప్రౌఢోక్తిసిద్ధమైన అలంకారంవలన ఏర్పడిన వస్తుధ్వని ఉన్నది. వస్తుధ్వనిని నిర్వహించటంలో నన్నయ పాటించే పద్ధతులలో ఇది సర్వసాధారణ మైనది. దీనిని నానారుచిరార్థసూక్తిలో భాగంగా కొందరు భావిస్తారు. (సంపా.)

**వ. మఱియు జ్యేష్ఠయుఁ జంద్రుండును శ్రీయును నుచ్చైశ్శ్రవంబును గౌస్తుభంబును నైరావణగజంబును నమృతపూర్ణశ్వేతకమండలు ధరుండైన ధన్వంతరియు నాదిగా ననేకంబు లుద్భవిల్లిన, నందుఁ ద్రిభువనవంద్య యయిన శ్రీదేవియు నిజప్రభాపటలపర్యుదస్త ప్రభాకరగభస్తివిస్తరం బయిన కౌస్తుభంబును నారాయణు వక్షఃస్థలంబున విలసిల్లె; నుచ్చైశ్శ్రవం బను యుగ్యంబు నైరావణగజంబును సురరాజయోగ్యంబు లయ్యెఁ; నంత నయ్యమృతంబు నసురులు చేకొనిన. 16**

**ప్రతిపదార్థం:** మఱియున్= అదిగాక; జ్యేష్ఠయున్= జ్యేష్ఠాదేవియు; చంద్రుండును; శ్రీయునున్= లక్ష్మీదేవియు; ఉచ్చైశ్శ్రవంబును= ఆ పేరుగలగుర్రమున్నూ; కౌస్తుభంబును= కౌస్తుభమణియున్నూ; ఐరావణగజంబును= ఐరావణమనేపేరున్న ఏనుగున్నూ; అమృత, పూర్ణ, శ్వేత, కమండలు, ధరుండు+ఐన, ధన్వంతరియున్= అమృతంతో నిండిన తెల్లని కమండలాన్ని ధరించినవాడైన ధన్వంతరిఅనేపేరుగల దేవవైద్యుడున్నూ; ఆదిగాన్= మొదలుగా; అనేకంబులు= పెక్కు; ఉద్భవిల్లినన్= పుట్టగా; అందున్= వాటిలో; త్రిభువన, వంద్య, అయిన= మూడులోకాలకు నమస్కరించదగిం దైన; శ్రీదేవియున్= లక్ష్మీదేవియు; నిజ, ప్రభా, పటల, పర్యుదస్త, ప్రభాకర, గభస్తి, విస్తరంబు+ఐన= తనకాంతిసముదాయంచేత నిరసింపబడిన సూర్యునికిరణాలసముదాయం కల దైన; కౌస్తుభంబును; నారాయణ, వక్షఃస్థలంబునన్= విష్ణువుయొక్కరొమ్మున; విలసిల్లెన్= ప్రకాశించాయి; ఉచ్చైశ్శ్రవంబు+అను; యుగ్యంబు= గుర్రమున్నూ; ఐరావణ, గజంబును= ఐరావణమనేఏనుగున్నూ; సురరాజ, యోగ్యంబులు= దేవేంద్రుడికి తగినవి; అయ్యెన్; అంత, ఆ+అమృతంబున్; అసురులు= రాక్షసులు; చేకొనినన్= గ్రహించగా.

**తాత్పర్యం:** అదికాక, జ్యేష్ఠాదేవి, చంద్రుడు, లక్ష్మి, ఉచ్చైశ్శ్రవమనే తెల్లనిగుర్రం, కౌస్తుభమణి, అమృతంతో నిండిన తెల్లని కమండలం ధరించిన ధన్వంతరి అనే దేవవైద్యుడు, ఐరావణ మనే తెల్లఏనుగు మొదలుగా గల పెక్కు (వ్యక్తులును, వస్తువులును, జంతువులును) పుట్టగా, వాటిలో ముల్లోకాలకూ నమస్కరింపదగిన లక్ష్మీదేవి, తనకాంతి సముదాయంచేత తిరస్కరించబడిన సూర్యుని కిరణాల సముదాయం గల కౌస్తుభమణి విష్ణునిరొమ్మున ప్రకాశించాయి (విష్ణువు వాటిని గ్రహించాడు). ఉచ్చైశ్శ్రవ మనేగుర్రం, ఐరావత మనే ఏనుగు దేవేంద్రుడికి తగిన వయ్యాయి (వాటిని ఇంద్రుడు గ్రహించాడు). అప్పుడు ఆ అమృతాన్ని రాక్షసులు గ్రహించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. నారాయణుండు కృత్రిమ । నారీరూపమునఁ దన్మనంబుల కతి మో**
**హారంభకారుఁ డై, యమ । రారులచేఁ గ్రమ్మఱంగ నమృతము గొనియెన్. 17**

**ప్రతిపదార్థం:** నారాయణుండు= విష్ణువు; కృత్రిమ, నారీ, రూపమునన్= మాయాకాంతారూపంలో; తద్+మనంబులకున్= ఆరాక్షసుల మనసులకు; అతి, మోహ+ఆరంభకారుఁడు+ఐ= అధికమయిన మోహంయొక్క ఉదయం కలిగించే వాడై; అమర+అరులచేన్= దేవతలకు శత్రువు లైన రాక్షసులనుండి; క్రమ్మఱంగన్= తిరుగ; అమృతము; కొనియెన్= గ్రహించాడు.

**తాత్పర్యం:** విష్ణువు మాయాకాంతారూపంతో రాక్షసుల మనస్సులకు అధికమయిన మోహంకలిగించినవాడై వారినుండి తిరిగి అమృతాన్ని గ్రహించాడు.

**వ. ఇ ట్లుపాయంబున నసురుల వంచించి యమృతంబు గొని విష్ణుదేవుండు దేవతల కిచ్చిన, నయ్యమృతంబు దేవత లుపయోగించుచోదేవరూపంబు దాల్చి రాహువు వేల్పులబంతి నయ్యమృతం బుపయోగించుచున్నఁ దత్సమీపంబున నున్న చంద్రాదిత్యులు వాని నెఱింగి నారాయణునకుం జెప్పిన, నయ్యమృతంబు వాని కంఠబిలంబు సొరకముందఱ. 18**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; ఉపాయంబునన్= నేర్పుతో; అసురులన్= రాక్షసులను; వంచించి= మోసగించి; అమృతంబు; కొని= గ్రహించి; విష్ణుదేవుండు; దేవతలకు+ఇచ్చినన్; ఆ+అమృతంబు= ఆ అమృతాన్ని; దేవతలు; ఉపయోగించుచోన్= త్రాగునప్పుడు; దేవ, రూపంబు= దేవతయొక్కరూపం; తాల్చి= ధరించి; రాహువు= రాక్షసులలో ఒకడు; నవగ్రహాలలో ఒకడు; వేల్పులబంతిన్= దేవతలవరుసలో; ఆ+అమృతంబు; ఉపయోగింపన్, పోయినన్= త్రాగటానికి వెళ్ళితే; తద్, సమీపంబునన్= అతని చెంత; ఉన్న= ఉండిన; చంద్ర+ఆదిత్యులు= చంద్రుడును, సూర్యుడును; వానిన్= రాహువును; ఎఱింగి= తెలిసికొని; నారాయణునకున్= విష్ణువుకు; చెప్పినన్= తెల్పగా; ఆ+అమృతంబు; వాని, కంఠబిలంబు= రాహువుయొక్క కంఠంయొక్క రంధ్రాన్ని; చొరక, ముందఱన్= ప్రవేశించటానికి ముందే.

**తాత్పర్యం:** ఈవిధంగా నేర్పుతో రాక్షసులను మోసగించి అమృతం గ్రహించి విష్ణువు దాన్ని దేవతల కిచ్చాడు. ఆ అమృతాన్ని దేవతలు త్రాగేటప్పుడు, దేవతారూపం ధరించి రాహువు దేవతల పంక్తిలో కూర్చుండి అమృతాన్ని త్రాగబోగా, అతనిచెంత ఉండిన చంద్రసూర్యులు వాడిని గుర్తించి విష్ణువుకు చెప్పారు. ఆ అమృతం రాహువు కంఠరంధ్రం ప్రవేశించటానికి ముందే (రాహువు దాన్ని మ్రింగటానికి ముందే). (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అమరారిమర్దనుఁడు చ । క్రము గ్రక్కున నేయ, రాహుకంఠము దెగి దే**
**హము ధరణిఁ బడియెఁ, దన్ముఖ । మమృతస్పర్శమున నక్షయం బై నిలిచెన్. 19**

**ప్రతిపదార్థం:** అమర+అరి, మర్దనుఁడు= దేవతలకు శత్రువులైన రాక్షసులను సంహరించేటివిష్ణువు; చక్రము= తన ఆయుధ మైన సుదర్శనాన్ని; గ్రక్కునన్= వేగంగా; ఏయన్= ప్రయోగించగా, రాహు, కంఠము= రాహువుయొక్కమెడ; తెగి; దేహము= శరీరం; ధరణిన్= భూమిపై; పడియెన్= పడింది; తద్, ముఖము= ఆరాహువుయొక్కముఖం; అమృతస్పర్శమునన్= అమృతంయొక్క తాకుచేత; అక్షయంబు+ఐ= నాశనంలేనిదై; నిలిచెన్= ఉండిపోయింది.

**తాత్పర్యం:** రాక్షసాంతకు డయిన విష్ణువు తనచక్రాన్ని వేగంగా ప్రయోగించగా రాహువుయొక్కకంఠం తెగటంచేత శరీరం భూమిపై పడింది. అతడిముఖంమాత్రం అమృతంయొక్క తాకుచేత నాశనం లేనిదై ఉండిపోయింది.

**విశేషం:** ఇచట తెగి అనే క్త్వార్థకక్రియ హేత్వర్థంలో వాడబడింది. అంటే తెగటంచేత అని అర్థం.

**వ. నాఁటంగోలె రాహువునకుఁ జంద్రాదిత్యులతోడి విరోధంబు శాశ్వతం బై ప్రవర్తిల్లుచుండె. 20**

**ప్రతిపదార్థం:** నాఁటంగోలెన్= నాటినుండి; రాహువునకున్; చంద్ర+ఆదిత్యులతోడి, విరోధంబు= చంద్రసూర్యులతోడివైరం (సమాసంలో తోడకు ఇత్వం వచ్చింది); శాశ్వతంబు+ఐ= నిత్యమయి; ప్రవర్తిల్లుచుండెన్= సాగుతూ ఉన్నది.

**తాత్పర్యం:** నాటినుండి రాహువుకు చంద్రసూర్యులతోడివిరోధం శాశ్వతంగా సాగుతూ ఉన్నది.

## దేవదానవుల యుద్ధము (సం.1-11-10)

**సీ. అంత దేవాహితు లమృతంబు గానక । యెంతయు నలిగి బలీంద్రుఁ గూడి**
**మంతనం బుండి 'యమర్త్యులతోడి పొ । త్తింతియ చాలు, నింకేల?' యనుచు**
**సంతనకట్టి, యుత్సాహసమేతులై । యంతంబులేని రథాశ్వములను**
**దంతుల నమితపదాతుల నొడఁగూర్చి॥ యంతకాకారు లై యార్చి, యమర**

**ఆ. వరులఁ దాఁకి యేసి రురుతరశరపక్ష । జాతవాతరయవిధూత మగుచుఁ**
**జెదర జలదపంక్తి, బెదర వజ్రాయుధు । హృదయ, ముదిలకొనఁగఁ ద్రిదశగణము. 21**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట; దేవ+అహితులు= దేవతలకు శత్రువు లయిన రాక్షసులు; అమృతంబు; కానక= పొందక; ఎంతయున్, అలిగి= మిక్కిలి కోపించి; బలి+ఇంద్రున్= తమకు రాజయిన బలిని; కూడి= కలిసికొని; మంతనంబు+ఉండి= మంత్రాలోచనం చేసి; అమర్త్యులతోడి, పొత్తు= దేవతలతో స్నేహం; ఇంతియ= ఇంతే; చాలున్; ఇంకన్+ఏల, అనుచు= ఇంకెందుకంటూ, సంతనకట్టి= గుమికూడి; ఉత్సాహసమేతులు+ఐ= ఉత్సాహంతో కూడినవా రై; అంతంబు, లేని= అపార మయిన, అధికములయిన; రథ+అశ్వములను= రథాలనూ, గుఱ్ఱాలనూ; దంతులన్= ఏనుగులనూ; అమితపదాతులన్= అధికసంఖ్య కల కాల్బలాన్ని; ఒడఁగూర్చి= సమకూర్చి; అంతక+ఆకారులు+ఐ= యమునియొక్క రూపంవంటి రూపం కలవారై; ఆర్చి= బొబ్బలిడి; ఉరుతర, శర, పక్ష, జాత, వాత, రయ, విధూతము+అగుచున్= మిక్కిలి అధికమయిన బాణాలకు కట్టిన ఎరకలవలన పుట్టిన గాలిచేత ఎగురగొట్టబడినది ఔతూ; జలద, పంక్తి= మేఘాలవరుస; చెదరన్= చెదరిపోగా; వజ్ర+ఆయుధు, హృదయము= వజ్రం ఆయుధంగా కల ఇంద్రుడిహృదయం; బెదరన్= భయపడగా; త్రిదశగణము= దేవతలసముదాయం; ఉదిలకొనఁగన్= పరితపించగా; అమరవరులన్= దేవతాశ్రేష్ఠులను; తాఁకి= ఎదిరించి; ఏసిరి= బాణాలు ప్రయోగించారు.

**తాత్పర్యం:** అప్పుడు రాక్షసులు అమృతాన్ని పొందక మిక్కిలి కోపించి, తమరాజయిన బలిచక్రవర్తిని కలిసికొని ఆలోచనచేసి, 'దేవతలతోడిపొందు ఇంతే చాలు, ఇం కెందుకు' అంటూ గుమికూడి ఉత్సాహంతో కూడినవారై అమితము లయిన రథాలను, గుఱ్ఱాలను, ఏనుగులను, అధికసంఖ్య గల కాల్బలాన్ని సమకూర్చుకొని యముడివలె భయంకర మయిన ఆకారాలుకలవా రై కేకలువేస్తూ మిక్కిలి సంఖ్యలో వేసినబాణాలకు కట్టిన ఈకలవలన పుట్టిన గాలియొక్కవేగంచేత ఎగురగొట్టబడింద్రై మేఘపంక్తి చెల్లాచెదరు కాగా, ఇంద్రుడిహృదయం భయపడేటట్లు దేవతాసముదాయం పరితపించేటట్లు, దేవతాశ్రేష్ఠులను ఎదిరించి బాణాదు లయిన ఆయుధాలను ప్రయోగించారు.

**విశేషం:** ఇంత+ఎ= ఇంతె; ఇంతియ రూపాంతరం.

**మహాస్రగ్ధర.**

**అమరేంద్రారాతు లిట్లాహవముఖమున నేయంగఁ దత్తీక్ష్ణబాణౌ**
**ఘము ఘోరం బై సురానీకముపయిఁ బెలుచం గప్పినం జూచి, దైత్యో**
**త్తములం గోదండచక్రోద్యతభుజులు మహాదారుణుల్ వీరలక్ష్మీ**
**రమణుల్ దుర్వారవాత్యారయమున నరనారాయణుల్ దాఁకి రల్కన్. 22**

**ప్రతిపదార్థం:** అమర+ఇంద్ర+అరాతులు= దేవేంద్రునికి శత్రువు లయిన రాక్షసులు; ఇట్లు= ఈవిధంగా ఆహవముఖమునన్= యుద్ధరంగం ముందరి భాగాన; ఏయంగన్= బాణాదులను ప్రయోగించగా; తత్, తీక్ష్ణ, బాణ+ఓఘము= వారి వాడి అయిన బాణాలయొక్క సముదాయం; ఘోరంబు+ఐ= భయంకర మై; సుర+అనీకముపయిన్= దేవతలసైన్యంమీద; పెలుచన్, కప్పినన్ మిక్కిలి కప్పివేయగా; చూచి; దైత్య+ఉత్తములన్= రాక్షసశ్రేష్ఠులను; కోదండ, చక్ర+ ఉద్యత, భుజులు= క్రమంగా గాండీవ ధనుస్సుతోను, చక్రంతోను ఎత్తబడిన భుజాలు గలవారున్నూ; మహత్, దారుణుల్= మిక్కిలిభయంకరులున్నూ; వీర, లక్ష్మీరమణుల్= శౌర్యలక్ష్మికి ప్రియులున్నూ; ఐన; నర, నారాయణుల్= నరుడు, నారాయణుడు; దుర్వార, వాత్యారయమునన్= వారించశక్యంకాని పెనుగాలియొక్క వేగంవంటి వేగంతో; అల్కన్= కోపంతో; తాఁకిరి= ముట్టడించారు.

**తాత్పర్యం:** రాక్షసు లీవిధంగా యుద్ధరంగంలో బాణాలు ప్రయోగించగా వారి బాణాలసమూహం భయంకరమై దేవతలసేనమీద దట్టంగా కప్పుకోగా చూచి, గాండీవధనుస్సుతో, చక్రంతో కూడినవారూ, మిక్కిలి భయంకరులూ, శౌర్యలక్ష్మికి ప్రియులూ అయిన నరుడును నారాయణుడును అనేవారు వారింప శక్యంకాని పెనుగాలియొక్క వేగంవంటివేగంతో రాక్షసశ్రేష్ఠులను ముట్టడించారు.

**విశేషం:** బాణ+ఓఘము= బాణౌఘము, వృద్ధిసంధి, మహాస్రగ్ధరలో ప్రతిపాదానికి స, త, త, న, స, ర, ర, గ అనే గణాలుంటాయి. 1-9-16 అక్షరాలు యతిస్థానాలు. కాంతి(బంధౌజ్జ్వల్యం) అనే శబ్దగణం ఇందులో పోషింపబడింది.

**మ. నరచాపప్రవిముక్తదారుణబృహన్నారాచధారల్ భయం**
**కరదైతేయనికాయకాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ బం**
**ధురధాత్రీధరతుంగశృంగతటసందోహంబుపైఁ గప్పు దు**
**ర్ధర ధారాధర ముక్తసంతతపయోధారావళిం బోలుచున్. 23**

**ప్రతిపదార్థం:** నర, చాప, ప్రవిముక్త, దారుణ, బృహత్, నారాచ, ధారల్= నరునిధనుస్సునుండి విడువబడిన భయంకరమైన పెద్దబాణాల పరంపరలు; దిశల్, నిండన్= దిక్కులు నిండగా; బంధుర ధాత్రీధర, తుంగ, శృంగ, తట, సందోహంబుపైన్= అందమయిన పర్వతాలయొక్క ఎత్తైనశిఖరాల అంచుల సముదాయంపై; కప్పు= ఆవరించే; దుర్ధర, ధారాధర, ముక్త, సంతత, పయః+ధారా+ఆవళిన్, పోలుచున్= ధరింపశక్యం కాని మేఘాలనుండి విడువబడిన దట్టమయిన నీటిధారల సముదాయాన్ని పోలుతూ; భయంకర, దైతేయ, నికాయ, కాయములపైన్= భయాన్ని కల్గించే రాక్షససముదాయాల శరీరాలపై; కప్పెన్= ఆవరించాయి.

**తాత్పర్యం:** నరునిధనుస్సునుండి విడువబడిన భయంకరము లైన పెద్దబాణాలపరంపరలు దిక్కులు నిండగా అందమయిన పర్వతాలయొక్క ఎత్తయిన శిఖరాలఅంచుల సమూహంపై కప్పే భరింపశక్యంకాని మేఘాలనుండి

విడువబడిన దట్ట మయిన నీటిధారలసముదాయాన్ని పోలుతూ, భయంకరులైన రాక్షసుల శరీరాల సముదాయాలపై కప్పాయి.

**విశేషం:** అలం: ఉపమ. ప్రసాద మిశ్రిత మైన ఓజస్సు (గాఢబంధత్వం) అనే శబ్దగుణం ఇక్కడ సార్థకంగా ప్రయోగించాడు నన్నయ.

**మ. పతదుర్వీధరధాతునిర్ఝరజలాభం బై మహాదేహని**
**ర్గత సాంద్రారుణపూర మొక్కమొగి నొల్కం ద్రెస్సి, నారాయణో**
**న్నతదోర్దండవిముక్తచక్రనిహతిన్ నాకద్విషన్మస్తక**
**ప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూభాగంబు కంపింపఁగన్. 24**

**ప్రతిపదార్థం:** పతత్, ఉర్వీధర, ధాతు, నిర్ఝర, జల+ఆభంబు+ఐ= క్రిందకు పడుతున్న పర్వతంయొక్క గైరికాది ధాతువులతో కూడిన సెలయేళ్ళలోని నీటియొక్క కాంతివంటి కాంతి కలదై; (ఆభ= సమానం, కాంతి అనే అర్థాలున్నాయి.) నీటితో సమానమైన కాంతి కలదై; మహత్, దేహ, నిర్గత, సాంద్ర+అరుణ, పూరము= పెద్దశరీరాలనుండి బయల్వెడలిన దట్ట మయిన రక్తప్రవాహం; ఒక్క, మొగిన్= ఒకేవిధంగా (ఎడతెగకుండ); ఒల్కన్= కారగా; నారాయణ+ఉన్నత, దోర్దండ, విముక్త, చక్ర, నిహతిన్= నారాయణుడి యొక్క పొడవైన దండాలవంటి భుజాలనుండి విడువబడిన చక్రంయొక్క దెబ్బచేత; త్రెస్సి= తెగి; నాక, ద్విషత్, మస్తక, ప్రతతుల్= స్వర్గానికి శత్రువు లయిన రాక్షసుల తలల సమూహాలు; భూభాగంబు= భూతలం; కంపింపఁగన్= చలించగా; ఘోరరణంబునన్= భయంకరమయిన యుద్ధంలో, పడియెన్= పడ్డాయి.

**తాత్పర్యం:** పైనుండి క్రిందకు పడుతున్న గైరికాదిధాతువులతోకూడిన నదులనీటియొక్క కాంతివంటి కాంతికలదై, పెద్ద పెద్దదేహాలనుండి బయల్వెడలిన రక్తప్రవాహం ఎడతెగకుండ కారుతుండగా, నారాయణుడియొక్క పొడవైన; దండాలవంటి భుజాలనుండి విడువబడిన చక్రంయొక్క దెబ్బచేత తెగి, రాక్షసుల తలల సముదాయాలు భూతలం చలించేటట్లుగా భయంకర మయిన యుద్ధరంగంలో పడ్డాయి.

**విశేషం:** ద్విషత్+మస్తక= ద్విషన్మస్తక - అనునాసికసంధి, ఆభ= కాంతి, సమానం అనే అర్థాలు రెండూ పై సందర్భానికి ఉచితంగా ఉంటాయి. సమానం అనే అర్థాన్ని గ్రహిస్తే ఉపమాలంకారం అవుతుంది. ఓజస్సు అనే శబ్దగుణం రచనలో ఇక్కడ సార్థకం.

**వ. ఇట్లు సముద్రతీరంబున నమరాసురులకు నతిఘోరయుద్ధం బయ్యె; నందు నరనారాయణు లపారపరాక్రము లై యసురవీరులఁ బెక్కండ్రం జంపిన నుక్కడంగి, దెసచెడి, యసురులు సముద్రంబు సొచ్చిన, నమరులు సమరలబ్ధవిజయు లై యమరపతి నమృతరక్షణార్థంబు ప్రార్థించి, యథాస్థానంబున మంథరనగంబు ప్రతిష్ఠాపించి, తమతమనివాసంబులకుం జని సుఖంబుండి రంత. 25**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; సముద్రతీరంబునన్= సముద్రపుటొడ్డున; అమర+అసురులకున్= దేవతలకును, రాక్షసులకును; అతిఘోరయుద్ధంబు= మిక్కిలి భయంకర మయినయుద్ధం; అయ్యెన్; అందున్= ఆ యుద్ధంలో; అపార, పరాక్రములు+ఐ= మేర లేని విక్రమంగలవా రై; అసుర, వీరులన్, పెక్కండ్రన్= పలువురు వీరు లయిన రాక్షసులను; చంపినన్= చంపగా; ఉక్కు+అడంగి= గర్వం తగ్గి; దెసచెడి= దిక్కులేక; అసురులు= రాక్షసులు; సముద్రంబు; చొచ్చినన్= ప్రవేశించగా; అమరులు=

దేవతలు; సమరలబ్ధవిజయులు+ఐ= యుద్ధంలో పొందబడిన విజయం కలవా రై; అమరపతిన్= దేవతలకు రాజయిన ఇంద్రుని; అమృత, రక్షణ+అర్థంబు= అమృతాన్ని రక్షించటంకొరకు; ప్రార్థించి= వేడి; మంథరనగంబున్= మంథరపర్వతాన్ని; యథాస్థానంబునన్= పూర్వ మున్న చోట; ప్రతిష్ఠాపించి= నిలిపి; తమ, తమ, నివాసంబులకున్= తమ తమ గృహాలకు; చని= వెళ్ళి; సుఖంబు+ఉండిరి= సుఖంతో ఉన్నారు.

**తాత్పర్యం:** ఈ విధంగా సముద్రపుటొడ్డున దేవతలకూ, రాక్షసులకూ మిక్కిలిభయంకర మైన యుద్ధం జరిగింది. ఆయుద్ధంలో నరుడును, నారాయణుడును అధిక మైన పరాక్రమం కలవారై వీరులయిన రాక్షసులను పలువురిని చంపగా, గర్వం తగ్గి దిక్కు లేక రాక్షసులు సముద్రంలో ప్రవేశించారు. దేవతలు యుద్ధంలో విజయాన్ని సాధించిన వారై, తమకు రాజైన ఇంద్రుడిని అమృతం రక్షించటంకొరకు ప్రార్థించి, మంథరపర్వతాన్ని పూర్వ ముండేచోట మళ్ళీ నిలిపి, తమ తమ గృహాలకు వెళ్ళి సుఖంతో ఉన్నారు.

**విశేషం:** సుఖంబు+ఉండిరి; ఇచ్చట ప్రథమావిభక్తి (సుఖంబు) తృతీయార్థంలో వాడబడింది.

### కద్రూవినత లుచ్చైశ్శ్రవమును జూచి పందెములు సఱచుట (సం. 1-18-1)

**క. అమృతముతో నుద్భవ మై । యమరేశ్వరయోగ్య మైన హయరత్నము త**
**ద్విమలోదధితీరంబునఁ । గొమరుగ నేకతమ యిచ్చఁ గ్రుమ్మరుచున్నన్. 26**

**ప్రతిపదార్థం:** అమృతముతోన్; ఉద్భవము+ఐ= పుట్టి; అమర+ఈశ్వర, యోగ్యము+అయిన= దేవతలరా జయిన ఇంద్రుడికి తగిన; హయ, రత్నము= అశ్వశ్రేష్ఠం; తద్+విమల+ఉదధి, తీరంబునన్= ఆ నిర్మల మయిన పాలసముద్రపుటొడ్డున; కొమరుగన్= అందంగా; ఏకతము+అ= ఒంటరిగా; ఇచ్చన్= స్వేచ్ఛగా; క్రుమ్మరుచున్+ఉన్నన్= తిరుగుతుండగా.

**తాత్పర్యం:** అమృతంతోపాటు పుట్టి దేవేంద్రునిచే గ్రహింపబడిన ఉచ్చైశ్శ్రవ మనే అశ్వశ్రేష్ఠం, ఆ పాలసముద్రం ఒడ్డున అందంగా, ఒంటరిగా, స్వేచ్ఛగా తిరుగుతుండగా.

**వ. కద్రువయు, వినతయు వినోదార్థంబు విహరించువారు కరిమకరనికరాఘాతజాత వాతోద్ధూత తుంగతరంగాగ్రసముచ్చలజ్జలకణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలం బైనదాని, నుద్యానవనంబునుంబోలె బహువిద్రుమలతాలంకృతం బైనదాని, నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్రశోభితరంగరమ్యం బైనదాని, దివంబునుం బోలె నహిమకరభరితం బైనదాని మఱియు. 27**

**ప్రతిపదార్థం:** కద్రువయున్; వినతయున్; వినోద+అర్థంబు= వినోదంకొరకు; విహరించువారు= సంచరించేవారు; కరి, మకర, నికర+ఆఘాత, జాత, వాత+ఉద్ధూత, తుంగ, తరంగ+అగ్ర, సముచ్చలత్, జల, కణ+ఆసార+ఛటా+ఆచ్ఛాదిత, గగన, తలంబు+ఐనదానిన్= ఏనుగులయొక్క, మొసళ్ళయొక్క సముదాయంయొక్క దెబ్బలచేత పుట్టిన, గాలిచేత ఎగురగొట్టబడిన ఎత్తయిన కెరటాలపైభాగంలో కదలాడే నీటిబిందువుల జడివాన సముదాయంచేత కప్పబడిన ఆకాశభాగం కలదానిని; ఉద్యానవనంబునున్, పోలెన్= విహారవనంవలె; బహు, వి, ద్రుమ, లతా+అలంకృతంబు+అయిన, దానిన్= పెక్కుపక్షులతోకూడిన, చెట్లతోకూడిన, లతలచేత అలంకరింపబడినదానిని; సముద్రపక్షంలో - బహు, విద్రుమ, లతా+అలంకృతంబు+ఐనదానిన్= పెక్కుపగడపుతీగలచేత అలంకరింపబడిన దానిని; నాటక ప్రయోగంబునున్+పోలెన్= నాటకంయొక్క ప్రదర్శనంవలె; ఘన, రస, పాత్ర, శోభిత, రంగరమ్యంబు+ఐనదానిన్= గొప్పశృంగారాదిరసాలతోను, పాత్రలతోను ప్రకాశించేరంగంచే

అందమయినదానిని; సముద్రపక్షంలో - ఘన, రస, పాత్ర, శోభి, తరంగ, రమ్యంబు+ఐనదానిన్= గొప్ప (అధికమైన) నీటికి నెలవై ప్రకాశించే కెరటాలచేత సుందర మైనదానిని, ఇక్కడ 'ఘన' అంటే మేఘా లనియు అర్థం చెప్పవచ్చును (మేఘాలలోని నీటికి నెలవులై); దివంబునున్, పోలెన్= ఆకాశంవలె, అహిమ, కర, భరితంబు+ఐనదానిన్= వేడికిరణాలు గల సూర్యుడితో కూడినదానిని; సముద్రపక్షంలో- అహి, మకర, భరితంబు+ఐనదానిన్= పాములతోను, మొసళ్ళతోను కూడిన దానిని; మఱియున్= ఇంకా.

**తాత్పర్యం:** అటువంటి సమయంలో కద్రూవినతలు వేడుకకొరకు విహరిస్తూ, నీటిఏనుగుల, మొసళ్ళ సముదాయాల దెబ్బలవలన పుట్టిన గాలిచేత ఎగురగొట్టబడిన ఎత్తయిన కెరటాల పై భాగాన కదలాడే నీటిబిందువుల జడివాన మొత్తంచేత కప్పబడిన ఆకాశభాగం గలదానిని, విహారవనం వలె (పెక్కు పక్షులతోకూడిన చెట్లచేత, తీగలచేత అలంకరింపబడిన దానిని) పెక్కు పగడపు తీగలచే అలంకరింపబడినదానిని, (నాటకప్రదర్శనంవలె గొప్పశృంగారాది రసాలతోను, పాత్రలతోను ప్రకాశించేరంగస్థలం వలె సుందర మైనదానిని) విస్తృత మైన నీటికి నెల వై ప్రకాశించే కెరటాలచేత సుందర మైనదానిని, (ఆకాశంవలె సూర్యుడితో కూడిన దానిని) పాములతోను, మొసళ్ళతోను నిండినదానిని, అదికాక.

**విశేషం:** అలంకారాలు; శ్లేష, వృత్త్యనుప్రాసం, అంత్యానుప్రాసం. నన్నయశ్లేషతో రచించినకొద్దిభాగాల్లో ఇది ఒకటి. ఉద్యానవనంబునున్‌పోలెన్, నాటకప్రయోగంబునున్ పోలెన్ - అనేచోట్ల ద్రుతంపై మరొకద్రుతం వాడబడింది.

**చ.** **అలఘుఫణీంద్రలోకకుహరాంతరదీప్తమణిస్ఫురత్ప్రభా**
**వలి గలదాని, శశ్వదుదవాసమహావ్రతశీతపీడితా**
**చలమునిసౌఖ్యహేతువిలసద్బడబాగ్ని శిఖాచయంబులన్**
**వెలిఁగెడిదానిఁ గాంచి రరవిందనిభానన లమ్మహోదధిన్.** **28**

**ప్రతిపదార్థం:** అరవిందనిభ+ఆననలు= పద్మంతో సమాన మైన ముఖాలు కల కద్రూవినతలు; అలఘు, ఫణి+ఇంద్ర, లోక, కుహర+అంతర, దీప్త, మణి, స్ఫురత్, ప్రభా+ఆవళి, కలదానిన్= గొప్పనాగరాజులలోక మయిన పాతాళం యొక్క గుహలోపల ప్రకాశించే రత్నాలయొక్క వెలుగుతున్నకాంతులసముదాయం కలదానిని; శశ్వత్+ఉదవాస, మహత్, వ్రత, శీత, పీడిత+అచల, ముని, సౌఖ్య, హేతు, విలసత్, బడబా+అగ్ని, శిఖా, చయంబులన్= ఎల్లప్పుడు నీటిలో నివసించటమనే గొప్పవ్రతంచేత చలివలన బాధింపబడే కదలని (పర్వతాలనే) మునుల సుఖానికి కారణ మయి ప్రకాశిస్తున్న ఔర్వాగ్నియొక్క జ్వాలల సముదాయాలచే; వెలిఁగెడుదానిన్= ప్రకాశించేదాన్ని; ఆ+మహత్+ఉదధిన్= ఆ గొప్పసముద్రాన్ని; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** పద్మాలవంటి ముఖాలు కల కద్రూవినతలు గొప్పనాగరాజులలోకమయిన పాతాళగుహలో ప్రకాశించే మణులయొక్క వెలుగుతున్న కాంతులసముదాయం కలదానిని, ఎల్లప్పుడూ నీటిలో నివసించట మనే గొప్పవ్రతంచేత చలిచే బాధింపబడినప్పటికి కదలకుండాఉండే పర్వతాలనే మునులసౌఖ్యానికి కారణ మయి ఒప్పే బడబానలంయొక్క జ్వాలలసముదాయంచేత ప్రకాశించే ఆపెద్దసముద్రాన్ని చూచారు.

**విశేషం:** అలం: రూపకం. ఈపద్యరచనలో సమతా(మార్గభేద) విశిష్టమైన ఓజస్సు (గాఢబంధత్వం) అనే శబ్దగుణాన్ని, అక్షరరమ్యతను నన్నయ పోషించాడు. మొదటి, మూడవ చరణాలను దీర్ఘసమాసాలతో రచించి రెండవ, నాల్గవ చరణాలను,

'ఆవలిగలదాని, వెలిఁగెడిదాని' అనే పదాలతో సమంగా విరవటం వలన వృత్తరచనలో సమత్వం ఏర్పడింది. మిగిలిన వృత్తరచనలో ఓజస్సు రాణించింది. అలలవిన్యాసంలో సమత్వం, గాంభీర్యంలో ఓజస్విత కల సముద్రవర్ణనంలో ఈగుణసంయోజనం విభావస్ఫూర్తిని వెలారుస్తున్నది. (సంపా.)

**మ. వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలావనైలావలీ**
**లవలీలుంగలవంగ సంగతలతాలాస్యంబు లీక్షించుచున్**
**ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం దత్తీరదేశంబునం**
**దవదాతాంబుజ ఫేనపుంజనిభు నయ్యశ్వోత్తముం దవ్వులన్. 29**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట; ధవళ+అక్షుల్= తెల్లనికన్నులు కల కద్రూవినతలు; చని= వెళ్ళి; ఎదురన్= తమఎదుట; దవ్వులన్= దూరంలో; వివిధ+ఉత్తుంగ, తరంగ, ఘట్టన, చలత్+వేలా, వన+ఏలా+ఆవలీ, లవలీ, లుంగ, లవంగ, సంగత, లతా, లాస్యంబులు= పలువిధా లయిన ఎత్తయిన కెరటాల దెబ్బలచే కదలుతున్న (వేలావన) సముద్రపుటొడ్డుమీది వనాలలోని ఏలకిలతల సమూహాలు, లవలి అనే పేరుగల లతలు, మాదీలతలు, లవంగలతలు అనే అందాలయిన (ఒండొంటితో కలసిన) లతలయొక్క చలన రూపాలయిన నాట్యాలు; ఈక్షించుచున్= చూస్తూ; తత్, తీర, దేశంబునందున్= ఆ సముద్రంయొక్క తీరప్రదేశంలో; అవదాత+అంబుజ, ఫేన, పుంజ, నిభున్= తెల్లనిపద్మాలతోనూ, నురుగు సముదాయంతోనూ, సమానమైన; ఆ+అశ్వ+ఉత్తమున్= ఆ శ్రేష్ఠ మైన గుఱ్ఱాన్ని; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** పిమ్మట తెల్లనికన్నులు గల ఆ కద్రూవినతలు తమఎదుట పలువిధా లైన ఎత్తైనకెరటాలదెబ్బలచేత కదలుతున్న సముద్రపుటొడ్డుమీది వనాలలోని ఏలకిలతలు, లవలీలతలు, మాదీలతలు, లవంగలతలు ఒండొంటితో కలిసి అందా లొలకపోసే లతల నాట్యాలు చూస్తూ తెల్లనిపద్మాలతోనూ, నురుగుసమూహంతోను సమానమైన ఆ ఉచ్చైశ్శ్రవమనబడే హయశ్రేష్ఠాన్ని చూచారు.

**విశేషం:** అలం: ఉపమ. వీనులకు విందైన సముద్రతరంగాల లయలూ, కన్నులకు పండువైన లతాలలనల నాట్యాలహొయలూ భూమికగా ఉండగా వాటిప్రక్కనే మనసును మరపించే తెల్లని ఉచ్చైశ్రవాన్ని దర్శింపచేస్తున్నాడు నన్నయ. ఇటువంటి చక్కని స్థిరచిత్రాలను వర్ణించటంలో నన్నయ దిట్ట. తరంగఘట్టనను, లతాలాస్యాలను, అశ్వసౌందార్యాన్నీ, విభావోచితమైన అక్షరరమ్యంగా వర్ణించాడు. ఓజోగుణ(గాఢబంధత్వ)విశిష్టమైన కాంతి(బంధౌజ్జ్వల్యం) అనే శబ్దగుణం కల రచనచేత సన్నివేశాన్ని ధ్వనిమయం చేశాడు నన్నయ. ఇందులోని అక్షరరమ్యత గుణపోషకం. (సంపా.)

**వ. కని, కద్రువ వినతం జూచి 'చూడవె యల్ల యతిధవళంబైన యశ్వంబునందు సంపూర్ణచంద్రునందు నల్లయుంబోలె వాలప్రదేశంబునందు నల్ల యై యున్నది' యనిన విని వినతనగి 'నీ వే కన్నులం జూచితే యక్క! యెక్కడిది నల్ల? యీయశ్వరాజుమూర్తి మహాపురుషకీర్తియుంబోలె నతినిర్మలం బై యొప్పచున్నయది' యనిన విని నవ్వి వినతకుఁ గద్రువ యి ట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** కని= ఆగుర్రాన్ని చూచి; చూడవె= చూడుమా; అల్ల= ప్రసిద్ధ మైన; అతి, ధవళంబు+ఐన= మిక్కిలితెల్లని దైన; అశ్వంబునందున్= గుర్రంలో; సంపూర్ణ, చంద్రు+అందున్= నిండు చంద్రుడిలోని; నల్లయున్, పోలెన్= మచ్చవలె; వాలప్రదేశంబునందున్= తోకభాగంలో; నల్ల+ఐ= మచ్చ అయి; ఉన్నది; అనినన్= అని పలుకగా; విని; వినత; నగి= నవ్వి; నీవు, ఏ, కన్నులన్, చూచితి(వి), ఏ= నీవు ఏకన్నులతో చూచావో (సరిగా చూడలేదని భావం); అక్క= కద్రువకు సంబోధన;

నల్ల= మచ్చ; ఎక్కడిది= ఎక్కడ ఉన్నది; ఈ, అశ్వరాజు, మూర్తి= ఈశ్రేష్ఠమైన గుర్రంరూపం; మహత్, పురుష కీర్తియున్, పోలెన్= మహాత్ముని కీర్తివలె; అతి, నిర్మలంబు+ఐ= మిక్కిలి తెల్లని దై; ఒప్పుచున్న, అది= ప్రకాశిస్తున్నది; అనినన్= అని వినత పల్కగా. విని= ఆలకించి; నవ్వి= హసించి; వినతకున్= వినతకు, కద్రువ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** ఆ గుర్రాన్ని చూచి కద్రువ వినతతో 'చూడుము! మిక్కిలి తెల్లని దైన ఆ గుర్రంలో, నిండు చంద్రుడిలోని మచ్చవలె తోకభాగం నల్లగా ఉన్నది' అని అనగా విని వినత నవ్వి 'ను వ్వే కన్నులతో చూచావే అక్కా! మచ్చ ఎక్కడిది? ఈ శ్రేష్ఠమైన గుఱ్ఱం మహాత్ముని కీర్తివలె మిక్కిలి తెల్లనిదై ప్రకాశిస్తున్నది' అని అనగా విని వినతతో కద్రువ ఇట్లా అన్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **'అమ్మహాశ్వంబుధవళదేహంబునందు । నల్ల గలిగిన నీ విప్డు నాకు దాసి**
**వగుము; మఱి యందు నల్లలే దయ్యె నేని । నీకు నే దాసి నగుదుఁ; బన్నిదము సఱుము.'** **31**

**ప్రతిపదార్థం:** ఆ+మహత్+అశ్వంబు, ధవళ, దేహంబు+అందున్= ఆగొప్ప గుర్రం యొక్క తెల్లని శరీరంలో; నల్ల= మచ్చ; కలిగినన్= ఉంటే; నీవు, ఇప్డు, నాకున్; దాసివి; అగుము; మఱి= అట్లుకాక; అందున్= శరీరంలో; నల్ల= మచ్చ; లేదు+అయ్యెన్+ఏని; నీకున్; నే= నేను; దాసిన్, అగుదున్; పన్నిదము= పందెం; చఱుము= (చరచుము) అరచేతిలో చేయివేసి పందెం వేయుము (చఱుము అనేది చరచుదమునకు రూపాంతరం).

**తాత్పర్యం:** ఆ గొప్ప గుర్రంయొక్క తెల్లనిదేహంలో నల్లనిమచ్చ ఉంటే నీ విప్పుడు నాకు దాసివి కమ్ము. అట్లా కాక ఆ శరీరంలో మచ్చలేకుంటే నేను నీకు దాసివి అవుతాను. పందెం వేయుము'.

**వ.** **అని యి ట్లిద్దఱు నొండొరులకు దాసీత్వంబు పణంబుగా నొడివి పన్నిదంబు సఱచిన, వినత 'యయ్యశ్వంబు డాసి చూతము ర' మ్మనినఁ గద్రువయు 'నిపుడు ప్రొద్దు లేదు, పతిపరిచర్యాకాలంబు నయ్యె; ఱేపకడయ చూత' మని యిద్దఱు మగుడివచ్చి తమ నివాసంబులకుం బోయి యున్న యప్పుడు.** **32**

**ప్రతిపదార్థం:** అని, ఇట్లు+ఇద్దఱున్= వినతాకద్రువలిరువురును; ఒండు+ఒరులకున్= ఒకరికొకరు; దాసీత్వంబు= దాసితనం; పణంబుగాన్= పందెంగా; నొడివి= పలికి; పన్నిదంబు= పందెం; చఱచినన్= చేతితో కొట్టి వెయ్యగా; వినత; ఆ+అశ్వంబు= ఆగుఱ్ఱాన్ని; డాసి= సమీపించి; చూతము= చూద్దాము; రమ్ము, అనినన్; కద్రువయున్; ఇపుడు; ప్రొద్దు, లేదు= సమయం లేదు; పతి, పరిచర్యాకాలంబున్= భర్తకు సేవచేసేకాలంకూడ, అయ్యెన్; ఱేపకడ+అ= ఉదయమే; చూతము; అని; ఇద్దఱు; మగుడి వచ్చి= తిరిగి వచ్చి; తమ, నివాసంబులకున్= తమ గృహాలకు; పోయి= వెళ్ళి.

**తాత్పర్యం:** అని ఈవిధంగా వినతాకద్రువలిద్దరు ఒకరొకరికి దాస్యం చేయటం పందెంగా పలికి పందెం వేయగా, వినత ఆ గుర్రాన్ని చేరి చూద్దాము రమ్మని పలుకగా, కద్రువ 'ఇప్పుడు సమయం చాలదు. భర్తకు సేవ చేసే కాలం కూడ అయింది. రేపు ఉదయమే వచ్చి చూద్దాము' అని తెలిపింది. అప్పు డాసతు లిద్దరూ తిరిగివచ్చి తమ తమ గృహాలకు పోయి ఉన్న సమయాన (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** చూచుదము - చువర్ణంతోడి దుగ్దకారం తకార మవుతుంది - చూతము.

**సీ. కద్రువ కొడుకులకడ కేఁగి 'యేను మి । మ్మందఱ వేఁడెద నన్నలార!**
**నాపంపు సేయుండు, నన్ను రక్షింపుఁడు । కామచారులకు దుష్కరము కలదె!**
**యుల్ల తెల్లని తురగోత్తము వాలంబు । నల్ల సేసితిరేని నాకు దాసి**
**యగు మన వినత, మీ రట్లు సేయనినాఁడు । దానికి మఱి యేను దాసి నగుదు;**

**ఆ. జంట పన్నిదంబు సఱచితి మిట్లుగా' । ననినఁ బాములెల్ల 'ననయ మిదియుఁ**
**దల్లి పనిచె నని యధర్మువు సేయంగ । నగునె? యెఱుక గలరె మగువ లెందు'! 33**

**ప్రతిపదార్థం:** కద్రువ; కొడుకుల, కడకున్= కుమారులవద్దకు; ఏఁగి= వెళ్ళి; అన్నలార= వత్సలారా! మిమ్ము+అందఱన్, వేఁడెదన్; నా, పంపు, చేయుండు= నాఆజ్ఞ చేయండి; నన్ను; రక్షింపుఁడు= కాపాడండి; కామ, చారులకున్= ఇచ్ఛవచ్చినట్లు సంచరించేవారికి; దుష్కరము= చేయ శక్యం కానిది; కలదు+ఎ= ఉన్నదా! లేదు; ఉల్ల= దూరసమీపప్రదేశాలకు మధ్యప్రదేశంలో ఉన్న; తెల్లని, తురగ+ఉత్తము, వాలంబు= తెల్లని అశ్వశ్రేష్ఠం యొక్క తోకను; నల్ల+చేసితిరి+ఏని= మచ్చచేశారంటే; మన, వినత; నాకు; దాసి, అగున్; మీరు+అట్లు; చేయని, నాఁడు= చేయకుంటే; దానికిన్= వినతకు; మఱి ఇంక; ఏను= నేను; దాసిన్, అగుదున్; ఇట్లుగాన్= ఈవిధంగా; జంటపన్నిదంబు= ఇద్దరు సమానంగా వేసేపందెం; చఱచితిమి= వేశాము; అనినన్= అని చెప్పగా; పాములు+ఎల్లన్= పాములన్నీ; ఇదియున్= ఇది; అనయము= నీతి కానిది; తల్లి; పనిచెన్+అని= ఆజ్ఞాపించిన దని; అధర్మువు= అధర్మం; చేయంగన్, అగునె= చేయనవునా? ఎందున్= ఎక్కడైనా; మగువలు= స్త్రీలు; ఎఱుక, కలరె= తెలివిగలవారా? (కారని భావం).

**తాత్పర్యం:** కద్రువ కొడుకు లయిన పాములచెంతకు వెళ్ళి, 'వత్సలారా! నేను మిమ్మ ల్నందరినీ ప్రార్థిస్తున్నాను. నాఆజ్ఞ చేయండి. నన్ను కాపాడండి. ఇచ్ఛవచ్చినట్లు సంచరించగల మీకు చేయ శక్యంకానిది ఉన్నదా? ఆ తెల్లని అశ్వశ్రేష్ఠంతోకను మీరు మచ్చచేస్తే వినత నాకు దాసి అవుతుంది. మీరు అట్లా తోకను నలుపు చేయకపోతే నే నింక వినతకు దాసి నవుతాను. ఈ విధంగా ఒండొరులం పందెం వేసుకొన్నాం' అని పలుకగా పాములన్నీ 'ఇది నీతిరహితం. తల్లి ఆజ్ఞాపించిందని అధర్మం చేయవచ్చా? ఎక్కడైనా స్త్రీలు జ్ఞానం కలవారా!'

**వ. అని యందఱుఁ దమలో విచారించి యధర్మారంభంబునకు సుముఖులు గాకయున్నఁ, గద్రువ కోపోద్దీపితముఖి యై. 34**

**ప్రతిపదార్థం:** అని; అందఱున్= పాములన్ని; తమలోన్= తమలోతాము; విచారించి= ఆలోచించి; అధర్మ+ఆరంభంబునకున్= అధర్మం చేయ మొదలిడటానికి; సుముఖులు= ఇష్టం కలవారు; కాక, ఉన్నన్= కాకుండగా; కద్రువ; కోప+ఉద్దీపిత, ముఖి యై= కోపంచేత ఎఱ్ఱబడిన ముఖం కలదై.

**తాత్పర్యం:** అని అందరూ తమలో తాము ఆలోచించి అధర్మం చేయటానికి ఇష్టపడనివారు కాగా, కద్రువ కోపంచేత ఎఱ్ఱబడిన ముఖం కలదై.

**క. 'అనుపమముగ జనమేజయుఁ । డను జనపతి సేయు సర్పయాగ నిమిత్తం**
**బునఁ బాములు పంచత్వము । సనియెడు' మని యురగములకు శాపం బిచ్చెన్. 35**

**ప్రతిపదార్థం:** అనుపమముగన్= సాటిలేకుండ; జనమేజయుఁడు= పరీక్షిత్తుకుమారుడు; అను జనపతి= అనేరాజు; చేయు సర్పయాగ, నిమిత్తంబునన్= సర్పాలను హుతం చేసే యజ్ఞ మనే కారణంగా; పాములు; పంచత్వము, చనియెడున్, అని= మరణం పొందుగాక అని; (ఎడు-తల ద్రుతానికి అచ్చు పరమైనపుడు మకారమవుతుంది); ఉరగములకున్= పాములకు; శాపంబు+ఇచ్చెన్= శాపమిచ్చినది.

**తాత్పర్యం:** 'పరీక్షిత్తుకుమారు డయిన జనమేజయు డనే రాజు చేసే సాటిలేని సర్పయాగం కారణంగా పాములు మరణం పొందుగాక' అని వాటికి శాప మిచ్చింది.

**వ. అందు శాపానుభవభీతచిత్తుం డై కర్కోటకుం డనువాఁడు తల్లి పంచినరూపంబున నుచ్చైశ్శ్రవంబువాలంబు నీలంబుగాఁ బట్టి వ్రేలుచున్న, మఱునాఁడు తేపకడయ కద్రువయు వినతయుం జని, యత్తురంగంబుఁ జూచి వినత యోటువడి, కద్రువకు దాసి యై, నోసి పనులు సేయుచున్నంతఁ, బంచశత వర్షంబులు నిండి రెండవయండం బవిసిన నందు. 36**

**ప్రతిపదార్థం:** అందున్= ఆపాములలో; శాప+అనుభవ, భీత, చిత్తుండు+ఐ= శాపాన్ని అనుభవించటానికి భయపడిన మనస్సు కలవా డై; కర్కోటకుండు+అనువాడు; తల్లి; పనిచిన, రూపంబునన్= ఆజ్ఞాపించిన రూపంతో, ఉచ్చైశ్శ్రవంబు, వాలంబు= ఆ పేరుండే అశ్వశ్రేష్ఠంయొక్క తోక; నీలంబు+కాన్= నల్ల అయ్యేట్లుగా; పట్టి= పట్టుకొని; వ్రేలుచున్నన్= వ్రేలాడుతుండగా; మఱునాఁడు; తేపకడ+అ= ఉదయమందే; కద్రువయున్, వినతయున్; చని= వెళ్ళి; ఆ+తురంగంబున్= ఆ గుర్రాన్ని; చూచి; వినత; ఓటు, పడి= ఓడి; నోసి= నొచ్చి, పనులు, చేయుచున్, ఉన్న, అంతన్= పనులు చేస్తూఉండగా; పంచశత, వర్షంబులు= ఐదువందలేండ్లు; నిండి= పూర్తికాగా; రెండవ, అండంబు= రెండవగ్రుడ్డు; అవిసినన్= పగులగా; అందున్= ఆగ్రుడ్డునుండి.

**తాత్పర్యం:** ఆ పాములలో శాపం అనుభవించటానికి భయపడిన హృదయం గలవాడై కర్కోటకు డనే పాము తల్లి అయిన కద్రువ ఆజ్ఞాపించిన రూపంతో ఉచ్చైశ్శ్రవ మనే తెల్లనిదేవతలగుర్రంతోకకు నల్లనిమచ్చ అయ్యేట్లుగా పట్టుకొని వ్రేలాడుతూ ఉండగా మరుసటి రోజున ఉదయమే కద్రువయు వినతయు వెళ్ళి ఆ గుర్రాన్ని చూచారు. దానితోకను కర్కోటకుడు నల్లగా పట్టుకొని వ్రేలాడుతుండటంచేత వినత ఓడి కద్రువకు దాసియై నొచ్చి ఆమె చెప్పిన పనులు చేస్తుండగా ఐదువందల ఏండ్లు నిండాయి. అంత వినత పెట్టిన రెండవగ్రుడ్డు పగిలి ఆ గ్రుడ్డునుండి.

### వినతకు గరుడుండు జనియించుట (సం. 1-20-4)

**ఉ. ఆతతపక్షమారుత రయ ప్రవికంపిత ఘూర్ణితాచల**
**వ్రాత మహార్ణవుండు, బలవన్నిజదేహసముజ్జ్వల ప్రభా**
**ధూత పతంగతేజుఁ డుదితుం డయి తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః**
**ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్రవీథికిన్. 37**

**ప్రతిపదార్థం:** ఆతత, పక్షమారుత, రయ, ప్రవికంపిత, ఘూర్ణిత+అచల, వ్రాత, మహత్, అర్ణవుండు= విశాల మైన రెక్కలగాలియొక్క వేగంచేత క్రమంగా చలింపజేయబడినట్టియు, సంక్షోభింప జేయబడినట్టియు, పర్వతాల సముదాయాలను, గొప్పసముద్రాలను, కలవాడున్నూ; బలవత్+నిజ, దేహ, సముజ్జ్వల, ప్రభా, ధూత, పతంగ, తేజుఁడు= బలం కల తన

దేహంయొక్క ప్రకాశించేకాంతిచేత తిరస్కరింపబడిన సూర్యునియొక్క కాంతి కలవాడున్నూ; అయిన; తార్క్ష్యుఁడు= గరుత్మంతుడు; ఉదితుండు+అయి= పుట్టి; తల్లికిన్= తల్లి అయిన వినతకు; మనఃప్రీతి= హృదయానికి ప్రియాన్ని; ఒనర్చుచున్= కావిస్తూ; అభ్రవీథికిన్= ఆకాశమార్గానికి; భీమజవంబునన్= భయంకర మయిన వేగంతో; నెగసెన్= ఎగిరాడు.

**తాత్పర్యం:** విశాల మయిన రెక్కలగాలుల వేగంచేత చలింపచేయబడిన పర్వతాల సమూహాన్ని, సంక్షోభింపచేయబడిన పెద్ద సముద్రాలను కలవాడున్నూ, బలం గల తనశరీరంయొక్క ప్రకాశించే కాంతిచేత తిరస్కరించబడిన సూర్యుడితేజస్సు కలవాడున్నూ అయిన గరుత్మంతుడు పుట్టి తల్లి అయిన వినతహృదయానికి ప్రియం చేస్తూ, అధికమయినవేగంతో ఆకాశమార్గానికి ఎగిరాడు.

**క. దారుణకల్పాంతమరుత్ । ప్రేరిత హవ్యవహశిఖల పెల్లిది యని బృం**
**దారకమునిబృందస్తుతి । బోరనఁ దా నగ్నిసూక్తములతో నెసఁగెన్. 38**

**ప్రతిపదార్థం:** దారుణ, కల్ప+అంత, మరుత్, ప్రేరిత, హవ్యవహ, శిఖల, పెల్లు+ఇది, అని= భయంకర మయిన ప్రళయకాలంలోని గాలిచే ప్రేరేపింపబడిన అగ్నియొక్క జ్వాలల సముదాయం ఇ దని; బృందారక, ముని, బృంద, స్తుతి= దేవతలయొక్కయు, మునుల సమూహంయొక్కయు స్తోత్రం; తాన్= తాను; బోరనన్=శీఘ్రంగా, అగ్ని, సూక్తములతోన్= అగ్నినిస్తుతించే వేదమంత్రాలతో ఎసఁగెన్= అతిశయించింది. (ఎగసెన్- పాఠాంతరం= బయల్వెడలింది).

**తాత్పర్యం:** భయంకరమయిన ప్రళయకాలంలోని గాలులచేత ప్రేరేపింపబడిన అగ్నియొక్క జ్వాలలసముదాయమిదని, దేవతలయొక్క, మునిసముదాయంయొక్క స్తోత్రం తాను శీఘ్రంగా అగ్నిని స్తుతించే వేదమంత్రాలతో అతిశయిల్లింది.

**వ. అంత. 39**

**ప్రతిపదార్థం:** అంతన్= పిదప

**తాత్పర్యం:** అటు పిమ్మట.

**క. హరికులిశక్షతి యెఱుఁగని । గురుతరపక్షములతోడి కులగిరివోలెన్**
**గరుడండు గగనగతి నురు । తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్. 40**

**ప్రతిపదార్థం:** హరి, కులిశ, క్షతి= ఇంద్రుని వజ్రాయుధంయొక్క దెబ్బ; ఎఱుఁగని= తెలియని; గురుతర, పక్షములతోడి కులగిరి, పోలెన్= మిక్కిలి పెద్దరెక్కలతో కూడిన కులపర్వతంవలె; గరుడండు; గగనగతిన్= ఆకాశగమనాన; ఉరుతర, జవమునన్= అధికమైన వేగంతో; అరుగుదెంచి= వచ్చి; తల్లికిన్= వినతకు; మ్రొక్కెన్= నమస్కరించాడు.

**తాత్పర్యం:** పూర్వం ఇంద్రుడు వజ్రాయుధంచేత పర్వతాలరెక్కలు ఖండించాడు. అట్లా వజ్రాయుధంయొక్క దెబ్బ నెఱుగని పెద్దరెక్కలతో కూడిన కులపర్వతం వలె గరుడుడు ఆకాశగమనాన వచ్చి తల్లి అయిన వినతకు నమస్కరించాడు.

**విశేషం:** అలం: ఉపమ, మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, గంధమాదనం, వింధ్యం, పారియాత్రం అనేవి ఏడుకులపర్వతాలు. ఈపద్యంలో కవిప్రౌఢోక్తిసిద్ధమైన అలంకారంవలన కలిగే వస్తుధ్వని ఉన్నది. వజ్రాహతికి రెక్కలు కోల్పోని

కులపర్వతం ఉపమానంగా చెప్పటం కవి ప్రౌఢోక్తి. దీనివలన భావికథలో ఇంద్రుడి వజ్రాయుధంకూడా ఏమీచేయలేనంత వీరుడై, ఇంద్రుడికి స్నేహితుడై, విష్ణువుకు వాహనమై, అమృతం త్రాగకపోయినా అమరుడై వెలుగొందే అసమానవీరుడయ్యే కథార్థాలు ధ్వన్యమానము లౌతున్నాయి. గరుత్మంతుడి గమనవేగం కందంలోని లఘువుల బాహుళ్యం వ్యంజింపజేస్తున్నది. అక్షరరమ్యతకూడ ఇక్కడ కథార్థధ్వనికి తోడ్పడుతున్నది. (సంపా.)

**వ. ఇట్లు నిజజననికి మ్రొక్కి కద్రువపాలికిం బోయి. 41**

**తాత్పర్యం:** ఈవిధంగా తనతల్లి యైన వినతకు నమస్కరించి, సవతితల్లి అయిన కద్రువచెంతకు వెళ్ళి.

**చ. తడయక మ్రొక్కియున్న వినతాసుతు నప్పుడు సూచి, యాత్మలో**
**నిడుగడఁ జేయుచుం గడు సహింపక కద్రువ వానిఁ బిల్చి 'నా**
**కొడుకుల నెల్ల నెత్తికొని క్రుమ్మరుచుండుమ, యేమి పంచినన్**
**మడవక చేయు మీ' వని సమర్పణ సేసెఁ బ్రభుత్వ మేర్పడన్. 42**

**ప్రతిపదార్థం:** తడయక= ఆలస్యంచేయక; మ్రొక్కి= నమస్కరించి; ఉన్న=ఉన్నటువంటి; వినతా, సుతున్= వినతయొక్క కుమారుడైన గరుడని; అప్పుడు= ఆసందర్భంలో; చూచి; ఆత్మలోన్= మనస్సులో; ఇడుగడన్, చేయుచున్= అసూయచూపుతూ; కడున్, సహింపక= మిక్కిలి ఓర్వలేక; కద్రువ; వానిన్= గరుడుని; పిల్చి; నా, కొడుకులన్, ఎల్లన్= నాకుమారు లైన పాముల నన్నింటిని; ఎత్తికొని= మోసికొని; క్రుమ్మరుచున్, ఉండుము+అ= తిరుగుతూఉండుమా! ఏమి, పంచినన్= వారేమి ఆజ్ఞాపించినా; ఈవు= నీవు; మడవక= మరలక (అలక్ష్యం చేయక); చేయుము; అని= అని పలికి; ప్రభుత్వము+ఏర్పడన్= అధికారం స్పష్టమయ్యేటట్లు; సమర్పణ, చేసెన్= గరుడునికి పాములను అప్పగించింది.

**తాత్పర్యం:** ఆలస్యం చేయకుండ మ్రొక్కిన, వినతపుత్రుడయిన గరుత్మంతుడిని కద్రువ చూచి మనసులో అసూయపడి ఓర్వలేక అతనితో ఇట్లా అన్నది: 'నాకొడుకుల(పాముల)నందరిని ఎత్తుకొని తిరుగుతూఉండుము. ఏపని చెప్పినను తిరస్కరించవ'ద్దని అధికారం ఏర్పడేటట్లు తన కొడుకులను అతనికి అప్పగించింది.

**వ. గరుడండును గద్రువ పంచిన పనులెల్లను వినత యనుమతంబున నతివినయపరుం డై చేయుచు. 43**

**ప్రతిపదార్థం:** గరుడండును= గరుడుడుకూడ (గరుడడు, గరుడుడు అనే రూపాలు రెండూ ఉన్నాయి); కద్రువ, పంచిన, పనులు+ఎల్లను= కద్రువ ఆజ్ఞాపించిన పనులన్నిటిని; వినత, అనుమతంబునన్= తల్లి అయిన వినత అంగీకారంతో; అతివినయ, పరుండు+అయి= మిక్కిలి నమ్రతతో కూడినవా డై; చేయుచున్= చేస్తూ.

**తాత్పర్యం:** గరుడుడుకూడ కద్రువ ఆజ్ఞాపించిన పనులన్నిటిని తన తల్లి అయిన వినత అంగీకారంతో మిక్కిలి నమ్రతతో చేస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఆ పన్నగముఖ్యులఁ దన । వీఁపునఁ బెట్టికొని పఱచి, విపినములు, మహా**
**ద్వీపములు, గిరులు, నఖిల ది । శాపాలపురములుఁ జూపెఁ జన వారలకున్. 44**

**ప్రతిపదార్థం:** ఆ, పన్నగ, ముఖ్యులన్= ఆ సర్పశ్రేష్ఠులను; తన, వీపునన్= తన వీపుమీద; పెట్టికొని; పఱచి= పరువెత్తి (ఎగిరి); వారలకున్= ఆపాములకు; విపినములు= అడవులు; మహత్+ద్వీపములు= గొప్పదీవులు; గిరులున్= పర్వతాలను; అఖిల, దిశా, పాల, పురములున్= సకల దిక్పాలకుల నగరాలను కూడ; చనన్= ఒప్పేట్లుగా; చూపెన్= చూపెను.

**తాత్పర్యం:** గరుడడు ఆ సర్పముఖ్యులను తనవీపుమీద పెట్టుకొని ఎగిరి, అడవులను, గొప్పద్వీపాలను, పర్వతాలను, అష్టదిక్పాలకుల నగరాలను వారికి ఒప్పేట్లుగా చూపించాడు.

**వ. ఒక్కనాఁడు సప్తమారుతజవంబున సప్తాశ్వమండలంబుదాఁక నెగసిన, నమ్మార్తాండు చండకిరణంబుల వేఁడిమిఁ దాఁకి, మాఁడి, గరుడని వీఁపున నున్నయురగులు దొరఁగి నేలంబడి మూర్ఛవోయినఁజూచి, కద్రువ కడునలిగి, గరుడనిం బదరి, యతిభక్తి నింద్రు నారాధించి. 45**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు; సప్తమారుత, జవంబునన్= ఏడుగాలులశక్తితో; సప్తాశ్వమండలంబు దాఁకన్= సూర్యమండలంవరకు; ఎగసినన్= పైకి ఎగురగా; ఆ+మార్తాండు= ఆ సూర్యునియొక్క; చండ, కిరణంబుల, వేఁడిమి= తీక్ష్ణమైన కిరణాలవేడి; తాఁకి= సోకి; మాఁడి= మాడిపోయి; గరుడని, వీఁపునన్, ఉన్న; ఉరగులు= పాములు; తొరఁగి= జారి; నేలన్, పడి; నేలమీద పడి; మూర్ఛ, పోయినన్; చూచి; కద్రువ; కడున్, అలిగి= మిక్కిలి కోపించి; గరుడనిన్; పదరి= ఆక్షేపించి; ఇంద్రున్; అతిభక్తిన్= మిక్కిలిభక్తితో; ఆరాధించి= పూజించి.

**తాత్పర్యం:** ఒకదినాన ఏడువాయువుల వేగంతో గరుడడు సూర్యుడిమండలం(బింబం)వరకు పైకెగురగా ఆసూర్యుడి తీక్షణ్ మైన కిరణాలవేడి తాకటంచేత గరుడుని వీపుపై ఉండే పాములు మాడి, జారి, నేలమీద పడి మూర్ఛిల్లగా చూచి కద్రువ మిక్కిలి కోపించి గరుడుని నిందించి ఇంద్రుడిని భక్తితో పూజించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. నరసురసిద్ధకింపురుషనాగనభశ్చరముఖ్యు లెల్ల నీ**
**కరుణయ వేచి మంద్రు, త్రిజగంబులు నీ కులిశాభిరక్షణ**
**స్ఫురణన చేసి సుస్థిరతఁ బొందుఁ బురందర! సర్వలోకసుం**
**దర! శరణంబు నా కగుము దానవసూదన! పాకశాసనా! 46**

**ప్రతిపదార్థం:** దానవసూదన= రాక్షసులను హతమార్చినవాడా!; పాకశాసనా= పాకుడనే రాక్షసుడిని శిక్షించినవాడా!; సర్వ, లోక, సుందర= అన్ని లోకాలకు అందమైనవాడా!; పురందర= ఓఇంద్రుడా!; నర, సుర, సిద్ధ, కింపురుష, నాగ, నభస్+చర, ముఖ్యులు+ఎల్లన్= నరులు, దేవతలు, సిద్ధులు, కింపురుషులు, నాగులు, ఆకాశంలో తిరుగాడే ఇతరులు మొదలయిన వారిలోని. ముఖ్యులందరును; నీ, కరుణ+అ= నీదయనే; వేచి= ఎదురుచూచి; మంద్రు= జీవిస్తారు; నీ, కులిశ+అభిరక్షణ, స్ఫురణన్+అ+చేసి= నీవజ్రాయుధంయొక్క రక్షణంయొక్క అతిశయంచేతనే, త్రిజగంబులు= ముల్లోకాలు; సుస్థిరతన్, పొందున్= (స్థిరత్వాన్ని) శాంతిని పొందుతాయి; నాకున్; శరణంబు= రక్షణము, అగుము= కమ్ము.

**తాత్పర్యం:** రాక్షససంహారి వైన ఓ ఇంద్రుడా! నరులు, దేవతలు, సిద్ధులు, కింపురుషులు, నాగులు, ఆకాశమార్గాన చరించే ఇతర ముఖ్యు లందరూ నీదయనే అపేక్షించి జీవిస్తారు. నీవజ్రాయుధంయొక్క రక్షణ కలగటంచేతనే ముల్లోకాలు శాంతిని పొందుతాయి. ఓఇంద్రుడా! ఎల్లలోకాలలో సుందరుడ వైనవాడా! నాకు రక్షకుడ వగుము.

**విశేషం:** ఈపద్యంలో రేఫాక్షరబాహుళ్యంవలన అక్షరరమ్యత ఏర్పడింది. దీనివలన కద్రువ లోని మనోవేదన ధ్వన్యమాన మౌతున్నది. 'పురందర! సర్వలోకసుందర!' అనే సంబుద్ధిలోని బిందుపూర్వక దకారంతో కూడుకొన్న ర వర్ణం వలన కలిగే నాదమాధుర్యం ఇంద్రుడిని ప్రసన్నుడినిగా చేసికొనటానికి తోడ్పడుతుంది. ఉదారత(బంధముయొక్క వికటత్వం)తో కూడుకొన్న ప్రసాదం (బంధశైథిల్యం) అనే శబ్దగుణం రసభావవ్యంజకంగా సంవదించిన నన్నయ రచనాశిల్ప మిది. (సంపా.)

**వ. అని స్తుతియించి పర్జన్యప్రసాదంబున మహావృష్టి గొడుకులపయిం గురియించి, యయ్యురగుల విగత పరితాపులంజేసి కద్రువ గర్వంబున నుఱక గరుడని వినతనుం బనులుగొనుచున్నంత, నొక్కనాఁడు గరుడండు తల్లి కి ట్లనియె. 47**

**ప్రతిపదార్థం:** అని; స్తుతియించి= పొగడి; పర్జన్య, ప్రసాదంబునన్= ఇంద్రుడి అనుగ్రహంచేత; మహత్, వృష్టి= గొప్పవాన; కొడుకులపయిన్= కుమారు లయిన పాములమీద; కురియించి= కురిసేట్లు చేసి; ఆ+ఉరగులన్= ఆపాములను; విగత, పరితాపులన్= పోయిన సంతాపం (వేడివల్లకలిగినబాధ) కలవారిని; చేసి; ఉఱక= లక్ష్యపెట్టక; పనులు, కొనుచున్+ఉన్న+అంతన్= వారిచేత పనులు చేయించుకొంటూండగా అప్పుడు; గరుడండు; తల్లికిన్= వినతకు; ఇట్లు+ అనియెన్= ఈవిధంగా పలికినాడు.

**తాత్పర్యం:** అని పొగడి, ఇంద్రుడి అనుగ్రహంచేత కొడుకులమీద గొప్పవాన కురిసేటట్లు చేసి, ఆపాములను వేడివలనకలిగినబాధ లేనివారిగా చేసి, కద్రువ ఎవ్వరినీ లక్ష్యపెట్టక వారిచే పనులు చేయించుకొంటూ ఉండగా, గరుడుడు తల్లితో ఇట్లా పలికాడు.

**ఉ. ఆయతపక్షతుండహతి నక్కులశైలము లెల్ల నుగ్గుగాఁ**
**జేయు మహాబలంబును బ్రసిద్ధియునుం గల నాకు నీపనిం**
**బాయక వీఁపునం దవడుఁ బాముల మోవను, వారికిం బనుల్**
**సేయను నేమి కారణము సెప్పుము దీనిఁ బయోరుహాననా! 48**

**ప్రతిపదార్థం:** పయోరుహ+ఆననా= పద్మంవంటి ముఖం కలదానా! ఆయత, పక్ష, తుండ, హతిన్; ఆయత= పెద్దవయిన; పక్ష= రెక్కలయొక్క; తుండ= ముక్కుయొక్క; హతిన్= దెబ్బచేత; ఆ+కుల, శైలములు+ఎల్లన్= ఆప్రాచీనపర్వతాలు అన్నింటిని; నుగ్గుగాన్= పొడిగా; చేయు, మహత్, బలంబును= చేసేగొప్పబలాన్ని; ప్రసిద్ధియునున్= ప్రఖ్యాతియు; కల; నాకున్; ఈపనిన్= ఈపనిని; పాయక= క్రమంతప్పకుండ; విడువక; వీఁపునందున్= వీపుమీద; అవడు, పాములు= నీచా లయిన పాములను; మోవను= మోయటానికి; వారికిన్, పనుల్ చేయను= ఆపాములకు సేవలుచేయటానికి, ఏమి కారణము; చెప్పుము.

**తాత్పర్యం:** పద్మంవంటిముఖంకలదానా! కులశైలాలన్నింటిని నావిశాలమైనరెక్కలతో, వాడియైన ముక్కుతోడి దెబ్బలతో పొడిగాచేసే గొప్పబలమున్నూ, ప్రసిద్ధియున్నూ ఉన్న నాకు విడువక సదా నీచా లయిన పాములను వీపుపై మోయటానికి, వాటికి సేవచేయటానికి కారణ మేమి? ఈ పనికి కారణమేమిటో చెప్పుము.

**విశేషం:** తల్లిని 'పయోరుహాననా!' అని సంబోధించటం ఉచితంకాదని కొందరంటారు. అయితే, ఇక్కడ అవయవార్థం అవివక్షితమని గ్రహించాలి. ఇటువంటిది ఈఆశ్వాసంలోనే మరొకటి ఉన్నది. వాసుకి తన చెల్లెలైన జరత్కారువును 'అంబుజనేత్రా'! (2.216) అని సంబోధిస్తాడు. ఇవి కావ్యభాషలో గౌరవాన్ని తెలిపే సంబుద్ధులుగా పరిగణింపబడతాయి. ఇందులో కొందరు భావించినట్లు అనౌచిత్యం లేదు.

**వ. అని యడిగిన వినత తనకుం గద్రువతోడి పన్నిదంబున నైన దాసీత్వంబును, తత్కారణం బైన యనూరుశాపంబును గొడుకున కేర్పడం జెప్పి యి ట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** అని, అడిగినన్= అని గరుత్మంతుడు అడుగగా; వినత, తనకున్; కద్రువతోడి, పన్నిదంబునన్= కద్రువతో వేసిన పందెంవలన; ఐన, దాసీత్వంబును= ఏర్పడిన దాసితనాన్ని; తత్, కారణంబు+ఐన= దానికి కారణ మయిన; అనూరు, శాపంబునున్= అనూరు డిచ్చిన శాపాన్ని; కొడుకునకున్; ఏర్పడన్, చెప్పి= వివరించి (స్పష్టమయ్యేట్లుగా); ఇట్లు, అనియెన్.

**తాత్పర్యం:** అని గరుడుడు అడుగగా వినత తన సవతి అయిన కద్రువతో జరిగిన పందెంచేత కలిగిన దాస్యాన్నీ, ఆ కారణాన కలిగిన జ్యేష్ఠపుత్రు డైన అనూరు డిచ్చిన శాపాన్నీ కొడుకునకు స్పష్టంగా తెల్పి ఇట్లా అన్నది.

**క.** **నీ కతమున నా దాస్యము । ప్రాకటముగఁ బాయు ననిన పలు కెడలోనం**
**జేకొని, యూఱడి నిర్గత । శోకస్థితి నున్నదానఁ జూవె ఖగేంద్రా! 50**

**ప్రతిపదార్థం:** ఖగ+ఇంద్రా+= ఓపక్షిరాజా! నీకతమునన్= నీకారణంచే; నా దాస్యము= నా దాసితనం; ప్రాకటముగన్= ప్రసిద్ధంగా (అందరికీ తెలిసేటట్లుగా); పాయున్= పోతుంది; అనిన= అని అనూరుడు చెప్పిన; పలుకు= మాట; ఎడలోనన్= మనస్సులో; చేకొని= గ్రహించి; ఊఱడి= ఓదార్పుచెంది; నిర్గత, శోక, స్థితిన్= పోయిన దుఃఖం కల స్థితిలో; ఉన్నదానన్+చూవె= ఉన్నదానినిసుమా!

**తాత్పర్యం:** ఓ పక్షిశ్రేష్ఠుడా! నీకారణంగా నా దాసితనం పోతుం దని అనూరుడు చెప్పినమాటను మనస్సులో ఉంచుకొని, బాధ విడిచి దుఃఖంపోయినస్థితి కలదాన నై ఉన్నానుసుమా!

**వ.** **'కొడుకులు సమర్థులైనం దల్లిదండ్రులయిడుమలు వాయుట యెందునుంగలయది, గావున నీయట్టిసత్పుత్త్రుం బడసియు దాసి నై యుండుదాననే' యనిన విని వైనతేయుండు తద్దయు దుఃఖితుం డై, యొక్కనాఁడు కాద్రవేయుల కి ట్లనియె. 51**

**ప్రతిపదార్థం:** కొడుకులు; సమర్థులు+ఐనన్= శక్తికలవారైతే; తల్లిదండ్రుల; ఇడుమలు= కష్టాలు; పాయుట= వీడటం; ఎందునున్, కల, అది= ఎచ్చటైనా ఉన్నది; కావునన్; నీ, అట్టి, సత్, పుత్త్రున్= నీవంటి మంచికుమారుడిని; పడసియున్= పొందియు; దాసిని+ఐ, ఉండు, దానను+ఏ= దాసి నై ఉంటానా; అనినన్= అని చెప్పగా; విని; వైనతేయుండు= వినతకొడు కైన గరుత్మంతుడు; తద్దయున్= మిక్కిలి; దుఃఖితుండు+ఐ= దుఃఖంపొందినవాడై; కాద్రవేయులకున్= కద్రువ కుమారు లయిన పాములకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'కుమారులు శక్తిమంతు లైతే తల్లిదండ్రుల కష్టాలు తొలగటం ఎచ్చటైనా ఉన్నదే(సహజమే). కావున నీవంటి యోగ్యు డైన కుమారుడిని పొంది నేను ఇంకా దాసి నై ఉంటానా!' అని వినత తెల్పగా విని గరుడుడు దుఃఖించి కద్రువపుత్రు లైన పాములతో ఇట్లా పలికాడు.

**క.** **మా యీ దాస్యము వాయు ను । పాయము సేయుండు, నన్నుఁ బనుపుం డిష్టం**
**బేయది దానిన తెత్తు న । జేయుఁడ నై యమరవరులఁ జేకొని యైనన్. 52**

**ప్రతిపదార్థం:** మా, ఈ, దాస్యము= తల్లియైన వినతకు, నాకు గల ఈబానిసతనం; పాయు+ఉపాయము= పోయేటి ఆలోచనను; చేయుండు= చెయ్యండి; నన్నున్; పనుపుండు= ఆజ్ఞాపించండి; ఇష్టంబు, ఏ+అది= కోరిం దేదో; దానిన్+అ= దాన్నే; అమర, వరులన్= దేవశ్రేష్ఠులను; చేకొని+ఐనన్= లోబరుచుకొని అయినా; అజేయుఁడను+ఐ= ఓడించబడనివాడనై, విజయం పొందేవాడినై; తెత్తున్= తెస్తాను.

**తాత్పర్యం:** నాతల్లియొక్క, నాయొక్కదాస్యం పోవటానికి ఆలోచన చేయండి; నన్ను ఆజ్ఞాపించండి; దేవశ్రేష్ఠులను లోబరుచుకొని అయినా మీకిష్టమయినదానిని విజయం పొంది తెస్తాను.

**వ. అనిన నయ్యురగులు కరుణించి గరుడని కి ట్లనిరి. 53**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అడుగగా; ఆ+ఉరగులు= ఆపాములు; కరుణించి= జాలిపడి, దయదలచి; గరుడనికిన్+ ఇట్లు+అనిరి= గరుత్మంతునితో ఇట్లా చెప్పారు.

**తాత్పర్యం:** అని గరుడుడు అడుగగా ఆపాములు జాలిపడి గరుడుడితో ఇట్లా చెప్పారు.

**చ. 'అమితపరాక్రమంబును, రయంబును, లావును గల్గు ఖేచరో**
**త్తముఁడవు నీవు; నీదయినదాస్యముఁ బాచికొనంగ నీకుఁ జి**
**త్తము గలదేని, భూరిభుజదర్పము శక్తియు నేర్పడంగ మా**
**కమృతముఁ దెచ్చియి' మ్మనిన నవ్విహగేంద్రుఁడు సంతసంబునన్. 54**

**ప్రతిపదార్థం:** నీవు; అమిత, పరాక్రమంబును= అంతు లేని విక్రమాన్ని; రయంబును= వేగాన్ని; లావును= బలాన్ని; కల్గు; ఖేచర+ఉత్తముఁడవు= పక్షులలో గొప్పవాడివి, (పక్షి శ్రేష్ఠుడివి); నీది+అయిన, దాస్యమున్= నీకు కలిగిన బానిసతనాన్ని; పాచికొనంగన్= పోగొట్టుకొనటానికి; నీకున్; చిత్తము, కలదు+ఏని= మనసు ఉంటే; భూరి, భుజ, దర్పము= అధిక మైన భుజాలయొక్క గర్వమున్నూ; శక్తియున్= సామర్థ్యమున్నూ; ఏర్పడంగన్= స్పష్టమయ్యేటట్లు; మాకున్; అమృతమున్; తెచ్చి, ఇమ్ము; అనినన్= అని పాములు చెప్పగా; ఆ, విహగ+ఇంద్రుఁడు= ఆపక్షిశ్రేష్ఠుడు; సంతసంబునన్= సంతోషంతో.

**తాత్పర్యం:** 'నీవు అంతులేని విక్రమాన్ని, వేగాన్ని, బలాన్ని కలిగిన పక్షిశ్రేష్ఠుడవు. నీకు కలిగిన దాస్యం పోగొట్టుకొనాలనే అభిప్రాయ మున్నట్లయితే, గొప్ప భుజాలగర్వమూ, శక్తీ ప్రకటితమయ్యేటట్లుగా మాకు అమృతాన్ని తెచ్చిఇ' మ్మని పాములు చెప్పగా, ఆపక్షిశ్రేష్ఠుడు సంతోషంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** గరుడుడికి ఉన్న అనంతపరాక్రమాది గుణాలకు తగిన కోరిక అమృతాన్ని తెచ్చి ఇవ్వట మని పాములు నిర్ణయించాయి. అమృతాన్ని పొందటం పాముల కోర్కె. దానిని తీర్చగలిగిన సమర్థుడు వారికి దొరికాడు. అందుకని అడిగారు. మహాభారతంలో అనేక సందర్భాలలో అమృతత్వసాధనకై జీవులు చేసే ప్రస్థానాన్ని ధ్వనిమయంచేయటం ఇచ్చటి కథార్థప్రయోజనం.

### గరుత్మంతుఁ డమృతంబుఁ దెచ్చుటకుఁ దల్లియనుమతిఁ గొనుట (సం. 1-24-1)

**వ. 'అట్ల చేయుదు; నమృతంబు దెచ్చి మీ కిచ్చి, యేనునుం దల్లియు దాస్యంబువలన విముక్తుల మగువార' మని నొడివి, తద్వృత్తాంతం బంతయుం దల్లికింజెప్పి 'యమృత హరణార్థం బరిగెద' నని మ్రొక్కిన, వినత సంతసిల్లి కొడుకుం గౌఁగిలించుకొని. 55**

**ప్రతిపదార్థం:** అట్లు+అ= ఆవిధంగానే; చేయుదున్; అమృతంబు, తెచ్చి; మీకున్+ఇచ్చి; ఏనునున్; తల్లియున్; దాస్యంబువలనన్; విముక్తులము+అగువారము= విడువబడినవార మవుతాము; అని; నొడివి= చెప్పి; తద్, వృత్తాంతంబు= ఆవిషయం; అంతయున్; తల్లికిన్= వినతకు; చెప్పి; అమృత, హరణ+అర్థంబు= అమృతాన్ని హరించేనిమిత్తం; అరిగెదన్= వెడలుతాను; అని;

మ్రొక్కినన్= నమస్కరించగా; సంతసిల్లి= సంతోషించి; కొడుకున్= కుమారు డయిన గరుడుని; కౌఁగిలించుకొని= వాత్సల్యంతో ఆలింగనం చేసికొని.

**తాత్పర్యం:** 'అట్లే చేస్తాను. స్వర్గంనుండి అమృతం తెచ్చి మీ కిచ్చి నేనూ మాతల్లి అయిన వినతా దాస్యంనుండి విడువబడినవాళ్ళ మవుతా' మని పలికి, ఆవిషయమంతా తల్లియైన వినతకు తెల్పి 'అమృతం హరించటానికి వెళ్తా' నని నమస్కరించగా వినత సంతోషించి కొడుకును కౌగిలించుకొని.

**చ. 'అనిలుఁడు పక్షయుగ్మ, మమృతాంశుఁడు వీఁపనలుండు మస్తకం,**
**బినుఁడు సమస్తదేహమును నెప్పుడుఁ గాచుచు నీ కభీష్టముల్**
**ఘనముగఁ జేయుచుండెడు జగన్నుత! యున్నతియున్ జయంబుఁ జే**
**కొను' మని యిచ్చె దీవనలు గోరి ఖగేంద్రునకుం బ్రియంబునన్. 56**

**ప్రతిపదార్థం:** అనిలుఁడు= వాయువు; పక్షయుగ్మము= రెక్కలజంటను; అమృత+అంశుఁడు= చంద్రుడు; వీఁపు; అనలుండు= అగ్ని; మస్తకంబు= శిరస్సును; ఇనుఁడు= సూర్యుడు; సమస్తదేహమునున్= సర్వశరీరాన్ని; ఎప్పుడున్= ఎల్లప్పుడు; కాచుచున్= రక్షిస్తూ; నీకున్, అభీష్టముల్= కోరికలు; ఘనముగన్= గొప్పగా; చేయుచుండెడున్= తీరుస్తూ ఉంటారుగాక! జగత్+నుత= లోకాలచేత స్తుతింపబడినవాడా! ఉన్నతియున్= గొప్పతనాన్ని; జయంబున్= విజయాన్ని; చేకొనుము= గ్రహించుము; అని; కోరి; దీవనలు= ఆశీస్సులు; ప్రియంబునన్= ప్రీతితో; ఖగ+ఇంద్రునకున్= పక్షులకు రాజయిన గరుత్మంతుడికి; ఇచ్చెన్= ఇచ్చింది.

**తాత్పర్యం:** 'వాయువు రెక్కలజంటను, చంద్రుడు వీపును, అగ్ని తలను, సూర్యుడు ఎల్లశరీరాన్ని సర్వదా రక్షిస్తూ నీ కోరికలు గొప్పగా తీరుస్తూఉంటారు గాక! లోకాలచేత నుతింపబడేవాడా! గొప్పతనాన్ని, విజయాన్ని గ్రహించుము' అని వినత మనసులో కోరి పక్షులకు రా జయిన గరుడునికి ప్రీతితో ఆశీస్సులు ఇచ్చింది.

**విశేషం:** తల్లులు బిడ్డలకు ఉగ్గుపెట్టి వారి శరీరంలోని అంగాల నన్నింటికీ శ్రీరామరక్షలు కోరుతూ వాత్సల్యాన్ని వ్యక్తంచేసినట్లు ఇక్కడ వినత తనకొడుకు రెక్కలకు, వీపునకు, తలకు, శరీరం మొత్తానికీ దైవరక్షను నిర్దేశించింది. గరుడుడు పక్షికాదనీ, మంత్రమనీ చెప్పే తత్త్వజ్ఞులు వీటిని మంత్రరక్షాకవచంగా వ్యాఖ్యానిస్తారు.

**వ. గరుడండును దల్లిదీవనలు గైకొని గమనోన్ముఖుం డై 'యమృతంబు దెచ్చునపుడు లావు గలుగవలయు, నా కాహారంబు ప్రసాదింపు' మనిన వినత యి ట్లనియె. 57**

**ప్రతిపదార్థం:** గరుడండును; తల్లి; దీవనలు= ఆశీస్సులు; కైకొని= గ్రహించి; గమన+ఉన్ముఖుండు+ఐ= వెళ్ళటానికి సిద్ధుడై; అమృతంబు; తెచ్చునపుడు; లావు= బలం; కలుగవలయున్; నాకున్ ఆహారంబు= తినే పదార్థం; ప్రసాదింపుము= అనుగ్రహించుము; అనినన్; వినత; ఇట్లు+ అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** గరుడుడు తల్లి అయిన వినతయొక్క దీవెనలు పొంది వెళ్ళటానికి సిద్ధమై, 'అమృతం తెచ్చే సమయంలో తగినబలం కలిగి ఉండాలి; నాకు ఆహారం అనుగ్రహించు' మని తల్లితో పలుకగా ఆమె ఇట్లా అన్నది.

**క. విషనిధికుక్షి నసంఖ్యము । నిషాదగణ ముండి ధారుణీప్రజకుఁ గడున్**
**విషమమును జేయు, దాని ని । మిషమున భక్షించి చను మమిత్రవిఘాతీ! 58**

**ప్రతిపదార్థం:** అమిత్రవిఘాతీ= శత్రువులను సంహరించేవాడా! విషనిధి, కుక్షిన్= సముద్రంయొక్క గర్భాన; అసంఖ్యము= లెక్కలేని; నిషాదగణము= బోయవాళ్ళసముదాయం; ఉండి; ధారుణీ, ప్రజకున్= భూమిలోని జనులకు; కడున్= మిక్కిలి; విషమమును= కష్టాన్ని; చేయున్; దానిన్= ఆ నిషాదగణాన్ని; నిమిషమునన్= కనురెప్పపాటుకాలంలో (తక్కువకాలంలో) భక్షించి= తిని; చనుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** ఓ శత్రువులను సంహరించే గరుడుడా! సముద్రగర్భాన లెక్కింపరాని బోయవాళ్ళసముదాయం ఉన్నది; భూమిలోని ప్రజలకు క్లేశం కలిగిస్తున్నది; ఆనిషాదగణాన్ని నిమిషకాలంలో తిని వెళ్ళుము.

**వ. 'భక్షణవిషయంబున బ్రాహ్మణునిం బరిహరించునది' యనిన గరుడండు 'నాకు బ్రాహ్మణు నెఱుంగు తెఱంగెఱింగింపు' మనిన వినత యి ట్లనియె. 59**

**ప్రతిపదార్థం:** భక్షణవిషయంబునన్= తినే సందర్భంలో; బ్రాహ్మణునిన్; పరిహరించునది= విడవాలి; అనినన్; గరుడండు; నాకున్; బ్రాహ్మణున్; ఎఱుంగు, తెఱంగు= తెలిసికొనే విధం; ఎఱింగింపుము= తెలుపుము.

**తాత్పర్యం:** తినే సందర్భంలో బ్రాహ్మణుడిని విడిచిపెట్టుము. (తినకుము) అని వినత పలుకగా గరుడుడు బ్రాహ్మణు డెవరో తెలిసికొనేవిధం తెల్పు మని అడుగగా వినత ఇట్లా చెప్పింది.

**క. రయమున మ్రింగుడు గాలము । క్రియ నెవ్వఁడు కంఠబిలముక్రిందికిఁ జన క**
**గ్నియపోలె నేర్చుచుండును । భయరహితా! వాని నెఱుఁగు బ్రాహ్మణుఁ గాఁగన్. 60**

**ప్రతిపదార్థం:** రయమునన్= వేగంతో; మ్రింగుడున్= మింగిన అనంతరం; గాలముక్రియన్= చేపనుపట్టే గాలంవలె; ఎవ్వఁడు; కంఠ, బిలము క్రిందికిన్= కంఠరంధ్రంక్రిందికి; చనక= వెళ్ళక; అగ్ని+అ+పోలెన్= అగ్నివిధంగా; ఏర్చుచుండును= కాలుస్తుంటాడో; భయరహితా= భయంలేనివాడా!; వానిన్= అట్టివాడిని; బ్రాహ్మణున్, కాఁగన్= బ్రాహ్మణు డయినట్లుగా; ఎఱుఁగు= తెలిసికో!

**తాత్పర్యం:** భయం లేని ఓ గరుత్మంతుడా! వేగంగా మింగేటప్పుడు చేపలను పట్టే గాలమనే సాధనంవలె ఎవడు కంఠరంధ్రంక్రిందికి పోకుండ అగ్నివలె కాలుస్తుంటాడో అట్టివాడిని బ్రాహ్మణుడిగా తెలిసికొమ్ము.

**విశేషం:** అలం: ఉపమ

**తే. కోపితుం డైన విప్రుండు ఘోరశస్త్ర । మగు, మహావిష మగు, నగ్ని యగు; నతండ**
**యర్చితుం డైన జనులకు నభిమతార్థ । సిద్ధికరుఁ డగు, గురుఁడగుఁ, జేయుఁ బ్రీతి. 61**

**ప్రతిపదార్థం:** విప్రుండు= బ్రాహ్మణుడు; కోపితుండు+ఐనన్= కోపం కల్గింపబడినవా డయితే; ఘోర, శస్త్రము+అగున్= భయంకరమైన ఆయుధ మవుతాడు; మహత్, విషము+అగున్= గొప్పవిష మవుతాడు; అగ్ని, అగున్; అతండు+అ= ఆ బ్రాహ్మణుడే; అర్చితుండు+ఐనన్= సేవింపబడినవా డయితే; జనులకున్= ప్రజలకు; అభిమత+అర్థ, సిద్ధి, కరుఁడు+అగున్=

కోరబడిన ప్రయోజనం యొక్క సిద్ధిని కలిగించేవా డవుతాడు; గురుఁడు+అగున్= ఉపదేశకు డవుతాడు; ప్రీతిన్+చేయున్= ఇష్టం కలిగిస్తాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడు కోపింపచేయబడితే భయంకర మయిన ఆయుధ మవుతాడు, గొప్పవిష మవుతాడు, అగ్ని అవుతాడు; ఆబ్రాహ్మణుడే సేవింపబడితే ప్రజలకు కోరబడిన ప్రయోజనంయొక్క సిద్ధిని కలిగించేవా డవుతాడు, ఆచార్యు డవుతాడు. ఇష్ట మొనరిస్తాడు.

**వ. అని బ్రాహ్మణస్వరూపంబుఁ జెప్పిన నెఱింగి, వినతకు మ్రొక్కి వీడ్కొని, గరుడం డతిత్వరితగతిం బఱచి, సముద్రోదరంబున నున్న నిషాదు లనేక శతసహస్రసంఖ్యలవారిం బాతాళవివరంబునుంబోని తనకంఠబిలంబుఁ దెఱచి యందఱ నొక్కపెట్ట మ్రింగిన, నం దొక్క విప్రుం డుండి కుత్తుకకు డిగక నిప్పునుంబోలె నేర్చుచున్న నెఱింగి, 'నాకంఠబిలంబున విప్రుం డున్నవాఁడేని వెలువడి వచ్చునది' యనిన గరుడని క వ్విప్రుం డి ట్లనియె. 62**

**ప్రతిపదార్థం:** అని; బ్రాహ్మణ, స్వరూపంబున్= బ్రాహ్మణుడియొక్క స్వరూపాన్ని (లక్షణాన్ని); చెప్పినన్= చెప్పగా; ఎఱింగి; వినతకున్; మ్రొక్కి= నమస్కరించి; వీడ్కొని= సెలవుపుచ్చుకొని; గరుడండు; అతి, త్వరిత, గతిన్= మిక్కిలి వేగం గల గమనంతో; పఱచి= పరుగెత్తి (ఎగిరి); సముద్ర+ఉదరంబునన్= సముద్రంయొక్క గర్భంలో; ఉన్న; అనేక, శత, సహస్ర, సంఖ్యల, వారిన్= పెక్కువందల వేల సంఖ్యలలో ఉన్న వారిని; నిషాదులన్= బోయలను; పాతాళవివరంబునున్, పోని= పాతాళలోకంయొక్క రంధ్రంవంటి; తన, కంఠ, బిలంబున్= తన కంఠంయొక్క రంధ్రాన్ని తెఱచి; ఒక్కపెట్టన్= ఒక్కమారుగా; మ్రింగినన్= మ్రింగగా; అందున్= ఆకంఠబిలంలో; ఎఱింగి= తెలిసి; విప్రుండు= ఒక్క బ్రాహ్మణుడు, ఉండి; కుత్తుకకున్, డిగక= కంఠంలోనికి దిగక; నిప్పునున్, పోలెన్= నిప్పువలె; ఏర్చుచున్+ఉన్నన్= కాలుస్తూ ఉండగా; నా కంఠబిలంబునన్= నా కంఠంయొక్క రంధ్రంలో; విప్రుండు= బ్రాహ్మణుడు; ఉన్నవాఁడు+ఏని= ఉన్నవా డయితే; వెలువడి వచ్చునది= బయటికి రావాలి; అనినన్= అనగా; గరుడనికిన్= గరుత్మంతుడితో; ఆ+ విప్రుండు= ఆబ్రాహ్మణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని వినత బ్రాహ్మణుడిలక్షణాన్ని చెప్పగా తెలిసికొని గరుడుడు వినతకు నమస్కరించి, ఆమెకడ సెలవు పుచ్చుకొని, మిక్కిలి వేగం గల గమనంతో ఎగిరి(పరుగెత్తి) సముద్రగర్భాన ఉండే పెక్కువేలసంఖ్య కల బోయలను పాతాళరంధ్రంవంటి తనకంఠరంధ్రం తెరిచి ఆనిషాదులనందరిని ఒకేమారు మ్రింగగా, ఆనిషాదులలో ఒక బ్రాహ్మణుడు ఉండి, గొంతుకలోనికి దిగక అగ్నివలె కాలుస్తుండగా తల్లి చెప్పిన లక్షణాన్నిబట్టి బ్రాహ్మణుడు కంఠంలో ఉన్నా డని తెలిసికొని, 'నాకంఠరంధ్రంలో ఎవడైనా బ్రాహ్మణుడు ఉంటే, బయటికి రావా' లని పలుకగా ఆబ్రాహ్మణుడు గరుడుడితో ఇట్లా పలికాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. 'విప్రుఁడ నున్నవాఁడ, నపవిత్రనిషాది మదీయభార్య, కీ**
**ర్తిప్రియ! దీనిఁ బెట్టి చనుదెంచుట ధర్మువె నాకు?' నావుడున్**
**'విప్రులఁ బొంది యున్న యపవిత్రులుఁ బూజ్యులు గారె; కావునన్**
**విప్రకులుండ! వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియున్.' 63**

**ప్రతిపదార్థం:** కీర్తిప్రియ!= కీర్తిపట్ల ఆసక్తి కలవాడా! గరుత్మంతుడా!; విప్రుఁడన్= బ్రాహ్మణుడను; ఉన్నవాఁడన్; అపవిత్ర= పరిశుద్ధురాలు కానిది; నిషాది= బోయవనిత; మదీయ, భార్య= నాభార్య; దీనిన్= ఈబోయతను; పెట్టి=విడిచి; చనుదెంచుట= రావటం; నాకున్; ధర్మువు+ఏ= ధర్మమా! (ధర్మంకాదని భావం); నావుడున్= అనగావిని; విప్రకులుండ= బ్రాహ్మణకులుడా!; విప్రులన్= బ్రాహ్మణులను; పొంది, ఉన్న= చెంది ఉండే (చెట్టపట్టి ఉండే); అపవిత్రులున్= అపరిశుద్ధులుకూడ; పూజ్యులు కారె= పూజింపదగినవారు కారా! (అవుతారు); కావునన్= ఆకారణంవలన; నీవును= నీనిషాదియున్= నీబోయభార్యయు; వేగము+అ= శీఘ్రంగా; వెల్వడుము= బయటకు రమ్ము; ఇచట 'నిషాదియు' అనేశబ్దం సహార్థంలో వాడబడింది. నిషాదియున్ అంటే నిషాదితోడ అని అర్థం.

**తాత్పర్యం:** 'కీర్తిపట్ల ఆసక్తిగల ఓగరుత్మంతుడా! బ్రాహ్మణుడిని ఉన్నాను, నాభార్య అపరిశుద్ధురా లయిన బోయవనిత; దీన్ని విడిచి రావటం నాకు ధర్మమా?' అనగా గరుడడు 'బ్రాహ్మణులను పొంది ఉండే అపరిశుద్ధులుకూడ పూజింపదగినవారు కారా? కావున ఓ బ్రాహ్మణ కులానికి చెందినవాడా! నీవు నీనిషాదిభార్యతో వెంటనే బయటకు రమ్ము!'

**వ. అనిన నాగరుడని యనుగ్రహంబున బ్రాహ్మణుండు నిషాదీసహితుం డై వెలువడి వచ్చి, గరుడని దీవించి, యథేచ్ఛం జనియె; గరుడండును గగనపథంబునం బఱచి, కశ్యపుం గని నమస్కరించి, 'యస్మజ్జననీ దాస్యనిరాసార్థం బురగుల కమృతంబుఁ దేర నరిగెద, నిషాదఖాదనంబున నాఁకలి వోవకున్నయది, నా కాహారంబు ప్రసాదింపు' మనిన కొడుకుకడంకకు మెచ్చి కశ్యపప్రజాపతి యి ట్లనియె. 64**

**ప్రతిపదార్థం:** అనినన్= గరుడుడు అట్లా పలుకగా; ఆ, గరుడని; అనుగ్రహంబునన్= ఆ గరుడని దయచేత; బ్రాహ్మణుండు; నిషాదీసహితుండై=బోయజాతి పత్నితో వెలువడి, వచ్చి= బయటకు వచ్చి; గరుడనిన్; దీవించి= ఆశీర్వదించి; యథా+ఇచ్ఛన్= ఇచ్ఛవచ్చినట్లు; చనియెన్= వెళ్ళాడు; గరుడండును; గగనపథంబునన్= ఆకాశమార్గాన; పఱచి= ఎగిరి; కశ్యపున్= తండ్రి అయిన కశ్యపుని; కని= చూచి; నమస్కరించి= మ్రొక్కి; అస్మత్, జననీ, దాస్య, నిరాస+అర్థంబు= మాతల్లియొక్క బానిసతనాన్ని పోగొట్టటానికి; ఉరగులకున్= పాములకు; అమృతంబు; తేరన్= తేవటానికి; అరిగెదన్= వెళ్లుతున్నాను; నిషాద, ఖాదనంబునన్= నిషాదులను తినటంచేత; ఆకలి; పోవక+ఉన్న+అది= తొలగకుండా ఉన్నది; నాకున్; ఆహారంబు= తినేపదార్థం; ప్రసాదింపుము= అనుగ్రహించుము; అనినన్; కొడుకు, కడంకకున్= కొడు కయిన గరుడుని పూనికకు; మెచ్చి; కశ్యపప్రజాపతి= కశ్యపబ్రహ్మ; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** అని గరుడడు పలుకగా, అతనిదయవలన బ్రాహ్మణుడు తన నిషాదభార్యతో కూడి కంఠంనుండి బయటకు వచ్చి గరుడుని ఆశీర్వదించి, తన ఇచ్ఛవచ్చినట్లు వెళ్ళాడు. గరుడడును ఆకాశమార్గాన ఎగిరి తండ్రి అయిన కశ్యపుడిని చూచి మ్రొక్కి 'నాతల్లి దాస్యాన్ని తొలగించే నిమిత్తం పాములకు అమృతం తేవటానికి వెళ్ళుతున్నాను. బోయలను తినటంచేత నాఆకలి తీరలేదు. నాకు మరే దైనా ఆహారం అనుగ్రహించండి' అని పలుకగా అతని (కుమారుని) పూనికకు మెచ్చి కశ్యపబ్రహ్మ ఇట్లా అన్నాడు.

### గజకచ్ఛపముల వృత్తాంతము (సం. 1-25-10)

**క. అనలనిభుండు విభావసుఁ । డను విప్రుఁడు నియమవంతుఁ డర్థాఢ్యుం డై**
**తనరి సుఖ మున్న, నాతని । యనుజన్ముఁడు సుప్రతీకుఁ డనువాఁ డతనిన్. 65**

**ప్రతిపదార్థం:** అనల, నిభుండు= అగ్నితో సమాను డయిన; విభావసుఁడు+అను, విప్రుఁడు= విభావసు డనే పేరుకల బ్రాహ్మణుడు; నియమవంతుఁడు= నియమం కలవాడు; అర్థ+ఆఢ్యుండు+ఐ= ధన సంపన్ను డయి; తనరి= ఒప్పి; సుఖము+ఉన్నన్= సుఖంతో ఉండగా; (ఇట ప్రథమ, తృతీయార్థంలో వాడబడింది); అతని+అనుజన్ముఁడు= అతని తమ్ముడు; సుప్రతీకుఁడు+అనువాఁడు= సుప్రతీకు డనే పేరు కలవాడు; అతనిన్= అన్న అయిన విభావసుడిని.

**తాత్పర్యం:** అగ్నితో సమానుడు, నియమాల ననుసరించేవాడు అయిన విభావసు డనే బ్రాహ్మణుడు, ధనసంపన్ను డై ఒప్పి సుఖంతో ఉండగా అతని తమ్ము డయిన సుప్రతీకు డనే పేరుకలవాడు అతని అన్న విభావసునితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'మనపితృవర్గము వడసిన । ధనము విభాగించి యిమ్ము ధర్మస్థితి నా'**
**కని యడుగంబోయిన య । య్యనుజునకు విభావసుం డహంకారమునన్. 66**

**ప్రతిపదార్థం:** మన, పితృవర్గము= మనతల్లిదండ్రుల, తాతముత్తాతల సమూహం; పడసిన= పొందిన; ధనమున్= సంపదను; విభాగించి= పాలుపంచి (విభజించి); నాకున్; ధర్మస్థితిన్= ధర్మం ప్రకారంగా; ఇమ్ము; అని, అడుగన్, పోయిన= అని అడగటానికి వెళ్లిన; ఆ, అనుజునకున్= ఆ తమ్ము డయిన సుప్రతీకునికి; విభావసుండు; అహంకారమునన్= గర్వంతో.

**తాత్పర్యం:** 'మన తండ్రితాతలు పొందిన సంపదను ధర్మప్రకారంగా పాలు పంచి నా కి' మ్మని అడగటానికి వెళ్ళిన తమ్ము డయిన సుప్రతీకుడికి విభావసుడు గర్వంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తా నలిగి యిచ్చె శాపం । 'బేనుఁగ వై యుండు' మని, సహింపక వాఁడున్**
**మానుగఁ 'గూర్మమ వగు' మని । వానికిఁ బ్రతిశాప మిచ్చె వసులోభమునన్. 67**

**ప్రతిపదార్థం:** తాను= ఆవిభావసుడు; అలిగి= కోపించి; ఏనుఁగవు+ఐ, ఉండుము+అని= ఏనుగవుగా ఉండుమని; శాపంబు+ఇచ్చెన్= శాపమిచ్చాడు; సహింపక= ఆశాపానికి ఓర్వక; వాఁడున్= తమ్ము డయిన సుప్రతీకుడును; మానుగన్= ఒప్పుగా; కూర్మమవు+అగుము+అని= తాబేలువు కమ్ము అని; వానికిన్= అన్న అయిన విభావసుడికి; వసులోభమునన్= సంపదపైనిఆశచేత; ప్రతిశాపము+ఇచ్చెన్= ఎదురుశాపం ఇచ్చాడు.

**తాత్పర్యం:** అన్న అయిన విభావసుడు 'ఏనుగవు కమ్మ' అని తమ్ముడిని శపిస్తే, ఆశాపానికి సహించక, తమ్ము డయిన సుప్రతీకుడు సంపదపై గల మక్కువతో 'తాబేలువు కమ్మ' అని అన్నను శపించాడు.

**వ. 'ఇ ట్లన్నయుం దమ్ముండును నన్యోన్యశాపంబులం జేసి యోజనత్రయోత్సేధంబు గలిగి దశయోజనవృత్తం బైన కూర్మంబును, షడ్యోజనోత్సేధంబు గలిగి ద్వాదశ యోజన విస్తృతం బైన గజంబును నై సరోవర విపినంబుల నుండి యర్థనిమిత్తం బైన పూర్వవైరంబునఁ దమలో నిత్యంబు నొండొంటితోడం బెనంగి పోరుచుండు; నవి నీకాహారంబు సు; మ్మరుగుము, కార్యసిద్ధి యయ్యెడు' మనిన గరుడండును మనోవేగంబునం బఱచి యారెంటినిం గాంచి. 68**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అన్నయున్, తమ్ముండునున్; అన్యోన్య, శాపంబులన్, చేసి= ఒండొరుల కిచ్చుకొన్న శాపాలచేత; యోజన, త్రయ+ఉత్సేధంబు, కలిగి= మూడు యోజనాల పొడవు (3×8= 24మైళ్ళు) గలిగి; దశ, యోజన, వృత్తంబు+ఐన=

పదియోజనాల (ఆమడల) చుట్టుకొలత గలిగిన; కూర్మంబును= తాబేలును; షట్, యోజన+ఉత్సేధంబు, కలిగి= ఆరుయోజనాల పొడవు గలిగి; ద్వాదశ, యోజన, విస్తృతంబు+ఐన= పన్నెండు యోజనాల వ్యాప్తి (వెడల్పు) గలిగిన; గజంబునున్+ఐ= ఏనుగును అయి; సరోవరవిపినంబులన్= క్రమంగా చెరువులోను, అడవిలోను; ఉండి= నివసించి; అర్థ, నిమిత్తంబు+ఐన= సంపదకారణంగా ఏర్పడిన; పూర్వ, వైరంబునన్= పూర్వజన్మలోని పగతో; నిత్యంబున్= ఎల్లప్పుడును; తమలోన్= తమలోతాము; ఒండు+ఒంటితోడన్= ఒకటి ఇంకొకదానితో; పెనంగి= కలయబడి;పోరుచుండున్= పోట్లాడుతుంటాయి. అవి=ఆతాబేలును, ఏనుగును; నీకున్; ఆహారంబు, చుమ్ము= తినదగినపదార్థాలు సుమా!; అరుగుము= వెళ్ళుము; కార్యసిద్ధి= పని నెరవేరటం; అయ్యెడున్+అనినన్= అవుతుందని చెప్పగా; (ఆశీర్వచనాన ఎడు చివరి ద్రుతానికి 'మ'కారం ఆదేశ మయింది); గరుడండును, మనస్+వేగంబునన్= మనస్సుయొక్క వేగంవంటి వేగంతో; పఱచి= పరుగెత్తి (ఎగిరి); ఆ, రెంటినిన్= ఆ తాబేటిని, ఏనుగును; కాంచి= చూచి.

**తాత్పర్యం:** 'ఈవిధంగా అన్నదమ్ములిద్దరు ఒండొరుల కిచ్చుకొన్న శాపాలచేత, మూడామడల పొడవు, పది ఆమడల పరిధి కల తాబేలును, ఆరామడలపొడవు, పండ్రెండామడల వెడల్పు గల ఏనుగును అయి క్రమంగా (తాబేలు) చెరువులోను (ఏనుగు) అడవిలోను ఉండి పూర్వజన్మంలోని విరోధంతో తమలో తాము ఎల్లప్పుడూ ఒండొంటితో కలియబడి పోరుతూఉంటాయి. ఆ తాబేలు, ఆ ఏనుగు నీకు తినదగిన ఆహారం సుమా! వెళ్ళుము. నీపని నెరవేరుగాక!' అని పలుకగా గరుడడు మనస్సుయొక్క వేగంవంటి వేగంతో ఎగిరి ఆ రెండింటిని చూచి (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. చఱచి యొకచేతఁ గూర్మముఁ । బెఱచేత గజంబుఁ బట్టి పెనఁచి ఖగేంద్రుం**
**డిఱికికొని గగనవీథిం । బఱచె వియచ్చరవిమానపంక్తులు దూలన్. 69**

**ప్రతిపదార్థం:** చఱచి= ఆక్రమించి; కొట్టి; ఒక, చేతన్= ఒకచేత్తో; కూర్మమున్= తాబేటిని; పెఱ, చేతన్= వేరొకచేత్తో; గజంబున్= ఏనుగును; పట్టి= పట్టుకొని; పెనఁచి= చుట్టుకొనేట్లుచేసి; ఖగ+ఇంద్రుండు= పక్షి శ్రేష్ఠు డయిన గరుత్మంతుడు; ఇఱికికొని అణగేటట్లు అదిమి; గగనవీథిన్= ఆకాశమార్గంలో; వియత్+చర, విమాన, పంక్తులు= ఆకాశంలో సంచరించే దేవతలయొక్క విమానాల వరుసలు; తూలన్= సంచలించేట్లుగా; పఱచెన్= ఎగిరాడు.

**తాత్పర్యం:** గరుత్మంతుడు పక్షి అవటంవల్ల రెక్కలతో ఏనుగును, తాబేటిని ఆక్రమించి ఒకచేత్తో (పాదంతో) తాబేటిని, వేరొకదానితో ఏనుగును పెనవేసి నొక్కి పట్టుకొని, ఆకాశంలో సంచరించే దేవతల విమానాల వరుసలు సంచలించేటట్లు ఎగిరాడు.

**క. కనకవ్రతతీవితతులఁ । బెనఁగిన సురభూరుహములఁ బెద్దయు బెడఁగై**
**తనరిన యలంబతీర్థం । బున కరిగె నగంబు లొక్కమొగి గ్రక్కదలన్. 70**

**ప్రతిపదార్థం:** కనక, వ్రతతీ, వితతులన్= సంపంగితీగల సమూహాలతో; పెనఁగిన= అల్లుకొని ఉండే; సుర, భూరుహములన్= దేవతా (కల్ప) వృక్షాలతో; పెద్దయున్= అధికంగా; బెడఁగు+ఐ= మనోహరమై; తనరిన= ప్రకాశించిన; అలంబ తీర్థంబునకున్ = అలంబ మనే పేరున్న తీర్థానికి; నగంబులు= కొండలు; ఒక్కమొగిన్= ఒక్కసారిగా; క్రక్కదలన్= (కదలగా, కదలగా) మిక్కిలి కదులుతుండగా; అరిగెన్= వెళ్ళినాడు.

**తాత్పర్యం:** సంపంగితీగలసమూహంతో అల్లుకొని ఉన్న దేవతావృక్షాలతో ఎక్కువగా మనోహర మై ప్రకాశిస్తున్న అలంబం అనే పేరున్న తీర్థానికి కొండలు మిక్కిలి కంపిస్తూ ఉండగా వెళ్లాడు.

**వ. అందు రోహిణంబను పాదపోత్తమంబు గరుడనిం గని సంభావించి 'శతయోజనాయతంబైనమదీయ శాఖపై నుండి యిగ్గజకచ్ఛపంబుల భక్షించి పో' మ్మనిన గరుడండు 'నట్ల చేయుదు' నని యమ్మహాశాఖపై నూఁద సమకట్టి, యందు. 71**

**ప్రతిపదార్థం:** అందున్= ఆపర్వతంలో; రోహిణంబు+అను= రోహిణమనే పేరున్న; పాదప+ఉత్తమంబు= వృక్ష శ్రేష్ఠం (పెద్దచెట్టు); గరుడనిన్= గరుత్మంతుడిని; కని= చూచి; సంభావించి= ఆదరించి (గౌరవించి); శత, యోజన+ఆయతంబు+ఐన= వందయోజనాల పొడవు ఉండే; మదీయ శాఖపైన్= నాకొమ్మపై; ఉండి= కూర్చుండి; ఈ, గజ, కచ్ఛపంబులన్= ఈఏనుగును, తాబేటిని; భక్షించి, పొమ్ము= తిని వెళ్ళుము; అనినన్= అని చెప్పగా; గరుడండును= గరుత్మంతుడును; అట్లు+అ చేయుదున్, అని= ఆవిధంగానే చేస్తానని; ఆ, మహత్, శాఖపైన్= ఆ గొప్ప చెట్టుకొమ్మపై; ఊఁదన్, సమకట్టి= ఆధారంగా చేసికొని నిలబడటానికి నిశ్చయించి; అందున్= ఆ కొమ్మపై.

**తాత్పర్యం:** ఆ పర్వతంలో రోహిణము అనే వృక్షశ్రేష్ఠం గరుడుని చూచి గౌరవించి, 'వందామడల పొడవు గల నాకొమ్మపై నిల్చి ఈ ఏనుగును, తాబేటిని తిని వెళ్ళు' మని పలుకగా గరుడుడు అట్లే చేస్తా నని ఆపెద్ద కొమ్మపై నిలబడటానికి పూని ఆ కొమ్మపై (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. పాదంబులు పెట్టుడుఁ ద । త్పాదపఘనశాఖ విఱిఁగి బల్లన నుచ్చై**
**ర్నాదమున దిక్కు లద్రువఁగ । భేదిల్లె విహంగతతులు భీతిం బఱవన్. 72**

**ప్రతిపదార్థం:** పాదంబులు= కాళ్ళు; పెట్టుడున్= మోపినవెంటనే; తద్, పాదపఘన, శాఖ= ఆరోహిణ మనే చెట్టుయొక్క గొప్ప కొమ్మ; విఱిఁగి; బల్లనన్= బల్లు మనేట్లుగా; ఉచ్చైః, నాదమునన్= పెద్దధ్వనితో; దిక్కులు; అద్రువఁగన్= కంపించగా; విహంగతతులు= పక్షుల సమూహాలు; భీతిన్= భయంతో; పఱవన్= పరుగెత్తగా, (ఎగురగా); భేదిల్లెన్= విరిగింది.

**తాత్పర్యం:** ఆగరుత్మంతుడు పాదాలు మోపగానే ఆ రోహిణ మనే వృక్షంయొక్క గొప్పకొమ్మ ఫెళ్ళుమనేటట్లుగా పెద్దధ్వనితో విరిగి, దిక్కులు కంపించగా, పక్షులసమూహాలు భయంతో ఎగిరిపోగా విరిగిపోయింది.

**వ. అమ్మహాశాఖ నవలంబించి తలక్రిం దై యాదిత్యకిరణంబులు తమ కాహారంబుగాఁ దపంబు సేయుచున్న వాలఖిల్యమహామునిగణంబులం జూచి, యిది భూమిపయింబడిన నిమ్మునులకు బాధయగు నని దానిం గఱచికొని, గజకచ్ఛపంబులం గరంబుల నిఱికికొని, గరుడండు గగనంబునం బఱచి, తనకు నూఁద నిమ్మగు ప్రదేశం బెందునుం గానక గంధమాదనంబునకుం జని, యందుఁ దపంబు సేయుచున్న కశ్యపుం గనుంగొని మ్రొక్కిన. 73**

**ప్రతిపదార్థం:** ఆ+మహత్, శాఖన్= ఆగొప్పకొమ్మను: అవలంబించి= పట్టుకొని; తల, క్రిందు+ఐ= తలక్రిందిభాగాన ఉండేటట్లుగా; ఆదిత్య, కిరణంబులు= సూర్యుని యొక్క కిరణాలు; తమకున్, ఆహారంబు, కాన్= భుజించేపదార్థం కాగా; తపంబు, చేయుచున్న, వాలఖిల్య, మహత్, ముని, గణంబులన్= వాలఖిల్యు లనే పేరున్న గొప్పమునులసమూహాలను; చూచి;

ఇది= ఈవిరిగిన కొమ్మ; భూమి, పయిన్, పడినన్= భూమిమీద పడితే; ఈ+మునులకున్= తలక్రిందుగా వ్రేలాడుతూ తపస్సు చేస్తున్న ఈ మునులకు; బాధ+అగున్+అని; దానిన్= ఆవిరిగినకొమ్మను; కఱచి కొని= నోటితో పట్టుకొని; గజ, కచ్ఛపంబులన్= ఏనుగును, తాబేటిని; కరంబులన్= చేతులలో; ఇఱికికొని= అడగునట్లుచేసి, అదిమిపట్టుకొని; గరుడండు; గగనంబునన్= ఆకాశంలో; పఱచి= ఎగురుతూ వెళ్ళి, తనకున్, ఊఁదన్= నిలవటానికి; ఇమ్ము+అగు, ప్రదేశంబు= తగినచోటును; ఎందునున్, కానక= ఎక్కడను చూడక; గంధమాదనంబునకున్= గంధమాదన మనే పర్వతానికి; చని= వెళ్ళి; అందున్= ఆపర్వతంలో; తపంబు+చేయుచున్న; కశ్యపున్= తండ్రి అయిన కశ్యపుడిని; కనుంగొని= చూచి; మ్రొక్కినన్= నమస్కరించగా.

**తాత్పర్యం:** ఆగొప్పకొమ్మను పట్టుకొని తలక్రిందుగా ఉండి సూర్యుడి కిరణాలే తమకు భోజనంగా తపస్సు చేస్తున్న వాలఖిల్యు లనే గొప్ప మునుల సమూహాన్ని చూచి ఈ కొమ్మ భూమిపై పడితే 'ఈమునులకు బాధ కలుగుతుం' దని ఆ కొమ్మను నోటితో కరచుకొని ఏనుగును, తాబేటిని చేతులలో అదిమిపట్టుకొని గరుడడు ఆకాశంలోనికి ఎగిరి తనకు నిలవటానికి వీలయినచోటు ఎచ్చటా కానలేక గంధమాదన పర్వతానికి వెళ్ళి అక్కడ తపస్సు చేస్తున్న తండ్రి అయిన కశ్యపుడిని చూచి నమస్కరించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. కనకమహీధరప్రతిమకాయు, మహాజవనిర్జితప్రభం**
**జను, నవిచింత్య భూరిబలసత్త్వసమన్వితు, దీప్తహవ్యవా**
**హనసము, వైనతేయునిఁద దాస్యగతద్రుమశాఖ నున్న య**
**త్యనఘుల వాలఖిల్యులను, నమ్మునినాథుఁడు చూచి నెమ్మితోన్. 74**

**ప్రతిపదార్థం:** కనక, మహీధర, ప్రతిమ, కాయున్= బంగారుకొండ అయిన మేరు పర్వతంతో సమాన మైన శరీరం కలవాడిని; మహత్, జవ, నిర్జిత, ప్రభంజనున్= గొప్పవేగంచేత జయింపబడిన వాయువు కల; అవిచింత్య, భూరి, బల, సత్త్వ సమన్వితున్= ఊహింపరాని గొప్పబలంతో, శక్తితో కూడిన వాడిని; దీప్త హవ్యవాహన, సమున్= వెలుగుతున్న అగ్నితో సమాను డయిన వాడిని; వైనతేయునిన్= వినత యొక్క కుమారు డయిన గరుత్మంతుడిని; తద్, ఆస్య, గత, ద్రుమ, శాఖన్= ఆ గరుత్మంతుడియొక్క నోటిలో ఉండే చెట్టుకొమ్మకు; ఉన్న; అతి+అనఘులన్= ఎట్టిపాపం లేనివారిని; మిక్కిలి గొప్పవారిని; వాలఖిల్యులనున్= వాలఖిల్యు లనే పేరున్న మునులను; ఆ+ముని, నాథుడు= ఆమునులకు నాయకు డయిన కశ్యపుడు; నెమ్మితోన్= దయతో; చూచి.

**తాత్పర్యం:** మేరుపర్వతంతో సమాన మయిన శరీరం గల వాడిని, తనకు గలగొప్పవేగంతో జయింపబడిన వాయువు గలవాడిని, ఊహింపరాని గొప్పబలంతోను, శక్తితోను కూడినవాడిని, వెలుగుతున్న అగ్నితో సమానుడైనవాడిని, వినతాకుమారు డయిన గరుత్మంతుని, అతనినోటిలో ఉన్న చెట్టుకొమ్మకు వేలాడుతున్న పాపరహితు లైన వాలఖిల్యు లనే పేరున్న మునులను కశ్యపుడు దయతో చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**వ. 'ఇగ్గరుడండు భువనహితమహారంభుండు బలసమన్వితుండు, మీకు బాధయగునని యిత్తరుశాఖ విడువనేరకున్న వాఁడు; వీనిం గరుణించి మీరొండుకడ కరుగుం' డనిన వాలఖిల్యులు కశ్యపుప్రార్థనం జేసి**

**దాని విడిచి హిమవంతంబునకుం జనిరి; గరుడండును ముఖనిక్షిప్తశాఖాస్థలితవచనుం డగుచుఁ దండ్రి కిట్లనియె. 75**

**ప్రతిపదార్థం:** ఈ+గరుడండు= ఈ గరుత్మంతుడు; భువన, హిత, మహత్+ఆరంభుండు= లోకాలకు మేలు కలిగించే గొప్పప్రయత్నం కలవాడు; బలసమన్వితుండు= బలంతో కూడినవాడు; మీకున్= చెట్టుకొమ్మకు తలక్రిందుగా వ్రేలాడుతూ తపస్సు చేసికొంటున్న మీకు; బాధ, అగును+అని; ఈ తరు, శాఖన్= ఈ చెట్టుకొమ్మను; విడువన్=, నేరక+ఉన్నవాఁడు= విడిచిపెట్ట లేక ఉన్నవాడు; వీనిన్= కొమ్మతోపాటు మిమ్మల్ని ఇక్కడికి తెచ్చిన ఈగరుత్మంతుడిని; కరుణించి= దయదలచి; మీరు+ఒండు, కడకున్= వేరొకచోటికి; అరుగుండు= వెళ్ళండి, అనినన్= అని చెప్పగా; వాలఖిల్యులు= వాలఖిల్యు లనే మునులు; కశ్యపు, ప్రార్థనన్ చేసి= కశ్యపునియొక్క కోరికచేత; దానిన్, విడిచి= ఆకొమ్మను విడిచి; హిమవంతంబునకున్= హిమవంత మనే పర్వతానికి; చనిరి= వెళ్ళారు; గరుడండును; ముఖ, నిక్షిప్త, శాఖా, స్థలిత, వచనుండు+అగుచున్= నోటిలో ఉంచుకొన్న కొమ్మవలన తొట్రుపాటుతో కూడిన మాటలు గలవా డవుతూ; తండ్రికిన్+ ఇట్లు+ అనియెన్= తండ్రి అయిన కశ్యపుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఈగరుత్మంతుడు లోకాలకు మేలుచేసే గొప్ప ప్రయత్నం కలవాడు. బలంతో కూడినవాడు. మీకు బాధకలుగుతుం దని నోటితో కరచుకొని ఉన్న ఈ చెట్టుకొమ్మను విడువజాలకున్నాడు. వీడిని అనుగ్రహించి మీరు ఇంకొకచోటికి వెళ్ళండి' అని పలుకగా వాలఖిల్యమునులు కశ్యపుడివేడికోలుతో ఆకొమ్మను విడిచి హిమవత్పర్వతానికి వెళ్ళారు. గరుడడును ముఖంలో ఉంచబడిన కొమ్మచేత తొట్రుపాటుతో కూడిన వాక్యాలు కలవాడవుతూ తండ్రి అయిన కశ్యపుడితో ఇట్లా పలికాడు.

**క. ధరణీసురవిరహిత మగు । నరణ్యదేశంబు నాకు నానతియిం డి**
**త్తరుశాఖ విడువవలయును । కరము నిరోధ మిది యనినఁ గశ్యపుఁ డనియెన్. 76**

**ప్రతిపదార్థం:** ధరణీసుర, విరహితము+అగు= బ్రాహ్మణులు లేనిదైన; అరణ్యదేశంబు= అడవి ప్రదేశాన్ని; నాకున్; ఆనతి+ఇండు= తెలియజేయండి (ఆజ్ఞాపించండి); ఈ, తరుశాఖన్= ఈ చెట్టుకొమ్మను; విడువన్వలయును; ఇది= ఈకొమ్మ; కరమున్= మిక్కిలి; నిరోధము= ఆటంకం; అనినన్= అని చెప్పగా; కశ్యపుండు+ అనియెన్= కశ్యపుడు చెప్పాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులు లేని అడవిప్రాంతాన్ని నాకు తెలియజేయండి. ఈకొమ్మను అక్కడ విడిచిపెట్టాలి. ఇది నాకు మిక్కిలి ఆటంకం. అని చెప్పగా కశ్యపుడు ఇట్లా చెప్పాడు.

**క. హిమశైలకందరాభా । గముకడ నిష్పురుషనగము కల దచ్చో నీ**
**ద్రుమశాఖ విడువు మది దా । నమానుష మగమ్య మీశ్వరాదుల కైనన్. 77**

**ప్రతిపదార్థం:** హిమ, శైల, కందరా, భాగము, కడన్= మంచుకొండయొక్క గుహయొక్క ప్రాంతం దగ్గర; నిష్పురుషనగము= నిష్పురుష మనే కొండ; కలదు; అచ్చోన్= ఆకొండమీద; ఈ, ద్రుమ, శాఖన్,= ఈచెట్టు కొమ్మను; విడువుము; అది, తాను= ఆకొండ; అమానుషము= మానవాతీతం (మనుష్యకృతంకానిది); ఈశ్వర+ఆదులకున్+ఐనన్= ఈశ్వరుడు మొదలయిన వారికికూడ; అగమ్యము= పొందరానిది;

**తాత్పర్యం:** హిమాలయంయొక్క గుహాప్రాంతంలో నిష్పురుషం అనే కొండ ఉన్నది. అక్కడ ఈ చెట్టుకొమ్మను విడువుము. అది మానవాతీతం. ఈశ్వరుడు మొదలయిన వారికికూడ చొరరానిది.

**విశేషం:** 'హిమశైలకందరాభాగముకడ' - అన్నప్పుడు హిమవత్పర్వతగుహాసమీపంలో నిష్పురుష పర్వతం ఉన్నదని అర్థం వస్తున్నది. కాని, అక్కడ అది లేదు. అందువలన 'దేశవిరోధమనే దోషం ఏర్పడుతుందని కొందరు అంటారు. 'హిమరుద్ధకందరాభాగముకడ' అని ఉండాలని భావిస్తారు. "తతో నిష్పురుషం శైలం - హిమసంరుద్ధకందరం' అని మూలం.

**వ. 'అది యిచ్చటికి లక్షయోజనంబులు గల దరుగు' మనిన గరుడండును మనోవేగంబునం బఱచి యా నిష్పురుషనగంబునం దత్తరుశాఖ విడిచి హిమవంతంబుమీఁదికిం బోయి గజకచ్ఛపంబుల భక్షించి, మహాసత్త్వసంపన్నుం డై నాకలోకంబున కెగయ సమకట్టి పక్షవిక్షేపంబుఁ జేసిన. 78**

**ప్రతిపదార్థం:** అది= ఆకొండ; ఇచ్చటికిన్= ఈగంధమాదనపర్వతానికి; లక్షయోజనంబులు, కలదు= లక్ష ఆమడలదూరం ఉన్నది; అరుగుము= వెళ్ళుము; అనినన్= అని చెప్పగా; గరుడండును, మనస్+వేగంబునన్= మనస్సుయొక్క వేగంవంటి వేగంతో; పఱచి= పరుగెత్తి(ఎగిరి); ఆ, నిష్పురుష, నగంబునన్= ఆనిష్పురుష మనే కొండలో; తద్, తరు, శాఖన్= ఆ రోహిణి వృక్షం యొక్క కొమ్మను; విడిచి= వదలిపెట్టి; హిమవంతంబుమీఁదికిన్= హిమాలయపర్వతంపైకి; పోయి= వెళ్ళి; గజకచ్ఛపంబులన్= ఏనుగును, తాబేటిని; భక్షించి= తిని; మహత్, సత్త్వసంపన్నుండు+ఐ= గొప్పబలంతో కూడిన వాడయి; నాకలోకంబునకున్= స్వర్గలోకానికి; ఎగయన్= ఎగరటానికి; సమకట్టి= నిశ్చయించి, పూని; పక్ష, విక్షేపంబున్, చేసినన్= రెక్కలు విదల్చటం చేయగా.

**తాత్పర్యం:** 'ఆకొండ ఈగంధమాదనపర్వతానికి లక్షఆమడలదూరంలో ఉన్నది. వెళ్ళుము' అని తండ్రి పలుకగా గరుడడు మనోవేగంతో ఎగిరి ఆనిష్పురుషపర్వతంలో ఆచెట్టుకొమ్మను విడిచి హిమాచలంమీదికి పోయి ఏనుగును తాబేటిని తిని గొప్పబలంతోకూడినవాడై స్వర్గలోకానికి ఎగురబూని రెక్కలు విదిలించగా.

### గరుడం డమృతహరణార్థం బెగయుట - (సం. 1-26-37)

**క. ఘనపక్షానిలచలితా । వనిరుహములవలనఁ దొరఁగు వరపుష్పచయం**
**బనిమిషజయార్థ మరిగెడు । వినతాసుతుమీఁదఁ బుష్పవృష్టియ పోలెన్. 79**

**ప్రతిపదార్థం:** ఘన, పక్ష+అనిల, చలిత+అవని, రుహముల వలనన్= గొప్పవైన రెక్కలయొక్క గాలిచేత కదలినచెట్లనుండి; తొరఁగు= జారిపడే; వర, పుష్ప, చయంబు= శ్రేష్ఠమైన పూలసముదాయం; అనిమిష, జయ+అర్థము= దేవతలను జయించటం కొరకు; అరిగెడు= వెళ్ళే; వినతా, సుతు, మీఁదన్= వినతకొడు కయిన గరుత్మంతుడిమీద; పుష్ప, వృష్టి+అ, పోలెన్= పూలవానవలె ఉండింది.

**తాత్పర్యం:** గొప్ప వయిన రెక్కలనుండి పుట్టిన గాలివలన కదలిన చెట్లనుండి శ్రేష్ఠములయిన పూలసమూహాలు దేవతలను జయించటానికి వెళ్ళేగరుత్మంతుడిపై పూలవానవలె ఒప్పాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. పూలవానయేమో అన్నట్లు ఉండిం దని భావం.

**వ. ఇట్లమృతహరణార్థంబు గరుడండు గగనంబున కెగసిన, నట దేవలోకంబునందు. 80**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; అమృత, హరణ+అర్థంబు= అమృతాన్ని తేవటానికి గరుడండు; గగనంబునకున్= ఆకాశానికి; ఎగసినన్= ఎగురగా; అట; దేవలోకంబునందున్= అచ్చట దేవతలలోకంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా అమృతాన్ని తేవటానికి గరుడడు ఆకాశంలోనికి ఎగురగా అక్కడ స్వర్గలోకంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**మాలిని.**

> **సురపతిసభఁ జూడం జూడ నంగారవృష్టుల్**
> **గురిసెఁ గులిశధారల్ గుంఠితం బయ్యె, దిక్కుం**
> **జరమదము లడంగెన్, సర్వదిక్పాలకాంతః**
> **కరణములు భయోద్వేగంబునన్ సంచలించెన్.** **81**

**ప్రతిపదార్థం:** సుర, పతి, సభన్= దేవతలరా జయిన ఇంద్రునిసభలో; చూడన్, చూడన్= చూడగాచూడగా; అంగార, వృష్టుల్= నిప్పుకణాలవర్షాలు; కురిసెన్= కురిశాయి; కులిశధారల్= వజ్రాయుధంయొక్క అంచులు; కుంఠితంబు+అయ్యెన్= మొక్కపోయాయి (బండబారాయి); దిక్, కుంజర, మదములు= దిక్కులలోని ఏనుగుల గర్వాలు; అడంగెన్= అణగారాయి; సర్వ, దిక్, పాలక+అంతః, కరణములు= అన్ని దిక్కులయొక్క పాలకులయొక్క (అందరుదిక్పాలకుల) మనస్సులు; భయ+ఉద్వేగంబునన్= భయంయొక్క ఆవేశంతో; సంచలించెన్= కంపించాయి.

**తాత్పర్యం:** చూస్తుండగానే దేవేంద్రునిసభలో నిప్పుకణాలవర్షాలు కురిశాయి. వజ్రాయుధంయొక్క అంచులు మొక్కపోయాయి. దిక్కులలోని ఏనుగులగర్వాలు అణగారాయి; దిక్పాలకులమనస్సులు భయావేశంతో క్షోభించాయి.

**విశేషం:** ముదర్ణకాంత మవటంచేత 'ధారలు' బహువచనాంత మైన విశేషణమైన 'కుంఠితం' ఏకవచనంలో ఉండవచ్చు. మాలినీ వృత్తంలో పాదానికి న, న, మ, య, య - అనేగణాలు ఉంటాయి. 9వఅక్షరానికి యతిమైత్రి చెల్లుతుంది. దేవలోకంలో ప్రవేశించే గరుత్మంతుడివలన దేవసభలో కలిగిన ఉత్పాతాలు ఒక మాలికగా ఇందులో నన్నయ వర్ణించాడు. (ఇవి గరుడ విజయాన్ని వ్యంగ్యంగా సూచిస్తున్నాయి.) అంగారవృష్టులు భావికథలో గరుత్మంతుడు చేసే యుద్ధాన్నీ, మిగిలిన ఉత్పాతాలు క్రమంగా-ఇంద్రుడు గరుడుడిపై ప్రయోగించే వజ్రాయుధం నిష్ఫలంకావటాన్నీ, సర్వలోక విజేతగా గరుత్మంతుడు గుర్తింపబడటాన్నీ, ఇంద్రుడివలె గరుత్మంతుడు పక్షికులానికి ఇంద్రుడు కావటాన్నీ ధ్వనింపచేస్తున్నట్లు నిబంధించటం నన్నయరచనలోని వస్తుధ్వని, గరుత్మంతుడి సురలోకవిజయానికీ, అమృతహరణానికీ, నారాయణ కరుణాప్రాప్తికీ, ఇంద్రుడి స్నేహానికీ, అమృతాన్ని ఇంద్రుడికి ఉపాయంతో తిరిగిఅందించటానికీ, వినతకూ గరుత్మంతుడికీ స్వాతంత్ర్యం లభించటానికీ నాందివలె రాణించే ఈపద్యాన్ని విశేషవృత్తమైన 'మాలిని'తో నన్నయ రచించి పఠితల మనస్సులు వస్తుధ్వనిని ఆస్వాదించేటట్లు హెచ్చరిస్తున్నారు. భరతుడు మాలినీవృత్తాన్ని 'నాందీముఖి' అన్నాడు. నన్నయ దానిని సార్థకం చేశాడు. (సంపా.)

**వ. ఇట్టి మహోత్పాతంబులు పుట్టిన, సురపతి బృహస్పతిం జూచి, 'యిది యేమి నిమిత్తం?' బని యడిగిన, దాని నంతయు నెఱింగి బృహస్పతి సురపతి కి ట్లనియె.** **82**

**ప్రతిపదార్థం:** ఇట్టి; మహత్, ఉత్పాతంబులు= గొప్ప చెడ్డ శకునాలు; పుట్టినన్= పుట్టగా; సురపతి= దేవేంద్రుడు; బృహస్పతిన్+ చూచి= గురు వైన బృహస్పతిని చూచి; ఇది, ఏమి; నిమిత్తంబు= కారణం; అని; అడిగినన్; దానిన్+అంతయున్= ఆవిషయా న్నంతటిని; ఎఱింగి= తెలిసికొని; బృహస్పతి; సురపతికిన్= ఇంద్రుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** ఇటువంటి గొప్పదుశ్శకునాలు కలుగగా దేవేంద్రుడు దేవతాగురు వైన బృహస్పతిని చూచి 'ఈ అపశకునాలకు కారణ మేమిటి?' అని అడిగాడు. ఆవిషయ మంతా తెలిసికొని బృహస్పతి దేవేంద్రుడికి ఇట్లా చెప్పాడు.

**సీ. బ్రహ్మణ్యుఁ డగు కశ్యపబ్రహ్మవరమున । వినతకుఁ బుట్టిన యనఘమూర్తి**
**వాలఖిల్యులదయ వరపక్షికులమున । క్రిందుఁ డై పరఁగిన యిద్ధతేజుఁ,**
**డుదధిలో నున్న యత్యుగ్రనిషాదుల । నారంగ మ్రింగిన ఘోరవీరుఁ,**
**డిభకచ్ఛపముల రోహిణశాఖతో నెత్తి । కొని దివిఁ బఱచిన యనిలవేగి.**

**తే. వీఁగి తనతల్లిదాస్యంబు నీఁగఁబూని । తడయ కమృతంబు గొనిపోవఁ గడఁగి వచ్చెఁ;**
**గామరూపసంపన్నుండు, గామగమనుఁ । డతఁడు నీకు నసాధ్యుండు శతమఖుండ! 83**

**ప్రతిపదార్థం:** శత, మఖుండ= ఇంద్రుడా! బ్రహ్మణ్యుఁడు+అగు= బ్రహ్మజ్ఞానం కలిగిన; కశ్యప బ్రహ్మ, వరమునన్= కశ్యపు డనే ప్రజాపతియొక్క వరంచేత; వినతకున్; పుట్టిన; అనఘమూర్తి= పాపంలేనట్టి వ్యక్తి; వాలఖిల్యుల, దయన్= వాలఖిల్యు లనే మునుల దయచేత; వర, పక్షి, కులమునకున్= శ్రేష్ఠ మయిన పక్షులయొక్క కులానికి; ఇంద్రుఁడు+ఐ= రాజై; పరఁగిన= ప్రసిద్ధి పొందిన; ఇద్ధ, తేజుఁడు= ప్రకాశించే ప్రతాపం కలవాడు; ఉదధిలోన్+ఉన్న= సముద్రంలో ఉండే; అతి+ఉగ్ర, నిషాదులన్= మిక్కిలి భయంకరు లైన బోయవాళ్ళను; ఆరంగ, మ్రింగిన= పూర్తిగా తినినట్టి; ఘోర, వీరుఁడు= భయంకరు డైన వీరుడు; ఇభ, కచ్ఛపములన్= ఏనుగును, తాబేటిని; రోహిణశాఖతోన్= రోహిణవృక్షంయొక్క కొమ్మతోపాటుగా; ఎత్తికొని= ఎత్తికొని పట్టుకొని; దివిన్= ఆకాశంలో; పఱచిన= (పరుగెత్తిన) ఎగిరిన; అనిల, వేగి= గాలియొక్క వేగం వంటి వేగం కలవాడు; వీఁగి= ఉత్సాహపడి; తన, తల్లి; దాస్యంబున్= తనతల్లి అయిన వినతయొక్క దాసితనాన్ని; ఈఁగన్+పూని= తొలగించటానికి నిశ్చయించి; తడయక= ఆలస్యంచేయక; అమృతంబు, కొని, పోవన్= అమృతాన్ని తీసికొనిపోవటానికి; కడఁగి, వచ్చెన్= పూని వచ్చాడు; కామ, రూప, సంపన్నుండు= కోరుకొన్నరూపం ధరించ కలవాడు; కామ, గమనుఁడు= కోరికకు తగినట్లుగా వెళ్ళేవాడు; నీకున్; అతఁడు= ఆవినతకొడుకు; అసాధ్యుండు= జయింపరానివాడు.

**తాత్పర్యం:** బ్రహ్మజ్ఞానం కలిగిన కశ్యపు డనే ప్రజాపతి వరంవలన వినతకు పుట్టిన పాపరహితుడు ఈగరుత్మంతుడు. ఇతడు వాలఖిల్యులనే మహర్షుల కృపచేత శ్రేష్ఠమయిన పక్షికులానికి రాజుగా ప్రసిద్ధిపొందిన గొప్ప ప్రభావం కలవాడు. సముద్రంలోపల ఉండే మిక్కిలి భయంకరు లైన బోయవాళ్ళను పూర్తిగా తినివేసిన ఘోర మైన వీరుడు. ఏనుగును, తాబేటిని రోహిణ వృక్షపు కొమ్మతోపాటు పట్టుకొని ఆకాశంలో ఎగిరిన వాయువేగం కలవాడు. ఉత్సాహపడి తనతల్లియొక్క దాసితనాన్ని పోగొట్టటానికి ఆలస్యం చేయకుండా అమృతం తీసికొనిపోవటానికి సాహసించి వచ్చాడు. ఇచ్ఛవచ్చిన రూపం ధరించగలిగినవాడు. ఇచ్ఛవచ్చినట్లుగా సంచరించేవాడు. ఓఇంద్రుడా! ఈగరుత్మంతుడు నీకు జయింపరానివాడు.

### వాలఖిల్యుల వృత్తాంతము (సం. 1-27-4)

**వ. అగ్గరుడని మాహాత్మ్యంబు నీవు నెఱుంగుదు; వది యెట్లనినఁ దొల్లి కశ్యపప్రజాపతి పుత్త్రార్థి యై భవత్ప్రభృతులైన దేవగణంబులను, వాలఖిల్యప్రముఖు లైన మహామునిగణంబులను దనకు సహాయులనుగాఁ**

**బడసి పుత్త్రకామేష్టి సేయునాఁడు నీవు నీబలంబునకుం దగినయిధ్మభారంబు మోచికొని యశ్రమంబున వచ్చువాఁడ వై, యల్పకుశపలాశేధ్మభారంబులు మోచికొని వడవడ వడంకుచు వచ్చువారి, నల్పసత్త్వుల, నంగుష్ఠప్రమాణ దేహుల; ననవరతోపవాస కృశీభూత శరీరుల, వాలఖిల్యమహామునులం జూచి నగిన, నమ్మునులు సిగ్గుపడి కడు నలిగి. 84**

**ప్రతిపదార్థం:** ఆ+గరుడని, మాహాత్మ్యంబు= ఆగరుత్మంతుడి గొప్పతనాన్ని; నీవునున్= నీవుకూడ; ఎఱుంగుదువు= తెలియుదువు; అది; ఎట్లు+అనినన్= ఏవిధంగా నంటే; తొల్లి= పూర్వం; కశ్యప, ప్రజాపతి= కశ్యపబ్రహ్మ; పుత్త్ర+అర్థి+ఐ= కొడుకులను కోరేవాడై; భవత్, ప్రభృతులు+ఐన= నీవు మొదలుగా ఉండే; దేవగణంబులను= దేవతల సమూహాలను; వాలఖిల్య, ప్రముఖులు+ఐన= వాలఖిల్యులు మొదలగువారైన; మహత్+ముని గణంబులన్= గొప్పవారైన ఋషులయొక్క సమూహాలను, తనకున్= యజ్ఞంచేయబోయే తనకు (కశ్యపుడికి); సహాయులను కాన్= తోడ్పడేవాళ్ళుగా; పడసి= పొంది; పుత్త్ర, కామ+ఇష్టి, చేయువాఁడు= పుత్రకామేష్టిని చేసే వాడు; నీవు; నీ, బలంబునకున్= నీయొక్క శక్తికి; తగిన= సరిపడిన; ఇధ్మ, భారంబు= కట్టెల (సమిధల) బరువును; మోచికొని; అశ్రమంబునన్= శ్రమలేకుండా; వచ్చు, వాఁడవు+ఐ; అల్ప, కుశ, పలాశ+ఇధ్మ, భారంబులు= తక్కువయిన దర్భ, మోదుగకట్టెల బరువులను; మోచికొని; వడవడ= వణకటంలో ధ్వన్యనుకరణం; వడంకుచున్= వణికిపోతూ; వచ్చు, వారిన్= వచ్చేటివాళ్ళను; అల్పసత్త్వులన్= తక్కువబలం గలవారిని; అంగుష్ఠప్రమాణదేహులన్= బొటనవ్రేలంత కొలతఉన్న శరీరాలు కలవాళ్ళను; అనవరత+ఉపవాస, కృశీభూత, శరీరులన్= ఎల్లప్పుడూ ఉపవాసాలచేత (ఒకరోజంతా భోజనం చేయకుండా ఉండి మరునాటిఉదయం భుజించటం ఉపవాస మనబడుతుంది) చిక్కినశరీరం కలిగినవారిని; వాలఖిల్య, మహత్, మునులన్= వాలఖిల్యులనే గొప్పమునులను; చూచి; నగినన్= నవ్వగా; ఆ+మునులు= ఆవాలఖిల్యమునులు; సిగ్గుపడి; కడున్, అలిగి= మిక్కిలి కోపించి.

**తాత్పర్యం:** ఆ గరుడుని గొప్పతనం నీవుకూడ ఎరుగుదువు. అది ఎట్లంటే: పూర్వం కశ్యప ప్రజాపతి పుత్రులను కోరువాడై నీవుమొదలుగా ఉన్న దేవతలసమూహాలను, వాలఖిల్యులు మొదలుగా ఉన్న గొప్పమునుల సమూహాలను తనకు తోడ్పడే వాళ్ళనుగా పొంది (పుత్రులను పొందటానికై చేసే) పుత్రకామేష్టి అనే యజ్ఞాన్ని చేసేటప్పుడు నీవు నీబలానికి తగ్గ కట్టెల(సమిధల) మోపు మోసికొని శ్రమలేకుండా (అనాయాసంగా) వస్తూ స్వల్పమైన దర్భలయొక్క, మోదుగుకట్టెలయొక్క మోపులను మోసికొని శ్రమచేత వడవడవణకుతూ వచ్చే హీనబలులను, బొటనవ్రేలంతమాత్రం కొలత ఉండే దేహాలతోకూడినవారున్నూ నిరంతరం ఉపవాసం చేస్తూ ఉండటంచేత చిక్కినమేనులు కలవారున్నూ అయిన వాలఖిల్యులనే గొప్పమునులను చూచి నవ్వగా ఆమునులు సిగ్గుపడి మిక్కిలి కోపించి (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. రణవిజయుఁ డనల తేజుం । డణిమాదిగుణాఢ్యుఁ డుదితుఁ డయ్యెడు వీరా**
**గ్రణి శతమఖుకంటెను శత । గుణవీర్యుం డైన పుత్త్రకుం డజితుం డై. 85**

**ప్రతిపదార్థం:** రణ, విజయుఁడు= యుద్ధంలో విజయం కలవాడు; అనల, తేజుండు= అగ్నియొక్క ప్రకాశంవంటి ప్రకాశం కలవాడు; అణిమా+ఆది, గుణ+ఆఢ్యుఁడు= అణిమ మొదలయిన గుణాలసంపద గలిగినవాడు; వీర+అగ్రణి= వీరులలో అగ్రేసరుడు; శతమఖుకంటెను= ఇంద్రుడికంటె; శతగుణవీర్యుండు+ఐన= వందరెట్లుబలం కలిగిన; పుత్త్రకుండు= కొడుకు; అజితుండు+ఐ= ఓడింపబడనివా డయి; ఉదితుఁడు+అయ్యెడున్= పుడతాడు (పుట్టగలడు).

**తాత్పర్యం:** యుద్ధంలో ఎప్పుడూ విజయం పొందేవాడున్నూ, అగ్నియొక్క ప్రకాశం గలవాడున్నూ, అణిమాదిగుణాలసంపద కలవాడున్నూ, వీరులలో అగ్రభాగాన ఉండేవాడున్నూ, ఇంద్రుడికంటె వందరెట్లు బలం కలవాడున్నూ అయిన కుమారుడు జయింపరానివా డై పుట్టగలడు.

**విశేషం:** అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం అనేవి అష్టసిద్ధులు.

**వ. వాఁడు రెండవయింద్రుం డయ్యెడు మని మహావీర్యవంతంబు లైన మంత్రంబుల వేల్చుచున్నంత, నంతయు నెఱింగి నీవు కశ్యపుపాలికిం బోయి నాకుం గరుణింపుండని వారిం బ్రార్థించినఁ గశ్యపప్రజాపతి యమ్మునుల కి ట్లనియె. 86**

**ప్రతిపదార్థం:** వాఁడు= ఆపుట్టేవాడు; రెండవ, ఇంద్రుండు; అయ్యెడున్+అని= అవునుగాక! అని; మహత్, వీర్యవంతంబులు+ఐన= గొప్పశక్తితో గూడిన; మంత్రంబులన్= వేదమంత్రాలతో; వేల్చుచున్+ఉన్న+అంతన్= యజ్ఞకుండంలో హోమం చేస్తున్నసమయంలో; అంతయున్= విషయాన్నంతటిని; ఎఱింగి= తెలిసికొని; నీవు; కశ్యపుపాలికిన్= యజ్ఞం చేస్తున్న కశ్యపుడిసమీపానికి; పోయి= వెళ్ళి; నాకున్, కరుణింపుండు= నన్ను దయచూడండి (ఇట ద్వితీయావిభక్తి అర్థంలో షష్ఠి వాడబడింది) అని; వారిన్= ఆ వాలఖిల్యులను; ప్రార్థించినన్= వేడుకొనగా; కశ్యపప్రజాపతి= కశ్యపబ్రహ్మ; ఆ, మునులకున్= ఆవాలఖిల్యమునులకు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ పుట్టేవాడు రెండవఇంద్రుడు అగుగాక! అని గొప్పశక్తిగల మంత్రాలతో అగ్నిలో హోమం చేస్తుండగా ఈ విషయమంతా తెలిసికొని నీవు కశ్యపుని చెంతకు వెళ్ళి, నన్ను దయచూడం డని వారిని వేడగా కశ్యపబ్రహ్మ ఆవాలఖిల్యులతో ఇట్లా చెప్పాడు.

**ఉ. ఉండు నితండు పద్మజు నియోగమునం ద్రిజగంబులందు నిం**
**ద్రుం డయి భూతరాశిఁ దన దోర్బలశక్తిఁ గడంగి కాచుచున్;**
**రెండవయింద్రుఁ డైన విపరీత మగున్ భువనప్రవృత్తి; మీ**
**రొండువిధంబు సేయు టిది యుక్తమె బ్రహ్మనియుక్తి యుండఁగన్. 87**

**ప్రతిపదార్థం:** ఇతండు= ఈయింద్రుడు; పద్మజు, నియోగమునన్= బ్రహ్మయొక్క ఆజ్ఞచేత; త్రిజగంబులందున్= మూడులోకాలలో; ఇంద్రుండు+అయి= ఇంద్రపదవి పొంది; భూతరాశిన్= ప్రాణులసమూహాన్ని; తన, దోస్+బల, శక్తిన్= తనభుజాలబలంయొక్క సామర్థ్యంతో; కడంగి= పూనుకొని; కాచుచున్= రక్షిస్తూ; ఉండున్= ఉంటాడు; రెండవ, ఇంద్రుఁడు; ఐనన్= ఏర్పడితే; భువన, ప్రవృత్తి= లోకాలయొక్కవర్తన; విపరీతము+అగున్= తారుమారవుతుంది; బ్రహ్మ, నియుక్తి= బ్రహ్మయొక్క నియోగం; ఉండఁగన్= ఉండగా; మీరు; ఒండు, విధంబు= వేరొకపద్ధతిని; చేయుట= చేయటం; ఇది, యుక్తము+ఎ= ఇది తగునా? తగదు.

**తాత్పర్యం:** ఇతడు బ్రహ్మయొక్క నియమంచేత మూడులోకాలలో ఇంద్రుడుగా ఉండి జీవులసమూహాన్ని, తనబాహువులబలంయొక్క సామర్థ్యంతో కాపాడుతున్నాడు. రెండవఇంద్రుడు ఏర్పడితే లోకాలయొక్కవర్తన తారుమారవుతుంది. బ్రహ్మయొక్క నియమం ఉండగా మీరు వేరువిధం చేయటం తగునా?(తగదు).

**వ. 'మీవచనం బమోఘంబు గావున నింక నాకు నుద్భవిల్లెడు పుత్త్రుండు పక్షికులంబున కెల్ల నింద్రుం డయ్యెడు' మనికశ్యపుండు వారల నొడంబఱిచి నీయింద్రత్వంబేకాధిష్ఠితంబు సేసె; నట్టి కశ్యపప్రజాపతి యజ్ఞమహిమను, వాలఖిల్యులతపోమహిమను వినతకుం బుట్టి విహగేంద్రుం డయిన యా గరుడం డిప్పు డమృతహరణార్థం బరుగుదెంచుటంజేసి స్వర్గలోకంబున మహోత్పాతంబులు పుట్టె' నని సురపతికి బృహస్పతి చెప్పిన విని, యింద్రుం డమృతరక్షకుల నెల్ల రావించి, 'మీర లతిప్రయత్నంబున నమృతంబు రక్షించుకొని యుండుం' డని పంచిన 'వల్లె' యని. 88**

**ప్రతిపదార్థం:** మీ, వచనంబు= మీ(వాలఖిల్యుల) యొక్కమాట; అమోఘంబు= వ్యర్థం కానిది; కావునన్= కాబట్టి; ఇంకన్= ఇటుతర్వాత; నాకున్; ఉద్భవిల్లెడు, పుత్త్రుండు= పుట్టబోయేకొడుకు; పక్షికులంబునకున్+ఎల్లన్= పక్షులజాతి కంతటికిని; ఇంద్రుండు+అయ్యెడున్, అని= ఇంద్రుడు అవును గాక! అని; కశ్యపుండు; వారలన్= ఆ మునులను; ఒడంబఱిచి= ఒప్పించి; నీ, ఇంద్రత్వంబు= నీ ఇంద్రపదవిని; ఏక+అధిష్ఠితంబు చేసెన్= ఒక్కనిచే పొందబడిందిగా (అధిష్ఠింపబడిన దానినిగా) చేశాడు; అట్టి, కశ్యప, ప్రజాపతి, యజ్ఞమహిమను= అటువంటి కశ్యపబ్రహ్మయొక్క యజ్ఞంయొక్క మహత్త్వంచేతను; వాలఖిల్యుల తపస్+మహిమను= వాలఖిల్యులు అనే మునులయొక్క తపస్సుయొక్కగొప్పతనంచేతను; వినతకున్, పుట్టి; విహగ+ఇంద్రుండు+అయిన= పక్షులకు రాజయిన; ఆ, గరుడండు= ఆగరుత్మంతుడు; ఇప్పుడు; అమృతహరణ+అర్థంబు= అమృతాన్ని ఎత్తుకొనిపోవటంకొరకు; అరుగుదెంచుటన్, చేసి= రావటంచేత; స్వర్గలోకంబునన్, మహత్, ఉత్పాతంబులు= గొప్ప చెడుశకునాలు; పుట్టెను= ఏర్పడినవి; అని; సురపతికిన్= దేవతల రాజయిన ఇంద్రుడికి; బృహస్పతి= దేవతలగురు వయిన బృహస్పతి; చెప్పినన్= చెప్పగా; విని ఇంద్రుండు; అమృత, రక్షకులన్, ఎల్లన్= అమృతాన్ని కాపాడేవారినందరిని; రావించి= రప్పించి; (వచ్చుధాతువుకు ప్రేరణరూపం); మీరలు; అతిప్రయత్నంబునన్= మిక్కిలిప్రయత్నంతో; అమృతంబు రక్షించుకొని, ఉండుండు; అని పంచినన్= అని ఆజ్ఞాపించగా; వల్లె, అని= అట్లే అని (అంగీకరించి).

**తాత్పర్యం:** 'మీవాక్కు వ్యర్థం కాదు. కావున ఇంక నాకు పుట్టబోయేకొడుకు పక్షిజాతికి అంతకూ ఇంద్రుడు(రాజు) అవునుగాక!' అని కశ్యపుడు వాలఖిల్యులను అంగీకరింపజేసి నీఇంద్రపదవి ఒక్కడిచేతనే అధిష్ఠితం అయ్యేటట్లు (ఒక్కడే ఇంద్రుడు ఉండేటట్లు) చేశాడు. అట్టి కశ్యపబ్రహ్మ పుత్రకామేష్టి మహత్త్వంచేతను, వాలఖిల్యులతపస్సుయొక్క మాహాత్మ్యంచేతను జన్మించి పక్షులకు రాజైన ఆ గరుడడు ఇప్పుడు అమృతాన్ని కొనిపోవటంకొరకు రావటంచేత స్వర్గలోకంలో గొప్పదుశ్శకునాలు కలిగాయి' అని బృహస్పతి దేవేంద్రుడికి చెప్పగా విని, ఇంద్రుడు అమృతాన్ని రక్షించేవారిని అందరినీ రప్పించి 'మిక్కిలిప్రయత్నంతో అమృతాన్ని కాపాడుతూ ఉండం' డని పంపగా వారు అట్లే అని.

**విశేషం:** ఎడున్+అని; ఎడు, తల ద్రుతానికి అచ్చు పరమయ్యేటపుడు మకారం ఆదేశం ఔతుంది. ఎడుమని.

**క. వారలు బహుప్రకారా । కారులు, వీరులు, నిశాతఖడ్గాదిమహా**
**దారుణ శస్త్రధరులు, కృ । ష్ణారుణ సితపీతఘనతరాంగత్రాణుల్. 89**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ అమృతాన్ని కాపాడేవారు; బహుప్రకార+ఆకారులు= పెక్కురకా లయిన రూపాలు కలవారు; వీరులు; నిశాత, ఖడ్గ+ఆది, మహత్, దారుణ, శస్త్ర, ధరులు= వాడి అయిన కత్తి మొదలయిన గొప్పభయంకరాలైన ఆయుధాలను ధరించినవారు; కృష్ణ+అరుణ, సిత, పీత, ఘనతర+అంగత్రాణుల్= నల్లని, ఎఱ్ఱని, తెల్లని, పచ్చని గొప్పవయిన కవచాలు కలవారు.

**తాత్పర్యం:** పెక్కురకా లయిన రూపాలు గల్గినవారు, వీరులు, వాడి అయిన కత్తి మొదలయిన భయంకరా లయిన ఆయుధాలు ధరించినవారు, నల్లని, ఎఱ్ఱని, తెల్లని, పచ్చని గొప్ప వయిన కవచాలు కలవారు అయిన ఆ అమృతరక్షకులు. (తరువాతి పద్యంలోని 'సమకట్టి' అనే దానితో అన్వయం.)

**క. సమకట్టి యొక్కమొగి న । ప్రమాదు లై నిలిచి రేయుఁబవలును రక్షా**
**క్షము లై యమృతము చుట్టును । నమేయబలు లుండి రంత నతిరభసమునన్. 90**

**ప్రతిపదార్థం:** సమకట్టి= పూని; ఒక్కమొగిన్= ఒకేవిధంగా (పూనికతో); అప్రమాదులు+ఐ= ఏమరుపాటు, పరాకు, లేనివా రయి; నిలిచి= నిలబడి ఉండి; రేయున్= రాత్రియున్నూ (రేయి-రూపాంతరం రే); పవలును= పగటిపూటయున్నూ; రక్షాక్షములు+ఐ= రక్షణలో సమర్థులై; అమృతము, చుట్టునున్= అమృతంయొక్క అన్నివైపులా; అమేయబలులు= అపరిమిత మైన బలం కలవారు; ఉండిరి; అంతన్= ఆసమయంలో; అతి, రభసమునన్= మిక్కిలి వేగంతో.

**తాత్పర్యం:** అమృతాన్ని రక్షించటానికి నిశ్చయించి దృఢమైన పూనికతో ఏమరుపాటు లేనివా రై నిలబడి రాత్రింబగళ్ళూ రక్షించటంలో సమర్థు లై ఊహింపరాని బలం కలవారు, అమృతంచుట్టూ కావలి ఉన్నారు. అంత మిక్కిలివేగంతో. (రాబోయేపద్యంతో అన్వయం.)

**మ. వితతోల్కాశనిపుంజమొక్కొ యనఁగా విన్వీథివిక్షిప్తప**
**క్షతివాతాహతిఁ దూలి తూలశకలాకారంబు లై వారిద**
**ప్రతతుల్ సాల్పడి నల్గడం జెదరఁగాఁ బాఱెన్ మనోవేగుఁ డై**
**పతగేంద్రుం డమృతాంతికంబునకుఁ దత్పాలుర్ భయం బందఁగన్. 91**

**ప్రతిపదార్థం:** వితత+ఉల్క+అశని, పుంజము+ఒక్కొ= విరివిగా గల మండే నిప్పుకణాలయొక్కయు, పిడుగులయొక్కయు సమూహమా; అనఁగాన్= అనునట్లుగా; విన్, వీథి= ఆకాశమార్గంలో, విక్షిప్త, పక్షతి, వాత+ఆహతిన్= విదల్చబడిన రెక్కలయొక్క గాలియొక్క దెబ్బలచేత; తూలి= అటు నిటు కదలి; వారిదప్రతతుల్= మబ్బులయొక్క సముదాయాలు; తూల, శకల+ఆకారంబులు+ఐ= దూదిపింజలయొక్క రూపాలు గల వై; చాల్పడి= వరుసగట్టి; నల్, కడన్= నాల్గువైపులా, చెదరఁ గాన్= చెదరిపోగా; మనస్+వేగుఁడు+ఐ= మనస్సుయొక్క వేగంవంటి వేగం కలవా డయి; పతగ+ఇంద్రుండు= పక్షులకు ఇంద్రు డయిన గరుత్మంతుడు; అమృత+అంతికంబునకున్= అమృతం దగ్గరకు; తద్+పాలుర్= ఆఅమృతరక్షకులు; (పాలురు అనే ప్రథమావిభక్తి అంతంలో బహువచనానికి ఉకారం లోపించింది); భయంబు+అందఁగన్= భయపడగా; పాఱెన్= పరుగెత్తాడు.

**తాత్పర్యం:** విరివి అయిన నిప్పుకణాలతో కూడిన పిడుగులసమూహమా అనేటట్లుగా ఆకాశమార్గంలో విదల్చబడిన రెక్కలనుండి పుట్టినగాలిదెబ్బచే అటునిటు కదలి, మబ్బులసముదాయాలు దూదిపింజల ఆకృతికల వై వరుసగట్టి నాలుగుదిక్కులకు చెదరిపోగా, అమృతాన్ని రక్షించేవారు భయపడేటట్లుగా, మనస్సుయొక్క వేగంవంటి వేగంకలవాడయి, గరుడుడు అమృతందగ్గరకు ఎగిరి వెళ్ళాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. అంత. 92**

**ప్రతిపదార్థం:** అంతన్= పిదప.

**తాత్పర్యం:** పిమ్మట (తరువాతి పద్యంతో అన్వయం.)

### గరుడఁ డమృతరక్షకులతో యుద్ధము సేయుట (సం. 1-28-1)

**క. కల్పాంతానలకీలా । కల్పాయతపక్షుఁ, బక్షిగణవిభు, శౌర్యా**
**కల్పుఁ గని, యమృతరక్షు ల । నల్పక్రోధు లయి తాఁకి రార్చి కడంకన్. 93**

**ప్రతిపదార్థం:** కల్ప+అంత+అనల, కీలా, కల్ప+ఆయత, పక్షున్= ప్రళయకాలంలోని అగ్నియొక్క జ్వాలలతో సమాన మయిన విశాల మైనరెక్కలు కలవాడిని; పక్షి, గణ, విభున్= పక్షులసమూహాలకు రాజయినవాడిని; శౌర్య+ఆకల్పున్= పరాక్రమం అలంకారంగా కలిగినవాడిని గరుత్మంతుడిని; కని= చూచి; అమృత, రక్షులు= అమృతాన్ని కాపాడేవారు; అనల్ప, క్రోధులు+అయి= అధిక మైన కోపంకలవా రయి; ఆర్చి= గర్జించి; కడంకన్= సాహసంతో; తాఁకిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** ప్రళయకాలంలోని అగ్నిజ్వాలలతో సమానమైన విశాలమైన రెక్కలు కలిగినవాడున్నూ, పక్షిగణాలకు రాజున్నూ, శౌర్య మలంకారంగా కలవాడున్నూ అయిన గరుత్మంతుడిని చూచి, అమృతాన్ని కాపాడేవారు అధికమైనకోపంతో అరచి పూనికతో ఎదుర్కొన్నారు.

**క. తడఁబడ నేసియు వైచియుఁ । బొడిచియు వివిధాస్త్రశస్త్రముల నుద్ధతు లై**
**కడుకొని యుద్ధము సేసిరి । కడిమిమెయిన్ విబుధవరులు గరుఁడనితోడన్. 94**

**ప్రతిపదార్థం:** తడఁబడన్= తొట్రుపాటుపడేటట్లు; ఏసియున్= బాణాలు ప్రయోగించియూ; వివిధ+అస్త్ర, శస్త్రములన్= పలురకా లయిన అస్త్రాలతో (మంత్రం ఉచ్చరించి ప్రయోగించబడే ఆయుధాలతో), శస్త్రాలతో (లోహాదినిర్మితాలయిన ఆయుధాలతో); వైచియున్= క్రమంగా పడేసియు; పొడిచియున్= క్రుమ్మియు; ఉద్ధతులు+ఐ= గర్వించినవా రై; కడుకొని= ఉత్సాహం పొంది; కడిమిమెయిన్= పరాక్రమంతో; గరుడనితోడన్= గరుత్మంతుడితో, విబుధవరులు= దేవతాశ్రేష్ఠులు; యుద్ధము; చేసిరి.

**తాత్పర్యం:** తొట్రుపడేటట్లుగా బాణాలు ప్రయోగించి, పలురకా లయిన శస్త్రాస్త్రాలతో పడేసియు, క్రుమ్మియు, గర్వించిన వారయి, ఉత్సాహం పొంది పరాక్రమంతో దేవతాశ్రేష్ఠులు గరుత్మంతుడితో యుద్ధం చేశారు.

**వ. గరుడండును నిజపక్ష విక్షిప్తరజోవృష్టి నమరవరుల దృష్టిపథంబుఁ గప్పి స్వర్గలోకంబు నిరాలోకంబుగాఁ జేసిన, నమరేంద్రుపనుపునం బవనుం డా రజోవృష్టి చెదర వీచె నంత. 95**

**ప్రతిపదార్థం:** గరుడండును= గరుత్మంతుడును; నిజ, పక్ష, విక్షిప్త, రజస్+వృష్టిన్= తనరెక్కలచేత విదల్చబడిన దుమ్ముయొక్క వర్షంతో; అమరవరుల= దేవతాశ్రేష్ఠులయొక్క; దృష్టిపథంబున్= చూపుమార్గాన్ని; కప్పి; స్వర్గలోకంబు= దేవతలలోకమైన స్వర్గలోకాన్ని; నిరాలోకంబు, కాన్= వెలుగు లేనిది అయ్యేటట్లుగా; చేసినన్= చేయగా; అమర+ఇంద్రు, పనుపునన్=

దేవతలరాజయిన ఇంద్రుడి ఆజ్ఞచేత; పవనుండు= గాలి; ఆ, రజః+వృష్టి= ఆదుమ్ముయొక్కవర్షం, చెదరన్= చెదరేటట్లుగా; వీచెన్= విసిరాడు; అంతన్= అప్పుడు

**తాత్పర్యం:** గరుడడు తనరెక్కలచేత చిమ్మబడిన ధూళివర్షంచేత దేవతాశ్రేష్ఠుల దృష్టిమార్గాన్ని కప్పి స్వర్గలోకాన్ని వెలుతురులేనిదానినిగా చేయగా, ఇంద్రుడిఆజ్ఞచేత వాయువు ఆ దుమ్మువాన చెదరిపోయేటట్లుగా విసరాడు.

**మాలిని.**

**పరశు కులిశ కుంత ప్రాస బాణాసనోద్య**
**త్పరిఘ కణప చక్ర ప్రస్ఫుర ద్బాహు సేనా**
**పరివృతుఁ డయి తాఁకెన్ భౌమనుం డన్మహాకిం**
**కరుఁడు సమరకేళీగర్వితున్ వైనతేయున్. 96**

**ప్రతిపదార్థం:** పరశు, కులిశ, కుంత, ప్రాస, బాణాసన, ఉద్యత్, పరిఘ, కణప, చక్ర, ప్రస్ఫురత్, బాహు, సేనా, పరివృతుఁడు+అయి= గొడ్డలి, వజ్రాయుధం, బల్లెములు, ఈటెలు, విండ్లు, పైకెత్తబడిన గుదియలు, కణపాలు (ఒకరకంఆయుధాలు), చక్రాలు మొదలయిన వాటితో ప్రకాశిస్తున్న భుజాలు కలిగిన సైన్యంతో చుట్టబడినవాడయి; భౌమనుండు+అన్= భౌమనుడు అనే పేరు కల (అనులోని ఉత్వం లోపించింది); మహత్, కింకరుఁడు= గొప్పసేవకుడు; సమర, కేళీగర్వితున్= యుద్ధ మనే క్రీడలో మదించిన; వైనతేయున్= వినతకొడు కయిన గరుత్మంతుడిని; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** గొడ్డలి, వజ్రం, బల్లెం, ఈటె, విల్లు, ఎత్తబడినబాణం, కణపం, చక్రం అనేవాటితో ప్రకాశిస్తున్నచేతులు కలిగిన సైన్యంతో చుట్టబడిన వాడయి భౌమనుడనే గొప్ప సేవకుడు యుద్ధ మనే క్రీడలో మదించిన గరుత్మంతుడిని ఎదుర్కొన్నాడు.

**క. బలవత్ఖగేంద్రకోపా । నలభస్మీభూతుఁ డై క్షణంబున వాఁడున్**
**బలమఱి క్రాఁగె నుదగ్ర । జ్వలన జ్వాలావలీఢశలభమపోలెన్. 97**

**ప్రతిపదార్థం:** బలవత్, ఖగ+ఇంద్ర, కోప+అనల, భస్మీభూతుఁడు+ఐ= బలవంతు డయిన, పక్షిరా జయిన గరుత్మంతుడియొక్క కోప మనే అగ్నిచేత బూడిద అయినవాడయి; క్షణంబునన్= క్షణకాలంలో; వాఁడున్= ఆభౌమనుడుకూడ; బలము+అఱి= బలం నశించి; ఉదగ్ర, జ్వలన, జ్వాలా+అవలీఢ, శలభము+అ, పోలెన్= పైకిలేస్తున్న అగ్నియొక్క మంటలచే కాల్చబడిన మిడుతయే అన్నట్లుగా క్రాఁగెన్= మాడిపోయాడు.

**తాత్పర్యం:** బలవంతు డయిన గరుత్మంతుడియొక్క కోప మనే అగ్నిచేత బూడి దయిన వా డయి, క్షణకాలంలో ఆభౌమను డనేవాడు బలం నశించి పైకి లేచే అగ్నిమంటలచేత కాల్బబడిన మిడతయే అన్నట్లుగా దగ్ధుడైనాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ. పక్షతుండాగ్ర నఖక్షతదేహు లై । బోరన నవరక్తధార లొలుక**
**విహగేంద్రునకు నోడి నిహతు లై సురవరుల్ । సురరాజు మఱువు సొచ్చిరి కలంగి;**

**సాధ్యు లనాయాససాధ్యులై పాఱిరి । పూర్వాభిముఖు లయి గర్వ ముడిఁగి;**
**వసువులు రుద్రులు వసుహీనవిప్రుల । క్రియ దక్షిణాశ్రితు లయిరి భీతి**

**ఆ. వంది; యపరదిక్కుఁ బొంది రాదిత్యు; లా । శ్వినులు నుత్తరమున కొనరఁ బఱచి;**
**రనల వరుణ పవన ధనద యమాసురుల్ । వీఁక దఱిఁగి కాందిశీకు లయిరి. 98**

**ప్రతిపదార్థం:** పక్ష, తుండ+అగ్ర, నఖ, క్షత, దేహులు+అయి= రెక్కలు ముక్కుయొక్కకొనభాగం, గోళ్ళు అనేవాటిచే గాయపరచబడిన శరీరాలు కలవా రయి; బోరన= శీఘ్రంగా; నవ, రక్త, ధారలు= క్రొత్తనెత్తురుల ధారలు; ఒలుకన్= కారగా; విహగ+ఇంద్రునకున్, ఓడి= గరుత్మంతునికి ఓడిపోయి; నిహతులు+ఐ= హింసింపబడినవారై; కలంగి= కలతపొంది; సురవరుల్= దేవతాశ్రేష్ఠులు; సురరాజు, మఱువు= దేవతలకు రాజయిన ఇంద్రుడి ఆశ్రయాన్ని; చొచ్చిరి= చేరారు; సాధ్యులు= సాధ్యులనే దేవతలలోని ఒకతెగవారు; అనాయాససాధ్యులు+ఐ= శ్రమలేకయే జయింపబడినవా రయి; గర్వము+ ఉడిఁగి= గర్వం నశించి; పూర్వ+అభిముఖులు+ఐ= తూర్పుముఖంగా పోయేవా రయి; పాఱిరి= పరుగెత్తారు; వసువులు= ఎనమండుగురు వసువులు; రుద్రులు= పదొకండుమంది రుద్రులు; భీతిన్+ అంది= భయపడి; వసుహీన, విప్రులక్రియన్= సంపద లేని బ్రాహ్మణులవలె; దక్షిణ+ఆశ్రితులు+అయిరి= దక్షిణదిక్కును ఆశ్రయించినవారైనారు. బ్రాహ్మణపక్షంలో - దక్షిణా+ ఆశ్రితులు+ అయిరి= సంభావనను ఆశ్రయించినవారైనారు; ఆదిత్యులు= పంద్రెండుగురు సూర్యులును; భీతిన్+అంది= భయపడి; అపర, దిక్కున్= పడమటిదిక్కును; పొందిరి= చేరారు. (సూర్యాస్తమయం పడమటిదిక్కున జరుగుతుంది); ఆశ్వినులు= అశ్వినీదేవతలు; ఉత్తరమునకున్= ఉత్తరదిక్కుకు; ఒనరన్= ఒప్పునట్లుగా; పఱచిరి= పారిపోయారు; అనల, వరుణ, పవన, ధనద, యమ+అసురుల్= అగ్ని, వరుణుడు, వాయువు, కుబేరుడు, యముడు, రాక్షసు డయిన నైరృతి అనే దిక్పాలురు; వీఁక, తఱిఁగి= పరాక్రమం తగ్గి, కాందిశీకులు+అయిరి= దిక్కు తెలియక పరుగెత్తినవా రైనారు.

**తాత్పర్యం:** గరుడుడి రెక్కలచే, ముక్కుకొనచే, గోళ్ళచే దెబ్బతిన్నశరీరం గలవా రయి బోరు మని నెత్తుటిధారలు కారుతుండగా గరుత్మంతుడిచేత జయింపబడి, హింసింపబడి దేవతాశ్రేష్ఠులు ఇంద్రుడిచాటుకు చేరారు; సాధ్యులనే దేవతాగణం శ్రమలేకుండా జయింపబడినవా రై గర్వం విడిచి తూర్పుదిక్కుకు పారిపోయారు; వసువులు, రుద్రులు సంపద లేని బ్రాహ్మణులవలె దక్షిణదిక్కును ఆశ్రయించారు (సంభావనను ఆశ్రయించారు); పంద్రెండుగురు సూర్యులు కలత చెంది పడమటిదిక్కును పొందారు; అశ్వినీదేవతలు ఉత్తరదిక్కుకు పోయారు; అగ్ని, వరుణుడు, వాయువు, కుబేరుడు, యముడు, అసురు డయిన నైరృతి అనే దిక్పాలురు దిక్కు తెలియక పారిపోయారు.

**విశేషం:** అలం: ఉపమ, శ్లేష

**క. తలరఁగ రేణుక్రథన । ప్రలిహప్రరుజాశ్వకృంతపదనఖులను ర**
**క్షులఁ గులిశనిశాతనఖా । వలిఁ బక్షీంద్రుండు వ్రచ్చివందఱలాడెన్. 99**

**ప్రతిపదార్థం:** పక్షి+ఇంద్రుండు= పక్షులకు రా జయిన గరుత్మంతుడు; రేణు, క్రథన, ప్రలిహ, ప్రరుజ+అశ్వకృంత, పదనఖులు+అనురక్షులన్= రేణువు, క్రథనుడు, ప్రలిహుడు, ప్రరుజుడు, అశ్వకృంతుడు, పదనఖుడు అనే కావలివాళ్ళను; తలరఁగన్= సంభ్రమించేటట్లుగా, కులిశ, నిశాత, నఖ+ఆవలిన్= వజ్రాయుధంవలె వాడి అయినగోళ్ళవరుసతో; వ్రచ్చి= చీల్చి; వందఱలు+ఆడెన్= ముక్కలు చేశాడు.

**తాత్పర్యం:** రేణువు, క్రథనుడు, ప్రలిహుడు, ప్రరుజుడు, అశ్వక్రంతుడు, పదనఖుడు అనే కావలివాళ్ళను సంభ్రమించేటట్లుగా గరుడడు వజ్రంవంటి వాడి అయిన గోళ్ళవరుసతో చీల్చి ముక్కలు చేశాడు.

**వ. ఇట్లు నిర్జరవరుల నెల్ల నిర్జించి, యూర్జితుం డై గరుడం డమృతస్థానంబున కరిగి, దానిం బరివేష్టించి ఘోరసమీరప్రేరితం బై దుర్వారశిఖాజిహ్వల నంబరంబు నాస్వాదించుచున్న యనలంబుం గని, తత్క్షణంబ సకలనదీజలంబుల నెల్లఁ బుక్కిలించుకొని వచ్చి యయ్యనలంబు నాఱంజల్లి, తీక్ష్ణధారం బై దేవనిర్మితం బై పరిభ్రమించుచున్న యంత్రచక్రంబు నారాంతరంబున సంక్షిప్తదేహుం డై చొచ్చి యచ్చక్రంబుక్రింద. 100**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; నిర్జర, వరులన్, ఎల్లన్= దేవతలనందరిని; నిర్జించి= జయించి; ఊర్జితుండు+ఐ= బలవంతుడై; గరుడండు; అమృతస్థానంబునకున్= అమృతంఉండే ప్రదేశానికి; అరిగి= వెళ్ళి; దానిన్= ఆ అమృతాన్ని; పరివేష్టించి= చుట్టుకొని; ఘోర, సమీర, ప్రేరితంబు+ఐ= భయంకర మైన వాయువుచే రగుల్కొల్పబడిన దై; దుర్వార, శిఖా, జిహ్వలన్= వారింప శక్యం గాని అగ్నిజ్వాల లనే నాలుకలతో; అంబరంబున్= ఆకాశాన్ని; ఆస్వాదించుచున్+ఉన్న= నాకుతున్న (తాకుతున్న); అనలంబున్, కని= అగ్నిని చూచి; తద్, క్షణంబు+ అ= ఆ క్షణమందే; సకల, నదీజలంబులన్+ఎల్లన్= అన్ని నదులయొక్క నీటినంతటిని; పుక్కిలించుకొని= నోటిలో ఉంచుకొని (గండూషించి); వచ్చి; ఆ+అనలంబున్= ఆ అగ్నిని; ఆఱన్, చల్లి= ఆరిపోయేటట్లుగా చల్లి; తీక్ష్ణ, ధారంబు+ఐ= పదు నైన అంచు గలదై; దేవనిర్మితంబు+ఐ దేవతలచేత తయారుచేయబడిన దై; పరిభ్రమించుచున్+ఉన్న= తిరుగుతున్న, యంత్రచక్రంబు, ఆర+అంతరంబునన్= యంత్రంలోని చక్రంయొక్క ఆకులలోపలిభాగాన; సంక్షిప్తదేహుండు+ఐ= చిన్నదిగా చేయబడినశరీరం కలవాడై; చొచ్చి= ప్రవేశించి; ఆ, చక్రంబు, క్రిందన్= ఆచక్రంయొక్క క్రిందిభాగంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా దేవతాశ్రేష్ఠులను అందరినీ ఓడించి బలవంతుడై గరుడడు అమృతం ఉండే ప్రదేశానికి వెళ్ళి భయంకరమైనగాలిచేత రగుల్కొల్పబడి వారింపశక్యం గాని జ్వాల లనే నాలుకలచేత ఆకాశాన్ని కబళిస్తున్న అగ్నిని చూచి ఆ క్షణమందే అన్నినదులలోని నీటినంతటిని నోటిలో ఉంచుకొని వచ్చి ఆ అగ్ని ఆరిపోయేటట్లుగా చల్లి, వాడి అయిన అంచుకలదై, దేవతలచే నిర్మింపబడి తిరుగుతున్న యంత్రరూప మైన చక్రంయొక్క ఆకులనడుమ సంకోచింపబడిన (చిన్నదిగా చేయబడిన) దేహం కలవా డై ఆచక్రంక్రింద.

**విశేషం:** అలం: రూపకం.

**ఉ. ఘోరవికార సన్నిహిత కోపముఖంబులు, దీప్తవిద్యుదు**
**ల్కారుణ దారుణాక్షములు నై, నిజదృష్టి విషాగ్ని నన్యులం**
**జేరఁగనీక యేర్చుచుఁ బ్రసిద్ధముగా నమృతంబు చుట్టు ర**
**క్షారతి నున్న యుగ్రభుజగంబుల రెంటిని గాంచి చెచ్చెరన్. 101**

**ప్రతిపదార్థం:** ఘోర, వికార, సన్నిహిత, కోప, ముఖంబులు= భయంకరా లయి వికారంతో కూడిన కోపం కల నోళ్ళు కలవియున్నూ; దీప్త, విద్యుత్+ ఉల్క+ అరుణ, దారుణ+అక్షములు+ఐ= వెలుగుతున్న మెఱుపులవలె నిప్పులవలె ఎఱ్ఱ నైన, భయంకరా లయిన కన్నులు గలవియై; నిజ దృష్టి, విష+అగ్నిన్= తమచూపులనుండి ప్రసరించే విష మనే అగ్నితో; అన్యులన్= ఇతరులను; చేరఁగన్, ఈక= దగ్గరకు రానీకుండ; ఏర్చుచున్= దహిస్తూ; ప్రసిద్ధముగాన్= ప్రకటమయ్యేటట్లు; అమృతంబు,

చుట్టన్; రక్షా, రతిన్= రక్షించడంలోని ఆసక్తితో; ఉన్న; ఉగ్ర, భుజగంబులన్, రెంటిని= భయంకరమయిన పాములను రెంటిని; కాంచి= చూచి; చెచ్చెరన్= వెంటనే.

**తాత్పర్యం:** భయంకరాలయి, వికారంతో కూడిన కోపమున్న ముఖాలు కలవియున్నూ; వెలుగుతున్న మెరుపులవలె, నిప్పుకణాలవలె, ఎర్ర నైన, భయంకరా లయిన కన్నులు కలవియున్నూ అయి తమ కన్నులలోని విష మనే అగ్నితో ఇతరులను దగ్గరకు రానీకుండ దహిస్తూ అమృతానికి చుట్టూ కాపాడటంలోని ఆసక్తితో ఉన్న భయంకరా లయిన పాములను రెంటిని చూచి, వెంటనే.

**విశేషం:** అలం: రూపకం. ఈపద్యరచనలోని రేఫాక్షరబాహుళ్యం, పరుషాక్షరవిన్యాసం సర్పాల భయంకరాకారాలను అక్షరరమ్యంగా ధ్వనింపజేస్తున్నవి.

**వ. అయ్యురగంబులం దనపక్షరజోవృష్టినంధంబులంజేసి, వాని శిరంబులు ద్రొక్కి పరాక్రమం బెసంగనమృతంబు కొని గరుడండు గగనంబున కెగసిన. 102**

**ప్రతిపదార్థం:** ఆ+ఉరగంబులన్= ఆపాములను; తన, పక్ష, రజస్+వృష్టి= తనరెక్కలవలన ఏర్పడిన దుమ్ముయొక్క వర్షంతో; అంధంబులన్+చేసి= గ్రుడ్డివాటినిగా చేసి; వాని, శిరంబులు, త్రొక్కి= వాటితలలు త్రొక్కి; పరాక్రమంబు+ఎసంగన్= పరాక్రమం ఎక్కువ కాగా; అమృతంబు, కొని= అమృతం తీసికొని; గరుడండు; గగనంబునకున్= ఆకాశానికి; ఎగసినన్= ఎగిరిపోగా.

**తాత్పర్యం:** ఆపాములను తనరెక్కలచేత ఎగురగొట్టబడిన దుమ్మువర్షంచేత గ్రుడ్డివాటినిగా చేసి, వాటి తలలు తన్ని, శౌర్యమొప్పేటట్లు అమృతాన్ని గ్రహించి గరుడుడు ఆకాశానికి ఎగిరిపోగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. కలహమున నిట్లు సురవీ। రులఁ బల్వుర నోర్చి, యొక్కరుఁడ యమృతముఁ దె**
**క్కలికొని, యాస్వాదింపక। యలోలుఁ డగు వానిఁ జూచి హరి యి ట్లనియెన్. 103**

**ప్రతిపదార్థం:** కలహమునన్= యుద్ధంలో; ఇట్లు= ఈవిధంగా; సురవీరులన్= వీరు లైన దేవతలను, పల్వురన్= చాలామందిని; ఓర్చి= ఓడించి; ఒక్కరుఁడు+అ= ఒక్కడే; అమృతమున్= అమృతాన్ని; తెక్కలికొని= అపహరించి; ఆస్వాదింపక= రుచిచూడక; అలోలుఁడు+అగువానిన్= ఆసక్తిలేకుండ ఉన్న ఆగరుత్మంతుడిని, చూచి; హరి= విష్ణువు; ఇట్లు+ అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈవిధంగా యుద్ధంలో దేవతావీరులను పెక్కుమందిని జయించి ఒక్కడే అమృతాన్ని దొంగిలించి రుచి చూడకుండ అనాసక్తుడుగా ఉండే గరుత్మంతుడిని చూచి విష్ణువు ఇట్లా అన్నాడు.

**క. నీ విజయోత్సాహమునకు, । లావునకు, జవంబునకు, నలౌల్యమునకు, స**
**ద్భావమునకు మెచ్చి, వరం । బీ వచ్చితి, వేఁడు మెద్ది యిష్టము నీకున్. 104**

**ప్రతిపదార్థం:** నీ, విజయ+ఉత్సాహమునకున్= నీవిజయంలోని ప్రయత్నానికి; లావునకున్= బలానికి; జవంబునకున్= వేగానికి; అలౌల్యమునకున్= అనాసక్తికి; సత్, భావమునకున్= మంచితనానికి; మెచ్చి= సంతోషించి; వరంబు+ఈన్, వచ్చితిన్= వరం ఇవ్వటానికి వచ్చాను; నీకున్, ఇష్టము, ఎద్ది= నీకు ఏది ప్రియమో; వేఁడుము= కోరుకొమ్ము.

**తాత్పర్యం:** నీ విజయంలోని పూనికకు (ప్రయత్నానికి) బలానికి, వేగానికి, అనాసక్తికి, మంచితనానికి, సంతోషించి నీకు వర మివ్వటానికి వచ్చాను. నీ కేది ఇష్టమో కోరుకొమ్ము.

**శ్రీమన్నారాయణుఁడు గరుడునకుఁ బ్రసన్నుఁ డగుట; ఇంద్రుండు గరుడునితో స్నేహించుట (సం. 1-29-12)**

**వ. అని ప్రసన్నుం డై యానతిచ్చిన యాదిదేవుం డగు శ్రీమన్నారాయణునకు నమస్కరించి గరుడం డి ట్లనియె. 105**

**ప్రతిపదార్థం:** అని; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహించినవాడయి; ఆనతి+ ఇచ్చిన= సెల విచ్చినటువంటి; ఆది, దేవుండు+ అగు= మొదటివే ల్పయిన; శ్రీమత్+నారాయణునకున్= శోభాయుక్తు డయిన నారాయణుడికి; నమస్కరించి= మ్రొక్కి; గరుడండు= గరుత్మంతుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని, దయకలవా డై ఆజ్ఞ ఇచ్చిన దేవాదిదేవు డయిన శ్రీమహావిష్ణువుకు మ్రొక్కి గరుడడు ఇట్లా పలికాడు.

**విశేషం:** శ్రీమత్+నారాయణునకున్= శ్రీమన్నారాయణునకు- అనునాసిక సంధి; ఆనతి+ఇచ్చిన= ఇకారసంధి; ఆనతిచ్చిన.

**సీ. 'అమృతాశనంబు చేయకయును దేవ! నా । కజరామరత్వంబు నందుటయును,**
**అఖిలలోకంబుల కగ్రణి వైన నీ । యగ్రంబునందు ని న్నధికభక్తిఁ**
**గొలుచుచు నునికియుఁ గోరితిఁ, గరుణతో । దయసేయు ముద్ధతదైత్యభేది!'**
**యనవుడు వానికి నభిమతంబులు ప్రీతుఁ । డై యిచ్చి హరి యిట్టు లనియె: 'నాకు**

**ఆ. ననఘ! వాహనంబ వై మహాధ్వజమ వై । యుండు' మనినఁ బక్షియును ప్రసాద**
**మనుచు మ్రొక్కిపఱచె; నంత నాతనిమీఁద । వజ్ర మెత్తి వైచె వాసవుండు. 106**

**ప్రతిపదార్థం:** దేవ= ఓదేవుడా! ఉద్ధత, దైత్య, భేది= గర్వించిన రాక్షసులను సంహరించేవాడా! అమృత+అశనంబు= అమృతం తినటం; చేయకయును= చేయకుండానే; నాకున్, అజర+అమరత్వంబున్= ముసలితనం, చావు అనేవి లేకుండటాన్ని; అందుటయును= పొందటాన్ని; అఖిల, లోకంబులకున్= అన్నిలోకాలకు; అగ్రణివి+ఐన= ప్రధానుడ వయిన; నీ, అగ్రంబునందున్= నీయెదుట; నిన్నున్; అధిక, భక్తిన్= మిక్కిలిభక్తితో; కొలుచుచున్, ఉనికియున్= సేవిస్తూ ఉండటము; కోరితిన్= వేడుకొన్నాను; కరుణతోన్= దయతో; దయచేయుము= అనుగ్రహించుము (ఇమ్ము); అనవుడున్= అనగా; వానికిన్= ఆగరుత్మంతుడికి; అభిమతంబులు= కోరికలను; ప్రీతుఁడు+ఐ= సంతోషించినవా డయి; ఇచ్చి; హరి= విష్ణువు; ఇట్టులు+అనియెన్= ఇట్లా చెప్పాడు; అనఘ= పాపం లేని వాడా!; నాకున్= విష్ణువు నయిన నాకు; వాహనంబవు+ఐ= మోసేవాహనాని వై; ధ్వజమవు+ఐ= గొప్ప జెండా వై; ఉండుము; అనినన్= అని చెప్పగా; పక్షియును= పక్షి అయిన గరుత్మంతుడును; ప్రసాదము+అనుచున్= అనుగ్రహమంటూ; మ్రొక్కి= నమస్కరించి; పఱచెన్= ఎగిరాడు; అంతన్= అంతట; అతనిమీఁదన్= ఆగరుత్మంతుడిమీద; వాసవుండు= ఇంద్రుడు; వజ్రము= వజ్రాయుధాన్ని; ఎత్తివైచెన్= పైకెత్తి విసిరాడు.

**తాత్పర్యం:** గర్వితు లైన రాక్షసులను సంహరించేవాడా! దేవా! అమృతం తినకుండానే ముసలితనం, చావు రాకుండటాన్నీ, అన్ని లోకాలకు అధికుడ వయిన నీయెదుట మిక్కిలి భక్తితో నిన్ను సేవిస్తుండటాన్నీ కోరినాను.

దయతో ఇమ్ము. అని గరుత్మంతుడు కోరగా సంతోషించినవా డయి అతనికి కోరికలను ఇచ్చి విష్ణువు 'నీవు నాకు వాహనంగా, గొప్పజెండాగా ఉండుము' అని చెప్పగా పక్షి అయిన గరుత్మంతుడు అనుగ్రహ మంటూ నమస్కరించి యెగిరిపోయాడు. అప్పుడు ఇంద్రుడు అతనిపై వజ్రాయుధాన్ని విసరివేశాడు.

**వ. అదియును నంబరంబున నగ్నికణంబులు చెదరం బఱతెంచి పక్షిరాజుపక్షంబులు దాఁక వచ్చినం జూచి గరుడండు నగి, 'నీచేయువేదన నన్నుం దాఁక నోపదు; నీవు మహాముని సంభవంబ వగుటను, దేవేంద్రునాయుధంబ వగుటను నిన్ను నవమానింపంగాదు, గావున మదీ యైకపర్ణశకలచ్ఛేదంబు సేయుము; నాయందు నీశక్తి యింతియ' యనిన సకలభూతసంఘం బెల్ల నాతనిపర్ణంబులసుస్థిరత్వంబునకు మెచ్చి సుపర్ణుం డని పొగడిరి. సురేంద్రుండును నవ్విహగేంద్రుమాహాత్మ్యంబునకు మెచ్చి యచ్చెరు వంది యి ట్లనియె 107**

**ప్రతిపదార్థం:** అదియును= ఆవజ్రాయుధమును; అంబరంబునన్= ఆకాశంలో; అగ్నికణంబులు= నిప్పుకణాలు; చెదరన్= ఎగిరిపడేట్లుగా; పఱతెంచి= వచ్చి; పక్షిరాజు, పక్షంబులు= పక్షులకు రా జయిన గరుత్మంతుడి రెక్కలను; తాఁక, వచ్చినన్= తాకటానికి రాగా; చూచి; గరుడుండు= గరుత్మంతుడు; నగి= నవ్వి; నీ, చేయు, వేదన= నీవు చేసే బాధ; నన్నున్= నన్ను (గరుత్మంతుడిని); తాఁకన్, ఓపదు= తాకజాలదు; నీవు; మహత్, ముని, సంభవంబవు+అగుటను= గొప్పమునినుండి పుట్టినదాని వవటంచేతను (వజ్రాయుధం దధీచి వెన్నెముకతో నిర్మింపబడిం దని పురాణవచనం); దేవేంద్రు+ ఆయుధంబవు+ అగుటను= దేవేంద్రుడియొక్క ఆయుధ మవటంచేతను; నిన్నున్; అవమానింపన్, కాదు= అవమానించరాదు; కావునన్= అందుచేత; మదీయ+ఏక, పర్ణ, శకల, ఛేదంబు= నాదయిన ఒక ఈకయొక్క ముక్కను తుంచటాన్ని; చేయుము; నాయందున్= నామీద; నీ, శక్తి= నీయొక్క (వజ్రాయుధంయొక్క) ప్రభావం; ఇంతి+అ= ఇంతమాత్రమే; అనినన్= అని పలుకగా; సకల, భూత, సంఘంబు+ఎల్లన్= అన్ని ప్రాణులయొక్క సమూహమంతా; అతని, పర్ణంబుల= ఆ గరుత్మంతుని రెక్కలయొక్క; సుస్థిరత్వంబునకున్= గట్టితనానికి; మెచ్చి= పొగడి; సుపర్ణుండు+అని= సుపర్ణుడు అనేపేరుతో; పొగడిరి= మెచ్చుకొన్నారు; (సుపర్ణుడంటే మంచిబల మైన రెక్కలు కలవాడని వ్యుత్పత్తి); సుర+ఇంద్రుండును= దేవతలకు రాజయిన ఇంద్రుడు కూడా; ఆ, విహగ+ ఇంద్రు, మాహాత్మ్యంబునకున్= ఆ పక్షులకు రాజయిన గరుత్మంతుడి గొప్పతనానికి; మెచ్చి; అచ్చెరువు+అంది= ఆశ్చర్యం పొంది; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆవజ్రాయుధం ఆకాశంలో నిప్పుకణాలు ఎగురునట్లుగా వచ్చి పక్షులకు రాజయిన గరుత్మంతుడి రెక్కలను తాకటానికి రాగా చూచి గరుడుడు నవ్వి 'నీవు చేసే బాధ నన్ను తాకజాలదు. నీవు గొప్పముని అయిన దధీచి వెన్నెముకచేత చేయబడినదాన వవటంచేత నిన్ను అవమానించటం తగదు. కావున నాయొక్క ఒక యీకముక్కను త్రుంచివేయుము. నాపై నీశక్తి ఇంతమాత్రమే' అని పలుకగా సర్వభూతసమూహం అతనిరెక్కల దృఢత్వానికి మెచ్చుకొని సుపర్ణు డని స్తుతించింది. దేవేంద్రుడుసైతం ఆపక్షిరాజుగొప్పతనానికి మెచ్చి ఆశ్చర్యపడి ఇట్లా పలికాడు.

**విశేషం:** ఇక్కడ గరుత్మంతుడికి సుపర్ణు డనే పేరు ఎట్లా వచ్చిందో చెప్పబడింది.

**ఆ. నిరుపమానశౌర్య! నీతోడఁ జెలిమి సే । యంగ నా కభీష్ట మైనయదియు;**
**నిట్టి విక్రమంబు, నిట్టి సామర్థ్యంబుఁ గలదె! యొరుల కిజ్జగంబునందు. 108**

**ప్రతిపదార్థం:** నిరుపమాన, శౌర్య=సాటిలేని పరాక్రమం కలవాడా! నీతోడన్, చెలిమి= నీతో(గరుత్మంతుడితో) స్నేహం; చేయంగన్= చేయటానికి; నాకున్+అభీష్టము+ఐన, అదియు= నాకు కోరిక గలిగింది; ఇట్టి విక్రమంబున్= ఇటువంటిపరాక్రమం; ఇట్టి, సామర్థ్యంబున్= ఇటువంటిశక్తి; ఒరులకున్= ఇతరులకు; ఈ+జగంబునందున్= ఈలోకంలో; కలదే+ఎ= కలదా (లేదని భావం).

**తాత్పర్యం:** ఓసాటిలేనిపరాక్రమం కలవాడా! నీతో స్నేహం చేయా లని నాకు కోరిక కలిగింది. ఇటువంటి విక్రమం, సమర్థత ఈ లోకంలో ఇతరులకు ఉన్నదా? (లేదని భావం).

**విశేషం:** నీతోడన్+చెలిమి; సమాసాలలో చేత, తోడ, వలన అనే వాటికి ఇత్వం వస్తుంది. నీతోడి చెలిమి- అలుక్సమాసం.

**క.** **అమరుఁడ వజరుఁడ వజితుఁడ । వమేయుఁడవు; నీకు నమృత మది యేల ఖగో**
**త్తమ! దీని నొరుల కిచ్చిన । నమరులకును వా రసాధ్యు లగుదురు పోరన్. 109**

**ప్రతిపదార్థం:** అమరుఁడవు= మరణం లేనివాడివి; అజరుఁడవు= ముసలితనం లేనివాడివి; అజితుఁడవు= ఓడింపబడనివాడివి; అమేయుఁడవు= కొలది చెప్పరానివాడివి; నీకున్; అమృతము+అది+ఏల= అమృతం ఎందుకు? ఖగ+ఉత్తమ!= పక్షులలో శ్రేష్ఠుడా! దీనిన్= ఈఅమృతాన్ని; ఒరులకున్= దేవతలకంటె ఇతరులకు; ఇచ్చినన్= ఇస్తే; వారు= ఆ అమృతం త్రాగినవారు; పోరన్= యుద్ధంలో; అమరులకును= దేవతలకుకూడ; అసాధ్యులు+అగుదురు= జయింపరానివా రవుతారు.

**తాత్పర్యం:** నీవు మరణం, ముసలితనం, పరాజయం లేనివాడివి. ఇట్టివాడి వని కొలది యిడరానివాడివి. నీకు అమృతం ఎందుకు? ఓ పక్షిరాజా! ఈ అమృతాన్ని ఇతరులకు ఇస్తే వారు దేవతలకుకూడ జయింపరానివా రవుతారు.

**క.** **'నీ వొరులకు నీయమృతం । బీ వలవదు; నాకు మగుడ నిచ్చిన నీ కి**
**ష్టావాప్తి యగు విధం బేఁ । గావించెద' ననిన హరికి గరుడం డనియెన్. 110**

**ప్రతిపదార్థం:** నీవు= (గరుత్మంతుడు); ఒరులకున్= ఇతరులకు; ఈ అమృతంబు= ఈఅమృతాన్ని; ఈ, వలవదు= ఇయ్యవద్దు; (ఈన్- ఇచ్చుధాతువుయొక్క తుమున్నర్థకరూపం); నాకున్; మగుడన్, ఇచ్చినన్= తిరిగి ఇస్తే; నీకున్; ఇష్ట+అవాప్తి= ఇష్టమయినదాన్ని పొందటం; అగు, విధంబు= అయ్యేవిధానాన్ని; ఏన్= నేను; కావించెదన్= చేస్తాను; అనినన్= అని చెప్పగా; హరికిన్= ఇంద్రుడికి; గరుడండు= గరుత్మంతుడు; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'నీవు ఇతరులకు ఈఅమృతాన్ని ఇయ్యవద్దు. నాకు దాన్ని తిరిగి తెచ్చి ఇస్తే, నీకిష్టమయింది జరిగేవిధంగా నేను చేస్తా' నని ఇంద్రుడు గరుత్మంతుడితో చెప్పగా, అతడితో గరుత్మంతుడు ఇట్లా అన్నాడు.

**వ.** **'ఏను మదీయమాతృదాసీత్వనిరాసార్థం బురగుల కమృతంబుఁ దెచ్చియిత్తు నని కాద్రవేయులతో నొడివి వచ్చినవాఁడ; నీ యమృతంబు గొనిపోయి వారల కిచ్చి మదీయజననీదాస్యంబుఁ బాచికొనిన, నురగు లీ యమృతం బుపయోగింపకుండ ముందఱ నీవు గొనిచను' మనిన, నగ్గరుడని మహానుభావంబునకు మెచ్చి 'నీబలపరాక్రమంబులు వినవలతుం జెప్పు' మనిన నయ్యింద్రునకు గరుడం డి ట్లనియె. 111**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మదీయ, మాతృ, దాసీత్వ, నిరాస+అర్థంబు= తల్లియొక్క దాసితనాన్ని పోగొట్టటానికి; ఉరగులకున్= పాములకు; అమృతంబున్, తెచ్చి, ఇత్తున్, అని= తీసుకొని వచ్చి ఇస్తానని; కాద్రవేయులతోన్= కద్రువకుమారు లయిన పాములతో; నొడివి, వచ్చినవాఁడన్= చెప్పి వచ్చినవాడిని; ఈ, అమృతంబు; కొనిపోయి= తీసికొనివెళ్ళి; వారలకున్= ఆపాములకు; ఇచ్చి; మదీయ, జననీ, దాస్యంబున్= నాతల్లియొక్క దాసితనాన్ని; పాచికొనినన్= పోగొట్టుకొన్నతరువాత; ఉరగులు= పాములు; ఈ, అమృతంబున్= నేను తీసికొనివెళ్ళిన అమృతాన్ని; ఉపయోగింపకుండన్= వాడకుండ(భుజింపకుండ); ముందఱన్= ముందుగా; నీవు; కొని=తీసికొని; చనుము= వెళ్ళుము; అనినన్= అని చెప్పగా; ఆ, గరుడని, మహత్+అనుభావంబునకున్= ఆగరుత్మంతుడి మహత్త్వానికి; మెచ్చి=మెచ్చుకొని; నీ, బల, పరాక్రమంబులు= నీయొక్క బలాన్ని; పరాక్రమాన్ని; వినన్, వలతున్= వినగోరుతాను; చెప్పుము; అనినన్= అనగా; ఆ+ఇంద్రునకున్= ఆ దేవేంద్రుడికి; గరుడండు; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** 'నేను నాతల్లి అయిన వినతదాస్యం తొలగించే నిమిత్తం, మీకు అమృతం తీసికొని వచ్చి ఇస్తా నని కద్రువకుమారు లైన పాములతో చెప్పి వచ్చాను. ఈ అమృతం తీసికొనిపోయి ఆ పాముల కిచ్చి నా తల్లిదాస్యం పోగొట్టుకొన్న పిమ్మట, పాము లీ అమృతం త్రాగకముందే నీవు దాన్ని గ్రహించి వెళ్ళుము' అని గరుడడు పలుకగా అతని మహత్త్వం మెచ్చుకొని 'నీబలాన్ని, పరాక్రమాన్ని వినగోరుతాను; చెప్పు' మని అడుగగా ఆ ఇంద్రునితో గరుడుడు ఇట్లా పలికాడు.

**క. పరనిందయు, నాత్మగుణో । త్కరపరికీర్తనముఁ జేయఁగా నుచితమె స**
**త్పురుషుల? కైనను, నీ క । చ్చెరువుగ నా కలతెఱంగుఁ జెప్పెదఁ బ్రీతిన్. 112**

**ప్రతిపదార్థం:** సత్, పురుషులకున్= సజ్జనులకు; పర, నిందయున్= ఇతరులను నిందించటం; ఆత్మ, గుణ+ఉత్కర, పరికీర్తనమున్= తనయొక్క గుణాల సముదాయాన్ని పొగడుకోవటం; చేయఁగాన్, ఉచితము+ఎ= చేయటం తగునా! ఐనను= అయినప్పటికిని; నీకున్= (ఇంద్రుడికి); అచ్చెరువుగన్= ఆశ్చర్యమయ్యేటట్లుగా; నా, కల, తెఱంగున్= నాసత్య మయిన విధాన్ని; ప్రీతిన్= ఇష్టంతో; చెప్పెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** ఇతరులను నిందించటం, తమగుణాలసముదాయాన్ని మెచ్చుకోవటం చేయటం సజ్జనులకు తగునా? (తగదు). అయినా నీకు ఆశ్చర్య మయ్యేటట్లుగా నా సత్యమయినవిధాన్ని ప్రీతితో చెప్తాను.

**ఉ. స్థావరజంగమప్రవితతం బగు భూవలయంబు నెల్ల నా**
**లావునఁ బూని తాల్తు, నవిలంఘ్యపయోధిజలంబు లెల్ల ర**
**త్నావళితోన చల్లుదు బృహన్ని జపక్షసమీరణంబునన్,**
**దేవగణేశ! యీక్షణమ త్రిమ్మరి వత్తుఁ ద్రివిష్టపంబులన్. 113**

**ప్రతిపదార్థం:** దేవ, గణ+ఈశ= దేవతల సమూహానికి రాజా!; స్థావర, జంగమ, ప్రవితతంబు+అగు= అచరాలు, చరాలు అయిన వస్తువులతో నిండినట్టి; భూవలయంబున్, ఎల్లన్= భూమండలాన్నంతటిని; నాలావునన్= నాబలంతో, పూని= వహించి; తాల్తున్= మోస్తాను; బృహత్, నిజ, పక్ష, సమీరణంబునన్= పెద్ద వయిన నారెక్కలగాలితో; అవిలంఘ్య, పయోధి, జలంబులు+ఎల్లన్= దాటశక్యం కాని సముద్రంయొక్క నీళ్ళ నన్నింటిని; రత్న+ఆవళితోన్+అ= రత్నాలసమూహంతో పాటుగా; చల్లుదున్= వెదజల్లుతాను; త్రి, విష్టపంబులన్= మూడులోకాలను; ఈక్షణము+అ= ఒక్కక్షణంలోనే; త్రిమ్మరి, వత్తున్= చుట్టు తిరిగి వస్తాను.

**తాత్పర్యం:** ఓదేవగణాలకు రాజా! ఇంద్రుడా! చరాలు; అచరాలు అయిన పదార్థాలతో నిండినట్టి భూమండలాన్నంతటిని నాబలంతో వహించి మోస్తాను. పెద్ద వయిన నారెక్కలగాలితో దాట శక్యం కాని సముద్రపునీళ్ళ నన్నింటిని రత్నాలసమూహంతో పాటుగా వెదజల్లుతాను. మూడులోకాలను క్షణంలో చుట్టి వస్తాను.

**విశేషం:** గరుత్మంతుడిలో ధీరోదాత్తలక్షణాలు ప్రకటితమైనవి. ఉదారత(బంధముయొక్కఅవికటత్వం)అనే శబ్దగుణం ఉదాత్తంగా పోషింపబడింది. ఈ పద్యం పరాక్రమవర్ణనానికి గౌరవం తెచ్చింది. ఇది నన్నయగుణసంవిధానశిల్పం.

**వ. అని చెప్పిన గరుడని జవసత్త్వసామర్థ్యంబులకు మెచ్చి సంతసిల్లి 'నీవు నాతో నెప్పుడు బద్ధసఖ్యుండ వై యుండవలయు' నని, వెండియు దేవేంద్రుండు గరుడని కి ట్లనియె. 114**

**ప్రతిపదార్థం:** అని, చెప్పినన్= అని చెప్పగా; గరుడని= గరుత్మంతుడియొక్క; జవ, సత్త్వసామర్థ్యంబులకున్= వేగానికి, బలానికి, శక్తికి; మెచ్చి; సంతసిల్లి= సంతోషించి; నీవు= (గరుత్మంతుడు); నాతోన్= (దేవేంద్రుడితో); ఎప్పుడున్= ఎల్లప్పుడు; బద్ధ, సఖ్యుండవు+అయి= కట్టబడిన స్నేహం కలవాడి వై; ఉండన్, వలయున్, అని= ఉండా లని, వెండియున్= మళ్ళీ; దేవ+ఇంద్రుండు= దేవతలకు రాజయిన ఇంద్రుడు; గరుడనికిన్+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని గరుడడు చెప్పగా, అతనివేగానికి, బలానికి, శక్తికి మెచ్చుకొని, సంతోషించి, 'నీవు నాతో ఎల్లప్పుడు స్నేహం కలవాడి వయి ఉండాలి' అని పలికి, మళ్ళీ ఇంద్రుడు గరుడనితో ఇ ట్లన్నాడు.

**క. 'నా కభిమత మొనరించితి । నీ కిష్టము చెప్పికొను' మనిన 'దుర్మదు లై**
**మా కి ట్లహితముఁ జేసిన । యా కద్రువపుత్త్రు లశన మయ్యెడు నాకున్'. 115**

**ప్రతిపదార్థం:** నాకున్+అభిమతము= నాకు(ఇంద్రుడికి) ఇష్టమైనదాన్ని; ఒనరించితి(వి)= చేశావు; నీకున్= (గరుత్మంతుడికి); ఇష్టము= ప్రియ మైనది; చెప్పికొనుము= తెల్పుము; అనినన్= అని చెప్పగా; దుర్మదులు+ఐ= చెడ్డగర్వం కలవా రయి; మాకున్= నాకు, నాతల్లి అయిన వినతకు; అహితమున్= అపకారాన్ని; చేసిన; ఆకద్రువ, పుత్త్రులు= ఆకద్రువ యొక్కకొడుకులు(పాములు); నాకున్= నాకు; అశనము+అయ్యెడున్= ఆహారం అగునుగాక!

**తాత్పర్యం:** 'నాకు ఇష్ట మైనదాన్ని చేశావు. నీ కిష్ట మయినదాన్ని తెల్పుము' అని ఇంద్రుడు గరుత్మంతుడితో చెప్పగా, 'అతిగర్వం కలవా రయి నాకు, నాతల్లి అయిన వినతకు అపకారం చేసిన కద్రువకొడుకులు నాకు ఆహారం కావాలి'.

**క. భవదభిరక్ష్యము లగు నీ । భువనంబులయందు సర్పములు ద్రిమ్మరుటన్**
**దివిజాధిప! నీ కెఱిఁగిం । పవలసె; నీయాజ్ఞ నాకుఁ బడయఁగ వలసెన్. 116**

**ప్రతిపదార్థం:** దివిజ+అధిప= దేవతలకురాజా! భవత్+అభిరక్ష్యములు+అగు= నీచే కాపాడదగినట్టి; ఈ, భువనంబుల, అందున్= ఈలోకాలలో; సర్పములు= పాములు; త్రిమ్మరుటన్= తిరుగుచుండటంచేత; నీకున్; ఎఱిగింపన్‌వలసెన్= తెలియజేయ వలసి వచ్చింది; నీ, ఆజ్ఞన్= నీఅనుజ్ఞను; నాకున్; పడయఁగన్‌వలసెన్= పొందవలసి వచ్చింది.

**తాత్పర్యం:** ఓ దేవరాజా! ఇంద్రుడా! నీచే రక్షింపదగినట్టి ఈలోకాల్లో పాములు తిరుగుతుండటంచేత నీకు తెలియజేయవలసి వచ్చింది. నాకు నీఆజ్ఞ పొందవలసి వచ్చింది.

**విశేషం:** మహాబలశాలి అయిన గరుడుడు తనంత తానే పాములను తినగలడు. ఇతరులఅనుమతి అడుగవలసిన అక్కరలేదు. అయినా, ఇంద్రపాలితా లయిన లోకాల్లో పాములు తిరుగుతుంటాయి కాబట్టి, వినయంతో అతని ఆజ్ఞను అర్థించాడు.

**వ. అని గరుడండు దనకు నురగభోజనత్వంబు సురపతిచేతం బడసి, తదనుగమ్యమానుం డై, యురగుల యొద్దకు వచ్చి, మరకతహరితం బైన కుశాస్తరణంబున నమృతకలశంబు నిలిపి, యురగులకుం జూపి యి ట్లనియె. 117**

**ప్రతిపదార్థం:** అని; గరుడండు= గరుత్మంతుడు; తనకున్, ఉరగ, భోజనత్వంబు= పాములు భోజనంగా గలిగిఉండటాన్ని; సురపతిచేతన్= దేవతలకు రా జయిన ఇంద్రునిచేత; పడసి= పొంది; తద్, అనుగమ్యమానుండు+ఐ= ఆ ఇంద్రునిచే అనుసరింపబడుతున్నవాడయి; ఉరగుల+ఒద్దకున్= పాములసమీపానికి; వచ్చి; మరకత, హరితంబు+ఐన= మరకతమణులవలె ఆకుపచ్చనైన; కుశ+ఆస్తరణంబునన్= దర్భలపరుపుమీద; అమృతకలశంబు= అమృతం కలపాత్రను; నిలిపి= ఉంచి; ఉరగులకున్= పాములకు; చూపి; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** అని గరుడడు తనకు పాములు భోజనంగా కలిగిఉండటాన్ని ఇంద్రుడిచేత పొంది, ఆ ఇంద్రుడిచే అనుసరింపబడుతున్నవా డయి పాములదగ్గరకు, వచ్చి, మరకతమణులవలె పచ్చగా ఉన్న దర్భల పరుపుపై (పేర్చినచోట) అమృత ముండేపాత్రను పెట్టి, పాములకు చూపి, ఇట్లా పలికాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అనిమిషనాథ సుగుప్త మ । యిన యమృతము దెచ్చి మీకు నిచ్చితి; నస్మ**
**జ్జననీదాస్యము వాసెను । దినకరపవనాగ్నితుహినదీప్తుల కరిగాన్. 118**

**ప్రతిపదార్థం:** అనిమిష, నాథ, సు, గుప్తము+అయిన= దేవతలకు రా జయిన ఇంద్రుడిచేత బాగుగా రక్షింపబడిన; అమృతము, తెచ్చి, మీకున్, ఇచ్చితిన్= అమృతాన్ని తెచ్చి మీ కిచ్చాను; అస్మద్+జననీ, దాస్యము= నాతల్లి అయిన వినతయొక్క దాసితనం; దినకర, పవన+అగ్ని, తుహిన, దీప్తులు+అ= సూర్యుడు, గాలి, అగ్ని, చంద్రుడు అనేవారు; కరి, కాన్= సాక్షిగా; పాసెన్= తొలగింది.

**తాత్పర్యం:** దేవేంద్రుడిచేత బాగుగా రక్షింపబడిన అమృతాన్ని తెచ్చి మీ కిచ్చివేశాను. సూర్యుడు, గాలి, అగ్ని, చంద్రుడు అనేవాళ్ళు సాక్షులుగా నాతల్లి అయిన వినతయొక్క దాసితనం పోయింది.

**విశేషం:** దాస్యము+పాసెను= దాస్యమువాసెను - పకారానికి వాదేశం. అస్మద్+జనని= అస్మజ్జనని - శ్చుత్వసంధి. ఈపద్యంలో అర్థవ్యక్తి(అర్థవ్యక్తిహేతుత్వం)అనే శబ్దగుణం రాణిస్తున్నది. 'అనిమిషనాథసుగుప్త' మైన అమృతాన్ని తాను తేవటంలో ఉన్న తెగువను గరుత్మంతుడు చెప్పటంతోపాటు గుప్తంగాఉన్న ఇంద్రుడిబారినుండి అమృతాన్ని దక్కించుకోవటం మీశక్తియుక్తులమీద ఆధారపడి ఉన్నదనిచెపుతున్న అర్థం ఇందులో వ్యంగ్యం. అమృతం తేవటమేకాని దానిని వినియోగించటం తన బాధ్యత కాదని వ్యంగ్యం. వెంటనే తల్లిని తీసికొని వెళ్ళటంలో అది స్పష్ట మౌతున్నది.

**వ. 'మీరలు స్నాతాలంకృతుల రై వచ్చి దీని నుపయోగింపుం' డని పంచి, తల్లిం దనవీఁ పెక్కించుకొని విహగేంద్రుం డురగుల కదృశ్యుండైయున్న సురేంద్రు వీడ్కొని చనియె; నిట యురగులును నమృతోపయోగకు తూహలంబున నొండొరులం గడవఁ గృతస్నానాలంకృతు లై చనుదెంచుటకు ముందఱ. 119**

**ప్రతిపదార్థం:** మీరలు= మీరు; స్నాత+అలంకృతులరు+ఐ= స్నానం చేసినవారు, అలంకరించు కొన్న వారు నై (విశేషణోభయపదకర్మధారయం); వచ్చి; దీనిన్= ఈఅమృతాన్ని; ఉపయోగింపుండు+అని= వాడుకొనం డని (భుజించం డని); పంచి= పంపి; తల్లిన్= తల్లి అయిన వినతను; తన, వీఁపు+ఎక్కించుకొని= తనవీపున ఎక్కించుకొని; విహగ+ఇంద్రుండు= పక్షులకు ఇంద్రు డయిన గరుత్మంతుడు; ఉరగులకున్= పాములకు; అదృశ్యుండు+ఐ= కనబడనివా డై; ఉన్నన్; సుర+ఇంద్రు= దేవతలరా జయిన ఇంద్రుడిని; వీడ్కొని= పోయివస్తా నని చెప్పి విడిచి; చనియెన్= వెళ్ళాడు; ఇట= అమృతముండే చోట; ఉరగులునున్= పాములు కూడా; అమృత+ఉపయోగ, కుతూహలంబునన్= అమృతాన్ని వాడుకొనే (త్రాగే) ఉత్సాహంతో; ఒండు+ఒరులన్= ఒకరొకరిని; కడవన్= దాటి ముందుకు పోయేటట్లు; కృత, స్నాన+అలంకృతులు+ఐ= చేయబడినస్నానం కలవారును, అలంకరింపబడినవారును అయి; చనుదెంచుటకున్= రావటానికి; ముందఱన్= ముందుగానే.

**తాత్పర్యం:** 'మీరు స్నానం చేసిన పిమ్మట అలంకరించుకొని వచ్చి అమృతం త్రాగం' డని పంపి, పక్షిరా జయిన గరుత్మంతుడు తల్లి అయిన వినతను తనవీపుపై ఎక్కించుకొని, పాములకు కనబడకుండ ఉండే దేవేంద్రుడి కడ సెలవుపుచ్చుకొని వెళ్ళిపోయాడు. ఇంక ఇచ్చట- పాములు అమృతం ఉపయోగించటంలోని ఉత్సాహంతో ఒండొంటిని దాటేటట్లుగా(ఆహమహమికతో) స్నానం చేసి, అలంకరించుకొని రావటానికి ముందే.

**విశేషం:** స్నాతాలంకృతులు+రు. ఇది ప్రథమావిభక్తితో ముగిసే యుష్మద్విశేషణ మవటంచేత, బహువచనాంత మవటంచేత 'రు' ఆగమంగా వచ్చింది. ఈ ఆగమానికి వెనుక ఉండే ఉత్వం అత్వంగా మారింది. స్నాతాలంకృతులరు.

**క. అమరాధిపుఁ డమృతముఁ గొని । యమరావతి కరిగి, తొంటియట్టుల సుస్థా**
**నమున నవిచలిత రక్షా । క్షముఁ డై రక్షించుకొని సుఖస్థితి నుండెన్. 120**

**ప్రతిపదార్థం:** అమర+అధిపుఁడు= దేవతలకు రాజయిన ఇంద్రుడు; అమృతమున్+కొని= అమృతాన్ని తీసికొని, అమరావతికిన్= దేవతలపట్టణ మయిన అమరావతికి; అరిగి= వెళ్ళి; తొంటి, అట్టులు+అ= పూర్వంవిధంగానే; సు, స్థానమునన్= మంచిచోట; అవిచలిత, రక్షా, క్షముఁడు+ఐ= చెదరని రక్షణలో సమర్థు డయి; రక్షించుకొని= కాపాడు కొని; సుఖ, స్థితిన్= సుఖమయిన ఉనికితో; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు అమృతాన్ని గ్రహించి, అమరావతీనగరానికి వెళ్ళి పూర్వంవలెనే, ఆ అమృతాన్ని మంచిచోట ఉంచి స్థిరమైన రక్షణంలో సమర్థు డై రక్షించుకొంటూ, సుఖంతో కూడిన స్థితితో ఉండినాడు.

**వ. అంత నయ్యురగులు నమృతం బుపయోగింపం గానక దానియున్నస్థానం బని దర్భలు నాకిన నాలుకలు రెండుగా వ్రయ్యుటంజేసి, నాటంగోలె ద్విజిహ్వులు నాఁ బరఁగిరి; యమృతస్థితింజేసి దర్భలు పవిత్రంబు లయ్యె. 121**

**ప్రతిపదార్థం:** అంతన్= తర్వాత; ఆ+ఉరగులు= ఆ పాములు; అమృతంబు= అమృతాన్ని; ఉపయోగింపన్, కానక= ఉపయోగింపలేక (త్రాగాలని ఎంచి దాన్ని కానక); దాని, ఉన్న, స్థానంబు+అని= అది ఉన్నచో టని; (కర్తృపద ప్రథమకు షష్ఠి); దర్భలు; నాకినన్= నాకగా; నాలుకలు; రెండుగా; వ్రయ్యుటన్, చేసి= చీలుటచేత; నాటన్, కోలెన్= నాటనుండి; ద్వి, జిహ్వులు, నాన్= రెండు నాలుకలు కలవారనేటట్లు; పరఁగిరి= ఒప్పినారు; అమృత, స్థితిన్, చేసి= అమృతంయొక్క ఉనికిచేత; దర్భలు; పవిత్రంబులు+అయ్యెన్= పవిత్రాలయ్యాయి.

**తాత్పర్యం:** పిమ్మట ఆపాములు అమృతం త్రాగటానికి వెళ్ళి, అది అచ్చట లేకపోవటంచేత ఉపయోగింప లేక అది ఉన్నస్థల మని దర్భలు నాకగా వాటిఅంచులు పదునుగా ఉంటాయికాబట్టి వాటి నాలుకలు రెండుగా చీలాయి. నాటినుండి పాములు (ద్విజిహ్వలు) రెండునాలుకలు కలవిగా ఒప్పినాయి. అమృతం తమపై ఉంచటం చేత దర్భలు పవిత్రా లయ్యాయి.

**క.** **ఈ సౌపర్ణాఖ్యానము । భాసురముగ వినిన పుణ్యపరులకు నధిక**
**శ్రీ సంపద లగు; దురితని । రాసం బగుఁ; బాయు నురగరక్షోభయముల్. 122**

**ప్రతిపదార్థం:** ఈ, సౌపర్ణ+ఆఖ్యానము= గరుత్మంతుడికి సంబంధించిన ఈ కథను; భాసురముగన్= ప్రకాశమానంగా (ఒప్పుగా); వినిన= వినినట్టి; పుణ్యపరులకున్= పుణ్యంపట్లఆసక్తి కలవారికి; అధికశ్రీ సంపదలు= విస్తారమయిన సిరియు, సంపదయు; అగున్= కలుగుతుంది; దురితనిరాసంబు= పాపాలు తొలగటం; అగున్=అవుతుంది; ఉరగ, రక్షః, భయముల్= పాములవలన, రాక్షసులవలన భయాలు; పాయున్= తొలగిపోతాయి.

**తాత్పర్యం:** గరుత్మంతుడికి సంబంధించిన ఈ కథను ఒప్పుగా వినిన పుణ్యాత్ములకు అధిక మయిన సిరిసంపదలు కలుగుతాయి. పాపక్షయం అవుతుంది. పాములనుండి, రాక్షసులనుండి భయాలు తొలగిపోతాయి.

**విశేషం:** ఇది గరుడోపాఖ్యానం వినటంవలన కలిగే ఫలాన్ని తెల్పుతున్నది - ఫలశ్రుతి.

**వ.** **ఇట్లురగు లమృతం బుపయోగింపం గానక చనిన, శేషుండు తనతల్లియుం దమ్ములుఁజేసిన యధర్మంబునకు నిర్వేదించి, వారల విడిచి కడునిష్ఠతో గంధమాదన బదరీవన గోకర్ణ పుష్కరారణ్య హిమవంతంబు లాదిగాఁ గల పుణ్యస్థానంబులం దనేక సహస్రవర్షంబులు బ్రహ్మ నుద్దేశించి తపంబు సేసిన, బ్రహ్మయుఁ బ్రత్యక్షం బై వరంబు వేడు మనిన శేషుం డి ట్లనియె. 123**

**ప్రతిపదార్థం:** ఇట్లు=ఈవిధంగా; ఉరగులు= పాములు; అమృతంబు=అమృతాన్ని; ఉపయోగింపన్, కానక= ఉపయోగించటానికి పొందక; చనినన్= వెళ్ళిపోగా; శేషుండు= ఆదిశేషుడు; తన తల్లియున్; తమ్ములున్; చేసిన; అధర్మంబునకున్= ధర్మవిరుద్ధ మయిన కార్యానికి; నిర్వేదించి= దుఃఖించి; వారలన్= తల్లిని, తమ్ముళ్ళను; విడిచి; కడు, నిష్ఠతోన్= మిక్కిలి నియమంతో; గంధమాదన, బదరీవన, గోకర్ణ, పుష్కర+అరణ్య, హిమవంతంబులు+ఆదిగాన్= గంధమాదనపర్వతం, బదరీవనం, గోకర్ణమనేక్షేత్రం, పుష్కర మనే పేరున్న అరణ్యం, హిమవత్పర్వతం మొదలుగా ఉండే; పుణ్యస్థానంబులందున్= పవిత్రా లైన ప్రదేశాలలో; అనేక సహస్రవర్షంబులు= పెక్కువేలయేండ్లు; బ్రహ్మన్, ఉద్దేశించి= బ్రహ్మనుగురించి; తపంబు, చేసినన్= తపస్సు చేయగా; బ్రహ్మయున్= బ్రహ్మకూడ; ప్రత్యక్షంబు+ఐ= ఎదుట నిలిచి; వరంబు, వేడుము+అనినన్= ఏదైనా వరం వేడుకొ మ్మని అనగా; శేషుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా పాములు అమృతాన్ని ఉపయోగించే భాగ్యం పొందలేక వెళ్ళిపోగా, ఆదిశేషుడు తనతల్లి, తమ్ములు చేసిన ధర్మవిరుద్ధ మైన కార్యానికి అసహ్యపడి, దుఃఖించి, వారిని విడిచి, మిక్కిలి నియమంతో గంధమాదనపర్వతం, బదరీవనం, గోకర్ణక్షేత్రం, పుష్కరారణ్యం, హిమాచలం మొదలయిన పుణ్యక్షేత్రాలలో పెక్కువేలయేండ్లు బ్రహ్మనుగురించి తపస్సు చేయగా బ్రహ్మకూడ కనుల ఎదుట నిలిచి ఏదైనా వరం వేడుకొమ్మని పలుకగా ఆదిశేషుడు ఇట్లా అన్నాడు.

బ్రహ్మ యనుజ్ఞవలన శేషుఁడు భూభారంబు దాల్చుట (సం. 1-32-2)

**సీ. 'తల్లియు నాసహోదరులును మూర్ఖు లై! ధర్మువు నుచితంబుఁ దప్పి వినత**
**కావైనతేయున కపకారములు సేసి, । రెప్పుడు వారు సహింప కెగ్గు**
**సేయుదు, రేను రోసితి, వారితోడిపొ । త్తొల్లఁ, దపంబు సేయుచు శరీర**
**భారంబు విడిచెదఁ బరమేష్ఠి!' యనవుడు । నాతని సమబుద్ధి కజుఁడు మెచ్చి**

**ఆ. నిత్యసత్యధర్మనిరతుండ వఖిలంబు । దాల్పనోపు నట్టి ధైర్యయుతుఁడ,**
**విది యనన్యవిషయ; మిమ్మహీభారంబు । నీవ తాల్పవలయు నిష్ఠతోడ. 124**

**ప్రతిపదార్థం:** పరమేష్ఠి!= ఓ బ్రహ్మదేవుడా! తల్లియున్= తల్లి అయిన కద్రువయు; నా, సహోదరులును= తోడబుట్టిన నా తమ్ములును; మూర్ఖులు+ఐ= బుద్ధిలేనివా రయి; ధర్మువున్= ధర్మాన్ని; ఉచితంబున్= తగినకార్యాన్ని; తప్పి= అతిక్రమించి; వినతకున్= సవతితల్లి అయిన వినతకు, వైనతేయునకున్= వినతకుమారు డైన గరుడునికిని; అపకారములు= హానులను; చేసిరి; వారు= తల్లి, తమ్ముళ్ళును; ఎప్పుడున్= ఎల్లప్పుడు; సహింపక= సైపక, ఓర్వలేక; ఎగ్గు, చేయుదురు= హాని చేస్తారు; ఏను= నేను; రోసితిన్= అసహ్యపడ్డాను; వారితోడి, పొత్తు+ఒల్లన్= తల్లితోను, తమ్ములతోను స్నేహాన్ని అంగీకరించను; తపంబు, చేయుచున్= తపస్సు చేస్తూ; శరీరభారంబు= దేహంయొక్క బరువును; విడిచెదన్= వదలుతాను(మరణిస్తాను); అనవుడున్= అనిన అనంతరం; అతని, సమబుద్ధికిన్= శేషునియొక్క ధర్మంతోకూడిన తలంపుకు; అజుఁడు= బ్రహ్మ; మెచ్చి; నిత్య, సత్య, ధర్మ, నిరతుండవు= ఎల్లప్పుడు సత్యం పట్ల, ధర్మంపట్ల ఆసక్తికలవాడివి; అఖిలంబు= సర్వాన్ని, తాల్పన్, ఓపు+అట్టి= ధరింపజాలునట్టి; ధైర్యయుతుఁడవు= ధైర్యంతో కూడినవాడివి; ఇది, అనన్య, విషయము= ఇతరులకు శక్యం(గోచరం)కాని కార్యం(అంశం); ఈ+మహీభారంబు= ఈభూమియొక్కబరువును; నిష్ఠతోడన్= స్థిరత్వంతో; నీవు+అ= నీవే; తాల్పన్‌వలయు= ధరించాలి.

**తాత్పర్యం:** 'ఓబ్రహ్మదేవుడా! నాతల్లి అయిన కద్రువ, తమ్ముళ్ళు, మూఢు లై ధర్మాన్ని, యుక్తాన్ని, విడిచి నా సవతితల్లి అయిన వినతకు, ఆమె కుమారు డైన గరుడుడికి కీడులు చేశారు. వాళ్ళు ఓర్వలేక ఎప్పుడూ ఇట్లే హాని చేస్తుంటారు. నేను అసహ్యపడ్డాను. వాళ్ళతో కలిసి ఉండటం నా కిష్టం లేదు. తపస్సు చేస్తూ దేహభారాన్ని విడుస్తాను' అని శేషుడు పలుకగా, బ్రహ్మ అతడి ధర్మబుద్ధికి మెచ్చి 'నీవు ఎల్లప్పుడు సత్యంపట్ల, ధర్మంపట్ల ఆసక్తి కలిగినవాడివి. సర్వం భరించేధైర్యంతో కూడినవాడివి. ఇది ఇతరులకు శక్యం కాని విషయం. ఈభూమియొక్క బరువును నీవే నియమంతో భరించాలి.

**చ. వినతకు నాత్మజుం డయిన వీరుఁడు, కశ్యపవాలఖిల్యస**
**న్మునులవరంబు గన్న ఖగముఖ్యుఁడు, వాసవు నోర్చియున్న స**
**ద్వినుతబలుండు కావున వివేకమునన్ వినతాతనూజుతో**
**ఘనముగఁ జెల్మి సేయు; మిది కార్యము నీకు భుజంగమేశ్వరా! 125**

**ప్రతిపదార్థం:** భుజంగమ+ఈశ్వరా!= పాములకు రాజు వైన శేషుడా! వినతకున్; ఆత్మజుండు= కుమారుడు; అయిన; వీరుఁడు= పరాక్రమవంతుడు; కశ్యప, వాలఖిల్య, సత్, మునుల= కశ్యపుడు, వాలఖిల్యులు అనే మంచి మునీశ్వరుల; వరంబు; కన్న= పొందిన; ఖగముఖ్యుఁడు= పక్షిశ్రేష్ఠుడు; వాసవున్= ఇంద్రుడిని; ఓర్చి+ఉన్న= ఓడించిఉన్న; సత్, వినుత, బలుండు=

సజ్జనులచే నుతింపబడిన బలం కలవాడు; కావునన్, వివేకమునన్= తెలివితో; వినతా, తనూజుతోన్= వినతకు కుమారు డైన గరుడనితో; ఘనముగన్= గొప్పగా; చెల్మి, చేయుము= స్నేహం చేయుము; ఇది= ఇట్లా స్నేహం చేయటం; నీకున్; కార్యము= చేయదగినపని.

**తాత్పర్యం:** సర్పరాజు వైన ఓ శేషుడా! వినతకు కుమారు డైన గరుత్మంతుడు పరాక్రమవంతుడు, కశ్యపుడు వాలఖిల్యులు మొద లైన గొప్పమునుల వరం పొందిన పక్షిశ్రేష్ఠుడు, ఇంద్రుడిని ఓడించి సజ్జనులచే స్తుతింపబడిన బలం కలవాడు. కాబట్టి తెలివితో ఆ గరుడనితో స్థిరంగా స్నేహం చేయుము. అతనితో స్నేహంచేయటం నీకు కర్తవ్యం.

**విశేషం:** బంధశైథిల్యం, అర్థవైమల్యం కల ప్రసాదగుణరమ్యమైన ఇటువంటి పద్యాలకు నన్నయ నిధి.

**వ. అని బ్రహ్మ నియోగించిన శేషుం డశేషమహీభారంబు దాల్చి గరుడనితో బద్ధసఖ్యుం డై యుండె; నిట వాసుకియుం దల్లిశాపంబున జనమేజయు చేయు సర్పయాగంబునం దయ్యెడుసర్పకులప్రళయంబునకు వెఱచి, తనబాంధవుల నైరావతాది సహోదరుల రావించి విషణ్ణహృదయుం డై యి ట్లనియె. 126**

**ప్రతిపదార్థం:** అని; బ్రహ్మ; నియోగించినన్= ఆజ్ఞాపించగా; శేషుండు; అశేష, మహీ, భారంబు= సర్వ మైన భూమియొక్క బరువును; తాల్చి= ధరించి; గరుడనితోన్= గరుత్మంతుడితో; బద్ధ, సఖ్యుండు+అయి, ఉండెన్= కట్టబడిన స్నేహం కలవాడై ఉన్నాడు; ఇటన్= ఇచ్చట (తల్లి, తమ్ముళ్ళు ఉన్నచోట); వాసుకియున్= వాసుకి అనే సర్పశ్రేష్ఠుడును; తల్లిశాపంబునన్= తల్లి అయిన కద్రువశాపంచేత; జనమేజయు, చేయు= జనమేజయుడు చేయబోయే; (కర్తృపదప్రథమకు షష్ఠి); సర్పయాగంబునందున్= పాములను ఆహుతి చేసే యజ్ఞంలో; అయ్యెడు= కాబోయే; సర్ప, కుల, ప్రళయంబునకున్= పాముల వంశంయొక్క నాశనానికి; వెఱచి= భయపడి; తనబాంధవులన్= తనబంధువు లయిన; ఐరావత+ఆది, సహోదరులన్= ఐరావతుడు మొదలయిన సోదరులను; రావించి= రప్పించి; విషణ్ణహృదయుండు+ఐ= దుఃఖించిన చిత్తం కలవాడయి; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** అని బ్రహ్మ ఆజ్ఞాపించగా శేషుడు భూమియొక్క సమస్తభారాన్నీ ధరించి గరుత్మంతుడితో స్నేహం కలిగి ఉన్నాడు. ఇచట వాసుకి అనే సర్పశ్రేష్ఠుడు తల్లి అయిన కద్రువయొక్క శాపంచేత జనమేజయుడు చేయబోయే సర్పయాగంలో కాగలపాములసముదాయంయొక్క వినాశనానికి భయపడి తన చుట్టాలను, ఐరావతుడు మొద లయిన సోదరులను పిలిపించి దుఃఖించినహృదయం కలవాడయి ఈ విధంగా పలికాడు.

### వాసుకి తల్లిశాపమునకు వగచుట (సం. 1-33-1)

**చ. చిరముగ బ్రహ్మకుం దపము సేసి, యనంతుఁ డనంతధారుణీ**
**భరగురుకార్యయుక్తుఁ డయి, పన్నగముఖ్యులపొత్తు వాసి, చె**
**చ్చెరఁ దనయంత నుండి, మదిఁ జేర్చి తలంపఁడ యొక్కనాఁడు దు**
**ర్భరతర దందశూకకుల భావిభయప్రవిఘాతకృత్యముల్. 127**

**ప్రతిపదార్థం:** చిరముగన్= చిరకాలం; బ్రహ్మకున్= బ్రహ్మనుగురించి (ద్వితీయకుబదులుషష్ఠి); తపము, చేసి; అనంతుఁడు= శేషుడు; అనంత, ధారుణీ, భర, గురు కార్యయుక్తుఁడు+అయి= అంతంలేని భూమిని మోయటం అనే గొప్పపనితో కూడినవా డయి; పన్నగముఖ్యుల= సర్పశ్రేష్ఠుల; పొత్తు, పాసి= స్నేహం విడిచి; చెచ్చెరన్= శీఘ్రంగా; తన, అంతన్, ఉండి= తాను వేరుగా ఉండి; ఒక్కనాఁడు= ఒక్కరోజుకూడ; దుర్భరతర, దండశూక, కుల, భావి, భయ, ప్రవిఘాత, కృత్యముల్= మిక్కిలి భరింపశక్యం కాని పాములయొక్కవంశానికి ముందు కాబోయే భయాన్ని అడ్డగించే పనులను; మదిన్= మనస్సులో; చేర్చి= కూర్చి; తలంపఁడు+అ= ఏమియు తలపోయడు.

**తాత్పర్యం:** శేషుడు చిరకాలం బ్రహ్మనుగురించి తపస్సు చేసి విస్తృతమైన భూమిని భరించటం అనే గొప్పకార్యంతో కూడిన వా డయి సర్పశ్రేష్ఠుల స్నేహం విడిచి శీఘ్రంగా తనంతతాను వేరుగా ఉండి ఒకప్పుడైనా మిక్కిలి భరింపశక్యంకాని పాముల సముదాయానికి ముందు కలుగబోయే భయాన్ని తొలగించే పనులను మనస్సులో తలంచి ఏమియు ఆలోచన చేయడు.

**విశేషం:** ఈపద్యంలో నన్నయ ఆరోహావరోహక్రమం వాక్యార్థసంయోజనంలో దీపింపచేస్తూ 'సమాధి' అనే శబ్దగుణాన్ని పోషించాడు. బ్రహ్మను తపస్సుతో మెప్పించి భూమిభారాన్ని మోసే దుష్కరమైనకార్యాన్ని సాధించిన శేషుడు సమర్థుడై ఉండికూడా తన సర్పకులానికి రాబోయే మహాప్రళయాన్నిగురించి పట్టించుకోవటంలేదని వాసుకి తనబంధువులతో చెపుతున్నాడు. చిన్నచిన్నమాటలతో మొదలై చివరిచరణమంతా వ్యాపించి ఉన్న దీర్ఘసమాసంతో చేసిన వాక్యవిన్యాసం ఆరోహక్రమాన్ని సూచిస్తూ వాసుకి మనోవేదనను వ్యక్తంచేస్తున్నది. (సంపా.)

**వ. 'మఱి యమృతమథనంబునాఁడు మంథరమహానగంబునకు నేత్రంబ నయిన నాక్లేశంబునకు మెచ్చి యమరులెల్లఁ బితామహుం బ్రార్థించి నాకు నవ్యయత్వంబును, సకలభయవిమోక్షణంబునుగా వరం బిప్పించి; రైనను జననీశాపంబున నురగకులప్రళయం బగుటకు మనోదుఃఖంబు దుస్సహం బై యుండు; దాని నుడిగించు నుపాయంబెద్ది? యేమిసేయువార?' మని చింతించుచున్న యన్నాగరాజునకు నాగకుమారు లత్యుద్ధతు లై యి ట్లనిరి. 128**

**ప్రతిపదార్థం:** మఱి= ఇంకను, అమృత, మథనంబు, నాఁడు= అమృతంకొరకు సముద్రాన్ని త్రచ్చేటప్పుడు; మంథర, మహత్, నగంబునకున్= కవ్వ మైన మంథర మనే గొప్పపర్వతానికి; నేత్రంబన్, అయిన= తరిత్రాడు నయిన; నా, క్లేశంబునకున్= నాకష్టానికి; మెచ్చి; అమరులు, ఎల్లన్= దేవతలందరును; పితామహున్= బ్రహ్మను; ప్రార్థించి= వేడి; నాకున్, అవ్యయత్వంబును= నాశంలేకుండటమును; సకల, భయ, విమోక్షణంబునున్, కాన్= సర్వభయాలనుండి విముక్తి అవునట్లుగా; వరంబు+ఇప్పించిరి= వరం ఇచ్చేటట్లు చేశారు; ఐనను= నా కేమీ భయంలేకపోయినా; జననీశాపంబునన్= తల్లియొక్క శాపంచేత; ఉరగ, కుల, ప్రళయంబు+అగుటకున్= పాములవంశం నాశం అవటానికి; మనస్+దుఃఖంబు= మనస్సులోని చింత; దుస్సహంబు+ఐ= సహింప శక్యం కానిదై; ఉండున్; దానిన్= ఆనాశాన్ని; ఉడిగించు+ఉపాయంబు= తొలగించేమార్గం; ఎద్ది= ఏది? ఏమిచేయువారము= దానిని తొలగించటానికి ఏం చేద్దాం?; అని; చింతించుచున్న= దుఃఖిస్తున్న; ఆ+నాగరాజునకున్= సర్పరా జైన ఆ వాసుకికి; నాగకుమారులు= యువకులైన పాములు; అతి+ఉద్ధతులు+ఐ= మిక్కిలి గర్వించినవా రై; (అతి+ఉద్ధతులు= అత్యుద్ధతులు- యణాదేశసంధి); ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** 'ఇంక- అమృతంకొరకు సముద్రం త్రచ్చేటప్పుడు కవ్వ మైన గొప్ప మంథరపర్వతానికి తరిత్రాడుగా అయిన నాకష్టానికి మెచ్చి దేవతలు అందరూ బ్రహ్మను వేడి నాకు నాశం లేకుండా ఉండేటట్లు, అన్నిభయాలనుండి

విముక్తియు అయ్యేటట్లు వరం అనుగ్రహింపజేశారు. నాకు భయంలేకపోయినా తల్లి అయిన కద్రువశాపంచేత సర్పాలసముదాయానికి వినాశం కలుగుతుండటంచేత, మనస్సులోని దుఃఖం సహింపశక్యంకాని దై ఉంటున్నది. సర్పాలకు కలిగే నాశాన్ని తొలగించే ఉపాయం ఏమైనా ఉందా? ఏం చేద్దాం?' అని దుఃఖిస్తున్న సర్పరాజైన ఆవాసుకితో యువకు లైన నాగులు మిక్కిలిగర్వించినవా రై ఇట్లా పలికారు. అనంతుడికీ వాసుకికీ ఉన్న భేదాన్ని తెలపటంలో వరుసగా పద్యాన్నీ వచనాన్నీ ఎన్నుకొన్న నన్నయగారి రుచిరార్థసూక్తినిధిత్వం గమనార్హం.

**విశేషం:** ఈభాగం వాసుకికి సర్పకులంపట్ల ఉండే అభిమానాన్ని సూచిస్తున్నది. బ్రహ్మవరంచేత అతనికి ఎట్టిహాని కలగదు. అయినా అతడు తనతోడిపాములకు కలుగబోయే వినాశాన్ని గురించి చింతించాడు. నాగకుమారులు వయస్సులో చిన్న వా రవటంచేత గర్వించి ఇట్లా చేద్దాం, అట్లా చేద్దాం అని పలికారు. అనంతుడికీ వాసుకికీ ఉన్న భేదాన్ని తెలపటంలో వరుసగా పద్యాన్నీ వచనాన్నీ ఎన్నుకొన్న నన్నయగారి రుచిరార్థసూక్తినిధిత్వం గమనార్హం.

**సీ.** **జనమేజయునిచేయు సర్పయాగమునకు । విఘ్న మందఱము గావింత; మతఁడు**
**ధర్మార్థి గావున ధారుణీసురుల మై । యడుగుద మిదియుఁ జేయకు మనియును;**
**గొందఱు మతనికిఁ గూర్చు మంత్రులము నై । యీక్రతుక్రియఁ జేసి యిహపరముల**
**కగుఁ బెక్కుదోషంబు లని హేతువులు సూపి । యుడిగింత; మందఱు నొక్కమొగిన**

**ఆ.** **భక్ష్యభోజ్యలేహ్య పానీయములమీఁద । సదములోని విప్రజనులమీఁద**
**వెగడుపడఁగఁ బాఱి వెఱపింత మొజ్జలు । తత్ప్రయోగవిధులు దప్పి పఱవ.** **129**

**ప్రతిపదార్థం:** జనమేజయునిచేయు= జనమేజయుడు కావించే (కర్తృపదప్రథమకుషష్ఠి); సర్పయాగమునకున్= సర్పాలను ఆహుతిచేసే యజ్ఞానికి; అందరమున్= మనమందరము; విఘ్నము= అంతరాయం; కావింతము= చేద్దాము; (విఘ్నా లెట్లా చేయాలో చెప్పుతున్నారు); అతఁడు= జనమేజయుడు; ధర్మ+అర్థి= ధర్మాన్ని కోరేవాడు; కావునన్; ధారుణీ, సురులము+ఐ= బ్రాహ్మణుల మయి; ఇదియున్= ఈయజ్ఞాన్ని; చేయకుము; అనియును; అడుగుదము; కొందఱము= మనలో కొందరం; అతనికిన్= జనమేజయుడికి; కూర్చు= ప్రియపడే; మంత్రులమున్, ఐ; ఈ క్రతు, క్రియన్, చేసి= ఈ సర్పయాగకార్యంచేత; ఇహపరములకున్= ఈలోకంలోను, పరలోకంలోను కలిగేసౌఖ్యాలకు; పెక్కుదోషంబులు= అనేక లోపాలు; అగున్, అని; హేతువులు, చూపి= కారణాలు తెలిపి; ఉడిగింతము= మానేటట్లు చేద్దాము; అందఱున్= మనమందరమూ; ఒక్కమొగిన్+అ= ఒకేపూనికతో; భక్ష్య, భోజ్య, లేహ్య, పానీయములమీఁదన్= తినదగినవియు, భుజింపదగినవియు, నాకదగినవియు, త్రాగదగినవియు అయిన నాలుగువిధాల ఆహారాలమీద; సదములోని= సభలోని; విప్రజనులమీఁదన్= బ్రాహ్మణులమీద; వెగడుపడగన్= భయం(వికారం) పొందేటట్లుగా; పాఱి= పరుగెత్తి; ఒజ్జలు= గురువులు (ఋత్విక్కులు మొదలైనవారు) తద్ప్రయోగవిధులు= ఆయజ్ఞాన్ని చేసే విధానాలు; తప్పి= విడిచి; పఱపన్= పారిపోయేట్లుగా; వెఱపింతము= భయపడేటట్లు చేద్దాము.

**తాత్పర్యం:** జనమేజయుడు చేసే సర్పయాగానికి మనమందరం ఆటంకం కలిగిద్దాం. ఎట్లంటే, జనమేజయుడు ధర్మాన్ని కోరేవాడు కావున మనం బ్రాహ్మణుల మై ఈయజ్ఞం చేయవద్దని అడుగుదాం. మనలో కొందరం ఆ జనమేజయుడికి ఇష్టులమై మంత్రుల మై ఈయాగాన్ని చేయటంచేత ఇహపరసౌఖ్యాలకు పెక్కులోపాలు కలుగుతాయని కారణాలు చూపి మానేటట్లు చేద్దాం. అందరం ఒకే పూనికతో భక్ష్యాలు, భోజ్యాలు, లేహ్యాలు, పానీయాలు అనే నాలుగు విధా లైన ఆహారాలమీద, సభలోని బ్రాహ్మణులమీద వికారంగా పరుగెత్తి ఋత్విక్కులు మొదలయిన గురువులు ఆ యజ్ఞాలు చేసే విధానాలు విడిచి పారిపోయేటట్లు భయపెట్టుదాము.

**విశేషం:** ఈ పద్యంలో గర్వితు లై నాగకుమారులు యజ్ఞానికి విఘ్నం కలిగించటానికై చెప్పిన ఉపాయాలు తెలుపబడినవి. కావించు+దము= చువర్ణంతోకూడిన దకారానికి తకారంఅవుతుంది. ఇట్లే ఉడిగింతము, వెఱపింతము అనేవి. భక్ష్యభోజ్యలేహ్యపానీయాలు నాలుగు విధా లైన ఆహారాలు. కొందరు వీటికి చోష్యంకూడా కలిపి ఆహారాలు అయిదు విధాలని చెప్పుతారు.

**వ. అనిన వారలలోఁ గొందఱు బుద్ధిమంతు లయిన భుజంగముఖ్యు లి ట్లనిరి. 130**

**ప్రతిపదార్థం:** అనినన్= అని నాగకుమారులు పలుకగా, వారలలోన్= వారిలో; కొందఱు; బుద్ధిమంతులు, అయిన, భుజంగముఖ్యులు= పాములలో శ్రేష్ఠులు, ఇట్లు+అనిరి;

**తాత్పర్యం:** నాగకుమారులు ఇట్లా పలుకగా ఆనాగులలో తెలివిగలవా రైన కొందఱు సర్పశ్రేష్ఠులు ఈవిధంగా పలికారు.

**క. ఇవి మీ కన్నియుఁ జేయఁగ । నవు నని తలఁపకుఁడు; భూసురాహుతి మంత్రో**
**ద్భవ దారుణదహనశిఖల్ । గవిసిన నెద్దియును జేయఁగా నెడ గలదే! 131**

**ప్రతిపదార్థం:** మీకున్; ఇవి, అన్నియున్= మీరు చెప్పిన ఉపాయాలన్నీ, చేయఁగన్, అవున్, అని= చేయటానికి వీ లవుతా యని; తలఁపకుఁడు= భావించకుడు; భూసుర+ఆహుతి, మంత్ర+ఉద్భవ, దారుణ, దహన, శిఖల్= బ్రాహ్మణులు అగ్నిలో వేల్చేటప్పుడు పఠించే మంత్రాలవలన పుట్టిన భయంకర మయిన అగ్నియొక్క జ్వాలలు; కవిసినన్= ఆక్రమించగా; ఎద్దియును= దేనినికూడా; చేయఁగాన్= చేయటానికి; ఎడ= అవకాశం; కలదే= ఉన్నదా? లేదని భావం.

**తాత్పర్యం:** మీరు చెప్పిన వన్నీ చేయటానికి వీలవుతా యని తలపోయకండి. బ్రాహ్మణులు అగ్నిలో వేల్చేటప్పుడు పఠించే మంత్రాలవలన పుట్టే భయంకర మైన అగ్నియొక్కజ్వాలలు వ్యాపిస్తే ఏదైనా చేయటానికి అవకాశముంటుందా? ఉండ దని భావం.

**వ. అనిన విని నాగరాజానుజుం డైన యేలాపుత్త్రుం డి ట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** అనినన్= బుద్ధిమంతు లైన కొందరు నాగులు అట్లా చెప్పగా; విని; నాగరాజ+అనుజుండు+అయిన= సర్పరా జైన వాసుకికి తమ్ము డైన; ఏలాపుత్త్రుండు= ఏలాపుత్రు డనే పేరుగల నాగకుమారుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని వాసుకి తమ్ము డైన ఏలాపుత్రు డనే నాగకుమారుడు ఇట్లా పలికాడు.

**ఆ. శాప మిచ్చునాఁడు జననియుత్సంగంబు । నందు నిద్రవోయి నట్ల యుండి**
**యమరవరుల కజున కైన యన్యోన్యసం । భాషణంబు లెఱుకపడఁగ వింటి. 133**

**ప్రతిపదార్థం:** శాపము+ఇచ్చునాఁడు= కద్రువ మనకు శాపం ఇచ్చే దినాన; జనని, ఉత్సంగంబునందున్= తల్లి ఒడిలో; నిద్ర, పోయిన, అట్లు+అ= నిద్రపోయినట్లే; ఉండి; అమరవరులకున్= దేవతాశ్రేష్ఠులకు, అజునకున్= బ్రహ్మకు; ఐన= జరిగిన; అన్యోన్య, సంభాషణంబులు= ఒండొరులమాటలు; ఎఱుక పడఁగన్= తెలిసేటట్లుగా; వింటిన్= విన్నాను.

**తాత్పర్యం:** కద్రువ పాములకు శాపం ఇచ్చేదినాన ఆమెఒడిలో నిద్రరాక పోయినా నిద్రపోతున్నట్లే ఉండి, దేవతాశ్రేష్ఠులకూ బ్రహ్మకూ జరిగిన ఒండొరుల మాటలు స్పష్టంగా తెలిసేటట్లు విన్నాను.

**వ. అప్పలుకులు సవిస్తరంబుగాఁ జెప్పెదవినుండు; 'శాపానంతరంబ యమరులెల్ల నజున కిట్లని రయ్యా! కద్రువ కడు నిర్దయురాలై యిట్టి యనంతబలవీర్యసంపన్ను లయిన కొడుకులం బడసి, వారి కకారణంబ దారుణం బైన శాపం బిచ్చె; మీరును వారింపక యుపేక్షించితిరి; దీనికిం బ్రతీకారంబు గలదే? 'యనిన నమరులకుఁ గమలసంభవుం డి ట్లనియె. 134**

**ప్రతిపదార్థం:** ఆ+పలుకులు= అజునికిని, అమరవరులకును జరిగిన పరస్పరసంభాషణలు; సవిస్తరంబుగాన్= వివరంతో కూడుకొని ఉండేటట్లుగా; చెప్పెదన్= తెల్పుతాను; వినుండు; శాప+అనంతరంబు+అ= కద్రువశాపం ఇచ్చిన వెంటనే; అమరులు+ఎల్లన్= దేవతలందరూ; అజునికిన్= బ్రహ్మదేవుడికి; ఇట్లు+అనిరి= ఈవిధంగా చెప్పారు; అయ్యా= బ్రహ్మకు సంబోధనం; కద్రువ= నాగమాత; కడునిర్దయురాలు+ఐ= మిక్కిలికఠినురాలై; ఇట్టి= ఇటువంటి; అనంత, బల, వీర్య, సంపన్నులు+అయిన= మేరలేని బలంతోను, పరాక్రమంతోను, కూడినవారైన; కొడుకులన్; పడసి= పొంది; వారికిన్= ఆ కొడుకులకు; అకారణంబు+అ= కారణంలేకుండానే; దారుణంబు+ఐన= ఘోరమైన; శాపంబు+ఇచ్చెన్; మీరును= మీరుకూడ; వారింపక= అడ్డగింపక; ఉపేక్షించితిరి= ఊరకున్నారు; దీనికిన్= ఆమె ఇచ్చిన శాపానికి; ప్రతీకారంబు= మారుచేత (తొలగించే ఉపాయం); కలదే= ఉన్నదా? అనినన్= అని అడుగగా; అమరులకున్= దేవతలకు; కమలసంభవుండు= బ్రహ్మదేవుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దేవతలకును, బ్రహ్మకును జరిగిన సంభాషణలు వివరంగా చెప్పుతాను, వినండి. కద్రువ పాములకు శాపం ఇచ్చినవెంటనే దేవతలందరు బ్రహ్మతో ఇట్లా పలికారు. "అయ్యా! కద్రువ మిక్కిలి కఠినాత్మురాలై అపారమైన బలం, పరాక్రమం ఉన్న ఇట్లాంటి కొడుకులను పొందికూడా వారికి కారణంలేకుండానే ఘోరమైన శాపం ఇచ్చింది. దానిని మీరు కూడ నివారించక ఊరకున్నారు. ఆ శాపానికి మారుసేత ఉన్నదా?" అని దేవతలు అడుగగా వారికి బ్రహ్మ ఇట్లా చెప్పాడు.

**క. క్రూరాకారుల, జగదప । కారులఁ, బన్నగులఁ దాల్పఁగా నోపని యి**
**ద్ధారుణికి హితంబుగ దు । ష్టోరగసంహార మిప్పు డొడఁబడ వలసెన్. 135**

**ప్రతిపదార్థం:** ఘోర+ఆకారులన్= ఘోరమైన ఆకారం కలవారున్నూ; జగత్, అపకారులన్= లోకానికి హాని చేసేవారు న్నూ; అయిన; పన్నగులన్= పాములను; తాల్పఁగాన్, ఓపని= మోయజాలని; ఈ+ధారుణికిన్= ఈభూమికి; హితంబుగన్= మేలయ్యేటట్లు; ఇప్పుడు; దుష్ట+ఉరగ, సంహారము= దుర్మార్గు లయిన నాగుల వినాశాన్ని; ఒడఁబడవలసెన్= అంగీకరింపవలసి వచ్చింది.

**తాత్పర్యం:** క్రూరమైన రూపం కలవారున్నూ, లోకానికి హాని చేసేవారున్నూ అయిన పాములను మోయజాలని ఈ భూమికి మేలు కలగటానికై ఇప్పుడు దుర్మార్గు లైన నాగుల వినాశానికి అంగీకరింపవలసి వచ్చింది.

**వ. 'మఱియు సకలలోకహితాచారంబు లై ప్రసిద్ధులైన నాగముఖ్యుల నెల్ల వాసుకి చెలియ లైన జగత్కారువునకు జగత్కారుం డను మహామునికిఁ బుట్టెడువాఁడధికతేజస్వి యాస్తీకుం డను మహాముని జనమేజయసమారబ్ధ సర్పసత్త్రప్రళయంబువలన రక్షించు' నని పితామహుండు దేవతలకుం జెప్పిన తెఱంగు సెప్పిన, వాసుకి ప్రముఖనాగముఖ్యులెల్ల సంతసిల్లి యేలాపుత్త్రు నెత్తుకొని సాధువాదంబుల నభినందించిరి; వాసుకియు**

**నాఁటంగోలె జరత్కారుమునీంద్రుం డెన్నండు దార పరిగ్రహంబు సేయునో యని తత్సమయ సమాగమం బపేక్షించి యుండు నంత. 136**

**ప్రతిపదార్థం:** మఱియున్; సకల, లోక, హిత+ఆచారంబులు+ఐ= అన్ని లోకాలకు మేలు కలిగించే ప్రవృత్తి కలవారై; ప్రసిద్ధులు+ఐన= ప్రఖ్యాతు లైన; నాగముఖ్యులన్, ఎల్లన్= సర్పశ్రేష్ఠులందరినీ; వాసుకి, చెలియలు+ఐన= వాసుకి చెల్లె లయిన; జరత్కారువునకున్= జరత్కారువు అనే ఆమెకును; జరత్కారుండు+అను= జరత్కారు డనే పేరున్న; మహత్, మునికిన్= గొప్పవా డైన ఋషికిని; పుట్టెడు, వాఁడు= జనించేవాడు; అధిక, తేజస్వి= మిక్కిలి తేజస్సుతో కూడినవాడు; ఆస్తీకుండు+ అను= ఆస్తీకు డనే; మహత్, ముని= గొప్పముని; జనమేజయ= జనమేజయుడిచేత; సమారబ్ధ= చక్కగా ఆరంభింపబడిన; సర్ప, సత్త్ర, ప్రళయంబువలనన్= సర్పయజ్ఞంలో జరిగే నాశంవలన; రక్షించును+అని= కాపాడుతా డని; పితామహుండు= బ్రహ్మ; దేవతలకున్= దేవతలకు; చెప్పిన, తెఱంగు= విధం; చెప్పినన్= చెప్పగా; వాసుకి, ప్రముఖ, నాగముఖ్యులు+ఎల్లన్= వాసుకి మొదలయిన సర్పశ్రేష్ఠులు అందరును; సంతసిల్లి= సంతోషించి; ఏలాపుత్త్రున్= ఏలాపుత్రు డనే పేరున్న నాగకుమారుడిని; ఎత్తుకొని; సాధువాదంబులన్= మంచిమాటలతో, (సంతోషంతో కూడిన పలుకులతో); అభినందించిరి= స్తుతించారు; వాసుకియున్= వాసుకికూడ; నాఁటంగోలెన్= అప్పటినుండి; జరత్కారు మునీంద్రుండు= జరత్కారువు అనే మునిశ్రేష్ఠుడు; ఎన్నండు= ఎప్పుడు; దారపరిగ్రహంబు= భార్యను గ్రహించటం; చేయును+ఓ= చేయగలడో! అని; తద్+సమయ, సమాగమంబు= ఆసమయంయొక్క రాకను; (జరత్కారుడు జరత్కారువును భార్యగా గ్రహించేసమయం ఎప్పుడు వస్తుందా? అని); అపేక్షించి, ఉండు+అంతన్= కోరుకొంటూ ఉండగా.

**తాత్పర్యం:** మఱియు సర్వలోకాలకు మేలు కలిగించేవారై, ప్రఖ్యాతు లయిన ముఖ్యు లయిన నాగులనందరిని వాసుకిచెల్లె లయిన జరుత్కారువుకూ, జరత్కారు డనే గొప్పమునికీ జనించేవాడూ మిక్కిలిప్రకాశం కలవాడూ అయిన ఆస్తీకు డనే మహాముని జనమేజయుడిచేత ప్రారంభింపబడిన సర్పయాగప్రళయం నుండి రక్షిస్తా డని బ్రహ్మ దేవతలకు చెప్పిన విధాన్ని తెల్పగా, నాగశ్రేష్ఠులందరు సంతోషం పొంది ఏలాపుత్రు డనే నాగకుమారుని ఎత్తుకొని మృదువచనాలతో పొగిడారు. వాసుకి అప్పటినుండి జరత్కారుడు ఎప్పుడు భార్యను పరిగ్రహిస్తాడో అని ఆ సమయంయొక్క రాకకై కాంక్షిస్తూ ఉండగా- (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. పరమతపోనిధి, యాయా၊ వరవంశోత్తముఁడు, నియమవంతుఁడు, లోకో**
**త్తరుఁడు, జరత్కారుఁడు నాఁ । బరఁగిన ముని బ్రహ్మచర్యపరిపాలకుఁ డై. 137**

**ప్రతిపదార్థం:** పరమ, తపస్+నిధి= గొప్పతపస్సుకు నిలయమైనవాడు; యాయావర, వంశ+ఉత్తముఁడు= యాయావర వంశంలో గొప్పవాడు; నియమవంతుఁడు= బ్రహ్మచర్యాది నియమాలు కలవాడు; లోక+ఉత్తరుఁడు= అతిలోకమహిమ కలవాడు; జరత్కారుఁడు; నాన్= జరత్కారుడు అనే పేరుతో; పరఁగిన= ఒప్పిన; ముని; బ్రహ్మ, చర్య, పరిపాలకుఁడు+ఐ= బ్రహ్మచర్యవ్రతాన్ని ఆచరించేవాడై.

**తాత్పర్యం:** గొప్పతపస్సుకు నిలయ మైన వాడు, యాయావర మనే వంశంలో శ్రేష్ఠుడు, బ్రహ్మచర్యాదినియమాలు కలవాడు, లోకాతీతుడు అయిన జరత్కారు డనే పేరుగల ముని బ్రహ్మచర్యాన్ని ఆచరించేవా డై.

**క. ఘోరవ్రతములు సలుపుచు । దారపరిగ్రహము సేయఁ దా నొల్లక, సం**
**సారపునర్భవభీతి న । పారవ్యామోహపాశబంధచ్యుతుఁ డై. 138**

**ప్రతిపదార్థం:** ఘోరవ్రతములు= అతికఠిన మైన పూజాది వ్రతాలు(ఉపవాసాదులు); సలుపుచున్= చేస్తూ; దారపరిగ్రహము, చేయన్= భార్యను గ్రహించటానికి; తాను, ఒల్లక= ఆజరత్కారుడు ఇష్టపడక; సంసార, పునః+భవ, భీతిన్= ప్రపంచంలో మళ్ళీపుట్టటం వలని భయంచేత; అపార, వ్యామోహ, పాశ, బంధ, చ్యుతుఁడు+ఐ= అంతులేని మిక్కిలి అజ్ఞానంఅనే త్రాళ్ళబంధంనుండి విముక్తుడై.

**తాత్పర్యం:** అతికఠిన మైన పూజాదివ్రతాలు చేస్తూ భార్యను గ్రహించటానికి ఆ జరత్కారుడు ఇష్టపడక సంసారంలో మళ్ళీ జన్మ కలుగుతుం దనే భయంవలన, అంతులేని అధికవ్యామోహ మనే త్రాళ్ళబంధంనుండి విముక్తు డై.

**వ. తపస్స్వాధ్యాయ బ్రహ్మచర్యవ్రతంబులం జేసి ఋషులఋణంబుల నీఁగుచుఁ బరిభ్రమించువాఁడు వనంబులో నొక్కపల్వలంబు గని, యందు మూషికవిలూనం బయి యొక్కమూలంబు తక్కియున్న వీరణతృణస్తంబంబు నవలంబించి తలక్రిం దై యాదిత్యకిరణంబు లాహారంబుగా వ్రేలుచున్న ఋషులం గొందఱం జూచి డాయంబోయి జరత్కారుం డి ట్లనియె. 139**

**ప్రతిపదార్థం:** తపస్+స్వాధ్యాయ, బ్రహ్మచర్య, వ్రతంబులన్, చేసి= తపస్సు, వేదాధ్యయనం, బ్రహ్మచర్యవ్రతం అనే వాటిచేత, ఋషులఋణంబులన్= ఋషులయొక్క ఋణాలను; ఈఁగుచున్= తొలగిస్తూ; పరిభ్రమించువాఁడు= తిరిగేవాడు; వనంబులోన్= అడవిలో; ఒక్కపల్వలంబు= ఒకనీటిపడియను; కని=చూచి; అందున్= ఆ పల్వలంలో; మూషికవిలూనంబు+అయి= ఎలుకలచే ఖండింపబడి; ఒక్కమూలంబు= ఒక్కవేరు; తక్కి+ఉన్నదానిన్= మిగిలిఉన్నదాన్ని; వీరణతృణస్తంబంబున్= ఔరుగడ్డిదుబ్బును; అవలంబించి= పట్టుకొని; తలక్రిందు+ఐ; ఆదిత్యకిరణంబులు= సూర్యకిరణాలు; ఆహారంబుగాన్= భోజనంగా; వ్రేలుచున్, ఉన్న= వ్రేలాడుతున్న; ఋషులన్ కొందఱన్= కొందరుమునులను; చూచి; డాయన్, పోయి= సమీపించి; జరత్కారుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** తపస్సు, వేదాలు చదవటం, బ్రహ్మచర్యవ్రతం అనే వాటిచేత ఋషులయొక్క ఋణాన్ని తొలగిస్తూ తిరిగే జరత్కారుడు అడవిలో ఒకనీటిపడియను చూచి అందు ఎలుకలచే కొరకబడి ఒక్కవేరుమాత్రమే మిగిలిఉన్న ఔరుగడ్డిదుబ్బును పట్టుకొని తలక్రిందుగా సూర్యుడి కిరణాలే తిండిగా వ్రేలాడుతున్న కొందరుఋషులను చూచి సమీపించి వారితో ఇట్లా పలికాడు.

**విశేషం:** యజ్ఞాదులచేత దేవతలఋణాన్ని, వేదాధ్యయనంచేత ఋషులఋణాన్ని, సంతానప్రాప్తిచేత పితృదేవతలఋణాన్ని తొలగించవచ్చని శాస్త్రాలు చెప్పుతాయి. జరత్కారుడు ఒక్క ఋషిఋణాన్ని మాత్రమే తొలగించుకొనగలిగాడు.

**క. 'కడునుగ్రము దలక్రిందుగఁ । బడి వ్రేలుట; యిదియు నొక తపంబొకొ; నా కే**
**ర్పడఁ జెప్పుఁ డీ తపం, బేఁ । దొడఁగెద' ననవుడును నయ్యధోముఖవిప్రుల్. 140**

**ప్రతిపదార్థం:** తలక్రిందుగన్= తల క్రింద ఉండేటట్లు; పడివ్రేలుట= ఉండి వ్రేలాడటం; కడున్, ఉగ్రము= మిక్కిలి భయంకరం; ఇదియున్= ఇట్లా తలక్రిందుగా వ్రేలాడటం; ఒక, తపంబు+ఒకొ= ఒక తపస్సుయొక్క విధమా! నాకున్; ఏర్పడన్, చెప్పుఁడు= తేటపడేట్లుగా తెల్పండి; ఏన్= నేను; ఈ, తపంబు; తొడఁగెదన్= చేయబూనుతాను; అనవుడున్= అనిన అనంతరం; ఆ+అధః+ముఖ, విప్రుల్= క్రిందికి ముఖం ఉండేటట్లుగా వ్రేలాడుతుండే ఆబ్రాహ్మణులు.

**తాత్పర్యం:** తలక్రిందుగా ఉండి వ్రేలాడటం మిక్కిలి భయంకరం. ఇట్లా చేయటంకూడ ఒకతపోవిశేషమా? నాకు స్పష్టంగా చెప్పండి; ఈతపస్సును నేనుకూడ చేయబూనుతాను'. అని జరత్కారుడు పలుకగా ముఖంక్రిందుగా వ్రేలాడుతుండే ఆ మునులు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అనఘ! యిది యేటి తప, మే । మనుపమ దుఃఖితుల మగుట, నాధారము లే**
**కను సంతానోచ్ఛేదం । బున వ్రేలెద మధమలోకమున తెరువు చనన్. 141**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుఁడా! ఇది= ఇట్లా తలక్రిందుగా వ్రేలాడటం; ఏటి, తపము= ఎట్టి తపస్సు (తపస్సు కాదనిభావం); ఏము= మేము; అనుపమ, దుఃఖితులము+అగుటన్= సాటిలేని శోకం కలవార మవటం చేత; సంతాన+ఉచ్ఛేదంబునన్= సంతానంయొక్క లేమిచేత; (సంతానసూత్రం తెగిపోవటంచేత); ఆధారము, లేకను= అవలంబంలేక; అధమలోకమున, తెరువు= నీచమైన లోకంయొక్క మార్గంలో; చనన్= వెళ్ళటానికి; వ్రేలెదము= వ్రేలాడుతున్నాము.

**తాత్పర్యం:** పాపరహితుఁడా! ఇది ఏమి తపస్సు? మేము సాటిలేని చింతకు గురిఅయినవాళ్ళ మవటంచేత, మా తరువాత సంతానం లేకున్నకారణాన ఆధారం లేక హీన మైన లోకంయొక్కమార్గంలో వెళ్ళటానికి ఇట్లా వ్రేలాడుతున్నాం.

**విశేషం:** లేక-వ్యతిరేకక్త్వార్థకం. ఇది కళయే. ఇచట 'ను' అర్థవిశేషంలో వాడబడింది. 'లేదని' - అని పాఠాంతరం. లోకము+తెరువు- ఒక్కొక్కప్పుడు తత్పురుషసమాసంలో 'న' ఆగమంగా వస్తుంది.

**వ. మందభాగ్యుల మయిన మావంశంబున జరత్కారుం డను పాపకర్ముండు పుట్టి దారపరిగ్రహంబు సేయను, సంతానంబు వడయను నొల్లకున్నవాఁ; డే మాతని పితృపితామహులము; మాపట్టిన యవురుగంటవేళ్ళెల్లం గాలుండు మూషికవ్యాజంబునం దరతరంబ కొఱికిన నొక్కవేర తక్కియున్నయిది; యదియును జరత్కారుం డనపత్యుం డయినం దెగు; నే మధఃపాతుల మగుదు; మాతం డపత్యంబు వడసెనేని యూర్ధ్వగతుల మగుదుము. 142**

**ప్రతిపదార్థం:** మందభాగ్యులము+అయి= హీన మైన అదృష్టం కలవారమైన; మావంశంబునన్= మావంశంలో; జరత్కారుండు+అను; పాపకర్ముండు= పాపంతో కూడిన పనులు కలవాడు; పుట్టి; దారపరిగ్రహంబు= భార్యను గ్రహించటం (పెండ్లి చేసికోవటం); చేయను= చేయటానికి; సంతానంబు= సంతతిని; పడయనున్= పొందటానికి; ఒల్లక+ఉన్నవాఁడు= అంగీకరించకున్నాడు; ఏము= మేము; అతని పితృపితామహులము= అతని తండ్రి తాతలం; మాపట్టిన (కర్తృపదప్రథమకు షష్ఠి)= మేం పట్టుకొన్న; అవురు, గంట, వేళ్ళు, ఎల్లన్= ఔరుగడ్డి దుబ్బు వేళ్ళన్నీ; కాలుండు= యముడు; మూషికవ్యాజంబునన్= ఎలుక లనే మిషచేత; తరతరంబు+అ= క్రమంగా; కొఱికినన్= కొరికి వేయగా; ఒక్క, వేరు+అ= ఒక్కవేరుమాత్రమే; తక్కి, ఉన్న, అది= మిగిలిఉన్నది; అదియును= ఆ ఒక్కవేరుకూడ; జరత్కారుండు; అనపత్యుండు+అయినన్= సంతానం లేనివా డయితే; తెగున్= తెగిపోతుంది (ఛిన్నమవుతుంది); ఏము= మేము; అధఃపాతులము= క్రిందపడేవాళ్ళం; అగుదుము; అతండు= ఆ జరత్కారుడు; అపత్యంబు= సంతానం; పడసెన్+ఏని= పొందితే; ఊర్ధ్వగతులము= పైలోకాలకు పోయేవాళ్ళం; అగుదుము.

**తాత్పర్యం:** అదృష్టహీనుల మైన మావంశంలో జరత్కారు డనే పాపాత్ముడు పుట్టి పెండ్లి చేసుకొనటానికీ, సంతానం పొందటానికీ అంగీకరించ కున్నాడు; మే మాతని తండ్రితాతలం; మేము పట్టుకొని వేలాడుతున్న ఔరుగడ్డి

దుబ్బువేళ్ళ నన్నింటిని యముడు ఎలుకలమిషతో క్రమంగా కొరికి వేస్తే ఒక్కవేరుమాత్రం మిగిలి ఉన్నది. జరత్కారుడు సంతానం పొందకపోతే ఆవేరుకూడ తెగిపోతుంది. అప్పుడు మేము అధోలోకాలలో పడతాం. అతడు సంతానం పొందితే పైలోకాలకు పోయేవాళ్ళం అవుతాం.

**తే. నీవు మాచుట్టమవపోలె నెమ్మితోడ । నవహితుండ వై మాపల్కు లాదరించి;**
**తా జరత్కారుఁ గని చెప్పవయ్య వాని । నెఱుఁగుదేని మాపడియెడు నీయవస్థ. 143**

**ప్రతిపదార్థం:** నీవు; మా, చుట్టమవు+అ, పోలెన్= మాబంధువువలె; నెమ్మితోడన్= ప్రీతితో; అవహితుండవు+ఐ= ఏకాగ్రచిత్తుడ వయి; మాపల్కులు= మామాటలు; ఆదరించితి(వి); ఆ జరత్కారున్= ఆ జరత్కారుని; కని= చూచి; వానిన్= అతనిని; ఎఱుఁగుదు+ఏని= తెలిసిఉంటే; మాపడియెడు= మేం పొందే; ఈ, అవస్థ= ఈదుర్గతి, చెప్పవు+అయ్య= తెల్పవయ్య.

**తాత్పర్యం:** నీవు ఎవరో మాకు బంధువువలె ప్రీతితో ఏకాగ్రచిత్తుడ వై మామాటలు విని మన్నించావు. ఆ జరత్కారుడిని ఎరుగుదువేని మేం పొందే ఈదురవస్థ వానికి తెలియజెప్పుము.

**విశేషం:** మాచుట్టమువలె, (మాపల్కులు,) మాపడియెడు ఈ అవస్థ వీటిలోని అస్మదర్థకసర్వనామాలు పదగతములై అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనికి అంగాలైనవి. పదగతమని, వాక్యగతమని అర్థాంతరసంక్రమితవాచ్యధ్వని రెండురకాలు. ఈ రెండింటిని నిపుణంగా పలుచోట్ల కథాసందర్భాలలో ప్రయోగించాడు నన్నయ.

**వ. అనిన విని జరత్కారుం డతికారుణ్యచిత్తుం డయి, యపత్యార్థం బవశ్యంబు వివాహంబు గావలయు నని యెంతయుం బ్రొద్దు చింతించి తన పితృవర్గంబున కి ట్లనియె. 144**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= పితృదేవతలు అట్లా పలికితే విని; జరత్కారుండు; అతి, కారుణ్య, చిత్తుండు+అయి= మిక్కిలి జాలితో కూడిన హృదయం కలవా డయి; అపత్య+అర్థంబు= సంతానంకొరకు; అవశ్యంబు= తప్పక; వివాహంబు, కావలయున్, అని= పెండ్లి చేసికొనాలని; ఎంతయున్, ప్రొద్దు= చాలాసేపు; చింతించి= ఆలోచించి (దుఃఖించి); తన, పితృ, వర్గంబునకున్= తన తండ్రి తాతల సముదాయంతో; ఇట్లు+ అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పితృదేవత లిట్లా పలుకగా, జరత్కారుడు మిక్కిలి దయతో కూడిన హృదయం కలవా డయి సంతానంకొరకు తప్పక పెండ్లిచేసుకోవా లని చాలాసేపు ఆలోచించి తన పితృదేవతల సముదాయంతో ఇట్లా పలికాడు.

**క. మీరలు నాపితృదేవత । లారాధ్యుల; రేను మీకు నాత్మజుఁడ; జర**
**త్కారుఁ డనువాఁడ; ముందఱ । దారపరిగ్రహము సేయఁ దగులదు బుద్ధిన్. 145**

**ప్రతిపదార్థం:** మీరలు; నాపితృదేవతలు= నాతండ్రితాతలు; ఆరాధ్యులరు= పూజింపదగినవారు; ఏను=నేను; మీకున్; ఆత్మజుఁడ= కుమారుడను; జరత్కారుఁడు+అనువాఁడన్= జరత్కారు డనే పేరు గలవాడను; ముందఱన్= ఇంతకుముందు; దార, పరిగ్రహము, చేయన్= భార్యను గ్రహించటానికి (పెండ్లి చేసికొనటానికి); బుద్ధిన్= మనస్సులో; తగులదు= (ఆసక్తి) పుట్టదు.

**తాత్పర్యం:** మీరు నా పితృదేవతలు; నాకు పూజింపదగినవారు; నేను మీకుమారుడిని; జరత్కారు డనే పేరు గలవాడిని; ఇంతకుముందు నాకు పెండ్లి చేసికొనాలనే ఆసక్తి మనస్సులో పుట్టలేదు.

**విశేషం:** ఆరాధ్యులు- యుష్మద్విశేషణం, బహువచనం - 'రు' ఆగమంగా వచ్చింది. ఈ ఆగమానికి ముందున్న ఉత్వానికి అత్వంకలిగింది.- ఆరాధ్యులరు.

**క. మి మ్మిట్లు చూచి, మీకు హి । త మ్మెట్లగు నట్లకా ముదంబున దారా**
**ర్థమ్ము ప్రవర్తింపఁగఁ జి । త్తమ్మిప్పుడు పుట్టె నాకు ధర్మస్థితి మై. 146**

**ప్రతిపదార్థం:** మిమ్ము+ఇట్లు= మిమ్ము ఈ విధంగా వ్రేలాడుతుండగా; చూచి; మీకున్; హితమ్ము= మేలు; ఎట్లు= ఏవిధంగా; అగున్= అవుతుందో; అట్లు+అ, కాన్= అట్లే అగునట్లుగా; ముదంబునన్= సంతోషంతో; దార+అర్థమ్ము= భార్యకోసం; (పెండ్లినిమిత్తం); ప్రవర్తింపఁగన్= వర్తించటానికి; ధర్మస్థితిమైన్= ధర్మంతో కూడిన స్థితితో; నాకున్; చిత్తమ్ము= మనస్సు(కోరిక); ఇప్పుడు, పుట్టెన్= ఇప్పుడు పుట్టింది.

**తాత్పర్యం:** ఇట్లా వ్రేలాడుతున్న మిమ్ము చూచి మీకు మే లెట్లా అవుతుందో అట్లే అవునట్లుగా సంతోషంతో ధర్మంతో కూడిన స్థితితో పెండ్లాడే నిమిత్తం వర్తించా లని నా కిప్పుడు మనసు పుట్టింది.

**వ. అనిన నమ్మహామునులు జరత్కారుపల్కులకు సంతసిల్లి యి ట్లనిరి. 147**

**ప్రతిపదార్థం:** అనినన్= అని జరత్కారుడు పలుకగా; ఆ+మహత్+మునులు= ఆ గొప్పమునులు; జరత్కారుపల్కులకున్; సంతసిల్లి= సంతోషించి; ఇట్లు+అనిరి= ఇట్లు పలికారు.

**తాత్పర్యం:** అని జరత్కారుడు పలుకగా, వ్రేలాడుతున్న ఆగొప్పమునులు అతనిమాటలకు సంతోషించి ఈవిధంగా పలికారు.

**చ. తగియెడు పుత్త్రులం బడసి, ధర్మువు దప్పక, తమ్ము నుత్తముల్**
**పొగడఁగ మన్మహామతులు పొందుగతుల్ గడుఘోరనిష్ఠతోఁ**
**దగిలి తపంబు సేసియును, దక్షిణ లిమ్ముగ నిచ్చి యజ్ఞముల్**
**నెగడఁగఁ జేసియుం, బడయనేర రపుత్త్రకు లైన దుర్మతుల్. 148**

**ప్రతిపదార్థం:** తగియెడు= తగిన(ఉత్తములైన); పుత్త్రులన్= కొడుకులను; పడసి= పొంది; ధర్మువు= ధర్మం; తప్పక= వీడక; తమ్మున్; ఉత్తముల్= మంచివారు; పొగడఁగన్= పొగడునట్లుగా; మన్+మహత్+మతులు= జీవించే గొప్పబుద్ధిమంతులు; పొందు, గతుల్= పొందేటి స్థితులు; కడు, ఘోర, నిష్ఠతోన్= మిక్కిలి కఠినమైన నియమంతో; తగిలి= ఆసక్తికలిగి; తపంబు, చేసియును; దక్షిణలు= సంభావనలు; ఇమ్ముగన్= ఒప్పుగా; ఇచ్చి; యజ్ఞముల్= యాగాలు; నెగడఁగన్= అధిక మవునట్లుగా; చేసియున్= చేసినప్పటికిని; అపుత్త్రకులు+ఐన= కొడుకులు లేనట్టి; దుర్మతుల్= దుష్టబుద్ధి కలవారు(చెడ్డవారు); పడయన్, నేరరు= పొందజాలరు.

**తాత్పర్యం:** యోగ్యు లయిన కొడుకులను పొంది ధర్మమార్గం తొలగకుండ తమ్ము సజ్జనులు పొగడేట్లుగా జీవించే గొప్ప బుద్ధిమంతులు పొందే ఉత్తమలోకాలను మిక్కిలి కఠిన మైన నిష్ఠతో విడువక తపస్సు చేసినప్పటికీ, ఒప్పుగా దక్షిణ లిచ్చి యజ్ఞాలు అధికంగా చేసినప్పటికీ పుత్రహీను లైన దుర్జనులు (అట్టిగతులు) పొందజాలరు.

**విశేషం:** మను+మహామతులు - మనుధాతువుయొక్క తద్ధర్మవిశేషణం 'మను' - (మనెడు, మనెడి అనేవి ఇతరరూపాలు) ఇచ్చట 'మను' అనేరూపంలోని 'ఉ' కారం లోపిస్తే 'మన్‌మహామతులు' అని అయింది. నన్నయ రుచిరార్థసూక్తికి ఉదాహరణం ఈపద్యం.

## జరత్కారుండు వివాహంబు చేసికొనఁబూనుట (సం. 1-42-9)

**వ.** **'కావున నీవు కృతదారపరిగ్రహుండ వై సంతానంబు వడసి, మమ్ము నూర్ధ్వలోకగతులం జేయు' మనిన, జరత్కారుం 'డట్లేని నాకు సనామ్ని యయినదాని వివాహంబు గావలయు' నని వారికి నమస్కరించి వీడ్కొని, సనామ కన్యాన్వేషణపరుం డై భూవలయం బెల్లఁ గలయం గ్రుమ్మరి. 149**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నీవు; కృత, దార, పరిగ్రహుండవు+ఐ= చేయబడిన భార్యయొక్క గ్రహణంకలవాడి వై (పెండ్లాడి); సంతానంబు, పడసి= సంతానం పొంది; మమ్మున్, ఊర్ధ్వలోక, గతులన్= ఉన్నతలోకాలకు పోయే వాళ్ళను; చేయుము+అనినన్= చేయు మని పితృదేవతలు పలుకగా; జరత్కారుండు; అట్లు+ఏని= నేను పెండ్లాడి సంతానం పొందా లంటే; నాకు; సనామ్ని, అయిన, దానిన్= సమానమయిన పేరు కలిగిన దాన్ని; (జరత్కారువు అనే పేరు కలిగినదానిని); వివాహంబు, కావలయున్= పెండ్లాడాలి; అని; వారికిన్= పితృదేవతలకు; నమస్కరించి; వీడ్కొని= వదలి; సనామ, కన్యా+అన్వేషణ, పరుండు+ఐ= తనపేరుతో సమాన మైన పేరున్న కన్యను వెదకటంలో ఆసక్తి కలవా డయి; భూవలయంబు+ఎల్లన్= సర్వభూచక్రాన; కలయన్= అంతటా; క్రుమ్మరి= తిరిగి.

**తాత్పర్యం:** 'కాబట్టి నీవు భార్యను గ్రహించి, సంతానం పొంది, మమ్ము ఉన్నతలోకాలకు వేళ్ళేవాళ్ళనుగా చేయు' మని పితృదేవతలు పలుకగా, జరత్కారుడు 'అట్లయితే నేను నాతో సమానమయిన పేరు కల కన్యను పెండ్లాడాలి' అని వారికి నమస్కరించి వారివద్ద సెలవు తీసికొని తనపేరుతో సమాన మయిన పేరు కల కన్యను వెదకటంలో ఆసక్తికలవా డయి భూచక్రమంతా తిరిగి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తరువోజ.**

**అనవరతవ్రతాయాసఖేదమున నతికృశం బగుచున్న యంగంబునందుఁ**
**దనరి యేర్పడ సిరల్, దద్దయు ముదిమిఁ దల వడంకుచునుండఁ, దన పితృవరుల**
**ఘనముగా నూర్ధ్వాభిగమనులఁ జేయఁగడఁగి వివాహంబుగా జరత్కారుఁ**
**డనఘుండు దనకోర్కి కనురూప యైనయట్టి కన్యకఁ గానఁ డయ్యె మర్త్యమున. 150**

**ప్రతిపదార్థం:** అనవరత, వ్రత+ఆయాస, ఖేదమునన్= ఎడతెగకుండ వ్రతాలు చేయటంవలని శ్రమచే కలిగిన దుఃఖంచేత; అతి, కృశంబు+అగుచున్న= మిక్కిలి చిక్కిన; అంగంబునందున్= శరీరంలో; తనరి= అతిశయించి; సిరల్= నాడులు; ఏర్పడన్= స్పష్టంగాబయట పడగా; తద్దయున్= మిక్కిలి; ముదిమిన్= ముసలితనంచేత; తల, వడంకుచున్, ఉండన్= తల

వణికిపోతుండగా; తన పితృవరులన్= శ్రేష్ఠు లైన తన తాతతండ్రులను; ఘనముగాన్= గొప్పగా; ఊర్ధ్వ+అభిగమనులన్= ఉన్నతలోకాలకు పోయే వారినిగా; చేయన్, కడఁగి= చేయబూని; వివాహంబు, కాన్= పెండ్లాడటానికి; అనఘుండు= పాపరహితు డయిన; జరత్కారుఁడు; తనకోర్కికిన్= తనకోరికకు (తనతో సమానమయినపేరు గల కన్యను పొందటం అతని కోరిక); అనురూప, ఐన అట్టి= తగినట్టి; కన్యకన్= కన్యను; మర్త్యమునన్= భూలోకంలో; కానఁడు+అయ్యెన్= చూడలేకపోయాడు (పొందలేనివా డయ్యాడు).

**తాత్పర్యం:** ఎల్లప్పుడూ వ్రతాలు చేయటంవలని శ్రమచేత కలిగే దుఃఖంవలన మిక్కిలి చిక్కిపోతున్న శరీరంలో అధికంగా నాడులు బయటపడగా, ముసలితనంచేత తల వణకుతూ ఉన్న, శ్రేష్ఠు లైన తన తాతతండ్రులను గొప్పగా ఉన్నతలోకాలకు పంపబూని వివాహ మాడటానికి పాపరహితు డయిన జరత్కారుడు తనకోరికకు తగినట్టి కన్యను భూలోకంలో పొందలేనివా డయ్యాడు.

**విశేషం:** తల వడంకుచునుండు తన పితృవరుల- అని పాఠాంతరం. ఈపాఠమే సరసంగా ఉన్నది, ప్రౌఢవ్యాకరణకారుడు దీన్నే గ్రహించాడు. రెండుద్విపదపాదాలు కలిస్తే ఒకతరువోజ పాద మవుతుంది. 3 ఇంద్రగణాలు, 1 సూర్యగణం, మళ్ళీ 3 ఇంద్రగణాలు, 1 సూర్యగణం ప్రతిపాదంలో ఉంటాయి. 3వగణాద్యక్షరం యతిమిత్రస్థానం. ఉత్తరార్ధంలో కూడ ఆయతియే కొనసాగాలి. ప్రాసనియమం ఉన్నది.

**వ. ఇట్లు జరత్కారుండు వివాహాపేక్షం బ్రతీక్షించుచున్న వాసుకియుం దనచారులవలన నంతయు నెఱింగి, నిజసహోదరి యైన జరత్కారుం దోడ్కొని జరత్కారుమహామునిపాలికిం బోయి యి ట్లనియె. 151**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; జరత్కారుండు; వివాహ+అపేక్షన్= పెండ్లిమీదికోరికతో; ప్రతీక్షించుచున్నన్= ఎదురుచూస్తూండగా; వాసుకియున్= వాసుకికూడ; తన, చారుల, వలనన్= తనవేగులవారివలన; అంతయున్= ఆవిషయమంతా; ఎఱింగి= తెలిసికొని; నిజ, సహోదరి+అయిన= తనతోబుట్టువయిన; జరత్కారున్= జరత్కారువు అనే పేరున్నదానిని; తోడ్కొని= తనవెంట తీసికొని; జరత్కారు, మహత్, ముని, పాలికిన్= జరత్కారుడనే గొప్పమునిచెంతకు; పోయి= వెళ్ళి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా జరత్కారుడు వివాహంమీదికోరికతో ఎదురుచూస్తూండగా, వాసుకికూడ తనసేవకులవలన విషయాన్నంతటినీ తెలిసికొని తన తోబుట్టు వయిన జరత్కారువును వెంటతీసికొని జరత్కారుమునిచెంతకు వెళ్ళి ఇట్లా పలికాడు.

**శా. ధన్యం బయ్యె భవత్కులం, బతి కృతార్థం బయ్యె నస్మత్కులం,**
**బన్యోన్యానుగుణాభిధానములఁ జిత్తానంద మొందెన్ వివే**
**కన్యాయాన్విత భూసురోత్తమ! జరత్కారూ! జగన్మాన్య! యి**
**క్కన్యాభిక్షఁ బరిగ్రహింపుము జరత్కారున్ మదీయానుజన్. 152**

**ప్రతిపదార్థం:** వివేక, న్యాయ+అన్విత= జ్ఞానంతోను, ధర్మంతోను కూడినవాడ! భూసుర+ఉత్తమ= బ్రాహ్మణశ్రేష్ఠుడా! జగత్+మాన్య= లోకంచేత పూజింపదగినవాడా! జరత్కారూ= ఓజరత్కారుమహర్షీ! భవత్కులంబు= మీవంశం; ధన్యంబు= పుణ్యవంతం; అయ్యెన్= అయింది; అస్మత్, కులంబు= మావంశం; కృతార్థంబు= ధన్యం; అయ్యెన్; అన్యోన్య+

అనుగుణ+అభిధానములన్= ఒండొరులకు తగినపేర్లచేత; చిత్త+ఆనందము= హృదయంలో సంతోషం; ఒందెన్= కలిగింది; మదీయ+అనుజన్= నాయొక్కచెల్లెలిని; జరత్కారున్= జరత్కారువు అనేదాన్ని; ఈ+కన్యాభిక్షన్= ఈకన్యారూప మయిన భిక్షను; పరిగ్రహింపుము= ప్రియంతో స్వీకరించండి.

**తాత్పర్యం:** జ్ఞానంతోను ధర్మంతోను కూడినవాడా! బ్రాహ్మణశ్రేష్ఠుడా! లోకపూజ్యుడా! జరత్కారుమహర్షీ! మీవంశం పుణ్యవంత మయింది. మావంశం ధన్య మయింది. నీకూ మాచెల్లెలికిని ఉండే ఒండొరులకు తగిన గుణాలచేత, పేర్లచేత హృదయంలో ఆనందం కలిగింది. నాచెల్లె లైన ఈజరత్కారువును వివాహార్థమై కన్యారూప మైన భిక్షగా ప్రీతితో గ్రహించండి.

**విశేషం:** ఇచట వాసుకి చెల్లెలిపేరూ, జరత్కారుమహర్షిపేరూ, సమానా లవటంచేత ఒండొరులకు ఆనుకూల్యం ఏర్పడింది. జరత్కారుడు తనపితృదేవతలతో తనకు సనామ అయిన కన్య దొరికితే పెండ్లిచేసికొంటా నని చెప్పాడు. అట్లే సనామ అయిన కన్య అతనికి లభించింది.

**వ. అనిన నొడంబడి, జరత్కారుండు సనామ యగుటంజేసి యక్కన్యకను వివాహం బై, ప్రథమసమాగమంబునం దన ధర్మపత్నికి సమయంబు సేసె; 'నాకు నీ వెన్నండేని యవమానంబు దలంచితి, నాఁడ నిన్నుం బాసి పోవుదు' ననిన నాఁటంగోలె. 153**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వాసుకి పలుకగా; ఒడంబడి= అంగీకరించి; జరత్కారుండు; సనామ, అగుటన్, చేసి= తనతో సమాన మయిన పేరు కలది అవటంచేత; ఆ+కన్యను= ఆజరత్కారువును; వివాహంబు+అయి= పెండ్లాడి; ప్రథమ, సమాగమంబునన్= మొదటికలయికలో; తనధర్మపత్నికిన్= తన భార్యకు (అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్య ధర్మపత్ని); సమయంబు= నియమం; చేసెన్= చేశాడు; నీవు; ఎన్నండు+ఏని= ఎప్పుడైనా; నాకున్; అవమానంబు= అగౌరవం; తలంచితి(వి)= తలపోశావో; నాఁడు+అ= ఆరోజుననే; నిన్నున్; పాసి= విడిచి, పోవుదున్= వెడతాను; అనినన్= అని పలుకగా; నాఁటన్, కోలెన్= ఆరోజునుండి.

**తాత్పర్యం:** అని వాసుకి పలుకగా జరత్కారుమహాముని తనతో సమానమయిన పేరు కలదవటంచేత ఆ కన్యను పెండ్లాడి మొదటి కూడికలోనే (మొట్టమొదటిసారి ఆమెను కూడినప్పుడే) తనభార్యకు 'నాకు నీవు ఎప్పుడు అగౌరవం తలపోస్తావో ఆరోజుననే నిన్ను విడిచిపోతాను' అని నియమం చేశాడు. ఆనాటినుండి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'తలంచితి(వి)' ఇచ్చట భూతకాల మవటంచేత 'వ' కారానికి లోపం. 'కోలె' అనేది నన్నయనాడు పంచమీ విభక్తి ప్రత్యయంగా వాడబడుతూ ఉండేది.

**క. వాలుపయి నడచున ట్లి బ్బాలిక నడునడ నడుంగి భయమున నియమా
భీలుఁ డగు పతికిఁ బవకుల్ । రేలును నేమఱక పరిచరించుచు నుండెన్. 154**

**ప్రతిపదార్థం:** ఆ+బాలిక= జరత్కారు వనే ఆ కన్య; వాలుపయిన్= కత్తిమీద; నడచు+అట్లు; నడునడ= ఇది వణకటంలోని ధ్వన్యనుకరణం; నడుంగి= వణకి(శంకించి); భయమునన్= భయంతో; నియమ+ఆభీలుఁడు+అగు= నియమం చేయటంచేత భయంకరు డయిన; పతికిన్= భర్తకు; పవళుల్= పగటిపూటల్లోను; రేలునున్= రాత్రుల్లోను; ఏమఱక= అశ్రద్ధ వహించక; పరిచరించుచున్, ఉండెన్= సేవచేస్తూ ఉండింది.

**తాత్పర్యం:** కన్య అయిన ఆ జరత్కారువు కత్తిపై నడుస్తున్నట్లుగా భయంతో వడవడవణకి నియమంచేత భయంకరు డైన భర్తకు పగళ్ళూ, రాత్రిళ్ళూ పొరపాటు పడకుండ శ్రద్ధతో సేవ చేస్తూ ఉండేది.

**క. అనవరతభక్తిఁ బాయక । తనపతికిం బ్రియము సేసి, తద్దయు గర్భం**
**బనురక్తిఁ దాల్చి యొప్పెను । దినకరగర్భ యగు పూర్వదిక్సతివోలెన్. 155**

**ప్రతిపదార్థం:** అనవరత, భక్తిన్= నిరంతరమైనభక్తితో; పాయక= విడువక; తన, పతికిన్= తనభర్తఅయిన జరత్కారుడికి; తద్దయున్= మిక్కిలి; ప్రియము+చేసి; అనురక్తిన్= అనురాగంతో; గర్భంబు= గర్భాన్ని; తాల్చి= ధరించి; దిన, కర, గర్భ, అగు= సూర్యుడు గర్భంలో(మధ్యభాగంలో)ఉన్న; పూర్వదిక్, సతి, పోలెన్= తూర్పు ది క్కనే కాంతవలె; ఒప్పెను= ప్రకాశించింది.

**తాత్పర్యం:** జరత్కారువు ఎడతెగని భక్తితో విడువక తనభర్తకు మిక్కిలిప్రీతి ఒనరించి, అనురాగంతో గర్భం ధరించి సూర్యుడు గర్భంలో ఉన్న తూర్పుదిక్కు అనే కాంతవలె ప్రకాశించింది.

**విశేషం:** అలం: ఉపమ, రూపకం.

**వ. అక్కోమలి యొక్కనాఁడు దనకుఱువు దలయంపిగాఁ గృష్ణాజినాస్తరణంబున నిజనాథుండు నిద్రితుండై యున్న యవసరంబున నాదిత్యుం డస్తగిరిశిఖరాసన్నుం డగుటయు, సంధ్యాసమయోచితక్రియలు నిర్వర్తింపఁ దదాశ్రమవాసు లైన మునులు గడంగుటం జూచి యాత్మగతంబున. 156**

**ప్రతిపదార్థం:** ఆ+కోమలి= సుకుమారగాత్రి అయిన ఆ జరత్కారువు; ఒక్కనాఁడు; తన, కుఱువు= తనతొడ; తలయంపిగాన్= తలగడ అగునట్లుగా; కృష్ణ+అజిన+ఆస్తరణంబునన్= కృష్ణమృగచర్మరూప మయిన పక్కమీద; నిజనాథుండు= తన భర్త; నిద్రితుండు+ఐ= నిద్రపోతున్నవా డయి; ఉన్న, అవసరంబునన్= ఉన్న సమయంలో; ఆదిత్యుండు= సూర్యుడు; అస్తగిరి, శిఖర+ఆసన్నుండు= పడమటికొండకొనను సమీపించినవాడు; (అస్తమించటానికి సిద్ధంగా ఉన్నవాడు); అగుటయున్= కాగా; సంధ్యాసమయ+ఉచితక్రియలు= సంధ్యాసమయంలో చేయదగిన కర్మలు; నిర్వర్తింపన్= చేయటానికి; తద్+ఆశ్రమవాసులు+ఐన= ఆ ఆశ్రమంలో నివసించేవారయిన; మునులు= ఋషులు; కడంగుటన్= పూనటాన్ని; చూచి; ఆత్మగతంబునన్= తనలో.

**తాత్పర్యం:** సుకుమారగాత్రి అయిన ఆ జరత్కారువు తనతొడనే తలగడగా, కృష్ణమృగచర్మపుపక్కపై తనభర్త నిద్రిస్తున్న సమయంలో, సూర్యుడు పడమటికొండకొనను చేరగా (అస్తమించటానికి సిద్ధంగా ఉండగా) ఆ ఆశ్రమంలో నివసించే ఋషులు సంధ్యాకాలంలో చేయదగిన సంధ్యావందనాదికర్మలు చేయటానికి పూనగా చూచి తనలో (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. 'సంధ్యలం దొనరించు సద్విధుల్ గడచిన । ధర్మలోపం బగుఁ దడయ కేల**
**బోధింప వై తని భూసురప్రవరుండు । పదరునో, బోధింపఁబడి యవజ్ఞ**
**దగునె నా కిట్లు నిద్రాభంగ మొనరింప । నని యల్గునో, దీని కల్గెనేని**
**యలుకయ పడుదుఁ గా, కగునె ధర్మక్రియా । లోపంబు, హృదయంబులో సహింప'**

**ఆ. నని వినిశ్చితాత్మ యై నిజపతిఁ బ్రబో । ధించె; మునియు నిద్ర దేఱి యలిగి**
**'యేల నిద్రఁ జెఱిచి తీవు' నావుడు జర । త్కారు విట్టు లనియెఁ గరము వెఱచి. 157**

**ప్రతిపదార్థం:** సంధ్యలందున్= సంధ్యాకాలాల్లో; ఒనరించు= చేసే; సత్, విధుల్= మంచికర్మలు; కడచినన్= అతిక్రమిస్తే; ధర్మలోపంబు= ధర్మానికి భంగం; అగున్= అవుతుంది; తడయక= ఆలస్యం చేయక; ఏల= ఎందుకు?; బోధింపవు+ఐతి(వి) +అని= మేల్కొల్పవయితి వని (భూతకాలమవటంచేత 'అయితివి' లోని 'వ' కారం లోపించింది); భూసుర, ప్రవరుండు= విప్రశ్రేష్ఠు డైన జరత్కారుడు; పదరునో= కోపిస్తాడో!; బోధింపఁబడి= మేల్కొల్పబడి; అవజ్ఞన్= అవమానంతో; నాకున్; ఇట్లు= ఈవిధంగా; నిద్రాభంగము= నిద్రకు ఆటంకం; ఒనరింపన్= చేయగా; తగునె= యుక్తమవునా అని; అల్గునో= కోపించునో; అలుక+అ=కోపాన్నే; పడుదున్, కాక=అనుభవిస్తానుకాని; ధర్మక్రియాలోపంబు= చేయదగినధర్మకార్యాల, లోపాన్ని; (చేయకపోవటాన్ని); హృదయంబులోన్= చిత్తంలో; సహింపన్+అగునే= సయింపదగునా! అని; వినిశ్చిత+ఆత్మ+ఐ= నిశ్చయింపబడిన మనస్సు కలదై; నిజ, పతిన్= తనభర్తను; ప్రబోధించెన్= మేల్కొలిపింది; మునియున్= జరత్కారుమునికూడ; నిద్ర, తేఱి= నిద్రనుండి తేరుకొని(మేలుకొని); అలిగి= కోపించి; ఈవు=నీవు; ఏల= ఎందుకు; నిద్రన్; చెరిచితి(వి)= నిద్ర చెడేటట్లు చేశావు; నావుడున్= అనిన అనంతరం; కరము= మిక్కిలి; వెఱచి= భయపడి; జరత్కారువు= అతనిభార్య; ఇట్టులు+అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** సంధ్యాకాలాలలో చేయవలసిన సత్కర్మలు లోపిస్తే ధర్మభంగం అవుతుంది. ఆలస్యం చేయక ఎందుకు నన్ను మేల్కొల్ప లేదు? అని బ్రాహ్మణశ్రేష్ఠు డైన జరత్కారుడు కోపిస్తాడో? మేలుకొల్పబడి అవమానంగా భావించి నా కీ విధంగా నిద్రకు ఆటంకం కలిగించటం తగునా? అని కోపిస్తాడో! ఒకవేళ మేల్కొల్పినందుకు కోపిస్తే కోపాన్నే భరిస్తాను గాక! ధర్మకార్యానికి లోపం హృదయంలో సైపదగునా' అని హృదయంలో నిశ్చయించుకొని జరత్కారువు తనభర్తను మేల్కొల్పింది. జరత్కారుడును నిద్రనుండి మేల్కొని కోపించి 'నీవు ఎందుకు నాకు నిద్రాభంగం చేశావు?' అని అనగా జరత్కారువు మిక్కిలి భయపడి ఇట్లా పలికింది.

**విశేషం:** ఇచట సాధ్వి అయిన జరత్కారువుమనస్సులో ధర్మసంఘర్షణ కలిగింది. భర్త నిద్రపోతున్నాడు. సంధ్యాసమయం అయింది. సంధ్యాకాలంలో చేయదగినకర్మలు చేయకుంటే ధర్మలోప మవుతుంది. అందుకు భర్త కోపించవచ్చు. ఒకవేళ లేపితే, లేచి నిద్రాభంగ మెందుకు చేశా వని కోపించవచ్చు. ఆసమయంలో భర్తను లేపకపోవటం అధర్మం. లేపటమూ అధర్మమే. రెండువిధాలా భర్త కోపించవచ్చు. ఆమె మనసులో బాగా ఆలోచించి, కోపాన్నే భరించవచ్చును కాని ధర్మక్రియాలోపం సహించరాదని నిశ్చయించి భర్తనులేపింది. ఇచట ఆమెకు ఉండే ధర్మక్రియాసక్తి తెల్లమవుతున్నది. ఆమెలోని ధర్మచింతనప్రవృత్తి ఆమె సంతానమైన ఆస్తీకునిలో ప్రతిఫలిస్తుందని వస్తుధ్వని. ఇందులో నన్నయధర్మనిష్ఠ ప్రతిఫలిస్తూఉంది.

**క. 'ఇనుఁ డస్తమింపఁ బోయిన । ననఘా! బోధింపవలసె' ననవుడు, 'నామే**
**ల్కను నంతకు నుండక యినుఁ । డొనరఁగ నస్తాద్రి కేఁగ నోడఁడె చెపుమా!' 158**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా; ఇనుఁడు= సూర్యుడు; అస్తమింపన్ పోయినన్= అస్తమించటానికి సిద్ధంగా ఉండగా; బోధింపన్వలసెన్= ధర్మక్రియాభంగ మవుతుం దేమో అని నిన్ను మేల్కొల్పవలసి వచ్చింది; అనవుడున్= అనిన అనంతరం; నా, మేల్కను, అంతకున్= నేను మేల్కొనేంతవరకు; ఉండక= అస్తమించకుండ ఉండక; ఇనుఁడు= సూర్యుడు; ఒనరఁగన్= ఒప్పుగా; అస్త+అద్రికిన్= పడమటికొండకు; ఏఁగన్= వెళ్ళటానికి; ఓడఁడు+ఎ= భయపడడా? చెపుమా= చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ పాపరహితుడా! సూర్యు డస్తమించటానికి సిద్ధంగా ఉండగా, ధర్మకార్యాచరణానికి లోపం కలుగుతుందని నిన్ను మేల్కొల్పవలసి వచ్చిం' దని ఆమె అనగా, జరత్కారుడు, నేను మేల్కొనేంతవరకు అస్తమించకుండ ఉండక సూర్యుడు పడమటికొండకు వెళ్ళటానికి భయపడడా! చెప్పుము' (అని పలికాడు).

**విశేషం:** మునిప్రభావం చాలా గొప్పది. అతడు మేల్కొనకపోతే సూర్యుడు అస్తమించటానికి భయపడతా డని అతని అభిప్రాయం.

**వ. 'నీవు నా కవమానంబు దలంచితివి; నీయొద్దనుండ నొల్లఁ ; దొల్లి నీకు నాచేసిన సమయంబు నిట్టిద; నీగర్భంబున నున్నవాఁడు సూర్యానలసమప్రభుం డైన పుత్త్రుం; డుభయకులదుఃఖోద్ధరణ సమర్థుండు సుమ్ము; నీవు వగవక నీయగ్రజునొద్ద నుండు' మని జరత్కారువు నూరార్చి జరత్కారుండు తపోవనంబునకుం జనియె; నిట జరత్కారువును తనయగ్రజుం డైన వాసుకి యొద్దకు వచ్చి తద్వృత్తాంతంబంతయు నెఱింగించి యుండునంత. 159**

**ప్రతిపదార్థం:** నీవు; నాకున్; అవమానంబు= అగౌరవం; తలంచితివి= తలపోశావు; నీయొద్దన్= నీచెంత; ఉండన్, ఒల్లన్= ఉండటానికి అంగీకరించను; తొల్లి= పూర్వం(మొదట); నీకున్; నా, చేసిన (కర్తృపదప్రథమకు షష్ఠి); సమయంబున్= నియమంకూడా; ఇట్టిది+అ= ఇట్టిదే. నీ, గర్భంబునన్= నీకడుపులో; ఉన్నవాడు; సూర్య+అనల, సమప్రభుండు+ఐన= సూర్యుడితోను, అగ్నితోను సమానమయిన కాంతి కల; పుత్త్రుండు= కుమారుడు; ఉభయ, కుల+ఉద్ధరణ, సమర్థుండు= మన ఇరువురియొక్క కులాల దుఃఖాన్ని తొలగించటానికి (పైకితేవటానికి) శక్తి కలవాడు సుమా (సుమ్ము- చూడుము యొక్క సంక్షేపరూపం); నీవు; వగవక= విచారింపక; నీ, అగ్రజు+ఒద్దన్= నీఅన్న అయిన వాసుకి చెంత; ఉండుము; అని; జరత్కారువున్= తనభార్య అయిన జరత్కారువును; ఊరార్చి= ఓదార్చి; జరత్కారుండు= ముని; తపోవనంబునకున్, తపస్సు చేసికొనటానికి తగిన అడవికి; చనియెన్= వెళ్లాడు; ఇటన్= ఇక్కడ; జరత్కారువును= భార్యకూడ; తన, అగ్రజుండు+ఐన= తనఅన్న అయిన; వాసుకి+ఒద్దకున్= వాసుకిచెంతకు; వచ్చి; తద్, వృత్తాంతంబు= జరిగినవిషయం; అంతయున్; ఎఱింగించి, ఉండు+అంతన్= తెలిపి ఉన్నంత.

**తాత్పర్యం:** 'నీవు నిద్రనుండి లేపటంచేత నాకు అవమానం చేయటానికి తలపోశావు. నీచెంత ఉండటానికి అంగీకరించను. ఎన్నడయినా నీవు నా కవమానం తలపోస్తే నాడే నిన్ను విడిచి పోతా నని ముందే నీకు శపథం చేసి ఉన్నాను, నీ కడుపున ఉన్న కుమారుడు సూర్యుడితోను, అగ్నితోను సమాన మయిన కాంతికలవాడు. మన ఇరువురికులాలయొక్క దుఃఖాన్ని తొలగించటానికి తగిన శక్తి కలవాడు సుమా! నీవు విచారించక నీ అన్నచెంత ఉండుము.' అని జరత్కారువును ఓదార్చి జరత్కారుముని తపస్సు చేసికొనటానికి అడవికి వెళ్ళాడు. ఇచట జరత్కారువును తన అన్న అయిన వాసుకి చెంతకు వచ్చి విషయమంతా తెలిపి ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఆపూర్ణతేజుఁ డపగత । పాపుఁ డపాకృతభవానుబంధుఁడు, నిజమా**
**తాపితృపక్షప్రబల భ । యాపహుఁ డాస్తీకుఁ డుదితుఁ డై పెరిఁగెఁ బ్రభన్. 160**

**ప్రతిపదార్థం:** ఆపూర్ణతేజుఁడు= మిక్కిలిసంపూర్ణమైన తేజస్సు కలవాడు; అపగతపాపుఁడు= పోయినపాపం కలవాడు; అపాకృత, భవ+అనుబంధుఁడు= తిరస్కరింపబడిన సంసారంయొక్క సంబంధం కలవాడు; నిజ, మాతృ, పితృ, పక్ష, ప్రబల, భయ+అపహుఁడు= తనతల్లియొక్క, తండ్రియొక్క పక్షాలయొక్క అధికమైన భయాన్ని పోగొట్టేవాడు; ఆస్తీకుఁడు= ఆస్తీకు డనేపేరు కలవాడు; ఉదితుఁడు+ఐ= పుట్టి; ప్రభన్= కాంతితో; పెరిఁగెన్= వర్ధిల్లాడు.

**తాత్పర్యం:** అంతటను నిండిన తేజస్సు కలవాడున్నూ, పాపంలేనివాడున్నూ, తిరస్కరింపబడిన సంసారబంధం కలవాడున్నూ, తనతల్లిదండ్రుల ఉభయపక్షాలకు చెందినవారి అధిక మైన భయాన్ని పోగొట్టేవాడున్నూ అయిన ఆస్తీకుడు కాంతితో పుట్టి పెరిగాడు.

**విశేషం:** మాతృ+పితృ= మాతాపితృ, ద్వంద్వసమాసంలో తొలిపదంచివరి ఋవర్ణస్థానంలో ఆవర్ణం వస్తుంది. 'ఆనఙ్ఋతోద్వంద్వే.'

**తే. చ్యవనసుతుఁ డైన ప్రమతితోఁ జదివె సకల । వేదవేదాంగములు, నిజవిమలబుద్ధి**
**నెఱిఁగె సకలశాస్త్రంబుల, నెల్లయందు । నధికసాత్త్వికుఁ డాస్తీకుఁ డనఁగ జనులు. 161**

**ప్రతిపదార్థం:** జనులు= ప్రజలు; ఎల్ల+అందున్= అన్నిచోట్లలోను; ఆస్తీకుఁడు; అధికసాత్త్వికుఁడు= గొప్పసత్త్వగుణం కలవాడు; అనఁగ= అనేటట్లుగా; చ్యవనసుతుఁడు+అయిన= చ్యవనుడికుమారు డయిన; ప్రమతితోన్= ప్రమతి అనే వాడివద్ద; సకల, వేద, వేద+అంగములు= అన్నివేదాలను, వేదాలకు అంగాలను; చదివెన్; సకల, శాస్త్రంబులన్= అన్ని శాస్త్రాలను; నిజ, విమల, బుద్ధిన్= తన నిర్మల మయిన బుద్ధితో; ఎఱిఁగెన్= తెలిసికొన్నాడు.

**తాత్పర్యం:** ఆ ఆస్తీకుడు ప్రజలు ఎల్లప్రదేశాలలోను అధిక మైన సత్త్వంకలవా డని పొగడేటట్లుగా చ్యవనకుమారు డైన ప్రమతివద్ద అన్నివేదాలను, వేదాలఅంగాలను అధ్యయనం చేశాడు. నిర్మల మయిన బుద్ధితో అన్ని శాస్త్రాలను తెలిసికొన్నాడు.

**విశేషం:** ఋగ్యజుస్సామాథర్వాలు నాలుగువేదాలు. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనేఆరున్నూ వేదాంగాలు.

ప్రమతితో చదివె అనేచోట తృతీయావిభక్తి ప్రత్యయమైన 'తో' వాడబడింది. "ఉపయోగంబునందు ఆఖ్యాతకు తోడవర్ణకమగును." "ఉపయోగ మనఁగా నియమపూర్వకవిద్యాస్వీకారము."

**వ. అటజనమేజయుండు దక్షకవిషానలంబునం దన జనకు పంచత్వం బుదంకువలన నెఱింగి, మంత్రులం జూచి, 'యిది యేమినిమిత్తంబు? దీని సవిస్తరంబుగాఁ జెప్పుం' డనిన మంత్రు లి ట్లనిరి. 162**

**ప్రతిపదార్థం:** అటన్= అచ్చట; జనమేజయుండు= పరీక్షిత్తు కుమారుడు; తక్షక, విష+అనలంబునన్= తక్షకునియొక్క విష మనే అగ్నిచేత; తన, జనకు, పంచత్వంబు= తన తండ్రి అయిన పరీక్షిత్తుమరణం; ఉదంకువలనన్= ఉదంకుడిద్వారా; ఎఱింగి= తెలిసికొని; మంత్రులన్, చూచి; ఇది; ఏమి; నిమిత్తంబు= కారణం; దీనిన్= ఈవృత్తాంతాన్ని; సవిస్తరంబుగాన్= వివరంతోకూడుకొని ఉండేట్లుగా; చెప్పుండు; అనినన్= అని అడుగగా; మంత్రులు; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** అచ్చట- జనమేజయుడు తక్షకుని విష మనే అగ్నిచేత తన తండ్రి అయిన పరీక్షిత్తు మరణించాడనిన వృత్తాంతం ఉదంకుడివలన తెలిసికొని మంత్రులను చూచి 'ఇది ఎందువలన జరిగింది? దీనిని వివరంగా తెల్పండి' అని అడుగగా మంత్రు లిట్లా పలికారు.

**విశేషం:** మానవశరీరం పంచభూతాత్మకం. మరణించినప్పుడు అది మళ్ళీ పంచభూతాలలో కలసిపోతుంది. అందుకే మరణానికి పంచత్వ మనే పేరు కలిగింది.

జనమేజయునకుఁ బరీక్షితు శాపకారణంబు మంత్రులు చెప్పుట. (సం. 1-36-8)

**సీ. అభిమన్యునకు విరాటాత్మజ యైన యు। త్తరకును బుట్టిన ధర్మమూర్తి,**
**కౌరవాన్వయపరిక్షయమున నుదయించి। ప్రథఁ బరీక్షితుఁడు నాఁ బరఁగువాఁడు,**
**ధర్మార్థకామముల్ దప్పక సలుపుచుఁ। బూని భూప్రజ నెల్లఁ బుణ్యచరిత**
**ననఘుఁ డై రక్షించి యఱువదియేఁడులు। రాజ్యంబు సేసిన రాజవృషభుఁ,**

**ఆ. డధికధర్మమార్గుఁ డైన నీయట్టి స। త్పుత్త్రుఁ బడసియున్న పుణ్యుఁ, డన్య**
**నాథ మకుటమణిగణప్రభారంజిత। పాదపంకజుండు భరతనిభుఁడు. 163**

**ప్రతిపదార్థం:** అభిమన్యునకున్; విరాట+ఆత్మజ+ఐన= విరాటునికూతురైన; ఉత్తరకును; పుట్టిన; ధర్మమూర్తి= ధర్మరూపుడు; కౌరవ+అన్వయ, పరిక్షయమునన్= కౌరవుల వంశంయొక్క వినాశసమయాన; ఉదయించి= పుట్టి; ప్రథన్= ప్రసిద్ధిచేత; పరీక్షితుఁడు, నాన్= పరీక్షితుడు అనగా; పరఁగువాఁడు= ఒప్పువాడు; ధర్మ+అర్థ, కామముల్= ధర్మం, అర్థం, కామం అనే పురుషార్థాలను; తప్పక= అతిక్రమించక; సలుపుచున్= చేస్తూ; పూని= యత్నించి; భూ, ప్రజన్, ఎల్లన్= భూమిలోని ప్రజలనందరిని; పుణ్యచరితన్= పవిత్రమయిన ప్రవర్తనతో; అనఘుఁడు+ఐ= పాపరహితుఁ డై; రక్షించి= కాపాడి; అఱువదియేఁడులు= అరవయిసంవత్సరాలు; రాజ్యంబు చేసిన= రాజ్యాన్ని పాలించిన; రాజవృషభుఁడు= రాజశ్రేష్ఠుడు; అధిక, ధర్మమార్గుఁడు+ఐన= మిక్కిలి ధర్మంతో కూడినమార్గం కలవాడి వైన; నీ+అట్టి= నీవంటి; సత్, పుత్త్రున్= మంచికుమారుడిని; పడసి, ఉన్న= పొంది ఉన్న; పుణ్యుఁడు= పవిత్రుడు; అన్య, నాథ, మకుట, మణి, గణ, ప్రభా, రంజిత, పాద, పంకజుండు= ఇతరరాజులయొక్క కిరీటాలలోని రత్నాల సముదాయాలయొక్క కాంతిచే ప్రకాశింపజేయబడిన పద్మాలవంటి పాదాలు కలవాడు; భరతనిభుఁడు= శకుంతలాదుష్యంతులకుమారు డైన భరతుడితో సమానుడు.

**తాత్పర్యం:** అభిమన్యుడికి విరాటునికూతు రైన ఉత్తరకు జన్మించిన ధర్మస్వరూపుడు, కౌరవవంశం వినాశంపొందే సమయంలో పుట్టి ప్రసిద్ధిచే పరీక్షితుడు అనగా ఒప్పేవాడు, ధర్మం, అర్థం, కామం అనే పురుషార్థాలను అతిక్రమించక అనుసరిస్తూ యత్నించి భూమిలోని ప్రజలను అందరిని పవిత్ర మయిన చరిత్రంతో పాపరహితుడై కాపాడి అరవయి సంవత్సరాలు రాజ్యం పాలించిన రాజశ్రేష్ఠుడు, మిక్కిలిధర్మంతో కూడినమార్గం కలవాడి వైన నీవంటి మంచికుమారుడిని పొంది ఉన్న పవిత్రుడు, ఇతరరాజుల కిరీటాలలోని మణుల సముదాయాలయొక్క కాంతిచే ప్రకాశింపజేయబడిన పద్మాలవంటి పాదాలు కలవాడు, భరతునితో సమానుడు.

**విశేషం:** అభిమన్యుడు కురుక్షేత్రసంగ్రామంలో మరణించే టప్పటికి ఉత్తర గర్భవతి అయి ఉండింది. అశ్వత్థామ గర్భస్థశిశువును సంహరించటానికి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. కృష్ణుడు చక్రంచేత దానిని నివారించి శిశువును రక్షించి కౌరవవంశాన్ని నిలిపాడు. అప్పుడు ఉత్తరకు పరీక్షిత్తు పుట్టాడు. అతడు కృష్ణుడిచే రక్షింపబడన ట్లయితే పాండవవంశం అంతరించి ఉండేది! సింహ, శరభ, శార్దూల, వృషభాది శబ్దాలు సమాసంలో ఉత్తరపదా లయితే శ్రేష్ఠతావాచక సూచకా లవుతాయి. శకుంతలా దుష్యంతులకు పుట్టిన భరతుడు కౌరవవంశకర్తలలో ఒకడు.

**వ. భవత్పితృప్రపితామహుం డైన పాండురాజునుంబోలె మృగయాసక్తుం డై యొక్కనాఁడు మహాగహనంబులఁ బెక్కుమృగంబుల నెగచి చంపి, తనచేత నేటువడి పాఱినమృగంబు వెంటఁ దగిలి మహాధనుర్ధరుం డై యజ్ఞమృగంబు పిఱుందం బఱచు రుద్రుండునుం బోలె. 164**

**ప్రతిపదార్థం:** భవత్, పితృ, ప్రపితామహుండు+ఐన= నీతండ్రి అయిన పరీక్షిత్తుకు ముత్తాత అయిన; పాండురాజునున్, పోలెన్= పాండురాజువలె; మృగయా+ఆసక్తుండు+ఐ= వేటలో ఆసక్తి కలవాడై; ఒక్కనాఁడు; మహత్, గహనంబులన్= పెద్దఅడవులలో; పెక్కు మృగంబులన్= అనేక జంతువులను; ఎగచి= తరిమి; చంపి; తనచేతన్; ఏటు, పడి= బాణపుదెబ్బ తిని; పాఱిన= పారిపోయిన; మృగంబువెంటన్= లేడివెంట; తగిలి= అనుసరించి; మహత్, ధనుః+ ధరుండు+ఐ= గొప్పవింటిని ధరించినవా డై; యజ్ఞమృగంబు= యజ్ఞరూప మయిన లేడియొక్క; పిఱుందన్= వెనుక; పఱచు= పరిగెత్తే; రుద్రుండునున్, పోలెన్= శివునివలె.

**తాత్పర్యం:** జనమేజయుడితండ్రి పరీక్షిత్తు, అతనితండ్రి అభిమన్యుడు, అతనితండ్రి అర్జునుడు, అతనితండ్రి పాండురాజు-అందుచేత పాండురాజు జనమేజయుడికి ముత్తాత అవుతాడు. ఆ పాండురాజు వలె వేటపట్ల ఆసక్తి కలవా డయి పరీక్షిత్తు ఒకనాడు పెద్దఅడవులలో అనేకజంతువులను తరిమి చంపి, తనచేత బాణపుదెబ్బ తిని పారిపోయిన ఒకలేడిని అనుసరిస్తూ గొప్పవిల్లు ధరించినవా డయి యజ్ఞరూప మైన లేడివెనుక పరుగెత్తే శివుడివలె.

**విశేషం:** దక్షాధ్వరధ్వంససమయంలో యజ్ఞం మృగరూపం ధరించి పరుగెత్తుతూ ఉంటే రుద్రుడు దానివెనుక తరుముతూ పరిగెత్తాడు. ఇచ్చట పరీక్షిత్తుకు ఆయజ్ఞమృగాన్ని వెంటాడే రుద్రునితో పోలిక చెప్పబడింది. అలంకారం ఉపమ.

**పృథ్వీవృత్తము.**

**అమిత్రమదభేది యొక్కరుఁడ యమ్మృగాన్వేషణ**
**భ్రమాకులితచిత్తుఁ డై తగిలి పాఱుచున్ ముందటన్**
**శమీకుఁ డనువాని నొక్కమునిసత్తమున్ సంతత**
**క్షమాదమసమన్వితుం గనియెఁ గాననాంతంబునన్.** **165**

**ప్రతిపదార్థం:** అమిత్ర, మద, భేది= శత్రువులయొక్కగర్వాన్ని అడగించేవాడు; ఒక్కరుఁడు+అ= ఒక్కడే; ఆ+మృగ+అన్వేషణ, భ్రమ+ఆకులిత, చిత్తుఁడు+ఐ= ఆ లేడిని వెదకటంకొరకు తిరగటంవలన కలతపెట్టబడిన హృదయం కలవాడై; తగిలి= అనుసరించి; పాఱుచున్= పరుగెత్తుతూ; ముందటన్; కానన+అంతంబునన్= అడవిచివర; సంతత, క్షమా, దమ, సమన్వితున్= ఎల్లప్పుడూ ఓర్పుతోను, అంతరింద్రియనిగ్రహంతోను కూడిన వాడిని; శమీకుడు+అను, వానిన్= శమీకు డనేపేరు కలవాడిని; ఒక్క, ముని, సత్తమున్= ఒకమునిశ్రేష్ఠుడిని; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** శత్రువులగర్వాన్ని అణచేపరీక్షిత్తు ఒక్కడే (ఒంటరిగా) తనచేత బాణంతోకొట్టబడి పరుగెత్తేమృగాన్ని వెదకటంకొరకు తిరగటంచేత కలతపెట్టబడిన హృదయం కలవాడై వెంటనంటి పరుగెత్తుతూ, ఎదుట అడవిచివర అధిక మైన ఓర్పుతోను, అంతరింద్రియనిగ్రహంతోను కూడిన శమీకు డనే పేరు గల ఒకమునిశ్రేష్ఠుడిని చూచాడు.

**విశేషం:** పృథ్వీవృత్తంలో ఒక్కొక్కపాదానికి జ, స, జ, స, య, లగ అనేగణాలు ఉంటాయి. పన్నెండవఅక్షరం యతిస్థానం. సంస్కృతంలో తొమ్మిదో అక్షరాన్ని యతిస్థానంగా పరిగణిస్తారు. నన్నయాదులు 12వ అక్షరాన్ని యతిగా పాటించారు. ప్రబంధకవులు తొమ్మిదవ అక్షరాన్నే యతిగా నిలిపారు.

**వ.** **కని 'మునీంద్రా! నాచేత నేటువడి మృగం బమ్ముతోన యిటవచ్చె, నది యెక్కడంబాఱె? నీ వెఱుంగుదేని చెప్పుమనిన, నమ్ముని మౌనవ్రతుండు గావునఁ బలుకకున్నం గినిసి, తత్సమీపంబున నపగతప్రాణం బై**

**పడియున్నపాముం దనవింటికొప్పున నెత్తి, యమ్మునియఱుతం దగుల వైచి, క్రమ్మఱి హస్తిపురంబునకు వచ్చియున్నంత. 166**

**ప్రతిపదార్థం:** కని= చూచి; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠుడా! నాచేతన్; ఏటు, పడి= బాణపుదెబ్బతిని; మృగంబు= లేడి; అమ్ముతోన్+అ= బాణంతోనే; ఇట, వచ్చెన్= ఇచటికి వచ్చింది; అది= ఆ మృగం; ఎక్కడన్= ఎక్కడికి; పాఱెన్= పరుగెత్తింది; నీవు; ఎఱుంగుదు(వు)+ఏని= ఎరిగిఉంటే; (భూతకాలంలోవలెనే తద్ధర్మంలో కూడ క్రియచివర ఉన్నవకారం లోపిస్తుంది); చెప్పుము= తెల్పుము; అనినన్= అనిఅడుగగా; ఆ+ముని= శమీకు డనే ఆ ముని; మౌన, వ్రతుండు, కావునన్= మాటాడకుండటం వ్రతంగా కలవాడు అవటంచేత; పలుకక+ఉన్నన్= బదులు పలకకుండా ఉండగా; కినిసి= కోపించి; తద్, సమీపంబునన్= అతనికి చేరువనే; అపగత, ప్రాణంబు+అయి= పోయిన ప్రాణం కలదై; పడి, ఉన్న, పామున్= పామును; తన, వింటి, కొప్పునన్= తనవింటికొనతో; ఎత్తి= పైకితీసి; ఆ+ముని, అఱుతన్= ఆమునియొక్కకంఠంలో; తగులన్, వైచి= అంటేటట్లుగా వేసి (తగిలించి); క్రమ్మఱి= తిరిగి, హస్తి, పురంబునకున్= హస్తినాపురానికి; వచ్చి, ఉన్న+అంతన్= చేరి ఉండగా.

**తాత్పర్యం:** చూచి, 'ఓమునిశ్రేష్ఠా! నాచేత బాణపుదెబ్బతిన్న లేడి ఆబాణంతోకూడ ఇక్కడకు వచ్చింది. అది ఎక్కడికి పారిపోయింది? నీకు తెలిసిఉంటే చెప్పుము' అని అడుగగా ఆ ముని మౌనవ్రతం కలవాడుకావున సమాధానం ఏమీ చెప్పకుండా ఉండగా, కోపించి అతనిచెంత చచ్చి పడిఉన్న ఒక పామును తన వింటికొనచే పైకితీసి ఆ శమీకముని మెడలో తగిలించి తిరిగి హస్తినాపురానికి వచ్చి ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. ఆశమీకుపుత్త్రుఁ డంబుజసంభవు। గుఱిచి భక్తితోడ ఘోరతపము**
**సేయుచున్న సుప్రసిద్ధుండు శృంగి య। న్వాఁడు భృంగిసముఁడ వంధ్యకోపి. 167**

**ప్రతిపదార్థం:** ఆ, శమీకు, పుత్త్రుఁడు= ఆ శమీకమునియొక్క కుమారుడు; అంబుజ, సంభవు, గుఱిచి= పద్మానపుట్టినవాడయిన బ్రహ్మనుగురించి; భక్తితోడన్= పూజ్యభావంతో; ఘోర, తపము= తీవ్ర మైన తపస్సు; చేయుచున్న; సుప్రసిద్ధుండు= మంచిఖ్యాతిగలవాడు; భృంగిసముఁడు= శివకింకరుడైన భృంగితో సమానుడు; (శివసమాను డనియు చెప్పవచ్చును); అవంధ్యకోపి= వ్యర్థంకాని కోపంకలవాడు; శృంగి, అన్, వాఁడు= శృంగి అనే పేరుకలవాడు.

**తాత్పర్యం:** ఆ శమీకమహర్షి కుమారుడు శృంగి అనేవాడు భక్తితో బ్రహ్మను గురించి కఠోరమైన తపస్సు చేస్తున్న సుప్రసిద్ధుడు. అతడు శివకింకరుడైన భృంగితో సమానుడు; మొక్కవోని కోపం గలవాడు.

**విశేషం:** 'అను' అనే ఉదంతతద్ధర్మవిశేషణంలో 'ఉ' లోపించింది. అన్వాడు.

**క. తనజనకు నఱుతఁ బవనా। శనశవముఁ దగిల్చి రాజసమునఁ బరీక్షి**
**జ్జనపాలు చనుట, కృశుఁ డను। మునివలన నెఱింగి కోపమూర్ఛాన్వితుఁ డై. 168**

**ప్రతిపదార్థం:** తన, జనకు= తన తండ్రియొక్క; అఱుతన్= కంఠంలో; పవన+అశన, శవమున్= వాయువును భక్షించే పాముయొక్క కళేబరాన్ని; తగిల్చి= అంటేట్లుగా చేసి; రాజసమునన్= దర్పంతో; పరీక్షిత్+జనపాలు, చనుట= పరీక్షిన్మహారాజు వెళ్ళటం; కృశుఁడు+అను= కృశుడు అనే పేరు గల; మునివలనన్= తపస్వివలన; ఎఱింగి= తెలిసికొని; కోపమూర్ఛా+అన్వితుఁడు+ఐ= కోపంయొక్క అతిశయంతో కూడినవా డై, కోపంతో వివశు డై అని అర్థం.

**తాత్పర్యం:** తన తండ్రిమెడలో పాముయొక్క కళేబరాన్ని అంటేట్లు వేసి దర్పంతో పరీక్షిన్మహారాజు వెళ్ళటం కృశుడనే మునివలన తెలిసికొని కోపంయొక్క అతిశయంతో కూడినవాడై. (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** పరీక్షిత్+జనపాలు- శ్చుత్వసంధి - పరీక్షిజ్జనపాలు. జనకు+అఋతన్-తత్పురుషసమాసంలో ఉకార, ఋకారాలకు అచ్చు పరమయినపుడు 'ను' ఆగమంగా వస్తుంది. జనకునఋత.

**వ. శాపజలంబు లెత్తికొని 'విజనం బైన విపినాంతరంబున విజితేంద్రియుం డై, మొదవుల చన్నులు వత్సంబులు గుడుచునప్పు డుద్గతం బగు పయఃఫేనంబ తనకాహారంబుగా మౌనవ్రతంబునం దపంబు సేయుచున్న మహావృద్ధు మదీయజనకు నవమానించిన పరీక్షితుండు నేఁడు మొదలుగా సప్తదివసంబులలోనఁ దక్షక విషాగ్నిదగ్ధుం డై యమసదనంబున కరిగెడు' మని శాపం బిచ్చి తండ్రిపాలికిం జని. 169**

**ప్రతిపదార్థం:** శాప, జలంబులు= శాపమివ్వటంకొరకు నీళ్లను; ఎత్తికొని= గ్రహించి; విజనంబు+ఐన= జనరహిత మైన; విపిన+అంతరంబునన్= అడవినడుమ; విజిత+ఇంద్రియుండు+ఐ= జయింపబడిన ఇంద్రియాలు కలవా డై; మొదవుల= ఆవుల; చన్నులు; వత్సంబులు= దూడలు; కుడుచు+అప్పుడు= కుడిచేసమయంలో; ఉద్గతంబు+అగు= పైకి వచ్చే; పయస్+ఫేనంబు+అ= పాలనురుగే; తనకున్; ఆహారంబు, కాన్= భోజన మవునట్లుగా; మౌన, వ్రతంబునన్= మాటలాడకుండటం (మౌనం) అనే నియమంతో; తపంబు, చేయుచున్న= తపస్సు చేస్తున్న; మహత్, వృద్ధున్= మిక్కిలిముసలివాడిని; మదీయ, జనకున్= నాతండ్రిని; అవమానించిన= పరాభవించిన; పరీక్షితుండు; నేఁడు, మొదలుగాన్= ఈరోజుమొదలుకొని; సప్త, దివసంబుల, లోనన్= ఏడురోజులలో; తక్షక, విష+అగ్ని, దగ్ధుండు+ఐ= తక్షకు డనే సర్పరాజు విష మనే అగ్నిచే తగులబెట్టబడినవాడై; యమ సదనంబునకున్= యముని గృహానికి (నరకానికి); అరిగెడున్+అని= వెళ్ళుగాక అని; (ఎడు, త, ల, ద్రుతానికి అచ్చు పరమయినపుడు 'మ'కార మవుతుంది); శాపంబు+ఇచ్చి; తండ్రి; పాలికిన్= తండ్రి అయిన శమీకుడిచెంతకు; చని= వెళ్ళి.

**తాత్పర్యం:** శాప మివ్వటానికి నీళ్ళు గ్రహించి, 'జనరహిత మైన అడవినడుమ ఇంద్రియాలను నిగ్రహించి ఆవులచన్నులు దూడలు కుడిచేటప్పుడు బయటికి వచ్చే పాలనురుగే తనకు భోజనమయ్యేట్లుగా మౌనవ్రతం పూని తపస్సుచేస్తున్న మిక్కిలిముసలివాడిని నా తండ్రిని అవమానించిన పరీక్షితు డనేరాజు, నేడు మొదలుకొని (నేటికి) ఏడురోజులలో తక్షకుడనే సర్పరాజుయొక్క విషమనే అగ్నిచేత కాల్చబడి యమలోకానికి వెళ్ళుగాక! (మరణించుగాక!)' అని శాప మిచ్చి తండ్రి అయిన శమీకుని చెంతకు వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** శాప మిచ్చేటప్పుడు జలం గ్రహించి ఇట్లా జరుగునుగాక! అని పలికి దాన్ని విడిచిపెడతారు.

**క. ఉరగకళేబర మంసాం । తరమునఁ బడి వ్రేలు చునికిఁ దలఁపక యచల**
**స్థిరుఁ డై పరమధ్యానా । వరతేంద్రియవృత్తి నున్నవాని శమీకున్. 170**

**ప్రతిపదార్థం:** ఉరగ, కళేబరము= పాముయొక్కశవం; అంస+అంతరమునన్= మూపులనడుమ; పడి; వ్రేలుచున్+ఉనికిన్= వ్రేలాడుతుండటం; తలఁపక= తలపోయక; అచల+స్థిరుఁడు+ఐ= పర్వతంవలె కదలనివాడై; పరమ, ధ్యాన+అవరత+ ఇంద్రియవృత్తిన్= గొప్పధ్యానంచేత తొలగిన ఇంద్రియాలయొక్క వ్యాపారంతో; ఉన్నవానిన్, శమీకున్= శమీకు డనేమునిని.

**తాత్పర్యం:** పాముయొక్క శవం మూపులనడుమనుండి వ్రేలాడుతుండటం తలపోయక పర్వతంవలె కదలకున్నవాడై, గొప్పదైన పరమాత్మధ్యానంచేత ఉడిగిన ఇంద్రియాలయొక్క వ్యాపారాలతో ఉన్న శమీకమునిని. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. కని యయ్యురగకళేబరంబుఁ బాఱవైచి, తత్‌క్షణంబ ప్రబుద్ధనయనుం డైనతండ్రి కభివాదనంబు సేసి, బాష్పపూరితనయనుం డై శృంగి పరీక్షితు నుద్దేశించి తన చేసిన శాపస్థితి సెప్పిన విని, శమీకుండు గరంబడలి యి ట్లనియె. 171**

**ప్రతిపదార్థం:** కని= చూచి; ఆ+ఉరగ, కళేబరంబు= ఆపాముశవం; పాఱవైచి= తీసివేసి తద్, క్షణంబు+అ= ఆక్షణమందే; ప్రబుద్ధనయనుండు+ఐన= మేల్కొన్న(తెరువబడ్డ) కన్నులుకలవా డయిన; తండ్రికిన్; అభివాదనంబు, చేసి= గోత్ర నామాదులు చెప్పి సాష్టాంగనమస్కారం చేసి; బాష్పపూరితనయనుండు+ఐ= కన్నీటితో నిండినకన్నులు కలవా డై; శృంగి; పరీక్షితున్= పరీక్షిన్మహారాజును; ఉద్దేశించి= గురించి; తన, చేసిన= తాను చేసిన; శాప, స్థితి= శాపంయొక్క ప్రకారం; చెప్పినన్= చెప్పగా; విని; శమీకుండు; కరంబు= మిక్కిలి; అడలి= శోకించి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** చూచి, ఆ పాముశవాన్ని తీసివేసి, ఆ క్షణమందే కన్నులు తెరచిన తండ్రికి నమస్కారం చేసి, కన్నీటితో నిండిననేత్రాలు కలవాడై పరీక్షితుని గురించి తా నిచ్చిన శాపవిధానాన్ని చెప్పగా విని శమీకమహర్షి మిక్కిలి దుఃఖించి ఇట్లా పలికాడు.

**క. క్రోధమ తపముం జెఱుచును; । గ్రోధమ యణిమాదు లైన గుణములఁ బాపుం:**
**గ్రోధమ ధర్మక్రియలకు । బాధ యగుం; గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే? 172**

**ప్రతిపదార్థం:** క్రోధము+అ= కోపమే; తపమున్= తపస్సును; చెఱుచును= చెడేట్లు చేస్తుంది; క్రోధము+అ; అణిమ+ఆదులు+ఐన= అణిమ, మహిమ మొదలయిన; గుణములన్= సిద్ధులను; పాపున్= పోగొట్టుతుంది; క్రోధము+అ; ధర్మక్రియలకున్= ధర్మంతోకూడిన కార్యాలకు; బాధ, అగున్= ఆటంకం అవుతుంది; తపస్వికిన్= మునికి; క్రోధికాన్= కోపంకలవా డవటం; చన్నే (చనున్+ఏ)= తగునా! తగ దని భావం.

**తాత్పర్యం:** కోపమే తపస్సును చెడగొడుతుంది. కోపమే అణిమ, లఘిమ మొదలయిన అష్టసిద్ధులను పోగొడుతుంది. కోపమే ధర్మంతో కూడిన కార్యాలకు బాధ కలిగిస్తుంది. కావున తపస్సు చేసే మునికి కోపం తగునా?

**విశేషం:** ఈ పద్యం దీని తర్వాతిపద్యం నన్నయ సూక్తినిధిత్వానికి తార్కాణాలు, చనున్+ఏ= ప్రశ్నార్థకమైన ఏకారం పరమవటంచేత 'చను' లోని ఉకారం లోపించింది- చన్నే.

**క. క్షమ లేని తపసితపమును, । బ్రమత్తుసంపదయు, ధర్మబాహ్యప్రభురా**
**జ్యము భిన్నకుంభమున తో । యములట్టుల యధ్రువంబు లగు నివి యెల్లన్. 173**

**ప్రతిపదార్థం:** క్షమ, లేని= ఓర్పు లేని; తపసి, తపమును= మునియొక్కతపస్సును; ప్రమత్తు= మిక్కిలిమత్తుగొన్నవాడి; (ప్రమాదపడేవాడియొక్క); సంపదయున్= ధనమున్నూ; ధర్మ, బాహ్య, ప్రభు= ధర్మానికి వెలిఅయిన (ధర్మంలేని) రాజుయొక్క; రాజ్యమున్= ప్రభుత్వమున్నూ, ఇవి, ఎల్లన్= ఇవన్నీ; భిన్నకుంభమున, తోయములు+అట్టులు+అ= బ్రద్ద లయిన కుండలోని నీళ్ళవలె; అధ్రువంబులు+అగున్= అస్థిరాలు అవుతాయి.

**తాత్పర్యం:** ఓర్పులేని ముని తపస్సున్నూ, ప్రమాదపడేవాడి ధనమున్నూ, ధర్మంనుండి తొలగినరాజురాజ్యమున్నూ, ఇవన్నియు బ్రద్దలయిన కుండలోని నీళ్ళవలె అస్థిరా లవుతాయి.

**విశేషం:** అలం: ఉపమ, కుంభము+తోయములు=తత్పురుషంలో ఒక్కొక్కప్పుడు 'న' ఆగమంగా వస్తుంది; కుంభమునతోయములు.

**వ.** **క్షమ విడిచి నీవు దృష్టాదృష్టవిరుద్ధం బైనక్రోధంబుఁ జేకొని సకలక్షమారక్షకుం డైన పరీక్షిత్తునకుం బరీక్షింపక శాపం బిచ్చి చెట్ట సేసితివి; రాజరక్షితు లై కాదె మహామును లతిఘోరతపంబు సేయుచు, వేదవిహిత ధర్మంబులు నడుపుచు మహాశక్తిమంతు లయి యున్నవా; రట్టిరాజుల కపకారంబు దలంచు నంత కంటె మిక్కిలిపాతకం బొం డెద్ది? మఱియు భరతకుల పవిత్రుం డైన పరీక్షితు రాజసామాన్యుంగా వగచితే? 174**

**ప్రతిపదార్థం:** క్షమ= ఓర్పు; విడిచి; నీవు; దృష్ట+అదృష్ట, విరుద్ధంబు+ఐన= మొదటిసారే చూడబడినట్టిదీ ఇదివర కెన్నడు చూడబడనట్టిదీ, మునులకు పొందతగనిదీఅయిన; క్రోధంబున్= కోపాన్ని; చేకొని= గ్రహించి; సకల, క్షమా, రక్షకుండు+ఐన= సర్వభూమిని రక్షించేవా డయిన; పరీక్షితునకున్; పరీక్షింపక= బాగుగా పరిశీలించక; శాపంబు+ఇచ్చి; చెట్ట, చేసితివి= చెడు చేశావు; రాజ, రక్షితులు+ఐ, కాదె= రాజుచే రక్షింపబడినవా రయి కదా! మహత్, మునులు= గొప్పమునులు; అతి, ఘోర, తపంబు, చేయుచున్= మిక్కిలి తీవ్ర మైన తపస్సు చేస్తూ; వేద, విహిత, ధర్మంబులు= వేదాలచే విధింపబడిన ధర్మకార్యాలు; నడుపుచున్= చేస్తూ; మహత్, శక్తిమంతులు+అయి, ఉన్నవారు= గొప్పమహిమ కలవా రయి ఉన్నారు; అట్టి, రాజులకు, అపకారంబు= కీడు; తలంచు, అంతకంటెన్= తలపోసేంతకంటె; మిక్కిలి పాతకంబు= అధిక మయినపాపం; ఒండు= ఇతరం; ఎద్ది= ఏది? ఏదీ లే దని భావం; మఱియున్= అదిగాక; భరత, కుల, పవిత్రుండు+ఐన= భరతకులంలో ధర్మకార్యాలు చేయటంచేత పవిత్రు డైన (భరతవంశాన్ని పవిత్రం చేసేటి అని కూడ అర్థం చెప్పవచ్చును); పరీక్షితున్= పరీక్షిన్మహారాజును; రాజ, సామాన్యున్, కాన్= సాధారణు డైనరాజుగా; వగచితి+ఎ= (భూతకాల మవటంచేత 'ఎ'కారంలోపం) తలచావా!

**తాత్పర్యం:** ఓర్పు విడిచి నీవు ఇదివర కెప్పుడు చూడనట్టి, మునులకు ఉండరానట్టి కోపాన్ని పొంది సరిగా ఆలోచించక సర్వభూమిని రక్షించేవా డైన పరీక్షిన్మహారాజుకు శాప మిచ్చి చెడు చేశావు. రాజులచే రక్షింపబడేకదా గొప్పమునులు మిక్కిలి తీవ్రమయిన తపస్సు చేస్తూ, వేదాలచే విధింపబడిన ధర్మకార్యాలు కొనసాగిస్తూ, గొప్ప శక్తికలవారై ఉన్నారు. అట్టిరాజులకు కీడుచేయ తలపోయటం కంటె అధికతరమైన పాపం మరొకటి ఉండదు. అదికాక, భరతవంశాన్ని పవిత్రం చేసేటి పరీక్షిన్మహారాజును సామాన్యు డైన రాజుగా తలపోశావా? అతడు సామాన్యు డైనరాజు కాడు. గొప్పమహారాజని భావం.

**విశేషం:** దృష్టాదృష్టవిరుద్ధం అనేదాన్ని విశేషణోభయపదకర్మధారయంగా గ్రహిస్తే, పైన చెప్పబడిన అర్థం సరిపోతుంది. దాన్ని షష్ఠీతత్పురుషంగా గ్రహిస్తే, దృష్ట మంటే చూడబడినది, అదృష్ట మంటే చూడబడనిది. ఇహపరాలకు విరుద్ధ మయిన దని అర్థం చెప్పుకోవాలి.

**ఉ.** **క్షత్త్రియవంశ్యు లై ధరణిఁ గావఁగ బుట్టినవారు బ్రాహ్మణ**
**క్షత్త్రియవైశ్యశూద్రు లనఁగాఁ గల నాలుగుజాతులన్ స్వచా**

**రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామమాం**
**ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యే యుగంబులన్!** **175**

**ప్రతిపదార్థం:** క్షత్రియ, వంశ్యులు+ఐ= క్షత్రియవంశానికి చెందినవారై; ధరణిన్= భూమిని; కావఁగన్= రక్షించటానికి; పుట్టినవారు; (దీన్ని రామమాంధాతృరఘుక్షితీశులు అనేదానికి విశేషణంగా గ్రహించాలి); రామ, మాంధాతృ; రఘు, క్షితీశులు= రాముడు, మాంధాత, రఘువు అనేరాజులు; ఏ, యుగంబులన్= ఏయుగాలలోనైనా; బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు+అనఁగాన్, కల= బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనే పేర్లు కల; నాలుగుజాతులన్= నాలుగు వర్ణాలలోనివారిని; స్వ, చారిత్రము= తమతమప్రవర్తన (వర్ణధర్మం); తప్పక+ఉండఁగన్= విడిచిపోకుండేట్లుగా; పరీక్షితు, కాచిన, అట్లు= పరీక్షిన్మహారాజు రక్షించినట్లు; ముదంబునన్= సంతోషంతో; కాచిరి+ఎ= రక్షించారా!

**తాత్పర్యం:** క్షత్రియకులానికి చెందినవా రై, భూమిని రక్షించటానికి పుట్టినట్టి రాముడు, మాంధాత, రఘుమహారాజు మొదలయినరాజులు ఏయుగంలోనైనా బ్రాహ్మణులు, క్షత్రియులు, కోమట్లు, శూద్రులు అనేపేర్లుగల నాలుగువర్ణాలను తమతమధర్మాలను తప్పకుండ పరీక్షిన్మహారాజు రక్షించినట్లు సంతోషంతో రక్షించిఉన్నారా! (రాముడు, మాంధాత మున్నయినవారుకూడ పరీక్షితుడు రక్షించినట్లు నాలుగువర్ణాలప్రజలను, తమతమవర్ణధర్మాలను తప్పకుండ రక్షించి ఉండలే దని భావం.)

**విశేషం:** పరీక్షితు, కాచిన, అట్లు= కర్తృపదప్రథమకు షష్ఠివాడబడింది. క్షత్రియు డంటే క్షతం(ఆపద) నుండి రక్షించేవాడు అని వ్యుత్పత్తి, మాంధాత సూర్యవంశానికి చెందినమహారాజు, యువనాశ్వునికుమారుడు. అతడు తండ్రిగర్భంనుండి బయటికి రాగానే మునులు ఇతడు దేన్ని కుడుచును (కమ్+ఏష-ధాస్యతి) అని పలికారు. అప్పుడు ఇంద్రుడు వచ్చి 'మాం ధాస్యతి', నన్ను కుడుచును అని పలికాడు. అందుచే ఇతనికి మాంధాత అనే పేరు కలిగింది. ఇతడు నన్ను తొలగిస్తా డని ఇంద్రుడు భయంపొందటంచేత ఇతని కీపేరు వచ్చిందని కొందరు చెప్పి ఉన్నారు. ఇతడు షోడశ(16) మహారాజుల్లో ఒకడు. అప్పకవి ఈపద్యాన్ని సంయుతాసంయుతప్రాసానికి ఉదాహరణంగా ఇచ్చాడు. మొదటి మూడుపాదాలలో ప్రాసాక్షరం తకారరేఫసంయుక్త మయింది. నాల్గవపాదంలో మాంధాతృ అనేటప్పుడు మాత్రం 'తృ' అసంయుక్తం.

**వ.** **'అతండు మృగయావ్యసనంబున నపరిమితక్షుత్పిపాసాపరిశ్రాంతుం డయి యెఱుంగక నా కవజ్ఞఁ జేసె; నేనును దాని సహించితి; నమ్మహాత్మునకు నీయిచ్చిన శాపంబుఁ గ్రమ్మరింపనేర్తేని లగ్గగు' ననిన శృంగి యి ట్లనియె.** **176**

**ప్రతిపదార్థం:** అతండు= పరీక్షిత్తు; మృగయా, వ్యసనంబునన్= వేటలోని అత్యాసక్తిచే; అపరిమిత, క్షుధ్, పిపాసా, పరిశ్రాంతుండు+అయి= అధిక మైన ఆకలిచేత, దప్పికచేత, అలసినవా డయి; ఎఱుంగక= తెలియక; నాకున్; అవజ్ఞన్= అవమానాన్ని; చేసెన్; ఏనును= నేనుకూడ; దానిన్= అతడు చేసిన అవమానాన్ని; సహించితిన్= సైచాను; ఆ+మహాత్మునకున్= ఆమహనీయు డైన పరీక్షిత్తునకు; నీఇచ్చిన= (కర్తృపదప్రథమకుషష్ఠి) నీవు ఇచ్చిన; శాపంబును; క్రమ్మఱింపన్= మరల్చటానికి; నేర్తు(వు) ఏని=(తద్ధర్మమున వకారలోపం) ఓపుతావేని; లగ్గు+అగున్= మేలవుతుంది; అనినన్= అని శమీకుడు పలుకగా; శృంగి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ పరీక్షిత్తు వేటపైని ఆసక్తిచేత అధికమయిన ఆకలిచే, దప్పికచే మిక్కిలి అలసి తెలియక నాకు అవమానం చేశాడు. నేనుకూడ దాన్ని సహించాను. ఆ మహనీయు డైన పరీక్షిత్తుకు నీవు ఇచ్చిన శాపం మరల్చగలిగితే మేలవుతుంది. అని శమీకుడు పలుకగా కుమారు డైన శృంగి ఇ ట్లన్నాడు.

**విశేషం:** వ్యసనాలు ఏడు: వెలది, జూదం, పానం, వేట, వాక్పారుష్యం, దండపారుష్యం, సొమ్ము అనవసరంగా వ్యయం చేయటం. వీటిలో వేట ఒకటి. వ్యసనపరాయణులు ఎట్టిదోషా న్నైనా చేస్తా రనటానికి ఇది నిదర్శనం.

**క. అలుకమెయి మున్న పలికితి । నలుకని నా పలుకు తీక్ష్ణ మై యింతకు ను**
**జ్జ్వలదహనాకృతిఁ దక్షకుఁ । దలరఁగఁ బ్రేరేప కేల తానెడ నుడుగున్. 177**

**ప్రతిపదార్థం:** అలుకమెయిన్= కోపంతో; మున్ను+అ= పూర్వమే; పలికితిన్= శాపమిచ్చాను; అలుకని= భయపడని; నా, పలుకు= నామాట; తీవ్రమై, ఇంతకున్= ఈపాటికి; ఉజ్జ్వల, దహన+ఆకృతిన్= మండే అగ్నియొక్క ఆకారంతో; తక్షకున్= తక్షకుడిని; తలరఁగన్= సంభ్రమించేటట్లుగా, (చలించేటట్లుగా), ప్రేరేపక= ప్రోత్సహింపక; ఏల= ఎందుకు; తాన్= తాను; ఎడన్= దూరంగా; వ్యర్థంగా; ఉడుగున్= తొలగిపోతుంది, మానుతుంది; మాన దని భావం.

**తాత్పర్యం:** కోపంతో పూర్వమే పలికాను. భయపడనినామాట తీవ్ర మై ఈపాటికి మండేఅగ్నియొక్క ఆకారంతో తక్షకుడిని కలత పొందేట్లుగా ప్రోత్సహింపక తాను ఎందుకు దూరంగా ఉండిపోతుంది? అంటే తక్షకుడిని తప్పక ప్రేరేపిస్తుం దని భావం.

**విశేషం:** ('అలుకని' - అనేపాఠం సందేహాస్పదంగా ఉన్నది.) (కొన్నిప్రతులలో ఉండే 'అలుకనె'- (అలుకన+ఎ) = నాపలుకు అంత చులకనిదా? అనేపాఠం ఉచితతరంగా కనిపిస్తున్నది.)

**వ. 'నావచనం బమోఘం' బనిన, శమీకుండు శోకాకులితచిత్తుండై, తన శిష్యున్ గౌరముఖుం డనువానిం బిలిచి, 'దీని నంతయుఁ బరీక్షితునకెఱింగించి తక్షకువలనిభయంబు దలంగునట్టి యుపాయంబు సేసికొమ్మని చెప్పి ర' మ్మనిన; వాఁడు నప్పుడ పరీక్షితుపాలికిం జని యి ట్లనియె. 178**

**ప్రతిపదార్థం:** నావచనంబు= నాపలుకు; అమోఘంబు= వ్యర్థం కానిది; అనినన్= అని శృంగి పలుకగా; శమీకుండు; శోక+ఆకులిత, చిత్తుండు+అయి= చింతచే కలత చెందిన హృదయం కలవా డయి; గౌరముఖుండు+అనువానిన్= గౌరముఖుడు అనేపేరు కలవాడిని; తన, శిష్యున్; పిలిచి; దీనిన్, అంతయున్= శృంగి శపించినవిషయమంతా; పరీక్షితునకున్; ఎఱింగించి= తెలిపి; తక్షకువలని భయంబు= (సమాసంలో చేత, తోడ, వలన అనేవాటికి 'ఇ' కారం వస్తుంది) తక్షకుడి వలన కలిగే భయాన్ని; తలంగు, అట్టి= తొలగించేటి; ఉపాయంబు; చేసికొమ్ము, అని= చేసికొమ్మని; చెప్పి, రమ్ము+అనినన్= చెప్పిర మ్మని పలుకగా; వాఁడున్= ఆగౌరముఖుడును; అప్పుడు+అ= వెంటనే; పరీక్షితు, పాలికిన్= పరీక్షిత్తుచెంతకు; చని=వెళ్ళి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నా పలుకు వ్యర్థం కాదు' అని శృంగి పలుకగా శమీకుడు దుఃఖంచేత కలత చెందిన హృదయం కలవా డయి, గౌరముఖుడనే పేరు గల తనశిష్యుడిని పిలిచి 'ఈ విషయమంతా పరీక్షిత్తుకు తెలిపి, తక్షకుడివలన కలిగే భయం తొలగే ఉపాయం చేసికొ మ్మని చెప్పిర' మ్మని పంపగా ఆ గౌరముఖుడు వెంటనే పరీక్షితుడిచెంతకు వెళ్ళి ఇట్లా పలికాడు.

**సీ. అడవిలో నేకాంతమతి ఘోరతపమున । నున్న మా గురులపై నురగశవము**
**వైచుట విని యల్గి, వారి తనూజుండు । శృంగి యన్వాఁడు కార్చిచ్చునట్టి**
**శాపంబు నీ కిచ్చె, సప్తాహములలోన । నా పరీక్షితుఁడు నాయలుకఁ జేసి**
**తక్షకవిషమున దగ్ధుఁ డయ్యెడు మని, । దానికి గురులు సంతాప మంది**

**ఆ. భూతలేశ! నన్నుఁ బుత్తెంచి రిప్పుడు, । తద్భయంబులెల్లఁ దలఁగునట్టి**
**మంత్రతంత్రవిధు లమర్చి యేమఱకుండు । నది నిరంతరంబు ననియుఁ గఱప. 179**

**ప్రతిపదార్థం:** అడవిలోన్= అడవిలో; ఏకాంత, మతిన్= ఏకాగ్రమైన మనస్సుతో; ఘోర, తపమునన్, ఉన్న= తీవ్రమైన తపస్సులో ఉండిన; మా గురులపైన్= మాగురు వైన శమీకునిమీద; (పూజ్యార్థంలో బహువచనం); ఉరగశవము= సర్పంయొక్కకళేబరాన్ని (చచ్చినపామును); వైచుట= వేయటం; విని; అల్గి= కోపించి; వారితనూజుండు= మాగురువులకుమారుడు; శృంగి, అన్, వాఁడు= శృంగి అనే పేరు కలవాడు; ('అను' లోని 'ఉ' కారం లోపిస్తే 'అన్వాడు' అయింది); కార్చిచ్చు+అట్టి= దావాగ్నివంటి; (అడవిని కాల్చే అగ్నివంటి); శాపంబు; సప్త+అహములలోనన్= ఏడురోజుల్లో; ఆ పరీక్షితుఁడు; నా, అలుకన్‌చేసి= నాకోపంచేత; తక్షకవిషమునన్= తక్షకుడి యొక్క విషంచేత; దగ్ధుఁడు= దహింపబడినవాడు; అయ్యెడున్+అని= అవునుగాక అని; (దీవనకు, శాపానికి ఎడమ, కావుత మొదలైనవి అవుతాయి); నీకున్, ఇచ్చెన్= నీకు శాపమిచ్చాడు; దానికిన్= శాపమివ్వటానికి; గురులు= శమీకుడు; సంతాపము+అంది= దుఃఖం పొంది; భూతల+ఈశ= ఓరాజా! ఇప్పుడు; నన్నున్; తద్, భయంబులు+ఎల్లన్= ఆశాపంవలని భయాలన్నీ; తలఁగు, అట్టి= తొలగించేటి; మంత్ర, తంత్ర, విధులు= మంత్రాలు, తంత్రాలు, (చేయదగిన కార్యాలు) మొదలైన విధానాలు; నిరంతరంబున్= సతతం; అమర్చి= ఏర్పరచి; ఏమఱక+ఉండునది= అశ్రద్ధవహించక ఉండాలి; అనియున్= అనికూడ; కఱపన్= బోధించటానికి; ఇప్పుడు; నన్నున్; పుత్తెంచిరి= పంపారు.

**తాత్పర్యం:** అడవిలో ఏకాగ్రమయిన మనస్సుతో తీవ్రమయిన తపస్సు చేస్తున్న పూజ్యులైన మాగురువుగారిపై నీవు చచ్చినపామును వేయటం విని కోపించి శృంగి అనేపేరు కల వారికుమారుడు 'ఏడురోజులలో ఆ పరీక్షితుడు నాకోపంచేత తక్షకు డనే పాముయొక్క విషంచేత దహింపబడుగాక!' అని దావాగ్ని వంటి శాపం నీ కిచ్చాడు. అట్లా అతడు శాప మివ్వటానికి మా గురువుగారు శోకించి ఓరాజా! దానివల్ల కలిగే భయాలన్నీ తొలగించే మంత్రాలు తంత్రాలు మొదలయిన విధానాలన్నీ ఏర్పరచి సంతతం జాగరూకతతో ఉండా లని నీకు బోధించేకొరకు నన్నిప్పుడు నీకడకు పంపారు.

**విశేషం:** ఇది శమీకుని క్షమాశక్తినీ సౌజన్యాన్నీ సూచిస్తుంది. అలం: ఉపమ. అయ్యెడున్+అని= అయ్యెడుమని "ఎడు, తల ద్రుతంబునకు అచ్చుపరంబగునపుడు మకారంబగు.'' (బాలవ్యా. క్రి.28సూ.)

**వ. అని చెప్పి గౌరముఖుం డరిగినం, బరీక్షితుండు పరిక్షీణహృదయుం డై తనచేసిన వ్యతిక్రమంబునకు సంతాపించి, శమీకు నుపశమనంబునకు మెచ్చి శృంగి శాపంబునకు వెఱచి మంత్రివర్గంబుతో విచారించి యాత్మరక్షయం దప్రమాదుం డై. 180**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; గౌరముఖుండు= శమీకునిశిష్యుడు; అరిగినన్= వెళ్ళగా; పరీక్షితుండు; పరిక్షీణహృదయుండు+ఐ= మిక్కిలి బలహీన మైన హృదయం కలవాడై; తనచేసిన= తాను చేసిన, (కర్తృపదప్రథమకు షష్ఠి); వ్యతిక్రమంబునకున్= ధర్మవిరుద్ధకార్యానికి; సంతాపించి= దుఃఖించి; శమీకు+ఉపశమంబునకున్= శమీకునియొక్క ఓర్పునకు; మెచ్చి; శృంగి, శాపంబునకున్= శృంగి ఇచ్చినశాపానికి; వెఱచి= భయపడి; మంత్రివర్గంబుతోన్= మంత్రులసమూహంతో; విచారించి= ఆలోచించి; ఆత్మ, రక్ష, అందున్= తన్ను రక్షించుకోవటంలో; అప్రమాదుండు+అయి= ఏమరుపాటు లేనివా డయి.

**తాత్పర్యం:** అని గురువుగారిసందేశం చెప్పి గౌరముఖుడు వెళ్ళగా, పరీక్షిత్తు కలతచెందినహృదయం కలవాడై తాను చేసిన ధర్మ విరుద్ధకార్యానికి శోకించి, శమీకుని ఓర్పునకు మెచ్చి, శృంగి ఇచ్చినశాపానికి భయపడి, మంత్రులసమూహంతో ఆలోచించి తనను రక్షించుకోవటంలో ఏమరుపాటు లేనివాడై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ. సకలోర్వీశుఁ డతిప్రయత్నపరుఁ డై, సర్వక్రియాదక్ష త**
**క్షకకోటుల్ పనిసేయఁగా, ఘనతరైకస్తంభహర్మ్యంబుఁ ద**
**క్షకభీతిన్ రచియింపఁ బంచి, దృఢరక్షన్ దానిలో నుండెఁ బా**
**యక రాత్రిందివజాగరూకహితభృత్యామాత్యవర్గంబుతోన్. 181**

**ప్రతిపదార్థం:** సకల+ఉర్వీ+ఈశుఁడు= సర్వభూమికిని ప్రభు వైన పరీక్షిత్తు; తక్షకభీతిన్= తక్షకుడివలని భయంచేత; అతిప్రయత్నపరుడు+ఐ= అధికమైన ప్రయత్నంలో ఆసక్తికలవాడై; సర్వ, క్రియా, దక్ష, తక్షక, కోటుల్= అన్నిపనులలోను సమర్థులైన వడ్ల (వడ్రంగుల) వారి సముదాయాలు; పనిచేయఁగాన్; ఘనతర, ఏక, స్తంభ, హర్మ్యంబున్= మిక్కిలి గొప్ప దైన ఒకటే స్తంభంగల సౌధాన్ని; రచియింపన్= నిర్మించటానికి; పంచి= ఆజ్ఞాపించి; రాత్రిందివ, జాగరూక, హిత, భృత్య+అమాత్య, వర్గంబుతోన్= రాత్రియు పగలును శ్రద్ధవహించి ఉండే ఆప్తులయొక్కయు, సేవకులయొక్కయు, మంత్రులయొక్కయు సముదాయంతో; పాయక= విడువక; దృఢరక్షన్= దట్ట మైన రక్షణతో; దానిలోన్= ఆఒంటికంబపుమేడలో; ఉండెన్= నివసించాడు.

**తాత్పర్యం:** సర్వభూమికి ప్రభు వైన పరీక్షిత్తు అధిక మైన ప్రయత్నంలో ఆసక్తి కలవాడై తక్షకుడివలనిభయంచేత అన్నిపనులను చేయటంలో నేర్పరు లైన వడ్రంగులసమూహాలు పనిచేయగా గొప్పదైన ఒంటికంబపుమేడ నిర్మించటానికి ఆజ్ఞాపించి రేయుంబవళ్ళు మేల్కొని ఉండి శ్రద్ధవహించేఆప్తుల, సేవకుల, మంత్రుల సమూహంతో విడువక దట్టమైనరక్షణతో ఆ ఒంటికంబపు మేడలో నివసించాడు.

**వ. మఱియు విషాపహారంబులయి వీర్యవంతంబు లయిన మంత్రతంత్రంబులు గలిగి యాజ్ఞాసిద్ధులైన విషవైద్యుల నొద్దఁ బెట్టికొని పరీక్షితుం డుండునంత, నట తక్షకుండు విప్రవచన ప్రచోదితుం డయి పరీక్షితునొద్దకు నెవ్విధంబునఁ బోవనగునో యని చింతించుచుండె; నటఁ దొల్లి. 182**

**ప్రతిపదార్థం:** మఱియున్= అదిగాక; విష+అపహారంబులు+అయి= విషాన్ని పోగొట్టేవై; వీర్యవంతంబులు+అయిన= శక్తి కల వైన; మంత్రతంత్రంబులు= మంత్రంబులును, వాటికి ఉచితమైన చర్యలును కలిగి; ఆజ్ఞాసిద్ధులు+అయిన= ఆజ్ఞతో సిద్ధిపొందిన (నోటితో ఆజ్ఞాపించటం చేతనే విషాన్ని పోగొట్టడంలో సమర్థులైన); విషవైద్యులన్= విషాన్ని తొలగించే వైద్యులను; ఒద్దన్= చెంత; పెట్టుకొని= ఉంచుకొని; పరీక్షితుండు= పరీక్షిన్మహారాజు; ఉండు+అంతన్= ఉండగా; అట= అచ్చట; తక్షకుండు; విప్ర, వచన, ప్రచోదితుండు+అయి= బ్రాహ్మణు డైన శృంగియొక్క శాపవచనంచేత ప్రేరేపింపబడినవాడై; పరీక్షితు+ఒద్దకున్= పరీక్షిత్తుదగ్గరకు; ఏవిధంబునన్= ఏవిధంగా; పోవన్, అగునో, అని= వెళ్ళటానికి వీలవుతుందో అని; చింతించుచున్+ ఉండెన్; అటన్; తొల్లి= పూర్వం.

**తాత్పర్యం:** అదిగాక, విషాన్ని తొలగించే, శక్తితో కూడినమంత్రాలు క్రియాకలాపాలు కలిగి, ఆజ్ఞాపించటంచేతనే విషాన్ని పోగొట్టటానికి సమర్థు లైన విషవైద్యులను దగ్గర ఉంచుకొని పరీక్షిత్తు ఉండగా; అచ్చట తక్షకుడు బ్రాహ్మణు డైన శృంగివచనంచేత ప్రేరేపించబడి, పరీక్షిత్తుకడకు ఎట్లా పోవటానికి వీలవుతుందో అని ఆలోచిస్తూ ఉన్నాడు. అచ్చట పూర్వం (అంతకుపూర్వమే). (తరువాతి పద్యంతో అన్వయం.)

## కశ్యపునకుఁ దక్షకుఁడు గోరిన ధనం బిచ్చి మరల్చుట (సం. 1-38-31)

**మధ్యాక్కర.**

**ధరణిఁ జరాచరభూతసంఘంబుఁ దమవిషవహ్ని**
**నురగంబు లేర్చుచు నునికి కలిగి, పయోరుహగర్భుఁ**
**డురగవిషాపేతజీవ సంజీవనోపదేశంబు**
**గరుణఁ గశ్యపునకు నిచ్చె నఖిలలోకహితంబు పొంటె. 183**

**ప్రతిపదార్థం:** ధరణిన్= భూమిలో; చర+అచర, భూత, సంఘంబున్= జంగమస్థావర (కదిలేటి కదలనట్టి) ప్రాణుల, వస్తువుల సముదాయాన్ని; తమ, విషవహ్నిన్= తమయొక్కవిష మనే అగ్నిచే; ఉరగంబులు= పాములు; ఏర్చుచున్= కాలుస్తూ; ఉనికికిన్= ఉండటానికి; అలిగి= కోపించి; పయోరుహగర్భుఁడు= బ్రహ్మ; ఉరగవిష+అపేత, జీవ, సంజీవన+ఉపదేశంబు= పాములయొక్క విషంచేత పోయినప్రాణం కలవారిని మళ్ళీ బ్రదికించే ఉపదేశాన్ని (మంత్రాన్ని); కరుణన్= దయతో; అఖిల, లోక, హితంబు, పొంటెన్= సర్వలోకాలయొక్కమేలుకొరకు; కశ్యపునకున్= కశ్యపమునికి; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** భూమిలో స్థావరజంగమ వస్తుసముదాయాన్ని తమవిషాగ్నిచేత పాములు కాల్చి వేస్తుండటంవలన కోపించి బ్రహ్మదేవుడు సర్వలోకాలమేలు కోరి పాములవిషంచేత ప్రాణం పోయినవారిని మళ్ళీ జీవింపజేసే మంత్రోపదేశాన్ని దయతో కశ్యపుడికి ఇచ్చాడు.

**విశేషం:** జడపదార్థాలుకూడ తీవ్రమయిన సర్పవిషంచేత మాడిపోవటానికి అవకాశం ఉన్నది. మధ్యాక్కర అనేది ఒక దేశీవృత్తం. ఇందులో పాదానికి రెండింద్రగణాలు, ఒకసూర్యగణం, మళ్ళీ రెండు ఇంద్రగణాలు ఒకసూర్యగణం, మొత్తం ఆరుగణాలు ఉంటాయి. పూర్వకవులలో మధ్యాక్కరను నన్నయ, ఆరణ్యపర్వశేషంలో ఎఱ్ఱన మాత్రమే వాడారు. అయిదవగణంలోని మొదటిఅక్షరం యతిమిత్రస్థానం. ఎఱ్ఱన నాల్గవగణం మొదటిఅక్షరంపైనే యతిస్థానం వేశాడు. పలువురు లాక్షణికులుకూడ అట్లే చెప్పారు. ప్రాసనియమం ఉన్నది. పొంటె అనేది చతుర్థీవిభక్తి ప్రత్యయం. నన్నయ తర్వాత దానిప్రయోగం క్రమంగా సన్నగిల్లింది.

**వ. అట్టి కశ్యపుం డను బ్రహ్మర్షి 'శృంగిశాపంబునఁ బరీక్షితుండు తక్షకదష్టుం డగు నేఁడు సప్తమదివసం బటె! యేను వాని నపేతజీవు సంజీవితుం జేసి నావిద్యాబలంబు మెఱయుదు; మఱి యదియునుంగాక.' 184**

**ప్రతిపదార్థం:** అట్టి; కశ్యపుండు+అను; బ్రహ్మ+ఋషి= బ్రహ్మజ్ఞానం కల మహర్షి; శృంగి, శాపంబునన్= శృంగియొక్క శాపంచేత; పరీక్షితుండు; తక్షక, దష్టుండు+అగు= తక్షకునిచేత కరువబడినవాడు కాగల; నేఁడు= ఈరోజు; సప్తమ, దివసంబు+అటె= ఏడవరో జట; ఏను= నేను; అపేతజీవున్= తొలగినప్రాణం కలవాడిని; వానిన్= ఆపరీక్షితుని; సంజీవితున్; బ్రతికినవాడిని; చేసి; నా, విద్యాబలంబు= నాయొక్కవిద్యలోనిశక్తిని, మెఱయుదున్= ప్రకాశింపజేస్తాను; మఱి= ఇంకను; అదియునున్, కాక= అది కాక.

**తాత్పర్యం:** విషాగ్నిదగ్ధులను మళ్ళీ జీవింపజేయగల మంత్రాన్ని బ్రహ్మచేత ఉపదేశం పొందిన బ్రహ్మజ్ఞానంగల కశ్యపుడనే బ్రహ్మర్షి ఇట్లా ఆలోచించాడు: 'శృంగియొక్క శాపంచేత పరీక్షితుడు తక్షకునిచేత కరవబడినవాడవుతాడు;

అతడు శాప మిచ్చి నేటికి ఏడుదినాలు అయినదట; ప్రాణం పోయిన ఆ పరీక్షిత్తును నేను మళ్ళీ సజీవుడిని చేసి నావిద్యలోని శక్తిని ప్రకాశింపజేస్తాను. అదిగాక'. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'మెఱయు' ధాతువు అంతర్భావితప్రేరణం. మెఱయు అంటే 'మెఱయించు' అని అర్థం.

**తే. ధరణియెల్లను రక్షించు ధర్మచరితు । నా పరీక్షితు రక్షించి, యతనిచేత**
**నపరిమితధనప్రాప్తుండ నగుదుఁ; గీర్తి । యును ధనంబు ధర్మముఁ గొను టుఱదె నాకు. 185**

**ప్రతిపదార్థం:** ధరణి+ఎల్లనున్= భూమినంతటిని; రక్షించు= కాపాడే, ధర్మచరితున్= ధర్మంతోకూడిన చరిత్రుడిని; ఆ, పరీక్షితున్= ఆ పరీక్షిన్మహారాజును; రక్షించి= జీవింపచేయటంచేత కాపాడి; అతనిచేతన్; అపరిమిత, ధన, ప్రాప్తుండన్= అధికమయినధనాన్ని పొందినవాడిని; అగుదున్= అవుతాను; కీర్తియును; ధనంబు; ధర్మము= పుణ్యం; కొనుట; నాకున్; ఉఱదె= తగదా; (తగి ఉంటుంది).

**తాత్పర్యం:** 'భూమినంతటిని కాపాడే ధర్మప్రవర్తను డైన పరీక్షిత్తును తక్షకవిషాగ్నినుండి కాపాడి అతనిచేత అధిక మయిన ధనాన్ని పొందుతాను. కీర్తిని. సొమ్మును, పుణ్యాన్ని గ్రహించటం నాకు తగదా!' (తగును అని భావం).

**వ. అని విచారించి హస్తిపురంబునకుం బోవువానిఁ దక్షకుండు వృద్ధవిప్రుం డయి వనంబులో నెదురంగని 'మునీంద్రా! యెట వోయె, దేమి కార్యంబున' కనిన వానికిం గశ్యపుం డి ట్లనియె. 186**

**ప్రతిపదార్థం:** అని; విచారించి= ఆలోచించి; హస్తిపురంబునకున్= హస్తినాపురానికి; పోవువానిన్= వెళ్ళేవాడిని(కశ్యపుని); తక్షకుండు; వృద్ధవిప్రుండు+అయి= ముసలిబ్రాహ్మణు డయి; వనంబులోన్= అడవిలో; ఎదురన్= తనఎదుట; కని= చూచి; ముని+ఇంద్రా= మునిశ్రేష్ఠుడ! ఎట= ఎచ్చటికి; పోయెదు (వకారలోపం)= వెడతావు; ఏమి, కార్యంబునకున్= ఏపని చేయటానికి; అనినన్= అని అడుగగా; వానికిన్= వృద్ధబ్రాహ్మణరూపు డయిన తక్షకునికి; కశ్యపుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** అని ఆలోచించి, పరీక్షితు డుండే హస్తినాపురానికి వెళ్ళే కశ్యపుడిని తక్షకుడు ముసలిబ్రాహ్మణుడి రూపంతో వెళ్ళి అడవిలో తనయెదుట చూచి 'ఓమునిశ్రేష్ఠుడా! ఎచటికి, ఏపని చేయటానికి వెళ్ళుతున్నావు?' అని అడుగగా; తక్షకుడితో కశ్యపుడు ఇట్లా పలికాడు.

**క. తక్షకుఁ డను పన్నగుఁడు ప । రీక్షితుఁ గఱచునటె నేఁ; డరిందము నతనిన్**
**రక్షింపఁగఁ బోయెద శుభ । దక్షిణు నా మంత్ర తంత్ర దాక్షిణ్యమునన్. 187**

**ప్రతిపదార్థం:** తక్షకుఁడు+అను, పన్నగుఁడు= తక్షకుడనే పేరున్న నాగుడు (పాము), నేఁడు= ఈరోజున; పరీక్షితున్= పరీక్షిన్మహారాజును; కఱచున్, అటె= కరుస్తాడట; అరిందమున్= శత్రువులను అణచేవాడు; శుభదక్షిణున్= మంగళప్రదుడు; (మంచిమనస్సుకలవాడు) అయిన; అతనిన్= ఆ పరీక్షిన్మహారాజును; నామంత్ర, తంత్ర, దాక్షిణ్యమునన్= నాయొక్క మంత్రాలలోను, శాపహరణకార్యంలోను ఉన్న సామర్థ్యంచేత; రక్షింపఁగన్= కాపాడటానికి; పోయెదన్= పోతున్నాను.

**తాత్పర్యం:** తక్షకు డనే పాము నేడు పరీక్షిన్మహారాజును కరుస్తాడట; శత్రువుల నణచేవాడు, శుభప్రదుడు, సమర్థుడు, మంచిమనస్సు కలవాడు అయిన ఆ మహారాజును విషాన్నిపోగొట్టటంలో శక్తి ఉన్న నా మంత్రతంత్ర సామర్థ్యంచేత కాపాడటానికి వెళ్ళుతున్నాను.

**విశేషం:** నాలుగవపాదంలోని 'దక్షిణు' - అనే విశేషణంయొక్క 'దక్షత' అనే పాఠాంతరం పెక్కు ప్రతులలో ఉన్నది.

**క. అనిన విని నగుచు వాఁ డి। ట్లనియెను 'దక్షకుఁడ నేన, యశనినిపాతం**
**బున బ్రదుకఁగ నగు నేనియు। ననఘా! మద్విషనిహతుల కగునే బ్రదుకన్. 188**

**ప్రతిపదార్థం:** అనినన్= అని కశ్యపుడు పలుకగా; విని; నగుచున్= నవ్వుతూ; వాఁడు= తక్షకుడు; ఇట్లు+అనియెను= ఇట్లా పలికాడు. తక్షకుఁడన్= తక్షకుడిని; ఏను+అ= నేనే; ఆశని, నిపాతంబునన్= వజ్రాయుధంయొక్క (పిడుగు) పాటుచేత; బ్రదుకఁగన్+అగున్, ఏనియున్= జీవించవచ్చు నేమోకాని,; అనఘా= ఓపాపరహితుడా! మత్, విష. నిహతులకున్= నాయొక్క విషంచేత చంపబడినవారికి; బ్రదుకన్= జీవించటానికి; అగున్+ఏ= శక్యమవునా! (కా దని భావం.)

**తాత్పర్యం:** అని కశ్యపుడు పలుకగా విని నవ్వుతూ తక్షకుడు ఇట్లన్నాడు: 'ఓ పాపరహితుడా! నేనే ఆ తక్షకుడిని. వజ్రాయుధం (పిడుగుపాటు) యొక్క దెబ్బచేత బ్రతికిన బ్రతుకవచ్చుగాక! నావిషంచేత చంపబడిన వారికి జీవింప శక్యం కాదు.'

**వ. 'నీమందులు మంత్రంబులు నాయందుం బనిసేయవు క్రమ్మఱి పొమ్ము; కాదేని నీవ చూడ నివ్వట వృక్షంబుఁ గఱచి నావిషానలంబున భస్మంబు సేసెద; నోపుదేని దీనిని సంజీవితంబుఁజేయు' మని తక్షకుం డా వృక్షంబుఁ గఱచిన. 189**

**ప్రతిపదార్థం:** నీమందులు= నీవు వేసే మందులు; మంత్రంబులు= విషాన్ని పోగొట్టే మంత్రాలు; నాయందున్= నావిషయంలో; పని, చేయవు= సఫలం కావు; క్రమ్మఱి= తిరిగి; పొమ్ము= వెళ్ళుము; కాదు+ఏని= అట్లాకాకుంటే; నీవు+అ= నీవే; చూడన్= చూస్తుండగా; ఈ+వటవృక్షంబున్= ఈమఱ్ఱిచెట్టును; కఱచి; నావిష+అనలంబునన్= నావిషంయొక్క అగ్నిచేత; భస్మంబు, చేసెదన్= బూడిద చేస్తాను; ఓపుదు(వు), ఏని= శక్తి కలవాడ వయితే; దీనిని= ఈవృక్షాన్ని; సంజీవితంబున్= బ్రతికినదాన్ని; చేయుము; అని; తక్షకుండు; ఆ వృక్షంబున్= ఆ చెట్టును; కఱచినన్= కరవగా.

**తాత్పర్యం:** 'నీవు వేసే మందులు, మంత్రాలు నా విషయంలో పని చేయవు. వ్యర్థా లవుతాయి. తిరిగివెళ్ళిపొమ్ము; అట్లా కాకుంటే, నీవు చూస్తూండగానే ఈ మఱ్ఱిచెట్టును కరచి నా విషంవలన పుట్టే అగ్నిచేత బూడిద చేస్తాను. శక్తికలవాడ వయితే ఈ చెట్టును మళ్ళీ బ్రతికించు ' అని తక్షకుడు ఆ చెట్టును కాటువేయగా.

**ఆ. అయ్యహీంద్ర విష మహానల దగ్ధ మై। విపుల పత్త్ర దీర్ఘ విటపతతుల**
**గగనమండలంబుఁ గప్పిన యవ్వట। తరువు భస్మ మయ్యెఁ దత్క్షణంబ. 190**

**ప్రతిపదార్థం:** ఆ+అహి+ఇంద్ర, విష. మహత్, అనల, దగ్ధము+ఐ= పాములరా జయిన ఆ తక్షకుని విషంవలన పుట్టిన గొప్ప అగ్నిచేత కాల్చబడిం దై; విపులపత్త్ర దీర్ఘ, విటప, తతులన్= విశాలా లయిన ఆకులచేతను పొడవైన కొమ్మలచేతను; గగనమండలంబున్= ఆకాశప్రదేశాన్ని; కప్పిన= ఆక్రమించిన; ఆ+వట, తరువు= ఆ మఱ్ఱిచెట్టు; తద్, క్షణంబు+అ= వెంటనే (ఆ క్షణమే); భస్మము+ అయ్యెన్= బూడిద అయింది.

**తాత్పర్యం:** పాముల రాజయిన ఆ తక్షకుని విషంవలన పుట్టిన గొప్ప అగ్నిచేత కాల్చబడి, విశాలమయిన ఆకులచేత, పొడవైనకొమ్మల సమూహాలచేత ఆకాశప్రదేశాన్ని ఆక్రమించిన ఆ మఱ్ఱిచెట్టు వెంటనే బూడిద అయింది.

**వ. కశ్యపుండును నప్పుడ యాభస్మ చయంబు గూడఁ ద్రోచి, తన మంత్రతంత్రశక్తింజేసి యెప్పటియట్ల వృక్షంబుగాఁ జేసినం జూచి, తక్షకుం డతివిస్మయం బంది 'మునీంద్రా! నీవిద్యాబలంబున నిది సంజీవితం బయ్యె నేనియు నతికుపిత విప్రశాప వ్యపగతాయుష్యం డైన పరీక్షితుండు సంజీవితుండు గానోపండు; వాని యిచ్చు ధనంబు కంటె నాయం దధికధనంబు గొనిపొ' మ్మనినఁ గశ్యపుండును దన దివ్యజ్ఞానంబున నట్లకా నెఱింగి, తక్షకుచేత ననంతం బైన యర్థంబు గొని క్రమ్మఱి చనియె; విజనం బైన విపినాంతరంబున నైన యయ్యిరువుర వృత్తాంతంబు మీ రె ట్లెఱింగితి రంటేని వినుము. 191**

**ప్రతిపదార్థం:** కశ్యపుండును= కశ్యపుడు కూడ; అప్పుడు+అ= అప్పుడే; ఆ భస్మచయంబు= చెట్టుకాలగా మిగిలిన బూడిద సముదాయాన్ని; కూడన్, త్రోచి= కలిసేట్లుగా ప్రోగుచేసి; తన, మంత్ర, తంత్ర, శక్తిన్, చేసి= తనయొక్క మంత్రాలయొక్క విషాన్ని తొలగించే కార్యాలయొక్క శక్తిచేత; ఎప్పటి, అట్లు+అ= పూర్వం విధంగానే; వృక్షంబుగాన్= చెట్టుగా; చేసినన్= చేయగా; చూచి; తక్షకుండు; అతి, విస్మయంబు= అధికమైన ఆశ్చర్యం; అంది= పొంది; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠా!; నీ, విద్యాబలంబునన్= నీవిద్యలోని శక్తిచేత; ఇది= ఈచెట్టు; సంజీవితంబు= మళ్ళీ చక్కగా బ్రదికింది; అయ్యెన్, ఏనియున్= అయినప్పటికి; అతి, కుపిత, విప్ర, శాప, వ్యపగత+ఆయుష్యుండు+అయిన= మిక్కిలి కోపించిన బ్రాహ్మణునియొక్క శాపంచేత పోయిన ఆయుర్దాయం కల; పరీక్షితుండు; సంజీవితుండు= బ్రతికినవాడు; కాన్, ఓపండు= కాజాలడు; వాని, ఇచ్చు, ధనంబు, కంటెన్= ఆపరీక్షితు డిచ్చే ధనంకంటె; నా, అందున్= నావలన; అధిక, ధనంబు= ఎక్కువధనం; కొని= గ్రహించి; పొమ్ము= వెళ్ళుము; అనినన్= అని పలుకగా; కశ్యపుండును; తన, దివ్యజ్ఞానంబునన్= దివ్యమైన (ఇంద్రియాల కతీతమైన) తపస్సువలన కలిగిన జ్ఞానంచేత; అట్లు+అ, కాన్= అట్లే కావటం (పరీక్షితుడు మరణించక తప్పదనటం); ఎఱింగి= తెలిసికొని; తక్షకుచేత; అనంతంబు+అయిన= అంతంలేని; అర్థంబు= ధనం; కొని= గ్రహించి; క్రమ్మఱి= తిరిగి; చనియెన్= వెళ్ళిపోయాడు; విజనంబు+అయిన= జనులు లేని; విపిన+అంతరంబునన్= అడవినడుమ; ఐన= జరిగిన; ఆ+ఇరువుర= ఆ ఇద్దరియొక్క; వృత్తాంతంబు; మీరు; ఎట్లు+ఎఱింగితిరి= మీ రెట్లా తెలిసికొన్నారు; అంటి(వి)+ఏని= (భూతకాలమవటంచేత 'వ' కారలోపం) అంటావేమో; వినుము (ఈపలుకులు, మంత్రులు జనమేజయుడితో చెపుతున్నారు).

**తాత్పర్యం:** కశ్యపుడుకూడ అప్పుడే కాలిన ఆ చెట్టుయొక్కబూడిదను పోగుచేసి తనమంత్రాలయొక్క, తంత్రాలయొక్క బలంచేత పూర్వంలాగే చెట్టుగా చేయగా, చూచి తక్షకుడు మిక్కిలి ఆశ్చర్యం పొంది 'ఓ మునిశ్రేష్ఠుడా! నీ విద్యయొక్క శక్తిచేత ఈ చెట్టు చక్కగా బ్రతికినప్పటికిని మిక్కిలి కోపించిన బ్రాహ్మణు డైన శృంగియొక్క శాపంచేత చనిపోయిన పరీక్షితుడు బ్రదుకజాలడు అత డిచ్చే సొమ్ముకంటె నావలన ఎక్కువ సొమ్ము గ్రహించి వెళ్ళిపొమ్ము' అని పలుకగా కశ్యపుడు కూడ తపస్సువలన కలిగిన తన దివ్యజ్ఞానంచేత అట్లే కావటం తెలిసికొని తక్షకుడివలన అధిక మైన ధనం గ్రహించి తిరిగి వెళ్ళిపోయాడు. జనం లేని అడవి నడుమ జరిగిన ఆ తక్షక, కశ్యపుల సంగతి మీ రెట్లా తెలిసికొన్నా రని అడుగుతా రేమో చెప్తుతాం వినండి.

**తే. ఇప్పురంబున బ్రాహ్మణుం డింధనార్థ । మేఁగి, మున్న యావృక్షంబు నెక్కి, దాని**
**తోన దగ్ధుఁ డై, మఱి దానితోన లబ్ధ । జీవుఁడై వచ్చి జనులకుఁ జెప్పె దీని. 192**

**ప్రతిపదార్థం:** ఈ+పురంబున, బ్రాహ్మణుండు= ఈ పట్టణంలోని విప్రుడు, ఇంధన+అర్థము= కట్టెలనిమిత్తం; ఏఁగి= వెళ్ళి; మున్ను+అ= అంతకుముందే; ఆ, వృక్షంబున్, ఎక్కి= ఆ మఱ్ఱిచెట్టును ఎక్కి; దానితోన్+అ= ఆ చెట్టుతోడనే; దగ్ధుఁడు+ఐ= కాల్చబడినవా డై; మఱి= తర్వాత; దానితోన్+అ= ఆ చెట్టుతోడనే; లబ్ధ, జీవుఁడు+ఐ= పొందబడినప్రాణం కలవా డై; వచ్చి= పట్టణానికి తిరిగి వచ్చి; దీనిన్= ఈ వృత్తాంతాన్ని; జనులకున్= ప్రజలకు; చెప్పెన్,

**తాత్పర్యం:** ఈ హస్తినాపురంలోని విప్రు డొకడు కట్టెల నిమిత్తం అడవికి పోయి, తక్షకుడు ఈ వృక్షాన్ని కాల్చటానికి ముందే దాన్ని ఎక్కి దానితోపాటు కాల్చబడి తర్వాత ఆ చెట్టుతోనే పొందబడిన ప్రాణం కలవాడై పట్టణానికి తిరిగివచ్చి ఈ వృత్తాంతాన్ని జనులకు చెప్పాడు.

**తక్షకవిషాగ్నిచేఁ బరీక్షితుండు హర్మ్యంబుతోడ దగ్ధుం డగుట (సం. 1-39-19)**

**వ. అట్లు కశ్యపుం గ్రమ్మఱించి తక్షకుండు తత్క్షణంబ నాగకుమారులం బిలిచి 'మీరలు విప్రుల రయి సురభి కుసుమ స్వాదు వన్యఫలంబులు పలాశపర్ణపుటికలం బెట్టికొని పరీక్షితు పాలికిం జని యిం' డని పంచి, తానును వారితోడన యదృశ్యరూపుం డయి వచ్చిన. 193**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; కశ్యపున్= కశ్యపమహర్షిని; క్రమ్మఱించి= తిరిగివెళ్ళేట్లు చేసి; తక్షకుండు; తద్+క్షణంబు+అ= ఆ క్షణమందే; నాగకుమారులన్= యువకులైననాగులను; పిలిచి; మీరలు= మీరు; విప్రులరు+అయి= బ్రాహ్మణు లయి; సురభి, కుసుమ, స్వాదు, వన్య, ఫలంబులు= సువాసన గల పువ్వులును, వనంలోని రుచిగల పండ్లును; పలాశ, పర్ణ, పుటికలన్= మోదుగ ఆకులలోను బుట్టలలోను; పెట్టికొని; పరీక్షితు, పాలికిన్= పరీక్షిత్తు చెంతకు; చని= వెళ్ళి; ఇండు; అని, పంచి= అని ఆజ్ఞాపించి; తానును= తానుకూడ; వారితోడన్, అ= వారివెంటనే; అదృశ్య, రూపుండు+అయి= కనబడని రూపం కలవా డయి; వచ్చినన్= రాగా.

**తాత్పర్యం:** తక్షకుడు ఆవిధంగా కశ్యపమహర్షిని మరలించి, ఆ క్షణమందే సర్పకుమారులను పిలిచి, 'మీరు బ్రాహ్మణు లై సువాసన గల పువ్వులను వనంలోని రుచిగల పండ్లను మోదుగ ఆకుల బుట్టలలో పెట్టుకొని పరీక్షిత్తు చెంతకు వెళ్ళి అతడి కివ్వం' డని ఆజ్ఞాపించి, తానుకూడ వారితోడనే అదృశ్యరూపుడై రాగా.

**విశేషం:** విప్రులు+రు - ప్రథమాంతా లయిన యుష్మదస్మద్విశేషణాలకు ఏకత్వమున వునులును, బహుత్వమున రుములును అంతాగమాలు ప్రాయికంగా అవుతాయి. ఈఆగమం పరమయినపుడు ఉత్వానికి అత్వం అవుతుంది- విప్రులరు.

**చ. ద్విజవరులం గుమారుల నతిప్రియదర్శను లైనవారి ఋ**
**గ్యజుషపదక్రమంబులు క్రియన్ గుణియించుచు వచ్చువారి న**
**గ్గజపురవల్లభుండు గని, గ్రక్కున డాయఁగఁ బిల్చి మెచ్చి, భా**
**వజసుభగుండు చేకొనియె వారలు దెచ్చినవాని నన్నిటిన్. 194**

**ప్రతిపదార్థం:** భావజ, సుభగుండు= మన్మథునివలె అందమైనవాడు; ఆ+గజపుర, వల్లభుండు= హస్తినాపురానికిరా జైన ఆ పరీక్షిత్తు; ద్విజవరులన్= బ్రాహ్మణశ్రేష్ఠులను; అతి ప్రియదర్శనులు+అయిన, వారిన్= మిక్కిలి ప్రియ మైన దర్శనం కలవారిని (చూడటానికి మిక్కిలి ప్రీతి కలిగించేవారిని); ఋక్, యజుష, పద, క్రమంబులు= ఋగ్వేదంయొక్క యజుర్వేదంయొక్క పదపాఠాన్ని, క్రమపాఠాన్ని; క్రియన్= అనుగుణంగా చేతులు త్రిప్పటం మొదలయినపనితో; గుణియించుచున్= లెక్కిస్తూ; వచ్చువారిన్= వచ్చేవాళ్ళను; కుమారులన్= బ్రాహ్మణవేషంలో ఉన్న యువకులను (నాగకుమారులను); కని= చూచి; గ్రక్కునన్= వేగంగా; డాయఁగన్= సమీపించేటట్లుగా; పిల్చి; మెచ్చి; వారలు= వారు; తెచ్చినవానిన్= తెచ్చిన వస్తువులను; (పూలను, పండ్లను); అన్నిటిన్= అన్నిటిని; చేకొనియెన్= గ్రహించాడు.

**తాత్పర్యం:** మన్మథునివలె సుందరుడు, హస్తినాపురప్రభువు అయిన పరీక్షిత్తు మిక్కిలిప్రియ మైన రూపం కలవారిని, ఋగ్వేదంయొక్క యజుర్వేదంయొక్క పదపాఠాన్ని, క్రమపాఠాన్ని అనుగుణ మైన క్రియతో లెక్కిస్తూ వచ్చేవాళ్ళను, బ్రాహ్మణయువకులను, (బ్రాహ్మణరూపంలో ఉన్న నాగకుమారులను) చూచి, వెంటనే దగ్గరకు రమ్మని పిలిచి, వారు తెచ్చిన పూలను, పండ్లను అన్నింటిని స్వీకరించాడు.

**విశేషం:** పద మంటే వేదవాక్యంలోని పదాలను ఒండొంటితో విడదీయటం, క్రమ మంటే ఒక్కొక్కమారు ఒక్కొక్కపదాన్ని విడిచి మరొకపదాన్ని గ్రహిస్తూ వేదాన్ని పఠించే ఒకానొకపద్ధతి.

**క. వారల నర్ఘప్రియ స । త్కారులఁ గావించి పుచ్చి, కాలనియోగ**
**ప్రేరితుఁ డై, యమరేంద్రా । కారుఁడు తద్వన్యఫలజిఘత్సాపేక్షన్. 195**

**ప్రతిపదార్థం:** అమర+ఇంద్ర+ఆకారుఁడు= దేవేంద్రుడి ఆకారంవంటి ఆకారం కలవాడు; వారలన్= ఆ విప్రకుమారులను; అర్ఘ, ప్రియ, సత్కారులన్= తగినట్టి, ప్రీతి కలిగించే సన్మానం కలవారిని; కావించి= చేసి; పుచ్చి= పంపి; కాలనియోగప్రేరితుఁడు+ఐ= కాలం (యముని) యొక్క నిర్దేశంచేత (ఆజ్ఞచే) ప్రేరేపింపబడినవా డై; తద్+వన్య, ఫల, జిఘత్సా+అపేక్షన్= ఆవనంలోని ఫలాలను తినాలనే కోరికతో.

**తాత్పర్యం:** ఇంద్రుని ఆకారంవంటి ఆకారం కల ఆ పరీక్షిత్తు వచ్చిన బ్రాహ్మణకుమారులకు తగినట్లు, వారికి ప్రీతి కలిగించేటట్లు సన్మానించి పంపి, కాలం(కాలుని) యొక్క ఆజ్ఞచేత ప్రేరేపించబడిన వాడై వారు తెచ్చిన అడవిలోని ఫలాలను తినాలనేకోరికతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. సూరెల నున్న మంత్రులను జుట్టములం గడుఁ గూర్చుమిత్త్రులన్**
**సారబలుండు చూచి 'మునిశాపదినంబులు వోవుదెంచె, నం**
**భోరుహమిత్త్రుఁ డస్తగిరిఁ బొందెడు' నం చొగిఁ దత్ఫలావలుల్**
**వారల కెల్లఁ బెట్టి, యనవద్యుఁడు దా నొకపండు చెచ్చెరన్. 196**

**ప్రతిపదార్థం:** అనవద్యుఁడు= దోషరహితుడు; సార, బలుండు= శ్రేష్ఠమైనబలం కల పరీక్షిత్తు; సూరెలన్= పార్శ్వంలో; ఉన్న; మంత్రులను; చుట్టములన్; కడున్, కూర్చు= మిక్కిలి ప్రీతి కలిగించే (ఆప్తులైన); మిత్రులన్= స్నేహితులను; చూచి; ముని, శాప, దినంబులు= ముని అయిన శృంగి ఇచ్చిన శాపానికి సంబంధించిన రోజులు; పోవుదెంచెన్= కడచిపోయాయి; అంభోరుహ, మిత్రుఁడు= పద్మాలకు ఆప్తుడైన సూర్యుడు; అస్తగిరిన్= పడమటికొండను; పొందెడున్= పొందుతున్నాడు; అంచున్= అని పలుకుతూ; ఒగిన్= వరుసగా; తద్, ఫల+ఆవలుల్= ఆ పండ్లసముదాయాలు; వారలకున్, ఎల్లన్= వారి కందరికిని; పెట్టి, తానున్+ఒక, పండు; చెచ్చెరన్= వేగంగా.

**తాత్పర్యం:** దోషరహితుడు, అధిక మయిన బలం కలవాడు అయిన పరీక్షిత్తు పార్శ్వాలలో ఉన్నమంత్రులను, బంధువులను, మిక్కిలి ఆప్తులైన స్నేహితులను చూచి 'ముని అయిన శృంగి ఇచ్చిన శాపపురోజులు ఏడును గడిచాయి; సూర్యుడు అస్తమిస్తున్నాడు'. అని పలుకుతూ వరుసగా ఆ ఫలాలసముదాయాలను వారికందరికి పెట్టి తానూ ఒకపండు వేగంగా.

**విశేషం:** ముని పెట్టిన శాపపు గడువురోజులు ముగిశాయి, అంభోరుహమిత్త్రుఁ డస్తగిరిఁ బొందెడు- అని పరీక్షిత్తు అన్న వాక్యాలలో 'గండం' అనే సూచ్యార్థసూచనం నిబంధించాడు నన్నయ. సూర్యుడస్తమించబోతున్నాడని చెప్పిన పరీక్షిత్తు తన అస్తమయాన్నే అజ్ఞాతంగా ధ్వనింపచేశా డన్నది ఇక్కడి విశేషం.

**క. కొని వ్రచ్చుడు, లోపల న । ల్లనిక్రిమి యై తోఁచి, చూడ లత్తుక వర్ణం**
**బునఁ బామై, విషవహ్నులు । దనుకఁగఁ గురువీరుఁ గఱచి తక్షకుఁ డరిగెన్. 197**

**ప్రతిపదార్థం:** కొని= గ్రహించి; వ్రచ్చుడున్+ చీల్చినవెంటనే; లోపలన్= ఆ పండులోపల; నల్లనిక్రిమి, ఐ= నల్లనిపురుగై; తోఁచి= కనబడి; చూడన్= పరిశీలించగా; లత్తుక, వర్ణంబునన్= లాక్షారసంవలె ఎఱ్ఱనిరంగుతో; పాము+ఐ; విషవహ్నులు= విషంయొక్క అగ్నులు; తనుకఁగన్= ప్రకాశించగా(కలుగగా); కురువీరున్= వీరు డైన కురువంశస్థుడిని (పరీక్షిత్తును); కఱచి; తక్షకుఁడు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ పండును గ్రహించి చీల్చిన వెంటనే నల్లనిపురు గై కనబడి, చూస్తుండగానే పారాణివంటి ఎఱ్ఱనిరంగుతో పామై, విషంయొక్క అగ్నులు జ్వలించగా వీరు డైన పరీక్షిత్తును తక్షకుడు కఱచి వెళ్ళాడు.

**వ. తత్పరిజనంబు లందఱు నశనిపాతంబున బెదరి చెదరినట్లు గనుకనిం బఱచి; రయ్యేకస్తంభహర్మ్యంబును దక్షకవిషాగ్ని దగ్ధంబయ్యెఁ; నట్లు భవజ్జనకుండు పరలోకగతుండైనం, బురోహిత పురస్సరానేకభూసురవరులు యథావిధిం బరలోకక్రియలు నిర్వర్తించి రంత. 198**

**ప్రతిపదార్థం:** తద్, పరిజనంబులు+అందఱున్= ఆ పరీక్షిత్తు సేవకులందరు, ఆశనిపాతంబునన్= పిడుగుపాటుచేత; బెదరి= భయపడి; చెదరిన+అట్లు= చెదరి పోయిన విధంగా; కనుకనిన్= సంభ్రమంతో; (వేగిరపాటుతో); పఱచిరి= పరుగెత్తారు; ఆ+ఏకస్తంభహర్మ్యంబును= ఆ ఒంటికంబపుమేడయు; తక్షక, విష+అగ్ని, దగ్ధంబు+అయ్యెన్= తక్షకునియొక్క విషంయొక్క అగ్నిచేత కాల్చబడినది అయింది; అట్లు= ఆవిధంగా; భవత్, జనకుండు= నీతండ్రి; పరలోకగతుండు+అయినన్= పరలోకాన్ని పొందినవాడు (మరణించినవాడు) కాగా; పురోహిత, పురస్సర+అనేక, భూసుర, వరులు= పురోహితులు ముందుగా గల పలువురు బ్రాహ్మణశ్రేష్ఠులు; యథావిధిన్= విధి నతిక్రమించకుండ; పరలోకక్రియలు= పరలోకానికి సంబంధించిన కర్మలు; నిర్వర్తించిరి= చేశారు.

**తాత్పర్యం:** ఆ పరివారజనులు అందరును, పిడుగుపాటుచే భయపడి చెల్లాచెద రైనట్లు సంభ్రమంతో పరుగెత్తారు. ఆ రాజున్న ఒంటికంబపు మేడకూడ తక్షకుడి విషంయొక్క అగ్నిచేత కాల్చబడింది. ఆవిధంగా నీతండ్రి మరణించగా, పురోహితులతో కూడిన బ్రాహ్మణశ్రేష్ఠులు శాస్త్రాన్ని అతిక్రమించకుండ అతనికి పరలోకంలో ఉత్తమగతి కల్గించే కర్మలు చేశారు.

**విశేషం:** అలం: ఉపమ.

## జనమేజయ మహారాజు సర్పయాగము సేయుట (సం. 1-46-6; 1-46-23)

**క. ఆయుష్మంతుఁడ వై, ల । క్ష్మీయుత! బాల్యంబునందఁ మీయన్వయరా**
**జ్యాయత్తమహీభారం । బాయతభుజ! నీవు దాల్చి తభిషిక్తుఁడ వై. 199**

**ప్రతిపదార్థం:** లక్ష్మీయుత= లక్ష్మితో కూడినవాడా! ఆయత, భుజ= దీర్ఘాలైన బాహువులు కలవాడా; బాల్యంబు+అందున్+అ= చిన్నతనమందే; ఆయుష్మంతుఁడవు+ఐ= చిరంజీవివై; మీ, అన్వయ, రాజ్య+ఆయత్త, మహీభారంబు= మీవంశానికి చెందిన రాజ్యంలో వ్యాపించిన భూమియొక్క బరువును; అభిషిక్తుఁడవు+ఐ= అభిషేకింపబడినవాడి వై; నీవు; తాల్చితి(వకారలోపం)= వహించావు.

**తాత్పర్యం:** దీర్ఘమైనబాహువులు కలవాడా! లక్ష్మితో కూడినవాడా! ఓ జనమేజయా! చిరంజీవి వౌ నీవు చిన్నతనమందే అభిషేకించబడినవాడి వై మీవంశానికి చెందినరాజ్యంలో వ్యాపించిన భూమియొక్క బరువును భరించావు.

**ఉ. పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చుచు ధారుణీప్రజన్;**
**మంచి తనేకయాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్;**
**నించితి సజ్జనస్తుతుల నిర్మల మైన యశంబు దిక్కులన్;**
**సంచితపుణ్య! సర్వగుణసంపద నెవ్వరు నీసమానులే! 200**

**ప్రతిపదార్థం:** సంచితపుణ్య!= సంపాదింపబడిన పుణ్యాలు కలవాడా! ప్రీతి ఒనర్చుచున్= ప్రీతి కావిస్తూ, ధారుణీప్రజన్= భూమిలోని ప్రజలను ధర్మమార్గమునన్= ధర్మంతో కూడిన మార్గంలో; పెంచితి(వి) (వకారలోపం)= ధర్మమార్గంతో పోషించావు; అనేకయాగములన్= పెక్కుయజ్ఞాలలో; మానుగన్= ఒప్పుగా; దక్షిణలు= సంభావనలు; ఇచ్చి, విప్రులన్= బ్రాహ్మణులను; మంచితి(వి)= పోషించావు; సజ్జనస్తుతులన్= మంచివాళ్ళ పొగడ్తలతో; దిక్కులన్= దిక్కులలో; నిర్మలము+ఐన= పరిశుద్ధమైన; యశంబు= కీర్తి; నించితి(వి)= నిండేటట్లు చేశావు; సర్వగుణ, సంపదన్= అన్నిగుణాలయొక్కసంపదలోను; ఎవ్వరున్= ఎవరైనా; నీసమానులు+ఏ= నీకు సమానులా? కారు అనిభావం.

**తాత్పర్యం:** ప్రీతికావిస్తూ భూజనాన్ని ధర్మమార్గంలో పెంపొందించావు; పెక్కుయజ్ఞాలలో ఒప్పుగా దక్షిణలు ఇచ్చి బ్రాహ్మణులను మనేటట్లు చేశావు, పోషించావు; ఉత్తమ జనులపొగడ్తలచేత పరిశుద్ధమైన కీర్తి దిక్కులలో నిండేటట్లు చేశావు; సంపాదించబడిన పుణ్యాలు కలవాడా! సమస్తగుణాలసంపదలో ఎవ్వ రైనా నీకు సరిపోలగలరా? (సమానులు కారని భావం).

**విశేషం:** పై పద్యంలోని నాలుగుపాదాలలో నాలుగు సమానవాక్యాలు నిండిఉండటం నన్నయ పద్యశిల్పానికి ఒక మచ్చుతునక. దీన్నే సమతాగుణం అంటారు. ఇటువంటి సమతాగుణాన్ని వృత్తాలలో నన్నయ అరుదుగా వాడతాడు. ఈ గుణాన్ని ఎఱ్ఱాప్రెగ్గడ స్వీకరించి ఎక్కువగా వాడాడు.

**ఉ. కాదన కిట్టిపాటియపకారముఁ దక్షకుఁ డేకవిప్ర సం**
**బోధనఁ జేసి చేసె; నృపపుంగవ! నీవు ననేక భూసురా**
**పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాది కా**
**కోదరసంహతిన్ హుతవహోగ్ర సమగ్ర శిఖాచయంబులన్. 201**

**ప్రతిపదార్థం:** నృప, పుంగవ= రాజశ్రేష్ఠుడా!; కాదు+అనక= యుక్తంకా దని అనకుండ; ఇట్టి, పాటి= ఇంతప్రమాణం కల (అధికమైన); అపకారమున్= హానిని; (కీడును); తక్షకుఁడు; ఏక, విప్ర, సంబోధనన్, చేసి= ఒకబ్రాహ్మణుడియొక్క ప్రేరణచేత; చేసెన్= చేశాడు; నీవున్= నీవుకూడ; అనేకభూసుర+ఆపాదిత, సర్ప, యాగమునన్= పలువురు బ్రాహ్మణులచేత చేయబడిన

పాములను ఆహుతి చేసే యజ్ఞంలో; హుతవహ+ఉగ్ర, సమగ్ర, శిఖా, చయంబులన్= అగ్నియొక్కభయంకరాలు, సంపూర్ణాలు అయిన జ్వాలలయొక్క సమూహాలలో; తక్షక+ఆది, కాకోదర+సంహతిన్= తక్షకుడు మొదలైన పాముల సముదాయాన్ని; భస్మము+చేయుము= బూడిద చేయుము.

**తాత్పర్యం:** ఓ రాజశ్రేష్ఠుడా! యుక్తం కా దనకుండ తక్షకుడు, శృంగి అనే ఒక బ్రాహ్మణుని ప్రేరణచేత ఇంతఅధికమైన కీడు చేశాడు. నీవు కూడ పలువురు బ్రాహ్మణులచేత నిర్వహించబడిన పాములను ఆహుతి చేసే యజ్ఞంలో తక్షకుడు మొదలైన పాములసమూహాన్ని భయంకరాలు, సంపూర్ణాలు అయిన అగ్ని జ్వాలలసముదాయాలలో బూడిద చేయుము.

**విశేషం:** తక్షకుడు ఒకవిప్రుడిచే మాత్రమే ప్రేరేపించబడి నీతండ్రిని చంపి ఇంతఅధిక మైన కీడు చేశాడు. నీవు పలువురువిప్రులచేత చేయబడే సర్పయాగంలో తక్షకుడినే కాదు ఇతరసర్పాలనుకూడ బూడిద చేయుము. ఈ పద్యంలో 'ద' కారానికి 'ధ' కారానికి ప్రాస వేయబడింది "సంచోదన చేత చేసె రిపుసూదన" అనే పాఠాంతరం ఉన్నది.

**వ. అనిన విని జనమేజయుండు కోపోద్దీపితచిత్తుం డై సర్పయాగము సేయ సమకట్టి, పురోహితులను ఋత్విజులను బిలువంబంచి వారల కి ట్లనియె. 202**

**ప్రతిపదార్థం:** అనినన్= మంత్రు లిట్లాపలుకగా; విని; జనమేజయుండు; కోప+ఉద్దీపిత, చిత్తుండు+ఐ= కోపంచేత, జ్వలింపజేయబడిన హృదయం కలవా డై; సర్పయాగము= సర్పాలను ఆహుతి చేసే యజ్ఞం; చేయన్, సమకట్టి= చేయటానికి పూని; పురోహితులను; ఋత్విజులను= యజ్ఞం చేయించే ఋత్విక్కులను; పిలువన్, పంచి= పిలవటానికి ఆజ్ఞాపించి; వారలకున్= ఆ పురోహితులకు ఋత్విక్కులకు; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** మంత్రు లిట్లా పలుకగా, విని జనమేజయుడు, కోపంచేత మండింపబడిన హృదయం కలవా డయి సర్పయాగం చేయబూని పురోహితులను, ఋత్విక్కులను పిలవటానికి ఆజ్ఞాపించి, వచ్చిన ఆ పురోహితులతో ఇట్లా పలికాడు.

**విశేషం:** ఋత్విజులు పదారుగురు: బ్రహ్మ, ఉద్గాత, హోత, ప్రతిప్రస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుడు, నేష్ట, ఆగ్నీధ్రుడు, సుబ్రహ్మణ్యుడు, గ్రావస్తుతుడు, ఉన్నేత, అధ్వర్యుడు, బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరుణుడు.

**చ. తనవిషవహ్ని మజ్జనకుఁ దక్షకుఁ డెట్లు దహించె నట్ల యే**
**నును సహమిత్రబాంధవజనుం డగు తక్షకు నుగ్రహవ్యవా**
**హనశిఖలన్ దహించి, దివిజాధిపలోకనివాసుఁ డైన మ**
**జ్జనకున కీయుదంకునకు సాధుమతంబుగఁ బ్రీతిఁ జేసెదన్. 203**

**ప్రతిపదార్థం:** తన; విషవహ్నిన్= విషంయొక్కఅగ్నిచేత; మత్, జనకున్= నాతండ్రిని; తక్షకుఁడు; ఎట్లు= ఏవిధంగా; దహించెన్= కాల్చాడో; అట్లు+అ= ఆవిధంగానే; ఏనును= నేనుకూడ; సహమిత్రబాంధవ, జనుండు+అగు= మిత్రులతోను, చుట్టాలైన జనులతోను కూడినవా డయిన; తక్షకున్= తక్షకుడిని; ఉగ్రహవ్యవాహనశిఖలన్= భయంకర మైన అగ్నియొక్క జ్వాలలచేత; దహించి= కాల్చి; దివిజ+అధిప, లోక, నివాసుఁడు+ఐన= దేవతలకు రాజైన ఇంద్రునిస్వర్గలోకంలో నివాసంకలవా డైన

(స్వర్గస్థుడైన); మత్, జనకునకున్= నాతండ్రికిని; ఈ, ఉదంకునకున్; సాధుమతంబుగన్= సజ్జనులకు సమ్మత మయ్యేటట్లుగా; ప్రీతిన్= ఇష్టాన్ని; చేసెదన్= కలిగిస్తాను.

**తాత్పర్యం:** తక్షకుడు తనవిషాగ్నిచేత నా తండ్రిని ఎట్లా కాల్చివేశాడో, ఆవిధంగానే మిత్రులతోను, బంధుజనాలతోను కూడిన తక్షకుడిని భయంకరమైన అగ్ని జ్వాలలలో కాల్చి స్వర్గస్థుడైన నాతండ్రికిని, ఈ ఉదంకుడనే బ్రాహ్మణుడికిని, సజ్జనులకు అభిమత మయ్యేటట్లుగా ప్రీతి కలిగిస్తాను.

**వ. 'సర్పయాగం బిట్టి దని శాస్త్రవిధానంబు గలదేని చెప్పుం' డనిన ఋత్విజు లి ట్లనిరి. 204**

**ప్రతిపదార్థం:** సర్పయాగంబు= సర్పాలను ఆహుతి చేసే యజ్ఞం; ఇట్టిది+అని= ఈవిధంగా ఉండే దని; శాస్త్రవిధానంబు= శాస్త్రంలో చెప్పబడిన పద్ధతి; కలదు+ఏని= ఉన్నట్లయితే; చెప్పుండు= తెల్పండి; అనినన్= జనమేజయుడు అడుగగా; ఋత్విజులు= యజ్ఞంచేసేవారు; ఇట్లు+అనిరి= ఈవిధంగా పలికారు.

**తాత్పర్యం:** 'సర్పయాగం ఇట్లా ఉంటుం దని శాస్త్రాలలో చెప్పబడిన క్రమం ఏదైనా ఉంటే తెల్పం' డని అడుగగా ఋత్విక్కులు ఈవిధంగా పలికారు.

**మత్తకోకిల.**

**'నీతదర్థమ కాఁగ దేవవినిర్మితం బిది, యన్య లు**
**ర్వీతలేశ్వర! దీనిఁ జేయరు; వింటి మేము పురాణ వి**
**ఖ్యాత మాద్యము' నావుడున్, విని కౌరవప్రవరుండు సం**
**జాత నిశ్చయుఁ డయ్యె నప్పుడు సర్పయాగము సేయఁగన్. 205**

**ప్రతిపదార్థం:** ఉర్వీతల+ఈశ్వర= ఓభూపతీ! జనమేజయా! నీ, తదర్థము+అ+కాఁగన్= నీకొరకే అయినట్లు; ఇది= ఈ సర్పయాగం; దేవ, వినిర్మితంబు= దేవతలచేత కల్పింపబడింది; అన్యులు= ఇతరులు; దీనిన్= ఈసర్పయాగాన్ని; చేయరు; ఏము= మేము; వింటిమి= వినిఉన్నాము; పురాణవిఖ్యాతము= పురాణాల్లో ప్రసిద్ధం; ఆద్యము= మొదటిది, సనాతనమైనది; నావుడున్= ఋత్విజులట్లా పలికినతర్వాత; విని; కౌరవప్రవరుండు= కురువంశంలో పుట్టినవారిలో శ్రేష్ఠుడు, జనమేజయుడు; అప్పుడు; సర్పయాగము= సర్పాలను ఆహుతి చేసేయజ్ఞాన్ని; చేయఁగన్= చేయటానికి; సంజాతనిశ్చయుఁడు+అయ్యెన్= పుట్టిన నిశ్చయం కలవాడు అయ్యాడు.

**తాత్పర్యం:** 'రాజా! జనమేజయా! ఈ సర్పయాగం నీకొరకే దేవతలచేత కల్పింపబడింది. ఇతరులు దీనిని చేయరు; మేము విని ఉన్నాము; ఇది పురాణాలలో ప్రసిద్ధం; ప్రాచీనమైనది' అని ఋత్విజులు పలుకగా విని కౌరవశ్రేష్ఠు డైన జనమేజయుడు అప్పుడు సర్పయాగం చేయటానికి నిశ్చయించాడు.

**విశేషం:** 'తదర్థము' అనేదాన్ని నన్నయ చతుర్థీవిభక్త్యర్థంలో వాడుతుంటాడు. మత్తకోకిలలో ప్రతిచరణానికీ ర-స-జ-జ-భ-ర అనే గణాలు ఉంటాయి. పదకొండవ అక్షరం యతిస్థానం

**వ. ఇట్లు కృతనిశ్చయుం డై జనమేజయుండు కాశిరాజపుత్త్రి యయిన వపుష్టమ యను మహాదేవి ధర్మపత్నిగా సర్పయాగదీక్షితుం డయి, శాస్త్రోపదిష్ట ప్రమాణ లక్షణ నిపుణ శిల్పాచార్య వినిర్మితంబును, యజ్ఞోపకరణానేక**

**ద్రవ్యసంభారసంభృతంబును, బ్రభూతధనధాన్యసంపూర్ణంబును, స్వస్వనియుక్తక్రియారంభసంభ్రమ పరిభ్రమద్బ్రాహ్మణ నివహంబును నయిన యజ్ఞాయతనంబున నున్న యా రాజునకు నొక్క వాస్తువిద్యా నిపుణుం డైన పౌరాణికుం డి ట్లనియె. 206**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; కృత, నిశ్చయుండు+ఐ= చేయబడిన నిశ్చయం కలవా డై; జనమేజయుండు; కాశిరాజ, పుత్త్రి; అయిన; వపుష్టమ, అను= వపుష్టమ అనే పేరున్న; మహాదేవి= పట్టమహిషి(రాణి); ధర్మపత్ని, కాన్= ధర్మా న్ననుసరించి పెండ్లాడిన భార్యగా; సర్పయాగ దీక్షితుండు+అయి= సర్పయాగంలో దీక్ష కలవాడై; శాస్త్ర+ఉపదిష్ట, ప్రమాణ, లక్షణ, నిపుణ, శిల్ప+ఆచార్య= శాస్త్రాలలో చెప్పబడిన కొలతలలో, లక్షణాలలో నేర్పరులైన శిల్పాచార్యులచేత; వినిర్మితంబును= కట్టబడినది; యజ్ఞ+ఉపకరణ+అనేక, ద్రవ్య, సంభార, సంభృతంబును= యజ్ఞానికి కావలసిన సాధనాలచేతనూ, పెక్కువస్తువుల సముదాయంతోనూ నిండినది; ప్రభూత, ధన, ధాన్య, సంపూర్ణంబును= అధిక మైన ధనంతోనూ, ధాన్యాలతోనూ నిండినది; స్వ, స్వ, నియుక్త, క్రియా+ఆరంభ, సంభ్రమ, పరిభ్రమత్, బ్రాహ్మణ, నివహంబునున్= తమకు తమకు నియోగింపబడిన కార్యాలను మొదలుపెట్టటంలోని వేగిరపాటుచేత తిరుగుతున్న బ్రాహ్మణులసముదాయం కలది; అయిన; యజ్ఞ+ ఆయతనంబునన్= యజ్ఞగృహంలో; ఉన్న= ఉన్నట్టి; ఆ రాజునకున్= రా జైన ఆ జనమేజయునికి; ఒక్క, వాస్తువిద్యానిపుణుండు, ఐన= గృహనిర్మాణశాస్త్రంలో నేర్పరి అయిన; పౌరాణికుండు= పురాణజ్ఞుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈవిధంగా నిశ్చయించినవాడయి, జనమేజయమహారాజు కాశీరాజుకు కూతురైన వపుష్టమ అనే పేరున్న మహారాజ్ఞి ధర్మపత్నిగా సర్పయాగం చేయటానికి దీక్షవహించి, శాస్త్రంలో చెప్పబడిన కొలతలలో లక్షణాలలో నేర్పరులైన శిల్పశ్రేష్ఠులచేత నిర్మింపబడినది, యజ్ఞానికి కావలసిన పెక్కుసాధనాలతోను, అనేకవస్తువుల సముదాయంతోను కూడినది, అధికమైన ధనంతోను, ధాన్యంతోను నిండినది, తమకు, తమకు నియోగింపబడిన క్రియలను ఆరంభించటంలోని వేగిరపాటుచేత తిరుగుతున్న విప్రులసమూహం కలది అయిన యజ్ఞగృహంలో ఉన్న జనమేజయుడితో గృహనిర్మాణశాస్త్రంలో నేర్పరి అయిన పురాణజ్ఞుడు ఒకడు ఇట్లా పలికాడు.

**విశేషం:** యజ్ఞం చేసేవాడు తనధర్మపత్నితోకూడ దీక్ష వహించాలి. భార్యలేనివాడు యజ్ఞం చేయరాదు. యజ్ఞానికి అనేకసాధనాలు కావాలి. అట్లే యజ్ఞానికి సంబంధించిన వివిధ కార్యాలు నిర్వహించటానికి పలువురు బ్రాహ్మణులు కావాలి. వాస్తువు అంటే గృహం లేక గృహం కట్టటానికి తగినస్థలం అని అర్థం. గృహనిర్మాణశాస్త్రానికి వాస్తువిద్య అనిపేరు.

**క. అనఘా! యీయజ్ఞము విధి। సనాథఋుత్విక్ప్రయోగసంపూర్ణం బ**
**య్యును గడచన నేరదు; నడు। మన యుడుగును భూసురోత్తమ నిమిత్తమునన్. 207**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! జనమేజయా!; ఈ, యజ్ఞము= నీవు చేయబోయే సర్పయాగం; విధిసనాథ, ఋుత్విక్, ప్రయోగ, సంపూర్ణంబు+అయ్యును= శాస్త్రంతో కూడిన ఋుత్విక్కులయొక్క కార్యవిధానంతో సమగ్రమైనది అయినను; కడచననేరదు= చివరివరకు సాగదు; భూసుర+ఉత్తమ, నిమిత్తమునన్= బ్రాహ్మణ శ్రేష్ఠుడియొక్క కారణంచేత; నడుమన్+అ= మధ్యలోనే; ఉడుగును= ఆగిపోతుంది.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడ వైన జనమేజయా!; నీవు చేయబోయే యీ యజ్ఞం ఋుత్విక్కులు శాస్త్రోక్తంగా చేసే క్రియాకలాపంచేత సమగ్ర మైనప్పటికిన్నీ చివరిదాకా సాగదు. ఒక బ్రాహ్మణోత్తముని కారణంగా మధ్యలోనే ఆగిపోతుంది.

**వ. అనినవానివచనం బవకర్ణించి, రాజనియుక్తు లయి చ్యవనకుల విఖ్యాతుండైన చండభార్గవుండు హోతగాఁ, బింగళుం డధ్వర్యుండుగా, శార్ఙ్గరవుండు బ్రహ్మగాఁ, గౌత్సుం డుద్గాతగా, వ్యాస వైశంపాయన పైల జైమిని సుమంతు శుక శ్వేతకేతు మౌద్గ ల్యోద్దాలక మాండవ్య కౌశిక కౌండిన్య శాండిల్యక్రామఠకకోహ లాసిత దేవల నారద పర్వత మైత్రే యాత్రేయ కుండజఠర కాలఘట వాత్స్యశ్రుతశ్రవో దేవశర్మ శర్మద రోమ శోదంక హరిత రురు పులోమ సోమశ్రవసు లాదిగాఁ గల మహామునులు సదస్యులుగా నీలాంబరపరిధానులును, ధూమసంరక్తనయనులు నై యాజ్ఞికు లగ్నిముఖంబు సేసి వేల్వం దొడంగిన. 208**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పౌరాణికుడు చెప్పగా; వాని, వచనంబు= అతనిమాట; అవకర్ణించి= పెడచెవినిపెట్టి, రాజ, నియుక్తులు+అయి= రాజుచే నియోగింపబడినవారై; చ్యవనకుల, విఖ్యాతుండు+ఐన= చ్యవనకులంలో ప్రసిద్ధుడైన; చండభార్గవుండు= చండ భార్గవు డనే ముని; హోతగాన్= ఋగ్వేదం తెలిసిన ఋత్విక్కుకాగా; పింగళుండు= పింగళు డనే పేరున్నముని; అధ్వర్యుండుగాన్= యజుర్వేద తంత్రం నడిపే ఋత్విజుడుగా; శార్ఙ్గరవుండు= శార్ఙ్గరవు డనే పేరున్నముని; బ్రహ్మగాన్= పదారుగురు ఋత్విజులలో ఒకడు కాగా; (యజ్ఞకర్తచేత ధనం పుచ్చుకొని యజ్ఞం చేయించేవాడు ఋత్విజుడు); కౌత్సుండు= కౌత్సు డనే ఋషి; ఉద్గాతగా= సామవేదతంత్రాన్ని నడిపే ఋత్విజుడు కాగా; వ్యాస, వైశంపాయన, పైల, జైమిని, సుమంతు, శుక, శ్వేతకేతు, మౌద్గల్య+ఉద్దాలక, మాండవ్య, కౌశిక, కౌండిన్య, శాండిల్య, క్రామఠక, కోహల+అసిత, దేవల, నారద, పర్వత మైత్రేయ+ఆత్రేయ, కుండజఠర, కాలఘట, వాత్స్య, శ్రుతశ్రవః దేవశర్మ, శర్మద, రోమశ+ఉదంక, హరిత, రురు, పులోమ, సోమశ్రవసులు= వ్యాసుడు, వైశంపాయనుడు, పైలుడు, జైమిని, సుమంతుడు, (వీరు నలుగురు వ్యాసుని శిష్యులు), శుకుడు (వ్యాసుని కుమారుడు), శ్వేతకేతుడు, మౌద్గల్యుడు, ఉద్దాలకుడు, మాండవ్యుడు, కౌశికుడు (విశ్వామిత్రుడు), కౌండిన్యుడు, శాండిల్యుడు, క్రామఠకుడు, కోహలుడు, అసితుడు, దేవలుడు (కొందరు అసితుడూ దేవలుడూ ఒక్కరే అంటారు బహుశః దేవలుడు నల్లగా ఉండేవాడు కాబోలు) నారదుడు, పర్వతుడు, మైత్రేయుడు, ఆత్రేయుడు, కుండజఠరుడు, కాలఘటుడు, వాత్స్యుడు, శ్రుతశ్రవుడు, దేవశర్మ, శర్మదుడు, రోమశుడు, ఉదంకుడు, హరితుడు, రురుడు, పులోముడు, సోమశ్రవసుడు; ఆదిగాన్, కల= మొదలుగాగల; మహత్, మునులు= గొప్పఋషులు; సదస్యులుగాన్= యజ్ఞవిధి పరీక్షాధికారులుగా; నీల+అంబర, పరిధానులును= నల్లనివస్త్రాలను ధరించినవారును; ధూమ, సంరక్త నయనులున్+ఐ= పొగచేత ఎర్రబడిన నేత్రాలు కలవారును అయి; యాజ్ఞికులు= యజ్ఞాన్ని నడిపేవారు; అగ్నిముఖంబు+చేసి= అగ్నిసాధ్యా లయిన కర్మలకు పూర్వమందు చేసే అంగభూత మైన కర్మసముదాయాన్ని చేసి; వేల్వన్= అగ్నిలో నెయ్యిమొదలైనవాటిని సమర్పించటానికి; తొడంగినన్= పూనగా.

**తాత్పర్యం:** అని పౌరాణికుడు చెప్పగా; అతనిమాట పెడచెవిని పెట్టి రాజుచే నియోగింపబడినవారై, చ్యవన మహర్షికులంలో ప్రసిద్ధుడైన చండభార్గవుడు హోతగా, పింగళుడు అధ్వర్యుడుగా, శార్ఙ్గరవుడు ఒక ఋత్విజుడుగా, కౌత్సుడు ఉద్గాతగా, వ్యాసవైశంపాయనాదు లైన మహర్షులు యజ్ఞవిధిపరీక్షకులుగా, నల్లనివస్త్రాలు ధరించినవారును, పొగలచేత ఎర్రబడిన నేత్రాలు కలవారును అయి యజ్ఞతంత్రాన్ని నడిపే ఋత్విజులు అగ్నిసాధ్యమైన కర్మలకు అంగభూతమైన కర్మకలాపాన్ని చేసి అందులో నెయ్యి మొదలైనపదార్థాలను హోమంచేయటానికి ప్రారంభించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ధరణిసురమంత్రహోమ । స్ఫురణను వివశు లయి భూరిభుజగప్రభు లొం**
**డొరుఁ బిలుచుచు నధికభయా । తురు లై కుండాగ్నులందుఁ దొరఁగిరి పెలుచన్. 209**

**ప్రతిపదార్థం:** ధరణిసుర, మంత్ర, హోమ, స్ఫురణను= బ్రాహ్మణుల మంత్రాలయొక్కయు, అగ్నిలో వేల్చే నెయ్యి మొదలయిన పదార్థాలయొక్కయు ప్రకాశంచేత; వివశులు+అయి= వశం తప్పినవా రై; భూరి, భుజగ, ప్రభులు= గొప్పపాములరాజులు; ఒండొరున్= ఒకరినొకరు; పిలుచుచున్; అధిక, భయ+ఆతురులు+ఐ= ఎక్కువభయంచేత కలతపొందినవారై; పెలుచన్= శీఘ్రంగా; కుండ+అగ్నులందున్= హోమకుండంలోని అగ్నులలో; తొరఁగిరి= పడ్డారు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుల మంత్రాలయొక్కయు, అగ్నిలో వేల్చేపదార్థాలయొక్కయు ప్రభావంచేత వశంతప్పినవారై గొప్పపాములరాజులు ఒకరినొకరు పిలుచుకొంటూ ఎక్కువభయంచేత కలతనొందినవారై హోమకుండంలోని అగ్నులలో శీఘ్రంగా పడ్డారు.

**వ. మఱియుఁ గోటిశ మానసపూర్ణ శలపాల హలీమక పిచ్ఛిల గౌణప చక్ర కాలవేగ ప్రకాలన హిరణ్యబాహు శరణ కక్షక కాలదంతకాదు లయిన వాసుకి కుల సంభవులును, బుచ్ఛాండక మండలక పిండసేక్తృ రణేభకోచ్ఛిఖ శరభ భంగ బిల్వ తేజోవిరోహణ శిలి శలకర మూక సుకుమార ప్రవేపన ముద్గర శిశురోమ సురోమ మహాహన్వాదు లయిన తక్షక కుల సంభవులును, బారావత పారిజాత యాత్ర పాండర హరిణ కృశ విహంగ శరభ మోద ప్రమోద సంహతాపనాదు లయిన యైరావతకులసంభవులును, నేరక కుండల వేణి వేణీస్కంధ కుమారక బాహుక శృంగబేర ధూర్తక ప్రాతరాతకాదు లయిన కౌరవ్యకులసంభవులును, శంకుకర్ణ పిఠరక కుఠార సుఖసేచక పూర్ణాంగద పూర్ణముఖప్రహాస శకుని దర్యమాహర కామఠక సుషేణ మానసావ్యయ భైరవ ముండ వేదాంగ పిశంగ చోద్రపారక వృషభ వేగవ త్పిండారక మహాహను రక్తాంగ సర్వసారంగ సమృద్ధ పఠవాసక వరాహకవీరణకసుచిత్ర చిత్రవేగిక పరాశర తరుణకమణిస్కంధారుణ్యాదు లయిన ధృతరాష్ట్రకుల సంభవులును నయి యొక్కొక్కమొగి సహస్రాయుతసంఖ్యలు గలిగి. 210**

**తాత్పర్యం:** మఱియు కోటిశుడు, మానసుడు, పూర్ణుడు, శలుడు, పాలుడు, హలీమకుడు, పిచ్ఛిలుడు, గౌణపుడు, చక్రుడు, కాలవేగుడు, ప్రకాలనుడు, హిరణ్యబాహుడు, శరణుడు, కక్షకుడు, కాలదంతకుడు మొదలైన వాసుకియొక్క కులంలో పుట్టినవారున్నూ, పుచ్ఛాండకుడు, మండలకుడు, పిండసేక్త, రణేభకుడు, ఉచ్ఛిఖుడు, శరభుడు, భంగుడు, బిల్వతేజుడు, విరోహణుడు, శిలశలకరుడు, మూకుడు, సుకుమారుడు, ప్రవేపనుడు, ముద్గరుడు, శిశురోముడు, సురోముడు, మహాహనువు మొదలయినవా రైన తక్షకవంశంలో పుట్టినవారున్నూ, పారావతుడు, పారిజాతయాత్రుడు (పారియాత్రుడు), పాండరుడు, హరిణుడు, కృశుడు, విహంగుడు, శరభుడు, మోదుడు, ప్రమోదుడు, సంహతాపనుడు (సంహతాశనుడు) మొదలయినవా రైన ఐరావతసర్పరాజకులంలో పుట్టినవారున్నూ, నేరకుడు, కుండలుడు, వేణి, వేణీస్కంధుడు, కుమారకుడు, బాహుకుడు, శృంగబేరకుడు, ధూర్తకుడు, ప్రాతరాతకుడు మొదలయినవా రైన కౌరవ్యు డనే సర్పరాజకులంలో పుట్టినవారున్నూ, శంకుకర్ణుడు, పిఠరకుడు, కుఠారుడు, సుఖసేచకుడు, పూర్ణాంగదుడు, పూర్ణముఖుడు, ప్రహాసుడు, శకుని, దర్యుడు, మాహరుడు, (హరి, ఆమాహరుడు అని సంస్కృతం) కామఠకుడు, సుషేణుడు, మానుడు, సావ్యయుడు (మానసుడు, అవ్యయుడు అనికూడ విడదీయవచ్చును) భైరవుడు, ముండుడు, వేదాంగుడు, పిశంగుడు, చోద్రపారకుడు (పింగళుడు, ఉడుపారగుడు అని సంస్కృతం); వృషభుడు, వేగవంతుడు, పిండారకుడు, మహాహనుడు, రక్తాంగుడు, సర్వసారంగుడు, సమృద్ధుడు, పఠవాసకుడు, వరాహకుడు, వీరణకుడు,

సుచిత్రుడు, చిత్రవేగికుడు, పరాశరుడు, తరుణకుడు, మణిస్కంధుడు, ఆరుణ్యుడు మొదలయినవా రైన ధృతరాష్ట్రసర్పరాజకులంలో పుట్టినవారున్నూ ఒక్కొక్కమొత్తంగా; వేలపదివేలు సంఖ్యలు కలిగి.

**మ. అతివేగాకులచిత్తు లై పడి, రుదాత్తాశీవిషాగ్నుల్, సితా**
**సితపీతారుణ వర్ణదేహులు, నవాసృగ్రక్తనేత్రుల్, మహో**
**న్నతు లేక త్రిక పంచ సప్త నవ నానామస్తకుల్, పల్వు రు**
**ద్ధతనాగేంద్రులు బ్రహ్మదండహతి నార్తధ్వాను లై వహ్నిలోన్. 211**

**ప్రతిపదార్థం:** ఉదాత్త+ఆశీ, విష+అగ్నుల్= అధిక మైన ఆశి అనే ఒకరక మైన (కోరల్లో ఉండే) విషరూపమైన అగ్ని కలవారున్నూ; సిత+అసిత, పీత+అరుణ, వర్ణ, దేహులున్= తెల్లని నల్లని పసుపు పచ్చని ఎర్రని రంగులు గల దేహాలు కలవారున్నూ; నవ+అసృక్+రక్తనేత్రుల్= క్రొత్తనెత్తురువలె ఎఱ్ఱనైన నేత్రాలు కలవారున్నూ; మహత్, ఉన్నతులు= మిక్కిలి ఎత్తైన వారున్నూ; ఏక, త్రిక, పంచ, సప్త, నవ, నానామస్తకుల్= ఒకటి, మూడు, అయిదు, ఏడు, తొమ్మిది మొద లైన పెక్కుతలలు గలవారున్నూ; పల్వురు= అనేకులు; ఉద్ధతనాగ+ఇంద్రులు= గర్వించిన సర్పరాజులు; బ్రహ్మదండ, హతిన్= బ్రాహ్మణుల మంత్రమనే దండంయొక్క దెబ్బచేత; ఆర్తధ్వానులు+ఐ= దైన్యంతో కూడిన ధ్వనులు కలవా రై; అతి, వేగ+ఆకుల+చిత్తులు+ఐ= మిక్కిలివేగంచేత కలతపొందిన హృదయం కలవా రై; వహ్నిలోన్= అగ్నిలో; పడిరి.

**తాత్పర్యం:** అధికమైన కోరల్లోని విషరూప మైన అగ్నికలవారున్నూ, తెల్లని, నల్లని, పసుపుపచ్చని, ఎర్రని రంగులు కల దేహాలు కలవారున్నూ, మిక్కిలి ఎత్తైన వారున్నూ, ఒకటి, మూడు, ఐదు, ఏడు, తొమ్మిది మొదలయిన పెక్కుతలలు కలవారున్నూ అయిన అనేకులు గర్వితు లైన సర్పరాజులు మంత్రమనే దండంయొక్క దెబ్బచేత దీన మైన ధ్వనులుకలవారై, అధిక మైన వేగంచేత కలతచెందిన చిత్తం కలవారై అగ్నిలో పడ్డారు.

**విశేషం:** 'బ్రహ్మదండహతి'- అనేసమాసానికి - బ్రహ్మఅంటే మంత్రం అనే అర్థం ఉన్నది కాబట్టి బ్రాహ్మణుల మంత్రరూపమైన శిక్షయొక్క దెబ్బచేత అనీ, లేదా, బ్రాహ్మణుల మంత్రరూపమైన దండంయొక్క దెబ్బచేత అని కానీ చెప్పవచ్చును. మంత్రం అధ్యాహారంగా గ్రహించాలి.

**క. తడఁబడఁ బడియెడు రవమును, । బడి కాలెడు రవముఁ, గాలి పలుదెఱఁగుల వ్ర,**
**స్సెడు రవమును, దిగ్వలయముఁ । గడుకొని మ్రోయించె నురగకాయోత్థిత మై. 212**

**ప్రతిపదార్థం:** తడఁబడన్= తొట్రుపడేట్లుగా; పడియెడు= అగ్నిలో పడే; రవమును= ధ్వనియు; పడి= అగ్నిలో పడి; కాలెడు= కాలేటప్పుడు కలిగే; రవమును= ధ్వనియు; కాలి= దగ్ధమై; పలుతెఱఁగులన్= పెక్కువిధాల; వ్రస్సెడు= చీలెడు; రవమును= ధ్వనియు; ఉరగ, కాయ+ఉత్థితము+ఐ= పాములశరీరాలనుండి పుట్టినవై; దిక్, వలయమున్= దిక్చక్రం; కడుకొని= అతిశయించి; మ్రోయించెన్= మ్రోగునట్లు చేశాయి.

**తాత్పర్యం:** తొట్రుపాటు పడుతూ అగ్నిలో పడేటప్పుడు కలిగేధ్వనియున్నూ, పడి కాలేధ్వనియున్నూ, కాలి పెక్కువిధాల బ్రద్దలయ్యేటప్పుడు కలిగే ధ్వనియున్నూ, పాముల దేహాలనుండి బయల్వడినవై దిక్చక్రాన్ని అతిశయంగా మ్రోగేటట్లు చేశాయి.

**వ. అంత. 213**

**తాత్పర్యం:** పిమ్మట. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తక్షకుఁ డతిభీతుం డై । యా క్షణమున నరిగె 'సురగణాధిప! నన్నున్**
**రక్షింపుమ రక్షింపుమ । రక్షింపుమ' యనుచు నప్పురందరు కడకున్. 214**

**ప్రతిపదార్థం:** తక్షకుఁడు= తక్షకు డనే సర్పరాజు; అతి, భీతుండు+ఐ= మిక్కిలి భయపడినవాడై; సుర, గుణ+అధిప!= దేవతలసమూహానికి అధిపతి వైన ఇంద్రుడా!; నన్నున్; రక్షింపుము+అ= కాపాడుమా; రక్షింపుము+అ= కాపాడుమా; అనుచున్= అని వేడుతూ; ఆ+పురందరు, కడకున్= ఆ ఇంద్రునిచెంతకు; ఆ క్షణమునన్= ఆ సమయంలో; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో తక్షకు డనే సర్పరాజు మిక్కిలి భయపడినవా డయి 'దేవతాధిపతి వైన ఓ ఇంద్రుడా! నన్ను కాపాడుము, కాపాడుము, కాపాడుము' అని వేడుతూ ఇంద్రుడిచెంతకు వెళ్ళాడు.

**వ. పురందరుండును దొల్లి కమలజువాక్యంబున వాసుకిప్రముఖ సర్పకులముఖ్యులకు సర్పసత్త్రభయంబు లేమి యెఱింగినవాఁడు గావున వాని నోడకుండు మని చేకొనియుండె; నిట వాసుకియు జనమేజయ సమారబ్ధ సర్పసత్త్ర పరిత్రస్తుం డై ద్వియోజన త్రియోజనాయామ స్థూలవ్యాళనివహంబులు నిజవంశ భ్రాతృవంశ జనితంబు లయినవి జననీ వాగ్దండపీడితంబు లయి యగ్నికుండంబునఁ బడుటకు శోకించి తన చెలియలి జరత్కారువుం జూచి యి ట్లనియె. 215**

**ప్రతిపదార్థం:** పురందరుండును= ఇంద్రుడును, తొల్లి= పూర్వం; కమలజు, వాక్యంబునన్= బ్రహ్మదేవుని వచనంచేత; వాసుకి, ప్రముఖ, సర్ప, కుల, ముఖ్యులకున్= వాసుకిమొదలయిన పాములకులంలోని ప్రధానులకు; సర్ప, సత్త్ర, భయంబు= సర్పయాగంవలనిభీతి; లేమి= లేకుండటం; ఎఱింగినవాఁడు= తెలిసినవాడు; కావునన్= కాబట్టి; వానిన్= తక్షకుడిని; ఓడక, ఉండుము+అని= భయపడక ఉండుమని; చేకొని, ఉండెన్= గ్రహించి ఉన్నాడు; ఇటన్= సర్పాలుండేచోట; వాసుకియున్= వాసుకి అనే సర్పరాజును; జనమేజయ, సమారబ్ధ, సర్ప, సత్త్ర, పరిత్రస్తుండు+ఐ= జనమేజయమహారాజుచేత ఆరంభించబడిన సర్పయాగంవలన మిక్కిలి భయపడినవాడై; ద్వియోజన, త్రియోజన+ఆయామ, స్థూల, వ్యాళ, నివహంబులు= రెండామడలు (ఆమడ= 4 క్రోసులు), మూడామడల పొడవును, లావును ఉన్నపాములసమూహాలు; నిజ, వంశ, భ్రాతృ, వంశ, జనితంబులు+అయినవి= తనవంశంలోను, సోదరుల వంశంలోను పుట్టినట్టివి; జననీవాక్+దండ, పీడితంబులు+ఐ= తల్లియొక్క శాపరూపమయినవాక్కు అనే శిక్షచే పీడింపబడినవై; అగ్నికుండంబునన్= హోమాగ్నికుండంలో (యజ్ఞసమయంలో అగ్నిని ఉంచటానికి నిర్మించినగొయ్యి); పడుటకున్; శోకించి= దుఃఖించి; తనచెలియలి= తన చెల్లె లైన; జరత్కారువున్= జరత్కారునిభార్యను; చూచి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడు పూర్వం బ్రహ్మయొక్క వచనంచేత వాసుకి మొదలైన పాములకులంలోని శ్రేష్ఠులకు సర్పయాగంవలని భయం లేకుండటం ఎరిగినవా డవటంచేత తక్షకుడిని భయపడకు మని ఆదరంతో గ్రహించి ఉన్నాడు. ఇంక- సర్పా లుండేచోట వాసుకి అనే సర్పరాజు జనమేజయుడిచేత ఆరంభించబడిన సర్పయాగంవలన మిక్కిలి భయపడినవాడై, రెండామడలు మూడామడలు పొడవును, లావును గల తనవంశంలోను సోదరులవంశంలోను పుట్టిన సర్పసమూహాలు తల్లియైన కద్రువ ఇచ్చిన వాగ్రూప మైన శాపంచేత (శిక్షచేత), పీడింపబడిన వై హోమాగ్నికుండంలో పడటానికి దుఃఖించి, తనచెల్లెలూ జరత్కారుమునిభార్యా అయిన జరత్కారువును చూచి ఇట్లా పలికాడు.

**క. ప్రస్తుత ఫణి సత్త్ర భయ । త్రస్తాత్ముల మైన యస్మదాదుల కెల్లన్**
**స్వస్తి యొనర్పఁగ నవసర । మాస్తీకున కయ్యె నిప్పు డంబుజనేత్రా! 216**

**ప్రతిపదార్థం:** అంబుజ, నేత్రా= పద్మాలవంటి నేత్రాలు కలదానా (జరత్కారువునకు సంబోధనం), ప్రస్తుత, ఫణి, సత్త్ర, భయ, త్రస్త+ఆత్ములము+ఐన= ఆరంభింపబడిన సర్పయాగంవలన భయపడిన హృదయాలు కలవార మైన; అస్మద్+ ఆదులకున్+ ఎల్లన్= నేను మొదలుగాగల వారికందరికిని; స్వస్తి= శుభం; ఒనర్పఁగన్= చేయటానికి; అవసరము= సమయం; ఇప్పుడు= ఈక్షణంలో, ఆస్తీకునకున్= నీకుమారు డైన ఆస్తీకునికి; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** పద్మాలవంటికన్నులుగల ఓ జరత్కారూ! జనమేజయుడిచేత ఆరంభింపబడిన సర్పయాగంవలన భయపడిన హృదయాలు కలవార మైన నేను మొదలుగాగల పాముల కన్నింటికిని శుభం (మేలు) చేయటానికి అవసరమైన సమయం ఇప్పుడు నీకుమారుడైన ఆస్తీకుడికి కలిగింది.

**విశేషం:** అవసరము(సం.)= సమయం; తెలుగులో వ్యవహారంలో 'అక్కర' అనే అర్థంకూడ దీని కున్నది. 'అంబుజనేత్రా!' అని అన్న చెల్లెలిని సంబోధించవచ్చునా అని కొందరు శంకించవచ్చును; ఈ సంబుద్ధి శృంగార భావవ్యంజకమే కాకుండా గౌరవవ్యంజకమైనదని కూడ గ్రహించాలి. ఈ ఆశ్వాసంలోనే (2.48 పద్యంలో) గరుత్మంతుడు తల్లియైన వినతను 'పయోరుహాననా' అని సంబోధించటంలోకూడ తాత్పర్య మిటువంటిదే.

**క. విమలతపోవిభవంబునఁ । గమలజు నట్టిండ విగతకల్మషుఁ డాస్తీ**
**కమహాముని; యీతనివచ । నమున మహాహికులరక్షణం బగుఁ బేర్మిన్. 217**

**ప్రతిపదార్థం:** ఆస్తీక, మహత్, ముని; విమల, తప+విభవం= నిర్మలమైన తపస్సు యొక్క వైభవంలో; కమలజు+అట్టిండు+అ= బ్రహ్మవంటివాడే; విగత, కల్మషుఁడు= పోయినపాపం కలవాడు; (పవిత్రుడు); ఈతని, వచనమునన్= ఈ ఆస్తీకుని వాక్కుచేత; మహత్+అహి+కుల, రక్షణంబు= గొప్పపాములకులంయొక్క రక్షణం; పేర్మిన్= అతిశయంతో; అగును= అవుతుంది.

**తాత్పర్యం:** నీ కుమారుడైన ఆస్తీకమహాముని, నిర్మలతపస్సంపదలో బ్రహ్మదేవుడి వంటివాడు. పాపరహితుడు. ఇతని మాటలచేత గొప్పవైన పాములసముదాయాల రక్షణం సమంజసంగా అవుతుంది.

**విశేషం:** కమలజు+అట్టిండు- 'షష్ఠీసమాసమునందుత్తున కచ్చు పరమగునపుడు నుగాగమమగును'- కమలజునట్టిండు. అట్టి+వాఁడు- తచ్ఛబ్దమైన 'వ'కులోపం అట్టిఁడు, అట్టిండు.

**వ. 'బ్రహ్మవచనంబు నిట్టిద కా విని యేలాపుత్త్రుండు మాకుఁ జెప్పె; జరత్కారుమహామునికి నిన్ను వివాహంబు సేయుటయు నేతదర్థంబ; యింకొక్కనిమేషంబేని యుపేక్షించిన సకలసర్పప్రళయం బగుం గావున నాస్తీకుండు జనమేజయ మహీపాలు పాలికిం బోయి సర్పయాగం బుడిగించి రక్షింపవలయు' ననిన, నయ్యగ్రజువచనంబులు విని జరత్కారువు గొడుకు మొగంబు చూచి 'భవన్మాతుల నియోగంబు సేయు' మనిన నాస్తీకుం డి ట్లనియె. 218**

**ప్రతిపదార్థం:** బ్రహ్మవచనంబును= బ్రహ్మవాక్కుకూడ; ఇట్టి+అది+అ= ఇట్టిదే!; కాన్, విని= అవునట్లుగా విని; (చూడు 132-136 పద్యాలు); ఏలాపుత్త్రుండు= ఏలాపుత్త్రు డనే పేరున్న నాగకుమారుడు; మాకున్; చెప్పెన్= తెలిపాడు; జరత్కారు, మహత్, మునికిన్; నిన్నున్= జరత్కారువును; వివాహంబు+చేయుటయున్= పెండ్లిచేయుటయును; ఏతద్+అర్థంబు+అ= ఈ ప్రయోజనం కలదే! (ఈ ప్రయోజనం కొరకే!); ఇంకన్+ఒక్క, నిమేషంబు+ఏని= ఇంకొక్కనిమిష మైనా; ఉపేక్షించినన్= అశ్రద్ధచేస్తే; సకల, సర్ప ప్రళయంబు= అన్నిపాములవినాశం; అగున్; కావునన్= కాబట్టి; ఆస్తీకుండు; జనమేజయ, మహీపాలు పాలికిన్=జనమేజయమహారాజు చెంతకు, పోయి= వెళ్ళి; సర్ప, యాగంబు= పాములను హోమం చేసే యజ్ఞం; ఉడిగించి= మానేటట్లు చేసి; రక్షింప వలయున్= పాములను కాపాడాలి. అనినన్= అని వాసుకి చెప్పగా; ఆ+అగ్రజు, వచనంబులు= ఆ అన్నగారి వాక్కులు; విని; జరత్కారువు= చెల్లెలైన జరత్కారువు; కొడుకు, మొగంబు= కుమారుని (ఆస్తీకుని) ముఖం; చూచి; భవత్+మాతుల, వినియోగంబు= నీ మేనమామ అయిన వాసుకిపనుపు (నియోగించినపని); చేయుము+అనినన్= చేయు మని తెల్పగా; ఆస్తీకుండు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** 'బ్రహ్మదేవునివాక్కుకూడ ఇటువంటిదే అయినట్లుగా (సర్పయాగం ఆస్తీకుడిచేత ఉడిగింపబడుతుందని) విని ఏలాపుత్రు డనే నాగకుమారుడు మాకు తెల్పాడు. జరత్కారుమహామునికి ని న్నిచ్చి పెండ్లిచేయటంకూడ ఈ ప్రయోజనం నెరవేరటానికే! ఇంకొక్క నిమిషమైనా అశ్రద్ధ చేస్తే సర్వసర్పవినాశం అవుతుంది. కాబట్టి ఆస్తీకుడు జనమేజయమహారాజు చెంతకు వెళ్ళి సర్పయాగం మాన్పించి పాములను రక్షించాలి' అని వాసుకి చెప్పగా, అన్నగారి వాక్కులు విని చెల్లెలైన జరత్కారువు కుమారుడి (ఆస్తీకుని) ముఖం చూచి 'నీమేనమామ అయిన వాసుకి చెప్పినపని చేయు' మని తెల్పగా ఆస్తీకుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇట్టి+అది; 'అది యవి శబ్దముల అత్తునకు వృత్తిని వైకల్పికంగా లోపము', ఇట్టిది, భవత్+మాతుల-అనునాసికసంధి - భవన్మాతుల.

### ఆస్తీకుఁడు సర్పయాగము నివారించుట (సం. 1-49-17)

**క. కడవఁబడి మున్ను వహ్నిం । గడుకొని పడినవియ కాని కద్రూసుతులం**
**బడనీ నింక; నవశ్యము । నుడిగింతును సర్పయాగ; మోడకుఁ డింకన్. 219**

**ప్రతిపదార్థం:** కడవఁబడి= (స్వార్థంలోపడు) గతించి; మున్ను= ఇంతకుపూర్వం; వహ్నిన్= అగ్నిలో; కడుకొని= అతిశయించి; పడిన+అవి+అ, కాని= పడ్డవే కాని; కద్రూసుతులన్= కద్రువకొడుకు లైన పాములను; ఇంకన్= ఇంకముందు; పడన్, ఈను= పడనీయను; అవశ్యమున్= నిశ్చయంగా; సర్పయాగము; ఉడిగింతును= మానేటట్లు చేస్తాను; ఇంకన్= ఇకముందు; ఓడకుఁడు = భయపడకండి.

**తాత్పర్యం:** ఇంతకుముందు (గతించినకాలంలో) అగ్నిలో అధికంగా పడినవాటినే కాని, కద్రువకొడుకు లైన పాములను ఇకముందు (భవిష్యత్తులో) పడనీయను, తప్పక సర్పయాగాన్ని మాన్పించుతాను. ఇంక(ఇప్పటినుండి) భయపడకండి.

**వ. అని యాస్తీకుండు వాసుకి ప్రముఖుల నాశ్వాసించి, సకలవేదవేదాంగపారగు లయిన విప్రవరులతో జనమేజయ సర్పసత్త్ర సదనంబునకుం జనుదెంచి, స్వదేహకాంతి సభాంతరంబెల్ల వెలుంగుచుండ స్వస్తివచనపూర్వకంబుగా ని ట్లని స్తుతియించె. 220**

**ప్రతిపదార్థం:** అని= అనిపలికి; ఆస్తీకుండు; వాసుకి, ప్రముఖులన్= వాసుకి మొదలైనవారిని; ఆశ్వాసించి= ఓదార్చి; సకల, వేద, వేద+అంగ, పారగులు+అయిన= సర్వ (నాలుగు) వేదాలయు, ఆరువేదాంగాలయు అంతాన్ని పొందిన (వేదవేదాంగాలను పూర్తిగా పఠించిన), విప్ర, వరులతోన్= బ్రాహ్మణశ్రేష్ఠులతో; జనమేజయ, సర్ప, సత్ర, సదనంబునకున్= జనమేజయుడి సర్పయాగం జరిగే యజ్ఞశాలకు; చనుదెంచి= వచ్చి; స్వ, దేహ, కాంతిన్= తనమేనికాంతిచే; సభా+అంతరంబు+ఎల్లన్= సభామధ్యభాగ మంతా; వెలుంగుచుండన్= ప్రకాశిస్తుండగా; స్వస్తి, వచన, పూర్వకంబుగాన్= శుభాన్ని సూచించే (స్వస్తి) వాక్కు మొదలుగా కలిగేట్లుగా; ఇట్లు+అని= ఈవిధంగా పలికి; స్తుతియించెన్= పొగిడాడు.

**తాత్పర్యం:** అని పలికి ఆస్తీకుడు వాసుకి మొదలైన నాగరాజులను ఓదార్చి, నాలుగువేదాలలోను, ఆరువేదాంగాలలోను నిష్ణాతు లైన బ్రాహ్మణశ్రేష్ఠులతో జనమేజయుడు సర్పయాగం చేసే శాలకు వచ్చి తనమేనికాంతిచే సభామధ్యమంతా ప్రకాశిస్తుండగా మంగళవాక్పూర్వకంగా జనమేజయుడిని ఈవిధంగా కీర్తించాడు.

**విశేషం:** ఋగ్యజుస్సామాథర్వము లని వేదాలు నాలుగు, శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆరూ వేదాంగాలు.

**మ. రజనీనాథకు లైన భూషణుఁడ వై, రాజర్షి వై, ధారుణీ**
**ప్రజ నెల్లన్ దయతోడ ధర్మచరితం బాలించుచుం, దొంటి ధ**
**ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృ రామున్ రఘున్**
**విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారీక్షితా! 221**

**ప్రతిపదార్థం:** జగత్, విఖ్యాత= లోకంలో సుప్రసిద్ధుడ వైన; పారీక్షితా!= పరీక్షిత్తుకుమారుడ వైన జనమేజయుడా!; రజనీ, నాథ, కుల+ఏక, భూషణుఁడవు+ఐ= రాత్రికి పతి అయిన చంద్రుడి వంశంలో ప్రధాన మైన అలంకారాని వై; రాజ+ఋషివి+ఐ= ఋషివంటిరాజు వై (తమ పవిత్రచరిత్రంచేత ఋషిగా పరిగణింపబడే రాజు రాజర్షి. పురూరవుడు. జనకుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు రాజర్షులు); ధారుణీప్రజన్+ఎల్లన్= భూమిలోనిప్రజలనందరిని; దయతోడన్; ధర్మ, చరితన్= ధర్మంతో కూడిన వర్తనంతో; పాలించుచున్= పరిపాలిస్తూ; తొంటి= పూర్వముండే; ధర్మజున్= ధర్మరాజును; నాభాగున్= అంబరీషుడి తండ్రి అయిన నాభాగుడనే సూర్యవంశపురాజును; భగీరథున్= సగరుని మనుమ డై గంగను ఆకాశంనుండి పాతాళం వరకు తెచ్చిన సూర్యవంశపురాజును; దశరథున్= రాముడితండ్రి అయిన దశరథుడిని; మాంధాతృ= కృతయుగంలో ఉన్న మాంధాత అనేయువనాశ్వుడి కుమారుడిని; రామున్= శ్రీరాముడిని; రఘున్= దశరథునితాత అయిన రఘుమహారాజును; విజయున్= అర్జునుడిని; సత్, గుణంబులన్= మంచి గుణాలలో; పోలితి(వి)= సరిపోలినావు.

**తాత్పర్యం:** ఓ జనమేజయమహారాజా! చంద్రవంశప్రధానాలంకారానివై, ఋషివంటి రాజువై, దయతోను, ధర్మంతోను కూడిన ప్రవర్తనతో భూమిలోని ప్రజలనందరిని పరిపాలిస్తూ మున్ను ప్రసిద్ధులైన ధర్మరాజును, నాభాగుడిని, భగీరథుడిని, దశరథుడిని, మాంధాతను, రాముడిని, రఘుమహారాజును, అర్జునుడిని ఉత్తమగుణాలలో సరిపోలినావు.

**విశేషం:** ధర్మరాజును, అర్జునుడిని నన్నయ ఆరంభాంతాలలో పేర్కొన్నాడు. వారు జనమేజయుడి ప్రపితామహులు, చంద్రవంశాలంకారులు. మిగిలినవారందరూ సూర్యవంశంలో ప్రసిద్ధులైన రాజులు. మాంధాత యువనాశ్వుడి గర్భంనుండి పుట్టాడు. అప్పుడు మునులు 'కమేష ధాస్యతి' అని అన్నారు. అప్పుడు ఇంద్రుడు వచ్చి 'మాం ధాస్యతి' అని పలికాడు.

అందుచేత అతడికి మాంధాత అనే పేరు కలిగింది. నన్నయ ఉదంకోపాఖ్యానంలో రచించిన నాగస్తుతి (ఆది. 1:104-107) ఎంతప్రసిద్ధమో, ఆస్తీకునికథలో రచించిన జనమేజయయాగస్తుతి అంత ప్రశస్తం. నన్నయ గుణప్రధానమైన రచన చేస్తాడు. వామనుడు గుణాలను శబ్దగుణా లనీ అర్థగుణా లనీ విభజించాడు. క్రమంగా ఆ విభాగం కలిసిపోయి శబ్దగుణాలకే పరిమితమైపోయింది. నన్నయ శబ్దగుణవాది. పదిరకాల శబ్దగుణాలను మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము అనే మూడుగుణాలలో అంతర్భవింపచేయటం మమ్మటాదులమతం. నన్నయకాలంనాటికి ఈవాదమే ప్రచారంలో ఉన్నది. ఉదంకోపాఖ్యానంలోని నాగస్తుతిలోని నాల్గుపద్యాలలో మాధుర్యౌజోగుణాలలో ప్రసాదాన్ని మిశ్రమంచేసి రచించాడు. అందుకు అవి సహృదయ హృదయానురంజకా లయ్యాయి. నన్నయ ఈఘట్టంలో పదిపద్యాలను (221-226; 228, 229, 231, 233) ప్రసాదమిశ్రిత మైన పదిగుణాలకు ప్రతినిధులుగా రచించి అపూర్వప్రయోగాన్ని చేశాడు. దశగుణసమాహారంగా కనబడే ఈఘట్టంలోని నన్నయపద్యాలు ఆణిముత్యాలు. వాటిలో ఈపద్యం ఉక్తిచమత్కారవిశిష్ట మైన మాధుర్యం (పృథక్పదత్వం) అనే గుణానికి చక్కని ఉదాహరణం. జనమేజయుడి ఆభిజాత్యాన్నీ, ధర్మచరిత్రాన్నీ, సద్గుణౌన్నత్యాన్నీ రుచిరార్థసూక్తులతో ఉదాత్తంగా కీర్తించాడు. సర్పయాగం చేయటం ఆస్తీకుడిదృష్టిలో ఉత్తమధర్మకార్యం కాదు. అటువంటి అమానుషయజ్ఞాన్ని నిర్వహిస్తున్న జనమేజయుడిని విమర్శించకుండా ఉదాత్తప్రశంసలతో ప్రారంభించటం ఉక్తినైపుణ్యం. ఇంతటివాడికి ఈపని తగదు- అని తేల్చిచెప్పటానికి అనువుగా తియ్యగా పొగడటంతో ప్రారంభించిన ఆస్తీకుడి మాటలతీరులోని ఈ ఉపక్రమణికను మాధుర్యగుణంలో నిబంధించటం మనోహరం, ఆస్వాదమధురం. (సంపా.)

**తరలము.**

> **కువలయంబున వారి కోరిన కోర్కికిం దగ నీవు పాం**
> **డవకులంబు వెలుంగఁ బుట్టి, దృఢంబుగా నృపలక్ష్మితో**
> **నవనిరాజ్యభరంబు దాల్చిన యంతనుండి మఖంబులం**
> **దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తు లైరి మహాద్విజుల్. 222**

**ప్రతిపదార్థం:** కు, వలయంబున, వారి= భూవలయంలోని జనుల(లు); కోరిన; కోర్కికిన్= కోరికకు; తగన్= తగినట్లుగా; నీవు, పాండవకులంబు= పాండవులవంశం; వెలుంగన్= ప్రకాశించేటట్లుగా; పుట్టి; దృఢంబుగాన్= స్థిరంగా; నృపలక్ష్మితోన్= రాజలక్ష్మితో; అవని, రాజ్య, భరంబు= భూమిరాజ్యంయొక్క భారాన్ని; తాల్చిన, అంతనుండి= ధరించినప్పటినుండి; మఖంబులన్= యజ్ఞాలలో; తివిరి= యత్నించి, (కుతూహలపడి); ఇష్టధనంబులు= బ్రాహ్మణులచేత కోరబడిన ధనాలను; ఇచ్చుటన్= ఇవ్వటంచేత; మహత్, ద్విజుల్= గొప్పబ్రాహ్మణులు, తృప్తులు+ఐరి= తృప్తి పొందారు.

**తాత్పర్యం:** భూవలయంలోని ప్రజలు కోరినకోరికకు తగినట్లు నీవు పాండవులవంశం ప్రకాశించేటట్లుగా పుట్టి స్థిరంగా రాజ్యలక్ష్మితో భూరాజ్యభారం వహించినప్పటినుండి యజ్ఞాలలో కుతూహలపడి బ్రాహ్మణులకు అభీష్టాలైన ధనాలు ఇస్తూండటంవలన వారు తృప్తిపొందారు.

**విశేషం:** కువలయంబు+వారు- తత్పురుషసమాసంలో 'న' ఆగమంగా వచ్చింది- కువలయంబునవారు. మహాబ్రాహ్మణశబ్దానికి గొప్పబ్రాహ్మణు డనే అర్థమే కాక నీచబ్రాహ్మణు డనే అర్థంకూడ ఉన్నది. మహాద్విజశబ్దానికి అటువంటి నీచార్థం లేదు. యజ్ఞాలు చేసి భూరిదక్షిణ లిచ్చి వంశప్రతిష్ఠను కాపాడిన జనమేజయుడిని ప్రసాదగుణభూయిష్ఠ మైన పద్యంలో కీర్తించటం సమంజసం. అర్థవైమల్యంతో కూడిన బంధశైథిల్యం ప్రసాదం. ఆయజ్ఞాలకూ ఈ యజ్ఞానికీ ఉన్న భేదాన్ని సారమతులైన సహృదయులభావనకు వదలటం నన్నయ వస్తుధ్వని. (సంపా.)

ఉ. అమ్మనుజేంద్రుఁ డైన నలుయజ్ఞము, ధర్మజురాజసూయయ
జ్ఞమ్ముఁ, బ్రయాగఁ జేసిన ప్రజాపతియజ్ఞముఁ, బాశపాణియ
జ్ఞమ్మును, గృష్ణుయజ్ఞము, నిశాకరుయజ్ఞము నీ మనోజ్ఞ య
జ్ఞమ్మును నొక్కరూప విలసన్మహిమం గురువంశవర్ధనా! 223

**ప్రతిపదార్థం:** కురు, వంశ, వర్ధనా!= కౌరవవంశాన్ని వృద్ధిపొందించేవాడా!; ఆ+మనుజ+ఇంద్రుఁడు+ఐన= ప్రసిద్ధు డైన రాజేంద్రు డైన; నలు యజ్ఞము= నలుని యాగమున్నూ; ధర్మజు, రాజసూయ, యజ్ఞమ్మున్= ధర్మరాజుయొక్క రాజసూయయాగమున్నూ; ప్రయాగన్= త్రివేణీసంగమ మైన ప్రయాగక్షేత్రంలో; చేసిన; ప్రజాపతి, యజ్ఞమున్= బ్రహ్మదేవుని యజ్ఞమున్నూ; పాశపాణి= పాశం హస్తంలో ఉన్న వరుణుని; యజ్ఞమ్మును; కృష్ణు= కృష్ణునియొక్క; యజ్ఞమున్; నిశా, కరుయజ్ఞమున్= చంద్రుని యజ్ఞమున్నూ; నీ, మనోజ్ఞ, యజ్ఞమ్మునున్= నీవు చేస్తున్న మనోహరమైన యజ్ఞమున్నూ; విలసత్+మహిమన్= ప్రకాశిస్తున్న మహత్త్వంలో; ఒక్క, రూపు+అ= ఒక్కవిధమే (సమానాలు).

**తాత్పర్యం:** కౌరవవంశాన్ని వృద్ధిపొందించేవాడా! జనమేజయా! ప్రసిద్ధుడైన నలమహారాజుయాగం, ధర్మరాజు చేసిన రాజసూయయజ్ఞం; బ్రహ్మదేవుడు ప్రయాగక్షేత్రంలో చేసిన యజ్ఞం, వరుణదేవుడి యజ్ఞం, కృష్ణుడియజ్ఞం, చంద్రుడియజ్ఞం, మనోహరమైన నీయజ్ఞం, ప్రకాశించే మహత్త్వంలో ఒక్కవిధమే (సమానాలే).

**విశేషం:** అలం: ఉపమ. నలాదులు చేసిన యజ్ఞాలు చాలాగొప్పవి. జనమేజయుడి యజ్ఞంకూడ అట్టిదే. విలసత్+మహిమన్= అనునాసికసంధి - విలసన్మహిమ. ఈపద్యరచనలో నన్నయ వస్తుస్వభావస్ఫుటత్వాన్ని స్ఫురింపచేయటానికి అర్థవ్యక్తి (ఝటిత్యర్థ ప్రతిపత్తిహేతుత్వం) అనే గుణాన్ని సార్థకంగా వాడాడు. సర్పయజ్ఞం ఎన్ని యజ్ఞాలకంటె ఎంతగొప్పదో చెప్పాడు. అంతవరకూ దేవతలు, భూపతులు చేయని ఆదియజ్ఞమైన సర్పయజ్ఞంయొక్క స్వరూపస్వభావాలను వివిధయజ్ఞాలతో పోల్చిచెప్పాడు. ఈస్తుతి విన్నవారు ఆస్తీకుడు ఆ యజ్ఞాన్ని సమర్థిస్తున్నాడని అనుకొంటారు. జనమేజయాదులుకూడ అట్లాగే భావించారు. నిషేధించటానికి పూర్వరంగంగా తోడ్పడిన ప్రశంస ఇది. (సంపా.)

చ. వితతమఖప్రయోగవిధివిత్తము, లుత్తమధీయుతుల్ జగ
న్నుత సుమహాతపోధను, లనుగ్రహనిగ్రహశక్తియుక్తు లీ
క్రతువున ఋత్విజుల్, కమలగర్భసమానులు పూర్వదిక్పతి
క్రతువున యాజకోత్తములకంటెఁ బ్రసిద్ధులు సర్వవిద్యలన్. 224

**ప్రతిపదార్థం:** ఈక్రతువున= నీవు చేసే సర్పయాగంలోని; ఋత్విజుల్= యజ్ఞం చేయించేవారు; వితత, మఖ, ప్రయోగ, విధి, విద్, తములు= విస్తృత మైన యజ్ఞాన్ని ప్రయోగించే (చేసే) విధానాన్ని ఎరిగినవాళ్ళలో శ్రేష్ఠులు; ఉత్తమ, ధీ, యుతుల్= ప్రశస్త మైన (గొప్ప) బుద్ధితో కూడినవారు; జగత్+నుత= లోకంచే స్తుతింపబడిన; సు, మహత్, తపస్+ధనులు= చాలగొప్పతపస్సే ధనంగా కలవారు; అనుగ్రహ, నిగ్రహ, శక్తి, యుక్తులు= దయచూపటం, శిక్షించటం అనేశక్తులతో కూడినవారు; కమల, గర్భ, సమానులు= బ్రహ్మతో సమానులు; పూర్వదిక్, పతి, క్రతువున= తూర్పుదిక్కుకు అధిపతి అయిన ఇంద్రునియజ్ఞంలోని; యాజక+ఉత్తములకంటెన్= యజ్ఞంచేయించే ఋత్విక్‌శ్రేష్ఠులకంటెను; సర్వవిద్యలన్= అన్ని విద్యలలోను; ప్రసిద్ధులు= ప్రసిద్ధిపొందినవారు.

**తాత్పర్యం:** నీవు చేస్తున్న ఈసర్పయాగంలోని ఋత్విక్కులు విస్తృతమైన యజ్ఞాచరణవిధానాన్ని బాగా ఎరిగినవారు, అధికబుద్ధిసంపన్నులు, లోకంచేత స్తుతింపబడిన మిక్కిలి గొప్పతపస్సే ధనంగా కలవారు, దయతో చూడటం, శపించి శిక్షించటం అనేశక్తులతో కూడినవారు, బ్రహ్మతో సమానులు, అన్ని విద్యలలోను, తూర్పుదిక్కును ఏలే ఇంద్రుడియజ్ఞంలోని ఉత్తమఋత్విజులకంటె ప్రసిద్ధిని పొందినవారు (కీర్తిమంతులు).

**విశేషం:** అలం: ఉపమ, జగత్+నుత= అనునాసికసంధి. ఈసమాసం 'లోకంచేతస్తుతింపబడేవాడా' అని జనమేజయుడికి సంబోధన మైనా కావచ్చును. ఋత్విజుల మహత్త్వాన్ని కీర్తించే ఈపద్యరచనలో నన్నయ బహుపదముల ఏకవద్భావాన్నీ మనోహరమైన ఘటనను ప్రదర్శించే శ్లేషము- అనే గుణాన్ని నిబంధించి రమ్యతను కల్పించాడు. వివిధరంగాలలో, వివిధగుణాలతో భాసించే అంతమంది యాజకోత్తములు ఒక్కచోటకూడటం అపూర్వసంఘటన, వారందరినీ సామూహికంగా ప్రశంసించటంలో భాసించే బహుపదాల ఏకవద్భావం శ్లేష మనే గుణం. లయబద్ధ మైన ఒక యజ్ఞచిత్రాన్ని నన్నయ ఇందులో పఠితల కందించాడు.(సంపా.)

**శా.** **విద్వన్ముఖ్యుఁడు, ధర్మమూర్తి, త్రిజగద్విఖ్యాతతేజుండు కృ**
**ష్ణద్వైపాయనుఁ డేగుదెంచి, సుతశిష్యబ్రహ్మసంఘంబుతో**
**సద్వంద్యుండు సదస్యుఁ డయ్యె ననినన్ శక్యంబె వర్ణింప; సా**
**క్షాద్విష్ణుండవు నీవు భూపతులలోఁ గౌరవ్యవంశాగ్రణీ!** **225**

**ప్రతిపదార్థం:** కౌరవ్య వంశ+అగ్రణీ!= కౌరవవంశంలో పుట్టిన వారిలో అగ్రేసరుడా!; విద్వత్+ముఖ్యుఁడు= విద్వాంసులలో ప్రధానుడు; ధర్మ, మూర్తి= ధర్మమేరూపంపొందినవాడు; త్రి, జగత్, విఖ్యాత, తేజుండు= ముల్లోకాలలో ప్రసిద్ధమైన కాంతికలవాడు. సత్, వంద్యుండు= సజ్జనులకు (పండితులకు) నమస్కరింపదగినవాడు; కృష్ణద్వైపాయనుఁడు= వ్యాసుడు; సుత, శిష్య, బ్రహ్మ, సంఘంబుతోన్= కుమారు డైన శుకునితో, వైశంపాయనాదిశిష్యులతో, ఋత్విక్కుల సముదాయంతో; ఏగుదెంచి= వచ్చి; సదస్యుఁడు= యజ్ఞవిధి పరీక్షాధికారి; అయ్యెన్, అనినన్= అయినాడంటే; వర్ణింపన్, శక్యంబు+ఎ= నీయజ్ఞమహిమను (నిన్ను) వర్ణించతరమా!(కాదు); భూపతులలోన్= రాజులలో; నీవు; సాక్షాత్; విష్ణుండవు+అ= సాక్షాత్తుగా విష్ణుమూర్తివే.

**తాత్పర్యం:** కౌరవవంశ్యులలో శ్రేష్ఠుడా! (జనమేజయా!) విద్వాంసులలో శ్రేష్ఠుడు, మూర్తి తాల్చిన ధర్మం, ముల్లోకాలలో ప్రసిద్ధమైన తేజం కలవాడు, సుజనవందనీయుడు అయిన వ్యాసమహర్షి స్వయంగా కుమారుడితోను, శిష్యులతోను, ఋత్విజులసముదాయంతోను వచ్చి నీయజ్ఞంలో సదస్యు డైనా డంటే నీయజ్ఞాన్నీ, నిన్నూ వర్ణింప తరమవుతుందా? రాజులలో నీవు సాక్షాత్తుగా విష్ణుమూర్తివే!

**విశేషం:** యమునాద్వీపంలో పుట్టినవాడు ద్వైపాయనుడు, నల్లని వాడవటం చేత కృష్ణద్వైపాయనుడు. పైలుడు, జైమిని, వైశంపాయనుడు, సుమంతుడు అతనిశిష్యులు. బ్రహ్మసంఘంపేర్లు 208వ వచనంలో చెప్పబడినవి. 'నాऽవిష్ణుః పృథివీపతిః' అనే సూక్తిని అనుసరించి రాజులందరూ విష్ణ్వంశ కలవారే. ఆ అంశ లేనివాడు రాజు కాడు. జనమేజయుడు సాక్షాత్తుగా విష్ణువే - అని ఆస్తీకుడి ప్రశంస. బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో విష్ణువు స్థితికారుడు. జనమేజయుడు సర్పయజ్ఞంచేస్తూ లయకారు డౌతున్నాడు. ఈ తారతమ్యాన్ని చివరలో ఆస్తీకుడు తన కోర్కెద్వారా ధ్వనింపజేస్తాడు. అందువలన ఇందులో వస్తుధ్వని ఉన్నది. అంతేకాదు. ఈపద్యరచనలో నన్నయ సభ్యప్రసంగంతో కూడిన బంధముయొక్క వికటత్వ మనే ఉదారత- అనే గుణాన్ని గొప్పగా పోషించాడు. కృష్ణద్వైపాయనుడి గుణగణాలను కీర్తించి, అంతటివాడిని సదస్యుడిగా చేసికొన్న జనమేజయుడు

సాక్షాత్ విష్ణువే అనటం ఇందులోని రుచిరార్థం. రచనలో నృత్యవద్భావం వాక్యపదవిన్యాసంలో గోచరించటం ఉదారతాగుణస్వభావం. అది ఈపద్యంలో సాక్షాత్కరించింది. (సంపా.)

**ఉ. ఆర్తిహరక్రియాభిరతుఁ డై, కృతసన్నిధి యై, ప్రదక్షిణా**
**వర్త శిఖాగ్రహస్తముల వహ్ని మహాద్విజదివ్యమంత్రని**
**ర్వర్తితహవ్యముల్ గొనుచు వారిజవైరికులేశ! నీకు సం**
**పూర్తమనోరథంబులును, బుణ్యఫలంబులు నిచ్చుచుండెడున్. 226**

**ప్రతిపదార్థం:** వారిజ, వైరి, కుల+ఈశ= పద్మాలకు శత్రువైన చంద్రునివంశంలో పుట్టినరాజా! ఆర్తి, హర, క్రియా+అభిరతుఁడు+ఐ = బాధను పోగొట్టే కర్మలలో ఆసక్తి కలవా డై; కృత, సన్నిధి+ఐ= చేయబడిన సన్నిధానం (సామీప్యం) కలవాడై; ప్రదక్షిణ+ఆవర్త+శిఖా+అగ్రహస్తములన్= కుడివైపునకు తిరిగే జ్వాల లనే ముంజేతులతో; వహ్ని= అగ్ని; మహత్, ద్విజ, దివ్య, మంత్ర, నిర్వర్తిత, హవ్యముల్= గొప్ప బ్రాహ్మణుల దేవతా సంబంధు లైన మంత్రాలచేత నెరవేర్చబడిన (అర్పించబడిన) అన్నాదులను; కొనుచున్= గ్రహిస్తూ; నీకున్; సంపూర్తమనోరథంబులును= సంపూర్ణాలైన కోరికలను; పుణ్యాఫలంబులున్= పుణ్యకార్యాలవలని ఫలితాలను; ఇచ్చుచుండెడున్= ఇస్తూ ఉండుగాక!

**తాత్పర్యం:** చంద్రవంశంలో పుట్టిన జనమేజయ మహారాజా! బాధను తొలగించే కర్మలం దాసక్తుడై, సన్నిహితుడై (ప్రత్యక్షమై) అగ్ని, బ్రాహ్మణోత్తముల దివ్యమంత్రాలచేత హోమం చేయబడిన అన్నాది హవ్యాలను కుడికి తిరిగే జ్వాల లనే ముంజేతులతో గ్రహిస్తూ, నిండైన కోరికలను, పుణ్యాల ఫలితాలను నీకు ఇస్తూ ఉండుగాక!

**విశేషం:** అగ్నిజ్వాలలు కుడివైపునకు తిరగటం శుభావహం. అగ్నిని కాంతి అనే గుణంకల రచనతో కీర్తించటం సార్థకం. కాంతికి ఔజ్జ్వల్యం స్వభావం. ఈ పద్యంలోని అక్షరరమ్యత కాంతిని పోషిస్తున్నది. (సంపా.)

**వ. అని జనమేజయు, నాతని యజ్ఞమహిమను, ఋత్విజులను, సదస్యులను, నగ్నిభట్టారకు ననురూప శుభవచనంబులఁ బ్రస్తుతించిన నాస్తీకున కందఱును బ్రీతు లయి; రంత జనమేజయుం డాస్తీకుం జూచి 'మునీంద్రా! నీ కెద్ది యిష్టంబు దానిన యిత్తు, నడుగు' మనినఁ గరంబు సంతసిల్లి యాస్తీకుం డి ట్లనియె. 227**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; జనమేజయున్= జనమేజయుడిని; ఆతని= అతడు చేసే; యజ్ఞమహిమను= యజ్ఞంయొక్క మహత్త్వాన్ని; ఋత్విజులను= యాజకులను; సదస్యులను= యజ్ఞవిధులను పరీక్షించే వ్యాసాదులను; అగ్ని, భట్టారకున్= పూజ్యుడైన అగ్నిని; అనురూప, శుభ, వచనంబులన్= తగిన మంగళవాక్కులతో; ప్రస్తుతించినన్= నుతింపగా; ఆస్తీకునకున్= ఆస్తీకునిపట్ల; అందఱును= రాజాదులు అందరును; ప్రీతులు+అయిరి= ప్రీతి పొందినవారైనారు; అంతన్= అప్పుడు; జనమేజయుండు; ఆస్తీకున్; చూచి; ముని+ఇంద్రా! (సవర్ణదీర్ఘసంధి)= మునిశ్రేష్ఠుడా!; నీకున్; ఎద్ది= ఏది; ఇష్టంబు= ప్రీతికరమో! దానిన్+అ= దానినే; ఇత్తున్= ఇస్తాను; అడుగుము; అనినన్= అని పల్కగా; కరంబు= మిక్కిలి; సంతసిల్లి= సంతోషించి; ఆస్తీకుండు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అని జనమేజయమహారాజును, అతని యజ్ఞంయొక్క మహత్త్వాన్ని, యజ్ఞం చేయించే ఋత్విక్కులను, యజ్ఞవిధిపరీక్షకు లైన సదస్యులను, పూజ్యు డైన అగ్నిని, వారివారికి తగిన మంగళవాక్కులతో పొగడగా, రాజాదులందరూ ఆస్తీకుడిపట్ల ప్రీతికలవా రైనారు. అప్పుడు జనమేజయుడు ఆస్తీకుని చూచి 'మునిశ్రేష్ఠా! నీ కేది ప్రియమో దానినే ఇస్తాను. అడుగు' మని పలుకగా, మిక్కిలి సంతోషించి ఆస్తీకు డిట్లా అన్నాడు.

**విశేషం:** ఆస్తీకునకు ప్రీతు లయిరి= నన్నయ ఇట్టిసందర్భాలలో షష్ఠీవిభక్తి వాడుతుంటాడు. 'ఆస్తీకునియెడ' అని అర్థం.

ఆస్తీకుడు యజ్ఞం మాన్పించటానికి వచ్చాడు. అచ్చటివారందరూ ప్రీతులైతే కాని తన వచ్చినపని సఫలం కాదు. అందుచేత అతడు అందరినీ ప్రస్తుతించాడు. ఆ స్తుతికూడ యథార్థమే కాని కేవలం పొగడ్త కాదు. కార్యసాఫల్యం కోరేవాడు ఇట్లా చేయాలి.

**ఉ. మానిత సత్యవాక్య! యభిమన్యుకులోద్వహ! శాంతమన్యుసం**
**తానుఁడ వై దయాభినిరతస్థితి నీవు మదీయబంధు సం**
**తానమనోజ్వరం బుపరతంబుగ, నాకుఁ బ్రియంబుగా మహో**
**ర్వీనుత! సర్పయాగ ముడివింపుము; కావుము సర్పసంహతిన్. 228**

**ప్రతిపదార్థం:** మానిత, సత్య, వాక్య= పూజింపబడిన సత్యమైన వాక్కు కలవాడా!; అభిమన్యు, కుల+ఉద్వహ= అభిమన్యుడి వంశాన్ని ఉద్ధరించేవాడా! (జనమేజయుడు అభిమన్యుడి పౌత్రుడు); మహత్, ఉర్వీ, నుత= విశాలమైన భూమిచే (భూజనులచేత) పొగడబడేవాడా!; శాంతమన్యుసంతానుఁడవు+ఐ= శమించిన (అణగిన) కోపం, దుఃఖం మొదలయినవాటి సముదాయం కలవాడి వై; దయా+అభినిరత, స్థితి= దయపట్ల ఆసక్తి కలస్థితిలో; నీవు; మదీయ, బంధు, సంతాన, మనస్+జ్వరంబు= నాకు సంబంధించిన బంధువుల(సర్పాల) సమూహంయొక్క మనస్సులలోని బాధ (జ్వరమంటే వేడి. ఇచ్చట ఆర్తి లేక బాధ అని చెప్పాలి); ఉపరతంబుగన్= శమించేటట్లుగా; నాకున్; ప్రియంబుగాన్= ప్రీతి కలిగేటట్లుగా; సర్ప, యాగము= సర్పాలను హత మొనరించే ఈయజ్ఞం; ఉడివింపుము= మాన్పుము; సర్పసంహతిన్= పాములసమూహాన్ని; కావుము= రక్షించుము.

**తాత్పర్యం:** పూజింపబడిన సత్యవాక్యం కలవాడా! అభిమన్యుడివంశాన్ని ఉద్ధరించేవాడా! విశాలమైన భూమిచేత (భూజనులందరిచేత) పొగడబడేవాడా! జనమేజయా! శమించిన కోపాదులసమూహం కలవాడివై, దయపట్ల ఆసక్తికలస్థితితో నాచుట్టా లైన పాములసమూహంయొక్క మనస్సులలోని ఆర్తి మానేటట్లుగా, నాకు ప్రీతి కలిగేటట్లుగా ఈ సర్పయాగాన్ని మానేటట్లు చేయుము. పాములసమూహాన్ని కాపాడుము.

**విశేషం:** 227వ వచనంలో జనమేజయుడు ఆస్తీకుడితో 'నీ కేది ఇష్టమో అది ఇస్తా' నన్నాడు. ఆస్తీకుడు సర్పయాగం మాన్పించటానికై వచ్చాడు. దాన్ని ఉడిగించటం జనమేజయుడికి ఇష్టం కాదు. 'నీవు అనిన వాక్యాన్ని పాటించి సత్యవచనుడివి కమ్ము' అని సూచించటానికై ఆస్తీకుడు 'మానిత సత్యవాక్య!' అని సంబోధించాడు. ఉడుగు-అపదాద్యంబయి అసంయుక్తం బయిన గకారానికి వకారాదేశం - ఉడువు; దీనికి ప్రేరణార్థక రూపం 'ఉడివించు. ఆస్తీకుడి కథకు ఈ పద్యం ప్రాణంవంటిది. సర్పయాగం ఆగటానికి ఆస్తీకుడు ఈపద్యంలో కోరుకొనే వరమే కారణం. ఇంతకుముందు ఆరుపద్యాలలో ఈ కోర్కె తీరటానికి అనువైన మానసికమైన వాతావరణాన్ని ఆస్తీకుడు కల్పించాడు. ఇప్పుడు ఆకోర్కెను బైటపెట్టాడు. ఆతని మాటలతీరులో నన్నయ సౌకుమార్య మనే గుణాన్ని పోషించాడు. పారుష్యంలేకుండా ఉండేది సౌకుమార్యం. అయినా రచనలో అజరఠత్వం ఆకృతికట్టాలి. జరఠత్వం అంటే ముసలితనం, కరకుతనం, గట్టితనం. ఈ మూడూ సౌకుమార్యగుణం కల రచనలో ఉండరాదు. అర్థవంత మైన ఎత్తుగడతో 'ఇచ్చినమాట నిలువబెట్టుకోవటం నీ జన్మవ్రతమౌతుంది. తప్పదు-' అనే భావం భావ్యమానమై పద్యభావాన్నంతా చైతన్యవంతం చేస్తుంది. జనమేజయుడు తీవ్రప్రతీకారవాంఛతో మొదలుపెట్టిన సర్పయాగాన్ని చాలించటం సత్యవాక్యపరిపాలనంలో భాగంగా మారుతుంది. అందువలన రచనలో ఒక ఉత్కంఠ రేకెత్తింపబడి అర్థరీత్యా, పద్యగతిరీత్యా ముసలితనంలేని జవసత్త్వాలు గోచరిస్తాయి. అడుగబోతున్నది అసాధ్యమైనకోరిక. కాని, ఆస్తీకుడి మాటలతీరులో కరకుతనం గోచరించదు. 'నా కోరికను కోపతాపాలు మానిన దయాబుద్ధితో ఆలోచించు' అని సుకుమారంగా హెచ్చరించా డతడు. ఎంతటి సంస్కారవంతమైన, ధ్వనిమయమైనవాక్కు!; 'నాకోరిక తీరిస్తే పాములవంశాలను పీడిస్తున్న మనోజ్వరం

తగ్గుతుంది, నామనస్సుకు ప్రీతి కలుగుతుంది' అన్నప్పుడు దయాదృష్టితో చూస్తే ఈరెండూ ఉత్తమధర్మాలు ఔతాయని ధ్వని. ఈ వాక్యంలోకూడా సౌకుమార్యం పరిమళిస్తున్నది. ఇక చివరికి 'సర్పయాగ ముడివింపుము; కావుము సర్పసంహతిన్' - అన్నప్పుడు మాటలో కాఠిన్యం లేకపోవటం గమనింపదగిన అంశం. తన బంధునాశనానికి పూనుకొన్న జనమేజయుడిని నిజానికి ఆస్తీకుడు పరుషంగా నిందించి శపించాలి. కాని, మాటలో కరకుదనం లేకుండా గట్టితనం స్ఫురించకుండా మృదువుగా, వినయంగా, హితంగా ప్రార్థిస్తున్నట్లు నివేదించుకొన్నాడు. ఆస్తీకుడు పూర్వపద్యాలలో తాను చేసిన స్తుతులన్నీ ఎంతటి సుకుమారాలైన మందలింపులో అప్పుడు జనమేజయుడికి తెలిసివచ్చేటట్లు మెత్తగా మాట్లాడింపచేశాడు నన్నయ. వాక్యాలలో నిబంధించిన వాచ్యార్థాలు తమ వాచ్యార్థాలను అప్రధానం చేసికొంటూ ప్రతీయమానమౌతున్న రమణీయ వ్యంగ్యార్థాలను ప్రసరించటం ఈస్తుతిలో విశేషం. ఇందులో సంబుద్ధులుకూడా సార్థకాలే. చివరకు- 'మహోర్వీనుత సర్పయాగము' అనేచోట ఒక చమత్కారం ఉన్నది. దీన్ని సమస్తంగా తీసికొంటే 'లోకమంతా కీర్తించిన సర్పయాగం' అని భావం. లోకమంతా కీర్తించే ఈయాగం జనమేజయుడి ప్రతీకారదృష్టితోచూస్తే ప్రశంసార్హం. కాని, ఉత్తమవంశజుని ఉత్తమధర్మ మైన దయాదృష్టితో చూస్తే అది విపరీతం. అప్పు డందులో విపరీతార్థవ్యంగ్యం గమ్యమానం అవుతుంది. కాగా, "మహోర్వీనుత!" అనే మాటను జనమేజయుడికి వేసిన సంబుద్ధిగాకూడా గ్రహించవచ్చు. అప్పుడు- 'సర్పయాగం ఆపి, సర్పకులాన్ని రక్షిస్తే నీవు ఈప్రపంచంలోని అందరిచేతా కీర్తింపబడతావు' అనే అర్థం ధ్వన్యమానం ఔతుంది. నన్నయ ధ్వనిమయరచనలో ఇక్కడ మెత్తగా మాట్లాడటం ఎంత గుణమో, వ్యంగ్యంగా మాట్లాడటంకూడా అంత గుణం. 'శబ్దగుణశాలి నన్నయ చతురశైలి'. (సంపా.)

**చ. అనిన సదస్యులందఱుఁ బ్రియంబున 'నిట్టి విశిష్ట విప్రము**
**ఖ్యునకు మహాతపోధనునకుం దగుపాత్రున కెద్ది యిచ్చినన్**
**ఘనముగ నక్షయం బగును గావున నీ ద్విజనాథుకోర్కిఁ బెం**
**పున వృథ సేయఁగాఁ దగదు భూవలయేశ్వర! యిమ్ము నెమ్మితోన్.' 229**

**ప్రతిపదార్థం:** అనినన్= అస్తీకుడు అట్లా అడుగగా; సదస్యులు+అందఱున్= సభ్యులందరున్నూ (వ్యాసాదులందరును); ప్రియంబునన్= ప్రీతితో; ఇట్టి, విశిష్ట, విప్ర, ముఖ్యునకున్= ఇటువంటి మిక్కిలి ఉత్తము డైన బ్రాహ్మణశ్రేష్ఠుడికి; మహత్, తపః, ధనునకున్= గొప్ప తపస్సే ధనంగా కలవాడికి; తగు= తగిన; పాత్రునకున్= అర్హునికి; ఎద్ది= ఏది; ఇచ్చినన్= ఇచ్చినప్పటికీ; ఘనముగన్= గొప్పగా; అక్షయంబు+అగును= తరుగనిది అవుతుంది; కావునన్= కాబట్టి; భూ, వలయ+ఈశ్వర= భూచక్రానికిరాజా! ఈ, ద్విజ, నాథు కోర్కిన్= ఈబ్రాహ్మణముఖ్యుడికోరికను; పెంపునన్= గౌరవంతో; వృథ, చేయన్, కాన్= వ్యర్థం చేయటం; తగదు= ఉచితం కాదు; నెమ్మితోన్= ప్రేమతో; ఇమ్ము.

**తాత్పర్యం:** అని ఆస్తీకుడు అడుగగా సభ్యులందరున్నూ 'తగినవాడు, అర్హుడు, గొప్పతపస్సే ధనంగా కలవాడు అయిన ఇటువంటి ఉత్తమబ్రాహ్మణుడికి ప్రీతితో ఏది ఇచ్చినా అది మిక్కిలి క్షయం లేనిది అవుతుంది కాబట్టి ఓరాజా! ఈ బ్రాహ్మణశ్రేష్ఠునికోరిక వ్యర్థం చేయటం తగదు. గౌరవంతోను, ప్రేమతోను ఇతడు అడిగింది ఇవ్వండి. (యజ్ఞాన్ని మానే టట్లు చేయండి).

**విశేషం:** గౌరవింపదగినవా డవటంచేత ఈ విప్రసత్తముడి కోరిక వ్యర్థం చేయటం తగదని భావం. ఈపద్యరచనలో 'సమాధి' అనే గుణమున్నది. అర్థదర్శనం కలిగేటట్లు వర్ణాల, శబ్దాల ఆరోహ అవరోహక్రమ విన్యాసం చేస్తే సమాధి. సదస్యులందరు ఈ పద్యంలో జనమేజయుడి సంకల్పంవెనుక ఉన్న తాత్పర్యాన్ని వదలి సర్పయాగాన్ని ఆపుమని అడుగుతున్న ఆస్తీకుడి వ్యక్తిత్వాన్ని దృష్టిలో పెట్టుకొని కర్తవ్యార్థదర్శనం చేస్తున్నారు, చేయిస్తున్నారు. అందువలన ఆస్తీకుడికోర్కెను తీర్చటమే అందరి ఏకాభిప్రాయం. ఏకోన్ముఖంగా సాగే అర్థదర్శనాన్ని ఆస్తీకుడిని ప్రశంసించే విశేషణాలలో కానవచ్చే సాభిప్రాయ అక్షరోచ్చారణలోని ఆరోహావరోహాలతో సార్థకంగా నన్నయ 'సమాధి' గుణాన్ని సాధించాడు. (సంపా.)

**వ. అనిన సర్వజనానుమతంబుగా జనమేజయుం డాస్తీక ప్రార్థనం జేసి సర్పయాగం బుడిగించె; నయ్యవసరంబున. 230**

**ప్రతిపదార్థం:** అనినన్= సదస్యులు అట్లా పలుకగా; సర్వ, జన+అనుమతంబుగాన్= అందరికీ సమ్మత మయ్యేటట్లుగా; జనమేజయుండు; ఆస్తీక, ప్రార్థనన్, చేసి= ఆస్తీకునివేడుకోలుచేత (ఆస్తీకుడు అడగటంచేత); సర్ప, యాగంబు= సర్పయజ్ఞాన్ని; ఉడిగించెన్= మానేటట్లు చేశాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని సదస్యులు పలుకగా అందరికీ సమ్మత మయ్యేటట్లుగా జనమేజయుడు ఆస్తీకు డడగటంచేత అతనికోరికను అనుసరించి సర్పయాగం మానిపించాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** మూలంలో ఆస్తీకుడు సర్పయాగాన్ని మాన్పించండని అడుగగా జనమేజయుడు మొదట సమ్మతించక మరొకవరం కోరుకొమ్మని నుడివినట్లున్నూ, అతడు అదే అడుగగా సమ్మతించినట్లున్నూ ఉన్నది.

**మ. అతులోర్వీసురముఖ్య మంత్రహుత మాహాత్మ్యంబునన్ వాసవ**
**చ్యుతుఁ డై ముందర తక్షకుం దురువిషార్చుల్ దూల వాత్యారయో**
**ద్ధతి నుద్ధూతవివర్ధితాయతబృహద్దావాగ్నివోలెన్ విచే**
**ష్టితుఁ డై మేఘపథంబులం దిరుగుచుండెన్ విస్మితుల్గా జనుల్. 231**

**ప్రతిపదార్థం:** అతుల+ఉర్వీ సుర, ముఖ్య, మంత్ర, హుత, మాహాత్మ్యంబునన్= సాటిలేని బ్రాహ్మణశ్రేష్ఠుల మంత్రాలచేత అగ్నిలో వేల్చటంయొక్క మహిమచే; వాసవ, చ్యుతుఁడు+ఐ= ఇంద్రునిచేత విడువబడినవాడై; ముందర= ఎదుట; తక్షకుండు= ఆపేరున్న సర్పరాజు; ఉరు, విష+అర్చుల్= గొప్పవిషంయొక్క జ్వాలలు; తూలన్= చలింపగా(రాలగా); వాత్యా, రయ+ఉద్ధతిన్= సుడిగాలియొక్క వేగంయొక్క విజృంభణంచేత; ఉద్ధూత, వివర్ధిత+ఆయత, బృహత్, దావ+అగ్ని, పోలెన్= ఎగురగొట్టబడిన మిక్కిలివృద్ధినొందింపబడిన దీర్ఘమైన పెద్దకార్చిచ్చువలె; విచేష్టితుఁడు+ఐ= చేష్టతక్కినవాడై; (వివశు డై); జనుల్= చూస్తున్న జనులు; విస్మితుల్, కాన్= ఆశ్చర్యం పొందిన వారవుతుండగా; మేఘపథంబులన్= మేఘమార్గాలలో; (ఆకాశంలో); తిరుగుచున్+ఉండెన్= సంచరిస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** తక్షకుడు సాటిలేని బ్రాహ్మణ శ్రేష్ఠుల హోమమంత్రాల మహిమచేత ఇంద్రుడినుండి విడివడినవాడై, విషాగ్నిజ్వాలలు చలిస్తూ ఉండగా, చేష్టా శూన్యుడై, అతిశయమైన సుడిగాలి వేగంచేత ఎగురగొట్టబడి వృద్ధిపొందిన విశాలమైన కార్చిచ్చువలె ఆకాశంలో పరిభ్రమిస్తూ ఉన్నాడు. ఆ దృశ్యాన్ని జనులు ఆశ్చర్యంతో చూస్తున్నారు!.

**విశేషం:** అలం: ఉపమ. పాములు అగ్నిలో పడును గాక! అని బ్రాహ్మణులు మంత్రాలు పఠిస్తూ ఉన్నారు. ఆమంత్రాలమహిమచేత పాములు హుతమౌతున్నాయి. హుతమంటే అగ్నికి కానుకగా (ఆహుతిగా) ఈబడేది. ఇచట తక్షకుడే హుతం. విచేష్టితుడు అంటే ప్రయత్నించేవా డనే అర్థంకూడ ఉన్నది. తక్షకుడు అగ్నిలో పడకుండటానికై ఎంతో ప్రయత్నిస్తూ ఆకాశంలో వివశు డై తిరుగుతున్నాడు. ఉద్ధతుడైన తక్షకుని వివశస్థితిని ప్రసాద సమతాగుణవిశిష్ట మైన ఓజోగుణంలో నిబంధించి రచనలో ప్రౌఢత్వాన్ని ప్రదర్శించాడు నన్నయ. భయవిహ్వలుడైన భయంకరాకారుని స్వరూపస్వభావాలను ప్రసాదమిశ్రితమైన ఓజోబంధంతో నన్నయ చిత్రించి ఔచిత్యం పాటించాడు. అంతేకాదు. ఆ దృశ్యంలో అగ్నిజ్వాలల ఔన్నత్యాన్ని- 'అతులోర్వీసుర ముఖ్యమంత్రహుతమాహాత్మ్యంబునన్' అనే దీర్ఘసమాసంతో సూచించాడు. ఆ అగ్నిలో పడటానికి సిద్ధమై ఆకాశంలో

అల్లల్లాడుతున్న తక్షకుడిని "ఉద్ధూతవివర్ధితాయతబృహద్దావాగ్నివోలెన్" ఉన్నాడని వర్ణిస్తూ ఉపమానాన్ని మరొక అగ్నిజ్వాలగా దీర్ఘసమాసంతో కల్పించాడు. ఒకటి సవనాగ్ని, మరొకటి దావాగ్ని. ఆ ఆకృతుల సామ్యాన్ని రచనాగతసమాన సమాసద్వయ సంఘటనతో ప్రదర్శించటం 'సమత' అనే శబ్దగుణ లక్షణం. ఈపద్యంలో ప్రధానగుణం ఓజస్సు. దానికి పోషకంగా నిలిచినవి ప్రసాదం, సమత, ఈ మూడింటినీ కథలోని రసభావపోషణకు అనువుగా వాడటం నన్నయ కవితాశిల్పం. (సంపా.)

**క. ఆతని నత్యుగ్రానల। పాతోన్ముఖుఁ డైన వానిఁ బడకుండఁగ 'నో**
**హో తక్షక! క్రమ్ముము' మని। యాతతభయుఁ గ్రమ్మఱించె నాస్తీకుఁ డెడన్. 232**

**ప్రతిపదార్థం:** ఆస్తీకుఁడు; అతి+ఉగ్ర+అనల, పాత+ఉన్ముఖుఁడు+ఐన, వానిన్= మిక్కిలి భయంకర మైన అగ్నిలో పడటానికి సిద్ధు డైన వాడిని; ఆతత, భయున్= విస్తార మైన భయం కలవాడిని; ఆతనిన్= ఆ తక్షకుడిని; ఓహో, తక్షక!= ఓతక్షకుడా! క్రమ్మఱుము= మరలిపొమ్ము; అని; పడక+ఉండఁగన్= అగ్నిలో పడకుండా ఉండేటట్లుగా; ఎడన్= నడుమనే; క్రమ్మఱించెన్= మరల్చాడు.

**తాత్పర్యం:** మిక్కిలి భయంకర మైన అగ్నిలో పడటానికి సిద్ధుడై ఉన్నట్టి, అధికమైన భయంతో కూడినట్టి ఆ తక్షకుడిని ఆస్తీకుడు 'ఓహో తక్షకా! మరలిపొమ్ము' అని పలికి అగ్నిలో పడకుండ నడుమనే మరల్చాడు.

**విశేషం:** 'ఎడన్' అంటే అగ్నిలో పడబోవటానికి ముందు అనిఅర్థం.

**మ. 'జననీశాపభయప్రపీడితమహాసర్పేంద్రులన్ సర్పయా**
**గనిమిత్తోద్ధత మృత్యువక్త్రగతులం గాకుండఁగాఁ గాచె' నం**
**చును నాస్తీకమునీంద్రు నందుల సదస్యుల్ సంతసం బంది బో**
**రనఁ గీర్తించిరి సంతతస్తుతిపదారావంబు రమ్యంబుగన్. 233**

**ప్రతిపదార్థం:** జననీ, శాప, భయ, ప్రపీడిత, మహత్, సర్ప+ఇంద్రులన్= తల్లి అయిన కద్రువశాపంవలని భయంచేత మిక్కిలి పీడింపబడిన గొప్పసర్పరాజులను; సర్పయాగ నిమిత్త+ఉద్ధత, మృత్యు, వక్త్ర, గతులన్= సర్పయాగం కారణంగా గల గర్వించిన మరణదేవతయొక్క ముఖాన్ని పొందినవారిని; కాక+ఉండఁగాన్= కాకుండేటట్లుగా; కాచెన్= రక్షించాడు; అంచునున్= అంటూ; ఆస్తీక, ముని+ఇంద్రున్= ఆస్తీకమునిశ్రేష్ఠుని; అందుల, సదస్యుల్= ఆ యజ్ఞశాలలోని సభ్యులు; (ఋత్విక్కులు మొదలైనవారు); సంతసంబు+అంది= సంతోషం పొంది; సంతత, స్తుతి, పద+ఆరావంబు= దట్టమైన స్తోత్రశబ్దాలధ్వని; రమ్యంబుగన్= సుందరమయ్యేటట్లుగా; బోరనన్= శీఘ్రంగా, పదే పదే; కీర్తించిరి= పొగిడారు.

**తాత్పర్యం:** 'తల్లి అయిన కద్రువ ఇచ్చిన శాపంవలని భయంచేత మిక్కిలి బాధింపబడిన గొప్ప సర్పరాజులను సర్పయాగం కారణంగా గల భయంకరమైన మృత్యుదేవతముఖాన్ని పొందినవారిని (మరణించినవారిని) కాకుండేట్లుగా రక్షించా' డని యాగశాలలోని సభ్యులు సంతోషం పొంది ఆస్తీకమునీంద్రుడిని అధికమైన స్తోత్రశబ్దాలధ్వనులతో మనోహరంగా పదేపదే ప్రస్తుతించారు.

**విశేషం:** జీవులకు ఒక్కొక్కరికి మరణం ఒక్కొక్కకారణంవలన కలుగుతూ ఉంటుంది. సర్పాలకు సర్పయాగం మృత్యుకారణ మయింది. అందుల- సమాసంలో అందు మొదలయినవాటికి 'అలి' ఆగమంగా వస్తుంది, నన్నయ భారతంలో 'ఉల'

ఆగమంకూడ కనిపిస్తుంది. అందలి అని అర్థం. ఆస్తీకుడు జనమేజయాదులను స్తుతించిన ఈఘట్టంలోని పద్యాలన్నీ అక్షరరమ్యతకు అనువైన ఉదాహరణలు. 'సంతతసస్తుతిపదారావంబు రమ్యంబుగన్' అనటంలో నన్నయ వ్యంగ్యంగా పైపద్యంలోని తనకవితాగుణ మైన అక్షరరమ్యతనుకూడ సూచించాడు. ఈపద్యరచనలో 'సమత' అనే గుణాన్ని పోషించాడు నన్నయ. మార్గాభేదత్వం సమత. ఈపద్యపూర్వార్ధంలో సదస్యులు ఆస్తీకుడిని స్తుతించినమాటలు ఓజోగుణవిశిష్టంగా ఉన్నాయి. స్తుతించిన సదస్యులనుగురించి ఉత్తరార్ధంలో నన్నయచెప్పినమాటలు మాధుర్యం (ఉక్తిచమత్కారం)తో కూడిఉన్నాయి. కీర్తనమున్న రెండుచరణాలూ, కథనమున్న రెండుచరణాలూ గుణనిర్వహణలో సమత్వాన్ని సాధించాయి. దానివలన పద్యనిర్మాణంలో సమత్వంతో కూడిన తూకం ఏర్పడింది. అంతేకాక, నాలుగుచరణాలలో మూడింట- పైచరణం క్రిందిచరణంలో చొచ్చుకొనిపోయే లక్షణం ఏకవాక్యతను, సమతను సూచిస్తున్నది. ఈ సన్నివేశాన్ని 'సమతా' గుణరచనతో ముగించటం శిల్పియైన నన్నయ సాధించిన చాతుర్యం. ఆదిపర్వంలోని ప్రథమ ద్వితీయాశ్వాసాలు సర్పసంహారోపసంహారంతో సమాప్తంకావటంకూడా కథారచనా పరమైన సమతాగుణం. (సంపా.)

**క. ఒనర జరత్కారు మునీం । ద్రునకు జరత్కారునకు సుతుం డైన మహా**
**మునివరు నాస్తీకుని ముద । మునఁ దలఁచిన నురగభయముఁ బొందదు జనులన్. 234**

**ప్రతిపదార్థం:** ఒనరన్=ఒప్పునట్లుగా; జరత్కారు, ముని+ ఇంద్రునకున్= జరత్కారువనే; మునిశ్రేష్ఠుడికి; జరత్కారునకున్= వాసుకి చెల్లెలైన జరత్కారువునకు; సుతుండు+ఐన= కుమారు డైన; మహత్, మునివరున్= గొప్పమునిశ్రేష్ఠుడిని; ఆస్తీకుని; ముదమునన్= సంతోషంతో; తలఁచినన్= స్మరించగా; జనులన్= ప్రజలను; ఉరగ, భయమున్= పాములవలని భయంకూడ; పొందదు= ప్రాపింపదు (అంటదు).

**తాత్పర్యం:** ఒప్పుగా జరత్కారువనే మునిశ్రేష్ఠునికి, జరత్కారు వనే వాసుకి చెల్లెలికి కుమారుడైన ఆస్తీకమహామునిని స్మరిస్తే జనులకు పాములవలన భయం కలుగదు.

**విశేషం:** ఆస్తీకచరిత్రానికి ఇది ఫలశ్రుతి.

**వ. మఱియు నయ్యాస్తీకు చరితంబు విన్నవారికి సర్వపాపక్షయం బగు నని. 235**

**ప్రతిపదార్థం:** మఱియున్= అదీకాక; ఆ+ఆస్తీకు, చరితంబు= ఆ ఆస్తీకముని చరిత్రం (కథ); విన్నవారికిన్= విన్నజనులకు; సర్వపాపక్షయంబు= అన్నిపాపాలనాశం; అగున్= అవుతుంది; (జరుగుతుంది); అని.

**తాత్పర్యం:** అదీకాక, ఆ ఆస్తీకమునివర్యునికథ విన్నజనులకు సకలపాపాలు తొలగిపోతాయి.

**విశేషం:** పై పద్యంలో ఆస్తీకుడిని స్మరించినవారికి కలిగే ఫలం చెప్పబడింది. ఈ వచనంలో అతడి కథ వినేవారికి కలిగే ఫలం పేర్కొనబడింది. మహాభారతకథాపరమార్థం అమృతత్వసాధనం. దీనికి సంబంధించిన మహార్థాలను చెప్పే ఆఖ్యానకాలకుకూడా ఫలశ్రుతులు చెప్పటం గమనింపదగిన అంశం. గరుడోపాఖ్యానం అమృతం త్రాగకుండానే అమరుడైనవాడి కథ. అమృతాన్ని అందించినా అందుకోలేని ఉరగుల కథ, సర్పయాగవృత్తాంతంలో ఆస్తీకుడు పాములను మృతినుండి తప్పించి, అదే అమృతత్వంగా అందించాడు. అమృతం అనేది ద్రవ్యమా? ధర్మమా? గుణమా? తత్త్వమా? అనే మీమాంసలలో దయాగుణమే అమృతమని తేల్చిన కథ యిది. ప్రధానకథకు పూర్వరంగమైన ఈరెండాశ్వాసాలకథకూ ఔచిత్యవంతమైన ముగింపు ఇది. (సంపా.)

## ఆశ్వాసాంతము

**క. రాజమహేంద్ర! కవీంద్రస । మాజ సురక్ష్మాజ! రాజమార్తాండ! ధరి**
**త్రీజననుతచారిత్ర! వి । రాజిత గుణరత్న! రాజరాజనరేంద్రా! 236**

**ప్రతిపదార్థం:** రాజమహత్+ఇంద్ర= రాజేంద్రా! రాజశ్రేష్ఠుడా!; కవి+ఇంద్ర, సమాజ, సురక్ష్మాజ= కవిశ్రేష్ఠులసమూహానికి దేవతావృక్షమా! (కల్పవృక్షమా!); రాజ, మార్తాండ= సూర్యుడివంటిరాజా!; ధరిత్రీ, జన, నుత, చారిత్ర= భూమిలోని జనులచేత పొగడబడే చరిత్రకలవాడా!; విరాజిత, గుణ, రత్న= ప్రకాశించే గుణాలనే రత్నాలు కలవాడా!; రాజరాజనరేంద్రా!

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠుడా! కవిశ్రేష్ఠులసముదాయానికి కల్పవృక్షమా! సూర్యుడివంటిరాజా! సూర్యుడివలె తేజస్సు కలవాడా! భూమిలోని జనులచేత స్తుతింపబడిన చరిత్ర కలవాడా! ప్రకాశించే గుణా లనే రత్నాలు కలవాడా! రాజరాజనరేంద్రా!

**విశేషం:** అలం: ఉపమ, రూపకం. ఆశ్వాసాంతంలో కృతిరచనాప్రేరకు డైన రాజరాజనరేంద్రునికి సంబోధనలు ఇందులోను తరువాతపద్యంలోను ఉన్నాయి.

**వసంతతిలకవృత్తము.**

**వీరావతార! సుకవిస్తుత! నిత్యధర్మ**
**ప్రారంభ! శిష్టపరిపాలనసక్త! రాజా!**
**నారాయణాఖ్య! కరుణారసపూర్ణ! వీర**
**శ్రీరమ్య! రాజకులశేఖర! విష్ణుమూర్తీ! 237**

**ప్రతిపదార్థం:** వీర+అవతార= వీరరసంయొక్క వ్యక్త మైన రూపమా! మూర్తిధరించినవీరరసమా!; సుకవి, స్తుత= మంచికవులచే నుతింపబడేవాడా!; నిత్య, ధర్మ, ప్రారంభ= ఎల్లప్పుడు ధర్మంతో కూడిన ప్రయత్నాలు కలవాడా!; శిష్టపరిపాలనసక్త= ఉత్తములను పాలించటంలో ఆసక్తికలవాడా!; రాజా!= ప్రభువైనవాడా!; నారాయణ+ఆఖ్య= (రాజు) నారాయణు డనే బిరుదు కలవాడా!; కరుణా, రస, పూర్ణ= దయారసంతో నిండినవాడా!; వీర, శ్రీ, రమ్య= వీరరసలక్ష్మిచే సుందరుడా!; రాజ, కుల, శేఖర= రాజవంశంలో శ్రేష్ఠుడా!; విష్ణుమూర్తీ= విష్ణువుయొక్క మూర్తివంటి మూర్తికలవాడా!.

**తాత్పర్యం:** మూర్తీభవించినవీరరసమా! మంచికవులచేత స్తుతింపబడేవాడా! ఎల్లప్పుడు ధర్మంతో కూడిన ప్రయత్నాలు కలవాడా! ఉత్తములను పరిపాలించటంలో ఆసక్తికలవాడా! రాజా! (రాజ) నారాయణు డనే బిరుదు కలవాడా! దయారసంతో నిండినవాడా! వీరరసలక్ష్మిచే సుందరుడా! రాజవంశంలో శ్రేష్ఠుడా! విష్ణువుయొక్క మూర్తివంటి మూర్తి కలవాడా!

**విశేషం:** వసంతతిలక వృత్తంలో ఒక్కొక్కపాదానికి, త, భ, జ, జ, గగ - అనే గణాలు (14 అక్షరాలు) ఉంటాయి. 8వఅక్షరం యతిమిత్రస్థానం. 'రాజా! నారాయణాఖ్య' - కు 'రాజనారాయణాఖ్య' అనే పాఠాంతరం ఉన్నది. రాజ, నారాయణాఖ్య అన్నప్పుడు రెండవపాదంచివర లఘువు వస్తుంది. సంస్కృతంలో పాదాంతంలో గురువుకు బదులు లఘువు వాడే సంప్రదాయం ఉన్నది. నన్నయ ఇచ్చట ఆ సంప్రదాయాన్ని అనుసరించా డని చెప్పాలి. కొందరు ఈపాఠమే సముచిత తరమని భావిస్తున్నారు.

**గద్యము.**

**ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్టప్రణీతం బయిన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబున నాగగరుడోత్పత్తియు, సముద్రమథనంబును, నమృతసంభవంబును, సౌపర్ణాఖ్యానంబును, జనమేజయ సర్పయాగంబును, నాస్తీక చరితంబును నన్నది ద్వితీయాశ్వాసము. 238**

**ప్రతిపదార్థం:** గద్యము= వచనం; దీర్ఘవచనం; ఛందోనియమం లేకపోయినా అనుప్రాసాదులతో శ్రవణసుభగంగా ఉండేటట్లు వ్రాయబడే వచనం, కావ్యాలలో ఆశ్వాసాంతాలలో కవి తనబిరుదాలను పేర్కొని తాను ఆకావ్యంలో ఆ ఆశ్వాసం ముగిసిం దని సూచించటానికి వ్రాసేవచనం. నన్నయ ఆశ్వాసంలోని ముఖ్యవిషయాలను కూడ ఇందులో సూచిస్తూ ఉంటాడు.

ఇది= ఈఆశ్వాసం; సకల, సుకవి, జన, వినుత= అందరు సత్కవి జనులచేత స్తుతింపబడిన; నన్నయ, భట్ట, ప్రణీతంబు+అయిన= పూజ్యు డైన నన్నయకవిచే రచింపబడిన; శ్రీమహత్, భారతంబు+అందున్= శోభాయుక్త మైన మహాభారతం అనే కావ్యంలో; ఆదిపర్వంబునన్= మొదటి దైన ఆదిపర్వంలో; నాగ, గరుడ+ఉత్పత్తియున్= పాములయొక్క, గరుత్మంతునియొక్క పుట్టుకయున్నూ; సముద్ర మథనంబును= దేవాసురులు అమృతంకొరకు సముద్రాన్ని చిలకటమున్నూ; అమృత, సంభవంబును= అమృతంయొక్క పుట్టుక (ఉత్పత్తి) యున్నూ; సౌపర్ణ+ఆఖ్యానంబును= గరుడునికి సంబంధించిన కథయున్నూ; జనమేజయ, సర్ప, యాగంబునున్= పరీక్షిత్తుకుమారుడైన జనమేజయుడి (అతడు చేసిన) సర్పాలను ఆహుతి చేసే యజ్ఞవృత్తాంతమున్నూ; ఆస్తీకు, చరితంబునున్= జరత్కారుకుమారుడైన ఆస్తీకముని కథయున్నూ; అన్నది= అనేవాటితో కూడింది; ద్వితీయ+ఆశ్వాసము= రెండవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది సర్వసత్కవిజనులచేత స్తుతింపబడే పూజ్య నన్నయకవిచేత రచింపబడిన శ్రీమహాభారత మనే కావ్యంలో, ఆదిపర్వంలో - పాములయొక్క గరుడునియొక్క పుట్టుక, సముద్రాన్ని దేవాసురులు మథించటం, అమృతంయొక్క ఉత్పత్తియున్నూ, గరుడునికి సంబంధించిన కథ, జనమేజయమహారాజు చేసిన సర్పయాగం, ఆస్తీకుడి కథ అనేవాటితో కూడినది రెండవ ఆశ్వాసం.

ఆదిపర్వం ద్వితీయాశ్వాసం సమాప్తం.



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆదిపర్వము -తృతీయాశ్వాసము

**శ్రీమచ్చళుక్య వంశశి । ఖామణి! మనుమార్గ! రాజకంఠీరవ! ధై**

**ర్యామరధరణీధర! ధర । ణీమండన! ధర్మనిరత! నిత్యాభ్యుదయా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీమత్+చళుక్య, వంశ, శిఖామణి= శోభాయుక్తమైన చళుక్యవంశానికి శిరోమణి ఐనవాడా!; మనుమార్గ= మనువు యొక్క మార్గంవంటి మార్గం కలవాడా! (మనువు మార్గాన్ని అనుసరించేవాడా!); రాజకంఠీరవ= రాజసింహా!; ధైర్య+అమర, ధరణీధర= ధైర్యంలో దేవతలపర్వత మైన మేరువువంటివాడా!; ధరణీమండన= భూమికి అలంకార మైనవాడా! ధర్మ, నిరత= ధర్మమందు ఆసక్తికలవాడా!; నిత్య+అభ్యుదయా!= నిరంతర మైన శుభోదయం కలవాడా!

**తాత్పర్యం:** (రాజరాజనరేంద్రుడికి సంబోధన) శోభాయుక్తమైన చాళుక్యవంశానికి శిరోమణీ! (శ్రేష్ఠుడా!) మనుమార్గప్రవర్తకుడా! రాజశ్రేష్ఠుడా! ధైర్యహేమాద్రీ! భూమికి అలంకారప్రాయ మైనవాడా! ధర్మమం దాసక్తికలవాడా! నిరంతరశుభోదయం కలవాడా!

**వ్యాసుఁడు జనమేజయునకు భారతకథం దెలుప వైశంపాయను నియోగించుట (సం.1-54-1)**

**వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె: నట్లు జనమేజయుం డుపసంహృతసర్పసత్త్రుం డయి యథావిధి సంపూర్ణదక్షిణల ఋత్విజులను, సదస్యులనుం బూజించి, దీనానాథజనంబులకుఁ గోరినధనంబు లిచ్చి, యనేకపురాణపుణ్యకథాశ్రవణకుతూహలపరుం డగుచు విద్వజ్జనగోష్ఠి నుండి యొక్కనాఁడు. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= కథచెప్పేవాడు, ఉగ్రశ్రవసుడు; శౌనక+ఆది, మహత్+మునులకున్= నైమిశారణ్యపుణ్యప్రదేశంలో ఉన్న శౌనకుడు మొదలైన మహామునులకు; చెప్పెను= చెప్పాడు; అట్లు= ఆవిధంగా; జనమేజయుండు= పరీక్షిన్మహారాజు కుమారుడు; ఉపసంహృత, సర్ప, సత్త్రుండు+అయి= ముగించబడిన సర్పయాగం కలవాడై, యథావిధి= శాస్త్రప్రకారంగా; (విధి నతిక్రమించకుండ);విధిననుసరించి సంపూర్ణ, దక్షిణలన్= నిండైన సంభావనలతో; ఋత్విజులను= యజ్ఞం చేయించేవారిని; సదస్యులనున్= యజ్ఞవిధి పరీక్షాధికారులను; పూజించి; దీన+అనాథ, జనంబులకున్= దీనులకున్నూ, దిక్కులేనివారికిన్నీ; కోరినధనంబులు; ఇచ్చి; అనేక, పురాణపుణ్యకథా శ్రవణకుతూహలపరుండు= పెక్కుపురాణాలలోని పుణ్యప్రదా లైన కథలను వినటంలో ఆసక్తిగలవా డగుచు; విద్వత్+జన, గోష్ఠిన్= విద్వాంసు లైన జనులగోష్ఠిలో ఉండి; ఒక్కనాఁడు= ఒకరోజు.

**తాత్పర్యం:** కథ చెప్పే సౌతి శౌనకుడు మొదలైన గొప్పమునులకు చెప్పాడు: ఆవిధంగా పరీక్షిత్తుకుమారు డైన జనమేజయుడు ముగించబడినసర్పయాగం కలవాడై, శాస్త్రాన్ని అతిక్రమించకుండా అధిక మైన సంభావనలతో యజ్ఞం చేయించే ఋత్విక్కులను, యజ్ఞవిధిపరీక్షకులైన వ్యాసాదులను పూజించి, ఆర్తులకున్నూ, దిక్కులేనివారికిన్నీ వారు కోరిన ధనాన్ని ఇచ్చి, పెక్కుపురాణాలలోని (ప్రాచీనాలైన) పుణ్యప్రదాలైన కథలను వినటానికి ఆసక్తి కలవాడై పండితు లైనవారిసభలో వారితో సల్లాపం చేస్తూ ఒకరోజు. (తరవాతి పద్యంతో అన్వయం.)

**మ. పరమబ్రహ్మనిధిం, బరాశరసుతున్, బ్రహ్మర్షిముఖ్యున్, దయా**

**పరుఁ, గౌరవ్యపితామహున్, జనహితప్రారంభుఁ, గృష్ణాజినాం**

**బరు, నీలాంబుదవర్ణదేహు, ననురూపప్రాంశు, నుద్యద్దివా**
**కర రుక్పింగజటాకలాపు, గతరాగద్వేషు, నిర్మత్సరున్. 3**

**ప్రతిపదార్థం:** పరమబ్రహ్మనిధిన్= శ్రేష్ఠమైనతపస్సుకు, (వేదాలకు)నిధి యైనవాడిని; పరాశరసుతున్= పరాశరుడికుమారుడిని; బ్రహ్మ+ఋషి, ముఖ్యున్= బ్రహ్మర్షులలో ప్రధానుడిని; దయా, పరున్= దయయందు ఆసక్తికలవాడిని; కౌరవ్య, పితామహున్= కౌరవసంతతికి తాత యైనవాడిని; జన, హితప్రారంభున్= ప్రజాహితమందు ప్రయత్నం కలవాడిని; కృష్ణ+అజిన+అంబరున్= జింకచర్మం వస్త్రంగా కలవాడిని; నీల+అంబుద, వర్ణదేహున్= నీలమేఘవర్ణంవంటి వర్ణం కలశరీరంకలవాడిని; అనురూప, ప్రాంశున్= తగినఎత్తు(పొడవు)గలవాడిని; ఉద్యత్+దివాకర, రుక్+పింగ, జటా, కలాపున్= ఉదయించే సూర్యుడికాంతివలె రాగిరంగు జడలసమూహం కలవాడిని; గత, రాగద్వేషున్= నశించిన రాగద్వేషాలు కలవాడిని; నిర్మత్సరున్= మాత్సర్యం లేనివాడిని.

**తాత్పర్యం:** పరమతపోనిధిని, పరాశరకుమారుడిని, బ్రహ్మర్షులలో అగ్రగణ్యుడిని, దయామయుడిని, కురుకులపితామహుడిని, లోకకల్యాణకారకుడిని, కృష్ణాజినాంబరధారిని, నల్లనిమేఘంయొక్క వర్ణంవంటి వర్ణం కల దేహం కలవాడిని, తగినయెత్తు గలవాడిని, ఉదయభానుడి కాంతి గల రాగిరంగుజడలసముదాయం కలవాడిని, రాగద్వేషాలు లేనివాడిని, మాత్సర్యరహితుడిని. (క్రిందివచనంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**వ. వైశంపాయన ప్రభృతి శిష్యవర్గంబులతో ననేకమునిగణపరివృతుం డయి, కనకమణిమయోచ్చాసనంబున నున్న వ్యాసభట్టారకు నతిభక్తి నర్ఘ్యపాద్యాదివిధులం బూజించి, వినయవినమితశిరస్కుం డై నమస్కరించి జనమేజయుం డి ట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** వైశంపాయన, ప్రభృతి, శిష్యవర్గంబులతోన్= వైశంపాయనుడు మొదలుగా గల శిష్యులసమూహాలతో; అనేకమునిగణపరివృతుండు+అయి= పెక్కుమంది మునులసమూహంతో చుట్టబడినవాడై; కనక, మణిమయ+ఉచ్చ+ ఆసనంబునన్= బంగారంతోను, మణులతోను నిండిన ఎత్తైనపీఠంమీద; ఉన్న; వ్యాసభట్టారకున్= పూజ్యు డైన వ్యాసమహర్షిని; అతి, భక్తిన్= మిక్కిలిభక్తితో, అర్ఘ్య, పాద్య+ఆది, విధులన్=పూజకు పుష్పాలు, కాళ్ళు కడుగుకొనేందుకు నీళ్ళు మొదలైన పరిచర్యలతో; పూజించి= అర్చించి; వినయవినమిత, శిరస్కుండు+ఐ= వినయంతోవంగినతల కలవాడై; నమస్కరించి; జనమేజయుండు. ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** వైశంపాయనుడు మొదలైన శిష్యులసమూహంతోను, పెక్కుమందిమునులతోను చుట్టబడినవా డై బంగారంతోను, మణులతోను చేయబడిన ఉన్నత మైన ఆసనమందు కూర్చున్న వ్యాసభగవానుడిని జనమేజయుడు అర్ఘ్యపాద్యాదు లిచ్చి మిక్కిలిభక్తితో పూజించి ఇట్లా పలికాడు.

**విశేషం:** భట్ట, భట్టార, భట్టారక శబ్దాలు పూజ్యావాచకాలు. ఇవి వ్యక్తిపేరుకు ముందునను, వెనుకను వస్తాయి. ఉదా: భట్టోద్భటుడు; కుమారిలభట్టు; నన్నయభట్టు; వ్యాసభట్టారకుడు మొ॥ విద్వాంసుడైన బ్రాహ్మణుడిపేరుతో "భట్టారక" శబ్దం వాడబడుతుంది.

**సీ. ప్రీతితో మీరును భీష్మాదికురువృద్ధ । రాజులు నుండి భూరాజ్యవిభవ**
**మెల్ల విభాగించి యిచ్చినం, దమతమ । వృత్తుల నుండక, వీఁగి పాండు**
**ధృతరాష్ట్రనందనుల్ ధృతి చెడి, వా రేమి । కారణంబునఁ బ్రజాక్షయము గాఁగ**
**భారతయుద్ధ మపారపరాక్రముల్ । చేసిరి? మీపంపు సేయ రైరి?**

**ఆ. యెఱిఁగి యెఱిఁగి వారి నేల వారింపర; । యిట్టి గోత్రకలహ మేల పుట్టె?**
**దీని కలతెఱంగు దెలియంగ నానతి । యిండు నాకు సన్మునీంద్రవంద్య! 5**

**ప్రతిపదార్థం:** సత్, ముని+ఇంద్ర, వంద్య= ఉత్తము లైన మునిశ్రేష్ఠులచేత నమస్కరించదగిన వ్యాసమహర్షీ!; మీరును= (వ్యాసుడున్నూ) భీష్మ+ఆది, కురువృద్ధ, రాజులున్= భీష్ముడు మొద లైన కురువంశ్యులైనపెద్దలున్నూ, రాజులున్నూ; ఉండి= దగ్గరే ఉండి; ప్రీతితోన్= ప్రేమతో; భూ, రాజ్య, విభవము+ఎల్లన్= భూమియొక్క రాజ్యసంపద నంతా; విభాగించి= విభజించి; ఇచ్చినన్= ఇచ్చినప్పటికీ; తమ, తమ; వృత్తులన్= నడవడులలో, జీవనవిధానాలలో; ఉండక; వీఁగి= చలించి; పాండుధృతరాష్ట్రనందనుల్= పాండురాజపుత్రులున్నూ, ధృతరాష్ట్రుడిపుత్రులున్నూ; ధృతి, చెడి=ధైర్యం నశించి; వారు; ఏమి కారణంబునన్; ప్రజా, క్షయము కాఁగన్= ప్రజలకు వినాశం కలిగేటట్లుగా; భారత, యుద్ధము; అపార, పరాక్రముల్= అంతులేనిశౌర్యం కలవారు; చేసిరి; మీ పంపు= మీ ఆజ్ఞను; చేయరు+ఐరి= చేయనివా రైనారు; ఎఱిఁగి ఎఱిఁగి; వారిన్; ఏల= ఎందుకు; వారింపరు= నివారించరు?; ఇట్టి; గోత్ర, కలహము= వంశమందలియుద్ధం; ఏల; పుట్టెన్= ఎందుకు కలిగింది; దీని; కల, తెఱంగు= యథార్థస్థితి; తెలియంగన్= తెలిసేటట్లుగా, నాకున్; ఆనతి+ఇండు= ఆజ్ఞాపించండి. (తెలుపండి).

**తాత్పర్యం:** ఉత్తములైన మునులచేత నమస్కరించదగిన ఓ వ్యాసభగవానుడా! మీరున్నూ, భీష్మాదికురువృద్ధులున్నూ, రాజులున్నూ దగ్గర ఉండి రాజ్యసంపదనంతటినీ విభాగించి ఇవ్వగా, అంతులేనిపరాక్రమం కల కౌరవపాండవులు తమతమవృత్తులలో ఉండకుండా చలించి ప్రజానాశ మయ్యేటట్లుగా భారతయుద్ధాన్ని చేసేందుకు ఎందుకు పాల్పడ్డారు? మీఆనతిని వారు ఎందుకు పాటించకున్నారు? తెలిసికూడా మీరు ఇటువంటియుద్ధాన్ని ఎందుకు నివారింపలేకపోయారు? ఈ గోత్రకలహ మెందుకు పుట్టింది? దీని యథార్థస్థితిని నాకు తెలియజెప్పండి.

**విశేషం:** ఎఱిఁగి+ఎఱిఁగి= ఆమ్రేడితము పరమైనను క్త్వార్థకమగుటచేత సంధి కాలేదు. శ్రోత అయిన జనమేజయుడు పాండవకౌరవులు భారతయుద్ధం ఎందుకు చేశారు? అని ప్రశ్నించాడు. ఆ యుద్ధం జరగకుండా ఉండటానికి అనువైన హేతువులను గురించి, అవి విఫల మైన పద్ధతులను గురించి తెలిసికొన తలచాడు. వ్యాసభీష్మాదులు ఉండి రాజ్యవిభాగంచేసి ఎవరి బ్రదుకులు వారివిగా జీవించటానికి అవకాశం కలిగించినా యుద్ధం ఎందుకు వచ్చిందని మొదటిఅనుమానం. వ్యాసభీష్మాదుల మాటలు వారు వినకపోవటానికి కారణమేమిటి? వారు వినకపోయినప్పుడు వీరు ఉదాసీనత ప్రకటించటంలో కల కారణమేమిటి? అని ప్రశ్నించి, ఇన్ని రకాలుగా యుద్ధం జరుగకుండా ఉండటానికి వీలున్నా అది ప్రవర్తిల్లటానికి మూలమైన బలమైన హేతువేది? అని అడిగాడు చివరకు. ఒక్కొక్కప్రశ్నకు సమాధానం చెపితే కథలోని లోతులు క్రమంగా తెలుస్తాయి. అన్నింటిలో చివరిప్రశ్నబలమైనది, లోతైనది, ఉత్కంఠను కలిగించేది, అన్నింటికి బీజం వంటిది. కాబట్టి కురుపాండవులమధ్య జరిగిన కురుక్షేత్రయుద్ధానికి కల ఆ మూలహేతువును మొదట వివరించటంద్వారా నన్నయ కథాతాత్పర్యాన్ని ప్రసన్నం చేస్తున్నాడు.

**వ. అని యిట్లు పాండవధార్తరాష్ట్రవిభేదనకథాశ్రవణకుతూహలపరుం డయి యడిగిన జనమేజయునకుం గరుణించి, కృష్ణద్వైపాయనుండు వైశంపాయనమునింజూచి 'శ్రీమహాభారతకథాఖ్యానంబాద్యంతంబితనికి సవిస్తరంబుగాఁ జెప్పు' మని పంచిచనిన. 6**

**ప్రతిపదార్థం:** అని, ఇట్లు; పాండవ= పాండవులయొక్కయు; ధార్తరాష్ట్ర= ధృతరాష్ట్రునికుమారులయొక్కయు; విభేదన= వేరుపాటుకు సంబంధించిన; కథాశ్రవణ= కథను వినుటయందు; కుతూహలపరుండు+ఐ= కుతుకమందు ఉత్సాహం కలవాడై; అడిగిన; జనమేజయునకున్= జనమేజయుడిని (ద్వితీయకు షష్ఠి); కరుణించి= కనికరించి; కృష్ణద్వైపాయనుండు= వేదవ్యాసుడు; వైశంపాయన, మునిన్; చూచి; శ్రీ, మహత్, భారత, కథా+ఆఖ్యానంబు= శోభాయుక్తమైన మహాభారతకథతోకూడిన ఇతిహాసాన్ని; ఆది+అంతంబు= మొదటినుండి చివరివరకు; ఇతనికిన్= ఈ జనమేజయుడికి; సవిస్తరంబుగాన్= విస్తృతితోకూడి ఉండేటట్లు; చెప్పుము; అని; పంచి= ఆజ్ఞాపించి; చనినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** అని ఈవిధంగా కౌరవపాండవులకలహవృత్తాంతాన్ని వినటానికి కుతూహలు డై ఉన్న జనమేజయుడిని కరుణించి, వేదవ్యాసుడు వైశంపాయనుని చూచి 'శ్రీమహాభారతకథతో కూడిన ఇతిహాసాన్ని ఆద్యంతం సవిస్తరంగా ఇతడికి చెప్పు' మని ఆజ్ఞాపించి వెళ్ళగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** జనమేజయు డడిగిన ప్రశ్నలో భారతయుద్ధానికి వ్యాసుడి బాధ్యత ఎంత అనే అంశం అంతర్గర్భితంగా ఉన్నది. అందువలన భారతకథను తానే చెప్పి తనను తాను సమర్థించుకొన్నట్లు కాకుండా, తన శిష్యుడైన వైశంపాయనుడిని మహాభారతకథను విస్తరించి చెప్పు మన్నాడు. విస్తరించట మంటే శ్రోత అడిగే ప్రశ్నలకూ, వెలిబుచ్చే అనుమానాలకూ తగిన వివరాలతో కథను పెంచి చెప్పటమన్నమాట. తాను రచించిన భారతాన్ని మానవలోకంలో ప్రచారం చేయటానికి వ్యాసుడు వైశంపాయనుడిని నియోగించాడు (చూడు: ఆది. 1.67).

## భారత మహిమము

**క. జనమేజయుండు విద్వ । జ్జనపరివృతుఁ డై సమస్తజనపాలసభా**
**జనయోగ్యుని వైశంపా । యనమునిఁ బూజించె వినతుఁ డై వినువేడ్కన్. 7**

**ప్రతిపదార్థం:** (భారతాన్ని) విను వేడ్కన్= వినే వేడుకతో, జనమేజయుండు; విద్వత్+జన, పరివృతుఁడు+ఐ= విద్వాంసు లైన జనులతో కూడినవాడై; సమస్త, జనపాలసభాజన, యోగ్యునిన్= సమస్తరాజులసభలలో ఉండే జనాలలోయోగ్యుడైనవాడిని (ఉండేందుకుతగినవాడిని) వైశంపాయనమునిన్= వైశంపాయను డనే పేరుకలిగిన మునిని; వినతుఁడు+ఐ= విధేయు డై; పూజించెన్= అర్చించాడు.

**తాత్పర్యం:** జనమేజయుడు శ్రీ మహాభారతాన్ని వినే వేడుకతో విద్వజ్జనాలతో కూడి, సకలరాజసభాసదులలో ఉత్తము డైన వైశంపాయనమునిని విధేయుడై పూజించాడు.

**వ. ఆ వైశంపాయనుండును నఖిలభువనవంద్యుం డయిన కృష్ణద్వైపాయనమునీంద్రునకు నమస్కారంబు సేసి, విద్వజ్జనంబుల యనుగ్రహంబు వడసి. 8**

**ప్రతిపదార్థం:** ఆ వైశంపాయనుండును= వ్యాసమహర్షిశిష్యుడైన ఆ వైశంపాయనుడు; అఖిల, భువనవంద్యుండు= సమస్తలోకాలచేత నమస్కరించదగినవాడు; అయిన; కృష్ణద్వైపాయనముని+ఇంద్రునకున్; నమస్కారంబు; చేసి; విద్వత్+జనంబుల= విద్వాంసు లైన జనాలయొక్క; అనుగ్రహంబు= దయ; పడసి=పొంది.

**తాత్పర్యం:** ఆ వైశంపాయనుడు వేదవ్యాసుడికి నమస్కరించి, అక్కడి విద్వాంసుల అనుగ్రహాన్ని పొంది. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. కమనీయధర్మార్థకామమోక్షములకు । నత్యంతసాధనం బయినదాని,**
**వేడ్కతోఁ దవిలి తన్ వినుచున్నవారల । కభిమతశుభకరం బయినదాని,**
**రాజుల కఖిలభూరాజ్యాభివృద్ధిని । త్యాభ్యుదయప్రదం బయినదాని,**
**వాఙ్మనఃకాయప్రవర్తితానేకజ । న్మాఘనిబర్హణం బయినదాని,**

**ఆ. సత్యవాక్ప్రబంధశతసహస్రశ్లోక । సంఖ్య మయినదాని, సర్వలోక**
**పూజ్య మయినదాని, బుధనుతవ్యాసమ । హామునిప్రణీత మయినదాని. 9**

**ప్రతిపదార్థం:** కమనీయ, ధర్మ+అర్థ, కామ మోక్షములకున్= ఇంపైన (కోరదగిన) ధర్మం, అర్థం,కామం, మోక్షం అనే చతుర్విధపురుషార్థాలకున్; అత్యంతసాధనంబు= అధిక మైన సాధనం; అయినదానిన్= అయినట్టిదానిని; వేడ్కతోన్= కుతూహలంతో; తవిలి= ఆసక్తి కలిగి, తన్=తన్ను వినుచున్నవారలకున్; అభిమత; శుభకరంబు= ఇష్టము లైన శుభాలను కలిగించేది; అయినదానిన్ రాజులకున్; అఖిల, భూ, రాజ్య+అభివృద్ధి, నిత్య+అభ్యుదయప్రదంబు= సమస్తభూమియొక్క రాజ్యాభివృద్ధిని, ఎల్లవేళల శుభోదయాన్ని ఇచ్చేది అయినదానిన్ వాక్+మనస్+కాయ+ప్రవర్తిత+అనేక, జన్మ+అఘ, నిబర్హణంబు= వాక్కుచేత, మనస్సుచేత, శరీరంచేత చేయబడిన అనేకజన్మాలలోని పాపాలను, హతమార్చేది అయినదానిని; సత్యవాక్+ప్రబంధ, శత, సహస్రశ్లోకసంఖ్యము= సత్య మైన వాక్కులకూర్పు కల నూరువేలశ్లోకాలసంఖ్య గలది అయినదానిని; సర్వలోకపూజ్యమున్= సమస్తలోకాలలో పూజించతగినది అయినదానిన్; బుధనుత వ్యాసమహత్మునిప్రణీతము= విద్వాంసులచేత పొగడబడిన వ్యాసమహామునిచేత రచింపబడినది అయినదానిన్= అయినట్టి దానిని

**తాత్పర్యం:** మనోహరా లైన (కోరదగిన) ధర్మం, అర్థం, కామం, మోక్షం, అనే నాలుగువిధా లైన పురుషార్థాలకు మిక్కిలిసాధనమైనదియున్నూ, కుతూహలంతో ఆసక్తిగా వింటున్నశ్రోతలకు ఇష్టమైన శుభాలను చేసేదిన్నీ, రాజులకు సమస్తభూమియొక్క రాజ్యమందలివృద్ధిని, సంతతశుభాభివృద్ధిని ఇచ్చేదిన్నీ, వాక్కు, మనస్సు, దేహం అనేత్రికరణాలతో చేయబడిన పెక్కుజన్మాలలోనిపాపాలను పోగొట్టేదిన్నీ, సత్యమైన వాక్కులకూర్పుకల వందవేలసంఖ్య కలదియూ, సమస్తజనులచేత పూజింపదగిందిన్నీ, పండితులచేత పొగడబడిన వ్యాసమహామునిచేత రచింపబడినదిన్నీ, అయినదానిని.

**విశేషం:** 'కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారతబద్ధనిరూపితార్థ' మేర్పడేటట్లు ప్రవచింపబోతున్న వైశంపాయనుడు వ్యాసమహాభారతప్రశస్తిచేయటం సముచితం. ఈపద్యంలో మహాభారత కావ్యప్రయోజనాలను పేర్కొనటం జరిగింది. పురుషార్థసాధనం అర్థప్రయోజనాన్ని, వినేవారికి శుభాలు కలిగించటం వ్యవహారవేత్తృత్వాన్నీ, అభ్యుదయాలు కలిగించి పాపాలను తొలగించటం శివేతరక్షయాన్ని, సర్వలోకపూజ్యత్వం యశస్సునూ సూచిస్తున్నాయి. నూరువేల శ్లోకాల భారతం మహత్‌భారతం అని పిలవటానికి యోగ్యమైన దని తాత్పర్యం. మహాకావ్యం సద్యఃపరనిర్వృతిని కలిగిస్తుం దని భావం. ఒకవస్తువునందుకానీ, వ్యక్తియందుకానీ పెక్కుగుణాలను వర్ణించేటప్పుడు దాని దాని అనిచెప్పటం నన్నయపద్యాలలో పలుచోట్ల కనిపిస్తుంది. వాక్+మనః= వాఙ్మనః-అనునాసిక సంధి.

**చ. వినుతపరాక్రముల్, ధృతివివేకులు, సత్యసమన్వితుల్, యశో**
**ధనులు, కృతజ్ఞు, లుత్తములు, ధర్మపరుల్, శరణాగతానుకం**

**పను లనఁగాఁ బ్రసిద్ధు లగు భారతవీరుల సద్గుణానుకీ**
**ర్తనముల నొప్పుదాని, విదితం బగుదాని సభాంతరంబులన్.** **10**

**ప్రతిపదార్థం:** వినుత, పరాక్రముల్= పొగడబడినపరాక్రమం కలవారు; ధృతి, వివేకులు= ధైర్యం, తెలివి కలవారు; సత్యసమన్వితుల్= సత్యంతో కూడినవారు; యశస్+ధనుల్= కీర్తియే ధనంగా కలవారు; కృతజ్ఞులు= చేసినమేలు మరువనివారు; ధర్మపరుల్= ధర్మమం దాసక్తులు; శరణ+ఆగత+అనుకంపనులు= శరణుచొచ్చినవారియందు దయకలవారు; అనఁగాన్; ప్రసిద్ధులు+అగు= ప్రఖ్యాతు లైన; భారత, వీరుల= వీరు లైన భరతవంశస్థులయొక్క; సత్+గుణ+అనుకీర్తనములన్= మంచిగుణాలస్తుతులతో; ఒప్పు; దానిన్; సభా+అంతరంబులన్= సభలలోపల; విదితంబు+ అగు, దానిన్= తెలియబడినదానిని, (ప్రసిద్ధమైనదానిని).

**తాత్పర్యం:** మహాపరాక్రమవంతులు, ధైర్యవివేకాలు కలవారు, సత్యపరులు, కీర్తిధనులు, కృతజ్ఞులు, ఉత్తములు, ధార్మికులు, శరణాగతులయందు దయకలవారు అని ప్రసిద్ధిపొందిన భారతవీరులసద్గుణాలను కీర్తించటంతో ఒప్పి, సభాంతరాలలో ప్రశస్త మైనదానిని (భారతాన్ని).

**విశేషం:** ఉత్తమనాయకులవలననే కావ్యాలకు ఉత్తమ గౌరవం లభిస్తుంది. అందువలన మహాభారతానికి ఉత్తమ కావ్యగౌరవప్రయోజనాలు సిద్ధించటానికి కారకులైన చంద్రవంశవీరుల గుణకీర్తనం ఈపద్యంలో నన్నయ నిర్వహించాడు. భారతవీరులు- అంటే భరతవంశంలో పుట్టిన వీరులనీ, భారతకావ్యంలోని వీరులనీ, పాండవులనీ అర్థాలు చెప్పవచ్చును. ఉత్తమనాయకవిశిష్టమైన భారతాన్ని వినటంవలన కలిగే లాభాలను రాబోయే పద్యంలో నన్నయ వివరిస్తున్నాడు.

**శా.** **ఆయుష్యం, బితిహాసవస్తుసముదాయం, బైహికాముష్మిక**
**శ్రేయః ప్రాప్తినిమిత్త, ముత్తమసభాసేవ్యంబు, లోకాగమ**
**న్యాయైకాంతగృహంబునాఁ బరఁగి, నానావేదవేదాంతవి**
**ద్యాయుక్తం బగుదానిఁ జెప్పఁ దొడఁగెం దద్భారతాఖ్యానమున్.** **11**

**ప్రతిపదార్థం:** ఆయుష్యంబు= ఆయుస్సు నిచ్చేది; ఇతిహాస, వస్తుసముదాయంబు= పూర్వకథలందలి ఇతివృత్తాలసమూహం కలది; ఐహిక+ఆముష్మిక, శ్రేయస్ప్రాప్తినిమిత్తము= ఇహలోకసంబంధ మైన పరలోకసంబంధ మైన శుభాలు పొందటానికి కారణం; ఉత్తమ, సభా, సేవ్యంబు= శ్రేష్ఠము లైన సభలచేత (యందు) సేవింపదగినది; లోక+ఆగమ, న్యాయ+ఏకాంత, గృహంబు= లోకానికి, శాస్త్రానికి సంబంధించిన ఆచారాలకు అనన్య మైన నిలయం; నాన్= అన్నట్లుగా; పరఁగి= ప్రసిద్ధికాంచి; నానా, వేదవేదాంత, విద్యాయుక్తంబు+అగుదానిన్= అనేకా లైన వేదాలలోని, ఉపనిషత్తులలోని జ్ఞానంతో కూడినదైన; తద్= ఆ; భారత+ఆఖ్యానమున్= భారతకథను; చెప్పన్, తొడఁగెన్= చెప్పటానికి ఆరంభించాడు.

**తాత్పర్యం:** ఆయుర్దాయాన్ని ఇచ్చేదీ, పూర్వకథావిషయాలసమూహం కలదీ, ఇహపరలోకశ్రేయాలను పొందటానికి కారణ మైనదీ, ప్రముఖా లైన సభలందు సేవింపదగినదీ, లోకానికి, శాస్త్రానికి సంబంధించిన ఆచారాలకు అనన్య మైన నిలయమైనదీ అయి, ప్రసిద్ధి పొంది, అనేక వేద వేదాంతజ్ఞానాలతో కూడిన ఆ మహాభారతకథను (వైశంపాయనుడు) చెప్పటానికి ఆరంభించాడు.

**విశేషం:** భారతం వివిధవిషయాలతో కూడిన విజ్ఞానకోశమని చెప్పదగింది. ఇహపరపుణ్యసాధనం, సమస్తాచారవిధానాలకు నిలయం, శాస్త్రేతిహాసం, కావ్యరచనంవలన కలిగే ప్రయోజనాలను తొమ్మిదవ పద్యంలో సూచించి, కావ్యశ్రవణంవలన కలిగే లాభాలను ఈపద్యంలో నన్నయ పేర్కొన్నాడు.

## పాండవధార్తరాష్ట్రుల భేదకారణసంగ్రహము (సం. 1-55-6)

**సీ. పాండుకుమారులు పాండుభూపతిపరో । క్షంబున హస్తిపురంబునందు**
**ధృతరాష్ట్రునొద్దఁ దత్సుతులతో నొక్కటఁ । బెరుఁగుచు, భూసురవరులవలన**
**వేదంబులును ధనుర్వేదాదివిద్యలుఁ । గఱచుచుఁ గడలేనియెఱుకఁ దనరు**
**చున్నఁ, దద్విపుల గుణోన్నతి సైఁపక । దుర్యోధనుండు దుష్కార్య మెత్తి.**

**ఆ. దుర్ణయమున శకునికర్ణదుశ్శాసనుల్ । గఱపఁ బాండవులకు నఱయ చేయఁ**
**గడఁగెఁ; బాండవులును గడుధార్మికులు గానఁ । బొరయ రైరి వారిదురితవిధుల. 12**

**ప్రతిపదార్థం:** పాండుకుమారులు= పాండవులు; పాండు, భూపతి, పరోక్షంబునన్= పాండురాజు(మరణించిన) పిమ్మట; హస్తిపురంబునందున్; ధృతరాష్ట్రు+ఒద్దన్; తద్+సుతులతోన్= ఆ ధృతరాష్ట్రుని కుమారులతో; ఒక్కటన్= కూడి (ఏకకాలంలో); పెరుఁగుచున్= పెరుఁగుతూ; భూసుర, వరులవలనన్= బ్రాహ్మణశ్రేష్ఠులవలన; వేదంబులును; ధనుః+వేద+ఆది, విద్యలున్= ధనుర్వేదంమొద లైన విద్యలు; కఱచుచున్= నేరుస్తూ; కడ, లేని, ఎఱుకన్= అంతులేనిజ్ఞానంతో; తనరుచున్నన్= ప్రకాశిస్తుండగా; తద్+విపుల, గుణ+ఉన్నతిన్= వారి విస్తారమైన సుగుణాలగొప్పతనం; సైఁపక= సహించక; దుర్యోధనుండు; దుష్కార్యము= చెట్టను; ఎత్తి= గ్రహించి; దుర్ణయమునన్= అన్యాయంగా; శకుని, కర్ణ, దుశ్శాసనుల్; కఱపన్= బోధించగా; పాండవులకున్; అఱ+అ= కీడే; చేయన్, కడఁగెన్= చేయటానికి ప్రయత్నించాడు; పాండవులును; కడు, ధార్మికులు= మిక్కిలి ధర్మయుక్తులు; కానన్= కాబట్టి; వారి, దురితవిధులన్= ఆ కౌరవులపాపకృత్యాలను; పొరయరు+ఐరి= పొందకున్నారు.

**తాత్పర్యం:** పాండురాజుమరణానంతరం పాండవులు హస్తినాపురంలో ధార్తరాష్ట్రులతోపాటు పెరుగుతూ, విప్రవరుల (వలన) వద్ద వేదాలు, ధనుర్వేదాదివిద్యలు నేరుస్తూ, అపారజ్ఞానసంపన్నులై ఉండగా, వారిగుణసంపదకు సహించక దుర్యోధనుడు దుష్కార్యాలకు తలపడి, శకుని కర్ణ దుశ్శాసనులు బోధించగా పాండవుల కెల్లప్పుడు కీడే చేయటానికి యత్నించేవాడు. పాండవులు పరమధార్మికులు కావటంచేత ధార్తరాష్ట్రుల దుష్కార్యాలవలన హాని పొందకుండిరి.

**విశేషం:** కురుక్షేత్రయుద్ధానికి బీజభూతమైన కథాసన్నివేశంతో కథను ప్రారంభించటం ప్రస్తుత కథాశిల్పం. పాండుకుమారులు నాయకులుగా, దుర్యోధనుడు ప్రతినాయకుడుగా రూపొందే భావికథలో నన్నయ కావ్యత్వాన్ని ధ్వనింపచేస్తున్నాడు. కొండను అద్దంలో చూపినట్లు భారతకథనంతా ఒక సీసపద్యంలో ప్రతిఫలింపజేసి పాండవకౌరవ భేద కారణాన్ని నిరూపించటం నన్నయ కథారచనాశిల్పం. ధృతరాష్ట్రు+ఒద్ద; షష్ఠీసమాసంలో ఉకారఋకారముల కచ్చుపరమైనప్పుడు ను ఆగమమౌతుంది- ధృతరాష్ట్రునొద్ద.

**వ. అది యెట్లనిన: నొక్కనాఁడు జలక్రీడాపరిశ్రమవిచేష్టితుం డయి ప్రమాణకోటిస్థలంబున నిద్రితుం డైన భీమసేను నతిఘనలతాపాశబద్ధుం జేసి గంగమడువునం ద్రోచిన, నాతం డనంతసత్త్వుండు గావునఁ దద్బంధంబు**

**లెల్లఁ దెగ నీల్గి మీఁదికి నెగసె; మఱియొక్కనాఁ డతివ్యాయామఖేదంబున సుప్తుం డైన వానిసర్వాంగంబుల యందుఁ గృష్ణసర్పంబులం బట్టి కఱపించిన, నాతండు వజ్రమయదేహుండు గావునఁ దద్విషదంష్ట్రలు నాఁటవయ్యెఁ; మఱియు నొక్కనాఁడు భోజన సమయంబున వానికి విషంబు వెట్టిన, నతండు దివ్యపురుషుండు గావునఁ దద్విషం బన్నంబుతోడన జీర్ణం బయ్యెఁ; మఱియు వారల కెల్ల నపాయంబు సేయసమకట్టి. 13**

**ప్రతిపదార్థం:** అది= వారు పాపకృత్యాలు చేయుటం; ఎట్లు+అనినన్; ఒక్కనాఁడు; జలక్రీడాపరిశ్రమ, విచేష్టితుండు+అయి= జలక్రీడలో మిక్కిలి అలసటచేత చేష్ట లుడిగినవా డై; ప్రమాణకోటిస్థలంబునన్= ప్రమాణకోటి అనే ప్రదేశంలో; నిద్రితుండు+ఐనన్= నిద్రపోయినవాడు కాగా; భీమసేనున్; అతి, ఘన, లతా, పాశబద్ధున్= మిక్కిలిపెద్ద వైన తీగ లనే త్రాళ్ళతో బంధించబడినవాడిని; చేసి; గంగ, మడువునన్= గంగానదిమడుగు(హ్రదం)లో; త్రోచినన్; ఆతండు= ఆ భీముడు; అనంత+సత్త్వుండు= అంతులేని బలంకలవాడు; కావునన్; తద్+బంధంబులు+ఎల్లన్= ఆ కట్టు(త్రాళ్ళన్నియున్నూ); తెగన్= తెగిపోయేటట్లుగా; నీల్గి= ఒడలువిఱుచుకొని; మీఁదికిన్, ఎగసెన్= నీటిపైకిలేచాడు; మఱి, ఒక్కనాఁడు; అతివ్యాయామఖేదంబునన్= మిక్కుట మైన పరిశ్రమవలన కలిగినబాధతో; సుప్తుండు+ఐనన్= నిద్రితు డైన; వానిన్= భీముడిని; సర్వ+అంగంబులయందున్= అన్నిఅవయవాలందు; కృష్ణసర్పంబులన్= నల్లత్రాచుపాములను; పట్టి; కఱపించినన్= కరిచేటట్లు చేయగా; ఆతండు= ఆ భీముడు; వజ్రమయ, దేహుండు= వజ్రమయమైన శరీరంకలవాడు; కావునన్; తద్= ఆ పాములయొక్క; విష, దంష్ట్రలు= విషపుకోరలు; నాటవు+అయ్యెన్= దిగబడవయ్యెను; మఱియున్; ఒక్కనాఁడు= ఇంకొకరోజున; భోజన, సమయంబునన్= అన్నం తినేటప్పుడు; వానికిన్= ఆ భీముడికి; విషంబు+పెట్టినన్; అతండు; దివ్యపురుషుండు= దేవ(అలౌకిక) పురుషుడు; కావునన్; తద్+విషంబు= ఆ విషం; అన్నంబుతోడన్+అ= అన్నంతోపాటుగానే; జీర్ణంబు+అయ్యెన్= అరిగిపోయింది; మఱియున్; వారలకున్+ఎల్లన్= ఆ పాండవులకందరికిన్నీ; అపాయంబు= కీడు; చేయన్; సమకట్టి= పూనుకొని.

**తాత్పర్యం:** పాండవులు పరమధార్మికులు కాబట్టి ధార్తరాష్ట్రులు చేస్తున్న దుశ్చర్యలచేత హాని పొందకున్నారు. అదెట్లా గనగా ఒకరోజు భీముడు జలక్రీడ లాడి మిక్కిలి అలసి సొమ్మసిల్లి ప్రమాణకోటి అనే ప్రదేశంలో నిద్రిస్తుండగా, అతడిని లతాపాశాలతో బంధించి గంగమడుగులోనికి త్రోశారు. ఆ భీముడు అనంతబలుడు కాబట్టి మేలుకొని, ఆ బంధాలు తెగేటట్లుగా ఒడలు విఱుచుకొని బయటికి వచ్చాడు. మఱొకరోజు భీముడు మిక్కిలి పరిశ్రమించి గాఢనిద్రలో ఉన్నపుడు నల్లత్రాచుపాములచేత కఱపించారు. అతడు వజ్రకాయుడుకాబట్టి ఆ సర్పాలవిషదంష్ట్రలు అతనిశరీరంలో దిగబడలేదు. మరి ఇంకొకరోజు భీముడికి భోజనం చేసేటప్పుడు అన్నంలో విషం కలిపి పెట్టించారు. ఆ భీముడు దివ్యపురుషుడు కాబట్టి అన్నంతోపాటే విషంకూడా జీర్ణమైపోయింది. అంతటితో ఆగక ఆ ధార్తరాష్ట్రులు పాండవుల కందరికీ కీడు చేసేందుకు పూనుకొని.

**విశేషం:** దుర్యోధనుడు పాండవులకు హాని చేసేవా డనటానికి ఉదాహరణంగా ఈ విషయాలను సౌతి చెప్పాడు. మొదట భీముడికి చేసిన కీడులను మూడింటిని పేర్కొన్నాడు. అతడు పాండవులకు వజ్రకవచం వంటివాడు. నీరుతో, విషంతో అతడిని చంపటానికి దుర్యోధనుడు ప్రయత్నించి విఫలు డయ్యాడు. దానివలన భీముడు అనంతబలుడనీ, వజ్రకాయుడనీ, దివ్యుడనీ తేలింది. ఆపైన పాండవులనందరినీ సామూహికంగా చంపటానికి యత్నించాడు- అగ్నితో. లాక్షాగృహదహనం ఆ ప్రయోజనంకొరకు రూపొందించిందే. (తరువాతి పద్యంలో ఆ అంశం వర్ణింపబడుతున్నది.)

**సీ. వదలక కురుపతి వారణావతమున । లక్కయిల్ గావించి, యక్కజముగ**

**నందఱఁ జొన్పి, యం దనలంబు దరికొల్పఁ । బనిచినఁ, బాండునందను లెఱింగి**

**విదురోపదిష్టభూవివరంబునం దప । క్రాంతు లై బ్రదికి నిశ్చింతు లయిరి;**
**ధర్మువు నుచితంబుఁ దప్పనివారల, । సదమలాచారుల నుదిత సత్య**

**ఆ. రతుల నఖిలలోకహితమహారంభుల, । భూరిగుణుల, నిర్జితారివర్గు**
**లై వెలుంగువారి దైవంబ రక్షించు । దురితవిధుల నెపుడుఁ బొరయకుండ. 14**

**ప్రతిపదార్థం:** వదలక (తనదుష్కార్యాలను) విడువక; కురుపతి= దుర్యోధనుడు; వారణావతమునన్= వారణావత మనే పేరు కల నగరంలో; లక్క, ఇల్= లక్కఇల్లు; కావించి= నిర్మించి; అక్కజముగన్= ఆశ్చర్యంగా; అందఱన్+చొన్పి= అందరినీ ప్రవేశపెట్టి; అందున్= ఆ ఇంటిలో; అనలంబు= నిప్పు; దరికొల్పన్= మండింపగా; పనిచినన్= ఆజ్ఞాపించగా; పాండు+నందనులు+ఎఱింగి= పాండవులు తెలిసికొని; విదుర+ఉపదిష్ట, భూ, వివరంబునందున్= విదురుడిచేత చెప్పబడిన భూమిరంధ్రమందు; అపక్రాంతులు+ఐ= తొలగిపోయినవా రై; బ్రదికి; నిశ్చింతులు+అయిరి= చింత లేనివా రైనారు; ధర్మువున్= ధర్మాన్ని; ఉచితంబున్= యోగ్యతను, తగినవిధానాన్ని; తప్పనివారలన్= విడువనివారిని; సత్+అమల+ఆచారులన్= నిర్మల మైన నడవడి కలవారిని; ఉదిత, సత్య, రతులన్= (శాస్త్రమందు) చెప్పబడిన సత్యమందు ఆసక్తికలవారిని; అఖిల, లోక, హిత, మహత్+ఆరంభులన్= సమస్తలోకాలమేలుకొరకై గొప్పపూనిక కలవారిని; భూరిగుణులన్= గొప్పగుణవంతులను; నిర్జిత+అరి, వర్గులు+ఐ= జయించబడినశత్రుసమూహం కలవారై; వెలుంగువారిన్= ప్రకాశించేవారిని; దైవంబు+అ= దైవమే; దురిత, విధులన్= పాపపుపనులను; ఎపుడున్; పొరయకుండన్= పొందకుండ; రక్షించున్= రక్షించును.

**తాత్పర్యం:** తన దురుద్దేశం విడవక, దుర్యోధనుడు వారణావతంలో లక్క ఇల్లొకటి నిర్మించి, అందులో పాండవులు ప్రవేశించేటట్లుచేసి దానికి నిప్పంటించు మని ఆజ్ఞాపించాడు. అది గ్రహించి పాండవులు విదురు డెఱిగించిన భూరంధ్రంనుండి బయటపడి బ్రతికి చింతలేనివా రైనారు. ధర్మాన్ని, యోగ్యతను తప్పని సజ్జనులను, ఋజుమార్గవర్తనులను, సత్యసంధులను, సకలజనహితకారులను, గుణసంపన్నులను, శత్రువులసమూహాన్ని జయించి ప్రకాశించేవారిని, పాపకార్యాలనుండి దైవమే ఎప్పుడూ రక్షిస్తుంటాడు.

**విశేషం:** ఈ పద్య ఉత్తరార్ధం నన్నయసూక్తినిధిత్వానికి తార్కాణం.

**వ. ఇట్లు దుర్యోధనుచేయు నపాయంబులవలనం బాయుచుఁబాండవులు లాక్షాగృహదాహంబువలన నక్షయు లై జననీసహితంబుగా వనంబులకుం జనిన, నందు భీమసేనుండు హిడింబాసురుం జంపి, వాని చెలియలి హిడింబను వివాహం బై, యేకచక్రపురంబున కేఁగి, యందు బకాసురుం జంపి విప్రులం గాచె; మఱి. యందఱు విప్రవేషంబున ద్రుపదుపురంబునకుం జని, యందు ద్రౌపదీస్వయంవరంబున మత్స్యయంత్రం బర్జునుం డశ్రమంబున నురుల నేసి, సకలరాజలోకంబు నోడిచి, ద్రోవదిం జేకొనిన, దాని నేవురు గురువచనంబున వివాహం బై ద్రుపదుపురంబున నొక్కసంవత్సరం బున్న నెఱింగి ధృతరాష్ట్రుండు వారి రావించి, వారల కర్ధరాజ్యంబిచ్చి, యింద్రప్రస్థపురంబున నుండం బనిచిన, నందుఁ బాండవులు రాజ్యంబు సేయుచున్నంత. 15**

**ప్రతిపదార్థం:** దుర్యోధను, చేయు, అపాయంబువలనన్= దుర్యోధనుడు చేసేకీడులనుండి; పాయుచున్= తొలగుతూ; పాండవులు; లాక్షాగృహ, దాహంబువలనన్= లక్కయిల్లు కాలటంనుండి; అక్షయులు+ఐ= నశించనివా రై; జననీ, సహితంబుగాన్=

తల్లి యైన కుంతితోకూడ; వనంబులకున్= అడవులకు; చనినన్= వెళ్ళగా; అందున్= వనంలో; భీమసేనుండు; హిడింబ+అసురున్= హిడింబు డనే రాక్షసుడిని; చంపి; వాని, చెలియలిన్; హిడింబను; వివాహంబు+ఐ= పెళ్లిచేసికొని; ఏకచక్రపురంబునకున్; ఏఁగి= వెళ్ళి; అందున్= ఏకచక్రపురంలో; బక+అసురున్= బకు డనే రాక్షసుడిని; చంపి; విప్రులన్= బ్రాహ్మణులను, కాచెన్= కాపాడెను; మఱి; అందరున్= తరువాత పాండవులందరు; విప్ర, వేషంబునన్= బ్రాహ్మణులవేషంతో; ద్రుపదపురంబునకున్= ద్రుపదరాజుపట్టణానికి; చని; అందున్= ఆ పట్టణంలో; ద్రౌపదీస్వయంవరంబునన్= ద్రౌపదీస్వయంవరమహోత్సవంలో (తనంత తాను మగని వరించి చేసికొనువివాహంలో); మత్స్యయంత్రంబు= చేప ఆకారంకలయంత్రాన్ని; అర్జునుండు; అశ్రమంబునన్= శ్రమలేకుండా; ఉరలన్+ఏసి= రాలునట్లుగా బాణంతో కొట్టి; సకల, రాజలోకంబున్= సమస్తరాజసమూహాన్ని; ఒడిచి= ఓడించి; ద్రోవదిన్= ద్రౌపదిని; చేకొనినన్= చెట్టపట్టగా; దానిన్= ఆద్రౌపదిని; ఏవురున్= అయిదుగురును; గురువచనంబునన్= పెద్దలమాటప్రకారం; వివాహంబు+ఐ= పెళ్ళాడి; ద్రుపదు, పురంబునన్; ఒక్క, సంవత్సరంబు; ఉన్నన్= ఉండగా; ఎఱింగి= తెలిసికొని; ధృతరాష్ట్రుండు; వారిన్= ఆ పాండవులను; రావించి= రప్పించి; వారలకున్= ఆ పాండవులకు; అర్ధరాజ్యంబు= సగంరాజ్యం; ఇచ్చి; ఇంద్రప్రస్థపురంబునన్; ఉండన్, పనిచినన్= ఉండేందుకు ఆజ్ఞాపించగా; అందున్= ఆ ఇంద్రప్రస్థంలో; పాండవులు; రాజ్యంబు, చేయుచున్, ఉన్న+అంతన్= రాజ్యం చేస్తుండగా.

**తాత్పర్యం:** ఈ విధంగా దుర్యోధనుడు చేస్తున్న కీడులనుంచి తొలగుతూ, పాండవులు లక్కయిల్లుకాలటంవలన ఎటువంటి హాని లేనివా రై తల్లితోకూడ అడవులకు వెళ్లారు. ఆ అడవులలో భీముడు హిడింబు డనే రాక్షసుడిని చంపి, అతనిచెల్లెలైన హిడింబను పెళ్ళాడి, ఏకచక్రపురానికి వెళ్ళి, అక్కడ బకు డనే రాక్షసుడిని చంపి బ్రాహ్మణులను రక్షించాడు. తరువాత పాండవు లందరూ బ్రాహ్మణవేషాలు ధరించి ద్రుపదుడిపట్టణానికి వెళ్ళారు. అక్కడ ద్రౌపది స్వయంవరవివాహోత్సవంలో చేపరూపంలో అమర్చిన యంత్రాన్ని అర్జునుడు శ్రమలేకుండా బాణంతో పడగొట్టి, రాజులందరినీ ఓడించి, ద్రౌపదిని గ్రహించాడు. తరువాత కుంతి, వ్యాసుడు మొదలైన పెద్దలమాటలను అనుసరించి పాండవు లైదుగురు ద్రౌపదిని పెళ్ళాడి ఒక్కఏడు ద్రుపదునిపట్టణంలోనే ఉన్నారు. ఆ విషయం తెలిసికొని ధృతరాష్ట్రుడు వారిని రప్పించి సగంరాజ్యం ఇచ్చి, ఇంద్రప్రస్థ మనే పట్టణంలో ఉండం డని ఆజ్ఞాపించాడు. దానిలో పాండవులు రాజ్యంచేస్తూ ఉండగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** వచ్చు ధాతువు ప్రేరణార్థకరూపం రావించు, లాక్షాగృహదాహ మైన తరువాత పాండవు లెక్కడున్నారో దుర్యోధనాదులకు తెలియదు. ద్రౌపదీవివాహం వలననే వాళ్ళ ఉనికి తెలియవచ్చింది.

**క. ద్వారవతి కేఁగి, యర్జునుఁ। డారంగ సుభద్రఁ బెండ్లి యై వచ్చి, మహా**
**వీరు నభిమన్యుఁ గులవి। స్తారకు సత్పుత్త్రు నతిముదంబునఁ బడసెన్. 16**

**ప్రతిపదార్థం:** ద్వారవతికిన్+ఏఁగి= ద్వారకానగరానికి వెళ్లి; అర్జునుఁడు; ఆరంగన్= మనస్ఫూర్తిగా; సుభద్రన్= సుభద్రను, (బలరామకృష్ణులసోదరిని) పెండ్లి యై; వచ్చి; మహత్+వీరున్= గొప్పవీరుడిని; కుల, విస్తారకున్= వంశాన్ని విస్తరింపజేసేవాడిని; సత్+పుత్త్రున్= యోగ్యు డైన కుమారుడిని; అభిమన్యున్= అభిమన్యు డనేపేరు కలిగినవాడిని; అతి, ముదంబునన్= మిక్కిలి సంతోషంతో; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ద్వారకానగరానికి వెళ్ళి, అక్కడ సుభద్రను మనసార పెళ్ళాడి వచ్చి, వీరుడు వంశవర్ధనుడు అయిన అభిమన్యు డనేపేరు కల సత్పుత్త్రుడిని పొందాడు.

**వ. మఱియు నగ్నిదేవుచేత దివ్యరథంబును దివ్యాశ్వంబులును గాండీవదేవదత్తంబులును నక్షయబాణ తూణీరంబులుం బడసి, సురగణంబులతో సురపతి నోర్చి, ఖాండవదహనంబున నగ్నిదేవునిం దనిపె; మఱి మయువలన సభాప్రాప్తుం డై, భీమునిచేత జరాసంధుం జంపించి, దిగ్విజయంబు సేసి సార్వభౌముం డై ధర్మరాజు రాజసూయమహాయజ్ఞంబుఁ గావించె; నివి మొదలుగాఁ గల పాండవులగుణసంపదలు చూచి సహింప నోపక దుర్యోధనుండు శకునికైతవంబున మాయాద్యూతంబున ధర్మరాజుం బరాజితుం జేసి, పంద్రెండేఁడులు వనవాసంబును, నొక్కయేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుగా సమయంబు సేసి భూమి వెలువరించినం, జని పాండవులు వనవాసంబున నున్నంత. 17**

**ప్రతిపదార్థం:** మఱియున్= అదిగాక; అగ్ని, దేవుచేతన్; దివ్య, రథంబును= దేవతాసంబంధ మైన రథాన్ని; దివ్య+అశ్వంబులును= దివ్యము లైన గుఱ్ఱాలను; గాండీవ, దేవదత్తంబులును= గాండీవ మనే పేరు గల ధనుస్సును, దేవదత్త మనే పేరు గల శంఖాన్ని; అక్షయ, బాణ, తూణీరంబులున్= తరగనిబాణాలు గల అమ్ములపొదులను; పడసి= పొంది; సురగణంబులతోన్= దేవతలసమూహాలతో కూడ; సుర, పతిన్= దేవేంద్రుడిని; ఓర్చి= జయించి; ఖాండవదహనంబునన్= ఖాండవ మనే పేరు గల వనాన్ని దహించటంచేత; అగ్నిదేవున్= అగ్నిహోత్రుడిని; తనిపెన్= సంతృప్తిపరిచాడు; మయువలనన్= మయు డనే పేరు కల శిల్పివలన; సభా, ప్రాప్తుండు+ఐ= సభాభవనాన్ని పొందినవాడై; భీముచేతన్= భీమసేనుడిచేత; జరాసంధున్= జరాసంధు డనే వాడిని (జర అనురాక్షసిచేత కూర్చబడినవాడిని, మగధరాజును); చంపించి; దిక్+విజయంబుచేసి= దిక్కులను జయించి; సార్వభౌముండు+ఐ= చక్రవర్తియై; ధర్మరాజు; రాజసూయ, మహాయజ్ఞంబు= రాజసూయ మనే పేరు కలిగిన గొప్పయజ్ఞాన్ని; కావించెన్= చేశాడు; ఇవి, మొదలుగాన్ కల; పాండవుల; గుణ, సంపదలు= సుగుణా లనే సంపదలను; చూచి; సహింపన్, ఓపక= ఓర్వజాలక; దుర్యోధనుండు; శకుని, కైతవంబునన్= శకునియొక్క కపటమున; మాయాద్యూతంబునన్= (ఇంద్రజాలాదివిద్యతో కూడిన దైన) మాయజూదాన; ధర్మరాజును; పరాజితున్, చేసి= ఓడినవాడినిగా చేసి; పంద్రెండు+ఏఁడులు; వనవాసంబును= అడవిలో నివసించటమున్నూ; ఒక్కఏఁడు; జనపదంబునన్= గ్రామమందు, దేశమందు; అజ్ఞాతవాసంబునుగాన్= తెలియబడకుండా నివసించటం అవునట్లుగా; సమయంబు= ప్రతిజ్ఞ, కట్టడి; చేసి; భూమి; వెలువరించినన్= భూమి(దేశం)నుండి; వెడలింపఁగాన్= బయటికి పంపగా; చని; పాండవులు; వనవాసంబునన్= అరణ్యవాసమందు; ఉన్న+అంతన్= ఉండగా.

**తాత్పర్యం:** అదికాక అర్జునుడు అగ్నిదేవుడిచేత దేవతాసంబంధ మైన రథాన్ని, దివ్యా లైన గుఱ్ఱాలను, గాండీవ మనే ధనుస్సును, దేవదత్త మనే శంఖాన్ని, తరగనిబాణాలతో కూడిన అమ్ములపొదులను పొంది దేవతాసమూహాలతో కూడ దేవేంద్రుడిని ఓడించి ఖాండవవనాన్ని దహించటంచేత అగ్నిని తృప్తి పరచాడు. తరువాత మయు డనే రాక్షసశిల్పివలన సభాభవనాన్ని పొంది, భీముడిచేత జరాసంధు డనే మగధరాజును చంపించి, అన్నిదిక్కులను జయించి చక్రవర్తి యై ధర్మరాజు రాజసూయ మనే గొప్పయజ్ఞాన్ని చేశాడు. పైన పేర్కొనబడిన ఘనకార్యాలు మొదలైన పాండవులసుగుణాలను, సంపదను చూచి ఓర్వజాలక దుర్యోధనుడు శకునికపటంచేత మాయజూదంలో ధర్మరాజును ఓడించి పన్నెండేళ్ళు అడవిలో నివసించటమున్నూ, ఒక్కఏడు గ్రామంలో (పట్టణంలో, జను లుండే ప్రదేశంలో) తెలియబడకుండా నివసించేటట్లుగాను నియమం చేసి, దేశంనుండి వెళ్ళగొట్టగా వెళ్ళి, పాండవులు అడవిలో నివసిస్తుండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** మయుడు రాక్షసశిల్పి. త్రిపురాసురులకు మూడుపురాలను నిర్మించి యిచ్చినవా డితడే. రాజసూయము= చక్రవర్తి అయినవాడిచేత చేయబడే గొప్ప యజ్ఞం. సామంతులందరూ పిలువబడి ఈయజ్ఞానికి వస్తారు. ఇది చేసేవాడి నిర్వివాద మైన సమ్రాట్పదవిని సూచిస్తుంది. "రాజావై రాజసూయే నేష్ట్వా భవతి''. శతపథబ్రాహ్మణం. పశుపతికి (శివుడికి) సంబంధించినది పాశుపతం. భూమి అంటే రాజ్య మని అర్థం.

**చ. పరమగురూపదేశమునఁ బార్థుఁడు పార్థివవంశశేఖరుం**
**డరిది తపంబునన్, భుజబలాతిశయంబున నీశుఁ బన్నగా**
**భరణుఁ బ్రసన్నుఁ జేసి, దయఁ బాశుపతాదిక దివ్యబాణముల్**
**హరసురరాజదేవనివహంబులచేఁ బడసెం బ్రియంబునన్. 18**

**ప్రతిపదార్థం:** పరమ, గురు+ఉపదేశమునన్= శ్రేష్ఠ డైన గురువుయొక్క (వ్యాసుని) బోధచేత (సవర్ణదీర్ఘసంధి); పార్థివ, వంశ, శేఖరుండు= రాజవంశంలో శ్రేష్ఠ డైన; పార్థుఁడు= అర్జునుడు; అరిది, తపంబునన్= అరుదైన తపస్సుచేత; భుజ, బల+అతిశయంబునన్= బాహుబలంయొక్కగొప్పతనంచేత; పన్నగ+ఆభరణున్= పాములు ఆభరణాలుగా కలవాడిని; ఈశున్= శంకరుడిని; దయన్= దయతో; ప్రసన్నున్, చేసి= అనుగ్రహం కలవాడినిగా చేసి; పాశుపత+ఆదిక, దివ్యబాణముల్= పాశుపతం మొద లైన దివ్యా లైన బాణాలను; హర= శివుడిచేతను; సురరాజ= దేవేంద్రుడిచేతను; దేవనివహంబులచేన్= దేవతలసమూహాలచేతను; ప్రియంబునన్= ప్రీతితో; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** అత్యుత్తము డైన గురువుయొక్క ఉపదేశంచేత రాజవంశశ్రేష్ఠ డైన అర్జునుడు దుష్కర మైన తపంచేతనూ, బాహుపరాక్రమంచేతనూ, శివుడిని దయతో ప్రసన్నుడిగా చేసికొని, శంకరుడిచేతనూ, ఇంద్రుడిచేతనూ, దేవతలసమూహంచేతనూ, పాశుపతం మొదలైన దివ్యబాణాలను పొందాడు.

**అక్కర. వనమునఁ బదియు రెండేఁడు లజ్ఞాతవాస మొక్కేఁడు**
**జనపదంబున నుండి, తపన నయ్యేండ్లు సలిపి, సద్వృత్తు**
**లనఘులు మును వేఁడి, కొనక మఱి భారతాజి సేయంగ**
**మొనసిరి, పాండవ కౌరవుల భేదమూల మిట్టిదియ. 19**

**ప్రతిపదార్థం:** వనమునన్= అరణ్యంలో; పదియున్, రెండు+ఏఁడులు= పంద్రెండేండ్లు; అజ్ఞాతవాసము= (ఎవ్వరికీ) తెలియబడకుండేటట్లుగా వసించటం; ఒక్క+ఏఁడు= ఒకసంవత్సరం; జనపదంబునన్= గ్రామమందు, (జనాలు నివసించే ప్రదేశంలో); ఉండి= నివసించి; తపనన్= తాపంతో; ఆ+ఏండ్లు= ఆ పదమూడుసంవత్సరాలు; సలిపి= ఆచరించి; సత్+వృత్తులు= మంచినడవడికలవారు; అనఘులు= పాపరహితులు, పుణ్యాత్ములు; మును= ముందుగా; వేఁడి, కొనక= యాచించి కూడా, పొందలేక; (రాజ్యభాగ మీయుమని ప్రార్థించియు పొందజాలక; మఱి= పిమ్మట; భారత+ఆజిన్= భారతయుద్ధం; చేయంగన్= చేయటానికి; మొనసిరి= పూనుకొన్నారు; పాండవ, కౌరవుల= పాండవులకు, కౌరవులకు; భేదమూలము= వైరానికి కారణం; ఇట్టి+అది+అ= ఇటువంటిదే.

**తాత్పర్యం:** పన్నెండేళ్ళు అరణ్యవాసం, ఒకయేడు అజ్ఞాతవాసం జనావాసప్రదేశాలలో చేసి, దుఃఖంతో ఆ పదమూడేళ్ళు గడిపి, సద్వర్తనులు, పుణ్యాత్ములు అయిన ఆ పాండవులు మళ్ళీ రాజ్యభాగాన్ని వేడుకొని కూడ పడయజాలక భారతయుద్ధానికి తలపడ్డారు. కౌరవపాండవుల వైరానికి కారణ మిదే.

**విశేషం:** కౌరవపాండవుల వైరకారణాన్ని నిరూపించే నెపంతో భారతేతిహాస కథలోని ప్రధానాంశాలను చెప్పి శ్రోతలకు మహేతిహాసకథను ప్రసన్నం చేసికొనే రుచిరమార్గాన్ని నన్నయ అందించాడు. ఈఘట్టంలో భారతయుద్ధంవరకు కల కథాంశాలు చెప్పి ఆపటంవలన- కారణం చెప్పి కార్యాన్ని విస్తారంగా తెలిసికొనండి అని శ్రోతలను ప్రోత్సహించినట్లయింది. అంతేకాక ప్రథమాశ్వాసంలో సౌతి భారతయుద్ధమే భారత మన్నట్లుగా పద్దెనిమిదిరోజుల కురుక్షేత్రయుద్ధాన్ని పేర్కొన్నాడు. (చూడు: ఆది. 1.68-70). కార్యం ముందు చెప్పి కారణాన్ని తరువాత చెప్పటం కథాకథన శిల్పంలో ఒక మెలకువ. ఉత్కంఠను పోషించే వివేకం. ఇది మధ్యాక్కరయే. 2. ఇంద్రగణాలు, ఒకసూర్యగణం, మళ్ళీరెండుఇంద్రగణాలు, ఒకసూర్యగణం మొత్తం పాదానికి ఆరుగణాలు. యతిమిత్రస్థానం పంచమగణం మొదటి అక్షరం. ఇట్టి+అది= ఇట్టిది - అది యందలి అకారానికి లోపం.

**వ. ఇట్టి భరతకులముఖ్యులవంశచరితానుకీర్తనంబునం జేసి యిక్కథ శ్రీమహాభారతంబునాఁ బరఁగె. 20**

**ప్రతిపదార్థం:** ఇట్టి; భరత, కుల, ముఖ్యుల= భరతవంశంలోనిశ్రేష్ఠులయొక్క, వంశ= వంశంయొక్క, చరిత= నడవడియొక్క; (కథ) అనుకీర్తనంబునన్+చేసి= నుతించటం (చెప్పటం) వలన; ఈ+కథ= ఈ, కథ; శ్రీమహాభారతంబు, నాన్= శోభాయుక్తమైన మహాభారత మనగా; పరఁగెన్= ప్రవర్తిల్లింది, ఒప్పింది.

**తాత్పర్యం:** పైన పేర్కొన్న ఇటువంటి భరతవంశంలోని శ్రేష్ఠులవంశచరిత్రను చెప్పేది కాబట్టి ఈకథ శ్రీమహాభారత మనే పేరుతో ఒప్పింది.

**విశేషం:** అనుధాతువు తుమున్నర్థకం నాన్ - అనన్.

**శా. ఆ నారాయణపాండవేయగుణమాహాత్మ్యామలజ్యోత్స్నఁ జి**
**త్తానందం బొనరించుచున్, జనుల కర్థాంశుప్రకాశంబుతో**
**మానై, సాత్యవతేయధీవనధి జన్మ శ్రీమహాభారతా**
**ఖ్యానాఖ్యామృతసూతి యొప్పు నిఖిలాఘధ్వాంతవిధ్వంసి యై. 21**

**ప్రతిపదార్థం:** ఆ= శ్రీమహాభారతంలో కల; నారాయణ, పాండవేయ, గుణ, మాహాత్మ్య+అమల, జ్యోత్స్నన్= శ్రీకృష్ణుడియొక్క, పాండుకుమారులయొక్క, సుగుణాల మహిమ అనే, నిర్మల మైన వెన్నెలచేత; జనులకున్= ప్రజలకు; చిత్త+ఆనందంబు= మనస్సుయొక్క సంతోషాన్ని; ఒనరించుచున్= కలిగిస్తూ; అర్థ+అంశు, ప్రకాశంబుతోన్= (పురుషార్థాలు) అర్థాలు అనే కిరణాలకాంతితో; మాను+ఐ= మనోజ్ఞ మై; సాత్యవతేయ, ధీవనధి, జన్మ, శ్రీమహాభారత+ఆఖ్యాన+ఆఖ్యా+అమృతసూతి= సత్యవతికుమారు డైన శ్రీవ్యాసభగవానుడియొక్క బుద్ధి అనే సముద్రమందు పుట్టుక కలిగిన (జన్మించిన) సంపద్యుక్తమైన మహాభారతకథ అనే పేరు కల చంద్రుడు; నిఖిల+అఘ+ధ్వాంత+విధ్వంసి+ఐ= సకలపాపాలనే చీకట్లను నాశ మొనర్చేది అయి, ఒప్పున్= ప్రకాశిస్తుంది.

**తాత్పర్యం:** శ్రీకృష్ణపాండవేయుల గుణమహిమలనే నిర్మల మైన వెన్నెలచేత జనులమనసులకు ఆనందం కలిగిస్తూ, పురుషార్థా లనే కిరణాలకాంతులతో మనోజ్ఞ మౌతూ, వ్యాసభగవానుడి మేధాసముద్రంనుండి పుట్టిన చంద్రు డనే శ్రీమహాభారతకథ సకలపాపా లనే చీకట్లను నశింపచేసే దై ఒప్పుతుంది.

**విశేషం:** అలం: రూపకం. రూపకాలంకారం: "ఉపమానేన యత్తత్వ ముపమేయస్య రూప్యతే। గుణానాం సమతం దృష్ట్వా రూపకం నామ తద్విదుః" (భామహ కావ్యాలంకారం). చంద్రవంశజుల చరిత్ర యైన భారతాన్ని చంద్రుడిగా రూపించటం

సార్థకం. ఇందులో సావయవ రూపకం నిర్వహింపబడటంచేత చంద్రవంశచరిత్ర మహత్త్వం సమగ్రంగా నిరూపింపబడిం దనిన తాత్పర్యం వ్యంగ్యం. ఈపద్యంలో కవిప్రౌఢోక్తిసిద్ధమైన అలంకారకృత అలంకారధ్వని ఉన్నది. కవిప్రౌఢోక్తి వలన వాచ్యరూపంగా కనబడే అలంకారం వలన మరొక అలంకారం ప్రతీయమానమై చమత్కారాతిశయాన్ని కలిగిస్తే దానిని పైఅలంకారధ్వనిగా పేర్కొంటారు. ఈపద్యంలోని రూపకాలంకారం వాచ్యమైనది. అందులో ఉపమేయం మహాభారతం; ఉపమానం చంద్రుడు, ఆ రెండింటికి అభేదం చెప్పటంవలన రూపకమైనది. కాగా, అందులో ఉపమానంకంటె ఉపమేయానికే వైశిష్ట్యం కలిగే టట్లు వర్ణించటంచేత వ్యతిరేకాలంకారం ధ్వనిస్తున్నది. వాచ్య మైన రూపకాలంకారంలో కవిప్రౌఢోక్తి వలన వ్యతిరేకాలంకారం ప్రతీయమానమై చమత్కారకారి కావటంచేత ఇక్కడ అలంకారకృత అలంకారధ్వని పోషింపబడింది. (సంపా.)

## ఉపరిచరవసుమహారాజు వృత్తాంతము (సం. 1-57-1)

**వ. ఇట్టి శ్రీమహాభారతంబునకుం గర్త యయిన శ్రీవేదవ్యాసునిజన్మంబు సవిస్తరంబుగాఁ జెప్పెద వినుము. 22**

**ప్రతిపదార్థం:** ఇట్టి, శ్రీమహత్, భారతంబునకున్; కర్త= నిర్మాత; శ్రీవేదవ్యాసుని= వేదాలను విభాగం చేసిన శ్రీవ్యాసుడి; జన్మంబు= పుట్టుక; సవిస్తరంబుగాన్= విపులంగా, వివరణంతోకూడి; చెప్పెదన్. వినుము.

**తాత్పర్యం:** మరియూ, ఇటువంటి శ్రీమహాభారతాన్ని రచించిన శ్రీవేదవ్యాసుడి జన్మగురించి వివరంగా చెపుతాను వినుము.

**సీ. వాసవప్రతిముండు వసు వను నాతండు । చేదిభూనాథుండు శిష్టలోక**
**నుతకీర్తి మృగయావినోదార్థ మడవికిఁ । జని, యొక్కమునిజనాశ్రమమునందు**
**నిర్వేదమున మహానిష్ఠతో సన్న్యస్త । శస్త్రుఁ డై తప మొప్పఁ జలుపుచున్న**
**నాతనిపాలికి నమరగణంబుతో । నింద్రుండు వచ్చి తా నిట్టు లనియె:**

**ఆ. 'ధరణిఁ బ్రజఁ గరంబు దయతోడ వర్ణధ । ర్మాభిరక్షఁ జేసి యమలచరిత**
**నేలి, రాజ్యవిభవ మది యేల యని తప । శ్చరణ నునికి నీక చనియె ననఘ!' 23**

**ప్రతిపదార్థం:** వాసవ, ప్రతిముండు= దేవేంద్రుడితో సమానుడు; 'వసువు' అనుఆతండు; చేది, భూనాథుండు= చేదిదేశానికి ప్రభువు; శిష్ట, లోక, నుత, కీర్తి= పండితజనంచేత పొగడబడినకీర్తి కలవాడు; మృగయా, వినోద+అర్థము= వేటయందు (అనే) వినోదంకొరకు; అడవికిన్; చని= వెళ్ళి; ఒక్క; ముని, జన+ఆశ్రమమునందున్= ఒకమునిజనులనివాసమందు; నిర్వేదమునన్= తత్త్వజ్ఞానంచేత, దుఃఖ, ఈర్ష్యాదులపట్ల కలిగే హేయత్వబుద్ధితో; మహత్+నిష్ఠతోన్= గొప్పనియమంతో; సన్న్యస్త, శస్త్రుఁడు, ఐ= వదలివేయబడిన ఆయుధాలు కలవా డై; తపము; ఒప్పన్= చక్కగా; చలుపుచున్నన్= ఆచరిస్తుండగా; ఆతని, పాలికిన్= ఆ వసువుదగ్గరికి; ఇంద్రుండు; అమరగణంబుతోన్= దేవతలసమూహంతో; వచ్చి; తాను, ఇట్టులు; అనియెన్; అనఘ!= పాపరహితుడా! వసుమహారాజా! ధరణిన్= భూమిని; ప్రజన్= ప్రజను; కరంబున్= మిక్కిలి; దయతోడన్; వర్ణ, ధర్మ+అభిరక్షన్= వర్ణాల (కులాల) యొక్క, ఆశ్రమధర్మాలయొక్క, రక్షణ, చేసి; అమల, చరితన్= నిర్మలమైన నడవడికతో; ఏలి= పాలించి; రాజ్యవిభవము= రాజ్యసంపద; అది, ఏల, అని= ఎందుకని; తపః+చరణన్= తపాన్ని ఆచరించటంలో; ఉనికి= ఉండటం; నీకున్+అ= నీకే; చనియెన్= తగింది.

**తాత్పర్యం:** చేదిదేశానికి ప్రభువు వసువు. అతడు దేవేంద్రతుల్యుడు, శిష్టజనవినుతుడు. ఆ రా జొకనాడు వేటనిమిత్తం అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ మున్యాశ్రమాన్ని దర్శించటంవలన అతనికి నిర్వేదం కలిగింది. ఆయుధాలను వదలివేసి ఆ రాజు మున్యాశ్రమంలో మహానిష్ఠతో తపం చేయ సాగాడు. ఒకరోజు ఇంద్రుడు ఆ రాజుదగ్గరకు వచ్చి, 'పాపరహితుడా! వర్ణాశ్రమధర్మరక్షణం చేసి ప్రజలను దయతో పరిపాలించావు. నిర్మల మైన నడవడితో రాజ్య మేలి ఈ విభవం దేనికి అని తపశ్చర్యలో ఉండటం నీకే తగింది'. నీవు తప్ప మరెవ్వరూ ఇట్లా చేయ రని భావం.

**వ. 'నీవర్ణధర్మప్రతిపాలనంబునకుఁ దపంబునకు మెచ్చితి; నీవు నాతోడం జెలిమిసేసి నాయొద్దకువచ్చుచుంబోవుచు మహీరాజ్యంబు సేయుచు నుండు' మని వానికి దేవత్వంబును గనకరత్నమయం బైన దివ్యవిమానంబును నెద్దాని నేని తాల్చిన నాయుధంబులు దాఁక నోడు నట్టి వాడని వనజంబులు గలిగిన యింద్రమాల యను కమలమాలికయును, దుష్టనిగ్రహశిష్టపరిపాలనక్షమం బైన యొక్కవేణుయష్టియు నిచ్చిన, నవ్వసువును దద్విమానారూఢుం డై యుపరిలోకంబునం జరించుటంజేసి యుపరిచరుండు నాఁ బరఁగి, యక్కమల మాలికయుఁ దనకుం జిహ్నంబుగా నవ్వేణుయష్టికి మహావిభవంబు సేయుచు, మెఱసి యేఁటేఁట నింద్రోత్సవం బను నుత్సవంబు సేయుచు నీశ్వరునకు నింద్రాదిదేవతలకు నతిప్రీతి సేసె; నది మొదలుగా రాజులెల్లం బ్రతిసంవత్సరంబు నింద్రోత్సవంబు సేయుచుండుదురు. 24**

**ప్రతిపదార్థం:** నీ వర్ణ, ధర్మ ప్రతిపాలనంబునకున్= నీయొక్క వర్ణధర్మాల పరిపాలనకు (పోషణకును); తపంబునకున్; మెచ్చితిన్; నీవు; నాతోడన్; చెలిమి= స్నేహం; చేసి; నా ఒద్దకున్= నాదగ్గరకు; వచ్చుచున్, పోవుచున్= రాకపోకలు సాగిస్తూ; మహీ, రాజ్యంబు= భూపరిపాలనం; చేయుచున్, ఉండుము; అని; వానికిన్= ఆ వసువుకు; దివ్యత్వంబును= దేవతాభావాన్ని, కనకరత్నమయంబు= బంగారంతోను, రత్నాలతోను నిండింది; అయిన; దివ్యవిమానంబును= దేవతాసంబంధ మైన విమానాన్ని; ఏ+దానిన్+ఏని= దేనిని; తాల్చినన్= ధరించిన; ఆయుధంబులు; తాఁకన్+ఓడున్= ఆయుధాలు తగిలేందుకు భయపడతాయో, (తాకలేవో); అట్టి= అటువంటి; వాడని= వాడిపోని; వనజంబులు= పద్మాలు; కలిగిన; ఇంద్రమాల= ఇంద్రమాల అనే పేరు కలిగిన; కమలమాలికయును= పద్మాలదండయున్నూ; దుష్ట, నిగ్రహ= దుష్టులను అణచటంలోనూ; శిష్ట, పరిపాలన= ఉత్తములైనవారిని పాలించటంలోనూ; క్షమంబు+ఐన= సమర్థమైన; ఒక్క, వేణు, యష్టియున్= వెదురుకర్రనూ; ఇచ్చినన్= ఇవ్వగా; ఆ+వసువును= ఆ వసురాజుకూడ తద్= విమాన+ఆరూఢుండు+ఐ= ఆ విమానాన్ని ఎక్కినవా డై, ఉపరిలోకంబునన్= ఊర్ధ్వలోకమందు; చరించుటన్+చేసి= సంచరించుటచేత; ఉపరిచరుండు, నాన్= ఉపరిచరుడు, (పైలోకంలో తిరిగేవాడు), అనఁగాన్; పరఁగి= ప్రసిద్ధినిపొంది; ఆ+కమలమాలికయున్= ఆ పద్మమాలయు; తనకున్, చిహ్నంబుగాన్= తనకుగుర్తుగా; ఆ+వేణుయష్టికిన్; మహావిభవంబుసేయుచున్, మెఱసి= గొప్పవైభవంచేస్తూ, ప్రకాశించేటట్లు చేసి; ఏఁటేఁటన్= ప్రతిసంవత్సరం; ఇంద్ర+ఉత్సవంబు+అను; ఉత్సవంబు= ఇంద్రోత్సవ మనే పేరు కలిగిన వేడుకను; చేయుచున్; ఈశ్వరునకున్= శివుడికి; ఇంద్ర+ఆది, దేవతలకున్= ఇంద్రుడు మొదలైన దేవతలకు; అతి, ప్రీతి= మిక్కిలి సంతృప్తి; చేసెన్; అది మొదలుగాన్= ఆ నాటినుండి; రాజులు+ఎల్లన్= రాజులందరు; ప్రతిసంవత్సరంబున్; ఇంద్ర+ఉత్సవంబు, చేయుచున్+ఉండుదురు.

**తాత్పర్యం:** 'నీ వర్ణాశ్రమధర్మపరిపాలనకు, తపస్సుకు మెచ్చుకొంటున్నాను. నీవు నాతో స్నేహం చేసి నావద్దకు వస్తూ పోతూ రాజ్యపాలనం చేస్తూ ఉండు' మని పలికి అతనికి దివ్యత్వాన్నీ, మణిసువర్ణమయమైన దివ్యవిమానాన్నీ, ఎటువంటి ఆయుధాలను తాకనివ్వని (ఎటువంటి ఆయుధాలు తాకలేని) వాడిపోనిపద్మాలు కల ఇంద్రమాల అనే పద్మమాలనూ, దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు సమర్థ మైన వేణుయష్టినీ ఇచ్చాడు. ఆ వసురాజు ఆ విమానాన్ని ఎక్కి

పైలోకంలో చరిస్తుండటంచేత ఉపరిచరుడు అనే పేరుతో ఒప్పి, ఆ ఇంద్రమాలిక తనకు గుర్తుగా, వేణుయష్టికి గొప్పవైభవంతో ఏటేటా ఇంద్రోత్సవాన్ని జరిపిస్తూ ఈశ్వరుడికి, ఇంద్రాదిదేవతలకు సంతోషాన్ని చేకూర్చాడు. నాటినుండీ రాజులందరూ ప్రతిసంవత్సరం ఇంద్రోత్సవాన్ని జరుపుతున్నారు.

**విశేషం:** మెఱయుధాతువు అంతర్భావిప్రేరణము. మెఱయునట్లు చేయు. ఇంద్రోత్సవము= ఇంద్రునిగౌరవార్థ మై రాజు లేటేటా చేసే ఉత్సవం.

**క. ఘనముగ నయ్యింద్రోత్సవ । మొనరించు మహీపతులకు నొగి నాయుర్వ**
**ర్ధనము నగుఁ, బెరుఁగు సంతతి, । యనవరతము ధరణిఁ బ్రజకు నభివృద్ధి యగున్. 25**

**ప్రతిపదార్థం:** ఘనముగన్= గొప్పగా; ఆ+ఇంద్ర+ఉత్సవము= ఆ ఇంద్రోత్సవం; ఒనరించు= చేసే; మహీపతులకున్= రాజులకు; ఒగిన్= క్రమంగా; ఆయున్, వర్ధనమున్= జీవితకాలం పెరగటం; అగున్= ఔతుంది; సంతతి= సంతానం, (పుత్రపౌత్రపారంపర్యం); పెరుఁగున్= అభివృద్ధి అవుతుంది (జరుగుతుంది); ధరణిన్= భూమియందు; ప్రజకున్= జనాలకు, అభివృద్ధి= పెంపు; అగున్= ఔతుంది.

**తాత్పర్యం:** ఆ ఇంద్రోత్సవాన్ని వైభవంగా చేసే రాజులకు ఆయువు పెరుగుతుంది; సంతతి వృద్ధి చెందుతుంది. అతని రాజ్యంలోనిప్రజకు ఎల్లప్పుడూ అభివృద్ధి జరుగుతుంది.

**వ. అట్టియింద్రోత్సవంబున నతిప్రీతుండయిన యింద్రువరంబున నుపరిచరుండు బృహద్రథ మణివాహన సౌబల యదురాజన్యు లనియెడి కొడుకుల నేవురం బడసి, వారలం బెక్కుదేశంబుల కభిషిక్తులం జేసిన, నయ్యేవురువాసవులు వేఱువేఱ వంశకరు లయి పరఁగి; ర ట్లుపరిచరుండు లబ్ధసంతానుం డయి రాజర్షి యయి రాజ్యంబు సేయుచు, నిజపురసమీపంబునం బాఱిన శుక్తిమతి యను మహానదిం గోలాహలం బనుపర్వతంబు గామించి యడ్డంబు వడిన, దానిం దనపాదంబునం జేసి తలఁగంద్రోచిన, నన్నదికిఁ బర్వతసమాగమంబున వసుపదుం డను కొడుకును గిరిక యను కూఁతురుం బుట్టిన, నయ్యిరువురను శుక్తిమతి దద్దయు భక్తిమతి యై గిరినిరోధంబు బాచి యుపకారంబు సేసిన యుపరిచరునకు మెచ్చి కానిక యిచ్చిన, నాతండు వసుపదుం దనకు సేనాపతిం జేసికొని, గిరికం దనక ధర్మపత్నిగాఁ జేసికొని యున్నంత, నగ్గిరిక ఋతుమతి యయిన, దీనికి మృగమాంసంబు దెచ్చి పెట్టు మని తనపితృదేవతలు పంచిన, నప్పు డయ్యుపరిచరుండు మృగవధార్థంబు వనంబున కరిగి. 26**

**ప్రతిపదార్థం:** అట్టి; ఇంద్రోత్సవంబునన్; అతిప్రీతుండు+అయిన= మిక్కిలిసంతోషించినవా డైన; ఇంద్రు= దేవేంద్రుడియొక్క; వరంబునన్; ఉపరిచరుండు; బృహద్రథుడు, మణివాహనుడు, సౌబలుడు, యదువు, రాజన్యుడు అనే పేరు గల; కొడుకులను; ఏవురన్= ఐదుగురిని; పడసి= పొంది; వారలన్; పెక్కుదేశంబులకున్; అభిషిక్తులన్+చేసినన్= అభిషేకించబడినవారిని (ప్రభువులను) చేయగా; ఆ+ఏవురు; వాసవులు= ఆ అయిదుగురు వసునందనులు; వేఱువేఱ; వంశకరులు+అయి= వంశాన్ని వృద్ధిచేసేవా రై; పరఁగిరి= ప్రసిద్ధిచెందారు. అట్లు; ఉపరిచరుండు; లబ్ధసంతానుండు+అయి= పొందినసంతానం కలవాడై; రాజ+ఋషి+అయి= రాజులలో ఋషివంటివా డై; రాజ్యంబు, చేయుచున్, నిజపురసమీపంబునన్= తనపట్టణానికి దగ్గరగా; పాఱిన= ప్రవహించిన; శుక్తిమతి, అను మహానదిన్; కోలాహలంబు+అను, పర్వతంబు; కామించి= మోహించి; అడ్డంబు+పడినన్= అడ్డుపడగా;

దానిన్= ఆ పర్వతాన్ని; తనపాదంబునన్+చేసి= తనకాలితో; తలఁగన్+త్రోచినన్= తొలగిపోయేటట్లుగా నెట్టివేయగా; ఆ+నదికిన్= ఆ ఏటికి; పర్వతసమాగమంబునన్= పర్వతంయొక్క కలయికచేత; వసుపదుండు; అనుకొడుకును; గిరిక అనుకూఁతురున్; పుట్టినన్; ఆ+ఇరువురును= ఆ ఇద్దరిని; శుక్తిమతి; తద్దయున్= మిక్కిలి; భక్తిమతి, ఐ= భక్తితో కూడిన మనస్సుగల దై; గిరినిరోధంబు= పర్వతంయొక్క అడ్డుపాటు; పాచి= తొలగించి; ఉపకారంబు, చేసిన; ఉపరిచరునకున్, మెచ్చి; కానిక= కానుక; ఇచ్చినన్; ఆతండు= ఆ ఉపరిచరుడు; వసుపదున్= వసుపదు డనే పేరు గల శుక్తిమతీకోలాహలు లకుమారుడిని; సేనాపతిన్; చేసికొని; గిరికన్= శుక్తిమతీకోలాహలులకుమార్తెను; తనకున్; ధర్మపత్నిగాన్= పట్టమహిషిగా; చేసికొని= స్వీకరించి; ఉన్న+అంతన్= ఉండగా: ఆ+గిరిక= ఆ గిరిక (ఉపరిచరుని రాజ్ఞి); ఋతుమతి= పుష్పవతి; అయినన్; దీనికిన్= ఈమెకు; మృగమాంసంబు= లేడిమాంసము; తెచ్చి పెట్టుము; అని; తన; పితృదేవతలు; పంచినన్= ఆజ్ఞాపించగా; అప్పుడు; ఆ+ఉపరిచరుండు; మృగవధ+అర్థంబు= జింకలను వధించుటకొఱకు; వనంబునకున్; అరిగి= వెళ్ళి.

**తాత్పర్యం:** ఉపరిచరుడు జరిపించిన ఇంద్రోత్సవాలకు దేవేంద్రు డెంతో సంతోషించాడు. ఇంద్రునివరంవలన ఉపరిచరుడికి బృహద్రథుడు, మణివాహనుడు, సౌబలుడు, యదువు, రాజన్యుడు అనే అయిదుగురుకుమారులు జన్మించారు. ఆ అయిదుగురు అనేకదేశాలకు అధిపతు లైనారు. వంశం అభివృద్ధి కావించారు. ఈవిధంగా ఉపరిచరుడు సంతానాన్ని పొంది, రాజర్షి అయి రాజ్యపాలనం చేస్తుండగా, ఆతడినగరసమీపంలో శుక్తిమతి అనేనదిని కామించి కోలాహలంఅనేపర్వతం ఆ నదిని అడ్డగించగా, ఉపరిచరుడు ఆపర్వతాన్ని తనకాలితో తొలగించాడు. పర్వతసంపర్కంచేత ఆ నదికి వసుపదు డనే కుమారుడు, గిరిక అనే కుమార్తె జన్మించారు. శుక్తిమతీనది ఉపరిచరుడికి కృతజ్ఞతగా, తనకొడుకైనవసుపదుడినీ, కూతురైన గిరికనూ కానుకగా ఇచ్చింది. ఆ రాజు వసుపదుడిని తనసేనాపతిగా గిరికను ధర్మపత్నిగా చేసికొన్నాడు. గిరిక ఋతుమతి అయింది. ఆమెకు మృగమాంసం తెచ్చిపెట్టుమని పితృదేవతలు ఆజ్ఞాపించగా, ఉపరిచరుడు మృగాలను వేటాడి ఆమెకు మృగమాంసం తెచ్చి పెట్టటానికి అడవికి వెళ్ళాడు.

**సీ.** **పలుకులముద్దును, గలికిక్రాల్గన్నుల । తెలివును, వలుఁదచన్నులబెడంగు,**
**నలఘుకాంచీపదస్థలములయొప్పును । లలితాననేందుమండలము రుచియు,**
**నళినీలకుటిలకుంతలములకాంతియు, । నెలజవ్వనంబున విలసనమును,**
**నలసభావంబునఁ బొలుపును, మెలుపును । గలుగు నగ్గిరికను దలఁచి తలఁచి,**

**ఆ.** **ముదితయందుఁ దనదు హృదయంబు నిలుపుటఁ । జేసి రాగ మడర భాసురముగ**
**రమణతో వనాంతరమున రేతస్స్కంద । మయ్యె నవనిపతికి నెయ్యు మొనర.** **27**

**ప్రతిపదార్థం:** పలుకులముద్దును= మాటలయొక్క మనోజ్ఞతయున్నూ; కలికిక్రాల్గన్నుల= మనోజ్ఞాలై చలించే కన్నులయొక్క; తెలివును= తెల్లదనమున్నూ; వలుఁదచన్నులబెడంగు= స్థూలా లైన కుచముల సొగసున్నూ; అలఘు, కాంచీపద, స్థలముల= విశాలాలైన పిరుదుప్రదేశాలయొక్క; ఒప్పును= అందమున్నూ; లలిత+ఆనన+ఇందుమండలము= మృదు వైన ముఖచంద్రబింబము యొక్క; రుచియున్= కాంతియున్నూ; అళినీలకుటిలకుంతలముల= తుమ్మెదలవలె నల్లనివి, వంకరలైన శిరోజాలయొక్క; కాంతియున్= వన్నెయూ; ఎలజవ్వనంబున= లేతయౌవనంలోని; విలసనమును= ప్రకాశమున్నూ; అలసభావంబునన్= మందత్వమందలి పొలుపును= అందమున్నూ; మెలుపును= జాగరూకతయున్నూ; కలుగు= ఉన్నటువంటి; ఆ+గిరికను= ఆ గిరికను; తలఁచి తలఁచి= భావించి భావించి; ముదితయందున్= ఆ గిరికయందే; తనదు; హృదయంబు=

మనస్సు, నిలుపుటన్, చేసి= నిలిపినందువలన; రాగము= అనురాగం; అడరన్= అతిశయించగా; భాసురముగన్= ప్రకాశించునదిగా; రమణతోన్= ప్రీతితో; వన+అంతరమునన్= అడవియందు; రేతస్+స్కందము= ఇంద్రియస్రావం; నెయ్యము+ఒనరన్= ప్రీతి ఒప్పునట్లుగా; అవనిపతికిన్= ఉపరిచరునకు; అయ్యెన్= ఆయెను. (అయింది).

**తాత్పర్యం:** ఆ గిరికముద్దుపలుకులను, అంద మైన కన్నులను, వక్షోజాలసోయగాన్ని, పిరుదులఒప్పును, చంద్రబింబంవంటిముఖసౌందర్యాన్ని, తుమ్మెదలవలె నల్లనైన, వంకరయైన శిరోజాలసౌభాగ్యాన్ని, నవయౌవన విలాసాలను, అలస విలాసాల అందచందాలను ఉపరిచరుడు తలచుకొని, తలచుకొని గిరికాలగ్నమనస్కు డై ఆ వనమధ్యంలో రేతస్స్ఖలన మొనర్చాడు.

**విశేషం:** అలం: ఉపమ. స్వభావోక్తి. వస్తువులో, వర్ణనలో, రచనలో ఈపద్యం ఒక విశిష్టమైనది. నాయికా స్వరూప సౌందర్యవిలాసాలను సాక్షాత్తుగా చూస్తున్నట్లుగా తన్మయత్వంతో భావించి ఆమెతో సంగమించినప్పుడు పొందే రేతస్స్ఖలనాన్ని వసురాజు పొందాడు. ఇటువంటి వస్తువే అరుదు. వర్ణనంలో సీసమంతా స్వభావోక్తితో నిండిఉన్నది. ఎడనెడ ఉపమ మెరుగుపెట్టింది. ఉపమ స్వభావోక్తికే పోషకంగా నిలిచింది. భౌతికరూపభావనం వలన భౌతికమైన ఇంద్రియస్ఖలనం కలిగినట్లు వర్ణించేటప్పుడు స్వభావోక్తియే సముచితం. ఇక పద్యరచనలో లఘుబహుళ మైన అక్షరరమ్యత గోచరిస్తుంది. అది వసురాజుయొక్క రతిభావతీవ్రతను ధ్వనిస్తున్నది. ఇందులో గిరికాదేవి విలాసాలను భావించిన వసురాజును నన్నయ వర్ణించి నప్పటికీ అతడు పొందింది రసానుభూతిగా కాక, భౌతికానుభూతిగా పేర్కొనటంచేత- అలంకారం, రసభావాలూ వస్తువునే ధ్వనిస్తున్నాయి. అంటే- అలంకార రసధ్వనులు వస్తుధ్వనిని పోషించే విశిష్టరచన ఈపద్యం. (సంపా.)

**వ. అయ్యమోఘవీర్యం బొక్కయజీర్ణపర్ణపుటంబున నిమ్ముగా సంగ్రహించి యొక్కడేగయఱుతంగట్టి దీనిం గొనిపోయి గిరికకిమ్మని యుపరిచరుండు పనిచిన, నదియు నతిత్వరితగతి నాకానం గడచి యాకాశంబునం బఱచునప్పుడు. 28**

**ప్రతిపదార్థం:** ఆ+అమోఘవీర్యంబు= ఆ ఉపరిచరుని వ్యర్థం కాని రేతస్సు; ఒక్క; అజీర్ణపర్ణపుటంబునన్= చిరిగిపోని (చిరుగులేని, చిరగని) ఆకుదొప్పలో; ఇమ్ముగాన్= చక్కగా; సంగ్రహించి= పదిలపరిచి; ఒక్కడేగ, అఱుతన్= ఒకడేగయొక్క మెడకు; కట్టి; దీనిన్= ఈ ఆకుదొప్పను; కొనిపోయి; గిరికకున్; ఇమ్ము; అని; ఉపరిచరుండు= వసురాజు; పనిచినన్= పంపగా; అదియున్= ఆ డేగయు; అతిత్వరితగతిన్= మిక్కిలిశీఘ్ర మైన పోకడతో; ఆ కానన్= ఆ అడవిని; కడచి= దాటి; ఆకాశంబునన్; పఱచు+అప్పుడు= పరుగిడుతున్నప్పుడు (ఎగిరిపోతున్నప్పుడు).

**తాత్పర్యం:** అమోఘ మైన ఆ వీర్యాన్ని ఒక చిరగని ఆకుదొప్పలో చేర్చి, దానిని ఒకడేగమెడకు కట్టి, దీనిని తీసికొని వెళ్ళి గిరికకు ఇమ్మని ఉపరిచరుడు పంపాడు. ఆ డేగ మహావేగంతో ఆ అడవిని దాటి ఆకాశంలో ఎగురుతున్నప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'అమోఘవీర్యం' అనేపదం సార్థకం. భావికథార్థవ్యంజకం. వ్యర్థంకానిది, మహిమాన్విత మైనది అని అమోఘశబ్దం ధ్వనింపజేస్తున్నది. అది ఎవరు ఉపయోగించినా సంతానాన్ని కలిగించేది అనీ, ఏదోవిధంగా అది సంతానకారక మౌతుందనీ అర్థం స్ఫురిస్తుంది. పితృదేవతలు కోరినట్లు గిరిక లేడిమాంసం తినకపూర్వమే ఆ వీర్యం ఆమెయందు వినియోగపడదని

కథార్థాలు సూచిస్తున్నాయి. గిరిక కొరకు ఉద్దిష్టమైన వసువీర్యం నదిలోపడి, చేపమ్రింగి, కవలపుట్టుకకు దారితీస్తుంది. ఆ కవలలో ఒకతె అయిన మత్స్యగంధి వ్యాసుడికి తల్లి అవుతుంది. అంటే వ్యాసోత్పత్తికి బీజన్యాసం ఈ అమోఘవీర్యం.

**క. ఆమిష మని దానిం గొనఁ । గా మది సమకట్టి, యొక్కఖగ మాఖగమున్**
**వ్యోమమునఁ దాఁక, దివిసం । గ్రామం బారెంటి కయ్యెఁ గడురభసమునన్. 29**

**ప్రతిపదార్థం:** ఆమిషము+అని= మాంస మని భావించి; దానిని= ఆ ఆకుదొప్పలో ఉన్నదానిని; కొనఁగాన్= తీసికొనేందుకు; మదిన్= మనస్సులో; సమకట్టి= పూనుకొని; ఒక్కఖగము= ఒకపక్షి; ఆ ఖగమున్= ఆ డేగను; వ్యోమమునన్= ఆకాశంలో; తాఁకన్= ఎదుర్కోగా; ఆరెంటికిన్= ఆ రెండుపక్షులకు; దివిన్= ఆకాశంలో; కడురభసమునన్= మిక్కిలివేగంగా; సంగ్రామంబు= యుద్ధం; అయ్యెన్= జరిగింది.

**తాత్పర్యం:** అది మాంస మని భావించి, దానిని అపహరించేందుకు పూనుకొన్న ఒక డేగ ఆ డేగను ఆకాశంలో ఎదుర్కొన్నది. ఆ రెంటికీ తత్క్షణమే ఆకాశంలో యుద్ధం జరిగింది.

**క. సునిశితతుండహతిని వ్ర । స్సినపర్ణపుటంబు వాసి చెదరుచు నృపనం**
**దనువీర్యము యమునానది । వనమధ్యమునందు వాయువశమునఁ బడియెన్. 30**

**ప్రతిపదార్థం:** సునిశితతుండహతిని= మిక్కిలిపదు నైన ముక్కుదెబ్బచేత; వ్రస్సిన= తెగిన; పర్ణపుటంబు= ఆకుదొప్ప; పాసి= వీడిపోయి; చెదరుచున్; నృపనందనువీర్యము= ఆ వసురాజుయొక్కరేతస్సు; యమునానది; వనమధ్యమునందున్= నీటిమధ్యలో (నడుమ); వాయువశమునన్= గాలికి లోబడి; పడియెన్.

**తాత్పర్యం:** మిక్కిలిపదు నైన పక్షిముక్కుయొక్క దెబ్బచేత ఆ ఆకుదొప్ప చెదరిపోయి, వసురాజువీర్యం యమునానదినీటిమధ్యలో గాలివాటున పడిపోయింది.

**వ. తొల్లి బ్రహ్మశాపనిమిత్తంబున నద్రిక యను నప్సరస యమునయందు మీ నయి క్రుమ్మరుచున్నయది యవ్వసువీర్యబిందుద్వయంబు త్రావి గర్భంబు దాల్చిన దశమమాసంబునందు. 31**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; బ్రహ్మ, శాపనిమిత్తంబునన్= బ్రహ్మదేవుడిశాపకారణంగా; అద్రిక, అను, అప్సరస, యమునయందున్; మీను+అయి= చేప అయి; క్రుమ్మరుచున్+ఉన్న+అది= తిరుగుతున్నది; ఆ+వసువీర్యబిందుద్వయంబు= ఆ వసురాజుయొక్క వీర్యపుబొట్లను రెంటిని; త్రావి= త్రాగి; గర్భంబు తాల్చిన; దశమమాసంబునందున్= పదవనెలలో.

**తాత్పర్యం:** పూర్వం బ్రహ్మశాపంవలన అద్రిక అనే అప్సరస యమునానదిలో చేపగా మారి తిరుగాడుతున్నది. ఆ చేప ఆ వసురాజు వీర్యబిందువులు రెంటిని త్రాగి గర్భం ధరించింది. పదవనెలలో.

**తే. తెరలవల వైచి జాలరుల్ దిగిచి, దాని । యుదరదళనంబు సేసి, యం దొక్కకొడుకు**
**నొక్కకూఁతును గని, వారి నొనరఁ దెచ్చి । దాశరాజున కిచ్చిరి తత్క్షణంబ. 32**

**ప్రతిపదార్థం:** తెరలవలలు= మఱుగువలలను; వైచి= వేసి; జాలరుల్= చేపలుపట్టేవాళ్ళు; తిగిచి= లాగి; దాని, ఉదరదళనంబు, చేసి= ఆ చేపయొక్కపొట్టను పగులగొట్టి (చీల్చి); అందున్+ఒక్క కొడుకున్, ఒక్క, కూఁతును= ఆ చేపపొట్టలో ఒక

కుమారుడిని, ఒక కూతురును; కని= చూచి; వారిని= వారిద్దరిని; ఒనరన్= చక్కగా; తెచ్చి; తద్క్షణంబు+అ= వెంటనే; దాశరాజునకున్+ఇచ్చిరి.

**తాత్పర్యం:** జాలరులు మరుగువలలు వేసి, ఆ చేపను లాగి, దానికడుపును చీల్చి అందులో ఒకకొడుకును, కూతురును కనుగొని, వారిని భద్రంగా తెచ్చి వెంటనే దాశరాజున కిచ్చారు.

## మత్స్యగంధి వృత్తాంతము (సం. 1-57-50)

**వ. అయ్యద్రికయు మానుషప్రసవం బొనరించినం దనకు శాపమోక్షణం బగు నని బ్రహ్మవచనంబు గలుగుటంజేసి మీనయోని విడిచి, దివ్యవనిత యయి దేవలోకంబునకుం జనియె; మఱియును మత్స్యోదరంబునఁ బుట్టిన యక్కొడుకు మత్స్యరాజునాఁ బరఁగి, ధర్మపరుం డయి మత్స్యదేశంబున కధిపతి యయ్యెఁ; నక్కూఁతును దాశరాజు దనకూఁతుంగాఁ జేకొని పెంచినం బెరుఁగుచు. 33**

**ప్రతిపదార్థం:** ఆ+అద్రికయున్= అద్రిక అనే పేరు కలిగిన ఆ అప్సరసయును; మానుషప్రసవంబు= మానవుడిని కనటం; ఒనరించినన్= చేసినట్లయితే; తనకున్; శాపమోక్షణంబు+అగున్= శాపంనుండి తొలగటమౌతుంది; అని; బ్రహ్మవచనంబు= బ్రహ్మదేవునియొక్కవాక్కు; కలుగుటన్+చేసి= కలిగినందువలన; మీనయోనిన్= చేపగర్భం; విడిచి; దివ్యవనిత+అయి= దేవతాస్త్రీ అయి; దేవలోకంబునకున్; చనియెన్; మఱియును; మత్స్య+ఉదరంబునన్= చేపకడుపులో; పుట్టిన; ఆ+కొడుకు; మత్స్యరాజు నాన్= మత్స్యరాజుఅనే పేరుకలవాడై; పరఁగి= ప్రసిద్ధిచెంది; ధర్మపరుండు+అయి= ధర్మమం దాసక్తికలవా డై; మత్స్యదేశంబునకున్; అధిపతి+అయ్యెన్= రాజయ్యాడు; దాశరాజు; ఆ+కూఁతును= ఆ ఆడపిల్లను; తనకూఁతున్+కాన్+చేసికొని= తనకుమార్తెగా చేసికొని; చేకొని= స్వీకరించి; పెంచినన్= పెంచగా; పెరుఁగుచున్= అభివృద్ధిచెందుతూ.

**తాత్పర్యం:** అద్రిక అనే పేరు కలిగిన ఆ అప్సరస మనుష్యులను కంటే తనకు శాపం తీరిపోతుం దని బ్రహ్మ చెప్పినందువలన మత్స్యగర్భాన్ని విడిచి దివ్యవనితగా మారి దేవలోకానికి వెళ్ళిపోయింది. చేపకడుపున పుట్టిన ఆ కుమారుడు మత్స్యరాజనే పేరుతో ప్రసిద్ధుడై మత్స్యదేశానికి రాజైనాడు. ఆ ఆడపిల్లను దాశరాజు తనకూతురుగా చేసికొని పెంచుతుండగా ఆమె వృద్ధి చెందుతూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అంబుజముఖి యక్కన్య ప్రి । యం బొనరఁగ మత్స్యగంది యనఁగా ధర్మా**
**ర్థంబుగఁ దనతండ్రి నియో । గంబున నయ్యమున నోడఁ గడపుచు నుండెన్. 34**

**ప్రతిపదార్థం:** అంబుజముఖి= పద్మంవంటి ముఖం గల; ఆ+కన్య= ఆ బాలిక; ప్రియంబు+ఒనరఁగన్= ప్రేమ కలిగేటట్లుగా; మత్స్యగంధి+అనఁగాన్= మత్స్యగంధి (చేపలవాసన కలది) అనే పేరుతో; ధర్మ+అర్థంబుగన్= ధర్మంకొరకు; తండ్రినియోగంబునన్= తండ్రియైన దాశరాజుయొక్క ఆజ్ఞతో; ఆ+యమునన్= ఆయమునానదిలో; ఓడన్= నావను; కడపుచున్+ఉండెన్= నడుపుతూ ఉన్నది.

**తాత్పర్యం:** పద్మంవంటి చక్కటిముఖం గల ఆ కన్య మత్స్యగంధి అనేపేరుగలదై, తనతండ్రి ఆజ్ఞచొప్పున యమునానదిలో ఓడ నడుపుతున్నది.

**వ. అంత.** **35**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట.

**తాత్పర్యం:** పిమ్మట.

**చ. గతమదమత్సరుండు, త్రిజగద్వినుతుండు, వసిష్ఠపౌత్త్రుఁ డు**
**న్నతమతి, శక్తిపుత్త్రుఁ, డఘనాశనఘోరతపోధనుండు, సు**
**వ్రతుఁ డయి తీర్థయాత్ర చనువాఁడు, పరాశరుఁ డన్మునీంద్రుఁ డ**
**య్యతివఁ దలోదరిం గనియె నయ్యమునానది యోడరేవునన్.** **36**

**ప్రతిపదార్థం:** గత, మద, మత్సరుండు= గతించిన మదం, మాత్సర్యం కలవాడు, అంటే మదమాత్సర్యాలు లేనివాడు; త్రిజగత్+వినుతుండు= ముల్లోకాలచేత పొగడబడినవాడు; వసిష్ఠపౌత్త్రుఁడు= వసిష్ఠమహామునియొక్క పుత్రుడిపుత్రుడు; ఉన్నతమతి= పెద్దమనస్సుకలవాడు; శక్తిపుత్త్రుఁడు= శక్తిమహామునికుమారుడు; అఘ, నాశన, ఘోర, తపస్+ధనుండు= పాపాన్ని నశింపజేసేటటువంటి భయంకర మైన తపస్సే ధనంగా కలవాడు; సువ్రతుఁడు= చక్కనిపుణ్యకర్మలు కలవాడు; అయి; తీర్థయాత్ర= పుణ్యక్షేత్రానికి ప్రయాణం; చనువాఁడు= వెళ్ళేవాడు; పరాశరుఁడు+అన్= పరాశరు డనే పేరు కలిగిన; మునీంద్రుఁడు= మునిశ్రేష్ఠుడు; ఆ+యమునానది+ఓడరేవునన్= ఆ యమునానదిలో ఓడలు ఆగేచోట; తలోదరిన్= సన్నని ఉదరం గల దైన; ఆ, అతివన్= ఆ స్త్రీని (మత్స్యగంధిని); కనియెన్= చూశాడు.

**తాత్పర్యం:** మదమాత్సర్యాలు లేని సాధుశీలి, ముల్లోకాలచేత పొగడ్తల నందుకొన్నవాడు, విశాలహృదయుడు, పాపాలను నశింపచేసే మహాతపస్సంపన్నుడు, వ్రతనిష్ఠ గలవాడు, వసిష్ఠుడికి పౌత్రుడు, శక్తిమహామునికి పుత్రుడు అయిన పరాశరు డనే పేరు గల మునీంద్రుడు తీర్థయాత్రకు వెళుతూ యమునానదిఓడరేవులో ఆ మత్స్యగంధిని చూచాడు.

**విశేషం:** పరాశరుడిపుత్రుడే వ్యాసభగవానుడు. వ్యాసమహర్షివంశవృక్ష మిది. "వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేఃపౌత్ర మకల్మషమ్ । పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్" ॥ వసిష్ఠుడిమునిమనుమడు, శక్తిమహాముని పౌత్రుడు, పరాశరుడికుమారుడు, శుకుడికి తండ్రి యైనవాడు వ్యాసుడు. అంటే: వసిష్ఠుడిపుత్రుడు శక్తిమహాముని; శక్తిపుత్రుడు పరాశరుడు; పరాశరుడిపుత్రుడు వ్యాసుడు. వ్యాసుడికుమారుడు శుకమహర్షి.

**వ. ఇ ట్లేకతంబ యేకవస్త్ర యై యోడ నెక్కవచ్చువారి నిరీక్షించుచున్న సత్యవతిం జూచి యా మునివరుండు దానియందు మదనపరవశుం డై దానిజన్మంబు దన దివ్యజ్ఞానంబున నెఱింగి, యయ్యోడ యెక్కి దానితో నొక్కటఁ జని చని.** **37**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ఏకతంబు+అ= ఒంటరిగానే; ఏకవస్త్ర+ఐ= ఒకేవస్త్రం గలదై; ఓడను ఎక్క వచ్చువారిన్; నిరీక్షించుచున్+ఉన్న= ఎదురుచూస్తున్న; సత్యవతిన్= మత్స్యగంధిని; చూచి; ఆ మునివరుండు= మునిశ్రేష్ఠు డైన ఆ పరాశరుడు; దానియందున్= ఆ మత్స్యగంధియందు; మదనపరవశుండు+ఐ= మన్మథుడికి లొంగినవా డై; దానిజన్మంబు= ఆ మత్స్యగంధి పుట్టుకను; తన; దివ్యజ్ఞానంబునన్= అలౌకిక మైన జ్ఞానంతో; ఎఱింగి; ఆ+ఓడ= ఆ ఓడను; ఎక్కి; దానితోన్= ఆ సత్యవతితో; ఒక్కటన్+చని= వెంబడివెళ్ళి; చని.

**తాత్పర్యం:** ఇట్లా ఒంటరిగా ఒకేవస్త్రం ధరించిందై ఓడ నెక్కేందుకు వచ్చేవారికోసం వేచిఉన్న మత్స్యగంధిని పరాశరుడు చూచి, మోహించి, తన దివ్యజ్ఞానంచేత ఆమెజన్మవృత్తాంతాన్ని గ్రహించి, ఆమెతోపాటు పోయి పోయి.

**సీ. చపలాక్షిచూపులచాడ్పున కెడ మెచ్చుఁ, । జిక్కనిచనుఁగవఁ జీఱఁ గోరు,**
**నన్నువకౌఁదీగ యందంబు మది నిల్పు, । జఘనచక్రంబుపైఁ జలుపు దృష్టి,**
**యభిలాష మేర్పడు నట్లుండఁగాఁ బల్కు, । వేడ్కతో మఱుమాట వినఁగఁ దివురు,**
**నతిఘనలజ్జావనత యగు నక్కన్య । పైఁ బడి లజ్జయుఁ బాపఁ గడఁగు**

**ఆ. నెంతశాంతు లయ్యు, నెంత జితేంద్రియు । లయ్యు, గడువివిక్త మయినచోట**
**సతులగోష్ఠిఁ జిత్తచలన మొందుదు; రెందుఁ । గాముశక్తి నోర్వఁగలరె జనులు. 38**

**ప్రతిపదార్థం:** చపలాక్షి= చంచలా లైన చూపులు కల ఆ మత్స్యగంధియొక్క; చూపుల, చాడ్పునకున్= చూపులవిధానానికి; ఎడన్+మెచ్చున్= హృదయంలో మెచ్చుకొన్నాడు; చిక్కని, చనుఁగవన్= ఒత్తయిన చనుదోయిని; చీఱన్, కోరున్= చీల్చ(గిల్ల) కోరాడు; అన్నువ, కౌఁదీఁగ= సన్నటితీగెవంటి నడుముయొక్క; అందంబున్; మదిన్, నిల్పున్= మనస్సునందు నిలిపాడు; జఘన, చక్రంబుపైన్= గుండ్రనిపిరుదులపై; దృష్టిన్= దృష్టిని; చలుపున్= ప్రసరింప జేశాడు; అభిలాషము= కోరిక; ఏర్పడునట్లుండఁగాన్= తేటతెల్లమగునట్లుగా (తేటతెల్లమయేటట్లుగా); పల్కున్= పలికాడు; వేడ్కతోన్= వేడుకతో; మఱుమాట= ప్రత్యుత్తరాన్ని; వినఁగన్= వినేందుకు, తివురున్= ప్రయత్నించాడు; అతి, ఘన, లజ్జా+అవనత+అగు= మిక్కుట మైన సిగ్గుతో వంగింది అయిన (వంగిన); ఆ+కన్యపైన్+పడి= ఆ కన్యమీదపడి; లజ్జయున్= (ఆకన్యయొక్క) సిగ్గును; పాపన్+కడఁగున్= పోగొట్టేందుకు ప్రయత్నించాడు; ఎంతశాంతులయ్యున్= ఎంతటి శాంతం కలవా రైనా; ఎంతజిత+ఇంద్రియులు+అయ్యున్= ఎంతగా ఇంద్రియాలను జయించినవా రైనా; కడున్= మిక్కిలి; వివిక్తము+అయినచోటన్= ఏకాంత మైన తావులో; సతులగోష్ఠిన్= స్త్రీలతోడికూటమియందు; చిత్తచలనము+ఒందుదురు= మనశ్చాంచల్యాన్ని పొందుతారు; జనులు= ప్రజలు; కాముశక్తిన్= మన్మథునిసామర్థ్యాన్ని; ఓర్వన్+కలరె= సహింపగలరా? (సహింపలేరు.)

**తాత్పర్యం:** పరాశరుడు మత్స్యగంధినేత్రసౌందర్యాన్ని చూచి మనసులో మెచ్చుకొన్నాడు. ఆమెచనుదోయిని నఖక్షతం చేయగోరాడు. ఆమె సన్నటినడుము సొగసును మనస్సులో నిలుపుకొన్నాడు. ఆమె జఘనప్రదేశమందే దృష్టి నిలుపుకొన్నాడు. తనకోరిక వెల్లడి అయ్యేటట్లుగా మాటలాడాడు. ఆమెప్రత్యుత్తరాన్ని వినేందుకు ఉవ్విళ్ళూరాడు. మిక్కుట మైన సిగ్గుతో నున్న ఆ కన్యమీద పడి ఆమెలజ్జను బాపేందుకు ప్రయత్నించాడు. ఎంతశాంతులైనా, ఎంతజితేంద్రియు లైనా, ఏకాంతస్థలంలో స్త్రీలకూటమి తటస్థిస్తే చిత్తచాంచల్యానికి లోనవుతారు. మన్మథునిబలాన్ని ఓర్వగలజను లున్నారా? లేరనుట.

**విశేషం:** సామాన్యంచేత విశేషం సమర్థింపబడింది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసమని అభిప్రాయం.

**లక్షణం:** సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్ (కువలయానందమ్)

**వ. ఇట్లు విగతలజ్జాపరవశుం డయి మునివరుండు దనయభిప్రాయం బక్కన్యక కెఱింగించిన, నదియును దీని కొడంబడనినాఁడు నా కలిగి యిమ్ముని శాపం బిచ్చునో యని వెఱచి యి ట్లనియె. 39**

**ప్రతిపదార్థం:** ఇట్లు, విగత, లజ్జా, పరవశుండు+అయి= పూర్తిగా విడిపోయిన లజ్జకు లొంగిన వాడై; మునివరుండు= మునిశ్రేష్ఠుడైన ఆపరాశరుడు; తనఅభిప్రాయంబు; ఆ+కన్యకకున్= ఆ పడుచునకు; ఎఱింగించినన్= తెల్పగా; అదియును=

ఆ మత్స్యగంధియు; దీనికిన్= ఇందుకు; ఒడంబడనినాఁడు= ఒప్పుకొననినాడు; నాకున్+అలిగి= నామీద కోపగించి; ఈ+ముని= ఈ ఋషి; శాపంబు+ఇచ్చునో+అని; వెఱచి= భయపడి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా మునిపుంగవు డైన పరాశరుడు సిగ్గువిడిచి తనకోరికను ఆ కన్యకు తెల్పగా, ఇందుకు ఇష్టపడకపోతే ఆ ముని శపిస్తాడేమో అని భయపడి ఇలా అన్నది.

**తరలము.**

**తనువు మీన్పొలవల్చు జాలరిదాన, నట్లును గాక యే**
**ననఘ! కన్యకఁ, గన్యకావ్రత మంతరించిన నెట్లు మ**
**జ్జనకునింటికిఁ బోవ నేర్తుఁ? బ్రసాదబుద్ధి యొనర్పు స**
**న్మునిగణోత్తమ! నాకు దోషవిముక్తి యె ట్లగు నట్లుగాన్. 40**

**ప్రతిపదార్థం:** తనువు= శరీరం; మీన్, పొల వల్చు= చేపవాసన వచ్చేటువంటి; జాలరి, దానను= చేపలు పట్టేవారికులానికి చెందినదానిని; అట్లునుగాక; ఏను= నేను; అనఘ!= ఓపుణ్యుడా! కన్యకన్= కన్నెను; కన్యకా, వ్రతము= కన్యగాఉండే నియమం; అంతరించినన్= నశించినచో; ఎట్లు; మత్+జనకు+ఇంటికిన్= నా తండ్రియొక్క ఇంటికి; పోవన్, నేర్తున్= పోజాలెదను? (పోగలను); సత్+మునిగణ+ఉత్తమ= శ్రేష్ఠు లైన మునులసమూహంలో శ్రేష్ఠుడా; నాకున్; దోషవిముక్తి= దోషంనుండి తొలగటం; ఎట్లు+అగున్= ఎట్లవుతుందో; అట్లుగాన్= ఆ విధ మయ్యేటట్లుగా; ప్రసాదబుద్ధి= అనుగ్రహంతో కూడిన బుద్ధిని; ఒనర్పుము= చేయవలసింది.

**తాత్పర్యం:** శరీరం చేపలవాసనతో కూడినట్టి జాలరిదాన్ని నేను. అదీకాక ఓ పుణ్యాత్ముడా! నేను కన్యను. నా కన్యాత్వం అంతరిస్తే నేను ఎట్లా నా తండ్రిగడప త్రొక్కుతాను? ఓ మునిగణోత్తమా! నాకు దోషం కలగని రీతిగా అనుగ్రహించవలసింది.

**వ. అనిన నమ్మునివరుండు గరంబు సంతోషించి 'నాకు నిష్టంబు సేసినదాన నీకన్యాత్వంబు దూషితంబు గా, దోడకు' మని దానికి వరం బిచ్చి, నీవు వసు వనురాజర్షివీర్యంబునం బుట్టినదానవు గాని సూతకులప్రసూతవు కా వని చెప్పి, దానిశరీరసౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు నేర్పడునట్లుగాఁ బ్రసాదించిన, నది గంధవతి యనియు, యోజనగంధి యనియుఁబరఁగి, తత్ప్రసాదంబున ననేక దివ్యాంబరాభరణభూషితయు నయి యమునానదీద్వీపంబున నోడ చేర్చి. 41**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; ఆ+మునివరుండు= ఆ మునిశ్రేష్ఠుడు, పరాశరుడు; కరంబు= మిక్కిలి; సంతోషించి; నాకున్; ఇష్టంబు= ప్రియం; చేసినదానన్= చేసినందువలన; నీ కన్యాత్వంబు= నీ కన్నెతనం; దూషితంబు= నిందింపబడినది; కాదు; ఓడకుము= భయపడకు; అని; దానికిన్= ఆ మత్స్యగంధికి; వరంబు+ఇచ్చి; నీవు; వసురాజ+ఋషి= వసు వనేపేరు కల రాజర్షియొక్క; వీర్యంబునన్= రేతస్సువలన; పుట్టినదానవు; కాని; సూతకులప్రసూతవు= సూతకులమందు పుట్టినదానివి కావు; అని; చెప్పి; దాని; శరీరసౌగంధ్యంబు= శరీరపరిమళం; యోజనంబునన్+కోలెన్= ఆమడ దూరంవరకు; జనులకున్; ఏర్పడు+అట్లు, కాన్= తెల్లమయేటట్లుగా; ప్రసాదించినన్= అనుగ్రహించగా; అది= ఆ మత్స్యగంధి; గంధవతి అనియున్; యోజనగంధి; అనియున్; పరఁగి= ప్రసిద్ధిచెంది; తద్+ప్రసాదంబునన్= ఆ పరాశరుడి అనుగ్రహంతో; అనేకదివ్య+

అంబర+ఆభరణ, భూషితయున్= పెక్కుదివ్యము లైన వస్త్రాలతోను, ఆభరణాలతోను అలంకరించబడినది, అయి; యమునాద్వీపంబునన్, ఓడ చేర్చి= యమునా నదిలో చుట్టూ నీరున్న నేలగల చోటుకు (ద్వీపం దగ్గరికి) నావను చేర్చి.

**తాత్పర్యం:** మత్స్యగంధిమాటలకు పరాశరుడు చాలాసంతోషించి, 'నాకు ప్రియంచేసినందువలన నీకన్యాత్వం చెడదు; భయపడకు' అని వర మిచ్చి, 'నీవు వసురాజర్షివీర్యంవలన జన్మించినదానివి కాని, సూతకులంలో పుట్టినదానివి కావు' అని ఎఱుకపరచి ఆమెశరీరసుగంధం యోజనదూరంలో కల జనులకు ఎరుక పడేటట్లుగా (తెలిసేటట్లుగా) అనుగ్రహించాడు. ఆమె గంధవతిగా, యోజనగంధిగా ప్రసిద్ధిచెందింది. ఆమె పరాశరుడిఅనుగ్రహంతో దివ్యవస్త్రాభరణాలంకృతు రాలై యమునాద్వీపానికి ఓడను చేర్చి.

**తే. 'ఎల్లవారును జూడంగ నిట్టిబయల । నెట్లు సంగమ మగు' నని యింతి యన్న**
**నమ్మునీంద్రుండు గావించె నప్పు డఖిల । దృష్టిపథరోధినీహారతిమిర మంత. 42**

**ప్రతిపదార్థం:** ఎల్లవారును= సమస్తజనులును; చూడంగన్; ఇట్టి బయలన్= ఇటువంటి బాహ్యప్రదేశంలో; ఎట్లు; సంగమము+అగున్= కలయిక ఔతుంది; అని; ఇంతి= ఆ యోజనగంధి; అన్నన్= పలుకగా; అమ్మునీంద్రుండు= ఆ మునిశ్రేష్ఠు డైన పరాశరుడు; అప్పుడు; అఖిల, దృష్టి, పథ, రోధి, నీహార, తిమిరము= అశేషజనుల దృక్పథాలను నిరోధించే మంచు అనే చీకటిని; అంతన్= అంతటా; కావించెన్= కల్పించాడు.

**తాత్పర్యం:** 'అందరూ చూస్తుండగా ఇటువంటిబయలుప్రదేశంలో ఎట్లా కలయిక అవుతుం?' దని యోజనగంధి అనగా అప్పు డాపరాశరముని సమస్తజనులదృష్టిని నిరోధించే మంచుచీకట్లను కల్పించాడు.

## శ్రీవేదవ్యాసమునీంద్రుని యవతారము (సం. 1-57-70)

**క. పరమేష్ఠికల్పుఁ డగు న । ప్పరాశరుసమాగమమునఁ బరమగుణైకా**
**భరణకు ననవద్యమనో । హరమూర్తికి సత్యవతికి నమ్మునిశక్తిన్. 43**

**ప్రతిపదార్థం:** పరమేష్ఠి, కల్పుఁడు+అగు= బ్రహ్మదేవుడితో సమాను డైన; ఆ+పరాశరు= ఆ పరాశరుడియొక్క; సమాగమమునన్= కలయికవలన; పరమ, గుణ+ఏక+ఆభరణకున్= ఉత్తమగుణాలే ముఖ్యమైన భూషణంగాకలదియున్నూ; అనవద్యమనోహరమూర్తికిన్= నిర్దోషం, మనోజ్ఞం అయిన ఆకారం కలదియున్నూఅయిన; సత్యవతికిన్= యోజనగంధికి; ఆ మునిశక్తిన్= ఆ పరాశరమునిమహిమతో.

**తాత్పర్యం:** బ్రహ్మసమాను డైన ఆ పరాశరమహర్షి సంగమంతో సుగుణాభరణకు, నిర్దోషం, మనోహరం అయినరూపం కలిగిన సత్యవతికి ఆ మునిమహిమవలన. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. సద్యోగర్భంబున నహి । మద్యుతితేజుండు వేదమయుఁ డఖిలమునీం**
**ద్రాద్యుఁడు వేదవ్యాసుం । డుద్యద్జ్ఞానంబుతోడ నుదితుం డయ్యెన్. 44**

**ప్రతిపదార్థం:** సద్యస్+గర్భంబునన్= తత్కాలగర్భాన; అహిమద్యుతి తేజుండు= సూర్యుడితేజస్సువంటి తేజస్సుకలవాడు; వేదమయుఁడు=(వేదాలచేత) జ్ఞానంచేత నిండినవాడు; అఖిలమునీంద్ర+ఆద్యుఁడు= సమస్తమునులలో మొదటివాడు; వేదవ్యాసుండు; ఉద్యత్+జ్ఞానంబుతోడన్= ఉదయిస్తున్న జ్ఞానంతో; ఉదితుండు+అయ్యెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** ఆ సత్యవతికి తత్కాలగర్భమందు సూర్యసన్నిభుడు, వేదమయుడు, ఆదిముని అయినటువంటి వేదవ్యాసుడు జ్ఞానవంతు డై అవతరించాడు.

**క. ఆ యమునాద్వీపమున న । మేయుఁడు కృష్ణుఁడయి లీలమెయిఁ గృష్ణద్వై**
**పాయనుఁ డనఁ బరఁగి వచ । శ్శ్రీయుతుఁడు తపంబువలనఁ జిత్తము నిలిపెన్. 45**

**ప్రతిపదార్థం:** ఆ యమునాద్వీపమునన్; అమేయుఁడు= మహనీయుడు; కృష్ణుఁడు+అయి= నల్లనివాడై; లీలమెయిన్= విలాసంతో లేదా-మహిమతో; కృష్ణద్వైపాయనుఁడు+అనన్+పరఁగి= కృష్ణద్వైపాయను డనే పేరుతో ప్రసిద్ధిచెంది; వచస్+ శ్రీయుతుఁడు= వాక్యసంపదతో కూడిన ఆ వ్యాసుడు; తపంబువలనన్= తపస్సునందు; చిత్తము నిలిపెన్= మనసు నిలిపాడు.

**తాత్పర్యం:** ఆ యమునాద్వీపంలో మహనీయుడు; నల్లనివాడు; వచస్సంపన్నుడు అయినట్టి అతడు కృష్ణద్వైపాయను డన్నపేరుతో ప్రసిద్ధుడై తపోమార్గంలోనే మనసు నిలిపాడు.

**విశేషం:** కృష్ణద్వైపాయనుడు= నల్లనైన యమునానదియొక్క ద్వీపాన్ని జన్మస్థానంగా కలవాడు.

**వ. పరాశరుండు సత్యవతి గోరిన వరంబు లిచ్చి నిజేచ్ఛ నరిగె; నంతఁ గృష్ణద్వైపాయనుండును గృష్ణాజిన పరిధాన కపిలజటామండల దండకమండలు మండితుం డై తల్లిముందట నిలిచి కరకమలంబులు మొగిచి మ్రొక్కి 'మీకుం బనిగలయప్పుడ నన్నుం దలంచునది; యాక్షణంబ వత్తు' నని సకలలోకపావనుం డఖిలలోక హితార్థంబుగాఁ దపోవనంబునకుం జని, యందు మహాఘోరతపంబు సేయుచు. 46**

**ప్రతిపదార్థం:** పరాశరుండు; సత్యవతి, కోరినవరంబులు; ఇచ్చి; నిజ+ఇచ్ఛన్= తనఇష్టప్రకారంగా; అరిగెన్= వెళ్ళాడు; అంతన్; కృష్ణద్వైపాయనుండును; కృష్ణాజినపరిధాన= జింకచర్మపు వస్త్రంతోను; కపిల, జటా, మండల= గోరోజనవర్ణం వంటి వర్ణం గల జడల సమూహంతోను; దండ, కమండలు, మండితుండు+ఐ= దండంతోను, జలపాత్రతోను ప్రకాశించినవాడై; తల్లిముందట నిలిచి; కరకమలంబులు= హస్తపద్మాలు; మొగిచి= మోడ్చి; మ్రొక్కి, మీకుం బనిగల, అప్పుడు+అ; నన్నున్ తలంచునది; ఆక్షణంబు+అ= ఆక్షణాన్నే; వత్తును; అని, సకలలోకపావనుండు= సమస్తలోకాలలోనూ పవిత్ర మైనవా డైన ఆ వ్యాసుడు; అఖిలలోకహిత+అర్థంబు, కాన్= సమస్తలోకాలయొక్క మేలుకొరకు; తపోవనంబునకున్; చని; అందున్; మహాఘోరతపంబు= గొప్ప భయంకరమైన తపస్సు; చేయుచున్= చేస్తూ.

**తాత్పర్యం:** పరాశరుడు సత్యవతి కోరినవరా లిచ్చి వెళ్ళిపోయాడు. అంతట కృష్ణద్వైపాయనుడు జింకచర్మపు వస్త్రంతోను, ఎఱ్ఱని జడలతోను, దండకమండలాలను ధరించి తల్లిముందర నిలచి ఆమెకు మ్రొక్కి, 'మీకు పని కలిగినప్పుడు నన్ను తలవండి; ఆ క్షణమే నేను వస్తా' నని చెప్పి, పరమపవిత్రు డైన ఆ వ్యాసుడు లోకహితానికై తపోవనానికి వెళ్లి, అక్కడ మహాభయంకర మైన తపస్సుచేస్తూ.

**విశేషం:** 40వ పద్యంలో మత్స్యగంధి తన కన్యకావ్రతం అంతరించటంవలన కలిగే దోషంనుండి తాను విముక్తురా లయ్యే వరాన్ని కోరింది. పరాశరుడు ఆ వరం ఇచ్చాడు. పరాశరుడిపొందువలన ఆమె కన్యాత్వం కోల్పోయింది. పుత్రవతి అయింది. పరాశరుడు వెళ్లాడు. కాని, ఆమెయందు కన్యాత్వం యథాపూర్వంగానే నిలిచి ఉన్నది. దానితో ఆమెకు పరాశరపత్ని అనే దోషం లేకుండా పోయింది. ఆమెకు సద్యోగర్భంవలన వ్యాసుడు పుట్టాడు. అతడు సద్యోయౌవనుడైనాడు; తల్లికి మ్రొక్కి తపోవనానికి

వెళ్ళాడు. ఎప్పుడు స్మరిస్తే అప్పుడు వస్తానని వరంలాంటి వాగ్దాన మిచ్చాడు. అవివాహిత అయిన మత్స్యగంధికి పుట్టినపుత్రుడు అట్లా పుట్టి అట్లా వెళ్లకపోతే ఆమె కన్యాత్వం దూషితమయ్యేది. చివరకు ఆమె కన్యగానే మిగిలింది. కాని, మత్స్యగంధి యోజనగంధిగా మారింది. కన్యగా ఉన్నప్పటి శరీరమత్స్యగంధ దోషంకూడా పోయింది. ఆమె కేర్పడిన శరీరసౌగంధ్యమే తరువాతికథలో శంతనుడిని ఆకర్షించింది. హస్తినాపుర పట్టమహిషిని చేసింది. కథను లోనారసి చూచేవారికి స్ఫురించే ఈ కథార్థాలన్నీ ప్రసన్నకథాకవి(లి) తార్థయుక్తితో నన్నయ సాధించిన వస్తుధ్వని విశేషాలే.

**ఉ. సంచిత పుణ్యుఁ డంబురుహసంభవునంశము దాల్చి పుట్టి లో**
**కాంచితుఁ డైనవాఁడు నిఖిలాగమపుంజము నేర్పడన్ విభా**
**గించి జగంబులందు వెలిఁగించి సమస్తజగద్ధితంబుగాఁ**
**బంచమవేద మై పరఁగు భారతసంహితఁ జేసె నున్నతిన్. 47**

**ప్రతిపదార్థం:** సంచిత పుణ్యుఁడు= కూడబెట్టిన పుణ్యాలు కలవాడు; అంబురుహ సంభవు నంశము= బ్రహ్మయొక్క అంశం; తాల్చి= ధరించి; పుట్టి; లోక+అంచితుఁడు+ఐనవాఁడు= లోకమందు పూజించబడిన వా డైనటువంటి కృష్ణద్వైపాయనుడు; నిఖిల+ఆగమ పుంజము= సకల వేదాల సమూహం; ఏర్పడన్= తేటతెల్ల మయ్యేటట్లుగా; విభాగించి= వేర్పాటు చేసి; జగంబులందున్ వెలిఁగించి= లోకాలలో ప్రకాశింపజేసి; సమస్త జగత్+హితంబుగాన్= సకల జగాలకు మేలు చేసేదిగా; పంచమ వేద మై పరఁగు= ఐదవవేదంగా ప్రసిద్ధ మైన; భారత సంహితన్= భారతమనే వేదభాగాన్ని; ఉన్నతిన్= గొప్పగా; చేసెన్.

**తాత్పర్యం:** పుణ్యనిధియున్నూ, బ్రహ్మఅంశాన జన్మించిన లోకపూజ్యుడున్నూ అయినట్టి ఆ కృష్ణద్వైపాయనుడు వేదాలను విభాగించి, వాటిని లోకంలో ప్రశస్తం కావించి, విశ్వశ్రేయస్సుకై పంచమవేద మని ప్రసిద్ధి చెందిన ఈ భారతసంహితను రచించాడు.

**విశేషం:** ఈపద్యం ప్రసాదగుణరంజిత. భారతసంహితను రచించిన వ్యాసుడిపుట్టుకనుగురించి నన్నయ చెప్పి, ఆ తరువాత భీష్మాది వీరుల పుట్టుకలనుగురించి చెప్పబోతున్నాడు. ఈ వరుసలోనే ఎందుకు చెప్పాలి? అనే ప్రశ్న ఏర్పడుతున్నది. దానికి రెండుకారణాలు కనబడుతున్నాయి. 5వ పద్యంలో జనమేజయుడు 'ప్రీతితో మీరును, భీష్మాది కురువృద్ధరాజులు ఉండికూడా పాండవ ధార్తరాష్ట్రులు రాజ్యాన్ని విభజించుకొని పాలిస్తూకూడా ఎందుకు యుద్ధం జరిగింది', అని వ్యాసుడిని ప్రశ్నించాడు. దానికి తరువాత వైశంపాయనుడు ఆవరుసలోనే సమాధానం చెప్పుకుంటూవస్తూ వ్యాసభీష్ముల జన్మవృత్తాంతాలను ముందుగా చెప్పాడు. అంతేకాక దేవతాంశలతో పుట్టినవారిలో బ్రహ్మాంశకలవాడు వ్యాసుడు. వసువుల అంశలు కలవాడు భీష్ముడు. అందువలన ఆక్రమంలో చెప్పాడు. అయితే వ్యాసుడు లోకహితార్థం జీవించటానికి పుట్టాడు. భీష్మాదులు యుద్ధంచేయటానికి పుట్టారు. అందువలన వ్యాసునికథ ప్రత్యేకంగా చెప్పబడింది. భీష్ముడికథ గుంపులో కలిసి పుట్టింది. శంతనుడి కథనుండి స్వంతంగా పెరిగింది. వీరిరువురూ భారతకథలో పాల్గొనే పాత్రలే. అయినా, వ్యాసుడు చిరంజీవి, భీష్ముడు దీర్ఘకాలం జీవించినవాడు. ఇటువంటి అర్థాలన్నింటినీ ఆ వరుసలో కథచెప్పటంద్వారా నన్నయ భావింపజేస్తున్నాడు.

### భీష్మాదివీరుల దేవదానవాదుల యంశంబువలనఁ బుట్టుట (సం. 1-58-3)

**వ. 'మఱియు దేవదైత్య దానవ ముని యక్ష పక్షిగంధర్వాదుల యంశావతారంబులు దాల్చి భీష్మాది మహావీరులు భారత యుద్ధంబు సేయ ననేకులు పుట్టిరి. వారల కొలంది యెఱింగి చెప్ప ననేకకాలం బనేకసహస్ర ముఖంబులవారి కైన నలవిగా' దనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 48**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకనూ (ఇంకా); దేవ= దేవతలు; దైత్య= దితిసంతాన మైన రాక్షసులు; దానవ= దను సంతాన మైన రాక్షసులు; ముని= మునులు; యక్ష= యక్షులు; పక్షి= పక్షులు; గంధర్వ+ఆదులు= గంధర్వులు మొదలైనవారి; అంశ+అవతారంబులు= అంశాలయొక్క రూపాలను; తాల్చి= ధరించి; భీష్మ+ఆది+మహావీరులు= భీష్ముడు మొదలైన గొప్పవీరులు; భారత యుద్ధంబు+ చేయన్; అనేకులు= పెక్కుమంది; పుట్టిరి; వారలకొలంది= వారి సామర్థ్యం; ఎఱింగి, చెప్పన్= తెలిసికొని చెప్పేందుకు; అనేకకాలంబు= చాలకాలం; అనేక, సహస్ర, ముఖంబులవారికిన్+ఐనన్= పెక్కు వేలముఖాలు కలవారి కైనా; అలవి, కాదు= శక్యం కాదు; అనినన్, విని= అని చెప్పగా విని; జనమేజయుండు= పరీక్షిత్తు కుమారుడు; వైశంపాయనునకున్= వ్యాసశిష్యు డైన వైశంపాయను డనే మునికి (తో); ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అంతేకాదు. దేవతలు, రాక్షసులు, మునులు, యక్షులు, పక్షులు, గంధర్వులు మొదలైనవారి అంశాలతో భీష్ముడు మొదలైన మహావీరులు భారతయుద్ధం చేయటానికి అనేకులు పుట్టారు. వారి బలాబలాలు తెలిసి చెప్పటానికి పెక్కువేల ముఖాలు కలవారుకూడా చాలకాలం చెప్పినా సాధ్యం కాదు'- అనగా విని జనమేజయుడు వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'మునికిట్లనియె' మునితో నిట్లనియె. 'సూ॥ వచ్యర్థా ముఖ్యకర్మంబునకుఁ దోడ కు వర్ణంబులు ప్రాయికంబుగా నగు' (బా.వ్యా.)

**క. 'అమరాసుర ముఖ్యుల యం। శములను మహిఁ బుట్టి 'సకలజనపాలక సం**
**ఘములకు భారతరణరం। గమునను లయ మొంద నేమి కారణ?' మనినన్. 49**

**ప్రతిపదార్థం:** అమరాసుర, ముఖ్యుల= దేవతలయు, రాక్షసులయు ముఖ్యు లైన వారియొక్క; అంశములను= భాగాలతో; మహిన్= భూమిపై; సకల, జనపాలక, సంఘములకున్= సకల రాజుల సమూహాలకు; పుట్టి= జన్మించి; భారత, రణ, రంగమునను= భారత యుద్ధరంగంలో; లయము+ఒందన్= నాశమయ్యేందుకు; ఏమి కారణము?; అనినన్= అని అడుగగా.

**తాత్పర్యం:** 'దేవదానవులఅంశలతో పుట్టిన సకలరాజ సమూహాలు భారతయుద్ధంలో నశించటానికి కారణం ఏమిటి?' అని జనమేజయుడు అడుగగా.

**వ. జనమేజయునకు వైశంపాయనుం డి ట్లనియె. 50**

**ప్రతిపదార్థం:** జనమేజయునకున్= జనమేజయుడితో; వైశంపాయనుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు.

**సీ. పరశురాముండు భీకర నిజకోపాగ్ని। నుగ్రుఁ డై యిరువదియొక్కమాఱు**
**ధాత్రీతలం బపక్షత్త్రంబు సేసినఁ,। దత్క్షత్త్రసతులు సంతానకాంక్ష**
**వెలయంగ ఋతుకాలముల మహావిప్రుల। దయఁ జేసి ధర్మువు దప్పకుండఁ**
**బడసిరి పలువురఁ గొడుకులఁ గూఁతుల,। నిప్పాటఁ దత్క్షత్త్ర మెసఁగి యుర్విఁ**

ఆ. బర్వి రాజధర్మపద్ధతి ననఘమై, । జారచోర దుష్టజనుల బాధ
బొరయకుండ నిఖిల భూప్రజాపాలనఁ । జేయుచుండె శిష్టసేవ్య మగుచు. 51

**ప్రతిపదార్థం:** భీకర, నిజకోప+అగ్నిన్= భయంకర మైన తన కోప మనే అగ్నిచేత; ఉగ్రుఁడు+ఐ= భయంకరు డై; ధాత్రీ, తలంబు= భూతలాన్ని; అపక్షత్త్రంబు= క్షత్రియులు లేనిది; చేసినన్= చేయగా; తద్+క్షత్త్రసతులు= ఆ క్షత్రియులయొక్క భార్యలు; సంతానకాంక్ష= సంతానమం దున్న కోరిక; వెలయంగన్= బయల్పడగా; ఋతుకాలములన్= స్త్రీల ఋతు సంబంధ మైన సమయాలలో; మహత్+విప్రుల, దయన్+చేసి= గొప్పవా రైన బ్రాహ్మణులయొక్క దయవలన; ధర్మువు, తప్పకుండన్= ధర్మమార్గం వీడకుండగా; పలువురన్= పెక్కురను కొడుకులన్; కూఁతులన్; పడసిరి= పొందారు; తద్+క్షత్త్రము= ఆ క్షత్రియవంశం; ఎసఁగి= ఒప్పారి; ఉర్విన్+పర్వి= భూమియందు వ్యాపించి; రాజధర్మ పద్ధతిన్= రాజధర్మ విధానాన్ని; అనఘము+ఐ= పాపరహితమై; జార, చోర, దుష్ట జనుల బాధన్= జారులవలన, దొంగలవలన, దుష్టులవలన బాధ; పొరయకుండన్= కలుగకుండా; నిఖిల, భూప్రజాపాలనన్= సమస్త భూమియందున్న ప్రజల పాలనం, శిష్ట, సేవ్యము+అగుచున్= శిష్టజనులచేత సేవించదగిన దగుతూ; చేయుచుండెన్.

**తాత్పర్యం:** పరశురాముడు ఉగ్రకోపుడై, ఇరవైయొక్కమార్లు దండెత్తి క్షత్రియు లందరిని వధించగా, ఆ రాజుల భార్యలు సంతానకాంక్షతో ఋతుకాలాలలో బ్రాహ్మణశ్రేష్ఠుల అనుగ్రహంతో, ధర్మవిధిని అనుసరించి సంతానాన్ని పొందారు. మళ్ళీ రాజవంశాలు వర్ధిల్లాయి. అట్లా జన్మించిన రాజులు ధర్మమార్గాన్ని విడువక జార చోర దుష్టజనాల బాధ ప్రజలకు కలుగకుండా భూమిని పాపరహితంగా పరిపాలించారు. వారిపాలన శిష్టసేవ్య మై ఉన్నది.

**విశేషం:** 'రాజధర్మపద్ధతిననఘమై' అనేచోట 'రాజధర్మపథనీతి విడువక' అనేపాఠాంతరం ఉన్నది.

వ. ఇట్లు బ్రాహ్మణ వీర్య ప్రభవు లయిన క్షత్త్రియులు ధర్మమార్గంబునం బ్రజాభిరక్షణంబు సేయుటంజేసి వర్ణాశ్రమ ధర్మస్థితులు దప్పక ప్రవర్తిల్లుటయు, బ్రహ్మక్షత్త్రంబుల కాయుర్వర్ధనంబును, ననవరతయాగతర్పిత పర్జన్య ప్రసాదంబునం గోరినయప్పుడు వానలు గురియుచు సకల సస్యసమృద్ధియుఁ, బ్రజావృద్ధియు నైన భూదేవి ప్రజాభారపీడిత యై సురాసుర మునిగణ పరివృతు లై యున్న హరి హర హిరణ్యగర్భుల కడకుం జని యి ట్లనియె. 52

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణ, వీర్య, ప్రభవులు= బ్రాహ్మణులయొక్క తేజస్సువలన జన్మించినవారు; అయిన; క్షత్రియులు; ధర్మమార్గంబునన్= ధర్మశాస్త్రపద్ధతిలో; ప్రజా+అభిరక్షణంబు= ప్రజలను కాపాడటం; చేయుటన్+చేసి= చేయటంవలన; వర్ణ+ఆశ్రమ, ధర్మ, స్థితులు= నాలుగు వర్ణాలయొక్క, నాలుగు ఆశ్రమాలయొక్క నియమాలయొక్క వ్యవస్థలు; తప్పక; ప్రవర్తిల్లుటయున్= ఏర్పడి ఉండగా; బ్రహ్మ, క్షత్త్రంబులకున్= బ్రాహ్మణ క్షత్రియ వర్ణాలవారికి; ఆయుస్+వర్ధనంబు= ఆయుస్సు పెరగటం; అనవరత యాగ, తర్పిత, పర్జన్య, ప్రసాదంబునన్= నిరంతరం యాగాలలో తృప్తి పొందిన దేవేంద్రుడి అనుగ్రహంచేత; కోరిన+అప్పుడు; వానలు కురియుచున్; సకలసస్యసమృద్ధియున్= సమస్తమైన పంటలయొక్క సంపద; ప్రజావృద్ధియున్= సంతానవృద్ధియు; ఐనన్= కాగా; భూదేవి; ప్రజాభారపీడిత+ఐ= ప్రజలభారంచేత బాధింపబడినదై; సుర+అసుర, మునిగణ, పరివృతులు+ఐ= దేవతల, రాక్షసుల, మునుల సమూహంచేత కూడినవా రై; ఉన్నన్; హరి, హర, హిరణ్యగర్భులకడకున్= విష్ణుశివబ్రహ్మలదగ్గరికి; చని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా బ్రాహ్మణులవలన జన్మించిన రాజులు ధర్మమార్గంలో ప్రజలను పాలించటంచేత వర్ణాశ్రమ ధర్మాలు స్థిరత్వం పొందినవి. బ్రాహ్మణులకు క్షత్రియులకు ఆయుర్దాయం పెరిగింది. నిరంతరం యజ్ఞాలవలన తృప్తి పొందిన దేవేంద్రుడి అనుగ్రహంచేత కోరినప్పుడు వానలు కురిసి, పంటలు పండాయి. ప్రజాబాహుళ్య మధిక మయింది. భూదేవి ప్రజాభారాన్ని సహించలేక బ్రహ్మ విష్ణు మహేశ్వరులవద్దకు వెళ్ళి ఇట్లా పలికింది.

**క. 'భూరి ప్రజా నిరంతర । భారము దాల్చు టిది కరము భారము; దయతో**
**మీరీభారమునకుఁ బ్రతి । కారము గావించి నన్నుఁ గావుం' డనినన్. 53**

**ప్రతిపదార్థం:** భూరి, ప్రజానిరంతర, భారము= అధిక మైన ప్రజలయొక్క ఎడతెగని బరువు; తాల్చుట+ఇది= ధరించుట అనునది కరమున్, భారము= మిక్కిలి బరువైనది; దయతోన్; మీరు; ఈ భారమునకున్; ప్రతికారము= ప్రతిక్రియ; కావించి= చేసి; నన్నున్; కావుండు= రక్షింపుడు. (రక్షించండి); అనినన్= అని అనగా.

**తాత్పర్యం:** 'అధిక మైన జనబాహుళ్యభారాన్ని మోయటం నాకు మిక్కిలి భార మౌతున్నది. దయతో మీ రీ భారానికి తగినప్రతిక్రియ చేసి నన్ను రక్షించండి' అని భూదేవి పలుకగా.

**క. వనజాసను ననుమతమున । వనరుహనాభుండు వాసవప్రముఖసుప**
**ర్వనికాయాంశంబులతోఁ । దనరఁగఁ బుట్టించె నుర్విఁ దనయంశమ్మున్. 54**

**ప్రతిపదార్థం:** వనజాసను= బ్రహ్మదేవుడి; అనుమతమునన్= సమ్మతితో; వనరుహనాభుండు= విష్ణుదేవుడు; వాసవ, ప్రముఖ, సుపర్వనికాయాంశంబులతోన్= ఇంద్రుడు మొదలైన ప్రముఖులైన దేవతాగణాల అంశలతో; తన+అంశమ్మున్= తనపాలును; తనరఁగన్= అతిశయించేటట్లుగా; ఉర్విన్= భూమియందు; పుట్టించెన్.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడి సమ్మతితో విష్ణుదేవుడు ఇంద్రాదిదేవతల అంశలతో, తన అంశ అతిశయించేటట్లుగా భూమిపై జన్మింపజేశాడు.

**విశేషం:** భూభారాన్ని తొలగించటానికి దేవతల అంశాలతో, తన అంశంతో భూమిమీద వీరులను సృష్టించినవాడు బ్రహ్మ కాడు విష్ణువు. ఇది పురాణాలలో వర్ణించే సర్గప్రతిసర్గాలవంటిది కాదు. భారతేతిహాసంలో పుట్టిన దైవాసురాంశ సంభూతులు విష్ణుసంకల్పంవలన పుట్టినవారు. కురుక్షేత్రయుద్ధంలో తాము సంఘర్షణపడి అందులో అపారప్రజానష్టం కలిగించి భూభారం తగ్గించటం వారి ఆశయం.

**క. దితిసుత దానవ యక్ష । ప్రతతుల యంశములఁ బుట్టి ప్రజలకు విహితా**
**హితు లగుచుండి రనేకులు । జితకాశులు ధరణిపతులు శిశుపాలాదుల్. 55**

**ప్రతిపదార్థం:** దితిసుత, దానవ, యక్షప్రతతులన్= దైత్య దానవ యక్షసమూహాలతో; అనేకులు= పెక్కుమంది; జితకాశులు= జయశీలురు; శిశుపాల+ఆదుల్= శిశుపాలుడు మొదలైన; ధరణీపతులు= రాజులు; పుట్టి= జన్మించి; ప్రజలకున్= ప్రజలకు విహిత+అహితులు+అగుచుండిరి= మిత్రులున్నూ, శత్రువులున్నూ అవుతున్నారు.

**తాత్పర్యం:** దైత్య దానవ యక్షుల అంశలతో పెక్కుమంది శిశుపాలాది జయగర్వితులైన రాజులు జన్మించి ప్రజలకు హితులుగానూ, అహితులుగానూ ఉన్నారు.

**చ. అతులబలాఢ్యు లైన యమరాంశ సముద్భవు లెల్లఁ బాండుభూ**
**పతిసుతపక్ష మై, సురవిపక్ష గణాంశజు లెల్ల దుర్మదో**
**ద్ధత కురురాజ పక్షమయి, ధారుణిభారము వాయ ఘోరభా**
**రతరణభూమి నీల్గిరి పరస్పరయుద్ధము సేసి వీరు లై. 56**

**ప్రతిపదార్థం:** అతుల బలాఢ్యులు+ఐన= సాటిలేని బలసంపన్ను లైన; అమర+అంశ సముద్భవులు+ఎల్లన్= దేవతల అంశలతో పుట్టిన వా రంతా; పాండుభూపతి సుత, పక్షము+ఐ= పాండవేయుల పక్షాన్ని పొంది; సుర విపక్షగణ + అంశజులు+ఎల్లన్= రాక్షసుల సమూహాల అంశాలలో పుట్టిన వారంతా; దుర్మద+ఉద్ధత కురురాజ పక్షము+అయి= దుర్మదుడున్నూ, గర్వితుడున్నూ అయిన దుర్యోధనుడి పక్షం పొందినవారై; ధారుణి, భారము+పాయన్= భూభారం తొలగేటట్లుగా; వీరులు+ఐ; పరస్పరయుద్ధము+చేసి= ఒకరితో, ఒకరు పోరాడి; భారత రణభూమిన్= భారతయుద్ధరంగంలో; ఈల్గిరి= చనిపోయారు.

**తాత్పర్యం:** దేవతల అంశలతో జన్మించిన సాటిలేని పరాక్రమవంతు లంతా పాండవేయులపక్షమై, రాక్షసాంశలతో పుట్టినవారంతా ఉద్ధతుడు, ఉన్మదుడు అయిన దుర్యోధనుడిపక్షాన్ని పొంది, వీరులై ఒకరితో ఒకరు పోరాడి భూభారం తొలగేటట్లుగా భారత రణరంగాన హతులైనారు.

**విశేషం:** దేవాసుర ప్రవృత్తుల నడుమ జరిగే బలమైన సంఘర్షణను వర్ణించటం ఇతిహాస స్వభావం.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 57**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అనగా విని జనమేజయుడు వైశంపాయనుడితో ఈవిధంగా అన్నాడు.

**క. ఆదిత్య దైత్య దానవు, లాదిగఁ గల భూతరాశి దగు సంభవమున్**
**మేదినిఁ దదంశముల మ, ర్త్యోదయములు నాకుఁ జెప్పు మొగి నేర్పడఁగన్. 58**

**ప్రతిపదార్థం:** ఆదిత్య, దైత్య, దానవులు= దేవతలు, రాక్షసులు, దానవులు; ఆదిగన్+కల= మొదలుగా గల; భూతరాశిది+అగు= జీవసముదాయానికి సంబంధించిన; సంభవమున్= పుట్టుకను; మేదినిన్= భూమియందు; తద్+అంశములన్= వారి అంశలతో; మర్త్య+ఉదయములు= మానవులయొక్క పుట్టుకలు; ఒగిన్= క్రమంగా; ఏర్పడఁగన్= తేట తెల్లమయ్యేటట్లుగా; నాకున్+చెప్పుము= నాకు తెల్పుము.

**తాత్పర్యం:** దేవదానవ రాక్షసుల జీవసముదాయంయొక్క పుట్టుకను, ఆ అంశలతో వా రీ భూమిపై మానవులుగా జన్మించటాన్నిగురించి నాకు తేటతెల్లంగా చెప్పండి.

**విశేషం:** దేవదానవాదుల అంశావతారాలుగా భూమిమీద పుట్టినవారినిగురించి చెప్పేముందు ఆ అంశలకు మూలకారకు లైనవారి పుట్టుకల విశేషాలను వివరించి, కథను ప్రసన్నం చేయుమని (తేటతెల్లంచేయుమని) జనమేజయు డడిగాడు.

## దేవదానవప్రముఖుల యుత్పత్తిక్రమము (సం. 1-59-9)

**వ. అనిన విని జనమేజయునకు వైశంపాయనుం డి ట్లని చెప్పెఁ; దొల్లి సకలజగదుత్పత్తినిమిత్తభూతుం డైన బ్రహ్మకు మానసపుత్త్రు లైన మరీచియు, నంగిరసుండును, నత్రియుఁ, బులస్త్యుండును, బులహుండును, గ్రతువును ననునార్వురు పుట్టి; రందు మరీచికిఁ గశ్యపప్రజాపతి పుట్టెఁ; గశ్యపువలనఁ జరాచర భూతరాశి యెల్ల నుద్భవిల్లె; నె ట్లనిన- బ్రహ్మదక్షిణాంగుష్ఠంబున దక్షుండును, వామాంగుష్ఠంబున ధరణి యను స్త్రీయునుం బుట్టిన యయ్యిరువురకును. 59**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; జనమేజయునకు; వైశంపాయనుండు; ఇట్లు+అని, చెప్పెన్; తొల్లి= పూర్వం; సకల జగత్+ఉత్పత్తి నిమిత్త భూతుం డైన= సమస్త లోకాలను సృష్టించేందుకు కారణ మైనవా డైన; బ్రహ్మకున్; మానస, పుత్త్రులు= మనస్సునుండి పుట్టిన కొడుకులు; ఐన; మరీచియున్; అంగిరసుండునున్; అత్రియున్; పులస్త్యుండును; పులహుండును; క్రతువునున్; అను+ఆర్వురు; పుట్టిరి; అందున్= వారిలో; మరీచికిన్; కశ్యప ప్రజాపతి; పుట్టెన్; కశ్యపు వలనన్; చర+అచర భూతరాశి= జంగమ స్థావరాలు మొదలుగాగల జీవసముదాయం; ఎల్లన్+ఉద్భవిల్లెన్= సమస్తం పుట్టింది; ఎట్లు+అనినన్= ఏవిధంగా అంటే; బ్రహ్మ, దక్షిణ+అంగుష్ఠంబునన్= బ్రహ్మ యొక్క కుడిచేతి బొటన వ్రేలియందు; దక్షుండును; వామ+అంగుష్ఠంబునన్= ఎడమచేతి బొటనవ్రేలియందు; ధరణి, అను, స్త్రీయునున్= ధరణి అనే పేరుగల వనితయున్నూ; పుట్టినన్= పుట్టగా; ఆ+ఇరువురకును= ఆ ఇద్దరికిన్నీ.

**తాత్పర్యం:** మానవజాతిపుట్టుకనుగురించి వైశంపాయనుడు జనమేజయుడికి ఇట్లా చెప్పాడు: సృష్టికారకు డైన బ్రహ్మదేవుడి మానసపుత్త్రు లైన వారు ఆరుగురు. వారు మరీచి, అంగిరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అనే పేర్లు కలవారు. వీరిలో మరీచికి కశ్యపప్రజాపతి జన్మించాడు. కశ్యపుడికి స్థావరజంగమా లన్నీ పుట్టినవి. బ్రహ్మదేవుడి కుడిచేతి బొటనవ్రేలియందు దక్షు డనే వాడున్నూ, ఎడమచేతి బొటనవ్రేలియందు ధరణి అనే స్త్రీయున్నూ జన్మించారు వారిద్దరికి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. సుతు లనఘులు వేవురు దమ । యుతు లై యుదయించి, సాంఖ్యయోగాభ్యాసో**
**న్నతిఁ జేసి ముక్తు లై, భూ । రితేజు లందఱును నూర్ధ్వరేతసు లైనన్. 60**

**ప్రతిపదార్థం:** అనఘులు= పుణ్యులు; వేవురు= వేయిమంది; సుతులు= కొడుకులు; దమయుతులు+ఐ= ఇంద్రియనిగ్రహంతో కూడినవా రై; ఉదయించి= జన్మించి; సాంఖ్య యోగ+అభ్యాస+ఉన్నతిన్, చేసి= సాంఖ్య మనే యోగాన్ని అభ్యసించటంలోని గొప్పతనంచేత; భూరి, తేజులు= గొప్ప తేజస్సు కలవారు; అందఱును; ముక్తులు+అయి; ఊర్ధ్వ, రేతసులు+ఐనన్= ఋషులు కాగా.

**తాత్పర్యం:** ధరణికి, దక్షునికి వేయిమంది పుత్రులు జన్మించారు. వారు ఇంద్రియనిగ్రహం కలవారై సాంఖ్య యోగాన్ని అభ్యసించి, ముక్తు లై ఊర్ధ్వరేతసులు (ఋషులు) కాగా.

**వ. పదంపడి యేఁబండ్రుకూఁతులుం బుట్టిన, వారల నెల్ల దక్షుం డపుత్త్రకుండు గావునఁ బుత్త్రీకరణంబు సేసి, యందుఁ గీర్తి లక్ష్మీ ధృతి మేధా పుష్టి శ్రద్ధా క్రియా బుద్ధి లజ్జా మతు లను వనితలఁ బదుండ్రను ధర్ముం డను మనువున కిచ్చె; నశ్విన్యాదు లైన యిరువదేడ్వు రను జంద్రున కిచ్చె; నదితి దితి దను కాలా నాయు స్సింహికా ముని కపిలా వినతా క్రోధా ప్రాధా క్రూరా కద్రువ లను పదుమువ్వురను గశ్యపున కిచ్చె; నం దదితి యనుదానికి ధాతృ మిత్రార్యమ శక్ర వరుణాంశు భగ వివస్వ త్పూష సవితృ త్వష్టృ విష్ణు లనంగా ద్వాదశాదిత్యులు పుట్టిరి; మఱియును. 61**

**ప్రతిపదార్థం:** పుత్త్రీకరణము= పుత్రులుగా భావించుట.

**తాత్పర్యం:** దక్షప్రజాపతికి ఏభైమంది కుమార్తెలు జన్మించారు. వారిలో పది మందిని ధర్ముడికి, ఇరవైఏడు మందిని చంద్రుడికి, పదమూడు మందిని కశ్యపుడికి ఇచ్చాడు. కశ్యపుడికి ఇచ్చిన కుమార్తెలలో అదితి అనే కుమార్తెకు ద్వాదశాదిత్యులు జన్మించారు.

**క. దితి యనుదానికి నప్రతి । హతబలుఁడు హిరణ్యకశిపుఁ డనఁ బుట్టె సుతుం;
డతనికి నేవురు పుట్టిరి । ప్రతాపగుణయుతులు సుతులు ప్రహ్లాదాదుల్. 62**

**ప్రతిపదార్థం:** దితి+అనుదానికిన్= దితియనుపేరుగల వనితకు; అప్రతిహతబలుఁడు= అడ్డగించరాని శక్తి గలవాడైన; హిరణ్యకశిపుఁడు= హిరణ్యకశిపుడనే పేరుగలిగిన; సుతుండు= కుమారుడు; పుట్టెన్= జన్మించాడు; అతనికిన్= ఆహిరణ్యకశిపుడికి; ప్రతాప గుణయుతులు= శౌర్య మనే గుణముతో కూడిన వారైన; ప్రహ్లాద+ఆదుల్= ప్రహ్లాదుడు మొదలైన; సుతులు= కొడుకులు; ఏవురు= ఐదుమంది; పుట్టిరి= కలిగిరి.

**తాత్పర్యం:** దక్షుడు కశ్యపుడి కిచ్చిన తన కూతుళ్ళలో దితి అనే ఆమెకు హిరణ్యకశిపు డనే అవక్రపరాక్రముడు జన్మించాడు. అతడికి బలపరాక్రమ గుణసంపన్ను లైన ప్రహ్లాదుడు మొదలుగా గల అయిదుగురు కుమారులు పుట్టారు.

**వ. ఆ ప్రహ్లాదసంహ్లాదానుహ్లాద శిబిబాష్కలులయందుఁ బ్రహ్లాదునకు విరోచన కుంభనికుంభు లనంగా ముువ్వురు పుట్టి; రందు విరోచనునకు బలి పుట్టె; బలికి బాణాసురుండు పుట్టె; దను వనుదానికి విప్రచిత్తి శంబర నముచిపులోమాసి లోమకేశి దుర్జయాదు లయిన దానవులు నలువండ్రు పుట్టిరి; వారల పుత్త్రపౌత్త్రవర్గం బసంఖ్యాతం బై ప్రవర్తిల్లెఁ; గాల యనుదానికి వినాశనక్రోధాదు లెనమండ్రు పుట్టిరి. 63**

**ప్రతిపదార్థం:** నలువండ్రు= నలభైమంది; పుత్త్ర పౌత్ర వర్గంబు= కొడుకుల, మనుమల సమూహం; అసంఖ్యాతంబు= లెక్కపెట్టరానిది; ఎనమండ్రు= ఎనిమిదిమంది;

**తాత్పర్యం:** ఆ అయిదుగురిలో ప్రహ్లాదుడికి విరోచనుడు, కుంభకుడు, నికుంభుడు అనే ముగ్గురు కొడుకులు పుట్టారు. విరోచనుడికి బలి పుట్టాడు. బలికి బాణాసురుడు జన్మించాడు. దను వనే వనితకు విప్రచిత్తి మొదలైన

నలుబది (40) మంది దానవులు కలిగారు. వారి కొడుకుల, మనుమళ్ళ సమూహం లెక్కించటానికి శక్యం కానిదై వ్యాపించింది. కాల అనే వనితకు వినాశనుడు, క్రోధుడు మొదలైన ఎనిమిదిమంది పుట్టారు.

**ఆ. అజితశక్తియుతులనాయువ యనుదాని । కజరు లధిక వీరు లతుల భూరి**
**భుజులు శక్రరిపులు పుట్టిరి నలువురు । విక్షర బలవీర వృత్రు లనఁగ. 64**

**ప్రతిపదార్థం:** అజితశక్తి యుతులు= జయించబడని శక్తితో కూడిన వారైన; అజరులు= ముసలితనం లేనివారు; అధికవీరులు= గొప్ప పరాక్రమవంతులు; అతుల, భూరి, భుజులు= సాటి లేని భుజబలం కలవారైన; విక్షర బలవీర వృత్రులు+అనఁగన్= విక్షరుడు, బలుడు, వీరుడు, వృత్రు డనే పేర్లు కలవారు; నలువురు; శక్రరిపులు= దేవేంద్రుడికి శత్రువులు; అనాయువ, అను, దానికిన్= అనాయువ అనే ఆమెకు; పుట్టిరి= జన్మించారు.

**తాత్పర్యం:** అనాయువు అనే ఆమెకు మహాపరాక్రమవంతు లైన విక్షర బల వీర వృత్రు లనే పేర్లు కల నలుగురు కుమారులు ఇంద్రుడికి శత్రువు లై జన్మించారు.

**వ. మఱియు సింహిక యనుదానికి రాహువు పుట్టె; ముని యనుదానికి భీమసేనోగ్రసేనాదు లయిన గంధర్వులు పదార్వురు పుట్టిరి; కపిల యను దానికి నమృతంబును గోగణంబులును బ్రాహ్మణులును ఘృతాచీ మేనకాదు లయిన యప్సరసలును బుట్టిరి; వినత యను దానికి ననూరుండును గరుడుండును బుట్టి; రం దనూరునకు శ్యేని యనుదానికి సంపాతి జటాయువులు పుట్టిరి; క్రోధ యను దానికిఁగ్రోధవశగణంబు పుట్టెఁ; బ్రాధ యను దానికి సిద్ధాదులు పుట్టిరి; క్రూర యనుదానికి సుచంద్ర చంద్ర హంత్రాదులు పుట్టిరి; కద్రువ యను దానికి శేష వాసుకి పురోగమానేక భుజంగముఖ్యులు పుట్టిరి. 65**

**ప్రతిపదార్థం:** పది+ఆర్వురు= పదియారుమంది; గోగణంబులు= గోవుల సమూహం; శేషవాసుకి పురోగమ+అనేక, భుజంగముఖ్యులు= శేషుడు, వాసుకి మున్నగు పలువురు సర్పశ్రేష్ఠులు.

**తాత్పర్యం:** సింహికకు రాహువు, మునికి భీమసేనాదు లైన గంధర్వులు పదహారుమంది, కపిలకు అమృతం, గోగణం, బ్రాహ్మణులు, అప్సరసలు జన్మించారు. వినతకు అనూరుడు గరుడుడు పుట్టారు. అనూరుడికి శ్యేని అనే భార్య వలన సంపాతి, జటాయువు జన్మించారు. క్రోధకు క్రోధ వశగణం పుట్టింది. ప్రాధకు సిద్ధాదులు పుట్టారు. క్రూరకు సుచంద్రాదులు జన్మించారు. కద్రువకు శేషుడు వాసుకి మొదలైన సర్పముఖ్యులు పుట్టారు.

**సీ. మఱి యంగిరసుఁ డను మానసపుత్త్రున । కయ్యుతథ్యుండు బృహస్పతియును**
**సంవర్తుఁడును గుణాశ్రయ యోగసిద్ధి య । న్యాఁతురుఁబుట్టి; రక్కొడుకులందు**
**విభుఁడు బృహస్పతి వేల్పుల కాచార్యుఁ । డై లోకపూజితుఁ డై వెలింగె;**
**మానుగా నత్రి య న్మానసపుత్త్రున । కుద్భవించిరి ధర్మయుతచరిత్రు**

**ఆ. లఖిలవేదవేదు లాద్యు లనేకులు । దీప్తరవిసహస్రతేజు లనఘు**
**లధికతరతపోమహత్త్వసంభృతవిశ్వ । భరులు సత్యపరులు పరమమునులు. 66**

**తాత్పర్యం:** అంగిరసు డనే మానసపుత్రుడికి ఉతథ్యుడు, బృహస్పతి, సంవర్తుడు అనే కొడుకులూ, గుణవతి అయిన యోగసిద్ధి అనే కూతురూ జన్మించారు. ఆ కుమారులలో బృహస్పతి దేవతలకు గురువై లోకపూజ్యుడై ప్రకాశించాడు. అత్రి అనే మానసపుత్రుడికి ధర్మస్వభావులు, వేదవిదులు, వేయిసూర్యులవెలుగు కలవారు, పుణ్యాత్ములు, అధికతపోమహితులు, ఆద్యులు సత్యపరులు అయినట్టి పరమమునులు అనేకులు జన్మించారు.

**వ. మఱియుఁ బులస్త్యుం డను మానసపుత్త్రునకు ననేకరాక్షసులు పుట్టిరి; పులహుం డను మానసపుత్త్రునకుఁ గిన్నర కింపురుషాదులు పుట్టిరి; క్రతు వను మానసపుత్త్రునకు సత్యవ్రత పరాయణు లైన పతంగ సహచరులు పుట్టిరి; పైతామహుం డైన దేవుం డను మునికిఁ బ్రజాపతి పుట్టె; వానికి ధూమ్రా బ్రహ్మవిద్యా మనస్వినీ రతాశ్వసాశాండిలీ ప్రభాత లనంగా నేడ్వురు భార్య లై; రందు ధూమ్రకు ధరుండును, బ్రహ్మవిద్యకు ధ్రువుండును, మనస్వినికి సోముండును, రతకు నహుండును, శ్వసకు ననిలుండును, శాండిలికి నగ్నియుఁ, బ్రభాతకుఁ బ్రత్యూష ప్రభాసు లనంగా నెనమండ్రు వసువులును బుట్టి; రందు ధరుం డను వసువునకు ద్రవిణుండును. హుతవాహ్యవహుండునుం బుట్టిరి; ధ్రువుండను వసువునకుఁ గాలుండు పుట్టె; సోముం డను వసువునకు మనోహర యనుదానికి వర్చసుండును శిబిరుండును బ్రాణుండును రమణుండును బృథ యను కూఁతురునుం బుట్టిరి; పృథకుఁ బదుండ్రు గంధర్వసుతులు పుట్టిరి; యహుం డను వసువునకు జ్యోతి పుట్టె; ననిలుండను వసువునకు శివ యను దానికి మనోజవుండును నవిజ్ఞాతగతియునుం బుట్టిరి. అగ్ని యను వసువునకుఁ గుమారుండు పుట్టెఁ; బ్రత్యూషుం డను వసువునకు ఋషియైన దేవలుండు పుట్టెఁ; బ్రభాసుం డను వసువునకు బృహస్పతి చెలియ లైన యోగసిద్ధికి విశ్వకర్మ పుట్టె. 67**

**తాత్పర్యం:** పులస్త్యు డనే బ్రహ్మమానసపుత్రుడికి అనేక రాక్షసులు జన్మించారు. పులహు డనే మానసపుత్రుడికి కిన్నర కింపురుషాదులు పుట్టారు. క్రతు వనేమానసపుత్రుడికి పక్షిసంతతులు జన్మించాయి. దేవుడనే మనువుకు ప్రజాపతి పుట్టాడు. ఆ ప్రజాపతికి ఏడుగురు భార్యలు. వారిలో ధూమ్ర అనే ఆమెకు ధరుడనే వాడు, బ్రహ్మ విద్యకు ధ్రువుడు, మనస్వినికి సోముడు, రతకు అహుడు, శ్వసకు అనిలుడు, శాండిలికి అగ్ని, ప్రభాతకు ప్రత్యూష, ప్రభాసు లనేపేర్లు కల ఎనిమిదిమంది వసువులు జన్మించారు. ఆ వసువులలో ధరుడనే వాడికి ద్రవిణుడు హుత హవ్యవహుడు అనే వారు జన్మించారు. ధ్రువుడనే వసువుకు కాలుడు పుట్టాడు. సోముడనే వసువుకు అతని భార్య అయిన మనోహరయందు వర్చసుడు, శిబిరుడు, ప్రాణుడు, రమణుడు అనే కుమారులు, పృథ అనే కూతురు పుట్టారు. పృథకు పదిమంది గంధర్వులు జన్మించారు. యహుడనే వసువుకు జ్యోతి జన్మించింది. అనిలుడికి శివ అనే ఆమెవలన మనోజవుడున్నూ, అవిజ్ఞాతగతియున్నూ జన్మించారు. అగ్నికి కుమారుడనే పేరు కలవాడు పుట్టాడు. ప్రత్యూషుడికి దేవలుడనే ఋషి జన్మించాడు. ప్రభాసుడనే వసువుకు బృహస్పతిసోదరి అయిన యోగసిద్ధి భార్య. ఈ దంపతులకు విశ్వకర్మ జన్మించాడు.

**క. ఆ విశ్వకర్మ నిర్మిత । దేవవిమానుండు, నిఖిల దివ్యాభరణ**
**శ్రీవిరచన పరితోషిత । దేవుఁడు, శిల్పప్రజాపతియు నై నెగడెన్. 68**

**ప్రతిపదార్థం:** ఆ విశ్వకర్మ= శ్రీ విశ్వకర్మ; నిర్మిత దేవవిమానుండు= నిర్మించబడిన దేవతలయొక్క విమానాలు కలవాడు; అంటే దేవవిమానాలను నిర్మించినవాడు; నిఖిల దివ్యాభరణ శ్రీ విరచన పరితోషిత దేవుఁడు= సమస్త మైన దివ్యము లైన

ఆభరణాల సంపదను నిర్మించటంచేత మిక్కిలి సంతృప్తిపడిన దేవతలు కలవాడు; శిల్ప ప్రజాపతియున్+ఐ= శిల్పకళలో బ్రహ్మవంటి వాడై; నెగడెన్= ప్రసిద్ధి కెక్కాడు.

**తాత్పర్యం:** ఆ విశ్వకర్మ దేవతల విమానాలను నిర్మించినవాడు, సమస్తదివ్యాభరణసంపదను విరచించటంచేత దేవతలను సంతోషపెట్టినవాడు. అతడు శిల్పప్రజాపతిగా ప్రసిద్ధి కెక్కాడు.

**వ. మఱియు స్థాణునకు మానసపుత్త్రు లైన మృగవ్యాధ శర్వ నిరృత్యజైక పాదహిర్బుధ్న్యపినాకి దహనేశ్వరకపాలి స్థాణు భవు లనంగా నేకాదశరుద్రులు పుట్టిరి; మఱి బ్రహ్మ దక్షిణస్తనంబున ధర్ముం డను మనువు పుట్టె; వానికి శమకామహర్షు లనంగా మువ్వురు పుట్టిరి; యామువ్వురకుఁ గ్రమంబునఁ బ్రాప్తి రతి నంద లనంగా మువ్వురు భార్యలైరి; సవితృనకు బడబారూపధారిణి యైన త్వాష్ట్రికి నాశ్వినులు పుట్టిరి; బ్రహ్మహృదయంబున భృగుండు పుట్టె; వానికిఁగవి పుట్టె; వానికి శుక్రుండు పుట్టి యసురుల కాచార్యుం డయ్యె; వానికిఁ జండామర్కత్వష్టృధరాత్త్రు లనంగా నలువురు గొడుకులు పుట్టిరి; వా రసురులకు యాజ్ఞికు లైరి మఱియును. 69**

**తాత్పర్యం:** స్థాణుడికి మానసపుత్రు లై ఏకాదశరుద్రులు జన్మించారు. బ్రహ్మదక్షిణస్తనంనుండి ధర్మ డనే మనువు జన్మించాడు. అతడికి శమకామహర్ష లనే ముగ్గురు పుత్రులు పుట్టారు. ఆ ముగ్గురికీ ప్రాప్తి రతి నంద లనే వారు భార్యలైనారు. సవితృడికి బడబారూపం ధరించిన త్వాష్ట్రికి ఆశ్వినులు జన్మించారు. బ్రహ్మహృదయం నుండి భృగుడు జన్మించాడు. ఆ భృగుడికి కవియును, ఆ కవికి శుక్రుడును జన్మించారు. శుక్రుడు రాక్షసులకు గురు వైనాడు. శుక్రుడికి నలుగురు కుమారులు పుట్టారు. వారు రాక్షసులకు యాజ్ఞికు లైనారు.

**సీ. విగతాఘుఁ డైన యాభృగునకుఁ బుత్త్రుఁడై । చ్యవనుండు పుట్టె; భార్గవవరుండు**
**జనవంద్యుఁ డతనికి మనుకన్యకకుఁ బుట్టె । నూరుల నౌర్వుండు భూరికీర్తి;**
**యతనికి నూర్వురు సుతులు ఋచీకాదు । లుదయించి రఖిల భూవిదిత తేజు;**
**లందు ఋచీకున కొందంగ జమదగ్ని । యనుముని పుట్టె; నాతనికిఁ బుట్టి**

**ఆ. రలఘుమతులు సుతులు నలువురు; వారిలోఁ । బరశురాముఁ డాదిపురుషమూర్తి**
**దండితాహితుండు గొండుక యయ్యును । దద్ద గుణములందుఁ బెద్ద యయ్యె. 70**

**ప్రతిపదార్థం:** విగత+అఘుఁడు+ఐన= (పూర్తిగా పోయిన పాపం గలవా డైన) పరమ పుణ్యు డైన; భార్గవ వరుండు= భృగువంశ శ్రేష్ఠుడు; జనవంద్యుఁడు= జనులచేత నమస్కరించ తగినవాడు; ఊరులన్= తొడలయందు; భూరికీర్తి= గొప్పకీర్తి గలవాడు; అఖిల భూవిదిత తేజులు= సమస్తభూమియందు ప్రసిద్ధ మైన తేజం కలవారు; అలఘుమతులు= ఉదారులు; ఆదిపురుషమూర్తి= శ్రీమన్నారాయణుడి రూపం; దండిత+అహితుండు= శత్రువులను శిక్షించినవాడు; కొండుక= బాలుడు; తద్ద= గొప్ప; గుణముల+అందున్; పెద్ద+అయ్యెన్;

**తాత్పర్యం:** పరమపుణ్యు డైన భృగువుకు చ్యవనుడు జన్మించాడు. పూజ్యు డైన చ్యవనుడికి మనుకన్యక భార్య అయినది. ఆ దంపతులకు ఊరువులందు ఔర్వుడు జన్మించాడు. అతడికి ఋచీకాదు లనబడే నూరుగురు కుమారులు పుట్టారు. వారిలో ఋచీకుడికి జమదగ్ని ఉదయించాడు. ఆ జమదగ్నిమహామునికి నలుగురు కుమారులు.

వారిలో పరశురాముడు మహావిష్ణువు అవతారం. అతడు శత్రుసంహారం కావించి చిన్న వాడైనా మహామహుడుగా ప్రసిద్ధి కెక్కాడు.

**వ. మఱియు బ్రహ్మకు ధాతయు విధాతయు ననంగా నిద్దఱు మనుసహాయులై పుట్టిరి; వారితోడను లక్ష్మి పుట్టె; లక్ష్మికి మానసపుత్త్రు లనేకులు పుట్టిరి; వరుణునకు జ్యేష్ఠకు బలుండును సుర యను కూఁతురునుం బుట్టిరి; సురయం దధర్ముండు పుట్టె; నా యధర్మునకు నిర్ఋతికి భయ మహాభయ మృత్యువు లనఁగా మువ్వురు పుట్టిరి; మఱియుఁ దామ్రకుఁ గాకియు శ్యేనియు భాసియు ధృతరాష్ట్రియు శుకియు నన నేవురుకన్యలు పుట్టిరి; యందుఁ గాకి యనుదానికి నులూకంబులు పుట్టె; శ్వేని యను దానికి శ్యేనంబులు పుట్టె; భాసి యనుదానికి భాసగృధ్రాదులు పుట్టె; ధృతరాష్ట్రి యను దానికి హంస చక్ర వాకంబులు పుట్టె; శుకియను దానికి శుకంబులు పుట్టె; మఱియుం గ్రోధునకు మృగియు మృగమందయు హరియు భద్రమనసయు మాతంగియు శార్దూలియు శ్వేతయు సురభియు సురసయు ననఁ దొమ్మండ్రు పుట్టి; రందు మృగి యనుదానికి మృగంబులు పుట్టె; మృగమంద యనుదానికి ఋక్ష చమర సృమరాదులు పుట్టె; హరి యనుదానికి వానరగణంబులు పుట్టె భద్రమనస యనుదానికి నైరావణంబు పుట్టె; నైరావణంబునకు దేవనాగంబులు పుట్టె; మాతంగి యనుదానికి గజంబులు పుట్టె; శార్దూలి యనుదానికి సింహవ్యాఘ్రంబులు పుట్టె; శ్వేత యనుదానికి దిగ్గజంబులు పుట్టె; సురభి యనుదానికి రోహిణియు గంధర్వియు ననలయు ననం బుట్టి; రందు రోహిణికిఁ బశుగణంబులు పుట్టె; గంధర్వి యనుదానికి హయంబులు పుట్టె; ననలకు గిరి వృక్షలతా గుల్మంబులు పుట్టె; సురసకు సర్పంబులు పుట్టె; నిది సకలభూత సంభవప్రకారంబు. 71**

**ప్రతిపదార్థం:** ఉలూకంబులు= గుడ్లగూబలు; శ్యేనంబులు= డేగలు; భాసగృధ్ర+ఆదులు= భాసములు గ్రద్దలు మొదలైనవి; శుకంబులు= చిలుకలు; ఋక్ష చమర సృమర+ఆదులు= ఎలుగుబంట్లు, చమరమృగాలు; పెద్ద చమరమృగాలు మొదలైనవి; ఐరావణంబు= తెల్లఏనుగు; దేవనాగంబులు= దేవతల ఏనుగులు; వానర గణంబులు= కోతుల సమూహాలు; వ్యాఘ్రంబులు= పెద్దపులులు; గుల్మంబులు= పొదలు; సకలభూతసంభవప్రకారంబు= సమస్తజీవులు పుట్టినరీతి.

**తాత్పర్యం:** బ్రహ్మకు ధాత, విధాత అనే ఇద్దరు జన్మించి మనువుకు సహాయు లైనారు. ధాతృవిధాతలతోపాటు లక్ష్మి జన్మించింది. ఆమెకు మానసపుత్రులు అనేకులు జన్మించారు. జ్యేష్ఠా వరుణ దంపతులకు బలు డనే కుమారుడు; సుర అనే కూతురు జన్మించారు. సురకు అధర్ముడు పుట్టాడు. అధర్ముడికి నిర్ఋతి భార్య అయింది. ఆ దంపతులకు భయ, మహాభయ, మృత్యువు అనే ముగ్గురు పుట్టారు. మఱియు, తామ్ర అనే ఆమెకు కాకి, శ్యేని, భాసి, ధృతరాష్ట్రి, శుకి అనే అయిదుగురు కన్యలు పుట్టారు. కాకికి గుడ్లగూబలు, శ్యేనికి డేగలు, భాసికి భాసములు, గ్రద్దలు, ధృతరాష్ట్రికి హంసలు, చక్రవాకాలు, శుకికి చిలుకలు జన్మించాయి. మఱియు క్రోధుడికి మృగి మొదలైన తొమ్మిది మంది కూతులు జన్మించారు. వారిలో మృగి అనే ఆమెకు మృగాలు, మృగమంద అనే ఆమెకు ఎలుగుబంట్లు, చిన్న, పెద్ద చమరీ మృగాలు పుట్టాయి. హరి అనే ఆమెకు కోతుల సమూహం కలిగింది. భద్రమనస అనే ఆమెకు ఐరావణం, ఐరావణానికి దేవగజాలు కలిగాయి. మాతంగికి గజాలు పుట్టాయి. శార్దూలికి సింహాలు, పెద్దపులులు పుట్టాయి. శ్వేతకు దిగ్గజాలు పుట్టాయి. సురభికి రోహిణి, గంధర్వి, అనల అనేవారు పుట్టారు. వారిలో

రోహిణికి పశువులు, గంధర్వికి గుఱ్ఱాలు, అనలకు కొండలు, చెట్లు, తీగెలు, తీవెపొదలు పుట్టాయి. సురసకు సర్పాలు పుట్టాయి. సకలజీవాలు పుట్టినరీతి ఇది.

**చ. దివిజ మునీంద్ర దానవదితి ప్రభవాదిసమస్తభూతసం**
**భవముఁ గృతావధాను లయి భక్తిమెయిన్ వినుచున్న పుణ్యమా**
**నవులకు నిక్కువం బగు మనఃప్రియ నిత్యసుఖంబులుం జిరా**
**యువు బహుపుత్త్రలాభవిభవోన్నతియున్ దురితప్రశాంతియున్. 72**

**ప్రతిపదార్థం:** దివిజమునీంద్ర దానవ దితి ప్రభవాది సమస్త భూత సంభవము= దేవతలు, మహామునులు, దానవులు, రాక్షసులు మొదలైన సమస్త జీవుల పుట్టుకను; కృతావధానులు+అయి= ఏకాగ్రత కలిగిన వారై; భక్తి మెయిన్= భక్తితో; వినుచున్+ఉన్న; పుణ్యమానవులకున్; మనఃప్రియ నిత్య సుఖంబులున్= మనసుకు ఇంపైన నిరంతర సౌఖ్యాలున్నూ; చిరాయువు= దీర్ఘాయువున్నూ, బహుపుత్ర లాభ విభవ+ఉన్నతియున్= పెక్కుమంది పుత్రులయొక్క లాభమూ, మహైశ్వర్యమూ; దురిత, ప్రశాంతియున్= పాపం అణగిపోవటమూ; నిక్కువంబు+అగున్= యథార్థ మౌతాయి. (తప్పకుండ కలుగుతాయి అని భావం).

**తాత్పర్యం:** దేవతలు, మునులు, దైత్యులు, దానవులు మొదలైన జీవుల పుట్టుకను సావధానులై వింటున్న పుణ్యులకు అభీష్టాలైన నిత్యసుఖాలు, చిరాయువు, బహుపుత్రలాభం, ఉన్నతమైన వైభవం పాపక్షయం యథార్థంగా అవుతాయి.

**విశేషం:** దేవతలు మొదలుకొని సర్వభూతాలవరకు సాగిన ఈ సృష్టికథను వినినవారికి కలిగే శుభాలను పేర్కొనే ఫలశ్రుతి ఇది. పురాణపంచలక్షణాలలో సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతరాలకు చెందిన కొన్నిఅంశాలు ఇందులో చోటుచేసికొని ఉండటంచేత పుణ్యప్రదమని తెలపటానికీ, సృష్టిలో ప్రతిజీవికూడా ఆ బ్రహ్మచైతన్యంనుండి పుట్టిన దనే ఆధ్యాత్మికస్పృహ కలగటానికీ ఈ ఫలశ్రుతి తోడ్పడుతుంది. "బీజం మాం సర్వభూతానాం, విద్ధి పార్థ! సనాతనం" (భగవద్గీత. 7.10) అనే భగవద్వాక్యం దీనికి ప్రమాణం.

### దేవదానవాద్యంశములచే భూమియందుఁ బుట్టిన వారి క్రమము (సం.1-57-84)

**వ. మఱియు మర్త్యలోకంబునందు దేవదైత్యదానవుల యంశావతారంబుల వివరించెద వినుము. 73**

**తాత్పర్యం:** భూలోకంలో దేవదానవ రాక్షసుల అంశలతో జన్మించిన వారినిగూర్చి వివరిస్తాను వినవలసింది.

**క. యాదవవంశంబున జగ । దాదిజుఁ డగు విష్ణుదేవునంశంబున ను**
**త్పాదిల్లెఁ గృష్ణుఁ డపగత । ఖేదుఁడు వసుదేవ దేవకీదేవులకున్. 74**

**ప్రతిపదార్థం:** జగత్+ఆదిజుఁడు+అగు= జగత్తునకు మొదట పుట్టినవాడైన; విష్ణుదేవు+అంశంబునన్= విష్ణుదేవునియొక్క అంశతో; అపగత, ఖేదుఁడు= దుఃఖంలేనివాడు, యాదవ వంశంబునన్; వసుదేవ, దేవకీదేవులకున్; కృష్ణుఁడు; ఉత్పాదిల్లెన్= పుట్టెను.

**తాత్పర్యం:** జగత్తుకు ఆద్యుడైన మహావిష్ణునిఅంశంతో శ్రీకృష్ణుడు యాదవవంశంలో దేవకీవసుదేవులకు జన్మించాడు.

**క. శ్రీ వెలుఁగ రోహిణికి వసు । దేవున కుదయించె విష్ణుదేవాంశమునన్**
**భూవంద్యుఁ డనంతుఁడు బల । దేవుండు ప్రలంబ ముఖ్యదితిజాంతకుఁ డై. 75**

**ప్రతిపదార్థం:** శ్రీ వెలుఁగన్= సంపద విలసిల్లేటట్లుగా; విష్ణుదేవ+అంశమునన్= విష్ణుమూర్తి అంశతో; భూవంద్యుఁడు= భూమిలోని జనులచేత నమస్కరించ తగినవాడు; అనంతుఁడు= ఆదిశేషుడు; ప్రలంబ ముఖ్యదితి జాంతకుడై (దితిజ+ అంతకుఁడై)= ప్రలంబుడువంటి ప్రముఖ రాక్షసులను చంపేవాడై; బలదేవుండు; ఉదయించెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** విష్ణుమూర్తిఅంశతో సర్వజనవంద్యు డైన ఆదిశేషుడు ప్రలంబాది రాక్షసులను సంహరించే వాడై రోహిణీ వసుదేవులకు బలదేవు డనే పేరుతో జన్మించాడు.

**వ. మఱియు లక్ష్మి యంశంబున రుక్మిణి యుదయించె; సనత్కుమారు నంశంబునఁ బ్రద్యుమ్నుండు పుట్టె; నప్సరసల యంశంబులఁ గృష్ణునిషోడశసహస్రాంతఃపురవనితలు పుట్టి; రయ్యయి వేల్పుల యంశంబుల యదువృష్ణి భోజాంధక వంశంబుల వీరు లనేకులు పుట్టిరి; మఱియు. 76**

**తాత్పర్యం:** లక్ష్మి అంశతో రుక్మిణి జన్మించింది; సనత్కుమారుడి అంశతో ప్రద్యుమ్నుడు ఉదయించాడు. అప్సరసలఅంశలతో శ్రీకృష్ణుడి పదహారువేల అంతఃపుర స్త్రీలు జన్మించారు. ఆ యాదేవతల అంశలతో యదువృష్ణి భోజఅంధక వంశాలందు వీరులు అనేకులు జన్మించారు. ఇంకను.

**క. ముదమునఁ బ్రభాసుఁ డను నెని । మిది యగు వసునంశమునను మేదిని భీష్ముం**
**డుదయించె సర్వవిద్యా । విదుఁ డపజిత పరశురామ వీర్యుఁడు బలిమిన్. 77**

**ప్రతిపదార్థం:** ముదమునన్= సంతోషంతో; ఎనిమిది+అగు= ఎనిమిదవ; వసు+అంశమునను= వసువు అంశంతో; మేదినిన్= భూమిలో; సర్వ విద్యావిదుఁడు= సమస్తవిద్యలు తెలిసినవాడు; అపజిత పరశురామ వీర్యుఁడు= ఓడింపబడిన పరశురాముడి యొక్క పరాక్రమం కలవాడు; బలిమిన్= శౌర్యంతో; భీష్ముండు; ఉదయించెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** ప్రభాసుడనే ఎనిమిదవవసువుయొక్క అంశతో సమస్తవిద్యలు ఎరిగినవాడు, తనబలిమితో పరశురాముడిని గెల్చినవాడు అయినట్టి భీష్ముడు జన్మించాడు.

**క. అనఘుఁడు సురగురునంశం । బునను భరద్వాజుకలశమునఁ బుట్టె శరా**
**సనవిద్యాచార్యుఁడు భూ । వినుతుఁడు ద్రోణుండు నిఖిలవేదవిదుం డై. 78**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= పాపరహితుడు; సురగురు+అంశంబునను= బృహస్పతి అంశతోను; భరద్వాజు కలశమునన్= భరద్వాజ మునికలశపాత్రమందు; శరాసన, విద్యా+ఆచార్యుఁడు= ధనుర్విద్యాగురువూ; భూవినుతుఁడు= భూమియందలి జనులచేత కొనియాడబడినవాడూ అయిన; ద్రోణుఁడు; నిఖిలవేద విదుండు+ఐ= సమస్త వేదాలను తెలిసినవాడై; పుట్టెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** దేవగురువైన బృహస్పతి అంశతో ధనుర్విద్యాగురువు, జనవంద్యుడు, సకల వేదజ్ఞుడు అయిన ద్రోణుడు జన్మించాడు.

**క. అలఘుఁడు కామక్రోధా । దుల యేకత్వమునఁ బుట్టె ద్రోణునకు మహా**
**బలుఁ డశ్వత్థామ రిపు । ప్రళయాంతకుఁ డస్త్రశస్త్రపరిణతుఁ డగుచున్. 79**

**ప్రతిపదార్థం:** కామ, క్రోధ+ఆదుల, ఏకత్వమునన్= కామం, క్రోధం మొదలైనవి ఏకం కావటం చేత; మహాబలుఁడు= గొప్పబలశాలి; రిపు ప్రళయాంతకుఁడు= శత్రువుల కల్లోలాన్ని అంతమొందించేవాడు; అస్త్ర శస్త్ర పరిణతుఁడు= అస్త్రాల (ప్రయోగాల)లో, శస్త్రాల (ప్రయోగాల)లో ఆరితేరినవాడు; అగుచున్; అశ్వత్థామ, ద్రోణునకున్, పుట్టెన్.

**తాత్పర్యం:** కామక్రోధాదుల ఏకత్వంవలన శత్రుప్రళయాన్ని అణచేవాడూ, అస్త్రశస్త్రాదులలో ఆరితేరిన వాడూ, మహాబలశాలియూ అయిన అశ్వత్థామ ద్రోణుడికి జన్మించాడు.

**వ. మఱియు నేకాదశరుద్రుల యంశంబునఁగృపుఁడు పుట్టె; సూర్యునంశంబునఁగర్ణుండు పుట్టె; ద్వాపరాంశంబున శకుని పుట్టె; నరిష్టాపుత్త్రుం డయిన హంసుం డను గంధర్వ విభుండు ధృతరాష్ట్రుం డయి పుట్టె; మతి యనువేల్పుగాంధారి యై పుట్టె; మఱియు నయ్యిద్దఱకుం గలియంశంబున దుర్యోధనుండు పుట్టెఁ; బౌలస్త్య భ్రాతృవర్గంబు దుశ్శాసనాది దుర్యోధనానుజ శతం బై పుట్టె; హిరణ్యకశిపుండు శిశుపాలుండై పుట్టె; సంహ్లాదుండు శల్యుం డై పుట్టె; ననుహ్లాదుండు ధృష్టకేతుం డై పుట్టె; శిబి యనువాఁడు ద్రుమసేనుం డై పుట్టె; బాష్కలుండు భగదత్తుఁ డై పుట్టె; విప్రచిత్తి యను దానవుండు జరాసంధుం డై పుట్టె; నయశ్శిరుండును నశ్వశీర్షుండును నయశ్శంకుండును గగనమూర్ధుండును వేగవంతుండును ననువా రేవురు దానవులు గేకయరాజు లయి పుట్టిరి; కేతుమంతుండమితౌజుం డై పుట్టె; స్వర్భానుం డుగ్రసేనుండై పుట్టె; జంభుండు విశోకుండై పుట్టె; నశ్వపతి కృతవర్మ యై పుట్టె; వృషపర్వుండు దీర్ఘప్రజ్ఞుం డై పుట్టె; నజరుండు మల్లుం డై పుట్టె; నశ్వగ్రీవుండు రోచమానుం డై పుట్టె; సూక్ష్ముండు బృహద్రథుం డై పుట్టెఁ; దుహుం డనువాఁడు సేనాబిందుం డై పుట్టె; నేకచక్రుండు ప్రతివింధ్యుం డై పుట్టె; విరూపాక్షుండు చిత్రవర్మ యై పుట్టె; హరుండును నహరుఁ డును సుబాహు బాహ్లికు లై పుట్టిరి; చంద్రవక్త్రుండు ముంజకేశుం డై పుట్టె; నికుంభుండు దేవాపి యై పుట్టె; శరభుండు సోమదత్తుం డై పుట్టెఁ; జంద్రుండు చంద్రవర్మ యై పుట్టె; నర్కుండు ఋషికుం డై పుట్టె; మయూరుండు విశ్వుం డై పుట్టె; సుపర్ణుండు క్రోధకీర్తి యై పుట్టె; రాహువు క్రోధుం డై పుట్టెఁ; జంద్రహంత శునకుం డై పుట్టెఁ; నశ్వుం డనువా డశోకుండైపుట్టె; భద్రహస్తుండు నందుం డై పుట్టె; దీర్ఘజిహ్వుండు గాశిరాజై పుట్టెఁ; జంద్రవినాశనుండు జానకి యై పుట్టె; బలీనుండు పౌండ్రమత్స్యుం డై పుట్టె; వృత్రుండు మణిమంతుం డై పుట్టెఁ; గాలాపుత్త్రు లెనమండ్రు క్రమంబున జయత్సేనాపరాజితనిషధాధిపతి శ్రేణిమన్మ హౌజో ఽభీరు సముద్రసేన బృహత్తులై పుట్టిరి; క్రోధ వశగణంబువలన మద్రక కర్ణ వేష్ట సిద్ధార్థ కీటక సువీర సుబాహు మహావీర బాహ్లిక క్రథ విచిత్ర సురథ శ్రీమన్నీల చీరవాసో భూమిపాల దంతవక్త్ర రుక్మిజనమేజ యాషాఢ వాయువేగ భూరితేజ ఏకలవ్య సుమిత్ర వాటధాన గోముఖ కారూషకక్షేమ ధూర్తి శ్రుతాయు రుద్వహ బృహత్సేన క్షేమాగ్ర తీర్థకుహర మతిమ దీశ్వరాదు లనేకులు పుట్టిరి; కాలనేమి కంసుండై పుట్టె; స్త్రీ పుంసరూప ధరుం డైన గుహ్యకుండు శిఖండి యై పుట్టె; మరుద్గణాంశంబునఁ బాండురాజు పుట్టె. 80**

**ప్రతిపదార్థం:** ఏకాదశరుద్రులు= పదకొండుమందిరుద్రులు. ద్వాపర+అంశంబునన్= ద్వాపరం అనే కలిసహాయుడి అంశతో; వేల్పు= దేవత; భ్రాతృవర్గంబు= సోదరుల సమూహం; మరుత్+గణ+అంశంబునన్= మరుత్తుయొక్క గణాల అంశతో.

**తాత్పర్యం:** స్పష్టం.

**క.** **మరుతులయంశంబునఁ బు । ట్టిరి ముప్పురు వివిధరణపటిష్ఠబలులు సు**
**స్థిరయశులు ద్రుపదసాత్యకి । విరాట భూపతులు భువనవిశ్రుతచరితుల్.** **81**

**ప్రతిపదార్థం:** వివిధ రణ పటిష్ఠబలులు= వేరువేరు విధా లయిన యుద్ధాలలో దృఢ మైన బలంగలవారు; సుస్థిరయశులు= శాశ్వత మైన కీర్తి కలవారు; భువన విశ్రుత చరితుల్= లోకమందు ప్రసిద్ధి కెక్కిన నడవడి కలవారు; ద్రుపద సాత్యకి విరాట భూపతులు; మరుతుల+అంశంబునన్= మరుత్తుల అంశతో; పుట్టిరి.

**తాత్పర్యం:** మరుత్తుల అంశలతో అనేకయుద్ధాలలో ఆరితేరినవారూ, శాశ్వతయశస్కులూ, లోకప్రసిద్ధ చరిత్రులూ అయిన ద్రుపదుడు, సాత్యకి, విరాటుడు అనే ముగ్గురు జన్మించారు.

**క.** **మాండవ్యుం డను మునివరు । చండతర క్రోధజనిత శాపంబున ధ**
**ర్ముం డఖిల ధర్మతత్త్వవి । దుం డనఁ విదురుఁ డనఁ బేర్మితో నుదయించెన్.** **82**

**ప్రతిపదార్థం:** మాండవ్యుండు+అను, మునివరు= మాండవ్యుడనేపేరుగల మునిశ్రేష్ఠునియొక్క; చండతరక్రోధజనితశాపంబునన్= మిక్కిలి తీవ్ర మైన కోపంవలన పుట్టిన శాపంచేత; ధర్ముండు= యముడు; అఖిలధర్మతత్త్వవిదుండు+అనన్= సమస్తధర్మాల యొక్కస్వభావం తెలిసినవా డనగా; పేర్మితోన్= గౌరవంతో; విదురుఁడు+అనన్; ఉదయించెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** మాండవ్యమహాముని తీవ్రంగా కోపించి ఇచ్చిన శాపంవలన యమధర్మరాజు సమస్తధర్మాలస్వభావం ఎఱిగినవాడుగా విదురు డనే పేరుతో జన్మించాడు.

**క.** **ప్రియ మొనరఁగ సిద్ధియు బు । ద్ధియు నను దేవతలు వసుమతిని గుంతియు మా**
**ద్రియు నై పుట్టిరి పాండు । ప్రియపత్నులు నిఖిలజగదభీష్టచరిత్రల్.** **83**

**ప్రతిపదార్థం:** ప్రియము+ఒనరఁగన్= ప్రియం కలుగుతున్నట్లుగా, సిద్ధియున్, బుద్ధియున్+అనుదేవతలు; వసుమతిని= భూమియందు, నిఖిలజగత్+అభీష్ట చరిత్రల్= సమస్త జగత్తుకు ఇష్టమైన చరిత్ర కలవారు; కుంతియున్; మాద్రియును+ఐ; పాండుప్రియపత్నులు= పాండురాజుయొక్క అనుగుభార్యలుగా; పుట్టిరి.

**తాత్పర్యం:** సిద్ధి బుద్ధి అనే దేవతలు కుంతిగానూ, మాద్రిగానూ జన్మించి సకల లోకాలకు ఇష్టమైన చరిత్ర కలవారై పాండురాజుకు పట్టమహిషు లైనారు.

**సీ.** **యమునంశమునఁ బుట్టె నధిపతి ధర్మజుం; । దనిలాంశమునఁ బుట్టె ననిలజుండు;**
**శక్రాంశమున ధనంజయుఁ డుదయించె; నా । శ్వినుల యంశముల నూర్జితులు నకుల**
**సహదేవు లనవద్యచరితులు పుట్టిరి; । శ్రీమూర్తి యై యాజ్ఞసేని పుట్టె;**
**నగ్నియంశమున జితారి ధృష్టద్యుమ్నుఁ । డనఁ బుట్టె ద్రుపదరాజాన్వయమున;**

**ఆ. ననఘ! యిది సురాసురాంశావతారకీ । ర్తనము; దీని వినినఁ దవిలి భక్తిఁ**
**జదివినను సమస్త జనులకు నఖిలదే । వాసురాదు లిత్తు రభిమతములు. 84**

**ప్రతిపదార్థం:** యముని+అంశమునన్= యముని అంశతో; అధిపతి= ప్రభు వైన; ధర్మజుండు= యుధిష్ఠిరుడు; పుట్టెన్= పుట్టెను; అనిలజుండు= భీమసేనుడు; అనిల+అంశమునన్= వాయుదేవుడి అంశతో; పుట్టెన్; శక్ర+అంశమునన్= ఇంద్రుడి అంశతో; ధనంజయుఁడు= అర్జునుడు; ఉదయించెన్= పుట్టెను; ఊర్జితులు= దృఢమైనవారు; అనవద్య, చరితులు= పవిత్ర మైన నడవడి గలవారు; నకుల, సహదేవులు; ఆశ్వినుల, అంశములన్= అశ్వినీదేవతల అంశలతో; పుట్టిరి; శ్రీమూర్తి, ఐ= లక్ష్మీ స్వరూపం కలదై; యాజ్ఞసేని= ద్రౌపది; పుట్టెన్; జిత+అరి= శత్రువులను జయించినవాడు; ధృష్టద్యుమ్నుఁడు+అనన్; ద్రుపదరాజ+అన్వయమునన్= ద్రుపదరాజు వంశంలో; అగ్ని+అంశమునన్= అగ్నిదేవుడిఅంశతో; పుట్టెన్; అనఘ!= పాపరహితు డైనవాడా! (జనమేజయా!); ఇది= ఇప్పుడు చెప్పింది; సుర+అసుర+అంశ+అవతార కీర్తనము= దేవతల యొక్క రాక్షసుల యొక్క అంశలతో జన్మించిన వారిస్తుతి; తవిలి= ఆసక్తితో; దీనిన్= ఈకథనాన్ని; వినినన్= వినినా; భక్తిన్, చదివినను= భక్తితో చదివినా, అఖిల, దేవ+అసుర+ఆదులు= సమస్తదేవతలు, రాక్షసులు మొదలైనవారు; సమస్త, జనులకున్= ప్రజలందరికి; అభిమతములు= కోరికలు; ఇత్తురు= ఇస్తారు.

**తాత్పర్యం:** యముడి అంశతో ధర్మరాజు, వాయుదేవుడి అంశతో భీముడు, ఇంద్రుడి అంశతో అర్జునుడు జన్మించారు. అశ్వినుల అంశతో నకుల సహదేవులు పుట్టారు. లక్ష్మి అంశతో ద్రౌపది జన్మించింది. అగ్నిఅంశతో ధృష్టద్యుమ్నుడు ద్రుపద రాజవంశంలో జన్మించాడు. ఓ పుణ్యుడా! ఇది దేవాసురులఅంశలతో భూతలంమీద జన్మించినవారి కీర్తనం. దీనిని భక్తితో విన్నవారికీ చదివినవారికీ ఆ దేవాసురులు కోరికలను నెరవేరుస్తారు.

**విశేషం:** ఈ సురాసురాంశావతార కథనం వినినవారికి చదివినవారికి కలిగే శుభఫలితాలను తెలిపే ఈపద్యం ఫలశ్రుతితో కూడిఉన్నది. అంశలతో అవతరించినవారు సురాసురులు. వారిలో ఆఅంశలు స్మరింపతగినవి. దైవముయొక్క పరిపూర్ణకళలో ఒకఅంశమాత్రమే భూమిమీద భౌతికాకారంతో అవతరిస్తే వారిని అంశావతారు లంటారు. సురాంశసంభూతులు దైవీసంపదకు, అసురాంశసంభూతులు ఆసురీసంపదకు ప్రతినిధులు. "ద్వౌ భూతసర్గౌ లోకేஉస్మిన్, దైవ ఆసుర ఏవచ" (భగవద్గీత 16.6) అన్న శ్రీకృష్ణుడు వీరందరిలో పరిపూర్ణావతారుడు. అవతరించిన పరమాత్మతత్త్వాన్ని ఆసురీప్రవృత్తులు దర్శించలేకపోగా ద్వేషిస్తారు; చివరకు నశిస్తారు. 'అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం' (భ.గీ. 9.11) అని అందుకే అన్నాడు శ్రీకృష్ణుడు. కాగా, సురాంశసంభూతులైన పాండవాదులు శ్రీకృష్ణుడిని భజించి, సేవించి తరించారు. 'మహాత్మానస్తు మాం పార్థ! దైవీంప్రకృతి మాశ్రితాః భజం త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్" (భ.గీ.9.13) అన్న గీతాకారుడి వాక్యం స్మరింపతగింది. భారతకథను లౌకికదృష్టితో చదివితే వచ్చేది నీతి; కావ్యదృష్టితో చదివితే కలిగేది రసానుభూతి; ఆధ్యాత్మిక దృష్టితో చదివితే పొందేది సర్వశ్రేయస్సుల విభూతి- అని ఇటువంటి ఫలశ్రుతులు పఠితలకు జ్ఞాపకం చేస్తుంటాయి.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 85**

**తాత్పర్యం:** అనగా విని జనమేయుడు వైశంపాయనుడితో ఈవిధంగా అన్నాడు.

**సీ. అభ్యస్తవేదవేదాంగులు, విధిదత్త । దక్షిణాప్రీణిత ధరణిదేవు,**
**లనవరతాశ్వమేధావభృథస్నాన । పూతమూర్తులు, కృతపుణ్యు, లహిత**
**వర్గజయుల్, ప్రాప్తవర్గచతుష్టయుల్, । సత్త్వాది సద్గుణజన్మనిలయు**
**లాభరతాది మహామహీపాలకు । లిద్ధయశోర్ధు లెందేనిఁ బుట్టి**

**ఆ. రట్టి కౌరవాన్వయంబుఁ బాండవ నృప । రత్నములకు వారిరాశి యైన**
**దాని వినఁగ వలతుఁ దద్దయుఁ బ్రీతితో । విప్రముఖ్య! నాకు విస్తరింపు. 86**

**ప్రతిపదార్థం:** అభ్యస్త, వేద, వేదాంగులు= వేదవేదాంగాలను అభ్యసించిన వారు; విధిదత్త, దక్షిణా, ప్రీణిత, ధరణి దేవులు= యజ్ఞవిధులందు ఇవ్వబడిన దక్షిణలచేత తృప్తిపరచబడిన బ్రాహ్మణులు కలవారు. (బ్రాహ్మణులను తృప్తిపరచిన వారు); అనవరత+అశ్వమేధ+అవభృథ, స్నాన పూతమూర్తులు= నిరంతర అశ్వమేధ యాగాలందలి యజ్ఞాంత స్నానాలచేత పవిత్ర మైన ఆకారాలు కలవారు; కృతపుణ్యులు= పుణ్యం చేసినవారు; అహిత వర్గజయుల్= అరిషడ్వర్గాలను (కామక్రోధలోభమోహ మదమాత్సర్యాలను), జయించినవారు; ప్రాప్త వర్గ చతుష్టయుల్= ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే వర్గ చతుష్టయాన్ని పొందినవారు; సత్త్వ+ఆది, సద్గుణ జన్మనిలయులు= సత్త్వంమొదలైన గుణాల పుట్టుకకు నివాస మైనవారు; ఆ భరత+ఆది, మహామహీపాలకులు= భరతుడు మొదలైన మహారాజులు; ఇద్ధయశస్+అర్థులు= దీప్త మైన కీర్తిని కోరేవారు; ఎందు+ఏనిన్, పుట్టిరి= దేనియందు పుట్టారో అట్టి; కౌరవ+అన్వయంబున్= కౌరవవంశాన్ని; పాండవ నృపరత్నములకున్= పాండవు లనే రాజశ్రేష్ఠులకు; వారి, రాశి+ఐన= సముద్రమైన; దానిన్= దానిని, తద్దయున్= మిక్కిలి; విప్రముఖ్య!= ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! వైశంపాయనుడా:; విస్తరింపు= వివరించి చెప్పుము; వినఁగన్, వలతున్= వినగోరుతాను.

**తాత్పర్యం:** సకలవేదవేదాంగాలు అభ్యసించినవారు, యజ్ఞయాగాలలో భూరిదక్షిణ లిచ్చి బ్రాహ్మణులను సంతృప్తి పరచిన వారు, నిరంతరం అశ్వమేధయాగా లాచరించి అవభృథస్నానంచేత పవిత్రమైన దేహాలు కలవారు, పుణ్యాచరితులు, అరిషడ్వర్గాలను జయించినవారు, ధర్మార్థకామాదులను పొందినవారు. సత్త్వగుణసంపన్నులు అయినటువంటి భరతుడు మొదలుగా గల కీర్తికాంక్షులైన మహారాజులు పుట్టిన కౌరవవంశం పాండవు లనే రత్నాలకు సముద్రం వంటిది. అటువంటి కౌరవవంశాన్నిగురించి నాకు సవిస్తరంగా ప్రీతితో తెలుపుము. విన వేడుక పడుతున్నాను.

**విశేషం:** అలం: రూపకం. కౌరవాన్వయ మనే మహాసముద్రంలో గ్రహించదగిన రత్నాలు పాండవులు, వారికథ సవిస్తరంగా చెప్పటం భారతేతిహాస వస్తుస్వభావం.

**వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డి ట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** సుగమం

**తాత్పర్యం:** అని అడుగగా వైశంపాయనుడు జనమేజయుడితో ఈవిధంగా అన్నాడు.

### కౌరవ వంశ వివరణము (సం. 1-70-10)

**చ. నిరుపమధర్మమార్గపరినిష్ఠితు లై మహి యెల్లఁ గాచుచుం**
**బరఁగిన తొంటి పూరు కురు పాండు మహీశుల పేర్మిఁ జేసి భూ**
**భరవహనక్షమం బగుచుఁ బౌరవ కౌరవ పాండవాన్వయం**
**బురుగుణసంపదం బెరిఁగి యొప్పె సమస్త జగత్ప్రసిద్ధ మై. 88**

**ప్రతిపదార్థం:** నిరుపమ, ధర్మమార్గ, పరినిష్ఠితులు+ఐ= సాటిలేని ధర్మమార్గమందు చక్కగా ఉంచబడినవా రై; మహి+ఎల్లన్= భూమినంతా; కాచుచున్= కాపాడుతూ; పరఁగిన= ప్రసిద్ధి పొందిన, తొంటి= పూర్వపు; పూరు, కురు, పాండు మహీ+ఈశుల=

పూరుడు కురుడు పాండుడు అనే పేర్లు గల మహారాజులయొక్క; పేర్మిన్+చేసి= గొప్పతనంవలన; భూ+భర వహన క్షమంబు+అగుచున్= భూభారాన్ని వహించేందుకు సమర్థ మైనది అవుతూ; పౌరవ= పూరురాజుకు సంబంధించిన; కౌరవ= కురురాజుకు సంబంధించిన; పాండవ, అన్వయంబు= పాండురాజుకు సంబంధించిన వంశం; ఉరుగుణసంపదన్= గొప్పగుణా లనే సంపదతో; పెరిఁగి= వర్ధిల్లి; సమస్త జగత్+ప్రసిద్ధము+ఐ= సమస్తలోకాలలో ప్రసిద్ధి పొందిన దై; ఒప్పెన్= శోభిల్లెను.

**తాత్పర్యం:** సాటిలేని ధర్మమార్గమందు లెస్సగా ప్రవర్తించినవారై, భూమినంతా కాపాడుతూ ప్రసిద్ధులైన పూరు, కురు, పాండురాజుల గొప్పతనంవలన పౌరవ కౌరవ పాండవ వంశాలు భూభారాన్ని వహించటానికి సమర్థమైన వవుతూ, గొప్పగుణసంపదతో పెరిగి సర్వజగత్ప్రసిద్ధా లై ఒప్పినవి.

**విశేషం:** జనమేజయు డడిగింది కౌరవవంశంలో పుట్టిన పాండవులకథ. ధర్మమార్గంలో నడవటం ఆ వంశకర్తలకు, వంశజులకు జీవితవ్రతం. ఆ ధర్మవర్తనంవలన కౌరవవంశం పౌరవ, కౌరవ, పాండవవంశంగా గుణసంపదచేత విస్తరించి లోకప్రసిద్ధిచెందింది. క్రమంగా విస్తరించిన వంశచరిత్ర విధానం తేటతెల్లమయ్యేటట్లు కథాకథనం సాగుతుం దని నన్నయ సూచన. (వివరాలకు పీఠిక చూడండి). ఈపద్యంలో రవర్ణ పునరావృత్తి అక్షరరమ్యతను ఆవిష్కరిస్తున్నది.

**వ. అది యెట్లనినం: దొల్లి దాక్షాయణి యైన యదితికిఁ గశ్యపునకుం బుట్టిన వివస్వంతునకు వైవస్వతుం డను మనువును యముండును శనైశ్చరుండును యమునయుఁ దపతియు ననం బుట్టి; రందు వైవస్వతుం డను మనువు వలన బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాదు లైన మానవులు పుట్టిరి; మఱియు వానికి వేనప్రముఖు లైన రాజు లేఁబండ్రు పుట్టి వంశకరు లై తమలోన యుద్ధంబు సేసి మడిసిరి; మఱియు నమ్మనుపుత్త్రి యైన యిల యనుదానికి సోమపుత్త్రుం డైన బుధునకుఁ బురూరవుండు పుట్టి చక్రవర్తి యై. 89**

**ప్రతిపదార్థం:** సుగమం

**తాత్పర్యం:** దక్షుడికుమార్తె యైన అదితికీ కశ్యపుడికీ జన్మించిన వివస్వంతు డనేవాడికి వైవస్వతు డనే మనువు, యముడు, శని, యమున, తపతి అనేవారు పుట్టారు. వారిలో వైవస్వతు డనే మనువువలన బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు మొదలైన మానవులు పుట్టారు. ఆ వైవస్వతుడికి వేనుడు మొదలైన రాజులు ఏభైమంది జన్మించి వంశాన్ని వృద్ధిచేసి చివరకు తమలో తాము పోరాడి మరణించారు. ఆ మనుపుత్రిక అయిన ఇల అనే ఆమెకు చంద్రుడిపుత్రు డైన బుధుడికి పురూరవుడు జన్మించాడు. అతడు చక్రవర్తి అయినాడు.

**క. ఇమ్మహిఁ ద్రయోదశ ద్వీ । పమ్ములు దన శౌర్యశక్తిఁ బాలించి మదాం**
**ధ్యమ్మున విప్రోత్తమ వి । త్తమ్ములు దా నపహరించె ధనలోభమునన్. 90**

**ప్రతిపదార్థం:** ఈ+మహిన్= ఈభూమిని; త్రయోదశ ద్వీపమ్ములు= పదమూడు ద్వీపాలను; శౌర్యశక్తిన్= పరాక్రమ సామర్థ్యంతో; పాలించి= ఏలి; మద+ఆంధ్యమ్మునన్= మదమువలని గ్రుడ్డితనంతో; విప్ర+ఉత్తమ విత్తమ్ములు= బ్రాహ్మణ శ్రేష్ఠులయొక్క సంపదలను; తాను; ఆ పురూరవుడు; ధనలోభమునన్= ధనాశతో; అపహరించెన్= దొంగిలించాడు.

**తాత్పర్యం:** ఆ పురూరవచక్రవర్తి ఈ భూమిని, పదమూడు ద్వీపాలను మహాశౌర్యంతో పాలిస్తూ మదాంధుడై బ్రాహ్మణోత్తముల ధనాలను ధనాశాపరుడై అపహరించాడు.

**క. విని దాని నుడుపఁగా బ్ర। హ్మనియుక్తుం డై సనత్కుమారుఁడు మహికిం**
**జనుదెంచె బ్రహ్మలోకం। బుననుండి యనేక దివ్యమునిసంఘముతోన్. 91**

**ప్రతిపదార్థం:** విని= దానిని తెలిసికొని; దానిన్+ఉడుపఁగాన్= దానిని మాన్పింప జేసేందుకు (పురూరవుడు చేసిన బ్రాహ్మణ ధనాపహరణాన్ని); బ్రహ్మ నియుక్తుండు+ఐ= బ్రహ్మచేత నియమించబడిన వాడై; సనత్కుమారుఁడు= సనత్కుమారు డనే దేవర్షి; అనేక దివ్యముని సంఘముతోన్= పెక్కుమంది దేవమునుల సమూహంతో; బ్రహ్మలోకంబున, నుండి; మహికిన్, చనుదెంచెన్= భూలోకానికి వచ్చాడు.

**తాత్పర్యం:** పురూరవుడు చేసిన బ్రాహ్మణధనాపహరణాన్ని విని దానిని తొలగించేందుకు బ్రహ్మచేత నియుక్తుడై సనత్కుమారుడు పెక్కుమంది దేవమునులతో బ్రహ్మలోకం నుండి భూలోకానికి వచ్చాడు.

**వ. పురూరవుండును రాజ్యగర్వంబున నమ్మునులకు దర్శనం బీనొల్లక పరిహసించిన నలిగి వారలు వాని నున్మత్తుంగా శపియించిన, వాఁడు గంధర్వలోకంబున నూర్వశీ సహితుం డై యుండె; నట్టి పురూరవునకు నూర్వశికి నాయువు ధీమంతుండు నమావసువు దృఢాయువు వనాయువు శతాయువు నను నార్వురు గొడుకులు పుట్టి; రం దాయువునకు స్వర్భానవి యను దానికి నహుష వృద్ధశర్మ రజి గయానేనసు లనంగా నేవురు పుట్టిరి; వారి యందు నహుషుండు రాజ్యాభిషిక్తుం డై. 92**

**ప్రతిపదార్థం:** సుగమం

**తాత్పర్యం:** రాజ్యగర్వంతో పురూరవుడు ఆ విచ్చేసిన దేవమునులకు దర్శనమిచ్చేందుకు ఇష్టపడక వారిని పరిహసించాడు. వారు కోపించి పురూరవుడు వెఱ్ఱివా డవాలి అని శపించారు. అంతట పురూరవుడు గంధర్వలోకంలో ఊర్వశి అనే అప్సరసతో కూడి ఉన్నాడు. ఊర్వశీపురూరవులకు ఆయువు, ధీమంతుడు, అమావసువు, దృఢాయువు, వనాయువు, శతాయువు అనే ఆరుగురు కుమారులు జన్మించారు. ఆయువు స్వర్భానవి అనే దంపతులకు నహుషుడు, వృద్ధశర్మ, రజి, గయుడు, అనేనసుడు - అనే అయిదుగురు జన్మించారు. వారిలో నహుషుడు ప్రభువై.

**మ. చతురంభోధిపరీతభూవలయమున్ సద్వీప సారణ్యస**
**క్షితిభృత్కం బగుదాని భూరిభుజశక్తిం జేసి పాలించుచుం**
**గ్రతువుల్ నూ ఱొనరించి కీర్తి వెలయంగా దిక్కులన్ నిర్జితా**
**హితుఁ డై యా నహుషుండు దాఁ బడసె దేవేంద్రత్వముం బేర్మితోన్. 93**

**ప్రతిపదార్థం:** చతుః+అంభోధిపరీత, భూవలయమున్= నాలుగుసముద్రాలచే చుట్టబడిన భూమండలాన్ని; సద్వీప, సారణ్య, సక్షితి, భృత్కం, బగు, దానిన్= ద్వీపాలతోకూడ అరణ్యాలతోకూడ, పర్వతాలతోకూడ కూడిఉన్న భూమిని; భూరి భుజశక్తిన్+చేసి= అధిక మైన బాహుపరాక్రమంతో; పాలించుచున్= పరిపాలిస్తూ; క్రతువుల్= యజ్ఞాలు; నూఱు+ఒనరించి= నూఱింటిని చేసి; దిక్కులన్= దిశలయందు; కీర్తి= యశస్సు; వెలయంగాన్= ప్రకాశించేటట్లుగా, నిర్జిత+అహితుఁడు+ఐ= శత్రువులను జయించినవాడై; ఆ నహుషుండు= స్వర్భానవి, ఆయువుల పుత్రుడైన నహుషుడు; పేర్మితోన్= గౌరవంతో; తాన్= తాను; దేవేంద్రత్వమున్= దేవేంద్రపదవిని; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** ద్వీపారణ్యపర్వతాలతో కూడినదీ నాలుగుసముద్రాలచేత చుట్టబడినదీ అయిన భూమండలాన్ని తన అపారబాహుబలంతో పరిపాలిస్తూ నూఱుయజ్ఞాలు చేసి, తనకీర్తి నలుదిశలకు వ్యాపింపజేసి, శత్రువులను జయించిన వాడైన ఆ నహుషుడు దేవేంద్రపదవిని పొందాడు.

**వ. అట్టి నహుషునకుఁ బ్రియంవద యనుదానికి యతి యయాతి సంయా త్యాయా త్యయతి ధ్రువు లనంగా నార్వురు పుట్టి; రందు యయాతి రా జై యనేకయాగంబులు సేసి శుక్రపుత్త్రి యయిన దేవయానియందు యదుతుర్వసులును వృషపర్వపుత్త్రి యయిన శర్మిష్ఠయందు ద్రుహ్యానుపూరులు ననంగా నేవురు కొడుకులం బడసి రాజ్యంబు సేయుచు శుక్రశాపంబున జరాభారపీడితుం డై కొడుకుల నందఱం బిలిచి యి ట్లనియె. 94**

**తాత్పర్యం:** నహుషుని, భార్య ప్రియంవద. ఆ దంపతులకు యతి యయాతి సంయాతి ఆయాతి అయతి ధ్రువులు అనే ఆరుగురుకుమారులు జన్మించారు. వారిలో యయాతి రాజై అనేకయజ్ఞాలు చేశాడు. శుక్రుడికుమార్తె అయిన దేవయానిని పెళ్ళాడి అతడు యదువు, తుర్వసుడు అనే ఇద్దరు కుమారులను పొందాడు. వృషపర్వపుత్రియైన శర్మిష్ఠయం దాతడు ద్రుహ్యి, అనువు, పూరు డనే ముగ్గురుకుమారులను బడసి (మొత్తం అయిదుగురు కొడుకులను పొంది), రాజ్యపరిపాలన చేస్తూ శుక్రుడిశాపంవలన ముసలితనంచేత పీడితు డయ్యాడు. అప్పు డా యయాతి తనకుమారుల నందరినీ పిలిచి ఇట్లా అన్నాడు.

**సీ. 'విషయోపభోగాభిలషణ మింకను నాకు । వదలక పెరుఁగుచున్నదియుఁ గాన**
**నందనులార! మీయం దొక్కరుండు నా । దగు జరాభారంబు దగిలి తాల్చి**
**తనజవ్వనంబు నా కొనరంగ నెవ్వఁ డీ । నోపు నాతండ సద్వీపసకల**
**ధారుణీసామ్రాజ్యభారయోగ్యుం డగు' । నని యడిగిన నగ్రతనయుఁ డయిన**

**ఆ. యదువుఁ దొట్టి సుతులు ముదిమికి నోపక । తలలు వాంచి యున్న వెలయఁ దండ్రి**
**పనుపుఁ జేసి ముదిమి గొని జవ్వనం బిచ్చెఁ । బూరుఁ డనుసుతుండు భూరికీర్తి. 95**

**ప్రతిపదార్థం:** విషయ+ఉపభోగ+అభిలషణము= ఇంద్రియ సుఖాలందలి కోరిక; ఇంకను= ఇప్పటికికూడ; నాకున్; వదలక; పెరుఁగుచున్+ఉన్నదియున్, కాన= కనుక; నందనులు+ఆర!= కుమారులారా! నాదగు= నా యొక్క జరాభారంబు= ముసలితనపు బరువును; మీయందున్+ఒక్కరుండు= మీలోఒకడు; తగిలి= ఆసక్తిగొని, తాల్చి= ధరించి; తన జవ్వనంబు= తన యౌవనము; నాకున్; ఒనరంగన్= ఒప్పునట్లుగా; ఏ+వాఁడు; ఈనోపున్= ఇయ్యగలవాడో; ఆతండు+అ= అతడే; సద్వీప, సకల, ధారుణీ, సామ్రాజ్య, భార, యోగ్యుండు+అగున్= ద్వీపాలతో కూడిన సమస్త భూమిసామ్రాజ్యంయొక్క భారానికి తగినవా డౌతాడు; అని; అడిగినన్; అగ్రతనయుఁడు+అయిన= పెద్దకుమారుడైన; యదువున్ తొట్టి= యదు వనువాడు మొదలుగా గల; సుతులు= కుమారులు; ముదిమికిన్+ఓపక= ముదిమిని తీసికొనేందుకు ఇష్టపడక; తలలు, వాంచి, ఉన్నన్= అనంగీకారసూచకంగా తలలు వంచుకొని ఉండగా; వెలయన్= ప్రకాశమయ్యేటట్లు; తండ్రిపనుపున్+చేసి= తండ్రి ఆజ్ఞతో; భూరికీర్తి= గొప్పకీర్తి కలవాడు; పూరుఁడు+అను, సుతుండు; ముదిమి, కొని= ముసలితనాన్ని తీసికొని; జవ్వనంబు+ఇచ్చెన్= యౌవనాన్ని ఇచ్చాడు.

**తాత్పర్యం:** 'ఇంద్రియసుఖాభిలాష న న్నింకా వదలిపెట్టక పెరుగుతున్నది. కాబట్టి ఓ కుమారులారా! మీలో ఒక్కడు నా ముసలితనాన్ని తీసికొని నిజ యౌవనాన్ని నాకు ఇవ్వండి. ఆవిధంగా ఇవ్వగలిగినవాడే ఈ సకలసామ్రాజ్య

భారాన్ని వహించేందుకు యోగ్యుడు' అని యయాతి ఈవిధంగా అడుగగా యదువు మొదలైన కొడుకులు మారు మాటాడక తలలు వంచుకొని ఉన్నారు. అప్పుడు పూరుడనే కొడుకు తండ్రిఆజ్ఞతో అతడి ముసలితనాన్ని తాను తీసికొని తన యౌవనాన్ని తండ్రికి ఇచ్చాడు.

**విశేషం:** ఈ సీసపద్యంలో ప్రాసయతి పాటింపబడింది.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 96**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అనగా విని జనమేయుడు వైశంపాయనునితో ఈవిధంగా అన్నాడు.

**యయాతి మహారాజు చరిత్రము (సం.1-71-3)**

**తే. వర్ణధర్మముల్ గాచుచు వసుధ యెల్ల । ననఘ చరితుఁ డై యేలిన యయ్యయాతి**
**భూసురోత్తమ! భార్గవపుత్త్రి యైన । దేవయానిని దా నెట్లు దేవిఁ జేసె?. 97**

**ప్రతిపదార్థం:** వర్ణ ధర్మముల్= కులం మొదలైన వాటి ధర్మాలను; కాచుచున్= కాపాడుతూ; వసుధ, ఎల్లన్= భూమినంతనూ; అనఘ చరితుఁడు+ఐ= పుణ్యవర్తను డై; ఏలిన= పాలించిన; ఆ+యయాతి= ఆ యయాతిమహారాజు; భూసురోత్తమ!= ఓ వైశంపాయన మహర్షీ! (ఓ బ్రాహ్మణోత్తమా!); బ్రాహ్మణులందు ఉత్తముడా!; భార్గవపుత్త్రి+ఐన= శుక్రుడికూతు రైన; దేవయానిని= దేవయాని అనే ఆమెను; తాను; ఎట్లు; దేవిన్= భార్యగా; చేసెన్= చేశాడు?

**తాత్పర్యం:** వర్ణాశ్రమధర్మాలను సంరక్షిస్తూ పుణ్యవర్తను డై భూమండలాన్ని ఏలిన ఆ యయాతిమహారాజు బ్రాహ్మణోత్తము డైన శుక్రుడికూతురును- దేవయానిని భార్యగా ఎట్లా చేసికొన్నాడో ఓ వైశంపాయనమహర్షీ! తెలుపవలసింది.

**విశేషం:** వర్ణాశ్రమధర్మాలను రక్షించిన యయాతి విలోమవివాహాన్ని ఎట్లా చేసికొన్నా డని ధర్మసందేహం.

**తే. విపులతేజంబునను దపోవీర్యమునను । జగదనుగ్రహనిగ్రహశక్తియుక్తుఁ**
**డయినయట్టి యయాతికి నలిగి యేమి । కారణంబున శాపంబు కావ్యుఁ డిచ్చె? 98**

**ప్రతిపదార్థం:** విపుల, తేజంబునను= విస్తార మైన తేజస్సుచేతను, తపస్+వీర్యమునను= తపస్సుయొక్క ప్రభావంచేతనున్నూ; జగత్+అనుగ్రహ, నిగ్రహశక్తియుక్తుఁడు= లోకాన్ని అనుగ్రహించటంలోనూ, నిరోధించటంలోనూ శక్తితో కూడిన వాడు, అయిన, అట్టి, యయాతికిన్; అలిగి= కోపించి, కావ్యుఁడు= శుక్రుడు; ఏమి, కారణంబునన్, శాపంబు+ఇచ్చెన్= ఏ కారణంవలన శపించాడు?

**తాత్పర్యం:** విస్తారమైన తేజస్సుచేతనూ, తపఃప్రభావంచేతనూ లోకాలను అనుగ్రహించేందుకు, నిగ్రహించేందుకు సమర్థు డైనట్టి యయాతిమహారాజును కోపించి శుక్రు డేకారణాన అతడిని శపించాడు?

**వ. మఱియు నస్మద్వంశకరుం డయిన యయాతిచరితంబు విన వలతుం జెప్పు మని యడిగిన వానికి వైశంపాయనుం డి ట్లనియె. 99**

**ప్రతిపదార్థం:** వినవలతున్= వినగోరెదను.

**తాత్పర్యం:** అంతేకాక, మావంశాన్ని వృద్ధి చేసిన ఆ యయాతియొక్క వృత్తాంతాన్ని నేను వినగోరుతాను చెప్పు మని అడుగగా జనమేజయుడికి వైశంపాయనుడు ఈవిధంగా అన్నాడు.

**క. మనుజాధిప! వృషపర్వుం । డను దానవపతికి శుక్రుఁ డా చార్యుం డై**
**యనిమిషవిరోధులకుఁ బ్రియ । మొనరించుచు వివిధ విధినయోపాయములన్. 100**

**ప్రతిపదార్థం:** మనుజ+అధిప!= ఓరాజా! (జనమేజయా); దానవపతికిన్= రాక్షసరాజుకు; శుక్రుఁడు; ఆచార్యుండు+ఐ= గురువై; అనిమిష విరోధులకున్= దేవతలకు శత్రువులు ఐన రాక్షసులకు; వివిధవిధి, నయ+ఉపాయములన్= వేర్వేరు ఏర్పాట్లచే నీతులతో, ఉపాయాలతో; ప్రియము+ఒనరించుచున్= సంతోషాన్ని కలిగిస్తూ.

**తాత్పర్యం:** ఓ రాజా! వృషపర్వు డనే రాక్షసరాజుకు శుక్రుడు ఆచార్యు డై పెక్కువిధాల ఏర్పాట్లతో, నీతులతో, ఉపాయాలతో రాక్షసులకు సంతోషాన్ని కలిగిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. దేవాసుర రణమున గత । జీవితు లగు నసురవరులఁ జెచ్చెర మృతసం**
**జీవని యను విద్యఁ బున । ర్జీవులఁగాఁ బ్రతిదినంబుఁ జేయుచు నుండెన్. 101**

**ప్రతిపదార్థం:** దేవ+అసుర, రణమునన్= దేవదానవుల యుద్ధమందు; గత, జీవితులు+అగు= మరణించినవారైన; అసుర, వరులన్= రాక్షసశ్రేష్ఠులను; చెచ్చెరన్= శీఘ్రంగా; మృతసంజీవని యను విద్యన్= మృతసంజీవని అనే పేరు కలిగిన చనిపోయినవారిని తిరిగిబ్రతికించే విద్యతో; ప్రతి, దినంబున్; పునః+జీవులన్+కాన్= మరల (తిరిగి) బ్రతికినవా రయ్యేటట్లుగా; చేయుచున్+ఉండెన్= చేస్తూ ఉండేవాడు.

**తాత్పర్యం:** దేవ దానవ యుద్ధంలో మృతు లైన రాక్షసులను శీఘ్రంగా మృతసంజీవని అనే విద్యచేత వారిని ప్రతిదినం పునర్జీవితులను చేస్తున్నాడు.

**వ. దాని నెఱింగి దేవతలెల్ల నతి భీతు లై యసురుల నోర్వ నోపక శుక్రువలన మృతసంజీవని వడసి తేనోపునట్టి మహాసత్త్వుం డెవ్వం డగునో యని విచారించి బృహస్పతిపుత్త్రుండయిన కచునికడకుం జని యిట్లనిరి. 102**

**ప్రతిపదార్థం:** అతిభీతులు+ఐ= మిక్కిలి భయపడినవారై; అసురులన్= రాక్షసులను; ఓర్వన్+ఓపక= గెలువ జాలక; పడసి= పొంది; తేన్+ఓపునట్టి= తీసుకురాజాలిన; మహాసత్త్వుండు= గొప్పబలవంతుడు; కచునికడకున్= కచుని చెంతకు.

**తాత్పర్యం:** ఆ విషయం తెలిసికొని దేవతలు భయపడి, రాక్షసులను జయించలేక, శుక్రునివద్దనుండి మృతసంజీవనీ విద్యను పొంది తిరిగి రాగల గొప్పసమర్థు డెవ్వడో అని విచారించి, బృహస్పతికుమారు డైన కచుడివద్దకు వెళ్ళి ఇట్లా అన్నారు.

**క. పోరను మృతసంజీవని । కారణమున నిహతు లయ్యుఁ గా రసురవరుల్**
**వారల నోర్వఁగ మన కతి । భారము దుర్వారవీర్యబలయుతు లగుటన్. 103**

**ప్రతిపదార్థం:** పోరను= యుద్ధమందు; మృతసంజీవని, కారణమునన్; నిహతులు+అయ్యున్= చచ్చినవారయ్యూ; కారు= చావరు; అసురవరుల్= రాక్షస శ్రేష్ఠులు; దుర్వార వీర్యబలయుతులు= నివారించేందుకు శక్యం కాని వీరత్వంతో బలంతో కూడినవారు; అగుటన్= కావటంచేత; ఓర్వఁగన్= జయించటానికి; మనకున్; అతి, భారము= మిక్కిలి బరువు (శక్యం కానిది, మోయలేనిది అని భావం).

**తాత్పర్యం:** యుద్ధంలో రాక్షసులు చనిపోయినా మృతసంజీవనికారణాన చావకుండా ఉన్నారు. వారు అపార వీర్యబలవంతులు కావటంచేత వారిని జయించటం మనకు అసాధ్య మై ఉన్నది.

**క. మనపక్షంబున వా ర । ద్దనుజులచే నిహతు లయ్యుఁ దగ మృతసంజీ**
**వని లేమిఁ జేసి యమసా । దనమున కరుగుదురు వీర్యదర్పితు లయ్యున్. 104**

**ప్రతిపదార్థం:** మన పక్షంబునవారు= మనవైపు ఉన్నవారు; (దేవతలు); ఆ+దనుజులచేన్= ఆ రాక్షసులచేత, నిహతులు= చంపబడినవారు; అయ్యున్= అయినప్పటికి; తగన్= ఒప్పారగా; మృతసంజీవని, లేమిన్+చేసి= చనిపోయినవారిని బ్రతికించే మృతసంజీవనీ విద్య లేకపోవటం కారణంగా; యమసాదనమునకున్= యముడి గృహానికి (నరకానికి లేదా మృత్యువు దగ్గరకు అని భావం); వీర్యదర్పితులు= పరాక్రమం చేత గర్వించిన వారు; అయ్యున్= అయినప్పటికీ; అరుగుదురు= వెడతారు (చనిపోతారు).

**తాత్పర్యం:** మహాబలగర్వితు లైనా మనపక్షంలోనివారు రాక్షసులచేత చంపబడిన మనకు మృతసంజీవని లేనందువల్ల యముడి నివాసానికే పోతున్నారు.

**విశేషం:** సదనము (రూ) సాదనము.

**క. కావున మృతసంజీవనిఁ । దేవలయును శుక్రువలన ధృతిఁ బడసి తప**
**శ్శ్రీవిభవ! దాని బలమునఁ । గావంగావలయు సురనికాయబలంబున్. 105**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; మృతసంజీవనిన్; శుక్రువలనన్= శుక్రునివద్ద నుండి; ధృతిన్+పడసి= ధైర్యంతో పొంది; తేవలయున్= తీసికొని రావలెను, తపస్+శ్రీ విభవ!= తపస్సుయొక్క శోభావిభవం కలవాడా!; ఓకచుడా! సుర, నికాయబలంబున్= దేవతల సమూహంయొక్క బలాన్ని; దాని బలమునన్= ఆమృత సంజీవనియొక్క శక్తిచేత; కావంగాన్, వలయున్= రక్షించవలెను;

**తాత్పర్యం:** కాబట్టి శుక్రుడినుండి మృతసంజీవనీవిద్యను పొంది తీసికొని రావాలి. ఓతపోధనా! ఆ సంజీవనీ విద్యాబలంతో దేవగణాలబలాన్ని కాపాడాలి.

**క. బాలుండవు, నియమవ్రత । శీలుండవు, నిన్నుఁ బ్రీతిఁ జేకొని, తద్వి**
**ద్యాలలనాదానముఁ గరు । ణాలయుఁ డై చేయు నమ్మహాముని నీకున్. 106**

**ప్రతిపదార్థం:** బాలుండవు= నీవు గ్రహణధారణ శక్తులు గల చిన్నవాడవు; నియమవ్రత, శీలుండవు= నియమాలు, ఉపాసనాది పుణ్యకర్మలు చేయటం స్వభావంగా కలవాడవు; నిన్నున్; ప్రీతిన్= ఆదరంగా; చేకొని= దరిచేర్చి; తద్= ఆ మృత సంజీవని అనబడే; విద్యాలలనా, దానమున్= విద్య అనే కన్యాదానాన్ని; కరుణా+ఆలయుఁడు+ఐ= దయకు నివాస స్థాన మైన వాడై; ఆ+మహత్+ముని= ఆ గొప్పవా డైన శుక్రమహర్షి, నీకున్; చేయున్= చేస్తాడు.

**తాత్పర్యం:** నీవు బాలుడివి. నియమాలు, వ్రతాలు నీకు స్వభావసిద్ధ మైనవి. శుక్రాచార్యుడు నిన్ను శిష్యుడిగా స్వీకరించి, సంతోషంతో నీ కా విద్యాకన్యను దయతో ఇవ్వగలడు.

**విశేషం:** విద్యాలలనాదానము - అనే రూపక సమాసం భావికథార్థ వ్యంజకం. ముందు కథలో దేవయాని తనమనసును కచుడికి అర్పించుకొనే కథార్థం ఇందులో ధ్వని. విద్యయనే, లలనను - అనీ, విద్యను, లలనను అనీ సమన్వయింపవచ్చును.

**వ. 'దుహితృస్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుం డతిక్రమింపండు గావున నీనేర్చువిధంబున దాని చిత్తంబు వడసి శుక్రు నారాధించిన నీ కిష్టసిద్ధి యగు' నని దేవతలు ప్రార్థించి పంచినం, గచుండును దేవహితార్థంబు వృషపర్వుపురంబునకుం జని యచ్చట వేదాధ్యయనశీలుం డయి సకలదైత్యదానవ గణోపాధ్యాయుం డయి యున్న శుక్రుం గని నమస్కరించి యి ట్లనియె. 107**

**ప్రతిపదార్థం:** దుహితృస్నేహంబునన్+చేసి= కూతురునందలి ప్రేమచేత; అతిక్రమింపండు= జవదాటడు; దేవహిత+అర్థంబు= దేవతలమేలు కొరకు; సకలదైత్యదానవ గణ+ఉపాధ్యాయుండు= సమస్తదైత్యుల, దానవుల సమూహమునకు గురువు.

**తాత్పర్యం:** 'కూతురుపై నున్న ప్రేమచేత దేవయానిమాటలను శుక్రుడు జవదాటడు. కాబట్టి నీ సామర్థ్యంతో ఆమె మనసును లోబరచుకొని, శుక్రుడికి శుశ్రూష చేస్తే, నీకు కార్యసిద్ధి కలుగుతుంది' అని దేవతలు వేడుకొని పంపగా కచుడు దేవతలమేలుకొరకై వృషపర్వుడిపట్టణానికి వెళ్ళి అక్కడ నిరంతరవేదాధ్యయనపరుడున్నూ, దైత్య దానవగణానికి గురువున్నూ అయినట్టి శుక్రాచార్యుడిని చూచి నమస్కరించి ఇట్లా పలికాడు.

**విశేషం:** దేవతలు కచుడికి మృతసంజీవనిని సాధించే మెలకువ ఒకటి చెప్పారు. మంత్రవిద్య శుక్రాచార్యాధీనం; శుక్రుడు ఆతని కుమార్తె అయిన దేవయానిపట్ల ఉన్న స్నేహానికి అధీనుడు. దేవయానిని ప్రసన్నం చేసికొంటే, శుక్రుడు, ఆ తరువాత అతని విద్య అనుకూలిస్తాయి అని చెప్పారు దేవతలు. భావికథాగతిని ఈ వాక్యం ప్రసన్నం చేస్తున్నది. కథలో దేవయానిపాత్రకు కల ప్రాధాన్యానికి ప్రాతిపదిక వేశాడు నన్నయ ఇక్కడ. ప్రసన్న కథాకలితార్థయుక్తికి చక్కని ఉదాహరణం.

**క. ఏను గచుం డనువాఁడ, మ । హానియమసమన్వితుఁడ, బృహస్పతిసుతుఁడన్,**
**మానుగ వచ్చితి నీకును । భానునిభా! శిష్యవృత్తిఁ బని సేయంగన్. 108**

**ప్రతిపదార్థం:** భానునిభా= సూర్యసన్నిభుడ వైన ఓ మహర్షీ!; ఏను= నేను; మహానియమ, సమన్వితుఁడన్= గొప్ప నియమాలతో కూడినవాడిని; బృహస్పతి, సుతుఁడన్= దేవగురు వైన బృహస్పతికి కుమారుడిని; కచుండు+అను, వాఁడన్= కచుడనే పేరు కలవాడిని; శిష్యవృత్తిన్= శిష్యప్రవర్తనతో; నీకును= నీకు; పని+ చేయంగన్= సేవచేయటానికి; మానుగన్= ఒప్పిదంగా; వచ్చితిన్= వచ్చాను.

**తాత్పర్యం:** సూర్యసన్నిభుడ వైన ఓమహర్షీ! నేను కచు డనేవాడిని. బృహస్పతికుమారుడిని. మీకు శుశ్రూష చేసి సేవించటానికి వచ్చాను.

**విశేషం:** విద్యయందు ఆసక్తి, గురువునందు భక్తి, నియమనిష్ఠలయందు ప్రసక్తి కల శిష్యుడే గురువుల ఆదరగౌరవాలను పొందగలడని కచునివర్తనం తెలుపుతున్నది.

**వ. అనిన నమ్మునికుమారుని సుకుమారత్వంబును, వినయ ప్రియవచన మృదుమధురత్వంబును, ననవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబునుం జూచి శుక్రం డతిస్నేహంబున 'వీనిం బూజించిన బృహస్పతిం బూజించిన యట్ల' యని యభ్యాగతపూజల వాని సంతుష్టుంగాఁ జేసి శిష్యుంగాఁ జేకొని యున్నంత, నక్కచుండు. 109**

**ప్రతిపదార్థం:** సుకుమారత్వంబును= మృదుత్వమును (చక్కనికౌమారదశను); వినయ, ప్రియ, వచన, మృదు, మధురత్వంబును= వినయంతో కూడిన ప్రియమైన మాటలలోని మెత్తదనమున్నూ, తియ్యదనమున్నూ; అనవరత, నియమ, వ్రత, ప్రకాశిత, ప్రశాంతత్వంబునున్= నిరంతరం నియమాలచేత, ఉపాసనలచేత ప్రకాశించబడిన ప్రశాంతతను; చూచి; శుక్రుండు; అతి, స్నేహంబునన్= అమితమైన వాత్సల్యంతో; వీనిన్= కచుడిని; పూజించినన్= గౌరవిస్తే (ఆదరిస్తే); బృహస్పతిన్, పూజించిన+అట్ల, అని= బృహస్పతిని గౌరవించినట్లే ఔతుం దని; వానిన్= కచుడిని; అభ్యాగత, పూజలన్= అతిథిపూజలతో; వానిన్= కచుడిని; సంతుష్టున్+కాన్, చేసి= తృప్తిపొందినవాడిగా చేసి; (సంతోషపెట్టి); శిష్యున్+కాన్, చేకొని= శిష్యు డయ్యేటట్లు చేసికొని; ఉన్న+అంతన్= ఉండగా; ఆ+కచుండు.

**తాత్పర్యం:** అని పలికిన కచుడి సౌకుమార్యాన్ని, అతడి వినయప్రియవచనాలలోని మెత్తదనాన్ని, తియ్యదనాన్ని, నిత్యనియమవ్రతాలవలన అతనిముఖంలో వెలిగే ప్రశాంతతను చూచి శుక్రుడు మిక్కిలి ప్రేమతో 'వీడిని పూజిస్తే దేవగురువును పూజించినట్లే' అని తలచి, అతిథిమర్యాదలు చేసి అతడిని సంతృప్తిపరిచి తనశిష్యుడిగా స్వీకరించాడు. అంతట కచుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. పని యేమి పంచినఁ బదపడి చేసెద । ననక తన్ బంచిన యాక్షణంబ**
**చేయుచు నిజగురు చిత్తవృత్తికిఁ గడు । ననుకూలుఁ డై వినయంబుతోడ**
**మనమునఁ జెయ్వుల మాటలభక్తి నే । కాకారుఁ డై, మఱి యంతకంటె**
**దేవయానికి సువిధేయుఁ డై ప్రియహిత । భాషణములఁ బుష్పఫలవిశేష**

**ఆ. దానములను సంతతప్రీతిఁ జేయుచు, నివ్విధమునఁ బెక్కులేండ్లు నిష్ఠ**
**గురుని గురుతనూజఁ గొలిచి యయ్యిరువుర । నెమ్మి వడసెఁ దనదునేర్పుపేర్మి. 110**

**ప్రతిపదార్థం:** పని, ఏమి, పంచినన్= పని ఏమి ఆజ్ఞాపించినా; పదపడి= తరువాత; చేసెదను; అనక; తన్, పంచిన= తనను ఆజ్ఞాపించిన; ఆ క్షణంబు+అ= వెంటనే; చేయుచున్= చేస్తూ; నిజగురు, చిత్తవృత్తికిన్= తనగురువుయొక్క మనఃప్రవృత్తికి; కడున్+అనుకూలుఁడు+ఐ= మిక్కిలి అనుకూలంగా ఉన్నవాడై; వినయంబుతోడన్= అణకువతో; మనమునన్, చెయ్వులన్, మాటలన్, భక్తిన్= మనోవాక్కాయకర్మలలో భక్తిలో; ఏక+ఆకారుఁడై= ఒకేవిధంగా మెలిగి; మఱి; అంతకంటెన్= శుక్రుడిపట్లచూపే

భక్తికంటె; దేవయానికిన్; విధేయుఁడు+ఐ= మరింత అనుకూలు డై; ప్రియ, హిత, భాషణములన్= ప్రియాలూ, హితాలూ అయిన మాటలతో; పుష్పఫల, విశేష, దానములను= పూలు, పండ్లు మొదలైనవాటిని విశేషంగా తెచ్చి ఇవ్వటంవలనను; సంతత, ప్రీతిన్, చేయుచున్= ఎల్లప్పుడు సంతోషాన్ని కలిగిస్తూ; ఈ+విధమునన్, పెక్కులు+ఏండ్లు; నిష్ఠన్= నియమాలతోడిదీక్షతో; గురునిన్, గురుతనూజన్= గురువుగారిని, గురుపుత్రిక అయిన దేవయానిని; కొలచి= సేవించి; ఆ+ఇరువుర, నెమ్మిన్= ఆ ఇద్దరి ప్రీతిని; తనదు, నేర్పు, పేర్మిన్, పడసెన్= తన నేర్పరితనంతో పొందాడు.

**తాత్పర్యం:** ఏపని చెప్పినా తరువాత చేస్తా నని బదులు చెప్పకుండా వెంటనే చేస్తూ, శుక్రుడి మనఃప్రవృత్తికి చాలా అనుకూలు డై మనోవాక్కాయకర్మలలో ఒకేవిధం కలవా డై; అంతకంటె అధికంగా దేవయానికి మిక్కిలి విధేయుడై, ప్రియవాక్యాలతోను, పుష్పఫలాల నధికంగా తెచ్చి ఇవ్వటంతోను ఆమెకు సంతోషం కలిగిస్తూ ఈతీరుగా ఎన్నో సంవత్సరాలు గురువును గురుపుత్రిని కొలిచి ఎంతోనేర్పుతో వారి ప్రేమను పొందాడు.

**వ. ఇట్లు గురుశుశ్రూషాకౌశలంబునఁ గచుండు శుక్రునకుం బ్రియశిష్యుం డై యున్న నెఱింగి, దానవులు సహింపనోపక బృహస్పతితోడి యలుకనక్కచు నొక్కనాఁడు హోమధేనువులం గాచుచు వనంబున నేకతంబ యున్న వాని వధియించి, విశాల సాలస్కంధంబున బంధించి చని; రంత నాదిత్యుం డస్తగిరి శిఖరగతుం డగుడు మగుడి హోమధేనువు లింటికి వచ్చిన, వానితోడన కచుండు రాకున్న, దేవయాని తనమనంబున మలమల మఱుంగుచుం బోయి తండ్రి కి ట్లనియె. 111**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; గురు, శుశ్రూషా, కౌశలంబునన్= గురువును సేవించటంలోని నేర్పరితనంతో; కచుండు; శుక్రునకున్; ప్రియశిష్యుండై, ఉన్నన్= మనసుకెక్కిన శిష్యుడై ఉండగా; ఎఱింగి= తెలిసికొని, గ్రహించి; దానవులు= రాక్షసులు; సహింపన్+ఓపక= ఓర్వలేక; బృహస్పతితోడి, అలుకన్= బృహస్పతియందు ఉన్న కోపంతో; ఒక్కనాఁడు= ఒకరోజు; హోమధేనువులన్= యజ్ఞకార్యాలకు ఉపయోగపడే ఆవులను; కాచుచున్= అరణ్యాలలో మేతమేస్తున్నప్పుడు వాటికి ఎటువంటి ఆపద రాకుండా రక్షిస్తూ; వనంబునన్= అడవిలో; ఏకతంబు+అ= ఒంటరిగా; ఉన్నవానిన్; వధియించి= చంపి; విశాల, సాల, స్కంధంబునన్= విస్తార మైన చెట్టుబోదెకు; బంధించి= కట్టి; చనిరి= వెళ్ళారు; అంతన్= ఆతరువాత; ఆదిత్యుండు= సూర్యుడు; అస్తగిరి శిఖరగతుండు+అగుడున్= పడమటి కొండ శిఖరాన్ని చేరినవాడు కాగా; మగుడి= తిరిగి; హోమధేనువులు; ఇంటికిన్; వచ్చినన్= రాగా; వానితోడన్+అ= ఆగోవులతోపాటే కలిసి; కచుండు; రాక+ఉన్నన్= రాకుండా ఉండగా; దేవయాని; తన, మనంబునన్= తన మనసులో; మలమల, మఱుంగుచున్= మలమలమని మనస్సు (వేదనపడగా) పోయి= వెళ్ళి; తన, తండ్రికిన్= తన తండ్రియైన శుక్రుడితో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నది.

**తాత్పర్యం:** ఈవిధంగా కచుడు తన సేవానైపుణ్యంతో శుక్రుడికి ప్రియశిష్యు డై ఉండటం తెలిసికొని రాక్షసులు సహించలేక, దేవగురు వైన బృహస్పతితో తమకు గల వైరాన్ని పురస్కరించుకొని కోపించి, ఆ కచుడు ఒకరోజు హోమధేనువులను కాస్తూ ఒంటరిగా ఉండగా రాక్షసులు అతడిని వధించి, ఒకపెద్దచెట్టుబోదెకు బంధించి వెళ్ళిపోయారు. అప్పుడు సూర్యాస్తమయ మైనది. హోమధేనువులు తిరిగి ఇంటికి వచ్చాయి. వాటివెంబడి కచుడు రాకపోవటాన్ని గమనించి దేవయాని కలవరపడుతూ తనతండ్రివద్దకు వెళ్ళి యిట్లా అన్నది.

**ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె, ధేనువుల్**
**నేఁ డిట వచ్చె నేకతమ, నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్**

**పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ, బ్రొద్దును బోయెఁ, గచుండు నేనియున్**
**రాఁడు, వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో! 112**

**ప్రతిపదార్థం:** వాఁడి, మయూఖముల్, కలుగువాఁడు= సూర్యుడు (చురుకుచురుకు మనే కిరణాలు కలవాడు); అపర+అంబుధిన్= పశ్చిమసముద్రంలో; క్రుంకెన్= మునిగాడు (అస్తమించాడు); ధేనువుల్= గోవులు; నేఁడు; ఇట; ఏకతము+అ= ఒంటరిగానే; వచ్చెన్; నిష్ఠమెయిన్= నియమంతో; భవత్+అగ్ని హోత్రముల్= నీ హోమాగ్నులు; పోఁడిగన్= ఒప్పుగా; వేల్వఁగాన్, పడియెన్= ఆహుతు లర్పించబడెను; ప్రొద్దును+పోయెన్= ప్రొద్దు కూడా పోయింది; కచుండున్+ఏనియున్, రాఁడు= కచుడుమాత్రం తిరిగిరాలేదు; వనంబులోనన్= అడవిలో; మృగ, రాక్షస, పన్నగబాధన్+ఒందెనో= క్రూరమృగాలవలన (కాని), రాక్షసులవలన (కాని), సర్పాలవలన (కాని) ఎటువంటి ఇబ్బందినైనా పొందాడేమో!

**తాత్పర్యం:** సూర్యుడు పడమటిసముద్రంలో క్రుంకాడు. హోమధేనువులు ఒంటరిగా తిరిగి వచ్చాయి. చీకటి పడటం వలన నీ అగ్నిహోత్రాలు చక్కగా ఆహుతులను పొందుతున్నాయి. చాలా ప్రొద్దు పోయింది. కచుడు మాత్రం తిరిగి రాలేదు. అడవిలో మృగ రాక్షస సర్పాలవలన బాధను పొందాడేమో!.

**విశేషం:** అలం: స్వభావోక్తి. సంధ్యాసమయాన్ని స్వభావోక్తిలో వర్ణిస్తూనే కచుడిపట్ల దేవయానికి గల అభిలాషనుకూడ రమణీయంగా ధ్వనింపజేశాడు నన్నయ. తెలుగులోని మంచిపద్యాలలో ఇది ఒకటి. అందుకు కారణం నన్నయ రచనాశిల్పమే. మాటలవలన మనసులోని అభిలాష ప్రసన్న మౌతున్నట్లుగా చెప్పే ఈపద్యరచనలో ప్రసాదగుణం పోషింపబడటం రసవ్యంజకం. నన్నయ కవితలో ఈపద్యంవంటి ప్రసాదగుణభూయిష్ఠా లైన పద్యాలు విశేషంగా కనబడతాయి. ఇందులో దేవయాని అభిలాష వ్యంగ్యం. దానికి ఆర్తి, అధిక్షేపం, శంక, దైన్యం, నిర్వేదం మొదలైన సంచారులు పోషకాలు. సంచారులు వాక్యాలవలన, అభిలాష తాత్పర్యంవలన అనుగమ్యమానా లౌతున్నాయి. వాక్యాలలోని క్రియాపదాలవలన రసభావవ్యంజనం చేసే శిల్పం మొదట పేర్కొనదగింది. క్రుంకె; వచ్చె; పోయె- అనే భూతార్థక క్రియలు 'వాటిపని అవి కచుడిసంగతి పట్టించుకోకుండానే జరుపుకున్నాయి' అనే ఆర్తిని ధ్వనింపజేస్తున్నాయి. 'వేల్వఁగాఁబడియెఁ' అనే కర్మార్థకప్రయోగం శుక్రుడుకూడా పట్టించుకోకుండా తనవిధులు తాను యాంత్రికంగా నిర్వర్తించాడనే అమర్షభావాన్ని వ్యక్తంచేస్తున్నది. 'కచుండునేనియున్ రాఁడు' అన్నప్పుడు అన్నీ సవ్యంగా జరిగిపోతున్నప్పుడు కచుడెందుకు రాడో గమనించండి! మీ కెవ్వరికీ పట్టలేదా? కీడేమైనా జరిగిందేమో! అనే శంక అందులో ధ్వని. 'బాధనొందెనో' అన్నప్పుడు ఆర్తి, దైన్యం, నిర్వేదం ధ్వనింపబడుతున్నాయి. ఇంతేకాదు 'వాఁడిమయూఖముల్ కలుగువాఁడు' అనే విశేషణంలోని 'కలుగు' అనే తద్ధర్మార్థక క్రియకూడా వ్యంజకమే. పగలల్లా కచుడు అడవులలో ఉండటంవలన దేవయానికి ఇంట్లో కచుడి యెడబాటువలన ఎండ తీవ్రంగా ఉన్నట్లు అనిపించేదనీ, ఎప్పుడు సూర్యు డస్తమిస్తాడా అని క్షణాలు లెక్కపెట్టుతూ పగళ్ళు భారంగా గడిపేదనీ, అస్తమయం కాగానే కచుడి దర్శనంవలన చంద్రదర్శనసౌఖ్యాన్ని పొందే దనీ ధ్వని. ఆరోజు బాధకలిగించే సూర్యుడు వెళ్ళాడే కాని సుఖాన్ని ఇచ్చే కచుడు రాలేదు. ఆవులుకూడా కచుడితో కలిసివెళ్ళాయి. కాని, ఒంటరిగానే తిరిగివచ్చాయి. కలిసిఉండటంవలన కచుడిపట్ల వాటికి ఆమాత్రం స్నేహధర్మం ఉండవద్దా? అసలు ఒంటరిగా ఎందుకు వచ్చాయి? వచ్చి ఏమీ పట్టనట్లు ఎట్లా ఉన్నాయి? అని ఆమె పడే ఆవేదన ఆమెకు అతనిపట్ల ఉన్న సాహచర్యమాధుర్యాన్ని వ్యక్తంచేస్తున్నది. తండ్రి సాయంకాలంలో జరిపే అగ్నికార్యాలు యథావిధిగా జరిపాడే కాని, తనవలె తన శిష్యుడుకూడా ఆనాడు చేశాడా లేదా అని గమనించనే లేదు. అనుఁగుశిష్యుడిని ఆయన ఆరోజు ఎందుకుమర్చిపోయాడో? అని ఆమెకు అమర్షం. ప్రొద్దుపోయింది. అందరూ ఇక నిద్రపోతారు. ఆమెవలె ఆసక్తితో అతడికొరకు ఎవరూ అడగటం లేదు. ఆమెకు రతిభావోదయమూలమైన అభిలాష అంకురించింది. అందువల్లనే 'కచుడు ఒక్కడుమాత్రం తిరిగిరాడు' అని కంటతడిపెట్టి దైన్యాన్ని ప్రకటించింది. ప్రొద్దుపోతే, అడవిలో ఒంటరిగా మిగిలిపోతే కచుడికి మృగరాక్షస

సర్వబాధ లేర్పడవచ్చును. వాటివలన అతడు చనిపోవచ్చును. అతడు చనిపోయినా ఎవరికీ దిగులు లేనట్లున్నది. పరిస్థితి గమనిస్తే తండ్రి, ఇల్లు, గోసంపద మొదలైన వెన్ని ఉన్నా దేవయానికి వాటిన్నిటికంటె కచుడే ఆత్మీయుడుగా, మనసు కోరేవాడుగా అనిపించాడు. అది అభిలాషయొక్క సమగ్రాభివ్యక్తి, నన్నయ అలంకార, వస్తుధ్వనులను రసధ్వనిలో పర్యవసింపజేసే కావ్యరచనాశిల్పం ఇందులో మకుటాయమానంగా ప్రసన్నమౌతున్నది. (సంపా.)

## కచుండు దానవహతుం డై మృతసంజీవనిచే బ్రదుకుట (సం.1-71-30)

**వ. అనిన విని శుక్రుండు దనదివ్యదృష్టి నసురవ్యాపాదితుం డైన కచుం గని, వానిం దోడ్కొని తేర మృతసంజీవనిం బంచిన, నదియును బ్రసాదం బని యతి త్వరితగతిం జని, విగతజీవుం డయిన కచు నప్పుడ సంజీవితుం జేసి తోడ్కొని వచ్చినం జూచి శుక్రుండును దేవయానియు సంతసిల్లి యున్నంతఁ, గొన్నిదినంబులకు వెండియు నొక్కనాఁడు. 113**

**ప్రతిపదార్థం:** అనినన్= అని దేవయాని చెప్పగా; విని; శుక్రుండు తన దివ్య, దృష్టిన్= జ్ఞానదృష్టితో; అసుర, వ్యాపాదితుండు+ఐన= రాక్షసులచేత చంపబడిన; కచున్; కని= చూచి; వానిన్= ఆకచుని; తోడ్కొని, తేరన్= పిలుచుకొని తెచ్చేందుకు; మృతసంజీవనిన్= చచ్చిపోయినవారిని బ్రతికించే విద్యను; పంచినన్= పంపగా; అదియును= ఆ విద్యయున్నూ; ప్రసాదంబు+అని= అనుగ్రహ మని; అతి, త్వరిత, గతిన్= మిక్కిలివేగంతో కూడిన గమనంతో; చని= వెళ్ళి; విగత, జీవితుండు+అయిన= పోయిన ప్రాణం కల; కచున్; అప్పుడు+అ= ఆ క్షణమందే; సంజీవితున్, చేసి= బ్రతికినవాడిని కావించి (చేసి); తోడ్కొని, వచ్చినన్= తనవెంట తీసికొని రాగా; చూచి, శుక్రుండును; సంతసిల్లి= సంతోషించి; ఉన్న+అంతన్= ఉండగా; కొన్ని, దినంబులకున్= కొన్ని రోజులకు; వెండియున్= మరల; ఒక్కనాఁడు= ఒకరోజు.

**తాత్పర్యం:** అని దేవయాని చెప్పగా విని శుక్రుడు తనదివ్యదృష్టితో రాక్షసులచేత చంపబడిన కచుడిని చూచి, అతడిని బ్రదికించి తెచ్చేందుకు మృతసంజీవనీవిద్యను పంపగా, ఆవిద్యకూడ అది తనకు అనుగ్రహ మని తలంచి మిక్కిలివేగంతో కూడిన గమనంతో వెళ్ళి, ప్రాణరహితు డైన కచుడిని తత్క్షణమే బ్రదికించి తన వెంట తీసికొని రాగా చూచి శుక్రుడూ, దేవయానియూ సంతోషించి ఉండగా కొన్నిరోజులతర్వాత మళ్ళీ ఒకరోజున. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** చర్మచక్షువులచూపు బహిఃప్రపంచంలో కొంతవరకు కొన్నివస్తువులనుమాత్రమే చూడగలదు. ఇది సామాన్యజీవుల కందే దృష్టి. దివ్యదృష్టి దాని కతీత మైనది. దానితో ఎంతదూరంలో ఉన్నదాని నైనా, ఎక్కడున్నదాని నైనా చూడవచ్చును. ఇది మునులకు, దేవతలకు ఉంటుంది. ప్రసాదంబు+అని= రాజులు దేవతలు మొదలైన వారు ఏదైనా పనిచేయు మని ఆజ్ఞాపించగానే సేవకులు, భక్తులు అనుగ్రహంగా భావించి వినయంతో ప్రసాద మంటారు. తమరు పని చెప్పి మమ్మల్ని అనుగ్రహించా రని విన్నవించుకొంటారు.

**క. అడవికిఁ బువ్వులు దేరఁగ । వడి నరిగినకచునిఁ జంపి, వారక దనుజుల్**
**పొడవు సెడఁ గాల్చి, సురతోఁ । దడయక యబ్బూది శుక్రుఁ ద్రావించి రొగిన్. 114**

**ప్రతిపదార్థం:** అడవికిన్; పువ్వులు; తేరఁగన్= తెచ్చేందుకు; వడిన్= వేగంగా; అరిగిన= వెళ్ళిన; కచునిన్; చంపి; వారక= ఉడుగక (అంతటితో ఆగక); దనుజుల్; పొడవు= రూపం; చెడన్= చెడిపోయేట్లుగా; కాల్చి; ఆ+బూది= కచుడిని కాల్చగా

ఏర్పడిన బూడిద; సురతోన్= మద్యంతో; తడయక= ఆలస్యం చేయక; ఒగిన్= క్రమంగా; శుక్రున్= శుక్రుడిచేత; త్రావించిరి= త్రాగేటట్లుగా చేశారు.

**తాత్పర్యం:** పూలు తెచ్చేందుకై అడవికి వెళ్ళిన కచుడిని చంపారు. అంతటితో ఆగక రాక్షసులు అతడి రూపులేకుండా కాల్చి, ఆలస్యం చేయకుండా ఆ బూడిదను మద్యంతోకలిపి, క్రమంగా శుక్రుడు త్రాగేటట్లు చేశారు.

**విశేషం:** తెచ్చు, తుమున్నర్థకము తేరన్ త్రాగు - త్రావు - ప్రేరణార్థకము త్రావించు.

**వ. శుక్రుండును సురాపానమోహితుం డయి యున్నఁ, దొల్లింటియట్ల దేవయాని గచుం గానక దుఃఖిత యై 'నేఁడును గచుండు రాక మసలె; నసురులచేత నిహతుం డయ్యెఁ గావలయు' నని శోకించిన దానిం జూచి శుక్రుం డి ట్లనియె. 115**

**ప్రతిపదార్థం:** శుక్రుండును= శుక్రుడు కూడ; సురా, పాన, మోహితుండు+అయి= మద్యం త్రాగటంచేత తెలివి తప్పినవాడై; ఉన్నన్= ఉండగా; తొల్లింటి, అట్లు+అ= పూర్వం వలెనే; దేవయాని; కచున్= కచుడిని; కానక= అరయక; దుఃఖిత+ఐ= దుఃఖం పొందినదై; నేఁడును= ఈ దినానకూడ; కచుండు; రాక= రాకుండా, మసలెన్= ఆలస్యం చేశాడు; అసురులచేతన్= రాక్షసులచేత; నిహతుండు= చంపబడినవాడు; అయ్యెన్, కావలయున్= అయ్యెను కాబోలును అని; శోకించినన్= దుఃఖించగా; దానిన్= దేవయానిని; చూచి; శుక్రుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** శుక్రుడుకూడ మద్యం త్రాగటంచేత మోహం (మైకం) పొందిన వాడై ఉండగా, పూర్వంవలెనే దేవయాని కచుడిజాడ తెలియక దుఃఖంపొందిన దై, 'ఈనాడుకూడ కచుడు రాకుండా ఆలస్యం చేశాడు. రాక్షసులచేత చంపబడినవా డయ్యాడు కాబోలు' నని చింతించగా ఆమెను చూసి శుక్రుడు ఇట్లా పలికాడు.

**విశేషం:** కచుడు అడవినుండి తిరిగిరానప్పుడు మొదటిసారి ఏమైనాడో తెలియక కలవరపడింది; రెండవసారి చంపబడి ఉండవచ్చునన్న నమ్మకంతో దుఃఖించింది. మొదటిసారి మనసులోనే వేదనను దాచుకొన్నది. ఇప్పుడు దుఃఖించి బైటపెట్టింది. అభిలాష- చింత అనే దశనందుకొన్న దని ధ్వని. శృంగారస్థాయి యైన రతి దశవిధావస్థలలో పరిణతి పొందుతుందని లాక్షణికుల వివేచన. మొదటిదశనుండి రెండవదశయొక్క పరిణామం ఇందులోని రసధ్వని. (సంపా.)

**క. వగవక సంజీవని పెం । పగణిత గర్వమున నసురు లా కచుతోడం**
**బగఁ గొని చంపెద; రాతఁడు । సుగతికిఁ జనుఁగాక; యేల శోకింపంగన్?. 116**

**ప్రతిపదార్థం:** సంజీవని; పెంపు= మృతులైన వారిని బ్రతికించేవిద్యయొక్క మహత్త్వం; వగవక= తలపక; అసురులు= రాక్షసులు; అగణిత, గర్వమునన్= గణింపరాని (అధికమైన) గర్వంతో; ఆ, కచుతోడన్= ఆ కచుడితో; పగన్= వైరాన్ని; కొని= పొంది; చంపెదరు= అతడిని చంపుతారు; ఆతఁడు= ఆ కచుడు; సుగతికిన్= మంచిస్థితికి (మోక్షానికి); చనున్, కాక= పోవుగాక; శోకింపన్, ఏల= దుఃఖించట మెందుకు?

**తాత్పర్యం:** సంజీవనీవిద్యగొప్పతనాన్ని ఆలోచించక రాక్షసులు అధికగర్వంతో ఆ కచుడితో వైరం పూని అతడిని చంపుతారు. అతడు ఉత్తమగతికి వెళ్ళుగాక. దీనికి దుఃఖించట మెందుకు?

**విశేషం:** వగచు ధాతువుకు నన్నయకాలాన తలచు అనే అర్థముండేది. తరువాత దానికి దుఃఖించు అన్న అర్థ మేర్పడింది.

**వ. అనిన దేవయాని యి ట్లనియె. 117**

**తాత్పర్యం:** శుక్రు డా విధంగా పలుకగా దేవయాని ఇట్లా అన్నది.

**మ. మతిలోకోత్తరుఁ డైన యంగిరసుమన్మం, డాశ్రితుం, డాబృహ**
**స్పతికింబుత్త్రుఁడు, మీకు శిష్యుడు, సురూప బ్రహ్మచర్యాశ్రమ**
**వ్రత సంపన్నుఁ, డకారణంబ దనుజవ్యాపాదితుం డైన న**
**చ్యుతధర్మజ్ఞ! మహాత్మ! యక్కచున కే శోకింప కె ట్లుండుదున్?. 118**

**ప్రతిపదార్థం:** మతి లోక+ఉత్తరుఁడు+ఐన= బుద్ధిలో అసాధారణు డైన, అంగిరసు= అంగీరసు డనే; ముని యొక్క; మన్మండు= పౌత్రుడు (మనుమడు); ఆశ్రితుండు= ని న్నాశ్రయించినవాడు; ఆ బృహస్పతికిన్= అంతటి దేవగురువు, సుప్రసిద్ధుడున్నూ అయి బృహస్పతికి; పుత్త్రుఁడు= కొడుకు; మీకున్= శుక్రుడికి; శిష్యుఁడు; సురూప, బ్రహ్మచర్య+ఆశ్రమ+వ్రత సంపన్నుఁడు= మంచి రూపం కలవాడున్నూ, బ్రహ్మచర్యాశ్రమ మనే వ్రతంతో కూడినవాడున్నూ అయిన కచుడు; అకారణంబు+అ= కారణం లేకుండానే; దనుజ, వ్యాపాదితుండు+ఐనన్= రాక్షసులచేత చంపబడ్డవాడు కాగా; అచ్యుత; ధర్మజ్ఞ= చ్యుతి లేని ధర్మాన్ని ఎరిగినవాడా! (ధర్మమార్గం తప్పనివాడా!); మహత్+ఆత్మ= మహానుభావా! (శుక్రుడికి సంబోధన); ఆ+కచునకున్= ఆ కచుడికొరకు; ఏన్= నేను; శోకింపక= దుఃఖించక; ఎట్లు ఉండుదున్= ఏ విధంగా ఉంటాను?

**తాత్పర్యం:** చ్యుతి లేని ధర్మాన్ని ఎరిగిన వాడా! పరమధర్మజ్ఞుడా! మహానుభావా! బుద్ధియందు లోకాతీతు డైన అంగిరసు డనే మునికి మనుమడున్నూ, ని న్నాశ్రయించినవాడున్నూ, ప్రసిద్ధు డైన బృహస్పతికి కుమారుడున్నూ, మీకు శిష్యుడున్నూ, మంచిరూపం కలవాడున్నూ, బ్రహ్మచర్యాశ్రమ మనే వ్రతంతో కూడినవాడున్నూ, అయినటువంటి కచుడు కారణం లేకుండానే రాక్షసులచేత చంపబడినవాడు కాగా అతడికొరకు నే నెట్లా దుఃఖించకుండా ఉంటాను?

**విశేషం:** దేవయాని కచుడియం దనురక్తురాలయిన దన్న సంగతిని ఈపద్యంలో వ్యంగ్యంగా స్ఫురిస్తున్న స్మృతి, గుణస్తుతి అనే దశలు తెలుపుతున్నాయి. రతిభావ పరిణామదశలలో ఇవి మూడవది, నాల్గవది, అవస్థలు పది. అవి- అభిలాష, చింత స్మృతి, గుణస్తుతి, ఉద్వేగము, ప్రలాపము, ఉన్మాదము, వ్యాధి, జాడ్యము, మరణము. రాత్రికి ఆశ్రమానికి తిరిగిరాని కచుడు తప్పక చనిపోయి ఉంటాడని పూర్వానుభవ స్మృతిచర్వణంవలన నిశ్చయించింది. చనిపోతే దిగులుపడేదేముంది? అని శుక్రుడు పేర్కొనగానే ఆమె తనశోకానికి కారణం చెప్పింది. ఆ కారణం కచుడి గుణగణప్రశస్తియే. కచుడు ఉత్తమవంశజుడు. తాతతండ్రులు మహామునులు. జగద్విదితులు. ఇక గురువుగారా వారిద్దరికి ఏమాత్రం తీసిపోని మహితాత్ముడు. కచుడు అందగాడు, బ్రహ్మచర్యవ్రతనిష్ఠాపరుడు. అటువంటి యోగ్యుడు రాక్షసులకారణంగా చనిపోయాడంటే శోకించకుండా ఎలా ఉండగలను? అని పలికింది. ఇందులో కచగుణకీర్తనం వాచ్యం. ఆ కీర్తనంవెనుక ఉన్న దేవయాని విప్రలంభం వ్యంగ్యం. ఉత్తమవంశజుడు, అందగాడు, బ్రహ్మచారి, శుక్రుడి శిష్యుడు అయిన కచుడు అన్నివిధాల తనకు యోగ్యుడైన వరుడని దేవయాని భావం. దీనిని తండ్రి గ్రహించడేమి? అని కోపం. అంతటి బ్రహ్మచారి పోతే తండ్రి శోకించనందుకు అధిక్షేపం. తండ్రికి ఇష్టంలేకపోయినా దేవయాని అతడి వియోగాన్ని భరించలే నని వ్యంగ్యంగా తండ్రికి చెపుతున్నది. కచుడికి తనకూతురు నివ్వటం ధర్మం కాదు కాబట్టి శుక్రు డామె అభిలాషను గమనింపలేదు. అయినా, కనీసమానవధర్మంతో చూచినా అతడిని రక్షించటం ఉచితం, ధర్మం, ఉత్తమలక్షణం. దానిని ధ్వనింపజేసేటట్లు 'అచ్యుతధర్మజ్ఞ! మహాత్మ!' అని

దేవయాని తండ్రిని సంబోధించింది. నన్నయ దేవయాని రతిభావావస్థ (గుణస్తుతి)ను మాధుర్య మనే గుణంతో పోషించాడు. ఉక్తివైచిత్ర్యంతో కూడుకొన్న పృథక్పదత్వం ఈరచనలో గుణం. అదే మాధుర్యం. 'అటువంటి కచుడు నిష్కారణంగా మనరాక్షసులచేత చంపబడితే ముల్లోకాలలో శుక్రుడి శిష్యుడు చంపబడ్డాడనే అపకీర్తి వస్తుంది. అతడి తాతతండ్రులుకూడ లోకత్రయవిదితులు. అన్ని లోకాలలో ఈవార్త గుప్పు మంటుంది. వారందరూ శుక్రుడిని నిందిస్తారు. ఈ గురుబంధువర్గమంతటి కంటె కచుడు నాకు కావలసినవాడు. అందువలన మీకు దుఃఖంలేకపోవచ్చును, నాకుమాత్రం విచారం కలుగుతుంది- అని అనురక్తిని ఉక్తివైచిత్రితో చెప్పింది. 'శోకింప కెట్లుండుదున్' అనటంలో మరొక చమత్కారమున్నది. ఆప్తజనవియోగంవలన, పునస్సమాగమం లేని ప్రియుడి యెడబాటువలన నాయిక పొందేది శోకం. అటువంటి శోకం దేవయాని పొందింది. కచుడు బ్రతికివస్తేనే ఆ శోకం సంచారి అయి రతికి పోషక మయ్యేది. లేదా శోకం కరుణరసంగా మారుతుంది. నన్నయ రుచిరార్థసూక్తినిధిత్వానికీ, వస్తుధ్వనిని రసధ్వనిలో పర్యవసింపచేయటానికీ, ఈ పద్యం అమూల్యోదాహరణం. (సంపా.)

**వ. 'వానిం జూచి కాని కుడువనొల్ల' నని దేవయాని యేడ్చుచున్నఁ, బెద్దయుంబ్రొద్దునకుఁ బ్రసన్నుం డై శుక్రుండు దనయోగదృష్టిం జూచి లోకాలోకపర్యంతభువనాంతరంబునఁ గచుం గానక సురాసమ్మిశ్ర భస్మ మయుం డై తనయుదరంబున నున్న యక్కచుం గని, సుర సేసిన దోషంబును, నసురులు సేసిన యపకారంబును నెఱింగి. 119**

**ప్రతిపదార్థం:** వానిన్= ఆ కచుడిని; చూచి; కాని= చూసిన తరువాత కాని; కుడువన్+ఒల్లన్= తినటానికి సమ్మతించను; అని; దేవయాని; ఏడ్చుచున్+ఉన్నన్= ఏడుస్తూండగా; పెద్దయున్, ప్రొద్దునకున్= చాలాసేపటికి; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహం కలవాడై; శుక్రుండు; యోగదృష్టిన్= యోగాభ్యాసంచేత లభించిన అతీంద్రియదృష్టితో (దివ్యదృష్టితో); చూచి; లోకాలోక, పర్యంత, భువన+అంతరంబునన్= లోకాలోకపర్వతంచేత చుట్టబడిన ప్రపంచంయొక్క నడుమన్; కచున్= కచుడిని; కానక= కనుగొనలేక; సురా, సమ్మిశ్ర, భస్మమయుండు+ఐ= మద్యంలో కలిసిన బూడిదఆకారం కలవాడై; తన; ఉదరంబునన్= పొట్టలో; ఉన్న; ఆ కచున్; కని= చూచి; సుర+చేసిన= మద్యపానం చేసిన; దోషంబునున్= కీడును; అసురులు= రాక్షసులు; చేసిన; అపకారంబునున్= హానిని; ఎఱింగి= తెలిసికొని.

**తాత్పర్యం:** ఆ కచుడిని చూసినతరువాత కాని అన్నం తినేందుకు అంగీకరించ నని దేవయాని ఏడుస్తుండగా, చాలాసేపటికి అనుగ్రహం కలవా డై శుక్రుడు దివ్యదృష్టితో చూచి, లోకాలోకపర్వతంచేత చుట్టబడిన ప్రపంచం మధ్యలో కచుడిని చూడక మద్యంలో కలిసిన బూడిద రూపాన తన కుక్షిలో ఉన్న ఆ కచుడిని చూచి మద్యపానం చేసిన హానినీ, రాక్షసులు చేసిన కీడునూ తెలిసికొని.

**విశేషం:** తాము చెప్పిన పని చేయనప్పుడు అన్నం తినేందుకు అంగీకరించకుండా ఏడవటం పిల్లలకు, ఆడవాళ్ళకు సహజం. భూమి చుట్టూ లోకాలోకపర్వతం (చక్రవాళపర్వతం) ఉంటుం దని చెపుతారు. దానికి ఇవతల వెలుతురు, అవతల చీకటి ఉంటుంది.

**ఆ. మొదలి పెక్కు జన్మములఁ బుణ్యకర్మముల్ । పరఁగఁ బెక్కుసేసి పడయఁబడిన**
**యట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రన । చెఱుచు మద్యసేవ సేయ నగునె?. 120**

**ప్రతిపదార్థం:** మొదలి, పెక్కు, జన్మములన్= పూర్వమందలి అనేకజన్మలందు; పుణ్యకర్మముల్= పుణ్యం కలిగించే పనులు; పరఁగన్= ఒప్పుగ; పెక్కు, చేసి= అనేక మైనవి చేసి; పడయఁ బడిన, అట్టి= పొందబడినటువంటి; ఎఱుక= జ్ఞానం;

జనులకున్= ప్రజలకు; ఆ క్షణమాత్రన్+అ= ఆ క్షణమందే; చెఱుచు= చెడునట్లు చేయు; మద్య, సేవ= మద్యాన్ని సేవించటం (మద్యపానం) చేయన్+అగున్+ఎ= చేయదగునా; (చేయరా దని భావం).

**తాత్పర్యం:** పూర్వమందలి అనేక జన్మాలలో పుణ్యకార్యాలను ఒప్పుగా అనేకం చేసి పొందబడిన జ్ఞానం జనాలకు క్షణమాత్రంలోనే పోగొట్టే మద్యపానం చేయదగునా?

**విశేషం:** మద్యపానం చేస్తే పూర్వజన్మాలలోని పుణ్యకర్మాలవలన లభించిన జ్ఞానంకూడా నశిస్తుం దని సందేశం. మద్యపాన దుష్ఫలితాన్ని తెలిపే రుచిరార్థ సూక్తి ఇది. మద్యపానం పంచమహాపాతకాలలో ఒకటి.

**క. భూసురు లాదిగఁ గల జను । లీసుర సేవించిరేని యిది మొదలుగఁ బా**
**పాసక్తిఁ బతితు లగుదురు; । చేసితి మర్యాద; దీనిఁ జేకొనుఁడు జనుల్. 121**

**ప్రతిపదార్థం:** భూసురులు+ఆదిగన్= బ్రాహ్మణులు మొదలుగా; కల; జనులు; ఈ సురన్= ఈ మద్యాన్ని; సేవించిరి+ఏని= సేవించారా (త్రాగితే); ఇది మొదలుగన్= నేడు మొదలుకొని; పాప+ఆసక్తిన్= పాపమందలి అపేక్షచేత (పాపమునందే తగులు కొనటంచేత); పతితులు= భ్రష్టులు (పాపలోకమందు పడినవారు); అగుదురు; మర్యాద= కట్టుబాటు; చేసితిన్; దానిని= ఆ కట్టుబాటును; జనుల్= ప్రజలు; చేకొనుఁడు= గ్రహించండి.

**తాత్పర్యం:** నేడు మొదలుకొని బ్రాహ్మణులు మున్నగు జనులు ఈ మద్యాన్ని పానం చేస్తే పాపమందు తగులుకొని దుర్గతి పొందుతారు. నే నీ కట్టడి చేశాను. ప్రజలు గ్రహించండి.

**విశేషం:** ఇది మొదలుగా అంటే నేను మద్యపానం చేయటంవలన కీడు జరిగింది మొదలుకొని అని అర్థం. మద్యపానం చేసేవారు అధోలోకాలకు పోతా రని దీనివలన తెలుస్తున్నది.

**వ. అని శుక్రుండు సురాపానంబు మహాపాతకంబుగా శపియించి, తనయుదరంబున నున్న కచు నప్పుడ సంజీవితుం జేసిన, నంద యుండి కచుండు శుక్రున కి ట్లనియె. 122**

**ప్రతిపదార్థం:** అని; శుక్రుండు; సురా, పానంబు= మద్యాన్ని త్రాగటం; మహత్+పాతకంబు, కాన్= గొప్ప పాప మయ్యేటట్లుగా; శపియించి= శపించి (శాపమిచ్చి); తన ఉదరంబునన్= తనపొట్టలో ఉన్న; కచున్; అప్పుడు+అ= వెంటనే; సంజీవితున్, చేసినన్= మరల బ్రతికిన వాడిని చేయగా; అందున్+అ= పొట్టయందే; ఉండి; కచుండు; శుక్రునకున్; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని శుక్రుడు మద్యం త్రాగటం గొప్పపాప మౌనట్లుగా శాప మిచ్చి తనపొట్టలో నున్న కచుడిని ఆక్షణమందే మరల బ్రదికినవాడిని చేయగా, కడుపులోనే ఉండి కచుడు శుక్రుడితో ఇట్లా పలికాడు.

**క. తనువును జీవము సత్త్వం । బును బడసితి నీ ప్రసాదమున; నీయుదరం**
**బనఘా! వెలువడు మార్గం । బొనరింపుము నాకు భూసురోత్తమ! దయతోన్. 123**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! భూసుర+ఉత్తమ= బ్రాహ్మణశ్రేష్ఠుడా; తనువును= దేహాన్ని; జీవమున్= ప్రాణాన్ని; సత్త్వంబును= బలాన్ని; నీ ప్రసాదమునన్= నీ అనుగ్రహంచేత; పడసితిన్= పొందాను; నీ, ఉదరంబు= కడుపునుండి; నాకున్; వెలువడు మార్గంబు= బయటికి వచ్చేవిధం (త్రోవ); దయతోన్; ఒనరింపుము= చేయుము.

**తాత్పర్యం:** పాపరహితుడవు, బ్రాహ్మణశ్రేష్ఠుడవు అయిన ఓ శుక్రుడా! నీ అనుగ్రహంవలన దేహాన్ని, ప్రాణాన్ని, బలాన్ని పొందాను. నాకు దయతో నీకడుపునుండి బయటికి వచ్చే విధం కావించవలసింది.

**విశేషం:** నీయుదరంబు+వెలువడు మార్గంబు 'ఒకానొకచో నొకవిభక్తికి మరియొక్క విభక్తియు నగును'. ఇచ్చట ఉదరంబు అనగా ఉదరమువలననుండి అని అర్థం. ప్రథమ పంచమ్యర్థమున వాడబడింది.

**వ. అనిన 'నాయుదరంబుభేదిల్లినంగాని యిమ్మునికుమారుండు వెలువడ నేరం; డుదరభేదనంబున మూర్ఛితుండ నయిన నన్ను సంజీవితుంజేయ వలయు' నని శుక్రుండు కచునకు సంజీవని నుపదేశించిన. 124**

**ప్రతిపదార్థం:** అనినన్= అని కచుడు పలుకగా; నా+ఉదరంబు= నాకడుపు; భేదిల్లినన్, కాని= బ్రద్దలయితే తప్ప; ఈ+మునికుమారుండు= (బృహస్పతి) మునికొడు కయిన ఈకచుడు; వెలువడన్ నేరండు= బయటికి రాజాలడు; ఉదర, భేదనంబునన్= కడుపు బ్రద్దలవటం వలన; మూర్ఛితుండను= మూర్ఛపొందినవాడను; అయిన, నన్నున్; సంజీవితున్= బ్రతికినవాడినిగా, చేయవలయున్= కచుడు చేయాలి; అని; శుక్రుండు; కచునకున్; సంజీవనిన్= మరణించినవారిని బ్రతికించే విద్యను; ఉపదేశించినన్= ఉపదేశం చేయగా (నేర్పగా).

**తాత్పర్యం:** అని కచుడు పలుకగా, 'నాకడుపు భేదిల్లితే కానీ (బ్రద్ద లయితే తప్ప) బృహస్పతి కుమారు డైన కచుడు బయటికి రాలేడు. కడుపు బ్రద్దలవటంచేత మూర్ఛ పొందిన నన్ను ఈ కచుడు మరల బ్రతికించాలి' అని శుక్రుడు కచుడికి సంజీవనివిద్యను ఉపదేశించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఉదరభిదాముఖమున న । భ్యుదయముతో నిర్గమించె బుధనుతుఁడు కచుం**
**డుదయాద్రిదరీముఖమున । నుదితుం డగు పూర్ణహిమమయూఖుఁడ పోలెన్. 125**

**ప్రతిపదార్థం:** ఉదర, భిదా, ముఖమునన్= కడుపుయొక్క రంధ్రముయొక్క మొదటినుండి, బుధనుతుఁడు= పండితులచేత స్తుతించబడినవాడు; కచుండు; అభ్యుదయముతోన్= విజయంతో, వాంఛితార్థఫలసిద్ధితో; ఉదయ+అద్రి, దరీ, ముఖమునన్= తూర్పుకొండ గుహారంభాన; ఉదితుండు+అగు= ఉదయించినవా డైన; పూర్ణ, హిమ, మయూఖుఁడు+అ+పోలెన్= నిండు చంద్రుడో యన; నిర్గమించెన్= బయటికి వచ్చాడు.

**తాత్పర్యం:** పండితులచే స్తుతించబడు కచుడు వాంఛితార్థసిద్ధితో తూర్పుకొండగుహయొక్క ఆరంభాన ఉదయించే చంద్రుడో యన శుక్రుడి కడుపురంధ్రంమొదటినుండి బయటికి వచ్చాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. సంజీవనీవిద్యను పొందిన కచుడిని అమృతప్రదుడైన చంద్రుడితో సంభావించటం ఔచిత్యవంతంగా ఉన్నది. కచుడు సంజీవనీవిద్య పొందటానికే వచ్చాడు. అతడికోరిక నెరవేరింది.

**వ. అంత. 126**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**తే.** **విగతజీవుఁ డై పడియున్న వేదమూర్తి । యతనిచేత సంజీవితుఁ డై వెలింగె**
**దనుజమంత్రి యుచ్చారణదక్షుచేత । నభిహితం బగు శబ్దంబునట్ల పోలె.** **127**

**ప్రతిపదార్థం:** విగత, జీవుఁడు+ఐ= పోయిన ప్రాణం కలవాడై; పడి, ఉన్న= నేలమీద పడి ఉన్న; వేద, మూర్తి= రూపు ధరించిన వేద మైన (వేదరూపుడైన); దనుజ, మంత్రి= రాక్షసులమంత్రి అయిన శుక్రుడు; ఉచ్చారణ, దక్షుచేతన్= శబ్దాలను ఉచ్చరించటం (పలకటం) లో సమర్థుడైనవాడిచేత; అభిహితంబు+అగు= పలుకబడిన; శబ్దంబు+అట్లు+అ, పోలెన్= పదంవలె; అతనిచేతన్= కచుడిచేత; సంజీవితుఁడు+ఐ= బ్రతికించబడినవాడై; వెలింగెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ప్రాణం పోయినవాడై పడి ఉన్న, వేదవిగ్రహు డైన, రాక్షసమంత్రి అయిన శుక్రుడు కచుడిచేత బ్రతికించబడినవా డై, పదాలను చక్కగా ఉచ్చరించటంలో నేర్పుకలవాడిచేత పలుకబడిన పదంవలె ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ. ఇందులోని ఉపమానం అపూర్వం. శబ్దబ్రహ్మవేత్తలకే అది తెలుస్తుంది. సుష్ఠూచ్చారణదక్షులు పలికే శబ్దాలు వీనులవిందు లై ప్రకాశిస్తాయి. అంతేకాక ఇక్కడ మరొక విశేషం ఉన్నది. శబ్దం కావ్యశరీరంవంటిది. అది సమర్థంగా ఉచ్చరించబడితే సమగ్రంగా ఆవిష్కరించబడినట్లౌతుంది. అట్లాగే కాలి, బూడిద అయి శుక్రుడి కడుపులో జీర్ణించిన కచుడు సంజీవనీ విద్యాప్రభావంచేత చెక్కుచెదరని ఆకారంతో బయలువెడలినాడని భావం. సంజీవనీ మంత్రాన్ని గ్రహించి ఉచ్చరించే సామర్థ్యం అతనియందు సమగ్రంగా ఏర్పడిందని కూడా వ్యంగ్యం. అట్లు, పోలె= అని రెండు ఉపమానవాచకాలను ఉపయోగించటం నన్నయరచనలలో కొన్ని చోట్లను, నన్నెచోడుడి కుమారసంభవంలో పెక్కుచోట్లను కనిపిస్తాయి. శబ్దంబు+అట్లు= షష్ఠీసమాసమున ఉత్తున కచ్చు పరమగునపుడు నుగాగమ మగును'; శబ్దంబునట్లు.

**వ.** **ఇ ట్లతిప్రయత్నంబునఁ గచుండు శుక్రువలన సంజీవని వడసి పెద్దకాలం బుండి, యొక్కనాడు శుక్రుచేత ననుజ్ఞాతుం డయి దేవలోకంబునకుం బోవుచుండి, దేవయాని కతిప్రియపూర్వకంబునం జెప్పిన, నదియును దద్వియోగదుఃఖిత యై కచున కి ట్లనియె.** **128**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; అతి, ప్రయత్నంబునన్= అధిక మైన ప్రయత్నంచేత; కచుండు; శుక్రువలన; సంజీవని= చచ్చినవారిని బ్రదికించే విద్యను; పడసి= పొంది (పకు వాదేశము); పెద్ద, కాలంబు= చాలకాలం; ఉండి= శుక్రుడిదగ్గర ఉండి; ఒక్కనాడు; శుక్రుచేతన్; అనుజ్ఞాతుండు+అయి= అనుమతించ బడినవాడై; దేవలోకంబునకున్= స్వర్గలోకానికి; పోవుచున్+ఉండి= వెళ్ళుతూ; దేవయానికి; అతిప్రియ, పూర్వకంబునన్= మిక్కిలి ప్రీతితో; చెప్పినన్= నేను వెళ్ళుతున్నా నని తెల్పగా; అదియును= ఆ దేవయానియున్నూ; తద్+వియోగ, దుఃఖిత+ఐ= అతని ఎడబాటువలన దుఃఖం పొందిన దై; కచునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా అధిక మైన ప్రయత్నంతో (మిక్కిలి కష్టపడి) కచుడు శుక్రుడినుండి మృతులను బ్రదికించే విద్యను పొంది, చాలకాలంఉండి, ఒకరోజున శుక్రుడిఅనుమతి పొంది స్వర్గలోకానికి తిరిగి వెళ్తూ, దేవయానికి అతిప్రీతిపూర్వకంగా ఆవార్త చెప్పగా, ఆమెయు అతని ఎడబాటుకు దుఃఖించి అతనితో ఇట్లా పలికింది.

**ఉ.** **'నీవును బ్రహ్మచారివి, వినీతుఁడ, వేనును గన్యకన్; మహీ**
**దేవకులావతంస! రవితేజ! వివాహము నీకు నాకు మున్**

**భావజశక్తి నైనయది; పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం**
**జీవనితోడ శుక్రుదయఁ; జేయుము నాకుఁ బ్రియంబు' నావుడున్. 129**

**ప్రతిపదార్థం:** మహీదేవ, కుల+అవతంస= బ్రాహ్మణకులానికి సిగబంతియైనవాడా!; రవి, తేజ= సూర్యుడి కాంతివంటి కాంతి కలవాడా!, కచుడా!; నీవును= నీవుకూడ; బ్రహ్మచారివి= అవివాహితుడవు; వినీతుఁడవు= వినయవంతుడివి; (గురువుచే విద్యపొందినవాడివి); ఏనును= నేనుకూడ; కన్యకన్= వివాహం కానిదానను; నీకున్, నాకున్= మన కిద్దరికీ; వివాహము= పెళ్ళి; మున్= ముందే; భావజ, శక్తిన్= మన్మథుడి ప్రభావంచేత; ఐన+అది= అయినది (మన్మథుడి ప్రభావంచేత నిన్ను నేను ప్రేమించాను కాబట్టి మానసికంగా పెండ్లి అయిపోయింది); పన్నుగన్= ఒప్పుగ; శుక్రుదయన్= నాతండ్రి అయిన శుక్రుడియొక్క దయతో; సంజీవనితోడన్= సంజీవనీవిద్యతోపాటుగ; నన్నున్; పరిగ్రహింపు(ము)= స్వీకరించుము, వివాహమాడుము; నాకున్; ప్రియంబు= ప్రీతి; చేయుము= కలిగించుము; నావుడున్= అని దేవయాని చెప్పిన అనంతరం.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణకులానికి అలంకార మైనవాడా! సూర్యుడికాంతివంటికాంతి కలిగిన ఓ కచుడా! నీవు వినయవంతుడివి, అవివాహితుడవు. నేనుకూడ కన్యను (పెళ్ళికానిదానిని). నీకూ, నాకూ ఇంతకుముందే మన్మథుడి శక్తిచేత (నేను నిన్ను ప్రేమించటంవలన) పెళ్ళి అయిపోయింది. అందుచేత శుక్రుడిదయతో సంజీవనీవిద్యతోపాటుగా నన్ను స్వీకరించి, వివాహమాడి, నాకు ప్రీతి కలిగించుము' అని దేవయాని చెప్పిన తరువాత.

**విశేషం:** నన్నయ రచనలో ప్రసాదగుణానికి ప్రసిద్ధమైన పద్యమిది. దేవయాని తన మనసులోని మాటను అనురాగంతో అకలుషంగా అవక్రంగా సూటిగా చెప్పే ఈపద్యంలో బంధశైథిల్యం, అర్థవైమల్యం పోషించబడటంతో శబ్దార్థగుణాలను నన్నయ ప్రదర్శించి తన ప్రజ్ఞను చాటుకొన్నాడు. శుక్రుడినుండి సంజీవనీవిద్యను పొందాలంటే, అతడికి ప్రాణమైన దేవయానితో స్నేహంగా ఉండి, ఆమెమనసును మెప్పించాలని బృహస్పతియే ముందుగా కచుడికి సూచించి ఉన్నాడు. కచుడి రూపంతోపాటు, అతడి చనవుకూడా దేవయానియందు అనురాగాన్ని మొలకెత్తింపచేసింది. ఆ అభిమానంతోనే రెండుసార్లు తండ్రిచేత అతడిని బ్రదికింపజేసింది. మొదట శుక్రుడు నిర్లిప్తంగా ఉండగా అన్నపానీయాలు మాని తండ్రిచేత కచుడి యోగక్షేమాలను ఆలోచించేట్లు చేసింది. దీనిని బట్టి కచుడు మొదట దేవయానిమనసు దోచుకొన్నట్లు, ఆపై శుక్రుడి మనసు గెలుచుకొన్నట్లు కథలోని అర్థాలు ప్రసన్నాలౌతున్నాయి. అయితే ఆమె తనమనసులోని రతిభావాన్ని కచునితో కాని, తండ్రితోకాని ఎన్నడూ చెప్పలేదు. దానికి కారణం కచుడి విద్యాభ్యాసం ముగియక పోవటమే. విద్య ముగిసిన తరువాత బ్రహ్మచారులైన విద్యార్థులు వివాహయోగ్యతను పొందుతారు. కాబట్టి ఆమె తనకోర్కెను కచుడు విద్యాభ్యాసం పూర్తిచేసి దేవలోకానికి బయలుదేరేంతవరకు బయటపెట్టలేదు. కాగా, ఇక కచుడు బయలుదేరేలోపలే తనకోర్కెను అతనికి చెప్పి, వెంటనే అతనిని దక్కించుకోవాలి. ఆ ఆత్రంతో మనసులోనిమాటను సూటిగా చెప్పినట్లు నన్నయ రచించాడు. కచుడి యందు తనమనసు లగ్నమైనది కాబట్టి వివాహమైనట్లే అని నిర్ణయించి చెప్పింది దేవయాని. కచుడి అంగీకారాన్ని ఆమె అడగలేదు. దానికి కారణం అతడు తిరస్కరిస్తా డని ఆమె ఊహించలేదు. దానికి అతడు చూపుతున్న చనవుకూడ హేతువు కావచ్చును; లేదా- తండ్రిదగ్గర తనమాట అడ్డులేకుండా సాగేమాలిమి ఉన్నది కాబట్టి కచుడుకూడా తనకోర్కెను కాదనకుండా మన్నిస్తాడనే అధికారిక ప్రవృత్తికూడా బలమైనకారణం కావచ్చును. మృతసంజీవనీవిద్యను శుక్రుని దయతో ఏవిధంగా స్వీకరించావో అట్లాగే తననుకూడా స్వీకరించుమని కోరింది. ఇందులో కచుడే శుక్రుడిని అడిగి తనను వివాహమాడాలనీ, అడిగితే తండ్రికాదనకుండా తాను చూచుకుంటాననీ, తండ్రికి మృతసంజీవని ఎంత ప్రాణప్రదమో తానూ అంతేననీ, ఆరెండింటినీ పొందే అర్హత కచుడుమాత్రమే సాధించగలిగాడు కాబట్టి అతడే తనకు భర్త (భరింపదగినవాడు) కాదగినవాడనీ దేవయాని భావించింది. కన్యలో ఉదయించిన యౌవనంకంటె లజ్జ అతిశయించి ఉండటం సహజం. దేవయాని కన్య

అయ్యును గడుసరి. తరువాతికథలో ఇది నిరూపింపబడుతుంది. మనసులు కలిసిన పెళ్ళి మన్మథుడే చేశా డని కచుడితో చెప్పిన దేవయాని పాణిగ్రహణం (చేయిపట్టి నూతినుండి లాగావు కాబట్టి) అయిందికాబట్టి నీకూనాకూ ఇదివరకే పెళ్ళి అయిపోయినట్లే అని యయాతితో చెప్పగలిగింది. ఆపెళ్ళిని తండ్రిచేత ఒప్పించి యయాతిచేత అంగీకరింపజేసింది. అంగీకరించని కచుడికి శాప మిచ్చింది; ప్రతిశాపాన్ని కూడా పొందింది. గారాబంగా పెరిగిన గడుసరి పిల్లలలో కానవచ్చే గూఢాహంకారం దేవయాని పాత్రకు జీవం. దానిని బీజంగా నాటాడు నన్నయ ఈపద్యంలో. (సంపా.)

**క.** **ఆ కచుఁ డత్యంతవిషా । దాకులుఁ డై 'లోకనింద్య మగు నర్థము నీ**
**వాకునకుఁ దెచ్చు టుచితమె? । నాకు సహోదరివి నీవు నాచిత్తమునన్.'** **130**

**ప్రతిపదార్థం:** ఆ కచుఁడు= అత్యంత, విషాద+ఆకులుఁడు+ఐ= మిక్కిలి శోకంచేత కలత పొందిన వాడై; లోక, నింద్యము= లోకంచేత నిందించదగినది; అగు+అర్థము= అగునట్టి కోరిక (పని); నీ వాకునకున్= నీవాక్కునకు; తెచ్చుట+ఉచితము+ఎ= తెచ్చుట తగునా (తగదు); నా చిత్తమునన్= నాహృదయమందు; నీవు, నాకున్ సహోదరివి= గురుపుత్రిక వగుటచే తోడపుట్టిన దానివి, నేను నిన్ను సోదరిగా భావిస్తున్నాను.

**తాత్పర్యం:** దేవయాని తనను వివాహమాడు మని కోరగా కచుడు శోకంచేత కలత పొందినవాడై 'లోకంచేత నిందించదగినకోరిక నీవాక్కునకు తెచ్చుట తగునా? (పలకటం తగదు). గురుపుత్రివి అవటంచేత నా హృదయంలో నీవు సోదరివి. నేను నిన్ను చెల్లెలుగా భావిస్తున్నాను'.

**విశేషం:** కచుడు ధర్మబుద్ధికలవాడు కావటంచేత గురుపుత్రిని తోబుట్టువుగా భావించాడు. అగు+అర్థము= 'ఉదంత తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగుటచే 'ను' ఆగమము'= అగునర్థము. వాక్కు= 'దీర్ఘము మీది హల్లునకు ద్విత్వము బహుళము' - వాకు ఇచ్చట ద్విత్వము రాలేదు. తెచ్చుట+ఉచితమె= అత్తునకు సంధి ఐనది= తెచ్చుటుచితమె.

**క.** **గురులకు శిష్యులు పుత్త్రులు । పరమార్థమ లోకధర్మపథ మిది; దీనిం**
**బరికింపక యీ పలుకులు । తరుణీ! గురుపుత్త్రి! నీకుఁ దగునే పలుకన్.** **131**

**ప్రతిపదార్థం:** తరుణీ= యువతీ; గురుపుత్త్రి= గురువుగారి కూతు రైన ఓ దేవయానీ!; గురులకున్; శిష్యులు; పుత్త్రులు= కుమారులు (పుత్ర సమానులు); పరమ+అర్థము+అ= ఉత్తమ మైన సత్యమే; ఇది= శిష్యులు గురువులకు పుత్రులన్నది; లోక; ధర్మ పథము= లోకంలోని ధర్మం యొక్క మార్గం; దీనిన్= ఈధర్మాన్ని; పరికింపక= చూడక; ఈ, పలుకులు= నన్ను వివాహ మాడుమన్న మాటలు; నీకున్, పలుకన్; తగును+ఏ= పలకటం తగునా (తగుదు).

**తాత్పర్యం:** యువతీ! గురుకుమారీ! గురువులకు శిష్యులు కొడుకులతో సమానులు. ఇది పరమసత్యం. లోక మనుసరించవలసిన ధర్మమార్గం. దీనిని చూడక (ఆలోచించక) నన్ను పరిగ్రహించు మని పలకటం నీకు ఉచితమా!

**విశేషం:** గురుపుత్రి అనే సంబోధన సాభిప్రాయం. సూక్తి అంటే సుభాషిత మనే అర్థం ఉన్నది. నన్నయ ఒక్కొకసారి పద్యాన్నంతా ఒక సుభాషితంగా రూపొందిస్తాడు. ఒక్కొకసారి పద్యంలోని భాగాన్ని సూక్తిగా చిత్రిస్తాడు. సామెతలవంటి వాక్యాలను పద్య పూర్వార్ధంలోకానీ, ఉత్తరార్ధంలోకానీ నిబంధించటం నన్నయ రచనాశిల్పంలోని ఒకమెలకువ. నిరంతరాధ్యాపకు డైన గురువు శిష్యుడికి తండ్రివంటివాడనే ధర్మం అది. 4.49 పద్యంలో గమనించవచ్చు.

**వ. అనిన నా కచునకు దేవయాని కరం బలిగి 'నీవు నా మనోరథంబు విఫలంబుగాఁ జేసిన వాఁడవు; నీకు సంజీవని పని సేయకుండెడు' మని శాపం బిచ్చినఁ, గచుం 'డేను ధర్మపథంబుఁ దప్పనివాఁడను; నీ వచనంబున నాకు సంజీవని పనిచేయదయ్యెనేనియు నాచేత నుపదేశంబు గొన్నవారికిఁ బనిసేయుంగాక; మఱి నీవు ధర్మ విరోధంబు దలంచితివిగావున నిన్ను బ్రాహ్మణుండు వివాహంబు గాకుండెడు' మని దేవయానికిఁ బ్రతిశాపం బిచ్చి తత్క్షణంబ. 132**

**ప్రతిపదార్థం:** అనినన్= అని కచుడు పలుకగా; దేవయాని; కరంబు= మిక్కిలి, అలిగి= కోపించి; నీవు; నా, మనోరథంబు= నా కోరిక; విఫలంబుగాన్= ఫలంలేని దానిగా; చేసిన వాఁడవు; నీకున్; సంజీవని= నా తండ్రినుండి నేర్చుకొనిన చనిపోయినవారిని బ్రతికించే సంజీవనీవిద్య; పని; చేయక+ఉండెడున్+అని= ఉపయోగపడకుండు గాక అని; శాపంబు+ఇచ్చినన్= శాపమివ్వగా; కచుండు; ఏను= నేను; ధర్మపథంబున్= ధర్మమార్గాన్ని; తప్పని వాఁడను= దాటని వాడిని; నీ వచనంబునన్= నీ శాపంవలన; (పలుకుచేత) నాకున్; సంజీవని= సంజీవనీవిద్య; పని, చేయదు+అయ్యెన్+ఏనియున్= పని చేయకపోయినా (భవిష్యదర్థకాన భూతకాలం); నా చేతన్; ఉపదేశంబు, కొన్న వారికిన్= ఉపదేశం పొందినవారికి; పని, చేయున్, కాక= ఉపయోగపడు గాక; మఱి= ఇంక; నీవు; ధర్మవిరోధంబు= ధర్మానికి వ్యతిరేక మైనపని; తలంచితివి; కావునన్; నిన్నున్; బ్రాహ్మణుండు; వివాహంబు, కాక+ఉండెడున్+అని= పెళ్ళాడకుండుగాక అని; దేవయానికిన్; ప్రతిశాపంబు= ఎదురుశాపం; ఇచ్చి; తత్+క్షణంబు+అ= ఆక్షణమందే (వెంటనే).

**తాత్పర్యం:** అని కచుడు పలుకగా దేవయాని మిక్కిలికోపించి 'నీవు నాకోరిక నిష్ఫలం చేశావు కాబట్టి నీకు సంజీవనీ విద్య ఉపయోగపడకుండును గాక' అని శాపమిచ్చింది. కచుడు 'నేను ధర్మమార్గాన్ని అతిక్రమించనివాడను. నీ శాపవచనంచేత నాకు సంజీవనీవిద్య పనిచేయక పోయినా నాచేత ఉపదేశం గ్రహించినవారికి పనిచేస్తుంది గాక. ఇంక నీవు ధర్మం కాని పని (సోదరప్రాయు డైన తండ్రిశిష్యుడిని పెళ్ళాడా లని) తలపోశావు కాబట్టి నిన్ను బ్రాహ్మణుడు పెళ్ళాడకుండుగాక' అని ఎదురు(మారు) శాప మిచ్చి వెంటనే.

**విశేషం:** పని+చేయు= చకు సాదేశం; పనిసేయు. ఉండెడున్+అని= ఎడుతలద్రుతమున కచ్చుపర మగునపుడు మకారమౌతుంది; ఉండెడు మని. (ఆశీరర్థమున ఎడమ అగు నని కొందరి మతము. అప్పుడు ఎడమని అనే రూపం వస్తుంది.)

**క. దేవగురునందనుం డమ । రావాసంబునకు నరిగి యమరులకును సం**
**జీవని యుపదేశించి, సు । ధీవినుతుఁ డొనర్చుచుండె దేవహితంబుల్. 133**

**ప్రతిపదార్థం:** సుధీ, వినుతుఁడు= పండితులచేత స్తుతించబడినవాడు; దేవ, గురు, నందనుండు= దేవతలగురు వైన బృహస్పతి కుమారుడు (కచుడు); అమర+ఆవాసంబునకున్= దేవతలనివాస మైన స్వర్గానికి; అరిగి= వెళ్ళి; అమరులకును= దేవతలకు; సంజీవని= సంజీవనీ విద్య; ఉపదేశించి= బోధించి; దేవహితంబున్= దేవతలకొరకు మేలును; ఒనర్చుచున్+ఉండెన్= చేయుచుండెను.

**తాత్పర్యం:** పండితులచేత స్తుతింపబడువాడూ బృహస్పతికుమారుడూ అయినటువంటి కచుడు దేవతల నివాస మైన స్వర్గానికి వెళ్ళి దేవతలకు సంజీవనీవిద్య ఉపదేశించి దేవతలకు మేలు చేస్తున్నాడు.

**వ. ఇట వృషపర్వుకూఁతురు శర్మిష్ఠయను కన్యక యొక్కనాడు కన్యకాసహస్రపరివృతయయి దేవయానీ సహితంబు వనంబునకుం జని, యొక్క సరోవర తీరంబునఁ దమతమ పరిధానంబులు పెట్టి జలక్రీడ లాడుచున్న, నవి సురకరువలిచేతం బ్రేరితంబు లయి కలిసిన నొండొరులం గడవఁ గొలను వెలువడు సంభ్రమంబున నక్కన్యక లన్యోన్యపరిధానంబులు వీడ్వడం గొని కట్టునెడ దేవయానిపుట్టంబు శర్మిష్ఠ గట్టిన, మఱి దాని పరిధానంబు దేవయాని పుచ్చుకొనక రోసి శర్మిష్ఠం జూచి యి ట్లనియె. 134**

**ప్రతిపదార్థం:** ఇటన్= శుక్రుడుండే చోట, రాక్షసరాజధానిలో; వృషపర్వు+కూఁతురు= వృషపర్వు డనే రాక్షసరాజుకుమార్తె; శర్మిష్ఠ, అను కన్యక= శర్మిష్ఠ అనే పేరు గల కన్య; ఒక్కనాఁడు= ఒకరోజున; కన్యకా, సహస్ర, పరివృత, అయి= కన్యకల వేలచే, పలువురు కన్యలచేత చుట్టబడిం దై; దేవయానీ, సహితంబు= దేవయానితోకూడ; వనంబునకున్= అడవికి; చని= వెళ్ళి; ఒక్కసరోవర, తీరంబునన్= ఒక సరస్సు ఒడ్డున; తమ, తమ పరిధానంబులు= తమ తమ కట్టుబట్టలు; పెట్టి= ఉంచి; జలక్రీడలు= నీటియందాటలు; ఆడుచున్+ఉన్నన్= చేయుచుండగా; అవి= ఆ బట్టలు; సురకరువలిచేతన్= సుడిగాలిచేత; ప్రేరితంబులు+అయి= ప్రేరేపించబడినవై (ఎగురగొట్టబడినవై); కలిసినన్= కలిసిపోగా; ఒండు+ఒరులన్= ఒకరొకరిని; కడవన్= మించునట్లుగ; కొలను= సరస్సునుండి (పంచమ్యర్థమున ప్రథమ); వెలువడు= బయటికి వచ్చే; సంభ్రమంబునన్= వేగిరిపాటుతో; ఆ+కన్యకలు= జలకేళిచేసిన కన్యలు; అన్యోన్య, పరిధానంబులు= ఒండొరుల వస్త్రాలు; వీడ్వడన్= మారుపడేటట్లుగా; కొని= గ్రహించి; కట్టు+ఎడన్= కట్టుకొనే సమయాన; దేవయాని పుట్టంబున్= దేవయాని వస్త్రాన్ని; (చీరను); శర్మిష్ఠ= రాక్షసరాజుకూతురు; కట్టినన్= కట్టుకొనగా; మఱి= అనంతరం; దాని, పరిధానంబు= ఆశర్మిష్ఠ వస్త్రాన్ని; దేవయాని; పుచ్చుకొనక= గ్రహించక; రోసి= అసహ్యించుకొని; శర్మిష్ఠన్; చూచి; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పలికింది.

**తాత్పర్యం:** కచుడు వెళ్ళిపోయినతర్వాత శుక్రుడు ఉన్నచోట రాక్షసరా జైన వృషపర్వుడికూతురు శర్మిష్ఠ అనే పేరు గల కన్య వేలకొద్ది కన్యలచేత చుట్టబడి దేవయానితోకూడ అడవికి వెళ్ళింది. (ఉద్యానవనానికి వెళ్ళి) ఒక కొలనుఒడ్డున వారు తమ తమ కట్టుబట్టలు పెట్టి జలకేళి చేస్తుండగా ఆ బట్టలు సుడిగాలిచేత ఎగురగొట్టబడి కలిసిపోయాయి. ఆ కన్యలు ఒండొరులను మీరునట్లుగా సరస్సునుండి బయటికి వచ్చే తొందరలో ఒండొరుల చీరలు మారుపడేటట్లు గ్రహించి కట్టుకొనే సమయాన దేవయానిచీర శర్మిష్ఠ కట్టుకొన్నది. అప్పుడు ఆ శర్మిష్ఠ వస్త్రాన్ని దేవయాని గ్రహించక ఏవగించుకొని శర్మిష్ఠను చూచి ఇట్లా పలికింది.

**విశేషం:** మూలంలో ఆకన్యలవస్త్రాలను ఇంద్రుడు కలిపివేసిన ట్లున్నది. నన్నయ మార్చి సురకరువలిచే నవి కలిపివేయబడిన వని వ్రాయటం ఔచిత్యశోభితంగా ఉన్నది.

**క. లోకోత్తరచరితుం డగు । నా కావ్యతనూజ; నీకు నారాధిత; నేఁ**
**బ్రాకట భూసురకన్యక; । నీకట్టిన మైల గట్ట నేర్తునె చెపుమా. 135**

**ప్రతిపదార్థం:** లోక+ఉత్తర, చరితుండు+అగు= అసామాన్యచరిత్ర కలవా డైన; ఆ, కావ్య, తనూజన్= ఆ శుక్రుడి కూతురిని; నీకున్= శర్మిష్ఠకు; ఆరాధితన్= పూజింపబడిన (తగిన) దానిని; నేన్= నేను; ప్రాకట, భూసుర, కన్యకన్= ప్రసిద్ధి పొందిన బ్రాహ్మణ కన్యకను; నీకట్టిన= (కర్తృపద ప్రథమకు షష్ఠి) నీవు కట్టుకొన్న; మైల= మలిన వస్త్రాన్ని; కట్టన్, నేర్తున్+ఎ= కట్టుకో గలనా; చెపుము+ఆ= చెప్పుమా.

**తాత్పర్యం:** అసాధారణచరిత్రు డైన శుక్రుడికూతురిని, నీకు పూజనీయురాలిని, ప్రసిద్ధ మైన బ్రాహ్మణకులాన పుట్టినకన్యను అయిన నేను నీవు కట్టుకొన్న మలినవస్త్రాన్ని కట్టుకోగలనా? చెప్పుము.

**విశేషం:** అగు+ఆ= ఉదంత తద్ధర్మ విశేషణమున కచ్చు పర మైనప్పుడు నుగాగమం ఔతుంది; అగు నా కావ్యు- అనుట వల్ల శుక్రుడి లోకోత్తరచరితత్వం వ్యక్తం చేయబడింది.

**వ. అనిన శర్మిష్ఠ యి ట్లనియె. 136**

**తాత్పర్యం:** దేవయాని అట్లా పలుకగా శర్మిష్ఠ ఇట్లా అన్నది.

**క. మా యయ్యకుఁ బాయక పని । సేయుచు దీవించి ప్రియము సెప్పచు నుండున్**
**మీయయ్య; వెండి మహిమలు । నా యొద్దన పలుక నీకు నానయు లేదే?. 137**

**ప్రతిపదార్థం:** మా అయ్యకున్= మాతండ్రి అయిన వృషపర్వుడికి; మీ అయ్య= మీ తండ్రి అయిన శుక్రుడు; పాయక= విడువక; పని, చేయుచున్, దీవించి= ఆశీర్వదించి; ప్రియము= ఇష్టము; చెప్పుచున్+ఉండున్= చెప్పుతూఉంటాడు; వెండి= మరియు; మహిమలు= గొప్పతనాలు; నా; ఒద్దన్+అ= నా దగ్గరే; పలుకన్= చెప్పటానికి; నీకున్; నానయున్= సిగ్గుకూడ; లేదు+ఏ= లేదా!

**తాత్పర్యం:** మీతండ్రి అయిన శుక్రుడు మాతండ్రి అయిన వృషపర్వుడిని విడువక సేవిస్తూ ఆశీర్వదించి ప్రియవాక్యాలు పలుకుతూ ఉంటాడు. మరి మీ గొప్పతనాలు నాదగ్గరే పలికేందుకు (పలకటానికి) నీకు సిగ్గుకూడ లేదా?

**వ. 'నాకట్టిన పుట్టంబు నీకుం గట్టంగాదు గా కేమి' యని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక్కనూతం ద్రోచి, శర్మిష్ఠ కన్యకాసహస్రపరివృత యయి క్రమ్మఱి వచ్చి నిజనివాసంబున నుండె; నంత. 138**

**ప్రతిపదార్థం:** నా, కట్టిన= నేను కట్టుకొన్న (కర్తృపద ప్రథమకు షష్ఠి); పుట్టంబు= వస్త్రం; నీకున్; కట్టన్, కాదు, కాక+ఏమి= కట్టుకొనరాదా ఏమి; అని; గర్వంబునన్= గర్వంతో; ఎగ్గులు+ఆడి= నిందలు పలికి; దేవయానిన్= దేవయానిని; ఒక్కనూతన్= ఒకనూతిలో; త్రోచి= త్రోసిపడేసి; శర్మిష్ఠ; కన్యకా, సహస్ర, పరివృత, అయి= కన్యలయొక్క వేయిచేత (పలువురు కన్యలచేత) చుట్టబడిన దై; క్రమ్మఱి వచ్చి= తిరిగివచ్చి; నిజనివాసంబునన్= తనయొక్క ఇంటిలో; ఉండెన్; అంతన్= పిమ్మట.

**తాత్పర్యం:** 'నేను కట్టుకొన్నవస్త్రం నీవు కట్టుకోరాదా ఏమిటి?' అని గర్వంతో నిందలాడి, దేవయానిని ఒక నూతిలో త్రోసివేసి, శర్మిష్ఠ వేయిమందికన్యకలతో కూడిన దై తిరిగివచ్చి తన గృహమందు ఉన్నది. పిమ్మట.

**విశేషం:** సహజంగా జరుగుతున్నట్లు చిత్రించే కథాసన్నివేశాలు కొన్ని భావికథార్థవ్యంజకాలుగా నిబంధింపబడటం వస్తుధ్వని శిల్పం. సుడిగాలిచేత శర్మిష్ఠాదేవయానుల చీరలు కలిసిపోయినవి. దేవయానిచీర శర్మిష్ఠ ధరించటం, శర్మిష్ఠచీరను దేవయాని తిరస్కరించటం ఆ పాత్రల చిత్తవృత్తులకు నిదర్శనాలు. విశేష మేమంటే చీరెలు మారుపడిన ఇరువురూ భావికథలో యయాతికి భార్యలు(సవతులు) కానున్నారు. క్షత్రియవనిత పెండ్లాడదగిన యయాతిని శర్మిష్ఠకు దక్కకుండా దేవయాని తాను పొందగలుగుతుంది బలీయ మైన విధివలన (లేదా శాపంవలన). శర్మిష్ఠ వేయిమంది చెలికత్తెలతోసహా తనకు దాస్యంచేసేటట్లు సాధించగలుగుతుంది. ఈ కథార్థాలకు బీజాలు ఇక్కడ ఉన్నాయి. చీరెలను కలిపిన గాలి విధి. వారిరువురు

సవతు లయ్యే యోగం అందులో ధ్వని. చీరెలు యయాతికి భార్యలుగా ఉండే సతీత్వాలకు సంకేతాలు. క్షత్రియవనిత కట్టుకొనే చీరను తాను ధరించలేదు దేవయాని. భావికథలో శర్మిష్ఠ వలె దేవయాని యయాతి మనసు నాకర్షించలేదు. శుక్రుడి భయంవలన, దేవయాని గడుసరితనంవలన యయాతి ఆమెను కట్టుకొన్నాడే కాని సహజమైన వలపువలన కాదు. దేవయాని జాత్యహంకారవతి; శర్మిష్ఠ అభిమానవతి. పట్టింపువస్తే నూరుగురు చెలికత్తెలసాయంతో దేవయానిని పాడుబడినబావిలో పడవేయగలిగిన సమర్థురాలు శర్మిష్ఠ, తరువాతి కథలో తాను యయాతిని పెండ్లాడి, తనకుమారుడైన పూరుని గుణౌన్నత్యంవలన రాజమాత అయి తన బలాన్నీ బలగాన్నీ ప్రదర్శించుకొన్నది. దేవయానికిగల కోపం, అహంకారం, అసహనం, ఈర్ష్య, ప్రతీకారప్రవృత్తి అనేవి క్రమంగా ఆమెను గార్హస్థ్యసుఖాలకూ, భర్తకూ దూరంచేస్తాయి. ఈకథలో చీరెకట్టి సహనంతో, స్థైర్యంతో, అభిమానంతో నిలిచిన శర్మిష్ఠ చివరకు క్షత్రియోచిత విజయాన్ని సాధిస్తుంది. జాత్యహంకారంవలన దేవయాని రెండింటికి చెడ్డ రేవడి ఔతుంది. భర్తను తిరిగిపొందిన దేవయాని ఓడిపోయిన అహంకారిణి. ఆ భావికథార్థాలకు ఇప్పటి కథాసన్నివేశాలను వ్యంజకాలుగా సంయోజనచేయటం నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తి. (సంపా.)

## యయాతి నూతంబడిన దేవయాని నుద్ధరించుట (సం. 1-73-14)

**ఉ. ఆనహుషాత్మజుం డగు యయాతి యధిజ్యధనుస్సహాయుఁ డై**
**యానతశాత్రవుండు మృగయారసలోలనిబద్ధబుద్ధిఁ ద**
**త్కాననమెల్లఁ గ్రుమ్మఱి నికామధృతశ్రముఁ డేగుదెంచె నం**
**దానలినాక్షి యున్న విపినాంతర కూపతటంబునొద్దకున్. 139**

**ప్రతిపదార్థం:** ఆనత, శాత్రవుండు= విధేయులైన శత్రువులు కలవాడు (శత్రువులను జయించిన వాడు); ఆ, నహుష= ఆత్మజుండు+అగు= ప్రసిద్ధ డైన నహుషుడి కుమారుడైన; యయాతి= మహారాజు; అధిజ్య, ధనుస్+సహాయుఁడు+ఐ= ఎక్కుపెట్టబడిన నారి కల విల్లు సహాయంగా గలవాడై; మృగయా, రసలోల, నిబద్ధ, బుద్ధిన్= వేట అనే వినోదమందు ఆసక్తి కలదియున్నూ, కట్టబడినదియున్నూ అయిన బుద్ధిగలవాడై; తద్, కాననము+ఎల్లన్= ఆ అడవిఅంతా; క్రుమ్మఱి= తిరిగి; నికామ, ధృత, శ్రముఁడు= మిక్కిలిగా పొందబడిన బడలిక గలవాడై; అందున్= ఆ అడవిలో; ఆ, నలిన+అక్షి= పద్మాలవంటి నేత్రాలు కలిగిన ఆదేవయాని; ఉన్న= పడియున్న; విపిన+అంతర, కూప, తటంబు, ఒద్దకున్= అడవినడుమ నున్న నూతి ఒడ్డు దగ్గరకు; ఏగుదెంచెన్= వచ్చెను.

**తాత్పర్యం:** ఓడించబడి విధేయులైన శత్రువులు కల ప్రసిద్ధుడైన నహుషుడి కుమారు డైన యయాతిమహారాజు వేట అనే వినోదమందు ఆసక్తిగల బుద్ధి కలవాడై, ఆ అడవి అంతా తిరిగి అధికంగా పొందబడిన శ్రమకలవాడై అక్కడ దేవయాని పడియున్న అడవిమధ్యలోని నూతిగట్టుదగ్గరకు వచ్చాడు.

**విశేషం:** ఆ, అను పదం ప్రసిద్ధ డనే అర్థాన్ని సూచిస్తుంది. తటంబు+ఒద్దకున్= షష్ఠీ సమాసమందు ఉకార బుకారములకు అచ్చుపరమైనపుడు నుగాగమ మౌతుంది. తటంబు నొద్దకున్.

**సీ. చనుదెంచి, యమ్మహాజనపతి జల మపే । క్షించి, యచ్చో విశ్రమించి, చూచి,**
**తత్కూపమున విలసత్కూలఘనవల్లి । యన్నిష్టసఖి నూఁదియున్న దాని,**
**గురుకుచయుగముపైఁ బరువడిఁ దొరఁగెడు । కన్నీరు పూరించుచున్న దానిఁ,**
**దనసమీపమునకు జనుల యాగమనంబు । పన్నుగాఁ గోరుచునున్న దాని,**

**ఆ. వరుణదేవుతోడఁ గర మల్గి జలనివా । సంబు విడిచి భూస్థలంబువలని**
**కరుగుదేర నున్న వరుణేంద్రుదేవియ । పోనిదాని దేవయానిఁ గనియె. 140**

**ప్రతిపదార్థం:** చనుదెంచి= వచ్చి; ఆ+మహత్, జనపతి= ఆ గొప్పరాజు (యయాతి); జలము= నీరు; అపేక్షించి= కోరి; అచ్చోన్= అచ్చట; విశ్రమించి= బడలిక తీర్చుకొని; చూచి; తద్+కూపమునన్= ఆనూతియందు; విలసత్, కూల, ఘన, వల్లి= ప్రకాశిస్తున్న ఒడ్డునందలి గొప్పతీగ; అను, ఇష్టసఖిన్= అనెడి ఇష్టురా లైన చెలికత్తెను; ఊఁది, ఉన్నదానిన్= పట్టుకొని ఉన్నదానిని; గురు, కుచయుగముపైన్= పెద్దస్తనాల జంటపై; పరువడిన్= క్రమంగా; తొరఁగెడు= కారెడు; కన్నీరు= బాష్పజలం; పూరించుచున్+ఉన్నదానిన్= నిండిస్తున్నదానిని; తన సమీపమునకున్= తన దగ్గరకు; జనుల= జనాలయొక్క; ఆగమనంబు= రాక; పన్నుగాన్= ఒప్పుగా; కోరుచున్+ఉన్నదానిన్= కోరుతున్న దానిని; వరుణదేవుతోడన్= పడమటి దిక్కునకు రా జైన వరుణదేవుడితో (వరుణదేవుడు జలాధిదేవత); కరము= మిక్కిలి; అల్గి= కోపించి; జలనివాసంబు= జలమందు నివసించటం విడిచి; భూస్థలంబు, వలనికిన్= భూప్రదేశం దిక్కుకు; అరుగుదేరన్, ఉన్న= వచ్చేందుకు సిద్ధంగా ఉన్న; వరుణ+ఇంద్రు, దేవి+అ= వరుణదేవుడి భార్యనే (వరుణుడి పట్టమహిషిని); పోనిదానిన్= పోలినదానిని; దేవయానిన్; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** వచ్చి, ఆ యయాతిమహారాజు నీరు కోరి, అక్కడ విశ్రాంతి గైకొని, చూచి, ఆనూతిలో ఒప్పుతున్న ఒడ్డునం దున్న గొప్పలత అనే ఇష్టసఖిని (రూపకాలంకారం) పట్టుకొన్న దానిని, పెద్దవైనస్తనయుగ్మంపై క్రమంగా జారు కన్నీటిని నింపుతున్నదానిని తనవద్దకు జనులరాకను ఒప్పుగా కోరుతున్నదానిని, వరుణదేవుడితో మిక్కిలి కోపించి జలమందలి నివాసాన్ని విడిచి భూప్రదేశందిక్కుకు రానున్న వరుణుడిపట్టమహిషిని పోలినదానిని దేవయానిని చూచాడు.

**విశేషం:** అలం: ఉపమాలంకారం: ఉత్ప్రేక్ష అనికూడ చెప్పవచ్చును. వరుణుఁడు జలాలకు రాజు. అందుచేత అతడిభార్య జలంలోనే నివసిస్తుంది. తీగను పట్టుకొని యున్న దేవయాని- భర్తమీద కోపించి భూప్రదేశందిక్కుకు రానున్న వరుణుడి పట్టమహిషేమో అన్నట్లున్నది. ఆ+చోటన్= అచ్చోట= త్రికసంధి. ఉత్తర పదమగు చోట శబ్దము టాక్షరము లోపంబు విభాష నగును. చోటుశబ్దము యొక్క సప్తమీ విభక్తి చోటన్. అను+ఇష్టసఖి= అను అనెడి ఉదంత తద్ధర్మ విశేషణమునందలి ఉకారము లోపించగా 'అన్' ఔతుంది. ఇచ్చట ఈ నకారానికి అచ్చుపరమైనందువలన నకారానికి ద్విత్వం వచ్చింది. కొందరు ఇది ద్రుతద్విత్వ సంధి అని చెప్తారు. కాని అన్ లోని నకారం ద్రుతం కాదు - మరి కొందరు అన్న+ఇష్టసఖి అని విడదీస్తారు. 'అరుగుదెంచు' ధాతువుకు తుమున్నర్థకం అరుగుదేరన్, నన్నయ వర్ణించేటప్పుడు విశేషణాలతర్వాత దాని, దాని అని ఉపయోగించటం పెక్కుచోట్ల కానవస్తుంది. ఈ పద్యం చూచి చిత్రకారుఁడు చిత్రాన్ని గీయవచ్చును. నన్నయవర్ణనలు చిత్రకారుడిచిత్రం వలె ఏకైకవిన్యాసాన్ని సూచిస్తా యని విమర్శకులు చెప్తారు. రసపోషకంగా అలంకారాన్ని ప్రయోగించటం, నిర్వహించటం, విడవటం, అవసరం వస్తే మిక్కిలిగా నిర్వహించకపోవటం అనే పద్ధతులు ధ్వనిమార్గవర్తులైన కవులు పాటిస్తారు. నన్నయ ఇక్కడ శోకిస్తున్న శృంగార విభావాన్ని వర్ణిస్తూ అలంకారాన్ని మిక్కిలిగా నిర్వహింపకపోవటం గమనార్హం. 'విలసత్కూపఘనవల్లి యన్నిష్టసఖి నూఁదియున్నదాని' అన్నచోట రూపకం వాడి, దానిని వదలి ఆమెరూపంకంటె దుఃఖాన్ని ఎక్కువగా వర్ణించి, ఎత్తుగీతలో 'వరుణదేవేంద్రుదేవియపోనిదాని' అని ఉపమాలంకారాన్ని నిర్వహించాడు నన్నయ. ఇక్కడ అలంకారం క్రమంగా వస్తువును భావాన్నీ ధ్వనింపచేస్తున్నది.

**వ. కని 'నీ వెవ్వరిదాన? వి ట్లేల యేకతంబ యివ్విపినాంతరకూపంబున నున్న దాన?' వనిన విని దేవయాని యెప్పడుం దమ విహరించుచున్న యవ్వనంబునకు మృగయావినోదార్థంబు యయాతి వచ్చుటంజేసి తొల్లియుఁజూచినది కావున నాతని నెఱింగి యి ట్లనియె. 141**

**ప్రతిపదార్థం:** కని= దేవయానిని చూచి; నీవు; ఎవ్వరిదానవు= ఎవరికి సంబంధించిన దానివి; ఇట్లు= ఈవిధంగా; ఏల= ఎందుకు; ఏకతంబు+అ= ఒంటరిగా; ఈవిపిన+అంతర, కూపంబునన్= ఈ అడవిమధ్య ఉన్న నూతియందు; ఉన్నదానవు; అనినన్= అని యయాతి అడుగగా; విని; దేవయాని; ఎప్పుడున్= ఎల్లప్పుడును (అంతకు ముందు); తమ, విహరించుచున్+ఉన్న= తాము విహారం చేస్తూఉండే; ఆ+వనంబునకున్= ఆ అడవికి; మృగయా, వినోద+అర్థంబు= వేట అనే వినోదం (వేడుక) నిమిత్తం; యయాతి, వచ్చుటన్ చేసి= వస్తూ ఉండటంచేత; తొల్లియున్= పూర్వం కూడ; చూచినది; కావునన్; అతనిన్= యయాతిని; ఎఱింగి= తెలిసికొని, గుర్తించి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** యయాతి దేవయానిని చూచి 'నీవు ఎవతెవు? ఈవిధంగా ఒంటరిగా ఈ అడవినడుమ ఉన్న నూతియందు ఎందుకు పడియున్నావు?' అని అడుగగా దేవయాని విని ఎప్పుడూ తాము విహరించే ఆ అడవికి వేటవేడుక కొరకు వస్తూ ఉండటంవలన, అంతకుముందుకూడ అతడిని చూచిఉన్నది కాబట్టి గుర్తించి ఇట్లా పలికింది.

**తరలము.**

**అమరసన్నిభ! యేను ఘోరసురాసురాహవభూమి న**
**య్యమరవీరులచేత మర్దితు లైన దానవులన్ గత**
**భ్రములఁగాఁ దన విద్యపెంపునఁ బ్రాప్తజీవులఁ జేసి య**
**త్యమితశక్తిమెయిన్ వెలింగినయట్టి భార్గవుకూఁతురన్.** **142**

**ప్రతిపదార్థం:** అమర, సన్నిభ= దేవతలతో సమానమైనవాడా!; ఏను= నేను; ఘోర, సుర+అసుర+ఆహవభూమిన్= భయంకరమైన దేవరాక్షసుల యుద్ధరంగంలో; ఆ+అమరవీరులచేతన్= వీరు లైన ఆ దేవతలచేత; మర్దితులు+అయిన= చంపబడిన; దానవులన్= రాక్షసులను; గత, భ్రములన్, కాన్= పోయినభ్రమ కలవా రగునట్లుగా; తన విద్య పెంపునన్= సంజీవని అనే తనవిద్యయొక్క గొప్పతనంచేత; ప్రాప్తజీవులన్; పొందబడిన జీవం (ప్రాణం) కలవారినిగా; చేసి; అతి+అమిత, భక్తిమెయిన్= మిక్కిలి అధిక మైన శక్తితో; వెలింగిన+అట్టి= ప్రకాశించినట్టి; భార్గవు= శుక్రుడియొక్క; కూఁతురన్= కుమార్తెను.

**తాత్పర్యం:** దేవతాసమానుడి వైన ఓ యయాతీ!. నేను భయంకర మైన దేవరాక్షసులయుద్ధరంగంలో వీరు లైన దేవతలచేత చంపబడిన రాక్షసులను తన సంజీవనీవిద్యాప్రభావంచేత భ్రమతొలగినవారినిగాను, ప్రాణవంతులను గాను చేసి అత్యధిక మైన శక్తితో ప్రకాశించిన శుక్రుడికుమార్తెను.

**విశేషం:** గతభ్రములఁగా అనేచోట జితశ్రములఁగా అన్న పాఠ మున్నది. అనగా జయించబడినశ్రమ కలవారినిగా అని అర్థం: ఈ పాఠంకూడా ఉచితంగానే ఉన్నది. అతి+అమిత= అత్యమిత- యణాదేశసంధి. కూఁతు శబ్దము ప్రథమైక వచనమునకు రు వర్ణ మగును. కూఁతురు. ఇది అస్మద్విశేషణ మగుటచే ను అంతాగమముగా వచ్చినది. ఈ ఆగమానికి ముందు ఉత్వం అత్వమైనది. కూతురన్. తరలవృత్తానికి ప్రతిపాదంలోనూ న-భ-ర-స-జ-జ-గ అనే గణా లుంటాయి. 12వ అక్షరం యతిస్థానం. ఇందలి మొదటి రెండులఘువులను ఒకగురువుగా చేస్తే మత్తకోకిలపాదమౌతుంది. అప్పుడు గణాలు "ర,స,జ,జ,భ,ర" అవుతాయి.

**వ.** **'దేవయాని యనుదానఁ బ్రమాదవశంబున నిన్నూతం బడి వెలువడ నేరకున్నదానను; న న్నుద్ధరించి రక్షింపు' మనిన నవ్విప్రకన్యకయందుఁ దద్దయు దయాళుం డై.** **143**

**ప్రతిపదార్థం:** దేవయాని యనుదానన్; ప్రమాదవశంబునన్= ఏమరుపాటు కారణాన; ఈ+నూతన్= ఈ నూతియందు; పడి; వెలువడన్, నేరక+ఉన్నదానను= పైకి రాజాలకున్నాను (రాలేకపోతున్నాను); నన్నున్, ఉద్ధరించి= పైకి తీసి; రక్షింపుము= కాపాడుము; అనినన్= అని పలుకగా; ఆ+విప్రకన్యక, అందున్= బ్రాహ్మణుడి (శుక్రుడి) కుమార్తె అయిన ఆ దేవయానియందు; తద్దయున్= మిక్కిలి; దయాళుండు+ఐ= దయకలవా డయి.

**తాత్పర్యం:** నేను దేవయాని అనే పేరుకలదానిని. ఏమరుపాటు కారణాన ఈ నూతిలో పడి పైకి రాలేకున్నాను. నన్ను పైకి తీసి రక్షించు మని పలుకగా ఆ బ్రాహ్మణకన్య అయిన దేవయానియెడల మిక్కిలిదయ కలవాడై.

**విశేషం:** 'అది శబ్దమునకు వునులు పరంబగునపుడును సంబోధనంబునందు దాన అన్న దాదేశం బగును'. అను+అది+ను= అనుదానను. దేవయాని ప్రమాదవశాన నూతిలో పడలేదు; శర్మిష్ఠ ఆమెను త్రోసింది. కాని, ఆమె ఈవిధంగా చెప్పటం ఆమె గడుసుతనాన్ని సూచిస్తుంది. శుక్రాచార్యుడికూతుర నని చెప్పుకొని ఆమె తన అభిజాత్యాన్ని చెప్పుకొన్నది. తన పాటుకు కారణంచెప్పకుండ, యయాతిపై కలిగిన అభిలాషకు ప్రతిఫలంగా అతని ఆదరాభిమానాలను పొందాలనుకోవటం అట్లా మాటాడటంలో కల వస్తుధ్వని.

**చ.** **జలధివిలోలవీచి విలసత్కలకాంచి సమంచితావనీ**
**తలవహనక్షమం బయిన దక్షిణహస్తమునం దదున్నమ**
**ద్గళదురఘర్మవారికణక్రమకరాబ్జము వట్టి నూతిలో**
**వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్.** **144**

**ప్రతిపదార్థం:** విశ్రుతకీర్తి= ప్రసిద్ధమైనకీర్తి కల యయాతి; జలధి, విలోల, వీచి, విలసత్, కల, కాంచి, సమంచిత+అవనీ, తల, వహన, క్షమంబు+అయిన= సముద్రంయొక్క చలించే తరంగా లనబడే ప్రకాశిస్తున్న మధురంగా మ్రోగే ఒడ్డాణంతో కూడిన భూతలాన్ని భరించటంలో సమర్థ మైన; దక్షిణ హస్తమునన్= కుడిచేతితో; తద్+ఉన్నమత్+గళత్+ఉరు, ఘర్మ, వారి, కణ, క్రమ, కర+అబ్జము= ఆ దేవయానియొక్క పైకెత్తబడుతున్నట్టియూ, జారుతున్న అధికమైన చెమట బిందువులచేత సుందరమైనట్టియూ పద్మము వంటిచేతిని; పట్టి= గ్రహించి; నూతిలోన్= నూతినుండి; వెలువడన్= బయటికి వచ్చునట్లుగా; కోమలిన్= మృదు వైన శరీరం కల దేవయానిని; ప్రీతితోన్= ప్రేమతో; తిగిచెన్= లాగెను (పైకిలాగాడు).

**తాత్పర్యం:** ప్రసిద్ధ మైన కీర్తి గల యయాతి సముద్రంయొక్క చలించే తరంగాలనే మధురమైన ధ్వని కలిగిన ఒడ్డాణంతో కూడిన ధరణీతలాన్ని వహించే శక్తి గల కుడిచేతితో పైకెత్తబడినదియూ, జారుతున్న అధికమైన చెమటబిందువులతో అంద మైనదీ అయిన దేవయాని పద్మంవంటిచేయిని పట్టుకొని నూతినుండి పైకి వచ్చేటట్లుగా ప్రీతితో పైకి తీశాడు.

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం, రూపకం. యయాతి దేవయానియొక్క కరాబ్జము పట్టుకొనటం ముందు జరుగబోతున్న పాణిగ్రహణాన్ని సూచిస్తుంది. దేవయాని హస్తం చెమటబిందువులతో తడిసి ఉండటంవలన పద్మంగా రూపించటం సముచితం. యయాతి కుడిచేయి భూభారవహనక్షమ మైనది కాబట్టి దిగ్గజముయొక్క తుండంవలె నున్నదని భావించటానికి వీలున్న 'హస్త' శబ్దం వాడటం సార్థకం. దేవయానియందు ఉదయించిన అభిలాషవలన కలిగిన సాత్త్వికభావోదయంగా హస్తంమీది స్వేదాన్ని నన్నయ వర్ణించి ధ్వనింపజేశాడు. అది కరగ్రహణంచేత పరిపుష్టి చెందింది. వర్ణ్యవస్తు స్వరూపస్వభావవ్యంజకాలైన

అక్షరాలను రచనలో వాడి శయ్యాసౌందర్యాన్ని పోషించే అక్షరరమ్యతకు ఈ పద్యం రమణీయోదాహరణం. నూతిలో వెలువడ= నూతినుండి బయటికి వచ్చేటట్లు ఇక్కడ షష్ఠీవిభక్తి పంచమ్యర్థంలో వాడబడింది.

**వ. ఇట్లు దేవయాని నుద్ధరించి నిజపురంబున కరిగె; నిట దేవయానియు శర్మిష్ఠసేసిన యెగ్గువలన విముక్తయయి తన్ను రోయుచు వచ్చుదాని ఘూర్ణిక యను పరిచారికం గని 'యేను వృషపర్వుపురంబు సొర నొల్ల; శర్మిష్ఠ చేత నా పడిన యవమానంబు మదీయ జనకున కెఱింగింపు' మని పంచిన, నదియును నతిత్వరితగతిం జని తద్వృత్తాంతం బంతయు శుక్రునకుం జెప్పిన, శుక్రుండును నాక్షణంబ వచ్చి కోప ఘూర్ణిత బాష్ప పూరితనయన యై యున్న దేవయానిం గని యి ట్లనియె. 145**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; దేవయానిన్; ఉద్ధరించి= పైకి తీసి; నిజపురంబునకున్= తన పట్టణానికి; అరిగెన్= యయాతి వెళ్ళాడు. ఇటన్= ఇచ్చట; దేవయానియున్= దేవయానికూడ; శర్మిష్ఠ, చేసిన= వృషపర్వుడి కూతు రైన శర్మిష్ఠ చేసిన; ఎగ్గువలనన్= కీడువలన; విముక్త+అయి= విడువబడినదై; తన్నున్= దేవయానిని; రోయుచున్+వచ్చు, దానిన్= వెదకుతూ వస్తున్న దానిని; ఘూర్ణిక అను పరిచారికన్= ఘూర్ణిక అన్న పేరు కల సేవకురాలిని; కని= చూచి; ఏను= నేను; వృషపర్వు, పురంబు= వృషపర్వు డనే రాక్షస రాజు పట్టణాన్ని; చొరన్+ఒల్లన్= ప్రవేశించటానికి అంగీకరించను; శర్మిష్ఠచేతన్; నా పడిన= (కర్తృపదప్రథమకుషష్ఠి) నేను పొందిన; అవమానంబు= పరాభవం; మదీయ జనకునకున్= నాతండ్రి యైన శుక్రుడికి; ఎఱింగింపుము= తెల్పుము; అని, పంచినన్= అని పంపగా; అదియునున్= ఆ ఘూర్ణికయును; అతి త్వరితగతిన్= మిక్కిలి వేగంతో కూడిన గమనంతో; చని= వెళ్ళి; తద్, వృత్తాంతంబు+అంతయున్= దేవయానికి జరిగిన అవమాన విషయమంతా; శుక్రనకున్; చెప్పగా; శుక్రుండునున్= శుక్రుడు కూడ; ఆ క్షణంబు+అ= ఆక్షణ మందే; వచ్చి; కోప, ఘూర్ణిత, బాష్ప, పూరిత, నయన, అయి, ఉన్న= కోపంచేత తిరుగుడు పడినట్టియున్నూ, కన్నీటితో నిండినట్టియున్నూ నేత్రాలు కలదై ఉన్న; దేవయానిన్; కని= చూచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా దేవయానిని నూతినుండి పైకి తీసి యయాతి తనపట్టణానికి వెళ్ళాడు. ఇక్కడ దేవయాని కూడా శర్మిష్ఠ తనకు చేసిన కీడువలన విడువబడినదై తనను వెదకుతూ వస్తున్న ఘూర్ణిక అనే పేరు కలదానిని చూచి 'నేను వృషపర్వుడి పట్టణంలో ప్రవేశించటానికి అంగీకరించను; శర్మిష్ఠచేత నేను పొందిన అవమానం నా తండ్రికి తెలుపుము' అని పంపగా, ఘూర్ణికకూడా మిక్కిలివేగంతో కూడిన గమనంతో వెళ్ళి జరిగిన వృత్తాంతమంతా శుక్రుడికి చెప్పింది. శుక్రుడుకూడ తత్క్షణమే వచ్చి, కోపంచేత తిరుగుడు పడినట్టి, కన్నీటితో నిండినట్టి నేత్రాలు కలదై ఉన్న దేవయానిని చూచి యిట్లా పలికాడు.

**క. అనుపమ నియమాన్వితు లై । యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు సే**
**సినవారికంటె నక్రో । ధనుఁడ గరం బధికుఁ డండ్రు తత్త్వవిధిజ్ఞుల్. 146**

**ప్రతిపదార్థం:** అనుపమ, నియమ+అన్వితులు+అయి= సాటిలేని నియమంతో కూడిన వా రై; అనూన, దక్షిణలన్= అధికము లయిన దక్షిణలతో (సంభావనలతో); క్రతు, సహస్రంబులు= యజ్ఞములు వేలు; చేసిన వారికంటెన్; అక్రోధనుఁడు+అ= కోపశీలం లేనివాడే; కరంబు= మిక్కిలి; అధికుఁడు= గొప్పవాడు; అని; తత్త్వవిధిజ్ఞుల్= పరమార్థ మెఱిఁగినవారు; అండ్రు= అందురు (అంటారు).

**తాత్పర్యం:** సాటి లేని నియమంతో కూడినవా రై గొప్పదక్షిణలతో వేలకొద్దీ యజ్ఞాలు చేసినవారికంటెకూడ కోపం లేనివాడే మిక్కిలిగొప్పవా డని పరమార్థం తెలిసినవారు చెప్తారు.

**విశేషం:** నన్నయ సూక్తులలో ఇది ఒకటి. అను+దురు, తిదుటలు పరంబు లగునపుడు అన్వాదుల'ను' స్థానమున సున్న యగును- అందురు. ఇట బిందువు మీది తదలకు నిత్య వైకల్పికంబులయి టడ లగును- అండురు. ఉత్వలోపము- అంద్రు.

**క. అలిగిన నలుగక, యెగ్గులు । పలికిన మఱి విననియట్ల ప్రతివచనంబుల్**
**వలుకక, బన్నము వడి యెడఁ । దలఁపక యు న్నతఁడె చూవె ధర్మజ్ఞుఁ డిలన్. 147**

**ప్రతిపదార్థం:** అలిగినన్= ఇతరులు కోపించగా; అలుగక= కోపించక; ఎగ్గులు, పలికినన్= నిందావాక్యాలు పలుకగా; మఱి= అనంతరం, వినని, అట్లు+అ= ఆ నిందావాక్యాలు వినని విధంగానే; ప్రతివచనంబుల్= మారుమాటలు; పలుకక; బన్నము= అవమానము; పడి= పొంది; ఎడన్= హృదయమందు; తలఁపక= దానిని తలపకుండగనే; ఉన్న+అతఁడు+అ+చూవె= ఉన్నవాడే సుమా; ఇలన్= భూమియందు; ధర్మజ్ఞుఁడు= ధర్మం తెలిసినవాడు.

**తాత్పర్యం:** ఇతరులు కోపిస్తే కోపించకుండా, ఇతరులు నిందలు పలికితే మరి వాటిని విననట్లే మారుపలుకక, అవమానం పొందికూడా హృదయమందు తలవకుండా ఉన్నవాడే సుమా భూమియందు ధర్మ మెరిగినవాడు.

**విశేషం:** ఇదికూడ నన్నయ సూక్తులలో ఒకటి. చూవె - చుమా యొక్క సంక్షిప్తరూపం.

**వ. 'కావున బుద్ధి గలవారికిఁ గ్రోధంబు గొనియాడం దగదు; శర్మిష్ఠ రాచకూఁతురు; గొండుక యది; దానితోడి దేమి ర' మ్మనిన దేవయాని యి ట్లనియె. 148**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; బుద్ధి, కలవారికిన్= బుద్ధిమంతులకు; క్రోధంబు= కోపము; కొని, ఆడన్, తగదు= పొగడుట యుక్తం కాదు; శర్మిష్ఠ; రాచకూఁతురు= రాజుగారి కూతురు; కొండుక+అది= చిన్నది; దానితోడి+అది+ఏమి= దానితో ఏమి; రమ్ము; అనినన్= అని శుక్రుఁడు పిలువగా; దేవయాని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'కాబట్టి బుద్ధిమంతులకు కోపాన్ని పొగడటం తగదు. అంటే కోపం మంచి దని పొగడటం యుక్తం కాదు. శర్మిష్ఠ; రాజకుమారి, వయసులో చిన్నది. దానితో ఏమిటి! (అంటే అది చేసిన పని లెక్కచేయ కూడదు) ఇంటికి రా' అని శుక్రుడు పలుకగా దేవయాని ఇట్లా అన్నది.

**విశేషం:** తోడన్+అదితోడిది= 'సమాసముల చేత తోడ వలనల కిత్వమగును. అది, శబ్దముల అత్తునకు వృత్తిని లోపంబు బహుళముగా నగును.

**క. కడు ననురక్తియు నేర్పును । గడఁకయు, గలవారి నుఱక కడవఁగ నెగ్గుల్**
**నొడివెడు వివేకశూన్యుల । కడ నుండెడు నంతకంటెఁ గష్టము గలదే. 149**

**ప్రతిపదార్థం:** కడున్= మిక్కిలి; అనురక్తియున్= ప్రేమయు; నేర్పును; కడఁకయున్= యత్నమును (పూనికయును); కల, వారిన్; ఉఱక= లక్ష్యము చేయక, కడవఁగన్= మేర మీరునట్లుగ; ఎగ్గుల్= నిందలు; నుడివెడు= పలికెడి; వివేకశూన్యుల కడన్= జ్ఞానహీనులవద్ద; ఉండెడు, అంతకంటెన్= నివసించేదానికంటె; కష్టము= నీచత్వం; కలదు+ఏ= ఉన్నదే; లేదని భావం.

**తాత్పర్యం:** మిక్కిలి అనురాగమూ, నేర్పూ, పూనికయు, కలవారిని లక్ష్యపెట్టక మేరమీరేటట్లుగా నిందలు పలికేజ్ఞాన హీనులవద్ద నివసించటంకంటె నైచ్యం వేరుగా గలదా! లేదు.

వ. 'ఈవృషపర్వుపురం బేను జొరనొల్ల; నెట యేనియుం బోదు' ననిన శుక్రుండు 'నాకు నీవ గతివి. నీతోడ నేనును వత్తు' ననుచుఁగూఁతుం బట్టువఱుచుచున్నంత, నంతయుఁజారులవలన నెఱింగి వృషపర్వుండు శుక్రునొద్దకు వచ్చి నమస్కరించి యి ట్లనియె. 150

**ప్రతిపదార్థం:** ఈ, వృషపర్వు, పురంబు= ఈ వృషపర్వుడి యొక్కపట్టణం; ఏను= నేను, చొరన్+ఒల్లన్= ప్రవేశించ నంగీకరించను; ఎట, ఏనియున్= ఎక్కడికైనా, పోదున్= వెళతాను; అని= అని దేవయాని పలుకగా; శుక్రుండు; నాకున్; నీవు+అ= నీవే; గతివి= దిక్కు; నీతోడన్; నేనును= నేనుకూడా; వత్తున్= వస్తాను; అనుచున్= అని పలుకుతూ; కూఁతున్= కూతురిని; పట్టువఱుచుచున్; ఉన్న, అంతన్= అను నయిస్తుండగా (ఓదారుస్తుండగా); అంతయున్= జరిగిన విషయమంతా; చారులవలనన్= వేగులవారివలన; ఎఱింగి= తెలిసికొని; వృషపర్వుండు= రాక్షసరాజు; శుక్రు+ఒద్దకున్= శుక్రుడి దగ్గరకు; వచ్చి; నమస్కరించి= మ్రొక్కి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఈ వృషపర్వుడిపట్టణంలో నేను ప్రవేశించటానికి అంగీకరించను. మరి ఎక్కడికైనా వెడతాను' అని దేవయాని పలుకగా శుక్రుడు 'నాకు నీవే దిక్కు, నీతో నేను కూడా వస్తా' నని కూతురిని ఓదారుస్తుండగా, ఈ విషయమంతా వేగులవారివలన తెలిసికొని, రాక్షసరా జైన వృషపర్వుడు శుక్రుడివద్దకు వచ్చి నమస్కరించి ఇట్లా పలికాడు.

ఉ. దేవతలన్ జయించుచు నతిస్థిరసంపదలం ద్వదీయవి
ద్యావిభవంబు పెంపునన దానవు లుద్ధతు లైరి; కానినాఁ
డీ వనరాశిలోఁ జొరరె యింతకు నంతకకోపు లైన య
ద్దేవపతాకినీపతుల దివ్యనిశాతమహాయుధాహతిన్. 151

**ప్రతిపదార్థం:** దేవతలన్= దేవతలను; జయించుచున్; అతిస్థిర, సంపదలన్= మిక్కిలి స్థిరమైన సంపదలతో; త్వదీయ, విద్యావిభవంబు, పెంపునన్+అ= నీయొక్క విద్యయొక్క వైభవం యొక్క గొప్పతనం చేతనే; దానవులు= రాక్షసులు; ఉద్ధతులు+ఐరి= గర్వించినవా రైనారు; కాని, నాఁడు= అది లేనప్పుడు; అంతక, కోపులు+అయిన= యముడియొక్క కోపం వంటి కోపం కలవారైన; ఆ+దేవ, పతాకినీ, పతుల= ఆ దేవతలసేనా నాయకులయొక్క; దివ్య, నిశాత, మహత్, ఆయుధ, ఆహతిన్= దేవతా సంబంధులూ, వాడివియూ అయిన గొప్పఆయుధాల దెబ్బచేత, ఇంతకున్= ఈ పాటికే; ఈవన రాశిలోన్= ఈ సముద్రంలో; చొరరు+ఎ= ప్రవేశించరా! ప్రవేశిస్తా రని భావం.

**తాత్పర్యం:** నీ విద్యా మహత్త్వంయొక్క గొప్పతనం చేతనే దేవతలను జయిస్తూ మిక్కిలి స్థిరమైన సంపదలతో రాక్షసులు గర్వం కలవా రైనారు కానిచో, (ఆ విద్యలేనపుడు) యముడికోపంవంటి కోపం కలవా రైన ఆ దేవతా సేనాపతుల దివ్య మైనవీ, వాడి అయినవీ అయిన గొప్పఆయుధాల దెబ్బలచేత ఈసముద్రంలో ప్రవేశించి ఉండరా! అంటే మరణించి ఉండరా? అని భావం.

**విశేషం:** ఇంతకు నంతక కోపులు - ఇచ్చట ఛేకానుప్రాసం కలదు. వృషపర్వుడు చెప్పిన దంతా సత్యమే. శుక్రుడి మృతసంజీవనీ విద్య లేకుంటే దేవతలు రాక్షసులను చంపి ఉండేవారే; లేకుంటే భయంతో రాక్షసులు సముద్రంలో దాగి

ఉండేవారే. వస్తుస్వభావస్ఫుటత్వంతో కూడుకొన్న ఝుటిత్యర్థప్రతిపత్తికి హేతు వైన రచన కల ఈపద్యంలో అర్థవ్యక్తి అనే శబ్దగుణం పోషించబడింది. (సంపా.)

**క. వారణ ఘోటక భాండా । గారంబులు మొదలుగాఁగఁ గల ధనములతో**
**సూరినుత! యిందఱము నీ । వారకములు గాఁగ మమ్ము వగవుము బుద్ధిన్. 152**

**ప్రతిపదార్థం:** సూరి, నుత= పండితులచేత స్తుతించబడినవాడా! శుక్రుడా!; వారణ, ఘోటక, భాండాగారంబులు= ఏనుగులు, గుఱ్ఱాలు, ధనాలు ఉండేచోట్లు; మొదలు, కాఁగన్= మొదలయ్యేటట్లుగా; కల, ధనములతోన్= ఉన్న ధనాలతో; ఇందఱము= ఈ రాక్షసులమందరమూ; నీ వారకములు, కాఁగన్= నీ సొమ్ములౌనట్లుగా; మమ్మున్= రాక్షసులను; బుద్ధిన్= మనస్సులో; వగవుము= తలచుము.

**తాత్పర్యం:** ఏనుగులు గుఱ్ఱాలు మొదలుగా గల ధనాలతో ఈ రాక్షసులందరమున్నూ నీ సొమ్ములుగానే మనస్సునందు తలచవలసింది.

**విశేషం:** వారకం= లేనికాలమునందు ఉపయోగార్థ మొకరి కిచ్చి, కలిగినకాలమునందు మరల పుచ్చుకొనే ధనం మొదలయినది - అని నిఘంటువులోని అర్థం. నన్నయకాలంలో 'వగచు' ధాతువుకు 'తలచు' అని అర్థం.

### శర్మిష్ఠ దాసి యై దేవయానిం గొలుచుట (సం.1-75-13)

**వ. 'ఈ దేవయాని కెద్ది యిష్టంబు దానిన యిత్తు, నడుగు' మనిన దేవయాని సంతసిల్లి 'యట్లేని శర్మిష్ఠ గన్యకా సహస్రంబుతో నాకు దాసి గావలయు, నిదియ నా కిష్టంబు; దీనిన యిచ్చునది' యనిన వృషపర్వుం డప్పు డక్కూఁతు రావించి, కన్యకాసహస్రంబుతో దేవయానికి దాసిగా నిచ్చి శుక్రునకు మనఃప్రియంబు సేసిన, శర్మిష్ఠయు నగ్గురువచనంబునఁ గన్యకాసహస్రంబుతో నిత్యంబును దేవయానిం గొలుచుచుండె; నంత నొక్కనాఁడు. 153**

**ప్రతిపదార్థం:** ఈ దేవయానికిన్= నీకూతు రైన దేవయానికి; ఎద్ది= ఏది; ఇష్టంబు= ప్రియమో; దానిన్+అ= దానినే; ఇత్తున్= ఇచ్చెదను; అడుగుము+అనినన్= అడుగు మని వృషపర్వుడు పలుకగా; దేవయాని; సంతసిల్లి= సంతోషించి; అట్లు+ఏని= అట్లైతే; అంటే నేనడిగిన దానినే (నా కిష్టమైన దానినే, నీ విచ్చేటట్లయితే); శర్మిష్ఠ= నీకూతురైన శర్మిష్ఠ; కన్యకా, సహస్రంబుతోన్= కన్యకలు వేయిమందితో; నాకున్, దాసి, కావలయున్= సేవకురాలు కావాలి; ఇది+అ= ఇదే; నాకు; ఇష్టంబు= ప్రియం (ఇష్టం); దీనిన్+అ= దీనినే; ఇచ్చునది= ఇమ్ము; అనినన్= అని దేవయాని పలుకగా; వృషపర్వుండు; అప్పుడు+అ= ఆ క్షణమే; ఆ+కూఁతున్= తన కూతురైన శర్మిష్ఠను; రావించి= రప్పించి; కన్యకా, సహస్రంబుతోన్= కన్యలు వేయిమందితో; దేవయానికిన్; దాసి+కాన్= దాసి అయ్యేటట్లుగా; ఇచ్చి; శుక్రునకున్; మనస్+ప్రియంబు= మనసుకు ప్రీతి; చేసినన్= చేయగా; శర్మిష్ఠయున్; ఆ+గురువచనంబునన్= ఆ తండ్రి యైన వృషపర్వుడి మాటచేత; కన్యకాసహస్రంబుతోన్= కన్యకలు వేయిమందితో; నిత్యంబును= ఎల్లప్పుడున్నూ; దేవయానిన్; కొలుచుచున్; ఉండెన్= సేవిస్తూ ఉన్నది; అంతన్= అటుతరువాత; ఒక్కనాఁడు= ఒక్కరోజున.

**తాత్పర్యం:** 'ఈ దేవయాని కేది ఇష్టమో (ప్రియమో) దానినే ఇస్తాను' అని వృషపర్వుడు పలుకగా దేవయాని సంతోషించి 'అట్లా అయితే, శర్మిష్ఠ వేయిమందికన్యలతో నాకు దాసి కావాలి; ఇదే నాకు ఇష్టం. దీనినే నాకు

ఇవ్వాలిసింది' అని పలుకగా వృషపర్వుండు తత్క్షణమే తనకూతు రైన శర్మిష్ఠను రప్పించి, వేయిమంది కన్యలతో దేవయానికి దాసిగా ఇచ్చి, గురువైన శుక్రుడికి మనఃప్రీతి కావించాడు. శర్మిష్ఠకూడా తండ్రివాక్యాలను అనుసరించి వేయిమంది కన్యలతో ఎల్లప్పుడూ దేవయానిని సేవిస్తూ ఉన్నది. అటుతర్వాత ఒక్కరోజున. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'విధియందు లూట్టునకు అదియను తచ్ఛబ్దమును ముందు ను గాగమంబును నగును'. ఇచ్చు+అది= ఇచ్చునది= ఇమ్ము.

**క.** **వనకేళీ కౌతుకమునఁ । జనియెను శర్మిష్ఠఁ దొట్టి సఖులెల్ల ముదం**
**బునఁ గొలిచిరాఁగ విభవము । దన కమరఁగ దేవయాని తద్వనమునకున్.** **154**

**ప్రతిపదార్థం:** దేవయాని; వన; కేళీ, కౌతుకమునన్= వనమందలి క్రీడయందలి కుతూహలంతో; శర్మిష్ఠన్+తొట్టి= శర్మిష్ఠ మొదలైన; సఖులు+ఎల్లన్= చెలికత్తెలందరూ; ముదంబునన్= సంతోషంతో; కొలిచి= సేవించి; రాఁగన్= తనతో రాగా; విభవము= వైభవం; తనకున్; అమరఁగన్= ఒప్పగా; తద్+వనమునకున్= ఆ అడవికి (యయాతి తనను నూతినుండి వెలికితీసిన వనానికే); చనియెను= వెళ్ళెను.

**తాత్పర్యం:** దేవయాని శర్మిష్ఠ మొదలైన చెలులంతా సంతోషంతో సేవించి రాగా, తనకు వైభవం ఒప్పగా, పూర్వపు వనానికే, వనమందు క్రీడించే కుతూహలంతో వెళ్ళింది.

**విశేషం:** తొట్టు ధాతువునకు క్త్వార్థకరూప మొక్కటే కానవస్తున్నది. పూర్వం వనాని కేగినపుడు రాచకూతు రైన శర్మిష్ఠకు అధిక వైభవ మున్నది. ఇప్పు డామె దేవయానికి దాసి అవటంచేత దేవయానికి అధికవైభవం కలిగింది.

**వ.** **ఇ ట్లరిగి యవ్వనంబునఁ గన్యకలుం దానును బుష్పాపచయంబు సేయుచు, విమలజలప్రవాహ విలసితం బైన యొక్కసెలయేటి కెలన, నవవికచ కుసుమ సుకుమార కోరక నికర భరిత సహకార కురవక వకు ళాశోక తమాల సాల చ్ఛాయాశీతల సికతాతలంబున నిష్టవినోదంబుల నున్న యవసరంబున.** **155**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; అరిగి= వెళ్ళి; ఆ+వనంబునన్= ఆ అడవిలో; కన్యకలున్= చెలికత్తెలయిన కన్యకలున్నూ; తానును; పుష్ప+అపచయంబు= పువ్వులను కోయటం; చేయుచున్; విమల, జల ప్రవాహ విలసితంబు+ఐన= నిర్మలమైన నీటిప్రవాహంతో ప్రకాశించేదైన; ఒక్క, సెలయేటి, కెలనన్= ఒక కొండనదిపక్క; నవ, వికచ కుసుమ= కొత్తగా వికసించిన పువ్వులయొక్క; సుకుమార, కోరక, నికర= మృదువైన పూమొగ్గలయొక్క సమూహంతో; భరిత= నిండిన; సహకార= తియ్యమామిడిచెట్లయొక్క; కురవక= గోరంట చెట్లయొక్క; వకుళ= పొగడచెట్లయొక్క; అశోక= అశోకవృక్షాలయొక్క; తమాల= చీకటిచెట్లయొక్క; సాల= మద్దిచెట్ల యొక్క; ఛాయా= నీడచేత; శీతల= చల్లనైన; సికతా, తలంబునన్= ఇసుకప్రదేశమందు; ఇష్ట, వినోదంబులన్= ప్రియా లైన వేడుకలతో; ఉన్న; అవసరంబునన్= సమయంలో.

**తాత్పర్యం:** ఈవిధంగా వెళ్ళి ఆవనంలో చెలికత్తె లైన కన్యలున్నూ, తానున్నూ, పూలు కోస్తూ నిర్మల మైన నీటిప్రవాహంతో ప్రకాశించే ఒక్క కొండనదిప్రక్క క్రొత్తగా వికసించిన పూలతోను, మృదువు లైన మొగ్గలయొక్క

సమూహంతోను, నిండిన తియ్యమామిడిచెట్ల గోరంటచెట్ల పొగడచెట్ల అశోకవృక్షాల చీకటిమాకుల మద్దిచెట్ల నీడలచేత చల్ల నైన ఇసుకప్రదేశంలో తమ కిష్ట మైనవేడుకలతో ఉన్న సమయాన. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** సాల మంటే వృక్ష మని అర్థం కూడ కలదు. అపుడు సహకారాది వృక్షాలయొక్క నీడచేత అని అర్థం చెప్పాలి. సాల+ఛాయా= సాలచ్ఛాయా. హ్రస్వ మైన అచ్చు తరువాతి ఛకారం ద్విరుక్త మౌతుంది.

**సీ.** **అంగనాజనుల యుత్తుంగ సంగత కుచ । కుంకుమ చందన పంకములయు**
**వారివ ధమ్మిల్లభారావకలిత ది । వ్యామోద నవపుష్పదామములయు**
**వారివ ముఖ సకర్పూరతాంబూలాది । వాసిత సురభి నిశ్వాసములయు**
**వారివ పరిధాన చారుధూపములయు । విలసిత సౌరభావలులు దాల్చి**

**తే.** **యనిలుఁ డను దూత వోయి తోడ్కొనుచు వచ్చె । దేవయానిపాలికి మృగతృష్ణఁ జేసి**
**కాననంబునఁ గ్రుమ్మరువాని వీరు । నతిపరిశ్రాంతుఁ డైన యయాతి నంత.** **156**

**ప్రతిపదార్థం:** అంగనా, జనుల= స్త్రీలయొక్క; ఉత్తుంగ= ఎత్తైన, సంగత= ఒకదానికొకటి మిక్కిలి దగ్గరగా నున్న; కుచ= స్తనాలయందలి; కుంకుమ, చందన, పంకములయున్= కుంకుమయొక్క, మంచిగంధం యొక్క, బురదల యొక్క; (కుంకుమ చందన ద్రవాలయొక్క; వారివి+అ= ఆ స్త్రీలవే అయిన; ధమ్మిల్లభార= పెద్దకొప్పుల నుండి; అవకలిత= జారిన; దివ్య+ఆమోద= మంచిసువాసన కల; వన పుష్ప దామములయున్= క్రొత్త పూలదండలయొక్క; వారివి+అ= ఆ స్త్రీలవే అయిన; ముఖ= ముఖాలనుండి వెలువడు; సకర్పూర, తాంబుల+ఆది= కర్పూరంతో కూడిన తాంబూలం మొదలైనవాటిచేత; వాసిత= సువాసన కలవిగా చేయబడిన; సురభి, నిశ్వాసములయున్= పరిమళాలు కల నిట్టూర్పులయొక్క; వారివి+అ= ఆ స్త్రీలవే అయిన; పరిధాన= వస్త్రాల యొక్క; చారు, ధూపములయున్= ఒప్పయిన ధూపాలయొక్క; విలసిత, సౌరభ+ఆవలులు= ప్రకాశించే వాసనల సముదాయాలు; తాల్చి= ధరించి; అనిలుఁడు+అను, దూత= గాలి అనే దూత; పోయి= వెళ్ళి; మృగతృష్ణన్, చేసి= ఎండమావులచేత; కాననంబునన్= అడవిలో; క్రుమ్మరువానిన్= తిరిగేవాడిని; వీరున్= వీరు డైన వాడిని; అతిపరిశ్రాంతుఁడు+అయిన= మిక్కిలి అలసినవా డైన; యయాతిన్= యయాతిమహారాజును; దేవయాని, పాలికిన్= దేవయాని సమీపానికి; తోడ్కొనుచున్, వచ్చెన్= తీసికొని వచ్చాడు; అంతన్= అటు పిమ్మట.

**తాత్పర్యం:** స్త్రీజనాల ఎత్తైనట్టి, అందమైనట్టి స్తనాలయందలి కుంకుమ గంధ ద్రవాలయొక్క సుగంధాలను ఆ స్త్రీలకే సంబంధించిన పెద్ద కొప్పులయం దుంచబడిన మంచివాసనలతో కూడిన క్రొత్తపూలదండలయొక్క సువాసనలను, ఆ స్త్రీలకే సంబంధించిన ముఖాలనుండి వెలువడే కర్పూరంతో కూడిన తాంబూలం మొదలైన వాటిచేత సువాసన కలవిగా చేయబడిన పరిమళవంతమైన నిట్టూర్పులయొక్క సౌగంధ్యాలను, ఆ స్త్రీలకే సంబంధించిన వస్త్రాల ఒప్పైనధూపాలయొక్క ప్రకాశించే సువాసనలసముదాయాన్ని వహించి వాయు వనే దూత వెడలి ఎండమావులచే అడవిలో తిరుగుతున్నట్టియూ, వీరుడైనట్టియూ, మిక్కిలి అలసినట్టియూ అయిన యయాతిమహారాజును దేవయాని చెంతకు తీసికొని వచ్చాడు.

**విశేషం:** అవకలిత శబ్దానికి జారిన అని కాని, వ్రేలాడుతున్న అని కాని అర్థాలు చెప్పవచ్చును. వాసిత, సురభి అనే పదాలు పునరుక్తులవలె తోచవచ్చును కాని సురభి శబ్దానికి సహజ మైన సౌరభం కల అని అర్థం చెప్పుకుంటే వారినిశ్వాసాలు సహజ

పరిమళ భరిత మైనవనీ, తాంబూలాది సుగంధద్రవ్యాలవలన ఆ సౌరభం మరింత అధిక మైనదనీ ఊహించవచ్చును. వస్త్రాలకు సువాసన కలిగేందుకు సుగంధాలతో ధూపాలు వేసేవా రని గ్రహించవచ్చును. మృగతృష్ణ అంటే ఎండమావులు. ఇక్కడ మృగాలను వేటాడుటయందు కోరిక లేక దప్పి అని అర్థం చెప్పుకొనటం యుక్తంగా ఉంటుంది. లేక మృగతృష్ణను చూచి నీరున్న దనుకొని భ్రమించి దప్పిక కలవాడవటంచేత యయాతి తిరుగుతున్నా డని భావించవచ్చును. గాలి అనే దూత యయాతిని తీసికొని వచ్చాడు అంటే గాలిలోని పరిమళంచేత ఆకర్షింపబడి యయాతి దేవయానిదగ్గరకు వచ్చా డని భావం. అలం: రూపకం.

**క. తరళనయనాబ్జదళములు - నెరయఁగఁ బై మున్న చల్లి నృపసుతుఁ బూజిం**
**చిరి నవకుసుమమయాలం - కరణ విశేషముల నచటి కాంతలు ప్రీతిన్. 157**

**ప్రతిపదార్థం:** అచటికాంతలు= అక్క డున్న దేవయాని మొదలైన స్త్రీలు; తరళ, నయన+అబ్జ, దళములు= చలించే నేత్రాలనుండి వెలువడే చూపులనెడి తామరరేకులు; నెరయఁగన్= నిండునట్లుగా; పైన్= యయాతి మీద; మున్ను+అ= మొదటనే చల్లి; నవ, కుసుమ మయ+అలంకరణ విశేషములన్= క్రొత్తపూలతో నిండిన అలంకార విశేషాలచేత; ప్రీతిన్= ప్రీతితో; నృపసుతున్= రాజకుమారు డైన యయాతిని; పూజించిరి= గౌరవించారు.

**తాత్పర్యం:** అక్కడ ఉన్న దేవయాని మొదలైన స్త్రీలు రాజకుమారు డైన యయాతిపై మొదటే చంచలాలయిన నేత్రాలనుండి వెలువడే చూపులనే పద్మదళాలు నిండేటట్లుగా చల్లి, తరువాత క్రొత్తపూలమాలలు మొదలైన అలంకారాలచేత అతడిని ప్రీతితో పూజించారు.

**విశేషం:** అలం: రూపకాతిశయోక్తి. యయాతి తమదగ్గరకు రాగానే ఆ స్త్రీలు మొదట తమచూపులను ప్రసరింపచేశా రనీ, తరువాత పుష్పమయాలైన అలంకారాలచేత పూజించా రనీ భావం.

### యయాతిమహారాజు దేవయానిని వివాహం బగుట (సం.1-76-8)

**వ. అయ్యయాతియుఁ దత్ప్రదేశంబున సుఖోపవిష్టుం డై దేవయానిం దొల్లి యెఱింగినవాఁ డై యతిశయరూప లావణ్యగుణసుందరి యయిన శర్మిష్ఠ నెఱుంగ వేఁడి, 'మీ రెవ్వరివారలు మీకులగోత్ర నామంబు లెఱుంగ వలతుం జెప్పుం' డనిన నారాజునకు దేవయాని యి ట్లనియె. 158**

**ప్రతిపదార్థం:** ఆ+యయాతియున్= ఆ యయాతియు; తద్, ప్రదేశంబునన్= అక్కడ; సుఖ+ఉపవిష్టుండు+ఐ= సుఖంగా కూర్చున్నవాడై; దేవయానిన్= దేవయానిని; తొల్లి= అంతకుముందే; ఎఱింగినవాఁడు+ఐ= నూతినుండి తీసినప్పుడే ఎఱిగినవాడు కాబట్టి; అతిశయ, రూప, లావణ్య, గుణసుందరి, అయిన= అధిక మైన రూపంతోను, సౌందర్యంతోను, గుణాలతోను అందమైన; శర్మిష్ఠను; ఎఱుంగన్, వేఁడి= తెలుసుకొన కోరి; మీరు; ఎవ్వరి, వారలు= ఎవరికి సంబంధించిన వారు; మీ, కుల, గోత్ర, నామంబులు= మీ యొక్క కులాన్ని గోత్రాన్ని, పేరును; ఎఱుంగన్, వలతున్= తెలిసికొనకోరుతాను; చెప్పుండు; అనినన్= అని అడుగగా; ఆ రాజునకున్= యయాతికి; దేవయాని; ఇట్లు= ఈవిధంగా, అనియెన్= పల్కింది.

**తాత్పర్యం:** ఆ యయాతికూడ అక్కడ సుఖంగా కూర్చుండి, అంతకుముందే నూతినుండి బయటికి తీసినపుడు దేవయానిని ఎరిగియున్నవా డవటంవలన అధిక మైన రూపంతోను, సౌందర్యంతోను, గుణాలతోను ఒప్పుతున్న

శర్మిష్ఠ ఎవరో తెలుసుకొన కోరి 'మీరు ఎవరికి సంబంధించినవారు, మీకులాలను, గోత్రాలను, పేరులను తెలిసికొనకోరుతున్నాను చెప్పు' డని అడిగాడు. అప్పుడు దేవయాని యయాతితో ఇట్లా పలికింది.

**విశేషం:** యయాతి శర్మిష్ఠను ఇప్పుడే మొదటిమారు చూచాడు. ప్రథమదర్శనం లోనే ఆమెసౌందర్యాదులచేత ఆకర్షింపబడినాడు. ఆమెను ఒక్కదాన్నిగురించే అడగటం యుక్తంగా ఉండ దని అతడు అందరినిగురించీ అడిగాడు.

**తే.** **నన్ను మున్న యెఱుంగు; దిన్నాతి నాకు । దాసి, వృషపర్వుఁ డను మహాదానవేంద్రు**
**కన్య; నాయొద్ద నెప్పడుఁ గదలకుండు । ననఘ! మఱి దీని శర్మిష్ఠ యండ్రు జనులు.** **159**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపరహితుడా; నన్నున్= నన్నుగురించి; మున్ను+అ= ముందే; ఎఱుంగుదు (తద్ధర్మ క్రియ అవటంచేత వకారం లోపించింది); ఈ+నాతి= ఈకన్య; నాకున్, దాసి= సేవకురాలు; వృషపర్వుఁడు+అను= వృషపర్వు డనే పేరు కల; మహత్+దానవ+ఇంద్రు= గొప్పరాక్షసరాజుయొక్క; కన్య= కూతురు; నాఒద్దన్= నాచెంత; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; కదలక+ఉండున్= వదలక నివసిస్తూ ఉంటుంది; మఱి= ఇంక; జనులు; దీనిన్= ఈమెను; శర్మిష్ఠ; అండ్రు= శర్మిష్ఠ అని అంటారు. (పిలుస్తారు.)

**తాత్పర్యం:** పాపరహితుడ వైన ఓయయాతీ! నీవు నన్నుగురించి ఇంతకు ముందే తెలిసికొన్నావు. ఈమె నాకు సేవకురాలు. వృషపర్వు డనే పేరు కలిగిన గొప్పరాక్షసరాజుకూతురు. నాచెంతనే ఎప్పుడూ విడువకుండా సేవ చేస్తూ ఉంటుంది. ఇక ఈమెను ప్రజలు శర్మిష్ఠ అంటారు.

**విశేషం:** అను - దురు. సూ: 'తిదుటలు పరంబు లగునపుడు అను మొదలగువాని స్థానంబున పూర్ణబిందు వగును' - అందురు. సున్నమీది దకారానికి డకారాదేశం- అండురు - ఉత్వలోపం - అండ్రు. ఇక్కడ దేవయాని తన గొప్పతనం ప్రదర్శించేందుకై రాక్షసరాజుకుమార్తెతనకు దాసి అని చెప్పింది. శర్మిష్ఠ తనంతటతాను పరిచయంచేసికొంటే మహాదానవేంద్రు కన్యగా చెప్పుకొంటుంది. అందువలన దేవయాని తానే చొరవతీసికొని ఆరాజుకూతురు దాసి అనీ ఆమెకు (చివరకు తనపెళ్లి తానే చేసికొనే) స్వాతంత్ర్యంకూడా లేదని స్పష్టంచేస్తుంది. 'రత్నహారీతుపార్థివః అనే న్యాయంతో కన్యారత్నాన్ని తానే నని వ్యంగ్యంగా సూచిస్తుంది.

**ఉ.** **నిగ్రహ మేది నన్నుఁ దరణిప్రభ! కూపము వెల్వరించునాఁ**
**డుగ్రమయూఖసాక్ష్యముగ నున్నతదక్షిణపాణిఁ జేసి భూ**
**పాగ్రణి! నాదు దక్షిణకరాగ్రము పట్టితి కాన మున్న పా**
**ణిగ్రహణంబు సేసి; తది నీయెడ విస్మృతిఁ బొందఁ బాడియే.** **160**

**ప్రతిపదార్థం:** తరణి, ప్రభ!= సూర్యుడికాంతివంటి కాంతి గలవాడా!; నిగ్రహము= మేర, నింద (లేదా అవమానం); ఏది= నశించి (ఇక్కడ ఏద అనే పాఠాంతర మున్నది. అదే ఉచితం. నాకు కలిగిన అవమానం నశించేటట్లుగా); కూపము. వెల్వరించునాఁడు= నూతినుండి బయటికి తీసేటప్పుడు; భూప+అగ్రణి= రాజశ్రేష్ఠుడా; ఉగ్రమయూఖ, సాక్ష్యముగన్= తీక్ష్ణ మైన కిరణాలు కలిగిన సూర్యుడి సాక్ష్యం కలిగేటట్లు; ఉన్నత, దక్షిణ, పాణిన్, చేసి= ఎత్తైన (పొడవైన) కుడిచేతితో; నాదు; దక్షిణ, కర+అగ్రము= కుడిచేతి అగ్రభాగాన్ని; పట్టితి(వి)= గ్రహించావు; కాన= కాబట్టి; మున్ను+అ= ఇంతకుముందే; పాణి, గ్రహణంబు చేసితి(వి)= చేతిని పట్టుకొనటం చేశావు. (పెళ్ళాడావు); అది= ఆవిషయం; నీఎడన్= నీహృదయంలో; విస్మృతిన్= మరపును; పొందన్= పొందటం; పాడి+ఏ= న్యాయమా?

**తాత్పర్యం:** సూర్యుడియొక్కకాంతివంటి కాంతి గల ఓ రాజశ్రేష్ఠుడా! నాకు కలిగిన చెర (శిక్ష) నశించేటట్లుగా (మేరమీరి) నన్ను నూతినుండి బయటికి తీసిననాడే సూర్యుడి సాక్షిగా దీర్ఘమైన నీకుడిచేతితో నాకుడిముంజేతిని గ్రహించావు. కాబట్టి ఇంతకుముందే నన్ను పెళ్ళాడినావు (నాచేయి పట్టుకున్నావు). ఆ విషయం నీహృదయంలో మరవటం న్యాయమా!

**విశేషం:** నిగ్రహ మంటే అదుపులో ఉండటం. ఇంద్రియనిగ్రహాదులలో ఈఅర్థం సరిపోతుంది. ఇక్కడ శిక్ష, నింద, మేర, చెఱ అనే అర్థాలు చెప్పుకోవటం యుక్తంగా ఉంటుంది. శర్మిష్ఠ దేవయానిని శిక్షించేందుకై ఆమెను నూతిలో త్రోసింది. అది చెఱవలె ఉన్నది. యయాతి పైకి తీయటంచేత ఆమె కాశిక్ష తొలగింది. ఈ పద్యంలో దేవయాని గడుసరితనం మరొకసారి స్పష్టమౌతుంది. యయాతి శర్మిష్ఠయొక్క 'అతిశయరూపలావణ్యసౌందర్యాన్ని' చూచాడు. ఆకర్షితుడైనాడు. అంతకుముందు దేవయానిని చూచాడు కాని ఆసక్తుడు కాలేదు. ఆమెకంటె అతిశయించిన రూపలావణ్యాలు శర్మిష్ఠకు ఉన్నాయని ధ్వని. యయాతి చూపులలోని మర్మాన్నీ, ఆమెనుగురించి తెలిసికోవాలనే ఆకాంక్షనూ దేవయాని పసికట్టింది. మనసులో కోర్కెకలిగితే వివాహమైనట్లే అని దేవయానిభావం. కచుడితో ఆమె ఆవిధంగానే పేర్కొన్నది. ఇప్పుడు యయాతి శర్మిష్ఠపై ఆసక్తికలిగి ఉండటంవలన, అది వివాహమయ్యే అవకాశం ఉన్నది. తా నుండగా తనదాసి అయిన శర్మిష్ఠపై యయాతి ఆసక్తిని ప్రకటించటం ఆమె సహించలేకపోయింది. అందుకే తనకూ యయాతికీ అంతకుముందే పాణిగ్రహణమైపోయిందని మనోధర్మాన్ని ప్రతిపాదించింది. యయాతిని తానే దక్కించుకొనవలెనని భావించింది. ఈవిధంగా ఆత్మాభిమానాన్ని శర్మిష్ఠముందు నిలుపుకొనటానికి యయాతిని వివాహమాడే నిర్ణయాన్ని మెరుపువలె తీసికొనటంలో ఆమెగడుసరితనం, సద్యఃస్ఫూర్తి, చాకచక్యం వెల్లడి అవుతున్నాయి. నన్నయ శిల్పంతో తీర్చిదిద్దినపాత్రలలో దేవయాని ఒకతె. ఉక్తివైచిత్ర్యంతో కూడికొనిన పృథక్పదత్వం గల ఈరచన మాధుర్యగుణవిశిష్టం. అభిలాషను ధ్వనింపచేయటంలో మాధుర్యం మహనీయం. (సంపా.)

**ఉ. 'నన్ను వివాహ మై నహుషనందన! యీలలితాంగిఁ దొట్టి యీ**
**కన్నియలందఱున్ దివిజకన్యలతో నెన యైనవారు నీ**
**కున్నతిఁ బ్రీతి సేయఁగ నృపోత్తమ! వాసవుఁ బోలి లీలతో**
**నిన్నరలోకభోగము లనేకము లందుము నీవు' నావుడున్. 161**

**ప్రతిపదార్థం:** నహుషనందన= నహుషుడి కొడుకువైన యయాతీ!; నన్ను; వివాహము+ఐ= పెళ్ళాడి; ఈ, లలిత+అంగిన్, తొట్టి= సుందరాంగి యైన ఈశర్మిష్ఠ మొదలుకొని; దివజకన్యలతోన్= దేవతాకన్యలతో; ఎన, అయినవారు= సాటి అయినవారు; ఈ, కన్నియలు, అందఱున్= ఈకన్యలంతా; నీకున్; ఉన్నతిన్= పెంపుతో, గౌరవంతో; ప్రీతి, చేయఁగన్= ప్రియం చేకూర్చగా; నృప+ఉత్తమ= రాజశ్రేష్ఠుడా!; వాసవున్= ఇంద్రుడిని; పోలి; లీలతోన్= విలాసంతో; నీవు; ఈ+నరలోక, భోగములు= ఈ మానవలోకానికి సంబంధించిన సౌఖ్యాలు; అనేకములు= పెక్కులు; అందుము= పొందుము; నావుడున్= అని దేవయాని పలుకగా.

**తాత్పర్యం:** 'నహుషుడి కుమారుడివైన ఓ యయాతి మహారాజా! నన్ను పెళ్ళాడి సుందరాంగి యైన శర్మిష్ఠ మొదలుగా గల దేవకన్యకలతో సాటి యైన ఈకన్యలంతా నీకు గౌరవంతో ప్రియం చేకూర్చగా ఇంద్రుడిని పోలి విలాసంతో నీవు మానవలోకానికి సంబంధించిన పెక్కుభోగా లనుభవించుము' అని దేవయాని పలికిన అనంతరం.

**విశేషం:** తొట్టుధాతువుకు తొట్టి అనే క్త్వార్థకరూపం ఒక్కటే ప్రయోగాలలో కనవస్తోంది. తనను వివాహమాడితే దేవకన్యలతోసాటివచ్చే శర్మిష్ఠాది కన్యలందరూ యయాతిని సేవించి ప్రీతి కలిగిస్తారని చెప్పటంలోకూడా దేవయాని గడుసరితనం కనబడుతుంది.

శర్మిష్ఠ మీద నీకు మక్కువ ఉంటే ముందు నన్ను వివాహమాడాలని సూచించింది. అయినా తాను రాణిగా, శర్మిష్ఠ దాసిగా మాత్రమే యయాతికి సేవలందించగలదని వ్యంగ్యంగా నిర్దేశించింది. ఈ పద్యరచనలోని మాధుర్యగుణం రసభావానుగుణం. (సంపా.)

**వ. 'క్షత్త్రియకన్యకల బ్రాహ్మణులు వివాహం బగుదురు గాక; యధర్మోత్తరంబుగా క్షత్త్రియులు బ్రాహ్మణకన్యకల వివాహం బగుదురే? నీపలుకులు ధర్మ విరుద్ధంబులు; మఱియు సర్వవర్ణాశ్రమధర్మంబులు సంకరంబులు గాకుండ రక్షించుచున్న యేన యిట్టి యధర్మంబున కొడంబడితినేని జగత్ప్రవృత్తి విపరీతం బగు' ననిన నయ్యయాతికి దేవయాని యి ట్లనియె. 162**

**ప్రతిపదార్థం:** క్షత్త్రియ కన్యకలన్= క్షత్రియుల కూతుళ్ళను; బ్రాహ్మణులు; వివాహంబు+అగుదురు, కాక= వివాహ మాడతారు కాని; అధర్మ+ఉత్తరంబు+కాన్= అధర్మం మీది దగునట్లుగా (ఇక్కడ, అధర్మ మార్గమున, ధర్మేతరంబుగా, అధర్మంబుగా అనే పాఠాంతరా లున్నాయి) అనే అర్థం వస్తుంది; క్షత్రియులు; బ్రాహ్మణ, కన్యకలన్= విప్రుల కూతుళ్ళను; వివాహంబు+అగుదురు+ఏ= పెళ్ళాడుతారా? నీ పలుకులు= నీ మాటలు; ధర్మవిరుద్ధంబులు= ధర్మానికి వ్యతిరేకమైనవి; మఱియున్= అదీకాక; సర్వవర్ణ+ఆశ్రమ ధర్మంబులు= సకలములయిన బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాది వర్ణాలయొక్క, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్న్యాసాశ్రమాలయొక్క ధర్మాలు; సంకరంబులు= ఒకదానితో ఒకటి కలిసినవి; కాక+ఉండన్= కాకుండగా; రక్షించుచు; ఉన్న= పాలిస్తున్న; ఏను+అ= రాజునైన నేనే; ఇట్టి, అధర్మంబునకున్= ఇట్టి ధర్మం కాని కార్యానికి; ఒడంబడితిన్+ఏనిన్= అంగీకరిస్తే; జగత్, ప్రవృత్తి= జగత్తుయొక్క వ్యాపారం (స్థితి); విపరీతంబు= వ్యత్యస్తం; అగున్; అనినన్= అని యయాతి పలుకగా; ఆ+యయాతికిన్; దేవయాని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'క్షత్రియులకూతుళ్ళను బ్రాహ్మణులు పెళ్ళాడుతారు కానీ అధర్మంగా క్షత్రియులు విప్రులకూతుళ్ళను పెళ్ళాడుతారా? నీ మాటలు ధర్మానికి వ్యతిరిక్తాలు. అదిగాక అన్నివర్ణాలయొక్క ఆశ్రమాల యొక్క ధర్మాలు సంకీర్ణాలు కాకుండా కాపాడుతున్న రాజు నైన నేనే ఇటువంటి అధర్మానికి అంగీకరిస్తే లోకవ్యాపారం వ్యత్యస్త మైపోతుంది' అని పలుకగా యయాతికి దేవయాని ఇ ట్లన్నది.

**క. 'వెలయఁగ ధర్మాధర్మం । బులు నడపుచు నిఖిలలోకపూజ్యుండై ని**
**ర్మలుఁ డగు శుక్రుఁడు పంచిన । నలఘుభుజా! నను వివాహ మగుదే?' యనినన్. 163**

**ప్రతిపదార్థం:** అలఘుభుజా!= గొప్ప బాహువులు కలవాడా! (పరాక్రమవంతుడా); వెలయఁగన్= ప్రసిద్ధికెక్కేటట్లుగ; ధర్మ+అధర్మంబులు= ధర్మాన్నీ, అధర్మాన్నీ; నడపుచున్= జరిగిస్తూ, నిర్ణయిస్తూ; నిఖిల, లోకపూజ్యుండు+ఐ= సకలలోకాలచేత (ప్రజలచేత) పూజనీయుడై; నిర్మలుఁడు+అగు= అనఘు డైన; శుక్రుఁడు= నాతండ్రి శుక్రాచార్యుఁడు; పంచినన్= ఆజ్ఞాపిస్తే; ననున్ వివాహము అగుదువు+ఏ= నన్ను పెళ్ళాడుతావా; అనినన్= అని దేవయాని పలుకగా.

**తాత్పర్యం:** 'గొప్పబాహుపరాక్రమం కలవాడా! ప్రసిద్ధమయ్యేటట్లుగా ధర్మాన్నీ అధర్మాన్నీ నిర్ణయిస్తూసకలలోకాలకు పూజనీయు డై పాపరహితు డైన నాతండ్రి శుక్రు డాజ్ఞాపిస్తే నన్ను పెండ్లాడుతావా?' అని దేవయాని పలుకగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ధర్మాధర్మ నిర్ణయం శాస్త్రప్రకారం చేయబడుతుంది లోకంలో. ఇక్కడ శాస్త్రకారుడివంటి శుక్రాచార్యుడిని ప్రమాణంగా ప్రతిపాదిస్తున్నది దేవయాని, శుక్రుడు రాక్షసాచార్యుడు. అతడు చెప్పింది ధర్మవిరుద్ధంగా ఉండదని లోకులు విశ్వసిస్తారు.

శుక్రుడు దేవయాని అభిమతానికి విరుద్ధమైన ధర్మం చెప్పడు. ఆచార్యప్రమాణం చూపి తన అభిమతాన్ని తీర్చుకోదలచటంలో దేవయాని గడుసరితనం ప్రకటితమౌతున్నది.

**వ. 'అమ్మహాముని వచ్చి యిది ధర్మవిరుద్ధంబు గా దని చెప్పెనేని నిన్ను వివాహం బగుదు' నని యయాతి యొడంబడిన దేవయాని యప్పుడ శుక్రు రావించిన. 164**

**ప్రతిపదార్థం:** ఆ, మహత్+ముని= ఆ గొప్పముని శుక్రుడు; వచ్చి; ఇది= ఈ వివాహం; ధర్మ, విరుద్ధంబు, కాదు+అని= ధర్మానికి వ్యతిరేకం కాదని; చెప్పెన్+ఏని= చెప్పినట్లైతే; నిన్నున్ వివాహంబు+అగుదున్+అని= నిన్ను పెండ్లాడుతా నని; యయాతి; ఒడంబడినన్= అంగీకరింపగా; దేవయాని; అప్పుడు+అ= వెంటనే (ఆ క్షణంలోనే); శుక్రున్= శుక్రాచార్యుడిని; రావించినన్= వచ్చేటట్లు చేయగా.

**తాత్పర్యం:** 'మహాముని యైన ఆ శుక్రుడు వచ్చి ఈ వివాహం ధర్మానికి విరుద్ధం కా దని చెప్పినట్లైతే నిన్ను పెళ్ళాడుతా' నని యయాతి అంగీకరించగా దేవయాని వెంటనే తండ్రి యైన శుక్రుడిని అక్కడికి రప్పించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తనదివ్యతేజమున న। వ్వన మెల్ల వెలుంగుచుండ వచ్చెను భృగునం**
**దనుఁడు నిజనందనకుఁ బ్రియ। మొనరింపఁగఁదలఁచి దానియొద్దకుఁ బ్రీతిన్. 165**

**ప్రతిపదార్థం:** తన, దివ్య, తేజమునన్= తనయొక్క దేవతాసంబంధ మైన కాంతిచేత; ఆ+వనము, ఎల్లన్= ఆ అడవిఅంతా; వెలుంగుచుండన్= ప్రకాశిస్తుండగా; నిజనందనకున్= తనకూతురికి; ప్రియము= ప్రీతి; ఒనరింపఁగన్+తలఁచి= చేయదలచి; భృగునందనుఁడు= భృగుకుమారు డైన శుక్రుడు; దాని, ఒద్దకున్= దేవయానిచెంతకు; ప్రీతిన్= ప్రీతితో; వచ్చెను.

**తాత్పర్యం:** దేవతాసంబంధ మైన కాంతిచేత ఆ అడవిఅంతా ప్రకాశిస్తుండగా భృగుకుమారు డైన శుక్రుడు తనకూతురైన దేవయానికి ప్రీతిచేయదలచి ప్రేమతో ఆమెవద్దకు వచ్చాడు.

**క. అతిసంభ్రమమున నవనీ। పతి విహితోత్థానుఁ డై తపశ్శక్తిఁ బ్రజా**
**పతినిభుఁ డగు భార్గవునకు। నతిభక్తిం బ్రణమితోత్తమాంగుం డయ్యెన్. 166**

**ప్రతిపదార్థం:** అవనీపతి= రాజైన యయాతి; అతి సంభ్రమమునన్= అధికమైన వేగిరపాటుతో; విహిత+ఉత్థానుఁడు+ఐ= చేయబడిన లేచుట కలవాడై (లేచినవాడై); తపః, శక్తిన్= తపస్సుయొక్క శక్తిచేత; ప్రజాపతినిభుఁడు+అగు= బ్రహ్మతో సమానుడైన; భార్గవునకున్= శుక్రుడికి; అతిభక్తిన్= మిక్కిలిభక్తితో; ప్రణమిత+ఉత్తమాంగుండు= మిక్కిలి వంచిన శిరస్సు కలవాడు (శిరస్సు మిక్కిలి వంచి నమస్కరించిన వాడు); అయ్యెన్.

**తాత్పర్యం:** రాజైన యయాతి మిక్కిలి వేగిరపాటుతో లేచి నిలబడి తపస్సుయొక్కశక్తియందు బ్రహ్మతో సమానుడైన శుక్రుడికి అధిక మైన భక్తితో నమస్కరించాడు.

**విశేషం:** ఈపద్యం యయాతికి గురువులయెడ ఉండే భక్తిని సూచిస్తున్నది. ఇందులో 'అతి' అనే విశేషణాలు, ప్రాదివర్ణాలు వ్యంజకాలై అక్షరరమ్యతను కల్పిస్తున్నాయి.

**వ. మఱియు దేవయానియు శర్మిష్ఠయుం గన్యకాసహస్రంబును నత్యంతభక్తితోఁ గ్రమంబున నమస్కరించి; రంత దేవయాని శుక్రున కి ట్లనియె. 167**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; దేవయానియున్, శర్మిష్ఠయున్; కన్యకాసహస్రంబున్= వేయిమంది కన్యలున్నూ; అత్యంత భక్తితోన్= అధికమైన భక్తితో; క్రమంబునన్= వరుసగా; (దేవయానీ పురస్సరంగా) నమస్కరించిరి; అంతన్= అటుపిమ్మట; దేవయాని; శుక్రునకున్, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** తరువాత దేవయానియూ, శర్మిష్ఠయూ, చెలికత్తె లయిన వేయిమందికన్యకలునూ, మిక్కిలి భక్తితో శుక్రుడికి నమస్కరించారు. అటుపిమ్మట దేవయాని శుక్రుడితో ఇట్లా పలికింది.

**విశేషం:** క్రమంబున అన్న పదంచేత ముందు దేవయాని, తరువాత శర్మిష్ఠ, ఆ తరువాత కన్యకలు నమస్కరించా రని గ్రహించవచ్చును. దీనివలన దేవయాని ప్రాముఖ్యం వెల్లడి అవుతున్నది.

**ఆ. ఇన్నరేంద్రుచేత మున్న గృహీత మై । యున్న నాకరంబు గ్రన్న నింక**
**నొరున కర్హ మగునె పరిణయ విషయ మై । ధరఁ బరిగ్రహింపఁ బరమమూర్తి!. 168**

**ప్రతిపదార్థం:** పరమమూర్తి= పరమమైన ఆకారం కలవాడా!; ఈ+నర+ఇంద్రుచేతన్= ఈరాజశ్రేష్ఠుడిచేత; మున్ను+అ= పూర్వమే; గృహీతము+అయి, ఉన్న= గ్రహించబడియున్న; నాకరంబు= నాచేయి; పరిణయ, విషయము+ఐ= వివాహానికి వస్తువై (వివాహ సంబంధాన); క్రన్నన్= శీఘ్రంగా; ధరన్= భూమియందు; పరిగ్రహింపన్= గ్రహించటానికి; ఇంకన్, ఒరునకున్= మరి ఇతరుడికి; అర్హము+అగును+ఎ= తగిన దౌ తుందా?; (కాదని భావం).

**తాత్పర్యం:** పరబ్రహ్మస్వరూపుడి వైన ఓతండ్రీ! ఈ రాజశ్రేష్ఠుడిచేత ఇంతకు పూర్వమే గ్రహించబడి యున్న నాచేతిని వివాహవిషయాన ఇంకొకరికి గ్రహించటానికి తగునా?

**వ. 'కావున నాకు నీ జన్మంబునఁ బతి యయాతియ; యితండును భవద్వచనంబున నన్ను వివాహం బగుదు ననియె; నిందు ధర్మవిరోధంబు లేకుండు నట్లుగాఁబ్రసాదింపవలయు' ననిన శుక్రుండు గరుణించి 'యయాతికి నీకును నయిన యీ వివాహంబునం దపక్రమదోషంబు లేకుండెడు' మని వరం బిచ్చి యయ్యిరువురకుం బరమోత్సవంబున వివాహంబు సేసి, శర్మిష్ఠం జూపి 'యిది వృషపర్వుని కూఁతురు; దీనికిఁ బ్రియంబున నన్నపాన భూషణాచ్ఛాదన మాల్యానులేపనాదుల సంతోషంబు సేయునది; శయనవిషయంబునఁ బరిహరించు నది' యని పంచి, కూఁతు నల్లునిం బూజించిన; నయ్యయాతియు శుక్రుని వీడ్కొని దేవయానిని శర్మిష్ఠను గన్యకా సహస్రంబును దోడ్కొని నిజపురంబునకుం జని యంతః పురరమ్యహర్మ్యతలంబున దేవయాని నునిచి, తదనుమతంబున నశోకవనికాసమీపంబున నొక్క గృహంబునందుఁ గన్యకాసహస్రంబుతో శర్మిష్ఠ నునిచి, దేవయానియందు సుఖోపభోగపరుం డై యున్నఁ; గొండొకకాలంబునకు దేవయానికి యదుతుర్వసు లను కొడుకులు పుట్టి; రంత శర్మిష్ఠ సంప్రాప్తయౌవనయు ఋతుమతియు నై యాత్మగతంబున. 169**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నాకున్; ఈ జన్మంబునన్= ఈపుట్టుకయందు; పతి= భర్త; యయాతి+అ= యయాతియే; ఇతండును= ఈయయాతికూడ; భవత్+వచనంబునన్= నీమాట ననుసరించి; నన్నున్; వివాహంబు+అగుదున్+అనియెన్= పెళ్ళాడుతా నని పలికాడు; ఇందున్= ఈ వివాహంలో; ధర్మ, విరోధంబు= ధర్మానికి వ్యతిరేకం; లేక+ఉండు+అట్లుగాన్= లేకుండే విధంగా; ప్రసాదింపవలయున్= అనుగ్రహించవలెను; అనినన్= అని దేవయాని పలుకగా; శుక్రుండు; కరుణించి= దయతాల్చి; యయాతికిన్; నీకునున్, అయిన; ఈ వివాహంబునందున్= ఈ పెళ్ళిలో; అపక్రమ, దోషంబు= క్రమం తప్పటం అనే దోషం; లేక, ఉండెడున్, అని= లేకుండు గాక, అని; వరంబు+ఇచ్చి; ఆ+ఇరువురకున్= ఆ దేవయానీయయాతు లిద్దరికిని; పరమ+ఉత్సవంబునన్= గొప్పవేడుకతో; వివాహంబు, చేసి= పెళ్ళిచేసి; శర్మిష్ఠన్; చూపి= యయాతికి చూపించి; ఇది= ఈమె; వృషపర్వుని కూతురు; దీనికిన్= ఈ శర్మిష్ఠకు; ప్రియంబునన్= ప్రీతితో; అన్న, పాన, భూషణ, అచ్ఛాదన, మాల్య+అనులేపన+ఆదులన్= అన్నం, పానం, అలంకారాలు, వస్త్రాలు, దండలు, శరీరానికి పూసుకొనే అనులేపనాలు మొదలైనవాటిచే; సంతోషంబు, చేయు+అది= ఆనందం కలిగించవలసింది; శయన, విషయంబునన్= పడకవిషయాన; పరిహరించు+అది= వర్జించవలసింది; అని; పంచి= ఆజ్ఞాపించి; కూఁతున్= కూతురైన దేవయానిని; అల్లునిన్= అల్లుడైన యయాతిని; పూజించినన్= గౌరవించగా; ఆ+యయాతియున్= ఆ యయాతికూడ; శుక్రునిన్; వీడ్కొని= విడిచి (శుక్రుడి వద్ద సెలవుతీసికొని); దేవయానిని, శర్మిష్ఠను, కన్యకాసహస్రంబును= కన్యకలు వేయిమందిని; తోడ్కొని= తనతో తీసికొని; నిజ, పురంబునకున్= తన పట్టణానికి; చని= వెళ్ళి; అంతఃపుర, రమ్య, హర్మ్య తలంబునన్= అంతఃపురమందలి అందమైన ప్రాసాద ప్రదేశమందు; దేవయానిన్; ఉనిచి= ఉంచి; తద్, అనుమతంబునన్= ఆమె అంగీకారంతోనే; అశోక, వనికా సమీపంబునన్= అశోకవృక్షాలతో కూడిన వనంచెంత; ఒక్క గృహమందున్= ఒక ఇంటియందు (ఇంట్లో); కన్యకా సహస్రంబుతోన్= కన్యలు వేయిమందితో; శర్మిష్ఠన్, ఉనిచి; దేవయానియందున్, సుఖ+ఉపభోగ, పరుండు+ఐ= సుఖాలను అనుభవించటంలో ఆసక్తి కలవాడై; ఉన్నన్= ఉండగా; కొండొకకాలంబునకున్= కొంతకాలానికి; దేవయానికిన్; యదు, తుర్వసులు+అను= యదువు తుర్వసుడు అనే; కొడుకులు; పుట్టిరి; అంతన్= ఆ తరువాత, శర్మిష్ఠ; సంప్రాప్త, యౌవనయున్= పొందబడిన యౌవనం కలదీ ఋతిమతియున్+ఐ= పుష్పవతియూ అయి; ఆత్మగతంబునన్= తనలో.

**తాత్పర్యం:** 'నా కీ పుట్టుకయందు (జన్మలో) యయాతియే భర్త. ఈ యయాతియు నీమాటను అనుసరించి నన్ను పెళ్ళాడుతా నని పలికాడు. ఈ మా వివాహంలో ధర్మానికి వ్యతిరేకం లేకుండేటట్లుగా అనుగ్రహించాలి (అనుగ్రహించవలసింది)' అని దేవయాని పలుకగా శుక్రుడు దయతాల్చి 'యయాతికీ నీకూ అయ్యే ఈ పెళ్ళిలో అధర్మదోషం లేకుండు గాక' అని వర మిచ్చి, వారిద్దరికీ అధిక మైన వేడుకతో పెళ్ళిచేసి యయాతికి శర్మిష్ఠను చూపించి 'ఈమె వృషపర్వు డనే రాక్షసరాజుకూతురు. ఈమెకు భోజనం, పానీయాలు, అలంకారాలు, వస్త్రాలు, దండలు, శరీరానికి పూసుకునే లేపనాలు మొదలైనవాటిచేత ఆనందం కల్పించుము. పడకవిషయంలో మాత్రం ఈమెను వర్జించవలసింది' అని ఆజ్ఞాపించి కూతు రైన దేవయానిని, అల్లు డైన యయాతిని గౌరవించాడు. ఆ యయాతికూడ శుక్రుడి దగ్గరసెలవు తీసుకొని దేవయానిని శర్మిష్ఠను వేయిమందికన్యలను వెంటతీసికొని తనపట్టణానికి వెళ్ళి అంతఃపురమందలి అందమైనమేడలో దేవయానిని ఉంచి, ఆమె అంగీకారంతో అశోకవృక్షాలవనానికి చెంత నున్న ఒకయింట్లో వేయిమంది కన్యలతో శర్మిష్ఠను ఉంచి, దేవయానితో సుఖాలను అనుభవిస్తూ ఉన్నాడు. కొంత కాలానికి దేవయానికి యదువు, తుర్వసుడు అనే కొడుకులు పుట్టారు. తరువాత శర్మిష్ఠ యౌవనవతీ, పుష్పవతియు, అయి, ఆత్మలో.

**విశేషం:** ఉండెడున్= అని 'సూ:- ఎడుతల ద్రుతమునకు అచ్చు పరంబగునపుడు మకారము. ఉండెడు మని. దేవయాని కడుగడుసరిగా తండ్రితో మాటాడింది. తనకూ యయాతికీ వివాహం కావటం ధర్మమా అధర్మమా అని ఆమె తండ్రి నడుగలేదు. యయాతిచేత ముందే కరగ్రహణం చేయబడిన దేవయానిని మరొకరు పాణిగ్రహణం చేయడానికి వీలులేదనీ, అట్లా జరిగితే అది ధర్మ విరుద్ధమనీ, ఆధర్మవైరుధ్యాన్ని తొలగించటమంటే ఈజన్మకు దేవయానికి యయాతియే భర్త' అని నిర్ణయించటమనిన్నీ, శుక్రాచార్యుడు అంగీకరిస్తే యయాతి దేవయానిని స్వీకరించటానికి అంగీకరించాడనీ దేవయాని సూచించింది. కూతురు స్వయంగా స్వీకరించిన వరుడిని అంగీకరించి, ఆశీర్వదించి, ధర్మవిరుద్ధం కాకుండా దారిచూపించటం తప్ప మరొకదారి శుక్రుడికి మిగిలించకుండా మాటాడటంలోనే దేవయాని గడుసరితనం ఉన్నది. శుక్రుడు కూడ దేవయానికి యయాతితో కరగ్రహణం కారణంగా వివాహమైనట్లుగానే నిర్ణయించి, దానివలన కలిగే అపక్రమదోషం లేకుండా వరమిచ్చాడు. తనయకు హితం చేద్దామనే ఉద్దేశంతోనే వచ్చిన శుక్రుడు దేవయానిపక్షంలోనే తీర్పిచ్చాడు. కాదు. ఆయనచేత ఆ తీర్పు దేవయాని ఇప్పించింది. నన్నయ దేవయాని పాత్రను మెలకువతో చిత్రించి ప్రసన్నకథాకలితార్థయుక్తిని ప్రదర్శించాడు. శుక్రుడు యయాతితో శర్మిష్ఠ కన్ని సౌకర్యాలూ కలిగించుమని పలికి శయనవిషయాన ఆమెను వర్జించాలి అనగా ఆమె సంగమం పరిహరించాలి అని ఆజ్ఞాపించాడు. ఈ విషయం చాలా ముఖ్య మైనది. యయాతి అట్లా చేయక శర్మిష్ఠతో భోగించి శుక్రుడిశాపానికి గురి అయ్యాడు.

**చ. అసదృశయౌవనం బిది యనన్యధనం బగు నొక్కొ! నాకు ని**
**క్కుసుమ సముద్గమంబును నగోచర దుర్గమ దుర్గవల్లరీ**
**కుసుమ సముద్గమం బగు నొకో! పతిలాభము లేమిఁ జేసి; యొ**
**ప్పెసఁగఁగ దేవయాని పతి నేమి తపం బొనరించి కాంచెనో! 170**

**ప్రతిపదార్థం:** అసదృశ యౌవనంబు+ఇది= సాటిలేని నా యీ యౌవనం; అనన్యధనంబు= ఎవరిచేతను అనుభవించబడని సొమ్ము; (ఇతరుల భోగాలకు పాత్రమవక నాయందే జీర్ణించేది); అగున్+ఒక్కొ= అవునేమో; నాకున్; ఈ+కుసుమ, సముద్గమంబును= ఈరజో దర్శనమున్నూ; పతి, లాభము, లేమిన్ చేసి= భర్తృప్రాప్తి లేకపోవటంచేత; అగోచర, దుర్గమ, దుర్గవల్లరీ, కుసుమ, సముద్గమంబు= ఇతరులకు వెళ్ళటానికి శక్యంకాని, దుర్గమందలి లతకు పూవులపుట్టుక; అగున్+ఒకో= దుర్గఅగునా ఏమి; ఒప్పు+ఎసఁగఁగన్= అందమతిశయించగా; దేవయాని; ఏమి తపంబు= ఏ గొప్పతపస్సు; ఒనరించి= చేసి; పతిన్= భర్తను; కాంచెన్+ఓ= పొందెనో.

**తాత్పర్యం:** సాటిలేని నా యీ యౌవనం అన్యులకు ఉపభోగ్యం కాక నాయందే జీర్ణించిపోవునా ఏమి! నాకు ఈ రజోదర్శనం (ఋతుమతీత్వం) భర్తృప్రాప్తి లేకపోవటంచేత ఇతరులకు ప్రవేశించేందుకు (వెళ్ళేందుకు) శక్యంకాని కోటలోని లతలకు పూచిన పుష్పాలపుట్టుక అగునా ఏమి? అంద మతిశయించగా దేవయాని ఏమి గొప్పతపం చేసి భర్తను పొందిందో!

**విశేషం:** కుసుమం అంటే పువ్వు. స్త్రీ రజస్సు అని అర్థాలు ఉన్నాయి. స్త్రీకి కుసుమ సముద్గమం అయింది అంటే ఆమె ఋతుమతి అయినది అని అర్థం. మనుష్యులు చొరలేని దుర్గంలోని లతలపూవులు వికసించి, వాడి వత్త లై పోవటమే కానీ వాటిని ఇతరులు ఉపయోగించేందుకు వీలుండదు. అట్లాగే భర్తృలాభం లేకపోవటంచేత తన ఋతుమతీత్వం కూడ

అన్యోపభోగ్యం కాకుండా వ్యర్థ మై పోతుం దని శర్మిష్ఠ విచారిస్తున్నది. అన్యులయొక్కధనం అన్యధనం. దానికి వ్యతిరేకం అనన్యధనం. స్త్రీయౌవనాన్ని భర్త అనుభవించాలి. అప్పు డది స్వధనం. భర్త అనుభవించకపోతే అది అనన్యధనమై వ్యర్థమై పోతుంది. అలం: కావ్యలింగం. 'కుసుమ' శబ్దంలో శ్లేష. పాత్ర స్వగతాన్ని వాక్యసుందరంగా నాటకీయంగా నన్నయ చిత్రించాడు. దీప్తరసత్వం కలిగిన ఔజ్జ్వల్యం రచనలోని శబ్దగుణం. వాక్యాలచివర క్రమంగా ఒక్కొ, ఒకో, ఓ అనే శబ్దాలు ప్లుతాలయి ఆమె భావతీవ్రతను ధ్వనింపజేస్తున్నాయి. 'అగోచరదుర్గమదుర్గవల్లరీ కుసుమసముద్గమం బగునొకో' అన్న వాక్యం ఆమె దాసీత్వంలో పొందుతున్న బాధయొక్క గాఢత్వాన్ని వ్యక్తంచేస్తుంది. ఏనాటి కైనా తాను పొందదలచుకొన్న యయాతి తన యౌవనాన్ని ఉపభోగించే అవకాశం లభించదేమో అన్న శంక, నిర్వేదం వ్యక్తంచేసింది. యయాతిని భర్తగా పొందిన దేవయాని అదృష్టాన్ని అసూయతో ప్రశంసించింది. శబ్దగుణంచేత రసభావధ్వని ఇందులో గమ్యమానం. (సంపా.)

**క. పతిఁ బడసి సుతులఁ బడయఁగ । నతివలు గోరుదురు; గోరినట్టుల తనకుం**
**బతిఁ బడసి సుతులఁ బడసెను; । సతు లీభార్గవికి భాగ్యసంపద నెనయే. 171**

**ప్రతిపదార్థం:** పతిన్= భర్తను; పడసి= పొంది; అతివలు= స్త్రీలు, సుతులన్= కొడుకులను; పడయఁగన్= పొందటానికి; కోరుదురు; కోరిన+అట్టులు+అ= కోరినట్లే; తనకున్; పతిన్= భర్తను; పడసి= పొంది; సుతులన్= కొడుకులను; పడసెను= పొందింది; ఈభార్గవికిన్= శుక్రుడి కూతు రైన ఈ దేవయానికి; సతులు= ఇతరకాంతలు; భాగ్య, సంపదన్= అదృష్ట సంపదయందు; ఎన+ఏ= సాటియా? (కారని భావం).

**తాత్పర్యం:** స్త్రీలు భర్తను పొంది కుమారులను పొందగోరుతారు. ఈ దేవయాని తాను కోరినట్లే భర్తను పొంది కొడుకులను కూడ పొందింది. అదృష్ట సంపదలో ఈమెకు ఇతరకాంతలు సాటి కారు.

**విశేషం:** కందపద్యంలో పూర్వ, ఉత్తరార్ధాల నిర్వహణలో (అంటే మొదటి, మూడవ చరణాల నిర్మాణంలో) సమత అనే శబ్దగుణం పోషింపబడింది. లోకంలో అందరు వనితలు కోరుకొనే పతిసౌఖ్యాన్నీ, పుత్రలాభాన్నీ దేవయాని పొందగలిగిందని చెప్పటంలో ఉన్న సమత్వం ఈగుణం వ్యంజింపజేస్తున్నది. అయితే సతులందరూ దేవయానికి సమానం కారు అన్న వాక్యంలో ఈర్ష్య, దైన్యం గోచరిస్తాయి. లోకంలో సతులు తాముకోరుకొన్న పతులను తాము పొందారు. కాని, దేవయాని శర్మిష్ఠ పొందవలసిన పతిని పొందటమేకాకుండా సర్వసతులకు సాధారణధర్మమైన పతిపొందును తాను పొందకుండా నిరోధించింది. నిజానికి ఆపని క్షత్రియవనిత అయిన తాను చేయగలిగిఉండాలి. కాని, ఆ అదృష్టం దేవయానికి దక్కిందని శర్మిష్ఠ దైన్యం. రసభావవ్యంజకమైన గుణవాక్యవిన్యాసం ఇందులోని శిల్పం. (సంపా.)

**తరువోజ.**

**ఈ రాజునంద నా హృదయంబు దవిలి యెప్పుడు నుండు; న న్నీతఁడు గరము**
**కారుణ్యమునఁ బ్రీతిగలయట్లు సూచుఁ; గమలాక్షి భార్గవకన్య దా నెట్లు**
**గోరి యీతనిఁ దనకును బతిఁ జేసికొనియె నటుల యేను గోరి లోకైక**
**భారధురంధరుఁ బరహితు ధర్మపరు నహుషాత్మజుఁ బతిఁ జేసికొందు. 172**

**ప్రతిపదార్థం:** ఈ రాజనందున్+అ= ఈయయాతి మహారాజునందే; నాహృదయంబు= నా చిత్తము; ఎప్పుడున్= ఎల్లప్పుడును; తవిలి ఉండున్= ఆసక్తికలిగి ఉంటుంది; నన్నున్; ఈతఁడు= ఈయయాతి; కరము= మిక్కిలి; కారుణ్యమునన్= దయతో;

ప్రీతి, కల, అట్లు= ప్రేమ ఉన్న విధాన; చూచున్; కమల+అక్షి= పద్మాలవంటి నేత్రాలు కలిగిన; భార్గవకన్య= శుక్రుడికూతు రైన దేవయాని; తాన్, ఎట్లు= తా నేవిధంగా; కోరి; ఈతనిన్= ఈయయాతిని; తనకును; పతిన్= భర్తను; చేసికొనియెన్= చేసికొన్నదో; అటులు+ఆ= అట్లే (అలాగే); ఏను= నేను కూడ; కోరి; లోక+ఏక+భార ధురంధరున్= లోకంయొక్క మొత్తం బరువును (భారాన్ని) వహించే వాడిని; పరహితున్= ఇతరులకు మేలు చేసేవాడిని; ధర్మపరున్= ధర్మమందు ఆసక్తికలవాడిని; నహుష+ఆత్మజున్= నహుషుడి కుమారు డైన యయాతిని; పతిన్= భర్తను; చేసికొందున్.

**తాత్పర్యం:** ఈ యయాతిమహారాజునందే నాచిత్త మెప్పుడూ ఆసక్తి కలిగి ఉన్నది. న న్నా రాజు మిక్కిలి దయతో, ప్రేమ తో చూస్తాడు. పద్మాలవంటినేత్రాలు కల శుక్రుడికూతు రైన దేవయాని తా నేవిధంగా వాంఛించి యయాతిని తనకు భర్తగా చేసికొన్నదో అట్లాగే నేనుకూడ కోరి లోకంయొక్క మొత్తంభారం వహించే వాడూ, ఇతరులకు మేలు చేసేవాడూ, ధర్మమం దాసక్తి కలవాడూ, నహుషుడి కుమారుడూ అయినట్టి ఈ యయాతిని భర్తగా చేసికొంటాను.

**విశేషం:** లోక+ఏక= లోకైక - వృద్ధిసంధి. తరువోజ దేశీవృత్తం: రెండు ద్విపదపాదము లైతే ఒక్క తరువోజపాద మౌతుంది. అనగా ఒక్కొక్క పాదానికి మూడింద్రగణాలు ఒక సూర్య గణం, మరల మూడింద్రగణాలు ఒక సూర్యగణం ఉంటాయి. ప్రాసనియమం కలదు. యతిమైత్రి పూర్వోత్తరార్ధములందు మొదటి గణం మొదటి అక్షరానికీ, మూడవగణం మొదటి అక్షరానికీ. నన్నయప్రసన్న కథాకలితార్థయుక్తి కీపద్యము చక్కని ఉదాహరణం. పాత్ర సంభాషణ ద్వారా పూర్వాపర కథార్థాలను భావింపజేయటం వలన కథను ప్రసన్నం చేసే ప్రక్రియను ఇందులో నన్నయ ప్రదర్శించాడు. అలనాడు వనంలో యయాతి' అతిశయరూపలావణ్యగుణసుందరి (3.158)'గా శర్మిష్ఠను దర్శించాడు. తొలిచూపును వర్ణించి వదలిన నన్నయ ఆ అంశాన్ని చెప్పటానికి వీలులేక మానివేశాడు. కాని, ఇక్కడ శర్మిష్ఠ తలపులో ఆ కథను పూరిస్తున్నాడు. ప్రథమ వీక్షణంలో శర్మిష్ఠ యయాతిని వలచింది. నాటినుండి ఆమె అతడిని ఎల్లప్పుడు మనస్సులో స్మరిస్తున్నది. యయాతికూడ ఆమెను చూచినప్పుడెల్లా మనసులో ప్రీతి ఉన్నట్లు చూస్తాడు. ఇరువురు అనురక్తులైనట్లు ఆ చూపులే సాక్షులు. అయితే, యయాతిని భర్తగా పొందిన అదృష్టం మాత్రం దేవయానికి దక్కింది. దేవయాని ఏవిధంగా తనంతట తాను కోరి యయాతిని భర్తగా పొందిందో, శర్మిష్ఠకూడా ఆవిధంగానే పొందాలని ఉవ్విళ్లూరింది. అంటే శర్మిష్ఠా యయాతుల హృదయాలలో ప్రణయబీజం గూఢంగానే ఉండిపోయింది. అది అంకురించి, పుష్పించి, ఫలించటానికి అదను రావలసి ఉన్నదని వ్యంగ్యార్థ సంయోజనంవలన తెలిసికొనాలి. (సంపా.)

## యయాతి శర్మిష్ఠకుఁ బుత్రదానంబు సేయుట (సం.1-77-10)

**వ. అని విచారించుచున్న యవసరంబున దాని పుణ్యస్వరూపంబు సన్నిహితం బైన య ట్లొక్కనాఁడు యయాతి యశోకవని కాలోకనతత్పరుండైవచ్చువాఁ డేకతంబ యున్న శర్మిష్ఠం గనిన, నదియును సంభ్రమ వినయావనత యై తనవలన నమ్మహీపతి ప్రసన్నచిత్తుం డగుట యెఱింగి కరకమలంబులు మొగిచి యి ట్లనియె. 173**

**ప్రతిపదార్థం:** అని; విచారించుచున్+ఉన్న= తలపోస్తున్న; అవసరంబునన్= సమయమందు; దాని= శర్మిష్ఠయొక్క; పుణ్యస్వరూపంబు= పుణ్యంయొక్కస్వరూపం; సన్నిహితంబు+ఐన, అట్లు= దగ్గరగా వచ్చినట్లు; ఒక్కనాఁడు= ఒకరోజున, యయాతి; అశోక, వనికిన్= అశోక వనానికి; ఆలోకన, తత్పరుండు+ఐ= చూడటంలో ఆసక్తికలవా డై (అశోకవనికా+ఆలోకన

తత్పురుండు+ఐ- అన్న సమాసంకూడ చేయవచ్చు.); వచ్చువాడు; ఏకతంబు+అ= ఒంటరిగా (ఆలోచనకు తగినచోట) ఉన్న; శర్మిష్ఠన్; కనినన్= చూడగా; అదియును= ఆ శర్మిష్ఠ కూడ; సంభ్రమ, వినయ+అవనత+ఐ= వేగిరపాటుతో కూడిన వినయంతో వంగినదై; తన వలనన్= తనపై (ఎడ); ఆ+మహీపతి= ఆ రాజు; ప్రసన్న, చిత్తుండు+అగుట= ప్రసన్న మైన హృదయం కలవా డవటం, దయతో (ప్రసాదంతో) కూడిన హృదయం కలవా డవటం; ఎఱింగి= తెలిసికొని; కరకమలంబులు= పద్మాలవంటిచేతులు; మొగిచి= మోడ్చి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** అని శర్మిష్ఠ భావిస్తున్న సమయంలో మూర్తీభవించిన ఆమెపుణ్యం దగ్గరకు వచ్చిందా (సమీపించిందా) అన్నట్లు ఒకరోజు యయాతి అశోకవనాన్ని చూడటానికి ఆసక్తి కలవాడై వచ్చి ఒంటరిగాఉన్న శర్మిష్ఠను చూడగా ఆమె కూడా వేగిరపాటుతోను, వినయంతోను నమ్రయై తనయెడ ఆ రాజు అనుగ్రహంతో కూడిన హృదయం కలవా డవటం తెలిసికొని హస్తపద్మాలు మోడ్చి యిట్లా పలికింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**ఉ. నీలగళోపమాన! కమనీయగుణోన్నతిఁ జెప్పఁ జాలు న**
**న్నేలిన దేవయానికి నరేశ్వర! భర్తవు గాన నాకునుం**
**బోలఁగ భర్త వీవ; యిది భూనుత! ధర్మపథంబు; నిక్కువం;**
**బాలును దాసియున్ సుతుఁడు నన్నవి వాయనిధర్మముల్ మహిన్. 174**

**ప్రతిపదార్థం:** నీలగళ+ఉపమాన= నల్లనికంఠం కలిగిన శివుడు ఉపమానంగా కలవాడా (శివునితో సమానుడా!); నర+ఈశ్వర= రాజా!; కమనీయ, గుణ+ఉన్నతిన్= అందమైన గుణాలయొక్క మహిమయందు; చెప్పన్+చాలు= చెప్పటానికి తగిన (అంటే గొప్పగుణాలు కలవారిలో పరిగణించదగిన); నన్నున్+ఏలిన= నన్ను పాలించే; దేవయానికిన్; భర్తవు; కాన= కాబట్టి; నాకునున్= సేవకురాలైన నాకుకూడ; పోలఁగన్= తగినట్లుగా; భర్తవు+ఈవు+అ= మగడివి నీవే; భూనుత= భూమిచే (లోకులచేత) నుతింపబడువాడా; ఇది= స్వామినికి భర్త అయినవాడు సేవకురాలికి కూడ భర్త కావటం; ధర్మపథంబు= ధర్మమార్గం; నిక్కువంబు= యథార్థం. ఆలును= భార్యయు; దాసియున్= సేవకురాలును; సుతుఁడున్= కుమారుడును; అను+అవి= అనేవి; మహిన్= భూమియందు; పాయని; విడువని; ధర్మముల్.

**తాత్పర్యం:** శివసమానుడ వైన ఓరాజా! అందము లైన గుణాలమహత్త్వంచేత పరిగణించదగిన నాకు యజమానురా లైన దేవయానికి భర్తవు కాబట్టి, నాకు కూడా తగినట్లుగా నీవే భర్తవు. లోకులచేత నుతించబడేవాడా! ఇది ధర్మమార్గం; యథార్థం. ఈ లోకంలో భార్య, సేవకురాలు, కుమారుడు అనేటటువంటివి విడువని (పరస్పరం విడదీయరాని) ధర్మాలు (విధులు).

**విశేషం:** ధర్మములు అన్నచోట అర్థములు అనే పాఠాంతర మున్నది. అర్థములు= సొమ్ములు. ఈ పద్యంలో శర్మిష్ఠను వివేకవతిగా నన్నయ చిత్రించాడు. దేవయానివలె తానుకూడ యయాతికి భార్య కావటానికి యోగ్యత ధర్మబద్ధంగా ఉన్న దని శర్మిష్ఠ వివరించి చెప్పింది. భార్యతోపాటు, దాసి, సంతానం అనేవి విడదీయలేని ధర్మాలని లోకధర్మంతో సమర్థించింది.

దానివలన యజమానురాలైన దేవయానికి భర్తవు అయినట్లే దాసికి కూడ భర్తవౌతావని సూచించింది. ఈధర్మంవలన దేవయాని నియమానికి భంగంరాదు. యయాతి కాదనలేని ధర్మసూక్ష్మాన్ని ప్రతిపాదించి సుముఖుడైన యయాతిని సమ్మతింపచేసే వివేకాన్ని ప్రదర్శించింది. ఈవాక్యాలన్నీ ఒకయెత్తు. 'నీలగళోపమాన!' అన్న సంబోధనం ఒక్కటీ ఒక్కయెత్తు. ఇది భావనారమణీయమైన సూక్తి. విషాన్ని కంఠంలో తాల్చి లోకహితం కొరకు పాటుపడిన శివుడు (మంగళప్రదుడు) నీలకంఠుడు. ఇష్టంలేకపోయినా కష్టమని చెప్పకుండా దేవయానిని భార్యగా స్వీకరించిన ధీరుడు యయాతి. మనస్సు లగ్నమైనా శర్మిష్ఠను స్మరించకుండా ఉదాసీనంగా ఉండిపోయిన ఉదాత్తుడు యయాతి. శర్మిష్ఠపైగల అనురాగాన్ని గూఢంగా దాచుకొన్న లోకపతియైన యయాతి యొక్క తత్కాల హృదయస్థితిని స్ఫురింపజేసే సంబోధనం నిబంధించటంలో ఉన్నది నన్నయ వాగనుశాసనత్వం, రుచిరార్థసూక్తి నిధిత్వం. ఇందలి గుణం మాధుర్యం సార్థకం. (సంపా.) అలం: అర్థాంతరన్యాసం. వ్యా.వి: అనిన, 'ఏడు మొదలగు వాటి సవర్ణమునకు అత్వమును కడహల్లునకు ద్విత్వమును విభాషనగును' అనిన అన్న+అవి: అత్సంధిచే - అన్నవి. అవిలోనిఅకారమునకులోపము, అన్నవి.

**వ. 'అద్దేవయానిం బరిగ్రహించినప్పడ తద్ధనం బగుట నేనును భవత్పరిగ్రహంబ కావున నన్నుం గరుణించి నాకు ఋతుకాలోచితంబుఁ బ్రసాదింపవలయు' ననిన నయ్యయాతి యి ట్లనియె. 175**

**ప్రతిపదార్థం:** ఆ+దేవయానిన్= ఆ దేవయానిని; పరిగ్రహించిన+అప్పుడు+అ= వివాహమాడినప్పుడే; తద్+ధనంబు+అగుటన్= ఆమెకు సంబంధించిన ధనాన్ని (సేవకురాల నవటంచేత); ఏనును= నేనుకూడ; భవత్+పరిగ్రహంబు+అ= మీ భార్యనే; కావున; నన్నున్; కరుణించి= దయదలచి, నాకున్; ఋతుకాల+ఉచితంబున్= ఋతుకాలానికి తగిన దానిని (సంగమాన్ని); ప్రసాదింపవలయున్= అనుగ్రహించవలసింది; అనినన్= అని శర్మిష్ఠ పలుకగా; ఆ+యయాతి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'మీ రా దేవయానిని పెళ్ళి చేసికొన్నప్పుడే ఆమె దాసినవటం చేత ఆమె సొత్తునైన నేను కూడ మీ భార్యనే. కాబట్టి దయదలచి నాకు ఋతుకాలానికి తగిన సంగమాన్ని అనుగ్రహించవలసిం' దని పలుకగా, ఆ యయాతి ఇట్లా అన్నాడు.

**విశేషం:** దేవయానివలెనే శర్మిష్ఠకూడ యయాతిని భర్తగా పొందటం విశేషం. దేవయాని భార్య కాబట్టి ఆమె సొత్తైన శర్మిష్ఠకూడ ఆమెవలెనే భోగింపదగినది. కావున శర్మిష్ఠకూడ భార్యయే. భార్యకు భర్త ఋతుకాలోచిత ధర్మాన్ని నిర్వహించటం అవశ్యకర్తవ్యం. క్షత్రియకన్యయైన శర్మిష్ఠ వివాహప్రసక్తి తేకుండా ఉండటం వివేకం. ఆమెను యయాతి గ్రహిస్తే అది గాంధర్వవివాహం అవుతుంది. పెండ్లితంతు లేని సతీపతిధర్మాన్ని ప్రతిపాదించిన శర్మిష్ఠ గడుసరి.

**క. లలితాంగి! శయన మొక్కఁడు । వెలిగా రుచిరాన్నపాన వివిధాభరణా**
**దుల శర్మిష్ఠకు నిష్టము । సొలయక చేయు మని నన్ను శుక్రుఁడు పంచెన్. 176**

**ప్రతిపదార్థం:** లలితాంగి!= సుందరమైన శరీరం కలదానా; శయనము+ఒక్కఁడు= పడక ఒక్కటి మాత్రం; వెలిగాన్= బాహ్యమయ్యేటట్లుగా (విడిచి); రుచిర+అన్నపాన, వివిధ+ఆభరణ+ఆదులన్= రుచిగల భోజన పానీయాలు, పలువిధాలైన అలంకారాలు మొదలైన వాటిచేత; శర్మిష్ఠకున్; ఇష్టము= ప్రియం; సొలయక= వెనుదీయక; చేయుము; అని; నన్నున్; శుక్రుడు; పంచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** సుందరాంగి వైన ఓ శర్మిష్ఠా! పడక ఒక్కటే తప్ప రుచిగల భోజనపానీయాలు, పలువిధా లైన అలంకారాలు మొదలైనవాటిచేత శర్మిష్ఠవిషయంలో వైముఖ్యం చూపకుండా ప్రీతి కలిగించుమని శుక్రుడు నన్నాజ్ఞాపించాడు.

**వ. 'ఏ నమ్మహామునివచనంబున కప్పు డొడంబడితి; నెట్లు బొంకనేర్తు' ననిన శర్మిష్ఠ యి ట్లనియె. 177**

**ప్రతిపదార్థం:** ఏను; ఆ+మహత్, ముని= గొప్పముని యైన శుక్రుడియొక్క; వచనంబునకున్= మాటకు; అప్పుడు= అతడాజ్ఞాపించినపుడు; ఒడంబడితిన్= అంగీకరించాను; ఎట్లు= ఏవిధంగా; బొంకన్, నేర్తున్= అసత్య మాడగలను? అనినన్= అని యయాతి పలుకగా; శర్మిష్ఠ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నేను గొప్పముని అయిన శుక్రుడిమాటకు అప్పుడే అంగీకరించాను. ఇప్పుడేవిధంగా అసత్యమాడగలను? అని యయాతి పలుకగా శర్మిష్ఠ ఇట్లా అన్నది.

**క. చను బొంకఁగఁ బ్రాణాత్యయ । మున, సర్వధనాపహరణమున, వధ గావ**
**చ్చిన విప్రార్థమున, వధూ । జన సంగమమున, వివాహసమయములందున్. 178**

**ప్రతిపదార్థం:** ప్రాణ+అత్యయమునన్= ప్రాణాలకు చేటువచ్చే సమయాన; సర్వ, ధన+అపహరణమునన్= ఉన్న సమస్తధనాన్ని దొంగిలిస్తున్న సమయాన; వధ, కావచ్చిన, విప్ర+అర్థమునన్= హత్య కావించబడేందుకు సిద్ధంగా ఉన్న బ్రాహ్మణుడికొరకు; వధూ, జన, సంగమమునన్= స్త్రీజనాలతో సంభోగవిషయాన; వివాహసమయములందున్= పెళ్ళికాలమందు; బొంకఁగన్= అబద్ధమాడటం; చనున్= తగును.

**తాత్పర్యం:** ప్రాణాలకు నాశం కలిగే సమయాన, సమస్తధనం అపహరించబడే సమయాన, వధించబడేందుకు సిద్ధంగా ఉన్న బ్రాహ్మణుడిని రక్షించేందుకూ, స్త్రీజనసంగమవిషయానా, పెళ్ళివేళలందూ అసత్య మాడవచ్చును.

**విశేషం:** ఈవిషయమే భాగవతంలో "వారిజాక్షులందు వైవాహికములందు, ప్రాణ విత్తమాన భంగమందుఁ, జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు, బొంకవచ్చు నఘముఁ బొందదధిప!" అనే పద్యంలో చెప్పబడింది. ఇక్కడ వధూజనసంగమం విషయం కాబట్టి పెళ్లిసమయాన యయాతి ఒడంబడిన కారణాన బొంకవచ్చు అని శర్మిష్ఠ చెప్పుతున్నది.

**వ. 'ఈ యేనింటియందు నసత్యదోషంబు లేదని మునివచనప్రమాణంబు గలదు; నీవు వివాహసమయంబున నొడంబడితివి కావున నసత్య దోషంబునం బొంద' ననిన నయ్యయాతి యొడంబడి శర్మిష్ఠకు నభిమతం బొనరించె; నదియుఁ దత్సమాగ మంబున గర్భిణి యై కొడుకుం గనిన విస్మయపడి దేవయాని దానికడకు వచ్చి యి ట్లనియె. 179**

**ప్రతిపదార్థం:** ఈ యేనింటి యందున్= ఈ అయిదింటిలోను; అసత్య, దోషంబు= అబద్ధం ఆడటంవలన దోషం; లేదు+అని; ముని, వచన, ప్రమాణంబు= మునీంద్రులు చెప్పిన మాట అనే ప్రమాణం; కలదు; నీవు; వివాహ, సమయంబునన్= పెళ్ళాడే సమయంలో; ఒడంబడితివి= అంగీకరించావు; కావునన్; అసత్యదోషంబునన్= అబద్ధమాడటం వలని పాపంతో

(పాపాన్ని); పొందవు= పొందవు (కలయవు); అనినన్= అంగీకరించి; శర్మిష్ఠకున్; అభిమతంబు= ఇష్టం; ఒనరించెన్= చేశాడు; అదియున్= శర్మిష్ఠ కూడ; తద్+సమాగమంబునన్= అతనితోడి కలయికచేత; గర్భిణి+ఐ= గర్భవతి అయి; కొడుకున్, కనినన్= ప్రసవించిగా; విస్మయపడి= ఆశ్చర్యపడి; దేవయాని; దాని, కడకున్= శర్మిష్ఠవద్దకు; వచ్చి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'పైన చెప్పబడిన ఐదువిషయాలలోను అబద్ధ మాడటంవలన పాపం లేదని మునీశ్వరులవచన మనే ప్రమాణం ఉన్నది. నీవు పెళ్ళిసమయంలో అంగీకరించావు కాబట్టి అబద్ధం దోషం పొందవు' అని శర్మిష్ఠ పలుకగా యయాతి అంగీకరించి శర్మిష్ఠకు ప్రీతి కావించాడు. శర్మిష్ఠకూడ యయాతితోడి కలయికచేత గర్భవతి అయి పుత్రుడిని కన్నది. అది చూచి దేవయాని ఆశ్చర్యపడి శర్మిష్ఠదగ్గరకు వచ్చి ఇట్లా పలికింది.

**విశేషం:** అసత్య దోషంబునన్+పొందవు= ఇక్కడ పొందుధాతువు అసమాపక క్రియగా వాడబడింది. విస్మయము+పడి= పడు మొదలైనవి పరమయ్యేటప్పుడు మువర్ణానికి లోపంగాని పూర్ణబిందువుగాని వస్తుంది. ఇచ్చట లోపం వచ్చింది.

**తే. బాల వయ్యు నత్యుత్తమశీలవినయ । గౌరవాన్విత వై నిర్వికారవృత్తి**
**నున్న నీ కున్నయునికిన సన్నుతాంగి! । సుతుఁడు పుట్టుట యిది గడుఁజోద్య మయ్యె. 180**

**ప్రతిపదార్థం:** సన్నుత+అంగి= పొగడబడిన అంగాలు కలదానా; బాలవు+అయ్యున్= వయసులో చిన్నదానివి అయికూడా, అతి+ఉత్తమ, శీల, వినయ, గౌరవ, అన్వితవు+ఐ= మిక్కిలి శ్రేష్ఠ మైన శీలంతోను, గౌరవంతోను కూడినదానివై; నిర్వికారవృత్తిన్= వికారం లేని వ్యాపారంతో; ఉన్న= వర్తిస్తున్న; నీకున్; ఉన్న ఉనికిన్+అ= ఉన్నట్లుండగానే; (ఎవరికీ తెలియకుండానే); సుతుఁడు, పుట్టుట, ఇది= కొడుకుపుట్టటమనేది; కడున్; చోద్యము; అయ్యెన్= మిక్కిలి ఆశ్చర్యకర మైనది.

**తాత్పర్యం:** ఓ సుందరాంగీ! బాలికవై కూడా, శ్రేష్ఠ మైన శీలంతోను, వినయంతోను, గౌరవంతోను కూడినదానివై మనోవికారం లేని వ్యాపారంతో ఉన్న నీకు ఉన్నట్లుండి కొడుకు పుట్టటం చూడగా మిక్కిలి ఆశ్చర్యంగా ఉన్నది.

**విశేషం:** ఈపద్యంలో శర్మిష్ఠకు వాడబడిన విశేషణాలు ఆమె వయసును, ప్రవర్తనను, వికారం లేని సచ్చరిత్రను సూచిస్తున్నాయి. అట్టి ఆమెకు ముం దెవరికీ తెలియకుండగానే, కుమారుడు పుట్టటం అన్నది ఆశ్చర్యకరంగా ఉన్నది. అది దేవయాని హృదయంలో శంకను కలిగించింది.

**వ. అది యె ట్లని యడిగిన శర్మిష్ఠ లజ్జావనతవదన యయి యి ట్లను; 'నెందేనినుండి యొక్కమహాముని నిఖిల వేదవేదాంగపారగుండు వచ్చి ఋతుమతినై యున్న నన్నుం జూచి నాకుఁ బుత్త్రోత్పత్తిఁ బ్రసాదించె' ననిన విని దేవయాని నిజనివాసంబునకుం జనియె; శర్మిష్ఠయు నయ్యయాతివలనఁ గ్రమంబున ద్రుహ్యుయను పూరు లనంగా ముప్వురు గొడుకులం బడసి యున్నంత, నొక్కనాఁడు. 181**

**ప్రతిపదార్థం:** అది, ఎట్లు= కుమారుడు పుట్టటం ఎట్లా జరిగింది; అని, అడిగినన్= అని దేవయాని అడుగగా; శర్మిష్ఠ, లజ్జా+అవనత, వదన అయి= సిగ్గుచేత వంగిన ముఖం కలదై; ఇట్లు+అనున్= ఇట్లా పలికింది; ఎందున్+ఏని+ఉండి= ఎక్కడ నుండియో; ఒక్క మహత్, ముని= ఒక గొప్పముని; నిఖిలవేద, వేద+అంగ, పారగుండు= అన్ని వేదాలయొక్క, వేదాంగాలయొక్క

అంతం చూచిన వాడు; వచ్చి; ఋతుమతిన్+ఐ+ఉన్న= పుష్పవతి నై ఉన్న; నన్నున్; నాకున్; చూచి; పుత్ర+ఉత్పత్తిన్= కొడుకు కాన్పును; ప్రసాదించెన్= అనుగ్రహించాడు; అనినన్= అని శర్మిష్ఠ పలుకగా; విని; దేవయాని. నిజనివాసంబునకున్= తన యింటికి; చనియెన్= వెళ్ళింది. శర్మిష్ఠయున్= శర్మిష్ఠకూడ, ఆ+యయాతివలనన్; క్రమంబునన్= వరుసగా; ద్రుహ్యు+అను, పూరులు అనంగాన్= ద్రుహ్యు; అనువు, పూరుడు అనే పేర్లుతో ఒప్పే ముప్వురుకొడుకులన్; పడసి= పొంది; ఉన్న+అంతన్= ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజు.

**తాత్పర్యం:** నీకు కొడుకు పుట్టటం ఎట్లా జరిగిం దని దేవయాని అడుగగా శర్మిష్ఠ సిగ్గుతో ముఖం వంచుకొని ఇట్లా అన్నది: 'ఎక్కడినుండియో సమస్త వేదాలను, వేదాంగాలను బాగా చదివిన ఒక గొప్పముని వచ్చి ఋతుకాలమం దున్న నన్ను చూచి నాకు పుత్రజన్మను అనుగ్రహించాడు' - అని శర్మిష్ఠ పలుకగా విని దేవయాని తన గృహానికి వెళ్ళింది. శర్మిష్ఠకూడ ఆ యయాతివలన వరుసగా ద్రుహ్యుడు, అనువు, పూరుడు అనే ముగ్గురు కొడుకులను పొంది ఉండగా ఒక్కరోజున.

**విశేషం:** ఋగ్యజుస్సామాథర్వణ వేదాలు నాలుగు. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, కల్పం, నిరుక్తం, జ్యోతిషం అనే ఆరు వేదాంగాలు, ద్రుహ్యు+అను= ద్రుహ్యును - యణాదేశసంధి. వివాహవిషయాలలో బొంకు లాడినా అసత్యదోషం రాదని చెప్పిన శర్మిష్ఠ ఇక్కడ తాను ఆ ధర్మాన్నే పాటించిందని చెప్పేటట్లు వ్యవహరించింది. పుత్రసంతానం ఇచ్చింది యయాతికాని ముని కాదు. అయినా, అట్లా చెప్పినా దోషం లేదని శర్మిష్ఠభావం.

**సీ.** **కరువలిచేఁ దూలుకపిల జటాలియ । కరమొప్పు శిఖలుగాఁ గనకరత్న**
**మయజాల భూషణామలదేహదీప్తుల । తేజంబుగాఁ బ్రవిదీప్యమాన**
**యాగశతంబుల నర్చితం బైన మూఁ । డగ్నులు ప్రత్యక్ష మైన యట్లు**
**దనమ్రోల శర్మిష్ఠతనయులు గ్రీడించు । చుండంగ నున్న యయ్యుర్వీశేని**

**ఆ.** **కడకు నేఁగుదెంచెఁ గన్యలు దనుజాధి! రాజసుతయుఁ దోడరాఁగ నొప్పి**
**దేవి దేవయాని దేవేంద్రుదేవియ । పోలె నెంతయును విభూతి మెఱసి.** **182**

**ప్రతిపదార్థం:** కరువలిచేన్= గాలిచేత; తూలు= చలించు; కపిల, జట+ఆళి+అ= గోరోజనంవంటి రంగు గల జడల యొక్క సముదాయమే; కరము+ఒప్పు= మిక్కిలి అందగించు; శిఖలు, కాన్= సిగలుగా; కనక, రత్నమయ, జాల, భూషణ, అమల దేహ, దీప్తులు+అ= బంగారంతోను, రత్నాలతోను కూడిన కవచాలవలె, నగలవలె నిర్మల మైన శరీరంయొక్క కాంతులే; తేజంబుకాన్= తేజస్సుగా; ప్రవిదీప్య మాన యాగ శతంబులన్= మిక్కిలి ప్రకాశిస్తున్న నూరు యజ్ఞాల యందు; అర్చితంబు+ఐన= పూజించబడిన; మూడు+అగ్నులు= త్రేతాగ్నులు; ప్రత్యక్షము+ఐన+అట్లు= ఎదుట సాక్షాత్కరించినట్లు; తనమ్రోలన్= తన ఎదుట; శర్మిష్ఠ తనయులు= శర్మిష్ఠకుమారులు; క్రీడించుచున్+ఉండంగన్= ఆడుతుండగా; ఉన్న; ఆ+ఉర్వీశేని కడకున్= ఆ యయాతి మహారాజు చెంతకు; కన్యలు= చెలికత్తె లైన ఇతర కన్యకలునూ; దనుజ+అధిరాజు సుతయున్= రాక్షస రా జైన వృషపర్వుడి కూతు రైన శర్మిష్ఠయునూ; తోడన్, రాఁగన్= తనవెంట రాగా; ఒప్పి= ప్రకాశించి; దేవేంద్రు, దేవి+అ, పోలెన్= దేవతల రా జైన, ఇంద్రుడి పట్టమహిషి యైన శచీదేవివలె; ఎంతయును= మిక్కిలి; విభూతి= వైభవం; మెఱసి= ప్రకాశించి; దేవి, దేవయాని= పట్టమహిషి యైన దేవయాని; ఏఁగుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** గాలిచేత కదిలే కపిలవర్ణం గల జడలసమూహమే మిక్కలి సుందర మైన సిగలుగా, బంగారంతోను, రత్నాలతోను, నిండిన (కవచాలవలె) నగలవలె నిర్మల మైన శరీరకాంతులే తేజస్సుగా ప్రకాశిస్తున్న వందలకొలది యజ్ఞాలయందు పూజించబడిన త్రేతాగ్నులు సాక్షాత్కరించినట్లు తన ఎదుట శర్మిష్ఠకుమారు లైన ద్రుహ్యుడు మొదలైన వారు ఆడుతుండగా ఉన్న ఆ యయాతిమహారాజువద్దకు కన్యకలునూ, వృషపర్వుడి కూతురైన శర్మిష్ఠయునూ తనవెంట రాగా దేవేంద్రుడి పట్టమహిషి యైన శచీదేవివలె వైభవం మెరయ పట్టమహిషి యైన దేవయాని వచ్చింది.

**విశేషం:** ('కనకరత్నమయజాల' లోని 'జాల' అన్నపదానికి కవచ మని అర్థం చెప్పాల్సి వచ్చింది. జాల అనగా సమూహమని అర్థ మున్నది కాని అప్పుడు అది భూషణ అన్న పదం తరువాత ఉండాలి) ఆ బాలురు అలంకారాదులు లేకపోయినా సహజకాంతిచేతనే ప్రకాశిస్తున్నా రని కవిభావం. గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము అనేవి మూడు త్రేతాగ్నులు. శర్మిష్ఠకుమారులు త్రేతాగ్నులవలె ఉన్నారనటం చేత ఆమెవలననే యయాతి గృహస్థధర్మం సార్థకమైనదనీ, వంశకర్తను ఆమెవలననే పొందగలిగాడనీ భావికథార్థ ధ్వని. అలం: మొదటి మూడుపాదాలలో రూపకం, ఉత్ప్రేక్షల సంకరం ఉన్నది. ఎత్తుగీతిలో ఉపమ ఉన్నది.

**వ. ఇ ట్లరుగుదెంచి యధికతేజస్వులయి యయాతి ప్రతిబింబంబులుం బోని యబ్బాలకులం జూచి' యిక్కుమారు లెక్కడి వా? రెవ్వరికొడుకు? లని యయాతి నడిగి యలబ్ధప్రతివచనయై 'మీ తల్లిదండ్రులెవ్వ' రని యక్కుమారుల నడిగిన. 183**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; అరుగుదెంచి= వచ్చి; అధిక, తేజస్వులు, అయి= మిక్కిలితేజుస్సు కలవా రై; యయాతి ప్రతిబింబంబులున్, పోని= యయాతియొక్క మాఱురూపాలవంటి; (యయాతిరూపం వంటి రూపం కల); ఆ+బాలకులన్= ఆ కుమారులను; చూచి; ఈ+కుమారులు; ఎక్కడివారు; ఎవ్వరి కొడుకులు; అని; యయాతిన్; అడిగి; అలబ్ధ ప్రతివచన+ఐ= పొందబడని సమాధానం కలదై; మీ తల్లిదండ్రులు= మీ తల్లి, తండ్రి; ఎవ్వరు; అని; ఆ+కుమారులన్; అడిగినన్= దేవయాని అడుగగా.

**తాత్పర్యం:** (దేవయాని) ఈవిధంగా వచ్చి అధిక మైన తేజస్సు కలిగి యయాతిరూపంవంటి రూపం కల శర్మిష్ఠ కుమారులను చూచి 'ఈకుమారులు ఏప్రదేశానికి చెందినవారు? ఎవ్వరి కొడుకులు?' అని యయాతిని అడిగింది. యయాతి సమాధానం చెప్పకపోతే, 'మీ తల్లిదండ్రు లెవ్వరు? అని ఆ కుమారులనే అడిగింది.

**క. తరుణప్రదేశినులు మా। సరముగ వారలు యయాతి శర్మిష్ఠలఁ జూ**
**పిరి తండ్రియుఁ దల్లియు నని। కర మనురాగిల్లెఁ గన్యకానివహంబున్. 184**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ కుమారులు; తరుణ, ప్రదేశినులు= లేత చూపుడువేళ్ళు; మాసరముగన్= దీర్ఘం కాగా; తండ్రియున్, తల్లియున్+అని; యయాతి శర్మిష్ఠలన్= యయాతి మహారాజును; శర్మిష్ఠను; చూపిరి; కన్యకా, నివహంబున్= కన్యలయొక్క సముదాయం కూడ; కరము= మిక్కిలి; అనురాగిల్లెన్= ప్రీతిపొందెను.

**తాత్పర్యం:** ఆ కుమారులు లలితము లైన చూపుడువ్రేళ్ళు దీర్ఘాలు కాగా వీరు మా తండ్రి తల్లి అని యయాతి శర్మిష్ఠలను చూపించారు. ఆ దృశ్యం చూచి అక్కడి కన్యకలసముదాయం మిక్కిలిప్రీతిని పొందారు.

**విశేషం:** ఇక్కడ మీతండ్రీ, తల్లీ ఎవ్వరని దేవయాని అడుగగా కుమారులు చూపుడు వ్రేళ్ళతో వరుసగా యయాతి శర్మిష్ఠలను చూపించటం చాలా సహజంగా ఉన్నది. సామాన్యంగా లోకంలో తల్లిదండ్రు లెవ రని అడుగుతారు. కాని, ఇక్కడ తండ్రిఎవరో ముందు తెలియాలి. తల్లిఎవరో ఆతరువాత; కాబట్టి ఇక్కడ ఆ పదాల వరుస మారింది.

**వ. ఇట్లు ద న్నెఱుంగకుండ యయాతి శర్మిష్ఠవలన లబ్ధసంతానుం డగుట యప్పు డెఱింగి. 185**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; తన్నున్+ఎఱుంగక+ఉండ= తనసంగతి తెలిసికొనకుండా, తనకు తెలియకుండా; యయాతి; శర్మిష్ఠవలనన్; లబ్ధ సంతానుండు+అగుట= పొందబడిన సంతానం కలవా డౌట; అప్పుడు; ఎఱింగి= దేవయాని తెలిసికొని.

**తాత్పర్యం:** ఈవిధంగా తనసంగతి తెలిసికొనకుండా (తనకు తెలియకుండా) యయాతి శర్మిష్ఠవలన సంతానాన్ని పొందటం అప్పుడు తెలిసికొని.

**విశేషం:** తా నెరుగకుండా అని ఉంటే ఎక్కువ ఉచితంగా ఉండేదని కొందరు భావిస్తారు. కాని, తనకు తెలియకుండా, తనసంగతి తెలియకుండా అని రెండర్థాలు వచ్చేటట్లు వాడి నన్నయ ప్రకృత, భావికథార్థవ్యంజకత్వాన్ని సాధించాడు. తనకు తెలియకుండా యయాతి శర్మిష్ఠవలన సంతానంపొందటంలో దోషం యయాతియందే ఉన్నదని ఆమె భావించింది. ఆపని యయాతి ఆమెసంగతి (శక్తియుక్తులు) తెలియకచేశాడని అభిమానపడి తనతండ్రిచేత శాపాన్ని ఇప్పించింది. భర్త తనపట్ల చేసిన ఈ అపరాధానికి ప్రతీకారం చేయాలని భావించే దేవయాని దురహంకారిణి.

**చ. పతివిహితానురాగమున భార్గవుపుత్త్రి యయాతిచేత వం**
**చిత యయి, వాఁడు దానవికిఁ జేసిన నెయ్యు మెఱింగి, కోపదుః**
**ఖిత యయి, తండ్రిపాలి కతిఖేదమునం జని, దీర్ఘనేత్రని**
**ర్గతజలధారలం గడిగెఁ గాంత తదీయ పదాబ్జయుగ్మమున్. 186**

**ప్రతిపదార్థం:** పతివిహిత+అనురాగమునన్= భర్తకు విధింపబడిన ప్రేమవిషయంలో భార్గవుపుత్త్రి= శుక్రుడికూతు రైన దేవయాని; యయాతిచేతన్; వంచిత+అయి= మోసగించబడిన దై; వాఁడు= యయాతి; దానవికిన్= రాక్షసస్త్రీ యైన శర్మిష్ఠకు; (శర్మిష్ఠయందు అని అర్థం:) చేసిన; నెయ్యము= ప్రేమ; ఎఱింగి= తెలిసికొని; కోపదుఃఖిత, అయి= కోపంచేత దుఃఖం పొందినదై; తండ్రిపాలికిన్= తండ్రి యైన శుక్రుడి చెంతకు; అతిఖేదమునన్= మిక్కిలి శోకంతో; చని= వెళ్ళి; తదీయపద+అబ్జ, యుగ్మమున్= ఆ శుక్రుడి పద్మాలవంటి పాదాలజంటను; దీర్ఘ, నేత్ర, నిర్గత, జలధారలన్= ఆయతములైన కన్నులనుండి బయల్వెడలిన (బయటపడిన) కన్నీటిధారలచేత; కడిగెన్= తడిపినది. (అతనిపాదాలపై పడి ఏడ్చిన దని భావం.)

**తాత్పర్యం:** పతి అన్యస్త్రీని ప్రేమించడంచేత, అతనిచేత వంచించబడిన దై శుక్రుడికూతు రైన దేవయాని, యయాతి రాక్షసకన్య యైన శర్మిష్ఠయందు చేసిన ప్రేమకలాపాన్ని ఎఱిగి కోపాన్ని, దుఃఖాన్ని పొందినదై, మిక్కిలి శోకంతో తండ్రివద్దకు వెళ్ళి తన విశాలనయనాలనుండి జారు కన్నీటిధారలచేత, అతని పాదపద్మయుగాన్ని కడిగింది. (అతడిపాదాలు క్షాళితాలయ్యేంత అధికంగా కన్నీ రోడ్చి ఏడ్చిందని భావం).

**విశేషం:** ప్రతివిహితానురాగమున అను పాఠాంతరం కలదు. ప్రతివిహితమంటే వ్యతిరేకంగా చేయబడింది. ఇక్కడ యయాతి శర్మిష్ఠను ప్రేమించటం వ్యతిరేకంగా చేయబడిన ప్రేమయే. అందుచేత ఈ పాఠమే ఉచితతరంగా కనబడుతున్నది.

ఈపద్యంలో దేవయానికి కలిగిన కోపదుఃఖభావాలు రుచిరార్థరమ్యంగా వర్ణింపబడినాయి, తా నుండగా మరొక వనితను వలచుటవలన అవమానితురాలయింది. తనభర్త శర్మిష్ఠయందు పుత్రులను పొందాడని తెలిసి దేవయాని మండిపడింది. శర్మిష్ఠ పరోక్షంగా తనమీద విజయం సాధించింది. ఆమె అస్తిత్వం అస్తి నాస్తి విచికిత్సలో పడింది. ఆమె అహంకారం దెబ్బతిన్నది. తండ్రిపెట్టిన కట్టడి వీగిపోవటంచేత ఏర్పడిన ఈవిపత్తును గురించి చెప్పుకొనటానికి పుట్టింటికి వెళ్ళింది. తండ్రిపాదపద్మాలను కన్నీటితో కడిగింది. కన్నీటితో పాదాలు కడిగిందనటంలో లక్ష్యార్థం ప్రధానం. పాదాలపై పడి కంటికి కడవకట్టినట్లు దుఃఖించిందని భావం. దాని వలన ఆమె దుఃఖభావతీవ్రత ధ్వనిస్తోంది కాబట్టి ఇక్కడ లక్షణా మూలధ్వని. కన్నీటితో కాళ్ళుకడగటమనేదానివలన దుఃఖం వాచ్యం కావటంవలన అవివక్షితవాచ్యధ్వని. (సంపా.)

## శుక్రుఁడు యయాతికి శాపం బిచ్చుట (సం.1-78-24)

**వ. అయ్యయాతియు దానిం బట్టువఱుచుచుఁ దోడన చని శుక్రుం గని నమస్కరించి యున్న నద్దేవయాని గద్గద వచన యై 'యధర్మంబున ధర్మంబు గీడ్పఱిచి యిమ్మహీశుం డాసురంబున నాసురియం దనురక్తుం డై పుత్త్రత్రయంబు వడసి నాకవమానంబు సేసె' ననిన విని శుక్రుండు యయాతి కలిగి 'నీవు యౌవనగర్వంబున రాగాంధుండ వై నాకూఁతున కప్రియంబు సేసితివి కావున జరాభారపీడితుండవు గ' మ్మని శాపం బిచ్చిన నయ్యయాతి శుక్రున కి ట్లనియె. 187**

**ప్రతిపదార్థం:** ఆ+యయాతికూడ; దానిన్= దేవయానిని; పట్టువఱుచుచున్= ఓదార్చుచు; తోడన్+అ= వెంటనే, చని= వెళ్ళి, శుక్రున్= శుక్రుడిని; కని= చూచి; నమస్కరించి; ఉన్నన్= నమస్కారం చేసి ఉండగా; ఆ+దేవయాని; గద్గద, వచన, ఐ= డగ్గుత్తికతో కూడిన మాటలు కలదై; అధర్మంబునన్= అధర్మంచేత; ధర్మంబు= ధర్మాన్ని; కీడ్పఱిచి= కించపరిచి; ఈ+మహీ+ఈశుండు= ఈరాజు; ఆసురంబునన్= రాక్షస విధాన; ఆసురి, అందున్= రాక్షసస్త్రీయందు; అనురక్తుండు+ఐ= ప్రేమకలవాడై; పుత్త్రత్రయంబు= ముగ్గురు కొడుకులను; పడసి= పొంది; నాకున్; అవమానంబు చేసెన్= పరాభవం చేశాడు; అనినన్= అని దేవయాని పలుకగా; విని; శుక్రుండు; యయాతికిన్= యయాతియెడ; అలిగి= కోపించి; నీవు; యౌవనగర్వంబునన్= యౌవనంవలని గర్వంచేత; రాగ+అంధుండవు+ఐ= ప్రేమచేత గ్రుడ్డివాడి వై; నాకూఁతునకున్= నాకూతు రైన దేవయానికి; అప్రియంబు= అనిష్టం; చేసితివి; కావునన్; జరా, భారపీడితుండవు= ముసలితనంయొక్కభారంచేత బాధించబడిన వాడివి; కమ్ము= అగుము; అని; శాపంబు; ఇచ్చినన్; ఆ+యయాతి; శుక్రునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ యయాతికూడ దేవయానిని ఓదారుస్తూ వెంటనే వెళ్ళి శుక్రుడిని దర్శించి నమస్కరించాడు. దేవయాని డగ్గుత్తికతో కూడికొన్న వాక్కులు కలదై ఇట్లా అన్నది: 'ఈ మహారాజు అధర్మంచేత ధర్మాన్ని కించపరిచి రాక్షసపద్ధతిలో రాక్షసకన్య అయిన శర్మిష్ఠను అనురాగంతో గ్రహించి పుత్త్రత్రయాన్ని పొంది నాకు అవమానం చేశాడు'. ఆమెమాటలు విని శుక్రుడు యయాతిమీద ఆగ్రహించి 'నీవు యౌవనగర్వంతో రాగాంధుడ వై నాకూతురికి ఇష్టంలేనిపని చేశావు. కాబట్టి ముసలితనపు బరువుతో పీడింపబడేవాడివి కమ్ము' అని శపించాడు. అప్పుడు ఆ యయాతి శుక్రాచార్యుడితో ఇట్లన్నాడు.

**విశేషం:** దేవయాని కోపాన్నీ దుఃఖాన్నీ ఉపశమింపచేయటానికి యయాతి ప్రయత్నించాడు. ఆమెవెంట శుక్రాచార్యుడి దగ్గరకు వెళ్ళి నమస్కరించాడు. అయినా ఆ ముని అతడిని పట్టించుకొన్నట్లు లేదు. ఆమె తండ్రితో చెప్పిన మాటలలో ముఖ్యమైన

అంశాలు. 1. రాజు అధర్మంచేత ధర్మాన్ని కించపరిచాడు. అంటే అధర్మసంబంధంవలన గృహస్థధర్మాన్ని కించపరిచాడని భావం. 2. అసురుడివలె వ్యవహరించి అసురకన్యను అనురాగంతో స్వీకరించాడు. ఈవాక్యంలో అసురశబ్దం నిందావాచకం. రాక్షసస్త్రీని ఈ రాక్షసుడు ప్రేమించి నన్ను రాక్షసంగా అవమానించాడని భావం. 3. పైపెచ్చు ఆమెయందు ముగ్గురుకొడుకులను పొందాడు. ఇది అచ్చమైన అసూయతో అన్నమాట. పట్టమహిషిఅయిన తనకు ఇద్దరు కొడుకులు. శర్మిష్ఠకు ముగ్గురుకొడుకులు. ఈ మూడింటికి గల మూలకారణం యౌవనంలో కలిగే రాగాంధ్య మని శుక్రుడు నిర్ణయించాడు. దానిని తొలగించే వార్ధక్యాన్ని శాపంవలన యయాతికి కలిగించాడు. శపించటానికి కారణం యయాతి అధర్మవర్తనం అని అనలేదుకాని కూతురుకు చేసిన అప్రియ మని మాత్రం ప్రత్యేకించి పేర్కొన్నాడు. కూతురి అప్రియత్వాన్ని తొలగించటానికి శాపాన్ని ఇచ్చాడు. ఆమె కిమ్మనలేదు కాబట్టి తండ్రి చేసినపని ఆమెకు ఆమోదయోగ్యమే అని వ్యంగ్యం. నాటకీయంగా పాత్రల సంభాషణలు వర్ణిస్తూ కథార్థాలను ప్రసన్నంచేసే నన్నయ ప్రయోగనైపుణ్యం ఇందులో ప్రసన్నమౌతున్నది. (సంపా.)

**క. ఋతుమతి యై పుత్త్రార్థము । పతిఁ గోరిన భార్యయందుఁ బ్రతికూలుం డై**
**ఋతువిఫలత్వము సేసిన । యతనికి మఱి భ్రూణహత్య యగు నండ్రు బుధుల్. 188**

**ప్రతిపదార్థం:** ఋతుమతి+ఐ= పుష్పవతి యై; పుత్త్ర+అర్థము= పుత్రుడి నిమిత్తం; పతిన్= భర్తను; కోరిన; భార్యయందున్; ప్రతికూలుండు+ఐ= అనుకూలుడు కానివాడై; ఋతు, విఫలత్వము చేసిన; అతనికిన్= ఋతుకాలంయొక్క వ్యర్థత్వం కావించిన వాడికి; మఱి; భ్రూణహత్య= గర్భమందలి బిడ్డను చంపటం (వలన కలుగు పాపం) అగును; అని; బుధుల్= పండితులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** పుష్పవతి యై భర్తను వాంఛించిన భార్యయెడ ఆనుకూల్యం లేనివాడై ఋతుకాలాన్ని వ్యర్థం చేసిన వాడికి గర్భస్థశిశువును చంపినపాప మౌ తుందని పెద్దలు (చెప్పారు).

**విశేషం:** ఇది నన్నయసూక్తులలో ఒకటి. యయాతి ఈపద్యంలో ఋతుమతి అయిన సతి పుత్రార్థం పతిని కోరితే, దానిని కాదనటం భ్రూణహత్యచేసినంత దోషం అనే పండితప్రమాణాన్ని పేర్కొన్నాడు. అది- అధర్మంతో ధర్మాన్ని కించపరిచాడన్న దేవయాని వాదాంశానికి సమాధానం. అట్లాచెప్పటంలో యయాతి దేవయానికంటె గడుసరితనాన్ని ప్రదర్శించాడు. యజమానురాలు రాజుకు భార్య అయితే ఆమె సేవకురాలుకూడ ఆయనకు భార్యయే. అయినా, ఆమెకు శయ్యాసుఖం మాత్రం ఈయవద్దని శుక్రుడి కట్టుబాటు. యయాతి తనంతట తాను ఆమె పొందును కోరలేదు. ఆమె ఋతుమతి అయినప్పుడు పుత్రార్థిని యై అతడిని అర్థించింది. ఆకోర్కెను అతడు తీర్చాడు. ఇందులో ధర్మవైరుద్ధ్యం లేదు. పుత్రులకొరకే అయిన సంబంధంవలన శర్మిష్ఠకు ముగ్గురుకొడుకులు పుట్టారు. అందువలన అధర్మంవలన ధర్మం అవమానంపొందలేదని యయాతి వాద తాత్పర్యం. అది ఆసుర మైన ధర్మంకాదనీ మానవీయధర్మ మనీ అతడి అభిప్రాయం.

**క. దానికి భీతుఁడ నై య । మ్మానవతీ ప్రార్థనం గ్రమం బొనరఁగ సం**
**తానము వడసితి నెదలో । దీనికి నలుగంగఁ దగునె దివ్యమునీంద్రా! 189**

**ప్రతిపదార్థం:** దివ్యముని, ఇంద్రా= దేవతాముని శ్రేష్ఠుడా, శుక్రాచార్యా!; దానికిన్= భ్రూణహత్యకు; భీతుఁడన్+ఐ= భయపడిన వాడి నై; ఆ+మానవతీ ప్రార్థనన్= అభిమానం కల ఆ శర్మిష్ఠయొక్క వేడికోలుచేత; క్రమంబు= న్యాయం (వరుస) ఒనరఁగన్= సమకూడేటట్లుగా; సంతానము= సంతతి; పడసితిన్= పొందితిని (పొందాను); దీనికిన్= ఈన్యాయమైనదానికి; ఎదలోన్= హృదయంలో అలుగంగన్ తగున్+ఎ= కోపించటం యుక్తమా? (కాదని భావం).

**తాత్పర్యం:** దేవతామునిశ్రేష్ఠుడ వైన ఓ శుక్రాచార్యా! ఆ భ్రూణహత్యాపాపానికి భయపడి, మానవతి యైన శర్మిష్ఠ కోరికచేత సక్రమంగానే సంతానాన్ని పొందాను. దీనికి హృదయంలో కోపించ తగునా?

**వ. 'ఏ నిద్దేవయానియందు విషయోపభోగతృప్తుండఁ గాను, జరాభారంబుఁ దాల్పనోప' నని ప్రార్థించిన విని వానికి శుక్రుండు గరుణించి 'యట్లేని నీముదిమి నీకొడుకులయం దొక్కరునిపయిం బెట్టి వానిజవ్వనంబు నీవు గొని రాజ్యసుఖంబు లనుభవింపుము; నీవు విషయోపభోగ తృప్తుండ వైన మఱి నీముదిమి నీవ తాల్చి, వాని జవ్వనంబు వానికి నిచ్చునది; నీ ముదిమిఁ దాల్చిన పుత్త్రుండ రాజ్యంబున కర్హుండును, వంశకర్తయు నగు' ననిన నయ్యయాతి శుక్రు వీడ్కొని దేవయానీసహితుం డై తనపురంబునకు వచ్చి శుక్రుశాపంబున జరాభారంబుఁ దాల్చిన, వానికి. 190**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఈ+దేవయానియందున్; విషయ+ఉపభోగ, తృప్తుండన్, కాను= ఇంద్రియ భోగాలను అనుభవించటంలో తృప్తిచెందిన వాడిని కాను; జరాభారంబున్= ముదిమి బరువును; తాల్పన్+ఓపన్= భరించజాలను; అని ప్రార్థించినన్= అని వేడుకోగా; విని; వానికిన్= యయాతియెడ; శుక్రుండు; కరుణించి= దయతలచి; అట్లు+ఏని= నీవు జరాభారం వహించ లేకపోయినట్లయితే; నీ ముదిమి= నీ ముసలితనం; నీ కొడుకులయందున్; ఒక్కరుని, పయిన్; పెట్టి= ఉంచి; వాని జవ్వనంబు= ఆ కొడుకుయౌవనం; నీవు కొని= నీవు గ్రహించి; రాజ్యసుఖంబులు= రాజత్వంవలని సౌఖ్యాలను; అనుభవింపుము; నీవు; విషయ+ఉపభోగ, తృప్తుండవు= ఇంద్రియ భోగాలను అనుభవించటంచేత తృప్తిపొందినవాడివి; ఐన; మరి= అయిన పిమ్మట; నీ ముదిమి= నీ ముసలితనం; నీవు+అ= నీవే; తాల్చి= ధరించి; వాని జవ్వనంబు= ఆ కొడుకుయౌవనం; వానికిన్= ఆ కొడుకుకు; ఇచ్చునది= ఇమ్ము; నీ ముదిమిన్; తాల్చిన; పుత్త్రుండు+అ= కొడుకే; రాజ్యంబునకున్= రాజత్వానికి; అర్హుండును= తగినవాడును; వంశకర్తయున్= వంశాన్ని కొనసాగించేవాడును; అగున్; అనినన్= అని శుక్రుడు పలుకగా; ఆ యయాతి; శుక్రున్= శుక్రుడిని; వీడ్కొని= సెలవు పుచ్చుకొని; (విడిచి) దేవయానీ+సహితుండు+ఐ= దేవయానితో కూడినవా డై; తన పురంబునకున్= తన పట్టణానికి; వచ్చి; శుక్రుశాపంబునన్= శుక్రుడిశాపంచేత; జరాభారంబున్= ముదిమిబరువును; తాల్చిన, వానికిన్= ధరించిన (గ్రహించిన) యయాతికి.

**తాత్పర్యం:** 'నే నీ దేవయానియందు ఇంద్రియభోగాలను అనుభవించటంలో (చే) తృప్తి పొంది యుండలేదు. అధిక మైన ముసలితనాన్ని వహించలేను' అని యయాతి వేడుకోగా విని వానియెడల శుక్రుడు దయతలచి నీవు ఇంద్రియభోగాలచేత తృప్తిపొందనివాడ వైతే నీ ముసలితనాన్ని నీకొడుకులలో ఒకడికి ఇచ్చి, వాడి యౌవనాన్ని నీవు గ్రహించి రాజ్యసుఖాలను అనుభవించుము; నీవు ఇంద్రియభోగాలవలన తృప్తిపొందినతరువాత నీముసలితనాన్ని నీవే తిరిగి గ్రహించి, నీ కొడుకుయౌవనాన్ని వాడి కిచ్చివేయుము. నీ ముసలితనాన్ని గ్రహించిన కొడుకే రాజ్యం చేయటానికి తగినవాడున్నూ వంశాన్ని కొనసాగించేవాడున్నూ అవుతా' డని పలుకగా ఆ యయాతి శుక్రుడిని వీడ్కొని దేవయానితో కూడినవా డై తనపట్టణానికి వచ్చి శుక్రుడు ఇచ్చిన శాపంవలన ముదిమి వహించాడు. ఆ తరువాత యయాతికి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'నేను దేవయానియందు విషయోపభోగతృప్తుడను కాను'- అని యయాతి అనటంలో విశేషం ఉన్నది. శర్మిష్ఠతోడి సంబంధం పుత్త్రార్థమే. దేవయానితోడి సంబంధం నిత్య మైనది. రాజులకు అనేక భార్య లుండవచ్చును. కాని, దేవయానియందు అతడికి విషయవాంఛ తీరలేదు. కాబట్టి వార్ధక్యభారంవలన దుఃఖం కలిగేది దేవయానిపొందు లేనందుకే. అది ఆమెకుకూడ

ప్రీతిపాత్రం కాదు. అందుచేత జరాభారాన్ని వహించలే నన్నాడు. శుక్రుడు తనపొరపాటు తెలిసికొన్నాడు. దేవయానినోట మాట పెకలలేదు. అటువంటిది యయాతి వాక్యనైపుణ్యం. ఇది వస్తుధ్వని. (సంపా.)

**క. తల వడఁకఁ దొడఁగె, నింద్రియ । ముల గర్వ మడంగె, నంగములు వదలె, వళీ**
**పలితంబు లయ్యె, వగరును । దలయేరును నుక్కిసయును దరికొనుదెంచెన్. 191**

**ప్రతిపదార్థం:** తల; వడఁకన్+తొడఁగెన్= తలవణకుట మొదలు పెట్టింది; ఇంద్రియముల= దేహం, నేత్రం మొదలైన కర్మేంద్రియాల; గర్వము= విజృంభణం; అడంగెన్= తగ్గింది; అంగములు= అవయవాలు; వదలెన్= శిథిలాలు అయినవి; వళీ, పలితంబులు= ముడతలున్నూ, నరసిన వెంట్రుకలున్నూ; అయ్యెన్; వగరును= శ్వాసరోగమున్నూ; తల ఏరును= తలనొప్పియున్నూ; ఉక్కిసయును= పొడిదగ్గున్నూ; దరికొనుదెంచెన్= విజృంభించాయి. తలకొనుదెంచెన్ అని పాఠాంతరం. (కలిగాయి లేక సంభవించాయి.)

**తాత్పర్యం:** తల వణకటం మొదలు పెట్టింది. ఇంద్రియాల మదం అణిగింది. అవయవాలు సడలినాయి; శరీరాన ముడతలు ఏర్పడ్డాయి. వెంట్రుకలు నరిశాయి. ఉబ్బసం, తలనొప్పి, పొడిదగ్గ కలిగాయి.

**విశేషం:** ఈపద్యంలో ముసలితనపు లక్షణా లన్నీ వర్ణించబడ్డాయి. అలం: స్వభావోక్తి.

## యయాతి యదుప్రముఖులకు శాపం బిచ్చుట (సం. 1-79-1)

**వ. ఇట్లు జరాక్రాంతుం డైన యయాతి గొడుకులనెల్లరావించి 'నాకు విషయసుఖతృప్తి లేకున్నయది గావున మీయందొక్కరుండు నా ముదిమి గొని తన జవ్వనంబు నా కిచ్చునది' యనిన విని యదు తుర్వసు ద్రుహ్యానులు దండ్రి కి ట్లనిరి. 192**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; జరా+ఆక్రాంతుండు= ముసలితనంచేత ఆక్రమించబడినవాడు; ఐన, యయాతి; కొడుకులన్+ఎల్లన్= కుమారులనందరినీ; రావించి= రప్పించి; నాకున్; విషయ, సుఖతృప్తి= ఇంద్రియ సుఖాల తృప్తి; లేక+ఉన్న+అది= కలుగకున్నది; కావున; మీయందున్; ఒక్కరుండు= ఒకడు; నాముదిమి= నాముసలితనం; కొని= గ్రహించి; తన జవ్వనంబు= తన యౌవనం; నాకు; ఇచ్చునది= ఇవ్వవలసింది; అనినన్= అని యయాతి పలుకగా; విని; యదు, తుర్వసు, ద్రుహ్యి+అనులు= ఆ పేర్లు కలిగిన కొడుకులు; తండ్రికిన్= యయాతికి; ఇట్లు+అనిరి= ఈవిధంగా పలికారు.

**తాత్పర్యం:** ఈవిధంగా వృద్ధుడైన యయాతి కొడుకులందరినీ తనకడకు రప్పించి 'నాకు ఇంద్రియభోగాలను అనుభవించటంలో తృప్తి కలగక ఉన్నది. కావున మీలో ఒకడు నా ముసలితనం గ్రహించి తనయౌవనాన్ని నాకు ఇవ్వవలసింది' అని యయాతి పలుకగా విని యదువు, తుర్వసుడు, ద్రుహ్యి, అనువు అనే కుమారులు యయాతితో ఇట్లా చెప్పారు.

**విశేషం:** ద్రుహ్యి+అనులు= దుహ్యానులు (యణాదేశసంధి).

**ఆ. తగిలి జరయు రుజయు దైవవశంబున । నయ్యెనేని వాని ననుభవింత్రు**
**గాక యెఱిఁగి యెఱిఁగి కడఁగి యూరెంటిఁ జే। కొందురయ్య యెట్టి కుమతు లైన. 193**

**ప్రతిపదార్థం:** తగిలి= అంటి; జరయున్= ముసలితనమూ; రుజయున్= రోగమూ; దైవవశంబునన్= విధివశాన; అయ్యేన్, ఏని= అయినట్లయితే; వానిని= ఆ జరారోగాలను; అనుభవింత్రు, కాక= అనుభవిస్తారు కాని; ఎఱిఁగి ఎఱిఁగి= బాగా తెలిసి; (తెలిసి తెలిసి); కడఁగి= పూని; ఆ రెంటిన్= ఆ జరారోగాలు రెండింటినీ; ఎట్టి కుమతులు+ఐనన్= ఎటువంటి బుద్ధిహీను లైనా; చేకొందురు+అయ్య?= గ్రహిస్తారా? గ్రహించరు.

**తాత్పర్యం:** ముసలితనమున్నూ; రోగమున్నూ విధివశాన ఎవరికైనా కలిగితే వారు వాటిని అనుభవిస్తారు కాని, తెలిసి తెలిసి మరొకరినుండి కావాలని ఆ రెంటింటినీ ఎవ్వరైనా ఎంతబుద్ధిహీను లైనా గ్రహిస్తారా?

**విశేషం:** అనుభవించుదురు. చువర్ణంతోడి దుక్‌దకారానికి తకారమౌతుంది. అనుభవింతురు. ఉత్వలోపము - అనుభవింత్రు. ఆమ్రేడితం పరమైనను క్త్వార్థక మగుటచేత సంధి కాలేదు - ఎఱిఁగియెఱిఁగి. ఈపద్యం నన్నయ సూక్తి.

**క. నరలు గల కాము నైనను । దరుణులు రోయుదురు డాయ; ధనపతి యయ్యుం**
**బురుషుఁడు దుర్వారజరా । పరిభూతి నభీష్టభోగబాహ్యుఁడ కాఁడే. 194**

**ప్రతిపదార్థం:** నరలు, కల= నరసిన వెంట్రుకలు కల; కామున్+ఐనను= మన్మథుడినైనా (అందగాడినైనా) కూడా; తరుణులు= జవ్వనులు; డాయన్= సమీపించటానికి; రోయుదురు= ఏవగిస్తారు. (అసహ్యపడతారు); పురుషుఁడు; ధనపతిఅయ్యున్= కుబేరు డైనా కూడా, అంటే సంపన్నుడైనా కూడ; దుర్వార జరాపరిభూతిన్= వారించ శక్యం కాని ముసలితనంవలని రోతచేత; అభీష్ట భోగ బాహ్యుఁడు+అ= ఇష్టము లైన భోగాలు వెలియైనవాడు; కాఁడు+ఏ= కాడా; అవుతాడు.

**తాత్పర్యం:** నరసిన వెంట్రుకలు కలిగిన మన్మథుడి నైనా యౌవనవతులు సమీపించటానికి అసహ్యించుకొంటారు. పురుషుడు ధనవంతు డైనా కూడా (కుబేరుడైనప్పటికి) వారించశక్యం కాని ముసలితనంవలన కలిగేరోతచేత ఇష్టములైన భోగాలు పొంద వీలు లేనివాడు కాడా!

**విశేషం:** ఇది నన్నయసూక్తి.

**వ. అని యొడంబడ కున్న నలిగి యయాతి 'యదువంశంబునవారు రాజ్యంబున కయోగ్యులుగాఁ, దుర్వసు వంశంబునవారు ధర్మాధర్మవివేకశూన్యు లై సంకీర్ణవర్ణ కిరాతులకు రాజులుగా, ద్రుహ్యువంశంబునవారు దుపప్లవసంతార్యం బైన దేశంబునకు రాజులుగా, జరాదూషకుం డగుట ననువంశంబునవారు ముదియు నంతకు నుండక జవ్వనంబునన పంచత్వంబున కరుగు వారునుంగా శాపంబిచ్చి, యానలువురకుం గొండుక వాని శర్మిష్ఠాపుత్త్రుఁ బూరుం బిలిచి యడిగిన, వాఁడు దండ్రి కోరినయట్ల చేసిన నవయౌవనుం డై యయాతి యభిమతసుఖంబులు సహస్రవర్షంబు లనుభవించి తృప్తుం డై, పూరుజవ్వనంబు వానిక యిచ్చి, తన జరాభారంబుఁ దాన తాల్చి నిజాజ్ఞావిధేయ చతురంత మహీతల బ్రహ్మక్షత్త్రాది వర్ణముఖ్యుల నెల్ల రావించి మంత్రిపురోహితసామంత పౌరజన సమక్షంబున సకలక్షోణీ చక్రసామ్రాజ్యంబునకుఁ బూరు నభిషిక్తుం జేసిన సర్వప్రకృతిజనంబు లారాజున కి ట్లనిరి. 195**

**ప్రతిపదార్థం:** అని; ఒడంబడక, ఉన్నన్= కొడుకులు ముసలితనం గ్రహించేందుకు అంగీకరించకుండా ఉండగా; యయాతి; యదువంశంబున వారు= యదువు వంశానికి చెందినవారు; రాజ్యంబునకున్= రాజ్యం చేసేందుకు; అయోగ్యులుగాన్=

తగనివారౌనట్లుగా (తగని వారుగా); తుర్వసు వంశంబున వారు= తుర్వసు వంశానికి చెందిన వారు; ధర్మ+అధర్మ వివేకశూన్యులు+ఐ= ఇది ధర్మం. ఇది అధర్మం అనేజ్ఞానం లేనివారై; సంకీర్ణ, వర్ణ కిరాతులకున్= సంకరజాతులైన వనచరులకు; రాజులుగాన్= రాజు లౌనట్లుగా; ద్రుహ్యువంశంబున వారు= ద్రుహ్యుని వంశానికి చెందినవారు, ఉడుప= ఉడుపప్లవ సంతార్యం బైన= తెప్పల చేతను, పడవల చేతను, (పుట్టుల చేతను) దాటటానికి యోగ్య మైన; దేశంబునకున్; రాజులుగాన్= రాజు లౌనట్లుగా; జరాదూషకుండు, అగుటన్= ముదిమిని నిందించిన వా డౌటచేత; అనువంశంబున వారు= అనువు వంశానికి చెందిన వారు; ముదియున్+అంతకున్= ముసలివారయ్యేంత వరకు; ఉండక= జీవించక; జవ్వనంబునన్+అ= యౌవనమందే; పంచత్వంబునకున్= మరణానికి (పంచభూతాలలో కలిసి పోవటానికి); అరుగు వారునున్+కాన్= వెళ్ళేవారు ఔనట్లుగా; శాపంబు+ఇచ్చి; ఆ నలువురకున్= యదువు మొదలైన నలుగురికంటె; కొండుకవానిన్= చిన్నవాడిని; శర్మిష్ఠాపుత్రున్= శర్మిష్ఠ కుమారు డైన; పూరున్= పూరు డనే వాడిని; పిలిచి; అడిగినన్= నా ముసలితనం పుచ్చుకొని నీ యౌవనం ఇస్తావా అని అడుగగా; వాఁడు= ఆ పూరుడు; తండ్రి; కోరిన అట్లు+అ= తండ్రి యైన యయాతి కోరినట్లే; చేసినన్= చేయగా; నవయౌవనుండు+ఐ= క్రొత్త యౌవనం కలవా డై; యయాతి; అభిమత సుఖంబులు= ఇష్టము లైన భోగాలు; సహస్ర వర్షంబులు= వేయి సంవత్సరాలు; అనుభవించి= పొంది తృప్తుండు+ఐ= తృప్తి పొందినవా డై; పూరుజవ్వనంబు= పూరుని యౌవనం; వానికిన్+అ= వానికే; ఇచ్చి; తనజరా, భారంబున్= తన ముదిమి బరువును; తాను+అ= తానే; తాల్చి= వహించి; నిజ, ఆజ్ఞా విధేయ, చతుః+అంత, మహీతల, బ్రహ్మక్షత్ర+ఆది వర్ణముఖ్యులన్, ఎల్లన్= తన ఆజ్ఞకు విధేయ మైన నాలుగు సముద్రాల చేత చుట్టబడిన భూతలమందలి బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలగు వర్ణాలలోని ప్రధానులందరినీ; రావించి= రప్పించి; మంత్రి పురోహిత సామంత పౌరజన సమక్షంబునన్= మంత్రులయొక్క, పురోహితులయొక్క; సామంతరాజులయొక్క; పురజనులయొక్క ఎదుట; సకలక్షోణీ చక్రసామ్రాజ్యంబునకున్= సర్వ భూవలయ సామ్రాజ్యానికి; పూరున్= పూరువును; అభిషిక్తున్+చేసి= అభిషేకించబడినవాడిని చేయగా, సర్వప్రకృతి, జనంబులున్= ఎల్లపురజనులున్నూ; ఆ రాజునకున్; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** అని అంగీకరించకుండాఉన్న కొడుకులను కోపించి యయాతి యదువువంశానికి చెందినవారు రాజత్వానికి తగని వా రౌనట్లుగా, తుర్వసువంశానికి చెందినవారు ధర్మాధర్మజ్ఞానం లేనివా రై సంకర జాతులకు చెందిన ఆటవికులకు రాజు లౌనట్లుగా, ద్రుహ్యువంశానికి చెందినవారు తెప్పలచే దాటదగిన దేశానికి (జలమయమైన దేశానికి) రాజు లౌనట్లుగా; ముదిమిని నిందించినవా డవటంచేత అనువువంశానికి చెందినవారు ముసలివారయ్యేంత వరకు జీవించక యౌవనంలోనే మరణించువా రౌనట్లుగా శాప మిచ్చి, యదువు మొదలైన నల్గురికంటె చిన్నవాడు, శర్మిష్ఠ కుమారు డైన పూరుడిని పిలిచి అడుగగా అతడు తండ్రి కోరినట్లుగానే తన యౌవనాన్ని తండ్రికి ఇచ్చి, అతని ముసలితనాన్ని తాను గ్రహించాడు. యయాతి నవ (క్రొత్త) యౌవన సమన్వితుడై ఇష్టభోగాలను వేయిసంవత్సరా లనుభవించి తృప్తి పొందినవా డై, అతడి యౌవనాన్ని ఆతడికే ఇచ్చి, తన ముసలితనాన్ని తానే ధరించి తనఆజ్ఞకు వశమైన నాల్గుసముద్రాలు హద్దులుగా గల భూతలమందున్న బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైన వర్ణాలలోని ప్రధాను లందరినీ రప్పించి మంత్రులు, పురోహితులు, సామంతరాజులు మొదలైన పురజనుల ఎదుట సర్వభూతల సామ్రాజ్యానికి పూరుడిని అభిషేకించాడు. అప్పుడు పురజనులందరూ రాజును చూసి యిట్లా పలికారు.

**విశేషం:** యదువంశంబు+వారు= తత్పురుషసమాసంలో కొన్నిచోట్ల 'న' ఆగమంగా వస్తుంది. వంశంబున వారు. స్వామి, అమాత్యుడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము అనునవి సప్తప్రకృతులు.

**మ. అవిచారం బని పల్క నోడెదము ధర్మాభిజ్ఞ! నీయగ్రసం**
**భవుఁ డత్యున్నతశక్తియుక్తుఁడు మహీభారప్రగల్భుండు భా**
**ర్గవదౌహిత్రుఁడు పాత్రుఁ డీయదుఁడు లోకఖ్యాతుఁ డుండంగ నీ**
**భువనేశత్వభరంబుఁ బూన్పఁ దగునే పూరున్ జఘన్యాత్మజున్. 196**

**ప్రతిపదార్థం:** ధర్మ+అభిజ్ఞ= ధర్మం తెలిసినవాడా!; అవిచారంబు, అని= అనాలోచిత మని; పల్కన్= చెప్పటానికి; ఓడెదము= భయపడుతున్నాము; అతి+ఉన్నతశక్తి యుక్తుఁడు= మిక్కిలి అధిక మైన సామర్థ్యంతో కూడినవాడు; మహీభార, ప్రగల్భుండు= భూమియొక్క బరువును వహించేందుకు సమర్థుడు; భార్గవ దౌహిత్రుఁడు= శుక్రుడి కూతు రైన దేవయానికి కొడుకు; లోకఖ్యాతుఁడు= జగత్తులో ప్రసిద్ధుడు; పాత్రుఁడు= తగిన వాడు (యోగ్యుడు); నీ అగ్రసంభవుఁడు= నీ పెద్దకొడుకు; యదుఁడు; ఉండంగన్= ఉండగా; ఈ, భువన+ఈశత్వ, భరంబున్= ఈ జగత్ప్రభుత్వ భారాన్ని; జఘన్యా+ఆత్మజున్= శూద్రస్త్రీయందు పుట్టినకుమారుడిని (చిన్నవాడిని); పూరున్= పూరుడిని; పూన్పన్; తగున్, ఏ= వహింపచేయటం ఉచితమా?

**తాత్పర్యం:** ధర్మం తెలిసిన ఓ యయాతి మహారాజా! అనాలోచిత మని చెప్పటానికి జంకుతున్నాము. అధికమైన సామర్థ్యంతో కూడినవాడూ, భూభారాన్ని వహించే నేర్పు కలవాడూ, తగినవాడూ, జగత్ప్రసిద్ధుడూ, శుక్రుడి మనుమడూ అయిన నీ పెద్దకొడుకు యదు వుండగా కనిష్ఠపుత్రుడు (తక్కువజాతిస్త్రీకి పుట్టినవాడు) అగు పూరుడిని రాజ్యభారం వహించేందుకు నియోగించటం తగునా?

**విశేషం:** జఘన్య శబ్దం విశేషణం. దానికి కనిష్ఠుడు, నీచుడు, నిందితుడు అనే అర్థాలు ఉన్నాయి. అది స్త్రీ లింగమైనప్పుడు నీచస్త్రీ, నింద్యురాలైన స్త్రీ అని అర్థం వస్తుంది. అటువంటి స్త్రీ కుమారుడు జఘన్యాత్మజుడు. శర్మిష్ఠ రాజకుమార్తె అయినా కూడా దాసి అవటంచేత ఆమెకు జఘన్యా శబ్దం వాడబడింది. కనిష్ఠకుమారు డని చెప్తే ఎట్టిబాధా వుండదు. మంత్రుల మాటలలో అర్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని ఉన్నది. అర్థదర్శనాన్ని కలిగించే వర్ణాల, పదాల ఆరోహావరోహక్రమం రచనలో పోషించటంద్వారా 'సమాధి' అనే శబ్దగుణం రాణించింది. (సంపా.)

**వ. అనిన వారల కయ్యయాతి యి ట్లనియె. 197**

**ప్రతిపదార్థం:** అనినన్=పురజను లట్లా పలుకగా; ఆ+యయాతి; వారలకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** పురజనులు ఆవిధంగా పలుకగా ఆ యయాతి వారితో ఇట్లా అన్నాడు.

**క. యదుఁ డగ్రతనూజుఁడు నా । హృదయ సముద్భవుఁడు దానయిన మద్వచనం**
**బిది యేటిది యని కడు దు । ర్మదుఁ డై చేయక కృతావ మానుం డయ్యెన్. 198**

**ప్రతిపదార్థం:** యదుఁడు+అగ్రతనూజుఁడు= జ్యేష్ఠ కుమారుడు (పెద్ద కొడుకు); నా, హృదయ, సముద్భవుఁడు= నా ఆత్మజుడు; తాన్; అయినన్= అయినప్పటికీ; మత్, వచనంబు= నా పలుకు; ఇది; ఏటి+అది= ఇది ఎట్టిది; అని; కడు, దుర్మదుఁడు+ఐ= మిక్కిలి గర్విష్ఠుడై; చేయక= నామాట పాటించక; కృత+అవమానుండు= అవమానంచేసినవాడు; అయ్యెన్= అయినాడు.

**తాత్పర్యం:** యదుఁడు నాజ్యేష్ఠకుమారుడు, ఆత్మజుడు అయినాకూడా చాలాగర్వితు డై నామాటను లెక్కచేయక నన్ను అవమానించినాడు.

**విశేషం:** ఏటి+అది. అది, యవిశబ్దముల అత్తునకు వృత్తిని లోపం బహుళంగా ఔతుంది.

**క.** **తనయుండు దల్లిదండ్రులు । పనిచినపని సేయఁడేని, పలు కెడలోఁ జే**
**కొనఁడేని, వాఁడు తనయుం । డనఁబడునే? పితృధనమున కర్హుం డగునే?** **199**

**ప్రతిపదార్థం:** తనయుండు= కొడుకు; తల్లి+తండ్రి= తల్లిదండ్రులు; పనిచిన పని= ఆజ్ఞాపించిన పని; చేయఁడు+ఏని= చేయని వాడైతే; పలుకు= తల్లిదండ్రుల మాట; ఎడలోన్= మనస్సులో; చేకొనఁడు+ఏని= గ్రహించనివాడైతే; వాఁడు= అట్టి కొడుకు, తనయుండు= కొడుకు; అనఁబడున్+ఏ= అనబడునా; పితృధనమునకున్= తండ్రి యొక్క సొమ్ముకు; అర్హుండు+అగున్+ఏ= తగినవా డౌనా?

**తాత్పర్యం:** కొడుకు తల్లిదండ్రు లాజ్ఞాపించిన పని చేయకపోతే, వారివాక్యం హృదయ పూర్వకంగా అంగీకరించకపోతే అట్టివాడు కొడుకు అనబడతాడా? తండ్రిసొమ్ముకు తగినవాడు అవుతాడా? కాడు.

**క.** **పూరుఁడు గొండుక యయ్యును । భూరిగుణజ్యేష్ఠుఁడును సుపుత్త్రుఁడు నవనీ**
**భారసహిష్ణుఁడు నాతఁడ । కోరినకార్యంబు దీర్చి కుశలుం డగుటన్.** **200**

**ప్రతిపదార్థం:** పూరుఁడు; కోరిన కార్యంబు= తండ్రినైన నేను కోరినపని; తీర్చి= నెరవేర్చి; కుశలుండు= నేర్పరి; అగుటన్= అగుటచేత; కొండుక+అయ్యును= వయసులో చిన్నవా డైనాకూడా; భూరి, గుణజ్యేష్ఠుఁడును= అధికము లైన గుణాలలో పెద్దవాడున్నూ; సుపుత్త్రుఁడున్= యోగ్యుఁడైన కుమారుడున్నూ; అవనీభార సహిష్ణుఁడున్= భూమియొక్క బరువును వహించే ఓర్పుకలవాడున్నూ; ఆతడు+అ= అతడే. (అయ్యాడు).

**తాత్పర్యం:** పూరుడు తండ్రి నైన నేను కోరినపని నెరవేర్చిన నేర్పరి అవటంచేత, వయసులో చిన్నవాడైనా, అధికము లైన గుణాలచేత అగ్రజుడూ, యోగ్యు డైన పుత్రుడూ, భూమిబరువును వహించే సహనం కలవాడూ అతడే.

**వ.** **'నా జరాభారంబుఁ దాల్చిన పుత్త్రుండ రాజ్యంబున కర్హుండును వంశకర్తయు నగు; శుక్రవచనంబును నిట్టిద' యని యయాతి ప్రకృతిజనంబుల నొడంబఱిచి, పూరు నఖిల భూభారధురంధరుం జేసి, యదుప్రభృతులఁ బ్రత్యంత భూములకు రాజులం జేసి, తాను వేదవేదాంగపారగు లయిన బ్రాహ్మణులతోడం దపోవనంబునకుం జని, యందుఁ గందమూల ఫలాశనుం డై వన్యంబులయిన ఫలంబుల హవ్యకవ్యంబుల నగ్నిభట్టారకుం బితృదేవతలం దనుపుచు, వానప్రస్థ విధానంబుఁ దప్పక శిలోంఛవృత్తి నతిథిభుక్తశేషం బుపయోగించుచు, నియతాత్ముం డై జితారిషడ్వర్గుండును నయి సహస్ర వర్షంబులు దపంబు సలిపి సర్వసంగ విముక్తుం డై, సర్వద్వంద్వంబులును విడిచి ముప్పది యేండ్లు నిరాహారుం డయి, యొక్కయేఁడు వాయుభక్షకుం డయి, పంచాగ్నిమధ్యంబున నిల్చి, యొక్కయేఁడు నీటిలో నేకపాదంబున నిలిచి, మహాఘోరతపంబు సేసి, దివ్య విమానంబున దేవలోకంబునకుం జని, యందు దేవర్షిగణపూజితుం డై**

**బ్రహ్మలోకంబునకుం జని, యందు బ్రహ్మర్షిగణపూజితుం డై యనేక కల్పంబు లుండి, క్రమ్మఱ నింద్రలోకంబునకు వచ్చిన నింద్రుండు వానిం బూజించి యి ట్లనియె. 201**

**ప్రతిపదార్థం:** నాజరా, భారంబున్= నా ముదిమి బరువును; తాల్చిన= వహించిన; పుత్త్రుండు+అ= కొడుకే; రాజ్యంబునకున్= రాజ్యపరిపాలనకు; అర్హుండును= తగినవాడును; వంశకర్తయున్= వంశాన్ని కొనసాగించినవాడును; అగున్; శుక్రవచనంబును= శుక్రునియొక్క వాక్యం కూడ; ఇట్టి+అది+అ= ఇట్టిదే; అని; యయాతి; ప్రకృతి జనంబులన్= పురజనులను; ఒడంబఱిచి= ఒప్పించి (అంగీకరింప జేసి); పూరున్= పూరుని; అఖిల, భూ, భార, ధురంధరున్= సమస్త (సర్వ) భూభారాన్ని వహించేవాడిని; చేసి; యదుప్రభృతులన్= యదువు మొదలైన వారిని; ప్రత్యంత భూములకున్= మిక్కిలి సమీపంలో ఉన్న దేశాలకు (మ్లేచ్ఛదేశాలకు); రాజులన్+చేసి; తాను; వేద, వేదాంగ, పారగులు+అయిన= వేదాలయొక్క; శిక్షా వ్యాకరణాది వేదాంగాలయొక్క అంతం చూచిన, అంటే వేద వేదాంగాలను బాగా ఎఱిగిన; బ్రాహ్మణులతోడన్= తపః+వనంబునకున్= తపస్సు చేసికొనేందుకు తగిన అడవికి; చని= వెళ్ళి; అందున్= ఆ వనమందు; కంద, మూల, ఫల, అశనుండు+ఐ= దుంపలు, వేర్లు, పళ్ళు ఆహారంగా కలవాడై; వన్యంబులు+అయిన= అడవిలో పుట్టిన; ఫలంబులన్= పళ్ళతో; హవ్యకవ్యంబులన్= దేవతల కివ్వదగిన అన్నంచేతను; పితృదేవతల కివ్వదగిన అన్నంచేతను, (ఇక్కడ అన్నమంటే ఆహారం) అగ్నిభట్టారకున్= హవ్యములచే పూజ్యు డైన అగ్నిని; పితృదేవతలన్= కవ్యములచే పితృదేవతలను; తనుపుచున్= తృప్తి నొందిస్తూ; వానప్రస్థ, విధానంబున్= నాల్గు ఆశ్రమాలలో మూడవది వానప్రస్థం, వానప్రస్థు డంటే వనవాసవ్రతాన్ని అవలంబించేవాడు; అట్టివాడి నియమాన్ని; తప్పక= మానక; శిలా+ఉంఛవృత్తిన్= రాళ్ళలో రాలిన గింజలను ఏరుకుని తినట మనే జీవనోపాయంతో; అతిథిభుక్తశేషంబు= అతిథులు తినగా మిగిలిన ఆహారాన్ని; ఉపయోగించుచున్= గ్రహిస్తూ; నియత+ఆత్ముండు+అయి= నియమంతో కూడిన ఆత్మకలవాడై; జిత+అరి+షట్+వర్గుండునున్= జయించబడిన కామక్రోధాదు లనే అంతఃశత్రుసమూహం కలవాడును; అయి; సహస్రవర్షంబులు= వేయి ఏళ్ళు; తపంబు; సలిపి= చేసి; సర్వ, సంగ, విముక్తుండు+ఐ= అన్ని ఆసక్తులచేత విడువబడిన వాడై; సర్వద్వంద్వంబులున్= శీతోష్ణ సుఖదుఃఖాది సకల ద్వంద్వాలను; విడిచి; ముప్పది యేండ్లు; నిరాహారుండు+అయి= ఆహారం లేనివా డై; ఒక్కయేఁడు; వాయుభక్షకుండు+అయి= గాలిని మాత్రం తినేవాడై; పంచ+అగ్ని మధ్యంబునన్= ఐదు అగ్నులనడుమ; నిల్చి; ఒక్క, ఏఁడు; నీటిలోన్; ఏకపాదంబునన్= ఒంటికాలితో; నిలిచి; మహత్+ఘోరతపంబు= గొప్పతీవ్ర మైన తపస్సును చేసి; దివ్య, విమానంబునన్= దేవతాసంబంధ మైన విమానమందు; దేవలోకంబునకున్= స్వర్గలోకానికి; చని= వెళ్ళి; అందున్= స్వర్గలోకంలో; బ్రహ్మ+ఋషి, గణ పూజితుండు+ఐ= బ్రహ్మర్షుల సముదాయంచేత పూజించబడినవా డై; అనేక, కల్పంబులు= పెక్కుయుగాలు; ఉండి; క్రమ్మఱన్= మళ్ళీ; ఇంద్రలోకంబునకున్= ఇంద్రుడి లోకానికి; (అనగా స్వర్గలోకానికి); వచ్చినన్= రాగా; ఇంద్రుండు; వానిన్= యయాతిని; పూజించి; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** 'నా ముదిమిబరువు వహించిన కొడుకే రాజ్యపాలనానికి తగినవాడూ, వంశాన్ని కొనసాగించే వాడూ అవుతాడు. శుక్రుడుకూడ ఈవిధంగానే (ఇట్లాగే) చెప్పి ఉన్నాడు' అని యయాతి పురజనులను ఒప్పించి పూరుడిని సకలమహీభారాన్ని వహించే చక్రవర్తిగా చేసి, యదువు మొదలైనవారిని సన్నిహితప్రదేశాలకు రాజులుగా చేసి, తాను వేదాలను వేదాంగాలను బాగా చదివిన బ్రాహ్మణులతో తపోవనానికి వెళ్ళాడు. ఆ వనంలో అతడు దుంపలను వేర్లను పళ్ళను భుజిస్తూ అడవి పళ్ళచేతను హవ్యాలచేతను అగ్నిదేవుడిని, కవ్యాలచేత పితృదేవతలను తృప్తి పొందిస్తూ (పరుస్తూ) వానప్రస్థాశ్రమనియమం తప్పక శిలలయందు రాలిన గింజలను ఏరుకొని తినటమే వృత్తిగా కలవాడై, అతిథులు తినగా మిగిలిన ఆహారాన్ని సేవిస్తూ, నియమంతో కూడిన ఆత్మ కలవాడూ, అరిషడ్వర్గాలను జయించిన వాడూ అయి, వెయ్యేళ్ళు, తపస్సు చేశాడు. తర్వాత సర్వసంగాలను, శీతోష్ణసుఖ దుఃఖాది ద్వంద్వాలను విడిచి

ముప్ఫైఏళ్ళు ఆహారం లేకుండా, ఒక్కఏడు వాయువునుమాత్రం భక్షిస్తూ, ఐదగ్నుల మధ్య నిలిచి (నిలబడి); ఒకఏడు నీటిలో ఒంటికాలిపై నిలబడి గొప్పతీవ్ర మైన తపస్సు చేసి దేవతావిమానంలో స్వర్గలోకానికి వెళ్ళాడు. ఆ స్వర్గలోకంలో దేవర్షులసమూహంచేత పూజించబడి బ్రహ్మలోకానికి వెళ్ళి, అక్కడ బ్రహ్మర్షులసమూహంచేత పూజించబడి అనేకకల్పా లుండి మళ్ళీ ఇంద్రలోకానికి రాగా, ఇంద్రుడు అతడిని పూజించి యిట్లా పలికాడు.

**విశేషం:** ఆహవనీయం, దక్షిణాగ్ని, గార్హపత్యం - త్రేతాగ్నులు. ఇవి క్రమంగా వేదికి పూర్వ, దక్షిణ, పశ్చిమదిశలలో (దిక్కులలో) ఉంటాయి. ఈ మూడిటికి సభ్యం, అవసథ్యం అనే రెండు కలిస్తే పంచాగ్నులు. ఈరెండు వేదికి ఈశాన్యదిక్కులో ఉంటాయి. బ్రహ్మ+ఋషి - బ్రహ్మర్షి - గుణసంధి.

**ఆ. 'కొడుకుజవ్వనంబుఁ గొని నీవు నిజరాజ్య । భూరిభరము వానిఁ బూన్చునప్పు**
**డతని కెద్ది గఱపి' తని యడిగిన హరి । కయ్యయాతి యిట్టు లనుచుఁ బలికె. 202**

**ప్రతిపదార్థం:** కొడుకు జవ్వనంబున్= కొడు కైన పూరుడి యౌవనం; కొని= గ్రహించి; వానిన్= ఆ పూరుని; నీవు; నిజ, రాజ్యభూరి భరమున్= నీ రాజ్యంయొక్క అధికమైన భారాన్ని; పూన్చు+అప్పుడు= వహింపచేసేటప్పుడు; అతనికిన్= ఆ పూరునికి; ఎద్ది, కఱపితి(వి) అని= ఏది బోధించితివి అని; అడిగినన్; హరికిన్= ఇంద్రుడికి; ఆ+యయాతి; ఇట్టులు; అనుచున్; పలికెన్.

**తాత్పర్యం:** 'కొడుకైన పూరుడి యౌవనాన్ని నీవు గ్రహించి, అతడిని విస్తృతమైన నీ రాజ్యభారాన్ని భరింప చేసేటప్పుడు అతని కేమి బోధించావు?' అని ఇంద్రుడు అడుగగా యయాతి ఇంద్రుడితో ఇట్లా పలికాడు.

## యయాతి పూరునకు బోధించిన నీతులు (సం.1-82-6)

**క. ఎఱుక గలవారి చరితలు । గఱచుచు, సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం**
**బెఱుఁగుచు, నెఱిఁగిన దానిని । మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్. 203**

**ప్రతిపదార్థం:** ఎఱుక, కలవారి చరితలు= జ్ఞానం కలవారి చరిత్రలు; కఱచుచున్=అభ్యసిస్తూ; సజ్జనుల, గోష్ఠిన్= మంచివారి సల్లాపమందు; (సభయందు); కదలక; ధర్మంబు; ఎఱుఁగుచున్= తెలిసికొంటూ; ఎఱిఁగిన దానిని= తెలిసికొన్న దానిని; మఱవక= మఱచిపోక; సమంజస బుద్ధిన్= న్యాయంతో కూడినబుద్ధితో; అనుష్ఠించునది= చేయవలెను.

**తాత్పర్యం:** జ్ఞానం కలవారి చరిత్రలు అభ్యసిస్తూ, సజ్జనులసల్లాపమందు కదలకుండా ధర్మం తెలిసికొంటూ, తెలిసికొన్నదానిని మరిచిపోకుండా న్యాయంతో కూడిన బుద్ధితో చేయాలి. (ఆచరించాలి).

**విశేషం:** మఱవక+అనుష్ఠించునది= అత్వసంధి.

**క. ఇచ్చునది పాత్రునకు ధన । మచ్చుగ; నొరు వేఁడకుండునది; యభిముఖు లై**
**వచ్చిన యాశార్థుల వృథ । పుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్. 204**

**ప్రతిపదార్థం:** పాత్రునకున్= అర్హుడికి; అచ్చుగన్= తగినట్లుగా; ధనము; ఇచ్చునది= ఈయవలయును (ఇవ్వవలసింది); ఒరున్= ఇతరుని; వేఁడక+ఉండునది= ప్రార్థించకుండా ఉండాలి; అభిముఖులు+ఐ= ఎదురుముఖం కలవారై; వచ్చిన, ఆశా+అర్థులన్= కోరికలను అడిగేవారికి, (ఆశతో కూడిన యాజకులను); వృథపుచ్చక= వ్యర్థం చేయక; సర్వభూత ప్రీతిన్= ఎల్ల జీవులకును సంతృప్తిని, చేయునది= చేయవలెను (చేయాలి).

**తాత్పర్యం:** అర్హుడికి తగినట్లుగా ధన మివ్వాలి. ఇంకొకరిని అడగకుండా. ఎదురుగా వచ్చిన యాచకులను వ్యర్థం చేయక (నిరాశపుచ్చక) సకలజీవులకూ సంతృప్తి చేయాలి. (తృప్తిని కలిగించాలి).

**విశేషం:** ఉండు+అది= 'విధియందు అది యను తచ్ఛబ్దంబును ముందు నుగాగమంబు నగును' ఉండునది.

**క.** **మనమునకుఁ బ్రియంబును హిత । మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం**
**బును బరిమితమును నగు పలు । కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్.** **205**

**ప్రతిపదార్థం:** మనమునకున్= మనస్సుకు; ప్రియంబున్= ప్రీతికలిగించేదీ; హితమును= మేలు కలిగించేదీ; పథ్యమున్= తగినదియున్నూ; తథ్యమును= సత్యమైనదీ; అమోఘమున్= వ్యర్థం కానిదీ మధురంబును= తీయనిదీ; పరిమితమును= సంక్షిప్తమైనదీ; అగు పలుకు= అయిన మాట; ఒనరఁగన్= ఒప్పేటట్లుగా; సభలన్= సభలలో; ధర్మయుతముగన్= ధర్మంతో కూడి ఉండేటట్లుగా; పలుకునది= పలకాలి.

**తాత్పర్యం:** సభలలో మనసుకు ప్రీతి కలిగించేదీ, మేలైనదీ, ఉచితమైనదీ, సత్యమైనదీ, తీయనిదీ, విస్తృతం కానిదీ, అయినమాట ధర్మంతో కూడుకొని ఉండేటట్లుగా పలకాలి.

**విశేషం:** సభలలో మానవు డేవిధంగా మాటాడాలో నన్నయ ఈపద్యంలో సూచిస్తున్నాడు. పలికే పలుకు మితమైనది, హితమైనది, సత్యమైనది అయి ఉండాలి అని అతని అభిప్రాయం. 'మిత హిత సత్యవాక్య జనమేజయ' అని అతడు జనమేజయుడిని సంబోధించాడు. కావ్యంలోకూడ నన్నయవాక్యాలు అట్లాగే ఉంటాయి.

**సీ.** **వదన బాణాసన వ్యక్తముక్తము లైన । పలుకు ల న్కడువాఁడి బాణతతులఁ**
**బరమర్మలక్ష్యముల్ పాయక భేదించు । చుండెడి దుర్జనయోధవరుల**
**కడనుండ కున్నది; కరుణ యార్జవమక్ష । జయము సత్యంబును శమము శౌచ**
**మను నివి యెద నిల్పునది; శత్రుషడ్వర్గ । జయమందునది శుద్ధశాంతబుద్ధి;**

**తే.** **మదముఁ గామముఁ గ్రోధంబు మత్సరంబు । లోభమును మోహమును నను లోని సహజ**
**వైరివర్గంబు నొడిచినవాఁడ యొడుచు । నశ్రమంబున వెలుపలి యహితతతుల.** **206**

**ప్రతిపదార్థం:** వదన, బాణాసన, వ్యక్తముక్తములు+ఐన= ముఖ మనే ధనుస్సునుండి వెలువడినవై విడవబడిన; పలుకులు+అన్, కడు వాఁడి బాణతతులన్= పలుకు లనే మిక్కిలివాడి యైన బాణాలసమూహంచేత; పర, మర్మ లక్ష్యముల్= ఇతరులయొక్క జీవస్థానాలనే గురులను; పాయక= విడువక; భేదించుచున్+ఉండెడి= చీలుస్తుండెడి; దుర్జన యోధవరులకడన్= దుష్టులైన జను లనబడే యోధశ్రేష్ఠులచెంత; ఉండక+ఉన్నది= ఉండకుండవలెను; కరుణ= దయ; ఆర్జవము= ఋజుత్వం; అక్షజయము=

ఇంద్రియజయం; సత్యంబును; శమము= అంతరింద్రియనిగ్రహం; శౌచము= శుచిత్వం; అను+ఇవి= అనువీటిని; ఎదన్= హృదయమందు; నిల్పునది= స్థిరంగా ఉండేటట్లు చేయాలి; శత్రు; షట్ వర్గ జయము= కామాదులైన ఆర్గురుశత్రువుల సముదాయాల జయము; శుద్ధశాంతబుద్ధిన్= నిర్మలం, శాంతం ఐనదైన బుద్ధితో; అందునది= పొందవలయును; మదమున్= గర్వాన్ని; కామమున్; క్రోధంబున్= కోపము; మత్సరంబున్= మాత్సర్యం; లోభమును= పిసినారితనాన్ని; మోహమునున్= అజ్ఞానాన్ని; అను; లోనిసహజవైరి వర్గంబున్= సహజమైన అంత శ్శత్రు సముదాయాన్ని (సహజం అంటే స్వభావసిద్ధమైనది); ఒడిచిన, వాడు+అ= ఓడించినవాడే; వెలుపలి, అహిత, తతులన్= బయట నున్న శత్రువుల సముదాయాన్ని; అశ్రమంబునన్= శ్రమలేకుండ, ఒడుచున్= ఓడిస్తాడు.(ఓడించగలడు).

**తాత్పర్యం:** ముఖమనే వింటియందు వ్యక్తములై విడువబడిన మాట లనే వాడియైన బాణాల సమూహంతో, ఇతరుల మర్మాలనే గుఱులను, విడవక చీలుస్తుండే దుష్టు లైన యోధశ్రేష్ఠుల చెంత నివసించకూడదు. దయ, ఋజుత్వం, ఇంద్రియజయం, సత్యం, బహిరింద్రియనిగ్రహం, శుచిత్వం అనే వాటిని హృదయంలో నిలపాలి. నిర్మల మైన శాంతబుద్ధితో కామాది వైరులను ఆరుగురిని జయించాలి. గర్వం, కామం, కోపం, మత్సరం, పిసినారితనం, అజ్ఞానం అనే సహజమైన అంతశ్శత్రువుల సముదాయాన్ని ఓడించినవాడే బహిశ్శత్రువుల సముదాయాన్ని శ్రమలేకుండా ఓడిస్తాడు.

**విశేషం:** అలం: రూపకాలంకారం. ఉండు+అది= ఉండునది కావాలి. కాని నన్నయ దానికి బదులు ఉన్నది అని వాడాడు. కామక్రోధలోభమోహమదమాత్సర్యాలు సహజములైన అంతశ్శత్రువులు. వెలుపలి శత్రువులు రాజులు, మానవులు మొదలైనవారు.

**వ. 'అని పూరుం గఱపితి; నమ్మహాపురుషుం డొరులకుఁ గఱపునట్టి సర్వగుణసంపన్నుం' డనిన విని యింద్రుండు వెండియు నయ్యయాతి కి ట్లనియె. 207**

**ప్రతిపదార్థం:** అని; పూరున్= పూరుని; కఱపితిన్= బోధించాను; ఆ, మహత్, పురుషుండు= ఆ మహానుభావుడు; ఒరులకున్= ఇతరులకు; కఱపు+అట్టి= బోధించేటి; సర్వగుణ సంపన్నుండు= సకల సద్గుణాలతో కూడినవాడు; అనినన్= అని యయాతి పలుకగా; విని; ఇంద్రుండు; వెండియున్= మరల; ఆ+యయాతికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అని నా కొడు కైన పూరుడికి బోధించాను. ఆ మహాత్ముడు ఇతరులకు బోధించగల సర్వగుణాలతో కూడినవాడు' (అతడికి ఇతరులు బోధించవలసిన అవసరం లేదని భావం), అని యయాతి పలుకగా విని ఇంద్రుడు మరల ఆ యయాతితో ఇట్లా పలికాడు.

**విశేషం:** యయాతి తనకొడు కైన పూరుడిని మహాపురుషుడు అనటానికి కారణం అతడి సద్గుణసంపదలే.

**క. ఏమి తపం బొనరించితి । భూమీశ్వర! పుణ్యలోక భోగంబులఁ దే**
**జోమహిమ ననుభవించితి । సామాన్యమె శతసహస్రసంవత్సరముల్. 208**

**ప్రతిపదార్థం:** భూమి+ఈశ్వర= ఓరాజా! యయాతీ! ఏమితపంబు= ఏతపస్సు; ఒనరించితి(వి)= చేశావు; శతసహస్ర సంవత్సరముల్= వందల వేల యేళ్ళు; పుణ్యలోక, భోగంబులన్= స్వర్గాది పుణ్యలోకాలలోని సౌఖ్యాలను; తేజస్+మహిమన్= కాంతియొక్క మహత్త్వంచేత; అనుభవించితి(వి)= పొందావు; సామాన్యము+ఎ= సాధారణమా?.

**తాత్పర్యం:** ఓమహారాజా! నీవు ఏ (మి) తపస్సు చేశావు? వందవేలయేళ్ళు తేజస్సుయొక్క మహత్త్వంచేత, స్వర్గలోక పుణ్యంచేత స్వర్గాదిలోకాలలోని సౌఖ్యాల ననుభవించావు. ఇది అసాధారణం.

**వ. అనిన నయ్యింద్రున కయ్యయాతి యి ట్లనియె. 209**

**తాత్పర్యం:** అని ఇంద్రుడు పలుకగా ఆ యయాతి ఇట్లా అన్నాడు.

**క. సురదైత్య యక్షరాక్షస । నరఖేచర సిద్ధమునిగణ ప్రవరుల భా**
**సురతపములు నాదగు దు । ష్కరఘోరతపంబు సరియుఁ గా వమరేంద్రా!. 210**

**ప్రతిపదార్థం:** అమర+ఇంద్రా= దేవతలకు రాజైన ఓయింద్రుడా! సురదైత్య యక్షరాక్షస నరఖేచర సిద్ధముని గణప్రవరుల= దేవతల, దితికుమారులైన దైత్యుల, యక్షుల, రాక్షసుల, మానవుల, ఖేచరుల (ఆకాశంలో సంచరించేవారు) సిద్ధుల, మునుల సముదాయంలో శ్రేష్ఠులైన వారియొక్క; భాసుర తపములు= ప్రకాశించే తపస్సులు; నా+అది+అగు= నాదగు; దుష్కర, ఘోరతపంబు= చేయశక్యం కాని తీవ్రమైన తపస్సుకు; సరియున్, కావు= సమానం కావు.

**తాత్పర్యం:** దేవతలకు రాజువైన ఓ ఇంద్రుడా! దేవతల, దైత్యుల, యక్షుల, రాక్షసుల, మానవుల, ఆకాశ సంచారుల, సిద్ధుల, మునుల, సముదాయాలలో శ్రేష్ఠ లైనవారి ప్రకాశించే తపస్సులు, చేయశక్యం కాని తీవ్రమైన నాతపస్సుకు సమానం కావు.

**విశేషం:** ఇక్కడ యయాతి తన తపస్సు సుర దైత్యాదుల తపస్సుకంటె మించినదనీ, అసమానమైన దనీ గర్వంతో పలికాడు. ఈ గర్వమే అతని పతనానికి కారణ మయింది.

### ఇంద్రుఁడు యయాతిని స్వర్గలోకభ్రష్టునిఁ జేయుట (సం.1-83-3)

**వ. అని తపోభిమానంబున మహర్షులతపంబు లవమానించి పలికిన నయ్యయాతిగర్వంబునకు సహింపక యింద్రుం డలిగి 'నీకు దేవలోకసుఖానుభవంబులందుఁ బుణ్యసమాప్తియయ్యెఁ; నీగర్వంబు నిన్నింత సేసె; నింక నధోలోకంబున కరుగు' మనిన వాఁడును 'మనుష్యలోకంబునకుం బోవనోప; నంతరిక్షంబున సద్భువనంబున సత్సంగతి నుండు నట్లుగా నాకుఁ బ్రసాదింపు' మని యింద్రుననుమతంబు వడసి. 211**

**ప్రతిపదార్థం:** అని; తపస్+అభిమానంబునన్= తన తపస్సునందలి అభిమానంచేత; మహర్షుల, తపంబులు= గొప్ప మునులయొక్క తపస్సులు; అవమానించి= తక్కువపరచి; పల్కినన్= పలుకగా; ఆ+యయాతి గర్వంబునకున్= ఆ యయాతియొక్క గర్వానికి; సహింపక= ఓర్వక, ఇంద్రుండు; అలిగి= కోపించి; నీకున్; దేవలోక సుఖ+అనుభవంబులందున్= స్వర్గలోకంలోని సుఖాలను అనుభవించటంలో; పుణ్యసమాప్తి, అయ్యెన్= నీవు చేసిన పుణ్యం పూర్తి అయింది; నీగర్వంబు; నిన్నున్, ఇంత చేసెన్= నీ కింత చెడ్డ చేసింది; ఇంకన్= ఇకముందు; అధస్+లోకంబునకున్= కిందిలోకానికి; అరుగుము; అనినన్= వెళ్ళుమని పలుకగా; వాఁడును= యయాతియు; మనుష్య, లోకంబునకున్= మానవలోకానికి; పోవన్, ఓపన్= వెళ్ళలేను; అంతరిక్షంబునన్= ఆకాశమందు; సత్, భువనంబునన్= నక్షత్రలోకాన; సత్, సంగతిన్= నక్షత్రాల స్నేహంతో; ఉండు, అట్లుగాన్= ఉండేవిధాన; నాకున్; ప్రసాదింపుము= అనుగ్రహించుము; అని; ఇంద్రు+అనుమతంబు= ఇంద్రునియొక్క సమ్మతి; పడసి= పొంది.

**తాత్పర్యం:** అని తపస్సునందు గర్వంచేత మహామునుల తపస్సులను తక్కువచేసి పలుకగా, ఆ యయాతి గర్వానికి సహించక ఇంద్రుడు కోపించి 'నీకు స్వర్గలోకసుఖాల ననుభవించటంలోని పుణ్యం క్షీణించింది. నీ గర్వం నీకు ఇంతహాని చేసింది. ఇక ముందు అధోలోకాలకు వెళ్ళు' మని పలుకగా, యయాతి 'నేను మానవలోకానికి వెళ్ళలేను; ఆకాశంలో నక్షత్రలోకమందు నక్షత్రాల స్నేహంతో ఉండేటట్లుగా న న్ననుగ్రహించు' మని ఇంద్రుడి సమ్మతి పొంది.

**విశేషం:** కామ్యకర్మలను చేసేవారు ఆ పుణ్యం కారణంగా స్వర్గానికి పోతారు. అక్కడ వారు భోగాలను అనుభవిస్తే వారి పుణ్యం క్షీణిస్తుంది. అపుడు వారు మళ్ళీ మనుష్యలోకాన జన్మిస్తారు. ఈ విషయమే 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' అని భగవద్గీతలో చెప్పబడింది.

**తే. అంతరిక్షంబువలన దిగంతరములు । వెలుఁగఁ జనుదెంచు నాతని విమలదీప్తి**
**సూచి సద్గణములు గడుఁ జోద్య మంది । యురుతరద్యుతి యిది యేమి యొక్కొయనుచు. 212**

**ప్రతిపదార్థం:** అంతరిక్షంబు వలనన్= ఆకాశందెస; దిక్+అంతరములు= దిక్కులయొక్క మధ్యభాగాలు; వెలుఁగన్= ప్రకాశించగా; చనుదెంచు, ఆతని= వచ్చు యయాతియొక్క; విమలదీప్తి= నిర్మలమైన కాంతి; చూచి; సత్+గణములు= నక్షత్రగణాలు; ఉరుతరద్యుతి, ఇది= మిక్కిలి అధికమైన యీ కాంతి; ఏమి; ఒక్కొ= ఏమోకదా; అనుచున్; కడున్= మిక్కిలి; చోద్యము+అందిరి= ఆశ్చర్యం పొందారు.

**తాత్పర్యం:** ఆకాశందెస దిక్కులమధ్యభాగాలు ప్రకాశింపగా వచ్చే యయాతియొక్క నిర్మల మైన కాంతి చూచి అధిక మైన ఈకాంతి ఏమో కదా! అంటూ నక్షత్రగణాలు ఎక్కువ ఆశ్చర్యాన్ని పొందాయి.

**వ. అంతనయ్యయాతి దౌహిత్రు లయిన యష్టకుండును బ్రతర్దనుండును వసుమంతుండును నౌశీనరుం డయిన శిబియు ననువారలు సద్భువన నివాసులు దమ యొద్దకుం జనుదెంచిన యయాతి నధిక తేజోమయు ననంత పుణ్యమూర్తిం గని నిసర్గస్నేహంబున నభ్యాగత పూజల సంతుష్టుంజేసి 'నీవెవ్వండ? వెం దుండి యేమికారణం బున నిందులకు వచ్చి?' తని యడిగిన వారలకు నయ్యయాతి యి ట్లనియె. 213**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట; ఆ+యయాతి ఆ యయాతియొక్క; దౌహిత్రులు+అయిన= కూతురి కొడుకు లైన అష్టకుడు, ప్రతర్దనుడు, వసుమంతుడు; ఔశీనరుండు+ఐన= ఉశీనర దేశానికి రాజైన; శిబియున్; అనువారలు+అనే పేర్లు కలవారు సత్+భువన నివాసులు= నక్షత్రలోకాన నివసించేవారు; తమ యొద్దకున్= తమ వద్దకు; చనుదెంచిన= వచ్చిన; యయాతిన్; అధిక, తేజోమయున్= గొప్ప తేజస్సుతో కూడిన వాడిని; అనంతపుణ్య మూర్తిన్= అంతం లేని పుణ్యం రూపు ధరించినవాడిని; కని= చూచి; నిసర్గ స్నేహంబునన్= సహజమైన ప్రేమతో; అభ్యాగత పూజలన్= అతిథులకు చేయవలసిన పూజలచేత; (భోజన సమయంలో వచ్చిన అతిథి - అభ్యాగతుడు); సంతుష్టున్ చేసి= సంతోషించిన వాడినిగా చేసి; నీవు; ఎవ్వండవు; ఎందున్+ఉండి= ఎక్కడినుండి; ఏమి కారణంబునన్= ఏ కారణం చేత; ఇందులకున్= ఇచ్చటికి; వచ్చితి(వి); అని; అడిగినన్; వారలకున్= ఆ అష్టకాదులకు; ఆ+యయాతి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అటు తరువాత ఆ యయాతి కూతురి కొడుకులైన అష్టకుడు, ప్రతర్దనుడు, వసుమంతుడు, ఉశీనరదేశానికి సంబంధించిన శిబి అనబడేనక్షత్ర లోకనివాసులైన వారు తమవద్దకు వచ్చిన గొప్పతేజస్సుతో కూడిన అధికమైనపుణ్యం

రూపుధరించిన యయాతిని చూచి, సహజమైనప్రేమతో అభ్యాగతులకు చేయవలసిన పూజలతో సంతోషపెట్టి 'నీ వెవరివి? ఎక్కడినుండి ఏ కారణాన ఇక్కడకు వచ్చావు' అని అడుగగా వారికి ఆ యయాతి ఇట్లా పలికాడు.

**క. అనవద్యధర్మచరితం । బున నున్నతుఁ డైన నహుషపుత్త్రుఁడఁ, బూరుం**
**డను మధ్యమలోకేశ్వరు । జనకుండ, యయాతి యనఁగఁ జనియెడువాఁడన్. 214**

**ప్రతిపదార్థం:** అనవద్య, ధర్మ, చరితంబునన్= నింద్యంకాని ధర్మంతో కూడిన ప్రవర్తనమందు; ఉన్నతుఁడు+ఐన= అధికుడయిన; నహుషు, పుత్త్రుఁడన్= నహుషుడి కుమారుడను; పూరుండు+అను= పూరు డనే పేరు కల; మధ్యమ+లోక+ఈశ్వరు= మర్త్యలోక ప్రభువుయొక్క, జనకుండన్= తండ్రిని; యయాతి, అనఁగన్= యయాతి అనే పేరుతో; చనియెడు; వాఁడన్= ఒప్పేవాడిని.

**తాత్పర్యం:** అనింద్యం, ధర్మయుక్తం అయిన చరిత్రచేత అధికుడైన నహుషుడి కుమారుడిని; పూరుడనే పేరు కల మధ్యమలోకాన్ని పరిపాలించే రాజుయొక్క తండ్రిని; యయాతి అనే పేరుతో ఒప్పువాడిని.

**విశేషం:** యయాతి తండ్రి యైన నహుషుడు ఇంద్రపదవి నధిష్ఠించి అగస్త్యుడిశాపంచేత అజగర మై పడి ధర్మజుడి సమాగమం చేత శాపవిముక్తు డైనవాడు.

**క. అమిత తపోవిభవంబునఁ । గమలజులోకంబు మొదలుగాఁ గల సురలో**
**కములందుఁ బుణ్యఫలములఁ । గ్రమమున భోగించి యింద్రుకడ కేఁ జనినన్. 215**

**ప్రతిపదార్థం:** అమిత, తపః, విభవంబునన్= అధికమైన తపస్సుయొక్క వైభవంచేత; కమలజులోకంబు, మొదలుగాన్, కల= బ్రహ్మలోకం మొదలయిన; సురలోకములందున్= దేవలోకాలందు; పుణ్యఫలములన్= పుణ్యంయొక్క ఫలాలను; క్రమమునన్= వరుసగా; భోగించి= అనుభవించి; ఇంద్రుకడకున్= ఇంద్రునిచెంతకు; ఏన్= నేను; చనినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** అధిక మైన తపస్సుయొక్క వైభవంచేత బ్రహ్మలోకం మొదలైన దేవలోకాలలో వరుసగా పుణ్యఫలాలను అనుభవించి ఇంద్రుడిచెంతకు నేను వెళ్ళగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. సురపతి నా తపమున క । చ్చెరువడి నీ తపము పేర్మిఁ జెప్పుమ యనినన్**
**సురసిద్ధమునీంద్ర తప । శ్చరణలు నాతపముతోడ సరిగా వంటిన్. 216**

**ప్రతిపదార్థం:** సురపతి= దేవతలకు రాజైన ఇంద్రుడు; నాతపమునకున్= నేను చేసిన తపస్సుకు; అచ్చెరువడి= ఆశ్చర్యపడి; నీతపము పేర్మిన్= నీవు చేసిన తపస్సుయొక్క పెంపును; చెప్పుము+అ= చెప్పుమా; అనినన్= అని అడుగగా; సురసిద్ధ, ముని+ఇంద్ర తపః చరణలు= దేవతలయొక్కయు, సిద్ధులయొక్కయు, మునిశ్రేష్ఠులయొక్కయు తపము చేయుటలు; నా తపముతోడన్= నేను చేసిన తపస్సుతో; సరి కావు= సమానం కావు; అంటిన్= అని పలికితిని.

**తాత్పర్యం:** దేవతలకు రాజైన ఇంద్రుడు నేను చేసిన తపస్సున కాశ్చర్యపడి 'నీ తపస్సుయొక్క మహత్త్వం చెప్పు' మని అడుగగా 'దేవతల, సిద్ధుల, మునిశ్రేష్ఠుల తపఃకార్యాలు నా తపంతో సమానం కా' వని పలికాను.

**విశేషం:** 'అను' ధాతువుయొక్క భూతకాలమందలి ఉత్తమపురుషైకవచనం 'అనితిని', ను స్థానంబున బిందువు - అంతిని; బిందువు మీది తకారానికి టకారం అంటిని; అంటిన్.

**చ. అమరవిభుండు దాని విని యల్గి 'మదంబున నుత్తమావమా**
**నము దగునయ్య చేయ' నని నన్ను నధోభువనప్రపాతసం**
**భ్రమవివశాత్ముఁ జేసె; నది పాడియ; యెందును నల్ప మయ్యు ద**
**ర్పము బహుకాలసంచిత తపఃఫలహాని యొనర్పకుండునే. 217**

**ప్రతిపదార్థం:** అమర, విభుండు= దేవతలకు రాజైన ఇంద్రుడు; దానిన్= నే నన్న మాటల తీరును; విని; అల్గి= కోపించి; మదంబునన్= గర్వంతో; ఉత్తమ+అవమానము= పూజ్యుల (శ్రేష్ఠులైన వారి) పరాభవము; చేయన్= చేయటం; తగున్+అయ్య= ఉచితమౌనా! అని; నన్నున్, అధస్+భువన, ప్రపాత, సంభ్రమ, వివశ+ఆత్మున్= క్రిందిలోకాలకు పడటంలోని వేగిరపాటుచేత వశం తప్పిన ఆత్మకలవాడిని; చేసెన్; అది= అట్లా చేయటం; పాడి+అ= న్యాయమే; ఎందును= ఎక్కడైనా; అల్పము+అయ్యున్= స్వల్పమైనా కూడా; దర్పము= గర్వము; బహుకాలసంచితతపస్+ఫలహాని= ఎంతోకాలంగా సంపాదించబడిన తపస్సుయొక్క ఫలంయొక్క కీడును (నాశాన్ని); ఒనర్పక+ఉండున్+ఏ= చేయకుండునా! తప్పక చేస్తుం దని భావం.

**తాత్పర్యం:** దేవేంద్రుడు నామాట విని కోపించి 'గర్వంతో శ్రేష్ఠులైనవారిని అవమానించటం తగునా?' అని నన్ను క్రిందిలోకాలకు పడటంలోని వేగిరపాటుచేత వశం తప్పిన ఆత్మకలవాడినిగా చేశాడు. అది న్యాయమే. ఎక్కడైనా స్వల్పమైన దైనా గర్వం పెద్దకాలం చేసిన తపస్సుయొక్కఫలాన్ని నాశనం చేయకుండా ఎట్లాఉంటుంది?.

**విశేషం:** యయాతి తనతప్పు తాను అంగీకరించాడు. ఇంద్రుడు శపించటంలో అన్యాయం లేదని అతడే చెప్పుకోవటం అతని ఔదార్యాన్ని సూచిస్తుంది. అలం: అర్థాంతరన్యాసం.

**వ. 'ఇట్లు కుపిత శతమఖ వచన ప్రపీడితుండ నయి తదాదేశంబున సద్భువనంబునకు వచ్చితి' ననిన నాతండు దమకు మాతామహుం డగుటయు నతని మహత్త్వంబును సార్వలౌకికత్వంబును సర్వజ్ఞానసంపత్తియు నెఱింగి, యష్టకాదులు సకల ధర్మాధర్మంబులు, సుగతి, దుర్గతి స్వరూపంబులు, జీవుల గర్భోత్పత్తిప్రకారంబులు, వర్ణాశ్రమధర్మంబులు నడిగిన వారల కయ్యయాతి యి ట్లనియె. 218**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; కుపిత, శతమఖ, వచన, ప్రపీడితుండన్+అయి= కోపించిన యింద్రుడియొక్క శాపవాక్యం చేత, మిక్కిలి బాధించబడిన వాడ నై; తద్+ఆదేశంబునన్= అతని యొక్క ఆజ్ఞచేత; సత్+భువనంబునకున్= నక్షత్రలోకానికి; వచ్చితిన్, అనినన్= అని యయాతి పలుకగా; ఆతండు= యయాతి; తమకున్= అష్టకాదులకు; మాతామహుండు; అగుటయున్= తల్లి(కి) దండ్రి కావటమూ; అతని, మహత్త్వంబును= అతని గొప్పతనమును; సార్వలౌకికత్వంబును= విశ్వజనీనత్వమును (సర్వలోకాల వారికి తెలిసియుండుటయు); సర్వజ్ఞాన సంపత్తియున్= సమస్తమైన జ్ఞానంయొక్క సంపదయున్నూ; ఎఱింగి= తెలిసికొని; అష్టక+ఆదులు= అష్టకులు మొదలైన వారు; సకల, ధర్మ+అధర్మంబులు= అన్నిధర్మాలు, అధర్మాలు: సుగతి, దుర్గతి స్వరూపంబులు= మంచిగతియొక్క (మోక్షం), చెడ్డ గతియొక్క (నరకాదుల); స్వరూపంబులు= స్వభావాలు; జీవుల,

గర్భ+ఉత్పత్తి ప్రకారంబులు= జీవులు పిండరూపాన పుట్టే విధము; వర్ణ, ఆశ్రమ ధర్మంబులును= బ్రాహ్మణ క్షత్రియాది వర్ణాలయొక్క బ్రహ్మచర్యాశ్రమాలయొక్క, స్వభావాలు; అడిగినన్= అడుగగా; వారలకున్= అష్టకాదులకు; ఆ+యయాతి; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= పల్కినాడు.

**తాత్పర్యం:** 'ఈ విధంగా కోపించిన ఇంద్రుడియొక్క వాక్కుచేత పీడించబడినవాడినై, అతడి ఆజ్ఞచేత నక్షత్ర లోకానికి వచ్చాను' అని యయాతి పలుకగా ఆయయాతి తమ మాతామహుడు కావటంచేతను, అతని గొప్పతనం సమస్త లోకాలలో ప్రసిద్ధి చెందటం చేతను, అన్ని విషయాలగురించిన జ్ఞానసంపదను తెలిసికొని అష్టకుడు మొదలైన వారు అన్ని ధర్మాలను, అధర్మాలను, మంచి చెడ్డగతుల స్వభావాలను, జీవుల పిండోత్పత్తి విధానాన్ని, వర్ణాశ్రమ ఆచారాలను అడుగగా ఆ అష్టకాదులకు యయాతి ఇట్లా చెప్పాడు.

**యయాతి యష్టకాదు లడిగిన ప్రశ్నలకు సంక్షేపరూపంబున సమాధానంబు లొసఁగుట (సం.1-84-3)**

**ఆ. సర్వభూతదయకు సత్యవాక్యమునకు । నుత్తమంబు ధర్మ వొం డెఱుంగ;**
**నొరుల నొప్పి కోడ కుపతాప మొనరించు । నదియ కడు నధర్మ మనిరి బుధులు. 219**

**ప్రతిపదార్థం:** సర్వభూతదయకున్= ఎల్ల జీవులయందలి దయకును; సత్య వాక్యమునకున్= సత్యంతో కూడిన వాక్యానికి; (వానికంటె) ఉత్తమంబు= శ్రేష్ఠమైన; ధర్మువు= ధర్మము; ఒండు= ఇతరము; ఎఱుంగన్; ఒరుల నొప్పికిన్= ఇతరులయొక్క బాధకు; (ఇతరులను బాధ పెట్టటానికి); ఓడక= భయపడక, జంకక; ఉపతాపము= సంతాపము; ఒనరించు+అది+అ= కలిగించుటయే; బుధులు= పండితులు; కడున్= మిక్కిలి; అధర్మము+అనిరి.

**తాత్పర్యం:** ఎల్లజీవులయందు దయ కలిగి ఉండటంకంటెను, నిజమైనవాక్యం పల్కటంకంటెను, శ్రేష్ఠ మైన ధర్మ మింకొకటి నాకు తెలియదు. ఇతరులను బాధించటానికి జంకక, సంతాపం కలుగ జేయటం మిక్కిలి అధర్మమని పండితులు చెప్పారు.

**ఆ. వేదవిహితవిధుల నాదరించుట యూర్ధ్వ । గతికిఁ దెరువు; విధులఁ గడచి యెందు**
**నాఁగఁబడినవాని లోఁగక చేయుట । యధమగతికి మార్గ మనిరి మునులు. 220**

**ప్రతిపదార్థం:** వేదవిహిత, విధులన్= వేదమందు విధించబడిన కార్యాలను; ఆదరించుట= ప్రీతితో చేయటం; ఊర్ధ్వగతికిన్= ఉన్నతమైన గతికి; తెరువు= మార్గం; విధులన్= వేదాలలో విధించబడిన కార్యాలను; కడచి= దాటి; ఎందున్= ఎక్కడైనా; ఆఁగఁబడినవానిన్= నిషేధించబడిన వాటిని; లోఁగక= వెనుదీయక; చేయుట; అధమగతికిన్= నీచమైన గతికి; మార్గము; అని; మునులు; అనిరి= చెప్పారు.

**తాత్పర్యం:** వేదమందు విధించబడిన కార్యాలను పాటించటం ఉన్నతమైన గతికి మార్గం. వేదమందు విధించబడిన కార్యాన్ని అతిక్రమించి, ఎల్లయెడల నిషేధించబడినవాటిని వెనుదీయక (వెనుకాడక) చేయటం నీచమైన గతికి మార్గం అని మునులు చెప్పారు.

వ. మఱియు గర్భయోనియందు ఋతుపుష్ప రససంయుక్తం బగుచు రేతంబు గాడ్పుచేతం బ్రేరితం బయి కలసిన, నందుఁ బంచతన్మాత్రలు పొడ వయి క్రమంబున నవయవంబు లేర్పడి లబ్ధజీవు లయి యుద్భవిల్లి, శ్రోత్రంబుల శబ్దంబును నేత్రంబుల రూపంబును ఘ్రాణంబున గంధంబును జిహ్వను రసంబును ద్వక్కున స్పర్శంబును మనంబున సర్వంబును నెఱుంగుచుఁ, బూర్వకర్మనియోగంబున దుష్కృతంబును సుకృతంబును జేయుచు, దుష్కృత బాహుళ్యంబునఁ బుణ్యంబు గీడ్పఱిచి బుద్ధి విరహితులై తిర్యగ్యోనులందుఁ బుట్టుదురు; సుకృత బాహుళ్యంబునఁ బాపంబు గీడ్పఱిచి బుద్ధియుక్తులై మనుష్యయోనులందుఁ బుట్టి, యుక్తాచారులును దత్త్వ విదులును నయి, దేవత్వంబునం బొంది, విశుద్ధజ్ఞాను లయి ముక్తు లగుదురు; మఱి యుక్తాచారు లెవ్వరనిన గురు శుశ్రూష సేయుచు నిత్యాధ్యయనాగ్ని కార్యంబులయం దప్రమత్తు లయి శమదమ శౌచంబులు దాల్చి యవిప్లుత బ్రహ్మచర్యులయిన బ్రహ్మచారులును, బాపంబునకుఁబరోపతాపంబునకు వెఱచి ధర్మ్యంబైన విత్తంబున నతిథులం బూజించుచు యజ్ఞంబులు సేయుచుఁ బరుల యీనిధనంబులు పరిగ్రహింపక నిత్యానుష్ఠానపరు లయిన గృహస్థులును, నియతాహారు లై సర్వసంగంబులు విడిచి జితేంద్రియు లైన వానప్రస్థులును, వనంబులనుండి గ్రామ్యవస్తువుల నుపయోగింపక గ్రామంబులనుండి శరీర ధారణార్థంబు నియతస్వల్పభోజను లయి నగర ప్రవేశంబు పరిహరించి కామక్రోధాదులం బొరయక శౌచాచారక్రియారతు లయి సర్వద్వంద్వంబులు నొడిచిసర్వసంగవివర్జితులయి యేకచరు లయి యనేకనికేతను లయిన యతులును నను వీరలు దమతమ పుణ్యాచారంబులం జేసి క్రిందం బదితరంబులవారిని మీఁదం బదితరంబుల వారిని దమ్మును నుద్ధరింతురు. 221

**ప్రతిపదార్థం:** మఱియున్= అదికాక; గర్భయోనియందున్= పిండముండు స్త్రీ అవయవమందు; ఋతుపుష్ప రస సంయుక్తంబు= ఋతుకాలానికి సంబంధించిన రజస్సుతో కూడినది; అగుచున్; రేతంబు= పురుషుడి వీర్యం; గాడ్పుచేతన్= గాలిచేత; ప్రేరితంబు+అయి= ప్రేరేపించబడినదై; కలసినన్= కలయగా; అందున్= ఆ రేతస్సునందు (గర్భయోనియందు) పంచతన్మాత్రలు= ఐదయిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు; పొడవు+అయి= రూపొంది; క్రమంబునన్= కాలక్రమాన; అవయవంబులు= అంగాలు; ఏర్పడి= రూపొంది; లబ్ధజీవులు+అయి= పొందబడిన జీవం కలవారై; ఉద్భవిల్లి= పుట్టి; శ్రోత్రంబులన్= చెవులచేత; శబ్దంబును= ధ్వనిని; నేత్రంబులన్= కన్నులచేత; రూపంబును; ఘ్రాణంబునన్= ముక్కుచేత; గంధంబును= వాసనను; జిహ్వను= నాలుకచేత; రసంబునున్= రుచిని; త్వక్కునన్= చర్మంచేత; స్పర్శంబును= స్పర్శను (తాకుడును); మనంబునన్= మనస్సుచేత; సర్వంబునున్= సమస్తమును; ఎఱుంగుచున్; పూర్వకర్మ నియోగంబునన్= పూర్వజన్మ మందలి కర్మల పనుపుచేత; దుష్కృతంబును= చెడ్డపనిని; సుకృతంబును= మంచిపనిని; చేయుచున్; దుష్కృత, బాహుళ్యంబునన్= చెడ్డపనుల ఆధిక్యత చేత; పుణ్యంబు= పుణ్యమును; కీడ్పఱచి= తక్కువచేసి; బుద్ధి విరహితులు+ఐ= బుద్ధిలేని వారై; తిర్యక్+యోనులందున్= పశుపక్ష్యాదుల గర్భమందు; పుట్టుదురు; సుకృత బాహుళ్యంబునన్= పుణ్యంయొక్క ఆధిక్యంచేత; పాపంబున్= పాపమును; కీడ్పఱిచి= తక్కువ పఱిచి; బుద్ధియుక్తులు+ఐ= బుద్ధితో కూడినవారై; మనుష్య యోనులందున్= మానవ గర్భమందు; పుట్టి; యుక్త+ఆచారులు= తగిన ఆచారం కలవారును; తత్వవిదులునున్= తత్త్వం తెలిసిన వారును; అయి; దేవత్త్వంబునన్= దేవత్వాన్ని; పొంది; విశుద్ధ జ్ఞానులు+అయి= నిర్మలమైన జ్ఞానం కలవారై; ముక్తులు= మోక్షం పొందినవారు; అగుదురు; మఱి=ఇంక; యుక్త+ఆచారులు= తగిన ఆచారం కలవారు; ఎవ్వరు+అనినన్= ఎవ్వ రనగా; గురు,

శుశ్రూష= గురువులసేవ, చేయుచున్; నిత్య+అధ్యయన+అగ్ని కార్యంబులయందున్= నిత్యం చేయదగిన వేదాధ్యయన, అగ్ని ఉపాసన మొద లైన పనులలో; అప్రమత్తులు= ప్రమాదం లేనివారు; శమ దమశౌచంబులు= బహిరింద్రియ అంతరింద్రియ నిగ్రహాన్ని; శుచిత్వాన్ని; తాల్చి= పొంది; అవిప్లుత బ్రహ్మచర్యులు+అయిన= చెడని బ్రహ్మచర్య వ్రతం కలవా రైన బ్రహ్మచారులును; పాపంబునకున్; పర+ఉపతాపంబునకున్= ఇతరులకు సంతాపాన్ని కలిగించటానికి; వెఱచి= భయపడి; ధర్మ్యంబు అయిన= ధర్మంతో కూడిన, ధర్మమార్గాన సంపాదించబడిన; విత్తంబునన్= ధనంతో; అతిథులన్; పూజించుచున్; యజ్ఞంబులు చేయుచున్; పరుల ఈని ధనంబులు= ఇతరులు ఇవ్వని ధనాలు (పరుల ధనంబులు, పరధనంబులు అని పాఠాంతరం. ఇవే యుక్తమైనవి); పరిగ్రహింపక= చేకొనక; నిత్య+అనుష్ఠాన పరులు= సంతతం చేయదగిన సంధ్యావందనాది కార్యాలయందు ఆసక్తి కలవా రైన; గృహస్థులును; నియత+ఆహారులు+ఐ= నియమంతో కూడిన ఆహారం కలవారై; సర్వసంగంబులు= అన్ని ఆసక్తులు; విడిచి; జిత+ఇంద్రియులు+ఐన= జయించబడిన ఇంద్రియాలు కలవారైన; వానప్రస్థులును= వానప్రస్థాశ్రమం కలవారును; వనంబులన్+ఉండి= అడవులందు నివసించి; గ్రామ్య వస్తువులను= గ్రామాలందలి వస్తువులను; ఉపయోగింపక; గ్రామంబులన్+ఉండి= గ్రామాలందు నివసించి; శరీర, ధారణ+అర్థంబు= శరీరం నిలిచే నిమిత్తం; నియత, స్వల్ప భోజనులు అయి= నియమంతో కూడిన స్వల్ప మైన ఆహారం కలవారై; నగర ప్రవేశంబు= పట్టణాలందు ప్రవేశించటం; పరిహరించి= విడిచి; కామ+క్రోధ+ఆదులన్= కామం, క్రోధం మొదలైన వాటిని; పొరయక= పొందక; శౌచ+ఆచార క్రియారతులు+అయి= శుచిత్వంతో కూడిన ఆచారమందును (ఆచారంలోను పనులలోను ఆసక్తికలవారై); సర్వద్వంద్వంబులున్= శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వాలన్నింటినీ; ఒడిచి= ఓడించి (జయించి); సర్వసంగ, వివర్జితులు+అయి= అన్ని సంగాలచేత విడువబడిన వారై; ఏక, చరులు+అయి= ఒంటరిగా సంచరించువా రై; అనేక నికేతనులు+అయిన= పెక్కు గృహాలు కలవారైన (ఒకేయింట్లో ఉండకుండా పెక్కుగృహాలకు భిక్షాటనార్థం వెళ్ళేవా రైన) యతులును= సన్న్యాసులును; (వీరు యుక్తాచారులు); అను వీరలు= అనే వీరు; తమ, తమ, పుణ్య+ఆచారంబులన్ చేసి= వారి వారి పుణ్యంతో కూడిన ఆచారాలచేత; క్రిందన్= జరిగిన కాలమందలి (కడచిపోయిన కాలంలోని); పదితరంబులవారిని; మీఁదన్= ముందువచ్చు; పదితరంబులవారిని; తమ్మును; ఉద్ధరింతురు= మీది కెత్తుదురు, ఉద్ధరిస్తారు.

**తాత్పర్యం:** అదిగాక గర్భయోనియందు ఋతుకాలమందలి స్త్రీ రజస్సుతో కూడినదై పురుషుడిరేతస్సు గాలిచేత ప్రేరేపించబడి కలయగా, ఆ గర్భయోనియందు శబ్దస్పర్శాదు లైన ఐదు తన్మాత్రలు రూపొంది క్రమంగా అవయవా లేర్పడి జీవం పొంది జన్మిస్తారు. తరువాత చెవులచేత శబ్దాన్ని, నేత్రాలచేత రూపాన్ని, ముక్కుచేత వాసనను, నాలుకచేత రుచిని, చర్మంచేత స్పర్శగుణాన్ని, మనస్సుచేత సమస్తాన్నీ ఎరుగుదురు (తెలిసికొంటారు). పిమ్మట పూర్వజన్మలోని కర్మలఏర్పాటుచేత మంచిపనిని, చెడ్డపనిని చేస్తూ చెడ్డపనుల ఆధిక్యంచేత పుణ్యాన్ని తక్కువ పరచి (చేసి) బుద్ధిలేనివారై పశుపక్ష్యాదుల గర్భాలందు జన్మిస్తారు. పుణ్యంయొక్క ఆధిక్యంచేత పాపాన్ని తక్కువ కావించి బుద్ధితో కూడినవారై మానవగర్భాలందు పుట్టి తగిన ఆచారాలు కలవారున్నూ, తత్త్వజ్ఞానం కలవారున్నూ అయి దేవత్వాన్ని పొంది నిర్మల మైన జ్ఞానంతో కూడి మోక్షాన్ని పొందుతారు. మఱి యుక్తాచారులు ఎవరంటే గురువుల సేవచేస్తూ నిత్యం వేదాధ్యయనాన్ని, అగ్నికార్యాన్ని పొరపాటులేకుండా చేస్తూ అంతర్బహిరింద్రియ నిగ్రహాన్ని, శుచిత్వాన్ని ధరించి భ్రష్టం కాని బ్రహ్మచర్యవ్రతం కలవా రైన బ్రహ్మచారులునూ, పాపానికీ, పరులను పీడించటానికీ భయపడి ధర్మమార్గాన సంపాదించబడిన ధనంతో అతిథులను పూజిస్తూ యజ్ఞాలు చేస్తూ ఇతరులు ఈయని ధనాలను గ్రహించక నిత్యకర్మానుష్ఠానంలో ఆసక్తులై ఉండే గృహస్థులును, నియమంతో కూడిన ఆహారం కలవారై

సర్వాసక్తులు విడిచి ఇంద్రియాలను జయించి ఒప్పారు వానప్రస్థులును, అడవియం దుండి గ్రామమందు పుట్టిన వస్తువులను వాడక గ్రామాలందు నివసించి దేహపోషణకై స్వల్పమైన (కొద్దిగా) ఆహారం స్వీకరిస్తూ (గ్రహిస్తూ) పట్టణాలలో ప్రవేశించక కామక్రోధాదులను పొందక శుచిత్వంతో కూడిన ఆచారాలందు, కర్మలందు ఆసక్తి కలవారై శీతోష్ణ సుఖ దుఃఖాదులను, సర్వ ద్వంద్వాలను జయించి సర్వాసక్తులను విడిచి ఒంటరిగా సంచరిస్తూ ఒకే గృహం లేనివారై యుండు సన్న్యాసులును-వీరు యుక్తాచారులు. వీరు తమ తమ పుణ్యాలయిన ఆచారాల చేత పదితరాల పూర్వులను, పదితరాల ముందువారిని మరియు, తమ వెనుక నున్న వారిని కూడ ఉద్ధరిస్తారు.

**క. మానాగ్నిహోత్రమును మఱి । మానాధ్యయనమును మానమౌనంబు నవి**
**జ్ఞానమున మానయజ్ఞము । నా నయథార్థంబు లివియు నాలుగు నుర్విన్. 222**

**ప్రతిపదార్థం:** మాన+అగ్నిహోత్రమును= గర్వంతో కూడిన అగ్ని ఉపాసనను; మఱి, మాన+అధ్యయనమును= ఆడంబరంతో కూడిన వేదాధ్యయనాన్ని; మానమౌనంబునన్= గర్వంతో కూడిన మౌనమును (మౌనాన్ని తాల్చుటయు); అవిజ్ఞానమునన్= జ్ఞానంలేకుండ (లేకపోవటంచేత); మానయజ్ఞమును= గర్వంతో కూడిన యజ్ఞమును; నాన్= అనగా; ఇవియున్ నాలుగున్= మానంతో కూడిన అగ్నిహోత్ర. అధ్యయన, మౌన, యజ్ఞములు నాలుగూ; ఉర్విన్= భూమియందు; అయథార్థంబులు= నిజాలు కావు.

**తాత్పర్యం:** గర్వంతో కూడిన అగ్నిహోత్రం, ఆడంబరానికై చేసే వేదాధ్యయనం, గర్వంతో కూడుకొన్న మౌనం, జ్ఞానం లేకుండా ఆడంబరంతో చేసే యజ్ఞం అనే నాలుగూ భూమియందు అసత్యా లైనవి (అయోగ్యా లైనవి).

**వ. అని యయాతి యష్టకాదు లడిగినవాని నెల్ల సంక్షేపరూపంబునం జెప్పటయు వార లి ట్లనిరి. 223**

**ప్రతిపదార్థం:** అని, యయాతి; అష్టక+ఆదులు= తన దౌహిత్రు లైన, అష్టకుడు మొదలైన వారు; అడిగిన వానిన్, ఎల్లన్= అడిగిన ప్రశ్నలు అన్నింటిని; సంక్షేప రూపంబునన్= విస్తరంగా కాక, సంక్షేప రూపాన; చెప్పుటయున్= చెప్పగా; వారలు= అష్టకాదులు; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** అని యయాతి తనదౌహిత్రు లయిన అష్టకాదులు అడిగిన ప్రశ్నల కన్నిటికీ సంక్షేపంగా సమాధానా లీయగా, అష్టకాదు లతనితో ఇట్లా అన్నారు.

**విశేషం:** ఇక్కడ మూలంలో అష్టకాదు లడిగిన ప్రశ్నలూ యయాతి ఇచ్చిన సమాధానాలూ విస్తృతంగా ఉన్నాయి. ఇది ఆధ్యాత్మిక విషయం కావటంచేత నన్నయ వాటిని సంగ్రహించాడు. సంగ్రహించినట్లు అతడే 'సంక్షేపరూపంబున' అని సూచించాడు. శాస్త్రేతిహాసమైన వ్యాసభారతాన్ని తెలుగులో కావ్యేతిహాసంగా నిర్మించే విధానంలో ముఖ్యమైన లక్షణం శాస్త్రాంశసంగ్రహీకరణం.

**తే. 'సకల ధర్మవిదుండవు, సర్వలోక । వర్తనము లెఱింగిన పుణ్యకర్త, వీవు**
**నెయ్య మొనరంగ నెఱిఁగింపుమయ్య మాకు । వెలయఁ బుణ్యలోకంబులు గలవె' యనిన. 224**

**ప్రతిపదార్థం:** సకల, ధర్మ, విదుండవు= అన్ని ధర్మాలను ఎఱింగిన వాడివి; సర్వలోక వర్తనములు= అన్ని లోకాల ప్రవర్తనలు; ఎఱింగిన= తెలిసిన; పుణ్యకర్తవు= పుణ్యం చేసినవాడివి; ఈవు= నీవు; నెయ్యము; ఒనరంగన్= స్నేహ మొప్పునట్లుగా; మాకున్; వెలయన్= ప్రసిద్ధంగా; పుణ్యలోకంబులు= పవిత్ర మైన లోకాలు; కలవు+ఎ= కలవా?; ఎఱింగింపుమయ్య= తెలుపవయ్య; అనినన్= అని అష్టకాదు లడుగగా.

**తాత్పర్యం:** 'నీవు సర్వధర్మాలను ఎరిగినవాడివి, సర్వలోకప్రవర్తనలు తెలిసిన పుణ్యమూర్తివి, స్నేహ మొప్పగా మాకు పుణ్యలోకాలు కలవా?' అని అష్టకాదులు అడుగగా. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. 'మీకుంబుణ్యలోకంబులుగల' వని యయాతి సెప్పిన విని యన్నలువురు సంతోషించి 'యేము నీ దౌహిత్రులము సు' మ్మని త మ్మెఱింగించి వానికిఁ బుణ్యలోకంబు లిచ్చిన న ట్లయ్యయాతి సత్సంగతిం జేసి తానును దౌహిత్రులు నూర్ధ్వలోకంబునకుం జనియె నని. 225**

**ప్రతిపదార్థం:** మీకున్; పుణ్యలోకంబులు= పుణ్యం చేసేవారు పోవు లోకాలు; కలవు= ఉన్నవి; అని; యయాతి; చెప్పినన్= చెప్పగా; విని; ఆనలువురున్= అష్టకుడు, ప్రతర్దనుడు వసుమంతుడు, శిబి అనే నలువురును; సంతోషించి; ఏము= మేము; నీదౌహిత్రులము; సుమ్ము= నీకూతురి కుమారులము సుమా!; అని; తమ్మున్, ఎఱింగించి= తమను తెలిపికొని; వానికిన్= ఆ యయాతికి; పుణ్యలోకంబులు; ఇచ్చినన్= ఇయ్యగా; అట్లు; ఆ+యయాతి; సత్సంగతిన్, చేసి= సత్పురుషుల సాంగత్యంచేత; తానును, దౌహిత్రులున్= కూతురి కుమారులును (మనుమలును); ఊర్ధ్వలోకంబునకున్= పైస్వర్గలోకానికి; చనియెన్= వెళ్ళెను; అని.

**తాత్పర్యం:** 'మీకు పుణ్యలోకా లున్నవి' అని యయాతి చెప్పగా విన్న ఆ నలుగురు మనుమలూ సంతోషించి 'మేము నీకూతురికుమారులం సుమా!' అని తమను తాము తెలుపుకొని ఆ యయాతికి పుణ్యలోకాలు ఇచ్చారు. ఆ విధంగా ఆ యయాతి ఉత్తములసంసర్గంచేత తాను మనుమలతో పైలోకానికి వెళ్ళాడు అని.

**విశేషం:** తానున్ దౌహిత్రులున్ చనియె - ఆత్మార్థం బభిహితం కావటంచేత ఇచ్చట క్రియకు ఏకవచనం కలిగింది.

**క. ఆ యతులపుణ్యునకు నన । సూయునకుఁ బరీక్షిదగ్రసుతునకు వైశం**
**పాయనుఁ డనంతపుణ్యఫ । లాయత్తము గాఁగఁ జెప్పె నని కడుఁ బ్రీతిన్. 226**

**ప్రతిపదార్థం:** వైశంపాయనుఁడు= వ్యాసుడి శిష్యుడు; ఆ, అతుల, పుణ్యునకున్= సాటిలేని పుణ్యం కలవాడికి; అనసూయునకున్= అసూయ లేని వాడికి; పరీక్షిత్, అగ్రసుతునకున్= పరీక్షిత్తు యొక్క జ్యేష్ఠకుమారు డైన ఆ జనమేజయుడికి; అనంత, పుణ్య, ఫల, ఆయత్తము; కాఁగన్= అంతం లేని పుణ్యంయొక్కఫలాని కధీన మయ్యేటట్లుగా; కడున్, ప్రీతిన్= మిక్కిలి ప్రీతితో; చెప్పెన్; అని శౌనకాదిమహర్షులకు సౌతి వివరించాడు.

**తాత్పర్యం:** సాటిలేని పుణ్యం కలవాడున్నూ, ఈర్ష్యారహితుడున్నూ, పరీక్షిన్మహారాజు జ్యేష్ఠ కుమారుడున్నూ అయిన జనమేజయుడికి వైశంపాయనుడు అంతం లేని పుణ్యంయొక్క ఫలానికి అధీనమౌనట్లుగా మిక్కిలి ప్రీతితో చెప్పాడని సౌతి శౌనకాదిమహర్షులకు తెలిపాడు.

## ఆశ్వాసాంతము

క. వీరశ్రీవనితాశ్రిత । భూరిస్థిర బాహుదండ! బుధనుత సుగుణా
ధార! కలియుగపవిత్ర! పు । రారాతి పదాబ్జపూజనాసక్తమతీ! 227

**ప్రతిపదార్థం:** వీర, శ్రీ, వనితా+ఆశ్రిత, భూరి, స్థిరబాహు, దండ= వీరలక్ష్మి అనే కాంతచేత ఆశ్రయించబడిన విశాలం, దృఢం అయిన దండంవంటి బాహువులు కలవాడా!; బుధ, నుత, సుగుణ+ఆధార= పండితులచేత పొగడబడిన మంచిగుణాలకు నెలవైనవాడా!; కలియుగ పవిత్ర= కలియుగాన్ని పవిత్రం చేసేవాడా!; పుర+అరాతి, పద+అబ్జ పూజన+ఆసక్త మతీ= త్రిపురాలకు శత్రు వైన (త్రిపుర సంహారు డైన) పద్మాలవంటి శివుడిపాదాలయందు ఆసక్తి కల మనస్సు కలవాడా!

**తాత్పర్యం:** వీరలక్ష్మి అనే కాంతచేత ఆశ్రయించబడిన విశాలాలు, దృఢాలు నైన దండాలవంటి బాహువులు కలవాడా! పండితులచేత పొగడబడిన మంచిగుణాలకు ఆశ్రయమైనవాడా! కలియుగాన్ని పవిత్రీకరించేవాడా! త్రిపురవైరి యైన శివుడి పాదపద్మాలందు ఆసక్తి కల మనస్సు కలిగినవాడా! రాజరాజా!

**మత్తకోకిలము.**

దండితాహితవీర! సూరినిధాన! దానవినోద! కో
దండపార్థ! పరాక్రమ ప్రియధామ! దిక్పరిపూరితా
ఖండ పాండు యశోనిధీ! పరగండభైరవ! వైరివే
దండ గండ విదారి ఘోరతరాసి భాసిభుజార్గళా!. 228

**ప్రతిపదార్థం:** దండిత+అహిత, వీర= శిక్షించబడిన శత్రువీరులు కలవాడా!; సూరి, నిధాన= పండితులకు నిధియైనవాడా!; దానవినోద= దానమందు వేడుక కలవాడా!; కోదండ, పార్థ= ధనుర్విద్యయందు అర్జునుడా!; పరాక్రమ, ప్రియ, ధామ= శౌర్యానికి ఇష్టమైన నెలవైన వాడా!; దిక్+పరిపూరిత+అఖండ, పాండు, యశస్+నిధీ= అన్ని దిక్కులందు నిండిన అధికమైన నిర్మల మైన కీర్తికి నిధానమా!; పరగండ భైరవ= (ఇది బిరుదు) శత్రువీరులకు భయంకరుడా!; వైరి, వేదండ గండ విదారి, ఘోర, తర+అసి, భాసి, భుజ+అర్గళా= శత్రువుల ఏనుగుల కపోలాలను భేదించే మిక్కిలి భయంకరమైన ఖడ్గంతో ప్రకాశించే గుదియల (గడియ) వంటి భుజాలు కలవాడా!

**తాత్పర్యం:** శిక్షించబడిన శత్రువీరులు కలవాడా! పండితులకు నిధాన మైనవాడా! దానమందు వేడుక కలవాడా! ధనుర్విద్యలో అర్జునుడివంటివాడా! శౌర్యానికి ప్రీతికరమైన నెలవా! అన్నిదిక్కులయందు నిండిన అధికమైన నిర్మలమైన కీర్తికి నిధానమా! శత్రువీరులకు భయంకరుడా! శత్రువుల ఏనుగులకపోలాలను, పగులగొట్టే భయంకరమైన ఖడ్గంతో ప్రకాశించే తలుపుగడియవంటి భుజాలు కలవాడా!

**విశేషం:** 227, 228 పద్యాలు ఆశ్వాసాంత పద్యాలు. ఇవి రాజరాజును వర్ణించే విశేషణాలతో కూడి ఉన్నవి. మత్తకోకిలంలో పాదానికి రస జజ భర గణాలతో కూడిన 18 అక్షరా లుంటాయి. యతిస్థానం 11వ అక్షరం. ఇందులో మొదటి గురువును రెండు లఘువులుగా మారిస్తే తరల మౌతుంది.

**గద్యము.**

**ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్టప్రణీతం బయిన శ్రీమహాభారతంబునం దాది పర్వంబున శ్రీమహాభారత కథాప్రారంభంబును, వ్యాసుజన్మంబును, దేవ దైత్య దానవ ముని యక్ష పక్షి గంధర్వాది నానా విధభూత సంభవంబును, దదంశావతారంబును, రాజవంశోత్పత్తియు, యయాతిచరితంబును నన్నది తృతీయాశ్వాసము. 229**

**తాత్పర్యం:** ఇది సర్వ సత్కవులచేత సన్నుతింపబడే నన్నయభట్టుచేత రచింపబడిన శ్రీమహాభారతంలోని ఆదిపర్వంలో శ్రీమహాభారత కథయొక్క ఆరంభం, వ్యాసుడి పుట్టుక, దేవతలు, దితికుమారులైన రాక్షసులు, దనుకుమారు లైన దానవులు, మునులు, యక్షులు, పక్షులు, గంధర్వులు మొదలైన పలువిధా లైన జీవుల పుట్టుక, వారి అంశాల జన్మం, (భూమిపై అవతరించటం), రాజవంశాల పుట్టుక, యయాతిరాజు చరిత్ర అనే విషయాలతో కూడిన మూడవ ఆశ్వాసం.

ఆదిపర్వంలో తృతీయాశ్వాసం సమాప్తం.



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆదిపర్వము -చతుర్థాశ్వాసము

**శ్రీలలనాస్తన ఘటిత వి । శాలోరస్థల! వివేకచతురానన! వా**
**ణీ లీలాస్పద! విలస । చ్చాళుక్యాన్వయ పయోధి సంపూర్ణశశీ! 1**

**ప్రతిపదార్థం:** ఈపద్యంలోని విశేషణాలు రాజరాజనరేంద్రుడి సంబోధనలు. శ్రీలలనా, స్తన, ఘటిత, విశాల, ఉరస్+స్థల= లక్ష్మి (రాజ్యలక్ష్మి) అనే కాంతయొక్క కుచాలచే చేర్చబడిన విపులమైన వక్షఃప్రదేశం కలవాడా! వివేక, చతురానన= జ్ఞానంలో నాల్గుమొగాలుకల బ్రహ్మ! (చతుర+ఆనన అనికూడా చెప్పవచ్చును; అప్పుడు జ్ఞానంలో నెగ్గగల ముఖం కలవాడా అని అర్థం); వాణీ, లీలా+ఆస్పద= సరస్వతీ విలాసాలకు నెలవైనవాడా!; విలసత్+చాళుక్య+అన్వయ, పయోధి, సంపూర్ణ, శశీ= ప్రకాశించే చాళుక్యవంశం అనే సముద్రానికి నిండుజాబిల్లి ఐనవాడా!; రాజరాజనరేంద్రా!

**తాత్పర్యం:** లక్ష్మి అనే కాంతయొక్కస్తనాలతో కూడిన విపులమైన వక్షస్స్థలం కలవాడా! వివేకంలో బ్రహ్మవంటివాడా! సరస్వతీవిలాసాలకు పట్టుకొమ్మ అయినవాడా! (కావ్యగీతప్రియా!) ప్రకాశించే చాళుక్యవంశం అనే సముద్రానికి నిండుచంద్రుడా! రాజరాజనరేంద్రుడా!

**విశేషం:** అలం: రూపకం. 'నా విష్ణుః పృథివీపతిః' అనే సూక్తిని అనుసరించి రాజు విష్ణ్వంశతో కూడి ఉంటాడు. అప్పుడు అతడిని లక్ష్మి ఆలింగనం చేసికొంటుంది అని భావన. సంబోధనల కైన విశేషణాల అర్థాలు వేటికవే ప్రత్యేకంగా ఉంటాయి. కాని ఇక్కడ 'వివేక చతురానన, వాణీలీలాస్పద' అనే రెండు విశేషణాలు మాత్రం పరస్పరం సమన్వయపడుతూ ఉండటం విశేషం. బ్రహ్మ లక్షణమున్న రాజరాజు సరస్వతికి ఆశ్రయుడయ్యాడనే భావం కుదురుతున్నది. విలసత్+చాళుక్య= విలసచ్చాళుక్య. శ్చుత్వసంధి.

### పూరువంశక్రమము (సం.1-90-11) (1-89-4)

**వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె : నట్లు యయాతికిఁ బుత్త్రుం డయిన పూరుండు సకల మహీరాజ్యంబు సేయుచు వంశకర్త యయిన వానికిఁ గౌసల్య యనుదానికి జనమేజయుండు పుట్టి రాజై యశ్వమేధత్రయంబుఁజేసి ప్రఖ్యాతి నొందె; నాజనమేజయునకు ననంత యనుదానికిఁబ్రాచిన్వంతుఁడు పుట్టి పరాక్రమంబున నుదయాచల పర్యంతంబు ప్రాగ్దిగ్విజయంబు సేసి ప్రాచిన్వంతుఁడు నాఁ బరఁగె; నట్టి ప్రాచిన్వంతునకు నశ్మకి యనుదానికి సంయాతి పుట్టె; వానికి వరాంగియనుదానికి నహంయాతి పుట్టె; వానికిం గృతవీర్యపుత్త్రియైన భానుమతికి సార్వభౌముండు పుట్టె; వానికిఁ గేకయ రాజపుత్త్రి యైన సునందకు జయత్సేనుండు పుట్టె; వానికి వైదర్భి యైన సుశ్రవసకు నవాచీనుండు పుట్టె; నయ్యవాచీనునకు విదర్భరాజపుత్త్రి యైన మర్యాదకు నరిహుండు పుట్టె; వానికి నాంగి యనుదానికి మహాభౌముండు పుట్టె; నా మహాభౌమునకుం బ్రసేనజిత్పుత్త్రియైన సుపుష్టకు నయుతానీకుండు పుట్టె; వానికిం బృథుశ్రవసుని పుత్త్రి**

**యైన కామకు నక్రోధనుండు పుట్టె; వానికిం గాళింగి యైన కరంభ యనుదానికి దేవాతిథి పుట్టె; వానికి వైదేహి యయిన మర్యాదకు ఋచీకుండు పుట్టె; వానికి నాంగియైన సుదేవ యనుదానికి ఋక్షుండు పుట్టె; ఋక్షునకుఁ దక్షకపుత్త్రి యయిన జ్వాలయనుదానికి మతినారుండు పుట్టె. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= భారతకథను చెప్పేవా డైన సౌతి; శౌనక+ఆది, మహత్+మునులకున్= శౌనకుడు మొదలైన గొప్పమునులకు; చెప్పెన్= చెప్పాడు; అట్లు=(వెనుకచెప్పిన)ఆవిధంగా; యయాతికిన్= యయాతి మహారాజుకు; పుత్త్రుండు+అయిన= కుమారుడు అయిన; పూరుండు= పూరుడు; సకల, మహీ, రాజ్యంబు+చేయుచున్= సమస్త మైన భూమియొక్క పరిపాలనం చేస్తూ; వంశ, కర్త, అయిన= వంశానికి తనదైన వర్తనంవలన ఒక ప్రత్యేక గౌరవాన్ని కలిగించి, తన తరువాతి వంశజులకు తనపేరుతో పిలువబడే మర్యాదను సృష్టించే వాడిని వంశకర్త అంటారు. అటువంటివాడు కాగా; వానికిన్= ఆ పూరునకున్నూ; కౌసల్య, అనుదానికిన్= కౌసల్య అనే పేరు కల వనితకున్నూ; జనమేజయుండు; పుట్టి; రాజు+ఐ= ప్రభువుఅయి; అశ్వమేధత్రయంబున్+చేసి= అశ్వమేధయాగాలు మూడింటిని చేసి; ప్రఖ్యాతిన్+ఒందెన్= ప్రసిద్ధి పొందాడు; ఆ, జనమేజయునకున్; అనంత, అనుదానికిన్; ప్రాచిన్వంతుండు; పుట్టి; పరాక్రమంబునన్= శౌర్యంతో; ఉదయ+అచల, పర్యంతంబు= సూర్యుడు ఉదయించే తూర్పుదిక్కుకొండవరకు; ప్రాక్, దిక్, విజయంబు+చేసి= తూర్పుదిక్కును జయించి; ప్రాచిన్వంతుఁడు, నాన్= తూర్పుదిక్కుకు రాజు అని; పరఁగెన్= ప్రసిద్ధిపొందాడు; అట్టి, ప్రాచిన్వంతునకున్; అశ్మకి, అను, దానికిన్, సంయాతి, పుట్టెన్; వానికిన్= ఆ సంయాతికిన్నీ; వరాంగి, అను, దానికిన్, అహంయాతి, పుట్టెన్; వానికిన్= ఆ అహంయాతికిన్నీ; కృతవీర్యపుత్త్రి; అయిన= కృతవీర్యునియొక్క కూతు రయిన భానుమతికిన్= భానుమతికిన్నీ; సార్వభౌముండు; పుట్టెన్; వానికిన్= ఆ సార్వభౌముడికి; కేకయ, రాజపుత్త్రి, అయిన= కేకయరాజుకు కూతురయిన; సునందకున్; జయత్సేనుండు; పుట్టెన్; వానికిన్= ఆ జయత్సేనునకు; వైదర్భి, అయిన= విదర్భరాజుకు కూతురైన; సుశ్రవసకు; అవాచీనుండు; పుట్టెన్; ఆ+అవాచీనునకున్; విదర్భ, రాజపుత్త్రి, అయిన= విదర్భదేశరాజుకు కూతురయిన; మర్యాదకున్= మర్యాద అనేపేరు కల వనితకు; అరిహుండు, పుట్టెన్; వానికిన్= ఆ అరిహునకు; ఆంగి, అనుదానికిని; మహాభౌముండు; పుట్టెన్; ఆ, మహాభౌమునకున్; ప్రసేనజిత్, పుత్త్రి, అయిన= ప్రసేనజిత్తుని పుత్త్రిక అయిన; సుపుష్టకున్; ఆయుతానీకుండు; పుట్టెన్; వానికిన్= ఆ అయుతానీకునకునూ; పృథుశ్రవసుని, పుత్త్రిక అయిన; సుపుష్టకున్; అయుతానీకుండు; పుట్టెన్; వానికిన్= ఆ ఆయుతానీకునకునూ; పృథుశ్రవసుని, పుత్త్రి, అయిన= పృథుశ్రవసుని కూతురయిన; కామకున్; అక్రోధనుండు; పుట్టెన్; వానికిన్= అక్రోధనుడికి; కాళింగి, అయిన= కళింగదేశపురాజు కూతు రయిన; కరంభ, అను, దానికిని; దేవాతిథి, పుట్టెన్; వానికిన్= ఆ దేవాతిథికిని; వైదేహి, అయిన= విదేహరాజుయొక్క కూతురైన; మర్యాదకున్; ఋచీకుండు; పుట్టెన్; వానికిన్= ఆ ఋచీకునకును; ఆంగి+అయిన= అంగరాజుకు కూతురైన; సుదేవ, అనుదానికిన్; ఋక్షుండు, పుట్టెన్; ఋక్షునకున్; తక్షకపుత్త్రి, అయిన= తక్షకునియొక్క కూతురైన; జ్వాల, అనుదానికిని; మతినారుండు; పుట్టి.

**తాత్పర్యం:** స్పష్టం

**క. ఇమ్ముగ సరస్వతీ తీ। రమ్మునఁ బండ్రెండు వత్సరమ్ములు విధిమా**
**ర్గమ్మున సద్గుణసముదా। య మ్మెసగఁగఁ జేసి సత్త్రయాగము నిష్ఠన్. 3**

**ప్రతిపదార్థం:** ఇమ్ముగన్= ఇంపుగా; సరస్వతీ, తీరమ్మునన్= సరస్వతీనది ఒడ్డున; పండ్రెండు, వత్సరమ్ములు= పదిరెండు (12) సంవత్సరాలు; విధి, మార్గమ్మునన్= శాస్త్రపద్ధతితో; సత్+గుణ, సముదాయమ్ము= మంచిగుణాల సమూహము; ఎసగఁగన్= అతిశయించగా; నిష్ఠన్= ఎక్కువ శ్రద్ధతో; సత్త్రయాగమున్= సత్త్రయాగాన్ని; చేసెన్= ఆచరించాడు.

**తాత్పర్యం:** మతినారుడు సరస్వతీనదిఒడ్డున పన్నెండుసంవత్సరాలు సత్త్రయాగాన్ని విధివిధానంగానూ, సద్గుణసమూహాలు అతిశయించేటట్లుగానూ ఎక్కువశ్రద్ధతో ప్రీతితో చేశాడు.

**విశేషం:** 13 మొదలు 100 రోజులవరకూ కొనసాగే యాగాన్ని సత్త్రయాగమంటారు.

**క.** **అతనికి సరస్వతీనది । మతి ననురక్త యయి వాని మానుగఁ దనకుం**
**బతిఁ జేసికొనియె ధర్మ । స్థితి; నయ్యిరువురకుఁ ద్రసుఁడు ధీరుఁడు పుట్టెన్.** **4**

**ప్రతిపదార్థం:** అతనికిన్= మతినారుని యందు (సప్తమికి మారుగా షష్ఠీవిభక్తి); సరస్వతీనది; మతిన్= మనస్సులో; అనురక్త+అయి= అనురాగం కలదై; వానిన్= ఆ మతినారుని; మానుగన్= ఒప్పుగా; తనకున్= తనకు; పతిన్= భర్తగా; ధర్మస్థితిన్= ధర్మమార్గాన; చేసికొనియెన్= చేసికొనెను. (వరించి పెండ్లాడింది); ఆ+ఇరువురకున్= సరస్వతికీ, మతినారునికీ; ధీరుఁడు= ధైర్యవంతుడైన; త్రసుఁడు= త్రసుడుఅనేవాడు; పుట్టెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** మతినారునియందు సరస్వతీనదికి మనస్సులో అనురాగం కలుగగా, ఆమె అతడిని ధర్మమార్గంలో తనభర్తగా చేసికొన్నది. వారిద్దరికీ త్రసుడు అనేవాడు పుట్టాడు.

**వ.** **ఆ త్రసునకుఁ గాళింది యనుదానికి నిలినుండు పుట్టె; వానికి రథంతరి యను దానికి దుష్యంతుండు పుట్టెఁ; బుట్టి యనన్యసాధారణశక్తియుక్తుం డై.** **5**

**ప్రతిపదార్థం:** ఆ, త్రసునకున్= ఆ త్రసు డనే రాజుకున్నూ; కాళింది, అనుదానికిన్= కాళింది అనేపేరు కల వనితకున్నూ; ఇలినుండు; పుట్టెన్; వానికిన్= ఆ ఇలినునకు; రథంతరి, అనుదానికిన్= రథంతరి అనే స్త్రీకిన్నీ; దుష్యంతుండు, పుట్టెన్= జన్మించాడు; పుట్టి; అనన్య, సాధారణ, శక్తి, యుక్తుండు+ఐ= ఇతరులకు సామాన్యం కాని సామర్థ్యం కలవాడై.

**తాత్పర్యం:** ఆ త్రసునికి కాళింది అనే భార్యయందు ఇలినుడు అనేవాడు పుట్టాడు. ఆ ఇలినుడికి రథంతరి అనేదానియందు దుష్యంతుడు జన్మించాడు. ఆ దుష్యంతుడు ఇతరులకు సాధారణంకాని (అధికమైన) సామర్థ్యంతో కూడినవాడై.

**క.** **బాలహరిణములఁ బట్టెడు । లీలను విషమాటవీ చలిత కేసరి శా**
**ర్దూలేభ శరభములఁ దన । బాలత్వమునంద యెగిచి పట్టుచు మఱియున్.** **6**

**ప్రతిపదార్థం:** బాల, హరిణములన్= లేడిపిల్లలను; పట్టెడు, లీలను= పట్టుకొనేవిధంగా; విషమ+అటవీ, చలిత= తిరగటానికి వీలుకాని (దుర్గమమైన) అడవులందు తిరుగుతున్నట్టి; కేసరి= సింహాలను; శార్దూల= పులులను; ఇభ= ఏనుగులను; శరభములన్= మీఁగండ్లమృగాలను; తన, బాలత్వమునందున్+అ= తనచిన్నతనంలోనే; యెగిచి, పట్టుచున్= వెంటాడి పట్టుకొంటూ; మఱియున్= ఇంకనూ.

**తాత్పర్యం:** ఆ దుష్యంతుడు తన చిన్నతనంలోనే లేడిపిల్లలను పట్టుకొనేవిధంగా దుర్గమ మైన అడవుల్లో తిరుగాడే సింహాలను, పులులను, ఏనుగులను, శరభమృగాలను వెంటాడి పట్టుకొంటూ, ఇంకా, (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ. శరభానికి ఎనిమిది కాళ్లుంటా యనీ, అది సింహంకంటె బలవత్తర మైన దనీ అంటారు.

**క.** **ఉర్వీరుహ నివహముతోఁ । బర్వతములు వెఱికి యొండు పర్వతములపైఁ**
**బర్వఁగ వైచుచు యౌవన । గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుం డై.** **7**

**ప్రతిపదార్థం:** ఉర్వీరుహ, నివహముతోన్= వృక్షాల సమూహంతోపాటుగా; పర్వతములు+పెఱికి= పర్వతాలను పెకలించి; ఒండు, పర్వతములపైన్= వేరుపర్వతాలమీద; పర్వఁగన్, వైచుచున్= పడవేస్తూ; ఉర్విన్= భూమియందు; యౌవన, గర్వంబునన్= యౌవనం వలని గర్వంతో; కడున్+అధికుండు+ఐ= మిక్కిలి గొప్ప వాడయి; ఒప్పెన్= అతిశయించాడు.

**తాత్పర్యం:** వృక్షాలసమూహంతోపాటుగా పర్వతాలను పెకలించి వేరే పర్వతాలపై పడవేస్తూ, యౌవనగర్వంతో భూలోకంలో మిక్కిలి గొప్పవా డయి అతిశయించాడు.

**విశేషం:** పర్వతములు+పెఱికి= 'ప' కు 'వ' ఆదేశం; పర్వతములు వెఱికి; గసడదవాదేశం.

## దుష్యంతుఁడు వేఁట కరుగుట (సం. 1-63-1)

**శా.** **ఆ దుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంతమాతంగ మ**
**ర్యాదాలంకృత మైన భూవలయ మాత్మాయత్త మై యుండఁగా**
**నాదిత్యాంశు సమీర దుర్గమ మహోగ్రారణ్య దేశాళితో**
**నాదిక్షత్త్ర చరిత్ర నేలె నజితుండై బాహువీర్యంబునన్.** **8**

**ప్రతిపదార్థం:** అనంత, సత్త్వుఁడు= అంతులేని బలం కలిగిన; ఆ, దుష్యంతుఁడు= అంతటిదుష్యంతుడు; సమస్త, ఆశా+అంత, మాతంగ, మర్యాదా+అలంకృతము+ఐన= అన్నిదిక్కులయొక్క చివరలందలి ఏనుగులయొక్క హద్దుతో అలంకరింపబడింది అయిన; భూవలయము= భూమండలం; ఆత్మ+ఆయత్తము+ఐ, ఉండఁగాన్= తనకు ఆధీనం కాగా; ఆదిత్య+అంశు, సమీర, దుర్గమ, మహత్, ఉగ్ర, అరణ్య, దేశ+ఆళితోన్= సూర్యుడి కిరణాలకున్నూ, గాలికిన్నీ ప్రవేశింప శక్యంగాని మిక్కిలి భయంకర మైన అడవిప్రాంతాల సమూహంతో; ఆది, క్షత్త్ర, చరిత్రన్= తొలుతటి మనువు మొదలైన రాజుల చరిత్రవంటి చరిత్రతో; బాహువీర్యంబునన్= భుజాలయొక్క బలంతో; అజితుండు+ఐ= ఓడనివాడై; ఏలెన్= పరిపాలించాడు.

**తాత్పర్యం:** అనంతమైన బలం కలిగిన ఆ దుష్యంతుడు అన్ని దిక్కులచివరలలో గల యేనుగులు (అష్టదిగ్గజాలు) సరిహద్దుగా ఒప్పిన భూమండలం తనకు అధీనమై ఉండగా సూర్యకిరణాలకున్నూ వాయువుకున్నూ ప్రవేశింపరానట్టి భయంకరాలైన అడవిప్రదేశాలతోపాటుగా పూర్వరాజులవర్తనంవంటి వర్తనంతో, భుజబలంతో, ఓడనివాడై భూమిని పరిపాలించాడు.

**విశేషం:** భూమిని ఎనిమిది దిక్కులందు ఎనిమిది ఏనుగులు మోస్తూ ఉంటా యని చెప్పుతారు. ఆ అష్టదిగ్గజాలు హద్దుగా గల భూమి అంటే సర్వభూమిని అని అర్థం. దుష్యంతుని విశాలమైన రాజ్యంలో దుర్గమారణ్యాలు, తపోవనాలు ఎక్కువగా ఉన్నా యని సూచన. ఇవి భావికథలో దుష్యంతుడు వేటకు పోవటానికీ, శకుంతలను చూచి వివాహం చేసికొనటానికీ అనువుగా ఉన్నవి. ఇటువంటిభావికథార్థసూచన నన్నయ వస్తుధ్వనికి నిదర్శనం. 'అనంతసత్త్వుఁడు' అంటే అనంతుడి(ఆదిశేషుడి) బలంవంటి బలం కలవాడనికూడ అర్థం చెప్పవచ్చును. భూభారం వహించే సందర్భం కనుక ఇదికూడ సమంజసంగా ఉంటుంది. ఓజోగుణభూయిష్ఠమైన ప్రసాదగుణం ఉదాత్తవిభావవర్ణనలో సముచితంగా ప్రయోగింపబడింది.

**క.** **ఆతని రాజ్యంబున ను। ర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజాశో**
**కాతంక క్షయ శంకా। పేతం బై ధర్మచరితఁ బెరుఁగుచు నుండెన్.** **9**

**ప్రతిపదార్థం:** అతని రాజ్యంబునన్= ఆ దుష్యంతుని పరిపాలనలో; ఉర్వీతలము= భూతలం; ప్రజాసమృద్ధిన్= జనులయొక్క అభివృద్ధితో; వెలసి= ప్రసిద్ధిపొంది; రుజా, శోక, ఆతంక, క్షయ, శంకా+అపేతంబు+ఐ= రోగాలు, దుఃఖాలు, విఘ్నాలు, నష్టాలు, అనుమానాలు లేనిదై; ధర్మ, చరితన్= ధర్మమైన వర్తనంతో; పెరుఁగుచున్+ఉండెన్= అభ్యుదయాన్ని పొందుతూ ఉన్నది.

**తాత్పర్యం:** దుష్యంతుడి పరిపాలనంలో దేశం ప్రజలఅభివృద్ధితో ప్రసిద్ధిచెంది రోగాలూ, దుఃఖాలూ, విఘ్నాలూ, నష్టాలూ, అనుమానాలూ ఏమీ లేనిదై ధర్మమైన ప్రవర్తనంతో సాగుతూ ఉన్నది.

**విశేషం:** దుష్యంతుడు ప్రజలకు ధర్మవర్తన మైన పాలనను అందించటంవలన వారికి ఎటువంటి అరిష్టాలు కలుగకుండా అభ్యుదయాలు కలుగుతూ ఉన్నాయని తాత్పర్యం. మూలంలో ఆరు శ్లోకాలలో ఉన్న భావాన్ని 'రుజా..... అపేతంబై' అన్న సమాసంలో కుదించి చెప్పాడు నన్నయ. భావికథలో ప్రజాపవాదభీతివలన శకుంతలాభరతులను భార్యాపుత్రులనుగా నిండుసభలో పేర్కొనకపోవటానికి తగిన భిత్తికను నన్నయ కథాకథనంలో సమకూర్చాడు.

**వ.** **అమ్మహీపతి యొక్కనాఁడు మృగయావినోదార్థి యయి యాదిత్యహయంబులకంటె వడిగల హయంబులు పూనిన రథం బెక్కి యాజానేయతురంగారూఢు లైన యాశ్వికులు పరివేష్టించి రాఁగ ననంతకుంతశక్తిచాప కృపాణపాణు లయిన వీరభటసహస్రంబులతోఁ జని వనంబులోని మృగంబులం జుట్టుముట్టి.** **10**

**ప్రతిపదార్థం:** ఆ+మహీపతి= భూమికి నాథు డైన ఆ దుష్యంతుడు; ఒక్కనాఁడు= ఒకరోజున; మృగయా, వినోద+అర్థి, అయి= వేటయందలి ఆనందాన్ని కోరినవాడై; ఆదిత్య, హయంబులకంటెన్= సూర్యుడియొక్క గుఱ్ఱాలకంటె; వడి+కల= వేగం కలిగిన; హయంబులు, పూనిన= గుర్రాలను కట్టిన; రథంబు+ఎక్కి= రథాన్ని ఎక్కి; ఆజానేయ, తురంగ+ఆరూఢులు+ అయిన= మేలిజాతి గుర్రాలను ఎక్కినట్టివా రైన; ఆశ్వికులు= రౌతులు; పరివేష్టించి, రాఁగన్= చుట్టూ చేరి వస్తూఉండగా; అనంత, కుంత, శక్తి, చాప, కృపాణ, పాణులు+అయిన= అనేకాలైన ఈటెలు, చిల్లకోలలు (ఆయుధవిశేషాలు), విండ్లు, కత్తులు చేతులలో కలవారైన; వీర, భట, సహస్రంబుతోన్= వీరులైన అనేక యోధులతో; చని= వెళ్ళి; వనంబులోని= అడవిలోని; మృగంబులన్= జంతువులను; చుట్టుముట్టి= నలువైపుల క్రమ్ముకొని దాడిచేసి.

**తాత్పర్యం:** ఆ దుష్యంతుడు ఒకనాడు వేటాడి వేడుక పడదామన్న కోరికతో సూర్యుడి గుర్రాలకంటె వేగంగల గుర్రాలను కట్టిన రథాన్ని ఎక్కి, మేలిరకం గుర్రాలపై ఎక్కిన ఆశ్వికులు తన చుట్టూ చేరి అనుసరిస్తూ ఉండగా ఈటెలు, చిల్లకోలలు, విండ్లు, కత్తులు మొదలైన ఆయుధాలను ధరించిన వీరభటులు అనేకులు వెంటరాగా, ముందుకు సాగి, వనంలోని మృగాలను నలువైపుల చుట్టుముట్టి దాడిచేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **కలయఁగ నార్పుల బొబ్బల । యులివున నవ్విపిన మను మహోదధిఁ బెలుచం**
**గలఁచెను దుష్యంత మహా । బల మందరనగము సత్త్వభయజననం బై.** **11**

**ప్రతిపదార్థం:** కలయఁగన్= వనమంతా వ్యాపించగా; ఆర్పులన్= మానవుల అరపులయూ, బొబ్బలన్= జంతువుల అరపులయూ; ఉలివునన్= ధ్వనితో; ఆ+విపినము+అను, మహత్+ఉదధిన్= ఆ అరణ్యమనే పెద్ద సముద్రాన్ని; దుష్యంత, మహత్+బల, మందర, నగము= దుష్యంతుడిసేన అనే మందరపర్వతం; సత్త్వ, భయ, జననంబు+ఐ= ప్రాణులకు భయాన్ని కలిగించే దై; పెలుచన్= ఆటోపంతో; కలఁచెను= కలతపెట్టింది.

**తాత్పర్యం:** ఆ వనమంతా వ్యాపించగా భటులూ, జంతువులూ చేసే కేకలూ అరుపులూ కలిసిన చప్పుడుతో ఆ అరణ్య మనే మహాసముద్రాన్ని దుష్యంతుడిసేన అనే మందరపర్వతం (కవ్వపుకొండ) ప్రాణులకు భయంకలిగేటట్లు కలతపెట్టింది.

**విశేషం:** అలం: రూపకం. అరణ్యమనే సముద్రాన్ని మథించగా దుష్యంతుడికి శకుంతల అనే లక్ష్మి లభిస్తుం దనే సూచన ఇందులో ఉన్నది.

**క. సరభస పరిచరిత మహా । శరభ ద్విపరిపు వరాహ శార్దూల మద**
**ద్విరదాది ప్రకర భయం । కరవనమధ్యమున నృపతి గడుఁ గడిమిమెయిన్. 12**

**ప్రతిపదార్థం:** సరభస= తొట్రుపాటుతో కూడికొన్న వేగంతో; పరిచరిత= తిరుగుతున్న; మహత్+శరభ= గొప్పవైన శరభమృగాలున్నూ; ద్విప, రిపు= (ఏనుగులకు శత్రువులైన) సింహాలున్నూ; వరాహ= పందులున్నూ; శార్దూల= పెద్దపులులున్నూ; మద, ద్విరద+ఆది= మదించిన ఏనుగులు మొదలైన వానియొక్క; ప్రకర= సమూహాలచేత; భయంకర= భయాన్ని కలిగించే; వన, మధ్యమునన్= అరణ్యముయొక్క నడిమిప్రాంతంలో; నృపతి= రాజు, దుష్యంతుడు; కడున్= మిక్కిలి; కడిమిమెయిన్= పరాక్రమంతో.

**తాత్పర్యం:** తొందరగా తిరుగుతున్న మహాశరభాలు, సింహాలు, పందులు, పెద్దపులులు, మదపుటేనుగులు మొదలైన జంతుసమూహాలతో భయంకరమైన ఆ అరణ్యమధ్యప్రాంతంలో దుష్యంతుడు మిక్కిలి పరాక్రమంతో.

**విశేషం:** 10వ వచనం నుండి వేటవర్ణనం జరుగుతున్నది. రాజు సైన్యంతో అడవిలో ప్రవేశించి, మృగాలను చుట్టుముట్టి, అరుపులతో, బొబ్బలతో వేసి, వాటిని భయపెట్టి అరణ్యమధ్యభాగానికి వచ్చేటట్లు చేశాడు. వనమధ్యభాగంలో రాజు వేటచేశాడు. అత్యంత సహజసుందరంగా వేటవర్ణనం సాగుతున్నది. మితహితవచనాలకూ, యథార్థవర్ణనలకూ స్తుతులకూ నన్నయ ప్రసిద్ధి.

**క. ఓసరిలి పఱచు మృగముల । నేసియు, డాసిన మృగముల నెగచి భుజాసిన్**
**వ్రేసియుఁ, జంపెను మృగయా । వ్యాసక్తి నపారఘోరవన్యమృగాళిన్. 13**

**ప్రతిపదార్థం:** ఓసరిలి= తప్పించుకొని; పఱచు= పారిపోవు; మృగములన్= జంతువులను; ఏసియున్= కొట్టియున్నూ; డాసిన, మృగములన్= దగ్గరకు వచ్చిన జంతువులను; ఎగచి= తరిమి, కుప్పించి; భుజ+అసిన్= చేతిలోని కత్తితో; వ్రేసియున్= కొట్టియు, నరికియున్నూ; మృగయా, వ్యాసక్తిన్= వేటయందలి వేడుకతో; అపార, ఘోర, వన్య, మృగ+ఆళిన్= అంతులేని క్రూరాలైన అడవికి చెందిన జంతువుల సమూహాన్ని; చంపెను= చంపాడు.

**తాత్పర్యం:** తప్పించుకొని పారిపోయే జంతువులను కొట్టియున్నూ, సమీపానికి వచ్చినవాటిని తరిమి, కుప్పించి నరికియున్నూ దుష్యంతుడు వేటలోని వేడుకతో అపారక్రూరవనజంతువులను సంహరించాడు.

**వ. ఇట్లు పెక్కుమృగంబుల నెగిచి చంపుచు మఱియుఁ జంపెడువేడుక నతి దూరంబున కరిగిన, నాతని రథవేగంబు ననుగమింపనోపక యధిక క్షుత్పిపాసాపరవశు లయి పదాతు లయ్యయి ప్రదేశంబుల**

**విశ్రమించి; రంత దుష్యంతుండు కతిపయామాత్య పురోహితసహితుం డై కొండొకనేల యరిగి, ముందట నొక్క పుణ్యనదీతీరంబున వివిధసురభి కుసుమఫల భారవినమ్ర తరులతాగుల్మ పరిశోభితం బయిన యొక్కవనంబు గని. 14**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; పెక్కు, మృగంబులన్= అనేక జంతువులను; ఎగిచి, చంపుచున్= తరిమి చంపుతూ; మఱియున్= ఇంకను; చంపెడు, వేడుకన్= వేటచేయాలన్న ఆసక్తితో; అతిదూరంబునకున్= మిక్కిలి దూరానికి; అరిగినన్= వెళ్ళగా; ఆతని, రథ, వేగంబున్= దుష్యంతునియొక్క రథంయొక్క వేగాన్ని; అనుగమింపన్+ఓపక= అనుసరించటానికి సమర్థులు కాక; అధిక, క్షుద్, పిపాసా, పరవశులు+అయి= ఎక్కువగా ఆకటిచేతను, దప్పికచేతను, అదుపుతప్పినవారై; పదాతులు= నేలపై నిలబడి యుద్ధం చేసే సైనికులు; ఆ+అయి, ప్రదేశంబులన్= ఆయా ప్రాంతాలలో; విశ్రమించిరి= విశ్రాంతి తీసికొన్నారు; అంతన్= ఆ సమయంలో; దుష్యంతుండు; కతిపయ+అమాత్య, పురోహిత, సహితుండు+ఐ= కొందరుమంత్రులతో, మంచిచెడులను తెలిపే బ్రాహ్మణులతో కూడినవాడై; కొండు+ఒక, నేల, అరిగి= వేఱొక ప్రదేశానికి చేరి; ముందటన్= ఎదురుగా; ఒక్క, పుణ్య, నదీ, తీరంబునన్= ఒక పవిత్ర మైన నదియొక్క ఒడ్డున; వివిధ, సురభి, కుసుమ, ఫల, భార, వినమ్ర, తరు, లతా, గుల్మ, పరిశోభితంబు+అయిన= రకరకా లయిన వాసనలు కలిగిన పూవులయొక్క పండ్లయొక్క బరువుచే వంగిన చెట్లు, తీగలు, పొదలతో అలంకరింపబడిన; ఒక్క, వనంబు+కని= ఒక వనాన్ని చూచి.

**తాత్పర్యం:** ఆవిధంగా దుష్యంతుడు అనేకమృగాలను తరిమి తరిమి చంపుతూ, ఇంకా వేటాడే వేడుకతో చాలదూరం వెళ్ళగా, ఆతడి రథవేగానికి కాలిబంట్లు తట్టుకోలేక, అనుసరించే ఓపికను కోల్పోయి, ఆకలిదప్పులతో అదుపుతప్పి ఆ యా ప్రదేశాలలో విశ్రాంతి తీసికొన్నారు. ఆ సమయంలో దుష్యంతుడు కొందరు మంత్రులతో, పురోహితులతో కలిసి వేరొక ప్రదేశానికి చేరి, ఎదురుగా ఒక పవిత్రమైన నదిఒడ్డున పలురకాల వాసనలు గల పూలతోనూ, పండ్లభారంతోనూ వంగిన చెట్లతో, తీగలతో, పొదలతో అందమైన ఒక వనాన్ని చూచాడు.

**విశేషం:** దుష్యంతుడు వేటాడినది సూర్యరశ్మి సోకని దుర్గమారణ్యం. దానికి సమీపంలో ఉన్నది మాలిని అనే పుణ్యనది. ఆ నదికి ఆవలి ఒడ్డుపై ఉన్నది తపోవనం. ఇటు అరణ్యానికీ అటు తపోవనానికీ నడుమ పుణ్యనది. ప్రకృతివర్ణనం పరమరమణీయం.

## కణ్వాశ్రమ వర్ణన (సం. 1-64-3)

**క. అమరపతి ఖాండవమునకు । రమణను వైశ్రవణు చైత్రరథమునకు సమా**
**నముగా దీనిని భూభా । గమునను రచియించె నొక్కొ కమలజుఁడు దయన్. 15**

**ప్రతిపదార్థం:** కమలజుఁడు= తామరపూవునందు పుట్టినవాడైన బ్రహ్మ; దయన్= కనికరంతో; దీనిని= ఈవనాన్ని; అమర, పతి, ఖాండవమునకున్= దేవతలకు ప్రభువైన ఇంద్రుడి (ఉద్యానవనమైన) ఖాండవానికి; రమణను= ఒప్పిదమైన గుణంలో; వైశ్రవణు, చైత్రరథమునకున్= కుబేరుడియొక్క (ఉద్యానవనమైన) చైత్రరథానికి; సమానముగాన్= సరిసమానంగా, తుల్యంగా; భూ, భాగమునను= ఈ భూఖండంలో; రచియించెన్+ఒక్కొ= నిర్మించాడు కాబోలు.

**తాత్పర్యం:** ఈవనాన్ని ఇంద్రుడి ఉద్యానవనమైన ఖాండవానికీ, కుబేరుని ఉద్యానవనమైన చైత్రరథానికీ అందంలో సమానంగా ఉండేటట్లు భూతలంమీద బ్రహ్మ దయతో నిర్మించాడు కాబోలు!

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. వనదర్శనంచేతనే అద్భుతభావావిష్టుడైనాడు దుష్యంతుడు. అందులో ప్రవేశిస్తే మరికొన్ని అద్భుతాలను చూడబోతున్నాడనీ, అనుభవించబోతున్నాడనీ అలంకారకృతవస్తుధ్వని. అద్భుతభావవ్యంజకంగా ఫలోత్ప్రేక్షను నన్నయ నిపుణంగా ప్రయోగించాడు.

**వ. అని దాని రమణీయభావంబుఁ బొగడుచుఁ జనుదెంచి యవ్వనంబు సొచ్చునప్పుడు 16**

**ప్రతిపదార్థం:** అని= ఆవిధంగా; దాని= ఆవనంయొక్క; రమణీయ, భావంబున్= అందమైన విధానాన్ని; పొగడుచున్= మెచ్చుకొంటూ; చనుదెంచి= వచ్చి; ఆ+వనంబు, చొచ్చునప్పుడు= ఆవనంలో ప్రవేశించేటప్పుడు (గసడదవాదేశం).

**తాత్పర్యం:** ఆవిధంగా దుష్యంతుడు ఆ వనసౌందర్యాన్ని మెచ్చుకొంటూ వచ్చి ఆ వనంలో ప్రవేశించే సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. అతిరుచిరాగతుం డయిన యాతనికిన్ హృదయప్రమోద మా**
**తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాపవ**
**ర్జిత కుసుమాక్షతావళులు సేసలు వెట్టినయట్టిరైరి సం**
**పత దళినీనినాదమృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్. 17**

**ప్రతిపదార్థం:** అతిరుచిర+ఆగతుండు+అయిన= మిక్కిలి ఒప్పిద మైన ఆగమనం కలవాడైన; (ఆగతమంటే ఆగమనం - భావేక్తః- సు+ఆగతము= స్వాగతం కలవాడు అని భావం); ఆతనికిన్= ఆ దుష్యంతుడికి; హృదయ, ప్రమోదము= మనస్సులోని ఆహ్లాదం; ఆతతముగన్= అధికమయ్యేటట్లుగా; ఆ+వనంబున= ఆ వనంలోని; లతాలలనల్= తీగ లనెడి వనితలు; సంపతత్, అళినీ, నినాద, మృదుభాషలన్= అటూ ఇటూ తిరుగుతున్న ఆడుతుమ్మెదల ఝుంకారాలు (ధ్వనులు) అనే మెత్తనిమాటలతో; దీవనలు= ఆశీస్సులను, శుభాకాంక్షలను; ఒప్పన్= తగినవిధంగా; ఇచ్చుచున్= ఇస్తూ; మృదుల+ అనిల+అపవర్జిత, కుసుమ+అక్షత+ఆవళులు= మెల్లని(మెత్తని) గాలులచేత రాల్పబడిన పూవులు అనెడి అక్షతల సమూహాలను; సేసలు, పెట్టిన, అట్టిరు+ఐరి= తలంబ్రాలుగా పోసినవా రైనారు-లేదా-ఆశీఃపురస్సరంగా అక్షతలు చల్లినవారైనారు.

**తాత్పర్యం:** మిక్కిలి సముచితంగా వచ్చిన ఆ దుష్యంతుడికి మనస్సులోని ఆహ్లాదం అధికమయ్యేటట్లుగా ఆ వనంలోని లతలనే వనితలు అటూ ఇటూ ఎగురుతున్న ఆడుతుమ్మెదల ఝుంకారధ్వనులనెడి మెత్తనిమాటలతో తగిన విధంగా ఆశీస్సులను ఇస్తూ, మెల్లనిగాలులచేత రాల్పబడిన పూవు లనెడి అక్షతలసమూహాన్ని తలంబ్రాలుగా చల్లినట్లు భాసించారు.

**విశేషం:** అలం: రూపకం, ఉత్ప్రేక్ష, సముచితంగా ప్రవేశించిన రాజుకు సముచితమైన స్వాగతం లభించినట్లు నన్నయ వర్ణించాడు. లతాలలనలు కల్యాణగీతాలతో పుష్పాక్షతలను తలంబ్రాలు పోసినట్లు మీదచల్లారని చేసిన ఈవర్ణనం దుష్యంతుడికి జరుగబోయే కల్యాణాన్ని సూచిస్తున్నది. భావికథార్థవ్యంజకమైన ఈపద్యం నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తికి రుచిరార్థసూక్తికీ చక్కని ఉదాహరణం. పద్యరచనలో అక్షరరమ్యత ప్రసాదమిశ్రితమైన మాధుర్యగుణాన్ని పోషిస్తూ శృంగారవ్యంజకంగా, ఆస్వాదయోగ్యంగా అమరింది. సవర్ణదీర్ఘాక్షరాల సంయోజనం పద్యానికి గీతికామాధుర్యాన్ని కలిగిస్తున్నది. నన్నయకవితాలక్షణాలన్నీ అమరిన అందమైన పద్య మిది.

**వ. మఱియును. 18**

**తాత్పర్యం:** ఇంకను. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. కాఱడవిఁ బఱచు మృగముల । నూఱడకం దిగిచి డస్సియున్నతని శ్రమం**
**బాఱఁగ నెడఁ బరితాపము । దీఱఁగఁ బైవీచె నన్నదీపవనంబుల్. 19**

**ప్రతిపదార్థం:** కాఱడవిన్= దట్టమైన అడవిలో; పఱచు, మృగములన్= పరుగెత్తే జంతువులను; ఊఱడకన్= విరామంలేకుండా; తిగిచి= చంపి, వేటాడి; డస్సి, ఉన్న, అతని= అలసియున్న ఆ దుష్యంతుడియొక్క; శ్రమంబు+ఆఱఁగన్= బడలిక తొలగేటట్లు; ఎడన్= మనస్సులోని; పరితాపము, తీఱఁగన్= తాపం తీరేటట్లుగా; ఆ+నదీ, పవనంబుల్= ఆ నదియొక్కగాలులు; పై, వీచెన్= దుష్యంతునిమీద ప్రసరించెను.

**తాత్పర్యం:** దట్టమైన అడవిలో పరుగెత్తే మృగాలను విరామం లేకుండ వెంటాడి వేటాడటంచేత అలసియున్న దుష్యంతుడి బడలిక తీరేటట్లు, మనసులోని తాపం తగ్గేటట్లు ఆ నదిమీదనుండి వచ్చే చల్లనిగాలులు అతనిపై వీచాయి.

**మానిని. ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగు ఠావుల, జొంపములం**
**బూచిన మంచియశోకములన్, సురపొన్నలఁ, బొన్నల, గేదఁగులం,**
**గాచి బెడంగుగఁ బండిన యాసహకారములం, గదళీతతులం**
**జూచుచు, వీనుల కింపెసఁగన్ వినుచున్ శుకకోకిల సుస్వరముల్. 20**

**ప్రతిపదార్థం:** ఏచి= విజృంభించి (పొడవుగా); తనర్చి= ప్రకాశించి పెరిగి; తలిర్చిన= చిగురులువేసిన; క్రోవులన్= ఎర్రగోరంటచెట్లచే; ఇమ్మగు= సొగసైన; ఠావులన్= తావులను; జొంపములన్= గుబురులుగా; పూచిన= పూలు పూసిన; మంచి, అశోకములన్= అనువైన అశోకవృక్షాలను; సురపొన్నలన్= సురపొన్న వృక్షాలను; పొన్నలన్= పొన్నచెట్లను; గేదఁగులన్= మొగలిచెట్లను; కాచి= కాయలుకాసి; బెడంగుగన్= బాగుగా; పండిన= పండియున్న; ఆ సహకారములన్= ఆ తీయమామిడిచెట్లను; కదళీ, తతులన్= అరటిచెట్ల సమూహాలను; చూచుచున్= చూస్తూ; వీనులకున్= చెవులకు; ఇంపు+ఎసఁగన్= ప్రీతికలిగేటట్లుగా; శుక, కోకిల, సుస్వరముల్= చిలుకలపలుకులు, కోకిలపాటలు (సుస్వరాలు); వినుచున్= వింటూ.

**తాత్పర్యం:** పొడవుగా పెరిగి చిగురించిన ఎర్రగోరంటచెట్లచే అంద మైన తావులనూ, గుబురులుగా పూలు పూసిన మంచిఅశోకవృక్షాలనూ, సురపొన్నలనూ, పొన్నలనూ, మొగలిపొదలనూ, చక్కగా కాయలు కాసి పండిన అందమైన తియ్యమామిడిచెట్లనూ, అరటిచెట్లగుంపులనూ చూస్తూ చిలుకలపలుకులను, కోకిలలమధురస్వరాలను చెవులకు పండువుగా వింటూ- (మీది పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: రూపకం, మానినీవృత్తంలోని ప్రతిచరణంలోనూ 7 భగాణాలపై ఒక గురువు ఉంటుంది. 1-13-19 అక్షరాలకు ఒక యతి చొప్పున మూడు యతిస్థానాలుంటాయి. నన్నయ మాత్రం 13వ అక్షరానికి మాత్రమే యతిమైత్రిని పాటించాడు. తెలుగులో ఆ, ఈఅనేవర్ణాలు ప్రసిద్ధినీ, విశేషాన్నీ, మహత్త్వాన్నీ, నిర్దేశాన్నీ సూచిస్తుంటాయి.

**కవిరాజవిరాజితము.**

**చని చని ముందట నాజ్య హవిర్ధృత సౌరభ ధూమలతాతతులం**
**బెనఁగిన వ్రాఁకుల కొమ్మలమీఁద నపేతలతాంతము లైనను బా**
**యని మధుపప్రకరంబులఁ జూచి జనాధిపుఁ డంత నెఱింగెఁ దపో**
**వన మిది యల్లదె దివ్యమునీంద్రునివాసము దానగు నంచు నెదన్. 21**

**ప్రతిపదార్థం:** చని, చని= వెళ్ళివెళ్ళి; ముందటన్= ఎదురుగా; ఆజ్య, హవిః, ధృత, సౌరభ, ధూమలతా, తతులన్= యజ్ఞాలలో హోమం చేసే హవి స్సయిన నేతివాసనచేత ధరింపబడిన వాసనలు కల పొగలను కలిగిన (పొగచూరిన) తీగలయొక్క సమూహాలతో; పెనఁగిన= అల్లుకొనిపోయిన; వ్రాఁకుల, కొమ్మల, మీఁదన్= చెట్లయొక్క కొమ్మలపై; అపేత, లతాంతములు+ఐనను= తొలగిన పూవులు కలిగిన వైనా (పూవులులేని వైనా అనిభావం); పాయని= (చెట్లను) విడిచిపెట్టని; మధుప, ప్రకరంబులన్= తుమ్మెదలయొక్క గుంపులను; చూచి; జన+అధిపుఁడు= ప్రజలకు ప్రభువైన ఆ దుష్యంతుడు; అంతన్= అపుడు; ఇది= ఈప్రదేశం; తపస్+వనము= (ఋషులు) తపస్సు చేసుకొనటానికి అనువైన అడవి; అల్ల+అదె= ఆ కనపడేదే (సమీపవాచకం); దివ్య, ముని+ఇంద్రు, నివాసము= మహిమాన్వితులైన మునులలో (ఇంద్రునివంటివాడు) శ్రేష్ఠుడైన వాడియొక్క ఉండేచోటు; తాను+అగున్, అంచున్= అయిఉండవచ్చునని; ఎదన్= మనస్సులో; ఎఱింగెన్= తెలిసికొన్నాడు.

**తాత్పర్యం:** ఆవిధంగా చాలదూరం వెళ్ళి ఎదురుగా యజ్ఞహవిస్సులైన నేతులవాసనలుగల పొగలతో చూరిన తీగలతో అల్లుకొని ఉన్న చెట్లకొమ్మలమీద పూవులు లేకున్నప్పటికీ విడిచివెళ్ళకుండా ఉన్న తుమ్మెదగుంపులను చూచి, ఆ ప్రాంతం తపోవన మనిన్నీ, దగ్గరలో ఉన్నది దివ్యమునీంద్రుడియొక్క నివాస మనిన్నీ అపుడు దుష్యంతుడు మనసులో తెలిసికొన్నాడు.

**విశేషం:** కవిరాజవిరాజితంలోని ప్రతిచరణంలోనూ 1 నగణం, 6 జగణాలూ, 1 వగణం వరుసగా ఉంటాయి. 1, 8, 14, 20 అక్షరాలు యతిస్థానాలు. ప్రాసనియమం ఉన్నది. నన్నయ మాత్రం 14వ అక్షరంతో మాత్రమే యతిమైత్రిని పాటించి ఒక యతికే ప్రాధాన్య మిచ్చాడు. మానినీవృత్తపాదంలోని మొదటి గురువును రెండు లఘువులుగా మారిస్తే కవిరాజవిరాజిత మౌతుంది. మానినీ, కవిరాజవిరాజితాలు రెండున్నూ జంటగా కుదిరి శకుంతలాదుష్యంతుల భావికల్యాణ సమాగమాన్ని సూచిస్తున్నవి. వనాలకంటె, ఉద్యానవనాలకంటె తపోవనానికి ఉండే విలక్షణత్వాన్ని నన్నయ ఈవర్ణనంలో చిత్రించాడు. కొమ్మలకు తీగలు అల్లుకోవటం, ఆతీగలపూలమీద తుమ్మెదలువ్రాలటం సామాన్యవనాలస్వభావం. కాని, తపోవనంలో, పూలు, పూలవాసన లేకపోయినా లతలు హవిస్సులపొగవలన కలిగిన వాసనతో తుమ్మెదలను అమితంగా ఆకర్షిస్తున్నాయి. నాగరకజీవితంలోని విలాసగృహస్థధర్మంకంటె ఆశ్రమంలోని నియమసహితగృహస్థధర్మంలోని గాఢత్వాన్ని నన్నయ వ్యంజింపచేస్తున్నాడు. హవిస్సులవాసన అక్కడిస్త్రీల (శకుంతలాదుల) పాతివ్రత్యస్వభావవ్యంజకం.

**వ. ఇట్లు హృదయసుఖావహం బగుచున్న యవ్వనంబులో నరిగి యరిగి యనవరత మహాద్విజ పఠ్యమానవేదధ్వనులను, నవిచ్ఛిన్న హూయమానాగ్ని హోత్రస్వాహాశబ్దంబులను, ననేకమునిగణప్రణీత వచన విషయ విభాగ వినిర్ణయన్యాయనిపుణ విద్వత్సభాసంభాషణఘోషంబులను, బ్రతిపక్ష దుర్విభేద ప్రమాణ విచార్యమాణ వేదార్థ మీమాంసక గోష్ఠీవివాద నాదంబులనుంజేసి మ్రోయుచు, యజ్ఞప్రయోగప్రవీణు లయిన యాజ్ఞికులకును విహితానుష్ఠానాసక్తులయిన యనుష్ఠాతలకును నధికతపోనిరతు లయిన**

**మహాతపోధనులకును నివాసం బయిన పుణ్యనదీతీరంబునఁ దద్దయు రమ్యం బయి గంగాతీరంబున**
**నరనారాయణస్థానంబునుంబోలె జగత్పావనం బైన కణ్వమహాముని యాశ్రమంబు గని యందు. 22**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; హృదయ, సుఖ+ఆవహంబు+అగుచున్+ఉన్న= మనస్సుకు హాయిని కలిగిస్తూ ఉన్న; ఆ+వనంబులోన్+అరిగి= ఆ వనంలోకివెళ్ళి; అనవరత, మహత్, ద్విజ, పఠ్యమాన, వేద, ధ్వనులను= ఎల్లప్పుడు గొప్ప బ్రాహ్మణులచేత చదువబడుతున్న వేదాలయొక్క స్వరనాదాలను; అవిచ్ఛిన్న, హూయమాన+అగ్నిహోత్ర, స్వాహా, శబ్దంబులను= ఎడతెగకుండ హోమం చేయబడుతున్న అగ్నిహోత్రానికి చెందిన స్వాహా అనే శబ్దాలను; అనేక, మునిగణ, ప్రణీత, వచన, విషయ, విభాగ, వినిర్ణయ, న్యాయ, నిపుణ, విద్వత్, సభా, సంభాషణ, ఘోషంబులను= పెక్కుమంది మునుల సమూహాలచేత రచింపబడిన వాక్యతాత్పర్యాలను విభజించి అర్థనిర్ణయం చేసే న్యాయశాస్త్రనిపుణు లైన పండితులయొక్క సభలలో జరిగే సంభాషణల సవ్వడులను; ప్రతిపక్ష, దుర్విభేద, ప్రమాణ, విచార్యమాణ, వేద+అర్థ, మీమాంసక, గోష్ఠీ వివాదనాదంబులనున్+చేసి= ప్రతిపక్షం (ఎదురువాదం) చేసేవారికి చిక్కువిడదీయరాని ప్రమాణాల (ఉపపత్తుల)తో ఆలోచింపజేస్తూ ఉన్న వేదతాత్పర్యం గల మీమాంసకులయొక్క చర్చలలోని వాదప్రతివాదాల ధ్వనులచేత; మ్రోయుచున్= సవ్వడిఔతూ; యజ్ఞ, ప్రయోగ, ప్రవీణులు+అయిన= యజ్ఞాలను నిర్వహించటంలో నిపుణులైన; యాజ్ఞికులకును= యజ్ఞం చేయించే ఋత్విక్కులకును; విహిత+అనుష్ఠాన+ఆసక్తులు+అయిన= వేదశాస్త్రాలలో చెప్పబడిన యోగ్య మైన తపోజపాదు లైన ఆచరణయోగ్యా లైనవాటిని అనుసరించటంలో ఆసక్తి కలవారు ఐన; అనుష్ఠాతలకును= కర్మనిష్ఠులకును; అధిక, తపః, నిరతులు+అయిన= గొప్పదైన తపస్సుచేయటంలో ఆసక్తికలవారు ఐన; తపస్+ధనులకును= తపస్సే ధనంగా గలవారి (తపస్వుల)కిని; నివాసంబు+అయిన= నివసించే ప్రదేశమైన; పుణ్యనదీ తీరంబునన్= పవిత్రమైన నదియొక్క ఒడ్డున; తద్దయున్, రమ్యంబు+అయి= మిక్కిలి సుందరమై; గంగా, తీరంబునన్= గంగానది ఒడ్డున; నర, నారాయణ, స్థానంబునున్, పోలెన్= ప్రాచీనములైన నరనారాయణులయొక్క నివాసస్థలంవలె; జగత్పావనంబు+ఐన= లోకాలను పవిత్రం చేసే; కణ్వ, మహత్, ముని, ఆశ్రమంబున్+కని= కణ్వమహర్షియొక్క ఆశ్రమాన్ని చూచి.

**తాత్పర్యం:** ఆ విధంగా దుష్యంతుడు హృదయానికి ఆహ్లాదం కలిగించే ఆ వనంలో ప్రవేశించి వెళ్ళివెళ్ళి, నిరంతరం పదక్రమంగా పఠింపబడుతున్న ఉత్తమవిప్రుల వేదనాదాలచేత, నిరంతరాయంగా అగ్నిలో వేల్వబడుతున్న హవిస్సులకు సంబంధించిన స్వాహాశబ్దాలచేత, అనేక మునులు ప్రతిపాదించిన వాక్యాలలోని (చేసిన నిర్వచనాలలోని) విషయాలను విభజించి అర్థనిర్ణయం చేసే న్యాయశాస్త్ర నిపుణులైన పండితులసభలలో జరిగే సంభాషణల ఘోషలతో, ప్రతిపక్షం చేసేవారికి చిక్కువిడదీయరాని ప్రమాణాలతో వేదార్థవిచారణ చేసే మీమాంసకుల చర్చలలోని వాదిప్రతివాదాలవలన కలిగే సవ్వడుల చేతనూ శబ్దిస్తూ, యజ్ఞాలను నిర్వహించటంలో నిపుణులైన ఋత్విక్కులకు, వేదవిహితాలైన కర్మలను అనుసరించే నిష్ఠాపరులకు, మహాతపోధనులకు నివాస ప్రదేశమై, గంగానదీతీరంలోఉన్న నరనారాయణులు నివసించేప్రదేశంవలె పుణ్యనదీతీరంలో సుందరంగా శోభిల్లుతూ లోకాన్ని పవిత్రం చేస్తూన్న కణ్వమహాముని ఆశ్రమాన్ని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఆర్షధర్మానికి ఆలవాలమైన ఋష్యాశ్రమంలో సాగే నిత్యకార్యక్రమాలను నన్నయ ఇందులో నిపుణంగా సూచించాడు. తపోవనంలో దుష్యంతుడు ప్రవేశించి ముందుకు సాగుతూ క్రమంగా వృక్షలతాది ప్రకృతి సంపదనూ, యజ్ఞయాగాది క్రతువులు నిర్వహిస్తూ వేదశాస్త్రాధ్యయనాలు సాగిస్తున్న మునుల సమూహాలనూ దర్శించాడు. వనంలోని అంతర్భాగాలలో ప్రవేశించి తర్వాత క్రమంగా కణ్వమహర్షియొక్క శాంతగుణంచేత ప్రభావితమైన ఆశ్రమజీవితం గోచరిస్తుంది. నన్నయ లోకజ్ఞతకు ఇది నిదర్శనం.

**సీ.** **శ్రవణసుఖంబుగా సామగానంబులు । చదివెడు శుకముల చదువు దగిలి**
**కదలక వినుచుండు కరులయుఁ గరికర । శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు**
**కణముల చల్లనిగా డ్పాసపడి దానిఁ । జెంది సుఖం బున్న సింహములయు,**
**భూసురప్రవరులు భూతబలుల్ తెచ్చి । పెట్టు నీవారాన్న పిండతతులు**

**తే.** **గడఁగి భక్షింప నొక్కటఁ గలిసియాడు । చున్న యెలుకలుఁ బిల్లుల యొండు సహజ**
**వైరివర్గంబులయు సహవాస మపుడు । సూచి మునిశక్తి కెంతయుఁ జోద్య మంది.** **23**

**ప్రతిపదార్థం:** శ్రవణ, సుఖంబు, కాన్= చెవులకు పండుగుగా; సామగానంబులు= సామవేదాన్ని సస్వరంగా పాడటాలను; చదివెడు= యథాతథంగా పలుకుతూన్న; శుకముల= చిలుకలయొక్క; చదువు= పాండిత్యమందు, చదివేపద్ధతియందు; తవిలి= ఇష్టపడి; ఆసక్తిచెంది; కదలక, వినుచున్న, కరులయున్= కదలకుండా తన్మయత్వంతో వింటున్న ఏనుగులయొక్కయు; కరి, కర, శీతల, ఛాయన్= ఏనుగుల తొండాలయొక్క చల్లని నీడలో; తద్+శీకర+అంబు, కణముల= ఆ తొండాలవలని నీటితుంపురులయొక్క; చల్లని, గాడ్పు+ఆసపడి= చల్లనిగాలిని కోరుకొని; దానిన్+చెంది= ఆ చల్లగాలిని పొంది; సుఖంబు+ఉన్న, సింహములయున్= హాయిగా ఉన్న సింహాలయొక్కయు; భూసుర, ప్రవరులు= బ్రాహ్మణశ్రేష్ఠులు; భూత, బలుల్= పక్షులు, జంతువుల వంటి జీవులకు ఆహారంగా; తెచ్చిపెట్టు= తీసికొనివచ్చి వివిధప్రదేశాలలో ఉంచే; నీవార+అన్న, పిండతతులున్= నివ్వరిధాన్యంతో వండిన అన్నపుముద్దల సమూహాలను; కడఁగి= పూని; భక్షింపన్= తినటానికి; ఒక్కటన్= ఒకచోట; కలిసి, ఆడుచున్, ఉన్న= కలసిమెలసి తిరుగుతున్న; ఎలుకలున్, పిల్లుల= ఎలుకలయొక్క, పిల్లులయొక్క; ఒండు, సహజ, వైరి, వర్గంబులయున్= పరస్పరం సహజంగా వైరం గల జాతులయినప్పటికీన్నీ; సహవాసము= కలిసిఉండే స్వభావాన్ని, సాహచర్యాన్ని, మైత్రిని; అపుడు, చూచి= ఆ సమయంలో కనుగొని; మునిశక్తికిన్= మునియొక్క మహిమకు; ఎంతయున్= ఎంతగానో; (అమితంగా); చోద్యము+అంది= ఆశ్చర్యపడి.

**తాత్పర్యం:** చెవులపండువుగా చిలుకలు సామవేదాన్ని సస్వరంగా పాడే పద్ధతులలో ఆసక్తిపొంది తన్మయత్వంతో కదలకుండా వింటున్న ఏనుగులూ, ఏనుగులతొండాల చల్లని నీడలలో వాటి నీటితుంపురుల చల్లనిగాలిపై ఆశపడి దాన్ని పొంది సుఖంగా ఉన్న సింహాలూ, బ్రాహ్మణశ్రేష్ఠులు భూతబలులు తెచ్చి వివిధప్రదేశాలలో నీవారధాన్యపు అన్నపిండాలను ఉంచగా వాటిని తినాలని వేగిరపడుతూ ఒకచోట కలిసిమెలసి తిరుగుతున్న ఎలుకలూ పిల్లులూ, అవి తమతమ మధ్య పరస్పరం సహజంగా ఉన్న వైరిస్వభావం గల వర్గాలైనప్పటికీ కలసిమెలసి మసలే వాటి స్నేహప్రవృత్తిని చూచి మునిమహిమకు ఎంతగానో ఆశ్చర్యపడి.

**విశేషం:** ప్రకృతిపురుషుల పరస్పరప్రభావాన్ని వర్ణించటం ఉత్తమకావ్యకళ. శమ దమ సమన్వితుడు, కరుణాహృదయుడు, సమచిత్తుడు అయిన కణ్వమహర్షి తమ మహిమను తపోవన జీవులపై వేసి వాటిమధ్య వైరుధ్యం లేని సహజీవన శాంత ప్రవృత్తిని కలిగించాడు. కణ్వముని మాహాత్మ్యాన్ని ఆశ్రమప్రకృతివర్ణనంద్వారా వ్యంజింపజేస్తున్న ఈపద్యం ధ్వనికావ్యరచనకు చక్కని ఉదాహరణం. శకుంతలాదుష్యంతుల జీవితంలో విరుద్ధభావాలకు సంఘర్షణ ఏర్పడగా ప్రసాదించేది కణ్వమహర్షి సహనధర్మశీలమే.

**వ.** **'ఇక్ష్వాకృపుం డైన కణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద; నా వచ్చునంతకు నందఱు నిచ్చోటన యుండునది' యని.** **24**

**ప్రతిపదార్థం:** ఈ+కాశ్యపుండు+ఐన= కశ్యపుని వంశానికి చెందిన ఈ; కణ్వ, మహత్+మునీంద్రునకున్= కణ్వుడనే గొప్ప మునిశ్రేష్ఠునకు; నమస్కరించి, వచ్చెదన్= మ్రొక్కివస్తాను; నా, వచ్చు, అంతకున్= నేను (తిరిగి) వచ్చేంతవరకున్నూ; అందఱున్= మీరందరుకూడ; ఈ+చోటన్+అ= ఈప్రదేశంలోనే; ఉండునది= ఉండవలెను; అని= అని పలికి.

**తాత్పర్యం:** 'కశ్యపప్రజాపతి వంశజుడైన ఈ కణ్వమహర్షిని దర్శించి నమస్కరించి తిరిగివస్తాను. నేను వచ్చేంతవరకు మీరందరూ ఇక్కడే ఉండండి' అని పలికి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. వలయు నమాత్యులం దగినవారల నుండఁగఁ బంచి ధారుణీ**
**తలవిభుఁ డొక్కరుండ చని తన్విఁ బయోజదళాయతాక్షి సం**
**కుల మిళితాళినీల పరికుంచిత కోమలకుంతలన్ శకుం**
**తల యను కన్యకం గనియెఁ దన్మునివల్లభు మందిరంబునన్. 25**

**ప్రతిపదార్థం:** వలయు+అమాత్యులన్= (ఋష్యాశ్రమాలను దర్శించేటప్పుడు రాజువెంట) ఉండదగిన, అత్యవసరమైన మంత్రులను; తగినవారలన్= యోగ్యులను, సమర్థులను; ఉండఁగన్, పంచి= అక్కడే ఉండటానికి ఆజ్ఞాపించి; ధారుణీతల, విభుఁడు= రాజయిన దుష్యంతుడు; ఒక్కరుండు+అ= ఒక్కడే(ఒంటరిగానే); చని= వెళ్ళి; తన్విన్= సన్నని శరీరం కలదానిని; పయోజ, దళ+ఆయత+అక్షిన్= తామరపూలరేకుల వలె విశాలమైన కన్నులు కలదానిని; సంకుల, మిళిత+అళి, నీల, పరికుంచిత, కోమల, కుంతలన్= దట్టంగా కూడిఉన్న తుమ్మెదల వలె నల్లనై మిక్కిలి వంకరలైన సుకుమారాలైన ముంగురులను కలిగినదానిని; శకుంతల+అను, కన్యకన్= శకుంతల అనే పేరుగల కన్యను; తద్+మునివల్లభు, మందిరంబునన్= ఆ మునిశ్రేష్ఠుడైన కణ్వుడియొక్క నివాసంలో; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** తనవెంట వస్తున్న ముఖ్యు లైన మంత్రులను, అనుచరులను అక్కడే ఉండేటట్లు నియమించి దుష్యంతుడు ఒంటరిగానే వెళ్ళి, మునిశ్రేష్ఠుడైన కణ్వుడి నివాసంలో సన్నని మేను కలిగినది, తామరపూలరేకులవంటి విశాలమైన కన్నులు కలది, ఒత్తుగా గుమికూడిన తుమ్మెదవలె నల్లగా వంకరలైన మెత్తని ముంగురులు కలది, అయిన శకుంతల అనే కన్యను చూచాడు.

**విశేషం:** అలం: ఉపమ, వృత్త్యనుప్రాసం. ఈ పద్యరచనలో 'ల' అనే అక్షరం తరచుగా వినిపించి శకుంతల సౌందర్య లావణ్యాలను ధ్వనింపజేస్తున్నది. ఇది నన్నయ రచనలోని అక్షరరమ్యత. కణ్వుడిని దర్శింపవచ్చిన దుష్యంతుడు ఆశ్రమంలో మునికిబదులు శకుంతలను చూచినట్లు వర్ణించటం విశేషం, శకుంతల మధురమూర్తిని వర్ణించటంలో నన్నయ మాధుర్యగుణం పోషించాడు.

**వ. అదియును ననంతవిలాసంబున జయంతుండ పోని దుష్యంతు నెఱింగి, యతిసంభ్రమంబున నాసనార్ఘ్య పాద్యాది విధులం బూజించి, కుశలం బడిగి యున్న, నక్కన్యకం జూచి దుష్యంతుం డి ట్లనియె. 26**

**ప్రతిపదార్థం:** అదియునున్= ఆ శకుంతలకూడ; అనంత, విలాసంబునన్= అపారమైన శరీరసహజహావభావాలతో; జయంతుండు+అ, పోని= జయంతుడివలెనేఉన్న; దుష్యంతున్+ఎఱింగి= దుష్యంతుడిని తెలిసికొని; అతి, సంభ్రమంబునన్= మిక్కిలి (ఆదరగౌరవాలతోకూడుకొన్న) తొట్రుపాటుతో; ఆసన+అర్ఘ్య, పాద్య+ఆది, విధులన్= కూర్చుండటానికి ఆసనం. త్రాగటానికి నీరు, కాళ్ళుకడుగుకొనటానికి నీరు, ఇవ్వటం మొదలైన అతిథిసత్కార విధానాలచేత; పూజించి= గౌరవించి;

కుశలంబు+అడిగి, ఉన్నన్= క్షేమాన్ని తెలిసికొని ఉండగా; ఆ+కన్యకన్= ఆ శకుంతలను; చూచి; దుష్యంతుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** శకుంతలకూడా అపారసహజశరీరహావభావాలు కలిగి, ఇంద్రుడికుమారుడైన జయంతుడితో పోల్చదగిన సౌందర్యంతో ఉన్న దుష్యంతుడిని తెలిసికొని, ఆదరగౌరవాలతో కూడుకొన్న తొట్రుపాటుతో ఆసనం, అర్ఘ్యం, పాద్యం మొదలైన అతిథి సపర్యలను చేసి పూజించి, క్షేమాదులను తెలిసికొని ఉండగా, ఆ కన్యను చూచి దుష్యంతుఁడు ఈవిధంగా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. 'క్రచ్చఱ వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా**
**వచ్చితి; మెందుఁ బోయిరొకొ వా?' రనినన్ విని యాలతాంగి ' వా**
**రిచ్చటినుండి యీక్షణమ యేఁగిరి కానకుఁ బండ్లుదేర; మీ**
**వచ్చు టెఱింగిరేని జనవల్లభ! వారును వత్తు రింతకున్. 27**

**ప్రతిపదార్థం:** క్రచ్చఱన్= సవిలాసంగా, వినోదంగా; వేఁట, వచ్చి= వేటకొరకు వచ్చి; ఇటన్= ఈ ఆశ్రమంలో; కణ్వ, మహత్+మునిన్= కణ్వుడనే గొప్పమునిని; చూచి, పోవఁగాన్= దర్శించి పోవటానికి; వచ్చితిమి= వచ్చాము (ఈబహువచనం స్వీయగౌరవవాచకం); వారు= కణ్వమహర్షి (ఇక్కడి బహువచనంకూడ గౌరవవాచకం); ఎందున్+పోయిరి+ఒకొ= ఎక్కడికి వెళ్ళినారో కదా!; అనినన్= అని అడుగగా; విని; ఆ, లతా+అంగి= తీగవలె శరీరంగల ఆ శకుంతల; వారు= ఆ కణ్వమహర్షి; ఇచ్చటినుండి= ఈ ఆశ్రమంనుండి; ఈ క్షణము+అ= ఇప్పుడే; కానకున్= అడవికి; పండ్లు తేరన్= పండ్లను తేవటానికి; ఏఁగిరి= వెళ్ళారు; మీ, వచ్చుట= మీరాకను; ఎఱింగిరి+ఏని= తెలిసికొన్నచో; జనవల్లభ= ఓరాజా!; వారును= ఆ కణ్వమహర్షికూడ; ఇంతకున్= ఈలోపుననే; వత్తురు= వస్తారు.

**తాత్పర్యం:** 'వినోదంగా వేటకు వచ్చి కణ్వమహామునిని దర్శించుకొని పోదా మని ఇక్కడకు వచ్చాను. వారు ఎక్కడికి పోయినారోకదా?' అని దుష్యంతుడు అడుగగా, లతాంగి అయిన శకుంతల ఇ ట్లన్నది: 'వారు ఇక్కడినుండి ఇంతకుముందే (ఈక్షణమే) పండ్లు తేవటానికి అడవిలోకి వెళ్ళారు. మీరాక వారికి తెలిస్తే, ఓరాజా! వారుకూడ ఇప్పుడే తిరిగివస్తారు'. (శకుంతల మాటలు తరువాయి వచనంలో కొనసాగుతున్నాయి.)

**వ. 'వారు వచ్చునంతకు నొక్కముహూర్తం బుండునది' యనిన విని యక్కోమలి వినయంబునకు మృదుమధురవచనంబులకు సంతసిల్లి, దానిం గన్యకగా నెఱింగి మనోజరాజ్యలక్ష్మియుంబోని దాని సర్వలక్షణ లక్షితంబు లయిన సర్వావయవంబులుం జూచి సంచలితహృదయుం డై 'నీ వెవ్వరి కూఁతుర? విట్టి రూపలావణ్యవిలాసవిభ్రమగుణసుందరి విందుల కేల వచ్చి'? తని యడిగిన నది యి ట్లనియె. 28**

**ప్రతిపదార్థం:** వారు, వచ్చు, అంతకున్= వారు తిరిగి వచ్చేవరకు; ఒక్క, ముహూర్తంబు= ఒక్కక్షణం (కొంచెంసేపు లేదా రెండు గడియల కాలం); ఉండునది= వేచియుండండి; అనినన్, విని= అని శకుంతల పలుకగా దుష్యంతుడు విని; ఆ, కోమలి, వినయంబునకున్= ఆ (మృదులస్వభావ యైన) శకుంతల అణకువకూ; మృదు, మధుర, వచనంబులకున్= మెత్తని,

తీయని మాటలకూ; సంతసిల్లి= సంతోషపడి; దానిన్= ఆ శకుంతలను; కన్యక, కాన్= వివాహం కాని వనితగా; ఎఱింగి= తెలిసికొని; మనోజ, రాజ్య, లక్ష్మియున్+పోని= మన్మథునియొక్క రాజ్యలక్ష్మివలెఉన్న; దాని= ఆశకుంతలయొక్క; సర్వ, లక్షణ, లక్షితంబులు+అయిన= అన్ని మంచి లక్షణాలు కలిగిన, సాముద్రిక చిహ్నాలు కల; సర్వ+అవయవంబులున్= శరీరఅవయవాల నన్నింటిని; చూచి; సంచలిత, హృదయుండు+ఐ= చలించిన మనస్సు కలవాడై(కోరిక కలవాడై అనిభావం); నీవు, ఎవ్వరి, కూఁతురవు= నీవు ఎవరియొక్క కుమార్తెవు?; ఇట్టి, రూప, లావణ్య, విలాస, విభ్రమ, గుణ, సుందరివి= ఇంతటి అపూర్వమైన ఆకారం, మేని నిగనిగ, సహజసుందర హావభావాలు, చేష్టలు అనే గుణాలచేత అందగత్తె వైన నీవు; ఇందులకున్= ఇక్కడికి, ఈ ఆశ్రమానికి; ఏల= ఏకారణంవలన; వచ్చితి(వి)= వచ్చావు? అని; అడిగినన్, అది= ఆ శకుంతల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** 'కణ్వమహాముని వనంనుండి తిరిగివచ్చేవరకు కొంతసేపు వేచి ఉండండి' - అని పలికిన ఆ శకుంతల వినయగుణానికీ, మెత్తని తియ్యని పలుకులకూ సంతోషించి, ఆమెను కన్యగా తెలిసికొని, మన్మథుని రాజ్యలక్ష్మివలె శుభలక్షణాలన్నింటితో కూడుకొన్న శరీరావయవాలు గల ఆమె సౌందర్యాన్ని చూచి స్పందించిన మనస్సుతో 'నీవు ఎవ్వరి కుమారితవు? ఇటువంటి అపూర్వ రూపాన్నీ లావణ్యాన్నీ సహజ శరీరహావభావ గుణాలు గల సుందరివి ఈ ఆశ్రమానికి ఏకారణంవలన వచ్చావు?' అని అడుగగా ఆమె ఇట్లా పలికింది.

**విశేషం:** అలం: తొలిచూపులోనే శకుంతలాదుష్యంతులకు అభిలాష కలిగింది. అనంతవిలాసంతో జయంతుడివలెనున్న అతని అందం ఆమెను ఆకర్షించింది; ఆమె వర్తనం సౌందర్యం మన్మథరాజ్యలక్ష్మివలె ఉన్న ఆమె రూపవైభవం అతడిని ఆకట్టుకొన్నాయి. ఆశ్రమంలో కంటె రాజసౌధంలో ఉండదగిన సుందరిగా ఆమెను భావించి ఆసక్తితో ఆమెనుగురించి అడిగాడు దుష్యంతుడు.

### శకుంతల దుష్యంతునకుఁ దనజన్మక్రమం బెఱింగించుట (సం. 1-65-14)

**క. 'జగతీవల్లభ! యే న । త్యగణిత ధర్మస్వరూపుఁ డని జనములు దన్**
**బొగడఁగ జగదారాధ్యుం । డగు కణ్వమహామునీంద్రునాత్మజ' ననినన్. 29**

**ప్రతిపదార్థం:** జగతీ, వల్లభ= లోకానికి నాథుడవైన ఓరాజా!; ఏను= నేను; అతి+అగణిత, ధర్మ, స్వరూపుఁడు+అని= మిక్కిలి గొప్పదయిన ధర్మముయొక్క రూపం వంటివాడు అని; జనములు= లోకములు; తన్= తనను (కణ్వుడిని); పొగడఁగన్= మెచ్చుకొంటూ ఉండగా; జగత్, ఆరాధ్యుండు+అగు= లోకాలచేత పూజింపదగినవాడు అయిన, కణ్వ, మహత్+ముని+ఇంద్రు, ఆత్మజన్= కణ్వుడుఅనేపేరుగల గొప్పమునిశ్రేష్ఠుడియొక్క కుమారితను; అనినన్= అనగా.

**తాత్పర్యం:** 'ఓ ప్రభువా! అపారమైన ధర్మమే రూపం దాల్చినవాడని ప్రజలు తనను ప్రశంసిస్తూ ఉండగా లోకపూజ్యుడై ఉన్న కణ్వమహామునీంద్రుడి కూతురిని నేను' అని అనగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. 'ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీలలితాంగియందు నా**
**హృదయము దద్దయుం దవిలె; నిష్పలు కింకను నమ్మనేర న**
**య్యెద; విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ బాయక విందు' నంచుఁ దా**
**నిది కలరూ పెఱుంగ నవనీపతి యుత్సుకుఁ డయ్యె నాత్మలోన్. 30**

**ప్రతిపదార్థం:** 'ఇది= ఈకన్యక (శకుంతల); ముని, కన్య, ఏని= మునియొక్క కూతురైనట్లయితే; మఱి= ఈవిధంగా అని భావం; ఏల+ఒకొ= ఏకారణంచేతనో; ఈ, లలిత+అంగి, అందున్= ఈకోమలిపై; నాహృదయము= నామనస్సు; తద్దయున్= బాగా(గాఢంగా); తవిలెన్= లగ్నమైనది; ఈ, పలుకు= (ఈమె చెప్పిన) ఈమాటను; ఇంకను, నమ్మనేరను+అయ్యెదన్= ఇప్పటికిన్నీ నమ్మజాలక ఉన్నాను; ఈ+మునిన్= ఈకణ్వమునిని; విజిత+ఇంద్రియుండు+అనఁగన్= జయింపబడిన ఇంద్రియాలు కలవాడని లోకులు అనగా (అనగా అవివాహితుడై బ్రహ్మచర్యవ్రతంలో ఉన్నా డని విన్నాను అనిభావం); పాయక= ఎల్లప్పుడూ; విందున్= వింటాను; అంచున్= అని తలుస్తూ; తాన్= తాను స్వయంగా; ఇది= ఈవిషయాన్ని (ద్వితీయకు మారుగా ప్రథమ); కల, రూపు+ఎఱుంగన్= ఉన్నది ఉన్నట్లుగా తెలిసికొనటానికి; అవనీ, పతి= రాజు (దుష్యంతుడు); ఆత్మలోన్= మనస్సులో; ఉత్సుకుఁడు+అయ్యెన్= ఆసక్తు డైనాడు.

**తాత్పర్యం:** 'ఈ శకుంతల మునికన్యయే అయినట్లయితే ఈకోమలిపై నామనస్సు ఎందుకు గాఢంగా లగ్నమైనది?' 'నే నీమెమాటను నమ్మజాలకుండా ఉన్నాను. ఈ కణ్వముని ఇంద్రియాలను జయించినవా డని ఎప్పుడూ వింటూ ఉంటాను' అని భావిస్తూ, 'ఈమె మాటలలోని యాథార్థ్యాన్ని ఉన్నది ఉన్నట్లు తెలుసుకోవా' లని మనస్సులో దుష్యంతుడు ఆసక్తిని పొందాడు.

**విశేషం:** దుష్యంతుడు క్షత్రియుడు. అతడి హృదయం శకుంతలయందు లగ్నమైనది. ఆమేమో తాను మునికన్య నని చెప్పింది. ఆమె నిజంగా మునికన్యయే అయితే అతని అంతఃకరణం ఆమెయందు ఆసక్తిని పొందేది కాదు. తన అంతః కరణం ధర్మబద్ధమైనదని దుష్యంతుడికి గాఢమైన విశ్వాసం. అది అతడి ఉత్తమసంస్కారానికి గుర్తు. మూలభారతంలో తన సంశయాన్ని దుష్యంతుడు సూటిగా శకుంతలతో చెప్పినట్లున్నది. దానిని నన్నయ దుష్యంతుడి ఆత్మగతంగా మార్చాడు. ఈ కల్పనంమీద కాళిదాసు రచించిన అభిజ్ఞానశాకుంతల నాటకంలోని "అసంశయం క్షత్రపరిగ్రహక్షమా । యదార్య మస్యా మభిలాషి మే మనః" "సతాం హి సందేహపదేషు వస్తుషు, ప్రమాణమంతఃకరణప్రవృత్తయః" అనే శ్లోకపాదాల ప్రభావం కనబడుతున్నది. తన మనస్సు ఆమెపై లగ్నమైనది కాబట్టి ఆమె క్షత్రియపరిగ్రహయోగ్యమైనదనిన్నీ, దానికి దుష్యంతుడి అంతఃకరణమే సాక్షి అనిన్నీ భావం.

**వ. ఇట్లు దుష్యంతుం డా శకుంతలజన్మం బెఱుంగ వేఁడి వెండియు దాని కి ట్లనియె. 31**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; దుష్యంతుండు; ఆ+శకుంతల జన్మంబు= ఆ శకుంతలయొక్క పుట్టుకనుగురించి; ఎఱుంగన్, వేఁడి, తెలిసికొనగోరి; వెండియున్= మరియు; దానికిన్= శకుంతలతో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుష్యంతుడు ఆవిధంగా ఆ శకుంతలపుట్టుకనుగురించి తెలిసికొనగోరి శకుంతలతో మరల ఈవిధంగా అన్నాడు.

**తే. ఉత్తమాశ్రమనిష్ఠితుఁ డూర్ధ్వరేతుఁ । డైన కణ్వమహాముని యనఘచరితుఁ;**
**డట్టిముని కెట్లు గూఁతుర వైతి? దీని । నాకు నెఱుఁగంగఁ జెప్పుము నలిననేత్ర! 32**

**ప్రతిపదార్థం:** నలిన, నేత్ర= పద్మాలవంటి కన్నులు కలదానా!; ఉత్తమ+ఆశ్రమ, నిష్ఠితుఁడు= ఉత్తమమైన ఆశ్రమమైన సన్న్యాసంలో నిష్ఠ కలిగినవాడున్నూ; ఊర్ధ్వ, రేతుఁడు= అధఃపతనం లేని రేతస్సు కలవాడు (ఇంద్రియనిగ్రహం కలవాడు) న్నూ; ఐన; కణ్వ, మహాముని; అనఘ, చరితుఁడు= కళంకంలేని చరిత్రకలవాడు; అట్టి= అటువంటి; మునికిన్; ఎట్లు= ఏవిధంగా; కూతురవు+ఐతి(వి)= కుమార్తె వైనావు; దీనిన్= ఈవిషయాన్ని; నాకున్= (దుష్యంతుడికి); ఎఱుఁగంగన్+చెప్పుము= తెలియజెప్పుము.

**తాత్పర్యం:** పద్మనేత్ర వైన ఓశకుంతలా! చతుర్విధాశ్రమాలలో ఉత్తమ మైన సన్న్యాసాశ్రమాన్ని నిష్ఠతో పాటించిన వాడూ, ఇంద్రియనిగ్రహం కలవాడూ అయిన కణ్వమహర్షి కళంకంలేని చరిత్రకలవాడు. అటువంటి ఆ మునికి నీ వెట్లా కూఁతుర వైనావు? ఆ సంగతి నాకు తెలియజెప్పుము.

**వ. అని యడిగిన నారాజునకు శకుంతల యి ట్లనియె. 33**

**ప్రతిపదార్థం:** అని, అడిగినన్= ఆ విధంగా అడుగగా; ఆ, రాజునకున్= ఆ రాజైన దుష్యంతుడికి; శకుంతల; ఇట్లు, అనియెన్= ఈవిధంగా అన్నది.

**తాత్పర్యం:** దుష్యంతుడు ఆవిధంగా అడుగగా శకుంతల ఈవిధంగా అన్నది.

**క. 'ఇక్కమలాక్షి శకుంతల । యెక్కడియది? దీని జన్మ మెవ్విధ?' మని త**
**మ్మొక్క మునినాథుఁ డడిగిన । నిక్కాశ్యపు లర్థిఁ జెప్పి రేను వినంగన్. 34**

**ప్రతిపదార్థం:** ఒక్కముని, నాథుఁడు= ఒక మునిశ్రేష్ఠుడు; ఈ+కమల+అక్షి= పద్మాలవంటి కన్నులు కల ఈ; శకుంతల; ఎక్కడి+అది= ఎక్కడినుండి వచ్చింది; దీని, జన్మము= ఈ శకుంతలయొక్క పుట్టుక; ఏ+విధము= ఎటువంటిది? అని; తమ్మున్= తమను (కణ్వమహర్షిని); అడిగినన్= అడుగగా; ఈ+కాశ్యపులు= కశ్యపవంశానికి చెందిన ఈ కాశ్యపులవారు; ఏను; వినంగన్= నేను వినేటట్లుగా; అర్థిన్= ప్రీతితో (సంస్కృతంలో ఈ అర్థం లేదు); చెప్పిరి= చెప్పారు (బహువచనం గౌరవసూచకం).

**తాత్పర్యం:** ఒకమునిశ్రేష్ఠుడు ఒకసారి కణ్వులవారిని ఈవిధంగా అడిగారు - 'పద్మాలవంటి కన్నులు గల ఈ శకుంతల ఎక్కడినుండి వచ్చింది? దీని పుట్టుపూర్వోత్తరా లేమిటి?' అని. అప్పుడు కణ్వులవారు నేనుకూడా వినేటట్లు ఈవిధంగా ప్రీతితో చెప్పారు.

**వ. 'నాజన్మప్రకారంబు మాయయ్య యమ్మునికిం జెప్పినవిధంబు చెప్పెదఁజిత్తగించివిను'మని యాదుష్యంతునకు శకుంతల యి ట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** మా+అయ్య= మాతండ్రి (కణ్వమహర్షి); నా, జన్మ, ప్రకారంబున్= నా పుట్టుక వృత్తాంతాన్ని; ఆ+మునికిన్, చెప్పిన, విధంబు, చెప్పెదన్= ఆ మునితో చెప్పిన పద్ధతిగానే విన్నవిస్తాను; చిత్తగించి= మనసుపెట్టి; వినుము+అని; శకుంతల; ఆ దుష్యంతునకున్; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** 'మా తండ్రిగారైన కణ్వమహర్షి నా జన్మవృత్తాంతాన్ని ఆ మునికి చెప్పిన పద్ధతిగా నీకు విన్నవిస్తాను. మనసుపెట్టి విను' మని శకుంతల దుష్యంతుడితో ఈవిధంగా అన్నది.

**విశేషం:** కణ్వుడు శకుంతలకు ఆమెవృత్తాంతాన్ని ఎన్నడూ ఆమెతో స్వయంగా చెప్పకపోవటం ఒకవిశేషం. ఒక మునితో చెప్పవలసివచ్చినప్పుడు ఆమెకూడా వినేటట్లు చెప్పటం ఔచిత్యం. ఇప్పుడు శకుంతల తనజన్మవృత్తాంతాన్ని తానే చెప్పుకొంటున్నట్లు కాకుండా కణ్వుడు మునికి చెప్పినట్లుగా చెప్పటం పరమౌచిత్యం. ఈ పద్ధతి వలన శకుంతల జన్మవృత్తాంతానికి ప్రామాణికత కలుగుతుంది. కణ్వపాత్ర రంగంమీద లేని లోపం తీరుతుంది. ఇది నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తి.

**సీ.** **అనఘుఁడు రాజర్షియై తపశ్శక్తిమై । బ్రహ్మర్షిభావంబుఁ బడసియున్న**
**సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోర । తపము సేయుచునున్నఁ దత్తపమున**
**కెంతయు వెఱచి దేవేశ్వరుఁ డప్సరో । గణములలో నగ్రగణ్య యైన**
**దాని మేనక యను ధవళాక్షిఁ బిలిచి 'వి । శ్వామిత్రుపాలికిఁ జని తదీయ**

**ఆ.** **ఘోరతపము చెఱిచి కోమలి! నా దైన ! దేవరాజ్యమహిమఁ దివిరి నీవు**
**గావు' మనిన నదియుఁ గడు భయంపడి యమ । రేశ్వరునకు మ్రొక్కియిట్టు లనియె.** **36**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= కళంకంలేనివాడు; రాజ+ఋషి+ఐ= రాజర్షి ఐ; (తపస్సాధనలో రాజర్షి కావటం ఒకస్థాయి; బ్రహ్మర్షి కావటం దాని పైస్థాయి, విశ్వామిత్రుడు రాజవంశంలో పుట్టి తపస్సుచేసి రాజర్షి అయినాడు); తపస్+శక్తి, మైన్= తపస్సుయొక్క బలంతో; బ్రహ్మ+ఋషి, భావంబున్= బ్రహ్మర్షి అనే స్థితిని (ఇది తపస్సాధనలో మిక్కిలి గొప్పది); పడసి, ఉన్న= పొందిఉన్న; సత్+ముని+ఈశ్వరుఁడు= ఉత్తములైన మునులలో గొప్పవాడైన; విశ్వామిత్రుఁడు; అతి, ఘోర, తపము= మిక్కిలి భయంకరమైన తపస్సును; చేయుచున్+ఉన్నన్= చేస్తూఉండగా; తద్+తపమునకున్= ఆ మహర్షియొక్క తపస్సుకు; ఎంతయున్, వెఱచి= మిక్కిలి భయపడి; దేవ+ఈశ్వరుఁడు, దేవతలకు రాజైన ఇంద్రుడు; అప్సరస్+గణములలోన్= అప్సరసలయొక్క సమూహాలలో; అగ్ర, గణ్య, ఐన, దానిన్= మొదట లెక్కింపదగిన దైన దానిని (శ్రేష్ఠురాలిని); మేనక, అను, ధవళ+అక్షిన్= మేనక అనే పేరుగల తెల్లని కన్నులు కలదానిని; పిలిచి; కోమలి!= మృదుస్వభావురాలా!; విశ్వామిత్రుపాలికిన్= విశ్వామిత్రుడి దగ్గరకు; చని= వెళ్ళి; తదీయ, ఘోర, తపము= అతనియొక్క భయంకరమైన తపస్సును; చెఱిచి= పాడుచేసి; నా+అది+ఐన= నాకు చెందిన; దేవ, రాజ్య, మహిమన్= దేవతల రాజ్య మైన స్వర్గంయొక్క గొప్పతనాన్ని; తివిరి= ప్రయత్నించి; నీవు; కావుము= కాపాడుము; అనినన్= అని చెప్పగా; అదియున్= ఆ మేనకకూడ; కడున్, భయము, పడి= మిక్కిలి భయపడి; అమర+ఈశ్వరునకున్= దేవతల ప్రభు వైన ఇంద్రుడికి; మ్రొక్కి= నమస్కరించి; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** రాజర్షి యై తపశ్శక్తితో బ్రహ్మర్షి భావాన్ని పొందియున్న పుణ్యాత్ముడు, మునిశ్రేష్ఠుడు అయిన విశ్వామిత్రుడు అత్యంతభయంకర మైన తపస్సు చేస్తూ ఉండగా, ఆ తపస్సుకు మిక్కిలి భయపడి దేవేంద్రుడు అప్సరోగణాలలో ఉత్తమురా లైన మేనకను పిలిపించి, 'ఓకోమలీ! నీవు ఆ విశ్వామిత్రుడి దగ్గరకు పోయి అతని భయంకర తపస్సును ఏ యత్నంతో నైనా భగ్నంచేసి నా స్వర్గరాజ్య గౌరవాన్ని నీవు రక్షించాలి' అని పల్కగా, మేనక అందుకు భయపడి ఇంద్రుడికి మ్రొక్కి ఈవిధంగా అన్నది.

**చ.** **వనజభవప్రభావుఁ డగువాని వసిష్ఠు నపత్యశోక మ**
**న్వననిధిలోన ముంచిన యవారితసత్త్వుఁడు నిన్నుఁ దొట్టి యీ**
**యనిమిషు లెల్లవానికి భయంపడుచుండుదు రట్టియుగ్రకో**
**పనుకడ కిప్డు డేఁగు మని పాడియె యిప్పని నన్నుఁ బంపఁగన్.** **37**

**ప్రతిపదార్థం:** వనజభవ, ప్రభావుఁడు+అగువానిన్= బ్రహ్మయొక్క మహత్త్వం వంటి మహత్త్వం కలిగిన; వసిష్ఠున్= వసిష్ఠ మహామునిని; అపత్యశోకము+అన్, వననిధిలోనన్= సంతానం (చనిపోవటం) వలని దుఃఖ మనే సముద్రంలో; ముంచిన= మునిగేటట్లు చేసిన; అవారిత, సత్త్వుఁడు= అడ్డులేని గొప్పతనం కలవాడు (విశ్వామిత్రుడు); నిన్నున్+తొట్టి= నిన్ను మొదలుకొని;

ఈ, అనిమిషులు, ఎల్లన్= ఈ దేవతలందరున్నూ; వానికిన్= ఆ విశ్వామిత్రుడికి; భయము+పడుచున్+ఉండుదురు= భయపడుతూ ఉంటారు; అట్టి, ఉగ్ర, కోపను, కడకున్= అటువంటి భయంకరమైన కోపంగలవాడైన విశ్వామిత్రుడి వద్దకు; ఇప్పుడు= ఈ పరిస్థితిలో; ఏఁగుము+అని= వెళ్ళుమని; ఈ+పనిన్= ఈకార్యంలో; నన్నున్, పంపఁగన్= నన్ను పంపటం; పాడి+ఎ= ధర్మమా? (ధర్మం కాదని భావం).

**తాత్పర్యం:** బ్రహ్మమహిమ వంటి మహిమ గల వసిష్ఠుడిని సైతం పుత్రశోకసాగరంలో ముంచినవాడు ఆ అనివార్యతేజస్వి విశ్వామిత్రుడు. నీవు మొదలుకొని దేవతలందరూ ఆ మహర్షి అంటే భయపడుతూ ఉంటారు. అట్టి భయంకర కోపస్వభావుడి పాలికి ఈ పనిమీద ఇప్పుడు నన్ను పొమ్మని చెప్పటం న్యాయం కాదు.

**విశేషం:** అలం: రూపకం. వసిష్ఠ మహర్షిని బ్రహ్మమహత్త్వం వంటి మహత్త్వం కలవాడని చెప్పటం; విశ్వామిత్రుడిని ఉగ్రకోపనుడు (రుద్రునివంటి కోపంకలవాడు) అనటం విశేషం. నూరుగురు పుత్రులు చనిపోవటంవలన కలిగే పుత్రశోకం సముద్రం వంటిదని రూపకం చేయటం సార్థకం. బ్రహ్మనే సముద్రంలో ముంచగలిగిన వాడికి దేవతలు ఒక్కలెక్కయా అని వ్యంగ్యం. దేవేంద్రాదులే భయపడుతూ ఉండగా కోమలికి ఆపని అసాధ్యమని భావం. ఉగ్రకోపనుని ఉగ్రత తరువాతి పద్యంలో వర్ణింపబడుతున్నది.

**ఉ. అమ్ముని యల్గి చూచుడును నాక్షణమాత్రన గోత్రధారుణీ**
**ధ్రమ్ములు వ్రయ్యు, నయ్యిసుము దక్కఁగ నంబుధు లింకు, మూఁడులో**
**కమ్ములు దిర్దిరం దిరుగు, గాడ్పు చలింపఁగ నోడు, నుగ్రతం**
**బమ్మినయట్టి కోపపరుపాలికి భామలు వోవ నోడరే. 38**

**ప్రతిపదార్థం:** ఆ+ముని= ఆమహర్షి (విశ్వామిత్రుడు); అల్గి, చూచుడును= కోపించి చూచిన వెంటనే; ఆ+క్షణమాత్రన్+అ= ఆ క్షణంలోపలే; గోత్ర, ధారుణీధ్రమ్ములు= సప్తకులపర్వతాలు; వ్రయ్యున్= బ్రద్దలౌతాయి; ఆ+ఇసుము, తక్కఁగన్= ఇసుక (మాత్రమే) మిగిలేటట్లుగా; అంబుధులు= సముద్రాలు; ఇంకున్= ఇంకిపోతాయి; మూఁడు, లోకమ్ములు= స్వర్గమర్త్యపాతాళాలు అనే మూడు లోకాలు; దిర్దిరన్= దిరదిర, గిరగిర; తిరుగున్= తిరుగును; గాడ్పు= వాయువు, గాలి; చలింపఁగన్= కదలటానికి, వీచేటందుకు; ఓడున్= జంకుతుంది; ఉగ్రతన్= తీవ్రమైన కోపభావంతో; పమ్మిన+అట్టి= అతిశయించినట్టి; కోపపరు, పాలికిన్= కోపస్వభావం కలవాడి యొద్దకు; భామలు= స్త్రీలు; పోవన్+ఓడరు+ఏ= వెళ్ళటానికి జంకరా? (జంకుతా రని భావం).

**తాత్పర్యం:** ఆ విశ్వామిత్రముని కోపించి చూస్తే ఆ క్షణంలోనే కులపర్వతాలన్నీ బ్రద్దలౌతాయి; అడుగున ఉన్న ఇసుకమాత్రమే మిగిలేటట్లు సముద్రాలన్నీ పూర్తిగా ఇంకిపోతాయి; మూడులోకాలూ గిరగిరా చక్రంవలె తిరిగిపోతాయి; గాలి కదలటానికికూడా జంకుతుంది. ఉగ్రస్వభావంతో అతిశయించే ఆ కోపపరుడి సమీపానికి భామలు పోవటానికి భయపడరా?

**విశేషం:** కులపర్వతాలు: మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము సప్తసముద్రములు: లవణసముద్రము, ఇక్షుసముద్రము, సురాసముద్రము, సర్పిస్సముద్రము, దధిసముద్రము, క్షీరసముద్రము, జలసముద్రము.

**వ. 'అయినను నానేర్చువిధంబున నమ్మునివరుచిత్తంబు మెత్తన చిత్తజాయత్తంబగునట్లుగాఁ జేసెద' నని వాసవు వీడ్కొని మేనక తనకు మందమలయానిలంబు దోడుగాఁ జనుదెంచి, హిమవత్పర్వతప్రదేశంబునం దపంబుసేయుచున్న విశ్వామిత్రు తపోవనంబు సొత్తెంచిన. 39**

**ప్రతిపదార్థం:** అయినను= అయినప్పటికీ; నా, నేర్చు, విధంబునన్= నేను నేర్చిన పద్ధతిలో; ఆ+మునివరు, చిత్తంబు= ఆ మునిశ్రేష్ఠుని మనస్సు; మెత్తన= తిన్నగా, లలితంగా; చిత్తజ+ఆయత్తంబు+అగునట్లు+కాన్= మన్మథునికి స్వాధీనమయ్యేటట్లుగా; చేసెదను+అని= చేస్తాను అనిచెప్పి; వాసవున్= దేవేంద్రుడిని; వీడ్కొని; మేనక; తనకున్= (మేనకకు); మంద, మలయ+అనిలంబు= మలయపర్వతంమీదనుండి వీచే మెల్లని చల్లగాలి; తోడుగాన్= వెంట రాగా; సాయపడగా; చనుదెంచి= వచ్చి; హిమవత్, పర్వత, ప్రదేశంబునన్= హిమవత్పర్వతప్రాంతంలో; తపంబు, చేయుచున్న= తపస్సుచేస్తూఉన్న; విశ్వామిత్రు= విశ్వామిత్రుడియొక్క; తపోవనంబు= తపస్సుకొరకైన అరణ్యాన్ని; చొత్తెంచినన్= ప్రవేశించగా.

**తాత్పర్యం:** 'అయినప్పటికి నేను నేర్చిన విధంగా (నాశక్తికొలది) ఆ మునిశ్రేష్ఠుని మనస్సును తిన్నగా మన్మథుడికి స్వాధీనమయ్యేటట్లుచేస్తాను'- అని చెప్పి దేవేంద్రుడిని వీడ్కొని మేనక చల్లని పిల్లగాలి వెంటరాగా బయలుదేరి వెళ్ళి హిమవత్పర్వతప్రాంతంలో తపస్సు చేసికొంటూ ఉన్న విశ్వామిత్రుడి తపోవనంలో ప్రవేశించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. చల్లని దక్షిణ మారుత । మల్లన వీతెంచెఁ దగిలి యా లలనా ధ**
**మ్మిల్ల కుసుమాంగరాగస । ముల్లసనసుగంధి యగుచు మునివరుమీఁదన్. 40**

**ప్రతిపదార్థం:** చల్లని, దక్షిణ, మారుతము= చల్లగా ఉండే మలయమారుతం; అల్లనన్= మెల్లగా; ఆ, లలనా, ధమ్మిల్ల, కుసుమ+అంగరాగ, సముల్లసన, సుగంధి, అగుచున్= ఆ వనిత (మేనక) యొక్క కొప్పులోని పూలవలనను, మైపూత వలనను అతిశయించిన మంచివాసన కలది ఔతూ; మునివరుమీఁదన్= మునిశ్రేష్ఠుడైన విశ్వామిత్రుడిమీద; తగిలి= విడువకుండా; వీతెంచెన్= ప్రసరించింది.

**తాత్పర్యం:** దక్షిణదిక్కునుండి వీచే చల్లని మలయానిలం ఆ మేనక కొప్పులోని పూలవాసనలచేతను, ఆమెమైపూతల సుగంధాలచేతను అమితంగా పరిమళిస్తూ ఆ మునిశ్రేష్ఠ డైన విశ్వామిత్రుడి మేనిపై విడువకుండా వీచింది.

**విశేషం:** పద్యంలోని ద్విరుక్త లకారప్రాస గాలి మెల్లగా వీచే లక్షణాన్ని అక్షరరమ్యంగా సూచిస్తున్నది. 'మునివర' లోని 'వర' శబ్దం మేనక ఇష్టసిద్ధిని స్ఫురింపజేస్తున్నది.

**వ. అంత. 41**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** ఆపైన (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. అనిమిషకాంతయున్ నవలతాంత విభూషణ లీల నల్లన**
**ల్లన వనకేళి లాలస విలాసగతిం జనుదెంచి ముందటం**

**గనియె మహామునిప్రవరుఁ గౌశికుఁ గౌశిక చిత్తభీతి సం**
**జనన మహాతపశ్చరణ సంయతచిత్తు నిరస్తచిత్తజున్. 42**

**ప్రతిపదార్థం:** అనిమిషకాంతయున్= దేవవనిత ఐన మేనకయు; నవ, లతాంత, విభూషణ, లీలన్= క్రొత్తవైన పూల అలంకారాల విలాసంతో; అల్లనన్+అల్లనన్= మెల్లమెల్లగా; వనకేళి, లాలస, విలాస, గతిన్= వనంలో విహరించే కోరికతో నైన కులుకునడకతో; చనుదెంచి= వచ్చి; ముందటన్= ఎట్టయెదుట; మహత్+ముని, ప్రవరున్= గొప్పమునులలో శ్రేష్ఠుడిని; కౌశిక, చిత్త, భీతి, సంజనన, మహత్+తపస్+చరణ, సంయత, చిత్తున్= ఇంద్రుడి మనస్సులో భయం పుట్టించే గొప్పదైన తపస్సు చేయటంలో నియతిగల మనస్సు కలవాడిని; నిరస్త, చిత్తజున్= తిరస్కరింపబడిన మన్మథుడిని కలిగినవాడిని; కౌశికున్= కుశికవంశానికి చెందిన విశ్వామిత్రుడిని; కనియెన్= చూచింది.

**తాత్పర్యం:** దేవకాంత అయిన మేనక క్రొత్తవైన పూల అలంకారాల విలాసంతో, మెల్లమెల్లగా వనంలో విహరించే కోరికతో కులుకుతూ నడుస్తూ వచ్చి తనముందట మహామునులలో శ్రేష్ఠుడూ, ఇంద్రుడిమనస్సులో భయంపుట్టించే గొప్పతపస్సు చేయటంలో నియతమైన మనస్సు కలవాడూ, మన్మథభావాన్ని జయించినవాడూ అయిన విశ్వామిత్రుడిని చూచింది.

**విశేషం:** రెప్పపాటు లేకుండా విశ్వామిత్రుడిని చూడటంవలన మేనకకు అనిమిషత్వం సార్థక మైన దని చమత్కారం. కౌశిక శబ్దాన్ని విశ్వామిత్రపరంగానూ, ఇంద్రపరంగానూ వాడటం విశేషం.

**క. అంబుజలోచన గని విన । యంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో**
**డం బుష్పాపచయ వ్యా । జంబున విహరించుచుండె సఖులుం దానున్. 43**

**ప్రతిపదార్థం:** అంబుజలోచన= పద్మాలవంటి కన్నులు గల మేనక; కని= విశ్వామిత్రుడిని చూచి; ఆ+మునికిన్; వినయంబునన్= అణకువతో; మ్రొక్కి= నమస్కరించి; అనురాగముతోడన్= ప్రీతితో; పుష్ప+అపచయ, వ్యాజంబునన్= పూలుకోసికొనటం అనే నెపంతో; సఖులున్, తానున్= చెలికత్తెలూ తానూ కలసి; విహరించుచున్+ఉండెన్= విహారం చేస్తూ ఉన్నది.

**తాత్పర్యం:** పద్మనేత్ర అయిన మేనక వినయంతో విశ్వామిత్రుడికి నమస్కరించి, ప్రీతితో పూలుకోసే నెపంతో చెలికత్తెలతో కలసి తానూ విహరిస్తూ ఉన్నది.

**విశేషం:** అంబుజలోచన అని వర్ణించటంలోనూ, బిందుపూర్వక సరళాక్షర ప్రాసలోనూ, నాదాక్షరాల, బిందుపూర్వక వర్ణాలప్రయోగంలోనూ నన్నయ అక్షరరమ్యంగా అనురాగభావాన్ని ధ్వనింపజేశాడు.

**చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభుమ్రోల నున్న స**
**మ్మిళిత సుగంధబంధురసమీరవశంబునఁ దూలి బాల పై**
**వలు వెడలన్ బయల్పడియె వల్దకుచంబులుఁ గక్షయుగ్మమున్**
**లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుత రోమరాజియున్. 44**

**ప్రతిపదార్థం:** తరుణి= యువతి(మేనక); అలసత, ఒప్పఁగాన్= అలసభావం తోపగా; ఆ+ముని, వల్లభు, మ్రోలన్= ఆ ఋషిశ్రేష్ఠుడి (విశ్వామిత్రుని) ముందట; ఉన్నన్= ఉండగా; సంమిళిత, సుగంధ, బంధుర, సమీర, వశంబునన్= మిళితమైన

మంచి వాసనగల ఒప్పిదమైన గాలివలన; బాల, పైవలువ= కోమలి పైపైట; తూలి= ఒరిగి; ఎడలన్= తొలగిపోగా; వల్గు, కుచంబులున్= పెద్దవైన చన్నులున్నూ; కక్ష, యుగ్మమున్= బాహుమూలల (చంకల) జంటయున్నూ; లలిత, కృశ+ఉదరంబున్= కోమలమైన సన్నని పొట్టయున్నూ (నడుమున్నూ); తరళ, త్రి, వళీయుత, రోమ, రాజియున్= మెరుస్తున్న కడుపుమీది మూడుమడతలతో కూడిన నూగారున్నూ; బయల్, పడియెన్= బయటపడినవి.

**తాత్పర్యం:** మేనక అలసభావం తోపగా ఆ ఋషిశ్రేష్ఠుడి ముందట ఉండగా, మంచివాసనతో కూడికొన్న గాలివలన కోమలి పైట ఒరిగి తొలగిపోయింది. అప్పుడు ఆమె పెద్దవైన వక్షోజాలూ, కోమలమైన సన్నని నడుమూ, మెరిసే కడుపుమీది మూడు మడతలతోకూడిన నూగారూ బయటపడ్డాయి.

**విశేషం:** మేనక శరీరాంగ సౌందర్యాన్ని వర్ణించే ఈపద్యరచనలో మాధుర్య మనే శబ్దగుణం పోషించి నన్నయ ఔచిత్యాన్ని పాటించాడు. ఆమె పైటను తొలగించిన గాలిని వర్ణించిన సమాసం మిగిలినవాటికంటె పొడుగ్గా ఉండటం శిల్పసుందరం. పైట తొలగినప్పుడు స్త్రీశరీరంలో కనపడే మన్మథస్థానాలను మాత్రమే వర్ణించటం రసవిభావస్ఫూర్తికి ఉద్దీపకం. అంతఃస్థాలను, అనునాసికాలను, బిందుపూర్వకవర్ణాలను వాడి మేనక సౌందర్యమాధుర్యాన్ని అక్షరరమ్యంగా నన్నయ అభివర్ణించాడు.

**క. అందుఁ దనదృష్టి నాటుడుఁ । గందర్ప నిశాత సాయకంబులు పెలుచన్**
**డెందముఁ గాఁడిన ధృతి సెడి । కంది మునీంద్రుండు దానిఁ గవయం దివిరెన్. 45**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రుండు= మునిశ్రేష్ఠుడు, విశ్వామిత్రుడు; అందున్= పైట తొలగిన ఆమె అందంలో; తనదృష్టి= తనయొక్క చూపు; నాటుడున్= తగులుకొనగా; కందర్ప, నిశాత, సాయకంబులు= మన్మథుని వాడియైన బాణాలు; పెలుచన్= అధికంగా; డెందమున్= హృదయాన్ని; కాఁడినన్= నాటగా; ధృతి+చెడి= నిబ్బరాన్ని (నిగ్రహాన్ని); కోల్పోయి; కంది= (విరహంచేత) తపించి; దానిన్= ఆమెను (మేనకను); కవయన్, తివిరెన్= కూడటానికి పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** విశ్వామిత్రుడు తనదృష్టి పైట తొలగిన మేనకమేనిసౌందర్యంలో చిక్కుకోవటంచేత, మన్మథుడు వేసిన వాడిబాణాలు మిక్కుటంగా తనహృదయంలో నాటగా, నిగ్రహాన్ని కోల్పోయి వలపుతాపంతో మేనకపొందుకొరకు పూనుకొన్నాడు.

**వ. మేనకయు విశ్వామిత్రు నిష్టంబునకుం దగిన కామోపభోగంబులం బెద్దకాలంబు రమియించిన నయ్యిద్దఱకు నిక్కన్యక పుట్టిన, దీని మాలిని యను నొక్కయేటి పులినతలంబునం బెట్టి మేనక దేవలోకంబునకుం జనియె; విశ్వామిత్రుండును దపోవనంబునకుం జనియె; నంత నమ్ముని ప్రభావంబున. 46**

**ప్రతిపదార్థం:** మేనకయున్= మేనకకూడ; విశ్వామిత్రు+ఇష్టంబునకున్= విశ్వామిత్రుడియొక్క కోర్కెకు; తగిన= ఉచితమైన; కామ+ఉపభోగంబులన్= మన్మథక్రీడలచేత; పెద్దకాలంబు= చాలకాలం; రమియించినన్= క్రీడించగా; ఆ+ఇద్దఱకున్= ఆ ఇరువురికి; ఈ+కన్యక= ఈ ఆడపిల్ల(శకుంతల); పుట్టినన్= పుట్టగా; దీనిన్= దీనిని (ఈశిశువును); మాలిని, అను+ఒక్క, యేటి, పులిన, తలంబునన్, పెట్టి= మాలిని అనే పేరు గల ఒక నదియొక్క ఇసుకతిన్నెపై ఉంచి; మేనక; దేవలోకంబునకున్= స్వర్గానికి; చనియెన్= వెళ్లింది; విశ్వామిత్రుండును; తపస్+వనంబునకున్= తపస్సు చేసికొనే అడవికి; చనియెన్= వెళ్ళాడు; అంతన్= ఆ మీద; ఆ+ముని, ప్రభావంబునన్= ఆ విశ్వామిత్రఋషియొక్క మహిమవలన.

**తాత్పర్యం:** మేనకకూడా విశ్వామిత్రుడి కోర్కెకు తగినట్లు మన్మథక్రీడలతో చాలకాలం భోగించగా వారిద్దరికి ఈకన్యపుట్టింది. మేనక ఈ బిడ్డను మాలినీనదీతీరాన ఒక ఇసుకతిన్నెమీద ఉంచి తాను దేవలోకానికి వెళ్ళిపోయింది. ఆ విశ్వామిత్రుడుకూడా తపోవనానికి వెళ్ళాడు. ఆ తరువాత ఆ మునిప్రభావంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** మూలభారతంలో శకుంతలను (శిశువుగా ఉన్నప్పుడు) పక్షులు తమకు తాము రక్షించినట్లు ఉండగా, నన్నయ ఆ రక్షణం మునిప్రభావంవలన కలిగిం దని అమూలకమైన హేతువును చూపించాడు. మునిమహిమను ప్రకటించే ఈ కల్పన సందర్భోచితం.

**ఆ. చెలఁగి లేవ నేడ్చు చిఱుతుకదానిఁ గ్ర। వ్యాదఘోరమృగము లశనబుద్ధిఁ**
**బట్టకుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు। కొని శకుంతతతులు గూడియుండె. 47**

**ప్రతిపదార్థం:** చెలఁగి= పూని, ప్రయత్నించి; లేవన్= లేవటానికై; ఏడ్చు= ఏడ్చే; చిఱుతుకదానిన్= చిట్టిపాప అయినదానిని; క్రవ్యాద, ఘోర, మృగములు= రాక్షసులూ, క్రూరమృగాలూ; అశన, బుద్ధిన్= తినాలనే కోర్కెతో; పట్టకుండన్= నోటకరవకుండ; చెట్టుపలన్= రెక్కలను; కప్పి= కమ్మి; రక్షించుకొని= కావాలని ఆప్యాయంగా కాపాడి; శకుంత, తతులు= పక్షులగుంపులు; కూడి, ఉండెన్= గుంపుగా కలసిఉన్నాయి.

**తాత్పర్యం:** చిట్టిపాపగా ఉన్న పసిగందు పైకిలేవటానికి చేతకాక ఏడుస్తూ ఉంటే ఆ అరుపు విని రాక్షసులూ, క్రూరమృగాలూ తినాలనే కోర్కెతో నోటకరచుకొనిపోకుండా పక్షులగుంపులు తమ రెక్కలతో ఆబిడ్డను రక్షించుకొంటూ గుమికూడిఉన్నాయి.

**విశేషం:** 'రక్షించుకొని' అనే ఆత్మనేపదార్థ క్రియతో పక్షు లా బాలపై ప్రదర్శించిన వాత్సల్యాతిశయాన్ని నన్నయ సూచించాడు.

**వ. అంత నేము శిష్యగణంబులతోడ సమిత్కుసుమ ఫలాహరణార్థం బక్కడకుం జని, యమ్మాలినీ పులినతలంబున శకుంతరక్షిత యై యున్న కూఁతు నత్యంతకాంతిమతి నవనీతలంబున కవతరించిన తరుణ శశిరేఖ యుంబోని దాని నెత్తుకొని వచ్చి, శకుంతరక్షిత యగుటఁ జేసి శకుంతల యను నామం బిడి కరంబు గారవంబునం బెనిచితిమి. 48**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ సమయంలో; ఏము= మేము (ఏను అనిచెప్పే గౌరవబహువచనం ఏము); శిష్యగణంబులతోడన్= శిష్యుల సమూహాలతో; సమిత్, కుసుమ, ఫల+ఆహరణ+అర్థంబు= సమిధలు, పూలు, పండ్లు, తేవటానికై; ఆ+కడకున్= ఆ ప్రదేశానికి; చని= వెళ్ళి; ఆ+మాలినీపులినతలంబునన్= ఆ మాలిని అనే పేరుగల నదియొక్క ఇసుకతిన్నె పై ; శకుంత, రక్షిత+ఐ= పక్షులచేత రక్షింపబడినది ఐ; ఉన్న; కూఁతున్= ఆ ఆడుశిశువును; అత్యంత, కాంతి, మతిన్= అపారమైన వెలుగుతోకూడిఉన్నదానిని; అవనీ, తలంబునకున్+అవతరించిన= నేలమీదికి దిగివచ్చిన; తరుణ, శశిరేఖయున్+పోని దానిన్= క్రొత్తదైన చంద్రకళను పోలిఉన్నదాన్ని; ఎత్తుకొని, వచ్చి= తీసికొని వచ్చి; శకుంత, రక్షిత, అగుటన్, చేసి= పక్షులచేత కాపాడబడినది కావటం చేత; శకుంతల, అను, నామంబు+ఇడి= శకుంతల అనే పేరుపెట్టి; కరంబు= మిక్కిలి; గారవంబునన్= మమకారంతో, ముద్దుగా; పెనిచితిమి= పెంచాము.

**తాత్పర్యం:** ఆ సమయంలో మేము శిష్యగణాలతో సమిధలు, పూలు, పండ్లు తెచ్చుకొనటానికి అక్కడికి వెళ్ళాము. మాలినీ నదీతీరంలోని ఒక ఇసుకతిన్నెమీద పక్షులచేత రక్షింపబడియున్న ఈ అమ్మాయి మిక్కిలి కాంతితో ప్రకాశిస్తూ నేలమీదకు దిగివచ్చిన క్రొత్తచంద్రరేఖవలె ఉండగా ఎత్తుకొని వచ్చాము. శకుంతాలచేత రక్షింపబడింది కాబట్టి ఆ బాలకు శకుంతల అనే పేరుపెట్టి కడు గారాబంగా పెంచాము.

**మధురాక్కర.**

**తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత**
**యును ననఁగ నింతులకు ముప్వు రొగిన గురువులు; వీర**
**లనఘ! యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు**
**ననఁగఁ బురుషున కియ్యేవు రనయంబును గురువులు. 49**

**ప్రతిపదార్థం:** తనరన్= ఒప్పారగా; జనకుండున్= జన్మ నిచ్చిన తండ్రియున్నూ; అన్న, ప్రదాతయును= అన్నంపెట్టి పోషించి ప్రాణం నిలిపిన అన్నదాతయున్నూ; భయ, త్రాతయున్= భయంనుండి కాపాడేవాడున్నూ; అనఁగన్= అని; ఇంతులకున్= స్త్రీలకు; ఒగిన= వరుసగా; వీరలు= వీళ్ళు (పైనపేర్కొన్నవారు); ముప్వురున్= ముగ్గురూ; గురువులు= తండ్రులు; అనఘ!= ఓ పాపరహితుడవైన మునీ!; పురుషునకున్= మగవాడికి; మఱియున్= పైముగ్గురేకాక ఇంకను; ఉపనేత= ఉపనయనం చేసినవాడూ; నిరంతర+అధ్యాపకుండున్= ఎల్లప్పుడు వేదాలను పాఠంగాచెప్పేవాడూ; ఈ+ఏవురున్= మొత్తం ఈ అయిదుగురు; అనయంబును= ఎల్లప్పుడూ; గురువులు= తండ్రులు.

**తాత్పర్యం:** స్త్రీలకు తండ్రులుగా కన్నవాడినీ, అన్నం పెట్టినవాడినీ, భయంనుండి రక్షించినవాడినీ మొత్తం వరుసగా ముగ్గురిని చెప్పుతారు; ఓ పుణ్యాత్ముడవైన మహర్షీ! పురుషులకు ఈ ముగ్గురేకాక ఉపనయనం చేసినవాడినీ, వేదాలు చెప్పినవాడినీ కలిపి మొత్తం అయిదుగురిని ఎల్లప్పుడూ తండ్రులుగా పరిగణిస్తారు.

**విశేషం:** మూలంలో - 'శరీరకృత్, ప్రాణదాతా, యస్య చాన్నాని భుంజతే' । క్రమేణైతే త్రయోఽప్యుక్తాః పితరో ధర్మదర్శనే'' - అని స్త్రీలకు గురువులు ముగ్గురే అని చెప్పబడి ఉండగా నన్నయ పురుషులకు అయిదుగురు గురువు లని విశేషించి పేర్కొన్నాడు. మధురాక్కర చరణంలో క్రమంగా 1 సూర్యగణం, 3 ఇంద్రగణాలు, 1 చంద్రగణం ఉంటాయి. నాల్గవగణం మొదటి అక్షరంతో యతి మైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**వ. 'అనం బరఁగిన శాస్త్రార్థంబున నేము దీనికి భయత్రాతల మగుటంజేసి గురుల; మిదియును మాచే నభివర్ధిత యగుటం జేసి మాకు హృదయానందని యైన కూఁతు' రని కణ్వమహాముని లమ్మునికిం జెప్పిన విధం బంతయు సవిస్తరంబుగా శకుంతల చెప్పిన విని దుష్యంతుం డాత్మగతంబున. 50**

**ప్రతిపదార్థం:** అనన్+పరఁగిన= ఈ విధంగా లోకప్రసిద్ధిచెందిన; శాస్త్ర+అర్థంబునన్= శాస్త్రప్రమాణంచేత; ఏము= మేము (కణ్వుడు); దీనికిన్= శకుంతలకు; భయత్రాతలము+అగుటన్+చేసి= భయాన్ని తొలగించినవారం కావటంచేత; గురులము= తండ్రులం (బహువచనం ఆత్మగౌరవ సూచకం); ఇదియును= ఈ శకుంతలకూడా; మాచే, అభివర్ధిత, అగుటన్+చేసి= మాచేత పెంచబడింది కాబట్టి; మాకున్, హృదయ+ఆనందని+ఐన, కూఁతురు= మాకు మనసుకు ఆనందాన్ని కలిగించే కూతురు; అని= ఈవిధంగా; కణ్వమహత్+మునులు; ఆ+మునికిన్; చెప్పిన, విధంబు+అంతయున్; సవిస్తరంబుగాన్=

వివరంగా; శకుంతల; చెప్పినన్; విని; దుష్యంతుండు; ఆత్మగతంబునన్= తనలో తాను స్వగతంగా (రాబోయే పద్యంలోవలె అనుకొన్నాడు).

**తాత్పర్యం:** 'ప్రసిద్ధ మైన ఈ శాస్త్రప్రమాణంచేత మేము శకుంతలకు భయత్రాతలం కావటంచేత గురువులం. ఈమెకూడా మాచేత పెంచబడి ఉండటంచేత మాకు మనసు కెక్కిన కూతురు' - అని కణ్వమహాముని ఆ మునికి చెప్పిన విధమంతా వివరంగా శకుంతల చెప్పగా విని దుష్యంతుడు తనలోతాను - (ఈవిధంగా అనుకొన్నాడు). (తరువాతి పద్యంతో అన్వయం.)

### దుష్యంతుండు శకుంతలను వివాహంబు సేసికొనఁ గోరుట (సం. 1-67-1)

**చ.** **ఇది మునినాథ కన్య యని యెంతయు నిఃస్పృహవృత్తి నున్ననా**
**హృదయము రాజపుత్త్రి నని యిక్కమలాక్షి నిజాభిజాత్య సం**
**పద నెఱిఁగించినన్ మదనబాణపరంపర కిప్పు డుండ నా**
**స్పద మయి సంచలించె నళిపాత వికంపిత పంకజాకృతిన్.** **51**

**ప్రతిపదార్థం:** ఇది= ఆమె (శకుంతల); మునినాథ, కన్య, అని= మునిశ్రేష్ఠుడి కూతు రని; ఎంతయున్= మిక్కిలి; నిస్+స్పృహవృత్తిన్= నిరాశతో; ఉన్న; నా హృదయము= (దుష్యంతుడి మనస్సు); ఈ+కమల+అక్షి= పద్మాలవంటి కన్నులుకల ఈ శకుంతల; రాజపుత్త్రిన్, అని= క్షత్రియుడి కూతురను అని; నిజ+ఆభిజాత్య, సంపదన్= తనయొక్క వంశవైభవాన్ని; ఎఱిఁగించినన్= తెలుపగా; ఇప్పుడు; మదన, బాణ, పరంపరకున్= మన్మథునియొక్క బాణాల వరుసకు; ఉండన్, ఆస్పదము+అయి= నెలవై, వశమై; అళిపాత, వికంపిత, పంకజ+ఆకృతిన్= తుమ్మెదలు వాలటంచేత చలించినపద్మంవలె; సంచలించెన్= కంపించింది.

**తాత్పర్యం:** శకుంతల మునికన్య యేమో అని మిక్కిలి నిరాశతో ఉన్న నా హృదయం ఈ పద్మాక్షి తాను రాజపుత్త్రినని తన వంశౌన్నత్యాన్ని తెలపటంచేత మన్మథబాణపరంపరకు వశమై తుమ్మెదలు వాలటంచేత కంపించిన పద్మంవలె చలించింది. (అని దుష్యంతుడు తనలో అనుకొన్నాడు).

**విశేషం:** అలం: ఉపమ. "ఇది మునికన్యయేని"..... అనే పద్యం, "ఇది మునినాథకన్యయని"...... అన్న ఈ పద్యం - ఈ రెండున్నూ నన్నయ ఈకథకు పెట్టిన రెండు వన్నెలు. దుష్యంతుడి ఉత్తమచిత్తవృతికి ఉదాహరణలు. కాళిదాసుడి అభిజ్ఞానశాకుంతల నాటకంలోని "భవ హృదయ సాభిలాషం సంప్రతి సందేహ నిర్ణయోజాతః" ఇత్యాది వాక్యాలు ఈ కథాసంవిధాన కల్పనలో నన్నయకు తోడ్పడి ఉంటాయి. "సతాం హి సందేహ పదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః" అనే శ్లోకతాత్పర్యాన్ని ఈపద్యభావం ధ్వనింపచేస్తున్నది. దశవిధమన్మథావస్థలలో మూడవదైన సంకల్పం ఇందులో సూచింపబడుతున్నది. పై రెండు పద్యాలూ చంపకమాలలే. అంటే వృత్తైక్యం పాటింపబడిందన్నమాట. రెండుపద్యాల ఎత్తుగడలూ సమానమే. ఇటువంటి వృత్త, గతిసామ్యాలు ఛందశ్శిల్పసంబంధి విశేషాలు. ఇవికూడా వస్తురస భావాలను ధ్వనింపజేస్తాయి. మొదటిపద్యంలో నాయకుడి హృదయంలో ఏర్పడిన శంక రెండవపద్యంలో నివృత్త మై రతిభావదీప్తికి ఏర్పడిన అడ్డంకి తొలగి రసస్థితికి చేరే వికాసం ఏర్పడింది. అందువలన ఈరెండుపద్యాలు నాయకగతమైన స్థాయి పోషణలో రెండు బలమైన బిందువులు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగా రీ పద్యద్వయ సన్నివేశ ప్రాశస్త్యాన్ని ఇట్లా పేర్కొన్నారు- "రెండుస్వగతములును సదృశతమము లైన చంపకము లందే నిబంధింపబడినవి. మొదటిదానియందుఁ దునిఁగిపోవచ్చిన దుష్యంతునిరతి రెండవదానియం

దతుకుకొని కొసలు సాగినది. శకుంతలా దుష్యంతుల ప్రణయకలాపమున కడ్డుగా జొచ్చుకొనివచ్చిన మేనకావిశ్వామిత్రుల శృంగారవృత్తాంతమున కుభయకూలములందును నిల్చి యీ రెండుపద్యములు అవాంతర కథాప్రవాహసేతునిబంధన ప్రయోజకములగు రెండు మహాస్తంభములవలె నున్నవి. ఇది ఛందస్సాధనముచే సాధింపబడిన కథాశిల్పము'' (నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి - పు. 162)

**వ. అనుచు మదనాతురుం డయి దుష్యంతుండు దనయం దక్కోమలియనురాగం బుపలక్షించి యి ట్లనియె. 52**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని తనలో తాను అనుకొంటూ; మదన+ఆతురుండు+అయి= మన్మథుడిచేత బాధింపబడినవాడై (కోరికను ఆపుకోలేనివాడై); దుష్యంతుండు; తనయందున్; ఆ+కోమలి, యనురాగంబు+ఉపలక్షించి= ఆ శకుంతలయొక్క ప్రీతిని గమనించి); ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా తనలో తాను అనుకొంటూ మనసులో మన్మథపరమైన భావాలు ఒత్తిడిచేయగా శకుంతల తనపై వలపుగొన్నట్లు గమనించి దుష్యంతుడు ఈవిధంగా పలికాడు.

**క. ఈ వల్కలాజినములకు । నీ వన్యఫలాశనముల కీ విటపకుటీ**
**రావాసములకు నుచితమె । నీ విలసిత రూపకాంతి నిర్మలగుణముల్. 53**

**ప్రతిపదార్థం:** నీ, విలసిత, రూప, కాంతి, నిర్మల, గుణముల్= నీ (శకుంతల) యొక్క (ప్రకాశితాలైన) అందమైన ఆకారము, దాని కాంతి, మచ్చలేని గుణాలు (అనేవి); ఈ వల్కల+అజినములకున్= ఈ నారచీరలకున్నూ; ఈ, వన్యఫల+అశనములకున్= ఈ అడవికి సంబంధించిన పండ్ల ఆహారాలకూ; ఈ, విటప, కుటీర+ఆవాసములకున్= ఈ పర్ణశాల నివాసాలకూ; ఉచితమె?= యోగ్యమైనదా? కాదని భావం.

**తాత్పర్యం:** నీ అందమైనరూపం, నీ మేనిప్రకాశం మచ్చలేని నీగుణాలు అనేవి ఈ నారచీరలు కట్టటానికీ, అడవిపండ్లు తింటూ ఉండటానికీ, ఈ ఆకుటిండ్లలో (పర్ణశాలలలో) నివసించటానికీ తగినవి కావు.

**విశేషం:** అందమైన రూపం నారచీరలు కట్టటం ఉచితం కాదు; మేనికాంతి అడవిపండ్లు తినటంవలన వాడిపోతుంది కాబట్టి అనుచితం. నిర్మలగుణాలు గల ఆమె మణులు పొదిగిన గృహాలలో ఉండదగింది కాబట్టి ఆశ్రమాలలో ఉండటం ఉచితం కాదని భావం. తన అభిలాషకు అనుకూలంగా ఆమెఅందం ఆశ్రమజీవితానికి అనుకూలం కాదని ప్రబోధించాడు (ప్రశంసించాడు) దుష్యంతుడు.

**ఉ. ఈ మునిపల్లె నుండు టిది యేల కరం బనురాగ మొప్పఁగా**
**భామిని! నాకు భార్య వయి భాసురలీల నశేషరాజ్య ల**
**క్ష్మీ మహనీయ సౌఖ్యముల మేలుగ నందు మనిందితేందుపా**
**దామలతుంగహర్మ్యముల హారిహిరణ్మయ కుట్టిమంబులన్. 54**

**ప్రతిపదార్థం:** భామిని!= ఓ శకుంతలా!; ఈ, ముని, పల్లెన్= ఈ మునులయొక్క పల్లెలో; ఉండుట. ఇది ఏల?= ఈవిధంగా ఉండటం ఎందుకు?; కరంబు= మిక్కిలి; అనురాగము, ఒప్పఁగాన్= వలపు అందగించగా; నాకున్= (దుష్యంతునికి); భార్యవు+అయి= ఇల్లాలివై; భాసుర, లీలన్= ప్రకాశించే వైభవంతో; అశేష. రాజ్య, లక్ష్మీ, మహనీయ, సౌఖ్యములన్= అపారమైన

రాజ్యసంపదవలని గొప్పవైన సుఖాలనూ; అనిందిత+ఇందు, పాద+అమల, తుంగ, హర్మ్యములన్= మచ్చలేని చంద్రకిరణాలవలె తెల్లని ఎత్తైన మేడలయొక్క; హారి, హిరణ్మయ, కుట్టిమంబులన్= అందమైన బంగారపు కట్టడాల పైభాగాలలో, మేలుగన్= ఇంపుగా, శుభంగా; అందుము= అందుకొమ్ము, అనుభవింపుము.

**తాత్పర్యం:** ఓ శకుంతలా! మును లుండే ఈపల్లెలో ఈవిధంగా ఉండటం ఎందుకు? మిక్కిలివలపు అందగించగా నాకు భార్యవు కమ్ము; ప్రకాశించే వైభవంతో అపారమైన రాజ్యసంపదవలన కలిగే సుఖాలను, మచ్చలేని చంద్రకిరణాలవలె తెల్లగానుండే ఎత్తైనమేడలలో అందమైన బంగారు కట్టడాల పైభాగాలలో మేలుగా అనుభవించుము.

**విశేషం:** పద్యం చిన్నచిన్న పదాలతో మొదలై సమాసాలతో ముగుస్తున్నట్లు సాగిన రచన శకుంతల అప్పటి దైన్యస్థితి నుండి పెండ్లి అయిన తరువాత క్రమంగా పొందే ఉన్నతస్థితిని స్ఫురింపచేస్తున్నట్లు దుష్యంతుడు పలికిన పద్ధతిని నన్నయ స్ఫురింపచేశాడు.

**సీ.** **'బ్రాహ్మంబు దైవంబుఁ బరఁగ నార్షంబుఁ బ్రా । జాపత్యమును రాక్షసంబు నాసు**
**రంబు గాంధర్వంబు రమణఁ బైశాచంబు । నను నెనిమిది వివాహములయందుఁ**
**గడుఁ బ్రశస్తములు సత్‌క్షత్త్ర వంశ్యులకు గాం । ధర్వ రాక్షసములు ధర్మయుక్తిఁ;**
**నీకును నాకును నెమ్మిఁ బరస్పర । ప్రేమంబు గాముండు పెంపఁదొడఁగెఁ**

**ఆ.** **గాన యెడయుఁ జేయఁగా నేల? గాంధర్వ । విధి వివాహ మగుట వినవె యుక్త'**
**మనిన లజ్జఁ జేసి యవనత వదన యై । యాలతాంగి యిట్టు లనియెఁ బతికి.** **55**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మంబు= సదాచారంగల వరుడిని వస్త్రాదులచేత అలంకరించి పూజించి చేసే కన్యాదానం; దైవంబున్= జ్యోతిష్టోమం మొదలైన యజ్ఞాలు ప్రారంభించేటప్పుడు యథావిధిగా ఆ యజ్ఞవిధిని నడిపిన ఋత్విజుడిని అలంకరించి చేసే వివాహం; పరఁగన్= ఒప్పగా; ఆర్షంబున్= ధర్మార్థం వరుడినుండి గోమిథునాన్ని తీసికొని కన్య నిచ్చి యథావిధిగా చేసే వివాహం; ప్రాజాపత్యమును= వరుడిచేత నేను ఇతర ఆశ్రమాలను వేటినీ స్వీకరించకుండ గృహస్థాశ్రమంలోనే ఉండి ధర్మాన్ని ఆచరిస్తాను' అని ప్రతిజ్ఞ చేయించి కన్యాదానం చేయటం; రాక్షసంబున్= కన్యను బలాత్కారంగా తీసికొని వచ్చి చేసికొనే వివాహం; ఆసురంబు= కన్యయొక్క తల్లిదండ్రులకూ, కన్యకూ యథాశక్తిద్రవ్య మిచ్చి యథేచ్ఛగా చేసికొనే వివాహం; గాంధర్వంబు= వధూవరులు పరస్పరం ప్రేమించుకొని చేసికొనే వివాహం; పైశాచంబున్= నిద్రిస్తూ కాని, త్రాగి మైమరచి కాని శీలాన్ని రక్షించుకోవటంలో పరాకుగా ఉన్న వనితను సంభోగేచ్ఛతో రహస్యంగా ఎత్తుకొనిపోయి చేసికొనే వివాహం; అను= అని చెప్పబడే; రమణన్= ఒప్పారు; ఎనిమిది, వివాహముల, అందున్= ఎనిమిది రకాల పెండ్లిండ్లలో; సత్, క్షత్త్రవంశ్యులకున్= మంచి క్షత్రియ వంశంలో పుట్టినవారికి; గాంధర్వ, రాక్షసములు= గాంధర్వవివాహమున్నూ, రాక్షస వివాహమున్నూ; ధర్మయుక్తిన్= ధర్మంతో కూడికొని ఉండటంచేత; కడున్, ప్రశస్తములు= ఎంతో మేలైనవి; నీకును, నాకును= నీకూ నాకూ (శకుంతలకూ, దుష్యంతుడికీ); నెమ్మిన్= ప్రీతితో; కాముండు= మన్మథుడు; పరస్పర, ప్రేమంబు= ఒకరిపై మరొకరికి అనురాగాన్ని; పెంపన్+తొడఁగెన్= ఎక్కువ చేస్తున్నాడు; కాన= కాబట్టి; ఎడయున్+చేయఁగాన్+ఏల= ఆలస్యంచేయటం ఎందుకు; గాంధర్వవిధిన్= గాంధర్వవివాహపద్ధతిలో; వివాహము+అగుట= పెండ్లిచేసికొనటం; యుక్తము, వినవె= సమంజసం సుమా!; అనినన్= అని పలుకగా; ఆ, లతాంగి= లతవంటి శరీరంకల ఆ శకుంతల; లజ్జన్, చేసి= సిగ్గుతో; అవనత, వదన, ఐ= వంచిన మొగం కలిగినదై (తలవంచుకొని); పతికిన్= రాజుతో; ఇట్టులు+అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** 'బ్రాహ్మం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, రాక్షసం, ఆసురం, గాంధర్వం, పైశాచం - అనే ఎనిమిది రకాలైన వివాహాలలో ఉత్తమక్షత్త్రియవంశాలకు చెందినవారికి గాంధర్వ రాక్షసవివాహాలు ధర్మంతోకూడి ఉండటంచేత మేలైనవి. ఇప్పుడు మన్మథుడు నీకూ నాకూ ప్రేమను ప్రీతితో పరస్పరం పెంపొందింపజేస్తున్నాడు కాబట్టి ఆలస్యం చేయటం మెందుకు? గాంధర్వవివాహపద్ధతిలో పెండ్లాడటం సమంజసం సుమా!' అని దుష్యంతుడు పలుకగా ఆ శకుంతల సిగ్గుతో తల వంచుకొని రాజుతో ఈవిధంగా అన్నది.

**విశేషం:** అష్టవిధ వివాహాలలో మొదటి నాలుగున్నూ బ్రాహ్మణులకు ఉచితమైనవి; గాంధర్వరాక్షసవివాహాలు క్షత్త్రియులకున్నూ, ఆసురం వైశ్యశూద్రులకున్నూ యోగ్యమైనవి. పైశాచికం ఎవ్వరూ అనుసరించతగింది కాదు - అని శాస్త్రాలు చెప్పుతున్నాయి. భారతదేశమంతటా మనుస్మృతి ప్రామాణికంగా పరిగణింపబడుతుంది. దాని తరువాత గౌతమ, బోధాయన, ఆపస్తంబాదులు రచించిన ధర్మశాస్త్ర గ్రంథాలు ఆయాకాలాలలో ప్రచారంలోకి వచ్చాయి. భారతదేశంలోని ఆయాప్రాంతాలవారికి, ఆయావర్గాలవారికి అవికూడా ప్రామాణికాలుగా ఉన్నాయి. త్రిలింగదేశంలో సామవేదులు గౌతమ ధర్మసూత్రాలనూ, మిగిలినవారు ఆపస్తంబసూత్రాలనూ అనుసరిస్తారు. కవిత్రయంవారు ముగ్గురూ ఆపస్తంబసూత్రులు, మనుధర్మాలతో ఆపస్తంబధర్మసూత్రాలు ఎడనెడ భేదిస్తాయి. ఆసందర్భాలలో నన్నయ మనుధర్మశాస్త్రాంశాలను అనుసరించి, ఆపస్తంబసూత్రాలు భేదించేఅంశాలను ప్రత్యేకించి పేర్కొనకుండా వదలటం గమనింపదగిన విషయం. రాజరాజనరేంద్రుడు 'మనుమార్గ' వర్తనుడు కావటం, వ్యాసనిబద్ధమహాభారతార్థానికి విరుద్ధం కాకుండా రచింపవలె నని ఆయన కోరటం దానికి కారణం కావచ్చు, దీనికి ఉదాహరణంగా అష్టవిధవివాహాల ప్రశంసను పేర్కొనవచ్చు. మనువు అష్టవిధవివాహాలు చెప్పాడు. వాటిలో ఆసురపైశాచాలు సర్వదా నిందించదగినవిగా పేర్కొన్నాడు. (మనుస్మృతి - 3- 21, 25). ఆపస్తంబుడు కేవలం ఆరింటినే చెప్పాడు. అవి - బ్రాహ్మ, దైవ, ఆర్ష, గాంధర్వ, ఆసుర, రాక్షసాలు. ఆపస్తంబుడు ప్రాజాపత్య, పైశాచాలను వదిలాడు. నన్నయ ఆపస్తంబసూత్రు డైనా అష్టవిధవివాహాలను పేర్కొన్నాడు. అయితే నింద్యాలను గురించి మాటాడలేదు. కథలో అవసరం లేదు కాబట్టి వదలి ఉండవచ్చును.

తిక్కన ఆనుశాసనిక పర్వంలో (2-226) బ్రాహ్మ, క్షాత్ర, గాంధర్వ, రాక్షస, ఆసుర వివాహాలను అయిదింటిని పేర్కొన్నాడు. ఇందులో క్షాత్రం క్రొత్తది. ఒకరినొకరు వలచినా రని తెలిసికొని పెద్దలు వధూవరులకు చేసే వివాహం క్షాత్రం. ఇది సంస్కృత భారతంలోనే ప్రస్తావించబడి ఉన్నది (సం.మ.భా. అను.44.9) దాన్ని తిక్కన యథాతథంగా గ్రహించాడు. అయితే, రాక్షస ఆసుర వివాహాలు ధర్మదూషితా లని పేర్కొన్నాడు. వివిధ ధర్మాలలో వాదు ఏర్పడినప్పుడు మనుశాస్త్రమే ప్రమాణ మని భారతం ప్రతిపాదిస్తున్న దని దీనివలన తాత్పర్యం ఏర్పడుతున్నది.

**క. కరుణానిరతులు ధర్మ । స్వరూపు లింతకు మదీయజనకులు సనుదెం**
**తురు; వారు వచ్చి నీ కి । చ్చిరేని పాణిగ్రహణము సేయుము నన్నున్. 56**

**ప్రతిపదార్థం:** కరుణా, నిరతులు= దయాపరులున్నూ; ధర్మస్వరూపులు= ధర్మమేరూపముతాల్చినవారున్నూ; (అయిన); మదీయ, జనకులు= నాతండ్రిగారు; ఇంతకున్= ఇంతలోనే; చనుదెంతురు= వస్తారు; వారు= కణ్వమహర్షి; వచ్చి; నీకున్, ఇచ్చిరి+ఏని= నీకు భార్యగా ఇవ్వటానికి అంగీకరిస్తే; నన్నున్= నన్ను; పాణిగ్రహణము, చేయుము= వివాహము చేసికొమ్ము.

**తాత్పర్యం:** దయాపరులు, ధర్మమే మూర్తికట్టినవారు అయిన మాతండ్రి కణ్వమహర్షులు ఇంతలోనే వస్తారు. వారు వచ్చి నన్ను నీకు భార్యగా కన్యాదానం చేస్తే నన్ను నీవు పెండ్లాడుము.

**క. అనిన దానికి దుష్యంతుం డి ట్లనియె. 57**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అని శకుంతల అనిన దానికి దుష్యంతుడు ఈవిధంగా పలికాడు.

**తే. తనకు మఱి తాన చుట్టంబు, తాన తనకు । గతియుఁ, ద న్నిచ్చుచోఁ దాన కర్త యనఁగ**
**వనజనేత్ర! గాంధర్వవివాహ మతి ర । హస్యమును నమంత్రకమును నగుచు నొప్పు. 58**

**ప్రతిపదార్థం:** వనజనేత్ర= పద్మాలవంటి కన్నులు కలదానా, శకుంతలా!; తనకున్, మఱి, తాను+అ, చుట్టంబు= తనకు చుట్టాలు మరెవ్వరు లేకుండా తానే తనకు చుట్టం కావటం; తాన, తనకున్, గతియున్= తనకు తానే దిక్కుకావటం; తన్నున్ (తనను)+ఇచ్చుచోన్, తాన, కర్త, అనఁగన్= తనను తాను ఇచ్చుకొనేటప్పుడు కన్యాదానం చేసే కర్తకూడా తానే కావటం; అనఁగన్= అని ప్రసిద్ధి చెందిన; గాంధర్వ, వివాహము= గాంధర్వవివాహం; అతి, రహస్యమును= మిక్కిలి గోప్యమున్నూ; అమంత్రకమును= మంత్రతంత్రాలు లేనిదిన్నీ; అగుచున్= ఔతూ; ఒప్పున్= ఒప్పారును.

**తాత్పర్యం:** ఓ కమలనేత్రా! తనకు తానే చుట్టం కావటం, తనకు తానే దిక్కు కావటం. తనను తాను ఇచ్చుకొంటున్నప్పుడు తానే కర్త కావటం అనే లక్షణాలతో ప్రసిద్ధి చెందిన గాంధర్వవివాహం మిక్కిలి గోప్యంగానూ, మంత్రతంత్రరహితంగానూ ఉంటుంది.

**వ. అని దుష్యంతుండు గాంధర్వవివాహస్వరూపంబు చెప్పి శకుంతల నొడంబఱిచిన నది యి ట్లనియె. 59**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; దుష్యంతుండు; గాంధర్వ, వివాహ, స్వరూపంబు= గాంధర్వవివాహం జరిగే పద్ధతి; చెప్పి= తెలిపి; శకుంతలను, ఒడంబఱిచినన్= శకుంతలను ఆ వివాహానికి అంగీకరించేటట్లు చేయగా; అది= ఆ శకుంతల; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నది.

**తాత్పర్యం:** పైవిధంగా దుష్యంతుడు గాంధర్వ వివాహం ప్రవర్తిల్లే పద్ధతిని చెప్పి శకుంతలను ఒప్పించాడు. అప్పుడామె దుష్యంతుడితో ఈవిధంగా అన్నది.

**చ. నరనుత! నీ ప్రసాదమున నా కుదయించిన నందనున్ మహీ**
**గురుతర యౌవరాజ్యమునకున్ దయతో నభిషిక్తుఁ జేయఁగా**
**వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో;**
**నిరుపమకీర్తి! యట్లయిన నీకును నాకును సంగమం బగున్. 60**

**ప్రతిపదార్థం:** నరనుత!= ప్రజలచేత కీర్తింపబడినవాడా!; నీ, ప్రసాదమునన్= నీ దయవలన; నాకున్; ఉదయించిన= పుట్టిన; నందనున్= కుమారుడిని; మహీ, గురుతర, యౌవరాజ్యమునకున్= గొప్పదైనభూమికి యౌవరాజ్యపదవియందు; అభిషిక్తున్, చేయఁగాన్= అభిషేకింపబడినవాడినిగా చేయటానికి; వరము= వరాన్ని; దయతోన్= దయతో; ప్రసన్నబుద్ధిన్= నిండుమనసుతో; అనవద్యముగాన్= ఉదాత్తంగా, తిరుగులేకుండా; నెమ్మితోన్= ప్రీతితో; దయ, చేయు(ము)= ఇమ్ము; నిరుపమకీర్తి= సాటిలేని కీర్తికలవాడా!; అట్లు+అయినన్= నే నడిగినవిధంగా జరిగితే; నీకును, నాకును= నీకున్నూ, నాకున్నూ; సంగమంబు= కలయిక, పెండ్లి; అగున్= అగును.

**తాత్పర్యం:** కీర్తిమంతుడ వైన దుష్యంతుడా! నీ అనుగ్రహంవలన నాకు పుట్టిన పుత్రునకు నీ విశాలసామ్రాజ్యానికి యౌవరాజ్యపదవిలో అభిషేకం చేసేవరాన్ని దయతోకూడిన నిండుమనసుతో ఉదాత్తంగా ప్రీతితో ఇమ్ము. సాటిలేని కీర్తికలవాడా! ఈవిధంగా అయితే నీకూ నాకూ వివాహ మౌతుంది.

**విశేషం:** 'నరనుత' అనే పదానికి 'నరవర' అనే పాఠాంతరం ఉన్నది. (నరవర= నరులలో శ్రేష్ఠుడైనవాడా); 'నిరుపమకీర్తి' కి 'నిరుపమదాన' అనే పాఠాంతరం ఉన్నది; 'సాటిలేనిదానం చేసేవాడా!' అనే సంబుద్ధి తా నడిగే వరాన్ని తప్పకుండా ఈయటం అతని దానప్రవృత్తికి తగిన దనే భావం శకుంతల ప్రకటించిందనే అర్థం స్ఫురిస్తుంది. శకుంతల తల్లిదండ్రులవలన తనకు కలిగిన అన్యాయం తన సంతతికి జరుగకూడ దని ముందే జాగ్రత్తపడి తన లోకజ్ఞతను ప్రదర్శించింది. నన్నయ రుచిరార్థసూక్తినిధి ఈపద్యం. ప్రతి పదం శకుంతల సౌముఖ్యాన్నీ, గడుసరితనాన్నీ నిపుణంగా చాటుతున్నది. మాటలన్నీ వాచ్యార్థంలో సంస్కృతి సౌగంధ్యంతో కూడి ఉన్నాయి. వాచ్యార్థస్ఫూర్తి తరువాత ప్రతీయమాన మయ్యే వ్యంగ్యార్థంద్వారా రుచిరంగా వెలుగొందే వైదగ్ధ్యం వాటిలో గోచరిస్తుంది. నీ ప్రసాదమున - దయతో - వరము - ప్రసన్నబుద్ధి - అనే మాటలతో దుష్యంతుడిని కోరుతున్నప్పుడు శకుంతల సాక్షాత్తు భగవంతుడిని అడుగుతున్నట్లు భక్తి వినయాలను ప్రదర్శించింది. నరనుత - నిరుపమ కీర్తి - అనవద్యముగా - అనే మాటలు వాడుతున్నప్పుడు లోకజ్ఞత ప్రకటించింది. ఇచ్చే వరం త్రికరణశుద్ధిగా తిరుగులేకుండా ప్రీతితో ఇవ్వాలని అడగటంలో నేర్పరితనం ఉన్నది. మాటతప్పితే ప్రజలలో నిరుపమానంగాఉన్న నీ కీర్తి మొక్కపోతుంది అని హెచ్చరించింది. ఇంతటి వ్యంగ్యార్థాన్ని వస్తుధ్వనికి అంగంగా వాడుకొనటం నన్నయ నేర్పరితనం. రాజు మదనాతురు డై సంగమాన్ని కోరుతున్నాడు. గాంధర్వవివాహం అనే ధర్మాన్ని చూపుతున్నాడు. ఆ తరువాతి సంగతి మాటాడటం లేదు. శకుంతల తనకూ తన సంతతికీ భద్రతకొరకు, దుష్యంతుడి అనురాగాన్ని పరీక్షించటంకొరకు ఈ వరం అడిగింది. 'నీకును నాకును సంగమంబగున్' అనటంలో గాంధర్వవిధిని అంగీకరించి, ఆతడి సంగమాన్ని మనసారా కోరుతున్నట్లు తెలిపింది. ఆమె మాటలలో ఎంతటి చొరవ ఉన్నదో అంతటి బిగువుకూడ ఉండటం నన్నయ సంభాషణరచనాచాతుర్యఫలం. రాజసభలో ఈ వరమే చర్చనీయాంశ మౌతుంది. కాబట్టి శకుంతలకథలో ఈపద్యం త్రాసులో ముల్లువంటిది. దుష్యంతుడు కణ్వమహర్షిదర్శనం చేసికొనకుండా నిష్క్రమించటానికీ, ఆ తరువాత శకుంతలను అంతః పురానికి పిలిపించుకొనకపోవటానికీ కల గూఢ మైన హేతువు ఆమె అడిగిన ఈవరమే. ఆమె పెద్దకోరిక కోరింది. అది పుత్రుడు పుట్టినప్పుడు ఫలిస్తుంది. పుత్రుడు పుట్టితే ఆమె తెలియపరచాలి. యౌవరాజ్య విషయం ఆ తరువాతిమాట, ఇట్లా ఎన్నో సన్నివేశాలపరంపరతో ముందుకథ నడవాలి. శకుంతలా గతంగా ఉన్న స్వీయభద్రతావిషయకమైన శంకయే భావికథలో ఒక గండంగా పరిణమించబోవటం వస్తుధ్వని విశేషం. ప్రసాదము, ప్రసన్నబుద్ధి - అనే పదాలు నన్నయరచనలో ప్రధానంగా కనబడే ప్రసాదగుణాన్నీ ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తినీ జ్ఞప్తికి తెప్పిస్తున్నాయి.

**వ. అనిన విని శకుంతల కెంతయు సంతోషంబుగా దాని కోరిన వరంబిచ్చి, గాంధర్వవివాహంబున నభిమతసుఖంబు లనుభవించి, యక్కోమలి వీడ్కొని 'నిన్నుఁ దోడ్కొనిరా నస్మత్ప్రధానవర్గంబుఁ గణ్వమహాముని పాలికిం బుత్తెంచెద' నని యూఅడ నొడివి దుష్యంతుండు నిజపురంబునకుం జనియె; నిట శకుంతలయుఁ దనచేసినదాని మునివరుం డెఱింగి యలిగెడునో యని వెఱచుచుండె; నంత నమ్మహాముని వనంబుననుండి కందమూలఫలంబులు గొని చనుదెంచి, లలితశృంగారభావంబున లజ్జావనతవదనయు నతిభీతచిత్తయు నైయున్న కూఁతుంజూచి, తన దివ్యజ్ఞానంబున నంతవృత్తాంతంబు నెఱింగి, క్షత్త్రియులకు గాంధర్వవివాహంబు విధిచోదితంబ యని సంతసిల్లి శకుంతల కి ట్లనియె. 61**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= అని చెప్పగా విని; ఎంతయున్; సంతోషంబున్; శకుంతలకున్; దాని, కోరిన, వరంబు+ఇచ్చి= ఆమెకోరిన వరం ఇచ్చి (ప్రథమకు షష్ఠి); గాంధర్వ, వివాహంబునన్; అభిమత, సుఖంబులు= ఇష్టసుఖాలు, (రతిసుఖాలు); అనుభవించి= పొంది; ఆ+కోమలిన్= ఆ శకుంతలను; వీడ్కొని= వెళ్ళివస్తానని; నిన్నున్= నిన్ను (శకుంతలను); తోడ్కొని, రాన్= తీసికొనిరావటానికి; అస్మద్, ప్రధాన, వర్గంబున్= నా మంత్రులను; కణ్వ, మహత్+ముని, పాలికిన్= కణ్వమహాముని దగ్గరకు; పుత్తెంచెదన్= పంపుతాను; అని= అనిచెప్పి; ఊఱడన్, నొడివి= సమాధానపడేటట్లు నచ్చజెప్పి; దుష్యంతుండు; నిజ, పురంబునకున్= తన రాజధానికి; చనియెన్= వెళ్ళాడు; ఇట= ఆశ్రమంలో; శకుంతలయున్= శకుంతలకూడ; తన, చేసిన, దానిన్= తానుచేసినపనిని; మునివరుండు= మునిశ్రేష్ఠుడైన కణ్వుడు; ఎఱింగి= తెలిసికొని; అలిగెడునో= కోపిస్తాడేమో; అని; వెఱచుచున్+ఉండెన్= భయపడుతూ ఉండింది; అంతన్= ఆ సమయంలో; ఆ+మహత్+ముని= ఆ కణ్వమహర్షి; వనంబుననుండి= అడవినుండి; కందమూల, ఫలంబులు, కొని= కందగడ్డలు, పండ్లు తీసికొని; చనుదెంచి= వచ్చి; లలిత, శృంగార, భావంబునన్= సున్నితమైన శృంగారహావభావాలతో; లజ్జా+అవనత, వదనయున్= సిగ్గుచేత వంచబడిన ముఖం కలిగినదియున్నూ; అతి, భీత, చిత్తయున్= మిక్కిలి భయపడిన హృదయం కలిగినదియున్నూ; ఐ; ఉన్న; కూఁతున్, చూచి= కూతురిని చూచి; తన, దివ్య, జ్ఞానంబునన్= తనయొక్క దివ్యదృష్టితో; అంత, వృత్తాంతంబున్+ఎఱింగి= జరిగిన కథనంతటిని తెలిసికొని; క్షత్త్రియులకున్= రాజులకు; గాంధర్వవివాహంబు; విధి, చోదితంబు+అ, అని= శాస్త్రసమ్మతమే అని; సంతసిల్లి= సంతోషించి; శకుంతలకున్= శకుంతలతో ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శకుంతలమాటలు విని అమితసంతోషంతో ఆమె కోరిన వరాన్ని ఇచ్చి, గాంధర్వవివాహ మాడి, ఇష్టసుఖాలను అనుభవించి, ఆకోమలిని వీడ్కొని 'నిన్ను వెంటబెట్టుకొని రావటానికి మంత్రులను కణ్వమహాముని వద్దకు పంపుతా'నని ఆమెను సమాధానపరచి, ఒప్పించి, దుష్యంతుడు తన నగరానికి వెళ్లిపోయాడు. ఇక ఇక్కడ ఆశ్రమంలో శకుంతలకూడ తాను చేసిన పనిని కణ్వమహర్షి తెలిసికొని కోపగిస్తాడేమో అని భయపడుతూ ఉన్నది. అప్పుడు కణ్వమహర్షికందమూలాలను, పండ్లను కోసికొని వనంనుండి తిరిగివచ్చి సున్నితమైన శృంగారహావభావాలతో సిగ్గుతో తలవంచుకొని భయపడుతూ ఉన్న తనకూతురు శకుంతలను చూచి దివ్యజ్ఞానంతో జరిగిన కథనంతా తెలిసికొన్నాడు. 'క్షత్త్రియులకు గాంధర్వవివాహం శాస్త్రసమ్మతమే' అని సంతోషించి శకుంతలతో ఈవిధంగా అన్నాడు.

**విశేషం:** కణ్వుడు కరుణానిరతు డనీ, ధర్మస్వరూపు డనీ శకుంతల చెప్పింది. ఆమెమాటలను ఆ మహర్షి తనవర్తనంద్వారా నిరూపించుకొన్నాడు.

## భరతుని జననము. ( సం.1-68-1)

**తే.** **తల్లి! నీకులగోత్ర సౌందర్యములకుఁ । దగిన పతిఁ గంటి; దానికిఁ దగఁగ గర్భ**
**మయ్యెఁ; నీదు గర్భమున వాఁ డఖిలభువన । వహన మహనీయుఁ డగు చక్రవర్తి సుమ్ము.** **62**

**ప్రతిపదార్థం:** తల్లి= అమ్మా! (తల్లిదండ్రులు కూతుళ్ళను ఆప్యాయంగా పిలిచే పిలుపు); నీ, కుల, గోత్ర, సౌందర్యములకున్= నీకులానికీ, గోత్రానికీ, అందానికీ; తగిన= యోగ్యుడైన; పతిన్= భర్తను; కంటి(వి)= పొందావు; దానికిన్, తగఁగన్= దానికి తగినట్లుగా; గర్భము+అయ్యెన్= నీకు గర్భమైనది; నీదు, గర్భమునవాఁడు= నీ గర్భంలో ఉన్నవాడు; అఖిల, భువన, వహన, మహనీయుఁడు+అగు= సమస్తభూమిని భరించ (పాలించ)గల గొప్పవాడైన; చక్రవర్తి, సుమ్ము= చక్రవర్తి సుమా!

**తాత్పర్యం:** అమ్మా! నీకులగోత్రాలకు అందచందాలకు తగిన భర్తను నీవు పొందగలిగావు. దానికి తగినట్లుగా నీవు గర్భవతివికూడ అయినావు. నీగర్భంలో ఉన్నవాడు ఈసమస్త భూమిని పాలించగలిగిన మహనీయు డయ్యే చక్రవర్తిసుమా!.

**విశేషం:** కణ్వమహర్షి భూత, భవిష్యత్, వర్తమానాలను దర్శించగల మహిమాన్వితు డనీ, క్రాంతదర్శి అనీ ఈమాటలు స్ఫురింపజేస్తున్నవి.

**వ. 'నీధర్మచరితంబునకు మెచ్చితి, నీ కోరిన వరం బిచ్చెద వేఁడు' మనిన శకుంతలయు 'నాచిత్తం బెప్పుడు ధర్మువునంద తగిలియుండను, నాకుద్భవించెడు పుత్త్రుండు దీర్ఘాయురారోగ్యైశ్వర్య బలసమన్వితుండును వంశకర్తయుఁగాను వలయు' ననిన నమ్మహాముని కరుణించి దాని కోరిన వరం బిచ్చి, యథాకాలవిధుల గర్భసంస్కార రక్షణంబులు సేయించి యున్నంత, వర్షత్రయంబు సంపూర్ణం బైన, శకుంతలకు భరతుం డుదయించి కణ్వనిర్వర్తిత జాతకర్మాది క్రియాకలాపుం డయి పెరుఁగుచుఁ గరతలాలంకృతచక్రుండును, చక్రవర్తిలక్షణలక్షితుండును, సింహసంహననుండును, దీర్ఘబాహుండును, ననంతజవసత్త్వ సంపన్నుండును నై పరఁగుచు. 63**

**ప్రతిపదార్థం:** నీ, ధర్మ, చరితంబునకున్= ధర్మబద్ధమైన నీ ప్రవర్తనకు; మెచ్చితిన్(ని)= సంతోషించాను; నీ, కోరిన, వరంబు; ఇచ్చెదన్; వేఁడుము= కోరుకొమ్ము; అనినన్= అనగా; శకుంతలయున్, నాచిత్తంబు= నామనస్సు; ఎప్పుడున్= అన్నివేళలా; ధర్మువునందున్+అ= ధర్మంలోనే; తగిలి, ఉండను= ఆసక్తి కలిగి ఉండేటట్లు; నాకున్, ఉద్భవించెడు, పుత్త్రుండు= నాకు పుట్టే కొడుకు; దీర్ఘ+ఆయుస్+ఆరోగ్య+ఐశ్వర్య, బల, సమన్వితుండును= దీర్ఘమైన ఆయుస్సుతోనూ, ఆరోగ్యంతోనూ, సంపదలతోనూ, బలంతోనూ కూడినవాడూ; వంశకర్తయున్= పుట్టిన వంశానికి కీర్తిప్రతిష్ఠలు కలిగించి తన తరువాతివారిని తనవంశజులుగా పేర్కొనేటట్లు చేసే ప్రముఖుడు వంశకర్త - అటువంటివాడుగానూ; కాన్, వలయున్, అనినన్= కావలెనని కోరగా; ఆ+మహాముని= ఆ కణ్వమహర్షి; కరుణించి= దయచూపి; దాని, కోరిన, వరంబు+ఇచ్చి= ఆమె కోరిన వరాన్ని ఇచ్చి; యథాకాల విధులన్= ఆయా సమయాలలో చేయదగిన శాస్త్రోక్త పద్ధతులతో; గర్భ, సంస్కార, రక్షణంబులు, చేయించి= స్త్రీ గర్భము తాల్చినప్పుడూ, ఆ గర్భము పెరుగుతున్నప్పుడూ గర్భస్థ శిశువు రక్షణం కోసము చేసే విధులను చేయించి; ఉన్నంతన్= ఉండగా; వర్షత్రయంబు, సంపూర్ణంబు+ఐనన్= మూడేండ్లు నిండగా; శకుంతలకున్; భరతుండు; ఉదయించి= పుట్టి; కణ్వ, నిర్వర్తిత, జాతకర్మ+ఆది, క్రియాకలాపుండు+అయి= కణ్వునిచేత చేయించబడిన జాతకర్మ మొదలైన సంస్కారక్రియలతో కూడినవాడై; పెరుఁగుచున్= పెద్దవాడౌతూ; కర, తల+అలంకృత, చక్రుండును= అరచేతియందు అమరిన చక్రరేఖ అనే సాముద్రిక లక్షణం కలవాడున్నూ; చక్రవర్తి, లక్షణ, లక్షితుండును= చక్రవర్తి కాగలిగే లక్షణాలు శరీరంమీద సాముద్రికంగా కనబడుతున్నవాడూ; సింహ, సంహననుండును= సింహంయొక్క శరీరంవంటి శరీరం కలవాడున్నూ; దీర్ఘబాహుండును= పొడ వైన చేతులు కలవాడున్నూ; అనంత, జవ, సత్త్వ, సంపన్నుండును+ఐ= అపారమైన వేగాన్నీ బలాన్నీ కలవాడున్నూ అయి; పరఁగుచున్= ఒప్పారుతూ.

**తాత్పర్యం:** 'నీధర్మప్రవర్తనకు నేను మెచ్చాను. నీవు కోరిన వరం ఇస్తాను. వేడుకొమ్ము' అని కణ్వమహర్షి అనగానే శకుంతల 'నా మనస్సెల్లప్పుడూ ధర్మంలోనే లగ్నమై ఉండాలి' అనీ, 'నాకు పుట్టే కొడుకు దీర్ఘాయువు, ఆరోగ్యం, ఐశ్వర్యం, బలం కలిగి వంశకర్తగా ప్రసిద్ధికెక్కాలి' అనీ కోరింది. అందుకు ఆ మహాముని కరుణించి శకుంతల

కోరిన వరాన్ని ఇచ్చి గర్భవతికి చేయవలసిన సంస్కార రక్షణ విధులను చేయించి ఉండగా, మూడేళ్ళు నిండిన తరువాత ఆమెకు భరతుడు జన్మించాడు. కణ్వమహర్షి అతనికి జాతకర్మాది క్రియాకలాపాలు జరిపించగా పెరుగుతున్నాడు. అరచేతిలో చక్రరేఖ కలవాడు, చక్రవర్తి, లక్షణాలన్నీ ముద్రించుకొన్న మేను కలవాడు. సింహంవలె సర్వాంగసుందరుడు, పొడుగైన చేతులు కలవాడు, అపారమైన వేగమూ, బలమూ కలవాడై భరతుడు విలసిల్లాడు.

**విశేషం:** భరతుడు పుట్టుకతోనే చక్రవర్తి కాదగిన సాముద్రిక చిహ్నాలు కలిగిఉన్నాడు. అరచేతిలో చక్రరేఖ రాజయోగాన్ని సూచిస్తుంది. "చక్రాసి చాప వజ్రాభా । రేఖాః కుర్వంతి భూపతిమ్' - అని సాముద్రికశాస్త్రం. చక్రం, ఖడ్గం, విల్లు, వజ్రాయుధం వంటి రేఖలు కలవాడు తప్పక రాజౌతాడని శాస్త్రం.

**మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరు వరాహవ్యాళశార్దూల ఖ**
**డ్గమదేభాదులఁ బట్టి తెచ్చి ఘనుఁడై కణ్వాశ్రమోపాంత భూ**
**జములం దోలిన కట్టుచుం బలిమిమై శాకుంతలుం డొప్పె వ**
**న్యమదేభంబుల నెక్కుచుం దగిలి నానాశైశవక్రీడలన్. 64**

**ప్రతిపదార్థం:** శాకుంతలుండు= శకుంతలయొక్క కుమారుడైన భరతుడు; బలిమిమైన్= బలంతో; అమిత+ఉగ్ర+అటవిలోనన్= ఎంతో భయంకరమైన అడవిలో; క్రుమ్మరు= తిరుగాడు; వరాహ, వ్యాళ, శార్దూల, ఖడ్గ, మద+ఇభ, ఆదులన్= అడవిపందులను, పాములను, పులులను, ఖడ్గమృగాలను, మదపుటేనుగులను, మరి ఇతరమృగాలను; పట్టి, తెచ్చి= పట్టుకొని, తీసికొనివచ్చి; ఘనుఁడు+ఐ= ప్రముఖుడు+ఐ; కణ్వ+ఆశ్రమ+ఉపాంత+భూజములందున్= కణ్వునియొక్క ఆశ్రమం యొక్క సమీపంలోని చెట్లకు; ఓలిన్+అ= వరుసగా; కట్టుచున్= కట్టివేస్తూ; తగిలి= ఆసక్తితో; మద+ఇభంబులన్, ఎక్కుచున్= అడవికి సంబంధించిన మదించిన ఏనుగులపై ఎక్కి స్వారిచేస్తూ; నానా, శైశవ, క్రీడలన్= అనేకరకా లైన బాల్యక్రీడలతో; ఒప్పెన్= ఒప్పారెను.

**తాత్పర్యం:** భరతుడు అపారబలంతో అతిభయంకర మైన అడవులలో తిరుగాడే అడవిపందులను, పాములను, పులులను, ఖడ్గమృగాలను, మదించిన ఏనుగులను ఇంకా తదితరమృగాలను అవలీలగా పట్టి తెచ్చి ఘటికుడై ఆ ఆశ్రమ సమీపప్రాంతంలో ఉన్న చెట్లకు వరుసగా కట్టివేస్తూ, ఆసక్తితో అడవిలో తిరిగే మదించిన ఏనుగులపై ఎక్కి స్వారిచేస్తూ తన బాల్యక్రీడలను అనేకవిధాలుగా ప్రదర్శిస్తూ ఉన్నాడు.

**విశేషం:** తండ్రి యైన దుష్యంతుడు పెద్దవా డైన తరువాత ప్రదర్శించిన బలాన్ని భరతుడు బాల్యంలోనే ప్రదర్శించాడు. శాకుంతలుండు అంటే శకుంతులయొక్కపుత్రుడని అర్థం. స్త్రీభ్యోఢక్' అని ఢక్ప్రత్యయాదులు వచ్చి శాకుంతలేయుడు అని కావలసింది. కాని, ఉత్సర్గశాస్త్రంచేత మహాకవి ప్రవర్తింపచేశాడని వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. ప్రసాదగుణమిశ్రిత మైన ఓజోగుణరచన బాలవీరుడి పరాక్రమవర్ణనంలో సహజంగా రాణించింది.

**వ. ఇట్లు వనంబులోని సర్వసత్త్వంబులను దనమహాసత్త్వంబునం జేసి దమియించుచున్న యాతనిం జూచి యాశ్చర్యం బంది యందులమునులెల్ల నాతనికి సర్వదమనుం డను నామంబుఁ జేసిరి; కణ్వమహామునియు నక్కుమారు నుదార తేజోరూప విక్రమ గుణంబులకు సంతసిల్లి 'వీఁ డఖిల భువన యౌవరాజ్యంబునకు సమర్థుం డగు సమయం బరుగుదెంచె' నని విచారించి యొక్కనాఁడు కూఁతున కి ట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; వనంబులోని= అరణ్యంలోని; సర్వసత్త్వంబులను= అన్నిమృగాలనూ; తన, మహత్+సత్త్వంబునన్, చేసి= తనయొక్క గొప్పదైన బలంచేత; దమియించుచున్+ఉన్నన్= అణచివేస్తూ (నశింపచేస్తూ) ఉండగా; అందుల, మునులెల్లన్= అక్కడి మునులందరు; ఆతనిన్= భరతుడిని; చూచి; ఆశ్చర్యంబు+అంది= అబ్బురపడి; ఆతనికిన్= భరతుడిని; సర్వదమనుండు= అన్నింటిని అణచువాడు; అను, నామంబున్, చేసిరి= అనే అర్థం గల బిరుదనామం పెట్టారు; కణ్వ, మహత్+మునియును; ఆ+కుమారు+ఉదార, తేజో, రూప, విక్రమ, గుణంబులకున్= ఆ బాలునియొక్క ఉత్తమ తేజస్సు (ప్రకాశం)కూ, ఆకారసౌష్ఠవానికీ, పరాక్రమగుణాలకూ; సంతసిల్లి= సంతోషించి; వీఁడు= ఈ భరతుడు; అఖిల, భువన, యౌవరాజ్యంబునకున్= సమస్త రాజ్యానికి యౌవరాజ్య పదవికి; సమర్థుండు+అగు, సమయంబు= యోగ్యుడైన సమయం; అరుగుదెంచెను+అని= వచ్చింది అని; విచారించి= ఆలోచించి; ఒక్కనాఁడు= ఒకరోజున; కూఁతునకున్= పుత్రిక అయిన శకుంతలతో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈవిధంగా అరణ్యంలోని అన్ని జంతువులనూ తన మహాబలంచేత అణచివేస్తున్న భరతుడిని చూచి ఆశ్చర్యపడి అక్కడి మునులందరూ అతడికి 'సర్వదమనుడు' (అన్నింటిని అణచివేసేవాడు) అనే పేరుపెట్టి పిలిచారు. కణ్వమహామునికూడా ఆ బాలుడి ఉదాత్తతేజస్సును, రూపాన్నీ, పరాక్రమగుణాలనూ చూచి సంతసించి అతడు సమస్తరాజ్యానికి యువరాజుగా ఉండదగిన సమయం వచ్చిం దని భావించి ఒకనాడు కూతు రైన శకుంతలతో ఈవిధంగా అన్నాడు.

**ఆ. ఎట్టిసాధ్వులకును బుట్టిన యిండ్లను । బెద్దకాల మునికి తద్ద తగదు;**
**పతులకడన యునికి సతులకు ధర్మువు; । సతుల కేడుగడయుఁ బతుల చూవె. 66**

**ప్రతిపదార్థం:** ఎట్టి, సాధ్వులకును= ఎటువంటి పతివ్రతలకైనను; పుట్టిన, ఇండ్లను= వారివారి పుట్టిండ్లలో; పెద్దకాలము+ఉనికి= చాలకాలం ఉండటం; తద్ద, తగదు= ఎంతమాత్రం (అత్యంతం) ఉచితం కాదు; సతులకున్= ఇల్లాళ్ళకు; పతుల, కడన్= భర్తలదగ్గరే; ఉనికి= ఉండటం; ధర్మువు= ధర్మం, న్యాయం; సతులకున్= వివాహితులకు; పతులు+అ= భర్తలే; ఏడు+కడయున్= ఏడురకాలైన రక్ష; (గురువు, తల్లి, తండ్రి, పురుషుడు, విద్య, దైవం, దాత - అనేవారు ఏడురకాలైన రక్షలు); చూవె= సుమా!

**తాత్పర్యం:** ఎటువంటి పతివ్రతలకైనా పుట్టినిళ్ళలో ఎక్కువకాలం ఉండటం ఎంతమాత్రం ఉచితం కాదు. ఇల్లాళ్ళకు భర్తలదగ్గర ఉండటమే ధర్మం. భార్యలకు భర్తలే సర్వరక్షకులు (ఏడుగడలు) సుమా!

**విశేషం:** నన్నయగారి సూక్తినిధిత్వానికి ఈపద్యం ఒక చక్కని ఉదాహరణం.

### కణ్వమహాముని శకుంతలను దుష్యంతుపాలికిం బంపుట (సం. 1-68-10)

**వ. 'కావున నీ విక్కుమారునిం దోడ్కొని నీపతిపాలికి నరుగు' మని మహాతపోధను లైన తన శిష్యులం గొందఱం దోడువంచిన, శకుంతలయు దౌష్యంతిం దోడ్కొని దుష్యంతుపాలికి వచ్చి సకలసామంతమంత్రిపురోహిత ప్రధానపౌరజనపరివృతుండై యున్న యారాజుం గనుంగొని. 67**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నీవు; ఈ+కుమారునిన్= ఈ బాలుడిని, లేదా, పుత్రుడిని; తోడ్కొని= వెంటతీసికొని; నీ, పతి, పాలికిన్= నీభర్త దగ్గరకు; అరుగుము= వెళ్ళుము; అని; మహాతపోధనులు+ఐన= గొప్పదైన తపస్సే ధనంగా కలవారైన;

తన, శిష్యులన్; కొందఱన్; తోడు, పంచినన్= తోడుగా వెంట పంపగా; శకుంతలయున్; దౌష్యంతిన్= దుష్యంతుడి పుత్త్రుడైన భరతుడిని; తోడ్కొని= వెంటతీసికొని; దుష్యంతుపాలికిన్, వచ్చి= దుష్యంతుడివద్దకు వచ్చి; సకల, సామంత, మంత్రి, పురోహిత, ప్రధాన, పౌరజన, పరివృతుండు+ఐ, ఉన్న= అందరు సామంతులు, మంత్రులు, పురోహితులు, సేనాపతులు, పురజనులచేత కూడినసభలో ఉన్నవాడైన; ఆ, రాజున్, కనుంగొని= ఆదుష్యంతుడిని చూచి.

**తాత్పర్యం:** 'కాబట్టి నీ వీ కుమారుడిని తీసికొని నీభర్తవద్దకు పొమ్మ' అని గొప్ప తపస్వులైన శిష్యులను కొందరిని తోడిచ్చి పంపగా శకుంతలకూడ భరతుడిని వెంటతీసికొని దుష్యంతుడి వద్దకు వచ్చి, సామంతులు, మంత్రులు, పురోహితులు, ప్రధానులు, పౌరజనులతో కూడి ఉన్నసభలో ఆ రాజును చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. గురునాశ్రమంబునను ము । న్నరుదుగఁ బతివలనఁ గనిన యనురాగము నా**
**దరణము ననుగ్రహంబును । గరుణయు సంభ్రమము నపుడు గానక యెడలోన్. 68**

**ప్రతిపదార్థం:** మున్ను= పూర్వం; గురు, ఆశ్రమంబునను= తండ్రియైన కణ్వుడి ఆశ్రమంలో; అరుదుగన్= అపూర్వంగా; పతివలనన్= భర్తఐన దుష్యంతుడిలో; కనిన= చూచిన; అనురాగమున్= వలపునూ; ఆదరణమున్= ఆప్యాయతయూ; అనుగ్రహంబును= అనుకూలతయూ; కరుణయున్= దయయు; సంభ్రమమున్= తొట్రుపాటుతో కూడిన ఆసక్తియు; అపుడు; కానక= చూడక; ఎడలోన్= మనసులో.

**తాత్పర్యం:** పూర్వం తండ్రిఆశ్రమంలో అపూర్వంగా తనపతి తనపట్లచూపిన వలపును, ఆదరాన్నీ, దయనూ, ఆసక్తినీ అప్పుడు కానక హృదయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** కణ్వాశ్రమంలో దుష్యంతుడు శకుంతలను గాంధర్వవివాహం చేసికొన్న ఘట్టంలో ఆ దుష్యంతుడి పాత్రలో పోషించిన భావక్రమాన్ని వ్యంగ్యంగా నన్నయ ఇక్కడ సూచించాడు. ఇది కథాకథనశిల్పంలో ఒకభాగం. ఎన్నో యేళ్ళక్రితం జరిగిన ఆఘట్టాన్ని మధురస్మృతిగా సమీక్షించింది శకుంతల. అది వమ్మ కావటంతో ఆమెహృదయం వికలమైపోయింది.

**క. ఎఱుఁగ డొకో నన్నుఁ నెఱిఁగియు । నెఱుఁగని యట్లుండునొక్కొఁ యెడ దవ్వగుడున్**
**మఱచెనొకొ! ముగ్ధ లధిపులు । మఱవరె బహుకార్యభారమగ్నులు కారే. 69**

**ప్రతిపదార్థం:** నన్నున్; ఎఱుఁగడు+ఒకొ= నన్ను ఎఱుగడా?; ఎఱిఁగియున్, ఎఱుఁగని, అట్లు+ఉండును+ఒక్కొ= గుర్తించికూడ గుర్తించనట్లు ఉంటున్నాడో(నటిస్తున్నాడో) ఏమో; ఎడ, దవ్వు+అగుడున్= చూచిచాలకాలంకావటంచేత; మఱచె నొకొ= మరచిపోయాడో ఏమో; అధిపులు= రాజులు; ముగ్ధులు= మూఢులు( మరపు ఎక్కువగా కలవారు అనిభావం); మఱవరె= మరచిపోరా; బహు, కార్య, భార, మగ్నులు, కారే= పలు పనులఒత్తిడులలో మునిగిఉంటారుకదా!

**తాత్పర్యం:** ఇతడు నన్ను గుర్తించలేదా? గుర్తించికూడ గుర్తించనట్లు నటిస్తున్నాడా? చాలకాలం కావటంచేత మరచాడో ఏమో; రాజులు అనేకకార్యాలలో మునిగి ఉంటారు కదా! అందువలన వారికి మరపు వింతకాదు. ప్రభువులు మూఢులు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**చ. తలఁపఁగ నాఁడు పల్కినవిధం బెడఁ దప్పఁగ వీడె నొక్కొ చూ**
**డ్కులు విరసంబులై కరము క్రూరము లైన నిమిత్త మేమియో?**
**కలయఁగఁ బల్కరించి రుపకారులు నై రని నమ్మియుండఁగా**
**వలవదు బుద్ధిమంతులు నవప్రియు లైన ధరాధినాథులన్. 70**

**ప్రతిపదార్థం:** తలఁపఁగన్= ఆలోచింపగా; నాఁడు= పెండ్లినాడు; పల్కిన, విధంబు= మాటాడిన పద్ధతి; ఎడన్, తప్పఁగన్ వీడెను+ఒక్కొ= మనసుమారి వదలిపెట్టాడా ఏమి?; చూడ్కులు= చూపులు; విరసంబులు+ఐ= విముఖంగా; కరము, క్రూరములు= మిక్కిలి కఠినాలు; ఐన, నిమిత్తము+ఏమియో= అయినకారణ మేమిటో?; నవ, ప్రియులు+ఐన= క్రొత్తదనాన్నే ఎల్లప్పుడు ప్రేమించేవారైన; ధరా+అధినాథులన్= భూపతులను; కలయఁగన్= కలుపుగోలుతనంతో; పల్కరించిరి= మాటాడా రనీ; ఉపకారులును+ఐరి+అని= మేలుచేసినవారైనారనీ; బుద్ధిమంతులు= తెలివిగలవారు; నమ్మి+ఉండఁగాన్, వలవదు= నమ్మిఉండకూడదు.

**తాత్పర్యం:** ఆలోచించగా, ఈరాజు పెండ్లినాడు పలికినపద్ధతిని మనసు మార్చుకొని వదలిపెట్టినాడా ఏమి? అతనిచూపులు నాయెడ విరసంగా, అత్యంత కఠినంగా ఉన్నవి. కారణ మేమిటో? క్రొత్తక్రొత్తవాటినే ప్రేమించే రాజులను (క్రొత్తగా వారు కలిసినప్పుడు) కలుపుగోలుతనంతో పల్కరించా రనీ, ఉపకారులై వ్యవహరించా రనీ బుద్ధిమంతులు వారిని నమ్మి ఉండరాదు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. శకుంతలమాటలలో పాలకులస్వభావాన్ని నన్నయ పరోక్షంగా అధిక్షేపించాడు.

**వ. అని తలంచి చింతాక్రాంత యై శకుంతల వెండియు నాత్మగతంబున. 71**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** ఆ విధంగా భావించి దుఃఖంచేత ఆవరింపబడిన హృదయంతో శకుంతల మనస్సులో ఇంకనూ ఇలా అనుకొన్నది.

**క. మఱచినఁ దలఁపింపఁగ నగు; । నెఱుఁగని నాఁ డెల్లపాట నెఱిఁగింప నగున్;**
**మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని । కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే. 72**

**ప్రతిపదార్థం:** మఱచినన్= (ఎవరైనా ఒక అంశాన్ని నిజంగా) మరచిపోయినట్లయితే; తలఁపింపఁగన్+అగున్= జ్ఞప్తికి తేవచ్చును; ఎఱుఁగనినాఁడు=(ఎవరైనా అసలు) తెలియనిస్థితిలో ఉన్నప్పుడు; ఎల్లపాటన్= అన్నివిధాలయత్నించి ఏదోపద్ధతిలో; ఎఱిఁగింపన్+అగున్= తెలియచెప్పవచ్చును; మఱి= కాని; ఎఱిఁగి= తెలిసికూడ; ఎఱుఁగన్+ఒల్లని= తెలియటానికి అంగీకరించని, లేదా, తెలియనట్లు నటించే; కఱటిన్= మోసగాడికి; తెలుపంగన్= తెలియచెప్పటం; కమల, గర్భుని, వశమే?= బ్రహ్మదేవుడి వశమా? కాదని భావం.

**తాత్పర్యం:** ఎవరైనా నిజంగా మరచిపోతే జ్ఞాపకం చేయవచ్చును; అసలు తెలియనప్పుడు ఏ పాటుపడి అయినా తెలియచెప్పవచ్చును. కాగా, తెలిసి కూడ తెలియని వాడివలె నటించే మోసగాడికి తెలియజేయటం బ్రహ్మతరంకూడా కాదు.

**విశేషం:** నన్నయ రుచిరార్థసూక్తికి ఇది చక్కని నిదర్శనం. ఈసూక్తివినగానే భర్తృహరిసుభాషితాలలోని మూర్ఖపద్ధతిలో చెప్పబడిన ఈసుభాషితం స్ఫురిస్తుంది. "అజ్ఞఃసుఖమారాధ్యస్సుకతరమారాధ్యతేవిశేషజ్ఞః, జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపినరం న రంజయతి'. దీనికి ఏనుగు లక్ష్మణకవి అనువాదం తెలుగునాట ప్రసిద్ధం. "తెలియని మనుజుని సుఖముగఁ దెలుపం దగు సుఖతరముగఁ దెలుపఁగవచ్చున్ దెలియనివానిం, దెలిసియుఁ, దెలియని నరుఁదెల్ప బ్రహ్మదేవుని వశమే.''

**వ.** **అయినను వచ్చి మిన్నక పోవంగాదు కావున నాపూర్వవృత్తాంతంబెల్ల నెఱింగించి యే నిక్కుమారుం జూపుదు' నని మనంబున నిశ్చయించి శకుంతల యా రాజున కి ట్లనియె.** **73**

**ప్రతిపదార్థం:** అయినను= అయినప్పటికి; వచ్చి= ఇక్కడకు వచ్చి; మిన్నక= ఊరక; పోవన్+కాదు= తిరిగిపోవటం తగదు; కావునన్= కాబట్టి; ఆ, పూర్వవృత్తాంతంబు+ఎల్లన్= ఆ ముందు జరిగిన కథనంతా; ఎఱింగించి= తెలిపి, జ్ఞాపకంచేసి; ఏను= నేను(శకుంతల); ఈ+కుమారున్= ఈకొడుకును; చూపుదును+అని, మనంబునన్, నిశ్చయించి= చూపిస్తానని మనస్సులో నిర్ణయించుకొని; శకుంతల; ఆ, రాజునకున్= ఆ దుష్యంతుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** 'అయినప్పటికిని, ఇంతదూరం వచ్చి ఏమీ సాధించకుండా ఊరక తిరిగిపోవటం తగదు కాబట్టి, మునుపు జరిగిన కథనంతా జ్ఞాపకంచేసి, నేను ఈ కుమారుడిని ఆతడికి చూపిస్తా' నని మనస్సులో నిశ్చయించుకొని శకుంతల దుష్యంతుడితో ఈ విధంగా పలికింది.

**క.** **జననాథ! వేఁట నెపమున । గొనకొని కణ్వాశ్రమమునకున్ వచ్చి ముదం**
**బున నందు నాకు నీయి । చ్చిన వరము దలంపవలయుఁ జిత్తములోనన్.** **74**

**ప్రతిపదార్థం:** జననాథ= ప్రజలకు ప్రభువైన ఓ దుష్యంతుడా!; వేఁట, నెపమునన్= వేట అనే మిషతో; గొనకొని= పూని (కావాలని); కణ్వ+ఆశ్రమమునకున్, వచ్చి= కణ్వ మహర్షియొక్క ఆశ్రమానికి వచ్చి; అందున్= ఆ ఆశ్రమంలో; ముదంబునన్= సంతోషంతో; నాకున్= (శకుంతలకు); నీ, ఇచ్చిన, వరము= నీవు ఇచ్చిన వరాన్ని (ప్రథమకు షష్ఠి); చిత్తములోనన్= మనస్సులో; తలంపన్, వలయున్= జ్ఞాపకం చేసికొనవలసింది.

**తాత్పర్యం:** ఓరాజా! వేట అనే మిషతో కావాలని సప్రయత్నంగా కణ్వమహాముని ఆశ్రమానికి వచ్చి, అక్కడ నీవు సంతోషంగా నాకు ఇచ్చిన వరాన్ని మనసులో జ్ఞాపకం చేసికొమ్ము!

**విశేషం:** 60వ పద్యంలో శకుంతల అడుగగా దుష్యంతుడు ప్రసాదించిన వరం ప్రస్తావింపబడుతున్నది. శకుంతలాదుష్యంతుల నడుమ రహస్యంగా ఏర్పడిన ఒప్పంద మిది. అది విస్మరింపబడితే కథాకార్యమంతా భగ్నమైపోయినట్లే. ఆ వరానికి సాక్షు లెవ్వరూ లేరు. శకుంతలాదుష్యంతులే దానికి సాక్షులు. అందులో దుష్యంతుడు విస్మరించినట్లు నటిస్తూ ఆ సత్యాన్ని అబద్ధంగా మార్చటానికి యత్నిస్తున్నాడు. అందుకే శకుంతలకు ఆవేదన.

**క.** **బాలార్కతేజుఁ డగు నీ । బాలుఁడు నీకొడుకు వీనిఁ బౌరవకుల ర**
**త్నాలంకారు నుదార గు । ణాలయు యువరాజుఁ జేయు మభిషేకముతోన్.** **75**

**ప్రతిపదార్థం:** బాల+అర్క, తేజుఁడు+అగు= బాల॥ (ఉదయించిన) సూర్యుని ప్రకాశంవంటి ప్రకాశం కలవాడైన; ఈ బాలుఁడు, ఈ చిరంజీవి; నీ, కొడుకు= నీయొక్క కుమారుడు; పౌరవ, కుల, రత్న+అలంకారున్= పూరుమహారాజు వంశకర్తగా వెలసిన

ఈవంశానికి అలంకారమైన వాడూ; (అయిన); వీనిన్= ఈ భరతుడిని; అభిషేకముతోన్= రాజ్యాభిషేకంతో, యువరాజున్; చేయుము;

**తాత్పర్యం:** బాలసూర్యుడివలె వెలుగుతున్న ఈ బాలుడు నీ కొడుకు. పౌరవవంశానికే అలంకార మైనవాడూ, ఉత్తమగుణాలకు నెలవైనవాడూ అయిన ఇతడిని యువరాజుగా అభిషేకించుము.

**విశేషం:** 74, 75 పద్యాలలో శకుంతల మాటనేర్పరితనాన్ని, ఔచిత్యాన్ని ప్రదర్శించింది. కణ్వాశ్రమంలో సంగమానికి పూర్వం దుష్యంతుడు వరమిచ్చాడు. ఆ సంగతి జ్ఞాపకం చేసింది. ఆ పైన జరిగిన గాంధర్వవిధి వివాహాన్ని ప్రస్తావించకుండా, పుత్త్రోదయాన్నీ, అతనియౌవరాజ్యాధికారాన్నీ పేర్కొన్నది. నిండుసభలో మాటాడేటప్పుడు పాటింపవలసిన లోకజ్ఞతను శకుంతల పాటించింది. గాంధర్వవివాహవిషయం ధ్వనిమయం చేయటం నన్నయ రచనాశిల్పం.

**దుష్యంతుఁడు శకుంతలను నిరాకరించుట (సం. 1-68-18)**

**వ. అనిన విని దుష్యంతుండు దానినంతయు నెఱింగియు నెఱుంగనివాఁడ పోలె ని ట్లనియె. 76**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** శకుంతల ఆవిధంగా అన్న మాటలు విని దుష్యంతుడు ఆ సంగతి అంతయు తెలిసికూడ తెలియనివాడి వలె ఈ విధంగా అన్నాడు.

**క. ఏ నెఱుఁగ నిన్నుఁ నెక్కడి । దానవు? మిన్నకయ యనుచితంబులు పలుకం**
**గా నేల? యరుగు మంబురు । హానన! యెందుండి వచ్చి తందులకు వడిన్. 77**

**ప్రతిపదార్థం:** అంబురుహ+ఆనన!= పద్మంవంటి ముఖం కలదానా! (శకుంతలా!); ఏన్= నేను; నిన్నున్; ఎఱుఁగన్= ఎరుగను; ఎక్కడి, దానవు= ఎక్కడ పుట్టినదానవు? నీవు అసలు ఎవరవు?; ఎక్కడినుండి వచ్చినదానవు? అని మూడు అర్థాలు చెప్పవచ్చును; మిన్నక+అయ= ఊరకయే; అనుచితంబులు= కూడనిమాటలు; పలుకంగాన్+ఏల= పలకటం ఎందుకు? (వలదు అని భావం); ఎందున్+ఉండి, వచ్చితి(వి)= ఎక్కడినుండి వచ్చావో; అందులకున్= ఆ ప్రదేశానికి; వడిన్= వేగంగా; అరుగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** పద్మముఖీ! నిన్ను నేను ఎరుగను; నీ వసలు ఎవరవు; ఊరకే ఒప్పని మాటలు మాటలాడుతా వెందుకు? ఎక్కడనుండి వచ్చావో అక్కడికే తిరిగివెళ్ళుము.

**వ. అనిన విని, వెల్లనై, వెచ్చనూర్చి, నిశ్చేష్టిత యై, కెందమ్మిరేకులవలనం దొరంగు జలకణంబులపోలెఁ గోపారుణిత నయనంబుల బాష్పకణంబులు దొరంగం దలవాంచి, యారాజుం గటాక్షించుచు, హృదయసంతాపంబు దనకుం దాన యుపశమించుకొని, పెద్దయుం బ్రొద్దు చింతించి శకుంతల యా రాజున కి ట్లనియె. 78**

**ప్రతిపదార్థం:** అనినన్= అని రాజు పల్కగా; విని; వెల్లన+ఐ= తెల్లబోయి; వెచ్చన్+ఊర్చి= వేడిగా నిట్టూర్పు విడిచి; నిశ్చేష్టిత+ఐ= చేతలు లేనిదై, కాలుచేతులాడనిదై; కెంపు+తమ్మి, రేకులవలనన్, తొరంగు, జలకణంబుల, పోలెన్= ఎఱ్ఱతామరపూల

రేకులనుండి జారే నీటిబిందువుల వలె; కోప+అరుణిత, నయనంబులన్= కోపంచేత ఎఱ్ఱబారిన కన్నులనుండి; బాష్పకణంబులు= కన్నీటిబిందువులు; తొరంగన్= కారగా; తల, వాంచి= తలను వంచికొని; ఆ, రాజున్= ఆ దుష్యంతుడిని; కటాక్షించుచున్= కనుకొనలలోనుండి చూస్తూ; హృదయ, సంతాపంబు= మనోవేదనను; తనకున్+తాను+అ= తనకుతానే, స్వయంగా; ఉపశమించుకొని= తగ్గించుకొని; పెద్దయున్+ప్రొద్దు= చాలసేపు; చింతించి= విచారించి; శకుంతల; ఆ, రాజునకున్= ఆ దుష్యంతునికి; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** దుష్యంతుడిమాటలు విని శకుంతల తెల్లబోయి, చేష్ట లుడిగి, ఎఱ్ఱతామరపూల రేకులపైనుండి జారుతున్న నీటిబిందువులవలె కోపంచేత ఎఱ్ఱబారిన కన్నులనుండి కన్నీటిబిందువులు కారుతూఉండగా, తలవంచుకొని ఆ రాజును క్రీగంటిచూపులతో చూస్తూ మనోవేదనను తనకు తానే అణచుకొని, చాలసేపు విచారించి ఆ రాజుతో ఈ విధంగా పలికింది.

**విశేషం:** ఇక్కడ దుఃఖతీవ్రతవలన కలిగే వైవర్ణ్యం, స్తంభం, అశ్రుపాతం అనే సాత్త్వికభావాలు శకుంతలయందు సహజంగా వర్ణించబడినవి. బాష్పవర్ణనంలోని ఉపమాలంకారం సార్థకం.

### కుపిత యైన శకుంతల దుష్యంతునకు ధర్మప్రబోధ మొనరించుట. (సం. 1-68-22)

**ఆ. ఏల యెఱుక లేని యితరుల యట్ల నీ। వెఱుఁగ ననుచుఁ బలికె దెఱిఁగి యెఱిఁగి;**
**యేన కాని దీని నెఱుఁగ రిం దొరు లని। తప్పఁబలుక నగునె ధార్మికులకు! 79**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు (దుష్యంతుడు); ఎఱిఁగి= అన్నివిషయాలు బాగా తెలిసికూడ; ఎఱుఁగను+అనుచున్= (తెలిసినదానిని) తెలియదు, అంటూ; ఎఱుక, లేని; ఇతరులు+అ+అట్లు+అ= అజ్ఞానుల వలె ఎవరో మాటాడినట్లు; పలికెదు= మాట్లాడుతావు; ఇందున్= ఇక్కడ; దీనిని= ఈ విషయాన్ని, లేదా, ఈ శకుంతలను; ఏను+అ, కాని= నేను మాత్రమేకాని; ఒరులు= ఇంకొకరు; ఎఱుఁగరు+అని= తెలియరని; ధార్మికులకున్= ధర్మాత్ములకు, ధర్మాత్ములైన మీకు (దుష్యంతునకు); తప్పన్, పలుకన్, అగును+ఎ= అబద్ధమాడవచ్చునా? (కూడదని భావం).

**తాత్పర్యం:** అన్నీ బాగా తెలిసికూడ నాకు తెలియదు అని ఎవరో తెలియని ఇతరులవలె ఎందుకు మాటాడుతావు? ఇక్కడ దీనిని నేనే కాని ఇతరు లెవ్వరు ఎఱుగ రని (సాక్షులు లేరని) ధర్మాత్ములైనవారు అబద్ధమాడవచ్చునా? (తగదని భావం).

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 'తప్పఁబలుక నగునె ధార్మికులకు' అనే వాక్యం సాధారణలోకధర్మంగానూ, దుష్యంతుని పట్ల వర్తించే అధిక్షేపంగానూ గ్రహించవచ్చును.

**చ. విమలయశోనిధీ! పురుషవృత్త మెఱుంగుచునుండుఁ జూవె వే**
**దములును బంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్**
**యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు న న్మహాపదా**
**ర్థము లివి యుండఁగా నరుఁడు దక్కొననేర్చునె తన్ను మ్రుచ్చిలన్. 80**

**ప్రతిపదార్థం:** విమలయశోనిధీ!= నిర్మలమైన కీర్తికి నెలవైనవాడా!; వేదములును= వేదాలున్నూ; పంచభూతములు= భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము - అనే అయిదు ప్రకృతులున్నూ; ధర్మువు= ధర్మమున్నూ; సంధ్యలు= ఉదయసంధ్య, సాయంసంధ్య అనే రెండున్నూ; అంతర్+ఆత్మయున్= హృదయమున్నూ; యముఁడును= (మృత్యువునకు అధిదేవత ఐన) యముడూ; చంద్ర, సూర్యులు= చంద్రుడూ, సూర్యుడూ; అహంబును= పగలూ; రాత్రియున్= రాత్రియూ; అన్, మహత్+పదార్థములు= అనబడే మహాపదార్థాలు; పురుషవృత్తము= నరుని చరిత్రాన్ని (నరులు చేసే పనులను); ఎఱుంగుచున్+ఉండున్+చూవె= తెలిసికొంటూ ఉంటాయిసుమా!; ఇవి, ఉండఁగాన్= ఈ మహాపదార్థాలు ఉండగా; నరుఁడు= మానవుడు; తన్ను= తనను తాను; క్రుచ్చిలన్= దొంగిలింపగా, వంచింపగా; తక్కొనన్ (తల+కొనన్), నేర్చునె= పూనుకొనగలడా? (పూనుకొనలేడని భావం). (క్రుచ్చిలన్= వంచించుకొని; తక్కు+ఒననేర్చునె= వేరువిధంగా చేయపూనుకొనునా? అనికూడ చెప్పవచ్చును.)

**తాత్పర్యం:** నిర్మలమైన కీర్తికి నిధివంటివాడ వైన దుష్యంతుడా! వేదాలు, పంచభూతాలు, ధర్మం, ఉభయసంధ్యలు, హృదయం, యముడు, చంద్రసూర్యులు, పగలు, రాత్రి - అనే మహాపదార్థాలు నరులవర్తనాన్ని ఎప్పుడూ గమనిస్తూనే ఉంటాయిసుమా! ఆ మహాపదార్థాలు ఉండగా నరుడు తనంతట తాను వంచించుకోగలడా! (సత్యాన్ని దాచుకొనగలడా, లేదా, తాను చేసిన దానిని దాచుకొనగలడా?), (లేడని భావం).

**విశేషం:** 'విమలయశోనిధీ!' అన్న సంబోధనం సార్థకం. అసలే అచ్చమైన కీర్తికలవాడవు ఇప్పుడు అసత్యమాడి నీ కీర్తికి మచ్చ తెచ్చుకోవద్దన్న హెచ్చరిక అందులో గమ్యం.

"ఆదిత్యచంద్రావనిలో నలశ్చ, ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే, ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్" - అనే మూలశ్లోకంలో లేని 'వేదాలను' మహాపదార్థాలలో మొదట చేర్చి నన్నయ వేదప్రామాణ్యాన్ని గౌరవించాడు. 'పంచమవేదానికి' సార్థకత కలిగించాడు. గాంధర్వవిధితో రహస్యంగా వివాహంచేసికొని, నిండుకొలువులో సాక్ష్యాధారాలు లేవని సాహసించాడు దుష్యంతుడు. సత్యానికీ, ధర్మానికీ, అంతేకాదు మనిషిచేసే ప్రతిపనికీ, సంకల్పానికీ అతని అంతరాత్మయే అసలైన సాక్షి. అంతరాత్మను చంపుకొంటే మనిషి తనను తాను వంచించుకొన్నట్లే అవుతుందని ఈసూక్తిలోని రుచిరార్థం. శకుంతలాదుష్యంతుల కథలోని పరమార్థం. ఇది నన్నయసూక్తి మౌక్తికం.

**క. నా యెఱిఁగినట్ల యిన్నియు । నీ యిచ్చిన వరము ధారుణీవర! యెఱుఁగున్**
**నాయందుఁ దొంటియట్టుల । చేయు మనుగ్రహ; మవజ్ఞ సేయం దగునే! 81**

**ప్రతిపదార్థం:** ధారుణీవర!= ఓరాజా!; నీ, ఇచ్చిన, వరము= నీవు నాకు ఇచ్చిన ఆ వరాన్ని గురించి; నా, ఎఱిఁగిన+అట్లు+అ= నాకు తెలిసిన విధంగానే; ఇన్నియున్= (ముందుపద్యంలో చెప్పిన) మహాపదార్థాలన్నీ; ఎఱుఁగున్= తెలియును; తొంటి+అట్టులు+అ= వెనుకటివలెనే; నాయందున్= నాయెడల; అనుగ్రహము, చేయుము= దయను ప్రదర్శించుము, అనురాగాన్ని అందించుము; అవజ్ఞ, చేయన్, తగును+ఏ= అవమానించటం ఉచితమా? (కాదని భావం).

**తాత్పర్యం:** ఓ రాజా! నీ విచ్చిన వరాన్నిగురించి నా కెట్లా తెలియునో ఆవిధంగానే వేదాలు మొదలైన మహాపదార్థాలకు కూడా తెలియును. కాబట్టి, నాపట్ల వెనుకటి వలెనే అనురాగాన్ని ప్రసాదించుము; నన్ను అవమానించటం తగునా? (తగదు).

**క. సతియును గుణవతియుఁ బ్రజా! వతియు ననువ్రతయు నైన వనిత నవజ్ఞా**
**న్వితదృష్టిఁ జూచు నతి దు। ర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్. 82**

**ప్రతిపదార్థం:** మతిన్= బుద్ధియందు; పరికింపన్= ఆలోచించగా; సతియును= పతివ్రతయున్నూ; గుణవతియున్= గుణవంతురాలున్నూ; ప్రజాపతియున్= సంతానవతియూ; అనువ్రతయున్= అనుకూలయూ; ఐన; వనితన్= స్త్రీని, భార్యను; అవజ్ఞా+అన్విత, దృష్టిన్= తిరస్కార దృష్టితో; చూచు, అతి, దుర్మతికిన్= చూచే మిక్కిలి దుష్టబుద్ధికలవాడికి; ఇహమున్, పరమున్, గలదు+ఎ= ఈ లోకంలో, పరలోకం (స్వర్గలోకం) లో సుఖం ఉంటుందా? బ్రతికినా చచ్చినా సుఖపడలే డని భావం.

**తాత్పర్యం:** బుద్ధితో బాగా పరిశీలిస్తే - పతివ్రత, గుణవంతురాలు, సంతానవతి, అనుకూల అయిన భార్యను తిరస్కారభావంతో చూచే మిక్కిలి దుర్బుద్ధికి ఇహపరసుఖాలు రెండూ ఉంటాయా? (ఉండ వనీ, రెంటికి చెడ్డ రేవడి ఔతా డనీ భావం).

**విశేషం:** నన్నయ రుచిరార్థసూక్తికి ఇది చక్కని ఉదాహరణం. గృహస్థాశ్రమధర్మం నాలుగు బలమైనస్తంభాలమీద నిలువబడిన వ్యవస్థ. ఆనాలుగుస్తంభాలేవంటే-1 యజమానుడు (భర్త, గృహస్థుడు, గృహమేధి) 2. కులసతి (భార్య, గృహిణి) 3. సంతానం (సుతుడు, పుత్రిక) 4. సత్యం (సత్యస్వరూపమైన పరమధర్మం, దాని వివిధభేదాలు). ఈ నాల్గింటియొక్క ప్రాశస్త్యాన్నిగురించి చెప్పించటమే శకుంతల ధార్మికోపన్యాసంలోని వ్యాసహృదయం. వాటిలో మొదటిఅంశమైన యజమానునియొక్క స్వరూపస్వభావాలను వ్యంగ్యంగా నిర్దేశించటం ఈపద్యంలోనూ ఆతరువాతి పద్యంలోనూ గమనించవచ్చును.

**క. సంతతగృహమేధి ఫలం। బంతయుఁ బడయంగ నోపు ననుగుణభార్యా**
**వంతుం డగువాఁడు క్రియా। వంతుఁడు దాంతుండుఁ బుత్త్రవంతుండు నగున్. 83**

**ప్రతిపదార్థం:** అనుగుణ, భార్యావంతుండు+అగు, వాఁడు= అనుకూలవతి అయిన భార్య కలవాడు; క్రియావంతుఁడు= కర్మలను ఆచరించేవాడూ; దాంతుండున్= ఇంద్రియ నిగ్రహం కలవాడూ; పుత్త్రవంతుండున్= పుత్రసంతానం కలవాడూ; అగున్= ఔతాడు; సంతత, గృహమేధి, ఫలంబు, అంతయున్= ఎల్లప్పుడు గార్హస్థ్యాశ్రమం నిర్వహించే యజమాని పొందే ఫలాన్నంతటినీ; పడయంగన్+ఓపున్= పొందగలుగుతాడు.

**తాత్పర్యం:** అనుకూలవతి ఐన భార్యగలవాడు కర్మలు ఆచరించగలుగుతాడు, ఇంద్రియాలను నిగ్రహించగలుగు తాడు, పుత్రసంతానాన్ని పొందగలుగుతాడు, గార్హస్థ్యధర్మాన్ని ఎల్లప్పుడూ ఆచరించే గృహస్థుడు పొందే ఫలాన్నంతటినీ; పడయంగన్+ఓపున్= పొందగలుగుతాడు.

**విశేషం:** గృహస్థాశ్రమధర్మాన్ని కీర్తించే రుచిరార్థసూక్తి యిది.

**వ. మఱియును. 84**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అంతేకాక.

**సీ.** **ధర్మార్థకామసాధన కుపకరణంబు । గృహనీతివిద్యకు గృహము, విమల**
**చారిత్రశిక్ష కాచార్యకం, బన్వయ । స్థితికి మూలంబు, సద్గతికి నూఁత,**
**గౌరవంబున కేకకారణం, బున్నత । స్థిరగుణమణుల కాకరము, హృదయ**
**సంతోషమునకు సంజనకంబు భార్యయ । చూవె భర్తకు, నొండ్లు గావు ప్రియము,**

**ఆ.** **లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను । నెట్టితీఱములను ముట్టఁబడిన**
**వంతలెల్లఁ బాయు నింతులఁ బ్రజలను । నొనరఁ జూడఁగనిన జనుల కెందు.** **85**

**ప్రతిపదార్థం:** ధర్మ+అర్థ, కామ, సాధనకున్, ఉపకరణంబు= ధర్మం, అర్థం, కామం అనే పురుషార్థాలను సాధించటానికి సాధనం; గృహనీతి, విద్యకున్, గృహము= గృహనీతి అనేవిద్యకు నెలవైనది; విమల, చారిత్ర, శిక్షకున్+ఆచార్యకంబు= నిర్మలమైన శీలాన్ని బోధించే గురువు; అన్వయ, స్థితికిన్, మూలంబు= వంశం నిలబడటానికి ఆధారం; సత్+గతికిన్, ఊఁత= ఉత్తమగతియైన మోక్షానికి ఊతకర్ర; గౌరవంబునకున్+ఏక, కారణంబు= మన్ననకు ముఖ్యహేతువు; ఉన్నత స్థిరగుణమణులకున్+ఆకరము= ఆదర్శమైనవీ, కలకాలం నిలిచేవీ అయిన మణులవంటి గుణాలకు నెలవైనది; హృదయ సంతోషమునకున్, సంజనకంబు= మానసికమైన ఆహ్లాదాన్ని కలిగించేది; భార్య+అ,చూవె= భార్యయేసుమా; భర్తకున్= మగనికి; ప్రియములు= ఇష్టమైనవి; ఒండ్లు, కావు= ఇతరాలు కావు; ఇంతులన్= భార్యలను; ప్రజలను= సంతానాన్నీ (బిడ్డలను); ఒనరన్, చూడన్, కనిన, జనులకున్= సరిగా ఆదరింపగలిగినవారికి ఎందున్= ఎక్కడైనా; ఎట్టి, ఘట్టములనున్= ఎటువంటి సన్నివేశాలలో (తరుణాలలో)నైనా; ఎట్టి, ఆపదలను= ఎటువంటి విపత్తులలోనైనా; ఎట్టితీఱములను= ఎటువంటి ఇబ్బందులలోనైనా; ముట్టన్+పడిన, వంతలు+ఎల్లన్= ఆవరించిన దుఃఖాలన్నియున్నూ; పాయున్= తొలగిపోతాయి.

**తాత్పర్యం:** ధర్మం, అర్థం, కామం అనే పురుషార్థాలను సాధించటానికి అనువైన సాధనమూ, గృహనీతి అనే విద్యకు నెలవైనదీ, నిర్మలమైన శీలాన్ని గురించి ప్రబోధించే గురుస్థానమూ, వంశం నిలవటానికి ఆధారమైనదీ, ఉత్తమగతులు పొందటానికి ఊతకర్ర అయినదీ, మన్ననకు ముఖ్యహేతువైనదీ, ఆదర్శప్రాయమైనవీ కలకాలం నిలిచేవీ అయిన మణులవంటి గుణాలకు నెలవైనదీ, హృదయానందాన్ని కలిగించేదీ భర్తకు భార్యయే సుమా! మగనికి ఇల్లాలికంటె ఇంపైనది వేరొకటి లేదు. ఆలుబిడ్డలను ఆప్యాయంగా చూచేవారికి ఏచోటనైనా, ఎటువంటి పరిస్థితులలోనైనా, ఎటువంటి ఆపదలలోనైనా, ఇబ్బందులలోనైనా చుట్టుముట్టిన దుఃఖాలన్నీ తొలగిపోతాయి.

**విశేషం:** గృహస్థాశ్రమధర్మరక్షణకు కేంద్రబిందు వైన గృహిణియొక్క గొప్పతనాన్నిచెప్పే గొప్పతెలుగుపద్యం.

**వ.** **మఱియు భార్య పురుషునం దర్ధం బగుటంజేసి పురుషునకు మున్న పరేత యైన పతివ్రత పరలోకంబునం దనపురుషుం గూడఁ దదాగమనంబు ప్రతీక్షించుచుండుం; బురుషుండు మున్న పరేతుం డైనఁ బదంపడి తానును బరేత యై తనపురుషుం గూడ నరుగునట్టి భార్య నవమానించుట ధర్మవిరోధంబు; మఱియునుం బురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్త్రుండై తాన యుద్భవిల్లు గావున 'నజ్గా దజ్గా త్సమ్భవసి' యనునది యాదిగాఁగల వేదవచనంబులయందును జనకుండునుఁ బుత్త్రుండును ననుభేదంబు లేదు.** **86**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతేకాక; భార్య= ఇల్లాలు; పురుషునందున్= మగనిలో; అర్ధంబు= సగం; అగుటన్+చేసి= కావటంచేత; పురుషునకున్; మున్ను+అ, పరేత, ఐన= మగనికంటె ముందే మరణించిన; పతివ్రత; పరలోకంబునన్= స్వర్గలోకంలోకూడ; తన, పురుషున్, కూడన్= తన భర్తతో కలియటానికి; తద్+ఆగమనంబు= అతడిరాకను; ప్రతీక్షించుచున్+ ఉండున్= ఎదురుచూస్తూ ఉంటుంది; పురుషుండు, మున్ను+అ, పరేతుండు+ఐనన్= భర్త ముందుగా చనిపోతే; పదంపడి= తరువాత; తానును, పరేత+ఐ= తానుకూడ చనిపోయినదై; తన, పురుషున్, కూడన్, అరుగునట్టి, భార్యను= తన మగనితో కలియుట కొరకు పోయే భార్యను; అవమానించుట= భంగపరచటం; ధర్మ, విరోధంబు= ధర్మానికి వ్యతిరేకం; మఱియునున్= ఇంతేకాక; పురుషుండు= భర్త; భార్యయందున్, ప్రవేశించి= భార్యలో ప్రవేశించి; గర్భంబునన్= గర్భధారణమార్గంలో; పుత్త్రుండు+ఐ= కుమారుడై; తాను+అ= తానే; ఉద్భవిల్లున్, కావునన్= పుట్టుతాడు కాబట్టి; అంగాత్+అంగాత్, సంభవసి= శరీరంనుండి పుట్టుతున్నావు; అను+అది, ఆదిగాన్+కల= అనే వాక్యం మొదలైన; వేదవచనంబుల+అందును= వేదవాక్యాలలోకూడ; జనకుండునున్, పుత్త్రుండును, అను, భేదంబు, లేదు= తండ్రి అనీ, కొడుకనీ భేదం ఉండదు.

**తాత్పర్యం:** అంతేకాక, భార్య భర్తలో సగం కాబట్టి మగనికంటె ముందే చనిపోయిన పతివ్రత పరలోకంలోకూడ తనభర్తతో కూడిఉండా లని అతడిరాకకోసం ఎదురుచూస్తూ ఉంటుంది. భర్త ముందుగా చనిపోతే తానుకూడ వెనువెంట వెళ్లి భర్తను కూడుకొనే భార్యను అవమానించటం ధర్మవిరోధం. అంతే కాదు. భర్త భార్యయందు ప్రవేశించి గర్భంలో వసించి పుత్రుడై జన్మిస్తాడు కాబట్టి 'అంగాత్ అంగాత్ సంభవసి శరీరం నుండి పుట్టుతున్నావు ఇత్యాది వేదవాక్యంవల్ల కూడ తండ్రికొడుకులకు భేదం లేదు.

**విశేషం:** గృహస్థాశ్రమంలో పుత్త్రునియొక్క ప్రాధాన్యం 86 నుండి 91వ పద్యంవరకు చెప్పబడింది.

**క. విను గార్హపత్య మను న । య్యనలము విహరింపఁబడి తదాహవనీయం**
**బున వెలుఁగునట్ల వెలుఁగును । జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతితోడన్. 87**

**ప్రతిపదార్థం:** విను= తెలిసికొమ్ము!; గార్హపత్యము+అను, ఆ+అనలము= గార్హపత్యం అని పిలువబడే ఆ అగ్ని; విహరింపఁబడి= ప్రజ్వలింపచేయబడి; తద్+ఆహవనీయంబున= ఆ ఆహవనీయం అనే అగ్నిలో; వెలుఁగున్, అట్లు+అ= ఏవిధంగా వెలుగుతుందో ఆవిధంగా; జనకుఁడు= తండ్రి; తాన్= తానే; పుత్త్రుఁడు+ఐ= కుమారుడై; నిజ, ద్యుతితోన్= తనకాంతితో; వెలుగును= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** గార్హపత్యం అనబడే అగ్ని ప్రజ్వలింపబడి ఏవిధంగా ఆహవనీయంలో వెలుగొందుతుందో ఆవిధంగానే తండ్రి తానే పుత్రుడై తన ప్రకాశంతో వెలుగొందుతాడు. దీనిని తెలిసికొనుము.

**విశేషం:** అలం: ఉపమ. గృహస్థు నిత్యాగ్నిహోత్రం చేసికొనటానికి ఆరిపోకుండా రక్షించుకొనే అగ్ని గార్హపత్యాగ్ని, వైశ్వదేవాది క్రియలు ఆచరించటానికి గార్హపత్యాగ్నినుండి గ్రహించి క్రియాసమాప్తివరకు హోమం చేయటానికి ఉపయోగించే అగ్ని ఆహవనీయాగ్ని, గార్హపత్యంలోని అగ్నియే ఆహవనీయంలో వెలుగొందుతుంది కాబట్టి తండ్రి తనువునుండి పుత్రుడు పుట్టి ప్రకాశిస్తాడని భావం.

**క. తాన తననీడ నీళ్ళ ల । లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుత! త**
**త్సూను జనకుండు సూచి మ । హానందముఁ బొందు నతిశయప్రీతిమెయిన్. 88**

**ప్రతిపదార్థం:** లోకస్తుత= లోకులచేత కీర్తింపబడినవాడా! దుష్యంతా!; తాను+అ= తానే; తన, నీడన్; నీళ్ళులలోన్= నీళ్ళల్లో, ఏర్పడన్= స్పష్టంగా; చూచున్+అట్లు= చూచేవిధంగా; జనకుండు= తండ్రి; తద్+సూను= అతని కుమారుడిని; చూచి; అతిశయ, ప్రీతిమెయిన్= మిక్కిలి సంతృప్తితో, మహత్+ఆనందమున్= గొప్పదైన ఆనందాన్ని; పొందును= పొందుతాడు.

**తాత్పర్యం:** రాజా! పురుషుడు నీళ్ళలో తననీడ తాను స్పష్టంగా చూచినవిధంగా తండ్రి కొడుకును చూచి మిక్కిలి సంతృప్తితో మహదానందాన్ని పొందుతాడు.

**విశేషం:** అలం: ఉపమ. పరమాత్మకు జీవాత్మకు బింబప్రతిబింబ భావం అద్వైతంలో చెప్పబడినట్లు ఇక్కడ తండ్రికొడుకులకు బింబప్రతిబింబ భావం చెప్పబడింది. తత్త్వతః రెండూ ఒకటే అని భావం.

**వ. 'పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్త్ర' యను వేదవచనంబు గలదు గావునఁ బుణ్యాచారుం డయిన పుత్త్రుం డుభయపక్షంబులవారి నుద్ధరించుఁ; గావున. 89**

**ప్రతిపదార్థం:** పుత్+నామ్ను; నరకాత్ - త్రాయతే+ఇతి, పుత్త్రః - 'పుత్' అనే పేరు కల నరకంనుండి కాపాడుతాడు కాబట్టి పుత్త్రుడు అనబడతాడు; అను, వేదవచనంబు; కలదు; కావునన్; పుణ్య+ఆచారుండు+అయిన, పుత్త్రుండు= పవిత్రమైన నడవడిక కలవాడైన పుత్రుడు; ఉభయ, పక్షంబుల, వారినిన్= రెండుప్రక్కలవారిని (ఇటుతండ్రి పక్షంవారిని అటు తల్లిపక్షంవారిని); ఉద్ధరించున్= ఉత్తమలోకాలను కలిగిస్తాడు (పైకెత్తుతాడు); కావున.

**తాత్పర్యం:** పుత్ అనే పేరుగల నరకంనుండి తల్లిదండ్రులను కాపాడుతాడు కాబట్టి పుత్త్రుడు అనే పేరు ఏర్పడింది అని వేదం చెప్పింది. కాబట్టి ఉత్తమశీలుడైన పుత్రుడు తల్లిదండ్రుల ఉభయవంశాలవారిని ఉద్ధరిస్తాడు కాబట్టి.

**విశేషం:** పుత్రుడి మహిమ తెలియటానికి ఈపర్వంలోని జరత్కారు వృత్తాంతం, పాండురాజతపోవన వృత్తాంతాలు చదువవచ్చును.

**క. నీ పుణ్యతనువు వలనన । యీపుత్త్రకుఁ డుద్భవిల్లి యెంతయు నొప్పన్**
**దీపంబువలన నొండొక । దీపము ప్రభవించినట్లు తేజం బెసఁగన్. 90**

**ప్రతిపదార్థం:** దీపంబు వలనన్= ఒక దీపంవలన; ఒండు+ఒక, దీపము= మరొకదీపం; తేజంబు+ఎసఁగన్= వెలుగొందగా; ప్రభవించిన+అట్లు= పుట్టినట్లు; నీ, పుణ్య, తనువు, వలనన్+అ= నీపవిత్రమైన శరీరంవలననుండియే; ఈపుత్త్రకుఁడు= ఈ కొడుకు (భరతుడు); ఉద్భవిల్లి= పుట్టి; ఎంతయున్+ఒప్పున్= ఎంతగానో ప్రకాశిస్తున్నాడు.

**తాత్పర్యం:** ఒక దీపంనుండి మరొకదీపం పుట్టి వెలుగొందినట్లు నీ పుణ్యశరీరంనుండి ఈపుత్త్రుడు పుట్టి ప్రకాశిస్తున్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. దీపంనుండి దీపం పుట్టటంతో తండ్రితనువునుండి పుత్రుడు పుట్టటం పోల్చబడింది. వెలిగించిన దీపం ఆకృతి కోల్పోయేది లేదు, వన్నెతగ్గేది లేదు. వెలిగినదీపం వెలిగించిన దీపంలాగానే ఆకృతిలో తేజస్సులో సమంగా ప్రకాశిస్తుంది. రూపాంతరం పొందినా రూపసామ్యం తండ్రిపుత్రులలో ఉంటుందని చెప్పే ఉపమ ఇది.

**మ. విపరీతప్రతిభాష లేమిటికి నుర్వీనాథ! యీ పుత్త్రగా**
**త్రపరిష్వంగసుఖంబు సేకొనుము ముక్తాహార కర్పూర సాం**
**ద్రపరాగ ప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్త్రగా**
**త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే. 91**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథ= భూమియొక్క పతివైన ఓరాజా!; విపరీత, ప్రతిభాషలు, +ఏమిటికిన్?= విరుద్ధాలైన మారుమాటలు ఎందుకు? (అటువంటి మాటలు చెప్పబోకు మనిభావం); ఈ, పుత్త్ర, గాత్ర, పరిష్వంగ, సుఖంబు= ఈ కుమారుడియొక్క శరీరాన్ని కౌగిలించుకొనటంవలని హాయిని; చేకొనుము= స్వీకరించుము(అనుభవింపుమని భావం); ముక్తా, హార, కర్పూర, సాంద్ర, పరాగ, ప్రసరంబున్= ముత్యాలహారాలున్నూ, పచ్చకర్పూరపు దట్టమైన పొడియొక్క వ్యాపనమున్నూ (పచ్చకర్పూరపు మైపూత అనిభావం); చందనమున్= మంచిగంధమున్నూ; చంద్రజ్యోత్స్నయున్= వెన్నెలయున్నూ; జీవులకున్= ప్రాణులకు; పుత్త్ర, గాత్ర, పరిష్వంగము+అట్లు= కుమారుడి శరీరాన్ని కౌగిలించుకొన్నట్లు; హృద్యంబు+ఏ= మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగించునా?; కడున్, శీతమే= మిక్కిలి చల్లదనంగా ఉండునా? (ఉండదని భావం).

**తాత్పర్యం:** ఓరాజా! విరుద్ధాలైన మారుమాటలు ఎందుకు? ఈపుత్రుడిని కౌగిలించుకొని ఈతడి కౌగిలివలన కలిగే సుఖాన్ని అనుభవించుము. ముత్యాలహారాలూ, పచ్చకర్పూరపు దట్టమైన పొడి ప్రసారం, మంచిగంధమూ, వెన్నెలయూ జీవులకు పుత్రునికౌగిలివలె మనసుకు సుఖాన్నీ, మంచి చల్లదనాన్నీ కలిగించలేవు.

**విశేషం:** అలం: వ్యతిరేకం. స్పర్శసిద్ధాంతాన్ని ప్రతిపాదించే ఈపద్యం నన్నయగారి సూక్తిమధురమైన కవిత్వానికి ఉత్తమ ఉదాహరణంగా తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధి చెందింది. ఇందులో నన్నయ ఎన్నుకొన్న ఉపమాద్రవ్యాలన్నీ అమూలకాలే.

**క. అనఘుఁడు వంశకరుండై । పెనుపున నీసుతుఁడు వాజపేయంబులు నూ**
**టొనరించు నని సరస్వతి । వినిచె మునులు వినఁగ నాకు వినువీథిదెసన్. 92**

**ప్రతిపదార్థం:** నీసుతుఁడు= నీకొడుకు; అనఘుఁడు= పాపరహితుడున్నూ; వంశకరుండు+ఐ= వంశకర్తయున్నూఅయి; పెనుపునన్= గొప్పతనంతో; వాజపేయంబులు, నూరు,+ఒనరించున్+అని= వాజపేయంఅనేపేరుగల యజ్ఞాలను నూరింటిని చేస్తాడని; వినువీథి, దెసన్= ఆకాశమార్గంలో; సరస్వతి= (ఆకాశ)వాణి; మునులు, వినఁగన్= ఋషులందరూ వినేటట్లు; నాకున్= నాకు (శకుంతలతో); వినిచెన్= చెప్పింది.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ము డైన నీకుమారుడు వంశకర్తయై పూనికతో నూరువాజపేయయాగాలను చేస్తా' డని ఆకాశవీధిలో సరస్వతి (ఆకాశవాణి) మునులందరూ వినేటట్లుగా నాతో చెప్పింది.

**విశేషం:** నన్నయ ఈ వివరాలు భరతుడు పుట్టిన ఘట్టంలో చెప్పలేదు. దుష్యంతుడి నిండుసభలో చెప్పించాడు. ఇది కథాకథన కళ. ఆకాశవాణిచేత పొగిడించుకొనినవాడు మహాత్ముడు ఔతాడనీ, ఆకాశవాణి భవిష్యద్వాణిగా సత్యమే చెపుతుందనీ అందరి విశ్వాసం. శకుంతల చెప్పిన ఆకాశవాణి సత్యకథనాన్ని దుష్యంతుడు నమ్మడు; అది పరోక్షప్రమాణం కావటంచేత. భావికథలో తన సభలోనే ఆకాశవాణి పలికినప్పుడు ప్రత్యక్షప్రమాణమని నమ్మాడు. ఆకాశవాణి ద్వయ ప్రయోగం వస్తుశిల్పం. ఈ సన్నివేశంలో తులనాత్మక శిల్పానుశీలనంవలన వస్తుధ్వని రాణిస్తున్నది.

**క. భూరిగుణు నిట్టి కులవి। స్తారకు దారకు నుదారధర్మప్రియ! ని**
**ష్కారణమ తప్పఁజూడఁగ। సారమతీ! చనునె నాఁటి సత్యము గలుగన్. 93**

**ప్రతిపదార్థం:** ఉదార, ధర్మ, ప్రియ= ఉత్తమ మైన ధర్మమునందు ప్రీతికలవాడా!; సారమతీ= సారవంత మైన బుద్ధికలవాడా!; నాఁటి, సత్యము, కలుగన్= ఆ వివాహంనాడు (దుష్యంతుడు) ఇచ్చిన వరమనే సత్యం వాస్తవమై ఉండగా; భూరి, గుణున్= అనేక గుణాలు కలవాడిని; ఇట్టి= ఇటువంటి (ఆకాశవాణి కీర్తించినటువంటి); కుల, విస్తారకున్= వంశాన్ని విస్తరించేవాడిని (వంశోద్ధారకుడిని); దారకున్= పుత్రుడిని (బాలకుడిని); నిష్కారణము+అ= కారణంలేకుండానే; తప్పన్, చూడఁగన్= కాదనటం (విముఖంగా చూడటం); చనునె= తగునా? (తగ దని భావం).

**తాత్పర్యం:** ఉత్తమధర్మప్రియా! సారమతీ! మనవివాహ మైననాడు నా కిచ్చిన వర మనే సత్యం నిలిచి ఉండగా, అపారగుణవంతుడు, వంశవిస్తారకుడు, అయిన పుత్త్రుడిని ఏకారణం లేకుండానే కాదనటం తగునా? (తగదు అని భావం).

**విశేషం:** ఉదారధర్మప్రియ! సారమతీ! అనీ శకుంతల దుష్యంతుడిని సంబోధించటం సాభిప్రాయం; ధర్మం తెలిసినవాడూ, వివేకం కలవాడూ పుత్త్రుడిని కాదన డని హెచ్చరింపు.

**చ. నుతజలపూరితంబు లగు నూతులు నూఱిటికంటె సూనృత**
**వ్రత! యొక బావి మేలు; మఱి బావులు నూఱిటికంటె నొక్కస**
**త్క్రతువది మేలు; తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు; త**
**త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడఁగన్. 94**

**ప్రతిపదార్థం:** సూనృతవ్రత!= నిజము మాటాడటమే నియమంగా కలవాడా!; నుత, జల, పూరితంబులు+అగు= మంచినీటిచేత నిండినవైన; నూతులు= చేదుడుబావులు; నూఱిటికంటెన్= వందకంటె; ఒక, బావి, మేలు= ఒక దిగుడుబావి ఉత్తమం; మఱి; బావులు, నూఱిటికంటెన్= దిగుడుబావులు వందకంటె; ఒక్క, సత్+క్రతువు+అది, మేలు= ఒకమంచి యజ్ఞం ఉత్తమం; తద్+క్రతుశతంబున, కంటెన్= అటువంటి నూరు యజ్ఞాలకంటె; సుతుండు, మేలు= కొడుకు మేలు; తద్, సుత, శతకంబు, కంటెన్= అట్టి కొడుకులు వందమందికంటె; చూడఁగన్= పరిశీలించగా; ఒక సూనృత, వాక్యము, మేలు= ఒక సత్యవాక్యం ఉత్తమం.

**తాత్పర్యం:** సత్యవ్రతం గల ఓ రాజా! మంచినీటితో నిండిన చేదుడుబావులు నూరింటికంటె ఒక దిగుడుబావి మేలు; కాగా, బావులు నూరింటికంటె ఒక మంచియజ్ఞం మేలు; అటువంటి నూరుయజ్ఞాలకంటె ఒక పుత్రుడు మేలు. అట్టి పుత్రులు నూరుమందికంటె ఒక సత్యవాక్యం మంచిది.

**విశేషం:** అలం: సారాలంకారం. 'సూనృతవ్రత!' అన్న సంబోధనం సాభిప్రాయం. మాటతప్పిన దుష్యంతుడి ప్రవర్తనను ఎత్తిపొడిచేది. ఆగ్రహంలో కూడ శకుంతల ఔచిత్యం పాటించింది. గృహస్థాశ్రమధర్మంలో సంతానంకంటె సత్యం గొప్పదని తాత్పర్యం. దీనిని 95, 96 పద్యాలలోకూడా వివరించటం గమనించదగింది. ఉత్తరోత్తరాలకు ఉత్కర్ష చెప్పి వర్ణిస్తే సారాలంకారం. ఉత్కర్ష ఆకారంలో కాదు గుణంలో. ఇక్కడ పుణ్యంలో నూరు నూతులు త్రవ్వించిన పుణ్యంకంటె ఒక బావి త్రవ్వించిన

పుణ్యం మిన్న. నూరు బావులు కట్టించిన పుణ్యంకంటె ఒక యజ్ఞంవలని పుణ్యం మేలు. నూరుయజ్ఞాల ఫలంకంటె ఒక కొడుకును పొందిన పుణ్యం మిన్న. నూర్గురు కొడుకులను కన్న పుణ్యంకంటె ఒక సత్యవాక్యం శ్రేష్ఠం. నూరు సంఖ్య అధికమైన ప్రమాణానికి గుర్తు. నన్నయ రుచిరార్థసూక్తికి ఇది మంచి ఉదాహరణం.

**క. వెలయంగ నశ్వమేధం । బులు వేయును నొక్కసత్యమును నిరుగడలం**
**దుల నిడి తూఁపఁగ సత్యము । వలనన ములుసూపు గౌరవంబున పేర్మిన్. 95**

**ప్రతిపదార్థం:** తులన్= త్రాసునందు; వెలయంగన్= ప్రకటమయ్యేటట్లు; అశ్వమేధంబులు, వేయునున్= వేయి అశ్వమేధయాగాలు (ఒకవైపు)నూ; ఒక్క, సత్యమును= ఒక సత్యాన్ని మాత్రమే (రెండోవైపునూ); ఇరుగడలన్= రెండువైపులా; తులన్= త్రాసులో ఇడి=ఉంచి; తూఁపఁగన్= తూచగా; గౌరవంబున+పేర్మిన్= గురుత్వము నందలి ఆధిక్యంతో ॥బరువుయొక్క ఆధిక్యంతో సత్యము, వలనన= సత్యంవైపే; ములు, చూపున్= ముల్లుచూపుతుంది, మొగ్గుచూపుతుంది. (సత్యమే గొప్ప దని సూచిస్తుంది అని భావం).

**తాత్పర్యం:** ఒక త్రాసులో బాహాటంగా వేయి అశ్వమేధాల (ఫలాన్ని)ను ఒకవైపునా, ఒక్కసత్యాన్ని మాత్రమే మరొకవైపునా ఉంచి తూచగా సత్యంవైపు బరువువలన ములుచూపి (మొగ్గుచూపి) సత్యమే గొప్పదని నిరూపిస్తుంది.

**విశేషం:** కొన్నిప్రతులలో ఈపద్యంతరువాత మరొక కందపద్యం అధికంగా కనబడుతున్నది. అది- "క. విను సత్యాలాపమునకు। మనుజేంద్ర! శతాశ్వమేధమహితఫలంబుల్ । గొనకొని చూచిన సరిగా । వనయంబును నిట్లు వలుకు నాగమఫణితుల్". తాత్పర్యంలో ఈపద్యంకంటె విశేషం లేకపోవటంచేత ఆపద్యం లేకపోయినా సందర్భంలో ఎటువంటి లోపమూ కానరాదు.

**తే. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద । సమధిగమము సత్యంబుతో సరియుఁ గావు**
**ఎఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద । యండ్రు సత్యంబు ధర్మజ్ఞు లైన మునులు. 96**

**ప్రతిపదార్థం:** సర్వ, తీర్థ+అభిగమనంబు= సమస్త తీర్థాలకు పోవటం; సర్వ, వేద, సమధిగమము= వేదాలనన్నింటిని అధ్యయనం చేయటం; సత్యంబుతోన్, సరియున్, కావు= సత్యంతో సాటి కావు; ధర్మజ్ఞులు+ఐన, మునులు= ధర్మం బాగా తెలిసిన ఋషులు; ఎందున్= ఎప్పుడైనా, ఎక్కడైనా; సత్యంబు= సత్యం; ఎల్ల, ధర్మంబులకున్= ధర్మాలన్నింటికంటె; పెద్ద, అండ్రు= గొప్పది అంటారు; ఎఱుఁగుము= తెలిసికొనుము, గమనించుము.

**తాత్పర్యం:** తీర్థా లన్నింటినీ సేవించటం, వేదాల నన్నింటినీ అధ్యయనంచేయటం సత్యంతో సాటికావు. ధర్మం బాగాతెలిసిన ఋషులు ఎల్లప్పుడు అన్నిధర్మాలకంటె సత్యమే గొప్పదని అంటారు. దీన్ని గమనించుము.

**విశేషం:** గృహస్థాశ్రమధర్మాలన్నింటిలో సత్యమే శ్రేష్ఠమని భావం. "సత్యమేవేశ్వరో లోకే । సత్యే ధర్మః ప్రతిష్ఠితః । సత్యమూలాని సర్వాణి । సత్యాన్నాస్తి పరం పదం" అని పురాణోక్తి. లోకంలో సత్యమే ఈశ్వరుడు; సత్యంలోనే ధర్మం నిత్యంగా నిలిచి ఉంటుంది; సర్వజగత్తుకూ సత్యమే మూలం; సత్యంకంటె ఉత్తమపదం మరొకటి లేదు. సత్యమంటే సత్యవాక్య మనీ, నిత్య(సత్య)మనీ రెండర్థాలున్నాయి. ఆ రెండూ ఈ సందర్భంలో గృహస్థాశ్రమపరంగా అన్వయిస్తాయి.

**క. కావున సత్యము మిక్కిలి । గా విమలప్రతిభఁ దలఁచి కణ్వాశ్రమ సం**
**భావిత సమయస్థితి దయఁ । గావింపుము; గొడుకుఁ జూడు కరుణాదృష్టిన్. 97**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; విమల, ప్రతిభన్= నిర్మలమైన బుద్ధితో; సత్యమున్= సత్యాన్ని; మిక్కిలిగాన్= గొప్పదానినిగా; తలఁచి= భావించి; కణ్వ+ఆశ్రమ, సంభావిత, సమయస్థితి= (నీవు) కణ్వాశ్రమంలో చేసిన ప్రతిజ్ఞను; దయన్= దయతో; కావింపుము= నెరవేర్చుము; కొడుకున్=(నీ) కొడుకును (భరతుడిని); కరుణాదృష్టిన్= దయాభావంతో; చూడుము= చూడుము (మన్నించుము).

**తాత్పర్యం:** కాబట్టి, నిర్మల మైన బుద్ధితో సత్యం గొప్పదిగా భావించి, కణ్వమహర్షిఆశ్రమంలో నీవు చేసిన ప్రతిజ్ఞను దయతో నెరవేర్చుము. నీ కొడుకును దయతో చూడుము.

**విశేషం:** గృహస్థాశ్రమధర్మంలో సత్యంచేత సర్వార్థసాధనం చేయవచ్చని భావం.

**క. క్షత్త్రవరుఁ డైన విశ్వా । మిత్త్రునకుఁ బవిత్ర యైన మేనకకున్ స**
**త్పుత్త్రి నయి బొంకు వలుకఁగ । ధాత్రీతలనాథ! యంత ధర్మేతరనే? 98**

**ప్రతిపదార్థం:** ధాత్రీతలనాథ= ఓరాజా!; క్షత్త్రవరుఁడు+ఐన= క్షత్రియులలో ఉత్తముడయిన; విశ్వామిత్త్రునకున్= విశ్వామిత్రుడికిన్నీ; పవిత్ర+ఐన= పవిత్రురాలు అయిన; మేనకకున్= మేనకకున్నూ; సత్+పుత్త్రిన్+అయి; యోగ్యురాలైన కుమార్తె నయి; బొంకు, పలుకఁగన్= అబద్ధ మాడటానికి; అంత, ధర్మ+ఇతరనే?= నేను అంత అధర్మపరురాలనా? (కానని భావం).

**తాత్పర్యం:** ఓరాజా! క్షత్రియులలో ఉత్తము డైన విశ్వామిత్రుడికీ, పవిత్రురా లైన మేనకకూ యోగ్యురా లైన కుమార్తె నయిన నేను అబద్ధమాడటానికి అంత అధర్మపరురాలను కాను.

**వ. అనిన శకుంతల పలుకులు సేకొన నొల్లక దుష్యంతుం డి ట్లనియె. 99**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** పైవిధంగా పలికిన శకుంతలయొక్క మాటలను దుష్యంతుడు అంగీకరించక ఈవిధంగా అన్నాడు.

**క. ఏ నెట? నీ వెట? సుతుఁ డెట? । యే నెన్నఁడు తొల్లి చూచి యెఱుఁగను నిన్నున్;**
**మానిను లసత్యవచనలు । నా నిట్టు లసత్యభాషణం బుచితంబే? 100**

**ప్రతిపదార్థం:** ఏన్+ఎట= నేను ఎక్కడ?; నీవు+ఎట= నీవు ఎక్కడ?; సుతుఁడు+ఎట= కుమారుడు ఎక్కడ; ఏన్= నేను; నిన్నున్= నిన్ను (శకుంతలను); తొల్లి= పూర్వం; ఎన్నఁడున్= ఏరోజునా, ఎప్పుడూ; చూచి, ఎఱుఁగను= చూడలేదు (చూచినట్లు జ్ఞాపకం లేదు); మానినులు= ఆడువారు; అసత్య, వచనలు, నాన్= అబద్ధాలు ఆడుతారు అన్నట్లుగా; ఇట్టులు= ఈవిధంగా; అసత్యభాషణంబు= అబద్ధాలు ఆడటం; ఉచితంబు+ఏ= తగునా? (తగదని భావం).

**తాత్పర్యం:** నే నెక్కడ? నీ వెక్కడ? కుమారు డెక్కడ? ని న్నింతకుపూర్వం ఏనాడూ చూచి ఎఱుగను. 'ఆడువారు అబద్ధా లాడుతారు' అన్నట్లుగా ఈవిధంగా అసత్యం పలకటం నీకు తగునా? (ఉచితం కాదు).

**విశేషం:** 'అసత్యవచనా నార్యః' అని మూలం, దీనిని నన్నయ ఔచిత్యవంతంగా తెలుగుచేశాడు. 'స్త్రీలు అసత్యవచనలు నాన్' -అనటంలో ఆ విశేషం ఉంది. ఆడువారు అసత్యాలు మాట్లాడుతారు అన్న నిశ్చితార్థం కాకుండా, ఆడువారు అబద్ధాలు

చెపుతారేమో అన్నపేరు నీవలన వచ్చేటట్లుగా (నాన్= అనగా) అని చెప్పటం ఔచిత్యం. స్త్రీజాతికి అపకీర్తి తేవద్దు అనే హెచ్చరిక ఇందులో గమ్యం. మరొక విశేషాన్ని శ్రీమదాంధ్రమహాభారతం సంశోధితముద్రణం పేర్కొన్నది." క. వనకన్యకయఁట నేనఁట। వనమున గాంధర్వమున వివాహంబఁట నం। దనుఁగనెనట, మరచితినఁట। వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్ - ఈపద్యము ఆదిపర్వమున నున్న దని అప్పకవి వ్రాసియున్నాడు- ఈపద్యము పినవీరభద్రుని శృంగారశాకుంతలములో నున్నది. అయినచో నిచ్చోటనే యుండఁబోలు. (ప్రథమసంపుటం - పుట. 204 (అధస్సూచి). దుష్యంతుడు ఈ మాటలన్న తరువాత శకుంతలనూ మేనకా విశ్వామిత్రులనూ, అనౌచిత్యంతోకూడిన నిందావాక్యాలతో అధిక్షేపించినట్లు సంస్కృతభారతంలో ఉన్నది. నన్నయ ఆ మాటలన్నీ వదలి శకుంతల సచ్ఛీలాన్ని వ్యక్తం చేశాడు.

**క. పొడవునఁ బ్రాయంబునఁ గడుఁ। గడిఁది బలంబునను జూడఁగా నసదృశు నీ**
**కొడు కని యీతని నెంతయు। నెడమడుగుగఁ జూపఁ దెత్తె యిందఱు నగఁగన్. 101**

**ప్రతిపదార్థం:** ఈతనిన్= ఇతనిని (భరతుడిని); చూడఁగాన్= పరిశీలించగా; పొడవునన్= ఆకారంచేత; ప్రాయంబునన్= వయస్సులోనూ, కడున్, కడిఁది, బలంబునను= అమితమైన బలంలోనూ; అసదృశున్= సాటిలేనివాడిని; నీకొడుకు+అని= నీయొక్క కుమారుడు, అని; ఎంతయున్, ఎడమడుగుగన్= ఎంతయో విరుద్ధంగా; ఇందఱున్= ఇంతమంది; నగఁగన్= నవ్వేటట్లు, ఎగతాళిచేసేటట్లు; చూపన్= నాకు చూపించటానికి; తెత్తె= తెస్తావా?

**తాత్పర్యం:** చూడంగానే రూపంలోనూ, వయస్సులోనూ అధికమైన బలంలోనూ సాటిలేనివాడుగా కనబడుతున్న ఇతడిని 'నీకొడుకు' అని ఎంతో విరుద్ధంగా అందరూ నవ్వేటట్లు నాకు చూపటానికి తీసికొనివచ్చావా?

**వ. 'ఇట్టి లోకవిరుద్ధంబుల కే మోడుదు; మయుక్తంబు లయిన పలుకులు పలుకక నీయాశ్రమంబునకుం బొ' మ్మనిన శకుంతల యత్యంతసంతాపితాంతఃకరణ యై. 102**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఇటువంటి; లోక, విరుద్ధంబులకున్= వాస్తవానికి వ్యతిరేకంగా ఉండేవాటికి; ఏము= మేము (నేను అనే సర్వనామానికి గౌరవవాచక బహువచనం); ఓడుదుము= భయపడతాము, జంకుతాము (అంగీకరించమని భావం); అయుక్తంబులు+అయిన= తగనివి అయిన; పలుకులు, పలుకక= మాటలు మాటాడక; నీ, ఆశ్రమంబునకున్+ పొమ్ము+అనినన్= నీయొక్క ఆశ్రమానికి తిరిగిపొమ్ము అని అనగా; శకుంతల; అత్యంత, సంతాపిత+అంతఃకరణ+ఐ= మిక్కిలి తపింపబడిన హృదయం కలిగినదై.

**తాత్పర్యం:** ఇటువంటి లోకవాస్తవ వ్యతిరేకాంశాలను మేము అంగీకరించం. తగనిమాటలు పలుకక నీవు నీ ఆశ్రమానికి తిరిగిపొమ్ము - అని దుష్యంతుడు పలుకగా శకుంతల మనస్సులో అధికంగా సంతాపాన్ని పొందినదై.

**మధ్యాక్కర.**

**'తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ**
**బడితి; నిప్పుడు పతిచేతను విడువఁబడియెదనొక్కొ!**
**నుడువులు వేయు నిం కేల? యిప్పాటినోములు తొల్లి**
**కడఁగి నోఁచితిని గా కేమి' యనుచును గందె డెందమున. 103**

**ప్రతిపదార్థం:** పుట్టిననాఁడు+అ= పుట్టిననాడే; తడయక= ఆలస్యంకాక; తల్లిచేన్, తండ్రిచేన్= తల్లిచేత (మేనకచేత), తండ్రిచేత (విశ్వామిత్రుడిచేత) విడువఁబడితిన్= వదలివేయబడినాను; ఇప్పుడు; పతిచేతను= భర్తచేతకూడ; విడువఁబడియెదన్+ఒక్కొ=

వదలబడతానో ఏమో!; ఇంకన్+ఏల= మరింకెందుకు; నుడువులు, వేయున్= వేయి(పెక్కు)మాటలు; ఈ+పాటి, నోములు= ఇంతటి (ఫలాన్ని ఇచ్చే) నోములు పూజలు; తొల్లి= పూర్వం; కడఁగి= పూనుకొని; నోచితిని, కాక+ఏమి= నోచాను కాబోలు; అనుచును; డెందమునన్= హృదయంలో; కందెన్= దుఃఖించింది, బాధపడింది.

**తాత్పర్యం:** 'పుట్టిననాడే వెంటనే తల్లిదండ్రులచేత ఆ నాడు విడువబడినాను. ఇప్పుడు భర్తచేతకూడ విడువబడతాను కాబోలు; ఇక వేయి(పెక్కు)మాట లాడట మెందుకు? పూర్వం ఇటువంటి కొరనోములే నోచాను కాబోలు. అని శకుంతల మనసులో బాధపడింది.

**విశేషం:** మధ్యాక్కర పాదంలో వరుసగా రెండు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం, రెండు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం ఉంటాయి. నన్నయ అయిదవ గణం మొదటి అక్షరంతో యతి పాటించాడు. ప్రాస నియమం ఉన్నది. ఈపద్యంలో ఒక్క 'పతి' అనే శబ్దం తప్ప మిగిలిన వన్నీ తెలుగు మాటలే. శోకభావాని కనుగుణమైన వృత్తాన్ని, రచనను, వాక్యాలను ఇందులో నన్నయ ప్రయోగించాడు.

**వ.** **ఇట్లు దద్దయు దుఃఖించి విగతాశయై బోరనఁదొరఁగు బాష్పజలంబు లందంద యొత్తికొనుచు 'నింక దైవంబ కాని యొండు శరణంబు లేదని యప్పరమ పతివ్రత తనయుందోడ్కొనిక్రమ్మఱిపోవ నున్న యవసరంబున.** **104**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; తద్దయున్= మిక్కిలి; దుఃఖించి= ఏడ్చి; విగత+ఆశ+ఐ= వదలబడిన ఆశలు కలదై; బోరనన్= ఎడతెరపిలేకుండ; తొరఁగు= కారు; బాష్పజలంబులు= కన్నీళ్ళు; అందు+అందు+అ= అక్కడికక్కడే; ఒత్తికొనుచున్= చెంగుతోఅద్దుకొంటూ; ఇంకన్= ఇకపై; దైవంబు+అ, కాని= దేవుడే తప్ప; ఒండు, శరణంబు, లేదు+అని= మరొకదిక్కు లేదని; ఆ+పరమపతివ్రత= ఆ గొప్ప ఇల్లాలు; తనయున్+తోడ్కొని= కొడుకును వెంటబెట్టుకొని; క్రమ్మఱిపోవన్+ఉన్న, అవసరంబునన్= తిరిగిపోబోతున్న సమయంలో.

**తాత్పర్యం:** ఈవిధంగా మిక్కిలి యేడ్చి, ఆశలు వదలుకొని, ఎడతెరపిలేకుండ కారే కన్నీళ్ళను అప్పుడప్పుడు ఒత్తుకొంటూ, ఇకపై నాకు దైవమే శరణ్యమని భావించి, ఆ ఉత్తమపతివ్రత కొడుకును వెంటబెట్టుకొని తిరిగిపోబోతున్న సమయంలో.

**విశేషం:** 'అన్యథా శరణం నాస్తిత్వమేవ శరణం మమ' వంటి భక్తిభావం శకుంతల ప్రదర్శిస్తున్నది కాబట్టి దైవరక్షణం కలుగుతుందని భావికథార్థధ్వని.

### దివ్యవాణి నాకర్ణించి దుష్యంతుఁడు శకుంతలను గ్రహించుట (సం. 1-69-28)

**చ.** **'గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు; సే**
**కొని భరియింపు మీతని; శకుంతల సత్యము వల్కె ,సాధ్వి, స**
**ద్వినుత, మహాపతివ్రత వివేకముతో' నని దివ్యవాణి దా**
**వినిచె ధరాధినాథునకు విస్మయ మందఁగఁ దత్సభాసదుల్.** **105**

**ప్రతిపదార్థం:** గొనకొని= అతిశయించి; వీఁడు= ఇతఁడు (భరతుడు); నీకును, శకుంతలకున్, ప్రియనందనుండు= నీకూ శకుంతలకూ (పుట్టిన) ముద్దుబిడ్డడు; ఈతనిన్= ఈపుత్రుడిని; చేకొని= స్వీకరించి; భరియింపుము= పోషించుము; సాధ్వి= ఇల్లాలు; సత్+వినుత= ఉత్తములచేత కీర్తింపబడినట్టి; మహాపతివ్రత= గొప్పపతివ్రత; (అయిన) శకుంతల; వివేకముతోన్= తెలివితో; సత్యము, పల్కెన్= నిజం చెప్పింది (గసడదవాదేశం); అని; తద్, సభా+ఆసదుల్= ఆ సభలో ఉన్నవారు; విస్మయము+అందఁగన్= ఆశ్చర్యపడగా; దివ్యవాణి= దేవతాసంబంధమైన వాణి, ఆకాశవాణి; ధరా+అధినాథునకున్= భూపతికి, రాజుకు (దుష్యంతుడికి); వినిచెన్= వినిపించింది.

**తాత్పర్యం:** 'ఈభరతుడు నీకూ శకుంతలకూ మిక్కిలి ముద్దుబిడ్డడు. ఈతనిని స్వీకరించి, పోషించుము. ఇల్లాలు, ఉత్తమకీర్తి కలిగింది, మహాపతివ్రత అయిన శకుంతల వివేకంతో నిజం చెప్పింది' - అని ఆకాశవాణి ఆ సభలోనివారు విని ఆశ్చర్యపడేటట్లు రాజుకు వినిపించింది. (ప్రకటించింది).

**విశేషం:** కథానిర్వహణంలో అంతంలో అద్భుతరసం ఉండాలని లక్షణవాక్యం. సభాసదులు విస్మయ మందేటట్లు ఆకాశవాణి పలకటంవలన అది సిద్ధించింది. ఇందులో స్వతస్సిద్ధంగా ఏర్పడిన అర్థశక్తివలన కలిగిన వస్తువు చేసే వస్తుధ్వని (స్వతస్సంభవ్యర్థ శక్త్యుద్భవ వస్తుకృత వస్తుధ్వని) ఉన్నది. 'ఏ నెట? నీ వెట? సుతు డెట? ఏ నెన్నఁడు తొల్లి చూచి యెఱుఁగను నిన్నున్' - అన్న దుష్యంతుడి మాటలకు పరోక్ష సమాధానం దివ్యవాణి సాక్ష్యం. పురుషుడి వృత్తాన్ని గమనిస్తూ ఉండే మహాపదార్థాలలో శబ్దగుణం కలిగిన ఆకాశం సాక్ష్యం పలకటం అద్భుతం. ఔచిత్యం. అమూర్తమైన ఆకాశవాణికి మానవీకరణం వస్తుకళావిశేషం. 'గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు' అనే వాక్యంలో దుష్యంతుడి ఆక్షేపాలన్నీ నిరాకరింపబడ్డాయి. తల్లిదండ్రులకు ప్రియనందనుడు భరతుడు అని పేర్కొనటంలో శకుంతలకు వలెనే దుష్యంతుడికికూడా భరతుడు ప్రీతిపాత్రుడే అయినా రాజు కావాలని ఆ సత్యాన్ని దాస్తున్నాడని ధ్వని. 'కొడుకును స్వీకరింపు' మనేది ధర్మప్రబోధం. 'శకుంతల సత్యం చెప్పింది' అనటంలో దుష్యంతుడు అబద్ధం చెప్పాడని తేలిన తాత్పర్యం. శకుంతల వివేకవతి. ఆమె తన ఉపన్యాసంలో క్రమంగా గృహిణి గొప్పతనాన్ని చెప్పి సాధ్వి అనిపించుకొన్నది. చక్రవర్తికాబోయే కొడుకు గొప్పతనాన్ని వివరించి సద్వినుత అనిపించుకొన్నది. దుష్యంతుడిని ఇంత సుకుమారంగా మందలించి సత్యాన్ని ప్రతిష్ఠాపించిన ఆకాశవాణి మాటలుకూర్చిన ఈరచనలో సౌకుమార్య మనే శబ్దగుణం సార్థకంగా పోషింపబడింది. పరుషవాక్యాలతో తిరస్కరించిన దుష్యంతుడికి దివ్యవాణి సుకుమారంగా ధర్మాన్ని నిర్దేశించింది. దానిని వస్తుధ్వనితో నిర్వహించటం నన్నయ రచానాశిల్పం.

**వ. ఇట్లెల్లవారలకు నతిహర్షంబుగా శకుంతల పతివ్రతాత్వంబును సత్యంబును భరతోత్పత్తియుఁ బ్రశంసించు వేలుపుల పలుకు లతివ్యక్తంబు లయి యాకాశంబువలన వీతెంచిన విని దుష్యంతుండు సభాసదులు విన ని ట్లనియె. 106**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; అతి, హర్షంబుగాన్= మిక్కిలి సంతోషంతో; శకుంతల, పతివ్రతాత్వంబును= శకుంతలయొక్క పాతివ్రత్యాన్ని గురించి; సత్యంబును= సత్యాన్ని గురించి; భరత+ఉత్పత్తియున్= భరతునియొక్క పుట్టుకను గురించి; ప్రశంసించు, వేలుపుల, పలుకులు= కీర్తించే దేవతల మాటలు; అతి, వ్యక్తంబులు+అయి= మిక్కిలి స్పష్టంగా; ఆకాశంబువలనన్= ఆకాశంనుండి; వీతెంచినన్= రాగా; దుష్యంతుండు; విని; సభాసదులు; వినన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా శకుంతల పాతివ్రత్యాన్ని గురించి, సత్యాన్ని గురించి, భరతుడి పుట్టుకను గురించి మిక్కిలి సంతోషంతో కీర్తించే దేవతలమాటలు, విస్పష్టంగా ఆకాశంనుండి వెలువడగా దుష్యంతుడు విని సభాసదులతో ఈవిధంగా అన్నాడు.

**విశేషం:** ఆకాశవాణితోపాటు దేవతల మాటలు వినబడటం ఈ కథలోని విశేషం. అపూర్వంకూడా, గృహస్థాశ్రమ వ్యవస్థలో ఇల్లాలు, కొడుకు, సత్యం అనే అంశాలు యజమానుడు (గృహస్థుడు) అనే ఒక్కరిచేత వంచింపబడితే ధార్మికంగా, ఆధ్యాత్మికంగా ప్రకృతిలో ఎంత సంక్షోభం కలుగుతుందో ఈ సన్నివేశంలో నన్నయ వస్తుధ్వని నాశ్రయించి ప్రపంచించాడు. దేవతలు శకుంతలను, భరతుడిని, సత్యాన్ని గురించి ప్రశంసించిన వాక్యాలు సభలో ఉన్నవారందరికీ హర్షాతిశయం కలిగించినట్లు నన్నయ పేర్కొనటంతో అంతటి నిండుసభలో దుష్యంతు డొక్కడే దోషిగా మిగిలిపోయాడని చెప్పక తెలుస్తున్న విశేషం. ఈ ముగింపు ఎంత గొప్పగా ఉన్నది! 'ధర్మో రక్షతి రక్షితః' అన్న వేదోక్తి సార్థక మైనది.

**తే. ఏను నీ యింతియును గాని యెఱుఁగ రన్యు । లర్థిఁ గణ్వమహాముని యాశ్రమంబు**
**నందు గాంధర్వవిధి వివాహమునఁ గరము । నెమ్మిఁ జేసిన దీని పాణిగ్రహణము. 107**

**ప్రతిపదార్థం:** అర్థిన్= కోర్కెతో; కణ్వ, మహత్+ముని, ఆశ్రమంబునందున్; గాంధర్వ, విధిన్, వివాహమునన్= గాంధర్వ పద్ధతిలో చేసికొనే పెండ్లి; కరమున్, నెమ్మిన్= మిక్కిలి ప్రీతితో; చేసిన, దీని, పాణిగ్రహణము= చేసికొన్న ఈమెతోడి వివాహం; ఏనున్= నేనున్నూ (దుష్యంతుడున్నూ); ఈ+ఇంతియునున్= ఈ వనిత (శకుంతల) యున్నూ; కాని= తప్ప; అన్యులు= ఇతరులు; ఎఱుఁగరు= తెలియరు. (ఇతరులకు తెలియదని భావం).

**తాత్పర్యం:** అలనాడు కోరి కోరి కణ్వమహర్షి ఆశ్రమంలో గాంధర్వవివాహపద్ధతి నాశ్రయించి ఈమెను మిక్కిలి ప్రీతితో చేసికొన్నవివాహం నాకూ ఈమెకూ తప్ప ఇతరుల కెవ్వరికి తెలియదు.

**తే. అన్యు లెఱుఁగమిఁ జేసి లోకాపవాద । భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి**
**యెఱుఁగ నంటిని నిందఱ కిప్పు డెఱుఁగఁ । జెప్పె నాకాశవాణి యచ్చెరువు గాఁగ. 108**

**ప్రతిపదార్థం:** అన్యులు= ఇతరులు; ఎఱుఁగమిన్, చేసి= ఎరుగకపోవటంచేత; లోక+అపవాద, భీతిన్= లోకనిందవలని భయంచేత; ఈ+తన్విన్= ఈవనితను; ఎఱిఁగియున్= తెలిసియుండికూడ; ప్రీతి, తప్పి= ఆప్యాయత లేకుండ; ఎఱుఁగను, అంటిని= నాకు తెలియదన్నాను; ఇందఱకున్= ఇంతమందికి; ఇప్పుడు= ఈక్షణంలో; ఆకాశవాణి; అచ్చెరువు, కాఁగన్= అబ్బురపాటు కలిగేటట్లు; ఎఱుఁగన్, చెప్పెన్= తెలియచెప్పింది.

**తాత్పర్యం:** ఇతరుల కెవ్వరికీ తెలియదు కాబట్టి లోకనింద కలుగునేమో అన్నభయంతో నా కీమె తెలిసిఉన్నప్పటికీ కఠినంగా 'ఈమె నాకు తెలియదు' అన్నాను. కాని, ఇప్పుడు అందరికీ తెలిసేటట్లు అద్భుతంగా ఆకాశవాణి ప్రకటించింది.

**విశేషం:** దుష్యంతుడు నిజాన్ని బయటపెట్టాడు. కళంకాన్ని కడిగివేసికొన్నాడు. అతడి వర్తనంవలన శకుంతలా మాహాత్మ్యం ధ్వనింపజేయబడింది.

**వ. అని మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్షపులక లెసఁగ నాలింగనంబు సేసి, శకుంతలా మహాదేవి నతిప్రణయగౌరవంబునసంభావించి, యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుంజేసి. పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి, తన రాజ్యభారం బంతయు భరతుం బూన్చి, దుష్యంతుండు తపోవనంబున కరిగిన. 109**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; దుష్యంతుండు; మహత్+అనురాగంబునన్= మిక్కిలి ప్రేమతో; కొడుకున్= కుమారుడిని ప్రేమాతిశయంతో (భరతుడిని); ఎత్తికొని; హర్ష, పులకలు+ఎసఁగన్= సంతోషంతో కూడిన గగుర్పాటు కలుగగా; ఆలింగనంబు, చేసి= కౌగిలించుకొని; శకుంతలా, మహాదేవిన్= పట్టమహిషి అయిన శకుంతలను; అతి, ప్రణయ, గౌరవంబునన్= మిక్కిలి వలపు యొక్క గురుత్వంతో; సంభావించి= సమ్మానించి; భరతున్= భరతుడిని; యౌవరాజ్యంబునకున్, అభిషిక్తున్, చేసి= యౌవరాజ్యపదవిలో అభిషేకం చేసి; పెద్దకాలంబు= చాలకాలం; రాజ్య, సుఖంబులు= రాజ్యంవలని భోగాలు; అనుభవించి= పొంది; తన, రాజ్యభారంబు+అంతయున్; భరతున్+పూన్చి= భరతుడు వహించేటట్లు చేసి; తపోవనంబునకున్+అరిగినన్= తపస్సుకు అనువైన అరణ్యానికి పోగా.

**తాత్పర్యం:** అని పలికి దుష్యంతుడు అమితప్రేమతో కొడుకును ఎత్తుకొని సంతోషంతో కలిగిన పులకలతో కౌగిలించుకొని, పట్టమహిషి అయిన శకుంతలను మిక్కిలి ప్రణయగౌరవంతో సమ్మానించి, భరతుడిని యౌవరాజ్యపదవిలో అభిషేకించి, చాలకాలం రాజ్యసుఖాలు అనుభవించి, తన రాజ్యభారా న్నంతా భరతుడికి అప్పగించి, తాను తపోవనానికి పోగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం - అని ఆశ్రమాలు నాలుగు. అందులో దుష్యంతుడు గార్హస్థ్యాశ్రమాన్ని నిర్వహించి వానప్రస్థం స్వీకరించాడు. బహుకాలం వనంలో తపస్సు చేసికొంటూ ఉండే ఆశ్రమం వానప్రస్థం. కథను ముగించటంలో కమనీయశిల్పం ఉన్నది ఇక్కడ. యజమానుడు మొదట సత్యాన్ని అంగీకరించి గృహస్థధర్మానికి మూలమైన శక్తిని రక్షించాడు. ఆమీద 'పుత్రగాత్రపరిష్వంగసుఖాన్ని' అనుభవించి దీపంవలన వెలిగిన దీపంవంటి అద్వైతానుభవంతో స్పర్శజ్ఞానంవలన కలిగిన పులకలతో పుత్రమహిమను చవి చూచాడు. గార్హపత్యాగ్ని ఆహవనీయంలో ప్రజ్వలించటానికి కారకురాలైన ఇల్లాలిని సంభావించాడు. ఇప్పటికి గృహస్థధర్మపీఠం నాలుగుకాళ్ళమీద నిలబడింది. భరతుడికి యౌవరాజ్యాభిషేకం చేసి సత్యవాక్యస్థాపనం చేసి, మిగిలిన ఆశ్రమధర్మాలను దుష్యంతుడు అనుసరించి సమగ్రజీవితాన్ని సాగించాడు.

**చ.** **భరతుఁ డశేష భూభువనభార ధురంధరుఁ డై వసుంధరం**
**బరఁగి, యనేక యాగములఁ బాయక భాస్కర జహ్నుకన్యకా**
**సురుచిర తీరదేశముల సువ్రతుఁడై యొనరించి, భూరిభూ**
**సురులకు నిచ్చె దక్షిణలు శుద్ధసువర్ణ గవాశ్వహస్తులన్.** **110**

**ప్రతిపదార్థం:** భరతుఁడు అశేష, భూభువన, భార, ధురంధరుఁడు+ఐ= అపార మైన సామ్రాజ్యంయొక్క బాధ్యతను వహించగలిగినవాడై; వసుంధరన్, పరఁగి= భూమిపై ప్రసిద్ధి వహించి; భాస్కర, జహ్నుకన్యకా= సూర్యుడిపుత్రిక అయిన యమునానదియొక్కయు, జహ్నుమహర్షి పుత్రిక (చెవిలోనుండి వెలువడటంచేత) అయిన గంగానదియొక్కయు; సురుచిర, తీర, దేశములన్= అందమైన తీర ప్రాంతాలలో; సు, వ్రతుఁడు+ఐ= ఉత్తమదీక్ష పొందినవాడై; అనేక, యాగములన్= పెక్కు యజ్ఞాలను; పాయక= వీడక, ఆసక్తితోన్; ఒనరించి= చేసి; దక్షిణలు= ద్రవ్యరూపంగా ఇచ్చే కానుకలనూ; శుద్ధ, సువర్ణ, గో+అశ్వ, హస్తులన్= మేలిమిబంగారాన్నీ, గోవులనూ, గుఱ్ఱాలనూ, ఏనుగులనూ; భూరి, భూసురులకున్, ఇచ్చెన్= అధికసంఖ్యలోగల బ్రాహ్మణులకు దానంచేశాడు.

**తాత్పర్యం:** భరతుడు అపార మైన సామ్రాజ్యభారాన్ని వహించి, లోకంలో ప్రసిద్ధి కెక్కి, గంగాయమునా నదీ పవిత్రతీరప్రాంతాలలో దీక్షతో అనేక యజ్ఞాలను ఆసక్తితో చేసి బ్రాహ్మణులకు అధికంగా దక్షిణలను, మేలిమి బంగారాన్నీ, గోవులనూ, గుఱ్ఱాలనూ, ఏనుగులనూ దానంచేశాడు.

## భరతవంశక్రమము (సం. 1-90-34)

**వ. మఱియు నతీతానాగతు లైన నిజవంశంబున రాజులకెల్ల వంశకర్త యయ్యె; నట్టి భరతునకుఁ గైకేయి యైన సునందకు భుమన్యుండు పుట్టె; వానికి దాశార్హపుత్త్రి యైన విజయకు సుహోత్రుండు పుట్టె; వానికి నిక్ష్వాకు కన్యయైన సువర్ణకు హస్తి పుట్టె; నతనిపేరం గౌరవ్య రాజధాని యైన నగరంబు హస్తిపురంబునాఁ బరఁగె; నట్టి హస్తికిం ద్రిగర్తరాజపుత్త్రి యైన యశోధరకు వికుంఠనుండు పుట్టె; వానికి దాశార్హపుత్త్రి యైన వసుదేవకు నజమీఢుండు పుట్టె; నయ్యజమీఢునకుఁ గైకేయియు గాంధారియు ఋక్షయు నను మువ్వురు స్త్రీలకు.111**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అంతేకాక, తనవంశంలో పూర్వం ఉండిన, భవిష్యత్తులో పుట్టే రాజుల కందరికీ వంశకర్త అయినాడు. అటువంటి భరతుడికీ కేకయరాజపుత్రిక అయిన సునందకూ భుమన్యుడు పుట్టాడు. అతడికీ దాశార్హుడి కూతురైన విజయకూ సుహోత్రుడు జన్మించాడు. అతడికీ ఇక్ష్వాకుడి పుత్రిక అయిన సువర్ణకూ హస్తి అనేవాడు పుట్టాడు. అతడిపేరుమీద కౌరవుల రాజధాని అయిన నగరం 'హస్తిపురం' అనగా ఒప్పారింది. ఆ హస్తికీ త్రిగర్తరాజుయొక్క కుమార్తె అయిన యశోధరకూ వికుంఠనుడు పుట్టాడు. అతడికీ దాశార్హరాజు పుత్రిక అయిన వసుదేవకూ అజమీఢుడు జన్మించాడు. ఆ అజమీఢుడికీ కైకేయి, గాంధారి, ఋక్ష అనే ముగ్గురు స్త్రీలకూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. బలయుతులు నూటయిరువది । నలువురు సుతు లుద్భవిల్లి నానాదేశం**
**బులకుఁ బతు లైరి; మఱి వా । రలలో సంవరణుఁ డఖిలరాజ్యోన్నతుఁ డై. 112**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** బలవంతు లైన నూట ఇరవైనలుగురు (124) కొడుకులు పుట్టి వివిధ దేశాలకు రాజు లైనారు. మఱి, వారందరిలో సంవరణుడు సమస్తరాజ్యాలలోనూ శ్రేష్ఠుడై.

**క. అనఘుఁడు పౌరవకుల వ । ర్ధనుఁ డద్దినపనాథ తనయఁ దపతి వివాహం**
**బొనరఁగ నయ్యె; నిరువుర । కును వంశకరుండు పుట్టెఁ గురుఁ డున్నతుఁడై. 113**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడూ, పౌరకులాన్ని వృద్ధిచెందించేవాడూ అయిన సంవరణుడు సూర్యుడి కుమార్తె అయిన తపతిని యోగ్యంగా వివాహం చేసికొన్నాడు. వారిరువురికి వంశకర్త అయిన కురుడు శ్రేష్ఠుడై పుట్టాడు.

**వ. వానిపేరం గురుక్షేత్రంబునాఁ బరఁగె; నట్టి కురునకు దాశార్హియైన శుభాంగికిని విధూరథుండు పుట్టె; వానికి మాగధి యయిన సంప్రియకు ననశ్వుండు పుట్టె; నయ్యనశ్వునకు మాగధి యైన యమృతకుం బరీక్షితుండు పుట్టె; వానికి బహుదానసుత యైన సుయశకు భీమసేనుండు పుట్టె; వానికిం గైకేయి యైన కుమారికిఁ బ్రదీపుఁడు (బర్యశ్రవసుండు) పుట్టె; వానికిఁబ్రతీపుండు పుట్టెఁ; బ్రతీపునకు శిబిపుత్త్రియయిన సునందకు**

**దేవాపి శంతనుబాహ్లికు లనఁగా ముగ్వురు పుట్టి; రందు దేవాపి బాల్యంబునంద తపోవనంబున కరిగిన శంతనుండు రాజయ్యె; వానికి గంగాదేవికి దేవవ్రతుం డైన భీష్ముండు పుట్టె; మఱియు శంతనునకు యోజనగంధి యయిన సత్యవతికిం జిత్రాంగద విచిత్రవీర్యు లనంగా నిద్దఱుగొడుకులు పుట్టి; రందుఁ జిత్రాంగదుండు బాల్యంబున గంధర్వనిహతుండయిన, వానికింగొండుకవానివిచిత్రవీర్యురాజ్యాభిషిక్తుంజేసి భీష్ముండు కాశీరాజదుహితల నంబికాంబాలిక లనువారి నిద్దఱ విచిత్రవీర్యునకు వివాహంబు సేసిన. 114**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అతడి పేరుమీద కురుక్షేత్ర మని పిలువబడింది. అటువంటి కురునకూ దాశార్హరాజపుత్రి అయిన శుభాంగికీ విదూరథుడు పుట్టాడు. అతడికీ మగధరాజు కుమార్తె అయిన సంప్రియకూ అనశ్వుడు పుట్టాడు. ఆ అనశ్వుడికీ మగధరాజకన్య అయిన అమృతకూ పరీక్షితుడు పుట్టాడు. వాడికీ బహుదానుడి కూతురైన సుయశకూ భీమసేనుడు పుట్టాడు. అతడికీ కేకయరాజపుత్రి అయిన కుమారికీ ప్రదీపుడు (పర్యశ్రవసుడు) పుట్టాడు. అతడికి ప్రతీపుడు పుట్టాడు. ప్రతీపుడికీ శిబికుమార్తె అయిన సునందకూ దేవాపి శంతనుడు బాహ్లికుడు అనే పేర్లు గల ముగ్గురు పుట్టారు. వారిలో దేవాపి బాల్యంలోనే తపోవనానికి వెళ్ళగా శంతనుడు రాజైనాడు. అతడికినీ గంగాదేవికినీ దేవవ్రతుడైన భీష్ముడు పుట్టాడు. అంతేకాక శంతనుడికీ యోజనగంధి అని పిలువబడే సత్యవతికీ చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అనే ఇద్దరు కొడుకులు పుట్టారు. వారిలో చిత్రాంగదుడు చిన్నతనంలోనే గంధర్వుడిచేత చంపబడటంచేత చిన్నవాడైన విచిత్రవీర్యుడిని రాజ్యాభిషిక్తుడిగా చేసి భీష్ముడు కాశీరాజుకుమార్తెలను అంబిక, అంబాలిక అనేవారిని ఇద్దరనిచ్చి వివాహంచేయగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. అతిశయరూపయౌవన గుణాధిక సుందర మైన యాసతీ**
**ద్వితయమునందు సంతతరతిన్ వివశుం డయి రాజకృత్యముల్**
**మతి నొకనాఁడుఁ జేయ కహిమద్యుతితేజుఁడు రాజయక్ష్మబా**
**ధితుఁడయి దేవలోకసుదతీప్రియుఁ డయ్యె విచిత్రవీర్యుఁడున్. 115**

**ప్రతిపదార్థం:** అహిమద్యుతి, తేజుఁడు= సూర్యకాంతివంటిప్రకాశంకలవాడైన; విచిత్రవీర్యుఁడున్= విచిత్రవీర్యుడుకూడ; అతిశయ, రూప, యౌవన, గుణ+అధిక, సుందరము+ఐన= అత్యంతం రూపంచేతను, వయసుచేతను, గుణాలయొక్క, ఆధిక్యంచేతను అందమైన; ఆ సతీద్వితయమునందున్= ఆభార్య లిరువురియందు; సంతత, రతిన్= విరామం లేని రతి (క్రీడ)భావానికి; వివశుండు+అయి= లోనైనవాడై; రాజకృత్యముల్= రాజుచేయవలసిన విధులను; మతిన్= బుద్ధితో; ఒకనాఁడున్+చేయక= ఒకరోజుకూడ చేయక; రాజయక్ష్మ, బాధితుఁడు+అయి= క్షయరోగపీడితుడయి; దేవలోక, సుదతీ, ప్రియుఁడు+అయ్యెన్= దేవలోకవనితలకు ప్రీతిపాత్రుడైనాడు, అంటే - మరణించా డని భావం. (పుణ్యంచేసినవారు చనిపోయిన తరువాత స్వర్గలోకం చేరి రంభాది దేవవనితలతో క్రీడిస్తారని ప్రతీతి).

**తాత్పర్యం:** సూర్యప్రకాశుడైన విచిత్రవీర్యుడు రూపంలోనూ, యౌవనంలోనూ గుణాలలోనూ అత్యంతసుందరులైన ఆ భార్య లిరువురియందును నిరంతరరతిభావానికి వశుడై, రాజవిధులనుగురించి యెన్నడూ మనసుకు పట్టించుకొనక క్షయరోగ పీడితుడై స్వర్గస్థుడైనాడు.

**విశేషం:** విచిత్రవీర్యుడి నిరంతర కామప్రవృత్తిని ఓజోగుణమిశ్రిత మైన మాధుర్యగుణం కల రచనతో నన్నయ రక్తికట్టించాడు. మాధుర్యంతో ఉక్తివైచిత్ర్యం మెరుస్తూ ఉండాలి. దానిని కవిప్రౌఢోక్తితో నన్నయ సాధించాడు. ఇద్దరు భార్యలతో నిరంతర రతి సాగించి క్షయరోగానికి గురిఅయి విచిత్రవీర్యుడు మృతుడైనా డనటానికి బదులుగా దేవలోకసుదతీప్రియుడైనా డనటం కవి ప్రౌఢోక్తి. ఇందులో పర్యాయోక్త్యలంకారం స్ఫురిస్తున్నది. చెప్పేదానిని సూటిగా కాకుండా భంగ్యంతరంగా చెప్పటం పర్యాయోక్తం. అట్లా చెప్పటంవలన విచిత్రవీర్యుడు చనిపోయికూడా దేవలోక సుదతీ భోగాన్ని కామపురుషార్థఫలంగా అనుభవిస్తున్నాడన్న వ్యంగ్యార్థం ప్రతీయమానం అవుతున్నది. ఇది ప్రౌఢోక్తి. రతివివశత్వం వలన విచిత్రవీర్యుడి రాజధర్మ ప్రవృత్తికి క్షయం కలిగింది. అతడి రుగ్మతకూడ క్షయవ్యాధియే. అతడి కామప్రవృత్తివలన అతడి దేహక్షతియే కాకుండా ధర్మక్షతి, వంశక్షతి అయింది. వంశంలో ఏర్పడిన మహాప్రళయ మది. సంతానవిచ్ఛేద మయ్యే ఆ దారుణ ఫలితానికి కారణమైన సంతతరతి రాజులకు తగదని కావ్యోపదేశం. దానిని నన్నయ కవిప్రౌఢోక్తిచేత సిద్ధమైన వస్తువుచేత కలిగే వస్తుధ్వనిగా రచనలో నిబంధించాడు. కవిప్రౌఢోక్తిసిద్ధ వస్తుకృతవస్తుధ్వని అనబడే ఈ రచనాశిల్పం నన్నయ పెక్కుచోట్ల ప్రదర్శించాడు. అందువలననే నన్నయది ధ్వనిప్రస్థాన మనీ, అందులో వస్తుధ్వని ఆయన మార్గమనీ పేర్కొనటం.

క. **అంత దౌష్యంతి సంతానవిచ్ఛేదంబు గావచ్చిన సత్యవతీనియుక్తుండై సకలధర్మమూర్తి కృష్ణద్వైపాయనుండు దేవరన్యాయంబున నంబికయందు ధృతరాష్ట్రుని, నంబాలికయందుఁ బాండురాజును నంబికాపరిచారిక యందు విదురునిం బుట్టించిన; నందు ధృతరాష్ట్రునకు గాంధారికి వ్యాసవరప్రసాదంబున దుర్యోధనుండాదిగా నూర్వురు గొడుకులు పుట్టిరి. పాండురాజు నియోగంబునఁ గుంతీమాద్రులకు ధర్మానిలశక్రాశ్వినుల ప్రసాదంబున ధర్మజభీమార్జున నకులసహదేవు లనంగా నేవురుకొడుకులు పుట్టి; రయ్యేవురకుం బాంచాలి ధర్మపత్నియయ్యె;దానియందు ధర్మరాజునకుఁబ్రతివింధ్యుండును, భీమసేనునకు శుత్రసోముండును, నర్జుననకు శ్రుతకీర్తియు, నకులునకు శతానీకుండును, సహదేవునకు శ్రుతసేనుండును ననఁ బంచోపపాండవులు పుట్టిరి; మఱి ధర్మరాజునకు స్వయంవర లబ్ధ యైన దేవికయనుదానికి యౌధేయుండు పుట్టె; భీమసేనునకు జరంధరకు సర్వగుండు పుట్టె; నర్జుననకు సుభద్రకు నభిమన్యుండు పుట్టె; నకులునకుఁ జైద్యయయిన కరేణుమతికి నిరమిత్రుండు పుట్టె; సహదేవునకు స్వయంవరలబ్ధయైన విజయకు సుహోత్రుండు పుట్టె; మఱియుభీమసేనునకు హిడింబకుఘటోత్కచుండు పుట్టె; నిప్పాటంబాండవ పుత్త్రులైన పదునొక్కండ్రయందును వంశకరుం డైన యభిమన్యునకు విరాటపుత్త్రి యయిన యుత్తరకుం బరీక్షితుండు పుట్టె.** **116**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అప్పుడు భరతవంశం విచ్ఛేదం అయ్యే స్థితికి రాగా సత్యవతిచేత నియోగింపబడి సమస్తధర్మమూర్తి అయిన వ్యాసుడు దేవరన్యాయంతో అంబికయందు ధృతరాష్ట్రుడినీ, అంబాలికయందు పాండురాజునూ, అంబికయొక్క చెలికత్తెయందు విదురుడినీ పుట్టించాడు. వారిలో ధృతరాష్ట్రుడికీ, గాంధారికీ వ్యాసుడివరంవలన దుర్యోధనుడు మొదలుకొని వందమంది కొడుకులు పుట్టారు. పాండురాజు నియోగించగా కుంతీమాద్రులకు యమధర్మరాజు, వాయువు, ఇంద్రుడు, అశ్వినీదేవతల దయవలన క్రమంగా ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులసహదేవులు అనబడే అయిదుగురు కొడుకులు పుట్టారు. ఆ అయిదుమందికి పాంచాలి భార్య అయింది. ఆమెయందు

ధర్మరాజుకు ప్రతివింధ్యుడూ, భీమసేనుడికి శ్రుతసోముడూ, అర్జునుడికి శ్రుతకీర్తియూ, నకులుడికి శతానీకుడూ, సహదేవుడికి శ్రుతసేనుడూ, పంచ ఉపపాండవులు అనబడేవారు పుట్టారు. ఇంకనూ, ధర్మరాజుకు స్వయంవరంలో లభించిన దేవిక అనేదానికీ యౌధేయుడు పుట్టాడు. భీమసేనుడికి జరంధరవలన సర్వగుడు పుట్టాడు. అర్జునుడికీ సుభద్రకూ అభిమన్యుడు పుట్టాడు. నకులుడికీ చేది వంశజురాలైన కరేణుమతికీ నిరమిత్రుడు పుట్టాడు. సహదేవుడికీ స్వయంవరంలో లభించిన విజయకూ సుహోత్రుడు పుట్టాడు. అంతేకాక, భీమసేనుడికీ హిడింబకూ ఘటోత్కచుడు పుట్టాడు. ఈ విధంగా పాండవులయొక్క పుత్రులైన పదకొండుమందిలోనూ వంశాన్ని నిలిపినవాడు అభిమన్యుడు. అతడికీ విరాటరాజపుత్రి అయిన ఉత్తరకూ పరీక్షితుడు పుట్టాడు.

**విశేషం:** దేవరుడనగా మగని తోబుట్టువు. రాజకుటుంబాలలో రాజ్యానికి వారసులు కాదగిన రాణికి మగనివలన సంతానం కలుగనప్పుడు బావగారి వలననో, మఱదివలననో సంతానం పొందడం దేవరన్యాయం. విచిత్రవీర్యుడు, చిత్రాంగదుడు సంతాన రహితులు కాగా, వారల అన్నయైన దేవరుడైన వ్యాసుడు ధృతరాష్ట్ర పాండురాజులను కన్నాడు.

**క. అతనికి ననంత పుణ్యా । న్వితయనఁదగు మాద్రవతికి నీ వఖిలజగ**
**న్నుత! జనమేజయ! పుట్టితి । ధృతిఁ బాండవవంశమునకుఁ దేజం బెసఁగన్. 117**

**ప్రతిపదార్థం:** అతనికిన్= పరీక్షితుడికి; అనంత, పుణ్య+అన్విత, అనన్, తగు, మాద్రవతికిన్= అపారపుణ్యంతో కూడినది (పుణ్యవతి) అని ప్రసిద్ధిచెందిన మాద్రవతికి; అఖిల, జగత్+నుత= సమస్తలోకాలచేత కీర్తింపబడువాడా!; జనమేజయ= జనమేజయుడా!; పాండవ, వంశమునకున్= పాండురాజు పేరుమీద ప్రసిద్ధమైన వంశానికి; ధృతిన్= స్థిరంగా; తేజంబు+ఎసఁగన్= వన్నె కలుగగా; నీవు= నీవు (జనమేజయుడు); పుట్టితి (వి)= పుట్టావు.

**తాత్పర్యం:** సమస్తలోకాలచేత కీర్తింపబడే జనమేజయుడా! పాండవవంశానికి స్థిరంగా వన్నె కలిగేటట్లు నీవు పరీక్షితుడికీ పుణ్యవతి అయిన మాద్రవతికీ పుట్టావు.

**మ. మఱియు నీకును వపుష్టమకును శతానీక శంకుకర్ణులుపుట్టి; రందు శతానీకునకువైదేహికి నశ్వమేధదత్తుండు పుట్టె. 118**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** కాగా, నీకూ వపుష్టమకూ శతానీకుడు, శంకుకర్ణుడు అనే ఇద్దరు పుత్రులు పుట్టారు. వారిలో శతానీకుడికీ వైదేహి (విదేహరాజపుత్రిక) కీ అశ్వమేధదత్తుడు పుట్టాడు.

**క. వీ రైలులుఁ బౌరవులును । భారతులును గౌరవులును బాండవులు ననన్**
**వీరు లయి పరఁగి; రిది నయ । పారగ! భవదీయవంశ పరిపాటి మహిన్. 119**

**ప్రతిపదార్థం:** వీరు= ఇంతవరకు పేర్కొన్నరాజులు; ఐలులు= ఐలుడువంశకర్తగా కలవారు; పౌరవులును= పురుమహారాజు వంశకర్తగాకలవారు; భారతులును= భరతుడు వంశకర్తగా కలవారు; కౌరవులును= కురుమహారాజు వంశకర్తగాకలవారు; పాండవులున్= పాండుమహారాజు వంశకర్తగా కలవారు; అనన్= అని పిలువబడుతూ; వీరులు+అయి, పరఁగిరి= పరాక్రమవంతులై

ఒప్పారినారు; నయపారగ!= నీతిలో పారం ముట్టినవాడా!; ఇది= పైనచెప్పినవిధం; మహిన్= లోకంలో (భూమిపై); భవదీయ, వంశ, పరిపాటి= నీయొక్క వంశముయొక్క అనుక్రమం, (వంశవృక్షం అని భావం).

**తాత్పర్యం:** వీరు ఐలులనీ, పౌరవులనీ, భారతులనీ, కౌరవులనీ, పాండవులనీ పిలువబడుతూ వీరులుగా ప్రసిద్ధిచెందారు. ఓ నయకోవిదుడా! ఇది లోకంలో వాసికెక్కిన నీవంశక్రమం.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 120**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అనగా విని జనమేజయుడు వైశంపాయనుడితో ఈవిధంగా అన్నాడు.

**క. నరవరుఁ డగు శంతనున క । మరనదికిని నెట్లు సంగమం బయ్యె మహా**
**పురుషుండు భీష్ముఁ డె ట్ల । య్యిరువురకును బుట్టె? దీని నెఱిఁగింపు మొగిన్. 121**

**ప్రతిపదార్థం:** నరవరుఁడు+అగు, శంతనునకున్= శ్రేష్ఠుడైన శంతనునకూ; అమర, నదికినిన్= గంగకూ; ఎట్లు, సంగమంబు, అయ్యెన్= ఏవిధంగా సంయోగం అయింది; ఆ+ఇరువురకును= ఆ ఇద్దరికీ; మహత్+పురుషుండు, భీష్ముఁడు= గొప్పవాడైన భీష్ముడు; ఎట్లు; పుట్టెన్= ఏవిధంగా పుట్టాడు?; ఒగిన్= క్రమంగా; దీనిన్= ఈవృత్తాంతాన్ని; ఎఱిఁగింపుము= తెలుపుము

**తాత్పర్యం:** ఉత్తముడైన శంతనుడికీ గంగకూ పొత్తు ఏవిధంగా కలిగింది? వా రిరువురికీ మహాత్ముడైన భీష్ముడు ఏవిధంగా పుట్టాడు? ఈ వృత్తాంతాన్ని క్రమంగా నాకు తెలుపుము.

## గంగా వసువుల సమయము (సం. 1-91-1)

**వ. 'మఱి పాండవ ధార్తరాష్ట్ర సంభవంబును సవిస్తరంబుగా వినవలతుం జెప్పు' మనిన వానికి వైశంపాయనుం డి ట్లని చెప్పెఁ; దొల్లి యిక్ష్వాకువంశంబున మహాభిషుం డనువాఁడు పుట్టి మహాధర్మశీలుండై యశ్వమేధసహస్రంబును రాజసూయశతంబునుం జేసి యింద్రాదిదేవతలం దనిపి, దేవలోకంబునకుం జని యందు దేవర్షిగణంబులతోఁ బితామహుంగొల్చుచున్న యవసరంబున గంగానది దివ్యస్త్రీరూపధారిణి యయి బ్రహ్మసభకు వచ్చిన. 122**

**ప్రతిపదార్థం:** మఱి= ఇంకను; పాండవ, ధార్తరాష్ట్ర, సంభవంబును= పాండురాజుకుమారులయొక్కయు, ధృతరాష్ట్రుని పుత్రులయొక్కయు పుట్టుకను; సవిస్తరంబుగాన్= విపులంగా; వినన్, వలతున్= వినగోరుతాను; చెప్పుము; అనినన్; వానికిన్= జనమేజయునికి; వైశంపాయనుండు; ఇట్లు+అని, చెప్పెన్= ఈవిధంగా చెప్పాడు; తొల్లి= పూర్వం; ఇక్ష్వాకు వంశంబునన్= ఇక్ష్వాకుడు మూలపురుషుడుగా వెలసిన వంశంలో; మహాభిషుండు; అనువాఁడు; పుట్టి; మహత్+ధర్మశీలుండు+ఐ= ఉత్తమధర్మస్వభావం కలవాడై; అశ్వమేధ, సహస్రంబును= అశ్వమేధ యాగాలు వేయినీ; రాజసూయ, శతంబును= రాజసూయయాగాలు నూరున్నూ; చేసి; ఇంద్ర+ఆది, దేవతలన్, తనిపి= ఇంద్రుడు మొదలైన దేవతలను సంతోషపెట్టి; దేవ, లోకంబునకున్, చని= దేవతలయొక్క లోకమైన స్వర్గానికి వెళ్ళి; అందున్= అక్కడ; దేవ, ఋషిగణంబులతోన్= దేవతలయొక్కయు, మునులయొక్కయు సమూహాలతో కలిసి; పితామహున్= బ్రహ్మను; కొల్చుచున్న= సేవిస్తున్న;

అవసరంబునన్= సమయంలో; గంగానది; దివ్య, స్త్రీ, రూప, ధారిణి+అయి= దేవతా సంబంధమైన స్త్రీయొక్క రూపాన్ని తాల్చినదయి; బ్రహ్మసభకున్, వచ్చినన్= బ్రహ్మదేవుడియొక్క సభకు రాగా.

**తాత్పర్యం:** 'ఇంకను పాండవుల, ధృతరాష్ట్ర పుత్త్రుల పుట్టుపూర్వోత్తరాలు వివరంగా వినగోరుతున్నాను చెప్పు' మని జనమేజయుడు అడుగగా వైశంపాయనుడు ఈవిధంగా చెప్పాడు: 'పూర్వం ఇక్ష్వాకువంశంలో మహాభిషుడనేవాడు పుట్టి ఉత్తమధర్మస్వభావుడై వేయి అశ్వమేధయాగాలను, నూరు రాజసూయయాగాలను చేసి ఇంద్రాదిదేవతలను సంతృప్తిపరచి స్వర్గలోకానికి పోయి అక్కడ దేవతలతోనూ ఋషిగణాలతోనూ కలిసి బ్రహ్మను సేవిస్తున్న సమయంలో గంగానది దేవవనితారూపం ధరించి బ్రహ్మసభకు రాగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **ఊరుమూల మేర్పడఁగ నయ్యువిద వలువు । దొలఁగె ననిలంబుచేత విధూత మగుచు;**
**నమరు లెల్లఁ బరాఙ్ముఖు లైరి; దాని । సాభిలాషుఁ డై చూచె మహాభిషుండు.** **123**

**ప్రతిపదార్థం:** అనిలంబు, చేతన్, విధూతము+అగుచున్= గాలిచేత ఎగురగొట్టబడినది ఔతూ; ఆ+ఉవిద, వలువు= ఆ వనితచీర; ఊరుమూలము+ఏర్పడఁగన్= తొడమొదలు కనబడునట్లుగా; తొలఁగెన్= తొలగిపోయింది; అమరులు+ఎల్లన్= దేవతలందరు; పరాక్+ముఖులు+ఐరి= ప్రక్కకు త్రిప్పుకొనిన ముఖాలు కలవారు ఐనారు; మహాభిషుండు; దానిన్= అట్టిస్థితిలో నున్న గంగను; స+అభిలాషుఁడు+ఐ= ఆసక్తితోకూడినవాడై; చూచెన్= చూచాడు.

**తాత్పర్యం:** గంగాదేవి కట్టుకున్న చీర గాలికి ఎగురగొట్టబడటంచేత ఆమె తొడలమొదలు కనపడేటట్లు తొలగింది. దానిని దేవతలందరు చూడక మొగాలు ప్రక్కకు త్రిప్పుకొన్నారు. కాని, మహాభిషుడు మాత్రం ఆసక్తితో దానిని చూచాడు.

**విశేషం:** ఈ పద్యంతరువాతకొన్ని ప్రతులలో "గంగాదేవియు నమ్మహాభిషురూపయౌవనవిలాసంబుల కోటువడి వానినచూచుచుండె' అనే వచనం కనబడుతున్నది. కాని, ఈ భావం మూలంలో లేదని శ్రీమహాభారతసంశోధితప్రతి దీనిని గ్రహించలేదు. ఒకవేళ ఈ వచనం ఉన్నదనుకొంటే గంగకూడ శాపార్హురాలౌతుంది. అది కథలో పొసగదు కాబట్టి ఆ వచనాన్ని గ్రహించకపోవటమే సముచితం.

**ఆ.** **దాని నెఱిఁగి కమలయోని వానికిఁ గర । మల్గి మర్త్యయోనియందుఁ బుట్టు**
**మనుచు శాపమిచ్చె; నొనరంగ వాఁడును । గరము భీతిఁ గరయుగంబు మొగిచి.** **124**

**ప్రతిపదార్థం:** కమలయోని= బ్రహ్మ; దానిన్, ఎఱిఁగి= దానిని గ్రహించి; వానికిన్= ఆ విధంగా చూచిన మహాభిషునిగురించి; కరము+అల్గి= మిక్కిలి కోపించి; మర్త్యయోనియందున్= మానవగర్భంలో; పుట్టుము, అనుచున్; శాపము; ఇచ్చెన్; ఒనరంగన్= ఒప్పుగా; వాఁడును= మహాభిషుడు; కరము, భీతిన్= మిక్కిలిభయంతో; కర, యుగంబు= చేతులజంట (రెండుచేతులు); మొగిచి= జోడించి.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు దానిని తెలిసికొని మహాభిషుడిమీద అమితంగా కోపించి అతడిని మానవవనితకు పుట్టు మని తగినట్లు శాపమిచ్చాడు. మహాభిషుడు మిక్కిలి భయపడి చేతులు రెండూ జోడించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. 'మర్త్యలోకంబున రాజర్షివరులలోనఁ బుణ్యచరిత్రుండు ప్రతీపుండ కావున వానికిఁ బుత్త్రుండ నై జన్మించెద; నొరులయందు జనింపనోప' నని కమలభవుననుమతంబు వడసె, గంగయు నమ్మహాభిషుని మహానుభావంబును రూపసౌందర్యంబులును దనయందుల యభిలాషయు నెఱింగి తానును మనోజబాణబాధిత యయి వానిన తలంచుచు మర్త్యలోకంబునకు వచ్చునది యెదుర. 125**

**ప్రతిపదార్థం:** మర్త్యలోకంబునన్= మానవలోకంలో; రాజర్షి, వరులలోన్= రాజులయ్యు ఋషిత్వాన్నికూడ సాధించినవారిలో నెల్ల; పుణ్య, చరిత్రుండు= నిర్మలస్వభావం కలవాడు; ప్రతీపుండు+అ= ప్రతీపుడు మాత్రమే; కావునన్= కాబట్టి; వానికిన్= అతనికి; పుత్త్రుండను+ఐ, జన్మించెదన్= కొడుకునై పుట్టుతాను; ఒరుల+అందున్= ఇతరులకు; జనింపన్+ఓపన్= పుట్టజాలను; అని; కమలభవు, అనుమతంబు= బ్రహ్మదేవునియొక్క సమ్మతిని; పడసెన్= పొందాడు; గంగయున్= గంగకూడ; ఆ+మహాభిషుని, మహత్+అనుభావంబును= ఆ మహాభిషుడియొక్క దొడ్డతనాన్నీ; రూప, సౌందర్యంబులును= ఆకారాన్నీ అందాన్నీ; తనయందుల, అభిలాషయున్= తనపట్లకోరికయు; ఎఱింగి= గ్రహించి; తానును=తానుకూడ; మనోజ, బాణ, బాధిత+అయి= మన్మథుడియొక్క బాణాలచేత కొట్టబడినది అయి (విరహాన్ని పొంది); వానిని+అ= అతనినే; తలంచుచున్= స్మరిస్తూ; భావిస్తూ; మర్త్యలోకంబునకున్, వచ్చునది, ఎదురన్= మానవలోకానికి రాగానే, ఎదుట.

**తాత్పర్యం:** 'మానవ(భూ)లోకంలో గల రాజర్షులందరిలో పుణ్యాత్ముడు ప్రతీపుడు కాబట్టి అతడికి మాత్రమే పుత్త్రుడనై జన్మిస్తాను; మరొకరియందు జన్మించలేను' అని కోరి దానికి బ్రహ్మదేవుడి సమ్మతినిపొందాడు. గంగకూడ ఆ మహాభిషుని దొడ్డతనాన్నీ, రూపసౌందర్యాలనూ, తనపట్ల అతని కున్న కోరికను గమనించి మన్మథబాణాలకు గురియై ఆతడినే తలపోస్తూ మర్త్యలోకానికి వచ్చి, ఎదుట.

**క. అనిమిషలోక వియోగం। బున దుఃఖితు లయి వసిష్ఠమునివరు శాపం
బున వచ్చువారి వసువుల। నెనమండ్రం గాంచి గంగ యెంతయుఁ బ్రీతిన్. 126**

**ప్రతిపదార్థం:** అనిమిషలోక, వియోగంబునన్= దేవలోకముయొక్క ఎడబాటుతో; దుఃఖితులు+అయి= బాధపడినవారై; వసిష్ఠ మునివరు, శాపంబునన్= వసిష్ఠ డనే ఋషిశ్రేష్ఠుడియొక్క శాపంవలన; వచ్చువారిన్= వస్తున్నవారిని; వసువులన్, ఎనమండ్రను= వసువులను ఎనిమిదిమందిని; గంగ; ఎంతయున్+ప్రీతిన్= మిక్కిలి ఆప్యాయంగా; కాంచి= చూచి.

**తాత్పర్యం:** స్వర్గలోకం విడువవలసివచ్చినందుకు దుఃఖితు లైనవారూ, వసిష్ఠమహాముని శాపంతో భూలోకానికి వస్తున్నవారూ అయిన ఎనిమిదిమంది వసువులను గంగ మిక్కిలి ఆప్యాయంగా చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** యమధర్మరాజుయొక్క పదిమంది భార్యలలో వసువు అనుఆమెకు జన్మించిన ఎనిమిదిమంది పుత్రులు వసువులు. వారు ఎల్లప్పుడు కలసిఉండే గణదేవతలు. వారిపేర్లు - ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు.

**క. 'ద్యుతి దఱిగి నిజనియోగ। చ్యుతిఁ బొందను మీకు నొండుచోటికి నరుగం
గత మేమి'? యనిన విని య। య్యతివకు సురనదికి నిట్టు లని రవ్వసువుల్. 127**

**ప్రతిపదార్థం:** ద్యుతి, తఱిగి= కాంతి తగ్గి; నిజ, నియోగ, చ్యుతిన్, పొందను= మీ స్థితినుండి పతనం కావటానికీ; ఒండు, చోటికిన్+అరుగన్= మరొకచోటికి పోవటానికీ; కతము+ఏమి+అనినన్= కారణ మేమిటి అనగా; విని; ఆ+వసువులు; ఆ+అతివకున్ సురనదికిన్= స్త్రీరూపంలో ఉన్న గంగానదికి; ఇట్టులు+అనిరి= ఈవిధంగా అన్నారు.

**తాత్పర్యం:** 'కాంతిహీను లై మీపదవులనుండి పతనం చెందటానికీ, ఉన్నచోటువదలి మరొకచోటికి పోవటానికీ కలకారణం ఏమి' టని అడుగగా స్త్రీరూపంలో ఉన్న గంగకు ఆ వసువులు ఈ విధంగా అన్నారు.

**వ.** **'ఏము వసిష్ఠమునివరు శాపంబునం జేసి మర్త్యలోకంబునం దెయ్యేనియు నొక్కపుణ్యవతి యైన స్త్రీయందు జన్మింపంబోయెద' మని దుఃఖించి, తమ శాపప్రకారంబు గంగాదేవికి నెఱింగించి, 'యే మొండుచోట జన్మింపనోపము; నీయంద పుట్టెదము; మఱి మహాభిషుండు ప్రతీపునకు శంతనుం డై పుట్టెడుఁగావున వానికి నీకును సమాగమం బగు; మాజన్మంబునకు నిమిత్తం బాతండ యగు' ననిన విని గంగ సంతసిల్లి యి ట్లనియె.** **128**

**ప్రతిపదార్థం:** ఏము= మేము (వసువులు); వసిష్ఠ, మునివరు, శాపంబునన్+చేసి= వసిష్ఠమహాముని శాపం కారణంగా; మర్త్యలోకంబునందున్= భూలోకంలో; ఏది+ఏనియున్, ఒక్క, పుణ్యవతి, ఐన, స్త్రీ, అందున్= ఎవరైనా ఒక పుణ్యంచేసికొన్న వనితకు; జన్మింపన్, పోయెదము+అని= పుట్టా లని వెళ్ళుతున్నా మని; దుఃఖించి= ఏడ్చి, బాధపడి; తమ, శాప, ప్రకారంబు= తమకు శాపం కలిగిన పద్ధతిని; గంగాదేవికిన్; ఎఱింగించి= తెలిపి; ఏము+ఒండు, చోటన్, జన్మింపన్, ఓపము= మేము మరొకచోట పుట్టలేము; నీయందున్+అ= నీయందే, నీకే; పుట్టెదము= జన్మిస్తాము; మఱి= ఇక; మహాభిషుండు; ప్రతీపునకున్; శంతనుండు+ఐ; పుట్టెడున్, కావునన్= పుట్టుతాడు కాబట్టి; వానికిన్, నీకును, సమాగమంబు+అగున్= అతనికీ నీకూ సంయోగం కలుగుతుంది. అతండు+అ= అతడే(శంతనుడే); మా, జన్మంబునకున్, నిమిత్తంబు= మాపుట్టుకకు కారణం; అగును+అనినన్, విని= ఔతా డని చెప్పగా విని; గంగ; సంతసిల్లి= సంతోషించి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నది.

**తాత్పర్యం:** మేము వసిష్ఠ మహామునిశాపంవలన భూలోకంలో ఎవరైనా ఒక్కపుణ్యవతి యైన వనితయందు జన్మించవలె నని పోతున్నామని దుఃఖించి, తమ శాపవృత్తాంతాన్ని గంగాదేవికి తెలియజెప్పి, 'మేము వేరేచోట ఎక్కడా జన్మించలేము, నీకు పుత్త్రులముగా పుట్టుతాము; ఇక - మహాభిషుడే ప్రతీపునకు శంతనుడై పుట్టుతాడు కాబట్టి అతనికీ నీకూ సంగమమౌతుంది. మా జన్మకు అతడే కారకు డౌతాడు' అనగా విని గంగ సంతోషించి ఈవిధంగా అన్నది.

**క.** **'నా కభిమతంబు నిట్టిద; । మీకును నుపకార మగు; సమీహిత బుద్ధిం**
**జేకొని చేసెద మీర ల । శోకస్థితి నుండుఁ' డనుచు సురనది కరుణన్.** **129**

**ప్రతిపదార్థం:** నాకున్, అభిమతంబున్, ఇట్టిది+అ= నాకోరికకూడా ఇటువంటిదే. సమీహిత, బుద్ధిన్= కోరబడిన మనస్సుతో (ఇష్టమైన మనస్సుతో అనిభావం); చేకొని= స్వీకరించి, అంగీకరించి; చేసెదన్= ఆచరిస్తాను; మీకునున్= మీకుకూడ; ఉపకారము+అగున్= మేలౌతుంది; మీరలు+అశోకస్థితిన్, ఉండుఁడు+అనుచున్= మీరు నిశ్చింతగా (దుఃఖం లేని మానసికస్థితిలో)ఉండండి అంటూ; సురనది= గంగానది; కరుణన్= దయతో.

**తాత్పర్యం:** 'నాకోరికకూడ అటువంటిదే; మీకోరికను ఇష్టమైన మనస్సుతో అంగీకరించి అమలుపరుస్తాను. మీకు మేలుకూడ జరుగుతుంది. మీ రింక నిశ్చింతగా ఉండండి' అంటూ గంగాదేవి కరుణతో (తరువాతి వచనంతో అన్వయం).

**వ. వసువులకు మనఃప్రియంబుగాఁబలికిన విని, వారును గంగ యనుగ్రహంబు వడసి 'నీవు మాకు నుపకారంబు సేయనోపుదేని నేము నీకుం గ్రమక్రమంబునం బుట్టునప్పుడ మమ్ము నీళ్ళ వైచుచు మర్త్యలోకంబున నుండకుండునట్లుగాఁ జేయునది; మాకు వసిష్ఠ మహాముని యనుజ్ఞయు నిట్టిద' యనిన గంగయు 'నట్ల చేయుదు; మఱి మీరెల్ల స్వర్గతులైన నా కొక్కకొడుకు దీర్ఘాయుష్మంతుండై యుండెడు విధం బె'ట్లనిన దానికి వసువు లి ట్లనిరి. 130**

**ప్రతిపదార్థం:** వసువులకున్= అష్టవసువులకు; మనస్+ప్రియంబు, గాన్= మనస్సుకు సంతోషం కలిగేటట్లు; పలికినన్; విని; వారును; గంగ, అనుగ్రహంబు, పడసి= గంగయొక్క దయను పొంది; 'నీవు, మాకున్, ఉపకారంబు, చేయన్, ఓపుదు+ఏని= నీవు మాకు మేలు చేయగలిగితే; ఏము, నీకున్, క్రమక్రమంబునన్, పుట్టు+అప్పుడు+అ= మేము నీకు ఒకరి తరువాతి ఒకరు వరుసగా పుట్టినప్పుడే; మమ్మున్, నీళ్ళన్, వైచుచున్= మమ్మల్ని నీళ్ళలో పడవేస్తూ; మర్త్యలోకంబునన్+ఉండకుండు, అట్లుగాన్= భూలోకంలో ఉండకుండా ఉండే విధంగా; చేయునది= చేయవలసింది; మాకున్; వసిష్ఠమహాముని, అనుజ్ఞయున్, ఇట్టిది+అ= వసిష్ఠ మహర్షి మా కిచ్చిన అనుమతికూడా ఇదే; అనినన్; గంగయున్; అట్లు+అ, చేయుదున్= ఆ విధంగానే చేస్తాను; మఱి= ఇక; మీరు+ఎల్లన్, స్వర్గతులు+ఐనన్= మీరందరు మరణిస్తే (స్వర్గానికి చేరితే); నాకున్+ఒక్క, కొడుకు, దీర్ఘాయుష్మంతుండు+ఐ= నాకు ఒక కొడుకు చాలకాలం జీవించేవాడై; ఉండెడు, విధంబు+ఎట్లు+అనినన్= ఉండే పద్ధతి ఏమిటి అనగా; దానికిన్= ఆ ప్రశ్నకు; వసువులు; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** వసువుల మనస్సులకు ప్రీతికలిగేటట్లు గంగాదేవి పలుకగా విని, వారు గంగాదేవి దయను పొంది ఈవిధంగా కోరారు- "నీవు మాకు ఉపకారం చేయగలిగితే మేము నీకు ఒకరితరువాత ఒకరు పుట్టినప్పుడే(వెంటనే) మమ్ములను నీళ్ళలో పడవేస్తూ మేము భూలోకంలో ఉండకుండా చేయవలసింది. మాకు వసిష్ఠమహర్షి ఇచ్చిన అనుమతికూడా ఇదే'. ఆ మాటలు విని గంగ ఈ విధంగా అన్నది. "మీ రడిగినట్లు ఆవిధంగానే చేస్తాను. అయితే, మీరందరు స్వర్గానికి చేరితే నాకు ఒక్కకొడుకు దీర్ఘాయువుకలవాడై ఉండేవాడు కావాలి. అది ఏవిధంగా వీలౌతుంది?' ఆ మాటలకు వసువులు ఈవిధంగా అన్నారు.

**క. మాయం దొక్కొక్కళ్ళతు । రీయాంశముఁ దాల్చి శుభచరిత్రుం డై దీ
ర్ఘాయుష్యం డష్టమ వసు । వాయతభుజుఁ డుండు నీకు నాత్మోద్భవుఁ డై. 131**

**ప్రతిపదార్థం:** మాయందున్+ఒక్క+ఒక్కళ్ళ, తురీయ+అంశమున్, తాల్చి= మాలో ఒక్కొక్కరియొక్క నాల్గవ అంశాన్ని (ఈపరిపూర్ణ మహత్త్వంలో నాల్గవవంతు) ధరించి; శుభ, చరిత్రుండు+ఐ= మంగళకరమైన శీలం కలవాడై; దీర్ఘ+ఆయుష్యుండు= చాలకాలం జీవించేవాడూ; ఆయత+భుజుఁడు= విశాలాలైన భుజాలు కలవాడూ; అష్టమవసువు= ఎనిమిదవ వసువు అయిన ప్రభాసుడు; నీకున్, ఆత్మ+ఉద్భవుఁడు+ఐ= కన్నకొడుకై; ఉండున్= భూలోకంలో ఉంటాడు.

**తాత్పర్యం:** మా ఒక్కొక్కళ్ళ నాల్గవ అంశాన్ని ధరించి ఉత్తమశీలుడై, దీర్ఘాయువై, విశాలభుజాలుగల అష్టమవసువు-ప్రభాసుడు నీకు కన్నకొడుకై మర్త్యలోకంలో ఉంటాడు.

తన పుత్త్రునకు భార్య వగు మని ప్రతీపుఁడు గంగ కుపదేశించుట (సం.1-92-1)

**వ. అని యిట్లు గంగా వసువు లొండొరులు సమయంబు సేసికొని చని; రంత నిక్కడ. 132**

**తాత్పర్యం:** అని ఈవిధంగా గంగాదేవి, అష్టవసువులూ పరస్పరం కట్టడిచేసికొని వెళ్ళారు. ఆ పైన ఇక్కడ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. వీరుఁడు ప్రతీపుఁ డఖిల। క్ష్మారాజ్య, సుఖములఁ దనిసి మానుగ గంగా**
**తీరమునఁ దపము సేయుచు। భారతకులుఁ డుండె ధర్మపరుఁడై నిష్ఠన్. 133**

**ప్రతిపదార్థం:** భారతకులుఁడు= భరతవంశంలో పుట్టినవాడూ; వీరుఁడు= పరాక్రమవంతుడూ, అయిన; ప్రతీపుఁడు; అఖిల, క్ష్మా, రాజ్య, సుఖములన్, తనిసి= సమస్త సామ్రాజ్య సుఖాలను అనుభవించి తృప్తుడై; నిష్ఠన్= దీక్షతో; ధర్మపరుఁడు+ఐ= ధర్మమునందు ప్రీతికలవాడై; మానుగన్= ఒప్పిదంగా; గంగా, తీరమునన్= గంగానది ఒడ్డున; తపము, చేయుచున్, ఉండెన్= తపస్సు చేస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** భరతకులంలో పుట్టి వీరుడైన ప్రతీపుడు సమస్తరాజ్యభోగాలను తనివితీర అనుభవించి ధర్మపరుడై దీక్షపట్టి గంగానదీతీరంలో మనోజ్ఞంగా తపస్సు చేస్తూ ఉన్నాడు.

**వ. ఇట్లు యమ నియమవ్రత పరాయణుండై యున్నవానికిం బ్రత్యక్షం బై యొక్కనాఁడు. 134**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** ఈవిధంగా యమం, నియమం అనే యోగపద్ధతుల నాచరించే నిష్ఠలో నిమగ్నుడై ఉండగా ప్రతీపుడికి (గంగ) ఒకనాడు ప్రత్యక్షమై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** యమ, నియమాలు అష్టాంగ యోగంలోని భాగాలు. ఆ యోగంలోని ఎనిమిది అంగాల పేర్లు ఇవి - యమం, నియమం, ఆసనం, ప్రాణాయామం, ప్రత్యాహారం, ధ్యానం, ధారణం, సమాధి. హింసాదులు చేయకుండ ఉండటం యమము. అది పదిరకాలు. అవి - సత్యం, దయ, క్షమ, ధృతి, మితాహారం, ఆర్జవం, బ్రహ్మచర్యం, అస్తేయం, అహింస, శౌచం. శరీరంకంటె భిన్నమైన మట్టి, నీళ్ళు సాధనాలుగా చేసే యోగసాధనం నియమం. అదికూడా పది విధాలు. అవి - తపం, సంతోషం, ఆస్తికత్వం, దానం, భగవదర్చన, వేదాంతశ్రవణం, లజ్జ, మతి, జపం, వ్రతం.132, 133, 134 సంఖ్యల పద్యవచనాలకు బదులు ఒకప్రతిలో "ఇట్లు నియమవ్రతులై వసువులు గంగకు నియమంబుసేసి చనిన నిట గంగయు భూలోకంబునకు వచ్చి నిరంతర నియమవ్రతపరాయణుండైయున్న ప్రతీపుం డనువానికిం బ్రత్యక్షం బై యొక్కనాడు "అనేవచనం కనబడుతున్నదని శ్రీమదాంధ్రమహాభారతసంశోధితముద్రణప్రతిలో ఉన్నది. (పు. 215)

**ఉ. గంగ నిజాంగదీప్తు లెసఁగం జనుదెంచి లతాంగి సంగతో**
**త్తుంగ పయోధర ద్వితయ తోయరుహానన చారునేత్ర ది**
**వ్యాంగన యై ప్రతీపవసుధాధిపు శాలవిశాల దక్షిణో**
**త్సంగమునందు మన్మథవశంబున నుండెఁ గరంబు లీలతోన్. 135**

**ప్రతిపదార్థం:** లతా+అంగి= తీగవంటి మేను కలిగినది; సంగత, ఉత్తుంగ, పయోధర, ద్వితయ; తోయరుహ+ఆనన= ఒప్పిదమై ఎత్తైన వక్షోజాల జంటను కలిగినదీ; పద్మంవంటి ముఖం కలిగినదీ; చారు, నేత్ర= అందమైన కన్నులు కలదీ; అయిన, గంగ= గంగాదేవి; నిజ+అంగ, దీప్తులు+ఎసఁగన్= తన శరీరపు కాంతులు వ్యాపించగా; దివ్య+అంగన+ఐ= దేవవనితగా రూపం తాల్చి; చనుదెంచి= వచ్చి; మన్మథ, వశంబునన్= మన్మథునికి వశమైనభావంతో (వలపుతో); ప్రతీప, వసుధా+అధిపు= ప్రతీపుడనేపేరుగల భూపతి(రాజు)యొక్క; శాల, విశాల, దక్షిణ+ఉత్సంగమునందున్= చెట్టువలె విశాలమైన కుడితొడమీద; కరంబు, లీలతోన్= మిక్కిలి శృంగారహేలతో; ఉండెన్= కూర్చుండెను.

**తాత్పర్యం:** గంగానది తీవెవంటి మేను కలిగినది, పొందికగా ఎత్తైన వక్షోజములజంట కలిగినది, పద్మమువంటి ముఖం కలిగినది అయిన దివ్యవనితారూపం తాల్చి తన శరీరకాంతులు ప్రసరిస్తూఉండగా వచ్చి మన్మథపారవశ్యంతో ప్రతీపమహారాజుయొక్క చెట్టువలె విశాలమైన కుడితొడమీద మిక్కిలి విలాసంగా కూర్చున్నది.

**విశేషం:** గంగ లతాంగి. ఆమె శరీరం తీగవంటిది. ప్రతీపుని వక్షస్సు చెట్టు వంటిది. తీగ చెట్టుకు అల్లుకొనినట్లు ఆమె అతని తొడపై ఉన్నదని స్వారస్యం.

**వ. ప్రతీపుండును దానింజూచి యచ్చెరువంది 'నీవెందులదాన? విట్లేలనాకుఱువెక్కి?' తనిన నది యి ట్లనియె. 136**

**ప్రతిపదార్థం:** కుఱువు= తొడ

**తాత్పర్యం:** ప్రతీపుడు గంగను చూచి ఆశ్చర్యపడి 'నీ వెక్కడిదానవు? నాతొడపై ఎందు కెక్కావు?' అని అడుగగా గంగ ఈవిధంగా అన్నది.

**ఆ. ఏను జహ్నుకన్య నింద్రసమాన! నీ । సద్గుణావళులకు సంతసిల్లి**
**భానుతేజ! నీకు భార్యగా వచ్చితి । నిష్టమునఁ బరిగ్రహింపు నన్ను. 137**

**ప్రతిపదార్థం:** ఇంద్రసమాన= ఇంద్రుడితో పోలినవాడా!; ఏను= నేను; జహ్ను, కన్యను= జహ్నుమహర్షి కుమార్తెను; గంగను; నీ, సద్గుణావళులకున్= నీయొక్క మంచి గుణములయొక్క సమూహానికి; సంతసిల్లి= సంతోషించి; భానుతేజ= సూర్యుడివంటి ప్రకాశం కలవాడా!; నీకున్, భార్య, కాన్, వచ్చితిన్= నీకు భార్య అగునట్లుగా (నీకు భార్యనౌదా మని) వచ్చాను; నన్నున్; ఇష్టమునన్= ప్రీతితో; పరిగ్రహింపు(ము)= స్వీకరించుము.

**తాత్పర్యం:** ఇంద్రసమానుడవైన ప్రతీపమహారాజా! నేను జహ్నుమహర్షి పుత్రికను గంగను. నీ మంచిగుణాలకు సంతోషించి నీకు భార్య నౌదా మని వచ్చాను. సూర్యతేజుడా! నన్ను ప్రీతితో స్వీకరించుము.

**చ. అనినఁ బ్రతీపుఁ డిట్లనియె; 'నంబురుహానన యగ్నిసాక్షికం**
**బునఁ బరిణీత యైన సతిఁ బొల్పుగ నొక్కతఁగాని యన్యలన్**
**మనముననేనియుం దలఁప; మానిని! యిట్టి జితాత్ము నన్ను ని**
**ట్లని పలుకంగ నీ కగునె? యన్యులఁ బల్కినయట్ల బేల వై. 138**

**ప్రతిపదార్థం:** అనినన్= అని గంగ పల్కగా; ప్రతీపుఁడు= ఇట్లు+అనియెన్; అంబురుహ+ఆనన= పద్మమువంటి ముఖంకలదానా!; అగ్నిసాక్షికంబునన్= అగ్నిసాక్షిగా; పరిణీత+ఐన= వివాహమైన; సతిన్= ఇల్లాలిని; పొల్పుగన్= ఒప్పారగా; ఒక్కతన్+కాని=

ఒక్కతినేకాని; అన్యలన్= ఇతరస్త్రీలను; మనమునన్+ఏనియున్, తలఁపన్= మనస్సులోకూడ భావించను; మానిని= ఓ అభిమానవతీ!; ఇట్టి; జిత+ఆత్మున్, నన్నున్= ఇటువంటి ఆత్మనిగ్రహంగలనాతో; అన్యలన్, పల్కిన, అట్లు+అ= ఇతరులతో మాటాడినట్లు; బేలవు+ఐ= అమాయకురాలవై; ఇట్లు+అని= ఈవిధంగా; పలుకంగన్= మాటాడటానికి; నీకున్+అగునె= నీకు తగునా? (తగ దని భావం).

**తాత్పర్యం:** అని గంగ పల్కగా ప్రతీపుడు ఈవిధంగా అన్నాడు - "ఓ పద్మముఖీ! అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యను ఒక్కతనేగాని ఇతరవనితలను మనసులో సైతం స్మరించను. ఓ అభిమానవతీ! ఇటువంటి ఆత్మనిగ్రహమున్న నన్ను, ఇతరులతో పలికినట్లుగా, అమాయకురాలవై ఈవిధంగా అడగటం నీకు న్యాయమా? (కాదని భావం).

**వ. 'మఱి యదియునుంగాక స్త్రీభాగం బయిన డాపలికుఱువెక్కక పురుషభాగంబై పుత్త్రారోహణ యోగ్యం బైన నావలపలికుఱు వెక్కితిగావున నాపుత్త్రునకు భార్య వగు' మనిన నదియునట్ల చేయుదునని యదృశ్యయయ్యె; నంతం బ్రతీపుఁడును బుత్త్రార్థియై సకలతీర్థంబులయందు సునందాదేవియుం దాను వేదవిహితవ్రతంబులు సలుపుచుఁ బెద్దకాలంబు దపంబు సేసిన. 139**

**ప్రతిపదార్థం:** మఱి= ఇంక; అదియునున్, కాక= అదికూడకాక; స్త్రీ, భాగంబు+అయిన= స్త్రీకూర్చుండేవైపు అయిన; డాపలి, కుఱువు+ఎక్కక= ఎడమతొడపైకి ఎక్కక; పురుష, భాగంబు+ఐ= పురుషులు కూర్చుండేవైపుఅయి; పుత్త్ర+ఆరోహణ, యోగ్యంబు+ఐ= కొడు కెక్కి కూర్చుండదగిన; నా, వలపలి, కుఱువు+ఎక్కితి(వి)= నాకుడితొడపైకి ఎక్కావు; కావునన్= కాబట్టి; నా, పుత్త్రునకున్, భార్యవు+అగుము+అనినన్= నాకొడుకుకు ఇల్లాలివి అగు మనగా; అదియును= ఆ గంగయు; అట్లు+అ; చేయుదును+అని; అదృశ్య+అయ్యెన్= మాయమాయెను; అంతన్= ఆ తరువాత; ప్రతీపుఁడును; పుత్త్ర+అర్థి+ఐ= పుత్త్రసంతానంకొఱకు; సకల, తీర్థంబుల, అందున్= అన్ని పుణ్యతీర్థాలలోనూ; సునందాదేవియున్, తానున్, వేద, విహితవ్రతంబులు= వేదాలలో చెప్పబడిన దీక్షలు; సలుపుచున్= చేస్తూ; పెద్దకాలంబు= చాలకాలం; తపంబు+చేసినన్= తపస్సు చేయగా.

**తాత్పర్యం:** 'అంతేకాకుండా నీవు స్త్రీలు కూర్చుండేవైపు ఎడమతొడపై ఎక్కకుండా, పురుషులు కూర్చుండేవైపైనది, పుత్రులు ఎక్కదగినది అయిన కుడితొడపై ఎక్కావు కాబట్టి నాకొడుకుకు ఇల్లాలి వగుము' అనగా, ఆమె అట్లే చేస్తా నని చెప్పి మాయమైపోయింది. ఆ తరువాత ప్రతీపుడు పుత్త్రుడికోసం సహధర్మచారిణియైన సునందాదేవితో కూడి సమస్త పుణ్యతీర్థాలలోను వేదధర్మోచితమైన వ్రతాలను నిర్వహిస్తూ చాలకాలం; తపస్సు చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. అధికపుణ్యమూర్తు లైన యయ్యిరువుర । కమరనిభుఁడు కౌరవాన్వయంబు**
**వెలుఁగుచుండఁ బుట్టె వీరాగ్రగణ్యుండు । సంతతార్థదాయి శంతనుండు. 140**

**ప్రతిపదార్థం:** అధిక, పుణ్యమూర్తులు+ఐన= అమితపుణ్యం కలిగించే ఆకారం కలిగినవారైన; ఆ+ఇరువురకున్= ఆ దంపతులకు సునందాప్రతీపులకు; అమర, నిభుఁడు= దేవతలతో తుల్యమైనవాడు; వీర+అగ్రగణ్యుండు= పరాక్రమవంతులలో శ్రేష్ఠుడు; సంతత, అర్థ, దాయి= ఎల్లప్పుడు ధనాన్ని దానంచేసేవాడు; (అయిన) శంతనుండు; కౌరవ+అన్వయంబు= కురుమహారాజు వంశకర్తగా నైన వంశం; వెలుఁగుచున్+ఉండన్; ప్రకాశిస్తూఉండగా; పుట్టెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** అమితపుణ్యదంపతులైన సునందాప్రతీపులకు దేవతలతో తుల్యుడైనవాడు, వీరశ్రేష్ఠుడు, మహాదాత అయిన శంతనుడు కౌరవవంశం ప్రకాశించగా జన్మించాడు.

**వ. ఇట్లుదయించి పెరిఁగి సంప్రాప్త యౌవనుం డైన కొడుకుం జూచి ప్రతీపుండు తనకు నక్షయపుణ్యలోకంబులు గలిగె నని సంతసించి, సకలరాజ్యభారధౌరేయుఁగా నభిషిక్తుం జేసి కొడుకున కి ట్లనియె. 141**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; ఉదయించి= పుట్టి; పెరిగి; సంప్రాప్త యౌవనుండు+ఐన= యువకుడైన; కొడుకున్; చూచి; ప్రతీపుండు; తనకున్; అక్షయ, పుణ్య, లోకంబులు, కలిగెన్, అని= క్షయంకాని పుణ్యభోగాలకు అనువైన లోకాలు కలిగాయి అని; సంతసించి= సంతోషించి; సకల, రాజ్యభార, ధౌరేయున్+కాన్= సమస్తరాజ్యముయొక్క భారాన్ని వహించేవాడిగా; అభిషిక్తున్, చేసి= రాజుగా చేసి; కొడుకునకున్+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా పుట్టి పెరిగి యువకు డైన కొడుకును చూచి ప్రతీపుడు తనకు శాశ్వతపుణ్యలోకసుఖాలు కలిగా యని సంతోషించి, సమస్త రాజ్యభారాన్ని కొడుకుపై ఉంచి, రాజ్యానికి పట్టంకట్టి, కొడుకుతో ఈవిధంగా అన్నాడు.

**మధ్యాక్కర.**

**తనుమధ్య దా నొక్కకన్య సురనదీతటమున నన్నుఁ**
**గనిన నక్కన్యకఁ జూచి 'నీ విట్టి కమనీయ రూప,**
**వొనర నా సుతునకు భార్య వగు మన్న నొడఁబడి యియ్య**
**కొనియెఁ; గావున దానిఁ దగ వివాహ మగుము నెయ్యమునను.' 142**

**ప్రతిపదార్థం:** తనుమధ్య= సన్నని నడుముగలది అయిన; తాను+ఒక్క, కన్య= ఒకకన్య(తానుగా); సురనదీ, తటమునన్= గంగానది ఒడ్డున; నన్నున్, కనినన్= నన్ను చూడగా; ఆ+కన్యకన్, చూచి= ఆ కన్యను చూచి; నీవు+ఇట్టి, కమనీయ, రూపవు= నీవు ఇంతటి అందమైనరూపం కలదానివి; ఒనరన్= ఒప్పారగా; నా, సుతునకున్, భార్యవు+అగుము; అన్నన్; ఒడఁబడి= అనుకూలించి; ఇయ్యకొనియెన్= అంగీకరించింది; కావునన్= కాబట్టి; దానిని= ఆ కన్యను; తగన్= ఒప్పుగా; నెయ్యమునను= అనురాగంతో; వివాహము+అగుము= పెండ్లిచేసికొమ్ము.

**తాత్పర్యం:** గంగానదీతీరాన సన్నునినడుము గల ఒకకన్య తానుగా నన్ను దర్శించగా, నే నాకన్యను చూచి 'నీవు ఇంతటి అందమైన ఆకారం కలిగినదానవు, నాకొడుకుకు భార్యవు కమ్ము' అనగా, ఆమె అనుకూలించి అంగీకరించింది. కాబట్టి, ఆ కన్యను అనురాగంతో తగినట్లు వివాహం చేసికొమ్ము.'

**విశేషం:** మధ్యాక్కరలోని ప్రతి పాదంలోనూ వరుసగా 2 ఇంద్రగణాలూ, 1 సూర్యగణం, 2 ఇంద్రగణాలూ, 1 సూర్యగణం అమరిఉంటాయి. నన్నయ అయిదవగణంలోని మొదటివర్ణంతో యతిమైత్రి చేశాడు. ప్రాస నియతం.

### గంగా శంతనుల సమయము (సం. 1-92-26)

**వ. మఱి యక్కోమలి కులగోత్రనామంబు లడుగక దానియిష్టంబు సలుపు మని కొడుకుం బంచి ప్రతీపుఁడు తపోవనంబునకుం జనియె; నిట శంతనుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు మహాధనుర్ధరుండై**

**మృగయావినోదంబులఁ దగిలి యొక్కరుండును వనమ్ములోఁ గ్రుమ్మరువాఁ డనిలాలోలకల్లోలమాలాస్ఫాలన సముచ్చల జ్జలకణాసార శిశిరశిశిరం బగుచున్న గంగాపులినతలంబున. 143**

**ప్రతిపదార్థం:** మఱి= ఇంకను; ఆ+కోమలి, కుల, గోత్ర, నామంబులు+అడుగక= ఆ వనితయొక్క కులం, గోత్రం, నామం అడుగకయే; దాని, ఇష్టంబు, సలుపుము+అని= దానికోర్కె తీర్చు మని; కొడుకున్+పంచి= పుత్రుడిని నియమించి; ప్రతీపుఁడు; తపో, వనంబునకున్, చనియెన్= తపోవనానికి వెళ్ళాడు; ఇట= ఇక్కడ; శంతనుండు; రాజ్యంబు; చేయుచున్; ఒక్కనాఁడు; మహత్+ధనున్+ధరుండు+ఐ= గొప్పవిల్లును ధరించినవాడై; మృగయా, వినోదంబులన్= వేటలోని వినోదాలలో; తగిలి= ఆసక్తుడై; ఒక్కరుండును= ఒక్కడే; వనమ్ములోన్, గ్రుమ్మరువాఁడు= అరణ్యంలో తిరుగుతూ; అనిల+ఆలోల, కల్లోల, మాలా, స్ఫాలన, సముచ్చలత్= గాలిచేత కదలింపబడిన అలల వరుసల తాకిడివలన పైకి లేపబడుతున్న; జల, కణ+అసార, శిశిర, శిశిరంబు+అగుచున్న= నీటితుంపురుల జడివానవలన మిక్కిలి చల్లనైనది ఔతున్న; గంగా, పులినతలంబునన్= గంగానదియొక్క ఇసుకతిన్నెలపైభాగాన.

**తాత్పర్యం:** అంతేకాక, ఆ కోమలికులగోత్రనామాలుకూడ అడుగకుండ దానికోర్కె తీర్చు మని కొడుకును నియోగించి ప్రతీపుడు తపోవనానికి వెళ్ళాడు. ఇక, ఇక్కడ శంతనుడు రాజ్యం చేస్తూ ఒకనాడు గొప్పదైన విల్లుగైకొని వేటలోని వినోదాలలో ఆసక్తుడై ఒక్కడే అడవిలో తిరుగుతూ గాలిచేత కదలింపబడిన అలల వరుసల తాకిడివలన పైకి లేపబడుతున్న నీటితుంపురుల జడివానవలన మిక్కిలి చల్లనైన గంగానదియొక్క ఇసుకతిన్నెపై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం. అలల కదలికలలోని అందాన్ని "అనిలా.......తలంబున" అనే వర్ణనలో లకార పునరావృత్తి వలన సాధించి నన్నయ అక్షరరమ్యతను ప్రదర్శించాడు. గంగాదేవి సౌందర్య వ్యంజకం ఈ అక్షరరమ్యత.

**క. తరళాయతలోచన న। త్యురుకుచఁ దేజోభిరామ నుత్తమదివ్యాం**
**బర మాల్య మణిమయాలం। కరణోజ్జ్వలవేష నొక్కకన్యకఁ గనియెన్. 144**

**ప్రతిపదార్థం:** తరళ+ఆయత, లోచనన్= కదలాడుతున్న విశాలమైన కన్నులుకలదీ; అతి+ఉరు, కుచన్= మిక్కిలిపెద్దవైన చన్నులు కలదీ; తేజస్+అభిరామన్= ప్రకాశంచేత అందమైనదీ; ఉత్తమ, దివ్య+అంబర, మాల్య, మణిమయ+అలంకరణ+ఉజ్జ్వల, వేషన్= శ్రేష్ఠాలైన దేవతాసంబంధులైన వస్త్రాలతో, పూలమాలలతో, మణులతో నిండిన అలంకారాలతో ప్రకాశించే వేషం కలిగినది - అయిన - ; ఒక్క, కన్యకన్= ఒక కన్యను; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** కదలాడే వెడల్పైన కన్నులు కలది, మిక్కిలి పెద్దవైన వక్షోజాలు కలది, మేనివన్నెచేత అందమైనది, మేలిరకపు దివ్యవస్త్రాలతోనూ, పూలమాలలతోనూ, మణులతో నిండిన హారాలతోనూ వెలుగొందుతున్న వేషం కల ఒక కన్యను చూచాడు.

**చ. కని 'వనకన్యయో దనుజకన్యకయో భుజగేంద్రకన్యయో**
**యనిమిషకన్యయో యిది వియచ్చరకన్యకయో యపూర్వ మీ**
**వనమున కిట్టు లేకతమ వచ్చునె మానవకన్య' యంచు న**
**య్యనఘుఁడు దానిఁ జిత్తమున నాదట వోవక చూచెఁబ్రీతితోన్. 145**

**ప్రతిపదార్థం:** ఆ+అనఘుఁడు= ఆ పాపరహితుడైన శంతనుడు; కని= చూచి; ఇది= ఈకన్య; వనకన్యయో= వనదేవతాకన్య ఏమో; దనుజ, కన్యకయో= రాక్షసజాతికి చెందిన కన్యఏమో; భుజగ+ఇంద్ర, కన్యయో= సర్పరాజుయొక్క తనయయేమో?; అనిమిష కన్యయో= దేవకన్యయేమో; వియచ్చరకన్యకయో= గంధర్వకన్యయేమో; అపూర్వము= ముందెన్నడు చూడని అద్భుతం; మానవకన్య= మానవజాతికి చెందిన కన్య; ఈ వనమునకున్= ఈ అరణ్యానికి; ఇట్టులు= ఈవిధంగా; ఏకతమ= ఒంటరిగా; వచ్చునె= వస్తుందా? (రాలేదని భావం); అంచున్= అని అనుకొంటూ; దానిన్= ఆ కన్యను; చిత్తమునన్= మనసులో; ఆదట, పోవక= తనివితీరక; ప్రీతితోన్= ఆసక్తితో; చూచెన్= చూచాడు.

**తాత్పర్యం:** నిర్మలస్వభావు డైన శంతనుడు ఆ కన్యను చూచి ఆమె వనదేవతాకన్యయేమో? లేదా రాక్షసరాజకన్యయేమో, లేదా సర్పరాజపుత్రికయేమో, దేవతాకన్యయేమో, లేదా గంధర్వాదికన్యయేమో అని భావించి, ఆమె సౌందర్యాన్ని అద్భుతమైనదిగా ప్రశంసించి, మానవకన్య అయితే ఆ అడవిలో ఒంటరిగా వస్తుందా? అని అనుకొంటూ ఆమెను తనవితీరక ఆసక్తితో చూచాడు.

**విశేషం:** అలం: ఉల్లేఖం, ఉత్ప్రేక్ష, అపూర్వవస్తుదర్శనంవలన కలిగిన అబ్బురపాటుకు ఉత్ప్రేక్షాలంకారం ఉచితం; అబ్బురపాటువలన కలిగిన భావతరంగిణిని ఉల్లేఖంతో వర్ణించటం సార్థకం. ధ్వనికి తోడ్పడే అలంకారాలను వాడటం నన్నయస్వభావం.

**వ. అదియు నమ్మహీపతి రూపయౌవనసౌందర్యవిలాసంబుల కోటువడి మహానురాగంబున వానిన చూచుచున్నంత. 146**

**ప్రతిపదార్థం:** ఓటు+పడు= వశమగు.

**తాత్పర్యం:** ఆ కన్యకూడ ఆ రాజుయొక్క రూపాన్నీ, యౌవనాన్నీ, సౌందర్యహావభావాలనూ చూచి వాటికి వశురాలై అపారమైన అనురాగంతో (వలపుతో) అతడినే చూస్తూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఇరువురు నొండొరువులఁ గడు । సురుచిరముగఁ జూచు వాఁడిచూడ్కులు దనకున్**
**శరములుగాఁ గొని యేసెను । మరుఁ డయ్యిరువుర మనోభిమానచ్యుతిగన్. 147**

**ప్రతిపదార్థం:** ఇరువురున్= ఉభయులూ (గంగాశంతనులు); ఒండు+ఒరువులన్= ఒకరిని మరొకరు; కడు, సురుచిరముగన్= మిక్కిలి ఒప్పిదమైనట్లుగా; చూచు= చూచే; వాఁడి, చూడ్కులు= పదునైన (ఎదుటివారిని హత్తుకొనేటట్లుండే) చూపులను; మరుఁడు= మన్మథుడు; తనకున్= తనకు; శరములుగాన్= బాణాలుగా; కొని= గ్రహించి; ఆ+ఇరువుర, మనః, అభిమాన, చ్యుతిగన్= ఆ ఉభయుల మానసికస్థైర్యం జారేటట్లుగా; ఏసెను= నాటాడు.

**తాత్పర్యం:** గంగాశంతను లిద్దరూ ఒకరినొకరు మిక్కిలి మనోహరంగా చూచుకొనే వారిచూపులనే తనబాణాలుగా ఎన్నుకొని మన్మథుడు ఆ యిరువురి మానసికస్థైర్యం జారేటట్లు సంధించాడు.

**విశేషం:** అలం: ప్రహర్షణం. మన్మథుని బాణాలు అయిదు - అవి : అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం. 'ఒకరువుఁడు'కు రూపాంతరం ఒరువుఁడు. ఒండు- ఒరువుఁడు- ఒకరువుఁడు ఇవన్నీ రూపాంతరాలు.

**వ. శంతనుండు దానిం జూచి 'నీవెందులదాన' విట్లేల యేకతంబ యున్నదాన' వని యడుగ నోడి మిన్నకయున్న నాతండు తనయందు దృఢానురాగుం డగుట యెఱింగి యది యి ట్లనియె. 148**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** శంతనుడు ఆకన్యను చూచి 'నీ వెక్కడిదానవు? ఈవిధంగా ఒంటరిగా ఎందు కున్నావు?' అని అడగటానికి జంకి ఊరకుండగా, అతడు తనయందు గాఢమైన అనురాగం కలిగి ఉండటాన్ని గ్రహించి ఆమె ఈవిధంగా పలికింది.

**క. భూనాథ! నీకు భార్యం । గా నన్నుఁ బరిగ్రహింపఁ గడుకొని యిష్టం**
**బేని సమయంబు సేయుము । మానుగ నా కిష్టమయినమార్గముఁ బ్రీతిన్. 149**

**ప్రతిపదార్థం:** భూనాథ= ఓరాజా! (భూమికి అధిపతి అయినవాడా); నీకున్; భార్యన్+కాన్= భార్యను అయ్యేటట్లుగా; నన్నున్; పరిగ్రహింపన్= స్వీకరించటానికి; కడుకొని= పూనుకొని; ఇష్టంబు+ఏని= కోరిక అయినట్లయితే; మానుగన్= మనోజ్ఞంగా; నాకున్+ఇష్టము+అయిన, మార్గమున్= నాకు నచ్చే పద్ధతిలో; ప్రీతిన్= సంతోషంతో; సమయంబు= కట్టడి, ప్రతిజ్ఞ; చేయుము.

**తాత్పర్యం:** ఓరాజా! నీకు భార్య అయ్యేటట్లు నన్ను స్వీకరించా లని నీకు కోరి కైతే, పూనుకొని మనోజ్ఞంగా నాకు నచ్చే పద్ధతిలో ఒక కట్టడి చేయుము.

**వ. అది యెట్లంటేని -'యే నెద్ది సేసినను దానికి నొడంబడి వారింపకుండను, నన్ను నప్రియంబులు పలుకక యుండను వలయు; నట్లైన నీకు భార్య నై యభిమతసుఖంబు లొనరింతు; నటుగాక నీ వెప్పడేని నన్ను నప్రియంబులు వలుకు దప్పుడ నిన్నుఁ బాసిపోదు' ననిన శంతనుండు నొడంబడి దానిం బరిగ్రహించె; గంగయు మనుష్యస్త్రీరూపధారిణియై వాని కిష్టోపభోగంబులు సలుపుచుండె; నంత. 150**

**ప్రతిపదార్థం:** అది, ఎట్లు+అంటి(వి)+ఏని= అది ఏవిధంగా అంటావా (అంటే అని భావం); ఏను+ఎద్ది, చేసినను= నే నేమి చేసినా; దానికిన్= చేసినదానికి; ఒడంబడి= అంగీకరించి; వారింపక+ఉండను= అడ్డగించకుండానూ; నన్ను+అప్రియంబులు, పలుకక, ఉండను= నాతో పరుష మైన మాటలు మాటలాడకుండానూ; వలయున్= ఉండాలి; అట్లు+ఐనన్= ఆ విధంగా అయితే; నీకున్, భార్యను+ఐ= నీకు ఇల్లాలినై; అభిమత, సుఖంబులు+ఒనరింతును= ఇష్ట(కోరిన)సుఖాలు అందిస్తాను; అటు, కాక= దానికి విరుద్ధంగా; నీవు+ఎప్పుడేని, నన్ను, అప్రియంబులు, పలుకుదు(వు)= నీవు ఎప్పుడైనా నాకు ఇష్టంకాని మాటలు మాట్లాడితివా; అప్పుడు+అ= వెంటనే; నిన్నున్, పాసి, పోదున్, అనినన్= నిన్ను వదలిపోతాను అని అనగా; శంతనుండు; ఒడంబడి= అంగీకరించి; దానిన్= ఆ కన్యను; పరిగ్రహించెన్= పెండ్లాడాడు; గంగయున్= గంగకూడ; మనుష్య, రూపధారిణి+ఐ= మానవరూపం ధరించినదై; వానికిన్= అతడికి; ఇష్ట, ఉపభోగంబులు, సలుపుచున్+ఉండెన్= కోరిన అనుభవాలను కలిగిస్తూ ఉన్నది; అంతన్= ఆతరువాత.

**తాత్పర్యం:** అది ఏవిధంగా అంటే - 'నేను ఏది చేసినా, దానికి నీవు అంగీకరించి, అడ్డు చెప్పకుండ నన్ను పరుష మైనమాటలతో మనసు నొప్పించకుండ ఉండాలి. అట్లైతే నేను నీకు భార్యనై కోరిన కోర్కెలు తీరుస్తాను. అట్లుకాక నీవెప్పుడైనా నాకు నచ్చనిమాటలు పలికితే వెంటనే నిన్ను విడిచిపోతాను' అనగా శంతనుడు ఆమె కట్టడికి

అంగీకరించి ఆమెను పెండ్లాడాడు. గంగకూడ మానవవనితరూపం ధరించి అతడికి కోరిన సుఖాలను కలిగిస్తూ ఉన్నది. ఆ తరువాత (తరువాతి పద్యంతో).

**విశేషం:** శంతనుడు గంగను కిమ్మనకుండా అంగీకరించటానికి కారణం అతడి తండ్రియైన ప్రతీపుడిఆదేశం. (చూడు. 142 143 పద్యాలు).

**సీ. వరుణుఁ డాదిగఁగల వసువులు దోడ్తోడఁ । బుట్టుచు నున్న నప్పొలఁతి వారి**
**నల్లన పుట్టిన యప్పుడ కొనిపోయి । నిర్దయ యై గంగనీరిలోన**
**వైచిన, నెఱిఁగి య వ్వసుమతీనాథుండు । 'తనయుల ని ట్లేల దయయు లేక**
**గంగలో వైచెదు'? కడు నధర్మం బేల । చేసెదు' నా నోడుఁ; జెలువ దన్నుఁ**

**ఆ. బాసిపోవు ననియుఁ బలుకక యెప్పటి । యట్ల నెమ్మి నుండు; నంతఁ బుట్టెఁ**
**దనయుఁ డష్టముండు దల్లిదండ్రుల కతి । ప్రీతియును ముదంబుఁ బెరుఁగుచుండ. 151**

**ప్రతిపదార్థం:** వరుణుఁడు+ఆదిగన్, కల, వసువులు= వరుణుడు మొదలైన వసువులు; తోడ్తోడన్, పుట్టుచున్, ఉన్నన్= వెంటవెంటనే పుట్టుతూ ఉండగా; ఆ+పొలఁతి= ఆ వనిత, గంగ; వారిన్+అల్లన, పుట్టిన అప్పుడు+అ= వారిని సడిచప్పుడు లేకుండ పుట్టినప్పుడే; కొనిపోయి= ఎత్తుకొనిపోయి; నిర్దయ+ఐ= దయలేని కఠినురాలై; గంగనీరిలోనన్, వైచినన్= గంగానదిజలంలో పడవేయగా; ఆ+వసుమతీనాథుండు= ఆరాజు; ఎఱిఁగి= తెలిసికొని; తనయులను+ఇట్లు+ఏల, దయయున్, లేక= దయకూడా లేకుండా కొడుకులను ఆవిధంగా ఎందుకు; గంగలోన్, వైచెదు(వు)= గంగలో వేస్తావు?; కడు, అధర్మంబు+ఏల, చేసెదు(వు)= మిక్కిలి అధర్మాన్ని ఎందుకు చేస్తావు; నాన్= అని అనటానికి; ఓడున్= వెనుకాడును; చెలువ= భార్య; తన్నున్= తనను; పాసిపోవును+అనియున్= వదలిపోతుంది అనికూడ; పలుకక= మారుమాటాడక; ఎప్పటి, అట్లు+అ= ఎప్పటివలెనే; నెమ్మిన్= ప్రీతితో; ఉండున్= ఉండేవాడు; అంతన్= అప్పుడు; తనయుఁడు, అష్టముండు= ఎనిమిదవ కొడుకు; తల్లి, తండ్రులకున్= అమ్మనాయనలకు; అతి, ప్రీతియును= మిక్కిలి ఆసక్తియున్నూ; ముదంబున్= సంతోషమున్నూ; పెరుఁగుచున్+ఉండన్= పెంపొందుతుండగా; పుట్టెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** వరుణుడు మొదలైన వసువులు వెంటవెంటనే పుట్టుతుండగా గంగ సడిచప్పుడు లేకుండ వారిని పుట్టిన వెంటనే నిర్దయురాలై తీసికొనిపోయి గంగానదినీటిలో పడవేసేది. ఆ రాజు ఆ సంగతి తెలిసికొని "కొడుకులను దయమాలి ఆ విధంగా గంగలో ఎందుకు వేస్తావు? మిక్కిలి అధర్మాన్ని ఎందుకు చేస్తావు?" అని అడగటానికి వెనుకాడేవాడు. ఆమె తనను వదలి వెళ్ళిపోతుందేమో అని మారుమాట లేకుండ ఎప్పటివలెనే ప్రీతితో ఉండేవాడు. అప్పుడు ఎనిమిదవ కొడుకు తల్లిదండ్రులకు మిక్కిలి ఆసక్తిని, అనురాగాన్ని పెంచుతూ పుట్టాడు.

**వ. అక్కొడుకుం జూచి పుత్త్రమోహంబునఁ జంపనీనోపక శంతనుండు గంగ కి ట్లనియె. 152**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** ఆ కొడుకును చూచి కొడుకుమీది మమకారంతో అతడిని చంపనీయలేక శంతనుడు గంగతో ఈవిధంగా అన్నాడు.

గంగ శంతనునకు వసువుల వృత్తాంతమును దెలుపుట (సం. 1-29-49)

**క. పడయంగ రాని కొడుకులఁ । గడుఁ బలువురఁ బడసి పుత్త్రఘాతినివై; తీ**
**కొడుకు నుదయార్కతేజుని । విడువఁగ నే నోప ననుచు వేడుకతోడన్. 153**

**ప్రతిపదార్థం:** పడయంగన్, రాని, కొడుకులన్= పొందటానికి శక్యంగాని కొడుకులను; కడున్, పలువురన్, పడసి= పెక్కుమందిని కని; పుత్ర ఘాతినివి+ఐతి(వి)= కొడుకులను చంపేశావు; ఈకొడుకున్= ఈపుత్రుడిని; వేడుకతోడన్= సంతోషం (పుత్రోత్సవం) కారణంగా; ఉదయ+అర్క, తేజునిన్= ఉదయిస్తున్న సూర్యప్రకాశం వంటి తేజస్సు కలవాడిని; విడువఁగన్= వదలటమంటే; నేను+ఓపను= నేను సహించలేను; అనుచున్= అని పలుకుతూ.

**తాత్పర్యం:** పొంద శక్యంగాని కొడుకులను అనేకులను పొంది(కని)కూడ, పుత్రులను చంపేదాని వైనావు. వేడుక కలిగించే ఈపుత్రుడిని, బాలసూర్యుడి ప్రకాశం కలవాడిని వదలాలంటే నాకు శక్యం కాదు, అంటూ (తరువాతి వచనంతో అన్వయం).

**వ. దాని నప్రియంబులు వలికి వారించిన, నదియుం దొల్లి చేసిన సమయంబు దలంచిఁ 'నీతోడిసంగతి నాకు నింతియ; యేను బుణ్యజలప్రవాహపవిత్రఁ ద్రిభువనపావని యనంబరఁగిన గంగఁజుమ్మీ! వసువులు వసిష్ఠశాపంబున వసుమతిం బుట్టుచుండి యే మొండుచోట జన్మింపనోపము; నీయంద పుట్టెదము; మర్త్యంబునం బెద్దకాలం బుండకుండ మమ్ము ముక్తులం జేయు మని నన్నుం బ్రార్థించిన దేవహితార్థంబు మనుష్యస్త్రీరూపంబు దాల్చి నీవలన వసువులం బుట్టించితి; దీన నీకుం బుణ్యలోకంబు లక్షయంబు లగు; మఱియు నియ్యష్టమపుత్త్రుండు వసువులం దొక్కొక్కళ్ళ చతుర్థాంశంబులు దాల్చి సకలధర్మమూర్తి యయి పుట్టినవాఁడు; లోకహితార్థంబుగా మర్త్యంబునం బెద్దకాలం బుండు 'ననిన గంగకు శంతనుండి ట్లనియె.154**

**ప్రతిపదార్థం:** దానిన్= గంగను; అప్రియంబులు= ఇష్టంలేని మాటలు; పలికి= మాటాడి; వారించినన్= అడ్డగించగా; అదియున్= ఆ గంగకూడ; తొల్లి, చేసిన సమయంబు= పూర్వం ఒప్పుకొన్న కట్టడిని; తలంచి= జ్ఞాపకం చేసికొని; నీతోడి, సంగతి= నీతో కలసిఉండటం; నాకున్+ఇంతియ= నాకు ఇంతవరకే; ఏను= నేను; పుణ్య, జలప్రవాహ, పవిత్రన్= పుణ్యంకలిగించే నీటియొక్కప్రవాహంచేత పవిత్రమైన దానిని; త్రి, భువన, పావని= మూడులోకాలలో పవిత్రురాలు; అనన్, పరఁగిన, గంగన్, చుమ్మీ= అని ప్రసిద్ధికెక్కిన గంగను సుమా!; వసువులు= అష్టవసువులు; వసిష్ఠ, శాపంబునన్= వసిష్ఠుడియొక్కశాపంవలన; వసుమతిన్, పుట్టుచున్+ఉండి= భూమిపై పుట్టుతూ; ఏము= మేము; ఒండు, చోటన్, జన్మింపన్, ఓపము= మరొకచోట పుట్టలేము; నీ, అందున్+అ, పుట్టెదము= నీగర్భమందే పుట్టుతాము; మర్త్యంబునన్= భూలోకంలో; పెద్దకాలంబు+ఉండక+ఉండన్= ఎక్కువకాలం ఉండకుండ; మమ్మున్, ముక్తులన్, చేయుము+అని= మమ్ములను నరజన్మనుండి విడువబడినవారినిగా చేయుమని; నన్నున్, ప్రార్థించినన్= నన్ను వేడగా; దేవహిత+అర్థంబు= దేవతలయొక్క మేలుకొరకు; మనుష్య, స్త్రీ, రూపంబు, తాల్చి= మానవవనితారూపం ధరించి; నీవలనన్, వసువులన్, పుట్టించితిన్= నీవు కారణంగా వసువులను కన్నాను; దీనన్= దీనివలన; నీకున్= నీకు(శంతనుడికి); పుణ్య, లోకంబులు+అక్షయంబులు+అగున్= పుణ్యంచేసినవారు మరణానంతరం పొందే ఉత్తమలోకాలు క్షయంకాకుండా అనుభవానికి వస్తాయి; మఱియున్= అంతేకాక; ఈ+అష్టమపుత్త్రుండు= ఈ ఎనిమిదవ కొడుకు; వసువులందున్+ఒక్కొక్కళ్ళ+చతుర్థ+అంశంబులు, తాల్చి= వసువులలోని ఒక్కొక్కళ్ళయొక్క నాలుగో అంశాన్ని పొంది(ధరించి); సకల, ధర్మ, మూర్తి+అయి= సమస్తధర్మాలయొక్క ఆకృతివంటివా డయి; పుట్టినవాఁడు= పుట్టాడు;

లోక, హిత+అర్థంబు, కాన్= లోకంయొక్క మేలు కొరకు; మర్త్యంబునన్= భూలోకంలో; పెద్దకాలంబు= చాలకాలం; ఉండును= జీవిస్తాడు; అనినన్= అనగా; గంగకున్; శంతనుఁడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ విధంగా గంగకు ఇష్టం లేని మాటలు పలికి అడ్డగించగా, ఆమె పూర్వం చేసికొన్న నియమాన్ని జ్ఞాపకం చేసికొని 'నీతోడిపొత్తు ఇంతటితో సరి; నేను పుణ్యాజల ప్రవాహరూప నైన పవిత్రురాలను; మూడులోకాలలో పరమపవిత్ర నని పేరొందిన గంగను సుమా! అష్టవసువులు వసిష్ఠుని శాపంవలన భూమిపై పుట్టుతూ, మేము మరొకచోట పుట్టలేము, నీగర్భమందే జన్మిస్తాము; భూలోకంలో ఎక్కువకాలం ఉండకుండ మమ్ములను ఆ జన్మలనుండి విముక్తి చేయు మని నన్ను వేడగా, ఆ దేవతల మేలుకోరి మానవవనితారూపం ధరించి నీవలన వసువులను కన్నాను. దీనివలన నీకు క్షయంలేని పుణ్యలోకాలు కలుగుతాయి. అంతేకాక, ఈ ఎనిమిదవకొడుకు వసువులలో ఒక్కొక్కళ్ళనాల్గవఅంశాన్ని ధరించి సమస్తధర్మాలకు మూర్తికట్టినవాడుగా పుట్టాడు. లోకశ్రేయస్సుకొఱకు భూలోకంలో చాలకాలం ఇతడు జీవిస్తాడు' అని చెప్పగా గంగతో శంతనుడు ఈ విధంగా అన్నాడు.

**క. వసువు లనువా రపేత । వ్యసనులు, దేవతలు, లోకవంద్యులు; వారిన్**
**వసుమతిఁ బుట్టఁగ శాపము । వసిష్ఠముని యేల యిచ్చె వారిజనేత్రా! 155**

**ప్రతిపదార్థం:** వారిజనేత్రా!= తామరలవంటి కన్నులు కలదానా! గంగా!; వసువులు+అను, వారు= వసువులని పిలువబడేవారు; అపేత, వ్యసనులు= తొలగిన దోషాలు కలవారు(దోషాలు లేనివారు అనిభావం); దేవతలు; లోకవంద్యులు= జనులచేత నమస్కరింపదగినవారు; (అయిన) వారిన్= ఆ వసువులను; వసుమతిన్= భూలోకంలో; పుట్టఁగన్= పుట్టేటట్లు; శాపము= శాపాన్ని వసిష్ఠముని= వసిష్ఠుడనే పేరుగల ఋషి; ఏల= ఎందుకు; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** వసువులు దోషరహితులు, దేవతలు, లోకులచేత పూజింపదగినవారు. అటువంటివారిని ఆ వసిష్ఠముని భూలోకంలో పుట్టేటట్లు ఎందుకు శపించాడు?

**విశేషం:** కామక్రోధాలవలన పుట్టే దోషాలను వ్యసనా లంటారు. అవి ఏడు. (సప్తవ్యసనాలు). కామం వలనపుట్టే నాలుగు వ్యసనాలు సురాపానము, స్త్రీవాంఛ, వేట, జూదం. కోపం వలనకలిగే వ్యసనాలు మూడు : వాక్పారుష్యం, దండపారుష్యం, అర్థదూషణం.

**వ. 'మఱి వసువులు పుట్టుచు స్వర్గంబునకుం జనుటయు, నీయష్టమవసువు మర్త్యంబునం బెద్దకాలం బునికియు నేమి కారణం?' బని యడిగిన వానికి గంగ యి ట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** విస్పష్టం.

**తాత్పర్యం:** 'కాగా, వసువులు పుట్టుతూ స్వర్గానికి వెళ్ళటానికీ, ఈ ఎనిమిదవవసువు భూలోకంలో చాలకాలం జీవించటానికీ(ఉండటానికీ) కారణ మేమి?' టని అడుగగా శంతనుడితో గంగ ఈ విధంగా అన్నది.

**విశేషం:** 128వ వచనంలో వసువులు తమ శాపప్రకారాన్ని గంగకు వినిపించినట్లు మాత్రం చెప్పి, ఇక్కడ శంతనుడి కోరికమీద గంగచేత ఆ కథను ప్రసన్నంగా చెప్పించటం కథాకథనశిల్పం. అప్పుడే చెప్పిఉన్నట్లయితే ఉత్కంఠ ఉండేదికాదు. పైపెచ్చు పునరుక్తి కలిగేది. ఈ రెండు దోషాలు కలుగకుండ నన్నయ కథను కాపాడాడు.

**చ. అతులతపంబునన్ వరుణుఁ డన్మునిచే బహుపుణ్యకర్మసు**
**స్థితిఁ బ్రభవింపగాఁ బడిన దివ్యమునీంద్రుఁ డశేషలోక పూ**
**జితుఁడు వసిష్ఠుఁ డాశ్రమముఁ జేసి తపం బొనరించె బ్రహ్మస**
**మ్మితుఁ డురురత్నరాజిత సుమేరు మహీధర కందరంబునన్. 157**

**ప్రతిపదార్థం:** అతుల, తపంబునన్= అపారమైన తపస్సువలన; వరుణుఁడు+అన్, మునిచేన్= వరుణుడు అనే పేరుగల మునిచేత; బహు, పుణ్య, కర్మ, సుస్థితిన్= అనేకములైన మంచి కార్యాలయొక్క కలిమివలన (పుణ్యకర్మఫలంగా); ప్రభవింపఁగాఁ +బడిన= పుట్టింపబడిన; దివ్య, ముని+ఇంద్రుఁడు= దేవతామహిమలు కల ఋషులలో శ్రేష్ఠుడు; అశేష, లోక, పూజితుఁడు= సమస్తలోకాలలో గౌరవింపబడినవాడు; బ్రహ్మసమ్మితుడు= బ్రహ్మతో సమానుడు; (అయిన) వసిష్ఠుఁడు; ఉరు, రత్న,రాజిత, సుమేరు, మహీధర, కందరంబునన్= పెద్దవైన రత్నాలచేత ప్రకాశించెడి సుమేరువు అనే పర్వతంయొక్క గుహలో (విభాగం); ఆశ్రమమున్, చేసి= ఆశ్రమం చేసికొని; తపంబు= తపస్సు; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** వరుణుడు అనే మునికి అపారతపస్సువలననూ, అనేకపుణ్యకర్మలయొక్క ఫలస్థితివలననూ పుట్టిన దివ్యమునీంద్రుడు, సర్వలోకాలచేత గౌరవింపబడేవాడు, బ్రహ్మతో సమానుడు అయిన వసిష్ఠమహర్షి రత్నాలతో వెలుగొందే పెద్దదైన మేరుపర్వతపు గుహలోపలిభాగాన్ని ఆశ్రమంగా చేసికొని తపస్సు చేశాడు.

**వ. మఱియు దక్షప్రజాపతి పుత్త్రియయిన సురభికిం గశ్యపునకుం బుట్టిన నందిని దనకు హోమధేను వయి కోరిన వస్తువులు గురియుచుండఁదపంబు సేయుచున్న వసిష్ఠునాశ్రమంబునకు వసువు లెనమండ్రును భార్యాసహితు లై క్రీడార్థంబు వచ్చి, వసిష్ఠుహోమధేనువుం జూచి, దాని శీలంబునకు విస్మయం బందుచున్నచో నం దష్టమవసుభార్య పతి కి ట్లనియె. 158**

**తాత్పర్యం:** కాగా, దక్షప్రజాపతియొక్క కూతు రయిన సురభికిన్నీ పుట్టిన నందిని అనే ధేనువు హోమానికి కావలసిన ద్రవ్యాల నన్నింటిని తనపాదుగుద్వారా అందించే హోమధేనువుగా ఉండి, కోరిన వస్తువులన్నింటిని పాలధారతోపాటు వర్షిస్తూ ఉండగా నిశ్చింతగా తపస్సుచేస్తున్న వసిష్ఠుడియొక్క ఆశ్రమానికి ఒకసారి ఎనిమిదిమంది వసువులు భార్యలతోకూడి విహారార్థం వచ్చి, వసిష్ఠుడి హోమధేనువును చూచి, దాని మహిమకు(స్వభావానికి) ఆశ్చర్యపడుతూ ఉన్న సమయంలో ఎనిమిదవ వసువుయొక్క భార్య తనభర్తతో ఈ విధంగా అన్నది.

**ఆ. దీనిపాలు ద్రావి మానవుల్ పదియువే । లేండ్లు జరయు రుజయు నెఱుఁగ కమర**
**భావమున సుఖంబు జీవింతు రటె!; దీని । నేలఁగనిన వాఁడ యెందుఁ బెద్ద. 159**

**ప్రతిపదార్థం:** దీని, పాలు, త్రావి= ఈనందినీధేనువుయొక్క పాలు త్రాగి; మానవుల్= నరులు; పదియున్, వేల+ఏండ్లు= పదివేలసంవత్సరాలు; జరయున్, రుజయున్, ఎఱుగక= ముసలితనం, రోగం అంటే తెలియకుండా(లేకుండా); అమర, భావమునన్= మరణంలేనిస్థితిలో; సుఖంబు, జీవింతురు+అటె= హాయిగా బ్రతుకుతారటగా; దీనిన్, ఏలన్, కనిన, వాఁడు+అ= దీనిని తన అదుపులో ఉంచుకొని పాలింపకలిగినవాడే; ఎందున్= ఎక్కడైనా; పెద్ద= గొప్పవాడు (అనబడతాడు).

**తాత్పర్యం:** ఈ నందినీధేనువుపాలు త్రాగి నరులు పదివేలేండ్లు ముసలితనం, రోగాలు లేకుండ అమరత్వంతో హాయిగా బ్రతుకుతారటగా! దీనికి యజమానుడై పాలకుడైనవాడే నిజంగా ఎక్కడైనా గొప్పవాడుగా పరిగణింపబడేది.

**వ. 'మర్త్యలోకంబున నుశీనరపతికూఁతురు జితవతి యను కోమలి నా ప్రియసఖి; యే నెప్పుడు దానికిఁ బ్రియంబు గోరుచుండుదు; నిమ్మొదవు నమ్ముదితకిచ్చిపుత్త' మనినఁబ్రణయిని వచనంబుల కనుగుణంబుగాఁ బ్రభాసుండు నిజభ్రాతృచోదితుం డయి వసిష్ఠహోమధేనువుం బట్టికొనిపోయిన, నమ్మునియు దనహోమధేనువుం గానక వనంబెల్లఁ గలయరోసి, తన యోగదృష్టిం జూచి వసువులు గొనిపోక యెఱింగి.160**

**ప్రతిపదార్థం:** మర్త్యలోకంబునన్= భూలోకంలో; ఉశీనర, పతి, కూఁతురు= ఉశీనరము- అనే దేశపు రాజుయొక్క కూతురు; జితవతి, అను, కోమలి= జితవతి అనే పేరుగల వనిత; నా, ప్రియసఖి= నాకు ఇష్టమైన స్నేహితురాలు; ఏను+ఎప్పుడున్; దానికిన్, ప్రియంబు, కోరుచున్+ఉండుదు(ను)= ఆమె సంతోషాన్నేకోరుతూ ఉంటాను; ఈ+మొదవున్= ఈఆవును; ఆ+ముదితకున్+ఇచ్చి, పుత్తము+అనినన్= ఆ వనితకు ఇచ్చి పంపుదాము అనగా; ప్రణయిని, వచనంబులకున్+ అనుగుణంబుగాన్= ప్రియురాలి మాటలకు అనువుగా; ప్రభాసుండు; నిజభ్రాతృ, చోదితుండు+అయి= తన సోదరులచేత ప్రేరితుడై; వసిష్ఠ, హోమధేనువున్, పట్టికొనిపోయినన్= వసిష్ఠుడియొక్క హోమధేనువును తీసికొనిపోగా; ఆ+మునియున్= ఆ వసిష్ఠుడు; హోమధేనువున్; కానక, వనంబు+ఎల్లన్= అరణ్యమంతా; కలయన్, రోసి= నలుదిక్కులా వెదకి; తన, యోగదృష్టిన్, చూచి= తన దివ్యదృష్టితో చూచి; వసువులు, కొనిపోక= కొనిపోవుట; ఎఱింగి= వసువులు తీసికొనిపోవటం తెలిసికొని.

**తాత్పర్యం:** 'భూలోకంలో ఉశీనరదేశాధిపతియొక్కకూతురు జితవతి అనే ఆమె నా ప్రాణస్నేహితురాలు. నే నెప్పుడూ ఆమెకు సంతోషం కలిగించా లని భావిస్తూ ఉంటాను. ఈ ఆవును ఆమె కిచ్చిపంపుదా' మనగా, ప్రియురాలి మాటలకు అనువుగా ప్రభాసుడు తనసోదరులచేత ప్రేరితుడై వసిష్ఠుడి హోమధేనువును పట్టికొనిపోగా, ఆముని తనహోమధేనువు కనబడకపోవటంతో అడవినాలుగుమూలల గాలించి, తన యోగదృష్టితో చూచి, వసువులు తీసికొనిపోవటం తెలిసికొని.

**ఆ. 'మనుజయోనిఁ బుట్టుఁ' డని వారి కప్పుడు । కోప మడర మునియు శాప మిచ్చె;**
**భయము వొంది వివశు లయి వచ్చి వారును । వినయ మొనర నిట్టు లనిరి మునికి. 161**

**ప్రతిపదార్థం:** మునియున్= వసిష్ఠుడు; వారికిన్= వసువులకు; అప్పుడు; మనుజయోనిన్, పుట్టుఁడు+అని= మానవగర్భంలో పుట్టండి అని; శాపము; ఇచ్చెన్; వారును= వసువులుకూడ; భయము, పొంది= భయపడి; వివశులు+అయి= కలతపొందిన బుద్ధికలవారై; వచ్చి; వినయము+ఒనరన్= అణకువ ఒప్పారగా; మునికిన్= వసిష్ఠుడితో; ఇట్టులు+అనిరి= ఈవిధంగా అన్నారు.

**తాత్పర్యం:** అప్పుడు వసిష్ఠుడు వసువులను 'మీరు మానవజన్మ ఎత్తండి' అని కోపంతో శపించాడు. వారు అందుకు భయపడి మనసు కలతపడగా వినయంగా వసిష్ఠుడితో ఈ విధంగా అన్నారు.

### గంగ దేవవ్రతునిం దెచ్చి శంతనున కిచ్చుట (సం. 1-94-11)

**వ. 'నీవు ధర్మమూర్తివి; మాచేసిన యజ్ఞానంబు సహించి మర్త్యంబునం బెద్దకాలం బుండకుండ మా కనుగ్రహింపవలయు' నని ప్రార్థించిన నమ్ముని ప్రసన్నుం డయి 'మీకోరినయట్ల యగు; నష్టముం డయిన యీప్రభాసుండుపెద్దయునపరాధంబుఁజేసెఁగావున వీఁడు మర్త్యలోకంబునం బెద్దకాలంబుండు;**

**ననపత్యుండు నగు' ననియె నని గంగాదేవి తనస్వరూపంబుఁ జూపి, వసూత్పత్తియు స్వర్గగమన నిమిత్తంబును గాంగేయ జన్మస్థితియునుం జెప్పి, 'దేవవ్రతుం డయిన యిక్కుమారుండు పెరుఁగునంతకు నాయొద్దన యుండు'నని శంతను నొడంబఱిచి కొడుకుం దోడ్కొని యరిగిన; విస్మయం బంది శంతనుండు దానితోడి యిష్టోపభోగంబులం బెద్దకాలంబు సనిన నల్పకాలంబుకా వగచుచు హస్తిపురంబునకు వచ్చి.162**

**ప్రతిపదార్థం:** నీవు; ధర్మమూర్తివి= ధర్మంరూపు తాల్చినవాడవు; మా, చేసిన= మేం చేసిన; అజ్ఞానంబు= అవివేకపు పనిని; సహించి= ఓర్చి; మర్త్యంబునన్= భూలోకంలో; పెద్దకాలంబు+ఉండక+ఉండన్= చాలకాలం జీవించకుండా; మాకున్+అనుగ్రహింప, వలయున్+అని, ప్రార్థించినన్= మమ్ములను దయచూడు మని వేడుకొనగా; ఆ+ముని, ప్రసన్నుండు+అయి= ఆ వసిష్ఠుడు సుముఖుడై; మీ, కోరిన, అట్లు+అ, అగున్= మీరు కోరిన విధంగానే అవుతుంది; అష్టముండు+అయిన, ఈ, ప్రభాసుండు= ఎనిమిదవవాడైన ఈప్రభాసుడు; పెద్దయున్, అపరాధంబున్, చేసెన్, కావునన్= మిక్కిలి నేరం చేశాడుకాబట్టి; వీఁడు= ఇతడు(ప్రభాసుడు); మర్త్యలోకంబునన్= భూలోకంలో; పెద్దకాలంబు+ఉండున్= చాలకాలం ఉంటాడు; అనపత్యుండు+అగున్= సంతానంలేనివాడును ఔతాడు; అనియెను; అని; గంగాదేవి; తన, స్వరూపంబున్= తన నిజరూపాన్ని; చూపి= చూపించి; వసు+ఉత్పత్తియున్= వసువులయొక్క పుట్టుకనుగురించి; స్వర్గ, గమన, నిమిత్తంబును= వారిస్వర్గప్రయాణానికి(మరణానికి) గల కారణాన్నీ; గాంగేయ, జన్మస్థితియునున్= గంగకుమారుడైన భీష్మడియొక్క పుట్టుకకు సంబంధించిన వాస్తవాన్నీ; చెప్పి; దేవవ్రతుండు+అయిన= దేవవ్రతుడు అనేపేరుతో వ్యవహరింపబడే ఈబాలుడు; పెరుఁగు+అంతకున్= పెద్దవాడయ్యేంతవరకు; నాయొద్దన్+అ, ఉండును+అని= నాదగ్గరే ఉంటా డని; శంతనున్= శంతనుడిని; ఒడంబఱిచి= ఒప్పించి; కొడుకున్, తోడ్కొని, అరిగినన్= కుమారుడిని తీసికొనిపోగా; శంతనుండు; విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; దానితోడి, ఇష్ట+ ఉపభోగంబులన్, పెద్దకాలంబు, చనినన్= గంగతో కలిసి కోరిన కోర్కెలను అనుభవించటం చాలకాలం సాగినప్పటికీన్నీ; అల్పకాలంబు, కాన్= కొద్దికాలమే సాగినట్లు; వగచుచున్= బాధపడుతూ; హస్తిపురంబునకున్, వచ్చి= హస్తినాపురానికి తిరిగివచ్చి.

**తాత్పర్యం:** 'వసిష్ఠమహర్షీ! నీవు ధర్మం తెలిసినవాడవు. మేము చేసిన అవివేకపుపనికి ఓర్చుకొని భూలోకంలో ఎక్కువకాలం ఉండకుండ మమ్ములను దయచూడు' మని వేడుకోగా, ఆ వసిష్ఠుడు అనుకూలుడై 'మీరు కోరినట్లే ఔతుంది; కాని, ఈ ఎనిమిదవవాడైన ప్రభాసుడు మిక్కిలినేరం చేశాడుకాబట్టి వీడు భూలోకంలో చాలకాలం జీవిస్తాడు, సంతానం లేనివాడుకూడ ఔతాడు' అని అన్నా డని చెప్పి, గంగాదేవి తన నిజస్వరూపాన్ని చూపి వసువులపుట్టుకను గురించి, వారు స్వర్గానికిపోవడానికి గల కారణాన్నిగురించి, భీష్మడి పుట్టుకకు సంబంధించిన వాస్తవాన్ని గురించి చెప్పి, దేవవ్రతుడని ఆ కుమారుడికి పేరుపెట్టి, అతడు పెద్దవాడయ్యేంతవరకు తనదగ్గరే ఉంటాడని పేర్కొని, దానికి శంతనుడిని ఒప్పించి, కొడుకును తనతో తీసికొనిపోయింది. శంతనుడు దాని కంతటికి ఆశ్చర్యపడి గంగతో తాను చాలకాలం కోరినకోర్కెలు అనుభవించినా అది స్వల్పకాలంగానే తోచగా విచారపడుతూ హస్తినాపురానికి వచ్చి.

**మ.** **తన కాజ్ఞావశవర్తు లై మహిసమస్తక్షత్రవంశేశు లె**
**ల్లను భక్తిం బనిసేయుచుండఁగ విశాలం బైన సత్కీర్తి ది**
**గ్వనితా మౌక్తిక దామలీల వెలుఁగన్ వారాశిపర్యంత భూ**
**జనరక్షాపరుఁ డయ్యె శంతనుఁడు రాజద్రాజధర్మస్థితిన్. 163**

**ప్రతిపదార్థం:** శంతనుఁడు; రాజత్, రాజధర్మస్థితిన్= ప్రకాశిస్తున్న రాజధర్మం యొక్క వ్యవస్థతో; తనకున్; ఆజ్ఞా, వశవర్తులు+ఐ= శాసనానికి లొంగినవారై; మహిన్, భూమిలోని సమస్త, క్షత్ర, వంశ+ఈశులు+ఎల్లను= క్షత్రియవంశాలకు చెందిన రాజులందరూ; భక్తిన్= వినయంతో; పని+చేయుచున్+ఉండఁగన్= సేవలు చేస్తూ ఉండగా; విశాలంబు+ఐన, సత్, కీర్తి= బాగా వ్యాపించిన మంచి కీర్తి; దిక్, వనితా, మౌక్తిక, దామ, లీల, వెలుఁగన్= దిక్కు అనెడి స్త్రీయొక్క ముత్యాలదండయో అన్నట్లు ప్రకాశించగా; వారాశి, పర్యంత, భూ, జన, రక్షా, పరుఁడు+అయ్యెన్= సముద్రాలవరకు వ్యాపించి ఉన్న భూమియొక్క జనులయొక్క రక్షణయందు నిమగ్నుడైనాడు.

**తాత్పర్యం:** శంతనుడు తన శాసనానికి తలఒగ్గి భూతలంమీది క్షత్రియవంశ్యులైన రాజు లందరు వినయంతో తనకు సేవలుచేస్తూ ఉండగా వ్యాపించిన తన ఉత్తమకీర్తి, దిక్కులనే వనితలకు పెట్టిన ముత్యాలదండయో అన్నట్లు ప్రకాశించగా, వెలుగొందుతున్న రాజధర్మవ్యవస్థతో సముద్రాలవరకు వ్యాపించిన భూమిని, ప్రజలను రక్షించటంలో నిమగ్నుడైనాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ.** **ఇట్లు లోకంబెల్లఁ దనధర్మమార్గంబ పొగడుచుండ సుఖంబుండి యాతం డొక్కనాఁడు మృగయావ్యాజంబున గంగాసమీపంబునం జనువాఁడు దన్నుంబాసి తనుత్వంబుఁ దాల్చినట్లు గడునల్పప్రవాహం బైయున్నదానిం గంగానదిం జూచి యిది యేమినిమిత్తంబో యనుచుం గొండొకనేల యరిగి.** **164**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; లోకంబు+ఎల్లన్= లోకమంతా; తన, ధర్మ, మార్గంబు+అ= తనయొక్కధర్మపద్ధతిని; పొగడుచున్+ఉండన్= ప్రశంసిస్తూ ఉండగా; సుఖంబు+ఉండి= హాయిగా కాలంగడుపుతూ; ఆతండు= శంతనుడు; ఒక్కనాఁడు= ఒకరోజున; మృగయా, వ్యాజంబునన్= వేట నెపంతో; గంగా, సమీపంబునకున్, చనువాఁడు= గంగానదియొక్క సమీపానికిపోతున్నవాడు; తన్నున్, పాసి, తనుత్వంబున్, తాల్చినట్లు= తనను వదలివెళ్ళి చిక్కినట్లు (సన్నపడ్డట్లు); కడున్, అల్ప, ప్రవాహంబు+ఐ, ఉన్న, దానిన్= మిక్కిలి తక్కువైన నీటిజాలు కలిగినదై ఉన్నదానిని; గంగానదిన్; చూచి; ఇది, ఏమి నిమిత్తంబు+ఓ, అనుచున్= దీనికి కారణ మేమిటో అని అనుకొంటూ; కొండొక, నేల అరిగి= మరొకచోటికి పోయి.

**తాత్పర్యం:** ఈవిధంగా లోకమంతా తా ననుసరించే ధర్మమార్గాన్ని పొగడుతూ ఉండగా, సుఖంగా ఉండి, ఒకనాడు వేటకై గంగానదిసమీపానికి పోగా ఎదుట గంగానది తననుండి దూరంకావటంచేత చిక్కి సన్నబడిపోయిందా అన్నట్లు మిక్కిలి తక్కువనీటిపారుదల కలిగిందై ఉండగా చూచి, దీనికి కారణ మేమిటో అని అనుకొంటూ మరొక ప్రాంతానికి పోయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**తరలము.**

**కనియె ముందట నమ్మహీపతి గాంగసైకత భూములం**
**బనుగొనన్ ధను వభ్యసించుచు బానసంహతి సేతుగా**
**ఘనముగా నమరాపగౌఘముఁ గట్టియున్న కుమారు న**
**త్యనఘు నాత్మసమాను నాత్మజు నాపగేయు మహాయశున్.** **165**

**ప్రతిపదార్థం:** ఆ+మహీపతి= ఆ రాజు (శంతనుడు); గాంగ, సైకత, భూములన్= గంగానదికి సంబంధించిన ఇసుకతిన్నెలపై; పన్ను+కొనన్-పనుగొనన్= (అభ్యాసంవలన) విద్యదృఢపడటానికి; ధనువు+అభ్యసించుచున్= విలువిద్యను అభ్యాసంచేస్తూ; బాణసంహతిన్= బాణాలయొక్క సమూహాన్ని; సేతుగాన్= అడ్డుకట్టగా; ఘనముగాన్= గొప్పగా, గట్టిగా; అమర+ఆపగా+ఓఘమున్= దేవతలనది అయిన గంగయొక్క ప్రవాహాన్ని; కట్టి+ఉన్న= అడ్డుపెట్టిఉన్న; అతి+అనఘున్= మిక్కిలి దోషరహితుడిని; ఆత్మ, సమానున్= తనతో పోలినవాడిని(రూపపరాక్రమాలలో); ఆత్మజున్= తన కుమారుడిని; ఆపగేయున్= గంగాపుత్రుడిని; మహత్+యశున్= గొప్పకీర్తికలవాడిని; కుమారున్= బాలుడిని, (పుత్త్రుడిని); ఎదుటన్= కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** ఆ శంతనుడు గంగానదిఒడ్డున నున్న ఇసుకతిన్నెలమీద ధనుర్విద్య గట్టిపడటానికి విల్లమ్ములతో అభ్యాసం చేస్తూ బాణాలసమూహంతో గంగాప్రవాహానికి అడ్డుకట్టగా కట్టి నీటిప్రవాహానికి అడ్డుపెట్టి ఉన్న దోషరహితుడు, తనతో సమానుడైనవాడు, తనకుమారుడు, గంగాపుత్రుడు, గొప్పకీర్తి కలవాడు అయిన ఒక బాలుడిని ఎదుట చూచాడు.

**విశేషం:** తరలము- ఇది అతిధృతి ఛందంలో పుట్టింది. ప్రతిపాదానికీ పందొమ్మిది అక్షరా లుంటాయి. గణాలు- న, భ, ర, స, జ, జ, గ; 12వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది. 'కుమారున్ - అత్యనఘున్ - ఆత్మసమానున్ - ఆత్మజున్ - ఆపగేయున్ - మహాయశున్' - అనే వరుసలో విశేషణాలు వాడి శంతనుడు దేవవ్రతునిలో కానవచ్చే గుణాలను క్రమంగా సహజంగా గుర్తించినట్లు నన్నయ వర్ణించాడు. ఇది ప్రసన్నకథాకవితలోని ఒక శిల్పం.

**వ. కని పుట్టిననాఁడ చూచినవాఁడు గావున నప్పు డెఱుంగనేరక విస్మయాకులిత చిత్తుం డయి యుండెఁ;**
**గుమారుండు నాతనిం జూచి తండ్రిగా నెఱుంగనేరకయు నిసర్గస్నేహమోహితుం డై యుండె; నంత, 166**

**తాత్పర్యం:** ఆవిధంగా చూచి, అతడిని పుట్టిననాడుమాత్రమే చూచి ఉన్నాడు కాబట్టి ఆసమయంలో గుర్తించలేక శంతనుడు ఆశ్చర్యంతో కలతపడిన హృదయంకలవాడై ఉన్నాడు. ఆ బాలుడుకూడ శంతనుడిని చూచి తండ్రిగా గుర్తించలేకపోయినా సహజమైన అనురాగంతో ముగ్ధుడై ఉండిపోయాడు. అంతట (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. దివ్యభూషణాలంకృతదేహుఁ డైన । కొడుకు వలపలిచేయూఁది కోమలాంగి**
**దివ్యనది ప్రీతితోఁ జనుదెంచి పతికిఁ । జూపి 'భూనాథ! వీఁడు నీ సూనుఁ' డనియె. 167**

**ప్రతిపదార్థం:** దివ్య, భూషణ+అలంకృత, దేహుఁడు+ఐన= దేవతాసంబంధు లైన ఆభరణాలచేత అలంకరింపబడిన శరీరం కలవాడైన; కొడుకు, వలపలి, చేయి+ఊఁది= కొడుకుయొక్క కుడిచేయి పట్టుకొని; కోమల+అంగి, దివ్యనది= వనిత యైన గంగ; ప్రీతితోన్, చనుదెంచి= సంతోషంతో వచ్చి; పతికిన్+చూపి= భర్తకు ఆ కుమారుడిని చూపి; భూనాథ= ఓరాజా!; వీఁడు= ఈబాలుడు; నీ, సూనుఁడు= నీకుమారుడు; అనియెన్= అని చెప్పింది.

**తాత్పర్యం:** దివ్యాభరణాలతో అలంకరింపబడిన మేను కలవాడైన కొడుకుయొక్క కుడిచేయిపట్టుకొని గంగాదేవి ఆప్యాయంగా వచ్చి బాలుడిని భర్తకు చూపి, 'ప్రభూ! ఈ బాలుడు నీకుమారుడు' అని చెప్పింది.

**వ. మఱియును. 168**

**ప్రతిపదార్థం:** సుస్పష్టం.

**తాత్పర్యం:** ఇంకా ఏమంటే. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. సాంగంబు లగుచుండ సకలవేదంబులు । సదివె వసిష్ఠుతోఁ; సకలధర్మ**
**శాస్త్రాది బహువిధశాస్త్రముల్ శుక్రబృ । హస్పతుల్ నేర్చినయట్ల నేర్చెఁ**
**బరమాస్త్రవిద్య నప్పరశురాముం డెంత । దక్షుఁ డంతియ కడుదక్షుఁ డయ్యెఁ;**
**నాత్మవిజ్ఞానంబునందు సనత్కుమా । రాదుల యట్టిఁడ యనఘమూర్తి**

**ఆ. నొప్పుగొనుము వీని; నుర్వీశ!' యని సుతు । నిచ్చి గంగ సనిన, నెఱిఁగి తనయు**
**నెమ్మిఁ దోడుకొనుచు నిధి గన్నపేదయ । పోలె సంతసిల్లి భూవిభుండు. 169**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ= రాజా! వసిష్ఠుతోన్= వసిష్ఠుడివద్ద; స+అంగంబులు+అగుచున్+ఉండన్= అంగాలతో కూడికొని ఉండగా; సకల, వేదంబులు, చదివెన్= అన్ని వేదాలనూ చదివాడు; శుక్ర, బృహస్పతుల్, నేర్చిన, అట్లు+అ= రాక్షసులగురువైన శుక్రుడు, దేవతల గురువైన బృహస్పతి నేర్చిన విధంగానే; సకలధర్మశాస్త్ర+ఆది, బహువిధశాస్త్రముల్= ధర్మశాస్త్రం మొదలైన అనేక శాస్త్రాలనన్నింటిని; నేర్చెన్= నేర్చాడు; పరమ+అస్త్ర, విద్యన్= మంత్రసహితా లైన శ్రేష్ఠమైన అస్త్రాలను ప్రయోగించే విద్యలో; ఆ+పరశురాముండు+ఎంత, దక్షుఁడు= ఆజమదగ్నిపుత్త్రుడైన పరశురాముడు ఎంత సమర్థుడో; అంతియ, కడు, దక్షుఁడు+అయ్యెన్= అంతగా మిక్కిలి నేర్పరి అయినాడు; ఆత్మవిజ్ఞానంబునందున్= ఆధ్యాత్మిక జ్ఞానంలో; సనత్‌కుమార+ ఆదులు+అ, అట్టిఁడ, అనఘమూర్తిన్= సనత్కుమారుడు మొదలైనవారివలెనే పుణ్యమూర్తికలవాడు అయిన; వీనిన్= వీడిని; ఒప్పు, కొనుము= ఇష్టంతో గ్రహించుము; అని, సుతున్= ఇచ్చి= అని కొడుకును, ఒప్పగించి; గంగ, చనినన్= (గసడదవాదేశం) గంగాదేవి వెడలిపోగా; తనయున్= కుమారుడిని; ఎఱిఁగి= గుర్తించి; నెమ్మిన్= ప్రీతితో; తోడుకొనుచున్= వెంటతీసికొనివెళ్ళుతూ; నిధి, కన్న, పేద+అ,పోలెన్= డబ్బుపాతర(గుప్తధనం)ను కనుగొనిన పేదవాడివలె; భూవిభుండు= రాజు; సంతసిల్లి= సంతోషించి,

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఇతడు వసిష్ఠుడివద్ద వేదాలను సాంగంగా చదివాడు; శుక్రుడు, బృహస్పతి నేర్చినట్లుగా సకలధర్మశాస్త్రాలను, వివిధశాస్త్రాలను నేర్చాడు; శ్రేష్ఠమైన అస్త్రాలన్నింటిని ప్రయోగించే నేర్పులో ఆ పరశురాముడు ఎంతసమర్థుడో అంతటిసమర్థుడైనాడు. ఆత్మజ్ఞానంలో సనత్కుమారాదులవలె పుణ్యాత్ముడైనవాడు. నీకుమారుడైన ఇతడిని స్వీకరించుము' అని శంతనుడికి కుమారుడిని ఒప్పచెప్పి వెడలిపోగా; శంతనుడు విషయమంతా తెలిసికొని పెన్నిధిని పొందిన పేదవాడివలె కొడుకును చూచి ఉప్పొంగిపోయి, అతడిని తనవెంట తీసికొనిపోయాడు.

**విశేషం:** అలం: ఉపమ; భార్యాపుత్రులు దూరమైన శంతనుడు ఎంతటిమహారాజైనా ఒంటరిగా ఎంతటిపేదవాడుగా కనబడతాడో, కొడుకుతో కూడుకొని ఉంటే ఎంతఅదృష్టవంతుడుగా గోచరిస్తాడో' పెన్నిధిని కనిన పేదవాడివలె' అనే పోలికతో నన్నయ రుచిరార్థదీప్తితో చెప్పాడు. వివిధరంగాలలో అత్యున్నతులు, ఆదర్శవంతులు అయినవారు- వసిష్ఠుడు, శుక్రుడు, బృహస్పతి, పరశురాముడు, సనత్‌కుమారుడు మొదలైనవారు. వారందరి పాండిత్యం ఒక్కటైతే ఎంతగొప్పదో అంతటి ఘనమైనవిద్వత్తు కలవాడు దేవవ్రతుడని వ్యంగ్యం. ఒక కామపురుషార్థాన్ని వదలి మిగిలిన పురుషార్థాలన్నింటికి సంబంధించిన విజ్ఞానాన్ని దేవవ్రతుడు గ్రహించాడని వస్తుధ్వని. సంతానంలేకుండ దీర్ఘకాలం ధర్మాత్ముడుగా భీష్ముని జీవితవృత్తానికి ఇటువంటి కథార్థాలు వ్యంజకాలై సార్థకా లౌతున్నాయి.

**వ. తన పురంబునకు వచ్చి సకలరాజన్య ప్రధాన సమక్షంబున గాంగేయునకు యౌవరాజ్యాభిషేకంబు సేసి, కొడుకుతోడి వినోదంబులం దగిలి నాలుగువత్సరంబు లనన్యవ్యాపారుండై యుండి, యొక్కనాఁడు యమునాతీరంబున వేఁటలాడుచుఁ గ్రుమ్మరువాఁ డపూర్వసురభిగంధం బాఘ్రాణించి దానివచ్చిన వల నారయుచు నరిగి యమునాతీరంబున. 170**

**ప్రతిపదార్థం:** తన, పురంబునకున్, వచ్చి= తన రాజధానికి తిరిగివచ్చి; సకల, రాజన్య, ప్రధాన, సమక్షంబునన్= సమస్త సామంత ప్రభువులయొక్కయు, మంత్రులు మొదలైన రాజోద్యోగులలో ముఖ్యులైనవారియొక్కయు ఎదుటన్; గాంగేయునకున్= గంగకుమారుడైన దేవవ్రతునకు; యౌవరాజ్య+అభిషేకంబు, చేసి= యువరాజు పదవిలో అభిషేకించి; కొడుకుతోడి, వినోదంబులన్, తగిలి= కొడుకుతో కలిసి వేడుకలలో ఆసక్తుడై; నాలుగు, వత్సరంబులు, అనన్య, వ్యాపారుండు+ఐ, ఉండి= నాలుగేండ్లు మరే ఇతర వ్యాసంగాలు లేనివాడై ఉండి; ఒక్కనాఁడు= ఒకరోజున; యమునా, తీరంబునన్= యమునానదీతీరంలో; వేఁటలు+ఆడుచున్= వేటాడుతూ, క్రుమ్మరువాఁడు= తిరుగుతుండే అతడు; అపూర్వ, సురభి, గంధంబు+ఆఘ్రాణించి= అద్భుతమైన (అంతకుముందెరుగని) ఒక గంధద్రవ్యం యొక్క సువాసనను అనుభవించి; (వాసన చూచి); దాని, వచ్చిన, వలను+ఆరయుచున్, అరిగి= అది వచ్చిన దిక్కున వెదకుతూ వెళ్ళి; యమునాతీరంబునన్= యమునానది ఒడ్డున.

**తాత్పర్యం:** శంతనుడు తన రాజధానికి తిరిగివచ్చి సకలరాజప్రధానుల ఎదుట గాంగేయుడికి యౌవరాజ్యపట్టాభిషేకం చేసి కొడుకుతో వేడుకలు సలుపుతూ నాలుగేళ్ళు మరే వ్యాసంగాలూ లేకుండ ఉండి, ఒకనాడు యమునానదీతీరంలో వేటాడుతూ తిరుగుతుండగా ఒక అపూర్వ మైన సుగంధం వాసన చూచాడు. ఆ వాసన వస్తున్న దిక్కుననే వెళ్ళుతూ యమునాతీరంలో.

### శంతనుఁడు సత్యవతిని భార్యగాఁగోరి ప్రతిహత మనోరథుఁ డగుట (సం. 1-94-41)

**క. కనకావదాతకోమల । తనులతఁ దనుమధ్యఁ గమలదళనేత్రను యో**
**జనగంధి నవనినాథుఁడు । గనియెను సురకన్యవోని కన్నియ నంతన్. 171**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; అవనినాథుఁడు= రాజు; కనక,+అవదాత, కోమల, తనులతన్= బంగారంవలె స్వచ్ఛమైన (తెల్ల) మెత్తనిలతవంటి మేనుకలిగినది; తనుమధ్యన్= సన్నని నడుము కలిగినది; కమల, దళ, నేత్రను= తామరరేకులవంటి కన్నులు కలదానిని; యోజన, గంధిన్= ఆమడదూరందాకా మేనిసుగంధాన్ని వ్యాపింపచేసేది అనే సార్థకమైన పేరును కలది; సుర, కన్య, పోని, కన్నియన్= దేవకన్యవంటికన్యను; కనియెను= చూచాడు.

**తాత్పర్యం:** అప్పుడు రాజు బంగారువలె స్వచ్ఛమైన మృదువైన లతవంటి మేను కలిగినది, సన్నని నడుము కలది, తామరరేకులవంటి కన్నులు కలది, ఆమడదూరం మేని సుగంధాన్ని వ్యాపింపజేసేది, అయిన దేవకన్యవంటి కన్యను చూచాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. దాని శరీరసౌరభము, దాని విలోల విలోకనంబులున్,**
**దాని మనోహరాకృతియు, దాని శుచిస్మిత వక్త్రకాంతియున్,**

దాని విలాసముం గడుముదంబునఁ జూచి మనోజబాణసం
తానహతాత్ముఁ డై నృపతి దానికి ని ట్లనియెం బ్రియంబునన్. 172

**ప్రతిపదార్థం:** నృపతి= రాజు(శంతనుడు); దాని, శరీర, సౌరభమున్= ఆమెయొక్క మేనిసుగంధమును; దాని, విలోల, విలోకనంబులున్= ఆమెయొక్క కదలాడే చూపులు; దాని, మనోహర+ఆకృతియున్= ఆమెయొక్క అందమైన ఆకారం; దాని, శుచి, స్మిత, వక్త్ర, కాంతియున్= ఆమెయొక్క తెల్లని చిరునవ్వుకల ముఖకాంతియు; దాని, విలాసమున్= ఆమెయొక్క శృంగారహావభావలక్షణాన్నీ; కడు, ముదంబునన్= మిక్కిలి సంతోషంతో; చూచి= చూచి; మనోజ, బాణ, సంతాన; హత+ ఆత్ముఁడు+ఐ= మన్మథుడియొక్క బాణాల సమూహంతో కొట్టబడిన హృదయం కలిగినవాడై; ప్రియంబునన్= అనురాగంతో; దానికిన్= ఆమెతో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** శంతనుడు ఆమెశరీరపరిమళాన్నీ, ఆమె చలించే కన్నులనూ, ఆమె అందమైన ఆకారాన్నీ, తెల్లని చిరునవ్వుతో కూడిన ఆమెముఖకాంతినీ, ఆమెశృంగారహావభావలీలలను మిక్కిలిసంతోషంతో చూచి మన్మథబాణాలతో కొట్టబడినహృదయం కలిగినవాడై(మదనవికారానికి లోనై) అనురాగంతో ఆమెతో ఈవిధంగా అన్నాడు.

**విశేషం:** నన్నయగారి అక్షరరమ్యతకు అద్దం పట్టే రచన. యోజనగంధి మధురాకృతిలో ఉన్న సమవిభక్తమైన రూపవైభవాన్ని 'సమత' అనే శబ్దగుణంతో ధ్వనింపజేశాడు నన్నయ. అక్షరరమ్యత అంటే రచనలోని రమణీయాక్షరప్రయోగ పునరావృత్తులవలన కలిగే అందమే కాదు, పద, పదసముదాయాలవలన కలిగే అందమనికూడ అర్థం. ఇందులో రాజు ఆమె సౌందర్యాన్ని చూచి మన్మథబాణహతాత్ముడైనాడన్నది వర్ణ్యవస్తువు. మన్మథుడి బాణాలు అయిదు. నన్నయ నాయికను వర్ణించేటప్పుడు షష్ఠీవిభక్త్యంతాలైన తచ్ఛబ్దాలు ('దాని' అనే సర్వనామాలు) అయిదింటితో అయిదు విశేషణాలను ప్రయోగించటం సార్థకం. ఆమె శరీర విలాసాలే పంచబాణాల వంటివని కవిప్రౌఢోక్తిసిద్ధమైన వస్తుధ్వని. ముదంబునన్ అనే మాట అభిలాషను ధ్వనింపజేస్తున్నది. పద్యపూర్వార్ధంలో నాయికా సౌందర్యవర్ణనం, ఉత్తరార్ధంలో నాయకుడి అభిలాషవర్ణనం. పూర్వార్ధంలో సమతాగుణం నాయికా సౌందర్యదర్శకం. మొత్తంపద్యంలో భాసించే మాధుర్యం రతిభావవ్యంజకం, నాయికయందు 'శుచిస్మితవక్త్రకాంతి' అనేది విశిష్టసౌందర్యలక్షణంగా నన్నయ నిర్దేశించాడు. రాబోయే పద్యంలోకూడా దానిని పేర్కొన్నాడు. మనసులోని మర్మాన్ని ముసిముసినవ్వులతో ముద్దుముద్దుగా ధ్వనింపజేయగల ముద్దరాలు యోజనగంధి.

ఉ. 'ఎందులదాన? వేకతమ యియ్యమునానది నోడ నడ్పుచున్
సుందరి! నీకు నున్కి యిది చూడఁగఁ దా నుచితంబె?' నావుడున్
మందమనోజ్ఞహాసముఖమండల మెత్తి మృగాక్షి చూచి సం
క్రందనసన్నిభున్ నృపతిఁ గన్యక యి ట్లని పల్కెఁ బ్రీతితోన్. 173

**ప్రతిపదార్థం:** సుందరి= అందమైనదానా! ఎందుల, దానవు= ఎక్కడిదానవు?; ఏకతము+అ= ఒంటరిగా; ఈ+యమునానదిన్= ఈ యమునానదిలో; ఓడ, నడ్పుచున్, నీకున్, ఉన్కి= పడవ నడుపుతూ నీవు ఉండటం; ఇది, చూడఁగన్, తాన్, ఉచితంబు+ఎ= చూడటానికి ఇది యోగ్యంగా లేదు; నావుడున్= అనగా విని; కన్యక= ఆ కన్య; మంద, మనోజ్ఞ, హాస, ముఖ, మండలము+ఎత్తి= అంద మైన చిరునవ్వు గల గుండ్రనిముఖాన్ని పైకెత్తి; మృగ+అక్షి= లేడికన్నులవంటి కన్నులుగల ఆమె; సంక్రందన, సన్నిభున్, నృపతిన్= ఇంద్రుడిని పోలిన ఆ రాజును; చూచి; ప్రీతితోన్= సంతోషంతో; ఇట్లు+అని, పల్కెన్.

**తాత్పర్యం:** 'అందమైనదానా! నీ వెక్కడిదానవు? ఒంటరిగా ఈ యమునానదిలో పడవనడుపుకొంటూ నీవు ఈ విధంగా ఉండటం చూడటానికి ఉచితంగా ఉన్నదా? (లేదు)' అని రాజుఅనగా విని ఆ కన్య చిరునవ్వుతో అందమైన

గుండ్రని ముఖం పైకెత్తి లేడికన్నుల వంటి కన్నులతో ఇంద్రుడిని పోలిన ఆ రాజును చూచి సంతోషంతో ఈ విధంగా అన్నది.

**విశేషం:** అలం: ఉపమ. నన్నయగారి అక్షరరమ్యతకు చక్కని ఉదాహరణ ఈపద్యరచన.ఈ పద్యపు ఎత్తుగడ తరువాతికవులకు ఎందరికో ఆయాసందర్భాలలో స్ఫూర్తి నిచ్చింది. పద్యపూర్వార్ధంలో వాచికాభినయం, ఉత్తరార్ధంలో ఆంగికాభినయం వర్ణించి నాయకుడి అభిలాషను, నాయిక ఆభిముఖ్యాన్నీ నాటకీయతతో ధ్వనింపజేసి, రసధ్వనికి వస్తుధ్వనిని పోషకంగా నిలిపిన మాధుర్యగుణవిశిష్ట మైన రచన యిది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **'ఏను దాశరాజుకూఁతురఁ; దండ్రి నియోగంబున నిక్కార్యంబు ధర్మార్థంబు సేయుచుందు' ననిన దాని యభినవ రూపసౌందర్యంబులు దొల్లియు విని యెఱింగినవాఁ డై యక్కోమలిం గామించి దాశరాజుకడకుం జని తనయభిప్రాయం బెఱింగించిన, నతండును సంతసిల్లి శంతను నత్యంతభక్తిం బూజించి యి ట్లనియె.174**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** 'నేను దాశరాజుకూతురిని; తండ్రిగారి ఆజ్ఞచేత ఈపనిని ధర్మంకోసం చేస్తుంటాను' అనిఅనగా దాని క్రొంగ్రొత్త రూప సౌందర్యాలను ఇదివరకే విని తెలిసికొన్నవాడు కావటంచేత, ఆ లలితాంగిపై కోర్కెపడి దాశరాజు వద్దకు వెళ్ళి తనఅభిప్రాయాన్ని తెలిపాడు. దాశరాజు సంతోషించి శంతనుడిని మిక్కిలిభక్తితో పూజించి ఈ విధంగా అన్నాడు.

**తే.** **పుట్టినప్పుడ కన్యకఁ బోలునట్టి । వరుస కిచ్చుట యిది లోకవర్తనంబు;**
**వసుమతీనాథ! నీయట్టి వరున కిచ్చి । ధన్యులము గామె యిక్కన్యఁ దద్ద పేర్మి. 175**

**ప్రతిపదార్థం:** పుట్టి, నప్పుడు+అ= పుట్టినప్పుడే; కన్యకన్, పోలునట్టి, వరునకున్+ఇచ్చుట= కన్యకను అనువైన వరునకు ఇవ్వటం; ఇది= అనేది; లోకవర్తనంబు= లోకమర్యాద; వసుమతీ, నాథ!= భూపతీ; నీ+అట్టి, వరునకున్= నీవంటి(యోగ్యుడైన) వరునకు; ఈ+కన్యన్= ఈకన్యను(యోజనగంధిని); తద్ద, పేర్మిన్= మిక్కిలి అనురక్తితో; ఇచ్చి; ధన్యులము, కామె= కృతార్థులం కామా! (ఔతా మని భావం).

**తాత్పర్యం:** పుట్టినప్పుడే కన్యను తగిన వరున కివ్వటం అనేది లోకమర్యాద. (పుట్టినప్పుడే ఆడపిల్లను ఒక అయ్యచేతిలో పెట్టాలి. అత డెక్కడో పుట్టే ఉంటా డని భావించటం లోక పరిపాటి). రాజా! ఈకన్యను మిక్కిలి మక్కువతో నీవంటి ఉత్తము డైన వరున కిచ్చి కృతార్థులం కామా?

**వ.** **'అయినను నా డెందంబునం గలదానిం జెప్పెద; నిక్కన్యక నీకు ధర్మపత్నిగాఁ జేయునట్టి యిష్టంబు గలదేని నావేఁడిన దాని ని'మ్మనిన శంతనుండు 'దాని నీనగునేని యిచ్చెదఁ; గానినాఁడీనేర; నది యేమి సెప్పు' మనిన దాశరా జి ట్లనియె. 176**

**ప్రతిపదార్థం:** స్పష్టం.

**తాత్పర్యం:** 'అయినప్పటికీ, నామనస్సులో ఉన్నదానిని చెప్తుతాను. ఈకన్యకను భార్యగా చేసికొనే కోరిక నీకు ఉంటే నేను కోరినదానిని ఇ' మ్మనగా శంతనుడు 'అది ఇవ్వదగిందైతే ఇస్తాను; కాకపోతే ఈయలేను. అది ఏమిటో తెలియచెప్పుము' అనగా దాశరాజు ఈ విధంగా అన్నాడు.

**మధ్యాక్కర.**

**'భూపాల! నీకు నిక్కోమలివలనఁ బుట్టిన సుతుఁడు**
**నీ పరోక్షంబున రాజు గావలె; నెమ్మి ని ట్లీఁగ**
**నోపుదే?' యనిన శంతనుఁడు గాంగేయు యువరాజుఁ దలఁచి**
**'యీపల్కు దక్కఁగ నొండు వేఁడుమ యిచ్చెద' ననిన. 177**

**ప్రతిపదార్థం:** భూపాల!= రాజా!; నీకున్; ఈ, కోమలివలనన్, పుట్టిన, సుతుఁడు= ఈ సుకుమారివలన కలిగిన కొడుకు; నీ, పరోక్షంబునన్, రాజు, కావలెన్= నీ తరువాత రాజు కావాలి; నెమ్మిన్= ప్రీతితో; ఇట్లు+ఈఁగన్, ఓపుదు+ఏ, అనినన్= ఈవిధంగా మాట ఇవ్వగలవా అని అనగా; శంతనుండు; గాంగేయున్, యువరాజున్, తలఁచి= యువరాజైన గాంగేయుడిని మనసులో జ్ఞాపకంచేసికొని; ఈపల్కు, తక్కఁగన్, ఒండు, వేఁడుము+ఇచ్చెదన్, అనినన్= ఈమాటతప్ప ఏదైనా వేరొకటి వేడుకో ఇస్తాను అనగా.

**తాత్పర్యం:** 'రాజా! నీకు ఈ సుకుమారివలన పుట్టిన కొడుకు నీ అనంతరం రాజ్యానికి రాజు అయ్యేటట్లు ప్రీతిగా మాట ఇవ్వగలవా?' అని అడుగగా శంతనుడు యువరాజయిన గాంగేయుడిని భావించి, 'ఈమాట తప్ప వేరే ఏమైనను వేడుకో ఇస్తాను' అని అనగా. (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** మధ్యాక్కర ప్రతిచరణంలో వరుసగా 2 ఇంద్రగణాలు, 1 సూర్యగణం, 2 ఇంద్రగణాలు, 1 సూర్యగణం ఉంటాయి. నన్నయ 5వ గణంలోని మొదటి అక్షరాన్ని యతిగా పాటించాడు. ప్రాసనియమం ఉంది.

### గాంగేయుఁడు బ్రహ్మచర్యవ్రతంబుఁ బూని భీష్ముం డగుట (సం. 1-94-54.)

**వ. 'నా కొండెద్దియు నిష్టంబు లే' దనిన విని, యద్దాశరాజుచేతం బ్రతిహత మనోరథుం డయి, క్రమ్మఱి నిజపురంబునకు వచ్చి, శంతనుండు చింతాక్రాంతుం డయి సత్యవతిన తలంచుచు, నివృత్తకార్యాంతరుం డయియున్న; నొక్కనాఁడు గాంగేయుండు తండ్రిపాలికి వచ్చి యి ట్లనియె. 178**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** 'నాకు మరేదియు ఇష్టం లే' దనగా విని, ఆ దాశరాజుచేత నిరాకరింపబడిన కోరికకలవాడై, తిరిగి తన పట్టణానికి వచ్చి, శంతనుడు విచారంచేత ఆవరింపబడినవాడై సత్యవతినే తలుస్తూ రాజకార్యాలనుండి దూరమై ఉండగా, ఒకనాడు గాంగేయుడు తండ్రిచెంతకు వచ్చి ఈ విధంగా అన్నాడు.

**చ. భవదభిరక్షితక్షితికి బాధ యొనర్పఁగ నోపునట్టి శా**
**త్రవనివహంబు లేదు; వసుధాప్రజకెల్ల ననంతసంతతో**
**త్సవముల; రాజులెల్ల ననిశంబు విధేయుల నీకు; నిట్లు మా**
**నవవృషభేంద్ర! యేలొకొ మనఃపరితాపముఁ బొందియుండఁగన్. 179**

**ప్రతిపదార్థం:** మానవ, వృషభ+ఇంద్ర= మానవులలో శ్రేష్ఠుడైనవాడా!; భవత్, అభిరక్షిత, క్షితికిన్= నీచేత లెస్సగా రక్షింపబడిన ఈ రాజ్యానికి(భూమికి); బాధ, ఒనర్పఁగన్, ఓపునట్టి, శాత్రవ, నివహంబు, లేదు=ఇబ్బంది కలిగించ గలిగిన శత్రుసమూహంలేదు; వసుధా, ప్రజకున్+ఎల్లన్= భూమిపైని జనులందరికిని; అనంత, సంతత+ఉత్సవములు+అ= అపారంగా ఎల్లప్పుడూ సంతోషాలే; నీకున్; అనిశంబున్= ఎల్లప్పుడు; రాజులు+ఎల్లన్= రాజులందరు; విధేయులు+అ= లొంగిఉన్నవారే; ఇట్లు= ఈవిధంగా; మనస్+ పరితాపమున్= మనోవేదనను; పొంది+ఉండఁగన్= కలిగిఉండటం; ఏల+ఒకొ= ఎందుకో కదా!

**తాత్పర్యం:** మానవులలో శ్రేష్ఠుడైనవాడా! నీచేత లెస్సగా రక్షింపబడిన ఈ రాజ్యానికి సమస్య తెచ్చిపెట్టగల శత్రువుల సమూహం లేదు; దేశంలోని ప్రజల కందరికి అపారంగా ఎల్లప్పుడు శుభాలే కలుగుతున్నాయి; రాజులందరు ఎప్పుడూ నీకు లొంగిఉన్నారు, మఱి - ఈవిధంగా మనోవేదన పొంది ఉండటానికి కారణ మేమిటో?

**విశేషం:** శంతనుడి మనోవ్యథకు కారణం తెలియక, ఆయననే అడిగి తెలిసికొందామని గాంగేయుడు రెండు ప్రశ్న లడిగాడు. ఆ రెండూ రాజ్యరక్షణకు సంబంధించినవే. శంతనుడికి అంతఃపుర సమస్యలు లేవు కాబట్టి గాంగేయు డాదిశలో ఆలోచించలేదు. రాజ్యరక్షణ విషయాలలోకూడా బయటి శత్రువులు, అంతశ్శత్రువులు అనే అంశాలకే ప్రాధాన్య మిచ్చాడు. రాజ్యాన్ని ఆక్రమించే శత్రుకూటాలు పేరుకుకూడా లేవు; సామంతరాజు లందరూ ప్రజలు సుఖంగా ఉండటంచేత అణగిమణిగియే ఉన్నారు. ఇక చింతకు కారణమేమిటని ప్రశ్న. శంతనుడి మనోవ్యథ బైటివారి కెవ్వరికీ చెప్పుకొనలేని సున్నితమైనదని నన్నయ ఈ పరామర్శద్వారా వివక్షితవాచ్యధ్వనిగా నిబంధించాడు.

**వ. అనిన విని పెద్దయుంబ్రొద్దు చింతించి శంతనుండు గొడుకున కి ట్లనియె. 180**

**ప్రతిపదార్థం:** సుస్పష్టం.

**తాత్పర్యం:** అనగా విని చాలసేపు ఆలోచించి శంతనుడు కొడుకుతో ఈవిధంగా అన్నాడు.

**విశేషం:** మనసులోని మాట చెప్పుకోలేక ఎంతోకాలం చింతించాడు శంతనుడు. గాంగేయు డడిగిన తరువాత ఎట్లా చెప్పవలెనా అని కొంతకాలం చింతించాడనటంవలన కథలో ఉత్కంఠ పెరుగుతుంది. శంతనుడు చెప్పే మాటలపై అవధానం కలుగుతుంది. కథాకవితలో ఇటువంటి రచన శిల్పసుందరం.

**క. వినవయ్య! యేకపుత్త్రుఁడు । ననపత్యుఁడు నొక్కరూప యని ధర్మువులన్**
**విని, నీకుఁ దోడు పుత్త్రుల । ననఘా! పడయంగ నిష్టమయినది నాకున్. 181**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; వినవయ్య= వినుము; ధర్మువులన్= ధర్మశాస్త్రాలలో; ఏక, పుత్త్రుఁడు= ఒకేఒకకొడుకు కలవాడు; అనపత్యుఁడు= సంతానం లేనివాడు; ఒక్క, రూపు+అ= ఒక్కటే, సమానమే; అని; విని; నాకున్; నీకున్, తోడు=నీకు సహాయంగా ఉండే; పుత్త్రులన్, పడయంగన్, ఇష్టము+అయినది= కొడుకులను పొందటానికి కోరిక కలిగింది.

**తాత్పర్యం:** ఓపుణ్యాత్ముఁడా! వినుము. ఒకే ఒక కొడుకు కలవాడు, సంతానం లేనివాడు - వీరిద్దరూ సమానులే అని ధర్మశాస్త్రాలలో విని, నీకు తోడుగా మరికొందరు కొడుకులను పొందా లని నాకు కోరిక కలిగింది.

**విశేషం:** శంతనుడు తన అభిప్రాయాన్ని సుసంగతంగా ప్రతిపాదిస్తున్నాడు. తర్కంలో 'నా ఽసంగతం ప్రయుంజీత' అని ఉన్నది. అసంగతాన్ని ప్రయోగించకూడదు కాబట్టి శంతనుడు అసంగతం కాని వాక్యం మాటాడినట్లు నన్నయ చిత్రించాడు. మాటాడే మాటల్లో పూర్వోత్తర సంబంధం ఉండటం సంగతి అంటారు. అది ప్రసంగం, ఉపోద్ఘాతం, హేతుత్వం, అవసరం, కార్యైక్యం, కారణైక్యం అని ఆరువిధాలు. వాటిని నిపుణంగా ప్రయోగించి నన్నయ రుచిరార్థసూక్తినైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నాడు. 'వివాహ మౌతాను' (184) అని ఫలితాంశంగా చెప్పదలచుకొని దానిని ఎదుటివారు తర్కసహంగా అంగీకరించేట్లు ప్రసంగం చేశాడు. దాని మొదలే ఈ పద్యం. లోకంలో ఏకపుత్రుడూ, అనపత్యుడూ ఒకటే నని ధర్మశాస్త్రాలంటాయని శాస్త్రప్రమాణంతో ప్రసంగం మొదలు పెట్టి, భీష్ముడికి తోడుగా మరికొంతమంది కొడుకులను పొందాలని ఉన్నదని ఉపోద్ఘాతం ప్రారంభించాడు. 'పుత్రులకొరకు పెళ్ళి' అనే తర్కంతో మొదలుపెట్టటం శంతనుడి లోకజ్ఞత.

**క.** **జనవినుత! యగ్నిహోత్రం । బును సంతానమును వేదములు నెడతెగఁగాఁ**
**జన దుత్తమవంశజులకు । ననిరి మహాధర్మనిపుణు లైన మునీంద్రుల్.** **182**

**ప్రతిపదార్థం:** జనవినుత= ప్రజలచేత కీర్తింపబడువాడా!; మహత్+ధర్మ, నిపుణులు+ఐన, ముని+ఇంద్రుల్= గొప్పధర్మశాస్త్ర నిర్ణయాలలో నిపుణులైన ఋషిశ్రేష్ఠులు; ఉత్తమ, వంశజులకున్= శ్రేష్ఠమైన వంశాలలో పుట్టినవారికి; అగ్నిహోత్రంబును= నిత్యకర్మాధికారాన్ని ఇచ్చే అగ్నికార్యం చేసికొనటానికి రక్షించుకొనే అగ్నిహోత్రమున్నూ; సంతానమును= వంశం విచ్ఛిన్నం కాకుండా రక్షించే సంతానమున్నూ; వేదములున్= జీవనవిధానానికి త్రోవచూపించే ఇహపరసాధనాలైన వేదాలున్నూ; ఎడతెగన్, కాన్= విడివడేటట్లు; చనదు= చేయకూడదు; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** ప్రజలచేత ప్రశంసింపబడే ఓ గాంగేయా! ఉత్తమధర్మ శాస్త్రనిర్ణయాలలో నిపుణులైన ఋషివరులు 'ఉత్తమవంశాలలో పుట్టినవారు అగ్నిహోత్రాన్నీ, సంతానాన్నీ, వేదాలనూ తమ గృహాలలో విచ్ఛిన్న మయ్యేటట్లు చేసికొనరా' దని అన్నారు.

**విశేషం:** ఈ పద్యంలో శంతనుడు తన కోర్కెను ధర్మవేత్తలైనవారి (ఆప్త) ప్రమాణంతో హేతుబద్ధం చేస్తున్నాడు. అంటే హేతుత్వమనే సంగతిని కల్పిస్తున్నా డన్నమాట. ఎడతెగకుండా అగ్నిని, సంతానాన్ని, వేదాలను రక్షించుకొనాలని వారన్నారని పేర్కొన్నాడు. గాంగేయు డున్నాడు కదా! మరి సంతానం ఎడతెగిపోవటం ఎలా కలుగుతుంది? అనే ఆకాంక్ష దానివలన కలుగుతుంది. (పూర్వం గంగవలన ఏడుగురు కొడుకులను పొందికూడా వారిని గంగపాలు చేసికొన్న స్మృతి ఇక్కడ వస్తుగత ధ్వనిగా గమ్యమానం).

**క.** **నీవస్త్ర శస్త్ర విద్యా । కోవిదుఁడవు; రణములందుఁ గ్రూరుఁడ; వరివి**
**ద్రావణ సాహసికుండవు । గావున నీయునికి నమ్మఁగా నేర నెదన్.** **183**

**ప్రతిపదార్థం:** నీవు= (గాంగేయుడు); అస్త్ర, శస్త్ర, విద్యా, కోవిదుఁడవు= మంత్రసహిత, మంత్రరహిత బాణాలను ప్రయోగించే విద్యలో పండితుడవు; రణములందున్= యుద్ధాలలో; క్రూరుఁడవు= దయాదాక్షిణ్యాలు లేని కరకువాడివి; అరి, విద్రావణ, సాహసికుండవు= శత్రువులను అణచటంలో వెనుకముందు చూడని తెగువరివి; కావునన్= కాబట్టి; నీ+ఉనికిన్= నీవు ఉండటాన్ని (బ్రతికి ఉండటాన్ని); ఎదన్= మనస్సులో; నమ్మఁగాన్, నేరను= నమ్మజాలను.

**తాత్పర్యం:** నీవు అస్త్రశస్త్రవిద్యలో పండితుడవు; యుద్ధాలలో దయాదాక్షిణ్యాలు లేని కరకువాడివి; శత్రువులను సంహరించటంలో వెనుకముం దాలోచించని సాహసికుడవు. (ఈమూడు గుణాలూ ఎప్పుడో ఒకప్పుడు నీకు ప్రమాదాన్ని తెచ్చిపెట్టేవే) కాబట్టి నీవు దీర్ఘకాలం బ్రతుకుతా వని నేను మనసులో నమ్మలేకపోతున్నాను.

**విశేషం:** గాంగేయు డుండగాకూడా బహుపుత్రులకొరకు ప్రయత్నం చేయవలసిన 'అవసరం' అనే సంగతి ఇందులో ప్రస్తావించబడింది. గాంగేయుడు అస్త్రశస్త్రవిద్యలలో ఎంతటి నిపుణుడో, రణరంగంలో అంతటి క్రూరుడు. శత్రువులను వెనుకముందు చూడకుండా చంపే సాహసానికి ఒడిగట్టేవాడు; అందువలన అతడికి మృత్యువు ఎప్పుడైనా ఏర్పడవచ్చును అని బహుపుత్రకాంక్షకు గల అవసరాన్ని చెప్పాడు. గాంగేయుడు దీర్ఘకాలం జీవిస్తాడని గంగ ఇదివరలో సూచించింది. కాని, అది ఇప్పటి అవసరానికి అనువైనది కాదు. అందువలన దానిని కప్పిఉంచాడు. దీనికి ఫలితంగా తరువాత శంతనుడు భీష్మునికి స్వేచ్ఛా మరణాన్ని వరంగా ప్రసాదించి దీర్ఘాయువుగా దీవించాడు.

**వ.** **'బహుపుత్త్రార్థంబు యత్నంబు సేయవలయు; వివాహం బయ్యెద' ననిన విని గాంగేయుండు వృద్ధామాత్యపురోహితసుహృజ్జనంబులతోవిచారించి, యోజనగంధి రాజు చిత్తంబునం గలుగుట యెఱింగి, యనేక రాజన్యసమన్వితుం డయి దాశరాజుకడకుం జని' మారాజునకు సత్యవతిని దేవింగా నిచ్చునది' యని యడిగిన; నాతండును దేవవ్రతుం బూజించి, 'నీవు ధర్మశీలుండ, వర్థానర్థవిదుండవు, సకలకార్య సమర్థుండవు. గుర్వర్థంబు కన్యార్థివై వచ్చితివి కావునం గృతార్థుండ నైతి; నెవ్వనియేని వీర్యంబున నిక్కన్య యుద్భవిల్లె నట్టి యుపరిచరుం డను రాజర్షి 'యీ సత్యవతి నొరుల కీవలవదు; శంతనునక యిచ్చునది' యనుటంజేసి తొల్లి యసితుం డయిన దేవలుండు కన్యార్థి యయి వచ్చి ప్రత్యాఖ్యాతుం డయ్యె; నిట్టి సంబంధ మెవ్వరికిఁ బడయనగు?'** **184**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** 'అనేక పుత్రులకొరకు ప్రయత్నం చేయాలి. వివాహం చేసికొంటాను' అని శంతనుడు అనగా గాంగేయుడు పెద్దలు, మంత్రులు, పురోహితులు, మిత్రులు మొదలైనవారితో ఆలోచించి రాజుమనసులో యోజనగంధి ఉన్నదని తెలిసికొని అనేక సామంతరాజులతో కలిసి దాశరాజువద్దకు వెళ్ళి 'మారాజుకు సత్యవతిని రాణిగా ఇ' మ్మని అడిగాడు. దాశరాజు దేవవ్రతుడిని గౌరవించి 'నీవు ధర్మాన్ని ఆచరించే స్వభావం కలవాడవు. ఉచితానుచితాలు (లాభనష్టాలను గురించి) తెలిసినవాడవు; అన్ని కార్యాలనూ నిర్వహింపగలవాడవు; తండ్రికొరకు కన్యను కోరటానికి వచ్చావు కాబట్టి నేను ధన్యుడనైనాను. ఈకన్య ఎవరివీర్యంవలన పుట్టిందో ఆ రాజర్షి ఉపరిచరుడు ఈ సత్యవతిని ఇతరుల కెవ్వరికీ ఈయవద్దనీ, శంతనునకు ఇమ్మనీ అన్నాడు. కాబట్టే, పూర్వం అసితవంశానికి చెందిన దేవలుడు కన్యను కోరి వచ్చి నాచే తిరస్కరింపబడ్డాడు. ఇటువంటి ఈసంబంధాన్ని ఎవరు పొందగలరు?'

**విశేషం:** 'బహుపుత్త్రార్థంబు యత్నంబు సేయవలయు' అనే వాక్యంవలన పైన చెప్పబడిన వాక్యార్థరూపకార్యాలకన్నింటికీ ఐక్యరూపమైన తాత్పర్యం ప్రతిపాదింపబడింది. ఇదే కార్యైక్యం. ఇక నిశ్చితాంశం- 'వివాహంబయ్యెద' అనే నిర్ణయం. ఇది సర్వకారణాలకూ కార్యరూపమైన ఫలితాంశం, ప్రతిపాద్యాంశం. తర్కబద్ధమైన, సంగత మైన వాదనైపుణ్యంతో శంతనుడు ప్రసంగం చేయటం నన్నయగారి నానారుచిరార్థసూక్తి వైభవానికి నిదర్శనం. శంతను డెంత తర్కబద్ధంగా తన నిశ్చయాన్ని

చెప్పినా, ఎవరితో వివాహం కావాలని కోరుకొంటున్నాడో గాంగేయుడికి చెప్పలేదు. అది ఉచితంకూడా. గాంగేయుడు మంత్రుల మంతనాలలో దానిని తెలిసికొన గలిగాడు. గాంగేయుడికి వ్యంగ్యమైనది పఠితకు వాచ్యమే. అందువలన దానిని సూచించి వదలి ఔచిత్యాన్ని పాటించాడు నన్నయ.

శంతనుడి వాదనలో ఎంతటి 'సంగతి' ఉన్నదో దాశరాజువాక్యంలోకూడా అంతటి 'సంగతి' నిపాటించి రచనాశిల్పంలో సరితూకాన్ని నన్నయ పాటించాడు. 'మారాజుకు సత్యవతిని దేవిగా ఇవ్వండి' అని గాంగేయుడు అడగటం ప్రసంగం. దాశరాజు గాంగేయుడిని ప్రశంసించటం, సత్యవతిని శంతనుడికి తప్ప మరొకరికి ఇచ్చే అవకాశం లేకపోవటం, ఇదివరకే దేవలుడు ఆమెను కోరగా నిరాకరించటం మొదలైన బిగువైన అంశాలతో ఉపోద్ఘాతం దాశరాజు ఇచ్చాడు. అతడి మాటలనుబట్టి సత్యవతి శంతనుడికొరకే పుట్టినట్లు స్పష్టమయింది. దానివలన హేతుత్వంకూడా సిద్ధించింది.

**క. విను మైనను సాపత్న్యం । బను దోషము కలదు దీన; నదియును నీచే**
**తన సంపాద్యము; నీ వలి । గిన నడ్డమె పురహరాజకేశవు లయినన్. 185**

**ప్రతిపదార్థం:** ఐనను= అయినప్పటికిని; వినుము; దీనన్= శంతనునకు యోజనగంధి నిచ్చి వివాహం చేయటంవలన; సాపత్న్యంబు+అను, దోషము= సవతి(రెండవభార్య)కి పుట్టారు అనే దోషం(ఆమె బిడ్డలకు); కలదు= ఉండగలదు; అదియును= అందులోను; నీచేతన్+అ= నీవలననే(నీవు శంతనునకు మొదటిభార్యవలన పుట్టిఉండటంవలన); సంపాద్యము= కలిగేది; నీవు+అలిగినన్= నీవు కోపిస్తే; పుర, హర, అజ, కేశవులు+అయినన్= త్రిపురసంహారకు డైన శివుడు, బ్రహ్మ, విష్ణువు అయినను; అడ్డమె?= ఎదురునిలువగలరా? (నిలువలేరని భావం).

**తాత్పర్యం:** అయినా నేను చెప్పేది వినుము - 'శంతనుడికి యోజనగంధి నీయటంవలన, సవతిసంతాన మనే దోషం ఆమె బిడ్డలకు ఏర్పడుతుంది. అందులోనూ అది నీవలననే ఏర్పడుతుంది. కాగా, నీవు కోపిస్తే త్రిమూర్తులుకూడ నీయెదుట నిలువగలరా? (నిలువలే రని భావం).

**విశేషం:** పెద్దరాణి కుమారు డుండగా తరువాతి రాణుల కొడుకులకు రాజ్యాధికారం ఉండదు. కాబట్టి సాపత్న్యమనే దోషం ఏర్పడింది. ఆ దోష నివారణోపాయాన్ని రాబోయే వచనంలో కోరాడు. అంటే 'అవసరం' అనే సంగతిని ప్రయోగించాడన్నమాట. 'నీ చేతన సంపాద్యము' అనే పాఠాంతరం 'నీ చేతన పరిహార్యము' అనే పాఠం కంటె ఉత్తమం. అందువలన ఇది గ్రాహ్యం.

**వ. 'ఆ దోషం బెట్లు పరిహృతంబగు నట్లుగా నీచిత్తంబునం దలంచి వివాహంబు సేయు' మనిన గాంగేయుం డి ట్లనియె. 186**

**ప్రతిపదార్థం:** విస్పష్టం.

**తాత్పర్యం:** 'ఆ దోషం ఏవిధంగా తొలగింపబడుతుందో ఆవిధంగా నీమనస్సులో భావించి(నిర్ణయించుకొని) వివాహం జరుపు' మని అనగా గాంగేయుడు ఈ విధంగా పలికాడు.

**విశేషం:** అవసరమనే సంగతి బలంగా ప్రతిపాదింపబడింది. గాంగేయు డుండగా సత్యవతి సంతానానికి రాజ్యాధికారం రాదు. ఈ కార్యవైరుధ్యానికి ఐక్యత కూర్చవలసినవాడు గాంగేయుడే. అందువలన అతడు ప్రతిజ్ఞ చేయబోతున్నాడు రాబోయే పద్యంలో.

**చ. వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతు లిందఱు నే గురుప్రయో**
**జనమునఁ జేసితిన్ సమయసంస్థితి; యీలలితాంగి కుద్భవిం**
**చిన తనయుండ రాజ్యమును జేయఁగ నర్హుఁడు; వాఁడ మాకు నె**
**ల్లను బతి; వాఁడ కౌరవకులస్థితికారుఁ డుదారసంపదన్. 187**

**ప్రతిపదార్థం:** ప్రసిద్ధులు+ఐన, పృథివీపతులు+ఇందఱున్= ప్రఖ్యాతులైన రాజులు ఇంతమంది; వినుఁడు= వినండి; ఏన్= నేను; గురుప్రయోజనమునన్= తండ్రియొక్క కార్యాన్ని ఉద్దేశించి; సమయ, సంస్థితి= ప్రతిజ్ఞయొక్క వ్యవస్థ (కలకాలం చక్కగా నిలిచే ప్రతిజ్ఞ)ను; చేసితిన్= చేశాను; ఈ, లలిత+అంగికిన్= కోమలమైన మేనుగల ఈవనితకు; ఉద్భవించిన= పుట్టిన; తనయుండు+అ= కొడుకే; రాజ్యమును, చేయఁగన్+అర్హుఁడు= రాజ్యం చేయటానికి హక్కుకలవాడు(యోగ్యుడు); వాఁడు+అ= అతడుమాత్రమే; మాకున్+ఎల్లను, పతి= మాకందరికి ప్రభువు; వాఁడు+అ= అతడే; ఉదార, సంపదన్= గొప్పదైన వైభవంతో; కౌరవ, కుల, స్థితి, కారుఁడు= కౌరవవంశంయొక్క అస్తిత్వానికి హేతువు (అంటే అతని సంతానమే భావికాలంలో కౌరవవంశం చక్రవర్తిత్వానికి అర్హత పొంది ఉంటుందని భావం)

**తాత్పర్యం:** ఇచ్చట సమావేశమైయున్న ప్రసిద్ధప్రభువు లందరూ వినండి. నేను తండ్రిగారి ప్రయోజనం కొరకు స్థిరమైన ఒక ప్రతిజ్ఞ చేశాను. అదేమంటే - ఈమెకు పుట్టినకొడుకే రాజ్యం చేయటానికి హక్కుగలవా డౌతాడు; అతడే మాకందరికి ప్రభువుగా పరిగణింపబడతాడు; అతడే గొప్ప దైన సంపత్తితో కౌరవవంశాన్ని నిలిపేవాడు ఔతాడు.

**విశేషం:** శంతనుడికి సత్యవతివలన పుట్టిన పుత్రుడే అతడి తరువాత సింహాసనార్హు డౌతాడని రాజుల ఎదుట గాంగేయుడు ప్రతిజ్ఞ చేయటంతో సాపత్న్యదోషం తొలగి కార్యం (సత్యవతిని శంతనుడి కిచ్చి వివాహం చేయటం) లో ఐక్యత ఏర్పడింది. అంటే కార్యనిర్వహణానికి మార్గం ఏర్పడిందని భావం. ఇది కార్యైక్యమనే సంగతి.

**వ. అని సభాసదులకెల్ల రోమహర్షణంబుగా సత్యవ్రతుండయిన దేవవ్రతుండు పలికిన వెండియు దాశరా జిట్లనియె. 188**

**ప్రతిపదార్థం:** సభాసదులు= సభలో ఉన్నవారు; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అని సభలో ఉన్న ధర్మజ్ఞులందరు గగుర్పాటు పొందేటట్లుగా సత్యమే జీవితదీక్షగా గల దేవవ్రతుడు పలుకగా దాశరాజు ఇంకను ఈ విధంగా అన్నాడు.

**క. 'నీ వఖిల ధర్మవిదుఁడవు । గావున నీ కిట్ల చేయఁగా దొరకొనియెన్;**
**భావిభవత్సుతు లిట్టిరె? । నీవిహితస్థితియు సలుపనేర్తురె?' యనినన్. 189**

**ప్రతిపదార్థం:** నీవు; అఖిల, ధర్మ, విదుఁడవు= సమస్తధర్మాలను తెలిసినవాడవు; కావునన్= కాబట్టి; నీకున్; ఇట్లు+అ, చేయఁగాన్, దొరకొనియెన్= ఈవిధంగా చేయటానికి చెల్లింది(సిద్ధించింది); భావి, భవత్, సుతులు= ముందుకాలంలోని నీ కొడుకులు; ఇట్టిరె= ఇటువంటివారే ఔతారా?; నీ, విహిత, స్థితియున్= నీచేత విధింపబడిన కట్టడిని; సలుపనేర్తురు+ఎ= అమలుచేయగలరా? (లేరని భావం); అనినన్= అని అనగా.

**తాత్పర్యం:** నీవు సమస్తధర్మాలను తెలిసినవాడవు కాబట్టి నీ కీవిధంగా చేయటం చెల్లింది. కాని, ముందుకాలంలో నీ కొడుకులు ఇటువంటివారే కాగలరా? నీవు విధించిన ఈ నియమాన్ని వారు పాటించగలరా? - అని అనగా.

**క. ధృతిఁ బూని బ్రహ్మచర్య । వ్రత మున్నతిఁ దాల్చితిని ధ్రువంబుగ; ననప**
**త్యత యైనను లోకము లా । యతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యము లై. 190**

**ప్రతిపదార్థం:** ధృతిన్= స్థిరంగా; పూని= పూనుకొని; బ్రహ్మచర్యవ్రతము= వివాహ మాడకుండ బ్రహ్మచారిగనే జీవితాంతంవరకు ఉండే దీక్షను; ఉన్నతిన్= ఉదాత్తంగా; ధ్రువంబుగన్= నిశ్చితంగా; తాల్చితిని= ధరించాను; అనపత్యత, ఐనను= సంతానంలేని (భావం)స్థితి నాకు కలిగినప్పటికి; నాకున్; ఆయతిన్= రాబోయే కాలంలో; లోకములు, పెక్కులు= అనేకలోకాలు; అనుభావ్యములు+ఐ= అనుభవింపదగినవై; కలవు= ఉన్నవి.

**తాత్పర్యం:** స్థిర మైన బుద్ధితో పూనుకొని బ్రహ్మచర్యవ్రతాన్ని నిశ్చితంగా సమున్నతంగా స్వీకరించాను. దానివలన సంతానంలేని స్థితి నాకు కలిగినప్పటికీ, రాబోయేకాలంలో అనేకలోకాలు నాకు అనుభవింపదగినవై ఉన్నవి.

**విశేషం:** ఇక్కడ కారణైక్య మనే సంగతి సిద్ధించింది. దాశరాజు పెట్టిన నియమానికి మూలకారణాలు మూడు. గాంగేయుడి అడ్డు ఉండకూడదు; గాంగేయుడి సంతతివలన కలిగే ఇబ్బందులు ఉండకూడదు. చిన్నరాణి సంతాన మైనా సత్యవతి కొడుకులకే రాజ్యం కావాలి. ఈ కారణాలన్నీ భీష్ముడి బ్రహ్మచర్యదీక్షతో సమగ్రంగా ఐక్యతను పొందాయి. సుసంగత వాక్యవిన్యాసం నన్నయగారి రుచిరార్థసూక్తికి రమణీయ వైభవం.

**వ. అని యిట్లు సత్యవతిని దనతండ్రికి వివాహంబు సేయుపొంటె నిజరాజ్యపరిత్యాగంబును బ్రహ్మచర్య వ్రత పరిగ్రహణంబును జేసిన దేవవ్రతు సత్యవ్రతంబునకు గురుకార్యధురంధరత్వంబునకు మెచ్చి దేవర్షి గణంబు లాతనిపయిం బుష్పవృష్టిఁ గురిసి భీష్ముం డని పొగడిరి. దాశరాజును గరంబు సంతసిల్లి శంతనునకు సత్యవతి నిచ్చె నంత. 191**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అని ఈవిధంగా సత్యవతిని తనతండ్రి అయిన శంతనున కిచ్చి పెండ్లిచేయటంకొరకు తనకువారసత్వంగా వచ్చే రాజ్యాన్ని వదలి పెట్టటమూ, బ్రహ్మచర్యవ్రతాన్ని స్వీకరించటమూ చేసిన దేవవ్రతుడి యొక్క సత్యనిష్ఠనూ, తండ్రికార్యాన్ని నిర్వహించటంలో ప్రదర్శించిన నేర్పరితనాన్నీ మెచ్చుకొని దేవతలూ, ఋషిసమూహాలు ఆతనిమీద పూలవాన కురిపించి 'భీష్ముడు' అని ప్రశంసించారు. దాశరాజుకూడ మిక్కిలి సంతోషించి శంతనుడికి సత్యవతిని ఇచ్చాడు. ఆ తరువాత- (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ. ఇనతేజుం డతిభక్తిఁ గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దో**
**డ్కొని తెచ్చెం దనతల్లి సత్యవతినిన్ క్షోణీజనుల్ దన్ను బో**
**రనఁ గీర్తింపఁగ శంతనుం డతిమనోరాగంబునం బొంద శాం**
**తనవుం డాతతకీర్తి హస్తిపురికిం దత్కౌతుకారంభుఁ డై. 192**

**ప్రతిపదార్థం:** ఇనతేజుండు= సూర్యుడివలె ప్రకాశించేవాడైన భీష్ముడు, ఆ+కన్యన్= ఆ కన్యను(సత్యవతిని); తన, తల్లిన్= తనకు తల్లివరుస అయినదానిని; అతి, భక్తిన్= మిక్కిలి భక్తితో; కాంచనరథంబు+ఎక్కించి= బంగారుతేరును ఎక్కించి; తోడు+కొని= వెంటతీసికొని; తన్నున్= తనను; క్షోణీ, జనుల్= భూప్రజలు; బోరనన్, కీర్తింపఁగన్= వెంటవెంటనే ప్రశంసించగా; శంతనుండు; అతి, మనో, రాగంబునన్, పొందన్= మిక్కిలి హృదయాహ్లాదాన్ని అనుభవించగా; ఆతతకీర్తి= విస్తారమైన కీర్తికలవాడైన; శాంతనవుండు= శంతనుడి కుమారుడైన భీష్ముడు; హస్తిపురికిన్= హస్తినాపురానికి; తద్+కౌతుక+ఆరంభుఁడు+ఐ= దాని పండుగను మొదలు పెట్టినవాడై; తెచ్చెన్= తెచ్చెను.

**తాత్పర్యం:** సూర్యుడివలె ప్రకాశించే భీష్ముడు ఆ కన్యకను, తనకు తల్లి అయినదానిని, సత్యవతిని భూప్రజలందరు తనను తేపతేపకు జయజయధ్వానాలతో కీర్తిస్తూ ఉండగా, శంతనుడు మనసులోని మమకారాన్ని భావించి తన్మయత్వాన్ని పొందుతూ ఉండగా, విశాలకీర్తిని గడించిన శంతనుడిపుత్రుడు హస్తినాపురికి ఆమెకు వేడుకను కలిగించేవాడై తనవెంట తీసికొనివచ్చాడు.

## చిత్రాంగదా విచిత్రవీర్యుల వృత్తాంతము (సం. 1-95-1)

**వ. శంతనుండును బరమానురాగంబున సత్యవతిని వివాహంబై, యతిమానుషం బయిన యాభీష్ము సత్యవ్రతంబునకు సంతసిల్లి, యాతనికి స్వచ్ఛందమరణంబుగా వరం బిచ్చి, సత్యవతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులన నిద్దరు కొడుకులం బడసి, వారలు సంప్రాప్తయౌవనులు గాకుండఁ బరలోకగతుం డైనఁ, దండ్రికి భీష్ముండు పరలోకక్రియలు నిర్వర్తించి, చిత్రాంగదు రాజ్యాభిషిక్తుం జేసిన; నాతండును నతివ్యాలోలుండై గర్వంబున నెవ్వరి నుఱక సురదనుజ మనుజ గంధర్వాదుల నాక్షేపించుచున్న వాని కలిగి చిత్రాంగదుం డను గంధర్వపతి యుద్ధార్థియయి వచ్చినం గురుక్షేత్రంబునందు. 193**

**ప్రతిపదార్థం:** శంతనుండును; పరమ+అనురాగంబునన్= అమితమైన ప్రేమతో; సత్యవతిని; వివాహంబు+ఐ; అతి, మానుషంబు+అయిన= మానవాతీతమైన; ఆ, భీష్మ, సత్య, వ్రతంబునకున్= ఆ భీష్ముడియొక్క సత్యనిష్ఠకు; సంతసిల్లి= సంతోషించి; ఆతనికిన్= భీష్ముడికి; స్వచ్ఛంద, మరణంబుగాన్= తాను కోరుకొన్నప్పుడే తనకు చావుకలిగేటట్లు; వరంబు= ఇచ్చి; సత్యవతియందు; చిత్రాంగద, విచిత్రవీర్యులు+అనన్; ఇద్దరు, కొడుకులన్; పడసి= పొంది; వారలు= ఆకొడుకులు; సంప్రాప్త, యౌవనులు, కాకుండన్= పొందబడిన యౌవనం కలవారు (యువకులు) కాకుండగనే; పరలోక, గతుండు+ఐనన్= స్వర్గలోకానికి వెళ్లగా(మరణించగా); తండ్రికిన్= శంతనుడికి; భీష్ముండు; పరలోక, క్రియలు, నిర్వర్తించి= చనిపోయినవారు ఉత్తమలోకాలను పొందటానికి చేసే వేదవిహితక్రియాకలాపాలను చేసి; చిత్రాంగదున్, రాజ్య+అభిషిక్తున్, చేసినన్= చిత్రాంగదుడిని రాజ్యానికి రాజుగా అభిషేకించగా; ఆతండును= చిత్రాంగదుడును; అతి, వ్యాలోలుండు+ఐ= మిక్కిలి లౌల్యంకలవాడై (చంచలుడై); గర్వంబునన్= అహంకారం చేత; ఎవ్వరిన్= ఎవ్వరినీ; ఉఱక= లెక్కచేయక; సుర, దనుజ, మనుజ, గంధర్వ+ఆదులన్= దేవతలు, రాక్షసులు, మానవులు, గంధర్వులు మొదలైనవారిని; ఆక్షేపించుచున్+ఉన్నన్= ఎగతాళి చేస్తూ ఉండగా; వానికిన్+ అలిగి= అతనిపై కోపించి; చిత్రాంగదుండు+అను, గంధర్వ, పతి= చిత్రాంగదుడు అనే గంధర్వరాజు; యుద్ధ+అర్థి+అయి, వచ్చినన్= యుద్ధాన్ని కోరి రాగా; కురుక్షేత్రంబునందున్= కురుక్షేత్రంలో.

**తాత్పర్యం:** శంతనుడు అమితమైన ప్రేమతో సత్యవతిని వివాహమాడి, మానవమాత్రులకు అసాధ్యమైన ఆ భీష్ముడి సత్యనిష్ఠకు సంతోషించి అతనికి అతని ఇచ్చ వచ్చినప్పుడు మరణించేటటువంటి వరమిచ్చి, సత్యవతియందు

చిత్రాంగద విచిత్రవీర్యు లనే ఇద్దరు కొడుకులను పొంది, వారు యువకులు కాకుండానే పరలోకానికి పోయాడు. భీష్ముడు తండ్రికి అపరక్రియలు చేసి, చిత్రాంగదుడికి రాజ్యాభిషేకం చేశాడు. అతడు కడు చంచలుడై అహంకారంతో ఎవ్వరిని లెక్కచేయక దేవతలను, రాక్షసులను, మానవులను, గంధర్వాదులను లక్ష్యం చేయక మాటాడుతుండగా అతని ప్రవర్తనకు కోపించి చిత్రాంగదు డనే గంధర్వరాజు తనతో ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. అప్పుడు కురుక్షేత్రంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. నరగంధర్వాధిపు ల । య్యిరువురు చిత్రాంగదులు సహింపక యని నొం**
**డొరుఁ దాఁకి వీఁకఁ బొడిచిరి । హిరణ్వతీ తీరమున నహీనబలాఢ్యుల్. 194**

**ప్రతిపదార్థం:** నర, గంధర్వ+అధిపులు= నరులకూ, గంధర్వులకూ రాజు లైన; ఆ+ఇరువురు, చిత్రాంగదులు= ఆ ఇద్దరు చిత్రాంగదులు; సహింపక= ఒకరినొకరు లెక్కచేసికొనకుండ; అనిన్= యుద్ధంలో; ఒండు+ఒరున్, తాకి= ఒకరి నొకరు ఢీకొని; వీఁకన్= పరాక్రమంతో; అహీన, బల+ఆఢ్యుల్= తక్కువకాని బలసంపద కలవారైనవారు; హిరణ్వతీ, తీరమునన్= హిరణ్వతీనదీతీరంలో; పొడిచిరి= పోట్లాడుకొన్నారు.

**తాత్పర్యం:** నరులకు, గంధర్వులకు ప్రభువు లైన ఆ ఇద్దరు చిత్రాంగదులు లెక్కచేయక యుద్ధంలో ఒకరినొకరు ఎదుర్కొని తరుగని బల మనే ధనం గలవారు హిరణ్వతీనదీతీరంలో పోట్లాడుకొన్నారు.

**విశేషం:** చిత్రాంగదుడిపై అదే పేరుగల గంధర్వపతి కోపించి యుద్ధానికి పిలవటం విశేషం. అది ద్వంద్వయుద్ధం కావటంచేత భీష్ముడు యుద్ధం చేయలేదు.

**క. వదలక మాయాయుద్ధా । తిదక్షుఁ డయి వంచనోన్నతిన్ గంధర్వుం**
**డుదితరవితేజుఁ జిత్రాం । గదుఁ జంపె విచిత్ర పత్త్రకార్ముకహస్తున్. 195**

**ప్రతిపదార్థం:** గంధర్వుండు; మాయా, యుద్ధ+అతి, దక్షుఁడు+అయి= మాయతో చేసే యుద్ధంలో మిక్కిలి నేర్పరి అయి; విచిత్ర, పత్త్ర, కార్ముక, హస్తున్= అపూర్వాలైన బాణాలను విండ్లను చేత ధరించినవాడైన; ఉదిత, రవి, తేజున్= ఉదయించిన సూర్యుడివలె ప్రకాశించేవాడైన, చిత్రాంగదున్; వదలక= వీడక; వంచన+ఉన్నతిన్= మిక్కిలి మోసంతో; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** మాయాయుద్ధంలో మిక్కిలి నేర్పరి అయిన గంధర్వుడు విచిత్రాలైన బాణకోదండాలను ధరించి ఉదయించే సూర్యుడివలె ప్రకాశించే చిత్రాంగదుడిని పట్టువిడవకుండా పోరి చంపాడు.

**వ. ఇట్లు చిత్రాంగదుండు గంధర్వనిహతుం డయినఁ, దత్పరోక్షంబున భీష్ముండు విచిత్రవీర్యుం గౌరవరాజ్యంబున కభిషిక్తుం జేసిన. 196**

**ప్రతిపదార్థం:** గంధర్వనిహతుండు= గంధర్వునిచే చంపబడినవాడు.

**తాత్పర్యం:** ఈవిధంగా చిత్రాంగదుడు గంధర్వుడిచేత చంపబడగా అతడి తరువాత భీష్ముడు విచిత్రవీర్యుడిని కౌరవరాజ్యానికి రాజుగా అభిషేకించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. వసునిభుఁడు పైతృకం బగు । వసుధా రాజ్యంబు భీష్మువచనమున గత**
**వ్యసనుఁడయి తాల్చెఁ దేజం । బెసగంగ విచిత్రవీర్యుఁ డిద్ధయశుం డై. 197**

**ప్రతిపదార్థం:** వసునిభుఁడు= వసురాజువంటివాడైన; విచిత్రవీర్యుఁడు; భీష్ము, వచనమునన్= భీష్ముడియొక్క ఆజ్ఞచొప్పున; పైతృకంబు+అగు= తండ్రినుండి వారసత్వంగా వచ్చే; వసుధారాజ్యంబు= భూపాలనం; గత, వ్యసనుండు+అయి= ఆపదలు లేనివాడై; తేజంబు+ఎసగంగన్= పరాక్రమం ఒప్పారగా; ఇద్ధ+యశుండు+ఐ= నిర్మలమైన కీర్తికలవాడై; తాల్చెన్= వహించాడు.

**తాత్పర్యం:** వసురాజువంటివా డైన విచిత్రవీర్యుఁడు భీష్ముడి ఆజ్ఞ చొప్పున భయరహితు డై నిజపరాక్రమం నిండారగా నిర్మలకీర్తితో భూపాలనాన్ని చేపట్టాడు.

### భీష్ముఁడు కాశీరాజుకూఁతుల స్వయంవరమున కరుగుట (సం. 1-96-4)

**వ. అట్టి విచిత్రవీర్యు నారూఢయౌవనుం జూచి భీష్ముండు వివాహయత్నపరుం డయి తన చారులవలనం గాశీరాజు కూఁతుల స్వయంవరోత్సవంబు విని ధనుర్ధరుం డయి రథం బెక్కి యొక్కరుండును వారణాసీపురంబునకుం జని యందు స్వయంవరంబునకు మూఁగిన రాజలోకం బెల్ల వెఱచి వెఱఁగుపడి చూచుచుండ నక్కన్యకలఁ దనరథం బెక్కించికొని యెల్లవారలు విన ని ట్లనియె. 198**

**తాత్పర్యం:** అటువంటి విచిత్రవీర్యుడు యౌవనం పొందగా గమనించి, భీష్ముడు అతడికి వివాహంచేసే ప్రయత్నంలో నిమగ్నుడై తనగూఢచారులవలన కాశీరాజుయొక్క కుమార్తెల స్వయంవరోత్సవం జరుగుతున్నదని విని, ధనుస్సును ధరించి రథమెక్కి ఒక్కడే వారణాసీ నగరానికి పోయి, ఆ నగరంలో స్వయంవరం నిమిత్తం సమావేశమైన రాజుల సమూహాలు భయపడి నిశ్చేష్టులై చూస్తూ ఉండగా ఆకన్యలను తనరథంమీద ఎక్కించుకొని అందరూ వినేటట్లు ఈవిధంగా అన్నాడు.

**క. నాయనుజునకు వివాహము । సేయఁగఁ గన్యాత్రయంబుఁ జేకొని బలిమిం**
**బోయెద నడ్డం బగు వా । రాయతభుజశక్తి నడ్డమగుఁ డాజిమొనన్. 199**

**ప్రతిపదార్థం:** నా, అనుజునకున్= నాతమ్ముడికి; వివాహము, చేయఁగన్= పెండ్లిచేయటానికి; కన్యా, త్రయంబున్= కన్యలుముగ్గురిని; బలిమిన్= బలవంతంగా, పరాక్రమంతో; చేకొని, పోయెదన్= తీసికొనిపోతాను; అడ్డంబు+అగువారు= అడ్డువచ్చేవారు; ఆజి, మొనన్= యుద్ధవ్యూహంతో; ఆయత, భుజ, శక్తిన్= విస్తారమైన భుజబలంతో, అడ్డము+అగుఁడు= అడ్డగించండి.

**తాత్పర్యం:** ఈ కన్యలు ముగ్గురినీ నాతమ్ముడి కిచ్చి పెండ్లి చేయటానికై బలంతో బలవంతంగా తీసికొనిపోతాను. అడ్డుతగిలేవారు అపారభుజబలంతో యుద్ధవ్యూహంతో అడ్డగించండి.

**వ. 'బ్రాహ్మంబు మొదలుగాఁగల యెనిమిది వివాహములయందు క్షత్త్రియులకుఁ గాంధర్వ రాక్షసంబు లుత్తమంబులు; స్వయంవరంబున జయించి వివాహం బగుట యంతకంటె నత్యుత్తమంబు గావున నిమ్మూఁగినరాజలోకంబు నెల్ల నోడించి యిక్కన్యలం దోడ్కొని నాచనుట యిది ధర్మంబ' యని కాశీరాజునకుం జెప్పి వీడ్కొని భీష్ముండు వచ్చునప్పుడు. 200**

**ప్రతిపదార్థం:** మూఁగిన= గుమికూడిన.

**తాత్పర్యం:** బ్రాహ్మం మొదలుకొని ఎనిమిది రకాల వివాహాలలో క్షత్రియులకు గాంధర్వం, రాక్షసం అనేవి రెండూ శ్రేష్ఠా లైనవి. స్వయంవరంలో జయించి పెండ్లిచేసికోవటం అంతకంటె ఎంతో శ్రేష్ఠం. కాబట్టి ఇక్కడ కూడిన రాజులయొక్క సమూహాన్నంతా ఓడించి ఈకన్యలను తీసికొని నేను పోవటం అనేది న్యాయమే అని కాశీరాజుకు చెప్పి వీడ్కోలు పలికి భీష్ముడు తిరిగి వచ్చేటప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ. నరనాగాశ్వవరూథయూథములతో నానావనీనాథు లు**
**ద్ధురు లై యొక్కట నొండొరుం జఱచి యుత్తుంగానిలోద్ధూత సా**
**గరసంక్షోభసమంబుగాఁ గలఁగి వీఁకన్ వీరులై తాఁకి యే**
**సిరి దేవవ్రతుపై నభోవలయ మచ్ఛిద్రంబుగా నమ్ములన్. 201**

**ప్రతిపదార్థం:** నానా+అవనీ, నాథులు= వివిధ దేశాలకు రాజులైనవారు; నర, నాగ, అశ్వ, వరూథ, యూథములతోన్= భటులయొక్కయు, ఏనుగులయొక్కయు, గుఱ్ఱాలయొక్కయు, సైన్యాల సమూహాలతో; ఒక్కటన్= ఒక్కచోట; ఒండొరున్, చఱచి= ఒకరినొకరు భుజాలపై చరచుకొని (ఐక్యతను తెలుపుకొని); ఉత్తుంగ+అనిల+ఉద్ధూత, సాగర, సంక్షోభ, సమంబుగాన్= గాలిచేత ఎత్తుగా ఎగురగొట్టబడిన (అలలుగల) సముద్రంయొక్క ఘోషతో సరి అయినదిగా; కలఁగి= కోపించి; వీఁకన్= గర్వంతో; వీరులు+ఐ= పౌరుషవంతులై; తాఁకి= ఢీకొని, ఎదిరించి; దేవవ్రతుపైన్= దేవవ్రతుడిమీద; నభోవలయము, న+ఛిద్రంబుకాన్= ఆకాశగోళంలో సందులేకుండ; అమ్ములన్= బాణాలను; ఏసిరి= గుప్పించారు.

**తాత్పర్యం:** వివిధ దేశాలకు అధిపతులైన రాజులందరు పదాతులు, ఏనుగులు, అశ్వాలు, సైన్యసమూహాలతో కలిసి ఒకచోట చేరి పరస్పరం (ప్రోత్సహించుకొంటూ) భుజాలపై చరచుకొంటూ బలమైన గాలితో ఎగురగొట్టబడిన అలలతో కూడిన సముద్రఘోషతో సమానంగా రోషంతో కోపించి గర్వంతో పౌరుషవంతులై ఎదిరించి ఆకాశవలయంలో ఆవంతసందులేకుండ దేవవ్రతుడిమీద బాణాలు గుప్పించారు.

**విశేషం:** అలం: ఉపమ, చతురంగబల సమీకరణాన్ని, సామూహిక యుద్ధ సంక్షోభాన్నీ, బాణాల గుప్పింపునూ వ్యక్తీకరించే అక్షర రమ్యతకు ఓజోగుణదీప్తికి ఈరచన ఉదాహరణ.

**క. వారల నందఱ రౌద్రా । కారుం డై కసిమసంగి గాంగేయుఁడు దు**
**ర్వార పటుబాణనిహతిని । వీరాహవరంగమునకు విముఖులఁ జేసెన్. 202**

**ప్రతిపదార్థం:** గాంగేయుఁడు= గంగాకుమారుడైన భీష్ముడు; రౌద్ర+ఆకారుండు+ఐ= భయంకరమైన కోపంతో కూడిన రూపం కలవాడై; వారలన్+అందఱన్= వారందరిని; కసిమసంగి= విజృంభించి; దుర్వార, పటు, బాణ, నిహతిని= వారించటానికి శక్యంగాని బలమైన బాణాల తాకిడిచేత; వీర+ఆహవ, రంగమునకున్= వీరయుద్ధభూమికి; విముఖులన్, చేసెన్= దూరమయ్యేవారిగా చేశాడు (యుద్ధభూమిని వదలి పారిపోయేటట్లు చేశా డని భావం).

**తాత్పర్యం:** భీష్ముడు తీవ్రమైన కోపంగలవాడై విజృంభించి, త్రిప్పికొట్టటానికి శక్యంగాని బలమైన బాణాల దెబ్బలచేత రాజులనందరిని వీరయుద్ధభూమినుండి వైదొలగిపోయేటట్లు చేశాడు.

క. **నెఱి నుఱక వైరి వీరుల । నెఱ(కుల దూఱంగ నేయు నృపపుంగవు నం**
**పఱ కోర్వక పిఱు సని రని । వెఱచి విషణ్ణు లయి సకలవిషయాధిపతుల్.** **203**

**ప్రతిపదార్థం:** సకల, విషయ+అధిపతుల్= సమస్త దేశాలయొక్క రాజులు; నెఱిన్, ఉఱక= ఇంచుకైనా లక్ష్యపెట్టక తాకునట్లు; వైరి, వీరుల, నెఱ(కులన్, దూఱంగన్= శత్రువులైన వీరులయొక్క మర్మస్థానాలలో గ్రుచ్చుకొనేటట్లు; ఏయు= బాణాలను వేయు; నృప, పుంగవు= రాజశ్రేష్ఠుడి (భీష్ముడి)యొక్క; అంపఱకున్= బాణాలకు; ఓర్వక= తాళలేక; అనిన్, వెఱచి= యుద్ధంచేయటానికి భయపడి; విషణ్ణులు+అయి= దుఃఖితులై, పిఱు, చనిరి= వెనుదిరిగి పోయారు.

**తాత్పర్యం:** సమస్తదేశాల ప్రభువులందరు భీష్ముడు తమపై క్రమంగా తాకేటట్లు శత్రువీరుల మర్మాలలో గ్రుచ్చుకొనేటట్లు బాణాలను సంధించి వేస్తూ ఉంటే ఆ బాణాలకు తాళలేక దుఃఖితులై యుద్ధంచేయటానికి భయపడి వెనుతిరిగిపోయారు.

వ. **ఇట్లు నిఖిలక్షత్త్రియక్షయార్థం బలిగిన పరశురాముండునుంబోలెఁ గడు నలిగి, పరశురామశిష్యుం డా క్షత్త్రవర్గంబునెల్లఁ దన శరధారావర్షంబున ముంచి యోడించి యేకవీరుం డయి వచ్చువాని పిఱుంద సమరసన్నద్ధుం డయి సాల్వుండు సనుదెంచి.** **204**

**ప్రతిపదార్థం:** పిఱుందన్= వెంబడి, వెనుక, సమరసన్నద్ధుండు= యుద్ధమునకు సిద్ధపడినవాడు.

**తాత్పర్యం:** ఈవిధంగా సమస్తక్షత్త్రియులను నశింపచేయటానికి కోపించిన పరశురాముడి విధంగా మిక్కిలి కోపించి పరశురాముడి శిష్యుడైన భీష్ముడు ఆ రాజుల సమూహాన్నంతా తన బాణధారలనే వానలో ముంచి ఓడించి ఏకవీరుడు (యుద్ధంలో పెక్కురను ఒక్కడే నిస్సహాయంగా ఓడించిన మేటివీరుడు) అయి వస్తూఉండగా అతని వెన్నంటి యుద్ధానికి సిద్ధమై సాల్వుడు వచ్చి.

**విశేషం:** అలం: భీష్ముడు పరశురాముడి వలె అలిగాడన్నచోట ఉపమ; శరధారావర్షంలో రూపకం.

### సాల్వుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట (సం. 1-96-27)

ఉ. **'ఈవసుధాధినాథుల జయించిన యట్టిద కాదు; చక్కనై**
**పోవక నిల్వు నా కెదిరిపోర మదీయధనుర్విముక్త నా**
**నావిధ మార్గణోగ్ర గహనంబున దిగ్భ్రమఁబొంద కెమ్మెయిం**
**బోవఁగఁ బోలు నీకనుచుఁ బూరుకులోత్తముఁ దాఁకె వీఁకతోన్.** **205**

**ప్రతిపదార్థం:** ఈ, వసుధా+అధినాథులన్, జయించిన, అట్టిది+అ, కాదు= ఈ రాజులను జయించటంవంటిదే కాదు; నాకున్+ఎదిరి, పోరన్, చక్కన+ఐ, పోవక, నిల్వు(ము)= నాతో ఎదురొడ్డి యుద్ధంచేయటానికి, పోకుండ నిలువబడు; మదీయ, ధనుర్విముక్త, నానా, విధ, మార్గణ+ఉగ్ర, గహనంబునన్= నాయొక్కవిల్లునుండి విడువబడిన పెక్కురకాలైన బాణా లనే భయంకర మైన అడవిలో; దిక్+భ్రమన్, పొందక= దిక్కులు తెలియని ఆశ్చర్యం పొందకుండా; ఏ+మెయిన్, పోవఁగన్,

పోలున్, నీకున్+అనుచున్= నీకు ఏవిధంగా పోవటానికి వీలౌతుందని అంటూ; వీఁకతోన్= గర్వంతో; పూరు, కుల+ఉత్తమున్= పూరు మహారాజు వంశంలో శ్రేష్ఠుడైన భీష్ముడిని; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** 'ఈ రాజులను జయించటం అదొక జయం కాదు. అట్లా సూటిగా పోకుండ నన్ను ఎదురించి యుద్ధంచేయటానికి నిలుచుండుము. నా విల్లునుండి విడువబడిన బహువిధాలైన బాణా లనే భయంకరమైన అరణ్యంలో దిక్కుత్రోవలు తెలియక అబ్బురపాటుపొందకుండా ఎక్కడికిపోతావు?' అని అంటూ సాల్వుడు పూరువంశంలో ఉత్తముడైన భీష్మునిమీద గర్వంతో బాణాలు వేశాడు.

**విశేషం:** అలం: రూపకం.

**వ. భీష్ముండును దనరథంబు నివర్తింపించి సంవర్తసమయ సమవర్తియుంబోలె నతిరౌద్రాకారుండయి నిలిచిన.206**

**తాత్పర్యం:** భీష్ముడుకూడ తనరథాన్ని వెనుకకు త్రిప్పించి ప్రళయకాలంలోని యముడివలె మిక్కిలి భయంకర మైన (రుద్రసంబంధమైన) ఆకారంకలవాడై నిలువగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**చ. 'అనిలజవంబునం బఱచు నమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱిం**
**చిన పరికాఁడ పోలెఁ గురుసింహవరూథము నిట్లు గ్రమ్మఱిం**
**చునె యితఁ' డంచునుం దగిలి చూపఱు సాల్వమహీశు విక్రమం**
**బొనరఁగ నల్గడం బొగడుచుండిరి విస్మయసక్తచిత్తు లై. 207**

**ప్రతిపదార్థం:** అనిలజవంబునన్= వాయువేగంతో; పఱచు= పరుగెత్తు; ఆ+మదనాగము+ఎదిర్చి= ఆ మదించిన ఏనుగును ఎదిరించి; క్రమ్మఱించిన= మళ్ళించిన; పరికాఁడు+అ; పోలెన్= తెగకు ముఖ్యమైన ఏనుగువలె; కురుసింహ, వరూథమున్= కురువంశంలో శ్రేష్ఠుడైన భీష్మునియొక్క సైన్యాన్ని; ఇట్లు= ఈవిధంగా; ఇతఁడు= సాల్వుడు; క్రమ్మఱించునె= మళ్ళింపగలిగాడే; అంచునున్= అనిఅంటూ; తగిలి= ఆసక్తితో; చూపఱు= చూచేవారు; విస్మయ, సక్త, చిత్తులు+ఐ= ఆశ్చర్యంతోకూడిన మనస్సులు కలవారై; సాల్వ, మహీ+ఈశు, విక్రమంబు= సాల్వభూపతి పరాక్రమాన్ని; నల్గడన్= నాల్గుదిక్కులా; పొగడుచున్+ఉండిరి= పొగడుతూ ఉండిపోయారు.

**తాత్పర్యం:** 'వాయువేగంతో పరుగెత్తే మదించిన ఏనుగును ఎదిరించి మళ్ళించిన ఆ తెగకు ముఖ్యమైన ఏనుగువలె కురుశ్రేష్ఠుడైన భీష్ముడియొక్క సైన్యాన్ని ఈవిధంగా ఇతడు మళ్ళించాడే' - అంటూ ఆసక్తితో చూచేవారు ఆశ్చర్యంతో నిండిన మనస్సులతో సాల్వభూపతి పరాక్రమాన్ని నాల్గుదిక్కులా పొగడుతూ ఉండిపోయారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అంత. 208**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట.

**తాత్పర్యం:** తరువాత (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ధృతిమెయి శతసంఖ్యయు దశ । శతసంఖ్యయు శతసహస్రసంఖ్యయును శతా**
**యుత సంఖ్యయుఁగా దేవ । వ్రతుమీఁదను సాల్వుఁ డేసె వాఁడిశరంబుల్. 209**

**ప్రతిపదార్థం:** సాల్వుఁడు; ధృతి, మెయిన్= ధైర్యంతో; వాఁడిశరంబుల్= పదను గల బాణాలను; శతసంఖ్యయున్= నూరుసంఖ్యలో; దశ, శతసంఖ్యయున్= పదినూర్లు అంటే వేయి సంఖ్యలో; శత, సహస్ర, సంఖ్యయును= నూరువేల (లక్ష) సంఖ్యలో; శత+అయుత, సంఖ్యయున్, కాన్= నూరుపదివేల (పదిలక్షల) సంఖ్యలుగా; దేవవ్రతు, మీఁదను= దేవవ్రతుడను పేరు గల భీష్ముడిమీద; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** సాల్వుడు ధైర్యంతో భీష్ముడిమీద పదనైన బాణాలను వరుసగా నూరు, వేయి, లక్ష, పదిలక్షల సంఖ్యలలో ప్రయోగించాడు.

**క. ఘనభుజుఁ డన్నియు నడుమన । తునియఁగ వడి నేసి, వానితురగచయస్యం**
**దన సూతుల నొక్కొక య । మ్మునఁ ద్రెళ్ళఁగ నేసె భరతముఖ్యుఁడు పోరన్. 210**

**ప్రతిపదార్థం:** ఘన, భుజుఁడు= గొప్పభుజాలు కలవాడైన; భరత, ముఖ్యుఁడు= భరతకులశ్రేష్ఠుడు - భీష్ముడు; పోరన్= యుద్ధంలో; అన్నియున్= సాల్వుడు ప్రయోగించిన బాణాల నన్నింటిని; నడుమన్+అ= మధ్యలోనే; తునియఁగన్= విరిగిపోయేటట్లు; వడిన్, ఏసి= వేగంగా బాణాలను ప్రయోగించి; వాని= సాల్వుడియొక్క; తురగ, చయ, స్యందన, సూతులన్= గుఱ్ఱాలసమూహాన్నీ, రథాన్నీ, రథాన్ని నడిపే సారథినీ; ఒక్కొక, అమ్మునన్= ఒక్కొక బాణంతో; త్రెళ్ళఁగన్= నేలపై కూలేటట్లు; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** గొప్ప భుజాలు కల ఆ భరతకులశ్రేష్ఠ డైన భీష్ముడు యుద్ధంలో సాల్వుడు ప్రయోగించిన బాణాల నన్నింటిని మధ్యలోనే తునిగిపోయేటట్లు వేగంగా బాణాలు ప్రయోగించి, అతడి గుఱ్ఱాలను, రథాలను, సారథినీ ఒక్కొక్కబాణంతో నేలపై కూలేటట్లు చేశాడు.

**విశేషం:** సాల్వుడు ఆశ్చర్యం కలిగించేటట్లు అధికసంఖ్యలో బాణాలను ప్రయోగించి భీష్ముడిని ఓడించటానికి యత్నించగా ఆబాణాలనన్నింటిని మధ్యలోనే త్రుంచివేసి, ఒక్కొక్కబాణంతోనే రథాన్నీ గుఱ్ఱాలనూ సారథిని చంపి అత్యద్భుత మనిపించుకొన్నా డని వ్యంగ్యం.

**క. రథమును రథ్యంబులు సా । రథియును వృథ యైన భగ్నరథుఁ డై భాగీ**
**రథికొడుకుచేత విమనో । రథుఁ డై సాల్వుండు నిజపురంబున కరిగెన్. 211**

**ప్రతిపదార్థం:** రథమును= రథమూ; రథ్యంబులున్= గుఱ్ఱాలూ; సారథియును= సారథియూ; వృథ+ఐనన్= పనికిరానివి కాగా; భగ్నరథుఁడు+ఐ= విరిగిన రథం కలవాడై; భాగీరథి, కొడుకుచేతన్= గంగాపుత్రుడైన భీష్ముడివలన; వి, మనోరథుఁడు+ఐ= వీగిపోయిన కోర్కెలు కలవాడై; సాల్వుండు= సాల్వుడు; నిజపురంబునకున్+అరిగెన్= తన రాజధానికి వెళ్ళాడు.

**తాత్పర్యం:** రథమూ, గుఱ్ఱాలూ, సారథీ పనికిరాకుండ పోగా సాల్వుడు రథం విరిగిపోవటమే కాకుండా మనోరథంబు (కోర్కె)కూడా వీగిపోయేటట్లు భీష్ముడు చేయగా చేసేది లేక తననగరానికి తిరిగివెళ్ళాడు.

**వ. ఇట్లు సకలరాజలోకంబు నెల్ల నశ్రమంబున నోడించి సాల్వరాజు మందల విడిచి పరాక్రమలబ్ధ లయిన కాశీరాజదుహితలనంబాంబికాంబాలికలందోడ్కొని వచ్చి భీష్ముండు విచిత్రవీర్యునకు వివాహంబుసేయనున్న నందుఁ బెద్దయది యైన యంబ యిట్లనియె. 212**

**ప్రతిపదార్థం:** పెద్ద+అది= పెద్దయది= జ్యేష్ఠురాలు.

**తాత్పర్యం:** ఈవిధంగా సమస్త రాజసమూహాన్నంతా తేలికగా ఓడించి సాల్వరాజును ప్రాణాలతో సేనలను బాధించక వదలి పరాక్రమంచేత లభించినవా రయిన కాశీరాజుపుత్రికలను అంబ, అంబిక, అంబాలికలను, తీసికొని వచ్చి భీష్ముడు విచిత్రవీర్యుడికి వివాహం చేయబోగా, ఆ ముగ్గురిలో పెద్దదయిన అంబ ఈవిధంగా అన్నది.

**ఆ. పరఁగ నన్ను సాల్వపతి వరియించినఁ । దండ్రిచేతఁ బూర్వదత్త నైతి**
**నమ్మహీశునకు; నయంబున నెయ్యది । ధర్మ వెఱిఁగి దానిఁ దలఁపు మిపుడు. 213**

**ప్రతిపదార్థం:** పరఁగన్= ఒప్పునట్లు; సాల్వపతి= సాల్వు డనేరాజు; నన్నున్= (అంబను); వరియించినన్= కోరుకొనగా; ఆ+మహీ+ఈశునకున్= ఆ రాజుకు; తండ్రిచేతన్= నాతండ్రిచేత; పూర్వ, దత్తను+ఐతిన్= ముందే ఇవ్వబడినదాన నైనాను; నయంబునన్= న్యాయంగా, నీతిగా; ఏ+అది, ధర్మువు= ఏది ధర్మమో; ఎఱిఁగి= తెలిసికొని; దానిన్= ఆ చేయదగినదానిని; ఇపుడు; తలఁపుము= ఆలోచించుము.

**తాత్పర్యం:** సాల్వరాజు నన్ను ఒప్పారగా వరించటంచేత మాతండ్రి నన్ను ఇంతకుపూర్వమే ఆ రాజుకు మాట ఇచ్చాడు. ఇప్పుడు (ఈపరిస్థితులలో) చేయదగిన ధర్మ మేదో తెలిసికొని నీతితో నిర్ణయించుము.

### విచిత్రవీర్యుని వివాహము, మరణము (సం. 1-96-52)

**వ. అనిన విని భీష్ముండు ధర్మవిదు లయిన బ్రాహ్మణుల యనుమతంబున దాని సాల్వరాజున కిచ్చిపుచ్చి, మహోత్సవంబున నయ్యిరువురు కన్యకల విచిత్రవీర్యునకు వివాహంబు సేసిన 214**

**ప్రతిపదార్థం:** ధర్మవిదులు= ధర్మం తెలిసినవారు.

**తాత్పర్యం:** అనగా విని భీష్ముడు ధర్మం తెలిసిన బ్రాహ్మణుల అనుమతితో అంబను సాల్వరాజుకు ఇచ్చేటట్లు పంపి, గొప్పవైభవంగా ఆ ఇద్దరు కన్యలను విచిత్రవీర్యుడికి ఇచ్చి పెళ్ళిచేయగా.

**ఉ. లాలిత రూపయౌవన విలాస విభాసిను లైన యంబికాం**
**బాలికలన్ వివాహ మయి భారతవంశకరుండు గామ లీ**
**లాలలితానుభోగరసలాలసుఁ డై నిజరాజ్యభార చిం**
**తాలసుఁ డయ్యెఁ; గామికి నయంబున నొండు దలంపఁబోలునే! 215**

**ప్రతిపదార్థం:** భారత, వంశ, కరుండు= భరతవంశోద్ధారకుడు అయిన విచిత్రవీర్యుడు; లాలిత, రూప, యౌవన, విలాస, విభాసినులు+ఐన= పోషింపబడిన రూప, యౌవనాలయొక్క లీలలచేత ప్రకాశించేవారైన; అంబికా, అంబాలికలన్; వివాహము+అయి= పెండ్లియాడి; కామ, లీలా, లలిత+అనుభోగ, రస, లాలసుఁడు+ఐ= మన్మథ విలాసాలచేత కోమలా లైన ఇష్టభోగాల అనుభవసారాన్ని పొందటంలో విషయాసక్తుడై; నిజ, రాజ్య, భార, చింతా+అలసుఁడు+అయ్యెన్= తన రాజ్యభారాన్ని గురించిన ఆలోచనలో ఉత్సాహంలేనివాడు అయ్యాడు; కామికిన్= ఇంద్రియసుఖాలను కోరేవాడికి; నయంబునన్= పొందికగా; ఒండు= మరొకదానినిగురించి; తలంపన్, పోలునే= ఆలోచింప వీలు కలుగునా? (కలుగ దని భావం).

**తాత్పర్యం:** భారతవంశకరు డైన విచిత్రవీర్యుడు లావణ్యంతో కూడిన రూప యౌవన విలాసాలతో ప్రకాశించే అంబికను, అంబాలికను పెండ్లాడి మన్మథలీలలతోకూడిన లలితభోగానుభవాలసారాన్ని పొందాలనే విషయాభిలాషతో తన రాజ్యనిర్వహణభారాన్నిగురించి ఆలోచించటంలో ఆసక్తిలేనివా డైనాడు. అంతేకదా! కాముకునికి పొందికగా మరొక విషయాన్నిగురించి ఆలోచించే వీలెక్కడ కలుగుతుంది? (కలుగదని భావం).

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. లలనల విలాసాలను, విచిత్రవీర్యుని విషయాసక్తిని వర్ణించే యీపద్యరచనలో లవర్ణం విరివిగా వాడి లాలిత్యాన్ని పోషించి శృంగార రసానుకూలమైన అక్షరరమ్యతను నన్నయ పాటించాడు. శ్లేష అనే శబ్దగుణం సార్థకం.

**వ. ఇట్లు సకలవ్యాపారరహితుం డై కాశీరాజదుహితల నయ్యిరువుర నతిప్రణయగౌరవంబునం దగిలి.216**

**ప్రతిపదార్థం:** దుహితలు= పుత్రికలు

**తాత్పర్యం:** ఈవిధంగా అన్ని ప్రవృత్తులను మానుకొని కాశీరాజు కూతుళ్ల నిద్దరిని అధికమైనప్రేమాదరంతో కూడి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. అమలసుధారమ్య హర్మ్యతలంబుల । నవకుసుమామోద నందనములఁ**
**గృతకాద్రి కందర క్రీడాగృహాంగణ । వివిధరత్నోపలవేదికలను**
**గలహంస కలనాదకమనీయ కమలినీ । దీర్ఘికాసైకతతీరములను**
**రమియించుచును గామరాగాధికాసక్తిఁ । జేసి శోషించి విచిత్రవీర్యుఁ**

**ఆ. డమరపురికిఁ జనిన, నతనికిఁ బరలోక । విధుల శాస్త్రదృష్టి వెలయఁ జేసి**
**నాపగాతనూజుఁ డఖిలబాంధవులయు । బ్రాహ్మణులయుఁదోడ భానునిభుఁడు. 217**

**ప్రతిపదార్థం:** విచిత్రవీర్యుఁడు; అమల, సుధా, రమ్య, హర్మ్య, తలంబులన్= స్వచ్ఛమైన(తెల్లనైన) సున్నపుపూతవలన అందమైన భవనాలయొక్క పైభాగాలలోనూ; నవ, కుసుమ+ఆమోద, నందనములన్= క్రొత్తపూలయొక్క వాసనలుగల ఉద్యానవనాలలోనూ; కృతక+అద్రి, కందర, క్రీడాగృహ+అంగణ= కృత్రిమంగా అమర్చిన కొండలయొక్క గుహలయొక్క, విలాసగృహాలయొక్క ముంగిళ్ళలోని; వివిధ, రత్న+ఉపల, వేదికలను= అనేకవిధా లైన రత్నాలతో ఉన్న రాతిఅరుగులమీదనూ; కలహంస, కలనాద= రాజహంసలయొక్క అవ్యక్తమధురమైన స్వరాలచేత; కమనీయ= అందమైన; కమలినీ, దీర్ఘికా, సైకత, తీరములను= సరోవరాలయొక్క, నడబావులయొక్క, తీరాల్లోని ఇసుక తిన్నెల మీద; రమియించుచును= క్రీడిస్తూ; కామ,

రాగ+అధిక+ఆసక్తిన్‌చేసి= కామసుఖంలోని మిక్కిలికోరిక కారణంగా; శోషించి= చిక్కిశల్యమై; అమర, పురికిన్, చనినన్= దేవతల నగరానికి పోగా (చనిపోగా); అతనికిన్= విచిత్రవీర్యుడికి; శాస్త్రదృష్టి, వెలయన్= శాస్త్రాలలో చెప్పబడిన పద్ధతికి అనుకూలంగా; పరలోక, విధులన్= చనిపోయినవారికి ఉత్తరగతులు కలిగించటానికి చేసేకర్మలు; ఆపగాతనూజుఁడు= గంగయొక్కపుత్రుడు, భీష్ముడు; భాను, నిభుఁడు= సూర్యుడితోపోలినవాడు; అఖిల, బాంధవులయున్, బ్రాహ్మణులయున్, తోడన్= అందరు బంధువులతో బ్రాహ్మణులతో కలిసి; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** తెల్లని సున్నంతో అందంగా ఉన్న మేడలపైభాగాలలోనూ, క్రొత్తగా పూచిన పూలసువాసనలుగల ఉద్యానవనాలలోనూ, కృత్రిమంగా కట్టిన కొండల గుహలలోనూ విలాసగృహాల ముంగిళ్లలో ఉన్న వివిధ రత్నాలు తాపిన రాతి అరుగులమీదనూ, రాజహంసల మధురమైన కూతలతో అందమైన సరోవరాలయొక్క, నడబావులయొక్క, తీరాలలోని ఇసుకతిన్నెలమీదనూ క్రీడిస్తూ కామభోగంలోని అమితమైన ఆసక్తివలన విచిత్రవీర్యుడు చిక్కిశల్యమై స్వర్గస్థుడు కాగా అతడికి సూర్యసన్నిభు డైన భీష్ముడు బంధువులందరితో, బ్రాహ్మణులతో కలిసి శాస్త్రోక్తంగా పరలోకవిధులను యథావిధిగా చేశాడు.

## సత్యవతి భీష్ముని వివాహమాడు మని కోరుట (సం. 1-97-4)

**వ. మఱియు నత్యంతశోకార్ణవంబున మునింగిన తల్లిని మఱఁదండ్రను నాశ్వాసించి, యరాజకం బయిన రాజ్యం బకలంకంబుగాఁబ్రతిపాలించుచున్న కొడుకు నఖిలధర్మవిదు గాంగేయుం జూచి సత్యవతి యి ట్లనియె.218**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఆపైన; అత్యంత, శోక+అర్ణవంబునన్, మునింగిన= అపార మైన దుఃఖ మనే సముద్రంలో మునిగిన; తల్లిని; మఱఁదండ్రను= తమ్ముని భార్యలను; ఆశ్వాసించి= ఓదార్చి; అ, రాజకంబు+అయిన, రాజ్యంబు= రాజు లేకుండా పోయిన రాజ్యాన్ని; అకలంకంబుకాన్= ఎటువంటి అపవాదు రాకుండ; ప్రతిపాలించుచున్+ఉన్న= రక్షకుడుగా పాలిస్తూ ఉన్న; కొడుకున్= కొడుకును; అఖిల, ధర్మ, విదున్, గాంగేయున్, చూచి= అన్నిధర్మాలూ తెలిసినవాడైన గంగాతనయుడైన భీష్ముడిని చూచి; సత్యవతి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నది.

**తాత్పర్యం:** ఆ తరువాత, అపారమైన దుఃఖసాగరంలో మునిగిన తల్లిని, మరదళ్ళనూ ఓదార్చి, రాజు లేని ఆరాజ్యానికి ఏలోపం రాకుండ రాజప్రతినిధిగా పాలనంసాగిస్తూ ఉండగా తనకు కొడుకూ, సర్వధర్మాలు తెలిసినవాడూ అయిన భీష్ముడిని చూచి సత్యవతి ఈవిధంగా అన్నది.

**విశేషం:** అలం: రూపకం.

**క. శంతను సంతానంబును । సంతతకీర్తియును బిండసత్కృతియును న**
**త్యంత మహీభారమును బ । రంతప! నీయంద చిరతరం బై నిలిచెన్. 219**

**ప్రతిపదార్థం:** పరంతప= శత్రువులను తపింపచేయువాడా! భీష్ముడా!; శంతను, సంతానంబును= శంతనుడియొక్క సంతానం (అనదగినవాస్తవమున్నూ); సంతత, కీర్తియును= కలకాలముండే కీర్తియున్నూ; పిండ, సత్కృతియునున్= పితృదేవతలకు పిండములు సమర్పించే ఉత్తమకర్మయూ; అత్యంత, మహీ, భారమును= అపారమైన రాజ్యంయొక్క భారమూ; నీ+అందున్+అ= నీయందే; చిరతరంబు+ఐ= చాలకాలం ఉండేదిగా; నిలిచెన్= ఏర్పడింది.

**తాత్పర్యం:** శత్రువులను తపింపజేసే ఓవీరుడా! భీష్మా! శంతనుడియొక్క సంతాన మని చెప్పదగిన వాస్తవమూ, కలకాలముండే కీర్తియూ, పితృదేవతలకు పిండప్రదానం చేసే ఉత్తమకర్మాధికారమూ, అపారమైన సామ్రాజ్యభారమూ నీయందే చాలకాలం నిలిచిఉండే స్థితి ఏర్పడింది.

**చ. జననుత సర్వధర్మములు సర్వజగత్పరివర్తనక్రమం**
**బును మఱి సర్వవంశములుఁ బుట్టిన మార్గము నీవ నిక్కువం**
**బనఘ! యెఱుంగు; దున్నతగుణాఢ్యుఁడవున్ భరతాన్వయావలం**
**బనుఁడవు నీవ; నిన్నొకఁడు పంచెదఁ జేయుము మత్ప్రియంబుగన్. 220**

**ప్రతిపదార్థం:** అనఘ= దోషాలు లేనివాడా; పుణ్యాత్ముడా! (భీష్మా!); జన, నుత, సర్వ, ధర్మములు= ప్రజలచేత కొనియాడబడే అన్ని ధర్మాలనుగురించి; సర్వ, జగత్, పరివర్తన, క్రమంబును= ప్రపంచంలో జరుగుతున్న మార్పులన్నింటిక్రమాన్నీ; మఱి= అంతేకాక; సర్వ, వంశములున్, పుట్టిన, మార్గమున్= (రాజ)వంశాలన్నీ ప్రారంభమైన విధానాన్నీ; నిక్కువంబు= వాస్తవంగా, నిజంగా; నీవు+అ, ఎఱుంగుదు(వు)= నీకు మాత్రమే తెలుసు; నీవు+అ= నీవే; ఉన్నత, గుణ+ఆఢ్యుఁడవున్= ఉత్తమగుణ సంపన్నుడవు; భరత+అన్వయ+అవలంబనుఁడవు= భరతుడు వంశకర్తగా ఉన్న వంశానికి ఆధారమైనవాడవు; నిన్నున్+ ఒకఁడు, పంచెదన్= నిన్ను ఒకఁడు, పంచెదన్= నిన్ను ఒకటి ఆజ్ఞాపిస్తాను; మత్, ప్రియంబుగన్, చేయుము= నాకు సంతోషమయ్యేటట్లు చేయుము.

**తాత్పర్యం:** పాపరహితుడవయిన ఓ భీష్మా! ప్రజలచేత కీర్తింపబడే ధర్మాలన్నింటిని గురించి, లోకంలో జరిగే పరిణామాలన్నింటి క్రమాన్నిగురించీ, అంతేకాక, రాజవంశాలన్నీ పుట్టిన విధానాలగురించి నీవు వాస్తవజ్ఞానం కలిగిఉన్నావు. ఉత్తమగుణసంపదగల నీవే ఈనాడు భరతవంశానికి ఆధారంగా నిలిచి ఉన్నావు. నిన్ను నేను ఒకటి ఆజ్ఞాపిస్తాను. నాసంతోషంకొరకు దానిని నీవు చేయుము.

**క. ఇక్కురువంశంబున వీ । వొక్కరుఁడవ యున్నవాఁడ; వుర్వీరాజ్యం**
**బెక్కటి సేకొని తేజము । దిక్కుల వెలిఁగింపు సంతతియుఁ బడయు మొగిన్. 221**

**ప్రతిపదార్థం:** ఈ+కురువంశంబునన్= ఈకురువంశంలో; నీవు+ఒక్కరుఁడవు+అ, ఉన్నవాఁడవు= నీవు ఒక్కడివే ఉన్నావు; ఉర్వీ, రాజ్యంబు= భూమిపరిపాలనను; ఎక్కటి, చేకొని= మరెవరి సహాయంలేకుండా ఒక్కడివే తీసికొని; తేజమున్= పరాక్రమాన్ని, ప్రకాశాన్ని; దిక్కులన్, వెలిఁగింపు(ము)= దిక్కులందు ప్రకాశించేటట్లు చేయుము; ఒగిన్= క్రమంగా; సంతతియున్, పడయుము= సంతానాన్నికూడా పొందుము.

**తాత్పర్యం:** ఇప్పుడు ఈకురువంశంలో (రాజ్యార్హు డైనవాడవు) నీవొక్కడవే (బ్రతికి) ఉన్నావు. నీవు ఈరాజ్యాన్ని అసహాయవీరుడిగా చేపట్టి నీపరాక్రమతేజాన్ని నలుదిక్కులా వెలిగేటట్లు చేయుము. క్రమంగా సంతానాన్నికూడ పొందుము.

**క. 'నిరతంబు బ్రహ్మమొదలుగ । వరుసన యెడతెగక యిట్లు వచ్చిన వంశం**
**బురుభుజ! నీ వుండఁగ నీ । తరమున విచ్ఛిన్న మగుట ధర్మువె?' యనినన్. 222**

**ప్రతిపదార్థం:** ఉరుభుజ= గొప్పభుజాలు కలవాడా (బాహుబలం కలవాడా అనిభావం); బ్రహ్మ, మొదలుగన్= బ్రహ్మదేవుడు మొదలుకొని; వరుసన్+అ= పరంపరగా; నిరతంబున్= ఎల్లప్పుడూ; ఎడతెగక= విచ్ఛిన్నం కాకుండ (ఆగిపోకుండ); ఇట్లు= ఈవిధంగా; వచ్చిన, వంశంబు= సాగిన వంశం; నీవు+ఉండఁగన్= నీవు(మిగిలి) ఉండగానే; నీతరమునన్= నీ జీవితకాలంలోనే; విచ్ఛిన్నము+అగుట= తెగిపోవుట (వంశంలో వారసుడు లేకుండపోవటం); ధర్మువు+ఎ= ధర్మమా? (కాదని భావం); అనినన్= అని అనగా.

**తాత్పర్యం:** 'గొప్ప భుజబలం కలవాడా! బ్రహ్మదేవుడు మొదలుకొని పరంపరగా ఎక్కడా ఎప్పుడూ ఆగిపోకుండా ఈవిధంగా వచ్చిన ఈవంశం నీ వుండగానే, నీజీవితకాలంలోనే వంశపరంపర విచ్ఛిన్నం కావటం (తెగిపోయి ఆగిపోవటం) ధర్మమా? (ధర్మం కాదు) అని సత్యవతి అనగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **విని భీష్ముఁ డనియె 'మీ కి । ట్లని యానతి యీయఁదగునె? యమ్మెయి నాప**
**ల్కిన పల్కును మఱి నా తా । ల్చిన వ్రతమును జెఱుప నంత చిఱుతనె చెపుఁడా'.** **223**

**ప్రతిపదార్థం:** విని= సత్యవతి మాటలు విని; భీష్ముఁడు+అనియెన్= భీష్ముడు ఈవిధంగా అన్నాడు; మీకున్+ఇట్లు+అని, ఆనతి, ఈయన్, తగునె= మీరు ఈవిధంగా ఆజ్ఞాపించటం న్యాయమా?; ఆ+మెయిన్, నా పల్కిన, పల్కును= ఆ విధంగా నేను చేసిన ప్రతిజ్ఞను (శంతనుడికి సత్యవతివలన పుట్టిన సంతానానికే రాజ్యం చెందేటట్లు చూస్తా నని దాశరాజుకు ఇచ్చిన మాటను ఇక్కడ భీష్ముడు ప్రస్తావన చేస్తున్నాడు); మఱి= అంతేకాక; నా, తాల్చిన, వ్రతమును= నేను పూనిన (బ్రహ్మచర్య) వ్రతాన్నీ (సత్యవతి సంతానానికి సవతికొడుకుల పోరు రాకుండ భీష్ముడు బ్రహ్మచర్యవ్రతాన్ని స్వీకరించిన ప్రస్తావన ఇది); చెఱుపన్= పాడుచేసుకోటానికి; అంత, చిఱుతనె, చెపుఁడు+ఆ= అంత బాలుడినా (అవివేకినా) చెప్పండి.

**తాత్పర్యం:** సత్యవతి మాటలు విని భీష్ముడు ఈవిధంగా అన్నాడు - "మీకు ఈవిధంగా ఆజ్ఞాపించటం ఉచితమా? (కాదు). ఆ విధంగా ఆనాడు చేసిన ప్రతిజ్ఞనూ, అంతేకాక నేను చేపట్టిన బ్రహ్మచర్యవ్రతాన్నీ వమ్ముచేయటానికి నే నంత బాలుడినా? (అవివేకినా) చెప్పండి. (కాదని భావం).

**క.** **హిమకరుఁడు శైత్యమును, న । ర్యముఁడు మహాతేజమును, హుతాశనుఁ డుష్ణ**
**త్వము విడిచిరేని గుర్వ । ర్థము నాచేకొనిన సద్వ్రతంబు విడుతునే?** **224**

**ప్రతిపదార్థం:** హిమకరుఁడు= (చల్లని కిరణాలు కలవాడు); చంద్రుడు; శైత్యమును= చల్లదనాన్నీ; అర్యముఁడు= సూర్యుడు; మహత్+తేజమును= గొప్పదైన ప్రకాశాన్నీ; హుత+అశనుఁడు= (హోమము చేయబడిన ద్రవ్యాలే ఆహారంగా కలవాడు); అగ్ని; ఉష్ణత్వమున్= వేడిమినీ; విడిచిరి+ఏని= వదలినప్పటికిన్నీ; గురు+అర్థము= తండ్రికొరకు; నా, చేకొనిన= నేను చేపట్టిన; సత్+వ్రతంబు= ఉత్తమదీక్షను (బ్రహ్మచర్యవ్రతాన్ని); విడుతును+ఏ= విడిచిపెట్టుతానా? (విడువ నని భావం).

**తాత్పర్యం:** చంద్రుడు చల్లదనాన్నీ, సూర్యుడు అత్యంతప్రకాశాన్నీ, అగ్ని వేడిమినీ విడిచినప్పటికీ, నేనుమాత్రం తండ్రికొఱకు చేపట్టిన ఈ ఉత్తమవ్రతాన్ని విడుస్తానా? (విడువను అని భావం).

**వ.** **'పృథివ్యాది మహాభూతంబులు గంధాదిగుణంబుల నెట్లు విడువ వట్ల యేనును గురుకార్యంబున మీశుల్కార్థంబుగా సర్వజనసమక్షంబున నాచేసిన సమయస్థితి విడువ; నది యట్లుండె; మీయానతిచ్చినట్లు**

**నాయెఱుఁగని ధర్మువులు లేవు; శంతనుసంతానంబు శాశ్వతంబగునట్లుగ క్షత్త్రధర్మంబుసెప్పెద; నాచెప్పినదాని ధర్మార్థవిదు లయి లోకయాత్రానిపుణు లయిన పురోహితప్రముఖ నిఖిలబ్రాహ్మణవరులతో విచారించి చేయునది' యని భీష్ముఁ డందఱు విన ని ట్లనియె. 225**

**ప్రతిపదార్థం:** పృథివీ+ఆది, మహత్, భూతంబులు= భూమిమొదలైన గొప్పవైన పంచభూతాలు; గంధ+ఆది, గుణంబులను+ఎట్లు, విడువవు= వాసనమొదలైన సహజలక్షణాలను ఏవిధంగా వదలుకోవో; అట్లు+అ, ఏనును= ఆ విధంగానే నేనుకూడ; గురు, కార్యంబునన్, మీ శుల్క+అర్థంబుగా= తండ్రికొరకైన (వివాహ) కార్యంలో మీకివ్వవలసిన కట్నం కొరకుగా; సర్వ, జన, సమక్షంబునన్= జనులందరి ఎదుట; నా, చేసిన, సమయ, స్థితి= నేను చేసిన నియమవ్యవస్థను; విడువను= వదలను; అది, అట్లు+ఉండెన్= అది ఆవిధంగా ఉండనివ్వండి.; మీ, ఆనతి+ఇచ్చినట్లు= మీరు ఆజ్ఞాపించినట్లు (మీరు-బహువచన గౌరవవాచకం); నా, ఎఱుఁగని, ధర్మువులు, లేవు= నాకు తెలియని ధర్మాలు లేవు; శంతను, సంతానంబు, శాశ్వతంబు+అగునట్లుగన్= శంతనుడి సంతతి అవిచ్ఛిన్నంగా (శాశ్వతంగా) సాగుతూ ఉండేటట్లుగా; క్షత్త్ర, ధర్మంబు, చెప్పెదన్= క్షత్త్రియులు పాటించదగిన ధర్మాన్ని చెప్పుతాను; నా, చెప్పిన, దానిన్= నేను చెప్పిన ఆ ధర్మాన్ని; ధర్మ+అర్థ, విదులు, అయి= ధర్మముయొక్క ప్రయోజనాన్నిగురించి తెలిసినవారై; లోక, యాత్రా, నిపుణులు+అయిన= లోకం సాగేతీరును తెలిసిన నేర్పరులగు; పురోహిత, ప్రముఖ, నిఖిల, బ్రాహ్మణ, వరులతోన్= పురోహితుడు మొదలైన సమస్త బ్రాహ్మణశ్రేష్ఠులతో; విచారించి= ఆలోచించి; చేయునది= ఆచరించవలసింది; అని; భీష్ముఁడు; అందఱు; వినన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'భూమి మొదలైన పంచమహాభూతాలు గంధం మొదలైన సహజగుణాలను ఏవిధంగా విడువవో అట్లే నేనుకూడ తండ్రిగారి ప్రయోజనం కొరకు మీ కివ్వవలసిన కన్యాశుల్కం నిమిత్తం జనులందరిముందు నేను చేసిన ప్రతిజ్ఞయొక్క వ్యవస్థను నేను విడువను. అది అట్లుండ నివ్వండి. మీరు చెప్పినట్లు నాకు తెలియని ధర్మాలు లేవు. శంతనుడి సంతానం అవిచ్ఛిన్నంగా సాగుతూ ఉండేటట్లుగా క్షత్త్రియధర్మాన్ని ఒకదానిని చెప్పుతాను. నేను చెప్పినదానిని ధర్మప్రయోజనాన్నీ, లోకంపోకడ విధానాన్నీ తెలిసిన నిపుణులైన పురోహితులు మొదలైన సమస్త బ్రాహ్మణశ్రేష్ఠులతో ఆలోచించి చేయవలసింది' - అని భీష్ముడు అందరూ వినేటట్లు ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము - అనేవి పంచమహాభూతాలు. గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం - అనేవి (వరుసగా) వాటి సహజగుణాలు.

**చ. పితృవధజాతకోపపరిపీడితుఁ డై జమదగ్నిసూనుఁ డు**
**ద్ధతబలు హైహయున్ సమరదర్పితుఁ జంపి యశేషధారుణీ**
**పతుల వధించె గర్భగతబాలురు నాదిగ; నట్టిచోటఁ ద**
**త్సతులకుఁ దొల్లి ధర్మవిధి సంతతి నిల్పరె భూసురోత్తముల్. 226**

**ప్రతిపదార్థం:** జమదగ్ని, సూనుఁడు= జమదగ్నికుమారు డైన పరశురాముడు; పితృ, వధ, జాత, కోప, పరిపీడితుఁడు+ఐ= తండ్రియొక్క వధవలన కలిగిన కోపంచేత బాధపడినవాడై; ఉద్ధత, బలున్= గర్వంతోకూడిన బలంకలవాడిని; సమర, దర్పితున్= యుద్ధంలో మదించినవాడిని; హైహయున్= హైహయుడిని; చంపి; గర్భగత బాలురున్, ఆదిగన్= స్త్రీగర్భాలలోని బాలురు మొదలుకొని; అశేష, ధారుణీ, పతులన్= శేషంలేకుండా రాజులనందరిని; వధించెన్= చంపాడు; అట్టిచోటన్= ఆవిధంగా జరిగినపట్ల; తద్, సతులకున్= ఆ రాజపత్నులకు; తొల్లి= పూర్వం; ధర్మవిధిన్= ధర్మశాస్త్రనియమంప్రకారం; భూసుర+ఉత్తములు= బ్రహ్మణోత్తములు; సంతతి, నిల్పరు+ఎ?= సంతానాన్ని నిలిచేట్లుచేయరా? (చేశారనిభావం).

**తాత్పర్యం:** పరశురాముడు తనతండ్రి వధింపబడటంవలన కలిగిన కోపంచేత పీడితుడై మహాబలసమన్వితుడు, యుద్ధాలలో మదించివ్యవహరించేవాడూ అయిన హైహయుడిని చంపి, రాజపత్నుల గర్భాలలోఉన్న బాలురు మొదలు కొని రాజులనందరినీ ఎవ్వరూ మిగలకుండా చంపాడు. అటువంటి సందర్భంలో పూర్వం బ్రాహ్మణశ్రేష్ఠులు ధర్మశాస్త్రవిధిప్రకారం ఆ రాజపత్నులందు సంతానాన్ని కలిగించి వంశాలను నిలిపారు.

**దీర్ఘతముని వృత్తాంతము (సం. 1-98-6)**

**వ. మఱి యదియునుంగాక యుతథ్యుం డను మునివరుపత్ని మమత యనుదాని గర్భిణి నభ్యాగతుం డయి బృహస్పతి దేవరన్యాయంబున నభిలషించినఁ దదీయగర్భస్థుం డయిన పుత్త్రుం డెఱింగి యిది ధర్మవిరుద్ధం బని యాక్రోశించిన వానికి నలిగి బృహస్పతి 'సర్వభూతేప్సితం బైన యిక్కార్యంబునందు నాకుఁ బ్రతికూలుండ వయితివి కావున దీర్ఘతమంబును బొందు' మని శాపం బిచ్చిన, వాఁడును దీర్ఘతముండు నాఁ బుట్టి సకలవేదవేదాంగవిదుండయి జాత్యంధుం డయ్యును తనవిద్యాబలంబునఁ బెద్దకాలంబునకుఁ బ్రద్వేషిణి యను నొక్కబ్రాహ్మణి వివాహం బయి గౌతమాదు లయిన కొడుకులం బెక్కండ్రం బడసిన, నది లబ్ధపుత్త్రయై తన్ను మెచ్చుకున్న 'నిట్లేల నన్ను మెచ్చ?' వని దీర్ఘతముండు ప్రద్వేషిణి నడిగిన నది యి ట్లనియె. 227**

**ప్రతిపదార్థం:** సుస్పష్టం.

**తాత్పర్యం:** మరి అంతేకాక - ఉతథ్యుడు అనే మునియొక్క భార్యమమతఅనేపేరుగల వనితను గర్భిణిఅయిఉన్ననూ అభ్యాగతుడుగా వచ్చిన బృహస్పతి దేవరన్యాయాన్ని అనుసరించి కోరగా, ఆమెగర్భంలో ఉన్న బాలుడు దానిని తెలిసికొని అది ధర్మవ్యతిరేక మని పెద్దగా అరవగా, అందుకు బృహస్పతి కోపపడి 'జీవులందరిచేత కోరబడే ఈపనిలో నాకు వ్యతిరిక్తుడ వైనావు కాబట్టి దీర్ఘకాలం చీకటిని అనుభవించు' మని (గ్రుడ్డివాడ వగుమని) శాపంపెట్టగా, ఆతడు దీర్ఘతము డనే పేరున పుట్టి వేదాలనూ, వేదాంగాలనూ తెలిసికొని పుట్టుగ్రుడ్డి అయినప్పటికీ తనవిద్యాబలంతో చాలకాలం తరువాత ప్రద్వేషిణి అనే బ్రాహ్మణవనితను పెండ్లాడి గౌతముడు మొదలైన కొడుకులను అనేకులను పొందగా, ఆమె పుత్రవతి అయినప్పటికీ తనను మెచ్చుకుండగా 'ఎందుకు నన్ను ఈవిధంగా మెచ్చవు?' అని దీర్ఘతముడు ప్రద్వేషిణిని అడుగగా ఆమె ఈవిధంగా అన్నది.

**తే. పతియు భరియించుఁ గావున భర్తయయ్యెఁ; । భామ భరియింపఁబడుఁగాన భార్య యయ్యెఁ;**
**బరఁగ నవి మనయందు వీడ్వడియె నిన్ను । నేన యెల్లకాలము భరియింతుఁ గాన. 228**

**ప్రతిపదార్థం:** పతియున్= మగడు; భరియించున్, కావునన్= భార్యను భరిస్తాడు కాబట్టి; భర్త, అయ్యెన్= భర్త అని పిలువబడతాడు; భామ= ఇల్లాలు; భరియింపఁబడున్, కాన= భర్తచేత భరింపబడుతుంది కాబట్టి; భార్య, అయ్యెన్= భార్య అనబడుతున్నది; పరఁగన్= ఒప్పగా; అవి= ఆ భార్యాభర్తలస్వభావాలు; నిన్నున్, నేను+అ; ఎల్లకాలము; భరియింతున్= భరిస్తాను, పోషిస్తాను; కాన= కాబట్టి; మన, అందున్= మనపట్ల; వీడ్వడియెన్= వేరుపడ్డాయి, (తిరగబడ్డాయి).

**తాత్పర్యం:** భార్యను భరిస్తాడు కాబట్టి మగడిని 'భర్త' అని పిలుస్తారు. భర్తచేత భరింపదగింది కాబట్టి ఇల్లాలిని 'భార్య' అని అంటారు. నేను నిన్నే యెల్లకాలం భరిస్తూ (పోషిస్తూ) ఉంటాను కాబట్టి అదిమనపట్ల వ్యత్యస్తమైనది (ఆ సంబంధం).

**ఆ. 'ఎంతకాల మయిన నిప్పాట భరియింప । నోప నింక నరుగు మొండుకడకు'**
**ననిన నిర్దయాత్మ లని దీర్ఘతముఁ డల్గి । సతుల కెల్ల నపుడు శాప మిచ్చె. 229**

**ప్రతిపదార్థం:** ఎంత, కాలము+అయినన్= ఎంతకాలమైననూ; ఈ+పాటన్= ఇదే విధంగా; భరియింపన్, ఓపన్= భరింప(పోషింప) జాలను; ఇంకన్= ఇకమీద; ఒండు, కడకున్= మరొకచోటికి; అరుగుము= వెళ్ళుము; అనినన్= అనగా; దీర్ఘతముఁడు; అల్గి= కోపించి; నిర్దయ+ఆత్మలు+అని= ఆడువారు దయలేని హృదయాలు కలవా రని; సతులకున్+ఎల్లన్= ఇల్లాండ్ర కందరికి; అపుడు; శాపము+ఇచ్చెన్= శాపం పెట్టాడు.

**తాత్పర్యం:** 'ఎంతకాల మయినా ఇదేవిధంగా భరించవలసివస్తే నేను భరించలేను; ఇక నీవు మరొకచోటికి వెళ్ళుము' అనగా స్త్రీలు దయలేని హృదయాలు కలిగినవా రని దీర్ఘతముడు కోపించి ఇల్లాండ్రకందరికి అప్పుడు శాపం పెట్టాడు.

**క. పతిహీన లయిన భామిను । లతిధనవతు లయ్యుఁ గులజ లయ్యును ననలం**
**కృత లయ్యెడు మాంగల్యర । హిత లయ్యెడుఁ గృపణవృత్తి నిదియు మొదలుగన్. 230**

**ప్రతిపదార్థం:** పతి, హీనలు+అయిన, భామినులు= భర్త చనిపోయిన వనితలు; అతి, ధనవతులు+అయ్యున్= ఎక్కువ ధనం కలవారైననూ; కులజలు+అయ్యునున్= ఉత్తమకులాలలో పుట్టినవారైననూ; ఇదియున్, మొదలుగన్= ఇప్పటినుండి; కృపణవృత్తిన్= దయనీయంగా; అనలంకృతలు+అయ్యెడున్= అలంకారాలు లేనివా రౌతారు గాక; మాంగల్య, రహితలు+అయ్యెడున్= తాళి లేని వారౌతారు గాక!

**తాత్పర్యం:** భర్తలను కోల్పోయిన భార్యలు ఎంతటి ధనవతు లైనా, ఉత్తమకులాలలో పుట్టినవారైనా ఇప్పటినుండి దయనీయంగా అలంకారాలు లేనివారుగా, తాళిలేనివారుగా అయ్యెదరుగాక! (ఇది దీర్ఘతము డిచ్చిన శాపం).

**వ. అనిశాపంబిచ్చిన దీర్ఘతమునకు నలిగి ప్రద్వేషిణి 'యిమ్ముదుకని నెటయేనియుం గొనిపొం' డని తనకొడుకులం బంచిన, వారును నయ్యౌతథ్యు నతివృద్ధు జాత్యంధు నింధనంబులతో బంధించి మోహాంధులయి గంగలో విడిచిన, నమ్మునియునుబ్రవాహవేగంబునఁబెక్కుదేశంబులుగడచి చనియె; నంత నొక్కనాఁడు బలియనురాజు గంగాభిషేకార్థంబు వచ్చినవాఁ డయ్యింధన బంధనంబున నుండియు నుదాత్తానుదాత్త స్వరిత ప్రచయస్వరభేదంబు లేర్పడ సలక్షణంబుగా వేదంబులం జదువుచుఁ, దరంగ ఘట్టనంబునం దనయున్నదరిం జేరవచ్చినవానిఁ దీరంబుఁ జేర్చి, యింధనబంధనంబులు విడిచి, మహర్షి మామతేయుంగా నెఱిఁగి, తన్నెఱింగించుకొని నమస్కారంబు సేసి యి ట్లనియె. 231**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** అని శాపం పెట్టిన దీర్ఘతముడిపై కోపించి ప్రద్వేషిణి 'ఈముసలివాడిని ఎక్కడికైనా తీసికొనిపోండి' అని తన కొడుకులను ఆజ్ఞాపించింది. వారు మిక్కిలి ముసలివాడు, పుట్టుగ్రుడ్డి అయిన ఆ ఉతథ్యుడి కుమారుడైన దీర్ఘతముడిని కట్టెలతో కలిపికట్టి గర్వాంధు లై గంగలో విడిచిపెట్టారు. ఆ ముని గంగాప్రవాహవేగంలో అనేకదేశాలు దాటి వెళ్ళాడు. అంత, ఒకనాడు బలి అనేరాజు గంగాస్నానంకొరకు వచ్చి కొయ్యలకు కట్టబడిఉండికూడ ఉదాత్త,

అనుదాత్త స్వరిత ప్రచయస్వరముల భేదం స్పష్టంగా తెలిసేటట్లు లక్షణసహితంగా వేదాలను చదువుతూ అలలతాకిడికి తా నున్న తీరానికి చేరరాగా, అతడిని ఒడ్డుకు చేర్చి కట్టెలకు కట్టిన కట్లను విప్పి మమతాపుత్రుడూ, మహర్షీ అయిన దీర్ఘతము డని తెలిసికొని, తనను అతనికి తెలియచెప్పుకొని నమస్కరించి ఈవిధంగా అన్నాడు.

**క. ఎందుండి వచ్చి తిందుల । కెందుల కేఁగుదు మహామునీశ్వర ! విద్వ**
**ద్వందిత! నాపుణ్యంబునఁ । జెందితి ని న్నిష్టఫలముఁ జెందిన పాటన్. 232**

**ప్రతిపదార్థం:** మహత్+ముని+ఈశ్వర= గొప్పమునులలో శ్రేష్ఠుడైనవాడా!; విద్వత్+వందిత= విద్వాంసులచేత నమస్కరింపబడినవాడా!; ఎందున్+ఉండి, ఇందులకున్+ వచ్చితి(వి)= ఎక్కడినుండి ఇక్కడికి వచ్చావు?; ఎందులకున్+ఏఁగుదు(వు)= ఎక్కడికి పోతావు?; ఇష్ట, ఫలము, చెందిన, పాటన్= కోరినకోర్కె ఫలించిన విధంగా; నిన్నున్; నా, పుణ్యంబునన్= నాపుణ్యంవలన; చెందితిన్= పొందాను.

**తాత్పర్యం:** మహామునిశ్రేష్ఠుడా! విద్వాంసుల నమస్కృతు లందుకొన్నవాడా! ఎక్కడినుండి ఇక్కడికి వచ్చావు? ఎక్కడికి పోతావు? నాకోర్కె ఫలించి నన్ను పొందినట్లు నాపుణ్యవశంగా నిన్ను చూడగలిగాను.

**వ. 'ఏనపుత్త్రకుండనై యెవ్విధంబునను సంతానంబు వడయనేరకున్నవాఁడ; నాకు సంతానదానంబు దయసేయు' మని యతనిం బూజించి తనపురంబునకుం దోడ్కొని చని, ఋతుమతి యై యున్న తనదేవి సుదేష్ణ యనుదాని సమర్పించిన, నదియును. 233**

**ప్రతిపదార్థం:** సుస్పష్టం.

**తాత్పర్యం:** 'నేను కొడుకులు లేనివాడి నై ఏవిధంగానూ సంతతిని పొందలేకుండా ఉన్నాను. నాకు సంతానదానం దయతో చేయుము' అని అతడిని గౌరవించి తననగరానికి తీసికొనిపోయి, ఋతుస్నాం చేసియున్న తనరాణి యైన సుదేష్ణను అతనికి అర్పించగా, ఆమె

**ఆ. పుట్టుఁ జీకు వృద్ధుఁ బూతిగంధాననుఁ । వేదజడునిఁ బొంద వెలఁది రోసి,**
**తన్నపోనిదానిఁ దన్విఁ గోమలిఁ దన । దాదికూఁతుఁ బంచెఁ దపసికడకు. 234**

**ప్రతిపదార్థం:** పుట్టు, చీకు= పుట్టుకతోనే గ్రుడ్డివాడు అయినవాడిని; వృద్ధున్= ముసలివాడిని; పూతి, గంధ+ఆననున్= దుర్గంధం (చెడువాసన) గల ముఖం (నోరు) కలవాడిని; వేద, జడునిన్= వేదంతప్ప మరొక విషయం తెలియని మూఢుడిని; పొందన్= కలియుటకు; వెలఁది= వనిత (రాణి); రోసి= అసహ్యించుకొని; తన్నున్+అ= తనను అన్నివిధాలా; పోని, దానిన్= పోలినదానిని; తన్విన్= సన్ననినడుము కలిగినదానిని; కోమలిన్= మృదువైనదానిని; తన, దాది, కూఁతున్= తనను పెంచినదాదియొక్క కూతురును; తపసి, కడకున్, పంచెన్= ఋషివద్దకు పంపింది.

**తాత్పర్యం:** పుట్టుగ్రుడ్డి, ముసలివాడు, దుర్గంధం వచ్చేనోరు కలవాడు, వేదంతప్ప మరొక విలాసం తెలియని అరసికుడు అయిన ఆ మునిని పొందటానికి రాణి ఏవగించుకొని, తనను అన్నివిధాలా పోలి ఉన్న సన్ననినడుముగలిగి, కోమలి అయిన తన దాదికూతురును మునిచెంతకు పంపించింది.

**వ. ఆ దీర్ఘతముండును దానివలనఁ గాక్షీవదాదుల నేకాదశపుత్త్రులం బుట్టించిన బలియును సంతసిల్లి 'వీరలు నాపుత్త్రకులే?' యనిన నమ్ముని వాని కి ట్లనియె. 235**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** ఆ దీర్ఘతముడున్నూ ఆ దాదికూతురువలన కాక్షీవదుడు మొదలైన పదకొండుమంది కొడుకులను పుట్టించగా బలి సంతోషించి వీరందరు నాకొడుకులేనా! అని అడుగగా ఆ ముని ఆ రాజుతో ఈవిధంగా అన్నాడు.

**క. వీరలు నీకులపుత్త్రులు । గారు; భవద్దేవి దాదిగాదిలిసుతకున్**
**భూరిభుజ! యుద్భవించిన । వారు మహాధర్మపరు లవారితసత్త్వుల్. 236**

**ప్రతిపదార్థం:** భూరిభుజ= ఘనమైన భుజాలు కలవాడా!; వీరలు= వీరు; నీ, కుల, పుత్త్రులు, కారు= నీవంశంలో పుట్టిన కొడుకులు కారు; భవత్, దేవి, దాది, గాదిలిసుతకున్, ఉద్భవించిన, వారు= నీయొక్కరాణియొక్కదాదియొక్క ముద్దులకూతురుకు పుట్టినవారు; మహత్+ధర్మ, పరులు= గొప్పదైన ధర్మంలో ఆసక్తి కలవారు; అవారిత, సత్త్వుల్= వారించటానికి వీలు కాని బలం కలవారు.

**తాత్పర్యం:** మహాభుజా! ఈ పుట్టినవారు నీవంశంలో పుట్టినవారు కారు. నీరాణియొక్క దాదిముద్దులకూతురుకు పుట్టినవారు. వీరు ఉత్తమధర్మపరాయణులు, ఎదురులేని బలశక్తి కలవారు.

**వ. అనిన నబ్బలి సంతానార్థి గావున వెండియు నమ్మునిం బ్రార్థించి తత్ప్రసాదంబు వడసి సుదేష్ణ నియోగించిన దీర్ఘతముండును దానియంగంబులెల్ల నంటిచూచి 'వంశకరుండును మహాసత్త్వుండును నయ్యేడు కొడుకు నీకుం బుట్టు' నని యనుగ్రహించిన, దానికి నంగరాజను రాజర్షి పుట్టె; నివ్విధంబున నుత్తమ క్షత్త్రియక్షేత్త్రంబులందు ధర్మమార్గంబున బ్రాహ్మణులవలనం బుట్టివంశకరు లయిన క్షత్త్రియు లనేకులు గలరు. 237**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; ఆ+బలి= ఆ బలిమహారాజు; సంతాన+అర్థి, కావున= సంతానాన్ని కోరువాడు కాబట్టి; వెండియున్= మరల; ఆ+మునిన్= దీర్ఘతముడిని; ప్రార్థించి= వేడికొని; తద్+ప్రసాదంబు, పడసి= అతని అనుగ్రహం పొంది; సుదేష్ణ= సుదేష్ణఅనేపేరుగల తన రాణిని; నియోగించినన్= అతని పొందుకై ఆజ్ఞాపించగా; దీర్ఘతముండును; దాని, అంగంబులు+ఎల్లన్, అంటి చూచి= ఆమె శరీరభాగాలన్నీ చేతితో తాకి(చూచి); వంశ, కరుండును= వంశాన్ని నిలువబెట్టేవాడున్నూ; మహత్+సత్త్వుండును= గొప్పబలంకలవాడున్నూ; అయ్యేడు, కొడుకు, నీకున్, పుట్టును; అని; అనుగ్రహించినన్= కరుణించగా; దానికిన్= సుదేష్ణకు; అంగరాజు+అను, రాజర్షి (రాజ+ఋషి), పుట్టెన్= అంగరాజు అనేపేరుతో ఋషిత్వం సాధించిన రాజు పుట్టాడు; ఈ+విధంబునన్; ఉత్తమ, క్షత్త్రియ, క్షేత్త్రంబులందున్= ఉత్తము లైన క్షత్త్రియులయొక్క భార్యలయందు; ధర్మ, మార్గంబునన్= ధర్మపద్ధతిలో; బ్రాహ్మణులవలనన్; పుట్టి; వంశకరులు; అయిన; క్షత్త్రియులు; అనేకులు= పెక్కుమంది; కలరు= ఉన్నారు.

**తాత్పర్యం:** అని పలుకగానే ఆ బలిమహారాజు సంతానాన్ని కోరుకొన్నవాడు కాబట్టి మరల ఆ మునిని వేడికొని, అతడి అనుమతిని పొంది తనరాణి యైన సుదేష్ణను ఋషితోడి పొందుకు నియమించాడు. ఆ దీర్ఘతముడు ఆమె శరీరభాగాల నన్నంటిని చేతితో తాకి వంశాన్ని నిలుపగలిగినవాడూ; గొప్పబలవంతుడూ, అయ్యేకొడుకు నీకు

జన్మిస్తాడని వరమీయగా సుదేష్ణకు అంగరాజు అనేపేరుగల రాజర్షి పుట్టాడు. ఈవిధంగా ఉత్తమక్షత్రియుల భార్యలయందు ధర్మమార్గంలో బ్రాహ్మణులవలన పుట్టి, వంశోద్ధారకు లైన క్షత్రియులు అనేకులు ఉన్నారు.

### సత్యవతి భీష్మని యనుమతంబున వ్యాసుని సోదరక్షేత్రములయందు సంతానమును బడయు మని నియోగించుట (సం. 1-99-1)

**క. కావున నియతాత్ము జగ। త్పావను ధర్మస్వరూపు బ్రాహ్మణుఁ బడయం**
**గావలయు; వాఁడు సంతతిఁ। గావించు విచిత్రవీర్యకక్షేత్రములన్. 238**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నియత+ఆత్మున్= నిగ్రహింపబడిన హృదయం కలవాడున్నూ; జగత్, పావనున్= లోకాన్ని పావనంచేసేవాడూ; ధర్మ, స్వరూపున్= ధర్మమే రూపం తాల్చినవాడూ; (అయిన) బ్రాహ్మణున్= బ్రాహ్మణుడిని; పడయం, గావలయున్= పొందాలి; వాఁడు= అతడు; విచిత్రవీర్యక, క్షేత్రములన్= విచిత్రవీర్యుడియొక్క భార్యలందు; సంతతిన్= సంతానాన్ని; కావించున్= పుట్టిస్తాడు.

**తాత్పర్యం:** కావున మనోనిగ్రహం కలవాడు, లోకపావనుడు, ధర్మమూర్తి అయిన ఒక బ్రాహ్మణుడిని పొందగలగాలి. అతడు విచిత్రవీర్యుడి భార్యలయందు సంతతిని కలిగిస్తాడు.

**వ. అనిన భీష్మపలుకులకు సంతోషించి సత్యవతి దొల్లి దనకన్యయైయున్నకాలంబునఁ బరాశరుండు దన్నుఁ గామించుటయు, నమ్మునివరంబునఁ దనకన్యాత్వంబు దూషితంబు గాకునికియుఁ, దత్ప్రసాదంబునం జేసి యమునాద్వీపంబునఁ గృష్ణద్వైపాయనుండు గానీనుం డయి సద్యోగర్భంబునఁ బుట్టి పనిగలయప్పుడ తన్నుఁ దలంచునది యని చెప్పితపోవనంబునకుం జనుటయును భీష్మనకుంజెప్పి, 'నిజతపోదహన దగ్ధపాపేంధనుం డయిన కృష్ణద్వైపాయనుం డఖిలధర్మమూర్తి నిత్యసత్యవచనుండు నా నియోగంబున నీ యనుమతంబున భవద్భ్రాతృక్షేత్రంబులయందు సంతానంబు వడయు' ననిన, నమ్మహర్షి కీర్తనంబు విని భీష్ముండు కరకమలంబులు మోగిచి వ్యాసభట్టారకుఁ డున్న దిక్కునకు మ్రొక్కి 'తొల్లి జగంబు లుత్పాదించిన యాదిమబ్రహ్మకుం గల సామర్థ్యంబు గల వేదవ్యాసుం డిక్కురువంశంబుఁబ్రతిష్ఠించునది యెల్లవారికి నభిమతంబ' యనిన, సత్యవతి కురువంశోద్వహనార్థంబు పారాశర్యుం దలంచుడు నాక్షణంబ. 239**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; భీష్మ, పలుకులకున్= భీష్మనియొక్క మాటలకు; సంతోషించి= ఆనందించి; సత్యవతి; తొల్లి= పూర్వం; తన, కన్య, ఐ, ఉన్న, కాలంబునన్= తాను కన్యగా ఉన్నకాలంలో; పరాశరుండు; తన్ను, కామించుటయున్= తనను కోరుటయున్నూ; ఆ+ముని, వరంబునన్= ఆ మునియొక్క అనుగ్రహంతో; తన, కన్యాత్వంబు, దూషితంబు, కాక, ఉనికియున్= తన కన్యాభావం దోషంలేకుండ ఉండుటయున్నూ; తద్, ప్రసాదంబునన్, చేసి= అతనిదయవలన; యమునా, ద్వీపంబునన్= యమునానదిలోని ఒకద్వీపంలో; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; కానీనుండు+అయి= కన్యకు పుట్టినవాడై; సద్యస్+గర్భమునందున్= వెంటనే ఏర్పడిన గర్భంలో; పుట్టి; పని, కల, అప్పుడు+అ, తన్ను, తలంచునది, అని= అవసరం వచ్చినప్పుడు వెంటనే తనను స్మరించునది, అని; చెప్పి; తపోవనంబునకున్= తపస్సు చేసికొనే అరణ్యానికి; చనుటయును= వెళ్లుటనుగూర్చి; భీష్మనకున్, చెప్పి; నిజ, తపః, దహన, దగ్ధ, పాప+ఇంధనుండు+అయిన= తనదైన తపస్సు అనే అగ్నిచేత దహింపచేయబడిన పాపము అనే వంటచెరకు కలవాడు అయిన (తపోఽగ్నిచేత పాపాన్ని తొలగించుకొన్నవాడు

అనిభావం); కృష్ణద్వైపాయనుండు; అఖిల, ధర్మ, మూర్తి= సమస్తధర్మాలు మూర్తికట్టినవాడు; నిత్య, సత్య, వచనుండు= ఎల్లప్పుడు సత్యాన్నే పలికేవాడు; నా, నియోగంబునన్= నా ఆజ్ఞవలన; నీ, అనుమతంబునన్= నీఅనుమతితో; భవత్+భ్రాతృ, క్షేత్రంబులయందున్= నీయొక్క తమ్ముని భార్యలయందు; సంతానంబు, పడయును, అనినన్= సంతానాన్ని పొందుతాడు అని చెప్పగా; ఆ+మహర్షి, కీర్తనంబు, విని= ఆ గొప్పమునియైన వ్యాసుని ప్రశంస విని; భీష్ముండు; కరకమలంబులు, మొగిచి= తామరలవంటి చేతులు జోడించి; వ్యాసభట్టారకుఁడు; ఉన్న; దిక్కునకున్, మ్రొక్కి= నమస్కరించి; తొల్లి= పూర్వం; జగంబులు= లోకాలను; ఉత్పాదించిన= సృష్టించిన; ఆదిమ, బ్రహ్మకున్, కల, సామర్థ్యంబు, కల, వేదవ్యాసుండు= ఆద్యు డైన బ్రహ్మ కున్న నేర్పు కల వేదవ్యాసుడు (వేదాలను విభజించటంవలన వేదవ్యాసుడని పిలువబడతాడు); ఈ+కురు, వంశంబున్, ప్రతిష్ఠించును= ఈ కురువంశాన్ని నిలువబెట్టుతాడు; అది, ఎల్లవారికిన్, అభిమతంబు+అ, అనినన్= అది అందరికీ ఆమోదమే అని అనగా; సత్యవతి; కురువంశ+ఉద్వహన+అర్థంబు= కురువంశాన్ని ఉద్ధరించటంకొరకై; పారాశర్యున్= పరాశరుని కుమారుడైన వ్యాసుడిని; తలంచుడున్= స్మరించగా; ఆ క్షణంబు+అ= అప్పుడే.

**తాత్పర్యం:** ఆ విధంగా అనగా భీష్ముడిమాటలకు సత్యవతి సంతోషపడి, పూర్వం తాను కన్యగా ఉన్నప్పుడు పరాశరమహర్షి తనను కోరటం, ఆ మునివరంవలన తన కన్యాత్వం దోషంలేకుండా ఉండటం, అతడి దయవలన యమునానదిలోని ద్వీపంలో వ్యాసుడు కన్యకుపుట్టినవాడుగా తనకు జన్మించటం, తనకెప్పుడైనా పనిపడినట్లైతే వెంటనే తనను తలంచుకొమ్మని చెప్పి అతడు తపోవనానికి పోవటం భీష్ముడికి చెప్పింది. 'కృష్ణద్వైపాయనుడు(వ్యాసుడు) తన తపస్సు అనే అగ్నితో పాపాలు అనే కట్టెలను కాల్చివేసిన తేజస్వి, సమస్తధర్మాలను తెలిసినవాడు. ఎల్లప్పుడూ సత్యం మాటాడేవాడు. నా ఆజ్ఞచేతనూ నీ అంగీకారంవలననూ నీ తమ్ముడి భార్యలందు సంతానాన్ని పొందుతాడు' అని అన్నది సత్యవతి. భీష్ముడు ఆ మహర్షి ప్రశంస విని చేతులు జోడించి వ్యాసుడున్న దిక్కుకు తిరిగి మ్రొక్కి 'పూర్వం లోకాలను సృష్టించిన మొదటిబ్రహ్మదేవుడికున్న సామర్థ్యంగల వేదవ్యాసుడే ఈ కురువంశాన్ని నిలపాలి. ఇది అందరికి అంగీకారమే' అని అనగా సత్యవతి కురువంశాన్ని ఉద్ధరించటంకొరకు వేదవ్యాసుడిని మనసులో తలచుకోగానే వెంటనే. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. నీలగిరీంద్ర శృంగమున నిర్మల మైన సువర్ణవల్లరీ**
**జాలమువోని పింగళవిశాలజటాచయ మొప్పఁగా వచ**
**శ్శ్రీలలితుండు వచ్చి నిలిచెన్ హరినీలవినీల విగ్రహో**
**రాళరుచుల్ వెలుంగఁగఁ బరాశరసూనుఁడు తల్లిముందటన్. 240**

**ప్రతిపదార్థం:** నీలగిరి+ఇంద్ర, శృంగమునన్= శ్రేష్ఠమైన నల్లనికొండయొక్క శిఖరంమీద; నిర్మలము+ఐన= స్వచ్ఛమైన; సువర్ణ, వల్లరీ, జాలము, పోని= బంగారుతీగల సమూహంవంటి; పింగళ, విశాల, జటా, చయము+ఒప్పఁగాన్= గోరోజనం వంటి రంగు గలిగి వ్యాపించి ఉన్న జడలయొక్క సమూహం అందంగా ఉండగా; వచస్+శ్రీ, లలితుండు= వాక్కు అనెడి సంపదచేత మృదువైనవాడు (మృదువైనవాక్కులనెడి సంపద కలవాడు); హరినీల, వినీల, విగ్రహ+ఉరాళరుచుల్, వెలుంగఁ గన్= ఇంద్రనీలం అనే రత్నంవలె దట్టమైన నీలవర్ణం గల ఆకారంనుండి వెలువడే కాంతులు; వెలుంగఁగన్= ప్రకాశించగా; పరాశర, సూనుఁడు= పరాశరమహర్షికి సత్యవతియందు పుట్టినవాడైన వ్యాసుడు; వచ్చి= వచ్చి; ముందటన్= తల్లిఎదుట; నిలిచెన్= నిలిచాడు.

**తాత్పర్యం:** శ్రేష్ఠమైన నల్లనికొండయొక్క శిఖరంమీది అచ్చమైన బంగారు తీగల సమూహం వలె గోరోజనంవంటి రంగుతో వ్యాపించిఉన్న జడలసమూహంతో ఒప్పారి మృదువైన మాట లనెడి సంపదతో కూడిన వేదవ్యాసుడు ఇంద్ర నీలం అనే మణివలె నీలకాంతులు ప్రకాశిస్తూ ఉండగా వచ్చి తల్లిముందట నిలిచాడు.

**విశేషం:** అలం: ఉపమ. నవరత్నాలలో ఒకటి నీలం, వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్య, నీల, ప్రవాళ, ముత్యాలు నవరత్నాలు. ఈ పద్యరచనలో శ్లేషము అనే శబ్దగుణం, అక్షరరమ్యత గమనింపదగినవి.

**వ. సత్యవతియును బెద్దకాలంబునకు వచ్చిన యాప్రథమపుత్త్రు నతిహర్షంబునం గౌఁగిలించుకొని యవిరళపయోధారల నానందబాష్పధారలం జేసి యభిషేకించుచున్న, నమ్మునివరుండును దల్లి బాష్పజలంబులు దుడిచి యభివాదనంబు సేసి పురోహితపురస్సరభూసురవరులతో విధిపూర్వకంబుగా భీష్ముండు సేసిన యర్ఘ్యాదిపూజలు సేకొని సుఖాసీనుం డై యున్న, నమ్మహామునిఁ గుశలం బడిగి సత్యవతి యి ట్లనియె. 241**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** చాలకాలం తరువాత వచ్చిన ఆ మొదటికొడుకును సత్యవతి అమితసంతోషంతో కౌగిలించుకొని తెరపిలేకుండ స్రవించే చనుబాలధారలతోనూ, ఆనందంతో కలిగిన కన్నీటిధారలతోనూ అభిషేకిస్తూ ఉండగా, ఆ మునిశ్రేష్ఠుడు తల్లికన్నీటిని తుడిచి నమస్కరించాడు. పురోహితుడిని ముందుంచుకొని బ్రాహ్మణశ్రేష్ఠులతో కలసి నియమానుసారంగా భీష్ము డిచ్చిన అర్ఘ్యాద్యతిథిపూజలు గ్రహించాడు. ఆ పై సుఖంగా అసనంమీద కూర్చుండి ఉండగా సత్యవతి ఆ మహామునిని క్షేమాదులు అడిగి ఈ విధంగా అన్నది.

**క. జనకునకును స్వామిత్వము । తనయోద్దేశమునఁ గలిమి తథ్యమ; యది య**
**జ్జననికిఁ గలుగున కావునఁ । జనుఁ బనిఁ బంపంగ నిన్ను జననుత! నాకున్, 242**

**ప్రతిపదార్థం:** తనయ+ఉద్దేశమునన్= కొడుకునుబట్టి; జనకునకును= తండ్రికి; స్వామిత్వము= ప్రభుత్వం, ఆజ్ఞ ఇచ్చే అధికారం; కలిమి= కలిగిఉండటం; తథ్యము+అ= నిజం; అది= ఆ ప్రభుత్వం, అధికారం, ఆ+జననికిన్= ఆతల్లికికూడ; కలుగును+అ= తప్పక కలుగుతుంది; కావునన్= కాబట్టి; జననుత= ప్రజలచేత ప్రశంసింపబడినవాడా! (వ్యాసా!); నాకున్; నిన్నున్; పనిన్, పంపంగన్= ఈ పని చేయుమని ఆజ్ఞాపించటం; చనున్= ఉచితమే ఔతుంది.

**తాత్పర్యం:** కొడుకుల లక్ష్యంలో తండ్రికి ఆజ్ఞాపించే అధికారం తప్పకుండా ఉంటుంది; అట్లాగే తల్లికికూడ అటువంటి అధికారం కలుగుతుంది కాబట్టి లోకంచేత కీర్తింపబడే వ్యాసుడా! నీకు పనిచెప్పి చేయు మని ఆజ్ఞాపించటం నాకు ఉచితమే ఔతుంది.

**చ. అనుపమరాజ్యసంపదకు నర్హుఁడు వంశము విస్తరింపనో**
**పినసుచరిత్రుఁ డీసుతుఁడు భీష్ముఁడు; దొల్లియుఁ దండ్రికిం బ్రియం**
**బనఘుఁడు సేయుచుండి నిఖిలావనిరాజ్యనివర్తనంబునుం**
**దనరఁగ బ్రహ్మచర్యమును దాల్చె జగద్విదితప్రతిజ్ఞుఁ డై. 243**

**ప్రతిపదార్థం:** అనుపమ, రాజ్య, సంపదకున్, అర్హుఁడు= సాటిలేని రాజ్య మనే సంపదకు యోగ్యుడైనవాడున్నూ; వంశము, విస్తరింపన్, ఓపిన, సుచరిత్రుఁడు= వంశాన్ని వృద్ధిచేయ గల మంచిప్రవర్తన కలవాడున్నూ; (అయిన); భీష్ముడు; తొల్లియున్= పూర్వం; అనఘుఁడు= పాపరహితుఁడైనవాడు (భీష్ముడు); ఈ సుతుఁడు= ఈ కుమారుడు; తండ్రికిన్= తండ్రియైన శంతనుడికి; ప్రియంబు= సంతోషాన్ని; చేయుచున్+ఉండి= కలిగిస్తూఉండి; నిఖిల+అవని, రాజ్య, నివర్తనంబునున్= సమస్తమైన భూసామ్రాజ్యాన్ని త్యజించటమూ; బ్రహ్మచర్యమును= వివాహముచేసికొనకుండ ఉండేవ్రతమూ; తనరఁగన్= ఒప్పునట్లుగా; జగత్+విదిత, ప్రతిజ్ఞుఁడు+ఐ= లోకానికి తెలియబడిన ప్రతిజ్ఞకలవాఁడై (లోకంలో ప్రసిద్ధికెక్కేటట్లు ప్రతిజ్ఞచేసినవాడై అనిభావం); తాల్చెన్= ధరించాడు.

**తాత్పర్యం:** సాటిలేని రాజ్యసంపదకు అర్హత కలవాడూ, వంశాన్ని విస్తరింపజేయగల ఉత్తమప్రవర్తన కలవాడూ, పాపరహితుడూ అయిన ఈకుమారుడు భీష్ముడు, పూర్వం తన తండ్రికి సంతోషాన్ని కలిగిస్తూ సకలసామ్రాజ్యాన్ని త్యజించి, బ్రహ్మచర్యవ్రతాన్ని ఒప్పారగా తాల్చి లోకంలో ప్రసిద్ధి కెక్కేటట్లు ప్రతిజ్ఞ చేశాడు.

**విశేషం:** భీష్ముని వర్ణనం కాంతి అనే శబ్దగుణప్రధానంగా సాగటం సముచితంగా ఉన్నది.

**క. ఈయన్వయవిచ్ఛేదము । నీ యెఱుఁగని యదియె సన్మునిస్తుత! జగముల్**
**నీయంద నిలిచినవి గా । వే యిక్కాలత్రయప్రవృత్తులతోడన్. 244**

**ప్రతిపదార్థం:** ఈ, అన్వయ, విచ్ఛేదము= ఈవంశం(పరంపర)సాగక ఇంతటితో తెగిపోవటం; నీ, ఎఱుఁగని, అదియె?= నీకు తెలియనిదా?; సత్+ముని, స్తుత= ఉత్తములైన ఋషులచేత కీర్తింపబడేవాడా! (వ్యాసుడా!); ఈ+కాల, త్రయ, ప్రవృత్తుల తోడన్= భూత, భవిష్యత్, వర్తమానా లనే మూడుకాలాలయొక్క స్వభావాలతో కూడిన; జగముల్= లోకాలు; నీ, అందున్+అ, నిలిచినవి, కావే= నీయందే ఉన్నవికదా!

**తాత్పర్యం:** ఈ వంశం ఇంతటితో ఆగిపోవటం (ఈవంశసంతతి పరంపర ఇంతటితో తెగిపోవటం) నీకు తెలియనిది కాదుకదా! మహామునులచే స్తుతింపబడే నీయందే మూడుకాలాలస్వభావాలతో మసలే జగత్తంతా నిలిచిఉన్నదికదా! (నీవు సర్వకాలసర్వజ్ఞుడవు అనిభావం).

**క. ధృతి నీయనుజుం డై వి । శ్రుతుఁ డైన విచిత్రవీర్యు సుక్షేత్రములన్**
**సుతులం బడయుము కుల మవి । రతసంతతి నెగడ దేవరన్యాయమునన్. 245**

**ప్రతిపదార్థం:** నీ, అనుజుండు+ఐ= నీతమ్ముడై; విశ్రుతుఁడు+ఐన= కీర్తికెక్కినవాడైన; విచిత్రవీర్యు, సుక్షేత్రములన్= విచిత్రవీర్యునియొక్క భార్యలయందు, ధృతిన్= సంతోషంతో; దేవరన్యాయమునన్= దేవరన్యాయంతో (క్షత్రియవంశం సంతతిలేకుండ విచ్ఛిన్నమైపోతున్నప్పుడు ఉత్తమబ్రాహ్మణుడివలన క్షత్రియవనితలయందు సంతానం పొందటం దేవరన్యాయం); కులము= వంశం; అవిరత, సంతతి, నెగడన్= ఆపు లేని సంతానంతో వర్ధిల్లగా సుతులన్, పడయుము= కొడుకులను పొందుము.

**తాత్పర్యం:** నీతమ్ముడుగా ప్రసిద్ధి చెందిన విచిత్రవీర్యుడియొక్క భార్యలయందు దేవరన్యాయాన్ని అనుసరించి సంతోషంతో ఈకులం ఎప్పుడూ ఎడతెగనిసంతతితో ఉండేటట్లు కుమారులను పొందుము.

**విశేషం:** భర్త అనపత్యుడై చనిపోతే స్త్రీ ఆ భర్తసోదరుడివలన సంతతిని పొందటం దేవరన్యాయము.

**క. నీ కారణమున వంశ మ । నాకుల మై నిలుచుటయుఁ దదాప్తులుఁ బ్రజలున్**
**శోకభయంబులు విడుతురు, । నాకును భీష్మునకుఁ గడు మనఃప్రియ మెసఁగున్. 246**

**ప్రతిపదార్థం:** నీ, కారణమునన్= నీవు కారణంగా; వంశము= భరతవంశం; అనాకులము+ఐ= చెదరిపోనిదై; నిలుచుటయున్= స్థిరపడుటయూ; తద్+ఆప్తులు= ఆ వంశయోగక్షేమాలు కోరే హితులూ; ప్రజలున్= రాజ్యప్రజలు; శోక, భయంబులు, విడుతురు= దుఃఖాన్నీ భయాన్నీ విడిచిపెడతారు; (వంశం విచ్ఛిన్నమౌతుందనే శోకం విచిత్రవీర్యుని తరువాత రాజ్యానికి రాజుండడేమో అనే భయం నిడిచిపెడతారని భావం); నాకును= (సత్యవతికిని); భీష్మునకున్, కడున్, మనస్+ప్రియము+ ఎసఁగున్= ఎక్కువయైన మానసికసంతోషం కలుగుతుంది.

**తాత్పర్యం:** నీవు కారణంగా భరతవంశం చెదరిపోకుండ స్థిరపడటమూ, ఆ వంశహితం కోరే ఆత్మీయులు, దేశప్రజలు దుఃఖాన్నీ భయాన్నీ వదలిపెట్టటమూ జరుగుతుంది. నాకూ, భీష్ముడికీ ఎంతో సంతోషం కలుగుతుంది.

**క. అని సత్యవతి నియోగిం । చిన వేదవ్యాసుఁ 'డట్ల చేయుదు; నిది యెం**
**దును గల ధర్మువ; యెప్పుడు । వినఁబడు నానాపురాణ వివిధశ్రుతులన్. 247**

**ప్రతిపదార్థం:** అని; సత్యవతి; నియోగించినన్= ఆజ్ఞాపించగా; వేదవ్యాసుఁడు= అట్లు+అ= ఆవిధంగానే; చేయుదును= చేస్తాను; ఇది, ఎందును, కల, ధర్మువు+అ= ఇది అన్నిచోట్ల ఉన్న ధర్మమే; నానా, పురాణ, వివిధ, శ్రుతులన్= అనేకపురాణాల్లోనూ, వివిధ వేదాలలోనూ, జనశ్రుతి సంప్రదాయాల్లోనూ; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; వినఁబడున్= ప్రచారంలో ఉన్నది.

**తాత్పర్యం:** ఈ విధంగా సత్యవతి ఆజ్ఞాపించగా వేదవ్యాసుడు ఇ ట్లన్నాడు - నేను నీవు ఆజ్ఞాపించినట్లే చేస్తాను. ఇది అంతటా ఉన్నధర్మమే. బహు పురాణాల్లోనూ, వేదాలలోనూ, జనశ్రుతిపరంపరలోనూ ఎప్పుడూ వినబడుతూ ఉన్నది.

**వ. 'ఇక్కాశీరాజ దుహితలయందు ధర్మస్థితిం బుత్త్రోత్పత్తిఁగావించెద; వీరలు నా చెప్పిన వ్రతం బొకసంవత్సరంబు సేసి శుద్ధాత్మ లగుదురేని సత్పుత్త్రులు పుట్టుదు' రనిన సత్యవతి యి ట్లనియె. 248**

**ప్రతిపదార్థం:** సుగమం.

**తాత్పర్యం:** 'ఈకాశీరాజ పుత్రికలయందు ధర్మనియమంతో పుత్రులను పుట్టిస్తాను. వీరు నేను చెప్పిన వ్రతాన్ని (నియమాన్ని) ఒక సంవత్సరకాలం ఆచరించి పవిత్రమైన హృదయాలు కలిగినవారై ఉంటే ఉత్తములైన కొడుకులు పుట్టుతారు' అని అనగా సత్యవతి ఈవిధంగా అన్నది.

**క. ప్రకటముగ వంశవిస్తా । రకు లగు పుత్త్రకులఁ జెచ్చెరం బడయుదు; రరా**
**జక మయిన ధారుణీప్రజ । కొక నిమిషం బయినఁ బ్రకృతి నుండఁగ లావే. 249**

**ప్రతిపదార్థం:** ప్రకటముగన్=లోకానికి తెలిసేటట్లుగా; వంశ, విస్తారకులు+అగు, పుత్త్రకులన్= వంశాన్ని పెంపొందించే కుమారులను; చెచ్చెరన్= వెనువెంటనే; పడయుదురు= పొందుతారు(కంటారు); అ, రాజకము+అయినన్, ధారుణీ, ప్రజకున్=

రాజులేనిరాజ్యప్రజలకు; ఒక, నిమిషంబు+అయినన్= ఒకక్షణకాలమైనప్పటికి; ప్రకృతిన్, ఉండఁగ, లావు+ఏ= సహజ శాంతస్వభావంతో ఉండటం అశక్యం కాదా!

**తాత్పర్యం:** ప్రసిద్ధంగా వంశాన్ని పెంపొందించే కొడుకులను వెంటవెంటనే వారు పొందుతారు. ఎందుకంటే రాజులేని రాజ్యప్రజలకు ఒకక్షణకాలమైనా సహజ శాంతస్వభావంతో ఉండటం అశక్యంకదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**చ. అవని యరాజకం బయిన యప్పుడ భూప్రజయందు సర్వధ**
**ర్మువులుఁ దొలంగు, దేవమునిముఖ్యులు వాయుదు, రోలి వృష్టిలే**
**దవు, మఱి యర్ఘువుల్ దఱుఁగు నందురు గావునఁ గాలయాపనం**
**బవితథవాక్య! చేయక నయంబున రాజ్యము నిల్పు మిత్తఱిన్. 250**

**ప్రతిపదార్థం:** అవని= భూమి; అ, రాజకంబు+అయిన, అప్పుడు+అ= రాజులేకుండపోయినవెంటనే; భూ, ప్రజ, అందున్= రాజ్యప్రజలలో; సర్వ, ధర్మువులు= ధర్మాలన్నీ; తొలంగున్= తొలగిపోతాయి; దేవ, ముని, ముఖ్యులు= దేవతలు, మునిశ్రేష్ఠులు లేదా దేవమునిశ్రేష్ఠులు; పాయుదురు= దేశంవదలి వెడలిపోతారు; ఓలిన్= క్రమంగా; వృష్టి, లేదు+అవు= వానలు లేకుండా ఉంటాయి; (కాటకం (కరువు) ఏర్పడుతుంది); మఱి= ఇంకను; అర్ఘువుల్= వెలలు; తఱుఁగును= పడిపోతాయి; అంటారు= అని చెప్పుతారు; కావునన్= కాబట్టి; అవితథవాక్య= మాటతప్పనివాడా! (సత్యవాక్యపాలకుడా); కాల, యాపన, చేయక= ఆలస్యం చేయకుండ; ఇత్తఱిన్= ఈసమయంలో; నయంబునన్= పొందికగా; నేర్పుగా; రాజ్యము, నిల్పుము= రాజ్యాన్ని కాపాడు(ము).

**తాత్పర్యం:** రాజ్యంలో రాజు లేకుండ పోయినవెంటనే రాజ్యప్రజలలో ధర్మాలన్నీ తొలగిపోతాయి; దేవఋషిశ్రేష్ఠులు రాజ్యాన్ని వదలిపోతారు; క్రమంగా వానలు లేకుండా పోతాయి; ఇక, వస్తువుల విలువలు పడిపోతాయి అని చెప్పుతారు కాబట్టి ఓ సత్యవాక్యపరిపాలకా! ఆలస్యం చేయక ఈ సమయంలో నేర్పుగా రాజ్యాన్ని నిలుపు(ము).

**క. దయ నీచే నుత్పాదితు । లయినసుతులు ద మ్మెఱుంగునంతకు భీష్ముం**
**డయ నయశాలి సమర్థుం । డయి చేకొని రాజ్యభార మారయుచుండున్. 251**

**ప్రతిపదార్థం:** దయ, నీచేన్, ఉత్పాదితులు+అయిన, సుతులు= దయతో నీవలన పుట్టింపబడిన కొడుకులు; తమ్మున్+ఎఱుంగు, అంతకున్= తమంతట తాము రాజ్యం నిర్వహించే తెలివి వచ్చేంతవరకు; భీష్ముండు; అయ, నయశాలి= శుభావహాలైన, నీతి యుక్త కార్యాలను, నిర్వహించే శక్తి కలవాడు. ("అయః శుభావహో విధిః" - అమరకోశము, 1 కాండము, కాలవర్గము, 29 శ్లో.) సమర్థుండు= నిర్వాహకుడు; అయి; రాజ్యభారము; చేకొని= స్వీకరించి; ఆరయుచున్+ఉండున్= రక్షిస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** దయతో నీవలన పుట్టించబడిన కొడుకులు తమంతట తాము తెలిసికొని రాజ్యంచేసేంతవరకు, భీష్ముడే రాజ్యానికి ఆవశ్యకాలు మంగళకరాలు, నీతిమంతాలు అయినా కార్యాలన్నీ సమకూర్చేవాడై సామర్థ్యంతో రాజ్యకార్యభారాన్ని చేపట్టి నిర్వహిస్తూ ఉంటాడు.

**వ. అని సత్యవతి కృష్ణద్వైపాయను నియోగించి ఋతుమతియు శుచిస్నాతయు నై యున్న యంబికకడకుం జని 'క్షేత్రజుం డైనవాఁడు సుపుత్త్రుండు గావున ధర్మ్యం బైన విధానంబున నీవు రాజ్యధురంధరుం డయిన కొడుకుం బడసి భరతవంశంబు నిలుపు; మెల్లధర్మంబులకంటెఁ గులంబు నిలుపుటయు మిక్కిలి ధర్మంబు; నేఁటిరాత్రి నీకడకు దేవరుండు వచ్చుం; దదాగమనంబుఁ బ్రతీక్షించి యుండునది' యని కోడలి నొడంబఱిచి యనేకసహస్రమహీసురులను దేవతలను ఋషులను నిష్టభోజనంబులం దనిపియున్న నారాత్రియందు .252**

**తాత్పర్యం:** అని సత్యవతి వ్యాసుడిని ఆజ్ఞాపించి ముట్టయి శుద్ధిస్నానం చేసిఉన్న అంబిక వద్దకు పోయి (యజమానునిభార్య కన్నవాడు) పుత్రులలో ఉత్తమపుత్రుడు కాబట్టి న్యాయమైన పద్ధతిలో రాజ్యాన్ని ధరింపగల సమర్థుడైన కొడుకును నీవు పొంది భరతవంశాన్ని నిలుపుము. ధర్మాలన్నింటిలోకంటె వంశం నిలపటం ఉత్తమధర్మం. నేటిరాత్రికి నీవద్దకు దేవరుడు (భర్తకు సోదరుడైన బ్రాహ్మణోత్తముడు) వస్తాడు. అతనిరాకకొరకు ఎదురుచూస్తూ ఉండవలసింది' అని కోడలిని అంగీకరింపజేసి పెక్కువేల బ్రాహ్మణులకు, దేవతలకు, మునులకు ఇష్టమైనవిందులు పెట్టి తృప్తులను చేసిఉండగా, ఆనాటిరాత్రి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'దేవర'- అంటే భర్తయొక్క సోదరుడు, 'దేవరన్యాయం'- 'అపుత్రాం గుర్వనుజ్ఞాతో దేవరః పుత్ర కామ్యయా'- అని యాజ్ఞవల్క్య స్మృతి (1.68). పుత్రవతి కాకుండానే భర్తను కోల్పోయిన స్త్రీ (విధవ) యందు, ఆమె దేవరుడు (భర్తసోదరుడు) పెద్దల అనుమతితో సంతానాన్ని పొందటం, దేవరన్యాయం.

## ధృతరాష్ట్ర పాండురాజ విదురుల జననము (సం. 1-100-4)

**క. 'తివిరి సుతజన్మ మెన్నం । డవునొకొ దేవరుని వలన?' ననుచును నవప**
**ల్లవకోమలాంగి యంబిక । ధవళేక్షణ విమలశయనతలమున నున్నన్. 253**

**ప్రతిపదార్థం:** తివిరి= కుతూహలపడి; నవపల్లవ, కోమల+అంగి= క్రొత్తచిగురాకువంటి దేహం గల సుకుమారవతి; ధవళ+ఈక్షణ= తెల్లనిచూపులు కలది; అంబిక; దేవరుని వలనన్= పతి సోదరుడు, సంతానాన్ని కలిగించటానికై నియోగించబడిన బ్రాహ్మణోత్తముని వలన; సుత, జన్మము, ఎన్నండు+అవును+ఒకొ= కొడుకు పుట్టడం ఎప్పుడు కలుగుతుందో; అనుచును= అని తలపోస్తూ; విమల, శయన, తలమునన్, ఉన్నన్= శుభ్రమైన శయ్యపై ఉండగా.

**తాత్పర్యం:** క్రొత్తచిగురాకువంటి సుకుమార శరీరం కలిగి తెల్లనిచూపులతో ఒప్పారే అంబిక- దేవరుని వలన 'నాకు ఎప్పుడు కొడుకు పుట్టుతాడో!' అని తలపోస్తూ  కుతూహలపడి శుభ్రమైన శయ్యపై పరుండి ఉన్నది.

**మధ్యాక్కర.**

**అవసరజ్ఞుం డయి వ్యాసుఁ డేతెంచె నంత నత్తపసి**
**కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులును**
**దవినయన్నువ నల్ల నైన దీర్ఘపుందనువును జూచి**
**యువిద గన్నుంగవ మొగిచి తెఱవక యుండె భయమున. 254**

**ప్రతిపదార్థం:** వ్యాసుఁడు; అవసర, జ్ఞుండు+అయి= తగినవేళ అది అని తెలిసినవాడై; ఏతెంచెన్= వచ్చాడు; అంతన్= అప్పుడు; ఆ+తపసి= ఆమునియొక్క; కవిల, గడ్డంబును= (కపిలశబ్దభవం కవిల) గోరోజనంవంటి రంగుగల గడ్డాన్నీ; కవిల, జడలును= గోరోజనంవంటి రంగుగల జడలుకట్టిన తలజుట్టునూ; కవిల, కన్నులును= గోరోజనంవంటి రంగులో ఉన్న కళ్ళనూ; తవిన= (తగిన); అన్నువ= సన్ననైన; నల్లన+ఐ= నల్లనిరంగుగలది అయిన; దీర్ఘపున్, తనువును= పొడుగాటి శరీరమునూ; చూచి; ఉవిద= వనిత(అంబిక); భయమునన్= భయంతో; కన్నుంగవ, మొగిచి, తెఱవక, ఉండెన్= కన్నులజంటను మూసి తెరువకుండానే ఉండిపోయింది.

**తాత్పర్యం:** అది తగినవేళ అని తెలిసినవాడై వ్యాసుడు వచ్చాడు. అప్పుడు ఆ మునియొక్క గోరోజనంవంటి రంగులో ఉన్న గడ్డాన్నీ, జడలనూ, కళ్ళనూ, వాటికి తగినట్లుగా సన్నగా నల్లగా పొడుగ్గా ఉన్న శరీరాన్ని చూచి అంబిక భయంతో కన్నులురెండూ మూసికొని తెరవకుండానే ఉండిపోయింది.

**విశేషం:** మధ్యాక్కరలోని ప్రతిచరణంలోనూ వరుసగా రెండు ఇంద్రగణాలూ, ఒక సూర్యగణం, రెండు ఇంద్రగణాలూ, ఒక సూర్యగణం ఉంటాయి. నన్నయ అయిదవ గణం మొదటి అక్షరంతో యతిమైత్రి చేశాడు. ప్రాసనియమం ఉంది. "కవిలగడ్డంబును, కవిలజడలును, గవిలకన్నులును"- అనేపాదానికి "కపిలగడ్డంబును, కపిలజడలును, గపిలకన్నులును"- అనే పాఠాంతరం కనబడుతున్నది. దీనినిగురించి ఆంధ్రమహాభారతసంశోధితముద్రణంలో ఈక్రిందివిధంగా వివరింపబడిఉన్నది: " ఇచ్చట కపిలగడ్డము అను పాఠము గ్రహించినచో వైరిసమాస మగుటయేకాక పవప్రాస మేర్పడుచున్నది. ఇది నన్నయకు సమ్మతమగునో కాదో నిర్ణయించుట కాధారములేదు. తాళపత్రప్రతు లన్నియును, శ,ష ప్రతులును కపిలగడ్డము అను పాఠమునే గ్రహించినవి. 'కవిల' కపిలశబ్దవైకృత మని శబ్దరత్నాకరము. కాని, ప్రాచీనశాసనములందు కపిలగోవు అనుటకు కవిల అనురూపము వినవచ్చును. వేగవిరాళు వంటిరూపములు కాన్పించుచున్నవి. దీనినిబట్టి కపిలశబ్దమునకు కవిలరూపము ప్రాచీనమైనది కలదు. నన్నయ యీకవిలరూపము నిచ్చట వాడెనని సరిపుచ్చుకొనవలెను. మఱియొక సందర్భమునందు కపిలశబ్దమును నన్నయ ప్రయోగించెను. 'అమరసువర్ణశృంగ (1-15) ఇత్యాదిపద్యమునందు కపిలం బగు గోశతంబు అని ప్రయోగము కన్పించుచున్నది. ప, వలకు, అభేదవర్గయతిని అప్పకవి యంగీకరించెను. సంధిగత మైనప్పుడు గసడదవాదేశముచేప, వలకు ప్రాస యంగీకరింపబడినది. అట్టిచోప, వలకు అభేదవర్గనియతిచే క్వాచిత్కమైన ప్రాసయుండెనేమో తెలియదు. గవురుగడ్డంబును అనుపాఠమును వినవచ్చుచున్నది. (ఆముద్రితగ్రంథచింతామణి- సంపుటము 16, సంచిక2, పుట17, సం.1903). ఇచ్చట సంస్కృతమూలమునందు భిన్నవిశేషణములు వాడబడియున్నవి. 'తస్య కృష్ణస్య కపిలాం జటాం దీప్తే చ లోచనే బభ్రూణిచైవ శ్మశ్రూణి దృష్ట్వా దేవీన్యమీలయత్'. నన్నయ కూడ ఇదేమార్గము నవలంబించి భిన్నవిశేషణములను వాడె నని భావించవచ్చును. అప్పుడు గవురుగడ్డము, కపిలజడలును, కపిలకన్నులును అని నన్నయ ప్రయోగించియుండెనని ఊహింపవచ్చును. (ప్రథమసంపుటము-పుట.245 (అథస్సూచిక).

**వ. కృష్ణద్వైపాయనుండును దానికింబుత్త్రదానంబు సేసి 'యాయంబికయందు బలపరాక్రమవంతుం డయిన కొడుకు పుట్టు; వాఁడు మాతృదోషంబున నంధుం డగు' ననిన విని విషణ్ణచిత్త యయి సత్యవతి వెండియుం గృష్ణద్వైపాయనుంబ్రార్థించి' యింకనంబాలికయం దొక్కకొడుకుంబడయు' మని నియోగించిన నెప్పటియట్ల యమ్మునివరుండు నంబాలిక కడకుం జనిన, నదియుం దనవేషంబునకు వెఱచి వెల్లనైయున్న నక్కోమలికిం బుత్త్రదానంబుసేసి' యీయంబాలికయందు మహాబలపరాక్రమగుణవంతుండు వంశకరుండు నగుపుత్త్రుండు పుట్టు; వాఁడును మాతృదోషంబునఁ బాండుదేహుం డగు' నని చెప్పి యరిగిన. 255**

**ప్రతిపదార్థం:** కృష్ణద్వైపాయనుండును= వ్యాసుడును; దానికిన్= ఆమెకు; పుత్త్ర, దానంబు, చేసి= కొడుకు కలుగునట్లుగా చేసి; ఈ, అంబిక, అందున్= ఈ అంబికకు; బల, పరాక్రమవంతుండు+అయిన= దేహబలం, పౌరుషం కలిగినవాడైన; కొడుకు, పుట్టున్= కొడుకు పుట్టుతాడు; వాఁడు= అతడు; మాతృ, దోషంబునన్= తల్లియొక్క పొరపాటువలన; అంధుండు+ అగున్= గ్రుడ్డివాడుఔతాడు; అనినన్= అనిచెప్పగా; విని; విషణ్ణ, చిత్త, అయి= దుఃఖంతో నిండిన హృదయం కలిగినదై; సత్యవతి; వెండియున్= మరల; కృష్ణద్వైపాయనున్, ప్రార్థించి= వ్యాసుడిని వేడికొని; ఇంకన్= మరియు; అంబాలిక, అందున్; ఒక్క, కొడుకున్, పడయుము+అని= ఒకకొడుకును పొందు మని; నియోగించినన్= ఆజ్ఞాపించగా; ఎప్పటి+అట్ల+అ= ఇదివరకువలెనే; ఆ, మునివరుండు= ఆ ఋషిశ్రేష్ఠుడు; అంబాలిక, కడకున్, చనినన్= అంబాలికవద్దకు పోగా; అదియున్= ఆమెకూడ; తన, వేషంబునకున్= తనయొక్క (వ్యాసుడియొక్క) ఆకారానికి; వెఱచి= భయపడి; వెల్లన్+ఐ, ఉన్నన్= తెల్లబోయి ఉండగా; ఆ+కోమలికిన్= ఆ చక్కనిదానికి; పుత్త్రదానంబు, చేసి= పుత్రుడిని ఇచ్చి (కొడుకు కలిగేటట్లుచేసి); ఈ, అంబాలిక, అందున్; మహత్+బల, పరాక్రమ, గుణవంతుండు= గొప్పదైన దేహబలం, పౌరుషం, అనే గుణాలు కలవాడు; వంశకరుఁడున్= వంశాన్ని నిలిపేవాడు; అగు; పుత్త్రుండు, పుట్టున్= కొడుకు పుట్టుతాడు; మాతృ, దోషంబునన్= తల్లిపొరపాటు కారణంగా; పాండు, దేహుండు+అగున్= తెలుపు (మించిన పచ్చని) రంగుగల శరీరం కలవాడు ఔతాడు; అని, చెప్పి, అరిగినన్= అని, పలికి, వెడలిపోగా.

**తాత్పర్యం:** వ్యాసుడు అంబికకు పుత్రుడు కలిగేటట్లు అనుగ్రహించి, ఆమెకు దేహబలం, పరాక్రమం కలవాడైన కొడుకు పుట్టుతాడనీ, తల్లిపొరపాటువలన అతడు గ్రుడ్డివాడౌతా డనీ చెప్పాడు. ఆ మాటలువిని సత్యవతి విచారంతో నిండిన మనస్సుతో మరల వ్యాసుడిని వేడికొని అంబాలికయందు ఒక్కకొడుకును పొందు మని ఆజ్ఞాపించగా, ఎప్పటివలెనే ఆమునిశ్రేష్ఠుడు అంబాలికవద్దకు వెళ్ళగా, ఆమెకూడ వ్యాసుడి వేషాన్నిచూచి భయపడి తెల్లబోయి ఉన్నది. వ్యాసుడు ఆమెకు పుత్రుడిని ప్రసాదించి ఆ అంబాలికకు గొప్ప దేహబలం, పౌరుషం (అనే) మంచి గుణాలు కలవాడు, వంశాన్ని నిలిపేవాడు (వంశకర్తగా వంశానికి కీర్తితెచ్చేవాడు) అయిన కొడుకు పుట్టుతాడు. వాడుకూడ తల్లిపొరపాటు కారణంగా తెల్లనిరంగు (పాండువర్ణం) గల దేహం కలవా డౌతాడు అని చెప్పి వెళ్ళిపోగా.

**విశేషం:** వ్యాసుడు పుత్రదానం చేసినప్పుడు అంబిక, అంబాలికలు ఉన్న స్థితులను బట్టి వారు కనే కొడుకులకు దోషాలు ఏర్పడ్డాయి. అంబిక కన్నులు మూసికొని తెరవలేదు కాబట్టి ఆమెకు పుట్టే కొడుకు (ధృతరాష్ట్రుడు) గ్రుడ్డివాడైనాడు. అంబాలిక తెల్లబోయి ఉన్నది కాబట్టి ఆమెకొడుకు (పాండురాజు) పుట్టుకతోనే పాండువర్ణంతో వెలువడ్డాడు. వారిరువురి తారతమ్యంకూడ వ్యాసుడు నిర్దేశించాడు. గ్రుడ్డివాడు 'బలపరాక్రమవంతుడు' ఔతాడనీ, పాండురాజు 'మహాబలపరాక్రమ గుణవంతుడు' 'వంశకరుడు' ఔతాడనీ చెప్పాడు. భారతంలో ధృతరాష్ట్ర పాండురాజుల జాతకాలు వ్యాసుడు వారు పుట్టకపూర్వమే నిర్ణయించాడు. ఈ తారతమ్యాన్ని ముందు పద్యాలలో వివరిస్తున్నాడు నన్నయ.

**క. బలవ న్మదనాగాయుత । బలయుతుఁడు సుతుండు పుట్టెఁ బ్రజ్ఞాచక్షుం**
**డలఘుఁడు ధృతరాష్ట్రుం డా । లలనకు నంబికకుఁ గురుకులప్రవరుం డై. 256**

**ప్రతిపదార్థం:** బలవత్+మద, నాగ+అయుత, బలయుతుఁడు= బలంతో మదించిన పదివేల ఏనుగులయొక్క బలంతోకూడినవాడైన; ప్రజ్ఞా చక్షుండు= బుద్ధియే కన్నులుగా కలవాడు; అనగా గ్రుడ్డివాఁడు అలఘుఁడు= అల్పుడుకానివాడు; ధృతరాష్ట్రుఁడు; ఆ, లలనకున్= ఆయింతికి; అంబికకున్; కురుకుల, ప్రవరుండు+ఐ= కురువంశంలో శ్రేష్ఠుడై; సుతుండు= కొడుకు; పుట్టెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** బలం కలిగి మదించిన పదివేలేనుగులబలంతో కూడుకొన్నవాడు. బుద్ధియే చూపుగా కలవాడు (కళ్ళు లేకపోయినా బుద్ధితో గ్రహింపగలిగినవాడు); అల్పుడు కానివాడు అయిన ధృతరాష్ట్రుడు అంబికకు కురువంశశ్రేష్ఠుడుగా కొడుకై పుట్టాడు.

**క. అంబాలికకును గుణర । త్నాంబుధి పాండుర విరాజితాంగుఁడు ప్రభవిం**
**చెం బాండురాజు గురువం । శంబు ప్రతిష్ఠింప ధర్మసర్వజ్ఞుం డై. 257**

**ప్రతిపదార్థం:** అంబాలికకును= అంబాలికకుకూడ; గుణరత్న+అంబుధి= మంచిగుణాలు అనే రత్నాలకు సముద్రంవంటివాడూ; పాండుర, విరాజిత+అంగుఁడు= తెల్లనిరంగు గల చర్మంతో ప్రకాశించిన శరీరంకలవాడూ; (అయిన); పాండురాజు; కురు, వంశంబు, ప్రతిష్ఠింపన్= కురువంశాన్ని సుస్థిరంగా నిలపటానికి; ధర్మ, సర్వజ్ఞుండు+ఐ= ధర్మాలన్నీ తెలిసినవాడై; ప్రభవించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** అంబాలికకుకూడ సద్గుణాలనే రత్నాలకు సముద్రవంవంటివాడూన్నూ; తెల్లని రంగుతో ప్రకాశించే మేను కలవాడూ అయిన పాండురాజు కురువంశాన్ని స్థిరంగా నిలపటానికి సర్వధర్మాలు తెలిసినవాడుగా పుట్టాడు.

**వ. ఇట్లు క్రమంబునం బుట్టిన ధృతరాష్ట్ర పాండుకుమారులకు బ్రాహ్మణసమేతుం డై భీష్ముండు జాతకర్మాదిక్రియ లొనరించినంత. నాంబికేయు జాత్యంధుం జూచి దుఃఖిత యయి సత్యవతి వెండియుఁ బారాశర్యుం దలంచుడు, నాక్షణంబ యమ్మునివరుండు వచ్చి పని యేమి యని యన్న 'నీయంబికకుఁ బ్రథమపుత్త్రుం డంధుం డయ్యెఁ; నింక నొక్కకొడుకు రూపవంతుం బడయు' మనిన, 'నియతతాత్మ యగునేని సుపుత్త్రుండు పుట్టు'ననవుడు, సత్యవతి తొల్లింటియట్ల కోడలి నియోగించిన, నక్కోమలి యమ్మునివరు వికృతవేషరూప గంధంబుల కోపక రోసి, తనదాసి ననేక భూషణాలంకృతం జేసి తనశయనతలంబున నుండం బంచిన, వ్యాసభట్టారకుండు వచ్చి దాని చేసిన యిష్టోపభోగంబులం దుష్టుండై దానికిం బుత్త్రదానంబు సేసిన.258**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; క్రమంబునన్, పుట్టిన= వరుసగా పుట్టిన; ధృతరాష్ట్ర, పాండుకుమారులకున్; బ్రాహ్మణ, సమేతుండు+ఐ= బ్రాహ్మణులతో కూడుకొనినవాడై; భీష్ముండు; జాతకర్మ+ఆది, క్రియలు+ఒనరించిన, అంతన్= శిశువుపుట్టినప్పుడు చేసే సంస్కారం మొదలైన చేయదగిన పను లన్నింటిని చేసిన తరువాత; సత్యవతి; ఆంబికేయున్, జాత్యంధున్, చూచి= అంబికయొక్క కొడుకును పుట్టుగ్రుడ్డివాడిగా చూచి; దుఃఖిత+అయి= బాధపడినదై; వెండియున్= మరల; పారాశర్యున్, తలంచుడున్= వ్యాసుడిని స్మరించటంచేత; ఆ క్షణంబు+అ= వెంటనే; ఆ, మునివరుండు, వచ్చి= ఆఋషిశ్రేష్ఠుడు వచ్చి; పని+ఏమి, అని, అన్నన్= ఏమి పని ఉన్నది అని అడుగగా; ఈ, అంబికకున్; ప్రథమపుత్త్రుండు= మొదటికొడుకు; అంధుండు+అయ్యెన్= గ్రుడ్డివా డైనాడు; ఇంకన్, ఒక్క కొడుకున్= ఇంకను మరొకకొడుకును; రూపవంతున్= అందగాడిని; పడయుము+అనినన్= పొందుము అని అనగా; నియత+ఆత్మ, అగును+ఏని= నిగ్రహంతో కూడిన హృదయం కలిగినది అయితే; సుపుత్త్రుండు= మంచికొడుకు; పుట్టును= పుట్టుతాడు; అనవుడున్= అనగా విని; సత్యవతి; తొల్లింటి, అట్లు+అ= ఇదివరకువలెనే; కోడలిన్, నియోగించినన్= కోడలిని ఆజ్ఞాపించగా; ఆ+కోమలి= ఆ అందగత్తె (అంబిక); ఆ+మునివరు, వికృత, వేష, రూప, గంధంబులకున్= ఆ మునియొక్క (వ్యాసునియొక్క) వికారమైన వేషానికీ, ఆకారానికీ, మేనివాసనకూ; ఓపక= సహించలేక; రోసి= అసహ్యించుకొని; తన, దాసిన్= తనయొక్క చెలికత్తెను; అనేక, భూషణ+అలంకృతన్, చేసి= పెక్కుసొమ్ములతో అలంకరింపబడినదానిగా చేసి; తన, శయన, తలంబునన్= తా నుండవలసిన పడకమీద; ఉండన్,

పంచినన్= ఉండుమని ఆజ్ఞాపించగా; వ్యాసభట్టారకుండు= వ్యాసమహర్షి, వచ్చి; దాని, చేసిన, ఇష్ట+ఉపభోగంబులన్, తుష్టుండు+ఐ= ఆ దాసి చేసిన ఇష్టమైన కామక్రీడల వలన సంతోషించినవాడై; దానికిన్= ఆమెకు; పుత్ర, దానంబు, చేసినన్= మగసంతానాన్ని ఇవ్వగా.

**తాత్పర్యం:** ఈవిధంగా ధృతరాష్ట్రుడూ, పాండురాజు వరుసగా పుట్టగా, వారికి భీష్ముడు బ్రాహ్మణులతోకూడి జాతకర్మమొదలైన సంస్కారాలను చేయించగా, సత్యవతి అంబిక కొడుకును పుట్టుగ్రుడ్డివాడుగా తెలిసికొని దుఃఖించి మరల వ్యాసుడిని తలచింది. ఆ మునివరుడు వెంటనే వచ్చి 'పని ఏమున్నది?' అని అడుగగా, ఈఅంబికకు పుట్టిన మొదటికొడుకు గ్రుడ్డివాడైనాడు కాబట్టి రూపవంతు డైన మరొక కొడుకును ఆమెయందు పొందు మని అడిగింది. 'ఆమె నిగ్రహం కలిగిన హృదయంతో ఉంటే మంచికొడుకు పుట్టగల'డని వ్యాసు డన్నాడు. ఆమాట విని సత్యవతి ఇదివరకు వలెనే కోడలైన అంబికను ఆజ్ఞాపించింది. ఆమె ఆ మునియొక్క వికారమైన వేషాన్నీ, ఆకారాన్నీ, మేనివాసననూ సహించలేక, అసహ్యించుకొని తనదాసి నొకదానిని పెక్కుసొమ్ములతో అలంకరించి తా నుండవలసిన సెజ్జమీద ఆమె ఉండేటట్లు ఆజ్ఞాపించింది. వ్యాసమహర్షి వచ్చి ఆ దాసి ప్రీతితో చేసిన కామక్రీడలకు సంతోషించి ఆమెకు పుత్రసంతానాన్ని ఇవ్వగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** దేహి తల్లికడుపులో పడినప్పటినుండి మరణించేవరకు పదహారు రకాలైన సంస్కారాలకు అర్హుడౌతాడు. వాటిని షోడశకర్మ లని అంటారు. అవి - గర్భాధానం, పుంసవనం, సీమంతం, జాతకర్మం, నామకరణం, అన్నప్రాశనం, చౌలం, ఉపనయనం, ప్రాజాపత్యం, సౌమ్యం, ఆగ్నేయం, వైశ్వదేవం, గోదానం, సమావర్తనం, వివాహం, అంత్యక్రియ.

**ఆ. చండకోపుఁ డయిన మాండవ్యమునివరు । శాపమున జముండు సంభవిల్లె**
**విదురుఁ డనఁగ ధర్మవిదుఁడు పారాశర్యు । వీర్యముననను భువి నవార్యబలుఁడు. 259**

**ప్రతిపదార్థం:** చండ, కోపుఁడు+అయిన= తీవ్రమైన కోపం కలవాడైన; మాండవ్య, మునివరు, శాపమునన్= మాండవ్యుడు అనే పేరుకల మునిశ్రేష్ఠుడి యొక్క శాపంవలన; జముండు= యముడు; భువిన్= భూలోకంలో; పారాశర్యు, వీర్యముననను= వేదవ్యాసుడి శుక్లంవలన; విదురుఁడు+అనఁగన్= విదురుడు అని పిలువబడే; ధర్మ, విదుఁడు= ధర్మవిషయాలలో పండితుడు; అవార్య, బలుఁడు= అడ్డగించటానికి వీలులేని బలంకలవాడు; సంభవిల్లెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** తీవ్రకోపస్వభావుడైన మాండవ్యమహర్షి పెట్టినశాపం కారణంగా యముడు భూలోకంలో వేదవ్యాసుడివీర్యంవలన ధర్మశాస్త్రపండితుడూ, ఎదురులేనిబలంకలవాడూ అయిన విదురుడుగా పుట్టాడు.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 260**

**తాత్పర్యం:** అనగా విని జనమేజయుడు వైశంపాయనుడితో ఈ విధంగా అన్నాడు.

## మాండవ్యోపాఖ్యానము (సం. 1-101-1)

**ఆ. సకలజీవరాశి సుకృత దుష్కృత ఫల । మెఱిఁగి నడుపుచున్న యట్టి ధర్ముఁ**
**డొంద శూద్రయోనియందు మాండవ్యుచే । శప్తుఁడై యదేల సంభవించె? 261**

**ప్రతిపదార్థం:** సకల, జీవ, రాశి, సుకృత, దుష్కృత, ఫలము= సమస్తమైన జీవులయొక్క సమూహంయొక్క పుణ్యాలయొక్క పాపాలయొక్క ఫలాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; నడపుచున్+ఉన్న= ధర్మాన్ని నడుపుతూ ఉన్న; అట్టి; ధర్ముఁడు= ఇటువంటి యమధర్మరాజు; మాండవ్యుచేన్, శప్తుఁడు+ఐ= మాండవ్యుడిచేత శపింపబడినవాడై; శూద్ర, యోని, యందున్= శూద్రవనితయందు; ఒందన్= పుట్టుకపొందటం; అది= అనేది; ఏల, సంభవించెన్= ఏకారణంవలన కలిగింది?

**తాత్పర్యం:** సమస్త జీవసమూహాల పుణ్యాపాపాల ఫలాలను తెలిసి వాటికి తగిన ధర్మం నడుపుతూ ఉన్నఇటువంటి యమధర్మరాజుకు మాండవ్యుడిచేత శపింపబడి శూద్రవనితకు పుట్టేస్థితి ఎందుకు కలిగింది?

**విశేషం:** ఈపద్యానికిబదులు- "సకలలోకధర్మమూర్తి యైన యముండుశూద్రుండైపుట్టుటయు మాండవ్యమునివరుండు శాపంబిచ్చుటయు నానతిమ్మనిన వానికి" అనే వచనం ఒకప్రతిలో కనబడుతున్నదని శ్రీమదాంధ్రమహాభారతసంశోధితముద్రణం చెప్తుతున్నది. (పు. 248).

**వ. అని యడిగిన వానికి వైశంపాయనుం డిట్లని చెప్పె; మాండవ్యుం డను బ్రహ్మర్షి దొల్లి మహీవలయంబునం గల తీర్థంబు లెల్ల నేకచారి యయి సేవించి యొక్క నగరంబున నెడ గలుగు నడవిలో నాశ్రమంబు గావించి తద్ద్వారవృక్షమూలంబున నూర్ధ్వబాహుం డయి మౌనవ్రతంబునం దపంబు సేయుచున్న నన్నగరంబు రాజు నర్థంబు మ్రుచ్చిలికొని మ్రుచ్చు లారెకులచేత ననుధావ్యమాను లై మాండవ్యసమీపంబునం బాఱి యయ్యాశ్రమంబులో డాఁగిన, వారి వెనుదగిలి వచ్చిన యారెకు లమ్మునిం గని 'రాజధనాపహారు లయిన చోరులు నీయొద్దన పాఱిరెటవోయి రెఱుంగుదేని చెప్పు' మనిన నమ్ముని మౌనవ్రతుండు గావునఁ బలుకకున్నం గినిసి యయ్యాశ్రమంబులోఁ జొచ్చి వెదకి ధనంబుతోడ నామ్రుచ్చులం బట్టికొని. 262**

**ప్రతిపదార్థం:** అని, అడిగినన్, వానికిన్= అని ప్రశ్నించగా, జనమేజయుడికి; వైశంపాయనుండు; ఇట్లు+అని, చెప్పెన్= ఈవిధంగా చెప్పాడు; తొల్లి= పూర్వం; మాండవ్యుండు+అను, బ్రహ్మర్షి= మాండవ్యుడు అనే పేరుగల బ్రాహ్మణు డైన ఋషి; మహీ, వలయంబునన్, గల, తీర్థంబులు+ఎల్లన్= భూమండలంలో ఉన్న పుణ్యతీర్థాల నన్నింటిని; ఏకచారి+అయి, సేవించి= ఒంటిగా తిరిగి సేవించుకొని; ఒక్క, నగరంబునన్= ఒక పట్టణప్రాంతంలో; ఎడ, కలుగు, అడవిలోన్= దూరంగా ఉన్న అడవిలో; ఆశ్రమంబు, కావించి= కుటీరం కట్టుకొని; తద్+ద్వార, వృక్ష, మూలంబునన్= ఆ ఆశ్రమద్వారంలో ఉన్న చెట్టుయొక్క మొదట్లో; ఊర్ధ్వ, బాహుండు+అయి= చేతులెత్తిఉంచినవాడై; మౌనవ్రతంబునన్= మాటాడకుండ ఉండే నియమంతో; తపంబు, చేయుచున్+ఉన్నన్= తపస్సుచేస్తూ ఉండగా; ఆ+నగరంబు, రాజు, అర్థంబు, మ్రుచ్చిలికొని= ఆపట్టణపురాజుయొక్క ధనాన్ని దొంగిలించి; మ్రుచ్చులు= దొంగలు; ఆరెకులచేతన్, అనుధావ్యమానులు+ఐ= తలారులచేత అనుసరింపబడుతున్నవారై; మాండవ్య, సమీపంబునన్, పాఱి= మాండవ్యుని వద్దకు పరుగెత్తి; ఆ+ఆశ్రమంబులో, డాఁగినన్= ఆ ఆశ్రమంలో దాగుకొనగా; వారి, వెను, తగిలి, వచ్చిన, ఆరెకులు= వారిని అనుసరించి వచ్చిన తలారులు; ఆ+మునిన్, కని= ఆ ఋషిని చూచి; రాజ, ధన+అపహారులు+అయిన, చోరులు= రాజుయొక్క డబ్బును దొంగిలించినవా రయిన దొంగలు; నీ, యొద్దన్+అ, పాఱిరి= నీదగ్గరికే పరుగెత్తారు; ఎట+పోయిరి= ఎక్కడకు వెళ్లారు; ఎఱుంగుదు(వు)+ఏని, చెప్పుము+అనినన్= నీకు తెలిస్తే తెలియచెప్పు మని అనగా; ఆ+ముని, మౌనవ్రతుండు, కావునన్= ఆ ముని మాటాడని దీక్షపట్టినవాడు కాబట్టి; పలుకక+ఉన్నన్= మాటాడకుండ ఉండగా; కినిసి= కోపగించి; ఆ+ఆశ్రమంబులోన్, చొచ్చి= ప్రవేశించి; ధనంబుతోడన్; ఆ మ్రుచ్చులన్; పట్టికొని;

**తాత్పర్యం:** ఆవిధంగా అడిగిన జనమేజయుడికి వైశంపాయనుడు ఈవిధంగా చెప్పాడు; పూర్వం మాండవ్యు డనే బ్రహ్మర్షి ఒంటరిగా భూమండలంలో ఉన్న పుణ్యతీర్థాల నన్నిటిని తిరిగి తిరిగి సేవించి ఒక పట్టణానికి కొంతదూరంగా

ఉన్న అడవిలో ఆశ్రమం కట్టుకొని, దానిద్వారంలో ఉన్న వృక్షంమొదట్లో చేతులు పైకెత్తి ఉంచి మౌనవ్రతంతో తపస్సుచేస్తూ ఉండగా, ఆపట్టణపు రాజుయొక్క ధనాన్ని దొంగిలించి దొంగలు తలారులు తమను వెంటాడుతూ ఉండగా మాండవ్యుడి సమీపానికి పరుగెత్తి ఆ ఆశ్రమంలో దాక్కొన్నారు. ఆ దొంగలను వెంటాడి వచ్చిన తలారులు ఆ మునిని చూచి 'రాజధనం దొంగిలించిన దొంగలు నీదగ్గరికే పరుగెత్తి వచ్చారు. నీకు తెలిస్తే వారిజాడను చెప్పు' మని అడుగగా, ఆ ముని మౌనవ్రతంలో ఉండటంచేత మాటాడకుండ ఉండగా, కోపగించి ఆశ్రమంలో ప్రవేశించి ఆ దొంగలను పట్టుకొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. తాన చోరులకును దాపికాఁడై వేష । ధారి మిన్నకేని తపముసేయు**
**చున్నయట్టు పలుకకున్నవాఁడని యెగ్గు । లాడి యారెకులు నయంబు లేక. 263**

**ప్రతిపదార్థం:** తాను+అ= తానే; చోరులకును= దొంగలకు; తాపికాడు+ఐ= సంధానంచేసేవాడై; వేషధారి= మునివేషం ధరించినవాడై; మిన్నక+ఏని, తపము, చేయుచున్+ఉన్న+అట్టు= పలకకుండ ఉండే నెపంతో తపస్సు చేస్తున్నట్లు; పలుకక+ఉన్నవాఁడు +అని= మౌనంగా ఉన్నా డని; ఎగ్గులు+ఆడి= నిందలు పలికి; ఆరెకులు= తలారులు, లేదా, రక్షకభటులు; నయంబు, లేక= నీతి తప్పి.

**తాత్పర్యం:** ఆ మునియే దొంగలకు సంధానం చేసే దళారి అనీ, వేషం వేసికొని మౌనంగా తపస్సు చేస్తున్నట్లు మాటాడకుండ ఉన్నా డని నిందలుపలికి తలారులు నీతిమాలి. (తరువాతి వచనంతో అన్వయం.)

**వ. మాండవ్యు నామ్రుచ్చులతోన కట్టికొని వచ్చి రాజునకుంజూపి ధనంబొప్పించిన, రాజు నామ్రుచ్చులం జంపించి తపోవేషంబుననున్న మ్రుచ్చని యమ్మాండవ్యునిఁ బురంబువెలుపల శూలప్రోతుం జేయించిన. 264**

**తాత్పర్యం:** మాండవ్యుడిని ఆ దొంగలతో కలిపి కట్టి తీసికొని వచ్చి రాజుకు చూపి ధనాన్ని ఒప్పగించగా, రాజు ఆ దొంగలను చంపించి, తపస్వివేషంలో ఉన్న దొంగగా భావించి ఆ మాండవ్యుడిని నగరం వెలుపలిభాగంలో ఇనుపశూలానికి గుచ్చబడినవాడై - కొఱుత వేయబడినవాడై.

**క. మునివరుఁ డట్లుండియుఁ దన । మనమున నతిశాంతుఁ డయి సమత్వమునఁ దప**
**మ్మొనరించె ననశనుం డ । య్యును బహుకాలంబు ప్రాణయుక్తుం డగుచున్. 265**

**ప్రతిపదార్థం:** మునివరుఁడు= మునిశ్రేష్ఠుడు; అట్లు+ఉండియున్= ఆ విధంగా ఉండికూడ; తన, మనమునన్= తన మనస్సులో; అతి, శాంతుండు+అయి= మిక్కిలి శాంతంతో కూడినవాడై (నిర్వికారుడై); సమత్వమునన్= సుఖదుఃఖాలలో చలించని మనస్సుగలయోగంతో (సమత్వం యోగఉచ్యతే); అనశనుండు+అయ్యును= ఆహారం తీసికొనని వాడైనప్పటికి; బహుకాలంబు= చాలకాలం; ప్రాణ, యుక్తుండు+అగుచున్= ప్రాణాలతో కూడినవా డౌతూ; తపమ్ము+ఒనరించెన్= తపస్సు చేశాడు.

**తాత్పర్యం:** మునిశ్రేష్ఠు డైన మాండవ్యుడు ఆవిధంగా కొఱుత వేయబడికూడ తన మనస్సులో ఎటువంటి వికారంలేని శాంతభావంతో, సుఖదుఃఖాలలో కలతచెందని యోగచిత్తంతో ఆహారం తినకపోయినా చాలకాలం ప్రాణాలతో కూడినవాడై తపస్సుచేశాడు.

వ. **ఇట్లు శరీరదుఃఖంబుదలంపక తపంబుసేయుచున్న యమ్మునిని తపంబు పేర్మికి మెచ్చి మహామునులు పక్షులయి రాత్రివచ్చి 'మునీంద్రా! యిట్టి మహాతపస్వి వైన నీ కిట్టి దుఃఖంబు గావించిన వా రెవ్వ' రని యడిగిన వారికి నమ్మాండవ్యుం డి ట్లనియె. 266**

**తాత్పర్యం:** ఈవిధంగా దేహానికి కలిగిన బాధను పట్టించుకోక తపస్సుచేస్తున్న ఆ ముని తపస్సుయొక్క అతిశయానికి (గొప్పతనానికి) మెచ్చి, గొప్పవారైన ఋషులు పక్షులఆకారంతో రాత్రివేళ వచ్చి 'ఓమునిశ్రేష్ఠుడా! ఇటువంటి గొప్పతపస్వి వైన నీకు ఇటువంటి బాధ కలిగించినవారు ఎవ్వరు?' అని అడుగగా వారికి ఆ మాండవ్యుడు ఈవిధంగా అన్నాడు.

తే. **ఎఱిఁగి యెఱిఁగి నన్నడుగంగ నేల దీని; । సుఖము దుఃఖంబుఁ బ్రాప్తించుచోట నరుఁడు**
**దగిలి తనకర్మవశమునఁ దనరుఁ దాన । కర్తగా కన్యులకు నేమి కారణంబు? 267**

**ప్రతిపదార్థం:** దీనిన్, ఎఱిఁగి, ఎఱిఁగి, నన్నున్+అడుగంగన్+ఏల= దీనిని బాగా తెలిసికూడ నన్ను అడగటం దేనికి?; సుఖము, దుఃఖంబున్, ప్రాప్తించు, చోటన్= సుఖదుఃఖాలు కలిగేటప్పుడు; నరుఁడు= మానవుడు; తన, కర్మవశమునన్= తాను స్వయంగా చేసిన పుణ్యాపాపకర్మల నాశ్రయించి; తగిలి= వాటిని పొంది; తనరున్= ఒప్పుతూ ఉంటాడు; తాను+అ= తానుమాత్రమే; కర్త, కాక= కారకుడు కాక; అన్యులకున్= ఇతరులు కారకులు కావటానికి; ఏమి, కారణంబు= కారణ మేమి ఉంటుంది?

**తాత్పర్యం:** మీప్రశ్నకు సమాధానం మీకు బాగా తెలిసికూడ నన్నడగటం దేనికి? నరుడు తన పూర్వపుణ్యాపాపకర్మల ఫలంగానే సుఖదుఃఖాలను పొందేటప్పుడు అనుభవిస్తూ ఉంటాడు. కాబట్టి నరుడు తనకర్మఫలాలకు తానే కర్త (కారకుడు) ఔతాడు కాని ఇందులో ఇతరులు కారణ మెందు కౌతారు?

**విశేషం:** "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" - అన్న సూక్తికి నన్నయగారి రచన రుచిరార్థ కవితాభివ్యక్తి, మాండవ్యుడు గొప్ప ఆత్మజ్ఞాని, శంకరభగవత్పాదులు సాధనపంచకంలో చెప్పిన ఈ క్రింది శ్లోకానికి అతడు ఉదాహరణప్రాయుడు. "ఏకాంతే సుఖ మాస్యతాం, పరతరే చేతః సమాధీయతాం, పూర్ణాత్మాసు సమీక్ష్యతాం, జగదిదం తద్బాధితం దృశ్యతాం. ప్రాక్కర్మప్రవిలాప్యతాం, చితిబలాన్నాప్యుత్తరైః శ్లిష్యతాం, ప్రారబ్ధస్త్విహ భుజ్యతా మథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్". ఏకాంతప్రదేశంలో సుఖంగా కూర్చుండుము, పరబ్రహ్మంలో చిత్తాన్ని సమాధానం చేయుము, ఈ జగత్తును పూర్ణబ్రహ్మంగా చూడుము, అది బ్రహ్మంలో విలీనమైనట్లు పరిగణించుము, పూర్వకర్మలను క్షయం చేసికొమ్ము. జ్ఞానాన్ని ఆశ్రయించి రాబోయే కర్మలయందు ఆసక్తుడవు కాబోకుము, ప్రారబ్ధభోగాన్ని అనుభవిస్తూ బ్రహ్మంలో నెలకొని ఉండుము అని ఈ శ్లోకభావం. ఇందులో చివరచెప్పిన అంశం మాండవ్యునిలో ముమ్మూర్తులా గోచరిస్తున్నది.

వ. **అని యమ్మహామునులతో మాండవ్యుండు పలికిన పలుకు లన్నగర రక్షకులు విని వచ్చి రాజున కెఱింగించిన, రాజునుం బఱతెంచి శూలప్రోతుం డయి యున్న మాండవ్యునకు నమస్కరించి 'నా చేసిన యజ్ఞానంబు సహించి నాకుం బ్రసాదింపవలయు' నని శూలంబువలన నమ్మునింబాచుచోనది పుచ్చరాకున్న, దానిమొదలు మెత్తన తునిమించినఁ దత్కంఠపార్శ్వంబునందు శూలశేషం బంతర్గతం బై యుండె; దానం జేసి యాముని యాణిమాండవ్యుండునాఁబరఁగుచునమ్మహాముని ఘోరతపంబుసేసి యెల్లలోకంబులు గమించి యొక్కనాఁడు యమునిపురంబునకుం జని ధర్మరాజున కి ట్లనియె. 268**

**తాత్పర్యం:** ఆ విధంగా ఆ మహామునులతో మాండవ్యుడు పలికిన మాటలను ఆ నగరాన్ని రక్షించే భటులు వినివచ్చి రాజుకు తెలుపగా, ఆరాజు వెంటనే బయలుదేరి శూలానికి గ్రుచ్చబడి కట్టబడిఉన్న మాండవ్యుడికి మ్రొక్కి 'నేను చేసిన తెలివితక్కువతనానికి (అజ్ఞానానికి) క్షమించి నన్ను అనుగ్రహించవలె' నని శూలంనుండి ఆమునిని విడిపించబోగా అది తీయటానికి రాలేదు. అప్పుడు దాని మొదలును నెమ్మదిగా నరికించగా అతని కంఠంలోని ప్రక్కభాగంలో మిగిలిన శూలభాగం శరీరంలోనే ఉండిపోయింది. దానివలన ఆ ముని ఆణి మాండవ్యుడు అని పిలువబడినాడు. ఆ మహాముని గొప్పతపస్సు చేసి లోకాలన్నింటిని దాటి ఒకనాడు యమునినగరానికి పోయి యమధర్మరాజుతో ఈవిధంగా అన్నాడు.

**క. దండధర! యిట్టి దారుణ । దండమునకు నేమిదుష్కృతముఁ జేసితి? ను**
**గ్రుండ వయి తగనిదండము । దండింపఁగ బ్రాహ్మణుండఁ దగునే నన్నున్? 269**

**ప్రతిపదార్థం:** దండధర= యముడా!; ఇట్టి, దారుణ, దండమునకున్= ఇటువంటి భయంకరనైన శిక్షకు; ఏమి, దుష్కృతమున్, చేసితిన్= ఏమి పాపం చేశాను? నన్నున్, బ్రాహ్మణుండన్, ఉగ్రుండవు+అయి= అధికమైన కోపంకలవాడవై; తగని, దండము, దండింపఁగన్= కూడని శిక్షచే శిక్షించటం; తగును+ఏ= న్యాయమా? (కాదని భావం).

**తాత్పర్యం:** యమధర్మరాజా! ఇటువంటి భయంకర మైన శిక్షకు నే నేమి తప్పుచేశాను? బ్రాహ్మణుడ నైన నన్ను ఇంతగా కోపించి కూడనిశిక్షతో శిక్షించటం న్యాయమా?

**వ. అనిన మాండవ్యునకు ధర్మరా జి ట్లనియె. 270**

**తాత్పర్యం:** అనగా మాండవ్యుడితో ధర్మరాజు ఈ విధంగా అన్నాడు.

**క. సొలయక తూనిఁగలం గొ । ఱ్ఱులఁ బెట్టితి నీవు నీచిఱుతకాలము త**
**త్ఫల మిప్పు డనుభవించితి; । తొలఁగునె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్. 271**

**ప్రతిపదార్థం:** నీవు; నీ చిఱుతకాలము= నీ చిన్నతనంలో; తూనిఁగలన్; సొలయక= స్వేచ్ఛగా ఎగురకుండ; కొఱ్ఱులన్, పెట్టితి(వి)= మేకులకు (శూలాలకు) గ్రుచ్చి పెట్టావు; తద్, ఫలము+ఇప్పుడు+అనుభవించితి(వి)= దానియొక్క ఫలాన్ని ఇప్పుడు అనుభవించావు; హింసాపరులకున్= హింస చేసేవారికి; దుఃఖప్రాప్తుల్= కష్టాలు కలగటాలు; తొలఁగున్+ఎ= తప్పుతాయా? (తప్ప వని భావం).

**తాత్పర్యం:** నీవు నీ చిన్నతనంలో తూనీగలను ఎగురనీయకుండా పట్టి ముండ్లకు గ్రుచ్చి ఉంచావు. దానిఫలాన్నే ఇప్పుడు అనుభవించావు. హింస చేసేవారికి కష్టాలు పొందక తప్పుతుందా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ. అనిన విని మాండవ్యుం డలిగి 'జన్మంబు మొదలుగాఁబదునాలుగువత్సరంబులు దాఁటునంతకుఁ బురుషుండు బాలుండు; వాఁడెద్ది సేసినఁ బాపంబుం బెద్ద పొరయదు; వానికి నోరు లెగ్గసేసినఁ బాతకు లగుదు; రిది నాచేసిన మర్యాద; నీవిట్టి ధర్మంబు దలంపక బాల్యంబున నల్పదోషంబుఁజేసిన నాకు**

**బ్రాహ్మణోచితంబుగాని క్రూరదండంబు గావించినవాఁడవు మర్త్యలోకంబున శూద్రయోనిం బుట్టు'మని శాపం బిచ్చుటంజేసి వాఁడు విదురుం డై పుట్టె. 272**

**తాత్పర్యం:** అనగా విని మాండవ్యుడు కోపించి 'పుట్టినది మొదలుగా పధ్నాలుగేండ్లు దాటేంతవరకు పురుషుడు బాలు డనబడతాడు. అతడు ఏది చేసినా పాపాన్ని పెద్దగా పొందడు. అతడికి ఇతరులు కీడు చేస్తే పాపు లౌతారు. ఇది నేను చేసిన కట్టడి. నీవు ఇట్టిధర్మాన్ని భావించక బాల్యంలో స్వల్పమైన దోషాన్ని చేసిన నాకు బ్రాహ్మణులకు యోగ్యంకాని కఠినమైన శిక్షను ఇచ్చావు. కాబట్టి నీవు మానవలోకంలో శూద్రవనితకు పుట్టు' మని శాపం ఇవ్వటంచేత అతడు (యముడు) విదురుడై పుట్టాడు.

**క. అని మాండవ్యాఖ్యానము । జనమేజయునకు నుదారచరితునకుఁ బ్రియం**
**బునఁ జెప్పెను వైశంపా । యనుఁ డవితథపుణ్యవచనుఁడని కడుభక్తిన్. 273**

**ప్రతిపదార్థం:** అని= ఈవిధంగా; మాండవ్య+అఖ్యానము= మాండవ్యునికథను; అవితథ, పుణ్య, వచనుఁడు= సత్యమైనవి, పుణ్యప్రదమైనవి అయిన మాటలు కలవాడు; వైశంపాయనుఁడు; ఉదారచరితునకున్= ఉత్తమప్రవర్తన కలవాడికి; జనమేజయునకున్; కడున్, భక్తిన్= మిక్కిలిభక్తితో; ప్రియంబునన్= ప్రీతితో; చెప్పెను= చెప్పాడు. అని.

**తాత్పర్యం:** ఈవిధంగా మాండవ్యుని కథను సత్యములు, పుణ్యప్రదములు అయిన మాటలుకల వైశంపాయనుడు ఉత్తమప్రవర్తన గల జనమేజయుడికి మిక్కిలిభక్తితో ప్రీతిగా చెప్పాడు అని.

### ఆశ్వాసాంతము

**క. సత్యాశ్రయకులశేఖర! నిత్యోదయ! రాజరాజనృప! సుకవిజన**
**స్తుత్య మహాగుణ! విమలా । దిత్యాగ్రతనూజ! విమలధీరమణీయా! 274**

**ప్రతిపదార్థం:** సత్యాశ్రయ, కుల, శేఖర= సత్యాశ్రయుడియొక్క వంశంలో శ్రేష్ఠుడైనవాడా!; నిత్య+ఉదయ= ఎల్లప్పుడు అభ్యుదయం కలవాడా!; రాజరాజనృప= రాజరాజనరేంద్రుడా!; సుకవి, జన, స్తుత్య, మహాగుణ= ఉత్తమకవులచేత కీర్తింపదగిన గొప్పగుణాలు కలవాడా!; విమలాదిత్య+అగ్ర, తనుజా!= విమలాదిత్యుడి పెద్దకుమారుడా!; అమల, ధీ, రమణీయా!= నిర్మల మైన బుద్ధిచేత అందమైనవాడా!.

**తాత్పర్యం:** సత్యాశ్రయుడివంశంలో మిన్నయైనవాడా! ఎల్లప్పుడు అభ్యుదయం కలవాడా! రాజరాజనరేంద్రా! ఉత్తమకవులచేత కీర్తింపదగిన గొప్పగుణాలు కలవాడా!; విమలాదిత్యుడి పెద్దకుమారుడా!; నిర్మలమైన బుద్ధిచేత అందమైనవాడా!

**ద్రుతవిలంబితము.**

**త్రిభువనాంకుశ దీప్తినిధీ! సమ । స్తభువనాశ్రయ ధర్మధురంధరా!**
**శుభయశః పరిశోభిత పూర్వది । క్ప్రభువిలాస! కృపారసబంధురా! 275**

**ప్రతిపదార్థం:** త్రిభువనాంకుశ, దీప్తి, నిధీ= మూడులోకాలను అంకుశంవలె నియమించగల తేజస్సుకు నిధి(పాతర)వంటివాడా! సమస్త, భువన+ఆశ్రయ, ధర్మ, ధురంధరా= అన్నిలోకాలను ఆశ్రయించిన ధర్మాన్ని భరించేవాడా!; శుభ, యశః, పరిశోభిత, పూర్వదిక్, ప్రభు, విలాస= మంగళకరమైన కీర్తితో ప్రకాశించిన ఇంద్రుడియొక్క విలాసంకలవాడా!; కృపారసబంధురా= దయారసంతో ఒప్పినవాడా!.

**తాత్పర్యం:** మూడులోకాలను నియమించగల తేజస్సుకు నిధివంటివాడా!; లోకాలన్నింటిని ఆశ్రయించిన ధర్మాన్ని భరించేవాడా!, మంగళకరమైన కీర్తితో ప్రకాశించిన ఇంద్రుడియొక్క విలాసం (వైభవం) కలవాడా!; దయారసంతో ఒప్పినవాడా!

**విశేషం:** ద్రుతవిలంబితవృత్తం జగతీచ్ఛందంలో పుట్టింది. ప్రతిపాదంలోనూ వరుసగా న,భ,భ,ర అనే నాల్గుగణాలు ఉంటాయి మొత్తం 12 అక్షరా లుండే పాదంలో 7వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది. నన్నయ రచనలో ద్రుతవిలంబిత మొక్కటే ఉన్నది. అదే ఇది.

**గద్యము.**

> **ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబునం గౌరవ వంశ కీర్తనంబును, గంగా శంతను సమాగమంబును, వసూత్పత్తియు స్వర్గగమనంబును, దదంశ సంఘూతంబున గాంగేయు జన్మంబును, దద్రాజ్య నివర్తనంబును, బ్రహ్మచర్యవ్రత ప్రతిజ్ఞాపరిపాలనంబును, సత్యవతీ వివాహంబును, జిత్రాంగద విచిత్రవీర్యుల జన్మంబును, జిత్రాంగద మరణానంతరంబున భీష్ముండు విచిత్రవీర్యు రాజ్యంబున నిలుపుటయు, విచిత్రవీర్యుని వివాహంబును, వాని పరోక్షంబునఁ గృష్ణద్వైపాయనువలన ధృతరాష్ట్ర పాండురాజుల జన్మంబును, మాండవ్యశాపంబున విదురు జన్మంబును నన్నది చతుర్థాశ్వాసము. 276**

**తాత్పర్యం:** ఇది సమస్తసత్కవులసమూహం కీర్తించే నన్నయభట్టు రచించిన శ్రీమహాభారతంలోని ప్రధానము లైన పదునెనిమిది పర్వాలలో మొదటి దైన ఆదిపర్వంలో కౌరవవంశాన్ని వర్ణించటం, గంగాశంతనుల కలయిక, వసువుయొక్క పుట్టుక, అతడు రాజ్యాన్ని పరిత్యజించటం, బ్రహ్మచర్యవ్రతాన్ని గ్రహించిన ప్రతిజ్ఞను పాటించటం, చిత్రాంగదుడు చనిపోయినతరువాత భీష్ముడు విచిత్రవీర్యుడిని రాజ్యపాలకుడిగా నిలపటం, విచిత్రవీర్యుడి వివాహం, అతని తరువాత వ్యాసుడివలన ధృతరాష్ట్రపాండురాజుల పుట్టుక, మాండవ్యుడి శాపం, విదురుడిపుట్టుక అనే కథార్థాలు కలది నాల్గవ ఆశ్వాసం.

ఆది పర్వంలో చతుర్థాశ్వాసం సమాప్తం.



# శ్రీమదాంధ్ర మహాభారతము

### సంపుటము - 1
## ఆదిపర్వము
### మొదటి భాగము (1,2,3,4 ఆశ్వాసములు)
## గద్యపద్య ప్రథమపాదసూచి

| పద్యము - పుట | |
|---|---|



*****

# ఆదిపర్వ కథాసారం

## (రెండవభాగం)

ధృతరాష్ట్రునికి పెళ్లియీడు వచ్చింది. గాంధారదేశాన్ని పరిపాలించే సుబలుడనే రాజుకు గాంధారి అనే కూతురు ఉన్నదనీ, ఆమె రూపలావణ్యశీలాలలో ఉత్తమురాలనీ, నూరుగురు బిడ్డలకుతల్లి కాగలదనీ జ్యోతిష్కుల వలన విని భీష్ముడు స్వయంగా ఆ సంబంధాన్ని కుదిర్చాడు. అంతేకాదు, గాంధారికి పదిమంది తోబుట్టువు లున్నారు. వారందరినీ ధృతరాష్ట్రుని కిచ్చి పెళ్ళిచేయించాడు. అంతేకాక, కులశీలవతులైన నూరుగురు కన్యల నిచ్చి ఆపై వివాహాలు జరిపించాడు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడయినా అతనికి ఎటువంటి లోపం రాకుండా చూచాడు. అతనికి పట్టాభిషేకం చేశాడు.

పాండురాజు అఖిలాస్త్రశస్త్రవిద్యలను గడించి విస్తృతదేశదండయాత్రలు చేసి, అపారధనరాసులు తెచ్చి ధృతరాష్ట్రుని వశం చేసేవాడు. బంధువులకు పంచేవాడు. అతడు స్వయంవరంలో పొందిన కన్య కుంతి; భీష్మానుమతితో పెండ్లాడిన కన్య మాద్రి. పాండురాజు కుంతీమాద్రులను అమితానురాగంతో చూచుకుంటూ ఉండేవాడు.

### కర్ణుని జన్మరహస్యం

ఇక్కడ కుంతి జీవితంలో జరిగిన ఒక రహస్యవృత్తాంతం చెప్పాలి. కుంతిభోజునియింట కుంతి కన్యగా పెరుగుతున్నప్పుడు అతిథులకు సత్కారాలను స్వయంగా నిర్వహిస్తూ వారి ఆశీస్సులను, ప్రశంసలను పొందుతూ ఉండేది. ఒకసారి దుర్వాసుడు వారింటికి అతిథిగా వచ్చాడు. అతనికి ఇష్టమైన పదార్థాలను వండి వడ్డించి భక్తితో సేవించింది - కుంతి. ఆ ముని సంతసించి ఒక దివ్యమంత్రాన్ని ప్రసాదించా డామెకు. ఆ మంత్రంతో ఏ వేల్పునైనా ఆరాధిస్తే అతడు కోరినపుత్రుడిని ఇచ్చి సంతోషపెడతాడు. అది ఆపద్ధర్మంగా వాడుకోతగినది మాత్రమే.

ఆ ముని వెళ్లిపోగానే ఆ మంత్రశక్తిని పరీక్షించాలని ఆసక్తి కలిగి గంగదరి కేగి కుంతి సూర్యుడిని స్మరించి, అతనివంటికొడుకును కోరి మంత్రాన్ని జపించింది. సూర్యుడు తరుణద్యుతితో ఆ తరుణి దగ్గరకు వచ్చాడు. సహజకవచకుండల శోభితుడైన బిడ్డ నిచ్చాడు. అతడే కర్ణుడు. అయితే కుంతి కోరికపై ఆమె కన్యాత్వం యథాతథంగా ఉండేటట్లు వరమిచ్చాడు. కుంతి సూర్యప్రేరితమై వచ్చిన ఒకమందసంలో కర్ణుడిని ఉంచి నదిలో వదలింది. సూతు డొకడు ఆ పెట్టెను పట్టి కర్ణుని తన పట్టిగా పెంచుకొన్నాడు.

కుంతి కర్ణుని జన్మరహస్యాన్ని బైటపెట్టలేదు. అది దేవరహస్యంగానే ఉండిపోయింది.

### పాండవ, కౌరవజననం

ఒకసారి పాండురాజు వేటకు వెళ్లాడు. ఆ రోజు వనంలో ఎక్కడా వేటకు మృగాలు దొరకలేదు. విసిగి వేసారి పోయాడు. చివరకు ఒకచోట, రెండుమృగాలు క్రీడిస్తుంటే చూచి వాటిని బాణాలతో కొట్టి చంపాడు. కిందము డనే

ముని తనభార్యతో కలిసి మృగరూపంలో క్రీడిస్తున్నాడు. అతడు పాండురాజు బాణాలకు చనిపోతూ శాపం పెట్టాడు. 'నేను నా భార్యతో కూడియున్నప్పుడు ఎలా చనిపోతున్నానో అలాగే నీవూ నీ భార్యతో కూడినప్పుడు చనిపోతావు. నీ భార్యకూడా చనిపోతుంది' - అని శపించి ఋషి దంపతులు కన్ను మూశారు. పాండురాజు విషణ్ణుడయ్యాడు; విరక్తుడుకూడా అయ్యాడు. భార్యాసమేతుడై శతశృంగపర్వతం చేరి ఘోర తపస్సు చేయ నారంభించాడు. అది బ్రహ్మలోకానికి వెళ్లేదారి. కొందరు మునులు బ్రహ్మలోకానికి పోతూ ఉంటే పాండురాజు వారితో తానూ వస్తా నన్నాడు. కాని, వారు 'అపుత్రస్య గతిర్నాస్తి - అని వినలేదా! నీకు సంతానం లేదు కాబట్టి మోక్షానికి అర్హతలే'దని చెప్పారు. వారిమాటలు పాండురాజును మరీ క్రుంగదీశాయి.

సంతానాన్ని గురించి కుంతీమాద్రులతో కలిసి ఆలోచించాడు. దుర్వాసమహర్షి తన కిచ్చిన మహామంత్ర మొకటున్నదని ఆపద్ధర్మంగా దానిని పుత్రలబ్ధికి వాడుకోవచ్చునని కుంతి చెప్పింది. పాండురాజు అంగీకరించాడు. కుంతిని పుత్రసంతానంకొరకు మంత్రమహిమ నాశ్రయించుమని నియోగించాడు. ఆమె భర్తకు ప్రదక్షిణం చేసి సమాహితచిత్తంతో మంత్రాన్ని జపించింది. మొదటగా సర్వలోకాలకు ఆశ్రయమైన ధర్మానికి మూలమైనవాడు ధర్ముడు; అతనిని స్మరించి ఉత్తమధర్మవర్తనుడైన పుత్రుడిని కోరుకొన్నది. దిక్కులు కాంతులతో పిక్కటిల్లేటట్లు వెలుగొందే బాలుడు ధర్ముని అంశాన జన్మించాడు. అతడు పుట్టినప్పుడు సర్వభూతములు సంతోషించాయి. ఆకాశవాణి ఇట్లా పలికింది; "ఇతడు కురుకులదీపకుడౌతాడు; ధర్మస్థిరమతి కావటంచేత యుధిష్ఠిరుడు అని పిలువబడతాడు".

యుధిష్ఠిరుడు పుట్టినసంగతి హస్తినాపురానికి వార్త అందింది. అందరూ సంతోషించారు. కాని, గాంధారి అప్పటికే గర్భవతి. సంవత్సరం నిండుతున్నా ముందుగా సంతానాన్ని కనలేకపోయింది. ఆ అసూయతో కడుపుపై బాదుకొన్నది. గర్భపాతమైపోయింది. వేదవ్యాసుడు వచ్చి ఆ పిండఖండాలను నూటొక్కటిని లెక్కించి వేరువేరు తైలభాండాలలో భద్రపరిచాడు. నూర్వురు కొడుకులు, ఒక్క కూతురు పుడతా రని చెప్పి వెళ్లాడు.

అక్కడ - శతశృంగపర్వతంమీద పాండురాజు మరొక పుత్రుని పొందాలనే కోరికతో కుంతిని - వాయుదేవుని నారాధించి ఉత్తమజవసత్త్వుడైన కుమారుడిని పొందుమని అడిగాడు. ఆమె అలాగే చేసింది. వజ్రదేహుడైన విక్రమోన్నతుడైన బాలుడు పుట్టాడు. దివ్యవాణి అతనికి "భీమసేనుడు" అని పేరు పెట్టింది.

అదేరోజు హస్తినాపురంలో దుర్యోధనుడు పుట్టాడు. కులాన్నీ, లోకాన్నీ నాశనం చేయగల దుశ్శకునాలు ఎన్నో పొడసూపాయి. అందరూ భయవిహ్వలులైనారు. అట్లాగే క్రమంగా దుశ్శాసనుడు మొదలైన తొంభైతొమ్మిది మంది తమ్ములు, దుశ్శల అనే చెల్లెలు పుట్టారు. కులనాశకుడైన దుర్యోధనుడిని ఒక్కడిని దూషించటం మంచి దని పెద్దలు ధృతరాష్ట్రునికి సూచించారు. అతడు పుత్రవ్యామోహంతో దాన్ని అంగీకరించలేదు.

ఈ సంగతి విని - పాండురాజు త్రిలోకవిజయుడైన పుత్రునికొరకు ఏకపాదంమీద నిలువబడి ఒక సంవత్సరకాలం ఇంద్రుడిని గురించి తపస్సు చేశాడు. దేవేంద్రుడు ప్రసన్నుడై శత్రుక్షయాన్ని చేయగల మహావీరుడు నీకు కొడుకుగా పుడతాడని వరమిచ్చాడు. కృతార్థుడైన పాండురాజు, కుంతీదేవిని ఉపాసించుమని కోరాడు. ఆమె అట్లాగే ఆరాధించింది. స్థిరపౌరుషుడు, లోకోత్తరుడు, వంశకరుడు అయిన పుత్రుడు ఇంద్రాంశతో పుట్టాడు. ఆ సమయంలో దేవతలు ఆ బాలుని భావిబలవీర్యాలను కీర్తిస్తూ పూలవానలు కురిపించారు. ఉత్తరఫల్గుణీనక్షత్రంలో పుట్టాడు కాబట్టి ఆ బాలుడిని ఫల్గుణుడని పిలిచారు.

ముగ్గురు కొడుకులను చూచి పాండురాజు మూడులోకాలు జయించినట్లు పొంగిపోతుండేవాడు. కాని మాద్రి తనయందు పుత్రసంతానం పొందే ఉపాయం లేకపోవటంవలన విచారిస్తూ ఉండేది. దీన్ని గమనించి కుంతితో ఒప్పించి, దుర్వాసుని మంత్రప్రభావంతో మాద్రిచేత అశ్వినీదేవతలను ఆరాధింపజేసి కవలపిల్లలను పొందగలిగాడు. వారే నకుల సహదేవులు. సౌందర్యపరాక్రమాలలో సాటిలేనివారు. ఇట్లా పంచపాండవులు పుట్టి శుక్లపక్షచంద్రబింబాలవలె పెంపొందుతూ ఉన్నారు.

అంతలో ఒక విపత్తు. వసంతఋతువు వచ్చింది. ప్రకృతిశోభ మానవుల హృదయాల నుప్పొంగ జేస్తున్నది. కుంతి అన్నదానవ్రతంలో నిమగ్నురాలై ఉన్నది. మాద్రి ఒక్కతే పాండురాజు ప్రక్కన ఉన్నది. ఆమె మనోహరరూపం వసంతప్రభావంతో అతని మనస్సు నాకర్షించింది. పాండురాజు మాద్రిని సమీపించాడు. మునిశాపంచేత మరణించాడు. శతశృంగీయులందరూ గుమిగూడారు. హృదయవిదారకంగా విచారించారు. మాద్రి తాను పాండురాజుతో సహగమనం చేసింది. కుమారులరక్షణకు కుంతి దృఢచిత్తంతో జీవించ సంకల్పించింది. మాద్రీపాండురాజుల అంత్యక్రియల తర్వాత వారి అవశేషాలతో అందరూ హస్తినాపురం చేరారు.

## రగిలిన పగలు

హస్తినాపురరాజమందిరంలో అటు కౌరవులు, ఇటు పాండవులు అందరూ కలిసి బాలక్రీడలాడుతుండే వారు. అందరిలో బలాఢ్యుడు భీమసేనుడు. జలక్రీడ లాడేటప్పుడు భీముడు కౌరవులను భుజాలపై కెక్కించుకొని నీటిలో ముంచి తేల్చి ఉక్కిరిబిక్కిరి చేసేవాడు. పండ్లకోసం కౌరవులు చెట్లెక్కితే భీముడు చెట్లమొదళ్ళు పట్టి ఊపి పండ్లతోబాటు వారిని కూడా క్రింద పడేసేవాడు. ఇట్లా భీముని చేతిలో బాధలు పడలేక దుర్యోధనుడు శకునిదుశ్శాసనులతో మంతనాలు సలిపి, భీముడిని ఒంటరిగా ఉన్నప్పుడు చంపటానికి పన్నాగాలు పన్నాడు.

ఒకనాడు భీముడు జలక్రీడలలో వేయిమంది వీరకుమారులతో పోటీపడి గెలిచి, బాగా అలసిపోయి, చల్లగాలి వీస్తుంటే నీటి ఒడ్డునే పడుకొని గాఢనిద్రపోయాడు. దాన్ని గమనించిన దుర్యోధనుడు భీముడిని లతాపాశాలతో గట్టిగా కట్టించి నీటిలో త్రోయించాడు. కాని భీముడు ఒళ్ళు విరుచుకునేసరికి ఆ లతలన్నీ పెటపెటా తెగిపోయాయి. భవబంధవిముక్తునివలె నీటినుండి బయటికి వచ్చాడు.

ఒకనాడు బాగా శ్రమించి భీముడు నిద్రిస్తున్నాడు. ఆ అదను కనిపెట్టి దుర్యోధనుడు ఒక సారథిచేత పాములను తెప్పించి అతడిని కరిపించాడు. భీమునిశరీరం వజ్రతుల్యం కావటంచేత పాముల కోరలు అతని చర్మంలో దిగబడలేదు. కాని, నిద్ర మెలకువ వచ్చింది. అతడు సారథి నొక్క చరుపుతో చంపివేశాడు. పాములను కాళ్ళతో నలిపేశాడు. ఒకసారి అన్నంలో విషం కలిపి పెట్టించాడు. యుయుత్సుడు వద్దంటున్నా ఆకలిగొన్న భీముడు ఆ విషాన్నం తిన్నాడు. విషంకూడా ఆకలివలన అతనికి అమృతంగా మారింది. ఇట్లా ఎన్నో ఉపాయాలతో భీముడిని వధించి ధర్మరాజును ఒంటరివాడిని చేసి చంపాలని దుర్యోధనుడు ప్రయత్నించి విఫలుడయ్యాడు. చివరకు పాండవుల కందరికీ అపాయం కలిగించే ఉపాయమే ఉపాదేయమనుకొన్నాడు.

## ఆదిపర్వ కథాసారం - 4

భీష్ముడు బాలురకందరికీ మొదట కృపాచార్యునిచేత విలువిద్య నేర్పించాడు. ఆపై ద్రోణుడినికూడా నియోగించాడు. ద్రోణుడిని ద్రుపదుడు అవమానించాడు. అందువలన అతనిపై ప్రతీకారం తీర్చుకోవాలని అతడు లోలోన మండిపడిపోతున్నాడు. శిష్యు లందరిని తనకోర్కె తీర్చగలరా అని అడిగాడు. అర్జునుడు ఒక్కడే మాట ఇచ్చాడు. అందువలన అతడిని జగదేకవీరునిగా తీర్చిదిద్దుతానని ద్రోణుడు వరమిచ్చాడు. ఏకలవ్యుని వంటివారిఅడ్డును ఉపాయంతో తొలగించాడు. రాత్రియుద్ధం, శబ్దభేది, అస్త్రశస్త్రాలు, విలువిద్యా రహస్యాలు ఎన్నెన్నో అర్జునుడికి బోధించాడు. విలువిద్యలో పార్థుడే ప్రథమగణ్యుడు.

రాజకుమారుల అస్త్రశస్త్రపాండిత్యాన్ని పెద్దలముందు ప్రదర్శింప చేయటానికి ద్రోణుడు ఒక విశాల సమతల ప్రదేశంలో రంగం ఏర్పాటు చేయించాడు. తెల్లనివస్త్రాలను ధరించిన ద్రోణుడు అశ్వత్థామ వెంటరాగా క్రీడారంగం మధ్యకు వచ్చి నిలబడ్డాడు. కురుకుమారులందరూ జ్యేష్ఠానుపూర్వంగా మహాధనువులతో తనుత్రాణాలతో గురువుగారివెనుక వరుసగా నిలిచారు. చూడముచ్చటగా నున్నది దృశ్యం.

మొట్టమొదట భీమదుర్యోధనుల గదాద్వంద్వయుద్ధం ప్రవర్తిల్లింది. భూమి దద్దరిల్లేటట్లు పాదఘట్టనం చేస్తూ మదపుటేనుగులవలె భయంకరంగా పోరాడసాగారు భీమదుర్యోధనులు. ప్రజలలో వారివురిపట్ల అభిమానం గలవారు పెద్దఅరుపులతో పాటు పరస్పరవివాదాలుగూడా చేయటం మొదలుపెట్టారు. దానితో వారిద్దరి పోరును ద్రోణుడు అశ్వత్థామను పంపి ఆపివేయించాడు.

ఆ తరువాత హేమకవచావృతుడు, ఉన్నతచాపధరుడు, అసితోత్పలవర్ణుడు, బద్ధతూణీరుడు అయిన అర్జునుడు రంగమధ్యంలో నిలిచి జనహృదయాలను ఆకట్టుకొన్నాడు. ప్రజలు చేసే ప్రస్తుతి మిన్నంటింది. అర్జునుడు ఆచార్యునిఅనుమతితో ఆగ్నేయ, వారుణాదిమహాస్త్రాలను ప్రయోగించి, పరుగెత్తుతున్న మృగాలపై బాణాలు నాటేపలునేర్పులను ప్రదర్శించి విలువిద్యలో మేటివీరుడని జయజయధ్వానాలు పొందాడు.

అంతలో సహజకవచకుండలధారియైన కర్ణుడు రంగద్వారం వద్ద నిలిచి భుజాస్ఫాలనం చేసి అర్జునుడిని ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించాడు. ద్రోణుని అనుమతితో ముందుగా అర్జునుడు ప్రదర్శించిన విద్యలన్నీ ప్రదర్శించి చూపించాడు. అతని పరాక్రమాన్ని చూచి దుర్యోధను డతనిని కౌగలించుకొని "నాతో స్నేహం చేసి నాకూ నా బంధువులకూ హితం చేసి నన్ను కురురాజ్యం ఏలించి, నా ఐశ్వర్యం ఉపయోగించుకో" అని కోరాడు. కర్ణుడు దానికి అంగీకరించాడు.

ఆ తరువాత కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం మొదలైనది. కర్ణుడు పర్జన్యాస్త్రం వేశాడు. అర్జునునిపై మేఘాలు దట్టంగా క్రమ్మాయి. కుంతి భయపడింది. అంతలో అర్జునుడు వాయుబాణం వేసి మేఘాలను చిమ్మివేశాడు. కుంతి శాంతపడింది. వారిద్దరి నడుమ పంతాలు పెరుగుతున్నందువలన కృపాచార్యు డడ్డంవచ్చి, అర్జునుని తల్లిదండ్రుల పేర్లు కులం అందరికీ తెలుసు. అట్లాగే నీ వివరాలు తెలియజెప్పుమని కర్ణుడిని అడిగాడు. కర్ణుడు చెప్పడానికి సిగ్గుపడి తలవంచుకొన్నాడు.

దుర్యోధనుడు రంగప్రవేశం చేసి, రాజైతేతప్ప పార్థునితో యుద్ధం చేయడానికి వీల్లేదంటే ఇదుగో అంగరాజ్యాన్నిస్తున్నానని, రంగమధ్యంలో సింహాసనం వేసి అంగరాజ్య పట్టాభిషేకం చేసి కర్ణుడిని అంగరాజుగా పిలిచాడు. సూతుడు, కొడుకుని చూచి ఉప్పొంగిపోయి కౌగలించుకొన్నాడు. కర్ణుడు అతనికి అభివాదనం చేశాడు. దానితో

అతడు సూతపుత్రుడని అందరికీ తెలిసిపోయింది. సూతపుత్రుడు క్షత్రియునితో యుద్ధం చేయటం తగదన్నాడు భీముడు. దుర్యోధనుడు అతని మాటలకు అడ్డువచ్చాడు. 'లేడి కడుపున పులి పుడుతుందా? ఇంతటి దివ్యతేజస్సు కలవాడు సామాన్యుడై ఉంటాడా? సూరుల జన్మస్థానం సురల జన్మం, ఏరుల జన్మం ఎవరు చెప్పగలరు? సహజకవచకుండలధారియైన ఇతడు అంగరాజ్యానికే కాదు, అఖిల మహీ మండలానికే అధిపతి కాగలిగినవాడు' అని ప్రశంసిస్తూ ఉండగా ప్రొద్దు క్రుంకింది. అందరూ వారివారి మందిరాలకు వెళ్ళారు.

## గురుదక్షిణ

మరునాడు ద్రోణాచార్యులు శిష్యులందరినీ పిలిచి 'గురుదక్షిణ నివ్వండి!' అన్నాడు. అందరూ గురువు గారిని ఆదేశించుమన్నారు. 'ఐశ్వర్యమదగర్వితుడైన ద్రుపదుడిని ఓడించి పట్టి నాముందు పెట్టండి. అదే నేను కోరే గురుదక్షిణ' అని ప్రకటించాడు-ద్రోణాచార్యుడు.

ఆమాట వినగానే కౌరవులందరూ సైన్యాలను వెంటబెట్టుకొని రథాలెక్కి పాంచాలపురం వైపు పయనం సాగించారు. పాండవులు గురువుకు ప్రదక్షిణం చేసి ఆయనను వెంట తీసికొని ఆ తరువాత బయలుదేరారు. కౌరవుల సేనను ద్రుపదుడు చతురంగసేనతో ఎదుర్కొనాడు. పోరు ఘోరంగా సాగింది. ద్రుపదుని పరాక్రమానికి కౌరవులు నిలువలేకపోయారు. వెనుదిరిగి పోసాగారు. పాండవు లెదురుపడ్డారు. వారి అండన నిలిచారు. అర్జునుడు భీమునిసాయంతో ముందుకు నడిచాడు. ద్రోణుడినీ, ధర్మజుడినీ ఒకచోట నిలిపారు. సైన్యంతో భీముడు ద్రుపదుని గజబలాన్ని మట్టుపెట్టాడు. అర్జునుడు అశ్వబలాన్ని మట్టుబెట్టి ద్రుపదునిపై బాణాలు గుప్పించాడు. అంతలో ద్రుపదుడు అర్జునుని విల్లును విరుగకొట్టాడు. అర్జునుడు సింహంవలె లంఘించి కత్తితో ద్రుపదుని రథంపైకి దూకాడు. మెరుపుదాడి చేసి అతడిని రథాక్షంతో కట్టి ద్రోణుని యెదుటకు తెచ్చి ఉంచాడు. అప్పుడు అవహేళనగా నవ్వుతూ ద్రోణుడు ద్రుపదునితో ఈవిధంగా అన్నాడు.

క. "వీ రెవ్వరయ్య ద్రుపదమ
హారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె యహహా! మ
హా రాజ్యమదాంధకార మది వాసెనొకో!"

ఇప్పటికైనా నేను జ్ఞాపకానికి వచ్చానా? అని అధిక్షేపించి ద్రుపదుడిని వదలివేశాడు. ఇట్లా గురుదక్షిణ పాండవులే ఇవ్వగలిగారు.

## లాక్షాగృహ దహనం

రాజ్యభారాన్ని వహించగలవాడినిగా భావించి భీష్మ విదురాదులతో విచారించి ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు యువరాజుగా పట్టంగట్టాడు. ధర్మజుడు నలుగురుతమ్ములసాయంతో నాలుగుదిక్కులా విజయయాత్రలు సాగించి అపారధనరాసులను తెచ్చి హస్తినాపుర వైభవాన్ని పెంచాడు. ధర్మరాజు పేరుకు యువరాజుగాని, తీరుకు సార్వభౌముడు.

పాండవులమీద పెరుగుతున్న ప్రజానురాగం దుర్యోధనునిగుండెల్లో అసూయాగ్నిని రగిల్చింది. అతడు

ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్లి తన దుఃఖాన్ని వెళ్లగ్రక్కాడు. 'పైతృకమైన ఈ రాజ్యలక్ష్మిని పూర్వం పాండురాజు భరించాడు. కాబట్టి ఇప్పుడు ధర్మరాజును యువరాజును చేశారు. ఆ తరువాత ఆతనికొడుకులు, మనుమలే రాజ్యాధిపతులౌతారు. మేము వారిని సేవించి బ్రతికేదుర్గతి ఏర్పడుతుంది. రాజ్యం మీ ఆధీనంలో ఉన్నది కాబట్టి మీరే మాకు, రాజ్యానికి మార్గం వేసి చూపించాలి. పాండవులకీర్తి ప్రజలలో పెరిగిపోతున్నది. ముందు వారిని దూరం చేయండి. వారణావతానికి పంపండి. ఆరునెలలలో నేనూ హస్తినాపురి ప్రజలలో నా మీద అభిమానం కలిగేటట్లు చూచుకొంటాను' - అని వాదించి తండ్రిని ఒప్పించాడు.

ధృతరాష్ట్రుడు నయంతో ప్రేమతో పాండవులను కుంతితోసహా వారణావతానికి పంపాడు. అక్కడ దుర్యోధనుడు పురోచనునితో లక్కయింటిని కట్టించి సమయం కనిపెట్టి అందులో పాండవులు తగులపడేటట్లు చూడాలని పన్నాగం పన్నాడు. విదురు డీరహస్యాన్ని గోప్యంగా ధర్మరాజుకు సూచించాడు. ధర్మజుడు గ్రహించి, భీమునితో చెప్పి, లాక్షాగృహంలో నిపుణంగా జాగరూకతతో ఉంటుంటారు. విదురుడు ఒక గూఢచారిని పాండవుల చెంతకు పంపించి లక్కయింటినుండి వారు తప్పించుకొని పోవటానికి బిలమార్గాన్ని ఏర్పరచి, కృష్ణ చతుర్దశినాటిరాత్రి లాక్షాగృహదహనమవుతుందని సూచించాడు. భీముడు ఈ రహస్యాన్ని గమనించి, పురోచనుని, ఒక దాసిని, దాని అయిదుగురు కొడుకులను ఆ లక్కయింటిలో ఉంచి, అన్నదమ్ములను తల్లిని బిలంద్వారా పంపించి, నియమించిన ముహూర్తంకంటె ముందే లక్కయిల్లు మొత్తం దహనమయ్యేటట్లు చూచి తాను బిలంద్వారా వెడలిపోయాడు. ఒక్క విదురుడు తప్ప అందరూ పాండవులు లక్కయింటిలో పడి కాలిపోయారని దుఃఖించారు. ధృతరాష్ట్రదుర్యోధనుల పాపసంకల్పాలను ప్రజలు గర్హించారు.

బిలద్వారంగుండా పాండవులు బయటపడి పాదచారులై నడిచి ఒక వనం చేరారు. భీముడు నీరు తెచ్చేలోపలే ఒక చెట్టుకింద ధర్మజాదులూ, కుంతీ గాఢనిద్రలో మునిగిపోయారు. వారి దీనావస్థకు విచారపడుతూ ఆ రాత్రి భీముడు వారికి కాపలా కాస్తూ ఉన్నాడు.

అది హిడింబాసురుడు నివసించే వనం. నరవాసన కొట్టింది అతనికి. పాండవులను చంపి వండి వడ్డించుమని చెల్లెలైన హిడింబను ఆజ్ఞాపించాడు. ఆమె ఆ చెట్టు దగ్గరకు వచ్చింది. భీముని సుందరవీరాకారం చూచింది. మనసారా ప్రేమించింది. అతనితోడిదే తనజీవిత మని మొదటిచూపులోనే నిర్ణయించుకొన్నది. అన్నను పోగొట్టుకొన్నా భీముడిని మాత్రం పొందాలనుకొన్నది. అన్నివిషయాలు భీముడికి చెప్పింది. ఆలస్యమైనదని హిడింబుడు లేచి వచ్చాడు. భీము డాతనితో యుద్ధానికి తలపడ్డాడు. రాక్షసుని అరుపులకు కుంతి నిద్ర లేచింది; ధర్మజాదులు లేచారు. హిడింబ మానవాకారంలో ఎదుట పడింది. కుంతి ఆమెను గురించి అడిగింది. హిడింబ ఏ సంగతీ దాచుకోకుండా మనసు విప్పి కుంతితో చెప్పుకొన్నది. ఆమెకు ఎన్నో మహిమలున్నాయి. వాటిని ప్రదర్శించి చూపింది. భీముడు హిడింబాసురుడుని చంపాడు. పాండవులను హిడింబ అనుసరించింది. భీముడు వారించాడు. ధర్మజుడు, కుంతి భీముడికి నచ్చజెప్పారు. శాలిహోత్రుని ఆశ్రమంగురించి హిడింబ చెప్పినమాటలు నిజమని తెలిశాయి. భీమునితో హిడింబకు వివాహమయింది. పగలల్లా ఆ దంపతులు అడవులలో విహరించేవారు. రాత్రిళ్ళు ధర్మరాజాదుల వద్ద ఉండేవారు. కొన్నాళ్ళకు ఘటోత్కచు డనేపుత్రుడు పుట్టాడు-హిడింబకు. భయంకరాకారుడు, సద్యోయౌవనుడు, అస్త్రశస్త్రకుశలుడు, రాక్షస పిశాచబలపరివృతుడు అయిన ఘటోత్కచుడు పాండవులను కొంతకాలం సేవించి రాక్షస రాజ్యానికి వెళ్ళిపోయాడు - తల్లిని తీసికొని. తనను స్మరిస్తేచాలు ప్రత్యక్షమౌతానని తండ్రితో చెప్పాడు.

శాలిహోత్రుని ఆశ్రమంలో వ్యాసుడు పాండవులకు దర్శనమిచ్చాడు. జరిగిన దానికి విచారించవ ద్దని ధైర్యం చెప్పి, భావికార్యక్రమాన్ని సూచించి వెళ్లాడు. పాండవులు బ్రాహ్మణవేషాలతో ఏకచక్రపురం చేరారు. అక్కడ భిక్షాటనం చేసికొంటూ బ్రతుకు సాగించారు. అయినా, అక్కడ ప్రజలను పట్టి పీడించే బకాసురుడిని భీముడు వధించి వారికి శాంతిసౌఖ్యాలను అందించాడు.

## పాండవవివాహం

ఆనాడు అర్జునుడి చేతిలో ఓడిన ద్రుపదుడు ద్రోణుడిని చంపే ఒకకొడుకును, అర్జునుని వివాహమాడే ఒకకూతురును పొందాలని అనేకఘోరవ్రతాలు చేశాడు. చివరకు ఒక క్రతువు నిర్వహించాడు. యజ్ఞాగ్నిలో నుండి ఉజ్జ్వల కరవాలంతో రథారూఢుడైన ధృష్టద్యుమ్నుడు పుట్టాడు. దివ్యతేజస్విని ద్రౌపది పుట్టింది. ఆ ద్రౌపదిని అర్జునునకివ్వాలని లోన సంకల్పం. పైకి చలత్ మత్స్యయంత్రభేదనాన్ని వరపరీక్షగా పెట్టాడు-ద్రుపదమహారాజు. ఈ సంగతి పాండవులు ఏకచక్రపురంలో విన్నారు. పాంచాలపురికి హుటాహుటిన బయలుదేరారు.

ద్రుపదనగరం స్వయంవరోత్సవంతో కోలాహలంగా ఉన్నది. ఎత్తుగా కట్టబడిన మత్స్యయంత్రాన్ని అయిదుబాణాలతో ఎవడు కొట్టగలడో, ఆ విలుకాడే ద్రౌపదికి భర్త కాగలడని పాంచాలపతి ప్రకటించాడు. రాజులు నగరం చుట్టూ డేరాలు తీర్చి స్వయంవరానికి దిగి ఉన్నారు. పాండవు లాపురిలో బ్రాహ్మణ వేషాలతో ప్రవేశించి ఒక కుంభాకారుని యింట్లో వసించి మత్స్యయంత్రసభకు వెళ్లారు.

ధృష్టద్యుమ్నుడు స్వయంవరనియమాన్ని ప్రకటించాడు. స్వయంవరసభలో విచ్చేసియున్న రాజులనందరినీ ద్రౌపదికి చూపించాడు. అందులో నూరుగురు కౌరవులున్నారు. కర్ణాశ్వత్థామాదులుకూడా ఉన్నారు. వారిలో ఎవరు లక్ష్యాన్ని భేదిస్తే అతడు కల్యాణమాలకు అర్హుడని సూచించాడు. ఆ సభలోని అతిథులలో వాసుదేవు డున్నాడు. అతడు బ్రాహ్మణవర్గంలో పంచాగ్నులవలె వెలుగొందుతున్న పాండవులను గ్రహించి, పార్థుడు పాంచాలిని గ్రహిస్తాడని సంతోషించాడు.

కొందరు రాజులు విల్లు ఎక్కపెట్టలేక వెనుతిరిగిపోయారు; కొందరు ప్రయత్నమే చేయలేకపోయారు; కొందరు చేసి విఫలురయ్యారు. బ్రాహ్మణులలో నుండి అర్జునుడు లేచి యంత్రాన్ని సమీపించి, గురువులకు నమస్కరించి, ధనువునకు ప్రదక్షిణం చేసి మ్రొక్కి, దానిని అవలీలగా ఎక్కుపెట్టి, అలవోకగా మత్స్యయంత్రాన్ని భేదించాడు. సభికు లందరూ ఆశ్చర్యపోయారు. బ్రాహ్మణు లుప్పొంగిపోయారు. ధృష్టద్యుమ్నుడు సైన్యంతో అర్జునుని వెంట నిలువ బడ్డాడు. ధర్మజుడు నకుల సహదేవులతో కలిసి వసతిగృహానికి వెళ్లాడు. ద్రౌపది కల్యాణమాలను అర్జునుని మెడలో ఉంచటానికి బయలుదేరింది. దుర్యోధనాదు లది సహించలేకపోయారు. రాచకన్నెను విప్రుడి కివ్వటం అవమానమని ఆగ్రహించారు. విప్రాకారంలో నున్న అర్జునుడిని అపహసించారు. ద్రుపదుడు భయపడి బ్రాహ్మణుల వెనకాల నిలువబడ్డాడు. వారందరికి అభయమిచ్చి అర్జునుడు భీమ సహాయంతో తిరుగబడ్డాడు.

అర్జునుడికి ఎదురుగా కర్ణుడు నిలిచి బాణయుద్ధం చేశాడు. తన ఎదుట నిలువగలిగిన ఆత డెవడా? అని కర్ణు డాశ్చర్యపోయాడు. ఎవడో విప్రశ్రేష్ఠునివలె నున్నాడని రణరంగం నుండి తొలగిపోయాడు. భీముడు శల్యుడిని

నేలపై పడేసి కొట్టాడు. అతడు లేచి దుమ్ము దులుపుకొని వెళ్లిపోయాడు. ఆ బ్రాహ్మణులెవరో తేల్చుకోవాలని పట్టుబట్టిన దుర్యోధనాదులకు మొగం వాచేటట్లు సమాధానం చెప్పి వాసుదేవుడు పంపివేశాడు. రాజులందరూ మరలిపోయారు. భీమార్జునులు ద్రౌపదిని తీసికొని యింటికి వచ్చారు. ధర్మజాదులతో కలిసి "తల్లితో అమ్మా! మే మొకభిక్ష తెచ్చాం" అని అన్నారు. కుంతి అసలు విషయాన్ని గ్రహింపక "మీ రయిదుగురూ ఉపయోగించుకొనండి" అని కొడుకులను నియోగించింది. ఆ తరువాత ద్రౌపదిని చూచి ప్రబోధించానని చిన్నబోయింది. ఆమె అన్నమాట అయితీరుతుంది. పాండవులు అమ్మమాట జవదాటరు. కుంతి కలత చెందింది. ధర్మజుడు తల్లినోదార్చి ద్రౌపదిని అర్జునుడినే వివాహమాడుమన్నాడు. అర్జునుడు పెద్దవాడైన ధర్మరాజును పెండ్లాడుమన్నాడు. వీరిద్దరూ ఇట్లా అంటూనే ఉన్నారు. పాండవులైదుగురూ పాంచాలిని చూచి మన్మథభావాన్ని ఒకేసారి పొందారు. పాంచాలి కూడా వారి అయిదుగురియందు బద్ధానురాగయై నిలిచింది. ధర్మజుడు వేదవ్యాసుని మాటలు స్మరించి ద్రౌపదిని పాండవులైదుగురు పాణిగ్రహణం చేయటమే ఉత్తమ మని నిర్ణయించాడు.

మత్స్యయంత్రం భేదించింది అర్జునుడనీ, ద్రౌపదిని వివాహమాడేది పాండవు లనీ తెలిసికొని ద్రుపదుడు సంతోషించాడు. ద్రౌపదికి భర్తృపంచకం ఏర్పడటానికి గల పూర్వజన్మవృత్తాంతాన్ని వ్యాసుడు వినిపించాడు. ఆమె అయిదుగురు భర్తలకు భార్య అయినా ఎవరిదగ్గర కన్యాత్వం సతీత్వం వారివద్ద మొక్కవోకుండా ఉండే వరం ఉండటంవలన వివాహంలోకూడా వరుసగా ధర్మజాదులు తాళిగట్టేటప్పు డామె కన్యాత్వం చెక్కు చెదరకుండా నిలిచింది. ఆ మహిమను చూచి అగ్నిజాతయైన ద్రౌపదియొక్కవిశిష్టలక్షణంగా అందరూ భావించారు. వాసుదేవుడు సంతోషించాడు. పాండవులవివాహం వైభవంగా జరిగింది. వారు పాంచాలనగరంలో ఒకయేడాదిపాటు ఉన్నారు.

## ఇంద్రప్రస్థపురం

ధృతరాష్ట్రుడు భీష్మాదుల నీతివచనాలు విని విదురుని పంపి పాండవులను హస్తినాపురానికి పిలిపించాడు. లాక్షాగృహదహనం నుండి పాండవులు బైటపడ్డందుకు దుర్యోధనుడు లోలోన మండిపోతుండేవాడు. పాండవులు ఎక్కువకాలం హస్తినాపురంలో ఉండకుండా చూడుమని తండ్రిని బలవంతపెట్టేవాడు. కొడుకుపోరు పడలేక ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్యమిచ్చి ఇంద్రప్రస్థపురం రాజధానిగా ఏలుకోండని పంపాడు. ధర్మరాజును పట్టాభిషిక్తుడిని చేశాడు. శ్రీకృష్ణాదులు వెంటరాగా పాండవులు ఇంద్రప్రస్థపురాన్ని చేరుకొన్నారు.

శ్రీకృష్ణుడు ఇంద్రుడిని, ఇంద్రుడు విశ్వకర్మను స్మరించగా విశ్వకర్మసాయంతో ఇంద్రప్రస్థపురం దిక్పాలకుల పురాలతో దీటైనదిగా రూపొందింది. వాసుదేవుని అనుమతితో ఆశీస్సులతో ధర్మజు డానగరంలో ప్రవేశించి అపరదేవేంద్రునివలె వెలుగొందుతూ ఉన్నాడు.

ఒకనాడు నారదుడు వచ్చి పాండవులలో ఒక్కొక్కరు ద్రౌపదిని ఒక్కొక్క యేడు తన భవనంలో ఉంచుకోవా లనీ, ఆ కట్టడిని తెలిసిగాని, తెలియకగాని ఎవరైనా మీరితే ఒకయేడాది పాటు అతడు తీర్థయాత్రలు చేసిరావా లనీ నియమం చేశాడు. పాండవులు దానికి కట్టుబడి ఉన్నారు.

అలా ఒకయేడు ధర్మరాజు అంతఃపురంలో ద్రౌపది ఉంటున్నది. అర్జునుడు బ్రాహ్మణ ధేనువును రక్షించటానికై ఆయుధాలు తెచ్చికొందామని ధర్మజుని భవనానికి వెళ్ళాడు. దొంగలను చంపి ధేనువును బ్రాహ్మణున కిచ్చి ఆయుధాలు ఉన్నచోట పెట్టాడు. కాని ఆ సమయంలో అర్జునాదులు ధర్మజునింటికి పోగూడదు. నియమం

తప్పినట్లైనది. ధర్మజుడు వలదన్నా అర్జునుడు తీర్థయాత్రలకు బయలుదేరాడు. ఆ యాత్ర అతనికి పుణ్యం పురుషార్థం కలిసి వచ్చేటట్లు చేసింది. ఉలూచి, చిత్రాంగద, సుభద్రలు అర్జునుని వివాహమాడారు. సుభద్ర బలరామ శ్రీకృష్ణుల ముద్దుల చెల్లెలు. అర్జునుడు యతివేషంలో సుభద్రకు సన్నిహితుడు కావటానికి, ఆమెను వివాహమాడి ఇంద్రప్రస్థపురానికి చేరటానికీ శ్రీకృష్ణుడు సూత్రధారుడుగా నిలిచాడు. సుభద్రార్జునుల వివాహం ఇంద్రోపేంద్రులే స్వయంగా చేయించారు. ఆమీద బలరాముడంగీకరించాడు. సుభద్రను ద్రౌపది దీవించింది. పాండవవంశాన్ని నిలిపే కౌరవవధువుగా సుభద్ర మహాభారతంలో చిరస్మరణీయురాలిగా నిలిచింది.

ఇది ఆదిపర్వకథాసారంలో రెండవభాగం.

**జి.వి. సుబ్రహ్మణ్యం**

ప్రధానసంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపుటం -2

## ఆదిపర్వము

రెండవ భాగము (5, 6, 7, 8 ఆశ్వాసములు)

# విషయసూచిక

### పంచమాశ్వాసము

## షష్ఠాశ్వాసము

## సప్తమాశ్వాసము

## అష్టమాశ్వాసము

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - పంచమాశ్వాసము

**శ్రీనాథమూర్తి! విబుధని ౹ ధాన! మహాదాన తర్పితద్విజవర! వేం**
**గీనాథ! పార్థనిభ! యభిమానమహార్ణవ! మహేంద్రమహిమాతిశయా!** **1**

**ప్రతిపదార్థం:** శ్రీనాథమూర్తి=లక్ష్మీదేవికి భర్త అయిన విష్ణువువంటి ఆకారం కలవాడా!; విబుధ, నిధాన= పండితులకు నిధివంటివాడా!; మహా, దాన తర్పిత, ద్విజ వర= గొప్పదానాలచేత తృప్తిని పొందింపబడిన బ్రాహ్మణశ్రేష్ఠులు కలవాడా!; వేంగీ నాథా= వేంగీదేశానికి ప్రభువు అయినవాడా!; పార్థ, నిభ= అర్జునితో సమానం అయినవాడా!; అభిమాన మహా+అర్ణవ= ప్రేమయందు సముద్రంవంటివాడా లేదా ఆత్మగౌరవంలో సముద్రంవంటివాడా!; మహా+ఇంద్ర, మహిమ+అతిశయా= దేవేంద్రుని గొప్పతనంవంటి ఆధిక్యము కలవాడా!

**తాత్పర్యం:** విష్ణుమూర్తివంటి ఆకారంకలవాడా! పండితులకు నిధివంటివాడా! మహాదానాలచేత బ్రాహ్మణ శ్రేష్ఠులను తృప్తి పొందించినవాడా! వేంగీదేశానికి రాజైనవాడా! అర్జునునితో సమానమైనవాడా! సముద్రమంత ప్రేమ కలవాడా లేదా సముద్రమంత ఆత్మాభిమానం కలవాడా! దేవేంద్రునంతటి గొప్పతనం కలవాడా!

**విశేషం:** ఇది రాజరాజనరేంద్రుని మనోహరమైన ఆకారాన్ని, మహాదానగుణాన్ని, పరాక్రమ విశేషాన్ని, ప్రేమాతిశయాన్ని, వైభవాన్ని తెలియచేసే ఆశ్వాసారంభ సంబోధనపద్యం.

### ధృతరాష్ట్రపాండుకుమారులు పెరుఁగుట (సం.1-102-1)

**వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెఁ: నట్లు ధృతరాష్ట్రపాండువిదురులు భీష్మాభిరక్షితులై పెరుఁగుచు, నుపనయనానంతరంబున నధ్యయనం బొనరించి రాజవిద్యలయందు జితశ్రము లై యున్నంత.** **2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= కథను చెప్పే ఆ ఉగ్రశ్రవసమహర్షి; శౌనక+ఆది, మహా, మునులకున్= శౌనకుడు మొదలైన మహర్షులకు; చెప్పెన్; అట్లు= ఆ విధంగా; ధృతరాష్ట్ర, పాండు విదురులు; భీష్మ+అభిరక్షితులు+ఐ= భీష్మునిచేత పోషింపబడిన వాళ్ళయి; పెరుగుచు= వృద్ధిచెందుతూ; ఉపనయన+అనంతరంబునన్= ఉపనయనం జరిగినతరువాత; అధ్యయనంబు= విద్యాభ్యాసం; ఒనరించి= చేసి; రాజ, విద్యల+అందు= క్షత్రియులకు తగిన విద్యలలో; జిత, శ్రములు+ఐ= జయింపబడిన శ్రమ కలవాళ్ళయి - అనగా సమర్థులై; ఉన్నంత= ఉండినప్పుడు.

**తాత్పర్యం:** మహాభారతకథను చెప్పే ఆ ఉగ్రశ్రవసుడు, శౌనకాదిమహామునులకు ఇట్లా చెప్పాడు; ఆ విధంగా ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుడు భీష్ముని పోషణలో పెరుగుతూ ఉపనయనమైన తరువాత విద్యాభ్యాసం చేసి, రాజవిద్యలలో ఆరితేరి ఉండగా.

సీ. అమరాపగాసుతు ననుశాసనంబునఁ। గౌరవ రాజ్యంబు గడు వెలింగెఁ,
గురుభూము లుత్తరకురువులకంటెను। నధికలక్ష్మీయుక్తి నతిశయిల్లె,
ధర్మాభిసంరక్షితం బైన భూప్రజ। కెంతయు నభివృద్ధి యెసఁగుచుండె,
వలసినయప్పుడు వానలు గురియుట। సస్యసమృద్ధి ప్రశస్త మయ్యెఁ,

ఆ. బాలు సేఁపెఁ బుష్పఫలభరితంబు లై। తరువనంబు లొప్పె, ధర్మకర్మ
నిరతిఁ జేసి కరము నెమ్మితో నన్యోన్య। హితముఁ జేయుచుండి రెల్ల జనులు 3

**ప్రతిపదార్థం:** అమర+ఆపగా, సుతు, అనుశాసనంబునన్= దేవనది అయిన గంగయొక్క పుత్రుడు భీష్మునిఏలుబడిచేత; కౌరవ, రాజ్యంబు; కడు=మిక్కిలి; వెలింగెన్=ప్రకాశించింది; కురు, భూములు=కురుదేశంలోని భూభాగాలు; ఉత్తర, కురువుల కంటెను=ఉత్తరకురుదేశంలోని ప్రదేశాలకంటె; అధిక, లక్ష్మీ, యుక్తిన్= అధికమైన సంపదచేత; అతిశయిల్లెన్= హెచ్చెను; ధర్మ+ అభిరక్షితంబు+ఐన= ధర్మంచేత చక్కగా రక్షింపబడిన; భూ, ప్రజకు= దేశప్రజలకు; ఎంతయున్= మిక్కిలి; అభివృద్ధి; ఎసఁగుచుండెన్= కలుగుతూ ఉండెను; వలసిన, అప్పుడు= అవసరమైనప్పుడు; వానలు, కురియుట= వానలు కురవటంచేత; సస్య, సమృద్ధి= పంటల అతిశయం; ప్రశస్తము+అయ్యెన్= గొప్పగా ఉండెను; పాలు, చేఁపెన్= పాలు పోసుకొన్నవి; (పంటగింజలు పాలుపోసుకోవడం అంటే పంటలు సారవంతంగా పండట మని భావం లేదా పాడి ఎక్కువయింది అని భావం); తరు, వనంబులు= చెట్ల సమూహాలు; పుష్ప, ఫల, భరితంబులు+ఐ= పూలతో, పళ్ళతో నిండిన వై; ఒప్పెన్= శోభిల్లినాయి; ఎల్ల జనులు= ప్రజలంతా; ధర్మ, కర్మ, నిరతిన్+చేసి= ధర్మకార్యాలమీద ఆసక్తిచేత; కరము, నెమ్మితోన్= మిక్కిలి ప్రేమతో; అన్యోన్య హితమున్= ఒకరికి ఒకరు మేలును; చేయుచుండిరి = చేస్తూ ఉన్నారు.

**తాత్పర్యం:** భీష్మునిపాలనలో కౌరవరాజ్యం గొప్పగా వెలిగింది. కురుదేశం ఉత్తరకురుదేశాలకంటె అధికసంపదతో విలసిల్లింది. ధర్మంచేత చక్కగా రక్షింపబడిన దేశప్రజలకు అభివృద్ధి కలుగుతూ ఉన్నది. అవసరమైనప్పుడు వానలు కురవటంచేత పంటలు సమృద్ధిగా పండాయి. పాడి ఎక్కువ అయింది. వృక్షాలు పూలతో, పళ్ళతో నిండాయి. ప్రజలంతా ధర్మకార్యాలమీద ఆసక్తి కలవా ళ్ళయి మిక్కిలి ప్రేమతో ఒకరి కొకరు మేలు చేస్తూ ఉన్నారు.

**విశేషం:** సమర్థుడు, ధర్మ బద్ధుడు అయిన భీష్ముని పాలనలో దేశంలో శాంతిసౌభాగ్యాలు ఎట్లా ఉన్నాయో ఈ పద్యం తెలుపుతున్నది. (వ్రాతప్రతులలో మొదటిపాదము చివర "వెలుంగె" అని ఉన్నది.)

మ. అమలాచారపవిత్రభూసురవరేణ్యాగార పుణ్యప్రదే
శములం దధ్యయనారవంబు విధివత్స్వాహాస్వధాస్వస్తిశ
బ్దములున్ మంగళతూర్యఘోషములు నుద్యత్కౌతుకాశీర్నినా
దములున్ రమ్యతరంబు లయ్యెఁ ధరణిం దద్రాజ్యసంవృద్ధితోన్. 4

**ప్రతిపదార్థం:** ధరణిన్=భూమిమీద; తద్+రాజ్య, సంవృద్ధితోన్= ఆ భీష్మునిపరిపాలనయొక్క పెంపుతో; అమల+ఆచార, పవిత్ర, భూసుర, వరేణ్య+అగార, పుణ్య ప్రదేశముల, అందు= నిర్మలమైన ఆచారంచేత, పరిశుద్ధాలు అయిన బ్రాహ్మణ శ్రేష్ఠుల ఇళ్ళలోని ఆ పుణ్యస్థలాలలో; అధ్యయన+ఆరవంబు= వేదపఠనధ్వని; విధివత్+స్వాహా, స్వధా, స్వస్తి శబ్దములున్= వేదశాస్త్రకర్మలతో కూడుకొన్న స్వాహా, స్వధా, స్వస్తి శబ్దాలూ; మంగళతూర్య, ఘోషములున్= మంగళవాద్యాల ధ్వనులూ;

ఉద్యత్+కౌతుక+ఆశీస్+నినాదములున్= వృద్ధిపొందే సంతోషంతో కూడిన ఆశీర్వచనశబ్దాలూ; రమ్యతరంబులు= మిక్కిలి మనోహరాలు; అయ్యెన్= అయినవి.

**తాత్పర్యం:** పెంపు వహించిన భీష్మునిపరిపాలనలో - సదాచారంచేత పవిత్రాలైన బ్రాహ్మణశ్రేష్ఠులఇళ్ళలో, పుణ్యస్థలాలలో- వేదనాదాలు, శ్రౌత స్మార్త కర్మసంబంధాలైన స్వాహా, స్వధా, స్వస్తిశబ్దాలు, మంగళవాద్య ధ్వనులు, మహానందంతో కూడిన ఆశీర్వచనాలు మిక్కిలి మనోహరాలై వినిపిస్తున్నాయి.

**విశేషం:** బ్రాహ్మణుల ఇళ్ళలో వేదకర్మలు, లౌకిక కర్మలు నిర్విఘ్నంగా సాగుతున్నా యని వస్తుధ్వని. అధ్యయన అధ్యాపనాలు, నిత్యనైమిత్తిక యజ్ఞకర్మలు, శుభకార్యాలు, ఆశీర్వచనాలు అనే నాల్గు క్రియలు వాటికి మూలమైన బ్రాహ్మణ సదాచార సంపత్తిని ధ్వనింపచేస్తున్నాయి. వర్ణాశ్రమ ధర్మ రక్షణపరుడైన భీష్ముని ప్రవృత్తి వస్తుధ్వని. ప్రసాదగుణమిశ్రితమైన ఓజస్సును ఉదాత్తవస్తువర్ణనంతో నిబంధించటం నన్నయరచనలో తరచుగా కనపడే శైలీశిల్పం. (సంపా.)

**వ. ఇట్లు బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాభివృద్ధియు సస్యసమృద్ధియు నగుచుండ, నాంబికేయు ధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుం జేసి, భీష్ముండు దనకు విల్లును విదురుబుద్ధియును సహాయంబులుగా రాజ్యంబు రక్షించుచున్నంత. 5**

**ప్రతిపదార్థం:** ఇట్లు; బ్రహ్మ+ఉత్తరంబు, కాన్= బ్రాహ్మణులు అధికులు కాగా; ప్రజా, వృద్ధియు= ప్రజలయొక్క అభివృద్ధి; సస్య, సమృద్ధియున్= పంటలు దండిగా పండటం; అగుచుండన్; భీష్ముండు; ఆంబికేయు= అంబికకొడుకు అయినవాడిని; ధృతరాష్ట్రున్; రాజ్య+అభిషిక్తున్= రాజ్యానికి అభిషేకింపబడినవాడిని - అంటే రాజును; చేసి; తనకున్; విల్లును; విదురు, బుద్ధియును; సహాయంబులుగాన్= తోడు కలవిగా; రాజ్యంబున్; రక్షించుచున్+ఉన్నంత= కాపాడుతూ ఉన్నప్పుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా బ్రాహ్మణులు అధికులు అవుతుండగా, ప్రజలు అభివృద్ధి చెందుతుండగా, పంటలు సమృద్ధిగా పండుతుండగా భీష్ముడు అంబికకొడుకు అయిన ధృతరాష్ట్రుడిని పట్టాభిషిక్తుడిని చేసి, తనకు ధనుస్సు, విదురుడిబుద్ధిబలం సహాయకాలుగా కౌరవరాజ్యాన్ని రక్షిస్తూ ఉండగా.

**విశేషం:** ధృతరాష్ట్రుని పట్టాభిషిక్తత వివాదగ్రస్తం. ఔత్తరాహభారతప్రతులలో అంధత్వంచేత ధృతరాష్ట్రుడు, పారసవత్వంచేత అనగా (పరుని కులము), పరస్త్రీయందు పుట్టినవాడు అగుటచేత విదురుడు రాజ్యాన్ని పొందలేక పోయినట్లూ, పాండురాజు రాజు అయినట్లూ చెప్పబడింది.

ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత

పారసవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవహ. (సం.భా.అధ్యా.109 శ్లో.25)

దాక్షిణాత్యప్రతిలోమాత్రం ధృతరాష్ట్రుడు పట్టాభిషిక్తు డైనట్లు ఉన్నది.

భీష్మేణ రాజా కౌరవ్యో ధృతరాష్ట్రోఽభిషేచితః (సం.భా. దాక్షిణాత్యప్రతి. అధ్యా 18. శ్లో.21)

కాని అదే ప్రతిలో అదే అధ్యాయంలో ధృతరాష్ట్రుడు అంధుడు అవటంచేత రాజ్యాన్ని పొందలేకపోయినట్లు, పారసవత్వం చేత విదురుడు రాజు కానట్లు, పాండురాజే రా జైనట్లు చెప్పబడి ఉండటం గమనించతగింది.

ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత

పారసవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవ హ. (సం.భా. దక్షిణాత్యప్రతి అధ్యా.18 శ్లో.30)

తెలుగుభారతంలో కూడా అనేక సందర్భాలలో ధృతరాష్ట్రుడి పట్టాభిషిక్తతకు ప్రతిబంధకా లైన వాక్యా లున్నాయి. (ఆది. షష్ఠా.ప.123 వ.124; ప 128, వ, 129, ప. 143)

ధృతరాష్ట్రుని పట్టాభిషిక్తత విషయంలో నన్నయ దాక్షిణాత్యప్రతిని అనుసరించినట్లు ఉన్నది.

**మ. ఆయము గర్వమున్ విడిచి యన్యపతుల్ పనిసేయ నిట్లు గాం**
**గేయభుజాబలంబున నికృత్తవిరోధిసమాజుఁ డై కుమా**
**రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న**
**త్యాయతకీర్తితోఁ దనకు హస్తిపురం బది రాజధానిగన్. 6**

**ప్రతిపదార్థం:** ఆయము= ఆదాయం; గర్వమున్ విడిచి; అన్య, పతులు= తక్కిన రాజులు; పనిచేయన్= సేవ చేయగా; ఇట్లు= ఈ విధంగా; గాంగేయ; భుజా, బలంబునన్= భీష్ముని భుజబలంచేత; నికృత్త, విరోధి, సమాజుఁడు+ఐ= నరకబడిన శత్రువులసమూహం కలవాడై; కుమార+ఆయిత, శక్తిశాలి= కుమారస్వామి అంతటి పరాక్రమం కలవాడైన; ధృతరాష్ట్రుఁడు; అతి+ఆయత; కీర్తితోన్= మిక్కిలి పొడవైన కీర్తితో - అనగా అత్యధికమైన కీర్తితో; తనకున్; హస్తిపురంబు; అది; రాజధానిగన్= రాజు నివసించు ప్రధాన నగరముగా అనగా పరిపాలనకేంద్రముగా; రాజ్యమున్ = రాజ్యమును; చేయుచున్+ఉండెన్= పాలిస్తూ ఉండినాడు.

**తాత్పర్యం:** ఇతరదేశాలరాజులు తమ ఆదాయాన్ని, గర్వాన్ని విడిచి తనను కొలుస్తూ ఉండగా, భీష్ముని భుజబలంచేత శత్రురాజులను సంహరించి, కుమారస్వామి అంతటి శక్తిశాలి అయిన ధృతరాష్ట్రుడు హస్తినాపురాన్ని తనకు రాజధానిగా చేసికొని, అత్యధికకీర్తితో రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉన్నాడు.

**విశేషం:** 'ఆయము గర్వమున్' అనేదానికి 'ఆయుతగర్వమున్' అనే పాఠాంతరం ఉన్నది. అప్పుడు అధికమయిన గర్వమును విడిచి ఇతరరాజులు అందరూ ధృతరాష్ట్రుడిని కొలిచారు అని అనవలసివస్తుంది. పద్యంలోని ప్రసాదగుణం పరిపాలనలోని ప్రశాంతతను ధ్వనింపచేస్తున్నది.

**వ. ఇట్లు రాజ్యంబు సేయుచు నారూఢ యౌవనుం డైన యా ధృతరాష్ట్రునకు వివాహంబు సేయ సమకట్టి, భీష్ముండు గాంధారపతి యయిన సుబులుకూఁతు గాంధారి యనుదాని, నతిశయ రూపలావణ్య శీలాభిజాత్య సమన్వితఁ గా బ్రాహ్మణులవలన విని విదురున కి ట్లనియె. 7**

**ప్రతిపదార్థం:** ఇట్లు; రాజ్యంబు; చేయుచు; ఆరూఢ, యౌవనుండు+ఐన= యౌవనవంతుడు కాగా; ఆ, ధృతరాష్ట్రునకున్= ఆ ధృతరాష్ట్ర మహారాజునకు; వివాహంబు; చేయన్ సమకట్టి= పూనుకొని; భీష్ముండు= భీష్ముడు; గాంధారపతి, అయిన= గాంధారదేశానికి రాజైన; సుబలు, కూఁతున్= సుబలుని పుత్రికను; గాంధారి, అను, దానిన్= గాంధారి అను పేరుగల కన్యను; అతిశయ, రూప, లావణ్య, శీల+ఆభిజాత్య; సమన్వితగా= మిక్కిలి, అందమైన రూపంతో; కాంతితో, మంచినడవడితో, ఉన్నతమైన వంశంతో కూడిన దానినిగా; బ్రాహ్మణులవలనన్= విప్రుల మూలమున; విని= విని; విదురనకున్= విదురునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా రాజ్యం చేస్తూ యౌవనవంతు డైన ఆ ధృతరాష్ట్రునికి వివాహం చేయటానికి పూనుకొని భీష్ముడు, గాంధారరాజైన సుబలునికూతురు గాంధారి - అందమైన రూపం కల దని, కాంతి కల దని, మంచి నడవడితో, ఉన్నత మైన వంశంతో కూడుకొన్న దని, బ్రాహ్మణులవలన విని విదురునితో ఇట్లా అన్నాడు.

**క. ఈ వంశము విచ్ఛేదము । గావచ్చినఁ గులము నిలుపఁగా సత్యవతీ**
**దేవి వచనమున సంతతి । గావించెను వ్యాసుఁ డను జగత్కర్త దయన్. 8**

**ప్రతిపదార్థం:** ఈ వంశము; విచ్ఛేదము= నాశం; కావచ్చినన్= కానుండగా; కులము నిలుపఁగాన్= కురువంశమును నిలుపుటకై; సత్యవతీదేవి, వచనమునన్= సత్యవతీదేవి యొక్క మాటవలన; వ్యాసుఁడు; అను; జగత్+కర్త= వ్యాసుడు అను పేరుగల బ్రహ్మ; దయన్= కృపతో; సంతతిన్ కావించెను= సంతానము కలిగించాడు.

**తాత్పర్యం:** ఈ కురువంశం నశిస్తూ ఉండగా, సత్యవతీదేవిమాటప్రకారం వ్యాసుడు అనే బ్రహ్మ, కులాన్ని నిలపటానికి దయతో సంతానాన్ని కలిగించాడు.

**విశేషం:** అలం: రూపకం.

**క. ఈ కులము వివర్ధింపఁగ । నా కభిమత; మేను వింటి నలినేక్షణ దా**
**నేకశత సుతులఁ బడయఁగ । నా కన్యక వరము వడసె నటె హరుచేతన్. 9**

**ప్రతిపదార్థం:** ఈ, కులము= ఈ వంశాన్ని; వివర్ధింపఁగన్= వృద్ధిపొందించటానికి; నాకున్; అభిమతము= ఇష్టం; ఏను=నేను; వింటిన్= విన్నాను; నలిన+ఈక్షణ= తామరలవంటి కళ్ళు కలది; తాన్=తాను; ఆ, కన్యక= ఆ గాంధారి; ఏక, శత, సుతులన్= ఒక కూతురును ఎక్కువగాగల వందమందికొడుకులను; పడయఁగన్= పొందటానికి; హరుచేతన్= శివునివలన; వరము; పడసెన్, అటె= పొందెనట కదా.

**తాత్పర్యం:** ఈ వంశాన్ని వృద్ధిపొందింప చేయడం నాకు ఇష్టం. తామరలవంటి అందమైన కళ్ళు కల ఆ గాంధారి వందమంది కొడుకులు, ఒక కూతురు- మొత్తం నూటొక్కరు తనకు కలిగేటట్లు శివుడివలన వరం పొందిందట కదా.

**విశేషం:** తనతరంలోనే సంతతిలేని కారణంగా రాజవంశంలో వారసుడులేని దీనస్థితి ఏర్పడటం భీష్ముడు గ్రహించాడు. దేవర న్యాయంతో ధృతరాష్ట్రపాండురాజులు పుట్టారు. వారితరంలో మళ్ళీ వారసులు లేనిదుస్థితి రాకూడ దని భావించాడు. నూరుగురు కొడుకులను, ఒక కూతురుని కనగలిగిన వధువును అన్వేషించాడు. పైకి చూస్తే అది ఒక అత్యాశగా ఉండవచ్చు. కాని, కులవిస్తారం కావా లంటే విస్తృతసంతానం గల కులసతి కావాలి. వంశాభివృద్ధినిగూర్చిన భీష్ముని ఆసక్తి ఈ మాటలలో ధ్వనిస్తూ ఉన్నది. ఏకశతసుతులన్ - ఇందులో సుతశబ్దం ఏకశేషసమాసంలో ఉన్నది కాబట్టి కొడుకు లనీ, కూతు రనీ అర్థం ఇస్తుంది. సుతులును=సుతయు, సుతుడును; ఏకశేషసమాసంలో పుంలింగమే శేషిస్తుంది. ఏకశతమంటే నూటొక్కరని అర్థం. గాంధారి నూర్గురుకొడుకులను, ఒక కూతురిని కంటుం దని శివునివరం.

**వ. 'కావున ధృతరాష్ట్రునకు గాంధారిని వివాహంబు సేయుదము; గాంధారపతి మనతోడి సంబంధమునకుం దగు' నని నిశ్చయించి సుబలు పాలికిఁ దగుముదుసళ్ళం బంచిన, సుబలుండును సుముఖుం డై**

**'కురుకులవిస్తారకుం డయిన ధృతరాష్ట్రుండ యిక్కన్యకకు నర్హుండు గావున నా రాజునకు గాంధారి నిచ్చితి'**
**ననిన, వాని బంధుజనంబు లెల్లఁ దమలో ని ట్లనిరి. 10**

**ప్రతిపదార్థం:** కావునన్; ధృతరాష్ట్రునకున్; గాంధారిని; వివాహంబున్, చేయుదము= పెండ్లిగావింతము; గాంధారపతి= గాంధారరాజు సుబలుడు; మనతోడి= మనతో; సంబంధమునకున్= వియ్యమునకు, తగున్; అని= ఆ విధముగా; నిశ్చయించి= నిర్ణయించుకొని; సుబలు, పాలికి= సుబలునిదగ్గరకు; తగు, ముదుసళ్ళన్= తగినపెద్దలను; పంచినన్= పంపగా; సుబలుండును; సుముఖుండు+ఐ= అనుకూలు డై; కురు, కుల విస్తారకుండు+అయిన= కురువంశాన్ని పెంచేవాడైన; ధృతరాష్ట్రుండు+అ= ధృతరాష్ట్రుడే; ఈ+కన్యకకున్; అర్హుండు= తగినవాడు; కావునన్; ఆ రాజునకున్= ధృతరాష్ట్రునకు; గాంధారిన్; ఇచ్చితిన్; అనిన; వాని= ఆ సుబలునియొక్క; బంధు, జనంబులు+ఎల్లన్= బంధుగణమంతా; తమలోన్; ఇట్లు+అనిరి= ఈ విధంగా అనుకొన్నారు.

**తాత్పర్యం:** 'కాబట్టి ధృతరాష్ట్రునితో గాంధారిని వివాహం చేద్దాము. గాంధారదేశప్రభువు సంబంధం యోగ్యమైనది' అని తీర్మానించి; సుబలునిదగ్గరికి యోగ్యులైన పెద్దలను పంపగా, సుబలుడుకూడా అనుకూలుడై 'వంశాన్ని విస్తరించేవా డైన ధృతరాష్ట్రుడే ఆ కన్యకు తగినవాడు. కాబట్టి, ధృతరాష్ట్రునికి గాంధారి నిస్తా'నని వాగ్దానంచేయగా గాంధారరాజబంధువు లందరూ తమలో తాము ఇట్లా అనుకొన్నారు.

**విశేషం:** తమతో సంబంధానికి తగినవాడు గాంధారరాజు అని భావించాడు- భీష్ముడు. దానికి కారణ మేమిటో చెప్పడు నన్నయ. సారమతులు లోనారసి తెలిసికొనదగిన అంశ మని వ్యంగ్యంచేశాడు. వంశవిస్తారాన్ని కోరేవారే గాంధారిని వివాహమాడటం సహజం. నూటఒక్క బిడ్డల తల్లి కాగల వరం పొందిన గాంధారికి వంశ విస్తృతికొరకు వివాహం చేసికొనే ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడైనా అనువైన, యోగ్యుడైన వరుడు అని వ్యంగ్యార్థం. గాంధారరాజు తన కూతురికి తగిన భర్త లభించా డని భావించాడు. తనభారం తీరిం దని తలంచాడు. ఎవ్వరికీ చెప్పకుండానే అంగీకరించాడు. ఇదంతా ఊహిస్తే కథ ప్రసన్నమౌతుంది. ఇది నన్నయ కథాకథనశిల్పం. (సంపా.)

**తే. అంగములలోన మే లుత్తమాంగ, మందు । నుత్తమంబులు గన్నుల యుర్విజనుల,**
**కట్టి కన్నులు లే వను నదియకాక । యుత్తముఁడు గాఁడె సద్గుణయుక్తి నతఁడు. 11**

**ప్రతిపదార్థం:** ఉర్వి, జనులకు= భూమిమీదప్రజలకు; అంగములలోన= అవయవాలలో; ఉత్తమ+అంగము= తల; మేలు= శ్రేష్ఠము; అందున్= ఆ తలలో; కన్నులు+అ= కన్నులే; ఉత్తమంబులు= శ్రేష్ఠాలు; అట్టి, కన్నులు= అటువంటి కన్నులే అతనికి లేవు; అనున్= అని లోకము అనును; అదియు+అ, కాక= అంతమాత్రమేకాని; అతఁడు= ఆ ధృతరాష్ట్రుడు; సత్+గుణ, యుక్తిన్=మంచిగుణాల కూడికతో; ఉత్తముఁడు; కాఁడే= అగునుకదా.

**తాత్పర్యం:** లోకంలో మానవులకు అవయవా లన్నింటిలో శిరస్సు ప్రధానం. ఆ శిరస్సులో కన్నులే ప్రధాన మైనవి. అటువంటి కన్నులే ధృతరాష్ట్రునికి లేవు. కాని అతడు మంచిగుణాలచేత ఉత్తముడే కదా!

**విశేషం:** 'కన్యా వరయతే రూపమ్' అనీ 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్' అనీ అభియుక్తోక్తి. గాంధారి పద్మాలవంటి అందమైన కళ్ళుకలది. ఆమెకు పుట్టుగ్రుడ్డితో పెండ్లి. ఆమెకు తగినవాడు ధృతరాష్ట్రుడే అని గాంధారపతి నిర్ణయించి, వివాహం నిశ్చయించాడు. అతడు చండశాసనుడు. అతని మాటను ఎవరూ కా దనలేరు. చివరకు గాంధారికూడా! ఆమెకు కూడ వివాహం కావా లంటే ధృతరాష్ట్రునివంటి వంశవిస్తారకుడే ముందుకు రావా లని తెలుసు. బంధువులుమాత్రం చూచి గ్రుడ్డివానికి పిల్ల నివ్వటం ఇష్టంలేక అధిక్షేపాత్మకంగా, వ్యంగ్యంగా గుసగుసలాడుకొన్నారు.

## ధృతరాష్ట్రుడు గాంధారిని వివాహంబు సేసికొనుట (సం.1-103-10)

**వ. అనిన వారిపలుకులు విని గాంధారి ధృతరాష్ట్రునకుఁ బితృవచనదత్తఁగాఁ దన్ను నిశ్చయించి, 'నాకుఁ బతి యిమ్మహీపతియ కాని యొరుల నొల్ల' నని యప్పరమపతివ్రత పరపురుషదర్శనంబు పరిహరించి, పతి కనుగుణంబుగా నేత్రపట్టంబునఁ దన నేత్రంబులు గట్టికొని యుండె; నంత నక్కన్యం దోడ్కొని దాని సహోదరుం డయిన శకుని మహావిభూతితో హస్తిపురంబునకు వచ్చిన' ధృతరాష్ట్రుండును బరమోత్సవంబున గాంధారిని వివాహంబై దానితోఁ బుట్టిన కన్యకల సత్యవ్రతయు సత్యసేనయు సుదేష్ణయు సంహితయుఁ దేజశ్శ్రవయు సుశ్రవయు నికృతియు శుభయు శంభువయు దశార్ణయు నను పందుండ్ర నొక్కలగ్నంబున వివాహం బయి మఱియును. 12**

**ప్రతిపదార్థం:** అనినన్+ అని అనగా; వారిపలుకులు విని; గాంధారి; ధృతరాష్ట్రునకున్= యువరాజైన ధృతరాష్ట్రునకు; తన్నున్= తనను; పితృ వచన, దత్తన్; కాన్= తండ్రిమాటతో ఇవ్వబడిన దానినిగా; నిశ్చయించి= నిర్ణయించి; నాకున్; పతి=భర్త; ఈ+మహీపతియు+అ, కాని= ఈ ధృతరాష్ట్రమహారాజేకాని; ఒరులన్= ఇతరులను; ఒల్లను= ఇష్టపడను; అని= ఆ ప్రకారంగా తెలిసి; ఆ+పరమ, పతివ్రత; పర, పురుష, దర్శనంబు= ఇతరపురుషులను చూడటం; పరిహరించి= వదలి; పతికిన్= భర్తకు; అనుగుణంబుగా= తగినట్లు; నేత్ర, పట్టంబునన్= కంటివస్త్రంతో; తన, నేత్రంబులు= తనకళ్ళు; కట్టికొనిఉండెన్= కనబడకుండా కట్టుకొని ఉండినది; అంతన్= తరువాత; ఆ+కన్యన్= ఆ గాంధారిని; తోడ్కొని= వెంటపెట్టుకొని; దాని= ఆ గాంధారియొక్క; సహోదరుఁడు+అయిన= తోడబుట్టినవాడైన; శకుని; మహా, విభూతితో= గొప్పసంపదతో; హస్తి, పురంబునకున్= హస్తినా పురమునకు; వచ్చినన్= రాగా; ధృతరాష్ట్రుండును; పరమ+ఉత్సవంబునన్= మహావైభవంగా; గాంధారిని; వివాహంబు+ఐ= పెళ్ళి చేసికొని; దానితోన్= ఆమెతో కూడ; పుట్టిన= జన్మించిన అనగా గాంధారీదేవి తోబుట్టువు లైన; కన్యకలన్, సత్యవ్రతయు; సత్యసేనయు; సుదేష్ణయు, సంహితయు, తేజశ్శ్రవయు; సుశ్రవయు; నికృతియు, శుభయు, శంభువయు, దశార్ణయున్, అను; పదుండ్రను= పదిమందిని; ఒక్క; లగ్నంబునన్= ఒకే ముహూర్తమునందు; వివాహంబు+అయి= పెండ్లాడి; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** సుబలుని బంధువులమాటలు విన్న గాంధారి, తండ్రి తనను ధృతరాష్ట్రుని కిచ్చినట్లు నిశ్చయించుకొన్నది. 'నాకు భర్త ధృతరాష్ట్రమహారాజే, అన్యులను వివాహమాడ అంగీకరించ' నని ఆ మహాపతివ్రత పరపురుషులను తాను చూడటానికి ఇష్టపడక, భర్తకు కళ్ళు లేవు కనుక తానుకూడా కళ్ళకు అడ్డంగా గుడ్డ కట్టుకొన్నది. తరువాత ఆమె సోదరుడు శకుని అధికసంపదతో ఆమెను వెంటబెట్టుకొని హస్తినాపురానికి వచ్చాడు. ధృతరాష్ట్రుడు మహావైభవంగా గాంధారినే కాక ఆమె చెల్లెళ్ళు పదిమందినికూడా ఒకే ముహూర్తంలో వివాహమాడాడు.

**విశేషం:** తండ్రి తీసికొనిన నిర్ణయాన్ని గురించి బంధువులు మాట్లాడుకొనే మాటలు గాంధారి విన్నది. తండ్రిమాటను గౌరవించి తాను ధృతరాష్ట్రుడిని పతిగా భావించుకొని, అతనికి అనురూపంగా కళ్ళకు గంతలు కట్టుకొన్నది. ఆమెచర్యవలన అటు పితృభక్తి, ఇటు పతిభక్తి వ్యక్తమయ్యాయి. బంధువులనోళ్ళు మూతపడ్డాయి. గాంధారి తనతో పాటు పదిమంది తోబుట్టువులతో సహా ధృతరాష్ట్రుని అంతఃపురంలో ప్రవేశించింది. వారినికూడా ధృతరాష్ట్రుడు వివాహమాడాడు.

**క. కులమును రూపము శీలముఁ। గల కన్యలఁ దెచ్చి తెచ్చి గాంగేయుం డీ**
**నలఘుఁడు ధృతరాష్ట్రుఁడు కుల। తిలకుండు పరిగ్రహించె దేవీశతమున్. 13**

**ప్రతిపదార్థం:** కులమును= వంశమును; రూపము= ఆకారము; శీలమున్= మంచి నడతయును; కల= ఉన్న; కన్యలన్; తెచ్చితెచ్చి= ఎక్కువగా తీసికొనివచ్చి; గాంగేయుండు= భీష్ముడు; ఈన్= ఇవ్వగా; అలఘుఁడు= గొప్పవాడు; కుల, తిలకుండు= వంశానికి అలంకారమైనవాడు; ధృతరాష్ట్రుఁడు; దేవీ, శతమున్= భార్యలు వందమందిని; పరిగ్రహించెన్= పెళ్ళిచేసికొన్నాడు.

**తాత్పర్యం:** కులం, రూపం, శీలం ఉన్న కన్యలను భీష్ముడు పలువురిని తెచ్చి ఇవ్వగా ధృతరాష్ట్రుడు వందమందిని పెళ్ళిచేసికొన్నాడు.

**విశేషం:** కన్యలను తెచ్చి తెచ్చి అని రెండుమార్లు చెప్పటంలో భీష్ముడు వంశవిస్తృతిమీద ఎంత అధికమైన ఆసక్తిని ప్రదర్శించాడో స్పష్టమౌతుంది. వందమంది కొడుకులను కనే గాంధారితో పాటు నూటపదిమంది రాణులను ధృతరాష్ట్రుని కిచ్చి పెళ్ళి చేయించాడు భీష్ముడు. వారందరివలన కలిగే సంతానంతో మరెప్పటికీ కురువంశంలో వారసులు లేరనే ప్రశ్న పుట్టదని అనుకొన్నాడు ఆ కురుపితామహుడు. అనావృష్టిని చూచిన గంగాసుతుడు అతివృష్టిని అభిలషించాడు. చివరకు ధృతరాష్ట్రసంతతి అంతా గంగపాలు కావటం విధివిలాసం.

**వ. అంత.**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**సీ. వేదంబులందుఁ బ్రవీణుఁడై మఱి సర్వ । శాస్త్రంబులందుఁ గౌశలము మెఱసి**
**యసికుంత కార్ముకాద్యాయుధ విద్యల । యందు జితశ్రముఁ డై తురంగ**
**సింధురారోహణశిక్షల దక్షుఁడై । నీతిప్రయోగముల్ నెఱయ నేర్చి**
**యతిమనోహర నవయౌవనారూఢుఁడై । కఱలేని హిమరశ్మికాంతి దాల్చి**

**ఆ. పెరుఁగుచున్న కొడుకుఁ బృథువక్షు నాయత । బాహు దీర్ఘదేహుఁ బాండుఁ జూచి**
**వీనివలనఁ గులము వెలుఁగు నంచును నెడ । జాహ్నవీసుతుండు సంతసిల్లి. 15**

**ప్రతిపదార్థం:** వేదములందున్= నాలుగు వేదాలలో; ప్రవీణుఁడు+ఐ= నేర్పరి అయి; మరి+ అంతేకాక; సర్వశాస్త్రంబులందున్= అన్ని శాస్త్రములలోకూడా; కౌశలము= సామర్థ్యం; మెఱసి= ప్రకాశింపచేసి; అసి, కుంత, కార్ముక+ఆది+ఆయుధ, విద్యల, అందున్= కత్తి, ఈటె, విల్లు మొదలైన ఆయుధాలకు సంబంధించిన విద్యలందు; జితశ్రముఁడు+ఐ= జయింపబడిన శ్రమకలవాడై-అనగా సమర్థుడై; తురంగ, సింధుర+ఆరోహణ; శిక్షలన్= గుఱ్ఱాలను, ఏనుగులను ఎక్కి స్వారిచేసేటటువంటి అభ్యాసాలలో; దక్షుఁడు+ఐ= నేర్పరి అయి; నీతి, ప్రయోగముల్= అనేకనీతులను ప్రయోగించేమాటలు; నెఱయన్= బాగా; నేర్చి; అతి, మనోహర, నవ, యౌవన+ఆరూఢుఁడు+ఐ= మిక్కిలి మనోహరం అయిన క్రొత్తయౌవనం పొందినవాడై; కఱలేని= మచ్చ లేని; హిమరశ్మి, కాంతిన్= చల్లనికిరణాలు కల చంద్రునికాంతిని; తాల్చి= ధరించి; పెరుఁగుచు+ఉన్న, కొడుకున్= వృద్ధి చెందుచున్న కుమారుని; పృథు, వక్షున్= విశాలమైన వక్షఃస్థలం కలవాడిని; ఆయత, బాహున్= పొడవైన చేతులు కలవాడిని; దీర్ఘ, దేహున్= పొడవైన శరీరం కలవాడిని; పాండున్= పాండురాజును; చూచి; వీనివలనన్; కులము= వంశం; వెలుఁగున్; అంచును= అనుచు (అంటూ); ఎడన్= హృదయంలో, జాహ్నవీ, సుతుండు= గంగాపుత్రుడైన భీష్ముడు; సంతసిల్లి= సంతోషించి.

**తాత్పర్యం:** వేదాలను, సర్వశాస్త్రాలను బాగా నేర్చి, కత్తి, ఈటె, ధనుస్సు మొదలైన ఆయుధవిద్యలలో ఆరితేరి, గుర్రాలను, ఏనుగులను ఎక్కి స్వారి చేయటంలో బాగా నేర్పరి అయి, మనోహరమైన నవయౌవనం కలవాడై,

మచ్చలేని చంద్రుడివలె ప్రకాశిస్తూ, విశాలమైన వక్షం, పొడవైన చేతులు, నిడుపైన శరీరం కల పాండురాజును చూచి ఇతనివలన వంశం వన్నెకు ఎక్కుతుం దని భీష్ముడు సంతోషించి.

**విశేషం:** వేదాలు నాలుగు - ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం. శాస్త్రాలు ఆరు - తర్కం, వ్యాకరణం, ధర్మం, మీమాంస, వైద్యం, జ్యోతిషం. యౌవనారూఢులైన ధృతరాష్ట్రుడిని, పాండురాజును వర్ణించే తీరులో నన్నయ ఒక భేదాన్ని పాటించి కథాకథనశిల్పాన్ని ప్రదర్శించాడు. పాండురాజుకు గల వేదశాస్త్రపాండిత్యంగాని, యుద్ధోచిత పరిశ్రమగాని ధృతరాష్ట్రునికి లేవు. పాండురాజుయొక్క యౌవనం అతిమనోహరంగా ఉన్నదట. ధృతరాష్ట్రునివలన కులం విస్తరిల్లుతుం దనీ, పాండురాజువలన కులగౌరవం పెరుగుం దనీ భీష్ముని ఆశయం. ధార్తరాష్ట్రులు సంఖ్యలో అధికమైనా, పాండవులు యశస్సులో అధికు లౌతా రనీ పాండురాజువల్లనే కులం కీర్తి కెక్కుతుం దనీ వస్తుధ్వని.

**వ. ఇ క్కుమారున కెందు వివాహంబు సేయుద మని విదురుతో విచారించుచుండె; నంతఁ దొల్లి. 16**

**ప్రతిపదార్థం:** ఈ+కుమారునకున్= యువకుడైన ఈ పాండురాజుకు; ఎందున్=ఎక్కడ; వివాహంబు, చేయుదము= పెండ్లిచేద్దాము; అని; విదురుతోన్; విచారించుచున్, ఉండెన్= ఆలోచిస్తూ ఉన్నాడు; అంతన్= తరువాత; తొల్లి= పూర్వం.

**తాత్పర్యం:** ఈ యువకుడైన పాండురాజుకు వివాహం చేయా లని విదురునితో కలిసి ఆలోచిస్తూ ఉన్నాడు. తరువాత - పూర్వం.

### కుంతిచరిత్రము (సం.1-104-1)

**సీ. యాదవకులవిభుఁ డగు శూరుఁ డను నాతఁ। డాత్మతనూజలయందుఁ బెద్ద**
**దాని నంబుజముఖి ధవళాక్షి వసుదేవు। చెలియలిఁ బృథ యను చెలువఁ బ్రీతిఁ**
**దనమేనయత్తనందనుఁ డపుత్త్రకుఁ డైన। యా కుంతిభోజున కర్థితోడఁ**
**గూఁతుఁగా నిచ్చినఁ గోమలి యాతని। యింటఁ దా నుండి యనేక విప్ర**

**తే. వరుల కతిథిజనులకు నవారితముగఁ। దండ్రి పనుపున నిష్టాన్నదాన మొనరఁ**
**జేయుచున్న దుర్వాసుఁ డన్ సిద్ధమౌని। వచ్చె నతిథి యై భోజనవాంఛఁ జేసి. 17**

**ప్రతిపదార్థం:** యాదవ, కుల, విభుఁడు+అగు= యాదవవంశరాజు అయిన; శూరుఁడు, అనునాతఁడు= శూరుడు అను పేరుగలవాడు; ఆత్మ, తనూజల, అందున్= తనకూతుళ్ళలో; పెద్దదానిన్= పెద్దకుమార్తెను; అంబుజముఖిన్= పద్మంవంటి ముఖం కలదానిని; ధవళ+అక్షిన్= తెల్లనికళ్ళు కలదానిని; వసుదేవు, చెలియలిన్= వసుదేవుని చెల్లెలిని; పృథ, అను= పృథ అను పేరుగల; చెలువన్= అందమైన పిల్లను; ప్రీతిన్= ప్రియమార; తన, మేనయత్త, నందనుఁడు= తన మేనత్తకుమారుడు; అపుత్త్రకుఁడు+ఐన= సంతానం లేనివాడైన; ఆ, కుంతిభోజునకున్= ప్రసిద్ధుడైన కుంతిభోజునికి; అర్థితోడన్= ప్రీతితో; కూతున్, కాన్ ఇచ్చినన్= కూతు రగునట్లుగా ఈయగా; కోమలి= ఆ సుకుమారి - పృథ; ఆతని, ఇంటన్= కుంతిభోజుని ఇంటిలో; తాన్= తాను; ఉండి= వసించి; అనేక, విప్ర, వరులకున్= పెక్కుమంది బ్రాహ్మణశ్రేష్ఠులకు; అతిథి, జనులకున్= ఆగంతకులైన ప్రజలకు; అవారితముగన్= అడ్డులేకుండా; తండ్రి, పనుపునన్= తండ్రిఆజ్ఞతో; ఇష్ట+అన్న, దానమున్= ఇష్టమైన భోజనం పెట్టటాన్ని; ఒనరన్= తగువిధంగా; చేయుచు+ఉన్నన్= చేస్తూఉండగా; దుర్వాసుఁడు+అన్; సిద్ధ, మౌని= సిద్ధికలముని; భోజన, వాంఛన్, చేసి= భోజనంమీద కోరికతో; అతిథి+ఐ వచ్చెన్= అతిథిగా విచ్చేసినాడు.

**తాత్పర్యం:** యాదవవంశరాజు అయిన శూరుడు తన పెద్దకుమార్తె పృథను, పిల్లలు లేని తనమేనత్తకొడుకైన కుంతిభోజుడికి ఎంతో ప్రీతితో పుత్రికగా ఇచ్చాడు. ఆ సుకుమారి కుంతిభోజుడిఇంట్లో తా నుండి, తండ్రి ఆజ్ఞతో పెక్కుమంది బ్రాహ్మణశ్రేష్ఠులకు, అతిథిజనులకు యథేచ్ఛగా అన్నదానం చేస్తూ ఉండగా దుర్వాసు డనే సిద్ధమౌని 'భోజనం పెట్టు' మని అతిథిగా వచ్చాడు.

**విశేషం:** అతిథి - తిథీ,వారం మున్నగు కాలనియమాలు లేకుండా, ఇంటికి భోజనానికి వచ్చినవాడు.

**వ. కుంతియు న మ్మునివరు కోరిన యాహారంబు వెట్టిన సంతుష్టుం డై యమ్మునివరుం డి ట్లనియె; 'నీమంత్రంబున నీ వే వేల్పుల నారాధించి తవ్వేల్పులు నీకోరినయట్టి పుత్త్రకుల నిత్తు' రని యాపద్ధర్మంబుగా నొక్కదివ్యమంత్రంబుఁ బ్రసాదించి చనిన, నమ్మంత్రశక్తి యెఱుంగ వేఁడి కుంతి యొక్కనాఁ డేకాంతంబ గంగకుం జని యవగాహనంబు సేసి. 18**

**ప్రతిపదార్థం:** కుంతియున్= కుంతీదేవియు; ఆ+ముని, వరు, కోరిన= ఆ మునిశ్రేష్ఠుడు కోరిన; ఆహారంబు, పెట్టినన్= విందుభోజనము పెట్టగా; సంతుష్టుండు+ఐ= పూర్తిగా తృప్తిచెందినవాడై; ఆ+ముని, వరుండు= ఆ మునిశ్రేష్ఠుడు - దుర్వాసుడు; ఇట్లు+అనియెన్; ఈ మంత్రంబునన్= ఈ మంత్రముచేత; నీవు; ఏ వేల్పులన్= ఏ దేవతలను; ఆరాధించితివి= పూజించావో; ఆ+వేల్పులు= ఆ దేవతలు; నీ, కోరిన, అట్టి= నీవు కోరినటువంటి; పుత్త్రకులన్= కుమారులను; ఇత్తురు+అని= ప్రసాదింతురు అని తెలిపి; ఆపద్+ధర్మంబుగాన్= ఆపత్కాలంలోని ధర్మంగా; ఒక్క; దివ్య, మంత్రంబున్; ప్రసాదించి= ఇచ్చి; చనినన్= వెళ్ళగా; ఆ+మంత్ర, శక్తిన్= ఆ మంత్రము యొక్క ప్రభావాన్ని; ఎఱుంగన్ వేఁడి= తెలియకోరి; కుంతి= కుంతీదేవి; ఒక్కనాఁడు= ఒక్కదినం; ఏకాంతంబు+అ= ఒంటరిగా; గంగకున్+చని= గంగకు వెళ్ళి; అవగాహనంబు చేసి= స్నానం చేసి.

**తాత్పర్యం:** కుంతి ఆ మునిశ్రేష్ఠుడు కోరిన ఆహారం పెట్టగా దుర్వాసుడు చాలా తృప్తి పొంది 'ఈ మంత్రం చేత నీవు ఏ దేవతలను ఆరాధిస్తావో ఆ దేవతలు నీవు కోరిన కొడుకులను ఇస్తారు' అని ఆపద్ధర్మంగా ఒక దివ్యమంత్రాన్ని ఉపదేశించి వెళ్ళాడు. తరువాత ఆమె ఆ మంత్రశక్తిని తెలిసికొనాలని ఒకరోజు ఒంటరిగా గంగకు వెళ్ళి స్నానం చేసి.

**విశేషం:** ఆపద్ధర్మం అంటే గత్యంతరం లేకపోయినప్పుడు పాటించదగిన న్యాయం అని భావం. త్రికాలజ్ఞుడైన దుర్వాసుడు పాండవోత్పత్తికి ఆ మంత్రం ఆపద్ధర్మంగా వినియోగింపబడా లని భవిష్యద్దర్శనంతో వరంగా ప్రసాదించాడు. అట్లా పుట్టినవాళ్ళే కౌంతేయు లయ్యారు (ధర్మరాజాదులు). ఆపద్ధర్మంగా కాక మంత్రశక్తి పరీక్షార్థం వినియోగించినప్పుడు పుట్టిన కర్ణుడు కౌంతేయుడుగా కాక రాధేయుడుగా ప్రసిద్ధికావటం జరిగింది.

**క. అ మ్మంత్రముఁ దనదగు హృద । యమ్మున నక్కన్య నిలిపి యాదిత్యున క**
**ర్ఘ్య మ్మెత్తి ' నాకు నిమ్ము ప్రి । యమ్మున నీ యట్టి పుత్త్రు నంబుజమిత్త్రా ! ' 19**

**ప్రతిపదార్థం:** ఆ+మంత్రమున్= ప్రసిద్ధిగల ఆ మంత్రాన్ని; తనది, అగు= తనదైన; హృదయమ్మునన్= హృదయంలో; ఆ+కన్య= ఆ కుంతి; నిలిపి= ఉంచుకొని అనగా జపించి; ఆదిత్యునకున్= సూర్యుడికి; అర్ఘ్యమ్ము= పూజకోసం దోసిట్లోకి తీసికొనే నీటిని; ఎత్తి= పైకెత్తి; అంబుజ మిత్త్రా= నీటిలోంచి పుట్టిన పద్మానికి మిత్రుడవు అయినవాడా- ఓ సూర్యుడా! నాకున్; ప్రియమ్మునన్= ప్రీతితో; నీ, అట్టి= నీవంటి; పుత్త్రున్= కుమారుని; ఇమ్ము= ప్రసాదించు.

**తాత్పర్యం:** కుంతి ఆ మంత్రాన్ని తనమనస్సులో జపించి సూర్యునికి అర్ఘ్యం ఇచ్చి 'ఆదిత్యా! నాకు నీవంటి కొడుకును ప్రేమతో ఇమ్ము.'

**క. అని కేలు మొగిచి నిలిచిన । వనజాయతనేత్ర కడకు వచ్చెను గగనం**
**బున నుండి కమలమిత్త్రుఁడు । తన తీవ్రకరత్వ ముడిగి తరుణద్యుతితోన్. 20**

**ప్రతిపదార్థం:** అని= ఆప్రకారంగా; కేలు= చేతులు; మొగిచి= మోడ్చి; నిలిచినన్= నిలువగా, కమల, మిత్త్రుఁడు= పద్మాలకు మిత్రుడు అయిన సూర్యుడు; తన; తీవ్ర, కరత్వము= వేడికిరణాలు కలిగి ఉండటాన్ని; ఉడిగి= విడిచి; తరుణ, ద్యుతితోన్= లేతకాంతితో అనగా యువకుడి అందంతో; వనజ+ఆయత, నేత్ర, కడకు= నీటినుండి పుట్టిన పద్మాలవలె విశాలమైన కన్నులు కల కుంతి దగ్గరకు; గగనంబుననుండి= ఆకాశంనుండి; వచ్చెను.

**తాత్పర్యం:** అని కుంతి చేతులు మోడ్చి నిలబడగా, సూర్యుడు తన వేడికిరణాలను విడిచి, కోమలకాంతితో (యువకుడి అందంతో) ఆకాశంనుండి ఆమెదగ్గరకు దిగివచ్చాడు.

**వ. అ క్కన్యకయు నట్టి తేజోరూపంబు సూచి విస్మయంబునను భయంబునను గడు సంభ్రమించి నడునడ నడుంగుచున్నదాని 'నోడకుండు' మని సూర్యుండు ప్రసన్నుండై 'నీకోరినవరం బీ వచ్చితి' ననిన గొంతియు లజ్జావనతవదనయై' యొక్కబ్రహ్మవిదుండు నాకుం గరుణించి యిమ్మంత్రం బుపదేశించిన దానిశక్తి నెఱుంగ వేఁడి యజ్ఞానంబున నిన్నుం ద్రిలోకైకదీపకుం ద్రిపురుషమూర్తిఁ ద్రివేదమయు రావించిన యీయపరాధంబు నాకు సహింపవలయు.' 21**

**ప్రతిపదార్థం:** ఆ+కన్యకయున్= ఆ కుంతీదేవి; అట్టి; తేజస్+రూపంబు= కాంతిమంతమైన ఆకారం; చూచి= విస్మయంబునను=ఆశ్చర్యంతో; భయంబునను= భీతితో; కడు=మిక్కిలి; సంభ్రమించి= తొట్రుపడి; నడునడ= నడకమధ్యలో; నడుంగుచు+ఉన్న, దానిన్= వణుకుతున్నదానిని; ఓడక+ఉండుము= భయపడకుము; అని= ఆ విధంగా తెలిపి; సూర్యుండు = సూర్యభగవానుడు; ప్రసన్నుండు+ఐ= దయకలవాడై; నీ కోరిన, వరంబు= నీవు కోరిన ప్రసిద్ధమైనవరాన్ని; ఈన్= ఇవ్వటానికి; వచ్చితిన్ అనిన; గొంతియు= కుంతీదేవికూడ; లజ్జా+అవనత, వదన+ఐ= సిగ్గుతో వంచుకొన్న ముఖం కలదై; ఒక్క, బ్రహ్మ విదుండు= ఒక ప్రసిద్ధుడైన బ్రహ్మమును తెలిసినవాడు; నాకున్; కరుణించి= దయతలచి; ఈ+మంత్రంబున్; ఉపదేశించినన్= ఉపదేశింపగా; దాని శక్తిన్= దాని బలాన్ని; ఎఱుంగ, వేఁడి= తెలిసికొనా లని; అజ్ఞానంబునన్= తెలివి తక్కువతనంతో; త్రిలోక+ఏక, దీపకున్= మూడులోకాలను ముఖ్యంగా వెలిగించేవాడిని; త్రి, పురుష, మూర్తిన్= బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అనే ముగ్గురు ఆకారం అయినవాడిని; త్రివేదమయున్= మూడు వేదాలరూపం అయినవాడిని; నిన్నున్; రావించిన= రప్పించిన; ఈ+అపరాధంబు= ఈ తప్పు; నాకున్= నాయందు; సహింపవలయున్= ఓర్చుకోవాలి.

**తాత్పర్యం:** ఆ కుంతీదేవికూడా అటువంటి కాంతిమంతమైన సూర్యునిరూపాన్ని చూచి ఆశ్చర్యంతో, భయంతో మిక్కిలి తొట్రుపడి వణకుతూ ఉండగా, సూర్యుడు, భయపడకు మని ప్రసన్నుడై 'నీవు కోరిన వరం ఇవ్వటానికి వచ్చాను' అన్నాడు. కుంతి సిగ్గుతో ముఖం వంచుకొని 'ఒక బ్రహ్మజ్ఞాని దయతో నాకు ఈ మంత్రాన్ని ఉపదేశించగా దానిశక్తి తెలిసికొనాలనే కోరికతో - మూడులోకాలను ముఖ్యంగా వెలిగించేవాడవు, త్రిమూర్తుల స్వరూపుడవు, మూడువేదాల ఆకారం తాల్చినవాడవు అయిన నిన్ను అజ్ఞానంచేత రప్పించిన నా తప్పును క్షమించుము.'

**విశేషం:** సూర్యుడు ఉదయం బ్రహ్మస్వరూపు డని, మధ్యాహ్నం శివస్వరూపు డని, సాయంకాలం విష్ణుస్వరూపు డని ప్రసిద్ధి. అందువలన సూర్యుడు త్రిపురుషమూర్తి. "బ్రహ్మస్వరూప ముదయే - మధ్యాహ్నే తు మహేశ్వరమ్ । సాయం ధ్యాయే త్సదా విష్ణుం- । త్రిమూర్తించ దివాకరమ్"॥ అట్లాగే సూర్యుడు ఉదయం ఋగ్వేదస్వరూపుడు, మధ్యాహ్నం యజుర్వేదస్వరూపుడు' సాయంకాలం సామవేదస్వరూపుడు. అందువల్లనే త్రివేదమయుడు. సూర్యుడు-(వ్యు) ప్రాణులను వారివారి వృత్తులందు ప్రేరేపించేవాడు.

**ఆ. 'ఎఱుకలేమిఁ జేసి యింతు లెప్పుడు నప । రాధయుతలు సాపరాధ లయిన**
**వారిఁ గరుణ నెల్లవారును రక్షింతు' । రనుచు సూర్యునకు లతాంగి మ్రొక్కె 22**

**ప్రతిపదార్థం:** ఎఱుక= జ్ఞానం; లేమిని, చేసి= లేకపోవటంచేత; ఇంతులు= స్త్రీలు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; అపరాధయుతలు=తప్పిదాలతో కూడినవారు; స+అపరాధలు= తప్పులతో కూడినవారు; అయినన్= అగుటచేత; వారిన్= ఆ స్త్రీలను; కరుణన్= దయతో; ఎల్లవారును= అందరూ; రక్షింతురు; అనుచున్= అని తెల్పుతూ; లతా+అంగి= లతవంటి (సుకుమారమయిన) దేహంకలది - కుంతి; సూర్యునకున్= సూర్యభగవానునికి; మ్రొక్కెన్= నమస్కరించింది.

**తాత్పర్యం:** 'తెలివి లేక స్త్రీలు ఎప్పుడూ తప్పులు చేస్తారు. తప్పులు చేసిన స్త్రీలను దయతో అందరూ మన్నిస్తారు' అని అంటూకుంతి సూర్యునికి నమస్కరించింది.

**వ. సూర్యుండును 'నీకు దుర్వాసుం డిచ్చిన వరంబును మంత్రంబుశక్తియు నెఱుంగుదు; మదీయదర్శనంబు వృథగాదు; నీ యభిమతంబు సేయుదు' ననిన గొంతి యి ట్లనియె. 23**

**ప్రతిపదార్థం:** సూర్యుండును; నీకున్; దుర్వాసుఁడు+ఇచ్చిన= దుర్వాసుడు ప్రసాదించిన; వరంబును; మంత్రంబు, శక్తియున్= మంత్రంయొక్కబలాన్ని; ఎఱుంగుదున్= తెలియుదును; మదీయ, దర్శనంబు= నాదర్శనం- నీవు నన్ను చూడటం; వృథకాదు= వ్యర్థం కాదు; నీ అభిమతంబు= నీ యిష్టప్రకారం; చేయుదును; అనినన్; కాంత= కుంతి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీకు దుర్వాసుడు ప్రసాదించిన వరంగురించి, మంత్రశక్తినిగురించి నాకు తెలుసు. నా దర్శనం వృథా కాదు. నీ కోర్కె నెరవేరుస్తాను' అని సూర్యుడు పలుకగా, కుంతి ఈ విధంగా అన్నది.

**ఆ. ఏను మంత్రశక్తి యెఱుఁగక కోరితిఁ । గన్య కిదియు కోరఁగాదు నాక;**
**నాకు గర్భమయిన నాతలిదండ్రులుఁ । జుట్టములును నన్నుఁ జూచి నగరె? 24**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మంత్ర, శక్తి= మంత్రంయొక్క శక్తిని; ఎఱుఁగక= తెలియక; కన్యకున్= పెళ్ళికానిస్త్రీకి; ఇదియున్= ఇది; కోరన్+కాదు= కోరకూడదు; నాకు+అ= అని అనక; కోరితిన్; నాకు; గర్భము+అయినన్= గర్భము కలిగినచో; నా, తలిదండ్రులున్; చుట్టములును= బంధువులును; నన్నున్ చూచి = నన్ను కనుగొని; నగరె= నవ్వరా?

**తాత్పర్యం:** నేను మంత్రశక్తి తెలియక, ఇది పెళ్ళికానిస్త్రీ కోరకూడ దని తెలియక కోరాను. నాకు గర్భం వస్తే నన్ను చూచి నా తల్లిదండ్రులు, బంధువులు నవ్వరా?

**వ. అనిన విని సూర్యుండు దానికిఁ గరుణించి 'నీకు సద్యోగర్భంబునఁ బుత్త్రుఁ డుద్భవిల్లు; నీకన్యాత్వంబును దూషితంబుగా' దని వరం బిచ్చినఁ, దత్క్షణంబ యక్కన్యకకు నంశుమంతునంశంబునఁ గానీనుం డై. 25**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; సూర్యుండు; దానికిన్= ఆ కుంతీదేవిని; కరుణించి= దయతలచి; నీకున్; సద్యస్+గర్భంబునన్= ఇప్పటికిప్పుడు కలిగే గర్భంవలన; పుత్త్రుఁడు; ఉద్భవిల్లున్= పుడతాడు; నీ, కన్యాత్వంబును= నీ కన్నెతనంకూడ; దూషితంబుకాదు= దోషం కలదికాదు; అని= ఆ ప్రకారంగా; వరంబు+ఇచ్చినన్= వరాన్ని ఇయ్యగా; తద్+క్షణంబు+అ= ఆ క్షణంలోనే; ఆ+కన్యకకున్; అంశుమంతు; అంశంబునన్= సూర్యుని అంశంచేత; కానీనుండు+ఐ= కన్యకు పుట్టినవా డై. (కానీన: కన్యకాజాతః - అని అమరకోశం).

**తాత్పర్యం:** అని కుంతి అనగా విని సూర్యుడు ఆమెమీద దయతలచి 'నీకు సద్యోగర్భంవలన పుత్త్రుడు పుట్టుతాడు. నీ కన్నెతనంకూడా చెడదు' అని వరం ఇవ్వగా, అప్పటికప్పుడే ఆ కన్యకు సూర్యునిఅంశాన కన్యాపుత్త్రుడై.

## కర్ణుఁడు జనియించి సూతగృహంబు సేరుట (సం.1-104-10)

**చ. సలలిత మైన పుట్టుఁగవచంబు నిసర్గజ మైన కుండలం**
**బుల యుగళంబు నొప్పఁగ సుపుత్త్రుఁడు కర్ణుఁడు పుట్టె సూర్యమం**
**డలమొకొ భూతలంబున బెడంగయి దీప్తిసహస్రకంబుతో**
**వెలుఁగెడు నా నిజద్యుతి సవిస్తరలీల వెలుంగుచుండఁగన్. 26**

**ప్రతిపదార్థం:** సలలితము+ఐన= అందమైన; పుట్టు, కవచంబు= పుట్టుకతోనే ఏర్పడ్డకవచం; నిసర్గజము+ఐన= సహజమైన; కుండలంబుల, యుగళంబున్= చెవిపోగుల జంటయు; ఒప్పఁగన్= ప్రకాశించగా; సు+పుత్త్రు+డు= చక్కనికుమారుడు; కర్ణుఁడు; సూర్య, మండలము+ఒకొ= సూర్యమండలమే యేమో; భూతలంబునన్= భూమిమీద; బెడంగు+అయి= అందమై; దీప్తి, సహస్రకంబుతో= వేయికిరణాలతో; వెలుఁగెడు, నా= ప్రకాశిస్తున్నదా అన్నట్లు; నిజ, ద్యుతి= తనకాంతి; సవిస్తర లీలన్= విరివి అయిన విలాసంతో; వెలుంగుచు+ఉండఁగన్; పుట్టెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** అందమైన సహజకవచకుండలాలతో ప్రకాశిస్తూ, సూర్యమండలమే భూమిమీద వేయికిరణాలతో ప్రకాశిస్తున్నదా అన్నట్లు అధికమైన కాంతితో కర్ణుడు పుట్టాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. 'నిజద్యుతిసవిస్తరలీల వెలుంగుచుండఁగన్' అనే విశేషణం సార్థకం. మహాభారతపాత్రలలో స్వీయ వ్యక్తిత్వంతో ఒంటరిపోరుతో దిగంతయశస్సు గడించిన వీరుడు కర్ణుడు. కర్ణుడు లేకపోతే భారతం లేదన్న లోకోక్తి ఈ పాత్రకున్న ప్రత్యేకతను తెలుపుతున్నది. పుట్టుకవచంతో, కుండలాలతో పుట్టిన దివ్యరూపంకలవాడైనా, కర్ణుడు నిజజీవితంలో విషాదాంతనాయకుడు.

**వ. అంత నాదిత్యుం డాకాశంబున కరిగినఁ, గొడుకుం జూచి కుంతి దద్దయు విస్మయం బంది యెద్దియుం జేయునది నేరక. 27**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; ఆదిత్యుండు= సూర్యుడు; ఆకాశంబునకు; అరిగినన్= వెళ్ళగా; కుంతి; కొడుకున్; చూచి; తద్దయున్= మిక్కిలి; విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; చేయునది, నేరక= ఏమి చేయాలో తెలియక.

**తాత్పర్యం:** తరువాత సూర్యుడు ఆకాశానికి వెళ్ళిపోగా, కుంతి కొడుకును చూచి మిక్కిలి ఆశ్చర్యపడి ఏమి చేయాలో తెలియక.

**తరువోజ**

**ఏల యమ్మునిని నాకు నిచ్చె నిమ్మంత్ర? మిమ్మంత్రశక్తి యే నెఱుఁగంగ వేఁడి**
**యేల పుత్త్రకుఁ గోరి యెంతయు భక్తి నినుఁ దలంచితిఁ బ్రీతి? నినుఁడును నాకు**
**నేల సద్యోగర్భమిచ్చెఁ? గుమారుఁ డేల యప్పడ యుదయించె? నిం కెట్టు**
**లీ లోకపరివాద మే నుడిగింతు? నింతకు నింతయు నెఱుఁగరె జనులు! 28**

**ప్రతిపదార్థం:** ఏల= ఎందుకు; ఆ+ముని= ఆ దుర్వాసుడు; నాకున్; ఈ+మంత్రము, ఇచ్చెన్= ఈ మంత్రాన్ని ప్రసాదించినాడు; ఈ+మంత్ర, శక్తి= ఈ మంత్రము యొక్క బలాన్ని; ఏన్=నేను; ఎఱుఁగంగ, వేఁడి= తెలిసి కొనా లని కోరి; ఏల= ఎందుకు; పుత్త్రకున్= కొడుకును; కోరి= ఇష్టపడి; ఎంతయున్= మిక్కిలి; భక్తిన్= భక్తితో; ఇనున్= సూర్యుడిని; తలంచితిన్= తలచుకొన్నాను; ప్రీతిన్= ప్రేమతో; ఇనుఁడును= సూర్యుడుకూడ; ఏల= ఏమిటికి; నాకున్=నాకు; సద్యఃగర్భము= అప్పటికప్పుడే కలిగే గర్భాన్ని; ఇచ్చెన్; ఏల= ఎందుకు; కుమారుఁడు; అప్పుడు+అ= అప్పుడే, ఉదయించెన్= పుట్టాడు; ఇంకన్=ఇటుపై; ఎట్టులు= ఏవిధంగా; ఈ లోక, పరివాదమున్= ఈలోకాపవాదాన్ని; ఏను= నేను; ఉడిగింతున్= లేకుండా చేస్తాను; ఇంతకున్= ఇప్పటికే; జనులు; ఇంతయున్= జరిగినది అంతా; ఎఱుఁగరె= తెలిసికోరా?

**తాత్పర్యం:** దుర్వాసుడు నా కెందుకు ఈ మంత్రాన్ని ఉపదేశించాడు? ఆ మంత్రప్రభావాన్ని తెలిసికొనా లని నేను ఎందుకు భక్తితో సూర్యుడిని స్మరించాను? ఆ సూర్యుడుకూడ నాకు ఎందుకు సద్యోగర్భాన్ని ఇచ్చాడు? అప్పుడే ఈ పుత్త్రుడు ఎందుకు నాకు పుట్టాడు? ఇంక ఏ విధంగా ఈ లోకాపవాదాన్ని తప్పించుకొంటాను? ఇప్పటికే జరిగిన దంతా ప్రజలు తెలిసికొనిఉండరా?

**విశేషం:** తరువోజలోని ప్రతిపాదంలోనూ రెండు ద్విపదపాదా లుంటాయి. ద్విపదలో ప్రతిపాదంలోనూ మూడు ఇంద్రగణాల మీద ఒక సూర్యగణం ఉంటుంది. అంటే తరువోజలో ఒక్కొక్క చరణంలో 3 ఇంద్రగణాలు+ ఒక సూర్యగణం+ 3 ఇంద్రగణాలు+ 1 సూర్యగణం ఉంటాయన్నమాట. ప్రతి రెండేసి గణాలమీద మూడు యతులు ఉంటాయి. ప్రాసనియతికూడా ఉన్నది. మొదటి పాదం గురువుతోకాని, లఘువుతోకాని, ప్రారంభమైతే మిగిలిన పాదాలన్నీ అట్లాగే సాగాలి. "తరువోజ యలసము, సుకుమారమైన ఛంద మని కవిత్రయము వారభిప్రాయపడినట్లు వారి ప్రయోగమునుబట్టి యూహింపఁదగియున్నది. చింత, శంక, దైన్యము, గ్లాని, శోకము మున్నగు నలసచిత్తవృత్తులందే తరువోజలు తఱచుగాఁ బ్రయోగింపబడి యున్నవి. విశేషించి భారతమందలి పందొమ్మిది తరువోజలలో నేడు తరువోజలు స్త్రీవాక్యములై యుండుటచే విన్నకోట పెద్దన యన్నట్లు స్త్రైణమైన మృదువృత్తముగా, కవిత్రయము భావించి రని కూడ తలంపవచ్చును... ఈ తరువోజయందు మత్తకోకిలా సంక్రమణ కల్పితమైన గమకచమత్కారము గుర్తింపదగియున్నది... తరువోజ మత్తకోకిలా భ్రాంతిని మాటిమాటికి గలిగించు చున్నది. విరుద్ధావిరుద్ధ నానాభావసాంకర్య చిత్రితమైన కుంతీదేవి తత్కాలచిత్తవృత్తి రమ్యముగ ధ్వనితమగుచున్నది." (డాక్టర్ పాటిబండ మాధవశర్మ - ఆంధ్రమహాభారతము. ఛందశ్శిల్పము). వితర్కరూపకమైన వాక్యవిన్యాసం పద్యమంతా ఒకే పద్ధతిలో కూర్చబడి ఉండటంచేత సమత (మార్గాభేదం) అనే శబ్దగుణం సార్థకంగా సమకూరింది. (సంపా.)

**వసంతతిలకము**

**'ఈ బాలు నెత్తుకొని యింటికిఁ జన్న, నన్నున్**
**నా బంధు లందఱు మనంబున నేమనా? రె**
**ట్లీ బాలసూర్యనిభు నిట్టుల డించి పోవం**
**గా బుద్ధిపుట్టు?' నని కన్య మనంబులోనన్. 29**

**ప్రతిపదార్థం:** ఈ, బాలున్= ఈ శిశువును; ఎత్తుకొని= తీసుకొని; ఇంటికిన్= అంతఃపురానికి; చన్న= వెళ్ళిన; నన్నున్; నా బంధులు+అందఱున్= నా చుట్టా లందరు; మనంబునన్= మనస్సులో; ఏమి+అనారు= ఏమి అనరు? - అనగా ఏమైనా అంటారు; ఎట్లు; ఈ, బాల, సూర్య, నిభున్= ఈ బాలసూర్యుడితో సమానమైనవాడిని; ఇట్టులన్= ఈ రీతిగా; డించి= దించి, వదలిపెట్టి; పోవన్‌కాన్= పోవగా; బుద్ధిపుట్టున్= ఆలోచన కలుగుతుంది.; అని= ఆ ప్రకారంగా; కన్య= పెళ్ళికానికుంతి; మనంబులోనన్= మనస్సులో.

**తాత్పర్యం:** ఈ బాలుడిని ఎత్తుకొని ఇంటికి వెళ్ళితే నన్ను నా బంధువు లందరూ దూషిస్తారు. అట్లని, బాలసూర్యుడివంటి ఈ బాలుడిని వదలి వెళ్ళటానికి బుద్ధి ఎట్లా పుడుతుంది? అని కన్యగా ఉన్న కుంతి మనస్సులో.

**విశేషం:** వసంతతిలకవృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా - త-భ-జ-జ-గగ- అనే గణా లుంటాయి. ఎనిమిదవ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది. దీనికి సింహోన్నత, సింహోద్ధత, ఉద్ధర్షిణి, మధుమాధవి, శోభాతతి, కర్ణోత్పల మొదలైన పే ర్లున్నాయి. నన్నయ ఈ వృత్తంలో మూడుపద్యాలు వ్రాశాడు. వాటిలో రెండు ఆశ్వాసాంత్యపద్యాలుగానూ, ఒకటి (అంటే ఈపద్యం) కథాసందర్భంలోనూ ఉపయోగించాడు. కుంతీదేవియొక్క అనిశ్చితమైన చిత్తవృత్తిని ఈ వృత్తం ధ్వనింపచేస్తున్నది. పుత్రుడిమీది మమకారం, బంధువులవలన కలిగే అపవాదం అనే రెండుభావావస్థలనడుమ అల్లల్లాడుతున్న ఆ మాతృమూర్తి వత్సల, భయభావాలను మాధుర్య మనే గుణంతో పోషించటం నన్నయరచనాశిల్పం, పృథక్‌పదత్వంతోపాటు ఉక్తివైచిత్ర్యంకూడా ఇందులో ఉన్నది. కుంతి మాతృమూర్తిగా వేదనపడుతున్నది. కాని, కన్య మనంబులో ఈ మాట లనుకొన్నట్లు నన్నయ చెప్పాడు. అది పొసగదు కదా! అనిపించవచ్చును. ఆమెకు సద్యోగర్భంలో కర్ణుడు పుట్టగానే సూర్యవరంవలన ఆమె కన్యాత్వం దూషితం కాకుండా యథాస్థితిగా ఉన్న దని వస్తుధ్వని, ఈ కన్యాత్వస్థితి వచ్చినందువలననే పసివాడైన కర్ణుడిని మందసంలో ఉంచి వెంటనే రాగలిగిం దని భావించాలి. నన్నయ 'కన్య' అనే మాటతో పాత్రయొక్క తత్కాలస్థితిగతులను ధ్వనింపచేయటం ఉక్తి చమత్కారం. (సంపా.)

**వ. వందురి వగచుచున్న దాని పుణ్యంబున నాదిత్యప్రేరితం బయి యనర్ఘరత్నవసుభరితంబయిన యొక్కమంజస నదీప్రవాహవేగంబునం దనయొద్దకు వచ్చిన, దానిలోఁ జెచ్చెరఁ దనకొడుకుం బెట్టి, కుంతి నిజగృహంబునకు వచ్చె; నంత. 30**

**ప్రతిపదార్థం:** వందురి= దుఃఖించి; వగచుచు+ఉన్న= ఆలోచిస్తున్న; దాని, పుణ్యంబునన్= ఆమె పుణ్యంవలన; ఆదిత్య, ప్రేరితంబు+అయి= సూర్యుడిచేత పంపబడినదై; అనర్ఘ, రత్న, వసు, భరితంబు+అయిన= అమూల్యమైన రత్నాలచేత, బంగారంచేత నిండినట్టిది అయిన; ఒక్క, మంజస= ఒకపెట్టె; నదీ, ప్రవాహ, వేగంబునన్= నదీప్రవాహవేగంచేత; తన,ఒద్దకు=

తన సమీపమునకు; వచ్చినన్= రాగా; దానిలోన్= ఆ పెట్టెలో; చెరన్+చెరన్= వెంటనే; తన, కొడుకున్= అప్పటికప్పుడే పుట్టిన తన కుమారుని; పెట్టి= ఉంచి; కుంతి= కుంతీకుమారి; నిజ, గృహంబునకున్= తన ఇంటికి; వచ్చెన్; అంత= ఆ తరువాత.

**తాత్పర్యం:** దుఃఖిస్తూ, ఆలోచిస్తున్న కుంతీదేవిపుణ్యంవలన సూర్యుడు పంపిన ఒకపెట్టె అమూల్యమైన రత్నాలతో, బంగారంతో నిండి నదీప్రవాహవేగంవలన ఆమెదగ్గరకు వచ్చింది. ఆ విధంగా తన దగ్గరకు వచ్చిన పెట్టెలో వెంటనే తనకొడుకును పెట్టి, కుంతి తనఇంటికి వచ్చింది. ఆ తరువాత.

**ఆ. ఘనభుజుండు రాధ యను దానిపతి యొక్క। సూతుఁ డరుగుదెంచి చూచి రత్న**
**పుంజభరిత మయిన మంజసలో నున్న। కొడుకు దానితోన కొనుచు వచ్చి. 31**

**ప్రతిపదార్థం:** ఘన, భుజుండు= గొప్పభుజాలు కలవాడు; రాధ, అను, దాని= రాధ అనుపేరుగల ఆమె; పతి= భర్త; ఒక్క, సూతుఁడు= సూతవంశంలో పుట్టినవాడు ఒకడు; అరుగుదెంచి= వచ్చి; చూచి= కనుగొని; రత్న, పుంజ, భరితము= రత్నాల సమూహంతో నిండినది; అయిన; మంజసలోన్= పెట్టెలో; ఉన్న= ఉండినట్టి; కొడుకున్; దాని, తోనన్= ఆ పెట్టెతోనే; కొనుచు= తీసికొంటూ; వచ్చి= ఇంటికివచ్చి.

**తాత్పర్యం:** రాధ అనే స్త్రీకి భర్త అయిన ఒక సూతుడు, గొప్పభుజాలు కలవాడు వచ్చి చూచి, రత్నాలపెట్టెలో ఉన్న బిడ్డను ఆ పెట్టెతోకూడ తీసికొని వెళ్ళి.

**క. తన భార్యకు రాధకు ని। చ్చిన నదియును గరము సంతసిల్లి కుమారుం**
**గని చన్నులు సేఁపి ముదం। బునఁ బెనిచెను సుహృదు లెట్టిపుణ్యమొ యనఁగన్. 32**

**ప్రతిపదార్థం:** తన భార్యకు, రాధకున్= తన ఇల్లాలు రాధకు; ఇచ్చినన్= ఈయగా; అదియును= ఆమెకూడా; కరము= మిక్కిలి; సంతసిల్లి; కుమారున్; కని=చూచి; చన్నులు= పాలిండ్లు, చేఁపి= పాలుకారునట్లు చేసి; సుహృదులు= చెలులు; ఎట్టి, పుణ్యమొ= ఎటువంటి పుణ్యమో; అనఁగన్= అని పలుకగా; ముదంబునన్= సంతోషముతో; పెనిచెను=పెంచింది.

**తాత్పర్యం:** తన భార్య అయిన రాధకు ఇవ్వగా, ఆమె చాలా సంతోషించి, ఆ కుమారుడిని చూచి చన్నులు చేపగా అతనికి పాలిచ్చి, చెలు లందరూ, 'ఇదంతా నీ పుణ్యం' అని పొగడగా, ఆ బాలుడిని పెంచింది.

**వ. ఇట్లు వసునివహంబుతో వచ్చుటంజేసి వసుషేణుం డను నామంబునం బరగి కర్ణుండు రాధేయుం డై సూతగృహంబునం బెరుఁగుచుండె; నంత నిట. 33**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వసు, నివహంబుతో= రత్నాల, బంగారుసమూహంతో; వచ్చుటన్+ చేసి= రావటంవలన; వసుషేణుండు; అను; నామంబునన్= పేరుతో; పరగి= ఒప్పి; కర్ణుండు; రాధేయుండు+ఐ= రాధకొడుకై; సూత, గృహంబునన్= సూతుని ఇంట్లో; పెరుఁగుచు+ఉండెన్= పెరుగుతూ ఉండినాడు; అంతన్, ఇట= అటుమీద - ఇక్కడ.

**తాత్పర్యం:** ఈ విధంగా బంగారంతో, రత్నాలతో రావటంచేత వసుషేణుడు అనే పేరుతో కర్ణుడు రాధకొడుకుగా సూతుడి ఇంట్లో పెరుగుతున్నాడు. ఆపైన ఇక్కడ.

**విశేషం:** వసుశబ్దానికి బంగారు, రత్నాలు అనే రెండుఅర్థాలూ ఉన్నాయి.

## పాండురాజు వివాహ మై దిగ్విజయము సేయుట (సం. 1-105-1)

**సీ. యదుకులవిమలపయఃపయోనిధిసుధా । కరరేఖఁ, గమనీయకాంతినిలయ,**
**ననవరతాన్నదానాభితర్పితముని । విప్రజనాశీఃపవిత్రమూర్తి,**
**వినయాభిమానవివేకసౌజన్యాది । సదమలగుణరత్నజన్మభూమిఁ,**
**బరమపతివ్రతాభరణాభిశోభితఁ । దామరసేక్షణఁ, దాల్మియందుఁ**

**ఆ. బృథివిఁ బోనిదానిఁ బృథయను కన్యక । నధికవీరుఁ డై స్వయంవరమునఁ**
**బడసి పరనరేంద్రపరిభావి పాండు భూ । వరుఁడు పేర్మితో వివాహ మయ్యె. 34**

**ప్రతిపదార్థం:** యదుకుల, విమల పయస్+పయస్+నిధి, సుధాకర, రేఖన్= యదువంశం అనే నిర్మలమైన పాలసముద్రానికి చంద్రరేఖ అయిన దానిని; కమనీయ, కాంతి, నిలయన్= మనోహరమైన కాంతికి స్థానం అయినదానిని; అనవరత+అన్నదాన+అభితర్పిత, ముని, విప్రజన+ఆశీస్, పవిత్రమూర్తిన్= ఎడతెగని అన్నదానంచేత తృప్తి పొందింపబడిన మునుల, బ్రాహ్మణుల ఆశీర్వచనంచేత పవిత్రమైన ఆకారం కలదానిని; వినయ+అభిమాన, వివేక, సౌజన్య+ఆది, సద్+అమల, గుణ, రత్న, జన్మభూమిన్= అడకువ, గౌరవం, వివేకం, మంచితనం మొదలైన ఉత్తమాలు అయిన నిర్మలగుణాలు అనే రత్నాలకు పుట్టుచోటు అయిన దానిని; పరమ, పతివ్రతా+ఆభరణ+అభిశోభితన్= ఉత్తమమైన పాతివ్రత్యం కల స్త్రీలకు నగవలె ఎక్కువగా ప్రకాశింపజేయబడుతున్నదానిని; తామరస+ఈక్షణన్= కమలాలవంటి కన్నులు కలదానిని; తాల్మి, అందున్= ఓర్పులో; పృథివిన్= భూమిని; పోనిదానినన్= పోలినట్టిదానిని; పృథ, అను, కన్యకన్= పృథ అనే పేరుగల కన్నెను అనగా కుంతిని; పర, నర+ఇంద్ర, పరిభావి= శత్రురాజులను అవమానించువాడు; పాండు, భూవరుఁడు= పాండురాజు; అధిక, వీరుఁ డు+ఐ= మిక్కిలి పరాక్రమశాలి అయి; స్వయంవరమునన్= స్వయంవరమునందు; పడసి= పొంది; పేర్మితో= గొప్పగా ప్రీతిగా; వివాహము+అయ్యెన్= పెళ్ళి చేసుకొన్నాడు.

**తాత్పర్యం:** యదువంశ మనే నిర్మలసముద్రానికి చంద్రరేఖవంటిది, మనోహరమైన తేజస్సుకు స్థానమైనది, ఎడతెగని అన్నదానంచేత మునులను బ్రాహ్మణులను తృప్తిపొందించి వాళ్ళ ఆశీర్వచనంచేత పవిత్రమైన ఆకారం కలది, వినయం, గౌరవం, వివేకం, మంచితనం మొదలైన ఉత్తమగుణా లనే రత్నాలకు జన్మభూమి అయినది, పరమ పతివ్రతలకు అలంకారంవలె ప్రకాశించేది, కమలాలవంటి కన్నులు కలది, ఓర్పులో భూమితో పోల్చదగింది అయిన పృథను, శత్రురాజులను జయించిన పాండురాజు మహాపరాక్రమశాలి అయి, స్వయంవరంలో పొంది, ప్రీతితో పెళ్ళి చేసికొన్నాడు.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ. ఈ పద్యంలో నన్నయ కుంతిని ఒక శృంగారనాయికగా కాక పుణ్యవతిగా, పవిత్రమూర్తిగా వర్ణించాడు. 'గణనీయకాంతినిలయ' అన్న విశేషణంద్వారా ఈ పద్యరచనలో కాంతి అనే శబ్దగుణం గణనీయంగా పోషింపబడిం దని సూచించాడు. వాడిన దీర్ఘసమాసాలు ఔజ్జ్వల్యం అనే స్వభావాన్ని ప్రదర్శించటంచేత కుంతిలోని కాంతిశీలం ధ్వనిమయం అవుతున్నది. అక్షరరమ్యత కాంతిగుణశోభకు వ్యంజకం కావటం ఈ రచనలోని విశేషం. భారతకథలోని మాతృమూర్తిగా అత్యంత కీలకమైన పాత్రను నిర్వహించే పృథను (కుంతిని) సీసపద్యంలో గుణసుందరంగా, ఉదాత్తంగా పరిచయం చేయటం రుచిరార్థ సూక్తినిధి ప్రదర్శించినశిల్పం.

**వ. మఱియు భీష్మానుమతంబున మద్రరాజతనయ మాద్రి యనుదాని మహోత్సవంబున వివాహంబై పాండురాజు భరతకులరత్నాలంకారుం డై పరాక్రమంబున నెవ్వరిని మెచ్చక యపారచతురంగబలసమన్వితుం డై. 35**

**ప్రతిపదార్థం:** మఱియు; భీష్మ+అనుమతంబున= భీష్ముడి అనుమతితో; మద్ర, రాజ, తనయ= మద్రదేశానికి సంబంధించిన రాజు కూతురు; మాద్రి అను దానిన్= మాద్రి అను పేరుగల ఆమెను; మహా+ఉత్సవంబునన్= గొప్ప పండుగతో (ఊరేగింపుతో); వివాహంబై= పెండ్లాడి; పాండురాజు= పాండురాజు; భరత, కుల, రత్న+ అలంకారుండు+ఐ= భరతవంశానికి రత్నాభరణం వంటివాడై; పరాక్రమంబునన్= వీర్యము లేదా శౌర్యమునందు; ఎవ్వరిని, మెచ్చక= ఎంతటివారినైనా, లెక్కచేయక; అపార, చతురంగ, బల, సమన్వితుండు+ఐ= అంతులేని నాలుగు అంగములు (రథ, గజ, తురగ, పదాతులు) కలసేనతో కూడుకొన్నవాడై.

**తాత్పర్యం:** పాండురాజు భీష్మునిఅనుమతితో మద్రరాజుకూతురైన మాద్రినికూడా వైభవంగా వివాహంచేసికొని, భరతవంశానికి రత్నాభరణంవంటివాడై, పరాక్రమంలో ఎవరినీ లెక్కచేయక చతురంగబలాలతో కూడుకొన్నవాడై.

**మ. ధ్వజినీ పాత భరంబునం దలరఁగా, ధాత్రీధరాహీంద్ర మూ**
**ర్ధజరత్నప్రకరంబు లున్నతగజేంద్రస్యందనప్రోల్లస**
**ద్ధ్వజ వాతాహతిఁ దూలఁగా జలదబృందం బీక్రియన్ సర్వది**
**గ్విజయార్థం బరిగెం గురుప్రభుఁడు దోర్వీర్యప్రకాశార్థి యై. 36**

**ప్రతిపదార్థం:** ధ్వజినీ, పాత, భరంబునన్= సైన్యంనడకభారంచేత; ధాత్రీ, ధర+అహి+ఇంద్ర, మూర్ధజ, రత్న, ప్రకరంబులు= భూమిని మోస్తున్న నాగరాజైన ఆదిశేషుని శిరస్సునందు పుట్టిన రత్నాలసమూహాలు; తలరఁగా= చలింపగా; ఉన్నత, గజ+ఇంద్ర, స్యందన, ప్ర+ఉల్లసత్+ధ్వజ, వాత+ఆ, హతిన్= ఎత్తైన మేలిమి ఏనుగులయొక్క, రథాలయొక్క బాగా ప్రకాశించే టెక్కెముల గాలిదెబ్బచేత; జలద, బృందంబు= మేఘాలసమూహం; తూలఁగాన్= చలింపగా; ఈ, క్రియన్= ఈ విధంగా; కురు, ప్రభుఁ డు= కురురా జైన పాండురాజు; దోః+వీర్య, ప్రకాశ+అర్థి+ఐ= బాహుబలాన్ని ప్రకటించాలన్న కోరిక కలవాడై; సర్వ, దిక్+విజయ+అర్థంబు= అన్నిదిక్కులను జయించటంకొరకు; అరిగెన్+ వెళ్ళాడు.

**తాత్పర్యం:** సైన్యంయొక్క పాదఘట్టనలభారంవల్ల భూమిని మోస్తున్న ఆదిశేషునిశిరోమణులు చలించేటట్లు, ఎత్తైన మేలిమిఏనుగులమీద, రథాలమీద కల జెండాల గాలిదెబ్బకు మేఘాల సమూహం చెదిరేటట్లు పాండురాజు తన బాహుబలాన్ని ప్రకటించా లన్నకోరికతో దిగ్విజయంకోసం వెళ్ళాడు.

**విశేషం:** అలం: అతిశయోక్తి. మత్తేభవృత్తం సమాసఘటితమై సంధిబంధురమై, ఉదాత్తగంభీరంగా ప్రసాదమిశ్రిత ఓజోగుణంతో సాగింది. ఈ పద్యశైలి వీరరసోచితం; అక్షరరమ్యం.

**క. అతులప్రతాపలీలా। యుతుఁ డై ప్రాగ్దక్షిణాపరోత్తర దిగ్భూ**
**పతుల నిజశాసన వశీ। కృతులం గావించెఁ దనదుకీర్తి వెలుంగన్. 37**

**ప్రతిపదార్థం:** అతుల, ప్రతాప, లీలా, యుతుఁడు+ఐ= సాటిలేని పరాక్రమవిలాసంతో కూడినవాడై; ప్రాక్+దక్షిణ+అపర+ ఉత్తర, దిక్+భూపతుల= తూర్పు, దక్షిణం, పడమర, ఉత్తరదిక్కులరాజులను; తనదు కీర్తి; వెలుంగన్; నిజ, శాసన, వశీకృతులన్= తన ఆజ్ఞకు లొంగేటట్లు చేయబడినవారినిగా - అనగా తనకు లొంగినవారినిగా; కావించెన్= చేశాడు.

**తాత్పర్యం:** సాటిలేని పరాక్రమవిలాసంతో పాండురాజు నాలుగుదిక్కులరాజులను తన ఆజ్ఞకు లొంగేటట్లు చేశాడు.

**మహాస్రగ్ధర**

**అతిరౌద్రాకారకీలాయతదవదహనోగ్రాగ్ర సేనానిపీడా**
**హతు లై నానావిధోపాయనములు గొని సౌహార్దవాంఛన్ జయశ్రీ**
**శ్రితబాహుం గానఁగా వచ్చిరి సకలజగత్సేవ్యమానున్ మహేంద్ర**
**ప్రతిముం గౌరవ్యవంశప్రభు నఖిలమహీపాలు రాంబాలికేయున్. 38**

**ప్రతిపదార్థం:** అఖిల, మహీ, పాలురు= భూమిమీది రాజులంతా; అతి, రౌద్ర+ఆకార, కీలా+ఆయత, దవదహన+ఉగ్ర+ అగ్ర, సేనా, నిపీడా, హతులు+ఐ= మిక్కిలితీక్ష్ణ మైన ఆకారం కల మంటలచేత గొప్పదైన కార్చిచ్చువలె భయంకరమైన ముందు ఉన్న సైన్యంతాకిడిచేత కొట్టబడినవారై; నానావిధ+ ఉపాయనములు= పలురకాలకానుకలు; కొని= తీసికొని; సౌహార్ద, వాంఛన్= స్నేహంమీదికోరికతో; జయ శ్రీ, శ్రిత, బాహున్= జయలక్ష్మిచేత ఆశ్రయించబడిన చేతులు కలవాడిని; సకల, జగత్+సేవ్యమానున్= అన్నిలోకాలచేత సేవింపదగినవాడిని; మహా+ఇంద్ర, ప్రతిమున్ = దేవేంద్రుడితో సమానమైనవాడిని; కౌరవ్య, వంశ, ప్రభున్= కురువంశరాజును; ఆంబాలికేయున్= అంబాలికకొడుకైన పాండురాజును; కానఁగాన్= చూడటానికి; వచ్చిరి= వచ్చారు.

**తాత్పర్యం:** భూమిమీద రాజులంతా మహాతీవ్రజ్వాలలతో మండుతున్న కార్చిచ్చువలె భయంకరమయిన ముందున్న సైన్యం తాకిడిచేత కొట్టబడినవాళ్ళయి అనేకరకాల కానుకలు తీసుకొని, మిత్రత్వాన్ని కోరి జయలక్ష్మిని ఆశ్రయించిన చేతులుకలవాడు, అన్నిలోకాలచేత సేవించబడేవాడు, దేవేంద్రునితో సమానుడయినవాడు, కురువంశప్రభువు అయిన - పాండురాజును చూడటానికి వచ్చారు.

**విశేషం:** అలం: ఉపమ. మహాస్రగ్ధర పాదానికి 22 అక్షరా లుంటాయి. స, త, త, న, స ర, ర, గ అనే గణాలు వరుసగా ఉంటాయి. 9, 16 అక్షరాలకు యతి చెల్లుతుంది. నన్నయ వ్రాసినవి మొత్తం రెండు మహాస్రగ్ధరలు, మొదటిది (ఆది 2.22) దేవదానవయుద్ధంలో నరనారాయణులు ప్రదర్శించిన ప్రతాపాన్ని వర్ణించేది. రెండవది ఇది. దిగ్విజయయాత్రలో పాండురాజు ప్రదర్శించిన పరాక్రమాన్ని వర్ణించేది. "వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్" అని క్షేమేంద్రుని మతం. స్రగ్ధరలోని మొదటి గురువును రెండు లఘువులు చేస్తే మహాస్రగ్ధర ఔతుంది. కాబట్టి స్రగ్ధరవలె మహాస్రగ్ధరనుకూడా మహావీరుల పరాక్రమ ప్రదర్శనకు వినియోగించి, నన్నయ వృత్తౌచిత్యాన్ని పాలించాడు. (సంపా.) పరాక్రమంవల్ల గాంభీర్యాన్ని, విజయలక్ష్మి వల్ల సౌందర్యాన్ని ఒక గొప్ప దండవలె ధరించినా డని-వృత్తము పేరుకు తగిన సన్నివేశకల్పన నన్నయఛందశ్శిల్పమర్మజ్ఞతకు నిదర్శనం.

**చ. లలిత హయ ద్విపంబుల విలాసినులన్ మణిరౌప్య కాంచనా**
**వలుల నజావిగోమహిష వర్గములన్ బహుభూషణంబులన్**
**బలువిడిఁ గప్పముల్ ధరణిపాలురచేఁ గొని నూఱువేల్గజం**
**బులఁ బెఱికించి తెచ్చెఁ గురుముఖ్యుఁ డకుప్యధనమ్ము లిమ్ముగన్. 39**

**ప్రతిపదార్థం:** కురు, ముఖ్యుఁడు= కురువంశంలో ముఖ్యుడైనవాడు - పాండురాజు; లలిత, హయ, ద్విపంబులన్= మనోహరాలైన గుఱ్ఱాలను, ఏనుగులను; విలాసినులన్= అందమైన స్త్రీలను; మణి, రౌప్య, కాంచన+ఆవలులన్= మణుల వెండిబంగారాల సమూహాలను; అజ+అవి, గో, మహిష, వర్గములన్= మేకల, గొఱ్ఱెల, గోవుల, దున్నల సమూహాలను; బహు,

భూషణంబులన్= అనేక ఆభరణాలను; బలువిడిన్= మిక్కుటంగా; కప్పముల్= పన్నులు; ధరణిపాలురచేన్= రాజులనుండి; కొని= గ్రహించి; అకుప్య, ధనమ్ములు= వెండి బంగారు రూపం అయిన సంపదలను; ఇమ్ముగన్= సులువుగ; నూఱు, వేల్, గజంబులన్= నూరువేల ఏనుగులతో; పెఱికించి= మోయించి; తెచ్చెన్.

**తాత్పర్యం:** పాండురాజు మనోహరాలైన గుర్రాలను, ఏనుగులను, అందమైన స్త్రీలను, మణులను, వెండిని, బంగారాన్ని, మేకలను, గొర్రెలను, ఆవులను, దున్నలను, చాలాధనాన్ని రాజులనుండి కప్పాలుగా గ్రహించాడు. వెండి, బంగారు రూపమైన ధనాన్ని నూరువేలఏనుగులతో మోయించి తెచ్చాడు.

**క. శరనిధిపరివృత విశ్వం । భరఁ గల భూపతులు పాండుపతికృతమునఁ గిం**
**కరు లై ప్రతిసమకల్పిత । కరు లై రది మొదలుగాఁగఁ గౌరవ్యులకున్. 40**

**ప్రతిపదార్థం:** శర, నిధి, పరివృత, విశ్వంభరన్= సముద్రంచేత చుట్టబడిన భూమిమీద; కల= ఉన్న; భూపతులు= రాజులు; పాండుపతి, కృతమునన్= పాండురాజు చేసిన పనివలన; కింకరులు+ఐ= సేవకులై; అది, మొదలు, కాఁగన్= అప్పటినుండి; కౌరవ్యులకున్= కురువంశరాజులకు; ప్రతి, సమ, కల్పిత, కరులు+ఐ= ప్రతిసంవత్సరం ఏర్పాటు చేయబడిన కప్పం కలవారు అయ్యారు - అనగా ప్రతిసంవత్సరం కప్పం చెల్లిస్తున్నారు.

**తాత్పర్యం:** భూమిమీది రాజులంతా పాండురాజు చేసిన పనివల్ల సేవకులై, అప్పటినుండి కురువంశ రాజులకు ప్రతి సంవత్సరం కప్పం చెల్లిస్తున్నారు.

## పాండురాజు సత్కృత్యములు (సం. 1-106-1)

**వ. ఇట్లు పాండురాజు దిగ్విజయంబు సేసి తదుపార్జితంబు లైన యపరిమితధనంబులఁ దెచ్చి ధృతరాష్ట్రుననుమతంబున భీష్మునకు సత్యవతికిం దమతల్లు లైన కౌసల్యలకు విదురునకు సుహృజ్జనులకు బ్రాహ్మణులకు నిచ్చి, వారివలన ననేకాశీఃప్రశంసలు వడసి సుఖం బున్నంత. 41**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పాండురాజు; దిక్+విజయంబు, చేసి= దిక్కులను జయించి; తద్+ఉపార్జితంబులు+ఐన= ఆ దిగ్విజయంవలన సంపాదించబడిన; అపరిమిత, ధనంబులన్= అంతులేని సంపదలను; తెచ్చి; ధృతరాష్ట్రు, అనుమతంబున= ధృతరాష్ట్రుని అంగీకారంతో; భీష్మునకున్; సత్యవతికిన్; తమ, తల్లులు+ఐన; కౌసల్యలకు= కోసలరాజు కూతుళ్ళకు; విదురునకున్; సుహృద్+జనులకున్= స్నేహితులకు; బ్రాహ్మణులకున్; ఇచ్చి; వారివలనన్; అనేక+ఆశీస్+ప్రశంసలు= పెక్కు ఆశీస్సులు, పొగడ్తలు; పడసి= పొంది; సుఖంబు+ఉన్నంత= సుఖంగా ఉండగా.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండురాజు దిగ్విజయం చేసి, అంతులేని సంపద తెచ్చి, ధృతరాష్ట్రుని అనుమతితో భీష్మునికి, సత్యవతికి, తమతల్లులకు, విదురునకు, మిత్రులకు, బ్రాహ్మణులకు ఇచ్చి, వారివలన అనేక ఆశీర్వచనాలను, ప్రశంసలను పొంది, సుఖంగా ఉండగా.

**చ. వినుతయశుండు పాండునృపవీరుఁడు దిగ్విజయంబు సేసి పెం**
**పునఁ గొనివచ్చి యిచ్చిన యపూర్వ మహా ధనరాశి పేర్మి వా**

**రని విభవంబుతోడ ధృతరాష్ట్రుఁడు సేసె శతాశ్వమేధముల్**
**దనిసన భూసురేశులకు దక్షిణ లిచ్చి యథోచితంబుగన్. 42**

**ప్రతిపదార్థం:** వినుత, యశుండు= పొగడబడిన కీర్తికలవాడు; పాండునృప, వీరుఁడు= వీరుడైన, పాండురాజు; దిక్+ విజయంబు, చేసి= దిక్కులను జయించి; పెంపునన్= గొప్పతనంచేత; కొనివచ్చి= తీసికొనివచ్చి; ఇచ్చిన= ఇచ్చినటువంటి; అపూర్వ, మహా, ధన, రాశి, పేర్మిన్= అంతకుముందు లేని గొప్ప ధనసమూహం యొక్క అతిశయంతో; వారని, విభవంబుతోడ= ఎడతెగని వైభవంతో; ధృతరాష్ట్రుఁడు; తనిసనన్= తృప్తిదీర; భూసుర+ఈశులకు= బ్రాహ్మణశ్రేష్ఠులకు; యథా+ఉచితంబుగన్= ఎవరికి తగినట్లు వారికి; దక్షిణలు= పెద్దవారికి గౌరవంగా ఇచ్చు ధనము; ఇచ్చి= ఒసగి; శత+అశ్వమేధముల్= వంద అశ్వమేధయాగాలు; చేసెన్.

**తాత్పర్యం:** కీర్తిమంతు డైన పాండురాజు దిక్కులను జయించి గొప్పగా తెచ్చి ఇచ్చిన ధనసమూహంతో ధృతరాష్ట్రుడు, మహావైభవంగా తృప్తిదీర బ్రాహ్మణోత్తములకు ఎవరికి తగినట్లు వారికి దక్షిణలు ఇచ్చి, వంద అశ్వమేధయాగాలు చేశాడు.

**వ. మఱియు నప్పాండురాజు వినయవిధేయత్వంబున ధృతరాష్ట్రునకు, నభిమతకార్యకరణంబున బాంధవులకు, ననుకూలత్వంబున సుహృజ్జనులకుఁ, బరిశ్రమజ్ఞానంబున విద్వాంసులకుఁ, గారుణ్యదానంబున ననాథులకు, నభయంకరత్వంబున మహీప్రజలకు సంతోషంబు సేయుచు. 43**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఆ+పాండురాజు; వినయ, విధేయత్వంబునన్= అణకువతో లొంగిఉండటంచేత; ధృతరాష్ట్రునకున్; అభిమతకార్య, కరణంబునన్= ఇష్టమైన పనులు చేయటంచేత; బాంధవులకున్= చుట్టాలకు; అనుకూలత్వం బునన్= అనుకూలంగా ఉండటంచేత; సుహృత్+జనులకున్= మిత్రులకు; పరిశ్రమ, జ్ఞానంబునన్= కృషిని గుర్తించటంచేత; విద్వాంసులకున్= పండితులకు; కారుణ్య, దానంబునన్= దయను దానంచేయటంచేత - అనగా కరుణ చూపటంచేత; అనాథులకున్= దిక్కులేనివాళ్ళకు; అభయంకరత్వంబునన్= భయంలేకుండా చేయడంచేత; మహీ, ప్రజలకున్= భూమిమీద ప్రజలకు; సంతోషంబు, చేయుచున్= సంతసం కలిగిస్తూ.

**తాత్పర్యం:** అంతేకాక ఆ పాండురాజు వినయవిధేయతలతో ధృతరాష్ట్రునికి, ఇష్టమైన పనులు చేయటంతో బంధువులకు, అనుకూలంగా ఉండటంతో మిత్రులకు, చేసిన కృషిని గుర్తించడంతో పండితులకు, దయ చూపటంతో దిక్కులేనివాళ్ళకు, భయంలేకుండా చేయటంతో ప్రజలకు సంతోషాన్ని కలిగిస్తూ.

**విశేషం:** ఇవి ఉత్తమరాజుకు ఉండే లక్షణాలు. ఉత్తమరాజు లక్షణాలే కాదు ఉత్తమవ్యక్తు లందరిలో ఉండే ఉన్నతమైన గుణాలు. వ్యక్తులంతా అలవరచుకోవలసిన ఉత్తమగుణాలు. పాండురాజు వంశకర్త. భావిచక్రవర్తుల వర్తనవిధిని ఆదర్శవంతంగా ఆచరించి చూపించాడు. పాండురాజు తన వంశాన్నీ, కుటుంబాన్నీ సమైక్యంగా, సంపన్నంగా, సంతోషంగా, ఆదర్శవంతంగా ఉంచటానికి తన శక్తియుక్తు లన్నీ ధారపోసి వంశకర్త అయినాడు. పాండురాజు తెచ్చియిచ్చిన ధనంతో వంద అశ్వమేధాలు చేసిన ధృతరాష్ట్రుడు వంశవిచ్ఛిత్తికి దోహదంచేశాడు. పాండురాజు ప్రవర్తిల్లచేసిన ఉదార చరిత్రాన్ని పాండవులు కొనసాగించారు. అందువలననే ధార్తరాష్ట్రులు నశించారు. పాండవులు వంశోద్ధారకులైనారు. పాండురాజు ప్రవర్తనలో ధ్వనిస్తున్న భావికథార్థాలను సారమతితో భావించాలి.

**క. 'మండిత గుణ సంపద నధి। కుం డగుచున్ బూరు భరత కురు పతులకుఁ దు**
**ల్యుం డయి వంశకరుం డగుఁ। బాండుమహీశుఁ' డని బుధసభలు దనుఁ బొగడన్. 44**

**ప్రతిపదార్థం:** మండితగుణసంపదన్= అలంకరింపబడిన సుగుణాల అతిశయంలో; అధికుండు= గొప్పవాడు; అగుచున్= అవుతూ; పాండు, మహీ+ఈశుఁడు= పాండురాజు; పూరు, భరత, కురుపతులకున్= రాజులైన పూరు, భరత, కురురాజులకు; తుల్యుండు+అయి= సమానుడైనవాడై; వంశ, కరుండు= వంశాన్ని నిలిపేవాడు, అగున్= కాగలడు; అని= ఆ ప్రకారంగా; బుధ, సభలు= పండితసమూహాలు; తనున్= తన్ను; పొగడన్= ప్రశంసింపగా.

**తాత్పర్యం:** 'అనేకసుగుణాలతో గొప్పవాడై పాండురాజు పూరు భరత కురు చక్రవర్తులతో సమానుడై, వంశాన్ని నిలిపేవాడు ఔతా' డని పండితులు తనను పొగడుతూ ఉండగా.

**క. నానాద్రవ్య నిరంతర। దానముల ననూనయజ్ఞదక్షిణలను ధా**
**త్రీనాథుఁడు బ్రాహ్మణులను। శ్రీనిలయులఁ జేయుచుండె శిష్టప్రియుఁ డై. 45**

**ప్రతిపదార్థం:** ధాత్రీ; నాథుఁడు= భూపతి - పాండురాజు; నానా, ద్రవ్య, నిరంతర, దానములన్= అనేక విధాలైన సంపదలను నిరంతరం దానంచేస్తూ ఉండటంవలన; అనూన, యజ్ఞ, దక్షిణలను= తక్కువకాని యజ్ఞాలలో దక్షిణలచేత - అనగా యజ్ఞాలలో గొప్పగా ఇచ్చే దక్షిణలచేత; శిష్ట, ప్రియుఁడు+ఐ= సదాచారసంపన్నులకు ప్రియమైనవాడై; బ్రాహ్మణులను; శ్రీనిలయులన్= సంపదకు ఉనికిపట్టు లయిన వారినిగా; చేయుచున్+ఉండెన్.

**తాత్పర్యం:** పాండురాజు అనేకవిధాలైన సంపదలను నిరంతరం దానం చేయటంచేత, యజ్ఞాలలో గొప్పగా దక్షిణలు ఇవ్వటంచేత, సదాచారసంపన్నులకు ప్రియమైనవాడై, బ్రాహ్మణులను ధనవంతులనుగా చేస్తూ ఉన్నాడు.

### వేటకుఁ బోయిన పాండురాజునకు శాపంబు గలుగుట (సం. 1-109-5)

**వ. మఱియు ననేకవినోదంబులను ననవరతకామానురూపవిషయసుఖానుభవంబులనుం బ్రొద్దు పుచ్చుచు నాతండు మృగయావ్యసనంబునం దగిలి. 46**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; అనేక, వినోదంబులను= పెక్కు వినోదాలతో; అనవరత, కామ+అనురూప, విషయ, సుఖ+అనుభవంబులన్= ఎడతెగని కామానికి తగిన విషయ సుఖాలను అనుభవించటంచేత; ప్రొద్దు, పుచ్చుచున్= కాలం గడుపుతూ; ఆతండు= పాండురాజు; మృగయావ్యసనంబునన్= వేటమీది మితిమీరిన ఆసక్తితో; తగిలి= తగులుకొని.

**తాత్పర్యం:** అంతేకాక, వివిధ సుఖవిలాసాలతో, ఎడతెరిపి లేకుండా కోరుకొన్న భోగాలు అనుభవించటంతో కాలంపుచ్చుతూ, పాండురాజు వేటమీద మితిమీరిన ఆసక్తితో తగులుకొని.

**ఉ. వాసవసన్నిభుండు హిమవన్నగదక్షిణపార్శ్వభూములన్**
**శ్రీసతిఁ బోని కుంతియును జెల్వగు మాద్రియుఁ దోడ రాఁగ బా**
**ణాసన బాణ భాసిత మహాభుజుఁడై విహరించుచుండె ని**
**చ్ఛాసదృశంబుగా గజవశాద్వయమధ్య గజేంద్ర లీలతోన్. 47**

**ప్రతిపదార్థం:** వాసవ, సన్నిభుండు= దేవేంద్రునితో సమానుడు అయిన పాండురాజు; హిమవత్+నగ, దక్షిణ, పార్శ్వ, భూములన్= హిమాలయపర్వతంయొక్క దక్షిణంవైపు ఉన్న భూములలో; శ్రీసతిన్+పోని= లక్ష్మీదేవిని పోలినట్టి; కుంతియును= కుంతియు; చెలువు+అగు= అందమైనది అయిన; మాద్రియున్; తోడ, రాఁగన్= వెంట రాగా; బాణ+ఆసన, బాణ, భాసిత, మహా, భుజుఁడు+ఐ= ధనుస్సుచేత, బాణాలచేత ప్రకాశింపచేయబడిన గొప్పభుజాలు కలవాడై; ఇచ్ఛా, సదృశంబుగాన్= కోరికకు తగినట్లు; గజావశా, ద్వయ, మధ్య, గజ+ఇంద్ర, లీలతోన్= ఆడేనుగులు రెండింటి మధ్య ఉండే మదపుటేనుగువంటి విలాసంతో; విహరించుచున్+ఉండెన్= విహరిస్తూ ఉండినాడు.

**తాత్పర్యం:** దేవేంద్రునితో సమాను డైన పాండురాజు, హిమాలయపర్వతానికి దక్షిణవైపున ఉండే భూములలో లక్ష్మీదేవివంటి కుంతి, అందమైన మాద్రి తనవెంట రాగా; ధనుస్సును, బాణాలను చేపట్టి ఇష్టంవచ్చినట్లుగా, రెండు ఆడుఏనుగుల మధ్య ఉండే మగమదపుటేనుగువంటి విలాసంతో విహరిస్తూ ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. మఱియుఁ దనకు ధృతరాష్ట్రుం డిష్టాన్నపాన మాల్యానులేపన భూషణాదులు నిత్యంబునుం బుత్తెంచుచుండ నిట్లు వనవాసవ్యాసంగంబున నుండి, యొక్కనాఁడు పెక్కుమృగంబుల నెగిచి యొక్కటి నేనియు నేయంగానక కినిసి యొక్కయెడ. 48**

**ప్రతిపదార్థం:** మఱియున్; తనకున్; ధృతరాష్ట్రుండు; ఇష్ట+అన్న, పాన, మాల్య+అనులేపన, భూషణ+ఆదులు= ఇష్టమైన అన్నపానాలు, పూదండలు, మైపూతలు, ఆభరణాలు మొదలైనవాటిని; నిత్యంబునున్= ప్రతిరోజు; పుత్తెంచుచు+ఉండన్= పంపుతూ ఉండగా; ఇట్లు; వన, వాస, వ్యాసంగంబునన్= అడవిలో ఉండటంమీది ఆసక్తితో; ఉండి= వసించి; ఒక్కనాఁడు; పెక్కు, మగ్రుంబులన్= అనేకమృగాలను; ఎగిచి= తరిమి; ఒక్కటిన్, ఏనియున్= ఒక్కదానినికూడా; ఏయన్+కానక= కొట్టడానికి సాధ్యపడక; కినిసి= కోపించి; ఒక్క+ఎడన్= ఒకచోట.

**తాత్పర్యం:** అంతేకాక తనకు ఇష్టమైన అన్నపానాలు, పూదండలు, మైపూతలు, ఆభరణాలు మొదలైనవి ప్రతిరోజు ధృతరాష్ట్రుడు పంపుతూ ఉండగా, అడవిలో ఉండా లనే ఆసక్తి ఉండి, ఒకరోజు అనేకమృగాలను తరిమి, ఒక్కదాన్ని కూడా కొట్టడం సాధ్యంకాక కోపించి, ఒకచోట.

**క. మనసిజరాగంబునఁ బెనఁ। గిన యిఱ్ఱిని లేడిఁ జూచి కృతహస్తుఁడు పె**
**ల్చన యే నమ్ముల నారెం। టిని ద్రెళ్ళఁగ నేసెఁ గడుఁ గఠినహృదయుం డై. 49**

**ప్రతిపదార్థం:** మనసిజ, రాగంబునన్= మన్మథరాగంతో; పెనఁగిన= కలిసిన; ఇఱ్ఱిని= మగజింకను; లేడిన్= ఆడుజింకను; చూచి= కనుగొని; కృత, హస్తుఁడు= బాణాలను ప్రయోగించటంలో అలవాటుపడిన చేయి కలవాడు; కడున్= మిక్కిలి; కఠిన, హృదయుండు+ఐ= కఠినమైన మనస్సు కలవాడై; పెల్చన= గట్టిగా; ఏను+అమ్ములన్= ఐదుబాణాలతో; ఆ, రెంటిని= ఆ రెండుమృగాలను; త్రెళ్ళఁగన్= చనిపోయేటట్లు; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** మన్మథరాగంతో కలిసి ఉన్న మగ ఆడుజింకలను చూచి, బాణప్రయోగంలో నేర్పుకలవాడైన పాండురాజు కఠినహృదయుడై అయిదుబాణాలతో అవి చనిపోయేట్లు గట్టిగా కొట్టాడు.

**వ. ఇ ట్లేసి యబ్బాణంబులు పుచ్చికొనియున్న యప్పాండురాజుం జూచి యమ్మృగమిథునంబునం దల్పావశిష్టజీవం బై పడియున్న మృగంబు మనుష్యవచనంబుల ని ట్లనియె. 50**

**విశేషం:** ఇట్లు+ఏసి= ఈ విధంగా కొట్టి; ఆ+బాణంబులు; పుచ్చికొని= తీసికొని; ఉన్న, ఆ+పాండురాజున్; చూచి; ఆ, మృగ, మిథునంబునందు= ఆ మృగాలజంటలో; అల్ప+అవశిష్ట, జీవంబు+ఐ= కొంచెం మిగిలిన ప్రాణం కలదై; ఉన్న= ఉండిన; మృగంబు= మగజింక; మనుష్య, వచనంబులన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా కొట్టి ఆ బాణాలు తీసికొన్న ఆ పాండురాజును చూచి, ఆ మృగాలజంటలో కొన ఊపిరితో ఉన్న మగజింక మానవవాక్కులతో ఈవిధంగా అన్నది.

**తరలము.**

**హరిపరాక్రమ! యేను గిందముఁ డన్మునిన్, మృగముల్ నిరం**
**తరము నిట్లు రమింపఁగాఁ గని తద్రతం బెడఁ గోరి సుం**
**దర మృగాకృతి నేను భార్యయు దారుణాటవిఁ గామ భో**
**గరతి నుండితి మిష్టచారిమృగవ్రజంబుల పొత్తునన్. 51**

**ప్రతిపదార్థం:** హరి, పరాక్రమ= దేవేంద్రునిపరాక్రమంవంటి పరాక్రమం కలవాడా!; ఏను= నేను; కిందముఁడు, అను, మునిన్= కిందముడు అను పేరుగల మునిని; మృగముల్= జింకలు; నిరంతరమున్= ఎల్లప్పుడు; ఇట్లు; రమింపన్+కాన్= సంభోగించటాన్ని; కని=చూచి; తద్+రతంబు= వానియొక్కక్రీడను; ఎడన్=మనస్సులో; కోరి= ఇష్టపడి; సుందర, మృగ+ఆకృతిన్= అందమైన జింకలరూపంతో; ఏను= నేను; భార్యయు= నా ఇల్లాలు; దారుణ+అటవిన్= భయంకరమైన అడవిలో; కామ, భోగ, రతిన్= మన్మథసుఖంమీది ఆసక్తితో; ఇష్ట, చారి, మృగ, వ్రజంబుల, పొత్తునన్= ఇష్టంగా తిరుగుతున్న జింకలసమూహాల సహవాసంతో; ఉండితిమి.

**తాత్పర్యం:** దేవేంద్రునివంటి పరాక్రమం కలవాడా! నేను కిందముడు అనే మునిని. ఎల్లప్పుడూ ఈ విధంగా మృగాలు సంభోగించటాన్ని చూచి అట్లా సంభోగించా లని భావించి, నేనూ, నా భార్యా అందమైన మృగరూపాలు ధరించి, భయంకరమైన ఈ అడవిలో స్వేచ్ఛగా తిరిగే తోటిజింకల సమూహంతో కలసి, మన్మథసుఖాలు అనుభవిస్తున్నాం.

**విశేషం:** తరల వృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న, భ, ర, స, జ, జ, గ - గణాలు ఉంటాయి. 12వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది. తరలం తన పేరుకు తగినట్లుగా చంచలం, తరంగితం, కంపితం అయిన చిత్తవృత్తిని ధ్వనింపచేస్తుంది. కిందముని చంచలత్వాన్ని కంపితకంఠంతో (కొనఊపిరితో) చెప్పే సందర్భంలో వాడి నన్నయ ఛందశ్శిల్పాన్ని ప్రదర్శించాడు.

**వ. మృగముల మై యున్న మమ్ము వధియించిన దీన నీకు పాతకంబు లేదు; వేటలాడుటయు, మృగంబులఁ జంపుటయు రాజులకు ధర్మంబ; యయినను. 52**

**ప్రతిపదార్థం:** మృగములము+ఐ, ఉన్న= జింకలమై ఉండు; మమ్మున్= మమ్మల్ని; వధియించిన= చంపిన; దీనన్= దీనివలన; నీకున్; పాతకంబు= పాపం; లేదు= ఉండదు; వేటలు, ఆడుటయు= వేటాడుటలు; మృగంబులన్= జింకలను; చంపుటయున్= వధించుట; రాజులకున్= క్షత్రియులకు; ధర్మంబు+అ= న్యాయమే; అయినను.

**తాత్పర్యం:** జింకల మై ఉన్న మమ్మల్ని చంపటంవలన నీకు పాపం రాదు. వేటాడటం, మృగాలను చంపటం క్షత్రియులకు ధర్మమే, అయినా.

**తే.** **పఱవనోపక యున్న, మైమఱచి పెంటిఁ। బెనఁగియున్నను, బ్రసవింప మొనసియున్నఁ,**
**దెవులు గొనియున్న మృగములఁ దివిరి యేయ। రెఱచి యాహారముగ మను నెఱుకు లయిన. 53**

**ప్రతిపదార్థం:** పఱవన్= పరుగెత్తటానికి; ఓపక= శక్తి లేక; ఉన్నన్= ఉండినను; మైమఱచి= శరీరము మరచి; పెంటిన్= ఆడుదానితో; పెనఁగి= కూడి; ఉన్నను= ఉండినప్పుడును; ప్రసవింపన్= ఈనటానికి; మొనసి= పూని; ఉన్నన్= ఉన్న సమయంలోను; తెవులు, కొని= వ్యాధిని పొంది; ఉన్నన్= ఉండినప్పుడున్నూ; మృగములన్= జింకలను; ఎఱచి= మాంసం; ఆహారముగ; మను= జీవించే; ఎఱుకులు= బోయవారు; అయినన్= అయినా; తివిరి= ప్రయత్నించి; ఏయరు= కొట్టరు.

**తాత్పర్యం:** పరుగెత్తలేనివి, ఆడుదానితో కూడుకొన్నవి, ఈనుతున్నవి, వ్యాధితో బాధపడుతున్నవి అయిన మృగాలను మాంసం ఆహారంగా జీవించే కిరాతులుకూడా కొట్టరు.

**చ.** **ఇనసమతేజు లై ధరణి నెన్నడు ధర్మపథంబు దప్పఁ ద్రొ**
**క్కని భరతాదిరాజుల జగన్నుతవంశమునందుఁ బుట్టి నీ**
**కనఘచరిత్ర। యిట్లు దగునయ్య యధర్మువు సేయ? నీ యెఱుం**
**గని నృపధర్మువుల్ గలవె? కౌరవపుంగవ! గౌరవస్థితిన్. 54**

**ప్రతిపదార్థం:** ఇన, సమ, తేజులు+ఐ= సూర్యుడితో సమానమైన తేజస్సు కలవారై; ధరణిన్= భూమిమీద; ఎన్నడున్= ఎప్పుడునూ; ధర్మ, పథంబు= ధర్మమార్గాన్ని; తప్పన్, త్రొక్కన్= తప్పుగా త్రొక్కని; భరత+ఆది, రాజుల, జగత్+నుత, వంశము+అందున్= భరతుడు మొదలైన రాజులు గల్గి; లోకంచేత పొగడబడినవంశంలో; పుట్టి; అనఘ, చరిత్ర= పాపం లేని నడవడి కలవాడా!; నీకున్, ఇట్లు; అధర్మువు= అన్యాయం; చేయన్= చేయటానికి; తగును+అయ్య= తగునా అయ్యా; కౌరవ, పుంగవ= కురువంశంలో శ్రేష్ఠుడా!; గౌరవ, స్థితిన్= ఉన్నతస్థితిలో ఉండటంచేత; నీ, ఎఱుంగని= నీకు తెలియని; నృప, ధర్మువుల్= రాజధర్మాలు; కలవె= కలవా?

**తాత్పర్యం:** సూర్యునితో సమానమైన తేజస్సు కలవారై, భూమిమీద ఎప్పుడూ ధర్మమార్గాన్ని తప్పని భరతుడు మొదలైన రాజుల ప్రసిద్ధవంశంలో పుట్టి, పుణ్యాత్ముడవైన నీకు అధర్మం చేయటం తగునా? కౌరవశ్రేష్ఠా! ఉన్నత స్థితిలో ఉన్న నీకు తెలియనిరాజధర్మాలు ఉన్నాయా?

**విశేషం:** భరతుడు మొదలైన వంశకర్తలు ధర్మమూర్తులు. వారివంశంలో పుట్టిన పాండురాజుకూడా ఆదర్శమూర్తిగా ఉండక, అధర్మంగా రతివివశులైన మృగాలను చంపటం గర్హించదగిన దని మునివచనం. "యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదే వేతరో జనః। స యత్ ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే" భ.గీ.3.21 అని గీతావాక్యం. పెద్దవారి ఆచరణలనే ఇతరజనులు

అనుసరిస్తారు. పెద్దలు చూపిన ప్రమాణాలకు లోకం కట్టుబడిఉంటుంది అన్న ధర్మాన్ని ఆధారంగా చేసుకొని కిందముడు పలికాడు. 'తగునయ్య' అను ప్రయోగము ఎంతో ఔచిత్యవంతము. తండ్రివై కాపాడవలసిన నీవు, రతిక్రీడలో ఉన్న మమ్మల్ని చంపటం న్యాయమా? అని మెత్తని మందలింపు.

**వ. అని తన్ను నిందించి పలికిన నామృగంబు పలుకుల కలిగి పాండురా జి ట్లనియె. 55**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; తన్ను= తనను; నిందించి; పలికినన్= మాటాడగా; ఆ, మృగంబు= ఆ జింకయొక్క; పలుకులకున్= మాటలకు; అలిగి= కోపించి; పాండురాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని తనను నిందించి పలుకగా ఆ జింకమాటలు విని కోపించి, పాండురాజు ఈ విధంగా పలికాడు.

**తే. పగఱఁ గని సైఁతురేనియు మృగకులంబు । గని సహింపరు రాజులు; మొనసి వాని**
**గ్రచ్చఱఁగఁ జంపుదురు; నమ్మి కిచ్చి చంపఁ । జనదు; మాయాబలంబునఁ జనదు చంప. 56**

**ప్రతిపదార్థం:** రాజులు, పగఱన్= శత్రువులను; కని= చూచి; సైఁతురు+ఏనియున్= సహించినప్పటికిని; మృగ, కులంబు= మృగాలసమూహాన్ని; కని= చూచి; సహింపరు= ఓర్చుకొనరు; మొనసి= పూని, వానిన్= ఆ మృగాలను; క్రచ్చఱగన్= వేగంగా; చంపుదురు; నమ్మిక +ఇచ్చి= నమ్మించి; చంపన్= చంపగా; చనదు= కూడదు; మాయా, బలంబునన్= మోసంయొక్క బలంచేత - అనగా మోసగించి; చంపన్= వధింపగా; చనదు= కూడదు.

**తాత్పర్యం:** రాజులు శత్రువులను చూచి సహిస్తారేమో కాని మృగాలను చూచి సహించరు. వెంటనే వాటిని చంపుతారు. అయినా నమ్మించి కాని, మోసంచేసి కాని చంపకూడదు.

**వ. 'తొల్లి యగస్త్య మహామునీంద్రుండు మృగ మాంసంబున నిత్యశ్రాద్ధంబు సేయుచుండి రాజులకు మృగవధ దోషంబు లేకుండ నిర్మించె; దీని నీకు నిందింపఁదగునే?' యనుచున్న నమ్మృగంబులు బాణఘాతక్షతవేదన సహింపనోపక 'సర్వప్రాణులకు సాధారణం బయి యిష్టం బగు సుఖావసరంబున నున్న మమ్ము ననపరాధుల వధించితి గావున నీవునుం బ్రియాసంగమం బయిన యప్పుడ పంచత్వం బొందెదు' మని, 'నీ ప్రియయు నిన్ను ననుగమించు' నని పాండురాజునకు శాపం బిచ్చి, గతప్రాణము లై పడియున్న మృగంబులం జూచి శోకించి పాండురాజు పరమ నిర్వేదనపరుం డయి. 57**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; అగస్త్య, మహా, ముని+ఇంద్రుండు= అగస్త్యమహర్షి; మృగ, మాంసంబునన్= జింకమాంసముతో; నిత్య, శ్రాద్ధంబు= ప్రతిదినశ్రాద్ధం; చేయుచున్+ఉండి= చేస్తూ ఉండి; రాజులకున్= క్షత్రియులకు; మృగ, వధ, దోషంబు= మృగాలను చంపటంవలని పాపం; లేకుండన్; నిర్మించెన్= చేశాడు; దీనిన్= ఈ పనిని, నీకున్= నీకు; నిందింపన్= దూషింపగా; తగునే= యోగ్యము అగునా? అనుచున్నన్= అంటూండగానే; ఆ+మృగంబులు= ఆ రెండు జింకలు; బాణ, ఘాత, క్షత, వేదనన్= బాణందెబ్బలవలన ఏర్పడిన గాయాలబాధను; సహింపఁగన్, ఓపక= ఓర్చుకోలేక; సర్వ, ప్రాణులకు; సాధారణంబు+అయి; ఇష్టంబు+అగు; సుఖ+అవసరంబునన్= సుఖసమయంలో; ఉన్న= ఉండిన; మమ్మున్= మమ్మల్ని; అనపరాధులన్= తప్పుచేయనివారిని; వధించితివి= వధించావు; కావున; నీవున్= నీవుకూడా; ప్రియా, సంగమంబు= ప్రియురాలితో కలయిక; అయిన= కలిగినవేళ; అప్పుడు+అ; పంచత్వంబు= మరణం; ఒందెడుము= పొందుతావు గాత; అని= ఆ

ప్రకారంగా; నీ, ప్రియయున్= నీ ప్రియురాలు కూడ; నిన్నున్, అనుగమించున్= వెంబడిస్తుంది; అని; పాండురాజునకు; శాపంబు+ఇచ్చి; గత, ప్రాణములు+ఐ= పోయిన ప్రాణాలు కల వై; పడియున్న= నేలపై పడిఉన్న; మృగంబులన్= జింకలను; చూచి; దుఃఖించి= శోకించి; పాండురాజు; పరమ, నిర్వేదన, పరుండు+అయి= మిక్కిలి నిరాశ చెందినవా డై.

**తాత్పర్యం:** 'పూర్వం అగస్త్యమహర్షి మృగమాంసంతో ప్రతిరోజూ శ్రాద్ధం చేస్తూ, రాజులకు మృగవధవలన పాపం లేకుండా చేశాడు. అందువలన నీవు నన్ను నిందించటం తగునా?' - అని అంటూ ఉండగా, ఆ మృగాలు బాణం దెబ్బలవలన కలిగినబాధ ఓర్చుకోలేక, ప్రాణు లన్నిటికి సాధారణ మై, ఇష్టమైన సంభోగ సుఖాన్ని అనుభవిస్తున్న సమయంలో ఏ తప్పు చేయని మమ్మల్ని చంపావు. కాబట్టి నీవుకూడా నీ ప్రియురాలితో కలిసినప్పుడు మరణాన్ని పొందుతావు; నీ భార్యకూడా నీతో మరణించుగాక' అని పాండురాజుకు శాపమిచ్చి, ప్రాణాలు విడిచి పడి ఉన్న ఆ మృగాలను చూచి, పాండురాజు మిక్కిలి దుఃఖించి నిరాశ చెందినవాడై.

**విశేషం:** శ్రాద్ధము - శ్రద్ధతో కూడినది - కాల, పాత్ర నియమాలతో చేసే పితృక్రియ.

**క. ఎట్టి విశిష్టకులంబునఁ। బుట్టియు, సదసద్వివేకములు గల్గియు, మున్**
**గట్టిన కర్మఫలంబులు। నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్? 58**

**ప్రతిపదార్థం:** మనుజుల్= మానవులు; ఎట్టి విశిష్ట, కులంబునన్= ఎంతటి ఉత్తమవంశంలో; పుట్టియున్; సత్+అసత్+వివేకములు= మంచి చెడ్డలను గురించిన పరిజ్ఞానాలు; కల్గియున్= కలిగియుండియు; మున్= పూర్వజన్మలో; కట్టిన= కూడబెట్టుకొన్న; కర్మ, ఫలంబులు= కర్మఫలాలు; నెట్టన= తప్పక; భోగింపక= అనుభవింపక; ఉండ, నేర్తురె = ఉండగలరా?

**తాత్పర్యం:** మానవులు ఎంతటి ఉత్తమవంశంలో పుట్టినా, మంచిచెడ్డలనుగురించిన పరిజ్ఞానాలు కలిగిఉన్నా, పూర్వజన్మకర్మఫలాన్ని అనుభవించక తప్పదు.

**విశేషం:** విధికంటె కర్మ బలీయ మని సుభాషితం. "ఫలం కర్మాయత్తం కి మమరగణైః కించ విధినా । నమ స్తత్కర్మేభ్యో విధిరపి న యేభ్యః ప్రభవతి" అని భర్తృహరిసుభాషితం (కర్మపద్ధతి-91 శ్లో) - ఫలం కర్మాధీనం కాబట్టి దేవతలతోనూ, దైవంతోనూ మా కేమిపని? దేవతలకుకూడా దాట శక్యంగాని కర్మకే నమస్కారం అని భర్తృహరికవితోక్తి. (సంపా.)

**వ. కామవ్యామోహితుం డయి కొండుకనాఁడు మదీయజనకుండు పరలోకగతుం డైనఁ దత్క్షేత్రంబున ధర్మమయుం డయిన కృష్ణద్వైపాయనమునివలన నుద్భవిల్లి, ధర్మప్రవృత్తుండ నై యున్న నా కిట్టి దుర్వ్యసనంబు కర్మవశంబున సంభవించె; నింక మునివృత్తియ యుచితంబు గావున సర్వసంగంబులు విడిచి, సర్వభూతంబులయందు సమచిత్తుండనై, హింస దలంపక నిత్యంబు నొక్కొక్కవనస్పతియందు నొక్కొక్కవన్య ఫలంబు భిక్ష గొని, యసంభవం బయిననాఁ డుపవాసంబు సేసి, వృక్షమూలంబున నుండి పాంసుపరిచ్ఛన్నదేహుండ నయి. 59**

**ప్రతిపదార్థం:** మదీయ, జనకుండు= నాతండ్రి; కామ, వ్యామోహితుండు+అయి= మన్మథునిచేత మిక్కిలి మోహింపచేయబడినవాడై; కొండుకనాఁడు= చిన్నతనంలో; పర, లోక, గతుండు+ఐనన్= స్వర్గలోకానికి వెళ్ళినవాడు కాగా; తద్+క్షేత్రంబునన్= అతని భార్యకు; ధర్మమయుండు+అయిన= ధర్మస్వరూపుడు అయిన; కృష్ణద్వైపాయన, మునివలనన్= వ్యాసమునివల్ల; ఉద్భవిల్లి= పుట్టి; ధర్మ, ప్రవృత్తుండను+ఐ= ధర్మమార్గంలో నడుస్తున్నవాడ నై; ఉన్న నాకున్= జీవించునాకు; ఇట్టి;

దుర్+వ్యసనంబు= ఇటువంటి చెడ్డఅవస్థ; కర్మ, వశంబున్= పూర్వజన్మంలో చేసిన పనులను అనుసరించి; సంభవించెన్= కలిగెను; ఇంకన్= ఇటుపై; ముని, వృత్తి, అ= మునిజీవనమే; ఉచితంబు= తగినది; కావునన్= కాబట్టి; సర్వ, సంగములు= అన్నిబంధాలు; విడిచి; సర్వ, భూతంబుల, అందున్= అన్ని ప్రాణులలో; సమ, చిత్తుండను+ఐ= సమానమైన మనస్సు కలవాడనై; హింస= హింసనుగూర్చి; తలంపక= ఆలోచింపక; నిత్యంబున్= ప్రతిరోజు; ఒక్కొక్క, వనస్పతి, అందున్= ఒక్కొక్క చెట్టునందు; ఒక్కొక్క, వన్య, ఫలంబు= ఒక్కొక్క, అడవిసంబంధ మైన పండును; భిక్ష, కొని= బిచ్చముగా గ్రహించి; అసంభవంబు+అయిననాఁడు= దొరకని రోజు; ఉపవాసంబు, చేసి= తిండిలేక ఉపవాసం గావించి; వృక్ష మూలంబునన్, ఉండి= చెట్టుమొదటఉండి; పాంసు పరిచ్ఛన్న దేహుండను+అయి= దుమ్ముతో కప్పబడిన దేహం కలవాడనై.

**తాత్పర్యం:** నా తండ్రి కామపరవశుడై చిన్ననాడు చనిపోగా, ఆయన భార్యకు ధర్మస్వరూపుడైన కృష్ణద్వైపాయనుని వలన పుట్టి, ధర్మమార్గంలో నడుస్తున్న నాకు ఈ దురవస్థ పూర్వజన్మకర్మను అనుసరించి కలిగింది. ఇక నాకు తగింది ముని వృత్తే. అందువలన బంధాల నన్నింటిని విడిచిపెట్టి, అన్నిప్రాణులందు సమబుద్ధి కలిగి, హింసమాని, ప్రతిరోజూ ఒక్కొక్కచెట్టునుండి ఒక్కోపండు భిక్షగా తీసికొని, అదీ దొరకనిరోజు ఉపవాసం ఉంటూ, చెట్టుమొదట్లో నివసిస్తూ, దుమ్ముతో నిండిన శరీరాన్ని కలవాడ నై.

**విశేషం:** పాండురాజు మునివృత్తిని స్వీకరించా లని సంకల్పించాడు. మునినిగురించి భగవద్గీతలో ఇట్లా చెప్పబడింది. "దుఃఖే ష్వనుద్విగ్నమనాః, సుఖేషు విగతస్పృహః । వీతరాగభయక్రోధః, స్థితధీ ర్ముని రుచ్యతే॥" (భ.గీ.2.56) దుఃఖాలు కలిగినప్పుడు కలతచెందని మనస్సు కలవాడు, సుఖాలపై కోరికలేనివాడు, అనురాగభయక్రోధాలను వదలినవాడు అయిన స్థితప్రజ్ఞుడు ముని. అట్టి మునిచిత్తవృత్తినీ, జీవనవిధానాన్నీ స్వీకరించా లని బ్రతుకుమీది నిరాశతో పాండురాజు సంకల్పించాడు.

**సీ.** **ఇంద్రియార్థంబులం దింద్రియవ్యాపార । ముడిగించి; క్రియ లెల్ల విడిచి, పుణ్య**
**పాపబంధంబుల నోపి బంధింపంగఁ । బడక మనోవృత్తి నొడిచి, నాకు**
**నిది ప్రియం బప్రియం బిది నింద యిది మహా । స్తుతి యిది యనక, సంతత నితాంత**
**సంతోషయుతుఁడనై వంతయు భయమును । శీతాతపంబులు వాతగతియు**

**ఆ.** **నెఱుఁగ కివ్విధమున మఱచి, శరీరంబు । మరణజీవితముల కురువిషాద**
**తోషవృత్తు లుడిగి, భీషణాటవి నుండి । చేసెదను దపంబు భాసురముగ.** **60**

**ప్రతిపదార్థం:** ఇంద్రియ+అర్థంబుల, అందున్= ఇంద్రియవిషయా లైన శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలలో; ఇంద్రియ, వ్యాపారము= ఇంద్రియాలు పనిచేయటాన్ని; ఉడిగించి= మాన్పించి; క్రియలు+ఎల్లన్= పనులు అన్నీ; విడిచి= వదలిపెట్టి; పుణ్య, పాప, బంధంబులన్= పాపపుణ్యాలబంధాలను; ఓపి= సహించి; బంధింపఁగన్, పడక= కట్టుపడకుండా; మనో, వృత్తిన్= మనోవ్యాపారాన్ని; ఒడిచి= జయించి అనగా ఓడించి; నాకున్; ఇది, ప్రియంబు= ఇది ఇష్టం; ఇది, అప్రియంబు= ఇది ఇష్టం కాదు; ఇది, నింద= ఇది దూషణ; ఇది మహా, స్తుతి= ఇది గొప్పపొగడ్త; అనక= అని తలపక; సంతత, నితాంత, సంతోష, యుతుఁడను+ఐ= ఎడతెగని అధికమైన సంతోషంతో కూడుకొన్నవాడ నై; వంతయున్= దుఃఖాన్ని; భయమును= భయాన్ని; శీత+ఆతపంబులు= చలిని ఎండను; వాత, గతియున్= గాలికదలికను; ఎఱుఁగక= తెలియక; ఈ+విధమునన్= ఇట్లు; శరీరంబున్; మఱచి; మరణ జీవితములకు= చావు బ్రతుకులకు; ఉరు, విషాద, తోష, వృత్తులు= గొప్ప దుఃఖం, సంతోషం అనే మనోవృత్తులను; ఉడిగి= విడిచి; భీషణ+అటవిన్= భయంకరమైన అడవిలో; ఉండి; తపంబున్= తపస్సును; భాసురముగన్= ప్రకాశించేటట్లు; చేసెదను.

**తాత్పర్యం:** నేను ఇంద్రియాలను బంధించి; అన్నికర్మలను వదలి, పాపపుణ్యాలను విడిచి, మనస్సును ఓడించి, ఇది ఇష్టం, ఇది అనిష్టం, ఇది నింద, ఇది స్తుతి అనే భావం లేకుండా, ఎడతెగని మహానందంతో - దుఃఖం, భయం, చలి, ఎండ, గాలి అంటే ఏమిటో తెలియక, శరీరాన్ని మరచిపోయి, చావుకు దుఃఖాన్నీ, బ్రతుకునకు సంతోషాన్నీ లేనివాడ నై, భయంకర మైన అరణ్యంలో పెద్దతపస్సు చేస్తాను.

**విశేషం:** మునివృత్తికి ఫలం స్థితప్రజ్ఞత్వం. భగవద్గీతలో చెప్పబడిన స్థితప్రజ్ఞ లక్షణాలు పాండురాజు సంకల్పంలో ప్రతిఫలిస్తున్నాయి. "యదా సంహరతే చాయం, కూర్మోంఽగానీవ సర్వశః । ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ య స్సర్వత్రా నభిస్నేహః, తత్తత్ప్రాప్యశుభాశుభం । నాభినందతి న ద్వేష్టి, తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥" మొదలైన శ్లోకాల తాత్పర్యం (భ.గీ. అధ్యా.2. శ్లో.58-57) స్మరింపతగినది. తపింపచేయటం తపస్సు. తపస్వి క్రమంగా ఇంద్రియాలను, క్రియలను, మనస్సును, రాగద్వేషాలను, ద్వంద్వాలను, సుఖదుఃఖాలను తపింపచేసి బ్రహ్మానందసిద్ధిని పొంది, ఆపై బ్రహ్మపదవిని పొందుతాడు. పాండురాజు ఆ మార్గాన్ని ఆశ్రయించా లని సంకల్పించాడు.

**వ. అని నిశ్చయించి, గొంతిని మాద్రినిం జూచి; 'మీర లిందుండి నవయక హస్తిపురంబునకుం జని నాతపోవృత్తి నునికి రాజునకు సత్యవతీదేవికి భీష్మునకు విదురనకుం గౌసల్యలకు వృద్ధపురోహిత బ్రాహ్మణులకుం జెప్పి యం దుండుం' డనిన, వారలు బాష్పపూరితనయన లయి 'యిట్టి యుగ్రతపంబు విడిచి, మమ్ము విడువనియట్టి యాశ్రమంబున నుండి తపంబు సేయు నది; యేము నిన్ను విడిచి పోవనోపము; మమ్ము విడిచితేని యిప్పడ ప్రాణంబులు విడుతు' మనిన వారల నిశ్చయం బెఱింగి 'యట్లేని నాయొద్దన యుండుం; దేను వానప్రస్థాశ్రమంబున వల్కలంబులు గట్టి, రేపును మాపును మధ్యాహ్నంబునప్పడును స్నానంబు సేసి వేల్చుచుం గందమూలఫలాశనుండనై, పితృదేవతల వాక్సలిలవన్యఫలంబులం దనుపుచుఁ, గ్రమంబున దేహమోక్షణంబు సేయుదు' నని యప్పడు. 61**

**విశేషం:** అని= ఆ ప్రకారంగా; నిశ్చయించి; గొంతిని= కుంతిని; మాద్రినిన్= మాద్రిని; చూచి; మీరలు; ఇందున్+ఉండి= ఇచ్చట వసించి; నవయక= కృశించిపోక; హస్తి, పురంబునకున్= హస్తినాపురికి; చని= వెళ్ళి; నా, తపస్+వృత్తి, ఉనికి= నేను తపోవృత్తిస్వీకరించే విషయాన్ని; రాజునకున్= ధృతరాష్ట్రునకు; సత్యవతీదేవికి= సత్యవతీదేవికి; భీష్మునకున్= భీష్మునికి; విదురునకున్; కౌసల్యలకు= అంబిక, అంబాలికలకు; వృద్ధ= వృద్ధులకు; పురోహిత= పురోహితులకు; బ్రాహ్మణులకున్= విప్రులకు; చెప్పి= తెలిపి; అందు+ ఉండుండు= అక్కడనే ఉండండి; అనినన్= అని చెప్పగా; వారలు= వారు (కుంతి, మాద్రి); బాష్ప, పూరిత, నయనలు+అయి= కన్నీటితో నిండిన కళ్ళు కలవారై; ఇట్టి, ఉగ్ర, తపంబు= ఇటువంటి భయంకరమైన తపస్సు; విడిచి= వీడి; మమ్మున్, విడువని, అట్టి, ఆశ్రమంబునన్+ఉండి= మమ్మల్ని విడిచిపెట్టనటువంటి ఆశ్రమంలో ఉండి; తపంబు, చేయునది= తపస్సు చేయండి; ఏము= మేము; నిన్నున్; విడిచి; పోవన్, ఓపము= పోలేము; మమ్ము; విడిచితి+ఏని= వదలివేసితివా; ఇప్పుడు+అ= ఈ క్షణమే; ప్రాణంబులన్, విడుతుము; అనినన్= అనగా; వారల= వారి యొక్క; నిశ్చయంబు= నిర్ణయము; ఎఱింగి= తెలిసికొని; అట్లు+ఏని= అట్లా అయితే; నా. ఒద్దన= నాదగ్గరే; ఉండుండు= ఉండండి; ఏను= నేను; వానప్రస్థ+ఆశ్రమంబునన్= వనములో వసించు ఆశ్రమధర్మముచేత; వల్కలంబులు= నారచీరలు; కట్టి; రేపును= ఉదయం; మాపును= సాయంకాలం; మధ్య+అహ్నంబు, అప్పుడును= మధ్యాహ్న సమయమునకూడ; స్నానంబు, చేసి= స్నానముగావించి; వేల్చుచున్= హోమం చేస్తూ; కంద, మూల; ఫల+అశనుండను+ఐ= గడ్డలు, వేళ్ళు, పళ్ళు ఆహారంగా కలవాడనై; పితృదేవతలన్= పితృదేవతలను; వాక్, సలిల, వన్య, ఫలంబులన్= మాటలతో, నీళ్ళతో, అడవిలో ఉండే పళ్ళతో; తనుపుచున్= తృప్తిపెట్టుతూ; క్రమంబున; దేహ, మోక్షణంబు= శరీరాన్ని విడువటం; చేయుదును= చేస్తాను; అని= అని చెప్పి; అప్పుడు.

**తాత్పర్యం:** అని నిశ్చయించి పాండురాజు కుంతిని, మాద్రిని చూచి 'మీరు ఇక్కడే ఉండి కృశించి పోక హస్తినాపురం వెళ్ళి, నేను తపోవృత్తిలో ఉండటాన్ని ధృతరాష్ట్రునికి, సత్యవతికి, భీష్మునికి, విదురునికి, తల్లులకు, వృద్ధులకు, పురోహితులకు, బ్రాహ్మణులకు చెప్పి అక్కడ ఉండండి' అని చెప్పగా వారు కంటతడిపెట్టి - 'ఈ విధమైన భయంకరతపస్సు మాని మాతోకూడ ఆశ్రమంలో ఉండి తపస్సు చేయండి. మేము మిమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళలేం. మీరు మమ్మల్ని వదలితే ఇప్పుడే ప్రాణాలు విడుస్తాం' అనగా, వారినిర్ణయం తెలిసికొని, 'అట్లా అయితే మీరు నా దగ్గరే ఉండండి. నేను వానప్రస్థాశ్రమంలో నారచీరలు కట్టి ఉదయం, సాయంకాలం, మధ్యాహ్నం స్నానం చేసి హోమం చేస్తూ కందమూలాలు, ఫలాలు ఆహారంగా తీసికొని, పితృదేవతలను మాటలతో, నీళ్ళతో, ఫలాలతో తృప్తిపరుస్తూ క్రమంగా శరీరాన్ని విడుస్తాను' అని అప్పుడు.

**విశేషం:** ఆశ్రమాలు నాలుగు. అవి - బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం. గృహస్థాశ్రమాన్ని వదలి వనంలోనే నివసిస్తూ తపస్వియై నియమజీవితాన్ని సాగించే ఆశ్రమం (జీవనవిధానం) వానప్రస్థం. వానప్రస్థంలో భార్యలతో కలిసి జీవించవచ్చును. సన్న్యాసంలో ఆ అవకాశం లేదు. అందువలననే చాలామంది రాజులు వానప్రస్థాశ్రమంలోనే తనువులు చాలిస్తారు.

**పృథ్వి.**

> **అమూల్య మణి భూషణంబులు గజాశ్వ బృందంబులున్**
> **సమృద్ధ ధన ధాన్యరాసులుఁ బ్రశస్తగోవర్గముం**
> **గ్రమంబునను భూసురేశుల కగణ్యపుణ్యార్థి యై**
> **యమర్త్యనిభుఁ డిచ్చెఁ బాండువిభుఁ డత్యుదారస్థితిన్.** **62**

**ప్రతిపదార్థం:** అమూల్య, మణి, భూషణంబులు= వెలలేని (అనగా ఎంతో విలువైన) రత్నాల సొమ్ములు; గజ+అశ్వ, బృందంబులున్= ఏనుగుల, గుర్రాల, సమూహాలు; సమృద్ధ, ధన, ధాన్య, రాసులున్= అధికమైన ధనరాసులు, ధాన్యరాసులు; ప్రశస్త, గోవర్గమున్= శ్రేష్ఠమైన ఆవులసమూహాన్ని; అమర్త్య, నిభుఁడు= దేవతలతో సమానుడైనవాడు; పాండు, విభుఁడు= పాండురాజు; అగణ్య, పుణ్య+అర్థి+ఐ= లెక్కకు మించిన పుణ్యాన్ని కోరినవాడై; అతి+ఉదార, స్థితిన్= మిక్కిలి ఎక్కువగా ఉదారమైన స్థితిచే; భూసుర+ఈశులకు= బ్రాహ్మణశ్రేష్ఠులకు; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** దేవతలతో సమానుడైన పాండురాజు, అపరిమిత మైన పుణ్యాన్ని కోరి, మిక్కిలి ఉదారంగా బ్రాహ్మణ శ్రేష్ఠులకు ఎంతో విలువైన రత్నాల సొమ్ములను, ఏనుగులను, గుఱ్ఱాలను, ధనరాసులను, ధాన్యరాసులను, శ్రేష్ఠమైన ఆవులను ఇచ్చాడు.

**విశేషం:** పృథ్వీ వృత్తపాదంలో 17 అక్షరా లుంటాయి. జ, స, జ, స య, లగ - అనే గణాలు వరుసగా ప్రతిపాదంలోనూ క్రమంగా వస్తాయి. 12వ అక్షరం యతిస్థానం. ప్రాస నియతి ఉన్నది. ఆంధ్రభారతంలో ఈ వృత్తాన్ని నన్నయమాత్రమే 5 సార్లు ప్రయోగించాడు. "సాక్షేప క్రోధ ధిక్కారే పరం పృథ్వీ భరక్షమా" అనే క్షేమేంద్రుని మతానికి చెందినవాడు నన్నయ. సంపదలపై తీవ్రమైన వ్యతిరేకభావంతో విరివిగా విప్రులకు దానం చేయటం ఈ వృత్తంలో వర్ణితం. (సంపా.)

**వ. మఱియుం గల వస్తువు లెల్లను ధృతరాష్ట్రున కిచ్చి పుచ్చి, మమత్వాహంకారవిముక్తుండై, ధర్మపత్ను లయ్యిరువురుఁ దనయట్ల తపస్వినులై తోడరా నుత్తరాభిముఖుండై యరిగి, నాగశైలంబును జైత్రరథంబును బారిషేణంబును హిమవంతంబునుం గడచి, సురసిద్ధసేవితం బయిన గంధమాదనంబునం గొండొక కాలం బుండి, యింద్రద్యుమ్నం బను కొలనును హంసకూటంబును నతిక్రమించి. 63**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; కల, వస్తువులు+ఎల్లను= ఉన్నవస్తువులన్నీ; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రునికి; ఇచ్చి, పుచ్చి= ఇచ్చి పంపి; మమత్వ+అహంకార, విముక్తుండు+ఐ= మమకారంచేత, అహంకారంచేత విడువబడినవాడై; ధర్మ పత్నులు= ధర్మనిర్వహణకోసం అగ్నిసాక్షిగా పెళ్ళిచేసుకొన్న భార్యలు; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరు; తన, అట్లు+అ= తనవలె; తపస్వినులు+ఐ= తపస్సు చేసేవారై; తోడరాన్= వెంటరాగా; ఉత్తర+అభిముఖుండు+ఐ= ఉత్తరదిశవైపు ముఖం కలవాడై; అరిగి= వెళ్ళి; నాగశైలంబును; చైత్రరథంబును; పారిషేణంబును; హిమవంతంబునున్- ఆయా పేర్లుగల ప్రదేశాలను; కడచి= దాటి; సుర, సిద్ధ, సేవితంబు+అయిన= దేవతలచేత, సిద్ధులచేత సేవింపబడినదైన; గంధమాదనంబునన్= గంధమాదన పర్వతంమీద; కొండు+ఒక, కాలంబు= కొంతకాలం; ఉండి= వసించి; ఇంద్రద్యుమ్నంబు+అను= ఇంద్రద్యుమ్నము అను పేరుగల; కొలనును= సరస్సును; హంసకూటంబును= హంసకూటము అనుదానిని, అతిక్రమించి= దాటి.

**తాత్పర్యం:** ఇంకా ఉన్నవస్తువు లన్నీ ధృతరాష్ట్రునికి ఇచ్చి పంపి, మమకారాన్ని, అహంకారాన్ని విడిచి, తన ధర్మపత్నులు కుంతీమాద్రులు తనవలె తాపసవృత్తిని స్వీకరించి వెంటరాగా, ఉత్తరదిశవైపు పయనించి, నాగశైలాన్ని, చైత్రరథాన్ని, పారిషేణాన్ని, హిమవంతాన్ని దాటి, దేవతలు, సిద్ధులు సేవించే గంధమాదనంమీద కొంతకాలం ఉండి, ఇంద్రద్యుమ్నం అనే కొలనును, హంసకూటాన్ని దాటి వెళ్లి.

### పాండురాజు శతశృంగంబునఁ దపోవృత్తి నుండుట (సం. 1-111-1)

**మ. యతిసంఘంబుల సంగతిన్ దురితకర్మాపేతుఁడై యేఁగి సం**
**తతసిద్ధామరయక్ష సేవితసముద్యచ్ఛృంగ మై యున్న యా**
**శతశృంగం బను పర్వతంబున శుభాచారుండు నిత్యవ్రతో**
**ద్యతుఁ డై ఘోరతపంబు సేసె మునిబృందం బద్భుతం బందఁగన్. 64**

**ప్రతిపదార్థం:** యతి, సంఘంబుల, సంగతిన్= మునుల సమూహాల సహవాసంతో; దురిత, కర్మ+అపేతుఁడు+ఐ= పాపకర్మలనుండి తొలగినవాడై; ఏఁగి= వెళ్ళి; సంతత, సిద్ధ+అమర, యక్ష, సేవిత, సముద్యత్+శృంగము+ఐ= ఎల్లప్పుడు సిద్ధులచేత, దేవతలచేత, యక్షులచేత సేవించబడిన మిక్కిలి ఎత్తైన శిఖరాలు కలదై; ఉన్న; ఆ శత, శృంగంబు= ప్రసిద్ధమైన శతశృంగము; అను, పర్వతంబున= అను పేరుగల కొండయందు; శుభ+ఆచారుండు= శుభమైన నడవడి కలవాడు; నిత్య, వ్రత+ఉద్యతుఁడు+ఐ= ఎడతెగని వ్రతాలమీద పూనిక కలవాడై; ముని, బృందంబు= మునులసమూహం; అద్భుతంబు+ అందఁగన్= ఆశ్చర్యపడేటట్లు; ఘోర, తపంబు; = భయంకరమైన తపస్సు; చేసెన్.

**తాత్పర్యం:** పాండురాజు మునులతో కలిసి పాపకర్మలకు దూరమై, ఎప్పుడూ సిద్ధులు, దేవతలు, యక్షులు సేవించే ఎత్తైన శిఖరాలు కల శతశృంగ మనే పర్వతంమీద (శుభమైన) మంగళకరమైన నడవడితో, ఎడతెగని వ్రతాలతో, మునులంతా ఆశ్చర్యపడేటట్లు ఘోరమైనతపస్సు చేస్తూ ఉన్నాడు.

**వ. ఇట్లు శతశృంగంబున నుత్తరభాగంబునందుఁ దపంబు సేయుచు బ్రహ్మఋషి సమానుండై, దివ్యవిమానంబు లెక్కివచ్చుచుం బోవుచున్న దేవగణంబులచేత సంకీర్ణం బైన స్వర్గమార్గంబున నుత్తరాభిముఖు లై యూర్ధ్వలోకంబున కనాయాసంబున నరిగెడు మునిసహస్రంబుం జూచి, 'మీర లెందులకుఁ బోయెద'రని యడిగిన నప్పాండురాజునకు వార లి ట్లనిరి. 65**

**ప్రతిపదార్థం:** ఇట్లు; శతశృంగంబునన్= శతశృంగపర్వతమున; ఉత్తరభాగంబునందున్= ఉత్తరంవైపు; తపంబు; చేయుచున్; బ్రహ్మ, ఋషి, సమానుండు+ఐ= బ్రహ్మర్షులతో సమానమైనవాడై; దివ్య, విమానంబులు= దేవతలు ఎక్కి తిరుగు రథములు; ఎక్కి= ఎక్కి; వచ్చుచున్, పోవుచు+ఉన్న= వస్తూపోతూ ఉన్నట్టి; దేవ, గణంబులచేత= దేవతలసమూహంతో; సంకీర్ణంబు+ఐన= నిండిన; స్వర్గ, మార్గంబునన్= దివి యొక్కదారిలో; ఉత్తర+అభిముఖులు+ఐ= ఉత్తరదిశవైపు ముఖాలు కలవారు అయి; ఊర్ధ్వ, లోకంబునకున్= స్వర్గానికి; అనాయాసంబునన్= శ్రమలేకుండ; అరిగెడు= వెళుతున్న; ముని సహస్రంబున్= వెయ్యిమంది మునులను; చూచి; మీరలు; ఎందులకున్; పోయెదరు; అని అడిగినన్= అని అడుగగా; ఆ+పాండురాజునకున్= ఆ పాండురాజుతో; వారలు= వారు; ఇట్లు, అనిరి.

**తాత్పర్యం:** ఈ విధంగా శతశృంగపర్వతానికి ఉత్తరభాగంలో తపస్సు చేస్తూ బ్రహ్మర్షులతో సమానమైనవాడై, దివ్య విమానా లెక్కి వస్తూ పోతూ ఉండే దేవతాసమూహాలతో నిండిన స్వర్గమార్గంలో, ఉత్తరదిక్కుగా స్వర్గలోకానికి శ్రమ లేకుండా వెళ్ళుతున్న వెయ్యిమందిమునులను చూచి, 'మీరు ఎక్కడికి పోతున్నా'? రని అడుగగా, ఆ పాండురాజుతో వారు ఇట్లా అన్నారు.

**క. అమవస గావున నేఁ డ క్కమలజుఁ గొలువఁగ మహర్షిగణములు పితృసం**
**ఘములును బోదురు బ్రహ్మాం । డమునం గలవార లం దొడంగూడంగన్. 66**

**విశేషం:** నేఁడు= ఈ రోజు; అమవస= అమావాస్య; కావున= కాబట్టి; ఆ+కమలజున్= పద్మంనుండి పుట్టిన ఆ బ్రహ్మదేవుడిని; కొలువఁగన్= సేవించటానికి; మహర్షి, గణములు= మహర్షుల సమూహాలు; పితృ, సంఘములును= పితృదేవతల సమూహాలు; బ్రహ్మాండమునన్= విశ్వంలో; కల, వారలు= ఉండేవారు; అందు=ఆ బ్రహ్మలోకంలో; ఒడన్+కూడంగన్= చేరటానికి; పోదురు= పోతూఉన్నారు.

**తాత్పర్యం:** ఈ రోజు అమావాస్య. అందువలన బ్రహ్మదేవుడిని సేవించడానికి మహర్షులసమూహాలు, పితృదేవతల సమూహాలు, బ్రహ్మాండంలో ఉన్నవాళ్ళంతా ఆ బ్రహ్మలోకం చేరటానికి పోతారు.

**విశేషం:** అమావాస్య పితృదినంగా ప్రసిద్ధం.

**వ. 'అది కారణంబుగా నేమును బ్రహ్మలోకంబునకుం బోయెద' మనిన నమ్మునుల పిఱుంద భార్యాద్వయసహితుండై సమవిషమప్రదేశంబులం జనుచున్న య ప్పాండురాజుం జూచి ఋషు లి ట్లనిరి. 67**

**విశేషం:** అది, కారణంబుగాన్= ఆ కారణంగా; ఏమును= మేముకూడా; బ్రహ్మ, లోకంబునకున్; పోయెదము; అనన్=అనగా; ఆ+మునుల; పిఱుంద= వెనుక; భార్యా, ద్వయ, సహితుండు+ఐ= భార్యల జంటతో కూడినవాడు అయి; సమ, విషమ, ప్రదేశములన్= సమంగా, మిట్టపల్లాలుగా ఉన్న భూములలో; చనుచు+ఉన్న= వెళ్ళుతున్న; ఆ+పాండురాజున్; చూచి; ఋషులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** 'ఆ కారణంగా మేము బ్రహ్మలోకానికి పోతున్నాం' అని అనగా, ఆ మునుల వెనుక భార్య లిద్దరితో సమంగానూ, మిట్టపల్లాలుగానూ ఉన్న భూమిమీద పోతున్న ఆ పాండురాజును చూచి ఋషులు ఇట్లా అన్నారు.

**క. వీర లతిలలిత మృదులా । కారలు, గిరివిషమగహనగహ్వరముల రా**
**నేరరు గావున నిట చను । దేరక మీ రుండుఁ డివియు దేవపథంబుల్. 68**

**ప్రతిపదార్థం:** వీరలు= ఈ కుంతీమాద్రులు; అతి, లలిత, మృదుల+ఆకారలు= మిక్కిలి మనోహరం, సుకుమారం అయిన ఆకారాలు కలవారు; గిరి, విషమ, గహన, గహ్వరములన్= కొండలలో మిట్టపల్లాలై చొరశక్యం కాని గుహలలో; రానేరరు= రాలేరు; కావునన్; ఇట= ఇచ్చటనుండి; చనుదేరక= రాకుండ; మీరు; ఉండుఁడు; ఇవియు= విశేషించి ఇవి; దేవ, పథంబుల్= దేవలోకానికి వెళ్ళే దారులు.

**తాత్పర్యం:** నీ భార్యలు మిక్కిలి సుకుమారమైన శరీరాలు కలవాళ్ళు. వీళ్ళు కొండలలో మిట్టపల్లాలై చొర శక్యం కాని గుహలలో రాలేరు. మీరు ఆగండి. విశేషించి ఇవి దేవమార్గాలు.

**విశేషం:** నీ భార్యలు సుకుమారశరీరాలు కలవారు; మిట్టపల్లాలతో చొరశక్యంకాని ఈ కొండగుహలలో రాలేరు- అనటం సమంజసమే. కాని, తాము వెళ్తూ మీరు ఆగండి; ఇవి దేవమార్గాలు అనడంలో - ఈ మార్గంలో వచ్చే యోగ్యత మీకు లేదనే అంశాన్ని సూక్ష్మాతిసూక్ష్మంగా పాండురాజుమనస్సు నొవ్వకుండా మునులు ధ్వనింపచేశారు. పాండురాజుకు తప స్సున్నది. సంతానం లేదు. సంతానహీనులకు దేవమార్గంలో ప్రవేశించడానికి అర్హత లేదు. ఈ విషయాన్ని పాండురాజు గ్రహించాడు.

**క. అనిన విని నరుల కక్కడఁ జనఁబోలమి యెఱిఁగి పాండుజనపాలకుఁ డి**
**ట్లనియెను 'స్వర్గద్వారం । బనపత్యులు గాన నోపరటె ముని లయ్యున్.' 69**

**ప్రతిపదార్థం:** అనిన, విని= అని మునులు చెప్పగా విని; నరులకు; అక్కడన్; చనన్+పోలమి= వెళ్ళటం సాధ్యం కాకుండటాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; పాండు, జనపాలకుఁడు= పాండురాజు; ఇట్లు+అనియెను; అనపత్యులు= సంతానం లేనివారు; మునుల్+అయ్యున్= ఋషులైనప్పటికి; స్వర్గ, ద్వారంబు= స్వర్గముయొక్క వాకిలి; కానన్= చూచుటకు; ఓపరు+అటె= చూడలేరట కదా.

**తాత్పర్యం:** ఋషు లన్న మాటలు విని, మానవు లక్కడికి పోలే రని తెలిసికొని పాండురాజు - 'సంతానం లేనివాళ్ళు ముని లైనప్పటికీ స్వర్గద్వారాన్ని చూడలేరటకదా' అన్నాడు.

**విశేషం:** 68వ పద్యంలో వ్యంగ్యంగా చెప్పబడిన అంశం ఈ పద్యంలో వాచ్యం కావటంచేత అత్యంతతిరస్కృతవాచ్యధ్వని ఇక్కడ గుణీభూత మయింది. (సంపా.)

**వ. 'అపుత్త్రస్య గతి ర్నాస్తి' యను వేదవచనంబుం గలదు గావున నే నపుత్త్రకుండ నేమి సేయుదు? ననిన మునులును గరుణించి యోగదృష్టి ననాగతం బెఱింగి. 'నీ వపుత్త్రకుండవు గావు; దైవాధిష్ఠితం బైన సంతానంబు నీకు ధర్మానిలశక్రాశ్వినులవరంబున నగు; నక్షయలోకంబులుం బడయుదువు గావున సంతానార్థంబు యత్నంబుఁ సేయు' మనిన విని పాండురా జాత్మగతంబునఁ 'బురుషుండు పుట్టుచుండి దేవఋషి పితృమనుష్యులఋణంబులు నాలుగింటితోడం బుట్టి యథాకాలవిధుల వానివలన విముక్తుండు గావలయు; నట్లుగాని వానికిఁ బుణ్యలోకంబులు**

**లేవు; యజ్ఞంబులంజేసి దేవతలఋణంబును, దపస్స్వాధ్యాయ బ్రహ్మచర్యవ్రతంబులంజేసి ఋషుల ఋణంబును, శ్రాద్ధపుత్త్రలాభంబులం జేసి పితరుల ఋణంబును, నానృశంస్యంబునం జేసి మనుష్యుల ఋణంబునుం బాపవలయు; నందుఁ బితరుల ఋణంబు దక్కఁ దక్కిన మూఁడుఋణంబులవలన విముక్తుండ నయితి. 70**

**విశేషం:** అపుత్త్రస్య= బిడ్డలులేనివానికి; గతిః= పుణ్యలోకం; నాస్తి= లేదు; అను; వేద, వచనంబున్= వేదవాక్యంకూడ; కలదు, కావున; నేనున్= నేను; అపుత్త్రకుండను= సంతానంలేనివాడిని; ఏమి చేయుదును; అనిన= అనగా; మునులును; కరుణించి= దయదలచి; యోగ, దృష్టిన్; అనాగతంబు= రాబోవుదానిని; ఎఱింగి= గ్రహించి; నీవు; అపుత్త్రకుండవు= పుత్రులు లేనివాడివి; కావు; దైవ+అధిష్ఠితంబు+ఐన= దేవతలచేత ప్రభావితం చేయబడిన; సంతానంబు; నీకున్; ధర్మ+అనిల, శక్ర+అశ్వినుల, వరంబునన్= యమునియొక్క, వాయువుయొక్క, ఇంద్రునియొక్క, అశ్వినీదేవతలయొక్క వరంచేత; అగున్= కలుగుతుంది; అక్షయ, లోకంబులున్= నాశం లేనిలోకాలు - అనగా పుణ్యలోకాలు; పడయుదువు= పొందుతావు; కావునన్, సంతాన+అర్థంబు= సంతానంకొరకు; యత్నంబు; చేయుము; అనినన్= అనగా; విని; పాండురాజు; ఆత్మగతంబునన్= మనస్సులో; పురుషుండు; పుట్టుచుండి; దేవ, ఋషి, పితృ, మనుష్యుల, ఋణంబులు; నాలుగింటితోడన్; పుట్టి; యథాకాల, విధులున్= ఆ యా కాలాల్లో చేసే కార్యాలచేత; వానివలన= ఈ ఋణాలవలన; విముక్తుండు= విడువబడినవాడు; కావలయున్= అగును; అట్లు, కానివానికిన్= ఆ విధంగా కాని అతనికి; పుణ్యలోకంబులు; లేవు= ఉండవు; యజ్ఞంబులన్, చేసి, దేవతల, ఋణంబును; తపస్+స్వాధ్యాయ, బ్రహ్మచర్య, వ్రతంబులన్, చేసి= తపస్సుచేత, వేదాధ్యయనంచేత, బ్రహ్మచర్యవ్రతంచేత; ఋషుల, ఋణంబును; శ్రాద్ధ, పుత్త్రలాభంబులన్, చేసి= శ్రాద్ధాలచేత, కొడుకులను పొందటంచేత; పితరుల ఋణంబునున్; ఆనృశంస్యంబు+చేసి= అక్రూరమైన భావంచేత - అనగా దయకలిగి ఉండటంచేత; మనుష్యుల ఋణంబునున్; పాపవలయున్= పోగొట్టవలెను; అందున్= అందులో; పితరుల, ఋణంబు; తక్కన్= తప్ప; తక్కిన, మూడు, ఋణంబులవలనన్; విముక్తుండను+అయితిన్= విడువబడినవాడను అయ్యాను.

**తాత్పర్యం:** 'పుత్రులు లేనివారికి పుణ్యలోకం లేదు' అనే వేదవచనంకూడా ఉన్నది. నేను పుత్రులు లేనివాడిని. ఏమి చేసేది?' - అని పాండురాజు అనగా, మునులు, దయతలచి, యోగదృష్టితో ముందు జరిగేదాన్ని తెలిసికొని 'నీవు పుత్రులు లేనివాడివి కావు. యమధర్మరాజు, వాయువు, ఇంద్రుడు, అశ్వినీదేవతల వరంతో నీకు సంతానం కలుగుతుంది. నీవు పుణ్యలోకాలు పొందుతావు. కాబట్టి సంతానంకొరకు ప్రయత్నించుము' అని చెప్పారు. అది విని పాండురాజు మనస్సులో ఇట్లా తలచాడు. 'పురుషుడు దేవ, ఋషి, పితృ, మనుష్య ఋణాలు నాలుగింటితో పుట్టి, ఆయాకాలాలలో చేయవలసిన కార్యాలచేత ఈ ఋణవిముక్తుడు కావాలి. అట్లా ఋణవిముక్తుడు కానివాడికి పుణ్యలోకాలు లేవు. యజ్ఞాలు చేసి దేవతల ఋణాన్నీ, తపస్సు, వేదాధ్యయనం, బ్రహ్మచర్యవ్రతంచేత ఋషుల ఋణాన్నీ, శ్రాద్ధాలు పెట్టి, కొడుకుల్ని కని పితృదేవతల ఋణాన్నీ, దయార్ద్రహృదయుడై మానవఋణాన్ని తీర్చుకోవాలి. నేను ఒక్క పితరులఋణం తప్ప-మిగతా మూడూ తీర్చుకొన్నాను.

**విశేషం:** పంచమవేదమైన మహాభారత ఆంధ్రీకరణంలో నన్నయ సందర్భోచితంగా వేదధర్మాలను వివరించడమే కాక వేదవాక్యాలను కూడా చెప్పాడు. 'అపుత్త్రస్య గతి ర్నాస్తి' అనే వాక్యం అటువంటిదే. 'ఋణం' శబ్దంలో ఋ వర్ణానికి బదులు రు, రి వర్ణాలు - ఋషి - రుషి - రిషి, ఋణము - రుణము - అని తాళపత్రప్రతులలో ఉండటం గమనించదగింది.

**తే. దేహనాశంబుతోడన తీఱు నెల్ల। ఋణములును మఱి పితరులఋణము దేహ**
**నాశ మయినను దీఱదు నాకు నదియ। తక్కియున్నది యే నెట్లు దానిఁ బాతు. 71**

**ప్రతిపదార్థం:** దేహ, నాశనంబుతోడన= శరీరం నశించిన వెంటనే; ఎల్ల, ఋణములను= అప్పులన్నీ, తీఱున్= తీరిపోతాయి; మఱి= ఇక; పితరుల, ఋణము= పితృ ఋణం; దేహ, నాశము+అయినను, తీరదు= శరీరము నాశనం అయినప్పటికి తీరిపోదు; నాకున్; అదియు; ఆ పితరుల ఋణమే; తక్కి, ఉన్నది= మిగిలి ఉన్నది; ఏను= నేను; దానిన్= దానిని; ఎట్లు, పాతున్= ఏవిధంగా తొలగించుకుంటాను.

**తాత్పర్యం:** శరీరం నశించిన వెంటనే అన్నిఋణాలు తీరిపోతాయి. పితరుల ఋణముమాత్రం శరీరం నశించినా తీరదు. నాకు అది ఒక్కటే మిగిలిఉన్నది. నేను దానిని ఎట్లా తీర్చుకొనగలను?

**వ. అని దుఃఖించి మృగశాపంబు దలంచి, తనవలన సంతానం బయ్యెడి విధంబు లేమి యెఱింగి యొక్కనాఁ డేకాంతంబ గొంతి కి ట్లనియె. 72**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; దుఃఖించి; మృగ, శాపంబు; తలంచి; తనవలన= తనమూలకంగా; సంతానంబు;అయ్యెడి= కానున్న; విధంబు= తీరు; లేమి= లేకపోవటాన్ని; ఎఱింగి= తెలిసి; ఒక్కనాఁడు; ఏకాంతంబు+అ= ఒంటరిగా; గొంతికి= కుంతీదేవికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని విచారించి మృగశాపాన్ని తలచికొని, తనవలన సంతానం కలిగేమార్గం లేకపోవటాన్ని తెలిసికొని, ఒకరోజు ఒంటరిగా ఉన్న కుంతితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. దానములం దపంబుల సదక్షిణ యజ్ఞములన్ విహీన సం**
**తానుల కూర్ధ్వలోక సుపథంబు లవశ్యము గావు; లబ్ధ సం**
**తానుల యెందుఁ బుణ్యు; లిది తథ్యము గావున నొండు దక్కి సం**
**తానము నాకు నయ్యెడువిధం బొనరింపుము ధర్మసంస్థితిన్. 73**

**ప్రతిపదార్థం:** దానములన్; తపంబులన్; స, దక్షిణ, యజ్ఞములన్= దక్షిణలతో కూడిన యజ్ఞాలచేత; విహీన, సంతానులకు= సంతానం లేనివాళ్ళకి, ఊర్ధ్వ, లోక సుపథంబులు= పై లోకాలకు మంచిమార్గాలు; అవశ్యము= తప్పక; కావు= లభించవు; లబ్ధ, సంతానులు+అ= పొందబడిన సంతానం కలవాళ్ళే, ఎందున్= ఎచ్చటైనా; పుణ్యులు= పుణ్యంకలవాళ్ళు; ఇది; తథ్యం= నిజం; కావునన్; ఒండు= ఇతరకార్యాలు; తక్కి= మాని; నాకున్; సంతానము; ధర్మ, సంస్థితిన్= ధర్మమార్గంలో; అయ్యెడు, విధంబు= కాగల తీరు; ఒనరింపుము= చేయుము.

**తాత్పర్యం:** దానాలు చేసినా, దక్షిణలతో యజ్ఞాలు చేసినా, సంతానం లేనివాళ్ళకు పుణ్యలోకాలు లభించవు. సంతానం కలవాళ్ళే పుణ్యవంతులు. అందువలన నీవు ఇతరకార్యా లన్నీ మాని, ధర్మమార్గంలో నాకు సంతానం కలిగేటట్లు చేయుము.

**క. అనపత్యుఁడ నై జీవిం । చిన, మృతిఁ బొందినను నిర్విశేషంబ; యిహం**
**బును బరమును నఫలమ; గా । వున సంతతి వడయు ధర్మువున ధర్మసతీ! 74**

**ప్రతిపదార్థం:** అనపత్యుఁడను+ఐ= బిడ్డలు లేనివాడనై; జీవించినన్= బ్రతికినను; మృతిన్+పొందినను= మరణం పొందినా; నిర్+విశేషంబు+అ= విశేషం లేదు - అనగా ఒక్కటే; ఇహంబును= ఈ లోకం; పరమును= పరలోకం; అఫలము+అ= ఫలం లేనిదే; కావున; ధర్మ, సతీ= ధర్మపత్నీ - కుంతీ! ధర్మువునన్= ధర్మంచే; సంతతి= సంతానాన్ని; పడయుము= పొందుము.

**తాత్పర్యం:** బిడ్డలు లేనివాడినై జీవించినా, మరణించినా ఒకటే; ఇహపరలోకాలు రెండూ ఫలరహితాలే. అందుచేత నీవు ధర్మపద్ధతిలో సంతానం పొందుము.

**వ. 'ఔరస క్షేత్రజ దత్తక కృత్రిమ గూఢోత్ప న్నాపవిద్ధు లను నార్వురుపుత్త్రులు బంధువులు దాయాదులు నగుదురు, కానీన సహోఢక్రీత పౌనర్భవ స్వయందత్త జ్ఞాతు లను నార్వురుపుత్త్రులు బంధువు లగుదురు గాని దాయాదులు గా; రట్టి పుత్త్రులలో నౌరసున కించుకయు తక్కువగాని తక్కటి పుత్త్రులకంటె క్షేత్రజుం డుత్కృష్టుం; డందును దేవరన్యాయ జాతుం డుత్తముం డండ్రు గావున నస్మన్నియోగంబునంజేసి ధర్మమార్గంబున క్షేత్రజులం బడసిన నేనును బుత్త్రవంతుల పుణ్యలోకంబులు వడయనేర్తు; నె ట్లనినఁ; దొల్లి గేకయరా జైన శారదండాయని పుత్త్రోత్పాదనంబునం దశక్తుం డయి తనధర్మపత్ని నీచెలియలి శ్రుతసేనం బుత్త్రార్థంబు నియోగించిన నది బ్రాహ్మణవచనంబునం బుణ్యస్నాతయై పుంసవనహోమంబు సేయించి ఋత్విజులవలన దుర్జయాదు లయిన కొడుకుల ముప్వురం బడసెఁ; బుత్త్రలాభంబున ననంతపుణ్యఫలం బగుట నది ధర్మ్యం బయిన యాచారం' బనిన విని కుంతి యి ట్లనియె. 75**

**ప్రతిపదార్థం:** ఔరస, క్షేత్రజ, దత్తక, కృత్రిమ, గూఢ+ఉత్పన్న+అపవిద్ధులు+అను= వివాహం చేసికొన్న భార్యయందు తనకు పుట్టినవాడు, నియోగంచేత తన భార్యయందు ఇతరులవలన పుట్టినవాడు, తనకు కుమారుడుగా ఇవ్వబడిన ఇతరుల కుమారుడు, అభిమానంతో కుమారుడుగా పెంచుకొనబడినవాడు, తనభార్యయందు తనకు తెలియకుండా ఇతరులవలన జన్మించినవాడు, తల్లిదండ్రులచేత విడిచిపెట్టబడి తనదగ్గర చేరినవాడు; అను; ఆర్వురు= ఆరుగురు; పుత్త్రులు; బంధువులు; దాయాదులున్= తన సంపదలో భాగం పొందేవాళ్ళు; అగుదురు; కానీన, సహోఢ, క్రీత, పౌనర్భవ, స్వయందత్త, జ్ఞాతులు= పెళ్ళికిముందు తన భార్య కన్యగా ఉన్నప్పుడు పుట్టినవాడు, వివాహసమయానికే గర్భిణిగా ఉన్న తన భార్యకు వివాహానంతరం పుట్టినవాడు, తల్లిదండ్రులకు ధన మిచ్చి కొనబడినవాడు, భర్తచే విడువబడిన స్త్రీకి లేదా విధవకు తనచేత పుట్టింపబడినవాడు, నీకు పుత్రుడను అవుతా నని తనంతగా తాను వచ్చినవాడు, తనగోత్రంవాడు; అను; ఆర్వురు= ఆరుగురు; పుత్త్రులు; బంధువులు; అగుదురు= ఔతారు; కాని, దాయాదులు= ఆస్తిలో భాగం పంచుకొనేవారు; కారు; అట్టి, పుత్త్రులలో, క్షేత్రజుండు= నియోగంచేత తన భార్యకు ఇతరులచేత పుట్టిన కుమారుడు; ఔరసునకు= వివాహమాడిన తన భార్యయందు తనకు పుట్టినవాడికంటె; ఇంచుకయు= కొంచెం; తక్కువగాని= అల్పుడు కాని; తక్కటి= మిగిలిన; పుత్రులకంటె; ఉత్కృష్టుండు= శ్రేష్ఠుడు; అందును= అందులోనూ; దేవర, న్యాయ, జాతుండు= దేవరన్యాయంవలన పుట్టినవాడు; ఉత్తముండు; అండ్రు= అంటారు; కావునన్; అస్మత్, నియోగంబునన్, చేసి= నా ఆజ్ఞతో చేసి; ధర్మ, మార్గంబునన్= ధర్మమార్గముచేత; క్షేత్రజులన్= క్షేత్రజులను; పడసినన్= పొందినచో; నేనును= నేనుకూడా; పుత్త్రవంతుల, పుణ్యలోకంబులు= పుత్రులున్నవాళ్ళు పొందే పుణ్యలోకాలు; పడయ, నేర్తున్(నేర్చుదున్)= పొందగల్గుతాను; ఎట్లు+అనిన్= ఏ విధంగా అంటే; తొల్లి= పూర్వం; కేకయ, రాజు+ఐన; శారదండాయని; పుత్ర+ఉత్పాదనంబు; అందున్= కొడుకులను పుట్టించటంలో; అశక్తుండు+అయి= శక్తిలేనివాడై; తన, ధర్మ, పత్ని= తాను అగ్నిసాక్షిగా వివాహం చేసికొన్న భార్యను; నీ చెలియలిన్= నీ (కుంతియొక్క) చెల్లెలిని; శ్రుతసేనన్; పుత్త్ర+అర్థంబు= పుత్రుల కొరకు; నియోగించినన్= ఆజ్ఞాపించగా; అది= ఆమె; బ్రాహ్మణ= బ్రాహ్మణుల; వచనంబునన్= మాటనుబట్టి; పుణ్య, స్నాత +ఐ= పవిత్రమైన స్నానం చేసిందై; పుంసవన, హోమంబు= కొడుకు పుట్టడానికి చేసే వైదికశుభకర్మకు

సంబంధించినహోమం; చేయించి; ఋత్విజులవలనన్= యజ్ఞం చేయించే బ్రాహ్మణులవలన; దుర్జయ+ఆదులు+అయిన= దుర్జయుడు మొదలగు వారైన; కొడుకులన్; ముమ్వురన్= ముగ్గురిని; పడసెన్= పొందెను; పుత్ర, లాభంబునన్= కొడుకులు పుట్టడంవలన; అనంత; పుణ్య, ఫలంబు+అగుటన్= అంతులేని పుణ్యం కలగటంచేత; అది= దేవరన్యాయంతో పుత్రులను పొందటం; ధర్మ్యంబు+ అయిన, ఆచారంబు= ధర్మంతో కూడిన ఆచారము; అనినన్= అనగా; విని; కుంతి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఔరసుడు, క్షేత్రజుడు, దత్తకుడు, కృత్రిముడు, గూఢోత్పన్నుడు, అపవిద్ధుడు అనే ఆరుగురు పుత్రులు బంధువులుమాత్రమే కాదు, ఆస్తిలో భాగస్వాములుకూడా. కానీనుడు, సహోఢుడు, క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు; జ్ఞాతుడు అనే ఆరుగురుపుత్రులు బంధువులే, కాని, ఆస్తిలో భాగస్వాములు కారు. ఈ పుత్రు లందరిలో క్షేత్రజుడు ఔరసుడికన్నా కొంచెం తక్కువ; తక్కినవారికన్నా మిన్న. అందునా దేవరన్యాయంచేత పుట్టిన క్షేత్రజుడు ఉత్తముడు. అందువలన నీవు నా ఆజ్ఞచేత ధర్మమార్గంలో క్షేత్రజులను పొందితే పుత్రు లున్నవాళ్ళు పొందే పుణ్యలోకాలు నేను పొందుతాను. ఎట్లా అంటే - పూర్వం కేకయరాజు శారదండాయని తాను పుత్రులను పొందలేక తనధర్మపత్ని, అంటే నీచెల్లెలు శ్రుతసేనను పుత్రులకొరకు నియోగించగా, ఆమె బ్రాహ్మణులు చెప్పినట్లు పుణ్యస్నానం చేసి, పుత్రులు పుట్టటంకోసం చేసేపుంసవన హోమం చేయించి, ఋత్విజులవలన దుర్జయుడు మొదలైన ముగ్గురుకొడుకులను పొందింది. పుత్రులు పుట్టటంచేత అంతులేని పుణ్యం కలుగుతుంది. కాబట్టి దేవరన్యాయంచేత పుత్రులను పొందటం ధర్మంతో కూడిన ఆచారం' అని పాండురాజు చెప్పగా కుంతి ఇట్లా అన్నది.

**విశేషం:** ఆంధ్రమహాభారతంలో సంశోధితప్రతిలో ఈ క్రింది విశేషా లున్నాయి. "సంస్కృతమూలము-సంతానమును బంధుదాయాదులు, అబంధుదాయాదులు- అని రెండుగా విభజించినది. అందు బంధుదాయాదులు; (1) స్వయంజాతుఁడు (2) ప్రణీతుఁడు (3) పరిక్రీతుఁడు (4) పౌనర్భవుఁడు (5) కానీనుఁడు (6) స్వైరిణీసుతుఁడు. అబంధుదాయాదులు- (1) దత్తుఁడు (2) క్రీతుఁడు - కృత్రిముఁడు (3) స్వయందత్తుడు (4) సహోఢుఁడు (5) జ్ఞాతరేతుఁడు (6) హీనయోనిధృతుఁడు. క్షేత్రజుఁడు -అనుటకు బదులు పి.పి.ఎస్ ప్రతిలో 'క్షేత్రిక' పదము కలదు. మూలమునందు 'క్షేత్రజుఁడు' అను పేరు లేదు. ప్రణీతుఁ డనియే కలదు. "ఊఢాయామేవ ఉత్తమానుగ్రహా జ్ఞాతః ప్రణీతః" అని నీలకంఠీయవ్యాఖ్య. బంధు దాయాద, అబంధుదాయాద విభాగమునందు నన్నయ మార్పులు చేసెను. దత్తక, కృత్రిమాపవిద్ధులు - అనువారిని నన్నయ బంధుదాయాదులలో చేర్చెను. బంధుదాయాదులనుండి పరిక్రీతుఁడు, పౌనర్భవుఁడు, కానీనుఁడు - అను వీరిని తొలగించెను. హీనయోనిధృతుఁడు మూలములో అన్ని ప్రతులయందును పేర్కొనఁబడెను. ఆంధ్రమునం దీతఁడు విడువఁబడెను. షట్సంతానమును పూర్తి చేయుటకై క్రీతుఁడు, కృత్రిముఁడు వేర్వేరుగా పరిగణింపఁబడిరి. (ప్రథమసంపుటం పు.273)"

**మరొక విశేషం:** నన్నయ ఆపస్తంబసూత్రుడు కాబట్టి ఆపస్తంబధర్మసూత్రాలను అనుసరించి సంతానవిషయాన్ని సమీక్షించి ఉండవచ్చును. మనువు, బోధాయనుడు, గౌతముడు ద్వాదశవిధపుత్రులను పేర్కొన్నారు. వారు ఔరస, క్షేత్రజ, దత్తక,కృత్రిమ, గూఢోత్పన్న, అపవిద్ధ, కానీన, సహోఢ, క్రీత, పౌనర్భవ, స్వయందత్త, జ్ఞాతులు. ఆపస్తంబుడు ఆరుగురిని మాత్రమే వారసులుగా, దాయాదులుగా పేర్కొన్నాడు. వారిలోకూడ క్రీతుడినీ, దత్తుడినీ తిరస్కరించాడు. నన్నయ మనువు పేర్కొన్నద్వాదశ పుత్రులను పేర్కొన్నప్పటికీ ఆరుగురినే వారసులుగా నిర్ధారించాడు. ఔరసుని తరువాత క్షేత్రజుడిని నిలిపాడు. (సంపా.)

**క. భరతకులశ్రేష్ఠుఁడ వయి । పరఁగిన నీ కేము ధర్మపత్నుల మయి యిం**

**కొరుల మనుష్యుల నంతః । కరణంబులఁ దలఁపఁ బొందఁగా నోపుదుమే? 76**

**ప్రతిపదార్థం:** భరత, కుల, శ్రేష్ఠుఁడవు+అయి= భరతవంశంలో ఉత్తముడవు అయి; పరఁగిన= ఒప్పిన; నీకున్= నీకు; ఏము= మేము; ధర్మపత్నులము+అయి= అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యలమై; ఇంకన్= మరి; ఒరుల, మనుష్యులన్= ఇతర పురుషులను; అంతఃకరణంబులన్= మనస్సులలో; తలఁపన్= తలంచుటకు; పొందగా= కలవడానికి; ఓపుదుమె= ఒప్పుకొందుమా? (ఒప్పుకొన మని భావం.)

**తాత్పర్యం:** భరతవంశంలో శ్రేష్ఠుడ వైన నీకు ధర్మపత్నుల మై, పరపురుషులను మనస్సులలో తలవటానికి, కలవటానికి ఒప్పుకోగలమా?

**వ.** **'భవత్ప్రసాదంబున మాయందుఁ బుత్త్రోత్పత్తి యగు నె ట్లనిన; దీని కనుగుణం బయినది యొక్క పుణ్యకథఁ దొల్లి పౌరాణికులవలన నా వినిన దానిం జెప్పెదఁ జిత్తగించి విను' మని పాండురాజునకుఁ గుంతి యి ట్లనియె. 77**

**ప్రతిపదార్థం:** భవత్+ప్రసాదంబునన్= నీ అనుగ్రహంతో; మాయందున్; పుత్త్ర+ఉత్పత్తి, అగున్= కొడుకులు పుట్టటం జరుగుతుంది.; ఎట్లు+అనిన= ఏ విధంగా అంటే; దీనికిన్; అనుగుణంబు+అయినది= తగినది; ఒక్క, పుణ్య, కథ= ఒక పుణ్యకథ; తొల్లి= పూర్వం, పౌరాణికులవలన= పురాణాలు చెప్పేవారివలన; నా, వినిన, దానిన్= నేను విన్న దానిని; చెప్పెదన్= తెలుపుతాను; చిత్తగించి= మనస్సు ఉంచి; వినుము; అని; పాండురాజునకున్; కుంతి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీదయవలన మాకు కొడుకులు కల్గుతారు. ఎట్లా అంటే దీనికి తగ్గ ఒకపుణ్యకథ పూర్వం పౌరాణికులు చెప్పగా విన్నాను. మనస్సు నిలిపి వినండి' అని పాండురాజుతో కుంతి ఇట్లా అన్నది.

## వ్యుషితాశ్వుండను రాజు వృత్తాంతము (సం. 1-112-7)

**చ.** **అతుల బల ప్రతాప మహిమాధికుఁ డై వ్యుషితాశ్వుఁ డన్మహీ**
**పతి నయధర్మతత్పరుఁడు పౌరవవంశజుఁ డశ్వమేధముల్**
**శత మొనరించుచుండి భుజశక్తి జయించె మహీశులం బ్రవ**
**ర్ధితయశుఁ డై ప్రతీచ్యుల నుదీచ్యులఁ బ్రాచ్యుల దాక్షిణాత్యులన్. 78**

**ప్రతిపదార్థం:** అతుల, బల, ప్రతాప, మహిమ+అధికుఁడు+ఐ= సాటిలేని బలపరాక్రమాల ప్రభావంచేత గొప్పవాడై; నయ, ధర్మ, తత్పరుఁడు= నీతి, ధర్మాలమీద ఆసక్తికలవాడు; పౌరవ, వంశజుఁడు= పూరువువంశంలో పుట్టినవాడు; వ్యుషిత+అశ్వుఁడు= వ్యుషితాశ్వుడు; అన్+మహీ, పతి= అనే రాజు; అశ్వమేధముల్= అశ్వమేధయాగములు; శతము= వంద, ఒనరించు+ఉండి= చేస్తూ ఉండి, భుజ, శక్తిన్= భుజబలంతో; ప్రవర్ధిత, యశుఁడు+ఐ= పెంపొందింపబడిన కీర్తి కలవాడై; ప్రతీచ్యులన్= పడమటి దిక్కులో ఉన్నవాళ్ళను; ఉదీచ్యులన్= ఉత్తరాన ఉన్నవాళ్ళను; ప్రాచ్యులన్= తూర్పున ఉన్నవాళ్ళను; దాక్షిణాత్యులన్= దక్షిణాన ఉన్నవాళ్ళను; మహి+ఈశులన్= రాజులను; జయించెన్.

**తాత్పర్యం:** సాటిలేని బలపరాక్రమాలతో అందరిని మించినవాడై, నీతిలో, ధర్మంలో ఆసక్తి కలిగి, పూరువంశంలో జన్మించిన వ్యుషితాశ్వు డనే మహారాజు అశ్వమేధయాగాలు వంద చేసి, భుజబలంతో పెంపొందిన కీర్తి కలవాడై నాలుగుదిక్కులలో ఉన్న రాజులను జయించాడు.

**విశేషం:** వ్యుషితాశ్వుడు బలపరాక్రమాలలో, దిగ్విజయాలలో పాండురాజును పోలి ఉండటంచేత కుంతికి అతని వృత్తాంతం జ్ఞాపకం వచ్చినట్లు ధ్వని. పాండురాజుయొక్క దిగ్విజయప్రశంసలోను, వ్యుషితాశ్వునిప్రశంసలోను నన్నయ చంపకమాలను వినియోగించటం విశేషం. వృత్తరచనాశిల్పం. చూడు. 39, 42 (సంపా.)

**క. ఆతని యజ్ఞంబునఁ బురు। హూత పురస్సర మరుద్గణోత్తము లధిక**
**ప్రీతిఁ జనుదెంచి హవ్యము। లాతత హస్తములఁ గొందు రగ్నిముఖమునన్. 79**

**ప్రతిపదార్థం:** అతని= ఆ రాజుయొక్క; యజ్ఞంబునన్; పురుహూత, పురఃసర, మరుత్+గణ+ఉత్తములు= దేవేంద్రుడు మొదలైన దేవతా శ్రేష్ఠులు; అధిక, ప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; చనుదెంచి= వచ్చి; అగ్ని, ముఖమునన్= అగ్నిదేవునిమూలాన; హవ్యములు= హోమంలో వేసిన ఆహుతులు; ఆతత, హస్తములన్= చాపబడిన చేతులతో; కొందురు= తీసికొంటారు.

**తాత్పర్యం:** ఆ వ్యుషితాశ్వునియజ్ఞంలో దేవేంద్రుడు మొదలైన దేవతాశ్రేష్ఠులు మిక్కిలిప్రీతితో వచ్చి, చేతులు చాచి అగ్నిదేవునిముఖంగా ఆహుతులు గైకొంటారు.

**వ. అట్టి వ్యుషితాశ్వుండు కాక్షీవతి యైన భద్ర తన భార్యయందు ననవరత కామాసక్తిం జేసి యక్ష్మ రుజాక్రాంతుం డయి యస్తమించిన నది పుత్త్రాలాభదుఃఖిత యయి పతివియోగంబు సహింప నోపక. 80**

**విశేషం:** అట్టి, వ్యుషిత+అశ్వుండు= వ్యుషితాశ్వుడు అను రాజు; కాక్షీవతి+ఐన; భద్ర; అను; తన భార్యయందున్= తన పత్నిపై; అనవరత, కామ+ఆసక్తిన్+చేసి= ఎడతెగని కామంమీద ఆసక్తితో; యక్ష్మ; రుజా+ఆక్రాంతుండు+అయి= క్షయరోగంచే ఆక్రమింపబడిన వాడై; అస్తమించినన్= మరణించగా; అది= అతని భార్య అయిన భద్ర; పుత్త్ర+అలాభ, దుఃఖిత+అయి కొడుకులను పొందలేక పోవటంతో దుఃఖించినదై; పతి, వియోగంబును= భర్తను కోల్పోవటాన్ని; సహింపన్+ఓపక= ఓర్చుకోలేక.

**తాత్పర్యం:** అటువంటి వ్యుషితాశ్వుడు తనభార్యమీద మితిమీరినకామంతో ఆసక్తుడై వ్యవహరించి క్షయ రోగగ్రస్తుడై మరణించగా, అతనిభార్య భద్ర కొడుకులు లేకపోవటంతో దుఃఖించి, భర్తను కోల్పోవటాన్ని సహించలేక.

**తే. పతియులేక జీవించు నయ్యతివ కయిన। జీవనముకంటె దానికిఁ జావ లగ్గు**
**కాన నీతోన చనుదెంతుఁ గాని నిన్నుఁ। బాసి యిం దుండఁగా నోప వాసవాభ ! 81**

**విశేషం:** పతియు= భర్త; లేక; జీవించు= జీవించే; ఆ+అతివకు= ఆ స్త్రీకి; అయిన= ఏర్పడిన; జీవనముకంటె= బతకటంకన్నా; దానికిన్= ఆ స్త్రీకి; చావు+అ, లగ్గు= చావే మేలు; కాన; నీతోన; చనుదెంతున్= వస్తాను; కాని; వాసవ+ఆభ= దేవేంద్రుని వంటి తేజస్సుకలవాడా!; నిన్నున్; పాసి= విడిచి; ఇందున్= ఈ లోకంలో; ఉండన్+కాన్= ఉండటానికి; ఓపన్= ఇష్టపడను.

**తాత్పర్యం:** భర్తలేకుండా జీవించటంకన్నా స్త్రీ చావటమే మేలు. అందువలన నేను నీతో వస్తాను కాని, ఇక్కడ ఉండలేను.

**వ. 'కాదేని నాకు నీ పుణ్యమూర్తిప్రతిమూర్తులైన పుత్త్రులం బ్రసాదింపు' మని దర్భాస్తరణశాయిని యై యాశవంబుఁ గౌఁగిలించుకొని విలాపించుచున్న దానికి వాని శరీరముననుండి యొక్క దివ్యవాణి యి ట్లనియె. 82**

**ప్రతిపదార్థం:** కాదు+ఏని= అట్లా కాకపోతే; నాకున్; నీ, పుణ్య, మూర్తి, ప్రతిమూర్తులు+ఐన= నీ పవిత్రమైన రూపం కలవారైన; పుత్రులన్= కుమారులను; ప్రసాదింపుము= దయతో ఇమ్ము; అని= ఆ విధంగా తెలిపి; దర్భ+ఆస్తరణ, శాయిని+ఐ= దర్భలపరుపుమీద పడుకొన్నది అయి; ఆ, శవంబున్= ఆ భర్తశవాన్ని; కౌగలించుకొని; విలపించుచు+ఉన్న= ఏడుస్తున్న; దానికి= ఆ భద్రకు; వాని, శరీరముననుండి= ఆ వ్యుషితాశ్వునిశరీరంనుండి; ఒక, దివ్య, వాణి= ఒక దేవతాసంబంధ మైన వాక్కు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అట్లా కాకపోతే నాకు నీపవిత్రరూపంవంటి రూపం కల కొడుకులను ప్రసాదించు' అని దర్భల పరుపుమీద పడుకొని భర్తశవాన్ని కౌగలించుకొని ఏడుస్తూ ఉండగా, ఆమెతో అతని శరీరంనుండి ఒక దివ్యవాణి ఇట్లా అన్నది.

**క. విదితముగ నీకు వర మి । చ్చెద నోడకు లెమ్ము; గుణవశీకృతభువనుల్**
**సదమలచరిత్రు లాత్మజు । లుదయింతురు వగవకుండు ముదితేందుముఖీ! 83**

**ప్రతిపదార్థం:** విదితముగ= ప్రసిద్ధంగా; నీకు; వరము; ఇచ్చెదన్; ఓడకు= భయపడకుము, లెమ్ము; ఉదిత+ఇందు, ముఖీ= ఉదయించిన చంద్రునివంటి ముఖంకలదానా; గుణ, వశీ, కృత, భువనుల్= గుణాలచేత వశం చేసుకోబడిన లోకాలు కలవాళ్ళు; సత్+అమల, చరిత్రులు= ఉత్తమమైన నిర్మలమైన నడవడి కలవాళ్ళు; ఆత్మజులు= కుమారులు; ఉదయింతురు= పుట్టుతారు; వగవక= చింతించక; ఉండుము.

**తాత్పర్యం:** నీకు వర మిస్తాను. భయపడవద్దు. లెమ్ము. ఉదయించినచంద్రునివంటిముఖంకలదానా! సుగుణాలచేత లోకాలను వశంచేసుకొనేవాళ్ళు, ఉత్తమమైన నడవడి కలవాళ్ళు అయినకొడుకులు నీకు పుడతారు. బాధపడకుము.

**వ. 'ఋతుమతి వయిన యష్టమ దివసంబుననేనిం జతుర్దశ దివసంబుననేని శుచి వై శయనంబున నుండి నన్నుఁ దలంపు' మనిన నదియుం దద్వచనానురూపంబు సేసి మువ్వురు సాల్వులును, నల్వురు మద్రులునుంగా నేడ్వురు కొడుకులం బడసె; నది గావున 'నీవు మాయందు దైవానుగ్రహంబున నపత్యంబు వడయు' మనినం గుంతిం జూచి పాండురాజు ధర్మ్యం బయిన యొక్క పురాణ కథఁ జెప్పెదఁ 'దొల్లి స్త్రీలు పురుషులచేత ననావృత లయి స్వతంత్రవృత్తి నఖిలప్రాణిసాధారణం బైన ధర్మంబునం దమతమవర్ణంబులయందు ఋతుకాలంబు దప్పక నియతానియతపురుషు లయి ప్రవర్తిల్లుచున్న, నుద్దాలకుం డను నొక్కమహామునిభార్య నతిసాధ్వి నధికతపోనిధి యైన శ్వేతకేతుతల్లి ఋతుమతి యైన దాని నొక్క వృద్ధవిప్రుం డతిథి యై వచ్చి పుత్రార్థంబు గామించిన శ్వేతకేతుం డలిగి యిది ధర్మవిరుద్ధం బని యాక్రోశించి దాని సహింపనోపక. 84**

**విశేషం:** ఋతుమతివి= ముట్టుఅయినదానివి; అయిన; అష్టమ, దివసంబునన్=ఏనిన్= ఎనిమిదోరోజున కాని; చతుర్దశ, దివసంబునన్+ఏని= పద్నాలుగో రోజున కాని; శుచివి+ఐ= పరిశుద్ధమైన దానివై; శయనంబునన్+ఉండి= పడకమీద ఉండి; నన్నున్; తలంపుము; అనినన్; అదియున్= ఆమె కూడా; తత్+వచన+అనురూపంబునన్+చేసి= అతనియొక్క మాటకు తగినట్లుగా ఆచరించి; మువ్వురు, సాల్వులును; నల్వురు, మద్రులునున్; కాన్= అగునట్లు; ఏడ్వురు= ఏడుమంది; కొడుకులన్; పడసెన్= పొందెను; అది= ఆమె; కావున= కాబట్టి; నీవున్=నీవును; మాయందున్= మాయెడ; దైవ+అనుగ్రహంబునన్;

అపత్యంబు= సంతానాన్ని; పడయుము= పొందుము; అనినన్= అనగా; కుంతిన్; చూచి; పాండురాజు; ధర్మ్యంబు+అయిన= ధర్మసంబంధమైన; ఒక్క= ఒక; పురాణ= ప్రాచీనమైన; కథన్= కథను; చెప్పెదన్= చెపుతాను; తొల్లి= పూర్వం; స్త్రీలు; పురుషులచేత= భర్తలచేత; అనావృతులు+అయి= చుట్టుకొనబడనివా రై - అనగా కట్టడిలేనివారై; స్వతంత్ర, వృత్తిన్= స్వతంత్ర మైన ప్రవర్తనతో; అఖిల, ప్రాణి, సాధారణంబు+ఐన= అన్నిప్రాణులకు సామన్యమైన; ధర్మంబునన్; తమ, తమ వర్ణంబులఅందున్= తమతమ జాతులలో; ఋతుకాలంబు= ముట్టయిన తరువాత పదహారురోజులు; తప్పక= దాటకుండ; నియత+అనియత, పురుషులు+అయి= నియమింపబడిన, నియమింపబడని పురుషులు కలవారై; ప్రవర్తిల్లుచున్+ఉన్నన్= వర్తిస్తూ ఉండగా; ఉద్దాలకుండు; అను; ఒక్క, మహా, ముని, భార్యన్= ఒక గొప్ప తపస్వి యొక్క ఇల్లాలిని; అతి, సాధ్విన్= మిక్కిలిపతివ్రత అయిన దానిని; అధిక, తపస్+నిధి+ఐన= అధికమైన తపస్సునకు స్థానమైనవాడు అయిన; శ్వేతకేతు, తల్లి= శ్వేతకేతునియొక్క తల్లిని; ఋతుమతి+ఐన= ముట్టు అయినది కాగా; దానిన్= ఆమెను; ఒక్క; వృద్ధ, విప్రుండు= ముసలి బ్రాహ్మణుడు; అతిథి+ఐ; వచ్చి; పుత్త్ర+అర్థంబు= కొడుకును పొందటంకొఱకు; కామించిన= రమింపగా; శ్వేతకేతుండు; అలిగి= కోపించి; ఇది; ధర్మ, విరుద్ధంబు= ధర్మానికి వ్యతిరేకం; అని; ఆక్రోశించి= తిట్టి; దాని; సహింపక= ఓర్వక.

**తాత్పర్యం:** 'నీవు ముట్టయిన ఎనిమిదో రోజు కాని, పద్నాలుగో రోజు కానీ పరిశుద్ధురాల వై పడకమీద ఉండి నన్ను స్మరింపుము' అని అనగా ఆమెకూడా ఆ మాటప్రకారం చేసి ముగ్గురు సాల్వులను, నలుగురు మద్రలను మొత్తం ఏడుగురు కొడుకులను కన్నది. కాబట్టి మాయందు నీవుకూడ దైవానుగ్రహంతో సంతానాన్ని పొందు' మని కుంతి చెప్పగా, పాండురాజు ఆమెను చూచి 'నీకు ధర్మసంబంధమైన ఒక పురాణకథ చెబుతాను. 'పూర్వం స్త్రీలు భర్తవలన కట్టడి లేని వాళ్ళయి, స్వతంత్రమైన ప్రవర్తన కలిగి, సర్వప్రాణిసాధారణమైన ధర్మంతో, తమ తమ జాతులలో ముట్టయిన తరువాత గర్భధారణకు యోగ్యమైన పదహారురోజులకాలం దాటకుండా, నియమింపబడిన లేదా నియమింపబడని పురుషులతో రమిస్తూ ఉండగా; మహాతపస్వి అయిన శ్వేతకేతుని తల్లి, మహాముని అయిన ఉద్దాలకుని భార్య, మహాపతివ్రత - ముట్టయి ఉన్నసమయంలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి తనకు పుత్త్రుడు కావా లని ఆమెను కామింపగా, శ్వేతకేతుడు కోపించి, ఇది ధర్మవిరుద్ధం అని తిట్టి, దాన్ని సహించక.

### శ్వేతకేతుఁడు స్త్రీపురుషుల విషయంబునఁ గావించిన కట్టడి (సం. 1-113-1)

**సీ.** **'ఇది యాదిగా సతు లెన్నండుఁ బరపురుషార్థినుల్ గాఁ జన; దన్యపురుష**
**సంగమంబునఁ జేసి సకలపాతకములు నగుఁ ; బరిగ్రహభూత లయిన సతుల**
**కిట్టిద మర్యాద యి మ్మనుష్యుల కెల్లఁ జేసితి లోక ప్రసిద్ధి గాఁగ '**
**నని ధర్మ్యమైన మర్యాద మానవులకుఁ దద్దయు హితముగా ధర్మమూర్తి**

**ఆ.** **యబ్జభవసమానుఁ డగు శ్వేతకేతుండు । నిలిపె; నదియు ధారుణీ జనంబు**
**నందు లోకపూజ్యమై ప్రవర్తిల్లుచు । నుండె శిష్ట సంప్రయుక్తిఁ జేసి.** **85**

**ప్రతిపదార్థం:** ఇది, ఆదిగాన్= ఇది మొదలుగా; సతులు= స్త్రీలు; ఎన్నండున్= ఎప్పుడూకూడ; పర, పురుష+అర్థినుల్= పరపురుషులను కోరేవారుగా; కాన్, చనదు= కాకూడదు; పరిగ్రహభూతలు+అయిన, సతులకు= చేపట్టబడిన స్త్రీలకు- అనగా పెళ్లి అయిన స్త్రీలకు; అన్య పురుషు, సంగమంబునన్+చేసి= పరపురుషసంబంధంవలన; సకల, పాతకములున్= అన్ని

పాపాలు; అగున్= కలుగును; ఇట్టిది+అ= ఇదే; మర్యాద= కట్టుబాటు; ఈ+మనుష్యులకు+ఎల్లన్= ఈ మానవు లందరికి; లోక, ప్రసిద్ధి, కాఁగన్= ప్రపంచంలో ప్రసిద్ధిచెందేటట్లు; చేసితి; అని= ఆ ప్రకారముగా; ధర్మ్యము+ఐన= ధర్మంతో కూడిన దైన; మర్యాద= హద్దు; అబ్జ, భవ, సమానుఁడు+అగు= పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవునితో సమానమైనవాడైన; శ్వేతకేతుండు; నిలిపెన్= ఉంచెను; అదియు= ఆ నియమం; శిష్ట, సంప్రయుక్తిన్+చేసి= పెద్దల ఆచారంచేత; లోక, పూజ్యము+ఐ= లోకంచేత పూజింప తగినదై; ప్రవర్తిల్లుచున్+ఉండెన్= నడుస్తూ ఉన్నది.

**తాత్పర్యం:** 'ఇది మొదలు స్త్రీలు ఎప్పుడూ పరపురుషులను కోరకూడదు. వివాహితస్త్రీలకు పురుషసంగమం వలన సర్వపాపాలు కలుగుతాయి. ఈ కట్టుబాటు లోకప్రసిద్ధంగా మానవు లందరికీ చేశాను' - అని ధర్మంతో కూడిన ఈ కట్టడిని మానవులకు మేలు కలిగేటట్లు ధర్మమూర్తి, బ్రహ్మతో సమానుడు అయిన శ్వేతకేతుడు ఏర్పాటు చేశాడు. ఆ మర్యాదనే శిష్టులంతా అనుసరించటంతో అది లోకానికి పూజింపతగిందై నడుస్తున్నది.

**వ. మఱియుఁ దిర్యగ్యోనులయందును నుత్తరకురుదేశంబులయందును మొదలింటి ధర్మంబ యిప్పడుం బ్రవర్తిల్లుచుండునట్లు మనుష్యులయందు శ్వేతకేతుండు సేసిన ధర్మస్థితికారణంబున నాఁటంగోలె. 86**

**ప్రతిపదార్థం:** మఱియున్; తిర్యక్+యోనుల, అందున్= పశుపక్ష్యాదులలోకూడ; ఉత్తర, కురు, దేశంబుల+అందును; మొదలింటి, ధర్మంబు+అ= మొదటి పద్ధతే - అనగా ఆడుప్రాణి ఋతుకాలంలో ఇష్టం వచ్చిన మగప్రాణితో రమించే పద్ధతి; ఇప్పుడున్; ప్రవర్తిల్లుచు+ఉండున్= జరుగుతూ ఉన్నది; అట్లు= ఆ విధంగా; శ్వేతకేతుఁడు; మనుష్యుల= మానవులలో; చేసిన= ఏర్పాటు గావించిన; ధర్మ, స్థితి= ధర్మం యొక్క ఉనికి; కారణంబునన్= కారణముచేత; నాఁటన్+కోలె= ఆ నాటి నుండి.

**తాత్పర్యం:** పశుపక్ష్యాదులతో కూడ, ఉత్తరకురుభూములలో ఇప్పటికీ ఆడుప్రాణి ఋతుకాలంలో ఏ నియమం లేకుండా ఇష్టం వచ్చినట్లు మగప్రాణితో రమించే మొదటి పద్ధతే ఉన్నది. శ్వేతకేతుడు ఆ విధంగా మానవులలో ఏర్పాటు చేసిన ధర్మంవలన ఆ రోజునుండీ.

**క. పురుషులచే ధర్మస్థితిఁ । బరిగ్రహింపంగఁ బడిన భార్యలకు నిరం**
**తరము నిజపురుషభక్తియుఁ బరపురుషవివర్జనంబుఁ బరిచిత మయ్యెన్. 87**

**ప్రతిపదార్థం:** పురుషులచే= మగవారిచే; ధర్మ, స్థితిన్= ధర్మమార్గంతో; పరిగ్రహింపంగన్+పడిన= వివాహం చేసుకొనబడిన; భార్యలకు; నిరంతరము= ఎల్లప్పుడు; నిజ, పురుష భక్తియున్= తమ భర్తలమీద భక్తీ; పర, పురుష వివర్జనంబున్= పర పురుషులను విడవటం; పరిచితము+అయ్యెన్= అలవడినదిగా అయింది.

**తాత్పర్యం:** పురుషులు ధర్మమార్గంలో వివాహం చేసుకొన్న భార్యలకు, ఎల్లప్పుడూ తమ భర్తలమీద భక్తి కలిగి ఉండటం, పరపురుషులను విడవటం అలవడింది.

**తే. భర్తచేత నియోగింపఁ బడక సతికి । నెద్దియును జేయఁగాఁ దగ; దెద్ది యైన**
**భర్తచేత నియోగింపఁ బడిన దానిఁ । జేయకునికి దోషం బని చెప్పె మనువు. 88**

**ప్రతిపదార్థం:** భర్తచేతన్= మగనిచేత; నియోగింపన్, పడక= ఆజ్ఞాపింపబడక; సతికిన్= భార్యకు; ఎద్దియును= ఏదీ; చేయఁగాన్, తగదు= చేయకూడదు; ఎద్ది+ఐనన్= ఏదైననూ; భర్తచేత= మగనిచేత; నియోగింపన్, పడిన, దానిన్= ఆజ్ఞాపింప బడినదానిని; చేయక+ఉనికి= చేయకుండటం; దోషంబు; అని, మనువు, చెప్పెన్= అని మనువు అన్నాడు.

**తాత్పర్యం:** భర్త ఆజ్ఞాపించనిదే భార్య ఏదీ చేయకూడదు. భర్త దేనిని ఆజ్ఞాపించినా అది చేయక పోవటం దోషం' అని మనువు చెప్పాడు.

**వ. పతి నియోగించిన దానిం జేయని నాఁడు భార్యకుం బాతకం బని యెఱింగి కాదె తొల్లి సౌదాసుం డైన కల్మాషపాదుం డను రాజర్షిచేత నియుక్తయై వానిభార్య మదయంతి యనునది వసిష్ఠువలన నశ్మకుం డను పుత్త్రుం బడసె; నస్మజ్జన్మంబు నిట్టిద; మహాముని యయిన కృష్ణద్వైపాయనువలనఁ గురుకులవృద్ధిపొంటె నే ముద్భవిల్లితిమి; కావున నీ విన్నికారణంబులు విచారించి నా నియోగంబు సేయుము. 89**

**ప్రతిపదార్థం:** పతి= భర్త; నియోగించిన, దానిన్= ఆజ్ఞాపించినదాన్ని; చేయని, నాఁడు= చేయని రోజు; భార్యకున్; పాతకంబు+అని= పాప మని; ఎఱింగి= తెలిసి; కాదె= కదా; తొల్లి= పూర్వం; సౌదాసుండు+ఐన= సుదాసుడి కుమారు డైన; కల్మాషపాదుండు; అను= అనుపేరుగల; రాజ+ఋషిచేతన్= రాజర్షివలన; నియుక్త+ఐ= ఆజ్ఞాపించబడినది అయి; వాని, భార్య= అతని పత్ని; మదయంతి; అనునది= అనుపేరు కలది; వసిష్ఠువలనన్= వసిష్ఠునివలన; అశ్మకుండు+అను; పుత్త్రున్; పడసెన్= పొందింది; అస్మత్+జన్మంబున్= మా పుట్టుకకూడా; ఇట్టిది+అ= ఇటువంటిదే; మహాముని; అయిన; కృష్ణద్వైపాయను వలనన్; కురు, కుల, వృద్ధిపొంటెన్= కురువంశవృద్ధి కొరకు; ఏము= మేము; ఉద్భవిల్లితిమి= జన్మించాము; కావునన్= కాబట్టి; నీవు= నీవు, ఇన్ని; కారణంబులు; విచారించి; నా, నియోగంబు= నా ఆజ్ఞ; చేయుము= పాటించుము.

**తాత్పర్యం:** భర్త ఆజ్ఞాపించిన దానిని చేయని రోజు భార్యకు పాపం వస్తుం దని తెలిసే కదా, పూర్వం సుదాసుడి కుమారుడైన కల్మాషపాదుడి ఆజ్ఞతో అతనిభార్య మదయంతి వసిష్ఠునివలన అశ్మకు డనే పుత్రుడిని పొందింది. మా పుట్టుకకూడా ఇటువంటిదే. మహాముని కృష్ణద్వైపాయనునివలన కురువంశం వృద్ధిపొందటానికి మేము జన్మించాము. కాబట్టి నీవు ఈ కారణా లన్నీ విచారించి నేను చెప్పినట్లు చేయుము.

**చ. అలయక ధర్మశాస్త్రములయందుఁ బురాణములందుఁ జెప్ప ను**
**త్పలదళనేత్ర! విందుమ యపత్యము మే లని; కావునన్ యశో**
**నిలయులఁ బుత్త్రులం బడయు నీ కొనరించెద సంగతాంగుళీ**
**దళవిలసన్మదీయకరతామరసద్వయయోజితాంజలిన్. 90**

**ప్రతిపదార్థం:** ఉత్పల, దళ, నేత్ర= కలువ రేకులవంటి కన్నులు కలదానా!; అలయక= విసుగు లేకుండ; ధర్మశాస్త్రముల, అందున్= ధర్మశాస్త్రాలలో; పురాణముల, అందున్= పురాణాలలో; చెప్పన్= చెప్పగా; అపత్యము= సంతానం; మేలు; అని; విందుము+అ= వింటున్నాం కదా; కావునన్; యశః+నిలయులన్= కీర్తికి స్థానమైనవారిని; పుత్త్రులన్; పడయు= పొందుము; సంగత+అంగుళీ, దళ, విలసత్+మదీయ, కర, తామరస, ద్వయ, యోజిత, అంజలిన్= కూడినవ్రేళ్ళు అనే రేకులతో ప్రకాశిస్తున్న నా కరకమలాల జంటచేత కూర్చబడిన నమస్కారాన్ని; నీకున్; ఒనరించెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** కలువ రేకులవంటి కన్నుల కల ఓ కుంతీ! విసుగు లేకుండా ధర్మశాస్త్రాలలోను, పురాణాలలోను సంతానం మే లని చెప్పగా వింటున్నాంకదా! అందువల్ల కీర్తిమంతు లైన పుత్త్రులను పొందుము. కమలాల జంటవంటి నా చేతు లెత్తి నీకు నమస్కారం చేస్తాను.

**విశేషం:** అలం: రూపకం. పాండురాజు కరకమలాలను జోడించి భార్యను ప్రార్థించటంలో ఒక వైశిష్ట్యాన్ని ప్రదర్శించాడు. పాండురాజు చెప్పిన కథనాన్నిబట్టి సమాజవ్యవస్థలో పూర్వం మాతృస్వామ్యవ్యవస్థమాత్రమే ఉండేది. ఆ తరువాత శ్వేతకేతువు మొదలైనవాళ్ళు వివాహిత అన్యపురుషసంయోగం పొందటం పాప మనే కట్టుబాటు ఏర్పరచి, పితృస్వామ్యవ్యవస్థకు ప్రాతిపదికలు వేశారు. మధ్యేమార్గంగా దేవరన్యాయం ప్రవర్తిల్లింది. దానితో మిశ్రస్వామ్యవ్యవస్థ తలయెత్తింది. భర్త బ్రతికి ఉండగా అన్యపురుష స్మరణం, గ్రహణం సముచితం కా దని కుంతి చెప్పింది. కాని, పాండురాజు, పతి అనుమతితో దేవరన్యాయంతో కలిగే సంతానం - క్షేత్రజులను- పొందు మని మాతృస్వామ్యప్రవృత్తిని ప్రార్థిస్తున్నాడు. దేవాంశసంభూతులు దేవరన్యాయజులకంటె ఉత్తము లని కుంతి అభిప్రాయం. నమస్కరించే పాండురాజులో పుత్రులకొరకైన దైన్యం, మాతృవ్యవస్థమీది గౌరవం ధ్వనిస్తున్నాయి. (సంపా.)

**వ. అని పుత్త్రముఖావలోకనలోలత్వంబున దీనవదనుం డై దేవిం బ్రార్థించినఁ గుంతియుం బుత్త్రోత్పాదనోన్ముఖి యై కుంతిభోజునింటఁ దనకొండుకనాఁడు దుర్వాసునిచేతం బడసిన మంత్రంబుతెఱంగు పతి కెఱింగించి 'యమ్మంత్రంబున కిది యవసరం బయ్యెఁ; నేవేల్పు నారాధింతు? నాన తి' మ్మనిన సంతసిల్లి కుంతీదేవికిం బాండురా జి ట్లనియె. 91**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; పుత్త్ర, ముఖ+అవలోకన, లోలత్వంబునన్= కొడుకుల ముఖాన్ని చూడాలనే ఆసక్తితో- అనగా కొడుకులు కావా లనే కోరికతో; దీన, వదనుండు+ఐ= దీనమైన ముఖం కలవా డై; దేవిన్= భార్యను - కుంతిని; ప్రార్థించినన్= అర్థింపగా; కుంతియున్; పుత్త్ర+ఉత్పాదన+ఉన్ముఖి+ఐ= కొడుకులను పుట్టించటంలో అనుకూలమైనది అయి; కుంతిభోజు, ఇంటన్; తన కొండుక, నాఁడు= తన చిన్నతనంలో; దుర్వాసుని చేతన్; పడసిన= పొందిన; మంత్రంబు, తెఱంగు= మంత్రంయొక్క విధం; పతికి= భర్తకు; ఎఱింగించి= తెలిపి; ఆ+మంత్రంబునకు= ఆ మంత్రానికి; ఇది; అవసరంబు= సమయం; అయ్యెన్= అయింది; ఏ, వేల్పున్= ఏ దేవుడిని; ఆరాధింతున్= సేవింతును; ఆనతి, ఇమ్ము, అనినన్= ఆజ్ఞాపించు మనగా; సంతసిల్లి= సంతోషించి; కుంతీదేవికిన్; పాండురాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని కొడుకులముఖాన్ని చూడా లనే కుతూహలంతో దీనవదను డై పాండురాజు కుంతిని ప్రార్థించగా ఆమెకూడా కొడుకులను కనా లనే కోరికకు అనుకూలమైనదై, తనచిన్నతనంలో కుంతిభోజుని ఇంట్లో దుర్వాసునిచేత తాను పొందిన మంత్రవిషయాన్ని భర్తకు చెప్పింది. ' ఆ మంత్రానికి ఇది సమయ మనీ, ఏ దేవుడిని సేవించాలో ఆజ్ఞాపించు' మని భర్తను అడిగింది, పాండురాజు సంతోషించి, కుంతీదేవితో ఈవిధంగా అన్నాడు.

**క. లలితాంగి! యెల్లలోకం । బులు ధర్మువునంద నిలుచుఁ ; బొలుపుగ ధర్మం**
**దలఁపుమ; యాతఁడ మఱి వే । ల్పులలోపలఁ బెద్ద ధర్మమున సత్యమునన్. 92**

**విశేషం:** లలిత+అంగి= అందమైన శరీరం కలదానా! ఓ కుంతీ!; ఎల్ల, లోకంబులు; ధర్మువు, అందు+అ=ధర్మం మీదే; పొలుపుగన్= స్థిరంగా; నిలుచున్= నిలుస్తాయి; ధర్మున్= ధర్మదేవతను; తలఁపుము+అ= స్మరించుము; మఱి= ఇక; వేల్పుల లోపలన్= దేవతలలో; ధర్మమునన్= ధర్మమునందు; సత్యమునన్= సత్యమునందును; ఆతఁడు+అ= అతడే; పెద్ద= గొప్పవాడు.

**తాత్పర్యం:** అందమైన శరీరం కల ఓ కుంతీ! అన్నిలోకాలు ధర్మంమీదే స్థిరంగా నిలుస్తాయి. ధర్మదేవతను స్మరించుము. దేవతలలో ధర్మంలోనూ, సత్యంలోనూ అతడే పెద్దవాడు.

**విశేషం:** "విశ్వం ధరతీతి ధర్మః" లోకాన్ని ధరించేది ధర్మం. ఆ ధర్మానికి అధిదేవత ధర్ముడు; అతడిని స్మరించి సంతానాన్ని పొందటంలో పాండురాజుయొక్క విశ్వశ్రేయోదృష్టి వ్యక్తమౌతున్నది. ధర్మాన్ని రక్షించే సంతానాన్ని కోరటం ఉత్తమగృహస్థుయొక్క ధర్మం. పుట్టబోయే కొడుకు మూర్తికట్టిన ధర్మం కావా అని పాండురాజు సంకల్పం.

**వ. అని నియోగించినఁ, గుంతియుం బతికిఁ బ్రదక్షిణంబుఁ జేసి సమాహితచిత్త యై మహాముని యిచ్చిన మంత్రంబు విధివంతంబుఁ జేసి ధర్ముని నారాధించిన, నా ధర్ముండును యోగమూర్తి ధరుం డై వచ్చి, వరం బిచ్చినం, గుంతియుఁ దత్ప్రసాదంబున గర్భంబు దాల్చి, సంవత్సరంబు పరిపూర్ణం బైన. 93**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; నియోగించినన్= ఆజ్ఞాపించగా; కుంతియున్; పతికిన్= భర్తకు; ప్రదక్షిణంబున్; చేసి; సమాహిత, చిత్త+ఐ= నిలువబడిన మనస్సు కల దై; మహాముని; ఇచ్చిన; మంత్రంబున్; విధి, వంతంబున్= విధితో కూడిన దానినిగా; చేసి; ధర్ముని= ధర్మదేవతను; ఆరాధించినన్= ప్రార్థించగా; ఆ ధర్మండును; యోగ, మూర్తి, ధరుండు+ఐ= యోగబలంచేత ఆకారాన్ని ధరించినవాడై; వచ్చి; వరంబు, ఇచ్చినన్= వరము ఈయగా; కుంతియున్; తద్+ప్రసాదంబునన్= అతని దయచేత; గర్భంబున్; తాల్చి= ధరించి; సంవత్సరంబు= ఒక సంవత్సరం; పరిపూర్ణంబు+ఐనన్= పూర్తికాగా.

**తాత్పర్యం:** అని ఆజ్ఞాపించగా, కుంతీదేవి భర్తకు ప్రదక్షిణం చేసి, మనస్సు నిలిపి మహాముని ఇచ్చిన మంత్రాన్ని యథావిధిగా జపించి, ధర్మదేవతను ప్రార్థించింది. ధర్ముడు యోగంచేత రూపాన్ని ధరించి వచ్చి వరమిచ్చాడు. కుంతీదేవి అతనిదయవలన గర్భం ధరించి సంవత్సరకాలం పూర్తి కాగానే.

**విశేషం:** కుంతి గర్భం ధరించి, సంవత్సరకాలం పూర్తిఅయిన తరువాత - కుమారుడిని కన్నట్లు ఈ కథనంలో ఉన్నది. సంవత్సరకాలం గడిచినట్లు మూలంలో లేదు. కుంతీదేవి ధర్ముడిని ఆహ్వానించేనాటికి గాంధారి ఒక సంవత్సరం గర్భవతి అయిఉన్నది. 'సంవత్సరధృతే గర్భే గాంధార్యా జనమేజయ!' అని మూలం. (భం.ఆది.పు.505)

### కుంతీదేవియందు ధర్మరాజుజననము (సం.1-114-3)

**ఉ. శాత్త్రవజైత్రతేజమున సర్వదిశల్ వెలుఁగంగ నైంద్ర న**
**క్షత్త్రయుతుండుగా శశి ప్రకాశజయోన్నత మైన యష్టమిన్**
**మిత్త్రముఖగ్రహప్రతతి మేలుగ నాభిజితోదయంబునం**
**బుత్త్రుఁడు ధర్మునంశమునఁ బుట్టె నతిస్థిరధర్మమూర్తి యై. 94**

**ప్రతిపదార్థం:** శాత్త్రవ, జైత్ర, తేజమునన్= శత్రువులను జయించే పరాక్రమంతో; సర్వ, దిశల్= అన్ని దిక్కులు; వెలుఁగంగన్; శశి= చంద్రుడు; ఐంద్ర, నక్షత్ర, యుతుండుగా= జ్యేష్ఠా నక్షత్రంతో కూడినవాడుగా; ప్రకాశ, జయ+ఉన్నతము+ఐన= కాంతితో, జయంతో ఉచ్చస్థితిలో ఉండగా; అష్టమిన్= అష్టమినాడు; మిత్త్ర, ముఖ, గ్రహ, ప్రతతి= సూర్యుడు మొదలైన గ్రహాల సమూహం; మేలుగన్= బాగుండగా; ఆభిజిత+ఉదయంబునన్= అభిజిన్ముహూర్తం ప్రారంభంలో; ధర్మ+అంశమునన్= ధర్మునియొక్క అంశం చేత; పుత్త్రుఁడు; అతి, స్థిర, ధర్మ, మూర్తి+ఐ= మిక్కిలి స్థిరమైన ధర్మం ఆకారంగా కలవా డై; పుట్టెన్.

**తాత్పర్యం:** దిక్కు లన్నీ వెలుగగా, చంద్రుడు జ్యేష్ఠా నక్షత్రంతోకూడి ఉచ్చస్థితిలో ఉండగా, సూర్యాదిగ్రహాలు శుభస్థానాలలో ఉండగా, అష్టమినాడు అభిజిన్ముహూర్తప్రారంభంలో ధర్మదేవతఅంశచేత శత్రువులను జయించగల పరాక్రమంతో ధర్మరాజు జన్మించాడు.

**విశేషం:** ఆంధ్రమహాభారత సంశోధితముద్రణప్రతిలో ఈక్రింది వివరణం అధస్సూచికలో ఇవ్వబడింది; "యుధిష్ఠిరుఁడు వికృతి సంవత్సర ఫాల్గుణ బహుళ అష్టమియందు జన్మించినట్లు భారతకూలంకష వ్యాఖ్యాకారుఁడు వివరించెను. కలియుగాది ప్రమాది సంవత్సరము చైత్రశుద్ధపాడ్యమిగనుక, ఆ పయిని నూటయెనిమిదియేళ్ళ యెనిమిది దినముల క్రిందట యుధిష్ఠిర జననము. ఆ తిథికి - అనగా ఫాల్గుణబహుళఅష్టమికి - జ్యేష్ఠానక్షత్రము వచ్చును. జయతిథిన్నీ అవును. ధర్మరాజు తరువాత సంవత్సరమునకు భీమునిపుట్టుక - ఖరసంవత్సరఫాల్గుణశుక్లత్రయోదశి మాఘనక్షత్రము. దుర్యోధనుఁడు భీమునికన్న మూఁడుయామములు 'చింన్న" చిన్న. అర్జునుఁడు నందనసంవత్సర ఫాల్గుణశుక్ల పౌర్ణమాసి" (పుట.279). సంశోధితముద్రణప్రతిలో 'శాత్రవ', 'మిత్ర' శబ్దప్రయోగం ఉన్నది. వావిళ్ళప్రతిలో 'మిత్ర' శబ్దం ఉంది. 'క్షత్ర శబ్దం క్షత్ర'గా వాడబడింది. ఈ రెండింటిని గమనించి ప్రాససామ్యం పరిష్కరించటమైనది.

నన్నయ ధర్మజుని పుట్టుకను ఉత్పలమాలలో వర్ణించాడు. మహావీరుల పుట్టుకలను, వారికి సంబంధించిన అంశాలను వర్ణించినప్పుడు కొన్నిటికి ఉదాత్త గంభీరమైన ఉత్పల చంపకమాలా వృత్తాలను ఎన్నుకొని, నన్నయ సజాతీయఛందస్సంవాద శిల్పాన్ని వెలార్చి పద్యవిద్యను ప్రదర్శించాడు. ఉదాహరణకు; కర్ణుని పుట్టుక (5.26) పాండురాజు తనకు సంతానాన్ని సమకూర్చు మని కుంతిని కోరటం( 5.90), వ్యుషితాశ్వునిపరాక్రమం (5.78), మరొక పుత్రునికొరకు వాయుదేవుడిని ఉపాసించు మని పాండురాజు కుంతిని కోరటం (5.102), భీముని పుట్టుక (5.104), ఇంద్రుని అంశతో కుమారుడిని కను మని పాండురాజు కుంతిని కోరటం (5.120) ధర్మజాదుల నందరిని పాండురాజుపుత్రులుగా గుర్తించి, హస్తినాపురిప్రజలు మొదటిసారిగా వారిని చూచినతీరు (5.150) మొదలైన చోట్ల చంపకమాలలు గమనించతగినవి. ధర్మరాజుజననం (5-94), ధృతరాష్ట్ర రాజ్యపాలనం (5.6), పాండురాజువిలాసం (5.47), సంతానంకొరకు ప్రార్థన (5.73), మాద్రి సంతానం కొరకు పరితపించటం (5.129), హస్తినాపుర ప్రజలు పాండవులను అసాధారణవ్యక్తు లని కీర్తించటం (5.151), (5.153), ఏకలవ్యునివర్ణనం (5.235) ఉత్పలమాలలో ఉన్నాయి. ఈ పద్యా లన్నింటిలోకంటె ధర్మజునిపుట్టుక వర్ణించే ఉత్పలమాల వృత్తంలో సంయుక్తాక్షరంతో దుష్కరప్రాస వాడి మిగిలినవారికంటె ధర్మజుని సంశ్లిష్టమైన ఉదాత్తవ్యక్తిత్వాన్ని ధ్వనింపచేయటం విశేషం. పద్యరచనలో కాంతి అనే శబ్దగుణాన్ని ఉజ్జ్వలంగా పోషించి నన్నయ గుణవద్రచనాశిల్పాన్ని వెలార్చాడు. 'శాత్రవ జైత్ర తేజమున సర్వదిశల్ వెలుగంగ' అనే విశేషణంలోనే కాంతిగుణం సూచించబడింది. ఉజ్జ్వలమైన తారాచంద్ర గ్రహ దైవబలాల వర్ణనతో అది ప్రకాశించింది. జ్యేష్ఠానక్షత్రం (పెద్దవాడుగా సూచించే నక్షత్రం)లో తారాబలం, చంద్రుడి శుభస్థితిలో చంద్రబలం, మిత్రగ్రహస్థితిలో గ్రహబలం, 'అతిస్థిరధర్మమూర్తి' అనిచెప్పి లోకాన్ని ధరించే ధర్మమే మూర్తికట్టినవా డని చెప్పటంతో దైవబలం-సూచించటంవలన ఒక పరిపూర్ణపురుషుడి ఉజ్జ్వలవ్యక్తిత్వాన్ని నన్నయ ధ్వనింపచేశాడు. జననకాలశుభగ్రహలక్షణాదులవివరంతో ఇతిహాసనాయకుడైన ధర్మజుడి జన్మఘట్టాన్ని వర్ణించి (ఇతరులకు ఈ వివరాలు ఇవ్వలేదు) అతడు భావికాలంలో చరిత్రపై వేయబోయే ప్రభావాన్ని ధ్వనిమయంగా నన్నయ సూచించాడు. (సంపా.)

**క. ధరణీసురు లాదిగ ను । ర్వరలోఁ గల సర్వభూత వర్గం బెల్లం**
**బరమోత్సవ మొందెను గుణ । శరణ్యుఁ డగు ధర్మజన్ము జన్మదినమునన్. 95**

**ప్రతిపదార్థం:** ధరణీ, సురులు+ఆదిగన్= బ్రాహ్మణులు మొదలుగా; ఉర్వరలోన్= భూమిమీద; కల= ఉన్న; సర్వ, భూత, వర్గంబు= అన్ని ప్రాణుల సమూహం; ఎల్లన్= అంతయు; గుణ, శరణ్యుడు= మంచిగుణాలకు స్థానమైనవాడు; అగు; ధర్మ,

జన్మ, జన్మ, దినమునన్= ధర్ముడినుండి పుట్టిన వానియొక్క జన్మదినాన - అనగా ధర్మరాజు పుట్టినరోజున; పరమ+ఉత్సవము= మిక్కిలి ఆనందం; ఒందెను= పొందాయి.

**తాత్పర్యం:** గుణవంతు డైన ధర్మరాజు పుట్టినరోజు బ్రాహ్మణులు మొదలుకొని భూమిమీద ఉన్న అన్ని ప్రాణులు ఎంతో ఆనందాన్ని పొందాయి.

**విశేషం:** ఇది శుభకరమైన మహాశకునం. సర్వభూతహితుడు, ధర్మరక్షకుడు, ప్రజారంజకుడైన సమ్రాట్టు కానున్నా డన్న భావిసూచన ఇందులో ధ్వని.

**క. శతశృంగ నిలయు లగు సం। శ్రితవ్రతులు విప్రవరులు సేసిరి ధర్మ**
**స్థితి జాతకర్మ మత్యు। న్నతిఁ బాండుప్రథమపుత్త్రునకు హర్షముతోన్. 96**

**ప్రతిపదార్థం:** పాండు, ప్రథమ, పుత్త్రునకున్= పాండురాజుయొక్క మొదటికుమారునికి; శత, శృంగ, నిలయులు+అగు= శతశృంగ పర్వతాన్ని ఉనికిపట్టుగా కలవాళ్ళయిన; సంశ్రిత, వ్రతులు= ఆశ్రయింపబడిన వ్రతం కలవాళ్ళు; విప్ర, వరులు= బ్రాహ్మణ శ్రేష్ఠులు; ధర్మ, స్థితి= ధర్మమార్గంలో; అతి+ఉన్నతిన్= మిక్కిలి గొప్పగా; జాతకర్మము= పుట్టినప్పుడు శిశువుకు చేసే సంస్కారం; హర్షముతోన్= సంతోషంతో; చేసిరి.

**తాత్పర్యం:** పాండురాజుయొక్క మొదటి కుమారునికి శతశృంగపర్వతంమీద వ్రతదీక్ష పూని ఉన్న బ్రాహ్మణ శ్రేష్ఠులంతా ధర్మమార్గంలో సంతోషంతో చాలాగొప్పగా జాతకర్మ చేశారు.

**క. కురుకుల విభుఁ డగు ధర్మ। స్థిరమతి యగు నీతఁ డనుచు ధృతిఁ జేసి యుధి**
**ష్ఠిరుఁ డను నామముఁ దా ను। చ్చరించె నాకాశవాణి జనవినుతముగన్. 97**

**ప్రతిపదార్థం:** ఈతఁడు= ఈ ధర్మనందనుడు; కురు, కుల, విభుఁడు= కురువంశానికి రాజు; అగున్; ధర్మ, స్థిర, మతి= ధర్మంలో స్థిరమైన బుద్ధికలవాడు; అగున్= కాగలడు; అనుచున్; ఆకాశవాణి; ధృతిన్+చేసి= ధైర్యంవలన; యుధిష్ఠిరుఁడు= యుద్ధంలో నిలుకడ కలవాడు; అను; నామమున్= పేరును; తాను= ఆ ఆకాశవాణి; జన, వినుతముగన్= జనులచేత కొనియాడబడేది ఔనట్లుగా; ఉచ్చరించెన్= పలికింది.

**తాత్పర్యం:** ఈతడు కురువంశానికి రా జవుతాడు. ధర్మంలో స్థిరమైన బుద్ధి కలవాడు అవుతాడు. ధైర్యంవలన యుధిష్ఠిరు డవుతాడు' అని ఆకాశవాణి లోకం కొనియాడేటట్లుగా అతనికి యుధిష్ఠిరు డనే పేరు పెట్టింది.

**విశేషం:** ఆకాశవాణి పేరుపెట్టటంచేత యుధిష్ఠిరుడు దేవహితు డని సూచన. పాండుధృతరాష్ట్రుల తరువాత వంశకర్తల గౌరవం నిలిపే చక్రవర్తి అత డౌతా డనీ, ధర్మాచరణంలో వీరుడూ, ధీరుడూ, స్థిరుడూ అయి ధర్మవీరరసప్రధానకథానాయకుడు కాగల డనీ ధ్వని. మహాభారతేతిహాసంలో మొదటినుండి చివరిదాకా ధృతితో నిలిచే ధర్మమూర్తి యుధిష్ఠిరుడు. (సంపా.)

### గాంధారి యుదరతాడనంబు గావించుకొనుట (సం. 1-107-8)

**వ. ఇట్లు పుత్త్రోదయంబునఁ బరమహర్ష సంపూర్ణ హృదయుం డై పాండురాజు కుంతీ మాద్రీ సహితుండై శతశృంగంబున నుండునంత, నట ముందఱ ధృతరాష్ట్రువలనన్ గాంధారి కృష్ణద్వైపాయనువరంబున గర్భంబు దాల్చి, యొక్క**

**సంవత్సరంబు నిండినఁ బ్రసూతి కాకున్నం బదరుచుఁ బుత్త్రలాభలాలస యయి యున్న యది యప్పు డయ్యుధిష్ఠిరు జన్మంబు విని మనస్తాపంబున నుదరతాడనంబుఁ జేసికొనిన, గర్భపాతం బగుడును. 98**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పుత్త్ర+ఉదయంబునన్= కొడుకు పుట్టుకచేత; పరమ, హర్ష, సంపూర్ణ, హృదయుండు+ఐ= ఎక్కువ సంతోషంచేత నిండిన మనస్సు కలవాడై; పాండురాజు; కుంతీ, మాద్రీ, సహితుండు+ఐ= కుంతీదేవితో, మాద్రితో కూడినవాడై; శతశృంగంబునన్+ ఉండునంతన్= శతశృంగపర్వతమున, ఉండగా; అట= అక్కడ - హస్తినాపురంలో; మున్దఱ= ముందుగా; ధృతరాష్ట్రువలనన్= ధృతరాష్ట్రునివల్ల; గాంధారి= గాంధారి; కృష్ణద్వైపాయను, వరంబునన్= కృష్ణద్వైపాయనుని వరంచేత; గర్భంబున్, తాల్చి= గర్భము ధరించి; ఒక్క, సంవత్సరంబు నిండినన్= ఒక సంవత్సరము పూర్తికాగా; ప్రసూతి=కాన్పు; కాకున్నన్= కాకపోగా; పదరుచు= త్వరపడుచు; పుత్త్ర, లాభ, లాలస+అయి= కొడుకును పొందా లనే మితిమీరిన ఆసక్తి కలది అయి; ఉన్న; అది= అయినది; అప్పుడు; ఆ+యుధిష్ఠిరు, జన్మంబున్= ఆ యుధిష్ఠిరుని పుట్టుకను; విని; మనస్+ తాపంబునన్= మనస్సులోని దుఃఖంచేత; ఉదర, తాడనంబున్= కడుపును బాదుకోవటం; చేసికొనిన= చేసుకో; గర్భ, పాతంబు= గర్భం క్రిందపడటం; అగుడును= కాగా.

**తాత్పర్యం:** ఇట్లా కొడుకు పుట్టటంవలన ఎంతో ఆనందించి పాండురాజు కుంతీమాద్రులతో శతశృంగాన ఉండగా, హస్తినాపురంలో కృష్ణద్వైపాయనునివరంచేత, ధృతరాష్ట్రునివలన, కుంతికన్నా ముందే గర్భవతి అయిన గాంధారి, ఒక సంవత్సర మైనా తనకు కాన్పు కాకపోవడంతో త్వరపడుతూ కొడుకును పొందా లని తహతహలాడుతూ ఉండగా, యుధిష్ఠిరుడు కుంతికి పుట్టాడని విని, కడుపును బాదుకోగా గర్భపాత మయింది.

**విశేషం:** తల్లుల మనఃప్రవృత్తులకు పిల్లలు ప్రతిబింబా లౌతారు. విశ్వశ్రేయస్సును కోరి, ధర్మమూర్తిని కోరి, కన్నది-కుంతీదేవి. కుంతీదేవికంటె ముందుగా గర్భవతి అయినా, తొలికాన్పు కుంతీదేవికే దక్కిం దని అసూయతో తనగర్భాన్ని తానే విచ్ఛిన్నం చేసుకొన్నది-గాంధారి. ధర్మరాజు వంశాన్నీ, ధర్మాన్నీ నిలిపేవా డౌతాడు; దుర్యోధనాదులు వంశాన్ని విచ్ఛిన్నం చేసేవా రౌతారు. ఇది వస్తుధ్వని. గాంధారిగర్భవిచ్ఛిత్తియే వంశవిచ్ఛిత్తికి సూచన. ఆమె అసూయామాత్సర్యాదిగుణాలే సంతానానికి వర్తించాయి. (సంపా.)

**క. దాని నెఱింగి పరాశర। సూనుఁడు చనుదెంచి సుబలసుతఁ జూచి 'మనో**
**హీన వయి గర్భపాతము। గా నిట్టులు సేయు టిదియుఁ గర్తవ్యం బే.' 99**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ గర్భపాతవృత్తాంతాన్ని; ఎఱింగి= తెలిసికొని; పరాశర, సూనుఁడు= పరాశరుని కుమారుడు - కృష్ణద్వైపాయనుడు; చనుదెంచి= వచ్చి; సుబల, సుతన్= సుబలునియొక్క కూతురిని - గాంధారిని; చూచి; మనోహీనవు+అయి= మనస్సులేని దాన వై; గర్భ, పాతము= గర్భం క్రిందపడుట; కాన్= అగునట్లుగా; ఇట్టులు= ఈ విధంగా; చేయుట; ఇదియున్= ఇట్టి హీనకార్యం; కర్తవ్యంబు+ఏ= చేయతగిందా?

**తాత్పర్యం:** అది తెలిసి కృష్ణద్వైపాయనుడు వచ్చాడు. గాంధారిని చూచి 'నీవు బుద్ధి లేకుండా ఈ విధంగా గర్భపాతం చేసికొనటం తగునా?' అన్నాడు.

**విశేషం:** ఈ పద్యంలో సముచ్చయంతోకూడిన 'ఇది' శబ్దంలో ఎంతో అర్థం ఇమిడిఉంది. అంతటి హీనమైన కార్యానికి అది సున్నితమైన మందలింపు. మందమతివై ఇంతటి తెగువకు పూనుకోవడం తగునా అని హెచ్చరిక.

**క. ఇమ్మాంసపేశి నేకశ । త మ్ముదయింతురు సుతులు ముదమ్మున; నిది త**
**థ్యమ్; ఇంక నైన నతియ । త్నమ్మున రక్షింపు దీని నా వచనమునన్. 100**

**ప్రతిపదార్థం:** ఈ+మాంస, పేశిన్= ఈ మాంసపు ముద్దనుండి; ఏక శతమ్ము= నూటొక్కమంది; సుతులు= కుమారులు, కూతుళ్ళు; ముదమ్మునన్= సంతోషంతో; ఉదయింతురు= పుడతారు; ఇది+తథ్యమ్ము= ఇది నిజం; ఇంకన్+ ఐనన్= ఇకనైనా; నా వచనమునన్= నా, మాటచేత; దీనిన్= ఈ మాంసపుముద్దను; అతి, యత్నమ్మునన్= మిక్కిలి ప్రయత్నంతో; రక్షింపు= కాపాడుము.

**తాత్పర్యం:** ఈ మాంసపుముద్దనుండి నూటొక్కమంది కొడుకులు కూతుళ్ళు (నూరుగురు కొడుకులు, ఒక కూతురు) పుడతారు. ఇది నిజం. నా మాట నమ్మి దీనిని చాలాజాగ్రత్తగా కాపాడుకొమ్ము.

**విశేషం:** ఏకశతము - (చూడు. 9వ పద్యవిశేషం.)

**వ. అని గాంధారిం బదరి తొల్లివేదంబులు విభాగించిన మహానుభావుం డమ్మాంసపేశి నేకోత్తరశతఖండంబులుగా విభాగించి, 'వీని వేఱు వేఱ ఘృత కుండలంబులం బెట్టి, శీతలజలంబులం దడుపుచు నుండునది; యిందు నూర్వురు గొడుకులు నొక్క కూతురుం బుట్టుదు'రని చెప్పి చనినఁ, దద్వచనప్రకారంబు చేయించి, గాంధారీ ధృతరాష్ట్రులు సంతసిల్లియున్న; నిట శతశృంగంబున. 101**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; గాంధారిన్; పదరి= నిందించి; తొల్లి= పూర్వం; వేదంబులు; విభాగించిన; మహానుభావుండు; ఆ+మాంస, పేశిన్= ఆ మాంసపు ముద్దను; ఏక+ఉత్తర, శత, ఖండంబులుగా= నూటొక్క ముక్కలుగా; విభాగించి; వీనిన్= ఈ ముక్కలను; వేఱు, వేఱు+అ= వేర్వేరుగా; ఘృత, కుండలంబులన్= నేతికుండలలో; పెట్టి; శీతల జలంబులన్= చల్లని నీటితో; తడుపుచున్, ఉండునది= తడుపుతూ ఉండవలసింది; ఇందున్= ఈ కుండలలో; నూర్వురు, కొడుకులున్= నూరుమంది కుమారులూ; ఒక్క కూతురున్= ఒక కుమార్తె; పుట్టుదురు= జన్మిస్తారు; అని; చెప్పి; చనినన్= వెళ్ళగా; తద్+వచన ప్రకారంబు= ఆయనమాట ప్రకారం; చేయించి; గాంధారీ, ధృతరాష్ట్రులు; సంతసిల్లి, ఉన్నన్= సంతోషించి ఉండగా; ఇటన్, శతశృంగంబునన్= ఇక్కడ, శతశృంగపర్వతం దగ్గర.

**తాత్పర్యం:** అని గాంధారిని ఆక్షేపించి; పూర్వం వేదాలను విభజించిన మహానుభావుడు వ్యాసుడు, ఆ మాంసపు ముద్దను నూటొక్క ముక్కలుగా చేసి, 'వేర్వేరుగా వీటిని నేతి కుండలలో పెట్టి, చన్నీళ్ళతో తడుపుతూ ఉండండి, వీటినుండి నూరుమంది కొడుకులు, ఒక్క కూతురు పుడతారు' అని చెప్పి వెళ్ళగా, గాంధారీ ధృతరాష్ట్రులు ఆయన చెప్పినప్రకారం చేయించి, సంతోషంతో ఉండగా - ఇక్కడ శతశృంగపర్వతం దగ్గర.

**చ. నిరుపమకీర్తి పాండుధరణీపతి వెండియుఁ గుంతిఁ జూచి 'యం**
**బురుహదళాక్షి ! యింక నొకపుత్త్రు నుదారచరిత్రు నుత్తమ**
**స్థిరజవసత్త్వు నయ్యనిలదేవుదయం జనియింపు పెంపుతోఁ ;**
**గురుకులరక్షకుం డతఁ డగున్ బలవద్భుజవిక్రమోన్నతిన్. 102**

**ప్రతిపదార్థం:** నిరుపమ, కీర్తి= సాటిలేని కీర్తి కలవాడు; పాండుధరణీపతి= పాండురాజు; వెండియున్= మళ్ళీ; కుంతిన్; చూచి; అంబురుహ, దళ+అక్షి= తామరరేకులవంటి కన్నులు కలదానా; ఇంకన్, ఒక పుత్త్రున్= ఇంకా ఒక కుమారుని; ఉదార, చరిత్రున్= గొప్పనడవడి కలవాడిని; ఉత్తమ, స్థిర, జవ, సత్త్వున్= శ్రేష్ఠమైన, స్థిరమైన వేగం, బలం కలవానిని; ఆ+అనిలదేవు, దయన్= ఆ వాయుదేవునిదయచేత; జనియింపు= పుట్టించుము; అతఁడు= ఆ పుత్రుడు; పెంపుతోన్= గొప్పతనంచేత; బలవత్+భుజ, విక్రమ+ ఉన్నతిన్= బలమైన భుజాల పరాక్రమంయొక్క అతిశయంచేత; కురు, కుల రక్షకుండు= కురువంశాన్ని రక్షించేవాడు; అగున్= కాగలడు.

**తాత్పర్యం:** సాటిలేనికీర్తి కల పాండురాజు కుంతీదేవిని చూచి, 'నీవు గొప్పనడవడి కలవాడూ, శ్రేష్ఠమైన, స్థిరమైన వేగం, బలం కలవాడూ అయిన మరో కొడుకును, వాయుదేవునిదయతో కనుము. అతడు గొప్పగా తన భుజబలపరాక్రమంచేత కురువంశాన్ని రక్షిస్తాడు.'

**విశేషం:** పాండురాజుపుత్త్రసంకల్పాలు విశిష్టంగా ఉన్నాయి. సత్యాన్నీ, ధర్మాన్నీ సర్వలోకంలో నిలుపగలిగినవాడుగా మొదటి కొడుకును కోరాడు. ధర్ముడిని ఆరాధించి యుధిష్ఠిరుడిని పొందాడు. ఇప్పుడు మహాబలశాలి అయిన కొడుకును వంశరక్షణం కొరకు కోరుకొంటున్నాడు. ముందు ధర్మరక్షణం, (లోకరక్షణం) ఆ తరువాత వంశరక్షణం. ఆ క్రమంలో పాండురాజుయొక్క ధార్మికచింతన వెల్లడిఅవుతున్నది. పాండురాజు చంద్రవంశకర్తలలో ఒకడుకదా! (సంపా.)

**వ. అని పనిచిన నెప్పటియట్ల కుంతీదేవి వాయుదేవు నారాధించి తత్ప్రసాదంబున గర్భంబు దాల్చి, సంవత్సరంబు సంపూర్ణం బగుడును. 103.**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; పనిచినన్= ఆజ్ఞాపించగా; ఎప్పటి అట్లు+అ= ఎప్పటివలెనే; కుంతీదేవి; వాయుదేవున్; ఆరాధించి; తద్+ప్రసాదంబునన్= ఆయన అనుగ్రహంచేత; గర్భంబున్; తాల్చి= ధరించి; సంవత్సరంబు= ఒక్క సంవత్సరం; సంపూర్ణంబు= పూర్తి; అగుడును= కాగా.

**తాత్పర్యం:** అని ఆజ్ఞాపించగా ఎప్పటివలెనే కుంతీదేవి వాయుదేవుడిని పూజించింది. అతనిదయవలన గర్భం తాల్చింది. ఒకఏడాది పూర్తి కాగానే -

**చ. సుతుఁడు నభస్వదంశమున సుస్థిరుఁ డై యుదయించినన్ మహా**
**యతికృత జాతకర్ముఁ డగు నాతని కాతతవీర్యవిక్రమో**
**న్నతునకు భీమసేనుఁ డను నామముఁ దా నొనరించె దివ్యవా**
**క్సతి శతశృంగశైల నివసన్మునిసంఘము సంతసిల్లఁగన్. 104**

**ప్రతిపదార్థం:** సుతుఁడు= కుమారుడు; నభస్వత్+అంశమునన్= వాయుదేవునియొక్క అంశంచేత; సుస్థిరుఁడు+ఐ= మిక్కిలి నిలుకడ కలవాడై; ఉదయించినన్= పుట్టగా; మహా, యతి, కృత, జాతకర్ముఁడు= గొప్ప ఋషులచే చేయబడిన జాతకర్మం కలవాడు; అగు, ఆతనికిన్= ఆ వాయుపుత్రునికి; ఆతత, వీర్య, విక్రమ+ఉన్నతునకు= అధికబలపరాక్రమాలచేత గొప్పవాడైన వానికి; దివ్య, వాక్+సతి= ఆకాశవాణి; తాన్= తను; శతశృంగ, శైల, నివసత్+ముని, సంఘము= శతశృంగ పర్వతం మీద నివసించే మునుల సమూహం; సంతసిల్లఁగన్= సంతోషింపగా; భీమసేనుఁడు; అను; నామమున్= పేరును; ఒనరించెన్= చేసింది.

**తాత్పర్యం:** వాయుదేవునిఅంశతో మహాబలవంతు డైనకొడుకు పుట్టగా, మహర్షులు అతనికి జాతకర్మ చేశారు. అధికబలపరాక్రమాలచేత ఉన్నతు డైన ఆ బాలునికి శతశృంగపర్వతంమీద నివసించే మహర్షు లందరూ సంతోషించేటట్లుగా ఆకాశవాణి భీమసేను డని నామకరణం చేసింది.

**విశేషం:** ఈ పద్యరచనలో ప్రసాదగుణం పోషింపబడింది. మునిసంఘం పొందిన సంతోషానికి కారకుడైన భీమునిపుట్టుకను ఆ గుణంలో వర్ణించటం ఔచిత్యం. ధర్మజుని పుట్టుకను వర్ణించిన పద్యంలో (5-94) సంయుక్తాక్షరమైన తవర్ణాన్ని ప్రాసగా నిలపటంవలన ధర్మజుడు నాయకుడు కాగా, ఈ వృత్తంలో అసంయుక్త మైన తకారం ప్రాసగా నిలపటంవలన భీమసేనుడు అనునాయకుడుగా ఎల్లప్పుడు అన్నను అనుసరించి ఉంటా డని ఛందశ్శిల్పంతో నన్నయ సాధించినవస్తుధ్వని. (సంపా.)

## దుర్యోధనాదుల జననము (సం.1-107-24)

**క. అనిలజు పుట్టిన దివసము - నన యట దుర్యోధనుండు నరనుత ! ధృతరా**
**ష్ట్రునకున్ గాంధారికి న । గ్ర నందనుఁడు ఘనుఁడు పుట్టెఁ గలియంశమునన్. 105**

**ప్రతిపదార్థం:** నరనుత= జనులచేత పొగడబడేవాడా! ఓ జనమేజయ మహారాజా!; అనిలజు, పుట్టిన, దివసమునన= వాయుదేవుని కుమారు డైన భీమసేనుడు పుట్టినరోజే; అట= హస్తినాపురంలో; కలి, అంశమునన్ = కలియొక్క అంశంలో; గాంధారికిన్; ధృతరాష్ట్రునకున్; అగ్ర, నందనుఁడు= పెద్దకొడుకు; ఘనుఁడు= గొప్పవాడు; దుర్యోధనుండు; పుట్టెన్.

**తాత్పర్యం:** ఓ జనమేజయమహారాజా! వాయుపుత్రుడు భీముడు పుట్టినరోజే, హస్తినాపురంలో గాంధారీ ధృతరాష్ట్రులకు కలిఅంశతో పెద్దకొడుకుగా గొప్పవాడైన దుర్యోధనుడు పుట్టాడు. (అని వైశంపాయనమహర్షి చెప్పటం ప్రారంభించాడు.)

**శా. ఆదుర్యోధనుఁ డుద్భవిల్లుడును గ్రవ్యాదారవంబుల్ శివా**
**నాదంబుల్ మదఘూకఘూంకృతులు నానారాసభధ్వానముల్**
**భూదిక్కంపముగాఁ జెలంగె విగతాంభోభృన్నభోవీథియం**
**దాదిత్యద్యుతి మాయఁగాఁ గురిసె నుగ్రాసృఙ్మహావర్షముల్. 106**

**ప్రతిపదార్థం:** ఆ, దుర్యోధనుఁడు; ఉద్భవిల్లుడును= పుట్టగా; క్రవ్యాద+ఆరవంబుల్= క్రూరమృగాల అరుపులు; శివా, నాదంబుల్= ఆడునక్కలయొక్క కూతలు; మద, ఘూక, ఘూంకృతులు= మదించిన గుడ్లగూబల ఘూంకారాలు; నానా, రాసభ, ధ్వానముల్= అనేకవిధా లైన గాడిదల ఓండ్ర శబ్దాలు; భూ, దిక్+కంపము, కాన్= భూమికి, దిక్కులకు చలనం కలిగేటట్లు; చెలంగెన్= మ్రోగాయి; విగత+అంభస్+భృత్+నభస్+వీథి, అందున్= పోయిన మేఘాలు కల ఆకాశమార్గంలో; ఆదిత్య, ద్యుతి= సూర్యునియొక్క కాంతి; మాయఁగాన్= నశించేటట్లుగా; ఉగ్ర+అసృక్+మహా, వర్షముల్= భయంకర మైన నెత్తుటి పెనువానలు; కురిసెన్= కురిశాయి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పుట్టగానే క్రూరమృగాల అరుపులు, నక్కలకూతలు, మదించినగుడ్లగూబల ఘూంకారాలు, నానావిధా లైన గాడిదల ఓండ్రలు, భూమి, దిక్కులు కంపించే విధంగా చెలరేగాయి. ఆకాశంలో నీటిని ధరించిన మేఘాలు తొలగి, సూర్యకాంతి మాసేటట్లుగా భయంకర మైన పెద్దనెత్తుటివానలు కురిశాయి.

**విశేషం:** ఇవి అన్నీ లోకోపద్రవాన్ని సూచించే అపశకునాలు. పాండురాజుపెద్దకొడుకు పుట్టినప్పుడు సర్వలోకానందకరాలైన శుభశకునాలు కలిగాయి. ధృతరాష్ట్రునిపెద్దకొడుకు పుట్టినప్పుడు సర్వలోకారిష్టదాయకాలైన అపశకునాలు కలిగాయి. ఇవి

భావికథలో కురువంశంలో వా ళ్ళిద్దరూ వరుసగా నిర్వహించే నిర్మాణాత్మక, విధ్వంసకాత్మకపాత్రల ప్రవృత్తులను ధ్వనింప చేస్తున్నాయి.

**వ. మఱియు దుర్యోధనజన్మానంతరంబున ధృతరాష్ట్రునకు వైశ్యాపుత్త్రుం డయిన యుయుత్సుండు పుట్టె; నంత గాంధారికి నొక్కొక్కదివసంబున నొక్కొక్కరుండుగాఁ గ్రమంబున దుశ్శాసన దుస్సహ దుశ్శల జలసంధ సమ సహ విందానువింద దుర్ధర్ష సుబాహు దుష్ప్రధర్షణ దుర్మర్షణ దుర్ముఖ దుష్కర్ణ కర్ణ వివింశతి వికర్ణ శల సత్త్వ సులోచన చిత్రోపచిత్ర చిత్రాక్ష చారుచిత్ర శరాసన దుర్మద దుర్విగాహ వివిత్సు వికటాన నోర్ణనాభ సునాభ నందోపనందక చిత్రబాణ చిత్రవర్మ సువర్మ దుర్విమోచనాయోబాహు మహాబాహు చిత్రాంగ చిత్రకుండల భీమవేగ భీమబల బలాకి బలవర్ధ నోగ్రాయుధ సుషేణ కుండధార మహోదర చిత్రాయుధ నిషంగి పాశి బృందారక దృఢవర్మ దృఢక్షత్త్ర సోమకీ ర్త్యనూదర దృఢసంధ జరాసంధ సద సువా గుగ్రశ్రవ ఉగ్రసేన సేనానీ దుష్పరాజ యాపరాజిత కుండశాయి విశాలాక్ష దురాధర దుర్జయ దృఢహస్త సుహస్త వాతవేగ సువర్చ ఆదిత్యకేతు బహ్వాశి నాగదత్తాగ్రయాయి కవచి క్రథన కుండి ధనుర్ధ రోగ్ర భీమరథ వీరబాహ్వ లోలు పాభయ రౌద్రకర్మ దృఢరథాశ్ర యానాధృష్య కుండభేది విరావి ప్రమథ ప్రమాథి దీర్ఘరోమ దీర్ఘబాహు వ్యూఢోరు కనకధ్వజ కుండాశి విరజసు లనంగా నూర్వురు గొడుకులు పుట్టిన. 107**

**ప్రతిపదార్థం:** మఱియు; దుర్యోధన, జన్మ+అనంతరంబున= దుర్యోధనునిపుట్టుక తర్వాత; వైశ్యా, పుత్త్రుండు+అయిన= కోమటి స్త్రీ కొడుకైన; యుయుత్సుండు; పుట్టెన్; గాంధారికిన్; ఒక్కొక్క, దివసంబునన్= ఒక్కొక్క రోజు; ఒక్కొక్కరుండుగాన్= ఒక్కొక్కడుగా; క్రమంబునన్= వరుసగా; దుశ్శాసనుడు, దుస్సహుడు మొదలైనవారు; అనంగాన్; నూర్వురు= వందమంది; కొడుకులు= కుమారులు; పుట్టినన్= పుట్టగా.

**తాత్పర్యం:** అంతేకాక, దుర్యోధనుడు పుట్టినతరువాత ధృతరాష్ట్రునికి వైశ్యకులపత్నివలన యుయుత్సు డనే కొడుకు పుట్టాడు. ఆ తరువాత గాంధారికి రోజు కొక్కడుగా దుశ్శాసనాదులు వరుసగా పుట్టారు. (వారిపే ర్లన్నీ పై వచనంలో వరుసగా ఉన్నాయి). ఈ విధంగా మొత్తం నూరుగురుకొడుకులు పుట్టారు.

**తే. ఆ తనూజుల కందఱ కనుజ యై ల। తాంగి దుశ్శల యను కూఁతు రమరఁ బుట్టె ;**
**నందు దౌహిత్రవంతుల దైన్య పుణ్య। గతియుఁ గాంతు నే నని పొంగెఁ గౌరవుండు. 108**

**ప్రతిపదార్థం:** ఆ, తనూజులకు+అందఱకున్= ఆ కుమారులందరికి; అనుజ+ఐ= అనుసరించి పుట్టిన దై - అనగా చెల్లె లై; లతా+అంగి= తీగవంటి దేహం కలది; దుశ్శల; అను; కూఁతురు; అమరన్= ఒప్పుగా; పుట్టెన్; అందున్= ఆమెయందు; దౌహిత్రవంతులది+ఐన= కూతురియొక్క కొడుకులు కలవారిది అయిన; పుణ్య, గతియున్= పుణ్యలోకంకూడ; నేనున్; కాంతున్= పొందుతాను; అని= ఆ విధంగా; కౌరవుండు= ధృతరాష్ట్రుడు; పొంగెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** ఆ కొడుకు లందరికి చెల్లెలుగా సుకుమారి అయి దుశ్శల అనే కూతురు పుట్టింది. ఆమెవలన దౌహిత్రులు కలవాళ్ళు పొందేపుణ్యలోకాన్నికూడా పొందుతా నని ధృతరాష్ట్రుడు సంతోషించాడు.

**విశేషం:** దుహిత అంటే కూతురు అని అర్థం. ఆమెకొడుకు దౌహిత్రుడు.

**వ. ఇట్లేకోత్తరశతపు త్త్రులం బడసి కృతార్థుండై యున్న ధృతరాష్ట్రుకడకు భీష్మవిదురాది బంధుజనంబులుఁ బురోహితప్రముఖ బ్రాహ్మణవరులును వచ్చి యొక్కనాఁ డేకాంతంబున ని ట్లనిరి. 109**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ఏకోత్తర, శత, పుత్త్రులన్= నూటొక్కమంది కొడుకులను కూతుండ్రను (100మందికొడుకులు, ఒకకూతురు); పడసి= పొంది; కృత+అర్థుండు+ఐ= తీరిన కోరిక కలవాడై; ఉన్న; ధృతరాష్ట్రు, కడకు= ధృతరాష్ట్రునిదగ్గరకు; భీష్మ, విదుర+ఆది, బంధు, జనంబులున్= భీష్ముడు, విదురుడు మొదలైన బంధువులు; పురోహిత, ప్రముఖ, బ్రాహ్మణ, వరులును= పురోహితులు మొద లైన బ్రాహ్మణ శ్రేష్ఠులు; వచ్చి; ఒక్కనాఁడు; ఏకాంతంబునన్= ఒంటరిగ; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** ఈ విధంగా నూటొక్కమంది పిల్లల్ని పొంది కోరిక తీరిన ధృతరాష్ట్రుని దగ్గరకు భీష్ముడు, విదురుడు మొదలైన బంధువులు, పురోహితులు మొదలైన బ్రాహ్మణ శ్రేష్ఠులు వచ్చి ఒంటరిగా అతనితో ఇట్లా అన్నారు.

**క. మన దుర్యోధను జన్మం । బునఁ బెక్కులు దుర్నిమిత్తములు పుట్టెఁ; జగ**
**జ్జనసంక్షయజననుం డగు । నని పలికెద రెఱుక గల మహాత్ములు వానిన్. 110**

**ప్రతిపదార్థం:** మన, దుర్యోధను, జన్మంబునన్= మనదుర్యోధనుడు పుట్టినప్పుడు; దుర్+నిమిత్తములు= చెడ్డశకునాలు; పెక్కులు= చాల; పుట్టెన్; ఎఱుక= జ్ఞానం; కల= ఉన్న; మహాత్ములు; వానిన్= ఆ దుర్యోధనుడిని; జగత్+జన+సంక్షయ, జననుండు= లోకంలోని ప్రజలకు నాశనం కలిగించేవాడు; అగున్, అని= అవుతాడు అని; పలికెదరు= చెప్పుతారు.(చెప్పారు).

**తాత్పర్యం:** మన దుర్యోధనుడు పుట్టినప్పుడు అనేకదుశ్శకునాలు పుట్టాయి. జ్ఞానులైన మహాత్ములు వాడు లోక జననాశకు డని అంటారు.(అన్నారు).

**క. కులమునకు నఖిలలోకం । బులకు నపాయంబు సేయు పురుషాధము ని**
**మ్ముల దూషించి జగంబును । గులమును రక్షించు టుఱదె కువలయనాథా! 111**

**ప్రతిపదార్థం:** కువలయనాథా= భూమికి ప్రభువు అయినవాడా!; కులమునకున్= వంశానికి; లోకంబులకున్= అన్ని లోకాలకు; అపాయంబు= కీడు; చేయు; పురుష+అధమున్= పురుషులలో నీచుడిని; ఇమ్ముల= సంతోషంతో; దూషించి= విడిచివేసి; జగంబును= లోకాన్ని; కులమును= వంశాన్ని; రక్షించుట; ఉఱదు+ఎ= తగదా?

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! కులానికీ, లోకాలకూ కీడు కల్గించే నీచుడైన ఈ దుర్యోధనుడిని వదలివేసి, లోకాన్నీ, కులాన్నీ రక్షించటం తగదా? (తగునని భావం.)

**వ. 'కావున నిప్పడ దుర్యోధను దూషింతము; నీకు వెండియుఁ బుత్త్రశతంబు సంపూర్ణంబయి పెరుఁగుచున్నయది' యనిన ధృతరాష్ట్రుండు పుత్త్రమోహంబున నప్పలుకులు విన నొల్లకుండె; నంత నట శతశృంగంబునఁ గుంతీదేవి భీమసేను సుపుత్త్రుం బడసి, దశమదివసంబున వేల్పులకు మ్రొక్కఁ గొడుకు నెత్తుకొని దేవగృహంబునకుఁ బోవునెడ నతివిషమగహనగిరిగహ్వరంబుననుండి యొక్కపులి వెలువడి యామిషార్థి యయి పయికి లంఘించిన. 112**

**ప్రతిపదార్థం:** కావునన్; ఇప్పుడు+అ= ఇప్పుడే; దుర్యోధను; దూషింతము= వదలి వేద్దాం; నీకున్; వెండియున్= మరియు; పుత్త్రశతంబు= వందమందికొడుకులు; సంపూర్ణంబు+అయి= నిండుగా; పెరుగుచు+ఉన్న అది = పెరుగుతూ ఉన్నారు; అనినన్= అనగా; ధృతరాష్ట్రుండు; పుత్త్ర మోహంబునన్= కొడుకుమీది మమకారంతో; ఆ+పలుకులు= పెద్దలు చెప్పిన ఆ మాటలు; వినన్= వినటానికి; ఒల్లక+ఉండెన్= ఇష్టపడలేదు; అంతన్= అప్పుడు; అట= అచ్చట; శతశృంగంబునన్= శతశృంగ పర్వతందగ్గర; కుంతీదేవి; భీమసేనున్= భీమసేనుడు అను; సుపుత్త్రున్= చక్కనికుమారుని; పడసి= పొంది; దశమ,

దివసంబునన్= పదోరోజు; వేల్పులకున్= దేవతలకు; మ్రొక్కన్= మ్రొక్కుటకై; కొడుకున్; ఎత్తుకొని; దేవ, గృహంబునకున్= దేవాలయానికి; పోవు, ఎడన్= పోవుచోట; అతి, విషమ, గహన, గిరి, గహ్వరంబునన్, ఉండి= మిక్కిలి మిట్టపల్లాలై ప్రవేశించడానికి సాధ్యం కాని కొండగుహనుండి; ఒక్క; పులి; వెలువడి= బయటకు వచ్చి; ఆమిష+అర్థి, అయి= మాంసంకోరిన దై; పయికిన్= మీదికి; లంఘించినన్= దూకగా.

**తాత్పర్యం:** 'అందువలన ఇప్పుడే దుర్యోధనుడిని విడిచిపెట్టుము, నీకు ఇంకా వందమందిపిల్లలు నిండుగా పెరుగుతున్నారు' అని అనగా, ధృతరాష్ట్రుడు పుత్రమమకారంతో ఆ పలుకులు వినటానికి ఇష్టపడలేదు. అక్కడ శతశృంగపర్వతంమీద కుంతి భీమసేనుడిని కని, పదోరోజున దేవతలకు మ్రొక్కటానికి ఆ బాలుడిని ఎత్తుకొని దేవాలయానికి పోయేచోట - మిక్కిలి మిట్టపల్లాలై ప్రవేశించ సాధ్యం కాని కొండగుహనుండి ఒకపులి బయటకు వచ్చి, మాంసాన్ని కోరి మీదికి దూకగా.

## భీమునిశరీరదార్ఢ్యము (సం.1-114-11)

**క. వీరుఁడు పాండుమహీపతి । దారుణ బాణ త్రయమునఁ దద్వ్యాఘ్రంబున్**
**ధారుణిఁ ద్రెళ్ళఁగ నడుమన । భూరిభుజుం డేసి కాచెఁ బుత్త్రుం దేవిన్. 113**

**ప్రతిపదార్థం:** వీరుఁడు; భూరి, భుజుండు= గొప్పభుజాలు కలవాడు; పాండు, మహీపతి= పాండురాజు; దారుణ, బాణ, త్రయమునన్= భయంకరమైన మూడుబాణాలతో; తద్+వ్యాఘ్రంబున్= ఆ పులిని; నడుమన్+అ= మధ్యలోనే; ధారుణిన్= భూమిమీద; త్రెళ్ళఁగన్= (చచ్చి) పడేటట్లు; ఏసి= కొట్టి; పుత్త్రున్= కొడుకును; దేవిన్=భార్యఐన కుంతీదేవిని; కాచెన్= రక్షించాడు.

**తాత్పర్యం:** వీరుడు, బలమైన భుజాలు కలవాడు అయిన పాండురాజు భయంకరాలైన మూడుబాణాలతో మధ్యలోనే ఆ పులిని భూమిమీద చచ్చిపడేటట్లు కొట్టి కొడుకు భీముడిని, భార్య కుంతీదేవిని కాపాడాడు.

**క. ఉరు శార్దూల భయంబునఁ । బరవశ యయి కుంతి యున్న బాలకుఁడు శిలో**
**త్కరముపయిఁ బడియెఁ దన ని । ష్ఠురతనుహతిఁ జేసి రాలు చూర్ణంబులుగన్. 114**

**ప్రతిపదార్థం:** ఉరు, శార్దూల, భయంబునన్= పెద్దపులివలన కలిగినభయంతో; కుంతి; పరవశ+అయి= ఒడలు తెలియని దై; ఉన్నన్= ఉండగా; బాలకుఁడు; తన, నిష్ఠుర, తను హతిన్= తన కఠినమైన శరీరంయొక్క దెబ్బచేత; రాలు, చూర్ణంబులుగన్= రాళ్ళు పొడి అయ్యేటట్లు; చేసి; శిలా+ఉత్కరము, పయిన్= రాళ్ళ సమూహంమీద - కొండమీద; పడియెన్= పడినాడు.

**తాత్పర్యం:** పెద్దపులివలన కలిగినభయంతో కుంతీదేవి శరీరం స్వాధీనం తప్పగా, బాలుడు భీముడు క్రిందపడ్డాడు. కఠినమైన అతనిశరీరం తాకిడికి ఆ కొండమీది రాళ్ళు పొడి అయ్యాయి.

**వ. దానిం జూచి పాండురాజు సంభ్రమంబునఁ బఱతెంచి విస్మితుం డై కొడుకు నెత్తికొని కుంతీదేవిం దోడ్కొని వేల్పులకు మ్రొక్కించి మగుడి నిజాశ్రమంబునకు వచ్చి సుఖం బుండి, గాంధారీధృతరాష్ట్రులకుఁ బుత్త్రశతంబు పుట్టుట విని, ఋషులవలన దివ్యమంత్రోపదేశంబుఁ గొని. 115**

**ప్రతిపదార్థం:** దానిన్+చూచి; పాండురాజు; సంభ్రమంబునన్= వేగిరపాటుతో; పఱతెంచి= వచ్చి; విస్మితుండు+ఐ= ఆశ్చర్య పడినవాడై; కొడుకున్; ఎత్తుకొని; కుంతీదేవిన్; తోడ్కొని= తనతో తీసికొని; వేల్పులకున్= దేవతలకు; మ్రొక్కించి; మగుడి= మరలి; నిజ+ఆశ్రమంబునకున్= తనయొక్క ఆశ్రమానికి; వచ్చి; సుఖంబు, ఉండి= సుఖంగా ఉండి; గాంధారీ, ధృతరాష్ట్రులకున్; పుత్త్ర శతంబు= వందమందికొడుకులు; పుట్టుట విని; ఋషులవలనన్; దివ్య, మంత్ర+ఉపదేశంబున్; కొని= గ్రహించి.

**తాత్పర్యం:** దానిని చూచి పాండురాజు వేగిరపాటుతో వచ్చాడు. ఆశ్చర్యపడి ఆ కొడుకును ఎత్తికొన్నాడు. కుంతీదేవిని తోడ్కొని దేవతలకు మ్రొక్కించి, తిరిగి తనఆశ్రమానికి వచ్చి సుఖంగా ఉండగా, గాంధారీ ధృతరాష్ట్రులకు వందమందికొడుకులు పుట్టా రని విని, ఋషులవలన దివ్యమంత్రోపదేశాన్ని పొంది.

### ఇంద్రప్రసాదంబునఁ గుంతి కర్ణునుఁ డుదయించుట (సం.1-114-15)

**క. కొడుకుం ద్రిలోక విజయుం। బడయుదు నని ఘోర మగు తపం బొనరింపం**
**దొడఁగె సురరాజు నెడలో। నిడికొని యేకాగ్రబుద్ధి నేకాంతమునన్. 116**

**ప్రతిపదార్థం:** త్రిలోక, విజయున్= మూడులోకాలను జయించేవాడిని; కొడుకున్; పడయుదును= పొందుతాను; అని= అని తలచి; ఘోరము+అగు= భయంకర మైనట్టి; తపంబు; సురరాజన్= దేవతలరా జైన దేవేంద్రుడిని; ఎడలోన్= మనస్సులో; ఇడికొని= ఉంచుకొని; ఏక+అగ్ర, బుద్ధిన్= ఒకదానిమీదే లగ్నమైన మనస్సుతో; ఏకాంతమునన్= ఒంటరిగా; ఒనరింపన్= చేయడానికి; తొడఁగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** ముల్లోకాలను జయించగల కొడుకును పొందా లని దేవేంద్రుడిని ధ్యానిస్తూ, ఏకాగ్రబుద్ధితో, ఏకాంతంగా గొప్పతపస్సు చేయడానికి పూనుకొన్నాడు.

**విశేషం:** కథలో కారణం చెప్పకుండా కార్యాలు జరుగుతున్నట్లు చెప్పటం ప్రసన్నకథాకవితలో ఒకశిల్పం. వందమంది కొడుకులు ధృతరాష్ట్రునికి పుట్టా రని వినగానే పాండురాజు దివ్యమంత్రాల ఉపదేశం పొందాడు; ఒంటి కాలిమీద గొప్పతపస్సు చేశాడు. త్రిలోకవిజయుడైన కొడుకును కోరుకొన్నాడు. ఈచర్యకు కారణం కథలో స్పష్టంగా లేదు. కాని లో నారసి చూస్తే కారణం స్పష్టమౌతుంది. ధార్తరాష్ట్రులు నూరుగురు ఏకమైతే మూడులోకాలనే జయించగలరేమో, ధర్మరక్ష కులరక్షకులైన ధర్మజ భీము లిద్దరూ ధార్తరాష్ట్రుల ధాటికి నిలువలేకపోవచ్చును. త్రిలోకవిజయుడైన పుత్త్రుడుమాత్రమే ధార్తరాష్ట్రులకు దీటుగా నిలిచి, పాండవ ప్రాభవాన్ని, లోకాధిపత్యాన్ని నిలుపగల డనే భావం పాండురాజులో కలిగినట్లు స్పష్టమౌతూఉంది. అందుకే త్రిలోకవిజయుడైన పుత్రునికొరకు త్రిలోకాధిపతిని ఆరాధించటం. (సంపా.)

**వ. ఇ ట్లతి నిష్ఠ నేకపాద స్థితుం డయి తపంబు సేయుచుఁ గుంతి నొక్క సంవత్సరంబు వ్రతంబు సేయం బంచియున్న నప్పాండురాజున కింద్రుండు ప్రత్యక్షం బై. 117**

**ప్రతిపదార్థం:** ఇట్లు; అతి, నిష్ఠన్= మిక్కిలి నియమంతో; ఏక, పాద, స్థితుండు+అయి= ఒకపాదంమీదనే నిలిచి ఉన్నవాడై - అనగా ఒంటి కాలిమీద నిలబడి; తపంబు, చేయుచున్= తపస్సు గావిస్తూ; కుంతిన్; ఒక్క, సంవత్సరంబు; వ్రతంబు చేయన్= వ్రతం చేయటానికై; పంచి= ఆజ్ఞాపించి; ఉన్నన్= ఉండగా; ఆ+పాండురాజునకున్= ఆ పాండురాజునకు; ఇంద్రుండు= మహేంద్రుడు; ప్రత్యక్షంబు+ఐ= ఎదుట కన్పించినవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా మిక్కిలినిష్ఠతో ఒంటికాలిమీద నిలబడి తాను తపస్సు చూస్తూ, కుంతీదేవిని ఒక సంవత్సరం వ్రతం చేయవలసిందిగా ఆజ్ఞాపించి ఉండగా, ఆ పాండురాజుకు దేవేంద్రుడు ప్రత్యక్షమై.

**క. 'పుత్త్రుఁడు నీ కుదయించు న । మిత్త్రక్షయకరుఁడు బంధుమిత్త్రాంబుజ స**
**న్మిత్త్రుం' డని వర మిచ్చిన । ధాత్త్రీపతి పొంగి పృథకుఁ దా ని ట్లనియెన్. 118**

**ప్రతిపదార్థం:** నీకున్; అమిత్ర, క్షయ, కరుఁడు= మిత్రులు కాని వాళ్ళను నాశం చేసేవాడు - అంటే శత్రువులను నాశనం చేసేవాడు; బంధు, మిత్త్ర+అంబుజ, సత్+మిత్త్రుండు= చుట్టాలు, స్నేహితులు అనే పద్మాలకు చక్కని సూర్యునివంటివాడు; పుత్త్రుఁడు; ఉదయించును= పుట్టుతాడు; అని= ఆ విధంగా; వరము+ఇచ్చినన్= వరం ఇయ్యగా; ధాత్రీ, పతి= పాండురాజు; పొంగి= మిక్కిలి సంతోషించి; తాన్= తాను; పృథకున్= కుంతీదేవికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీకు శత్రువులను నాశనం చేసేవాడు, బంధువులు, స్నేహితులు అనే పద్మాలకు సూర్యుని వంటివాడు అయినకొడుకు పుడతాడు' అని వరం ఇవ్వగా పాండురాజు ఎంతో సంతోషించి కుంతీదేవితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** పాండురాజు వరం కోరినట్లు చెప్పకుండా, ఇంద్రుడే తనంతట తాను వర మిచ్చినట్లు చెప్పటం ఇక్కడ విశేషం. శత్రువులను సంహరించేవాడు, బంధువులను సంతోషపెట్టేవాడు అయిన కొడుకు పుట్టుతా డని ఇంద్రునివరం. నిజానికి అటువంటి కొడుకు కావా లన్నది పాండురాజు మనసులోనికోరిక. ఆ శత్రువు లెవరు? ఆ బంధువు లెవరు? - అనే ప్రశ్నలకు సమాధానం కాలం చెప్పవలసిందే. సారమతులు లో నారసి భావించతగిందే.

**క. ధనమున విద్యను సంతతిఁ దనిసిన వా రెందుఁ గలరె? ధవళేక్షణ ! కా**
**వున నా కింకను బలువురఁ । దనయులఁ బడయంగ వలయు ధర్మువు పేర్మిన్. 119**

**ప్రతిపదార్థం:** ధవళ+ఈక్షణ= తెల్లని కన్నులు కలదానా!; ధనమునన్= ధనంచేత; విద్యను= విద్యచేత; సంతతిన్= సంతానంచేత; తనిసినవారు= తృప్తిపొందినవారు; ఎందున్= ఎక్కడైనా; కలరె= ఉన్నారా?; కావునన్= కాబట్టి; నాకున్= నాకు; ఇంకను= ఇంకా; పలువురన్= పెక్కుమందిని; తనయులను= పుత్రులను; ధర్మువు, పేర్మిన్= ధర్మంయొక్క అతిశయంచేత; పడయంగవలయున్= పొందాలి.

**తాత్పర్యం:** ఓ కుంతీ! లోకంలో ధనం, విద్య, సంతానం విషయాలలో తృప్తి పొందినవాళ్ళు ఎవరైనా ఉన్నారా? అందువలన నా కింకా ఎందరో కొడుకులను ధర్మమార్గంలో పొందా లని ఉన్నది.

**చ. అమరగణంబులోనఁ బరమార్థమ యింద్రుఁడు పెద్ద, సర్వలో**
**కములకు వల్లభుం డతఁడ కావున నయ్యమరాధిపప్రసా**
**దమున సుతున్ సురేంద్రసము ధర్మసమన్వితు నస్మదీయవం**
**శము వెలుఁగింపఁగాఁ బడయు సర్వజగత్పరిరక్షణక్షమున్. 120**

**ప్రతిపదార్థం:** అమర, గణంబులోనన్= దేవతలసమూహంలో; పరమ+అర్థము+అ= సత్యంగానే; ఇంద్రుఁడు; పెద్ద= పెద్దవాడు, గొప్పవాడు; అతడు+అ= అతడే; సర్వ, లోకములకున్= అన్ని లోకాలకు; వల్లభుండు= రాజు; కావునన్= అందుచేత; ఆ+అమర+అధిప, ప్రసాదమునన్= ఆ దేవతలరాజుయొక్క దయతో; సుర+ఇంద్ర,సమున్= దేవేంద్రునితో సమాను డైనవాడిని;

ధర్మ సమన్వితున్= ధర్మంతో కూడినవాడిని; సర్వ, జగత్+రక్షణ, క్షమున్= లోకా లన్నింటిని కాపాడటంలో సమర్థుడు అయినటువంటివాడిని; అస్మదీయ, వంశము = నా వంశం; వెలుఁగింపఁగాన్= ప్రకాశింప చేయటానికి; సుతున్= కుమారుని; పడయు= పొందుము.

**తాత్పర్యం:** దేవతలలో నిజంగా దేవేంద్రుడు పెద్ద. అతడే లోకాల కన్నింటికి రాజు. అందువలన ఆ దేవేంద్రుని దయతో అతనితో సమాన మైనవాడు, ధర్మాత్ము డైనవాడు, అన్నిలోకాలను రక్షించటంలో సమర్థు డైనవాడు, నా వంశాన్ని వెలిగించేవాడు అయినకొడుకును పొందుము.

**వ. అని నియోగించినఁ గుంతియుఁ దొల్లిటి యట్ల దుర్వాసుం డిచ్చిన మంత్రంబున నింద్రు నారాధించినఁ,**
**దత్ప్రసాదంబునఁ గుంతికి. 121**

**ప్రతిపదార్థం:** అని; నియోగించినన్= ఆజ్ఞాపించగా; కుంతియున్; తొల్లిటి, అట్లు+అ= ఇదివరకటివలెనే; దుర్వాసుండు; ఇచ్చిన= ప్రసాదించిన; మంత్రంబునన్= మంత్రంచేత; ఇంద్రున్= ఇంద్రుని; ఆరాధించినన్= పూజించగా; తద్+ప్రసాదంబునన్= అతని దయతో; కుంతికిన్.

**తాత్పర్యం:** అని పాండురాజు ఆజ్ఞాపించగా; కుంతికూడ ఇదివరకటివలెనే దుర్వాసు డిచ్చినమంత్రంతో ఇంద్రుడిని ప్రార్థించగా అతనిదయతో కుంతికి.

**క. స్థిరపౌరుషుండు లోకో । త్తరుఁ డుత్తరఫల్గునీప్రథమపాదమునన్**
**సురరాజునంశమున భా । సురతేజుఁడు వంశకరుఁడు సుతుఁ డుదయించెన్. 122**

**ప్రతిపదార్థం:** స్థిర, పౌరుషుండు= నిలకడైన పౌరుషం కలవాడు; లోక+ఉత్తరుఁడు= లోకంలో శ్రేష్ఠుడు; భాసుర, తేజుఁడు= ప్రకాశిస్తున్న తేజస్సు కలవాడు; వంశ, కరుఁడు= వంశాన్ని నిలిపేవాడు; సుతుఁడు= కుమారుడు; సుర, రాజు, అంశమునన్= దేవేంద్రుని అంశంతో; ఉత్తర ఫల్గునీ, ప్రథమ, పాదమునన్= ఉత్తరఫల్గునీనక్షత్రం మొదటిపాదంలో; ఉదయించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** స్థిరమైనపౌరుషం కలవాడు, లోకంలో కెల్ల శ్రేష్ఠుడు, ప్రకాశించే తేజస్సు కలవాడు, వంశాన్ని నిలిపేవాడు అయినకుమారుడు, దేవేంద్రునిఅంశతో ఉత్తరఫల్గునీనక్షత్రప్రథమపాదంలో జన్మించాడు.

**విశేషం:** పాద మనగా నాల్గోవంతు.

**వ. అయ్యవసరంబున.**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో **123**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**సీ. 'విను కార్తవీర్యుకంటెను వీరుఁ డగుట నర్జుననామ మీతండ యొనరఁ దాల్చు;**
**నీతండ యనిఁ బురుహూతాదిసురుల నోడించి ఖాండవము దహించు బలిమి;**

నీతండ నిఖిలావనీతలేశుల నోర్చి రాజసూయము ధర్మరాజు నునుచు;
నీతండ వేల్పులచేత దివ్యాస్త్రముల్ వడసి విరోధుల నొడుచుఁ గడిమి'

ఆ. ననుచు నవపయోదనినదగంభీర మై। నెగసె దివ్యవాణి గగనవీథిఁ,
గురిసెఁ బుష్పవృష్టి, సురదుందుభిధ్వనుల్। సెలఁగె సకలభువనవలయ మద్రువ. 124

**ప్రతిపదార్థం:** విను; కార్త్యవీర్యుకంటెన్; వీరుఁడు; అగుటన్= అవటంచేత; అర్జున, నామము= అర్జును డనే పేరు; ఒనరన్= ఒప్పేటట్లు; తాల్చున్= ధరిస్తాడు; ఈతండు+అ= ఇతడే; అనిన్= యుద్ధంలో; పురుహూత+ఆది, సురులన్= ఇంద్రుడు మొదలైన దేవతలను; ఓడించి; బలమిన్= పరాక్రమంతో; ఖాండవము= ఖాండవవనాన్ని; దహించున్= కాల్చును; ఈతండు+అ= ఇతడే; నిఖిల+అవనీతల+ఈశులన్= మొత్తం భూమిమీది రాజులను; ఓర్చి= జయించి; రాజసూయము= రాజసూయయాగంలో; ధర్మరాజున్= ధర్మరాజును; ఉనుచున్= ఉంచుతాడు; ఈతండు+అ= ఇతడే; వేల్పులచేత= దేవతలచేత; దివ్య+అస్త్రముల్= దేవతా సంబంధమైన బాణాలు; పడసి= పొంది; కడిమిన్= పరాక్రమంతో; విరోధులన్= శత్రువులను; ఒడుచున్= ఓడిస్తాడు; అనుచున్= అంటూ; నవ, పయోద, నినద, గంభీరము+ఐ= క్రొత్త మేఘంయొక్క ఉరుమువలె గంభీరమై; దివ్య, వాణి= దేవతా సంబంధ మైన పలుకు; గగన, వీథిన్= ఆకాశవీథిలో; నెగసెన్= వ్యాపించింది; పుష్ప, వృష్టి= పూలవాన; కురిసెన్; సుర, దుందుభి, ధ్వనుల్= దేవతలయొక్క నగారాల మ్రోతలు; సకల, భువన, వలయము= మొత్తం భూమండలం; అద్రువన్= అదిరేటట్లు; చెలఁగెన్= మ్రోగాయి.

**తాత్పర్యం:** 'ఇతడు కార్త్యవీర్యునికన్నా వీరుడు కావటంచేత అర్జునుడు అనేపేరు వహిస్తాడు. యుద్ధంలో ఇంద్రాది దేవతలను ఓడించి, పరాక్రమంతో ఖాండవాన్ని దహిస్తాడు. భూమిమీద రాజు లందరినీ జయించి, ధర్మరాజుచేత రాజసూయయాగాన్ని చేయిస్తాడు. దేవతలవలన దివ్యాస్త్రాలు పొంది శత్రువులను జయిస్తాడు' అని ఆకాశవాణి క్రొత్త మేఘం మ్రోసిన ఉరుమువలె గంభీరంగా పలికింది. పూలవాన కురిసింది. భూమండలం దద్దరిల్లేటట్లు దేవ దుందుభులు మ్రోగాయి.

**విశేషం:** పుట్టుకను కందపద్యంలో వర్ణించి; మహిమను సీసపద్యంలో వివరించటం నన్నయ ప్రదర్శించిన పద్యవిద్యాప్రౌఢి. ధర్మజభీములు స్థిరపాత్రలుగాను, అర్జునునిపాత్ర వికాసదశలను పొందేదిగాను చిత్రించటం భారతకథలో కనపడుతుంది. ధర్మజు డనే ధర్మశక్తికి భీముడు భౌతికబలాన్ని కూర్చేవాడు; అర్జునుడు దైవబలాన్ని అనుసంధించేవాడు. ఆ భేదం చెప్పటం నన్నయ వస్తుశిల్పం. 'ఈతండ' ఏవార్థకమైన తదర్థకసర్వనామాలను మూడుచరణాలలో మొదట వాడి, అర్జునుని పరిణామ స్థితులను నన్నయ కథలో చక్కగ సూచించాడు. ఏవార్థకం అర్జునుని అనన్యపరాక్రమాన్ని ధ్వనింప చేస్తుంది. ఖాండవదహన ఘట్టంనుండి అర్జునునికి శ్రీకృష్ణసహాయం, దేవతలవలని దివ్యాస్త్రలాభం కలగటం ప్రారంభ మౌతుంది. ఇవి భావికథాబీజాలుగా ప్రస్తావించి వాటి వివరాలను తెలిసికొనటానికి పఠితలహృదయాలలో ఉత్కంఠను రేకెత్తించటం ప్రసన్నకథాకవి(లి) తార్థయోజనం. (సంపా.)

వ. మఱియు మరీచ్యాది ప్రజాపతులును, ధాత్రాది ద్వాదశాదిత్యులును, మృగవ్యాధాది రుద్రులును, ధరాది వసువులును, భరద్వాజాది మహర్షులును, భీమసేనాది గంధర్వులును, శేషాది మహానాగముఖ్యులును, వైనతేయాది ఖచరులును, మేనకాద్యప్సరసలును, నాశ్వినులును, విశ్వేదేవతలును, మఱియు స్వర్గంబున నున్నరాజులుం జను దెంచిన.125

**ప్రతిపదార్థం:** మఱియున్; మరీచి+ఆది, ప్రజాపతులును= మరీచి మొద లైనబ్రహ్మలు, ధాతృ+ఆది, ద్వాదశ+ ఆదిత్యులును= ధాత మొదలైన పన్నెండుమందిసూర్యులు; మృగవ్యాధ+ఆది, రుద్రులు= మృగవ్యాధుడు మొదలైన రుద్రులు; ధర+ఆది, వసువులును= ధరుడు మొదలైనవసువులు; భరద్వాజ+ఆది, మహర్షులును= భరద్వాజుడు మొదలైన మహామునులు; భీమసేన+ఆది, గంధర్వులును= భీమసేనుడు మొదలైన గంధర్వులు; శేష+ఆది, మహా, నాగ, ముఖ్యులును= శేషుడు మొదలైన సర్పశ్రేష్ఠులు; వైనతేయ+ఆది, ఖచరులును= వైనతేయుడు మొదలైన ఆకాశసంచారులు; మేనకా+ఆది. అప్సరసలును= మేనక మొదలైన అప్సరసలు; అశ్వినులు= అశ్వినీదేవతలు; విశ్వేదేవతలును; మఱియున్= ఇంకనూ; స్వర్గంబునన్+ఉన్న; రాజులున్; చనుదెంచినన్= రాగా.

**తాత్పర్యం:** అంతేకాక, మరీచి మొదలైన నవబ్రహ్మలు, ధాత మొదలైన ద్వాదశాదిత్యులు, మృగవ్యాధుడు మొదలైన ఏకాదశరుద్రులు, ధరుడు మొదలైన అష్టవసువులు, భరద్వాజుడు మొదలైన మహర్షులు, భీమసేనుడు మొదలైన గంధర్వులు, శేషుడు మొదలైన సర్పశ్రేష్ఠులు, గరుత్మంతుడు మొదలైన ఆకాశగమనం కలిగినవాళ్ళు, మేనక మొదలైనఅప్సరసలు, అశ్వినీదేవతలు, విశ్వేదేవతలు, ఇంకా స్వర్గంలో ఉన్నరాజులంతా రాగా.

**విశేషం:** ప్రజాపతులు తొమ్మిదిమంది. వారిని నవబ్రహ్మ లంటారు. వారు-భృగువు, పులస్త్యుడు, పులహుడు, అంగిరసుడు, అత్రి, క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు, మరీచి. ద్వాదశాదిత్యులు - ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు. ఏకాదశరుద్రులు - అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు. (మృగవ్యాధుడనగా రుద్రుడు);

**క.** **శతశృంగనగేంద్రము శత। ధృతి సర్గదినంబపోలెఁ ద్రిభువనభూత**
**ప్రతతిఁ బరిపూర్ణశోభా। ధృతి నింద్రతనూజుజన్మదినమున నొప్పెన్.** **126**

**ప్రతిపదార్థం:** ఇంద్ర, తనూజు, జన్మదినమునన్= ఇంద్రునికొడు కైన అర్జునుని పుట్టినరోజు; శతశృంగ, నగ+ఇంద్రము= శతశృంగం అనేపేరు కల పర్వతశ్రేష్ఠం; త్రి, భువన, భూత, ప్రతతిన్= మూడులోకాలలోని భూతాలసమూహంతో; పరిపూర్ణ, శోభా, ధృతిన్= నిండుశోభను ధరించటంచేత; శతధృతి, సర్గ, దినంబు+అ పోలెన్= బ్రహ్మయొక్క సృష్టిరోజువలె; ఒప్పెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** అర్జునుడు పుట్టినరోజు శతశృంగపర్వతం మూడులోకాలలోని భూతాలు అక్కడికి రాగా పరిపూర్ణ శోభతో బ్రహ్మదేవుడు సృష్టిచేసేరోజువలె ప్రకాశించింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఇందులో అలంకారకృత వస్తుధ్వని ఉన్నది. త్రిభువనాలనుండి పెద్దలు రావటంచేత రెండు విశేషార్థాలు స్ఫురిస్తున్నాయి. పాండవులలో మూడులోకాలను దర్శించిన తన విజయగీతాలను పాడించుకొన్నవాడు అర్జును డొక్కడే. ఈ భావి కథార్థధ్వని ఒకటి. బ్రహ్మదేవుడు సృష్టిచేసేరోజేమో అన్న ఉత్ప్రేక్షవలన అర్జును డొక్కడే పాండవులలో వంశకారకు డౌతా డని లో నారసినవారిభావనకు అందే మరొక భావికథార్థవస్తుధ్వని. (సంపా.)

**మాలిని :**

**సరససురవధూలాస్యంబులున్ సిద్ధవిద్యా**
**ధరపటుపటహాతోద్యంబులుం గిన్నరీ కిం**

**పురుష లలితగీతంబుల్ మహారమ్య మయ్యెన్**
**వరముని దివిజాశీర్వాదనాదంబుతోడన్.** 127

**ప్రతిపదార్థం:** సరస, సుర, వధూ లాస్యంబులున్= మనోహరా లైన అప్సరసలయొక్క నృత్యాలు; సిద్ధ, విద్యాధర, పటు, పటహ+ఆతోద్యంబుల్= సిద్ధుల, విద్యాధరులయొక్క గట్టి తప్పెటల, వీణ, వేణువు, మృదంగం, కాంస్యం (కంచువాద్యం) అనే నాలుగు విధాలైన వాద్యాలయొక్క శబ్దాలు; కిన్నరీ, కింపురుష, లలిత, గీతంబుల్= కిన్నర స్త్రీల, కింపురుషులయొక్క మనోహరాలైన గానాలు; వర, ముని, దివిజ+ఆశీర్వాద, నాదంబుతోడన్= ఉత్తము లైన ఋషులయొక్క, దేవతలయొక్క ఆశీర్వచనశబ్దంతో; మహా, రమ్యము= మిక్కిలి మనోహరం; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** మనోహరా లైన అప్సరసల నృత్యాలు, సిద్ధవిద్యాధరుల వీణా వేణు మృదంగాదివాద్యాల ధ్వనులు, కిన్నర కింపురుషుల లలితగానాలు, మహర్షులు, దేవతలు చేసే ఆశీర్వచనాలశబ్దంతో మిక్కిలి మనోహరంగా ఉన్నది.

**విశేషం:** మాలినిపాదంలో వరుసగా న, న, మ, య, య అనే గణా లుంటాయి. 9వ అక్షరం యతిస్థానం. ప్రాసనియతి ఉన్నది.. వరమునిదివిజాశీర్వాదాలతో సహా దేవతల లలితగీతాలు మహారమ్య మయ్యె నని సహోక్తిరమ్యంగా నన్నయ వర్ణించాడు. వర్ణ్యవస్తువుకు తగిన అక్షరరమ్యత రచనాసౌందర్యాంశం. శ్లేష, సమతగుణాల నిర్వహణం దానికి పోషణం, కాగా మునుల ఆశీస్సులు - తపస్సుచేసి ఇంద్ర పరమేశ్వరాదులను మెప్పించగలిగే అర్జునుని తపోవీరాన్ని, లలితగీతాదులు - ధీరలలితుడుగా ప్రదర్శించే అతడి సరసశృంగారవిలాసయశోవీరాన్ని భావింప చేసేవిగా ఉన్నాయి. (సంపా.)

**వ. పాండురాజును బరమోత్సవంబునం గుంతివలనఁ బురుషత్రయసమానం బయిన పుత్త్రత్రయంబు వడసి భువనత్రయరాజ్యంబు వడసినంతియ సంతసిల్లి, కుమారులతోడి వినోదంబులం దగిలి యున్నంత; మాద్రి దనయందుఁ బుత్త్రజన్మంబు వడయు నుపాయంబు లేమికి దుఃఖించి యాత్మగతంబున.** 128

**ప్రతిపదార్థం:** పాండురాజును= పాండురాజుకూడ; పరమ+ఉత్సవంబునన్= మిక్కిలి వేడుకగా; కుంతివలనన్; పురుష, త్రయ, సమానంబు+అయిన= పురుషులు ముగ్గురితో (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతో) సమానమైన; పుత్ర, త్రయంబు= కొడుకులు ముగ్గురిని; పడసి= పొంది; భువన, త్రయ, రాజ్యంబు= మూడు లోకాలయొక్క పాలనాధికారం; పడసినంతియు+అ= పొందినంతగా; సంతసిల్లి= సంతోషించి; కుమారులతోడి; వినోదంబులన్= విలాసంగా ఆటలలో; తగిలి= తగుల్కొని - అనగా ప్రొద్దు పుచ్చుతూ; ఉన్నంతన్= ఉండగా; మాద్రి; తనయందున్= తనకు; పుత్త్ర, జన్మంబు= కొడుకులు పుట్టటం; పడయు= పొందే; ఉపాయంబు; లేమికి= లేకున్నందుకు; దుఃఖించి; ఆత్మగతంబునన్= మనస్సులో.

**తాత్పర్యం:** పాండురాజు మిక్కిలివేడుకగా కుంతీదేవివలన త్రిమూర్తులతో సమానమైన ముగ్గురు కొడుకులను పొంది, త్రిలోకాధిపత్యం పొందినంతగా సంతోషించి, కుమారులతో విలాసంగా ఆటలతో ప్రొద్దు పుచ్చుతూ ఉండగా - మాద్రి తనకు కొడుకులు పుట్టేమార్గం లేనందుకు దుఃఖించి, మనస్సులో.

**ఉ. కోరిన కోర్కికిం దగఁగఁ గుంతి సుతత్రయంబుఁ గాంచె; గాం**
**ధారియు నక్కడన్ సుతశతంబు ముదం బొనరంగఁ గాంచె; నేఁ**
**బోరచి యాఁడుఁబుట్టువునఁ బుట్టి నిరర్థకజీవ నైతి సం**
**సారసుఖావహం బయిన సత్సుతజన్మముఁ గానఁ బోలమిన్.** 129

**ప్రతిపదార్థం:** కుంతి; కోరిన, కోర్కికిన్; తగన్+కన్= తగినట్లుగ; సుత, త్రితయంబున్= కొడుకులు ముగ్గురిని; కాంచెన్= కన్నది; గాంధారియున్= గాంధారికూడా; అక్కడన్= హస్తినాపురంలో; సుత, శతంబు= కొడుకులు వందమందిని; ముదంబు= సంతోషం; ఒనరంగన్= ఒప్పేటట్లు; కాంచెన్= కన్నది; ఏన్= నేను; పోరచి, ఆడు, పుట్టువునన్= నిస్సార మైన స్త్రీజన్మతో; పుట్టి; సంసార సుఖ+ఆవహంబు+అయిన= సంసారంలో సుఖాన్ని కలిగించేది ఐన; సత్+సుత, జన్మమున్= మంచికొడుకుల పుట్టుకను; కానన్‌పోలమిన్= కనలేకపోవటంచేత; నిరర్థక, జీవన్= వ్యర్థ మైన బ్రతుకు కలదాన్ని; ఐతిన్= అయినాను.

**తాత్పర్యం:** కుంతి తాను కోరినకోర్కెకు తగినట్లు ముగ్గురు కొడుకులను కన్నది. అక్కడ హస్తినాపురంలో గాంధారి సంతోషంగా వందమందికొడుకులను కన్నది. నేను నిస్సార మైన ఆడజన్మ నెత్తి సంసారంలో సుఖాన్ని కలిగించే కొడుకులను కనలేకపోవటంచేత వ్యర్థ మైనబ్రతుకు కలదాన్ని అయ్యాను.

**విశేషం:** మాద్రిమాటలలో తోడికోడళ్ళవలె తానుకూడా సంతానవతి కాలేకపోయినందుకు పడే వేదనతోపాటు, స్త్రీకి జీవితంలో సంతానకాంక్ష ఎంత ప్రబలమో వ్యక్త మవుతున్నది. 'పోరచియాఁడుఁబుట్టువునఁ బుట్టి నిరర్థకజీవ నైతి' - అనే వాక్యం సంతానం లేని జీవితం ఎంతో నిరర్థక మని ఆమె ఎంతగా భావిస్తున్నదో ధ్వనింపచేస్తున్నది. వాక్యం అలక్ష్యక్రమవ్యంగ్యానికి వ్యంజన మయ్యే రచన కిది చక్కని ఉదాహరణం. ఓజఃప్రసాదగుణమిశ్రరూపమైన పద్యరచన మాద్రిమనోవేదనను ప్రసన్నం చేస్తున్నది. (సంపా.)

## మాద్రికి నకులసహదేవులు పుట్టుట (సం. 1-115-1)

**వ. అని వగచుచు నొక్కనాఁ డేకాంతంబునం బతియొద్ద గద్గద వచన యై తన మనోవాంఛితంబుఁ జెప్పి 'కుంతీదేవి యనుగ్రహంబుం బడయ నగునేని కొడుకులం బడయుదు; నట్లయిన నాకును నీకును లోకంబులకును హితం బగుఁ గావున నాకుఁ బుత్త్రోత్పాదనంబు దయసేయం గుంతీదేవికి నానతి యి' మ్మనిన మాద్రికిఁ బాండురా జి ట్లనియె. 130**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; వగచుచున్= చింతిస్తూ; ఒక్కనాఁడు; ఏకాంతంబునన్= ఒంటరి పాటున; పతి, ఒద్ద= భర్త దగ్గర; గద్గద, వచన+ఐ= తడబడుతున్న మాటలు కలదై; తన మనో, వాంఛితంబున్= తన మనస్సులోని కోరికను; చెప్పి; కుంతీదేవి, అనుగ్రహంబున్ = కుంతీదేవియొక్క దయను; పడయన్+అగున్+ఏని; పొందకల్గినట్లైతే; కొడుకులన్; పడయుదును= పొందుతాను; అట్లు+అయినన్= ఆ విధంగా అయితే; నాకును; నీకును; లోకంబులకును; హితంబు+అగున్= మేలు కల్గుతుంది. కావున; నాకున్; పుత్త్ర+ఉత్పాదనంబు= కొడుకులు పుట్టేటట్లు; దయ, చేయన్= కరుణచూపేటట్లు; కుంతీదేవికిన్; ఆనతి; ఇమ్ము= ఆజ్ఞ ఇమ్ము; అనినన్= అనగా; మాద్రికిన్; పాండురాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చింతిస్తూ ఒకరోజు ఒంటరిగా భర్తదగ్గర తడబడేమాటలతో తనమనస్సులోని కోరికను తెలిపి 'కుంతీదేవి దయతలిస్తే నేను కొడుకులను పొందుతాను; అట్లా అయితే నాకు, నీకు, లోకాలకు మే లవుతుంది. అందువలన నాకు కొడుకులు పుట్టేటట్లు చేయవలసిందిగా కుంతీదేవికి ఆజ్ఞ ఇవ్వండి' అని మాద్రి అనగా పాండురాజు ఇట్లా అన్నాడు.

**క. నా వచనమున నపత్యముఁ। గావించును గుంతి నీకుఁ గడు నెయ్యముతోఁ;**
**నీ వగచిన యీ యర్థము। చూవె। మనంబునఁ దలంచుచుండుదు నేనున్. 131**

**ప్రతిపదార్థం:** నా వచనమునన్= నామాటచేత; కుంతి; నీకున్; కడు, నెయ్యముతో= మిక్కిలి ప్రేమతో; అపత్యమున్= సంతానాన్ని; కావించును; నీ, వగచిన= నీవు ఆలోచించిన; ఈ, అర్థము+అ= ఈ విషయాన్నే; ఏనున్, మనంబునన్, తలంచుచుందున్; చూవె= నేను కూడా మనస్సులో అనుకుంటూ ఉంటాను సుమా.

**తాత్పర్యం:** నా మాటప్రకారం కుంతి మిక్కిలి ప్రేమతో నీకు సంతానాన్ని కలుగజేస్తుంది. నీవు తలచిన ఈ విషయాన్నే నేనూ నా మనస్సులో కోరుకొంటూ ఉండేవాడినిసుమా.

**వ. అని పలికి యప్పుడ కుంతీదేవిం బిలిచి మద్రరాజపుత్త్రి దయిన మనోవాంఛితంబుఁ జెప్పి 'సకలలోక కల్యాణ కారు లాశ్వినులు గావున వారి నారాధించి యపత్యంబు వడయు' మనిన గొంతియుం బతివచనానురూపంబు సేసిన మాద్రికి. 132**

**ప్రతిపదార్థం:** అని; పలికి; అప్పుడు+అ= ఆ క్షణమే; కుంతీదేవిన్+పిలిచి; మద్ర, రాజ, పుత్త్రిది+అయిన= మద్రరాజ కూతురైన మాద్రియొక్క; మనస్+వాంఛితంబున్= మనస్సులోని కోరికను; చెప్పి= తెలిపి; సకల, లోక, కల్యాణ, కారులు= అన్ని లోకాలకు శుభాన్ని కూర్చేవారు; ఆశ్వినులు= అశ్వినీదేవతలు; కావునన్; వారిన్; ఆరాధించి= పూజించి; అపత్యంబు= సంతానం; పడయుము= పొందుము; అనిన; గొంతియున్= కుంతీదేవియు; పతి, వచన+అనురూపంబు= మగనిమాటకు తగినట్లుగా; చేసినన్= చేయుగా; మాద్రికిన్.

**తాత్పర్యం:** అని పలికి అప్పుడే కుంతీదేవిని పిలిచి, మాద్రి కోరికను తెలియచెప్పి; 'లోకానికంతా మేలుచేసేవాళ్ళు అశ్వినీదేవతలు కాబట్టి వాళ్ళను ఆరాధించి సంతానాన్ని పొందుము' అని చెప్పాడు. కుంతికూడా మగనిమాటకు తగినట్లు చేయగా మాద్రికి.

**తే. కవలవారు సూర్యేందుప్రకాశతేజు లా । శ్వినులయంశములఁ బుట్టి రమరగుణులు**
**వారలకుఁ బ్రీతి నాకాశవాణి సేసె । నకుల సహదేవు లనియెడు నామయుగము. 133**

**ప్రతిపదార్థం:** కవలవారు= కవల పిల్లలు; సూర్య+ఇందు, ప్రకాశ, తేజులు= సూర్యచంద్రులవలె ప్రకాశించే కాంతి కలవాళ్ళు; అమర, గుణులు = దేవతలయొక్క గుణాలవంటి గుణాలు కలవాళ్ళు; ఆశ్వినుల, అంశములన్= అశ్వినీదేవతల అంశలలో; పుట్టిరి= జన్మించారు; వారలకున్= వాళ్లకు; ప్రీతిన్= సంతోషంతో; ఆకాశవాణి; నకుల, సహదేవులు; అనియెడు; నామ, యుగము = పేర్లజంటను; చేసెన్.

**తాత్పర్యం:** సూర్యచంద్రులవలె ప్రకాశించే తేజస్సు కలవాళ్ళు, దేవతల గుణాలవంటి గుణాలు కలవాళ్ళు అశ్వినీదేవతల అంశలలో కవలలు పుట్టారు. వారికి ఆకాశవాణి సంతోషంతో నకుల సహదేవు లనేపేర్లు పెట్టింది.

**క. ఊర్జితులు యుధిష్ఠిర భీ । మార్జున నకుల సహదేవు లన నిట్లు వివే**
**కార్జితయశు లుదయించిరి । నిర్జరుల వరప్రసాదనిర్మితశక్తిన్. 134**

**ప్రతిపదార్థం:** ఊర్జితులు= గట్టిబలం కలవాళ్ళు; భీమ+అర్జున, నకుల, సహదేవులు; అనన్= అనగా; వివేక+ఆర్జిత, యశులు= వివేకంచేత సంపాదించబడిన కీర్తి కలవాళ్ళు; నిర్జరుల, వర, ప్రసాద నిర్మిత, శక్తిన్= దేవతలయొక్క వరప్రసాదంచేత కల్పించబడిన శక్తిచేత; ఇట్లు; ఉదయించిరి= పుట్టారు.

**తాత్పర్యం:** బలవంతు లైన యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవు లనేవాళ్ళు - వివేకంచేత సంపాదించిన కీర్తి కలవాళ్ళు, దేవతల వరప్రసాదంచేత ఈ విధంగా పుట్టారు.

**విశేషం:** 'పాండవులు పుట్టిన శుభవేళలలో ఆకాశవాణి పలికింది: వాళ్ళకు పేర్లనుకూడా తానే పెట్టింది. అర్జునుని జన్మదినం త్రిలోకవైభవంగా జరిగింది. దైవాంశసంభూతులేకాక, దైవబలసమన్వితులు, దైవాశీర్వాదయుతులు పాండవులు. ఊర్జితులు అంటే పురుషకారాన్ని సాధింపగలిగిన బలం కలవా ళ్ళని విశేషార్థం. వివేక+ఆర్జితయశులు అనే విశేషణం కూడా పాండవులకు సార్థకమే. సదసద్వివేకం ధర్మవీరుల లక్షణం. పాండవుల సద్వృత్తం, ధార్తరాష్ట్రుల దుర్వృత్తమే భావిభారతకథ. ఇది వస్తుధ్వని. (సంపా.)

**వ. అంత నట.** **135**

**టీ.** అంతన్= తరువాత; అటన్= అక్కడ.

**సీ. మృగ శాప భయమున జగతీశుఁ డప్పాండు । పతి శతశృంగపర్వతమునందుఁ**
**బత్నీసమేతుఁడై యత్నంబుతో ఘోర । తప మొనరించుచు విపులశక్తి**
**నమరవరప్రసాదమున ధర్మస్థితిఁ । గొడుకుల నేవురఁ బడసె ననియు**
**విని వసుదేవుండు మనమున హర్షించి । యనుజను మఱఁదిని ఘనుఁడు చూడఁ**

**తే. దనపురోహితుఁ గశ్యపుం డను మహాత్ముఁ । జీరి పుత్తెంచె నవ్విప్రుచేత భాగి**
**నేయు లగు కుమారులకు నమేయరత్న । భూషణావళు లిచ్చి విశేషలీల.** **136**

**ప్రతిపదార్థం:** జగతి+ఈశుఁడు= లోకానికంతటికి ప్రభువు; ఆ+పాండు, పతి= ఆ పాండురాజు; మృగ, శాప, భయంబునన్= మృగశాపంవలన కల్గిన భయంతో - అనగా మృగరూపం పొందిన కిందము డనే ఋషివలన కల్గిన శాపభయంతో; శతశృంగ, పర్వతమునందున్; పత్నీ, సమేతుఁడు+ఐ= భార్యలతో కూడినవాడై; యత్నంబుతోన్; ఘోర, తపమున్= తీవ్రతపస్సును; ఒనరించుచు= చేస్తూ; విపుల, శక్తిన్= గొప్ప శక్తిచేత; అమర, వర, ప్రసాదమునన్= దేవతలయొక్క వరప్రసాదంచేత; ధర్మ, స్థితిన్= ధర్మమార్గంలో; కొడుకులన్; ఏవురన్= ఐదుగురిని; పడసెన్= పొందెను; అనియున్= అని కూడా; విని= ఆలకించి; ఘనుఁడు; వసుదేవుండు; మనమునన్= మనస్సులో; హర్షించి= సంతోషించి; అనుజను= తోడబుట్టిన దానిని - చెల్లెలిని (కుంతిని); మఱఁదిని (అనగా పాండురాజును); చూడన్= చూడగా; పురోహితున్= పురోహితుణ్ణి; కశ్యపుఁడు అను మహాత్మున్ = కశ్యపుడు అనే పేరుగల మహనీయుణ్ణి; చీరి= పిలిచి, ఆహ్వానించి; ఆ+విప్రుచేతన్= ఆ బ్రాహ్మణునితో; భాగినేయులు= తోబుట్టువుయొక్క కొడుకులు; అగు+కుమారులకున్= అయిన పుత్రులకు; అమేయ, రత్న, భూషణ+ఆవళులు= అపరిమిత మైన రత్నాభరణాల సమూహాలను; విశేష, లీలన్= అధిక మైన విలాసంతో; ఇచ్చి+పుత్తెంచెన్ = ఇచ్చి పంపాడు.

**తాత్పర్యం:** పాండురాజు మృగశాపభయంవలన భార్యలతో కలిసి శతశృంగపర్వతంమీద ఘోరతపస్సు చేస్తూ, దేవతలవరప్రసాదంవలన ధర్మమార్గంలో అయిదుగురుకొడుకులను పొందా డని విని, కుంతిఅన్న వసుదేవుడు, తన చెల్లెలిని, మరదిని చూచి రావడానికి తన పురోహితు డైన కశ్యపుడిని పిలిచి, అతనిచేత తన చెల్లెలిపిల్లలకు అపరిమిత మైన రత్నాభరణాలను విశేషవైభవంతో ఇచ్చి పంపాడు.

**విశేషం:** పాండవులకు యాదవులతో ఏర్పడబోయే గాఢమైన అనుబంధానికి ఇది ప్రస్తావనవంటిది. పాండురాజుతో బంధుత్వం కలుపుకొన్న వసుదేవుని తరువాత వాసుదేవుడుకూడా పాండవులతో బంధుత్వాన్ని కలుపుకుంటాడు (సుభద్రను అర్జునుడి కిచ్చి); అంతేకాదు వారియోగక్షేమాలను చూచే రక్షకుడుగా నిలుస్తాడు.

**వ.** **అ క్కశ్యపుండును జనుదెంచి పృథామాద్రీ సహితుం డయి యున్న యప్పాండురాజుం గని వసుదేవు సందేశంబుఁ జెప్పి యక్కుమారులకు రత్నభూషణాంబరంబు లిచ్చి, క్రమంబునఁ జౌలోపనయనంబు లొనరించి, వేదాధ్యయనంబు సేయించుచున్నంత వసంతసమయం బఖిలజీవలోకానందజననం బై యేర్పడం జనుదెంచిన.** **137**

**ప్రతిపదార్థం:** ఆ+కశ్యపుండును; చనుదెంచి= వచ్చి; పృథా, మాద్రీ, సహితుండు+అయి= కుంతీమాద్రులతో కూడినవాడై; ఉన్న= కలిసిఉండే; ఆ+పాండురాజును; కని= చూచి; వసుదేవు, సందేశంబు= వసుదేవుడు చెప్పి పంపిన సమాచారాన్ని; చెప్పి; ఆ+కుమారులకున్= ఆ పాండవులకు; రత్న, భూషణ+అంబరంబులు= రత్నాల ఆభరణాలు, వస్త్రాలు; ఇచ్చి; క్రమంబునన్= వరుసగా; చౌల+ఉపనయనంబులు= చౌలకర్మ, ఉపనయనకర్మ; ఒనరించి= చేసి; వేద+అధ్యయనంబున్= గురుముఖమున వేదాన్ని చదివించటం; చేయించుచు+ఉన్నంత= చేయిస్తూ ఉండే సమయంలోనే; వసంత, సమయంబు= వసంతకాలం; అఖిల, జీవ, లోక+ఆనంద, జననంబు+ఐ= అన్ని ప్రాణిసమూహాలకు ఆనందాన్ని కలిగించే దై; ఏర్పడన్+చనుదెంచినన్= తేటపడునట్లు, రాగా.

**తాత్పర్యం:** ఆ కశ్యపుడు వచ్చి కుంతీమాద్రులతో కలిసి ఉన్న పాండురాజును చూచి, వసుదేవుడు చెప్పి పంపిన సందేశాన్ని వినిపించి, క్రమంగా వాళ్ళకు చౌలోపనయనకర్మలు చేసి వేదాధ్యయనం చేయిస్తూ ఉండగా అన్ని ప్రాణులకు ఆనందాన్ని కలిగిస్తూ వసంతకాలం వచ్చింది.

## వసంతవర్ణనము (సం. 1-116-1)

**లయగ్రాహి.**

**కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధుపమ్ముల సుగీత నినదమ్ము లెసఁగెం; జూ**
**తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి ముకుళమ్ములను నానుచు ముద మ్మొనర వాచా**
**లమ్ము లగు కోకిల కులమ్ముల రవమ్ము మధుర మ్మగుచు విన్చె; ననిశమ్ము సుమనోభా**
**రమ్ముల నశోకనికరమ్ములును జంపకచయమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్.** **138**

**ప్రతిపదార్థం:** కమ్మని, లతా+అంతములకున్= మంచివాసన కల పూలకు; మొనసి= పూని; వచ్చు= చెంతకు విచ్చేయు; మధుపమ్ముల, సుగీత, నినదమ్ములు= తుమ్మెదలయొక్క చక్కని గానాల ధ్వనులు; ఎసఁగెన్= అతిశయించినాయి; చూతమ్ముల, లసత్+కిసలయమ్ముల, సుగంధి, ముకుళమ్ములన్= మామిడిచెట్లయొక్క ప్రకాశిస్తున్న చివుళ్ళను, మంచివాసన కల మొగ్గలను; ఆనుచున్= తింటూ; ముదమ్ము= సంతోషం, ఒనరన్= ఒప్పగా; వాచాలమ్ములు= కూయునటువంటివి; అగు= అయిన; కోకిల, కులమ్ముల, రవమ్ము= కోయిల గుంపులయొక్క ధ్వని; మధురమ్ము+అగుచు; వినిచెన్= వినిపించింది; అనిశమ్ము= ఎల్లప్పుడూ; సుమనస్+భారమ్ములన్= పూలబరువుచేత; అశోక, నికరమ్ములును= అశోకవృక్షాల సమూహాలు; చంపక, చయమ్ములును= సంపెంగల సమూహాలు; కింశుక, వనమ్ములును= మోదుగులసమూహాలు, ఒప్పెన్= అందగించాయి.

**తాత్పర్యం:** సువాసన కల పూలకు మూగినతుమ్మెదలఝుంకారం అతిశయించింది. మామిడిచివుళ్ళను, మొగ్గలను తింటూ సంతోషంతో కూసే కోయిలగుంపులకూతలు మనోహరంగా వినిపించాయి. అశోకాలు, సంపెగలు, మోదుగులు బాగా పూచాయి.

**విశేషం:** లయగ్రాహి పాదానికి 30 అక్షరా లుంటాయి. భ, జ, స, న, భ, జ, స, న, భ, య అనే గణాలు వరుసగా ఉంటాయి. 9, 17, 25 అక్షరాలు ప్రాసయతిస్థానాలు. ప్రాసనియమం ఉన్నది. నన్నయ రచించినమూడులయగ్రాహులలో రెండింటిని (క్రింది పద్యంకూడా) వెంటవెంటనే వసంతర్తువర్ణనలో వినియోగించటం విశేషం. (తరువాతి పద్యంకూడా లయగ్రాహియే). ఈ పద్యంలో వసంత ఋతువులో వనాలలో విరబూసి కనువిందుచేసే పూలచెట్ల అందాన్ని, వీనుల విందుచేసే తుమ్మెదల ఝుంకార నాదాన్ని, కోయిలల సుస్వరమాధుర్యాన్ని నన్నయ వర్ణించాడు. మకారం నాదాక్షరం, సప్తస్వరాలలో ఒకటి. అటువంటి మకారాన్ని ద్విరుక్తంగా, నియతసుందరంగా, మళ్ళీమళ్ళీ ప్రయోగించి, ఆ తుమ్మెదల ఝుంకారనాదాన్ని, ఆ కోయిలల సుస్వర మాధుర్యాన్ని పాఠకుల చెవి సోకేటట్లు చేశాడు. శృంగారభావోద్దీపకంగా ఏర్పడిన వాతావరణాన్ని అక్షరరమ్యంగా ధ్వనింపచేశాడు. వసంతం లోకంలో అందరికీ అందంగా, ఆనందంగా, ప్రాణప్రదంగా ఉండటం సహజం. కానీ ఇక్కడ పాండురాజుకు మాద్రికి ప్రాణహారిగా పరిణమించింది. అంటే లయగ్రాహి ప్రాణగ్రాహి అయింది. ఒకరికి ఇరువురి ప్రాణాలు అంతమయ్యాయి. అందుకే రెండు లయగ్రాహివృత్తాలు. లయించటం అంటే నశించటం. ఈ సందర్భంలో ఒకే పర్యాయం భార్యాభర్తల ప్రాణాలు లయమయ్యాయి. (వృత్తాలు) లయాత్మకపద్యంలో పేరుకు తగిన ఔచిత్యాన్ని, అందులో అంతర్గతంగా ఉన్న పరమసత్యాన్ని నన్నయ ప్రసన్న గంభీరంగా ప్రతిపాదించాడు.

**లయగ్రాహి**

> **చందన తమాలతరులందు నగరుద్రుమములందుఁ గదళీవనములందు లవలీ మా**
> **కంద తరుషండములయందు ననిమీలదరవిందసరసీవనములందు వనరాజీ**
> **కందళిత పుష్పమకరందరసముం దగులుచుం దనుపు సౌరభము నొంది జనచిత్తా**
> **నందముగఁ బ్రోషితులడెందము లలందురఁగ మందమలయానిల మమందగతి వీచెన్.** **139**

**ప్రతిపదార్థం:** చందన, తమాల, తరుల+అందున్= మంచి గంధపు చెట్లయందు, చీకటి చెట్లయందు; అగరు, ద్రుమముల+ అందున్= అగరు చెట్లతోటలందు, కదళీ, వనముల+అందు= అరటితోటలందు; లవలీ, మాకంద, తరు, షండముల+అందున్= లవలీతీగల, తియ్యమామిడి చెట్లయొక్క సమూహాలయందు; అనిమీలత్+అరవింద, సరసీ, వనముల+ వికసించిన తామరలు కల కొలకుల సమూహాలందు; వనరాజీ, కందళిత, పుష్ప, మకరంద, రసమున్= వనసమూహంలో వికసించిన పూలమీది తేనెను; తగులుచున్= తాకుతూ; తనువు= చల్లదనం; సౌరభమున్= సువాసనను; ఒంది= పొంది; జన, చిత్త+ఆనందముగన్= ప్రజలమనస్సుకు సంతోషం కలిగేట్లు; ప్రోషితుల, డెందములు= దేశాంతరంలో ఉన్న వారి మనస్సులు; అలందురఁగన్= దుఃఖించేట్లు; మంద, మలయ+అనిలము= మెల్లనిచల్లగాలి; అమంద, గతిన్= అధిక మైన వ్యాప్తితో; వీచెన్= వీచింది.

**తాత్పర్యం:** మంచిగంధపుచెట్ల, చీకటిచెట్ల, అగరుచెట్ల, అరటితోటల, లవలీతీగల, తియ్యమామిడి చెట్ల సమూహాలలో, పూచిన తామరకొలనులలో, వికసించినపూలలోని తేనెమీద పాకుతూ చల్లదనాన్ని, సువాసనను పొంది ప్రజల మనస్సుకు ఆనందం కలిగించేటట్లు, దేశాంతరంలో ఉన్నవాళ్ళ మనస్సులు దుఃఖించేటట్లు మందమారుతం అధికంగా వీచింది. (తమాల= చీకటి చెట్లు- నల్లని ఆకులు గల చెట్లు. లవలీ= ఒకతీగ, ఒక ఫలవృక్షము)

**విశేషం:** ముందు పద్యంలో రూపనాదాత్మక వనసౌందర్యాన్ని రమణీయంగా వర్ణించిన నన్నయ - ఈ పద్యంలో కనువిందుచేసే వనసౌందర్యంతో పాటు స్పర్శాత్మకమందమలయానిలాన్ని మనోహరంగా వర్ణించాడు. ఆ పద్యంలో తుమ్మెదల ఝంకారనాదాన్ని, కోయిలల స్వరమాధుర్యాన్ని ధ్వనింపచెయ్యటానికి ద్విరుక్తమకారాన్ని వాడుకుంటే - ఈ పద్యంలో మందమలయానిలాన్ని అందచేయటానికి బిందుపూర్వక దకారాన్ని వాడుకొన్నాడు. అక్షరశిల్పి నన్నయ. అక్షరరమ్యం, రుచిరార్థమనోజ్ఞం ఆయన కవిత.

## పాండురాజుమరణము (సం. 1-116-4)

**వ. ఇట్లు సర్వభూతసమ్మోహనంబయిన వసంతసమయంబునం బాండురాజు మదనసమ్మోహనమార్గణబందీకృత మానసుం డై మద్రరాజపుత్త్రి దైన మనోహరాకృతియందు మనంబు నిలిపి యున్నంత; నొక్కనాఁడు కుంతీదేవి బ్రాహ్మణభోజనంబు సేయించుచుండి మాద్రీరక్షణంబునం దేమఱియున్న యవసరంబున. 140**

**ప్రతిపదార్థం:** ఇట్లు; సర్వ, భూత, సమ్మోహనంబు+అయిన= అన్ని ప్రాణులను మోహింపచేసేది అయిన; వసంత, సమయంబునన్= వసంతకాలంలో; పాండురాజు; మదన, సమ్మోహన, మార్గణ, బందీకృత, మానసుండు+ఐ= మన్మథుడి యొక్క సమ్మోహన బాణంచేత కట్టివేయబడిన మనస్సు కలవా డై; మద్రరాజ, పుత్త్రికది+ఐన= మాద్రికి సంబంధించిందైన; మనోహర+ఆకృతియందున్= అందమైన రూపంమీద; మనంబు= మనస్సు; నిలిపి; ఉన్నంతన్= ఉండగా; ఒక్కనాఁడు; కుంతీదేవి= కుంతి; బ్రాహ్మణ, భోజనంబు, చేయించుచున్= బ్రాహ్మణులకు భోజనం చేయిస్తూ; ఉండి= ఉన్నదై; మాద్రీ, రక్షణంబునందున్= మాద్రియొక్క రక్షణలో; ఏమఱి= మరచి; ఉన్న అవసరంబునన్= ఉండిన సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా అన్నిప్రాణులను మోహింపచేసే వసంతకాలంలో పాండురాజు మన్మథునియొక్క సమ్మోహన బాణానికి లొంగిన మనస్సు కలవాడై, మాద్రియొక్క మనోహరరూపం మీద మనస్సు నిలిపి, ఒక రోజు కుంతీదేవి బ్రాహ్మణభోజనం చేయిస్తూ మాద్రిని కనిపెట్టటం మరచి ఉన్నసమయంలో.

**విశేషం:** మానవమనస్తత్త్వంపై ప్రకృతిప్రభావం ప్రబలం. విశేషించి వసంతప్రభావం విపరీతం. మాద్రి వయస్సులో చిన్నది. మహా సౌందర్యవతి. ఆమె పాండురాజువశం కాకుండా, వా ళ్ళిద్దరికీ ఏకాంతం ఏర్పడకుండా కుంతి కనిపెడుతూనే ఉన్నది. కానీ ఆ రోజు బ్రాహ్మణభోజనంలో నిమగ్నురా లై ఆమె మాద్రివిషయం మరచింది.

**ఉ. చారుసువర్ణహాసినవచంపకభూషయు సిందువారము**
**క్తా రమణీయయున్ వకుళదామవతంసయు నై యపూర్వ శృం**
**గారవిలాసలీల యెసఁగం దనముందట నున్న మాద్రి నం**
**భోరుహనేత్రఁ జూచి కురుపుంగవుఁ డంగజరాగమత్తుఁ డై. 141**

**ప్రతిపదార్థం:** చారు, సువర్ణ, హాసి, నవ, చంపక, భూషయున్= అంద మైన బంగారాన్నే గేలిచేసే క్రొత్తసంపెంగపువ్వులే ఆభరణంగా కలది; సిందువార, ముక్తారమణీయయున్= వావిలిపూ లనే ముత్యాలచే మనోహరమైనదియున్నూ; వకుళ, దామ, వతంసయున్,ఐ= పొగదదండలు చెవి ఆభరణాలుగా కలదై; అపూర్వ, శృంగార, విలాస, లీల= అంతకుముందు లేని అలంకార విలాసం యొక్క అతిశయం; ఎసఁగన్= ఒప్పగా; తన, ముందటన్, ఉన్న= తన ముందున్న; అంభోరుహ, నేత్రన్= కమలాలవంటి కన్నులు కలదానిని; మాద్రిన్= మాద్రిని; చూచి= కనుగొని, కురు పుంగవుఁడు= కురుశ్రేష్ఠు డైన పాండురాజు; అంగజ, రాగ, మత్తుఁడు+ఐ= మన్మథరాగంచేత మదించినవాడై,

**తాత్పర్యం:** అందంలో బంగారాన్ని మించిన క్రొత్తసంపెంగపువ్వులే ఆభరణాలుగా కలదై, వావిలిపూ లనే ముత్యాలచేత మనోహర మైనదై, పొగదండలు చెవి ఆభరణాలుగా కలదై అంతకుముం దెన్నడూ లేని శృంగారవిలాసంతో తన ముందున్న - కమలాలవంటి అందమైన కన్నులు కల మాద్రిని చూచి, కురుశ్రేష్ఠుడైన పాండురాజు మన్మథరాగవశుడై.

**విశేషం:** సహజంగానే సౌందర్యవతి అయిన మాద్రికి వసంత పుష్పాలంకారాలు అమితమైన శోభను కల్గించాయి. ఆమె రూపం ఆనాడు పాండురాజుకు మత్తెక్కించింది. (వతంస-అవతంసయొక్కరూపాంతరం)

**క. కిందముశాపము డెందము । నం దలఁపక శాపభయమునన్ మాద్రి గడున్**
**వందురి వారింపఁగ బలి । మిం దత్సంభోగసుఖసమీహితుఁ డయ్యెన్. 142**

**ప్రతిపదార్థం:** కిందము, శాపమున్= కిందమునియొక్క శాపాన్ని; డెందమునన్= మనస్సులో; తలఁపక= ఆలోచింపక; మాద్రి; శాప, భయమునన్= శాపంవలని భయంచేత; కడున్= మిక్కిలి; వందురి= దుఃఖించి; వారింపఁగన్= అడ్డుకోగా; బలిమిన్= బలాత్కారంచే; తత్+సంభోగ, సుఖ సమీహితుఁడు= దానితో సంభోగసుఖంమీద కోరిక కలవాడు; అయ్యెన్.

**తాత్పర్యం:** పాండురాజు కిందమునిశాపాన్ని మరచాడు. ఆ శాపం గుర్తున్నమాద్రి ఎంతో భయంతో, దుఃఖంతో తనను వారిస్తున్నా, బలాత్కారంగా ఆమెతో సంభోగసుఖాన్ని పొందకోరాడు.

**విశేషం:** ప్రకృతిప్రభావం, మాద్రి సౌందర్యం, మానవసహజమైన కామతృష్ణ. విశేషించి ఆ కామతృష్ణ తీర్చుకోవటానికి అనుకూలించిన ఆ సమయం పాండురాజుప్రాణాలు తీశాయి. విధి బలీయం.

**వ. దానం జేసి విగతజీవుం డైన యప్పాండురాజుం గౌఁగిలించుకొని మాద్రి యఱచుచున్న, దాని యాక్రందన ధ్వని విని వెఱచి కుంతీదేవి గొడుకులుం దానునుం బఱతెంచి పతియడుగులపయిం బడి యేడ్చుచున్న నెఱింగి, శతశృంగ నివాసులగు మునులెల్లం దెరలివచ్చి చూచి శోకవిస్మయాకులితచిత్తు లయి; రంతఁ గుంతీదేవి మాద్రి కి ట్లనియె. 143**

**ప్రతిపదార్థం:** దానన్+చేసి= దానివలన; విగత, జీవుండు+ఐన= కోల్పోయిన ప్రాణాలు కల వాడైన; ఆ+పాండురాజున్; కౌఁగిలించుకొని; మాద్రి; అఱచుచున్నన్= రోదిస్తుండగా; దాని+ఆక్రందన, ధ్వని= ఆమె ఏడుపు శబ్దం; విని; వెఱచి= భయపడి; కుంతీదేవి; కొడుకులున్; తానునున్; పఱతెంచి= వచ్చి; పతి, అడుగుల, పయిన్= భర్త పాదాల మీద; పడి; ఏడ్చుచు+ఉన్నన్= దూషించుచుండగా; ఎఱింగి= తెలిసికొని; శతశృంగ, నివాసులు+అగు మునులు+ఎల్లన్= శతశృంగ పర్వతమున నివసించు ముని లందరూ; తెరలి= కలతచెంది; వచ్చి; చూచి;శోక, విస్మయ+ఆకులిత, చిత్తులు+అయిరి= దుఃఖంచేత, ఆశ్చర్యంచేత కలత చెందిన మనస్సు కలవాళ్ళు అయ్యారు; అంతన్= అప్పుడు, కుంతీదేవి; మాద్రికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దానివలన ప్రాణాలు కోల్పోయిన ఆ పాండురాజును కౌగలించుకొని మాద్రి అరుస్తూ ఉన్నది. దాని యేడుపు సవ్వడి విని భయపడి కొడుకులతోసహా కుంతీదేవి వచ్చి, భర్తపాదాలమీద పడి ఏడ్వసాగింది. ఆ సంగతి తెలిసికొని శతశృంగంలో నివసిస్తున్న మునులంతా గుమికూడి వచ్చి చూచి దుఃఖంతో, ఆశ్చర్యంతో కలతచెందిన మనస్సు కలవా రయ్యారు. అప్పుడు కుంతి మాద్రితో ఈ విధంగా అనింది.

**ఉ. 'నా కెడ యిమ్ము, లెమ్ము, కురునాథుమనఃప్రియధర్మపత్ని నే**
**నేకత మెట్టు లుండుదు? మహీపతితోడన పోదుఁ; బుత్త్రులం**
**జేకొని పెన్పు; నా పసుపుఁ జేయుము' నావుడు మాద్రి దద్దయున్**
**శోకపరీతచిత్త యగుచుం బృథ కి ట్లనియెం బ్రియంబునన్. 144**

**ప్రతిపదార్థం:** నాకు; ఎడ= చోటు; ఇమ్ము; లెమ్ములే; కురునాథు, మనస్+ప్రియ, ధర్మపత్నిన్= కురురా జైన పాండురాజుయొక్క మనస్సుకు ప్రియ మైన భార్యను; ఏన్= నేను; ఏకతము+అ= ఒంటరిగా; ఎట్టుల; ఉండుదున్; మహీపతితోడన= రాజుతోనే; పోదున్= పోతాను - అనగా ప్రాణాలు విడుస్తాను; పుత్త్రులన్; చేకొని= తీసికొని; పెన్పు= పెంచుము; నా, పసుపున్= నా యొక్క ఆజ్ఞను; చేయుము; నావుడు= అనగా; మాద్రి; తద్దయున్= మిక్కిలి; శోక, పరీత, చిత్త, అగుచున్= దుఃఖంచే చుట్టబడిన మనస్సు కలదై; ప్రియంబునన్= అనువుగా; పృథకున్= కుంతికి; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** 'నీవు లేచి నాకు చో టిమ్ము. నేను పాండురాజుమనస్సుకు ప్రియ మైన ధర్మపత్నిని. ఆయనను విడిచి ఉండలేను. ఆయనతో వెళ్ళిపోతాను. నీవు కొడుకులను పెంచుము' అని కుంతి అనగా మాద్రి ఎంతో దుఃఖంతో ఆమెమనస్సుకు ప్రియంగా ఇట్లా పలికింది.

**విశేషం:** కురునాథుమనఃప్రియధర్మపత్ని - అని మాద్రిని సంబోధించి - నేను, ఏకతమ ఎలా ఉండగలను అని కుంతి అన్నట్లు కూడా గ్రహింపవచ్చు. ఆ సంబోధనలో కుంతి మాద్రిని ఎత్తిపొడవడం ధ్వనిస్తుంది. - పాండురాజు మనస్సుకు ప్రియమైన నీ ధర్మపత్నీత్వం ఇదేనా? భర్త ప్రాణం పోవడానికి కారణభూతురాలవు అయ్యావు - అనేనింద అందులో స్ఫురించక మానదు, అట్లా కాక కుంతి తనే కురునాథుమనఃప్రియధర్మపత్నిన్ అని చెప్పుకొని, ఏన్= నేను, ఏకతమ= ఒంటరిగా, ఎట్లా ఉండగలను అన్నట్లు భావించినా అందులోనూ కొంత ఎత్తిపొడుపు లేకపోలేదు. పాండురాజుకు నేను నీ కన్నా తక్కువ ప్రియమైన భార్యను కాను; అయినా మైమరచి నీవలె ఆయనకు ప్రాణాపాయం కలిగింపని ధర్మపత్నిని సుమా! ఆయన ధర్మపత్నిని అయిన నేను ఆయన లేకుండా ఎట్లా జీవించగలను అనే పదునైనభావం పరోక్షంగా మాద్రికి ఎత్తుపొడుపే. అప్పటి పరిస్థితుల్లో కుంతి ఎంత సానుభూతితో మాద్రిని చూచినా, ఆమెమీద కుంతికి ఒకింత కోపం, సపత్నీభావం లోలోపల కలగటం సహజమే. తదనుగుణంగా ఆమె మాటలలో కొంత ఎత్తిపొడుపు చోటుచేసికొనడంకూడా సహజమే. అలతి అలతి మాటలతో కూడినవాక్యాలు శోకతీవ్రతను వ్యక్తంచేస్తున్న ట్లున్నాయి. మాధుర్యగుణం ఈ పద్యంలో నాటకీయంగా పోషింపబడింది.

## మాద్రి సహగమనము సేయుట (సం. 1-116-25)

**తరువోజ.**

**కురువంశ నిస్తారకుల ధర్మయుక్తిఁ గొడుకులఁ బడసి యి క్కురుకుంజరునకుఁ**
**గరము మనఃప్రీతి గావించి పుణ్యగతికిఁ గారణమవై కమలాక్షి! నీవు**
**దిరముగా నిష్టంబు దీర్చి; తే నిందు ధృతిఁ బతియిష్టంబు దీర్పన; కాన**
**యరిగెదఁ బతితోడ నన్యలోకంబునం దైనఁ బ్రీతిసేయఁగఁ గాంతు ననియు. 145**

**ప్రతిపదార్థం:** కమలాక్షి= తామరలవంటి కన్నులు కలదానా! ఓ కుంతీ!; నీవు; కురు, వంశ నిస్తారకులన్= కురువంశాన్ని తరింప చేసేవారిని; కొడుకులన్; ధర్మ, యుక్తిన్= ధర్మంతోడి కూడికచేత - అనగా ధర్మమార్గంలో; పడసి= పొంది; ఈ+కురు,

కుంజరునకున్= ఈ కురుశ్రేష్ఠు డైన పాండురాజుకు; కరము= మిక్కిలి; మనఃప్రీతి= మనస్సంతోషాన్ని; కావించి; పుణ్య, గతికిన్= పుణ్యలోకానికి; కారణమవు+ఐ= హేతువై; తిరముగాన్= శాశ్వతంగా; ఇష్టంబున్ తీర్చితి= అభీష్టాన్ని నెరవేర్చావు; ఏన్= నేను; ఇందున్= ఈ లోకంలో; ధృతిన్= సంతోషంతో; పతి, ఇష్టంబున్= భర్తయొక్క కోరికను; తీర్పను+అ= తీర్చనే లేదు; కానన్= అందుచేత; అన్య, లోకంబు, అందు+ఐనన్= పరలోకంలో నైనా; ప్రీతి= ఇష్టం; చేయఁగన్; కాంతున్= చూస్తాను; పతితోడన్= భర్తతోకూడా; అరిగెదన్= వెళ్తాను; అనియు.

**తాత్పర్యం:** కుంతీ! నీవు కురువంశాన్ని తరింప చేసే కొడుకులను ధర్మమార్గంలో కని, ఈ కురుశ్రేష్ఠు డైన పాండురాజుకు మిక్కిలి సంతోషం కలిగించి, పుణ్యలోకం పొందడానికి కారణ మయ్యావు. శాశ్వతంగా ఆయన కోర్కె తీర్చావు. నేను ఈ లోకంలో భర్తకోర్కె తీర్చనే లేదు. అందువలన పరలోకంలో నైనా తీర్చటానికి ఆయన వెంట వెళ్తాను.

**విశేషం:** తరువోజ లక్షణానికి ఆది. 5.28 చూడండి. ఎత్తిపొడుపుగా పలికిన కుంతితో గడుసరిగా మాద్రి మాట్లాడింది. కుంతి ఎత్తిపొడుపును తనమాటలలో ఎంత గోప్యంగా మలచిందో, మాద్రికూడా తన గడుసరితనాన్ని అంత నిపుణంగా గోప్యంచేసి సహజసంభాషణవలె పలికింది. ముందటి పద్యంలో 'మనఃప్రియధర్మపత్నిగా భావిస్తే ఆమె పాండురాజు అనుమతితో మంత్రశక్తివలన పుణ్యగతికి కారకు లైన కొడుకులను కని ఆయనకు పుణ్యగతిని, మనఃప్రీతిని కలిగించింది. మాద్రికి మంత్రశక్తి లేదు కాని అందమైన ఆకృతి ఉన్నది. దానిని పాండురాజు కోరాడు. కాని, దానివలన పాండురాజుకు మనఃప్రీతి కలిగించలేక పోయింది. శాపకారణంగా, మనఃప్రీతిని కలిగించటంలో కుంతి కృతార్థురాలైంది. తాను కాలేకపోయింది అని వాచ్యమైన అర్థం. వ్యంగార్థ్యప్రతీతికూడా కలుగుతున్నది. కుంతీ! నీవు పాండురాజు ఇష్టం తీర్చినదానవు. ఆ యిష్టపూర్తివలన ఆ వాచ్యంవెంట ఇహలోకసుఖంకంటె పరలోకసుఖమే కలుగుతుంది. పాండురాజు నన్ను కోరింది ఇహలోక సుఖాన్ని. దాన్ని తీర్చే అవకాశం లేదు-ఈ లోకంలో. అందువలన ఆయనతోపాటు నేనుకూడా సహగమనంచేసి ఆ కోర్కె పరలోకంలోనైనా తీరుస్తాను అన్నది-మాద్రి. 'పతికి మనఃప్రియధర్మపత్ని' అని ఎత్తిపొడుపుగా మాద్రిని సంబోధించిన అర్థాన్ని పురస్కరించుకొని తానే సహగమనయోగ్యత కలిగినదాని నని, అదే పాండురాజుకు మనఃప్రియహేతు వని చెప్పింది. మాద్రిశోకపరీతచిత్తప్రవృత్తి వ్యంజకంగా కాంతిగుణంతో కూడిన తరువోజ సార్థకం. (సంపా.)

**వ. 'మఱియు మృగశాపభయం బెఱింగియు ని ట్లేమఱిన యతిప్రమత్తురాల; నే నిందుండి పుత్త్రుల రక్షింప నేర; నన్ను వారింప వలవదు; కొడుకుల నేమఱక రక్షించునది' యని చెప్పి కుంతీదేవి వీడ్కొని మునిసహస్రంబునకు మ్రొక్కి మద్రరాజపుత్త్రి పతితోడన చితారూఢ యై యగ్నిశిఖల నపగత ప్రాణ యయ్యెఁ; నంత నయ్యిరువుర యంగంబులు సంగ్రహించుకొని మహామునులు కుంతీదేవిం గొడుకుల నూరార్చి. 146**

**ప్రతిపదార్థం:** మఱియు; మృగ, శాప, భయంబు= జింకయొక్క శాపంవలనకలిగే భయం; ఎఱింగియున్= తెలిసికూడ; ఇట్లు; ఏమఱిన= మరచిపోయిన; అతి, ప్రమత్తురాలన్= మిక్కిలి మత్తు గొన్న దానను - అనగా జాగరూకత లేనిదానను; ఏన్=నేను; ఇందు+ఉండి; పుత్రుల; రక్షింపనేరన్= కాపాడలేను; నన్నున్, వారింప, వలవదు= అడ్డగించవద్దు; కొడుకులన్; ఏమఱక= మరువకుండా; రక్షించునది= కాపాడేది; అని, చెప్పి; కుంతీదేవిన్; వీడ్కొని= వీడి; ముని, సహస్రంబునకు= మునులు వేయిమందికి (మునుల సమూహానికి); మ్రొక్కి= నమస్కరించి; మద్రరాజ, పుత్రి; పతితోడన= భర్తతో కూడా; చితా+ఆరూఢ+ఐ= చితిపైకి ఎక్కిందై; అగ్ని శిఖలన్= నిప్పుమంటలలో; అపగత, ప్రాణ= పోయిన ప్రాణాలు కలది; అయ్యెన్= అయినది; అంతన్= అటుపై; ఆ+ఇరువుర, అంగంబులు= ఆ ఇద్దరిఅవయవాలు (శవదహనం తరువాతి రోజు ఆయా అవయవాల

ఎముకలు); సంగ్రహించుకొని= సమకూర్చుకొని - అనగా ఒకటిగా చేర్చి తీసికొని; మహామునులు; కుంతీదేవిన్, కొడుకులన్= కుంతిని, ఆమెపుత్రుల్ని; ఊరార్చి= ఓదార్చి.

**తాత్పర్యం:** 'మృగశాపంవలన కలిగే భయం తెలిసికూడా ఈవిధంగా జాగ్రత్త లేనిదాన్ని అయిన నేను, ఇక్కడ ఉండి కొడుకులను కాపాడ లేను. నన్ను అడ్డుకోవద్దు. జాగ్రత్తతో నీవే కొడుకులను కాపాడుము' అని కుంతీదేవికి చెప్పి; వెయ్యి మంది(అనేకులైన) మహర్షులకు మ్రొక్కి, భర్తశవంతోపాటు తానుకూడా చితి ఎక్కి మంటలలో మాద్రి ప్రాణాలు వదిలింది. తరువాత మహామునులు మాద్రీపాండురాజుల అస్థిసంచయనం చేసి, కుంతీదేవినీ, ఆమె కొడుకులను ఓదార్చి.

**విశేషం:** కిందము డిచ్చిన శాపంప్రకారం పాండురాజు ఏ సతితో క్రీడింపబోతాడో ఆమెకూడా చనిపోతుంది. అది ఇక్కడ నిజమయింది.

**క. ధరణీరాజ్యవిభూతియు । పరిజనులను బాంధవులను బ్రజ విడిచి తప**
**శ్చరణతపస్వుల తనకున్ । శరణం బని నమ్మి పాండుజనపతి నెమ్మిన్. 147**

**ప్రతిపదార్థం:** పాండు, జనపతి= పాండురాజు; ధరణీ, రాజ్య విభూతియు= భూరాజ్యసంపదను; పరిజనులను= సేవకులను; బాంధవులను= చుట్టాలను; ప్రజ= ప్రజలను; విడిచి; తపస్+చరణ= తపస్సుచేసే; తపస్వులు+అ= ఋషులే; తనకున్; శరణంబు+అని= దిక్కని; నమ్మి; నెమ్మిన్= ప్రీతితో.

**తాత్పర్యం:** పాండురాజు రాజ్యసంపదను, సేవకులను, చుట్టాలను ప్రజలను వదలి తపస్సుచేసే ఋషులు మాత్రమే తనకు దిక్కని నమ్మి నిశ్చింతగా.

**క. కొడుకుల నిందఱ కిల్లడ । యిడి పరలోకమున కరిగె; నెడసేయక యి**
**ప్పుడ వీరలఁ గురువృద్ధుల । కడకుం గొని పోవ వలయు గజపురమునకున్. 148**

**ప్రతిపదార్థం:** కొడుకులన్; ఇందఱకున్= ఇంతమందికి - (ఇంతమంది మహర్షులకు); ఇల్లడ, ఇడి= ఇల్లడ పెట్టి, అప్పగించి; పరలోకమునకున్= స్వర్గానికి; అరిగెన్= వెళ్ళాడు; ఎడ, చేయక= ఆలస్యం చేయక; ఇప్పుడు+అ; వీరలన్= పాండవులను; గజ, పురమునకున్= హస్తినాపురానికి; కురు, వృద్ధుల కడకున్= కురువంశంలోని పెద్దల దగ్గరకు; కొనిపోవవలయున్= తీసికొనిపోవాలి.

**తాత్పర్యం:** కొడుకులను మనందరికి అప్పగించి పాండురాజు స్వర్గానికి వెళ్ళాడు. మనం ఆలస్యం చేయకుండా ఇప్పుడే ఈ పాండవులను హస్తినాపురంలో కురువంశంలోని పెద్దలదగ్గరకు తీసికొనిపోవాలి.

**విశేషం:** ఎవరైనా తీర్థయాత్రాదులకు పోతూ తిరిగివచ్చేంతవరకూ ఒకరివద్ద భద్రంగా ఉంచి, మరల తిరిగి ఇచ్చేటట్లు అర్థాన్ని (డబ్బు, వస్తువులు) ఉంచటం ఇల్లడపెట్టటం అంటారు. ఇక్కడ పాండవులు పాండురాజుకు, అతని వంశానికి సంబంధించిన ధనంవంటివారు. పాండురాజు పరలోకగతుడైనవాడు కాబట్టి అతనివంశానికి వారసులైన పుత్రులను ఆ వంశంలోని పెద్దలకు ఒప్పచెప్పటం న్యాయం. ఋషులు ధర్మబుద్ధితో తమకు ఆ కర్తవ్య మున్న దని భావించటం మానవసంబంధాలలో ఉండదగిన ఒక మహనీయలక్షణంగా కావ్యోపదేశం.

**మునులు పాండవులను హస్తినాపురంబునకుం గొనివచ్చి ధృతరాష్ట్రున కొప్పగించుట (సం.1-117-6)**

**వ. అని తమలో విచారించి, కుంతీదేవిని గుమారులం దోడ్కొని మునులెల్ల హస్తిపురంబునకు వచ్చి రంత.149**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; తమలోన్; విచారించి= ఆలోచించి; కుంతీదేవిని; ఆమె కుమారులన్= ఆమె కుమారుల్ని; తోడ్కొని= తీసికొనివచ్చి; మునులు+ఎల్లన్= మునులందరు; హస్తి, పురంబునకున్= హస్తినాపురానికి; వచ్చిరి; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** అని మునులు తమలో ఆలోచించి కుంతీదేవిని, కుమారులను వెంటపెట్టుకొని హస్తినాపురానికి వచ్చారు. అప్పుడు.

**చ. 'సురల వరప్రసాదమునఁ జూవె సుపుత్త్రులఁ బాండురాజు భా**
**సురముగఁ గాంచెఁ ; దత్సుతులఁ జూతము రం' డని పౌరు లెల్ల నొం**
**డొరులకుఁ జెప్పుచుం దెరలి యొండొరులం గడవంగ వచ్చి చూ**
**చిరి భుజవిక్రమాధరిత సింహకిశోరులఁ బాండవేయులన్. 150**

**ప్రతిపదార్థం:** పౌరులు+ఎల్లన్= హస్తినాపుర ప్రజలందరును; పాండురాజు; సురల, వరప్రసాదమునన్+చూవె= దేవతలయొక్క వరప్రసాదంచేత సుమా; సు, పుత్త్రులన్= యోగ్యులైన కొడుకులను; భాసురముగన్= ప్రకాశించేటట్లు; కాంచెన్= కన్నాడు; తత్+సుతులన్= ఆయనయొక్క కొడుకులను; చూతము+రండు+అని; ఒండు+ఒరులకున్= ఒకరి కొకరు; చెప్పుచున్= పలకరించుకుంటూ; తెరలి= బయలుదేరి; ఒండు+ఒరులన్= ఒకరు మరొకరిని; కడవంగన్= దాటి; వచ్చి; భుజ, విక్రమ+అధరిత, సింహ, కిశోరులన్= బాహు పరాక్రమంచే తక్కువగా చేయబడిన సింహపుపిల్లలు కలవారిని - అనగా సింహపుపిల్లలను మించిన పరాక్రమవంతులను; పాండవేయులన్= పాండుపుత్త్రులను; చూచిరి.

**తాత్పర్యం:** 'పాండురాజు దేవతల అనుగ్రహంచేత సుపుత్రులను కన్నాడు. వారిని చూద్దాం రం'డని హస్తినాపుర ప్రజ లందరూ ఒకరితో ఒకరు చెప్పుకొంటూ, ఒకరికంటె ఒకరు ముందుమిగిలి సింహపుపిల్లలకంటె పరాక్రవంతులైన పాండుకుమారులను చూచారు.

**విశేషం:** హస్తినాపురానికి దూరమై చాలకాలంగా అడవులలో పాండురాజు ఉంటున్నా, ఆ నగరంలో, రాజ్యంలో, ప్రజలలో అతనికి ఉన్నపలుకుబడి, గౌరవం ఈ పద్యంలో వ్యంగ్యం. ఈ పద్యరచనలో సమాధి అనే శబ్దగుణం సార్థకంగా పోషించబడింది. పాండవులను చూడా లన్నఉత్కంఠను క్రమంగా పౌరులు పెంచుకొంటూ వచ్చి, చివరకు పాండవులను చూచినట్లు ఈ పద్యరచన చిన్నచిన్న పదాలతో, సమాసాలతో సాగి పాండవులను, 'భుజవిక్రమాధరితసింహకిశోరులు'గా వర్ణించిన దీర్ఘసమాసంతో ముగియటంతో ఆరోహగతిని సూచిస్తూ, చూపరుల ఆసక్తినీ, అద్భుతాన్నీ ధ్వనింపచేస్తున్నది. 'పాండవేయులన్' అన్న చివరివిశేషణం 'తండ్రికి తగిన తనయులు' అనే భావం ప్రజలకు కలిగిం దని ధ్వనింపజేస్తున్నది.

**ఉ. 'వీరలు దైవశక్తిఁ బ్రభవించిన వా రగు టేమి సందియం?**
**బీరమణీయకాంతి నుపమింపఁగ వేల్పుల కారె? యిట్టి యా**
**కారవిశేషసంపదఁ బ్రకాశితతేజముపేర్మిఁ జూడ సా**
**ధారణమర్త్యులే!' యని ముదంబునఁ బౌరులు దమ్ముఁ జూడఁగన్. 151**

**ప్రతిపదార్థం:** వీరలు= వీళ్ళు; దైవ,శక్తిన్= దేవతలప్రభావంచేత; ప్రభవించిన వారు+అగుట= పుట్టినవాళ్ళుకావటంలో; ఏమి, సందియంబు= అనుమానం ఏ మున్నది? ఈ, రమణీయ, కాంతిన్= ఈ మనోహరమైన కాంతిని; ఉపమింపఁగన్= పోల్చి చూడగా; వేల్పులు+అ, కారె= దేవతలే కదా; ఇట్టి, ఆకార, విశేష, సంపదన్= ఈ విధమైన రూపవిశేషంయొక్క అతిశయాన్ని; ప్రకాశిత, తేజము, పేర్మిన్= ప్రకటం చేయబడిన తేజస్సు యొక్క అతిశయాన్ని; చూడన్= చూడగా; సాధారణ, మర్త్యులే= సామాన్య మానవులా; అని= ఆ విధంగా; పౌరులు= పురప్రజలు; ముదంబునన్= సంతోషంతో; తమ్మున్= తమను; చూడఁగన్= కనుగొనగా.

**తాత్పర్యం:** 'వీళ్ళు దైవశక్తివలన పుట్టిన వా ళ్ళవటంలో సందేహం ఏముది? ఈ మనోహరమైన కాంతిని పోల్చి చూస్తే వీరు దేవతలే. ఈ విధమైన రూపసంపద, తేజస్సు సామాన్యమానవులకు ఉంటాయా?' - అని పౌరులు తమను సంతోషంతో చూడగా.

**విశేషం:** పాండవులను చూడాలన్న ప్రజలఆసక్తిని ముందుపద్యంలో వర్ణించి, వాళ్ళను చూచిన తరువాత ప్రజలు వాళ్ళనుగూర్చి చేసే ప్రశంసను ఈ పద్యంలో నన్నయ వర్ణించాడు. పై పద్యంలో కర్తృపదస్థానీయులు ప్రజలు, ఈ పద్యంలోని ప్రజలవాక్యాలలో చూడటానికి వచ్చినప్రజలను ఆకట్టుకొని వారిని తమ అభిమానులుగా మార్చుకొంటున్న పాండవుల మహిమ వ్యంగ్యం. పాండురాజు తరువాత పాండవులే హస్తినకు ప్రభువు లన్నది ధ్వని.

**వ. ముని సహస్ర పరివృతులయి జననీ సహితంబు పాండురాజ కుమారులు రాజమార్గంబు దఱియవచ్చి రాజమందిర ద్వారాసన్ను లగునంత, మంత్రి పురోహిత బ్రాహ్మణ నివహంబులు దుర్యోధన దుశ్శాసన ప్రముఖ ధార్తరాష్ట్రశతంబును నెదురు వచ్చి పాండవులం దోడ్కొని తెచ్చిన, భీష్మ విదుర ధృతరాష్ట్ర సత్యవత్యం బికాంబాలికలు మొదలుగా నమ్మునులకు నమస్కరించి; రంతం దమకు మ్రొక్కిన కుమారుల నతిస్నేహంబున నెత్తికొని. కుంతిని బ్రియపూర్వకంబున సంభావించి, పాండురాజవియోగదుఃఖితు లయి మహాశోకంబునం దేలుచున్న విదుర ధృతరాష్ట్రుల గాంధారీ సహితం బూరార్చి, యమ్మునులయం దొక్కవృద్ధతపస్వి ముని సహస్రానుమతంబున ని ట్లనియె. 152**

**ప్రతిపదార్థం:** ముని, సహస్ర, పరివృతులు+అయి= మునులు వెయ్యి మందిచే (అనేకులచే) చుట్టబడినవాళ్ళయి; జననీ, సహితంబు= తల్లితోకూడా; పాండురాజ, కుమారులు; రాజమార్గంబు; దఱియ, వచ్చి= చేరవచ్చి; రాజ, మందిర, ద్వార+ఆసన్నులు+అగునంతన్= రాజభవనంయొక్క ద్వారం దగ్గరకు వచ్చినవారు కాగానే; మంత్రి, పురోహిత, బ్రాహ్మణ, నివహంబులు= మంత్రుల, పురోహితుల, బ్రాహ్మణుల యొక్క సమూహాలు; దుర్యోధన, ప్రముఖ, ధార్తరాష్ట్ర, శతంబును= దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలైన ధృతరాష్ట్రుని కుమారులు వందమంది; ఎదురువచ్చి; పాండవులన్; తోడ్కొని, తెచ్చినన్= తీసికొనిరాగా; భీష్మ, విదుర, ధృతరాష్ట్ర, సత్యవతి+అంబికా+అంబాలికలు= భీష్ముడు, విదురుడు, ధృతరాష్ట్రుడు, సత్యవతి, అంబిక, అంబాలిక; మొదలుగాన్= ముందుగా; ఆ+మునులకు; నమస్కరించిరి; అంతన్= ఆ సమయంలో; మ్రొక్కిన+కుమారులన్= తమకు నమస్కరించిన పుత్రుల్ని; అతి, స్నేహంబునన్= మిక్కిలి ప్రేమతో; ఎత్తికొని= పైకెత్తి; కుంతినిన్, ప్రియ, పూర్వకంబునన్= ప్రీతిగా; సంభావించి= గౌరవించి; పాండురాజ, వియోగ, దుఃఖితులు+అయి= పాండురాజు యొక్క ఎడబాటుచే (మరణంచే) దుఃఖాన్ని పొందినవాళ్ళయి; మహా, శోకంబునన్= పెద్దదుఃఖంలో; తేలుచున్న= తేలిపోతూ ఉండే; విదుర, ధృతరాష్ట్రుల, గాంధారీ, సహితంబున్= విదురునీ, ధృతరాష్ట్రునీ, గాంధారితో కూడా; ఊరార్చి= ఓదార్చి;

ఆ+మునులయందు= ఆ మహర్షులలో; ఒక్క; వృద్ధ, తపస్వి= వృద్ధ ముని;, సహస్ర+అనుమతంబునన్= ఋషులు వెయ్యిమందియొక్క అనుమతితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** వెయ్యిమంది మునులు తమను చుట్టి వెంట రాగా, తల్లితోకూడి పాండవులు, రాజమార్గాన్ని చేరటానికి వచ్చి, రాజభవనద్వారాన్ని సమీపించగానే మంత్రులు, పురోహితులు, బ్రాహ్మణులు, దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలైన ధృతరాష్ట్రునికొడుకులు వందమంది ఎదురువచ్చి, వారిని తోడ్కొని లోపలికి తీసికొనివచ్చారు. భీష్ముడు, విదురుడు, సత్యవతి, ధృతరాష్ట్రుడు, అంబిక, అంబాలిక ముందుగా ఆ మునులకు నమస్కరించి, తమకు మ్రొక్కిన పాండవులను ప్రేమతో ఎత్తుకొని, కుంతిని ఎంతోప్రీతితో గౌరవించారు. పాండురాజుమరణానికి పెద్దగా దుఃఖిస్తున్న విదురధృతరాష్ట్రులనూ, గాంధారినీకూడా ఓదార్చి, ఆ మునులలో పెద్దవాడైన ఒకమహాముని మిగతా ముని లందరి అనుమతితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇది - ఒక రాజకుటుంబాన్ని రాజకుటుంబసభ్యులు ఆహ్వానించే తీరును తెలిపే వర్ణన. ప్రజాపరిషత్తులలోనూ, సామూహికంగా రాజును దర్శించే సందర్భాలలోనూ అందరూ మాట్లాడకుండా వారిచేత అనుతింపబడిన ప్రతినిధులే మాట్లాడే సాంఘిక సంప్రదాయం వృద్ధతపస్వి మాట్లాడటంలో కనపడుతున్నది.

**ఉ. భానునిభుండు పాండుజనపాలుఁడు ఘోరతపంబు సేసి ధ**
**ర్మానిలవాసవాశ్వినుల దైనవరంబున శక్తిపేర్మితో**
**నీ నరనాథనందనుల నేవుర వంశవివృద్ధిపొంటెఁ బం**
**చాననసత్త్వులం బడసె నాశతశృంగమహానగంబునన్. 153**

**ప్రతిపదార్థం:** భాను, నిభుండు= సూర్యునితో సమానుడు; పాండు, జన, పాలుఁడు= పాండురాజు, ఆ శతశృంగ, మహా నగంబునన్= ఆ శతశృంగ మనే గొప్పపర్వతంమీద; ఘోర, తపంబు= భయంకర మైన తపస్సు; చేసి; ధర్మ+ అనిల, వాసవ+అశ్వినులది+ఐన= యమునియొక్క, వాయుదేవునియొక్క, దేవేంద్రునియొక్క, అశ్వినీదేవతలయొక్క; వరంబున, శక్తి, పేర్మితో= వరప్రభావంయొక్క అతిశయంతో; వంశ; వివృద్ధి, పొంటెన్= వంశంయొక్క గొప్పపెంపుదలకొరకు; ఈ, నరనాథ, నందనులన్= ఈ రాజకుమారులను; పంచానన, సత్త్వులన్= సింహంయొక్క బలంవంటి బలంకలవాళ్ళను; ఏవురన్= ఐదుగురిని; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** సూర్యునితో సమాను డైన పాండురాజు, శతశృంగపర్వతంమీద పెద్దతపస్సు చేసి, యమ, వాయు, దేవేంద్ర, అశ్వినీదేవతలయొక్క వరప్రసాదంతో, వంశాభివృద్ధికొరకు సింహాలవలె బలవంతు లైన అయిదుగురు కొడుకులను కన్నాడు.

**విశేషం:** ఈ పద్యరచనలో అర్థవ్యక్తి అనే గుణం సార్థకం. వృద్ధతపస్వి మాట్లాడినమాటలలో వంశవృద్ధికొరకు పాండురాజు దేవతలవరాలతో పుత్రులను ఏ విధంగా పొందాడో ప్రతిపదసార్థకంగా వివరించాడు. వస్తుస్వభావాన్ని ఝటితిస్ఫూర్తితో వ్యక్తమయ్యేటట్లు చెప్పటం అర్థవ్యక్తిగుణస్వభావం. పాండురాజు ఘోరతపస్సుచేత సూర్యునివలె ప్రకాశించాడు. దానికి దేవతలు మెచ్చి వరాలుగా తనయుల నిచ్చారు. అరణ్యంలో పెరిగిన పాండవులు సింహసత్త్వులుగా శ్రేష్ఠు లనిపించుకొన్నారు. దీనికి శతశృంగాలతో కూడుకొన్న ఆ పర్వతంమీది వేలాదిమునులు సాక్ష్యం! అని ప్రత్యక్షప్రమాణంగా పాండవులను పరిచయం చేశాడు. (సంపా.)

**క. త్రిదశాధినాథసదృశుఁడు । ద్రిదశాలయమునకు మాద్రిదేవియుఁ దానున్**

**ముదమొనర నరిగె నేఁటికిఁ । బదియేడగునాఁడు దురితబంధచ్యుతుఁ డై. 154**

**విశేషం:** త్రిదశ+అధినాథ, సదృశుఁడు= దేవేంద్రునితో సమాన మైనవాడు - పాండురాజు; మాద్రిదేవియున్+ తానున్= మాద్రి మరియు తానూ; దురిత, బంధ, చ్యుతుఁ డై= పాపబంధాలనుండి విడువబడినవాడై; నేటికిన్; పది+ఏడగు, నాఁడు= పదిహేడో రోజు; త్రిదశ+ఆలయమునకున్= స్వర్గానికి; ముదము= సంతోషం, ఒనరన్= ఒప్పగా; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** దేవేంద్రునితో సమాను డైన పాండురాజు మాద్రితో పాపబంధాలనుండి విముక్తుడై పదిహేడు రోజులక్రితం స్వర్గానికి వెళ్ళాడు.

**విశేషం:** మాద్రీపాండురాజులు మరణించారు అని వాచ్యంగా చెప్పకుండా స్వర్గస్థు లైనా రని పౌరుష్యం లేనట్లుగా ముని చెప్పటంలో సౌకుమార్యం అనే శబ్దగుణం పోషింపబడింది. ఉత్తమసంతానంవలన పాండురాజుకు ఉత్తమగతి - అంటే స్వర్గలోక ప్రాప్తి - లభించిం దని వ్యంగ్యం. భూలోకంలో ఇంద్రునివలె బ్రతికిన పాండురాజు స్వర్గానికి వెళ్ళేటప్పుడు-శచీసమేతంగా ఇంద్రుడు వెళ్ళినట్లుగా మాద్రీసహితంగా వెళ్ళా డనీ, సతీసమేతుడై స్వర్గగమనంచేసిన పాండురాజు పాపబంధా లన్నీ తెగిపోవటంవలన శాశ్వతస్వర్గాలోకావాప్తిని పొందా డనీ వస్తుధ్వని. (సంపా.)

**క. కమనీయలీల నొక్కట । నమరపురంబునకుఁ జనిన యయ్యిరువుర యం**

**గము లివి; పితృమేధవిధి । క్రమ మొనరఁగ సంస్కరింపఁ గడఁగుఁడు వీనిన్. 155**

**ప్రతిపదార్థం:** కమనీయ, లీలన్= మనోహర మైన విలాసంతో; ఒక్కటన్= ఒకరితో ఒకరు; అమర, పురంబునకున్= స్వర్గానికి; చనినన్ = వెళ్ళగా; ఆ+ఇరువుర, అంగములు= ఆ ఇద్దరియొక్క అస్థులు; ఇవి; పితృమేధ, విధి, క్రమము= ఉత్తర క్రియలయొక్క విధానం; ఒనరన్= ఒప్పేటట్లు; వీనిన్= ఈ అస్థుల్ని; సంస్కరింపన్= సంస్కరించటానికి; కడఁగుఁడు= ప్రయత్నించండి.

**తాత్పర్యం:** ఆ విధంగా ఒకటిగా స్వర్గానికి వెళ్ళిన ఆ ఇద్దరి అస్థు లివి. ఉత్తరక్రియలు శాస్త్రోక్తంగా జరిపి, వీటిని సంస్కరించటానికి ప్రయత్నించండి.

**వ. 'ఈ దేవియును బతితోడన పోవ సమకట్టినం బుత్త్రరక్షణార్థంబు మునిగణ ప్రార్థిత యై యెట్టకేనియు ధృతప్రాణ యయ్యెఁ; నిక్కుమారులు కురుకులవిస్తారకులు, దేవమూర్తులు. యుధిష్ఠిరభీమార్జున నకులసహదేవు లనంగా దేవాధిష్ఠితనామంబులు దాల్చి, బ్రహ్మర్షి ప్రణీతోపనయను లై శ్రుతాధ్యయన సంపన్ను లగుచుఁ బెరుఁగుచున్నవారు వీరలం జేకొని కురువృద్ధులు ధర్మబుద్ధి రక్షించునది' యని చెప్పి సిద్ధచారణగణంబులతో నమ్మహామును లంతర్ధానంబు సేసి; రంత వ్యాస భీష్మ ధృతరాష్ట్రుల యనుమతంబున. 156**

**ప్రతిపదార్థం:** ఈ, దేవియును= ఈ కుంతీదేవికూడ; పతితోడన్+అ= భర్తతోనే; పోవన్= వెళ్ళటానికి; సమకట్టినన్= పూనుకోగా; పుత్త్ర, రక్షణ+అర్థంబు= కొడుకులను కాపాడటంకొరకు; ముని, గణ, ప్రార్థిత+ఐ= ఋషులసమూహంచేత ప్రార్థింపబడిందై; ఎట్టకు+ఏనియు= చిట్టచివరకు; ధృత, ప్రాణ= ధరింపబడిన ప్రాణాలు కలది; అయ్యెన్= అయింది; ఈ+కుమారులు= ఈ పాండవులు; కురు, కుల, విస్తారకులు= కురువంశాన్ని వృద్ధిచేసేవారు; దేవమూర్తులు= దేవతాస్వరూపులు;

యుధిష్ఠిర, భీమ+అర్జున, నకుల, సహదేవులు; అనంగాన్; దేవ+అధిష్ఠిత= దేవతలచేత ప్రభావితా లైన; నామంబులు= పేర్లు; తాల్చి= ధరించి; బ్రహ్మ+ఋషి, ప్రణీత+ఉపనయనులు+ఐ= బ్రహ్మర్షులచేత చేయబడిన ఉపనయనం కలవాళ్ళయి; శ్రుత+అధ్యయన, సంపన్నులు= వేదాధ్యయనం అనే సంపద కలవాళ్ళు; అగుచున్; పెరుఁగుచున్నవారు= పెరుగుతూ ఉన్నారు; వీరలన్= వీళ్లను; చేకొని= తీసికొని; కురు, వృద్ధులు= కురువంశంలోని పెద్దలు; ధర్మ, బుద్ధిన్= ధర్మంతో కూడిన బుద్ధితో; రక్షించునది= కాపాడవలసింది; అని= ఆ విధంగా; చెప్పి= వివరించి; సిద్ధ, చారణ, గణంబులతోన్= సిద్ధుల, చారణుల యొక్క సమూహాలతో; ఆ+మహా, మునులు; అంతర్ధానంబు+ చేసిరి= కనపడకుండా పోయారు; అంతన్= తరువాత; వ్యాస, భీష్మ, ధృతరాష్ట్రుల, అనుమతంబునన్= వ్యాస, భీష్మ, ధృతరాష్ట్రులయొక్క అనుమతితో.

**తాత్పర్యం:** 'ఈ కుంతీదేవికూడా భర్తతో సహగమనం చేయటానికి పూనుకొన్నది. అయితే, ఋషులు ప్రార్థించటం చేత కొడుకులను రక్షించటానికి బ్రతికి ఉన్నది. ఈ కొడుకులు కురువంశాన్ని వృద్ధి చేస్తారు; దేవతాస్వరూపులు; యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవు లని దేవతల ప్రభావం కల పేర్లు ధరించి, బ్రహ్మర్షులు ఉపనయనం చేయగా, చక్కగా వేదాధ్యయనం చేస్తూ పెరుగుతున్నారు. కురువంశంలో పెద్ద లైనమీరు వీళ్ళను చేరదీసి ధర్మబుద్ధితో రక్షించండి' - అని చెప్పి, ఆ మహామునులు సిద్ధచారణులతోసహా అంతర్ధాన మయ్యారు. తరువాత వ్యాస భీష్మ ధృతరాష్ట్రుల అనుమతితో.

**విశేషం:** శతశృంగపర్వతంలో జరిగిన వృత్తాంతా న్నంతా వృద్ధమునిచేత సంగ్రహంగా చెప్పించి, హస్తినాపుర కథ కొక సంబంధాన్ని పునరుద్ధరించాడు-నన్నయ. భర్తతోపాటు సహగమనం చేస్తా నని మాద్రి చెప్పినమాటలే పూర్వకథలో ఉన్నాయి. ఆ తరువాత కుంతి తానుకూడా సహగమనానికి సిద్ధమైనట్లూ, మాద్రియే కాక, మునిగణాలు ఆమెకు ఎంతోనచ్చజెప్పి పుత్రరక్షణార్థం బ్రతుకు మని బోధించా రనే వివరణం ఇక్కడ చెప్పాడు-నన్నయ. సమయసందర్భా లెరిగి కథార్థాలను ఉత్కంఠావహంగా కూర్చటం ప్రసన్నకథాకలితార్థయుక్తిలక్షణం. (సంపా.)

**సీ. వెలయంగఁ బితృమేధవిధి విచక్షణశీల । సద్భూసురోపదేశక్రమమున**
**నధికవిభూతితో నతిపవిత్రదే । శమున నయ్యంగముల్ సంస్కరించి,**
**పుణ్యస్వధామృతంబుల నొప్పఁగా । శ్రాద్ధవిధి యొనరించి, సద్విప్రతతికి**
**నగ్రహారములు దివ్యాంబరాభరణ శ । య్యాసనచ్ఛత్త్రగవాశ్వకరుల**

**ఆ. నిచ్చి, సర్వజనుల కెల్లను భోజన । దాన మొనరఁ జేసి, ధర్మవిదుఁడు**
**విదురుఁ డట్లు పాండువిభునకుఁ జేయించె । నన్యలోకహితంబు లైన విధులు. 157**

**ప్రతిపదార్థం:** ధర్మ, విదుఁడు= ధర్మం తెలిసినవాడు; విదురుఁడు; వెలయంగన్= ఒప్పేటట్లు; పితృమేధ, విధి, విచక్షణ, శీల, సత్+భూసుర+ఉపదేశ, క్రమమునన్= పితృయజ్ఞ విధానంలో పండితస్వభావం కల ఉత్తము లైన బ్రాహ్మణులు చెప్పిన విధంగా; అధిక, విభూతితోన్= మిక్కిలి ఐశ్వర్యంతో; అతి, పవిత్ర, ప్రదేశమునన్= మిక్కిలి పవిత్రమైన స్థలంలో; ఆ+అంగముల్= ఆ అస్థికలు; సంస్కరించి= సంస్కారం జరిపించి; పుణ్య, స్వధా+అమృతంబులన్= పుణ్య మైన హోమాలతో, జలతర్పణాలతో; ఒప్పఁగాన్= తగు విధముగా; శ్రాద్ధ, విధి= శ్రాద్ధకర్మను; ఒనరించి= చేసి; సత్+విప్ర, తతికిన్= ఉత్తమ బ్రాహ్మణుల సమూహానికి; అగ్రహారాలు= కొన్నిగ్రామాలు; దివ్య+అంబర+ఆభరణ, శయ్యా+ఆసన, ఛత్త్ర, గో+అశ్వ, కరులన్= శ్రేష్ఠమైన వస్త్రాలను, ఆభరణాలను, పడకలను, ఆసనాలను, గొడుగులను, గోవులను, గుర్రాలను, ఏనుగులను; ఇచ్చి; సర్వ,

జనులకు+ఎల్లన్= ప్రజలకు అందరికి; భోజన, దానమున్= అన్నదానాన్ని; ఒనరన్= తగినట్లు; చేసి; పాండువిభునకు= పాండురాజుకు; అన్యలోక, హితములు+ఐన= పరలోకంలో మేలు చేసేవి అయిన; విధులు= కర్మలు; అట్లు; చేయించెన్.

**తాత్పర్యం:** ధర్మజ్ఞు డైన విదురుడు పితృయజ్ఞవిధానం చక్కగా తెలిసిన బ్రాహ్మణోత్తములు చెప్పినప్రకారం మిక్కిలి వైభవంగా మహాపవిత్రస్థలంలో ఆ అస్థికలకు సంస్కారం జరిపించి, పుణ్యహోమంతో, జలతర్పణాలతో శ్రాద్ధకర్మ చేయించి, సద్బ్రాహ్మణులకు అగ్రహారాలు, వస్త్రాలు, ఆభరణాలు, పడకలు, ఆసనాలు, గొడుగులు, గోవులు, గుఱ్ఱాలు, ఏనుగులు దానా లిచ్చి, ప్రజ లందరికీ అన్నదానం చేసి, పాండురాజుకు ఉత్తరక్రియలు చేయించారు.

**విశేషం:** గో+అశ్వ= గవాశ్వ - అయవాయావాదేశసంధి. దేవతలకు 'స్వాహా'శబ్దంతో, పితరులకు 'స్వధా' శబ్దంతో హోమాలు చేయడం శాస్త్రవిధానం.

**వ. అంతఁ గృష్ణద్వైపాయనుండు వారి కందఱకు దుఃఖోపశమనంబుసేసి, యొక్కనాఁడు సత్యవతికి నేకాంతంబున ని ట్లనియె. 158**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; కృష్ణద్వైపాయనుండు; వారికి+అందఱకున్= వా ళ్లందరికి; దుఃఖ+ఉపశమనంబు చేసి= దుఃఖం తగ్గేటట్లు ఓదార్చి; ఒక్కనాఁడు; సత్యవతికిన్= తనతల్లి సత్యవతితో; ఏకాంతంబునన్= రహస్యంగా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** తరువాత కృష్ణద్వైపాయనుడు వా ళ్ళందరినీ ఓదార్చి, ఒకనాడు సత్యవతితో రహస్యంగా ఇట్లా అన్నాడు.

**క. మతిఁ దలఁపఁగ సంసారం । బతి చంచల మెండమావులట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు; । గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్. 159**

**ప్రతిపదార్థం:** మతిన్= బుద్ధితో; తలఁపఁగన్= ఆలోచించగా; సంసారంబు;అతి, చంచలము= మిక్కిలి చలించునది; ఎండమావులు+అట్టులన్= ఎండమావులవలె; సంపత్+ప్రతతులు= సంపదలయొక్క సమూహాలు; అతి, క్షణికంబులు= మిక్కిలి త్వరగా నశించేవి; గత కాలము= గడచిన కాలం; వచ్చు, కాలముకంటెన్= రాబోయే కాలంకంటె; మేలు= మంచిది, ఉత్తమమైంది.

**తాత్పర్యం:** ఆలోచించి చూస్తే సంసారం ఎండమావులవలె అతిచంచలం. సంపదలు అశాశ్వతాలు. రాబోయే రోజులకంటె గడచిపోయిన రోజులే మేలు.

**విశేషం:** అలం: ఉపమ. అతిప్రసిద్ధా లైన నన్నయసూక్తులలో ఇది ఒకటి. ఏ యుగంలో నైనా, ఎవరికైనా ఇది సత్య మనిపిస్తుంది.

**క. క్రూరులు విలుప్త ధర్మా । చారులు ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని
ష్కారణవైరులు వీరల । కారణమున నెగ్గు పుట్టుఁ గౌరవ్యులకున్. 160**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్ర, సుతులు= ధృతరాష్ట్రుని యొక్క కొడుకులు; క్రూరులు; విలుప్త, ధర్మ+ఆచారులు= నశించిన ధర్మ బద్ధమైన నడవడి కలవారు; అసత్+వృత్తులు= మంచివి కాని పనులు కలవాళ్ళు; నిష్కారణ, వైరులు= కారణం

లేకుండానే శత్రువులయేవాళ్ళు; వీరల, కారణమునన్; కౌరవ్యులకున్= కురువంశంలో పుట్టిన వాళ్ళకు; ఎగ్గు= కీడు; పుట్టున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రునికొడుకులు దుర్మార్గులు. కారణం లేకుండానే వైరం వహించేవారు. వారికారణంగా కౌరవవంశానికి కీడు కలుగుతుంది.

**వ. 'దాని ధృతరాష్ట్రుండు తాన యనుభవించుంగాని మీ రీ దారుణంబుఁ జూడక వీరి విడిచి తపోవనంబున కరుగుం' డని చెప్పి చనిన సత్యవతియుఁ బారాశర్యునుపదేశంబు భీష్మవిదురుల కెఱింగించి కోడండ్ర నంబికాంబాలికలం దోడ్కొని వనంబునకుం జని, తానును వారు నతిఘోరతపంబు సేసి కొండొక కాలమునకు శరీరంబులు విడిచి పుణ్యగతికిం బోయి; రిట ధృతరాష్ట్రుండును. 161**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ కీడును; ధృతరాష్ట్రుండు; తాను+అ= తానే; అనుభవించున్= అనుభవిస్తాడు; కాని; మీరు; ఈ, దారుణంబున్= ఈ దారుణాన్ని; చూడక= చూడకుండా; వీరిన్= వీరిని; విడిచి= వదలి; తపోవనంబునకున్= తపస్సు చేయు అడవికి; అరుగుండు= వెళ్ళండి; అని= ఆ విధంగా; చెప్పి= తెలిపి; చనినన్= పోగా; సత్యవతియున్= సత్యవతికూడా; పారాశర్య, ఉపదేశంబు= పరాశరునికొడుకైన కృష్ణద్వైపాయనుని ఉపదేశాన్ని; భీష్మ, విదురులకున్= భీష్మునికి, విదురునికి; ఎఱింగించి= తెలిపి; కోడండ్రన్= కోడళ్లైన; అంబికా+అంబాలికలన్= అంబికను, అంబాలికను; తోడ్కొని= తీసికొని; వనంబునకున్= అడవికి; చని= వెళ్ళి; తానును= తానూ; వారు= వాళ్ళూ; అతి, ఘోర, తపంబు= మిక్కిలి భయంకర మైన తపస్సు; చేసి; కొండొక, కాలమునకున్= కొంతకాలానికి; శరీరంబులు; విడిచి; పుణ్య, గతికిన్= స్వర్గానికి; పోయిరి; ఇట; ధృతరాష్ట్రుండును-

**తాత్పర్యం:** 'దానిని ధృతరాష్ట్రుడు తానే అనుభవిస్తాడు. కాబట్టి మీరు ఈ దారుణాన్ని చూడకుండా వీళ్ళను విడిచిపెట్టి తపోవనానికి వెళ్ళండి' అని చెప్పి వెళ్ళగా, సత్యవతికూడ వ్యాసుని ఉపదేశాన్ని భీష్మునికీ, విదురునికీ తెలిపి, కోడళ్ళయిన అంబిక, అంబాలికలను వెంటతీసికొని అడవికి వెళ్ళి, తానూ వాళ్ళూ తీవ్రమైన తపస్సుచేసి, కొంతకాలానికి శరీరాలు విడిచి స్వర్గానికి చేరారు. ఇక ఇక్కడ ధృతరాష్ట్రుడు.

**విశేషం:** ద్రష్ట అయిన కృష్ణద్వైపాయనుడు కౌరవుల స్వభావాలు, భవిష్యత్పరిణామాలు దర్శించాడు. కౌరవ వంశాభ్యుదయంమీద కొండంత ఆశ పెట్టుకొన్న సత్యవతీదేవిగుండె బ్రద్దలు కాకుండ ముందుగానే దాన్ని తెలిపి, ఆమెను తపోవనానికి పంపాడు.

## కురుపాండుకుమారుల బాలక్రీడలు (సం. 1-119-13)

**క. తన సుతులు పాండు సుతు లని । మనమున భేదింప కతిసమంజసభావం**
**బున నొక్క రూపకాఁ జే। కొని యుండెం బాండురాజుకొడుకులఁ బ్రీతిన్. 162**

**ప్రతిపదార్థం:** తన, సుతులు= తన కొడుకులు; పాండు, సుతులు= పాండురాజు, కొడుకులు; అని= ఆ విధంగా; మనమునన్= మనస్సులో; భేదింపక= తేడా చూపక; అతి, సమంజస, భావంబునన్= మిక్కిలి న్యాయబుద్ధితో; ఒక్కరూపు+అ, కాన్= ఒకే విధంగా, ప్రీతిన్= ప్రేమతో; పాండురాజు, కొడుకులన్= పాండవుల్ని; చేకొని+ఉండెన్= చేపట్టి ఉన్నాడు.

**తాత్పర్యం:** తనకొడుకులు, పాండురాజుకొడుకులు అనే భేదభావం లేక, మిక్కిలిన్యాయబుద్ధితో అందరినీ ఒకే విధంగా చూస్తూ పాండవులను ప్రేమతో పెంచుతూ ఉన్నాడు.

**క. ధృతరాష్ట్రునెయ్యమున సం । తతవర్ధితు లగుచుఁ బాండుతనయులు వినయా**
**న్వితులు కుమారక్రీడా । రతు లయి యొడఁగూడి ధార్తరాష్ట్రులతోడన్. 163**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రు, నెయ్యమునన్= ధృతరాష్ట్రునిప్రేమతో; సంతత, వర్ధితులు+అగుచున్= ఎల్లప్పుడు పెంచబడిన వాళ్ళయి; వినయ+అన్వితులు= వినయంతో కూడినవారు; పాండు, తనయులు= పాండురాజుకొడుకులు; ధార్తరాష్ట్రుల తోడన్= ధృతరాష్ట్రునికొడుకులతో; ఒడన్+కూడి= కలిసి; కుమార, క్రీడా, రతులు+అయి= బాలక్రీడలలో ఆసక్తి కలవాళ్ళయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుని ప్రేమచేత పెరుగుతూ వినయవంతు లైన పాండవులు కౌరవులతో కలిసి బాలక్రీడల మీద ఆసక్తి కలవాళ్ళయి.

**క. గిఱుపునెడ నేయునెడ వడిఁ । బఱచునెడం బెనఁగునెడ నపార బలంబుల్**
**మెఱయునెడ భీమునకు నం । దొఱుఁ గీడ్పడఁ దొడఁగి రుద్ధతులు రాజసుతుల్. 164**

**ప్రతిపదార్థం:** గిఱుపు, ఎడన్= తిరిగేటప్పుడు; ఏయు, ఎడన్= కొట్టేటప్పుడు; వడిన్= వేగంగా; పఱచు, ఎడన్= పరుగెత్తేటప్పుడు; పెనఁగు, ఎడన్= పెనగులాడేటప్పుడు; అపార, బలంబుల్= అంతులేని బలాలను; మెఱయు, ఎడన్= చూపేటప్పుడు; ఉద్ధతులు= గర్వించినవారు; రాజ, సుతుల్= రాజకుమారులు; అందొఱున్= అందరూ; భీమునకున్; కీడ్పడన్= తక్కువ అవటానికి; తొడఁగిరి= పూనుకొన్నారు.

**తాత్పర్యం:** గుండ్రంగా తిరిగేటప్పుడు, కొట్టేటప్పుడు, వేగంగా పరుగెత్తేటప్పుడు, పెనగులాడేటప్పుడు, అపార బలాలను ప్రదర్శించేటప్పుడు గర్వంతో ఉన్న రాజకుమారు లంతా భీమునికన్నా తక్కువ అవుతున్నారు.

**క. వదలక పెనఁగి పదుండ్రం । బదియేవురఁ నొక్కపెట్ట పట్టి ధరిత్రి**
**జెదరఁ బడవైచి పవనజుఁ । డదయుండయి వీఁపు లొలియ నందఱ నీడ్చున్. 165**

**ప్రతిపదార్థం:** వదలక; పెనఁగి= పోరాడి; పదుండ్రన్= పదిమందిని; పదియేవురన్= పదిహేనుమందిని; ఒక్కపెట్టు+అ= ఒక్కసారిగ; పట్టి; ధరిత్రిన్= భూమిమీద; చెదరన్= చెల్లాచెదురుగా; పడవైచి= క్రిందపడవేసి; పవనజుఁడు= వాయుదేవునికి పుట్టినవాడు - భీముడు; అదయుండు+అయి= దయలేనివాడై; వీఁపులు+ఒలియన్= వీపుల చర్మం ఊడిపోయేట్లుగ; అందఱన్, ఈడ్చున్= అందరినీ, ఈడ్చేవాడు.

**తాత్పర్యం:** వదలక పోరాడి, పది లేదా పదిహేనుమందిని ఒక్కసారిగా పట్టి, నేలమీద చెల్లాచెదురుగా పడవేసి, భీముడు దయలేనివాడై అందరివీపులచర్మాలు లేచిపోయేట్లు ఈడ్చేవాడు.

**సీ. కూడి జలక్రీడ లాడుచోఁ గడఁగి యా । ధృతరాష్ట్రతనయుల నతులశక్తి**
**లెక్కించియుఁ బదుండ్ర నొక్కొక్క భుజమున । నెక్కించుకొని, వారి యుక్కడంగఁ**
**గ్రుంచఱ నీరిలో ముంచుచు నెత్తుచుఁ । గారించి తీరంబు చేరఁ బెట్టుఁ ;**
**గోరి ఫలార్థు లై వారల యెక్కిన । వ్రూఁకుల మొదళుల వీఁకఁ బట్టి**

**ఆ. వడిఁ గదల్చుఁ బండ్లు దడఁబడువారల । తోన ధరణిమీఁదఁ దొరఁగుచుండ;**
**నిట్టిపాట గాడ్పుపట్టిచే దుశ్శాస । నాదు లెల్ల బాధితాత్ము లైరి. 166**

**ప్రతిపదార్థం:** కూడి; జలక్రీడలు; ఆడుచోన్; కడఁగి= పూని; ఆ ధృతరాష్ట్ర, తనయులన్= ఆ ధృతరాష్ట్రుని కొడుకులను; అతుల, శక్తిన్= సాటిలేని బలంతో; లెక్కించియున్= లెక్కపెట్టి; పదుండ్రన్= పదిమందిని; ఒక్క+ఒక్క, భుజమునన్= ఒక్కొక్క భుజంమీద; ఎక్కించుకొని; వారి, ఉక్కు= వాళ్ల బలం; అడంగన్= అణగేటట్లుగా; క్రంచఱ= వేగంగా; నీరిలోన్; ముంచుచున్; ఎత్తుచున్; కారించి= బాధించి; తీరంబు= గట్టును; చేరన్= చేరేట్లు; పెట్టున్; కోరి; ఫల+అర్థులు+ఐ= పండ్లు కోరినవాళ్ళయి; వారల, ఎక్కిన మ్రాకులమొదళ్లను= వా రెక్కినట్టి చెట్లమొదళ్ళను; వీఁకన్= బలంతో; పట్టి; తడఁబడు, వారలతోనన్; పండ్లు; ధరణి, మీఁదన్= భూమిమీద; తొరఁగుచుండన్= పడుతుండగా; వడిన్= వేగంగా; కదల్చున్= కదలించేవాడు; ఇట్టిపాట= ఈ విధంగా; గాడ్పు, పట్టిచే= వాయుదేవుని కొడుకైన భీమునిచేత; దుశ్శాశన+ఆదులు+ఎల్లన్= దుశ్శాసనుడు మొదలైనవాళ్లంతా; బాధిత+ఆత్ములు+ఐరి= బాధింపబడిన శరీరాలుకలవాళ్ళు అయ్యారు.

**తాత్పర్యం:** అంతా చేరి జలక్రీడలు ఆడేటప్పుడు భీముడు సాటిలేని బలంతో పూని ధృతరాష్ట్రునికొడుకులను ఒక్కొక్క భుజంమీద పదిమందిని లెక్కపెట్టి ఎక్కించుకొని, వాళ్ళ బలం అణగేటట్లు వేగంగా నీటిలో ముంచుతూ, పై కెత్తుతూ బాధించి, గట్టుకు చేర్చేవాడు. వాళ్ళు పండ్లు కోయడానికి ఎక్కిన చెట్లమొదళ్ళను బలంగా వేగంగా కదల్చి, వాళ్ళూ, పండ్లూ నేలమీద రాలేటట్లు చేసేవాడు. ఈ విధంగా దుశ్శాసనుడు మొదలైనవాళ్ళంతా భీమునిచేత బాధింపబడుతూ ఉండేవాళ్ళు.

**వ. దాని సహింపనోపక యొక్కనాఁడు దుర్యోధనుండు శకుని దుశ్శాసనాదులతో విచారించి యి ట్లనియె.167**

**ప్రతిపదార్థం:** దానిన్= భీమునిచేత కలిగేబాధను; సహింపన్+ఓపక= ఓర్చుకోలేక; ఒక్కనాఁడు; దుర్యోధనుండు; శకుని; దుశ్శాసన+ఆదులతో= శకుని, దుశ్శాసనుడు మొదలైనవాళ్ళతో; విచారించి= ఆలోచించి; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** భీమునిచేత కలిగేబాధను ఓర్చుకోలేక, ఒకనాడు దుర్యోధనుడు శకుని, దుశ్శాసనుడు మొదలైన వాళ్ళతో ఆలోచించి ఈ విధంగా అన్నాడు.

**పృథ్వి.**

**ఉపాంశువధఁ జేసి మధ్యము మదోద్ధతుం జంపి ని**
**స్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి యే**
**నపాండవముగా సముద్రవలయాఖిలక్షోణి మ**
**త్కృపాణపటుశక్తి నత్యధికకీర్తి నై యేలెదన్. 168**

**ప్రతిపదార్థం:** మద+ఉద్ధతున్= గర్వంతో విజృంభించినవాడిని; మధ్యమున్= నడిమివాడిని - అనగా కుంతీదేవికొడుకులలో మధ్యమంవాడైన భీముడిని; ఉపాంశు, వధన్+చేసి= రహస్యంగా హత్యచేసి; చంపి; అశక్తు= శక్తిలేనివా డైన; ధర్మనందనున్; బంధించి; నిస్సపత్నముగన్= శత్రువు లేకుండా; అపాండవముగాన్= పాండవులు లేకుండా; సముద్ర, వలయ+అఖిల, క్షోణిన్= సముద్రంచేత చుట్టబడిన సమస్తభూమండలాన్ని; మత్, కృపాణ, పటు, శక్తిన్= నా కత్తియొక్క గట్టిబలంతో; అతి+అధిక, కీర్తిని+ఐ= మిక్కిలి ఎక్కువ కీర్తిగలవాడనై; ఏలెదన్= పరిపాలిస్తాను.

**తాత్పర్యం:** గర్వంతో విజృంభిస్తున్న భీముడిని రహస్యంగా చంపి, అశక్తు డైన ధర్మరాజును చెరసాలలో పెట్టి, శత్రువు అనేవాడు లేకుండా, అపాండవంగా సమస్తభూమండలాన్నీ నాకత్తికి ఎదురులేకుండా అఖండకీర్తితో పరిపాలిస్తాను.

**విశేషం:** పాండవులకు బలం, తనకు ప్రబలశత్రువు భీముడుమాత్రమే అని దుర్యోధనుని భావన. అతడిని ప్రత్యక్షంగా ఎదుర్కొని చంపడం సాధ్యపడదు. అందువలన అతడిని రహస్యంగా చంపి, తనకన్నా పెద్దవాడైన ధర్మరాజును చెరసాలలో పెడితే-ఇక తనను ఎదిరించే శత్రువు లుండ రనీ, మిగతావారిలో తానే పెద్ద కనుక రాజ్యాధికారం తనకే సంక్రమిస్తుం దనీ, సమస్తభూమండలాన్ని తానే పరిపాలించవ చ్చనీ దుర్యోధనుని దురాలోచన. అప్పటి కింకా అర్జున నకుల సహదేవుల శక్తి సామర్థ్యాలు దుర్యోధనుని దృష్టికి వచ్చినట్లు లేదు. పాండవధార్తరాష్ట్రుల విభేదానికి బీజం భీమునిబల మనీ, దుర్యోధనుని దుశ్చింత అనీ వస్తుధ్వని. (సంపా.)

**ఛందశ్శిల్పం:** పృథ్వీవృత్తంలోని ప్రతిపాదంలోనూ 17 అక్షరా లుంటాయి. జ, స, జ, స, య, లగ - అనే గణాలు వరుసగా అమరి ఉంటాయి. 12వ అక్షరం యతిస్థానం. ఈ సందర్భంలో నన్నయ పృథ్వీవృత్తం వాడటంలో గల సార్థక్యాన్ని గురించీ, ఈ పద్యరచనలోని అక్షరరమ్యత, వాక్యవృత్తులగురించీ డాక్టర్ పాటిబండమాధవశర్మగా రిట్లా వ్యాఖ్యానించారు. "పృథ్వీరాజ్య హరణోత్సాహమును, తదంగమైన పృథానందనోత్సాహమును పృథ్వీవృత్తమున నిబంధించుట వృత్తనామాశ్రితమైన శిల్పము. పద్య మందలి పూర్వోత్తరార్ధములందు అక్షర, పదరచనా రూపమైన శిల్పమును గుర్తింపవచ్చును. పూర్వార్ధమందలి మహాప్రాణవ్యంజనము, నీచమధ్యస్వరములు, వ్యస్తపదములు దుర్యోధనుఁ డా వాక్యఖండములను రహస్యముగ, అనుదాత్తస్వరమున, సనిశ్శ్వసితముగ, ససంభ్రముగ నుచ్చరించె నని స్పష్టము చేయుచున్నది. ఉత్తరార్ధమునందలి సమస్తపదములు, నాదాక్షరములు, విశేషించి చతుర్థపాదము నందలి ఉదాత్తస్వరములు దుర్యోధను డావాక్యమును అనర్గలముగ క్రమవర్ధమానస్వరమున ఉచ్చరించె నని స్ఫుటము చేయుచున్నవి. భీమవధ, ధర్మజబంధనములు రహస్యవిషయములు. అపాండవమైన క్షోణీరాజ్యపాలనము ప్రకాశవిషయము, స్వరవ్యంజనవిన్యాస శిల్పము వాక్యార్థవ్యంజకమైన వాచికాభినయనమునకు చక్కగా నుపకరించుచున్నది. 'అసమాసైః పదై ర్భాతి పృథ్వీ పృథ్వీ పృథక్ స్థితైః (సువృత్తతిలకం 2-27). వ్యస్తములైన యసమస్త పదములచే పృథ్వీవృత్తము పృథువుగా భాసించు నని క్షేమేంద్రుఁ డొకరహస్యమును వెల్లడించెను. నన్నయ యారహస్యమునే పైపద్యమందలి పూర్వార్ధమున ప్రదర్శించెను'' (ఆంధ్రమహాభారతము: ఛందశ్శిల్పము - పు.280,281)

## దుర్యోధనుఁడు భీమునిఁ జంపింపఁ దివురుట (సం. 1-119-28)

**వ. అని పాపబుద్ధియందుఁ గృతనిశ్చయుం డై దుర్యోధనుండు భీష్మ విదురు లెఱుంగకుండ భీమున కపాయంబు సేయ సమకట్టి, యంతరం బన్వేషించుచున్నంత నొక్కనాఁడు జలక్రీడావసరంబున. 169**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పాప, బుద్ధియందున్= చెడ్డఆలోచనతో; కృత, నిశ్చయుండు+ఐ= చేయబడిన నిర్ణయం కలవాడై; దుర్యోధనుండు; భీష్మ, విదురులు ఎఱుంగకుండన్= భీష్మునికి విదురునికి తెలియనీయకుండా; భీమునకున్; అపాయంబు, చేయన్= అపాయం కలిగించటానికి; సమకట్టి= పూనుకొని; అంతరంబు= అవకాశాన్ని; అన్వేషించుచున్= వెదకుతూ; ఉన్నంతన్= ఉండగా; ఒక్కనాఁడు; జల, క్రీడా+అవసరంబునన్= జలక్రీడలు ఆడేసమయంలో.

**తాత్పర్యం:** అని దురాలోచనతో దుర్యోధనుడు భీష్మవిదురులకు తెలియకుండా భీమునికి కీడు చేయా లని అవకాశంకొరకు వెదకుతుండగా ఒకరోజు జలక్రీడలు ఆడేసమయంలో.

ఉ. **వేడుక నొక్కరుండు శతవీరకుమారులతోడఁ జల్లుఁ బో**
**రాడి జయించి యందఱ, ననంతపరిశ్రమపారవశ్యముం**
**గూడి ప్రమాణకోటి ననఘుండు సమీరణనందనుండు మే**
**యాడక నిద్రవోయె శిశిరానిలముల్ పయి వీచుచుండఁగన్.** 170

**ప్రతిపదార్థం:** అనఘుండు= పాపంలేనివాడు; సమీరణ, నందనుండు= వాయుదేవునికొడుకైన భీముడు; వేడుకన్= వేడుకతో; ఒక్కరుండు= ఒక్కడు; శత, వీర, కుమారులతోడన్= నూరుమంది వీరులైనకురుకుమారులతో- దుర్యోధనాదులతో; చల్లున్+పోరు+ఆడి= నీళ్ళలో దిగి ఒకరిమీద ఒకరు నీళ్ళు చల్లుకొనే ఆట ఆడి; అందఱన్; జయించి; అనంత, పరిశ్రమ, పారవశ్యమున్= అంతులేని శ్రమవల్ల కల్గిన మైమరపుతో; కూడి= ఉండి; ప్రమాణకోటిన్= ప్రమాణకోటి అనే స్థలంలో; శిశిర+అనిలముల్= చల్లనిగాలులు; పయిన్= మీద; వీచుచుండఁగన్; మెయి= దేహం; ఆడక= కదలక; నిద్ర, పోయెన్.

**తాత్పర్యం:** పాపరహితుడు, వాయుపుత్రుడు అయిన భీముడు ఒక్కడే వేడుకగా వందమందికౌరవులతో జలక్రీడలాడి అందరినీ జయించి, అంతులేని శ్రమచేత కలిగిన అలసటవలన మైమరచి ప్రమాణకోటి అనే స్థలంలో చల్లగాలులు వీస్తూ ఉండగా మేను కదల్చకుండ గాఢనిద్రలో ఉన్నాడు.

**విశేషం:** ధార్తరాష్ట్రు లందరినీ మట్టుపెట్టగలదిట్ట భీము డనే అర్థాన్ని వ్యంగ్యంగా, బీజతుల్యంగా ఈ సన్నివేశం వ్యక్తంచేస్తున్నది.

క. **ఆ పవనజు నతిఘనలతి । కాపాశావలుల నంటఁ గట్టించి మహా**
**కోపమున గంగమడువునఁ । ద్రోపించె సుయోధనుండు దురితకరుం డై.** 171

**ప్రతిపదార్థం:** సుయోధనుండు= దుర్యోధనుడు; దురిత, కరుండు+ఐ= పాపం చేసేవాడై; ఆ, పవనజున్= ఆ వాయుపుత్రుడైన భీముడిని; అతి, ఘన, లతికా, పాశ+ఆవలులన్= మిక్కిలి గట్టివైన తీగ లనే తాళ్ళ సమూహంచే; అంటన్+కట్టించి= శరీరానికి అతుక్కొనిపోయే విధంగా కట్టించి; మహాకోపమునన్= మిక్కిలికోపంతో; గంగమడువునన్= గంగమడుగులోకి; త్రోపించెన్= త్రోయించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు దుర్మార్గుడై భీముడిని గట్టి తీగలచే గట్టిగా కట్టించి, మహాకోపంతో గంగమడుగులోకి త్రోయించాడు.

క. **అనిలసుతుం డంతన మే । ల్కని నీల్గుడు నతని వజ్రఘనకాయముఁ బొం**
**దినలతికాపాశము లె । ల్లను ద్రెస్సె మృణాళనాళలతికలపోలెన్.** 172

**ప్రతిపదార్థం:** అనిల, సుతుండు= వాయుదేవునికొడుకు - భీముడు; అంతన= అప్పటికప్పుడే - అంతలోనే; మేల్కని= మేలుకొని; నీల్గుడున్= ఒళ్ళు విరుచుకోగా; అతని, వజ్ర, ఘనకాయమున్= అతనియొక్క వజ్రంవంటి ధృఢమైన దేహాన్ని; పొందిన= తగులుకొన్న; లతికా, పాశములు+ఎల్లను= తీగ లనే త్రా ళ్ళన్నీ; మృణాళ, నాళ, లతికల, పోలెన్= లేత తామరతూళ్ళతీగలవలె; త్రెస్సెన్= తెగాయి.

**తాత్పర్యం:** భీముడు అప్పటి కప్పుడు మేల్కొని ఒళ్ళు విరువగానే, వజ్రంవలె కఠినమైన అతనిశరీరానికి కట్టిన తీగలతా ళ్ళన్నీ లేతతామరతూళ్ళతీగలవలె సులభంగా తెగిపోయాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. కర్మబంధనములు గ్రక్కునఁ బాయుడుఁ । బుణ్యగతికి నెగయు పురుషు నట్లు**
**బంధనంబు లెల్లఁ బాయుడు భీముండు । నీరిలోననుండి నెగయుదెంచె. 173**

**ప్రతిపదార్థం:** కర్మ, బంధనములు= కర్మబంధాలు; గ్రక్కునన్= తటాలున; పాయుడున్= తొలగిపోగా; పుణ్యగతికిన్= పుణ్యలోకానికి; ఎగయు, పురుషునట్లు= ఎగిరిపోయే పురుషునివలె; బంధనంబులు+ఎల్లన్= కట్లన్నీ; పాయుడున్= తొలగిపోగా; భీముండు= భీముడు; నీరిలోన, నుండి= నీళ్ళలోనుండి; నెగయుదెంచెన్= పైకి లేచాడు.

**తాత్పర్యం:** కర్మబంధాలు తొలగిపోగా పురుషుడు(జీవుడు) స్వర్గానికి ఎగిరిపోయినట్లు, కట్లు తెగగానే భీముడు నీటినుండి పైకి లేచి వచ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. మఱియు నొక్కనాఁడు. 174**

**తాత్పర్యం:** ఇంకా మరొకరోజు.

**క. జనపతి పనుపఁగ సారథి । ఘనవిషకృష్ణోరగములఁ గఱపించె శ్రమం**
**బున నిద్రితుఁ డైన ప్రభం । జనసుతుసర్వాంగమర్మసంధుల నెల్లన్. 175**

**ప్రతిపదార్థం:** జన, పతి= రాజు - దుర్యోధనుడు; పనుపఁగన్= ఆజ్ఞాపించగా; సారథి; శ్రమంబునన్= అలసటచేత; నిద్రితుఁడు+ఐన= నిద్రపోయినవాడైన; ప్రభంజన; సుతు, సర్వ+అంగ, మర్మ, సంధులన్, ఎల్లన్= వాయుపుత్రుని అన్ని అవయవాల కీలకస్థానాల కూడిక లన్నింటను; ఘన, విష, కృష్ణ+ఉరగములన్= గొప్పవిషం కల నల్లత్రాచుపాములచేత; కఱపించెన్= కరిపించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఆజ్ఞాపించగా సారథి, అలసి నిద్రపోయిన భీమసేనుని అన్ని అవయవాల మర్మస్థానాల సంధు లన్నిటా గొప్పవిషంగల నల్లత్రాచుపాములతో కరిపించాడు.

**క. అవిరళవిషఫణిదంష్ట్రలు । పవనజువజ్రమయతనువుపయితోలును నో**
**పవ భేదింపఁగఁ; బాప । వ్యవసాయులచెయ్వు లర్థవంతము లగునే? 176**

**ప్రతిపదార్థం:** అవిరళ, విష, దంష్ట్రలు= దట్టమైన విషం ఉన్న పాములకోరలు; పవనజు, వ్రజమయ, తనువు, పయితోలునున్= వాయుపుత్రుని వజ్రంవంటి (అనగా వజ్రంవలె గట్టిదైన) శరీరంమీది చర్మాన్నికూడ; భేదింపఁగన్= చీల్చటానికి; ఓపవ= సమర్థమైనవి కాలేకపోయాయి; పాప, వ్యవసాయుల, చెయ్వులు= పాపం చేయడంలో నిశ్చితమైనబుద్ధి కలవాళ్ళచేష్టలు; అర్థవంతములు= ఫలాన్ని కూర్చేవి; అగునే= అగునా? - కావు.

**తాత్పర్యం:** దట్ట మైనవిష మున్న ఆ పాములకోరలు, భీమసేనుని వజ్రంవంటి శరీరం పై తోలునుకూడా చీల్చ లేక పోయాయి. పాపబుద్ధి కలవారిపను లెప్పుడూ ఫలించవు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**చ. అలఘుబలుండు భీముఁడును నంతన మేల్కని యవ్విషోరగం**
**బులఁ జరణంబులం జమరి, ముక్కన వాతను నెత్తు రొల్కగాఁ**
**దలరఁగ సారథిం జఱచెఁ దా నపహస్తమునన్, వసుంధరా**
**తలమునఁ ద్రెళ్ళె సారథియుఁ దత్క్షణమాత్రన ముక్తజీవుఁ డై. 177**

**ప్రతిపదార్థం:** అలఘు, బలుండు= తక్కువ కాని బలం కలవాడు; భీముఁడును; అంతన= అప్పుడే; మేల్కని; ఆ+విష+ ఉరగంబులన్= ఆ విషపుపాములను; చరణంబులన్= కాళ్ళతో; చమరి= రాచి; ముక్కున; నోట; నెత్తురు; ఒల్కగాన్= కారేటట్లు; తలరఁగన్= చలించునట్లుగా; తాన్= తాను - అనగా భీముడు; అపహస్తమునన్= పెడచేత్తో; సారథిన్; చఱచెన్= కొట్టాడు; సారథియున్= సారథికూడా; తత్+క్షణ, మాత్రన= ఆ క్షణంలోనే; ముక్త జీవుఁడు+ఐ= విడువబడిన ప్రాణాలు కలవా డై; వసుంధరాతలమునన్= నేలమీద; త్రెళ్ళెన్= చచ్చిపడ్డాడు.

**తాత్పర్యం:** మహాబలవంతు డైన భీముడు; అప్పుడే మేల్కొని ఆ పాములను కాళ్ళతో రాచి, చంపి, ముక్కున నోట నెత్తురు కారేటట్లు సారథిని పెడచేత్తో కొట్టాడు. సారథి ఆ క్షణంలోనే చచ్చి నేలమీద పడ్డాడు.

**క. మఱియును నొకనాఁ డెవ్వరు । నెఱుఁగక యుండంగఁ గౌరవేంద్రుఁడు ధర్మం**
**బెఱుఁగక విష మన్నముతో । గుఱుకొని పెట్టించె గాడ్పుకొడుకున కలుకన్. 178**

**ప్రతిపదార్థం:** మఱియునున్= ఇంకనూ; ఒకనాఁడు; ఎవ్వరున్= ఎవరుకూడా; ఎఱుఁగక, ఉండంగన్= తెలియక ఉండేటట్లు; కౌరవ+ఇంద్రుఁడు= కౌరవరాజు - దుర్యోధనుడు; ధర్మంబు= ధర్మాన్ని; ఎఱుఁగక= ఆలోచింపక; గాడ్పు, కొడుకునకున్= వాయుదేవుని కుమారునికి - భీమునికి; అలుకన్= కోపంతో; విషము; అన్నముతో; గుఱుకొని= పూని; పెట్టించెన్.

**తాత్పర్యం:** ఇంకోరోజు ఎవ్వరికీ తెలియకుండా దుర్యోధనుడు, ధర్మాన్నిగూర్చి ఆలోచింపక, కోపంతో విషాన్ని అన్నంలో కలిపి భీమునికి పెట్టించాడు.

**క. సముఁ డై యుయుత్సుఁ డయ్య । న్నము దుష్టం బగుటఁ జెప్పినను గుడిచె విషా**
**న్నము నాఁకటిపెలుచను; నది । యమృతాన్నం బయ్యె జీర్ణ మై మారుతికిన్. 179**

**ప్రతిపదార్థం:** యుయుత్సుఁడు= ధృతరాష్ట్రునికి వైశ్యవనితయందు పుట్టినవాడు; వయసులో దుర్యోధనుని తరువాతివాడు; సముఁడు+ఐ= సమబుద్ధి కలవాడై; ఆ+అన్నము; దుష్టంబు= చెడ్డది; అగుటన్= కావడం; చెప్పినను= చెప్పినప్పటికి; ఆఁకటి, పెలుచనున్= ఆకలియొక్క అతిశయంతో; విష+అన్నమున్= విషభోజనాన్ని; కుడిచెన్= తిన్నాడు; అది= ఆ విషాన్నం; మారుతికిన్= వాయుపుత్రుడైన భీమునికి; జీర్ణము+ఐ= అరిగినదై; అమృత+అన్నంబు= అమృతభోజనము; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** యుయుత్సుడు సమబుద్ధి కలవాడై ఆ అన్నం చెడ్డ దని చెప్పినా, భీముడు అధిక మైన ఆకలివలన దాన్ని తిన్నాడు. అది అతనికి జీర్ణ మై అమృతంవంటిది అయింది.

**వ. ఇట్లు దుర్యోధనుండు భీమునకుఁ దనచేసిన యెగ్గు లెల్లను గృతఘ్నునకుం జేసిన లగ్గులునుంబోలె నిష్ఫలంబు లైన సిగ్గువడి, వెండియుఁ బాండవుల కెల్ల నపాయంబు సేయ నుపాయంబుఁ జింతించుచుండె; నంత భీష్మ నియోగంబున. 180**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దుర్యోధనుండు; భీమునకున్; తన, చేసిన, ఎగ్గులు+ఎల్లను= తాను చేసిన అపకారాలన్నీ; కృతఘ్నునకున్, చేసిన= మేలు మర్చిపోయేవాడికి చేసిన; లగ్గులునున్+పోలె= ఉపకారాలవలె; నిష్ఫలంబులు+ఐన= వ్యర్థం కాగా; సిగ్గు, పడి; వెండియున్= మరల, పాండవులకు+ఎల్లన్= పాండవులందరికి; అపాయంబు= కీడు; చేయన్= చేయుటకై; ఉపాయంబున; చింతించుచు+ఉండెన్= ఆలోచిస్తూ ఉండినాడు; అంతన్= అప్పుడు, భీష్మ, నియోగంబునన్= భీష్ముని ఆజ్ఞతో.

**తాత్పర్యం:** ఈ విధంగా దుర్యోధనుడు భీమునికి చేసిన అపకారా లన్నీ కృతఘ్నునికి చేసిన ఉపకారాలవలె వ్యర్థం కాగా, సిగ్గుపడి, మళ్ళీ పాండవు లందరికి కీడు చేయా లని ఉపాయం ఆలోచిస్తూ ఉన్నాడు. అప్పుడు భీష్ముని ఆజ్ఞవలన.

**విశేషం:** ఒక్క భీముడిని చంపితే పాండవులు నిర్వీర్యు లౌతా రని దుర్యోధనుడు భావించి విఫలు డైనాడు. తర్వాత పాండవు లందరిని కలిపి ఒక్కసారిగా చంపటానికి ఆలోచించాడు.

**క. విలువిద్యఁ గఱచుచుండిరి । బలయుతులు కుమారకులు కృపద్రోణాచా**
**ర్యులతోడఁ గలసి యొక్కట । నలఘుపరాక్రమసమేతు లధికస్పర్ధన్. 181**

**ప్రతిపదార్థం:** బలయుతులు= బలంతో కూడినవాళ్ళు; అలఘు, పరాక్రమ, సమేతులు= గొప్పపరాక్రమంతో కూడినవాళ్ళు; కుమారకులు= పాండవులు కౌరవులు; ఒక్కటన్= ఒకటిగా; కలసి; కృప, ద్రోణ+ఆచార్యులతోడన్= కృపద్రోణాచార్యులవద్ద; అధిక, స్పర్ధన్= అధికమైనపోటీతో; విలువిద్యన్; కఱచుచున్+ఉండిరి= నేర్చుకొంటూ ఉన్నారు.

**తాత్పర్యం:** బలవంతులు, పరాక్రమవంతులు అయిన కురుపాండవులు, ఒక్కటిగా కలిసి, కృపద్రోణాచార్యులవద్ద, ఒకరిని మించవలె నని మరొకరు పోటీపడుతూ, విలువిద్య నేర్చుకుంటూ ఉన్నారు.

**విశేషం:** 'స్పర్ధయా వర్ధతే విద్యా' అని పండితోక్తి. విలువిద్యను కురుకుమారులు ఒకరికంటె మరొకరు మించా లని స్పర్ధతో నేర్చుకుంటున్నా రన్నమాట!

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 182**

**తాత్పర్యం:** అని చెప్పగా విని వైశంపాయనునితో జనమేజయుడు ఈ విధంగా అన్నాడు.

**తే. కృపుఁడు ద్రోణుండు ననఁగ సత్కీర్తులైన । వారిజన్మప్రకారంబు, వారు వచ్చి**
**కౌరవులకెల్ల గురు లైన కారణంబు । విప్రముఖ్య! నా కెఱుఁగంగ విస్తరింపు. 183**

**ప్రతిపదార్థం:** కృపుఁడు; ద్రోణుండున్; అనఁగన్= అనగా; సత్+కీర్తులు+ఐన= మంచికీర్తి కలవా ళ్ళయిన; వారి, జన్మ, ప్రకారంబు= వాళ్ళ పుట్టుకయొక్క విధం; వారు, వచ్చి; కౌరవులకు+ఎల్లన్= కురుకుమారు లందరికీ; గురులు+ఐన=

ఆచార్యులైన; కారణంబున్= విధానాన్ని; విప్ర, ముఖ్య= బ్రాహ్మణోత్తమా! వైశంపాయనమహర్షీ!; నాకున్; ఎఱుఁగంగ= తెలిసేటట్లు; విస్తరింపు= వివరంగా చెప్పుము.

**తాత్పర్యం:** ఓ వైశంపాయనమహర్షీ! కృపుడు, ద్రోణుడు పుట్టినవిధాన్నీ, వాళ్ళు వచ్చి కురుకుమారు లందరికీ గురువు లైనవిధాన్నీ నాకు తెలిసేటట్లుగా వివరంగా చెప్పుము.

**వ. అని యడిగిన వైశంపాయనుం డి ట్లనియె. 184**

**తాత్పర్యం:** అని అడుగగా వైశంపాయనుడు ఇట్లా చెప్పాడు.

## కృపాచార్యుల జన్మవృత్తాంతము (సం. 1-120-2)

**సీ. విన వయ్య! గౌతముం డనఁ బ్రసిద్ధుం డైన । మునికి శరద్వంతుఁ డను మహాత్ముఁ**
**డురుతరతేజుఁ డై శరసమూహంబుతో । నుదయించి, వేదముల్ చదువ నొల్ల**
**కతిఘోరతపమున నుతభూసురోత్తముల్ । వేదముల్ చదువున ట్లాదరమున**
**సర్వాస్త్రవిదుఁడు ధనుర్వేద మొప్పఁగఁ బడసి, మహానిష్ఠఁ గడఁగి తపము**

**ఆ. సేయుచున్న దివిజనాయకుఁ డతిభీతి । నెఱిఁగి, వానితపముఁ జెఱుపఁ బనిచె**
**జలజనయనఁ దరుణి జలపద యనియెడు । దాని; నదియు వచ్చె వానికడకు. 185**

**ప్రతిపదార్థం:** వినవయ్య= అయ్యా! వినుము; గౌతముండు; అనన్; ప్రసిద్ధుండు+ఐన; మునికి; శరద్వంతుడు+అను; మహాత్ముఁడు; ఉరుతర, తేజుఁడు+ఐ= ఎంతో (మిక్కిలి) తేజస్సు కలిగినవాడై; శర, సమూహంబులతోన్= బాణాల సమూహంతో; ఉదయించి= పుట్టి; వేదముల్; చదువన్= పఠించటానికి; ఒల్లక= ఇష్టపడక; అతి, ఘోర, తపమునన్= ఎంతో భయంకర మయిన తపస్సుచేత; నుత, భూసుర+ఉత్తముల్= పొగడబడిన బ్రాహ్మణశ్రేష్ఠులు; వేదముల్; చదువునట్లు; ఆదరమునన్= ప్రీతితో; సర్వ+అస్త్ర, విదుఁడు= అన్ని అస్త్రాలూ తెలిసినవాడు; ధనుర్వేదమున్= ధనుర్వేదాన్ని; ఒప్పఁగన్= తగునట్లు; పడసి= పొంది; మహా, నిష్ఠన్= గొప్ప నియమంతో; కడఁగి= పూని; తపము; చేయుచున్+ఉన్నన్= చేస్తూ ఉండగా; దివిజ, నాయకుఁడు= దేవేంద్రుడు; ఎఱిఁగి= తెలిసికొని; అతిభీతిన్= మిక్కిలి భయంతో; వాని= అతని; తపమున్= తపస్సును; చెఱుపన్= భంగపరచటానికై; జలజనయనన్= కమలాలవంటి కన్నులు కలదానిని; తరుణిన్= యౌవనంలో ఉన్నదానిని; జలపద, అనియెడు దానిన్= జలపద అను పేరుగల దానిని; పనిచెన్= పంపినాడు; అదియున్= ఆ యౌవనవతియు; వాని; కడకున్; వచ్చెన్.

**తాత్పర్యం:** గౌతము డనే పేరుగల (గౌతము డనే పేరుతో ప్రసిద్ధుడైన) మహామునికి, శరద్వంతు డనే మహాత్ముడు గొప్పతేజస్సుతో, బాణసమూహంతో పుట్టి, వేదాలు చదవటానికి ఇష్టపడక, అతిభయంకర మయిన తపస్సు చేసి, బ్రాహ్మణోత్తములు వేదాలు చదివేవిధంగా తాను ధనుర్వేదాన్ని సాధించి, మహానిష్ఠతో తపస్సు చేస్తుండగా దేవేంద్రుడు అది తెలిసికొని భయపడి, అతనితపస్సును భగ్నం చెయ్యా లని కమలాలవంటి కన్నులు గల 'జలపద' అనే యౌవనవతిని పంపించాడు. ఆమె అతనిదగ్గరికి వచ్చింది.

**విశేషం:** 'జలపద'కు జానపది, జాలవతి, జలవతి అనే పాఠాంతరా లున్నాయి.

**క. అమ్ముదితఁ జూచి కాముశ । రమ్ములచే విద్ధుఁ డై శరద్వంతుఁడు చి**

**త్త మ్మలర మదనరాగర । సమ్మునఁ ద న్నెఱుఁగకుండెఁ జంచలతనుఁ డై. 186**

**ప్రతిపదార్థం:** ఆ+ముదితన్= ఆ కాంతను; చూచి; శరద్వంతుఁడు; కాము, శరమ్ములచే= మన్మథునియొక్క బాణాలచేత; విద్ధుఁడు+ఐ= కొట్టబడినవాడై; చిత్తమ్ము= మనస్సు; అలరన్= వికసించగా; మదన, రాగ, రసమ్మునన్= మన్మథరాగం అనే ఆనందంలో; చంచల, తనుఁడు+ఐ= చలిస్తున్న శరీరం కలిగినవాడై; తన్నున్+ఎఱుఁగక+ఉండెన్= తనను తాను తెలియక ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ కాంతను చూచి శరద్వంతుడు మన్మథబాణంచేత పీడింపబడి, మనసు చెదరి మన్మథరాగంలో మైమరచి ఉన్నాడు.

**క. ఆ తరుణికటాక్షేక్షణ । పాతము గౌతమున కపుడు పటుబాణధనుః**

**పాతముతోడన రేతః । పాతము గావించె రాగపరవశుఁ డగుటన్. 187**

**ప్రతిపదార్థం:** ఆ, తరుణి, కటాక్ష+ఈక్షణ, పాతము= ఆ కాంతయొక్క కడగంటిచూపు పడటంతోనే; అపుడు; రాగ, పరవశుఁడు+అగుటన్= మన్మథరాగానికి స్వాధీనం అయినవాడు అవటంచేత; గౌతమునకున్= గౌతముని కుమారుడైన శరద్వంతునికి; పటు, బాణ, ధనుః, పాతముతోడన= గట్టివైన బాణాలు గల ధనుస్సు పడటంతోనే; రేతస్ పాతము= వీర్యం పడటం; కావించెన్= చేసింది.

**తాత్పర్యం:** ఆ కాంత కడగంటిచూపు శరద్వంతునిమీద పడగానే, అతడు మన్మథరాగపరవశు డై ఉండటం చేత, అతనిచేతిధనుర్బాణాలతోపాటు వీర్యంకూడా జారిపడింది.

**విశేషం:** అలం: సహోక్తి.

**వ. దాని నెఱింగి శరద్వంతుం డయ్యాశ్రమంబు విడిచి చని యొండుచోటం దపంబు సేయుచుండె; నవ్వీర్యం బొక్క శరస్తంబంబున ద్వివిధం బయి పడిన, నందొక కొడుకునుం గూఁతురుం బుట్టి; రంత శంతనుండు మృగయా వినోదార్థం బరిగిన వానిసేనాచరుం డా శరస్తంబంబున నున్న కొడుకుం గూఁతుఁ దత్సమీపంబున నున్న శరచాప కృష్ణాజినంబులుం జూచి, యివి యెయ్యేనియు నొక్కధనుర్వేదవిదుం డయిన బ్రాహ్మణునపత్యం బగు నని శంతనునకుం జూపిన, శంతనుండును వారలఁ జేకొని కృపాయత్తచిత్తుం డయి పెనుచుటం జేసి యయ్యిరువురుఁ గృపుఁడును గృపియు నన బెరుఁగుచున్నంత. 188**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ సంఘటనను; ఎఱింగి= తెలిసికొని; శరద్వంతుండు; ఆ+ఆశ్రమంబు; విడిచి; చని= వెళ్ళి; ఒండు, చోటన్= మరొకచోట; తపంబు= తపస్సు; చేయుచున్+ఉండెన్= చేస్తూ ఉండినాడు; ఆ+వీర్యంబు= ఆ రేతస్సు; ఒక్క; శర, స్తంబంబునన్= రెల్లుగంటలో; ద్వివిధంబు+అయి= రెండుభాగాలు కలిగినదై; పడినన్= పడగా; అందున్= అందులోనుండి; ఒక్క+కొడుకునున్+కూతురున్ = ఒక్కకుమారుడు, ఒకకుమార్తె; పుట్టిరి= జన్మించారు; అంతన్= తర్వాత; శంతనుండు= శంతనమహారాజు; మృగయా, వినోద+అర్థంబు= వేటకోసం; అరిగినన్= వెళ్ళగా; వాని, సేనా చరుండు= అతనియొక్క సేనలో తిరిగేవాడు; ఆ శర, స్తంబంబునన్= ఆ రెల్లు గంటలో; ఉన్న= ఉండే; కొడుకున్+కూతున్; తద్+సమీపంబునన్, ఉన్న=

దానికి దగ్గరగా ఉన్న; శర, చాప, కృష్ణ+అజినంబులున్= బాణాలు, ధనుస్సు, జింకచర్మం; చూచి; ఇవి= ఈ కనిపించేవి అన్నీ; ఏ+ఏవియున్= ఎవరేని; ఒక్క= ధనుర్వేద, విదుండు+అయిన= ఒక్కవిలువిద్యలో పండితుడైన; బ్రాహ్మణు, అపత్యంబు= బ్రాహ్మణునియొక్క సంతానం; అగును= అయిఉండును; అని= ఆ విధంగా; శంతనునకున్= శంతనుమహారాజుకు; చూపినన్= చూపగా; శంతనుండును= శంతనమహారాజును; వారలన్= ఆ ఇద్దరినీ; చేకొని= తీసికొని; కృపా+ఆయత్త, చిత్తుండు+అయి= దయతో కూడిన మనస్సు కలిగినవాడై; పెనుచుటన్+చేసి= పెంచటంచేత; ఆ+ఇరువురున్; కృపుఁడును; కృపియు; అనన్= అనే పేర్లతో; పెరుగుచున్+ఉన్నంతన్= పెరుగుతూ ఉండగా.

**తాత్పర్యం:** దానిని తెలిసికొని శరద్వంతుడు ఆ ఆశ్రమాన్ని విడిచివెళ్లి, వేరొకచోట తపస్సు చేసికొంటూ ఉన్నాడు. ఆయనవీర్యం ఒకరెల్లుగంటలో రెండు భాగాలుగా పడింది. దానినుండి ఒకకొడుకు, ఒకకూతురు పుట్టారు. తర్వాత ఒకరోజు శంతనుమహారాజు వేటకు రాగా, అతని సైనికులలో ఒకడు ఆ రెల్లుగంటలో ఉన్నపిల్లలనూ, అక్కడే పడి ఉన్న ధనుర్బాణాలనూ, జింకచర్మాన్నీ చూచి, వీ ళ్ళెవరో ఒక ధనుర్వేదపండితు డైన బ్రాహ్మణునిసంతానం అని తలచి, శంతనునికి చూపించగా, ఆయన వాళ్ళను తీసికొని కృపతో పెంచటంచేత వా ళ్ళిద్దరూ కృపుడు, కృపి అనే పేర్లతో పెరుగుతూ ఉండగా.

**క.** **చనుదెంచి శరద్వంతుం । డనవద్యుఁడు దనయపత్య మని వారిని శం**
**తనున కెఱిఁగించి కృపు న । త్యనుపము నుపనీతుఁ జేసె నధికప్రీతిన్.** **189**

**ప్రతిపదార్థం:** అనవద్యుఁడు= దోషంలేనివాడు; శరద్వంతుండు; చనుదెంచి= వచ్చి; తన, అపత్యము+అని= తనసంతానం అని; వారిని= ఆ ఇద్దరిని; శంతనునకున్; ఎఱిఁగించి= తెలియజేసి; అతి+అనుపమున్= ఏమాత్రం సాటిలేనివాడిని; కృపున్= కృపుని; అధిక, ప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; ఉపనీతున్= ఉపనయనసంస్కారం కలవాడినిగా; చేసెన్.

**తాత్పర్యం:** పవిత్రు డైన శరద్వంతుడు వచ్చి, వాళ్ళు తనసంతాన మని శంతనునికి తెలిపి, అద్వితీయు డైన కృపునికి అమిత మైన ప్రేమతో ఉపనయనసంస్కారం చేశాడు.

**శా.** **వేదంబుల్ చదివించె భూసురులతో విఖ్యాతిగా, నాత్మసం**
**వేదిం జేసెఁ, జతుర్విధం బగు ధనుర్వేదంబు నానాస్త్రవి**
**ద్యాదాక్షిణ్యముతోడఁ దాన కఱపెం, దద్విత్తముల్ సూచి సం**
**వాదుల్గాఁ దననందనుం గృపు శరద్వంతుండు దాంతాత్ముఁ డై.** **190**

**ప్రతిపదార్థం:** దాంత+ఆత్ముఁడు+ఐ= నిగ్రహించబడిన మనస్సు కలిగినవాడై; శరద్వంతుండు; తన; నందనున్= తన యొక్క కుమారుడిని; కృపున్= కృపుని; విఖ్యాతిగాన్= ప్రసిద్ధిగా; వేదంబుల్; భూసురులతోన్= బ్రాహ్మణులతో; చదివించెన్= చదివింపజేసినాడు; ఆత్మ, సంవేదిన్= ఆత్మ నెరిగినవానిగా; చేసెన్; చతుర్విధంబు+అగు= నాలుగువిధాలు కలిగినదైన; (రథ, గజ, తురగ, పదాతి సంబంధాలు కలిగినది); ధనుర్వేదంబు; నానా+అస్త్ర, విద్యా, దాక్షిణ్యము, తోడన్= అనేకవిధాలైన అస్త్రవిద్యలలోని నేర్పుతో; తద్+విత్తముల్= ఆ ధనుర్వేదాన్ని తెలిసినగొప్పవారు - అంటే ధనుర్వేదపండితులు; చూచి; సంవాదుల్= ఏకీభవించేవారు; కాన్= అయ్యేటట్లు; తాను+అ= తానే; కఱపెన్= నేర్పించాడు.

**తాత్పర్యం:** శరద్వంతుడు బ్రాహ్మణులవద్ద తనకుమారుడికి వేదాలు చెప్పించి, ఆత్మజ్ఞానం కలవాడినిగా చేశాడు. రథ, గజ, తురగ, పదాతిబలాలతో సంబంధం ఉన్న ధనుర్వేదాన్ని, నానావిధాలైన అస్త్రప్రయోగ నైపుణ్యంతో, ధనుర్వేదపండితులు చూచి మెచ్చుకొనేవిధంగా తానే నేర్పించాడు.

**వ. అట్టి కృపాచార్యు రావించి భీష్ముం డతిభక్తిం బూజించి వానితోడఁ దన మనుమల నందఱ విలువిద్య గఱవం బంచిన. 191**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; కృపాచార్యు= కృపాచార్యుని; రావించి=రప్పించి; భీష్ముండు; అతి భక్తిన్= మిక్కిలిభక్తితో; పూజించి; వానితోడన్= అతనితో; తన, మనుమలన్; అందఱన్; విలువిద్య; కఱవన్= నేర్చుకొనటానికి; పంచినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** అటువంటి కృపాచార్యుడిని రప్పించి భీష్ముడు, మిక్కిలి భక్తితో గౌరవించి, తన మనుమల నందరినీ విలువిద్య నేర్చకొనటానికి ఆజ్ఞాపించగా.

**క. సవిశేషముగ ధనుర్వే। దవిశారదు లైరి కడు జితశ్రములై పాం**
**డవ ధృతరాష్ట్రాత్మజ యా। దవు లాదిగ రాజసుతులు తత్కృపుశిక్షన్. 192**

**ప్రతిపదార్థం:** పాండవ, ధృతరాష్ట్ర+ఆత్మజ, యాదవులు+ఆదిగ= పాండవులు, ధృతరాష్ట్రునికొడుకులు, యాదవులు మొదలైన; రాజ, సుతులు= రాజకుమారులు; తద్+కృపు, శిక్షన్= ఆ కృపుని శిక్షణచేత; సవిశేషముగన్= అతిశయంతో కూడినట్లు; కడున్= మిక్కిలి; జిత, శ్రములు+ఐ= జయించబడిన శ్రమ కలిగినవారై; ధనుర్వేద, విశారదులు+ఐరి= విలువిద్యలో పండితు లయ్యారు.

**తాత్పర్యం:** పాండవులు, కౌరవులు, యాదవులు మొదలైన రాకుమారులు కృపునిశిక్షణలో శ్రమను జయించి, విలువిద్యలో గొప్పపండితు లయ్యారు.

## ద్రోణాచార్యుల జన్మవృత్తాంతము (సం. 1-121-3)

**వ. 'మఱియు వారల కాచార్యుం డైన ద్రోణుజన్మంబును వానిచరిత్రంబును జెప్పెద విను' మని జనమేజయునకు వైశంపాయనుం డి ట్లనియె. 193**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; వారలకున్= ఆ కౌరవపాండవులకు; ఆచార్యుండు+ఐన= గురు వైన; ద్రోణు= ద్రోణుని యొక్క; జన్మంబును=పుట్టుకను; వాని, చరిత్రంబును= అతనిచరిత్రను; చెప్పెదన్; వినుము; అని= ఆ ప్రకారంగా; జనమేజయునకున్= జనమేజయమహారాజుకు; వైశంపాయనుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అంతేకాక, కురుపాండవులకు ఆచార్యు డైన ద్రోణునిపుట్టుకనూ, చరిత్రనూ తెలుపుతాను' విను మని జనమేజయునితో వైశంపాయనుడు ఈ విధంగా అన్నాడు.

**క. సద్వినుతచరిత్రుండు భ। రద్వాజుం డను మునీశ్వరప్రవరుఁడు గం**
**గాద్వారమునఁ దపంబు జ। గద్వంద్యుఁడు సేయుచుండె గతకల్మషుఁ డై. 194**

**ప్రతిపదార్థం:** సత్+వినుత, చరిత్రుండు= సత్పురుషులచేత పొగడబడిన నడవడి కలవాడు; జగత్+వంద్యుఁడు= లోకాలచేత నమస్కరింపదగినవాడు; భరద్వాజుండు, అను; ముని+ఈశ్వర, ప్రవరుఁడు= ఋషి శ్రేష్ఠులలో ఉత్తముడు; గత, కల్మషుఁడు+ఐ= పోయిన పాపం కలిగినవాడై; గంగా, ద్వారమునన్= గంగానదిద్వారముకడ; తపంబున్= తపస్సును; చేయుచున్ ఉండెన్= చేస్తూ ఉండినాడు.

**తాత్పర్యం:** సత్పురుషులచేత ప్రశంసించబడిన నడవడి కలిగినవాడు, లోకంచేత నమస్కరింపదగినవాడు, పవిత్రుడు అయిన భరద్వాజమహాముని గంగాద్వారంవద్ద తపస్సు చేస్తూ ఉన్నాడు.

**సీ. అమ్ముని యొక్కనాఁ డభిషేచనార్థంబు । గంగకుఁ జని, మున్న కరము లీల**
**నందు జలక్రీడ లాడుచునున్న య । ప్సరస ఘృతాచి యన్సదమలాంగి**
**పటుపవనాపేత పరిధాన యైన య । య్యవసరంబునఁ జూచి, యమ్మృగాక్షిఁ**
**గామించి యున్నఁ, దత్కామరాగంబున । యతిరేకమునఁ జేసి యాక్షణంబ**

**తే. తనకు శుక్లపాతం బైన, దానిఁ దెచ్చి । ద్రోణమున సంగ్రహించిన, ద్రోణుఁ డనఁగఁ**
**బుట్టె శుక్రునంశంబునఁ బుణ్యమూర్తి । ధర్మతత్త్వజ్ఞుఁ డగు భరద్వాజమునికి. 195**

**ప్రతిపదార్థం:** ఆ+ముని= ఆ భరద్వాజుడు; ఒక్కనాఁడు; అభిషేచన+అర్థంబు= స్నానంకొరకు; గంగకున్+చని; మున్ను+అ= ముందుగానే; కరము= మిక్కిలి, లీలన్= విలాసంతో; అందున్= ఆ గంగలో; జలక్రీడలు+ఆడుచున్= జలక్రీడలు ఆడుతూ ఉండే; అప్సరసన్; ఘృతాచి, అన్= ఘృతాచి, అనేపేరుకల; సత్+అమల+అంగిన్= మిక్కిలి నిర్మలం అయిన దేహంగలది; పటు, పవన+అపేత, పరిధాన+ఐన= పెద్దగాలిచేత తొలగించబడిన చీర కలది కాగా; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; చూచి; ఆ+మృగ+అక్షిన్= ఆ జింకకన్నులవంటి కన్నులు కల స్త్రీని; కామించి+ఉన్నన్= కామించిఉండగా; తద్+కామ, రాగంబున, అతిరేకమునన్+చేసి= ఆ మన్మథరాగంయొక్క అతిశయంచేత; ఆ, క్షణంబు+అ= ఆ నిమిషంలోనే; తనకున్; శుక్ల, పాతంబు+ఐనన్= వీర్యం జారిపడగా; దానిన్= ఆ వీర్యాన్ని; తెచ్చి; ద్రోణమునన్= కలశంలో; సంగ్రహించినన్= పట్టిపెట్టగా; శుక్రు, అంశంబునన్= శుక్రునియొక్క అంశచేత; పుణ్య, మూర్తి= పుణ్యాత్ముడు; ధర్మ, తత్త్వజ్ఞుఁడు= ధర్మంయొక్క తత్త్వాన్ని తెలిసినవాడు; అగు= అయినట్టి; భరద్వాజ, మునికిన్; ద్రోణుఁడు+అనఁగన్+పుట్టెన్= ద్రోణుడు అనేవాడు పుట్టాడు.

**తాత్పర్యం:** ఆ భారద్వాజముని ఒకనాడు స్నానానికై గంగానదికి వెళ్ళాడు. ఎదురుగా మహావిలాసంతో జలక్రీడలాడుతూ, పెనుగాలిచేత చీరతొలగి నిర్మల మైనదేహంతో ఉన్న ఘృతాచి అనే అప్సరసను చూచి కామించాడు. ఆ మన్మథరాగాతిశయంచేత ఆ క్షణంలోనే తనకు వీర్యస్ఖలనం కాగా, ఆ వీర్యాన్ని తెచ్చి, కలశంలో పెట్టాడు. దానినుండే శుక్రునిఅంశతో పుణ్యాత్ముడు, ధర్మతత్త్వం తెలిసినవాడు అయిన భరద్వాజమునికి ద్రోణుడు పుట్టాడు.

**విశేషం:** 'తెచ్చి ద్రోణమున సంగ్రహించిన' అనే దానికి 'చేతిద్రోణమున సంగ్రహించిన' అనే పాఠాంతరం ఉన్నది. ఆ పరిస్థితులలో వీర్యాన్ని తెచ్చి ద్రోణంలో సంగ్రహించా డనటంకంటె, స్నానార్థమై వెళ్ళిన ద్రోణుడు చేతిద్రోణంలో సంగ్రహించా డనటం ఎక్కువ సమంజసం అనిపిస్తుంది. 'శుక్రునంశంబున' అనే దానికి గురునియంశంబున అనే పాఠాంతరంకూడా ఉన్నది.

**వ. మఱియు ననంతరంబ భరద్వాజసఖుండైన పృషతుం డను పాంచాలపతి మహాఘోరతపంబు సేయుచు నొక్కనాఁడు దనసమీపంబున వాసంతికాపచయవినోదంబున నున్న యప్సరస మేనక యను దానిం జూచి, మదనరాగంబున రేతస్స్కందం బయిన దానిం దన పాదంబునఁ బ్రచ్ఛాదించిన, నందు ద్రుపదుం డనుకొడుకు మరుదంశంబునఁ బుట్టిన, వాని భరద్వాజాశ్రమంబునఁ బెట్టి చని పృషతుండు పాంచాలదేశంబున రాజ్యంబు సేయుచుండె, ద్రుపదుండును ద్రోణునితోడ నొక్కట వేదాధ్యయనంబు సేసి విలువిద్యయుం గఱచి యా పృషతు పరోక్షంబునం బాంచాలదేశంబున కభిషిక్తుం డయ్యెఁ; ద్రోణుండును నగ్నివేశ్యుం డను మహామునివలన ధనుర్విద్యా పారగుం డై తత్ప్రసాదంబున నాగ్నేయాస్త్రం బాదిగా ననేకదివ్యబాణంబులు వడసి, భరద్వాజు నియోగంబునఁ బుత్రలాభార్థంబు కృపుని చెలియలిఁ గృపి యనుదాని వివాహం బయి, దానియం దశ్వత్థామ యను కొడుకుం బడసి, యొక్కనాఁడు. 196**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; అనంతరంబు+అ= ఆ తరువాత; భరద్వాజ, సఖుండు+ఐన= భరద్వాజునియొక్క స్నేహితు డైన; పృషతుండు+అను; పాంచాల, పతి= పాంచాలదేశపురాజు; మహా, ఘోర, తపంబు= గొప్ప తీవ్రతపస్సు; చేయుచున్= చేస్తూ; ఒక్కనాఁడు; తన, సమీపంబునన్= తనకు దగ్గర; వాసంతికా, కుసుమ+అపచయ, వినోదంబునన్= వసంతోత్సవ పుష్పాలను కోసే వేడుకలో; ఉన్న; అప్సరస, మేనక, అను, దానిన్= అప్సరసయైన మేనక అను పేరుగల దానిని; చూచి; మదన, రాగంబునన్= మన్మథరాగంచేత; రేతస్+స్కందంబు+అయినన్= వీర్యం జారిపడగా; 'రేతస్ఖలనంబు' అని పాఠాంతరం ఉన్నది; దానిన్= ఆ రేతస్సును; తన, పాదంబునన్= తనకాలితో; ప్రచ్ఛాదించినన్= కప్పివేయగా; అందున్, ద్రుపదుండు= అందుండి ద్రుపదుడు; అను, కొడుకు= పేరుగల కుమారుడు; మరుత్+అంశంబునన్= మరుత్తుయొక్క అంశలో; పుట్టినన్= పుట్టగా; వానిన్= అతనిని; భరద్వాజ+ఆశ్రమంబునన్= భరద్వాజుని ఆశ్రమంలో; పెట్టి= ఉంచి; చని= వెళ్ళి, పృషతుండు= పృషతుడు; పాంచాల, దేశంబునన్= పాంచాలదేశంలో; రాజ్యంబు, చేయుచున్= రాజ్యం చేస్తూ; ఉండెన్; ద్రుపదుండును; ద్రోణునితోడన్= ద్రోణునితోటి; ఒక్కట= ఒకటిగా; వేద+అధ్యయనంబు= వేదాధ్యయనం (వేదాలను చదవడం); చేసి; విలువిద్యయున్= విలువిద్యనుకూడా; కఱచి= నేర్చి; ఆ, పృషతు, పరోక్షంబునన్= ఆ పృషతుని తర్వాత; పాంచాల, దేశంబునకున్; అభిషిక్తుండు+అయ్యెన్= అభిషేకింపబడ్డ వా డయినాడు; ద్రోణుండును; అగ్నివేశ్యుండు+అను; మహా, ముని వలనన్; ధనుర్విద్యా, పారగుండు+ఐ= విలువిద్యయొక్క అంతాన్ని (చివరిని) ముట్టినవాడై; తద్+ప్రసాదంబునన్= అతడి (అగ్నివేశ్యుని) యొక్క దయచేత; ఆగ్నేయ+అస్త్రంబు; ఆదిగాన్= మొదలుగా; అనేక, దివ్య, బాణంబులు= అనేకమయిన దేవతాసంబంధాలైన బాణాలు; పడసి= పొంది; భరద్వాజ, నియోగంబునన్= భరద్వాజునియొక్క ఆజ్ఞచేత; పుత్ర, లాభ+అర్థంబు= పుత్రులను పొందటంకొరకు; కృపుని, చెలియలిన్= కృపుని చెల్లెలిని; కృపి, అనుదానిన్= కృపి అను పేరుగల ఆమెను; వివాహంబు+అయి= పెండ్లి అయి; దాని అందున్= ఆమెయందు; అశ్వత్థామ, అను; కొడుకున్; పడసి= పొంది; ఒక్కనాఁడు.

**తాత్పర్యం:** భరద్వాజునిస్నేహితు డైన పృషతు డనే పాంచాలదేశపు రాజు మహాభయంకర మయిన తపస్సు చేస్తూ, ఒక రోజు తనసమీపంలో వసంతకుసుమాలను కోస్తున్న మేనక అనే అప్సరసను చూచాడు. మన్మథరాగంచేత వీర్యస్ఖలనం కాగా, దానిని తనపాదంతో కప్పివేశాడు. అందులోనుండి ద్రుపదు డనే కొడుకు మరుత్తుని అంశతో జన్మించాడు. ఆ బాలుడిని భరద్వాజాశ్రమంలోనే ఉంచి, పృషతుడు వెళ్ళి పాంచాలరాజ్యం పాలిస్తూ ఉన్నాడు. ద్రుపదుడు ద్రోణునితో కలిసి వేదాలు చదివి, విలువిద్యను నేర్చి, పృషతునితర్వాత పాంచాలదేశానికి రా జయ్యాడు. ద్రోణుడు అగ్నివేశ్యుడనే మహామునివద్ద ధనుర్విద్యాపారంగతుడై, అతనిఅనుగ్రహంచేత ఆగ్నేయాస్త్రం మొదలుగా

అనేకదివ్యాస్త్రాలు పొంది, భరద్వాజుని ఆజ్ఞచేత పుత్రులను పొందటానికి కృపునిచెల్లెలైన కృపిని వివాహమాడాడు. ఆమెవలన అశ్వత్థామ అనే కొడుకును కన్నాడు. ఒకనాడు -

**క. అనవరతము బ్రాహ్మణులకుఁ। దనియఁగ ధన మిచ్చు జామదగ్న్యుఁడు రాముం**
**డను జనవాదపరంపర। విని యరిగెను వానికడకు విత్తాపేక్షన్. 197**

**ప్రతిపదార్థం:** అనవతరము= ఎల్లప్పుడూ; బ్రాహ్మణులకున్; తనియఁగ= తృప్తిపొందే విధంగా, జామదగ్న్యుఁడు=జమదగ్ని కుమారుడు; రాముండు= పరశురాముడు; ధనము=ధనాన్ని; ఇచ్చున్= ఇస్తున్నాడు; అను, జన, వాద, పరంపర= అనే జనుల మాటల వరుసను; విని; వాని కడకున్= అతనిదగ్గరకు; విత్త+అపేక్షన్= ధనంమీదికోరికచేత; అరిగెను=వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఎప్పుడూ బ్రాహ్మణులకు తృప్తి కలిగేవిధంగా జమదగ్నికుమారు డైన పరశురాముడు ధన మిస్తున్నా డని అందరూ అనుకుంటుంటే విని, అతనివద్దకు ధనాపేక్షతో వెళ్ళాడు.

**క. అరిగి మహేంద్రాచలమునఁ। బరమతపోవృత్తి నున్న భార్గవు లోకో**
**త్తరు భూరికర్మనిర్మల। చరితుని ద్రోణుండు గాంచి సద్వినయమునన్. 198**

**ప్రతిపదార్థం:** అరిగి=వెళ్ళి; మహేంద్ర+అచలమునన్= మహేంద్రపర్వతంవద్ద; పరమ, తపస్+వృత్తిన్= గొప్పతపస్సు చేసే పనితో; ఉన్న; భూరి, కర్మ, నిర్మల చరితుని= గొప్పపనులచేత పరిశుద్ధం అయిన నడవడి కలవాడిని; భార్గవు= భృగువంశంవా డైన పరశురాముడిని; ద్రోణుండు= ద్రోణుడు; కాంచి=చూచి; సత్+వినయంబునన్= మంచి వినయంతో.

**తాత్పర్యం:** వెళ్ళి, మహేంద్రపర్వతంవద్ద ఘోరతపస్సు చేస్తున్నవాడూ, లోకంలో శ్రేష్ఠుడూ, గొప్పపనులు చేయటం చేత పరిశుద్ధమయిన నడవడి గలవాడూ అయిన పరశురాముడిని చూచి మంచివినయంతో.

**వ. 'ఏను భారద్వాజుండ, ద్రోణుం డనువాఁడ; నర్థార్థి నై నీకడకు వచ్చితి' ననినఁ బరశురాముం డి ట్లనియె.199**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; భరద్వాజుండ= భరద్వాజుని కుమారుడను; ద్రోణుండు; అనువాఁడన్; అర్థ+అర్థిని+ఐ= ధనాన్ని కోరినవాడినై; నీ, కడకున్= నీ దగ్గరికి; వచ్చితిన్; అనినన్; పరశురాముండు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నేను భరద్వాజునికుమారుడ నైన ద్రోణుడిని. ధనాన్ని ఆశించి నీదగ్గరకు వచ్చాను' అని అనగా పరశురాముడు ఈ విధంగా బదులు పలికాడు.

**చ. కలధన మెల్ల ముందఱ జగన్నుత। విప్రుల కిచ్చి, వార్ధిమే**
**ఖలనిఖిలోర్వి యంతయును గశ్యపుఁ డ న్ముని కిచ్చితిన్, శరం**
**బులును శరీరశస్త్రములుఁ బొల్పుగ నున్నవి; వీనిలోన నీ**
**వలసినవస్తువుల్ గొను ధ్రువంబుగ నిచ్చెద నీకు నావుడున్. 200**

**విశేషం:** జగత్+నుత= లోకంచేత పొగడబడేవాడా!; కల, ధనము+ఎల్లన్= ఉన్న ధనా న్నంతటినీ; ముందఱ= ముందుగానే,; విప్రులకున్= బ్రాహ్మణులకు; ఇచ్చి; వార్ధి, మేఖల, నిఖిల+ఉర్వి, అంతయును= సముద్రం ఒడ్డాణంగా కలిగిన సమస్త

భూమండలాన్నీ; కశ్యపుఁడు= కశ్యపుడు; అన్, మునికిన్, ఇచ్చితి; శరంబులును= బాణాలు; శరీర, శస్త్రముల్= శరీరం, ఆయుధాలు; పొల్పుగన్= ఒప్పుగా; ఉన్నవి; వీనిలోనన్= వీటిలో; నీ, వలసిన, వస్తువుల్= నీవు కోరుకొన్న వస్తువులను; కొను= తీసికొమ్ము; నీకున్= నీకు; ధ్రువంబుగన్= తప్పకుండా; ఇచ్చెదన్; నావుడున్= అని పరశురాముడు అనగా.

**తాత్పర్యం:** 'లోకంచేత పొగడ్త లందుకొన్న ఓ ద్రోణా! నేను ఉన్నధనం అంతా ముందే బ్రాహ్మణులకు ఇచ్చివేశాను. సముద్రం ఒడ్డాణంగా చుట్టిన భూమి నంతటినీ కశ్యపమహర్షికి ఇచ్చివేశాను. ఇక శస్త్రాస్త్రాలు, శరీరం మిగిలి ఉన్నాయి. వీటిలో నీకు కావలసినవాటిని తీసికొమ్ము తప్పక ఇస్తాను' అని పరశురాముడు అనగా.

**క. ధనములలో నత్యుత్తమ। ధనములు శస్త్రాస్త్రములు; ముదంబున వీనిం**
**గొని కృతకృత్యుఁడ నగుదును। జననుత ! నా కొసఁగు మస్త్రశస్త్రచయంబుల్. 201**

**ప్రతిపదార్థం:** జన, నుత= జనులచేత కొనియాడబడేవాడా! ఓ పరశురామా!; ధనములలోన్; అతి+ఉత్తమ+ధనములు= మిక్కిలి శ్రేష్ఠములైన ధనాలు; శస్త్ర+అస్త్రములు; ముదంబునన్= సంతోషంతో; వీనిన్= వీటిని; కొని=తీసికొని; కృతకృత్యుఁడను= నెరవేరిన పనికలవాడిని; అగుదును= అయ్యేదను; నాకున్; అస్త్ర,శస్త్రచయంబుల్= అస్త్ర శస్త్రాల సమూహాలు; ఒసఁగుము= ఇమ్ము.

**తాత్పర్యం:** జనులచేత ప్రశంసించబడే ఓ పరశురామా! ధనాలలో మిక్కిలి మేలైనధనాలు శస్త్రాస్త్రాలు. కాబట్టి సంతోషంతో వీటిని తీసికొని కృతార్థుడ నవుతాను. శస్త్రాస్త్రసమూహాన్ని నాకు ఇమ్ము.

**వ. అని పరశురాముచేత దివ్యాస్త్రంబులు ప్రయోగరహస్యమంత్రంబులతోడం బడసి, ధనుర్విద్యయు నభ్యసించి, ధనార్థియయి తన బాలసఖుండైన ద్రుపదుపాలికిం జని 'యేను ద్రోణుండ, నీ బాలసఖుండ, సహాధ్యాయుండ న న్నెఱుంగుదే' యని ప్రణయపూర్వకంబుగాఁ బలికిన విని యప్పలుకులు విన సహింపక ద్రుపదుం డలిగి యి ట్లనియె. 202**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; పరశురాముచేత; దివ్య+అస్త్రంబులు= దేవతాసంబంధమైన అస్త్రాలు; ప్రయోగ, రహస్య, మంత్రంబులతోడన్= ప్రయోగించటంలోని మర్మాలతో, మంత్రాలతో; పడసి= పొంది; ధనుర్విద్యయున్= విలువిద్యనుకూడా; అభ్యసించి= నేర్చుకొని; ధన+అర్థి+అయి= ధనాన్ని కోరినవాడై; తన, బాల, సఖుండు+ఐన= తనయొక్క చిన్ననాటి స్నేహితుడైన; ద్రుపదు, పాలికిన్= ద్రుపదుని దగ్గరకి; చని= వెళ్లి; ఏను= నేను; ద్రోణుండన్= ద్రోణుడను; నీ, బాల సఖుండన్= నీ చిన్ననాటి మిత్రుణ్ణి; సహ+అధ్యాయుండన్= నీతో కలిసి చదివినవాడిని; నన్నున్= నన్ను; ఎఱుంగుదే= తెలిసి ఉన్నావు కదా, గుర్తుపట్టావుకదా!; అని= ఆ ప్రకారంగా; ప్రణయ, పూర్వకంబుగా= స్నేహభావం ఉట్టిపడగా; పలికినన్= మాట్లాడగా; ఆ+పలుకులు; వినన్ సహింపక= వినటానికి ఇష్టపడక; ద్రుపదుండు; అలిగి= కోపపడి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పరశురామునిచేత దివ్యాస్త్రాలను, వాటిప్రయోగమర్మాలతో, మంత్రాలతోకూడా పొంది, విలువిద్యను అభ్యసించి, ధనాన్ని కోరి తనచిన్ననాటి స్నేహితు డైన ద్రుపదుదగ్గరికి వెళ్లి, ' నేను నీ బాల్యమిత్రుడిని, నీతో కలిసి చదువుకొన్నవాడిని. తెలుసుకదా' అని స్నేహపూర్వకంగా మాట్లాడగా, ద్రుపదు డామాటలను సహించలేక కోపించి ఈ విధంగా అన్నాడు.

## ద్రోణుఁడు ద్రుపదునిచే నవమానితుఁ డగుట (సం. 1-122-2)

**చ. కొలఁది యెఱుంగ కిట్టి పలుకుల్ పలుకం దగుఁ గాదు నా కనన్**
**బలుగుఁదనంబునం బలుకఁ బాడియె నీ సఖి నంచుఁ? బేదవి**
**ప్రులకును ధారుణీశులకుఁ బోలఁగ సఖ్యము సంభవించునే?**
**పలుకక వేగ పొః మ్మకట పాఱుఁడు సంగడికాఁడె యెందునన్ ? 203**

**ప్రతిపదార్థం:** కొలఁది= అంతరం; ఎఱుంగక= తెలియక; ఇట్టి పలుకుల్= ఇటువంటి మాటలు; పలుకన్= మాటాడుటకు; తగున్, కాదు= తగినది, కాదు; నాకు+అనన్= నాకు అనగా; పలుగు+తనంబునన్= నిందాపూర్వకంగా; నీ, సఖిన్= నీ స్నేహితుడిని; అంచున్= అంటూ; పలుకన్; పాడియె= న్యాయమా!; పేద, విప్రులకును= బీద బ్రాహ్మణులకు; ధారుణి+ఈశులకున్= రాజులకు; పోలఁగన్= సమానమైనట్లు; సఖ్యము= స్నేహం; సంభవించునే= కలుగుతుందా?; పలుకక= మాట్లాడ కుండా; వేగన్= త్వరగా; పొమ్ము= వెళ్లు; అకట= అయ్యో!; పాఱుఁడు= బ్రాహ్మణుడు; ఎందునన్= ఎక్కడైనా; సంగడికాఁడు+ఎ= స్నేహితుడా?

**తాత్పర్యం:** మన ఇద్దరి అంతరం తెలియకుండా, 'నాకు ఈ విధంగా మాట్లాడ తగునా, కూడదా' అని అనుకోకుండా, నన్ను నీ స్నేహితుడి నని చెప్పడం న్యాయంగా ఉందా? బీదబ్రాహ్మణులకూ మహారాజులకూ స్నేహం ఎట్లా సాధ్యపడుతుంది? మారుమాట్లాడక పొమ్ము. అయ్యో! అసలు బ్రాహ్మణుడు ఎక్కడైనా చెలికా డౌతాడా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**చ. ధనపతితో దరిద్రునకుఁ, దత్త్వవిదుం డగు వానితోడ మూ**
**ర్ఖునకుఁ, బ్రశాంతుతోడఁ గడుఁ గ్రూరునకున్, రణశూరుతోడ భీ**
**రునకు, వరూథితోడ నవరూథికి, సజ్జనుతోడఁ గష్టదు**
**ర్జనునకు నెవ్విధంబునను సఖ్యము దా నొడఁగూడ నేర్చునే? 204**

**ప్రతిపదార్థం:** ధనపతితోన్= ధనానికి ప్రభువైనవానితో - అంటే సంపదకలవానితో; దరిద్రునకున్; తత్త్వ, విదుండు+అగువానితోడన్= తత్త్వం తెలిసినవానితో; మూర్ఖునకున్; ప్రశాంతుతోడన్= మిక్కిలి శాంతం కలిగినవానితో; కడున్+క్రూరునకున్= మిక్కిలి క్రూరుడైనవానికి; రణ, శూరుతోడన్= యుద్ధంలో పరాక్రమవంతు డైన వానితో; భీరునకున్= పిరికివానికి; వరూథితోడన్= కవచం కలిగినవానితో; అవరూథికిన్= కవచం లేనివానికి; సజ్జనుతోడన్= సన్మార్గునితో; కష్ట, దుర్జనునకున్= పాపి అయిన దుర్మార్గునికి; సఖ్యము= స్నేహం; ఏ+విధంబునను= ఎట్లు; తాన్= తాను; ఒడగూడన్+నేర్చునే= కలుగుతుందా? కలుగ దని భావం.

**తాత్పర్యం:** ధనవంతునితో దరిద్రునికి, పండితునితో మూర్ఖునికి, ప్రశాంతునితో క్రూరునికి, వీరునితో పిరికివానికి, కవచరక్షణ కలవానితో రక్షాకవచం లేనివానికి, సజ్జనునితో దుర్మార్గునికి స్నేహం ఏ విధంగా కలుగుతుంది?

**విశేషం:** ఈ పద్యం నన్నయరుచిరార్థసూక్తులలో ఒకటి. ద్రుపదుడు చిన్ననాటి నెచ్చెలిని గుర్తించికూడా, పేదవాడూ, ధనవంతుడూ అనే భేదభావంతో అతనిని తిరస్కరించాడు. అంతటితో ఆగకుండా తన ప్రవర్తనను ధర్మబద్ధమైనదానిగా

సమర్థించుకొన్నాడు. అందుకై ముందు పద్యంలో మహారాజుకూ పేదబాపనికీ ఎక్కడి సంబంధం అని ఎత్తిపొడిచాడు. ధనాపేక్షతో వచ్చిన ద్రోణుని మనసు అతని పేదరికాన్ని ఎత్తిచూపుతున్నందుకు చివుక్కుమనేటట్లు చేశాడు. అంతటితో ఆగక అసలు బ్రాహ్మణుడు స్నేహంచేయ తగినవాడా? అని అధిక్షేపించాడు. ఇది అతని వర్ణాన్నీ, స్వభావాన్నీ నిందించేవాక్యం. అర్థహీనుడైనా ద్రోణుడు అభిమానహీనుడు కాడు. అందువలన ఆవాక్యం అతడిని రెచ్చగొట్టుంది. పైపెచ్చు ఈపద్యంలో ద్రుపదుడు తన ప్రవర్తనకు లోకధర్మాన్ని సూక్తిగా చెప్పి సమర్థించుకొంటున్నాడు. ఇందులో పేర్కొన్న పోలికలవలన ద్రుపదుడు తనను ధనపతిగా, తత్త్వవేత్తగా, ప్రశాంతునిగా, రణశూరునిగా, సురక్షితునిగా, ఉత్తమునిగా చెప్పుకొని ఆత్మప్రశంస చేసికొన్నాడు. ద్రోణుడిని వరుసగా దరిద్రునిగా, మూర్ఖునిగా, క్రూరునిగా, పిరికిపందగా, అరక్షితునిగా, పరమదుర్మార్గునిగా నిందించి, నిష్కారణమైన పరనిందకు పాల్పడ్డాడు. ముందు పద్యంలోని మాటలే ద్రోణునిమనసును పుండుచేసి ఉంటాయి; పైపెచ్చు ఈ మాటలు పుండుమీద కారం చల్లిన ట్లుంటాయి. సూక్తులను కథార్థపోషకాలుగా వాడేనన్నయకథాకథనశిల్ప మిది.

**క. సమశీలశ్రుతయుతులకు । సమధనవంతులకు సమసుచారిత్రులకుం**
**దమలో సఖ్యమును వివా । హము నగుఁ గా; కగునె రెండు నసమానులకున్. 205**

**ప్రతిపదార్థం:** సమ, శీల, శ్రుత, యుతులకున్= సమానమైన స్వభావంతో, విద్యతో కూడిన వాళ్ళకు, సమ, ధనవంతులకున్= సమానంగా ధనవంతు లైనవాళ్ళకు; సమ, సుచారిత్రులకున్= సమాన మైన మంచి నడవడిక కలిగినవాళ్ళకు; తమలోన్; సఖ్యమును= స్నేహం; వివాహము= పెండ్లి; అగున్, కాక= ఏర్పడుతాయికానీ; రెండున్= మైత్రి, - వివాహము, అను రెండును; అసమానులకున్= సమానులు కానివాళ్ళకు; అగునె= ఔతాయా? (కా వని భావం)

**తాత్పర్యం:** సమానమైన స్వభావం, విద్య కలవాళ్ళకు, సమానమైన సంపద కలవాళ్ళకు, సమానమైన మంచినడవడి కలవాళ్ళకు స్నేహం, వివాహం ఏర్పడుతాయి. కాని సమానులు కానివాళ్ళకు అవి ఏర్పడతాయా? (ఏర్పడ వని భావం)

**విశేషం:** కయ్యానికీ వియ్యానికీ సామ్యం ఉండా లనే జనసూక్తి కీపద్యం రమణీయపద్యాకృతి.

**వ. 'మఱి యట్లుంగాక రాజులకుఁ గార్యవశంబునం జేసి మి త్రామిత్ర సంబంధములు సంభవించుం గావున మా యట్టి రాజులకు మీయట్టిపేదపాఱువారలతోఁ గార్యకారణం బైన సఖ్యం బెన్నండును గానేర' దని ద్రుపదుం డైశ్వర్యగర్వంబున మెచ్చక పలికిన విని, ద్రోణుం డవమానజనితమన్యుఘూర్ణమానమానసుం డయి యెద్దియుం జేయునది నేరక పుత్త్రకళత్రాగ్నిహోత్రశిష్యగణంబులతో హస్తిపురంబునకు వచ్చె; నంత నప్పురబహిరంగణంబున ధృతరాష్ట్రపాండునందను లందఱుఁ గందుకక్రీడాపరు లయి వేడుకతో నాడుచున్నంత నక్కాంచనకందుకం బొక్కనూతం బడిన. 206**

**ప్రతిపదార్థం:** మఱి= ఇంకా; అట్లున్+కాక= ఆ విధంగా కాకుండా; రాజులకున్; కార్య, వశంబునన్ చేసి= అవసరంచేత; మిత్ర+అమిత్ర, సంబంధములు= స్నేహ, వైర సంబంధాలు; సంభవించున్= కలుగుతాయి, కావునన్; మీయట్టి, పేద, పాఱు వారలతోన్= మీవంటి బీదబ్రాహ్మణులతో; కార్య, కారణంబు+ఐన= ప్రయోజనకర మైన; సఖ్యంబు= మైత్రి; ఎన్నండును= ఎప్పటికినీ; కానేరదు=కలుగబోదు; అని= ఆ ప్రకారంగా; ద్రుపదుండు; ఐశ్వర్య గర్వంబునన్= సంపదవలన కలిగినపొగరుచేత; మెచ్చక= లక్ష్యపెట్టకుండా (నిర్లక్ష్యంగా); పలికినన్; విని; ద్రోణుండు; అవమాన, జనిత, మన్యు, ఘూర్ణమాన, మానసుండు+అయి= అవమానంవలన పుట్టినకోపంచేత తిరుగుడు పడుతున్న మనసు కలిగినవా డై; ఎద్దియున్, చేయునది, నేరక= ఏమిచేయాలో

తెలియక; పుత్ర, కళత్ర+అగ్నిహోత్ర, శిష్య, గణంబులతో= కొడుకుతో, భార్యతో, అగ్నిహోత్రంతో, శిష్యసమూహంతో; హస్తి, పురంబునకున్; వచ్చెన్; అంతన్= అప్పుడు; ఆ+పుర, బహిస్+అంగణంబునన్= ఆ పట్టణం వెలుపల; ధృతరాష్ట్ర, పాండు నందనులు= ధృతరాష్ట్రుని కుమారులు, పాండురాజు కుమారులు (కౌరవ పాండవులు); అందఱున్= అంతా; కందుక, క్రీడాపరులు+అయి= చెండాట ఆడటంలో ఆసక్తి కలిగినవారై; వేడుకతోన్= సంతోషంతో; ఆడుచు+ఉన్నంతన్= ఆడుతూ ఉండగా; ఆ+కాంచన, కందుకంబు= ఆ బంగారు చెండు (బంతి); నూతన్= బావిలో; పడినన్= పడగా.

**తాత్పర్యం:** 'అంతేకాదు; రాజులకు అవసరాన్నిబట్టి మిత్రత్వశత్రుత్వాలు ఏర్పడుతుంటాయి; అందుచేత మా వంటి రాజులకు, మీవంటి పేదబ్రాహ్మణులతో ప్రయోజనం ఏమీ లేదు కాబట్టి స్నేహం ఎప్పుడూ ఏర్పడదు' అని ద్రుపదరాజు ఐశ్వర్యగర్వంతో తిరస్కరించి మాట్లాడగా ద్రోణుడు అవమానంచేత కలిగిన కోపంవలన కలతచెందిన మనసు కలవాడై, ఏమీచేయటానికీ తోచక, కొడుకుతో, భార్యతో, అగ్నిహోత్రంతో, శిష్యసమూహాలతో హస్తినాపురానికి వచ్చాడు. అప్పుడు ఆ పట్టణంబయట ధృతరాష్ట్రునికుమారులు, పాండురాజుకుమారులు చెండాట ఆడుకొంటూ ఉండగా వా ళ్ళాడుతున్న బంగారుబంతి బావిలో పడింది. అప్పుడు.

**ఆ. నీరిలోనఁ దోఁచు తారక ప్రతిబింబ । మొక్కొ యనఁగ వెలుఁగుచున్నదాని**
**రాచకొడుకులెల్లఁ జూచుచునుండిరి । దానిఁ బుచ్చుకొనువిధంబు లేక. 207**

**ప్రతిపదార్థం:** నీరిలోనన్= నీటిలో; తోఁచు= కనిపిస్తున్న; తారక, ప్రతిబింబము+ఒక్కొ= నక్షత్రంయొక్క ప్రతిబింబమా?; అనఁగన్= అనేటట్లుగా; వెలుఁగుచున్+ఉన్న= ప్రకాశిస్తూ ఉన్న; దానిన్= ఆ బంతిని; రాచ, కొడుకులు+ఎల్లన్= రాకుమారులంతా; దానిన్= ఆ బంతిని; పుచ్చుకొను, విధంబు= తీసికొనే మార్గం; లేక= తెలియక; చూచుచున్; ఉండిరి.

**తాత్పర్యం:** నీటిలో ప్రతిఫలిస్తున్న నక్షత్రమా అన్నట్లుగా వెలుగుతున్న ఆ బంగారుబంతిని తీసికొనేమార్గం లేక రాకుమారులంతా ఊరకే చూస్తున్నారు.

**విశేషం:** అలం : ఉత్ప్రేక్ష.

**వ. అట్టి యవసరంబున. 208**

**తాత్పర్యం:** అటువంటి సమయంలో.

### ద్రోణుఁడు హస్తిపురంబునకు వచ్చుట. (సం. 1-122-14)

**క. నానావిధశరశరధుల । తో నున్నతచాపధరుఁడు ద్రోణుఁడు వారిం**
**గానఁ జనుదెంచి యంతయుఁ । దా నప్పు డెఱింగి రాజతనయుల కనియెన్. 209**

**ప్రతిపదార్థం:** నానా, విధ, శర, శరధులతోన్= అనేకవిధా లైన బాణాలతో, అమ్ములపొదులతో; ఉన్నత, చాప, ధరుఁడు= పొడవైన ధనుస్సు ధరించినవాడు; ద్రోణుఁడు; వారిన్= ఆ కౌరవ పాండవుల్ని; కానన్= చూడటానికై; చనుదెంచి= వచ్చి; తాన్= తాను; అప్పుడు; అంతయున్; ఎఱింగి; రాజ, తనయులకున్= రాకుమారులతో; అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనేకవిధా లైన బాణాలతో, అమ్ములపొదులతో, ఎత్తైన ధనుస్సును ధరించిన ద్రోణుడు వాళ్ళ దగ్గరికి వెళ్ళి, విషయమంతా తెలిసికొని ఆ రాజకుమారులతో ఇట్లా అన్నాడు.

**చ. భరతకులప్రసూతులరు భాసురశస్త్రమహాస్త్ర విద్యలం**
**గరము ప్రసిద్ధుఁ డై పరఁగు గౌతమశిష్యుల; రిట్టి మీకు దు**
**ష్కరముగ నూతిలోఁ బడిన కాంచనపిండుఁ గొనంగనేర కొం**
**డొరుల మొగంబు చూచి నగుచుండఁగఁ జన్నె యుపాయహీనతన్. 210**

**ప్రతిపదార్థం:** భరత, కుల, ప్రసూతులరు= భరతవంశంలో పుట్టినవారు; భాసుర, శస్త్ర, మహా+అస్త్ర, విద్యలన్= ప్రకాశిస్తున్న శస్త్రవిద్యలలో, గొప్ప అస్త్రవిద్యలలో; కరము= మిక్కిలి; ప్రసిద్ధుఁడు+ఐ= పేరు పొందినవాడై; పరఁగు= ఒప్పు; గౌతమ, శిష్యులరు= కృపాచార్యుని శిష్యులు; ఇట్టి; మీకున్; దుష్కరముగన్= కష్టంగా; నూతిలోన్= బావిలో; పడిన, కాంచన, పిండున్= బంగారు బంతిని; కొనంగ, నేరక= పైకితీయకలేక; ఉపాయ హీనతన్= ఉపాయం లేక; ఒండు+ఒరుల, మొగంబు= ఒకరిముఖాన్ని ఒకరు; చూచి; నగుచున్+ఉండఁగన్= నవ్వుతూ (నిస్సహాయంగా)ఉండటం; చన్నె= తగినపనా?

**తాత్పర్యం:** మీరు భరతవంశంలో పుట్టి; శస్త్రాస్త్రవిద్యలలో మహాప్రసిద్ధు డైన కృపాచార్యునిశిష్యులై, బావిలో పడిన బంతిని తీసికొనటం చేతకాక ఒకరిముఖం ఒకరు చూచుకుంటూ నవ్వుకొనటం మీకు తగినపనా?

**విశేషం:** బాణవిద్యలో ప్రౌఢుడై ద్రోణుడు - బావిలో పడినబంతిని పైకితీసికొనలేక వెలవెలపోతున్న పాండవులతో, ధార్తరాష్ట్రులతో అవహేళనగా మాట్లాడటం వాళ్ళను అవమానించటం కాదు. ఉత్తమవంశంలో పుట్టి, ఉత్తమగురువుకు శిష్యులై సమయోచితమైన ఉపాయం ఆలోచించకుండ ఉద్విగ్నులు కావటం వీరులకు ఉచితం కా దని హెచ్చరించటానికి. ఆ తరువాత తనవిద్యను, యోగ్యతను ప్రదర్శించాడు. ఈ సన్నివేశం కృపాచార్యునికంటె ద్రోణుడు గొప్పవా డనీ, అతనిశిక్షణ రాజకుమారుల కవసర మనీ భీష్ముడు భావించేటట్లు చేసిం దని వస్తుధ్వని. (సంపా.)

**వ. 'దీని బాణపరంపరం జేసి పుచ్చి యిచ్చెదఁ జూడుఁ; డీ విద్య యొరు లెవ్వరు నేర' రని ద్రోణుం డొక్కబాణం బభి మంత్రించి దృష్టి ముష్టి సౌష్ఠవంబు లొప్ప నక్కందుకంబు నాట నేసి దానిపుంఖంబు మఱియొక బాణంబున నేసి తత్పుంఖం బొండొకబాణంబున నేసి వరుసన బాణరజ్జువు గావించి దానిం దిగిచికొని యిచ్చినం జూచి రాజకుమారు లెల్ల విస్మయం బంది ద్రోణుం దోడ్కొని చని భీష్మున కంతయు నెఱింగించిన నాతండును. 211**

**ప్రతిపదార్థం:** దీనిన్= ఈ బంతిని; బాణ, పరంపరన్+చేసి= బాణాల వరుసతో; పుచ్చి= తీసికొని; ఇచ్చెదన్; చూడుఁడు= చూస్తూ ఉండండి; ఈ, విద్య; = ఈ విలువిద్యను; ఒరులు+ఎవ్వరున్= ఇతరు లెవ్వరూ; నేరరు= నేర్వలేదు; అని= ఆ విధంగా; ద్రోణుండు; ఒక్క, బాణంబు= ఒక్క బాణాన్ని; అభిమంత్రించి= మంత్రంతో పిలిచి; దృష్టి, ముష్టి, సౌష్ఠవంబులు= చూపు యొక్క, పిడికిలి యొక్క చక్కదనాలు; ఒప్పన్= ఒప్పునట్లుగా; ఆ+కందుకంబు= ఆ బంతిని; నాటన్+ఏసి= గ్రుచ్చుకునేట్లుగా కొట్టి; దాని= ఆ బాణం యొక్క; పుంఖంబు= క్రింది చివర; మఱియొక, బాణంబునన్= ఇంకొక బాణంతో; ఏసి= కొట్టి; తద్+పుంఖంబు= దానియొక్క చివరిఅంచును; ఒండు+ఒక, బాణంబునన్= మరొక బాణంచేత; ఏసి=కొట్టి; వరుసన; బాణ, రజ్జువు= బాణాల తాడును; కావించి= అగునట్లు చేసి; దానిన్= ఆ బంతిని; తిగిచికొని= లాగుకుని; ఇచ్చినన్= ఈయగా; చూచి= కనుగొని; రాజకుమారులు+ఎల్లన్= రాజకుమారు లందరు; విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; ద్రోణుని= ద్రోణుణ్ణి; తోడ్కొని= తీసికొని; చని= వెళ్ళి; భీష్మునకున్, అంతయున్, ఎఱింగించినన్= భీష్మునికి అంతా తెలుపగా; అతండున్= అతడుకూడా.

**తాత్పర్యం:** 'ఈ బంతిని బాణపరంపరతో తీసి ఇస్తాను చూడండి. ఈ విద్య ఇతరు లెవ్వరికీ రాదు' అని ద్రోణుడు ఒక బాణాన్ని అభిమంత్రించి, చూపును, పిడికిలిని చక్కగా నిలిపి, ఆ బంతికి నాటుకునే విధంగా ఆ బాణాన్ని కొట్టి, ఆబాణంచివరికి మరో బాణాన్ని, దాని చివరికి ఇంకో బాణాన్నీ కొట్టి, వరుసగా బాణాలతాడు చేసి బంతిని లాగి ఇచ్చాడు. అది చూచి, రాకుమారు లందరూ ఆశ్చర్యపడి, ద్రోణుడిని తీసికొని వెళ్ళి భీష్మునికి జరిగినదంతా చెప్పారు. ఆయనకూడా.

**క. ఆసన్నపలితు ననఘు శ । రాసనగురు భూరిసత్త్వు నసితకృశాంగున్**
**భూసురవరు ద్రోణు గుణో । ద్భాసితు వినినట్ల చూచి పరమప్రీతిన్. 212**

**ప్రతిపదార్థం:** ఆసన్న, పలితున్= సమీపించిన తెలనెరిసినవాడిని; అనఘున్= పాపంలేనివాడిని; శర+ఆసన, గురున్= ధనుర్విద్యకు గురువైనవాడిని; భూరి, సత్త్వున్= గొప్పబలం కలిగినవాడిని; అసిత, కృశ+అంగున్= నల్లని, సన్నబడిన శరీరం కలవాడిని; భూసుర, వరున్= బ్రాహ్మణ శ్రేష్ఠుడిని; గుణ+ఉద్భాసితున్= మంచిగుణాలచేత ప్రకాశిస్తున్నవాడిని; ద్రోణున్= ద్రోణుణ్ణి; వినినట్లు+అ= మునుపు వినినట్లే; చూచి= కనుగొని; పరమ, ప్రీతిన్= మిక్కిలి సంతోషంతో.

**తాత్పర్యం:** తల నెరియుటం మొదలైనవాడు, పుణ్యాత్ముడు, ధనుర్విద్యాచార్యుడు, మహాబలవంతుడు, నల్లని బక్కచిక్కిన శరీరం కలవాడు, బ్రాహ్మణశ్రేష్ఠుడు, మంచిగుణాలచేత ప్రకాశించేవాడు అయిన ద్రోణుడిని తాను ముందే విన్నట్లుగా చూచి భీష్ముడు ఎంతో సంతోషంతో.

**క. 'ఎందుండి వచ్చి తిందుల; । కెం దుండఁగ నీకు నిష్ట మెఱిఁగింపుము స**
**ద్వందిత!' యని యడిగిన సా । నందుఁడు ద్రోణుండు భీష్మునకు ని ట్లనియెన్. 213**

**ప్రతిపదార్థం:** ఎందు+ఉండి= ఎక్కడనుండి; ఇందులకున్= ఇక్కడికి; వచ్చితివి= వచ్చావు? నీకున్; ఎందు+ఉండఁగన్= ఎక్కడ ఉండటానికి; ఇష్టము= అభిలాష; ఎఱిఁగింపుము= తెలియజేయుము; సద్+వందిత= సజ్జనులచేత పొగడబడేవాడా!; అని= ఆ ప్రకారంగా; అడిగినన్= అడుగగా; స+ఆనందుఁడు= ఆనందంతో కూడినవాడైన; ద్రోణుండు; భీష్మునకున్; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** 'సజ్జనులచేత పొగడబడేవాడా! ఓ ద్రోణాచార్యా! నీవు ఎక్కడనుండి ఇక్కడకు వచ్చావు? ఎక్కడ ఉండటం నీ కిష్టం? చెప్పుము' అని అడుగగానే ద్రోణుడు సంతోషించి భీష్మునితో ఈ విధంగా అన్నాడు.

**వ. ఏను ద్రోణుం డనువాఁడ; భరద్వాజపుత్త్రుండ నగ్నివేశ్యుండను మహామునివరునొద్ద బ్రహ్మచర్యాశ్రమంబున వేదాధ్యయ నంబు సేసి ధనుర్వేదం బభ్యసించుచున్ననాఁడు, పాంచాలపతి యైన పృషతుపుత్త్రుండు ద్రుపదుం డను వాఁడు నా కిష్టసఖుం డయి యెల్లవిద్యలు గఱచి, 'యేను పాంచాలవిషయంబునకు రా జయిననాఁడు నా యొద్దకు వచ్చునది; నా రాజ్యభోగంబులు నీవు ననుభవింప నర్హుండ' వని నన్నుఁ బ్రార్థించి చని, పృషతుపరోక్షంబునఁ దద్దేశంబునకు రా జయి యున్న, నేను గురునియుక్తుండ నై గౌతమిం బాణిగ్రహణంబు సేసి యిక్కుమారు నశ్వత్థామ నధికతేజస్వి నాత్మజుం బడసి, ధనంబు లేమిం గుటుంబభరణంబునం దసమర్థుండ నయి యుండియు. 214**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ద్రోణుండు+అను వాఁడన్; భరద్వాజ, పుత్త్రుండన్= భరద్వాజమహర్షి కుమారుణ్ణి; అగ్నివేశ్యుండు= అగ్నివేశ్యుడను పేరుగల; మహాముని, వరున్+ఒద్ద= గొప్ప మునిశ్రేష్ఠుని దగ్గర; బ్రహ్మచర్య+ఆశ్రమంబునన్; వేద+ అధ్యయనంబు= వేదాలు చదవటం; చేసి; ధనుర్వేదంబు= విలువిద్యను; అభ్యసించుచున్= నేర్చుకొంటూ; ఉన్న, నాఁడు= ఉన్నప్పుడు; పాంచాల, పతి+ఐన= పాంచాలదేశపురాజైన, పృషతు, పుత్త్రుండు= పృషతు డనేవానికుమారుడు; ద్రుపదుండు+ అనువాడు; నాకు; ఇష్ట, సఖుండు+ఐ= ప్రియమైన స్నేహితుడై; ఎల్ల, విద్యలు; కఱచి= నేర్చుకొని; ఏను= నేను; పాంచాల, విషయంబునకున్= పాంచాలదేశానికి; రాజు+అయిన, నాఁడు= రాజైనప్పుడు; నా, ఒద్దకున్= నా దగ్గరికి; వచ్చునది= రమ్ము; నా, రాజ్య, భోగంబులు; నీవున్= నీవు కూడా; అనుభవింపన్= అనుభవించుటకు; అర్హుండవు= తగినవాడివి; అని; నన్నున్; ప్రార్థించి; చని= వెళ్ళి; పృషతు, పరోక్షంబునన్= పృషతుని తర్వాత, తద్+దేశంబునకున్= ఆ దేశానికి; రాజు+అయి, ఉన్నన్= ప్రభువైఉండగా; నేను= నేను; గురు, నియుక్తుండను+ఐ= తండ్రిచేత ఆజ్ఞాపించబడినవాడినై; గౌతమిన్= కృపిని; పాణిగ్రహణంబు+చేసి= వివాహమాడి; ఈ+కుమారున్; అశ్వత్థామన్; అధిక, తేజస్విన్= మిక్కిలి తేజశ్శాలిని; ఆత్మజున్= కుమారుని; పడసి= పొంది; ధనంబు, లేమిన్= ధనం లేకపోవటంచేత; కుటుంబ, భరణంబు, అందు= సంసారాన్ని భరించటంలో; అసమర్థుండను; అయి; ఉండియున్= శక్తిలేనివాడనై ఉండికూడా.

**తాత్పర్యం:** నాపేరు ద్రోణుడు. భరద్వాజునికుమారుడిని. అగ్నివేశ్య డనే గొప్పమునిశ్రేష్ఠునిదగ్గర బ్రహ్మచర్య వ్రతం అవలంబించి వేదాధ్యయనం చేసి, ధనుర్వేదం నేర్చుకొంటున్నకాలంలో, పాంచాలరాజైన పృషతునికుమారుడు ద్రుపదు డనేవాడు నాకు ప్రియమిత్రుడై అన్నివిద్యలూ గురువుదగ్గర నేర్చి, 'నేను పాంచాలదేశానికి రాజైనప్పుడు నీవు నా దగ్గరికి రావాలి సుమా! నా రాజ్యభోగాలు నీవు కూడా అనుభవించటానికి అర్హుడ' వని నన్ను ప్రార్థించి వెళ్ళాడు. పృషతునితర్వాత ద్రుపదుడు ఆ దేశానికి రా జయ్యాడు. నేనుకూడా తండ్రిఆజ్ఞచేత కృపిని వివాహమాడి, గొప్పతేజస్సుకల ఈ బాలుడు అశ్వత్థామను కొడుకుగా పొంది, ధనం లేమిచేత సంసారాన్ని భరించలేనివాడినై ఉండికూడా -

**క. పురుషవిశేష వివేకా । పరిచయు లగు ధరణిపతుల పాలికిఁ బోవం**
**బరులందు దుష్ప్రతిగ్రహ । భర మెదలో రోసి ధర్మపథమున నున్నన్. 215**

**ప్రతిపదార్థం:** పురుష, విశేష, వివేక+అపరిచయులు+అగు= పురుషునియొక్క గొప్పతనాన్ని గురించిన ఆలోచనలందు పరిచయం లేనివాళ్ళయిన; ధరణి, పతుల, పాలికిన్= రాజుల దగ్గరికి; పోవన్= వెళ్ళటం; పరులందు= ఇతరుల దగ్గర; దుష్ప్రతిగ్రహ, భరము= చెడుదానాలను తీసికొనటంయొక్క కష్టాన్ని; ఎదలో= మనసులో; రోసి= అసహ్యించుకొని; ధర్మ, పథమునన్= ధర్మమార్గంలో; ఉన్నన్= ఉండగా.

**తాత్పర్యం:** వ్యక్తులయోగ్యతను గుర్తించలేని రాజులదగ్గరికి వెళ్లటానికీ, ఇతరులనుండి చెడుదానాలు తీసికొనటానికీ, ఇష్టపడక ధర్మమార్గంలో జీవితం గడపుతుండగా.

**క. ధనపతుల బాలురు ముదం । బున నిత్యముఁ బాలు ద్రావఁబోయిన నస్మ**
**త్తనయుండు వీఁడు బాల్యం । బున నేడ్చెను బాలు నాకుఁ బోయుం డనుచున్. 216**

**ప్రతిపదార్థం:** ధన, పతుల, బాలురు= ధనవంతుల పిల్లలు; ముదంబునన్= సంతోషంతో; నిత్యమున్= ప్రతిదినం; పాలు, త్రావన్ పోయినన్= పాలుత్రాగుచుండగా; అస్మద్+తనయుండు= నా కుమారుడు; వీఁడు= ఈ బాలుడు; బాల్యంబునన్= బాల్యమునందు; నాకున్, పాలు, పోయుండు; అనుచున్; ఏడ్చెన్.

**తాత్పర్యం:** ధనవంతుల బిడ్డలు ప్రతిదినం సంతోషంతో పాలు త్రాగుతూండగా, నా కుమారుడు వీడు బాల్యంలో 'నాకుకూడా పాలు పోయండ'ని ఏడ్చాడు.

**వ. దానిం జూచి 'దారిద్ర్యంబునకంటెఁ గష్టం బొం డెద్దియు లేదు; దీని నా బాలసఖుండగు పాంచాలు పాలికిం బోయి పాచికొందు; నాతండు తనదేశంబున కభిషిక్తుండు గాఁ బోవుచుండి నన్ను రాఁ బనిచి పోయె'. 217**

**ప్రతిపదార్థం:** దానిన్+చూచి= ఆ సన్నివేశాన్ని చూచి; దారిద్ర్యంబునకంటెన్= లేమిడి కన్నా; కష్టంబు= కష్టము; ఒండు+ ఎద్దియున్= మరొకటి ఏదీ; లేదు; దీనిన్= ఈ పేదరికాన్ని; నా, బాల, సఖుండు= నా చిన్ననాటి స్నేహితుడు; అగు= అయినట్టి; పాంచాలు, పాలికిన్= పాంచాలదేశపు రాజైన ద్రుపదుని దగ్గరికి; పోయి; పాచికొందున్= పోగొట్టుకొంటాను; అతండు= ఆ ద్రుపదుడు; తన, దేశంబునకున్= తన రాజ్యానికి; అభిషిక్తుండు+కాన్= రాజు కావడానికి; పోవుచుండి= పోతూ ఉండి; నన్నున్= నన్ను; రాన్+పనిచి= రమ్మని చెప్పి; పోయెన్.

**తాత్పర్యం:** దానిని చూచి దారిద్ర్యంకంటే కష్టం మరొకటి లే దని తలచి 'ఈ దారిద్ర్యాన్ని నా బాల్యమిత్రు డైన పాంచాలరాజు ద్రుపదునిదగ్గరకు పోయి తొలగించుకుంటాను. అతడు తనదేశానికి రాజు కావటానికి వెళ్తూ నన్ను ఆహ్వానించి వెళ్ళాడు'.

**మత్తకోకిల**

**వేఁడు టెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనున్**
**వేఁడికో లుచితంబ కావున వేడ్కతోఁ జని సోమకున్**
**వేఁడినన్ ధన మోపఁడేనియు వీనిమాత్రకు నాలుగేన్**
**పాఁడికుఱ్ఱుల నీఁడె వీనికిఁ బాలు ద్రావుచునుండఁగన్. 218**

**ప్రతిపదార్థం:** వేఁడుట= యాచించటం; ఎంతయున్= మిక్కలి; కష్టము+ఐనను= కష్టమైనపని అయినప్పటికీ; వేఱులేని= భేదంలేని; సుహృత్+జనున్= మిత్రుడిని; వేఁడికోలు= వేడుకోవటం; ఉచితంబు+అ= తగినదే; కావునన్; వేడ్కతోన్= సంతోషంతో; చని= వెళ్ళి; సోమకున్= ద్రుపదుడిని; వేఁడినన్= ప్రార్థింపగా; ధనము+ఓపఁడు+ఏనియున్= ధనం ఇవ్వలేకపోయినప్పటికీ; వీని మాత్రకు= వీడికి (అశ్వత్థామకు) సరిపోయేంతగా; నాలుగు+ఏన్= నాలుగైనా; పాఁడి, కుఱ్ఱులన్= పాడి ఆవులను; వీనికిన్= ఈ అశ్వత్థామకు; పాలు; త్రావుచున్, ఉండఁగన్= పాలుత్రాగటానికి; ఈఁడె= ఇవ్వడా!

**తాత్పర్యం:** యాచించటం ఎంతో కష్టమైన పని. అయినప్పటికీ భేదం లేని మిత్రుడిని యాచించటం ఉచితమే. అందుచేత సంతోషంగా వెళ్లి ద్రుపదుడిని అడిగినట్లయితే, ధనం ఇవ్వలేకపోయినా, అశ్వత్థామ పాలు త్రాగటానికి సరిపోయేటట్లుగా నాలుగుపాడిఆవులనైనా ఇవ్వడా?

**విశేషం:** మత్తకోకిలపాదంలో ర, స, జ, జ, భ, ర - అనే గణాలు వరుసగా ఉంటాయి. 11వ అక్షరం యతిస్థానం. ప్రాస నియమం ఉన్నది.

**వ. 'అని నిశ్చయించి ద్రుపదునొద్దకుం బోయి న న్నెఱింగించిన, నాతండు దన రాజ్యమదంబున నన్నును దన్నును నెఱుంగక' యేను రాజను నీవు పేదపాఱుండవు; నాకును నీకును నెక్కడి సఖ్యం?' బలి పలికిన వానిచేత నవమానితుండ నయి వచ్చితి' నని ద్రోణుండు దనవృత్తాంతం బంతయుఁ జెప్పిన. 219**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; నిశ్చయించి= నిర్ణయించుకొని; ద్రుపదు+ఒద్దకున్= ద్రుపదుడి దగ్గరికి; పోయి; నన్నున్+ఎఱింగించినన్= నన్ను నేను పరిచయం చేసికొనగా; ఆతండు= ఆ ద్రుపదుడు; తన, రాజ్య మదంబునన్= తన యొక్క రాజ్యంవలన కలిగిన పొగరుచేత; నన్నును= నన్ను; తన్నును= తనను; ఎఱుంగక= తెలియక; ఏను= నేను; రాజను; నీవు; పేద, పాఱుండవు= బీదబ్రాహ్మణుడివి; నాకును; నీకునున్; ఎక్కడి= ఎక్కడ; సఖ్యంబు= స్నేహం; అని, పలికినన్; వానిచేతన్= ఆ ద్రుపదునిచే; అవమానితుండను+అయి= అవమానించబడినవాడి నై; వచ్చితిని; అని; అట్లు; ద్రోణుండు; తన+వృత్తాంతంబు+అంతయున్, చెప్పినన్= తన వృత్తాంతాన్ని అంతా చెప్పగా-

**తాత్పర్యం:** 'అని నిర్ణయించుకొని ద్రుపదునిదగ్గరికి వెళ్ళి, నన్ను నేను పరిచయం చేసికొనగా, అతడు రాజ్యమదంచేత నన్నూ, తననూ ఎరుగకుండా 'నేను రాజును నీవు బీదబ్రాహ్మణుడివి. నాకూ నీకూ స్నేహం ఎక్కడిది?' అని పలికాడు. ఆ విధంగా అతనిచేత అవమానం పొంది వచ్చా' నని ద్రోణుడు తనవృత్తాంతం అంతా చెప్పగా-

**క. విని రోయుతీఁగ గాళ్ళం । బెనఁగెం దా ననుచుఁ బొంగి భీష్ముఁడు ద్రోణున్**
**ఘనభుజు నభీష్టపూజా । ధనదానవిధానముల ముదంబునఁ దనిపెన్. 220**

**ప్రతిపదార్థం:** విని= ఆ ద్రోణవృత్తాంతాన్ని ఆలకించి; భీష్ముఁడు; రోయు, తీఁగ= వెదకుతున్న తీగ; తాన్; కాళ్ళన్; పెనఁగన్= చుట్టుకొన్నది; అనుచున్= అంటూ; పొంగి= సంతోషించి; ఘన, భుజున్= గొప్పభుజాలు కలిగినవాడిని; ద్రోణున్= ద్రోణుణ్ణి; అభీష్ట, పూజా, ధన, దాన, విధానములన్= ఇష్టమైన పూజలు చేయటం, ధనాన్ని దానం ఇవ్వటం అనే పద్ధతులచేత; ముదంబునన్= సంతోషంతో; తనిపెన్= తృప్తిపరచాడు.

**తాత్పర్యం:** అది విని, భీష్ముడు వెదుకబోయిన తీగ కాళ్లకు చుట్టుకున్నట్లు సంతోషించి, ద్రోణునికి ఇష్టమైన పూజలు చేసి, ధనదానా లిచ్చి తృప్తిపరచాడు.

**వ. మఱియును. 221**

**తాత్పర్యం:** అంతటితో ఆగక.

**భీష్ముఁడు కురుపాండుకుమారులకు ద్రోణుని గురువుగా నియమించుట (సం. 1-122-40)**

**చ. మనుమల నెల్లఁ జూపి మతిమంతుఁడు శాంతనవుండు 'వీరిఁ జే**
**కొని గురువృత్తిమైఁ గఱపు ఘోరశరాసనవిద్యలెల్లఁ ; బెం**
**పున జమదగ్నిసూనుఁడును బోలఁడు' ని న్నని విందు విల్లునే**
**ర్పున నయనైపుణంబునను భూరిపరాక్రమగర్వసంపదన్. 222**

**ప్రతిపదార్థం:** మతిమంతుఁడు= గొప్పబుద్ధికలవాడు; శాంతనవుండు= భీష్ముడు; మనుమలన్; ఎల్లన్; చూపి; వీరిన్; చేకొని= గ్రహించి; ఘోర+శర+ఆసన, విద్యలు+ఎల్లన్= భయంకరమైన ధనుర్విద్య లన్నింటినీ; పెంపునన్= అతిశయంగా; గురు, వృత్తిమైన్= గురుత్వంచేత; కఱపు= నేర్పుము; నిన్నున్; విల్లు, నేర్పునన్= విలువిద్యా నైపుణ్యంలో; నయ, నైపుణంబునను= నీతినేర్పులో; భూరి, పరాక్రమ, గర్వ, సంపదన్= గొప్పబలం కలిగిన గర్వమనే కలిమిలో; జమదగ్ని సూనుఁడును= జమదగ్నికుమారు డైన పరశురాముడుకూడా; పోలడు, అని, విందున్= సరిపోలడు అని విన్నాను.

**తాత్పర్యం:** మతిమంతుడైన భీష్ముడు తనమనుమళ్ళందరిని ద్రోణునికి చూపించి 'వీరికి గురుత్వం వహించి గొప్పగా విలువిద్య లన్నింటినీ నేర్పుము. విలువిద్యలో, నీతిలో, పరాక్రమంలో పరశురాముడుకూడా నిన్ను పోల డని విన్నాను'.

**వ. అని కుమారుల నెల్లం జూపి ద్రోణునకు శిష్యులంగా సమర్పించిన, ద్రోణుండును వారలం జేకొని యందఱ కి ట్లనియె. 223**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; కుమారులను+ఎల్లన్= కుమారు లందరినీ; చూపి; ద్రోణునకున్; శిష్యులన్+కాన్= శిష్యు లయ్యేటట్లుగా; సమర్పించినన్= సమర్పింపగా; ద్రోణుండును; వారలన్; చేకొని= (శిష్యులుగా) గ్రహించి; అందఱకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలికి కుమారు లందరినీ చూపి, వాళ్ళను ద్రోణునికి శిష్యులుగా సమర్పించాడు. ద్రోణుడు వాళ్ళందరినీ దగ్గరికి తీసి ఈ విధంగా అన్నాడు.

**తే. 'అస్త్రవిద్యలు గఱచి నా దైన యిష్ట । మొగిన తీర్పంగ నిం దెవ్వఁ డోపు' ననినఁ**
**బాయ మొగమిడి కౌరవుల్ పలుకకుండి; । 'రేను దీర్చెద' నని పూనె నింద్రసుతుఁడు. 224**

**ప్రతిపదార్థం:** అస్త్ర; విద్యలు= అస్త్రములయొక్క విద్యలు; కఱచి= నేర్చి; నాది+ఐన; ఇష్టము= నాదగు కోర్కె; ఒగిన్+అ= క్రమంగా; తీర్పంగన్= తీర్పగా; ఇందున్= ఇచ్చట; ఎవ్వఁడు= ఎవడు; ఓపున్= సరిపోతాడు; అనినన్= అని అనగా; పాయమొగము= మారుమొగం; ఇడి= పెట్టి; కౌరవుల్= కౌరవులు; పలుకక+ఉండిరి= పలుకకుండా ఊరక ఉండిరి; ఇంద్ర, సుతుఁడు= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; ఏను= నేను; తీర్చెదను+అని+పూనెన్= తీరుస్తాను అని పూనుకున్నాడు.

**తాత్పర్యం:** 'నా దగ్గర అస్త్రవిద్యలు నేర్చి నాకోరిక మీలో ఎవ్వడు తీర్చగల' డని అడుగగా కౌరవు లందరూ పెడమొగాలు పెట్టి మౌనం వహించారు. అర్జునుడు 'నేను తీరుస్తా'నని ముందుకు వచ్చాడు.

**వ. ఇట్లు దన యిష్టంబు దీర్పం బూనిన యర్జును నాచార్యుం డతిస్నేహంబునఁ గౌఁగిలించుకొని కరంబు సంతసిల్లి కుమారుల కెల్ల విలువిద్యఁ గఱపుచున్న, నానాదేశంబులం గల రాజపుత్త్రులెల్ల వచ్చి వారితోడఁ గలసి కఱచుచుండిరి; మఱియు, సూతపుత్త్రుం డయిన రాధేయుండును ధనుర్విద్యాకౌశలంబున నర్జునునితోడ మచ్చరించుచు దుర్యోధనపక్షపాతి యై యుండె; నంత. 225**

**ప్రతిపదార్థం:** ఇట్లు; తన, ఇష్టంబు= తన కోరికను; తీర్పన్+పూనిన= తీర్చటానికి పూనుకొన్న; అర్జునున్; ఆచార్యుండు; అతి, స్నేహంబునన్= మిక్కిలి ప్రేమతో; కౌఁగిలించుకొని; కరంబు= మిక్కిలి; సంతసిల్లి; కుమారులకు+ఎల్లన్= కురుకుమారు లందరికీ; విలు, విద్యన్= కఱపుచు+ఉన్నన్= నేర్పుతూ ఉండగా; నానా దేశంబులన్, కల= అనేకదేశాలలో ఉండే; రాజపుత్రులు+ఎల్లన్, వచ్చి= రాజకుమారులు అందరూ వచ్చి; వారితోడన్, కలసి= ఆ కురుకుమారులతో కలిసి; కఱచుచు+ఉండిరి= నేర్చుకొంటూ ఉన్నారు; మఱియున్; సూత, పుత్త్రుండు+అయిన= సూతుని కొడుకైన; రాధేయుండును; ధనుర్విద్యా, కౌశలంబునన్= విలువిద్యలోని నేర్పుతో; అర్జునునితోడ; మచ్చరించుచు= ద్వేషం వహిస్తూ; దుర్యోధన, పక్షపాతి+ఐ= దుర్యోధనుని పక్షాన ఉన్నవాడై; ఉండెన్= ఉన్నాడు; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తనకోరికను తీరుస్తా నని ముందుకు వచ్చినఅర్జునుడిని అపారప్రేమతో కౌగిలించుకొని, ఎంతో సంతోషించి, కురుకుమారు లందరికీ విలువిద్య నేర్పుతుండగా, నానాదేశాలనుండి రాకుమారులు వచ్చి, వారితో కలిసి ఆ విద్య నేర్చుకొంటున్నారు. సూతునికుమారుడైన రాధేయుడు విలువిద్యా నైపుణ్యంలో అర్జునునితో ద్వేషంవహిస్తూ దుర్యోధనునిపక్షంలో చేరి ఉన్నాడు.

**క. నరుఁ డస్త్రశస్త్రవిద్యా । పరిణతి నధికుఁ డయి వినయపరుఁ డయి శశ్వ**
**ద్గురుపూజాయత్నంబునఁ । బరఁగుచు సంప్రీతుఁ జేసె భారద్వాజున్. 226**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; అస్త్ర, శస్త్ర, విద్యా, పరిణతిన్= అస్త్రశస్త్రవిద్యాదులలో పక్వతతో; అధికుఁడు+అయి= గొప్పవాడై; వినయపరుఁడు+అయి=అణకువ ప్రధానంగా కలవాడై; శశ్వత్+గురు, పూజా, యత్నంబునన్= నిరంతరం గురువును పూజించే ప్రయత్నంలో; పరఁగుచున్= ప్రవర్తిస్తూ; భారద్వాజున్= భరద్వాజుని కుమారు డైన ద్రోణుణ్ణి; సంప్రీతున్= సంతోషించిన వాణ్ణిగా; చేసెన్.

**తాత్పర్యం:** అర్జునుడు శస్త్రాస్త్రవిద్యానైపుణ్యంలో అధికు డై; వినయంతో ఎప్పుడూ గురుపూజ చేస్తూ ద్రోణుణ్ణి సంతోషపరిచాడు.

**విశేషం:** శిష్యుడు ఉత్తమగురువుకొరకు ఎట్లా అన్వేషిస్తాడో; గురువుకూడా ఉత్తమశిష్యుడికొరకు అట్లా అన్వేషిస్తాడు, సాధిస్తాడు. ఇక్కడ ఉభయత్రా సార్థక్యం ఏర్పడింది.

**వ. అ య్యర్జునుతోడి విద్యామత్సరంబునఁ జీఁకటి నాతం డేయ నేరకుండవలయు నని తలంచి యశ్వత్థామ రహస్యంబున నన్నసాధకుం బిలిచి 'యెన్నండును నరునకు నంధకారంబునఁ గుడవం బెట్టకుమీ!' యని పంచిన వాఁడును దద్వచనానురూపంబు సేయుచున్న నొక్కనాఁటి రాత్రియందు. 227**

**ప్రతిపదార్థం:** ఆ+అర్జునుతోడి; విద్యా, మత్సరంబునన్= విద్యలో పోటీచేత; చీఁకటిన్= చీకట్లో; ఆతండు= అర్జునుడు; ఏయ, నేరకుండ వలయును+అని= బాణాలు వేయటం నేర్వకుండా ఉండా లని; తలంచి; అశ్వత్థామ= ద్రోణునికొడుకు; రహస్యంబునన్= రహస్యంగా; అన్నసాధకున్= వంటవాడిని; పిలిచి; ఎన్నండును= ఎప్పుడుగానీ; నరునకున్= అర్జునునికి; అంధకారంబునన్= చీకట్లో; కుడువన్= తినటానికి; పెట్టకుమీ= పెట్టవద్దు సుమా!; అని; పంచినన్= ఆజ్ఞాపించగా; వాఁడును; తద్+వచన+అనురూపంబు= అతని మాటప్రకారం; చేయుచున్+ఉన్నన్; ఒక్కనాఁటి; రాత్రి; అందున్.

**తాత్పర్యం:** అర్జునునితో ఉన్న విద్యాస్పర్ధతో అశ్వత్థామ-చీకట్లో బాణాలు వేయటం అర్జునుడు నేర్చుకోకుండా ఉండా లని తలచి, వంటవాడిని పిలిచి, 'చీకట్లో అర్జునుడికి అన్నం పెట్టవ' ద్దని ఆజ్ఞాపించగా, అతనిమాట ప్రకారం వంటవాడు అదేవిధంగా చేస్తుండగా, ఒకనాటిరాత్రి.

**ఉ. వాసవనందనుండు గుడువం గుడువం బటుమారుతాహతిం**
**జేసి చలించి దీపశిఖ చెచ్చెరఁ బాయుడు భోజనక్రియా**
**భ్యాసవశంబునం గుడిచి 'పన్నుగ నిట్టుల విద్య లెల్ల న**
**భ్యాసవశంబునం బడయ భారము లే దని నిశ్చితాత్ముఁ డై. 228**

**ప్రతిపదార్థం:** వాసవ, నందనుండు= ఇంద్రకుమారుడు - అర్జునుడు; కుడువన్, కుడువన్= తింటూ తింటూ ఉండగా; పటు, మారుత+ఆహతిన్+చేసి= పెద్దగాలితాకిడిచేత; చలించి= కదిలి; దీప, శిఖ= దీపపుమంట; చెరన్+చెరన్= తటాలున; పాయుడున్= తొలగిపోగా(ఆరిపోగా); భోజన, క్రియా+అభ్యాస, వశంబునన్= అన్నం తినటం అనే పని చేయటంలో అలవాటు చొప్పున; కుడిచి= తిని; పన్నుగన్= ఒప్పేటట్లుగా; ఇట్టులన్= ఈ విధంగా; విద్యలు+ఎల్లన్= విద్యలు అన్నీ; అభ్యాస వశంబునన్= సాధన చేయటంచేత; పడయన్= పొందటం; భారము= కష్టం; లేదు; అని= ఆ ప్రకారం; నిశ్చిత+ఆత్ముండు+ఐ= నిశ్చయం పొందిన మనసు కలవాడై.

**తాత్పర్యం:** ఇంద్రునికొడుకైన అర్జునుడు అన్నం తింటూండగా పెద్దగాలికి తటాలున దీపం ఆరిపోయింది. అయినా, అలవాటు ప్రకారం ఆ చీకటిలోనే తిని, ఈ విధంగానే విద్య లన్నింటినీ సాధన చేసి నేర్చుకొనవచ్చని నిశ్చయించుకొని.

**క.** **పాయక చీఁకటియందును। నేయంగా నభ్యసించు నిట్టియెడం గౌం**
**తేయు ధనుర్జ్యా ధ్వని విని। ధీయుక్తుఁడు ద్రోణుఁ డరుగుదెంచి ముదమునన్.** **229**

**ప్రతిపదార్థం:** పాయక= విడవకుండా; చీఁకటియందును; ఏయన్, కాన్= బాణాలు వేయటాన్ని; అభ్యసించి= సాధన చేసే; ఇట్టి ఎడన్= ఈ సమయంలో; కౌంతేయు; ధనుః+జ్యా, ధ్వని= అర్జునునివింటియొక్క అల్లెత్రాటిధ్వని; విని; ధీ, యుక్తుండు= బుద్ధితో కూడినవాడు; ద్రోణుఁడు; ముదమునన్= సంతోషంతో; అరుగుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** పట్టుపట్టి చీకట్లోకూడా ఎప్పుడు విలువిద్యను అభ్యసించసాగాడో అప్పుడు అర్జునునివింటియొక్క అల్లెత్రాటిధ్వని విని, మేధావి అయిన ద్రోణుడు సంతోషంతో అక్కడకు వచ్చి.

**సీ.** **ఆతని యస్త్రవిద్యాభియోగమునకుఁ। బ్రియశిష్యవృత్తికిఁ బెద్ద మెచ్చి**
**'యన్న! ధనుర్ధరు లన్యులు నీకంటె। నధికులు గాకుండునట్లు గాఁగఁ**
**గఱపుదు విలువిద్య ఘనముగా' నని పల్కి। ద్వంద్వసంకీర్ణయుద్ధముల తెఱఁగు**
**రథమహీవాజివారణములపై నుండి। దృఢచిత్రసౌష్ఠవస్థితుల నేయ**

**తే.** **బహువిధవ్యూహభేదనోపాయములను। సంప్రయోగరహస్యాతిశయము గాఁగఁ**
**గఱపె నర్జునుఁ దొంటి భార్గవుఁడు వింట। నిట్టిఁ డే! యని పొగడంగ నెల్ల జనులు.** **230**

**ప్రతిపదార్థం:** అతని, అస్త్ర, విద్యా+అభియోగమునకున్= ఆ అర్జునుని అస్త్రవిద్యలందలి పూనికకూ; ప్రియ, శిష్య, వృత్తికిన్= ప్రియమైన శిష్యుడినడవడికీ; పెద్ద మెచ్చి= మిక్కిలి సంతోషించి; అన్న! (ప్రేమపూర్వకసంబోధన); అన్యులు= ఇతరులు; ధనుర్ధరులు= విల్లును చేపట్టినవాళ్ళు; నీ కంటెన్; అధికులు; కాకుండునట్లు; కాఁగన్; ఘనముగాన్= గొప్పగా; విలువిద్య కఱపుదున్= ధనుర్విద్య నేర్పుతాను; అని= ఆ విధంగా; పలికి; ద్వంద్వ, సంకీర్ణ, యుద్ధముల, తెఱఁగు= ద్వంద్వ యుద్ధంయొక్క, సంకుల యుద్ధంయొక్క పద్ధతి; రథ, మహీ, వాజి, వారణములపైన్, ఉండి= రథంమీద, నేలమీద, గుర్రంమీద, ఏనుగుమీద ఉండి; దృఢ, చిత్ర, సౌష్ఠవ, స్థితులన్= గట్టిగా; చిత్రంగా, చక్కగా ఉన్న స్థితులలో; ఏయన్= కొట్టటానికి; బహు, విధ, వ్యూహ, భేదన+ఉపాయములను= అనేకవిధాలైన వ్యూహాలను భేదించే ఉపాయాలను; సంప్రయోగ, రహస్య+అతిశయము, కాఁగన్= ప్రయోగ రహస్యాల అతిశయంతో కూడుకొనేట్లుగా; తొంటి, భార్గవుఁడు= ఒకనాటి పరశురాముడు; వింటన్= విలువిద్యలో; ఇట్టిఁడే= ఇటువంటివాడా!; అని; ఎల్ల, జనులు; పొగడంగన్; అర్జునున్= అర్జునుడికి; కఱపెన్= నేర్పాడు.

**తాత్పర్యం:** అస్త్రవిద్యలో అర్జునునికి గల పట్టుదలకు, అతని గురుభక్తికి ద్రోణుడు ఎంతో సంతోషించాడు. 'అన్న! నీకంటె వే రెవ్వరూ అధికులు కానట్లుగా విలువిద్య నేర్పిస్తా'నన్నాడు. ద్వంద్వయుద్ధ, సంకులయుద్ధ పద్ధతులను, రథంమీద, నేలమీద, గుర్రాలమీద, ఏనుగులమీద ఉండి దృఢం, చిత్రం, సౌష్ఠవం అయిన స్థితులలో బాణాలు వేయటాన్ని, బహువిధా లైన వ్యూహాలను భేదించే ఉపాయాలను, బాణప్రయోగరహస్యాలను 'ఇదివరకటి ఆ పరశురాముడుకూడా విలువిద్యలో ఇంతటివాడు కా డని' ప్రజలు అర్జునుడిని పొగడేటట్లుగా అతనికి నేర్పాడు.

**విశేషం:** ఇద్దరువీరులమధ్య యుద్ధం ద్వంద్వయుద్ధం. చాలామందివీరులు కలియబడి చేసేయుద్ధం సంకీర్ణయుద్ధం.

### ఏకలవ్యుం డనువాఁడు ద్రోణు నారాధించి విలువిద్య గఱచుట (సం. 1-123-10)

**వ. మఱియు గదాకార్ముకప్రాసాసితోమరకుంతశక్త్యాది వివిధాయుధంబులయందును గుమారుల నందఱ జితశ్రములం జేయుచున్న ద్రోణాచార్యుల మహాప్రసిద్ధి విని హిరణ్యధన్వుం డను నెఱుకురాజుకొడు కేకలవ్యుం డనువాఁడు ధనుర్విద్యాగ్రహణార్థి యయి వచ్చినవాని నిషాదపుత్త్రుం డని శిష్యుంగాఁ జేకొన కున్న, వాఁడును ద్రోణుననుజ్ఞ వడసి చని వనంబులోన. 231**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; గదా, కార్ముక, ప్రాస+అసి, తోమర, కుంత, శక్తి+ఆది, వివిధ+ఆయుధంబులయందును= గద, ధనుస్సు, ఈటె, కత్తి, తోమరం, కుంతకం, శక్తి మొదలైన అనేకాలైన ఆయుధాలలో; కుమారులన్, అందఱన్= కురు కుమారుల్ని అందరినీ; జిత, శ్రములన్= జయించిన శ్రమగలవాళ్ళుగా (నేర్పరులుగా); చేయుచున్+ఉన్న= చేస్తూ ఉన్న; ద్రోణాచార్యుల; మహా, ప్రసిద్ధి = గొప్ప పేరు; విని= ఆలకించి; హిరణ్యధన్వుండు; అను; ఎఱుకు, రాజు, కొడుకు; ఏకలవ్యుండు; అనువాఁడు; ధనుర్విద్యా, గ్రహణ+అర్థి+అయి= విలువిద్యను నేర్చుకొనా లన్న కోరిక కలవాడై; వచ్చిన; వానిన్= ఆ ఏకలవ్యుడిని; నిషాద, పుత్త్రుండు+అని= ఎరుకలవాని కొడు కని; శిష్యున్+కాన్; చేకొనక+ఉన్నన్= గ్రహింపకుండగా; వాఁడును= ఆ ఏకలవ్యుడును; ద్రోణున్; అనుజ్ఞ= అనుమతి; పడసి= పొంది; చని= వెళ్లి; వనంబులోన్= అడవిలో.

**తాత్పర్యం:** అంతేకాకుండా గద, ధనుస్సు, ఈటె,కత్తి, తోమరం, కుంతం, శక్తి మొదలైన అనేకవిధాలైన ఆయుధవిద్యలలో రాకుమారు లందరినీ నేర్పరులను చేస్తున్న ద్రోణాచార్యులకీర్తి విని, హిరణ్యధన్వు డనే ఎరుకరాజుకొడుకు ఏకలవ్యు డనేవాడు విలువిద్యను నేర్చుకోవా లని వచ్చాడు. ఏకలవ్యుడు ఎరుకువాని కుమారు డని ద్రోణుడు శిష్యునిగా అంగీకరింపలేదు. అప్పుడు ఏకలవ్యుడు ద్రోణునిఅనుమతి పొంది వెళ్లి అడవిలో.

**తే. వినయమున ద్రోణురూపు మన్నున నమర్చి । దాని కతిభక్తితోడఁ బ్రదక్షిణంబుఁ
జేసి మ్రొక్కుచు సంతతాభ్యాసశక్తి । నస్త్రవిద్యారహస్యంబు లర్థిఁ బడసె. 232**

**ప్రతిపదార్థం:** వినయమునన్=అణకువతో; ద్రోణు, రూపు= ద్రోణుని బొమ్మను; మన్నునన్= మట్టితో; అమర్చి= చేసి; దానికిన్= ఆ బొమ్మకు; అతి, భక్తితోన్= మిక్కిలి భక్తితో; ప్రదక్షిణంబున్; చేసి; మ్రొక్కుచు; సంతత+అభ్యాస, శక్తిన్= ఎడతెగని అభ్యాసబలంచేత; అస్త్ర విద్యా, రహస్యంబులు= విలువిద్యలోని మర్మాలు; అర్థిన్= సంతోషంతో; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** వినయంతో ఏకలవ్యుడు ద్రోణునిబొమ్మను మట్టితో చేసి నిలిపి, దానికి భక్తితో ప్రదక్షిణ నమస్కారాలు చేస్తూ, ఎడతెగని సాధనబలంచేత తానే విలువిద్యా రహస్యాలన్నీ గ్రహించాడు.

**విశేషం:** ఇది ఏకలవ్యునిముగ్ధ మైన స్థిరభక్తికి అద్దంపట్టే పద్యం. గురుముఖతః నేర్చుకొన్నవిద్యకంటె గురువుకు దూరంగా ఉన్నా, భక్తితో అధికమైనవిద్యను సాధించవచ్చు ననీ, విద్యాప్రాప్తికి గురుసాన్నిధ్యంకంటె గురుభక్తియే ముఖ్యం అనీ ఈ పద్యం బోధిస్తున్నది. గురుభక్తిని మించిన శక్తి లే దనే ఒక అర్థాంతరన్యాసాలంకారస్ఫూర్తినికూడా కలిగిస్తున్నది. అందువలన ఇందులో స్వతస్సంభవ్యర్థశక్త్యుద్భవాలంకారకృతవస్తుధ్వని ఉన్నది (సంపా.)

**క. ఇట పాండవకౌరవు లొ ।క్కొట నందఱు గురుననుజ్ఞఁ గొని మృగయాలం**
**పటు లై వనమున కరిగిరి । పటుతరజవసారమేయభటనివహముతోన్. 233**

**ప్రతిపదార్థం:** ఇట= హస్తినాపురంలో; పాండవ, కౌరవులు; ఒక్కొటన్= ఒకటిగా; అందఱు; గురు, అనుజ్ఞన్= గురువుయొక్క ఆజ్ఞను; కొని= పొంది; మృగయా, లంపటులు+ఐ= వేట అంటే ఎంతో ఆసక్తి కలిగినవా ళ్ళయి; పటుతర, జవసారమేయ, భట నివహముతోన్= మిక్కిలి ఎక్కువైనవేగం గల కుక్క లున్న భటులసమూహంతో; వనమునకున్= అడవికి; అరిగిరి= వెళ్లారు.

**తాత్పర్యం:** ఇక్కడ హస్తినాపురంలో పాండవులు, కౌరవులు కలిసి ద్రోణాచార్యుని అనుమతి పొంది, వేటపట్ల ఎంతో ఆసక్తి కలవా ళ్ళయి, మిక్కిలివేగం గల వేటకుక్కలతోకూడిన భటసమూహంతో అడవికి వెళ్ళారు.

**వ. ఇ ట్లరిగి వనంబులోఁ గ్రుమ్మరుచున్న నం దొక్క భటునికుక్క తోడు దప్పి పఱచి యొక్కెడ నేకతంబ యేయుచున్న నేకలవ్యసమీపంబున మొఱింగిన, నయ్యేలుంగు విని దానిముఖంబునం దేడుబాణంబు లొక్కటఁ దొడిగి యక్కజంబుగా నతిలాఘవంబున వాఁ డేసిన, నది శరపూరితముఖం బయి కురుకుమారుల యొద్దకుం బాఱిన దానిం జూచి విస్మయం బంది య ట్లేసినవాఁ డెవ్వఁడో యని రోయుచు వచ్చువారు ముందఱ. 234**

**ప్రతిపదార్థం:** ఇట్లు, అరిగి= ఈ విధంగా వెళ్లి, వనంబులోన్= అడవిలో; క్రుమ్మరుచున్+ఉన్నన్= తిరుగుతూఉండగా; అందున్= వానిలో; ఒక్క, భటుని, కుక్క= ఒకానొక భటునియొక్క కుక్క; తోడు; తప్పి; పఱచి= పరిగెత్తి; ఒక్క+ఎడన్= ఒకచోట; ఏకతంబు+అ= ఒంటరిగానే; ఏయుచున్నన్= బాణాలు వేస్తున్న; ఏకలవ్య, సమీపంబునన్= ఏకలవ్యుని దగ్గర; మొఱింగినన్= మొరవగా; ఆ+ఎలుంగు= ఆ కంఠధ్వని; విని, దాని, ముఖంబున+అందు= దాని నోటిలో; ఏడు, బాణంబులు; ఒక్కటన్= ఒకటిగా; తొడిగి= ధనుస్సులో ఎక్కుపెట్టి; అక్కజంబుగాన్= ఆశ్చర్యకరంగా; అతి లాఘవంబునన్= ఎంతో చాకచక్యంతో; వాఁడు= ఏకలవ్యుడు; ఏసినన్= కొట్టగా; అది= ఆ కుక్క; శర, పూరిత, ముఖంబు+అయి= బాణాలతో నిండిన నోరు కలిగిన దై; కురు కుమారుల, ఒద్దకున్= కౌరవపాండవుల కడకు; పాఱినన్= పరుగెత్తగా; దానిన్= ఆ కుక్కను; చూచి; విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; అట్లు= ఆ విధంగా; ఏసినవాఁడు= కొట్టినవాడు; ఎవ్వఁడో= ఎవరో; అని= ఆ విధంగా; రోయుచున్= వెదకుతూ; వచ్చువారు= వస్తున్నవాళ్ళు; ముందఱన్= ఎదురుగా.

**తాత్పర్యం:** ఈ విధంగా వెళ్లి వెళ్లి, అడవిలో తిరుగుతూ ఉండగా, ఒక భటుడికుక్క తోడు తప్పి పరుగెత్తి ఒకచోట ఒంటరిగా బాణాలు వేస్తున్న ఏకలవ్యుడికి దగ్గరగా వెళ్ళి మొరిగింది. అతడు ఏడుబాణాలను ఒక్కటిగా వింట సంధించి అతిచాకచక్యంగా, ఆశ్చర్యకరంగా ఆ కుక్కనోట కొట్టాడు. అది బాణాలతో నిండిన నోటితో కురుకుమారుల దగ్గరికి పరుగెత్తింది. దానిని చూచివాళ్ళు ఆశ్చర్యపడి ఆ విధంగా కొట్టినవా డెవ్వడా అని వెదకుతూ వస్తుండగా - ఎదురుగా -

**ఉ. తేజితబాణహస్తు, దృఢదీర్ఘమలీమసకృష్ణదేహుఁ, గృ**
**ష్ణాజినవస్త్రు నస్త్రవిషయాస్తవిషాదు నిషాదుఁ జూచి యా**
**రాజకుమారు లందఱుఁ బరస్పరవక్త్రవిలోకనక్రియా**
**వ్యాజమునం దదీక్షణనివారితు లై రతిమత్సరంబునన్. 235**

**ప్రతిపదార్థం:** తేజిత, బాణ, హస్తున్= పదును పెట్టబడిన బాణం చేతిలో కలిగినవాడిని; దృఢ దీర్ఘ, మలీమస, కృష్ణ, దేహున్= దిట్టమైనదీ, పొడవైనదీ, మురికి పట్టినదీ, నల్లనిదీ అయిన శరీరం కలవాడిని; కృష్ణ+అజిన, వస్త్రున్= జింకచర్మాన్ని వస్త్రంగా కలిగిన వాణ్ణి; అస్త్ర, విషయ+అస్త, విషాదున్= అస్త్రాల విషయంలో పోయిన దుఃఖం కలవాడిని; నిషాదున్= ఎరుకవాడిని; చూచి; ఆ, రాకుమారులు; అందఱున్; పరస్పర, వక్త్ర, విలోకన, క్రియా, వ్యాజమునన్= ఒకరిముఖాన్ని ఒకరు చూచుకొనటం అనే పని నెపంతో; అతి, మత్సరంబునన్= మిక్కిలి స్పర్ధచేత; తద్+ఈక్షణ, నివారితులు+ఐరి= అతడిని చూడడంనుండి తొలగించబడిన వా ళ్ళయ్యారు.

**తాత్పర్యం:** పదునుపెట్టినబాణాన్ని చేత పట్టుకొన్నవాడు, దిట్టమైనదీ, పొడవైనదీ, మురికిపట్టినదీ, నల్లనిదీ అయిన దేహాన్ని కలిగినవాడు, జింకచర్మాన్ని వస్త్రంగా ధరించినవాడు, అస్త్రవిద్యలో లోటు లేనివాడు అయిన ఏకలవ్యుడిని చూచి, ఆ రాకుమారులంతా విపరీతమయిన మాత్సర్యంచేత అతడిని చూడలేక ఒకరిముఖం ఒకరు చూచుకొన్నారు.

**విశేషం:** ఈపద్యశైలి ప్రసాదవిశిష్టమైన ఓజోగుణంతో పాత్రవిశిష్టతను ధ్వనింపచేస్తున్నది. అక్షరరమ్యం, ఉదాత్తమనోహరం అయిన నన్నయశైలికి ఉత్తమ ఉదాహరణాలుగా నిల్చే పద్యాలలో ఇది ఒకటి. స్థిరచిత్రాలను వర్ణించటంలో నన్నయ చూపిన నైపుణ్యానికి ఇదొక నిలువెత్తు సాక్ష్యం. (సంపా.) 'అస్త్ర' విషయాస్త' -కు 'అస్త్ర విషయాప్త' అని పాఠాంతరం ఉన్నది.

**వ. అ క్కుమారులు వానిశరలాఘవంబునకు మెచ్చి 'నీ వెవ్వండ వెవ్వరిచేత విలువిద్యఁ గఱచి?' తని యడిగిన వారికి నయ్యెఱుకు కి ట్లనియె. 236**

**ప్రతిపదార్థం:** ఆ+కుమారులు= ఆ కురు కుమారులు; వాని= ఆ ఏకలవ్యుని; శర, లాఘవంబునకున్= బాణప్రయోగంలో నేర్పునకు; మెచ్చి= పొగడి; నీవు, ఎవ్వండవు= నీవు ఎవడవు; ఎవ్వరిచేతన్= ఎవరిచేత; విలువిద్యన్= ధనుర్విద్యను; కఱచితివి= నేర్చావు? అని= ఆ విధంగా; అడిగినన్= అడుగగా; వారికిన్= ఆ కుమారులకు; ఆ+ఎఱుకు= ఆ ఎరుకవాడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ కుమారులు అతని బాణప్రయోగంలోని నేర్పరితనానికి మెచ్చి, 'నీ వెవ్వడవు? నీవు ఎవ్వరివద్ద విలువిద్య నేర్చుకొన్నావు?' అని అడుగగా వారితో ఆ బోయవాడు ఈ విధంగా అన్నాడు.

**క. వినుఁ! డే హిరణ్యధన్వుం । డను వనచరనాథుకొడుక; నాచార్యుఁడు ద్రో**
**ణునకున్ శిష్యుఁడ; నెందును । ననవద్యుఁడ ; నేకలవ్యుఁ డనువాఁడ మహిన్. 237**

**ప్రతిపదార్థం:** వినుఁడు; ఏన్= నేను; హిరణ్యధన్వుండు+అను= హిరణ్యధన్వుడు అనే పేరుగల; వనచరనాధుకొడుకన్= అడవిలో తిరిగేవాడైన ఎఱుకలరాజు కుమారుడిని; ఆచార్యుఁడు= గురువు; ద్రోణునకున్; శిష్యుఁడన్; ఎందునున్; అనవద్యుఁడన్= దోషంలేనివాడిని; మహిన్= భూమిలో; ఏకలవ్యుఁడు; అనువాఁడన్= అను పేరుగలవాడిని.

**తాత్పర్యం:** వినండి. నేను హిరణ్యధన్వు డనే కిరాతరాజకుమారుడిని. ద్రోణాచార్యుల శిష్యుడిని. ఏదోషం లేని వాడిని. నాపేరు ఏకలవ్యుడు.

**వ. అనిన విని కురుకుమారు లందఱు మగుడి వచ్చి ద్రోణున కంతయుఁ జెప్పి; రంత నర్జునుం డేకాంతంబ యొక్కనాఁ డాచార్యున కి ట్లనియె. 238**

**విశేషం:** అనినన్= అని అనగా; విని; కురుకుమారులు; అందఱు; మగుడి, వచ్చి= తిరిగి వచ్చి; ద్రోణునకున్; అంతయున్; చెప్పిరి; అంతన్= అప్పుడు; అర్జునుండు= అర్జునుడు; ఏకాంతంబు+అ= రహస్యంగా; ఒక్కనాఁడు= ఒకరోజు; ఆచార్యునకున్= ద్రోణునితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని ఏకలవ్యు డనగా విని, కురుమారు లందరూ తిరిగివచ్చి ద్రోణునికి ఆ సంగతినంతా చెప్పారు. ఆ పైన అర్జునుడు ఏకాంతంగా ఒకనాడు ద్రోణునితో ఈ విధంగా అన్నాడు.

**క. విలువిద్య నొరులు నీ క। గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు నని మున్**
**బలికితిరి; నాక కా దీ। త్రిలోకముల కధికుఁ జూచితిమి యొక యెఱుకున్. 239**

**ప్రతిపదార్థం:** విలువిద్యన్= విలువిద్యలో; ఒరులు= ఇతరులు; నీకున్; అగ్గలముగన్= అధికంగా; లేకుండ; నిన్నున్= నీకు; కఱపుదున్= నేర్పుతాను; అని= ఆ విధంగా; మున్= మునుపు లేదా ఇదివరకు; పలికితిరి= చెప్పినారు; నాకు+అ= నా ఒక్కనికే; కాదు; ఈ, త్రిలోకములకున్= ఈ ముల్లోకాలకూ; అధికున్= అధికమైనవానిని; ఒక, ఎఱుకున్= ఒక ఎరుకువాడిని; చూచితిమి.

**తాత్పర్యం:** విలువిద్యలో నీకంటె అధికులు లేనట్లుగా నేర్పుతా నని ఇదివరకు నాతో చెప్పారు. ఇప్పుడు నాకే కాదు, ఈ ముల్లోకాలకంటె అధికు డైన ఒకఎరుకను చూచాము.

**క. నాకంటెను మీకంటెను। లోకములో నధికుఁ డతిబలుండు ధనుర్వి**
**ద్యాకౌశలమున; నాతఁడు। మీకుం బ్రియశిష్యుఁ డటె యమిథ్యావచనా ! 240**

**ప్రతిపదార్థం:** అమిథ్యా, వచనా= అసత్యంకాని మాట కలవాడా!; ఆతఁడు= ఆ ఎరుకవాడు; ధనుర్విద్యా, కౌశలమునన్= విలువిద్యలోని నేర్పులో; లోకములో; నాకంటెను; మీకంటెను; అధికుఁడు; అతి, బలుండు= ఎంతో బలశాలి; మీకున్, ప్రియ, శిష్యుఁడు= మీకు ఇష్టమైన శిష్యుడు; అటె= ఔనటకదా!

**తాత్పర్యం:** అసత్యం కానిమాట గల ఆచార్యవర్యా! ఆ ఎరుకులవాడు విలువిద్యా నైపుణ్యంలో నాకంటె, మీకంటె ఈ లోకంలో అధికుడు, మహాబలవంతుడు, అతడు మీకు ప్రియశిష్యు డట కదా!

**విశేషం:** ఏకలవ్యుని విలువిద్యానైపుణ్యం అర్జునునికి ఆశ్చర్యజనకం, మాత్సర్యహేతువు కాగా, అతడు తాను ద్రోణాచార్య శిష్యుడి నన్న మాట పిడుగు పాటైంది. కాగా, ఆచార్యుడు చెప్పినమాటకు, చేసిన పనికి ఎంత భేదం! అర్జునునిహృదయం తుకతుక లాడిపోయింది, అయినా అర్జునునివంటి సంస్కారసంపన్నుడు అంతటి గురుదేవుడిని ఏ మనగలడు? అట్లా అని ఏమీ అనకుండా ఎట్లా ఉండగలడు? అందుచేతనే 'అమిథ్యావచనా'! - అసత్యం కానిమాట కలవాడా! అని ఒక్కమాట

అన్నాడు. ఆ మాటలోని ఎత్తిపొడుపు ఈటెపోటు వంటిది. కాగా, అలతి, అలతి పదాలతో అతితీవ్రభావాలను ప్రకటించే నన్నయపద్యాలలో ఇది ఒకటి. నన్నయ సందర్భోచితంగా 'అర్థవ్యక్తి' అనే శబ్దగుణాన్ని వాడి, అర్జునుని మనసులోని బాధను, అమర్షను, అసూయను వ్యక్తంచేసే శక్తి కల సర్వనామాలను, అవ్యయాలను, నిపాతాలను నిపుణంగా ప్రయోగించి నాటకీయతను పోషించాడు. 'నాకంటె అధికుడు, మీకంటె అతిబలుడు అనటంలోనూ, 'మీకున్' ప్రియశిష్యుడు 'అటె' అనటంలోనూ గూఢమైన కోపంతోకూడిన అధిక్షేపం ఉన్నది. నిపాతాలనుసైతం కథాధ్వనికి వ్యంజకాలుగా వాడటం ఇక్కడివిశేషం. (సంపా.)

**క. అనిన విని ద్రోణుం డదరిపడి 'వానిం జూతము ర'మ్మని యర్జునుం దోడ్కొని, యనవరతశరాసనాభ్యాసనిరతుం డయి యున్న యేకలవ్యుకడ కేఁగిన, నెఱింగి వాఁడు నెదురు పఱతెంచి ద్రోణునకు మ్రొక్కి తన శరీరంబు సర్వస్వంబును నివేదించి, 'యేను మీ శిష్యుండ; మి మ్మారాధించి మీ ప్రసాదంబున నివ్విలువిద్యఁ గఱచితి' నని కరంబులు మొగిచియున్నం జూచి, ద్రోణుం 'డట్లేని మాకు గురుదక్షిణ యి'మ్మనిన సంతసిల్లి వాఁ డిట్లనియె. 241**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; విని; ద్రోణుండు; అదిరిపడి= ఉలిక్కిపడి; వానిన్= అతనిని; చూతము= చూస్తాము; రమ్ము; అని; అర్జునున్, తోడ్కొని= తీసికొని; అనవరత, శర+ఆసన+అభ్యాస, నిరతుండు+అయి= ఎడతెగని విలువిద్యయొక్క అభ్యాసంలో మిక్కిలి ఆసక్తికలవాడై; ఉన్న; ఏకలవ్య, కడకున్= ఉండే ఏకలవ్యుని దగ్గరకు; ఏఁగినన్= వెళ్లగా; ఎఱింగి= (వారి రాకను) తెలిసికొని; వాఁడు= ఏకలవ్యుడు; ఎదురు, పఱతెంచి= ఎదురుగా వచ్చి; ద్రోణునకున్; మ్రొక్కి; తన, శరీరంబు= తనయొక్క దేహము; సర్వస్వంబును=మొత్తం సంపదను; నివేదించి= అర్పించి; ఏను, మీ, శిష్యుండన్= నేను మీ శిష్యుణ్ణి; మిమ్ము+ఆరాధించి= మిమ్మల్ని సేవించి; మీ, ప్రసాదంబునన్= మీ అనుగ్రహంచేత; ఈ విలువిద్యన్= ఈ ధనుర్విద్యను; కఱచితిని= నేర్చుకొన్నాను; అని= అంటూ; కరంబులు= చేతులు; మొగిచి= ముడిచి; ఉన్నన్= ఉండగా; చూచి= కనుగొని; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; అట్లు+ఏని= అలా అయినట్లయితే; మాకున్; గురుదక్షిణ+ఇమ్ము= గురుదక్షిణ నిమ్ము; అనినన్= అనగా; సంతసిల్లి=సంతోషించి; వాఁడు= ఆ ఏకలవ్యుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని ద్రోణుడు అదిరిపడి అతడిని చూద్దాం ర మ్మని అర్జునుని తీసికొని, నిరంతరం విలువిద్యను సాధనచేయటంలో మునిగి ఉన్న ఏకలవ్యునిదగ్గరకు వెళ్లాడు. వాళ్ళ రాకను ఏకలవ్యుడు తెలిసికొని, ఎదురు వచ్చి ద్రోణునికి నమస్కరించి, తనశరీరాన్నీ, మొత్తం సంపదనూ ఆయనకు సమర్పించి, 'నేను మీ శిష్యుడిని. మిమ్మల్ని సేవించి ఈ విలువిద్య నేర్చుకొన్నాను' అని చేతులు జోడించి నిలిచినాడు. అతడిని చూచి ద్రోణుడు 'అయితే నాకు గురుదక్షిణ ఇ'మ్మన్నాడు. అందుకు సంతోషించి ఏకలవ్యుడు ఇట్లా అన్నాడు.

**క. 'ఇది దేహం; బిది యర్థం; । బిది నా పరిజనసమూహ; మిన్నిటిలో నె**
**య్యది మీ కిష్టము దానిన । ముద మొదవఁగ నిత్తుఁ గొనుఁ డమోఘం' బనినన్. 242**

**ప్రతిపదార్థం:** ఇది, దేహంబు; ఇది; అర్థంబు= ధనం; ఇది; నా, పరిజన, సమూహము= నా సేవకుల సమూహం; ఇన్నిటిలోన్; ఏ+అది; మీకున్; ఇష్టము; దానిన్+అ= దానినే; ముదము= సంతోషం; ఒదవఁగన్= కలిగేట్లుగా; ఇత్తున్; కొనుఁడు= తీసికొనండి; అమోఘంబు= ఇది తప్పనిది - అంటే దీనికి తిరుగులేదు; అనినన్= అని అనగానే.

**తాత్పర్యం:** 'ఇది నాదేహం, ఇది నాధనం. ఇది నాసేవకసమూహం. వీటిలో మీ కేది ఇష్టమో దానిని తప్పకుండా, సంతోషంగా ఇస్తాను. తీసికొనండి. దీనికి తిరుగులేదు' అని అనగా.

**విశేషం:** అంతటిగురువు తానై వచ్చి గురుదక్షిణ కోరటమే కొండంత భాగ్యంగా భావించి, ఉన్న దంతా ఆయన ముందుంచిన ఏకలవ్యుని ఉన్నతోన్నతగురుభక్తికి ఈ పద్యం అద్దంవంటిది. అతనిమాటలలో సర్వార్పణభావంతోడి ముగ్ధభక్తి మూర్తికట్టింది.

**క. 'నెమ్మిని నీ దక్షిణహ। స్తమ్మున పెనువ్రేలు దునిమి దక్షిణ యి; మ్మి**

**ష్ట మ్మిది నా 'కనపుడు విన। యమ్మున వాఁ డిచ్చె దాని నాచార్యునకున్. 243**

**ప్రతిపదార్థం:** నెమ్మిని= ప్రీతితో; నీ, దక్షిణ, హస్తమ్మున, పెను, వ్రేలు= నీ కుడిచేతి బొటన వ్రేలిని; తునిమి= కోసి; దక్షిణ= దక్షిణగా; ఇమ్ము; ఇది; నాకున్; ఇష్టమ్ము; అనవుడు= అని అనగా; వాఁడు= ఆ ఏకలవ్యుడు; వినయమ్మునన్= వినయముతో; దానిన్= ఆ బొటనవ్రేలిని; ఆచార్యునకున్= ద్రోణాచార్యులకు; ఇచ్చెన్.

**తాత్పర్యం:** ' నీ కుడిచేతి బొటనవ్రేలిని కోసి ప్రీతితో నాకు గురుదక్షిణగా ఇమ్ము. అది నా కిష్టం' అని ద్రోణు డనగానే ఏకలవ్యుడు వినయంతో దానిని ఆచార్యునికి ఇచ్చాడు.

**తే. దక్షిణాంగుష్ఠ మిచ్చిన దానఁ జేసి। బాణసంధానలాఘవభంగ మయిన**

**నెఱుకు విలువిద్య కలిమికి హీనుఁ డయ్యెఁ; బార్థునకును మనోరుజ పాసె నంత. 244**

**ప్రతిపదార్థం:** దక్షిణ+అంగుష్ఠము = కుడిచేతి బొటనవ్రేలిని; ఇచ్చిన; దానన్+చేసి = ఇచ్చినందువలన; బాణ, సంధాన, లాఘవ, భంగము= బాణాన్ని కూర్చటంలోని నేర్పుకు లోపం; అయినన్= కాగా; ఎఱుక= ఆ ఏకలవ్యుడు; విలువిద్య, కలిమికి= ధనుర్విద్య అనే సంపదకు; హీనుఁడు= లేనివాడు; అయ్యెన్= అయ్యాడు; పార్థునకును= అర్జునునికిని; మనస్+రుజ= మానసిక దుఃఖం; పాసెన్= తొలగింది; అంతన్= అనంతరం.

**తాత్పర్యం:** కుడిచేతిబొటనవ్రేలు ఇవ్వటంచేత బాణాన్ని కూర్చటంలో నేర్పు లోపించి ఏకలవ్యుడు విలువిద్యా సంపద కోల్పోయాడు. దానివలన అర్జునునికి దుఃఖం తొలగింది.

**క. 'విలువిద్య నొరులు నీ క। గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు' నని మున్**

**బలరిపుసుతునకుఁ బలికిన। పలు కప్పడు గురుఁడు సేసెఁ బరమార్థముగన్. 245**

**ప్రతిపదార్థం:** విలువిద్యన్= విలువిద్యలో; ఒరులు= ఇతరులు; నీకున్; అగ్గలముగన్= అధికంగా; లేకుండన్= లేకుండునట్లు; నిన్నున్; కఱపుదున్= నేర్పుతాను; అని= ఆ విధంగా; మున్= పూర్వం; బల, రిపు, సుతునకున్= బలు డనే రాక్షసుడికి శత్రువైన ఇంద్రునికుమారునికి - అర్జునునికి; పలికిన, పలుకు= చెప్పిన మాటను; అప్పుడు; గురుఁడు= ద్రోణుడు; పరమార్థముగన్= సత్యంగా; చేసెన్.

**తాత్పర్యం:** 'విలువిద్యలో ఇతరులు నీకంటె అధికులు కాకుండా నీకు నేర్పుతా' నని, ఇదివరకు ద్రోణుడు అర్జునుని కిచ్చిన మాట అప్పుడు నిజం చేశాడు.

**మత్తకోకిల.**

**భూపనందను లివ్విధంబున భూరిశస్త్రమహాస్త్రవి**

**ద్యోపదేశపరిగ్రహస్థితి నున్న నందఱయందు వి**

**ద్యోపదేశము దుల్య మైనను నుత్తమోత్తముఁ డయ్యె వి**

**ద్యాపరిశ్రమకౌశలంబున దండితారి నరుం డిలన్. 246**

**ప్రతిపదార్థం:** భూప, నందనులు= రాకుమారులు; ఈ+విధంబునన్; భూరి, శస్త్ర, మహా+అస్త్ర, విద్యా+ఉపదేశ, పరిగ్రహ, స్థితిన్= గొప్ప ఆయుధవిద్యయొక్క, గొప్ప అస్త్రవిద్యయొక్క బోధను గ్రహించటం అనే స్థితిలో; ఉన్నన్= ఉండగా; అందఱు, అందున్= అందరిలో; విద్యా+ఉపదేశము= విద్యాబోధన; తుల్యము= సమానం; అయినను= అయినప్పటికి; దండిత+అరి= శిక్షించబడిన శత్రువులు గలవాడు; నరుండు= అర్జునుడు; విద్యా, పరిశ్రమ, కౌశలంబునన్= విద్యయొక్క అభ్యాసపు నేర్పుచేత; ఇలన్= భూమిలో; ఉత్తమ+ఉత్తముఁడు= శ్రేష్ఠులలో శ్రేష్ఠుడు; అయ్యెన్.

**తాత్పర్యం:** రాజకుమారులు ద్రోణునివలన గొప్పశస్త్రాస్త్రవిద్యాబోధనను పొందటంలో అంతా సమానమే అయినా, అర్జునుడు విశేషంగా సాధన చేసి సర్వశ్రేష్ఠు డయ్యాడు.

**విశేషం:** మత్తకోకిలపాదంలో ర,స,జ,జ,భ, ర - అనే గణాలు వరుసగా ఉంటాయి. 11వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది.

**క. అనిలాత్మజు బలమును న । ర్జును కార్ముక కౌశలంబు శూరగుణంబుల్**

**మనమున సహింపనోపక । వనరుచు ధృతరాష్ట్రసుతులు వందిరి తమలోన్. 247**

**ప్రతిపదార్థం:** అనిల+ఆత్మజు, బలమును= వాయుపుత్రుడైన భీముని బలాన్ని; కార్ముక, కౌశలంబు= అర్జునుని విలువిద్యా నైపుణ్యం; శూర, గుణంబుల్= వీరలక్షణాలు; మనసునన్= మనసులో; సహింపన్+ఓపక= ఓర్వలేక; ధృతరాష్ట్ర సుతులు= కౌరవులు; వనరుచున్ = బాధపడుతూ; తమలోన్; వందిరి= దుఃఖించారు.

**తాత్పర్యం:** భీమునిబలాన్నీ, అర్జునుని విలువిద్యానైపుణ్యాన్నీ, వీరలక్షణాలనూ చూచి, సహించలేక కౌరవులు తమలో తాము ఎంతో దుఃఖాన్ని పొందారు.

### ద్రోణుఁ డస్త్రవిద్యం దనశిష్యులఁ బరీక్షించుట (సం.1-123-15)

**వ. అ క్కుమారుల ధనుర్విద్యా కౌశలం బెఱుంగ వేఁడి యొక్కనాఁడు ద్రోణుండు కృత్రిమం బయిన భాసం బను పక్షి నొక్క వృక్షశాఖాగ్రంబున లక్ష్యంబుగా రచియించి, దాని నందఱకుఁ జూపి 'మీమీ ధనువుల బాణంబులు సంధించి నా పంచిన యప్పుడ యిప్పక్షి తలఁ దెగ నేయుం; డే నొక ళ్లొకళ్లన పంచెద' నని ముందఱ ధర్మనందనుం బిలిచి 'యీ వృక్షశాఖాగ్రంబున నున్న పక్షి నిమ్ముగా నీక్షించి మద్వచనానంతరంబున శరమోక్షణంబు సేయు మనిన నతండును వల్లె యని గురువచనంబు సేసి యున్న నయ్యుధిష్ఠిరునకు ద్రోణుం డి ట్లనియె. 248**

**ప్రతిపదార్థం:** ఆ కుమారుల= ఆ కురుకుమారులయొక్క; ధనుర్విద్యా, కౌశలంబు= విలువిద్యలోని నేర్పు; ఎఱుంగన్= తెలుసుకొనాలని; వేఁడి=కోరి; ఒక్కనాఁడు= ఒకరోజు; ద్రోణుండు; కృత్రిమంబు+అయిన= కల్పించబడిన దైన; భాసంబు= గ్రద్ద; అను, పక్షిన్= అనే పక్షిని; ఒక్క; వృక్ష, శాఖా+అగ్రంబున= ఒక చెట్టుకొమ్మచివరిలో; లక్ష్యంబుగాన్= గురిగా; రచియించి= కూర్చి; దానిన్; అందఱకున్= అందరికి; చూపి; మీ, మీ, ధనువులన్= మీమీవిండ్లయందు; బాణంబులు; సంధించి= ఎక్కుపెట్టి; నా, పంచిన, అప్పుడు+అ= నేను ఆజ్ఞాపించిన సమయంలోనే; ఈ, పక్షి, తలన్= ఈ పక్షి యొక్క తలను; తెగన్= తెగేట్లుగా; ఏయుండు= కొట్టండి; ఏన్= నేను; ఒకళ్లు+ఒకళ్లన= ఒక్కొక్కరినీ; పంచెదన్= ఆజ్ఞాపిస్తాను;

అని= ఆ ప్రకారంగా; ముందఱ; = మొదట; ధర్మనందనున్, పిలిచి = ఆ ధర్మరాజుని పిలిచి; ఈ, వృక్ష, శాఖా+అగ్రంబునన్= ఈ చెట్టుకొమ్మ కొనలో; ఉన్న= ఉండు; పక్షిన్= పక్షిని; ఇమ్ముగాన్= తగిన విధంగా; ఈక్షించి= చూచి; మద్+వచన+ అనంతరంబునన్; నా మాట తర్వాత; శర, మోక్షణంబు= బాణాన్ని వదలటం; చేయుము; అనినన్= అనగా; అతండును = ఆ ధర్మరాజును; వల్లె, అని= సరే, అని; గురు, వచనంబు= గురువుగారి మాటను; చేసి= సిద్ధము గావించి; ఉన్నన్= ఉండగా; ఆ+యుధిష్ఠిరునకున్= ఆ ధర్మరాజుతో; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ కురుకుమారుల విలువిద్యా నైపుణ్యాన్ని తెలిసికొన గోరి ఒకనాడు ద్రోణుడు, భాస మనే పక్షిని రూపొందించి, ఒకచెట్టుకొమ్మచివరన కట్టి, దానిని అందరికీ చూపి, 'నేను చెప్పినప్పుడు మీమీ ధనువులు ఎక్కు పెట్టి, ఆ పక్షితలను తెగగొట్టండి. నేను ఒక్కొక్కరినే ఆజ్ఞాపిస్తాను' అని ముందుగా ధర్మరాజును పిలిచి 'ఈ చెట్టుకొమ్మ కొసన ఉండే పక్షిని చక్కగా చూచి, నేను చెప్పినప్పుడు బాణంతో కొట్టుము', అనగా, అతడు సరే అని గురువుమాట ప్రకారం సిద్ధంగా ఉండగా, ద్రోణుడు ఇట్లా అన్నాడు.

**తే. 'వృక్షశాఖాగ్రమున నున్న పక్షిశిరము । దెల్లముగఁ జూచితే మహీవల్లభుండ!'**
**యనిన నిమ్ముగఁ జూచితి ననిన, వెండి । యును గురుఁడు ధర్మజున కిట్టు లనియెఁ బ్రీతి. 249**

**ప్రతిపదార్థం:** మహీ, వల్లభుండ= ఓ రాజా!; వృక్ష, శాఖా+అగ్రమునన్= చెట్టుకొమ్మచివరన; ఉన్న, పక్షి, శిరము= ఉండే పక్షితల; తెల్లముగన్= స్పష్టంగా; చూచితే= చూచావా?; అనినన్= అనగా; ఇమ్ముగాన్= చక్కగా; చూచితిని; అనినన్= అని చెప్పగా; వెండియును= మఱియును; గురుఁడు= ద్రోణుడు; ప్రీతిన్= ప్రీతితో; ధర్మరాజునకున్; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! చెట్టుకొమ్మచివర ఉన్న పక్షితలను స్పష్టంగా చూచావా' అని అడుగగా; చక్కగా చూచా నని అతడు చెప్పగా, మరల ద్రోణుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**క. జననుత! యా మ్రానిని న । న్నును మఱి నీ భ్రాతృవరులనుం జూచితె నీ?'**
**వనవుడుఁ జూచితి నన్నిటి । ననఘా! వృక్షమున నున్న యవ్విహగముతోన్. 250**

**ప్రతిపదార్థం:** జన, నుత,= జనులచేత పొగడబడేవాడా! ఓ ధర్మరాజా!; ఆ, మ్రానిని= ఆ చెట్టును; నన్నును= నన్ను; మఱి= ఇంకా; నీ, భ్రాతృ, వరులనున్= నీయొక్క ఉత్తములైన తమ్ములను; నీవు; చూచితె= చూశావా; అనవుడు= అని అనగా; అనఘా= పాపంలేనివాడా! ఓ ద్రోణాచార్యా!; వృక్షమునన్, ఉన్న= చెట్టుపై నున్నట్టి; ఆ+విహంగముతోన్= ఆ పక్షితోసహా; అన్నిటిన్; చూచితిన్.

**తాత్పర్యం:** 'జనులచేత పొగడబడే ఓ ధర్మరాజా! ఆమానును, నన్ను, నీతమ్ముళ్లని చూశావా?' అని ద్రోణుడు అడుగగానే, 'పుణ్యాత్మా! చెట్టుమీద నున్న ఆ పక్షితోపాటు అన్నిటినీ చూచా'నని ధర్మరాజు అన్నాడు.

**వ. అనిన విని ద్రోణుండు ధర్మజుం బదరి 'నీ దృష్టి చెదరె; నీవు దీని నేయనోపవు పాయు' మని యివ్విధంబున దుర్యోధనాదు లైన ధార్తరాష్ట్రులను భీమసేన నకుల సహదేవులను నానాదేశాగతు లైన రాజపుత్త్రులను గ్రమంబున నడిగిన వారలు ధర్మనందను చెప్పినట్ల చెప్పిన, నందఱ నిందించి, పురందరనందనుం బిలిచి వారి నడిగిన యట్ల యడిగిన నాచార్యునకు నర్జునుం డి ట్లనియె. 251**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ద్రోణుండు; ధర్మజున్; పదరి= నిందించి; నీ, దృష్టి= నీ చూపు; చెదరెన్= చెదరింది; నీవు, దీనిన్= నీవు ఈ పక్షిని; ఏయన్+ఓపవు= కొట్టలేవు; పాయుము= తప్పుకో; అని= అంటూ నిర్దేశించి; ఈ+విధంబునన్= ఈ రీతిగా; దుర్యోధన+ఆదులు+ఐన= దుర్యోధనుడు మొదలైనవారైన; ధార్తరాష్ట్రులను; నానా, దేశ+ఆగతులు+అయిన= వివిధదేశాలనుండి వచ్చినవా రైన; రాజ, పుత్రులను= రాకుమారుల్ని; క్రమంబునన్= వరుసగా; అడిగినన్= అడుగగా; వారలు= వాళ్లు; ధర్మనందను, చెప్పినట్లు+అ= ధర్మరాజు చెప్పినట్లే; చెప్పినన్= చెప్పగా; అందఱన్= అందరినీ; నిందించి= దూషించి; పురందర, నందనున్= దేవేంద్రుని కుమారుడైన అర్జునుడిని; పిలిచి= చెంతకు పిలిచి; వారిన్= వాళ్లను; అడిగిన, అట్లు+అ= అడిగిన విధంగానే; అడిగినన్= అడుగగా; ఆచార్యునకున్= ద్రోణునకు; అర్జునుండు= అర్జునుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని ద్రోణుడు ధర్మరాజును నిందించి 'నీ దృష్టి చెదిరింది. నీవు దీనిని కొట్టలేవు. ప్రక్కకు తప్పుకొమ్ము' అన్నాడు. అదే విధంగా దుర్యోధనుడు మొదలైన కౌరవులను, భీమసేననకులసహదేవులను, వివిధ దేశాలనుండి వచ్చిన రాకుమారులను వరుసగా అడుగగా, వా ళ్ళంతా ధర్మరాజు ఇచ్చిన సమాధానమే ఇచ్చారు. ద్రోణుడు అందరినీ నిందించి, తర్వాత అర్జునుడిని పిలిచి వాళ్ళను అడిగినట్లే అడుగగా అత డిట్లా అన్నాడు.

**క. 'పక్షిశిరంబు దిరంబుగ । నీక్షించితి; నొండు గాన నెద్దియు' ననినన్**
**లక్షించి యేయు మని సూ । క్ష్మేక్షణు ద్రోణుండు పనిచె నింద్రతనూజున్. 252**

**ప్రతిపదార్థం:** పక్షి, శిరంబు= పక్షితలను; తిరంబుగన్= చక్కగ; ఈక్షించితిన్= చూచాను; ఒండు= ఇతరం; ఎద్దియున్= ఏదీ కూడా; కానన్= చూడటం లేదు; అనినన్= అని తెల్పగా; లక్షించి= గురిపెట్టి; ఏయుము= కొట్టుము; అని= ఆ ప్రకారం; ద్రోణుండు; సూక్ష్మ+ఈక్షణున్= సునిశిత మైన దృష్టి గల; ఇంద్రతనూజున్= అర్జునుని; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** 'పక్షితలను చక్కగా చూచాను. ఇం కేదీ నాకు కనిపించటం లేదు' అని అర్జునుడు అనగా, ద్రోణుడు 'గురి చూచి కొట్టుము' అని సూక్ష్మదృష్టి గల అర్జునుని ఆజ్ఞాపించాడు.

**క. గురువచనానంతరమున । నరుఁ డప్పుడు శరవిమోక్షణము సేయుఁడుఁ జె**
**చ్చెరఁ బక్షిశిరము దెగి త । ద్ధరణీరుహశాఖనుండి ధారుణిఁ బడియెన్. 253**

**ప్రతిపదార్థం:** గురు, వచన+అనంతరమునన్= గురువుమాట తర్వాత; నరుఁడు= అర్జునుడు; అప్పుడు; శర, మోక్షణము= బాణాన్ని విడవటం; చేయుఁడున్= చేయగా; చెరన్+చెరన్= తత్క్షణమే; పక్షి, శిరము= పక్షితల; తెగి; తద్+ధరుణీరుహ, శాఖ నుండి= ఆ చెట్టుకొమ్మనుండి; ధారుణిన్= భూమిమీద; పడియెన్= పడింది.

**తాత్పర్యం:** గురువు చెప్పిన తర్వాత అర్జునుడు బాణాన్ని వదిలాడు. ఆ పక్షితల తత్క్షణమే తెగి చెట్టుకొమ్మ నుండి నేలమీద పడింది.

**వ. ఇ ట్లశ్రమంబునఁ గృత్రిమపక్షితలఁ దెగనేసిన యర్జును నచలితదృష్టికి లక్ష్యవేధిత్వంబునకు మెచ్చి ద్రోణుం డాతనికి ధనుర్వేదరహస్యంబు లుపదేశించె; నంత. 254**

**ప్రతిపదార్థం:** ఇట్లు; అ(శ్రమంబునన్= సులువుగా; కృత్రిమ, పక్షి తలన్= కల్పింపబడిన పక్షియొక్క తలను; తెగన్, ఏసిన= తెగునట్లు కొట్టిన; అర్జును= అర్జునునియొక్క; అచలిత దృష్టికి= చెదిరిపోని దృష్టికి; లక్ష్య, వేధిత్వంబునకున్= గురిని

కొట్టగలిగినందుకు; మెచ్చి= పొగడి; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; అతనికి= అర్జునునికి; ధనుర్వేద, రహస్యంబులు= విలువిద్యలోని రహస్యాలు; ఉపదేశించెన్; అంతన్= తర్వాత.

**తాత్పర్యం:** ఈ విధంగా సులువుగా ఆ కల్పితపక్షితలను తెగగొట్టిన అర్జునునినిశ్చలదృష్టికీ, గురిని కొట్టే సామర్థ్యానికీ, ద్రోణుడు మెచ్చి, అతనికి విలువిద్యారహస్యాలు ఉపదేశించాడు. తర్వాత.

## అర్జునుఁడు ద్రోణుని మొసలినుండి విడిపించుట (సం. 1-123-68)

**క. మానుగ రాజకుమారుల । తో నొక్కట నొక్కనాఁడు ద్రోణుఁడు గంగా**
**స్నానార్థ మరిగి యందు మ । హా నియమస్థుఁ డయి నీళ్ల నాడుచునున్నన్. 255**

**ప్రతిపదార్థం:** మానుగన్= ఒప్పుగ; రాజ, కుమారులతోన్= కురుకుమారులతో; ఒక్కటన్= ఒక్కటిగా; ఒక్కనాఁడు; ద్రోణుఁడు; గంగా, స్నాన+అర్థము= గంగానదిలో స్నానం చేయటంకొరకు; అరిగి= వెళ్లి; అందున్= ఆ నదిలో; మహా, నియమస్థుఁడు+అయి= గొప్పనియమం కలిగినవా డై; నీళ్లన్, ఆడుచున్= స్నానం చేస్తూ; ఉన్నన్= ఉండగా.

**తాత్పర్యం:** ఒకనాడు రాకుమారు లందరితో కలిసి ద్రోణుడు గంగాస్నానం చేయటానికై వెళ్లి, ఎంతోనిష్ఠతో నీటిలో స్నానం చేస్తుండగా.

**క. వెఱచఱవ నీరిలో నొ । క్కెఱగా నొక మొసలి చూడ్కికి నగోచర మై**
**పఱతెంచి కుంభసంభవు । చిఱుదొడ వడిఁ బట్టికొనియె శిష్యులు బెదరన్. 256**

**ప్రతిపదార్థం:** వెఱచఱవ= భయపడేట్లుగా; నీరిలోన్= నీటిలో; ఒక్కెఱగాన్= భయంకరంగా; ఒక; మొసలి= మొసలి; చూడ్కికిన్= చూడటానికి; అగోచరము+ఐ= కనిపించనిదై; పఱతెంచి= వచ్చి; కుంభసంభవు, చిఱుతొడ= ద్రోణునియొక్క పిక్కను; శిష్యులు, బెదరన్= శిష్యులంతా బెదరునట్లు; వడిన్= వేగంగా; పట్టుకొనియెన్= పట్టుకొన్నది.

**తాత్పర్యం:** నీళ్ళల్లో భయంకరంగా ఒకమొసలి కంటికి కనపడకుండా వచ్చి, శిష్యులంతా బెదిరేటట్లుగా ద్రోణాచార్యుని పిక్కను వెంటనే పట్టుకొన్నది.

**క. దాని విడిపింప ద్రోణుఁడు । దా నపుడు సమర్థుఁ డయ్యుఁ దడయక పనిచెన్**
**'దీని విడిపింపుఁ' డని నృప । సూనుల శరసజ్యచాపశోభితకరులన్. 257**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ మొసలిని; విడిపింపన్= విడిపించటానికి; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; తాన్; అపుడు= ఆ సమయంలో; సమర్థుఁడు+అయ్యున్= సామర్థ్యం కలిగినవాడు అయికూడా; తడయక= ఆలస్యం చేయకుండా; దీనిన్= ఈ మొసలిని; విడిపింపుఁడు; అని; శర, సజ్య, చాప, శోభిత, కరులన్= బాణాలచేత, అల్లెత్రాళ్లచేత కూడిన ధనుస్సులతో ప్రకాశిస్తున్న చేతులు కలవారిని; నృప, సూనులన్= రాకుమారులను; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** ఆ మొసలిని విడిపించటానికి ద్రోణు డపుడు తాను సమర్థు డైకూడా ఆలస్యం లేకుండా దీన్ని విడిపించం డని ధనుర్బాణాలు చేత ధరించిఉన్నరాకుమారులను ఆజ్ఞాపించాడు.

**శా. దానిన్ నేరక యందఱున్ వివశు లై తా రున్న నన్నీరిలోఁ**
**గానం గాని శరీరముం గల మహోగ్ర గ్రాహమున్ గోత్ర భి**
**త్సూనుం డేనుశరంబులన్ విపులతేజుం డేసి శక్తిన్ మహా**
**సేనప్రఖ్యుఁడు ద్రోణుజంఘ విడిపించెన్ విక్రమం బొప్పఁగన్. 258**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ మొసలిని విడిపించటం; నేరక= చేతకాక; అందఱున్; వివశులు+ఐ= మైమరచినవాళ్ళయి; తారు= తాము; ఉన్నన్= ఉండగా; ఆ+నీరిలోన్; కానన్+కాని= చూడటానికి సాధ్యపడని; శరీరమున్+కల= దేహంఉండే; మహా+ఉగ్ర, గ్రాహమున్= మిక్కిలి భయంకరం అయిన మొసలిని; విపుల, తేజుండు= ఎంతో పరాక్రమం కలవాడు; శక్తిన్= బలంలో; మహాసేన, ప్రఖ్యుఁడు= కుమారస్వామితో సమానుడు; గోత్ర, భిత్+సూనుండు= కొండలను చీల్చిన దేవేంద్రునియొక్క కుమారుడు; ఏను, శరంబులన్= అయిదు బాణాలతో; ఏసి= కొట్టి; విక్రమంబు= పరాక్రమం; ఒప్పఁగన్= ప్రకాశించేటట్లు; ద్రోణు, జంఘన్= ద్రోణాచార్యునియొక్క పిక్కను; విడిపించెన్.

**తాత్పర్యం:** ఆ రాకుమారులంతా మొసలిని విడిపించటం చేతకాక దిక్కుతెలియనిస్థితిలో ఉండగా, మహాపరాక్రమశాలి, శక్తిలో కుమారస్వామివంటివాడు, పర్వతాలరెక్కలు నరికిన దేవేంద్రునిపుత్త్రుడు అయిన అర్జునుడు, నీటిలో కనిపించకుండా ఉన్న ఆ భయంకరమైన మొసలిని అయిదుబాణాలతో కొట్టి, ద్రోణాచార్యుని పిక్కను విడిపించాడు.

**వ. అ మ్మహోగ్రగ్రాహంబు పార్థబాణపంచకవిభిన్నదేహం బయి పంచత్వంబుఁ బొందినం జూచి, ద్రోణుం డర్జును ధనుః కౌశలంబునకుఁ దనయం దతిస్నేహంబునకు మెచ్చి, వీనిచే ద్రుపదుండు బంధుసహితంబు పరాజితుండగు నని తనమనంబున సంతోషించి, వానికి ననేకదివ్యబాణంబు లిచ్చె నని యర్జునుకొండుకనాఁటి పరాక్రమ గుణసంపదలు వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె నని. 259**

**ప్రతిపదార్థం:** ఆ+మహా=ఉగ్ర, గ్రాహంబు= ఆ గొప్ప భయంకరమయిన మొసలి; పార్థ, బాణ, పంచక, విభిన్న, దేహంబు+అయి= అర్జునునిబాణాలు అయిదింటిచేత చీల్చబడిన శరీరం కలదై; పంచత్వంబున్= మరణాన్ని; పొందినన్= పొందగా; చూచి= కనుగొని; ద్రోణుండు; అర్జును, ధనుస్+కౌశలంబునకున్= అర్జునుని విలువిద్యానైపుణ్యానికి; తనయందు= తనపై; అతి, స్నేహంబునకున్= మిక్కిలి ప్రీతికి; మెచ్చి= పొగడి; వీనిచే= వీనివల్ల; ద్రుపదుండు; బంధు, సహితంబు= బంధువులతో సహా, పరాజితుండు= ఓడగొట్టబడినవాడు; అగున్= కాగలడు; అని= అని; తన, మనంబునన్; సంతోషించి; వానికిన్= ఆ అర్జునునికి; అనేక, దివ్య, బాణంబులు= అనేకదేవతాసంబంధమైనబాణాలు; ఇచ్చెన్; అని; అర్జును, కొండుకనాఁటి= అర్జునుని యొక్కచిన్ననాటి; పరాక్రమ, గుణ, సంపదలు= పరాక్రమంయొక్క, గుణాలయొక్కగొప్పలు; వైశంపాయనుండు; జనమేజయునకున్; చెప్పెన్; అని.

**తాత్పర్యం:** 'ఆ అతిభయంకరమయిన మొసలి అర్జునుని అయిదుబాణాలచేత శరీరం చీలి మరణించింది. అది చూచి ద్రోణుడు అర్జునుని విలువిద్యానైపుణ్యానికి, తనపట్ల గల ప్రేమకు మెచ్చి, అతనిచేత ద్రుపదుడు బంధువులతో సహా ఓడిపోగల' డని సంతోషించి అనేకదివ్యబాణాలు అతనికిచ్చాడు' - అని అర్జునునిచిన్ననాటి పరాక్రమ గుణవిశేషాలు వైశంపాయనుడు జనమేజయునికి చెప్పె నని.

**విశేషం:** ద్రోణుడు ధృతరాష్ట్రపాండురాజకుమారులకు విలువిద్య నేర్పటంలో కొంత స్వార్థం ఉంది. అది ద్రుపదుడిని తన శిష్యులచేత అవమానింప చేయటం, భీష్ముడు తన మనుమ లందరినీ శిష్యులుగా చేసిన మరుక్షణమే గురువుగా తనకోర్కెను

తీర్చేవా ళ్ళెవ రని వాళ్ళని ప్రశ్నించాడు. అర్జును డొక్కడే అనుకూలంగా స్పందించాడు. మొసలిని చంపి ద్రోణుడిని కాపాడటంతో విలువిద్యాభ్యాసం పూర్తి అయినట్లు వస్తుధ్వని. అర్జునుడు ఏకైక వీరుడిగా ప్రకాశించాడు. ద్రోణునికోర్కె తీరింది. ద్రుపదుడిని సపరివారంగా ఓడించ గలిగిన ఒక మహావీరుడిని తయారు చేయగలిగినందుకు ద్రోణుడు సంతోషించాడు. ఇది భావికథకు నాంది. పూర్వాపరసంబంధం కల కథాకథనశిల్పం. (సంపా.)

## ఆశ్వాసాంతము

**క. వ్యసనవివర్జిత ! మాన ၊ వ్యసగోత్రపవిత్ర! విష్ణువర్ధననృప! స**
**ప్తసముద్రముద్రితాఖిల ၊ వసుధాజనగీతకీర్తి! వాసవమూర్తీ!. 260**

**ప్రతిపదార్థం:** వ్యసన, వివర్జిత= వ్యసనాలచేత విడువబడినవాడా!; మానవ్య, సగోత్ర, పవిత్ర= మానవ్య, సగోత్రంలో పవిత్ర మైన వాడా!; విష్ణు, వర్ధన, నృప= విష్ణువర్ధన మహారాజా!; సప్తసముద్ర, ముద్రిత+అఖిల, వసుధా, జన, గీత, కీర్తి= ఏడు సముద్రాలచేత గుర్తు వేయబడినటువంటి సమస్త భూప్రజలచేత పొగడబడిన కీర్తి కలవాడా!; వాసవ, మూర్తీ= ఇంద్రునివంటి రూపం కలవాడా!

**తాత్పర్యం:** ఏ వ్యసనం లేనివాడా! మానవ్య సగోత్రంలో పవిత్రుడ వైనవాడా! విష్ణువర్ధనమహారాజా! సప్త సముద్రాలచేత ముద్రవేయబడిన సమస్తభూమండలప్రజలచేత పొగడబడిన కీర్తి కలవాడా! ఇంద్రునివంటి రూపం కలవాడా!

**విశేషం:** రాజరాజనరేంద్రుడు మొదట వైయాఘ్రపాదగోత్రుడు. విష్ణువర్ధనుని మానవ్య సగోత్రుడైన హరితపుత్త్రుడు పెంచుకొన్నందు వలన మానవ్య సగోత్రు డైనాడు.

**వనమయూరం.**

**రాజకులశేఖర! పరంతప! వివేక ၊ భ్రాజిత! జగద్వలయభాసురసముద్య**
**త్తేజ! నిరవద్య! యువతీమదన! వీరో ၊ గ్రాజివిజయా! త్రిభువనాంకుశ! నరేంద్రా. 261**

**ప్రతిపదార్థం:** రాజ, కుల, శేఖర= రాజవంశమందు లేదా చంద్రవంశమందు శ్రేష్ఠుడయిన వాడా!, పరంతప= శత్రువులను నాశనం చేసేవాడా! వివేక, భ్రాజిత= విచక్షణజ్ఞానంచేత ప్రకాశింపచేయబడినవాడా!; జగత్+వలయ, భాసుర, సముద్యత్, తేజ= భూమండలంలో ప్రకాశిస్తూ పెరుగుతున్న కాంతి కలవాడా!; నిరవద్య= దోషం లేనివాడా!; యువతీ, మదన= యౌవనంలో ఉన్నస్త్రీలకు మన్మథుడైనవాడా!; వీర+ఉగ్ర+ఆజి, విజయా= వీరులతోడి భయంకరమయిన యుద్ధంలో గెలుపు కలిగినవాడా!; త్రిభువన+అంకుశ= మూడులోకాలకు అంకుశంవంటివాడా! (ఇది రాజరాజుబిరుదం); నర+ఇంద్రా= మానవులకు ప్రభు వైనవాడా- ఓ రాజరాజనరేంద్రా!

**తాత్పర్యం:** రాజవంశానికి లేదా చంద్రవంశానికి అలంకార మైనవాడా! శత్రువులను నాశనం చేసేవాడా! వివేకం చేత ప్రకాశించేవాడా! భూమండలంలో ప్రకాశిస్తూ వృద్ధి పొందుతున్న తేజస్సు కలవాడా!, యువతులకు మన్మథునివంటివాడా!, వీరులతో భయంకరయుద్ధంలో విజయం కలవాడా!, త్రిభువనాంకుశ అనే బిరుదం కలవాడా! రాజరాజనరేంద్రా!

**విశేషం:** ఇవికూడా రాజరాజనరేంద్రునిగుణవిశేషాలు. ఆశ్వాసాంతంలో కృతిపతిసంబోధనలు. వనమయూరపాదానికి భ, జ, స, న, గగ - అనే గణాలు వరుసగా ఉంటాయి. 9వ అక్షరం యతిస్థానం. ప్రాసనియతి ఉన్నది.

**గద్యము.**

**ఇది సకలసుకవిజనవినుతనన్నయభట్టప్రణీతం బైన శ్రీ మహాభారతంబునం దాదిపర్వంబున ధృతరాష్ట్ర పాండురాజుల వివాహంబును, బాండురాజదిగ్విజయంబును, బాండవధార్తరాష్ట్రసంభవంబును, బాండురాజు నిర్యాణంబును, గృపద్రోణజన్మకథనంబును, గుమారాస్త్రవిద్యాగ్రహణంబును నన్నది పంచమాశ్వాసము. 262**

**తాత్పర్యం:** ఇది, సకలసత్కవుల ప్రశంస లందుకొన్న నన్నయభట్టు రచించిన శ్రీమహాభారతంలో - ఆదిపర్వంలో- ధృతరాష్ట్రపాండురాజులవివాహం, పాండురాజుదిగ్విజయం, పాండవధార్తరాష్ట్రులజననం, పాండురాజు మరణం, కృపాచార్యద్రోణాచార్యులపుట్టుకనుగూర్చి చెప్పటం, కురుకుమారులు అస్త్రవిద్యను అభ్యసించటం - అనే కథార్థాలు కల ఐదవఆశ్వాసం.

ఆదిపర్వంలో పంచమాశ్వాసం సమాప్తం.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము

**శ్రీ జయవిభాసి! వినమ । ద్రాజన్య కిరీటమణి విరాజిత పాదాం**
**భోజ! భువనైకసుందర । రాజాన్వయతిలక! రాజరాజనరేంద్రా! 1**

**ప్రతిపదార్థం:** రాజరాజనరేంద్రా!; శ్రీ= సంపదచేత; జయ= జయంచేత; విభాసి= ప్రకాశించేవాడా; వినమత్+రాజన్య, కిరీట, మణి, విరాజిత, పాద+అంభోజ= వంగి నమస్కరిస్తున్న రాజులయొక్క కిరీటాలలోని మణులవలన మిక్కిలి ప్రకాశిస్తున్న పద్మాలవంటి పాదాలు గలవాడా!; భువన+ఏక, సుందర= లోకంలో నీకు నీవే సాటి అయిన అందగాడా!; రాజ+అన్వయ, తిలక= చంద్రవంశంలో శ్రేష్ఠుడవైనవాడా!

**తాత్పర్యం:** సంపదతో, విజయంతో వెలుగొందుతూ, వంగి నమస్కరిస్తున్న రాజుల కిరీటాలలోని మణుల కాంతులవలన ఎంతో ప్రకాశించే పాదపద్మాలు కలిగి, లోకమంతటికీ అందగాడివై, చంద్రవంశశ్రేష్ఠుడవైన ఓ రాజరాజనరేంద్రా!

**విశేషం:** ఆశ్వాసారంభపద్యాన్ని శ్రీకారంతో ప్రారంభించి, కృతిపతిగుణవిశేషాలు కొనియాడుతూ అతడిని సంబోధించి, కథ మొదలుపెట్టటం, నన్నయ ఏర్పరచిన సంప్రదాయం. తర్వాతి తెలుగుకవులు చాలామంది దీన్ని పాటించటం జరిగింది.

**వ. అ క్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె; నట్లు కృతాస్త్ర శస్త్రులయిన రాజకుమారుల విద్యాకౌశలంబు వ్యాస గాంగేయ విదుర కృప శల్య శకుని సోమదత్తాదుల సమక్షంబునం జూప సమకట్టి యొక్కనాఁడు ద్రోణుండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= కథను చెప్పుతున్న ఆతడు - రౌమహర్షణి; శౌనక+ఆది, మహామునులకున్= శౌనకుడు మొదలయిన గొప్ప ఋషులకు; చెప్పెన్; అట్లు= ఆ విధంగా; కృత+అస్త్ర, శస్త్రులు+అయిన= చేయబడిన (అంటే నేర్పబడిన) అస్త్రాలు, శస్త్రాలు కలవారైన; రాజకుమారుల; విద్యా, కౌశలంబు= విద్యలోని నేర్పు; వ్యాస, గాంగేయ, విదుర, కృప, శల్య, శకుని, సోమదత్త+ఆదుల= వ్యాసుడు, భీష్ముడు, విదురుడు, కృపుడు, శల్యుడు, శకుని, సోమదత్తుడు మొదలైనవాళ్ళయొక్క; సమక్షంబునన్= ఎదుట; చూపన్= చూపటానికి; సమకట్టి= పూనుకొని; ఒక్కనాఁడు= ఒక రోజు; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** శౌనకుడు మొదలైన మహామునులకు మహాభారతకథను చెపుతున్న రౌమహర్షణి- 'ఆ విధంగా శస్త్రాస్త్రవిద్యలు నేర్చుకొన్న కురుకుమారుల విద్యానైపుణ్యాన్ని - వ్యాసుడు, భీష్ముడు, విదురుడు, కృపుడు, శల్యుడు,

శకుని, సోమదత్తుడు మొదలైన పెద్దలముందు ప్రదర్శింపచేయాలనుకొన్న ద్రోణాచార్యుడు -ధృతరాష్ట్రునితో ఇట్లా అన్నా' డని మళ్ళీ కథను ప్రారంభించి చెప్పాడు.

**విశేషం:** రాజకుమారుల-అంటే ఇక్కడ ధృతరాష్ట్ర, పాండురాజకుమారుల-అని గ్రహించాలి.

**కుమారాస్త్రవిద్యాసందర్శనము (సం.1-124-1)**

**క. ఘోరాస్త్రశస్త్రవిద్యల । నారూఢత మిగుల నిపుణు లైరి కుమారుల్**
**మీరలు వీరల విద్యా । పారము సను టెఱుఁగవలయు భవదీయ సభన్. 3**

**ప్రతిపదార్థం:** కుమారుల్ (కౌరవులు, పాండవులు); ఘోర+అస్త్ర, శస్త్ర, విద్యలన్= భయంకరాలైన అస్త్రశస్త్రవిద్యలలో; ఆరూఢతన్= మీదికి ఎదుగుటచేత; మిగులన్= మిక్కిలి; నిపుణులు+ఐరి= నేర్పరులయ్యారు; మీరలు= మీరు; భయదీయ సభన్= మీయొక్కసభలో; వీరల, విద్యా, పారము+చనుట= వీళ్ళయొక్క విద్యయొక్క ఆవలిఒడ్డును చేరటాన్ని - అంటే వీళ్ళు శస్త్రాస్త్రవిద్యనంతటినీ నేర్చుకొని సాధించిన నైపుణ్యాన్ని; ఎఱుఁగవలయున్= తెలిసికొనాలి.

**తాత్పర్యం:** భయంకరాలైన శస్త్రాస్త్రవిద్యలను సమగ్రంగా అభ్యసించి, కౌరవులు, పాండవులు, ఆ విద్యలలో మిక్కిలి నేర్పరులయ్యారు. మీరు సభలో వాళ్ళనేర్పును తెలిసికొనాలి.

**వ. అనిన నట్ల చేయుదు నని ధృతరాష్ట్రుండు 'గుమారుల విద్యాసందర్శనరంగంబు రమ్యంబుగాఁ జేయింపు' మని విదురుం బంచిన, నతండును దాని శాస్త్రవిహిత ప్రమాణోపేత వృత్తాయామంబును, నపాకృత వృక్ష గుల్మ వల్మీకంబును, నంగీకృత పూర్వోత్తరప్లవంబును, సమీకృత నిమ్నోన్నత ప్రదేశంబును, దూరీకృత కంటక పాషాణ శల్య శకలంబును, విరజీకృత రజోధూసర స్థలంబును, విరచిత బహువిధ ప్రేక్షాగారాంచిత మణిమయమంచ ప్రపంచంబును,నానాధ్వజనవపల్లవరంభాస్తంభమాలాలంకృతద్వారతోరణంబును, బ్రతిదిశనిర్వర్తిత శాంతిక బలి విధానంబునుంగాఁ జేయించినం, బంచాంగశుద్ధదినశుభముహూర్తంబున ధృతరాష్ట్రుండు గాంధారీ పురస్కృత దేవీశతపరివృతుం డై, వివిధభూషణ భూషితానేక విలాసినీనివహంబుతోఁ జనుదెంచి, విలంబిత కదంబక స్థూలముక్తాఫలదామ రమణీయం బై, యాబద్ధమరకత వజ్రవైడూర్య పద్మరాగప్రభాప్రకర వ్యతికర విరచితా పూర్వ సురచాపచారుగౌరవం బై, యతిమనోహరం బైన శాతకుంభమయ ప్రేక్షాగారంబున నున్న. 4**

**విశేషం:** అనినన్= ద్రోణాచార్యుడు ఆ విధంగా చెప్పగా; అట్లు+అ= ఆ విధంగానే; చేయుదున్+అని= చేస్తాను అని; ధృతరాష్ట్రుండు; కుమారుల, విద్యా, సందర్శన, రంగంబు= రాజకుమారుల విద్యలను చూపే ప్రదేశాన్ని; రమ్యంబు, కాన్= అందంగా ఉండేటట్లుగా; చేయింపుము; అని; విదురున్= విదురుణ్ణి; పంచినన్= ఆజ్ఞాపించగా; అతండును; దానిన్= ఆ ప్రదేశాన్ని - ఆ రంగస్థలాన్ని; శాస్త్ర, విహిత, ప్రమాణ+ఉపేత, వృత్త+ఆయామంబునున్= శాస్త్రంలో విధించబడిన కొలతలతో కూడుకొన్న చుట్టుకొలత, పొడవు కలదీ; అపాకృత, వృక్ష, గుల్మ, వల్మీకంబును= తొలగించబడినచెట్లు, పొదలు, పుట్టలు కలదీ; అంగీకృత, పూర్వ+ఉత్తర, ప్లవంబును= అవయవాలుగా చేయబడిన - అంటే అవయవాలవలె అతుక్కొని రంగస్థల భాగాలుగా ఉండేటట్లు చేయబడిన - తూర్పు, ఉత్తర, దిక్కుల్లో వాటమైన పల్లపునేలలు కలదీ; సమీకృత, నిమ్న+ఉన్నత, ప్రదేశంబును= చదరం చేయబడిన పల్లాలూ, మిట్టప్రదేశాలూ కలదీ; దూరీకృత, కంటక, పాషాణ, శల్య, శకలంబును= దూరం చేయబడిన - అంటే తొలగించబడిన ముళ్ళూ, రాళ్ళూ, ఎముకముక్కలూ కలదీ; విరజీకృత, రజస్+ధూసర,

స్థలంబును= దుమ్ముతొలగించి, శుభ్రంచేయబడిన స్థలాలు కలదీ; విరచిత, బహు, విధ, ప్రేక్షా+అగార+అంచిత, మణిమయ, మంచ, ప్రపంచంబును= నిర్మించబడిన, అనేకవిధాలైన, చూడటం కోసమైన ఇండ్లయొక్కయు, అలంకరింపబడిన మణులతో నిండిన మంచలయొక్కయు, సమూహంతో కూడిందీ; నానాధ్వజ, నవ, పల్లవ, రంభా, స్తంభ, మాలా+అలంకృత, ద్వార, తోరణంబును= పలువిధాలైన జెండాలతో, క్రొత్తచివుళ్ళతో, అరటిస్తంభాలతో, పూలమాలలతో అలంకరింపబడిన లోపలివాకిళ్ళూ; వెలుపలివాకిళ్ళూ కలదీ; ప్రతిదిశ, నిర్వర్తిత, శాంతిక, బలి, విధానంబునను, కాన్= ప్రతిదిక్కులలోను నెరవేర్చబడిన శాంతిని కలిగించే బలులతో కూడిన పూజావిధులు కలది అగునట్లుగా; చేయించినన్= చేయించగా; పంచ+అంగ, శుద్ధ, దిన, శుభ, ముహూర్తంబునన్= = పంచాంగాలచేత (తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలచేత) పవిత్రమైన శుభసమయంలో; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; గాంధారీ, పురస్, కృత, దేవీ, శత, పరివృతుండు+ఐ= గాంధారి ముందుండేటట్లుగా చేయబడిన భార్యలు వందమందిచేత చుట్టబడినవాడై; వివిధ, భూషణ, భూషిత+అనేక, విలాసినీ, నివహంబుతోన్= పలువిధాలైన సొమ్ములతో అలంకరింపబడిన పెక్కుమంది స్త్రీల సమూహంతో; చనుదెంచి= వచ్చి; విలంబిత, కదంబ, స్థూల, ముక్తాఫల, దామ, రమణీయంబు+ఐ= వ్రేలాడగట్టిన కడిమి మొగ్గలవలె పెద్దవైన ముత్యాలయొక్క దండలచేత అందమైనదై; ఆబద్ధ, మరకత, వజ్ర, వైడూర్య, పద్మరాగ, ప్రవాళ, ప్రభా, ప్రకర, వ్యతికర, విరచిత+ అపూర్వ, సుర, చాప, గౌరవంబు+ఐ= కట్టబడిన పచ్చలయొక్క, వజ్రాలయొక్క, వైడూర్యాలయొక్క, పద్మరాగాలయొక్క, పగడాలయొక్క, కాంతులసమూహంయొక్క పరస్పరంకూడికచేత నిర్మింపబడిన అరుదైన ఇంద్రధనుస్సు అందంయొక్క గొప్పతనం కలదై; అతిమనోహరంబు+అయిన= మిక్కిలి అందమైనదైన; శాతకుంభమయ, ప్రేక్షా+అగారంబునన్= (ప్రదర్శన) చూడటంకొరకు బంగారుతో నిర్మించిన ఇంటిలో; ఉన్నన్=ఉండగా.

**తాత్పర్యం:** ఆ విధంగా ద్రోణాచార్యుడు చెప్పగా, అట్లే చేస్తానని ధృతరాష్ట్రుడు 'కురుకుమారుల శస్త్రాస్త్ర విద్యా ప్రదర్శనకు అందమైన రంగస్థలాన్ని సిద్ధంచేయించుమని విదురుడిని ఆజ్ఞాపించాడు. విదురుడు శాస్త్రప్రకారం చుట్టుకొలత, పొడవు ఉండేటట్లు, చెట్లను, పొదలను, పుట్టలను తీసివేయించి, అవయవాలవలె అంటి ఉంటేటట్లు తూర్పుభాగంలో, ఉత్తరభాగంలో వాటమైన పల్లపుప్రదేశాలను ఏర్పాటుచేయించి, మిట్టపల్లాలను చదునుచేయించి, ముళ్ళను, రాళ్ళను, ఎముకముక్కల్ని ఏరివేయించి, దుమ్మును అణగగొట్టించి, ప్రేక్షకులు కూర్చొని చూడడానికి పలువిధాలైన ఇండ్లను, మణులతో అలంకరించిన మంచెలను నిర్మింపజేశాడు. లోపలి వాకిళ్ళను, వెలుపలవాకిళ్ళను జెండాలతో, క్రొత్తచిగుళ్ళతో, అరటిస్తంభాలతో, పూలమాలలతో అలంకరింపజేసి, అన్నిదిక్కులలో శాంతిపూజలు జరిపించాడు. రంగస్థలాన్ని సర్వాంగసుందరంగా సిద్ధంచేయించాడు. పంచాంగం ప్రకారం మంచిరోజున, శుభముహూర్తంలో ధృతరాష్ట్రుడు గాంధారీదేవి ముందు నడుస్తుండగా వందమంది భార్యలతో, పలువిధాలైన సొమ్ములు అలంకరించుకొన్న పెక్కుమంది స్త్రీలతో వచ్చి, వ్రేలాడే కడిమిమొగ్గలవలె పెద్దవైన ముత్యాలతో కూర్చిన దండలతో చూడముచ్చటయిందీ, అమర్చిన మరకత వజ్ర వైడూర్య పద్మరాగ ప్రవాళకాంతుల కలయికతో అపూర్వమైన ఇంద్రధనుస్సు అందాన్ని మించిందీ, మనోహరమైందీ, బంగారుతో నిర్మించిందీ అయిన ఇంటిలో - (కురుకుమారాస్త్రవిద్యాప్రదర్శనను లోపలకూర్చొని చూడటానికి నిర్మించిన ఇంటిలో) - ఉండగా.

**విశేషం:** అలం: ఉదాత్తం, ఉపమ, అంత్యానుప్రాసం. ఈ రంగస్థలంయొక్క అధునాతనరూపమే ఇప్పటి 'స్టేడియం'.

**తే.** **అందుఁ గరమొప్పి సుందరీబృంద మఖిల । రత్నరాజితకనకధరాధరేంద్ర**
**కందరాంతరమున నున్న సుందరామ్మ । తాశనాంగనాబృందంబు ననుకరించె.** **5**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ ఇంటిలో (ఆ ప్రేక్షాగారంలో); సుందరీ, బృందము= స్త్రీలయొక్క సమూహం; కరము= మిక్కిలి; ఒప్పి= తగినట్లుండి; అఖిల, రత్న, రాజిత, కనక, ధరాధర+ఇంద్ర, కందర+అంతరమునన్+ఉన్న= అన్నిరత్నాలతో ప్రకాశింపజేయబడిన బంగారుపర్వతశ్రేష్ఠముయొక్క-అంటే మేరుపర్వతంయొక్క-గుహలలోపల ఉన్న; సుందర+అమృత+ఆశన+అంగనా, బృందంబున్= అందమైన దేవతాస్త్రీలసమూహాన్ని; అనుకరించెన్= పోలింది.

**తాత్పర్యం:** ఆ ఇంట్లో ఉండే స్త్రీలసమూహం సకలరత్నకాంతులతో ప్రకాశించేమేరుపర్వతగుహలో ఉన్న సుందరదేవతాస్త్రీలసమూహాన్ని పోలి ఉన్నది.

**విశేషం:** అలంకారం: ఉపమ. అమృతాన్ని ఆహారంగా కలవారు దేవతలు.

**తే. సుతులవిద్యాప్రవీణతఁ జూచువేడ్క । నెంతయును సంతసంబునఁ గుంతిదేవి**
**రాజసన్నిధి గాంధారరాజపుత్త్రి । కెలన నుండె నున్మీలితనలిననేత్ర. 6**

**ప్రతిపదార్థం:** ఉత్+మిలీత, నలిన, నేత్ర= విప్పారిన తామరలవంటి కన్నులు గలది; సుతుల=కొడుకులయొక్క; విద్యా ప్రవీణతన్= విద్యలోని నేర్పును; చూచు, వేడ్కన్= చూడాలనే కుతూహలంతో; ఎంతయున్= మిక్కిలి; సంతసంబునన్= సంతోషంతో; కుంతీదేవి; రాజ, సన్నిధిన్= రాజుదగ్గర; గాంధార, రాజ, పుత్త్రి, కెలనన్= గాంధారరాజుకూతురైన గాంధారిప్రక్క; ఉండెన్.

**తాత్పర్యం:** వికసించిన తామరపూలవంటి కన్నులున్న కుంతీదేవి, తనకుమారుల విద్యానైపుణ్యాన్ని చూడాలన్న కుతూహలంతో, ధృతరాష్ట్రునిదగ్గర-గాంధారిప్రక్కన ఎంతో సంతోషంతో ఉండింది.

**విశేషం:** కొడుకుల విద్యానైపుణ్యాన్ని కళ్ళార చూడగోరే మాతృమూర్తియొక్కమానసికస్థితికి - 'ఉన్మీలితనలిననేత్ర' అనే విశేషం ఎంతో ఉచితంగా ఉన్నది. కళ్ళకు గంతలు గట్టుకొన్న గాంధారిప్రక్కన విప్పారిన కన్నులు గల కుంతి కూర్చోవటం విశేషం. తులనాత్మకసౌందర్యాన్ని వెలార్చే స్థిరచిత్ర మిది.

**వ. మఱియును. 7**

**తాత్పర్యం:** ఇంకా.

**సీ. వ్యాసపురస్కృతావనిదేవనివహంబుఁ, గృప శల్య శకుని గాంగేయ విదుర**
**సోమదత్తాది భాసురగురుబాంధవ । మిత్త్రవర్గంబు, నమేయ మంత్రి**
**సామంత మండలేశ్వరసమూహంబును, । గాయక వైతాళికప్రవరులుఁ**
**దమతమ నియమిత స్థానంబులం దోలి । నుండిరి; బోరన నులిసె భేరు;**

**ఆ. లస్త్రదర్శనాగతాఖిల క్షత్రియ । వైశ్యశూద్రవివిధవర్ణజనుల**
**కలకలంబు ప్రళయకాలసంక్షోభితాం । భోనిధిస్వనంబుఁ బోలెఁ జెలఁగె. 8**

**ప్రతిపదార్థం:** వ్యాస, పురస్+కృత+అవని, దేవ, నివహంబున్= వ్యాసుడు ముందుగా ఉండే భూసురుల - అంటే బ్రాహ్మణుల సమూహం; కృప, శల్య, శకుని, గాంగేయ, విదుర, సోమదత్త+ఆది, భాసుర, గురు, బాంధవ, మిత్ర, వర్గంబున్= కృపాచార్యుడు,

శల్యుడు, శకుని, భీష్ముడు, విదురుడు, సోమదత్తుడు మొదలైన ప్రకాశించే గురువులయొక్క, బంధువులయొక్క, మిత్రులయొక్క సమూహం; అమేయ, మంత్రి, సామంత, మండల+ఈశ్వర, సమూహంబును= అపరిమితమైన మంత్రులయొక్క, సామంతులయొక్క, మండలాధిపతులయొక్క సమూహం; గాయక, వైతాళిక, ప్రవరులున్= శ్రేష్ఠులైన పాటలు పాడేవారు, వేకువనే రాజును మేలుకొలిపేవారు; తమ, తమ, నియమిత స్థానంబుల+అందున్= తమ తమకు నియమింపబడిన ప్రదేశాలలో; ఓలిన్= వరుసగా; ఉండిరి= కూర్చున్నారు; భేరులు; బోరనన్= బోరుమని; ఉలిసెన్= మ్రోగాయి; అస్త్ర, దర్శన+ఆగత+అఖిల, క్షత్రియ, వైశ్య, శూద్ర, వివిధ, వర్ణ, జనుల కలకలంబు= అస్త్రవిద్యాప్రదర్శనోత్సవాన్ని చూడటానికి వచ్చిన అందరు క్షత్రియులయొక్క, వైశ్యులయొక్క, శూద్రులయొక్క, వివిధజాతుల జనులయొక్క పెద్దశబ్దం; ప్రళయకాల, సంక్షోభిత+అంభోనిధి, స్వనంబున్= ప్రళయకాలంచేత మిక్కిలి కలతపెట్టబడిన సముద్రశబ్దాన్ని; పోలెన్= వలె; చెలఁగెన్= ఒప్పారెను.

**తాత్పర్యం:** వ్యాసమహర్షిని ముందుగా కల బ్రాహ్మణులసమూహం; కృపాచార్యుడు, శల్యుడు, శకుని, భీష్ముడు, విదురుడు, సోమదత్తుడు మొదలైన గురుబంధుమిత్రులసమూహం, అపరిమితమైన మంత్రిసామంత మండలాధిపతుల సమూహం, గాయకవైతాళికశ్రేష్ఠులు - ఎవరికి నియమించినస్థానాలలో వాళ్ళు వరుసగా కూర్చున్నారు. భేరులు మ్రోగాయి. అస్త్రవిద్యా ప్రదర్శనోత్సవం చూడడానికి వచ్చిన క్షత్రియవైశ్యశూద్రాదివివిధజాతి జనుల కలకలం ప్రళయకాలసముద్రఘోషవలె ఉండింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్టియవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణమాల్యానులేపన యజ్ఞోపవీతపలితకేశశ్మశ్రు శోభిత దేహుండై రంగమధ్యంబున నశ్వత్థామసహితుం డై, విముక్తజలదజాలవియన్మధ్యంబున నంగారకసహితుం డైన యాదిత్యుండునుంబోలె నున్న నగణ్యభూసురవరేణ్యపుణ్యాహవాచనానంతరంబున. 9**

**ప్రతిపదార్థం:** అట్టి అవసరంబునన్= అటువంటి సమయాన; ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; శుక్ల+అంబర+ఆభరణ, మాల్య+అనులేపన, యజ్ఞ+ఉపవీత, పలిత, కేశ, శ్మశ్రు, శోభిత, దేహుండు+ఐ= తెల్లనివస్త్రాలతో, సొమ్ములతో, పూలదండలతో, గంధంతో, జందెంతో, నెరసిన వెంద్రుకలతో, గడ్డంతో, మీసంతో, ప్రకాశిస్తున్నదేహం కలవాడై; రంగ, మధ్యంబునన్; అశ్వత్థామ, సహితుండు+ఐ= అశ్వత్థామతో కూడినవాడై; విముక్త, జలద, జాల, వియత్+మధ్యంబునన్= విడువబడిన మేఘాలసమూహం గల ఆకాశంయొక్క మధ్యప్రదేశంలో; అంగారక, సహితుండు+ఐన= అంగారకునితో కూడుకొన్నవా డైన; ఆదిత్యుండునున్, పోలెన్= సూర్యునివలె; ఉన్నన్= ఉండగా; అగణ్య, భూసుర, వరేణ్య, పుణ్యాహవాచన+అనంతరంబునన్= లెక్కకు మిక్కిలి అయిన బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క పుణ్యాహవాచనానికి తర్వాత.

**తాత్పర్యం:** అటువంటి సమయంలో ద్రోణాచార్యుడు - తెల్లనివస్త్రాలతో, సొమ్ములతో, పూలదండలతో, గంధంతో, జందెంతో, నెరసిన వెంద్రుకలతో, గడ్డంతో, మీసంతో, ప్రకాశిస్తున్న దేహం కలవాడై- రంగమధ్యంలో అశ్వత్థామతో కూడి, మేఘాలు వీడి నిర్మలమైన ఆకాశమధ్యంలో అంగారకగ్రహసహితుడై ప్రకాశించే సూర్యునివలె ఉన్నాడు. పెక్కుమంది బ్రాహ్మణోత్తముల పుణ్యాహవాచనంతర్వాత.

**విశేషం:** అలం: ఉపమ. అంగారకసహితుండైన యాదిత్యుండునుంబోలె - అనేచోట మూలం ఇట్లా ఉన్నది. 'సాంగారక ఇవాంశుమాన్. సాంగారకః సభౌమః, అంశుమాన్ చంద్రః' అని నీలకంఠీయం - చిత్రశాలాప్రతి పుట 236, చూడు.

మహాభారతసంశోధితప్రతి. పుట.323, ధనుర్విద్యాభాస్కరుడైన ద్రోణాచార్యుని సూర్యునితోను, రాక్షసావేశపరు డైన అశ్వత్థామను అగ్నిగ్రహమైన అంగారకునితోను పోల్చటం ఎంతో ఉచితంగా ఉన్నది. తండ్రికొడుకు లిద్దరు ఆ రెండుగ్రహాలవలె మహాతేజస్వులు.

**శా. ద్రోణాచార్యుపిఱుంద నొప్పి దృఢహస్తుల్, బద్ధగోధాంగుళీ**
**త్రాణుల్, మార్గణపూర్ణతూణులు, మహాధన్వుల్ కుమారుల్ తను**
**త్రాణోపేతులు రంగమధ్యమున నంతన్ నిల్చి రుద్యద్గుణ**
**శ్రేణీరమ్యులు ధర్మజప్రముఖు లై జ్యేష్ఠానుపూర్వంబుగన్. 10**

**ప్రతిపదార్థం:** దృఢ, హస్తుల్= బలమైన చేతులు కలవాళ్ళు; బద్ధ, గోధా+అంగుళీ, త్రాణుల్= కట్టబడిన ఉడుముచర్మపు వ్రేళ్ళకవచాలు కలవాళ్ళు; మార్గణ, పూర్ణ, తూణులు= బాణాలతో నిండిన అమ్ములపొదులు కలవాళ్ళు; మహా, ధన్వుల్= గొప్ప ధనుస్సులు కలవాళ్ళు; తను, త్రాణ+ఉపేతుల్= కవచాలతో కూడినవాళ్ళు; ఉద్యత్+గుణ, శ్రేణీ, రమ్యులు= ఉన్నతగుణాల వరుసతో మనోహరమైనవాళ్ళు; రాజకుమారుల్= కురురాజకుమారులు; ద్రోణ+ఆచార్య, పిఱుందన్, ఒప్పి= ద్రోణాచార్యుని వెనుక అందంగా; ధర్మజ, ప్రముఖులు+ఐ= ధర్మరాజును మొట్టమొదట కలవాళ్ళయి; జ్యేష్ఠ+అనుపూర్వంబుగన్= పెద్దవాళ్ళు ముందు ఉండేటట్లుగా; అంతన్= అప్పుడు; రంగమధ్యంబునన్= రంగంయొక్కమధ్యన; నిల్చిరి= నిలిచారు.

**తాత్పర్యం:** బలమైనహస్తాలు కలవాళ్ళు, అల్లెత్రాటిదెబ్బ తగులకుండా ఉడుముతోలుతో కుట్టినకవచాలు వ్రేళ్ళకు తొడుక్కొన్నవాళ్ళు, బాణాలు నిండుగా ఉండే అమ్ములపొదులు కలవాళ్ళు, గొప్పధనుస్సులు, కవచాలు ధరించినవాళ్ళు, ఉన్నతగుణాలచేత రాణించేవాళ్ళు అయిన పాండవులు, కౌరవులు, ద్రోణాచార్యుని వెనుక, ధర్మరాజుప్రక్కన వయోధర్మాన్నిబట్టి వరుసగా రంగమధ్యంలో నిలిచారు.

**వ. అట్లు నిలిచి, రక్తచందనదిగ్ధాంగులు రక్తమాల్యాంబరాభరణులు రక్తపతాకులు రక్తాంతలోచను లై యాచార్యు ననుమతంబున. 11**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆవిధంగా; నిలిచి; రక్త, చందన, దిగ్ధ+అంగులు= ఎర్రగంధంచేత పూయబడిన దేహాలు కలవాళ్ళు; రక్త, మాల్య+అంబర+ఆభరణులు= ఎర్రనిపూలదండలు, వస్త్రాలు, సొమ్ములు కలవాళ్ళు; రక్త, పతాకులు= ఎర్రనిజెండాలు కలవాళ్ళు; రక్త+అంత+లోచనులు+ఐ= ఎర్రని కొలుకులు ఉండే కన్నులు కలవాళ్ళయి; ఆచార్య+అనుమతంబునన్= ద్రోణాచార్యుని ఆజ్ఞచేత.

**తాత్పర్యం:** ఆ విధంగా నిలబడి - ఎర్రగంధాన్ని దేహానికి పూసికొని, ఎర్రటి పూలదండలు, వస్త్రాలు, సొమ్ములు ధరించి, ఎర్రజెండాలు చేత పట్టుకొని, ఎర్రబడ్డకనుగొలకులతో ఉన్నవాళ్ళు - ద్రోణాచార్యుని ఆజ్ఞతో.

**విశేషం:** రక్తవర్ణం వీరరౌద్రరసస్ఫోరకం. రసోచితవిభావవర్ణనం ప్రసన్నకథాకవితలో ఒక శిల్పం.

**సీ. అసిచర్మకౌశలం బమరంగఁ జూపెడు । వారును, దృఢసౌష్ఠవంబు లొప్పఁ**
**దమతమనామాంకితము లైన శరముల । నేర్పడ లక్ష్యంబు లేయువారు,**
**హయ మదద్విరద రథారూఢ దక్షతఁ । బ్రకటించువారును, బ్రాసశక్తి**
**కుంత తోమర గదాకుశలత్వ మెఱిఁగించు । వారునుగా నిట్లు వసుధలోని**

**ఆ. రాజసుతులతోడ రమణఁ బాండవధృత । రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దఁ**
**దద్దయును ముదమునఁ దమతమవిద్యలు । మెఱసి రెల్లజనులు మెచ్చి పొగడ. 12**

**ప్రతిపదార్థం:** పాండవ, ధృతరాష్ట్ర, సుతులు= పాండవులు, ధృతరాష్ట్రునికుమారులు - కౌరవులు; రమణన్= మనోహరంగా; వసుధలోని= భూమిలోని; రాజసుతులతోడన్= రాకుమారులతో; అసి, చర్మ, కౌశలంబు= కత్తులలోని, డాలులోనినేర్పును; అమరంగన్= ఒప్పిదంగా; చూపెడు వారును= చూపుతున్నవాళ్ళూ; దృఢ, సౌష్ఠవంబులు+ఒప్పన్= బలం నిండుదనం ఒప్పగా; తమ, తమ; నామ+అంకితములు+ఐన= పేర్లతో గుర్తులు వేయబడినవైన; శరములన్= బాణాలతో; ఏర్పడన్= వేరయ్యేటట్లు; లక్ష్యంబులన్= గురిచేసి కొట్టదలచినవాటిని; ఏయువారు= కొట్టేవాళ్ళు; హయ, మద, ద్విరద, రథ+ఆరూఢ, దక్షతన్= గుఱ్ఱాలను, మదపుటేనుగులను, రథాలను ఎక్కటంలోని నేర్పును; ప్రకటించువారును= ప్రదర్శించేవాళ్ళు; ప్రాస, శక్తి, కుంత, తోమర, గదా, కుశలత్వము= ఈటెలలో, శక్తులలో, బల్లేలలో, చిల్లకోలలలో, గదలలో నేర్పును - అంటే వీటిని ప్రయోగించటంలోని నేర్పును; ఎఱిగించువారును= తెలియజేసేవాళ్ళు; కాన్= అగునట్లు; ఇట్లు= ఈ విధంగా, తద్దయును= మిక్కిలి; ముదమునన్= సంతోషంతో; తమ, తమ, విద్యలు= వారివారివిద్యలు; ఎల్ల, జనులు; మెచ్చి; పొగడన్; వృద్ధ, రాజుల+ఒద్ద= పెద్దరాజులదగ్గర; మెఱసిరి= ప్రకాశించారు.

**తాత్పర్యం:** పాండవులు, కౌరవులు చూడముచ్చటగా లోకంలోని రాకుమారులతో కూడి - కత్తి, డాలు, విన్యాసాలలో తాము గడించిన నేర్పునూ, తమపేర్లు పొదిగిన బాణాలు వేసి లక్ష్యాన్ని ఛేదించటంలో సాధించిన సామర్థ్యాన్నీ, గుఱ్ఱాలను, మదపుటేనుగులను, రథాలను అధిరోహించటంలో ఆర్జించిన నైపుణ్యాన్నీ, ఈటె మొదలైన ఆయుధాలను ప్రయోగించటంలో తాము పొందిన కౌశలాన్నీ ప్రజలందరూ చూచి సంతోషించి కొనియాడేటట్లు పెద్దరాజుల ఎదుట ప్రదర్శించారు.

## భీమదుర్యోధనులు తమగదాకౌశలంబు సూపుట (సం. 1-124-30)

**వ. అంత ననంతబలపరాక్రము లగు భీమదుర్యోధను లుద్యద్గదాహస్తు లయి మహామత్సరంబుతో నేక శృంగసముత్తుంగశైలద్వయంబు ననుకరించుచు వశానిమిత్తక్రుద్ధగంధసింధురంబులుంబోలె నొండొరులం దాఁకి సవ్యాపసవ్యచిత్రమండలమార్గంబుల గదాకౌశలంబు మెఱయునెడ. 13**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ తరువాత; అనంత, బల, పరాక్రములు+అగు= అంతులేని - అంటే అమితమైన బలపరాక్రమాలు కలవాళ్ళయిన; భీమదుర్యోధనులు; ఉద్యత్+గదా, హస్తులు+అయి= ఎత్తబడిన గదలతో కూడిన చేతులు గలవాళ్ళయి; మహా, మత్సరంబుతోన్= మిక్కిలి క్రోధంతో; ఏక, శృంగ, సమ్+ఉత్+తుంగ, శైల, ద్వయంబున్= ఒక్కశిఖరం ఉండే మిక్కిలి ఎత్తైన పర్వతాల జంటను; అనుకరించుచున్= పోలుతూ; వశా, నిమిత్త, క్రుద్ధ, గంధ, సింధురంబులున్+పోలెన్= ఆడ ఏనుగు కారణంగా కోపించిన మదపుటేనుగువలె; ఒండొరులన్= ఒకరినొకరు; తాఁకి= ఎదుర్కొని; సవ్య+అపసవ్య, చిత్ర, మండల, మార్గంబులన్= ఎడమనుంచి కుడికి, కుడినుండి ఎడమవైపునకు, చిత్రమైనవలయాకార (తిరిగే) పద్ధతులలో; గదా, కౌశలంబు= గదలోని నేర్పును - అంటే గదాయుద్ధంలోని నేర్పును; మెఱయు+ఎడన్= ప్రదర్శించేసమయంలో.

**తాత్పర్యం:** ఆ తర్వాత- అంతులేని బలపరాక్రమాలు గల భీమదుర్యోధనులు, చేత గదలెత్తుకొని, మహాక్రోధంతో ఒకే శిఖరం ఉన్న మిక్కిలిఎత్తైనపర్వతాలజంటవలె, ఆడఏనుగు కారణంగా కోపించిన మదపుటేనుగుల జంటవలె,

ఒకరినొకరు తాకి, ఎడమనుండి కుడికి, కుడినుండి ఎడమకు చిత్రమైన వలయాకారపద్ధతులలో తిరుగుతూ, గదాయుద్ధనైపుణ్యాన్ని ప్రదర్శించారు.

**విశేషం:** అలం: ఉపమ. చేత గదలు ధరించి, యుద్ధానికి సిద్ధమైన భీమదుర్యోధనులను ఒకే శిఖరం ఉన్న మిక్కిలి ఎత్తైన పర్వతాలజంటతో, ఆడఏనుగు కారణంగా కోపించి కలబడే మదపుటేనుగుల జంటతో పోల్చటంవలన వాళ్ళ ఉన్నతాకారం, బలసమానత, మాత్సర్యతీవ్రత చక్కగా వ్యక్తమౌతున్నాయి.

**మ. అవనీచక్రము పాదఘాతహతి నల్లాడంగ నత్యుగ్రభై**
**రవహుంకార రవంబునన్ వియదగారంబెల్ల భేదిల్లఁ బాం**
**డవకౌరవ్యగదావిఘట్టన మకాండప్రోత్థమై భావిపాం**
**డవకౌరవ్యరణాభిసూచన పటిష్ఠం బయ్యె ఘోరాకృతిన్. 14**

**ప్రతిపదార్థం:** అవనీ, చక్రము= భూమండలం; పాద, ఘాత, హతిన్= పాదాలతొక్కిళ్ళదెబ్బలతో; అల్లాడంగన్= కదలగా; అతి+ఉగ్ర, భైరవ, హుంకార, రవంబునన్= మిక్కిలితీవ్రమై భయంకరమైన హుంకారధ్వనిచేత; వియత్+అగారంబు+ఎల్లన్= ఆకాశమనే ఇల్లంతా; భేదిల్లన్= బ్రద్దలుకాగా; పాండవ, కౌరవ్య, గదా, విఘట్టనము= భీమదుర్యోధనుల గదలయొక్క తీవ్రమైన తాకిడి; అకాండ, ప్ర+ఉత్థము+ఐ= అకాలంలో లెస్సగా పుట్టిందై; ఘోర+ఆకృతిన్= భయంకరమైన రూపంతో; భావి, పాండవ, కౌరవ్య, రణ+అభిసూచన, పటిష్ఠంబు+అయ్యెన్= ముందు జరగబోయే పాండవ కౌరవ యుద్ధాన్ని ఇప్పటికిప్పుడే సూచించటంలో సమర్థమైనదయింది.

**తాత్పర్యం:** కాళ్ళతొక్కుడు దెబ్బలతో భూమండలం చలించగా, మహాభయంకరహుంకారధ్వనితో ఆకాశమనే ఇల్లంతా బ్రద్దలయ్యేటట్లు, భీమదుర్యోధన గదలతాకిడి, అకాలంలో ఏర్పడి, భయంకరరూపంతో మున్ముందు రాబోయే కురుపాండవమహాసంగ్రామాన్ని ఇప్పటికిప్పుడే స్పష్టంగా సూచించేదయింది.

**విశేషం:** కురుక్షేత్రయుద్ధంలోని చివరిఘట్టం భీమదుర్యోధనుల గదాయుద్ధం. దానికి ఈ గదాయుద్ధ ప్రదర్శనం వ్యంజకంగా ఉన్నది. ఇదొక వస్తుధ్వనిశిల్పవిశేషం. అంతేకాదు, ఓజోగుణం విభావయుద్ధోద్రేకాన్ని ధ్వనింపచేస్తున్నది.

**క. ఆ రాజసుతులవిద్యా । పారగపటు చేష్టితములఁ బరువడి నగ్గాం**
**ధారీధృతరాష్ట్రుల కతి । ధీరుఁడు విదురుండు సెప్పి తెలుపుచునుండెన్. 15**

**ప్రతిపదార్థం:** ఆ, రాజ,సుతుల= ఆ కురుపాండవులైన రాకుమారులయొక్క; విద్యా, పారగ, పటు, చేష్టితములన్= విద్యయొక్క పరిణతిని సాధించటాన్ని తెలిపే సమర్థాలైన చేష్టలను (అంటే విద్యాప్రదర్శనలను); అతి, ధీరుఁడు= గొప్పవిద్వాంసుడైన విదురుడు; పరువడిన్= వరుసగా; ఆ+గాంధారీ, ధృతరాష్ట్రులకున్ చెప్పి, తెలుపుచున్, ఉండెన్= గాంధారికి ధృతరాష్ట్రునికి చెప్పి వివరిస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ రాకుమారుల విద్యాపారంగత్వాన్ని తెలిపే ఆ విద్యాప్రదర్శనలనుగూర్చి విద్వాంసుడైన విదురుడు వరుసగా ఆ గాంధారీధృతరాష్ట్రులకు తెలియచెప్పుతూ ఉన్నాడు.

**వ. అంత భీమదుర్యోధనుల గదా కౌశలంబు సూచుజనులపక్షపాతజనిత పరస్పర క్రోధ వచనంబులు విని ద్రోణుండు రంగభంగభయంబున నశ్వత్థామంబంచి వారి నిద్దఱ వారించి, వారాశియుంబోలె బోరన మ్రోయుచున్న వాదిత్రశబ్దంబు లుడిపి, 'నా ప్రియశిష్యుండయిన యర్జును ధనుర్విద్యాకౌశలంబుఁ జూడుం' డనిన నయ్యాచార్య వచనానంతరంబున. 16**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; భీమ, దుర్యోధనుల, గదా, కౌశలంబు= భీమదుర్యోధనులయొక్క గదావిద్యలోని నేర్పు; చూచు, జనుల, పక్షపాత, జనిత, పరస్పర, క్రోధ, వచనంబులు= చూస్తున్నట్టి ప్రజలయొక్క పక్షపాతంవలన పుట్టిన ఒండొరులకోపవాక్యాలు; విని; ద్రోణుండు; రంగ, భంగ, భయంబున్= విద్యాప్రదర్శనరంగం చెడిపోతుందనే భయంవలన; అశ్వత్థామన్; పంచి= పంపి; వారిన్; ఇద్దఱన్; ఆ భీమదుర్యోధనులిద్దరిని; వారించి= తొలగించి; వారాశియున్+పోలెన్= సముద్రంవలె; బోరు+అన; మ్రోయుచున్+ఉన్న; వాదిత్ర, శబ్దంబులు= వాద్యాలయొక్క ధ్వనులను; ఉడిపి= మాన్పించి; నా, ప్రియ, శిష్యుండు+అయిన; అర్జును, ధనుస్+విద్యా, కౌశలంబున్= అర్జునునియొక్క ధనుర్విద్యలోని నేర్పును; చూడుండు; అనినన్= అని అనగా; ఆ+ఆచార్య, వచన+అనంతరంబున= ఆ ద్రోణాచార్యుని మాటలతర్వాత.

**తాత్పర్యం:** అప్పుడు భీమదుర్యోధనుల గదాకౌశలం చూచే ప్రజలు, పక్షపాతంతో కోపావేశాలు పెంచుకొని, ఒకరి నొకరు అనుకొంటున్నమాటలు విని, అస్త్రవిద్యాప్రదర్శనరంగం భగ్నమవుతుందన్నభయంతో, ద్రోణాచార్యుడు అశ్వత్థామను పంపి, ఆ భీమదుర్యోధనులను తొలగించి, సముద్రఘోషవలె మ్రోగుతున్న వాద్యధ్వని మాన్పించి, 'నా ప్రియశిష్యుడైన అర్జునుని ధనుర్విద్యానైపుణ్యాన్ని చూడం' డని ప్రకటించిన తర్వాత.

**విశేషం:** ఆటలపోటీలలో పాల్గొనేవాళ్ళసంగతి ఎట్లా ఉన్నా - ఆ పోటీలను చూచేప్రేక్షకులు పక్షాలు వహించటం; అరుపులతో, కేకలతో, మాటలతో పరస్పరం క్రోధావేశాలు రెచ్చగొట్టుకొనటం, ఒక్కొక్కసారి ఆ పోటీలు పెద్ద పోట్లాటలుగా మారటం లోకసహజమే. ప్రస్తుతం భీమదుర్యోధనుల గదాకౌశలప్రదర్శనలో కూడా అలాంటి వాతావరణమే ఏర్పడింది. రంగస్థలం రణభూమిగా మారే ప్రమాదం ఏర్పడింది. అందుచేతనే ఆచార్యుడు ఆ ప్రదర్శనను ఆపివేయించటం జరిగింది. కాగా, మానవహృదయంమీద ధ్వనిప్రభావం మెండు. వివిధవాద్యధ్వనులు వివిధరసోద్దీపకాలు. అందుచేతనే క్రోధావేశప్రేరకాలైన వాద్యధ్వనులను ఆచార్యుడు ఆపివేయించాడు. తతం, ఆనద్ధం, సుషిరం, ఘనం అనే వాద్యచతుష్టయానికి వాదిత్రనామంఉన్నది.

**ఉ. హారివిచిత్రహేమకవచావృతుఁ, డున్నతచాపచారుదీ**
**ర్ఘోరుభుజుండు, భాస్వదసితోత్పలవర్ణుఁడు, సేంద్రచాపశం**
**పారుచిమేఘమో యనఁగ బాండవమధ్యముఁ డొప్పి బద్ధతూ**
**ణీరుఁడు రంగమధ్యమున నిల్చె జనంబులు దన్నుఁ జూడఁగన్. 17**

**ప్రతిపదార్థం:** హారి, విచిత్ర, హేమ, కవచ+ఆవృతుఁడు= మనోహరమై వింతవింత రంగులు గలదైన బంగారు కవచంతో కప్పబడినవాడు; ఉన్నత, చారు, చాప, దీర్ఘ+ఉరు+భుజుండు= అందమైన ధనుస్సుతో పొడవైన, శ్రేష్ఠమైన హస్తం కలవాడు; బద్ధ తూణీరుఁడు= కట్టబడిన అమ్ములపొదులు గలవాడు; భాస్వత్+అసిత+ఉత్పల, వర్ణుఁడు= ప్రకాశిస్తున్న నల్లకలువ వన్నె కలవాడు; పాండవమధ్యముఁడు= పాండవులలో నడిమివాడైన అర్జునుడు; జనంబులు; తన్నుఁ= తనను; చూడఁగన్= చూస్తుండగా; స+ఇంద్ర+చాప, శంపా, రుచి, మేఘమో, అనఁగన్= ఇంద్రధనుస్సుతో, మెరుపుకాంతితో కూడుకొన్న మేఘమా అనేటట్లు; ఒప్పి= అందంగాఅమరి; రంగ, మధ్యమునన్; నిల్చెన్.

**తాత్పర్యం:** మినమినలాడే నల్లకలువ వన్నెవాడు, పాండవులలో నడిమివాడు అయిన అర్జునుడు - మనోహరమై, వింతవింత రంగుల బంగారుకవచం తొడుక్కొని, దీర్ఘం, శ్రేష్ఠం అయిన తన హస్తానికి అందమిచ్చిన ఎత్తైన ధనుస్సు ధరించి, అమ్ములపొదులు కట్టుకొని, జనులంతా తనను చూస్తుండగా - ఇంద్రధనుస్సుతో, మెరుపుకాంతితో కూడినమేఘమా అన్నట్లు రంగమధ్యంలో అందంగా నిలిచాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. పద్యంలో ప్రసాదవిశిష్టమైన ఓజోగుణం ధీరోదాత్తుడైన అర్జునుని రూపవర్ణనకు అనుగుణంగా ఉన్నది.

**క. నరు నింద్రాత్మజు నింద్రా । వరజసఖున్ వీరుఁ బాండవప్రవరు ధను**
**ర్ధరుఁ జూచి, చూపఱెల్లం । బరమాద్భుతచిత్తు లగుచుఁ బలికిరి తమలోన్. 18**

**ప్రతిపదార్థం:** నరున్= అర్జునుని; ఇంద్ర+ఆత్మజున్= ఇంద్రునియొక్క కుమారుడైనవానిని; ఇంద్ర+అవరజ, సఖున్= ఇంద్రునితమ్ముడైన ఉపేంద్రునియొక్క - శ్రీకృష్ణునియొక్క స్నేహితుడిని; వీరున్= వీరుడైనవానిని; పాండవ, ప్రవరున్= పాండవులలో శ్రేష్ఠమైనవాడిని; ధనుః+ధరున్= ధనుస్సును ధరించినవాడిని; (అర్జునుడిని) చూచి; చూపఱు+ఎల్లన్= ప్రేక్షకులంతా - చూచేవాళ్ళంతా; పరమ+అద్భుత, చిత్తులు+అగుచున్= మిక్కిలి ఆశ్చర్యంతో కూడిన మనస్సులు కలవాళ్ళయి; తమలోన్= తమలో తాము; పలికిరి= పలికారు, మాట్లాడుకొన్నారు.

**తాత్పర్యం:** నరుడు ఇంద్రతనయుడు, ఉపేంద్రుడైన శ్రీకృష్ణునిస్నేహితుడు, వీరుడు, పాండవశ్రేష్ఠుడు, ధనుర్ధరుడు అయిన అర్జునుడిని చూచి, అమితాశ్చర్యంతో ప్రేక్షకులు తమలో తాము ఇట్లా అనుకొన్నారు.

**విశేషం:** ఈ పద్యంలో అర్జునుణ్ణి "ఇంద్రావరజసఖున్" అని చెప్పడం జరిగింది. ఈ 'కుమారాస్త్రప్రదర్శన' సమయం నాటికి కృష్ణుడు - పాండవులతో సమావేశం కాలేదుకదా! అని సంశయం కల్గుతుంది. 'ఉపేంద్రుడైన కృష్ణుని సఖుడు' - అర్జునుడనే మాట కవి చెప్పిందే కానీ, పాత్ర లెవ్వరూ చెప్పింది కాదు. కవికి కథపూర్తిగా తెలుసుగనుక-"కృష్ణసఖుడు" అనడం- భవిష్యత్ సూచకం కూడా కాగలదు. పాత్రనైతే ఆక్షేపించవచ్చు. కవికి కృష్ణార్జునుల జన్మాంతర నారాయణనరఋషిత్వాలు తెలుసు కనుక ఇక్కడ 'సఖ' శబ్దం అనౌచిత్యం కాదు. మూలంలో "ఇంద్రానుజసమః" అని ఉంది. 'సఖ' శబ్దం 'సమాన' మనే అర్థంలో చెప్పడం కద్దు. కనుక కృష్ణసమానుడని కూడ చెప్పుకోవచ్చు.

**తే. వీఁడె కృతహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందు । వీఁడె యగ్రగణ్యుఁడు ధర్మవిదులలోన,**
**వీఁడె భరతవంశం బెల్ల వెలుఁగఁ గుంతి । కడుపు చల్లఁగాఁ బుట్టిన ఘనభుజుండు. 19**

**ప్రతిపదార్థం:** వీఁడె= ఇతడే; అఖిల+అస్త్ర, విద్యల+అందు= అన్ని అస్త్రవిద్యలలో; కృత, హస్తుఁడు= నేర్పరి; వీఁడె= ఇతడే; ధర్మ, విదులలోన= ధర్మం తెలిసినవారిలో; అగ్ర, గణ్యుఁడు= మొదట లెక్కించదగినవాడు; వీఁడె= ఇతడే; భరత, వంశంబు+ఎల్లన్= భరతునియొక్క వంశమంతా; వెలుఁగన్= ప్రకాశించగా; కుంతి, కడుపు, చల్లఁగాన్= కుంతీదేవికడుపు చల్లగా; పుట్టిన; ఘన, భుజుండు= గొప్పహస్తాలు గలవాడు.

**తాత్పర్యం:** ఇతడే (ఈ అర్జునుడే) అస్త్రవిద్యలన్నింటిలో నేర్పరి. ఇతడే ధర్మం తెలిసినవాళ్ళలో మొదట లెక్కపెట్ట తగినవాడు. ఇతడే భరతవంశానికంతటికీ కీర్తి వచ్చేటట్లు కుంతికడుపు చల్లగా పుట్టిన గొప్పభుజాలు కలవాడు.

**విశేషం:** రంగస్థలంలో ప్రవేశించిన వీరులందరిలో ప్రదర్శనకు పూర్వమే ప్రజల ప్రశంసలందుకొన్న వాడిగా అర్జునుని వర్ణనలో అతని అత్యధికవీరత్వం ధ్వనిస్తూ ఉన్నది.

**క. అని పలుకుజనులపలుకులు । విని గొంతి యనంతహర్షవిస్తారితలో**
**చన యై నందను నృపనం । దనసంఘములోనఁ జూచి తద్దయుఁ బొంగెన్. 20**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పలుకు; జనుల పలుకులు విని; గొంతి= కుంతీదేవి; అనంత, హర్ష, విస్తారిత, లోచన+ఐ= అంతులేని ఆనందంచేత విప్పారిన నేత్రాలు కలదై; నందనున్= కుమారుడిని - అర్జునుడిని; నృప, నందన, సంఘములోనన్= రాజకుమారులయొక్క సమూహంలో; చూచి; తద్దయున్= మిక్కిలి; పొంగెన్= సంతోషించింది.

**తాత్పర్యం:** ఆ విధంగా పలికే జనులపలుకులు విని, కుంతీదేవి అంతులేనిఆనందంతో విప్పారినకళ్ళతో తన కుమారుడైన అర్జునుడిని రాకుమారులసమూహంలో చూచి ఎంతో సంతోషించింది.

**క. చారుమనస్సమ్మదరస । పూరము వెలివేర్చునట్లు పొలఁతికి విగళ**
**ద్భూరిస్తనజనితపయో । ధారలు నానందబాష్పధారలు నొప్పెన్. 21**

**ప్రతిపదార్థం:** చారు, మనస్+సమ్మద, రస, పూరము= చక్కనిమనస్సులోని సంతోషమనే జలప్రవాహం; వెలివేర్చున్+అట్లు= బయల్పడేట్లు; పొలఁతికిన్= స్త్రీకి - అంటే కుంతీదేవికి; విగళత్+భూరి, స్తన, జనిత, పయస్+ధారలున్= కారుతున్న పెద్ద పాలిండ్లనుండి పుట్టిన పాలధారలును; ఆనంద, బాష్ప, ధారలున్= ఆనందంవల్లవచ్చే కన్నీటిధారలును; ఒప్పెన్= అమరినాయి-తగువిధంగా ఏర్పడినాయి.

**తాత్పర్యం:** మనస్సులోని సంతోషజలప్రవాహం వెలుపలికి వచ్చినట్లు, కుంతీదేవిపాలిండ్లనుండి పాలధారలు, కన్నులనుండి ఆనందబాష్పధారలు బయటికి వచ్చాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. కొడుకు గొప్పతనాన్ని లోకమంతా మెచ్చుకుంటే ఓ మాతృమూర్తి హృదయం ఎంతగా పులకిస్తుందో ఈ పద్యంలో చూడవచ్చును. లోకులందరి ఆనందం ఒకవైపు, తల్లిపొందే ఆనందం మరొకవైపు వర్ణించి సామ్యపరిశీలనవలన కలిగే రమణీయభావచిత్రాన్ని పఠితకు నన్నయ అందించాడు. కుంతి ఉద్విగ్నప్రవృత్తికలదిగా చిత్రించబడింది. వత్సలభావాన్ని సాత్త్వికభావాలతో వ్యక్తంచేయటం అందుకు సాక్ష్యం. పాలిండ్లనుండి పాలధారలు, కన్నులనుండి కన్నీటిధారలు రావటం వాత్సల్యరసాన్ని వ్యంజింపచేసే మాతృసహజమైన సాత్త్వికభావాభివ్యక్తులు. (సంపా.)

**వ. అయ్యర్జునుస్తుతివచనంబు లొక్కట జనసంఘంబువలన నెగసి వియత్తలవిదళనం బయిన నమ్మహాధ్వని విని యదరిపడి ధృతరాష్ట్రుం 'డిది యేమి రభసం?' బని విదురు నడిగిన నాతం డి ట్లనియె. 22**

**ప్రతిపదార్థం:** ఆ+అర్జును, స్తుతివచనంబులు= ఆ అర్జునునిగూర్చిన పొగడ్తలు; ఒక్కట= ఒక్కమారుగ; జన, సంఘంబు వలనన్= జనసమూహంననుండి; ఎగసి= పైకి లేచి; వియత్+తల, విదళనంబు+అయినన్= ఆకాశప్రదేశాన్ని చీల్చేది కాగా; ఆ+మహా, ధ్వని= ఆ పెద్దశబ్దాన్ని; విని; అదరిపడి= భయపడి; ధృతరాష్ట్రుండు; ఇది; ఏమి, రభసంబు= ఇదేమి అలజడి; అని; విదురున్+అడిగినన్= విదురుడిని అడుగగా; ఆతండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ అర్జునుడినిగూర్చినపొగడ్తలు ఒక్కమారుగా జనసమూహంనుండి పైకి లేచి ఆకాశాన్ని బ్రద్దలు చేసేట్లు ఉండగా, ఆ మహాధ్వనిని విని ధృతరాష్ట్రుడు భయపడి 'ఇదేమి అలజడి' అని విదురుడిని అడిగాడు. విదురుడు అతనితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ధృతరాష్ట్రుడు ఆ మహాధ్వనిని విని, మొదట భయపడ్డాడు. ఇది 'ఫలానా' ధ్వని అని తెలిశాక సంతోషించాడు.

**క. భూరిభుజుం డర్జునుఁ డతి । శూరుఁడు దనయస్త్రవిద్యఁ జూపఁగ రంగ**
**త్ప్రారంభుఁ డయిన నతని న । వారితముగఁ బొగడుజనరవం బిది యధిపా! 23**

**ప్రతిపదార్థం:** అధిపా= ఓ రాజా!; ఇది; భూరి, భుజుండు= పెద్దభుజాలు గలవాడు; అతి, శూరుఁడు= మిక్కిలి పరాక్రమవంతుడు - అయిన; అర్జునుఁడు; తన, అస్త్ర, విద్యన్; చూపఁగన్; రంగత్+ప్రారంభుఁడు+అయినన్= ప్రకాశిస్తున్న ప్రారంభం కలవాడు కాగా; అతనిన్= ఆ అర్జునుని; అవారితముగన్= అడ్డులేకుండగా; పొగడు= కొనియాడు; జన, రవంబు= జనులయొక్కశబ్దం.

**తాత్పర్యం:** ఓ రాజా! ఇది - గొప్పభుజాలు కలవాడు, మిక్కిలి పరాక్రమవంతుడు అయిన అర్జునుడు - తన అస్త్రవిద్యాప్రదర్శనను, శోభాయమానంగా ప్రారంభించగా, అతడిని ఎడతెరిపిలేకుండా ప్రశంసించే ప్రజల ధ్వని.

**క. అనవుడు ధృతరాష్ట్రుఁడు దన । మనమున సంతోషమంది మానుగ వీనుల్**
**గనిన ఫల మిపుడు గంటిన్ । వినఁ గంటినిఁ బాండుసుతుల విద్యాశక్తుల్. 24**

**ప్రతిపదార్థం:** అనవుడు= అని విదురు డనగా; ధృతరాష్ట్రుఁడు; తన, మనమునన్= తనయొక్క మనస్సులో; సంతోషము+అంది= సంతోషాన్ని పొంది; మానుగన్= ఒప్పుగా; వీనుల్= చెవులు; కనిన= పొందిన; ఫలము; ఇప్పుడు; కంటిన్= పొందాను; పాండు, సుతుల, విద్యా, శక్తుల్= పాండురాజుకొడుకుల విద్యలలోని సామర్థ్యాలను; వినన్+కంటిని= వినగలిగాను.

**తాత్పర్యం:** అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడు, తన మనస్సులో సంతోషించి 'చెవులున్న ఫలాన్నిప్పుడు పొందాను; పాండుకుమారుల విద్యాశక్తులనుగూర్చి ఇప్పుడు వినగలిగాను' అన్నాడు.

**క. భూరినిజద్యుతితోడఁ బృ । థారణిసంభూతపాండవాగ్నిత్రితయం**
**బారఁగ నస్మత్కులదురి । తోరుతరారణ్యదాహ మున్నతిఁ జేయున్. 25**

**ప్రతిపదార్థం:** పృథా+అరణి, సంభూత, పాండవ+అగ్ని, త్రితయంబు= కుంతి అనే అరణిలో పుట్టిన పాండవులనే అగ్నులు మూడు; భూరి, నిజ, ద్యుతి, తోడన్= గొప్పదైన తమకాంతితో; ఆరఁగన్= పూర్తిగా; అస్మత్+కుల, దురిత+ఉరుతర+అరణ్య, దాహము= నా వంశంయొక్క పాపమనే మిక్కిలి పెద్ద అరణ్యాన్ని కాల్చటం; ఉన్నతిన్= గొప్పగా; చేయున్= చేయగలవు.

**తాత్పర్యం:** కుంతి అనే అరణిలో పుట్టిన మూడుఅగ్నులూ (అంటే ధర్మరాజు, భీముడు, అర్జునుడు) తమ గొప్పకాంతితో నావంశంయొక్క పాపమనే పెద్దఅరణ్యాన్ని పూర్తిగా దహించివేయగలవు.

**విశేషం:** అలం: రూపకం. కుంతికి పుట్టిన ముగ్గురు కొడుకులు త్రేతాగ్నులనీ, ఆ ముగ్గురూ కురువంశంలో పుట్టిన పాప మనే అరణ్యాన్ని దహించివేస్తారనీ, అప్రయత్నంగా ధృతరాష్ట్రుడే అనటంలో - పాండవుల పరాక్రమంమాత్రమే కాక, వాళ్ళ

వ్యక్తిత్వాల పవిత్రత, అంతేకాక మున్ముందు మహాభారతసంగ్రామంలో ఈ ముగ్గురే కౌరవులను హతమారుస్తారన్న భావికథార్థం, 14వ పద్యంలోవలె వాచ్యంగా కాకుండా వ్యంగ్యరమణీయంగా ధ్వనిస్తున్నాయి.

## అర్జునుండు తనయస్త్రవిద్యాకౌశలంబు సూపుట (సం.1-125-18)

**వ. అని పొగడుచుండ నర్జునుం డాచార్యుననుమతంబున నస్త్రలాఘవవైచిత్ర్య ప్రకాశనపరుం డయి యెల్లవారును జూచుచుండ. 26**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పొగడుచున్+ఉండన్; అర్జునుండు; ఆచార్య+అనుమతంబునన్= ద్రోణాచార్యునియొక్క అనుమతితో; అస్త్ర, లాఘవ, వైచిత్ర్య, ప్రకాశన, పరుండు+అయి= అస్త్రవిద్యానైపుణ్యంలోని విచిత్రాన్ని (అనగా ఆశ్చర్యకరాలైన నానావిధ అస్త్ర విద్యా విన్యాసాలను) ప్రకటించటమే ప్రధానమైనదానినిగా కలవాడై; ఎల్లవారును= అందరును; చూచుచున్+ఉండన్= చూస్తుండగా.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు పొగడుతూ ఉండగా అర్జునుడు ద్రోణాచార్యుని అనుమతితో, మంత్రప్రధానాలైన గొప్పగొప్ప అస్త్రాలను ప్రయోగించే విద్యలోగల అద్భుత నైపుణ్యాలను ప్రదర్శించటంలో ఆసక్తికలవాడై, అక్కడున్న వాళ్ళందరూ చూస్తూ ఉండగా....

**సీ. ఆగ్నేయశరమున నతిభీకరాగ్నియు । వారుణాస్త్రమున దుర్వారజలము**
**ననిలబాణంబున నధికానిలంబును । మేఘాస్త్రమున మహామేఘచయముఁ**
**బుట్టించు మఱియును భూమిబాణంబున । భూప్రవిష్టుం డగు, భూరిఘోర**
**శైలబాణంబున శైలరూపము దాల్చు । వీరుఁ, డదృశ్యాస్త్రవిద్యపేర్మిఁ**

**తే. దా నదృశ్యదేహుం డగుఁ, దత్క్షణంబ । హ్రస్వుఁ డగు దీర్ఘుఁ డగు సూక్ష్ముఁ డగు రయంబు**
**తోడ రథమధ్యగతుఁ డగు ధూర్గతుండు । నగు మహీతలగతుఁ డగు నద్భుతముగ. 27**

**ప్రతిపదార్థం:** వీరుఁడు= వీరుడైన అర్జునుడు; అద్భుతముగ= ఆశ్చర్యకరంగా; ఆగ్నేయశరమునన్= అగ్నిసంబంధమైన బాణంచేత; అతి, భీకర+అగ్నియు= మిక్కిలి భయంకరమైన నిప్పును; వరుణ+అస్త్రమునన్= వరుణసంబంధమైన అస్త్రంచేత; దుర్+వార, జలమున్= ఆపటానికి సాధ్యం కాని నీటిని; అనిలబాణంబునన్= వాయుసంబంధమైన బాణంచేత, అంటే వాయవ్యాస్త్రంచేత; అధిక+అనిలంబును= మిక్కిలిగాలిని; మేఘ+అస్త్రమునన్= మేఘసంబంధమైన అస్త్రంచేత; మహా, మేఘ, చయమున్= పెద్దమేఘాల సమూహాన్ని; పుట్టించున్; మఱియును= ఇంకా; భూమి, బాణంబునన్= భూబాణంచేత; భూ, ప్రవిష్టుండు+అగున్= భూమిలో ప్రవేశించినవాడౌతాడు; భూరి, ఘోర, శైల, బాణంబునన్= పెద్దది, భయంకరమైనది అయిన పర్వతబాణంచేత; శైల, రూపము= పర్వతరూపాన్ని; తాల్చున్= ధరిస్తాడు; అదృశ్య+అస్త్ర విద్య, పేర్మిన్= అగుపించకుండ చేసే అస్త్రవిద్యలోని అతిశయంచేత; తాను; అదృశ్య, దేహుండు+అగున్= అగుపించని దేహం కలవాడౌతాడు; తత్+క్షణంబు+అ= ఆ నిమిషాననే; హ్రస్వుఁడు, అగున్= పొట్టివాడవుతాడు; దీర్ఘుఁడు+అగున్= పొడవైనవాడవుతాడు; సూక్ష్ముఁడు+అగున్= సన్నని వాడవుతాడు; రయంబుతోడ= వేగంతో; రథ, మధ్య, గతుఁడు+అగున్= రథంయొక్క మధ్యానికి వెళ్ళినవాడౌతాడు; ధూర్గతుండున్+అగున్ = నొగలనడుమ ఉన్నవాడవుతాడు; మహీతల, గతుఁడు+అగున్= భూమిమీద ఉన్నవాడౌతాడు.

**తాత్పర్యం:** వీరుడైన అర్జునుడు అందరికీ ఆశ్చర్యం కలిగేటట్లు ఆగ్నేయాస్త్రంతో అతిభయంకరమైన అగ్నిని, వారుణాస్త్రంతో వారింప సాధ్యంగాని నీటిని, వాయువ్యాస్త్రంచేత విపరీతమైన గాలిని, మేఘాస్త్రంచేత మహామేఘ సమూహాన్ని పుట్టించాడు. అంతేకాక భౌమాస్త్రంచేత భూమిలో ప్రవేశించాడు. శైలాస్త్రంచేత పర్వతరూపాన్ని పొందాడు. అదృశ్యాస్త్రంచేత అగుపడకుండా పోయాడు. అప్పటికప్పుడు పొట్టివాడయ్యాడు; పొడుగువాడయ్యాడు; సన్ననివాడయ్యాడు; మహావేగంగా రథమధ్యంలోకి వెళ్ళాడు, వెంటనే నొగలపై కూర్చున్నాడు; నేలమీద నిలిచాడు.

**వ. మఱియుం బాఱెడుసింహవ్యాఘ్రవరాహాదిమృగంబుల ముఖంబులం దొక్కొక్కయ మ్మేసినట్ల యేనేసి యమ్ము లతిలాఘవంబున నేసియు, రజ్జుసమాలంబితం బయిన గోశృంగంబునం దేకవింశతిశరంబులు వరుసన నాట నేసియు, ని ట్లస్త్రవిద్యావైచిత్ర్యంబు మెఱసి గదాఖడ్గాదివివిధాయుధదక్షతం జూపి యర్జునుండు జనుల కాశ్చర్యంబు సేయుచున్నంతఁ, గర్ణుండును నిజవిద్యాకౌశలంబు మెఱయ సమకట్టి రంగద్వారంబున నిలిచి భుజాస్ఫాలనంబు సేసిన. 28**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; పాఱెడు, సింహ, వ్యాఘ్ర, వరాహ+ఆది, మృగంబుల, ముఖంబుల+అందు= పరుగెత్తుతున్న సింహం, పెద్దపులి, పంది మొదలయిన జంతువులయొక్క నోళ్ళలో; ఒక్కొక్క; అమ్ము+ఏసినట్లు+అ= బాణాన్ని వేసినవిధంగా; ఏనేసి, అమ్ములు= ఐదేసిబాణాలు; అతిలాఘవంబునన్= మిక్కిలిసులువుగా; ఏసియున్= వేసినతర్వాత; రజ్జు, సమ్+ ఆలంబితంబు+అయిన= త్రాటికి చక్కగా వేలాడగట్టబడిన; గో, శృంగంబు+అందు= ఆవుకొమ్మునందు; ఏకవింశతి, శరంబులు= ఇరవైఒక్కబాణాలు; వరుసన, నాటన్+ఏసియున్= నాటుకొనేటట్లు; వేసి; ఇట్లు+అస్త్ర, విద్యా, వైచిత్ర్యంబు= ఈవిధంగా అస్త్రవిద్యలోని విచిత్రతను - అంటే అస్త్రవిద్యలోని ఆశ్చర్యకరమైన తన నైపుణ్యాన్ని; మెఱసి= ప్రదర్శించి; గదా, ఖడ్గ+ఆది, వివిధ+ఆయుధ, దక్షతన్= గద, కత్తి మొదలయిన పలువిధాల ఆయుధాలలోని నేర్పును; చూపి; అర్జునుండు; జనులకు+ ఆశ్చర్యంబు+ చేయుచున్+ఉన్న+అంతన్= ప్రజలకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుండగా; కర్ణుండును= కర్ణుడుకూడా; నిజ, విద్యా, కౌశలంబు= తనయొక్క విద్యలోని నేర్పును; మెఱయన్= ప్రదర్శించుటకు; సమకట్టి= పూనుకొని; రంగ, ద్వారంబునన్; నిలిచి; భుజా+ఆస్ఫాలనంబు= భుజం చరచటాన్ని; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** అంతేకాక పరుగెత్తుతున్న సింహం, పెద్దపులి, పంది మొదలయిన మృగాలనోళ్ళలో ఒక్కొక్క బాణాన్ని వేసినట్లు ఐదేసిబాణాలను అతిసులభంగా వేసి, తర్వాత త్రాటికి వేలాడగట్టబడిన ఆవుకొమ్మున నాటుకొనేటట్లు వరుసగా ఇరవయ్యొక్క బాణాలను వేశాడు. ఈ విధంగా తన అస్త్రవిద్యావిచిత్రాలను ప్రదర్శించి, గద, కత్తి మొదలయిన అనేకవిధాలైన ఆయుధవిద్యల్లో తనకున్న నైపుణ్యాన్ని చూపి జనులను ఆశ్చర్యపరవశులను చేస్తుండగా; కర్ణుడు తన విద్యానైపుణ్యాన్ని ప్రదర్శింప పూనుకొని రంగద్వారంలో నిలిచి భుజం చరచగా.

**విశేషం:** రంగస్థలంలో పరుగెత్తే సింహాలకు, పెద్దపులులకు ప్రసక్తి ఎట్లని కొంతకు కొంత సందేహం కలగటం సహజం. రంగస్థలం సువిశాలమైన భద్రతకు తగిన ఏర్పాట్లు చేసినప్పుడు ఆయామృగాలను ప్రవేశపెట్టటం అసాధ్యం కాదు. కాని అవి లోహమయాలైన కృత్రిమజంతువులు అనే సూచన కొన్ని సంస్కృత భారత పాఠాలలో ఉన్నట్లు మహాభారత సంశోధితప్రతిలో పేర్కొనటం జరిగింది. "భ్రమతశ్చ వరాహస్య లౌహస్యప్రముఖే సమమ్ పంచబాణానసంసక్తా సమ్ముమో చైకబాణవత్." 'లౌహస్య' అనటానికి 'భ్రమరస్య, కామస్య, సింహస్య' అనే పాఠాలుకూడా ఉన్నాయి". - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.328.

**మ. జనులెల్లం గడుసంభ్రమింపఁగ నజస్రంబై భుజాస్ఫాలన**
**ధ్వని శైలప్రకరంబుపైఁ బడు మహాదంభోళిశబ్దంబొకో**
**యన వీతెంచినఁ బాండవుల్ సనిరి ద్రోణాచార్యు డాయన్, సుయో**
**ధను వేష్టించిరి తమ్ము లందఱును దద్ద్వారంబు వీక్షించుచున్. 29**

**ప్రతిపదార్థం:** జనులు+ఎల్లన్= ప్రజలందరు; కడున్= మిక్కిలి; సంభ్రమింపఁగన్= భయపడగా; అజస్రంబు+ఐ= ఎడతెరపిలేనిదై; భుజా+ఆస్ఫాలధ్వని= భుజం చరచటంవలన కలిగినశబ్దం; శైల, ప్రకరంబు, పైన్= కొండల సమూహం మీద; పడు= పడుతూఉన్న; మహా, దంభోళి, శబ్దంబు+ఒకో= గొప్పవజ్రాయుధంయొక్కశబ్దమా; అనన్= అనేటట్లు; వీతెంచినన్= రాగా; పాండవులు; ద్రోణాచార్యు డాయన్= ద్రోణాచార్యుణ్ణి సమీపించటానికి; చనిరి= వెళ్ళారు; తమ్ములు+అందరును= (దుర్యోధనుడి) తమ్ములందరు; తద్+ద్వారంబు= ఆ వాకిలిని - అంటే ఆ శబ్దం వచ్చినవాకిలిని; వీక్షించుచున్= చూస్తూ; సుయోధనున్, వేష్టించిరి= దుర్యోధనుని చుట్టూ చేరారు.

**తాత్పర్యం:** ప్రజలంతా ఎంతో భయపడి ఎడతెరిపిలేనిదై భుజం చరచటంవలన పుట్టిన ఆ శబ్దం, పర్వత సమూహంపై పడే మహావజ్రాయుధశబ్దమా అనేటట్లు రాగా, పాండవులు ద్రోణాచార్యునిదగ్గరకు చేరారు. దుర్యోధనుని తమ్ముళ్లందరూ శబ్దం వచ్చిన ఆ వాకిలివైపు చూస్తూ దుర్యోధనునిచుట్టూ చేరారు.

**విశేషం:** ఆ ధ్వనితీవ్రత కర్ణునిహృదయబాధాతీవ్రతను చక్కగా ధ్వనింపచేస్తున్నది.

**వ. అంత. 30**

**తాత్పర్యం:** అప్పుడు.

### కర్ణుఁడు ప్రవేశించి అర్జును నధిక్షేపించుట (సం. 1-126-2)

**శా. సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితున్**
**బాలార్క ప్రతిమున్ శరాసనధరున్ బద్ధోగ్రనిస్త్రింశు శౌ**
**ర్యాలంకారు సువర్ణవర్ణు ఘనుఁ గర్ణాఖ్యున్ జగత్కర్ణపూ**
**ర్ణాలోలద్గుణుఁ జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్. 31**

**ప్రతిపదార్థం:** అచ్చటన్= అక్కడ; సాల, ప్రాంశున్= మద్దిచెట్టువలె పొడవైనవాడిని; నిజ+ఉత్+జ్వలత్+కవచున్= సహజమై మిక్కిలి ప్రకాశిస్తున్న కవచం గలవాడిని; శశ్వత్+కుండల+ఉద్భాసితున్= శాశ్వతాలయిన కుండలాలతో గొప్పగా వెలుగుతున్నవాడిని; బాల+అర్క, ప్రతిమున్= బాలసూర్యునిపోలినవాడిని; శర+ఆసన, ధరున్= ధనుస్సును ధరించినవాడిని; బద్ధ+ఉగ్ర, నిస్త్రింశున్= కట్టబడిన భయంకరమైన ఖడ్గం కలవాడిని; శౌర్య+అలంకారున్= శౌర్యమే అలంకారంగా కలవాడిని; సువర్ణ, వర్ణున్= బంగారువన్నెకలవాడిని; ఘనున్= గొప్పవాడిని; జగత్+కర్ణ, పూర్ణ+ఆలోలత్+గుణున్= లోకంయొక్క చెవులలో నిండి, వ్యాపిస్తున్న గుణాలు కలవాడిని; కర్ణ+ఆఖ్యున్= కర్ణుడనేపేరు కలవాడిని; చూచి, చూపఱు= చూచేవారు; ప్రభూత+ఆశ్చర్యులు+ఐరి= మిక్కిలి ఆశ్చర్యం కలవాళ్ళయ్యారు.

**తాత్పర్యం:** మద్దిచెట్టువలె ఎంతో ఎత్తైనవాడు, సహజకవచకుండలాలతో చాలా ఎక్కువగా ప్రకాశించేవాడు, బాలసూర్యుడిని పోలినవాడు, ధనుస్సును ధరించినవాడు, మొలలో భయంకరమైన కత్తిని కట్టుకొన్నవాడు, శౌర్యమే

అలంకారంగా కలవాడు, బంగారువన్నెవాడు, గొప్పవాడు, లోకం చెవులలో నిండి వ్యాపిస్తున్న మంచిగుణాలు కలవాడు అయిన కర్ణుడిని చూచి ప్రేక్షకులంతా ఎంతో ఆశ్చర్యపడ్డారు.

**విశేషం:** మహాభారతంలో ఇది ఒక ప్రసిద్ధ పద్యం; నన్నయనాటకీయరచనకు పతాకవంటిపద్యం. హస్తినాపురరంగమధ్యంలో ప్రేక్షకులు చూచిన కర్ణునిమహనీయవ్యక్తిత్వాన్ని, దీప్తిని, విజృంభణాన్ని పాఠకుల కంటికి కట్టినట్లు వ్రాసిన ఛాయాచిత్రంవంటి పద్యం. ఇందులోని ఉదాత్తమనోహరశైలి, శార్దూలవృత్తం కర్ణుని ఔన్నత్యవిజృంభణలకు చక్కని ఉద్దీపకాలు. నన్నయ ప్రసన్నకథాకవితలో స్థిరచిత్రవర్ణనశిల్పానికి ఈ పద్యం ఒక మచ్చుతునక. 17వ పద్యంలోని అర్జునునివర్ణనకు ఇది దీటుగా నిలుస్తుంది. ప్రసాదమిశ్రితమైన ఓజోగుణం ఈ పద్యరచనలోని విభావవిస్ఫోరకంగా రాణిస్తున్నది.

**వ. కర్ణుండును జనుల నందఱ నదల్చి చొత్తెంచి, రంగమధ్యంబున నిలిచి, కలయం జూచి, కృపద్రోణాచార్యులకు నమస్కరించి, సజలజలధరధ్వానగంభీరవచనంబుల నర్జును నాక్షేపించి యి ట్లనియె. 32**

**ప్రతిపదార్థం:** కర్ణుండును= కర్ణుడుకూడా; జనులన్+అందరన్= ప్రజలను అందరినీ; అదల్చి= బెదిరి తొలగిపోయేటట్లు చేసి; చొచ్చు+తెంచి= ప్రవేశించి; రంగమధ్యంబునన్= రంగమధ్యంలో; నిలిచి= నిలబడి; కలయన్+చూచి= అంతటా చూచి; కృప, ద్రోణ+ఆచార్యులకున్; నమస్కరించి; సజల, జలధర, ధ్వాన, గంభీర, వచనంబులన్= నీటితో కూడిన మేఘంయొక్క ఉరుములవలె గంభీరాలైన మాటలచేత; అర్జునున్= అర్జునుణ్ణి; ఆక్షేపించి= అడ్డగించి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కర్ణుడుకూడా ప్రజలంతా బెదిరి తొలగిపోయేటట్లు చేసి ప్రవేశించి, రంగమధ్యంలో నిలిచి, అంతటా కలయ చూచి కృపద్రోణాచార్యులకు నమస్కరించి, నీటితో కూడిన మేఘం ఉరిమినట్లు గంభీరంగా మాట్లాడుతూ అర్జునుడిని అడ్డగించి ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** ఇది కర్ణునిచలద్రూపవర్ణన; నన్నయనాటకీయరచన, కర్ణుడు జనులందరిని అదల్చి ప్రవేశించటం, రంగమధ్యంలో నిల్చి కలయచూడటం, కృపద్రోణాచార్యులకు నమస్కరించటం, అర్జునునికి అడ్డంగా నిలబడి గంభీరస్వరంతో మాట్లాడటం - భావుకుడైన పాఠకుడు చలనచిత్రంలోవలె ఈ వచనంలో దర్శించవచ్చును.

**క. నీవ కడునేర్పుకాఁడవు । గా వలవదు; వీనిఁ గొన్ని గఱచితి మేమున్**
**నీవిద్యలెల్లఁ జూపుదు । మే వీరుల సూచి మేలుమే లని పొగడన్. 33**

**ప్రతిపదార్థం:** నీవు+అ= నీవే; కడున్= మిక్కిలి; నేర్పుకాఁడవు= నేర్చినవాడివి; కావలవదు= కానక్కరలేదు; ఏమున్= మేము కూడ; వీనిన్= ఈ విద్యలను; కొన్ని= కొన్నింటిని; కఱచితిమి= నేర్చుకొన్నాము; నీ, విద్యలు+ఎల్లన్= నీవు చూపించిన విద్య లన్నింటిని; వీరులు+అ= వీరులైనవారే; చూచి; మేలు; మేలు; అని; పొగడన్= కొనియాడగా; చూపుదుము+ఎ= చూపుతాంకదా!

**తాత్పర్యం:** నీవే పెద్దనేర్పరి కానక్కరలేదు. మేముగూడా ఈ విద్యలు కొన్ని నేర్చి ఉన్నాం. నీవు చూపిన అన్ని విద్యలు - ఈ సామాన్యజనులు కాదు - వీరులైనవాళ్ళుకూడా చూచి మేలు మే లని పొగడేటట్లు చూపుతాం గదా!

**విశేషం:** ఇది నన్నయనాటకీయసంభాషణ, కర్ణునిస్వభావానికి అద్దంపట్టే సంభాషణ. స్వాతిశయంవైపు మొగ్గుతున్న అతని ఆత్మవిశ్వాసాన్ని, అర్జునమాత్సర్యంవైపు మొగ్గుతున్న అతనివిద్యాస్పర్ధను ధ్వనింపజేయటం ఇందులో చూడవచ్చు. అధిక్షేపోక్తికి ఇదొక చక్కని ఉదాహరణం.

**క. అనిన నినతనయుపలుకులు । జనులకు విస్మయము, సవ్యసాచికిఁ గోపం**
**బును సిగ్గును, మఱి దుర్యో । ధనునకుఁ బ్రీతియును జేసెఁ దత్క్షణమాత్రన్. 34**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; ఇన, తనయు, పలుకులు= సూర్యునికుమారుడైన కర్ణునిమాటలు; జనులకు; విస్మయము= ఆశ్చర్యాన్ని; సవ్యసాచికిన్= అర్జునునికి; కోపంబును= కోపాన్ని; సిగ్గును; మఱి= మరియు; దుర్యోధనునకున్; ప్రీతియును= సంతోషాన్నీ; తద్+క్షణ, మాత్రన్= ఆ నిమిషంలోనే; చేసెన్= కలుగజేశాయి.

**తాత్పర్యం:** కర్ణునిమాటలు ఆ క్షణాన ప్రజలకు ఆశ్చర్యాన్నీ, అర్జునునికి కోపాన్నీ, సిగ్గునూ, దుర్యోధనునికి సంతోషాన్నీ కలిగించాయి.

**విశేషం:** అలం: ఉల్లేఖం; చూపరులకు కర్ణుని భుజస్ఫాలనం భయాన్నీ, ఆకారం అద్భుతాన్నీ కలిగించాయి. అనుకోని విధంగా అతడు అర్జునుణ్ణి ధిక్కరించి పలికిన మాటలు వివిధవ్యక్తులకు వివిధభావాలు కలిగించాయి. ప్రజలకు అసంభవమైనది సంభవమైనట్లు ఆశ్చర్యం కలిగించాయి. తనకు ఎవ్వరూ సాటిలేరని అనుకొంటున్న అర్జునునికి కోపాన్నీ, సిగ్గునూ కలిగించాయి. పాండవమధ్యమునితో దీటైన వీరుడు తనవైపు లేడని నిరాశతో ఉన్న దుర్యోధనునికి సంతోషాన్ని కలిగించాయి.

**వ. అంత ద్రోణుచేత ననుజ్ఞాతుం డయి కర్ణుం డర్జునుచూపిన యస్త్రవిద్యావిశేషంబులెల్ల నశ్రమంబునఁ జూపినఁ జూచి, దుర్యోధనుండు దానుం దమ్ములును గర్ణునిం గౌఁగిలించుకొని 'నాతో బద్ధసఖ్యుండ వయి నాకును బాంధవులకును హితంబు సేసి నారాజ్యభోగంబులను నీవును నుపయోగింపు' మనిన 'నట్ల చేయుదు' నని కర్ణుం డాతనితోడి యిష్టసఖిత్వంబున కొడంబడి, 'యిమ్మూఁగిన రాజలోకంబును నీవును జూడఁ బార్థుతో ద్వంద్వయుద్ధంబు చేయవలయు' ననిన ధార్తరాష్ట్రమధ్యంబున నున్న యక్కర్ణుం జూచి పార్థుం డి ట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; ద్రోణునిచేతన్; అనుజ్ఞాతుండు+అయి= అనుమతింపబడినవాడై; కర్ణుండు; అర్జునుడు, చూపిన= అర్జునుడు ప్రదర్శించిన; అస్త్ర, విద్యా, విశేషంబులు+ఎల్లన్= అస్త్రవిద్యలోని ప్రత్యేకతలన్నింటిని; అ(శమంబునన్= శ్రమలేకుండ - సులభంగా; చూపినన్= చూపగా; చూచి; దుర్యోధనుండు; తానున్= తానునూ; తమ్ములును= తమ్ములున్నూ; కర్ణునిన్; కౌఁగిలించుకొని; నాతో (దుర్యోధనుడితో); బద్ధసఖ్యుండవు+అయి= కట్టబడినస్నేహం కలవాడివై; నాకును; బాంధవులకును= చుట్టాలకూ; హితంబు+చేసి= మేలుచేసి; నా, రాజ్యభోగంబులను; నీవును= నీవు కూడా; ఉపయోగింపుము= వినియోగించుకొమ్ము; అనినన్= అని అనగా; అట్లు+అ= అట్లే; చేయుదును= చేస్తాను; అని= ఆ విధంగా; కర్ణుండు; అతనితోడన్= దుర్యోధనునితో; ఇష్టసఖిత్వంబునకు= ఇష్టమైన స్నేహానికి; ఒడంబడి= ఒప్పుకొని; ఈ+మూగిన, రాజ, లోకంబును= ఈ చేరిన రాజుల సమూహమూ; నీవును= నీవూ; చూడన్= చూస్తుండగా; పార్థుతో= అర్జునునితో; ద్వంద్వ, యుద్ధంబు= జతగా పోరాడేయుద్ధం; చేయవలయున్= చేయాలి; అనినన్= అనగా; ధార్తరాష్ట్ర, మధ్యంబునన్+ఉన్న= ధృతరాష్ట్రునికుమారులైన కౌరవులమధ్యన ఉండే; ఆ+కర్ణున్; చూచి; పార్థుండు= అర్జునుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అప్పుడు ద్రోణుడు అనుమతించగా కర్ణుడు, అర్జునుడు చూపిన అస్త్రవిద్యావిశేషాలన్నీ అతి సులభంగా చూపాడు. అది చూచి దుర్యోధనుడు - తాను, తమ్ములు కర్ణుణ్ణి కౌగలించుకొని, 'నాతో చెలిమి చేసి నాకు, బంధువులకు మేలు కూర్చి, నా రాజ్యభోగాలు నీవుగూడా అనుభవించు' మని అన్నాడు. కర్ణుడు అట్లే అని అతనితో స్నేహంచేయటానికి సమ్మతించి, 'ఇక్కడ చేరిన ఈ రాజసమూహం, నీవూ చూస్తుండగా అర్జునునితో ద్వంద్వయుద్ధం చేయా' లని అన్నాడు. అప్పుడు కౌరవులమధ్యనున్న ఆ కర్ణుడిని చూచి అర్జునుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'నా రాజ్యభోగంబులను నీవు నుపయోగింపుము' - అనే దానికి 'నన్నుం గురురాజ్యం బేలించి నా యైశ్వర్యంబు...' అనే పాఠాంతరం కొన్నిప్రతులలో ఉన్నది. మూలం: అహం చ కురురాష్ట్రం చ యథేచ్ఛ ముపభుజ్యతామ్ (పి.పి.యస్. ప్రతి, పుట. 850) - శ్రీమదాంధ్రమహాభారతసంశోధిత ప్రతి, పుట. 330.

**క. పిలువంగఁబడక సభలకు । బలిమిం జని పలుకు పాపభాగుల లోకం**

**బులకుఁ జన వేఁడి పలికెదు । పలువ! యెఱుంగవు పరాత్మపరిమాణంబుల్. 36**

**ప్రతిపదార్థం:** పిలువంగన్+పడక= పిలువబడకుండ - ఆహ్వానం లేకుండా; సభలకున్= సభలకు; బలిమిన్= బలంతో; చని=వెళ్ళి; పలుకు= మాట్లాడే; పాప, భాగుల, లోకంబులకున్= పాపం పొందినవాళ్ళలోకాలకు, చనన్= వెళ్ళటానికి, వేఁడి= కోరి; పలికెదు= మాటాడుతున్నావు; పలువ= దుర్మార్గుడా; పర+ఆత్మ, పరిమాణంబుల్= ఎదుటివాళ్ళయొక్క, నీయొక్క కొలదులు; ఎఱుంగవు= తెలియవు.

**తాత్పర్యం:** పిలుపు లేకుండానే సభలకు బలగర్వంతో వెళ్ళి, నోటికివచ్చినట్లు మాట్లాడే పాపాత్ములు వెళ్ళే లోకాలకు (నరకాలకు) పోవాలనుకొని మాట్లాడుతున్నావు. దుర్మార్గుడా! నీవు ఎదుటివాళ్ళకొలది, నీ కొలది తెలియనివాడవు.

**క. అనిన విని పార్థునకు ని । ట్లనియె నినాత్మజుఁడు 'దుర్బలాశ్వాసక్షే**

**పనిబంధమ్ములు వలుకక । ఘననిశితాస్త్రములఁ బలుకఁ గడఁగుము నాతోన్'. 37**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ఇన+ఆత్మజుఁడు= సూర్యునియొక్క కుమారుడైన కర్ణుడు; పార్థునకున్= అర్జునునితో; ఇట్లు+అనియెన్; నాతోన్=నాతో; దుర్+బల+ఆశ్వాస, క్షేప, నిబంధమ్ములు= బలహీనులను ఊరడించటంకోసం కాలంపుచ్చే మాటలు; పలుకక; ఘన, నిశిత+అస్త్రములన్= గొప్ప వాడియైన బాణాలతో; పలుకన్= పలకటానికి; కడఁగుము= ప్రయత్నించుము.

**తాత్పర్యం:** అర్జునునిమాటలు విని కర్ణుడు - 'బలహీనులను ఊరడించటానికి చెప్పేమాటలు మాని, గొప్ప పదునైనబాణాలతో మాట్లాడుము' అని పలికాడు.

**విశేషం:** దుర్బలాశ్వాసక్షేపనిబంధమ్ములు - అనే దానికి మూలం: "సంక్షేపైః దుర్బలాశ్వాసైః శరైః కథయ భారత" - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట 330. 'చేతకానివారికి సంతోషం కలిగించే పొల్లుమాటలు కట్టిపెట్టి, వాడిబాణాలతో సమాధానం చెప్పుము' - అని పలికిన కర్ణునివాక్యంలో అత్యంతతిరస్కృతవాచ్యధ్వని ఉన్నది. బాణాలతో పలకటం - అనేది లక్ష్యార్థవిశేషం. 'అర్జునా! నీవలె నేను వాచాశూరుడిని కాదు. కార్యశూరుడిని. మాటలతో కాలం వ్యర్థం చేయక చేతనైతే యుద్ధం చేయుము' అన్నది కర్ణుని అధిక్షేపం.

**క. ఈ రంగభూమి యస్త్రవి । శారదు లగువారి కెల్ల సామాన్యముగా**

**కారయ వీరికిఁ జొర నగు । వీరికిఁ గా దను విచారవిషయము గలదే?. 38**

**ప్రతిపదార్థం:** ఆరయన్= విచారిస్తే; ఈ, రంగ, భూమి; అస్త్ర, విశారదులు+అగు, వారికి+ఎల్లన్= అస్త్రాలలో నేర్పరులైనవారి కందరికి; సామాన్యము, కాక= సమానం కాకుండా; వీరికిన్= వీళ్ళకు; చొరన్+అగున్= ప్రవేశించవచ్చు; వీరికిన్= వీళ్ళకు; కాదు+అను= ప్రవేశించకూడదనే; విచార, విషయము= ఆలోచించదగిన అంశం; కలదే= ఉన్నదా?

**తాత్పర్యం:** విచారించి చూస్తే ఈ రంగభూమి అస్త్రవిద్యావేత్తలందరికి సమానం గాకుండా - వీళ్ళకు ప్రవేశం ఉన్నది, వీళ్ళకు ప్రవేశం లేదు అని విచారించవలసింది ఏమైనా ఉన్నదా?

**వ. అని గర్వించి దుర్యోధనానుమతంబునఁ బార్థుతో ద్వంద్వయుద్ధంబు సేయంబూని రణసన్నద్ధుం డయి రవితనయుండు రంగమధ్యంబున నున్నంత, నర్జునుండును నాచార్యభ్రాతృచోదితుం డై యుగాంత కాలానలుండునుంబోలెఁ బ్రతిఘటించి నిలిచిన. 39**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; గర్వించి= పొగరుతోకూడి; దుర్యోధన+అనుమతంబునన్= దుర్యోధనునియొక్క అనుమతితో; పార్థుతో= అర్జునునితో; ద్వంద్వయుద్ధంబు= ఇద్దరు ఒకరితో ఒకరు చేసేయుద్ధం; చేయన్= చేయటానికి; పూని= ప్రయత్నించి; రణ, సన్నద్ధుండు+అయి= యుద్ధంకోసం బాగా సిద్ధమైనవాడై; రవి, తనయుండు= సూర్యునియొక్క కుమారుడైన కర్ణుడు; రంగమధ్యంబునన్= రంగమధ్యంలో; ఉన్న+అంతన్= ఉండిన సమయంలో; అర్జునుండును=అర్జునుడు కూడా; ఆచార్య, భ్రాతృ, చోదితుండు+ఐ= గురువులచేత, సోదరులచేత పురికొల్పబడినవాడై; యుగ+అంత; కాల+అనలుండునున్, పోలెన్= ప్రళయకాలంలోని అగ్నివలె; ప్రతిఘటించి=ఎదిరించి; నిలిచినన్= నిలువగా.

**తాత్పర్యం:** అని కర్ణుడు గర్వపడి దుర్యోధనుని అనుమతితో - అర్జునునితో ద్వంద్వయుద్ధం చేయటానికై సిద్ధమై రంగమధ్యంలో ఉండగా, గురువులచేత, సోదరులచేత ప్రేరేపింపబడినవాడై అర్జునుడు ప్రళయకాలాగ్నివలె ఎదిరించి నిలువగా.

**విశేషం:** కర్ణుడు రంగప్రవేశం చేయగానే కురుకుమారులు రెండు వర్గాలుగా చీలిపోవటం కళ్ళకు కట్టినట్లు అందరికి అగుపించింది. కర్ణునికి మిత్రుడు, గురువు, దైవం అన్నీ దుర్యోధనుడే. అర్జునునికి గురువులు, సోదరులు మార్గదర్శకులు. పాండవులకు పెద్దలున్నారు. దుర్యోధనుడు తనకు తానే పెద్ద. అర్జునునిది ధర్మనిర్ణయం. కర్ణునిది, దుర్యోధనునిది స్వయంనిర్ణయం. ఇక ముందు కథలో ఈధోరణి ఇంతే! భావికురుకుమారవిభేదక్రమానికి ఇది నాంది.

## కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము (సం.1-126-23)

**మ. జనితామర్షణుఁ డంతఁ బార్థుపయిఁ బర్జన్యాస్త్ర మక్కర్ణుఁ డే**
**సె; నపారం బయి భూనభోంతరముఁ దజ్జీమూతయూథంబు గ**
**ప్పినఁ దద్ధ్వాంతతిరోహితాపఘనుఁ డై బీభత్సుఁ డుండెన్; విరో**
**చనుఁ డాత్మద్యుతి విస్తరించె సుతుపై సంప్రీతచేతస్కుఁ డై. 40**

**ప్రతిపదార్థం:** జనిత+అమర్షణుఁడు= పుట్టబడినకోపం గలవాడు; ఆ+కర్ణుఁడు; అంతన్= అప్పుడు; పార్థు, పయిన్= అర్జునునిమీద; పర్జన్య+అస్త్రము= మేఘాస్త్రాన్ని; ఏసెన్= వేశాడు; తత్+జీమూత, యూథంబు= దానియొక్కమేఘాలసమూహం; అపారంబు+అయి= హద్దు లేనిదై; భూ, నభస్+అంతరమున్= భూమ్యాకాశాల మధ్యప్రదేశాన్ని; కప్పినన్= కప్పివేయగా; బీభత్సుఁడు= అర్జునుడు; తద్+ధ్వాంత, తిరోహిత+అపఘనుఁడు+ఐ= ఆ చీకటిచేత మరుగుపడినదేహం కలవాడై; ఉండెన్; విరోచనుఁడు= సూర్యుడు; సంప్రీత, చేతస్కుఁడు+ఐ= మిక్కిలి ఆనందించిన మనస్సు కలవాడై; ఆత్మ, ద్యుతిన్= తన యొక్కకాంతిని; సుతుపైన్= కుమారుని (కర్ణుడి) మీద; విస్తరించెన్= ప్రసరించాడు.

**తాత్పర్యం:** కర్ణుడు కోపంతో అర్జునునిమీద మేఘాస్త్రాన్ని ప్రయోగించాడు. అంతులేని మేఘసమూహం భూమ్యాకాశమధ్యప్రదేశాన్ని కప్పివేయగా అర్జునుడు ఆ చీకటిలో మరుగుపడిపోయాడు. సూర్యుడు సంతోషించి కుమారుడైన కర్ణునిమీద తనకాంతిని ప్రసరించాడు.

**విశేషం:** 'తద్ధ్వాంత తిరోహితాపఘనుడై బీభత్సు డుండెన్' - అనేదానికి - తద్ధ్వాంతము వాయ వాయుశరముం బీభత్సు డేసెన్ - అనే పాఠాంతరమున్నది. మూలం: మేఘచ్ఛాయోపగూఢస్తు తతోఽదృశ్యత పాండవః । సూర్యాతప పరిష్వక్తః కర్ణోఽపి సమదృశ్యత. - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.331.

**వ. అయ్యవసరంబున దుర్యోధనుందొట్టి ధృతరాష్ట్రనందను లందఱుఁ గర్ణువలన నుండిరి; భీష్మద్రోణకృప పాండవులు పార్థువలన నుండి రంత. 41**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; దుర్యోధనున్+తొట్టి= దుర్యోధనుడు మొదలుకొని; ధృతరాష్ట్రనందనులు+ అందఱున్= కౌరవులందరూ; కర్ణువలనన్= కర్ణునివైపు; ఉండిరి; భీష్మ, ద్రోణ, కృప, పాండవులు; పార్థువలనన్= అర్జునునివైపు; ఉండిరి; అంతన్= అటుపై.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఒకవైపు దుర్యోధనుడుమొదలు ధృతరాష్ట్రునికొడుకులంతా కర్ణునిపక్షంలో నిలిచారు. మరొకవైపు భీష్ముడు, ద్రోణుడు, పాండవులు అర్జునునిపక్షంలో నిలిచారు. అప్పుడు.

**క. రవిసుతపార్థులఘోరా । హవమునకును వెఱచుచున్నయది కుంతి తదు**
**ద్భవఘనతరశరతిమిరౌ । ఘవృతాంగుఁ దనూజుఁ జూడఁ గానక వంతన్. 42**

**ప్రతిపదార్థం:** రవిసుత, పార్థుల, ఘోర+ఆహవమునకును= కర్ణార్జునులయొక్క భయంకరమైన యుద్ధానికి; వెఱచుచున్+ఉన్న, అది, కుంతి= భయపడుతూన్న కుంతీదేవి; తత్+ఉద్భవ, ఘనతర, శర, తిమిర+ఓఘ, వృత+అంగున్= దానినుండి పుట్టిన చాలాగొప్పదైన బాణంవలన కలిగిన చీకట్ల సమూహంచేత కప్పబడిన దేహం గలవాడిని; తనూజున్= కుమారుడిని, అర్జునుని; చూడన్+కానకన్= చూడలేక; వంతన్= దిగులుతో.

**తాత్పర్యం:** కర్ణార్జునులద్వంద్వయుద్ధం చూచి భయపడుతూన్న కుంతి, కర్ణునిపర్జన్యాస్త్రం (మేఘాస్త్రం) వలన కలిగినచీకట్లసమూహంచేత కప్పబడి, అర్జునుడు అగుపించకపోగా అప్పుడు.

**క. ధృతి దఱిఁగి మోహమూర్ఛా । న్విత యైనను సంభ్రమించి విదురుఁడు ప్రత్యా**
**గతజీవఁ జేసె నప్పడ । యతిశీతలచందనోదకాసేకమునన్. 43**

**ప్రతిపదార్థం:** ధృతి= ధైర్యం; తఱిఁగి= తగ్గి; మోహ, మూర్ఛా+అన్విత+ఐనను= మోహంవలన, మూర్ఛతో కూడుకొన్నది కాగా; విదురుడు; సంభ్రమించి= త్వరపడి; అప్పుడు+అ= అప్పటికప్పుడే; అతి శీతల, చందన+ఉదక+ఆసేకమునన్= మిక్కిలి చల్లని గంధపునీళ్లను చల్లటంచేత; ప్రతి+ఆగత, జీవన్= మరలివచ్చిన ప్రాణం గలదాన్నిగా; చేసెన్.

**తాత్పర్యం:** ధైర్యం తగ్గి, మోహంతో కుంతీదేవి మూర్ఛిల్లగా, విదురుడు వెంటనే చల్లనిగంధపునీళ్లను చల్లి ఆమెకు ప్రాణం మళ్ళీ వచ్చేటట్లు చేశాడు.

**విశేషం:** కుంతీదేవి పుత్రవాత్సల్యాన్ని వ్యక్తంచేయటంలో ప్రదర్శించే ఉద్విగ్నప్రవృత్తిని ఈ సన్నివేశం మరొకసారి ధ్వనింప చేస్తున్నది. మూర్ఛ అన్నది సాత్త్వికభావంవంటిది. వాత్సల్యం హర్షంతో ఉప్పొంగితే పాలధారలు, ఆనందబాష్పాలు (21వపద్యం); భయభావంతో ఉప్పొంగితే మూర్ఛిల్లటం - అనేవి సాత్త్వికచేతనను వ్యక్తంచేస్తున్నాయి. వస్తుధ్వనిని రసధ్వనికి అంగంగా పోషించే కథాకథనశిల్పమిది. (సంపా.)

**వ. అంత నర్జునుం డనిలబాణంబున నమ్మేఘపటలంబు పఱవనేసి యాదిత్యసమతేజుం డయి యుండె; నంత విదురదర్శితు లైన యక్కర్ణార్జునులం జూచి కుంతి సంతసిల్లె; నపుడు ధర్మవిదుం డఖిలద్వంద్వయుద్ధసమాచార నిపుణుండు కృపాచార్యుం డయ్యిద్దఱ నడుమ నిలిచి కర్ణున కి ట్లనియె. 44**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; అర్జునుండు; అనిల, బాణంబునన్= వాయవ్యాస్త్రంచేత; ఆ+మేఘ, పటలంబు= ఆ మేఘాల సమూహాన్ని; పఱవన్+ఏసి= పారిపోయేటట్లు కొట్టి; ఆదిత్య, సమ, తేజుండు+అయి= సూర్యునితో సమానమైన కాంతి కలవాడై; ఉండెన్; అంతన్= తర్వాత; విదుర, దర్శితులు+ఐన= విదురునిచేత చూపబడినవారైన; ఆ+కర్ణ+అర్జునులన్; చూచి; కుంతి; సంతసిల్లెన్= సంతోషించింది; అపుడు; ధర్మ, విదుండు= ధర్మం తెలిసినవాడు; అఖిల, ద్వంద్వ, యుద్ధ, సమాచార, నిపుణుండు= అన్ని ద్వంద్వయుద్ధాలను చక్కగా నడపటంలో నేర్పరి అయినవాడు; కృపాచార్యుండు; ఆ+ఇద్దఱ, నడుమన్= ఆ ఇద్దరిమధ్య; నిలిచి; కర్ణునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అప్పు డర్జునుడు వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించి, ఆ మేఘసమూహాన్ని పారద్రోలి, సూర్యునివలె వెలుగుతూ నిలిచాడు. విదురుడు చూపిస్తే ఆ కర్ణార్జునులను కుంతి చూచి సంతోషించింది. ధర్మజ్ఞుడూ, ద్వంద్వయుద్ధాలను చక్కగా నడపటంలో నిపుణుడూ అయిన కృపాచార్యుడు ఆ కర్ణార్జునులనడుమ నిలిచి కర్ణునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** కర్ణార్జును లిద్దరికీ తల్లి కుంతి. వాళ్ళిద్దరి ద్వంద్వయుద్ధం చూచి జనులంతా పొందే స్పందన ఒక యెత్తు; ఆ తల్లి పొందే స్పందన ఒకయెత్తు అని కథనశిల్పం చెపుతున్నది. కర్ణునిమేఘాస్త్రంవలన అర్జునుడు కప్పివేయబడటం చూచి ఓర్చుకోలేక మూర్ఛితురాలైంది. మబ్బులు వీడినతరువాత అర్జునుడిని చూచి ఆనందించింది. అర్జునుడు లోకానికి తెలిసిన కుంతికొడుకు. కర్ణుడు తెలియనికొడుకు. ఇద్దరినీ చూచి రెండుకన్నులతో సంతోషించటం సార్థకం. ఈ సన్నివేశం భావికథలో పాండవులను కర్ణుడు చంపుతాడేమో అన్న భయంతో ఆమె అతడిని రహస్యంగా వరంకోరే ఘట్టానికి బీజప్రాయంగా భాసిస్తుంది.

**చ. కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుడు, రాజధర్మబం**
**ధురచరితుండు; నీ వితనితోడ రణం బొనరించెదేని వి**
**స్తరముగ నీదువంశమును దల్లిని దండ్రిని జెప్పు; చెప్పినన్**
**దొరయగుదేని నీ కెదిరి దోర్బలశక్తి నితండు సూపెడిన్. 45**

**ప్రతిపదార్థం:** కురు, కులజుండు= కురువంశంలో పుట్టినవాడు; పాండునకున్= పాండురాజుకు; కుంతికిన్; పుత్త్రుడు; రాజ, ధర్మ, బంధుర, చరితుండు= రాజధర్మంచేత ఒప్పిన నడవడి కలవాడు; నీవు; ఇతనితోడన్= ఈ అర్జునునితో; రణంబు= యుద్ధం; ఒనరించెదు+ఏని= చేసేటట్లయితే; విస్తరముగన్= వివరంగా; నీదు, వంశమును; తల్లిని, తండ్రిని= తల్లిదండ్రుల్ని; చెప్పు= చెప్పుము; చెప్పినన్= అట్లా చెప్పితే; దొర+అగుదువు+ఏని= సమానుడవైతే, క్షత్రియుడవైతే; ఇతండు= ఈ అర్జునుడు; నీకున్+ఎదిరి= నీకు ఎదురు నిలిచి; దోస్+బల, శక్తిన్= భుజబలశక్తిని; చూపెడిన్= చూపగలడు.

**తాత్పర్యం:** అర్జునుడు కురురాజువంశంలో పుట్టినవాడు. పాండురాజుకు, కుంతీదేవికి పుత్రుడు. రాజధర్మంచేత ప్రకాశించేప్రవర్తన కలవాడు. నీవు ఇతనితో యుద్ధం చేయదలిస్తే నీవంశాన్నీ, తల్లిదండ్రులనూ వివరంగా చెప్పుము. సమానుడవైతే ఇతడు నిన్నెదిరించి భుజశక్తి చూపిస్తాడు.

**విశేషం:** శబ్దశక్తిమూలధ్వనికి ఈ పద్యం అమూల్యోదాహరణం. 'కృపాచార్యుడు పలికిన వాక్యాలలో 'కుల', 'రాజ', 'దొర' - అనే మూడు శబ్దాలు సాభిప్రాయాలు. కులమంటే వంశమనీ, వర్ణమనీ రెండర్థాలున్నాయి. అర్జునుడు కురువంశానికీ, వాళ్ళకులానికీ (క్షత్రియవర్ణం) చెందినవాడు; రాజశబ్దానికి రాజ్యంచేసేవాడనీ, క్షత్రియుడనీ అర్థాలేర్పడతాయి. వంశాన్ని తల్లిని తండ్రిని పేర్కొని నీవు దొరవు (క్షత్రియుడవు, రాజువు, సమానమైనవాడవు)గా నిరూపించుకొను మని కృపాచార్యుడు కర్ణుడిని అడిగాడు. దొర శబ్దంలోని ప్రభువు అనే అర్థాన్ని గ్రహించి, దుర్యోధనుడు ఆ కర్ణుడిని అంగరాజ్యాధిపతిని చేస్తాడు. పరాక్రమంలో అర్జునునితో కర్ణుడు సమానమని సూచించాడు. తల్లిదండ్రులు, కులం అనే అంశాలను శూరులపట్ల పట్టించుకొనకూడదని వారించాడు. 'అనిలజ' అని భీముడిని ఎత్తిపొడిచాడు. ఈ పద్యంలోని రమణీయమైన వ్యంగ్యార్థమంతా 'దొర' అనే శబ్దప్రయోగంమీద అధారపడి ఉన్నది. ప్రభువనే అర్థం వాచ్యంలో, సమానుడనే అర్థం వ్యంగ్యంలో స్ఫురిస్తుంది. 'వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే' అనే న్యాయం ధ్వనిస్తుంది. భావికథకు అదే మూలమౌతుంది. కాబట్టి ఇది శబ్దశక్తిమూలధ్వని. చమత్కారమేమంటే పఠితకు కర్ణుడి తల్లిదండ్రులసంగతి తెలుసు.. సన్నివేశంలో ఉన్నవారికి తెలియదు. కర్ణునిస్థితి పఠితలో సానుభూతిని రేకెత్తిస్తుంది. ఇది రసవిషయకమైన రహస్యం. (సంపా.)

**వ. అనిన విని కర్ణుండు దనకులంబును దల్లిదండ్రులను జెప్ప సిగ్గుపడి తలవాంచి యున్నం జూచి దుర్యోధనుండు గృపున కి ట్లనియె. 46**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; కర్ణుండు; తన, కులంబును; తల్లి, దండ్రులను; చెప్పన్= చెప్పటానికి; సిగ్గుపడి; తలవాంచి= తలనువంచి; ఉన్నన్= ఉండగా; దుర్యోధనుండు; కృపునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని కర్ణుడు తన కులాన్నిగురించి, తల్లిదండ్రులనుగురించి చెప్పటానికి సిగ్గుపడి, తలవంచుకొని ఉండగా చూచి దుర్యోధనుడు కృపాచార్యునితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** కర్ణుడు తాను సూతనందనుడననీ, రాధేయుండననీ చెప్పటానికి సిగ్గుపడి ఊరుకొనటమే ప్రకరణౌచిత్యం. అత డెవరి కొడుకో పఠితకు తెలుసు. పెంచినతండ్రిని తండ్రిగా చెప్పుకొనటం అవమానంగా భావించాడని తలంచటం ఉచితం కాదు. తనను పెంచిన తల్లిదండ్రులు వంశగౌరవంలో కుంతీపాండురాజులతో సమానులు కారని చెప్పటం కర్ణునికి ఇష్టం లేదు. అందువలన సిగ్గుపడి ఊరుకొన్నాడు.

**క. కులముగలవాఁడు, శౌర్యము । గలవాఁడును, నధికసేన గలవాఁడును, భూ**
**తలమున రా జను నామము । విలసిల్లఁగఁ దాల్చు మూఁడువిధముల పేర్మిన్. 47**

**ప్రతిపదార్థం:** కులము, కలవాఁడు; శౌర్యము, కలవాఁడునున్= పరాక్రమం కలవాడును; అధిక, సేన, కలవాఁడును= ఎక్కువ సేన కలవాడును; భూతలమునన్= భూమిమీద; పేర్మిన్= గొప్పగా; మూడు విధముల; రాజు+అను, నామమున్= రాజు అనే పేరును; విలసిల్లగన్= ఒప్పుగా; తాల్చున్= ధరిస్తాడు.

**తాత్పర్యం:** కులమున్నవాడు, శౌర్యమున్నవాడు, అధికసేనాబలమున్నవాడు, భూమిమీద మూడువిధాల రాజనే పేరు గొప్పగా పెట్టుకొంటున్నాడు.

**విశేషం:** కృపాచార్యుడు పేర్కొన్న 'దొర' అనే పదానికి రూఢిలో ఉన్న అర్థాలు చెప్పి, కర్ణుని దొరతనాన్ని నిలపటానికి దుర్యోధనుని ప్రయత్నం ఇది.

**తే. రాజవరుఁ డైన పార్థుతో రాజు గాని । యీతఁ డని సేయఁగాఁ దగఁడేని వీని**
**నెల్లవారును జూడంగ నీక్షణంబ । రాజుఁ జేసెద నే నంగరాజ్య మిచ్చి. 48**

**ప్రతిపదార్థం:** రాజ, వరుఁడు+ఐన, పార్థుతోన్= రాజులలో శ్రేష్ఠుడైన అర్జునునితో; రాజు, కాని, ఈతఁడు= రాజు కానట్టి ఈ కర్ణుడు; అని= యుద్ధం; చేయఁగాన్= చేయటానికి; తగఁడు+ఏని= తగనివాడైతే; వీనిన్= ఈ కర్ణుడిని; ఎల్ల, వారును= అందరును; చూడంగన్= చూస్తూఉండగా; అంగరాజ్యము+ఇచ్చి; నేను; రాజున్+చేసెదన్= రాజుగా చేస్తాను.

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠుడైన అర్జునునితో - రాజు కానట్టి ఈ కర్ణుడు యుద్ధం చేయటానికి తగనివాడైతే అందరూ చూస్తుండగా ఇతనికి నేను అంగరాజ్యమిచ్చి, రాజుగా చేస్తాను.

## దుర్యోధనుఁడు కర్ణుని నంగరాజ్యమున కభిషిక్తుం జేయుట (సం. 1-126-36)

**వ. అని యప్పుడ భీష్మధృతరాష్ట్రులకుం జెప్పి వారియనుమతంబున మహామహీసురసహస్రంబునకు గోసహస్రాయుతంబు దానంబు సేసి 'యంగరాజ్యంబునకు వీఁ డర్హుం డయ్యెడు' మను బ్రాహ్మణవచనంబు వడసి, కర్ణుం గాంచనపీఠంబున నునిచి యంగరాజ్యమున కభిషిక్తుం జేసినఁ, గర్ణుండును మణిమకుట కేయూర హారాది భూషణ భూషితుం డై సకలరాజచిహ్నంబుల నొప్పి పరమహర్షంబుతోడం గురుపతి కి ట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; అప్పుడు+అ= అప్పటికప్పుడే; భీష్మ, ధృతరాష్ట్రులకున్= భీష్మునికి, ధృతరాష్ట్రునికి; చెప్పి= తెలిపి; వారి, అనుమతంబునన్= వారి అనుమతితో; మహామహీసుర, సహస్రంబునకున్= ఉత్తములయిన బ్రాహ్మణులు వేయిమందికి; గో, సహస్ర+అయుతంబు= కోటిఆవులను [అయుతము= 10వేలు; సహస్ర అయుతము 1000X 10,000= 1,00,00,000(కోటి);] దానంబు; చేసి; అంగ, రాజ్యంబునకున్; వీఁడు= ఈతడు - ఈ కర్ణుడు; అర్హుండు+అయ్యెడము= తగినవాడు అయ్యెడుగాక; అను= అనునట్టి; బ్రాహ్మణ, వచనంబు= బ్రాహ్మణులయొక్క మాట; పడసి= పొంది; కర్ణున్= కర్ణుణ్ణి; కాంచన, పీఠంబునన్= బంగారు సింహాసనంమీద; ఉనిచి= ఉంచి; అంగ,రాజ్యమునకున్; అభిషిక్తున్= అభిషేకించినవానిని; చేసినన్= చేయగా; కర్ణుండును; మణి, మయ, మకుట, కేయూర, హార+ఆది, భూషణ, భూషింతుడు+ఐ= మణులతో నిండిన కిరీటం, భుజకీర్తులు, దండలు మొదలయిన సొమ్ములతో అలంకరింపబడినవాడై; సకల, రాజ చిహ్నంబులన్= అన్నివిధాలైన రాజలాంఛనాలతో - అంటే అన్నివిధాలైన రాచరికపు గుర్తులతో; ఒప్పి= ప్రకాశించి; పరమ, హర్షంబుతోడన్= మిక్కిలిసంతోషంతో; కురుపతికిన్= దుర్యోధనునికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఈ విధంగా పలికి, అప్పటికప్పుడే భీష్మధృతరాష్ట్రులకు చెప్పి - వాళ్ళ అనుమతితో వేయిమందిబ్రాహ్మణోత్తములకు కోటి గోవులను దానంగా ఇచ్చి, ఆ బ్రాహ్మణులచేత అంగరాజ్యానికి కర్ణుడు అర్హుడయ్యెడు గాక అని ఆశీర్వదింపజేసి, బంగారుసింహాసనంమీద కర్ణుడిని కూర్చుండబెట్టి అంగరాజుగా అతడిని అభిషేకించాడు. కర్ణుడు మణిమయ కిరీటంతో, భుజకీర్తులతో, హారాలతో, అనేకవిధాలైన ఆభరణాలతో, సకలరాజలాంఛనాలతో శోభిల్లి మహానందంతో దుర్యోధనునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** దుర్యోధనుడు చేసిన ఈ మహోపకారమే కర్ణునిజీవితాన్నీ, మహాభారతకథనూ మలుపు తిప్పింది. సూతసుతుడిని అంగరాజుగా మార్చింది. జీవితాంతం కృతజ్ఞతాభావబంధంతో కర్ణుడిని కౌరవపక్షానికి కట్టివేసింది. అర్జునునికి సమానుడైన విలుకాడు తనపక్షాన ఉన్నాడన్న ఆత్మవిశ్వాసాన్ని సుయోధనునిలో పెంచింది. గోదాన విషయం మూలంలో లేదు. అక్కడ

"విప్రైశ్చ ప్రదత్వా హ్యమితం వసు'' అనే ఉంది. 'వసు' అంటే 'బంగారం, రత్నం, ధనం' అని అర్థాలు. గోదాన వైశిష్ట్యాన్ని గుర్తించిన నన్నయ - వసుదానాన్ని "గోసహస్రాయుతంబు దానంబుసేసి'' అని వివరించాడు.

**క. బృహదబ్ధిమేఖలాఖిల । మహీతలక్షత్త్రవరసమక్షమున మహా**
**మహిమాన్వితుఁగా నన్నును । మహీశుఁగాఁ జేసి తతిసమర్థత వెలయన్. 50**

**ప్రతిపదార్థం:** బృహత్= అబ్ధి, మేఖలా+అఖిల, మహీతల, క్షత్త్ర, వర, సమక్షమునన్= మహాసముద్రాన్ని మొలనూలుగా గల సమస్త భూమండలంలోని రాజశ్రేష్ఠులయొక్క ఎదుట; అతి, సమర్థత= మిక్కిలి నేర్పు; వెలయన్= ప్రకాశించగా; నన్నును= నన్ను కూడా; మహా, మహిమ+అన్వితుఁగాన్= మిక్కిలిగొప్పతనంతో కూడుకొన్నవాణ్ణిగా; మహీ+ఈశున్+కాన్= భూపతిని అగునట్లుగా - అంటే రాజగునట్లుగా; చేసితి= చేశావు.

**తాత్పర్యం:** మహాసముద్రాన్ని మొలనూలుగా (ఒడ్డాణంగా) గల సమస్తభూమండలంలోని రాజశ్రేష్ఠుల సమక్షంలో మిక్కిలినేర్పు మెరయ నన్నెంతో గౌరవించి రాజుగా చేశావు.

**క. 'దీనికి సదృశముగా మఱి । యే నేమి యొనర్తు నీకు నిష్టం?' బనినన్**
**'మానుగ నాతోఁ జెలిమి మ । హీనుతముగఁ జేయు; మిదియ యిష్టము నాకున్.' 51**

**ప్రతిపదార్థం:** దీనికిన్= ఈ గొప్ప ఉపకారానికి; సదృశముగాన్= సమానంగా; మఱి= మరల; ఏను= నేను; ఏమి= ఏది; ఇష్టంబు= ఇష్టమైన దానిని; ఒనర్తున్= చేస్తాను; అనినన్= అని అనగా; మానుగన్= ఒప్పుగా; నాతోన్; చెలిమి= స్నేహం; మహీ, నుతముగన్= లోకం కొనియాడేటట్లుగా; చేయుము; నాకున్; ఇదియ, ఇష్టము = ఇదే ఇష్టం.

**తాత్పర్యం:** 'నీవు చేసిన ఈ మహోపకారానికి సమానంగా నేను నీ కిష్టమైంది ఏంచేయగలను?' - అని కర్ణు డడుగగా, 'లోకం కొనియాడేటట్లు నాతో స్నేహం చేయుము; ఇదే నా కిష్టం' అని దుర్యోధనుడన్నాడు.

**విశేషం:** ఏ ముహూర్తంలో 'నాతో చెలిమి మహీనుతముగా' చేయు మని దుర్యోధనుడు కర్ణుడిని కోరాడో - ఏ ముహూర్తంలో కర్ణుడు దుర్యోధనునితో చెయ్యి కలిపాడో - వాళ్ళమైత్రి మహీనుతమే అయింది. మహాభారతంలో అతిప్రధానపాత్ర నిర్వహించింది. కర్ణుని స్వామిభక్తి లోకం కొనియాడదగిందే. కాని అది ఆంజనేయుని స్వామిభక్తివంటిది కాదు. కర్ణుని స్వామిభక్తి కృతజ్ఞతారూపం. ఆంజనేయుని స్వామిభక్తి శ్రీరామసుగుణపరవశతారూపం; స్వార్థరహితం.

**వ. అనిన విని దుర్యోధనున కెంతయు సంతోషంబుగాఁ గర్ణుం డతనితోడి యిష్ట సఖిత్వంబున కొడంబడియె, నంతఁ గొడుకు రాజ్యాభిషేకోత్సవంబు సూచి హర్షపరవశుం డయి సూతుండు రథంబు డిగ్గి కర్ణునొద్దకుం బఱతెంచినఁ, గర్ణుండును బితృగౌరవంబున సంభ్రమించి వానికి వినయవినమితోత్త మాంగుండయిన. 52**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; దుర్యోధనునకున్; ఎంతయున్= మిక్కిలి; సంతోషంబుగాన్= సంతోషంగా; కర్ణుండు; అతనితోడి; ఇష్ట, సఖిత్వంబునకున్= అతనితో ఇష్టమైన స్నేహితుడుగా ఉండటానికి; ఒడంబడియెన్=ఒప్పుకొన్నాడు; అంతన్= అప్పుడు; కొడుకు= పెంచిన కుమారునియొక్క; రాజ్య+అభిషేక+ఉత్సవంబున్= రాజ్యానికి అభిషిక్తుడైన పండుగను; చూచి; సూతుండు= రథంనడిపేవాడు- అతిరథుడు- కర్ణునిపెంచినతండ్రి; హర్ష, పరవశుండు+అయి= సంతోషంతో మైమరచినవాడై;

రథంబు, డిగ్గి= రథంనుండి దిగి; కర్ణు+ఒద్దకున్= కర్ణునిదగ్గరకు; పఱతెంచినన్= పరుగెత్తి రాగా; కర్ణుండును; పితృగౌరవంబునన్= తండ్రిమీది భక్తిచేత; సంభ్రమించి= వేగిరపడి; వానికిన్= ఆ సూతునికి; వినయ, వినమిత+ఉత్తమ+ అంగుండు= వినయంచేత (అణకువచేత) వంగినశిరస్సు కలవాడు; అయినన్= కాగా.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడనగా, ఎంతో సంతోషంతో కర్ణుడాతనికి ప్రియమిత్రుడుగా ఉండటానికి అంగీకరించాడు. అప్పుడు కుమారుని అంగరాజ్యాభిషేకోత్సవాన్ని చూచి అతిరథుడు రథం దిగి పరుగుపరుగున కర్ణునిదగ్గరకు రాగా, కర్ణుడుకూడా తండ్రిమీదిగౌరవంతో త్వరత్వరగా లేచి వినయంతో శిరస్సువంచి నమస్కరించాడు.

**విశేషం:** ఇది తండ్రికొడుకుల జీవితంలో ఒక రసోజ్జ్వలమైనసన్నివేశం.

**తే.** **కడఁగి సూతుండు పుత్త్రకుఁ గౌఁగిలించి । కొని తదీయమూర్ధాఘ్రాణ మొనరఁ జేసి**
**యంగరాజ్యాభిషేకార్ద్రమైన శిరముఁ । దడిపె వెండియు హర్షాశ్రుతతుల నొప్ప.** **53**

**ప్రతిపదార్థం:** సూతుండు= అతిరథుడు; కడఁగి= ప్రయత్నించి; పుత్త్రకున్= ప్రియకుమారుడిని; కౌఁగలించుకొని; తదీయ, మూర్ధ+ఆఘ్రాణము= అతనియొక్క తలను మూర్కొనటాన్ని; ఒనరన్= ఇంపుగా, ప్రియమార; చేసి= గావించి; అంగ+రాజ్య+ అభిషేక+ఆర్ద్రము+ఐన= అంగరాజ్యానికి అభిషేకించటంచేత తడిసిందైన; శిరమున్= తలను; వెండియున్= మళ్ళీ; హర్ష+అశ్రు, తతులన్= ఆనందబాష్పసమూహాలచేత; ఒప్పన్= అందంగా; తడిపెన్= తడిపాడు.

**తాత్పర్యం:** అతిరథుడు ప్రయత్నించి పుత్రుడిని కౌగలించుకొని ప్రియమార అతనితలను మూర్కొని అంగ రాజ్యాభిషేకంచేత తడిసిన అతనితలను మళ్ళీ తన ఆనందాశ్రువులచేత తడిపాడు.

**విశేషం:** కర్ణుడు తనకుమారుడే అయినా ఇప్పుడతడు అంగరాజు. ఇప్పుడు అతడిని ఇదివరకటివలె కౌగలించుకొనటం ఎట్లా? పైగా ఎవరేమనుకొంటారో? అందుచేతనే కాబోలు 'కడగి' సూతు డాతనికి కౌగలించుకొన్నాడని చెప్పటం.

**వ.** **దానిం జూచి భీముండు గర్ణుని సూతకులసంభవుంగా నెఱింగి నగుచు ని ట్లనియె.** **54**

**ప్రతిపదార్థం:** దానిన్+చూచి= అతిరథుడు కర్ణుడిని కౌగలించుకొనటాన్ని చూచి; భీముండు; కర్ణునిన్; సూత, కుల, సంభవున్, కాన్= సూతకులంలో (రథంనడిపేవారికులంలో) పుట్టినవాడినిగా; ఎఱింగి= తెలిసికొని; నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అతిరథుడు కర్ణుడిని కౌగలించుకొనటం గమనించి, అతడు సూతకులంలో పుట్టినవాడని తెలిసికొని భీముడు అవహేళనగా నవ్వుతూ ఈవిధంగా అన్నాడు.

**క.** **నీదు కులమునకుఁ దగఁగఁ బ్ర। తోదము గొని రథము గడపఁ దొరఁగుము నృపధ**
**ర్మోదయుఁ డగు నర్జునుతోఁ । గా దనక రణంబు సేయఁగా నీ కగునే?** **55**

**ప్రతిపదార్థం:** నీదు, కులమునకున్; తగఁగన్= తగినట్లు; ప్రతోదము, కొని= మునికోలను తీసికొని; రథమున్= రథాన్ని; కడపన్= నడపటానికి; తొడుగుము= పూనుకో; నీకున్, నృప, ధర్మ+ఉదయుఁడు+అగు+అర్జుతోన్= రాజధర్మంలో పుట్టినవా డైన అర్జునునితో; కాదు+అనక= కాదనకుండ - తగదు నని; రణంబు, చేయఁగా= యుద్ధంచేయటం; అగునే= తగునా!

**తాత్పర్యం:** నీ కులానికి తగ్గట్లు మునికోల పుచ్చుకొని నీవు రథం నడప ప్రయత్నించాలి గాని, రాజధర్మంలో జన్మించిన అర్జునునితో కాదనకుండా యుద్ధంచేయటం నీకు తగునా!

**వ. మఱి యదియునుం గాక. 56**

**తాత్పర్యం:** ఇంకా, అంతేకాక.

**తే. ఉత్తమక్షత్రియప్రవరోపయోగ్య । మైన యంగరాజ్యంబు నీ కర్హ మగునె?**
**మంత్రపూత మై గురుయజమానభక్ష్య । మగుపురోడాశ మది గుక్క కర్హ మగునె! 57**

**ప్రతిపదార్థం:** ఉత్తమ, క్షత్రియ, ప్రవర+ఉపయోగ్యము+ఐన= ఉత్తముడైన క్షత్రియశ్రేష్ఠునిచేత అనుభవించదగినదైన; అంగ రాజ్యంబు; నీకున్+అర్హము+అగునె= నీకు తగినటువంటిది అవుతుందా; మంత్ర, పూతము+ఐ= మంత్రంచేత పవిత్రమై; గురు, యజమాన, భక్ష్యము+అగు= గొప్పయజ్ఞకర్త తినదగినదైన; పురోడాశము= యజ్ఞంకొరకు చేసిన పిండివంట; కుక్కకున్; అర్హము= తగింది; అగునె= ఔతుందా? (కాదని భావం)

**తాత్పర్యం:** ఉత్తమక్షత్రియశ్రేష్ఠునిచేత అనుభవించదగిందైన అంగరాజ్యం నీకు అనుభవించ తగిందవుతుందా? గొప్పయజ్ఞకర్త భుజించదగిన యజ్ఞశేషమైనపిండివంట కుక్క తినటం తగునా!

**విశేషం:** అలం : దృష్టాంతం.

**వ. అనినం గర్ణుండు వెల్లనయి యెద్దియుం జేయునది నేరక దీర్ఘోష్ణనిశ్వాసవ్యాకులిత వదనుం డయి యాకాశంబు వలన నున్న యాదిత్యుం జూచుచు మిన్నకుండె; నంత నంతర్విలులితుం డయిన యక్కర్ణుం జూచి భ్రాతృపద్మవన మధ్యంబుననుండి దుర్యోధనమదాంధగంధసింధురంబు వెలువడి వచ్చి కడు నలిగి భీమున కి ట్లనియె. 58**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; కర్ణుండు; వెల్లనయి= వెలవెలబోయి; ఎద్దియున్, చేయునది= ఏదీ చేయటానికి; నేరక= తెలియక; దీర్ఘ+ఉష్ణ, నిశ్వాస, వ్యాకులిత, వదనుండు+అయి= పొడవై వేడి అయిన నిట్టూర్పుచేత కలత చెందిన ముఖం కలవాడై; ఆకాశంబువలనన్= ఆకాశంవైపు; ఉన్న; ఆదిత్యున్= సూర్యుడిని; చూచుచున్; మిన్నక+ఉండెన్= ఊరకున్నాడు; అంతన్= తర్వాత; అంతః+విలులితుండు+అయిన= లోలోపల (మనస్సులో) కలతచెందుతున్నవాడైన; ఆ+కర్ణున్; చూచి; భ్రాతృ, పద్మ, వన, మధ్యంబుననుండి= తమ్ములు అనే తామరవనం మధ్యనుండి; దుర్యోధన, మద+అంధ, గంధ, సింధురంబు= దుర్యోధనుడనే మదంచేత కన్నులు కానని మదపుటేనుగు; వెలువడి= బయటకు నడచి; వచ్చి; కడున్= మిక్కిలి; అలిగి= కోపించి; భీమునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** భీముడు అట్లా మాట్లాడగానే కర్ణుడు వెలవెలపోయి, ఏమీ చేయటానికి తోచక, పెద్దవేడినిట్టూర్పు విడిచి, కలతచెందినముఖంతో ఆకాశంలో ఉన్న ఆ సూర్యునివైపు చూస్తూ ఊరకున్నాడు. మనసులో మిక్కిలి కలత చెందుతున్న ఆ కర్ణుడిని చూచి, తమ్ములనే తామరవనమధ్యంనుండి దుర్యోధనుడనే మదపుటేనుగు వెలుపలికి వచ్చి ఎంతో కోపంతో భీమునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: రూపకం. తన కులాన్ని, తండ్రిని, తల్లినిగురించి పదిమంది ఎదుట నిలదీసి అడిగినపుడు బదులు చెప్పలేక ఏమిచేయటానికీ దిక్కుతోచక బాధపడుతూ- అన్నీ తెలిసి, ఏమీ తెలియనట్లు నంగనాచివలె నింగిలో ఉన్న కర్మసాక్షివైపు చూచే కర్ణుని భంగిమలోని నాటకీయత, ఔచిత్యం, విశేషించి భావుకులకు రసానందహేతువులు. అట్లే తమ్ములనే తామరవనమధ్యం బునుండి మదపుటేనుగువలె కన్నుమిన్నుకానక ముందుకు నడచివచ్చే దుర్యోధనుని భంగిమకూడా రూపకోచితం. (సంపా.)

**క. అనిలజ! నీ కి ట్లని ప । ల్కను దలఁపను నగునె? లేడి కడుపునఁ బులి పు**
**ట్టునె? యిట్టి దివ్యతేజం । బున వాఁ డధమాన్వయమునఁ బుట్టునె చెపుమా! 59**

**ప్రతిపదార్థం:** అనిలజ= వాయువువల్ల పుట్టినవాడా!; నీకున్; ఇట్లు+అని= ఈ ప్రకారంగా; పల్కను= మాటాడటానికి; తలఁపనున్= ఆలోచించటానికి; అగునె= తగునా; లేడి, కడుపునన్; పులి; పుట్టునె; ఇట్టి; దివ్య, తేజంబునవాఁడు= శ్రేష్ఠమైన కాంతి కలవాడు; అధమ+అన్వయమునన్= నీచమైన కులంలో; పుట్టునె, చెపుమా!= జన్మించునా! చెప్పు.

**తాత్పర్యం:** వాయువువల్ల పుట్టిన ఓ భీమా! ఇట్లా మాట్లాడటం, ఆలోచించటం నీకు తగునా? లేడికడుపున పులి పుట్టుతుందా? ఇంత గొప్పకాంతికలవాడు నీచకులంలో పుట్టుతాడా?

**విశేషం:** భీముడిని 'అనిలజ' అని సంబోధించటంలో నీ పుట్టుక సంగతి ఏమిటనే ఎత్తిపొడుపు ధ్వనిస్తున్నది. అలం: అర్థాంతరన్యాసం.

**వ. శూరులజన్మంబు సురలజన్మంబును । నేఱులజన్మంబు నెఱుఁగ నగునె?**
**మొగిని దధీచియెమ్మునఁ బుట్టదయ్యెనే । వాసవాయుధ మైన వజ్ర మదియు;**
**గాంగేయుఁ డన మఱి కార్తికేయుం డన । నాగ్నేయుఁ డన రౌద్రుఁ డనఁగ శరవ**
**ణోద్భవుం డన గుహుం డుద్భవిల్లఁడె? శర । స్తంబజన్ముఁడు గాఁడె ధర్మవిదుఁడు**

**తే. గృపుఁడు? ఘటసంభవుఁడు గాఁడె కీర్తిపరుఁడు । వరుఁడు ద్రోణుండు? విప్రులవలనఁ బుట్ట**
**రైరె సత్క్షత్రియుల్ ఘను లవనిఁ గావఁ? గడఁగి మీ జన్మములు నిట్ల కావె వినఁగ. 60**

**ప్రతిపదార్థం:** శూరుల, జన్మంబున్; సురల, జన్మంబునున్= దేవతలయొక్క పుట్టుకను; ఏఱుల, జన్మంబున్= నదుల పుట్టుకను; ఎఱుఁగన్+అగునె= తెలిసికొనటం సాధ్యమా!; మొగిని= క్రమంగా; వాసవ+ఆయుధము+ఐన= దేవేంద్రునియొక్క ఆయుధమైన వజ్రము; అదియున్= అది; దధీచి, ఎమ్మునన్= దధీచి ఎముకలో; పుట్టదు+అయ్యెనే= పుట్టలేదా?; గాంగే యుఁడు+అనన్= గంగకొడు కనగా; ఆగ్నేయుడు+అనన్= అగ్ని కొడుకనగా; రౌద్రుఁడు+అనంగన్= రుద్రునికొడు కనగా; శరవణ ఉద్భవుండు+అనన్= రెల్లుగడ్డిపొదలో పుట్టినవాడనగా; గుహుండు= కుమారస్వామి; ఉద్భవిల్లఁడె= పుట్టలేదా; ధర్మవిదుఁ డు= ధర్మాన్ని తెలిసినవాడు; కృపుఁడు= కృపాచార్యుడు; శర, స్తంబ, జన్ముఁడు= రెల్లుగంటలో పుట్టుక కలవాడు; కాఁడె; కీర్తిపరుఁడు= కీర్తిగలవాడు; వరుఁడు= శ్రేష్ఠుడు; ద్రోణుండు; ఘట, సంభవుఁడు= కుండలో పుట్టినవాడు; కాఁడె= కాదా!; అవనిన్+ భూమిని; కావన్=కాపాడటానికి; కడఁగి= పూనుకొని; ఘనులు= గొప్పవారు; సత్+క్షత్రియుల్= ఉత్తములైనరాజులు; విప్రులవలనన్= బ్రాహ్మణులవలన; పుట్టరు+ఐరె= పుట్టినవారు కాలేదా; వినఁగన్= వినటాన్ని బట్టి (తెలియగా), మీ జన్మములున్= మీ యొక్క పుట్టుకలుకూడా; ఇట్లు+అ, కావె= ఈ విధమైనవే కదా!

**తాత్పర్యం:** శూరుల పుట్టుక, దేవతల పుట్టుక, నదుల పుట్టుక తెలిసికొనటం సాధ్యమా? దేవేంద్రుని వజ్రాయుధం దధీచి ఎముకనుండి పుట్టలేదా? గంగకొడుకుగా, కృత్తికలకొడుకుగా, అగ్నికొడుకుగా, రుద్రునికొడుకుగా, రెల్లుపొదలలో జన్మకలవాడుగా కుమారస్వామి పుట్టలేదా? ధర్మమెరిగిన కృపాచార్యుడు రెల్లుగడ్డిగంటలో పుట్టలేదా? కీర్తిమంతుడు, శ్రేష్ఠుడు అయిన ద్రోణుడు కుండలో పుట్టలేదా? భూమిని కాపాడటానికై ఉత్తమ క్షత్రియులు బ్రాహ్మణులవలన పుట్టలేదా? విన్నదానినిబట్టి మీ పుట్టుకలుకూడా ఇట్టివే కదా!

**విశేషం:** 'శూరులజన్మంబు సురలజన్మంబును నేఱులజన్మంబు నెఱుఁగనగునె' - అనేదానికి మూలం:- "శూరాణాంచ నదీనాంచ దుర్విదాః ప్రభవాః కిల" (చిత్రకళాప్రతి) - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.335. పెద్దలముందు మిత్రుడైన కర్ణుడిని నిందించిన భీముడిని అధిక్షేపిస్తూ దుర్యోధనుడు పెద్దలందరిపుట్టుకతో కలిపి పాండవుల పుట్టుకలను గురించికూడా పేర్కొన్నాడు. మీరందరూ శూరులైతే గూఢజన్ముడైకూడా గొప్పవాడుగా కనపడుతున్న కర్ణుడు శూరుడు కాలేకపోతాడా? అని తార్కికంగా మాట్లాడాడు. తెలియక, అభిమానంతో మాట్లాడుతున్న దుర్యోధనునిమాటలతో నిజం తెలిసిన పఠితల మనస్సులు అభిమానిస్తాయి. కర్ణుడిలోని విషాదాంతనాయకలక్షణాలలో ఇది ఒకటి. అన్ని మంచిగుణాలున్నా ఏదో ఒక అనివార్యమైన లోపంవలన కర్ణుడు విషాదాంతం పొందుతూ పఠితల సానుభూతిని పొందుతాడని వస్తుధ్వని. (సంపా.)

**వ. 'వానితోడి దేమి? దివ్యలక్షణలక్షితుండును సహజకవచకుండలమండితుండును గాని ప్రకృతిపురుషుండు గాఁడు; తన బాహుబలంబున నీ యంగరాజ్యంబునక కాదు సకలమహీరాజ్యంబునకు నర్హుం డగు' ననుచున్నయంత నాదిత్యుం డస్తంగతుం డైన, నస్త్రసందర్శనరంగంబు వెలువడి దుర్యోధనుండు గర్ణుం దోడ్కొని కరదీపికా సహస్రంబుతో నిజమందిరంబున కరిగెఁ; బాండవులును భీష్మద్రోణవిదుర కృపాచార్యులతో నిజనివాసంబుల కరిగిరి. 61**

**ప్రతిపదార్థం:** వానితోడిది+ఏమి= వాటితో పనేమి? (అంటే ఆ జన్మలగురించి తర్కించి ఏం ప్రయోజనం); (కర్ణుడు) దివ్య, లక్షణ, లక్షితుండును= శ్రేష్ఠాలైనలక్షణాలచేత గుర్తింపబడేవాడును; సహజ, కవచ, కుండల, మండితుండును, గాని= సహజాలైన కవచకుండలాలచేత అలంకరింపబడినవాడుగాని; ప్రకృతిపురుషుండు, కాఁడు= సామాన్య మానవుడు కాడు; తన బాహుబలంబునన్= తనయొక్క బాహుబలంచేత; ఈ, అంగరాజ్యంబునక, కాదు= ఈ అంగరాజ్యానికి మాత్రమే కాదు; సకల, మహీ, రాజ్యంబునకున్= మొత్తం ప్రపంచంయొక్క దొరతనానికి; అర్హుండు+అగున్= తగినవాడవును; అనుచున్+ఉన్న, అంతన్= అని పలుకుతుండగా; ఆదిత్యుండు= సూర్యుడు; అస్తంగతుండు+ఐనన్= అస్తమించే కొండవైపు వెళ్ళినవాడు కాగా - అంటే అస్తమించగా; దుర్యోధనుండు; అస్త్ర, సందర్శన, రంగంబు= అస్త్రవిద్యను చూపే ప్రదేశంనుండి; వెలువడి= బయటకు వచ్చి; కర్ణున్= కర్ణుడిని; తోడు+కొని= వెంటపెట్టుకొని; కర, దీపికా, సహస్రంబుతో= దివ్విటీలు వెయ్యింటితో; నిజ, మందిరంబును= తనయొక్క ఇంటికి; అరిగెన్= వెళ్ళాడు; పాండవులును; భీష్మ, ద్రోణ, విదుర, కృపాచార్యులతో; నిజ, నివాసంబులకున్= తమయొక్క ఇండ్లకు; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** 'ఆ జన్మలతో ఏం పని? కర్ణుడు దివ్యలక్షణాలు కలవాడు. సహజకవచకుండలాలు కలవాడు. సామాన్యుడు కాదు. తనబాహుబలంచేత ఈ అంగరాజ్యాన్నే కాదు ఈ భూమండలాన్నంతా పరిపాలించగల సమర్థుడు' అని అంటూండగా, సూర్యు డస్తమించాడు. దుర్యోధనుడు అస్త్రవిద్యారంగాన్ని విడిచి కర్ణుని వెంటబెట్టుకొని వెయ్యి దివ్విటీలు వెలుగుతుండగా తన ఇంటికి వెళ్ళాడు. పాండవులుకూడా భీష్మ ద్రోణ విదుర కృపాచార్యులతో కలిసి తమతమ ఇండ్లకు వెళ్ళారు.

**విశేషం:** దుర్యోధనుని అధిక్షేపాలకు ఏఒక్కరుకూడా ప్రతిసమాధానం ఇచ్చినట్లు చెప్పకుండా ఉండటమే ప్రకరణౌచిత్యం. ప్రతిభావంతుడైన నాటకకర్త ఒకరంగాన్ని అద్భుతంగా నిర్వహించినట్లు ఈ ముగింపు గోచరిస్తుంది. కర్ణునికీర్తి చివరకు జగజ్జేగీయమానంగా ప్రకాశిస్తుంది. కాని, సూర్యుడు అస్తమించటంతో రంగం ముగుస్తుంది. సూర్యసుతుడైన కర్ణుడు జగత్ప్రసిద్ధిని పొందుతాడు కాని విషాదాంతాన్ని చవిచూస్తాడు అని వస్తుధ్వని. వేయిదివిటీలతో వెలుగుతూ నిష్క్రమించిన దుర్యోధనుడు కర్ణుడి స్నేహంవలన భావిచరిత్రలో వేయివిధాల వెలుగబోతున్నాడని వస్తుధ్వని. కాలాన్ని వస్తుధ్వనిగా వాడుకొనే శిల్పం అనల్పం. కాళిదాసాదిమహాకవులనాటకశిల్పమర్మాలను నన్నయ తనరచనలో ప్రవేశపెట్టి కథార్థసంవిధానాన్ని చేశాడు. (సంపా.)

**ఆ. కుంతి యంత సహజకుండలకవచాభి । రాముఁ గర్ణుఁ జూచి రవి సమానుఁ**
**బ్రత్యభిజ్ఞ నెఱిఁగి ప్రథమపుత్త్ర స్నేహ । మెఱుకపడక యుండ నింతి యుండె. 62**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు, కుంతి; సహజ, కుండల+అభిరామున్= పుట్టుకతో వచ్చిన కుండలాలతో, కవచంతో మనోహరమైన వాడిని; రవి, సమానున్= సూర్యునితో సమానమైనవాడిని; కర్ణున్, చూచి; ప్రతి+అభిజ్ఞన్= గుర్తుచేత; ఎఱిఁగి= తెలుసుకొని; ఇంతి= స్త్రీ - కుంతీదేవి; ప్రథమ, పుత్త్ర, స్నేహము= మొదటి కుమారునిమీది ప్రేమ; ఎఱుక, పడక, ఉండన్= బయటపడకుండేటట్లు; ఉండెన్.

**తాత్పర్యం:** అప్పుడు కుంతీదేవి సహజకవచకుండలాలచేత మనోహరుడై, సూర్యసమానుడైన కర్ణుడిని చూచి, గుర్తుపట్టినా, ఆ మొదటికొడుకుమీద తనకున్నప్రేమను బయటపడనీకుండా ఉండింది.

**విశేషం:** కుమారాస్త్రవిద్యాసందర్శనఘట్టంవలన కర్ణుడు హస్తినాపురంలోనే సూతపుత్రుడుగా పెరిగి, దుర్యోధనునికి మిత్రుడై, అంగరాజై ఉన్నాడని కుంతికి తెలిసింది. కాని, ఆమె నిజం బయటపెట్టక దాచి ఉంచింది. ఇది కర్ణునిజీవితం విషాదాంతం కావటానికి ప్రధానమైన శాపం అయింది. (సంపా.)

**క. వినుతధనుర్విద్యావిదు । ఘనుఁ గర్ణు సహాయుఁ బడసి కౌరవవిభుఁ డ**
**ర్జునువలనిభయము సెడి ఱొ । మ్మునఁ జేయిడి నిద్రవోయె ముదితాత్ముం డై. 63**

**ప్రతిపదార్థం:** వినుత, ధనుః+విద్యా, విదున్= పొగడబడిన విలువిద్యను తెలిసినవాడిని; ఘనున్= గొప్పవాడిని; కర్ణున్= కర్ణుడిని; సహాయున్= స్నేహితుడిని; పడసి= పొంది; కౌరవ, విభుఁడు= దుర్యోధనుడు; ముదిత+ఆత్ముండు+ఐ= సంతోషించిన మనస్సు కలవాడై; అర్జునువలని= అర్జునునివలన; భయము, చెడి= భయంపోయి; ఱొమ్మునన్+చేయి+ఇడి= గుండెమీద చేయి వేసికొని; నిద్రపోయెన్.

**తాత్పర్యం:** పొగడదగిన విలువిద్యానిపుణుడైన కర్ణుడిని మిత్రుడిగా పొంది దుర్యోధనుడు సంతోషించి, అర్జునునివలన భయం లేకుండా గుండెమీద చెయ్యివేసికొని నిద్రపోయాడు.

**విశేషం:** అర్జునునికి ప్రతివీరుడిగా కర్ణుడిని నిలిపిన దుర్యోధనునినైపుణ్యం ప్రశంసనీయంగా మిగిలింది ఈ రంగంచివర. కురుకుమారులలో భీమదుర్యోధనులపోరు పెద్దలచేత వారింపబడవచ్చునేమో కాని, కర్ణార్జునుల వైరంమాత్రం కాలం తీర్చవలసిందే అనే సూచన కథాంతంలో నన్నయ ధ్వనింపచేశాడు. (సంపా.)

## కౌరవపాండవులు గురుదక్షిణార్థంబు ద్రుపదుం బట్టఁ జనుట (సం. 1-127-1)

**వ. అంతఁ బ్రభాతం బగుటయు సమయనియమంబులు దీర్చి యాచార్యుండు శిష్యులనెల్ల రావించి 'మీరు నాకు గురుదక్షిణ యిం' డనిన నందఱు మ్రొక్కి యెదుర నిలిచి 'మీ కెద్ది యిష్టంబు సెప్పుం' డనిన విని 'యవివేక కారణ దారుణైశ్వర్యావలిప్తుం డైన ద్రుపదు నొడిచిపట్టి తెం; డిదియ నా కిష్టం బైన గురుదక్షిణ' యని పంచిన. 64**

**ప్రతిపదార్థం:** అంతన్= తర్వాత; ప్రభాతంబు+అగుటయు= తెల్లవారగా; సమయ, నియమంబులు= ఆయా సమయాలలో చేయవలసిన పనులు; తీర్చి= పూర్తిచేసుకొని; ఆచార్యుండు= గురువైన ద్రోణుడు; శిష్యులను+ఎల్లన్= శిష్యులందరినీ; రావించి; మీరలు; నాకున్; గురుదక్షిణ; ఇండు= ఈయవలసింది; అనినన్= అనగా; అందఱు; మ్రొక్కి; ఎదుర,నిలిచి= ఎదుట నిలబడి; మీకున్+ఎద్ది= మీకు ఏది; ఇష్టంబు= ఇష్టమో; చెప్పుండు= చెప్పండి; అనినన్= అనగా; విని; అవివేక, కారణ, దారుణ+ఐశ్వర్య+అవలిప్తుండు+ఐన= అవివేకానికి కారణమైన భయంకరమైన సంపదచేత గర్వించినవాడైన; ద్రుపదున్; ఒడిచి= ఓడించి; పట్టి; తెండు= తీసికొని రండు; ఇదియ; నాకు+ఇష్టంబు+ఐన= నాకు ప్రీతికరమైన; గురుదక్షిణ; అని= ఆవిధంగా; పంచినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** తెల్లవారగానే ఆయా సమయాలలో చేయవలసిన పనులు పూర్తిచేసుకొని ద్రోణాచార్యుడు శిష్యులను పిలిచి 'మీరు నాకు గురుదక్షిణ ఇవ్వండి' అన్నాడు. శిష్యులందరు ఆయనకు మ్రొక్కి ఎదుట నిలబడి 'మీ కేది ఇష్టమో సెలవీయం' డని అడిగారు. అందుల కాయన 'అత్యధికసంపదచేత గర్వించి వివేకాన్ని కోల్పోయిన ద్రుపదుడిని ఓడించి పట్టి తీసికొని రండి. ఇదే నా కిష్టమైన గురుదక్షిణ' అని ఆజ్ఞాపించాడు. కాగా.

**క. వల్లె యని రాజనందను । లెల్లను సమకట్టి, రథము లెక్కి దిశల్ భే
దిల్లఁగ గర్జిల్లి , నిశా । తోల్లసిత కృపాణ కార్ము కోద్యతకరు లై. 65**

**ప్రతిపదార్థం:** వల్లె, అని= సరే అని, రాజనందనులు+ఎల్లను= రాజకుమారులంతా; సమకట్టి= పూనుకొని; రథములు+ఎక్కి; దిశల్= దిక్కులు; భేదిల్లఁగన్= బ్రద్దలయ్యేట్లు; గర్జిల్లి= సింహనాదం చేసి - పెద్ద యుద్ధధ్వని చేసి; నిశాత+ఉల్లసిత, కృపాణ, కార్ముక+ఉద్యత, కరులు+ఐ= వాడియై ప్రకాశిస్తున్న కత్తులతో, విల్లులతో ఎత్తబడిన చేతులు కలవాళ్ళయి.

**తాత్పర్యం:** ద్రోణుడు కోరినగురుదక్షిణకు సరే అని రాజకుమారులంతా పూనుకొని రథాలెక్కి దిక్కులు పిక్కటిల్లేట్లుగా సింహనాదాలు చేసి, చేత ఖడ్గాలు, ధనుస్సులు ధరించి.

**ఉత్సాహము.**

**'ఏల దీని నెడయుఁ జేయ? నీ క్షణంబ యేఁగి పాం
చాలుఁ బట్టి తెత్త మధికశౌర్యలీల మెఱయఁగాఁ
బోలు' ననుచుఁ బెరిఁగి రాజపుత్త్రు లెల్ల నరిగి పాం
చాలుపురము ముట్టికొని రసంఖ్య బలసమేతు లై. 66**

**ప్రతిపదార్థం:** రాజ, పుత్త్రులు+ఎల్లన్= రాజకుమారులంతా; దీనిన్= ఈ పనిని అంటే ద్రుపదుడిని ఓడించి పట్టితెచ్చేపనిని; ఎడయున్+చేయ= ఆలస్యంచేయటం; ఏల= ఎందులకు; ఈ క్షణంబు+అ= ఈ నిముషంలోనే, ఏఁగి= వెళ్ళి; పాంచాలున్+పట్టి=

పాంచాలరాజైన ద్రుపదుడిని పట్టుకొని; తెత్తము (తెచ్చుదము)= తీసుకొనివద్దాము; అధిక, శౌర్య, లీల= అధికశూరత్వం యొక్క విలాసం; మెఱయఁగాన్= ప్రదర్శించగా; పోలున్= తగును; అనుచున్= అంటూ; పెరిఁగి= విజృంభించి; అరిగి= వెళ్ళి; అసంఖ్య, బల, సమేతులు+ఐ= లెక్కించ సాధ్యం గాని సైన్యంతో కూడుకొన్నవాళ్ళయి; పాంచాలు, పురమున్= ద్రుపదుని పట్టణాన్ని; ముట్టికొనిరి= ముట్టడించారు.

**తాత్పర్యం:** రాజకుమారులంతా 'ఈ పనికి ఆలస్యంచేయడమెందుకు?' అని ఈ క్షణమే వెళ్ళి ద్రుపదుడిని పట్టి తెద్దామనీ, ఇది అధికశౌర్యవిలాసాన్ని ప్రదర్శించదగినసమయమనీ, విజృంభించి అసంఖ్యాకసైన్యంతో వెళ్ళి, ద్రుపదుపురాన్ని ముట్టడించారు.

**విశేషం:** ఉత్సాహం జాతివృత్తం. అందులో ప్రతిచరణంలోనూ ఏడు సూర్యగణాలు, ఒక గురువు ఉంటాయి. అయిదవగణం మొదటి అక్షరం యతి. ఉత్సాహం వీరరసస్థాయిభావం. ఆ పేరుతో వెలసిన వృత్తం ఇక్కడ కురుకుమారులు యుద్ధోత్సాహాన్ని ప్రదర్శించే సందర్భంలో వాడబడింది. 'ఉత్సాహ స్సర్వకృత్యేషు సత్వరా మానసీక్రియా' అన్న భావప్రకాశోక్తికి అనుగుణంగా కురుకుమారుల వేగవంతమైన మానసికప్రక్రియను ఈ వృత్తం ధ్వనింప చేస్తున్నది. కాబట్టి నన్నయ మొదటిసారిగా వాడిన ఉత్సాహవృత్తాన్ని కథార్థయోజనకు అనుగుణంగా నిర్వహించాడు. (సంపా.)

**వ. పాండవులును రథంబు లెక్కి ద్రోణుం బరివేష్టించి పిఱుంద నరిగి; రంత నర్జునుం డాచార్యున కి ట్లనియె.67**

**ప్రతిపదార్థం:** పాండవులును; రథంబులు+ఎక్కి; ద్రోణున్= ద్రోణాచార్యుని; పరివేష్టించి= చుట్టువచ్చి; పిఱుందన్= వెనుక; అరిగిరి= వెళ్ళారు; అంతన్= అప్పుడు; అర్జునుండు; ఆచార్యునకున్= ద్రోణాచార్యునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** పాండవులుకూడా రథాలెక్కి ద్రోణుణ్ణి మధ్యలో ఉంచి చుట్టూ తాము గుమిగూడి రక్షించుకొంటూ కౌరవులవెనుకనే బయలుదేరి వెళ్ళారు. అప్పుడు అర్జునుడు ద్రోణునితో ఇట్లా అన్నాడు.

**క. వడిగొని కౌరవు లొండొరుఁ। గడవఁగ మును చనిరి; వారిగర్వము సూడం**
**గడిమిని ద్రుపదాధిపుతోఁ। బొడువఁగఁ దమ కలవియగునె భుజవీర్యమునన్. 68**

**ప్రతిపదార్థం:** కౌరవులు; వడిగొని= వేగంగా; ఒండొరున్= ఒకరినొకరు; కడవఁగన్= మీరునట్లుగా; మును, చనిరి= ముందు వెళ్ళారు; వారిగర్వము; చూడన్= చూడగా; భుజ, వీర్యమునన్= భుజశక్తిలోని; కడిమిని= అతిశయంతో; ద్రుపద+అధిపుతోన్= ద్రుపదరాజుతో; పొడువఁగన్= యుద్ధంచేయటానికి; తమకు+అలవి, అగునె= తమకు సాధ్యమవుతుందా?

**తాత్పర్యం:** కౌరవులు వేగంగా ఒకరినొకరు మీరి ముందుగా వెళ్ళారు గాని - వాళ్ళగర్వం చూస్తే - భుజబలంలో ద్రుపదరాజును మించి యుద్ధంచేయటం వాళ్ళకు సాధ్యమా?

**విశేషం:** ఇది ద్రుపదునిబలం ఏపాటిదో తెలిసికొనాలని పార్థుడు సాగించినసంభాషణ, ఉత్తమవీరుడు శత్రుబలాన్ని అంచనా వేసుకోకుండా యుద్ధానికి దిగడు. కౌరవులు తామే ద్రుపదుడిని పట్టితెచ్చామన్న కీర్తి రావాలని, ద్రోణునిమెప్పు పొందాలని, అవిచారంగా, ఆవేశంతో ముందుకు దూకారు. అర్జునుడు అట్లా చేస్తాడా? దెబ్బతిని తిరిగి వస్తాడా? పైగా అస్త్రవిద్యాభ్యాసం తరువాత ఇదే తానెదుర్కొనే ప్రథమయుద్ధం. అందులోనూ ద్రుపదునితో. అందుకే ఇంత ఆలోచన. తన గురువును అంతటి అస్త్రవిద్యాచార్యుడిని తిరస్కరించిన ద్రుపదుడు అంత తక్కువవాడుగా ఉంటాడా? కాని ద్రుపదుని బలపరాక్రమాల కొలదిని

గూర్చి గురువుగారిని ప్రత్యక్షంగా అడగటం ఎట్లా? అర్జునుడు జంకుతున్నాడనే భావన ఆయనకు వస్తుందేమో? అంతేకాదు, తన ఆత్మాభిమానం ఏమి కావాలి? అందుకే అర్జునుడు అంతనేర్పుగా ద్రోణునితో సంభాషణ ఆరంభించాడు; కౌరవుల స్వాతిశయాన్ని, తొందరపాటును గూర్చి అనుకొంటున్నట్లు ఆరంభించాడు.

**క. అతగులచే ద్రుపదుఁ డనవ । హితుఁ డై పట్టువడ నంతహీనుఁడె? శౌర్యో**
**న్నతుఁ డధికధనుర్విద్యా । న్వితుఁడు భవత్సఖుఁ డనంగ వినరొకొ వానిన్. 69**

**ప్రతిపదార్థం:** ద్రుపదుఁడు; అనవహితుడు+ఐ= ఎచ్చరిక లేనివాడై; అతగులచే= బలహీనులచే; పట్టు పడన్=చిక్కుటకు; అంత, హీనుఁడె= అంతతక్కువవాడా!; వానిన్= ఆ ద్రుపదుడిని; శౌర్య+ఉన్నతుఁడు= శూరత్వంచేత గొప్పవాడు; అధిక, ధనుః+విద్యా+అన్వితుఁడు= గొప్ప ధనుర్విద్యతో కూడుకొన్నవాడు; భవత్+సఖుఁడు= మీయొక్క స్నేహితుడు; అనంగన్= అని అంటుండగా; వినరు+ఒకొ= వినలేదా ఏమి?

**తాత్పర్యం:** ఏమరుపాటున బలహీనులచేత పట్టువడటానికి ద్రుపదుడంత తక్కువవాడా? ద్రుపదుడు గొప్ప శౌర్యవంతుడనీ, గొప్ప ధనుర్విద్యాసంపన్నుడనీ, మీ స్నేహితుడనీ వినలేదా ఏమి ?

**విశేషం:** గురువుగారుమాత్రం తక్కువవారా! శిష్యునిశక్తిసామర్థ్యాలు ఆయనకు తెలియవా. పరీక్షకు ముందే శిష్యునికి సమాధానాలు చెపుతాడా? అందుకే ద్రోణునిమౌనం. ప్రియశిష్యునియుద్ధనైపుణ్యాని కిది ప్రథమపరీక్ష. ఆ శిష్యుడే అన్నీ ఆలోచించుకోవాలి. అంచనా వేసుకోవాలి. యుద్ధం చేయాలి. విజయం సాధించాలి. గురుదక్షిణ ఇవ్వాలి.

**వ. అనుచుం బాంచాలుపురం బాసన్నంబు గాఁ జనుదెంచునంతకు ముందఱ చని దుర్యోధన యుయుత్సు దుశ్శాసనవికర్ణజలసంధాదు లైన ధార్తరా ష్ట్రు లనేకనృపకుమారసహితు లై పాంచాలుపురం బవరోధించినఁ బాంచాలపతి యలిగి యపారచతురంగబలసమేతుం డై కౌరవులం దాఁకి. 70**

**ప్రతిపదార్థం:** అనుచున్; పాంచాలు, పురంబు= ద్రుపదునియొక్క నగరం; ఆసన్నంబు, కాన్= దగ్గర అయ్యేటట్లు; చనుదెంచు+అంతకున్= రాగా; చని= ముందుగా వెళ్ళి; దుర్యోధన, యుయుత్సు, దుశ్శాసన, వికర్ణ, జలసంధ+÷ఆదులు+ఐన= దుర్యోధనుడు, యుయుత్సుడు, దుశ్శాసనుడు, వికర్ణుడు, జలసంధుడు మొదలైన; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుని కుమారులు; అనేక, నృప, కుమార, సహితులు+ఐ= పెక్కుమంది రాకుమారులతో కూడినవాళ్ళయి; పాంచాలు, పురంబు; అవరోధించినన్= అడ్డగించగా; పాంచాల, పతి= పాంచాలరాజు - ద్రుపదుడు; అలిగి= కోపించి; అపార, చతురంగ, బల, సమేతుండు+ఐ= అంతులేని రథ గజ తురగ పదాతి సైన్యంతో కూడుకొన్నవాడై; కౌరవులన్; తాఁకి= ఎదుర్కొని.

**తాత్పర్యం:** ద్రుపదునినగరం దగ్గరపడగా దుర్యోధనుడు, యుయుత్సుడు, దుశ్శాసనుడు, వికర్ణుడు, జలసంధుడు మొదలైన ధృతరాష్ట్రునికుమారులు, పెక్కుమంది రాకుమారులతో కలిసి, ఆ ద్రుపదుని నగరాన్ని ముట్టడించగా, ద్రుపదుడు కోపించి అంతులేని రథగజతురగపదాతిసైన్యంతో కౌరవుల నెదుర్కొని.

**క. శరనికరసహస్రంబులఁ । బరువడి నందఱను గప్పెఁ బ్రావృడ్ధారా**
**ధర మురుధారాజలముల । సరసిజములఁ గప్పునట్లు సంరంభమునన్. 71**

**ప్రతిపదార్థం:** ప్రావృట్+ధారా, ధరము= వర్షాకాల మేఘం; ఉరు, ధారా, జలముల= పెద్ద ధారలైన నీళ్ళతో; సరసిజములన్= పద్మాలను; కప్పునట్లు= క్రమ్మే విధంగా; సంరంభమునన్= త్వరపడి; శర, నికర, సహస్రంబులన్= వేలబాణసమూహాలతో; పరువడిన్= వరుసగా; అందఱను= వారిని అందరినీ; కప్పెన్= కప్పాడు.

**తాత్పర్యం:** వర్షాకాలమేఘం పెద్ద జలధారలతో పద్మాలను కప్పివేసినట్లు ద్రుపదుడు త్వరపడి బాణ సమూహాలు వేలకువేలు వేసి, వాళ్ళనందరినీ వరుసగా కప్పివేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. కలయ నసిముసల దండం । బులు గొని కాంపిల్యనగరమున జను లెల్లన్**
**నలి రేఁగి యార్చి కౌరవ । బలసుభటులఁ బొడిచి రాజి బడలు వడంగన్. 72**

**ప్రతిపదార్థం:** కాంపిల్య, నగరమునన్, జనులు+ఎల్లన్= కాంపిల్యనగరంలోని ప్రజలంతా; నలి= మిక్కిలి; రేఁగి= విజృంభించి; ఆర్చి= సింహనాదాలు చేసి; కలయన్= అంతటా; అసి, ముసల, దండంబులు= కత్తులను, రోకళ్ళను, కర్రలను; కొని= చేతపట్టి; ఆజిన్= యుద్ధంలో; కౌరవ, బల, సుభటులన్= కౌరవ సైన్యంలోని మేటి వీరులను; బడలుపడంగన్= శ్రమపడేట్లుగా; పొడిచిరి= యుద్ధంచేశారు.

**తాత్పర్యం:** కాంపిల్యనగరంలోని ప్రజలంతా విజృంభించి సింహనాదాలు చేసి, కత్తులు, రోకళ్ళు, కర్రలు చేతపట్టి కౌరవసేనలోని మేటివీర లందరు బడలికపొందేటట్లు యుద్ధం చేశారు.

**క. ధృతరాష్ట్రకుమారకు లవ । హితు లై పాంచాలుమీఁద నేసిరి సాంద్రా**
**తతబాణప్రకరతిరో । హిత మై రవికిరణజాల మేర్పడకుండన్. 73**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రకుమారులు= ధృతరాష్ట్రునియొక్క ప్రియపుత్రులు; అవహితులు+ఐ= ఎచ్చరిక గలవాళ్ళయి - సావధానులై; సాంద్ర+ఆతత, బాణ, ప్రకర, తిరోహితము+ఐ= దట్టములై అధికములైన బాణాల సమూహంచేత కప్పబడినదై; రవి, కిరణ, జాలము= సూర్యునియొక్కకిరణాలసమూహం; ఏర్పడక+ఉండన్= బయటపడకుండ ఉండేటట్లుగా; పాంచాలుమీఁదన్= ద్రుపదునిమీద; ఏసిరి= కొట్టారు.

**తాత్పర్యం:** కౌరవులు సావధానులై సూర్యకిరణాలుకూడా బయల్పడకుండేటట్లు దట్టమై అధికమైన బాణ సమూహాన్ని ద్రుపదునిమీద వేశారు.

**క. వారల శరములు నడుమన । వారించుచు నధికలాఘవంబున వారిన్**
**ఘోరశరవిద్ధమర్ములఁ । గా రణమున సోమకుండు ఘనుఁ డై యేసెన్. 74**

**ప్రతిపదార్థం:** సోమకుండు= ద్రుపదుడు; రణమునన్= యుద్ధంలో; ఘనుఁడు+ఐ= గొప్పవాడై - అధికుడై; వారల, శరములు= వాళ్ళయొక్క - కౌరవులయొక్క బాణాలు; నడుమన= నడుమనే; వారించుచున్= తొలగిస్తూ; అధిక, లాఘవంబునన్= మిక్కిలి సులువుగా; వారిన్= వాళ్ళను; ఘోర, శర, విద్ధ, మర్ములన్+కా= భయంకరాలైన బాణాలచేత బాధింపబడిన ఆయువుపట్లు కలవాళ్ళనుగా; ఏసెన్= కొట్టినాడు.

**తాత్పర్యం:** యుద్ధంలో ద్రుపదుడు పెచ్చుపెరిగినవాడై కౌరవుల బాణాలను నడుమనే తొలగించి, అతిసులభంగా వారిఆయువుపట్లు అదరేటట్లు భయంకరాలైన బాణాలతో కొట్టాడు.

**క. నానావిధ మార్గణముల । నానామార్గముల నేసినం, గురువీరుల్**
**వానిం జూచి భయంపడి । నానాతనుఁగా మనంబునన్ వగఁచి రనిన్. 75**

**ప్రతిపదార్థం:** నానావిధ, మార్గణముల= పలురకాలైన బాణాలచేత; నానామార్గములన్= పలువైపులనుండి; ఏసినన్= కొట్టగా; కురు, వీరుల్= కౌరవవీరులు; అనిన్= యుద్ధంలో; వానిన్= ఆ ద్రుపదుడిని; చూచి; భయంపడి; నానాతనున్+కా= అనేకవిధాలైన రూపాలు కలవాడినిగా; మనంబునన్= మనస్సులో; వగచిరి= తలచారు.

**తాత్పర్యం:** పలువిధాలైన బాణాలచేత పలువైపులనుండి కొట్టగా, కురువీరులు యుద్ధంలో ఆ ద్రుపదుణ్ణి చూచి భయపడి, అతణ్ణి నానారూపాలు కలవాణ్ణిగా మనస్సులో తలచారు.

**వ. ఇట్లు పాంచాలుబాణవృష్టికి నిలుపోపక కురుకుమారులు కుమారశరనిహత సురారికుమారులుంబోలె వెఱచఱిచి పాండవులయొద్దకుం బఱతెంచినం జూచి, యర్జునుం డాచార్యధర్మజులకు నమస్కరించి 'మీర లింద యుండుం; డే నీక్షణంబ యప్పాంచాలుం బట్టి తెచ్చెద' నని విజృంభించి, సంరంభంబున భీమసేనుండు దనకు సేనాగ్రచరుండుగా మాద్రేయులు రథచక్రరక్షకులుగా ద్రుపదరాజవాహినీసముద్రంబు దఱియం జొచ్చిన. 76**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పాంచాలు, బాణ, వృష్టికిన్= ద్రుపదునియొక్క బాణాల వానకు; నిలుపు+ఓపక= నిలువలేక; కురుకుమారులు; కుమార, శర, నిహత, సుర+అరి, కుమారులున్+పోలెన్= కుమారస్వామియొక్క బాణాలతో కొట్టబడిన రాక్షసకుమారులవలె; వెఱచఱిచి= భయపడి; పాండవుల, ఒద్దకున్= పాండవులదగ్గరకు; పఱతెంచినన్= పరుగెత్తుకొనిరాగా; చూచి, అర్జునుండు; ఆచార్య, ధర్మజులకు= ద్రోణాచార్యునికి, ధర్మరాజుకు; నమస్కరించి; మీరలు; ఇందు+అ= ఇక్కడే; ఉండుండు= ఉండండి; ఏను= నేను; ఈ క్షణంబు+అ= ఈ నిమిషాన్నే; ఆ+పాంచాలున్= ఆ ద్రుపదుడిని; పట్టి; తెచ్చెదను+అని; విజృంభించి; సంరంభంబునన్= వేగిరపాటుతో; భీమసేనుండు; తనకున్; సేనా+అగ్రచరుండు+కా= సేనయొక్క ముందుభాగానికి వెళ్ళేవాడుగా; మాద్రేయులు= మాద్రితనయులైన నకులసహదేవులు; రథ, చక్ర, రక్షకులుగా= రథంయొక్కచక్రాలను రక్షించేవాళ్ళుగా; ద్రుపద, రాజ, వాహినీ, సముద్రంబున్= ద్రుపదరాజుయొక్కసేన అనే సముద్రాన్ని; తఱియన్= సమీపించేటట్లు; చొచ్చినన్= ప్రవేశించగా.

**తాత్పర్యం:** ద్రుపదునిబాణవర్షానికి నిలువలేక కౌరవులు కుమారస్వామిబాణాలచేత కొట్టబడిన రాక్షసకుమారులవలె భయపడి పాండవులదగ్గరకు పరుగెత్తారు. అది చూచి అర్జునుడు ద్రోణధర్మరాజులకు నమస్కరించి 'మీ రిక్కడే ఉండండి. నేను ఈ క్షణాన్నే ద్రుపదుణ్ణి పట్టి తెస్తా' నని ఆటోపంతో, భీమసేనుడు తనసైన్యానికి ముందు నడువగా, నకులసహదేవులు తనచక్రరక్షకులు కాగా, ద్రుపదుడిసైన్యమనే సముద్రాన్ని సమీపించాడు.

**విశేషం:** అలం: ఉపమ, రూపకం. అర్జునుడు గురువైన ద్రోణునికి, పెద్దన్న అయిన ధర్మరాజుకు నమస్కరించటం గురుజనభక్తికి నిదర్శనం. అర్జునుడికి గురు వెంతటి దైవమో, అన్నకూడా అంతటి దైవం.

## భీమార్జునులు ద్రుపదునిసేనను దునుమాడుట (సం. అను.1-78-40 పంక్తి)

**క. కరిఘటలఁ దాఁకి భీముఁడు । కరటికటీకుంభదంతకరముఖముల జ**
**ర్జరితములఁ జేసె నిష్ఠుర । తరవజ్రనిపాతపటుగదాఘాతములన్. 77**

**ప్రతిపదార్థం:** కరి, ఘటలన్= ఏనుగుల సమూహాలను; తాఁకి= ఎదుర్కొని; భీముఁడు; నిష్ఠురతర, వజ్ర, నిపాత, పటు, గదా, ఘాతములన్= మిక్కిలి కఠినాలైన వజ్రాయుధంయొక్క దెబ్బలవలె బలమైన గదయొక్క దెబ్బలచేత; కరటి, కటీ, కుంభ, దంత, కర, ముఖములన్= ఏనుగులయొక్క చెక్కిళ్ళను, కుంభస్థలాలను, దంతాలను, తొండాలను, ముఖాలను; జర్జరితములన్+చేసెన్= పగులగొట్టబడినవాటినిగా చేశాడు.

**తాత్పర్యం:** భీముడు ఏనుగుల సమూహాలను ఎదుర్కొని వజ్రపాతంవంటి గదాఘాతాలచేత వాటిచెక్కిళ్ళను, కుంభస్థలాలను, దంతాలను, తొండాలను, ముఖాలను పగులగొట్టాడు.

**ఉ. దారుణమౌ వృకోదరు గదాకులిశాహతి నన్యవాహినీ**
**వారణసంచయం బభినవక్షతజారుణధార లొప్ప సం**
**చారితధాతునిర్ఝరవిశాలశిలోచ్చయ సంచయాభమై**
**వీరరణంబునం బడియె విక్షతహస్తిపవృక్షపంక్తితోన్. 78**

**ప్రతిపదార్థం:** దారుణము+ఔ= భయంకరమైనట్టి; వృక+ఉదరు, గదా, కులిశ+ఆహతిన్= తోడేలు కడుపువంటి కడుపు కలవాడైన భీమునియొక్క గద అనే వజ్రాయుధంయొక్క దెబ్బచేత, అన్య, వాహినీ, వారణ, సంచయంబు= శత్రుసేనలోని ఏనుగులగుంపు; అభినవ, క్షతజ+అరుణ, ధారలు+ఒప్పన్= కొత్తనెత్తురుయొక్క ఎఱ్ఱనిధారలు ఒప్పగా; సంచారిత, ధాతు, నిర్ఝర, విశాల, శిలా+ఉచ్చయ, సంచయ+ఆభము+ఐ= సంచరింపజేయబడిన గైరికధాతువులతో కూడిన సెలయేళ్ళతో విశాలమైన పర్వత సమూహం యొక్క కాంతి గలదై; విక్షత, హస్తిప, వృక్ష, పంక్తితోన్= కొట్టబడిన మావటీళ్ళనే వృక్షాల సమూహంతో, వీర, రణంబునన్= వీరులయొక్కయుద్ధంలో; పడియెన్= పడింది.

**తాత్పర్యం:** భయంకరమైన వజ్రాయుధంవంటి భీమునిగదాఘాతంచేత శత్రుసైన్యంలోని ఏనుగులగుంపు - క్రొత్తనెత్తుటిధారలతో - గైరికాదిధాతువులతో కూడిన సెలయేళ్ళతో, విశాలమైన సంచార పర్వత సమూహంవలె, కొట్టబడిన మావటీళ్ళనే వృక్షసమూహంతోకూడి ఆ యుద్ధంలో పడింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. 'పర్వతసమూహంవలె' అని ఉంటే ఉపమ అవుతుంది. కాని, 'సంచారపర్వతసమూహంవలె' అనే భావన దీన్ని ఉత్ప్రేక్షగా మారుస్తున్నది.

**చ. అనిలజుఁ డుగ్రుఁ డై ద్రుపదుహస్తిఘటావళి నశ్వసంహతిన్**
**ఘనరథకోటి భగ్నములుగా సమరంబునఁ జేసె పేదదు**
**ర్మనుజులఁ జంప నేల యని మానుగ గోపుఁడు గోగణంబులన్**
**గొనకొని రొప్పునట్టు లధికుం డెగిచెం బృథుదండహస్తుఁ డై. 79**

**ప్రతిపదార్థం:** అనిలజుఁడు= వాయుదేవునికుమారుడైన భీముడు; ఉగ్రుఁడు+ఐ= భయంకరమైనవాడై; సమరంబునన్= యుద్ధంలో; ద్రుపదు, హస్తి, ఘటా+ఆవలిన్= ద్రుపదునియొక్క ఏనుగు మందలయొక్క సముదాయాన్ని; అశ్వ, సంహతిన్= గుర్రాల సమూహాన్ని; ఘన, రథ, కోటిన్= గొప్ప రథాల సమూహాన్ని; భగ్నములు+కాన్= దెబ్బతిన్నవాటినిగా; చేసి, పేద, దుర్+మనుజులన్= బలహీనులైన దుష్ట మానవులను; చంపన్+ఏల= చంపటం ఎందుకు; అని= అనుకొని; మానుగన్= ఒప్పుగా; అధికుండు= గొప్పవాడు - భీముడు; పృథు, దండ, హస్తుఁడు+ఐ= పెద్దగద చేతిలో గలవాడై; గోపుఁడు= ఆవులకాపరి; గో, గణంబులన్= ఆవుల సమూహాలను; కొనకొని= పూని; రొప్పునట్టుల= అరచి తరిమినట్లుగా; ఎగిచెన్= తరిమాడు.

**తాత్పర్యం:** భీముడు భయంకరుడై యుద్ధంలో ద్రుపదునిగజాశ్వరథసమూహాలను భగ్నంచేసి, బలహీనులైన దుష్టమానవులను చంపటం ఎందుకులే అని గొల్లవాడు గోవులమందను అరచి తరిమినట్లు తరిమాడు.

**విశేషం:** అలం: ఉపమ. భీమపరాక్రమాన్ని వర్ణించిన 77, 78, 79 పద్యాలు ఓజోగుణరమణీయాలు.

**స్రగ్ధర.**

> **అంతఁ గౌంతేయుఁ డత్యాయతభుజుఁడు నరుం డల్గి పాంచాలు దంతి**
> **ధ్వాంతంబున్ వానివాహోత్తమతుహినతతిం దద్భటోదారతారా**
> **సంతానంబున్ శరాంశూచ్చయవిభవమునన్ శాంతిఁ బొందించి యుద్య**
> **ద్ధ్వాంతారాతిప్రభుం డై తనరుచు వెలిఁగెన్ దద్రణవ్యోమవీథిన్.** **80**

**ప్రతిపదార్థం:** అంతన్= తర్వాత; అతి+ఆయత, భుజుఁడు= మిక్కిలి విశాలాలైన భుజాలు కలవాడు; కౌంతేయుఁడు= కుంతీదేవి కుమారుడు; నరుండు= అర్జునుడు; అల్గి= కోపించి; పాంచాలు, దంతి, ధ్వాంతంబున్= ద్రుపదునియొక్కఏనుగుల సమూహమనే చీకటిని; వాని, వాహ+ఉత్తమ, తుహిన, తతిన్= అతనియొక్క అశ్వశ్రేష్ఠాలనే మంచుసమూహాన్ని; తత్+భట+ఉదార, తారా, సంతానంబున్= అతనియొక్క భటులు అనే గొప్పనక్షత్రాల సమూహాన్ని; శర+అంశు+ఉచ్చయ, విభవమునన్= బాణాలు అనే కిరణాల సమూహంయొక్కసంపదచేత; శాంతిన్+పొందించి= అణగేటట్లు చేసి; తత్+రణ, వ్యోమ, వీథిన్= ఆ యుద్ధమనే ఆకాశమార్గంలో; ఉద్యత్+ధ్వాంత+అరాతి, ప్రభుండు+ఐ= ప్రకాశిస్తున్నసూర్యునికాంతివంటి కాంతి గలవాడై; తనరుచున్= ఒప్పుతూ; వెలిఁగెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** తర్వాత విశాలాలైన భుజాలు కలవాడూ, కుంతీకుమారుడూ అయిన అర్జునుడు ఆగ్రహించి, ద్రుపదుని ఏనుగులసమూహమనే చీకటిని, అశ్వసమూహమనే మంచును, సైనికసమూహమనే నక్షత్రసముదాయాన్ని తన బాణాలనే కిరణసంపదచేత అణగేటట్లు చేసి, యుద్ధమనే ఆకాశవీథిలో సూర్యుడివలె ప్రకాశించాడు.

**విశేషం:** అలం: రూపకం. స్రగ్ధరావృత్తంలో ప్రతిపాదంలోనూ మ, ర, భ, న, య, య, య అనే గణాలుంటాయి. 8, 15 అక్షరాలతో యతిమైత్రి. నన్నయ వాడిన స్రగ్ధరావృత్త మిదే. "వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్" అని కాత్యాయనుడు చెప్పినట్లు అభినవగుప్తపాదులు పేర్కొన్నారు. అత్యాయుతభుజుడైన అర్జునుని బాణప్రయోగాన్ని సూర్యుని కర (కిరణ) ప్రయోగాలుగా రూపకం చేయటంతో ఛందశ్శిల్పంతోపాటు అలంకారసార్థక్యాన్నికూడా నన్నయ ప్రదర్శించాడు. (సంపా.)

**క. ఆతనిఁ జూచి సహింపక । యాతతకార్ముకుఁడు ద్రుపదుననుజుఁడు శౌర్యో**
**పేతుఁడు సత్యజితుం డను । నాతఁడు ధీరుఁ డయి తాఁకె నతిరభసమునన్. 81**

**ప్రతిపదార్థం:** ఆతనిన్= ఆ అర్జునుడిని; చూచి; సహింపలేక= ఓర్వలేక; ఆతత, కార్ముకుఁడు= గొప్పవిల్లు కలవాడు; శౌర్య+ ఉపేతుఁడు= శౌర్యంతో కూడుకొన్నవాడు; ద్రుపదున్+అనుజుఁడు= ద్రుపదుడిని అనుసరించి పుట్టినవాడు - తమ్ముడు; సత్యజితుండు; అను; అతడు; ధీరుఁడు+అయి= ధైర్యంగలవాడై; అతి, రభసమునన్= మిక్కిలి ఆటోపంతో; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** అర్జునునివిజృంభణం చూచి ఓర్వలేక ద్రుపదునితమ్ముడు సత్యజితుడనేవాడు గొప్పవిల్లు చేపట్టి శౌర్యధైర్యాలు గలవాడై అమితమైన ఆటోపంతో ఆతణ్ణి ఎదుర్కొన్నాడు.

**క. కడఁగి ద్రుపదానుజుఁడు నె । వ్వడిఁ గవ్వడి నేసె నూఱువాఁడిశరములం**
**గడు నలిగి వాని నన్నియు । నడుమన తునియంగ నేసె నరుఁ డస్త్రములన్. 82**

**ప్రతిపదార్థం:** ద్రుపద+అనుజుఁడు= ద్రుపదునితమ్ముడు; కడఁగి= పూనుకొని; నెఱ+వడిన్= నిండువేగంతో; నూఱు, వాఁడి, శరములన్= వంద పదునైన బాణాలచేత; కవ్వడిన్= అర్జునుడిని; ఏసెన్= కొట్టాడు; నరుఁడు= అర్జునుడు; కడున్= మిక్కిలి; అలిగి= కోపించి; వానిన్= ఆ బాణాలను; అన్నియున్= అన్నింటిని; నడుమన్+అ= మధ్యలోనే; తునియంగన్= ముక్కలయ్యేటట్లు; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** ద్రుపదుని తమ్ముడు ఎంతో ప్రయత్నించి, మహావేగంగా వందవాడిబాణాలతో అర్జునుడిని కొట్టాడు. అందుకు అర్జునుడు ఆగ్రహించి, తనబాణాలతో నడుమనే వాటినన్నింటిని ముక్కలు చేశాడు.

**క. వివిధాస్త్రకోవిదుఁడు వా । సవి వానిరథంబుఁ బార్ష్ణిసారథుల మహిం**
**గువలు వడ నేసె నుగ్రా । హవమునకును వాఁడు విముఖుఁడై చెడి పఱవన్. 83**

**ప్రతిపదార్థం:** వివిధ+అస్త్ర, కోవిదుఁడు= అనేకవిధాలైన అస్త్రాలను తెలిసినవాడు; వాసవి= ఇంద్రునికొడుకైన అర్జునుడు; వాని, రథంబున్= అతనియొక్క రథాన్ని; పార్ష్ణి సారథులన్= వెనుక కాపలాకాసేవాళ్ళను, సారథులను; వాఁడు= ఆ ద్రుపదుని తమ్ముడు; ఉగ్ర+ఆహవమునకును= భయంకరమైనయుద్ధానికి; విముఖుఁడు+ఐ= పెడమొగంగలవాడై; చెడి= కనబడకుండ; పఱవన్= పరుగెత్తిపోయేటట్లు; మహిన్= భూమిమీద; కువలుపడన్= కుప్పలుపడేట్లుగా; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** అనేకవిధాలైన అస్త్రాలు తెలిసిన అర్జునుడు - ద్రుపదుడితమ్ముడు గొప్పయుద్ధానికి భయపడి పరుగెత్తిపోయేటట్లు - అతనిరథాన్నీ, సారథులనూ నేలమీద కుప్పలు పడేటట్లు కొట్టాడు.

**వ. అంత. 84**

**తాత్పర్యం:** ఆ పైన.

**క. శరమోక్షణవేగనిరం । తరమండలితోరుచాపదండుఁ డకాండో**
**ద్ధురదండధరుఁడపోలెను । హరినందనుఁ దాఁకె ద్రుపదుఁ డత్యుద్ధతుఁ డై. 85**

**ప్రతిపదార్థం:** శర, మోక్షణ, వేగ, నిరంతర, మండలిత+ఉరు, చాప, దండుఁడు= బాణాలను వదలటంలోని వేగంచేత ఎడతెగక వలయాకారంగా చేయబడిన గొప్ప ధనుస్సుయొక్క కఱ్ఱగలవాడు; ద్రుపదుఁడు; అతి+ఉద్ధతుఁడు+ఐ= మిక్కిలి గర్వించినవాడై; అకాండ+ఉద్ధుర, దండ, ధరుఁడు+అ, పోలెను= అకాలంలో విజృభించిన యముడో అనేటట్లు; హరి, నందనున్= దేవేంద్రుని కుమారుడైన అర్జునుణ్ణి; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** వ్యవధి లేకుండ వేగంగా బాణాలు వదలటంవలన వలయాకారం పొందిన ధనుస్సుయొక్క కఱ్ర కలవాడైన ద్రుపదుడు, మిక్కిలిగర్వంతో అకాలంలో విజ్రుంభించిన యముడో అన్నట్లు అర్జునుడిని ఎదుర్కొన్నాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. 'చాపదండుఁ డకాండోద్ధుర....' అనేదానికి 'చాపదండు నకాండోద్ధుర...' అనే పాఠాంతరమున్నది. అట్లయితే ఆ విశేషం అర్జుననకు అన్వయిస్తుంది.

**మ. పరమాస్త్రైకవిశారదుల్ బలయుతుల్ పాంచాలకౌంతేయు లొం**
**డొరులన్ మార్కొని యేయునప్పుడు తదీయోగ్రాజిరంగంబు దు**
**స్తర నీరంధ్ర నిశాత సాయక తమస్సంఛన్న మైనం బర**
**స్పరయుద్ధంబులు దక్కి యోధులు నిశాభ్రాంతాత్ము లై రచ్చటన్. 86**

**ప్రతిపదార్థం:** పరమ+అస్త్ర+ఏక, విశారదుల్= ఉత్తమాలైన అస్త్రాలలో మిక్కిలిపండితులూ; బలయుతుల్= బలంతో కూడుకొన్నవాళ్ళు అయిన; పాంచాల, కౌంతేయులు= పాంచాలరాజైన ద్రుపదుడు, కుంతీ తనయుడైన అర్జునుడు; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; మార్కొని= ఎదుర్కొని; ఏయు+అప్పుడు= బాణాలు ప్రయోగించేటప్పుడు; తదీయ+ఉగ్ర+ఆజి, రంగంబు= వాళ్ళయొక్క భయంకరమైన యుద్ధభూమి; దుస్+తర, నీరంధ్ర, నిశాత, సాయక, తమస్+సంఛన్నము+ఐనన్= దాటరానివి, దట్టమైనవి, వాడిఅయినవి అయిన బాణాలవలన కలిగిన చీకటిచేత కప్పబడగా; అచ్చటన్= అక్కడగల; యోధులు= వీరులు; పరస్పర యుద్ధంబు= ఒకరితో నొకరు పోరాడటాలు, తక్కి= మాని; నిశా, భ్రాంత+ఆత్ములు+ఐరి= రాత్రి అయిందనే భ్రాంతిని పొందిన మనస్సులు కలవాళ్ళు అయ్యారు.

**తాత్పర్యం:** అస్త్రవిద్యలో పండితులు, బలవంతులు అయిన ద్రుపదపార్థులు, ఒకరినొకరు ఎదుర్కొని బాణాలు ప్రయోగించుకొనేటప్పుడు - భయంకరమైన వాళ్ళయుద్ధభూమి, దాటరాని దట్టమైన వాడిబాణాలతో కప్పబడి చీకటిమయం కాగా, అచ్చటివీరులు ఒకరితో ఒకరు పోరాటడం మాని రాత్రి అయిందని భ్రాంతిపడ్డారు.

**విశేషం:** అలం: భ్రాంతిమంతం.

### అర్జునుఁడు ద్రుపదుం బట్టి కట్టి తెచ్చుట (సం.1-128-3)

**వ. అట్టి మహాద్వంద్వయుద్ధంబున విజిగీషుం డయి పాంచాలుండు పాండవమధ్యముధనుర్మధ్యంబు భగ్నంబుగా నొక్కబాణంబున నేసి యార్చిన, నలిగి వాసవసుతుం డుద్యతాసిహస్తుం డయి శైలస్థలంబుమీఁదికి లంఘించుకొదమసింగంబునుంబోలె ద్రుపదురథంబుమీఁదికి లంఘించి వానిం బట్టికొనినఁ దత్సైన్యంబు హాహాకారంబు లెసంగ మహార్ణవంబునుంబోలె మ్రోయుచుండె నంత. 87**

**ప్రతిపదార్థం:** అట్టి; మహా, ద్వంద్వ, యుద్ధంబునన్= అటువంటి గొప్ప జంటపోరులో; విజిగీషుండు+అయి= జయించాలన్నకోరిక మిక్కుటంగా కలవాడై; పాంచాలుండు= ద్రుపదుడు; పాండవ, మధ్యము, ధనుః+మధ్యంబు= పాండవులలో

నడిమివాడైన అర్జునుని విల్లుయొక్క నడిమిభాగం; భగ్నంబు, కాన్= విరిగేటట్లుగా; ఒక్క, బాణంబునన్= ఒక్క బాణంతో; ఏసి= కొట్టి; ఆర్చినన్= సింహనాదం చేయగా; వాసవ, సుతుండు= దేవేంద్రునియొక్క కుమారుడైన అర్జునుడు; అలిగి= కోపించి; ఉద్యత+అసి, హస్తుండు+అయి= ఎత్తబడిన కత్తిని చేతిలో కలవాడై; శైల, స్థలంబు, మీఁదికిన్= కొండ ప్రదేశం మీదికి; లంఘించు= ఎగిరిదూకే; కొదమ, సింగంబునున్+పోలెన్= పిల్లసింహంవలె; ద్రుపదు రథంబు, మీఁదికి= ద్రుపదుని తేరుపైకి; లంఘించి= దూకి; వానిన్= ఆ ద్రుపదుడిని; పట్టికొనినన్= పట్టుకోగా; తత్+సైన్యంబు= అతనియొక్క సైన్యం; హాహాకారంబులు= హాహా శబ్దాలు; ఎసంగన్= అతిశయించగా; మహా+అర్ణవంబునున్+పోలెన్= మహాసముద్రంవలె; మ్రోయుచున్+ఉండెన్= ఘోషిస్తూ ఉండింది; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** ఆ గొప్పద్వంద్వయుద్ధంలో జయించాలన్నకోరిక మిక్కుటంగా కలవాడై ద్రుపదుడు, అర్జునుని విల్లు నడిమిభాగం విరిగేటట్లు ఒక బాణం వేసి పెద్దగా అరచాడు. అందుకు అర్జునుడు ఆగ్రహించి, చేత కత్తి నెత్తుకొని కొండమీదికి దూకే కొదమసింహంవలె ద్రుపదునిరథంమీదికి ఎగిరి దూకి, అతణ్ణి పట్టుకొన్నాడు. అప్పుడు ద్రుపదునిసైన్యం పెద్దహాహాకారాలతో మహాసముద్రంవలె ఘోషిస్తూ ఉండింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ప్రక్షీణదర్పు ద్రుపదు ర । థాక్షముతోఁ గట్టి తెచ్చి యర్జునుఁడు క్రియా**
**దక్షుం డయి గురునకు గురు । దక్షిణగా నిచ్చి చేసెఁ దత్సమ్మదమున్. 88**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు; క్రియా, దక్షుండు+అయి= కార్యంలో సమర్థుడై - అంటే చేయవలసిన పనిని చేయడంలో సమర్థుడై; ప్రక్షీణ, దర్పున్= మిక్కిలి తగ్గిపోయినగర్వం గలవాడిని; ద్రుపదున్= ద్రుపదుడిని, రథ+అక్షముతోన్= తేరి ఇరుసుతో (ఇరుసుకు); కట్టి, తెచ్చి; గురునకున్= గురువైన ద్రోణాచార్యునికి; గురుదక్షిణగాన్; ఇచ్చి; తత్+సమ్మదమున్= అతనికి సంతోషాన్ని; చేసెన్= కలిగించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు కార్యసాధనసమర్థుడై గర్వం కోల్పోయిన ద్రుపదుణ్ణి తేరి ఇరుసుకు కట్టి తెచ్చి , గురుదక్షిణగా ఇచ్చి ద్రోణాచార్యుణ్ణి సంతోషపెట్టాడు.

**విశేషం:** అక్షరరమ్యతలో అనురణనధ్వనికి ఉపకరణంగా వాడే నన్నయరచనాశిల్పంలో ఒక మెలకువ ఈ పద్యంలో ఉన్నది. పద్యంలో 'క్ష' ప్రాసాక్షరం. చివరి పాదంలోని 'గురుదక్షిణ' అనే పదం. ఈ పద్యంలో ఆయువుపట్టు. గురుదక్షిణకు గౌరవాన్ని కలిగించే క్షకారప్రాస అనురణనసౌందర్యాన్ని కలిగిస్తున్నది. పూర్వార్ధంలోని క్షకారప్రాస ద్రుపదుని దైన్యాన్ని ధ్వనిచూస్తుంటే, ఉత్తరార్ధంలోని క్షకారప్రాస అర్జునుని ప్రతాపాన్ని ధ్వనిస్తున్నది. 'గురుదక్షిణ' అంటే గురువుకొరకైనదక్షిణ అనీ, గొప్పదైన దక్షిణ అనీ అర్థవైచిత్రి ఏర్పడి 'గురువునకు గురుదక్షిణ' తగినవిధంగా - కొండంతదేవుడికి కొండంతపత్రి నిచ్చినట్లు - ఇచ్చాడనే అర్థం అనురణన సామర్థ్యంతో ఏర్పడుతున్నది. అందువలన ఈ పద్యంలో శబ్దశక్తిమూలక అనురణనధ్వని ఉన్నది. (సంపా.)

**వ. ద్రోణుండును నర్జునుచేసిన పరాక్రమంబునకుఁ బరమహృష్టహృదయుం డై ద్రుపదుం జూచి నగుచు ని ట్లనియె. 89**

**ప్రతిపదార్థం:** ద్రోణుండును; అర్జును= అర్జునుడు; చేసిన= కావించిన; పరాక్రమంబునకున్; పరమ, హృష్ట, హృదయుండు+ఐ= మిక్కిలి ఆనందించిన హృదయం కలవాడై; ద్రుపదున్+చూచి; నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ద్రోణుడుకూడా అర్జునుని పరాక్రమం చూచి ఆనందించి నవ్వుతూ ద్రుపదునితో ఇట్లా అన్నాడు.

**క. వీ రెవ్వ రయ్య? ద్రుపదమ । హారాజులె! యిట్లు కృపణు లయి పట్టువడన్**
**వీరికి వలసెనె? యహహా! మ । హారాజ్యమదాంధకార మది వాసెనొకో?. 90**

**ప్రతిపదార్థం:** వీరు+ఎవ్వరు+అయ్య= వీ రెవ్వరండి!; ద్రుపద, మహారాజులె= ద్రుపదమహారాజులుగారేనా!; ఇట్లు= ఈ విధంగా; కృపణులు+అయి= దిక్కులేనివారై; పట్టు+పడన్= పట్టుపడటానికి; వీరికిన్= వీరికి; వలసెన్+ఎ= ఆవశ్యకమయిందా! అహహా= ఔరా!; మహా, రాజ్య, మద+అంధకారము= గొప్పరాజ్యగర్వంచేత కలిగిన గ్రుడ్డితనం; అది= అది; పాసెన్+ఒకో= తొలగిపోయిందా ఏమి?

**తాత్పర్యం:** వీ రెవ్వ రయ్యా? ద్రుపదమహారాజులే! ఈ విధంగా దిక్కులేక పట్టుపడవలసిన పరిస్థితి ఏర్పడిందే! అహాహా! మహారాజ్యమదంచేత కలిగిన కన్నుగాననితనం తొలగిపోయిందా?

**విశేషం:** వ్యంగ్యంగా అధిక్షేపించే వాక్యపద్ధతికి ఈ పద్యం తెలుగులో హృద్యమైన ఉదాహరణగా నిలిచిపోయింది. ద్రోణుని గూఢాభిమానాన్ని ఈ పద్యం వ్యంగ్యసుందరంగా వ్యక్తం చేస్తున్నది. ద్రోణుడు అధిక్షేపంగా పలికేటప్పుడు - అయ్య! మహారాజులె, వీరికి వలసెనె; అదివాసెనొకో! - అనే మాటలనేప్పుడు ఒక వింతవెటకారం ధ్వనిస్తుంది. దానిని కాకువు అంటారు. ఆ కాకువులు పూర్వం ద్రుపదుడు ద్రోణుడిని అవమానించినమాటలవరుసను స్ఫురింపచేస్తూ, వాటికి ప్రతిగా ద్రోణుడు అధిక్షేపిస్తున్నట్లు ధ్వని. మొదట ద్రోణుడు తమ పాతస్నేహాన్ని జ్ఞాపకంచేస్తూ గుర్తించావా? అని ప్రశ్నించినప్పుడు, ద్రుపదుడు తనకు తెలియదన్నాడు. దానికి ఎద్దేవగా 'నీ వెవరయ్యా?' అని వ్యంగ్యంగా ప్రశ్నించటం. మహారాజుతో పేద బాపడికి సంబంధం ఎట్లా కలుగుతుంది? అని ప్రశ్నించిన ద్రుపదుడిని 'ఇప్పుడు నా ఎదుట ఉన్నది ద్రుపదమహారాజులా?' అని వెటకారపుతిరుగుప్రశ్న. 'రాజ్యంపోయిన పేదవాడివి నీవు' అని వ్యంగ్యమైన అధిక్షేపం. 'ఈ విధంగా దిక్కులేకుండా పట్టుపడవలసి వచ్చిందా?' అని పరిహసించినప్పుడు పూర్వం తన దయనీయస్థితిని చూచికూడా జాలిపడక 'మిత్రామిత్రత్వాలు రాజులకు కార్యవశంగా ఏర్పడతాయి' అన్న ద్రుపదునిమాటకు తిరుగుదెబ్బ వినపడుతుంది. ఐశ్వర్యగర్వంచేత ద్రోణుని విలువ తెలిసికొనకుండ మాట్లాడిన గ్రుడ్డితనం ఇప్పుడు తొలగిందా, 'నీ ఐశ్వర్యం, నీ పరాక్రమం, నా శిష్యులఅధీనం, నా దయాభిక్ష' అని తలపింపచేసి, తన ఔన్నత్యాన్నీ, అదృష్టాన్నీ వ్యంగ్యంగా ద్రోణుడు ధ్వనింపచేశాడు. (సంపా.)

**ఆ. 'ఇంక నైన మమ్ము నెఱుఁగంగ నగునొక్కొ!' యనుచు నుల్లసంబు లాడి ద్రుపదు**
**విడిచిపుచ్చె గురుఁడు; విప్రులయలుకయుఁ దృణహుతాశనంబు దీర్ఘ మగునె?. 91**

**ప్రతిపదార్థం:** ఇంకన్+ఐన= ఇక ముందైన; మమ్మున్= మమ్ములను; ఎఱుంగన్+అగున్+ఒక్కొ= గుర్తించుకోతగునుసుమా!; అనుచున్= అంటూ; ఉల్లసంబులు+ఆడి= ఎగతాళి మాటలు మాట్లాడి; గురుఁడు= ద్రోణాచార్యుడు; ద్రుపదున్= ద్రుపదుడిని; విచిచి, పుచ్చెన్= వదిలివేశాడు; విప్రుల+అలుకయున్= బ్రాహ్మణులయొక్కకోపం; తృణ, హుతాశనంబు= గడ్డినిప్పు; దీర్ఘము+అగునె= ఎక్కువకాలం ఉంటుందా!

**తాత్పర్యం:** 'ఇక ముందైనా మమ్మల్ని గుర్తుంచుకోగలరా?' అని ఎగతాళి చేసి, ద్రోణుడు ద్రుపదుణ్ణి విడిచి పెట్టాడు. బ్రాహ్మణునికోపం, గడ్డినిప్పు ఎక్కువకాలం ఉంటాయా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ఇప్పటికైనా న న్నెప్పుడూ గుర్తుంచుకుంటావా? - అనే కాకువువలన కలిగే అధిక్షేపార్థం ద్రుపదునికి గుండెలో ములుకువలె కలకాలం గుర్తుంటుంది. చేసిన స్నేహాన్ని మరిచేవారికి తగినవాఙ్మయాస్త్రం ద్రోణుని

అధిక్షేపోక్తి. భీమార్జునులు ద్రుపదునితో యుద్ధం చేసినఘట్టంలో దాదాపు ప్రతిపద్యంలోనూ అలంకారప్రయోగం చేశాడు-నన్నయ. కథార్థాలను ప్రసన్నంచేయటానికి అర్థాలంకారప్రయోగంకూడా అర్థయోజనశిల్పంలో ఒకభాగం. (సంపా.)

## ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరుని యౌవరాజ్యాభిషిక్తునింజేయుట (సం.1-79-191)

**వ. ఇట్లు ద్రుపదుండు ద్రోణుచేత విముక్తుం డయ్యుఁ గోపపాశబద్ధుం డయి యప్పరిభవంబునకుం బ్రతీకారంబు సేయ సమకట్టి బ్రాహ్మణోపాస్తి సేయుచుండె; నంత నిట ధృతరాష్ట్రుండు యుధిష్ఠిరు రాజ్యభారధురంధరుంగా నెఱింగి భీష్మవిదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తుం జేసిన. 92**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ద్రుపదుండు; ద్రోణుచేతన్; విముక్తుండు+అయ్యున్= విడువబడినవాడైనా; కోప, పాశ, బద్ధుండు+అయి= కోప మనే తాటిచేత కట్టబడినవాడై; ఆ+పరిభవంబునకున్= ఆ అవమానానికి; ప్రతీకారంబు= తిరిగి అపకారం; చేయన్= చేయటానికి; సమకట్టి= పూనుకొని; బ్రాహ్మణ+ఉపాస్తి= బ్రాహ్మణులయొక్క సేవను; చేయుచున్+ఉండెను= చేస్తూఉన్నాడు; అంతన్= తర్వాత; ఇటన్= హస్తినాపురంలో; ధృతరాష్ట్రుండు, యుధిష్ఠిరున్= ధర్మరాజును; రాజ్య, భార, ధురంధరున్+కాన్= రాజ్యంయొక్క భారాన్ని వహించేసమర్థుడిగా; ఎఱింగి= తెలిసికొని; భీష్మ, విదురులతో; విచారించి= ఆలోచించి; యౌవ, రాజ్య+అభిషిక్తున్= యౌవరాజ్యంలో అభిషేకింపబడినవానినిగా; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రుపదుడు ద్రోణునిచేత విడిచిపెట్టబడినా - అతడు కోపమనే తాటితో కట్టబడినవాడై, ద్రోణుడు తనకు చేసినఅవమానానికి తిరిగి అపకారం చేయాలని బ్రాహ్మణులసేవ చేస్తున్నాడు. అట హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు యౌవరాజ్యభారం వహించటానికి యుధిష్ఠిరుడు తగినవాడని భీష్మ, విదురులతో విచారించి, అతణ్ణి యౌవరాజ్యాభిషిక్తుణ్ణి చేయగా.

**విశేషం:** 'బ్రాహ్మణోపాస్తి సేయుచుండె' - అనే దానికి బ్రాహ్మణోపాస్తిచేయుచు పురంబు సొరనొల్లక యుండె' - 'సేయుచుండె ద్రోణుండు రాజకుమారసహితుండై హస్తిపురంబునకు మగుడి వచ్చె నంత' అనే పాఠాంతరాలున్నాయి. - శ్రీమదాంధ్ర మహాభారతము సంశోధితప్రతి, పుట. 341. ద్రోణుడు తరువాత రాజకుమారసహితుడై హస్తినాపురానికి తిరిగిరావటం విశేషంగాదు. కాని ద్రుపదుడు అవమానాన్ని భరించలేక బ్రాహ్మణోపాస్తి చేస్తూ తనపురం సొర నొల్లకుండటం విశేషం.

**చ. నలువురు దమ్ములున్ బలిమి నాలుగుదిక్కులు నోర్చి సర్వభూ**
**తలమున రాజనందనులదర్ప మడంచుచు భూరివస్తురా**
**సులు గొనివచ్చి యీఁగొని విశుద్ధయశోనిధి యొప్పె ధర్మజుం**
**డలఘుఁడు యౌవరాజ్యయుతుఁ డయ్యును బెంపున సార్వభౌముఁ డై. 93**

**ప్రతిపదార్థం:** నలువురు, తమ్ములున్; బలిమిన్= బలంతో; నాలుగు, దిక్కులున్= నాలుగుదిక్కుల్నీ; ఓర్చి= ఓడించి; సర్వ, భూతలమునన్= మొత్తంభూమిమీద; రాజ, నందనుల, దర్పము= రాజకుమారులయొక్క గర్వాన్ని; అడంచుచున్= అణచివేస్తూ; భూరి, వస్తు, రాసులు= పెద్దవైన పదార్థరాసులను; కొనివచ్చి= తీసికొనివచ్చి; ఈన్= ఈయగా; కొని= తీసుకొని; విశుద్ధ, యశస్+నిధి= స్వచ్ఛమైనకీర్తికి స్థానమైనవాడు; అలఘుఁడు= తక్కువవాడుకానివాడు - అంటే గొప్పవాడు; ధర్మజుండు= యౌవ, రాజ్య, యుతుఁడు+అయ్యును =యౌవరాజ్యంతో కూడుకొన్నవాడే అయినప్పటికీ; పెంపునన్= గొప్పతనంచేత; సార్వభౌముఁడు+ఐ= సమస్తభూమిని పరిపాలించే రాజై; ఒప్పెన్= వెలిగాడు.

**తాత్పర్యం:** నలుగురుతమ్ములు తమబలంతో నాలుగుదిక్కులు జయించి, భూమిమీది రాకుమారు లందరి పొగ రణచి, ఎంతోవిలువైన పదార్థరాసులను తెచ్చి ఇయ్యగా, వాటిని గ్రహించి స్వచ్ఛమైనకీర్తితో గొప్పవాడైన ధర్మరాజు యువరాజే అయినా చక్రవర్తివలె వెలిగాడు.

**విశేషం:** అలం: కావ్యలింగం. 'సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్'. ధర్మరాజు పదవిలో యువరాజైనా మహిమలో సార్వభౌముడు. తమ్ములు నలుదిక్కుల రాజులను జయించి సంపదలు తెచ్చి అతని అధీనం చేయటంవలన అతడు సార్వభౌముడనే భావం సమర్థనీయమైనది. ఇక్కడ ధర్మరాజుని నాయకత్వంతోపాటు భీమాదుల అనునాయకత్వంకూడ వస్తుధ్వని. భీమాదుల వీరవృత్తాలన్నీ ధర్మజునిధర్మవీరప్రవృత్తికి పోషకాలే. అంగిని పోషించే అంగా (అంగరసా) లే అని తాత్పర్యం. ధర్మజుడివర్ణనం ప్రసాదగుణభూయిష్ఠమై ఉండటం సార్థకం. (సంపా.)

**వ. మఱియును. 94**

**తాత్పర్యం:** ఇంకా.

**క. బద్ధపరంపర నొప్పె మ । దోద్ధతగజరథతురంగయుద్ధముల గదా**
**యుద్ధములఁ జూడ నెందుఁ బ్ర । సిద్ధుఁడు మధ్యముఁడ యను విశిష్టస్తవముల్. 95**

**ప్రతిపదార్థం:** మద+ఉద్ధత, గజ, రథ, తురంగ, యుద్ధముల= మదంచేత గర్వించిన ఏనుగులబలంతో, రథబలంతో, అశ్వ బలంతో యుద్ధాలు చేయటంలో; చూడన్= చూడగా; ఎందున్= దేనిలోనైనా; మధ్యముఁడు+అ= కుంతీపుత్రులలో నడిమివాడైన భీముడే; ప్రసిద్ధుడు= పేరుకెక్కినవాడు; అను; విశిష్ట, స్తవముల్= గొప్పపొగడ్తలు; బద్ధ, పరంపరన్= కట్టబడ్డవరుసచేత; ఒప్పెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** గజరథాశ్వయుద్ధాలలో, గదాయుద్ధంలో - దేనిలోనైనా కుంతీపుత్రులలో నడిమివాడైన భీముడే పేరు కెక్కినవాడన్న పొగడ్తలు పరంపరగా వ్యాపించాయి.

**చ. అనుపమకార్ముకాదివివిధాయుధవిద్యలయందుఁ గోవిదుం**
**డనఁగ నజయ్యుఁ డై పరఁగు నర్జునుఁ బోలఁగ నన్యు లెందు లే**
**రను జనఘోష ముచ్చరిత మయ్యె మరుచ్చలితోచ్చవీచి ని**
**స్వనముఖరాబ్ధివేష్టిత విశాలమహీవలయాంతరంబునన్. 96**

**ప్రతిపదార్థం:** అనుపమ, కార్ముక+ఆది, వివిధ+ఆయుధ విద్యల+అందు= సాటిలేని ధనుస్సు మొదలుగా నానావిధాలైన ఆయుధ విద్యలలో; కోవిదుండు= పండితుడు; అనఁగన్; అజయ్యుఁడు+ఐ= గెలువసాధ్యంగానివాడై; పరఁగు= ఒప్పునట్టి; అర్జునున్; పోలఁగన్; అన్యులు= ఇతరులు; ఎందున్= ఎచ్చటను; లేరు; అను; జన, ఘోషము= జనులయొక్కధ్వని; మరుత్+ చలిత+ఉచ్చ, వీచి, నిస్వన, ముఖర+అబ్ధి, వేష్టిత, విశాల, మహీ, వలయ+అంతరంబునన్= గాలిచేత ఎగురుతున్న ఎత్తైన అలలయొక్క శబ్దంచేత ధ్వనిస్తున్నసముద్రాలచేత చుట్టబడిన విశాలభూమండలంయొక్క మధ్యప్రదేశంలో; ఉత్+చరితము= మీది కెగసింది; అయ్యెన్.

**తాత్పర్యం:** ధనుర్విద్య మొదలుగా వివిధాలైన ఆయుధవిద్యలలో పండితుడై, అజేయుడైన అర్జునునితో పోల్చటానికి ఇతరు లెక్కడా లేరనే జనఘోష భూమండలంలో అంతటా మీదికి ఎగసింది.

**విశేషం:** ప్రసాదగుణ విశిష్టమైన ఓజోగుణం ఈ రచనలో అర్జునుడిఅనంతకీర్తిని ధ్వనింపచేస్తున్నది. ధర్మజుడిని, అర్జునుడిని చంపకమాలలో వర్ణించటం, భీముడిని, కవలను కందపద్యాలలో వర్ణించటం నన్నయ ఛందశ్శిల్పంద్వారా ప్రదర్శిస్తున్న పాత్రల కీర్తుల తారతమ్యానుశీలనం, అక్షరరమ్యాలైన ఛందస్సులనుకూడా వ్యంజకాలుగా నిబంధించే నన్నయరుచిరార్థసూక్తినిధిత్వం పాండవవర్ణనంలో ప్రౌఢంగా ప్రదర్శించబడింది. (సంపా.)

**క. యము లమితశౌర్యు లరినృప । యము లమలచరిత్రనిరతు లనఁగా నత్యు**
**త్తమభక్తి నన్నలకు విన । యము మెఱయుచు నుండి రధికు లై బహుకళలన్. 97**

**ప్రతిపదార్థం:** యములు= కవలలు - నకులసహదేవులు; అమిత, శౌర్యులు= మిక్కిలిపరాక్రమం కలవాళ్ళు; అరి, నృప, యములు= శత్రురాజులకు యమధర్మరాజువంటివాళ్ళు; అమల, చరిత్ర, నిరతులు= నిర్మలమైన నడవడిలో ఆసక్తిగలవాళ్ళు; అనఁగాన్= అని చెప్పబడగా; బహుకళలన్= అనేకవిద్యల్లో; అధికులై= గొప్పవాళ్ళయి; అతి+ఉత్తమ, భక్తిన్= మిక్కిలి శ్రేష్ఠమైన భక్తితో; అన్నలకున్; వినయము; మెఱయుచున్= చూపుతూ; ఉండిరి.

**తాత్పర్యం:** నకులసహదేవులు - మిక్కిలి పరాక్రమం కలవాళ్ళు. శత్రురాజులకు యమధర్మరాజువంటివాళ్ళు. స్వచ్ఛమైన నడవడిగలవాళ్ళు - అనే పేరు పొంది అనేకవిద్యలలో ఆరితేరి అత్యుత్తమభక్తితో అన్నలపట్ల వినయం చూపుతూన్నారు.

### భారద్వాజుం డర్జునునకు బ్రహ్మశిరోనామకదివ్యబాణం బొసఁగుట (సం.1-80-20)

**వ. ఇట్లు పాండుకుమారు లపారగుణంబుల నెల్లవారికి నారాధ్యు లయి పరఁగుచున్న నందు ధనుర్విద్య నర్జును దృఢముష్టిలాఘవలక్ష్యవేధిత్వదూరాపాత జితశ్రమత్వంబులకు నసిగదాశక్తితోమరాదిప్రహరణప్రవీణతకుం బరమహీపాల పరాజయోత్పాదన పరాక్రమంబునకుఁ దనవలని భక్తిస్నేహంబులకు మెచ్చి భారద్వాజుండు వానికి బ్రహ్మశిరం బను దివ్యబాణంబు సప్రయోగనివర్తనంబుగా నిచ్చి యి ట్లనియె. 98**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పాండు, కుమారులు= పాండవులు; అపార, గుణంబులన్= అంతులేని (మంచి) గుణాలతో; ఎల్లవారికిన్= అందరికీ; ఆరాధ్యులు+అయి= పూజింపదగినవాళ్ళయి; పరగుచున్+ఉన్నన్= ప్రవర్తిల్లుతుండగా; అందున్= అందులో; ధనుః+విద్యన్= ధనుర్విద్యలో; అర్జును, దృఢ, ముష్టి, లాఘవ, లక్ష్యవేధిత్వ, దూర+ఆపాత, జిత, శ్రమత్వంబులకున్= అర్జుననియొక్క గట్టిపిడికిలికీ, వేగానికీ (నైపుణ్యానికీ), గురిని కొట్టటానికీ, దూరప్రయోగానికీ, జయింపబడిన అలసట కలవాడవటానికీ; అసి, గదా, శక్తి, తోమర+ఆది, ప్రహరణ, ప్రవీణతకున్= కత్తి, గద, బల్లెం, చిల్లకోల మొదలయిన వాటితో కొట్టటంలోని నేర్పుకు; పర, మహీపాల, పరాజయ+ఉత్పాదన, పరాక్రమంబునకున్= శత్రురాజులకు అపజయాన్ని కలిగించేటి పరాక్రమానికీ; తనవలనిభక్తి, స్నేహంబులకున్= తనపట్ల ఉండే భక్తిప్రేమలకు; మెచ్చి; భారద్వాజుండు= ద్రోణుడు; వానికిన్= అర్జుననికి; బ్రహ్మశిరంబు+అను; దివ్య, బాణంబున్= దేవతాసంబంధమైన బాణాన్ని; సప్రయోగ, నివర్తనంబుగాన్= ప్రయోగ, ఉపసంహారాలతో కూడినట్లుగా; ఇచ్చి= ఒసగి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవులు అంతులేని మంచిగుణాలతో అందరికీ పూజ్యులై ప్రవర్తిల్లుతుండగా- వారిలో అర్జుననియొక్క పిడికిలిబిగువుకు, వేగానికి (నైపుణ్యానికి), గురి కొట్టే నేర్పుకు, దూరాన పడేటట్లు ప్రయోగించే సామర్థ్యానికి, అలసటలేనితనానికీ; కత్తి, గద, బల్లెం, చిల్లకోల మొదలైన ఆయుధవిద్యలలో ఆర్జించుకొన్న ప్రావీణ్యానికీ,

శత్రురాజుల జయింపగల పరాక్రమానికీ, తనపట్ల చూపుతున్న భక్తిప్రేమలకు మెచ్చి, ద్రోణాచార్యుడు 'బ్రహ్మశిర' మనే పేరుగల దివ్యాస్త్రాన్ని ప్రయోగోపసంహారాలతో ఉపదేశించి ఇచ్చి, ఇట్లా అన్నాడు.

**ఉ. దీని నగస్తి నాఁ బరగు దివ్యమునీంద్రుఁడు దొల్లి ప్రీతితో**
**భూనుత! యగ్నివేశుఁ డను భూరిమునీంద్రున కిచ్చె; వారలున్**
**మానుగ నాకు నిచ్చిరి; క్రమంబున నేనును నీకు నిచ్చితిన్;**
**దీనికి నీవ యర్హుఁడవు తేజమునం గడుఁ బెద్ద గావునన్. 99**

**ప్రతిపదార్థం:** భూనుత!= భూమిపై పొగడబడేవాడా!; దీనిన్= ఈఅస్త్రాన్ని; తొల్లి= పూర్వం; అగస్తినాన్+పరగు= అగస్తి అనే పేరుతో ఒప్పే; దివ్యముని+ఇంద్రుఁడు= గొప్పమునిశ్రేష్ఠుడు; ప్రీతితోన్= ప్రేమతో; అగ్నివేశుఁడు+అను; భూరి; ముని+ఇంద్రునకున్= గొప్ప మునిశ్రేష్ఠునికి; ఇచ్చెన్; వారలున్= వారు; మానుగన్= అయితే; ఒప్పుగ; నాకున్= నాకు; ఇచ్చిరి= ఇచ్చారు; నేనును= నేనుకూడా; క్రమంబునన్= వరుసగా; నీకున్; ఇచ్చితిని; తేజంబునన్= పరాక్రమంలో; కడున్= మిక్కిలి; పెద్ద; కావునన్; దీనికిన్; నీవు+అ= నీవే; అర్హుఁడవు= తగినవాడివి.

**తాత్పర్యం:** లోకంలో పొగడ్తలందుకొన్న ఓ అర్జునా! అగస్తి మహాముని ఈ అస్త్రాన్ని ప్రేమతో అగ్నివేశునికి ఇచ్చాడు. ఆయన నా కిచ్చాడు. నేను నీ కిచ్చాను. పరాక్రమంలో గొప్పవాడివి కనుక దీనికి నీవే తగినవాడివి.

**వ. 'దీని మానవులయందుఁ బ్రయోగింపకుండునది; యల్పతేజులయందుఁ బ్రయుక్తం బయి యిది జగంబులఁ గాల్చు; నిన్ను బాధించు నట్టి మానవులు గలిగిరేని ప్రయోగించునది; వారి నశ్రమంబున సాధించు' నని దాని మహిమ చెప్పి 'నీవు నీ బంధుసమక్షంబున నాకు గురుదక్షిణ యి; మ్మిది యెయ్యది యనిన నాయుద్ధంబుసేయునపుడు నాతో నెన్నడుఁ బ్రతియుద్ధంబు సేయకుండు; మిదియ నాకు గురుదక్షిణ' యనిన నర్జునుండు వల్లె యని యాచార్యునకు నమస్కరించి దాని కొడంబడియె; నంత దుర్యోధనుండు యుధిష్ఠిరుయౌవరాజ్యాభిషేకంబునకు భీమార్జునయములపరాక్రంబునకు మనంబున సహింపనోపక కర్ణశకునిదుశ్శాసనులతో మంతనం బుండి యి ట్లనియె. 100**

**ప్రతిపదార్థం:** దీనిన్= ఈ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని; మానవుల+అందున్= మానవులపై; ప్రయోగింపక+ఉండునది= ప్రయోగించకుండా ఉండవలసింది; అల్ప, తేజుల+అందు= తక్కువశక్తి కలవారిమీద; ప్రయుక్తంబు+అయి= ప్రయోగింపబడినదై; ఇది= ఈ అస్త్రం; జగంబులన్= లోకాలను; కాల్చున్; నిన్నున్; బాధించు, అట్టి= బాధకలిగించునట్టి; మానవులు; కలిగిరి+ఏని= ఉన్నట్లయితే; ప్రయోగించునది= ప్రయోగించుము; వారిన్; అశ్రమంబునన్= శ్రమలేకుండ - సులభంగా; సాధించున్= లోబరుచుకొంటుంది; అని; దాని, మహిమన్= దాని ప్రభావాన్ని; చెప్పి; నీవు; నీ, బంధు, సమక్షంబునన్= నీయొక్క బంధువుల ఎదుట; నాకున్; గురుదక్షిణ; ఇమ్ము; ఇది= ఈ గురుదక్షిణ; ఏ+అది= ఏది; అనినన్= అనగా; నా, యుద్ధంబు, చేయు, అపుడు= నేను యుద్ధం చేసేప్పుడు; నాతోన్= నాతో; ఎన్నడున్= ఎప్పుడూ; ప్రతి, యుద్ధంబు= ఎదురుయుద్ధం; చేయక+ఉండుము; ఇదియ= ఇదే; నాకున్, గురుదక్షిణ; అనినన్= అనగా; అర్జునుండు; వల్లె= సరే; అని; ఆచార్యునకున్= ద్రోణునికి; నమస్కరించి; దానికిన్; ఒడంబడియెన్= అంగీకరించాడు; అంతన్= తరువాత; దుర్యోధనుండు; యుధిష్ఠిరు= ధర్మరాజుయొక్క;, యౌవరాజ్యాభిషేకంబునకు; భీమ+అర్జున, యముల, పరాక్రమంబునకు= భీమునియొక్క అర్జునునియొక్క,

నకులసహదేవులయొక్క పరాక్రమానికి; మనంబునన్; సహింపన్+ఓపక= ఓర్వలేక; కర్ణ, శకుని, దుశ్శాసనులతో; మంతనంబు+ ఉండి= ఆలోచనచేస్తూ ఉండి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఈ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని మానవులమీద ప్రయోగించవద్దు. అల్పశక్తిగల వారిమీద ప్రయోగిస్తే ఇది లోకాలనే మాడ్చివేస్తుంది. నిన్ను బాధించే మానవులుంటే వాళ్ళమీద ప్రయోగించు. అతిసులభంగా ఇది వాళ్ళను పడగొట్టగలుగుతుంది' - అని ఆ అస్త్రమహిమ తెలియజెప్పి - 'నీ బంధువు లందరియెదుట నా కొక గురుదక్షిణ ఇమ్ము. అది ఏమంటే నేను యుద్ధం చేసేప్పుడు నీవు నాతో ఎదురుయుద్ధం చేయకుండటం' అని ద్రోణాచార్యు డనగా విని అందుకు అర్జునుడు అంగీకరించాడు. తర్వాత దుర్యోధనుడు భీమార్జుననకుల సహదేవులపరాక్రమం చూచి ఓర్వలేక, కర్ణశకునిదుశ్శాసనులతో ఆలోచనచేస్తూ ఇట్లా అన్నాడు.

## కణికనీతి (సం. 1-81-10)

**సీ. 'ఆయుధవిద్యలయందు జితశ్రము । లనియును రణశూరు లనియు సంత**
**తోత్సాహు లనియు నత్యుద్ధతు లనియును । భయమందుచుండుదుఁ బాండవులకు;**
**దానిపై నిప్పుడు ధర్మజు యువరాజుఁ । జేసె రా; జే నేమి సేయువాఁడ?**
**నృపనీతి యెయ్యది? నిరతంబుగా మీర । నా కెఱిఁగింపుఁడు నయముతోడ'**

**ఆ. ననిన వినియుఁ గణికుఁ డనువాఁడు, సౌబలు । నాప్తమంత్రి, నీతులందుఁ గరము**
**కుశలుఁ డైనవాఁడు కురుకులవల్లభు । నిష్టమునకుఁ దగఁగ నిట్టు లనియె. 101**

**ప్రతిపదార్థం:** ఆయుధ, విద్యల+అందు; జితశ్రములు+అనియును= అలసట ఎరుగనివారు, పండితులనీ; రణ, శూరులు+ అనియు= యుద్ధంలో శౌర్యంకలవారనీ; సంతత+ఉత్సాహవంతులు+అనియున్= ఎడతెగని ఉత్సాహం కలవారనీ; అతి+ ఉద్ధతులు= మిక్కిలి గర్వించినవాళ్ళు; అనియును= అనికూడా; పాండవులకు= పాండవులను జూచి; భయము+ అందుచు+ ఉండుదున్= భయపడుతుంటాను; దానిపైన్= దానికితోడు; రాజు= ధృతరాష్ట్ర మహారాజు; ధర్మరాజున్= ధర్మరాజును; యువరాజున్+చేసె= యువరాజుగా చేశాడు; ఏమి, చేయు, వాఁడన్; నృపనీతి= రాజనీతి; ఏ+అది=ఏది; మీరు+అ= మీరే; నయముతోడన్= ప్రీతితో; నిరంతరంబుగాన్= నిత్యంగా; నాకున్+ఎఱిఁగింపుఁడు= నాకు తెలియచెప్పండి; అనినన్= అనగా; వినియున్= వినికూడా; నీతుల+అందున్; కరము, కుశలుఁడు+ఐనవాఁడు= నీతులలో మిక్కిలినేర్పరి ఐనవాడు; సౌబలు+ఆప్త, మంత్రి= సుబలునికుమారుడైన శకునియొక్క ప్రియమైనమంత్రి; కణికుఁడు+అనువాఁడు; కురు, కుల, వల్లభు+ఇష్టమునకున్= కురువంశరాజైన దుర్యోధనుని కోరికకు; తగఁగన్= తగినట్లుగా; ఇట్టుల+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఆయుధవిద్యలలో పండితులనీ, రణశూరులనీ, ఎడతెగనిఉత్సాహవంతులనీ, మిక్కిలి గర్వించినవాళ్ళనీ పాండవులకు భయపడుతుంటాను. దానికితోడు ధృతరాష్ట్రమహారాజు, ధర్మరాజును యువరాజుగా చేశాడు. ఏం చేయాలో తోచటంలేదు. ప్రీతితో రాజనీతి నా కుపదేశించండి' - అని దుర్యోధనుడనగా, నీతుల్లో నేర్పరీ, శకునికి ప్రియమంత్రీ అయిన కణికుడు దుర్యోధనునికోరికకు తగినట్లు ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** కణికుడు - అనే పేరుకు 'కణింకుఁడు' , 'గిణికుఁడు' అనే పాఠాంతరాలున్నాయి. అంతేగాక సంస్కృతభారతం పి.పి.యస్.శాస్త్రిప్రతి, 904 పుటలో "తతః కణింక మానాయ్య ధృతరాష్ట్రోఽబ్రవీ దిదమ్" అని ఉంది. సంస్కృతభారతం

చిత్రశాలాప్రతి, 244 పుటలో "కణికం మంత్రిణాం శ్రేష్ఠం ధృతరాష్ట్రోऽబ్రవీ ద్వచః"అని ఉన్నది. చూడు, - శ్రీమదాంధ్రమహాభారత సంశోధితప్రతి, పుట 344. కణికుడు - కిణింకుడైనాఁ గిణికుడైనా - అతనిపేరు సంగతి ఎలా ఉన్నా పైన పేర్కొన్న సంస్కృతభారత ప్రతులనుబట్టి కణికుడిని పిలిపించి ఉపదేశం పొందినవాడు ధృతరాష్ట్రుడు. కాని నన్నయ భారతంలో కణికోపదేశాన్ని పొందింది దుర్యోధనుడు. ఇది పెద్దమార్పు. ఇది ఇట్లా ఉండగా భాండార్కరుప్రతిలో నన్నయభారతంలోని కణికనీతిప్రక్షిప్తమనే అభిప్రాయం వ్యక్తంచేయబడినట్లు, తాము చూచిచ తాళపత్రప్రతుల్లో, ముద్రితప్రతుల్లో కణికనీతి ఉన్నట్లు శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతిని సిద్ధం చేసినవారు చెప్తున్నారు. "భాండార్కరు ప్రతిలో (అధ్యాయాలు 128, 129) కణికనీతి విడువబడింది. 574 పుటలోని జ్ఞాపిక చూడనవును. నన్నయ (క్రీ.శ.1050) భారతంలో కణికనీతిప్రశంస లే దని భాండార్కరు నుడువుతున్నది. క్షేమేంద్రుని భారతమంజరిలో గూడ ఇది లేదని భాండార్కరు సంస్థవారు వ్రాస్తున్నారు. జావాప్రతి (క్రీ.శ.1000)లో గూడ ఇది లేదని వారే చెప్తున్నారు. మూలభారతంమీద రచింపబడిన వ్యాఖ్యలలో కణికనీతి వ్యాఖ్యానింపబడలేదని భాండార్కరుప్రతి తెలుపుచున్నది. శాంతిపర్వంలో శత్రుంజయునికి భరద్వాజునిచేత ఉపదేశించబడిన రాజనీతిసారాంశమే- కణికనీతి అని వీరిమతం. కాని మేము చూచిన తాళప్రతులలోను, ముద్రితప్రతులలోను కణికనీతి కనబడుచున్నది. నన్నయభారతములో ఇది ప్రక్షిప్తమనుటకు ఆధారమేమో తెలియదు. పర్వానుక్రమణిక, పర్వసంగ్రహములందు మాత్రం కణికనీతి ప్రశంస లేదు''. - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుటలు 344, 345.

**తరువోజ.**

**ధరణీశుఁ డుద్యతదండుఁ డై యుచిత । దండవిధానంబుఁ దప్పక ధర్మ**
**చరితులఁగా మహీజనుల రక్షించి । సద్వృత్తుఁ డగునది; సర్వవర్ణములు**
**వరుసన తమతమ వర్ణధర్మముల । వర్తిల్లుదురు గడవక దండభీతి**
**నరిమిత్రవర్జితుఁ డై సమబుద్ధి । యగు మహీవల్లభు ననుశాసనమున.** **102**

**ప్రతిపదార్థం:** ధరణి+ఈశుడు= భూపతి, రాజు; ఉద్యత, దండుఁడు+ఐ= పైకెత్తబడిన రాజదండం గలవాడై; ఉచిత, దండ, విధానంబున్= తగిన దండనీతి పద్ధతిని; తప్పక; మహీ, జనులన్= భూమిలోని ప్రజలను; ధర్మ, చరితులన్+కాన్= ధర్మమైన నడవడి కలవాళ్ళనుగా; రక్షించి= సత్+వృత్తుఁడు+అగునది= మంచి నడవడి కలవాఁడు కావాలి; దండనీతిన్= దండ నీతిలో; అరి, మిత్ర, వర్జితుఁడు+ఐ = శత్రువులు, మిత్రులు లేనివాడై; సమ, బుద్ధి+అగున్= సమానమైన బుద్ధి కల వాడవుతాడు; మహీ, వల్లభు+అనుశాసనమునన్= రాజుయొక్క ఆజ్ఞచేత; సర్వ, వర్ణములు= అన్నిజాతులు; వరుసన= క్రమంగా; తమ, తమ వర్ణ ధర్మముల= తమ తమ జాతులయొక్క ధర్మాలను; కడవక= దాటక; వర్తిల్లుదురు= ప్రవర్తిస్తారు.

**తాత్పర్యం:** ప్రభువు ప్రబలమైన అధికారం గలవాడై, తగిన దండనీతిని అవలంబించి, ప్రజలను ధర్మమార్గాన నడిపించి, మంచి ప్రవర్తన గలవాడుగా ఉండాలి. దండనీతిలో స్వపరభేదభావం లేకుండ సమబుద్ధితో ఉండే రాజుయొక్కఆజ్ఞచేత అన్నిజాతులవాళ్ళూ తమతమజాతిధర్మాలను ఉల్లంఘించక ప్రవర్తిస్తారు.

**విశేషం:** ఉత్తమపాలనకు అధికారబలం ఒక్కటే ప్రభువుకు చాలదు. నిష్పక్షపాతం, సత్ప్రవర్తనం ప్రభుతకు పెద్దబలాన్ని చేకూర్చే గుణాలు. ఇవికూడా ప్రభువుకు ఉండాలి. తరువోజ లక్షణానికి ఆది. 5,28, 145 పద్యాల విశేషవ్యాఖ్యలు చూడండి.

**క. గుఱుకొని కార్యాకార్యము । లెఱుఁగక దుశ్చరితుఁ డై యహితుఁ డగు నేనిన్**
**మఱవక గురు నైనను జను ।లెఱుఁగఁగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్.** **103**

**ప్రతిపదార్థం:** గుఱుకొని= ప్రయత్నించి; కార్య+అకార్యములు= చేయదగిన పనులు, చేయకూడని పనులు; ఎఱుఁగక= తెలియక; దుః+చరితుఁడు+ఐ= చెడునడవడి కలవాడై; అహితుఁడు+అగున్+ఏనిన్= మేలుకోరేవాడు కాకుంటే; మహీ +ఈశుఁడు= భూపతి - రాజు; గురున్+ఐనను= గురువునైనా; మఱవక= మరచిపోకుండా; బుద్ధిన్= తెలివితేటలతో - వివేకంతో; జనులు+ఎఱుఁగఁగన్= ప్రజలకందరికీ తెలిసేటట్లు; శాసించునది= శిక్షించవలసింది.

**తాత్పర్యం:** ఇవి చేయదగిన పనులు, ఇవి చేయగూడని పనులు - అని తెలిసికొనకుండ, చెడు నడవడి గలవాడై, మేలుకోరేవాడు కాకుంటే - తండ్రినైనా (లేదా గురువునైనా) సరే విడిచిపెట్టక, వివేకంతో, ప్రజలందరికీ తెలిసేటట్లు అతడిని ప్రభువు శిక్షించాలి.

**విశేషం:** గురు శబ్దానికి పాఠాంతరం సుతుశబ్దం ఉంది. మూలంలో దీనికి సరిపడే శ్లోకం కనిపించదు - శ్రీమదాంధ్రమహాభారత సంశోధితప్రతి, పు. 345

**క. ధీరమతియుతులతోడ । విచారము సేయునది మును, విచారితపూర్వ**
**ప్రారబ్ధమైన కార్యము । పారముఁ బొందును విఘాతపదదూరం బై. 104**

**ప్రతిపదార్థం:** మును= ముందుగా; ధీర, మతి, యుతులతోడన్= గొప్ప బుద్ధి గలవాళ్ళతో; విచారము= ఆలోచన; చేయునది= చేసేది; విచారిత, పూర్వ, ప్ర+అరబ్ధము+ఐన, కార్యము= ముందుగా ఆలోచించబడిందై గొప్పగా మొదలుపెట్టబడిన పని; విఘాత, పద, దూరంబు+ఐ= చెడిపోవటం అనే మాటకు దూరమైనదై - అంటే చెడిపోకుండ; పారమున్+పొందును= తుదముట్టును - పూర్తి అవుతుంది.

**తాత్పర్యం:** ఏ పనినైనా బుద్ధిమంతులతో ముందుగా విచారించి చేయాలి. ముందుగా విచారించి చక్కగా ప్రారంభించిన పని చెడిపోకుండా సఫలమవుతుంది.

**క. జనపాలుఁడు మృదుకర్మం । బున నైనను గ్రూరకర్మమున నైనను నే**
**ర్పున నుద్ధరించునది త - న్ననపాయతఁ బొంది చేయునది ధర్మంబుల్. 105**

**ప్రతిపదార్థం:** జన, పాలుఁడు= ప్రజలను పాలించేవాడు - రాజు; నేర్పునన్= నేర్పుతో; తన్నున్= తనను; మృదు, కర్మంబునన్+ఐనను= మెత్తనిపనిచేతకాని; క్రూర, కర్మమునన్+ఐనను= భయంకరమైనపనిచేతగాని; ఉద్ధరించునది= రక్షించుకోవాలి; అనపాయతన్= ప్రమాదం లేకుండటాన్ని; పొంది= కలిగి; ధర్మంబుల్; చేయునది= చేయాలి.

**తాత్పర్యం:** రాజు నేర్పుతో మెత్తనిపనిచేతగాని, భయంకరమైనపనిచేతగాని, మొదట తనను తాను రక్షించుకోవాలి. తనకు ప్రమాదం లేకుండ చూచుకొని రాజధర్మాలు నడపాలి.

**క. అమలినమతి నాత్మచ్ఛి । ద్రము లన్యు లెఱుఁగకుండఁ దా నన్య చ్ఛి**
**ద్రము లిమ్ముగ నెఱుఁగుచు దే । శముఁ గాలము నెఱిఁగి మిత్రసంపన్నుం డై. 106**

**ప్రతిపదార్థం:** అమలినమతిన్= స్వచ్ఛమైన బుద్ధితో; ఆత్మ, ఛిద్రములు= తనయొక్క లోపాలు; అన్యులు= ఇతరులు; ఎఱుఁగకుండ = తెలిసికొనకుండా; తాను, అన్య, ఛిద్రములు= ఇతరులయొక్క లోపాలు; ఇమ్ముగన్= అనుకూలంగా; ఎఱుఁగుచున్= తెలిసికొంటూ; దేశమున్= దేశపరిస్థితులను; కాలమున్= కాల పరిస్థితులను; ఎఱిఁగి= తెలిసికొని; మిత్ర, సంపన్నుండు+ఐ= స్నేహితులయొక్క బలంకలవాడై.

**తాత్పర్యం:** అచ్చపుబుద్ధితో తన లోపాలు ఇతరులు తెలిసికోకుండ ఇతరుల లోపాలను తాను తెలిసికొంటూ, దేశకాలపరిస్థితులను ఎరిగి, మిత్రబలం గలవాడై, రాజు తనరాజధర్మాలను నిర్వర్తించాలి.

**క. బలహీను లైనచో శ । త్రులఁ జెఱచుట నీతి, యధిక దోర్వీర్య సుహృ**
**ద్బలు లైన వారిఁ జెఱుపఁగ । నలవియె యక్లేశ సాధ్యు లగుదురె మీఁదన్. 107**

**ప్రతిపదార్థం:** బల, హీనులు+ఐనచో= బలాన్ని కోల్పోయినవాళ్ళయితే; శత్రువులన్; చెఱచుట= చంపటం; నీతి= రాజనీతి; అధిక, దోః+వీర్య, సుహృత్+బలులు+ఐన, వారిన్= ఎక్కువ బాహుబలం, మిత్రబలం గలవాళ్ళయినవారిని; చెఱపఁగన్= చంపటం; అలవియె= సాధ్యమా; మీఁదన్= తర్వాత; అక్లేశ, సాధ్యులు+అగుదురు+ఎ= (వారు) కష్టం లేకుండా - అంటే సులభంగా జయింపబడినవాళ్ళవుతారా!

**తాత్పర్యం:** బలహీను లైనపుడే శత్రువులను చంపటం రాజనీతి. వాళ్ళు అధికబాహుబలం, మిత్రబలం కూర్చుకొన్న తర్వాత వాళ్ళని చంపటం సాధ్యమా? జయించటం సులభమా? (కాదు అని భావం)

**క. అలయక పరాత్మ కృత్యం । బులఁ బతి యెఱుఁగునది దూతముఖమునఁ, బరభూ**
**ముల వృత్తాంతము లెఱుఁగఁగఁ । బలుమఱుఁ బుచ్చునది వివిధ పాషండ తతిన్. 108**

**ప్రతిపదార్థం:** పతి= రాజు; అలయక= విసుగుచెందక; దూత, ముఖమునన్= దూతవలన; పర+ఆత్మ, కృత్యంబులన్= తనయొక్క, శత్రువులయొక్క పనులను; ఎఱుంగునది= తెలుసుకోవాలి; పర, భూముల, వృత్తాంతములు= శత్రుదేశాలయొక్క సమాచారాలు; ఎరుఁగఁగన్= తెలిసికొనటానికి; వివిధ, పాషండ, తతిన్= పలువిధాలైన పాషండుల సమూహాన్ని; పలుమఱున్= పెక్కుమారులు; పుచ్చునది= పంపించాలి.

**తాత్పర్యం:** రాజు విసుగులేకుండా తన పనులనుగురించి, శత్రువుల పనులనుగురించి దూతలవలన తెలిసికొనాలి. శత్రుదేశవిషయాలను తెలిసికొనటానికి పలువిధాలైన పాషండులసమూహాల్ని పంపాలి.

**విశేషం:** శత్రువుల కృత్యాలనుగూర్చి దూతల వలన తెలిసికొనవలసిన అవసరం రాజులకు ఉన్నది. అంతేకాదు; తమ పనులను గూర్చి ప్రజలేమనుకొంటున్నారో, తమపనులప్రభావం దేశప్రజలమీద, శత్రువులమీద ఏ విధంగా ఉన్నదో మదింపువేసుకొనటం కూడా రాజుకు అవసరమే. పాషండు లంటే వేదబాహ్యులు.

**క. నానావిహార శైలో । ద్యాన సభా తీర్థ దేవతాగృహ మృగయా**
**స్థానముల కరుగునెడ మును । మానుగ శోధింపవలయు మానవపతికిన్. 109**

**ప్రతిపదార్థం:** మానవ, పతికిన్= రాజుకు; నానా, విహార, శైల+ఉద్యాన, సభా, తీర్థ, దేవతా, గృహ, మృగయా, స్థానములకున్+ అరుగు+ఎడన్= పలువిధాలైన క్రీడాపర్వతాలకు, ఉద్యానవనాలకు, సభలకు, పుణ్యతీర్థాలకు, దేవాలయాలకు, వేటాడే ప్రదేశాలకు వెళ్ళేటప్పుడు; మును= ముందుగా; మానుగన్= తగు విధంగా; శోధింపవలయున్= పరిశుద్ధంచేయాలి - అంటే ప్రభువుకు ప్రమాదం కలిగించే వ్యక్తులు, ఆయుధాలు దాగి ఉండకుండా పరిశీలించి, ఉంటే తొలగించి ఆయా స్థలాలను ప్రమాదరహితంగా శుద్ధంచేయాలి.

**తాత్పర్యం:** పలువిధాలైన క్రీడాపర్వతాలకు, ఉద్యానవనాలకు, సభలకు, పుణ్యతీర్థాలకు, దేవాలయాలకు, వేటాడే ప్రదేశాలకు వెళ్ళేటప్పుడు - ప్రభువుకు ప్రమాదాలు కలుగకుండ, ఆయాప్రదేశాలను ముందుగా తగువిధంగా పరిశీలించి, ప్రమాదంకలిగించే వ్యక్తులు, ఆయుధాలు ఉంటే తొలగించి పరిశుద్ధంగా ఉండేటట్లు చేయాలి.

**విశేషం:** ఈ పద్ధతులు ఈనాడుగూడ ఆచరణలో ఉన్నాయి. ఇవి ప్రభువుకు రక్షణ కల్పించటంలో భాగాలు.

**తే. వీరు నమ్మంగఁ దగుదురు వీరు నమ్మఁ । దగరు నాకు నా వలవదు; తత్త్వబుద్ధి**
**నెవ్వరిని విశ్వసింపక యెల్ల ప్రొద్దు । నాత్మరక్షాపరుం డగు నది విభుండు.** **110**

**ప్రతిపదార్థం:** విభుండు= రాజు; నాకున్; వీరు; నమ్మంగన్ తగుదురు= నమ్మదగినవాళ్ళు; వీరు; నమ్మన్, తగరు= నమ్మదగనివాళ్ళు; నా, వలవదు= అని అనవద్దు; తత్త్వ, బుద్ధిన్= నిశ్చయబుద్ధిచేత; ఎవ్వరిని= ఎవరినికూడా; విశ్వసింపక= నమ్మక; ఆత్మ, రక్షా, పరుండు+అగునది= తన్ను తాను రక్షించుకోవటమే ప్రధానంగా కలవాడు కావాలి.

**తాత్పర్యం:** రాజైనవాడు 'నాకు వీరు నమ్మదగినవారు, వీరు నమ్మగూడనివారు'అని అనగూడదు. నిశ్చయబుద్ధి చేత ఎవ్వరినీ నమ్మకుండా తనరక్షణ తానే ప్రధానంగా చూచుకోవాలి.

**ఉ. ఇమ్ముగ నాత్మరక్ష విధియించువిధంబున మంత్రరక్ష య**
**త్నమ్మునఁ జేయఁగావలయుఁ; దత్పరిరక్షణశక్తి నెల్ల కా**
**ర్యమ్ములు సిద్ధిఁ బొందుఁ బరమార్థము; మంత్రవిభేద మైనఁ గా**
**ర్యమ్ములు నిర్వహింపఁగ బృహస్పతికైనను నేరఁబోలునే.** **111**

**ప్రతిపదార్థం:** ఇమ్ముగన్= బాగుగా; ఆత్మ, రక్ష= తనను రక్షించుకోవటాన్ని; విధియించు, విధంబున= చేసికొన్నట్లే; మంత్ర, రక్ష= రహస్యంయొక్క కాపాడటాన్ని; యత్నమ్మునన్= ప్రయత్నంతో; చేయగావలయున్= చేసుకోవాలి; తత్+పరిరక్షణ, శక్తిన్= ఆ రహస్యాలోచనాన్ని రక్షించటంయొక్క బలంచేత; ఎల్ల, కార్యమ్ములు= అన్ని పనులు; సిద్ధిన్+పొందున్= సఫలతను పొందుతాయి; పరమ+అర్థము= నిశ్చయం; మంత్ర, విభేదము+ఐనన్= రహస్యంయొక్క వెల్లడిఅయితే; కార్యమ్ములు= పనులు; నిర్వహింపఁగన్= జరపటానికి; బృహస్పతికిన్+ఐనను; నేరన్+పోలునే= సాధ్యమవుతుందా?

**తాత్పర్యం:** ప్రభువు తనను తాను జాగ్రత్తగా రక్షించుకొన్నట్లే, తన రహస్యాలోచనాన్నిగూడ రక్షించుకోవాలి. రహస్యాలోచన వెల్లడి కాకుండ రక్షించుకొనే బలంచేతనే అన్నిపనులు ఫలవంతాలవుతాయి. రహస్యాలోచన వెల్లడి అయితే పనులను ఫలవంతం కావించటం ఆ బృహస్పతికైనా సాధ్యంకాదు. (బుద్ధిబలంలో బృహస్పతిని మించిన వాళ్ళులేరు కనుక అతనికికూడా సాధ్యం కాదనటం.)

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క. పలుమఱు శపథంబులు నం । జలియును నభివాదనమును సామప్రియభా**
**షలు మిథ్యావినయంబులుఁ । గలయవి దుష్టస్వభావకాపురుషులకున్.** **112**

**ప్రతిపదార్థం:** దుష్టస్వభావ, కాపురుషులకున్= చెడుస్వభావం గల నీచ మానవులకు; పలుమఱు= చాలామార్లు; శపథంబులున్= ఒట్టుపెట్టుకోవటాలు; అంజలియును= చేతులు జోడించటాలు; అభివాదనమును= నమస్కారాలు; సామ, ప్రియ, భాషలు= సామోపాయం, (అనుకూల ప్రవర్తన రూపమైన ఉపాయం), ఇంపైన మాటలు; మిథ్యా, వినయంబులు= కపటపు వినయాలు; కల, అవి= ఉన్నాయి.

**తాత్పర్యం:** చెడు స్వభావం గల నీచులు మాటిమాటికీ ఒట్టుపెట్టుకుంటారు. చేతులు జోడిస్తారు. నమస్కారాలు చేస్తారు. సామోపాయంతో కూడిన ఇంపైన మాటలు మాట్లాడుతారు. కపటపువినయాలు ప్రదర్శిస్తారు.

**విశేషం:** ఉపాయాలు - సామ, దాన, భేద, దండాలు - అనేవి నాలుగు.

**క. తన కిమ్మగు నంతకు దు । ర్జనుఁ డిష్టుఁడపోలె నుండి సర్పమపోలెం**
**దన కిమ్మగుడును గఱచును । ఘనదారుణకర్మగరళ ఘనదంష్ట్రములన్. 113**

**ప్రతిపదార్థం:** దుర్జనుఁడు= దుర్మార్గుడు; తనకు; ఇమ్ము+అగు+అంతకు= అనుకూలం అయ్యేవరకు; ఇష్టుఁడు+అ, పోలెన్= ఇష్టమైనవాడివలె - మిత్రుడివలె; ఉండి= వర్తించి; తనకున్; ఇమ్ము+అగుడును= అవకాశం లభించినంతనే; సర్పము+పోలెన్= పామువలె; ఘన, దారుణ, కర్మ, గరళ, ఘన దంష్ట్రములన్= మిక్కిలి క్రూరాలయిన పనులు అనే విషంచే పెద్దవైన కోరలచేత; కఱచును= కరుస్తాడు.

**తాత్పర్యం:** దుర్మార్గుడు తనకు అనుకూల మయ్యేంతవరకు మిత్రుడివలె నటించి, అనుకూలత ఏర్పడిన వెంటనే పామువలె తన క్రూరకృత్యా లనే కోరలతో కరుస్తాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. కడునలుకయుఁ గూర్మియు నే । ర్పడ నెఱిఁగించునది వాని ఫలకాలమునన్**
**బిడుగును గాడ్పును జనులకుఁ । బడుటయు వీచుటయు నెఱుకపడియెడుభంగిన్. 114**

**ప్రతిపదార్థం:** కడున్= మిక్కుటమైన; అలుకయున్= కోపమూ; కూర్మియున్= స్నేహమూ; వాని, ఫల, కాలమునన్= వాటియొక్క ఫలంయొక్క సమయాన - అంటే ఆ రెండింటియొక్క అనుభవకాలాన; పిడుగును; గాడ్పును= గాలియును; పడుటయు; వీచుటయున్; జనులకున్; ఎఱుకపడియెడు, భంగిన్= తెలిసేటట్లుగా; ఏర్పడన్= స్పష్టమయ్యేట్లు; ఎఱిఁగించునది= తెలియజేయాలి.

**తాత్పర్యం:** పిడుగుపడటం, గాలివీచటం - అవి జరిగినపుడే జనులకు తెలిసినట్లు - మిక్కుటమైన కోపంగాని, స్నేహంగాని వాటి అనుభవకాలానికే ఇతరులకు తెలియజేయాలి.

**విశేషం:** అలం: క్రమం, ఉపమ.

**క. తఱియగునంతకు రిపుఁ దన । యఱకటఁ బెట్టికొనియుండునది; దఱియగుడుం**
**జెఱచునది ఱాతిమీఁదను । వఱలఁగ మృద్ఘటము నెత్తి వైచిన భంగిన్. 115**

**ప్రతిపదార్థం:** తఱి= సమయం; అగునంతకున్= వచ్చేవరకు; రిపున్= శత్రువును; తన, అఱకటన్= తనయొక్క భుజం మీద; పెట్టుకొని; ఉండునది = ఉండాలి; తఱి, అగుడున్= సమయం వచ్చినపుడు; మృత్+ఘటమున్= మట్టికుండను; వఱలఁగన్= ఒప్పగా - ప్రకాశించేటట్లు; ఱాతిమీదను; ఎత్తివైచిన, భంగిన్= ఎత్తి పడవేసిన విధంగా; చెఱచునది= నాశనమయ్యేటట్లు చేయాలి.

**తాత్పర్యం:** తగిన సమయం వచ్చేవరకు శత్రువును భుజంమీదికి ఎక్కించుకొని మోస్తూ, తగిన సమయం రాగానే మట్టికుండను రాతిమీద ఎత్తికొట్టినట్లు అతడిని నాశనం చేయాలి.

**విశేషం:** అలం: ఉపమ. ఈ పద్యం పెక్కు ప్రతుల్లో లేనట్లు శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి పుట,348లో ఉన్నది.

**క. తన కపకారము మునుఁ జే। సిన జనుఁ డల్పుఁ డని నమ్మి చేకొని యుండం**
**జన; దొకయించుక ముల్లయి । నను బాదతలమున నున్న నడవఁగ నగునే. 116**

**ప్రతిపదార్థం:** మును= ముందు - ఇదివరకు; తనకున్; అపకారము= కీడు; చేసిన; జనుఁడు; అల్పుఁడు+అని= తక్కువవాడని; నమ్మి; చేకొని= ఆదరించి; ఉండన్+చనదు= ఉండకూడదు; ఒక, ఇంచుక= ఒకకొద్దిపాటి; ముల్లు+అయినను; పాద, తలమునన్= పాదప్రదేశంలో - అంటే పాదంలో; ఉన్నన్= ఉంటే; నడువఁగన్= నడవటానికి; అగునే= సాధ్యమవుతుందా?

**తాత్పర్యం:** ఇంతకుముందు తనకు అపకారం చేసిన మానవుడు తక్కువవాడుకదా అని, అతడిని ఆదరించకూడదు. ముల్లు చిన్నదే అయినా అది పాదంలో ఉంటే నడవటానికి సాధ్యమవుతుందా?

**విశేషం:** అలం: అర్థాంతర్యాసం. ఈ పద్యానికి పాఠాంతరంగా కొన్ని ప్రతుల్లో ఉన్న పద్యం: "తన కపకారము చేసిన, జనుఁ డల్పుం డనుచు నమ్మి జడమతి యై చే, కొనఁ జన దించుక ముల్లయి, నను బద్ధతులందు నున్న నడువఁగ నగునే." - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి పుట,347

**క. బాలుఁ డని తలఁచి రిపుతో । నేలిదమునఁ గలిసియునికి యిది కార్యమె? యు**
**త్కీలానలకణ మించుక । చాలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్. 117**

**ప్రతిపదార్థం:** బాలుఁడు+అని; తలఁచి; రిపుతోన్= శత్రువుతో; ఏలిదమునన్= చులకనభావంతో; కలిసి, ఉనికి= కలిసి ఉండటం; ఇది= ఇట్లుండటం; కార్యమె= చేయదగిన పనియా; ఉగ్ర, శైల+అటవులన్= భయంకరాలైన పర్వతాలలోని అడవులను; కాల్పంగన్= కాల్చడానికి; ఉత్, కీలా+అనల, కణము= పెద్దమంటయొక్క నిప్పురవ్వ; ఇంచుక= కొంచెం; చాలదె= సరిపోదా.

**తాత్పర్యం:** బాలుడు కదా అని చులకన భావం వహించి శత్రువుతో కలిసి ఉండకూడదు. భయంకరాలైన పర్వతారణ్యాలను కాల్చటానికి చిన్న నిప్పురవ్వ చాలదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క. మొనసి యపకారిఁ గడ నిడి । కొనియుండెడు కుమతి దీర్ఘకుజశాఖాగ్రం**
**బున నుండి నిద్రవోయెడు । మనుజునకు సమాన మగుఁ బ్రమత్తత్వమునన్. 118**

**ప్రతిపదార్థం:** మొనసి= పూని; అపకారిన్= కీడుచేసినవాడిని; కడన్+ఇడికొని+ఉండెడు= దగ్గర ఉంచుకొని ఉండే; కుమతి= చెడుబుద్ధికలవాడు - ఇట బుద్ధిలేనివాడని గ్రహింపవచ్చు; ప్రమత్తత్వమునన్= ఏమరినవాడు కావటంలో; దీర్ఘ, కుజ, శాఖా+అగ్రంబునన్+ఉండి= ఎత్తైనచెట్టు కొమ్మయొక్క చివరలో పరుండి; నిద్ర+పోయెడు; మనుజునకున్ సమానము+అగున్= నిద్రించేవాడితో సమానం అగుచున్నాడు.

**తాత్పర్యం:** ప్రయత్నించి తన కపకారం చేసినవాడిని దగ్గర ఉంచుకొన్న బుద్ధిహీనుడు ఏమరుపాటుతో ఎత్తైన చెట్టుకొమ్మచివర నిద్రించేవాడితో సమానం.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మఁగా**
**నొడివియు సత్యమిచ్చియుఁ జనున్ జననాథ! కృతాపకారులం**
**గడఁగి వధింపఁగాఁ గనుట కావ్యమతం బిది; గాన యెట్టులుం**
**గడుకొని శత్రులం జెఱుపఁగాంచుట కార్యము రాజనీతిమైన్. 119**

**ప్రతిపదార్థం:** జననాథ= ఓరాజా!; కృత+అపకారులన్= చేయబడిన అపకారాలు కలవాళ్ళను; తడయక= ఆలస్యంచేయక; సామ భేదములన్= సామోపాయంచేత, భేదోపాయంచేత; దానములన్= దానాలచేత; దయతోడ; నమ్మన్+కాన్= నమ్మకం కలిగించేటట్లుగా; నొడివియున్= మాట్లాడి; సత్యము+ఇచ్చియున్= ఒట్టుపెట్టుకొని; కడఁగి= ప్రయత్నించి; వధింపన్+కాన్+కనుట= చంపబడేటట్లు చూడటం - అంటే చంపటం; చనున్= తగును; ఇది= ఈ నీతి; కావ్య, మతంబు= శుక్రాచార్యునియొక్క అభిప్రాయం; కానన్= కనుక; ఎట్టులున్= ఏ విధంగానైనా; కడుకొని= ప్రయత్నించి; రాజనీతిమైన్= రాజనీతిచేత; శత్రువున్= పగవాణ్ణి, చెఱుపన్, కాంచుట= నశించేటట్లు చూడటం; కార్యము= చేయదగిన పని.

**తాత్పర్యం:** ఓ రాజా! అపకారాలు చేసినవాళ్ళను - సామదానభేదోపాయాలచేత లేదా దయ చూపి నమ్మకం కలిగేట్లుగా మాట్లాడి లేదా ఒట్టుపెట్టుకొని, నమ్మకం కలిగించి ఆలస్యం జరగకుండా చంపాలి. ఇది శుక్రుని అభిప్రాయం. అందుచేత ఏ విధంగా నైనా రాజనీతితో శత్రువులను హతమార్చాలి.

**విశేషం:** కావ్యమతం బిది - అనే దానికి కాప్యుమతం బిది, కార్యమతం బిది, కావ్యమతం బిది అనే పాఠాంతరాలున్నాయి. శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి పుట,348

**వ. 'కావున సర్వప్రకారంబుల నపకారకారణు లయిన వారిం బరుల నయిన బాంధవుల నయిన నుపేక్షింపక యాత్మరక్షాపరుండ వయి దూరంబుసేసి దూషించునది' యనినఁ గణికుమతంబు విని దుర్యోధనుండు చింతాపరుం డై యొక్కనాఁడు ధృతరాష్ట్రున కేకాంతంబున ని ట్లనియె. 120**

**ప్రతిపదార్థం:** కావునన్; సర్వ, ప్రకారంబులన్= అన్నివిధాలచేత; అపకార, కారణులు+అయిన, వారిన్= అపకారాలు చేసిన వారిని; పరులన్+అయినన్= శత్రువులనైనా; బాంధవులన్+అయినన్; ఉపేక్షింపక= అశ్రద్ధచేయక; ఆత్మ, రక్షాపరుండవు+అయి= నిన్ను నీవు రక్షించుకొనటంలో మనస్సు కలవాడవై; దూరంబు+చేసి= (వారిని) దూరంగా ఉంచి; దూషించునది= తిట్టాలి (ఇట చంపాలి అనే అర్థం సమంజసం); అనినన్= అని అనగా; కణికు, మతంబు= కణికునియొక్క అభిప్రాయం; విని;

దుర్యోధనుండు; చింతా, పరుండు+ఐ= దుఃఖం నిండిన మనస్సు కలవాడై; ఒక్కనాఁడు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రునితో; ఏకాంతంబునన్= ఒంటరిగా ఉన్నప్పుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అందుచేత అపకారాలు చేసినవాళ్ళు శత్రువులైనా బంధువులైనా అశ్రద్ధచేయకూడదు. ఆత్మరక్షణకొరకు అన్నివిధాలా వాళ్ళను హతమార్చా' లని కణికుడు చెప్పగా విని, చింతాక్రాంతుడై దుర్యోధనుడు ఒకనాడు ధృతరాష్ట్రుడు ఒంటరిగా ఉన్నప్పుడు అతనితో ఇట్లా అన్నాడు.

### దుర్యోధనుఁడు తండ్రితోఁ దన మనోదుఃఖంబుఁ దెలుపుట (సం.1-129-10)

**తే.** **వీరు లని పాండుసుతులకు వెఱతు నేను; । వెఱచుటకుఁ దోడుగా నిప్డు విభుఁడ వీవు**
**పాండవజ్యేష్ఠునకుఁ బ్రీతిఁ బరమయౌవ । రాజ్య మిచ్చితి కురువృద్ధరాజులొద్ద.** **121**

**ప్రతిపదార్థం:** నేను; వీరులు+అని; పాండు, సుతులకున్= పాండురాజుయొక్క కుమారులకు - పాండవులకు; వెఱతున్= భయపడతాను; వెఱచుటకున్= భయపడటానికి; తోడు, కాన్= తోడయినట్లు; విభుఁడవు+ఈవు= రాజువైన నీవు; కురు, వృద్ధ, రాజుల+ఒద్ద= కురువంశపు పెద్దలయొక్క, రాజులయొక్క ఎదుట; ప్రీతిన్= ప్రేమతో; పాండవ, జ్యేష్ఠునకున్= పాండవులలో పెద్దవాడైనవానికి, ధర్మరాజుకు; పరమ, యౌవ, రాజ్యము= ప్రధానమైన యౌవరాజ్యాన్ని; ఇచ్చితి= ఇచ్చావు.

**తాత్పర్యం:** పాండవులు వీరులని నేను భయపడుతున్నాను. నేను భయపడటానికి తగ్గట్లే ప్రభువైన నీవు కురువంశపుపెద్దలయెదుట, రాజులయెదుట పాండవులలో పెద్దవాడైన ధర్మరాజును ప్రేమతో యువరాజును చేశావు.

**విశేషం:** వ్యక్తిబలాన్ని అంతకంత పెంచేది అధికారం. పాండవులు మొదలే బలవంతులు. అందుకుతోడు యుధిష్ఠిరుడిప్పుడు యువరాజైనాడు. ఆ యౌవరాజ్యాధికారం అతనికి ఎవరో ఇచ్చింది కాదు. రాజైన ధృతరాష్ట్రుడే స్వయంగా ఇచ్చాడు. పైగా చాటుమాటుగా ఏదో మాటవరుస ఇవ్వలేదు. పదిమందిఎదుట శాస్త్రోక్తంగా కట్టబెట్టాడు. దాన్ని కాదనటం ఎట్లా? పాండవులను ఎదిరించటం ఎట్లా? అదే దుర్యోధనునిబాధ, భయం. అతనిమానసికస్థితిని తెలియపరచేదే ఈ తేటగీతి.

**వ.** **'దాననచేసి పౌర జానపద బ్రాహ్మణ ప్రధానవరులు ధర్మజున కనురక్తు లయి, నిన్నును భీష్ముని నాదరింపక, ప్రజ్ఞాచక్షుండు రాజ్యరక్షణంబు సేయ సమర్థుండు గాఁడు, భీష్ముండు సమర్థుం డయ్యును ముందఱ రాజ్యభార నివర్తనంబునందుఁ గృతప్రతిజ్ఞుం డయ్యెం; గావునఁ బాండవజ్యేష్ఠుం డైన యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకంబు సేయుద; మతండు తరుణుం డయ్యును గుణవృద్ధుండు ధర్మశీలుండు పరాక్రమవంతు లైన తమ్ములుగలవాడు రాజ్యప్రతిష్ఠితుం డయ్యెనేని వృద్ధుల నమాత్యుల బంధుమిత్రులను దొల్లింటికంటె మిక్కిలిగాఁ బూజార్హుల నెల్లం బూజించుఁ, బితామహుండైన భీష్ముని సపుత్త్రకుండైన ధృతరాష్ట్రుని నతిభక్తి నభీష్టభోగానుభవపరులంగా సుఖంబున నునుచు, దీనికి విదురుండును నొడంబడు నని యెప్పుడుఁ దమలో విచారింతు రని వింటిఁ; గర్ణశూలాయమానంబు లైన మూర్ఖప్రకృతుల పలుకులు విననోపఁ; బాండవుల నిప్పరంబువలనఁ బాయునట్లుగాఁ జేయవలయు; నేమి సేయుదు?' ననినఁ గొడుకునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె.** **122**

**ప్రతిపదార్థం:** దాననచేసి= దానివలన - ధర్మరాజుకు యౌవరాజ్యం ఇచ్చినందువలన; పౌర, జానపద, బ్రాహ్మణ, ప్రధానవరులు= పట్టణప్రజలు, పల్లెప్రజలు, బ్రాహ్మణులు, మంత్రిశ్రేష్ఠులు; ధర్మజునకు= ధర్మరాజునకు; అనురక్తులు+అయి= అనురాగం

- ప్రేమ కలవాళ్ళయి; నిన్నును; భీష్మునిన్= భీష్ముని; ఆదరింపక= లెక్కచేయక; ప్రజ్ఞాచక్షుండు= బుద్ధియే కన్నుగా కలవాడు- ధృతరాష్ట్రుడు; రాజ్య, రక్షణంబు, చేయన్= రాజ్యాన్ని రక్షించటానికి; సమర్థుఁడు; కాఁడు; భీష్ముండు; సమర్థుండు+అయ్యును; ముందఱ= మున్ను, రాజ్య, భార, నివర్తనంబు+అందు= రాజ్యభారంనుండి మరలటంలో; కృత ప్రతిజ్ఞుండు= చేయబడినప్రతిజ్ఞ కలవాడు; అయ్యెన్; కావునన్; పాండవ, జ్యేష్ఠుండు+ఐన= పాండవులలో పెద్దవాడైన; యుధిష్ఠిరునకున్= ధర్మరాజునకు; రాజ్య+అభిషేకంబు; చేయుదము; అతండు= ఆ ధర్మరాజు; తరుణుండు+అయ్యును= యువకుడైనా; గుణ, వృద్ధుండు= గుణంచేత పెద్దవాడు; ధర్మశీలుండు= ధర్మాన్నే స్వభావంగా కలవాడు; వృద్ధులన్= పెద్దలను; అమాత్యులన్= మంత్రులను; బంధు, మిత్రులను; తొల్లింటికంటె= మునుపటికంటె; మిక్కిలిగా= ఎక్కువగా; పూజా+అర్హులన్+ఎల్లన్= గౌరవానికి తగినవాళ్ళ నందరినీ; పూజించున్= గౌరవిస్తాడు; పితామహుండు+ఐన= తాతగారైన; భీష్ముని; స, పుత్త్రుకుండు+ఐన= కుమారులు గల వాడైన; ధృతరాష్ట్రునిన్; అతి, భక్తిన్= మిక్కిలిభక్తితో; అభి+ఇష్ట, భోగ+అనుభవ, పరులన్+కాన్= కోరుకొన్న భోగాలను అనుభవించటంలో లగ్నమైన మనస్సులు గలవాళ్ళనుగా; సుఖంబునన్= సుఖంతో; ఉనుచున్= ఉంచుతాడు; దీనికిన్= ఈ విధంగా చేయటానికి; విదురుండునున్= విదురుడుకూడా; ఒడంబడును+అని= ఒప్పుకొంటాడని; ఎల్లప్పుడు; తమలోన్= తమలో తాము; విచారింతురు= ఆలోచిస్తారు; అని= అనికూడా; వింటిన్= విన్నాను; కర్ణ, శూలాయమానంబులు+ఐన= చెవులకు బల్లేలవంటివైన; మూర్ఖ, ప్రకృతుల, పలుకులు= మూర్ఖులైన జనులయొక్క మాటలు; వినన్+ఓపన్= వినలేకున్నాను; పాండవులన్; ఈ+పురంబువలనన్= ఈ నగరంనుండి; పాయు+అట్లు+కాన్= తొలగేటట్లుగా; చేయవలయున్; ఏమి; చేయుదున్; అనినన్; కొడుకునకున్; ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ధర్మరాజుకు యౌవరాజ్యం ఇవ్వటంవలన పట్టణప్రజలు, పల్లెప్రజలు, మంత్రిశ్రేష్ఠులు అతనిపట్ల అనురాగంకలవాళ్ళయి, నిన్నూ; భీష్ముడినీ లెక్కచేయక, ధృతరాష్ట్రుడు రాజ్యాన్ని రక్షించలేడు. భీష్ముడు రాజ్యాన్ని రక్షించగలవాడే అయినా రాజ్యభారం స్వీకరించనని ప్రతిజ్ఞచేసి ఉన్నాడు. అందుచేత ధర్మరాజునే రాజుగా చేద్దా మనీ, అతడు యువకుడైనా గుణవంతుడనీ, ధర్మాత్ముడనీ, పరాక్రమవంతులైన తమ్ములు గలవాడనీ, అటువంటివాడిని రాజుగా చేస్తే మంత్రులను, బంధువులను, మిత్రులను, గౌరవించదగినవాళ్ళందరినీ మునుపటికంటె ఎక్కువగా గౌరవిస్తాడనీ, తాతగారైన భీష్ముడిని, పుత్రులున్న ధృతరాష్ట్రుడిని మిక్కిలిభక్తితో పూజిస్తాడనీ, వారి కిష్టమైన భోగాలను అనుభవింపజేసి సుఖంగా ఉంచుతాడనీ, ఇందుకు విదురుడుకూడ అంగీకరిస్తాడనీ ఎప్పుడూ తమలో తాము అనుకొంటున్నారు. చెవులకు బల్లెములవలె తగిలే ఈ మూర్ఖజనుల మాటలను నేను వినలేకున్నాను. పాండవులను ఈ పురం వదలిపోయేటట్లు చేయం' డని దుర్యోధనుడనగా అతనితో ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు.

**చ. జనపతి యైనవానికిఁ బ్రచండమహాతుములాహవాంతరం**
**బున మృతిఁబొందియొండె, మఱి పుత్త్రులపైఁ దనరాజ్యభార మె**
**ల్లను నియమించి యేఁగి గిరులం దప మొప్పఁగఁ జేసి యొండెఁ గా**
**కనిమిషలోకభోగసుఖ మందఁగఁ బోలునె శాశ్వతంబుగన్. 123**

**ప్రతిపదార్థం:** జనపతి+ఐన, వానికిన్= రాజైనవానికి; ప్రచండ, మహా, తుముల+ఆహవ+అంతరంబునన్= సహింప శక్యంగాని పెద్ద సంకులయుద్ధంయొక్క మధ్యంలో; మృతిన్= మరణాన్ని; పొంది; ఒండెన్= కాని; మఱి= అట్లా కాక; పుత్త్రుల పైన్; తన, రాజ్య, భారము+ఎల్లను= తనయొక్క రాజ్యంయొక్కభారాన్నంతను; నియమించి= ఏర్పాట్లుచేసి; ఏఁగి= వెళ్ళి; గిరులన్= పర్వతాలలో; తపము= తపస్సు; ఓపన్+కన్= తగినట్లుగా; చేసి; ఒండెన్= కాని; కాక= కాకుండా; శాశ్వతంబుగన్= శాశ్వతంగా; అనిమిష, లోక, భోగ, సుఖము= స్వర్గలోకాన్ని అనుభవించటంలోని సుఖాన్ని; అందన్+కన్= పొందటానికి; పోలునె= సాధ్యమగునా?

**తాత్పర్యం:** రాజైనవాడు మహాయుద్ధంలో మరణించి గాని, రాజ్యభారాన్ని కొడుకులకు అప్పగించి కొండలపై గొప్పతపస్సు చేసి గాని, శాశ్వతమైన స్వర్గసుఖాన్ని పొందగలడేగాని, వేరే విధంగా దాన్ని పొందగలడా!

**వ. రా జయ్యెడువాఁడు తన రాజ్యభారంబు దాన చూచి యరయవలయు; నేను షడంగసహితంబుగా వేదాధ్యయనంబు సేసియు నర్థశాస్త్రంబునందుఁ గృతనిశ్చయుండ నయి బలంబు గలిగియు నంగవైకల్యంబునం బరచక్రంబులకుం బ్రతివ్యూహంబు రచియింప నేరమింజేసి రాజ్యంబునకుఁ దగకున్న. 124**

**ప్రతిపదార్థం:** రాజు+అయ్యెడు, వాడు= రాజైనవాడు; తన, రాజ్య, భారంబు= తనరాజ్యభారాన్ని; తానే; చూచి, అరయ, వలయున్= విచారించుకోవాలి; ఏను= నేను; షట్+అంగ, సహితంబుగా= ఆరు అంగాలతో కూడిన; వేద+అధ్యయనంబు= వేదాన్ని చదవటం; చేసియున్=చేసికూడా; అర్థశాస్త్రంబు+అందు= ద్రవ్యనీతిశాస్త్రంలో; కృత, నిశ్చయుండను+అయి= నేర్పబడిన సిద్ధాంతాలు కలవాడినై; బలంబు; కలిగియు; అంగ, వైకల్యంబునన్= అవయవంయొక్క లోపంచేత; పర, చక్రంబులకున్= శత్రువులయొక్క సైన్యాలకు; ప్రతివ్యూహంబులు= ఎదురు పన్నుగడలు; నేరమిన్+చేసి= కూర్చటానికి చేతకాకపోవటంవలన; రాజ్యంబునకున్, తగక+ఉన్నన్= రాజ్యపాలనకు తగనివాడనై ఉండటంచేత.

**తాత్పర్యం:** రాజైనవాడు తన రాజ్యవిషయాలు తానే విచారించుకొనాలి. నేను ఆరుఅంగాలతో కూడిన వేదాన్ని చదివి అర్థనీతిశాస్త్రాన్ని నేర్చుకొన్నా, బలంకలవాణ్ణి అయినా, అంధుడిని కావటంచేత శత్రు సైన్యాలకు ఎదురు వ్యూహాలు కూర్చలేనివాడినై రాజ్యపాలనకు తగనివాడను కావటంచేత.

**విశేషం:** షడంగాలు - శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిష్యం, కల్పం.

**ఉ. లోకనుతుండు పాండుఁ డమలుండు మహాగుణరత్నపూర్ణర**
**త్నాకరుఁ డత్యుదారమతి నంధుఁడ నైనను నన్ను రాజుఁగాఁ**
**జేకొని నాకు భక్తిఁ బనిసేయుచు సర్వజగజ్జిగీషుఁ డై**
**యీకురువంశరాజ్యభర మింతయుఁ దాల్చెఁ బరాక్రమంబునన్. 125**

**ప్రతిపదార్థం:** లోక, నుతుండు= ప్రపంచంచేత కొనియాడబడినవాడు; అమలుండు= దోషంలేనివాడు- పవిత్రుడు; మహా, గుణ, రత్న, పూర్ణ, రత్న+ఆకరుఁడు= గొప్పవైన మంచిగుణాలనే రత్నాలచేత నిండిన సముద్రునివంటివాడు; పాండుఁడు= పాండురాజు; అతి+ఉదారమతిన్= మిక్కిలి గొప్పమనస్సుతో; అంధుఁడను+ఐనను= గ్రుడ్డివాడను అయినప్పటికీ; నన్నున్; రాజున్+కాన్= రాజును కావించి; చేకొని; నాకున్; భక్తిన్= భక్తితో; పనిచేయుచు; సర్వ, జగత్+జిగీషుఁడు+ఐ= మొత్తం ప్రపంచాన్ని జయించ గోరేవాడై; పరాక్రమంబునన్; ఈ, కురు, వంశ, రాజ్య, భరము+ఇంతయున్= ఈ కురువంశ రాజ్యభారాన్నంతటినీ; తాల్చెన్= ధరించాడు.

**తాత్పర్యం:** ప్రపంచప్రశంసలందుకొన్నవాడు, పవిత్రుడు, సద్గుణాలనే రత్నాలకు సముద్రునివంటివాడు అయిన పాండురాజు గొప్పమనస్సుతో, గ్రుడ్డివాడినైన నన్ను రాజుగా స్వీకరించి, భక్తితో సేవచేస్తూ, సర్వప్రపంచాన్ని జయింపగోరేవాడై పరాక్రమంతో ఈ కురువంశరాజ్యభారాన్నంతా వహించాడు.

**క. పరచక్రపతులచే భీ। కరుఁ డై ధనరాసు లదిమి కప్పము గొని చె**
**చ్చెరఁ దెచ్చియిచ్చి నన్నును। భరతకులశ్రేష్ఠుఁ డునిచె బహుయజ్ఞములన్. 126**

**ప్రతిపదార్థం:** భరత, కుల, శ్రేష్ఠుండు= భరతవంశంలో పేరు కెక్కినవాడు; భీకరుఁడు+ఐ= భయాన్ని కలిగించేవాడై; అదిమి= అణచి; ధన, రాసులు; పర, చక్ర, పతులచే= శత్రురాజ్యాలయొక్క రాజులచేత; కప్పము; కొని= తీసికొని; చెర+చెరన్= వెంటనే; తెచ్చి, ఇచ్చి; నన్నును= నన్నుకూడా; బహు, యజ్ఞములన్= అనేకయజ్ఞాలలో; ఉనిచెన్= ఉండేట్లు చేశాడు - అంటే అనేక యజ్ఞాలు నాచేత చేయించాడు.

**తాత్పర్యం:** భరతవంశశ్రేష్ఠుడైన పాండురాజు శత్రుభయంకరుడై శత్రువులను అణచి, కప్పం గ్రహించి ధనరాసులు వెంటనే తెచ్చి, ఇచ్చి నా చేత అనేకయజ్ఞాలు చేయించాడు.

**వ. 'మఱియు వానికంటె గుణంబుల మిక్కిలి యయి జనంబులకు ననురక్తు లై పరగుచున్నపాండురాజు కుమారుల నెవ్విధంబునఁ బాపనేర్తు' నని దుఃఖించిన ధృతరాష్ట్రునకు దుర్యోధనుం డి ట్లనియె. 127**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకనూ, వానికంటెన్= ఆ పాండురాజుకంటె; గుణంబుల= మంచిగుణాలలో; మిక్కిలి, అయి= ఎక్కువై; జనంబులకున్, అనురక్తులు+ఐ= అనురాగం - ప్రేమ - కలవారై; పరగుచున్+ఉన్న= ఒప్పుతున్న; పాండు రాజ, కుమారులన్= పాండవులను; ఏవిధంబునన్= ఏ విధంగా, పాపనేర్తును= తొలగించగలను, అని; దుఃఖించిన= దుఃఖించు; ధృతరాష్ట్రునకు; దుర్యోధనుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఆ పాండురాజుకంటె గుణాలలో అధికు లై ప్రజలప్రేమ గలిగి ప్రకాశిస్తున్న పాండవులను ఏ విధంగా తొలగించగల?' నని ధృతరాష్ట్రుడు దుఃఖించగా, దుర్యోధనుడు ఇట్లా అన్నాడు.

**సీ. పైతృకం బగు లక్ష్మి పాండుభూపతి మున్ను। తాల్చుటఁజేసి తత్తనయుఁ డైన**
**ధర్మజుఁ డిప్పుడు దాల్చిన, నాతని। తనయుండు మఱి దానిఁ దాల్చు, మీఁద**
**నిప్పాటఁ బాండువంశేశుల వసుమతీ। రాజ్యార్హు లగుదురు; రాజ్యమునకుఁ**
**బరువడి మే మింతఁ బాసిన మాపుత్త్ర పౌత్త్ర వర్గంబునుఁ బాయు; నింక**

**ఆ. నొరులఁ గొలిచి కుడువనోప మే; మట్లుగా। కుండ మమ్ముఁ జేయనోపుదేని**
**పాండురాజుతోంటిభక్తియు నప్పాండు। తనయులందు దయయుఁ దలఁపకుండు. 128**

**ప్రతిపదార్థం:** పైతృకంబు+అగు, లక్ష్మి= పితరులనుండి వచ్చిందైన సంపదను; పాండు, భూపతి= పాండురాజు; మున్ను= ముందు; తాల్చుటన్+చేసి= ధరించటంవలన; తత్+తనయుఁడు+ఐన, ధర్మజుడు= అతనియొక్క కుమారుడైన ధర్మరాజు; ఇప్పుడు= ఈ సందర్భంలో; తాల్చినన్= ధరిస్తే; అతని, తనయుండు= అతనియొక్క - ధర్మరాజుయొక్కకుమారుడు; మఱి= మళ్ళీ; దానిన్= ఆ సంపదను; తాల్చున్= ధరిస్తాడు; మీఁదన్= తర్వాత; ఈ+పాటను= ఈవిధంగా; పాండు, వంశ+ఈశులు+అ= పాండువంశరాజులే; వసుమతీ, రాజ్య+అర్హులు= భూమిదొరతనానికి తగినవారు; అగుదురు; రాజ్యమునకున్= రాజ్యానికి; పరువడి= క్రమంగా; మేము; ఇంతన్= ఈ కొలది; పాసినన్= దూరమైతే; మా, పుత్త్ర, పౌత్త్ర, వర్గంబునున్= మాయొక్క కొడుకులయొక్క, మనుమలయొక్క సమూహం; పాయున్= దూరమవుతుంది; ఇంకన్= ఇకముందు; ఏము;

ఒరులన్= ఇతరులను; కొలిచి= సేవించి; కుడువన్+ఓపము= తినటాన్ని, త్రాగటాన్ని చేయలేము - అంటే బ్రతుకు గడపలేము; అట్లు; కాక+ఉండ; మమ్మున్; చేయన్+ఓపుదు+ఏని= నీవు చేయగలిగితే; పాండురాజు, తొంటి, భక్తియున్= పాండురాజుయొక్క మునుపటి భక్తిని; ఆ+పాండు, తనయుల+అందు= ఆ పాండవులపట్ల; దయయున్; తలఁపక+ఉండు= ఆలోచించకుండా ఉండుము.

**తాత్పర్యం:** వంశపారంపర్యంగా తాత తండ్రులనుండి వచ్చే రాజ్యసంపదను ఇదివరకు పాండురాజు చేపట్టి ఉండటంచే ఇప్పుడు ధర్మరాజు చేపడితే, తరువాత అతనితనయుడు చేపడతాడు. ఈ విధంగా పాండురాజు వంశంవాళ్ళే రాజ్యార్హులౌతారు. మేము రాజ్యాధికారానికి దూరమైతే క్రమంగా మాకొడుకులు, మనుమలు దూరమౌతారు. ఇకముందు ఇతరులకు సేవలుచేసి మేము బ్రదుకలేము. మాకు అటువంటి గతిపట్టకుండా నీవు చేయగలిగితే పాండురాజు నీపట్ల ఇదివరకు చూపిన భక్తిని, పాండవులపట్ల నీ కున్న దయను మనస్సులో నిలుపవద్దు.

**దుర్యోధనుఁడు పాండవులను వారణావతంబునకుఁ బంపు మని తండ్రితోఁ జెప్పుట (సం. 1-130-8)**

**వ. 'ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదీయం బయినది; ప్రకృతిజనులు వశ్యులు గాకున్నను గ్రమాగతంబయి మాకు నప్రయత్నలభ్యంబగుఁ దొల్లి పాండురాజు రా జై గుణంబులం బ్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజురాజ్యంబ వలతురు; దాని నెఱింగియ కాదె యేను నిత్యదానసమ్మానంబులం బ్రకృతిజనంబులకు సంతోషంబు సేయుచునుండుదు; నిందుల దుష్టజనులపక్షపాతవచనంబు లుడుగునంతకు నుపాయంబునఁ గొంతినిఁ బాండవులను దదీయభృత్యామాత్యవర్గంబుతో వారణావతంబునకుం బుత్తము; మనకు రాజ్యంబు సుప్రతిష్ఠితం బైన మఱి వార లిందులకు వత్తు' రనిన దుర్యోధనునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 129**

**ప్రతిపదార్థం:** ఈ, రాజ్యంబు; మొదలింటన్+కోలె= మొదటినుండి; భవదీయంబు+అయినది= నీదైనది; ప్రకృతి, జనులు= స్వామి, అమాత్య, సుహృత్కోశాదులకు సంబంధించినప్రజలు; వశ్యులు+కాక+ఉన్నను= లోబడినవారు కాకపోయినా; క్రమ+ఆగతంబు+అయి= వరుసగా వచ్చినదై; మాకున్, అప్రయత్న, లభ్యంబు= శ్రమపడకుండా దొరికింది; అగున్= అవుతుంది; తొల్లి= ఇదివరకు; పాండురాజు; రాజు+ఐ; గుణంబులన్= మంచి గుణాలచేత; ప్రజా+అనురాగంబు= ప్రజల యొక్క ప్రేమ; పడయుటన్+చేసి= పొందటంవలన; ఎల్లవారును= అందరూ; ధర్మరాజు, రాజ్యంబు= ధర్మరాజుయొక్క రాజ్యాన్నే, వలతురు= కోరుకొంటారు, దానిన్=దాన్ని; ఎఱింగియు, కాదె= తెలిసికొనేకదా; ఏను= నేను; నిత్య, దాన, సమ్మానం బులన్= ప్రతిదినం దానాలచేతను, గౌరవాలచేతను; ప్రకృతి, జనంబులకున్= స్వామి, అమాత్య, సుహృత్కోశాదులకు సంబంధించిన ప్రజలకు; సంతోషంబు= సంతోషాన్ని; చేయుచున్+ఉండుదున్= కలిగిస్తూఉన్నాను; ఇందుల= ఇచ్చట; దుష్ట, జనుల, పక్షపాత, వచనంబులు= చెడ్డజనులయొక్క పక్షపాతపు మాటలు; ఉడుగు+అంతకున్= మానునంతవరకు; ఉపాయం బునన్= ఉపాయంతో; గొంతినిఁ= కుంతీదేవిని; పాండవులను; తదీయ, భృత్య+అమాత్య, వర్గంబుతో= వారియొక్క సేవకులయొక్క, మంత్రులయొక్క సమూహంతో; వారణావతంబునకున్= వారణావతానికి; పుత్తము= పంపుదాము; మనకున్; రాజ్యంబు= అధికారం; సుప్రతిష్ఠింబు+ఐనన్= బాగుగా స్థిరపడగానే; మఱి=తర్వాత; వారలు= వాళ్లు; ఇందులకున్= ఇక్కడికి; వచ్చుదురు= వస్తారు; అనినన్= అని అనగా; దుర్యోధనునకు; ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఈ రాజ్యం మొదటినుండి నీది. నీవు ఒకవేళ స్వామి అమాత్యసుహృత్కోశాదులకు సంబంధించిన వాళ్ళు విధేయులు కాకున్నా, అప్రయత్నంగా రాజ్యం క్రమపద్ధతిలో మా చేతి కందుతుంది. ఇదివరకు పాండురాజు

రాజై తనగుణగణాలచేత ప్రజానురాగం పొందిన కారణంగా అందరూ ధర్మరాజురాజ్యాన్ని కోరుకొంటున్నారు. దాన్ని గ్రహించేకదా నేను ప్రతిదినం దానాలచేత, సమ్మానాలచేత ప్రకృతిజనులను సంతోషపరుస్తున్నాను. ఇచ్చట చెడ్డవాళ్ళ పక్షపాతపుమాటలు ఆగిపోయేంతవరకు కుంతీదేవిని, పాండవులను, వారిసేవకులతో, అమాత్యులతోసహా ఉపాయంతో వారణావతం పంపుదాము. మనకు రాజ్యాధికారం స్థిరపడిన తర్వాత వాళ్ళిక్కడికి వస్తారు' అని దుర్యోధనుడనగా అతనితో ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** సప్తప్రకృతులు - స్వామి, అమాత్యుడు, సుహృత్తు, కోశం, రాష్ట్రం, దుర్గం, బలం.

**తరువోజ.**

**'ఏ నెల్లప్రొద్దు నా యెడ లోనఁ దలఁతు నీయభిప్రాయంబ; యిది దారుణంబు**
**గాన వాకునకుఁ జుల్కన తేరనోపఁ; గడఁగి పాండవుల నేకత మెట్టు లనుప**
**గా నగు? మఱి దీని గాంగేయవిదురకలశజాశ్వత్థామ గౌతముల్ బుద్ధి**
**గా నొడంబడుదురె? కా దయ్య!' యనినఁ గౌరవజ్యేష్ఠుండు ఘనుఁ డిట్టు లనియె. 130**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఎల్ల, ప్రొద్దు= అన్ని వేళలా; నా, ఎడలోనన్= నాహృదయంలో; ఈఅభిప్రాయంబు+అ; తలఁతున్= ఆలోచిస్తాను; ఇది= ఈ అభిప్రాయం; దారుణంబు= భయంకరమైనది; కానన్= అగుటచేత; చుల్కన= సులువుగా; వాకునకున్= మాటకు; తేరన్+ఓపన్= తీసుకొనిరాలేను; కడఁగి= పూని; పాండవులన్; ఏకతము= ఒంటరిగా; ఎట్టుల= ఏ విధంగా; అనుపగాన్+అగున్= పంపటానికి వీలగును; మఱి= ఇక; దీనిన్= దీన్ని; గాంగేయ, విదుర, కలశజ+అశ్వత్థామ, గౌతముల్= భీష్ముడు, విదురుడు, ద్రోణుడు, అశ్వత్థామ, కృపాచార్యుడు; బుద్ధిగాన్= మనస్ఫూర్తిగా; ఒడంబడుదురె= ఒప్పుకొంటారా; కాదు+అయ్య= సాధ్యంకాదయ్యా; అనినన్= అని అనగా; కౌరవ, జ్యేష్ఠుండు= కౌరవులలో పెద్దవాడైన దుర్యోధనుడు; ఘనుఁడు= అసాధ్యుడు; ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఎప్పుడూ నా హృదయంలో ఈ అభిప్రాయమే ఉన్నది. ఇది ఘోరమైనది కనుక సులభంగా పైకి చెప్పలేకున్నాను. ఒంటరిగా పాండవులను పంపటానికి ఏ విధంగా వీలవుతుంది? మరి, దీనికి భీష్మ ద్రోణ విదురాశ్వత్థామకృపులు మనఃపూర్వకంగా అంగీకరిస్తారా? సాధ్యం కాదు' - అని ధృతరాష్ట్రుడనగా తండ్రితో దుర్యోధనుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇది ధృతరాష్ట్రుని ఆంతర్యాన్ని తెలిపే పద్యం. మొదటిపాదానికి - "ఏను నిక్కార్యంబ(బు) హృదయంబులోన నెప్పుడుఁ జింతింతు నిది దారుణంబు" అనేపాఠాంతరం ఉంది. - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.352. ద్విపదపాదద్వయం తరువోజ ఏకపాదం. లక్షణానికి చూడు - ఆది.2.151.

**వ. 'భవదనుజ్ఞాగౌరవంబున గాంగేయాదులు దీనికి నొడంబడుదురు; వారు కౌరవులకెల్ల సము లై యుండియు నావారల; యెట్లనిన; నశ్వత్థామ నా కిష్టుం డగుట నన్నుఁ బాయకుండు; పుత్త్రస్నేహంబున ద్రోణుండును భారద్వాజుని భాగినేయునిం బాయనేరమింజేసి కృపాచార్యుండును నాయొద్దన యుందురు; మఱి భీష్ముండు మధ్యస్థుం డగుటఁ బాండవులం బరిగ్రహింపఁడు; విదురుండు పాండవపక్షపాతి యయ్యును నొక్కరుండు నా కహితంబు**

**సేయనోపండు; గావున నిక్కార్యంబున దోషంబు లేదు; వినిద్రకరణం బయిన నాహృదయశల్యంబు బాచి న న్నుద్ధరింపు' మని ధృతరాష్ట్రు నెట్టకేలకు నొడంబఱిచి దుర్యోధనుం డప్పుడు. 131**

**ప్రతిపదార్థం:** భవత్+అనుజ్ఞా, గౌరవంబున= నీయొక్క ఆజ్ఞలోని గౌరవంచేత; గాంగేయ+ఆదులు= భీష్ముడు మొదలయిన వాళ్ళు; కౌరవులకు+ఎల్లన్= కురువంశంవాళ్ళందరికీ; సములు+ఐ= సమానమైన భావం కలవాళ్ళయి - అంటే కురువంశం వాళ్ళందరిపట్ల సమభావం కలవాళ్ళయి; ఉండియు; నా, వారలు+అ= నావాళ్ళే; అనినన్; అశ్వత్థామ; నాకు; ఇష్టుండు+అగుటన్= ప్రియమైనవాడు కావటంచేత; నన్నున్; పాయక+ఉండున్= వదలక ఉంటాడు; పుత్ర, స్నేహంబునన్= పుత్రునిమీది ప్రేమచేత; ద్రోణుండును; భారద్వాజుని= ద్రోణుని; భాగినేయునిన్= చెల్లెలిభర్తను; పాయ, నేరమిన్+చేసి= వదలలేకుండటంచేత; కృపాచార్యుండును; నా, ఒద్దన= నా దగ్గరే; ఉందురు; మఱి; భీష్ముండు; మధ్యస్థుండు+అగుటన్= నడుమఉండి రెండువైపుల వారికి పక్షపాతంలేక న్యాయం చెప్పేవాడు కావటంచేత; పాండవులన్; పరిగ్రహింపఁడు= ప్రియంతో తీసుకోడు - అంటే పాండవులవైపు వెళ్ళడు; విదురుండు; పాండవ, పక్షపాతి= పాండవులపట్ల పక్షపాతం కలవాడు; అయ్యును; ఒక్కరుండు; నాకు; అహితంబున్+అ= కీడు; చేయన్, ఓపండు= చేయలేడు; కావునన్, ఈ+కార్యంబునన్= ఈ పనిలో - పాండవులను పంపేపనిలో; దోషంబు= లోపం; లేదు; వినిద్రకరణంబు+అయిన= నిద్రలేనట్లు చేసేదైన; నా, హృదయ, శల్యంబున్= నా గుండెలోని ముల్లును; పాచి= తొలగించి; నన్నున్; ఉద్ధరింపుము= పైకి తెమ్ము; అని; ధృతరాష్ట్రున్; ఎట్టకేలకున్= చిట్టచివరికి; ఒడంబఱిచి= ఒప్పించి; దుర్యోధనుండు; అప్పుడు= అంతట.

**తాత్పర్యం:** 'మీ ఆజ్ఞమీదిగౌరవంచేత భీష్ముడు, ద్రోణుడు మొదలయినవాళ్ళు దీనికి ఒప్పుకొంటారు. వాళ్ళు కురుపాండవులపట్ల సమభావం కలవాళ్ళే అయినా నావాళ్ళే. ఎ ట్లనగా; అశ్వత్థామ నాకు ఇష్టమైనవాడు. అందుచేత నన్ను వదలిపోడు. కొడకుమీదిప్రేమచేత ద్రోణుడు, చెల్లెలి భర్త అయిన ద్రోణుడిని వదలలేక కృపుడు నా వైపే ఉంటారు. భీష్ముడు మధ్యస్థుడు కనుక పాండవులవైపు వెళ్ళడు. విదురుడు పాండవపక్షపాతియే. కాని ఆత డొక్కడు నాకు కీడు చేయలేడు. అందుచేత ఈ కార్యక్రమంలో ఏ లోపం లేదు. నాకు నిద్రలేకుండా చేసే ఈ గుండెలోని ముల్లును తొలగించి, నన్ను జీవితంలో పైకితీసికొని రమ్ము' - అని చిట్టచివరికి ధృతరాష్ట్రుడిని ఒప్పించి దుర్యోధనుడు.

**క. వలను గల మంత్రివరులం । బిలిచి పృథానందనులకుఁ బ్రియముగ మీ రి**
**మ్ముల వారణావతంబును । వెలయఁగఁ బొగడుండు వారు విని తగుల నెడన్. 132**

**ప్రతిపదార్థం:** వలను, కల= నేర్పుగల; మంత్రివరులన్= మంత్రిశ్రేష్ఠులను; పిలిచి, మీరు; పృథా, నందనులకున్= కుంతీదేవి యొక్కకొడుకులకు; ప్రియముగన్= ఇష్టమయ్యేటట్లు; వారు; విని; ఎడన్= మనస్సులో; తగులన్= ఆశపడేటట్లు; ఇమ్ములన్= ఇంపుగా; వారణావతంబును; వెలయఁగన్= ప్రకాశించేటట్లు - అంటే గొప్పగా; పొగడుండు = ప్రశంసించండి.

**తాత్పర్యం:** నేర్పరులు, మంచివాళ్ళు అయిన మంత్రులను పిలిచి, 'మీరు పాండవులు వినేటట్లు, విని వాళ్ళు ఆశపడేటట్లు, వారణావతాన్ని గొప్పగా పొగడండి'.

**వ. అని పంచిన వారును వారణావతంబు ననవరతసురభికుసుమఫలభారనమ్రశాఖావిశాలతరువనరేఖాలంకృతం బనియును, వనజలకేళీకందుకమృగయాదివివిధవిహారహారిప్రదేశాభిశోభితం బనియును, నవసుధా ధౌతసౌధ సుధాకరనికరప్రభాపటలప్రధ్వంసితాసితపక్షదోషం బనియును, నిరస్తదోషానుషంగమంగళ మహారత్న**

**రాజివిరాజితవిపులవిపణివీథీవిహసితాలకావిలాసం బనియును, మనోరమానేకసుఖానుభోగ భోగిమహాభాగ జనసమృద్ధం బనియును, బుణ్యనదీప్రవాహశోభితం బనియును వర్ణించి యప్పురంబునందు పాండునందనుల జాతకౌతూహలచిత్తులం జేసి యున్నఁ, గొండొకకాలంబునకు ధృతరాష్ట్రుండు దుర్యోధనదుష్టవచనప్రబోధితుం డయి యొక్కనాఁడు.** **133**

**ప్రతిపదార్థం:** అని, పంచిన= ఆజ్ఞాపించగా; వారును; వారణావతంబున్; అనవరత, సురభి, కుసుమ, ఫల, భార, నమ్ర, శాఖా, విశాల, తరు, వనరేఖా+అలంకృతంబు+అనియును= ఎల్లప్పుడు మంచివాసనగల పూలయొక్క, పండ్లయొక్క బరువుచేత వంగిన కొమ్మలచేత విశాలమైన చెట్లు ఉండే తోపులయొక్క వరుసలచేత అలంకరింపబడిందనీ, వన, జల, కేళీ, కందుక, మృగయా+ఆది, వివిధ, విహార, హారి, ప్రదేశ+అభిశోభితంబు+అనియును= ఉద్యానవనం, జలక్రీడ, చెండ్లాట, వేట మొదలయిన అనేకవిధాలైన క్రీడలకు మనోహరాలైన ప్రదేశాలతో ఒప్పిందనీ; నవ, సుధా, ధౌత, సౌధ సుధాకర, నికర, ప్రభాపటల, ప్రధ్వంసిత+అసిత, పక్షదోషంబు+అనియును= క్రొత్తదైన సున్నంచేత తెల్లగా చేయబడిన మేడలు అనే చంద్రుల సమూహంయొక్క కాంతిసమూహంచేత పూర్తిగా నశింపజేయబడిన కృష్ణపక్షంలోని రాత్రులు కలది అనీ; నిరస్త, దోషా+అనుషంగ, మంగళ, మహత్, రత్న, రాజి, విరాజిత, విపుల, విపణి, వీథీ, విహసిత+అలకా, విలాసంబు+అనియును= తీసివేయబడిన దోషసంబంధం గల శుభాన్ని కూర్చే గొప్పరత్నాలయొక్క సమూహంచేత మిక్కిలి ప్రకాశిస్తున్న విశాలమైన అంగడివీథులచేత ఎగతాళి చేయబడిన అలకాపట్టణంయొక్క శోభకలది అనీ; మనోరమా+అనేక, సుఖ+అనుభోగ, భోగి, మహాభాగ, జన, సమృద్ధంబు+ అనియును= మనోహరాలైన పెక్కుసుఖాలయొక్క అనుభవాలను అనుభవించేటి పుణ్యావంతులయిన జనులచేత నిండినట్టిదనీ; పుణ్య,నదీ,ప్రవాహ,శోభితంబు+అనియును= పవిత్రాలైన నదులయొక్క ప్రవాహాలతో ప్రకాశించేది అనీ; వర్ణించి; ఆ+పురంబు+ అందు+అ= ఆ నగరమందే; పాండునందనుల= పాండవుల, జాత, కౌతూహల, చిత్తులన్+చేసి= పుట్టిన ఆశ కల మనస్సుకలవాళ్ళనుగా చేసి; ఉన్నన్; కొండొక, కాలంబునకు= కొద్దికాలానికి; ధృతరాష్ట్రుండు; దుర్యోధన, దుష్ట, వచన, ప్రబోధితుండు+అయి= దుర్యోధనునియొక్క చెడు మాటలచేత లెస్సగా తెలుపబడినవాడై; ఒక్కనాఁడు= ఒకదినం.

**తాత్పర్యం:** అని ఆజ్ఞాపించగా - ఆ మంత్రులు - వారణావతం ఎల్లప్పుడూ పూలబరువుచేత, పండ్లబరువుచేత వంగిన కొమ్మలుగల పెద్దచెట్లతో - ఉద్యానవనవిహారం, జలక్రీడ, చెండ్లాట, వేట మొదలైన పెక్కుక్రీడలకు తగిన మనోహరప్రదేశాలతో - కృష్ణపక్షరాత్రులను (చీకట్లను) తమ క్రొత్తసున్నపుపూత కాంతులతో పారద్రోలే చంద్రులవంటి పెద్ద మేడలతో - దోషం లేనివి, శుభాన్ని కూర్చేవి, అయిన గొప్ప రత్నాలతో అలకానగర శోభనే అపహాస్యంచేసే పెద్ద అంగడి వీథులతో - అనేకభోగాలను అనుభవించే పుణ్యాత్ములైన ప్రజలతో - పవిత్రనదీ ప్రవాహాలతో ప్రకాశిస్తున్నదనీ, ఆ నగరంమీద పాండవులకు అపరిమితమైన కోరిక కలిగేటట్లు వర్ణించారు. కొద్దికాలం తర్వాత ధృతరాష్ట్రుడు దుర్యోధనుని చెడుమాటలు మనస్సుకు పట్టినవాడై.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ, అంత్యానుప్రాసం, వృత్త్యనుప్రాసం.

**ధృతరాష్ట్రుండు పాండవులను వారణావతనగరంబునకుఁ బోవఁ బనుచుట (సం. 1-131-2)**

**ఉ. పాండుకుమారులం బిలువఁబంచి సుహృన్నివహంబు నొద్ద న**
**ప్పాండుఁ దలంచి నిర్గళితబాష్పకరాళకపోలయుగ్ముఁ డై**
**పాండుమహీశుకంటె నతిభక్తుల మి మ్మొకఁ డేను బంచెదం**
**బాండుయశోఽ ర్థులార! యిది పథ్యము కాఁగఁ దలంపుఁ డాత్మలోన్.** **134**

**ప్రతిపదార్థం:** పాండు, కుమారులన్; పిలువన్; పంచి= ఆజ్ఞాపించి; సుహృత్+నివహంబు+ఒద్దన్= ఆప్తుల సమూహంయొక్క ఎదుట; ఆ+పాండున్= ఆ పాండురాజును; తలంచి= గుర్తు చేసికొని; నిర్గళిత, బాష్ప, కరాళ, కపోల, యుగ్ముఁడు+ఐ= కారుతున్న కన్నీళ్ళ మిట్టపల్లాలైన చెక్కిళ్ళజంట కలవాడై; పాండు, మహి+ఈశునికంటెన్= పాండురాజుకంటె; అతి, భక్తులన్= మిక్కిలి భక్తి గల వాళ్ళయిన; మిమ్మున్; ఏను= నేను; ఒకఁడు, పంచెదన్= ఒకటి ఆజ్ఞాపిస్తాను; పాండు, యశః+అర్థులారా!= పాండురాజుయొక్క కీర్తిని కోరేవాళ్ళారా! లేదా తెల్లనికీర్తిని కోరేవాళ్ళారా!; ఆత్మలోన్= మనస్సులో; ఇది= నేను ఆజ్ఞాపించునది; పథ్యము, కాఁగన్= చేయదగింది, అయినట్లుగా; తలంపుఁడు= ఆలోచించండి.

**తాత్పర్యం:** పాండవులను పిలిపించి, ఆప్తులందరి ఎదుట పాండురాజును స్మరించి కన్నీరు నింపుకొని, పాండురాజుకంటె ఎక్కువ భక్తిగలవాళ్ళయిన మిమ్మల్ని నేనొకటి ఆజ్ఞాపిస్తాను. పాండురాజుకీర్తిని కోరేవాళ్ళారా! ఇది చేయదగింది అని ఆలోచించండి. (లేదా నిర్మలకీర్తిని కోరే మీరు ఇది చేయదగింది అని ఆలోచించండి.)

**విశేషం:** 'పాండు' శబ్దంలో శ్లేష ఉన్నది. తండ్రికీర్తిని కోరేవాళ్ళు తండ్రి అడుగుజాడలలో నడుస్తారు. అందుచేత ధృతరాష్ట్రుడు - తండ్రికీర్తిని కోరే ఓ పాండవులారా! మీ తండ్రి నా పట్ల భక్తికలవాడు. మీరు కూడా నా పట్ల అతనికంటె ఎక్కువభక్తి కలవాళ్ళు. మీతండ్రి అడుగుజాడలలో నడిచి నేను చెప్పినట్లు అతనివలె మీరుకూడా చేయండనటం. పాండుయశోऽర్థులారా - అనేదాన్ని తెల్లనికీర్తిని కోరేవాళ్ళారా అని అన్వయిస్తే - పెద్దలమాట వినటం కీర్తికరం. కీర్తిని కోరే ఓ పాండవులారా! ఈ పెదతండ్రి చెప్పినట్లు చేయండి అనటం. కీర్తివర్ణం తెలుపు అని కవిసమయం.

**క. విదితంబుగఁ బుణ్యామర । నదీ సమీపమున వారణావత నగరం**
**బది సర్వసుఖాస్పద మని । వదలక వర్ణింతు రెల్లవారును దానిన్. 135**

**ప్రతిపదార్థం:** విదితంబుగన్= ప్రసిద్ధంగా; పుణ్య+అమర, నదీ, సమీపమునన్= పవిత్రమైన గంగానది దగ్గర; వారణావత, నగరంబు; అది= ఆ నగరం; సర్వ, సుఖ+ఆస్పదము+అని= అన్ని సుఖాలకు చోటు అని; ఎల్లవారును= అందరూ; దానిన్= దాన్ని; వదలక; వర్ణింతురు.

**తాత్పర్యం:** పవిత్రమైన గంగానదీసమీపంలో ప్రసిద్ధమైన వారణావతనగరం సర్వసుఖాలకు స్థానమని అందరూ ప్రశంసిస్తారు.

**క. మీరును గుంతియు సహపరి । వారమహామాత్య భృత్యవర్గులరై నా**
**నారాజ్యలీలతోఁ జని । సారమతిం జేయుఁ డందు సతతోత్సవముల్. 136**

**ప్రతిపదార్థం:** మీరును; కుంతియున్; సహపరివార, మహా+అమాత్య, భృత్య, వర్గులరు+ఐ= పరివారంతోను, మహామంత్రులతోను; సేవకులసమూహాలతోను కూడినవాళ్ళయి; నానా, రాజ్య, లీలతోన్= పలువిధాలైన రాజ్యవిలాసంతో; చని= వెళ్ళి; అందున్= ఆ నగరంలో; సారమతిన్= మేలిమిబుద్ధితో; సతత+ఉత్సవముల్= ఎడతెగనిపండుగలను; చేయుఁడు= ఆచరించండి.

**తాత్పర్యం:** మీరూ, కుంతీదేవితో, పరివారంతో, అమాత్యులతో, సేవకులతో కూడి నానావిధరాజ్యవైభవంతో అక్కడకు వెళ్ళి హాయిగా పండుగలను చేసికొనండి.

వ. 'పశుపతి నివాసం బయిన యప్పుణ్యస్థానంబునం బాండుహితంబుగా నగణ్యగోహిరణ్యాదిమహాదానంబుల బ్రాహ్మణసంతర్పణంబులు సేసి యందుఁ గొండొకకాలం బుండి వచ్చునది' యని పంచిన వల్లె యని పాండవులు గాంధారీధృతరాష్ట్రులకు మ్రొక్కి వీడ్కొని, దుర్యోధనాదుల నందఱం బ్రియపూర్వకంబుగా సంభావించి, భీష్మద్రోణవిదురకృపాదులకు మ్రొక్కి యనేకవృద్ధబ్రాహ్మణులకు నమస్కారంబు సేసి వారలవలన దీర్ఘాయురారోగ్య స్వస్తివచనంబులతోఁ బునర్దర్శనం బయ్యెడ మని దీవనలు సేకొనుచు జననీసహితంబుగా వారణావతంబునకు గమనోన్ముఖు లయినంత. 137

**ప్రతిపదార్థం:** పశుపతి, నివాసంబు+అయిన= శివునియొక్క ఉనికిపట్టయిన; ఆ+పుణ్య, స్థానంబునన్; పాండు, హితంబుగాన్= పాండురాజుకు ఇష్టమయ్యేటట్లుగా; అగణ్య, గో హిరణ్య+ఆది, మహా, దానంబులన్= లెక్క లేనన్ని గోవులు బంగారం మొదలైన మహాదానాలచేత; బ్రాహ్మణ, సంతర్పణంబులు= బ్రాహ్మణులను బాగుగా తృప్తిపరచటం; చేసి; అందున్= ఆ వారణావత నగరంలో; కొండొక; కాలంబు= కొద్దికాలం; ఉండి; వచ్చునది= రండు; అని, పంచినన్= ఆజ్ఞాపించగా; వల్లె; అని= సరే అని; పాండవులు; గాంధారీ, ధృతరాష్ట్రులకున్= గాంధారీధృతరాష్ట్రులకు, మ్రొక్కి= నమస్కరించి; వీడ్కొని= సెలవుతీసికొని; దుర్యోధన+ఆదులన్= దుర్యోధనుడు మొదలయినవాళ్ళను; అందరన్= అందరిని; ప్రియ పూర్వకంబుగా= సంతోషపూర్వకంగా; సంభావించి= సమ్మానించి; భీష్మ, ద్రోణ, విదుర, కృప+ఆదులకు= భీష్ముడు, ద్రోణుడు, విదురుడు, కృపుడు మొదలయినవారికి; మ్రొక్కి; అనేక, వృద్ధ, బ్రాహ్మణులకు; నమస్కారంబు, చేసి; వారలవలనన్= వారివల్ల; దీర్ఘ+ఆయుః +ఆరోగ్య, స్వస్తి, వచనంబులతోన్= నిడుపైన-అంటే ఎక్కువైన -ఆయుష్యం, ఆరోగ్యం, శుభం కలుగుతుందనే మాటలతో; పునః+దర్శనంబు= మరలచూడటం; అయ్యెడము+అని= అగునుగాక అని; దీవనలు= ఆశీస్సులు; చేకొనుచున్= తీసికొంటూ; జననీ సహితంబుగా= తల్లితోకూడా; వారణావతంబునకు; గమన+ఉన్ముఖులు+అయినన్= పోవటానికి పూనుకొన్నవాళ్ళు కాగా; అంతన్= తర్వాత.

**తాత్పర్యం:** 'శివుని నివాసస్థానమైన ఆ పవిత్రస్థలంలో పాండురాజుకు ప్రీతిగా అనేక గోదానాలు; సువర్ణదానాలు మొదలయిన మహాదానాలు చేసి, బ్రాహ్మణులను తృప్తిపరుస్తూ, కొద్దికాలం ఉండి తిరిగిరం' డని ఆజ్ఞాపించగా, పాండవులు అందుకు అంగీకరించి గాంధారీధృతరాష్ట్రులకు మ్రొక్కి, వారిదగ్గర సెలవు తీసికొని దుర్యోధనాదు లందరిని సంతోషపూర్వకంగా సమ్మానించి, పెక్కుమంది వృద్ధబ్రాహ్మణులకు నమస్కారాలుచేసి, వారివలన దీర్ఘఆయురారోగ్యశుభాలు కలిగేట్లు ఆశీర్వచనాలు పొంది, తల్లితోకూడ వారణావతానికి పోవటానికి పూనుకోగా - తరువాత.

**విశేషం:** భీష్మద్రోణవిదురాదులకు మ్రొక్కి - అనేదానికి "విదుర సోమదత్త బాహ్లిక కురువృద్ధులకున్ ద్రోణకృపాచార్యాది బ్రాహ్మణసమూహంబునకుఁ బ్రియపూర్వకంబుగా మ్రొక్కి" - విదురసోమదత్తబాహ్లికకురువృద్ధులకు ద్రోణకృపాచార్యాశ్వత్థామాది బ్రాహ్మణసమూహంబునకు ప్రియపూర్వకంబుగా నమస్కరించి - అనే పాఠాంతరాలున్నాయి. - శ్రీమదాంధ్రమహాభారత సంశోధితప్రతి, పుట. 354.

### దుర్యోధనుఁడు లాక్షాగృహనిర్మాణమునకై పురోచనుని వారణావతంబునకుఁ బంపుట (సం.1-132-2)

క. తనవగచినకార్యము దొర। కొనుటకు ధృతరాష్ట్రపుత్త్రకుఁడు పొంగి పురో
చనుఁ బిలిపించి రహస్యం। బున వానికిఁ గరమునెయ్యమున ని ట్లనియెన్. 138

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్ర, పుత్రకుఁడు= ధృతరాష్ట్రునియొక్క ప్రియపుత్రుడు - దుర్యోధనుడు; తనవగచిన, కార్యము= తనయొక్కతలచినపని; దొరకొనుటకు= ఈడేరటానికి - ఫలించినందుకు; పొంగి= సంతోషించి; పురోచనున్= పురోచనుణ్ణి; పిలిపించి; రహస్యంబునన్= గోప్యంగా; వానికిన్= అతనికి; కరము= మిక్కిలి; నెయ్యమునన్= స్నేహంతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తాను తలంచినపని ఫలించినందుకు సంతోషించి, పురోచనుడిని పిలిపించి రహస్యంగా అతనితో మిక్కిలిస్నేహంగా ఇట్లా అన్నాడు.

**తరలము.**

**అలఘుతేజుల వారణావత మన్పురంబునఁ బాండవే**
**యులఁ బ్రియంబున నుండఁబంచె గుణోన్నతుండు కురుప్రభుం;**
**డలయ కిప్పడు నీవు మున్ చని యందు వారికి నుండఁగా**
**నిలయముల్ రచియింపు నీదగునేర్పుఁ జూతము చెచ్చెరన్.** **139**

**ప్రతిపదార్థం:** గుణ+ఉన్నతుండు= మంచిగుణాలచేత గొప్పవాడైన; కురు, ప్రభుండు= కురురాజు - ధృతరాష్ట్రుడు; అలఘు, తేజులు= తక్కువకాని కాంతిగలవాళ్ళయిన; పాండవేయులన్= పాండవులను; వారణావతము+అన్+పురంబునన్; ప్రియంబునన్= ప్రేమతో; ఉండన్= ఉండటానికి; పంచెన్= ఆజ్ఞాపించాడు; అలయక= విసుగుకోకుండ; నీవు; మున్= ముందు; చని= వెళ్ళి; అందున్= అక్కడ - అంటే వారణావతంలో; వారికిన్= పాండవులకు; ఉండఁగాన్= ఉండటానికి; నిలయముల్= ఇండ్లు; చెర+చెరన్= వెంటనే; రచియింపు= నిర్మించు; నీది+అగు; నేర్పున్; చూతము= నీ నైపుణ్యాన్ని చూద్దాము.

**తాత్పర్యం:** గొప్పగుణవంతుడైన ధృతరాష్ట్రమహారాజు తేజోవంతులైన పాండవులను ప్రేమతో వారణావతమనే నగరంలో నివసించటానికి ఆజ్ఞాపించాడు. నీవు విసుగుకోకుండ వెంటనే వాళ్ళకు అక్కడ ఇండ్లు నిర్మించుము. నీ నేర్పు చూద్దాం. తరలము లేక తరళము అనగా చలించునది, ప్రకాశించునది. చంచలమైన ధృతరాష్ట్రుని మనస్సు దుర్యోధనుని దుర్బుద్ధికి లొంగి పాండవులను వారణావతానికి తరలించే తరుణంలో ఈ తరలము ప్రయుక్తం. దివ్యప్రకాశం ఎక్కడ ఉన్నా అది మణియై శోభిస్తుంది. హారంవంటి పాండవుల ఔజ్జ్వల్యం సర్వప్రకాశనిలయం.

**విశేషం:** తరలంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న, భ, ర, స, జ, జ, గ అనే గణాలుంటాయి. 12వ అక్షరం యతి.

**వ.** **నాకుం బరమవిశ్వాసివి నీ వొక్కరుండవ; యిది యనన్యవిషయం బయిన కార్యంబు; కావున నీవ దీనిం జేయవలయు; వాయుజవంబు లయిన వేసడంబులఁ బూనిన యరదం బెక్కి, నేఁడ చని వారణావతంబున లాక్షాసర్జకరసమిశ్రం బై ఘృతతైలార్ద్రంబయిన మృత్తికాపుంజంబున నొక్క చతుశ్శాల విశాలంబుగా నాయుధశాల సమీపంబున మనోహరంబుగా నవిరళసుధాధవళితంబుగా నిర్మించి యందుఁ బాండవుల నునిచి వార లేమఱి నమ్మి కొండొకకాలం బుండ, ని న్నొరు లెఱుంగకుండ నిమ్మయినయవసరంబునం దద్గృహద్వారంబునందు ఘోరానలంబు దరికొలిపి పగఱ పంచత్వం బెఱింగి రమ్ము.** **140**

**ప్రతిపదార్థం:** నాకున్; పరమవిశ్వాసివి= మిక్కిలి నమ్మదగినవాడివి; నీవు+ఒక్కరుండవు+అ= నీవొక్కడివే; ఇది= ఈపని; అనన్య, విషయంబు+అయిన= ఇతరులకు గోచరం కానిదైన; కార్యంబు= పని; కావునన్; నీవు+అ= నీవే; దీనిన్; చేయవలయు; వాయు, జవంబులు+అయిన= గాలివేగంతో సమానమైన వేగం గలవైన; వేసడంబులన్= కంచరగాడిదలను; పూనిన= తాల్చిన; అరదంబు= రథం; ఎక్కి; నేఁడు+అ= ఈ రోజే; చని= వెళ్ళి; వారణావతంబునన్; లాక్షా, సర్జక, రస, మిశ్రంబు+ఐ= లక్క, మద్దిచెట్టుబంక కలసిందై; ఘృత, తైల+ఆర్ద్రంబు+అయిన= నెయ్యితోను, నూనెతోను తడిసిందైన; మృత్తికా, పుంజంబునన్= మట్టికుప్పచేత; ఒక్క, చతుశ్శాలన్= ఒక నాలుగిండ్ల భవంతిని; విశాలంబుగాన్= విడిదికలదిగా; ఆయుధశాల, సమీపంబునన్= ఆయుధాలుండే మేడకు దగ్గరగా; మనోహరంబుగాన్= మనస్సు ఆకర్షించేటట్లు; అవిరళ, సుధా, ధవళితంబుగాన్= దట్టమైన సున్నంచే తెల్లగా చేయబడిందిగా, నిర్మించి; అందున్; పాండవులన్; ఉనిచి; వారలు; ఏమఱి= (అజాగ్రత్తగా) మరచి; నమ్మి; కొండొక, కాలంబు= కొద్దికాలం; ఉండన్= ఉండగా; ఇమ్ము+అయిన= అనుకూలమయిన; అవసరంబునన్= సమయంలో; తత్+గృహ, ద్వారంబు, అందున్= ఆ యింటియొక్కవాకిట్లో; ఘోర+అనలంబు= భయంకరమైన నిప్పును; దరికొలిపి= మండించి; పగఱ, పంచత్వంబు= శత్రువులయొక్కచావును; ఎఱింగి= తెలిసికొని; రమ్ము.

**తాత్పర్యం:** నీవు నాకు మిక్కిలి నమ్మదగినవాడివి. ఇది ఇతరులకు సాధ్యం కాని పని. అందుచేత నీవే చేయాలి. వాయువేగంతో సమానమైన వేగం కలిగిన కంచరగాడిదలు పూనినరథం ఎక్కి ఈ రోజే వారణావతం వెళ్ళి అక్కడ లక్క, మద్దిబంక కలిపిన నేతితో, నూనెతో తడిపినమట్టితో ఒక నాలుగిండ్ల భవంతిని ఆయుధశాల దగ్గర మనోహరంగా దట్టమైన సున్నంకొట్టి తెల్లగా నిర్మించి, అందులో పాండవులను ఉంచి, వాళ్ళు ఏమరుపాటున నమ్మి కొంతకాలం ఉన్న తర్వాత, ఆ యింటి వాకిటికి నిప్పుపెట్టి, శత్రువులైన పాండవుల చావును తెలిసికొని రమ్ము.

**క. ఈ కార్య సిద్ధి యగుడును । నీ కతమున నఖిల ధారుణీ రాజ్యము నా**
**కేకాధిష్ఠిత మగు నిది । నీకును నిత్యోపభోగనిలయమ కాదే. 141**

**ప్రతిపదార్థం:** ఈకార్యసిద్ధి= ఈ పనియొక్క సఫలత; అగుడును= అయితే, అయినవెంటనే; నీ కతమునన్= నీ కారణాన; అఖిల, ధారుణీ, రాజ్యము= మొత్తం భూమిమీద అధికారం; నాకున్; ఏక+అధిష్ఠితము= ఒకనిచేతనే పొందబడింది; అగున్= అవుతుంది; ఇది= ఈ పని; నీకును= నీకు కూడా, నిత్య+ఉపభోగ, నిలయము+అ= శాశ్వతమైన సుఖాలకు స్థానం; కాదే= కాదా.

**తాత్పర్యం:** ఈ పని సఫలమైతే నీ కారణంగా సమస్తరాజ్యాధికారం నా చేతికి వస్తుంది. ఈ విధంగా జరిగితే నీవు శాశ్వతసుఖాలను అనుభవించవచ్చునుగదా!

### వారణావతప్రస్థానము - విదురోపదేశము (సం. 1-133-4)

**వ. అని పంచినం బురోచనుం డతిత్వరితగతి నరిగి దుర్యోధను కఱపిన రూపున వారణావతంబున లాక్షాగృహంబు రచియించుచుండె; నిట యుధిష్ఠిరభీమార్జునయములుం గ్రమంబునం దొల్లి షోడశపంచదశ చతుర్దశత్రయోదశవర్షజాతు లయి శతశృంగంబున నుండి హస్తిపురంబునకు వచ్చి యందుఁ గౌరవులం గలసి యస్త్రవిద్యలం గఱచుచుం బదమూడేం డ్లుండి, యపుడు ధృతరాష్ట్రునియోగంబున వారణావతంబునకు జననీసహితంబుగాఁ బోవ సమకట్టి మహాజవసత్త్వసమేతంబు లయిన హయంబులం బూనిన రథంబు లెక్కి ధనుర్ధరు లయి హస్తిపురంబు వెలువడు నపు డప్పురంబునం గల బ్రాహ్మణక్షత్రియప్రముఖానేక జనంబులు శోకసంతప్తహృదయు లయి. 142**

**ప్రతిపదార్థం:** అని; పంచినన్= ఆజ్ఞాపించగా; పురోచనుండు; అతి, త్వరిత, గతిన్= మిక్కిలి వేగంతో గూడిన విధంగా; అరిగి= వెళ్ళి; దుర్యోధను, కఱపిన, రూపునన్= దుర్యోధనుడు చెప్పినవిధంగా; వారణావతంబునన్; లాక్షాగృహంబు= లక్క ఇల్లు; రచియించుచున్+ఉండెన్= నిర్మిస్తూ ఉన్నాడు; ఇట; యుధిష్ఠిర, భీమ+అర్జున, యములున్= ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులసహదేవులు; క్రమంబునన్= వరుసగా; తొల్లి= పూర్వం; షోడశ, పంచదశ, చతుర్దశ, త్రయోదశ, వర్ష, జాతులు+అయి= పదహారు, పదిహేను, పద్నాలుగు, పదమూడు సంవత్సరాల పుట్టుక (వయస్సు) కలవాళ్ళయి; శతశృంగం బుననుండి= శతశృంగపర్వతంనుండి; హస్తి, పురంబునకున్= హస్తినాపురానికి; వచ్చి; అందున్= ఆ హస్తినాపురంలో; కౌరవులన్+కలిసి= కౌరవులతో కలిసి; అస్త్రవిద్యలన్; కఱచుచున్= నేర్చుకొంటూ; పదమూడు+ఏండ్లు+ఉండి; అప్పుడు; ధృతరాష్ట్రు, నియోగంబునన్= ధృతరాష్ట్రునియొక్క ఆజ్ఞచేత; వారణావతంబునకున్; జననీసహితంబుగాన్= తల్లితోకూడ; పోవన్= పోవటానికి; సమకట్టి= పూనుకొని; మహా, జవ, సత్త్వ, సమేతంబులు+అయిన= గొప్పవేగంతో, బలంతో కూడుకొనిన వైన; హయంబులన్= గుఱ్ఱాలను; పూనిన= ఏర్పాటుచేసిన; రథంబులు; ఎక్కి; ధనుః+ధరులు+అయి= విండ్లను చేపట్టినవాళ్ళయి; హస్తి, పురంబు= హస్తినాపురం; వెలువడునపుడు= వెలువడే సమయంలో; ఆ+పురంబునన్= ఆ నగరంలో; కల= ఉన్న; బ్రాహ్మణ; క్షత్త్రియ, ప్రముఖ+అనేక, జనంబులు= బ్రాహ్మణులు; క్షత్రియులు; మొదలయిన పెక్కుమంది ప్రజలు; శోకసంతప్తహృదయులు+అయి= దుఃఖంచేత మిక్కిలి కాల్చబడిన మనస్సులు కలవాళ్ళయి.

**తాత్పర్యం:** అని ఆజ్ఞాపించగా, పురోచనుడు మిక్కిలి వేగంగా వెళ్ళి, దుర్యోధనుడు చెప్పినట్లు వారణావతంలో లక్కఇల్లు నిర్మిస్తూ ఉన్నాడు. ఇక్కడ క్రమంగా పదహారు, పదిహేను, పద్నాలుగు, పదమూడుసంవత్సరాల వయస్సు కల ధర్మజభీమార్జుననకులసహదేవులు శతశృంగపర్వతంనుండి హస్తినకు వచ్చి, కౌరవులతో కలిసి అస్త్రవిద్యలు నేర్చుకొంటూ పదమూడేండ్లు ఉండి, ధృతరాష్ట్రుని ఆజ్ఞప్రకారం తల్లితోకూడ వారణావతానికి పోవ సమకట్టి, గొప్పవేగం, బలంగల గుర్రాలు పూనినరథాలెక్కి, చేత ధనుస్సులు ధరించి, హస్తిపురం వెలువడేటప్పుడు ఆ పురంలోని బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలయినవాళ్ళంతా మిక్కిలి దుఃఖంతో;

**విశేషం:** వారణావతానికి వెళ్ళేనాటికి ధర్మరాజు వయస్సు 29 సంవత్సరాలు - భీమునిది 28 సంవత్సరాలు - అర్జునునిది 27 సంవత్సరాలు - నకులసహదేవులది (కవలలు) 26 సంవత్సరాలు.

**సీ.** **'ఇప్పాండుపుత్త్రుల నేలకో ధృతరాష్ట్రుం। డేకత మనుపంగ నిచ్చగించె;**
**నిది యధర్మం బని యెఱిఁగి గాంగేయాదు। లేల వారింపరో యెఱుఁగరొక్కొ;**
**పితృపితామహులచే భృతపూర్వమై క్రమా। గత మైన రాజ్యంబుఁ గరము నెమ్మిఁ**
**బాండుసుతజ్యేష్ఠు భరతకులశ్రేష్ఠు। ధర్మజుఁ బూన్పక ధర్ము వుడిపి**

**ఆ.** **యేల వృద్ధరాజు లెడసేసిరో; పార్థుఁ దరుగు నెడక మనము నరిగి యతని**
**యున్న చోన ప్రీతి నుండుద; మిం దుండ। నేల?' యనుచుఁ బౌరు లెల్లఁ దెరలి.** **143**

**ప్రతిపదార్థం:** పౌరులు+ఎల్లన్= హస్తినాపుర ప్రజలంతా; ఈ+పాండు, పుత్త్రులన్= ఈ పాండురాజు కుమారులను, పాండవులను; ఏల+ఒకో= ఎందుచేతనోగదా!; ధృతరాష్ట్రుఁడు; ఏకతము= ఒంటరులను చేసి, వేరుచేసి, ప్రత్యేకంగా; అనుపంగన్= పంపటానికి; ఇచ్చగించెన్= ఇష్టపడ్డాడు; ఇది= ఈ పని; అధర్మంబు; అని; ఎఱిఁగి= తెలిసి; గాంగేయ+ఆదులు= భీష్ముడు మొదలయినవాళ్ళు; ఏల= ఎందుచేత; వారింపరో= అడ్డగించరో; ఎఱుఁగరు+ఒక్కొ= వారికి తెలియదేమో! పితృ, పితామహులచే=

తండ్రితాతలచేత; భృత, పూర్వము+ఐ= ముందు భరింపబడినదై; క్రమ+ఆగతము+ఐన= వరుసగా వచ్చేదైన; రాజ్యంబునన్; కరము= మిక్కిలి; నెమ్మిన్= ప్రీతితో; పాండు, సుత, జ్యేష్ఠున్= పాండురాజు కుమారులలో పెద్దవాణ్ణి; భరతకుల, శ్రేష్ఠున్= భరతునియొక్క వంశంలో శ్రేష్ఠుణ్ణి; ధర్మజున్= ధర్మరాజును; పూన్పక= వహించేట్లు చేయక; ధర్మువు+ఉడిపి= ధర్మాన్ని తొలగించి; వృద్ధ, రాజులు; ఏల= ఎందుకు; ఎడ= దూరము; చేసిరో; పార్థుఁడు= పృథ - అంటే కుంతి-కనుక కుంతీతనయు డైన ధర్మరాజు; అరుగు+ఎడకు+అ= వెళ్ళేచోటికే; మనమున్= మనంకూడ; అరిగి=పోయి; అతని, ఉన్న చోన= ఆయన ఉండే చోటనే; ప్రీతిన్, ఉండుదము= ప్రీతితో ఉందాము; ఇందున్= ఈ హస్తినలో; ఉండన్+ఏల= ఉండటమెందుకు; అనుచున్= అంటూ; తెరలి= కదలి.

**తాత్పర్యం:** 'ఈ పాండవులను ఎందుచేతనో ధృతరాష్ట్రుడు తన ఆలోచనతో హస్తిననుండి ఒంటరులుగా చేసి పంపివేయాలనుకొన్నాడు. ఇది అధర్మమని తెలిసికూడా భీష్ముడూ మొదలయినవాళ్ళు ఎందుచేత అడ్డగించలేదో? తండ్రితాతలనుండి వరుసగా వచ్చిన రాజ్యాన్ని - పాండుపుత్రులలో పెద్దవాడూ, భరతవంశంలో శ్రేష్ఠుడూ అయిన ధర్మరాజు ధరించేటట్లు చేయక, ధర్మం తప్పి ఎందుచేత వృద్ధరాజులు అతణ్ణి దూరం చేశారో? ధర్మరాజు వెళ్ళే చోటికే మనంగూడా వెళ్ళుదాము. అతడున్న చోటనే మనంగూడా ప్రీతితో ఉందాం. ఈ హస్తినలో ఉండట మెందుకు' అని పౌరులందరూ బయలుదేరారు.

**వ. తన పిఱుందన వచ్చువారిం బ్రియపూర్వకంబున నూరార్చి 'పితృవచనంబు సేయకునికి ధర్మవిరుద్ధంబు గావున వారణావతంబునకుం బోయి వచ్చెద' మని యందఱం గ్రమ్మఱించి, చనుచున్న ధర్మనందను పిఱుంద నొక్కింతనేల యరిగి, విదురుం డొరులు వినియును నెఱుంగరాని వచనంబుల బహుప్రకారవచనరచనా విశారదుం డైన యుధిష్ఠిరున కెల్ల కార్యంబులు గఱపి, కొడుకులం గౌఁగిలించుకొని, కుంతీదేవికి మ్రొక్కి పాండురాజుం దలంచి బాష్పపూరితనయనుం డై క్రమ్మఱ చనియె; నిట కుంతియు ధర్మరాజు డాయ వచ్చి యి ట్లనియె. 144**

**ప్రతిపదార్థం:** తన, పిఱుందన్= తనవెంట; వచ్చు వారిన్ = వచ్చేవాళ్లను; ప్రియ, పూర్వకంబునన్= స్నేహం మొదలుగా - అంటే స్నేహంతో; ఊరార్చి= ఊరడించి; పితృ, వచనంబు= తండ్రియొక్క మాట; చేయక+ఉనికి= పాటించకుండటం; ధర్మ విరుద్ధంబు= ధర్మానికి వ్యతిరేకం; కావునన్; వారణావతంబునకున్= వారణావతానికి; పోయి= పోయి; వచ్చెదము= వస్తాము; అని; అందరన్= అందరినీ; క్రమ్మరించి= మరలించి; చనుచున్+ఉన్న= వెళ్ళుతున్న; ధర్మనందను, పిఱుందన్= ధర్మరాజుయొక్క వెనుక; ఒక్కింత, నేల, అరిగి= కొద్దిదూరం వెళ్ళి; విదురుండు; ఒరులు= ఇతరులు; వినియును= వినికూడా; ఎఱుంగరాని= తెలిసికొనటానికి సాధ్యంగాని; వచనంబులన్= మాటలతో; బహు, ప్రకార, వచన, రచనా, విశారదుండు+ఐన= పలువిధాలైన మాటలను కూర్చటంలో పండితుడైన; యుధిష్ఠిరునకున్= ధర్మరాజుకు; ఎల్ల కార్యంబులు= అన్ని చేయదగ్గ పనులను; కఱపి= బోధించి; కొడుకులన్= కుమారుల్ని; కౌఁగిలించుకొని; కుంతీదేవికిన్= కుంతికి; మ్రొక్కి= నమస్కరించి; పాండురాజున్= పాండురాజును; తలంచి= గుర్తుచేసికొని; బాష్ప, పూరిత, నయనుండు+ఐ= కన్నీళ్ళతో నిండిన కన్నులు కలవాడై; క్రమ్మఱి= మరలి; చనియెన్= వెళ్ళాడు; ఇట= ఇచ్చట; కుంతియున్= కుంతీదేవియు; ధర్మరాజున్, డాయ, వచ్చి= ధర్మరాజు సమీపానికి వచ్చి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** తన వెంట వచ్చేవాళ్ళను స్నేహపూర్వకంగా ఓదార్చి 'తండ్రిమాట పాటించకపోవటం ధర్మవిరుద్ధమనీ, అందుచేత వారణావతం పోయివస్తా' మనీ చెప్పి వాళ్ళందరినీ వెనుకకు పంపి, వెళ్ళుతున్న ధర్మరాజువెంబడి - విదురుడు కొద్దిదూరం వెళ్ళి, ఇతరులు విన్నా వాళ్ళకు అర్థంగాని మాటలతో మాటనేర్పరి అయిన ధర్మరాజుకు

వారణావతాన చేయదగిన పనులన్నింటినీ బోధించి, పాండవులను కౌగిలించుకొని, కుంతీదేవికి మ్రొక్కి, పాండురాజును స్మరించి కన్నీళ్ళు నించి, వెనుదిరిగి వెళ్ళాడు. తరువాత కుంతీదేవి ధర్మరాజుకు దగ్గరగా వచ్చి ఇలా అన్నది.

**తే. విదురుఁ డేతెంచి యొరులకు వినియు నెఱుఁగఁ గానియ ట్లుండఁ బలికి నిన్ గఱపె బుద్ధి; నట్ల చేయుదు నంటి వీ; వతని మతము । సెప్పనగునేని యెఱుఁగంగఁ జెప్పు మయ్య! 145**

**ప్రతిపదార్థం:** విదురుఁడు; ఏతెంచి= వచ్చి; ఒరులకున్= ఇతరులకు; వినియున్= విని కూడా; ఎఱుఁగన్+కాని= అర్థంకాని; అట్లు+ఉండన్= ఆ విధంగా ఉండేటట్లు; పలికి; బుద్ధిన్= తెలివిని - సలహాను; నిన్+కఱపెన్= నీకు చెప్పాడు; నీవు; అట్లు= ఆ విధంగానే; చేయుదున్= చేస్తాను; అంటి=అన్నావు; అతని, మతము= అతనియొక్క (విదురునియొక్క) అభిప్రాయం; చెప్పన్+అగున్+ఏని= చెప్పదగిందైతే; నీవు; ఎఱుఁగంగన్= తెలిసేటట్లు; చెప్పుము+అయ్య= చెప్పుము నాయనా!

**తాత్పర్యం:** విదురుడు వచ్చి ఇతరులు విన్నా అర్థంకాని విధంగా నీకు సలహా చెప్పాడు. నీవుకూడా చెప్పినట్లుగానే చేస్తానని అతనితో అన్నావు. చెప్పదగిందైతే అతనిఅభిప్రాయం నాకు తెలియజెప్పుము.

**వ. అనిన నగుచు ధర్మతనయుండు విదురువచనంబుల యభిప్రాయంబులు దల్లి కి ట్లని చెప్పె. 146**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; నగుచున్= నవ్వుతూ; ధర్మతనయుండు= ధర్మరాజు; విదురు+వచనంబుల+ అభిప్రాయంబులు= విదురుని మాటలలోని అభిప్రాయాలు; తల్లికిన్= తల్లి కుంతీదేవికి; ఇట్లు+అని+చెప్పెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అనగా ధర్మరాజు నవ్వుతూ విదురునిమాటలలోని తాత్పర్యాన్ని తల్లికి ఈ విధంగా చెప్పాడు.

**ఆ. ఎల్లకార్యగతులు నెఱుఁగుదు; రయినను । నెఱుఁగఁ జెప్పవలయు నెఱిఁగినంత; పనియులేక మిమ్ముఁ బనిచిన కురుపతి । హితుఁడపోలె మీఁద నెగ్గు సేయు. 147**

**ప్రతిపదార్థం:** ఎల్ల, కార్య గతులున్= అన్ని పనుల విధాలు; ఎఱుఁగుదురు= మీకు తెలియును; అయినను= అయినప్పటికి; ఎఱిఁగిన+అంత= తెలిసినంతవరకు; ఎఱుఁగన్+చెప్పవలయున్= తెలియచెప్పాలి; పనియు; లేక= ఏ పనిగూడ లేకుండ; మిమ్మున్; పనిచిన= పంపిన; కురు, పతి= ధృతరాష్ట్రుడు; హితుఁడపోలెన్= మేలు చేసేవానివలె ఉండి; మీఁదన్= తర్వాత; ఎగ్గు= కీడు; చేయున్= చేస్తాడు.

**తాత్పర్యం:** చేయదగిన పనుల పద్ధతులన్నింటిని మీ రెరుగుదురు. అయినా నాకు తెలిసినంతవరకూ మీకు తెలియచెప్పాలి. ఏ పనీ లేకుండా మిమ్ములను వారణావతం పంపించే ధృతరాష్ట్రుడు మీకు మేలు చేసేవాడివలె ఉండి, తర్వాత కీడు చేస్తాడు.

**వ. 'కావున మీర లేమఱక విషాగ్నులవలన నప్రమత్తుల రై యెఱుక గలిగి యుండునది' యని బుద్ధిగఱపి మఱియు' దుర్యోధనుచేసెడు దుష్క్రియ లిమ్ముగా నెఱింగి వానికిం బ్రతీకారంబు సెప్పి పుత్తెంచెద ననియె' నని చెప్పిన విని, విదురుబుద్ధికిఁ దమవలని నెయ్యంబునకు సంతసిల్లుచునిట్లు బాండవులు కతిపయప్రయాణంబుల వారణావతంబున కరుగునంత. 148**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; మీరలు= మీరు; ఏమఱక= ఏమరుపాటు లేక; విష+అగ్నులవలనన్= విషంవలనను, అగ్నివలనను; అప్రమత్తులరు+ఐ= ఏమరుపాటు లేనివాళ్ళయి; ఎఱుక= తెలివి; కలిగి ఉండునది= కలిగి ఉండండి అని; బుద్ధి, కఱపి= సలహా చెప్పి; మఱియున్= ఇంకా; దుర్యోధను, చేసెడు, దుష్క్రియలు= దుర్యోధనునియొక్క చేస్తున్న చెడ్డపనులు - అంటే దుర్యోధనునిచెడ్డపనులు; ఎఱింగి= తెలిసికొని; వానికిన్= ఆ చెడ్డ పనులకు; ప్రతీకారంబు= విరుగుడు; చెప్పి; పుత్తెంచెదన్= పంపిస్తాను; అనియెన్= అని; చెప్పినన్= ధర్మరాజు చెప్పగా; విని; విదురు, బుద్ధికిన్= విదురునియొక్క సలహాకు; తమ, వలని= తమవైపు ఉన్న; నెయ్యంబునకున్= స్నేహానికి; సంతసిల్లుచున్= సంతోషిస్తూ; ఇట్లు; పాండవులు; కతిపయ, ప్రయాణంబులన్= కొన్నిరోజులప్రయాణాలతో; వారణావతంబునకున్+అరుగు+అంత= వారణావతానికి వెళ్ళినతర్వాత.

**తాత్పర్యం:** 'అందుచేత మీరు ఏమరుపాటు లేకుండా విషంవల్ల, అగ్నివల్ల కలిగే ప్రమాదాల విషయంలో జాగరూకులై ఉండుండని సలహా చెప్పి, దుర్యోధనుడు చేసే చెడుపనులు తెలిసికొని, ఆ చెడుపనులకు విరుగుడులుకూడా చెప్పి పంపిస్తానని విదురు డన్నా' డని ధర్మరాజు చెప్పగా - కుంతీదేవి, పాండవులు విదురుడు చెప్పిన సలహాకు, అతనికి తమపట్ల ఉండే స్నేహభావానికి సంతోషిస్తూ కొన్నిరోజులు ప్రయాణంచేసి వారణావతానికి చేరుకొన్న తర్వాత.

### పాండవులు జననీసహితంబుగా వారణావతంబుఁ జేరుట (సం. 1-134-1)

**సీ.** **వారణావతమునవా రెల్లఁ బాండవా । గమనంబు విని సంతసమునఁ బెరిఁగి**
**కరమొప్పఁ గరిరథతురగబలాఢ్యు లై । యెదురు వచ్చిరి మహాముదముతోడఁ;**
**గలయంగ గృహములఁ గలువడములు గడు - విలసిల్లె నంబరతలము గప్పి**
**మలయజమృగమదావిలసలిలంబుల । నిమ్ముగా నార్ద్రీకృతమ్ము లయిన**

**తే.** **యంగణుల నొప్పెఁ గర్పూరరంగవల్లు । లంగనలు గయిసేసి యుత్తుంగహర్మ్య**
**తలము లెక్కిరి తత్పురీవిలసంబుఁ । జూచు పాండుకుమారులఁ జూచువేడ్క.** 149

**ప్రతిపదార్థం:** పాండవ+ఆగమనంబు= పాండవులయొక్క రాక; విని; వారణావతమున, వారు+ఎల్లన్= వారణావతంలోని జనులంతా; సంతసమునన్= సంతోషంతో; పెరిగి= ఉబ్బి; కరము= మిక్కిలి; ఒప్పన్= అందంగా; కరి, రథ, తురగ, బల+ఆఢ్యులు+ఐ= ఏనుగులతో, రథాలతో, గుర్రాలతో; సైన్యంతో కూడినవాళ్ళయి; మహాముదముతోడన్= మహాసంతోషంతో; ఎదురు, వచ్చిరి; కలయంగన్= అంతటా; గృహములన్= ఇండ్లలో; కలువడములు= ధ్వజస్తంభాలకు కట్టే బంగారుకలువపూదండలు; అంబర, తలము= ఆకాశంయొక్క క్రిందిభాగాన్ని; కప్పి; కడున్= మిక్కిలి; విలసిల్లెన్= ప్రకాశించాయి; మలయజ, మృగమద+ఆవిల, సలిలంబులన్= మంచిగంధంతోను, కస్తూరితోను; కలిసిననీటిచేత; ఇమ్ముగాన్= ఇంపుగా; ఆర్ద్రీకృతమ్ములు+అయిన= తడుపబడినవి అయిన; అంగణులన్= రాజవీథులందు; కర్పూరరంగవల్లులు= కర్పూరపుపొడితో వేసిన ముగ్గులు; ఒప్పెన్= ప్రకాశించాయి; అంగనలు= స్త్రీలు; కయిసేసి= అలంకరించి; తత్÷పురీ, విలసంబున్= ఆ పట్టణంయొక్క శోభను, చూచు, పాండుకుమారులన్= పాండవులను; చూచు= చూడాలనే; వేడ్కన్= కుతూహలంతో; ఉత్తుంగ= ఎత్తైన; హర్మ్య, తలములు= మేడలమీది సమప్రదేశాలు; ఎక్కిరి.

**తాత్పర్యం:** పాండవులరాకనుగురించి విని, వారణావతంలోని ప్రజలంతా ఎంతో ఆనందించి, చతురంగ బలాలతో వారికి ఎదురేగారు. ఇండ్ల ధ్వజస్తంభాలకు కట్టిన బంగారుకలువపూదండలు ఆకాశాన్ని కప్పి మిక్కిలి ప్రకాశించాయి.

మంచిగంధం, కస్తూరి కలిపిననీటితో తడిసిన రాజమార్గాలలో కర్పూరపుముగ్గులు కళకళలాడాయి. ఆడవాళ్ళు అలంకరించుకొని ఆ నగరశోభను చూస్తున్నపాండవులను చూడటానికి మేడలెక్కారు.

**వ. పాండుకుమారులు ననేకభూసురాశీర్వాదనాదాభినందితు లై ఫాల్గునమాసంబున శుక్లపక్షమున నష్టమియు రోహిణినాడు వారణావతంబు సొచ్చి సర్వాలంకారసుందరం బయిన రాజమందిరంబున నున్న కొన్ని దినంబులకుం బురోచనుండు దనచేసినచతుశ్శాల సకలజననయనాభిరామం బైన దానిం జూపినం జూచి పాండుసుతులు సంతసిల్లి, పురోచనశిల్పాచార్యులం, బూజించి పుణ్యాహరవపురస్సరంబుగా గృహప్రవేశంబు సేసి; రంతం బరాభిప్రాయమాయోపాయ ప్రయోగవిదుం డైన ధర్మతనయుండు దాని కృత్రిమరమణీయత నుపలక్షించి యల్లన భీమున కి ట్లనియె. 150**

**ప్రతిపదార్థం:** పాండుకుమారులున్= పాండవులు; అనేక, భూసుర+ఆశీర్వాదనాద+అభినందితులు+ఐ= పెక్కుమంది బ్రాహ్మణులయొక్క ఆశీర్వాద ధ్వనులచేత కొనియాడబడినవాళ్ళయి; ఫాల్గున,మాసంబున; శుక్లపక్షంబున; అష్టమియు; రోహిణినాడు; వారణావతంబు; చొచ్చి= ప్రవేశించి; సర్వ+అలంకార, సుందరంబు+అయిన= అన్నిఅలంకారాలచేత అందమైన దైన; రాజ మందిరంబునన్; ఉన్నన్= ఉండగా; కొన్ని, దినంబులకున్; పురోచనుండు; తన, చేసిన= తనయొక్క చేసిన - అంటే తాను నిర్మించిన; చతుశ్శాల= నాలుగిండ్ల భవంతి; సకల, జన, నయన+అభిరామంబు+ఐన= అందరు ప్రజలయొక్క కన్నులకు ఇంపు గొలిపేది అయిన; దానిన్; చూపినన్= చూపగా; చూచి; పాండుసుతులు= పాండురాజుయొక్క కుమారులు; సంతసిల్లి= సంతోషించి; పురోచన; శిల్ప+ఆచార్యులన్= పురోచనుడనే పేరుగల శిల్పాచార్యులను; పూజించి; పుణ్యాహ, రవ, పురస్సరంబుగాన్= పుణ్యాహవచనం మున్నుగా; గృహ, ప్రవేశంబు; చేసిరి; అంతన్= అటుపై; పర+అభిప్రాయ, మాయ+ఉపాయ, ప్రయోగ విదుండు+ఐన= ఇతరుల అభిప్రాయాలను, కపటోపాయ ప్రయోగాలను ఎరిగినవాడైన; ధర్మతనయుండు= ధర్మరాజు; దాని= ఆ చతుశ్శాలయొక్క కృత్రిమ రమణీయతన్= సహజంకాని కేవలం కల్పింపబడినదైన అందాన్ని; ఉపలక్షించి= చూచి; అల్లనన్= మెల్లగా; భీమునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** పాండవులు పెక్కుమందిబ్రాహ్మణుల ఆశీర్వచనాలు పొంది, ఫాల్గున శుద్ధఅష్టమి రోహిణీ నక్షత్రం రోజున వారణావతంలో ప్రవేశించి; అన్నివిధాల అందమైన రాజమందిరంలో ఉంటూఉండగా, పురోచనుడు తాను నిర్మించిన మహామనోహరమైన చతుశ్శాలను చూపించాడు. పాండవులు సంతోషించి, పురోచనుడిని సమ్మానించి, పుణ్యాహవచనాలతో అందు ప్రవేశించారు. ఇతరుల అభిప్రాయాలను, మాయోపాయప్రయోగాలను ఎరిగిన ధర్మరాజు ఆ చతుశ్శాలకృత్రిమరమణీయతను చూచి మెల్లగా భీమునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** పుణ్యాహవాచనము - శుభంకలగటానికి పుణ్యాహమనే శబ్దాన్ని మూడుమారులు చెప్పే శుభకర్మం. 'అష్టమియు రోహిణి నాడు' - అనే దానికి 'సిద్ధార్థి సంవత్సర ఫాల్గున శుద్ధ అష్టమి రోహిణియందు', అనే ఒకపాఠాంతరం గూడ ఉన్నది. - శ్రీమదాంధ్ర మహాభారతసంశోధితప్రతి, పుట 358.

**క. ఈ గృహ కుడ్యంబులు లా । క్షాగర్భము లాజ్య తైలగంధులు మఱి శ**
**స్త్రాగారసమీపము మా - యాగృహ మగు నిది యవశ్య మాగ్నేయం బై. 151**

**ప్రతిపదార్థం:** ఈ, గృహ, కుడ్యంబులు= ఈ యింటియొక్క గోడలు; లాక్షా, గర్భములు= లక్కను లోపల కలిగినట్టివి; ఆజ్య, తైల, గంధులు= నేతియొక్కయు, నూనెయొక్కయు వాసన గలవి; మఱి= అంతేగాక; శస్త్ర+అగార, సమీపము= ఆయుధాలుండేచోటికి దగ్గరగా ఉన్నది; అవశ్యము= తప్పక; ఆగ్నేయంబు+ఐ= అగ్నిచే దహింపదగిందై; ఇది; మాయా, గృహము+అగున్= మోసపుటిల్లుగా ఉన్నది.

**తాత్పర్యం:** ఈ యింటిగోడలలో లక్క ఉన్నది. ఇవి నేతివాసన, నూనెవాసన కలిగి ఉన్నాయి. అంతేగాక ఇది ఆయుధాలుండే చోటికి దగ్గరగా ఉన్నది. తప్పక ఇది నిప్పుచేత తగులబడే మోసపుటిల్లు.

**క. దీని తెఱఁ గెఱిఁగినట్ల మ । హానిపుణుఁడు విదురుఁ డురువిషాగ్నులవలనన్**
**మానుగ నేమఱకుం డని । తాను బ్రబోధించె నేకతమ ననుఁ బ్రీతిన్. 152**

**ప్రతిపదార్థం:** దీని, తెఱఁగు= ఈ యింటియొక్కపద్ధతి; ఎఱిఁగినట్లు+అ= తెలిసినట్లే; మహానిపుణుఁడు= గొప్పనేర్పరి; విదురుఁడు; ఉరు, విష+అగ్నులవలనన్= గొప్ప విషంవలన, అగ్నివలన; ఏమఱకుండు+అని= మైమరచి ఉండవద్దని; మానుగన్= ఒప్పుగా; తాను; ఏకతమ= ఒంటరిగా; ననున్; ప్రీతిన్= ప్రేమతో; ప్రబోధించెన్= ఉపదేశించాడు.

**తాత్పర్యం:** ఈ యింటి విషయం తనకు తెలిసినట్లే మహామేధావి అయిన విదురుడు విషం, నిప్పు విషయాలలో ఏమరి ఉండవద్దని ఎవ్వరూ లేకుండా చూచి ఒంటరిపాటున నాకు హెచ్చరిక చేశాడు.

**వ. 'కావున మన మిందు విశ్వసించియుండవలవ; దవశ్యం బగ్నిభయం బగు' ననిన విని భీముం డి ట్లనియె. 153**

**ప్రతిపదార్థం:** కావున; మనము; ఇందున్= ఈ యింటిలో; విశ్వసించి= నమ్మి; ఉండవలవదు= ఉండకూడదు; అవశ్యంబు= తప్పక; అగ్ని, భయంబు+అగున్= నిప్పువలన భయం కలుగుతుంది; అనిన్; విని; భీముండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కాబట్టి, మనం ఈ యింట్లో నమ్మి ఉండకూడదు; తప్పక ఈ యింట అగ్నిభయం కలుగుతుంది అని ధర్మరాజు పలుకగా విని భీముడు ఈ విధంగా అన్నాడు.

**ఆ. 'ఇట్టిదేని మనకు నిం దుండఁగా నేల? । యరిగి ముందు నున్నయంద యుండి,**
**యెఱిఁగి దీనితోన యుష్పరోచనుఁ గాల్చి । పోద' మనిన ధర్మపుత్త్రుఁ డనియె. 154**

**ప్రతిపదార్థం:** ఇట్టిది+ఏని= ఇటువంటిదైతే; మనకున్; ఇందున్= ఈయింటిలో; ఉండఁగాన్+ఏల= ఉండట మెందుకు; అరిగి= వెళ్ళి; ముందు+ఉన్న+అందు+అ= ఇదివరకు ఉన్నచోటనే; ఉండి= వసించి; ఎఱిఁగి= తెలిసి; ఈ+పురోచనున్; దీనితోనన్= ఈ యింటితోకూడ; కాల్చి; పోదము= పోవుదము; అనినన్= అనగా; ధర్మపుత్త్రుడు= ధర్మరాజు; అనియెన్= ఇట్లన్నాడు.

**తాత్పర్యం:** 'ఇటువంటిదైతే ఈయింట్లో మనం ఉండటమెందుకు? ఇదివరకున్న ఇంట్లోనే ఉందాము. ఈ యింటితో పురోచనుడినిగూడ దహించి పోదాము' అని భీము డనగా అతనితో ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**క. ఎఱిఁగితిమి దీని తెఱఁ; గే । మఱ కెఱుఁగనియట్లు గూఢమతి నుండుద మిం**
**దఱముఁ బురోచనుకృతకము । నెఱి నేర్పడునంతకును వినీతాత్ముల మై. 155**

**ప్రతిపదార్థం:** దీని, తెఱఁగు= ఈ యింటి పద్ధతి; ఎఱిఁగితిమి= తెలిసికొన్నాము; ఏమఱక= పరాకులేకుండ; ఎఱుఁగని+అట్లు= తెలియనట్లు; పురోచను, కృతకము= పురోచనునిచేత చేయబడినది - అంటే పురోచనునిమోసం - నెఱిన్= పూర్తిగా; ఏర్పడు+అంతకును= బయటపడేంతవరకు; వినీత+ఆత్ములము+ఐ= నిగ్రహించిన మనస్సులు కలవారమై; గూఢమతిన్= రహస్యమైన తలంపుతో; ఇందఱము= ఇంతమందిమి; ఉండుదము= ఉందాము.

**తాత్పర్యం:** మనం ఈ యింటి సంగతి తెలిసికొన్నాము. పరాకు లేకుండా ఏమీ తెలియనట్లే పురోచనుడిమోసం పూర్తిగా బయటపడేవరకు మనస్సును నిగ్రహించుకొని రహస్యమైన ఆలోచనతో అందరం ఇందే ఉందాము.

**వ. ఇప్పాపగృహప్రకారంబు మన మెఱంగుట పురోచనుం డెఱింగెనేని దుర్యోధనునియోగంబు విఫలం బగు నట్లు గాకుండ శీఘ్రకారుల మై దీని దహించిన నక్కడ భీష్మవిదురులు విని కోపించినం గురుకులసముద్రక్షోభం బగు; మఱి దాహభయంబున మన మొండుగడకుం బోయిన నెఱింగి మనయంతరంబ రోయుచు నద్దురాత్ముండు దుర్యోధనుండు వెండియు మన కపాయంబు సేయు నె ట్లనిన. 156**

**ప్రతిపదార్థం:** ఈ+పాప, గృహ, ప్రకారంబు= ఈ పాపమైన ఇంటి విధం; మనము; ఎఱుంగుట; పురోచనుండు; ఎఱింగెన్+ఏని= తెలిసికొన్నట్లయితే; దుర్యోధను, నియోగంబు= దుర్యోధనునియొక్క ఆజ్ఞ; విఫలంబు+అగున్= వ్యర్థమవుతుంది; అట్లు, కాక+ఉండ= అలా కాకుండా; శీఘ్ర, కారులము+ఐ= త్వరపడి చేసేవాళ్ళమై; దీనిన్= ఈ యింటిని; దహించినన్= కాల్చివేస్తే; అక్కడ= హస్తినలో; భీష్మ, విదురులు= భీష్మ విదురులు; విని; కోపించినన్= కోపపడగా; కురు, కుల, సముద్ర క్షోభంబు+అగున్= కురువంశమనే సముద్రంలో గగ్గోలు కలుగుతుంది; మఱి= అట్లుగాక; దాహ, భయంబునన్= కాల్పువలని భయంచేత; మనము; ఒండు, కడకున్= ఇంకొకచోటికి; పోయినన్= పోయినచో; ఎఱింగి= తెలిసికొని; మన, అంతరంబు+అ= మనయొక్కమఱుగునే - అంటే మనం దాగిఉండే చోటునే; రోయుచున్= వెదుకుతూ; ఆ+దురాత్ముండు= ఆ దుర్మార్గుడు; దుర్యోధనుఁడు; వెండియున్= మరల; మనకున్; అపాయంబు= కీడును; చేయును= చేస్తాడు; ఎట్లు+అనినన్= ఏ విధంగాఅంటే.,

**తాత్పర్యం:** ఈ పాపపుఇంటిసంగతి మనకు తెలిసినట్లు పురోచనుడికి తెలిస్తే; దుర్యోధనుని ఆజ్ఞ విఫలమవుతుంది. అట్లా కాకుండా మనం తొందరపడి ఈ యింటిని దహించివేస్తే, అక్కడ హస్తినలో భీష్మవిదురులు ఇది విని కోపిస్తే, కురువంశమనే మహాసముద్రంలో సంక్షోభం కలుగుతుంది. అట్లా కాక ఇల్లు కాలుతుందనే భయంచేత వేరొక చోటికి వెళ్తే ఆ దుర్మార్గుడు దుర్యోధనుడు మనం దాగినచోటునే వెదుకుతూ మళ్లీ మనకు కీడు చేస్తాడు. అది ఎట్లాగంటే.

**సీ. 'రాజ్యపదస్థుం డరాజ్యపదస్థులఁ । బక్షబలాఢ్యుఁ డపక్షబలుల**
**విపులార్థవంతుండు విగతార్థసార్థుల । నవసరం బెఱిఁగి వాఁ డశ్రమమున**
**దూష్యులఁ దుదిదాఁక దూషించు మనల న । న్నిష్ఠురునకు నది నీతిగాదె!**
**కావున నోరు లెఱుంగకయుండఁ గడు నమ్మి । నట్టుల యుండుద' మని దినంబు**

**తే. లెల్ల వేఁటలాడుచు రాత్రులెల్ల నుద్య । తాయతాయుధహస్తు లై యనుదినంబు**
**నప్పురోచను వంచించి యనఘు లుండి । రప్రమాదు లై పాండవు లప్పురమున. 157**

**ప్రతిపదార్థం:** రాజ్యపదస్థుండు= రాజ్యస్థానంలో ఉన్నవాడు - అంటే రాజ్యాధికారంలో ఉన్నవాడు; అరాజ్య, పదస్థులన్= రాజ్యాధికారంలో లేనివాళ్ళను; పక్షబల+ఆఢ్యుఁడు= సహాయబలం కలవాడు; అపక్ష, బలులన్= సహాయబలం లేనివాళ్ళను; విపుల+అర్థవంతుండు= ఎక్కువ డబ్బున్నవాడు; విగత+అర్థసార్థుల= కోల్పోయిన ధనం గలవాళ్ళను; అవసరంబు= సమయం; ఎఱిఁగి= తెలుసుకొని; అశ్రమమునన్= సులువుగా; వాఁడు= ఆ దుర్యోధనుడు; మనలన్= మనల్ని; దూష్యులన్= నిందింపదగినవాళ్ళను; (ఇట చెరుపదగినవాళ్ళని భావించాలి); తుది, తాఁకన్= చివరివరకు; దూషించున్= నిందిస్తాడు- చెరుస్తాడు; ఆ+నిష్ఠురునకున్= ఆ క్రూరుడికి; అది; నీతి; కాదె= కాదా! కావునన్; ఒరులు= ఇతరులు, ఎఱుంగక+ఉండన్= తెలిసికొనకుండ; నమ్మినట్టులన్= నమ్మినట్లే; ఉండుదము= ఉందాము; అని= ఆ ప్రకారం; దినంబులు+ఎల్లన్= పగటిపూటలం దెల్ల; వేఁటలు+ఆడుచు; రాత్రులు+ఎల్లన్; ఉద్యత+ఆయత+ఆయుధ, హస్తులు+ఐ= ఎత్తబడిన గొప్ప ఆయుధాలు కల చేతులు కలవాళ్ళయి; అప్రమాదులై= ఏమరుపాటు లేనివాళ్ళయి; అనుదినంబు= ప్రతిదినం; ఆ+పురోచనున్; వంచించి= మోసగించి; ఆ+పురమునన్= ఆ వారణావతనగరంలో; అనఘులు= పాపంలేనివాళ్ళు - పుణ్యాత్ములు; పాండవులు; ఉండిరి.

**తాత్పర్యం:** రాజ్యాధికారంలో ఉన్నవాడు, సహాయబలం కలవాడు, గొప్పసంపద కలవాడు అయిన దుర్యోధనుడు - రాజ్యాధికారం, సహాయబలం లేక సంపద కోల్పోయిన మనలను సమయం చూచి తుదముట్ట చెరచటానికి ప్రయత్నిస్తాడు. ఆ దుర్మార్గుడికి అదియేనీతి. అందుచేత ఇతరులు తెలిసికొనకుండా నమ్మినట్లే ఉందాము- అని పుణ్యాత్ములైన పాండవులు ప్రతిదినం పగలెల్ల వేటాడుతూ, రాత్రులలో ఆయుధాలు చేత ధరించి అప్రమత్తులై ఆ వారణావతంలో ఉన్నారు.

**విశేషం:** విగతార్థసార్థుల - అనేదానికి 'విగతార్థవంతుల,' 'విగతార్థసాధుల' అనే పాఠాంతరాలున్నాయి. హస్తినాపురం వదలి బయటికి వచ్చిన పాండవులస్థితి, హస్తినాపురంలో రాజైన ధృతరాష్ట్రుని సంతతిస్థితి ధర్మజుని వాక్యాలలో నిరూపితమయ్యాయి. పాండవులకు హస్తినలోని బందుగుల బలం దూరమైనది. రాజ్యాధికారం, బంధువులబలగం, అపారసంపద, దుర్యోధనాదులకు దక్కాయి. పాండవులు ఏకాకులు, నిస్సహాయులు అయ్యారు. ఇక క్రమంగా వాళ్ళకు ద్రుపదునితో బంధుత్వం, కృష్ణునితో చెలిమి ఏర్పడితేకాని కౌరవులకంటె బలంలోనూ, బలగంలోనూ, సంపదలోనూ అధికులు కారు.

## లాక్షాగృహదహనము (సం. 1-135-1)

**వ. అట హస్తిపురంబున విదురుండు దుర్యోధనుదుర్మంత్రం బంతయు నిమ్ముగా నెఱింగి, కడువిశ్వాసి నొక్క ఖనకు నతి కుశలుం బాండవులపాలికిం బుత్తెంచిన వాఁడును వచ్చి రహస్యంబునం బాండవులం గని తన్ను నమ్మునట్లుగా విదురుసాభిజ్ఞానవచనంబు లెఱింగించి 'యీకృష్ణచతుర్దశినాఁటిరాత్రి పురోచనుండు లక్కయింట దహనంబు దరికొల్పుం గావున నిందుండి మీకు వెలువడిపోవునట్టియుపాయంబు మారాజు నియోగంబునం జేయవచ్చితి' నని చెప్పి, లక్కయిల్లు వెలువడునట్లుగా నొక్కబిలంబు నెవ్వరు నెఱుంగకుండం జేసి, వారల కెఱింగించిన భీముండు దాని నిమ్ముగా శోధించి యెఱింగి యుండు నంత. 158**

**ప్రతిపదార్థం:** అట, హస్తినాపురంబునన్= హస్తినాపురంలో; విదురుండు; దుర్యోధన, దుర్మంత్రంబు+అంతయును= దుర్యోధనుని యొక్క చెడ్డఆలోచన అంతా; ఇమ్ముగాన్= స్పష్టంగా; ఎఱింగి; కడున్= మిక్కిలి; విశ్వాసిన్= నమ్మదగినవాడిని; అతికుశలున్= మిక్కిలి నేర్పుగల వాడిని; పాండవులపాలికిన్= పాండవుల దగ్గరకు; పుచ్చు+తెంచినన్= పంపించగా; వాఁడును; వచ్చి; రహస్యంబునన్= చాటుగా; పాండవులన్; కని= చూచి; తన్ను, నమ్మునట్లుగ; విదురు, స+అభిజ్ఞాన, వచనంబులు=

విదురునియొక్కగుర్తుతో కూడిన మాటలు; ఎఱిఁగించి= తెలిపి; ఈ, కృష్ణ, చతుర్దశినాటి, రాత్రి; పురోచనుండు; లక్కయింట; దహనంబు= నిప్పు; దరికొల్పున్= మండిస్తాడు; కావునన్; ఇందుండి= ఈ యింటినుండి; మీకున్; వెలువడి, పోవునట్టి= బయటపడిపోవునట్టి; ఉపాయంబు; మా, రాజు, నియోగంబునన్= మా దొర అయిన విదురునియొక్క ఆజ్ఞచేత; చేయన్= చేయటానికై; వచ్చితిన్= వచ్చాను; అని; చెప్పి; లక్క, ఇల్లు, వెలువడునట్లుగాన్= లక్కయింటినుండి బయటికిపోయి ఉండేటట్లుగా; ఒక్క= ఒక; బిలంబున్= సొరంగాన్ని; ఎవ్వరున్, ఎఱుంగకుండన్= ఎవ్వరుకూడా తెలుసుకోకుండ; చేసి; వారలకున్= పాండవులకు; ఎఱింగించినన్= తెలియజేయగా; భీముండు; దానిన్= ఆ సొరంగాన్ని; ఇమ్ముగా= పూర్తిగా; శోధించి= పరిశీలించి; ఎఱింగి= తెలిసికొని; ఉండునంతన్= ఉన్నతర్వాత.

**తాత్పర్యం:** హస్తినాపురంలో విదురుడు దుర్యోధనునిదురాలోచననంతటిని స్పష్టంగా తెలిసికొని, మిక్కిలి విశ్వాసపాత్రుడు, నేర్పరి అయిన ఒక ఖనకుడిని పిలిచి, పాండవుల దగ్గరకు పంపించగా, వాడు పాండవులను రహస్యంగా కలిసి, విదురుడు తనను గుర్తించటానికి చెప్పిన మాటలు చెప్పి, 'రానున్న కృష్ణపక్షచతుర్దశినాటి రాత్రి పురోచను డీ లక్కయింటిని తగులబెడతాడు. అందుచేత ఈ యింటినుండి మీరు బయటపడి వెళ్ళటానికి తగినమార్గం విదురుని ఆజ్ఞమేరకు నేరవేర్చటానికి వచ్చా' నని, లక్కయింటినుండి బయటికి ఒక రహస్యపుసొరంగాన్ని ఎవ్వరికీ తెలియకుండా త్రవ్వి పాండవులకు తెలియజేయగా, దాన్ని భీముడు పూర్తిగా పరిశీలించి తెలిసికొన్నాడు. తర్వాత.

**విశేషం:** ఈ కృష్ణ చతుర్దశి - ఇది రౌద్రి సంవత్సర భాద్రపద బహుళ చతుర్దశి అని భారతకూలంకషవ్యాఖ్య. శ్రీమదాంధ్రమహాభారత సంశోధితప్రతి, పుట 361.

**క. ధనదానములను బ్రియభో । జనదానములను విశిష్టసద్విజతతులం**
**దనుపుచు నుండఁగఁ దత్పుర । మున షణ్మాసమున భరతముఖ్యుల కరిగెన్. 159**

**ప్రతిపదార్థం:** ధన, దానములన్= ధనదానాలచేత; ప్రియ, భోజన, దానములను= ప్రియమైన భోజనదానాలచేతను; విశిష్ట, సత్+ద్విజ, తతులన్= గొప్పవారైన మంచిబ్రాహ్మణులను; తనుపుచున్= తృప్తిపరుస్తూ; ఉండఁగన్= ఉండగా; తత్+పురమునన్= ఆ నగరాన - వారణావతనగరాన; భరత, ముఖ్యులకున్= భరతవంశంలో ముఖ్యులైన పాండవులకు; షట్+మాసములు= ఆరునెలలు; అరిగెన్= గడిచాయి.

**తాత్పర్యం:** ధనదానాలచేత; ఇష్టమైన భోజనదానాలచేత బ్రాహ్మణసమూహాలను తృప్తిపరుస్తుండగానే వారణావతంలో పాండవులకు ఆరునెలలు గడిచాయి.

**వ. ఆ కృష్ణచతుర్దశినాఁడు కుంతీదేవి యప్పురంబునం గల బ్రాహ్మణ పుణ్యాంగనా జనంబుల కెల్ల నిష్టాన్న పానదానంబులం దుష్టి చేసి దేవపూజ గావించి యున్నెడం, బురోచనుపంపిననిషాదవనిత సపుత్త్రయై బహువిధవన్యమూల ఫలంబులు దెచ్చి యిచ్చుచుం గుంతీదేవింబాయక సేవించి పాండవ కృత్యంబులు నిత్యంబును నెఱింగించు చుండెడు నది, నాఁటిరాత్రి యుత్సవంబునం గాలచోదిత యై తానునుం దన యేవురు కొడుకులు నధికమధుపాన మదంబున మెయి యెఱుంగక లక్కయింటి పక్కంబున నిద్రవోయిన, నర్ధరాత్రంబునప్పుడు భీముండు మేల్కని పురోచనుకంటె ముందఱఁ దాన యుత్సహించి వానిశయనగృహద్వారంబున ఘోరానలంబు దరికొలిపి,**

**చెచ్చెరఁ దల్లిని నన్ననుం దమ్ములను బిలంబులోని కనిచి, యాయుధాగారంబుతోడన లాక్షాగారంబు హుతాశనున కశనంబు సేసి, ఖనకునకుం దమకుశలగమనం బెఱింగించి, బిలప్రవిష్టుం డయి కుంతిని ధర్మార్జుననకుల సహదేవులను బిలంబు వెలువరించి తోడ్కొని చనునప్పుడు. 160**

**ప్రతిపదార్థం:** ఆ, కృష్ణ, చతుర్దశినాఁడు; కుంతీదేవి; ఆ+పురంబునన్+కల= ఆ వారణావతనగరంలో ఉన్న; బ్రాహ్మణ, పుణ్యాంగనా, జనంబులకు+ఎల్లన్= బ్రాహ్మణముత్తైదువుల కందరికి; ఇష్ట+అన్న, పాన, దానంబులన్; తుష్టి+చేసి= తృప్తిపెట్టి; దేవపూజ; కావించి; ఉన్న+ఎడన్= ఉన్నసమయాన; పురోచను, పంపిన, నిషాద, వనిత= పురోచనుడు పంపిన బోయస్త్రీ; సపుత్ర+ఐ= కొడుకులతో కూడిందై; బహు, విధ, వన్య, మూల, ఫలంబులు= అనేకవిధాలైన అడవిలో పుట్టిన వైన వేళ్ళను, పండ్లను; తెచ్చి; ఇచ్చుచున్= ఇస్తూ; కుంతీదేవిన్; పాయక= వదలక; సేవించి; పాండవ, కృత్యంబులు= పాండవులయొక్క పనులు; నిత్యంబును= ప్రతిదినము; ఎఱింగించుచున్= తెలియజేస్తూ; ఉండెడు+అది= ఉన్నట్టిది; నాఁటి, రాత్రి= ఆ కృష్ణచతుర్దశినాటిరాత్రి; ఉత్సవంబునన్= పండుగనందు; కాల, చోదిత+ఐ= మృత్యువుచేత ప్రేరేపింపబడిందై; తానునున్; తన, ఏవురు= తన అయిదుగురు; కొడుకులున్=కుమారులును; అధిక, మధుపాన, మదంబునన్= ఎక్కువ కల్లుయొక్క త్రాగుడుచేత కలిగిన మత్తుచేత; మెయి= దేహం; ఎఱుంగక= తెలియక, లక్కయింటి; పక్కంబునన్= లక్కయింటిప్రక్కన; నిద్రపోయినన్= నిద్రించగా; అర్ధరాత్రంబు+అప్పుడు; భీముండు; మేల్కని; పురోచనుకంటె; ముందఱన్; తాను+అ= తానే, ఉత్సహించి= పూనుకొని; వాని, శయన, గృహ, ద్వారంబునన్= వాడియొక్క పడకటింటివాకిట్లో; ఘోర+అనలంబున్= భయంకరమైనఅగ్నిని; దరికొలిపి= మండించి; చెర+చెరన్= వెనువెంటనే; తల్లినిన్; అన్ననున్; తమ్ములను; బిలంబులోనికి= సొరంగంలోనికి; అనిచి= పంపి; ఆయుధ+ అగారంబుతోడన= ఆయుధాలయొక్కఇంటితోసహా, లాక్షా+అగారంబు= లక్కయిల్లు; హుత+ అశనునకున్= అగ్నిహోత్రునికి; అశనంబు+చేసి= ఆహారంగా చేసి; ఖనకునకున్; తమ, కుశల, గమనంబు= తమయొక్క క్షేమగమనాన్ని; ఎఱిఁగించి= తెలియజేసి; బిల, ప్రవిష్టుండు+అయి= సొరంగంలో ప్రవేశించినవాడై; కుంతిని; ధర్మ+అర్జున; నకుల, సహదేవులను; బిలంబు, వెలువరించి= సొరంగంనుండి బయల్పడేటట్లు చేసి; తోడ్కొని= తీసుకొని; చనునప్పుడు= వెళ్ళేటప్పుడు.

**తాత్పర్యం:** ఆ కృష్ణచతుర్దశినాడు కుంతీదేవి వారణావతనగరంలో ఉండే బ్రాహ్మణముత్తైదువుల కందరికి ఇష్టమైన భోజనం తృప్తిగా పెట్టి, దేవపూజ చేసింది. పురోచనుడు పంపిన బోయస్త్రీ కొడుకులు గలది కనుక అడవిలో అనేకవిధాలైన మూలాలు, ఫలాలు తెచ్చి యిస్తూ కుంతీదేవిని వదలక సేవిస్తూ; పాండవులు చేసే పనులన్నింటిని ప్రతిదినం ఆ పురోచనుడికి తెలియజేస్తూ ఉన్నది. చావు మూడిందై ఆ బోయెత తాను, తన కొడుకులు ఆ కృష్ణచతుర్దశి నాటిరాత్రి పండుగనందు పెల్లుగా కల్లు త్రాగి, మత్తెక్కి మైమరచి ఆ లక్కయింటిప్రక్క నిదురించగా, భీముడు పురోచనుడికంటె ముందే తానే పూనుకొని వాడిపడకింటి వాకిటికి పెద్దగా నిప్పు అంటించి, వెంటనే తల్లిని, అన్నను, తమ్ములను ఆ సొరంగంలో పంపి, ఆయుధాలున్న ఆ యింటితోకూడా లక్కయింటిని తగులబెట్టాడు. విదురుడు పంపిన ఖనకుడికి తాము క్షేమంగా వెళ్ళటాన్ని తెలియజేశాడు. సొరంగంలో ప్రవేశించి, కుంతిని, ధర్మార్జుననకులసహదేవులను ఆ సొరంగంనుండి బయల్పడేటట్లు చేసి తోడ్కొని వెళ్ళేటప్పుడు.

**విశేషం:** ఆ బోయవనితకు కూడా కుంతీదేవివలె ఐదుగురు కొడుకులుండటం విశేషం. వాళ్ళు కుంతిని, ఆమెపుత్రులను గమనిస్తూ నిత్యం రహస్యసమాచారాన్ని అందించటానికి నియుక్తులైన వారన్నమాట.

**సీ. కడునిద్రఁ గానక తొడరుచు వడిగొని । నడవంగ నేరక తడయుచున్న**

**నెఱిఁగి, చెచ్చెరఁ దల్లి నఱకట నిడి, ధర్మ । సుతవిజయులఁ దనవితతబాహు**

**యమళంబు నెక్కించి, యముల నుత్సంగంబు । లెక్కించుకొని భీముఁ డక్కజముగ**

**నరిగెడు రయమునఁ దరులు సాల్పడి మ్రొగ్గఁ । బదఘట్టనంబులఁ జదిసి ఱాలు**

**ఆ. నుఱుము గాఁగ నిట్లు నెఱయంగ సత్త్వంబు । మెఱసి రాతి రెల్ల నుఱక పవన**

**తనయుఁ డరిగెఁ బవలు సనినట్లు చీఁకటి । యనక ముండ్లు గండ్లు ననక తెరలి. 161**

**ప్రతిపదార్థం:** కడు, నిద్రన్= ఎక్కువ నిద్రచేత; కానక= చూడలేక; తొడరుచున్= తొట్రుపడుతూ; వడిగొని= వేగాన్ని పొంది; నడవంగనేరక= నడవలేక; తడయుచు+ఉన్నన్= ఆలస్యంచేస్తున్న; ఎఱిఁగి= తెలిసికొని; భీముఁడు; చెర+చెరన్= వేగమే; తల్లిన్; అఱకటన్= మూపుమీద; ఇడి= ఉంచి; ధర్మసుత, విజయులన్= ధర్మరాజును, అర్జునుణ్ణి; తన, వితత, బాహు, యమళంబున్= తనయొక్క విశాలమైన బాహువుల (భుజాల) యొక్కజంటపై; ఎక్కించి; యములన్; కవలను - నకుల సహదేవులను; ఉత్సంగంబులు= ఒడులు - తొడలపైభాగాలపై; ఎక్కించుకొని; అక్కజముగన్= ఆశ్చర్యకరంగా; అరిగెడు= వెళ్ళునట్టి; రయంబునన్= వేగంచేత; తరులు= చెట్లు; సాలు+పడి= వరుసగా; మ్రొగ్గన్= పడగా; పద, ఘట్టనంబులన్= పాదాల తొక్కిళ్ళచేత; చదిసి= నలిగి; ఱాలు= రాళ్ళు; నుఱుము= పొడి; కాఁగన్= కాగా; ఇట్లు= ఈ విధంగా; సత్త్వంబు= బలం; నెఱయంగన్= నిండుగ; మెఱసి= చూపి; రాతిరి+ఎల్లన్= రాత్రినికూడ; ఉఱక= లెక్కచేయక; చీఁకటి;అనక= అనకుండా; ముండ్లు, గండ్లన్= ముళ్ళు, పగుళ్ళు; అనక= అని అనకుండ; తెరలి= కదిలి; పవలు= పగటిపూట; చనినట్లు= పోయినట్లు; పవన, తనయుండు= వాయుదేవునియొక్కకుమారుడైన భీముడు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** మిక్కుటమైన నిద్రతో తొట్రుపడుతూ వడివడిగా నడవలేని తల్లిని మూపుమీద, ధర్మజార్జునులను భుజాలమీద, నకులసహదేవులను ఒడులలో ఎత్తుకొని, భీముడు తన గమనవేగంవలన వృక్షాలు వరుసగా పడేటట్లు; పాదాల త్రొక్కిళ్ళచేత నలిగి రాళ్ళు పొడి అయ్యేటట్లు తన బలం చూపి, రాత్రిని కూడలెక్కచేయకుండా, చీకటని అనుకోకుండా, ముండ్లు, పగుళ్ళు అని కూడచూడకుండా, పగటిపూట నడిచినట్లు నడిచి వెళ్ళాడు.

**విశేషం:** 'గండ్లు' అనేదానికి 'గుండ్లు' అనే పాఠాంతరం ఉంది. గుండ్లు అంటే రాళ్ళు.

**వ. ఇట వారణావతంబున. 162**

**తాత్పర్యం:** ఇక ఇక్కడ వారణావతనగరంలో.

**చ. అనుపమనిత్యసత్యరతు లై వినయాన్వితు లైన పాండునం**

**దనులకు ధర్మమూర్తులకు ధర్ము వెఱుంగక యిట్టు లెగ్గు సే**

**సిన ధృతరాష్ట్రజాధము నశేషసుహృత్సుతబంధుదాహసూ**

**చనమయి లక్కయి ల్లతికృశానుశిఖాహతిఁ గ్రాఁగె గ్రక్కునన్. 163**

**ప్రతిపదార్థం:** అనుపమ, నిత్య, సత్య, రతులు+ఐ= సాటిలేని నిత్యమైన సత్యంపై ఆసక్తిగలవారై; వినయ+అన్వితులు+ఐన= అణకువతో కూడినవారైన; పాండు, నందనులకు= పాండురాజుయొక్క కుమారులకు - పాండవులకు; ధర్మమూర్తులకు= ధర్మంయొక్క ఆకారమైనవారికి; ధర్మువు+ఎఱుంగక= ధర్మాన్ని తెలియక; ఇట్టులు= ఈ విధంగా; ఎగ్గు= కీడు; చేసిన; ధృతరాష్ట్రజ+అధమున్= ధృతరాష్ట్రునికుమారుడైన నీచుడిని; అశేష; సుహృత్+సుత, బంధు, దాహ, సూచనము+అయి=

మొత్తంమిత్రులయొక్క, కొడుకులయొక్క, బంధువులయొక్క కాలటాన్ని సూచించేటిదై; లక్కఇల్లు; అతి, కృశాను, శిఖాహతిన్= అధికమైన అగ్నిజ్వాలలయొక్క దెబ్బచేత; గ్రక్కునన్= వెంటనే; క్రాఁగెన్= కాలింది.

**తాత్పర్యం:** సత్యంమీద ఆసక్తి కలవాళ్ళు; వినయవంతులు, ధర్మస్వరూపులు అయిన పాండునందనులకు, ధర్మం తప్పి ఈ విధంగా కీడుచేసిన నీచ దుర్యోధనుని మిత్రులు, పుత్రులు, బంధువులు కాలటాన్ని సూచించేదై - లక్కయిల్లు అధికమైన అగ్నిజ్వాలలచేత కాలిపోయింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. "అత్యుత్కటైః పుణ్యాపాపైః ఇహైవ ఫల మశ్నుతే'' అన్నట్లు ధర్మమార్గవర్తనులైన పాండవులను సజీవదహనం చేయాలనేది దుర్యోధనుని దురాలోచన. కాని అతడు ఈ జీవితకాలంలోనే బంధుమిత్ర సంతతితో నశించిపోవటం తథ్యమని లక్కయింటి మంట ధ్వనింపచేసింది.

**వ. తదనంతరంబ ప్రభాతసమయం బగుడును. 164**

**ప్రతిపదార్థం:** తత్+అనంతరంబు+అ= ఆ తర్వాత; ప్రభాత, సమయంబు= తెల్లవారటం; అగుడును= కాగా;

**తాత్పర్యం:** ఆ తరువాత తెల్లవారగా.

**చ. అతిదురితక్రియాభిరతుఁడైన పురోచనుతోన భస్మసా**
**త్కృత మయి చెడ్డ తద్విపులగేహముఁ దత్క్షణదగ్ధ మైనయా**
**కృతక విభూతి జాతుష నికేతనమున్ మఱి శస్త్ర వేశ్మమున్**
**ధృతి సెడి చూడఁగా నరుఁగుదెంచి జనుల్ గడు సంభ్రమంబుతోన్. 165**

**ప్రతిపదార్థం:** అతి, దురిత, క్రియా+అభిరతుఁడు+ఐన= మిక్కిలిపాపకార్యంలో ఆసక్తిగలవాడైన; పురోచనుతోనన్= పురోచనునితో సహా; భస్మ, సాత్కృతము+అయి= బూడిదచేయబడినదై; చెడ్డ= చెడినట్టి; తత్+విపుల, గేహమున్= ఆ విశాల మైన ఇంటిని; తత్; క్షణ, దగ్ధము+ఐన= ఆక్షణానే కాలిపోయిందైన; ఆ కృతక, విభూతి, జాతుష, నికేతనమున్= ఆ యొక్క కృత్రిమ మైన వైభవంగలదైన లక్కయింటిని; మఱి= మరియు; శస్త్ర, వేశ్మమున్= ఆయుధాలయొక్క ఇంటిని, ధృతి+చెడి= సంతోషాన్ని కోల్పోయి; జనుల్= ప్రజలు; చూడఁగాన్= చూడటానికి; అరుగుదెంచి= వచ్చి; కడు, సంభ్రమంబుతోన్= మిక్కిలివేగిరపాటుతో.

**తాత్పర్యం:** పాపపుపనులు చేయటంలో ఆసక్తి కల ఆ పురోచనునితోసహా బూడిద అయిన ఆ కృత్రిమ శోభగల లక్కయింటినీ, ఆయుధగారాన్నీ సంతోషం కోల్పోయి చూడటానికి జనులు, మిక్కిలి వేగిరపాటుతో వచ్చి.

**మధ్యాక్కర.**

**ప్రో వైన భస్మంబు వాయఁ ద్రోచి య బ్బూదిలో నడఁగి**
**యేవురు గొడుకులతోడ నం దొక్క యింతి యత్యుగ్ర**
**పావకదగ్ధ యై యున్నఁ జూచి, యప్పౌరులు దాని**
**భావించి కుంతియు సుతులు నని శోకపరవశు లగుచు. 166**

**ప్రతిపదార్థం:** ప్రోవు+ఐన= కుప్పగా పడ్డ; భస్మంబు= బూడిదను; పాయన్+త్రోచి= తొలగేటట్లుగా త్రోసి; ఆ+బూదిలోన్= ఆ బూడిదలో; అడఁగి=అణగి; ఏవురు, కొడుకులతోడన్= ఐదుగురు కొడుకులతో కూడ; అందు++ఒక్క; ఇంతి= ఆడది; అతి+ఉగ్ర, పావక, దగ్ధ+ఐ= మిక్కిలి భయంకరమైన అగ్నిచేత కాల్చబడిందై; ఉన్నన్= ఉండగా; చూచి, ఆ+పౌరులు; దానిన్= ఆ స్త్రీని; కుంతియున్, సుతులన్+అని= కుంతీదేవియు, కుమారులనియు - అంటే పాండవులని; భావించి= తలంచి; శోక, పరవశులు= దుఃఖంతో మైమరచినవారు - అనగా అమితదుఃఖం పొందినవారు; అగుచున్= అవుతూ.

**తాత్పర్యం:** కుప్పగా ఉండే బూడిదను తొలగద్రోసి అందులో అయిదుగురు కొడుకులతోసహా కాలిపడి ఉండే స్త్రీని చూచి - వాళ్ళే కుంతీ, పాండవులని భావించి, పౌరులు పెద్దదుఃఖంతో.

**విశేషం:** మధ్యాక్కరచరణంలో క్రమంగా 2 ఇంద్ర - 1 సూర్య - 2 ఇంద్ర - 1 సూర్యగణాలుంటాయి. నన్నయ అయిదవగణం మొదటి అక్షరంతో యతిమైత్రి చేశాడు. ప్రాస ఉన్నది. కోపం, పశ్చాత్తాపం, దుఃఖం, ప్రబోధం, ప్రార్థనం, అధిక్షేపం, విస్మయం, నింద,స్తుతి, ఉత్సాహం మొదలైన భావాలను వర్ణించేటప్పుడు ఈ వృత్తం సాధారణంగా ప్రయోగింపబడుతుంది. ఇక్కడ దుఃఖభావ వ్యంజకంగా మధ్యాక్కరను నన్నయ రచించాడు. (సంపా.)

**మ. 'బలవంతుల్ భరతాన్వయస్థితికరుల్ భాస్వద్భుజావీర్యని**
**ర్దళితారాతులు భూరి భూభర మహాధౌరేయకుల్ పాండవే**
**యులు నిష్కారణ మిట్లు వచ్చి ధృతరాష్ట్రోపాయమాయోత్థిత**
**జ్వలనజ్వాలలఁ గ్రాఁగిరే' యనుచు సంజాతార్తులై రెంతయున్. 167**

**ప్రతిపదార్థం:** బలవంతుల్; భరత+అన్వయ, స్థితి, కరుల్= భరతవంశానికి నిలుకడను కూర్చేవాళ్ళు; భాస్వత్+భుజా, వీర్య, నిర్దళిత+అరాతులు= ప్రకాశిస్తున్న భుజాలయొక్క బలంచేత చీల్చబడిన శత్రువులు కలవాళ్ళు; భూరి, భూ, భర, మహా, ధౌరేయకుల్= గొప్పదైన భూమియొక్క భారాన్ని గొప్పగా మోసేవాళ్ళు; పాండవేయులు= పాండవులు; నిష్కారణము= కారణంలేకుండానే, ఇట్లు; వచ్చి; ధృతరాష్ట్ర+ఉపాయ, మాయ+ఉత్థిత, జ్వలన, జ్వాలలన్= ధృతరాష్ట్రునియొక్క ఉపాయమైన మోసంచేత పైకిలేచిన నిప్పుమంటలలో; క్రాఁగిరే= కాలిపోయారు కదా; అనుచున్; ఎంతయున్= మిక్కిలి; సంజాత+ఆర్తులు+ఐరి= పుట్టిన దుఃఖం కలవాళ్ళయ్యారు.

**తాత్పర్యం:** 'బలవంతులు, భరతవంశం నిలిపేవాళ్ళు, భుజబలంచేత శత్రువులను సంహరించినవాళ్ళు, భూభారాన్ని వహించగలవాళ్ళు అయిన పాండవులు - ఏ కారణం లేకుండా - ఈ విధంగా ధృతరాష్ట్రుని కపటోపాయంతో పైకెగిసిన నిప్పుమంటల్లో మాడిపోయారు గదా!' అని మిక్కిలి దుఃఖించారు.

**వ. అంత విదుర ప్రేషితుం డయిన ఖనకుండు పౌరులం గలసి భస్మంబు వాయఁ ద్రోచువాఁడపోలె నెవ్వరు నెఱుంగకుండఁ దనచేసిన బిలంబుద్వారంబు గప్పి లక్కయింట నొక్కనిషాదవనిత యేవురుగొడుకులతో దగ్ధ యగుట యెఱింగి గజపురంబునకుం జని తద్వృత్తాంతంబును బాండవుల కుశలగమనంబును విదురునకుం జెప్పె; నిట వారణావతమ్మునవా రెల్ల నిట్టిదారుణంబు దుర్యోధనకారితంబకా నెఱింగి శోకించి, కుంతీ పాండవులపంచత్వంబు ధృతరాష్ట్రునకుం జెప్పి పుచ్చిన. 168**

**ప్రతిపదార్థం:** అంతన్= అనంతరం; విదుర, ప్రేషితుండు+అయిన= విదురునిచేత పంపబడినవాడైన; ఖనకుండు= త్రవ్వేవాడు; పౌరులన్= ఆ నగరప్రజలను; కలసి; భస్మంబు= బూడిదను; పాయన్+త్రోచు, వాడ, పోలెన్= తొలగత్రోసేవానివలె; తన, చేసిన, బిలంబు, ద్వారంబు= తాను చేసిన సొరంగంయొక్క వాకిలిని; కప్పి= మూసివేసి; లక్క, ఇంటన్= లక్క యింటిలో; ఒక్క; నిషాద, వనిత= బోయకాంత; ఏవురు కొడుకులతో= ఐదుగురు కొడుకులతో; దగ్ధ+అగుట= కాలిపోయిం దవటం; ఎఱింగి= తెలిసికొని, గజ, పురంబునకున్= హస్తినాపురానికి; చని= వెళ్ళి; తత్+వృత్తాంతంబును= ఆ విషయాన్ని; పాండవుల, కుశల, గమనంబును= పాండవులయొక్క క్షేమగమనాన్ని; విదురునకున్; చెప్పెన్; ఇట= ఇక్కడ; వారణా వతమ్మునవారు+ఎల్లన్= వారణవతాన ఉన్నవాళ్ళంతా; ఇట్టి, దారుణంబు= ఈ విధమైన ఘోరం; దుర్యోధనకారితంబు+అ+కాన్= దుర్యోధనునియొక్క చేష్టయే; అని, ఎఱింగి= తెలిసికొని; శోకించి= దుఃఖించి; కుంతీ, పాండవుల, పంచత్వంబు= కుంతియొక్క, పాండవులయొక్క మరణం; ధృతరాష్ట్రునకున్; చెప్పి, పుచ్చినన్= చెప్పిపంపగా.

**తాత్పర్యం:** విదురుడు పంపిన ఆ ఖనకుడు వారణావతనగరప్రజలతో కలిసి బూడిదను ఆవలికి తోసేవాడిలా ప్రవర్తించి, ఇతరు లెవ్వరు చూడకుండ తాను త్రవ్విన సొరంగద్వారాన్ని కప్పివేశాడు. లక్కయింట కాలిపోయింది బోయెత, ఆమెఐదుగురుకొడుకులు అని తెలిసికొని హస్తినాపురానికి వెళ్ళి, ఆ విషయాన్నీ, పాండవులు క్షేమంగా అక్కడనుండి వెళ్ళటాన్నీ విదురునికి చెప్పాడు. వారణావతప్రజలంతా - ఈ ఘోరకృత్యం దుర్యోధనుడు చేసిందే- అని దుఃఖించి కుంతీపాండవుల మరణవార్తను ధృతరాష్ట్రునికి చెప్పి పంపారు.

### పాండవులు లక్కయింటఁ జచ్చి రని ధృతరాష్ట్రుండు దుఃఖించుట (సం.1-137-10)

**ఉ. బాధిత శత్రు వర్గు లగు పాండుకుమారుల దుఃఖవార్త మ**
**ర్త్యాధము లైన సౌబలదినాధిపసూనులయొద్ద నప్డు దు**
**ర్యోధనుఁ డాదిగాఁగ సుతు లున్న సభన్ విని దుఃఖితాత్ముఁ డై**
**యా ధృతరాష్ట్రుఁ డా వఱచిన ట్లఱచెన్ వివిధప్రలాపుఁ డై. 169**

**ప్రతిపదార్థం:** ఆ ధృతరాష్ట్రుఁడు; మర్త్య+అధములు+ఐన= మానవుల్లో తక్కువవారైన - నీచులైన; సౌబల, దిన+అధిప, సూనుల+ఒద్దన్= శకుని కర్ణుల దగ్గర; దుర్యోధనుఁడు+ఆది, కాఁగన్= దుర్యోధనుడు మొదలుగా; సుతులు= కొడుకులు; ఉన్న సభన్= ఉన్నట్టి సభలో; బాధిత, శత్రు, వర్గులు+అగు= బాధింపబడిన శత్రువుల సమూహం కలవాళ్ళయిన; పాండు, కుమారుల, దుఃఖ, వార్త= పాండవులయొక్క దుఃఖసమాచారం - అంటే పాండవుల మరణవార్త; విని; దుఃఖిత+ ఆత్ముఁడు+ఐ= బాధింపబడిన మనస్సుకలవాడై; వివిధ, ప్రలాపుఁడు+ఐ= అనేకవిధాలైన ఏడ్వటాన్ని కలవాడై; (పాండవులను గూర్చి అనేక విధాలుగా భావిస్తూ ఏడ్చినా డని భావం) ఆవు+అఱచినట్లు; అఱచెన్.

**తాత్పర్యం:** దుర్యోధనుడు మొదలగు కొడుకులు ఉన్నసభలో నీచులైన శకుని కర్ణుల ఎదుట, పాండవుల మరణవార్త విని, మిక్కలి బాధపడుతూ, అనేకవిధాల వాళ్ళను గూర్చి భావించి, దుఃఖిస్తూ, ధృతరాష్ట్రుడు ఆవు అరచినట్లు అరచాడు.

**విశేషం:** అలం: ఉపమ. పరమదారుణమైన ఈ సంఘటన వెనుక తన పుత్రుని మాయోపాయం ఉందని తెలిసి ఏడ్చినా; తెలియక ఏడ్చినా -నిజంగా ఏడ్చినా, అబద్ధంగా ఏడ్చినా - మొత్తానికి ధృతరాష్ట్రుడు, అందరిముందు అంతపెద్దగా ఏడ్చాడట

- 'ఆ వఱచి న ట్లఱచి' ఏడ్చాడట. సుబలుని తనయుడు సౌబలుడు - శకుని. దినాధిపుడు - పగటికిరాజు - సూర్యుడు. సూర్యసూనుడు - సూర్యుని కుమారుడు- కర్ణుడు. వీళ్లతో దుర్యోధనుణ్ణీ కలిపి మర్త్యాధము లనటం సార్థకం. సహృదయ సంవాదం కలిగించే విశేషణం.

**వ. మఱియు గాంధారిం దొట్టి దేవీజనులయాక్రందనధ్వను లంతఃపురంబున నెగసె; భీష్మాదికురువృద్ధులును విప్రులుం బౌరులును శోకాక్రాంతు లయిరి; విదురుండు పాండవులకుశలస్థితి యెఱింగియు నెఱుంగనియ ట్లందఱం గలసి దుఃఖితుండపోలె నుండె; నంత ధృతరాష్ట్రుండు గొడుకులుం దానును బాంధవులును గుంతీపాండవుల కుదకదానంబు సేసి సంస్కారాదిపరలోకక్రియలు గంగాతీరంబునం జేయ సమకట్టించి తగువారి బ్రాహ్మణుల నపారధనంబులతోడం బుచ్చిన. 170**

**ప్రతిపదార్థం:** మఱియున్; గాంధారిన్+తొట్టి= గాంధారి మొదలుగా; దేవీ, జనుల+ఆక్రందన, ధ్వనులు= అంతఃపుర స్త్రీల ఏడుపుశబ్దాలు; అంతఃపురంబునన్; ఎగసెన్= పైకిలేచాయి; భీష్మ+ఆది, కురు, వృద్ధులును= భీష్ముడు మొదలైన కురువంశపు పెద్దలును; విప్రులున్= బ్రాహ్మణులును; పౌరులును= పుర ప్రజలును; శోక+ఆక్రాంతులు= దుఃఖంచేత ఆక్రమింపబడినవాళ్ళు; అయిరి; విదురుండు; పాండవుల, కుశలస్థితి= పాండవులయొక్క క్షేమంగా ఉండే స్థితిని, ఎఱింగియు; ఎఱుంగని+అట్లు; అందఱన్+కలసి= అందరితో కూడి; దుఃఖితుండ పోలెను= దుఃఖించినవానివలె; ఉండెన్= ఉన్నాడు; అంతన్= అటుపై; ధృతరాష్ట్రుండు; కొడుకులున్; తానును; బాంధవులును = చుట్టాలుకూడా; కుంతీ, పాండవులకున్= కుంతికీ పాండవులకు; ఉదక, దానంబు+చేసి= నీటిని వదలి; సంస్కార+ఆది, పరలోక, క్రియలు= దహనం మొదలైన పరలోకానికి సంబంధించిన అంత్యక్రియలు; గంగా, తీరంబునన్; చేయన్= చేయటానికి; సమకట్టించి= ఏర్పాటు చేయించి; తగువారిన్= తగినట్టివాళ్ళను; బ్రాహ్మణులను; అపార, ధనంబులతోడన్= అంతులేని ధనాలతో, పుచ్చినన్= పంపగా;

**తాత్పర్యం:** అంతేగాక గాంధారీదేవి మొదలయిన అంతఃపురకాంతల ఏడుపు ధ్వనులు పెల్లుబికాయి. భీష్ముడు మొదలైన కురువంశపు పెద్దలు దుఃఖించారు. విదురుడు, పాండవులు క్షేమంగా ఉన్నారని తెలిసినా అందరితోపాటు తానుకూడ దుఃఖించేవానివలె ఉన్నాడు. ధృతరాష్ట్రుడు, కొడుకులు, తాను, బంధువులు, కుంతీదేవికి, పాండవులకు నీళ్ళు వదలి, పరలోకక్రియలు గంగాతీరాన జరిపించటానికి ఏర్పాట్లు చేయించి, యోగ్యులైన బ్రాహ్మణులకు అంతులేని ధనాలిచ్చి పంపగా.

**క. మతిఁ బాండుకుమారుల పం। చత విని దుర్యోధనుండు సంతసపడియెన్;**
**హితుఁ డయిన పురోచను పం। చత కెంతయు జాతదుఃఖచంచలుఁ డయ్యెన్. 171**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు; పాండుకుమారుల, పంచత= పాండవులయొక్కమరణం, విని; మతిన్= మనస్సులో; సంతసపడియెన్= సంతోషించాడు; హితుఁడు+అయిన= మేలు కోరేవాడయిన; పురోచను పంచతకున్= పురోచనునియొక్క మరణానికి; ఎంతయున్= మిక్కిలి; జాత, దుఃఖచంచలుఁడు+అయ్యెన్= పుట్టబడిన దుఃఖంచేత చలించినవాడు అయ్యాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పాండవుల మరణానికి సంతోషించాడు. తనమేలుకోరేవాడైన పురోచనుని మరణానికి మాత్రం ఎంతో దుఃఖించాడు.

**విశేషం:** పురోచనుణ్ణి ముందుగా కాల్చటంవల్ల పాండవులు తప్పించుకొన్నారన్నవార్త రహస్యంగా ఉండగలిగింది.

**పాండవులు వారణావతమువనుండి దక్షిణదిశగా నడచుట (సం. 1-137-17)**

**వ. అట పాండవులును భాగీరథి లంఘించి దక్షిణాభిముఖు లయి మారుతమార్తాండమరీచిగోచరంబు గాని గహనంబున నరుగుచు నధికక్షుత్పిపాసాపరవశు లయి నడవనోపకయున్న నెప్పటియట్ల యందఱ నెత్తికొని వాయుతనయుండు వాయువేగంబునఁ జని సాయాహ్నంబున నొక్కవటమహీజాతశీతల శిలాతలంబున నునిచి దాని యగ్రవిటపం బెక్కి నీ రారయుచున్నంత ననతిదూరంబున. 172**

**ప్రతిపదార్థం:** అట, పాండవులును; భాగీరథి, లంఘించి= గంగను దాటి; దక్షిణ+అభిముఖులు+అయి= దక్షిణానికి ఎదురుగా ముఖాలు గలవాళ్ళయి; మారుత, మార్తాండ, మరీచి, గోచరంబు, కాని= గాలికిని; సూర్యునికాంతికిని చొరగాని; గహనంబునన్= అడవిలో; అరుగుచున్= వెళ్ళుతూ; అధిక, క్షుత్+పిపాసా, పరవశులు+అయి= మిక్కిలి ఆకలిదప్పులకు లోనైనవాళ్ళయి, నడవన్+ఓపక= నడవలేక; ఉన్నన్; ఎప్పటి, అట్ల= ఎప్పటిమాదిరిగానే; అందఱన్; ఎత్తికొని; వాయు, తనయుండు= వాయుదేవునియొక్క కుమారుడు-భీముడు; వాయు, వేగంబునన్, చని= వాయువేగంతోపోయి; సాయ+అహ్నంబునన్= సాయంకాలాన; ఒక్క, వట, మహీజాత, శీతల, శిలా తలంబునన్= ఒక మఱ్ఱిచెట్టుయొక్క చల్లని రాతిప్రదేశంలో; ఉనిచి= ఉంచి; దాని= ఆ మఱ్ఱిచెట్టుయొక్క; అగ్ర, విటపంబు= చివరి కొమ్మ; ఎక్కి; నీరు+అరయుచు+ఉన్న+అంతన్= నీటిని వెదకుతుండగా; అనతి, దూరంబునన్= ఎక్కువ కాని దూరాన - అంటే కొద్ది దూరాన.

**తాత్పర్యం:** పాండవులు గంగానదిని దాటి దక్షిణంవైపు సాగి, గాలి, సూర్యకిరణాలు చొరరాని దట్టమైన అడవిలో నడిచివెళ్ళుతూ, ఎక్కువ ఆకలి దప్పులకు లోనైన వాళ్ళయి నడవలేకపోగా, భీమసేనుడు ఎప్పటివలె తక్కినవాళ్ళను ఎత్తుకొని వాయువేగాన వెళ్ళి, సాయంకాలాన ఒక మఱ్ఱి చెట్టుక్రింద ఉండే చల్లని రాతిప్రదేశాన ఉంచి, ఆ మఱ్ఱిచెట్టు చివరికొమ్మ నెక్కి నీళ్ళకొరకు వెదకుతుండగా కొంతదూరంలో.

**మ. ప్రమదాపాదిపయఃప్రపూర్ణ మిది యౌఁ బద్మాకరం బంచుఁ ద**
**త్కమలామోదసుగంధ మారుతము వీఁకన్ ము న్నెఱింగించినన్**
**రమణం బిల్చె సరోవరం బనిలజున్ రాజీవరాజీ వస**
**త్సముదాళివ్రజచక్రవాక బక హంస క్రౌంచ నాదంబులన్. 173**

**ప్రతిపదార్థం:** ప్రమద+ఆపాది, పయః ప్రపూర్ణము= సంతోషాన్ని కలిగించే నీటితో నిండినది; పద్మ+ఆకరంబు= పద్మాలకు స్థానమైనది - కొలను; ఇది+ఔన్= ఇది అగునని; అంచున్= అనుకుంటూ; తత్+కమల+ఆమోద, సుగంధ, మారుతము= ఆ కొలనులోని తామరలయొక్క మంచివాసనతో కూడివీస్తున్న గాలి; వీఁకన్= ఉత్సాహంతో; మున్ను+ఎఱింగించినన్= ముందుగా తెలియజేయగా, రాజీవ, రాజీ, వసత్+సమద+ఆళి, వ్రజ, చక్రవాక, బక, హంస, క్రౌంచ, నాదంబులన్= కమలాలయొక్క సమూహంలో ఉన్నట్టి మదించిన తుమ్మెదల సమూహంయొక్క, చక్రవాకపక్షులయొక్క, కొంగలయొక్క, క్రౌంచపక్షులయొక్క ధ్వనులచేత; సరోవరంబు= కొలను; రమణన్= ప్రీతితో; అనిలజున్= వాయుపుత్రుడైన భీముడిని; పిల్చెన్= పిలిచింది.

**తాత్పర్యం:** ఆహ్లాదాన్ని కలిగించే నీటితో నిండినదీ, పద్మాలకు నెలవైనదీ అని, తామరపూల మంచివాసనతో కలిసి వీస్తున్నగాలి ముందుగా పరిచయం చేస్తుండగా -కమలాలలో దాగిన మదించిన తుమ్మెదల గుంపులు, చక్రవాకపక్షులు, కొంగలు, క్రౌంచపక్షులు చేసేధ్వనులతో సరోవరం వాయుపుత్రుడైన భీముడిని పిలిచింది.

**విశేషం:** ఈ పద్యరచనలో సమాధి అనే గుణం ఉన్నది. 'రాజీవరాజీవ' అనేచోట యమకం. కథాప్రసన్నతకు భంగం కలిగించే విస్తృతి లేక, అక్షరరమ్యం, మనోహరం అయిన సరోవరమిది. సరోవరం (వనితవలె) భీముడిని ఆహ్వానిస్తున్నదనే వర్ణనం భావికథలో హిడింబ పవనసుతుడిని, తనంతట తాను కొరుకొనే కథార్థాన్ని సూచిస్తున్నది. భావికథార్థ ధ్వనిని ఇందులో నన్నయ నిబంధించాడు. (సంపా.)

**వ. ఆ దిక్కున కా క్షణంబ యరిగి య క్కొలను గని యందుఁ గృతావగాహుం డై కడుపునిండ నీళ్ళు ద్రావి యచ్ఛిద్ర కమల ప త్ర పుటికల నీళ్ళు గొని భీముండు గ్రమ్మఱి వచ్చునంత. 174**

**ప్రతిపదార్థం:** ఆ, దిక్కునకున్; ఆ, క్షణంబు+అ= ఆ నిమిషాన్నే; అరిగి= వెళ్ళి; ఆ+కొలనున్; కని= చూచి; అందున్; కృత+అవగాహుండు+ఐ= చేయబడిన స్నానం గలవాడై; కడుపునిండ; నీళ్ళు; త్రావి; అచ్ఛిద్ర, కమల, పత్ర పుటికల= చినగని తామరాకు దొప్పలలో; నీళ్ళు; కొని= తీసికొని; భీముండు; క్రమ్మఱి= మరలి; వచ్చు+అంత= వచ్చేటప్పుడు.

**తాత్పర్యం:** ఆ వైపు వెంటనే వెళ్ళి ఆ సరోవరాన్ని చూచి, అందులో స్నానం చేసి, కడుపునిండా నీళ్ళుత్రాగి చినగని తామరాకుదొప్పలలో నీళ్ళు నింపుకొని భీముడు తిరిగివచ్చేటప్పుడు.

**క. ధరణీ దిశాప్రసారిత । గురుకరనికరంబు లుడిచికొని దీర్ఘనిరం**
**తరగతి ఖిన్నుఁడపోలెను । హరిదశ్వుఁడు విశ్రమించె నస్తాద్రిదరిన్. 175**

**ప్రతిపదార్థం:** హరిదశ్వుఁడు= సూర్యుడు; దీర్ఘ, నిరంతర గతిన్= నిడుపైన ఎడతెగనినడకచేత; ఖిన్నుఁడపోలెను= అలసిపోయిన వాడా అనేటట్లు; ధరణీ, దిశా, ప్రసారిత, గురు, కర, నికరంబులు= భూమిలోను, దిక్కులలోను చాపబడిన గొప్పకిరణాలయొక్క లేదా చేతులయొక్క సమూహాలు; ఉడిచికొని= అణచుకొని(ముడుచుకొని); అస్త+అద్రి, దరిన్= అస్తమించే పర్వతగుహలో; విశ్రమించెన్= పరుండినాడు.

**తాత్పర్యం:** సూర్యుడు తనసుదీర్ఘమైన ఎడతెగని నడకచేత అలసిపోయినాడా అన్నట్లు - భూమిమీద దిక్కులలో చాచిన తనకిరణాలనే చేతులను ముడుచుకొని అస్తగిరిగుహలో విశ్రమించాడు.

**విశేషం:** అలం; ఉత్ప్రేక్ష. హరిదశ్వుడు - పచ్చనికాంతిగల గుఱ్ఱాలు కలవాడు - సూర్యుడు. కరము - అనే శబ్దానికి కిరణం, చేయి అనే రెండు అర్థాలున్నాయి.

**ఉ. అంబురుహాప్తుఁ డస్తశిఖరాంతరితుం డగుడున్ సమస్త జీ**
**వంబులు నెల్లచో నిజ నివాసముఁ బొందునెడం దమిస్రపుం**
**జంబులపోలె వెల్వడియె శైలవిశాలగుహాలినుండి నా**
**గంబులయూథముల్ సరసఘాసపరిగ్రహణోత్సుకంబు లై. 176**

**ప్రతిపదార్థం:** అంబురుహ+ఆప్తుఁడు = తామరలకు చుట్టమైన సూర్యుడు; అస్త, శిఖర+అంతరితుండు+అగుడున్= అస్త పర్వతంయొక్క శిఖరంచేత మరుగుపరుపబడినవాడు కాగా; సమస్త జీవంబులున్= అన్ని ప్రాణులు; ఎల్లచోన్= అన్నిచోట్ల; నిజ, నివాసమున్= తమయొక్క నివాసస్థలాలను; పొందు+ఎడన్= పొందునట్టి సమయాన; నాగంబుల, యూథముల్= ఏనుగుల గుంపులు; సరస, ఘాస, పరిగ్రహణ+ఉత్సుకంబులు+ఐ= రుచితో కూడిన గడ్డిని ప్రియమార పుచ్చుకోవాలన్న

ఉత్సాహంగలవై; తమిస్ర, పుంజంబుల, పోలెన్= చీకట్ల గుంపులవలె; శైల, విశాల, గుహా+ఆలినుండి= కొండలలోని గుహల సమూహంనుండి; వెల్వడియెన్= బయటికి వచ్చాయి.

**తాత్పర్యం:** సూర్యాస్తమయం కాగానే అన్నిప్రాణులు తమ తమనివాసస్థానాలకు పోతుండగా, ఏనుగుల గుంపులు పచ్చిగడ్డిని ప్రియమార భుజించాలన్న ఉత్సాహంతో చీకట్లగుంపులవలె కొండగుహలనుండి వెలుపలికి వచ్చాయి.

**విశేషం:** అలం: ఉపమ. గుహలు వెలువడుతున్న ఏనుగులగుంపును వర్ణించే ఈ రచనలో ఆరోహావరోహక్రమస్ఫూర్తి కల సమాధి అనే శబ్దగుణం సార్థకంగా పోషింపబడింది. (సంపా.)

### భీముఁడు నిద్రితు లైన జననీసోదరులను జూచి చింతిల్లుట (సం. 1-138-14)

**వ. భీమసేనుండును దద్వటవృక్షంబుక్రింద నధికపథిశ్రాంతులై పయి పుట్టంబులు పఱచుకొని తమ బాహుదండంబులు దలగడలుగా నిద్రితులయియున్న సహోదరులం దల్లినిం జూచి పరమదుఃఖితుం డై యాత్మగతంబున. 177**

**ప్రతిపదార్థం:** భీమసేనుండును; తత్+వట, వృక్షంబు క్రిందన్= ఆ మఱ్ఱిచెట్టుక్రింద; అధిక, పథిశ్రాంతులు+ఐ= ఎక్కువ దారినడకవలన బడలినవాళ్ళయి; పయి, పుట్టంబులు= పైగుడ్డలు; పఱచుకొని= నేలపై పరచి; తమ, బాహు, దండంబులు= తమ చేతులు; తలగడలుగా= దిండ్లుగా; నిద్రితులు+అయి= నిద్రపోయినవాళ్ళయి; ఉన్న= ఉండే; సహ+ఉదరులన్= తోబుట్టువులను; తల్లినిన్= తల్లిని; చూచి= కాంచి; పరమ+దుఃఖితుండు+ఐ= మిక్కిలిదుఃఖించినవాడై, ఆత్మగతంబునన్= తనమనస్సులో.

**తాత్పర్యం:** ఎక్కువ దారినడకవలన బడలిక పొందినవాళ్ళయి పై గుడ్డలు పరచుకొని చేతులు దిండ్లుగా పెట్టుకొని ఆ మఱ్ఱిచెట్టు క్రింద నిద్రించేసోదరులను, తల్లిని చూచి భీమసేనుడు మిక్కిలి దుఃఖించి తన మనస్సులో.

**క. త్రిభువనసామ్రాజ్యశ్రీ । ప్రభుఁ డగు ధర్మాత్మజుండు ప్రాకృతజనున**
**ట్లభిరూక్షతలంబున ని । ట్లభిభూతుం డగునె నిద్ర నతిఖిన్నుం డై. 178**

**ప్రతిపదార్థం:** త్రిభువన, సామ్రాజ్యశ్రీ, ప్రభుఁడు+అగు= ముల్లోకాలసామ్రాజ్యలక్ష్మికి ప్రభువైన; ధర్మ+ఆత్మజుండు= ధర్మరాజు; ప్రాకృతజనున్+అట్లు= సామాన్యమానవునివలె; ఇట్లు; అభిరూక్షతలంబునన్= మిక్కిలికఠినమైన ప్రదేశాన; అతి, ఖిన్నుండు+ఐ= మిక్కిలి దుఃఖం పొందినవాడై; నిద్రన్= నిద్రలో; అభిభూతుండు+అగునె= త్రోసిపుచ్చబడినవాడయ్యాడుగదా.

**తాత్పర్యం:** ముల్లోకాలకు ప్రభువైన ధర్మరాజు సామాన్య మానవునివలె ఈ విధంగా మిగుల దుఃఖం పొంది, కఠినమైన ఈ నేలమీద నిద్రించటమా!

**విశేషం:** అలం: విషమం.

**సీ. కుంతిభోజాధిపుకూఁతురు వసుదేవు । చెలియలు మఱియు విచిత్రవీర్యు**
**కోడలు కౌరవకులవిభూషణుఁ డైన । పాండుమహాదేవి పరమధర్మ**
**పరు లైన కొడుకులం బడసినయది పుష్ప । సుకుమారతరమూర్తి శుచిపరార్ధ్య**
**శయనతలంబున శయనించియును నిద్ర । వోవనియది దప్పిఁ బొంది కటికి**

**ఆ. నేల గుండ్లు లొత్త నిద్ర వోయిన యది; । తల్లికంటె నిద్రఁ దగిలి సుతులు**
**వాలుమృగము లున్న వన మని వగవక । మఱచియుండి; రేమి మాడ్కి యొక్కొ! 179**

**ప్రతిపదార్థం:** కుంతిభోజ+అధిపు, కూతురు= కుంతిభోజుడనే పేరుగల రాజుయొక్కకూతురు; వసుదేవు, చెలియలు; మఱియు; విచిత్రవీర్యు, కోడలు; కౌరవకుల, విభూషణుఁడు+ఐన= కౌరవవంశానికి ఆభరణంవంటివాడైన; పాండు మహాదేవి= పాండురాజుయొక్క పట్టపురాణి; పరమ, ధర్మపరులు+ఐన= మిక్కిలిధర్మాత్ములైన; కొడుకులను; పడసిన+అది= కన్నట్టిది; పుష్ప, పరమ, సుకుమారతర, మూర్తి= పూవుకంటె సుకుమారమైన శరీరం కలది; శుచి, పరార్ధ్య, శయన, తలంబునన్= పరిశుద్ధత ముఖ్యమైన పడకమీద; శయనించియును= పడుకొనికూడ; నిద్ర+పోవని+అది= నిద్రపోనిది; దప్పిపొంది= దాహంవేసి; కటికినేలన్= ఆచ్ఛాదనంలేని కఠినమైన గట్టి నేలమీద; గుండ్లలు+ఒత్తన్= రాళ్ళు ఒత్తుకొంటూ ఉండగా; నిద్ర పోయిన+అది= నిద్రపోయింది; తల్లి కంటెన్; నిద్రన్+తగిలి= నిద్రలో చిక్కుకొని; సుతులు= కొడుకులు; వాలు, మృగములు+ఉన్న= క్రూరమృగాలుండే; వనము+అని= అడవి అని; వగవక= విచారింపక; మరచి+ఉండిరి; ఏమి, మాడ్కి+ఒక్కొ= ఏవిధమో కదా!.

**తాత్పర్యం:** కుంతిభోజునికూతురు, వసుదేవునిచెల్లెలు, విచిత్రవీర్యునికోడలు, పాండురాజుపట్టపురాణి, పరమ ధర్మాత్ములైన కొడుకుల కన్నతల్లి, పూవుకంటె సుకుమారమైన శరీరం కలది, పరిశుభ్రమైన పడకమీద పరుండి కూడ నిద్రపోవనిది - అయిన కుంతీదేవి, అలసిపోయి కటికినేలమీద రాళ్ళొత్తుకొంటున్నా నిద్రపోయింది. తల్లికంటె గాఢంగా నిద్రలో ఉన్న కొడుకులు ఇది క్రూరమృగాలుండే అడవి అనికూడ ఆలోచించకుండా నిద్రపోతున్నారు. ఇదేమి చిత్రమో కదా!

**విశేషం:** అలం: విషమం.

**వ. 'వీరికి నిద్రాభంగంబు సేయనోపఁ; దమకుం దార మేల్కొని నీళ్ళు ద్రావుదురుగాక!' యని యక్కమలపత్త్ర పుటికల నీ ళ్ళిమ్ముగా సంగ్రహించి వెండియుం దనమనంబున. 180**

**ప్రతిపదార్థం:** వీరికిన్; నిద్రా, భంగంబు= నిద్రను చెరచటం; చేయన్+ఓపన్= చేయలేను; తమకున్+తారు+అ= తమకు తామే; మేలుకొని; నీళ్ళు; త్రావుదురు+కాక= తాగుదురులే అనీ; ఆ+కమల, పత్త్ర, పుటికల= ఆ తామరాకుదొప్పల్లో; నీళ్ళు+ఇమ్ముగా= నీళ్ళు తగురీతిగా; సంగ్రహించి= కుదించిఉంచి; వెండియున్= మరల; తన, మనంబున= తనమనస్సులో.

**తాత్పర్యం:** 'వీళ్ళకు నిద్రాభంగం చేయలేను; వీళ్ళు తమంత తామే మేల్కొని నీళ్ళు తాగుతారులే' అని నీళ్ళను తగు విధంగా తామరాకుదొప్పల్లో భద్రపరచి మళ్ళీ తనమనస్సులో.

**క. ఖలుఁ డై ధృతరాష్ట్రుఁడు పు । త్త్రులుఁ దానును గూడి మమ్ము దూరస్థులఁ గా**
**నిలు వెలువరించి లాక్షా । నిలయంబున నునిచెఁ బాపనిష్ఠితబుద్ధిన్. 181**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుఁడు; ఖలుఁడు+ఐ= దుర్మార్గుడై; పుత్త్రులున్, తానును; కూడి= కలిసి; మమ్మున్; దూరస్థులన్+కాన్= దూరంగా ఉండేవాళ్ళు అగునట్లుగా; ఇలు, వెలువరించి= ఇంటినుండి బయటికి పంపి; పాపనిష్ఠిత, బుద్ధిన్= పాపంలో ఉంచబడిన బుద్ధితో; లాక్షా, నిలయంబునన్= లక్కయింటిలో; ఉనిచెన్= ఉంచాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు దుర్మార్గుడై, కొడుకులూ, తానూ కలిసి, మమ్మలను దూరం చేయటానికై ఇంటి నుండి బయటికి పంపి దుర్బుద్ధితో లక్కయింట్లో ఉంచాడు.

**క. కులపాంసను లై యహితం । బులు సేయుచునుండుచుట్టములఁ బొందక యి**
**మ్ముల నుండువాఁడ పుణ్యుఁడు, । వెలయఁగ గ్రామస్థితైకవృక్షమపోలెన్. 182**

**ప్రతిపదార్థం:** కుల, పాంసనులు+ఐ= వంశనాశనం చేసే వాళ్ళయి; అహితంబులు= అపకారాలు; చేయుచున్+ఉండు, చుట్టములన్= చేస్తూ ఉండే చుట్టాలను; పొందక= చేరక; వెలయఁగన్= ఒప్పుగ; గ్రామస్థిత+ఏకవృక్షము+అ పోలెన్= గ్రామంలో ఉండే ఒకే ఒకచెట్టువలె; ఇమ్ములన్= అనుకూలస్థానాల్లో; ఉండు, వాఁడు+అ= ఉండేటివాడే; పుణ్యుఁడు= పుణ్యాత్ముడు.

**తాత్పర్యం:** వంశనాశనం చేసేవాళ్ళయి, అపకారం చేసే దుర్మార్గులైన చుట్టాల చెంత చేరకుండా - గ్రామంలోని ఒకేఒకవృక్షంలా (అది అందరి ఆదరాన్ని పొంది క్షేమంగా ఉంటుంది) తన కనుకూలమైన స్థానంలో ఉండే వాడే పుణ్యాత్ముడు.

**విశేషం:** అలం: ఉపమ. నన్నయకవితలో రుచిరార్థసూక్తి.

**క. పరహితఫలవంతులు సు । స్థిరమూలాన్వితు లపాపధీరతులు పర**
**స్పరసంశ్రయమున జీవిం । తురు మనుజులు వనములోని ద్రుమములపోలెన్. 183**

**ప్రతిపదార్థం:** పరహిత, ఫలవంతులు= ఇతరుల మేలునే ఫలంగా కలవాళ్ళు (ఇతరుల మేలుకొరకు ఫలాలను కలిగినవి - అని వృక్షపరమైన అర్థం); సుస్థిర, మూల+అన్వితులు= మిక్కిలి స్థిరమైన మూలధనంతోకూడినవాళ్ళు (మిక్కిలి స్థిరమైన వేళ్ళతో కూడినవి - అని వృక్షపరమైన అర్థం); అపాప, ధీ, రతులు= పాపబుద్ధిలో ఆసక్తిలేనివాళ్ళు (పాపబుద్ధిలేనివి - అని వృక్షపరమైన అర్థం); మనుజులు; వనములోని= అడవిలోని; ద్రుమములపోలెన్= వృక్షాలవలె; పరస్పర, సంశ్రయమునన్= ఒండొరుల ఆశ్రయంచేత, జీవింతురు= జీవిస్తారు.

**తాత్పర్యం:** ఇతరుల మేలు కోరుతూ, సుస్థిరమైన మూలధనం గలిగి, పాపబుద్ధి లేని మానవులు - అడవిలో ఒకదానితో ఒకటి కలిసి పెనగి ఉండే వృక్షాలవలె కలిసిమెలసి జీవిస్తారు.

**విశేషం:** అలం: శ్లేష, ఉపమ. ఫలశబ్దానికి 'బల' అనే పాఠాంతరం ఉన్నది. అలాగే 'అపాపధీరతులు' అనే దానికి 'అపారధీయుతులు', 'అపారధీమతులు', 'అపారధికృతుల్' అనే పాఠాంతరాలున్నాయి. - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.368.

**వ. అని ధృతరాష్ట్రుబాంధవంబు నిందించుచు నిబిడాంధకారనీరంధ్రంబు లయిన దిశలు సూచి యున్నంత, జన రభసంబు దవ్వుల వీతెంచిన ముందటం బురంబు గలుగవలయు, వీరల మేల్కొనునంతకు నే నిచ్చోట నేమరకుండవలయు నని. 184**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; ధృతరాష్ట్ర, బాంధవంబు= ధృతరాష్ట్రునియొక్క బంధుత్వాన్ని; నిందించున్, నిబిడ+అంధకార, నీరంధ్రంబులు+అయిన= దట్టమైన చీకటిచేత నిండి సందులేనివైన; దిశలు; చూచి; ఉన్న+అంతన్= ఉన్నతర్వాత; జన, రభసంబు= జనులసందడి; దవ్వుల, వీతెంచినన్= దూరంనుండి వినరాగా; ముందటన్, పురంబు= నగరం;

కలుగవలయున్= ఉండాలి; వీరలు= వీళ్ళు; మేలుకొనునంతకున్= మేలుకొనేవరకు; ఏన్= నేను; ఈ+చోటన్; ఏమరక+ఉండవలయున్= పరాకు లేక ఉండాలి; అని.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రునితో ఉన్న బంధుత్వాన్ని నిందిస్తూ పూర్తిగా చీకటిపడిన తర్వాత దూరంనుండి జనుల సందడి వినిపించగా, ముందువైపు పట్టణ మొకటి ఉన్నదని తెలిసికొని, అయినా తల్లీ, సోదరులూ మేల్కొనేవరకూ జాగ్రత్తగా ఉండాలి అని.

**క. ఆ కాననాంతరంబునఁ । బ్రాకటభుజవిక్రముండు పాండవవజ్ర**
**ప్రాకారుఁడు జాగరమున । శోకమనస్కుఁ డయి పవనసూనుం డుండెన్. 185**

**ప్రతిపదార్థం:** ఆ, కానన+అంతరంబునన్= ఆ అడవినడుమ; ప్రాకట, భుజ, విక్రముండు= ప్రసిద్ధమైన భుజపరాక్రమం కలవాడు; పాండవ, వజ్ర, ప్రాకారుఁడు= పాండవులకు వజ్ర ప్రహరిగోడ అయినవాడు; పవన సూనుఁడు= వాయుదేవునియొక్క కుమారుడు; భీముడు; శోకమనస్కుఁడు+అయి= దుఃఖమొందిన మనస్సు కలవాడయి; జాగరమునన్= మెలకువతో; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ అడవిమధ్య, ప్రసిద్ధమైన బాహుపరాక్రమం కలవాడు, పాండవులకు వజ్రప్రహరిగోడవంటివాడు అయిన భీముడు దుఃఖంతోకూడిన మనస్సుతో మెలకువగా ఉన్నాడు.

**వ. తత్సమీపంబున బాలసాలతరుషండమండపంబుననుండి హిడింబుఁ డను నొక్కరాక్షసుండు వారి దవ్వులం జూచి మైపెంచి రూక్షకేశంబులు విద్రిచి యావులించి నీల్గి 'నీరసవన్యమృగమాంసఖాదనజాతనిర్వేదనపరుండ నయి పెద్దకాలంబునకు మానవమాంసం బాస్వాదింప గంటి' నని తన చెలియలి హిడింబ యనుదానిం బిలిచి యి ట్లనియె. 186**

**ప్రతిపదార్థం:** తత్+సమీపంబునన్= దానికి దగ్గరగా; బాల, సాల, తరు, షండ, మండపంబునన్= లేతవైన మద్దిచెట్టు సమూహమనే మండపంలో; ఉండి; హిడింబుఁడు+అను; ఒక్క, రాక్షసుండు; వారిన్= వాళ్ళను - అంటే పాండవులను, కుంతిని; దవ్వులన్= దూరాన; చూచి; మై+పెంచి= శరీరాన్ని పెద్దదిగా చేసి; రూక్ష, కేశంబులు= కఱుకువెంట్రుకలు; విద్రిచి= విదిల్చి; ఆవులించి; నీల్గి= ఒడలు విరిచికొని; నీరస, వన్య, మృగ, మాంస, ఖాదన, జాత, నిర్వేదన, పరుండును+అయి= రుచిలేని అడవి జంతువుల మాంసాన్ని తినటంచేత కలిగిన రోత ప్రధానంగా కలవాడినై; పెద్ద, కాలంబునకు= చాలాకాలానికి; మానవ, మాంసంబు= మనుష్యులయొక్క మాంసాన్ని; ఆస్వాదింపన్+కంటిని+అని= రుచి చూడగలిగానని; తన, చెలియలిన్= తనయొక్క చెల్లెలిని; హిడింబ= హిడింబ అను పేరుగల, దానిన్= దాన్ని; పిలిచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అడవి మధ్య పాండవులుండే ప్రదేశానికి దగ్గరగా మద్దిచెట్ల నడుమ హిడింబు డనే రాక్షసు డొకడు వాళ్లను చూచి మేను పెంచి, తన కరకు వెంట్రుకలు విదిలించి, ఆవులించి, నీల్గి, రుచిలేని అడవి జంతువుల మాంసం తిని తిని రోత పుట్టిన తనకు చాలా కాలం తర్వాత మానవమాంసం రుచి చూచే అవకాశం కలిగిందని చెల్లెలు హిడింబను పిలిచి ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. 'బాల సాల తరు షండ మండపంబున' అనే దానికి బాల రసాల తరు షండ మండిత మంటపంబున - బాల రసాల తరు షండ మండపంబున - ఇత్యాది పాఠాంతరాలు ఉన్నాయి - శ్రీమదాంధ్ర మహాభారతసంశోధితప్రతి, పుట. 369.

**ఉ. ఇందుల కిమ్మెయిన్ మనుజు లెన్నఁడు వత్తురె? వత్తురేని యా**
**నందముఁ బొంది నిర్భయమునన్ శయనింతురె? యిట్లు వంటయిల్**
**కుందెలు సొచ్చె; వేగ చని కోమలి ! వారలఁ జంపి తెచ్చి నా**
**కొందగ వండి పెట్టుము రసోత్కట మానవ మాంస ఖండముల్. 187**

**ప్రతిపదార్థం:** కోమలి= సుకుమారమైనదానా!; ఇందులకున్= ఇక్కడికి; ఈ+మెయిన్= ఈ విధంగా; మనుజులు; ఎన్నఁడు= ఎప్పుడైన; వచ్చుదురె= వస్తారా!; వచ్చుదురు+ఏని= ఒకవేళ వచ్చినప్పటికీ; ఆనందమున్; పొంది; నిర్భయమునన్= భయంలేకుండ; శయనించుదురె= పడుకొంటారా!; ఇట్లు= ఈ విధంగా; వంటయిల్= వంట ఇంటిలో; కుందెలు= కుందేలు; చొచ్చెన్= ప్రవేశించింది; వేగన్= వేగంగా; చని= వెళ్ళి; వారలన్= వాళ్ళను; చంపి, రస+ఉత్కట, మానవ, మాంస, ఖండముల్= రుచిలో అధికమైన మానవులయొక్క మాంసపుముక్కలను; నాకు+ఒందగన్= నాకు ఒప్పేటట్లు; వండి; పెట్టుము.

**తాత్పర్యం:** 'ఇక్కడికి ఈ విధంగా మానవులు ఎప్పుడైనా వస్తారా! ఒకవేళ వస్తే సంతోషంగా, నిర్భయంగా ఇట్లా నిద్రిస్తారా! కుందేలు వంటింట్లోకి వచ్చింది. వెంటనే వెళ్ళి వాళ్ళని చంపి మిక్కిలి రుచి గల మానవమాంసఖండాలు చక్కగా నాకు వండిపెట్టు' మని హిడింబుడు చెల్లెలితో చెప్పాడు.

**విశేషం:** వంటయిల్ కుందెలు సొచ్చె - జాతీయం - అవసరమైనది తానై స్వాధీనమయిం దనటం. నన్నయగారి పాత్రోచిత సంభాషణరచనకు ఈ పద్యం చక్కని ఉదాహరణ.

### హిడింబ భీమసేనునిం జూచి మోహించుట (సం. 1-139-1)

**వ. అని పంచిన నదియును నతి త్వరితగతిం జని, ముందఱ వారల డాయ శంకించి, యొక్క వృక్షంబు మఱువునం గొండొక ప్రొ ద్దుండి. 188**

**ప్రతిపదార్థం:** అని; పంచినన్= ఆజ్ఞాపించగా; అదియును= ఆ హిడింబకూడ; అతి, త్వరిత, గతిన్= మిక్కిలి వేగంగా; చని= వెళ్ళి; ముందఱ= ముందు; వారలకున్= వాళ్ళను; డాయన్= సమీపించటానికి; శంకించి= వెనుకాడి; ఒక్క; వృక్షంబు, మఱువునన్= చెట్టుయొక్క చాటున; కొండు+ఒక, ప్రొద్దు+ఉండి= కొంతసేపు ఉండి;

**తాత్పర్యం:** అని హిడింబుడు ఆజ్ఞాపించగా హిడింబ మిక్కిలి త్వరగా వెళ్ళి ముందు వాళ్ళను సమీపించటానికి జంకి ఒక చెట్టుచాటున కొంతసేపు ఉండి.

**మ. వనజాతాయతనేత్రు నున్నతబృహద్వక్షఃస్థలున్ సింహసం**
**హననుం బాండవసింహమున్ హృదయజన్మాకారు నుద్యన్మహా**
**శనికల్పస్థిరబాహుఁ జూచుచు మనోజాతాగ్నిసంజాతవే**
**దన యై రాక్షసి కామరూపధర మర్త్యస్త్రీస్వరూపంబుతోన్. 189**

**ప్రతిపదార్థం:** వనజాత+ఆయత, నేత్రున్= పద్మాలవలె విశాలమైన నేత్రాలు కలవానిని; ఉన్నత, బృహత్, వక్షస్+స్థలున్= ఎత్తైన విశాలమైన రొమ్ము గలవానిని; సింహసంహననున్= సింహంవంటి చక్కనినడుము కలవాడిని; హృదయ, జన్మ+ఆకారున్=

మనస్సునుండి పుట్టినవాడైన మన్మథునిఆకారంవంటి ఆకారం కలవాడిని; ఉద్యత్+మహత్+అశని, కల్ప, స్థిరబాహున్= ప్రకాశించేగొప్పవజ్రాయుధంతో సమానమైన దృఢమైన చేతులుగలవాడిని; పాండవ, సింహమున్= పాండవులలో శ్రేష్ఠుడిని- భీముణ్ణి; చూచుచున్= చూస్తూ; రాక్షసి= హిడింబ; మనో, జాత+అగ్ని, సంజాత, వేదన, ఐ= మన్మథాగ్నివలన పుట్టిన బాధ కలదై; కామ, రూప, ధర= ఇచ్చ వచ్చిన రూపాన్ని ధరించేది - రాక్షసి హిడింబ; మర్త్య స్త్రీ, స్వరూపంబుతోన్= మానవకాంతరూపంతో;

**తాత్పర్యం:** పద్మాలవలె విశాలమైన నేత్రాలు; ఎత్తైన విశాలమైన వక్షస్థలం, సింహంవంటి సన్నని నడుంతోకూడిన చక్కని శరీరం, మన్మథునివంటి అందం, వజ్రాయుధంవంటి దృఢమైన బాహువులు కల భీమసేనుడిని హిడింబ చూచి, మోహించి, కామరూపం ధరించి, మానవకాంతరూపంతో.

**విశేషం:** అలం: ఉపమ. ఈఘట్టంలో ఆకర్షించిన భీమసేనుని రూపవర్ణనకు మత్తేభవృత్తం, ఉదాత్తరమణీయశైలి ఎంతో ఉచితంగా ఉన్నాయి. మాధుర్యంతో, ఓజస్సుతో కూడిన ఈ రచన హిడింబకు, మనోహరుడు, మహావీరుడయిన భీమునికి తగినట్లున్నది.

**క. వితత బహురత్నరుచిశో । భితభూషణములు వెలుంగ, బెడఁగగు నవపు**
**ష్పితజంగమలతక్రియ ను । న్నతకుచ సనుదెంచెఁ బవననందను డాయన్. 190**

**ప్రతిపదార్థం:** ఉన్నత కుచ= ఎత్తైన రొమ్ములు కలది - హిడింబ; వితత, బహు, రత్న, రుచి, శోభిత, భూషణములు= గొప్పవై అనేకాలైన రత్నకాంతులచేత ప్రకాశిస్తున్న సొమ్ములు; వెలుంగన్= ప్రకాశించగా; నవ, పుష్పిత, జంగమ, లత, క్రియన్= క్రొత్తగా పుష్పించిన నడతీగవలె; పవన, నందనున్= వాయుపుత్రుడైన భీమసేనుడిని; డాయన్= సమీపించటానికి; చనుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** హిడింబ రత్నకాంతులతో శోభిల్లే సొమ్ములు ధరించి, క్రొత్తగా పుష్పించిన నడతీగవలె భీమసేనుని దగ్గరకు వచ్చింది.

**విశేషం:** అలం: ఉపమ. ఉన్నత బృహద్వక్షస్సలుడైన భీమసేనునికి దీటైన నాయిక ఉన్నతకుచ అయిన హిడింబ అని చమత్కారం. పూలు విరగబూసిన జంగమ లత పవనతనయుడిని సమీపించిందనటంలో భావుకమైన సౌందర్యం ఉన్నది. పూలతీవెయొక్క యౌవనసౌగంధ్యాన్ని గాలి వహిస్తాడని వస్తుధ్వని.

**క. రమణి నిజభ్రాతృనియో । గముఁ దలఁపక యపుడు భీముఁ గదిసెఁ; బతిస్నే**
**హము కామినులకు బలవం । తము; పెఱనెయ్యములు వేయుఁ దత్సదృశములే? 191**

**ప్రతిపదార్థం:** రమణి= ఆ కాంత; నిజ, భ్రాతృ, నియోగమున్= తన అన్నయొక్క ఆజ్ఞను; తలపక= ఆలోచించక- మరచి; అపుడు; భీమున్; కదిసెన్= చేరుకొన్నది; కామినులకున్= కాంతలకు; పతిస్నేహము+అ= భర్తమీదిప్రేమే; బలవంతము= బలమైనది; పెఱ, నెయ్యములు= తక్కిన ప్రేమలు; వేయున్= వెయ్యి అయినా, తత్+సదృశములే= దానితో సమానాలా?

**తాత్పర్యం:** హిడింబ తనఅన్న ఆజ్ఞను మరచి భీముడిని కూడుకొన్నది. కాంతలకు భర్తమీది స్నేహమే బలమైనది. తక్కిన స్నేహాలు వెయ్యి అయినా దానితో సమానాలు కావు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ. ఇట్లు మన్మథవ్యథాశిథిలితమానమానస యయి తనయొద్దకు వచ్చుదానిం బవమానసూనుం డవమాన పూర్వకంబున 'నీ వెందులదాన? వింతప్రొ ద్దిందుల కేల వచ్చి? తెటవోయె? దెడ గలిగి పొ' మ్మనిన విని హిడింబ యి ట్లనియె. 192**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మన్మథ, వ్యథా, శిథిలిత, మాన, మానస+అయి= మన్మథబాధచే పోగొట్టబడ్డ అభిమానంగల మనస్సుగలదై; తన, ఒద్దకున్= తనదగ్గరికి; వచ్చు, దానినన్= వస్తున్న హిడింబను; పవమాన, సూనుండు= వాయుదేవునియొక్క కుమారుడు; అవమాన, పూర్వకంబునన్= అవమానం ముందు కలిగేట్లుగా; నీవు; ఎందుల, దానవు= ఎక్కడి దానివి; ఇంత, ప్రొద్దు= ఇంత, పొద్దు పోయినతర్వాత - అంటే ఇంతరాత్రివేళ; ఇందులకున్= ఇక్కడికి; ఏల, వచ్చితి= ఎందుకు వచ్చావు; ఎట+పోయెదు= ఎక్కడికి పోతున్నావు; ఎడ, కలిగి= దూరంగా; పొమ్ము+అనినన్= పో అనగా; విని; హిడింబ = హిడింబ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** మన్మథబాధచేత అభిమానాన్ని కోల్పోయి తన దగ్గరకు వచ్చే హిడింబను చూచి భీముడు అవమాన పూర్వకంగా 'నీవు ఎక్కడిదానవు; ఇంతరాత్రివేళ ఇక్కడికి ఎందుకు వచ్చావు; దూరంగా తొలగిపో' అని అనగా హిడింబ అతనితో ఇట్లా అన్నది.

**క. జననుత ! యేను హిడింబుం । డను రక్కసుచెలియలం బ్రియంబున నినుఁ జూ**
**చినయప్పటఁగోలెను గడు । మనోభవనిపీడ్యమానమానస నయితిన్. 193**

**ప్రతిపదార్థం:** జన, నుత= ప్రజలచేత కొనియాడబడేవాడా!; ఏను= నేను; హిడింబుండు+అను; రక్కసు, చెలియలన్= రాక్షసునియొక్క చెల్లెలిని; ప్రియంబునన్= ప్రేమతో; నినున్= నిన్ను; చూచిన+అప్పటన్, కోలెన్= చూచినప్పటినుండి; కడు= మిక్కిలి; మనోభవ, నిపీడ్యమాన, మానసను+అయితిన్= మన్మథునిచేత ఎక్కువగా బాధింపబడే మనస్సు గల దానిని అయ్యాను.

**తాత్పర్యం:** జనులచేత కొనియాడబడేవాడా! నేను హిడింబుడనే రాక్షసుడికి చెల్లెలిని. నిన్ను చూచింది మొదలు మన్మథబాధకు గురిఅయ్యాను.

**క. నాకుఁ బతి వయిన నిన్నుం । జేకొని మాయన్న యెగ్గుసేయక కాచున్;**
**నాకు మఱి నీవ పతివి గు । ణాకర యి జ్జన్మమున మహాస్నేహమునన్. 194**

**ప్రతిపదార్థం:** నాకున్; పతివి= భర్తవు; అయినన్= అయితే; మా+అన్న; నిన్నున్+చేకొని= తీసికొని - అంటే నిన్ను తనవానినిగా భావించి; ఎగ్గు+చేయక= కీడుచేయక; కాచున్= రక్షిస్తాడు; గుణ+ఆకర= మంచిగుణాలకు స్థానమైనవాడా! ఈ+జన్మమునన్; మన, స్నేహమునన్= మిక్కిలి ప్రేమచేత; నీవు+అ= నీవే; నాకున్; మఱి; పతివి= భర్తవు.

**తాత్పర్యం:** నీవు నాకు భర్త వైతే మా అన్న నిన్ను తన వాడినిగా స్వీకరిస్తాడు. కీడుచేయకుండా నిన్ను కాపాడుతాడు. అమితప్రేమచేత ఈ జన్మలో నువ్వే నాకు భర్తవు.

**విశేషం:** హిడింబ జన్మచే రాక్షసవనిత. కాని, ఉత్తమ మానవలక్షణాలతో కూడుకొన్న పతివ్రత. హాస్యానికై అబద్ధం పలకదు. ఆమె భీముడిని చూచింది. మన్మథభావానికి గురిఅయింది. అయినా, ఆమె భీముడిని కామంతో చంచలదృష్టితో చూడలేదు. అతడే ఆమెకు జన్మంతా భర్తగా ఉండాలని భావించింది. అతనికొరకు తన అన్నను వదలివేయటానికికూడా వెనుకాడలేదు. జనానంతర సౌహృదాల జాగృతివలన భీముడిని భర్తగా కోరిన ఉత్తమఇల్లాలు హిడింబ. పాండవులకు ప్రథమ సంతతిని ప్రసాదించబోయే ఆ పాత్రను నన్నయ ఉదాత్తంగా పోషించాడు.

**చ. ఉఱఁడు సురేంద్రు నైన బలియుండు హిడింబుఁడు వానిబారికిన్**
**వెఱవనివారలుం గలరె? వీరలు ముంద రెఱుంగ రక్కటా!**
**యెఱిఁగిరయేని యిట్లు దమయిండులనుండిన యట్లు మెచ్చ కే**
**మఱి శయనింతురే; కడుఁ బ్రమాదము సేసిరి బుద్ధిహీను లై. 195**

**ప్రతిపదార్థం:** బలియుండు= బలవంతుడైనవాడు; హిడింబుఁడు; సుర+ఇంద్రున్+ఐన= దేవేంద్రుడి నైనా; ఉఱఁడు= లెక్కపెట్టడు; వాని, బారికిన్= వాని హింసకు; వెఱువని, వారలున్= భయపడనివారు; కలరె= ఉన్నారా!; వీరలు= వీరు; అక్కటా= అయ్యో!; ముందర+ఎఱుఁగరు= ముందుగా తెలియరు; ఎఱిఁగిర+ఏని= తెలిసికొని ఉంటే; ఇట్లు= ఈ విధంగా; తమ, ఇండులన్= తమయొక్క ఇండ్లల్లో; ఉండిన+అట్లు = ఉన్నవిధంగా; మెచ్చక+ఏ= లెక్కచేయకే; మఱి; శయనించుదురె= పడుకొంటారా; కడు, బుద్ధి, హీనులు+ఐ= చాలాబుద్ధిలేనివారై; కడు= మిక్కలి; ప్రమాదము= పొరపాటు; చేసిరి.

**తాత్పర్యం:** హిడింబుడు బలవంతుడు. దేవేంద్రుడినికూడా లెక్కపెట్టడు. అతనిదెబ్బకు భయపడనివాళ్ళు లేరు. అయ్యో! వీళ్ళకు ముందుగా తెలియదు. తెలిసి ఉంటే ఈ విధంగా తమ ఇండ్లలో ఉన్నట్టు ఇతడిని లెక్కచేయకుండా ఇట్లా పడుకొంటారా! బుద్ధిహీనులై పెద్దపొరపాటు చేశారు.

**విశేషం:** 'ఉఱడు సురేంద్రు నైన' అనే దానికి ఉఱుకు సురేంద్రుఁడైన' అనే పాఠాంతరం ఉంది.

**వ. 'ఇది హిడింబువనంబు; దీనం జొచ్చి వెలువడుట జముకుత్తుకఁ జొచ్చి వెలువడునట్లు; యాతం డింతకు వచ్చు; వీరితోడి దేమి; నీవు నాకుఁ బతి వై ప్రాణంబు రక్షించుకొని నావలన నిష్టోపభోగంబు లందు; మేనును గామచారిణిని; నీ కిష్టం బైన చోటికి నిన్నుఁ దోడ్కొనిపోవనేర్తు ననిన దానికి భీముం డి ట్లనియె. 196**

**ప్రతిపదార్థం:** ఇది; హిడింబు, వనంబు= హిడింబునియొక్క అడవి; దీనిన్+చొచ్చి= దీనిలో ప్రవేశించి; వెలువడుట= బయటపడటం; జము, కుత్తుకన్= యముడియొక్క గొంతులో; చొచ్చి= ప్రవేశించి; వెలువడునట్లు+అ= బయటికి వచ్చినట్లే; అతండు= హిడింబుడు; ఇంతకున్= ఇంతలో; వచ్చున్= రానున్నాడు; వీరితోడిది+ఏమి= వీళ్ళతో ఏం పని; నీవు; నాకున్; పతివి+ఐ= భర్తవై; ప్రాణంబు; రక్షించుకొని; నావలనన్; ఇష్ట+ఉపభోగంబులు+అందుము= ఇష్టమైన సుఖాలు అనుభవించుము; ఏనును= నేనుకూడ; కామ, చారిణిన్= ఇచ్ఛ వచ్చిన చోటికి పోయేదాన్ని; నీకు+ఇష్టంబు+ఐన, చోటికిన్; నిన్నున్+తోడ్కొని= నిన్ను తీసుకొని; పోవనేర్తున్= పోగలను; అనినన్= అనగా; దానికిన్= హిడింబకు; భీముండు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఇది హిడింబాసురుడి అడవి. దీంట్లో ప్రవేశించి బయటికి పోవటం యముడి కుత్తుకలో ప్రవేశించి బయటపడటమే. ఇప్పుడే హిడింబుడు రాబోతున్నాడు. తక్కినవాళ్లసంగతి మన కెందుకు? నీవు నాకు భర్తవై ప్రాణాలు రక్షించుకొని నావలన కోరినసుఖాలు అనుభవించుము. నేను కోరినచోటికి పోగలదాన్ని. నీ కిష్టమైన చోటికి నిన్ను తీసికొని పోతాను' అని అనగా హిడింబతో భీముడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. విను బేల! యెట్టికష్టుఁడుఁ । దన పురుష గుణంబు పెడఁగఁ దల్లిని దోఁబు**
**ట్టినవారి విడిచి రాగం । బునఁ జపల స్త్రీ సుఖంబుఁ బొందునె చెపుమా. 197**

**ప్రతిపదార్థం:** విను= వినుము; బేల= అమాయకురాలా; ఎట్టి, కష్టుఁడున్= ఎటువంటి నీచుడైనా; తన, పురుష, గుణంబు+చెడఁగన్= తన పురుష లక్షణం చెడిపోయేటట్లు; తల్లిని; తోన్+పుట్టినవారిన్= సోదరుల్ని; విడిచి; రాగంబునన్= మోహంచేత; చపల, స్త్రీ, సుఖంబున్= నిలుకడలేని స్త్రీవలనిసుఖాన్ని; పొందునె, చెపుమా= పొందుతాడా! చెప్పుము.

**తాత్పర్యం:** అమాయకురాలా! ఎంతటి నీచపురుషుడైనా తనపురుష లక్షణం పోగొట్టుకొని - తల్లిని, తోబుట్టువులను వదలి మోహంలో పడి చంచలమైన స్త్రీసుఖాన్ని పొందుతాడా! చెప్పుము.

**విశేషం:** 'బేల!', 'చపల స్త్రీ సుఖంబు' అనే రెండు శబ్దప్రయోగాల శక్తివలన ప్రతీయమానమయ్యే ధ్వని ఈ పద్యంలో ప్రాణం. వనంలో ప్రవేశించి సుఖంగా నిద్రిస్తున్న ధర్మజాదులను బుద్ధిహీనులనుగా భావించే హిడింబ, భీమునికి అమాయకురాలుగా అనిపించింది. మనసులో మెరసిన మదనభావానికి బానిస అయి ఆప్తులను వదలుకొనే లక్షణం చపల స్త్రీలకు సహజం. ఆమె భర్త మీదకూడ చపల ప్రణయమే కలిగిఉంటుందని భీముని వ్యాఖ్య. అందువలన ఇకపై హిడింబ తాను బేల కాదనీ, చపల కాదనీ మాటలతో, చేతలతో నిరూపించుకొని తనగాఢమైన ప్రేమను చాటుకొంది. భీముడు తాను ప్రౌఢుడననీ, బంధుప్రీతి కలవాడననీ చెప్పుకొన్నాడు. హిడింబాభీముల ప్రవృత్తులు విరుద్ధాలని భీముని భావనం. (సంపా.)

**వ. అనిన విని హిడింబ వీరి 'నందఱ రక్షించుట నీకుఁ బ్రియం బేని య ప్పురుషాదుండు రాకుండ ముంద వీరి నెత్తుకొని పోయెద; వీరలఁ బ్రబోధింపు' మనిన భీముం డి ట్లనియె. 198**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; విని; హిడింబ; వీరిన్+అందఱన్= వీళ్ళను అందరినీ; కాపాడుట= రక్షించుట; నీకు; ప్రియంబు+ఏని= ఇష్టమైతే; ఆ+పురుషాదుండు= ఆ మనుష్యులను తినేవాడు - ఆ రాక్షసుడు; రాకుండన్, ముంద= రాక; ముందుగానే; వీరిన్= వీళ్లను; ఎత్తుకొని, పోయెదన్; వీరలన్+ప్రబోధింపుము= వీరిని మేల్కొనుపుము; అనినన్= అనగా; భీముండు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'వీరి నెత్తుకొని పోయెద' అనిన విని హిడింబ భీమునితో 'వీ ళ్ళందరిని రక్షించటం నీ కిష్ట మైతే నరమాంసభక్షకుడైన ఆ రాక్షసుడు రాకముందే వీళ్ళను మేల్కొలుపుము' అనగా భీముడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** సతికి తోబుట్టువుకోరికకంటె కట్టుకొన్నవాడిఇష్టమే ఎక్కువ అని వ్యంగ్యంగా హిడింబ చెప్పింది.

**తే. అధికవీరుండు రక్కసుఁ డరుగుదెంచు । నని మనంబున భయమంది వనజనేత్ర!**
**వీరిసుఖసుప్తులై యున్నవారి నిద్ర । సెడఁగ బోధింప నోప; నాకడిమి వినుము. 199**

**ప్రతిపదార్థం:** వనజ, నేత్ర= పద్మాలవంటి కన్నులు కలదానా!; అధిక వీరుండు= మేటివీరుడు; రక్కసుఁడు; అరుగుదెంచున్+అని= వస్తాడని; మనంబునన్, భయము+అంది= భీతి చెంది; సుఖ, సుప్తులు+ఐ+ఉన్నవారి= సుఖంగా నిద్రిస్తున్న వాళ్ళయిన వాళ్ళని; వీరిన్= వీళ్ళని; నిద్ర+చెడఁగన్= నిద్ర చెడిపొయ్యేటట్లు; బోధింపన్+ఓపన్= మేల్కొలుపలేను; నా, కడిమి= నా యొక్కబలం; వినుము.

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు కలదానా! మేటి వీరుడైన ఒక రాక్షసుడు వస్తున్నాడని సుఖంగా నిద్రిస్తున్న వీళ్ళను నిద్ర చెడిపొయ్యేటట్లు మేల్కొలుపలేను. నా బలాన్నిగూర్చి వినుము.

**విశేషం:** 'కన్యా వరయతే రూపం' అనే న్యాయంతో భీముడిని మనోహరరూపాన్ని చూచి అతడిని వలచింది హిడింబ. పరుల ఆధిక్యాన్ని తన యెదుట కీర్తిస్తే సహించలేని ఆత్మాభిమానం గల మహావీరుడు భీముడు. అయితే అతడు స్వభావంచేత ఉద్ధతుడు. తన పరాక్రమాదులను తానే కీర్తించకొనబోతున్నాడు. అతని మాటలవలన భీమునికి రూపానికి అనువైన పౌరుషంకూడా ఉన్నదని హిడింబకు తెలుస్తుంది. (సంపా.)

**ఉ. క్రచ్చఱ నొక్కరక్కసుఁడ కాఁడు సురాసురులెల్ల నొక్కటై**
**వచ్చిన నీవ చూడఁగ నవార్యబలోన్నతిఁజేసి వారలన్**
**వ్రచ్చి వధింతుఁగాక; యిటు వచ్చి శ్రమంపడియున్న నిచ్చట**
**న్మెచ్చగువీరి దైన సుఖనిద్రకు భంగము సేయనెర్తునే. 200**

**ప్రతిపదార్థం:** క్రచ్చు+అఱన్= మాంద్యము - మెల్లదనం - తొలగేటట్లుగా - అంటే వేగంగా; ఒక్క, రక్కసుఁడు+అ, కాఁడు= ఒక్కరాక్షసుడు మాత్రమే కాదు; సుర+అసురులు+ఎల్లన్= దేవతలు, రాక్షసులు అందరు; ఒక్కటి+ఐ= ఏకమై; వచ్చినన్= వచ్చినప్పటికీ; ఈవు+అ= నీవే; చూడగఁన్= చూస్తుండగా; అవార్య, బల+ఉన్నతిన్+చేసి= అడ్డుకొన సాధ్యం కాని బలంయొక్క ఆధిక్యంతో; వారలన్=వాళ్లను; వ్రచ్చి= చీల్చి; వధింతున్+కాక= చంపుతాను కాని; ఇటు, వచ్చి= ఈ విధంగా వచ్చి; శ్రమంపడి= అలసట పొంది; ఉన్నన్=ఉండగా; ఇచ్చటన్= ఇక్కడ; మెచ్చు+అగు= మెచ్చుకోదగిందైన; వీరిది+అగు= వీళ్ల; సుఖ, నిద్రకున్= సుఖమైన నిద్రకు; భంగము= ఆటంకం; చేయనేర్తునే= కలిగిస్తానా!

**తాత్పర్యం:** వేగంతో ఒక్క రాక్షసుడే కాదు దేవదానవులంతా ఏకమై వచ్చినా, నీవు చూస్తుండగా అపారబలంతో వాళ్ళను చీల్చి చంపుతాను. కాని, ఈ విధంగా వచ్చి అలసటచెంది సుఖంగా నిద్రించే వీళ్ళనిద్రకు భంగం కలిగిస్తానా?

**విశేషం:** పరపరాక్రమ వర్ణనంవలన ఏర్పడిన సాహంకారక్రోధంతో ఆత్మప్రశంసారూపమైన ప్రతాపోక్తులు పలకటం భీమపాత్రకు సహజం. క్రోధభాద్రమైన ఉత్సాహభావాన్ని దీప్తరసత్వం కల ఉజ్జ్వలవాక్యాలలో వ్యక్తంచేసిన భీముడిమాటలను కాంతిగుణంలో ప్రకాశింపచేయటం నన్నయ రుచిరార్థసూక్తినిధిత్వ లక్షణం. (సంపా.)

**వ. 'పెక్కులు వలుకక యారక్కసురాఁ బనుపు' మని భీమసేనుండు విజృంభించి పలుకుచున్నంత నట హిడింబుండు హిడింబ మసలుటకు మహాక్రోధానలజ్వలితచిత్తుం డయి. 201**

**ప్రతిపదార్థం:** పెక్కులు+పలుకక= ఎక్కువమాటలాడక; ఆ, రక్కసున్, రాన్+పనుపుము= ఆ రాక్షసుడిని వచ్చేట్లు పంపుము; అని= ఆ ప్రకారం; భీమసేనుండు; విజృంభించి; పలుకుచు+ఉన్న+అంతన్= పలుకుతూ ఉండే సమయంలో; అట హిడింబుండు= హిడింబాసురుడు; హిడింబ; మసలుటకు= ఆలస్యం చేయటానికి; మహా+క్రోధ+అనల, జ్వలిత, చిత్తుండు+అయి= మిక్కిలి కోపమనే నిప్పుచేత మండుతున్న మనస్సుకలవాడై.

**తాత్పర్యం:** 'ఎక్కువగా మాట్లాడక ఆ రాక్షసుడిని ఇక్కడికి పంపు' మని భీమసేనుడు పెచ్చుపెరిగి పలుకుతుండగా - అక్కడ హిడింబుడు, హిడింబ ఆలస్యం చేసినందుకు మిక్కిలి కోపించి.

**సీ. కాలమేఘంబునుబోలె విశాల మై । నీల మై దేహంబు గ్రాలుచుండ**
**ఘనతటిల్లతలయ ట్లెనిమిది దంష్ట్రలు । మెఱవంగఁ బండులుఁ గొఱికి పెలుచ**
**నతిరోషలోహితాయతవృత్తనేత్రముల్ । దిరుగంగఁ బెట్టుచుఁ బరుషకేశ**
**జాలంబు గాడ్పునఁ దూలంగఁ గాలోప । మానుఁ డై చనుదెంచి మానుషాదుఁ.**

**ఆ. దనుజఁ జూచి 'కష్టమనుజులఁ గూడి నా । పనుపు సేయకుండఁ జనునె నీకు?'**
**ననుచు నుదరిపలుక విని హిడింబయుఁ గడు । వెఱచి భీమసేను మఱువు సొచ్చె. 202**

**ప్రతిపదార్థం:** కాల, మేఘంబును+పోలెన్= నల్లనిమేఘంవలె; విశాలము+ఐ; నీలము+ఐ= నీలిరంగు గల దేహంబు; క్రాలుచున్+ఉండన్= ఒప్పుతూ ఉండగా; ఘన, తటిత్+లతల+అట్లు= మేఘంలోని మెరుపుతీవలవలె; ఎనిమిది, దంష్ట్రలు= ఎనిమిదికోరలు; మెఱవంగన్= ప్రకాశిస్తుండగా; పెలుచన్= గట్టిగా; పండులు= పండ్లు; కొఱికి, అతి, రోష, లోహిత+ఆయత, వృత్త, నేత్రముల్= మిక్కిలికోపంతో ఎఱ్ఱనై, నిడుపులై గుండ్రనివైన కన్నులు; తిరుగంగన్+పెట్టుచున్= తిప్పుతూ; పరుష, కేశ, జాలంబు= బిరుసైన వెండ్రుకల సమూహం; గాడ్పునన్= గాలిచేత; తూలంగన్= కదలగా; కాల+ఉపమానుఁడు+ఐ= యమునితో పోల్చదగినవాడై; చనుదెంచి= వచ్చి; మానుషాదుఁడు= మానవమాంసం తినేవాడు-రాక్షసుడు; అనుజన్= తోబుట్టువును - చెల్లెలిని; చూచి; కష్ట, మనుజులన్+కూడి= నీచులైన మానవులతో కూడి; నా, పనుపు+చేయకుండన్= నాయొక్క ఆజ్ఞను పాటించకుండటం; నీకున్; చనునె= తగునా; అనుచున్= అని అంటూ; ఉదరి= పైకెగసి; పలుకన్= మాటాడగా; విని=ఆలకించి; హిడింబయున్; కడున్= మిక్కిలి; వెఱచి= భయపడి; భీమసేను, మఱువు+చొచ్చెన్= భీమునిచాటుకు వెళ్ళింది.

**తాత్పర్యం:** నల్లనిమబ్బువంటి పెద్దదేహంతో, మేఘంలోని మెరపు తీగలవంటి ఎనిమిదికోరలతో, గట్టిగా పండ్లుకొరికి; కోపంతో ఎర్రబడి, నిడుపులై, గుండ్రనివైన కళ్ళు తిప్పుతూ, బిరుసువెండ్రుకలు గాలికి కదులుతూ ఉండగా - యముడివంటిరాక్షసుడు హిడింబుడు వచ్చి, చెల్లెలిని చూచి 'నీవు నీచులైన మానవులతో కలిసి నా ఆజ్ఞ త్రోసిపుచ్చటం తగునా?' అని గద్దించి పలుకగా హిడింబ మిక్కిలి భయపడి భీమునిచాటుకు వెళ్ళింది.

**విశేషం:** అలం: ఉపమ.

## భీమసేనహిడింబాసురుల యుద్ధము (సం.1-141-15)

**వ. అంత. 203**

**తాత్పర్యం:** అప్పుడు.

**ఉ. పన్నగవైరి విక్రముఁడు పాండవ సింహము దానిఁ జూచి 'మీ**
**యన్నను నన్నుఁ జూడుము భయంపడకుండుమ' యంచు, వాని న**
**త్యున్నతిఁ దాఁకి 'రాక్షస! వధోచిత! నీ బల గర్వ మేదఁగా**
**నిన్ను వధించి యివ్వనము నెట్టన చేసెద నిర్భయంబుగన్'. 204**

**ప్రతిపదార్థం:** పన్నగవైరి, విక్రముఁడు= పాములకు శత్రువైన గరుడునివంటి పరాక్రమం కలవాడు; పాండవ, సింహము= పాండవులలో శ్రేష్ఠుడు - భీముడు; దానిన్= ఆ హిడింబను; చూచి, మీ, అన్నను; నన్నున్, చూడుము; భయంపడక+ఉండుము= భయపడకుండా ఉండు; అంచున్= అనుచు; వానిన్= ఆ హిడింబాసురుని; అతి+ఉన్నతిన్= పెద్దఎత్తున; తాఁకి= ఎదుర్కొని; రాక్షస= ఓ రాక్షసుడా!; వధ+ఉచిత= చంపదగినవాడా!; నీ, బల, గర్వము+ఏదఁగాన్= నీ యొక్క బలంయొక్క పొగరు నశించేటట్లుగా; నిన్నున్; వధించి= చంపి; ఈ+వనమునన్= ఈ అడవిని; నెట్టన= తప్పనిసరిగా; నిర్+భయంబుగన్= భయంలేని దానినిగా, చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** గరుత్మంతునివంటి పరాక్రమం కల భీముడు, ఆ హిడింబతో -'మీ అన్నను, నన్ను చూడుము. భయపడకుము' అని పలికి ఆ హిడింబాసురుని పెద్దఎత్తున ఎదుర్కొని 'రాక్షసా! నీవు చంపదగినవాడివి; నీ బలగర్వం నశించేటట్లు నిన్ను చంపి, ఈ అడవిని తప్పక భయం లేని దాన్నిగా చేస్తాను' అన్నాడు.

**విశేషం:** హిడింబునికి భయపడి భీముని అండజేరింది-హిడింబ. భీముడిబాధ్యత పెరిగింది. తన బలానికీ హిడింబుడి బలానికీ గల భేదాన్ని చూడటానికి ఆమెను అక్కడే నిలవబడుమన్నాడు-భీముడు. 'తొలగిపొమ్ము' నుండి 'భయపడకుండా నిలిచిచూడు' అన్నంతవరకు మాట మారింది. ఆ మార్పుకు అభిమానమే కారణం, కాని భీమునికి ఆమెపట్ల కలిగిన వలపు కాదు. ఏమైనా వైముఖ్యంనుండి సౌముఖ్యంవరకు దిగేటట్లు భీముడిని ఆకట్టుకొనగలిగింది హిడింబ. (సంపా.)

**క. 'చక్క నగు' మనిన రక్కసుఁ । డక్కజముగఁ బెరిఁగి 'యియ్యయగు నిప్పుడు, నీ**
**యుక్కును బీరముఁ జూచెదఁ । జిక్కక నిలు' మనుచుఁ గడు విజృంభించి వడిన్. 205**

**ప్రతిపదార్థం:** చక్కనగుము= చక్కగా, నిలువు; అనినన్= అనగా; రక్కసుఁడు; అక్కజముగన్= ఆశ్చర్యకరంగా; పెరిగి= విజృంభించి; ఇయ్య+అగున్= అంగీకారమవుతుంది; ఇప్పుడు; నీ+ఉక్కును= నీయొక్క బలాన్ని; బీరమున్= పరాక్రమాన్ని; చూచెదన్= చూస్తాను; చిక్కక= వెనుదీయక; నిలుము; అనుచున్= అంటూ; కడున్= మిక్కిలి; విజృంభించి= పెచ్చుపెరిగి; వడిన్= వేగంగా.

**తాత్పర్యం:** 'చక్కగా నిలువు' మనగానే రాక్షసుడు ఆశ్చర్యకరంగా విజృంభించి, సరే, అని 'నీ బల పరాక్రమాలను చూస్తాను గాక! వెనుదీయక నిలబడు' అని పెచ్చుపెరిగి వేగంగా.

**క. చే సమరికొంచుఁ బొడువఁగ । డాసినఁ దద్భుజముతోన డగ్గఱఁగ జయో**
**ద్భాసి యయి పట్టికొనియె మ । హాసత్త్వుఁడు భీమసేనుఁ డమ్మనుజాదున్. 206**

**ప్రతిపదార్థం:** చే, సమరికొంచున్= చేయి చరుచుకొంటూ; పొడువఁగన్= కొట్టడానికి; డాసినన్= సమీపించగా; మహాసత్త్వుఁడు= మిక్కిలి బలం గలవాడు; భీమసేనుఁడు, జయ+ఉత్+భాసి+అయి= విజయంతో మిక్కిలి ప్రకాశించేవాడై; ఆ+మనుజాదున్= ఆ రాక్షసుడిని; తత్+భుజముతోన, డగ్గఱఁగన్= ఆ భుజంతోగూడ దగ్గరగా; పట్టుకొనియెన్.

**తాత్పర్యం:** చేయి చరచి కొట్టటానికి మీదికి రాగా, మహాబలవంతుడైన భీముడు గెలుపు పొంది వెలిగేవాడై ఆ రాక్షసుణ్ణి వాడిచేతితోసహా దగ్గరగా పట్టుకొన్నాడు.

**క. 'నిరుపద్రవసుఖనిద్రా । నిరతాత్మకు లయిన వీరినిద్రకు నస్మ**
**చ్చరణభుజఘాతశబ్దం । బరుదుగ విఘ్నంబు సేయు' నని వగచి మదిన్. 207**

**ప్రతిపదార్థం:** నిర్+ఉపద్రవ, సుఖ, నిద్రా, నిరత+ఆత్మకులు+అయిన= హానిలేని సుఖమైన నిద్రలో తగిలిన మనస్సు కలవాళ్ళయిన; వీరి+నిద్రకున్; అస్మత్+చరణ, భుజ, ఘాత, శబ్దంబు= మాయొక్కకాళ్ళయొక్క చేతులయొక్క దెబ్బలధ్వని; అరుదుగన్= ఆశ్చర్యంగా; విఘ్నంబు+చేయున్+అని= ఆటంకం కలిగిస్తుందని; మదిన్= మనస్సులో; వగచి= బాధపడి.

**తాత్పర్యం:** భంగం లేని సుఖనిద్రలో ఉండే వీళ్ళనిద్రకు, తమకాళ్ళచేతుల దెబ్బల ధ్వని ఆటంకం కలిగిస్తుందని మనసులో బాధపడి.

**క. వడముడి యారక్కసు న । య్యెడ కష్టధనుఃప్రమాణ మెడ గలుగఁగ నె**
**వ్వడి నీడ్చె నల్పమృగమును । విడువక గజవైరి యీడ్చువిధమునఁ బెలుచన్. 208**

**ప్రతిపదార్థం:** వడముడి= భీముడు; ఆ రక్కసున్; ఆ+ఎడకున్= ఆ ప్రదేశానికి; అష్ట, ధనుః, ప్రమాణము= ఎనిమిది విండ్లకొలత; ఎడ+కలుగఁగన్= దూరం ఉండేటట్లు; నెఱ+వడిన్= మిక్కిలి వేగంతో; గజవైరి= ఏనుగుల శత్రువైన సింహం; అల్ప, మృగమును= చిన్నజంతువును; విడువక; పెలుచన్= గట్టిగా; ఈడ్చు, విధమునన్; ఈడ్చెన్= ఈడ్చాడు.

**తాత్పర్యం:** భీము డా రాక్షసుణ్ణి - సింహం చిన్న జంతువును వదలక గట్టిగా ఈడ్చేటట్లు - ఆ ప్రదేశానికి ఎనిమిది ధనుస్సుల కొలత గల దూరానికి మిక్కిలి వేగంగా ఈడ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ. ధనుస్సు= నాల్గుమూరలకొలత. అష్టధనుస్సులు కనుక ముప్పైరెండు మూరల దూరం.

**వ. అట్టియెడ. 209**

**తాత్పర్యం:** అటువంటి సమయంలో.

**చ. చరణహతిన్ మహాతరులు సాల్పడి జర్జరితంబు లై మహిం**
**దొరఁగఁగ నిట్టు లొండొరులతోడ మదోద్ధతషష్టిహాయన**
**ద్విరదములట్లు ఘోరరణవీరులు సేసిరి మల్లయుద్ధ ము**
**ద్ధురబలు లై సమీరణసుతుండు హిడింబుఁడు తద్వనంబునన్. 210**

**ప్రతిపదార్థం:** ఘోర, రణ, వీరులు= భయంకరమైన యుద్ధవీరులు; సమీరణ, సుతుండు= వాయుదేవునియొక్క కుమారుడు - భీముడు; హిడింబుఁడు; చరణ, హతిన్= కాళ్ళయొక్క త్రొక్కిడిచేత; మహా, తరులు= పెద్దచెట్లు; చాలు+పడి= వరుసగా పడి; జర్జరితంబులు+ఐ= విరిగినవై; మహిన్+తొరగఁగన్= భూమిమీద పడగా; ఒండు+ఒరులతోడన్= ఒకరితో నొకరు; ఇట్టుల= ఈ విధంగా; మద+ఉద్ధత, షష్టి, హాయన, ద్విరదముల+అట్లు= మదంచేత గర్వించిన అరవయ్యేండ్ల మదపుటేనుగులవలె; ఉద్ధుర, బలులు+ఐ= ఎక్కువైన బలంగలవాళ్ళయి; తత్+వనంబునన్= ఆ అడవిలో; మల్లయుద్ధము; చేసిరి.

**తాత్పర్యం:** భయంకర యుద్ధవీరులైన భీమహిడింబులు - తమకాళ్ళతొక్కిడికి వరుసగా పెద్దపెద్ద వృక్షాలు విరిగి నేల కొరిగేటట్లు, అరవయ్యేండ్ల మదపుటేనుగులవలె ఆ అడవిలో ఒకరితో ఒకరు మల్లయుద్ధం చేశారు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. భూరిపదఘాతజాత ధ।రారేణుప్రకరధూసరశరీరకు లై**
**వా రిద్దఱు నొప్పిరి నీ। హారచ్ఛన్నంబు లయిన యద్రులపోలెన్. 211**

**ప్రతిపదార్థం:** భూరి, పద, ఘాత, జాత, ధరా, రేణు, ప్రకర, ధూసర, శరీరకులు+ఐ= గొప్పవైన కాళ్ళయొక్క తొక్కిళ్ళవలన పుట్టిన భూమియొక్క దుమ్ముకణాల సమూహంచేత బూడిదరంగు గల దేహం కలవాళ్ళయి; వారు+ఇద్దఱున్= భీమ హిడింబు లిద్దరు; నీహార, చ్ఛన్నంబులు+అయిన= మంచుచేత కప్పబడ్డవైన, అద్రుల, పోలెన్= పర్వతాలవలె; ఒప్పిరి=ఉండిరి.

**తాత్పర్యం:** గొప్పవైన కాళ్ళతొక్కిళ్ళచేత పుట్టిన దుమ్ము కప్పి, బూడిదరంగుదేహాలు కలవాళ్ళయి భీమ హిడింబు లిద్దరు మంచుచేత కప్పబడిన కొండలవలె ఉన్నారు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఆరాక్షసుండు భీము న। పారభుజాబంధనమున బంధించి మహా**
**ధీరధ్వని రోదోంతర। పూరిత మగునట్లు గాఁగ బొబ్బిడి యార్చెన్. 212**

**ప్రతిపదార్థం:** ఆ, రాక్షసుండు; భీమున్; అపార, భుజా, బంధమునన్= అంతులేని చేతుల బిగింపుచే; బంధించి= కట్టివేసి; మహాధీర, ధ్వని= గొప్ప ధీరునియొక్క ధ్వని - గొప్ప ధైర్యంతో కూడినశబ్దం; రోదోంతర, పూరితము+అగునట్లు+కాఁగన్= భూమ్యాకాశాల నడుమ నిండింది అయ్యేట్లుగా; బొబ్బ+ఇడి= సింహనాదం చేసి; ఆర్చెన్= అరచాడు.

**తాత్పర్యం:** ఆ రాక్షసుడు భీముణ్ణి గట్టిగా చేతులతో బంధించి గొప్పధీరునివలె భూమ్యాకాశాల మధ్య భాగమంతా నిండేట్లు పెద్దగా సింహనాదం చేసి అరచాడు.

**వ. అమ్మహాధ్వని విని కుంతియుఁ గొడుకులును మేల్కని, తమసమీపంబున నతిమానుషం బయిన రూప సౌందర్యములతో నున్న హిడింబం జూచి, 'యిది వనదేవతయో సురకన్యయో' యనుచు విస్మయంబంది; రంతం గుంతి శాంతవచనంబుల 'నీ వెందులదాన? విట కేల వచ్చి?' తని యడిగిన నది యి ట్లనియె. 213**

**ప్రతిపదార్థం:** ఆ+మహాధ్వని= ఆ పెద్దశబ్దం; విని, కుంతియున్, కొడుకులున్; మేలు+కని= మేల్కొంచి, నిద్ర తెలిసి; తమ, సమీపంబునన్; అతి, మానుషంబు+అయిన= మానవులకు అతిక్రమించిందైన - అంటే, మానవులకు లేనట్టిదైన; రూప, సౌందర్యములతోన్= ఆకారంతో, అందంతో; ఉన్న= ఉండిన; హిడింబన్; చూచి, ఇది; వన, దేవతయో= వనదేవతయో; సుర, కన్యయో= దేవతాకాంతయో; అనుచున్= అని తలస్తూ; విస్మయంబు+అందిరి= ఆశ్చర్యపడ్డారు; అంతన్= తరువాత; కుంతి; శాంత, వచనంబులన్= మెల్లనిమాటలతో; నీవు, ఎందుల, దానవు= నీవు ఎక్కడిదానివి; ఇటకు+ఏల= ఇక్కడికి ఎందు లకు; వచ్చితివి+అని-వచ్చా వని; అడిగినన్= అడుగగా; అది= ఆ హిడింబ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ పెద్దశబ్దం విని కుంతీదేవీ, కొడుకులూ మేల్కొని తమసమీపంలో మానవాతీతమైన రూప సౌందర్యాలతో ఉన్న హిడింబను చూచి, ఇది వనదేవతో లేక దేవకాంతో అని ఆశ్చర్యపడ్డారు. తర్వాత కుంతి మెల్లని మాటలతో 'నీవు ఎక్కడి దానివి? ఇక్కడి కేల వచ్చావు?' అని అడుగగా అమెతో ఆ హిడింబ ఇట్లా చెప్పింది.

**సీ. నీలజీమూతంబులీల నాక్షేపించి । నల్ల నై తోతెంచు నల్లగృహము**
**గల హిడింబుం డను బలితంపురక్కసు । చెలియల; నాతండు వెలయ మీకు**
**రోయక యహితంబు సేయ నన్ బంచినఁ । జనుదెంచి, యేను మీ తనయునందుఁ**
**బతిబుద్ధిఁ దాల్చి యుద్ధతమన్మథార్త నై । మసలితి; మసలిన నసుర వచ్చి.**

**తే. యలిగి, మీతోడ నన్నును గలయఁ బట్టి । మ్రింగ నున్న నయ్యసురతోడం గడంగి**
**మల్లయుద్ధంబు సేయుచు నల్లచోట । నున్నవాఁడు మీసుతుఁడు దర్పోన్నతుండు. 214**

**ప్రతిపదార్థం:** నీల, జీమూతంబు, లీలన్= నల్లనిమేఘంయొక్క విలాసాన్ని; ఆక్షేపించి= త్రోసిపుచ్చి, నల్లన+ఐ=నల్లగా; తోతెంచు= కనిపించేటి; అల్ల, గృహము= ఆ యిల్లు; కల= కలిగిన; హిడింబుండు+అను; బలితంపు, రక్కసు, చెలియలన్= బలవంతుడైన రాక్షసునియొక్క చెల్లెలిని; అతండు= ఆ హిడింబుడు; వెలయన్= ప్రకాశించగా; రోయక= విడువక; మీకున్= మీకు అందరికీ; అహితంబు+చేయన్= కీడుచేయటానికి; నన్= నన్ను (హిడింబను); పంచినన్= ఆజ్ఞాపించగా; ఏను= నేను, మీ, తనయునందు= మీ కుమారునిమీద; పతి, బుద్ధిన్= భర్త అనే మనస్సును; తాల్చి= ధరించి; ఉద్ధత, మన్మథ+ఆర్తను+ఐ= మిక్కిలి మన్మథబాధను పొందినదాన్నై; మసలితిన్= ఆలస్యంచేశాను; మసలినన్= ఆలస్యం చేయగా; అసుర= రాక్షసుడు; వచ్చి, అలిగి= కోపించి; మీతోడన్= మీతో; నన్నును= నన్నుకూడా; కలయన్+పట్టి= మిక్కిలి గట్టిగా నిర్బంధించి; మ్రింగన్+ ఉన్నన్= మ్రింగబోతుండగా; ఆ, అసురతోడన్= ఆ రాక్షసునితో; కడంగి= పూనుకొని; మల్లయుద్ధంబు+చేయుచున్; దర్ప+ ఉన్నతుండు= గర్వంలో అధికుడైనవాడు; మీ సుతుఁడు= మీ కుమారుడు; అల్ల, చోటన్= ఆ ప్రదేశాన; ఉన్నవాఁడు= ఉన్నాడు.

**తాత్పర్యం:** మేఘకాంతిని మించిన నల్లదనంతో కన్పట్టే ఆ యిల్లు గల హిడింబుడనే రాక్షసుడి చెల్లెలిని. అతడు మీకు కీడు చెయ్యమని నన్ను పంపిస్తే, నేను మీ కుమారుణ్ణి భర్తగా భావించి, మన్మథబాధ పొంది ఆలస్యం చేయటంచేత, అతడు వచ్చి కోపించి మీతో పాటు నన్నుగూడ మ్రింగబోయాడు. అప్పుడు గర్వాధికుడైన మీ కుమారుడు పూనుకొని అతనితో మల్లయుద్ధం చేస్తూ అదిగో అక్కడ ఉన్నాడు.

**విశేషం:** అన్నిచోట్ల ప్రాసయతి గల సీసం. ప్రసాదగుణంగల రచనలో - ప్రసన్నంగా మాట్లాడిన హిడింబమాటలు రచించటం, ఒక్కగుక్కలో ఎంతోకథను చెప్పుతున్న స్ఫూర్తిని సీసపద్యరచనలో కలిగించటం నన్నయ కథాకథనశిల్పం. హిడింబమాటలు పొల్లులేనివి, సార్థకమైనవి, సాభిప్రాయమైనవి. 'మీ తనయునందు పతిబుద్ధి తాల్చి, ఉద్ధతమన్మథార్తనై మసలితిని' అన్న వాక్యం ఆమె సంభాషణలో ఆయువుపట్టు. అదే కుంతిమనసును ఆకట్టుకొన్న సమ్మోహనాస్త్రం. 'మీ సుతుడు దర్పోన్నతుండు' అనే మాట కోడలు అత్తతో అనదగిన ఆప్యాయపు అభివ్యక్తి. రాబోయే కథను వస్తుధ్వనితో ప్రసన్నంచేశాడు నన్నయ. (సంపా.)

**వ. 'నన్నును మిమ్మును రక్షించి యా రక్కసు నుక్కడంగ నశ్రమంబున నిప్పడు చంపుం జూడుం' డనిన నందఱు లేచి యుద్ధతులై మల్లయుద్ధంబు సేయుచున్న భీమహిడింబులం జూచి; రంత నచ్చోటికిం జని యర్జునుండు భీమసేనున కి ట్లనియె. 215**

**ప్రతిపదార్థం:** నన్నునున్; మిమ్మునున్; రక్షించి= కాపాడి; ఆ, రక్కసు+ఉక్కు+అడంగన్= ఆ రాక్షసుడిబలం నశించేటట్లు; అశ్రమంబునన్= సులువుగా; ఇప్పుడు= ఈ సమయంలోనే; చంపున్= చంపుతాడు; చూడుండు+అనినన్; అందఱున్, లేచి; ఉద్ధతులు+ఐ= గర్వించినవాళ్ళై, మల్ల, యుద్ధంబు; చేయుచున్+ఉన్న= మల్లయుద్ధం చేస్తూ ఉన్న; భీమ, హిడింబులన్=

భీముడిని, హిడింబుని; చూచిరి; అంతన్= అప్పుడు; అర్జునుండు; ఆ+చోటికిన్ చని= అక్కడకు వెళ్ళి; భీమసేనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నన్నూ మిమ్మల్నీ రక్షించి, ఆ రాక్షసుణ్ణి ఇప్పుడు సులభంగా చంపగలడు చూడండి' అని అనగా-అందరూ లేచి, గర్వించి మల్లయుద్ధం చేసే ఆ భీమహిడింబులను చూచారు. అప్పుడు అర్జునుడు వాళ్ళు యుద్ధం చేసే చోటికి పోయి భీమునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'నన్నూ మిమ్మూ రక్షించి' అనటంలో కలుపుగోలుతనాన్ని, ఆత్మీయతనూ; ' ఆ రాక్షసుడు' అని అన్నను పేర్కొనటంలో పుట్టింటి సంబంధాన్ని త్రెంచుకొని అత్తవారింటిలో కలిసిపోయిన ఆప్యాయతను అద్భుతంగా ప్రదర్శించింది హిడింబ.

**ఉ. తూ ర్పరుణంబుగాఁ దొడఁగె దుష్టనిశాచరవేళ యయ్యెడున్**
**మార్పుము కాలయాపన మమర్చక యప్పిశితాశిఁ బట్టి పా**
**లార్పఁగ నేల నావుడు బలాఢ్యుఁడు భీముఁడు మల్లవిద్య నే**
**ర్పేర్పడఁగా హిడింబు బలహీనపరాక్రముఁ జేసెఁ జెచ్చెరన్. 216**

**ప్రతిపదార్థం:** తూర్పు+అరుణంబు+కాన్+తొడఁగెన్= తూర్పుదిక్కు ఎఱ్ఱపడటం మొదలైంది; దుష్ట, నిశా, చర, వేళ+అయ్యెడున్= దుర్మార్గులైన రాక్షసుల వేళ అవుతున్నది; కాల, యాపనము+అమర్చక= ఆలస్యం చేయక; ఆ+పిశితాశిన్+పట్టి= ఆ రాక్షసుడిని పట్టి; మార్పుము= చంపుము; పాలార్పఁగన్+ఏల= ఉపేక్షించుట ఎందుకు?; నావుడున్= అని అనగా; బల+ఆఢ్యుఁడు= బలంతో కూడినవాడు; భీముఁడు; మల్ల, విద్య, నేర్పు+ఏర్పడఁగాన్= మల్లవిద్యలోని నైపుణ్యం ప్రకాశించేటట్లు; హిడింబున్= హిడింబాసురుణ్ణి; చెర+చెరన్= వెంటనే; బలహీన, పరాక్రమున్= బలం నశించిన పరాక్రమం కలవాణ్ణిగా; చేసెన్.

**తాత్పర్యం:** 'తూర్పు ఎఱ్ఱబడుతున్నది. దుష్టరాక్షసులకు అనుకూల సమయం ఆసన్నమౌతున్నది. ఆలస్యం చేయక ఆ రాక్షసుణ్ణి చంపుము' అని అర్జునుడనగా తనమల్లయుద్ధనైపుణ్యం మెరయగా భీముడు హిడింబాసురుణ్ణి బలహీనుణ్ణి చేశాడు.

**విశేషం:** సంధ్యాసమయం రాక్షసుల కనుకూలమట! పూర్వసంధ్యాసమయంలో రౌద్రముహూర్తం వస్తుందట! అప్పుడు రాక్షసు లెక్కువ శక్తిమంతులవుతారట! 'పుర స్సంరజ్యతే ప్రాచీ । పూర్వా సంధ్యా ప్రవర్తతే । రౌద్రే ముహూర్తే రక్షాంసి । భవంతి బలవంతి చ' - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.376.

**క. వడి నసురవాత ముక్కున । నుడుగక రక్తప్రవాహ మొలుకుచు నుండన్**
**గడకాలు వట్టి వానిని । మడవక పవనజుఁడు నూఱు మాఱులు వీచెన్. 217**

**ప్రతిపదార్థం:** వడిన్= వేగంగా; అసుర, వాత= రాక్షసునియొక్కనోటనుండి; ముక్కునన్= ముక్కునుండి; ఉడుగక= ఆగక; రక్త, ప్రవాహము= నెత్తుటిధార; ఒలుకుచున్, ఉండన్= కారుతూ ఉండగా; పవనజుఁడు= వాయుపుత్రుడైన భీముడు; కడ, కాలు, పట్టి= కాలి చివరిభాగం పట్టుకొని; వానిన్= ఆ హిడింబాసురుడిని; మడవక= వెనుకాడక; నూఱు, మాఱులు; వీచెన్= విసిరాడు (గిరగిర త్రిప్పాడు)

**తాత్పర్యం:** హిడింబాసురుడి నోట, ముక్కున ఆగకుండా నెత్తురుధారలు కారుతూ ఉండగా, భీముడు అతడి కడకాలుపట్టి గాలిలోకి ఎత్తి గిరగిరా వందసార్లు త్రిప్పాడు.

**విశేషం:** విసరటం పవనగుణం. హిడింబుడి కడకాలు పట్టి అతడిని వంగనీయక అతివేగంగా నూరుమారులు విసరిన భీముడిని పవనజుడని సంబోధించటం ఎంతో ఉచితంగా ఉన్నది.

**ఆ. లావు సెడఁగ నిట్లు వీవంగఁ బడి గత। చేష్టుఁ డయిన యసురుఁ జిక్కఁ బట్టి**
**నేలఁ బెట్టి వాని కోలెమ్ము బ్రల్లన। విఱిచి నడుము ద్రుంచి వీచి వైచె. 218**

**ప్రతిపదార్థం:** లావు+చెడఁగన్= బలం నశించేటట్లు; ఇట్లు= ఈ విధంగా; వీవంగన్+పడి= విసరబడి; గత, చేష్టుఁడు+అయిన= పోయినచేష్టలు కలవాడైన; అసురన్= రాక్షసుడిని; చిక్కన్+పట్టి= బిగియపట్టి; నేలన్+పెట్టి= నేలమీద పెట్టి; వాని, కోలెమ్ము= వాడి వెన్నెముకను; బ్రల్లు+అనన్= భళ్ళుమనేటట్లు; విఱిచి; నడుము; త్రుంచి; వీచి, వైచెన్= గాలి విసురునట్లు విసరివేశాడు.

**తాత్పర్యం:** బలం క్రుంగేటట్లు ఈ విధంగా విసరటంచేత అవయవాల కదలికలు కోల్పోయిన హిడింబుణ్ణి బిగియబట్టి, నేలమీద పెట్టి, అతడి వెన్నెముక విరిచి, నడుము త్రుంచి విసరివేశాడు.

**విశేషం:** అలతి అలతి పదాలతో కూడిన ఈ ఆటవెలది ఆ హిడింబుడి ప్రాణాలతో భీముడాడుకొన్న అతిభయంకరమైన తీరును అద్దంలోవలె పాఠకునికి ప్రదర్శిస్తున్నది.

**వ. అట్టి చిత్ర వధం జూచి చిత్రీయమాణచిత్తు లై భీమసేను పరాక్రమంబు వొగడుచు నందఱు హిడింబానుగమ్యమాను లై చని; ర ట్లరుగునెడ భీముండు హిడింబ రాక కొడంబడక 'రాక్షసులు వైరంబుఁ దలంచి మాయలు సేయుదురు కావున నీవు మాతోడ రావలవదు; నిన్ను విశ్వసింపము; నీవును మీయన్న వోయిన తెరువున పొ' మ్మనిన నది భయంపడి వడవడ వడంకుచున్న దానిం జూచి కరుణారసార్ద్రచిత్తుం డయి ధర్మరాజు భీమున కి ట్లనియె. 219**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; చిత్ర, వధన్= చిత్రమైన చంపటాన్ని; చూచి; చిత్రీయమాణ, చిత్తులు+ఐ= ఆశ్చర్యపడుతున్న మనస్సు కలవాళ్ళయి; భీమసేను, పరాక్రమంబు= భీమునిపరాక్రమాన్ని; పొగడుచున్= పొగడుతూ; అందఱు; హిడింబ+అనుగమ్యమానులు+ఐ= హిడింబచేత వెంబడింపబడినవాళ్ళయి; చనిరి=వెళ్ళారు; అట్లు+అరుగు+ఎడన్= ఆ విధంగా వెళ్ళేటప్పుడు; భీముండు; హిడింబ, రాకకు+ఒడంబడక= హిడింబ రావటానికి ఇష్టపడక; రాక్షసులు= రక్కసులు; వైరంబున్= పగను; తలంచి= మనస్సులోఉంచి; మాయలు; చేయుదురు= చేస్తారు; కావునన్; నీవు; మాతోడ; రా, వలవదు= రావద్దు; నిన్నున్= నిన్ను; విశ్వసింపము= నమ్మము; నీవును; మీ+అన్న+పోయిన; తెరువునన్= మార్గాన; పొమ్ము+అనినన్= పొమ్మని అనగా (అన్నపోయినమార్గం మరణమే); అది= ఆ హిడింబ; భయంపడి= భీతిచెంది; వడవడ, వడంకుచున్+ఉన్న దానిన్+చూచి= వడవడ వణకుతూ ఉండేది చూచి; కరుణా, రస+ఆర్ద్ర, చిత్తుండు+అయి= దయారసంచేత తడిసిన మనస్సు కలవాడై; ధర్మరాజు; భీమునకున్+ఇట్లు+అనియెన్= భీమునితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా హిడింబుణ్ణి చిత్రవధ చేయటంచూచి ఆశ్చర్యపడి, భీమునిపరాక్రమాన్ని పొగడుతూ, హిడింబ తమ వెంట రాగా, అందరూ అతనిదగ్గరకు వెళ్ళారు. భీముడు హిడింబ రాకకు ఇష్టపడక' రాక్షసులు పగబట్టి మాయలు చేస్తారు. అందుచేత నీవు మాతో రావద్దు. నీవుకూడా మీ అన్న చనిపోయినట్లే చావు' మని అనగా, ఆ రాక్షసి భయపడి వడవడ వణుకుతుండటం చూచి దయతో ధర్మరాజు భీమునితో ఇట్లా అన్నాడు.

**తే. వధకు నర్హుఁడై వచ్చినవానిఁ జంపి । తదియు ధర్మువ; యిది చాల నబల; దీని**
**కలుగఁ జన; దాత్మరక్షకు నగ్గలంబు । ధర్మరక్షయ యుత్తమధార్మికులకు. 220**

**ప్రతిపదార్థం:** వధకున్+అర్హుఁడు+ఐ= చంపబడటానికి తగినవాడై; వచ్చినవానిన్= వచ్చిన అతణ్ణి; చంపితివి= చంపావు; అదియు= అది; ధర్మువు+అ= ధర్మమే; ఇది= ఈ హిడింబ; చాలన్, అబల= ఏ మాత్రం బలం లేనిది - ఆడది; దీనికిన్+అలుగన్= దీనిమీద కోపపడటం; చనదు= కూడదు; ఉత్తమ, ధార్మికులకు= ఉత్తములైన ధర్మాత్ములకు; ధర్మ, రక్షయ= ధర్మాన్ని రక్షించటమే; ఆత్మరక్షకున్= తనరక్షణకంటె; అగ్గలంబు= అధికం.

**తాత్పర్యం:** చంపదగినవాణ్ణి చంపావు. అది ధర్మమే. ఈ హిడింబ చాలా అబల. దీనిమీద కోపపడ కూడదు. ఉత్తములైన ధర్మాత్ములకు ఆత్మరక్షణకంటె ధర్మరక్షణమే ఉత్తమం.

**విశేషం:** నన్నయ రుచిరార్థసూక్తినిధిలో ఇదొక సూక్తిరత్నం. సమస్యను విశ్లేషించి నిర్ణయించటంలో ధర్మజునివివేకం అపూర్వం. హిడింబను రక్షించటం ధర్మరక్షణం; శిక్షించటం ఆత్మరక్షణానికి సంబంధించింది. ఆత్మరక్షణకొరకు చూడక ధర్మరక్షణచేయటం ఉత్తమధార్మికుల కర్తవ్యమని ధర్మజుని తీర్పు.

**క. ఆపద యైనను ధర్మువ । ప్రాపుగ రక్షింపవలయుఁ బరమార్థము; ధ**
**ర్మాపాయమ ధార్మికులకు । నాపద జన్మాంతరమున ననుగత మగుటన్. 221**

**ప్రతిపదార్థం:** ఆపద+ఐనను= ప్రమాదం కలిగినా; ధర్మువు+అ= ధర్మాన్నే; ప్రాపుగన్= ఆధారంగా; రక్షింప, వలయున్= కాపాడాలి; పరమ+అర్థము= సత్యం; జన్మ+అంతరమునన్= ఇంకొక పుట్టుకలోకూడ; అనుగతము+అగుటన్= వెంబడించేది కావటంవల్ల; ధార్మికులకున్= ధర్మం ఆచరించేవారికి; ధర్మ+అపాయము+అ= ధర్మం చెడటమే; ఆపద= కీడు.

**తాత్పర్యం:** తనకు ఆపద కలిగినా ధర్మాత్ములు ధర్మాన్నే రక్షించాలి. ఇది నిజం. ఎందుచేతనంటే ఇంకొక జన్మలో కూడా వెంటవచ్చేది కావటంచేత ధర్మం చెడిపోవటమే ధర్మాత్ములకు నిజమైన ఆపద.

**విశేషం:** ధర్మప్రబోధానికి, ధర్మసూక్ష్మవివరణకు కథాగమనంలో ఎక్కడ ఏ అవకాశం వచ్చినా నన్నయ దాన్ని జారవిడువడు. కథా ప్రసన్నతకు భంగం లేకుండా, సూటిగా, సులభశైలిలో, రమణీయంగా ధర్మాన్నిగూర్చి చెప్పి ఆవలికథను కొనసాగించటం ఆయన పద్ధతి.

**వ. 'దీనియందు రాక్షసభావం బుపలక్షింపవలవదు; మాకు నాత్మీయబుద్ధియ యుండు' ననిన హిడింబ ధర్మరాజునకుం గుంతీదేవికి మ్రొక్కి యేకాంతంబునఁ గుంతి కి ట్లనియె; 'నవ్వా! సర్వప్రాణులకు సామాన్యం బయ్యును మనోజరాగంబు వనితల కసహ్యం బయి విశేషంబయి యుండు; నేను వృకోదరునిమిత్తంబు మదనబాణబాధిత నయి నాచుట్టంబులను జెలులను విడిచితి; నాయిష్టంబు మీరు గావింపనినాఁ డిప్పడ ప్రాణంబులు విడుతు; నన్ను రక్షించిన మీకు నిష్టంబులయినవాని నెల్లం దలంచి చేయుదు; నిమ్ముగానియెడ మి మ్మందఱ నెత్తికొని మీమెచ్చినచోటికిఁ బోవనేర్తు; నాపలుకులు నమ్ము నది; యే నతీతానాగతవర్తమానంబు లెల్లను దెల్లంబుగా నెఱుంగుదు; వలయునేని యనాగతంబు సెప్పెద వినుండు; ముందట నొక్క సరోవరంబును**

**నొక్కవనస్పతియునుం గల; వవి రెండును శాలిహోత్రుం డనుమహామునిచేతం దపఃప్రభావంబునం బడయంబడినయవి; యక్కొలనినీళ్ళు ద్రావినవారికి నెన్నండును నాఁకలియును నీరువట్టును లే; వవ్వనస్పతియు శీతవాతాతపవర్షంబులవలన రక్షించు; మీర లందున్న మీ కడకుఁ గృష్ణద్వైపాయనుండు వచ్చి మీకు హితోపదేశంబు సేయు నని చెప్పిన. 222**

**ప్రతిపదార్థం:** దీని+అందున్= ఈ హిడింబపట్ల; రాక్షస భావంబు; ఉపలక్షింపవలవదు= చూడవద్దు; మాకున్; ఆత్మీయ, బుద్ధియు+అ= బంధువనే తలంపే; ఉండున్= ఉన్నది; అనినన్; హిడింబ; ధర్మరాజునకున్, కుంతీదేవికిన్; మ్రొక్కి; ఏకాంతంబునన్= ఒంటరిగా; కుంతికిన్; ఇట్లు+అనియెన్; అవ్వా= అమ్మా; సర్వ, ప్రాణులకున్= అన్ని జీవులకు; సామాన్యంబు+ అయ్యును= సాధారణమే అయినను; మనోజ, రాగంబు= మన్మథునివలన కోరిక; వనితలకున్= స్త్రీలకు; అసహ్యంబు+అయి= ఎక్కువైనదై; ఉండున్= ఉంటుంది; నేను; వృక+ఉదరు, నిమిత్తంబు= భీమునికారణంగా; మదన, బాణ, బాధితను+అయి= మన్మథునియొక్కబాణాలచేత బాధింపబడినదాననై; నా, చుట్టంబులనున్; చెలులనున్=స్నేహితులను; విడిచితిన్= వదలిపెట్టాను; నా+ఇష్టంబు= నాయొక్క కోరికను; మీరు, కావింపనినాఁడు= మీరు తీర్చని రోజు; ఇప్పుడు+అ= ఇప్పటికిప్పుడే; ప్రాణంబులు విడుతున్= ప్రాణాలు వదలివేస్తాను; నన్నున్; రక్షించినన్; మీకున్ ఇష్టంబులు+అయిన, వానిన్+ఎల్లన్= మీకిష్టమైన అన్నింటిని; తలంచి= ఆలోచించి; చేయుదున్= చేస్తాను; ఇమ్ము, కాని+ఎడన్= అనుకూలం కానిదైన చోట; మిమ్మున్+అందఱన్= మిమ్మల్ని అందరినీ; ఎత్తికొని; మీ మెచ్చిన, చోటికిన్ = మీరు కోరిన ప్రదేశానికి; పోవన్; నేర్తు= పోగలను; నా పలుకులు= నా మాటలు; నమ్మునది= నమ్మండి; ఏన్= నేను; అతీత+అనాగత, వర్తమానంబులు+ఎల్లను= భూత భవిష్య, ద్వర్తమానాల నన్నింటిని; తెల్లంబుగాన్= స్పష్టంగా; ఎఱుంగుదున్; వలయున్+ఏని= అవసరమైతే; అనాగతంబు= రాబోయేదాన్ని; చెప్పెదన్; వినుండు; ముందటన్; ఒక్క సరోవరంబును= ఒక కొలను; ఒక్క, వనస్పతియున్= ఒక్క చెట్టు; కలవు; అవి, రెండును; శాలిహోత్రుండు+అను= శాలిహోత్రుడు అనే పేరుగల; మహామునిచేతన్= మహర్షి చేత; తపఃప్రభావంబునన్, పడయన్+ పడిన+అవి= తపస్సు యొక్క ప్రభావంతో. పొందబడినవి; ఆ+కొలని= ఆ కొలనులోని; నీళ్ళు; త్రావిన, వారికిన్; ఎన్నండును= ఎప్పుడునూ; ఆఁకలియును; నీరుపట్టును= దప్పికయును; లేవు; ఆ+వనస్పతియున్= ఆ చెట్టుకూడ; శీత+వాత+ఆతప, వర్షంబువలనన్= చలి, గాలి, ఎండ, వానలనుండి; రక్షించున్= కాపాడుతుంది; మీరలు, అందు+ఉన్నన్= అచ్చట ఉండగా; మీ, కడకున్= మీ చెంతకు; కృష్ణద్వైపాయనుండు= వేదవ్యాసమహర్షి; వచ్చి; మీకున్, హిత+ఉపదేశంబు= మేలును కలిగించేమాటలు; చేయున్= చెప్తాడు; అని; చెప్పినన్.

**తాత్పర్యం:** 'ఈ హిడింబను రాక్షసిగా చూడవద్దు. మాకు ఈమెపట్ల బంధుభావమే ఉన్నది' అని ధర్మరాజు అనగా - హిడింబ, ధర్మజునికి, కుంతీదేవికి మ్రొక్కి ఏకాంతంలో కుంతితో 'అమ్మా! సర్వప్రాణులకు కామవాంఛ సమానమే. అయినా స్త్రీలవిషయంలో ఇది ఓర్చుకొనరానిదై ఉంటుంది. నేను భీమునిమీద మనసుపడి బంధువులను, స్నేహితులను వదలుకొన్నాను. నాకోరికను మీరు తీర్చకుంటే ప్రాణాలు విడుస్తాను. నన్ను రక్షిస్తే మీ కిష్టమైన వాటిని చేస్తాను. మీకు మార్గం అనుకూలంగా లేనప్పుడు మీరు కోరినచోట్లకు మిమ్మల్ని ఎత్తుకొని పోయి చేర్చగలను. భూతభవిష్యద్వర్తమానాలను ఎరిగి చెప్పగలను. ఇప్పుడు రాబోయేదాన్ని గురించి చెప్తాను-వినండి. ముందర కొంత దూరాన ఒక సరోవరం, ఒక వృక్షం ఉన్నాయి. అవి రెండూ శాలిహోత్రుడనే మహామునితపఃప్రభావంచేత ఏర్పడ్డాయి. ఆ సరోవరంలోని నీళ్ళు త్రాగితే ఆకలిదప్పులుండవు. ఆ చెట్టు - చలి, గాలి, ఎండ, వానలనుండి రక్షించగలదు. మీ రక్కడ ఉండగా కృష్ణద్వైపాయనుడు వచ్చి మీకు మేలుకలిగేమాటలు చెప్తాడు' - అని చెప్పగా.

**క. విని కుంతియుఁ బాండవులును। మనమున విస్మయముపడి సమంజసభావం**
**బున దాని దివ్యవనితయ। యని తద్దయు నాదరించి రప్పుడు కరుణన్. 223**

**ప్రతిపదార్థం:** విని, కుంతియున్; పాండవులును; మనమునన్; విస్మయముపడి= ఆశ్చర్యపడి; సమంజస, భావంబునన్= మంచి అభిప్రాయంతో; దానిన్= ఆ హిడింబను; దివ్యవనితయ+అని= దేవతాస్త్రీ అని; అప్పుడు; కరుణన్= దయతో; తద్దయున్= మిక్కిలి; ఆదరించిరి.

**తాత్పర్యం:** హిడింబమాటలు విని కుంతీదేవి, పాండవులు ఆశ్చర్యపడి మంచి అభిప్రాయంతో ఆమెను దేవతా కాంతగా భావించి మిక్కిలిదయతో అదరించారు.

**వ. అంత దాని వినయంబునకు ననాగతం బెఱుంగుటకు సంతసిల్లి కుంతి భీమున కి ట్లనియె. 224**

**ప్రతిపదార్థం:** అంత= తరువాత; దాని, వినయంబునకున్= ఆ హిడింబయొక్క అణకువకు; అనాగతంబు+ఎఱుంగుటకున్= రాబోయేదాన్ని తెలిసికొనగలగటానికి; సంతసిల్లి= సంతోషించి; కుంతి; భీమునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ తరువాత హిడింబయొక్క అణకువకు, భవిష్యత్తును తెలిసికొనగలిగిన వివేకానికి సంతోషించి, కుంతీదేవి భీమునితో ఈ విధంగా అన్నది.

### భీముఁడు తల్లియనుమతంబున హిడింబను బరిగ్రహించుట (సం. 1-143-1)

**క. అన్న! యిది ధర్మ్మ వని మీ । యన్నను నన్నును నతిప్రియంబున నెదలో**
**మన్నించి, యేమి వనిచినఁ గ్రన్నన మా పసుపు సేయఁ గడఁగుము బుద్ధిన్. 225**

**ప్రతిపదార్థం:** అన్న= నాయనా భీమసేనా! ఇది; ధర్మ్మవు+అని= ధర్మమని; మీ, అన్నను= మీ అన్న అయిన ధర్మరాజును; నన్నును= నన్ను; అతిప్రియంబునన్= మిక్కిలి ప్రీతితో; ఎదలో= మనస్సులో; మన్నించి= గౌరవించి; ఏమి+పనిచినన్- ఏమి ఆజ్ఞాపించినా; క్రన్నన= వెంటనే; మా, పసుపు+చేయన్= మాయొక్క ఆజ్ఞ చేయటానికి; బుద్ధిన్= ఇష్టపడి; కడఁగుము= పూనుకొమ్ము.

**తాత్పర్యం:** నాయనా! భీమసేనా! మీ అన్న ధర్మరాజునూ, నన్నూ గౌరవించి, మేము ఏమి ఆజ్ఞాపించినా అది ధర్మ మని తలచి, వెంటనే చేయుము.

**విశేషం:** 'అన్న' - వాత్సల్యపూరితమైన సంబోధన. 'బుద్ధిన్' అనే దానికి 'భక్తిన్' అనే పాఠాంతరం కూడ ఉన్నది.

**క. ఇది పరమ సాధ్వి, దీనిని । మది నొండుగఁ దలఁప వలదు, మానుగఁ బుత్రా**
**భ్యుదయ మగుఁ; బాండుహితముగ । నిది కార్యం బని పరిగ్రహింపుము నెమ్మిన్. 226**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ హిడింబ; పరమసాధ్వి= ఉత్తమ పతివ్రత; మదిన్= మనస్సులో; దీనిన్= ఈమెను; ఒండుగన్= వేరొక విధంగా; తలఁపవలదు= భావించవద్దు; మానుగన్= ఒప్పుగా; పాండు, హితముగన్= పాండురాజుకు మేలు కలిగేటట్లు; పుత్ర+అభ్యుదయము+అగున్= పుత్రుడు పుట్టటం జరుగుతుంది; నెమ్మిన్= సంతోషంతో; ఇది; కార్యంబు+అని= ఇది చేయదగిన పని అని; పరిగ్రహింపుము= చేపట్టుము.

**తాత్పర్యం:** ఈ హిడింబ ఉత్తమపతివ్రత. మనస్సులో దీన్ని గురించి వేరొక విధంగా భావించవద్దు. పాండురాజుకు కూడా మేలుకలిగేటట్లు పుత్రుడు పుడతాడు. ఇది చేయదగినపని అనే తలంపుతో దీన్ని చేపట్టుము.

**విశేషం:** వంశంలో పుత్రపౌత్రాభివృద్ధి పితృదేవతలకు హితమైనది. అందుచేతనే కుంతి పాండుహితంగా పుత్రాభ్యుదయం అవుతుందనటం.

**వ. అని భీమసేను నొడంబఱిచి హిడింబ కనురాగంబుగాఁ జెప్పి 'నీవు శుచి వయి యుత్తమ స్త్రీ గుణంబులు దాల్చి భీమునకు మనఃప్రియంబు సేయుము; పగ ళ్లెల్లను మీ యిష్టంబున విహరించి రాత్రులు మాయొద్దన యుండు నది' యని నియమించిన భీముండును 'బుత్త్రజన్మం బగునంతకు దీని మీవచనంబునఁ బరిగ్రహించెద' నని వారల సమక్షంబున సమయంబు సేసె; నంతఁ బాండవులు జననీసహితంబు శాలిహోత్రునాశ్రమంబునకుం జని ప్రభాతసమయంబున నక్కొలనఁ గృతస్నాను లయి సంధ్యావందనంబులు దీర్చి; శాలిహోత్రుచేతం బూజితు లయి తద్వనస్పతి చ్ఛాయా శీతల తలంబున విశ్రమించి విగత క్షుత్పిపాసు లై సుఖం బున్నంత. 227**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; భీమసేనున్, ఒడంబఱిచి= ఒప్పించి; హిడింబకున్; అనురాగంబుగాన్= ప్రేమగా; చెప్పి; నీవు; శుచివి+అయి= పరిశుద్ధురాలవై; ఉత్తమ, స్త్రీగుణంబులు+తాల్చి= ఉత్తమస్త్రీయొక్క లక్షణాలను కలిగి; భీమునకున్; మనఃప్రియంబున్= మనస్సుకు సంతోషాన్ని; చేయుము= కలిగించుము; పగళ్లు+ఎల్లను= పగలంతా, మీ ఇష్టంబున= మీయొక్క ఇష్టం వచ్చినట్లు; విహరించి= తిరిగి; రాత్రులు; మా+ఒద్దన= మాదగ్గరే; ఉండునది= ఉండండి; అని= ఆ విధంగా; నియమించినన్= కట్టడి చేయగా; భీముండును; పుత్త్ర, జన్మంబు+అగు+అంతకు= కొడుకు పుట్టేవరకు; దీనిన్= హిడింబను; మీ వచనంబునన్= మీయొక్క మాటచేత; పరిగ్రహించెదను+అని= చేపడతానని. వారల= వాళ్లయొక్క; సమక్షంబునన్= ఎదుట; సమయంబు+చేసెన్= ప్రతిజ్ఞ చేసినాడు; అంతన్= ఆ తరువాత; పాండవులు= పాండుకుమారులు; జననీసహితంబు= తల్లితోకూడి; శాలిహోత్రు+ఆశ్రమంబునకున్= శాలిహోత్రునియొక్క ఆశ్రమానికి; చని=పోయి (వెళ్లి); ప్రభాత సమయంబునన్= ప్రొద్దుననే; ఆ+ కొలనన్= ఆ సరోవరంలో; కృత+స్నానులు+అయి= చేయబడ్డ స్నానము కలవారై; సంధ్యావందనంబులు= సంధ్యాసమయంలోని నమస్కారాలు; తీర్చి= తీర్చుకొని; శాలిహోత్రు+చేతన్= శాలిహోత్రమునిచేత; పూజితులు+అయి= గౌరవింపబడ్డవాళ్లై; తత్+వనస్పతి+ఛాయా+శీతల+తలంబునన్= ఆ వనస్పతి అను చెట్టు నీడయొక్క చల్లని ప్రదేశంలో; విశ్రమించి= విశ్రాంతి తీసుకొని; విగత+క్షుత్+పిపాసులు+ఐ= బొత్తిగా పోయిన (పూర్తిగా పోగొట్టబడిన) ఆకలి, దప్పిక కలవాళ్లై; సుఖంబు= సుఖంగా; ఉన్నంతన్= ఉన్న అనంతరం.

**తాత్పర్యం:** అని భీమసేనుణ్ణి ఒప్పించి, హిడింబకు ప్రియంగా జెప్పి, 'నీవు పరిశుద్ధురాలవై ఉత్తమ స్త్రీగుణాలతో భీముణ్ణి సంతోషపెట్టుము. పగలు నీ ఇష్టం వచ్చిన చోట తిరిగి, రాత్రులు మా దగ్గరే ఉండండి' అని నియమించగా భీముడుకూడ 'కొడుకు పుట్టేవరకు హిడింబను మీ మాటప్రకారం చేపడతా' నన్నాడు. తరువాత పాండవులు తల్లితో కలిసి శాలిహోత్రుని ఆశ్రమానికి వెళ్ళారు. ప్రొద్దున్నే అక్కడికొలనులో స్నానంచేసి, సంధ్యావందనాలు తీర్చుకొని, శాలిహోత్రునిచే గౌరవింపబడ్డారు. అక్కడిచెట్టునీడయొక్క చల్లదనంలో విశ్రాంతి తీసికొని, ఆకలిదప్పికలు తీరి సుఖంగా ఉన్నారు.

## పాండవులకు వ్యాసుఁడు హితోపదేశము సేయుట (సం.1-144-7)

**ఉ. పుణ్యతపోమయుండు మునిపూజ్యుఁడు బ్రహ్మసమప్రభుండు బ్ర**
**హ్మణ్యుఁడు ప్రావృషేణ్యజలదాసితవర్ణుఁ దశేషకిల్బిషా**

**రణ్యద వానలుం డగు పరాశరనందనుఁ డేగుదెంచెఁ ద**

**త్పుణ్యచయస్వరూపమునుబోలెఁ గరంబు మనోముదంబుగన్. 228**

**ప్రతిపదార్థం:** పుణ్యతపః+మయుండు= పవిత్రమైన తపస్సు నిండుగా గలవాడు; ముని, పూజ్యుఁడు= మునులచేత పూజింప దగినవాడు; బ్రహ్మసమప్రభుండు= బ్రహ్మదేవునితేజస్సుతో సమానమైన తేజస్సు కలవాడు; బ్రహ్మణ్యుఁడు= బ్రాహ్మణులకు హితుడైనవాడు; ప్రావృషేణ్య, జలద+అసిత, వర్ణుఁడు= వర్షాకాలంలలోని మేఘంవలె నల్లనైన రంగు కలవాడు; అశేష కిల్బిష+అరణ్య; దవానలుండు+అగు= సర్వపాపాలు అనే అడవికి కార్చిచ్చువంటి వాడైన; పరాశర, నందనుఁడు= పరాశరుని యొక్క కుమారుడు, వ్యాసుడు; తత్+పుణ్య, చయ, స్వరూపమును+పోలెన్= ఆ కుంతీ పాండవులయొక్క పుణ్యసమూహంయొక్క ఆకారంవలె; కరంబు= మిక్కిలి; మనస్ ముదంబుగన్= మనస్సుకు సంతోషం కలిగేటట్లు; ఏగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** పవిత్రమైన తపస్సు నిండుగా కలవాడు, మునులచేత పూజింపదగినవాడు; బ్రహ్మదేవునితో సమానమైన తేజస్సు కలవాడు; బ్రాహ్మణులకు హితుడైనవాడు; వర్షాకాలమేఘంవంటి రంగుకలవాడు; సర్వపాపాలను హరించేవాడు అయిన వ్యాసుడు; ఆ కుంతీపాండవులయొక్క పుణ్యస్వరూపంవలె, వాళ్ళ మనస్సులకు ఆనందం కలిగేటట్లుగా వచ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ, రూపకం.

**వ. ఇట్లు వచ్చిన వేదవ్యాసమునీంద్రునకు నందఱు నతిభక్తి నమస్కరించి యాస నార్ఘ్యాది విధులం బూజించి యున్నవారలం గరుణార్ద్రదృష్టిం జూచి కృష్ణద్వైపాయనుం డి ట్లనియె. 229**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వచ్చిన; వేదవ్యాస, ముని+ఇంద్రునకున్= వేదవ్యాసముని శ్రేష్ఠునికి; అందఱున్; అతి, భక్తిన్= మిక్కిలి భక్తితో; నమస్కరించి; ఆసన+అర్ఘ్య+ఆది, విధులన్= ఆసనం, అర్ఘ్యం, మొదలైన ఏర్పాట్లతో; పూజించి; ఉన్నన్=ఉండగా; వారలన్= వాళ్లను; కరుణా+ఆర్ద్ర, దృష్టిన్= దయచేత తడియైన చూపుతో; చూచి; కృష్ణద్వైపాయనుండు= కృష్ణద్వైపాయనుడైన వ్యాసుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా వచ్చిన మునిశ్రేష్ఠుడైన వేదవ్యాసునికి అందరూ భక్తితో నమస్కరించి, ఆసనం, అర్ఘ్యం మొదలైన ఉపచారాలతో పూజించి ఉండగా, వాళ్ళందరినీ దయార్ద్రదృష్టితో చూచి, వ్యాసుడు ఈ విధంగా అన్నాడు.

**పద్మకము.**

**కొడుకు పల్కు విని కూడదు నాక దుర్మాతుఁడై**

**కడఁగి మీకు నపకారము సేసి ధరిత్రి వె**

**ల్వడఁగఁబంచెఁ గడుఁబాపమతిన్ ధృతరాష్ట్రుఁ, డె**

**య్యెడల దుర్జనుల నేమఱి నమ్మగఁ బోలునే. 230**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుడు; కొడుకు, పల్కు= కొడుకుయొక్క మాట; విని; కూడదు= తగదు; నాక= అని అనక; దుర్మాతుఁడు+ఐ= చెడుమనస్సు కలవాడై; కడఁగి= పూని; మీకున్; అపకారము, చేసి; ధరిత్రి= భూమి అనగా (రాజ్యం యొక్క పొలిమేరలను); వెలువడఁగన్= దాటిపోయేటట్లు; కడున్+పాపమతిన్= మిక్కిలిచెడుబుద్ధితో; పంచెన్= పంపించాడు; ఏ+ఎడలన్= ఎచ్చటైనా; దుర్జనులన్= దుర్మార్గులను; ఏమఱి= ఉపేక్షించి; నమ్మగన్+పోలునే= నమ్మవచ్చునా!

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు కొడుకుమాట విని, ఇది తగదని చెప్పక దుర్మార్గుడై మీకు అపకారం చేసి, మిమ్మల్ని రాజ్యంనుండి వెళ్ళగొట్టాడు. దుర్మార్గులను ఎక్కడైనా ఎప్పుడైనా ఉపేక్షించకూడదు, నమ్మకూడదు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. పద్మకవృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న, భ, జ, జ, జ, గ - అనే గణాలుంటాయి. లాక్షణికులు 11వ అక్షరం యతిస్థానంగా పేర్కొన్నారు. కాని, నన్నయ 8వ అక్షరాన్ని యతిగా నిలిపాడు. ఆంధ్రమహాభారతమంతటిలో నన్నయమాత్రమే - ఒక్కసారిమాత్రమే - వాడినవిశేషవృత్తాల్లో ఇదొకటి కావటం విశేషం. ఇదికాక, రథోద్ధతం, మణిభూషకం, దండకం అనేవి ఈ కోవకు చెందుతాయి. (సంపా.)

**వ. 'దీని నెఱింగి మీకు హితోపదేశంబు సేయ వచ్చితి; నిఖిల ధర్మవిదుల రయి వినీతుల రయిన మీకు బాంధవవియోజనం బయిన యీ కర్మంబు పురాకృతంబు; దీనికి శోకింపవలవదు; కొండొకకాలంబునకు మీరును బాంధవులం గలసి యెప్పటియట్ల రాజ్యంబు సేయుదు; రిది శాలిహోత్రుతపఃప్రభావంబున నైన కొలను; దీని జలంబు లుపయోగించినవారికి బుభుక్షాపిపాసలు లే; వివ్వనస్పతియును శీతవాతాతపవర్షంబువలన రక్షించు; నిం దొరు లెఱుంగకుండఁ గార్యార్థుల రై కతిపయదినంబు లుండి యేకచక్రపురంబున కేఁగి బ్రాహ్మణభావంబున బ్రాహ్మణగోష్ఠి నుండి నారాక ప్రతీక్షించియుండు నది' యని కఱపి తనకు వినయావనతులయి కృతాంజలు లయిన మనుమల దీవించి కౌఁగలించుకొని, బాష్పపూరితనయన యయి మ్రొక్కియున్న కోడలి నూరార్చి; 'నీకొడుకు ధర్మనిత్యుం; డీ యుధిష్ఠిరుండు నారాయణుభుజంబులంబోని తననలువురుదమ్ములబలంబున సర్వపార్థివుల శాసించి సార్వభౌముం డై రాజసూయాశ్వమేధాదిక్రతువులు సేసి పితృపైతామహం బైన రాజ్యలక్ష్మి ననుభవించుచుం గురుకులంబునెల్లఁ బవిత్రంబు సేయు' నని శోకోపశమనంబుఁ జేసి; హిడింబం జూచి 'దీనిపేరు కమలపాలిక యిది భీమునకు వశవర్తి యయి పరిచరించి మహాసత్త్వుం డయిన కొడుకుం గాంచు; నాతండు మి మ్మందఱ నాపద్విషయంబున నుద్ధరించు' నని చెప్పి మునివరుండు తిరోహితుం డైన. 231**

**ప్రతిపదార్థం:** దీనిన్; ఎఱింగి= తెలిసికొని; మీకు; హిత+ఉపదేశంబు+చేయన్= మేలును కూర్చే మాటలు చెప్పటానికి; వచ్చితిన్; నిఖిల, ధర్మ, విదులరు+అయి= అన్నిధర్మాలు తెలిసికొన్న వాళ్ళయి; వినీతులరు= వినయం కలవాళ్లు; అయిన= అయినట్టి; మీకున్, బాంధవవియోజనంబు+అయిన= బంధువులకు దూరమైన; ఈ, కర్మంబు; పురాకృతంబు= గతజన్మంలో చేయబడింది; దీనికిన్; శోకింపన్, వలవదు= దుఃఖింప నక్కరలేదు; కొండొకకాలంబునకున్= కొంతకాలానికి; మీరును= మీరుకూడా; బాంధవులన్+కలిసి; ఎప్పటి+అట్ల= ఎప్పటివలెనే; రాజ్యంబు+ చేయుదురు; ఇది; శాలిహోత్రు, తపః, ప్రభావంబునన్+ ఐన= శాలిహోత్రుడనే మహామునియొక్క తపస్సుయొక్క మహిమచేత ఏర్పడిన; కొలను; దీని, జలంబులు; ఉపయోగించినవారికి; బుభుక్షా, పిపాసలు= ఆకలిదప్పులు; లేవు; ఈ+వనస్పతియును= ఈ చెట్టుకూడ; శీత, వాత+ఆతప, వర్షంబువలనన్= చలి, గాలి, ఎండ, వానలనుండి; రక్షించున్= కాపాడుతుంది; ఇందున్= ఇక్కడ; ఒరులు= ఇతరులు; ఎఱుంగక+ఉండన్= తెలుసుకొనకుండ; కార్య+అర్థులరు+ఐ= ప్రయోజనాన్ని కోరే వాళ్ళయి; కతిపయ, దినంబులు= కొన్నిరోజులు; ఉండి; ఏకచక్ర, పురంబునకున్= ఏకచక్రమనే పేరుగల పట్టణానికి; ఏఁగి= వెళ్ళి; అందున్= ఆ పట్టణంలో; బ్రాహ్మణభావంబునన్= బ్రాహ్మణులయొక్క పద్ధతిలో; బ్రాహ్మణులగోష్ఠిన్+ఉండి= బ్రాహ్మణులయొక్క సభలో ఉండి; నా రాక, ప్రతీక్షించి= నా యొక్క రాకను ఎదురుచూచి; ఉండునది= ఉండండి; అని= ఆప్రకారం; కఱపి= బోధించి; తనకున్; వినయ+అవనతులు+అయి= వినయంతో వంగినవారై; కృత+అంజలులు+అయిన= చేయబడిన చేతులజోడింపు కలవాళ్ళయిన - అంటే చేతులు జోడించి

నమస్కరించిన; మనుమలన్= మనుమల్ని; దీవించి= ఆశీర్వదించి; కౌఁగలించుకొని= ఆలింగనంచేసి; బాష్ప, పూరిత, నయన+అయి= కన్నీటిచే నిండిన కళ్ళు కలదై; మ్రొక్కి+ఉన్న= నమస్కరించిన; కోడలిన్= కోడలిని, కుంతిని; ఊరార్చి= ఓదార్చి; నీ, కొడుకు= నీ కుమారుడు; ఈ యుధిష్ఠిరుండు= ఈ ధర్మరాజు; ధర్మ, నిత్యుండు= ఎడతెగని ధర్మం కలవాడు; నారాయణ, భుజంబులన్+పోని= శ్రీమహావిష్ణువుయొక్క చేతులవంటి; తన, నలువురు+తమ్ముల, బలంబునన్; సార్వభౌముండు+ఐ= సమస్త భూమండలాన్ని ఏలువాడై; రాజసూయ+అశ్వమేధ+ఆది, క్రతువులు+చేసి= రాజసూయం, అశ్వమేధం మొదలయిన యాగాలు చేసి; పితృపైతామహంబు+ఐన= తండ్రితాతలకు సంబంధించిందైన; రాజ్యలక్ష్మిన్= రాజ్యసంపదను; అనుభవించుచున్= అనుభవిస్తూ; కురు, కులంబును+ఎల్లన్= కురువంశాన్నంతటినీ; పవిత్రంబు+చేయున్= పవిత్రం చేస్తాడు; అని= అని; శోక+ఉపశమనంబున్+చేసి= దుఃఖం తగ్గేటట్లు చేసి; హిడింబన్+చూచి; దీని, పేరు= ఈమె పేరు; కమలపాలిక; ఇది= ఈమె, భీమునకున్= భీమునికి; వశవర్తిని+అయి= లొంగినదై; పరిచరించి= సేవచేసి; మహా, సత్త్వుండు+అయిన= మిక్కిలి బలం గలవాడయిన; కొడుకున్= కుమారుణ్ణి; కాంచున్= పొందుతుంది; ఆతండు= ఆ కుమారుడు; మిమ్ము+అందఱన్= మిమ్మల్ని అందరినీ; ఆపత్+విషయంబునన్= ప్రమాదానికి సంబంధించిన సందర్భంలో; ఉద్ధరించున్= మీది కెత్తుతాడు - అంటే రక్షిస్తాడు; అని, చెప్పి; ముని, వరుండు= మునిశ్రేష్ఠుడు; తిరోహితుండు+ఐనన్= అగుపించకుండాపోయినవాడు కాగా - అంటే అంతర్ధానమందినవాడు కాగా.

**తాత్పర్యం:** 'ఆ విషయాన్ని తెలిసికొని మీకు హితోపదేశం చేయాలని వచ్చాను. అన్నిధర్మాలు తెలిసినవాళ్ళు, వినయవంతులు అయిన మీకు బంధువులతో ఎడబాటు కలగటం పూర్వజన్మకృతం. దీనికి దుఃఖించవద్దు. కొంతకాలానికి మీరుకూడా బంధువులతో కలిసి ఎప్పటివలె రాజ్యం చేస్తారు. ఇది శాలిహోత్రమహాముని తపః ప్రభావంచేత ఏర్పడిన సరోవరం. దీనినీళ్ళు త్రాగినవాళ్ళకు ఆకలిదప్పులుండవు. ఈ చెట్టుకూడ చలి, గాలి, ఎండ, వానలనుండి మిమ్మల్ని కాపాడుతుంది. ఇక్కడ ఇతరులకు కన్పించకుండ మీ పని నెరవేరేవరకు కొన్ని రోజులుండి, తరువాత ఏకచక్రపురానికి పోయి, అక్కడ బ్రాహ్మణరూపంలో బ్రాహ్మణులతో కలిసి ఉండి, నా రాకకోసం ఎదురుచూడం' డని బోధించాడు. తనకు శిరస్సువంచి నమస్కరించి, చేతులు జోడించి నిలిచిన మనుమలను దీవించి కౌగలించుకొని, కన్నీరు కారుస్తున్న కోడలు కుంతిని ఓదార్చి, 'నీకొడుకు యుధిష్ఠిరుడు ధర్మాత్ముడు. అతడు నారాయణునిభుజాలవంటి నలువురుతమ్ముళ్ల బలంచేత రాజులందరిని శాసించి సార్వభౌముడు చేసే, రాజసూయాశ్వమేధాదియాగాలు చేసి, తాతతండ్రులరాజ్యం ఏలగలుగుతాడు. కురువంశాన్నంతటిని పవిత్రం చేస్తాడు' అని వారిశోకాన్ని ఉపశమింపచేశాడు. హిడింబను చూచి 'దీని పేరు కమలపాలిక. ఇది భీమునికి వశమై సేవ చేసి మహాబలవంతుడైన కొడుకును కంటుంది. అతడు మిమ్మల్నందరినీ ఆపత్సమయంలో రక్షిస్తాడు' అని చెప్పి వ్యాసమహర్షి అదృశ్యమయ్యాడు.

**క. అమ్మునివరు కఱపిన మా । ర్గమ్మునఁ బాండవులు విగతకల్మషు లవిషా**
**దమ్మున సుఖముండిరి విన । య మ్మొప్పఁగ శాలిహోత్రునాశ్రమభూమిన్. 232**

**ప్రతిపదార్థం:** ఆ+ముని, వరు, కఱపిన, మార్గమ్మునన్= ఆ మునిశ్రేష్ఠుడైన వ్యాసమహర్షి బోధించిన పద్ధతిలో; పాండవులు= పాండుకుమారులు; విగత, కల్మషులు= పోయినపాపంకలవాళ్ళు - అంటే పుణ్యాత్ములు; వినయమ్ము+ఒప్పఁగన్= వినయం ప్రకాశించగా; శాలిహోత్రు+ఆశ్రమ, భూమిన్= శాలిహోత్రునియొక్క ఆశ్రమప్రదేశంలో; అవిషాదమ్మునన్= దుఃఖంలేకుండా; సుఖము+ఉండిరి= సుఖంగా ఉన్నారు.

**తాత్పర్యం:** ఆ మునిశ్రేష్ఠుడైన వ్యాసమహర్షి బోధించినవిధంగా పుణ్యాత్ములైన పాండవులు వినయంతో శాలిహోత్రునిఆశ్రమంలో దుఃఖం లేకుండా సుఖంగా ఉన్నారు.

**వ. అంత. 233**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**చ. పవనతనూజుఁ డక్కమలపాలికచేత వినీతుఁ డై మహా**
**ర్ణవవృతభూమిలోఁ గల వనంబుల హంసబలాకసారసా**
**రవరుచిరాపగావరసరఃపులినంబులఁ బర్వతంబులన్**
**వివిధవిహారుఁ డై యనుభవించె నభీష్టమనోజభోగముల్. 234**

**ప్రతిపదార్థం:** పవన, తనూజుఁడు= వాయుదేవునికుమారుడైన భీముడు; ఆ+కమలపాలికచేతన్= ఆ హిడింబచేత; వినీతుఁడు+ఐ= నడిపించబడినవాడై; మహా+అర్ణవ, వృత, భూమిలోన్= పెద్దసముద్రాలచే చుట్టబడిన భూమిలో; కల= ఉన్న; వనంబులన్= అడవులలో; హంస, బలాక, సారస+ఆరవ, రుచిర+ఆపగా, వర, సరః+పులినంబులన్= హంసలయొక్క, కొంగలయొక్క, బెగ్గురుపక్షులయొక్క ధ్వనులచేత మనోహరాలైన నదులయొక్క, శ్రేష్ఠాలైన కొలనులయొక్క ఇసుకతిన్నెలలో; పర్వతంబులన్= కొండలలో; వివిధ, విహారుఁడు+ఐ= పలువిధాలైన విహారాలు కలవాడై; అభీష్ట, మనోజ, భోగముల్= మనస్సు కింపైన మన్మథసుఖాలను; అనుభవించెన్.

**తాత్పర్యం:** హిడింబ తనను అనుసరించగా భీముడు భూమండలంలోని అనేకవనాలలో, హంసలు, కొంగలు, బెగ్గురుపక్షులు మొదలయినవాటిధ్వనులచేత మనోహరాలైన నదులయొక్క, కొలనులయొక్క ఇసుకతిన్నెలలో; పర్వతాలలో అనేకవిధాల విహరించి మనసు కింపయిన మన్మథసుఖాలను అనుభవించాడు.

**విశేషం:** ఇందులో కమలపాలికాభీముల ప్రణయవిహారాలనే మనోహరసన్నివేశాలను మసృణమైన పదరచనతో నన్నయ వర్ణించి శ్లేషమనే గుణాన్ని పోషించాడు. శృంగారసస్ఫోరకమైన అక్షరరమ్యతతో రచనను అలంకరించాడు. (సంపా.)

## హిడింబయందు ఘటోత్కచుండు పుట్టుట (సం.1-143-27)

**చ. నరవరుఁడైన భీమువలనం బ్రభవించె హిడింబకున్ సుతుం**
**డురుతర భీమ రూపుఁడు ఘటోత్కచ నాముఁడు విస్ఫుర ద్భయం**
**కర వదనంబు శంకునిభకర్ణములున్ వికృతాక్షులుం బయో**
**ధరవరవర్ణమున్ వికటదారుణదంష్ట్రలు నొప్పచుండఁగన్. 235**

**ప్రతిపదార్థం:** నర, వరుఁడు+ఐన= మానవులలో శ్రేష్ఠుడైన, భీమువలనన్= భీమునివల్ల; హిడింబకున్; విస్ఫురత్+భయంకర, వదనంబు= ప్రకాశిస్తున్న భయంకరమైన ముఖం; శంకు, నిభ, కర్ణములున్= మోడువంటిచెవులు; వికృత+అక్షులున్= వికారమైన కన్నులును; పయోధర, వర, వర్ణమున్= మేఘంయొక్క శ్రేష్ఠమైన రంగు, వికట, దారుణ, దంష్ట్రలున్= హెచ్చు తగ్గులై భయంకరాలైన కోరలు; ఒప్పుచున్+ఉండఁగన్= ప్రకాశిస్తుండగా; ఉరుతర, భీమ, రూపుఁడు= మిక్కిలి గొప్పదైన

భయంకరమైన రూపంకలవాడు; ఘటోత్కచనాముఁడు= ఘటోత్కచుడనే పేరు కలవాడు; సుతుండు= కుమారుడు; ప్రభవించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** భీమహిడింబలకు భయంకరమైన ముఖం, మోడువంటిచెవులు, వికారాలైన కన్నులు, నల్లనిరంగు, హెచ్చుతగ్గులై భయంకరాలైన కోరలు, భీతి గొలిపే పెద్దదేహం కల ఘటోత్కచ నామధేయుడు కుమారుడొకడు పుట్టాడు.

**విశేషం:** శంకునిభకర్ణములున్- అనేదానికి శంఖనిభకర్ణములున్ అనే పాఠాంతరం ఉన్నది. మూలంలో 'శంకుకర్ణం విభీషణమ్' అని ఉంది - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.382.

**వ. ఇట్లు సద్యోగర్భంబునం గామరూపధరుం డై ఘటోత్కచుండు పుట్టి తత్క్షణంబ నవయౌవనుండును ననేకాస్త్రశస్త్ర కుశలుండును నపరిమిత రాక్షస పిశాచ బలపరివృతుండును నై తల్లిదండ్రులకుఁ గుంతీదేవికి మ్రొక్కిన, నగ్రనందనుం డగుట నందఱును గరంబు గారవంబునఁ గొనియాడం గొన్నిదినంబు లుండి; యొక్కనాఁ డంజలి పుటఘటితమస్తకుం డయి 'రాక్షసపిశాచబలంబులతోడ నాయిమ్ముల నుండెదం; బని గలయప్పుడు నన్నుఁ దలఁ చునది; యాక్షణంబ వత్తు' నని యందఱిచేత ననుజ్ఞాతుండై తల్లిం దోడ్కొని, యుత్తరాభిముఖుం డయి యరిగె; నిట పాండవులును శాలిహోత్రునొద్ద ననేకధర్మశాస్త్రనీతిశాస్త్రంబు లభ్యసించి యమ్మునివరు వీడ్కొని చని విదర్భమత్స్య త్రిగర్తకీచక విషయంబులు గడచి యేకచక్రం బను నగ్రహారంబు గని. 236**

**ప్రతిపదార్థం:** ఇట్లు; సద్యః+గర్భంబునన్= అప్పటికప్పుడు కలిగిన కడుపున; కామ, రూప, ధరుండు+ఐ= ఇచ్ఛవచ్చిన రూపాన్ని ధరించేవాడై; ఘటోత్కచుండు, పుట్టి; తత్+క్షణంబు+అ= ఆ నిమిషాన్నే; నవ, యౌవనుండును= క్రొత్తగా ఏర్పడిన యౌవనం కలవాడును; అనేక+అస్త్ర, శస్త్ర, కుశలుండునున్= పలువిధాలైన అస్త్రాలలో, శస్త్రాలలో నేర్పుకలవాడును; అపరిమిత, రాక్షస, పిశాచ, బల పరివృతుండునున్+ఐ= అంతులేని రాక్షసపిశాచబలంచేత చుట్టబడినవాడును అయి; తల్లి, తండ్రులకున్; కుంతీదేవికిన్; మ్రొక్కినన్= నమస్కరింపగా; అగ్ర, నందనుండు+అగుటన్= పెద్దకొడుకు కావటంచేత; అందఱును; కరంబు= మిక్కిలి; గారవంబునన్= ప్రేమతో; కొనియాడన్= పొగడగా; కొన్ని, దినంబులు+ఉండి; ఒక్కనాఁడు; అంజలి పుట, ఘటిత, మస్తకుండు+అయి= దొప్పవంటి చేమోడ్పులచే కూడిన తల కలవాడై; రాక్షస,పిశాచ, బలంబులతోడన్; ఆ+ఇమ్ములన్= ఆ ప్రదేశాలలో; ఉండెదన్; పని, కల+అప్పుడు= పని ఉండే సమయంలో; నన్నున్, తలంచునది= తలచండి; ఆ+క్షణంబు+అ= ఆ నిమిషాననే; వచ్చుదును+అని= వస్తానని; అందఱిచేతన్, అనుజ్ఞాతుండు+ఐ= అనుమతింపబడినవాడై; తల్లిన్+తోడ్కొని= తల్లిని తీసుకొని; ఉత్తర+అభిముఖుండు+అయి= ఉత్తరానికి ఎదురుగా ముఖం కలవాడై- అంటే ఉత్తరంవైపు తిరిగినవాడై; అరిగెన్= వెళ్ళాడు; ఇట; పాండవులును= పాండవులు కూడా; శాలిహోత్రు+ఒద్దన్= శాలిహోత్రునిదగ్గర; అనేక ధర్మశాస్త్ర, నీతి శాస్త్రంబులు= చాలా ధర్మశాస్త్ర నీతిశాస్త్ర విషయాలు; అభ్యసించి= నేర్చుకొని; ఆ+ముని, వరున్= ఆ మునిశ్రేష్ఠుడిని; వీడ్కొని= వదలి; చని= వెళ్ళి; విదర్భ, మత్స్య, త్రిగర్త, కీచక, విషయంబులు= విదర్భ, మత్స్య, త్రిగర్త, కీచక దేశాలు, కడచి= దాటి; ఏకచక్రంబు+అను+అగ్రహారంబు; కని= చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా అప్పటికప్పుడు కలిగిన గర్భంలో తనకు ఇచ్ఛవచ్చినరూపాన్ని ధరించగలవాడైన ఘటోత్కచుడు పుట్టి, తత్క్షణమే నవయౌవనం, వివిధశాస్త్రాలలో నైపుణ్యం కలవాడై, అపరిమితరాక్షసపిశాచబలంతో కూడి తల్లిదండ్రులకు, కుంతీదేవికి నమస్కరించాడు. ఘటోత్కచుడు మొదట పుట్టినకుమారుడు కావటంవలన

అతణ్ణి అందరు ఆదరించగా - అతడు కొన్నిదినాలుండి, ఒకనాడు అందరికీ నమస్కరించి - 'నేను రాక్షస పిశాచబలాలతో ఆయాప్రదేశాల్లో ఉంటాను. అవసరమైనప్పుడు నన్ను తలిస్తే ఆ క్షణాన్నే వస్తా' నన్నాడు. తరువాత అందరి అనుమతి పొంది తల్లిని వెంటతీసికొని ఉత్తరదిశగా వెళ్ళాడు. ఇట పాండవులు కూడా శాలిహోత్రుని దగ్గర అనేకధర్మశాస్త్రాలు, నీతిశాస్త్రాలు అభ్యసించి, ఆయనదగ్గర సెలవు తీసికొని విదర్భ, మత్స్య, త్రిగర్త, కీచకదేశాలు దాటి, ఏకచక్రమనే అగ్రహారాన్ని చూచి.

**విశేషం:** 'నాయిమ్ముల' - నాకు ఇష్టమైనట్లు - అనుకూలమైనట్లు అనిగూడ అన్వయించడానికి అవకాశం ఉన్నది. 'ఏకచక్రం బనునగ్రహారంబు' - ఏకచక్రాపురము అని మూలం. 'ఏకచక్రామ్ గతా స్తే తు' - చిత్రశాలాప్రతి, ఘటోత్కచజన్మము చైత్రబహుళ అష్టమి - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.383.

### పాండవు లేకచక్రపురంబున విప్రగృహంబున నుండుట (సం.1-145-1)

**క. లలితజటాజినకుశవ - ల్కలధరు లై వేద మొప్పఁగాఁ జదువుచు ని**
**మ్ముల బ్రహ్మచారివృత్తిని । వెలయఁగ నం దుండి రొక్కవిప్రగృహమునన్. 237**

**ప్రతిపదార్థం:** లలిత, జటా+అజిన, కుశ, వల్కల, ధరులు, ఐ= చక్కనిజడలను, జింకతోళ్ళను, దర్భలను, నారచీరలను కట్టినవారై; వేదము= వేదాన్ని; ఒప్పఁగాన్= తగువిధంగా; చదువుచున్; ఇమ్ముల=సుఖంగా; బ్రహ్మచారి, వృత్తిని= బ్రహ్మచారియొక్క నడవడితో; వెలయఁగన్= ప్రకాశించేటట్లు; ఒక్క, విప్ర, గృహమునన్= ఒక బ్రాహ్మణుని ఇంటిలో; అందున్= ఆ ఏకచక్రపురంలో; ఉండిరి.

**తాత్పర్యం:** (పాండవులు) చక్కనిజడలతో, జింకతోళ్ళతో, దర్భలతో, నారచీరలతో వేదపఠనం చేస్తూ బ్రహ్మచర్యవృత్తి నవలంబించి సుఖంగా ఆ ఏకచక్రపురంలో ఒక బ్రాహ్మణునిఇంట్లో ఉన్నారు.

**క. ధృతిఁ జదువుచు భిక్షార్థము । ప్రతిగృహమున కరుగుచున్న భవ్యుల మౌన**
**వ్రతులం దృప్తులఁ జేసిరి । సతతము నందుల గృహస్థ సద్ద్విజులు దయన్. 238**

**ప్రతిపదార్థం:** ధృతిన్, చదువుచున్= సంతోషంతో చదువుతూ; భిక్షా+అర్థము= భిక్షకోసం; ప్రతిగృహమునకున్= ఇంటింటికి; అరుగుచున్+ఉన్న= వెళ్ళుతున్న; భవ్యులన్= మంచివాళ్ళను; మౌన, వ్రతులన్= మాటాడక ఉండే వ్రతాన్ని అవలంబించిన వాళ్ళను; అందుల= అక్కడి; గృహస్థ, సత్+ద్విజులు= ఏకచక్రపురంలోని గృహస్థులైన మంచి బ్రాహ్మణులు; దయన్= దయతో; సతతము= ఎల్లప్పుడు; తృప్తులన్+చేసిరి= తృప్తి పొందినవారినిగా చేశారు.

**తాత్పర్యం:** సంతోషంతో చదువుతూ భిక్షకోసం ప్రతిగృహానికి వెళుతున్న మౌనవ్రతులు, మంచివాళ్ళు అయిన పాండవులను ఏకచక్రపురంలోని సద్బ్రాహ్మణగృహస్థులు దయతో ఎల్లప్పుడు తృప్తిపరచారు.

**క. 'జలజప్రియతేజుల వీ । రల ధీరుల ధరణివలయరాజ్యశ్రీయో**
**గ్యుల ని ట్లేలొకొ భిక్షా । శులఁ జేసె విధాతృఁ' డంచు శోకింప జనుల్. 239**

**ప్రతిపదార్థం:** జలజ, ప్రియ, తేజులన్= నీటినుండి పుట్టిన పద్మానికి ప్రియుడైన సూర్యునివంటి కాంతి కలవాళ్ళను; ధీరులన్; ధరణి, వలయ, రాజ్యశ్రీ, యోగ్యులన్= భూమండలంయొక్క రాజ్యలక్ష్మికి తగినవాళ్ళను; వీరలన్= వీళ్ళను;

విధాతృఁడు= బ్రహ్మదేవుడు; ఏల+ఒకొ= ఎందుచేతనో; ఇట్లు= ఈ విధంగా; భిక్షా+అశులన్= భిక్షాన్నం తినేవాళ్ళుగా; చేసెన్; అంచున్= అంటూ; జనుల్; శోకింపన్= విచారింపగా.

**తాత్పర్యం:** 'సూర్యతేజులు, ధీరులు, భూమండలరాజ్యలక్ష్మికి తగినవాళ్ళు అయిన వీళ్ళను (పాండవులను) బ్రహ్మదేవుడు ఎందుచేత భిక్షాన్నం తినేవాళ్ళుగా చేశాడో కదా!' అని జనులంతా దుఃఖించగా.

**క. పరమాన్నభక్ష్యభిక్షా । పరిపూర్ణతరంబు లయిన పాత్రము లయ్యే**
**వురు నిత్యంబు నివేదిం । తురు దల్లికిఁ గరముభక్తితో వినయమునన్. 240**

**ప్రతిపదార్థం:** ఆ+ఏవురు= ఆ ఐదుగురు; నిత్యము= ప్రతిదినం; కరము= మిక్కిలి; భక్తితో; వినయమునన్= వినయంతో; పరమ+అన్న+భక్ష్య, భిక్షా, పరిపూర్ణతరంబులు+అయిన= పాయసంచేతను, పిండివంటలచేతను, అన్నంచేతను పూర్తిగా నిండినవైన; పాత్రములు= పాత్రములను; కుంతీదేవికి; నివేదింతురు= సమర్పిస్తారు, ఇస్తారు.

**తాత్పర్యం:** పాండవులైదుగురు ప్రతిదినం మిక్కిలి భక్తివినయాలతో పాయసం, పిండివంటలు, అన్నం నిండిన పాత్రలను తెచ్చి తల్లికి అందజేస్తారు.

**వ. కుంతియు దాని రెండుభాగంబులు సేసి యం దొక్క భాగంబు భీమునకుం బెట్టి, తక్కిన భాగంబు గడమ కొడుకులుం దానును గుడుచుచు నిట్లు ప్రచ్ఛన్ను లై యేకచక్రపురంబున నున్నంత, నొక్కనాఁడు ధర్మార్జునయములు భిక్షార్థం బరిగిన నిట కుంతియు భీముండును దమ విడిసిన విప్రగృహంబున నున్నంత, నం దొక్కపెట్ట యార్తధ్వని యెగసిన విని కుంతీదేవి యెంతయు సంతాపించి భీమున కి ట్లనియె. 241**

**ప్రతిపదార్థం:** కుంతియున్; దానిన్= ఆ ఆహారాన్ని; రెండు, భాగంబులు+చేసి; అందు+ఒక్క, భాగంబు; భీమునకున్+పెట్టి; తక్కినభాగంబు; కడమకొడుకులున్= తక్కినకొడుకులును; తానును= తానూ; కుడుచుచున్= తింటూ; ఇట్లు; ప్రచ్ఛన్నులు+ఐ= కప్పబడినవాళ్ళయి అంటే మారువేషాలలో ఉన్న వాళ్ళయి; ఏక, చక్ర, పురంబునన్; ఉన్న+అంతన్; ఉండగా; ఒక్కనాఁడు; ధర్మ+అర్జున+యములు= ధర్మరాజు, అర్జునుడు, నకులసహదేవులు; భిక్షా+అర్థంబు= భిక్షకోసం; అరిగినన్= వెళ్ళగా; ఇట, కుంతియు, భీముండును; తమ విడిసిన, విప్ర, గృహంబునన్= తమయొక్క విడిదిచేసిన బ్రాహ్మణగృహంలో; అంటే తా ముండే బ్రాహ్మణులఇంటిలో; ఉన్న+అంతన్= ఉండగా; అందున్= ఆ ఇంటిలో; ఒక్కపెట్ట= ఒక్కసారిగా; ఆర్త, ధ్వని= ఏడుపుశబ్దం; ఎగసినన్= వ్యాపింపగా; విని; కుంతీదేవి, ఎంతయున్; మిక్కిలి; సంతాపించి= దుఃఖించి; భీమునకున్+ ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కుంతీదేవి ఆ ఆహారాన్ని రెండుభాగాలు చేసి ఒకభాగం భీమునికి పెట్టి, తక్కిన భాగాన్ని తానూ, తక్కినకొడుకులూ తింటూ, మారువేషంలో కాలం గడుపుతూండగా, ఒకనాడు ధర్మార్జుననకులసహదేవులు భిక్షకు వెళ్ళినసమయంలో తానూ భీముడూ ఇంట్లో ఉండగా, తా ముండే ఆ బ్రాహ్మణగృహంలో ఒక్కసారిగా పెద్దఏడుపు వినిపించింది. అది విని కుంతీదేవి ఎంతో బాధపడి భీమునితో ఇట్లా అన్నది.

**తే. ఇందు సుఖ ముండితిమి యెరు లెఱుఁగకుండ । నేలొకో యిప్పు డీ విప్రు నింట నార్త**
**రవము వీతెంచె? దీని నారసి యెఱుంగ । వలయుఁ; దత్ప్రతీకారంబు వలయుఁ జేయ. 242**

**ప్రతిపదార్థం:** ఒరులు+ఎఱుఁగక+ఉండన్= ఇతరులకు తెలియకుండ; ఇందున్= ఈ బ్రాహ్మణుని ఇంటిలో; సుఖము+ ఉండితిమి= సుఖంగా ఉన్నాం; ఇప్పుడు+ఈ, విప్రుని+ఇంటన్= ఇప్పు డీ బ్రాహ్మణుని ఇంట్లో; ఆర్త, రవము= ఏడుపుధ్వని; ఏల+ఒకో= ఎందుచేతనోకదా!; వీతెంచెన్= వ్యాపించింది; దీనిన్+ఆరసి= దీన్ని విచారించి; ఎఱుంగవలయున్= తెలిసికోవాలి; తత్+ప్రతీకారంబు= దానికి మారుచేతను; చేయ, వలయున్= చేయాలి, అనగా వాళ్ల బాధ తొలగించాలి.

**తాత్పర్యం:** ఇతరులకెవ్వరికీ తెలియకుండ ఇక్కడ సుఖంగా ఉన్నాం. ఎందుచేతనో ఇప్పు డీ బ్రాహ్మణుని ఇంట్లో ఏడుపుధ్వని వినవస్తున్నది. దీన్ని విచారించి తెలిసికొని వాళ్లబాధను తొలగించాలి.

**వ. పరమోపకారి యైన యీ బ్రాహ్మణునకు నేమి ప్రియము సేయ సమకూరునో యని చింతించుచున్నచో నిప్ప డెద్ది యేనియు నొక్క దుస్తరం బయిన దుఃఖం బీ గృహస్థున కయ్యెం గావలయు; నా మనంబు మలమల మఱిఁగెడుఁ గావున దీనిం దలఁగి వీరికి మనఃప్రియంబు సేయవలయు. 243**

**ప్రతిపదార్థం:** పరమ+ఉపకారి+ఐన= మిక్కిలిఉపకారం చేసినవాడైన; ఈ, బ్రాహ్మణునకున్; ఏమి, ప్రియము= ఏమిఇష్టం; చేయన్; సమకూరునో= కలుగుతుందో; అని= ఆ విధంగా; చింతించుచున్+ఉన్నచోన్= ఆలోచిస్తూ ఉండగా; ఇప్పుడు; ఎద్ది+ఏనియున్= ఏదోఒక; దుస్తరంబు+అయిన= దాటరానిదైన; దుఃఖంబు= కష్టం; ఈ గృహస్థునకున్; అయ్యెన్+కావలయున్= అయి ఉండాలి; నా, మనంబు= నా యొక్క మనస్సు; మలమల= మలమలమాడినట్లు; మఱిఁగెడున్= కాగుతున్నది - తపిస్తున్నది; కావునన్; దీనిన్= ఈ కష్టాన్ని; తలఁగి= తొలగించి; వీరికిన్; మనఃప్రియంబు= మనస్సుకు సంతోషాన్ని; చేయవలయున్= కలిగించాలి.

**తాత్పర్యం:** మనకు మహోపకారం చేసిన ఈ బ్రాహ్మణునికి ఏదైనా ఇష్టమైనది చేయాలని ఆలోచిస్తుండగా ఇప్పు డేదో దాట శక్యంకాని కష్టం ఈ యింటి యజమానికి కలిగినట్లున్నది. నా మనస్సు చాలా బాధపడుతున్నది. అందుచేత ఆ కష్టాన్ని తీర్చి' వారికి మనస్సంతోషాన్ని కలిగించాలి.

**క. కృత మెఱుఁగుట పుణ్యము; స । న్మతి దానికి సమముసేఁత మధ్యము; మఱి త**
**త్కృతమున కగ్గలముగ స । త్కృతిసేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్. 244**

**ప్రతిపదార్థం:** కృతబుద్ధులకున్= చేయబడినబుద్ధిగలవాళ్ళకు - అంటే పండితులకు; కృతము= చేయబడినదాన్ని; ఎఱుఁగుట= తెలిసికొనటం; పుణ్యము; సత్+మతిన్= మంచిబుద్ధితో; దానికిన్= చేసినమేలుకు; సమము= సమమైనదాన్ని - ప్రత్యుపకారాన్ని; చేఁత= చేయటం; మధ్యము= మధ్యమార్గం; మఱి= అంతేకాక; తత్+కృతమునకున్= ఆ చేయబడినదానికంటె; అగ్గలముగన్= అధికంగా; సత్+కృతి= మంచిపని; ప్రత్యుపకారం; చేయుట; ఉత్తమంబు.

**తాత్పర్యం:** బుద్ధిమంతులైనవాళ్ళు-ఎదుటివాళ్ళు చేసిన ఉపకారాన్ని గుర్తించటమే గొప్ప పుణ్యకార్యం. మంచిబుద్ధితో దానికి సమానమైన ప్రత్యుపకారం చేయటం మధ్యమమార్గం. అట్లాకాక చేసిన ఉపకారంకంటె ఎక్కువగా ప్రత్యుపకారం చేయటం ఉత్తమపద్ధతి.

**విశేషం:** నన్నయనానారుచిరార్థసూక్తి కిది ఒక చక్కని ఉదాహరణం.

**వ. అనిన విని భీమసేనుం డి ట్లనియె. 245**

**తాత్పర్యం:** అని కుంతీదేవి పలుకగా భీముడు విని ఈ విధంగా అన్నాడు.

**వ. ఎఱిఁగి నాకుఁ జెప్పు; మిది యేమి? యెవ్వరి । వలన నింతయయ్యె? వగవ నేల?**
**యెంత కడిఁది యైన నిది యేను దీర్చి యీ । విప్రునకుఁ బ్రియంబు విస్తరింతు. 246**

**ప్రతిపదార్థం:** ఇది; ఏమి= ఈ దుఃఖం ఏమిటి!; ఎవ్వరివలనన్= ఎవరివల్ల; ఇంత+అయ్యెన్= ఇంత జరిగింది - అంటే ఇంతదుఃఖం కలిగింది; ఎఱిఁగి= తెలిసికొని; నాకున్+చెప్పుము; వగవన్+ఏల= దుఃఖించటమెందుకు? ఎంత, కడిఁది+ఐనన్= ఎంతకష్టమైనదైనా; ఇది= దీన్ని; ఏను= నేను; తీర్చి= నెరవేర్చి, చక్కజేసి; ఈ, విప్రునకున్= ఈ బ్రాహ్మణునికి; ప్రియంబు= సంతోషాన్ని; విస్తరింతున్= అధికం చేస్తాను.

**తాత్పర్యం:** ఇ దేమి దుఃఖం? ఎవరివల్ల ఇంత జరిగింది? తెలిసికొని నాతో చెప్పుము. దుఃఖించటం ఎందుకు? ఇది ఎంత కష్టమైనదైనా నేను దీన్ని తీర్చి ఈ బ్రాహ్మణునికి మిక్కిలి సంతోషాన్ని కలిగిస్తాను.

**వ. అనినం గుంతి యట్ల చేయుదు నని చని దుఃఖపరవశు లయి పరిదేవనంబు సేయుచున్న వారలం జూచి యడుగ నేరక మిన్న కున్నంత బ్రాహ్మణుండు దనబాంధవులు విన ని ట్లనియె. 247**

**ప్రతిపదార్థం:** అనినన్=అనిచెప్పగా; కుంతి; అట్లు+అ= ఆ విధంగానే; చేయుదున్+అని= చేస్తాను అని చెప్పి; చని= వెళ్ళి; దుఃఖపరవశులు+అయి= దుఃఖానికి పూర్తిగా లొంగిపోయినవాళ్ళయి - అంటే పూర్తిగా దుఃఖంలో మునిగిపోయినవాళ్ళయి; పరిదేవనంబు; చేయుచున్+ఉన్న, వారలన్= ఏడుస్తూ ఉండే వాళ్లను; చూచి; అడుగనేరక= అడుగలేక; మిన్నక+ఉన్న+అంతన్= ఊరుకున్న తర్వాత; బ్రాహ్మణుండు; తన, బాంధవులు; వినన్= వినేటట్లుగా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని భీము డనగా కుంతి అట్లాగే చేస్తా నని వెళ్ళి, పూర్తిగా దుఃఖంలో మునిగి ఏడుస్తున్నవాళ్ళను చూచి ఏమీ అడుగలేక ఊరకుండగా బ్రాహ్మణుడు తనబంధువులు వినేటట్లుగా ఇట్లా అన్నాడు.

**బకున కాహారముగాఁ బోవుటనుగూర్చి బ్రాహ్మణకుటుంబము విచారించుట (సం.1-145-20)**

**క. నలసారము సంసార మ । ఖిలదుఃఖావహము భయనికేతన మతిచం**
**చలము పరాధీనం బిం । దుల జీవన మేల నమ్ముదురు తత్త్వవిదుల్. 248**

**ప్రతిపదార్థం:** సంసారము; నలసారము= గడ్డియొక్కసారంవంటి సారంగలది - అంటే నిస్సారమైనది; దుఃఖ+ఆవహము= దుఃఖాన్ని కలిగించేది; భయ, నికేతనము= భయానికి ఇల్లు అయినట్టిది; అతి, చంచలము= మిక్కిలిచలించేది- స్థిరత్వం లేనట్టిది; పర+అధీనంబు= ఇతరులకు లొంగినట్టిది; తత్త్వవిదుల్= నిజాన్ని తెలిసికొన్నవారు - అంటే పండితులు; ఇందుల, జీవనము= సంసారంలోని బ్రతుకును; ఏల! నమ్మెదురు= ఎందుకు నమ్ముతారు.

**తాత్పర్యం:** సంసారం గడ్డివలె నిస్సారమైనది; దుఃఖాన్ని కలిగించేది; భయానికి స్థానమైనది; మిక్కిలి చంచలమైనది; ఇతరులకు లొంగేది; పండితులైనవాళ్ళు ఈ సంసారజీవనం సత్యమైనదని ఎట్లా నమ్ముతారు?

**విశేషం:** కథాప్రసన్నతకు భంగంలేకుండ, సందర్భోచితంగా మానవునికి వెలుగునిచ్చే నన్నయనానారుచిరార్థసూక్తులలో ఇది ఒకటి. నలసారము - నలస్యతృణస్యసారఇసారోయస్య సః - భా.కూ. - శ్రీమదాంధ్రమహాభారత సంశోధితప్రతి, పుట.386.

**క. ఆదిని సంయోగవియో । గాదిద్వంద్వములు దేహి యగు వానికి సం**
**పాదిల్లక తక్కవు పూ । ర్వోదయ కర్మమున నెట్టి యోగికి నయినన్. 249**

**ప్రతిపదార్థం:** ఎట్టి, యోగికిన్+అయినన్= ఎట్లాంటి యోగాభ్యాసంచేసే వానికైనా లేదా ఎట్లాంటి అదృష్టవంతునికైనా; పూర్వ+ఉదయ, కర్మమునన్= పూర్వజన్మంలోని కర్మవలన; ఆదిని= మొదట; సంయోగ, వియోగ+ఆది, ద్వంద్వములు= కలవటం, విడిపోవటం మొదలయిన జంటలు; దేహి+అగువానికిన్= దేహంగలవాడైన వానికి - అంటే ప్రతిమనుజునికి; సంపాదిల్లక= కలుగక; తక్కవు= తప్పవు.

**తాత్పర్యం:** ఎంతయోగికైనా - ఏ మానవుడికైనా - పూర్వజన్మకర్మవలన కలవటం, విడిపోవటం ద్వంద్వాలను అనుభవించటం తప్పదు.

**విశేషం:** మానవజీవితతత్త్వాన్ని తెలిపే నన్నయ రుచిరార్థసూక్తులలో ఇది ఒకటి.

**తరువోజ :-**

**ఏనును బ్రజలును నీధర్మసతియు నే యుపాయంబున నిబ్బారిఁ గడవఁ**
**గానేర్తు? మెయ్యది గర్జ? మిందుండఁ గా దేగుదమ యొండు గడ కని ముంద**
**రే నెంత సెప్పిన నెన్నండు వినద యిది; యిట్టిదారుణ మిమ్మెయిఁ జేయఁ**
**గా నున్న విధి యేల కడవంగ నిచ్చుఁ? గర్మవిపాకంబు గడవంగ లావె. 250**

**ప్రతిపదార్థం:** ఏనును= నేనూ; ప్రజలును= బిడ్డలును; ఈ, ధర్మ, సతియున్= ఈధర్మపత్ని - అంటే ఈ నా భార్యా; ఏ+ఉపాయంబునన్= ఏ ఉపాయంచేత; ఈ+బారిన్= ఈ ఆపదను; కడవంగన్= దాటగా; నేర్తుము (నేర్చుదము); ఏ+అది= ఏది; కర్జము= చేయదగింది; ఇందు+ఉండన్+కాదు= ఇక్కడ ఉండకూడదు; ఒండు+కడకున్= వేరొకచోటికి; ఏగుదము+అ= వెళ్ళుదామే; అని; ముందర+ఏను+ఎంత+చెప్పినన్= ముందుగా నే నెంతచెప్పినా; ఇది= ఈమె (భార్య); ఎన్నండు= ఎప్పుడూ; వినదు+అ= వినలేదు; ఇట్టి, దారుణము= ఇంతటిఘోరాన్ని; ఈ+మెయిన్= ఈవిధంగా; చేయన్+కాన్+ఉన్న= చేయటానికై ఉంటే; విధి= బ్రహ్మ; ఏల= ఎట్లు; కడవంగనిచ్చున్= పోనిస్తాడు; కర్మ విపాకంబు= కర్మఫలం; కడవంగన్= తప్పించుకోవటానికి; లావె= సాధ్యమా?

**తాత్పర్యం:** నేను, బిడ్డలు, నా భార్య ఏ ఉపాయంచేత ఈ ఆపదను దాటగలం? ఏం చేయాలో తోచకుండా ఉన్నది. ఇక్కడ ఉండకూడదు, వే రొకచోటికి వెళ్ళుదామే అని ముందుగా నే నే నెంత చెప్పినా నా భార్య వినలేదు. ఇంతటి ఘోరాన్ని ఈ విధంగా చేయబోతున్న బ్రహ్మ మమ్మల్ని ఎందుకు పోనిస్తాడు? కర్మఫలం తప్పించుకోవటం సాధ్యమా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. తరువోజకు 3 ఇంద్రగణాలు, 1 సూర్యగణం, మళ్ళీ 3 ఇంద్రగణాలు, 1 సూర్యగణం ఉంటాయి. 1-3-7 గణాల మొదటి అక్షరాలకు యతిమైత్రి ఉంటుంది. ప్రాసనియతి ఉన్నది. 102వ పద్యం చూడండి.

**సీ. మంత్రయుక్తంబుగా మత్పరిణీత యై । ధర్మచారిణి యగు దాని వినయ**
**వతిఁ బ్రజావతి ననువ్రత నెట్టు లసురకు । భక్ష్యంబ వగు మని పనుపనేర్తు?**

ధర్మాభివృద్ధిగాఁ దగు వరునకు నీఁగ। నిల్లడ బ్రహ్మచే నిడఁగఁబడిన

యిక్కన్య యతిబాల యిం దుద్భవం బగు। దౌహిత్రలాభంబు దలఁగ నెట్లు

ఆ. దీనిఁ బుత్తు? మఱి మదీయ పిండోదక। నిధిఁ దనూజుఁ గులము నిస్తరించు

వానిఁ బితృగణంబువలని ఋణంబుఁ బా। చిన మహోపకారిఁ జిఱుతవాని. 251

**ప్రతిపదార్థం:** మంత్రయుక్తంబుగాన్= మంత్రంతో కూడుకొన్నదిగా; మత్+పరిణీత+ఐన= నాచే వివాహమాడబడిన; ధర్మ, చారిణి+అగు, దానిన్= ధర్మంలో నడిచేదానిని; వినయవతిన్= వినయవంతురాలైనదానిని; అనువ్రతన్= అనుసరించి నడచుకొనేదానిని; ఎట్టుల= ఏ విధంగా; అసురకున్= రాక్షసునికి; భక్ష్యంబవు+అగుము+అని= తినదగిన దానివి కమ్ము అని; పనుప, నేర్తున్= పంపించగలను; ధర్మ+అభివృద్ధిగాన్= ధర్మం ఎక్కువగా పెరిగేటట్లు; తగు, వరునకున్= తగిన మగనికి; ఈగన్= ఇవ్వటానికి; బ్రహ్మచే= బ్రహ్మదేవునిచేత; ఇల్లడ= అడిగినప్పుడు ఇమ్మని ఉంచిన వస్తువుగా; ఇడఁగన్+పడిన= ఉంచబడిన; ఈ+కన్య; అతిబాల= చాలా చిన్నది; ఇందు+ఉద్భవంబు+అగు= దీనిద్వారా కలిగేటి; దౌహిత్ర, లాభంబు= కూతురికొడుకు - మనుమడు పుట్టటం; తలఁగన్= తొలగిపోయేటట్లు; ఎట్లు= ఏ విధంగా; దీనిని= ఈ కూతురిని; పుత్తున్= పంపిస్తాను; మఱి= అంతేకాక; మదీయ, పిండ+ఉదక, నిధిన్= నాయొక్క పితృదేవతల కిచ్చే అన్నపుముద్దలకు, నీళ్లకు స్థానమైనవాడిని; తనూజున్= శరీరంనుండి జన్మించినవాడిని - కుమారుడిని; కులము, నిస్తరించువానిన్= వంశాన్ని తరింపజేసేవాడిని; పితృగణంబువలని, ఋణంబున్+పాచిన, మహా+ఉపకారిన్= పితృదేవతలయొక్క సమూహంనుండి ఋణాన్ని తొలగించి గొప్ప ఉపకారం చేసినవాణ్ణి; చిఱుతవానిన్= చిన్నవాడిని.

**తాత్పర్యం:** వేదమంత్రపూర్వకంగా వివాహమాడి నాతోగూడ ధర్మమార్గాన చరిస్తూ వినయవతి అయి నన్నుసరించి నడచుకొనే భార్యను రాక్షసునికి ఆహారం కమ్మని ఎలా పంపగలను? ధర్మం అభివృద్ధి చెందేటట్లు తగిన వరుడి కిచ్చి వివాహం చేయటానికి నా దగ్గర బ్రహ్మదేవుడు ఇల్లడగా ఉంచిన ఈ కన్యను నా కూతురిని - దౌహిత్రుడు నాకు లేకుండాపోయేటట్లు రాక్షసునికి ఆహారంగా ఎట్లా పంపగలను? అంతే కాదు, నా పితృదేవతలకు పిండోదకా లిచ్చే కుమారుడిని, వంశాన్ని తరింపజేసేవాడిని, పితృదేవతల ఋణం తీర్చే మహోపకారిని, ఈ చిన్నవాడిని.

ఆ, ఎట్టు సూచి చూచి యిది పాప మనక య। య్యసుర వాతఁ ద్రోతు నదయవృత్తి;

నరిగి యేన యిప్ప డసురకు నాహార। మగుదు వీరిఁ బుచ్చ నగునె నాకు. 252

**ప్రతిపదార్థం:** ఎట్టు= ఏవిధంగా; చూచి, చూచి; ఇది= ఈ పని; పాపము+అనక; ఆ+అసురవాతన్= ఆ రాక్షసుని నోట; అదయ, వృత్తిన్= దయలేనినడవడికతో - అంటే క్రూరంగా; త్రోతున్= తోస్తాను; ఏన= నేనే; అరిగి= వెళ్ళి; ఇప్పుడు+అ= ఇప్పుడే; అసురకున్= రాక్షసునికి; ఆహారము+అగుదున్= ఆహారం అవుతాను; నాకున్; వీరికిన్; పుచ్చన్+అగునె= పంపతగునా!

**తాత్పర్యం:** ఏ విధంగా చూచి చూచి ఇది పాపమని అనక ఈ చిన్నవాడిని క్రూరంగా ఆ రాక్షసునినోట తోస్తాను? నేనే వెళ్ళి ఇప్పుడే ఆ రాక్షసునికి ఆహారమవుతాను. వీళ్ళను నేను పంపదగునా?

వ. అని యాత్మపరిత్యాగంబునందుఁ గృతనిశ్చయుం డై యున్న బ్రాహ్మణుం జూచి బ్రాహ్మణి యి ట్లనియె. 253

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; ఆత్మ, పరిత్యాగంబునందున్= తనను తాను అర్పించుకోవటంలో; కృత, నిశ్చయుండు+ఐ= చేయబడిన నిర్ణయం కలవాడై; ఉన్న; బ్రాహ్మణున్+చూచి; బ్రాహ్మణి= బ్రాహ్మణునిభార్య; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని తనను తాను అర్పించుకోవటానికి నిర్ణయించుకొన్న బ్రాహ్మణుణ్ణి చూచి, ఆ బ్రాహ్మణుని భార్య ఈ విధంగా అన్నది.

**క. మనుజులకు నెవ్విధంబున । ననతిక్రమణీయ మైన యాపద్విషయం**
**బున సంతాపింపఁగ జన । దని యెఱిఁగియు నగునె యెట్టు లని శోకింపన్. 254**

**ప్రతిపదార్థం:** మనుజులకున్; ఏ+విధంబునన్= ఏ విధంగానైనా; న+అతిక్రమణీయము+ఐన= దాటరానిదైన; ఆపత్+ విషయంబునన్= ఆపద విషయంలో; సంతాపింపఁగన్+చనదు+అని= దుఃఖించకూడదని; ఎఱిఁగియున్= తెలిసియు, ఎట్టుల+అని= ఎట్లా అని; శోకింపన్= దుఃఖించగా; అగునె= తగునా!

**తాత్పర్యం:** మానవులకు ఏవిధంగాను దాటరానిదైన ఆపదవిషయంలో శోకించగూడదని తెలిసికూడా ఎట్లా అని శోకింపవచ్చా? (కూడ దని భావం.)

**వ. ఆ రక్కసున కే నశనం బయ్యెద; మీరు వగవకుండుఁడు; భార్యయందుఁ బడయంబడు నపత్యంబు నాయందు మున్న పడసితి; రేనును ఋణవిముక్త నయితిం; బ్రాణవియోగంబు సేసి యయినను భార్య పతికి హితంబు సేయవలయు; మఱి యట్లుంగాక. 255**

**ప్రతిపదార్థం:** ఆ, రక్కసునకున్= ఆ రాక్షసునికి; ఏను+అశనంబు+అయ్యెదన్= నేను ఆహారమవుతాను; మీరు; వగవక+ఉండుఁడు= దుఃఖించకండి; భార్య+అందున్, పడయన్+పడు+అపత్యంబు= భార్యవల్ల పొందబడే సంతానం; నా+అందున్= నా యందు; మున్న= ముందే; పడసితిరి= పొందారు; ఏనును= నేనుకూడా; ఋణ, విముక్తను+అయితిన్= ఋణాన్ని తీర్చుకొన్న దాన్ని అయ్యాను; ప్రాణ, వియోగంబు+చేసి+అయినను= ప్రాణాలు వదలి అయినా; భార్య; పతికిన్= భర్తకు; హితంబు+చేయవలయున్= మేలు చేయాలి; అట్లున్+కాక= ఆవిధంగా కాకుండా.

**తాత్పర్యం:** ఆ రాక్షసునికి నేను ఆహారమవుతాను. మీరు దుఃఖించకండి. భార్యద్వారా పొందవలసిన సంతానాన్ని నాయందు ఇదివరకే మీరు పొందారు. నేను నా ఋణం తీర్చుకొన్నాను. ప్రాణాలు వదలి అయినా భార్య భర్తకు మేలుచేయాలి. అట్లాకాక-

**ఆ. పురుషుకంటె మున్ను పరలోక మేఁగిన । సతియ నోఁచినదియు సతులలోనఁ;**
**బురుషహీన యైనఁ బరమపతివ్రత । యయ్యు జగముచేతఁ బ్రయ్యఁబడదె. 256**

**ప్రతిపదార్థం:** పురుషుకంటెన్, మున్ను= భర్తకంటె ముందుగా; పరలోకము+ఏఁగిన, సతియ= పరలోకానికి పోయిన భార్యయే; సతులలోనన్= పతివ్రతలలో; నోచినదియు= పుణ్యంకలది; పురుష, హీన+ఐనన్= భర్తను కోల్పోయిందైతే; పరమ, పతివ్రత+అయ్యున్= పరమపతివ్రత అయికూడా; జగముచేతన్= లోకంచేత; ప్రయ్యన్+పడదె= నిందను పొందదా!

**తాత్పర్యం:** భర్తకంటె ముందు మరణించినభార్యే పతివ్రతలలో మిక్కిలి పుణ్యాత్మురాలు. పరమపతివ్రత అయినా భర్తలేని స్త్రీ లోకంచేత నింద పొందుతుంది గదా!

**ఆ. పడిన యామిషంబు పక్షు లపేక్షించు । నట్లు పురుషహీనయయిన యువతిఁ**
**జూచి యెల్లవారుఁ జులుక నపేక్షింతు । రిదియుఁ బాప మనక హీనమతులు. 257**

**ప్రతిపదార్థం:** పడిన+ఆమిషంబు= క్రింద పడిన మాంసపుముక్కను; పక్షులు+అపేక్షించునట్లు= పక్షులు కోరేవిధంగా; పురుష, హీన+అయిన, యువతిన్+చూచి= భర్తలేని స్త్రీని చూచి; ఎల్లవారున్= అందరు; హీనమతులు= నీచమైన బుద్ధికలవాళ్ళు; ఇదియున్= ఇది; పాపము+అనక; చులుకన్= తేలికగా; అపేక్షింతురు= కోరుకుంటారు.

**తాత్పర్యం:** క్రిందపడిన మాంసపుముక్కను పక్షులు కోరేవిధంగా భర్తను కోల్పోయిన స్త్రీని చూచి నీచులు ఇది పాప మని కూడా అనుకోక తేలికగా ఆమెను కోరతారు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. సతి విముక్త యయినఁ బతికిఁ బునర్దార । సంగ్రహంబు సేఁత శాస్త్రమతము;**
**పతి విముక్తుఁ డయిన సతి కన్యపురుషసం । గ్రహముసేఁత లోకగర్హితంబు. 258**

**ప్రతిపదార్థం:** సతి, విముక్త+అయినన్= భార్య విడువబడినదైతే - అంటే భార్య మరణిస్తే; పతికిన్= భర్తకు; పునః+దార, సంగ్రహంబు+చేత= మరల భార్యను చేపట్టటం; శాస్త్ర, మతము= శాస్త్రంయొక్క పద్ధతి; పతి, విముక్తుఁడు+అయినన్= భర్త విడువబడ్డ వాడయితే - అంటే భర్త మరణిస్తే; సతికిన్= భార్యకు, అన్య, పురుష, సంగ్రహము+చేఁత= మరొక భర్తను చేపట్టటం; లోక, గర్హితంబు= లోకంచేత నిందింపబడింది.

**తాత్పర్యం:** భార్య మరణిస్తే భర్త మరొక భార్యను స్వీకరించటం శాస్త్రసమ్మతమే. భర్త మరణిస్తే భార్య మరొక భర్తను స్వీకరించటం లోకంచేత నిందింపబడింది.

**వ. 'కావున నేను భవద్విహీన నయి యొక్క నిమేషం బేనియు జీవింపనేర; నేర్చితినేనియు ని క్కుమారుల రక్షింపనేర; నె ట్లనిన శూద్రులు వేదశ్రుతిం బ్రార్థించునట్లు కులాచారసదృశులు గానివా రిక్కన్యం బ్రార్థించినం దత్ప్రతీకారంబు సేయను నిక్కుమారునందు గుణాధానంబు సేయను నాకొలంది గాదు; మత్పరోక్షంబునం బునర్దార పరిగ్రహంబు సేసి గృహస్థధర్మంబును నగ్నిహోత్రంబునుం బుత్త్రులను రక్షించునది । యనుచు మరణవ్యవసాయంబునం దున్న తల్లిని దండ్రిం జూచి కూఁతు రి ట్లనియె. 259**

**ప్రతిపదార్థం:** కావున, నేను; భవత్+విహీనన్+అయి= మీయొక్కలేకుండటాన్ని గలదాననై - అంటే మీరు లేనిదానినై; ఒక్కనిమేషంబు+ఏనియు= ఒక నిమిషమైనా; జీవింపనేరన్= బ్రతుకలేను; నేర్చితిన్+ఏనియు= ఒకవేళ బ్రతుకనేర్చినా; ఈ+కుమారులన్= ఈ బిడ్డలను; కుల+ఆచార, సదృశులు, కాని వారు= కులంయొక్క ఆచారానికి సరిపోలనివాళ్ళు; ఈ+కన్యన్; ప్రార్థించినన్= కోరితే; తత్+ప్రతీకారంబు+చేయను= దానికి పరిహారం చేయటానికి; ఈ+కుమారుని+అందున్= ఈ కుమారునియెడ; గుణ+ ఆధానంబు+చేయను= గుణాలు ఉంచటాన్ని చేయటానికి - అనగా నేను చనిపోయింతర్వాత; పునః+దార, పరిగ్రహంబు+చేసి= మళ్ళీ భార్యను చేపట్టి; గృహస్థ; ధర్మంబును= గృహస్థునియొక్క ధర్మాన్ని - భార్యను పరిగ్రహించి

ధర్మార్థకామాలను నడుపుతూ, వేదపాఠం, వైశ్వదేవాదిహోమం, అతిథిపూజ, పితృతర్పణం, భూతబలి అనే పంచయజ్ఞాలు చేయటం; అగ్నిహోత్రంబునున్; పుత్రులను; రక్షించునది= కాపాడండి; అనుచున్, మరణ, వ్యవసాయంబు+అందు+ఉన్న= చనిపోయే ప్రయత్నంలో ఉన్న; తల్లిని, తండ్రిని+చూచి; కూతురు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'కావున నేను మీరు లేకుండ ఒక్క నిమిషమైనా జీవించలేను. ఒకవేళ జీవించినా ఈ బిడ్డలను రక్షించలేను. ఎట్లంటే వేదాధికారం లేని శూద్రులు వేదం వినటాన్ని కోరినట్లు, కులాచారానికి సరిపోనివాళ్ళు ఈ కన్యను కోరితే దానికి ప్రతీకారం చేయటానికికాని, ఈ కుమారునికి మంచిగుణాలు అలవడేటట్లు తగినశిక్షణ ఇవ్వటానికి కాని - నాకు శక్తి లేదు. నేను మరణించినా మీరు మరొక భార్యను చేపట్టి గృహస్థు ఆచరించవలసిన ధర్మాన్ని, అగ్నిహోత్రాన్ని, పుత్రులను రక్షించండి' - అని చనిపోయే ప్రయత్నంలో ఉన్న తల్లిని, తండ్రిని చూచి కూతురు ఈ విధంగా అన్నది.

**ఆ. ఒలసి యెంతకాల ముండిన నేను మీ । దానఁ గాన, యొరుల ధనము; నన్ను**
**నెన్నఁడయిన నొరుల కిచ్చుచో నసురకు । భోజనముగ నిచ్చి పుచ్చుఁ డిపుడ. 260**

**ప్రతిపదార్థం:** ఒలసి= కలిసి; ఎంతకాలము+ఉండినన్= ఎంతకాలం మీతో ఉన్నా; ఏను= నేను; మీ, దానన్, కాను+అ= మీ దాన్ని కాను (ఆడదాన్నే); ఒరుల, ధనము+అ= ఇతరులయొక్క సొమ్మునే; నన్నున్= నన్ను; ఎన్నఁడు+అయినన్= ఏ రోజైనా; ఒరులకున్= ఇతరులకు; ఇచ్చుచోన్= ఇవ్వవలసిఉండగా, ఇపుడు+అ= ఇప్పుడే; అసురకున్= రాక్షసునికి; భోజనముగన్= ఆహారంగా; ఇచ్చి, పుచ్చుడు= ఇచ్చిపంపండి.

**తాత్పర్యం:** ఎంతకాలం మీతో కలిసి ఉన్నా నేను మీదాన్ని కాను, ఇతరుల సొమ్మునే. ఎప్పుడైనా నన్ను ఇతరుల కివ్వటం తప్పనప్పుడు ఇప్పుడే ఈ రాక్షసునికి ఆహారంగా ఇచ్చి పంపండి.

**తే. తండ్రిచేయు తిలోదక దాన విధులు । పొందుఁ బరలోకగత యైన పుత్రియందుఁ;**
**బుత్రి చేసిన విధులు దత్పురుషుఁ గాని । తల్లిదండ్రులఁ బొందవు ధర్మయుక్తి. 261**

**ప్రతిపదార్థం:** తండ్రి, చేయు, తిల+ఉదక, దాన, విధులు= నువ్వులు, నీళ్ళువదలటంవంటి తర్పణక్రియలు; పర, లోకగత+ఐన= స్వర్గలోకానికి వెళ్ళిందైన; పుత్రి+అందున్= కుమార్తెకు; పొందున్= చేరుతాయి; పుత్రి= కూతురు; చేసిన; విధులు= చేసేకర్మలు; తత్+పురుషునకున్+కాని= దానియొక్క భర్తకే కాని; తల్లి, తండ్రులన్; ధర్మయుక్తిన్= ధర్మంప్రకారం; పొందవు= చేరవు.

**తాత్పర్యం:** తండ్రి వదలే నువ్వులు, నీళ్ళు మరణించిన కూతురుకి చెందుతాయి. కాని, కూతురు చేసే కర్మలు ధర్మప్రకారం ఆమె భర్తకే కాని, తల్లిదండ్రులకు చెందవు.

**విశేషం:** సందర్భం వచ్చినపుడంతా నన్నయ సంక్షిప్తంగా వైదికవిధులు వివరిస్తాడు.

**వ. 'మీకు నాయం దయ్యెడు దౌహిత్ర లాభంబునకంటె మీ రిద్దఱు జీవించిన ననేక పుత్త్ర పౌత్త్ర లాభం బగు; దానంజేసి కులంబు నిలుచుం గావున నన్నుఁ బుచ్చుం' డనినఁ గూఁతుం గౌఁగిలించుకొని యేడ్చుచున్న వారల కన్నీళ్ళు దుడుచుచు. 262**

**ప్రతిపదార్థం:** మీకున్; నా+అందు+అయ్యెడు= నాయందు కలిగే; దౌహిత్ర, లాభంబునకంటెన్= మనుమని పుట్టుకకంటె; మీరు+ఇద్దఱు; జీవించినన్= బ్రదికిఉంటే; అనేక, పుత్త్ర, పౌత్త్ర, లాభంబు+అగున్= పెక్కుమందికుమారులు, మనుమలు కలగటం జరుగుతుంది; దానన్+చేసి= దానివలన; కులంబు= వంశం; నిలుచున్= నిలుస్తుంది; కావునన్, = కాబట్టి; పుచ్చుండు+అనినన్= పంపండి అని అనగా; కూఁతున్= కుమార్తెను; కౌఁగిలించుకొని; ఏడ్చుచున్+ఉన్న; వారల= తల్లిదండ్రుల; కన్నీళ్ళు, తుడుచుచున్.

**తాత్పర్యం:** 'మీకు నాయందు మనుమడు పుట్టటం అనే లాభంకంటె, మీ రిద్దరు బ్రతికి ఉంటే పెక్కుమంది కుమారులు, మనుమలు పుడతారు. వారివల్ల వంశం నిలుస్తుంది. అందుచేత నన్ను రాక్షసునికి ఆహారంగా పంపం'డని పలికిన కూతురుని కౌగలించుకొని ఏడుస్తున్న తల్లిదండ్రుల కన్నీళ్ళు తుడుస్తూ.

**తే.** **బాలకుం డొక కొండుక కోల చేతఁ । బట్టికొని యేన రక్కసుఁ గిట్టి చంపి**
**చులుక వత్తు మీ రేడ్వఁగా వలవ, దనుచుఁ । గలయ నూరార్చెఁ దన తొక్కుఁబలుకు లొప్ప. 263**

**ప్రతిపదార్థం:** బాలకుండు= చిన్నపిల్లవాడు; ఒక, కొండుక, కోల= ఒక చిన్నకర్రను; చేతన్+పట్టికొని= చేతిలో పట్టుకొని; ఏన= నేను; రక్కసున్= రాక్షసుణ్ణి; కిట్టి= సమీపించి, చంపి; చులుక= సులువుగ; వత్తున్= వస్తాను; మీరు+ఏడ్వఁగా, వలవదు+అనుచున్= మీరు ఏడ్వవద్దంటూ; తన, తొక్కున్, పలుకులు= తనయొక్క అవ్యక్తపు మాటలు - అంటే వచ్చీరాని మాటలు; ఒప్పన్= అందగింపగా; కలయన్= అందరినీ చేరి; ఊరార్చెన్= ఓదార్చాడు.

**తాత్పర్యం:** చిన్నపిల్లవాడు ఒకచిన్నకఱ్ఱను చేత పట్టుకొని 'నేనే ఆ రాక్షసుడిదగ్గరకు వెళ్ళి సులువుగా తిరిగివస్తాను; మీరు ఏడ్వవద్దు' అని వచ్చీరానిమాటలతో అందరినీ చేరి ఓదార్చాడు.

**విశేషం:** తొక్కుపలుకులు - అనేదానికి ముద్దుపలుకులు, తొట్రుపలుకులు, తొత్తుపలుకులు - అనేపాఠాంతరాలున్నాయి. - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.389. కుమారాస్త్రవిద్యాప్రదర్శనఘట్టంలోవలె నన్నయనాటకీయత ఈ తేటగీతిలో తాండవించింది. చిన్నకర్ర చేతపట్టుకొని, తడబడే అడుగులతోవచ్చీరానిమాటలతో అందరినీ చేరి ఓదార్చే ఆ బాలకుడిని భావుకుడైన ప్రతిపాఠకుడు చూడగలడు. పై పద్యంలో అన్నీ ప్రాసయతులే.

**వ.** **వాని యవ్యక్తవచనంబులు విని యందఱు నే డ్పుడిగిన, నయ్యవసరంబునం గుంతీదేవి వారల డాయంబోయి. 264**

**ప్రతిపదార్థం:** వాని, అవ్యక్త, వచనంబులు= ఆ బాలకునియొక్క స్పష్టతలేని మాటలు - వచ్చీరాని మాటలు; విని; అందఱున్= ఇంటివాళ్ళు అందరు; ఏడ్పు+ఉడిగినన్= ఏడుపు మానగా; ఆ+అవసరంబునన్= ఆ సమయాన; కుంతీదేవి; వారల, డాయన్+పోయి= వారలదగ్గరకు వెళ్ళి.

**తాత్పర్యం:** ఆ బాలకుని వచ్చీరాని మాటలు విని అందరూ ఏడ్పు మానగా, కుంతీదేవి వాళ్ళదగ్గరకు వెళ్ళి.

**క.** **'ఇది యేమి తెఱఁగు? దీనికి । మొద లెయ్యది నాకుఁ దెల్లముగఁ జెప్పుఁడు తీ**
**ర్చెద' నని విగతాసులఁ దన । మృదు వచన ప్రశ్న మను నమృతమున నెత్తెన్. 265**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ దుఃఖకారణము; ఏమి, తెఱఁగు= ఏమి పద్ధతి; దీనికిన్; మొదలు= కారణం; ఏ+అది; నాకున్, తెల్లముగన్= స్పష్టంగా; చెప్పుఁడు; తీర్చెదన్+అని= తొలగిస్తానని; విగత+అసులన్= పోయినప్రాణాలు కలవాళ్ళను; తన, మృదు, వచన, ప్రశ్నము+అను= తనయొక్క మెత్తనైన మాటలతో కూడిన ప్రశ్న అనే; అమృతమునన్= అమృతంచేత; ఎత్తెన్=పైకెత్తింది - అంటే బ్రతికించింది.

**తాత్పర్యం:** 'ఇది ఏమిటి? దీనికి కారణమేమి? నాకు స్పష్టంగా చెప్పండి. నే నీ ఆపదను తొలగిస్తాను' అని తన మృదువైన మాటలతో కూడిన ప్రశ్న అనే అమృతంతో వాళ్ళను బ్రతికించింది.

**విశేషం:** అలం: రూపకం.

**వ. ఇ ట్లడిగినఁ గుంతీదేవికి నవ్విప్రుం డి ట్లనియె. 266**

**తాత్పర్యం:** ఈ విధంగా అడిగిన కుంతీదేవికి ఆ బ్రాహ్మణుడు ఇట్లా అన్నాడు.

### కుంతీదేవికి బ్రాహ్మణుండు తనదుఃఖకారణంబును దెలుపుట (సం.1-148-1)

**సీ. ఏ నేమి సెప్పుదు దీని నెవ్వరికిని । మానుషంబునఁ దీర్పరాని దాని;**
**నయినను జెప్పెదఁ బ్రియహితవచన । యీ । ప్రోలికి నామడనేల నల్ల**
**యమునానదీగహ్వరమున బకుం డను । రక్కసుం డుండి వాఁ డక్కజముగ**
**నిందుల కాఁపుల నందఱఁ దొల్లి యి । ల్వరుస మ్రింగుచు నున్నఁ బరమసాధు**

**ఆ. లగు ధరామరేంద్రు లగణితజపహోమ । దానవిధులఁ జేసి వానివలనఁ**
**గ్రమము వడసి యొక్క సమయంబుఁ జేసిరి; । యొనర దాని తెఱఁగు వినుము తల్లి! 267**

**ప్రతిపదార్థం:** మానుషంబునన్= మానవప్రయత్నంచేత; ఏ+వారికిని= ఎవరికికూడా; తీర్పరాని, దానిన్= తీర్చటానికి సాధ్యం కానిదానిని; దీనిన్= ఈ విపత్తును; ఏను= నేను; ఏమి+చెప్పుదున్= ఏమని చెప్పగలను? అయినను; ప్రియ, హిత, వచన= వినటానికి ఇంపై మేలుచేసే మాటలు గలదానా! చెప్పెదను; ఈప్రోలికిన్= ఈ పట్టణానికి; ఆమడ, నేలన్= ఆమడదూరంలో; అల్ల, యమునా, నదీ, గహ్వరమున= ఆ యమునానది దగ్గర కొండగుహలో; బకుండు+అను; రక్కసుండు+ఉండి= రాక్షసుడు ఉండి; వాఁడు+అక్కజముగన్= వాడు ఆశ్చర్యకరంగా; ఇందుల కాపులన్+అందఱన్= ఈ పట్టణంలో కాపురముండేవాళ్ళనందరిని; తొల్లి= ఇదివరకు; ఇల్+వరుసన్= ఇంటివరుసన; మ్రింగుచున్+ఉన్నన్= మ్రింగుతూ ఉండగా; పరమ, సాధులు+అగు= మిక్కిలి మంచి వాళ్ళయిన; ధరా+అమర+ఇంద్రులు= భూమియందు దేవతలు - అంటే బ్రాహ్మణశ్రేష్ఠులు; అగణిత, జప, హోమ, విధులన్+చేసి= లెక్కింపసాధ్యంగాని జపాలు, హోమాలు, దానాలు అనేకకర్మలను చేసి; వాని, వలనన్; క్రమము+పడసి= మార్గాన్ని పొంది; ఒక్క, సమయంబున్= ఒక ఏర్పాటును; చేసిరి; తల్లి= ఓ తల్లీ! ఒనరన్= ఒప్పగా; దాని, తెఱఁగు= దానియొక్కవిధం; వినుము.

**తాత్పర్యం:** మానవ ప్రయత్నంచేత ఎవ్వరికీ తీర్ప సాధ్యంగాని ఆపదనుగురించి ఏమని చెప్పగలను? ప్రియంగా, హితంగా మాట్లాడే ఓ తల్లీ! ఈ పట్టణానికి ఆమడదూరాన యమునానదీతీరంలో ఉండే అడవిలో బకుడనే రాక్షసు

డున్నాడు. వాడీపట్టణవాసులను ఇంటివరుసగా మింగుతుండగా పరమసాధువులైన బ్రాహ్మణశ్రేష్ఠులు లెక్కకు మిక్కిలి జప హోమ దాన సత్కర్మలు చేసి, అతనితో ఒక ఏర్పాటు చేసికొన్నారు. అది నీకు చెప్పుతాను. వినుము.

**వ. నిత్యంబు నిలువరుస నొక్కమానిసి రెం డెనుపోతులం బూన్చిన శకటంబున నపరిమితభక్ష్యపిశిత మిశ్రాన్నంబు నించికొని పోయిన దానిని, వానిని, నయ్యెనుపోతులను భక్షించుచు. 268**

**ప్రతిపదార్థం:** నిత్యంబున్= ప్రతిదినం; ఇలువరుసన్= ఇంటి వరుసబట్టి; ఒక్క, మానిసి= ఒక్కమనిషి; రెండు+ఎనుపోతులన్= రెండు దున్నపోతులను; పూన్చిన= కట్టిన; శకటంబునన్= బండిలో; అపరిమిత, భక్ష్య, పిశిత, మిశ్ర+అన్నంబు= అంతులేని తినుబండారాలతో, మాంసంతో కలిపిన అన్నం; నించికొని= నింపుకొని; పోయినన్= పోతే; దానిన్= ఆ అన్నాన్ని; వానిని= ఆ మనిషినీ; ఆ+ఎనుపోతులను=ఆ దున్నపోతుల్నీ; భక్షించుచున్= తింటూ.

**తాత్పర్యం:** ప్రతిదినం ఇంటివరుసన ఒక మనిషి రెండు దున్నపోతులను కట్టిన బండిలో అపరిమితమైన తినుబండారాలూ, మాంసంతో కలిపిన అన్నాన్నీ నింపుకొని వెళ్ళితే, వాడు ఆ అన్నాన్నీ, మనిషినీ, ఆ దున్నపోతుల్నీ తింటూ.

**ఆ. మనుజభక్షుఁ డిదియ తనకు నప్పనముగా । నొరులవలనిబాధ నొరయకుండ**
**దీనిఁ గాచుచుండు నీనాఁటిరాజును । దలఁపఁ డసుర నోర్వ బలిమిలేమి. 269**

**ప్రతిపదార్థం:** మనుజ, భక్షుఁడు= మానవులను తినేవాడు - రాక్షసుడు; ఇదియ= ఇదే; తనకున్, అప్పనముకాన్= కానుకగా; ఒరుల, వలని, బాధన్= ఇతరులవలన కలిగేబాధను; ఒరయక+ఉండన్= కలుగకుండ; దీనిన్= ఈపట్టణాన్ని; కాచుచుండున్= రక్షిస్తూఉన్నాడు; ఈ, నాఁటి, రాజును= ఈ దేశపు రాజుకూడ; అసురన్= రాక్షసుడిని; ఓర్వన్= అణచటానికి; బలిమిలేమిన్= బలంలేకుండటంచేత; తలపఁడు= దీన్నిగురించి ఆలోచించడు.

**తాత్పర్యం:** రాక్షసుడు ఇదే తనకు కానుకగా భావించి, ఇతరులవలన ఈ పట్టణానికి బాధ కలుగకుండ రక్షిస్తూ ఉన్నాడు. ఈ దేశప్రభువుకూడ రాక్షసుడిని చంపగలశక్తి లేనివాడవటంచేత దీన్ని గురించి ఆలోచించడు.

**విశేషం:** అప్పనము - అనేదానికి జీవితము, వర్తనము, వేతనము, జీవనము అనే పాఠాంతరాలున్నాయి. శ్రీమదాంధ్రమహాభారత సంశోధితప్రతి, పుట.290,

**ఉ. పోలఁగ ధర్మశీలుఁ డయి భూరిబలాధికుఁ డైన ధారుణీ**
**పాలకు రక్ష ము న్బడసి భార్యను బుత్త్రుల నర్థయుక్తితో**
**నోలిన మేలుగాఁ బడసి యూళ్ళను నున్నది యట్లుగాని నాఁ**
**డేల గృహస్థవృత్తి సుఖ మేఁగి వనంబున నున్కి కష్టమే. 270**

**ప్రతిపదార్థం:** పోలఁగన్= ఒప్పుగ; ధర్మ, శీలుఁడు+అయి= ధర్మం స్వభావంగా కలవాడై; భూరి, బల+అధికుఁడు+ఐన= పెద్దబలంచేత గొప్పవాడైన; ధారుణీ, పాలకు, రక్ష=భూమిని ఏలే రాజుయొక్క అండ; మున్+పడసి= ముందుగా పొంది; భార్యను; పుత్త్రులన్; అర్థ, యుక్తితోన్= ధనంయొక్కకూడికతో - అంటే ధనం కలిగి; ఓలిన= వరుసగా; మేలుగాన్= మేలు కలదిగా; పడసి= పొంది; ఊళ్ళను+ఉన్నది= ఊళ్ళలో కాపురమున్నట్టిది (తగినపద్ధతి); అట్లు+కాని, నాఁడు= ఆ విధంగా కాని

నాడు; ఏల= ఎందుకు? గృహస్థ, వృత్తి= గృహస్థధర్మం; సుఖమె=సుఖమా! ఏఁగి= వెళ్ళి; వనంబునన్= అడవిలో; ఉనికి= ఉండటం; కష్టమే= కష్టమా!

**తాత్పర్యం:** ధర్మాత్ముడు, బలవంతుడు అయిన రాజుయొక్క రక్షణ పొందిన తర్వాత వివాహమాడి, పిల్లలను కని, ధనం సంపాదించి, ఊళ్ళలో కాపురముండాలి కాని, అది లేనినాడు గృహస్థవృత్తి ఎందుకు? అది సుఖాన్ని ఇయ్యగలదా! వెళ్ళి అడవిలో ఉండటం కష్టమా! అదే సుఖం గదా!

**విశేషం:** సందర్భోచితంగా ఈ పద్యం రాజధర్మాన్ని చెప్పుతున్నది.

**క. అరి యని విప్రులచేతను । ధరణీశులు పోఁకయును మొదలుగాఁ గొన రె**
**వ్వరు నిప్పాపుఁడు మానిసి । నరిగొనియెడు భక్షణార్థి యై విప్రులచేన్. 271**

**ప్రతిపదార్థం:** ధరణి+ఈశులు= భూమికిప్రభువులు - రాజులు; ఎవ్వరున్= ఎవరుకూడ; విప్రులచేతను= బ్రాహ్మణులచేత; అరి+అని= కప్పమని; పోఁకయును, మొదలుగాన్= వక్కనుకూడ; కొనరు= తీసికొనరు; ఈ+పాపుఁడు= ఈ పాపాత్ముడైన రాక్షసుడు; భక్షణ+అర్థి+ఐ= తిండికోరినవాడై; విప్రులచేన్= బ్రాహ్మణులచేత; మానిసిన్= మనిషిని; అరిగొనియెడున్= కప్పంగా తీసికొంటున్నాడు.

**తాత్పర్యం:** రాజులు బ్రాహ్మణులనుండి పోకచెక్కనుకూడా కప్పంగా తీసికొనరు. కాని ఈ పాపాత్ముడైన రాక్షసుడు తిండికొరకు విప్రులనుండి మనిషినే కప్పంగా తీసికొంటున్నాడు.

**విశేషం:** 'పోఁకయు' అనేదానికి 'రూకయు, రూఁకయు' అనే పాఠాంతరాలున్నాయి - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.391.

**వ. 'పెద్దకాలంబునకు నీ యిలువరుస నేఁడు మాకు వచ్చె; ని చ్చిఱుత వాని నా రాక్షసునకు భక్ష్యంబుగాఁ బుచ్చనోప; నేన పోయెద' నని దుఃఖించి పలికిన బ్రాహ్మణునకుఁ గుంతి యి ట్లనియె; 'నయ్యా! దీనికి సంతాపింపవలవ; దీయాపద దలఁగునట్టి యుపాయంబు గంటి; నీకుం గొడు కొక్కరుండ; వాఁడును గడుబాలుండు; బలిగొనపోవ నర్హుండు గాఁడు; నా కేవురుగొడుకులు గలరు; వారలలో నొక్కరుం డారక్కసునకు భవదర్థంబుగా బలి గొని పోయెడు' ననిన దాని విననోడి బ్రాహ్మణుండు చెవులు మూసికొని యి ట్లనియె. 272**

**ప్రతిపదార్థం:** పెద్దకాలంబునకున్= చాలాకాలానికి; ఈ+ఇలు, వరుస= ఈ ఇంటివరుస; నేఁడు= ఈ రోజు; మాకున్= మాకు (వంతుగా); వచ్చెన్= వచ్చింది; ఈ+చిఱుత, వానిన్= ఈ చిన్నవాడిని; ఆ రాక్షసునకున్= ఆ రక్కసునికి; భక్ష్యంబు+కాన్= ఆహారంగా; పుచ్చన్+ఓపన్= పంపలేను; నేను+అ= నేనే; పోయెదను+అని= పోతానని; దుఃఖించి=విలపించి; పలికిన= మాటాడిన; బ్రాహ్మణునకున్= విప్రునికి; కుంతి=కుంతీదేవి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది; అయ్యా!; దీనికిన్; సంతాపింపన్, వలవదు= దుఃఖించవద్దు; ఈ+ఆపద, తలఁగునట్టి= ఈవిపత్తు తొలగిపోయేటి; ఉపాయంబు+కంటిన్= ఉపాయాన్ని కనుగొన్నాను; నీకున్; కొడుకు; ఒక్కరుండు+అ= ఒక్కడే; వాఁడును= వాడుకూడా; కడున్= మిక్కిలి; బాలుండు= పసివాడు; బలికొనిపోవన్= ఆహారం తీసికొనిపోవటానికి; అర్హుండు= తగినవాడు; కాఁడు= కానేరడు; నాకున్+ఏవురు, కొడుకులు= నాకు ఐదుగురు కొడుకులు; కలరు=ఉన్నారు; వారలలోన్, ఒక్కరుండు= ఆ అయిదుమందిలో ఒకడు; ఆ రక్కసునకున్; భవత్+అర్థంబుగాన్= మీకోసం; బలి, కొని, పోయెడున్= కప్పం తీసికొనివెళ్ళగలడు; అనినన్= అని అనగా; దానిన్= ఆ మాటను; వినన్+ఓడి= వినలేక; బ్రాహ్మణుండు; చెవులు, మూసికొని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'చాలా కాలానికి ఈ యింటివరుస నేడు మా యింటికి వచ్చింది. ఈ పసిబాలుణ్ణి రాక్షసునికి ఆహారంగా పంపలేను. నేను పోతాను' అని బ్రాహ్మణుడు దుఃఖంతో పలుకగా, కుంతి 'అయ్యా! దీనికి దుఃఖించవద్దు. ఈ ఆపద తొలగే ఉపాయం నేను ఆలోచించాను. నీకు ఒక్కడే కొడుకు. వాడు పసివాడు. బకుడికి బలితీసుకొనిపోవటానికికూడా అర్హుడు కాడు. నాకు ఐదుగురు కొడుకులు. వాళ్ళలో ఒకడు మీకు బదులుగా ఈ బలి తీసికొని వెళ్ళగలడు' అని అంటూనే బ్రాహ్మణుడు ఆ మాటలు వినలేక చెవులు మూసికొని ఆమెతో ఇట్లా అన్నాడు.

**మధ్యాక్కర.**

> **అతిథి యై వచ్చిన బ్రాహ్మణున్ జీవితార్థి నై నాకు**
> **హితముగా రక్కసువాతఁ ద్రోవ నే నె ట్లొడంబడుదు?**
> **మతి నవమానింపఁగా దనిన విప్రుమరణంబు దలఁచు**
> **టతిపాతకము; పాతకములలో బ్రహ్మహత్యయ పెద్ద.** **273**

**ప్రతిపదార్థం:** అతిథి+ఐ= అతిథిగా; వచ్చిన; బ్రాహ్మణున్= విప్రుడిని; జీవిత+అర్థిని+ఐ= బ్రతుకు కోరుకొన్నవాడినై; నాకున్, హితముగా= నాకు మేలుకలిగేటట్లుగా; రక్కసు; వాతన్= రాక్షసుడి నోటిలో; త్రోవన్= త్రోయటానికి; ఏన్= నేను; ఎట్లు= ఏవిధంగా; ఒడంబడుదున్= ఒప్పుకొంటాను; మతిన్= మనస్సులో; అవమానింపన్+కాదు+అనినన్= అవమానించతగదు అనగా; విప్ర, మరణంబు= బ్రాహ్మణునియొక్క చావును; తలఁచుట= సంకల్పించటం; అతి, పాతకము= మహాపాపం; పాతకములలోన్= పాపాలలో; బ్రహ్మహత్యయు+అ= బ్రాహ్మణుడినిచంపటమే; పెద్ద= పెద్దపాపం.

**తాత్పర్యం:** అతిథిగా వచ్చిన బ్రాహ్మణుడిని, నా జీవితాన్ని నిలుపుకొనే కోరికతో - నాకు మేలు కలిగేటట్లుగా - రాక్షసునిబారిన పడవేయటానికి నే నెట్లా అంగీకరిస్తాను? అసలు బ్రాహ్మణులను అవమానించే సంకల్పమే పాపమైతే విప్రుని మరణాన్ని సంకల్పించటం మరెంత పాపమో! పాతకాలన్నింటిలో బ్రాహ్మణహత్య మహాపాపం. (పెద్దది)

**విశేషం:** మధ్యాక్కర లక్షణం చూడు. ఆది. 6.166. ఇది ధార్మికసూక్తి.

> **క. ధృతి సెడి వేఁడెడువానిని । నతిథిని నభ్యాగతుని భయస్థుని శరణా**
> **గతుఁ జంపఁగ నొడఁబడు దు । ర్మతి కిహముం బరముఁ గలదె మదిఁ బరికింపన్.** **274**

**ప్రతిపదార్థం:** ధృతి+చెడి= ధైర్యంపోయి; వేఁడెడు, వానినిన్= ప్రార్థించేవాడిని; అతిథిని= తిథిలేకుండావచ్చే ఆగంతకుణ్ణి; అభి+అగతుని= భోజనమయానికి రమ్మని ఆహ్వానింపగా వచ్చిన అతిథిని; భయస్థునిన్= భయపడేవాడిని; శరణ+ఆగతున్= శరణుకోరి వచ్చినవాడిని; చంపఁగన్= చంపటానికి; ఒడన్, పడు= ఇష్టపడు; దుర్+మతికిన్= చెడ్డబుద్ధికలవాడికి; మదిన్= మనస్సులో; పరికింపన్= ఆలోచిస్తే; ఇహమున్+పరమున్= ఇహలోకపరలోకసుఖం; కలదె= కలదా! (లేదని భావం)

**తాత్పర్యం:** ధైర్యాన్ని కోల్పోయి ప్రార్థించేవాడిని, అతిథిని, అభ్యాగతుడిని, భయపడేవాడిని, శరణు కోరి వచ్చిన వాడిని చంపాలనుకొనే దుర్మార్గునికి ఇహలోకపరలోకసుఖముంటుందా! (ఉండదు).

**వ. 'మఱి యాత్మఘాతంబు మహాపాతకంబు; దాని కెట్లొడంబడి తంటేని యది యనతిక్రమణీయం బయి యప్రతీకారం బయి యొరులచేతం జేయంబడుటంజేసి నాకుం బాతకంబు లేదు; దానిం జేసినవానికి మహాపాతకం బగుం గావున బ్రాహ్మణహింస కే నొడంబడ నోప' ననినఁ గుంతి యి ట్లనియె. 275**

**ప్రతిపదార్థం:** మఱి ఆత్మ, ఘాతంబు= తనను తాను చంపుకోవటం; మహా, పాతకంబు= మిక్కిలిపాపం; దానికిన్= ఆ ఆత్మహత్యకు; ఎట్లు+ఒడంబడితివి+అంటి+ఏని= ఏ విధంగా అంగీకరించావు అని అంటావేమో; అది; న+అతిక్రమణీయంబు+ అయి= మారుసేత లేనిదై; ఒరులచేతన్+చేయన్+పడుటన్+చేసి= ఇతరులచేత చేయబడటంవలన; నాకున్; పాతకంబు= పాపం; లేదు, దానిన్+చేసిన, వానికిన్= ఆ పనిగావించిన అతనికి; మహా, పాతకంబు= మిక్కిలిపాపం; అగున్=అవుతుంది; కావునన్; బ్రాహ్మణ, హింసకున్= బ్రాహ్మణమరణానికి; ఏన్= నేను; ఒడంబడన్+ఓపన్= ఇష్టపడలేను; అనినన్= అనగా; కుంతి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'తనను తాను చంపుకొనటం (ఆత్మహత్య) మహాపాపం కదా! దానికెట్లా అంగీకరించావని అంటావేమో - అది దాటరానిదై, మారుచేయటానికి వీలులేనిదై, ఇతరులచేత చేయబడుతున్నది కనుక నాకు పాపం లేదు. దానిని చేసినవాళ్ళకే మహాపాపం కనుక నేను బ్రాహ్మణహింసకు (అంటే మీ కుమారుడిని బకుడికి ఆహారంగా పంపటానికి) ఇష్టపడలే' నని పలుకగా కుంతి ఇట్లా అన్నది.

### బకునిఁ జంప భీమునిఁ బంపుటకుఁ గుంతి నిశ్చయించుట (సం.1-149-13)

**క. ఏనును దీనిన తలఁచి మ । హీనుత! విప్రవధ యెద సహింపక మఱి నా**
**సూను సమర్పించితి; మ । త్సూను వధింపంగ రక్కసునకు వశంబే? 276**

**ప్రతిపదార్థం:** మహీ, నుత= లోకంచేత కొనియాడబడేవాడా; ఏనును= నేనుకూడ; దీనిన్+అ= దీన్నే; తలఁచి= ఆలోచించి; విప్ర, వధ= బ్రాహ్మణుడిని చంపటాన్ని; ఎదన్, సహించక= మనస్సులో ఓర్వలేక; మఱి; నా, సూనున్= నాయొక్కకుమారుడిని; సమర్పించితిన్= ఇచ్చాను; మత్+సూనున్+వధింపంగన్= నాయొక్కకుమారుడిని చంపటం; రక్కసునకున్= రాక్షసుడికి; వశంబె= సాధ్యమా; (కాదని భావం)

**తాత్పర్యం:** నేనుగూడ దీన్నే ఆలోచించి బ్రాహ్మణవధను సహింపక నా కుమారుణ్ణి బకాసురుడికి అర్పిస్తానన్నాను. నా కుమారుడిని చంపటం ఆ రాక్షసుడికి సాధ్యం కాదు.

**క. ఖలు నసుర నోర్వ నోపెడు । బలయుతుఁగా నెఱిఁగి కొడుకుఁ బనిచెదఁ గా; కి**
**మ్ముల శతపుత్త్రులు గల ధ । న్యుల కైన ననిష్టుఁ డగు తనూజుఁడు గలఁడే ? 277**

**ప్రతిపదార్థం:** ఖలున్+అసురన్+ఓర్వన్+ఓపెడు= దుర్మార్గుడైన రాక్షసుడిని చంపగలిగిన; బలయుతుగాన్= బలంతో కూడుకొన్నవానిగా; ఎఱిఁగి= తెలిసికొని; కొడుకున్; పనిచెదన్= పంపుతున్నాను; కాక= అట్లా కాక; ఇమ్ములన్= సుఖంగా; శత, పుత్త్రులు= నూరుమంది కొడుకులు; కల= ఉన్నట్టి; ధన్యులకున్+ఐనన్= పుణ్యాత్ములకైనా; అనిష్టుఁడు+అగు= ఇష్టంకానివాడైన; తనూజుఁడు= పుత్రుడు; కలఁడే= ఉన్నాడా? (ఉండడని భావం.)

**తాత్పర్యం:** దుర్మార్గుడైన రాక్షసుడిని చంపగల బలవంతుడని తెలిసే నా కుమారుడిని పంపుతున్నాను. కాకుంటే వందమంది కొడుకులున్నవాళ్ళకయినా ఇష్టంకాని కొడుకు ఉంటాడా?

**వ. 'ఈతనిచేతఁ దొల్లియుఁ బెక్కం డ్రసురులు నిహతు లయిరి' వీఁడు మహాబలసంపన్నుండు మంత్రసిద్ధుం; డని భీముం బిలిచి 'యీ బ్రాహ్మణునాపదం దలఁగి నాకు మనఃప్రియంబు సేయు' మనిన వల్లె యని భీముం డారక్కసుఁ జంప బూనె; బ్రాహ్మణుండును దనబంధువర్గంబుతో సంతసిల్లె; నంత ధర్మార్జుననకుల సహదేవులు వచ్చి పరమహర్ష పరిపూర్ణుండై యున్న పవనతనయునాకారం బుపలక్షించి విస్మితు లగుచుండ ధర్మతనయుం డల్లనఁ దల్లికి ని ట్లనియె. 278**

**ప్రతిపదార్థం:** ఈతనిచేతన్= ఈ నా కుమారునిచేత; తొల్లియున్= ఇదివరకుకూడ; పెక్కండ్రు+అసురులు= పెక్కుమంది రాక్షసులు; నిహతులు+అయిరి= చంపబడినవాళ్ళయ్యారు; వీఁడు= ఇతడు; మహాబల, సంపన్నుండు= మిక్కిలి బలసంపద కలవాడు; మంత్రసిద్ధుండు= మంత్రసిద్ధి కలవాడు; అని= అని చెప్పి; భీమున్, పిలిచి; ఈ, బ్రాహ్మణు+ఆపదన్= ఈ బ్రాహ్మణుని యొక్క విపత్తును; తలఁగి= తొలగించి; నాకున్; మనఃప్రియంబు= మనస్సుకు సంతోషం; చేయుము; అనినన్= అనగా; వల్లె+అని= సరే అని; భీముండు; ఆ, రక్కసున్= ఆ రాక్షసుని; చంపన్+పూనెన్= చంపటానికి పూనుకొన్నాడు; బ్రాహ్మణుండును= బ్రాహ్మణుడుకూడా; తన, బంధు, వర్గంబుతో= తనయొక్క బంధువుల సమూహంతో; సంతసిల్లెన్= సంతోషించాడు; అంతన్= తర్వాత; ధర్మ+అర్జున, నకుల, సహదేవులు= ధర్మరాజు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు; వచ్చి; పరమ, హర్ష, పరిపూర్ణుండు+ఐ= మిక్కిలిసంతోషంతో నిండినవాడై; ఉన్న= ఉండే; పవన, తనయు+ఆకారంబున్= వాయుపుత్రుడైన భీమునియొక్క రూపాన్ని; ఉపలక్షించి= చూచి; విస్మితులు+అగుచున్+ఉండన్= ఆశ్చర్యం పొందినవా రవుతుంటే; ధర్మతనయుండు= ధర్మరాజు; అల్లనన్= మెల్లగా; తల్లికిన్= తల్లితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఇతడు ఇదివరకుకూడా పెక్కుమంది రాక్షసులను చంపాడు. ఇతడు మహాబలవంతుడు. మంత్రసిద్ధి కలవాడు' అని భీముడిని పిలిచి 'ఈ బ్రాహ్మణుని ఆపద తీర్చి నా మనసుకు సంతోషాన్ని కూర్చు'మనగా సరే అని భీముడు ఆ రాక్షసుడిని చంపటానికి పూనుకొన్నాడు. బ్రాహ్మణుడుకూడ తనబంధువులతో కలిసి సంతోషించాడు. తరువాత ధర్మరాజు, అర్జునుడు, నకులసహదేవులు వచ్చి మహానందంతో ఉన్న భీముని రూపాన్ని చూచి ఆశ్చర్యపడుతుండగా ధర్మరాజు మెల్లగా తల్లితో ఇట్లా అన్నాడు.

**చ. నరనుతకీర్తి యీ యనిలనందనుఁ డెవ్వరితోడనేని భీ
కరసమరంబు సేయ సమకట్టినయట్లు మహానురాగ ని
ర్భరమున నున్నవాఁ; డితనిభావము సూడఁగ వేఱు; వీని సు
స్థిరబలు మీరు పంచితిరొ? చెచ్చెరఁ దాన యుపక్రమించెనో? 279**

**ప్రతిపదార్థం:** నర, నుత, కీర్తి= మనుష్యులచేత పొగడబడిన కీర్తిగలవాడు; ఈ+అనిలనందనుడు= ఈ వాయుపుత్రుడు - భీముడు; ఎవ్వరితోడన్+ఏని= ఎవ్వరితోనైనా; భీకర, సమరంబు+చేయన్= భయంకరమైన యుద్ధం చేయటానికి; సమకట్టిన+అట్లు= పూనుకొన్నట్లు; మహా+అనురాగ, నిర్భరమునన్+ఉన్నవాఁడు= గొప్పసంతోషంచేత నిండినట్లున్నాడు; ఇతని, భావము+చూడఁగన్= ఇతనియొక్క స్థితిని చూస్తే; వేఱు= మార్పుగ ఉన్నది; సుస్థిరబలున్= మిక్కిలి నిలకడగల బలంగలవాడిని; వీనిన్= ఈ భీముడిని; మీరు; పంచితిరొ= ఆజ్ఞాపించారా; చెర+చెరన్= వెంటనే; తాను+అ= తనంటత తానే; ఉపక్రమించెనో= పూనుకొన్నాడో!

**తాత్పర్యం:** భీముడు ఎవరితోనో భయంకర యుద్ధం చేయటానికి పూనుకొన్నట్లు మహాసంతోషంగా ఉన్నాడు. ఇతనిస్థితి చూస్తే ఎప్పటిలాగ లేదు. ఈ భీముడిని మీరు ఆజ్ఞాపించారా? లేక తనంతట తానే యుద్ధానికి పూనుకొన్నాడా?

**వ. అని యడిగిన ధర్మతనయునకుఁ గుంతీదేవి 'యీ యేకచక్రపురంబున బ్రాహ్మణుల బకాసురుండు బాధించుటయుఁ దమ విడిసిన యింటిబ్రాహ్మణుని కైన యాపదయు, దానిం దీర్పం బవనతనయు బ్రాహ్మణార్థంబుగాఁ దనసమర్పించుటయుం జెప్పిన విని ధర్మజుండు దుఃఖించి 'యిది యేమి సాహసంబు సేసితి? రొడ్లకొడుకులకుంగాఁ దమకొడుకుల విడుచు దుర్బుద్ధులునుం గలరె; యిది లోకాచారవిరుద్ధంబు; మఱి భీమసేనుఁడు మీకు విడువందగియెడు కొడుకే? 280**

**ప్రతిపదార్థం:** అని; అడిగిన; ధర్మతనయునకున్= ధర్మరాజుకు; కుంతీదేవి, ఈ+ఏకచక్ర, పురంబున, బ్రాహ్మణులన్= ఈ ఏకచక్రపురంలోని బ్రాహ్మణులను; బక+అసురుండు= బకుడు అను రాక్షసుడు; బాధించుటయున్; తమ, విడిసిన= తమయొక్క విడిది చేసిన; ఇంటి= ఇంటిలోని; బ్రాహ్మణునికిన్+ఐన= బ్రాహ్మణునికి కలిగిన; ఆపదయు, దానిన్+తీర్పన్= దానిని తీర్చటానికి; పవన, తనయున్= వాయుదేవునియొక్కకుమారుడైన భీముడిని; బ్రాహ్మణ+అర్థంబుగాన్= బ్రాహ్మణునికొఱకు; తన, సమర్పించుటయున్= తనయొక్క ఇవ్వటం - అంటే తా నివ్వటం; చెప్పినన్= చెప్పగా; విని; ధర్మజుండు= ధర్మరాజు; దుఃఖించి; ఇది+ఏమి+సాహసంబు+చేసితిరి; ఒడ్ల, కొడుకులన్+కాన్= ఇతరులయొక్క కొడుకులకొరకు; తమ, కొడుకులన్; విడుచు= వదిలే; దుర్+బుద్ధులునున్= చెడుబుద్ధి కలవారుకూడ; కలరె= ఉన్నారా? ఇది; లోక+ఆచార, విరుద్ధంబు= ఇది లోకంయొక్కపద్ధతికి వ్యతిరేకమైనది; మఱి= అంతేకాక; భీమసేనుఁడు; మీకున్; విడువన్+తగియెడి; కొడుకే. (విడువదగిన కొడుకు కాడని భావం.)

**తాత్పర్యం:** అని అడిగిన ధర్మరాజుకు కుంతీదేవి ఏకచక్రపురంలోని బ్రాహ్మణులను బకాసురుడు బాధించటాన్నీ, తాము విడిది ఉన్న ఇంటిబ్రాహ్మణునికి కలిగిన ఆపదను, దాన్ని తీర్చటానికి బ్రాహ్మణునికొరకు తాను భీముడిని పంపటాన్నీ చెప్పగా విని ధర్మరాజు దుఃఖించి - 'ఇదేమి సాహసం? ఇతరుల కొడుకులను రక్షించటానికి తమ కొడుకులను కోల్పోయే దుర్బుద్ధులూ ఉన్నారా! ఇది లోకపద్ధతికి విరుద్ధం. అంతేకాదు, భీమసేనుడు మీకు విడువదగిన కుమారుడా?

**సీ. ఇతని విక్రమ మాశ్రయించియ కాదె య । య్యెడ లక్కయిల్లు వెల్వడఁగఁ గంటి;**
**మడవిలో నిద్రావశాత్ముల మై యున్న । మననిద్రఁ జెఱుపఁగా దని హిడింబు**
**నెడగల్గఁ గొనిపోయి యెక్కటి సంపిన । దండితశత్రుఁ డీతండ కాఁడె!**
**యితనిబల్మిన కాదె యెంతయు భీతు లై । ధృతరాష్ట్రనందనుల్ ధృతియుఁ దఱిఁగి**

**ఆ. నిద్రలేక తమకు నిలుచు నుపాయంబు । లొండుదక్కి వెదకుచున్నవారు;**
**బలియు నిట్టిభీము బ్రాహ్మణార్థమ్ముగా । నసురవాతఁ ద్రోతు రవ్వ! యిట్లు. 281**

**ప్రతిపదార్థం:** ఇతని, విక్రమము+ఆశ్రయించియ, కాదె= ఇతనిపరాక్రమాన్ని ఆధారం చేసికొనేకదా; ఆ+ఎడ= ఆ చోట; లక్క+ఇల్లు; వెలువడన్+కంటిమి= లక్కయింటినుండి బయటపడగలిగాము; అడవిలో; నిద్రా+అవశ+ఆత్ములము+ఐ= నిద్రలో

స్వాధీనం లేని దేహాలు గలవారమై; ఉన్న, మన, నిద్రన్; చెఱుపఁగన్+కాదు+అని= చెడగొట్టకూడదని; హిడింబున్= హిడింబాసురుణ్ణి, ఎడ+కలుగన్= దూరముండేటట్లు - అంటే దూరంగా; కొనిపోయి= తీసికొని పోయి; ఎక్కటి= ఒక్కడుగా; చంపిన, దండిత, శత్రుఁడు= దండింపబడిన శత్రువులు కలవాడు; ఈతండు+అ, కాడె= ఇతడే కదా! ఇతని బల్మిన, కాదె= ఇతనిబలంచేతనే కదా; ఎంతయు= ఎంతేని - అంటే మిక్కిలి; భీతులు+ఐ= భయపడినవారై; ధృతరాష్ట్రనందనుల్= ధృతరాష్ట్రునియొక్క కుమారులు - కౌరవులు; ధృతియున్+తఱిగి = ధైర్యం తగ్గి; నిద్రలేక; తమకున్, నిలుచు+ఉపాయంబులు+ ఒండు+తక్కి= తమకు నిలబడునట్టి ఉపాయాలు ఇతరాలు లేక; వెదకుచున్+ఉన్నవారు; బలియున్= బలవంతుడైనవాడిని; ఇట్టి, భీమున్= ఇటువంటి భీముడిని; బ్రాహ్మణ+ అర్థంబుగాన్= బ్రాహ్మణునికోసం; అసుర, వాతన్= రాక్షసునినోట; అవ్వ= అమ్మా; ఇట్లు, త్రోతురు= తోస్తారా!

**తాత్పర్యం:** ఇతని పరాక్రమాన్ని ఆశ్రయించే కదా అక్కడ లక్కయింటినుండి బయటపడగలిగాము. మనం మైమరచి నిద్రించేటప్పుడు మననిద్రకు భంగం కలగకూడదని, హిడింబాసురుడిని దూరంగా తీసికొనిపోయి ఒంటరిగా చంపినవాడితడే కదా! ఇతని బలం చూచేగదా భయపడి కౌరవులు నిద్రలేక తమకు నిలిచే ఉపాయాలు - అంటే బ్రతికిబట్టకట్టే ఉపాయాలు - వెదకుతున్నారు. అమ్మా! అట్లాంటి బలవంతుడైన భీముడిని బ్రాహ్మణునికోసం బకాసురుని నోట్లో ఇట్లా తోస్తారా!

**వ. 'అక్కట! దుఃఖాతిశయంబున మతిభ్రమణం బయ్యెం గా కేమి?' యనినఁ గొడుకునకుఁ గుంతి యి ట్లనియె. 282**

**ప్రతిపదార్థం:** అక్కట= అయ్యో!; దుఃఖ+అతిశయంబునన్= దుఃఖంయొక్క ఆధిక్యం(ఎక్కువ) వల్ల; మతి, భ్రమణంబు+ అయ్యెన్+ కాక+ఏమి= బుద్ధి తిరుగుడుపడటం జరిగిందా ఏమి - అంటే చిత్తచాంచల్యం ఏర్పడిందా ఏమి? అనినన్= అనగా; కొడుకునకున్= ధర్మరాజుతో; కుంతి, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అయ్యో! దుఃఖం అమితంగా ఏర్పడటంవలన మతిభ్రమణం జరిగిందా ఏమి?' అని అనగా ధర్మరాజుతో కుంతీదేవి ఈ విధంగా పలికింది.

**ఆ. భ్రమవిమోహలోభభయపరిభూత నై । కొడుకు విడువ నంత వెడఁగ నయ్య!**
**యేను భీముశక్తి యెఱుఁగక పంచిన । దానఁ గాను; వినుము వీనిశక్తి. 283**

**ప్రతిపదార్థం:** భ్రమ, విమోహ, లోభ, భయ, పరిభూతన్+ఐ= భ్రాంతిచేత, మిక్కిలిమోహంచేత, ఆశచేత, భయంచేత, పీడింపబడినదాన్నై; కొడుకున్= కొడుకును; విడువన్= వదలిపెట్టటానికి; అంత, వెడఁగన్+అయ్య= అంత వెఱ్ఱిదాన్నటయ్యా!; ఏను= నేను; భీము, శక్తి= భీమునియొక్కశక్తి; ఎఱుగఁక= తెలియక; పంచినదానను= ఆజ్ఞాపించినదానిని; కాను= కాదు; వీని, శక్తి; వినుము.

**తాత్పర్యం:** భ్రాంతికి, మోహానికి, ఆశకు, భయానికి వశమై కొడుకును పోగొట్టుకొనటానికి నేనంత వెఱ్ఱిదాన్నటయ్యా! భీమునిశక్తి తెలియక నే నీ పని అప్పగించలేదు. ఇతనిశక్తి వినుము.

**తే. వీఁడు పుట్టిన పదియగునాఁడు పెలుచఁ । బడియె నాచేతనుండి య ప్పర్వతమునఁ;**
**బడినవడిఁ జేసి బాలకు నొడలు దాఁకి । యచటి రాలెల్లఁ బెల్లు ను గ్గయ్యెఁ జూవె. 284**

**ప్రతిపదార్థం:** వీఁడు= ఈ భీముడు; పుట్టిన; పది+అగు, నాఁడు= పదవరోజు; నాచేతన్+ఉండి= నాచేతిలోనుండి; ఆ+పర్వతమునన్= ఆ కొండమీద; పెలుచన్= గట్టిగా; పడియెన్; పడిన వడిన్+చేసి= పడినవేగంచేత; బాలకు+ఒడలు+ తాఁకి= బాలకునియొక్క శరీరం తగిలి; అచటి; రాలు+ఎల్లన్= రాళ్ళన్నీ; పెల్లు= అధికంగా; నుగ్గు+అయ్యెన్+చూవె= పొడి అయ్యాయి సుమా!

**తాత్పర్యం:** ఈ భీముడు పుట్టిన పదవరోజు నా చేతినుండి జారి ఆ పర్వతంమీద గట్టిగా పడ్డాడు. వేగంతో పడ్డవాడిశరీరం తగిలి అక్కడి రాళ్ళన్నీ పొడి అయ్యాయి సుమా!

**వ. అట్టి వజ్రకాయుండు వజ్రధరు నయిన నోర్వనోపు నట్టి సమర్థుండు; రక్కసు నశ్రమంబునం జంపి యిందుల బ్రాహ్మణులబాధ యుడుచుం; బవనతనయు నుద్దేశించి సంతాపింపవలవదు; మనకు సుఖనివాసంబు సేసి పరమోపకారి యైన యీబ్రాహ్మణునకుఁ బ్రత్యుపకారంబు సేయ సమకూరె. 285**

**ప్రతిపదార్థం:** అట్టి, వజ్రకాయుండు= వజ్రంవంటి దేహం కలవాడు; వజ్రధరున్+అయినన్= వజ్రాయుధాన్ని ధరించిన దేవేంద్రుడిని అయినా; ఓర్వన్+ఓపునట్టి, సమర్థుండు= జయించగలిగినట్టి శక్తికలవాడు; రక్కసున్= రాక్షసుడిని; అశ్రమంబునన్= శ్రమలేకుండ - సులువుగా; చంపి; ఇందుల= ఈ ఏకచక్రపురంలోని; బ్రాహ్మణుల, బాధ, ఉడుచున్= బ్రాహ్మణుల బాధను పోగొట్టుతాడు; పవన, తనయున్+ఉద్దేశించి= భీముడిని గురించి; సంతాపింప, వలవదు= దిగులుపడవద్దు; మనకున్; సుఖ, నివాసంబు+చేసి= సుఖమైన ఉనికిని కల్గించి; పరమ+ఉపకారి+ఐన= మిక్కిలి మేలుచేసేవాడైన; ఈ, బ్రాహ్మణునకున్; ప్రతి+ఉపకారంబు= బదులుమేలు; చేయన్= చేయటానికి; సమకూరెన్= (అవకాశం) లభించింది.

**తాత్పర్యం:** ఆ విధంగా వజ్రంవంటి దేహం గల భీముడు వజ్రాయుధుడైన దేవేంద్రుడినైనా జయించగల సమర్థుడు. రాక్షసుడిని సులభంగా చంపి ఈ ఊరి బ్రాహ్మణులబాధ తీర్చగలడు. అతడిని గురించి దిగులుపడ నక్కరలేదు. మనం సుఖంగా ఉండటానికి తగిన నివాసాన్ని కూర్చి మిక్కిలి ఉపకారం చేసిన ఈ బ్రాహ్మణునికి ప్రత్యుపకారం చేయటానికి తగిన అవకాశం లభించింది.

**కుంతి ధర్మజునకుఁ బరదుఃఖనివారణము పరమపుణ్యం బని తెలుపుట (సం. 1-150-20)**

**సీ. ఉత్తమక్షత్త్రియుం డొరులదుఃఖంబులు । దలఁగంగఁ బుట్టిన ధర్మశీలుఁ;**
**డలయక మృత్యుభయం బైనచో విప్రుఁ । గాచి సత్పుణ్యలోకములు వడయు;**
**ధన్యుఁడై క్షత్త్రియు దయఁ గాచి బుధలోక । కీర్తనీయంబగు కీర్తి వడయు;**
**వైశ్యశూద్రులఁ గాచి వసుధాతలస్థిత । సర్వప్రజానురంజనము వడయు;**

**ఆ. ననఘ! సన్మునీంద్రుఁ డయిన వేదవ్యాసు । వలన దీని నిక్కువముగ వింటి;**
**బ్రాహ్మణులకుఁ బ్రియము పాయక చేయంగఁ । గాన్ప చూవె పుణ్యకర్మఫలము. 286**

**ప్రతిపదార్థం:** ఉత్తమ, క్షత్త్రియుండు; ఒరుల, దుఃఖంబులు= ఇతరులయొక్క దుఃఖాలను; తలఁగంగన్= తొలగించటానికి; పుట్టిన; ధర్మశీలుఁడు = ధర్మాన్నే స్వభావంగా కలవాడు; అలయక= ఆలస్యం చేయక; మృత్యు, భయంబు+ఐనచో= మృత్యువు వలన భయం కలిగితే; విప్రున్= బ్రాహ్మణుడిని; కాచి= రక్షించి, సత్+పుణ్య, లోకములు= మంచిపుణ్య లోకాలను; పడయున్= పొందుతాడు; ధన్యుఁడు+ఐ= పుణ్యవంతుడై; క్షత్రియున్= క్షత్రియుని; దయన్+కాచి= దయతో రక్షించి; బుధ,

లోక, కీర్తనీయంబు +అగు= పండితులయొక్క సమూహంచేత పొగడదగిందైన; కీర్తి+పడయున్= కీర్తిని పొందుతాడు; వైశ్య+శూద్రులన్+కాచి= వైశ్యులను, శూద్రులను రక్షించి; వసుధా, తల, స్థిత, సర్వ, ప్రజల+అనురంజనము+పడయు= భూమండలంలో ఉన్న ప్రజలందరియొక్క అనురాగాన్ని పొందుతాడు; దీనిన్= ఈ విషయాన్ని; అనఘా= పాపంలేనివాడా - పుణ్యాత్మా; సత్+ముని+ఇంద్రుం+డు+అయిన= గొప్పమునుల్లో శ్రేష్ఠుడైన; వేదవ్యాసువలనన్; నిక్కువముగన్= నిజంగా; వింటిన్; బ్రాహ్మణులకున్; ప్రియము= ఇష్టమైనది; పాయక, చేయంగన్+కాన్న, చూవె= తప్పక చేయచూడటమే సుమా; పుణ్య, కర్మ, ఫలము= పవిత్రాలైన పనులు చేయటంవలన పొందేఫలం - మహాపుణ్యం.

**తాత్పర్యం:** ఉత్తమక్షత్రియుడు ఇతరుల దుఃఖాలు తొలగించటానికి పుట్టినధర్మశీలుడు, ఆలస్యం చేయక మృత్యుభయం కలిగిన బ్రాహ్మణుడిని కాపాడితే అతడు పుణ్యలోకాలు పొందుతాడు. ధన్యుడై క్షత్రియుడిని దయతో రక్షిస్తే పండితుల చేత ప్రశంసించదగిన కీర్తిని పొందుతాడు. వైశ్యులను, శూద్రులను రక్షిస్తే భూమండలంలో ప్రజలందరి అనురాగాన్ని పొందుతాడు. ఈ విషయం మునిశ్రేష్ఠుడైన వేదవ్యాసుడు చెప్పితే విన్నాను. బ్రాహ్మణులకు ఇష్టమైనది తప్పక చేయచూడటమే సుమా మహాపుణ్యఫలం.

**క. జననుత! బ్రాహ్మణకార్యము । సనం జేసిన బ్రాహ్మణప్రసాదంబున నీ**
**కును నీతమ్ములకును నగు । ననవరతశ్రీసుఖాయురైశ్వర్యంబుల్. 287**

**ప్రతిపదార్థం:** జన, నుత= జనులచేత కొనియాడబడేవాడా!; బ్రాహ్మణ, కార్యము; చనన్+చేసినన్= జరిగేటట్లు చేస్తే; బ్రాహ్మణ, ప్రసాదంబునన్= బ్రాహ్మణులయొక్క అనుగ్రహంచేత; నీకును, నీ, తమ్ములకును, అనవరత, శ్రీ, సుఖ, ఆయుః +ఐశ్వర్యంబుల్= ఎడతెగని సంపద, సుఖం, ఆయువు, ప్రభుత; అగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** బ్రాహ్మణకార్యం పూర్తిచేస్తే వారిఅనుగ్రహంవలన నీకు, నీ తమ్ములకు అంతులేని సంపద, సుఖం, ఆయువు, ప్రభుత కలుగుతాయి.

**వ. అనిన విని ధర్మతనయుండు గుంతీదేవి కారుణ్యబుద్ధికి బ్రాహ్మణభక్తికి ధర్మనిత్యతకు సంతసిల్లి తానును భీమసేను నియోగించె; నంత భీముం డవ్విప్రున కి ట్లనియె. 288**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ధర్మతనయుండు= ధర్మరాజు; కుంతీదేవి, కారుణ్య బుద్ధికిన్= కుంతీదేవియొక్క దయతోకూడిన మనసుకు; బ్రాహ్మణభక్తికిన్= బ్రాహ్మణులపట్లగల భక్తికి; ధర్మ, నిత్యతకు= ధర్మంయొక్క ఎడతెగనితనానికి - అంటే ఎల్లప్పుడూ ధర్మాన్ని ఆచరించటానికి; సంతసిల్లి= సంతోషించి; తానును= తానుకూడా; భీమసేనున్; నియోగించెన్= ఆజ్ఞాపించాడు; అంతన్= అంతట; భీముండు; ఆ+విప్రునకున్= ఆ బ్రాహ్మణునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చెప్పగా విని ధర్మరాజు కుంతీదేవియొక్క దయార్ద్రబుద్ధికి, బ్రాహ్మణభక్తికి; ధర్మాచరణానికి సంతోషించి, తానుకూడా భీమసేనుడిని ఆజ్ఞాపించాడు. అప్పుడు భీమసేనుడు బ్రాహ్మణునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** తల్లిగా కుంతీదేవి కొడుకులను దిద్దితీరుస్తున్న ఉదాత్తవైఖరిని తెలిపే రెండవ సన్నివేశమిది. అన్నంపెట్టి కొడుకులను పోషించటంలోకూడా ఆమె తీర్పరితనం గోచరించింది. ధర్మాన్ని బోధించి, దానిని ఆచరించే పద్ధతిలోకూడ, తాను ఆచరిస్తూ కొడుకుల మొదటిగురువైన తల్లిగా తెలియచెప్పే నేర్పరితనం ప్రదర్శించింది. ధర్మరాజుకుసైతం వివేకం కలిగించే ధర్మబోధ

చేసింది. ఆ తెలివిడి వేదవ్యాసులవలన కలిగిందని ప్రామాణికభావం కలిగించింది. భీముడిని ధర్మాచరణశీలునిగా మలచింది. బుద్ధిశక్తినీ, బాహుబలాన్నీ ధర్మశక్తికి అనుకూలంగా ఎలా రూపొందించాలో తెలిసిన వివేకమూర్తి పాండవమాతృమూర్తి.

**ఆ. కడుపునిండఁ గుడువఁ గానమి రేయెల్లఁ । గన్నుఁబొందకున్నఁ గరము డస్సి**
**యున్నవాఁడ; నాకు నోపుదురేని యా । హారతృప్తిసేయుఁడ; డట్లు లయిన. 289**

**ప్రతిపదార్థం:** కడుపు నిండన్= కడుపునిండుగా; కుడువన్+కానమి= తినటానికి లేకుండటంచేత - అంటే కడుపునిండా తిండి లేకుండటంచేత; రేయి+ఎల్లన్= రాత్రి అంతా; కన్ను+పొందక+ఉన్నన్= కన్ను మూయకుండుటవలన - అంటే నిద్రలేకపోవటంచేత; కరము= మిక్కిలి; డస్సి+ఉన్నవాఁడన్= అలసిఉన్నాను; ఓపుదురు+ఏని= చేయగలిగితే; నాకున్; ఆహార, తృప్తి+చేయుఁడు= ఆహారంచేత తృప్తి చేయండి; అట్టులు+అయినన్= ఆ విధంగా అయితే.

**తాత్పర్యం:** కడుపునిండ తిండి లేకుండటంచేత రాత్రి పూర్తిగా నిద్రలేదు. అందుచేత మిక్కిలి డస్సి ఉన్నాను. పెట్టగలిగితే నాకు ఆహారం తృప్తిగా పెట్టండి. అట్లయితే.

**ఆ. 'బలము పెద్ద గలిగి పాపిష్ఠు రక్కసుఁ । జంపి యిప్పురమున జనుల కెల్ల**
**హర్ష మే నొనర్తు' ననవుడు విప్రుఁడు । దానుఁ జుట్టములును దత్క్షణంబ. 290**

**ప్రతిపదార్థం:** బలము; పెద్ద+కలిగి= ఎక్కువగా పొంది; పాపిష్ఠ, రక్కసున్= పాపి అయిన రాక్షసుని; చంపి, ఈ+పురమునన్= ఈ పట్టణంలోని; జనులకున్+ఎల్లన్= ప్రజలందరికీ; హర్షము= సంతోషం; ఏను= నేను; ఒనర్తున్= చేస్తాను; అని అనగా విని, విప్రుఁడు= బ్రాహ్మణుడు; తానున్; చుట్టములును; తత్క్షణంబు+అ= అప్పటికప్పుడే.

**తాత్పర్యం:** 'బలం ఎక్కువగా పొంది, ఆ పాపాత్ముడైన రక్కసుడిని చంపి, ఈ పురజనులందరికి సంతోషాన్ని కలిగిస్తా' నని అనగా - బ్రాహ్మణుడు, తాను, చుట్టాలు అప్పటికప్పుడే.

**తరలము**

**పలుదెఱంగుల పిండివంటలుఁ బప్పుఁ గూడును నేతికుం**
**డలు గుడంబు దధిప్రపూర్ణఘటంబులుం గొనివచ్చి యీ**
**నలఘుసత్త్వుఁడు మారుతాత్మజుఁ డన్నిటన్ గతఖేదుఁడై**
**బలము గల్గి కడంగె నప్పుడు బ్రాహ్మణార్థము సేయఁగన్. 291**

**ప్రతిపదార్థం:** పలు+తెఱంగులు= అనేక విధాలైన; పిండి, వంటలును; పప్పున్= పప్పును; కూడును= అన్నము; నేతి, కుండలు= నెయ్యిగల కుండలు; గుడంబు= బెల్లం; దధి, ప్రపూర్ణ, ఘటంబులున్= పెరుగుతో పూర్తిగా నిండిన కుండలు; ఈన్= ఈయగా; అలఘు, సత్త్వుఁడు= తక్కువకాని బలం కలవాడు - మహాబలవంతుడు; మారుత+ఆత్మజుఁడు= వాయుతనయుడైన భీముడు; అన్నిటన్= అన్నింటిచేత; గత, ఖేదుఁడు+ఐ= పోయిన బడలిక కలవాడై; బలము+కల్గి; అప్పుడు; బ్రాహ్మణ+అర్థము+చేయఁగన్= బ్రాహ్మణునియొక్క పని చెయ్యటానికి; కడంగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** అనేక విధాలైన పిండివంటలు, పప్పు, కూడు, నేతికుండలు, బెల్లం, పెరుగు నిండినకుండలు తీసుకొని వచ్చి ఇస్తే - వాటి నన్నింటిని భక్షించి బలవంతుడైన భీముడు బడలిక తీరి బ్రాహ్మణుని ఆపద తీర్చటానికి, బకాసురునిమీదికి వెళ్ళటానికి పూనుకొన్నాడు.

**విశేషం:** నన్నయ ఈ ఆశ్వాసంలో రెండు తరలవృత్తాలను వాడాడు. ఒకటి దుర్యోధనుడు పురోచనుని లక్కయిల్లు కట్టటానికి పంపిన ఘట్టంలో ఉన్నది. (ఆది.6.139) రెండోది ఇది. బ్రాహ్మణార్థము అనేమాట బ్రాహ్మణులకొరకు చేసే ఏ పనికైనా వర్తించే అర్థంలో నన్నయచేత వాడబడింది. కాని, అది ఇప్పుడు అర్థపరిణామం పొంది బ్రాహ్మణులఇంట ఆబ్దికానికి భోక్తగా ఒప్పుకొని చేసే పనికే రూఢి కెక్కింది.

## భీముఁడు బకాసురునిఁ జంపఁబోవుట (సం. 1-151-1)

**వ. ఇట్లు భీమసేనుం డిష్టాన్నోపభోగంబునం దృప్తుం డయి భక్ష్యాన్నపూర్ణం బయిన శకటంబు నెక్కి దక్షిణాభిముఖుం డయి బకాసురుం డున్నచోటికిం జని యార్ద్రశుష్కకళేబరదుర్గంధనిందితం బయిన బకస్థానంబు డాయక యెడగలిగి యమునాతీరంబున శకటంబు నిలిపి యారక్కసుం బిలుచుచు వానివచ్చునంతకు మిన్నకుండ నేల యని కాళ్లుసేతులుఁ గడిగికొని యాచమించి యాశకటంబుపయి కూడు గుడుచుచుండె; నటబకాసురుండును.292**

**ప్రతిపదార్థం:** ఇట్లు; భీమసేనుండు; ఇష్ట+అన్న+ఉపభోగంబునన్= ఇష్టమైన ఆహారాన్ని భుజించటంచేత; తృప్తుండు+అయి= తృప్తిపొందినవాడయి; భక్ష్య+అన్న, పూర్ణంబు+అయిన= పిండివంటలతో, అన్నంతో నిండినదైన; శకటంబున్=బండిని; ఎక్కి; దక్షిణ+అభిముఖుండు+అయి= దక్షిణదిశకు ఎదురుగా ముఖం కలవాడై; బకాసురుండు; ఉన్న; చోటికిన్; చని= వెళ్ళి; ఆర్ద్ర, శుష్క, కళేబర, దుర్గంధ, నిందితంబు+అయిన= పచ్చివి, ఎండినవి అయిన పీనుగుల దుర్వాసనచేత దూషింపబడిం దైన; బక, స్థానంబు= బకాసురుడియొక్కచోటు - ఉన్నచోటు; డాయక= సమీపించక; ఎడ+కలిగి= దూరంగా ఉండి; యమునా తీరంబునన్= యమునానదియొక్క ఒడ్డు దగ్గర; శకటంబు= బండి; నిలిపి; ఆ, రక్కసున్= ఆ రాక్షసుడిని; పిలుచుచున్= పిలుస్తూ; వాని, వచ్చు+అంతకున్= వాడియొక్క రాక వరకు; మిన్నక+ఉండన్+ఏల+అని= ఊరకుండుట ఎందులకని; కాళ్లు+చేతులు; కడిగికొని; ఆచమించి= ఆచమనం చేసి; ఆ, శకటంబుపయి= ఆ బండిమీద ఉండే; కూడు= అన్నం; కుడుచుచున్+ఉండెన్= తింటూ ఉన్నాడు; అట= అక్కడ; బకాసురుండును= బకాసురుడుకూడా.

**తాత్పర్యం:** ఈ విధంగా భీమసేనుడు ఇష్టమైన ఆహారాన్ని భుజించి, తృప్తినొంది, పిండివంటలతో, అన్నంతో నిండిన బండినెక్కి, దక్షిణదిశగా బకాసురుడుండేచోటికి వెళ్ళి, పచ్చివి, ఎండినవి అయిన పీనుగుల కంపు కొట్టే బకాసురుని నివాసస్థానాన్ని సమీపించక, యమునానదీ తీరాన్నే బండి నిలిపి, ఆ రాక్షసుణ్ణి పిలుస్తూ, వాడు వచ్చేవరకు ఊరకుండుట ఎందుకని కాళ్ళుచేతులు కడుక్కొని ఆచమనం చేసి బండిమీదికూడు తినసాగాడు. అట బకాసురుడు.

**ఆ. 'ప్రొద్దు నేఁడు పెద్దపోయె నిత్యము నిట । తెచ్చియిచ్చుబలియుఁ దెచ్చి యీఁగ**
**నొల్ల కెలుఁగు లిచ్చుచున్నవాఁ డమ్మను । జాధముండు మెచ్చఁ డయ్యెఁ' ననుచు. 293**

**ప్రతిపదార్థం:** నేఁడు= ఈరోజు; ప్రొద్దు= కాలం; పెద్ద+పోయెన్= ఎక్కువ గడిచింది; నిత్యమున్= ప్రతిదినం; ఇట= ఇక్కడకు; తెచ్చి+ఇచ్చు; బలియున్= (ఆహారరూపమైన) కానుక; తెచ్చి+ఈఁగన్+ఒల్లక= తెచ్చి ఇవ్వటానికి ఇష్టపడక; ఆ+మనుజు+అధముండు= ఆ నీచమానవుడు; ఎలుఁగులు+ఇచ్చుచున్+ఉన్నవాఁడు= పిలుపు ఇస్తున్నాడు; - అంటే పిలుస్తున్నాడు; మెచ్చఁడు+అయ్యెన్+అనుచున్= నన్ను లెక్కపెట్టలేదంటూ.

**తాత్పర్యం:** 'ఈ రోజు ప్రొద్దు పోయింది. ప్రతిదినం ఇక్కడికి తెచ్చి యిచ్చే బలి తెచ్చి ఇవ్వటం ఇష్టపడక, ఆ నీచమానవుడు నన్ను లెక్కపెట్టక పిలుస్తున్నాడు' అని.

**ఆ. అలిగి యౌడుగఱచి యాఁకటి పెలుచన । నిలువనోప కసుర నింగి దాఁకఁ**
**బెరిఁగి యరుగుదెంచె భీమరూపంబుతో । నుగ్రభంగి భీముఁ డున్న దెసకు. 294**

**ప్రతిపదార్థం:** అసుర= రాక్షసుడు; అలిగి= కోపించి; ఔడు+కఱచి= పెదవి బిగబట్టి; ఆఁకటి, పెలుచనన్= ఆకలియొక్క అతిశయంతో; నిలువన్+ఓపక= నిలువలేక; నింగి+తాఁకన్= ఆకాశమంటేటట్లు; పెరిఁగి= విజృంభించి; భీమ, రూపంబుతోన్= భయంకరమైన ఆకారంతో; ఉగ్ర, భంగిన్= అధికమైన కోపంగల వైఖరితో; భీముఁడు+ఉన్న, దెసకున్= భీముడుండే దిక్కుకు; అరుగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** బకాసురుడు కోపించి, అధికమైన ఆకలికి తాళలేక, ఆకాశం ఎత్తున విజృంభించి, భయంకరమైన ఆకారంతో భయంకరమైన విధంగా భీముడుండే దిక్కుకు వచ్చాడు.

**సీ. చనుదెంచి ముందట శకటంబుపైనుండి । యోడక కుడుచుచు నున్న భీము**
**దవ్వులఁ జూచి 'నిత్యము నాకు నియమించి । కొనివచ్చు కూ డేల కుడిచె దీవు?**
**గడుఁ గ్రొవ్వి, రేకచక్రంబునవారల । కే నింత యెల్లిద మేల యైతి?'**
**నని డాయ వచ్చి యయ్యనిలనందనువీఁపుఁ । బిడికిటఁ బొడిచిన, బెదర కసుర**

**ఆ. వలను సూడ కొండు వగవక యెప్పటి । యట్లు కుడుచుచున్న నలిగి బకుఁడు**
**'వీని బాగు సూడ వే' అంచు డాసిన । తరువుఁ బెఱికి కొనుచుఁ దాఁకుఁ దెంచె. 295**

**ప్రతిపదార్థం:** చనుదెంచి= వచ్చి; ముందటన్; శకటంబు పైన్+ఉండి= బండిమీదనుండి; ఓడక= భయపడక; కుడుచుచున్+ఉన్న= ఆహారం తింటున్న; భీమున్; దవ్వులన్= దూరంగా; చూచి; నిత్యము= ప్రతిదినం; నాకున్; నియమించుకొనివచ్చు= ఏర్పాటు చేసుకొని వచ్చే; కూడు+ఏల= అన్నాన్ని ఎందుచేత; ఈవు= నీవు; కుడిచెదు= తింటున్నావు; కడుగ్రొవ్విరి= మిక్కిలి పొగరు పట్టినారు; ఏక, చక్రంబున, వారలకు= ఏకచక్రపురంలో ఉండేవాళ్ళకు; ఏను= నేను; ఇంత+ఎల్లిదము= ఇంతచులకన; ఏల+ఐతిని; అని; డాయ, వచ్చి= దగ్గరగా వచ్చి; ఆ+అనిల, నందను, వీఁపున్= ఆ భీమునియొక్క వీపును; పిడికిటన్ పొడిచినన్= పిడికిటితో పొడవగా; బెదరక= భయపడక; అసుర, వలను+చూడక= ఆ రాక్షసునివైపు చూడకుండ; ఒండు వగవక= వేరేమీ ఆలోచించకుండ; ఎప్పటి+అట్లు; కుడుచుచున్+ఉన్నన్= తింటూఉండగా; బకుఁడు; అలిగి= కోపించి; వీని, బాగుచూడన్+వేఱు+అంచున్= వీడివిధం చూస్తే వేరుగా ఉన్నదని; డాసిన, తరువున్= దగ్గరగా ఉండే చెట్టును; పెఱికికొనుచున్; తాఁకుదెంచెన్= దగ్గరకు వచ్చాడు.

**తాత్పర్యం:** వచ్చి, తనను చూచి భయపడక, బండిమీద ఉండి ఆహారం తింటున్న భీమసేనుడిని - దూరాన్నుండి చూచి 'ప్రతిదినం నాకై తెచ్చే అన్నాన్ని నీ వేల తింటున్నా'వనీ, 'ఏకచక్రపురవాసులు పొగరుపట్టారు. వాళ్ళకు నే నెందువలన ఇంత చులకన అయ్యాను?' అనీ, సమీపించి, భీముడివీపున పిడికిట పొడిచాడు. భీముడు బెదరక, ఆ రాక్షసుడివైపు కూడ చూడకుండ, వేరేమీ ఆలోచించక, ఎప్పటివలె అన్నం తింటుండగా, బకుడు కోపించి, వీడితీరు వేరుగా ఉన్నదని పక్కనుండే చెట్టును పెరికికొని భీమునిదగ్గరకు వచ్చాడు.

**విశేషం:** వీని బాగు - అనే దానికి వీనిబాస, వీనిలావు, వీనిభంగి - అనే పాఠాంతరాలున్నాయి. శ్రీమదాంధ్రమహాభారత సంశోధితప్రతి, పుట.397.

**వ. అంతకు ముందఱ భీమసేనుం డంత కూడునుం గుడిచి యనంతబలసమేతుం డై యంతకాకారంబున మల్లసఱచుకొని యార్చుచు. 296**

**ప్రతిపదార్థం:** అంతకు, ముందఱ= అంతకు మునుపు; భీమసేనుండు; అంత, కూడునున్= మొత్తం ఆహారాన్ని; కుడిచి= తిని; అనంత, బల, సమేతుండు+ఐ= అంతులేనిబలంతో కూడుకొన్నవాడై; అంతక+ఆకారంబునన్= యమధర్మరాజుయొక్క రూపంతో; మల్ల, చఱచుకొని= భుజంతట్టుకొని; ఆర్చుచున్= అరుస్తూ.

**తాత్పర్యం:** అంతకు ముందు భీమసేనుడు మొత్తం ఆహారాన్ని తిని మిక్కిలి బలవంతుడై యమధర్మరాజు రూపం దాల్చి భుజం తట్టి అరుస్తూ.

**ఉ. ఇంచుకయేని పాపమున కెన్నఁడు రోయక యెల్లవారి బా**
**ధించి మనుష్యమాంసములు దించును గ్రొవ్వితి; వాని నెల్లఁ గ్ర**
**క్కించెద, నీమదాంధ్య ముడిగించెద, నిప్పడ కాలుప్రోలి కే**
**గించెదఁ జక్కనై నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా! 297**

**ప్రతిపదార్థం:** రాక్షస+అధమా!= రాక్షసులలో నీచుడైనవాడా! ఎన్నడు= ఎప్పుడుకూడ; పాపమునకున్; ఇంచుక+ఏని= కొద్దిగా కూడ; రోయక= రోతచెందక; ఎల్లవారిన్= అందరినీ; బాధించి; మనుష్య, మాంసములు= మానవుల మాంసాలు; తించును= తినుచును, తింటూ; క్రొవ్వితివి= పొగరెక్కావు; వానిన్+ఎల్లన్= వాటినన్నింటిని; క్రక్కించెదన్= క్రక్కిస్తాను; నీ మద+ఆంధ్యము= నీ పొగరు= యొక్క గ్రుడ్డితనం; ఉడిగించెదన్= పోగొట్టుతాను; ఇప్పుడు+అ= ఇప్పటికిప్పుడే; కాలు+ప్రోలికిన్+ఏగించెదన్= యమధర్మరాజుయొక్క పట్టణానికి పంపిస్తాను; కిట్టి= సమీపించి; రణంబునన్= యుద్ధంలో; చక్కన+ఐ= సరిగా; నిలుము= నిలబడుము.

## భీమసేనుఁడు బకాసురుం జంపుట (సం. 1-151-15)

**వ. అనుచు సమీరణసుతుండు దన సమీపంబున నున్న విశాలసాలవృక్షంబు పెఱికికొని రక్కసునిపై వైచిన వాఁడును దన చేతివృక్షంబున దాని భగ్నంబుఁ జేసె; ని ట్లిరువురు నొక్కవడి వృక్షయుద్ధంబు సేసి యాసన్న మహీరుహంబులు సమసిన మల్లయుద్ధసన్నద్ధులై. 298**

**ప్రతిపదార్థం:** అనుచున్= అనిఅంటూ; సమీరణ, సుతుండు= వాయుపుత్రుడైన భీముడు; తన, సమీపంబునన్= తన దగ్గరలో ఉండే; విశాల, సాల, వృక్షంబున్= పెద్ద మద్దిచెట్టును; పెఱికికొని= ఊడదీసి; రక్కసు, పైన్= రాక్షసుని మీద; వైచినన్= వేయగా; వాఁడును= ఆ రాక్షసుడు కూడా; తన, చేతి వృక్షంబునన్= తనచేతిలోని చెట్టుచేత; దానిన్= ఆ పెద్దమద్దిచెట్టును; భగ్నంబున్+చేసెన్= విరుగగొట్టాడు; ఇట్లు+ ఇరువురున్= ఈ విధంగా ఇద్దరున్నూ; ఒక్క, వడిన్= ఒక్కవేగంలో; వృక్ష, యుద్ధంబు+చేసి= చెట్లతో యుద్ధం చేసి; ఆసన్న, మహీరుహంబులు= దగ్గరుండే చెట్లు; సమసినన్= నశింపగా; మల్ల, యుద్ధ, సన్నద్ధులు+ఐ= మల్లయుద్ధానికి పూనుకొన్నవాళ్ళయి.

**తాత్పర్యం:** అని అంటూ, వాయుపుత్రుడైన భీముడు తనకు సమీపాన ఉన్న ఒకపెద్దమద్దిచెట్టును పెరికి రాక్షసుడిమీద వేయగా - వాడు తనచేతిలో ఉండే చెట్టుతో దాన్ని విరుగగొట్టాడు. ఈ విధంగా ఇద్దరూ చెట్లతో యుద్ధం చేసి, చుట్టుప్రక్కల ఉండే చెట్లన్నీ నశించగా మల్లయుద్ధానికి పూనుకొన్నారు.

**చ. పరువడి నొండొరుం బెనఁగి పట్టుచుఁ ద్రోచుచు నీడ్చుచుం బర**
**స్పరజయకాంక్షులైన బక పాండవవీరుల పాదఘట్టనన్**
**ధరణితలంబు గ్రక్కదలెఁ, దన్నికటద్రుమవల్లు లెల్ల జ**
**ర్జరితము లయ్యెఁ, నిష్ఠురవిశాలశిలల్ నుఱుమయ్యె నయ్యెడన్. 299**

**ప్రతిపదార్థం:** పరువడిన్= క్రమంగా; ఒండు+ఒరున్= ఒకరితో నొకరు; పెనఁగి= కలియబడి; పట్టుచున్= పట్టుకొంటూ; త్రోచుచున్= తోసుకొంటూ; ఈడ్చుచున్= ఈడ్చుకొంటూ; పరస్పర, జయ, కాంక్షులు+ఐన= ఒకరినొకరు జయించాలన్న కోరిక కలవాళ్ళయిన; బక, పాండవ, వీరుల, పాద, ఘట్టనన్= వీరులైన బక భీములయొక్క పాదాలయొక్క తొక్కిడిచేత; ఆ+ఎడన్= ఆ ప్రదేశాన; ధరణి, తలంబు= భూభాగం, క్రక్కదలెన్= మిక్కిలి చలించింది; తత్+నికట, ద్రుమ, వల్లులు+ఎల్ల= దానికి సమీపంలో ఉండేచెట్లు, తీగలు, అన్నీ; జర్జరితములు+అయ్యెన్= శిథిలమయ్యాయి - చెల్లాచెదరయ్యాయి; నిష్ఠుర, విశాల, శిలల్= కఠినాలైన పెద్దబండలు; నుఱుము+అయ్యెన్= పిండి అయ్యాయి.

**తాత్పర్యం:** క్రమంగా భీమబకాసురులు ఒకరితో ఒకరు కలియబడి పట్టుకొంటూ; త్రోసుకొంటూ, ఈడ్చుకొంటూ విజయం సాధించాలని మల్లయుద్ధం చేస్తుంటే, అక్కడి భూభాగం ఎక్కువగా చలించింది. ప్రక్కల ఉండే అన్నిచెట్లూ, తీగెలు చెల్లాచెదరయ్యాయి. కఠినాలైన పెద్దబండలుకూడా పిండి అయ్యాయి.

**ఉ. ఇద్దఱ హుంకృతిధ్వనులు నిద్దఱ భూరిభుజారవంబు న**
**య్యిద్దఱముష్టిఘాతజనితేరితదారుణనిస్వనంబు న**
**య్యిద్దఱపాదఘట్టితమహీరవమున్ విని చూప ఱెల్లనుం**
**దద్దయు భీతి నచ్చటికిఁ దా రెడగల్గఁగఁ బాఱి రొక్కఁడై. 300**

**ప్రతిపదార్థం:** ఇద్దఱ, హుంకృతి, ధ్వనులున్= భీమబకాసురులిద్దరియొక్క హుంకారశబ్దాలు; ఇద్దఱ, భూరి, భుజా, రవంబున్= ఆ యిద్దరియొక్క పెద్దభుజాలు తట్టేచప్పుడు; ఆ+ఇద్దఱ, ముష్టి, ఘాత, జనిత+ఈరిత, దారుణ, నిస్వనంబున్= ఆ యిద్దరియొక్క పిడికిలిపోట్లనుండి పుట్టి త్రోయబడిన భయంకరమైన శబ్దం; ఆ+ఇద్దఱ, పాద, ఘట్టిత, మహీ, రవమున్= ఆ యిద్దరియొక్క పాదాలచే త్రొక్కబడిన భూమియొక్కశబ్దం; విని; చూపఱు+ఎల్లనున్= చూచేవాళ్ళంతా; తద్దయు, భీతిన్= మిక్కిలిభయంతో; తారు= తాము; ఒక్కడు+ఐ= ఒక్కటై; అచ్చటికిన్; ఎడ, కల్గఁగన్= దూరమవునట్లుగా - దూరంగా; పాఱిరి= పరుగెత్తారు.

**తాత్పర్యం:** భీమ బకాసురులిద్దరియొక్క హుంకారాలు, భుజాల చప్పుడు, పిడికిటిపోట్ల ధ్వని, కాళ్ళ తొక్కిళ్ళచేత భూమినుండి పుట్టిన శబ్దం విని, చూచేవాళ్ళంతా మిక్కిలి భయపడి ఒక్కటిగా అక్కడినుండి పరుగెత్తారు.

**విశేషం:** వీరరసోచితంగా ఓజోగుణప్రధానమైన ఈ పద్యంలో - ద్విత్వాక్షర ప్రాస, ద్విత్వాక్షరాలు, విశేషించి మహాప్రాణాక్షరాలు- భీమ బకాసురుల ద్వంద్వయుద్ధాన్ని - అందులోనూ మల్లయుద్ధశబ్దాల్ని అద్భుతంగా ధ్వనింప చేసేవిగా ఉన్నాయి. అక్షర రమ్యమైన నన్నయశైలికి ఇదొక చక్కని ఉదాహరణ.

**వ. ఇట్లు భీమ బకాసురు లాసురంబునం బెనంగి మల్లయుద్ధంబు సేయునెడ. 301**

**ప్రతిపదార్థం:** ఇట్లు; భీమ, బక+అసురులు+ఆసురంబునన్= భీముడు, బకాసురుడు, అసురకృత్యం చేత; పెనంగి= కలియబడి; మల్ల, యుద్ధంబు+చేయు+ఎడ= మల్లయుద్ధం చేసే సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా భీమబకాసురులు రాక్షసంగా కలియబడి మల్లయుద్ధం చేసే సమయంలో.

**క. కడఁగి వృకోదరుఁ డసురం । బడఁగా ధర వైచి వామపాదంబునఁ జే**
**డ్పడ వానిఱొమ్ముఁ దాఁచెం । గడుకొని యసురయును లేచి కడునుద్ధతుఁ డై. 302**

**ప్రతిపదార్థం:** కడఁగి= పూనుకొని; వృక+ఉదరుఁడు= తోడేలుకడుపువంటి కడుపుకలవాడు - భీముడు; అసురన్= రాక్షసుడిని; పడఁగా= పడేటట్లు; ధరన్ వైచి= భూమిమీద పడవేసి; వామ, పాదంబునన్= ఎడమకాలితో; వాని, ఱొమ్మున్= అతనియొక్క ఎదను; తాఁచెన్= తన్నాడు; కడుకొని= పూనుకొని; అసురయును= రాక్షసుడుకూడ; లేచి= పైకిలేచి; కడున్+ఉద్ధతుఁడు+ఐ= మిక్కిలి విజృంభించినవాడై.

**తాత్పర్యం:** ప్రయత్నించి భీముడు బకాసురుడిని నేలమీద పడవేసి, అతనిఎదను ఎడమకాలితో తన్నాడు. వాడుకూడా ప్రయత్నించి, లేచి, మిక్కిలి విజృంభించి.

**క. అనిలసుతుఁ బట్టికొని పె । ల్చన త్రోచి కడంగి కనకశైలనికుంజం**
**బునుబోని వానివక్షముఁ । దనదృఢతరముష్టిఁ బొడిచెఁ దద్దయు నలుకన్. 303**

**ప్రతిపదార్థం:** అనిలసుతున్= వాయుపుత్రుడైన భీముడిని; పట్టికొని= బిగియపట్టి; పెల్చన్= గట్టిగా; త్రోచి= నెట్టి; కడంగి= పూని; కనక, శైల, నికుంజంబును+పోని= బంగారుకొండలోని పొదరింటిని పోలిన; వాని, వక్షమున్= భీమునియొక్క రొమ్మును; తద్దయున్= మిక్కిలి; అలుకన్= కోపంతో; తన, దృఢ, తర, ముష్టిన్= తనయొక్క మిక్కిలి గట్టి పిడికిలితో; పొడిచెన్.

**తాత్పర్యం:** భీముడిని గట్టిగా పట్టుకొని మేరుపర్వతంమీది పొదరింటినిపోలిన అతని ఎదను అమితమైన కోపంతో గట్టిగా తన పిడికిలితో పొడిచాడు.

**విశేషం:** అలం: ఉపమ. కనకశైలనికుంజంబునుబోని - అనేదానికి శైలోచ్ఛ్రాయంబునుంబోని - అనే పాఠాంతరం ఉంది. మూలం; "వ్యాత్తాననేన ఘోరేణ లంబజిహ్వేన రక్షసా తే నాభిద్రుత్య భీమేన భీమో మూర్ధ్ని సమాహితః" - శ్రీమదాంధ్ర మహాభారతసంశోధితప్రతి, పుట. 398.

**వ. భీముండును వాని హీనసత్త్వుంగా నెఱింగి సుర హస్తి హస్తానుకారంబు లైన సవ్య దక్షిణ హస్తంబుల న మ్మనుజ కంటకు కటి కంఠ ప్రదేశంబులు వట్టికొని. 304**

**ప్రతిపదార్థం:** భీముండును= భీముడుకూడా; వానిన్= ఆ బకాసురుణ్ణి; హీన, సత్త్వున్+కాన్= నశించినబలం కలవాడినిగా; ఎఱింగి= తెలుసుకొని; సుర; హస్తి, హస్త+అనుకారంబులు+ఐన= ఐరావతంయొక్క తొండాలను పోలినవైన; సవ్య, దక్షిణ, హస్తంబులన్= ఎడమకుడి చేతులతో; ఆ+మనుజ, కంటకు, కటి, కంఠ, ప్రదేశంబులు+పట్టికొని= మానవులకు శత్రువైన ఆ బకాసురుడి నడుము, గొంతు పట్టుకొని.

**తాత్పర్యం:** భీముడుకూడా - ఆ బకాసురుడు బలహీనుడు కావటాన్ని గమనించి, ఐరావతంయొక్క తొండాలవంటి బలమైన తన ఎడమకుడిచేతులతో వాడినడుమూ, గొంతూ పట్టుకొని.

**ఉ. దారుణ జానుదండమున దండధర ప్రతిముండు భీకరా**
**కారుఁడు వానివీఁపు విఱుగంబొడిచెం బిశితంబుతో నవ**
**ద్వారములన్ మహారుధిరధారలు బోరన నొల్కి మాంస పం**
**కారుణవారిఘోరనదు లై పఱవన్ విపినాంతరంబునన్. 305**

**ప్రతిపదార్థం:** భీకర+ఆకారుఁడు= భయంకరమైన రూపం కలవాడు; దండ, ధర, ప్రతిముండు= యమధర్మరాజుతో సమానమైనవాడు - అయిన భీముడు; దారుణ, జాను, దండమునన్= కఠినమైన తనమోకాలనే దండంతో; పిశితంబుతోన్= మాంసంతో; నవ, ద్వారంబులన్= తొమ్మిదిమార్గాలనుండి; మహా, రుధిర, ధారలు= పెద్ద నెత్తుటి ధారలు; బోరనన్+ఒల్కి= బోరన చింది; విపిన+అంతరంబునన్= అడవి మధ్యభాగంలో; మాంస, పంక+అరుణ, వారి, ఘోర, నదులు+ఐ= మాంస మనే బురదతో ఎఱ్ఱనినీటితో భయంకరాలైన నదులై; పఱవన్= పారగా; వాని, వీఁపు= ఆ బకాసురునియొక్క వీపు; విఱుగన్= విరిగేటట్లు; పొడిచెన్.

**తాత్పర్యం:** భీముడు దండధరునివలె - అంటే యమునివలె - భయంకరాకారుడై, మహాకఠినమైన తన మోకాలనే దండంతో - బకాసురునినవద్వారాలనుండి మాంసంతో కూడిన నెత్తుటిధారలు ఉరవడిగా వెలికివచ్చి, అడవిమధ్యలో మాంసం అనే బురదతో, ఎఱ్ఱనినీటితో భయంకరాలైన నదులవలె ప్రవహించేటట్లు - ఆ రాక్షసుడివీపు విరిగేలా పొడిచాడు.

**విశేషం:** నవద్వారాలు - నేత్రాలు -2; శ్రోత్రాలు -2, నాసారంధ్రాలు-2, ముఖరంధ్రం-1, మలమూత్రవిసర్జన రంధ్రాలు-2, అలం: రూపకం. ఉపమ, అతిశయోక్తి. శ్రవ్యకావ్యంలో స్థిరరూపవర్ణనకంటె, చలద్రూపవర్ణన చాల కష్టం. అయినా పాఠకుని దృష్టిని విశేషంగా ఆకర్షించేది, అతడిని అధికంగా రసపరవశుడిని చేసేది - చలద్రూపవర్ణనమే. ఈ సన్నివేశంలో నన్నయ మల్లయుద్ధం చేస్తున్న భీమబకాసురుల చలద్రూపాలను మనకళ్ళకు కట్టినట్లు మనోహరంగా చిత్రించాడు. ఆ యిద్దరియుద్ధాన్ని చూస్తున్న అనుభూతిని కలిగించాడు. కాగా, అలంకారాన్ని ప్రయోగించి వస్తువును, రసాన్ని ధ్వనింప చెయ్యటం ఒక గొప్ప కవితా శిల్పం. ఈ పద్యంలో నన్నయ - భీముని మోకాటిని యమదండంతో రూపించి, భీముడిని యమధర్మరాజుతో పోల్చి - బకాసురుని పాలిటికి భీముడు సాక్షాత్తు యముడే అని, ఆ రాక్షసునికి మరణం తప్పదని ధ్వనింపచేశాడు. అట్లాగే భీమునిదెబ్బకు బకాసురుని నవరంధ్రాలనుండి మాంసంతో కూడిన నెత్తురు ఏరులై పారిందన్న అతిశయోక్తితో - భయానక బీభత్స రసస్ఫూర్తి కలిగించాడు. విశేషించి - 297వ పద్యంలో భీముడు ప్రతిజ్ఞ చేసినట్లు - బకాసురుడు ఇన్నాళ్ళూ తిన్న మానవమాంసాన్నీ, త్రాగినరక్తాన్నీ క్రక్కించినట్లుంది - ఈ పద్యవర్ణన. అంతేకాదు హిడింబ బకాసురులవధలలో శత్రువును వెన్నువిరిచి చంపే మల్లవిద్యను భీముడు సమంగా ప్రదర్శించటం గమనార్హం. ఇటువంటి సంవాదశిల్పపూర్వాపరసంవిధానంతో నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తిని సాధించటం ఇందులోని విశేషం.

**వ. ఇట్లు బకాసురుండు భీముచేత నిహతుం డయి విగతజీవితుం డగుచుండి యఱచిన నమ్మహాధ్వని విని, వాని బాంధవు లైన రక్కసులు పెక్కండ్రు పఱతెంచిన వారలం జూచి భీముం డి ట్లనియె. 306**

**ప్రతిపదార్థం:** ఇట్లు; బకాసురుండు; భీముచేత; నిహతుండు+అయి= చంపబడినవాడై; విగజీవితుండు+అగుచున్+ఉండి= కోల్పోయిన ప్రాణం కలవాడవుతూ; అఱచినన్ = అరవగా; ఆ+మహా, ధ్వని= ఆ పెద్దశబ్దాన్ని; విని; వాని బాంధవులు+ఐన= వాడియొక్క బంధువులయిన; రక్కసులు= రాక్షసులు; పెక్కండ్రు= చాలామంది; పఱతెంచినన్= రాగా; వారలన్+చూచి; భీముండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** బకాసురుడు భీమునిచేత హతుడై ప్రాణం పోయేటప్పుడు పెద్దగా అరవగా; ఆ ధ్వని విని అతని బంధువులైన పెక్కుమందిరాక్షసులు పరుగెత్తుకొని రాగా వారిని చూచి భీముడిట్లా అన్నాడు.

**తే. 'ఇంక నెన్నండు రక్కసు లిద్దురాత్ము । నట్లు మనుజులఁ దినకుండుఁ; డడరి మనుజ**
**భక్షణము సేసితిరయేని బకుని యట్లు చత్తు' రని రక్కసుల కెల్లఁ జాటె వినఁగ. 307**

**ప్రతిపదార్థం:** ఇంకన్+ఎన్నండున్= ఇంకెప్పుడుకూడ; రక్కసులు; ఈ దురాత్ము+అట్లు= ఈ దుర్మార్గుడివలె; మనుజులన్= మానవులను; తినక+ఉండుఁడు; అడరి= పూనుకొని; మనుజ, భక్షణము+చేసితిర+ఏని= మానవులను తినటం చేస్తే - అంటే మానవులను తింటే; బకుని+అట్లు; చత్తురు (చచ్చుదురు)+అని; రక్కసులు+ఎల్లన్= రాక్షసులందరు; వినఁగన్= వినేటట్లు; చాటెన్= ప్రకటించాడు.

**తాత్పర్యం:** 'ఇంకెప్పుడు మీరు ఈ దుర్మార్గునివలె మానవులను తినవద్దు. తింటే ఈ బకాసురుడివలె మీకు కూడ చావు తప్ప'దని ఆ రాక్షసులందరు వినేటట్లు భీముడు ప్రకటించాడు.

**వ. అంత నారాక్షసులు భీతు లై భీము సేసిన సమయంబున కొడంబడి నాఁటంగోలె నేకచక్రనివాసులకు నుపద్రవంబుఁ చేయనోడి; రట్లు భీముండు బకాసురుం జంపి, వానిం జంపుట జగద్విదితంబుగాఁ దత్కళేబరం బీడ్చుకొని వచ్చి, నగర ద్వార సమీపంబున వైచి, యందుల విప్రులకు సంతోషంబు సేసి, నిజ నివాసంబునకుం జని త ద్వృత్తాంతం బంతయుఁ దల్లికి సహోదరులకుం జెప్పి యున్నంత. 308**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; ఆ, రాక్షసులు; భీతులు+ఐ= భయపడినవారై; భీము, చేసిన, సమయంబునకున్= భీముడు చేసిన నియమానికి; ఒడంబడి= ఒప్పుకొని; నాఁటన్+కోలెన్= ఆ రోజునుండి; ఏకచక్ర, నివాసులకున్= ఏకచక్రపురంలో కాపురముండేవారికి; ఉపద్రవంబున్= హాని; చేయన్+ఓడిరి= చేయటానికి భయపడ్డారు; అట్లు; భీముండు; బకాసురున్; చంపి; వానిన్= బకాసురుని; చంపుట; జగత్+విదితంబు+కాన్= ప్రపంచానికంతటికీ తెలిసేటట్లు; తత్+కళేబరంబున్= అతనియొక్క శవాన్ని; ఈడ్చుకొని, వచ్చి; నగర, ద్వార, సమీపంబునన్= నగరంయొక్క ద్వారం దగ్గర; వైచి= పడవేసి; అందుల, విప్రులకున్= అందుండే బ్రాహ్మణులకు; సంతోషంబు+చేసి; నిజ, నివాసంబునకున్+చని= తానుండే ఇంటికి వెళ్ళి; తత్+వృత్తాంతంబు+ అంతయున్= ఆ విషయాన్నంతటినీ; తల్లికిన్, సహ+ఉదరులకున్= తల్లికి, తోబుట్టువులకు; చెప్పి+ఉన్న+అంతన్= తెలిపి ఉన్న సమయంలో;

**తాత్పర్యం:** అప్పుడు రాక్షసులు భయపడి భీముడు చేసిన నియమానికి అంగీకరించారు. ఆ రోజునుండి ఏకచక్ర పురవాసులకు కీడు చేయటానికి భయపడ్డారు. బకాసురవధ లోకానికంతటికి తెలిసేటట్లు భీముడు ఆ రాక్షసునిశవాన్ని ఈడ్చుకొనివచ్చి, ఏకచక్రనగరద్వారం దగ్గర పడవేసి, ఆ నగరంలోని బ్రాహ్మణుల కెల్ల సంతోషం కలిగించి, తన ఇంటికి వెళ్ళి, తల్లికి, సోదరులకు జరిగిన వృత్తాంతం చెప్పాడు. అప్పుడు.

ఉ. వీఁ డొక మంత్రసిద్ధుఁ డగు విప్రుఁ; డసాధ్యబలున్ బకాసురున్
నేఁ డనిఁ జంపెనట్టె! యితనిం జని చూతమ యంచుఁ జెచ్చెరం
బోఁడిగ వేత్రకీయమున భూసురు లాదిగ వచ్చి చూచి ర
వ్వాఁడిమగంటిమిన్ వెలయువాని వృకోదరు నెల్లవారలున్. 309

**ప్రతిపదార్థం:** వీఁడు+ఒక, మంత్రసిద్ధుఁడు+అగు, విప్రుఁడు= ఈ డొకమంత్రంచేత ఫలాన్ని పొందిన బ్రాహ్మణుడు; అసాధ్యబలున్= జయించటానికి శక్యంగాని బలం కలవాడిని; బకాసురున్= బకుడు అనే రాక్షసుణ్ణి; నేఁడు; అనిన్= యుద్ధంలో; అట్టె, చంపెన్= అంతసులువుగా చంపాడు; చని= వెళ్ళి; ఇతనిన్; చూచుదుము+అ+అంచున్= చూద్దామా అంటూ; చెర+చెరన్= త్వరత్వరగా; వేత్రకీయమునన్= ఏకచక్రపురంలో; భూసురులు+ఆదిగన్= బ్రాహ్మణులు మొదలుగా; ఎల్లవారలున్= అందరును; ఆ+వాఁడిమగంటిమిన్, వెలయువానిన్, వృక+ఉదరున్= ఈ తీక్ష్ణమైన పౌరుషంచేత ప్రకాశించేవా డైన భీముడిని; పోఁడిగ= ఒప్పుగా; వచ్చి, చూచిరి.

**తాత్పర్యం:** 'ఈ డొక మంత్రసిద్ధి గల బ్రాహ్మణుడు. జయించ సాధ్యంగాని బలవంతుడైన బకాసురుడిని ఈరోజు యుద్ధంలో సులువుగా చంపాడు. వెళ్ళి చూద్దాం' అని ఏకచక్రపురంలో బ్రాహ్మణులు మొదలుగా అందరూ త్వరత్వరగా వచ్చి తీక్ష్ణమైన పౌరుషంచేత ప్రకాశించే భీముడిని చూచారు.

**విశేషం:** వేత్రకీయము - అనేది ఏకచక్రపురానికి సంజ్ఞ. ఇచట భారతకూలంకషంలో ఇట్లా ఉంది. 'వేత్రకీయమున - ఏక చక్రాపురమున - అద్యప్రభృతి స్వప్యంతే వేత్రకీయ నివాసినః' - శ్రీమదాంధ్రమహాభారతసంశోధితప్రతి, పుట.399. బకాసురవధకు నాయకుని వంటివాడు భీముడు. హిడింబుడిని కారడవిలో చంపి, ఆత్మీయులైన అన్నదమ్ముల కుంతీహిడింబల ప్రశంసల నందుకొన్నాడు. అది ఆత్మరక్షణకోసం చేసిన రాక్షససంహారం. బకాసురవధ పరహితార్థమై కృతజ్ఞతాభావంతో ఏకచక్రపురవాసులకు పాండవులు చేసిన ప్రత్యుపకారం. అందువలన కార్యసాధకుడైన భీమునికి ప్రజలప్రశంస.

క. అని యిట్లు పాండునృపనం । దనుల చరిత్రంబు సెప్పెఁ దా వైశంపా
యనుఁడు జనమేజయున కని । జనవినుతచరిత్రపాత్ర ! సౌజన్యనిధీ! 310

**ప్రతిపదార్థం:** జన, వినుత, చరిత్ర, పాత్ర= జనులచేత పొగడబడిన నడవడికి స్థానమైన వాడా!; సౌజన్య, నిధీ= మంచితనానికి ఉనికిపట్టయినవాడా - రాజరాజనరేంద్రా!; అని; ఇట్లు; పాండు, నృప, నందనుల, చరిత్రంబు= పాండురాజుయొక్క కొడుకుల కథను; వైశంపాయనుడు; తాన్= తాను; జనమేజయునకున్; చెప్పెన్; అని-

**తాత్పర్యం:** జనులచే కీర్తింపబడిన చరిత్ర కలిగి, మంచితనానికి నిధివైన ఓ రాజరాజనరేంద్రా! ఈవిధంగా పాండవుల చరిత్రను వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు - అని సూతుడు శౌనకాదిమహామునులకు చెప్పాడు.

**విశేషం:** చరిత్ర అంటే కథ అనీ, శీలం అనీ అర్థాలున్నాయి. ఇక్కడ రెండర్థాలూ సార్థకాలే. కథాపరంగా, సంఘటనలపరంగా, మనస్తత్వాలపరంగా - మహాభారతంలో ఈ ఆరవ ఆశ్వాసానికి ఒక ప్రత్యేకత ఉన్నది; ప్రాధాన్యం ఉన్నది. నన్నయ నాటకీయ రచనకు నిలువెత్తు నిదర్శనంవలె నిలిచి, కురుకుమారుల అస్త్రవిద్యాప్రదర్శనతో ఆరంభమైన ఈ ఆశ్వాసంలో - భీమదుర్యోధనుల

గదాయుద్ధఘట్టంలో - కురు పాండవ విభేదాలు అందరిముందు ఒక్కసారిగా గుప్పుమన్నాయి. కర్ణుని రంగప్రవేశంతో, అతని అంగరాజ్యాభిషేకంతో అవి ఘనీభవించాయి. అందరు చూచి ఆనందించవలసిన అస్త్రవిద్యాప్రదర్శన - మున్ముందు రానున్న మహాభారత సంగ్రామానికి నాందివలె మారింది. అర్ధాంతరంగా ముగిసింది. అంతబలవంతుడైన ద్రుపదుడిని అట్లాపట్టి కట్టితెచ్చి, గురుదక్షిణగా ద్రోణునికి ఇవ్వటంలో అర్జునుని అద్వితీయసామర్థ్యసౌశీల్యాలు అందరిదృష్టిని ఆకర్షించాయి. ధర్మజుని యౌవరాజ్యాభిషేకం, అతని నలుగురు తమ్ముల దిగ్విజయ యాత్ర, పాండవుల మీద - ప్రత్యేకించి ధర్మరాజు మీద పెల్లుబికిన ప్రజానురాగం, పాండవుల నాయకత్వ నైపుణ్యాన్ని నిరూపించాయి. ప్రతినాయకుడైన దుర్యోధనుడు పాండవులకు వ్యతిరేకంగా తన సహాయులతో సాగించిన దురాలోచన, పాండవుల ప్రాణాలు తీయాలని జరిపించిన లాక్షాగృహదహనం - అతని దుర్మార్గప్రవృత్తిని ప్రస్ఫుటం చేశాయి. దుర్యోధనుడు తండ్రితో తన మనోదుఃఖాన్ని వెళ్ళబోసుకొనే ఘట్టం - కురుపాండవ కథాగతిని ప్రభావితం చేసే - ధృతరాష్ట్ర మహారాజు మనస్తత్వాన్ని వ్యక్తం చేసింది. లాక్షాగృహదహనం నుండి పాండవులు ప్రాణాలతో బయటపడటం, ధర్మవిజయానికి, అధర్మపరాజయానికి, మొత్తం మహాభారత సందేశానికి చక్కని సంకేతమై నిలిచింది. లాక్షగృహదహనం తరువాతి కథ అంతా భీమనాయకంగానే సాగింది. హిడింబాసుర బకాసురులవధలు భీముని బలపరాక్రమాలకు విజయపతాకాలు. తల్లి శాసనాన్ని, అన్నగారి నిర్దేశాన్ని అనుసరించి, ఇద్దరి గురుత్వాన్ని శిరసావహించి పాండవపక్షాన ప్రవర్తిల్లే ప్రబల క్రియాశక్తి భీముడు. హిడింబను అతడు వివాహమాడటం ఇందుకొక నిదర్శనం. హిడింబా భీమసేనుల వివాహఫలమే - మాయాయుద్ధనిపుణుడు, మహాశక్తి సంపన్నుడు అయిన ఘటోత్కచుని జననం. అతని జననం పాండవపక్షానికి పెద్దబలం. పాండవపక్షాన జ్ఞానశక్తి వ్యాసుడు; ఇచ్ఛాశక్తి కుంతి; ధార్మికశక్తి ధర్మరాజు; క్రియాశక్తులు భీమార్జునులు; రక్షాశక్తులు నకుల సహదేవులు. ఆరవ ఆశ్వాసకథ ఆసక్తికరమైన కథ; మున్ముందు రానున్న మలుపులను సూచించే కథ.

## ఆశ్వాసాంతము

**క. మలహారినాథ ! విలస । చ్చళుక్యకులతిలక! రాజసర్వజ్ఞ! రిపు**
**ప్రలయప్రతాప ! పరనృప । లలనాననకమలహరిణలాంఛనమూర్తీ! 311**

**ప్రతిపదార్థం:** మలహారి, నాథ= మలహారిదేశానికి ప్రభువైనవాడా!; విలసత్+చళుక్య, కుల, తిలక= ప్రకాశిస్తున్న చాళుక్యవంశానికి అలంకారమైనవాడా!; రాజ, సర్వజ్ఞ= రాజపరమేశ్వరా! రిపు, ప్రలయ, ప్రతాప= శత్రువులకు నాశనం కలిగించేటి ప్రతాపం కలవాడా!; పర, నృప, లలనా+ఆనన, కమల, హరిణ, లాంఛన, మూర్తీ= శత్రువులయొక్క స్త్రీలముఖాలనే పద్మాలకు చంద్రునివంటి ఆకారం గలవాడా!

**తాత్పర్యం:** మలహారిదేశప్రభూ! చాళుక్యవంశాలంకారా! రాజపరమేశ్వరా! శత్రురాజులను నశింపజేసే పరాక్రమం కలవాడా! శత్రువులయొక్క స్త్రీల ముఖాలనే పద్మాలు ముడుచుకొని పోయేటట్లు చేసే చంద్రుని వంటివాడా!

**విశేషం:** ఇవి ఆశ్వాసాంతంలో కృతిపతి అయిన రాజరాజనరేంద్రుడిని ప్రశంసిస్తూ చేసే సంబోధనలు.

**మాలిని.**

**ప్రణమదఖిలధాత్రీపాలకాలోలచూడా । మణిగణకిరణశ్రీమండితాంఘ్రీ! నరేంద్రా**
**గ్రణి ! నిఖిలమహీరక్షామణీ! రాజనారా । యణ ! విమలమతీ! శీతాంశువంశప్రకాశీ! 312**

**ప్రతిపదార్థం:** ప్రణమత్+అఖిల, ధాత్రీ, పాలక+ఆలోల, చూడామణి, గణ, కిరణశ్రీ, మండిత+అంఘ్రీ= నమస్కరిస్తున్న అందరు రాజులయొక్క కదలుతున్న శిరోరత్నాల సమూహాల కాంతులయొక్క సంపదచేత అలంకరింపబడిన పాదాలు కలవాడా!; నరేంద్ర+అగ్రణి= రాజులలో శ్రేష్ఠుడా!; నిఖిల, మహీ, రక్షా, మణీ= సమస్త భూమండలాన్ని రక్షించుటయందు శ్రేష్ఠుడా!; రాజనారాయణ!= రాజనారాయణుడు అనే బిరుదు కలవాడా!; విమల, మతీ= నిర్మలమైన బుద్ధికలవాడా!; శీత+అంశు, వంశ, ప్రకాశీ= చల్లని కిరణాలు కలవాడైనచంద్రునివంశాన్ని ప్రకాశింప చేసేవాడా!

**తాత్పర్యం:** నమస్కరిస్తున్న రాజులందరి చలించేశిరోరత్నసమూహాల కాంతిసంపదచేత అలంకరింపబడిన పాదాలుకలవాడా! రాజశ్రేష్ఠా! సమస్త భూమండలాన్ని రక్షించడంలో శ్రేష్ఠుడా! రాజనారాయణ బిరుదాంకితా! నిర్మలమైన బుద్ధికలవాడా! చంద్రవంశాన్ని ప్రకాశింపజేసేవాడా! - ఓ రాజరాజనరేంద్రా!

**విశేషం:** మాలిని వృత్తపాదంలో వరుసగా న, న, మ, య, య గణాలుంటాయి. 9వ అక్షరం యతిస్థానం. 'కుర్యాత్ సర్గస్య పర్యన్తే మాలినీం ద్రుతతాలవత్' అని క్షేమేంద్రుడు సువృత్తతిలకంలో తెలిపినట్లే ఇచ్చట షష్ఠాశ్వాసాంతంలో మాలినివృత్తం కూర్చబడింది. రాజరాజనరేంద్రుణ్ణి "నారాయణాఖ్య" అని ఆదిపర్వం ద్వితీయాశ్వాసాంతంలోని ఆశ్వాసాంతపద్యాల్లో (పద్యం-237) కూడా ఉంది. కనుక 'రాజనారాయణ' అనేది ఇతని బిరుదు.

**గద్యము**

**ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబునం గుమారాస్త్రవిద్యాసందర్శనంబును, ద్రుపదగ్రహణమోక్షణంబును, దుర్యోధనుదుర్మంత్రంబును, వారణావతయాత్రయు, జతుగృహదాహంబును, విదురోపదిష్టద్వారంబునం బాండవాపక్రమణంబును, హిడింబు వధయును, హిడింబావివాహంబును, వ్యాససందర్శనంబును, ఘటోత్కచసంభవంబును, విప్రగృహంబున నజ్ఞాతచర్యయును, బకాసురవధయును నన్నది షష్ఠాశ్వాసము. 313**

**తాత్పర్యం:** ఇది, సకల సత్కవుల ప్రశంసలందుకొన్న నన్నయభట్టు రచించిన శ్రీ మహాభారతంలో ఆదిపర్వంలో - కురుకుమారుల అస్త్రవిద్యాప్రదర్శన చూడటం, ద్రుపదరాజును యుద్ధంలో బంధించి విడిచిపెట్టటం, దుర్యోధనుని దురాలోచనం, పాండవులు - వారణావతానికి వెళ్ళటం, లక్కయింటిని తగులబెట్టటం, విదురుడు ఉపదేశించిన మార్గంలో పాండవులు బయటపడటం, హిడింబాసురుడుని సంహరించటం, భీమసేనుడు హిడింబను వివాహమాడటం, వ్యాసమహర్షి దర్శనమివ్వటం, ఘటోత్కచుడు జన్మించటం, పాండవులు బ్రాహ్మణుని ఇంట అజ్ఞాతంగా మెలగటం, బకాసురుడిని హతమార్చటం- అనే అంశాలు కలది ఆరవఆశ్వాసం.

ఆదిపర్వంలో షష్ఠాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - సప్తమాశ్వాసము

**శ్రీ రాజరాజ! వీర । శ్రీరమణీరమ్య । గంధసింధుర హయ శి**
**క్షారూఢిదక్ష ! దక్ష మ । ఖారిదయాలబ్ధ సుస్థిరైశ్వర్యపదా ! 1**

**ప్రతిపదార్థం:** శ్రీరాజరాజ! వీర, శ్రీ, రమణీ, రమ్య! = వీరలక్ష్మి అనే కాంతకు మనోహరుడ వైనవాడా!; గంధ, సింధుర, హయ, శిక్షా+ఆరూఢి, దక్ష!= మదపుటేనుగులను, గుఱ్ఱాలను శిక్షించటంలోను, ఎక్కటంలోను సమర్థుడ వైనవాడా! దక్ష, మఖ+అరి దయా, లబ్ధ, సుస్థిర+ఐశ్వర్య, పదా!= దక్షుడి యజ్ఞానికి శత్రు వైన శివుడిదయతో పొందబడిన శాశ్వతమైన ఐశ్వర్య స్థానం - అనగా రాజ్యపదవి కలవాడా!

**తాత్పర్యం:** ఓ రాజరాజనరేంద్రా! వీరలక్ష్మి అనే కాంతకు మనోహరుడ వైనవాడా! మదపుటేనుగులను, గుఱ్ఱాలను శిక్షించటంలోను, అధిరోహించటంలోను సమర్థుడైనవాడా! దక్షయజ్ఞానికి శత్రు వైన శివునిదయతో పొందిన శాశ్వతరాజ్యపదవి కలవాడా!

### ధృష్టద్యుమ్న ద్రౌపదుల యుత్పత్తి వృత్తాంతము (సం. 1-153-1)

**వ. అ క్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె; నట్లు పాండవులు విప్రవేషంబున నేకచక్రపురంబునందు వేదాధ్యయనంబు సేయుచు విప్రగృహంబున నున్న కొన్ని దినంబులకు నొక్కబ్రాహ్మణుండు ద్రుపదు పురంబున నుండి చనుదెంచి విశ్రమార్థి యైన, నాగృహస్థుండు వాని నభ్యాగతపూజల సంతుష్టుం జేసి యున్నంతఁ, గుంతీదేవి గొడుకులుం దాను నవ్విప్రు నతిప్రీతి నుపాసించి 'యయ్యా! మీర లెందుండి వచ్చితి? రే దేశంబులు రమ్యంబు? లెందుల రాజులు గుణవంతు? లని యడిగిన' న వ్విప్రుం డి ట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= మహాభారతకథను చెప్పే ఆ ఉగ్రశ్రవసుడు; శౌనక+ఆది, మహామునులకున్= శౌనకుడు మొదలైన మహర్షులకు; చెప్పెన్; అట్లు= ఆ విధంగా; పాండవులు; విప్ర వేషంబునన్= బ్రాహ్మణవేషంతో; ఏకచక్రపురంబునందు; వేద+అధ్యయనంబు+చేయుచున్= వేదాన్ని గురుముఖంగా చదువుకొంటూ; విప్ర, గృహంబునన్= బ్రాహ్మణుని ఇంట్లో; ఉన్నన్= ఉండగా; కొన్ని, దినంబులకున్; ఒక్క, బ్రాహ్మణుండు; ద్రుపదు, పురంబుననుండి= ద్రుపదుని పట్టణంనుండి; చనుదెంచి= వచ్చి; విశ్రమ+అర్థి, ఐనన్= విశ్రాంతిని కోరినవాడు కాగా; ఆ గృహస్థుండు= పాండవులున్న ఆ యింటి యజమాని; వానిన్= ఆ బ్రాహ్మణుడిని; అభ్యాగత పూజలన్= అభ్యాగతులకు చేసే పూజలతో; సంతుష్టున్= తృప్తి పొందిన

వాడినిగా; చేసి, ఉన్నంతన్= ఉన్న అంతట; కొడుకులున్; తానున్; కుంతీదేవి; ఆ+విప్రున్= వచ్చి ఉన్న ఆ బ్రాహ్మణుడిని; అతిప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; ఉపాసించి= సేవించి; అయ్యా!;= అయ్యా; మీరలు, ఎందుండి= మీ రెక్కడినుండి; వచ్చితిరి= వచ్చినారు; ఏ దేశంబులు; రమ్యంబులు= అందమైనవి; ఎందుల రాజులు= ఏ దేశాలలోని రాజులు; గుణవంతులు= మంచిగుణాలు కలవారు; అని; అడిగినన్= అడుగగా; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** మహాభారతకథను చెప్పుతున్న ఉగ్రశ్రవసుడు, శౌనకాది మహామునులకు - భీముడు బకాసురుడిని వధించేవరకు జరిగినకథను వివరించాడు. ఆ విధంగా పాండవులు బ్రాహ్మణవేషాలతో ఏకచక్రపురంలో వేదాధ్యయనం చేస్తూ ఒక బ్రాహ్మణుని ఇంట్లో ఉండగా, కొన్ని రోజుల తర్వాత ఒక బ్రాహ్మణుడు ద్రుపదరాజు పట్టణంనుండి వచ్చి విశ్రాంతి కోరగా, పాండవు లున్న ఇంటియజమాని అతడిని అభ్యాగత పూజలతో తృప్తిపరచాడు. ఆ సమయంలో కుంతీదేవి - కొడుకులు, తాను ప్రీతితో ఆ బ్రాహ్మణుడిని సేవించి, 'అయ్యా! మీరు ఎక్కడినుంచి వచ్చారు? ఏ దేశాలు అందమైనవి? ఏ దేశాల రాజులు గుణవంతులు?' అని అడుగగా ఆ బ్రాహ్మణుడు ఇట్లా అన్నాడు.

**చ. సొలయక యెల్ల దేశములుఁ జూచితి; నందుఁ బ్రసిద్ధు లైన రా**
**జుల సుచరిత్ర సంపదలుఁ జూచితి; నా ద్రుపదేశుదేశముం**
**బొలుపున నొండు దేశములు పోల్పఁగ నెవ్వియు లేవు; సద్గుణం**
**బులఁ బరు లెవ్వరున్ ద్రుపదుఁ బోలఁగ లేరు ధరాతలంబునన్. 3**

**ప్రతిపదార్థం:** సొలయక= అలసట చెందక; ఎల్ల, దేశములున్; చూచితిన్; అందున్, ప్రసిద్ధులు+ఐన= వాటిలో ముఖ్యులైన; రాజుల; సుచరిత్ర, సంపదలున్= మంచి నడవడి అనే సంపదలను; చూచితిన్; ధరాతలంబునన్= భూమిమీద; ఆ, ద్రుపద+ఈశు, దేశమున్= ఆ ద్రుపదరాజుయొక్క దేశమును; పొలుపునన్= అందంలో; పోల్పఁగన్= పోల్చటానికి; ఒండు, దేశములు= ఇతర దేశాలు; ఎవ్వియున్, లేవు= ఏవీ లేవు; సద్గుణంబులన్= మంచిగుణాలలో; పరులు= ఇతరులు; ఎవ్వరున్= ఎవరూగానీ; ద్రుపదున్; పోలఁగలేరు= సరిపోలేరు.

**తాత్పర్యం:** అలసట చెందకుండా నేను అన్నిదేశాలను చూచాను. వాటిలో ప్రసిద్ధు లైన రాజుల మంచి నడవడి అనే సంపదలూ చూచాను. ఈ భూమిమీద అందంలో ఆ ద్రుపదరాజుదేశంతో పోల్చటానికి ఇతరదేశా లేవీ లేవు. సద్గుణాలలో ఇతరు లెవ్వరూ ఆ ద్రుపదుడిని సరిపోలలేరు.

**వ. 'ఆ ద్రుపదుండు దన కూఁతు నగ్నికుండసముద్భవ యైనదాని నయోనిజ నగణ్యపుణ్యలావణ్యగుణసమన్విత ననురూపుఁ డైన రాజపుత్రునకు వివాహంబు సేయంగానక, స్వయంవరంబు రచియించుచున్నవాఁ' డనినం, గుంతియు ధర్మ తనయుండును విస్మితులై 'యది యేమి కారణంబున నయోనిజ యయ్యె? నక్కన్య నెవ్విధంబున ద్రుపదుండు వడసె? దీని సవిస్తరంబుగాఁ జెప్పు' మనిన నవ్విప్రుండు వారల కి ట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** ఆ, ద్రుపదుండు; తన, కూఁతున్= తన పుత్రికను; అగ్ని, కుండ, సముద్భవ, ఐన, దానిన్= అగ్నిగుండం నుండి గొప్పగా జన్మించిన దానిని; అయోనిజన్= స్త్రీ గర్భంనుండి పుట్టని దానిని; అగణ్య, పుణ్య, లావణ్య, గుణ, సమన్వితన్= లెక్కించటానికి సాధ్యం కాని పుణ్యంతో, కాంతితో, గుణంతో కూడుకొన్నదానిని; అనురూపుఁడు+ఐన=

తగినవాడైన; రాజపుత్రునకున్; వివాహంబు+చేయన్+కానక= పెళ్ళిచేయటం సాధ్యం కాక; స్వయంవరంబు; రచియించుచున్న వాఁడు= రూపొందిస్తున్నాడు; అనినన్= అని ఆ బ్రాహ్మణుడు చెప్పగా; కుంతియున్; ధర్మతనయుండును= ధర్మరాజును; విస్మితులు+ఐ= ఆశ్చర్యపడినవాళ్ళయి; అది= ద్రౌపది; ఏమి, కారణంబునన్= ఏకారణంచేత; అయోనిజ, అయ్యెన్= అయోనిజ అయినది; ఆ+కన్యన్; ఏ+విధంబునన్; ద్రుపదుండు; పడసెన్= పొందినాడు; దీనిన్= ఈ వృత్తాంతాన్ని; సవిస్తరంబుగాన్= విపులంగా; చెప్పుము; అనినన్= అనిఅనగా; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; వారలకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అగ్నిగుండంనుండి ఆవిర్భవించిందీ, మానవకాంతకు జన్మించనిదీ, అపార మైన పుణ్యంతో, కాంతితో, గుణంతో కూడుకొన్నదీ అయిన తన పుత్రిక ద్రౌపదికి వివాహం చేయా లనుకొన్న ద్రుపదునికి తగిన రాకుమారుడు దొరకలేదు; అందుకే ఆయన స్వయంవరాన్ని ఏర్పాటు చేస్తున్నాడు' అని ఆ బ్రాహ్మణుడు చెప్పగా, కుంతీ ధర్మరాజులు ఆశ్చర్యపడి ' ఆ ద్రౌపది ఏ కారణంచేత మానవకాంతకు జన్మించని దైనది? ద్రుపదుడు ఆమెను ఏ విధంగా కూతురుగా పొందాడు? ఈ వృత్తాంతం విపులంగా చెప్పండి' అని అడుగగా, ఆ బ్రాహ్మణుడు వాళ్ళతో ఇట్లా అన్నాడు.

**సీ. ఆది భరద్వాజుఁ డను ముని కలశంబు । నం దుద్భవించిన యనఘమూర్తి**
**ద్రోణుండు మఱి పృషతున కుద్భవించిన । ద్రుపదుండు నొక్కటఁ దొడఁగి యిష్ట**
**సఖు లయి వేదముల్ సదివి, ధనుర్వేద । మగ్నివేశులతోడ నర్థిఁ గఱచి**
**చని, ద్రుపదుండు పాంచాలభూములకు రా । జైన, భారద్వాజుఁ డతని కడకు.**

**ఆ. నరిగి, వానిచేత నవమానితుం డయి । హస్తిపురికి వచ్చి, యఖిలకురుకు**
**మారవరుల నెల్ల మానుగా శస్త్రకో । విదులఁ జేసె లోకవిదితయశుఁడు. 5**

**ప్రతిపదార్థం:** ఆదిన్= మొదట; భరద్వాజుఁడు, అను; ముని, కలశంబునందు= మునియొక్క కుండయందు; ఉద్భవించిన= పుట్టిన; అనఘమూర్తి= పాపరహితుడైనవాడు; ద్రోణుండు; మఱి= మఱియు; పృషతునకున్; ఉద్భవించిన= పుట్టిన; ద్రుపదుండున్; ఒక్కటన్= ఒకచోట; తొడఁగి= పూనుకొని; ఇష్ట, సఖులు+అయి= ప్రియస్నేహితులై; వేదముల్, చదివి; ధనుర్వేదము= ధనుర్వేదాన్ని; అగ్నివేశులతోడన్= అగ్నివేశు డనే మునిదగ్గర; అర్థిన్= కోరి; కఱచి= నేర్చుకొని; చని= వెళ్ళి; ఆ ద్రుపదుండు; పాంచాల భూములకున్= పాంచాలదేశానికి; రాజు+ఐనన్= రాజు కాగా; భారద్వాజుఁడు= భరద్వాజుని కుమారు డైన ద్రోణుడు; అతని, కడకున్= ఆ ద్రుపదుని దగ్గరకు; అరిగి= వెళ్ళి; వానిచేతన్; =అతనివల్ల; అవమానితుండు+ అయి= అవమానింపబడినవా డై; హస్తి, పురికిన్; వచ్చి; అఖిల, కురు, కుమార, వరులన్+ఎల్లన్= కురుకుమార శ్రేష్ఠుల నందరిని; లోక, విదిత, యశుఁ డు= ప్రపంచాని కంతటికి తెలియబడిన కీర్తికలవాడు - ద్రోణుడు; మానుగాన్= ఒప్పుగా; శస్త్ర, కోవిదులన్= శస్త్ర విద్యలలో మిక్కిలి నేర్పరులనుగా; చేసెన్.

**తాత్పర్యం:** భరద్వాజ మహర్షి కలశంనుండి పుట్టిన పుణ్యాత్ముడు ద్రోణుడు, పృషతుని పుత్రుడైన ద్రుపదుడు- ఒకచోట ఉండి ప్రియ స్నేహితు లై, వేదాలను చదివారు. తరువాత ధనుర్వేదాన్ని అగ్నివేశుని దగ్గర అభ్యసించారు. ద్రుపదుడు పాంచాలదేశానికి ప్రభువుకాగా, ద్రోణుడు అతనిదగ్గరకు వెళ్ళి అవమానం పొందాడు. ప్రపంచ ప్రసిద్ధ మైన కీర్తి గల ఆ ద్రోణుడు హస్తినాపురానికి వచ్చి, కురుకుమారుల నందరినీ శస్త్రవిద్యలో ఎంతో నేర్పరులుగా తీర్చిదిద్దాడు.

**వ. ఇట్లు దనవలన విలువిద్య గఱచిన పాండవ కౌరవ కుమారులం జూచి ద్రోణుండు' నా కవమానంబు సేసిన య ప్పాంచాలు నోడించి పట్టికొని తెం; డిదియ నాకు గురుదక్షిణ యగు' నని పంచిన, వల్లె యని యందఱు నా ద్రుపదుపయిం బోయి, వానిచేత నిర్జితు లయిన, నర్జునుండు ద్రుపదుతోడ మహాయుద్ధంబుసేసి, వానిం బట్టికొని వచ్చి, ద్రోణున కొప్పించిన నతండును. 6**

**ప్రతిపదార్థం:** ఇట్లు, తనవలన; విలువిద్య; కఱచిన= నేర్చుకొన్న; పాండవ, కౌరవ, కుమారులన్= పాండుకుమారుల్ని, కౌరవుల్ని; చూచి, ద్రోణుండు; నాకున్; అవమానంబు, చేసిన= అవమానం కలిగించిన; ఆ+పాంచాలున్= పాంచాల దేశ రాజైన ద్రుపదుడిని; ఓడించి, పట్టికొని, తెండు= ఓడించిపట్టి తీసుకొనిరండు; ఇదియ; నాకున్; గురుదక్షిణ; అగున్= అవుతుంది; అని; పంచినన్= పంపగా; వల్లె, అని= సరే అని; అందఱున్= అందరూ; ఆ, ద్రుపదు, పయిన్= ఆ ద్రుపదుని మీదికి పోయి; వానిచేతన్, నిర్జితులు+అయినన్= అతనిచేత ఓడింపబడినవాళ్ళు కాగా; అర్జునుండు; ద్రుపదుతోడన్= ద్రుపదునితో; మహాయుద్ధంబు; చేసి, వానిన్, పట్టికొని; వచ్చి; ద్రోణునకున్; ఒప్పించినన్= అప్పగించగా; అతండును= ఆ ద్రోణుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తనవలన విద్య నేర్చుకొన్న కురు పాండవకుమారులను చూచి ద్రోణుడు - 'నన్ను అవమానించిన ద్రుపదుడిని ఓడించి, పట్టికొని రండి. ఇదే నాకు గురుదక్షిణ' అని పంపగా; సరే అని, అందరు ఆ ద్రుపదునిమీదికి దండెత్తిపోయి ఓడిపోయారు. అర్జునుడు అతనితో మహాయుద్ధం చేసి, అతడిని పట్టుకొని వచ్చి ద్రోణునికి అప్పగించాడు. అప్పుడు ఆ ద్రోణుడు.

**విశేషం:** కౌరవులుమాత్రమే ముందు వెళ్లి, ఓడినట్లు పూర్వకథ. ఇక్కడ అర్జునుడు తప్ప తక్కినవా ళ్ళంతా ఓడిన ట్లున్నది.

**ఆ. ఉల్లసంబు లాడి యోడకు పొ మ్మని । ద్రుపదు విడిచి పుచ్చె; ద్రోణుచేత**
**నట్లు విడువఁబడి తదవమాన తప్తుఁడై । పృషతనందనుండు పెద్ద యలిగి 7**

**ప్రతిపదార్థం:** ఉల్లసంబులు+ఆడి= దెప్పిపొడుపుమాటలు మాట్లాడి; ఓడకు= భయపడవద్దు; పొమ్ము=పో; అని, ద్రుపదున్; విడిచి, పుచ్చెన్= విడిచిపెట్టాడు; పృషత, నందనుండు= పృషతునియొక్క కుమారుడు-ద్రుపదుడు; ద్రోణుచేతన్, అట్లు; విడుబడి= వదలిపెట్టబడి; తద్+అవమాన, తప్తుఁడు+ఐ= ఆ అవమానంచేత బాధింపబడినవా డై; పెద్ద, అలిగి= మిక్కిలి కోపించి.

**తాత్పర్యం:** దెప్పి పొడుపుమాటలు మాట్లాడి, అవమానించి, భయపడవద్దు పొ మ్మని ద్రుపదుడిని విడిచిపెట్టాడు. ద్రుపదుడు ఆ విధంగా విడువబడి, ఆ అవమానంతో బాధపడి, మిక్కిలి కోపించి.

**వ. రణరంగంబున ద్రోణు వధియించునట్టి కొడుకును, నర్జునునకు దేవి యగునట్టి కూఁతునుం బడయుదు నని బ్రహ్మవిదు లయిన బ్రాహ్మణులనివాసంబులకుం జని, నిత్యంబును బ్రాహ్మణోపాస్తి సేయుచు, నొక్కనాఁడు గంగాకూలంబునందు వానప్రస్థవృత్తి నున్న యాజోపయాజు లనువారి నిద్దఱ ననవరతవ్రతవ్యాసక్తులం గాశ్యపగోత్రులం గని వారికి నమస్కరించి, యందుఁ గొండుక యయ్యును దపోమహిమ నెవ్వరికంటెఁ బెద్దయైన వాని నుపయాజు నుపాసించి యి ట్లనియె. 8**

**ప్రతిపదార్థం:** రణ, రంగంబునన్= యుద్ధభూమిలో; ద్రోణున్, వధియించునట్టి= ద్రోణుడిని చంపునట్టి; కొడుకునున్; అర్జుననకున్; దేవి యగునట్టి; కూఁతునున్; పడయుదున్+అని= పొందుతాను అని, బ్రహ్మ, విదులు+అయిన= బ్రహ్మజ్ఞాన సంపన్నులైన, బ్రాహ్మణుల, నివాసంబులకున్= బ్రాహ్మణులుండే స్థలాలకు; చని= వెళ్ళి; నిత్యంబును= ప్రతిదినము; బ్రాహ్మణ+ఉపాస్తి= బ్రాహ్మణసేవ; చేయుచున్, ఒక్కనాఁడు; గంగా, కూలంబునందున్= గంగాతీరంలో; వానప్రస్థ, వృత్తిన్= వానప్రస్థాశ్రమ జీవనంలో; ఉన్న; యాజ+ఉపయాజులు= యాజుడు, ఉపయాజుడు; అను, వారిన్= అనే వాళ్ళను; ఇద్దఱన్= ఇరువురిని; అనవరత, వ్రత, వ్యాసక్తులన్= సర్వదా నియమనిష్ఠల్లో మిక్కిలి ఆసక్తి గలవాళ్ళను; కాశ్యప, గోత్రులన్= కాశ్యప గోత్రంవాళ్ళను; కని= చూచి; వారికిన్, నమస్కరించి; అందున్= వారిలో; కొండుక, అయ్యును= చిన్నవాడైనను; తపోమహిమన్= తపోమహిమచే; ఎవ్వరికంటెన్= ఇతరులందరికంటెపెద్ద, ఐన, వానిన్= గొప్ప వాడైన వానిని; ఉపయాజున్; ఉపాసించి= పూజించి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** యుద్ధరంగంలో ద్రోణుడిని చంపగల పుత్రుడిని, అర్జునునికి భార్య కాగల పుత్రికను పొందా లని ద్రుపదుడు బ్రహ్మజ్ఞానసంపన్ను లైన బ్రాహ్మణు లున్న ప్రదేశాలకు వెళ్ళి, ప్రతిదినం బ్రాహ్మణసేవ చేయసాగాడు. అతడు ఒకనాడు గంగాతీరంలో వానప్రస్థ ఆశ్రమజీవితం గడుపుతున్న యాజ, ఉపయాజు లనే ఇద్దరిని చూచాడు. వాళ్ళు కాశ్యపగోత్రులు; సర్వదా నియమనిష్ఠాచరణంలో మిక్కిలి ఆసక్తి కలవాళ్ళు. వాళ్ళకు నమస్కరించి, వాళ్ళలో చిన్నవాడైనా తపోమహిమలో అందరికంటె పెద్దవా డైన ఉపయాజిని పూజించి, ఇట్లా అన్నాడు.

**విశేషం:** తనను ఓడించి పట్టి తెచ్చిన అర్జునునిపై శాశ్వతక్రోధం పెట్టుకోకుండా, అతని పరాక్రమాన్ని మనసారా మెచ్చుకొన్న ద్రుపదుని సహృదయత, అంతటి వీరకిశోరుడిని తన అల్లుడిగా చేసికొనా లన్న తలంపు ప్రశంసింప దగినవే! ఆశ్చర్యకరమైనవే! చతుర్విధ - ఆశ్రమాలు: 1. బ్రహ్మచర్యం, 2.గార్హస్థ్యం, 3. వానప్రస్థం, 4. సన్న్యాసం.

**క. మునినాథ! నాకు సత్సుత । జననం బగునట్టి క్రతువు సద్విధిఁ గావిం**
**చినఁ గృతకృత్యుఁడ నగుదుం; । గొను మిచ్చెద నీకు లక్ష గోధేనువులన్. 9**

**ప్రతిపదార్థం:** మునినాథ!= మునిశ్రేష్ఠా; నాకున్; సత్+సుత, జననంబు+అగు= మంచి కుమారుడిని కలిగించే; క్రతువున్= యజ్ఞాన్ని; సత్+ విధిన్= శాస్త్రంలో చెప్పిన పద్ధతి ప్రకారం; కావించినన్= జరిపిస్తే; కృత, కృత్యుఁడన్= నెరవేరిన కోరిక కలవాడను; అగుదున్= అవుతాను; నీకున్; లక్ష, గో, ధేనువులన్= లక్ష ఆవులను, లేగలతో కూడిన పాడిఆవులను; ఇచ్చెదన్, కొనుము= ఇస్తాను, తీసికొనుము.

**తాత్పర్యం:** ఓ మునిశ్రేష్ఠా! నాకు మంచి కుమారుడిని ప్రసాదించే యజ్ఞాన్ని జరిపిస్తే ధన్యుడ నౌతాను. నీకు లక్ష ఆవులను, లేగదూడలతో కూడిన పాడిఆవులను ఇస్తాను. తీసికొమ్ము.

**విశేషం:** 'గోధేనువులన్' అనే చోట ' గో ధనచయమున్' అనే పాఠాంతరం ఉంది. గో శబ్దానికున్న నానార్థాలలో ఆవు, ఎద్దు అనేవి ప్రకృతానికి సంబంధించినవి. వాటిలోను 'ఆవు' అనే అర్థమే ఎక్కువ ఉచితంగా ఉన్నది. ధేనువు అంటే లేగదూడకు పాలు కుడిపే ఆవు.

**వ. అనిన నుపయాజుం 'డే నిట్టి ఫలంబు నపేక్షింప; నెవ్వరేని ఫలార్థు లగుదు రందుల కేఁగు' మనిన ద్రుపదుండు వెండియు వానిన యొక్క సంవత్సరం బారాధించిన నమ్ముని వాని కి ట్లనియె. 10**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; ఉపయాజుండు; ఏన్= నేను; ఇట్టి= ఈ విధమైన; ఫలంబున్= ఫలితాన్ని; అపేక్షింపన్= కోరుకొనను; ఎవ్వరు+ఏని= ఎవరైనా; ఫల+అర్థులు+అగుదురు= ఫలం కోరుకొనేవా రున్నట్లైతే; అందులకున్= అక్కడకు; ఏఁగుము= వెళ్ళుము; అనినన్= అనిచెప్పగా; ద్రుపదుండు; వెండియున్= మరల; వానిన్+అ= ఆ ఉపయాజినే; ఒక్క సంవత్సరంబు; ఆరాధించినన్= సేవించగా; ఆ+ముని= ఆ ఉపయాజి; వానికిన్= ద్రుపదునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని ద్రుపదుడు పల్కగా; ఉపయాజుడు 'నేను అట్లాంటి ఫలాన్ని ఆశించను. ఎవరైనా ప్రతిఫలం ఆశించేవా ళ్ళుంటే వెళ్లుము' అన్నాడు. ద్రుపదుడు మళ్ళీ ఒక సంవత్సరం ఆ మునినే సేవించగా, అతడు ద్రుపదునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** కార్యార్థి ఎదుటివారితత్త్వం తెలిసికొనకుండా 'ఉపకారం చేస్తే ప్రతిఫలం ఇస్తా' నని పలకటం అవివేకం. అల్పులు అందుకు సంతోషిస్తారేమో కాని, మహాత్ములు దాన్ని మెచ్చరు. అంతేకాక దాన్ని అవినయంగా, అవినీతిగా, అహంకారంగా కూడా పరిగణిస్తారు.

**తే.** **అనఘచరితుఁడు మాయన్న వనములోనఁ**
**జనుచు నొక్కనాఁ డొక్కపం డొనరఁ గాంచి**
**కొనియె శుచి యగు శుచియుఁ గా దని యెఱుంగఁ**
**బడని భూమితలంబుపైఁ బడిన దాని.** **11**

**ప్రతిపదార్థం:** అనఘ, చరితుఁడు= పాపరహితమైన నడవడి కల వాడు; మా, అన్న (యాజుడు); వనములోన్= అడవియందు; చనుచున్= వెళ్ళుతూ; ఒక్క,నాఁడు; శుచి, అగు= శుభ్రమైనది; శుచియున్+కాదు= శుభ్రమైనది కాదు; అని= అని; ఎఱుంగన్+పడని= తెలియని; భూమి, తలంబు, పైన్+ భూప్రదేశంమీద; పడిన దానిన్= పడినదాన్ని; ఒక్క, పండు= ఒక పండును; ఒనరన్= ఒప్పుగ, కాంచి= చూచి; కొనియెన్= తీసికొన్నాడు.

**తాత్పర్యం:** పాప రహితమైన నడవడి గల మా అన్న యాజుడు అడవిలో వెళ్తూ ఒకనాడు 'ఇది శుభ్రమైనది, కాదు' అని తెలియని నేలమీద పడిన ఒక పండును చూచి, దాన్ని తీసికొన్నాడు.

**విశేషం:** పై పద్యంలో మొదటిమూడు పాదాల్లో ప్రాసయతులే ఉన్నాయి.

**వ.** **'ఫలార్థి యయినవాఁడు తత్ఫలానుబంధంబు లయిన దోషంబులు పరికింపండు గావున నమ్మునివరుండు నీ కభిమతంబు సేయుం బో' మ్మనిన ద్రుపదుం డరిగి, సంహితాధ్యయనాది పంచమహాయజ్ఞంబులు సేయుచు, శిలోంఛవృత్తి భైక్షసంపాదిత కుటుంబభారుం డై, ఘోరతపోవృత్తి నున్న యాజుం గని, నమస్కరించి యి ట్లనియె.** **12**

**ప్రతిపదార్థం:** ఫల+ఆర్థి, అయినవాఁడు= ఫలాన్ని కోరుకొనేవాడు; తద్+ఫల+అనుబంధంబులు+అయిన= ఆ ఫలానికి సంబంధించినవైన; దోషంబులు; పరికింపండు= లెక్కపెట్టడు; కావునన్; ఆ+ముని, వరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; నీకున్; అభిమతంబు= ఇష్టమైనది; చేయున్; చేస్తాడు; పొమ్ము+అనినన్= పో అని చెప్పగా; ద్రుపదుండు; అరిగి= వెళ్ళి; సంహితా+ అధ్యయన+ఆది= వేదాన్ని అధ్యయనం చేయటం మొదలైన; పంచ, మహాయజ్ఞంబులు; చేయుచున్; శిల+ఉంఛ, వృత్తి, భైక్ష,

సంపాదిత, కుటుంబ, భారుండు+ఐ= పైరు కోసిన తరువాత మళ్ళయందు జారిపడిన వెన్ను గింజలు మొదలగు వాటిని ఏరికొనే జీవనోపాయంచేత, భిక్షా సంబంధంగా- అనగా బిచ్చమెత్తి సంపాదించబడిన దానిచేత, కుటుంబ భారాన్ని వహించిన వా డై; ఘోర, తపో, వృత్తిన్+ఉన్న= భయంకరమైన తపస్సు చేస్తున్న; యాజున్= యాజమునిని; కని= చూచి; నమస్కరించి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఫలాన్ని కోరేవాడు దానికి సంబంధించిన దోషాలను లెక్కపెట్టడు. అందువలన ఆ మునిశ్రేష్ఠుడు నీవు కోరిన దానిని చేస్తాడు, వెళ్ళుము' అని చెప్పగా, ద్రుపదుడు యాజుని వద్దకు వెళ్ళాడు. అతడు వేదాధ్యయనం మొదలైన పంచమహాయజ్ఞాలు చేసేవాడు. పైరు కోసిన తర్వాత మళ్లలో జారిపడిన వెన్నులు, గింజలు మొదలైన వాటిని ఏరుకొనే జీవనోపాయంచేత, బిచ్చమెత్తి సంపాదించిన దానిచేత - కుటుంబభారాన్ని వహిస్తూ, భయంకరమైన తపస్సు చేస్తున్నాడు. అతడిని చూచి ద్రుపదుడు నమస్కరించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** పంచమహాయజ్ఞాలు: (1) దేవయజ్ఞం (దేవతలతృప్తికొఱకు అగ్నిహోత్రంలో హవిస్సులు వేసి హోమం చేయటం), (2) పితృయజ్ఞం (పితృదేవతలతృప్తికొఱకు స్వధాకారంతో తర్పణం చేసి, బ్రాహ్మణులకు భోజనం పెట్టటం), (3) భూతయజ్ఞం (వైశ్వదేవం చేసిన తర్వాత బహిర్దేశంలో భూతాలతృప్తికొఱకు బలి యివ్వటం), (4) మనుష్యయజ్ఞం (యథాశక్తిగా అతిథులకు అన్నం పెట్టటం) (5) బ్రహ్మయజ్ఞం (వేదాధ్యయనం - ఒక ఋక్కును గాని, యజస్సును గాని, సామాన్ని గాని, శక్తి కొద్దీ నిత్యం అభ్యసించటం).

**క. మునినాథ! నాకు సత్సుత । జననం బగునట్టి క్రతువు సద్విధి గావిం**
**చినఁ గృతకృత్యుఁడ నగుదుం । గొను మిచ్చెద నీకు లక్ష గో ధేనువులన్. 13**

**ప్రతిపదార్థం:** (ప్రతిపదార్థ, తాత్పర్యాలకొరకు తొమ్మిదవ పద్యం చూడండి).

**విశేషం:** యాజుడు ఫలార్థి అని ముందే అతని తమ్ముడు చెప్పాడు. కనుక ద్రుపదుడు 'లక్ష గోధేనువులను ప్రతిఫలంగా ఇస్తాను' అనటంలో తప్పు లేదు. నన్నయ 9వ పద్యాన్నే యథాతథంగా మరల వాడుకొన్నాడు. అంటే తమ్ముని దగ్గర ఒకమాట, అన్నదగ్గర మరొకమాట చెప్పకుండా తన ధ్యేయాన్ని యథాతథంగా తెలిపాడు-ద్రుపదుడు అనటానికి నిదర్శనంగా తొమ్మిదవపద్యాన్ని ఇక్కడకూడా ఒక పలుకైనా తప్పకుండా అర్థిస్తూ తెలిపాడు.

**వ. అని ప్రార్థించి వెండియు నా ద్రుపదుండు యాజున కి ట్లనియె. 14**

**ప్రతిపదార్థం:** అని, ప్రార్థించి; వెండియున్= మరల; ఆ ద్రుపదుండు; యాజునకున్, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని వేడికొని మరల ఆ ద్రుపదుడు యాజునితో ఈ విధంగా చెప్పాడు.

**క. భారతవంశాచార్యుఁడు । భారద్వాజుండు నా కపాయము సేసెన్**
**ఘోరాజి నతని నోర్చున । పారపరాక్రమసుపుత్త్రుఁ బడయఁగ వలయున్. 15**

**ప్రతిపదార్థం:** భారతవంశ+ఆచార్యుఁడు=భరతునికి సంబంధించిన వంశానికి గురువు; భారద్వాజుండు= భరద్వాజునికి పుత్రు డైన ద్రోణుడు; నాకున్; అపాయము= కీడు; చేసెన్; అతనిన్; ఘోర+ఆజిన్= భయంకరమైన యుద్ధంలో; ఓర్చు= ఓడించే; అపార, పరాక్రమున్= అంతులేని పరాక్రమం కలవాడిని; సుపుత్త్రున్= మంచి కుమారుడిని; పడయఁగవలయున్= పొందవలెను.

**తాత్పర్యం:** భరతవంశానికి గురువు, భరద్వాజునికి పుత్రుడు అయిన ద్రోణుడు, నాకు హాని చేశాడు. అతడిని మహాయుద్ధంలో ఓడించే మంచిపుత్రుడిని పొందాలి.

**క. షడరత్ని ధనుర్ధరుఁడె । య్యెడ నజితుఁడు గాన వాని హీనుంగాఁ జే**
**యుఁడు నాకుఁ జతుర్వర్గము । వడయుట యని పృషతసుతుఁడు ప్రార్థించె మునిన్. 16**

**ప్రతిపదార్థం:** షట్+అరత్ని; ధనుస్+ధరుడు= చిటికెన వ్రేలు చాచిన ఆరు పిడిమూరల ధనుస్సును ధరించినవాడు, ద్రోణుడు; ఎయ్యెడన్= ఎక్కడ కూడ; అజితుఁడు, కాన= జయించబడనివాడు కావున; వానిన్= అతణ్ణి; హీనుంగాన్= తక్కువైన వాడినిగా; చేయుఁడు= చేసినచో; నాకున్= నాకు; చతుర్వర్గము= ధర్మార్థ కామమోక్షాలు; పడయుట= పొందుట; అని; పృషత, సుతుఁడు= పృషతుని కుమారుడైన ద్రుపదుడు; మునిన్= యాజుని; ప్రార్థించెన్.

**తాత్పర్యం:** 'ఆరుమూరల పొడవైన ధనుస్సును ధరించిన ద్రోణుడు ఎక్కడకూడ జయింపబడనివాడు కనుక, అట్లాంటివాడిని తక్కువ చేస్తే, ధర్మార్థకామమోక్షాలైన నాలుగుపురుషార్థాలు నేను పొందినట్లే' అని ద్రుపదుడు యాజుణ్ణి ప్రార్థించాడు.

**విశేషం:** 'అరత్ని' శబ్దానికి 'చిటికెన వ్రేలు చాచిన పిడి మూర మో చేయి' అని గుప్తార్థప్రకాశిక.

**వ. అ య్యాజుండును యాజకత్వంబున కొడంబడి 'నీ కోర్కికిం దగినయట్టి కొడుకునుం గూఁతురుం బుట్టుదు; రోడకుండు మని యజ్ఞోపకరణద్రవ్యంబులు సమకట్టికొని; యథావిధి నుపయాజుండు సహాయుండుగా సౌత్రామణి యయిన కోకిలాదేవి పత్నిగా ద్రుపదుం బుత్రకామేష్టి సేయించిన, నందు మంత్రాహుతులం దృప్తుం డయిన యగ్నిదేవుని వలన. 17**

**ప్రతిపదార్థం:** ఆ+యాజుండును; యాజకత్వంబునకు= యజ్ఞం చేయించే యాజ్ఞికుడిగా ఉండటానికి; ఒడంబడి= ఒప్పుకొని; నీ, కోర్కికిన్; తగిన, అట్టి; కొడుకున్; కూతురున్, పుట్టుదురు; ఓడకుండుము= భయపడవద్దు; అని= అనిపలికి; యజ్ఞ+ఉపకరణ, ద్రవ్యంబులు= యజ్ఞసాధనములను, పదార్థములను; సమకట్టికొని= సిద్ధం చేసికొని; యథావిధిన్= శాస్త్ర పద్ధతి ప్రకారం; ఉపయాజుండు (తమ్ముడు) సహాయుండుగా; సౌత్రామణి, అయిన కోకిలాదేవి (ద్రుపదుని భార్య), పత్నిగా= యజ్ఞాది ధర్మ కార్య నిర్వహణల్లో భర్తను అనుసరించే భార్యగా; ద్రుపదున్; పుత్రకామ+ఇష్టిన్= పుత్రులను కోరిచేసే యజ్ఞాన్ని; చేయించినన్; అందున్= ఆ యజ్ఞంలో; మంత్ర+ఆహుతులన్= మంత్రాలచేత, వ్రేల్చిన హోమద్రవ్యాలచేత; తృప్తుండు= తృప్తిపొందినవాడు; అయిన; అగ్నిదేవువలనన్= అగ్నిదేవునివల్ల.

**తాత్పర్యం:** ఆ యాజుడు యజ్ఞం చేయించే యాజ్ఞికుడిగా ఉండటానికి అంగీకరించి, 'నీ కోరికకు తగిన కొడుకు, కూతురు జన్మిస్తారు; భయపడవద్దు' అని - యజ్ఞసాధనాలను, పదార్థాలను సిద్ధం చేసికొని, తమ్ముడు ఉపయాజుడు సహాయుడుగా, ద్రుపదుని భార్య కోకిలాదేవి ధర్మపత్నిగా, ద్రుపదునిచేత శాస్త్రోక్తంగా యజ్ఞం చేయించాడు. మంత్రాలతో ఆహుతులుగా వ్రేల్చిన పదార్థాలతో, తృప్తి పొందిన అగ్నిదేవునివలన.

**విశేషం:** భార్య అనగా భరింపబడేది. జాయ సంతానాన్ని కూర్చేది. గృహిణి గృహాన్ని నిర్వహించేది. రాజులకు పెక్కుమంది భార్య లున్నా, యజ్ఞాలవంటి ధర్మకార్యాలలో భర్తను అనుసరించే వ్యక్తిని, పత్ని, ధర్మపత్ని అని వ్యవహరిస్తారు. పుత్రకామేష్టి

పుత్రులను కోరి చేసే యజ్ఞం. పూర్వం దశరథ మహారాజు ఈ యజ్ఞం చేశాడు. యజ్ఞసమయంలో ధర్మపత్ని తప్పక యజమానితో ఉండితీరాలి. ఈ సందర్భంలో ద్రుపదుని భార్య పేరు ప్రస్తావించటం గమనార్హం. ఇక్కడ కోకిలాదేవి అను పేరుకు ముందు 'సౌత్రామణి అయిన' అనే విశేషణం ఉన్నది. సౌత్రామణి అనగా తూర్పు అంటే తూర్పు దిక్కుకలదియై ఆమె యజ్ఞం చేసే సమయంలో కూర్చొని ఉన్న దని గ్రహించాలి.

**క. జ్వాలాభీలాంగుఁడు కర । వాల బృహచ్చాపధరుఁడు వరవర్మ కిరీ**

**టాలంకారుఁడు వహ్నియ । పోలె రథారూఢుఁ డొక్క పుత్త్రుఁడు పుట్టెన్. 18**

**ప్రతిపదార్థం:** జ్వాలా+ఆభీల+అంగుడు= అగ్నిజ్వాలవలె భయంకరమైన శరీరం కలవాడు; కరవాల, బృహత్+చాప, ధరుఁడు= ఖడ్గాన్ని, పెద్ద ధనుస్సును ధరించినవాడు; వర, వర్మ, కిరీట+అలంకారుఁడు= శ్రేష్ఠమైన కవచం, కిరీటం అలంకారంగా కలవాడు; రథ+ఆరూఢుఁడు= రథాన్ని ఎక్కిఉన్నవాడు; వహ్నియ పోలెన్= అగ్నిహోత్రునివలె; ఒక్క, పుత్త్రుఁడు; పుట్టెన్.

**తాత్పర్యం:** అగ్నిజ్వాలవలె భయంకరమైన శరీరం కలవాడు, ఖడ్గాన్నీ, పెద్ద ధనుస్సును ధరించినవాడు, శ్రేష్ఠమైన కవచంతో కిరీటంతో అలంకరింపబడినవాడు; రథాన్ని అధిరోహించినవాడు అయిన ఒక పుత్రుడు అగ్నిహోత్రుని వలె ఉదయించాడు.

**విశేషం:** అలం; ఉపమ.

**వ. మఱియు 19**

**తాత్పర్యం:** ఇంకా.

**తరలము.**

**కుల పవిత్ర, సితేతరోత్పలకోమలామలవర్ణ, యు**

**త్పలసుగంధి, లసన్మహోత్పలపత్త్రనేత్ర, యరాళకుం**

**తల విభాసిని, దివ్యతేజముఁ దాల్చి యొక్క కుమారి త**

**జ్జ్వలనకుండమునందుఁ బుట్టెఁ బ్రసన్నమూర్తి ముదంబుతోన్. 20**

**ప్రతిపదార్థం:** కుల, పవిత్ర= వంశాన్ని పవిత్రం చేసేది; సిత+ఇతర+ఉత్పల; కోమల+అమల, వర్ణ= తెల్లదికాని కలువవలె సుకుమారమూ స్వచ్ఛమూ అయిన రంగు కలది - అనగా నల్లకలువవంటి శరీరవర్ణం కలది; ఉత్పల, సుగంధి= కలువవంటి సువాసన కలది; లసత్+మహా+ఉత్పల, పత్త్ర, నేత్ర = ప్రకాశించే పెద్ద కలువ రేకులవంటి నేత్రాలు కలది; అరాళ, కుంతల, విభాసిని= వంకరలు తిరిగిన వెంద్రుకలతో వెలిగేది; దివ్య, తేజమున్= దివ్యకాంతిని; తాల్చి= ధరించి; ప్రసన్నమూర్తి= హాయిని గొలుపు ఆకారం కలది; ముదంబుతోన్= సంతోషంతో; ఒక్క, కుమారి= ఒక కన్య; తద్+జ్వలన, కుండము+అందున్= ఆ అగ్నికుండంలోనుండి; పుట్టెన్.

**తాత్పర్యం:** వంశాన్ని పావనం చేసేది, నల్లకలువవంటి శరీరవర్ణం కలది, కలువగంధంవంటి సుగంధం కలది, కళకళలాడే పెద్ద కలువరేకులవంటి కన్నులు కలది, వంకరలు తిరిగిన వెంద్రుకలతో వెలిగేది, దివ్య తేజస్సును ధరించింది; మనోహరమైన ఆకారం కలది అయిన ఒకకన్య సంతోషంతో ఆ అగ్నికుండంలో ఉదయించింది.

**విశేషం:** అలం: ఉపమ. నన్నయ తరల వృత్తాన్ని ఆది సభా పర్వాలలో ప్రతి ఆశ్వాసంలోనూ కనీసం ఒకటి రచించాడు. ఆదిపర్వంలోని చతుర్థ, పంచమ, అష్టమాశ్వాసాలలో ఒక్కొక్కటి చొప్పున, మిగిలిన వాటిల్లో రెండు చొప్పున వాడాడు. సభాపర్వంలో ప్రథమాశ్వాసంలో మూడు, ద్వితీయాశ్వాసంలో అయిదు వాడాడు. అరణ్యపర్వంలో ద్వితీయాశ్వాసంలో తప్ప ప్రథమ తృతీయాశ్వాసాలలో రెండేసి రచించాడు. నన్నయ అభిమాన విశేష వృత్తాలలో ఇది ఒకటి. లక్షణం ఇదివరలో చెప్పబడింది. (చూడు ఆది. 3-142) (సంపా.) తరలము లేదా తరళము అనగా ప్రకాశించేది. ఇచ్చట దివ్యతేజస్సు ధరించిన కన్య అగ్నికుండంలోనుండి ఆవిర్భవించింది కాబట్టి ఈ సందర్భంగా ప్రస్తుత ఛందోవిశేషం ఎంతో ఔచిత్యవంతం.

**వ. ఇట్లు పుట్టిన యక్కొడుకునకుం గూఁతునకు ధృష్టద్యుమ్నుండును గృష్ణయు నను నామంబు లాకాశవాణి జన విదితంబుగా నుచ్చరించె; నట్లు ద్రుపదుండు లబ్ధసంతానుం డయి, సంతసిల్లి యాజునకు యథోక్త దక్షిణ లిచ్చి, బ్రాహ్మణులం బూజించి, ధృష్టద్యుమ్నుని ధనుర్వేదపారగుం జేయించి యున్నంత, నక్కన్య యిపుడు వివాహసమయప్రాప్త యయిన. 21**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పుట్టిన; ఆ+కొడుకునకున్; కూఁతునకున్; ధృష్టద్యుమ్నుండును, కృష్ణయున్, అను, నామంబులు= ధృష్టద్యుమ్నుడు, కృష్ణ అను పేర్లు; ఆకాశవాణి; జన, విదితంబుగాన్= జనులకు తెలిసేటట్లుగా; ఉచ్చరించెన్= పలికెను; అట్లు= ఆ విధంగా; ద్రుపదుండు; లబ్ధ, సంతానుండు+అయి= పొందిన సంతానం కలవాడై; సంతసిల్లి= సంతోషించి; యాజునకున్= యాజ మునికి; యథా+ఉక్త, దక్షిణలు= చెప్పిన ప్రకారం దక్షిణలు; ఇచ్చి; బ్రాహ్మణులన్; పూజించి; ధృష్టద్యుమ్నుని; ధనుర్వేద పారగున్= ధనుర్వేదము యొక్క ఆవలి ఒడ్డు చేరినవాడినిగా - అనగా ధనుర్వేదాన్ని పూర్తిగా నేర్చినవాడినిగా; చేయించి; ఉన్నంతన్= ఉన్నంతలో; ఆ+కన్య= ఆ కృష్ణ; ఇపుడు; వివాహ, సమయ, ప్రాప్త, అయినన్= వివాహసమయం సమీపించింది కాగా.

**తాత్పర్యం:** ఈ విధంగా పుట్టిన కుమారునికి, కూతురికి - ధృష్టద్యుమ్నుడు, కృష్ణ అనే పేర్లను ప్రజ లందరికీ తెలిసే విధంగా ఆకాశవాణి పలికింది. ఆ విధంగా ద్రుపదుడు సంతానం పొంది, సంతోషించి, యాజునికి చెప్పిన ప్రకారం దక్షిణ లిచ్చి, బ్రాహ్మణులను పూజించాడు. ధృష్టద్యుమ్నుడిని ధనుర్వేదపారంగతుడిని చేయించాడు. ఇప్పుడు ఆ కన్యకు వివాహసమయం సమీపించగా;

**విశేషం:** ధృష్టద్యుమ్నుడు= గొప్ప బలంకలవాడు; కృష్ణ= నల్లని శరీరం కలది.

### ద్రౌపదీవివాహప్రయత్నము (అమూలకము)

**ఉ. మానితు లైన పాండవకుమారులుఁ గుంతియు లక్కయింట ను**
**గ్రానలదగ్ధు లై రని ధరామరముఖ్యు లెఱింగి చెప్పఁగా**
**నా నరనాయకుండు విని యాతత శోకమహానలజ్వల**
**న్మానసుఁ డయ్యె బంధుజనమంత్రిపురోహిత విప్రసన్నిధిన్. 22**

**ప్రతిపదార్థం:** మానితులు+ఐన= గౌరవింపబడినవా రైన; పాండవ కుమారులున్= పాండవులూ; కుంతియున్; లక్క, ఇంటన్= లక్కయింటిలో; ఉగ్ర+అనల, దగ్ధులు+ఐరి+అని= భయంకరమైన అగ్నిచేత కాలిపోయా రని; బంధు, జన, మంత్రి, పురోహిత, విప్ర, సన్నిధిన్= బంధుజనులయొక్క, మంత్రులయొక్క, పురోహితులయొక్క, బ్రాహ్మణులయొక్క ఎదుట;

ధరా+అమర ముఖ్యులు= బ్రాహ్మణశ్రేష్ఠులు; ఎఱింగి= తెలిసికొని; చెప్పఁగాన్; ఆ, నర నాయకుండు= ఆ రాజు - ద్రుపదుడు; విని, అతత, శోక, మహా+అనల, జ్వలత్+మానసుఁడు+అయ్యెన్= మిక్కుటమైన దుఃఖ మనెడి గొప్ప అగ్నిచేత దహింప బడుతున్న మనస్సు కల వా డయ్యాడు.

**తాత్పర్యం:** గొప్పవా ళ్ళయిన పాండవులు, కుంతి లక్కయింట్లో భయంకరమైన అగ్నికి ఆహుతి అయ్యా రని బంధువుల, మంత్రుల, పురోహితుల, బ్రాహ్మణుల సమక్షంలో బ్రాహ్మణశ్రేష్ఠులు చెప్పగా, విని ద్రుపదుడు అధికదుఃఖ మనే అగ్నిచే దహింపబడుతున్న మనస్సు కలవా డయ్యాడు.

**విశేషం:** అలం: రూపకం. జ్వలత్+మానసుడు= జ్వలన్మానసుడు - అనునాసికసంధి.

**వ. మఱియును.** **23**

**తాత్పర్యం:** అంతటితో ఆగక.

**సీ. 'ఇంద్రసమానున కిందీవరశ్యామ । సుందరాంగున కింద్రనందనునకు**
**దేవిఁగాఁ బ్రీతితో దీని నీఁ గాంచితి । నని యున్నచో విధాతృనకు నిట్లు**
**పాడియే విఘ్న మాపాదింప; నమ్మహా । ధ్వరమునఁ బుట్టిన సరసిజాక్షి**
**నే నెట్టు లొరులకు నీ నేర్తు' నని దుఃఖ । పరవశుఁడయి యున్న ధరణిపతికిఁ**

**ఆ. దత్పురోహితుండు దా నిట్టు లనియె 'న । ప్పాండవులనుగుఱిచి బహువిధంబు**
**లగు నిమిత్తములు నయంబునఁ జూచితి; । నెగ్గు లేదు; వారి కెల్ల లగ్గు'.** **24**

**ప్రతిపదార్థం:** ఇంద్ర, సమానునకున్= ఇంద్రునితో సమానమైనవానికి; ఇందీవర, శ్యామసుందర+అంగునకున్= నల్లకలువవలె నల్ల నై అందమైన శరీరం కలవానికి; ఇంద్ర, నందనునకున్= ఇంద్రుని కుమారు డైన అర్జునునికి; ప్రీతితోన్= ప్రేమతో; దీనిన్= ఈ కృష్ణను, దేవిగాన్= భార్యగా; ఈన్+కాంచితిన్= ఇవ్వగలిగాను; అని, ఉన్నచో= అని ఉండగా; విధాతృనకున్= బ్రహ్మదేవునికి; ఇట్లు; విఘ్నము= చెఱుపు; ఆపాదింపన్= కలిగించుట; పాడియే= న్యాయమా; ఆ+మహా+అధ్వరమునన్= ఆ మహాయజ్ఞంలో; పుట్టిన; సరసిజ+అక్షిన్= సరస్సునుండి పుట్టిన పద్మమువంటి కన్నులు కలదానిని; ఏన్= నేను; ఎట్టుల= ఏ విధంగా; ఒరులకున్= ఇతరులకు; ఈ, నేర్తును= ఇవ్వగలను; అని= అని తలచి; దుఃఖ, పరవశుఁడు+అయి= దుఃఖానికి పూర్తిగా లొంగిపోయినవా డై- అనగా మిక్కిలి దుఃఖం పొందినవా డై; ఉన్న, ధరణి, పతికిన్= ఉండు భూపతికి - ద్రుపదరాజుకు; తద్+పురోహితుండు= అతని పురోహితుడు; తాన్= తాను; ఇట్లు+అనియెన్; ఆ+పాండవులను; గుఱిచి= గురించి; బహువిధంబులు+అగు= పెక్కు విధాలైన; నిమిత్తములు= శకునాలు; నయంబునన్= నేర్పుగా; చూచితిన్; వారికిన్= ఆ పాండవులకు; ఎగ్గు= కీడు; లేదు; ఎల్ల= అంతయు; లగ్గు= మేలు.

**తాత్పర్యం:** 'ఇంద్రునితో సమానుడు, నల్లకలువవలె నల్లని అందమైన శరీరం కలవాడు. ఇంద్రుని కుమారుడు అయిన అర్జునునికి ప్రేమతో కృష్ణను భార్యగా ఇవ్వా లని ఉండగా, బ్రహ్మదేవుడు ఈ విధంగా చెరుపు చేయటం న్యాయమా? ఆ మహాయజ్ఞంలో పుట్టిన ద్రౌపదిని ఏ విధంగా ఇతరులకు ఇవ్వగలను? అని ద్రుపదుడు దుఃఖంలో మునిగిపోయాడు. అప్పు డతని పురోహితుడు ఇట్లా అన్నాడు. 'ఆ పాండవులను గురించి అనేకవిధా లైన శుభశకునాలను నిపుణంగా చూచాను. వారికి కీడు లేదు. అంతా మేలే'.

**విశేషం:** అర్జునుడు ఇందీవరశ్యాముడు. అగ్నినుండి పుట్టిన కృష్ణకూడ 'సితేతరోత్పల కోమలామలవర్ణ' - (ఉత్పల, పత్రనేత్ర, ఉత్పలసుగంధి కూడ). అర్జునునికొరకే ద్రౌపది పుట్టింది కనుక ఇద్దరిలో ఈ రూపసామ్యం ఒక విశేషం.

**వ. 'తొల్లి దేవేంద్రుండు గొండొకకాలం బదృశ్యుం డై యుండిన, నతనిం గానక శచీదేవి శోకింపం బోయిన నుపశ్రుతిం జేసి బృహస్పతి దానికి దేవేంద్రాగమనంబు సెప్పె నని వేదంబుల వినంబడుం; గావున నేను నుపశ్రుతిం జూచితి; నిది దప్పదు; పాండవులు పరలోకగతులు గారు; పరమానందంబున నున్నవారు; వార లెందుండియు నిందులకు వత్తురు; నీవును సుచిత్తుండ వయి స్వయంవరం బిప్పురంబున ఘోషింపం బంపు; మిది కన్యాదానంబునందు రాజులకు శాస్త్రచోదితం' బనినం బురోహితువచనంబునంజేసి, యూఱడి ద్రుపదుండు నేఁటికి డెబ్బదియేనగు దివసంబునం బౌషమాసంబున శుక్లపక్షంబున నష్టమియు రోహిణినాఁడు స్వయంవరం బని ఘోషింపం బంచి. 25**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; దేవేంద్రుండు; కొండు+ఒక, కాలంబు= కొంత కాలం; అదృశ్యుండు+ఐ= అగుపడనివా డై; ఉండినన్= ఉండగా; అతనిని= ఆ ఇంద్రుని; కానక= చూడక; శచీదేవి; శోకింపన్+పోయినన్= దుఃఖించపోగా; ఉపశ్రుతిన్+చేసి= శుభాశుభ సూచకమైన ఇతరుల సంభాషణ ధ్వనిని వినటంచేత; బృహస్పతి; దానికిన్= ఆ శచీదేవికి; దేవేంద్ర+ఆగమనంబు= దేవేంద్రుని యొక్క రాకను; చెప్పెన్+అని= చెప్పాడు అని; వేదంబులన్= వేదాలలో; వినంబడున్= వినబడుతూ ఉంది; కావునన్= కాబట్టి; నేనున్= నేనుకూడా; ఉపశ్రుతిన్; = ఆ ఉపశ్రుతిని; చూచితిన్, ఇది; తప్పదు; పాండవులు; పరలోకగతులు, కారు= స్వర్గలోకానికి వెళ్ళినవారు కారు - అనగా మరణించలేదు; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషంతో; ఉన్న, వారు; వారలు; ఎందు+ఉండియున్= ఎక్కడ ఉన్నా; ఇందులకున్= ఇక్కడికి; వత్తురు= వచ్చుదురు; నీవును; సు చిత్తుండవు+అయి= కలతలేని మంచి మనస్సు కలవాడవై; స్వయంవరంబు= స్వయంవరాన్ని; ఈ+పురంబునన్= ఈ నగరంలో; ఘోషింపన్= చాటించటానికి; పంపుము= ఆజ్ఞాపించు; ఇది= ఈ స్వయంవరం; కన్యా, దానంబునందున్= కన్యాదానమున; రాజులకున్; శాస్త్ర, చోదితంబు= శాస్త్రంచేత చెప్పబడింది; అనినన్= అని అనగా; పురోహితు, వచనంబునన్+చేసి= పురోహితుని యొక్క మాటలతో; ఊఱడి= ఓదార్పునొంది; ద్రుపదుండు; నేఁటికిన్= ఈనాటికి; డెబ్బది, ఏను+అగు= డెబ్బది యైదవది అగు; దివసంబునన్= రోజున; పౌష, మాసంబునన్= పుష్యమాసంలో; శుక్ల, పక్షంబునన్, అష్టమియు= శుక్లపక్షం అష్టమితిథి; రోహిణినాడు= రోహిణీ నక్షత్ర మున్ననాడు; స్వయంవరంబు+అని; ఘోషింపన్= చాటించటానికి; పంచి= ఆజ్ఞాపించి.

**తాత్పర్యం:** 'పూర్వం దేవేంద్రుడు కొంతకాలం కనబడకపోగా, శచీదేవి శోకించిం దనీ, శుభసూచకమైన ఇతరుల సంభాషణనుబట్టి బృహస్పతి ఆమెకు దేవేంద్రుని రాకనుగురించి చెప్పా డనీ వేదాలవలన తెలుస్తున్నది. కనుక నేనుకూడ అట్లాంటి శుభశకునాలే చూచాను. ఇది తప్పదు. పాండవులు మరణించలేదు. పరమానందంతో ఉన్నారు. వా ళ్ళెక్కడున్నా ఇక్కడికి వస్తారు. నీవు నిర్మల మైన మనస్సుతో ఈ పట్టణంలో స్వయంవరాన్ని చాటించడానికి ఆజ్ఞాపించుము. స్వయంవరం కన్యాదానంలో రాజులకు శాస్త్రవిహితమే - ఈ విధంగా చెప్పిన పురోహితునిమాటలతో ఊరటచెంది, ద్రుపదుడు - ఈ నాటినుండి డెబ్బై ఐదవరోజు పుష్యమాస, శుక్ల పక్ష అష్టమి, రోహిణీనక్షత్రం ఉన్నరోజు స్వయంవరం జరుగుతుం దని చాటించటానికి ఆజ్ఞాపించాడు.

**విశేషం:** కొన్ని ప్రతులలో 'అష్టమి'కి బదులు పంచమి అని ఉన్నది. ఉపశ్రుతి అంటే ఒకరు మాట్లాడుతున్నప్పుడు అనుకోకుండా శుభాశుభసూచకమైన ఇతరుల సంభాషణ వినటం. ఇది శకునం. దీన్నిబట్టి భవిష్యత్తులో జరుగబోయే శుభాశుభాలను శకునశాస్త్రం చెప్పేవాళ్లు చెప్పుతారు.

**క. ఎవ్వరికిని మోపెట్టను । దివ్వను శక్యంబు గాని దృఢకార్ముకమున్**

**దవ్వై దివమునఁ దిరిగెడు । నవ్విలసత్కనకమత్స్య యంత్రముఁ జేసెన్. 26**

**ప్రతిపదార్థం:** ఎవ్వరికిని; మోపెట్టను= ఎక్కు పెట్టటానికి; తివ్వను= లాగటానికి; శక్యంబు+కాని= సాధ్యం కాని; దృఢ; కార్ముకమున్= బలమైన ధనుస్సును; దవ్వు+ఐ= దూరమై; దివమునన్= ఆకాశంలో; తిరిగెడు= తిరుగునట్టి; ఆ+విలసత్+కనక, మత్స్యయంత్రమున్= ప్రకాశించే బంగారుచేపతో కూడిన యంత్రాన్ని; చేసెన్= రూపొందించాడు.

**తాత్పర్యం:** ఎక్కుపెట్టటానికికాని, లాగటానికి కాని ఎవ్వరికీ సాధ్యంకాని ఒక బలమైన ధనుస్సునూ, దూరంగా ఆకాశంలో తిరిగే ప్రకాశవంత మైన బంగారు మత్స్యయంత్రాన్నీ రూపొందించాడు.

**క. 'ధరణిఁ గల రాజులెల్లను । బురుడునఁ గాంపిల్య నగరమున కరిగెద రొం**

**డొరులం గడవఁగ, నని భూ । సురువరుఁ డెఱిఁగించెఁ బృషతసుతుకథయెల్లన్. 27**

**ప్రతిపదార్థం:** ధరణిన్= భూమిమీద; కల= ఉన్న; రాజులు+ఎల్లన్= రాజులంతా; పురుడునన్= సమానంగా; కాంపిల్య నగరమునకు (ఇది ద్రుపదుపురం); ఒండొరులన్+కడవఁగన్= ఒకరికంటె ముందుగా మరొకరు; అరిగెదరు= వెళ్ళుతారు; అని= ఆప్రకారం, భూసుర, వరుఁడు= బ్రాహ్మణ శ్రేష్ఠుడు; పృషత, సుతు, కథ, ఎల్లన్= ద్రుపదుడి కథ అంతా; ఎఱిఁగించెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'భూమిమీద ఉన్న రాజులంతా ఒకరికొకరు (ముందుగా వెళ్ళా లని) పోటీపడుతూ ద్రుపదుని కాంపిల్య నగరానికి వెళ్ళుతున్నా' రని ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు ద్రుపదునికథ అంతా చెప్పాడు.

**వ. దాని విని పాండునందను లందులకుం బోవనున్నఁ గొడుకుల యభిప్రాయం బెఱింగి కుంతీదేవి యి ట్లనియె. 28**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ వృత్తాంతమును; విని, పాండునందనులు= పాండుకుమారులు; అందులకున్= కాంపిల్యనగరానికి; పోవన్+ఉన్నన్= పోవలె నని ఉండగా; కొడుకుల; అభిప్రాయంబు; ఎఱింగి; కుంతీదేవి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ వృత్తాంతాన్ని విని పాండవులు కాంపిల్యనగరానికి పోవా లనే అభిప్రాయంతో ఉండగా; దానిని గ్రహించి కుంతీదేవి వాళ్ళతో ఈ విధంగా అనింది.

### పాండవులు పాంచాలపురంబునకు బయలుదేరుట. (సం. 1-156-2)

**క. కడుఁబెద్దకాల ముండితి । మొడఁబడి; యిం దెంతకాల మున్నను మన క**

**య్యెడు లాభ మేమి? మఱి యె । ప్పుడు నుచితమె యొరుల యిండ్ల పొత్తున నుండన్. 29**

**ప్రతిపదార్థం:** కడున్= చాల; పెద్ద, కాలము= ఎక్కువ కాలం; ఒడఁబడి= ఇష్టపడి; ఉండితిమి= ఉంటిమి; ఇందు+ఎంతకాలము+ ఉన్నను= ఇక్కడ ఎంతకాలం ఉన్నా; మనకున్; అయ్యెడు= కలిగే; లాభము+ఏమి; మఱి; ఎప్పుడున్; ఒరుల= ఇతరుల; ఇండ్ల, పొత్తునన్= ఇండ్లల్లో; ఉండన్= ఉండటం; ఉచితమె= తగునా?

**తాత్పర్యం:** ఏకచక్రపురంలోని ఈ బ్రాహ్మణుని ఇంట్లో చాలా యెక్కువకాలం ఎట్లాగో ఉన్నాం. ఇక్కడ ఎంత కాల మున్నా మనకు కలిగే లాభ మే ముంది? అంతేకాక ఎప్పుడూ ఇతరుల యిండ్లలో కలిసి ఉండటం ఉచితం కాదు కదా!

**వ. దక్షిణపాంచాలంబు గరంబు రమ్యం బనియును, బాంచాలపతి పరమధార్మికుం డనియును వింటిమి; మఱి యట్లుం గాక. 30**

**ప్రతిపదార్థం:** దక్షిణ, పాంచాలంబు= దక్షిణపాంచాలదేశం; కరంబు= మిక్కిలి; రమ్యంబు+అనియును= అందమైన దనీ, పాంచాల పతి= పాంచాలరాజు; పరమ, ధార్మికుండు+అనియును= మిక్కిలి ధర్మబుద్ధికలవా డనీ; వింటిమి= విన్నాము; మఱి= ఇక; అట్లున్+కాక= ఆ విధంగా కాకుండా;

**తాత్పర్యం:** దక్షిణపాంచాలదేశం ఎంతో అందమైన దనీ, పాంచాలాన్ని పాలించే రాజు మిక్కిలి ధర్మబుద్ధి కలవా డనిన్నీ విన్నాము; అంతేకాక.

**క. అడుగకయు విప్రవరులకు । నడరఁగ నద్దేశమున గృహస్థులు భక్తిం**
**గుడువఁగఁ బెట్టుదు రెప్పుడుఁ । గడు హృద్యము లయిన మోదకంబులతోడన్. 31**

**ప్రతిపదార్థం:** ఆ+దేశమునన్= ఆ పాంచాలదేశంలో; గృహస్థులు= ఇంటి యజమానులు; అడరఁగన్= ఒప్పుగ; విప్ర, వరులకున్= బ్రాహ్మణ శ్రేష్ఠులకు; అడుగకయు= అడుగకుండానే; భక్తిన్= భక్తితో; ఎప్పుడున్= ఎల్లప్పుడు; కడున్= మిక్కిలి; హృద్యములు+ అయిన= ఇంపైన; మోదకంబులతోడన్= కుడుములతో; కుడువగన్= తినటానికి (భోజనం); పెట్టుదురు.

**తాత్పర్యం:** ఆ పాంచాలదేశంలో గృహస్థులు బ్రాహ్మణశ్రేష్ఠులకు అడుగకుండానే భక్తితో, మనోహరా లైన మోదకాలతో ఎప్పుడూ భోజనం పెడుతూ ఉంటారు.

**వ. 'అందులకుం బోవుద' మనినం గొడుకులెల్ల వల్లె యని 'మీ పంచిన విధంబ చేయం గలవార' మని యొడంబడి తమయున్న యింటిబ్రాహ్మణునకుం జెప్పి వీడ్కొని. 32**

**ప్రతిపదార్థం:** అందులకున్= ఆ పాంచాలదేశానికి; పోవుదము+అనినన్= పోదాం అని అనగా; కొడుకులు+ఎల్ల= కొడుకులంతా; వల్లె, అని= సరే అని; మీ, పంచిన, విధంబు+అ= మీరు ఆజ్ఞాపించినట్లే; చేయన్+కలవారము+అని= చేస్తాము అని; ఒడంబడి= సమ్మతించి; తమ, ఉన్న= తామున్న; ఇంటి= ఇంటి; బ్రాహ్మణునకున్, చెప్పి; వీడ్కొని= సెలవు తీసికొని.

**తాత్పర్యం:** పాంచాలపురానికి వెళ్లుదా మని కుంతి అనగానే కొడుకులంతా సరే అని 'మీరు చెప్పినట్లే చేస్తా' మని ఒప్పుకొని, తా మున్న యింటి బ్రాహ్మణునికి చెప్పి అతనిదగ్గర సెలవు తీసికొని.

### పాండవులు ద్రుపదుపురంబున కరుగుచు వ్యాసమహర్షిం గనుట (సం. 1-157-1)

**చ. ఉరుసరసీవనంబులు మహోగ్రనగంబులు నేఱులున్ సుదు**
**స్తరవిపినంబులుం గడచి ధన్యులు పాండుకుమారకుల్ నిరం**

**తరగతి నేఁగుచుం గనిరి ధర్మసమేతుఁ బితామహుం దమో**

**హరు హరిమూర్తి నార్తిహరు నాదిమునీంద్రుఁ బరాశరాత్మజున్. 33**

**ప్రతిపదార్థం:** ఉరు, సరసీవనంబులు= పెద్ద సరస్సుల సమూహాలు; మహా+ఉగ్ర, నగంబులున్= మిక్కిలి భయంకరా లైన పర్వతాలు; ఏఱులున్= నదులు; సు, దుస్తర, విపినంబులున్= దాటటానికి చాలా కష్టమైన అడవులు; కడచి= దాటి; ధన్యులు= పుణ్యావంతులైన; పాండుకుమారకుల్= పాండురాజుకుమారులు; నిరంతర, గతిన్= ఎడతెగని ప్రయాణంతో; ఏఁగుచున్= వెళ్ళుతూ; ధర్మ, సమేతున్= ధర్మంతో కూడుకొన్నవాడిని - అనగా ధర్మాత్ముడిని; పితామహున్= తాతను; తమోహరున్= అజ్ఞానాన్ని తొలగించేవాడిని; హరిమూర్తిన్= విష్ణుస్వరూపుని; ఆర్తి, హరున్= దుఃఖాన్ని తొలగించే వాడిని; ఆది, మునీంద్రున్= తొలి ముని శ్రేష్ఠుడిని; పరాశర+ఆత్మజున్= పరాశరునియొక్క కుమారుడిని - వేదవ్యాసుడిని; కనిరి= చూచారు.

**తాత్పర్యం:** పెద్ద సరస్సుల సమూహాలను, భయంకరా లైన పర్వతాలను, నదులను - దాటడానికి చాలా కష్టమైన అడవులను దాటి - పుణ్యాత్ములైన పాండవులు నిరంతరం ప్రయాణం చేస్తూ - ధర్మాత్ముడు, పితామహుడు, అజ్ఞానాన్ని తొలగించేవాడు, విష్ణుస్వరూపుడు, దుఃఖాన్ని హరించేవాడు, ఆదిమునీంద్రుడు, పరాశరపుత్రుడు అయిన వ్యాసమహర్షిని దర్శించారు.

**వ. కని వినయమ్మున నమ్మునీంద్రునకు నందఱు నమస్కారంబు సేసిన వారలం జూచి కరుణారస పూరితాంతః కరణుం డయి వ్యాసభట్టారకుం డి ట్లనియె. 34**

**ప్రతిపదార్థం:** కని= చూచి; వినయమ్మునన్; ఆ+మునీంద్రునకున్= ఆ వ్యాసమహర్షికి; అందఱు; నమస్కారంబు; చేసిన; వారలన్; చూచి; కరుణా, రస, పూరిత+అంతఃకరణుండు+అయి= దయారసంతో నిండిన మనస్సు కలవాడై; వ్యాసభట్టారకుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** పాండవులు వ్యాసమహర్షిని చూచి వినయంతో ఆయనకు నమస్కరించగా; ఆ మునీంద్రుడు కరుణారసంతో నిండినహృదయంతో వాళ్ళను చూచి ఈ విధంగా అన్నాడు.

**క. ధర్మసుతుఁ డున్న చోటను । ధర్మువునకు హాని గలదె ధారుణి; నైనన్**

**ధర్మువ తాత్పర్యముగా । నిర్మలమతి నెగడునది వినీతాత్ముల రై. 35**

**ప్రతిపదార్థం:** ధర్మసుతుఁడు= ధర్మరాజు; ఉన్న, చోటను= ఉండే ప్రదేశంలో; ధర్మువునకున్= ధర్మానికి; హానికలదె= హాని ఉంటుందా?; ధారుణిన్= భూమిమీద; అయినన్= అయినప్పటికి; ధర్మువు+అ= ధర్మమే; తాత్పర్యముగా= ముఖ్యసారాంశంగా; నిర్మలమతిన్= మాలిన్యం లేని మనస్సుతో; వినీత+ఆత్ములరు+ఐ= వినయవంతు లై; నెగడునది= నడచుకోండి.

**తాత్పర్యం:** ధర్మరాజు ఉన్నచోట ధర్మానికి హాని ఉంటుందా? (ఉండ దని భావం). అయినప్పటికీ ధర్మమే ప్రధానంగా, నిర్మలమైన మనస్సుతో వినయవంతు లై మెలగండి.

**సీ. తా నొక్క మునికన్య దన కర్మవశమునఁ । బతిఁ బడయంగ నోపక యుపేత**

**దౌర్భాగ్య యై ఘోరతప మొనరించిన । దానికి శివుఁడు ప్రత్యక్షమయ్యు,**

**'వేఁడుము వర' మన్న వేడ్కతోఁ బతిదాన । మని యేనుమాఱు లయ్యబల వేఁడె;**

**'నట్లేని నీకు దేహాంతరంబునఁ బతు । లగుదు రేవురు పరమార్థ' మనియు**

**ఆ. హరుఁడు కరుణ నిచ్చె; నది యిప్డు పాంచాల । పతికిఁ గృష్ణ యనఁగఁ బంకజాక్షి**

**యుద్భవిల్లి పెరుఁగుచున్నది; తత్స్వయం । వరము సేయుచున్నవాఁడు నేఁడు. 36**

**ప్రతిపదార్థం:** తాను; ఒక్క మునికన్య; తన, కర్మవశమునన్= తన పూర్వజన్మ కర్మవలన; పతిన్= భర్తను; పడయంగన్+ఓపక= పొందలేక; ఉపేత, దౌర్భాగ్య+ఐ= కూడుకొన్న దురదృష్టం కలదై - అనగా దురదృష్టవంతురాలై; ఘోర, తపము= కఠినమైన తపస్సు; ఒనరించినన్= చేయగా; దానికిన్= ఆమెకు; శివుఁడు; ప్రత్యక్షము+అయ్యు= అగుపించి; వరము, వేడుము, అన్నన్= వరాన్ని కోరుకో, అని అనగా; వేడ్కతోన్= సంతోషంతో; పతి, దానము+అని= భర్తను దానం చేయం డని; ఏను+మారులు= ఐదుసారులు; ఆ+అబల= ఆ కాంత; వేఁడెన్= ప్రార్థించింది; అట్లు+ఏని= అట్లయితే; నీకున్, దేహాంతరంబునన్= మరొక దేహాన్ని పొందినపుడు - అనగా మరొక జన్మలో; ఏవురు= ఐదుగురు; పతులు అగుదురు= భర్తలు ఔతారు; పరమార్థము+అనియు= సత్యము అని; హరుఁడు= శివుడు; కరుణన్= దయతో; ఇచ్చెన్= వరం ఇచ్చాడు; అది= ఆ మునికన్య; ఇప్డు= ఇప్పుడు; పంకజ+అక్షి - పద్మాలవంటి కన్నులు కలది; కృష్ణ, అనఁగన్= కృష్ణ అనే పేరుతో; పాంచాల, పతికిన్= పాంచాలరాజుకు; ఉద్భవిల్లి= పుట్టి; పెరుగుచున్+ఉన్నది= పెరుగుతూ ఉన్నది; తద్+స్వయంవరము= ఆమెయొక్క స్వయంవరం; నేఁడు= ఈ రోజు; చేయుచున్+ఉన్నవాఁడు= చేస్తున్నాడు లేదా ప్రకటిస్తున్నాడు.

**తాత్పర్యం:** ఒక మునికన్య తన పూర్వజన్మకర్మవశాత్తు భర్తను పొందలేక దురదృష్టవంతురా లై కఠోర మైన తపస్సు చేయగా, ఆమెకు శివుడు ప్రత్యక్షమై వరం కోరుకో మన్నాడు. అప్పు డామె సంతోషంతో పతిదాన మి మ్మని ఐదుసార్లు అడిగింది. శివుడు దయతో - 'అట్లయితే నీకు మరుసటిజన్మలో భర్తలు ఐదుగురు అవుతారు, ఇది సత్య' మని వర మిచ్చాడు. ఆ కన్య ఇప్పుడు కృష్ణ అనే పేరుతో పాంచాలరాజు కూతురుగా పుట్టి పెరుగుతూ ఉన్నది. ద్రుపదుడు ఆమె స్వయంవరాన్ని ఈ రోజు జరుపుతున్నాడు.

**విశేషం:** హరుడు - ప్రళయకాలంలో సర్వాన్నీ హరించేవాడు, భక్తుల పీడను హరించేవాడు - శివుడు. 'చేయుచున్నవాఁడు నేఁడు' అనేదానికి 'చేయుచున్నవాఁడు వాఁడు' అనే పాంఠాంతరం ఉన్నది. 'నేడు' అనేదానికంటే ఇదే సముచితంగా కనపడుతున్నది. ఎందువలననంటే, పాండవులు ఈ మాట విన్న తరువాత కొన్నిరోజులు రాత్రింబవళ్ళు ప్రయాణంచేసి ద్రుపదుని నగరానికి వెళ్ళినట్లు చెప్పబడింది.

**వ. 'మీరు ద్రుపదపురంబునకుం జక్క నరుగునది; యందు మీకు ల గ్గగు' నని చెప్పి కృష్ణద్వైపాయనుం డరిగినఁ బాండునందనులు జననీసహితం బనవరతంబు రాత్రులుం బగళ్ళును బయనంబు వోవువా రొక్కనాఁ డర్ధరాత్రంబున గంగయందు సోమశ్రవం బను తీర్థంబున స్నానార్థు లై, యర్జునుండు ప్రకాశార్థంబును రక్షణార్థంబునుంగా నొక్కకొఱవి సేతఁ బట్టుకొని ముందఱం బోవ, నందఱు నరుగునెడ, నంగారపర్ణుఁ డను గంధర్వుం డంగనాసహితంబు గంగకు నంతప్రొద్దు జలక్రీడార్థంబు వచ్చిన; వాఁ డప్పాండవుల పాదధ్వని విని యలిగి, విల్లుగొని గుణధ్వనిం జేసి వారి కి ట్లనియె. 37**

**ప్రతిపదార్థం:** మీరు; ద్రుపదు, పురంబునకున్= ద్రుపదుని నగరానికి; చక్కన్= నేరుగా; అరుగునది= వెళ్ళండి; అందున్= అక్కడ; మీకున్; లగ్గు= మేలు; అగున్, అని, చెప్పి; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; అరిగినన్= వెళ్ళగా; పాండు,

నందనులు= పాండుకుమారులు; జననీ, సహితంబు= తల్లితో కలిసి; అనవరతంబు= ఎడతెగకుండ; రాత్రులున్, పగళ్ళును; పయనంబు, పోవువారు= ప్రయాణం చేసేవాళ్ళు; ఒక్కనాఁడు; అర్ధరాత్రంబునన్= నడిరేయిలో; గంగ, అందున్= గంగానదిలోని, సోమశ్రవంబు= సోమశ్రవము అను పేరుగల తీర్థములో; స్నాన+అర్థులై= స్నానాన్ని చేయగోరిన వాళ్ళయి; అర్జునుండు; ప్రకాశ+అర్థంబును= వెలుగు కొరకూ; రక్షణ= అర్థంబునున్+కాన్= రక్షణ కొరకూ; ఒక్క; కొఱవి= మండుచున్న కొయ్య; చేతన్+పట్టుకొని; ముందఱన్+పోవన్= ముందుకు పోగా; అందఱున్= అందరూ; అరుగునెడన్= వెళ్ళుతూ ఉండగా; అంగార పర్ణుఁడు+అను; గంధర్వుఁడు; అంగనా, సహితంబు= భార్యలతో గూడి; గంగకున్; అంతప్రొద్దు= అంతరాత్రి సమయంలో; జలక్రీడా+అర్థంబు= జలక్రీడకొరకు; వచ్చినన్= రాగా; వాఁడు; ఆ+పాండవుల, పాదధ్వని= కాళ్ళచప్పుడు; విని=ఆలకించి; అలిగి= కోపించి; విల్లు, కొని= విల్లు తీసికొని; గుణధ్వని= అల్లెత్రాడు లాగినశబ్దం చేసి; వారికిన్= వాళ్ళకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'మీరు ద్రుపదపురానికి చక్కగా వెళ్ళండి. అక్కడ మీకు మేలు కలుగుతుంది' అని చెప్పి వ్యాసుడు వెళ్లగా - పాండవులు తల్లితోకూడి రాత్రింబగళ్లు ఎడతెగకుండా ప్రయాణం చేశారు. ఒకనాటి అర్ధరాత్రి గంగానదిలో - సోమశ్రవ మనే తీర్థంలో - స్నానం చెయ్యా లని అనుకొన్నారు. అర్జునుడు వెలుగుకొరకూ, రక్షణకొరకూ ఒక కొరవిని చేత బట్టుకొని ముందుపోతూ ఉండగా; అందరూ అతనివెంట వెళ్తూ ఉన్నారు. అప్పుడు అంగారపర్ణుడు అనే గంధర్వుడు తన భార్యలతో కూడి ఆ రాత్రివేళ జలక్రీడ లాడటానికి గంగానదికి వచ్చాడు. ఆ పాండవుల పాదధ్వని విని, కోపించి ధనుస్సు చేతబట్టి, అల్లెత్రాటి శబ్దం చేసి, వాళ్ళతో ఇట్లా అన్నాడు.

**క. ఇల నర్ధరాత్రమును, సం । ధ్యలు రెండును, భూత యక్ష దానవ గంధ**
**ర్వులు గ్రుమ్మరియెడు ప్రొద్దులు; । వెలయఁగ నిం దవనిచరులు వెఱతురు నడవన్. 38**

**ప్రతిపదార్థం:** ఇలన్= భూమిమీద; అర్ధ, రాత్రమును= నడిరేయి; సంధ్యలు, రెండును= ఉదయం సాయంసంధ్యలు; భూత, యక్ష, దానవ, గంధర్వులు= భూతాలు, యక్షులు, రాక్షసులు, గంధర్వులు; క్రుమ్మరియెడు= తిరిగెడు; ప్రొద్దులు= వేళలు; వెలయఁగన్= ఒప్పగా; ఇందున్= ఈ వేళలలో; అవని, చరులు= భూమిమీద నడిచేవారు - అనగా మానవులు; నడవన్, వెఱతురు= తిరగటానికి భయపడతారు.

**తాత్పర్యం:** ఈ భూమిమీద అర్ధరాత్రిసమయంలో; ఉదయసాయంసంధ్యలలో భూతాలు, యక్షులు, రాక్షసులు, గంధర్వులు తిరుగుతూ ఉంటారు. కనుక ఆ వేళలలో మానవులు తిరగటానికి భయపడతారు.

**విశేషం:** సంధ్య: రాత్రింబవళ్ల సంధికాలం. ప్రాతస్సంధ్య: సూర్యోదయానికి ముందు మూడుఘడియలనుండి సూర్యోదయం వరకు గల కాలం. సాయంసంధ్య: సూర్యాస్తమయానికి ముందు మూడుఘడియల నుండి సూర్యాస్తమయంవరకు గల కాలం.

## అర్జునుఁ డంగారపర్ణుని జయించుట (1-158-9)

**వ. 'ఇ వ్వేళయందుఁ గ్రుమ్మరియెడువారి నెంత బలవంతుల నైనను రాజుల నయినను నిగ్రహింతుము; నన్ను డాయకుం; డెడగలిగి పొం; డే నంగారపర్ణుం డను గంధర్వుండఁ, గుబేరుసఖుండ; నెప్పుడు నిందు విహరించుచుండుదు; న న్నె ఱుంగరె! యి వ్వనంబును గంగాతీరంబును నంగారపర్ణంబులు నా జగద్విదితంబులు; దీని మానవులు సొర నోడుదు' రనిన వాని కర్జునుం డి ట్లనియె. 39**

**ప్రతిపదార్థం:** ఈ+వేళ+అందున్= ఈ సమయాలలో; క్రుమ్మరియెడు, వారిన్= తిరిగేవాళ్ళని; ఎంత, బలవంతులన్+ఐనను; రాజులన్+అయినను; నిగ్రహింతుము= నిగ్రహించుదుము, పడద్రోయగలం; నన్నున్; డాయకుండుఁడు= సమీపించకండి; ఎడ, గలిగి, పొండు= దూరంగా తొలగిపొండి; ఏన్= నేను; అంగాపర్ణుండు; అను, గంధర్వుండన్; కుబేర, సఖుండన్= కుబేరునికి స్నేహితుడిని; ఎప్పుడున్; ఇందున్= ఇక్కడ; విహరించుచుందున్= విహరిస్తూ ఉంటాను; నన్నున్; ఎఱుంగరె= తెలియరా?; ఈ, వనంబును= అ అడవీ; గంగాతీర్థంబును; అంగారపర్ణంబులునా= అంగారపర్ణుడి వని; జగత్+విదితంబులు= ప్రపంచానికి తెలియబడినవి; దీనిన్; మానవులు; చొరన్= ప్రవేశించటానికి; ఓడుదురు= భయపడతారు; అనినన్= అని అనగా; వానికిన్= ఆ అంగారపర్ణునికి; అర్జునుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ సమయాలలో తిరిగేవాళ్ళు ఎంత బలవంతు లైనా, రాజు లైనా వాళ్ళను పడద్రోయగలం; నా దగ్గరికి రాకండి; దూరంగా తొలగిపొండి. నేను అంగారపర్ణు డనే గంధర్వుడిని. కుబేరుడి మిత్రుడిని. ఎప్పుడూ ఇక్కడ విహరిస్తుంటాను. నన్ను గురించి తెలియదా? ఈ అడవి, గంగాతీరం అంగారపర్ణుడి వని ప్రపంచ ప్రసిద్ధి పొందాయి. ఈ ప్రాంతంలో ప్రవేశించటానికి మానవులు భయపడతారు-అని పల్కగా, అతనితో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**క. నడురేయి సంధ్యలందును । నడవఁగ నోడుదు రశక్తనరు లొరులు; భయం**
**పడుదుమె యే మెయ్యెడ నె । ప్పడు నడతుమ యధికశక్తి పురుషుల మగుటన్. 40**

**ప్రతిపదార్థం:** అశక్త, నరులు= బలహీనులైన మానవులు; ఒరులు= ఇతరులు; నడురేయి= అర్ధరాత్రి; సంధ్యల+అందును= ఉభయసంధ్యలలో; నడవఁగన్= నడవటానికి; ఓడుదురు= జంకుతారు; ఏము= మేము; భయంపడుదుమె= భయపడుతామా?; అధిక, శక్తి, పురుషులము+అగుటన్= మిక్కిలి శక్తి కల మగవార మవటంచేత; ఏ+ఎడన్= ఎక్కడ నైనా; ఎప్పుడున్= ఎప్పుడైనా; నడతుము+అ= నడుస్తాము.

**తాత్పర్యం:** బలహీనులైన ఇతరమానవులు అర్ధరాత్రి, సంధ్యాసమయాలలో నడవటానికి భయపడతారు. మేము భయపడతామా? మహాశక్తి కల వీరులం కావటంచేత ఎక్కడైనా; ఎప్పుడైనా సంచరిస్తూ ఉంటాము.

**క. అడవులు నేఱులు నివి నీ । పడసిన యవి యట్టె; పుణ్య భాగీరథి యి**
**ప్పడమిఁ గల జనుల కెల్లను । నెడపక సేవ్యంబ కాక యిది నీయదియే? 41**

**ప్రతిపదార్థం:** అడవులున్, ఏఱులున్, ఇవి, నీ, పడసిన, అవి, అట్టె= అరణ్యాలు, నదులు ఇవి నీవు సంపాదించినట్టివా ఏమి?; పుణ్య, భాగీరథి= పవిత్రమైన గంగ; ఈ+పుడమిన్= ఈ భూమియందు; కల= ఉన్న; జనులకు+ఎల్లను= జనులందరికీ; ఎడపక= ఎల్లప్పుడు; సేవ్యంబు+అ, కాక= సేవింప దగింది కాక; ఇది, నీ యదియే= ఇది నీకు మాత్రమే సంబంధించినదా?

**తాత్పర్యం:** అడవులు, నదులు నీవు సంపాదించినవా ఏమి? పవిత్ర గంగానది భూమిమీది జను లందరికి తప్పక సేవింపదగిందే. ఇది నీదా?

**విశేషం:** అడవులు, నదులు, పర్వతాలు, సముద్రాలు ఏ మానవుడూ భూమిమీదికి తెచ్చినవి కావు. అవి ప్రకృతి ప్రసాదించినవి. అందరూ సమానంగా అనుభవించవలసినవి. ఇది ఈ నాటి సామ్యవాదానికి పునాది భావన. భగీరథుడి ప్రయత్నంచేత గంగ ఈ లోకానికి తీసికొనిరాబడింది కనుక దానికి భాగీరథి అని పేరు.

**సీ. హైమవతోత్తుంగ హేమశృంగంబున । నుండి భూమికి వచ్చి యుదధిఁ గూడె**
**గంగనా; మూఁడు దెఱంగుల నదియు; మం । దాకిని నా సత్పథంబునందు**
**సురసిద్ధముని వియచ్చర సేవ్య యయ్యెఁ; న । య్యధమలోకంబునయందు భోగ**
**వతి యన నొప్పె నున్నతి; నిట్లు త్రిభువన । పావని యైన యిప్పరమమూర్తిఁ**

**ఆ. బార్వతీశమకుటబంధబంధురతరా । వాస గంగ నాడ వచ్చి నీవు**
**వలవ దనిన నుడుగువారము గాము; నీ । విఘ్నవచనములకు వెఱతు మెట్లు? 42**

**ప్రతిపదార్థం:** హైమవత+ఉత్తుంగ, హేమ, శృంగంబున నుండి= హిమవత్పర్వతముయొక్క ఎత్తైన బంగారు శిఖరంనుండి; భూమికి వచ్చి; గంగనాన్= గంగ అను పేరుతో; ఉదధిన్= సముద్రమును; కూడెన్= కలిసెను; అదియు, మూఁడు; తెఱంగులన్= మూడు మార్గాలలో; సత్+పథంబు+అందున్= నక్షత్ర మార్గంలో - అనగా ఆకాశంలో; మందాకినినాన్= మందాకిని అనే పేరుతో; సుర, సిద్ధ, ముని, వియత్+చర, సేవ్య, అయ్యెన్= సురలు, సిద్ధులు, మునులు మొదలైన ఆకాశ సంచారులకు సేవింపదగిందయ్యెను; అధమ, లోకంబునన్, అందున్= పాతాళలోకంలో; భోగవతి, అనన్= భోగవతి అనే పేరుతో; ఒప్పెన్= ఉన్నది; ఇట్లు; ఉన్నతిన్= గొప్పగ; త్రిభువన; పావని, ఐన= మూడులోకాలను పవిత్రం చేసే దైన; ఈ+పరమమూర్తి= ఈ పవిత్రమూర్తి; పార్వతీ+ఈశ, మకుట, బంధ, బంధురతర+ఆవాస= పార్వతీపతి యైన శివుని జటాజూటంలో మిక్కిలి ఒప్పైన స్థానం గల దైన; గంగన్= గంగయందు; ఆడవచ్చి= స్నానం చేయవచ్చి; నీవు; వలవదు+అనినన్= వద్దనిన; ఉడుగువారము= మానుకొనేవారం; కాము= కాము; నీ, విఘ్న వచనములకున్= నీ ఆటంకపు మాటలకు; వెఱతుము= వెఱచుదుము; ఎట్లు= ఎట్లా భయపడతాము? (భయపడ మని భావం)

**తాత్పర్యం:** హిమాలయంలోని ఎత్తైన బంగారు శిఖరంనుండి భూమికి వచ్చి, గంగ అనే పేరుతో సముద్రంలో కలిసింది. అది మూడు మార్గాలలో సాగింది. ఆకాశమార్గంలో మందాకిని అనే పేరుతో దేవతలు, సిద్ధులు, మునులు మొదలైన ఆకాశసంచారులకు సేవించదగింది అయింది. పాతాళ లోకంలో 'భోగవతి' అనే పేరుతో ఉంది. ఈ విధంగా మూడులోకాలను గొప్పగా పవిత్రం చేసే ఈ పుణ్యామూర్తి, శివునిజటాజూటంలో ఉచితస్థానం గలది - అయిన ఈ గంగలో స్నానం చేయటానికి వచ్చి, నీవు వ ద్దన్నంత మాత్రాన మానుకొనే వాళ్ళం కాము. నీ అడ్డుమాటలకు ఎట్లా భయపడతాము?

**వ. అనుచు నిజ జననీ భ్రాతృ సహితుం డయి గంగాభిషేకార్థంబు చనుదెంచు న య్యర్జుననిపయి నంగారపర్ణుం డతినిశిత సాయకంబు లేసిన, నర్జునుం డలిగి తనచేతికొఱవి విదిర్చి యయ్యమ్ములు దన్నుం దాఁకకుండం గాచి కొని వాని కి ట్లనియె. 43**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; నిజ, జననీ, భ్రాతృ, సహితుండు+అయి= తన తల్లితో, తోబుట్టువులతో కూడినవాడై; గంగా+అభిషేక+అర్థంబు= గంగలో స్నానం చేయటంకొరకు; చనుదెంచు= వచ్చు; ఆ+అర్జునుని, పయిన్= ఆ అర్జునుని మీద; అంగారపర్ణుండు; అతి, నిశిత, సాయకంబులు= మిక్కిలివాడియైన బాణాలను; ఏసినన్= ప్రయోగింపగా; అర్జునుండు= అర్జునుడు; అలిగి= కోపించి; తన, చేతి= తన చేతిలోని; కొఱవి= దివిటీని; విదిర్చి= విదిలించి; ఆ+అమ్ములు= ఆ బాణాలు; తన్నున్= తనను; తాఁకకుండన్= తగలకుండా; కాచికొని= కాపాడుకొని; వానికిన్= ఆ అంగారపర్ణునితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పల్కుతూ, తన తల్లితో, అన్నదమ్ములతో గంగాస్నానం చేయటానికి వస్తున్న ఆ అర్జునునిమీద అంగారపర్ణుడు మిక్కిలి వాడిబాణాలు వేయగా, అర్జునుడు కోపించి, తనచేతి కొరవి విదిల్చి, ఆ బాణాలు తనను తాకకుండా కాపాడుకొని, అతనితో ఇట్లా అన్నాడు.

**ఆ. వెడఁగ! యిట్టి పాటి వెఱపించుటలును మా । యలును నేమి సేయు నస్త్రవిదులఁ ;**
**బెక్కులయ్యు నీ బిభీషికల్ నుఱువులు । విరియునట్టు లిందు విరియుఁ జూవె. 44**

**ప్రతిపదార్థం:** వెడఁగ! = వెఱ్ఱివాడా!; ఇట్టి, పాటి= ఈ మాత్రపు; వెఱపించుటలును= బెదరింపులు; మాయలును; అస్త్ర, విదులన్= అస్త్రరహస్యాలు తెలిసినవాళ్ళను; ఏమి, చేయున్= ఏమి చేయగలవు; పెక్కులు+అయ్యున్; నీ బిభీషికల్= నీయొక్క బడాయి మాటలు; నుఱువులు= నీటిపై నురుగులు; విరియునట్టులన్= చెదరిపోయేటట్లు; ఇందున్= ఇచ్చట; విరియున్= చెదరిపోతాయి; చూవె= చూడుము సుమా!

**తాత్పర్యం:** వెఱ్ఱివాడా! ఈ మాత్రపు బెదిరింపులు, మాయలు అస్త్రవేత్తలను ఏమి చేయగలవు? నీ బెదిరింపులు ఎన్నైనా అవి నురుగులవలె చెదరినట్లు చెదరిపోతాయి, చూడుము.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ. అగ్నిదేవుండు బృహస్పతి కిచ్చె ము, । న్నతఁడు భరద్వాజుఁ డనఁగఁ బరఁగు**
**ముని కిచ్చె, నమ్మహాముని భార్గవున కిచ్చె । భార్గవుండును గుంభభవున కిచ్చె**
**నమ్మహాత్ముండు నా కతిదయ నిచ్చె ని । య్యనలాస్త్ర మని దాని నమ్మహోగ్ర**
**గంధర్వుపై వైచె ఘనుఁ డింద్రసుతుఁ డంతఁ । దద్రథం బప్పుడ దగ్ధ మయిన,**

**ఆ. నగ్నిదాహభీతి నంగారపర్ణుండు । బమ్మరిల్లి నేలఁబడిన, వానిఁ**
**గొప్పు వట్టి యీడ్చికొని వచ్చె ధర్మజు । కడకు నింద్రసుతుఁడు కడిమి మెఱసి. 45**

**ప్రతిపదార్థం:** ఈ+అనల+అస్త్రము= ఈ ఆగ్నేయాస్త్రం; అగ్నిదేవుండు; మున్ను= పూర్వం; బృహస్పతికిన్+ఇచ్చెన్; అతఁడు= ఆ బృహస్పతి; భరద్వాజుఁడు, అనఁగన్= భరద్వాజు డనే; పరఁగు= ఒప్పునట్టి; మునికిన్+ఇచ్చెన్= మునికి ఇచ్చాడు; ఆ+మహాముని= ఆ మహర్షి; భార్గవునకున్= పరశురామునికి; ఇచ్చెన్= ఇచ్చాడు; భార్గవుండును= పరశురాముండును; కుంభ, భవునకున్= కుండనుండి పుట్టినవానికి-ద్రోణునికి; ఇచ్చెన్; ఆ+మహాత్ముండును; నాకున్; అతి, దయన్ ఇచ్చెన్= మిక్కిలి దయతో ఇచ్చాడు; అని= అనుచు; దానిన్= ఆ అస్త్రాన్ని; ఆ+మహా+ఉగ్ర, గంధర్వు, పై = మహాభయంకరు డైన ఆ గంధర్వునిమీద; ఘనుఁడు= గొప్పవాడు; ఇంద్ర, సుతుఁడు= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; వైచెన్= వేశాడు; అంతన్= అంతలో; తత్+ రథంబు= అతనియొక్క (అంగారుపర్ణుడియొక్క) రథము; అప్పుడు+అ= అప్పటికప్పుడే; దగ్ధము+అయినన్= తగులబడినదికాగా; అగ్ని, దాహ; భీతిన్= నిప్పు కాల్పువలన భయంతో; అంగారపర్ణుండు; బమ్మరిల్లి= దిమ్మతిరిగి; నేల, పడినన్= నేలపై పడగా; వానిన్= ఆ గంధర్వుని; కొప్పుపట్టి= జుట్టు పట్టి; ఇంద్ర, సుతుఁడు= అర్జునుడు; కడిమి= పరాక్రమం, మెఱసి=ప్రకాశించగా; ధర్మజు, కడకున్= ధర్మరాజు దగ్గరకు; ఈడ్చికొని; వచ్చెన్.

**తాత్పర్యం:** 'ఈ ఆగ్నేయాస్త్రాన్ని పూర్వం అగ్నిదేవుడు బృహస్పతి కిచ్చాడు. అతడు భరద్వాజముని కిచ్చాడు. ఆ ముని పరశురామునికి, అతడు ద్రోణునికి, ఆ మహాత్ముడు అతిదయతో నాకు ఇవ్వటం జరిగింది' అని మహావీరుడైన అర్జునుడు దానిని ఆ భయంకరు డైన గంధర్వునిమీద ప్రయోగించాడు. తత్క్షణమే అతని రథం దగ్ధమైపోగా; నిప్పుకాల్పువల్ల కలిగిన భయంతో అతడు దిమ్మతిరిగి నేలమీద పడిపోయాడు. అర్జునుడు తన పరాక్రమం ప్రకాశించగా, అతడిని జుట్టుపట్టి ధర్మరాజు దగ్గరికి ఈడ్చుకొని వచ్చాడు.

**క. వాని మనోవల్లభ కుం । భీనసి యనునది గరంబు భీతి 'నశేషో**
**ర్వీనాథులార! దయఁ బతి । దానము నా కిండు మీకు ధర్మువు పెరుఁగున్'. 46**

**ప్రతిపదార్థం:** వాని, మనో, వల్లభ= ఆ అంగారపర్ణుని ప్రాణేశ్వరి - భార్య; కుంభీనసి; అనునది= అనే పేరుకలది; కరంబు, భీతిన్= మిక్కిలి భయంతో; అశేష+ఉర్వీనాథులార!= సమస్త భూమికి ప్రభువులారా!; దయన్= కరుణతో; పతిదానము= పతియొక్క దానం; నాకున్+ఇండు= నాకు ప్రసాదించండి; మీకున్; ధర్మువు= ధర్మంపెరుఁగున్.

**తాత్పర్యం:** ఆ అంగారపర్ణునిభార్య కుంభీనసి మిక్కిలిభయంతో - 'ఈ సమస్తభూమికి ప్రభువులారా! దయతో నాకు పతిదానం చేయండి. మీకు ధర్మం పెరుగుతుంది'.

**విశేషం:** అప్పటికి పాండవులు బ్రాహ్మణవేషాలలో ఉన్నారు. కుంభీనసి వాళ్ళను 'అశేషోర్వీనాథులారా!' అని సంబోధించటం ఆశ్చర్యకరంగా ఉన్నా - అంగారపర్ణుడు పాండవులను ముందే గుర్తించినట్లు చెప్పాడు కదా. (చూ.ప.57, ప.58) అందువలన బ్రాహ్మణవేషధారులై వచ్చిన వాళ్ళు పాండవు లని కుంభీనసికి భర్త ముందే చెప్పాడేమో. అందువలననే ఆమె అట్లా అన్నదేమో. కాగా, కుంభీనసి ప్రార్థనను మన్నించి 'గంధర్వా! కురువంశ ప్రభువు ధర్మరాజు కరుణతో నిన్ను విడువు మన్నాడు. ఇక భయపడకు' మని కూడా అర్జునుడు అన్నాడు.

**క. అని యఱచుచున్నదానికి । ననఘుఁడు గరుణించి పాండవాగ్రజుఁ డయ్యు**
**ర్జునుఁ జూచి 'వీని విడువుము । యని నోడినవాని హీను నపగతశౌర్యున్'. 47**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; అఱచుచున్+ఉన్న= ఏడ్చుచున్న; దానికిన్= ఆ కుంభీనసికి; అనఘుఁడు= పాపంలేనివాడు; పాండవ+అగ్రజుఁడు= పాండవులందు ముందు పుట్టినవాడు - ధర్మరాజు; కరుణించి= దయతలచి; ఆ+అర్జునున్; చూచి; అనిన్= యుద్ధంలో; ఓడినవాడిని; హీనున్= క్రుంగిపోయినవాడిని; అపగతశౌర్యున్= పోయిన శౌర్యం కలవాడిని; వీనిన్= ఈ అంగారపర్ణుడిని; విడువుము+అ.

**తాత్పర్యం:** అని ఆక్రోశిస్తున్న కుంభీనసిపట్ల పుణ్యాత్ముడు, పాండవాగ్రజుడు అయిన ధర్మరాజు దయతలచి, అర్జునుడిని చూచి, యుద్ధంలో ఓడినవాడు, క్రుంగిపోయినవాడు, శౌర్యం కోల్పోయినవాడు అయిన ఈ అంగారపర్ణుడిని విడిచిపెట్టుము.

**ఆ. అనిన నరుఁడు వల్లె యని వాని కనియె 'గం । ధర్వ! నిన్నుఁ గరుణ ధర్మరాజు**
**కురుకులేశ్వరుం డశరణశరణ్యుండు । విడువఁ బనిచె నింక వెఱవకుండు'. 48**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; నరుఁడు= అర్జునుడు; వల్లె, అని= సరే అని; వానికిన్ అనియెన్= అంగారపర్ణునితో ఇట్లా అన్నాడు; గంధర్వ!; నిన్నున్; కురుకుల+ఈశ్వరుండు= కురువంశ ప్రభువు; అ, శరణ, శరణ్యుండు= శరణులేనివారికి శరణు పొందతగినవాడు; ధర్మరాజు; కరుణన్= దయతో; విడువన్, పనిచెన్= వదిలిపెట్టుమని ఆజ్ఞాపించాడు; ఇంకన్; వెఱవక= భయపడక; ఉండు.

**తాత్పర్యం:** అని పల్కగా అర్జునుడు సరే అని అంగారపర్ణునితో ఇట్లా అన్నాడు - 'ఓ గంధర్వుడా! కురువంశ ప్రభువు, శరణులేని వారికి శరణు పొందదగినవాడు అయిన ధర్మరాజు దయతో నిన్ను విడువటానికి ఆజ్ఞాపించాడు.

**వ. అని వాని నాశ్వాసించి విడిచిన నట్లు నిర్జితుండై యర్జునున కంగారుపర్ణుం డి ట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** అని, వానిన్; ఆశ్వాసించి= ఓదార్చి; విడిచినన్= విడిచిపెట్టగా; అట్లు= ఆ విధంగా; నిర్జితుండు+ఐ= ఓడింపబడినవా డై; అర్జుననకున్; అంగారపర్ణుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని అంగారపర్ణుడిని ఓదార్చి విడుదల చేయగా, ఓడిపోయిన అంగారపర్ణుడు అర్జుననితో ఈ విధంగా అన్నాడు.

### అంగారపర్ణం డర్జుననితో సఖ్యము సేయుట (1-158-35)

**మ. అని నీచేతఁ బరాజితుండ నయి నా యంగారపర్ణత్వ మిం**
**కను దాల్పన్ మది నంత నిస్త్రపుఁడనే; గర్వం బడంగన్ రణం**
**బున మున్నోడియుఁ బూర్వనామమున బెంపున్ గర్వముం దాల్చువాఁ**
**డనఘా! సత్సభలందు మెచ్చఁబడునే హాసాస్పదీభూతుఁ డై. 50**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!, ఓ అర్జునుడా!; అనిన్= యుద్ధంలో; నీచేతన్; పరాజితుండన్+అయి= ఓడింపబడిన వాడి నై; నా, అంగారపర్ణత్వము= అంగారపర్ణుడనే నా పేరును; ఇంకను; తాల్పన్= ధరించుటకు; మదిన్= మనస్సునందు; అంత నిస్త్రపుఁడనే= అంతగా సిగ్గులేనివాడనా; గర్వంబు+అడంగన్= పొగరు అణగగా; రణంబునన్= యుద్ధంలో; మున్ను; ఓడియున్= ఓడిపోయికూడా; పూర్వనామమునన్= మొదటిపేరుతో; పెంపున్= గొప్పతనాన్ని; గర్వమున్, తాల్చువాఁడు= దర్పముతో ధరించువాడు; హాస+ఆస్పదీ, భూతుఁడు+ఐ= ఎగతాళికి ఉనికి పట్టయినవా డై; సత్+సభల, అందున్= సజ్జనుల సభలలో; మెచ్చన్+పడునే= గౌరవింపబడతాడా, కీర్తింపబడతాడా! (పడ డని భావం.)

**తాత్పర్యం:** పుణ్యాత్మా! అర్జునా! యుద్ధంలో నీ చేతిలో ఓడిపోయి, ఇంకా అంగారపర్ణు డనే పేరు ధరించటానికి నే నంత సిగ్గు లేనివాడినా? మొదట యుద్ధంలో గర్వం అణగిపోయేవిధంగా ఓడిపోయికూడా - మొదటిపేరుతోనే గొప్పతనాన్నీ, గర్వాన్నీ పొందేవాడు సజ్జనుల సభలలో ఎగతాళికి గురౌతాడు కాని, మెప్పు పొందగలడా?

**వ. నీ యాగ్నేయాస్త్రంబున దగ్ధరథుండ నయ్యును గంధర్వమాయ ననేక రత్నవిచిత్రం బైన రథంబు వడసి, యిది మొదలుగాఁ జిత్రరథుండ నయ్యెద; నీ పరాక్రమంబునకు మెచ్చితి; నీతోడి సఖ్యంబు నా కభిమతం బయిన యది; నా తపంబునం బడయంబడిన చాక్షుషి యనువిద్య నీ కిచ్చెద; దీనిం దొల్లి మనువువలన సోముండు పడసె; సోమునివలన గంధర్వపతి యయిన విశ్వావసుండు వడసె; నాతనివలన నేనుఁ బడసితి; నెవ్వండేని**

**మూఁడులోకంబులుం జూడ నిచ్చగించు నాతండు దనయిచ్చకుం దగ నివ్విద్యపెంపున సర్వస్వంబును గంజూచు; నేము దీనన చేసికాదె మానవులకు విశేషుల మై వేల్పులచేత శాసింపంబడక జీవించెద; మిది కాపురుషప్రాప్తం బైఫలియింపదు; నీవు తాపత్యవంశవర్ధ నుండవు; మహాపురుషుండవు; నీకు సఫలంబగు, నీదివ్యవిద్యఁ గొను మిచ్చెద; దీనిఁ గొనునప్పుడు షణ్మాసవ్రతంబు సేయవలయు; నీవు నాకు నాగ్నేయాస్త్రం బిచ్చునది; మఱి మహా జవసత్త్వంబులుఁ గామగమనంబులు నయిన గంధర్వహయంబుల మీ కేవురకుం జెఱు నూఱేసి యిచ్చెద. 51**

**ప్రతిపదార్థం:** నీ, ఆగ్నేయ+అస్త్రంబునన్; దగ్ధ, రథుండను+అయ్యును= కాలిపోయిన రథం కలవాడనయినా; గంధర్వ, మాయన్= గంధర్వమాయచేత; అనేక, రత్న, విచిత్రంబు+ఐన= వివిధరత్నాలచేత ఆశ్చర్యకరమైన; రథంబు; పడసి= పొంది; ఇది, మొదలుగా= నేటినుండి; చిత్రరథుండన్= చిత్రరథుడు అనుపేరుగలవాడను; అయ్యేదన్= అవుతాను; నీ పరాక్రమంబునకు; మెచ్చితిన్; నీతోడి; సఖ్యంబు= స్నేహం; నాకున్; అభిమతంబు= ఇష్టము అయిన; అది= ఇష్టమైనది; నా తపంబునన్, పడయన్+పడిన= పొందబడిన; చాక్షుషి, అను, విద్య, నీకున్= చాక్షుషి అనుపేరుగల విద్యను నీకు ఇస్తున్నాను; దీనిన్; తొల్లి= పూర్వం; మనువువలన, సోముండు= చంద్రుడు; పడసెన్= పొందినాడు; సోముని వలన= చంద్రునివలన; గంధర్వ, పతి, అయిన= గంధర్వరాజైన; విశ్వావసుండు; పడసెన్= పొందినాడు; అతనివలన= ఆ విశ్వావసునివల్ల; నేను; పడసితిన్= పొందాను; ఎవ్వండేని; మూడు, లోకంబులున్, చూడన్= ఎవ్వరైనా ముల్లోకాలను చూచుటకు; ఇచ్చగించునో= కోరుకొనునో; అతండు; తన ఇచ్చకున్= తన కోరికకు; తగన్= తగినట్లు; ఈ+విద్య, పెంపునన్= ఈ విద్యయొక్క మహిమచేత; సర్వస్వంబునున్= మొత్తాన్నీ; చూచున్= చూస్తాడు; ఏము= మేము; దీనన, చేసి= దీనివలననే; కాదె= కదా!; మానవులకు; విశేషులము+ఐ= శ్రేష్ఠులమై, వేల్పుల చేత= దేవతలచేత; శాసింపన్+పడక= ఆజ్ఞాపించబడక; జీవించెదము= జీవిస్తాము; ఇది, కాపురుష, ప్రాప్తంబు+ఐ= చెడుమానవులచే పొందబడినచో; ఫలియింపదు= ఫలవంతం కాదు; నీవు, తాపత్య, వంశ, వర్ధనుండవు= తపతికి సంబంధించిన వంశాన్ని పెంపుచేసేవాడవు; మహాపురుషుండవు; నీకున్, సఫలంబు+అగున్= నీకు ఫలముతో కూడినది అగును; ఈ దివ్య, విద్యన్; కొనుము= తీసికొనుము; ఇచ్చెదన్; దీనిన్; కొనునప్పుడు; షట్+మాస, వ్రతంబు= ఆరు నెలల వ్రతం; చేయవలయు; నీవు; నాకున్; ఆగ్నేయ+అస్త్రంబు; ఇచ్చునది; మఱి= అంతేగాక; మహా, జవ, సత్త్వంబులున్= మిక్కిలి వేగం, బలం కలవీ; కామ, గమనంబులున్= కోరినచోటికి వెళ్ళగలవీ; అయిన= అయినటికీ; గంధర్వ, హయంబులన్= గంధర్వ జాతిగుర్రాలను; మీకున్+ఏవురకున్= మీ అయిదుగురికి; చెఱు, నూఱు+ఏసి= ఒక్కొక్కరికి వందవంతున; ఇచ్చెదన్= ఇస్తాను.

**తాత్పర్యం:** నీ ఆగ్నేయాస్త్రంవలన దగ్ధరథుడిని అయినప్పటికి, గంధర్వమహిమతో వివిధ రత్నాలచేత విచిత్రమైన రథాన్ని పొంది, ఇది మొదలు 'చిత్రరథుడు' అనే పేరు కలవాడ నౌతాను. నీ పరాక్రమానికి మెచ్చాను. నీతో స్నేహం చెయ్యా లని కోరుతున్నాను. నేను తపస్సుచేత సాధించిన చాక్షుషీవిద్యను నీ కిస్తాను. దీనిని పూర్వం మనువునుండి చంద్రుడు, అతడినుండి గంధర్వా జైన విశ్వావసుడు పొందారు. అతడినుండి నేను పొందాను. మూడులోకాలూ చూడగోరేవాడు తన కోరికకు తగినట్లు ఈ విద్యాప్రభావంచేత సర్వం చూడగలడు. మేము ఈ విద్యవలననే గదా మానవులకంటె శ్రేష్ఠుల మై, దేవతలచే ఆజ్ఞాపింపబడక జీవిస్తున్నాము. ఈ విద్య దుర్మార్గులకు లభిస్తే ఫలించదు. నీవు తపతికి సంబంధించిన వంశాన్ని వర్ధిల్లజేసేవాడివి. నీ కిది సఫలమవుతుంది. ఈ విద్యను నీ కిస్తాను. తీసికొమ్ము. దీనిని గ్రహించే సమయంలో ఆరు నెలలు వ్రతం చేయాలి. నీవు నాకు ఆగ్నేయాస్త్రాన్ని ఇవ్వు. నేను ఇంకా మీ అయిదుగురికి మహావేగం, బలం గల గంధర్వజాతి గుర్రాలను ఒక్కొక్కరికి వంద ఇస్తాను.

**సీ. వృత్రుపై గీర్వాణవిభుఁ డల్గి వజ్రంబు । వైచిన నది వాని వజ్ర కఠిన**
**పటు మస్తకంబునఁ బడి పాతరయమునఁ । బదివ్రయ్యలైనఁ దద్భాగచయము**
**క్రమమున బ్రాహ్మణ క్షత్ర విట్ఛూద్రుల । యందు వేదంబులు నాయుధములు**
**హలము శుశ్రూషయు నయ్యె వజ్రంబులు । వాహంబులందు జవంబు నయ్యె**

**తే. నట్టి జవమున నభిమతం బగుచు నున్న । యట్టి హయసమూహం బయ్యె నవనిపతుల**
**కఖిల భువనముల్ రక్షించునపుడు సకల । సాధనములలో నుత్తమసాధనంబు. 52**

**ప్రతిపదార్థం:** వృత్రు, పై= వృత్రు డనే రాక్షసుని మీద; గీర్వాణవిభుఁడు= దేవతలరాజు, దేవేంద్రుడు; అల్గి= కోపించి; వజ్రంబు= వజ్రాయుధం; వైచినన్= వేయగా; అది, వాని, వజ్ర, కఠిన, పటు, మస్తకంబునన్= అది అతనియొక్క వజ్రంవలె గట్టిదైన పెద్ద తలమీద; పడి, పాత, రయమునన్= పడిన వేగంచేత; అది= ఆ వజ్రాయుధం; పది, వ్రయ్యలు+ఐనన్= పదిముక్కలు కాగా; తద్+భాగ, చయము= ఆ ముక్కల సమూహం, క్రమమునన్= వరుసగా; బ్రాహ్మణ, క్షత్ర, విట్, శూద్రుల, అందున్= బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య శూద్రులలో; వేదంబులున్; ఆయుధములు; హలము= నాగలి; శుశ్రూషయున్= సేవయు; అయ్యెన్= అయినవి; వజ్రంబులు; వాహల్ంబు+అందు= గుర్రాలలో; జవంబు= వేగం; అయ్యెన్= అయినవి; అట్టి, జవమునన్= వేగంచేత; అభిమతంబు+అగుచున్+ఉన్న= ఇష్టమౌతున్న; అట్టి; హయ, సమూహము= గుర్రాల సమూహం; అవని, పతులకు= భూపతులకు- రాజులకు; అఖిల, భువనముల్= అన్ని లోకాలు; రక్షించునపుడు; సకల, సాధనములలోన్; ఉత్తమ, సాధనము, అయ్యెన్= అన్ని సాధనాలలో శ్రేష్ఠమైన సాధనం అయింది.

**తాత్పర్యం:** వృత్రు డనే రాక్షసునిమీద దేవేంద్రుడు కోపించి వజ్రాయుధం వేయగా, అది వజ్రంవలె కఠినమైన అతని పెద్ద తల మీద పడి, పతనవేగంతో పది ముక్కలైంది. ఆ ముక్కల సమూహం వరుసగా బ్రాహ్మణులలో వేదశక్తిగా, క్షత్రియులలో ఆయుధశక్తిగా; వైశ్యులలో నాగలిశక్తిగా; శూద్రులలో సేవాశక్తిగా; గుర్రాలలో వేగంగా రూపొందింది. ఆ విధమైన వేగం కారణంగా రాజులకు ఇష్టమౌతున్న గుర్రాల సమూహం వాళ్ళ లోకా లన్నింటిని రక్షించటానికి ఉపయోగించే సాధనాలలో ఉత్తమసాధనం అయింది.

**వ. అనిన వాని కర్జునుం డి ట్లనియె. 53**

**తాత్పర్యం:** అని అనగా, అంగారపర్ణునితో అర్జునుడు ఈ విధంగా అన్నాడు.

**ఆ. ఎంత మిత్రు లైన నెన్నండు నొరులచే । విద్యయును జయంబు విత్తచయము**
**గొనఁగ నొల్ల! నాకుఁ గూర్తేని యనలాస్త్ర । మనఘ ! నీవు గొనుము హయము లిమ్ము. 54**

**ప్రతిపదార్థం:** ఎంత, మిత్రులు+ఐనన్= ఎంత స్నేహితు లైనను; ఎన్నండున్= ఎన్నడైనను; ఒరులచే= ఇతరులచేత; విద్యయును= విద్యను; జయంబు= విజయాన్ని; విత్త, చయము= ధనసమూహం; కొనఁగన్= తీసికొనుటకు; ఒల్లన్= ఇష్టపడను; నాకున్= నాకు; కూర్తు+ఏని= మిత్రుడ వైతే- ఈయ తలిస్తే; అనఘ!= పాపరహితుడా! అనల+అస్త్రము= ఆగ్నేయాస్త్రం; నీవు, కొనుము= తీసికొనుము; హయములు= గుర్రాలు; ఇమ్ము= ఇవ్వవలసింది.

**తాత్పర్యం:** ఎంత స్నేహితు లైనా ఇతరులనుండి విద్యను, విజయాన్ని, ధనసమూహాన్ని స్వీకరించటానికి ఎప్పుడూ నే నిష్టపడను. కాని, నీవు నాకు ఇవ్వదలచుకొంటే; ఓ పుణ్యాత్మా! ఈ ఆగ్నేయాస్త్రాన్ని తీసికొని, ఆ గుఱ్ఱాలను ఇవ్వుము.

**వ. 'నీతోడ సఖ్యంబుఁ జేసెద; మఱి మమ్ముఁ బరమధార్మికులం బరమబ్రహ్మణ్యుల నేమి కారణంబున నుదరి పలికి?' తనిన గంధర్వుం డి ట్లనియె. 55**

**ప్రతిపదార్థం:** నీతోడన్; సఖ్యంబు= స్నేహం; చేసెదన్= చేస్తాను; మఱి= అయితే; మమ్మున్= మమ్మల్ని; పరమ, ధార్మికులను= మహాధర్మబుద్ధికలవాళ్ళను; పరమ, బ్రహ్మణ్యులన్= మిక్కిలిగా బ్రాహ్మణహితం కోరేవాళ్ళను; ఏమి, కారణంబునన్= ఏ కారణంచేత; ఉదరి= అదిరించి; పలికితి(వి)= మాటాడితివి; అనినన్= అని అనగా; గంధర్వుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీతో స్నేహం చేస్తాను. అయితే మిక్కిలిగా మేము బ్రాహ్మణహితం కోరేవాళ్ళం. మహాధర్మబుద్ధి కలవాళ్ళం. ఎందుచేత మమ్మల్ని అధిక్షేపించి మాట్లాడావు? అని ప్రశ్నించగా గంధర్వుడు ఇట్లా అన్నాడు.

**క. విమలము లయి లోకత్రిత । యమునఁ బ్రవర్తిల్లు మీ మహాగుణములు ని**
**త్యము విందు నారదప్రము । ఖ మునీశ్వర సిద్ధసాధ్య గణములవలనన్. 56**

**ప్రతిపదార్థం:** విమలములు+అయి= పవిత్రాలై; లోక; త్రితయమునన్= ముల్లోకాలలో; ప్రవర్తిల్లు= నడుచు; మీ, మహా, గుణములు= మీ యొక్క గొప్పగుణాలు; నారద, ప్రముఖ, ముని+ఈశ్వర, సిద్ధ, సాధ్య, గణములవలనన్= నారదుడు మొదలైన ప్రసిద్ధ మునీశ్వరుల, సిద్ధుల, సాధ్యుల సమూహాలచేత; నిత్యము= ప్రతిదినం; విందున్= వింటాను.

**తాత్పర్యం:** పవిత్రా లై ముల్లోకాలలో వ్యాపించిన మీ గొప్ప గుణాలు నారదుడు మొదలైన మునీశ్వరులు, సిద్ధ, సాధ్యసమూహాలు చెప్పగా ప్రతిదినం వింటూ ఉంటాను.

**క. మేరునగోత్తంసమహీ । భారధురంధరుల మిమ్ముఁ బాండవుల గుణో**
**దారుల ధీరుల నెఱుఁగని । వా రెవ్వరుఁ గలరె భరతవంశోత్తములన్. 57**

**విశేషం:** మేరు, నగ+ఉత్తంస, మహీ, భార, ధురంధరుల= మేరుపర్వతాన్ని సిగబంతిగా గల భూమండలభారాన్ని వహించిన; మిమ్మున్; పాండవులన్= పాండవుల్ని; గుణ+ఉదారులన్= గుణంచేత గొప్పవారైనవాళ్ళను; ధీరులన్= ధీరుల్ని; భరతవంశ+ ఉత్తములన్= భరతవంశ శ్రేష్ఠులను; ఎఱుఁగనివారు= తెలియనివాళ్ళు; ఎవ్వరున్+కలరె= ఎవరైనా ఉన్నారా?

**తాత్పర్యం :** మేరుపర్వతాన్ని సిగబంతిగా గల భూమండల భారాన్ని వహించినవాళ్ళు, సద్గుణాలచేత గొప్పవాళ్ళు, ధీరులు, భరతవంశశ్రేష్ఠులు అయిన మిమ్మల్ని - పాండవులను - తెలియని వా ళ్ళెవరైనా ఉన్నారా?

**వ. ఏను మిమ్ము నెఱింగియు, మీకు నగ్నిపరిగ్రహంబును, బ్రాహ్మణసంగ్రహంబును లేమింజేసి పరుసంబులు పలికితి; మఱియును. 58**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మిమ్మున్, ఎఱింగియు; మీకున్; అగ్ని, పరిగ్రహంబును= అగ్నిహోత్రస్వీకారం; బ్రాహ్మణ, సంగ్రహంబును= బ్రాహ్మణుడిని గ్రహించటం; లేమిన్+చేసి= లేకుండటంవలన; పరుసంబులు= కఠినాలైన మాటలు; పలికితిన్; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** నాకు మీరు తెలిసినా, మీకు అగ్నిహోత్రం, బ్రాహ్మణుడు లేనందువలన కఠినంగా మాట్లాడాను. అంతేకాక.

**ఉ. ఇంతుల గోష్ఠి నున్నయతఁ డెంత వివేకము గల్గెనేని య**
**త్యంత మదాభిభూతుఁ డగు; ధర్మువు దప్పుఁ; బ్రియం బెఱుంగఁ; డే**
**నెంత వివేకి నయ్యును సహింపక యింతుల యొద్దఁ బల్కితిన్;**
**వింతయె? కాము శక్తి యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్! 59**

**ప్రతిపదార్థం:** ఇంతుల, గోష్ఠిన్= స్త్రీలతో సల్లాపాలాడుతూ; ఉన్న; అతఁడు; ఎంత; వివేకము; కలిగెన్+ఏని; అత్యంత, మద+అభిభూతుఁడు+అగున్= ఎంతో ఎక్కువైన మదంచేత తిరస్కరింపబడినవా డౌతాడు - అనగా మిక్కిలి దురభిమానంతో కూడుకొన్న వా డౌతాడు; ధర్మువు, తప్పున్= ధర్మాన్ని తప్పుతాడు; ప్రియంబు+ఎఱుంగఁడు= ప్రీతిగా మెలగటం తెలియడు; ఏన్= నేను; ఎంత, వివేకిన్+అయ్యును= వివేకం కలవాడ నైనా; సహింపక= ఓర్పులేక; ఇంతుల, ఒద్దన్= భార్యల ఎదుట; పల్కితిన్= ఆ విధంగా మాట్లాడాను; వింతయె?= ఇది ఆశ్చర్యమా?; కాము, శక్తి= మన్మథునియొక్క శక్తిని; ఉడివింపఁగన్= మాన్పించటం- అనగా లేకుండ చేయటం; ఎట్టివారికిన్; శక్యమె= సాధ్యమా?

**తాత్పర్యం:** స్త్రీల గోష్ఠిలో ఉండేవాడు ఎంత వివేకి అయినా, అహంకారపూరితు డౌతాడు. ధర్మం తప్పి వ్యవహరిస్తాడు. ప్రియంగా వ్యవహరించలేడు. నేను వివేకంగలవాడినే అయినా నిగ్రహం కోల్పోయి, భార్యల యెదుట ఆ విధంగా మీతో మాట్లాడాను. ఇది అసహజం కాదు గదా! మన్మథుని శక్తిని అణచటం ఎంతవారికైనా సాధ్యమా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. స్త్రీలయెదుట స్వాతిశయభావం పెంచుకొని ఇతరులతో వ్యవహరించటం పురుషసహజం.

**క. సుర గరుడ విషోరగ య । క్ష రాక్షస పిశాచ, భూత గంధర్వులు నో**
**పరు ధిక్కరింప బ్రాహ్మణ । పురస్కృతులఁ బుణ్యమతుల భూతలపతులన్. 60**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణ, పురస్కృతులన్= బ్రాహ్మణుడిని ముందుంచుకొన్న వాళ్ళను; పుణ్య, మతులన్= పవిత్రమైన మనస్సుకల వాళ్ళను; భూతల, పతులన్= రాజులను; సుర, గరుడ, విష+ఉరగ, యక్ష, రాక్షస, పిశాచ, భూత, గంధర్వులు= దేవతలు, గరుడులు, నాగులు, యక్షులు, రాక్షసులు, పిశాచాలు, భూతాలు, గంధర్వులు; ధిక్కరింపన్= తిరస్కరించటానికి; ఓపరు= చాలరు.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడిని ముందుంచుకొన్న పవిత్రహృదయులైన రాజులను - సురలు కాని, గరుడులు కాని, నాగులుకాని, యక్ష, రాక్షస పిశాచభూతగంధర్వులు కాని ధిక్కరించలేరు.

**అంగారపర్ణుఁడు పాండవులకుఁ బురోహితునిఁ బురస్కరింపుఁ డని చెప్పుట (సం.1-159-17)**

**సీ. అనవద్యు వేదవేదాంగ విశారదు । జప హోమ యజ్ఞ ప్రశస్తు సత్య**
**వచను విప్రోత్తము వర్గచతుష్టయ । సాధనసఖు సదాచారు సూరి**
**సేవ్యుఁ బురోహితుఁ జేసిన భూపతి । యేలు నుర్వీతలం బెల్ల; నిందుఁ**
**బరలోకమునఁ బుణ్యపరుల లోకంబులు । వడయు; జయస్వర్గఫలము సూవె**

ఆ. **రాజ్య; మదియు నుర్వరాసురవిరహితుఁ । డయిన పతికిఁ గేవలాభిజాత్య**
**శౌర్యమహిమఁ బడయ సమకూరునయ్య తా । పత్య! నిత్యసత్యభాషణుండ !.** **61**

**ప్రతిపదార్థం:** తాపత్య= తపతికి సంబంధించిన వంశంవాడా!; నిత్య, సత్య, భాషణుండ= ఎల్లప్పుడు సత్యాన్ని మాటాడే వాడా!; అనవద్యున్= ఏ లోపమూ లేనివాడిని; వేద, వేదాంగ, విశారదున్= వేదాలలో, వేదాంగాలలో- జ్యోతిషవ్యాకరణాదిశాస్త్రాలలో విద్వాంసుడిని; జప, హోమ, యజ్ఞప్రశస్తున్= జపంచేత, హోమంచేత, యజ్ఞంచేత ప్రసిద్ధుడైన వాడిని; విప్ర+ఉత్తమున్= బ్రాహ్మణ శ్రేష్ఠుని, వర్గ, చతుష్టయ, సాధన, సఖున్= ధర్మార్థ కామమోక్షాలను సాధించటంలో మిత్రుడైనవాడిని; సదాచారున్= మంచి నడవడి గలవాడిని; సూరి, సేవ్యున్= పండితులచేత సేవింపబడేవాడిని; పురోహితున్= పురోహితునిగా; చేసిన= చేసుకొన్న; భూపతి= రాజు; ఇందున్= ఈ లోకాన; ఉర్వీ, తలంబు+ఎల్లన్= భూమండలాన్నిఅంతా; ఏలున్= పాలిస్తాడు; పరలోకమునన్= పరలోకంలో; పుణ్యపరుల= పుణ్యాత్ముల; లోకంబులు; పడయున్= పొందుతాడు; రాజ్యము; జయ, స్వర్గ ఫలము= జయాన్నీ, స్వర్గాన్నీ, ఫలంగా గలిగినట్టిది; సూవె= సుమా; అదియున్= ఆ ఫలం; ఉర్వరా; సుర, విరహితుఁడయిన పతికిన్= భూసురుడు - అనగా బ్రాహ్మణుడు లేనిరాజుకు; కేవల+ఆభిజాత్య, శౌర్య, మహిమన్= కేవలం వంశంయొక్క పరాక్రమంయొక్క గొప్పతనంచేత; పడయన్, సమకూరున్+అయ్య= పొందటం సాధ్యమగునా? (సాధ్యం కాదని భావం)

**తాత్పర్యం:** తపతికి సంబంధించినవంశంలో జన్మించినవాడా! నిత్యసత్యభాషీ! అర్జునా! ఏ లోపం లేనివాడిని, వేద వేదాంగాలలో పండితుడిని, జప, హోమయజ్ఞాలు చేయటంచేత ప్రసిద్ధ డైనవాడిని, సత్యభాషిని, బ్రాహ్మణ శ్రేష్ఠుని, ధర్మార్థ కామమోక్ష సాధనలో మిత్రుడిని, మంచినడవడిగలవాడిని పురోహితుడిగా చేసికొన్న రాజు, ఈ లోకంలో భూమండలమంతా పరిపాలిస్తాడు; పరలోకంలో పుణ్యగతులు పొందుతాడు; జయ,ం, స్వర్గం రాజ్యం వలన లభిస్తాయి. బ్రాహ్మణుడు లేకుండా రాజుకు కేవలం వంశపరాక్రమాల గొప్పతనంచేతనే అటువంటి ఫలాన్ని పొందటం సాధ్యం కాదు.

**విశేషం:** ఈ పద్యం రాజ్యవ్యవస్థలో పురోహితుని ప్రాధాన్యాన్నీ, అతని యోగ్యతలను వివరిస్తుంది. అర్జునుణ్ణి తాపత్యుడనడానికి గల విశేషాలు ఇదే ఆశ్వాసంలో 67 పద్యంనుండీ ఉన్నాయి. చూడవచ్చు.

వ. **మీరు ధర్మానిలశక్రాశ్వినులవరంబునం బాండురాజునకుం గుంతీమాద్రులకుం బుట్టినవారలు ధర్మవిదులరు; వేదవేదాంగ ధనుర్వేదపారగుం డయిన భారద్వాజు శిష్యుల; రఖిలలోకహితులరుం గావునం బురోహిత రహితులరై యుండఁ దగదు.** **62**

**ప్రతిపదార్థం:** మీరు; ధర్మ+అనిల, శక్ర+అశ్వినుల, వరంబునన్= యమధర్మరాజు, వాయుదేవుడు, దేవేంద్రుడు, అశ్వినీదేవతలు - వీరి వరంవలన; పాండురాజునకున్, కుంతీ, మాద్రులకున్, పుట్టినవారలు; ధర్మ, విదులరు= ధర్మం తెలిసినవాళ్ళు; వేద, వేద+అంగ, ధనుర్వేద, పారగుండు+అయిన= వేద వేదాంగ ధనుర్వేదాల యొక్క ఆవలి ఒడ్డు చేరినవాడైన - అనగా వేద వేదాంగ ధనుర్వేదాలను పూర్తిగా నేర్చినవాడైన; భారద్వాజు, శిష్యులరు= భరద్వాజుని కుమారుడైన ద్రోణునియొక్క శిష్యులు; అఖిల, లోకహితులరున్= అన్ని లోకాల మేలు కోరేవాళ్ళున్నూ; కావునన్= కాబట్టి; పురోహితరహితులరు+ఐ= పురోహితుడు లేనివాళ్లై; ఉండన్+తగదు= ఉండటం యోగ్యం కాదు.

**తాత్పర్యం:** మీరు, యమ, వాయు, దేవేంద్ర, అశ్వినీదేవతల వరాలతో పాండురాజుకు, కుంతీమాద్రులకు జన్మించినవాళ్ళు. ధర్మం తెలిసినవాళ్ళు. వేదవేదాంగధనుర్వేదాలను పూర్తిగా తెలిసిన ద్రోణాచార్యుని శిష్యులు. అన్ని లోకాలమేలు కోరేవాళ్ళు. అందుచేత పురోహితుడు లేకుండా ఉండటం తగదు.

**విశేషం:** వేదాలు నాలుగు: ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం. వేదాంగాలు ఆరు; శిక్ష (కర్త-పాణిని), వ్యాకరణం (కర్త-పాణిని), ఛందం (కర్త-పింగళముని), నిరుక్తం (కర్త-యాస్కుడు), జ్యోతిషం (కర్తలు-ఆదిత్యాదులు), కల్పం (కర్తలు-ఆశ్వలాయన, కాత్యాయన, ఆపస్తంబాదులు). ఉపవేదాలు నాలుగు : ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, అర్థవేదం.

**ఆ. పాండుపుత్త్ర ! నీవు బ్రహ్మచర్యస్థుండ । వగుటఁ జేసి మన్మథార్తు నన్ను**
**నొడిచి తిందు రాత్రి యుద్ధంబు సేసి; కా । మోపభోగనిరతుఁ డోటు వడఁడె? 63**

**ప్రతిపదార్థం:** పాండు, పుత్త్ర= పాండురాజుకుమారా!; నీవు, బ్రహ్మచర్యస్థుండవు+అగుటన్+చేసి= బ్రహ్మచర్య ఆశ్రమంలో ఉన్నవాడవు కనుక; ఇందున్= ఇక్కడ; రాత్రి, యుద్ధంబు, చేసి; మన్మథ+ఆర్తున్= మన్మథునిచేత పీడితు డనైన; నన్నున్= నన్ను; ఒడిచితివి= ఓడించావు; కామ+ఉపభోగ, నిరతుఁడు= కామసుఖానుభవాలలో మిక్కిలి ఆసక్తిగొన్నవాడు ఓటు, పడఁడె= ఓడిపోడా?

**తాత్పర్యం:** పాండుకుమారా! ఓ అర్జునా! నీవు బ్రహ్మచర్యంలో ఉన్నవాడివి కావటంచేత మన్మథపీడితుడ నైన నన్ను ఇక్కడ రాత్రియుద్ధం చేసి ఓడించావు. కామసుఖానుభవంలో నిమగ్నుడైనవాడు ఓడిపోడా?

**విశేషం:** అలం : అర్థాంతరన్యాసం.

**వ. మఱియుఁ గామ ప్రవృత్తుం డయ్యును మహీపతి మహీసురవరపురస్సరుం డగు నేని యెల్ల యుద్ధంబుల శత్రుల జయించు. 64**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతేకాక; కామప్రవృత్తుండు+అయ్యును= కామమునందు ప్రవర్తిల్లేవాడైనా; మహీపతి= రాజు; మహీసుర, వర, పురస్+సరుండు+అగున్+ఏని= బ్రాహ్మణశ్రేష్ఠుని ముందుంచుకొన్నవా డైతే; ఎల్ల, యుద్ధంబులన్= అన్ని యుద్ధాలలో; శత్రులన్, జయించున్= శత్రువుల్ని జయించగలుగుతాడు.

**తాత్పర్యం:** అంతేకాక రాజు కామభోగాలలో ప్రవర్తిల్లేవా డైనా, పురోహితుడిని ముందుంచుకొంటే, అన్ని యుద్ధాలలో శత్రువులను జయించగలడు.

**ఉ. వేదము వేదియుం గలుగు విప్రవరేణ్యుఁ డగణ్యపుణ్య సం**
**పాది పురోహితుం డయినఁ బాపము పొందునె భూపతిం బ్రతా**
**పోదయ! కాన మీదగు గుణోన్నతికిం దగ ధర్మతత్త్వ సం**
**వేదిఁ బురస్కరింపుఁడు పవిత్రచరిత్రు మహీసురోత్తమున్. 65**

**ప్రతిపదార్థం:** ప్రతాప+ఉదయ!= ఓ పరాక్రమశాలీ! అర్జునా!; వేదము; వేదియున్= యజ్ఞవేదికయు; కలుగు; విప్ర, వరేణ్యుఁడు= బ్రాహ్మణశ్రేష్ఠుడు; అగణ్య, పుణ్య, సంపాది= లెక్కకు మిక్కిలియైన పుణ్యాలను సంపాదించినవాడు; పురోహితుండు+ అయినన్= పురోహితుడు అయితే; భూపతిన్= రాజును, పాపము; పొందునె= పాపం అంటునా; కాన= అందుచేత; మీది+అగు; గుణ+ఉన్నతికిన్= గుణాల గొప్పతనానికి; తగన్= తగినట్లు; ధర్మ, తత్త్వ, సంవేదిన్= ధర్మతత్త్వాన్ని బాగా

తెలిసినవాడిని; పవిత్ర, చరిత్రున్= పుణ్యప్రవర్తన కలవాడిని; మహీ, సుర+ఉత్తమున్= బ్రాహ్మణశ్రేష్ఠుడిని; పురస్కరింపుఁడు= ముం దిడుకొనండి - అనగా పురోహితునిగా చేసుకోండి.

**తాత్పర్యం:** పరాక్రమశాలీ! ఓ అర్జునా! వేదం, యజ్ఞవేదిక కల బ్రాహ్మణశ్రేష్ఠుడు, అత్యధిక పుణ్యాన్ని సంపాదించిన వాడు - పురోహితుడైతే, ఇక రాజుకు పాపం అంటుతుందా? అందుచేత మీ గుణాల గొప్పతనానికి తగినట్లు ధర్మతత్త్వాన్ని బాగా తెలిసినవాడు, పవిత్రమైన నడవడి కలవాడు అయిన బ్రాహ్మణ శ్రేష్ఠుడిని మీ పురోహితునిగా చేసుకోండి.

**తే. అనిన వానికి నర్జునుం డనియె 'మమ్ము। ననఘ! తాపత్యు లని పల్కి తతిముదమున**
**నేము కౌంతేయులము మఱి యెట్లు సెప్ప। మయ్య తపతి కపత్యుల మైన తెఱఁగు'. 66**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; వానికిన్= ఆ అంగారపర్ణునికి; అర్జునుండు; అనియెన్; అనఘ!= పాప రహితుడా! అతి ముదమునన్= మిక్కిలి సంతోషంతో; మమ్మున్, తాపత్యులు+అని= తపతిసంతతివా రని; పల్కితి(వి)= పలికితివి; ఏము= మేము; కౌంతేయులము= కుంతీపుత్రులం; తపతికిన్; అపత్యులము+ఐన= తపతికి సంతతివార మైన ; తెఱఁగు= విధం; మఱి; ఎట్లు; చెప్పుము+అయ్య= మరి ఏ విధంగానో తెలపండయ్యా!

**తాత్పర్యం:** అని పల్కగా ఆ గంధర్వునితో అర్జునుడు ఇట్లా అన్నాడు. 'పుణ్యాత్మా! నీవు సంతోషంతో మమ్మల్ని 'తపతిసంతతివారు' అని పేర్కొన్నావు. మేము కుంతీపుత్రులం. మరి యే విధంగా మేము తపతి సంతతివార మయ్యామో తెలియచెప్పవలసింది'.

## తపతీసంవరణోపాఖ్యానము (సం. 1-160-3)

**వ. అనిన నర్జునునకు నంగారపర్ణుం డి ట్లనియె. 67**

**తాత్పర్యం:** అని పలికిన అర్జునునితో అంగారపర్ణుడు ఈ విధంగా అన్నాడు.

**సీ. ఆదిత్యునకుఁ బుత్త్రి యనఘ సావిత్రికిని। ననుజ యుత్తమలక్షణామలాంగి**
**తపతి; యక్కన్య ధవళాయతేక్షణ। యౌవనసంప్రాప్త యైన, దానిఁ**
**జూచి యక్కన్యక సురుచిరగుణముల। కనుగుణుం డగు నిర్మలాభిజాత్యుఁ**
**బతి నెవ్విధంబునఁ బడయుదునో యని। తలఁచుచు నున్న యత్తపనుగుఱిచి**

**ఆ. భక్తిఁ దపము సేసెఁ బ్రభుఁ డజామీఢసం। దనుఁడు భరతకులుఁడు ధర్మవిదుఁడు**
**సర్వగుణయుతుండు సంవరణుం డను। వాఁడు కృతజపోపవాసవిధుల. 68**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా- ఓ అర్జునా!; ఆదిత్యునకున్= సూర్యునికి; పుత్త్రి= కూతురు; సావిత్రికిన్; అనుజ= అనుసరించి జన్మించినది - అనగా చెల్లెలు; ఉత్తమ, లక్షణ+అమల+అంగి= శ్రేష్ఠమైన లక్షణాలతో కూడిన నిర్మల మైన శరీరం కలది; తపతి; ఆ+కన్య = ఆ కన్యక; ధవళ+ఆయత+ఈక్షణ= తెల్లని విశాలములైన కన్నులు కలది; యౌవన, సంప్రాప్త, ఐన, దానిన్= యౌవనవతి అయినదానిని; చూచి; ఆ+కన్యక= ఆ తపతియొక్క; సురుచిర గుణములకున్=

ఒప్పిదమైన గుణాలకు - అనగా మంచి గుణాలకు; అనుగుణుండు+అగు= తగినగుణాలు కలవా డైన; నిర్మల+ఆభిజాత్యున్= స్వచ్ఛమైన వంశం కలవాడిని; పతిన్= భర్తను; ఏ+విధంబునన్, పడయుదునో= ఏ విధంగా పొందుతానో; అని; తలఁచుచున్+ఉన్న= ఆలోచిస్తున్న; ఆ+తపను గుఱించి= ఆ సూర్యుడినిగూర్చి; ప్రభుఁడు= రాజు; అజామీఢ, నందనుఁడు= అజామీఢుని యొక్క కుమారుడు; భరత, కులుఁడు= భరత వంశపువాడు; ధర్మ విదుఁడు= ధర్మం తెలిసినవాడు, సర్వ, గుణయుతుండు= అన్ని మంచి గుణాలతో కూడుకొన్నవాడు అయిన; సంవరణుండు+అను, వాఁడు; కృత, జప+ఉపవాస, విధులన్= చేయబడిన జపం, ఉపవాసం, మొదలైన నియమాలచేత; భక్తిన్= భక్తితో; తపము; చేసెన్.

**తాత్పర్యం:** సూర్యునికి కూతురు, సావిత్రికి చెల్లెలు, ఉత్తమ లక్షణాలు, నిర్మల శరీరం, తెల్లని నేత్రాలు కలది, యౌవనవతి అయిన తపతి అనే కన్యకను చూచి - ఆమెఉత్తమగుణాలకు తగినగుణాలుకలవాడు, మంచివంశం కలవాడు అయిన భర్తను ఏ విధంగా పొందుతానా అని సూర్యుడు ఆలోచిస్తుండగా - ఆ సూర్యుడినిగూర్చి - ప్రభువు అజామీఢుని పుత్రుడు, భరతవంశంవాడు, ధర్మం తెలిసినవాడు, సర్వసద్గుణాలతో కూడుకొన్నవాడు అయిన సంవరణుడు - జపం, ఉపవాసం, మొదలైన నియమాలతో భక్తితో తపస్సు చేశాడు.

**విశేషం:** ఋక్షకుని కుమారుని పేరుకూడా సంవరణుడే.

**చ. 'గగనమునందు నెందు నధికప్రభ నేను వెలుంగు నట్టు లి**
**జ్జగతిఁ బ్రసిద్ధుఁడై వెలుఁగు సంవరణుండ మదీయపుత్త్రికిం**
**దగుపతి; వీని కిచ్చెద ముదంబున నీలలితాంగి' నంచు మా**
**నుగ నెడ నిశ్చయించెఁ దపనుండు దదీయతపః ప్రసన్నుఁడై. 69**

**ప్రతిపదార్థం:** గగనమునందున్= ఆకాశంలో; ఎందున్= ఎక్కడైనా; ఏను= నేను; అధిక, ప్రభన్= మిక్కిలికాంతితో; వెలుంగు నట్టులు= ప్రకాశిస్తూ ఉన్నట్లే; ఈ+జగతిన్= ఈ ప్రపంచంలో; ప్రసిద్ధుఁడు+ఐ; వెలుఁగు= ప్రకాశించే; సంవరణుండు+అ= సంవరణుడే; మదీయ, పుత్త్రికిన్= నా యొక్క పుత్రికకు; తగు, పతి= తగిన భర్త; ముదంబునన్= సంతోషంతో; ఈ, లలిత+అంగిన్= ఈ సుకుమారమైన శరీరం కలదానిని; వీనికిన్, ఇచ్చెదన్= ఇతనికి ఇస్తాను; అనుచున్= అంటూ; సూర్యుడు, తదీయ, తపఃస్+ప్రసన్నుఁడు+ఐ= ఆ సంవరణునియొక్క తపస్సునకు సంతోషించినవాడై; మానుగన్= ఒప్పుగా; ఎడన్= హృదయంలో; నిశ్చయించెన్= నిర్ణయించుకొన్నాడు.

**తాత్పర్యం:** 'ఆకాశంలో అధికకాంతితో నేను వెలుగుతున్నట్లే ఈ ప్రపంచంలో సంవరణుడు ప్రసిద్ధ డై వెలుగుతున్నాడు. కనుక ఇతడే నా పుత్రికకు తగిన భర్త. ఈ సుకుమారిని సంతోషంతో ఇతని కిస్తాను' అని సంవరణుని తపస్సుకు సంతోషించిన సూర్యుడు తనమనస్సులో చక్కగా నిశ్చయించుకొన్నాడు.

**వ. అంత నొక్కనాఁడు సంవరణుండు మృగయావినోదార్థి యయి వనంబునఁ బరిభ్రమించి అధికక్షుత్పిపాసాపీడిత పతితతురంగుం డయి యేకతంబ పాదచారి యై చని యొక్క పర్వతవనోద్దేశంబునందు. 70**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపై; ఒక్కనాఁడు; సంవరణుండు; మృగయా, వినోద+అర్థి, అయి= వేటయొక్క వినోదంకొరకు; వనంబునన్= అడవిలో; పరిభ్రమించి= తిరిగి; అధిక, క్షుత్+పిపాసా, పీడిత, పతిత, తురంగుండు+అయి= మిక్కిలి ఆకలిచేత, దప్పికచేత, పీడింపబడి పడిపోయిన గుఱ్ఱం కలవాడై; ఏకతంబు+అ= ఒంటరిగా; పాదచారి+ఐ= కాలినడకతో; చని= వెళ్ళి; ఒక్క, పర్వత, వన+ఉత్+దేశంబునందు= ఒక పర్వతంయొక్క అరణ్యంలోని ఎత్తైన ప్రదేశంలో.

**తాత్పర్యం:** తర్వాత ఒకనాడు సంవరణుడు వేటకై అడవికి వెళ్ళాడు. తిరిగి తిరిగి అధికమైన ఆకలిదప్పులతో తన గుర్రం పడిపోగా, తాను ఒంటరిగా కాలినడకతో వెళ్ళి ఒక కొండ అడవిలోని ఎత్తైన ప్రదేశంలో.

**క. కనియె నొక కన్యఁ గోమలిఁ । గనకప్రభ నిజ శరీరకాంతి నుపాంతం**
**బున వృక్షలతావలిఁ గాం । చనమయముగఁ జేయుచున్న చంద్రనిభాస్యన్. 71**

**ప్రతిపదార్థం:** ఒక, కన్యన్= ఒక వివాహంకాని అమ్మాయిని; కోమలిన్= సుకుమారిని; కనక, ప్రభ,నిజ, శరీర కాంతిన్= బంగారు కాంతితో సమానమైన తన శరీరకాంతిచేత; ఉపాంతంబునన్= సమీపంలోని; వృక్ష, లతా+ఆవలిన్= చెట్ల తీవల సమూహాన్ని; కాంచన మయముగన్= బంగారుమయంగా చేయుచున్న; చేస్తున్న; చంద్ర, నిభ+ఆస్యన్= చంద్రునితో సమానమైన ముఖం కలిగిన దానిని; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** సుకుమారి, బంగారుకాంతివంటి తన శరీరకాంతితో ప్రక్క నున్న చెట్లను, తీవలను బంగారుమయం చేస్తున్నట్టిది, చంద్రునివంటి అందమైన ముఖంకలది అయిన ఒకకన్యను చూశాడు.

**విశేషం:** అలం: ఉపమ, తద్గుణం.

## సంవరణుండు తపతింజూచి మోహించుట (సం. 1-160-25)

**వ. కని యనిమిషలోచనుం డయి మనంబున ని ట్లని వితర్కించె. 72**

**ప్రతిపదార్థం:** కని= చూచి; అనిమిష, లోచనుండు+అయి= రెప్పవాల్చని కన్నులు కలవాడై; మనంబునన్= మనస్సునందు; ఇట్లు+అని= ఈ విధంగా; వితర్కించెన్= ఊహించాడు.

**తాత్పర్యం:** చూచి కనురెప్పపాటుకూడా లేని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ మనస్సులో ఈ విధంగా భావించాడు.

**సీ. త్రిభువనలక్ష్మి యేతెంచి యేకాంత మి । ట్లేలొకో యున్నది యివ్వనమున,**
**గగనమణిప్రభ గగనంబునం దుండి । యవనీతల ప్రాప్త మయ్యె నొక్కొ**
**శంభుండు లావణ్యసద్గుణసముదాయ । మింద యిమ్ముగ సంగ్రహించె నొక్కొ**
**దీని యంగములఁ బొందిన యివ్విభూషణ । శ్రీ యేమి పుణ్యంబుఁ జేసె నొక్కొ**

**ఆ. యమరకన్యయొక్కొ యక్షకన్యక యొక్కొ । సిద్ధకన్య యొక్కొ శ్రీసమృద్ధి**
**సర్వలక్షణ ప్రశస్తాంగి యిది దివ్య । కన్య యగు ననంతకాంతిపేర్మి. 73**

**ప్రతిపదార్థం:** త్రిభువన లక్ష్మి= మూడులోకాలలక్ష్మి; ఏతెంచి= వచ్చి; ఏకాంతము= ఒంటరిగా; ఈ వనమునన్= ఈ అడవిలో; ఇట్లు+ఏల+ఒకో= ఈ విధంగా ఎందుకు; ఉన్నది= ఉన్నదో; గగనమణిప్రభ= సూర్యునియొక్కకాంతి; గగనంబు+అందున్+ఉండి= ఆకాశంనుండి; అవనీతల, ప్రాప్తము+అయ్యెన్+ఒక్కొ= భూతలంమీదికి వచ్చినదా! శంభుండు= బ్రహ్మదేవుడు; లావణ్య, సద్గుణ, సముదాయము= సౌందర్యం యొక్క మంచిగుణాల సమూహం; ఇందు+అ= దీని యందే; ఇమ్ముగన్= ఒప్పుగ; సంగ్రహించెన్, ఒక్కొ= కూర్చినాడా; దీని= ఈ కన్యకయొక్క; అంగంబులన్= అవయవాలను; ఈ+విభూషణ, శ్రీ= ఈ అలంకారాల శోభ; ఏమి, పుణ్యంబున్= ఏ పుణ్యాన్ని; చేసెన్+ఒక్కొ= చేసిందో కదా!; అమర, కన్య,

ఒక్కో= దేవతాకన్యయా!; యక్ష, కన్యక+ఒక్కో= యక్ష కన్యయా; సిద్ధ కన్య+ఒక్కొ = సిద్ధ కన్యయా; శ్రీ సమృద్ధి, సర్వ, లక్షణ ప్రశస్త+అంగి= శోభచే నిండి, అన్ని శుభలక్షణాలచేత ప్రశంసింప తగిన శరీరం కలది; అనంత కాంతి పేర్మిన్= అంతం లేని కాంతియొక్క అతిశయంచేత; ఇది, దివ్య, కన్య, అగున్= ఈమె దివ్యకన్యయే అవుతుంది.

**తాత్పర్యం:** త్రిలోకలక్ష్మి ఒంటరిగా ఈ వనంలో ఈ విధంగా ఎందు కున్నదో! సూర్యకాంతి ఆకాశంనుండి భూమిమీదికి అవతరించిందో! బ్రహ్మదేవుడు సౌందర్య సద్గుణాల సముదాయాన్ని ఈమెలోనే సమకూర్చాడేమో! ఈమె అవయవాలను పొందిన ఈ అలంకారాల శోభ యేపుణ్యం చేసిందో! ఈమె దేవకన్యో, యక్షకన్యో, సిద్ధకన్యో, శోభాసమృద్ధితో, అపారమైన కాంతితో, సకలశుభలక్షణాలతో ప్రశంసింప దగిన శరీరం గల ఈమె ఒక దివ్యకన్యే అయి ఉంటుంది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. సంవరణుని హృదయంలో అభిలాష జనించటానికి కారణ మైన తపతినిగురించి ఉత్ప్రేక్షలో వర్ణించిన ఈ పద్యరచనలోని మాధుర్య మనే శబ్దగుణం రసపోషకం. (సంపా.) శంభు శబ్దం శివుడు, విష్ణువు, బ్రహ్మ అని ముప్వురకు వర్తిస్తుంది. కాని ఈ పద్యంలో 'బ్రహ్మ' అనే అర్థంలోనే గ్రహించడమైనది.

**చ. నెఱికురులున్ విలోలసితనేత్రయుగంబును నొప్పులొల్కు వా**
**తెఱయును దీని యాననముతెల్వి కరంబు మనోహరంబు; నా**
**యెఱిఁగిన యంతనుండి సతి నిట్టిలతాలలితాంగిఁ జూచి యే**
**నెఱుఁగ; సురేంద్రకన్యకలు నిట్టిరె రూపవిలాససంపదన్. 74**

**ప్రతిపదార్థం:** నెఱి, కురులున్= అందమైన జుట్టు; విలోల, సిత, నేత్ర యుగంబునున్= చలిస్తున్న తెల్లని కన్నుల జంట; ఒప్పులు+ఒల్కు, వా తెఱయును= అందాలు చిందే పెదవి; దీని, ఆననము, తెల్వి= దీని ముఖకాంతి; కరంబు= మిక్కిలి; మనోహరంబు= మనస్సును దోచుకొనునట్టిది; నా ఎఱిఁగిన, అంత నుండి= నేను పుట్టి బుద్ధి ఎఱిగినప్పటి నుండి; ఇట్టి; లతా, లలిత+అంగిన్= ఇటువంటి తీగవలె సుకుమారమైన శరీరం కల దానిని; సతిన్= కాంతను; ఏన్= నేను; చూచి, ఎఱుఁ గన్= చూచి ఎరుగుట లేదు అనగా చూడలేదు; రూప, విలాస, సంపదన్= అందంయొక్క శృంగార కళా విశేషం యొక్క ఆధిక్యంలో; సుర+ఇంద్ర, కన్యకలున్= దేవేంద్రునియొక్క కన్యకలైనా; ఇట్టిరే= ఇట్టివారా?

**తాత్పర్యం:** ఈమె అందమైన కేశపాశం, చలించే తెల్లని కన్నుల జంట, ఒప్పు లొలికే పెదవి, ముఖకాంతి ఎంతో మనోహరంగా ఉన్నాయి. నేను పుట్టి బుద్ధి యెఱిగిననాటినుండి - తీవవలె ఇంత సుకుమారమైన స్త్రీని చూడలేదు. అందంలో శృంగారకళావిశేషంలో దేవతాకన్యకలలో నైనా ఇట్లాంటివా ళ్ళున్నారా?

**విశేషం:** అలం: ఉదాత్తం. ఈ పద్యంలోకూడ అభిలాషను ధ్వనింపచేసే మాధుర్యగుణం పోషింపబడింది. (సంపా.)

**వ. అని వితర్కించుచు మదనకర్కశమార్గణలక్షీభూతచేతస్కుం డయి తదీయగుణమయపాశబద్ధుండునుం బోలెఁ గదలనేరక తన్నివేశితచేతనుండునుంబోలెఁ ద న్నెఱుంగక తద్రూపామృతపానంబున ననిమిషత్వంబునం బొందిన తన నయనంబుల దానియంద నిలిపి సంవరణుం డక్కన్యక కి ట్లనియె. 75**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; వితర్కించుచున్= ఊహిస్తూ; మదన, కర్కశ, మార్గ; లక్షీభూత, చేతస్కుండు+అయి= మన్మథునియొక్క కరకైన బాణాలకు గురిచేయబడిన మనస్సు కలవాడై; తదీయగుణమయ, పాశబద్ధుండునున్+పోలెన్= దానియొక్క గుణాలనెడి త్రాళ్ళచేత కట్టివేయబడినవానివలె; కదలనేరక= చలింపక; తద్+నివేశిత, చేతనుండునున్+పోలెన్= దానియందు ఉంచబడిన చైతన్యం కలవానివలె; తన్ను+ఎఱుంగక= తన్ను తాను మరచి; తద్+రూప+అమృత, పానంబునన్= దానియొక్క రూపమనెడి అమృతాన్ని త్రాగటంచేత; అనిమిషత్వంబునన్= రెప్పపాటు లేమిని అనగా దేవతాత్వమును; పొందిన; తన, నయనంబులన్= తన కన్నులను; దాని; అందు+అ= ఆ తపతియందే; నిలిపి, సంవరణుండు; ఆ+కన్యకకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని ఊహిస్తూ తనమనస్సు మన్మథబాణాలకు గురికాగా, సంవరణుడు ఆమె గుణా లనే త్రాళ్ళతో కట్టివేయబడ్డవానివలె కదలలేక, తన చైతన్యా న్నంతా ఆమెలో ఉంచినట్లు తనను తాను మరచి ఆమెరూప మనే అమృతాన్ని త్రాగడంచేత రెప్పపాటు లేనికళ్ళను ఆమెవైపే నిలిపి, ఆ కన్యతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: రూపకం. చక్షుఃప్రీతి అనే మన్మథావస్థ.

**ఆ. ఎఱుఁగఁ జెప్పు మబల ! యెవ్వరి దాన; వి । ట్లేల యున్నదాన వేకతంబ;**
**క్రూర వన మృగములు గ్రుమ్మరుచున్న యీ । విజన విషమ శైల విపిన భూమి. 76**

**ప్రతిపదార్థం:** అబల!= ఓ కాంత!; ఎవ్వరిదానవు= ఎవరికి సంబంధించినదానివి; ఎఱుఁగన్+చెప్పుము; క్రూర, వన, మృగములు, క్రుమ్మరుచు+ఉన్న= క్రూరమైన అడవిమృగాలు తిరుగుతున్న; ఈ, విజన, విషమ, శైల, విపిన, భూమిన్= ఈ మనుష్యులులేని ఎగుడుదిగుడు పర్వతారణ్య ప్రదేశంలో; ఇట్లు= ఈవిధంగా; ఏల= ఎందుకు; ఏకతంబు+అ= ఒంటరిగా; ఉన్నదానవు= ఉన్నావు.

**తాత్పర్యం:** ఓ కాంతా! నీ వెవరో వివరంగా చెప్పుము. క్రూరమైన అడవిమృగాలు తిరుగుతున్న ఈ ప్రాంతంలో మనుష్యులు లేని ఎగుడుదిగుడు పర్వతారణ్యప్రదేశంలో ఈ విధంగా ఒంటరిగా ఎందు కున్నావు?

**క. అని పలుకుచున్న నృపనం । దనునకు మఱుమాట యీాక తామరసనిభా**
**నన మేఘమధ్యసౌదా । మనివోలె నడంగె దృష్టిమార్గము గడవన్. 77**

**ప్రతిపదార్థం:** అని, పలుకుచు, ఉన్న; నృప, నందనునకు= రాజకుమారునికి; మఱుమాట= సమాధానం; ఈక=ఇవ్వకుండా; తామరస, నిభ+ఆనన= పద్మవంటి ముఖం కల ఆ తపతి; మేఘ, మధ్య, సౌదామని, పోలెన్= మేఘాలమధ్య మెరపు తీగవలె; దృష్టిమార్గము= చూపు ప్రసరించే త్రోవ; కడవన్= దాటి; అడంగెన్= మాయమయింది.

**తాత్పర్యం:** అని మాట్లాడుతున్న రాజకుమారునికి బదులు చెప్పకుండా పద్మంవంటి ముఖం కల ఆ తపతి మేఘాలమధ్య మెరపుతీగవలె కంటికి కన్పించకుండా మాయమైపోయింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇ ట్లదృశ్యం బయిన యక్కన్యకం గానక మానవపతి మానరహితుం డయి మహీతలంబు పయిం బడి ప్రలాపించు చున్న, నాతని నభినవయౌవనవిభ్రమోద్భాసితు నంగజాకారుం జూచి తపతి తానును**

**మదనబాణబాధిత యై, తన రూపంబుఁ జూపి మధురవచనంబుల 'ని ట్లేల మోహగతుండ వయి?' తని పలికిన, దానికి సంవరణుం డి ట్లనియె. 78**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అదృశ్యంబు+అయిన= ఈ విధంగా అగుపడకుండ పోయిన; ఆ+కన్యకన్= ఆ కన్నెను; కానక= కనజాలక; మానవపతి= రాజు (సంవరణుడు); మానరహితుండు+అయి= అభిమానాన్ని కోల్పోయినవాడై; మహీతలంబు+పయిన్+పడి= నేలమీదపడి; ప్రలాపించుచున్నన్= ఏడ్చుచుండగా; ఆతనిన్= ఆ సంవరణుడిని; అభినవ యౌవన విభ్రమ+ఉద్భాసితున్= సరిక్రొత్త యౌవన విలాసంచేత లెస్సగా ప్రకాశించేవాడిని; అంగజ+ఆకారున్= మన్మథునివంటి ఆకారం కలవాడిని; చూచి; తపతి; తానును; మదన బాణ బాధిత, ఐ= మన్మథ బాణాలచేత బాధింపబడినదై; తన, రూపంబున్, చూపి= తన రూపాన్ని చూపి; మధుర, వచనంబులన్= తీయని మాటలతో; ఇట్లు+ఏల= ఈ విధంగా ఎందుకు; మోహ, గతుండవు= మోహాన్ని పొందినవాడవు; అయితి(వి)= అయితివి; అని పలికినన్= అని పలుకగా; దానికిన్= ఆ తపతికి; సంవరణుండు= సంవరణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆమె అదృశ్యమై పోగా, సంవరణుడు ఆమెను కనుగొనలేక అభిమానాన్ని కోల్పోయి, నేలమీద పడి దుఃఖించాడు. నవయౌవనవిలాసంతో ప్రకాశించేవాడు, మన్మథాకారుడు అయిన అతడిని చూచి తపతి తానుకూడ మన్మథబాణాలచేత బాధింపబడిం దై, అతనియెదుట నిలిచి, తీయనిమాటలతో ' ఈ విధంగా ఎందుకు మోహం పొందావు?' అని అడుగగా ఆమెతో సంవరణుడు ఇట్లా అన్నాడు.

**చ. ధరణి నతిప్రతాపబలదర్పములన్ విన నేన పెద్ద; నె**
**వ్వరికిని మున్ భయంపడనివాఁడ; భయార్తుఁడ నైతి నిప్డు; పం**
**కరుహదళాయతాక్షి! దయఁ గావుము నన్ను; భవన్నిమిత్త దు**
**ర్భరతర పంచబాణహతిఁ బంచతఁ బొందకయుండునట్లుగన్. 79**

**ప్రతిపదార్థం:** వినన్= వినగా; ధరణిన్= భూమిమీద; అతి, ప్రతాప, బల, దర్పములన్= గొప్ప పరాక్రమంచేత, బలంచేత, గర్వం చేత; నేను+అ, పెద్దన్= నేనే పెద్దను; మున్= ఇదివరకు; ఎవ్వరికిని; భయంపడనివాఁడన్= ఎవ్వరికీ భయపడనివాడిని; ఇప్డు= ఇప్పుడు; భయ+ఆర్తుఁడన్+ఐతిన్= భయంచేత దుఃఖాన్ని పొందినవాడ నైనాను; పంకరుహ, దళ+ఆయత+అక్షి= పద్మపత్రాలవంటి విశాలా లయిన కన్నులు కలదానా; భవత్+నిమిత్త; దుర్భరతర, పంచబాణ, హతిన్= నీ కారణంగా భరింప సాధ్యం కాని మన్మథుని యొక్క దెబ్బచే; పంచతన్= మరణాన్ని; పొందక; ఉండునట్లుగన్= ఉండే విధంగా; దయన్= దయతో; కావుము= కాపాడుము.

**తాత్పర్యం:** గొప్పబలగర్వపరాక్రమాలలో ఈ భూమిమీద నేనే గొప్పవాడిని. ఇంతవరకు ఎవ్వరికీ భయపడనివాడిని; కాని ఇప్పుడు భయంతో బాధితుడ నయ్యాను. ఓ పద్మాక్షీ! నీ కారణంగా భరింపరాని మన్మథునిదెబ్బతో మరణం పొందకుండ, దయతో నన్ను రక్షింపుము.

**వ. 'నన్ను గాంధర్వవివాహంబున వరియింపు' మనిన సంవరణునకుఁ దపతి యి ట్లనియె. 80**

**ప్రతిపదార్థం:** నన్నున్= నన్ను; గాంధర్వవివాహంబునన్= గాంధర్వ వివాహ పద్ధతిలో; వరియింపుము= కోరి పెండ్లాడు; అనినన్= అని అడుగగా; సంవరణునకున్= సంవరణునికి; తపతి=తపతి; ఇట్లు= ఈ విధంగా; అనియె= అన్నది.

**తాత్పర్యం:** 'నన్ను గాంధర్వవివాహపద్ధతిలో పెండ్లి చేసికొను' మని అడుగగా; సంవరుణునితో తపతి ఈ విధంగా పలికింది.

**విశేషం:** గాంధర్వ వివాహాలు: వధూవరులు పరస్పరం ప్రేమించుకొని పెద్దలతో అవసరం లేకుండా రహస్యంగా, అమంత్రకంగా చేసికొనే వివాహం. వివాహాలు ఎనిమిది విధాలు. (1) బ్రాహ్మం (2) దైవం (3) ఆర్షం (4) ప్రాజాపత్యం (5) రాక్షసం (6) ఆసురం (7) గాంధర్వం (8) పైశాచం (వివరాలకు చూడు. ఆది.4.55)

**క. భువనైకదీపకుం డగు । సవితృనకుఁ దనూజ; మఱియు సావిత్రికి నే**
**నవరజ, నవినయవర్జిత; నవనీశ్వర! వినుము తపతి యను సురకన్యన్. 81**

**ప్రతిపదార్థం:** అవని+ఈశ్వర= భూపతీ! సంవరణ మహారాజా!; వినుము; ఏన్= నేను; భువన+ఏక, దీపకుండు, అగు= లోకాన్ని అంతటిని వెలిగించేవా డైన; సవితృనకున్= సూర్యునికి; తనూజన్= కూతురిని; మఱియు; సావిత్రికిన్= సావిత్రికి; అవరజన్= తోబుట్టువును- చెల్లెలిని; అవినయ, వర్జితన్= అవినయంచేత విడువబడినదానిని - అనగా గర్వంలేనిదానిని; తపతి అను; సురకన్యన్= దేవకన్యను.

**తాత్పర్యం:** ఓ రాజా! విను. లోకాన్ని వెలిగించే సూర్యునికూతురిని. సావిత్రికి చెల్లెలిని. గర్వం లేనిదానిని. తపతి అనే పేరుగల దేవకన్యను.

**వ. 'నాయందు నీకుం బ్రియంబు గలదేని మదీయ జనకు నడుగుము; న న్నిచ్చు; నింతులకు స్వాతంత్ర్యంబు లేమి నీ వెఱుంగుదువు గాదె! కావున ననవరతజపనియమప్రణిపాతంబుల నాదిత్యు నారాధింపు' మని చెప్పి తపతి యాదిత్యమండలంబున కరిగె; నంత సంవరణుండు మూర్ఛాగతుం డయి పడియున్న, నాతని యమాత్యుండు వచ్చి శీతలపరిషేచనంబు సేసిన మూర్ఛదేఱి యమ్మహీపతి మహాభక్తి నప్పర్వతంబున నుండి సూర్యు నారాధించుచు. 82**

**ప్రతిపదార్థం:** నాయందున్= నాపై; నీకున్; ప్రియంబు= ప్రేమ; కలదు+ఏనిన్= ఉన్నచో; మదీయ, జనకున్= నాయొక్క తండ్రిని; అడుగుము; నన్నున్+ఇచ్చున్= నన్ను నీ కిచ్చి వివాహం చేస్తాడు; ఇంతులకున్; స్వాతంత్ర్యంబు, లేమి= స్వేచ్ఛలేకుండుట; నీవు; ఎఱుంగుదువుకాదె= తెలియుదువు కదా; కావునన్= కాబట్టి; అనవరత, జప, నియమ, ప్రణిపాతంబులన్= ఎడతెగని జపాలచేత, నియమాలచేత, నమస్కారాలచేత; ఆదిత్యునిన్= సూర్యుడిని; ఆరాధింపుము= సేవింపుము; అని, చెప్పి; తపతి; ఆదిత్య, మండలమునకున్= సూర్యమండలానికి; అరిగెన్= వెళ్ళింది; అంతన్= తరువాత; సంవరణుండు; మూర్ఛా, గతుండు+ అయి= మూర్ఛపోయినవాడై; పడియున్నన్, ఆతని= ఆ సంవరణునియొక్క; అమాత్యుండు= మంత్రి; వచ్చి; శీతల, పరిషేచనంబు, చేసినన్= చల్లని నీళ్ళు చల్లగా; మూర్ఛ, తేఱి= మూర్ఛనుండి తేరుకొని; ఆ+మహీపతి= ఆ రాజు (సంవరణుడు); మహా భక్తిన్= మిక్కిలి భక్తితో; ఆ+పర్వతంబునన్= ఆ కొండమీద; ఉండి= నివసించి; సూర్యున్= సూర్యుణ్ణి; ఆరాధించుచున్=సేవిస్తూ.

**తాత్పర్యం:** 'నాపై నీకు ప్రేమ ఉంటే, మా తండ్రిని అడుగుము; న న్నిస్తాడు. స్త్రీలకు స్వాతంత్ర్యం లే దని నీకు తెలుసుకదా! కనుక నిరంతరజపాలతో, నియమాలతో, నమస్కారాలతో సూర్యుడిని ఆరాధించుము' అని పలికి తపతి సూర్యమండలానికి వెళ్ళిపోయింది. తరువాత సంవరణుడు మూర్ఛపడి ఉండగా, అతనిమంత్రి వచ్చి చల్లని నీటితో మూర్ఛతేర్చాడు. ఆ మహారాజు ఆ పర్వతంమీదనే ఉండి, మహాభక్తితో సూర్యుడిని ఆరాధించాడు.

వసిష్ఠుఁడు తపతినిఁ గొనితెచ్చి సంవరణునకు వివాహంబు సేయించుట (సం.1-162-12)

**చ. ప్రతిహత రాగ కోపభయుఁ బంకరుహప్రభవప్రభావు దూ**
**రితదురితున్ మునీశ్వరవరిష్ఠు వసిష్ఠమహామునిం బురో**
**హితు నతిభక్తితోఁ దలఁచె; నిష్ట మెఱింగి వసిష్ఠుఁడున్ సమా**
**హితమతి నేఁగుదెంచి కనియెం బ్రభు సంవరణుం బ్రియంబునన్. 83**

**ప్రతిపదార్థం:** ప్రతిహత, రాగ, కోప, భయున్= నిరోధింపబడిన రాగం, కోపం, భయం కలవాడూ; పంకరుహ, ప్రభవ, ప్రభావున్= పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవునివంటి మహిమ కలవాడూ; దూరిత దురితున్= దూరం చేయబడిన పాపం కలవాడూ - అనగా ఏ పాపమూ చేయనివాడూ; ముని+ఈశ్వర, వరిష్ఠున్= మునిశ్రేష్ఠులలో ఉత్తముడైనవాడూ; అయిన; వసిష్ఠ, మహామునిన్= వసిష్ఠ మహర్షిని; పురోహితున్= తన పురోహితునిగా; అతి, భక్తితోన్= మిక్కిలి భక్తితో; తలఁచెన్= స్మరించాడు; ఇష్టము+ఎఱింగి= అతని కోరికను తెలిసికొని; వసిష్ఠుఁడున్= వసిష్ఠుడుకూడా; సమాహిత, మతిన్= ప్రసన్నమైన మనస్సుతో; ఏఁగుదెంచి= వచ్చి; ప్రభున్; సంవరణున్= సంవరణుడిని; ప్రియంబునన్= ప్రేమతో; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** రాగం, కోపం,భయం లేనివాడు బ్రహ్మదేవునితో సమానమైన ప్రభావం గలవాడు, పాపరహితుడు, మునీశ్వరశ్రేష్ఠుడు, తమ పురోహితుడు అయిన వసిష్ఠమహామునిని సంవరణుడు మిక్కిలి భక్తితో స్మరించాడు. అతని కోరికను తెలిసికొని, ఆ మహాముని ప్రసన్నమైన మనసుతో వచ్చి, ఆ ప్రభువును ప్రేమతో దర్శించాడు.

**వ. ఇట్లు దలంచిన పండ్రెం డగు దివసంబునకు వచ్చి వసిష్ఠుం డవిరతవ్రతోపవాసకృశీభూతశరీరుం డయి యున్న సంవరణుం జూచి యాతండు తపనసుత యయిన తపతియందు బద్ధానురాగుం డగుట తన యోగ దృష్టి నెఱింగి. 84**

**ప్రతిపదార్థం:** ఇట్లు; తలంచిన= స్మరించిన; పండ్రెండు+అగు= పన్నెండవది అయిన; దివసంబునకున్= రోజునకు; వచ్చి; వసిష్ఠుండు; అవిరత, వ్రత+ఉపవాస, కృశీభూత, శరీరుండు+అయి= ఎడతెగని వ్రతోపవాసాలచేత బక్కచిక్కిన దేహం కలవాడై; ఉన్న, సంవరణున్= ఉండే సంవరుణ్ణి; చూచి; ఆతండు= ఆ సంవరణుడు; తపన, సుత, అయిన= సూర్యుని కూతురైన; తపతి అందున్ = తపతిపై; బద్ధ+అనురాగుండు+అగుటన్= కట్టివేయబడిన ప్రేమ కలవా డగుటను; తన, యోగదృష్టిన్= తన యోగదృష్టితో; ఎఱింగి= తెలిసికొని.

**తాత్పర్యం:** ఈ విధంగా సంవరణుడు తలచుకొన్న పన్నెండవ రోజున వసిష్ఠుడు వచ్చి, ఎడతెగని వ్రతోపవాసాలతో కృశించి ఉన్న అతడిని చూచి, అతడు సూర్యపుత్రిక అయిన తపతిపై గాఢమైన ప్రేమ కలిగి ఉన్నా డని తన యోగ దృష్టితో తెలిసికొని.

**చ. జగదభివంద్యుఁ డాక్షణమ సమ్మతి సంవరణ ప్రయోజనం**
**బొగి నొనరింపఁగా నయుతయోజనముల్ చని లోకలోచనుం**
**డగు దిననాథు నాతతసహస్రకరుం గని సంస్తుతించె న**
**తృగణితవేదమంత్రముల నమ్మునినాథుఁ డతిప్రియంబునన్. 85**

**ప్రతిపదార్థం:** జగత్+అభివంద్యుఁడు= లోకంచేత నమస్కరింపదగినవాడు - వసిష్ఠుడు; ఆ, క్షణము+అ= అప్పటికప్పుడే; సమ్మతిన్= అంగీకారంతో; సంవరణ ప్రయోజనంబు= సంవరణునియొక్క పని; ఒగిన్= క్రమంగా; ఒనరింపఁగాన్= చేయటానికి; అయుత; యోజనముల్= పదివేల ఆమడలదూరం; చని= వెళ్ళి; లోక, లోచనుండు+అగు= లోకాలకు కన్నైనవాడగు; దిన, నాథున్= పగటికి ప్రభు వైనవాడిని; ఆతత, సహస్రకరున్= విస్తారమైన వేయికిరణాలు కలవాడిని; కని= చూచి; ఆ+మునినాథుఁడు= ఆ మునిశ్రేష్ఠుడైన, వసిష్ఠుడు; అతి+ప్రియంబునన్= మిక్కిలి ప్రీతితో; అతి+అగణిత, వేదమంత్రములన్= లెక్కలేనన్ని వేదమంత్రాలతో; సంస్తుతించెన్= స్తోత్రం చేశాడు.

**తాత్పర్యం:** జగత్పూజ్యుడైన వసిష్ఠమహాముని అప్పటి కప్పుడే సంవరణునికోర్కె తీర్చటానికి అంగీకరించి పదివేల ఆమడలు పయనించి, లోకాలకు కన్నైనవాడు, పగటికి ప్రభువు, విస్తారమైన వేయికిరణాలు కలవాడు అయిన సూర్యుడిని చూచి మిక్కిలి ప్రీతితో అనేకవేదమంత్రాలతో స్తోత్రం చేశాడు.

**వ. సూర్యుండును వసిష్ఠమహాముని నతిగౌరవంబున సంభావించి 'భవదాగమన ప్రయోజనంబు సెప్పు' మనిన వసిష్ఠుం డి ట్లనియె. 86**

**ప్రతిపదార్థం:** సూర్యుండును= సూర్యుడుకూడ; వసిష్ఠమహామునిన్= వసిష్ఠమహర్షిని; అతి, గౌరవంబునన్= మిక్కిలిగౌరవంతో; సంభావించి= పూజించి; భవత్+ఆగమన, ప్రయోజనంబు= మీరు వచ్చిన పని; చెప్పుము+అనినన్= చెప్పండి అనగా; వసిష్ఠుండు= వసిష్ఠుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** సూర్యుడుకూడ వసిష్ఠమహర్షిని మిక్కిలి మర్యాదతో పూజించి 'మీ రాకకు కారణ మేమి? చెప్పం' డని వసిష్ఠుణ్ణి అడిగాడు. అపుడు వసిష్ఠుడు ఈ విధంగా అన్నాడు.

**సీ. 'అలఘుండు పౌరవకులశేఖరుండు సం । వరణుఁ డన్వాఁ డనవరత కీర్తి**
**విదితుండు ధర్మార్థవిదుఁడు నీ పుత్త్రికి । నగణిత గుణములఁ దగు వరుండు**
**గావున నతనికి దేవిఁగాఁ దపతి నీ । వలయుఁ; గూఁతులఁ గన్నఫలము దగిన**
**వరులకు సద్ధర్మచరితుల కీఁ గాన్న । కాదె!' నావుడు సూర్యుఁ డాదరించి**

**ఆ. 'వరుఁడు రాజవంశకరుఁడు సంవరణుండ । యనుగుణుండు దీని' కని కరంబు**
**గారవమున నిచ్చి యా ఋషితోడఁ బు । త్తెంచెఁ దపతిఁ గురుకులాంచితునకు. 87**

**ప్రతిపదార్థం:** అలఘుండు= తక్కువవాడు కానివాడు - అనగా గొప్పవాడు; పౌరవ, కులశేఖరుండు= పూరువుయొక్క వంశానికి శిరోభూషణమైనవాడు; సంవరణుండు; అన్+వాఁడు= అనేవాడు; అనవరత; కీర్తి, విదితుండు= ఎల్లప్పుడు కీర్తిచేత తెలియబడిన వాడు - అనగా కీర్తిచేత ప్రసిద్ధుడు; ధర్మ+అర్థ, విదుఁడు= ధర్మార్థాలను తెలిసినవాడు; నీ పుత్త్రికిన్= నీకుమార్తెకు; అగణిత, గుణములన్= లెక్కలేనన్ని సుగుణాలచేత; తగు, వరుండు= తగిన భర్త; కావునన్; తపతిన్; అతనికిన్, దేవికాన్= అతనికి భార్యగా; ఈవలయున్= ఇయ్యవలసింది; కూతులన్= కుమార్తెల్ని; కన్న= కనినందులకు; ఫలము= ఫలితము; తగిన, వరులకున్= యోగ్యులైనవరులకు; సత్+ధర్మ, చరితులకున్= చక్కని ధర్మంతో కూడిన నడవడి కలవారికి; ఈన్+కాన్పు+అ కాదె= ఇవ్వగలగటమే కదా!; నావుడు= అని అనగా; సూర్యుఁడు; ఆదరించి; దీనికిన్= ఈ తపతికి; వరుఁడు= భర్త (కోరదగినవాడు); రాజవంశకరుఁడు= సంతానంవలన చంద్రవంశాన్ని నిలిపేవాడు; సంవరణుండు+అ= సంవరణుడే;

అనుగుణుండు= తగిన గుణాలు కలవాడు; అని= అని తలచి; కరంబు= మిక్కిలి; గౌరవమునన్= ప్రేమతో; తపతిన్; కురు, కుల+అంచితునకున్= కురుకులంచేత పూజింపబడేవానికి; ఇచ్చి; ఆ ఋషితోడన్= ఆ ఋషివెంట; పుత్తెంచెన్= పంపాడు.

**తాత్పర్యం:** 'గొప్పవాడు, పూరువుయొక్క వంశానికి శిరోభూషణమైనవాడు, ఎల్లప్పుడు కీర్తిచేత ప్రసిద్ధుడు, ధర్మార్థాలు తెలిసినవాడు అయిన సంవరణుడు అనేకసద్గుణాలచేత నీపుత్రికకు తగినవరుడు. కనుక అతనికి భార్యగా తపతిని ఇవ్వాలి. కుమార్తెలను కన్నందుకు ఫలం -ధర్మబద్ధమైన నడవడిగల తగినవరులకు ఇవ్వగలగటమే కదా!' అని పల్కగా, సూర్యుడు వసిష్ఠునిమాట ఆదరించి, 'చంద్రవంశాన్ని నిలిపేవాడైన సంవరణుడే ఈమెకు తగిన వరు డని - మిక్కిలిప్రీతితో, కురుకులంచేత పూజింపబడే అతనికి తపతి నిచ్చి ఆ ఋషివెంట సాగనంపాడు.

**వ. ఇ ట్లొక్కనిమిషంబున మున్నూటయఱువదినాలుగు యోజనంబులు పఱచు నాదిత్యురథంబుతో నశ్రమంబున నరిగి, తపనదత్త యయిన తపతిం దోడ్కొని వచ్చి, వసిష్ఠుండు విధివంతంబుగా సంవరణునకుం దపతి వివాహంబు సేయించెఁ; గావున మహాత్ము లయిన పురోహితులం బడసిన రాజుల కభీష్టంబు లయిన శుభంబు లగుట నిశ్చయం; బిట్లు సంవరణుండు దపతి వివాహంబయి. 88**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఒక్క, నిమిషంబునన్; మున్నూట అరువది నాలుగు యోజనంబులు; పఱచు= పరుగెత్తు; ఆదిత్యు రథంబుతోన్= సూర్యునియొక్క రథంతో; అ(శ్రమంబునన్= (శ్రమలేకుండా; అరిగి= వెళ్ళి; తపన, దత్త, అయిన= సూర్యునిచే ఇవ్వబడినదైన; తపతిన్; తోడ్కొనివచ్చి= తీసికొనివచ్చి; వసిష్ఠుండు; విధివంతంబుగాన్= శాస్త్రపద్ధతిగా; సంవరణునకున్, తపతిన్, వివాహంబు; చేయించెన్, కావునన్; మహత్+ఆత్ములు+ఐన= మహనీయులైన; పురోహితులన్; పడసిన= పొందిన; రాజులకున్; అభీష్టంబులు+అయిన= కోరబడినవైన; శుభంబులు+అగుట; నిశ్చయంబు; ఇట్లు; సంవరణుండు; తపతిన్; వివాహంబు+అయి= పెండ్లి చేసికొని.

**తాత్పర్యం:** ఈ విధంగా, నిముషానికి మూడువందల అరవైనాలుగు ఆమడలు పరుగెత్తే సూర్యుని రథంతోపాటు (శ్రమలేకుండ వెళ్ళి, అత డిచ్చిన తపతిని తనవెంట తీసికొనివచ్చి, వసిష్ఠుడు శాస్త్రోక్తంగా తపతీసంవరణులకు వివాహం జరిపించాడు. అందుచేత మహాత్ములైన పురోహితులను పొందినరాజులకు కోరుకొన్న శుభాలు కలగటం నిశ్చయం. ఈ విధంగా సంవరణుడు తపతిని వివాహం చేసికొని.

**క. ఆ తరుణియందుఁ జేతో । జాత సుఖప్రీతిఁ దగిలి శైలాటవులన్**
**వీతనృపకార్యధర్మ । వ్రాతుం డయి పదియురెండువర్షము లుండెన్. 89**

**ప్రతిపదార్థం:** ఆ, తరుణియందున్= ఆ కాంతయందు; చేతోజాత; సుఖప్రీతిన్= మన్మథ సుఖప్రీతితో; తగిలి= తగులుకొని, ఆసక్తి కలిగి; వీత, నృపకార్య ధర్మవ్రాతుండు+అయి= వదలిన రాచకార్య ధర్మసమూహం కలవాడై; శైల+అటవులన్= కొండలందు, అడవులందు; పదియు, రెండు, వర్షములు= పండ్రెండేండ్లు; ఉండెన్.

**తాత్పర్యం:** మన్మథసుఖప్రీతితో ఆ తపతితోనే కాపురం చేస్తూ, రాచకార్యాలను, ధర్మాలను వదలి పన్నెండేళ్లు కొండలలో, అడవులలో ఉండిపోయాడు.

**వ. 'దానం జేసి మహీతలంబున కనావృష్టి యయిన నెఱింగి వసిష్ఠుండు శాంతికపౌష్టికవిధు లొనరించి, సంవరణుం దోడ్కొని హస్తినాపురంబున కరిగిన నఖిలప్రజకు ననురాగం బయ్యెఁ ననావృష్టి దోషంబునుం బాసె; నంత సంవరణునకుఁ దపతికిం దాపత్యుండై వంశకరుండు కురుండు పుట్టె, నది మొదలుగా మీరును దాపత్యుల రయితి' రని గంధర్వుండు చెప్పిన నర్జునుండు వెండియు ని ట్లనియె. 90**

**ప్రతిపదార్థం:** దానన్+చేసి= అందువలన; మహీ, తలంబునకున్= భూమండలానికి; అనావృష్టి, అయినన్= వానలేమి ఏర్పడగా; ఎఱింగి= తెలిసికొని; వసిష్ఠుండు; శాంతి, పౌష్టిక, విధులు= శాంతికములు, పౌష్టికములు అయిన వేదకర్మలను; ఒనరించి= చేసి; సంవరణున్= సంవరణుని; తోడ్కొని= తీసికొని; హస్తినాపురంబునకున్= హస్తినాపురానికి; అరిగినన్= వెళ్ళగా; అఖిల= సమస్త; ప్రజకున్= జనులకు; అనురాగంబు+అయ్యెన్= ప్రీతికలిగింది; అనావృష్టి, దోషంబునున్= వానలేమి లోపంకూడ; పాసెన్= తొలగింది; అంతన్= అటు; సంవరణునకున్, తపతికిన్; తాపత్యుండు+ఐ= తపతి కుమారు డై; వంశకరుండు= సంతానం వలన వంశాన్ని నిలిపేవాడేకాక వంశానికి పేరు తెచ్చేవాడు; కురుండు= కురువు; పుట్టెన్; అది, మొదలుగాన్= ఆనాటి నుండి; మీరును; తాపత్యులరు= తపతి సంతానమైనవారు; అయితిరి; అని, = ఆ విధంగా; గంధర్వుండు; చెప్పినన్= చెప్పగా; అర్జునుండు; వెండియున్, మరలా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'దానివలన భూమండలంలో అనావృష్టి ఏర్పడగా, అది తెలిసికొని వసిష్ఠుడు శాంతిక, పౌష్టిక, వైదిక క్రియలు చేసి, సంవరణుడిని తనవెంట పిలిచికొని హస్తినాపురానికి వెళ్ళాడు. ప్రజలంతా ఆనందించారు. అనావృష్టి తొలగింది. తరువాత సంవరణుడిని తనవెంట పిలిచికొని హస్తినాపురానికి వెళ్ళాడు. ప్రజ లంతా ఆనందించారు. అనావృష్టి తొలగింది. తరువాత సంవరణునికి, తపతికి వంశకర్త అయిన కురుడు పుట్టాడు. అప్పటినుండి మీరు కూడా తాపత్య లయ్యారు, అని గంధర్వుడు చెప్పగా, అర్జునుడు మరల ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'హిమకరుఁదొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్ । క్రమమున వంశకర్త లనఁగా మహినొప్పిన' (1.14) చంద్ర వంశంలోని వంశకర్తల చరిత్రలు పాండవుల చరిత్రకంటె ముందు చెప్పటం మహాభారతంలో కాలక్రమంలో చెప్పే కథాకథనశిల్పం. భరతుని తరువాత కురుమహారాజు జననం చెప్పి ఉండవలసింది. కాని, అంగారపర్ణునికథలో పాండవులు - కౌరవు లనేకాదు, తాపత్యులు అనికూడా వాళ్ళు పిలువబడతా రనే అంశం చెప్పవలసివచ్చినప్పుడు కురుజన్మవృత్తాంతం చెప్పటం జరిగింది. ఇది కార్యకారణసంబద్ధమైన కథాకథనపద్ధతి. చంద్రవంశంలోని రాజులను వంశకర్తలపేర్లతో (అంటే వారి సంతాన మని) పిలిచే పద్ధతి ఉన్నది. అంటే - పాండవులనుకూడా పౌరవు లనీ, భారతు లనీ, కౌరవు లనీ పిలుస్తారు. ఇంతేకాక - వంశకర్తల భార్యల పేర్లతో (వారిసంతాన మని) పిలిచే సంప్రదాయంకూడా ఉన్నది. అటువంటి విశిష్ట గౌరవం ఇద్దరు ముగ్గురికిమాత్రమే దక్కింది. అందులో ముఖ్యులు, తపతి, కుంతి, సత్యవతి. పాండవులను 'తాపత్యు'లని అంగారపర్ణుడు కావా లనే పేర్కొన్నాడు. తీగలాగితే డొంకంతా కదలినట్లు 'మేము తాపత్యుల మె ట్లయ్యాం?' అన్న ప్రశ్నతో తపతీసంవరణోపాఖ్యానం అంతా చెప్పాడు అయితే ఈ కథ వంశకథమాత్రమే కాదు; మరేవంశకర్తజీవితంలోనూ కనపడని పురోహిత మాహాత్మ్యాన్ని చెప్పేకథ. సంవరణమహారాజువలె పాండవులుకూడా పురోహితపురస్సరులై ఉండా లని అంగారపర్ణునిహితబోధ. పురోహితునివలన హితం కలిగిన వంశకర్తకథ విన్న తరువాత, ఆ పురోహితుడైన వసిష్ఠునిమహత్త్వాన్నిగురించి అర్జునుడు తెలిసికొనగోరటం సహజం. ఒక కథలోనుండి మరొక కథ సహజంగా ఉద్భవించే కథాకథన శిల్పం ఇది. నన్నయగారి ప్రసన్నకథాకవితార్థయుక్తికి అత్యంత సహజంగా ఆవిష్కరించిన కథార్థాలు ఈ ఘట్టంలోనే ఉన్నాయి.

**క. నుతముగ నస్మత్కుల భూ । పతులకు నాద్యులకుఁ బుణ్యభాగులకుఁ బురో**
**హితుఁ డయిన వసిష్ఠ మహా॥ త్మతఁ జెప్పుము వినఁగ వలతు మది నేర్పడఁగన్. 91**

**ప్రతిపదార్థం:** నుతముగన్= కొనియాడదగినట్లుగా; అస్మత్+కుల, భూపతులకున్= నా (మా) యొక్క వంశమందలి రాజులకు; ఆద్యులకున్= మొదటివారలకు; పుణ్యభాగులకున్= పుణ్యదంపతులకు; పురోహితుఁడు+అయిన= పురోహితుడు అయిన; వసిష్ఠ= వసిష్ఠునియొక్క; మహా+ఆత్మతన్= మహిమను; మదిన్= మనస్సునందు; ఏర్పడఁగన్= చెప్పుము; వినఁగన్+వలతున్= వినటానికి, కోరుకొంటాను.

**తాత్పర్యం:** మా వంశంలో మొదటివారు, పుణ్యాత్ములు అయిన ప్రభువులకు పురోహితుడుగా ప్రశంస లందుకొన్న వసిష్ఠులవారిమహిమను మనసుకు వచ్చే విధంగా స్పష్టంగా వినా లని ఉన్నది; తెలియజేయండి.

**వ. అనిన గంధర్వుం డి ట్లనియె. 92**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అడుగగా; గంధర్వుండు= అంగారపర్ణు డనే గంధర్వరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని అనగా గంధర్వుడైన అంగారపర్ణుడు ఈ విధంగా అన్నాడు.

**క. ధృతి నెవ్వని నేని పురో । హితుఁగాఁ బుణ్యమునఁ బడసి యిక్ష్వాకుకులో**
**దితు లైన పతులు రాజ్యో - న్నతి నొప్పం జేసి రుర్వి నానాక్రతువుల్. 93**

**ప్రతిపదార్థం:** ఇక్ష్వాకు, కుల+ఉదితులు+అయిన= ఇక్ష్వాకువంశంలో జన్మించిన; పతులు= రాజులు; ధృతిన్= సంతోషంతో; ఎవ్వనిన్+ఏని= ఎవరినైతే; పురోహితుఁగాన్= పురోహితునిగా; పుణ్యమునన్= పుణ్యంచేత; పడసి= పొంది; ఉర్విన్= భూమిమీద; రాజ్య+ఉన్నతిన్= రాజ్యముయొక్క గొప్పతనం; ఒప్పన్= ప్రకాశింపగా; నానా, క్రతువుల్= అనేకవిధా లైన యజ్ఞాలు; చేసిరి.

**తాత్పర్యం:** ఇక్ష్వాకువంశరాజులు పుణ్యవశంచేత ఎవరిని పురోహితునిగా పొంది, రాజ్యగౌరవం ప్రకాశించగా, భూమిమీద పెక్కువిధా లైన యజ్ఞాలు చేశారో.

**క. బలమఱి కామక్రోధం । బులు రెండు జయింపఁబడి తపోవీర్య బలం**
**బులఁ జేసి చేయునవి ని । చ్చలు నెవ్వనియేని పాద సంవాహంబుల్. 94**

**ప్రతిపదార్థం:** నిచ్చలున్= ఎల్లప్పుడు; ఎవ్వని+ఏని= ఎవరియొక్క; పాద, సంవాహంబుల్= పాదాలు ఒత్తుటలు; బలము+అఱి= బలం నశించి; కామ, క్రోధంబులు= కామము, క్రోధము; రెండు= రెండూ; జయింపన్+పడి= జయింపబడి; తపోవీర్య బలంబులన్+చేసి= తపముయొక్క ప్రభవాతిశయంవలన; చేయునవి.

**తాత్పర్యం:** ఎల్లప్పుడు ఎవరి పాద సంవాహనం చేస్తే కామక్రోధాలు రెండూ బలహీనాలై జయింపబడి, తపస్సు యొక్క ప్రభావాతిశయాలచేత చేసే పను లౌతాయో.

**విశేషం:** తపశ్శక్తియొక్క బలంచేత, కామక్రోధాలు బలహీనమై జయింపబడి నిత్యం ఎవ్వరి పాదసంవాహాలను చేస్తాయో - అంటే ఎవరికి అధీనాలు అవుతాయో అనికూడా చెప్పవచ్చును.

సీ. 'శమహీనుఁ డైన విశ్వామిత్రు చేసిన । యపకారమునఁ జేసి యాత్మసుతులు
యమసదనంబున కరిగిన, వారలఁ । దనతపోవీర్యసత్త్వముల పేర్మిఁ
గ్రమ్మఱింపఁగ శక్తి కలిగియు, వేల న । య్యంబుధి గడవనియట్ల శాంతుఁ
డయి యెవ్వఁడేని కృతాంతకుఁ గడవంగ । నొల్లండ, యట్టి యత్యుగ్రతేజుఁ

ఆ. డగు వసిష్ఠముని మహాత్మతఁ జెప్ప నా । యలవియయ్య'! యనిన నవ్వసిష్ఠ
గాధిసుతుల కేమికారణంబున నిట్టి । వైర మయ్యె నెఱుఁగ వలతు దీని. 95

**ప్రతిపదార్థం:** శమ, హీనుఁడు+ఐన= శాంతం లేనివాడైన; విశ్వామిత్రు, చేసిన= విశ్వామిత్రుడు చేసిన; అపకారమునన్+చేసి= అపకారంవలన; ఆత్మసుతులు = తన కుమారులు; యమ, సదనంబునకున్=యముని ఇంటికి; అరిగినన్= వెళ్ళగా; వారలన్= వాళ్ళను; తన, తపోవీర్య, సత్త్వముల, పేర్మిన్= తనతపస్సుయొక్క ప్రభావబలాల అతిశయంతో; క్రమ్మఱింపఁగన్= మరలించటానికి; శక్తి కలిగియున్= బలము ఉండియు; వేలన్= చెలియలికట్టను; ఆ+అంబుధి= ఆ సముద్రం; కడవని, అట్లు+అ= దాటనివిధంగానే; శాంతుఁడు+అయి= శాంతం కలవాడై; ఎవ్వఁడు+ఏని= ఎవరైనా; కృత+అంతకున్= యమధర్మరాజును; కడవంగన్= దాటివెళ్ళడానికి; ఒల్లండు+అ= ఇష్టపడడో; అట్టి; అతి+ఉగ్ర, తేజుఁడు= అటువంటి మిక్కిలి భయంకరమైన తేజస్సు కలవాడు; అగు, వసిష్ఠముని; మహత్+ఆత్మతన్=మహానుభావతను; చెప్పన్= చెప్పటానికి; నా, అలవి, అయ్య!= నాకు సాధ్య మౌతుందటయ్యా!; అనినన్= అని అనగా; ఆ+వసిష్ఠ, గాధిసుతులకున్= ఆ వసిష్ఠవిశ్వామిత్రులకు; ఏమి, కారణంబునన్= ఎందువల్ల; ఇట్టి, వైరము+అయ్యెన్= శత్రుత్వం కలిగిందో; దీనిన్= దీనిని; ఎఱుఁగన్ వలతున్= తెలిసికొనగోరుతున్నాను.

**తాత్పర్యం:** 'శాంతస్వభావం లేని విశ్వామిత్రుడు చేసిన అపకారంవలన, తనకుమారులు యమలోకానికి వెళ్లగా, వాళ్ళను తనతపఃప్రభావంతో మరలించటానికి సమర్థుడై ఉండికూడ, చెలియలికట్టను సముద్రం దాటనట్లే, శాంతుడై, యమధర్మరాజును అతిక్రమించటానికి ఎవరు ఇష్టపడలేదో - అట్లాంటి మహాభయంకరమైన తేజస్సు కల వసిష్ఠమహాముని మహిమను చెప్పటం నా తరమా? అని గంధర్వుడు పల్కగా 'ఆ వసిష్ఠ విశ్వామిత్రులకు ఏ కారణంచేత ఇటువంటివైరం ఏర్పడిందో వినగోరుతున్నాను'.

**విశేషం:** అలం: ఉపమ.

### అంగారపర్ణుఁడు అర్జునునకు వసిష్ఠమహిమ చెప్పుట (సం.1-165-2)

వ. చెప్పు మని యర్జునుం డడిగిన గంధర్వుం డి ట్లని చెప్పెఁ; దొల్లి కన్యాకుబ్జంబున గాధిపుత్త్రుండు విశ్వామిత్రుం డనురాజు నిరమిత్రంబుగా ధాత్రి నేలుచు, నొక్కనాఁడు మృగయార్థం బరిగి, యపారబలసమేతుం డయి ఘోరారణ్యంబున గ్రుమ్మరి, వడంబడి కడు డస్సి వసిష్ఠునాశ్రమం బాశ్రయించిన, నమ్మునివరుండు విశ్వామిత్రు నతిప్రీతిం బూజించి, వానికిని వానిసేనకు నభిమతంబు లైన యాహారంబులు గురియ నందిని యను తన హోమధేనువుం బంచిన నదియు. 96

**ప్రతిపదార్థం:** చెప్పుము+అని; అర్జునుండు; అడిగినన్; గంధర్వుండు= అంగారపర్ణుడు; ఇట్లు+అని; చెప్పెన్; తొల్లి= పూర్వం; కన్యాకుబ్జంబునన్= కన్యాకుబ్జంలో; గాధిపుత్త్రుండు= గాధియొక్క కుమారుడు; విశ్వామిత్రుండు+అను; రాజు; నిర్+అమిత్రంబుగాన్= శత్రువులు లేకుండ; ధాత్రిన్= భూమిని; ఏలుచున్= పాలిస్తూ; ఒక్కనాఁడు; మృగయా+అర్థంబు= వేటకొరకు; అరిగి= వెళ్ళి; అపార, బల, సమేతుండు+అయి= అంతులేని సైన్యంతో కూడినవాడై; ఘోర+అరణ్యంబునన్= భయంకరమైన అడవియందు; క్రుమ్మరి= తిరిగి; వడన్+పడి= తాపం పొంది; కడున్, డస్సి= మిక్కిలి అలసి; వసిష్ఠ+ఆశ్రమంబు= వసిష్ఠునియొక్క ఆశ్రమాన్ని; ఆశ్రయించినన్= (విశ్రాంతికొరకు) చేరగా; ఆ+ముని, వరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; విశ్వామిత్రున్= విశ్వామిత్రుని; అతి, ప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; పూజించి; వానికిని = అతనికి; వాని, సేనకున్= అతని సైన్యానికి; అభిమతంబులు+ఐన= ఇష్టములైన; ఆహారంబులు= భోజనాలు; కురియన్= వర్షించుటకై; నందిని; అను, హోమ, ధేనువున్; పంచినన్= ఆజ్ఞాపించగా; అదియున్= ఆ ధేనువు.

**తాత్పర్యం:** చెప్పవలసిం దని అర్జునుడు అడుగగా, గంధర్వుడు ఈ విధంగా చెప్పాడు. పూర్వం కన్యాకుబ్జంలో గాధికుమారుడు, విశ్వామిత్రుడు అనే రాజు, శత్రువులు లేకుండా భూమిని పరిపాలించాడు. అతడు ఒకనాడు వేట కొరకు అపారమైన సైన్యంతో వెళ్ళి, భయంకరమైన అరణ్యంలో తిరిగి, తాపం పొంది, మిక్కిలి అలసి, విశ్రాంతికొరకు వసిష్ఠుని ఆశ్రమం చేరాడు. ఆ మునిశ్రేష్ఠుడు విశ్వామిత్రుడిని మిక్కిలిప్రేమతో పూజించి, అతనికీ, అతనిసేనకూఇష్ట మైన ఆహారపదార్థాలు సమృద్ధిగా అందజేయటానికి 'నందిని' అనే తన హోమధేనువును ఆజ్ఞాపించాడు. అప్పు డది.

**క. ఘృతనదులును, నోదన ప । ర్వతములు, దధి కుల్యములు, నవారిత రసపూ**
**రిత బహువిధోపదంశో । న్నత పుంజంబులును దత్క్షణంబునఁ గురిసెన్. 97**

**ప్రతిపదార్థం:** ఘృత, నదులునున్= నేతి నదులూ; ఓదన పర్వతములు= అన్నపు కొండలూ; దధి కుల్యములున్= పెరుగు కాలువలూ; అవారిత, రసపూరిత, బహువిధ, ఉపదంశ+ఉన్నత, పుంజములును= ఆపుటకు సాధ్యం కాని రసంతో నిండిన అనేకవిధాలైన ఊరుగాయలయొక్క గొప్పరాసులూ; తద్+క్షణంబునన్= ఆ క్షణంలోనే; కురిసెన్= కురిపించింది.

**తాత్పర్యం:** నేతినదులను, అన్నపు కొండలను, పెరుగుకాల్వలను, ఎడతెరపి లేని రసంతో నిండిన అనేక విధాలైన గొప్ప ఊరుగాయల రాసులను అప్పటి కప్పుడే వర్షించింది.

**వ. ఇట్లు చతుర్విధాహారంబుల నందఱం దృప్తులం జేసి యున్న యా నందినిం జూచి విశ్వామిత్త్రుండు విస్మితుం డయి యాత్మగతంబున. 98**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; చతుర్విధ+ఆహారంబులన్= నాలుగురకాలైన ఆహారపదార్థాలతో; అందఱన్= అందరినీ; తృప్తులన్+చేసి= సంతృప్తి కలిగించి; ఉన్న+ఆ; నందినిన్= ఆ నందినీ ధేనువును; చూచి; విశ్వామిత్రుండు; విస్మితుండు+అయి= ఆశ్చర్యపడినవాడై; ఆత్మ, గతంబునన్= తన మనస్సులో.

**తాత్పర్యం:** ఈ విధంగా భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యా లనే నాలుగువిధాలైన ఆహారపదార్థాలతో అందరినీ తృప్తిపరచి ఉన్న ఆ నందినీధేనువును చూచి, విశ్వామిత్రుడు ఆశ్చర్యపడి, తన మనస్సులో.

**మధ్యాక్కర.**

**మృదురోమములును, శంకునిభకర్ణముల్, మెత్తని వలుఁద**
**పొదుగును, నిడుదచన్నులును గుఱుచలై పొలుచు కొమ్ములును,**
**సదమలశరదిందుశంఖనిభ మైన చాయయుఁ గలుగు**
**మొద విది నిధి చేరినట్లు చేరె నిమ్మునికిఁ బుణ్యమున. 99**

**ప్రతిపదార్థం:** మృదురోమములును= మృదువైన వెంట్రుకలూ; శంకు, నిభ, కర్ణముల్= బాణాగ్రాలతో సమానమైన చెవులూ; మెత్తని, వలుద, పొదుగును= మెత్తని పెద్దదియైన పొదుగును; నిడుద, చన్నులును= పొడవైన చన్నులూ; కుఱుచలు+ఐ= పొట్టివై; పొలుచు= ఒప్పు; కొమ్ములును= కొమ్ములూ; సత్+అమల, శరద్+ఇందు, శంఖ, నిభము+ఐన= నిర్మలమైన శరత్కాల చంద్రునితో, శంఖంతో సమానమైన; చాయయున్= రంగును; కలుగు=కలిగిన; మొదవు= పాడి ఆవు; ఇది; నిధి= ధనపు పాతర; చేరినట్లు= చేరిన విధంగా; పుణ్యమునన్= పుణ్యంచేత; ఈ+మునికిన్= ఈ వసిష్ఠమహామునికి; చేరెన్.

**తాత్పర్యం:** మెత్తని వెంట్రుకలు, బాణాగ్రాలవంటి చెవులు, మెత్తని పెద్దపొదుగు, పొడవైన చన్నులు, ఒప్పిదమయిన పొట్టి కొమ్ములు; నిర్మలమైన శరత్కాల చంద్రునితో; శంఖంతో సమానమైన రంగు కల ఈ పాడిఆవు పెన్నిధి చేరినట్లు పుణ్యంవలన ఈ వసిష్ఠమహామునిని చేరింది.

**విశేషం:** అలం: ఉపమ. చంద్రునిలో మచ్చ ఉంటుంది. హోమధేనువు నందిని రంగు ఏ మాత్రం మచ్చలేని తెలుపు - అని తెలపటానికి సదమలశరదిందుశంఖనిభమైన చాయ అనటం జరిగింది. నన్నయ ఈ ఆశ్వాసంలో అయిదు మధ్యాక్కరలను వాడాడు. అందులో ఇది మొదటిది. ఆదిపర్వంలో ఎక్కువ సంఖ్యలో మధ్యాక్కరలు వాడిన ఆశ్వాసం ఇదే. (సంపా.)

**వ. అని పెద్దయుం బ్రొద్దు చింతించి తత్‌పరిగ్రహకుతూహలహృదయుం డయి విశ్వామిత్రుండు వసిష్ఠున కి ట్లనియె. 100**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; చింతించి= ఆలోచించి; తద్+పరిగ్రహ, కుతూహల, హృదయుండు+అయి= దానిని తీసికొనటంలో ఉబలాటపడే హృదయం కలవాడై; విశ్వామిత్రుండు; వసిష్ఠునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చాలాసేపు ఆలోచించి ఆ ఆవును తీసికొనాలనే ఉబలాటపడే హృదయంతో విశ్వామిత్రుడు వసిష్ఠునితో ఈ విధంగా అన్నాడు.

**తే. దీనికంటెను నొప్పెడి వాని నొక్క । లక్ష మొదవుల నిచ్చెద నక్షయముగ**
**రాజ్యమయిన నిచ్చెద జగత్పూజ్య! నాకు । నిమ్ము నీ హోమధేనువు నెమ్మితోడ. 101**

**ప్రతిపదార్థం:** జగత్+పూజ్య!= లోకంచేత పూజింపదగినవాడా!; దీని కంటెను; ఒప్పెడి, వానిన్= బాగున్నవాటిని; ఒక్క లక్ష, మొదవులన్= పాడి ఆవులను; అక్షయముగన్= తరుగకుండ; ఇచ్చెదన్; రాజ్యము+అయినన్; ఇచ్చెదన్; నాకున్; నీ, హోమధేనువు; నెమ్మితోడన్= ప్రీతితో; ఇమ్ము= నీ యొక్క హోమధేనువును ఇష్టంతో ఈయవలసింది.

**తాత్పర్యం:** ప్రపంచంచేత పూజలు పొందదగిన ఓ వసిష్ఠమహర్షీ! దీనికంటె బాగున్న ఒక లక్షపాడిఆవులను తరుగులేకుండా నీ కిస్తాను. రాజ్యమైనా ఇస్తాను. ప్రీతితో నీ హోమధేనువును నా కిమ్ము.

**చ. అనిన వసిష్ఠుఁ డి ట్లనియె; 'నంత ధనంబును నట్టి రాజ్యముం**
**గొననగు నయ్య యిచ్చిడిపికుఱ్ఱికి? నీ కిది యేల? యేను దీ**
**నన పితృదేవతాతిథిజనంబులఁ దృప్తులఁ జేయుచుండుదున్;**
**జననుత! దీనిఁ బ్రోచుటయ చాలుఁ దపస్వుల కేల సంపదల్?' 102**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; వసిష్ఠుఁడు; ఇట్లు+అనియెన్; ఈ+చిడిపి, కుఱ్ఱికిన్= ఈ చిన్న ఆవునకు; అంత, ధనంబునున్= అంత అధికధనాన్ని; అట్టి; రాజ్యమున్; కొనన్+అగునయ్యా= తీసికొనవచ్చునా; నీకున్; ఇది; ఏల?= ఇది ఎందుకు; ఏను; దీనన్+అ= నేను ఈ ఆవుచేతనే; పితృదేవతా+అతిథి, జనంబులన్= పితృదేవతలను, అతిథులను; తృప్తులను= తృప్తి పొందినవారిగా; చేయుచున్+ఉండుదున్= చేస్తూ ఉంటాను; జన, నుత!= జనులచే పొగడబడువాడా!; దీనిన్= ఈ ధేనువును; ప్రోచుటయు+అ= కాపాడుటయే; చాలున్= రక్షించుకొంటేనే చాలు; తపస్వులకున్= ఋషులకు; సంపదల్; ఏల?

**తాత్పర్యం:** పై విధంగా విశ్వామిత్రుడు పలుకగా, వసిష్ఠుడు ఇట్లా అన్నాడు - 'ఈ చిన్ని ఆవుకై అంత ఎక్కువ ధనాన్ని, అంత గొప్పరాజ్యాన్ని తీసికొనవచ్చునా? ఇది నీకు ఎందుకు? నేను దీనిచేత పితృదేవతలను, అతిథి జనులను తృప్తిపరుస్తూ ఉంటాను. ప్రజలచేత పొగడబడే ఓ విశ్వామిత్రా! ఈ ఆవును ఒక్కదానిని కాపాడుకొంటే చాలు; ఋషులకు సంపద లెందుకు?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ. 'దీని నొరున కీఁ గా' దనిన నలిగి విశ్వామిత్రుండు 'నేను క్షత్రియుండ నిగ్రహానుగ్రహసమర్థుండ, నీవు బ్రాహ్మణుండవు శాంతుండ; వేమి సేయ నోపుదు? దీనికి లక్షమొదవుల నీఁబోయిన నొల్లవ యిమ్మొదవు నవశ్యంబును బలిమి నైనం బరిగ్రహింతు' నని నందినిం బట్టికొనఁ బంచినం బలుకక వసిష్ఠుండు చూచుచుండె. 103**

**ప్రతిపదార్థం:** దీనిని= ఈ ఆవును; ఒరునకున్= ఇతరునికి; ఈన్+కాదు= ఇచ్చుటకు వీలేకాదు; అనినన్=అని చెప్పగా; అలిగి= కోపించి; విశ్వామిత్రుండు; నేను; క్షత్రియుండన్; నిగ్రహ+అనుగ్రహ, సమర్థుండన్= శిక్షించుటకు, దయచూపుటకు శక్తి కలవాడను; నీవు; బ్రాహ్మణుండవు; శాంతుండవు= శాంత గుణం కలవాడవు; ఏమి; చేయన్+ఓపుదు= ఏమి, చేయగలవు; దీనికిన్= ఈ ఆవుకు; లక్ష మొదవులన్= ఒక లక్ష పాడి ఆవులను; ఈన్+పోయినన్= ఇవ్వబోగా; ఒల్లవు+అ= ఇష్టపడ వైతివి; ఈ+మొదవున్= ఈ పాడిఆవును, ఈ నందినీ ధేనువును; అవశ్యంబును= తప్పక; బలిమిన్+ఐనన్= బలవంతంగా నైనాసరే; పరిగ్రహింతున్= తీసికొని పోతాను; అని= అని అంటూ; నందినిన్= నందినిని; పట్టికొనన్= పట్టుకొనటానికి; పంచినన్= ఆజ్ఞాపించగా; పలుకక= మారుమాటాడకుండా; వసిష్ఠుండు; చూచుచున్+ఉండెన్= చూస్తూ ఉండిపోయాడు.

**తాత్పర్యం:** 'దీనిని మరొకరికి ఇవ్వటానికి వీలు కాదు' అనగా విశ్వామిత్రుడు కోపించి, 'నేను క్షత్రియుడను. శిక్షించటానికి; దయచూపటానికి సమర్థుడను. నీవు బ్రాహ్మణుడవు. శాంతుడవు. ఏమి చేయగలవు? దీనికి బదులుగా

లక్షపాడిఆవులను ఇవ్వబోతే వద్దన్నావు. ఈ ఆవును బలాత్కారంగా నైనా తప్పక గ్రహిస్తాను' అని నందినిని పట్టుకొనేందుకు ఆజ్ఞాపించగా, వసిష్ఠుడు మారు మాటాడక చూస్తూ ఉండిపోయాడు.

**ఆ. పరులవలన బాధ పొరయకుండఁగ సాధు । జనుల ధనము గాచు జనవిభుండు**
**కరుణ తప్పి తాన హరియించువాఁ డగు । నేని సాధులోక మేమి సేయు?. 104**

**ప్రతిపదార్థం:** పరులవలనన్= ఇతరులవలన; బాధ; పొరయక+ఉండఁగన్= కలుగకుండ; సాధుజనుల, ధనము= మంచివారి ధనాన్ని; కాచు= కాపాడు; జనవిభుండు= రాజు; కరుణ, తప్పి= దయలేక; తాను+అ= తానే; హరియించువాఁడు అగున్+ఏని= అపహరించే వాడైతే; సాధు, లోకము= సాధువుల సమూహం; ఏమి, చేయున్= ఏమి చేయగలుగుతుంది.

**తాత్పర్యం:** ఇతరులవలన బాధ కలుగకుండ, సాధుజనుల ధనాన్ని కాపాడవలసిన ప్రభువే దయ తప్పి, తాను అపహరించేవా డైతే; సాధు జనులసమూహం ఏం చేయగలదు?

**వ. ఇట్లు విశ్వామిత్రుండు వసిష్ఠు హోమధేనువుం బట్టికొనఁ బంచిన పట్టీక జనులవలని కశాదండతాడనంబులం బీడింపం యఱచుచు వసిష్ఠునొద్దకు వచ్చి యి ట్లనియె. 105**

**ప్రతిపదార్థం:** ఇట్లు, విశ్వామిత్రుండు; వసిష్ఠు, హోమధేనువున్= వసిష్ఠుని హోమధేనువును; పట్టికొనన్= పట్టుకొనుటకు; పంచినన్= పంపగా; అది= ఆ ధేనువు; పట్టు+ఈక= పట్టుపడక; జనులవలని= సైనికులవలన; కశా, దండ, తాడనంబులన్= కొరడాల యొక్క, కఱ్ఱలయొక్క దెబ్బలతో; పీడింపన్+పడి= బాధింపబడి; అఱచుచున్= అరుస్తూ; వసిష్ఠు+ఒద్దకు= వసిష్ఠుని దగ్గరకు; వచ్చి, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా విశ్వామిత్రుడు, వసిష్ఠుని హోమధేనువును పట్టుకొనేందుకు తన సైనికులను పంపగా, అది పట్టువడక, వాళ్ళ కొరడాల, కర్రల దెబ్బలచేత బాధింపబడి అరుస్తూ వసిష్ఠుని దగ్గరికి వచ్చి ఇట్లా పలికింది.

**క. 'న న్నేల యుపేక్షించితి? రిన్నరుల కధర్మపరుల కిచ్చితిరే? వి**
**ద్వన్నాథ! యిదియు ధర్మువె?' । యన్నను విని పలుకకుండె నమ్ముని యంతన్. 106**

**ప్రతిపదార్థం:** విద్వత్+నాథ!= పండితులకు ప్రభువైనవాడా - ఓ వసిష్ఠా!; నన్నున్+ఏల= న న్నెందుకు; ఉపేక్షించితిరి= నా సంగతి ఎందుకు పట్టించు కొనకుండ అశ్రద్ధతో ఉన్నారు; అధర్మపరులకున్= అధర్మమే ప్రధానంగా కలవాళ్ళకు; ఈ+నరులకున్= ఈ ప్రజలకు; ఇచ్చితిరి+ఏ; ఇచ్చినారా!; ఇదియు= ఇది; ధర్మువు+ఎ= ధర్మమా; అన్నను= అని నందిని అనగా; విని; ఆ+ముని= ఆ వసిష్ఠ మహాముని; పలుకక+ఉండెన్= మాటాడకుండా ఉన్నాడు; అంతన్= తరువాత.

**తాత్పర్యం:** పండితులకు ప్రభు వైన ఓ వసిష్ఠమహామునీ! మీరు న న్నెందుకు విడిచారు? అధర్మపరులైన ఈ నరులకు ఎందు కిచ్చారు? ఇది ధర్మమా? అని పల్కగా, ఆ ముని మౌనంగానే ఉండిపోయాడు. తరువాత.

**వ. తదీయాభిప్రాయం బెఱింగి నందినియుఁ దనవత్సంబుఁ బట్టికొన వచ్చిన జనుల కలిగి చిందఱరేఁగి నిదాఘ సమయమధ్యందినదినకరమూర్తియుం బోలె దుర్నిరీక్ష్య యయి, యంగవిక్షేపంబున నంగారవృష్టిఁ గురియుచు, వాలంబున శబరులను, శకృన్మూత్రంబుల శక యవన పుండ్ర పుళింద ద్రవిళ సింహళులను, ఫేనంబున దరదబర్బరు లను బుట్టించిన. 107**

**ప్రతిపదార్థం:** తదీయ+అభిప్రాయంబు= అతని యొక్క అభిప్రాయాన్ని; ఎఱింగి= తెలిసికొని; నందినియున్= నందినికూడా; తన వత్సంబున్= తన దూడను; పట్టికొనన్= పట్టుకొనుటకై; వచ్చిన= వచ్చిన; జనులకున్= జనానికి; అలిగి= కోపించి; చిందఱరేగి= ఆవేశంతో చెలరేగి; నిదాఘ, సమయ, మధ్యందిన, దినకరమూర్తియున్+పోలెన్= వేసవికాలంలోని మధ్యాహ్న సూర్యుని ఆకారం వలె; దుర్నిరీక్ష్య+అయి= చూడ సాధ్యం గాని దై; అంగ, విక్షేపంబునన్= దేహాన్ని విదిలించటంచేత; అంగారవృష్టిన్= నిప్పుల వానను; కురియుచున్= కురిపిస్తూ; వాలంబునన్= తోకనుండి; శబరులను; శకృత్+మూత్రంబులన్= పేడనుండి, పంచితంనుండి; శక, యవన, పుంద్ర, పుళింద, ద్రవిళ, సింహళులను; ఫేనంబునన్= నురుగునుండి; దరద, బర్బరులను; పుట్టించినన్= పుట్టించగా.

**తాత్పర్యం:** వసిష్ఠుని అభిప్రాయాన్ని తెలిసికొని నందినికూడ, తన దూడను పట్టుకొనటానికి వచ్చిన జనులను చూచి, కోపించి ఆవేశంతో చెలరేగి, వేసవికాలంలోని మధ్యాహ్నసూర్యునివలె తేరిపార చూడరానిదై, దేహాన్ని విదిల్చి, నిప్పులవాన కురిపిస్తూ, తోకనుండి శబరులను, మలమూత్రాలనుండి శక, యవన, పుంద్ర, పుళింద, సింహళులను, నురుగునుండి దరద బర్బరులను పుట్టించగా.

**క. నలి రేఁగి కడఁగి తద్బల। ములు విశ్వామిత్రు సైన్యముల కేనుమడుం**
**గులు పెరిఁగి మూఁడుయోజన।ములు వాఱఁగ నెగిచె నొక్కమొగిఁ బ్రతిబలమున్. 108**

**ప్రతిపదార్థం:** నలిరేఁగి= విజృంభించి; కడఁగి= పూని; తత్+బలములు= ఆ సైన్యములు - శబర, శక, యవన, పుంద్ర, పుళింద, ద్రవిళ, సింహళ సైన్యములు; విశ్వామిత్రు, సైన్యములకు= విశ్వామిత్రునియొక్క సేనలకు; ఏను, మడుంగులు= అయిదురెట్లు; పెరిఁగి; ప్రతిబలమున్= శత్రుసైన్యాన్ని - అనగా విశ్వామిత్రుని సైన్యాన్ని; ఒక్క మొగిన్= ఒక్క పూనికతో; మూఁడు, యోజనముల్= మూడు ఆమడలు; పాఱఁగన్= పరుగెత్తేటట్లు; ఎగిచెన్= తరిమెను.

**తాత్పర్యం:** నందినినుండి పుట్టిన ఆ సైన్యాలు చెలరేగి, విశ్వామిత్రుని సైన్యాలకంటె అయిదురెట్లు అధికమై, శత్రుసైన్యాన్ని ఒక్కఊపున మూడామడలు పరుగెత్తే విధంగా తరిమివేశాయి.

**వ. అట్టి బ్రహ్మతేజోజనితం బయిన ప్రభావంబుఁ జూచి విశ్వామిత్రుండు విలక్షముఖుం డై, క్షాత్రబలంబు నిందించి, యెల్ల బలంబులకు మిక్కిలి తపోబలంబ యని. 109**

**ప్రతిపదార్థం:** అట్టి, బ్రహ్మతేజస్+జనితంబు+అయిన= బ్రాహ్మణుని తేజస్సునుండి పుట్టిన దైన; ప్రభావంబున్= మహిమను; చూచి; విశ్వామిత్రుండు; విలక్ష, ముఖుండు+ఐ= సిగ్గుపడిన ముఖం కలవా డై; క్షాత్ర, బలంబు= క్షత్రియబలాన్ని; నిందించి; ఎల్ల, బలంబులకున్= అన్ని బలాలకు; మిక్కిలి= ఎక్కువైనది; తపస్+బలంబు+అ= తపోబలమే; అని.

**తాత్పర్యం:** అట్టి బ్రాహ్మణ తేజస్సునుండి పుట్టిన మహిమను చూచి, విశ్వామిత్రుడు సిగ్గుపడి, క్షత్రియబలాన్ని నిందించి, అన్ని బలాలకంటె ఎక్కువైనది తపోబలమే అని.

**చ. పొలుపగు రాజ్యసంపదుపభోగములెల్లఁ దృణంబుగా మదిం**
**దలఁచి విరక్తుఁ డై విడిచి, దారుణశైలవనాతరంబులన్**
**వెలయఁ దపంబు సేసి, గుణవిశ్రుతుఁడై పడసెన్ మహాతపో**
**బలమున సర్వసంపదలు బ్రహ్మఋషిత్వము దివ్యశక్తియున్. 110**

**ప్రతిపదార్థం:** పొలుపు+అగు= స్థిరమైన; రాజ్య, సంపద్+ఉపభోగములు= రాజ్యసందవలని భోగానుభవాలు; ఎల్లన్= అన్నింటిని; తృణంబుగాన్= ఒక్క గడ్డిపరకగా; మదిన్; తలఁచి; విరక్తుఁడు+ఐ= వైరాగ్యభావం పొందినవా డై; విడిచి= వదలిపెట్టి; దారుణ, శైల, వన+ అంతరంబులన్= భయంకరమైన కొండల, అడవుల మధ్య; వెలయన్= ఒప్పునట్లు; తపంబు; చేసి; గుణ, విశ్రుతుఁడు+ఐ= గుణాలచే ప్రసిద్ధుడై; మహా, తపస్+బలమునన్= గొప్ప తప శ్శక్తిచేత; సర్వ, సంపదలు; బ్రహ్మ ఋషిత్వము= బ్రహ్మర్షి అగుటను; దివ్య, శక్తియున్= దేవతాసంబంధమైన మహిమను; పడసెన్= పొందెను.

**తాత్పర్యం:** స్థిరమైన రాజ్యసంపదతో అనుభవించే భోగా లన్నింటిని గడ్డిపరకగా భావించి, విరక్తి చెంది, వాటిన న్నింటిని విడిచి, భయంకరమైన కొండలు, అడవుల మధ్యకు వెళ్ళి, గొప్పతపస్సు చేసి, సద్గుణాలతో ప్రసిద్ధు డై తపోమహిమవలన సర్వసంపదలను, బ్రహ్మర్షిత్వాన్ని, దివ్యశక్తిని పొందాడు.

**వ. ఆ విశ్వామిత్రుం డిక్ష్వాకు కుల సంభవు డైన కల్మాషపాదుం డను రాజునకు యాజకత్వం బపేక్షించి తత్పురోహితుం డైన వసిష్ఠుతో బద్ధవైరుం డయి, తదపకారంబు రోయుచున్నంత, నొక్కనాఁడు కల్మాషపాదుండు వేఁట పోయి, రమ్యారణ్య భ్రమణ ఖిన్నుం డయి, విశ్రమార్థంబు వసిష్ఠాశ్రమంబునకుం జనువాఁడు దన కభిముఖుం డయి వచ్చువాని వసిష్ఠ పుత్త్రుం బుత్త్రశతాగ్రజు నధికతపశ్శక్తియుక్తు శక్తియనుమహామునిం గని, తెరువు దొలంగు మని రాజాభిమానంబున మెచ్చక పలికిన, నమ్మునివరుం డి ట్లనియె. 111**

**ప్రతిపదార్థం:** ఆ, విశ్వామిత్రుండు, ఇక్ష్వాకు, కుల, సంభవుండు+అయిన= ఇక్ష్వాకువంశంలో, జన్మించినవా డైన; కల్మాష పాదుండు+అను, రాజునకు; యాజకత్వంబు= యజ్ఞం చేయించే వా డగుటను; అపేక్షించి= కోరి; తద్+పురోహితుండు= అతని యొక్క పురోహితుడు; అయిన, వసిష్ఠుతో; బద్ధవైరుండు+ఐ= కట్టుబడిన వైరం గలవా డై - అనగా మనస్సున తీవ్రంగా నిలిచిన పగ కలవా డై; తద్+అపకారంబు= ఆ వసిష్ఠునికి కీడును; రోయుచున్= వెదకుతూ; ఉన్నంతన్= ఉండగా; ఒక్కనాఁడు; కల్మాషపాదుండు; వేఁట పోయి; రమ్య+అరణ్య, భ్రమణ, ఖిన్నుండు+అయి= అందమైన అడవులలో తిరగటంచేత బడలిక నొందిన వాడై; విశ్రమ+అర్థంబు= విశ్రాంతికొరకు; వసిష్ఠ+ఆశ్రమంబునకున్= వసిష్ఠునియొక్కఆశ్రమానికి; చను వాఁడు= వెళ్లేవాడు; తనకు+అభిముఖుండు+అయి= తనకు ఎదురై; వచ్చు, వానిన్= వస్తున్న వాడిని; వసిష్ఠ, పుత్త్రున్= వసిష్ఠుని కుమారుణ్ణి; పుత్త్ర, శత+అగ్రజున్= పుత్త్రులు నూఱుగురియందు పెద్దవాడిని; అధిక, తపస్+శక్తి, యుక్తున్= మిక్కిలి తపోబలంతో కూడుకొన్నవాడిని; శక్తి, అను; మహా, మునిన్; కని= చూచి; తెరువు= మార్గం; తొలంగుము+అని; తప్పుకొమ్మని; రాజ+ అభిమానమునన్= రాజుననేగర్వంతో; మెచ్చక= లక్ష్యపెట్టక; పలికినన్= పలుకగా; ఆ+ముని వరుండు= ఆ మునిశ్రేష్ఠుడు (శక్తి); ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ విశ్వామిత్రుడు ఇక్ష్వాకువంశంలో జన్మించిన కల్మాషపాదు డనే రాజుకు యాజకుడు కావా లని కోరి, అతని పురోహితుడైన వసిష్ఠునితో తీవ్రవైరం కలవాడై, అతనికి అపకారం చెయ్యా లని ఆలోచిస్తుండగా, ఒకనాడు కల్మాషపాదుడు వేటకు పోయి, అందమైన అడవులలో తిరిగి, ఆ అలసట తీర్చుకోవటానికి వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్తూ, తనకు ఎదురుగా వస్తున్న వసిష్ఠపుత్రుడిని చూచాడు. అతడు నూరుమందిపుత్రులలో పెద్దవాడు; అధికతపశ్శక్తి కలవాడు; శక్తి అను పేరు గలవాడు, మహాముని. అతడిని చూచి కల్మాషపాదుడు రాజుననేగర్వంతో త్రోవనుండి తప్పుకొ మ్మని అతడిని లక్ష్యపెట్టకుండా పలికాడు. అప్పుడు ఆ మునిశ్రేష్ఠుడు (శక్తి) ఇట్లా అన్నాడు.

**ఆ. ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు । రరుగుదెంచు నప్పు డధికభక్తిఁ**
**దెరలి ప్రియము వలికి తెరువిత్తు రిట్టిద । ధర్మ; మీవు దీనిఁ దలఁప వెట్టు? 112**

**ప్రతిపదార్థం:** ఎట్టి రాజులును= ఎంతటి రాజులైనా; మహీసుర+ఉత్తములు= బ్రాహ్మణోత్తములు; ఎదురు+అరుగుదెంచునప్పుడు= ఎదురుగా వచ్చునపుడు; అధికభక్తిన్= మిక్కిలి భక్తితో; తెరలి= తొలగి; ప్రియము= ఇంపైన మాటను; పలికి; తెరువు= మార్గము; ఇత్తురు (ఇచ్చుదురు) = ఇస్తారు; ఇట్టిది+అ, ధర్మువు= ఇదే ధర్మం; నీవు; దీనిన్= ఈ ధర్మాన్ని; తలఁపవు+ఎట్టు= ఎందుచేత దీనిని ఆలోచించవు.

**తాత్పర్యం:** ఎంత గొప్పరాజులైనా బ్రాహ్మణు లెదురుగా వచ్చినప్పుడు, మిక్కిలిభక్తితో తాము ప్రక్కకు తొలగి, ప్రియంగా మాటాడి, దారి యిస్తారు. ఇది ధర్మం. దీన్నిగురించి నీ వెందుకు ఆలోచించటం లేదు?

## శక్తిమహాముని కల్మాషపాదుని శపియించుట (సం.1-166-7)

**వ. 'ఏను ధర్మపథంబున నున్నవాఁడ; నేల తొలంగుదు'? ననిన నలిగి కల్మాషపాదుండు దనచేతి కశకోలనమ్మునీంద్రుని వ్రేసిన నవమానితుం డయి కోపారుణితనయనంబుల నతనిం జూచి 'నీవు రాక్షసభావంబున నకారణంబ నాకు నికారంబు సేసితి కావున రాక్షసుండ వయి మనుష్యపిశితం బశనంబుగా నుండు' మని శాపం బిచ్చినఁ, గల్మాషపాదుం డమ్మహామునివరు వసిష్ఠతనయుంగా నెఱింగి 'నాకు శాపవ్యపాయంబు ప్రసాదింప వలయు' నని ప్రార్థించుచున్న నచ్చోటికి విశ్వామిత్రుండు వచ్చి వారలు దన్నెఱుంగకుండ నంతర్హితుం డయి కల్మాషపాదు నంతర్గతుం డయి యుండ, నొక్కరక్కసుం గింకరుం డను వానిం బంచిన వాఁడు విశ్వామిత్రునాదేశంబునను, శక్తిశాపంబుననుం జేసి కల్మాషపాదునంతరాత్మ నావేశించి యున్నంత. 113**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ధర్మ, పథంబునన్= ధర్మమార్గంలో; ఉన్న, వాఁడన్= ఉన్నాను; ఏల= ఎందుకు; తొలంగుదున్= తొలగుతాను; అనినన్= అని అనగా; అలిగి= కోపించి, అవమానింపబడినవాడై; కోప+అరుణిత, నయనంబులన్= కోపంచేత ఎఱ్ఱవిగా చేయబడిన కన్నులతో; అతనిన్= ఆ రాజును; చూచి; నీవు, రాక్షస భావంబునన్= నీవు రాక్షస బుద్ధిచేత; అకారణంబు+అ= కారణం లేకుండానే; నాకున్; నికారంబు= అవమానం; చేసితి(వి)= చేసితివి; కావునన్= కాబట్టి; రాక్షసుండవు+అయి; మనుష్య, పిశితంబు= మానవ మాంసం; అశనంబుగాన్= ఆహారంగా; ఉండుము+అని; శాపంబు; ఇచ్చినన్; కల్మాషపాదుండు; ఆ+మహా, మునివరున్= ఆ మహర్షి శ్రేష్ఠుని; వసిష్ఠ, తనయున్+కాన్= వసిష్ఠునియొక్క కుమారునిగా; ఎఱింగి= తెలిసికొని; నాకున్, శాప, వ్యపాయంబు= శాపముయొక్క తొలగింపును; ప్రసాదింపవలయున్+అని= దయతో ఇవ్వవలసిం దని; ప్రార్థించుచున్నన్= వేడుకొంటూ ఉండగా; ఆ+చోటికిన్= ఆచోటికి; విశ్వామిత్రుండు; వచ్చి; వారలు; తన్నున్+ఎఱుంగకుండన్= తనను తెలియకుండా; అంతర్హితుండు+అయి= చాటున నున్నవా డై; కల్మాషపాదున్; అంతర్గతుండు+అయి= కల్మాషపాదుని లోపల చేరి; ఉండన్= ఉండుటకు; ఒక్క, రక్కసున్= ఒక్క రాక్షసుడిని; కింకరుఁడు; అను, వానిన్; పంచినన్= ఆజ్ఞాపించగా; వాడు= ఆ కింకరుడు; విశ్వామిత్రు+ఆదేశంబునను= విశ్వామిత్రుని ఆజ్ఞచేత; శక్తి, శాపంబుననున్+చేసి= శక్తియొక్క శాపంవలన; కల్మాషపాదు+అంతరాత్మన్= కల్మాషపాదునియొక్క మనస్సును; ఆవేశించి= ప్రవేశించి; ఉన్న+అంతన్= ఉండిన అనంతరం.

**తాత్పర్యం:** 'నేను ధర్మమార్గంలో ఉన్నాను. ఎందుకు తొలగుతాను' అని పల్కగా కోపించి కల్మాషపాదుడు తన చేతికొరడాకర్రతో ఆ మునీశ్వరుడిని కొట్టాడు. ఆ విధంగా అవమానింపబడిన ఆ ముని, కోపంతో ఎరుపెక్కిన కళ్ళతో అతడిని చూచి నీవు రాక్షసబుద్ధితో అకారణంగా నన్ను అవమానించావు. కనుక రాక్షసుడ వై నరమాంసం ఆహారంగా జీవించు' మని శాపమిచ్చాడు. అప్పుడు కల్మాషపాదుడు అతణ్ణి వసిష్ఠుని కుమారునిగా గుర్తించి 'శాపవిమోచనం ప్రసాదించండి' అని ప్రార్థిస్తూ ఉండగా - విశ్వామిత్రుడు అక్కడికి వచ్చి, కనబడకుండ దాగి కల్మాషపాదుని మనస్సులో చేరవలసిం దని కింకరు డనే రాక్షసుడిని ఆజ్ఞాపించాడు. వాడు విశ్వామిత్రుని ఆజ్ఞతో శక్తిశాపంతో కల్మాషపాదుని అంతరాత్మలో ప్రవేశించాడు. ఆ పరిస్థితిలో.

**తే.** **రాక్షసావిష్టుఁ డైనప్డు రాజ్యలీల । విడిచి త న్నెఱుంగక, తదావేశరహితుఁ**
**డైన యప్పుడు రాచకార్యంబులందు । బద్ధబుద్ధి యై కల్మాషపాదుఁ డుండె.** **114**

**ప్రతిపదార్థం:** కల్మాషపాదుఁడు; రాక్షస+ఆవిష్టుఁడు= రాక్షసునిచేత ఆవేశింపబడినవాడు; అయినప్డు= అయిన సందర్భంలో; రాజ్యలీలన్= రాజ్యవిలాసాలను; విడిచి; తన్నున్+ఎఱుంగక= తనను తాను తెలియక; తద్+ఆవేశ, రహితుఁడు+అయిన, అప్పుడు= ఆ రాక్షసుడు ఆవేశించనప్పుడు; రాచకార్యంబులందు; బద్ధ, బుద్ధి+ఐ= కట్టుబడిన బుద్ధికలవాడై; ఉండెన్.

**తాత్పర్యం:** కల్మాషపాదుడు - రాక్షసుడు త న్నావేశించినప్పుడు రాజ్యవ్యవహారాలు విచారించక తనను తాను మరచి, ఆవేశించనప్పుడు రాజ్యవ్యవహారాలు చూస్తూ ఉండేవాడు.

**వ.** **ఆ కల్మాషపాదు నొక్కనాఁ డొక్కబ్రాహ్మణుం డధిక క్షుధార్తుం డయి వచ్చి సమాంసంబయిన భోజనం బడిగిన నిచ్చి, పోయిన వాఁ డంతఃపురంబున నుండి మఱచి యర్ధరాత్రంబునప్పుడు దలంచికొని తన బానసంబు వానిం బిలిచి 'యే నొక్కబ్రాహ్మణునకుం గుడువ నిచ్చి వచ్చి మఱచియుండితిం; జెచ్చెర నవ్విప్రునకు మాంసంబుతోఁ గుడువంబెట్టు' మని పంచిన, వాఁడు నింతప్రొద్దు మాంసంబు వడయనేర ననిన నప్పు డారాజు రాక్షసాధిష్ఠితుం డగుటం చేసి 'మనుష్యమాంసంబుతో నయినం గుడువం బెట్టు' మనిన సూపకారుండు వధ్యస్థానంబునకుఁ జని మనుష్య మాంసంబు దెచ్చి యిమ్ముగా వండి పెట్టిన, నవ్విప్రుండు దన దివ్యదృష్టిం జూచి దాని మానవమాంసంగా నెఱింగి కడు నలిగి.** **115**

**ప్రతిపదార్థం:** ఆ, కల్మాషపాదున్= ఆ కల్మాషపాదుణ్ణి; ఒక్కనాఁడు; ఒక్క, బ్రాహ్మణుండు; అధిక= మిక్కిలి; క్షుధా+ఆర్తుండు+అయి= ఆకలిచేత పీడింపబడిన వాడై; వచ్చి= అరుదెంచి; సమాంసంబు+అయిన= మాంసంతో కూడిన; భోజనంబు; అడిగినన్= అడుగగా; ఇచ్చి= పెట్టుతా నని మాట ఇచ్చి; పోయినన్= పోగా; వాఁడు= అతడు-ఆరాజు; అంతః పురంబునన్= అంతఃపురంలోనే ఉండి; మఱచి; అర్ధ, రాత్రంబు= సగం రాత్రిలో; తలంచికొని= గుర్తుచేసికొని; బానసంబు, వానికిన్= తన వంటవాణ్ణి; పిలిచి; ఏన్= నేను; ఒక్క బ్రాహ్మణునకున్= ఒక బ్రాహ్మణునికి; కుడువన్= తినుటకు; ఇచ్చి, వచ్చి= మాట ఇచ్చి వచ్చి; మఱచి+ఉండితిన్= మరచిపోయాను; చెరన్+చెరన్= వెంటనే; ఆ+విప్రునకున్= ఆ బ్రాహ్మణునికి; మాంసంబుతోన్; కుడువన్+పెట్టుము+అని= భుజించుటకై పెట్టు అని; పంచినన్= ఆజ్ఞాపించగా; వాఁడున్= అతడును; ఇంత ప్రొద్దు= ఇంత రాత్రిపూట; మాంసంబు= మాంసాన్ని; పడయ, నేరన్= పొందలేను; అనినన్= అని అనగా; అప్పుడు, ఆ రాజు= ఆ సమయంలో ఆ రాజు; రాక్షస+అధిష్ఠితుండు=రాక్షసునిచేత ఆవేశింపబడినవాడు; అగుటన్+చేసి= అయినందువల్ల;

మనుష్య, మాంసంబుతోన్+అయినన్= నరమాంసంతోనైనా సరే; కుడువన్; పెట్టుము; అనినన్= అనగా; సూపకారుండు= వంటవాడు; వధ్యస్థానంబునకున్= చంపునట్టి స్థలానికి; చని= వెళ్ళి; మనుష్య, మాంసంబు = మానవ మాంసాన్ని; తెచ్చి= తీసికొనివచ్చి; ఇమ్ముగాన్= ఇంపుగా; వండిపెట్టినన్= వండిపెట్టగా; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; తన, దివ్య, దృష్టిన్= తన దివ్యదృష్టితో; దానిన్, మానవ, మాంసంబుగాన్= దానిని నరమాంసంగా; ఎఱింగి= తెలిసికొని; కడున్=మిక్కిలి; అలిగి= కోపించి.

**తాత్పర్యం:** ఒకనాడు ఆ కల్మాషపాదుని దగ్గరకు ఒక బ్రాహ్మణుడు మిక్కిలి ఆకలితో బాధపడుతూ వచ్చాడు. మాంసాహారం కావా లని అడిగాడు. అతడు సరే అని మాట ఇచ్చి అంతఃపురానికి వెళ్ళి మరచిపోయాడు. అర్ధరాత్రి సమయంలో గుర్తుకు వచ్చి, వంటవాడిని పిలిచి, 'నే నొక బ్రాహ్మణునికి భోజనం పెడతా నని చెప్పి వచ్చి మరచి పోయాను. వెంటనే అతనికి మాంసంతో భోజనం పెట్టు' మని ఆజ్ఞాపించాడు. వాడు ఆ అర్ధరాత్రి పూట మాంసాన్ని సంపాదించ లే నని అన్నాడు. అప్పు డారాజు రాక్షసునిచేత ఆవేశింపబడినవాడు కావటంచేత 'నరమాంసంతో నైనా అతనికి భోజనం పెట్టు' మని పల్కగా, ఆ వంటవాడు వధ్యస్థానానికి వెళ్ళి మనుష్యమాంసం తెచ్చి, రుచిగా వండిపెట్టాడు. ఆ బ్రాహ్మణుడు దివ్యదృష్టితో అది మానవమాంసం అని తెలిసికొని, మిక్కిలి కోపించి,

**క. 'తివిరి యభోజ్యం బగు మా । నవ మాంసముతోడ భోజనము పెట్టినవాఁ**
**డవు నీవు మనుష్యాదుఁడ । వవు' మని వాఁ డిచ్చె శాప మన్నరపతికిన్. 116**

**ప్రతిపదార్థం:** తివిరి= పూని; అభోజ్యంబు+అగు= తినగూడని దైన; మానవ, మాంసముతోడన్; భోజనము, పెట్టినవాఁడవు; నీవు; మనుష్యాదుఁడవు+అగుము+అని= మనుష్యమాంసం తినేవాడి వగు మని - అనగా రాక్షసుడవు కమ్మని; ఆ+నరపతికిన్= ఆ రాజుకు; వాఁడు= ఆ బ్రాహ్మణుడు; శాపము; ఇచ్చెన్.

**తాత్పర్యం:** 'తినగూడని నరమాంసంతో నాకు భోజనం పెట్టావు. నీవు మనుష్యమాంసం తినే రాక్షసుడవు అగుదువు గాక!' అని ఆ బ్రాహ్మణుడు రాజైన కల్మాషపాదుడిని శపించాడు.

**వ. ఇట్లు బ్రాహ్మణ శాపంబునం గల్మాషపాదుండు మానుష భావంబు విడిచి, రాక్షసుం డై శక్తి యొద్దకు వచ్చి 'నీ కారణంబున నిట్టి శాపవ్యాపారంబు సంభవించె; దీని ఫలంబు ముందఱ నీవ యనుభవింపు' మని శక్తి నపగత ప్రాణుం జేసి, విశ్వామిత్రుచేతఁ బ్రచోదితుం డయి పదంపడి వసిష్ఠపుత్త్రుల నందఱ వధియించిన. 117**

**ప్రతిపదార్థం:** ఇట్లు; బ్రాహ్మణ, శాపంబునన్= బ్రాహ్మణ శాపంచేత; కల్మాషపాదుండు; మానుష భావంబు= మనుష్యత్వమును; విడిచి; రాక్షసుండు+ఐ; శక్తి, ఒద్దకున్; వచ్చి; నీ కారణంబునన్= నీ కారణంచేత; ఇట్టి, శాప, వ్యాపారంబు= ఇటువంటి శాపం కలిగేపని; సంభవించెన్= ఏర్పడింది; దీని, ఫలంబు= దీని ఫలితం; ముందఱ= ముందుగానే; నీవు+అ= నీవే; అనుభవింపుము; అని= అని; శక్తిన్= శక్తిమహామునిని; అపగత, ప్రాణున్+చేసి= పోయిన ప్రాణం కలవాడినిగా చేసి 'అనగా చంపి; విశ్వామిత్రుచేతన్; ప్రచోదితుండు+అయి= విశ్వామిత్రునిచే పురికొల్పబడినవాడై; పదంపడి= పిమ్మట; వసిష్ఠ, పుత్త్రులన్= వసిష్ఠుని కుమారుల్ని; అందఱన్= అందరినీ; వధియించినన్= చంపగా.

**తాత్పర్యం:** ఈ విధంగా బ్రాహ్మణశాపంచేత కల్మాషపాదుడు మనుష్యత్వాన్ని విడిచి, రాక్షసుడైన శక్తి మహాముని దగ్గరికి వచ్చి 'నీ కారణంగా ఈ శాపవ్యవహారం ఏర్పడింది. దీనిఫలం నీవే మొదట అనుభవించు' మని అతడిని చంపేశాడు. తరువాత విశ్వామిత్రునిప్రేరణతో వసిష్ఠునిపుత్రు లందరినీ వధించాడు.

## పుత్త్రశోకమున వసిష్ఠుఁడు ఆత్మహత్యకుఁబ్రయత్నించుట (సం.1-166-40)

**తే. సుతుల రాక్షసనిహతులఁ జూచి పరమ । యోగధరుఁ డయ్యుఁ బుత్త్ర వియోగశోక**
**భరము దాల్చె వసిష్ఠుం డపారభూరి । ధరణిభరము నగేంద్రుండు దాల్చునట్లు. 118**

**ప్రతిపదార్థం:** రాక్షస, నిహతులన్= రాక్షసునిచేత చంపబడినవాళ్ళను; సుతులన్= పుత్త్రులను; చూచి; వసిష్ఠుండు; పరమ, యోగ, ధరుఁడు+అయ్యున్= ఉత్తమమైన యోగశక్తిని ధరించేవాడే అయినా; అపార, భూరి, ధరణి, భరమున్= అంతులేని గొప్ప భూభారాన్ని; నగ+ఇంద్రుఁడు= పర్వతాలకు రాజైన హిమవంతుడు; తాల్చునట్లు= ధరించునట్లు; పుత్త్ర వియోగ, శోక, భరమున్= కొడుకుల ఎడబాటువలన కలిగిన దుఃఖంయొక్కభారాన్ని; తాల్చెన్= ధరించాడు.

**తాత్పర్యం:** వసిష్ఠుడు గొప్ప యోగశక్తి కలవాడే అయినా - రాక్షసునిచేత చచ్చిన తనకొడుకులను చూచి, పర్వత రాజైన హిమవంతుడు అంతులేని గొప్పభూభారాన్ని ధరించినట్లు పుత్రుల ఎడబాటువలన కలిగిన దుఃఖభారాన్ని వహించాడు.

**విశేషం:** అలం: ఉపమ. 'నగేంద్రుండు' అనే చోట 'ధరణి' భర మురగేంద్రుండు' అని పెక్కు ప్రతులలో; 'ధరణి భరము నాగేంద్రుండు' అని కొన్ని ప్రతులలో పాఠాంతరా లున్నాయి. ఉరగేంద్రుడు, నాగేంద్రుడు అంటే ఆదిశేషుడు. అతడు భూభారం వహించేవాడే. పర్వతానికి 'ధరణీ ధరం' అనే పేరుంది. గనుక నగేంద్రు డైన హిమవంతుడుకూడ భూభారం వహించేవాడే!

**చ. అమిత వివృద్ధ శోక వివశాత్మకుఁ డై మది నాత్మఘాతదో**
**షమును దలంప కెంతయు విషాదమునన్ బలవద్దవాగ్ని మ**
**ధ్యము వడిఁ జొచ్చినన్ బృహదుదగ్రశిఖానల మాక్షణంబ యు**
**ష్ణము చెడి శీత మయ్యె మునినాథున కుగ్రతపంబుపెంపునన్. 119**

**ప్రతిపదార్థం:** అమిత, వివృద్ధ, శోక, వివశ+ఆత్మకుఁడు+ఐ= మిక్కిలి ఎక్కువైన దుఃఖంచేత పరవశమైన మనస్సు కలవా డై; మదిన్= మనస్సునందు; ఆత్మ, ఘాత, దోషమును= ఆత్మహత్య అనే పాపాన్ని; తలంపక= ఆలోచింపక; ఎంతయున్= మిక్కిలి; విషాదమునన్= దుఃఖంచేత; బలవత్+దవ+అగ్ని, మధ్యము= అధికమైన కార్చిచ్చునడుమ; వడిన్= వేగమే; చొచ్చినన్= ప్రవేశించగా; బృహత్+ఉదగ్ర, శిఖా+అనలము= పెద్ద భయంకరమైన మంటలు కల అగ్ని; మునినాథునకున్= మునిశ్రేష్ఠు డైన ఆ వసిష్ఠునకు; ఉగ్ర, తపంబు, పెంపునన్= గొప్ప తపస్సుయొక్క అతిశయంచేత; ఆ క్షణంబు+అ= అప్పటికప్పుడే; ఉష్ణము= వేడి; చెడి=పోయి; శీతము= చల్లనిది; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** మిక్కిలి ఎక్కువైన దుఃఖంతో మనస్సు స్వాధీనం తప్పి, ఆత్మహత్య పాప మని కూడ భావించక, అమిత మైన బాధతో పెద్ద కార్చిచ్చులోకి వడిగా ప్రవేశించాడు. అయితే, మునిశ్రేష్ఠు డైన ఆ వసిష్ఠుని తపోమహిమచేత ఆ కార్చిచ్చు వేడిని కోల్పోయి చల్లబడింది.

**విశేషం:** శోకభావ తీవ్రతచేత వసిష్ఠుడు ఆత్మహత్య చేసికొనటానికి చేసే ప్రయత్నాలను అయిదింటిని - పంచప్రాణాలు తీసికొనే యత్నాలకు వ్యంజకాలుగా - నన్నయ రచించాడు. ఒక్కొక్క పద్యంలో ఒక్కొక్క ప్రయత్నం ఒక్కొక్క ఘటనగా

రాణిస్తుంది. ఘటనాచిత్రణంలో శ్లేష అనే గుణం శోభిస్తుంది. బహుపదాలు ఏకపదవద్భావం పొందే మసృణ మైన రచనను శ్లేష మని అంటారు. ప్రసాదంకంటె విలక్షణంగా ఉండే ఇటువంటి రచనను 119 నుండి 123 పద్యంవరకు శ్లేషగుణసుందరంగా రచించి, సంఘటనౌచిత్యాన్ని పాటించాడు - నన్నయ. (సంపా.)

**ఉ. పంబిన శోక భారమునఁ బ్రాణ విమోక్షముఁ గోరి కంఠ దే**
**శంబున రాయి గట్టికొని సన్మునినాథుఁడు నిశ్చితాత్ముఁడై**
**యంబుధిఁ జొచ్చినం గడు భయంపడి వార్ధి లసత్తరంగ హ**
**స్తంబుల నెత్తిపట్టె నుచితస్థితిఁ దీరముఁ జేర నమ్మునిన్. 120**

**ప్రతిపదార్థం:** పంబిన= మిక్కుటమైన; శోకభారమునన్= దుఃఖంయొక్క బరువుచేత; సత్+ముని, నాథుఁడు= గొప్ప మునిశ్రేష్ఠు డైన ఆ వసిష్ఠుడు; నిశ్చిత+ఆత్ముఁడు+ఐ= నిర్ణయించుకొన్న మనస్సు కలవాడై; ప్రాణ, విమోక్షమున్= ప్రాణమును వదలుటను; కోరి= కోరుకొని; కంఠదేశంబునన్= మెడలో; రాయి, కట్టికొని= రాతిని కట్టుకొని; అంబుధిన్= సముద్రంలో; చొచ్చినన్= ప్రవేశింపగా; వార్ధి= సముద్రం; కడున్= మిక్కిలి; భయంపడి; ఆ+మునిన్= ఆ వసిష్ఠుని; ఉచిత, స్థితిన్= తగినట్లుగ; తీరమున్= గట్టును; చేరన్= చేరునట్లుగ; లసత్, తరంగ, హస్తంబులన్= ప్రకాశిస్తున్న అలలుఅనెడి చేతులతో; ఎత్తి పట్టెన్=ఎత్తి పట్టింది.

**తాత్పర్యం:** మిక్కుటమైన దుఃఖభారంతో మునిశ్రేష్ఠుడైన వసిష్ఠుడు ఎలాగైనా ప్రాణం విడువా లని నిశ్చయించుకొని, మెడకు రాయికట్టుకొని సముద్రంలో దూకగా - ఆ సముద్రుడే భయపడి, ప్రకాశించే తన అల లనే చేతులతో ఎత్తిపట్టి తగువిధంగా ఆయనను ఒడ్డుకు చేర్చాడు.

**విశేషం:** అలం: రూపకం.

**చ. సుతశతవర్జితాశ్రమము చూడఁగ నోపక మేరుపర్వతో**
**న్నతపృథుశృంగ మెక్కిపడినన్, మునివల్లభుదేహబంధ మ**
**క్షత మయి తూలసంచయనికాశత నొప్పెఁ; ననంత సంతత**
**వ్రతనియమప్రభావు లగువారలఁ బొందునె దేహదుఃఖముల్. 121**

**ప్రతిపదార్థం:** సుత, శత, వర్జిత+ఆశ్రమము= కొడుకులు నూఱుమందిచేత విడువబడిన ఆశ్రమాన్ని; చూడన్+కన్+ఓపక= చూడటానికి ఇష్టపడక; మేరుపర్వత+ఉన్నత, పృథు, శృంగము+ఎక్కి= మేరుపర్వతపు ఎత్తైన విశాలశిఖరాన్ని ఎక్కి; పడినన్= పడగా; మునివల్లభు, దేహబంధము= మునినాథు డైన వసిష్ఠుని శరీరముయొక్క కూర్పు; అక్షతము+అయి= గాయం కానిది అయి; తూల, సంచయ, నికాశతన్= దూదిమూటయొక్క సమానత్వంతో; ఒప్పెన్= ప్రకాశించింది; అనంత, సంతత, వ్రత, నియమ, ప్రభావులు+అగు= అంతులేని ఎడతెగని వ్రతనియమాలయొక్క ప్రభావం కలవాళ్ళయిన; వారలన్= వాళ్లను; దేహ, దుఃఖముల్= శరీర సంబంధ మైన దుఃఖాలు; పొందునె= కలుగుతాయా? (కలుగవు అనిభావం).

**తాత్పర్యం:** నూరుమంది కొడుకులు మరణించటంతో శూన్యమైన తనఆశ్రమాన్ని చూడలేక మునిశ్రేష్ఠు డైన వసిష్ఠుడు మేరుపర్వతపు ఎత్తైన శిఖరం ఎక్కి క్రిందికి దూకగా, అతనిదేహం దూదిమూటవలె గాయపడలేదు. ఎల్లప్పుడు అంతులేని వ్రతనియమాలప్రభావం కలవాళ్ళను దేహకష్టాలు దరిచేరవుకదా!

**విశేషం:** అలం : అర్థాంతరన్యాసం, ఉపమ.

**మధ్యాక్కర.**

**వదలక మరణార్థి యగుచు మునినాథవరుఁడు దా నొక్క**
**నది నుదగ్రగ్రాహవతిఁ బ్రవేశించినను ముని నంట**
**నది యోడి శతవిధంబులఁ బరిద్రుతయయి స్థలం బయిన**
**నది యాదిగాఁగ శతద్రునామ యై యన్నది యొప్పె. 122**

**ప్రతిపదార్థం:** వదలక= విడిచిపెట్టక; మరణ+అర్థి= చావును కోరినవాడు; అగుచున్= అవుతూ; మునినాథ, వరుఁడు= మునిశ్రేష్ఠులలో ఉత్తముడు; తాన్= తాను; ఉదగ్ర, గ్రాహవతిన్= మిక్కిలి భయంకరమైన మొసళ్ళు కలదానిని; ఒక్క, నదిన్= ఒక్క నదిలో; ప్రవేశించినను= ప్రవేశించినప్పటికీ; అది= ఆ నది; మునిన్= వసిష్ఠుని; అంటన్= తాకుటకు; ఓడి= భయపడి; శతవిధంబులన్= నూఱుమార్గాల; పరిద్రుత; అయి= పారినదై; స్థలంబు+అయినన్= మెరక కాగా; ఆదికాఁగన్= అది మొదలుగా; ఆ+నది; శతద్రు, నామ+ఐ= శతద్రువు అనే పేరు కలదై; ఒప్పెన్= ప్రసిద్ధికెక్కింది.

**తాత్పర్యం:** మునిశ్రేష్ఠులలో ఉత్తముడైన వసిష్ఠుడు మరణించా లన్న కోరికను ఇంకా వదలకుండా మహా భయంకరమైన మొస ళ్ళున్న ఒకనదిలో ప్రవేశించాడు. ఆ నది ఆయనను తాకటానికి భయపడి, నూరు మార్గాలలో ప్రవహించి మెరక అయిపోయింది. అప్పటినుండి ఆ నది శతద్రువు అనే పేరుతో ప్రసిద్ధి చెందింది.

**మధ్యాక్కర.**

**ఘనపాశములఁ జేసి యెల్ల యంగముల్ గలయ బంధించి**
**కొని యొక్కనదిఁ జొచ్చి మునిఁగినను వంతఁ గూరి యన్నదియుఁ**
**దన దివ్యశక్తి నప్పాశముల విడిచి తన్మునినాథుఁ**
**బనుగొనఁ దీరంబు చేరఁ బెట్టి విపాశనాఁ బరఁగె. 123**

**ప్రతిపదార్థం:** ఘన, పాశములన్+చేసి= గొప్ప త్రాళ్ళచేత; ఎల్ల అంగముల్= అన్ని అవయవాలను; కలయన్= ఒకటిగా చేర్చి; బంధించికొని= కట్టివేసికొని; ఒక్కనదిన్; చొచ్చి= ప్రవేశించి; మునిఁగినన్= మునుగగా; ఆ+నదియున్= ఆ నదిగూడ; వంతన్+కూరి= దుఃఖాన్ని పొంది; తన దివ్య, శక్తిన్= తనయొక్క ఆశ్చర్యకరమైన శక్తిచేత; ఆ+పాశములన్= ఆ త్రాళ్ళను; విడిచి= విడిపించి; తద్+మునినాథున్= ఆ మునిశ్రేష్ఠుడిని; పనుగొనన్= చక్కనగునట్లు; తీరంబు, చేరన్= ఒడ్డు చేరునట్లు; పెట్టి= చేసి; విపాశ నాన్= విపాశ (పాశములు లేనిది) అనే పేరుతో; పరఁగెన్= ఒప్పింది.

**తాత్పర్యం:** వసిష్ఠుడు పెద్దత్రాళ్ళతో తన అవయవా లన్నిటినీ ఒకటిగా చేర్చి కట్టుకొని ఒక నదిలో మునిగాడు. ఆ నదికూడ మిక్కిలి దుఃఖించి తన దివ్యశక్తితో అతనికట్లను విప్పి, ఒడ్డుచేర్చి తాను 'విపాశ' అనే పేరుతో ప్రసిద్ధి చెందింది.

**వ. ఇట్లు పెక్కువిధంబుల నాత్మపరిత్యాగంబునందుఁ గృతనిశ్చయుం డయ్యును నప్రాప్తమరణుం డయి వసిష్ఠుండు నిజాశ్రమంబునకు వచ్చువాఁడు దన పిఱుంద వచ్చు కోడలి నదృశ్యంతి యను దాని శక్తిభార్య నప్పు డెఱింగి, దాని యుదరంబుననుండి షడంగాలంకృత వేదధ్వని గరంబు మధురం బై వీతెంచిన విని విస్మితుం డయి. 124**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పెక్కు విధంబులన్=ఎన్నో రకాలుగా; ఆత్మ; పరిత్యాగంబునందున్= దేహాన్ని విడుచుటయందు; కృత, నిశ్చయుండు= చేయబడిన నిశ్చయం కలవాడు; అయ్యును= అయినప్పటికీ; అప్రాప్త; మరణుండు+అయి= పొందబడని చావుకలవా డై; వసిష్ఠుండు= వసిష్ఠుడు; నిజ+ఆశ్రమంబునకున్= తనయొక్క ఆశ్రమానికి; వచ్చువాఁడు= వచ్చునటువంటివాడు; తన పిఱుందన్= తన వెనుక; వచ్చు= వస్తూ ఉన్న; కోడలిన్; అదృశ్యంతి అనుదానిన్ = అదృశ్యంతి అను పేరుగల ఆమెను; శక్తి, భార్యన్= శక్తి మహామునియొక్క భార్యను; అప్పుడు; ఎఱింగి= చూచి; దాని= ఆమెయొక్క; ఉదరంబుననుండి= కడుపులో నుండి; షడంగ+అలంకృత వేద, ధ్వని= ఆరు అంగములచేత అలంకరింపబడిన వేదంయొక్క ఉచ్చారణ ధ్వని; కరంబు= మిక్కిలి; మధురంబు+ఐ= వినసొంపై; వీతెంచినన్= రాగా; విని; విస్మితుండు+అయి= ఆశ్చర్యపడినవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా వసిష్ఠుడు ఆత్మహత్య చేసికొనా లని పెక్కుమార్గాలలో దృఢంగా ప్రయత్నించినా, మరణం పొందలేక తన ఆశ్రమానికి తిరిగివస్తూ, తన వెనుకనే వస్తున్న తన కోడలిని గమనించాడు. ఆమె శక్తి మహాముని భార్య. ఆమె పేరు అదృశ్యంతి. ఆమె గర్భంనుండి షడంగాలతో అలంకృతమైన వేద ధ్వని మిక్కిలి మనోహరంగా వినిపించసాగింది. దానిని విని వసిష్ఠుడు ఆశ్చర్యపడి.

**విశేషం:** షడంగాలు: అనుద్రుతం, ద్రుతం, లఘువు, గురువు, ప్లుతం, కాకపాదం.

**తే. శక్తి చదువును బోలె సువ్యక్త మగుచు । వీనులకు నిది యమృతోపమాన మయ్యె**
**వేదనాదంబు; దీని పుణ్యోదరమున । నున్నవాఁడు సుతుండు విద్వన్నుతుండు. 125**

**ప్రతిపదార్థం:** శక్తి, చదువును+పోలె= శక్తిమహాముని చదువువలె; సువ్యక్తము= మిక్కిలి స్పష్టమైనది; అగుచున్= అవుతూ; ఇది, వేద, నాదంబు= ఇది వేద ధ్వని; వీనులకున్= చెవులకు; అమృత+ఉపమానము+అయ్యెన్= అమృతమువంటి దయింది; దీనిన్= ఈ అదృశ్యంతి యొక్క; పుణ్య+ఉదరమునన్= పవిత్రమైన గర్భంలో; విద్వత్+నుతుండు= విద్వాంసులచేత పొగడబడువాడు; సుతుండు= కుమారుడు; ఉన్నవాడు= ఉన్నాడు.

**తాత్పర్యం:** శక్తిమహాముని చదివినట్లు మిక్కిలి స్పష్టమై ఈ వేదనాదం చెవులకు అమృతంవలె వినిపిస్తున్నది. ఈమె పుణ్యగర్భంలో విద్వాంసులచేత పొగడబడే కుమారుడు ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. ఈ తేటగీతిలో నాల్గుపాదాల్లోనూ ప్రాసయతి గలదు.

**వ. 'అనవరత వేదాధ్యయనశీలుం డయిన శక్తిచదువు వినుచుం బండ్రెండేఁడులు గర్భంబునుండి సకల వేదంబులు ధరియించినవాఁ డీ పౌత్రుముఖంబు చూచి యేను గృతార్థుండ నగుదు' నని వసిష్ఠుండు మరణ వ్యవసాయ నివృత్తుం డై నిజాశ్రమంబున నుండునంత; నొక్కనాఁడు రాక్షసరూపధరుం డై రౌద్రాకారంబున వచ్చు కల్మాషపాదుం జూచి యదృశ్యంతి వెఱచిన దాని నోడుకుండు మని మునివరుండు హుంకారంబున రాక్షసు వారించి, వానిపయి మంత్రపూతంబు లైన కమండలుజలంబు లొలికిన. 126**

**ప్రతిపదార్థం:** అనవరత, వేద+అధ్యయన, శీలుండు+అయిన= ఎల్లప్పుడు వేదాలను పఠించటమే స్వభావంగా గలవాడైన; శక్తి, చదువు= శక్తి మహామునియొక్క చదువు; వినుచున్= వింటూ; పండ్రెండు+ఏడులున్= పన్నెండు సంవత్సరాలు; గర్భంబునుండి= కడుపులో ఉండి; సకల, వేదంబులు= అన్ని వేదాలు; ధరియించినవాఁడు= నేర్చిన అతడు; ఈ; పౌత్రు,

ముఖంబున్= ఈ మనుమడి యొక్క ముఖాన్ని; చూచి; ఏను= నేను; కృతార్థుండను= తీరిన కోరికకలవాడను; అగుదున్+అని= అవుతా నని; వసిష్ఠుండు; మరణ, వ్యవసాయ, నివృత్తుండు+ఐ= చావుకొరకు చేసే ప్రయత్నంనుండి వెనుదిరిగినవా డై - అనగా ఆత్మహత్యా ప్రయత్నాన్ని మాని; నిజ+ఆశ్రమంబునన్= తన ఆశ్రమంలో; ఉండునంతన్= ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజు; రాక్షస, రూప, ధరుండు+ఐ= రాక్షస రూపాన్ని ధరించినవా డై; రౌద్ర+ఆకారంబునన్= భయంకరమైన రూపంతో; వచ్చు= వస్తూన్న; కల్మాషపాదున్; చూచి; అదృశ్యంతి (వసిష్ఠుడి కోడలు); వెఱచిన= భయపడిన; దానిన్= ఆమెను; ఓడక+ ఉండుము+అని= భయపడకుండు మని; మునివరుండు= మునిశ్రేష్ఠు డైన వసిష్ఠుడు; హుంకారంబున్= హుం అనే పెద్ద ధ్వనితో; రాక్షసున్= రక్కసుని; వారించి= ఆపి; వానిపై; మంత్ర, పూతంబులు+ఐన= మంత్రాలచేత పవిత్రాలైన; కమండలు, జలంబులు= కమండలంలోని నీళ్ళు; ఒలికినన్= చల్లగా.

**తాత్పర్యం:** 'ఎల్లప్పుడు వేదాలు చదవటమే స్వభావంగా శక్తియొక్కచదువు వింటూ పన్నెండుసంవత్సరాలు గర్భంలో ఉండి అన్నివేదాలు నేర్చుకొన్న ఈ మనుమడిముఖం చూచి, నేను కృతార్థుడ నౌతాను' అని వసిష్ఠుడు ఆత్మహత్యాప్రయత్నం మాని, తన ఆశ్రమంలో ఉండిపోయాడు. ఒకనాడు కల్మాషపాదుడు రాక్షస రూపాన్ని ధరించి రాగా అతడిని చూచి అదృశ్యంతి భయపడింది. వసిష్ఠుడు ఆమెను భయపడ వద్దని చెప్పి, తన హుంకారంతో ఆ రాక్షసుడిని నిలిపి, మంత్రపూతమైన కమండలుజలాన్ని అతనిపై చల్లాడు.

### వసిష్ఠువలనఁ గల్మాషపాదుండు శాపవిముక్తిఁ జెందుట (సం.1-168-5)

**క. భూపాలకుండు బ్రాహ్మణ । శాపంబునఁ బదియురెండుసంవత్సరముల్**
**పాపమతి నుండి రాక్షస । రూపము చెడి యపుడు మనుజరూపముఁ దాల్చెన్. 127**

**ప్రతిపదార్థం:** భూపాలకుండు= రాజైన కల్మాషపాదుడు; బ్రాహ్మణ, శాపంబునన్= బ్రాహ్మణశాపంచేత; పదియు, రెండు, సంవత్సరముల్= పండ్రెండేళ్ళు; పాప, మతిన్= పాపబుద్ధితో; ఉండి= ధరించి; అప్పుడు, రాక్షస, రూపము; చెడి= కోల్పోయి; మనుజ, రూపమున్; తాల్చెన్.

**తాత్పర్యం:** కల్మాషపాదమహారాజు బ్రాహ్మణశాపంవలన పన్నెండేళ్లు పాపబుద్ధితో ఉండి, అప్పుడు రాక్షస రూపాన్ని వదలి, మానవరూపాన్ని పొందాడు.

**వ. ఇట్లు శాపవిముక్తుం డై కల్మాషపాదుండు వసిష్ఠునకు నమస్కరించి ముకుళితకరకమలుఁ డై 'మునీంద్రా! నీ ప్రసాదంబున శాపంబువలనం బాసి కృతార్థుండ నయితి' ననిన వానికి వసిష్ఠుం డి ట్లనియె. 128**

**ప్రతిపదార్థం:** ఇట్లు; శాప, విముక్తుండు+అయి= శాపంచేత విముక్తి పొందినవాడై; కల్మాషపాదుండు; వసిష్ఠునకున్, నమస్కరించి; ముకుళిత, కర, కమలుండు+ఐ= మోడ్పుగా చేయబడిన కమలాలవంటి చేతులు కలవాడై; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠా!; నీ, ప్రసాదంబునన్= నీ దయచేత; శాపంబువలనన్= శాపంనుండి; పాసి= విముక్తినొంది; కృత+అర్థుండను= నెరవేరిన కోరిక కలవాడను; అయితిన్= అయినాను; అనినన్= అని చెప్పగా; వానికిన్= ఆ కల్మాషపాదునికి; వసిష్ఠుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా శాపవిముక్తి పొంది కల్మాషపాదుడు వసిష్ఠునికి నమస్కరించి చేతులు జోడించి 'మునిశ్రేష్ఠా! నీ దయవలన శాపవిముక్తి పొంది కృతార్థుడ నయ్యాను' అని పల్కగా, అతనితో వసిష్ఠుడు ఇట్లా అన్నాడు.

**చ. గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడుభక్తుఁడ వై సమస్త ధా**
**రుణి ప్రజ గూర్పఁగా విగతరోషుఁడ వై సుఖ ముండు మింక బ్రా**
**హ్మణుల కవజ్ఞసేయక శమంబును చేకొను; మింద్రుఁడైన బ్రా**
**హ్మణుల కవజ్ఞసేసి యవమానముఁ బొందుఁ బ్రతాపహీనుఁడై. 129**

**ప్రతిపదార్థం:** గుణములన్= మంచిగుణాలచేత; ఒప్పి= ప్రకాశించి; బ్రాహ్మణులకున్; కడున్= మిక్కిలి; భక్తుఁడవు+ఐ; సమస్త; ధారుణి, ప్రజ= మొత్తం భూమియందలి ప్రజలు; కూర్పఁగా= ప్రేమింపగా; విగత, రోషుఁడవు+ఐ= పోయిన కోపం కలవాడ వై; సుఖము+ఉండుము= సుఖంగా ఉండుము; ఇంకన్= ఇకమీదట; బ్రాహ్మణులకున్; అవజ్ఞ= అవమానం; చేయక= కలిగించకుండా; శమంబును= శాంతిని; చేకొనుము= పొందుము; ఇంద్రుఁడు+ఐనన్= ఇంద్రుడు అయినప్పటికీ; బ్రాహ్మణులకున్; అవజ్ఞ= అవమానం; చేసి; ప్రతాప; హీనుఁడు+ఐ= పరాక్రమాన్ని కోల్పోయినవా డై; అవమానమున్, పొందున్= అవమానాన్ని పొందుతాడు.

**తాత్పర్యం:** మంచిగుణాలతో బ్రాహ్మణభక్తుడ వై; భూమిమీద ప్రజ లందరికీ ఇష్టుడ వై, కోపం లేకుండా, సుఖంగా జీవించుము. బ్రాహ్మణులను అవమానించక శాంతిని పొందుము. బ్రాహ్మణులకు అవమానం చేస్తే, ఇంద్రుడైనా పరాక్రమహీనుడై అవమానం పొందగలడు.

**విశేషం:** అలం : అర్థాంతరన్యాసం.

నన్నయకు "ధారుణి" (భూమి అని అర్థం) పదప్రయోగం చాలా ఇష్టం. ఈ పద్యం రెండవపాదంలో "ధా/రుణి....రోష" అని యతి స్థానములో 'ధారుణి'లోని "రు" వచ్చి-ఈ రూపాన్ని స్థిరపరచింది.

**వ. అని కఱపిన నట్లచేయుదు నని యమ్మహీపతి వసిష్ఠుం దోడ్కొని, యయోధ్యాపురంబున కరిగి, సకల ప్రజానురాగ కరుం డయి యమ్మునివరు నతిభక్తిం బూజించుచుఁ, దొల్లి రాక్షసుం డయి మదయంతీ సహితంబు వనంబునం గ్రుమ్మరియెడి కాలం బొక్క బ్రాహ్మణ మిథునంబు ఋతుకాలప్రవృత్తి నున్నం గని యాఁ కంటి పెలుచన నందు బ్రాహ్మణుం బట్టికొని భక్షించిన, నతిదుఃఖిత యై యాబ్రాహ్మణభార్య పరమ పతివ్రత యాంగిరసి యనునది పురుషవియోగంబునం బుత్రార్థంబయిన నిజప్రయత్నంబు విఫలం బగుటకు శోకించి, 'వనితాసంభోగంబున నీవును నా పురుషునట్లు పంచత్వంబునుం బొందు' మని శాపం బిచ్చి వసిష్ఠువలన నీకుఁ బుత్రలాభం బగు నని చెప్పి, యగ్నిప్రవేశంబు సేసినం, బదంపడి దీని నంతయు మదయంతివలన నెఱింగినవాఁ డై, తనకుఁ బుత్త్రోత్పాదన సామర్థ్యంబు లేమిం దలంచి కల్మాషపాదుండు పుత్త్రార్థి యయి వసిష్ఠున కి ట్లనియె. 130**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; కఱపినన్= బోధించగా; అట్లు+అ; చేయుదున్+అని; ఆ+మహీ, పతి= ఆ రాజు (కల్మాషపాదుడు); వసిష్ఠున్ తోడ్కొని= వెంటపెట్టుకొని; అయోధ్యాపురంబునకున్; అరిగి= వెళ్ళి; సకల, ప్రజా+అనురాగ, కరుండు+అయి= అందరు ప్రజలకు ప్రేమను, కలిగించువా డై; ఆ+ముని, వరున్= ఆ మునిశ్రేష్ఠుడైన వసిష్ఠుడిని; అతి భక్తిన్= మిక్కిలి భక్తితో సేవిస్తూ; పూజించుచున్; తొల్లి= పూర్వం; రాక్షసుండు+అయి; మదయంతీ, సహితంబు= మదయంతితో

కూడి; వనంబునన్= అడవియందు; క్రుమ్మరియెడి= తిరిగెడి; కాలంబు= కాలంలో; ఒక్క; బ్రాహ్మణ, మిథునంబు= బ్రాహ్మణ దంపతుల జంట; ఋతుకాల, ప్రవృత్తిన్= కామకేళియందు; ఉన్నన్= ఉండగా; కని=చూచి; ఆఁకంటి, పెలుచనన్= ఆకలియొక్క అతిశయంచేత; అందున్= ఆ జంటలో; బ్రాహ్మణున్= బ్రాహ్మణుని; పట్టికొని, భక్షించినన్= తినగా; ఆ బ్రాహ్మణ భార్య= ఆ బ్రాహ్మణుని ఇల్లాలు; పరమ, పతివ్రత= మహాపతివ్రత; ఆంగిరసి అనునది= ఆంగిరసి అను ఆమె; అతి, దుఃఖిత+ఐ= మిక్కిలి దుఃఖించిన దై; పురుష, వియోగంబునన్= భర్తను కోల్పోవటంచేత; పుత్త్ర+అర్థంబు+అయిన= పుత్రుని కొరకైన; నిజ, ప్రయత్నంబు= తన యొక్క ప్రయత్నం; విఫలంబు+అగుటన్= ఫలము లేని దగుటకు; శోకించి= దుఃఖించి; వనితా, సంభోగంబునన్= స్త్రీతో రమించేటప్పుడు; నీవును= నీవు కూడా; నా, పురుషున్+అట్ల= నా భర్తవలె; పంచత్వంబునున్= మరణమును; పొందుము+అని; శాపంబు+ఇచ్చి; వసిష్ఠునివలనన్; నీకున్; పుత్త్ర, లాభంబు; అగున్+అని= చెప్పి; అగ్ని, ప్రవేశంబు= నిప్పులో దూకుట; చేసినన్= చేయగా; పదంపడి= పిమ్మట; దీనిన్+అంతయున్= ఈ జరిగినదాని నంతయు; మదయంతివలనన్= తనభార్య యైన మదయంతివలన; ఎఱింగినవాడై= తెలిసిన వాడై; తనకున్; పుత్త్ర+ఉత్పాదన, సామర్థ్యంబు లేమిన్= కొడుకును పుట్టించే శక్తి లేకుండుటను; తలంచి; కల్మాష పాదుండు; పుత్త్ర+అర్థి, అయి= పుత్రుడిని కోరినవాడై; వసిష్ఠునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని వసిష్ఠుడు బోధింపగా, ఆ విధంగానే చేస్తా నని ఆ రాజు వసిష్ఠుడిని వెంటబెట్టుకొని అయోధ్యా నగరానికి వెళ్లి, ప్రజలందరికి ఇష్టు డై ఆ ముని శ్రేష్ఠుణ్ణి అతిభక్తితో పూజించసాగాడు. పూర్వం తాను రాక్షసుడై, తనభార్య మదయంతితో కూడి అడవిలో తిరిగేకాలంలో ఒక బ్రాహ్మణదంపతులజంట కామకేళిలో ఉండటం చూచి, అధికమైన ఆకలితో బ్రాహ్మణుడిని పట్టుకొని భక్షింపగా, అతనిభార్య పరమపతివ్రత 'ఆంగిరసి' మిక్కిలి దుఃఖించి, భర్తను కోల్పోవటంవలన కొడుకు పుట్టా లన్న తనకోరిక విఫలమైన దని శోకించి, 'స్త్రీతో రమించినప్పుడు నీవుకూడా నా భర్తవలె అకాలమరణం పొందుతావు' అని శపించి, 'వసిష్ఠునివలన నీకు పుత్రలాభం కలుగుతుంది' అని చెప్పి, అగ్నిప్రవేశం చేసింది. తరువాత ఈ విషయమంతా మదయంతి ద్వారా తెలిసికొని, తనకు పుత్రులను పొందే యోగ్యత లే దని ఆలోచించి, కల్మాషపాదుడు పుత్రుణ్ణి కోరినవాడై వసిష్ఠునితో ఇట్లా అన్నాడు.

### వసిష్ఠప్రసాదంబునఁ గల్మాషపాదుఁడు పుత్త్రవంతుఁడగుట (సం.1-168-11)

**క. మనుకుల పవిత్రుఁ బుత్త్రకు । నినసన్నిభు ! నాకుఁ బడయు; మే నట్లయినన్**
**మునినాథ! నీ ప్రసాదం । బునఁ బితరులవలన ఋణవిముక్తుఁడ నగుదున్. 131**

**ప్రతిపదార్థం:** మను, కుల, పవిత్రున్= మనువువంశాన్ని పరిశుద్ధం చేసేవాడిని; పుత్త్రకున్= చక్కటి కుమారుడిని; ఇన, సన్నిభున్= సూర్యుడితో సమానమైనవాడిని; నాకున్; పడయుము= పొందుము; ఏను= నేను; అట్లు+అయినన్= ఆ విధంగా అయితే కానీ; మునినాథ!= ఓ మునిశ్రేష్ఠా!; నీ ప్రసాదంబునన్= నీదయచేత; పితరులవలనన్= పితృదేవతలవలన; ఋణ, విముక్తుఁడన్= అప్పునుండి విడువబడినవాడను; అగుదున్= ఔతాను.

**తాత్పర్యం:** ఓ వసిష్ఠమహర్షీ! మనువువంశాన్ని పవిత్రంచేసేవాడు, సూర్యునితో సమానమైనవాడు అయిన సుపుత్రుడిని నాకు కలిగించుము. నేను ఆ విధంగా నీదయతో పితృదేవతల ఋణంనుండి విముక్తుడ నౌతాను.

**వ. అని తన భార్యయైన మదయంతి యనుదానిని ఋతుమతి సమర్పించిన, నదియు వసిష్ఠుప్రసాదంబున గర్భిణి యయి పండ్రెండేఁడులు గర్భంబు మోచి వేసరి, యొక్క యశ్మశకలంబున నుదరభేదనంబుఁ జేసిన నశ్మకుం**

**డను రాజర్షి పుట్టె; నట యదృశ్యంతికిం బరాశరుం డుదయించి వసిష్ఠ నిర్మిత జాతకర్మాదికుండయి పెరుఁ గుచు నొక్క నాఁడు రాక్షసభక్షణంబునం దనజనకు పంచత్వంబు దల్లివలన విని కోపదహనదందహ్యమాన హృదయుం డయి 'తపోమహత్త్వంబున నఖిలలోకసంహారంబు సేయుదు' నని యున్న మనుమని వారించి వసిష్ఠుం డి ట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** అని= ఆప్రకారం; తన భార్య, ఐన, మదయంతి అను దానిని= మదయంతి అనే పేరుగల ఆమెను; ఋతుమతిన్= రజస్వల యైన దానిని; సమర్పించినన్= ఈయగా; అదియు= ఆమెయు; వసిష్ఠు, ప్రసాదంబునన్= వసిష్ఠుని దయచేత; గర్భిణి; అయి; పంద్రెండు+ఏఁడులు= పంద్రెండు సంవత్సరాలు; గర్భంబు, మోచి= గర్భాన్ని మోసి; వేసరి= విసుగుచెంది; ఒక్క; అశ్మ, శకలంబునన్= రాతిముక్కచేత; ఉదర భేదనంబునున్= కడుపు చీల్చుటను; చేసినన్= చేయగా; అశ్మకుండు, అను, రాజర్షి; పుట్టెన్= పుట్టాడు; అట; అదృశ్యంతికిన్= అదృశ్యంతికి; పరాశరుండు; ఉదయించి= పుట్టి; వసిష్ఠ, నిర్మిత, జాతకర్మ+ఆదికుండు+అయి= వసిష్ఠునిచేత చేయబడిన జాతకర్మం మొదలైనవి కలవాడై; పెరుగుఁచు; ఒక్కనాఁడు; రాక్షస, భక్షణంబునన్= రాక్షసుడు తినటంచేత; తన, జనకు, పంచత్వంబు= తనతండ్రియొక్క మరణం; తల్లివలన; విని; కోప, దహన, దందహ్యమాన హృదయుండు+అయి= కోప మనే అగ్నిచేత మిక్కిలిగా కాల్చబడుతున్న మనస్సు కలవా డై; తపస్+మహత్త్వంబునన్= తపస్సు యొక్క మహిమచేత; అఖిల, లోక, సంహారంబునన్= అన్ని లోకాలను చంపటం; చేయుదును=చేస్తాను; అని (కోపంతో) ఉండే; మనుమని, వారించి= పౌత్రుణ్ణి ఆపి; వసిష్ఠుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని, రజస్వల అయిన తన భార్య మదయంతిని వసిష్ఠునికి సమర్పించగా ఆమె అతని అనుగ్రహంతో గర్భిణి అయి, పన్నెండేళ్ళు గర్భం మోసి విసిగి, ఒక రాతిముక్కతో కడుపు చీల్చుకొనగా, అశ్మకుడు అనే రాజర్షి జన్మించాడు. అక్కడ అదృశ్యంతికి (శక్తి భార్యకు) పరాశరుడు జన్మించాడు. అతనికి వసిష్ఠుడు జాతకర్మాదులు జరిపించాడు. అతడు పెరుగుతూ 'రాక్షసుడు భక్షించటంచేత తనతండ్రి మరణించా డని ఒకనాడు తల్లి ద్వారా తెలిసికొని, కోపాగ్నితో మండుతున్న హృదయం కలవాడై తన తపోమహిమతో అఖిలలోకాలను నాశనం చేస్తా నని పూనుకొనగా అతడిని ఆపి, వసిష్ఠమహాముని ఇట్లా అన్నాడు.

**సీ. వినవయ్య! కృతవీర్యుఁ డను జనపతి దొల్లి । భృగు వంశ యాజ్యుఁ డై పెక్కుక్రతువు**
**లొనరించి, యగణిత ధనదానముల వారిఁ । దృప్తులఁ గావించి దివికిఁ జనిన,**
**నతనివంశమున వా రతిధనలుబ్ధులై । కృత్యవీర్యు ధనమెల్లఁ గ్లప్తి సేసి**
**కొని డాఁచియున్న వా రని భార్గవుల నెల్లఁ । బలికిన భార్గవుల్ భయము వొంది.**

**తే. కొంద ఱర్థము వారిక కూర్చి యిచ్చి; । రవనిసురవంశ్యులకు నిచ్చి రందుఁ గొంద,**
**ఱెవ్వరికి నీక తమ తమ యిండ్లఁ బాఁతి । కొని సుఖం బుండి రధము లై కొంద ఱందు. 133**

**ప్రతిపదార్థం:** వినవయ్య!= అయ్యా! విను; కృతవీర్యుఁడు; అను, జన, పతి= అనెడి రాజు; తొల్లి= పూర్వం; భృగు, వంశ, యాజ్యుఁడు+ఐ= భృగువంశం వారిని యాజ్యులుగా - అనగా యజ్ఞం చేయించే యాజ్ఞికులుగా కలవా డై; క్రతువులు= అనేక యజ్ఞాలు; ఒనరించి= చేసి; అగణిత, ధన, దానములన్= లెక్కలేనన్ని ధనదానాలచేత; వారిన్= వాళ్ళను; తృప్తులన్+కావించి= తృప్తినొందిన వారినిగా చేసి; దివికిన్= స్వర్గానికి; చనినన్= వెళ్ళగా; అతని, వంశము, వారు; అతి ధనలుబ్ధులు+ఐ= మిక్కిలిగా

ధనమునందు ఆశకలవారై; కృతవీర్య, ధనము+ఎల్లన్= కృతవీరునియొక్క ధనాన్ని అంతా; క్లృప్తి, చేసికొని= ఏర్పాటు చేసికొని; డాఁచి, ఉన్నవారు= దాచుకొని ఉన్నారు; అని= అని; భార్గవులన్+ఎల్లన్= భృగువంశం వారి నందరిని ఉద్దేశించి; పలికినన్= పలుకగా; భార్గవుల్= ఆ భృగువంశ బ్రాహ్మణులు; భయము, పొంది; కొందరు; అర్థము= ధనాన్ని; వారికి+అ= వారికే; కూర్చి= ఒకటిగా చేర్చి; ఇచ్చిరి= ఇచ్చారు; అందున్= వారిలో; కొందఱు= కొంతమంది; అవని, సుర, వంశ్యులకున్= బ్రాహ్మణ వంశాన పుట్టిన వారికి; ఇచ్చిరి; అందు, కొందఱు= అందులో మరికొంతమంది; ఎవ్వరికిన్= ఎవ్వరికికూడా; ఈక= ఇవ్వక; అధములు+ఐ= నీచులై; తమతమ, ఇండ్లన్; పాతికొని, సుఖంబు+ఉండిరి= తమ తమ ఇళ్ళలో పాతిపెట్టుకొని సుఖంగా ఉన్నారు.

**తాత్పర్యం:** వినవయ్యా! పూర్వం కృతవీర్యు డనే రాజు భృగువంశబ్రాహ్మణులను యాజ్ఞికులుగా పొంది, పెక్కు యాగాలు చేసి, లెక్కలేనన్ని ధనదానాలచే వాళ్ళను తృప్తిపరచి స్వర్గానికి వెళ్ళాడు. అతనివంశంవాళ్ళు ధన లోభంతో 'కృతవీరుని ధనాన్నంతా భృగువంశబ్రాహ్మణులు సంగ్రహించి దాచుకొని ఉన్నారు' అని పలుకగా, ఆ బ్రాహ్మణులు కొందరు భయపడి తమ దగ్గర ఉన్న ధనాన్ని ఒకచోట చేర్చి వాళ్ళకే ఇచ్చారు. మరికొందరు తమధనాన్ని వేర్వేరు బ్రాహ్మణవంశాలవాళ్ళకు ఇచ్చారు. ఇంక కొందరు తమ ఇళ్లలో పాతిపెట్టుకొన్నారు.

**వ. అంత నా క్షత్త్రియు లొక్క భార్గవుని యిల్లు గ్రొచ్చి యనంతం బయిన యర్థంబు గని యలిగి, రాజధన వంచకులై రని భార్గవుల నెల్ల నిగ్రహించి, గర్భంబుల నున్న యర్భకులు మొదలుగా వధించిన, వెఱచి భార్గవుల భార్యలెల్ల హిమవంతంబునకుం బాఱిన; నం దొక్క భృగుపత్ని భయంపడి, తన యూరుదేశంబున గర్భంబు ధరియించిన, నెఱింగి క్షత్త్రియులు దాని భేదింప సమకట్టి వచ్చిన నంతకు ముందఱ. 134**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; ఆ క్షత్రియులు= ఆ రాజులు; ఒక్క, భార్గవుని, ఇల్లు= ఒక భృగువంశ బ్రాహ్మణుని ఇల్లు; క్రొచ్చి= త్రవ్వి; అనంతంబు+అయిన= అంతం లేనిదైన అనగా అత్యధిక మైన, అర్థంబున్= ధనాన్ని; కని= చూచి; అలిగి= కోపించి; రాజ, ధనవంచకులు+ఐరి+అని= రాజుయొక్క ధనాన్ని అపహరించిన వాళ్ళు అయ్యా రని; భార్గవులన్+ఎల్లన్= భృగువంశ బ్రాహ్మణుల నంతా; నిగ్రహించి= పడద్రోసి; గర్భంబులన్+ఉన్న= కడుపు లో ఉన్న; అర్భకులు= బాలురు; మొదలుగా; వధియించినన్= చంపగా; వెఱచి= భయపడి; భార్గవుల; భార్యలు+ఎల్లన్= భార్గవుల, భార్యలందరు; హిమవంతంబు నకున్= హిమాలయ పర్వతానికి; పాఱినన్= పరుగెత్తగా; అందు+ఒక్క= వారిలో ఒక్క; భృగుపత్ని= భృగువంశపు బ్రాహ్మణుని భార్య, భయంపడి; తన; ఊరు, దేశంబునన్= తొడయందు; గర్భంబు= గర్భాన్ని; ధరియించినన్= ధరింపగా; ఎఱింగి= తెలిసికొని; క్షత్రియులు= రాజులు; దానిన్= దానిని; భేదింపన్= చీల్చుటకు; సమకట్టి= పూనుకొని; వచ్చినన్= రాగా; అంతకు ముందఱ= అంతకంటె మునుపే.

**తాత్పర్యం:** తర్వాత ఆ క్షత్రియులు ఒక భృగువంశబ్రాహ్మణుని ఇల్లు త్రవ్వి అత్యధికమైన ధనం చూచి, కోపించి, రాజధనం వంచనతో గ్రహించా రని ఆ భృగువంశబ్రాహ్మణుల నందరినీ పడద్రోసి, కడుపులలో ఉన్న బాలురు మొదలుగా అందరినీ చంపగా, వాళ్ళభార్యలంతా భయపడి హిమాలయానికి పరుగెత్తారు. వాళ్ళలో ఒక బ్రాహ్మణునిభార్య తనతొడలో గర్భాన్ని ధరించగా, క్షత్రియులు అది తెలిసికొని దానినికూడ విచ్ఛిన్నం చేయా లని రాగా, అంతకు ముందే.

## భార్గవుండైన ఔర్వునిజననము (సం.1-169-20)

**క. భువనోపప్లవసమయో। ద్భవ భానునిభప్రభావిభాసితుఁ డయి భా**
**ర్గవుఁ డూరుదేశమున ను। ద్భవించె మహి వెలుఁగుచుండఁ బ్రభ నౌర్వుఁ డనన్. 135**

**ప్రతిపదార్థం:** భువన+ఉపప్లవ, సమయ+ఉద్భవ, భాను, నిభ, ప్రభా, విభాసితుఁడు+అయి= లోకాలయొక్క ప్రళయకాలమందు పుట్టిన సూర్యునితో సమానమైన కాంతిచేత ప్రకాశించేవా డై; భార్గవుఁడు= భృగువంశంవాడు; ఊరు, దేశమునన్= తొడయందు; ఔర్వుఁడు+అనన్= ఔర్వు డనే పేరుతో; ప్రభన్= కాంతితో; మహిన్= భూమిమీద; వెలుఁగుచుండన్= ప్రకాశించేటట్లుగా; ఉద్భవించెన్= పుట్టెను.

**తాత్పర్యం:** ప్రళయకాలసూర్యునివంటి కాంతితో భృగువంశంవాడు తొడనుండి పుట్టి ఔర్వు డనే పేరుతో లోక ప్రసిద్ధు డయ్యాడు.

**మ. అమితౌజుం డగు వానిఁ జూచి కృతవీర్యామ్నాయజ క్షత్త్రియా**
**ధములెల్లన్ హతదృష్టు లై కృపణతం దత్పర్వతారణ్యదే**
**శములం గ్రుమ్మరుచుండి రంధు లయి; నిశ్శంకం బ్రతిక్రూరక**
**ర్మములం దుద్యతు లైన వారికి నశర్మప్రాప్తి గాకుండునే. 136**

**ప్రతిపదార్థం:** అమిత+ఓజుండు+అగు= మిక్కిలి తేజస్సు కలవాడైన; వానిన్= ఆ ఔర్వుని; చూచి; కృతవీర్య+ఆమ్నాయజ, క్షత్త్రియ+అధములు+ఎల్లన్= కృతవీర్యుని వంశంలో పుట్టిన నీచులైన క్షత్త్రియులంతా; హత, దృష్టులు+ఐ= కొట్టబడిన చూపులు కలవాళ్ళయి అనగా నాశమైన దృష్టి కలవాళ్ళయి; అంధులు+అయి= గ్రుడ్డివాళ్ళయి; కృపణతన్= దీనత్వంతో; తద్+పర్వత, అరణ్య, దేశములన్= ఆ కొండలయొక్క, అడవులయొక్క ప్రదేశాలలో; క్రుమ్మరుచుండిరి= తిరుగుతూ ఉన్నారు; నిశ్శంకంబు= జంకులేకుండ; అతి, క్రూర, కర్మములందు= మిక్కిలి దుర్మార్గపు పనులలో; ఉద్యతులు+ఐన; వారికిన్= ప్రయత్నం కలవాళ్ళకి; అశర్మప్రాప్తి= సంతోషం కానిదానిని పొందటం - అనగా దుఃఖాన్ని పొందటం; కాకుండునే= జరుగకుండునా.

**తాత్పర్యం:** అమితమైన తేజస్సు కల ఆ ఔర్వుడిని చూచిన వెంటనే కృతవీర్యుని వంశంలో పుట్టిన క్షత్త్రియాధము లంతా దృష్టి కోల్పోయి, గ్రుడ్డివా ళ్ళయి దైన్యంతో ఆ పర్వతారణ్యప్రదేశాలలో తిరుగుతూ ఉండిపోయారు. జంకు లేకుండ పరమదుర్మార్గపుపనులు చేయటానికి ప్రయత్నించేవాళ్ళకు దుఃఖం ప్రాప్తించకుండా ఉంటుందా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ. అ ట్లా క్షత్త్రియు లందఱు నంధు లై భృగుపత్ని యొద్దకు వచ్చి, మాకు దృష్టిదానంబుఁ బ్రసాదింపవలయు నని వేఁడిన నది వారల కి ట్లనియె. 137**

**ప్రతిపదార్థం:** అట్లు; ఆ క్షత్త్రియులు; అందఱున్; అంధు లై= గ్రుడ్డివాళ్ళయి; భృగుపత్ని= భృగువు భార్య; వద్దకు= దగ్గరకు; వచ్చి= చనుదెంచి; మాకున్; దృష్టి= చూపు; దానంబున్= ఇచ్చుట; ప్రసాదింపవలయును; అని= అని; వేఁడినన్= ప్రార్థింపగా; అది, వారలకున్= ఆమె వాళ్లతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ విధంగా ఆ క్షత్రియులంతా గ్రుడ్డివాళ్ళయి భృగుభార్యవద్దకు వచ్చి 'మాకు చూపు మరల ప్రసాదించు' మని వేడుకోగా ఆమె వాళ్ళతో ఇట్లా అన్నది.

**మధ్యాక్కర.**

**ఏను మీ దృష్టులు గొన్నదానఁ గా; నిక్కుమారుండు**
**భానుతేజుండు మీచేఁ దనగురులు పరిభూతు లయిన**
**దానికి నలిగి మీ పాపబుద్ధికిఁ దగ నిట్లు సేసె;**
**వీని మే రెఱుఁగరె భార్గవకులము వెలిఁగించువాని. 138**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మీ, దృష్టులు= మీ చూపులను; కొన్న, దానన్= తీసికొన్న దానను - అనగా మీకు లేకుండ చేసిన దానను; కాన్= కాను; ఈ+కుమారుండు; భాను, తేజుండు= సూర్యునితో సమానమైన తేజస్సుకలవాడు; మీచేన్= మీ చేత; తన, గురులు= తన తండ్రి తాతలు; పరిభూతులు= అవమానింపబడినవాళ్ళు; అయిన, దానికిన్= అయినందుకు; అలిగి= కోపించి; మీ, పాప, బుద్ధికిన్= మీ యొక్క పాపచింతనకు; తగన్= తగినట్లు; ఇట్లు; చేసెన్; భార్గవ, కులము; వెలిఁగించువాని; వీని, మీరు+ఎఱుఁగరే= ఇతనిని మీరు ఎరుగరా?

**తాత్పర్యం:** మీ చూపులను నేను పోగొట్టలేదు. ఈ కుమారుడు సూర్యసమానమైన తేజస్సు కలవాడు. తన తండ్రితాతలను మీరు అవమానించా రని కోపించి, మీ పాపబుద్ధికి తగినట్లు ఇట్లా చేశాడు. భార్గవకులాన్ని ప్రకాశింపజేసే వీడిని మే రెరుగరా?

**వ. 'ఇ క్కుమారుండు నూఱు సంవత్సరములు నా యూరు గర్భంబున నుండి సకల వేదవేదాంగంబులు నేర్చినవాఁడు, మహాతపోనిధి; మీకుం గరుణించు నితనిం బ్రార్థింపుం', డనిన, నాక్షత్రియులు నతిభక్తులై యౌర్వుం బ్రార్థించి తత్ప్రసాదంబున దృష్టులు వడసి చని; రంత నౌర్వుండు దన పితృబంధుజనులెల్ల నొక్కటం బరలోక గతు లగుటకు దుఃఖించి, సకలలోక ప్రలయార్థంబుగా ఘోరతపంబు సేయందొడంగిన. 139**

**ప్రతిపదార్థం:** ఈ+కుమారుండు; నూఱు, సంవత్సరములు; నా, ఊరు గర్భంబునన్= నా తొడయందు; ఉండి= నివసించి; సకల, వేద, వేద+అంగంబులు= అన్ని వేదములు, వేద వేదాంగములు; నేర్చినవాఁడు= అభ్యసించినవాడు; మహా, తపోనిధి= గొప్ప తపస్సునకు స్థానమైనవాడు; మీకున్= మిమ్ము; కరుణించున్= కరుణిస్తాడు; ఇతనిన్= వీనిని; ప్రార్థింపుండు= ప్రార్థించండి; అనినన్= అనగా; ఆ క్షత్రియులున్= ఆ క్షత్రియులు; అతి, భక్తులు+ఐ= మిక్కిలి భక్తికలవారై; ఔర్వున్, ప్రార్థించి= ఔర్వుని ప్రార్థించి (వేడుకొని); తత్+ప్రసాదంబునన్= అతనియొక్క దయచేత; దృష్టులు= చూపులు; పడసి= పొంది; చనిరి= వెళ్ళారు; అంతన్= అటుపై; ఔర్వుండు= ఔర్వుడు; తన, పితృ బంధుజనులు+ఎల్లన్= తన తండ్రులు, బంధువులు అందరు; ఒక్కటన్= ఒక్కటిగా, ఒక్కసారిగా; పరలోక, గతులు+అగుటకున్= మరొకలోకానికి వెళ్లినవారగుటకు; - అనగా మరణించినందుకు; దుఃఖించి; సకలలోక; ప్రలయ+అర్థంబుగాన్= అన్ని లోకాల నాశనంకొరకు; ఘోర తపంబు= భయంకరమైన తపస్సు; చేయన్+ తొడంగినన్= చేయటానికి పూనుకొనగా.

**తాత్పర్యం:** 'ఈ కుమారుడు వందసంవత్సరాలు నా ఊరువులో ఉండి వేదవేదాంగా లన్నిటిని నేర్చాడు; మహాతపోనిధి. ఇతడిని ప్రార్థించండి. మిమ్ములను కరుణిస్తాడు' అని పల్కగా, ఆ క్షత్రియులు మిక్కిలి భక్తి కలవాళ్ళయి ఔర్వుని

ప్రార్థించి, అతని దయతో తిరిగి దృష్టిని పొంది వెళ్ళిపోయారు. తర్వాత ఔర్వుడు తన తండ్రులు, బంధువులు అందరు ఒక్కసారిగా మరణించినందుకు దుఃఖించి, లోకాలన్నింటిని నాశనం చేసేందుకు భయంకరమైన తపస్సు చేయ పూనుకొన్నాడు.

**చ. అతని తపంబు పెంపునఁ జరాచరసంభృతమైన విష్టప**
**త్రితయము భీతిఁ బొందిన, ధృతిం బితృలోకనివాసు లైన త**
**త్పితృవరు లెల్ల వచ్చి కడుఁ బ్రీతి నపాకృత గర్వు నౌర్వు న**
**ప్రతిమతపోవిభాసిఁ గని పల్కిరి తద్దయు శాంతచిత్తులై. 140**

**ప్రతిపదార్థం:** అతని, తపంబు, పెంపునన్= ఆ ఔర్వుని తపస్సుయొక్క అధిక్యంచేత; చర+అచర, సంభృతము+అయిన= కదలిక కలవాటితో, కదలికలేని వాటితో నిండిన; విష్టప, త్రితయము= లోకాలు మూడు; భీతిన్= భయాన్ని; పొందినన్= పొందగా; ధృతిన్= సంతోషంతో; పితృలోక, నివాసులు+ఐన= పితృలోకంలో ఉన్నవాళ్ళయిన; తద్+పితృ, వరులు+ఎల్లన్= అతనియొక్క ఉత్తములైన తండ్రులంతా; వచ్చి; కడున్= మిక్కిలి; ప్రీతిన్= ప్రేమతో; అపాకృత, గర్వున్= తొలగింపబడిన గర్వం కలవాడిని; అప్రతిమ, తపస్+విభాసిన్= సాటిలేని తపస్సుచే ప్రకాశించేవాడిని; ఔర్వున్= ఔర్వుని; కని= చూచి; తద్దయున్= మిక్కిలి; శాంతచిత్తులు+ఐ= శాంతంతో కూడిన మనస్సుకలవాళ్ళయి; పలికిరి.

**తాత్పర్యం:** ఆ ఔర్వుని తీవ్రతపస్సుకు చరాచరాలతో కూడిన ముల్లోకాలు భీతిచెందగా, పితృలోకవాసులైన అతని తాతతండ్రులంతా సంతోషంతో వచ్చి మిక్కిలిప్రేమతో - గర్వం లేనివాడు, సాటిలేని తపస్సుతో ప్రకాశించేవాడు అయిన ఔర్వుడిని చూచి మిక్కిలి శాంతచిత్తులై ఈ విధంగా పలికారు.

## పితృదేవతలు ఔర్వుని శాంతచిత్తునిఁ జేయుట (సం.1-170-14)

**వ. 'అయ్యా! నీ తపో మహత్త్వంబుఁ జూచి లోకంబు లెల్ల భయంపడియెడు; లోకానుగ్రహంబుగా నీరోషంబు విడువుము; మే మసమర్థుల మై క్షత్రియులచేత వధియింపం బడిన వారము గాము; ధనలుబ్ధుల మయి ధనంబు దాఁచినవారము గాము; ధనము వలసినం గుబేరుండు దాన మాకుఁ దెచ్చి యిచ్చుం; దపోమహత్త్వంబున మాకు నాయువు గడుంబెద్దయైన నిర్వేదించి మనుష్యలోకంబున నుండ నొల్లక యాత్మఘాతంబునం బుణ్యలోకంబులు లేమిం జేసి దానిం బరిహరించి యా క్షత్రియులతో వైరం బమర్చికొని తన్నిమిత్తంబున దేహంబులు విడిచితిమి; భార్గవులతేజంబు నొరులు పరిభవింప నోపుదురె? కావున నీవు దీనికింగా సర్వజనోపద్రవంబు సేయవల; దిది మా కభీష్టం' బనిన నౌర్వుండు వారల కి ట్లనియె. 141**

**ప్రతిపదార్థం:** అయ్యా; నీ, తపస్+మహత్త్వంబున్= నీ తపస్సుయొక్క గొప్పతనాన్ని; చూచి; లోకంబులు+ఎల్లన్; భయంపడియెడు; లోక+అనుగ్రహంబుగా= లోకాలకు మేలు కలిగేటట్లుగా; నీ, రోషంబు= నీ కోపాన్ని; విడువుము; మేము= అందరము; అసమర్థులము+ఐ= శక్తిలేని వారమై; క్షత్రియులచేత; వధియింపన్+పడిన, వారము కాము= చంపబడినవాళ్ళం కాము; ధన, లుబ్ధులము+అయి= ధనమునందు మిక్కిలి ఆశ కలవాళ్ళ మై; ధనంబు= ధనాన్ని; దాచిన వారము కాము= దాచిపెట్టిన వాళ్లం కాము; ధనము; వలసినన్= అవసరమైతే; కుబేరుండు; తాన్+అ= తానే; మాకున్; తెచ్చి ఇచ్చున్; తపస్+మహత్త్వంబునన్=

తపస్సుయొక్క మహిమచేత; మాకున్= మాకు; ఆయువు= ఆయుష్యం; కడున్= మిక్కిలి; పెద్ద, ఐనన్= ఎక్కువ కాగా; నిర్వేదించి= విరక్తి చెంది; మనుష్య లోకంబునన్= మానవలోకంలో; ఉండన్= ఉండటానికి; ఒల్లక= ఇష్టపడక; ఆత్మ, ఘాతంబునన్= ఆత్మహత్యవలన; పుణ్యలోకంబులు; లేమిన్+చేసి= లేకుండటంవలన; దానిన్= ఆత్మహత్యను; పరిహరించి= వదలి; ఆ, క్షత్రియులతో; వైరంబు; అమర్చికొని= ఏర్పాటు చేసికొని; తద్+నిమిత్తంబునన్= ఆ కారణంగా; దేహంబులు, విడిచితిమి; భార్గవుల= భృగువంశం బ్రాహ్మణులయొక్క; తేజంబున్= కాంతిని, పరాక్రమాన్ని; ఒరులు= ఇతరులు; పరిభవింపన్+ ఓపుదురే= అవమానింపగలరా; కావునన్; నీవు; దీనికిన్+కా= దీనికొరకని; సర్వ, జన+ఉపద్రవంబు= అందరు ప్రజలకు హాని; చేయ, వలదు= చేయవద్దు; ఇది; మాకు; అభీష్టంబు= కోరిక; అనినన్= అని చెప్పగా; ఔర్వుండు; వారలకున్= వాళ్లకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నాయనా! నీ తపోమహిమ చూచి లోకా లన్నీ భయపడుతున్నాయి. లోకాలకు మేలు కలిగే విధంగా నీ కోపాన్ని వదలిపెట్టుము. మేము అసమర్థుల మై క్షత్రియులచేత వధింపబడ లేదు. ధనంమీది పేరాసతో ధనాన్ని దాచలేదు. మాకు ధనం అవసరమైతే, కుబేరుడు తానే తెచ్చి యిస్తాడు. తపోమహిమతో మాకు ఆయుష్యం మిక్కిలియెక్కువ కాగా విరక్తి చెంది, మానవలోకంలో ఉండటానికి ఇష్టం లేక, ఆత్మహత్య చేసికొంటే పుణ్యలోకాలు రావని, దాన్ని వదలి, ఆ క్షత్రియులతో వైరం తెచ్చుకొన్నాం. ఆ కారణంగా దేహాలు విడిచాం. భృగువంశ బ్రాహ్మణులు తేజస్సును ఇతరులు పరాభవించగలరా? కనుక దీనికై నీవు ప్రజలందరికీ హాని చేయవద్దు. ఇది మా కోరిక' అని పల్కగా ఔర్వుడు వాళ్ళతో ఇట్లా అన్నాడు.

**మత్తకోకిలము.**

**మానితం బగు నా తపోమహిమం బ్రిలోక పరాభవం**
**బేను జేయఁగఁ బూని చేసితి నిట్టి దొక్క ప్రతిజ్ఞ మున్,**
**దీని నెట్టులు గ్రమ్మఱింతు మదీయ భాషిత మెన్నఁడు**
**న్నేని మోఘము గాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁగన్. 142**

**ప్రతిపదార్థం:** మానితంబు+అగు= పూజింపబడినదయిన; నా, తపోమహిమన్ = నా తపస్సుయొక్క గొప్పతనంచేత; ఏను=నేను; త్రిలోక, పరాభవంబున్= ముల్లోకాల నాశనాన్ని; చేయఁగన్= చేయటానికి; పూని= ప్రయత్నించి; పూర్వము; ఇట్టిది= ఇటువంటిదైన, ఒక్క, ప్రతిజ్ఞ= ఒక్క ప్రతిన; చేసితిన్= చేశాను; దీనిన్= దీన్ని; ఎట్టులు= ఏ విధంగా; క్రమ్మరింతున్= మరలిస్తాను; దిక్+ధరణీ, రవి+ఇందులు= దిక్కులు, భూమి, సూర్యుడు, చంద్రుడు; ఎఱుంగఁగన్= తెలియగా; మదీయ, భాషితము= నాదైన మాట; ఎన్నఁడున్+ఏని= ఎన్నడైనా; మోఘము= వ్యర్థం; కాదు= కాజాలదు.

**తాత్పర్యం:** ప్రశస్తమైన నా తపోమహిమతో ముల్లోకాలను నాశనం చేస్తా నని పూర్వం నే నొక ప్రతిజ్ఞ చేశాను. దీనిని ఏ విధంగా మరలిస్తాను. దిక్కులు, భూమి, సూర్యచంద్రులు సాక్షులుగా నా మాట ఎన్నడూ వ్యర్థం కాదు.

**విశేషం:** ఔర్వుడు తన ప్రతిజ్ఞ వ్యర్థం కాదు అని చెప్పే సందర్భంలో ప్రతిజ్ఞాపాలన తప్ప దని నిర్ధారించాడు. అట్టి నిర్ధారణ వాక్యం ఏ స్వరంలో ఏ విధంగా ప్రకటించాలో ప్రస్తుత పద్యగతిలో ప్రతీయమానమైంది.

**క. మతి మఱచి యనిస్తీర్ణ। ప్రతిజ్ఞుఁ డగు వాని కోపపటుదహన మని**
**ర్గత మయి వడి నరణి సము। త్థిత దహనమపోలె నాత్మదేహము నేర్చున్. 143**

**ప్రతిపదార్థం:** మతిన్= మనస్సునందు; మఱచి; అనిస్తీర్ణ, ప్రతిజ్ఞుఁడు= దాటబడని ప్రతిజ్ఞ కలవాడు; అగు, వాని, కోప, పటు, దహనము= అయిన వ్యక్తియొక్క కోపం అనెడి గొప్ప అగ్ని; అనిర్గతము+అయి= బయటికి వెలువడని దై; అరణి, సమ్+ఉత్థిత, దహనము+అ పోలెన్= అరణియందు పుట్టిన నిప్పువలె, వడిన్= వేగమే; ఆత్మదేహమున్= తన శరీరాన్ని; ఏర్చున్= కాల్చును.

**తాత్పర్యం:** మరచిపోయి తన ప్రతిజ్ఞను నేరవేర్చుకొననివాడి కోపాగ్ని వెలుపలికి రానిదై, అరణిలో పుట్టిన అగ్నివలె వెంటనే అతనిశరీరాన్ని కాల్చివేస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అలయక నిమిత్తజంబగు । నలుకను క్షమియించి శాంతుఁ డగు పురుషుం డి**
**మ్ముల రక్షింపఁగ నోపునె । పొలుపుగ ధర్మార్థకామములు సమములుగన్. 144**

**ప్రతిపదార్థం:** అలయక= శ్రమపడక; నిమిత్తజంబు+అగు, అలుకను= కారణంవలన పుట్టిన దైవ కోపాన్ని; క్షమించి= ఓర్చి; శాంతుఁడు+అగు= శాంతం కలవాడైన; పురుషుండు= మానవుడు; పొలుపుగా= చక్కగా; ధర్మ+అర్థ, కామములు= ధర్మం, అర్థం, కామం అనే పురుషార్థాలు; సమములుగన్= సమానాలుగా; ఇమ్ములన్= తగినట్లుగా; రక్షింపఁగన్+ఓపునె= రక్షింప కలుగునా.

**తాత్పర్యం:** ఒక కారణంవలన కలిగిన కోపాన్ని తీర్చుకొనటానికి శ్రమపడక, సహించి శాంతు డైన మానవుడు ధర్మార్థకామాలను చక్కగా, సమానంగా రక్షించగలడా?

**తే. పాపు లై క్షత్త్రియాధముల్ భార్గవులకు । నట్లు హింస గావించు నాఁ డార్తనాద**
**మూరుగర్భగతుండనై యుండి వినిన । నాఁడ కోప మసహ్యమై నన్నుఁ బొందె. 145**

**ప్రతిపదార్థం:** పాపులు+ఐ= దుర్మార్గు లై; క్షత్త్రియ+అధముల్= నీచు లైన క్షత్రియులు; భార్గవులకున్= భృగువంశ బ్రాహ్మణులకు; అట్లు; హింస, కావించునాఁడు= ఆ విధంగా హింస చేసే రోజు, ఆర్తనాదము= దుఃఖధ్వని; ఊరు, గర్భ, గతుండను+ఐ= తొడలోపల ఉన్నవాడనై; ఉండి= వసించి; వినిన, నాఁడు+అ= వినిన రోజే; కోపము; అసహ్యము+ఐ= ఓర్వరాని దై; నన్నున్; పొందెన్.

**తాత్పర్యం:** దుర్మార్గులై, నీచు లైన క్షత్రియులు - భృగువంశ బ్రాహ్మణులను ఆ విధంగా హింసిస్తున్నవాడే, వాళ్ళ దుఃఖధ్వనిని నేను తొడలోపల ఉండి విన్నప్పుడే నాకు సహించరాని కోపం కలిగింది.

**తే. ఎఱుక గలఁ డేని మఱి శక్తుఁ డేని యన్యు । లన్యులకు హింస గావించునపుడు దానిఁ**
**బూని వారింపకున్న నప్పురుషుఁ డేఁగు । హింస చేసినవారల యేఁగుగతికి. 146**

**ప్రతిపదార్థం:** ఎఱుక=జ్ఞానం; కలఁడు+ఏని= ఉన్నవాడైతే; అన్యులు= ఇతరులు; అన్యులకున్= ఇతరులకు; హింస, కావించు, నపుడు; దానిన్= ఆ హింసను; పూని= ప్రయత్నించి; వారింపక+ఉన్నన్= ఆపకున్నట్లయితే; ఆ+పురుషుఁడు; హింస, చేసిన వారల; ఏఁగు గతికిన్= వెళ్ళే మార్గానికి (చోటుకి) (నరకానికి అని భావం).

**తాత్పర్యం:** జ్ఞానవంతుడు, సమర్థుడు అయినవాడు - ఒకరు మరొకరిని హింసించే సమయంలో ప్రయత్నించి ఆ హింసను నివారించకుంటే, అతడుకూడ ఆ హింస చేసినవాళ్ళగతినే (నరకాన్నే) పొందుతాడు.

**విశేషం:** నన్నయ రుచిరార్థసూక్తి.

**వ. 'కావున లోకంబులయందు సామర్థ్యంబు గలిగి పాప ప్రతిషేధంబు సేయని వారల నుద్దేశించి యలిగితి; నేనును మీ వచనంబతిక్రమింప నోడుదు; నఖిలలోకదహనోద్యతం బయిన నా కోపదహనంబు నిగృహీతం బయిన నన్ను దహించు; నేమి సేయు వాఁడ? మీరు సర్వలోకహితులరు; నాకును లోకంబులకును హితం బగునట్లుగా నుపదేశింపుఁ' డనిన నౌర్వునకుం బితరు లి ట్లనిరి. 147**

**ప్రతిపదార్థం:** కావునన్; లోకంబుల అందున్= లోకాలలో; సామర్థ్యంబు; కలిగి; పాప, ప్రతిషేధంబు= పాపాన్ని ఆపటాన్ని; చేయని వారలన్= చేయనివాళ్లను; ఉద్దేశించి; అలిగితిని= కోపించాను; ఏనును= నేనుకూడ; మీ, వచనంబు= మీ మాట; అతిక్రమింపన్= దాటుటకు; ఓడుదును= భయపడతాను; అఖిల, లోక, దహన+ఉద్యతంబు+అయిన= అన్ని లోకాలను కాల్చటానికి పూనుకొన్న; నా, కోప, దహనంబు= నా కోప మనే నిప్పు; నిగృహీతంబు+అయినన్= నివారింపబడిన దైతే; నన్ను+అ= నన్నే; దహించున్= కాల్చును; ఏమి, చేయువాఁడన్= నేనేమి చేయాలి; మీరు; సర్వలోక, హితులరు= అన్ని లోకాలకు మేలు కోరేవారు; నాకును, లోకంబులకును, హితంబు+అగునట్లుగాన్= నాకూ, లోకాలకూ మేలు కలిగేటట్లుగా; ఉపదేశింపుఁడు; అనినన్= అని అడుగగా; ఔర్వునకున్= ఔర్వునికి; పితరులు= పితృదేవతలు; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** 'అందుచేత లోకాలలో - సామర్థ్యం ఉండి, పాపాన్ని ఆపటానికి ప్రయత్నంచేయనివాళ్ళను ఉద్దేశించి కోపం వహించాను. నేను మీ మాట దాటటానికి భయపడతాను. లోకాలన్నింటిని దహించటానికి పూనుకొన్న నా కోపాగ్నిని ఆపితే, అది నన్నే దహిస్తుంది. ఇప్పు డేం చేయాలి? నాకూ, ఈ లోకాలకూ మేలు కలిగే విధంగా ఉపదేశించండి' అని పల్కఁగా ఔర్వునితో పితృదేవతలు ఇట్లా అన్నారు.

**ఆ. జలములంద యుండు సర్వలోకంబులు । గాన నీ మహోగ్ర కలుష వహ్ని**
**జలధిలోన విడిచి సత్యప్రతిజ్ఞుండ । వగుము; జలధి జలము నది దహించు. 148**

**ప్రతిపదార్థం:** సర్వ, లోకంబులు= అన్ని లోకాలు; జలములు+అంద= నీటియందే; ఉండున్= ఉంటాయి; కాన= కనుక; నీ, మహా+ఉగ్ర, కలుషవహ్నిన్= నీయొక్క మిక్కిలి భయంకరమైన కోప మనే అగ్నిని; జలధిలోనన్= సముద్రంలో; విడిచి; సత్య, ప్రతిజ్ఞుఁడవు= సత్యమైన ప్రతిజ్ఞ కలవాడవు; అగుము= కావలసింది; ఆ కోపాగ్ని; జలధి, జలమున్= సముద్రపు నీటిని; దహించున్= కాల్చుతుంది.

**తాత్పర్యం:** అన్నిలోకాలూ నీటిలోనే ఉంటాయి. కనుక మహాభయంకరమైన నీ కోపాగ్నిని సముద్రంలో విడిచిపెట్టి; నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకో. అది సముద్రంలోని నీటిని దహిస్తుంది.

**వ. 'అనిన నౌర్వుండు పితృదేవతాదేశంబునఁ దన కోపానలంబు సముద్రంబులో వైచిన, నది యౌర్వానలంబు నా నశ్వముఖంబున నబ్ధిజలంబులఁ ద్రావుచుండు; నిది వేదంబులయందు వినంబడియెడుకథ గావున నీవును నౌర్వునట్ల ధర్మవిదుండవు భువనపరిభావి యైన యీ క్రోధంబు విడువు' మనిన వసిష్ఠు వచనంబునం బరాశరుండు గోపం బుపసంహరించి, రాక్షసవినాశార్థంబుగా సత్త్రయాగంబు సేయం గడంగిన. 149**

**ప్రతిపదార్థం:** అనినన్= అని తెలుపగా; ఔర్వుండు; పితృదేవతా+ఆదేశంబునన్= పితృదేవతలయొక్క ఆజ్ఞచేత; తన, కోప+అనలంబు= కోపమనే అగ్నిని; సముద్రంలో= సాగరంలో; వైచినన్= విసరివేయగా; అది= అదే; ఔర్వ+అనలంబు, నాన్= ఔర్వాగ్ని అనే పేరుతో; అశ్వముఖంబునన్= గుర్రపుముఖంతో; అబ్ధి, జలంబులన్= సముద్రపు నీటిని; త్రావుచున్+ఉండున్= త్రాగుతూ ఉన్నది; ఇది, వేదంబులన్ అందు= ఇది వేదాలలో; వినంబడియెడు= వినిపించెడి; కథ= కథ; కావునన్= కాబట్టి; నీవును= నీవు కూడా; ఔర్వు, అట్ల= ఔర్వునివలె; ధర్మ, విదుండవు= ధర్మాన్ని తెలిసినవాడవు; భువన, పరిభావి,ఐన= లోకములను నశింపచేసేది ఐన; ఈ, క్రోధంబున్= ఈ కోపాన్ని; విడువుము+అనిన= వదలిపెట్టు అని పలికినట్టి; వసిష్ఠ, వచనంబునన్= వసిష్ఠునిమాటప్రకారం; పరాశరుండు; కోపంబు= కోపాన్ని; ఉపసంహరించి= మరలించి; రాక్షస, వినాశ+అర్థంబుగాన్= రాక్షసులచావుకొరకు; సత్త్రయాగంబు= సత్రయాగాన్ని; చేయన్= చేయటానికి; కడంగినన్= పూనుకొనగా.

**తాత్పర్యం:** అని పల్కగా ఔర్వుడు పితృదేవతల ఆజ్ఞ ప్రకారం తన కోపాగ్నిని సముద్రంలో వేయగా, అది ఔర్వాగ్ని అనే పేరుతో గుర్రపుముఖంతో సముద్రపునీటిని త్రాగుతూ ఉంటుంది. ఇది వేదాలలో వినిపించే కథ. 'నీవుకూడా ఔర్వునివలె ధర్మం తెలిసినవాడవు కనుక లోకాలను నశింపజేసే ఈ కోపాన్ని విడిచిపెట్టుము' అని పల్కగా, వసిష్ఠునిమాట ప్రకారం పరాశరుడు కోపాన్ని ఉపసంహరించి, రాక్షసవినాశంకొరకు సత్రయాగం చేయాలని పూనుకొన్నాడు.

### పరాశరుఁడు రాక్షసవినాశార్థంబు సత్రయాగంబు సేయుట (సం.1-172-2)

**తే.** **శక్తి రాక్షసనిహతుఁ డై చనిన శోక । దహనహతుఁ డై వసిష్ఠుండు దానిఁ దలఁచి**
**కడుఁ బ్రశాంతాత్ముఁ డయ్యు రాక్షసవినాశ । మొలసి మనుమని వారింపకుండె నంత.** **150**

**ప్రతిపదార్థం:** శక్తి= శక్తిమహాముని; రాక్షస, నిహతుఁడు+ఐ= రాక్షసునిచేత చంపబడినవాడై; చనినన్= చనిపోగా; వసిష్ఠుండు, ప్రశాంత+ఆత్ముఁడు+అయ్యున్= శాంతమైన మనస్సు కలవాడే అయినా; దానిన్= దానిని; తలఁచి= తలచుకొని; శోక, దహన, హతుఁడు+ఐ= శోక మనే అగ్నిచేత మనస్సు చెడినవాడై; రాక్షస, వినాశము= రాక్షసులయొక్క చావు; ఒలసి= కాంక్షించి; మనుమనిన్= మనుమడైన పరాశరుణ్ణి; వారింపక= ఆపక; ఉండెన్; అంతన్= అటుపై.

**తాత్పర్యం:** శక్తి మహాముని రాక్షసనిహతు డై గతింపగా, వసిష్ఠుడు శాంతమైన మనస్సు కలవాడే అయినప్పటికీ, దానిని తలచుకొని దుఃఖాగ్నితో మనస్సు చెడినవాడై; తన మనుమ డైన పరాశరుడు రాక్షసవినాశనార్థం చేసే యాగప్రయత్నాన్ని నివారించలేదు.

**క.** **ఘోరాకారులు కృతహా । హారవులు సబాలవృద్ధు లయి పడిరి దురా**
**చారులు రాక్షసులు ముని । ప్రారబ్ధాధ్వరసమిద్ధపావకశిఖలన్.** **151**

**ప్రతిపదార్థం:** ఘోర+ఆకారులు= భయంకరమైన రూపం కలవాళ్ళు; కృత, హాహా, రవులు= చేయబడిన హాహా అనేధ్వని కలవాళ్ళు; దుర్+ఆచారులు= చెడుప్రవర్తన కలవాళ్ళు; రాక్షసులు, స, బాల, వృద్ధులు+అయి= బాలురతో, ముసలి వాండ్రతో కూడినవాళ్లయి; ముని, ప్ర+ఆరబ్ధ+అధ్వర, సమిద్ధ, పావక, శిఖలన్= పరాశరమునిచేత గొప్పగా ప్రారంభింపబడిన యజ్ఞమునందలి మండుతున్న అగ్నిజ్వాలలలో; పడిరి.

**తాత్పర్యం:** దుర్మార్గులైన రాక్షసులు, భయంకరమైన హాహాకారాలతో, బాలురతో, వృద్ధులతో సహా పరాశరుడు ప్రారంభించిన యాగంలో - మండుతున్న అగ్నిజ్వాలలలో పడిపోయారు.

**వ. ఇట్లు పరాశరుండు గావించు సత్త్రయాగంబున నైన రాక్షసకులప్రళయంబుఁ జూచి పులస్త్యపులహక్రతువులు మహామునిసంఘంబులతో వసిష్ఠాశ్రమంబునకు వచ్చి. 152**

**ప్రతిపదార్థం:** ఇట్లు, పరాశరుండు; కావించు= చేయు; సత్త్ర, యాగంబునన్+ఐన= సత్రయాగంలో జరిగిన; రాక్షస, కుల, ప్రళయంబున్= రాక్షసవంశ నాశనాన్ని; చూచి, పులస్త్య= పులస్త్యుడు; పులహ= పులహుడు; క్రతువులు= క్రతువు లనేవాళ్లు; మహాముని, సంఘంబులతోన్= మహామునుల సమూహాలతో; వసిష్ఠ+ఆశ్రమంబునకున్= వసిష్ఠుని ఆశ్రమానికి; వచ్చి.

**తాత్పర్యం:** ఈ విధంగా పరాశరుడు చేసే సత్త్రయాగంలో జరిగిన రాక్షసనాశనాన్ని చూచి - పులస్త్యుడు, పులహుడు, క్రతువు మహర్షులసమూహంతో వసిష్ఠాశ్రమానికి వచ్చి.

**విశేషం:** పులస్త్యుడు, పులహుడు, క్రతువు - బ్రహ్మమానసపుత్రులు.

**క. అగ్నిహతిఁ జేసి మానవ। భుగ్నివహము మరణబాధఁ బొందించుచు మూఁ**
**డగ్నులయొద్దను నాలవ। యగ్నియనన్ వెలుఁగుచున్న యమ్మునినాథున్. 153**

**ప్రతిపదార్థం:** అగ్ని, హతిన్+చేసి= అగ్నిలో పడటంచేత; మానవ, భుక్+నివహము= మానవులను తినే రాక్షసుల సమూహాన్ని; మరణబాధన్= చావుకు సంబంధించిన దుఃఖాన్ని; పొందించుచున్= కలిగిస్తూ; మూఁడు, అగ్నుల ఒద్దను= మూడు విధాలైన అగ్నుల దగ్గర; నాలవ, అగ్ని అనన్= నాల్గవ అగ్నియో అన్నట్లుగా; వెలుఁగుచు+ఉన్న= ప్రకాశిస్తున్న; ఆ+ముని నాథున్= ఆ మునిశ్రేష్ఠుడైన పరాశరుడిని.

**తాత్పర్యం:** మానవులు భక్షించే రాక్షససమూహాన్ని అగ్నిలో పడేటట్లు చేయటంద్వారా వాళ్ళకు మరణబాధ కలిగిస్తూ, మూడగ్నులదగ్గర నాల్గవఅగ్నివలె ఉన్న ఆ మునిశ్రేష్ఠుడిని.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. త్రేతాగ్నులు - ఆహవనీయం, దక్షిణాగ్ని, గార్హపత్యం - ఇవి మూడు యజ్ఞవేదికి క్రమంగా తూర్పు, దక్షిణం, పడమర - ఈ దిక్కులలో ఉంటాయి.

**క. పరమతపోనిలయు దినే। శ్వరదీప్తిసహస్రతేజు శాక్తేయుఁ బరా**
**శరుఁ గని యందఱుఁ బ్రార్థిం। చిరి రాక్షసమారణంబు సేయకు మనుచున్. 154**

**ప్రతిపదార్థం:** పరమ, తపస్+నిలయున్= గొప్ప తపస్సుకు ఉనికిపట్టయినవాడిని; దిన+ఈశ్వర, దీప్తి, సహస్ర, తేజున్= పగటి ప్రభువైన సూర్యునికాంతికి వేయిరెట్లుకాంతి కలవాడిని - అనగా వేయిమందిసూర్యులవలె ప్రకాశించేవాణ్ణి; శాక్తేయున్= శక్తి మహామునియొక్క పుత్రుని; పరాశరున్; కని= చూచి; అందఱున్= మునులుఅంతా; రాక్షస, మారణంబున్= రాక్షసులను చంపటాన్ని; చేయకుము= చేయవద్దు; అనుచున్; ప్రార్థించిరి.

**తాత్పర్యం:** మహాతపస్సంపన్నుడు, వెయ్యిమంది సూర్యుల కాంతితో ప్రకాశించేవాడు, శక్తిమహాముని కుమారుడు అయిన పరాశరుడిని చూచి, రాక్షససంహారం మానండని అందరు ప్రార్థించారు.

**వ. 'పరాశరుండును బులస్త్యాదిమహామునిప్రార్థితుం డై రాక్షససత్త్రయాగం బుపసంహరించి, తన్నియోగంబున నయ్యగ్ని హిమవదుత్తరపార్శ్వంబున వైచిన, నదియును బర్వంబుల నందు వృక్షలతా గుల్మ శిలాభక్షణంబు**

**సేయుచుండెఁ' నని యిట్లు గంధర్వుండు తాపత్యవసిష్ఠౌర్వోపాఖ్యానంబు చెప్పిన విని యర్జునుండు వాని కి ట్లనియె. 155**

**ప్రతిపదార్థం:** పరాశరుండును, పులస్త్య+ఆది, మహాముని, ప్రార్థితుండు+ఐ= పులస్త్యుడు మొదలైన మహామునులచేత ప్రార్థింపబడినవా డై; రాక్షస, సత్రయాగంబు= రాక్షససత్రయాగాన్ని; ఉపసంహరించి= ఆపి; తద్+నియోగంబునన్= వారి ఆజ్ఞచేత; ఆ+అగ్ని; హిమవత్+ఉత్తర, పార్శ్వంబునన్= హిమాలయపర్వతంయొక్క ఉత్తరపు ప్రక్క; వైచినన్= వేయగా; అదియును= అ ఆగ్నియు; పర్వంబుల, అందున్= పర్వదినాలలో, ఆ ఉత్తరపు ప్రక్కన; వృక్ష, లతా, గుల్మ, శిలా, భక్షణంబు= చెట్లను, తీవలను, పొదలను, రాళ్ళను తినుటను; చేయుచు+ఉండెన్= చేస్తూ ఉండింది; అని= అని; ఇట్లు; గంధర్వుండు; తాపత్య వసిష్ఠ+ఔర్వ+ఉపాఖ్యానంబు= తాపత్యులయొక్క వసిస్ఠునియొక్క, ఔర్వునియొక్క కథను; చెప్పినన్= చెప్పగా; విని=ఆలకించి; అర్జునుండు= అర్జునుడు; వానికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'పరాశరుడుకూడ - పులస్త్యుడు మొదలైన మహామునులు ప్రార్థించగా రాక్షసవినాశనంకొరకు చేసే ఆ సత్రయాగాన్ని ఆపి, ఆ మునుల ఆజ్ఞతో ఆ యాగాగ్నిని హిమాలయానికి ఉత్తరంవైపు వేయగా, అది పర్వదినాలలో చెట్లను, తీగలను, పొదలను, శిలలను భక్షిస్తూ ఉండింది' అని గంధర్వుడు తాపత్య - వసిష్ఠ - ఔర్వుల కథను చెప్పగా విని, అర్జునుడు అతనితో ఇట్లా అన్నాడు.

**ఉ. మాకు నతిప్రియుండవు సమస్తవిదుండవు చెప్పుమయ్య! యీ**
**లోకములోని వర్తనములుం దగువారి నెఱుంగు; దెవ్వనిం**
**బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ**
**జేకొనువార? మట్టి బుధసేవితుఁ గానఁగ మాకు నెం దగున్? 156**

**ప్రతిపదార్థం:** మాకున్, అతి, ప్రియుండవు= మిక్కిలి ఇష్టమైనవాడవు; సమస్త, విదుండవు= అన్నీ తెలిసినవాడవు; చెప్పుము+అయ్య= అయ్యా! వివరించు; ఈ లోకములోని, వర్తనములున్= ఈ లోకమందలి నడవడులను; తగువారిన్= తగినవారిని; ఎఱుంగుదు= తెలియుదువు; ఎవ్వనిన్= ఎవ్వరిని; ప్రాకట, ధర్మ, తత్త్వవిదున్= ప్రసిద్ధంగా ధర్మతత్త్వాన్ని తెలిసిన వాడిని; బ్రాహ్మణ; ముఖ్యున్= బ్రాహ్మణులలో శ్రేష్ఠు డైనవాడిని; పురోహితుండు, కాన్= పురోహితు డయ్యేటట్లు; చేకొనువారము= గ్రహించగలవారం; అట్టి= అటువంటి; బుధ, సేవితున్= పండితులచే పూజింపబడేవాడిని; మాకున్; కానఁగన్= చూచుటకు; ఎందు+అగున్= ఎచ్చట జరుగుతుంది?

**తాత్పర్యం:** మాకు మిక్కిలి ఇష్టమైనవాడవు, అన్నింటిని తెలిసినవాడవు, అంతేకాదు ఈ లోకవ్యవహారాలను, తగిన వ్యక్తులను తెలిసినవాడవు. ధర్మతత్త్వం బాగా తెలిసినవాడు, బ్రాహ్మణశ్రేష్ఠుడు అయిన ఏవ్యక్తిని పురోహితునిగా మేము స్వీకరించాలో, పండితులచే పూజింపబడే అట్టివ్యక్తి మాకు ఎక్కడ లభిస్తాడో తెల్పకోరుతాను.

**వ. అనిన గంధర్వుండు పెద్దయుంబ్రొద్దు విచారించి 'యిచ్చోటికిం గుఱంగట నుత్కచం బను పుణ్యతీర్థంబునం దపంబు సేయుచున్నవాని ధౌమ్యుం డను బ్రాహ్మణునిఁ బురోహితుఁగాఁ బ్రార్థింపుం; డమ్మహాత్ముండు మీకుఁ బురోహితుం డైన సర్వార్థసిద్ధి యగు' ననిన సంతసిల్లి వానికి నాగ్నేయాస్త్రంబు విధ్యుక్తంబుగా నిచ్చి 'మాకు నీ యిచ్చిన హయంబుల**

**నీయంద సంగ్రహించి యుండుము; ప్రయోజనంబు గలనాఁడు గొనిపోయెద' మని గంధర్వు వీడ్కొని పాండవులు**
**భాగీరథి నుత్తరించి యుత్కచం బను పుణ్యతీర్థంబున కరిగి యందు. 157**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అడుగగా; గంధర్వుండు; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; విచారించి= ఆలోచించి; ఈ+చోటికిన్= ఇచ్చటికి; కుఱంగటన్= సమీపాన; ఉత్కచంబు; అను, పుణ్య, తీర్థంబునన్= అను పుణ్యతీర్థంలో; తపంబు; చేయుచు; ఉన్నవాని; ధౌమ్యుండు; అను; బ్రాహ్మణునిన్; పురోహితున్+కాన్= పురోహితు డయ్యేటట్లుగా; ప్రార్థింపుండు= ప్రార్థించండి; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడు; మీకున్, పురోహితుండు+ఐనన్= పురోహితుడైతే; సర్వ+అర్థ, సిద్ధి= అన్ని ప్రయోజనాలు సమకూరటం; అగున్= జరుగును; అనినన్= అని తెల్పగా; సంతసిల్లి; వానికిన్= అతనికి; ఆగ్నేయ+అస్త్రంబు; = ఆగ్నేయాస్త్రాన్ని; విధి+ఉక్తంబుగాన్= నియమం ప్రకారం; ఇచ్చి; మాకున్; నీ ఇచ్చిన, హయంబులన్= నీవు ఒసగిన గుఱ్ఱాలను; నీ; అందు+అ= నీ దగ్గరే; సంగ్రహించి= దాచి; ఉండుము= ఉంచు; ప్రయోజనంబు, కలనాఁడు= అవసరమేర్పడిన రోజు; కొని పోయెదము= తీసికొనిపోతాము; అని, గంధర్వున్= ఆవిధంగా గంధర్వుణ్ణి; వీడ్కొని; పాండవులు; భాగీరథిన్= గంగను; ఉత్తరించి= దాటి; ఉత్కచంబు, అను, పుణ్యతీర్థంబునకున్; అరిగి= వెళ్ళి, అందున్= అక్కడ.

**తాత్పర్యం:** అని పల్కగా, గంధర్వుడు చాలాసేపు ఆలోచించి 'ఇక్కడికి సమీపంలో ఉత్కచం అనే పుణ్యతీర్థం ఉన్నది. అక్కడ తపస్సు చేసికొంటున్న ధౌమ్యుడనే బ్రాహ్మణుడిని పురోహితునిగా ప్రార్థించండి. ఆ మహాత్ముడు మీకు పురోహితుడైతే అన్ని ప్రయోజనాలు సిద్ధిస్తా'యని తెల్పగా, సంతోషించి, అతనికి ఆగ్నేయాస్త్రాన్ని యథావిధిగా ఇచ్చి, 'మాకు నీ విచ్చిన గుఱ్ఱాలను నీ దగ్గరే ఉంచుము. అవసరమైనప్పుడు తీసికొంటాము' అని ఆ గంధర్వుడిని వీడ్కొని, పాండవులు గంగానదిని దాటి, ఉత్కచ మనే పుణ్యతీర్థానికి వెళ్ళి, అక్కడ.

### పాండవులు ధౌమ్యునిఁ బురోహితుఁగా వరియించుట (సం.1-174-6)

**ఉ. వీత సమస్త దోషుఁ డయి వేడ్క దపం బొనరించుచున్న వి**
**ఖ్యాతుఁ బురోహితప్రవరుఁగా వరియించిరి భక్తితో జగ**
**త్పూతచరిత్రు సాధుజనపూజితు ధార్మికు ధౌమ్యు దేవల**
**భ్రాతృవరున్ మహాత్ము హితభాషణు భూసురవంశభూషణున్. 158**

**ప్రతిపదార్థం:** వీత, సమస్త, దోషుఁడు+అయి= పోయిన ఎల్లపాపాలు కలవాడై; వేడ్కన్= కుతూహలంతో, తపంబు; ఒనరించుచున్+ఉన్న= చేస్తూఉన్న; విఖ్యాతున్= ప్రసిద్ధుడిని; జగత్+పూత, చరిత్రున్= లోకాలలో పవిత్రమైన నడవడి కలవాడిని; సాధుజన, పూజితున్= సజ్జనులచేత పూజింపబడినవాడిని; ధార్మికున్= ధర్మం చేసేవాడిని; మహాత్మున్= మహాత్ముడైన వాడిని; హిత, భాషణు=ఉపకారం చేసేమాటలుకలవాడిని; భూసుర, వంశ, భూషణున్= బ్రాహ్మణవంశానికి అలంకారమైనవాడిని; దేవల, భ్రాతృ, వరున్= దేవలుని తోబుట్టువులలో శ్రేష్ఠుడైనవాడిని; ధౌమ్యున్= ధౌమ్యుని; పురోహిత, ప్రవరున్+కాన్= పురోహిత శ్రేష్ఠునిగా, భక్తితోన్; వరియించిరి= కోరారు.

**తాత్పర్యం:** పాపరహితుడు, కుతూహలంతో తపస్సు చేస్తున్నవాడు, ప్రసిద్ధుడు, లోకంలో పవిత్రమైనచరిత్ర కలవాడు, సజ్జనులచేత పూజింపబడేవాడు, ధార్మికుడు, మహాత్ముడు, మేలు కలిగించే మాటలు పలికేవాడు, బ్రాహ్మణవంశానికి అలంకారమైనవాడు, దేవలుని తోబుట్టువులలో శ్రేష్ఠుడు అయినధౌమ్యుడిని తమకు పురోహితశ్రేష్ఠునిగా పాండవులు స్వీకరించారు.

**వ. ధౌమ్యుండును వారి నతిప్రీతిం బూజించి పురోహితత్వంబుం బరిగ్రహించె; నట్లు తేజోరూపబుద్ధివిభవంబుల బృహస్పతిసదృశుం డై వేదవేదాంగవిదుం డైన ధౌమ్యుం బురోహితుంగాఁ బడసి, పాండునందను లశేష మహీరాజ్యంబు వడసినంతియ సంతసిల్లి, తత్కృతస్వస్త్యయను లయి, జననీ సహితంబు దక్షిణ పాంచాలం బున కరుగువారు ముందఱ ద్రుపదుపురంబునకుఁ బోయెడు బ్రాహ్మణులం గని 'మీ రెందులకుం బోయెద'? రని యడిగిన వా రి ట్లనిరి. 159**

**ప్రతిపదార్థం:** ధౌమ్యుండును; వారిన్= ఆ పాండవుల్ని; అతి, ప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; పూజించి, పురోహితత్వంబున్; పరిగ్రహించెన్= చేకొని, గ్రహించాడు; అట్లు; తేజస్, రూప, బుద్ధి, విభవంబులన్= తేజస్సుచేతను, రూపంచేతను, బుద్ధిచేతను, గొప్పతనంచేతను; బృహస్పతి, సదృశుండు+ఐ= బృహస్పతితో సమాన మైనవాడై; వేద, వేద+అంగ, విదుండు+ఐన= వేదాలను, వేదాంగాలను తెలిసినవాడైన; ధౌమ్యున్= ధౌమ్యుణ్ణి; పురోహితున్+కాన్= పురోహితునిగా; పడసి= పొంది; పాండునందనులు= పాండవులు; అశేష, మహీ, రాజ్యంబున్= మొత్తం భూమిమీద అధికారాన్నిఅంతయు; పడసిన, అంతియ= పొందినంతగా; సంతసిల్లి; తత్+కృత, స్వస్తి+అయనులు+అయి= అతనిచేత చేయబడిన ఆశీర్వాదం కలవా ళ్ళయి; జననీ, సహితంబు= తల్లితో కలిసి; దక్షిణ, పాంచాలంబునకున్, అరుగువారు= దక్షిణ పాంచాలదేశాలకు వెళ్ళే వాళ్ళు; ముందర= ముందుగా; ద్రుపదు, పురంబునకున్ = ద్రుపదుని నగరానికి; పోయెడు= పోయే; బ్రాహ్మణులన్+కని= బ్రాహ్మణులను చూచి; మీరు; ఎందులకున్= ఎక్కడికి; పోయెదరు+అని= పోతూఉన్నారని; అడిగినన్= అడుగగా; వారు, ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** ధౌమ్యుడుకూడా వాళ్ళను మిక్కిలి ప్రేమతో పూజించి, పురోహితత్వాన్ని స్వీకరించాడు. ఆ విధంగా తేజస్సుచేత, రూపంచేత, బుద్ధిచేత, గొప్పతనంచేత, బృహస్పతితో సమానుడై, వేదవేదాంగాలను పూర్తిగా తెలిసిన ధౌమ్యుడిని పురోహితునిగా పొంది, పాండవులు సమస్తభూమండలరాజ్యాన్ని పొందినంతగా సంతోషించి, ధౌమ్యుని ఆశీర్వచనం పొంది, తల్లితోకూడ దక్షిణపాంచాలదేశానికి వెళ్ళుతూ, తమకు ముందు ద్రుపదుని నగరానికి వెళ్లే బ్రాహ్మణులను చూచి, 'మీ రెక్కడికి వెళ్లుతున్నారు' అని అడుగగా, వా రిట్లా అన్నారు.

**సీ. యజ్ఞసేన ప్రభు యజ్ఞమహావేదిఁ । గవచశరాసనఖడ్గబాణ**
**రథయుక్తుఁ డై మహారథుఁడు ధృష్టద్యుమ్నుఁ । డన నుదయించిన, నతనితోడ**
**నొక్కటఁ బుట్టిన యక్కన్యకను గృష్ణ । నసితోత్పల శ్యామలామలాంగి**
**మెఱుపునుం బోలెను వఱలు నుత్పలగంధి । బంధుర తను సౌరభంబు గలుగు**

**ఆ. దాని ద్రుపదరాజుతనయఁ దదీయ స్వ । యంవరోత్సవంబు నపుడు చూడఁ**
**గనినవారు దృష్టి గనిన ఫలం బెల్లఁ । గనినవారు పరమకౌతుకమున. 160**

**ప్రతిపదార్థం:** యజ్ఞసేన, ప్రభు, యజ్ఞమహావేదిన్= ద్రుపదమహారాజుయొక్క యజ్ఞమునందలి గొప్పవేదియందు; కవచ, శర+ ఆసన, ఖడ్గ, బాణ, రథ, యుక్తుఁడు+ఐ= కవచంతో, ధనుస్సుతో; ఖడ్గంతో, బాణాలతో, రథంతో కూడినవాడై; మహా రథుఁడు; ధృష్టద్యుమ్నుఁడు; అనన్= అనగా; ఉదయించినన్= పుట్టగా; అతనితోడన్; ఒక్కటన్= ఏకకాలంలో; పుట్టిన = ఉదయించిన; ఆ+కన్యకను= ఆ కన్నెను; కృష్ణన్= కృష్ణ అను పేరు కలదానిని, అసిత+ఉత్పల, శ్యామల+అమల+అంగిన్= నల్లకలువవలె నల్లని నిర్మల మైన దేహం కలదానిని; మెఱుపునున్+పోలెను= మెఱుపువలె; వఱలు= ప్రకాశించే; ఉత్పల,

గంధిన్= కలువ పూవు వాసనవంటి వాసనకలదానిని; బంధుర, తను, సౌరభంబు, కలుగు, దానిన్= గాఢమైన మేని సువాసన కలదానిని; ద్రుపదరాజు తనయన్= ద్రుపదరాజుయొక్క పుత్రికను; తదీయ, స్వయంవర+ఉత్సవంబు, అపుడు= ఆమె స్వయంవరంయొక్క ఉత్సవమునందు; పరమ, కౌతుకమునన్= మిక్కిలి ఆసక్తితో; చూడన్+కనిన, వారు= చూడగలిగిన వారు; దృష్టు కనిన= కన్నులను (చూపులను) పొందిన; ఫలంబు+ఎల్లన్= ఫలితాన్ని అంతా; కనిన, వారు= పొందినవారు.

**తాత్పర్యం:** ద్రుపదమహారాజుయజ్ఞవేదికనుండి కవచంతో, ధనుస్సుతో, ఖడ్గంతో, బాణాలతో, రథంతో మహారథుడైన ధృష్టద్యుమ్నుడు ఉద్భవించాడు. అతనితోపాటు 'కృష్ణ' అనే పేరు కల కూతురుకూడ జన్మించింది. ఆమె నల్లకలువలవలె నల్లని నిర్మలమైన దేహంకలది. మెఱుపుతీగవలె ప్రకాశిస్తూ, నల్లకలువగంధంవంటి మనోహరమైన శరీరసుగంధం కలది. కనుక అటువంటి ఆ ద్రౌపదిని మిక్కిలి కుతూహలంతో స్వయంవరోత్సవ సమయంలో చూడగలిగినవాళ్ళే కన్నులున్న ఫలం పొందినవారు.

**విశేషం:** అలం: ఉపమ. మహారథుడు: - పదకొండువేలమంది విలుకాండ్రతో యుద్ధంచేయగల యోధుడు. మరొకవిధంగా - 'తనను, సారథిని, గుర్రాలను కాపాడుకొంటూ పోరాడే యోధుడు మహారథుడు' అని కొందరు అంటారు.

**వ. అట్టి మహోత్సవంబు చూడ ద్రుపదు పురంబునకుం బోయెద; మందులకు నుత్సవ దర్శనోత్సుకు లై దర్శనీయులుం దరుణులును నపారభూరిదక్షిణయజ్ఞకరులును ననేకశ స్త్రాస్త్రవిదులును నయిన నానాదేశాధిపతులు నింతకుఁ జనుదెంతు; రనంతధనంబును బ్రాహ్మణులకు వా రిత్తు; రట్టె మీరును వారిం జూడ వచ్చెదరేని యొక్కటఁ బోదము రండు. 161**

**ప్రతిపదార్థం:** అట్టి, మహా+ఉత్సవంబున్= గొప్ప ఉత్సవాన్ని; చూడన్= చూచుటకై; ద్రుపదుపురంబునకున్= ద్రుపదుని నగరానికి; పోయెదము= పోతూఉన్నాము; అందులకున్; ఉత్సవ, దర్శన+ఉత్సుకులు+ఐ= స్వయంవరోత్సవాన్ని చూచుటయందు ఉత్సాహం కలిగినవాళ్ళూ; దర్శనీయులున్= చూడదగినవాళ్ళూ; తరుణులునున్= యౌవనంలో ఉన్నవాళ్ళూ; అపార, భూరి, దక్షిణ, యజ్ఞకరులునున్= అంతులేని అధికమైన దక్షిణలతో యజ్ఞాలు చేసేవాళ్ళూ; అనేక శస్త్ర+అస్త్ర, విదులునున్= పెక్కు, మంత్రరహిత, మంత్రసహిత బాణవిద్యలు తెలిసినవాళ్ళూ; అయిన; నానా, దేశ+అధిపతులున్= వివిధ దేశాలరాజులు; ఇంతకున్= ఇప్పటికే; చనుదెంతురు= వచ్చిఉంటారు; అనంత, ధనంబును= అంతులేని డబ్బును; బ్రాహ్మణులకు; వారు+ఇత్తురు= వారు ఇస్తారు; అట్టె; మీరునున్= అట్లే మీరుకూడా; వారిన్= వాళ్ళను; చూడన్ వచ్చెదరు+ఏని= చూచుటకు వచ్చేవారయితే; ఒక్కటన్= ఒకటిగా; కలిసి, పోదము, రండు= కలసిపోదాం రండి.

**తాత్పర్యం:** అటువంటి స్వయంవరమహోత్సవాన్ని చూడటానికి ద్రుపదునినగరానికి మేము వెళ్తున్నాము. ఆ ఉత్సవం చూడాలన్న కుతూహలంతో చూడముచ్చటైనవాళ్ళు, యౌవనంలో ఉన్నవాళ్ళు, అంతులేని గొప్ప దక్షిణలతో యజ్ఞాలుచేసినవాళ్ళు, అనేకశస్త్రాస్త్రాలు తెలిసినవాళ్ళు అయిన వివిధదేశాల రాజులు ఈ పాటికి అక్కడికి వచ్చిఉంటారు. వాళ్ళు బ్రాహ్మణులకు అపారమైన ధనాన్ని ఇస్తారట. మీరుకూడ వాళ్ళను చూడడానికి వచ్చేట్టయితే, కలిసిపోదాం రండి.

**క. మీ యం దీ కృష్ణు నుదం। సాయతభుజుఁ జూచి తాన హర్షముతోడం**
**దోయజముఖి వరియించును। మా యెఱిఁగినకార్య మిది సమంజసబుద్ధిన్. 162**

**ప్రతిపదార్థం:** మీ+అందున్= మీలో; ఈ కృష్ణున్= ఈ నల్లని వాడిని; ఉత్+అంస+ఆయత, భుజున్= గొప్ప భుజశిఖరాలు కల నిడుపైన బాహువులు కల వాడిని; చూచి; తోజయ, ముఖి= నీటినుండి పుట్టిన పద్మాలవంటి ముఖం కలది - ద్రౌపది; తాను+అ= తనంతట తానే; వరియించును= కోరుకుంటుంది; ఇది, సమంజస; బుద్ధిన్= ఇది మిక్కిలి ఒప్పుతున్న బుద్ధితో, మా, ఎఱిఁగిన, కార్యము= మాకు తెలిసిన కార్యం.

**తాత్పర్యం:** మీలో నల్లనివాడు, గొప్ప భుజశిఖరాలతో కూడిన నిడుపైన చేతులు కలవాడు అయిన ఇతడిని చూచి, ద్రౌపది తనంతట తానే వరిస్తుంది. ఇది మా మనస్సుకు తోచిన సమంజసమైన కార్యం.

**విశేషం:** విప్రుల మాటలలో ఉపశ్రుతివంటి శుభశకునం భావికథార్థాన్ని ధ్వనింపచేస్తున్నది. (ఉపశ్రుతినిగురించి చూడు. ఆది. 7.24.25)

**వ. అని మాటలాడుచు వచ్చు బ్రాహ్మణులతోడఁ బాండవులు ద్రుపదుపురంబున కరుగు వా రెదుర. 163**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; మాటలాడుచు; వచ్చు=వచ్చే; బ్రాహ్మణులతో=బ్రాహ్మణులతో; పాండవులు= పాండుకుమారులు; ద్రుపదు, పురంబునకున్= ద్రుపదు నగరానికి; అరుగువారు= వెళ్ళేవాళ్ళు; ఎదురన్= ఎదుట.

**తాత్పర్యం:** అని మాట్లాడుకొంటూ వచ్చే బ్రాహ్మణులతో కలిసి పాండవులు ద్రుపదునిపట్టణానికి వెళ్లుతూ ఎదుట.

**క. కృష్ణమృగాజినధరుఁ దరు। ణోష్ణద్యుతితేజుఁ బంకజోద్భవసదృశుం**
**గృష్ణద్వైపాయను గత। తృష్ణామయుఁ గాంచి రరుగుదెంచు మహాత్మున్. 164**

**ప్రతిపదార్థం:** కృష్ణ, మృగ+అజిన, ధరున్= నల్లని జింకతోలు వస్త్రంగా కట్టుకొన్నవాడిని; తరుణ+ఉష్ణ, ద్యుతి, తేజున్= మధ్యాహ్న సూర్యునివంటి కాంతి కలవాడిని; పంకజ+ఉద్భవ, సదృశున్= పద్మమునుండి పుట్టిన బ్రహ్మతో సమానుడైనవాడిని; గత, తృష్ణా; మయున్= పోయిన ఆశ కల వాడిని; అరుగుదెంచు= వస్తున్న; మహాత్మున్= మహానుభావుడిని; కృష్ణద్వైపాయనున్= వేదవ్యాసుడిని; కాంచిరి= చూచిరి.

**తాత్పర్యం:** నల్లచి జింకచర్మం ధరించినవాడు, మధ్యాహ్న సూర్యునివంటి కాంతికలవాడు, పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవునితో సమానమైనవాడు అయిన వేదవ్యాసుడు, తమకు ఎదురు వస్తుండగా పాండవులు ఏ ఆశాలేని ఆ మహానుభావుడిని చూచారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. కని వినయమ్మున న మ్మునీంద్రునకు నందఱు నమస్కరించి కృతాంజలు లై యున్న వారికి హృదయానందంబుగా సత్యవతీనందనుం డాగామి శుభంబు లావేదించి చనినఁ; బాండవులును గతిపయ దినంబులకు ద్రుపదుపురంబు సొచ్చి నాలుగు సముద్రంబులుం బోలె ఘూర్ణిల్లి మ్రోయుచుం బురంబు నాలుగుదిక్కుల విడిసియున్న నానాదేశాగత మహీనాథుల బహువిధస్కంధావారంబులఁ జూచుచుం జని, యొక్కకుంభకారగృహంబున విడిసి, త మ్మెవ్వరు నెఱుంగకుండ బ్రాహ్మణవృత్తి నుండు నంతఁ, బాంచాలపతి పార్థునకుఁ గూఁతు నీ సమకట్టి పాండవుల నన్వేషించి యెందునుం గానక. 165**

**ప్రతిపదార్థం:** కని= చూచి; వినయమ్ముననన్; ఆ+మునీంద్రునకున్= ఆ మునిశ్రేష్ఠుడైన వేదవ్యాసునకు; అందరున్; నమస్కరించి; కృత+అంజలులు+ఐ= చేతులు జోడించిన వాళ్ళయి; ఉన్నన్= ఉండగా; వారికిన్= ఆ పాండవులకు; హృదయ+ ఆనందంబుగాన్= మనస్సుకు సంతోషం కలిగేటట్లు; సత్యవతీ, నందనుండు= సత్యవతియొక్క కుమారుడు, వ్యాసుడు; ఆగామి, శుభంబులు= రానున్న శుభాలను; ఆవేదించి= తెలిపి; చనినన్= వెళ్ళగా; పాండవులును; కతిపయ, దినంబులకున్= కొన్ని రోజులకు; ద్రుపదుపురంబు= ద్రుపదు నగరాన్ని; చొచ్చి= ప్రవేశించి; నాలుగు, సముద్రంబులున్+పోలెన్= నాలుగు సముద్రాలవలె; ఘూర్ణిల్లి= కలతనొంది; మ్రోయుచున్= శబ్దిస్తూ, ఘోషిస్తూ; పురంబు, నాలుగు దిక్కులన్= ఊరికి నాలుగు దిక్కులలో; విడిసి, ఉన్న= విడిది చేసి ఉన్న; నానా, దేశ+ఆగత, మహీనాథుల= వివిధ దేశాలనుండి వచ్చిన రాజులయొక్క; బహువిధ, స్కంధావారంబులన్= అనేక విధాలైన సైన్యం విడిదిచేసిన చోట్లను; చూచుచున్= చూస్తూ; చని= వెళ్ళి; ఒక్క, కుంభకార గృహంబునన్= ఒక కుమ్మరిఇంటియందు; విడిసి= విడిది చేసి; తమ్ము+ఎవ్వరున్= తమను ఎవ్వరుకూడ; ఎఱుంగ కుండ= తెలియకుండ; బ్రాహ్మణ, వృత్తిన్= బ్రాహ్మణ వృత్తిలో; ఉండునంతన్= ఉన్న సమయంలో; పాంచాలపతి= పాంచాలదేశపురాజు - ద్రుపదుడు; పార్థునకున్= అర్జునునకు; కూఁతున్= పుత్రికను; ఈన్= ఇచ్చుటకు; సమకట్టి=పూనుకొని; పాండవులన్= పాండవుల్ని; అన్వేషించి= వెదకి; ఎందునన్= ఎక్కడ కూడ; కానక= చూడక.

**తాత్పర్యం:** చూచి, వినయంతో ఆ వేదవ్యాసునికి అందరు నమస్కరించి, చేతులు జోడించి, నిలువగా - వాళ్ళకు సంతోషం కలిగే విధంగా ఆ సత్యవతీనందనుడైన వ్యాసుడు రానున్న శుభాలను గురించి తెలిపి వెళ్ళాడు. తర్వాత పాండవులు కొద్దిరోజులలో ద్రుపదుని నగరానికి చేరి, నగరం నాలుగుదిక్కుల నాలుగు సముద్రాలవలె ఘూర్ణిస్తూ, వివిధ దేశాలనుండి వచ్చిన రాజులబహువిధసైన్యాలు విడిదిచేసిన స్థావరాలను చూస్తూ, నగరంలో ప్రవేశించి, ఒక కుమ్మరిఇంట్లో విడిది చేసి, ఎవరూ గుర్తించకుండా బ్రాహ్మణవృత్తిలో ఉన్నారు. పాంచాలరాజు అర్జునునికి తన కుమార్తె నివ్వా లని ప్రయత్నించి, పాండవులకొరకు వెదకి, వాళ్ళను ఎక్కడా కనుగొనలేక.

**విశేషం:** అలం: ఉపమ.

## ద్రౌపదీస్వయంవరము (సం.1-176-11)

**సీ.** **వైహాయసం బైన వరమత్స్యయంత్రంబు । ని వ్విల్లు మోపెట్టి యెవ్వఁ డేను**
**శరముల నేయు నశ్రమమున నతఁడ నా । తనయకు వరుఁ డగు ధర్మయుక్తి**
**నని చాటఁ బంచిన నా ఘోషణము విని । యుర్వీశులెల్ల నొండొరులఁ గడవఁ**
**గడువేడ్కఁ దొడి పూసి కట్టి విభూతితోఁ । దమతమచిహ్నముల్ దనరి యెఱుక**

**ఆ.** **పడఁగ వేఱువేఱ పన్ని భూతలము గ్ర । క్కదల సైన్యపాదఘట్టనమునఁ**
**బొలుచు ద్రుపదరాజపుత్రీస్వయంవర । రంగమునకుఁ జనిరి రమణతోడ.** **166**

**ప్రతిపదార్థం:** వైహాయసంబు+ఐన= ఆకాశంలో ఉన్నట్టిదైన; వర, మత్స్యయంత్రంబున్= శ్రేష్ఠమైన మత్స్యయంత్రాన్ని; ఈ+విల్లు= ఈ ధనుస్సును; మోపెట్టి= ఎక్కుపెట్టి; ఎవ్వఁడున్; ఏను, శరములన్= ఐదు బాణాలతో; అశ్రమమునన్= శ్రమ పడకుండా - అనగా సులభంగా; ఏయున్= కొట్టునో; అతఁడు+అ= అతడే; నా, తనయకున్= నా కూతురికి; ధర్మయుక్తిన్= ధర్మంతోడి కూడికతో అనగా ధర్మబద్ధంగా; వరుఁడు= మగడు; అగున్= అవుతాడు; అని, చాటన్, పంచినన్= చాటింపువేయండని ఆజ్ఞాపించగా; ఆఘోషణము= ఆ చాటింపు; విని; ఉర్వీ+ఈశులు= భూపతులు, రాజులు; ఎల్లన్= అందరు; ఒండొరులన్=

ఒకరి నొకరు; కడవన్= మీరునట్లు; కడున్= మిక్కిలి; వేడ్కన్= సంతోషంతో; తొడి= సొమ్ములు ధరించి (తొడుగుకొని); పూసి= మైపూతలు పూసి; కట్టి= (మంచి) వస్త్రాలు కట్టి; విభూతితోన్= సంపదతో; తమ తమ చిహ్నముల్= తమ తమ గుర్తులతో (ధ్వజములు మొదలుగునవి) తనరి= ఒప్పి; ఎఱుకపడఁగన్= తెలిసేటట్లు; వేఱువేఱు+అ= విడివిడిగా, పన్ని= సిద్ధపడి; సైన్య, పాద, ఘట్టనమునన్= సైన్యాలయొక్క కాలిత్రొక్కుడుచేత; భూతలము= భూమి; క్రక్కదల (కదల+కదల)= మిక్కిలి చలింపగా; పొలుచు= ఒప్పునట్టి; ద్రుపదరాజు పుత్త్రీ, స్వయంవర, రంగమునకున్= ద్రౌపదియొక్క స్వయంవర స్థానానికి; రమణతోడన్= ప్రీతిగా; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** 'ఆకాశంలో కట్టిన మత్స్యయంత్రాన్ని ఈ విల్లు ఎక్కుపెట్టి ఐదు బాణాలతో ఎవడు పడగొడతాడో అతడే ధర్మప్రకారం నా పుత్రికకు భర్త అవుతాడు' అని ద్రుపదుడు చాటింపు వేయగా, ఆ చాటింపు విని రాజులంతా ఒకరికంటె ముందు మరొకరు ఎంతో సంతోషంగా ఆభరణాలు ధరించి, మైపూతలు పూసికొని, మంచి వస్త్రాలు కట్టుకొని, ఐశ్వర్యంతో తమ తమ ధ్వజాలు మొదలైన చిహ్నాలు స్పష్టంగా కనబడే విధంగా సిద్ధమై, సైన్యాల కాళ్లతాకిడికి భూతలం కంపించగా, ద్రౌపదీస్వయంవరమండపానికి ప్రీతితో వెళ్ళారు.

**వ. అదియును బురంబు పూర్వోత్తరదిగ్భాగంబునం జందనోదకసంసిక్త సమీకృతస్థలం బయి, యగాధోన్నత పరిఖాప్రాకారంబులను విశాలద్వారతోరణంబులను గైలాసశైలవిలాసాపహాసిభాసురగగనతలోల్లేఖిశిఖర రమ్యహర్మ్యతలంబులను బహుప్రకారంబు లైన సారువులనుం జేసి యొప్పుచున్న, నందు యథాస్థానంబుల నానాదేశాధిపతుల నుండంబంచి ద్రుపదుండు వారల నెల్లం బూజించెఁ; బరమబ్రహ్మణ్యు లగు బ్రాహ్మణులతోడం గలసియున్న పాండవులును బ్రాహ్మణసమూహంబులో నుండి పాంచాలరాజు సమృద్ధినిం జూచి సంతసిల్లి రంత. 167**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ ద్రౌపదీ స్వయంవరరంగం; పురంబు, పూర్వ+ఉత్తర దిక్+భాగంబునన్= పట్టణంయొక్క ఈశాన్య దిక్కున ఉన్న ప్రదేశంలో; చందన+ఉదక, సంసిక్త, సమీకృత, స్థలంబు+అయి= మంచి గంధపు నీటిచే తడుపబడి చదరంగా చేయబడిన స్థలం కలదై; అగాధ+ఉన్నత, పరిఖా, ప్రాకారంబులను= లోతైన అగడ్తలతో, ఎత్తైన ప్రహరులతో; విశాల, ద్వార, తోరణంబులను= పెద్దవైన వెలుపలి వాకిళ్ళతో, తోరణాలతో; కైలాస, శైల, విలాస+అపహాసి, భాసుర, గగనతల+ఉల్లేఖి, శిఖర, రమ్య, హర్మ్య, తలంబులను= కైలాసపర్వతంయొక్క చక్కదనాన్ని ఎగతాళి చేసేటట్లు ప్రకాశిస్తూ ఆకాశప్రదేశాన్ని తాకుతున్న కొనలచేత అందమైన మేడల ప్రదేశాలతో; సారువులనున్ చేసి= మంచెలతో; ఒప్పుచున్నన్= వెలుగుతుండగా; అందున్= అక్కడ; యథా, స్థానంబుల= ఆయాప్రదేశాలలో; నానా, దేశ+అధిపతులన్= వివిధ దేశాల రాజులను; ఉండన్+పంచి= ఉండునట్లుగా నియమించి; ద్రుపదుండు; వారలన్+ఎల్లన్, పూజించెన్; పరమ, బ్రహ్మణ్యులు+అగు= మిక్కిలిగ బ్రాహ్మణత్వము కలిగియున్న వాళ్ళయిన; బ్రాహ్మణులతోడన్= బ్రాహ్మణులతో; కలిసి, ఉన్న, పాండవులును; బ్రాహ్మణ సమూహంబులోన్; ఉండి; పాంచాలరాజు, సమృద్ధినిన్= ద్రుపదునియొక్క గొప్పఐశ్వర్యాన్ని; చూచి; సంతసిల్లిరి; అంతన్.

**తాత్పర్యం:** ఆ ద్రౌపదీ స్వయంవరరంగం నగరానికి ఈశాన్యదిక్కున, మంచిగంధపునీటితో తడుపబడి చదరంగా చేయబడిన స్థలం కలదై, లోతైన అగడ్తలతో, ఎత్తైన ప్రాకారాలతో, విశాలా లైన ద్వారాలతో, వెలుపలి వాకిళ్లతో, కైలాస పర్వత సౌందర్యాన్ని ఎగతాళిచేసే విధంగా ప్రకాశిస్తూ, ఆకాశా న్నంటే శిఖరాలు కల అందమైన సౌధ

ప్రదేశాలతో, అనేకవిధా లైన మంచెలతో అమరి ఉండగా, అందులో వివిధదేశాల రాజులకు ఆయా ప్రదేశాలలో విడిది కల్పించి, ద్రుపదుడు వా ళ్ళందరిని పూజించాడు. ఉత్తమబ్రాహ్మణులతో కలిసి ఉన్న పాండవులు, ఆ బ్రాహ్మణసమూహంలో ఉంటూనే, పాంచాలరాజు ఐశ్వర్యాతిశయాన్ని చూచి, సంతోషించారు. తరువాత.

**సీ. ధవళవిభూషణ దామానులేపనా । మలినాంగి సితపుష్పమాల చేతఁ**
**గొని పుష్పసాయకు కుసుమేతరం బైన । యాఱగు సాయకం బనఁగ జనులు**
**ధవళాక్షి రంగమధ్యంబునఁ దనుమధ్య । దా నొప్పి పాంచాలతనయ యున్న**
**భూసురప్రవరుల పుణ్యాహఘోషంబు । విలసిల్లె నాశీర్వివృద్ధితోడ**

**ఆ. ద్రుపదపతి పురోహితుండును గృతపరి । స్తరణుఁ డై ప్రయోగదక్షుఁ డగ్ని**
**ముఖము సేసి వేల్వ మొనసి వివాహోప । కరణ వస్తుచయము గాచియుండె. 168**

**ప్రతిపదార్థం:** ధవళ, విభూషణ, దామ+అనులేపన+అమలిన+అంగి= తెల్లని ఆభరణాలను. మాలలను, మైపూతను కల నిర్మల మైన దేహం కలది; ధవళ+అక్షి= తెల్లని కన్నులు కలది; తను, మధ్య= సన్నని నడుం కలది; పాంచాల, తనయ= పాంచాల రాజు కూతురు అయిన ద్రౌపది; సిత, పుష్పమాల= తెల్లని పూలదండను; చేతన్+కొని= చేతిలో ధరించి; జనులు= ప్రజలు; పుష్ప, సాయకు, కుసుమ+ఇతరంబు+ఐన= పూవులను బాణాలుగా గల మన్మథునియొక్క పూవులకంటె ఇతరమైన; ఆఱు+అగు, సాయకంబు+అనఁగన్= ఆరవ బాణమా అని అనగా; రంగమధ్యంబునన్= స్వయంవరరంగమధ్యంలో; తాన్= తాను; ఒప్పి= ప్రకాశించి; ఉన్నన్= ఉండగా; భూసుర, ప్రవరుల, పుణ్యాహఘోషంబు= బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క పుణ్యాహము అనే ధ్వని; ఆశీస్+వివృద్ధితోడన్= ఆశీర్వాదాల అతిశయంతో; విలసిల్లెన్= ఒప్పెను; ప్రయోగ దక్షుఁడు= వైదికకర్మలు చేయించటంలో సమర్థుడు; ద్రుపద పురోహితుండును= ద్రుపదుని యొక్క పురోహితుడుకూడ; కృత, పరిస్తరణుఁడు+ఐ= చేయబడిన పరిస్తరణం కలవాడై- అనగా అగ్నిచుట్టును దర్భల సమూహాన్ని అలంకరించినవాడై; అగ్నిముఖము= అగ్నియొక్క హోమారంభం; చేసి= కావించి; వివాహ+ఉపకరణ, వస్తు చయము= పెండ్లికి సాధనాలైన వస్తువుల సమూహాన్ని; వేల్వన్= హోమం చేయటానికి; మొనసి= పూని; కాచి, ఉండెన్= వేచిఉన్నాడు.

**తాత్పర్యం:** పాంచాలరాజతనయ ద్రౌపది - అందమైన సన్ననినడుముతో, తెల్లని కళ్ళతో, అలంకరించుకొన్న తెల్లని ఆభరణాలతో, పూలదండతో, మైపూతతో, నిర్మలదేహకాంతితో, తెల్లటి పూదండ ఒకటి చేత ధరించి ప్రజలంతా తనను చూచి 'ఈమె మన్మథునిఅయిదుపూలబాణాలకంటే వేరైన ఆరవపూబాణమా అని అనుకొంటుండగా - స్వయంవర రంగమధ్యంలో నిలిచి ఉన్నది. బ్రాహ్మణ శ్రేష్ఠుల పుణ్యాహధ్వని, ఆశీర్వచనాలు అతిశయిల్లాయి. వైదిక కర్మలు చేయించటంలో చాలా సమర్థుడైన ద్రుపదపురోహితుడు అగ్నిచుట్టూ దర్భలు అలంకరించి, హోమారంభంచేసి, వివాహానికి తగిన వస్తుసమూహంతో హోమం చేయటానికి సిద్ధంగా వేచి ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. అట్టి యవసరంబున బోరన మ్రోయు జనులయులివును వాదిత్రనాదంబును వారించి ధృష్టద్యుమ్నుండు మూఁగినరాజలోకంబు నెల్లం జూచి యగ్నిసమీపంబున గంధపుష్పధూపదీపార్చితం బైన విల్లును నమ్ములను వైహాయసం బైన లక్ష్యంబును వారలకుం జూపి యి ట్లనియె. 169**

**ప్రతిపదార్థం:** అట్టి, అవసరంబునన్= అట్టి సమయంలో; బోరన, మ్రోయు= హోరుమని మ్రోగే; జనుల, ఉలివును= జనులు మాట్లాడుకొనే మాటల సవ్వడిని; వాదిత్రనాదంబును= వాద్యాల ధ్వనిని; వారించి= ఆపి; ధృష్టద్యుమ్నుండు; మూఁగిన= కూడిఉన్న; రాజ, లోకంబున్+ఎల్లన్= రాజుల సమూహాన్నంతా; చూచి; అగ్ని, సమీపంబునన్, అగ్నిహోత్రం దగ్గర; గంధ, పుష్ప, ధూప, దీప+అర్చితంబు+అయిన= గంధంచేత, పూవులచేత, ధూపంచేత, దీపంచేత, పూజింపబడిన దైన; విల్లును= ధనుస్సును; అమ్ములను= బాణాలను; వైహాయసంబు+ఐన= ఆకాశాన ఉన్నట్టి దైన; లక్ష్యంబును= గురియైన మత్స్యయంత్రాన్ని; వారలకున్, చూపి= వాళ్లకు చూపించి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ సమయంలో హోరు మనే ప్రజలధ్వనినీ, వాద్యాలధ్వనినీ ఆపి, ధృష్టద్యుమ్నుడు అక్కడ చేరిన రాజ సమూహా న్నంతా చూచి, అగ్నిహోత్రం దగ్గర గంధపుష్పధూపదీపాలతో పూజింపబడిన ధనుస్సును, బాణాలను, ఆకాశంలో ఉన్న మత్స్యయంత్రాన్ని వాళ్ళకు చూపి, ఈ విధంగా పలికాడు.

**తరువోజ.**

> **ఈ విల్లు మోపెట్టి యేను బాణముల । నీ యంత్రమత్స్యంబు నేసినవాఁడ**
> **భావజప్రతిముఁ డిబ్బాలకుఁ దగిన । పతి; యిది మునిశక్తిఁ బడసిన విద్య;**
> **గావున మీ రిప్డు గావింపుఁ డిదియ । ఘనతర కార్ముక కౌశలోన్నతియు**
> **లావును గలవారలకు నవసరము । లలితయశంబుఁ గల్యాణంబుఁ బడయ.** **170**

**ప్రతిపదార్థం:** ఈ, విల్లు= ఈ ధనుస్సును; మోపెట్టి= ఎక్కుపెట్టి; ఏను, బాణములన్= ఐదుబాణాలచేత; ఈ యంత్ర, మత్స్యంబున్= ఈ యంత్రంలోని చేపను; ఏసిన, వాఁడు+అ= కొట్టినవాడే; భావజ, ప్రతిముఁడు= మన్మథుని పోలినవాడు; ఈ, బాలకున్= ఈ కన్యకు - ద్రౌపదికి; తగిన, పతి= తగిన మగడు; ఇది= ఈ మత్స్యయంత్రం; ముని, శక్తిన్= ఋషి యొక్క శక్తి చేత; పడసిన= పొందిన; విద్య; కావునన్; మీరు; ఇప్డు= ఇప్పుడు; కావింపుడు= ప్రయత్నింపుడు; ఘనతర, కార్ముక, కౌశల+ ఉన్నతియున్= మిక్కిలి గొప్పదైన ధనుస్సునందలి నైపుణ్యంయొక్క అతిశయాన్ని; లావును= బలమును; కలవారలకున్= కలిగినవారికి; ఇదియు+అ= ఇదే; లలిత, యశంబున్= చక్కని కీర్తిని; కల్యాణంబున్= శుభాన్ని, వివాహాన్ని; పడయన్= పొందటానికి; అవసరము= (తగిన) సమయం.

**తాత్పర్యం:** ఈ విల్లును ఎక్కుపెట్టి, ఐదు బాణాలతో ఈ యంత్రంలోని మత్స్యాన్ని కొట్టినవాడే ఈ కన్యకు తగిన మన్మథసమాను డైన భర్త. ఈ మత్స్యయంత్రం మునిశక్తితో పొందినవిద్య. కనుక ఇప్పుడు మీరు ప్రయత్నించండి. విలువిద్యలో గొప్పసామర్థ్యం, బలం కలవాళ్ళు చక్కనికీర్తిని, కల్యాణాన్ని పొందటానికి ఇదే సరైన సమయం.

**వ. అని ధృష్టద్యుమ్నుండు మూఁగిన రాజపుత్త్రులకు నెల్ల నెఱుంగ జెప్పి, ద్రుపదరాజపుత్త్రిం జూచి 'యఖిలజలధి వేలావలయవలయిత మహీతలంబునం గల రాజనందను లెల్ల నీస్స్వయంవరంబునకు వచ్చినవారు; వీరలం జూడు' మని దుర్యోధనదుశ్శాసనదుర్ముఖప్రముఖు లయిన ధృతరాష్ట్రనందనుల నూర్వురం, దత్సమీపంబున నున్న కర్ణాశ్వత్థామ సోమదత్త భూరిశ్రవశ్శ్రుతసేనాదులను, బుత్త్రభ్రాతృసమేతు లయి యున్న శల్య విరాట జరాసంధ గాంధారపతులను, నక్రూర సారణ సాత్యకి సాంబ సంకర్షణ ప్రద్యుమ్న కృష్ణ కృతవ ర్మానిరుద్ధ యుయుధాన ప్రముఖులైన యదువృష్ణి భోజాంధకవరులను, సుమిత్ర సుకుమార సుశర్మ సుదక్షిణ సుషేణ**

**సేనాబిందు చంద్రసేన సముద్రసే నౌశీనర చేకితాన శిశుపాల శ్రేణిమ జ్జనమేజయ జయద్రథ బృహద్రథ సత్యవ్రత చిత్రాంగద శుభాంగద భగీరథ భగదత్త పౌండ్రకవాసుదేవ వత్సరాజ ప్రభృతు లయిన నానాదేశాధీశులను వేదధ్వని సనాథం బై యొప్పచున్న బ్రాహ్మణసమూహంబునుం జూపి. 171**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; ధృష్టద్యుమ్నుండు; మూఁగిన= చేరిన; రాజ, పుత్త్రులకున్+ఎల్లన్= రాజకుమారు లందరికీ; ఎఱుంగన్+చెప్పి= తెలియునట్లుచెప్పి; ద్రుపదరాజ, పుత్త్రిన్+చూచి= ద్రౌపదిని చూచి; అఖిల, జలధి, వేలా, వలయ, వలయిత, మహీతలంబునన్+కల= అన్ని సముద్రాల చెలియలికట్టలు అనే వలయంచేత చుట్టబడిన భూప్రదేశంలో; కల= ఉన్న; రాజ, నందనులు+ఎల్లన్= రాజకుమారులందరు; నీ, స్వయం వరమునకు ; వచ్చినవారు= వచ్చారు; వీరలన్= వీళ్లను, చూడుము+అని; దుర్యోధన, దుశ్శాసన, దుర్ముఖ, ప్రముఖులు+అయిన= దుర్యోధనుడు, దుశ్శాసనుడు, దుర్ముఖుడు మొదలైన; ధృతరాష్ట్ర, నందనులన్= ధృతరాష్ట్రుని కుమారుల; నూర్వురన్= నూరుమందినీ; తద్+సమీపంబునన్= అక్కడికి దగ్గరగా నున్న; కర్ణ+అశ్వత్థామ, సోమదత్త, భూరిశ్రవస్, శ్రుతసేన, ఆదులను= కర్ణుడు, అశ్వత్థామ, సోమదత్తుడు, భూరిశ్రవుడు, శ్రుతసేనుడు, మొదలగువారినీ; పుత్ర, భ్రాతృ, సమేతులు+అయి ఉన్న= కొడుకులతో, తోబుట్టువులతో కూడిఉన్న; శల్య, విరాట, జరాసంధ, గాంధార పతులనున్; అక్రూర, సారణ, సాత్యకి, సాంబ, సంకర్షణ, ప్రద్యుమ్న, కృష్ణ, కృతవర్మ+అనిరుద్ధ, యుయుధాన; ప్రముఖులు+అయిన= మొదలైన; యదు, వృష్ణి, భోజ+అంధక, వరులను= యదు, వృష్ణి, భోజ, అంధక వంశ శ్రేష్ఠులనూ; సుమిత్ర, సుకుమార, సుశర్మ, సుదక్షిణ, సుషేణ, సేనాబిందు, చంద్రసేన, సముద్రసేన, ఔశీనర, చేకితాన, శిశుపాల, శ్రేణిమత్+జనమేజయ, జయద్రథ, బృహద్రథ, సత్యవ్రత, చిత్రాంగద, శుభాంగద, భగీరథ, భగదత్త, పౌండ్రకవాసుదేవ, వత్సరాజ, ప్రభృతులు+అయిన= మొదలగు వారైన; నానా, దేశ+అధీశులను= వివిధదేశాల రాజులనూ; వేద, ధ్వని సనాథంబు+ఐ= వేద ధ్వనులతో కూడినదై; ఒప్పుచున్న= ప్రకాశిస్తున్న; బ్రాహ్మణ, సమూహంబునున్= బ్రాహ్మణులయొక్క సమూహాన్నీ; చూపి.

**తాత్పర్యం:** అని ధృష్టద్యుమ్నుడు అక్కడ చేరిన రాజపుత్రుల కందరికీ తెలియజెప్పాడు. ద్రౌపదిని చూచి 'సమస్త భూమండలంలో కల రాజకుమారులంతా నీ స్వయంవరానికి వచ్చారు. వీళ్ళను చూడు' మని దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలైన ధృతరాష్ట్రకుమారులు నూరుగురినీ - ఆ సమీపంలో ఉన్న కర్ణుడు, అశ్వత్థామ, సోమదత్తాదులనూ, కొడుకులతో సోదరులతో కూడి ఉన్న శల్య, విరాటాదులనూ - అక్రూరుడు, సారణుడు, సాత్యకి మొదలైన యదు వృష్ణి భోజ అంధక వంశ శ్రేష్ఠులనూ - సుమిత్రుడు, సుకుమారుడు మొదలైన వివిధ దేశాల రాజులనూ, వేదధ్వనితో ప్రకాశిస్తున్న బ్రాహ్మణసమూహాన్నీ చూపి.

గమనిక: ఇందలి పేర్ల వరుస మొత్తము వచనభాగాన్ని చదివి గ్రహింప ప్రార్థన.

**విశేషం:** స్వయంవరం - క్షత్రియకన్యలు-వివిధదేశాలనుండి వచ్చి చేరిన రాజకుమారుల సభలో, స్వయంగా తనకు ఇష్టమైన వరుణ్ణి వరించే ఉత్సవం. ఇక్కడ బాలుడైన అనిరుద్ధుడూ, వృద్ధుడైన సోమదత్తుడూ స్వయంవరానికి వచ్చిన వాళ్లలో ఉన్నారు. మూలంలోనూ ఇట్లే ఉంది. వచ్చినవాళ్లందరూ వరించడానికే కాదు-చూడడానికీ, ఆశీర్వదించడానికీ వచ్చినవాళ్లూ ఉంటారు. బలరామకృష్ణులూ ఇలా వచ్చినవాళ్లే!

**రాజపుత్త్రులు మత్స్యయంత్రమును భేదింపఁబోయి భంగపడుట. (సం -177-22)**

**ఆ. 'ఇందు లక్ష్య మెవ్వఁ డేసె నాతని వరి। యింపు నెమ్మితోడ నిందువదన!'**
**యనిన రాజపుత్త్రు లవ్విల్లు మోపెట్టి। యేయఁ గడఁగి కదలి రెల్లవారు. 172**

**ప్రతిపదార్థం:** ఇందు, వదన= చంద్రునివంటిముఖం కలదానా!; ఇందున్= వీరందరిలో; లక్ష్యము= గురి అయిన మత్స్యయంత్రాన్ని; ఎవ్వఁడు; ఏసెన్= కొట్టాడో; అతనిన్= వానిని; నెమ్మితోడన్= ప్రేమతో; వరియింపు= వరింపుము; అనినన్= అనిపలుకగా; రాజ, పుత్త్రులు; ఎల్లవారు=అందరు, ఆ+విల్లు= ఆ ధనుస్సును; మోపెట్టి= ఎక్కుపెట్టి; ఏయన్= కొట్టటానికి; కడఁగి= పూనుకొని; కదలిరి= ముందుకు సాగారు.

**తాత్పర్యం:** 'చంద్రునివంటి ముఖం కల ఓద్రౌపదీ! వీరిలో మత్స్యయంత్రాన్ని కొట్టినవాడిని ప్రేమతో వరించుము' అని పల్కగా రాజకుమారు లంతా ఆ విల్లు ఎక్కుపెట్టి కొట్టటానికి పూనుకొని కదిలారు.

**సీ.** **అమ్మహోత్సవము నెయ్యమ్మునఁ జూడంగఁ । దివిరి యేతెంచిన దివిజ ఖచర**
**గరుడ గంధర్వ కిన్నరుల విమానముల్ । విలసిల్లె నంబరతలమునందుఁ;**
**బణవవీణావేణురణితానుసార మై । రసగీతరవ మెల్ల దెసల నెసఁగె;**
**బోరన వివిధతూర్యారవంబులు మహా । వననిధిధ్వానంబు ననుకరించె;**

**ఆ.** **దివ్యమాల్యములయు దివ్యానులేపన । ములయు సౌరభంబు వెలయఁ దాల్చి**
**రంగమధ్యజనులకుం గడు తనుపుగాఁ జేరి వీచె దివ్య మారుతంబు.** **173**

**ప్రతిపదార్థం:** ఆ+మహోత్సవమున్= ఆ గొప్ప ఉత్సవాన్ని; నెయ్యమ్మునన్= ప్రీతితో; చూడంగన్; తివిరి= కోరి; ఏతెంచిన= (విచ్చేసిన) వచ్చిన; దివిజ, ఖచర, గరుడ, గంధర్వ, కిన్నరుల విమానముల్; అంబరతలంబునందున్= ఆకాశ ప్రదేశంలో; విలసిల్లెన్= ప్రకాశించాయి; పణవ, వీణా, వేణు, రణిత+అనుసారము+ఐ= మద్దెలల, వీణల, పిల్లనగ్రోవుల ధ్వనిని అనుసరించిన దై; రస, గీత, రవము= ఆనందాన్ని కలిగించే సంగీతధ్వని; ఎల్ల దెసలన్= అన్నిదిక్కుల; ఎసఁగెన్= వ్యాపించెను; బోరన; వివిధ తూర్య+ఆరవంబు= బోరు మని అనేక విధాలైన వాద్యాల ధ్వనులు; మహా, వన, నిధి ధ్వానంబున్= మహాసముద్రముయొక్క ధ్వనిని; అనుకరించెన్= పోలెను; దివ్య, మాల్యములయు= మంచిపూలదండలయొక్క; దివ్య+అనులేపనములయు = మంచిపూతలయొక్క - అనగా గంధం మొదలైన మైపూతద్రవ్యాలయొక్క; సౌరభంబు= సువాసన; వెలయన్= ఒప్పగా; తాల్చి= ధరించి; రంగ, మధ్య, జనులకున్= స్వయంవరరంగమధ్యంలో ఉన్న జనులకు; కడున్= మిక్కిలి; తనుపుగాన్= తృప్తిగా; దివ్య, మారుతంబు= మంచి గాలి; వీచెన్= వీచింది.

**తాత్పర్యం:** దేవతలు, ఆకాశసంచారులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు ఆ ద్రౌపదీ స్వయంవరమహోత్సవాన్ని చూడగోరి ప్రీతితో రాగా, వాళ్ళవిమానాలు ఆకాశంలో ప్రకాశించాయి. మద్దెలల, వీణల, పిల్లనగ్రోవుల ధ్వనిని అనుసరిస్తూ రసమయసంగీతధ్వని అన్నిదిక్కుల వ్యాపించింది. అనేకవిధాలైన వాద్యాల ధ్వనులహోరు మహాసముద్ర ధ్వనినిపోలి ఉండింది. మంచిపూదండలు, గంధంవంటి మంచిమైపూతలు మొదలైనవవాటి సువాసనతో కూడిన మంచిగాలి, స్వయంవరరంగమధ్యంలో ఉన్న జనులకు తృప్తి కలిగేవిధంగా వీచింది.

**విశేషం:** అలం: ఉపమ.

**చ.** **అవిరళభస్మమధ్యమున నగ్నికణంబుల పోలె బ్రాహ్మణ**
**ప్రవరులలోన నేర్పడక పాండవు లేవురు నున్నఁ జూచి యా**

**దవ వృషభుండు కృష్ణుఁడు ముదంబున వారి నెఱింగి, పార్థుఁ డీ**
**యువతిఁ బరిగ్రహించు ననియుం దలఁచెన్ హృదయంబులోపలన్. 174**

**ప్రతిపదార్థం:** అవిరళ, భస్మ, మధ్యమునన్= దట్టమైన బూడిద నడుమ; అగ్ని కణంబుల, పోలెన్= నిప్పు ముక్కలవలె; బ్రాహ్మణ, ప్రవరులలోనన్= బ్రాహ్మణశ్రేష్ఠులలో; పాండవులు+ఏవురున్= పాండవు లైదుగురూ; ఏర్పడక= తెలియరాక; ఉన్నన్= ఉండగా; చూచి; యాదవ, వృషభుండు= యాదవులలో శ్రేష్ఠుడు-కృష్ణుడు; ముదంబునన్= సంతోషంతో; వారిన్= వాళ్ళను; ఎఱింగి= తెలిసికొని; పార్థుఁడు= అర్జునుడు; ఈ, యువతిన్= ఈ కన్యను - ద్రౌపదిని; పరిగ్రహించున్= చేపట్టును; అనియున్, హృదయంబులోపలన్, తలఁచెన్= అని కూడ హృదయంలో అనుకొన్నాడు.

**తాత్పర్యం:** దట్టమైన బూడిద నడుమ నిప్పు కణాలవలె బ్రాహ్మణ శ్రేష్ఠుల మధ్య పాండవులైదుగురూ స్పష్టంగా తెలియరాకుండా ఉండటం చూచి, ఆ యాదవ శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు సంతోషంతో వాళ్ళను గుర్తించి, అర్జునుడు ఈ ద్రౌపదిని చేపట్టగల డనికూడ మనస్సులో అనుకొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. సత్త్వగుణ ప్రధానులు, పవిత్రులు అయిన బ్రాహ్మణశ్రేష్ఠుల సమూహాన్ని భస్మంతో, సత్త్వరజోగుణ ప్రధానులు-బ్రాహ్మణ వేషాలతో బ్రాహ్మణులమధ్యలో ఉన్న పాండవులను అగ్నికణాలతో పోల్చటం అర్థవంతంగా మనోహరంగా ఉన్నది. పాండవులను నివురుకప్పిన నిప్పుకణాలుగా వర్ణించటం రుచిరార్థసూక్తిమత్త్వం. బ్రాహ్మణవేషాలు తొలగి నిజరూపాలు వెలువడే సమయం వచ్చిం దని రంగమధ్యంలోని గాలి ధ్వనిస్తున్నది. నివురుకప్పిన నిప్పులను సైతం గుర్తింపగలిగిన శ్రీకృష్ణుని దివ్యప్రతిభ ఇందులో గమ్యమానం. 'ఏర్పడక పాండవు లేవురు నున్నన్ - చూచి' అన్నప్పుడు ఉండగా చూచి, అనిన్నీ, ఉన్నప్పటికీ గమనింప కలిగి (తెలిసికొని చూచి) అనిన్నీ చెప్పుకొనేటట్లు రచించటం నన్నయ సూక్తిప్రయోగనైపుణ్యం. శ్రీకృష్ణాదులు మత్స్యయంత్ర భేదనంలో పాల్గొనకపోవటానికి కారణం ధ్వనిమయం చేసి కథను ప్రసన్నం చేశాడు నన్నయ. (సంపా.)

**వ. అంత నా రాజనందనులు ద్రుపదరాజనందనం జూచి కందర్పబాణబాధితు లయి తమ్మును దమ సామర్థ్యము నెఱుంగక యర్థిత్వంబున నవ్విల్లు మోపెట్టఁ బోయి. 175**

**ప్రతిపదార్థం:** అంతన్= అనంతరం; ఆ రాజనందనులు= ఆ రాజకుమారులు, ద్రుపదరాజనందనన్= ద్రుపదరాజుయొక్క కూతురైన ద్రౌపదిని; చూచి; కందర్ప, బాణ, బాధితులు+అయి= మన్మథునిబాణాలచేత బాధింపబడినవాళ్ళయి; తమ్మునున్= తమను; తమ సామర్థ్యమ్మును; ఎఱుంగక= తెలియక; అర్థిత్వంబునన్= ఆశచేత; ఆ+విల్లు= ఆ ధనుస్సును; మోపెట్టన్+పోయి= ఎక్కుపెట్టపోయి.

**తాత్పర్యం:** తరువాత ఆ రాజకుమారులు ద్రౌపదిని చూచి మన్మథబాణపీడితులై తమను, తమ పరాక్రమాన్ని అంచనా వేసుకోలేక ఆశతో ఆ విల్లును ఎక్కుపెట్టటానికి పోయి.

**క. వడి నౌడు గఱచి, వలకేల్ । నిడుచన గనయమునఁ బెనఁచి, నీల్గి, బలం బే**
**ర్పడ విల్లు వంపనోపక । యుడిగిరి నృపసుతులు గొంద ఱొయ్యన లజ్జన్. 176**

**ప్రతిపదార్థం:** నృప, సుతులు= రాజపుత్రులు; కొందరు; వడిన్= వేగమే; ఔడు, కఱచి= పెదవిని పళ్ళతో బిగబట్టి; వలకేల్= కుడిచేతిని; నిడుచన= పొడవగునట్లు; గనయమునన్= వింటికొప్పునందు; పెనఁచి= చుట్టి; నీల్గి= ఒళ్ళువిరుచుకొని; బలంబు=

శక్తి; ఏర్పడన్= బైటపడగా; విల్లు= ధనుస్సు; వంపన్+ఓపక= వంచలేక; ఒయ్యనన్= తిన్నగా; లజ్జన్= సిగ్గుచేత; ఉడిగిరి= ప్రయత్నాన్ని మానుకొన్నారు.

**తాత్పర్యం:** రాజకుమారులు కొందరు వేగంగా తమ పెదవిని పళ్ళతో బిగబట్టి, కుడిచేతిని చాచి, వింటికొప్పును పట్టి, నీల్గి తమబలం బైటపడగా, ఆ వింటిని వంచలేక సిగ్గుపడి ఆ ప్రయత్నం మెల్లగా మానుకొన్నారు.

**క. బలవంతుల బలమఱగా । మలువక ప్రూన్రానిపాట మాయాధను వి**
**మ్ములఁ జేసిన మోపెట్టఁగఁ । గొలఁదియె యని డాయ రైరి కొందఱు దానిన్. 177**

**ప్రతిపదార్థం:** కొందరు; బలవంతులు; బలము; అఱఁగాన్= నశించేటట్లు; మలువక= వంపక; ప్రూన్+ప్రూని పాట= ప్రూకులలో పెద్ద ప్రూకువలె; మాయా, ధనువు= మాయా ధనుస్సును; ఇమ్ములన్= చక్కగా; చేసినన్= చేసినచో; మోపెట్టఁగన్= ఎక్కుపెట్టుటకు; కొలదియె= సాధ్యమా; అని= తలంచి; దానిన్= ఆ ధనుస్సును; డాయరు+అయిరి= దగ్గరకే పోక పోయారు.

**తాత్పర్యం:** 'బలవంతుల బలం అణగేవిధంగా దానిని వంచక' ప్రూనులలో పెద్దప్రూనువలె ఉన్న ఈ మాయా ధనుస్సును ఈ విధంగా చేస్తే ఎవరు ఎక్కుపెట్టగలరు? అని కొందరు రాకుమారులు దాని దగ్గరకే పోలేదు.

**మ. 'ఇది యెట్లున్ సమకూర దెవ్వరికి; ము న్నీ విల్లు మోపెట్టఁ బో**
**లదు; మోపెట్టియు నంతరిక్షమున నా లక్ష్యంబు భేదింపఁగా**
**నది బ్రహ్మదుల కైన నిం దలవిగా' దంచున్ విచారించి ని**
**ర్మదు లై కొందఱు రాజు లేఁగిరి నిజక్ష్మామార్గముల్ చూచుచున్. 178**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ ద్రౌపది; ఎట్లున్= ఏ విధంగా కూడ; ఎవ్వరికీ= ఎవరికీ; సమకూరదు= లభించదు; మున్ను= ముందు; ఈ, విల్లు; మోపెట్టన్= ఎక్కుపెట్టటానికి; పోలదు= సాధ్యంకాదు; మోపెట్టియున్= ఎక్కుపెట్టినప్పటికి; అంతరిక్షమునన్= ఆకాశంలో; ఆ, లక్ష్యంబున్= ఆ గురిని - మత్స్యయంత్రాన్ని; భేదింపఁగాన్= కొట్టటం; అది= అనేది; బ్రహ్మ+ఆదులకు+ఐనన్= బ్రహ్మ మొదలైన వాళ్ళకు కూడ; ఇందున్= ఇక్కడ; అలవి, కాదు= సాధ్యం కాదు; అంచున్= అని అంటూ; విచారించి= ఆలోచించి; కొందఱు, రాజులు; నిర్మదులు+ఐ= మదంలేనివాళ్ళయి; నిజ, క్ష్మా, మార్గముల్= తమ భూముల త్రోవలు - అనగా తమ ఊరిత్రోవలు; చూచుచున్; ఏఁగిరి= వెళ్ళిరి.

**తాత్పర్యం:** 'ఈ ద్రౌపది యే విధంగాకూడా ఎవ్వరికీ లభించదు. మొదట ఈ విల్లు ఎక్కుపెట్టటమే సాధ్యం కాదు. ఎక్కుపెట్టినా, ఆకాశంలోని ఆ మత్స్యయంత్రాన్ని భేదించటం బ్రహ్మాదులకైనా అలవికాదు' అని ఆలోచించి, కొందరు రాజులు గర్వం వదలి, తమఊరిదారి పట్టారు.

**విశేషం:** భూవలయంలో ఉన్న రాజులంతా మూగిన సభ అది. చాలమంది విల్లును ఎత్తే శక్తిలేక ఓటుపడ్డారు. వాళ్ళంతా ఆ విల్లెత్తటం, ఆపైన మత్స్యయంత్రాన్ని భేదించటం సాధ్యమయ్యే పని కా దనీ, ద్రౌపదిస్వయంవరం సఫలం కా దనీ భావించి, తమ తమ దేశాలకు తిరిగిపోయారు. ఈ వర్ణనం మత్స్యయంత్రాన్ని భేదించే అర్జునునీ. అర్జునుని సామర్థ్యాతిశయాన్నీ మరింత ప్రకాశింపచేసేదిగా ఉన్నది.

## అర్జునుఁడు మత్స్యయంత్రంబుఁ దెగ నేయుట (సం.1-179-4)

**వ. ఇట్లు రాజపుత్త్రు లవ్విల్లు మోపెట్ట నోపక నివృత్తు లయిరి; మఱి యదు వృష్ణి భోజాంధకులు కృష్ణానుమతంబున సజ్య కర్మంబునం దనారంభు లయి యున్నకుండి; రంత శిశుపాల జరాసంధ శల్యకర్ణులు దర్పితు లై తమ తమ లావులు మెఱసి క్రమంబున నలువురు మాష యవముద్గరోమమాత్రంబులు దక్క గొనయం బెక్కించియు మోపెట్ట నశక్యంబయిన నుక్కుసెడి స్రుక్కిన; వారలం జూచి యగ్రజు ననుమతంబున విప్రసభ వెలువడి విజయుండు ధనుస్సమీపంబున కరిగిన, నాతని యుత్సాహంబున కచ్చెరువడి కొందఱు బ్రాహ్మణులు దమలో ని ట్లనిరి.179**

**ప్రతిపదార్థం:** ఇట్లు; రాజపుత్త్రులు; ఆ+విల్లు= ఆ ధనుస్సును; మోపెట్టన్+ఓపక= ఎక్కుపెట్టలేక; నివృత్తులు+ఐరి= వెనుదిరిగి పోయారు; మఱి= ఇక; యదు, వృష్ణి; భోజ+అంధకులు= యాదవులు, వృష్ణులు, భోజులు, అంధకులు; కృష్ణ+అనుమతంబునన్= కృష్ణుని అభిప్రాయాన్ని అనుసరించి; సజ్య, కర్మంబునందు= విల్లు ఎక్కుపెట్టే పనియందు; అనారంభులు+ఐ= ఆరంభం చేయని వా ళ్ళయి - అనగా ప్రయత్నం చేయనివాళ్ళయి; మిన్నక+ఉండిరి= ఊరకున్నారు; అంతన్= అటుపై; శిశుపాల, జరాసంధ; శల్య, కర్ణులు; దర్పితులు+ఐ= గర్వంతో కూడుకొన్నవారై; తమ తమ లావులు= తమతమ బలాలు; మెఱసి= ప్రకటించి; క్రమంబునన్= వరుసగా; నలువురు; మాష, యవ, ముద్గ, రోమ, మాత్రంబులు= మినుపగింజ, యవగింజ, పెసరగింజ, వెంద్రుక అంత మాత్రములు; తక్క= తక్కువగా, (మిగులునట్టుగా); గొనయంబు= అల్లెత్రాటిని; ఎక్కించియు; మోపెట్టన్= ఎక్కుపెట్టుటకు; అశక్యంబు+అయినన్= సాధ్యం కాకపోగా; ఉక్కు, చెడి= బలం లేక; స్రుక్కినన్= సోలగా; వారలన్= వాళ్ళను; చూచి, అగ్రజు, అనుమతంబునన్= అన్న యైన ధర్మరాజుయొక్క సమ్మతిచేత; విప్రసభ= బ్రాహ్మణుల సభనుండి; వెలువడి= బయలుదేరి; విజయుండు= అర్జునుడు; ధనుస్+సమీపంబునకు= విల్లు దగ్గరకు; అరిగినన్= వెళ్లగా; అతని ఉత్సాహంబునకున్; అచ్చెరువు, పడి= ఆశ్చర్యపడి; కొందరు, బ్రాహ్మణులు; తమలోన్; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** ఈ విధంగా రాజకుమారులు ఆ ధనుస్సులు ఎక్కుపెట్టలేక వెనుదిరిగి పోయారు. యదువృష్ణి, భోజాంధకులు శ్రీకృష్ణుని అభిప్రాయాన్ని అనుసరించి ధనుస్సును ఎక్కుపెట్టే ప్రయత్నమే చేయలేదు. శిశుపాల, జరాసంధ, శల్య, కర్ణులు గర్వితులై తమ తమ బలాలు వెల్లడి కాగా - క్రమంగా మినుపగింజ, యవగింజ, పెసరగింజ, వెంద్రుక - అంతమాత్రం తక్కువగా అల్లెత్రాటిని ఎక్కించి కూడ, ఆ ధనుస్సును ఎక్కుపెట్టలేక బలం చెడి సోలిపోయారు. వాళ్ళను చూచి అర్జునుడు తన అన్న ధర్మరాజు అనుమతిని పొంది, బ్రాహ్మణసభ నుండి వెలువడి ధనుస్సు దగ్గరికి వెళ్లగా, అతని ఉత్సాహానికి ఆశ్చర్యపడి కొందరు బ్రాహ్మణులు తమలో ఇట్లా మాట్లాడుకొన్నారు.

**విశేషం:** అలం: క్రమము. మత్స్యయంత్రం భేదించలేని రాజులను నన్నయ నాల్గు విధాలుగా వర్గీకరించి వర్ణించాడు. 1. విల్లు నెత్తటానికి ప్రయత్నించి విఫలు లైనవారు. 2. విల్లు నెత్తటం, మత్స్యయంత్రం కొట్టటం సాధ్యం కా దని భావించి పోటీ మానుకొని ఇండ్లకు పోయినవారు. 3. ఆ పోటీలో పాల్గొనా లని వచ్చి పోటీలో పాల్గొనక నిర్లిప్తులుగా ఉండిపోయినవారు. 4. పోటీలో పాల్గొన్నా అల్లెత్రాటిని ఎక్కించేవరకు వచ్చి కొద్దిలో తప్పినవారు. ఈ నాల్గువర్గాల రాజకుమారులందరి ప్రయత్నాలు ముగిసిన తరువాత బ్రాహ్మణవర్గంలో నుండి విజయుడు లేచి విల్లును సమీపించాడు. అర్జునుడిని ఈ సమయంలో 'విజయుడు' అని పేర్కొనటం (అతని విజయాన్ని సూచిస్తూ) ఎంతో ఉచితంగా ఉన్నది.

**ఉ. ఇ మ్మనుజేంద్రనందను లహీనబలుల్ దృఢదీర్ఘ బాహువీ**
**ర్యమ్ములవార లోపర శరాసనకర్మమునం ; దయుక్త ద**
**ర్పమ్మున నిప్డు నవ్వు పఱుపన్ సమకట్టె నితండు విప్రవం**
**శమ్మునవారినెల్లఁ దనశక్తి యెఱుంగక దుర్విదగ్ధుఁ డై. 180**

**ప్రతిపదార్థం:** ఈ+మనుజ+ఇంద్ర, నందనులు= ఈ రాజశ్రేష్ఠుల కుమారులు; దృఢ, దీర్ఘ, బాహు, వీర్యమ్ముల వారలు= దృఢాలై పొడవైన బాహువుల పరాక్రమాలు గలవారు; అహీన, బలుల్= తక్కువగాని బలం కలవారు; శర+ఆసన, కర్మమునందు= ధనుస్సు యొక్క పనియందు అనగా ధనుస్సును ఎక్కుపెట్టి మత్స్యయంత్రాన్ని కొట్టేపనిలో; ఓపరు+అ= చేతగాని వా రైరికదా; ఇప్పుడు, ఇతండు; అయుక్త, దర్పమ్మునన్= తగని గర్వంచేత; తన శక్తి; ఎఱుంగక= తెలియక; దుర్విదగ్ధుఁడు+ఐ= అవివేకి అయి; విప్ర, వంశంబునన్, వారిన్+ఎల్లన్= బ్రాహ్మణవంశంలోని వారినందరిని; నవ్వుపఱుపన్= నవ్వుల పాలయ్యేటట్లు చేయటానికి; సమకట్టెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** ఈ మహారాజకుమారులు దృఢాలైనవి, పొడవైనవి అగు బాహువుల పరాక్రమంలో ఏమాత్రం తక్కువ కాని బలంకలవాళ్ళు. వాళ్ళే ఈ విల్లును ఎక్కుపెట్టి కొట్టలేక పోయారు. ఇప్పు డితడు అనుచిత మైన గర్వంతో, తనశక్తి యెంతో తెలుసుకోలేక, అవివేకి అయి బ్రాహ్మణవంశంవాళ్ళనంతా నవ్వులపాలు చేయటానికి పూనుకొన్నాడు.

**క. అనువారు, నందుఁ గొందఱు । 'ఘనుఁ డీతఁడు; వీరికంటెఁ గార్ముక విద్యం**
**దనరిన వాఁ డయి దీనికి । మొనసెంగా; కన్యుఁ డిట్లు మొనయం గలఁడే! 181**

**ప్రతిపదార్థం:** అనువారున్= అని పలికేవాళ్లు; అందున్= వారిలో; కొందఱు; ఈతఁడు; ఘనుఁడు; కార్ముక విద్యన్= విలువిద్యలో; వీరికంటెన్; తనరినవాఁడు+ఐ= ఒప్పినవా డై; దీనికిన్= ఈ పనికి, మొనసెన్+కాక= పూనుకొన్నాడు కాని; అన్యుఁడు= ఇతరుడు; ఇట్లు; మొనయన్+కలఁడు+ఏ= పూనుకొనగలడా.

**తాత్పర్యం:** అని పలుకుతూ ఉండగా; అందులో కొందరు 'ఇతడు గొప్పవాడు. వీళ్ళకంటె విలువిద్యలో నేర్పు కలవా డై ఈ పనికి పూనుకొన్నాడుకాని సామాన్యుడు ఈ విధంగా పూనుకొనగలడా?'

**మ. అమితోత్సాహుఁడు దీర్ఘ బాహుపరిఘుం డత్యంతతేజస్వి స**
**ద్విమలాచారుఁడు విప్రభక్తిపరుఁ డీ విప్రుండు విప్రప్రసా**
**దమునన్ విప్రుల కెల్ల సంతసముగాఁ దత్కర్మసంసిద్ధి ను**
**త్తముఁడై పొందెడు మంచు నుండిరి దయన్ ధాత్రీసురుల్ ప్రీతు లై. 182**

**ప్రతిపదార్థం:** అమిత+ఉత్సాహుఁడు= అపరిమితమైన ఉత్సాహం కలవాడు; దీర్ఘ; బాహు, పరిఘుండు= పొడవైన ఇనుప గుదియలవంటి బాహువులు కలవాడు; అత్యంత, తేజస్వి= మిక్కిలి తేజస్సు కలవాడు; సత్+విమల, ఆచారుఁడు= శ్రేష్ఠమూ; నిర్మలమూ అయిన నడవడి కలవాడు; విప్ర, భక్తిపరుఁడు= బ్రాహ్మణభక్తి ప్రధానంగా కలవాడు; ఈ, విప్రుండు= ఈ బ్రాహ్మణుడు; విప్ర, ప్రసాదమునన్= బ్రాహ్మణుల అనుగ్రహంవలన; విప్రులకున్+ఎల్లన్= బ్రాహ్మణులందరికి; సంతసముగాన్= సంతోషమయ్యేటట్లు; తద్+కర్మ; సంసిద్ధిన్= ఆ కార్యంయొక్క నెఱవేరుటను; ఉత్తముఁడు+ఐ; పొందెడుము= పొందుగాక;

అంచున్= అని పలుకుతూ; ధాత్రీ, సురుల్= బ్రాహ్మణులు; ప్రీతులు+ఐ= సంతోషించినవా ళ్ళయి; దయన్= దయతో; ఉండిరి= ఉన్నారు.

**తాత్పర్యం:** అపరిమితమైన ఉత్సాహం కలవాడు, దీర్ఘమైన ఇనుపగుదియలవంటి బాహువులు కలవాడు, మిక్కిలి తేజస్సు కలవాడు, శ్రేష్ఠము, నిర్మలము అయిన నడవడి కలవాడు, బ్రాహ్మణభక్తి కలవాడు అయిన ఈ బ్రాహ్మణుడు - బ్రాహ్మణుల అనుగ్రహంచేత బ్రాహ్మణులందరికి సంతోషం కలిగేవిధంగా కార్యసిద్ధి పొందుగాక! అని బ్రాహ్మణులు సంతోషించినవాళ్ళయి అర్జునునిపట్ల దయతో ఉన్నారు.

**విశేషం:** అర్జునుడు ధనువుదగ్గరికి పోతున్న సమయంలో బ్రాహ్మణవర్గంవాళ్ళు అతడినిగురించి భావించిన పద్ధతులను మూడురకాలుగా ఒక క్రమంలో చిత్రించటం నన్నయ కథాకథనశిల్పం. ఒకరకంవాళ్ళు భయస్థులు. మహాపరాక్రమవంతు లైన రాకుమారులే ఎక్కుపెట్టలేని విల్లును చేపట్టి మత్స్యయంత్రాన్ని కొట్టటానికి యత్నించి విఫలుడై బ్రాహ్మణవర్గాన్ని నవ్వులపాలు చేయటానికి పూనుకొన్నా డని వాళ్ళు భావించారు. రెండవ రకంవాళ్ళు వివేచనపరులు. రాకుమారులకంటె బలవంతుడై ఉండబట్టే ప్రయత్నిస్తున్నా డని భావించారు. మూడవ రకంవాళ్ళు విజ్ఞులు. విజయుని రూపతేజోబలాదులను గణించి, విజయం తథ్యమని నిశ్చయించినవారు. ఈ బ్రాహ్మణవర్గాలవారి వ్యాఖ్యలు అర్జునుని సామర్థ్యాన్ని, విజయాన్ని ప్రకాశింపచేసే వస్తుధ్వని విశేషాలు. క్షత్రియులు మాట్లాడకుండా ఉండటంకూడా ఇందులో ఒక విశేషమే. బ్రాహ్మణహృదయం బయటపడినట్లుగా క్షత్రియహృదయం బయటపడదు. బహుశః కొందరు క్షత్రియులు ఆశ్చర్యచకితులై అర్జునునివైపు అలా చూస్తూ ఉన్నారేమో - ఇతడు ఏం చేస్తాడో చూద్దా మని. మరికొందరు అతని ప్రయత్నాన్ని ఉపేక్షించి ఊరకున్నారేమో! మొత్తానికి క్షత్రియులు మాట్లాడలేదు.

**వ. అంత న య్యర్జునుండు న వ్వింటిసమీపంబునకు వచ్చి గురువులం దలంచి నమస్కారంబు సేసి, ధనువునకుఁ బ్రదక్షిణంబుఁ జేసి మ్రొక్కి దాని నెత్తికొని పూర్వపరిచితం బైనవిల్లు మోపెట్టిన ట్లశ్రమంబున మోపెట్టి, జను లాశ్చర్యంబునుం బొందుచుండ, నే నమ్ముల న మ్మత్స్యయంత్రంబు నాక్షణంబ యురుల నేసినం జూచి బ్రాహ్మణ క్షత్రియ ప్రముఖు లయిన జనులెల్ల విస్మితు లయి. 183**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపై; ఆ+అర్జునుండున్= ఆ అర్జునుడుకూడా; ఆ+వింటి= ఆ ధనుస్సుయొక్క; సమీపంబునకున్= దగ్గరకు; వచ్చి; గురువులన్; తలంచి; నమస్కారంబు, చేసి; ధనువునకున్= ధనుస్సుకు; ప్రదక్షిణంబున్ చేసి= చుట్టుతిరిగి; మ్రొక్కి; దానిన్, ఎత్తికొని= ఆ వింటిని ఎత్తుకొని; పూర్వ, పరిచితంబు+ఐన= ఇంతకు ముందే అలవాటుపడిన; విల్లు= ధనుస్సు; మోపెట్టిన+అట్లు= ఎక్కుపెట్టినట్లు; అశ్రమంబునన్= శ్రమలేకుండా, సులభంగా; మోపెట్టి= ఎక్కుపెట్టి; జనులు, ఆశ్చర్యంబునున్, పొందుచుండన్= ఆశ్చర్యాన్ని పొందగా; ఏను+అమ్ములన్= ఐదుబాణాలచేత; ఆ+మత్స్య యంత్రంబున్= ఆ మత్స్యయంత్రాన్ని; ఆ, క్షణంబు+అ= ఆ క్షణమే; ఉరులన్= పడేటట్లు; ఏసినన్= కొట్టగా; చూచి; బ్రాహ్మణ, క్షత్రియ, ప్రముఖులు+ఐన= బ్రాహ్మణులు, క్షత్రియులతో ముఖ్యులైన; జనులు+ఎల్లన్= ప్రజలు అందరూ; విస్మితులు+అయి= ఆశ్చర్యపడిన వాళ్ళయి.

**తాత్పర్యం:** తరువాత అర్జునుడు ఆ ధనుస్సు దగ్గరికి వచ్చి, గురువులను స్మరించుకొని నమస్కారం చేసి, ధనుస్సుకు ప్రదక్షిణనమస్కారాలు చేసి, దాన్ని ఎత్తుకొని, అలవా టైన ధనుస్సును సంధించినట్లు సులభంగా సంధించి, ప్రజలంతా ఆశ్చర్యపడుతుండగా, ఐదు బాణాలతో ఆ మత్స్యయంత్రాన్ని ఒక్క క్షణంలోనే పడగొట్టాడు. అది చూచి బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైన జనులంతా ఆశ్చర్యపరవశు లయ్యారు.

**విశేషం:** అర్జునుడు విల్లును ఎక్కుపెట్టటానికి ముందు గురువులను స్మరించి నమస్కరించటం, విల్లుకు ప్రదక్షిణం చేసి మ్రొక్కటం - అనేవి ధనుర్వేదవిద్యను పవిత్రభావంతో ఉపాసించే మేటివీరుని లక్షణం. గర్వితులైనవారికి విల్లు వశం కాలేదు. మత్స్యయంత్రం ఒక ఋషి కల్పించిన విద్య అని ధృష్టద్యుమ్నుడు చెప్పనే చెప్పాడు. విద్యను గౌరవించటం విద్వాంసునికే తెలుసు అని అర్జునునిపాత్రను చిత్రించటం - ఇక్కడ విశేషం. విద్య వినయవంతులకే ప్రసన్నమౌతుం దనే సత్యంకూడ ఇక్కడ స్పష్టమౌతున్నది. మత్స్యయంత్రభేదనంవంటి మహత్తరవిషయాన్ని నన్నయ చిన్నవచనంలో చెప్పి ముగించాడు. అర్జునుని ప్రశంసించిన వాక్యాలను వృత్తాలలో నిబంధించాడు. మత్స్యయంత్రం కొట్టిన అర్జునునికి అది ఒక గొప్ప ప్రదర్శనం కాదు. కాని, ఆ సభలో ఉన్నవాళ్ళ కంతా అది ఒక అద్భుతం. అవలీలగా ప్రదర్శితమైన జగదేకవీరుడైన అర్జునుని వీరరసాన్ని వచనంలోనూ, దానినుండి పుట్టిన అద్భుతాన్ని పద్యాలలోనూ రచించటం నన్నయగారి సార్థక ఛందఃప్రయోగశిల్పం.

**చ. ఫలపవనాంబుభోజన శుభవ్రతవృత్తులఁ జేసి చూడ దు**
**ర్బలతను లయ్యు బ్రాహ్మణు లపారతపోబలసంపదన్ మహా**
**బలయుతు; లట్టి వారలకు భవ్యుల కెందు నసాధ్య మెద్దియుం**
**గలదె? చరాచరాఖిలజగంబులఁ బెద్దల కారె సద్ద్విజుల్. 184**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణులు; ఫల, పవన+అంబు, భోజన, శుభ, వ్రత, వృత్తులన్+చేసి= పండ్లు, గాలి, నీరు భక్షించటంచేత, పుణ్యాలయిన వ్రతాలను చేయటంచేత; చూడన్= చూడటానికి; దుర్బల తనులు+అయ్యున్= బలహీనమైన శరీరం కలవారు అయినప్పటికీ; అపార, తపస్+బల, సంపదన్= అమితమైన తపోబలంయొక్క అతిశయంచేత; మహా, బల, యుతులు= గొప్ప బలంతో కూడినవారు; అట్టి, వారలకు; భవ్యులకున్= మహనీయులకు; ఎందున్, అసాధ్యము= ఎచ్చటను సాధ్యం కానిది; ఎద్దియున్, కలదె= ఏదైనా ఉన్నదా?; సత్+ద్విజుల్= ఉత్తములైన బ్రాహ్మణులు; చర+అచర+అఖిల, జగంబులన్= కదలునవి, కదలనివి అయిన అన్ని లోకాలలో; పెద్దలు+అ, కారె= పెద్దలే కదా.

**తాత్పర్యం:** బ్రాహ్మణులు ఫలాలను, గాలిని, నీటిని భక్షించటంచేత, పుణ్యవ్రతాలు చేయటంచేత; చూడటానికి బలహీనమైన దేహంకలవా ళ్ళయినా, అపారతపోబలసంపదచేత వాళ్ళు మహాబలవంతులు. అటువంటి మహనీయులకు ఎక్కడా అసాధ్యమైనది ఏదీ లేదు. సమస్తచరాచరలోకాలలో సద్బ్రాహ్మణులే గొప్పవాళ్ళుగదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క. నిమిషాంతరమున ని ట్ల । శ్రమమున మర్త్యులకు నేయ సమకూరునె యు**
**త్తముఁ డీతఁడు బ్రాహ్మణ రూ । పమున సురేశ్వరుఁడొ హరుఁడొ భానుఁడొ గుహుఁడో! 185**

**ప్రతిపదార్థం:** నిమిష+అంతరమునన్= క్షణం లోపల; ఇట్లు; అశ్రమమునన్= అనాయాసంగా; మర్త్యులకున్= మానవులకు; ఏయన్= మత్స్యయంత్రాన్ని పడవేయటం; సమకూరునె= సాధ్యమౌతుందా; ఈతఁడు, ఉత్తముఁడు; బ్రాహ్మణ రూపమునన్= బ్రాహ్మణ రూపంలో ఉన్న; సుర+ఈశ్వరుఁడొ= దేవేంద్రుడో; హరుఁడొ= శివుడో; భానుఁడొ= సూర్యుడో; గుహుఁడో= కుమారస్వామియో.

**తాత్పర్యం:** క్షణకాలంలోపలనే ఈ విధంగా అనాయాసంగా మత్స్యయంత్రాన్ని కొట్టటం మానవులకు సాధ్యమౌతుందా? ఉత్తము డైన ఇతడు బ్రాహ్మణరూపంలో ఉన్న దేవేంద్రుడో! శివుడో! సూర్యుడో! కుమారస్వామియో!

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, ఉల్లేఖం.

**క. అని ధరణి నుండి పొగడెడు । జనుల నిరంతరరవంబు, జలధరమార్గం**
**బున నుండి పొగడు దివ్యుల । యనవరతరవంబు నొక్కఁ డయి కడు నొప్పెన్. 186**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; ధరణిన్+ఉండి= భూమిమీద ఉండి; పొగడెడు, జనుల, నిరంతర, రవంబు= పొగడునట్టి మనుష్యులయొక్క ఎడతెగని శబ్దం; జలధర, మార్గంబున నుండి = మేఘమార్గము - అనగా ఆకాశమార్గమునుండి; పొగడు, దివ్యుల అనవరత, రవంబున్ = పొగడునటువంటి దేవతలయొక్క ఎడతెగనిశబ్దం; ఒక్కఁడు+అయి= ఒకటి అయి; కడున్= మిక్కిలి; ఒప్పెన్= అనువుగా అమరాయి.

**తాత్పర్యం:** అని భూమిమీద ఉండి పొగడే జనుల ఎడతెగని ధ్వని, ఆకాశంనుండి పొగడే దేవతల ఎడతెగని ధ్వని కలిసి మిక్కిలి అనువుగా అమరాయి.

**విశేషం:** ఇటు నేలమీదనుండి పొగడే జనాల సవ్వడి, అటు ఆకాశంనుండి పొగడే దేవతల సవ్వడి సమంగా ఏర్పడి అర్జునుని ప్రశంస భూనభోంతరాళాలలో వ్యాపించిం దని భావనామయంగా వర్ణించాడు నన్నయ. ఈ పద్యరచనానిర్ధారణంలోని సమత అనే గుణం ఈ వస్తుగుణాన్ని రమణీయంగా పోషిస్తున్నది. అద్భుతం ఆశ్చర్యభావంయొక్క ఉత్కటదశ. అది వాచికంగా వ్యక్తమైన మూడుదశలను మూడుపద్యాలలో నన్నయ చిత్రంచటం గమనార్హం. రాబోయే పద్యంలో చేష్టాత్మకమైన ఆశ్చర్యాన్ని వర్ణించటం శిల్పం. (సంపా.)

**క. చెలఁగె సురదుందుభిస్వన । ములు ముదమున భూసురోత్తములు పయిపుట్టం**
**బులు వీచివీచి యార్చిరి । వెలయఁగ నరుమీఁదఁ బుష్పవృష్టియుఁ గురిసెన్. 187**

**ప్రతిపదార్థం:** సుర, దుందుభి, స్వనములు= దేవతలయొక్కభేరులధ్వనులు; చెలఁగెన్= మ్రోగాయి; భూసుర+ఉత్తముల్= బ్రాహ్మణ శ్రేష్ఠులు; ముదమునన్= సంతోషంతో; పయి, పుట్టంబులు= మీది వస్త్రాలు - అనగా ఉత్తరీయాలు; వీచి, వీచి, ఆర్చిరి= మిక్కిలి వీచుతూ అరచారు; వెలయఁగన్= ఒప్పగా; నరుమీఁదన్= అర్జునుని మీద; పుష్పవృష్టియున్= పూలవానకూడ; కురిసెన్.

**తాత్పర్యం:** అప్పుడు దేవతల భేరీధ్వనులు మ్రోగాయి. బ్రాహ్మణోత్తములు తమ ఉత్తరీయాలను పదే పదే వీచుతూ పెద్దగా కేకలు వేశారు. అర్జునునిమీద పూలవాన అందంగా కురిసింది.

**విశేషం:** అంతమందిలో తమవాడు గెలిచా డని ఆనందాతిశయంతో బ్రాహ్మణులు ఉత్తరీయాలను పదేపదే వీచుతూ పెద్దగా కేకలు వేయటం ఎంతో సహజంగా, నాటకదృశ్యంగా కళ్ళకు కట్టిన ట్లున్నది.

**వ. అ య్యవసరంబున ధర్మనందనుండు నకుల సహదేవానుగమ్యమానుం డయి నిజనివాసంబునకుం జనియె; నిట ధృష్టద్యుమ్న సహితుం డయి యజ్ఞసేనుండు మహాసేనతో నర్జునునకు సహాయుండుగా నరిగె; నంత. 188**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ధర్మనందనుండు; నకుల, సహదేవ+అనుగమ్యమానుండు+అయి= నకుల, సహదేవులచే వెంబడింప బడినవాడై; నిజ, నివాసంబునకున్= తన ఇంటికి; చనియెన్= వెళ్ళాడు; ఇట; ధృష్టద్యుమ్న,

సహితుండు+ అయి= ధృష్టద్యుమ్నునితో కూడి; యజ్ఞసేనుండు= ద్రుపదుడు; మహా, సేనతోన్= గొప్ప సైన్యంతో; అర్జుననకున్= అర్జునునికి; సహాయుండుగాన్= సహకరించువాడై; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో ధర్మరాజు నకులసహదేవులు వెంటరాగా తమ యింటికి వెళ్ళిపోయాడు. ఇక్కడ ధృష్టద్యుమ్నునితో కూడి ద్రుపదుడు గొప్పసేనతో అర్జునునికి సహాయుడుగా వెళ్ళాడు. అప్పుడు.

### ద్రౌపది యర్జునుని వరించుట (సం. 1-179-22)

**సీ. ధరణీశ నందనుల్ ద న్నతిప్రీతితోఁ జూచుచు నుండంగ సుందరాంగి**
**తోయజదళనేత్ర ద్రుపదరాజాత్మజ । కమనీయ గజరాజగమనలీలఁ**
**జనుదెంచి సురరాజసన్నిభు నభినవ । యౌవనోద్భాసితు నసితరత్న**
**రుచిరాంగు నంగజరూపు ధనంజయుఁ । దనచేతి సితపుష్పదామకమునఁ**

**ఆ. బొలఁతి ముదముతోడఁ బూజించె; నట్టియు। త్సవముఁ జూచి దాని సైఁప కపుడు**
**కౌరవేంద్రుఁ డాదిగాఁ గల భూపతు । లెల్ల నలిగి కలయు నేపు రేఁగి.** **189**

**ప్రతిపదార్థం:** ధరణి+ఈశ, నందనుల్= రాజకుమారులు; తన్నున్; అతి, ప్రీతితోన్, చూచుచున్, ఉండంగన్ = మిక్కిలి ప్రీతితో చూస్తూ ఉండగా; సుందర+అంగి= అందమైన శరీరం కలది; తోయజ, దళ, నేత్ర= తామర రేకులవంటి కన్నులు కలది; ద్రుపదరాజ+ఆత్మజ= ద్రుపదరాజుయొక్క కూతురు-ద్రౌపది; కమనీయ, గజరాజ, గమన, లీలన్= మనోహరమైన ఏనుగు శ్రేష్ఠముయొక్క నడకవంటి విలాసంతో; చనుదెంచి= వచ్చి; సురరాజ, సన్నిభున్= దేవేంద్రునితో సమానుడైనవాడిని; అభినవ, యౌవన+ఉద్భాసితున్= క్రొత్త యౌవనంచే ప్రకాశించే కాంతికల దేహం కలవాడిని; అంగజ, రూపున్= మన్మథుని వంటి రూపం కలవాడిని; ధనంజయున్= అర్జునుడిని; తన, చేతి, సిత, పుష్ప, దామకమునన్= తనచేతిలో ఉన్న తెల్లని పూదండచేత; పొలఁతి= ఆ కాంత; ముదముతోడన్= సంతోషంతో; పూజించెన్; అట్టి, ఉత్సవమున్, చూచి; సైఁపక= ఓర్వక; అపుడు; కౌరవ+ఇంద్రుఁడు= దుర్యోధనుడు; ఆదికాన్+కల= మొదలుగా కల; భూపతులు= రాజులు; ఎల్లన్= అందరు; అలిగి= కోపించి; కలయన్= అంతటను; ఏపురేఁగి= విజృంభించి.

**తాత్పర్యం:** రాజకుమారులంతా తనను మిక్కిలి ప్రీతితో చూస్తూ ఉండగా - అందమైనశరీరం కలది, తామరరేకులవంటి కన్నులు కలది అయిన ద్రౌపది, మనోహర మైన మదపుటేనుగునడకవంటి నడకతో విలాసంగా వచ్చి - దేవేంద్రునితో సమానమైనవాడు, నూత్నయౌవనంతో ప్రకాశించేవాడు, ఇంద్రనీలంవంటి కాంతిగల దేహం కలవాడు; మన్మథునివంటి రూపం కలవాడు అయిన అర్జునుడిని తనచేతితెల్లని పూలదండతో పూజించింది. అటువంటి ఉత్సవాన్ని చూచి ఓర్వలేక, అప్పుడు దుర్యోధనుడు మొదలైనరాజులంతా కోపించి అంతటా విజృంభించారు.

**విశేషం:** రాజకుమారులంతా ద్రౌపది యొక్క అందమైన ఆకారాన్నీ, తామరరేకులవంటి కన్నులనూ, మదేభగమనంవంటి నడకహొయలనూ కన్నార్పకుండా చూచారు. అంతటి సౌందర్యరాశి అర్జునునికి అంకితమైపోతున్నదే అని వారి అసూయ. ఆమె సౌందర్యం, దాని ఫలితం తరువాతి పద్యంలో నన్నయ చెప్పబోతున్నాడు. దానికి హేతువును కల్పించుకొన్నా డిక్కడ. ఇది ప్రసన్న కథాకలితార్థయుక్తి. రాజకుమారులంతా ద్రౌపదిని చూస్తుండగా, ఆమెమాత్రం అర్జునుడినే ఏకాగ్రతతో చూస్తున్నది. అతడు మొదట దేవేంద్రునితో సమానుడైనవాడుగా కనిపించాడట! ఈ 'సురరాజసన్నిభుడు' అనే విశేషణం రమణీయార్థవ్యంజకం.

వస్తుధ్వని పోషకం. అర్జునుడు ఇంద్రునివరంవలన పుట్టినవా డన్నది ఒక అర్థం, రాబోయే కథలో పంచేంద్రోపాఖ్యానంలో చెప్పబోయే కథార్థాలలో ఇంద్రత్వభావనం పతిత ఇక్కడ అనుసంధించుకొనవలసివస్తుంది. పూర్వాపర కావ్యార్థభావనవలన అర్జునుడుగా ఉన్న ఇంద్రుడు నిజానికి అయిదురూపాలకు ప్రతినిధి. అందువలననే అంతగా ఆసక్తితో చూస్తున్న ద్రౌపదియందు అర్జునుని మనసు మన్మథాయత్తమైనట్లు నన్నయ వర్ణించాడు. ఇది కథాకథనశిల్పరహస్యం. 213వ పద్యంలో ఈ రహస్యం గమనింపవచ్చును. ఇంద్రత్వమే కాక యౌవనం, కాంతి, రూపం అనే గుణాలను ద్రౌపది అర్జునునిలో చూచి అతనిమెడలో దండవేసింది. 'కన్యా వరయతే రూపం'. (సంపా.)

**మత్తకోకిలము.**

> **ఏల రాఁ బనిచెన్ మహీశుల నెల్లఁ జుట్టమపోలె ము**
> **న్నేల సత్కృతిఁ జేసె నిందఱ? కిమ్మహారథు లుండఁగా**
> **నేల కన్యక నిచ్చె విప్రున కిందు నేఁడు శఠుండు పాం**
> **చాలుఁ, డిప్పడ వీని నిర్గతసత్త్వుఁ జేయుద మాజిలోన్.** **190**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశులన్+ఎల్లన్= రాజులందరిని; ఏల, రాన్+పనిచెన్= ఎందుకు రప్పించాడు? చుట్టము, పోలెన్= చుట్టంవలె; మున్ను= ముందు; ఇందఱకున్= ఇంతమందికి; ఏల, సత్కృతిన్= ఎందుకు సమ్మానం; చేసెన్= చేశాడు; ఈ+మహారథులు+ ఉండఁగాన్= ఇంతమంది మహావీరు లుండగా; నేఁడు; ఏల= ఎందుకు; ఇందున్= ఇచ్చట; విప్రునకున్= బ్రాహ్మణునికి; కన్యకన్; ఇచ్చెన్; పాంచాలుఁడు= ద్రుపదుడు; శఠుండు= మోసగాడు; ఇప్పుడు+అ= ఇప్పటి కిప్పుడే; వీనిన్= ఈ ద్రుపదుడిని; ఆజిలోన్= యుద్ధంలో; నిర్గత, సత్త్వున్= కోల్పోయిన బలం కలవాణ్ణిగా; చేయుదము= చేస్తాము.

**తాత్పర్యం:** రాజు లందరినీ ఎందుకు రప్పించాడు? చుట్టంవలె ఇందరికి ముందుగా ఎందుకు సమ్మానం చేశాడు? ఈ మహావీరులంతా ఉండగా ఈనాడు ఇక్కడ ఒక బ్రాహ్మణుడికి కన్యకను ఎందు కిచ్చాడు? ద్రుపదుడు మోసగాడు. ఇప్పుడే యుద్ధంలో ఇతని బలాన్ని అణచివేద్దాం.

**విశేషం:** ద్రౌపదీస్వయంవరానికి విచ్చేసి పరాభూతులైన భూపతుల కోపాగ్ని ఈ పద్యంలో ప్రకటితం. చిన్న చిన్న వాక్యాలలో ఎక్కడికక్కడ ఆగిపోయే ఈ వాక్యాలనుబట్టి వారి కోపతాపాలు పూర్తిగా నిర్వీర్యము లని సూచన.

> **క. తన విద్య పేర్మి నృపనం । దనఁ బడసెను విప్రుఁ; డితని తప్పే? కడుదు**
> **ర్జనుఁ డీ ద్రుపదుఁడు నృపతుల । ననయంబున మెచ్చఁ డయ్యె నతిగర్వితుఁడై.** **191**

**ప్రతిపదార్థం:** విప్రుఁడు= బ్రాహ్మణుడు; తన, విద్య, పేర్మిన్= తన విద్యయొక్క గొప్పతనంచేత; నృప, నందనన్= రాజు కూతురైన ద్రౌపదిని; పడసెను= పొందాడు; ఇతని తప్పు+ఏ= ఇతని త ప్పేమున్నది; ఈ ద్రుపదుఁడు; దుర్జనుఁడు= దుర్మార్గుడు; అతి గర్వితుఁడు+ఐ= మిక్కిలి గర్వించినవాడై; నృపతులన్= రాజులను; అనయంబునన్= అవినీతితో; మెచ్చఁడు+అయ్యెన్= మెచ్చని వాడు అయ్యాడు.

**తాత్పర్యం:** ఈ బ్రాహ్మణుడు తన విద్యాబలంతో ద్రౌపదిని పొందాడు. ఇతని తప్పు ఏ మున్నది? ద్రుపదుడు దుర్మార్గుడు. అతడు అతిగర్వంతో రాజులను ఏమాత్రం లెక్కపెట్టలేదు.

**వ. 'ఏమిదోషంబు సేసియు బ్రాహ్మణుండు వధ్యుండు గాఁడు; మన రాజ్యంబును నర్థంబును బ్రాహ్మణార్థంబ; కావున న విప్రుతోడి దేమి? యని ద్రుపదుపయి నెత్తుదెంచిన, ద్రుపదుండును కడుభీతుం డై బ్రాహ్మణుల మఱువు సొచ్చె;**

**నిట్లు శరణాగతుం డయిన ద్రుపదు నోడకుండు మని బ్రాహ్మణులు దమ తమ దండాజినంబు లెత్తికొని ప్రతిబలంబులపయి వీచుచున్నంత, వారలం జూచి నగుచు నర్జునుం డి ట్లనియె. 192**

**ప్రతిపదార్థం:** ఏమి, దోషంబు, చేసియు; బ్రాహ్మణుండు; వధ్యుండు= చంపదగినవాడు; కాఁడు; మన, రాజ్యంబునున్; అర్థంబును= సంపదయు; బ్రాహ్మణ+అర్థంబు+అ= బ్రాహ్మణుల కొరకే; కావునన్, ఆ+విప్రుతోడిది+ఏమి= ఆ బ్రాహ్మణునితో మన కేమి; అని= అని తలచి; ద్రుపదు పయిన్= ద్రుపదునిమీద; ఎత్తుదెంచినన్= దండెత్తి రాగా; ద్రుపదుండును; కడున్= మిక్కిలి; భీతుండు+ఐ= భయపడినవాడై; బ్రాహ్మణుల, మఱువు= బ్రాహ్మణులచాటున; చొచ్చెన్= చేరెను; ఇట్లు; శరణ+ ఆగతుండు+అయిన= శరణుకోరి వచ్చిన; ద్రుపదున్= ద్రుపదుని; ఓడకుండుము+అని= భయపడ వద్దని; బ్రాహ్మణులు; తమతమ, దండ+అజినంబులు= చేతికఱ్ఱలను, (యోగదండములు మొదలైనవి) జింకచర్మములను; ఎత్తికొని; ప్రతిబలంబుపయిన్= శత్రుసేనలమీద; వీచుచున్; ఉన్నంతన్= వీచుచుండగా; వారలన్+చూచి= వాళ్ళను కనుగొని; నగుచున్= నవ్వుతూ; అర్జునుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఏ తప్పుచేసినా బ్రాహ్మణుడు చంపదగినవాడు కాదు. మనరాజ్యం, సంపద బ్రాహ్మణులకొరకే. కనుక ఈ బ్రాహ్మణునితో మన కేమి పని?' అని ద్రుపదుడిమీదికి దండెత్తి రాగా, అతడు మిక్కిలి భయపడి, బ్రాహ్మణుల చాటున చేరాడు. ఈ విధంగా శరణుకోరివచ్చిన ద్రుపదునికి అభయమిచ్చి బ్రాహ్మణులు తమ తమ దండాలను, జింక చర్మాలను ఎత్తుకొని శత్రుసేనలమీద వీచుతుండగా వారిని చూచి నవ్వుతూ అర్జునుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** దుర్యోధనుడి దురహంకారం, కులాహంకారం, కుత్సితనీతి, అధర్మప్రవృత్తి ఈ సన్నివేశంలో బైటపడ్డాయి. మత్స్యయంత్రం కొట్టిన బ్రాహ్మణుడు అవధ్యుడు కాబట్టి అతడిని వదలిపెట్టటం న్యాయం అన్నాడు. క్షత్రియు లుండగా బ్రాహ్మణుడికి అవకాశం కలిగించి రాజకులానికి అవమానం కలిగించిన ద్రుపదుడిపై ఆగ్రహించాడు. పూర్వాపరాలను గాని, స్వపరసామర్థ్యాలను గాని ఆలోచించని దుర్విదగ్ధుడు దుర్యోధనుడు. కన్యను గెలుచుకొన్నవాడు రాజలోకం తిరగబడితే వారిని జయించి తన యోగ్యతను నిరూపించుకోవటం స్వయంవరరాజధర్మం. దుర్యోధనుడు సమర్థుడైతే బ్రాహ్మణుడి (అర్జునుడి)తో తలపడాలి. ఆ ధర్మం అతడు పాటించలేదు. ద్రుపదుడు బ్రాహ్మణుల నాశ్రయించటం సందర్భోచితం. అర్జునుడు తన యోగ్యతను నిరూపించుకొనా లని వీరసూచనంకూడా అది. అర్జునుడు దానిని పసికట్టాడు. బ్రాహ్మణులు దండాలతో విజృంభిస్తే వారిని వారించాడు. భీముడితో కలిసి రంగంలో నిలువబడి తనయోగ్యతను నిరూపించుకొనే ప్రయత్నంచేయటానికి పూర్వరంగం కలిగించాడు దుర్యోధనుడు. స్వయంవరసభలోకూడ దుర్యోధనుడు తన వర్గంతో కూడి, ప్రతినాయకప్రవృత్తిని ప్రదర్శించటం వస్తుధ్వనికి పరోక్షపోషకం. (సంపా.)

**క. కడఁగి మదీయాస్త్రము లని । యెడు పటుమంత్రముల నిప్పు డీ నృపరిపుల**
**న్కడిఁది విషాహుల దర్పం । బుడిగించెదఁ దొలఁగి చూచుచుండుఁడు మీరల్. 193**

**ప్రతిపదార్థం:** కడఁగి= పూని; మదీయ+అస్త్రములు= నా బాణాలు; అనియెడు= అనెడి; పటు, మంత్రములన్= గొప్ప మంత్రాలచేత; ఇప్పుడు; ఈ, నృప, రిపులు+అన్= ఈ రాజుయొక్క శత్రువులనెడి - అనగా ద్రుపదుడి శత్రువులు అనే; కడిఁది విష+అహుల, దర్పంబు= పెద్ద విషసర్పాల గర్వాన్ని; ఉడిగించెదన్= అణచెదను; మీరల్= మీరు; తొలఁగి= ప్రక్కకు తొలగి; చూచుచు+ ఉండుఁడు =చూస్తూ ఉండండి.

**తాత్పర్యం:** పూనుకొని, నా అస్త్రా లనే గొప్పమంత్రాలతో ఇప్పు డీ ద్రుపదునిశత్రువు లనే పెద్దవిషసర్పాల గర్వం అణచివేస్తాను. మీరు ప్రక్కకు తొలగి చూస్తూ ఉండండి.

**విశేషం:** అలం: రూపకం. అలంకారవస్తుధ్వనికి పోషణం కావటానికి ఈ పద్యం రమణీయోదాహరణం. దుర్యోధనాదులు దుష్టసర్పాలు. అవి కాటువేయటానికి పూనుకొన్నాయి. అవి కాటువేయకుండా మంత్రగానివలె వాటిని నిర్వీర్యం చేస్తా నని సూచించాడు అర్జునుడు. 'ప్రతివీరులను చంపకుండా భంగపాటుకు గురిచేస్తాను చూడండి' అని వస్తుధ్వని. విషసర్పోపమానం దుర్యోధనాదుల కుటిలస్వభావానికీ, క్రూరత్వానికీ వ్యంజకం.

## అర్జునుండు కర్ణునితో యుద్ధంబు సేసి జయించుట (సం.1-181-3)

**వ. అని తానును భీమసేనుండును గడఁగి రిపుబలంబుపయి నపరిమితశరంబు లేసె; భీమసేనుండు నొక్క వృక్షంబు వెఱికికొని దండ హస్తుం డయిన దండధరుండునుంబోలె నర్జునునకు సహాయుం డయి నిలిచె; నంత న య్యిద్దఱ మహా సంరంభంబుఁ జూచి విస్మితుఁ డై కృష్ణుండు బలదేవుని కి ట్లనియె. 194**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; తానును, భీమసేనుండును; కడఁగి= పూనుకొని; రిపు, బలంబుపయిన్= శత్రుసైన్యంమీద; అపరిమిత, శరంబులు= లెక్కలేనన్ని బాణాలు, ఏసెన్= వేశాడు; భీమసేనుండున్= భీమసేనుడుకూడా; ఒక్క, వృక్షంబు= ఒక చెట్టును; పెఱికి= పెరికి; దండ, హస్తుండు+అయిన= దండమును చేతియందు కలవా డైన; దండధరుండునున్+పోలెన్= యమధర్మరాజువలె; అర్జుననకున్= అర్జునునికి; సహాయుండు+అయి= సహకరించేవాడై; నిలిచెన్= నిలిచాడు; అంతన్= అటుపై; ఆ+ఇద్దఱ, మహా, సంరంభంబున్= ఆ ఇరువురి గొప్పవిజృంభణాన్ని; చూచి; కృష్ణుండు; విస్మితుఁడు+ఐ= ఆశ్చర్యపడినవాడై; బలదేవునకున్= బలరామునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా పల్కి, తానూ భీమసేనుడూ పూనుకొని శత్రుసైన్యంమీద లెక్కలేనన్ని బాణాలు వేశాడు. భీమసేనుడు ఒక పెద్దచెట్టును పెకలించుకొని, దండాయుధాన్ని ధరించిన యమధర్మరాజువలె అర్జునునికి సహాయుడుగా నిలిచాడు. అప్పుడు వా ళ్ళిద్దరి మహావిజృంభణం చూచి కృష్ణుడు ఆశ్చర్యపడి బలరామునితో ఇట్లా అన్నాడు.

**సీ. 'తాలాభ మగు విల్లు దాల్చి విరోధుల । నెగచుచున్నవాఁ డింద్రతనయుఁ;**
**డాతని కెలన మహావృక్షహస్తుఁడై । యున్న వీరుండు వృకోదరుండు;**
**యంత్రంబు నరుఁ డేసి నప్పుడు పోయిన । యగ్గౌరవర్ణుండు యమతనూజుఁ;**
**డాతనితోడన యరిగిన యిరువురుఁ । గవల వా రర్కప్రకాశ తేజు'**

**ఆ. లనిన 'లక్కయింట నగ్నిదాహంబున । నెట్లు బ్రదికి రొక్కో! యిమ్మహాత్ము;**
**లెట్టి పుణ్యదినమొ యేవురఁ జూచితి' । మనుచు సంతసిల్లె హలధరుండు. 195**

**ప్రతిపదార్థం:** తాల+ఆభము= తాటిచెట్టు వంటిది; అగు= అయిన, విల్లు= ధనుస్సు; తాల్చి= ధరించి; విరోధులన్= శత్రువులను, ఎగచుచున్= తోలుచు; ఉన్నవాఁడు; ఇంద్ర, తనయుఁడు= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; అతని, కెలనన్= అతనికి ప్రక్క; మహా, వృక్ష, హస్తుఁడు+ఐ= గొప్ప చెట్టును చేత కలవాడై; ఉన్న= ఉండే; వీరుండు; వృకోదరుండు= భీముడు; యంత్రంబున్= మత్స్యయంత్రమును; నరుఁడు= అర్జునుడు; ఏసిన+అప్పుడు= కొట్టినప్పుడు; పోయిన, ఆ, గౌర, వర్ణుండు= తెల్లని వన్నె కల అతడు; యమ, తనూజుఁడు= యముని పుత్త్రుడైన ధర్మరాజు; అతని తోడన= అతని వెంట; అరిగిన= వెళ్ళిన; ఇరువురున్= ఇద్దరును; కవలవారు= నకుల సహదేవులు; అర్క, ప్రకాశతేజులు= సూర్యకాంతివంటి తేజస్సు

కలవాళ్ళు; అనినన్= అని పల్కగా; లక్క, ఇంటన్= లక్క ఇంటిలో; అగ్ని దాహంబునన్= నిప్పు మంటనుండి; ఈ మహాత్ములు; ఎట్లు; బ్రదికిరి+ఒక్కొ; ఎట్టి, పుణ్యదినమొ= ఎటువంటి పవిత్రమైన రోజో; ఏవురన్= ఐదుగురిని; చూచితిమి; అనుచున్= అనుకొంటూ; హలధరుండు= నాగలిని ధరించినవాడు - బలరాముడు; సంతసిల్లెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** 'తాటిచెట్టువంటి పెద్దవిల్లు ధరించి, శత్రువులను తరుముతున్నవాడు అర్జునుడు. అతని ప్రక్కనే గొప్పవృక్షాన్ని చే పట్టి ఉన్నవీరుడు భీముడు. అర్జునుడు మత్స్యయంత్రాన్ని పడగొట్టగానే సభనుండి వెళ్లిపోయిన తెల్లనివన్నెగలఅతడు-ధర్మరాజు. అతనివెంట వెళ్ళిన సూర్యసమానతేజు లిద్దరు నకులసహదేవులు' అని శ్రీకృష్ణుడు చెప్పగా 'లక్కయింటిలో నిప్పుమంటనుండి వీ రెట్లా బ్రతికారో! ఈ ఐదుగురుని చూచాము. ఇది ఎంత సుదినం!' అని బలరాముడు సంతోషించాడు.

**విశేషం:** వృకోదరుడు - వృకము=తోడేలు; తోడేలు కడుపువంటి కడుపు గలవాడు - భీముడు.

**వ. అంత. 196**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతలో.

**తాత్పర్యం:** అప్పుడు.

**క. కురుపతి సూడఁగఁ గర్ణుఁడు । నరుఁ దాఁకెను; శల్యుఁ డనిల నందనుఁ దాఁకెన్**
**సరభసమున, విస్మయ మం । దిరి ధరణీదేవమనుజదేవప్రవరుల్. 197**

**ప్రతిపదార్థం:** కురుపతి= దుర్యోధనుడు; చూడఁగన్= చూస్తూఉండగా; కర్ణుఁడు; నరున్= అర్జునుని; తాఁకెను= ఎదుర్కొనెను; సరభసముననన్= వేగిరపాటుతో కూడినట్లుగ; శల్యుఁడు; అనిల, నందనున్= వాయుదేవుని కుమారుడైన భీముని; తాఁకెన్= ఎదుర్కొన్నాడు; ధరణీ, దేవ, మనుజ, దేవ ప్రవరుల్= బ్రాహ్మణశ్రేష్ఠులు, మానవశ్రేష్ఠులు దేవతా శ్రేష్ఠులు; విస్మయము+అందిరి= ఆశ్చర్యాన్ని పొందారు.

**తాత్పర్యం:** కురుపతి అయిన దుర్యోధనుడు చూస్తూ ఉండగా కర్ణుడు అర్జునుడిని ఎదుర్కొన్నాడు. వెంటనే వేగంగా శల్యుడు భీముడిని ఎదుర్కొన్నాడు. అది చూచి బ్రాహ్మణ, మానవ, దేవతా శ్రేష్ఠులు ఆశ్చర్యపడ్డారు.

**శా. కర్ణుండున్ విజయుండు నొండొరులఁ జుల్కం దాఁకి; చాపంబు లా**
**కర్ణాంతం బగుచుండఁగాఁ దిగిచి యుగ్రక్రోధులై యేసి; రా**
**పూర్ణంబయ్యెఁ దదీయ బాణతతి నంభోభృత్పథం బెల్ల; నా**
**స్తీర్ణం బయ్యె ధరిత్రి యెల్ల; నవిసెన్ దిక్చక్ర మెల్లన్ వడిన్. 198**

**ప్రతిపదార్థం:** కర్ణుండున్, విజయుండున్= కర్ణుడును, అర్జునుడును; ఒండొరులన్= ఒకరినొకరు; చుల్కన్= సులభంగా; తాఁకి= ఎదుర్కొని; చాపంబులు= ధనుస్సులను; ఆకర్ణ+అంతంబు= చెవికొనవరకు పోవునవి; అగుచున్+ఉండఁగాన్= అవుతూ ఉండగా; తిగిచి= లాగి; ఉగ్ర, క్రోధులు+ఐ= భయంకరమైన కోపం కలవాళ్ళయి; ఏసిరి= బాణాలను వేశారు; తదీయ, బాణతతిన్= వారియొక్క బాణాల సమూహంచేత; వడిన్= వెంటనే; అంభో, భృత్+పథంబు+ఎల్లన్= నీటిని ధరించిన

మేఘాలయొక్క మార్గమంతా - అనగా ఆకాశమంతా; ఆపూర్ణంబు= నిండినది; అయ్యెన్= అయింది; ధరిత్రి, ఎల్లన్= భూమి అంతా; ఆస్తీర్ణంబు+అయ్యెన్= పరచబడింది అయింది; దిక్+చక్రము= దిక్కుల సమూహం; ఎల్లన్= అంతయు; వడిన్= వేగంగా; అవిసెన్= పగిలెను.

**తాత్పర్యం:** కర్ణార్జునులు ఒకరినొకరు సులభంగా ఎదుర్కొని, ధనుస్సులను ఆకర్ణాంతం లాగి, భయంకరమైన కోపంతో పరస్పరం బాణప్రయోగం చేసికొన్నారు. వాళ్లబాణాలసమూహంతో భూమీ, ఆకాశం నిండిపోయాయి. దిక్కులు పగిలిపోయాయి.

**క. వీరుఁడగు నరుని యేయు న । పార శరావలుల నడుమ వారింపంగా**
**నేరక యే టుడిగి మహా । శూరుఁడు రాధేయుఁ డింద్రజున కి ట్లనియెన్. 199**

**ప్రతిపదార్థం:** వీరుఁడు+అగు; నరుని; ఏయు, అపార, శర+ఆవళులన్= అర్జునునియొక్క వేయునటువంటి అనంతాలైన బాణాల సమూహాలను; నడుమన్= మధ్యలో; వారింపఁగన్= ఆపటానికి; నేరక= చేతకాక; మహాశూరుఁడు; రాధేయుఁడు= కర్ణుడు; ఏటు+ఉడిగి= బాణాలు వేయటం మాని; ఇంద్రజునకున్= అర్జునునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** వీరు డైన అర్జునుడు వేసే అంతులేని బాణపరంపరను నడుమ అడ్డుకొనలేక, మహాశూరుడైన కర్ణుడు బాణప్రయోగం మాని ఇంద్రకుమారు డైన అర్జునునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** నరుని యేయు - నరునియొక్క ఏయు - అనగా, నరుడు ఏయు. ఇక్కడ ప్రథమకు షష్ఠి వచ్చింది.

**క. నా యెదురఁ జక్కనై యని । సేయఁగ భార్గవునకును శచీవరునకుఁ గౌం**
**తేయుఁ డగు విజయునకుఁ గా । కాయతభుజశక్తి నొరుల కలవియె ధరణిన్. 200**

**ప్రతిపదార్థం:** నా, ఎదురన్= నా సమక్షంలో; చక్కన+ఐ= చక్కగా నిలబడి; అని= యుద్ధం; చేయఁగన్= చేయటానికి; భార్గవునకును= పరశురామునికి; శచీవరునకున్= శచీదేవి భర్తయైన దేవేంద్రునికి; కౌంతేయుఁడు+అగు= కుంతికొడుకు అయిన; విజయునకున్= అర్జునునికి; కాక= తప్ప; ఆయత, భుజ, శక్తిన్= అధికమైన భుజబలంచేత; ధరణిన్= భూమియందు; ఒరులకున్= ఇతరులకు; అలవియె= సాధ్యమా!; (కా దని భావం.)

**తాత్పర్యం:** నా యెదుట చక్కగా నిలిచి, యుద్ధంచేయటానికి పరశురామునికి, దేవేంద్రునికి, కుంతి కొడుకైన అర్జునునికి మాత్రమే సాధ్యమవుతుంది. కాని, గొప్పభుజశక్తితో న న్నెదుర్కొనటానికి ఈ భూమిమీద ఇతరులకు సాధ్యమవుతుందా?

**క. నీ వప్రాకృతబలుఁడవు; । నీ విక్రమమునకు విల్లునేర్పునకు మహీ**
**దేవకులోత్తమ ! మెచ్చితి; । నావుడుఁ బార్థుండు గర్ణునకు ని ట్లనియెన్. 201**

**ప్రతిపదార్థం:** నీవు+అప్రాకృత, బలుఁడవు= నీవు సామాన్యంకాని బలం కలవాడవు; మహీదేవ, కుల+ఉత్తమ= బ్రాహ్మణ కులంలో శ్రేష్ఠుడా; నీ విక్రమునకున్= నీ పరాక్రమానికి; విల్లు; నేర్పునకున్= విలువిద్యానైపుణ్యానికి; మెచ్చితిన్; నావుడున్= అని అనగా; పార్థుండు= అర్జునుడు; కర్ణునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! నీవు అసాధారణమైన బలం కలిగి ఉన్నావు. నీ పరాక్రమానికి, విలువిద్యా నైపుణ్యానికి మెచ్చాను' అని పల్కగా అర్జునుడు కర్ణునితో ఇట్లా అన్నాడు.

**మధ్యాక్కర.**

**ఏను నీ చెప్పిన వారిలోపల నెవ్వఁడఁ గాను;**
**గాని నే సర్వశస్త్రాస్త్రవిద్యలఁ గడుఁ బ్రసిద్ధుండ;**
**భూనుత బ్రహ్మతేజో౽ ధికుఁడ; నిన్నుఁ బోరిలో నోర్వఁ**
**గా నున్న వీరుండ; నొండు దక్కి లోఁగక చక్క నిలుము. 202**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నీ, చెప్పిన, వారిలోపలన్= నీయొక్క చెప్పినవారియందు - అనగా నీవు చెప్పినవారిలో; ఎవ్వఁడన్ కాను;= ఎవరినీకాను; కాని= అయితే; నే= నేను; సర్వ, శస్త్ర+అస్త్ర, విద్యలన్= అన్ని శస్త్రాస్త్రవిద్యలందు; కడున్= మిక్కిలి; ప్రసిద్ధుండన్= ప్రముఖుడిని; భూనుత, బ్రహ్మతేజస్+అధికుఁడన్= భూమియందు పొగడబడిన బ్రహ్మతేజస్సుచేత గొప్పవాడను; నిన్నున్= నిన్ను; పోరిలోన్= యుద్ధంలో; ఓర్వన్+కాన్+ఉన్న= ఓడించటానికి సిద్ధంగా ఉన్న; వీరుండన్= వీరుణ్ణి; ఒండు= ఇతరములు; తక్కి= విడిచి; లోఁగక= వెనుదీయక; చక్క, నిలుము= గట్టిగ ఎదురుగా నిలబడుము.

**తాత్పర్యం:** నేను నీవు చెప్పినవాళ్ళలో ఎవ్వడినీ కాను. కాని అన్ని శస్త్రాస్త్రవిద్యలలో మిక్కిలి ప్రసిద్ధుడిని. లోకం కొనియాడే బ్రహ్మతేజస్సుతో గొప్పవాడిని. నిన్ను యుద్ధంలో ఓడించటానికి సిద్ధంగా ఉన్న వీరుడిని. తక్కిన మాటలు కట్టిపెట్టి గట్టిగా నిలబడు.

**విశేషం:** 'కాని నే' - అనే దానికి బదులు 'కానీన' అని అర్జునుడు కర్ణుడిని సంబోధించినట్లు కొన్ని ప్రతులలో ఉన్న పాఠం సరైందిగా తోచదు. కన్యాపుత్త్రుడు కానీనుడు, కర్ణుడు కన్యాపుత్త్రుడే అయినా అప్పటి కావిషయం అర్జునుడికి తెలియదు. అందుచేత కర్ణుడిని 'కానీన' అని సంబోధించటం అసంబద్ధం. 'కాని, నే' అనే ప్రస్తుతపాఠమే అన్నివిధాల ఉత్తమమైనది.

**మరొక విశేషం:** 'ఏను నీ చెప్పినవారిలోపల నెవ్వఁడఁగాను' అని నిశ్చయార్థంలో అంటే సందర్భోచితంగా అర్జునుడు మాట్లాడి నట్లవుతుందే కాని, అబద్ధం పలికినదోషం కలుగుతుంది. అందువలన నానారుచిరార్థ సూక్తి నిపుణుడైన నన్నయ ఆవాక్యాన్ని ప్రశ్నార్థకంగా, కాకువులో ఉచ్చరించటానికి వీలుగా కూడా నిబంధించాడు. అప్పుడు కర్ణుడు చెప్పినవారిలో అర్జునుడు ఎవ్వడు కాడు? అందరూ అవుతాడు - ముగ్గురు కలిసినా వారితో సమాను డౌతాడు అనే అర్థచమత్కారం ఏర్పడుతుంది. 'కాని, నే సర్వశస్త్రాస్త్రవిద్యలఁ గడు బ్రసిద్ధుండ' - అనే అర్జునునివాక్యంలో - 'కాని, నేను పైన నీవు చెప్పిన అందరియొక్క శస్త్రాస్త్రవిద్యలలో ఎంతో ప్రసిద్ధిపొందాను' అనే అర్థం కాకువులోనే సిద్ధిస్తుంది. అసత్యదోషం నివారితమవుతుంది. 'నిన్నుఁ బోరిలో నోర్వఁగ నున్న వీరుండన్' అని పలికినప్పుడు 'నిన్ను యుద్ధంలో ఓడించటానికే ఇంకా బ్రతికి ఉన్నాను, అదే నా జీవిత లక్ష్యం' అని అర్జునుడు వ్యంగ్యంగా చెప్పినట్లు భావించటానికి వీలుంది. మధ్యాక్కర మాటనేర్పరితనానికి వాడటం ఛందశ్శిల్పం. అర్జునుడు తన ఉనికిని గూఢంగా నిబంధించి వాఙ్మయ నైపుణ్యాన్ని ప్రదర్శించినట్లు చిత్రించాడు నన్నయ. (సంపా.)

**వ. అనిన విని కర్ణుండు బ్రహ్మతేజం బజేయం బని విజయుతోడియుద్ధం బొల్లక క్రమ్మఱియె; మఱిశల్య భీమసేనులు పెనంగి మల్లయుద్ధంబు సేయునెడ భీముండు భీమబలంబునం బట్టుకొని శల్యుం ద్రెళ్ళ వైచిన. 203**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అర్జునుడు పలుకగా; విని, కర్ణుండు; బ్రహ్మతేజంబు; అజేయంబు= జయింప సాధ్యంకానిది; అని; విజయుతోడి= అర్జునునితో; యుద్ధంబు+ఒల్లక= యుద్ధం చేయటానికి ఇష్టపడక; క్రమ్మఱియెన్= వెనుదిరిగాడు; మఱి= పిమ్మట; శల్య, భీమసేనులు= శల్యుడు, భీముడు; పెనంగి= కలియబడి; మల్లయుద్ధంబున్; చేయు, ఎడ= చేసేటప్పుడు; భీముండు; భీమ, బలంబునన్= భయంకరమైన బలంచేత; శల్యున్= శల్యుని; పట్టుకొని= బిగియపట్టి; త్రెళ్ళవైచినన్= పడవేయగా.

**తాత్పర్యం:** అని అర్జునుడు పల్కగా, కర్ణుడు విని బ్రాహ్మణతేజస్సును జయించటం సాధ్య కా దని, అర్జునునితో యుద్ధం చేయటానికి ఇష్టపడక వెనుదిరిగి వెళ్ళాడు. శల్యభీమసేనులు కలియబడి మల్లయుద్ధం చేశారు. అప్పుడు భీముడు భయంకరమైన బలంతో శల్యుడిని పట్టుకొని పడవేశాడు.

**ఆ. సెల్లుఁ డట్లు నేల ద్రెళ్ళి చెచ్చెర లేచి । యొడలు దుడిచికొనుచు నొయ్యఁ జనియె;**
**వానిఁ జూచి నగుచు మానుగా విప్రులు । భూరిసత్త్వు భీముఁ బొగడి రంత. 204**

**ప్రతిపదార్థం:** సెల్లుఁడు= శల్యుడు; అట్లు; నేలన్= భూమిమీద; త్రెళ్ళి= పడి; చెరన్+చెరన్= బిరబిరా; లేచి; ఒడలు= దేహాన్ని; తుడిచి కొనుచున్; ఒయ్యన్= తిన్నగా; చనియెన్= వెళ్ళాడు; వానిన్= ఆ శల్యుణ్ణి; చూచి; విప్రులు= బ్రాహ్మణులు; నగుచున్= నవ్వుతూ; మానుగాన్= ఒప్పుగా; భూరి, సత్త్వు, భీమున్= గొప్ప బలవంతుడైన భీముడిని; అంతన్= అప్పుడు; పొగడిరి.

**తాత్పర్యం:** శల్యు డా విధంగా నేలపై పడి వెంటనే లేచి, శరీరం తుడుచుకొంటూ, తిన్నగా వెళ్ళిపోయాడు. అతడిని చూచి బ్రాహ్మణులు నవ్వుతూ మహాబలవంతు డైన భీముడిని గొప్పగా ప్రశంసించారు.

**ఆ. పరశురాముఁ డొండె హరుఁ డొండె నరుఁ డొండె । గాక యొరులు గలరె కర్ణు నోర్వ!**
**బలిమి భీముఁ డొండె బలదేవుఁ డొండెఁ గా౹ కొరులు నరులు శల్యు నోర్వఁ గలరె! 205**

**ప్రతిపదార్థం:** పరశురాముఁడు; ఒండె= కాని; హరుఁడు= శివుడు; ఒండె= కాని; నరుఁడు= అర్జునుడు; ఒండె= కాని; కాక= తప్ప; కర్ణున్+ఓర్వన్= కర్ణుని ఓడించటానికి; ఒరులు= ఇతరులు; కలరె= ఉన్నారా; బలిమిన్= బలంచేత; భీముఁడు; ఒండె= కాని; బలదేవుఁడు= బలరాముడు; ఒండెన్= కాని; కాక= తప్ప; ఒరులు= ఇతరులు; నరులు= మానవులు; శల్యున్+ఓర్వన్, కలరె= శల్యుడిని ఓడించగలరా! (లే రని భావం)

**తాత్పర్యం:** పరశురాముడో, శివుడో, అర్జునుడో కాక ఇతరులు కర్ణుడిని ఓడించగలరా? బలంలో భీముడో, బలరాముడో కాక తక్కినమానవులు శల్యుడిని ఓడించగలరా?

**వ. 'వీ రెవ్వరో యెం దుండుదురో యెఱుంగవలయు' నని దుర్యోధనాదు లయిన రాజపుత్త్రు లెల్ల విస్మితు లయి యున్న వారలం జూచి కృష్ణుం డి ట్లనియె. 206**

**ప్రతిపదార్థం:** వీరు; ఎవ్వరో= వీరెవరో; ఎందు+ఉండుదురో= ఎక్కడ ఉంటారో; ఎఱుంగవలయున్= తెలిసికోవాలి; అని= అని తలంచి; దుర్యోధన+ఆదులు+అయిన= దుర్యోధనుడు మొదలైన; రాజ, పుత్త్రులు+ఎల్లన్= రాజకుమారులంతా; విస్మితులు+అయి= ఆశ్చర్యపడినవారై; ఉన్నన్= ఉండగా; వారలన్, చూచి; కృష్ణుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'వీ ళ్ళెవరో, ఎక్కడ ఉంటారో తెలిసికొనాలి' అని దుర్యోధనుడు మొదలైన రాకుమారు లంతా ఆశ్చర్యంతో ఉండగా, వాళ్ళను చూచి కృష్ణుడు ఈవిధంగా అన్నాడు.

**చ. పరులకు దుష్కరంబయిన భాసుర కార్యము సేసి, తత్స్వయం**
**వరమునఁ బత్నిఁగాఁ బడసె వారిరుహాయత నేత్రఁ గృష్ణ నీ**
**ధరణిసురాన్వయోత్తముఁడు ధర్మవిధిం; జెపుఁడయ్య యింక నె**
**వ్వరికిని జన్నె వీని ననవద్యపరాక్రము నాక్రమింపఁగన్.** 207

**ప్రతిపదార్థం:** పరులకున్= ఇతరులకు (శత్రువులకు అని దుర్యోధనపరమైన చమత్కారార్థం); దుష్కరంబు+అయిన= చేయటానికి అలవి గానిదైన; భాసుర, కార్యము= గొప్పపని; చేసి; ఈ, ధరణి, సుర+అన్వయ+ఉత్తముఁడు= ఈ బ్రాహ్మణ వంశమందలి శ్రేష్ఠుడు; తద్+స్వయంవరంబునన్= ఆ స్వయంవరంలో; వారిరుహ+ఆయత, నేత్రన్= పద్మాలవంటి విశాలాలైన కన్నులు కలదానిని; కృష్ణన్= ద్రౌపదిని; ధర్మవిధిన్= ధర్మంప్రకారం; పత్నిన్+కాన్= భార్యగా; పడసెన్= పొందాడు; ఇంకన్= మరి; వీనిన్= ఇతనిని; అనవద్య, పరాక్రమున్= సాటిలేని పరాక్రమం కలవాడిని; ఆక్రమింపన్+కన్= జయించటానికి; ఎవ్వరికిన్= ఎవ్వరికైనా; చన్నె= సాధ్యమా; చెపుడు++అయ్య!= చెప్పండయ్యా!

**తాత్పర్యం:** ఇతరులు చేయటానికి సాధ్యం కాని గొప్పపని చేసి ఈ బ్రాహ్మణశ్రేష్ఠుడు ఆ స్వయంవరంలో పద్మాలవంటి కన్నులు కల ద్రౌపదిని ధర్మమార్గంలో భార్యగా పొందాడు. ఈ సాటిలేని పరాక్రమశాలిని జయించటం ఇక ఎవరికి సాధ్యమో చెప్పండి.

**విశేషం:** మహాభారతంలో శ్రీకృష్ణుడు పాఠకులకు మొట్టమొదట కనిపించేది ఈ ఘట్టంలోనే. ఆయన మహనీయవ్యక్తిత్వం, సర్వజ్ఞత, చతురత అద్దంలోవలె మొదట అగుపించేదికూడ ఈ ఘట్టంలోనే. శ్రీకృష్ణుడు- బ్రాహ్మణవేషాల్లో బ్రాహ్మణులమధ్య కూర్చున్న పాండవులను మొదట కనిపెట్టాడు. ద్రౌపదిని గెలుచుకొనగల అర్జునుని ధనుర్విద్యాకౌశలాన్ని కూడా దర్శించాడు. ఎంతో దూరదృష్టితో యదు, వృష్ణి, భోజ, అంధక వంశాల వీరులు పోటీలో పాల్గొనకుండా తప్పించాడు. పాండవులందరిని బలరామునికి పరిచయంచేశాడు. అసూయాద్వేషాలతో పాండవుల ఉనికిపట్టు కనిపెట్టా లని ఆరాటపడే దుర్యోధనాది రాకుమారులందరి ప్రయత్నాన్ని విరమింపజేశాడు. అర్జునుని సామర్థ్యాన్ని అతిచతురంగా శ్లాఘించి, అన్యుల అసమర్థతను అవహేళన చేశాడు. కథాకథనశిల్పం ఆ మహాసభలో శ్రీకృష్ణుని పురుషోత్తమత్వాన్ని అద్భుతంగా ధ్వనింపజేసింది.

**వ. 'వలవ దుడుగుం, డని వారించిన; నట్లు కృష్ణుచేత నివారితులయి రాజపుత్త్రులు దమతమదేశంబులకుం జని; రంత భీమార్జునులు బ్రాహ్మణపరివృతు లయి ద్రుపదరాజపుత్త్రిం దోడ్కొని వచ్చునంత.** 208

**ప్రతిపదార్థం:** వలవదు= వద్దు; ఉడుగుండు= మానుడు; అని; వారించినన్= ఆపగా; అట్లు, కృష్ణుచేత; నివారితులు+అయి= ఆపబడినవా ళ్ళయి; రాజపుత్త్రులు, తమతమ, దేశంబులకున్=వారివారిదేశాలకు పోయారు; అంతన్= అటుపై; భీమ+అర్జునులు= భీముడు, అర్జునుడు; బ్రాహ్మణ, పరివృతులు+అయి= బ్రాహ్మణులచేత చుట్టబడినవాళ్ళయి; ద్రుపదరాజ పుత్త్రిన్= ద్రౌపదిని; తోడ్కొని= తీసికొని; వచ్చునంతన్= వచ్చుచుండగా; (వస్తూ ఉన్న సమయంలో)

**తాత్పర్యం:** 'వద్దు. వా ళ్ళెవరో తెలుసుకొనే ప్రయత్నం మానండి' అని శ్రీకృష్ణుడు ఆ రాకుమారు లందరిని ఆపగా, వాళ్ళు తమ తమ దేశాలకు తిరిగి వెళ్ళారు. అప్పుడు భీమార్జునులు బ్రాహ్మణులు చుట్టూ గుమిగూడి రాగా ద్రౌపదిని తమతో తీసుకొని ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు.

సీ. 'ఉత్సవ సందర్శనోత్సుకు లై పోయి । కడుఁ బెద్ద ప్రొ ద్దయ్యెఁ; గొడుకు లేల
మసలిరొ? కౌరవుల్ విసువక వైరంబు । గావించు పాపస్వభావు; లెఱిఁగి
క్రందునఁ జంపిరో? యందుల కేవురు । లీలతో నొక్కట నేల యరిగి?
రవ్యయుం డయిన వేదవ్యాసువచనంబు । నిక్కంబుగాకుండు నొక్కొ? వేల్పు

ఆ. లార! భూసురేశులార! మీ శరణంబ । కాని యొండుగతియుఁ గాన; నాకు
శరణ మగుఁడు; సుతులఁ గరుణతో రక్షింపుఁ' । డనుచుఁ గుంతి వగచి వనరుచుండె. 209

**ప్రతిపదార్థం:** ఉత్సవ, సందర్శన+ఉత్సుకులు+ఐ= స్వయంవరోత్సవాన్ని చూడగోరినవాళ్ళయి; కొడుకులు; పోయి; కడున్= మిక్కిలి; పెద్ద, ప్రొద్దు= ఎక్కువసేపు; అయ్యెన్= అయింది; ఏల= ఎందుచేత; మసలిరొ= ఆలస్యం చేశారో; విసువక= విసుగు లేకుండ, వైరంబు= పగను; కావించు= పూను; పాపస్వభావులు= దుర్మార్గపుబుద్ధికలవాళ్ళు; కౌరవుల్; ఎఱిఁగి= తెలిసికొని; క్రందునన్= సందడిలో; చంపిరో= చంపినారా!; అందులకున్= అక్కడకు; ఏవురు= ఐదుగురు; లీలతోన్= విలాసంగా; ఒక్కటన్= ఒక్కటిగా; ఏల= ఎందుచేత; అరిగిరి= వెళ్లారు; అవ్యయుండు+అయిన= నాశము లేనివా డైన; వేదవ్యాసు, వచనంబు= వేదవ్యాసునిమాట; నిక్కంబు= నిజము; కాక+ఉండున్+ఒక్కొ= కాకుండునా?; వేల్పులార= దేవతలార; భూసుర+ఈశులార= బ్రాహ్మణోత్తములారా; మీ, శరణంబు= మీశరణము; కాని= తప్ప; ఒండు= వేరొక; గతియున్= మార్గమును; కానన్= చూడలేదు; నాకున్= నాకు; శరణము+అగుఁడు= దిక్కుకండి; సుతులన్= కొడుకులను; కరుణతోన్= దయతో; రక్షింపుఁడు= కాపాడండి; అనుచున్= అని అంటూ; కుంతి; వగచి= విచారించి; వనరుచున్+ఉండెన్= ఏడుస్తూ ఉండెను (ఉండింది.)

**తాత్పర్యం:** 'కొడుకులు స్వయంవరోత్సవాన్ని చూడబోయి చాలా సేపైనది. ఇంకాతిరిగి రాక యెందుకు ఆలస్యం చేశారో? విసుగులేని వైరం పూనిన పాపస్వభావు లైన కౌరవులు వీరిని గుర్తించి ఆ సందడిలో చంపేశారేమో? విలాసంగా అక్కడికి ఐదుగురు ఒకేసారి యెందుకు వెళ్ళారు? అవ్యయుడైన వేదవ్యాసుని మాట సత్యం కాకుండా ఉంటుందా? దేవతలారా! బ్రాహ్మణోత్తములారా! మీరే నాకు దిక్కు. వేరే మార్గమేదీ లేదు. నన్ను రక్షించండి. నా కుమారులను దయతో కాపాడండి' అని కుంతి విచారించి, దుఃఖిస్తూ ఉండింది.

**విశేషం:** చిన్నప్పటినుంచి దుర్యోధనాదులు భీమాదులపై పగబూని ఉన్నారు. ఒక్కొక్కరిని (ముందుగా భీముడిని) చంపేయత్నం చేసి విఫలు లయ్యారు. ఆ తరువాత పాండవులందరినీ ఒక్కుమ్మడిగా చంపా లని యత్నించి లాక్షాగృహాన్ని కల్పించారు. అందువలన కౌరవులు విసుగులేని వైరం సాగించేవా ళ్ళని కుంతి పేర్కొన్నది. పాండవులంతా ఒక్కసారి ఒక్కచోట దొరికితే కౌరవులు చంపేస్తారేమో అనే భయం ఈ ఘట్టంలో కుంతికి కలగటం సహజం. దేవతలనూ, బ్రాహ్మణులనూ శరణు కోరింది. శరణుకోరినవారిని రక్షించటం వారి ధర్మ మనే భక్తివిశ్వాసాలు కల తల్లి ఆమె.

## అర్జునుండు ద్రౌపదిం దెచ్చి తల్లికి నివేదించుట (సం.1-182-1)

వ. అట్టి యవసరంబునఁ దల్లియొద్దకు ధర్మరాజును గవలవారు మున్న వచ్చియున్నఁ, దదనంతరంబ భీమార్జునులు ద్రౌపదీసహితు లయి చనుదెంచి మ్రొక్కి 'మే మొక్క భిక్ష దెచ్చితి' మని తల్లికి నివేదించిన, నెఱుంగక యెప్పటి యట్ల

**కా వగచి కుంతీదేవి సంతసిల్లి దాని 'మీ రేవురు నుపయోగింపుఁ' డని కొడుకుల నియోగించి, భువన త్రయ రాజ్య లక్ష్మియుం బోలె నున్న యక్కన్నియం జూచి లజ్జించి, యధర్మభీత యయి ధర్మతనయున కి ట్లనియె. 210**

**ప్రతిపదార్థం:** అట్టి; అవసరంబునన్= సమయాన; తల్లి, ఒద్దకున్= తల్లి దగ్గరకు; ధర్మరాజును; కవలవారున్= నకుల సహదేవులును; మున్న, వచ్చి= ముందుగానే వచ్చి; ఉన్నన్= ఉండగా; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; భీమ+అర్జునులు= భీముడు, అర్జునుడు; ద్రౌపదీ, సహితులు+అయి= ద్రౌపదితో కూడుకొన్నవాళ్లై; చనుదెంచి= వచ్చి; మ్రొక్కి; మేము+ఒక్క; భిక్ష; తెచ్చితిమి+అని; తల్లికి; నివేదించినన్= తెలుపగా; ఎఱుంగక= తెలియక; ఎప్పటి, అట్ల, కా= ఎప్పటివలె అయినట్లు; వగచి= తలచి; కుంతీదేవి; సంతసిల్లి; దానిన్; మీరు; ఏవురు= ఐదుగురును; ఉపయోగింపుఁడు= వినియోగించుకొనండి, అనుభవించండి; అని= అని అంటూ; కొడుకులన్; నియోగించి= నియమించి; భువన, త్రయ, రాజ్య, లక్ష్మియున్, పోలెన్= లోకములు మూడింటియొక్క రాజ్య లక్ష్మివలె; ఉన్న= ఉన్నట్టి; ఆ+కన్నియన్= ఆకన్నెను; చూచి= కనుగొని; లజ్జించి= సిగ్గుపడి; అధర్మ, భీత+అయి= అధర్మానికి భయపడిన దై; ధర్మతనయునకున్= ధర్మనందనునితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అటువంటి సమయంలో ధర్మరాజు, నకులసహదేవులు తల్లి దగ్గరికి ముందుగానే వచ్చి ఉండగా, తర్వాత భీమార్జునులు ద్రౌపదితో కూడా వచ్చి నమస్కరించి 'మే మొక భిక్ష తెచ్చాము' అని తల్లికి నివేదించారు. ఆమె ఆ భిక్షనుగూర్చి తెలియక ఎప్పటివంటిదానిగానే భావించి, సంతసించి, 'దానిని మీ రైదుగురు ఉపయోగించుకొండి' అని కొడుకులను ఆజ్ఞాపించింది. అయితే, ముల్లోకాల రాజ్యలక్ష్మివలె ఉన్న ఆ కన్యను (ద్రౌపదిని) చూచి, సిగ్గుపడి, అధర్మానికి భయపడి ధర్మరాజుతో ఇట్లా పలికింది.

**సీ. 'ఈ తన్విఁ దోడ్కొని నీ తమ్ము లిరువురు । ప్రీతి నేతెంచి 'యీ భిక్ష యెప్పఁ**
**గొను' మని నాకుఁ జెప్పినను 'నేవురు నుప । యోగింపుఁ' డంటి; నాయుక్తి దొల్లి**
**యనృత మెన్నండుఁ గా దనఘ! మీ రెప్పుడు । మద్వచనాతిక్రమంబు సేయ;**
**రిది లోకమున లేని యది; యేమి సేయంగ । నగు?' నని చింతాకులాత్మ యైనఁ**

**తే. దల్లి నూరార్చి, వాసవతనయుఁ జూచి । 'పార్థ! నీచేతఁ బడయంగఁ బడిన దీని**
**నగ్ని సన్నిధిఁ బాణిగ్రహణంబు నీవ । చేయు' మన ధర్మజునకును జిష్ణుఁ డనియె. 211**

**ప్రతిపదార్థం:** ఈ, తన్విన్= ఈ కాంతను; తోడ్కొని= తీసికొని; నీ తమ్ములు= నీ తమ్ముళ్లు; ఇరువురు= ఇద్దరూ; ప్రీతిన్= సంతోషంతో; ఏతెంచి= వచ్చి; ఈ, భిక్ష= ఈ భిక్షను; ఒప్పన్= ఒప్పుగా; కొనుము+అని= గ్రహింపు మని; నాకున్; చెప్పినను= చెప్పగా; ఏవురున్= ఐదుగురును; ఉపయోగింపుఁడు= ఉపయోగించుకొండి; అంటిన్= అని అన్నాను; నా, ఉక్తి= నా మాట; తొల్లి= పూర్వం; ఎన్నండును= ఎప్పుడుకూడా; అనృతము= అబద్ధం; కాదు= కాలేదు; అనఘ= పాపరహితుడా! - ఓ ధర్మరాజా!; మీరు; ఎప్పుడు= ఏనాడుకూడా; మద్+వచన+అతిక్రమంబు= నామాట దాటుటను; చేయరు; ఇది= ఈ పద్ధతి; లోకాన, లేని, అది= లోకంలో లేనిది; ఏమి చేయంగన్+అగున్= ఏమి చేయగలం; అని= అంటూ; చింతా+ఆకుల+ఆత్మ+ఐనన్= చింతచేత కలత నొందిన మనస్సు కలది కాగా; తల్లిన్; ఊరార్చి= ఓదార్చి; వాసవ, తనయున్= దేవేంద్రుని కుమారుడైన అర్జునుడిని; చూచి; పార్థా!= అర్జునా; నీచేతన్= నీచేత; పడయంగన్+పడిన= పొందబడిన; దీనిన్= ఈ స్త్రీని; అగ్ని, సన్నిధిన్= అగ్ని ఎదుట; నీవు+అ= నీవే; పాణిగ్రహణంబు, చేయుము= పెళ్ళాడుము; అనన్= అని అనగా; ధర్మజునకును; జిష్ణుఁడు= అర్జునుడు; అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఈ కాంతను తోడ్కొని నీ తమ్ము లిద్దరు సంతోషంతో వచ్చి ఈ భిక్ష గ్రహించు మని నాతో చెప్పగా, 'మీ రైదుగురు ఉపయోగించుకొండి' అని అన్నాను. నా మాట ఇంతవరకు ఎన్నడు అసత్యం కాలేదు. ధర్మజా! మీ రెప్పుడు నా మాట జవదాటరు. కాని, ఇది లోకవిరుద్ధం. ఏం చేద్దాం' అని చింతతో కలతచెందిన తల్లిని ఓదార్చి, అర్జునుని వైపు చూచి 'అర్జునా! నీవు సంపాదించిన ఈమెను అగ్నిసన్నిధిలో నీవే వివాహం చేసికొమ్ము' అని పల్కగా ధర్మజునితో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**వ. 'పెద్దవాఁ డుండఁ గొండుక వానికి వివాహం బగుట ధర్మ విరుద్ధంబు గావున దీని నగ్రమహిషిగాఁ బరిగ్రహింపుము; మా నలువుర యనుమతంబును నిట్టిద' యనుచున్న యవసరంబున విధిప్రేరణవశంబున. 212**

**ప్రతిపదార్థం:** పెద్దవాడు; ఉండన్= ఉండగా; కొండుకవానికిన్= చిన్నవానికి; వివాహంబు+అగుట= పెండ్లి అగుట; ధర్మ, విరుద్ధంబు= ధర్మానికి విరుద్ధం; కావున= కాబట్టి; దీనిన్= ఈమెను; అగ్ర, మహిషిన్, కాన్= పెద్దభార్యగా; పరిగ్రహింపుము; మా నలువుర, అనుమతంబునున్= మా నలుగురి సమ్మతికూడా; ఇట్టిది+అ= ఇదే; అనుచున్+ఉన్న= అనుకుంటూ ఉండే; అవసరంబునన్= సమయాన; విధి, ప్రేరణ, వశంబునన్= విధిప్రేరణచేత.

**తాత్పర్యం:** 'పెద్దవాడు ఉండగా చిన్నవాడికి పెళ్లికావటం ధర్మవిరుద్ధం. అందుచేత ఈమెను పెద్దభార్యగా పరిగ్రహింపుము. మా నలువురికి సమ్మత మైనదికూడ ఇదే'! అని అంటున్న సమయంలో విధిప్రేరణతో.

**ఉ. ఆ లలితాంగియందు హృదయంబులు దృష్టులు నిల్పి పాండుభూ**
**పాల తనూజపంచకము పంచశరాహతిఁ బొందె నొక్కతన్**
**బాలికఁ దొల్లి యేవురకు భామినిఁగా సృజియించి యున్న య**
**య్యాలరి బ్రహ్మ చెయ్ది పరమార్థముగా కది యేల యొం డగున్. 213**

**ప్రతిపదార్థం:** ఆ, లలిత+అంగి, అందు= ఆ అందమైనశరీరం కల ద్రౌపదియందు; హృదయంబులు= మనస్సులు; దృష్టులు= చూపులు; నిల్పి= పాదుకొల్పి, నెలకొనజేసి; పాండుభూపాల, తనూజ, పంచకము= పాండురాజు కొడుకు లైదుగురి సమూహం; పంచ, శర+ఆహతిన్= ఐదుబాణాలు కలవాడైన మన్మథునియొక్క దెబ్బను; పొందెన్= పొందాడు; ఒక్కతన్, బాలికన్= ఒక కన్యకను; తొల్లి= పూర్వం; ఏవురకున్= ఐదుగురికి; భామినిన్+కాన్= భార్యగా; సృజియించి= సృష్టించి; ఉన్న= ఉండే; ఆ+అలరి, బ్రహ్మ, చెయ్ది= ఆ తుంటరిఅయిన బ్రహ్మయొక్కచేష్ట అయినది; పరమ+అర్థము= సత్యము కాక; ఒండు= ఇతరం; ఏల, అగున్= ఎందుకు ఔతుంది?

**తాత్పర్యం:** ఆ అందమైనశరీరం కల ద్రౌపదిమీద పాండురాజు కుమారు లైదుగురు తమ మనస్సులను, చూపులను నిల్పి, మన్మథబాధ పొందారు. ఒక కన్యకను ఐదుగురికి భార్యగా భావించి, ముందే సృష్టించి ఉన్న తుంటరి బ్రహ్మచేసినపని సత్యంకాక, వేరొక విధంగా ఎలా అవుతుంది?

**విశేషం:** పాండుభూపాల తనూజ 'పంచకం' - అన ప్రయోగంలో సమాహారమైన 'పంచకం' అనే శబ్దానికి వ్యంగ్యార్థస్ఫూర్తి ఉన్నది. ద్రౌపదిపట్ల పాండవులకు ఉండే ఏకతాభావాని కిది సూచన. పంచేంద్రోపాఖ్యానంలో చెప్పబడబోయే ఏకైకతత్త్వాని కిది ధ్వని. ద్రౌపదియందు పాండవులు అయిదుగురు ఒక్కసారి మన్మథభావం పొందా రని చెప్పటం సాభిప్రాయం. ఆపైన

ద్రౌపదికూడ పాండవులందరియందు అనురక్తురా లౌతుంది. ఇది చిత్రమైన సన్నివేశం. భార్యాభర్తలనడుమ ఉదయించే రతిభావం, అనురాగం, జననాంతరసౌహృదరూపం కాని తాత్కాలికం కా దని ఇందులో ధ్వనింపబడింది. అంతేకాదు - మత్స్యయంత్రం భేదించిన తరువాత ద్రౌపది మన్మథునివంటి అర్జునుని మెడను కల్యాణమాలతో అలంకరించినట్లు కవి చెప్పినా వారిరువురి మనస్సులలో మారవికారం కలిగినట్లు చెప్పక, ఇక్కడ అందరికీ ఒకేసారి మన్మథభావం ఉదయ మైన దని వర్ణించడం నన్నయ కథాకథనశిల్పం. (సంపా.)

**వ. ఇట్లు పాంచాలియందు బద్ధానురాగు లయియున్న తమ యేవుర యభిప్రాయం బెఱింగి వేద వ్యాస వచనంబులుం దలంచి ధర్మతనయుండు దమ్ముల కి ట్లనియె. 214**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాంచాలి, అందున్= ద్రౌపదియందు; బద్ధ+అనురాగులు+అయి= తగులుకొన్న ప్రేమకలవా ళ్ళయి; ఉన్న= ఉన్నటువంటి; తమ, ఏవుర= తమ ఐదుగురి; అభిప్రాయంబు; ఎఱింగి= తెలిసికొని; వేదవ్యాస, వచనంబులున్= వేదవ్యాసుని వాక్కులు కూడా; తలంచి= తలచుకొని; ధర్మతనయుండు= ధర్మరాజు; తమ్ములకున్= సోదరులతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రౌపదియందు అనురక్తు లై ఉన్న తమ అయిదుగురి అభిప్రాయం తెలిసికొని, వేదవ్యాసునిమాటలు తలచి, ధర్మరాజు తమ్ములతో ఈ విధంగా అన్నాడు.

**క. గురువచనస్థితి మన కే। గురకును నిది పత్నిగాఁ దగుం గావున ని**
**త్తరుణిని బరిగ్రహింతము । తిరముగ; గురువచన మొండుదెఱఁ గేల యగున్. 215**

**ప్రతిపదార్థం:** గురు, వచన, స్థితి= పెద్దవారియొక్కమాట ఉండటంచేత; మనకు+ఏగురకునున్= మన ఐదుగురికి; ఇది= ఈ ద్రౌపది; పత్ని= భార్య; కాన్, తగున్= కాదగును; కావునన్= కాబట్టి; ఈ+తరుణినిన్= ఈ కాంతను; తిరముగా= స్థిరంగా; పరిగ్రహింతము= పరిగ్రహించుదము-పెండ్లాడుదాం; గురు, వచనము= పెద్దవారిమాట; ఒండు, తెఱఁగు= వేరు విధంగా; ఏల, అగున్= ఎందుకు అవుతుంది.

**తాత్పర్యం:** పెద్దల మాట ప్రకారం మన ఐదుగురికి ఈమె భార్య కాదగును. కనుక ఈమెను నిశ్చితంగా మనం వివాహం చేసుకొందాము. పెద్దలమాట వ్యర్థం కాదుగదా!

**వ. అని పలుకుచున్న యవసరంబున. 216**

**ప్రతిపదార్థం:** అని= ఆప్రకారంగా; పలుకుచు+ఉన్న= మాటాడుతూఉండే; అవసరంబునన్= సమయంలో.

**తాత్పర్యం:** అని అంటున్న సమయంలో.

## శ్రీకృష్ణ బలరాములు ధర్మరాజాదులఁజూడవచ్చుట (సం.1-183-2)

**శా. రాజత్కీర్తులు వచ్చి కాంచి రనఘుల్ రాముండు గృష్ణుండు న**
**య్యాజామీఢు నజాతశత్రు నృపలోకారాధ్యు నుదృద్ధుణ**

**భ్రాజిష్ణుం దమ మేనయత్త కొడుకున్ బాలార్కతుల్యోజ్జ్వల**
**త్తేజున్ భ్రాతృచతుష్కమధ్యగతుఁ గౌంతేయాగ్రజున్ ధర్మజున్. 217**

**ప్రతిపదార్థం:** రాజత్+కీర్తులు= ప్రకాశిస్తున్న కీర్తికలవాళ్ళు; అనఘుల్= పాపం లేనివాళ్ళు; రాముండు= బలరాముడు; కృష్ణుండున్; వచ్చి; ఆ+అజామీఢున్= ప్రసిద్ధమయిన అజామీఢునివంశంలో పుట్టినవాడిని; అజాతశత్రున్= పుట్టబడని శత్రువులు కలవాడిని; నృప, లోక+ఆరాధ్యున్= రాజసమూహంచేత సేవింపదగినవాడిని; ఉద్యత్+గుణ, భ్రాజిష్ణున్= ఉన్నత మైన గుణాలచేత ప్రకాశించేవాడిని; తమ, మేనయత్త= తన మేనత్త; కొడుకున్= కుమారుణ్ణి; బాల+అర్క, తుల్య+ఉత్+జ్వలత్+తేజున్= బాలసూర్యునితో సమానంగా ప్రకాశిస్తున్న తేజస్సు కలవాడిని; భ్రాతృ, చతుష్క, మధ్య, గతున్= తమ్ములు నలుగురిమధ్య ఉన్నవాడిని; కౌంతేయ+అగ్రజున్= కుంతికొడుకులలో పెద్దవాడిని; ధర్మరాజున్; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** ప్రకాశిస్తున్న కీర్తి కలవాళ్ళు, పాపంలేనివాళ్ళు అయిన బలరామకృష్ణులు వచ్చి - అజామీఢుని వంశంలో పుట్టినవాడు, శత్రువులు లేనివాడు, రాజసమూహం సేవింప తగినవాడు, ఉన్నతగుణాలతో వెలిగేవాడు, తమ మేనత్తకొడుకు, బాలసూర్యునితో సమానమైన ఉజ్జ్వలతేజస్సు కలవాడు, తమ్ములు నలుగురిమధ్యలో ఉన్నవాడు, కుంతికొడుకులలో పెద్దవాడు అయిన ధర్మజుడిని చూచారు.

**విశేషం:** మహాభారతంలో ఇది శ్రీకృష్ణపాండవుల ప్రథమసమావేశం. నన్నయగారి వస్తుధ్వని శిల్పానికి ఇది ఉత్తమ ఉదాహరణం. ఇది ఒక అపూర్వ ప్రథమ సమావేశం. శ్రీకృష్ణుడు పాండవులను చూచా డని వర్ణించలేదు నన్నయ. నలుగురు తమ్ముల నడుమనున్న ధర్మరాజును చూచినట్లు వర్ణించాడు. అంతేకాదు బ్రాహ్మణ వేషధారిగా కాక 'నృపలోకారాధ్యుడి'గా దర్శించినట్లు వర్ణించటం సాభిప్రాయం. శ్రీకృష్ణకృపాకటాక్షాలతో ధర్మజుడు రాజసూయాగాదులు నిర్వహించి సకల రాజలోక పూజితుడౌతా డని వస్తుధ్వని. 'బాలార్కతుల్యోజ్జ్వలత్తేజు' డనటం మరొక విశేషం. ఇక్కడినుండి ధర్మరాజు జీవితంలో ఉజ్జ్వల అధ్యాయం మొదలౌతున్న దని భావం. ముందుపద్యం (213)లో పాండవ పంచకం అనే సమాసం వ్యక్తులుగా వా రైదుగురైనా తత్త్వంలో ఒకరే అని ధ్వనింపజేస్తున్నది. అందువలననే నాయికగా ద్రౌపది ఒక్కతే. మహాభారతంలో నాయకులు పాండవులు, అందులోనూ ప్రధానుడు ధర్మరాజు. భీమాదులు అనునాయకులు. అనునాయకు లంటే స్వీయప్రయోజనం లేకుండా ప్రధాననాయకకార్యమే తమ కార్యాలుగా భావించే అద్వైతచిత్తవృత్తులు కలవారు. శ్రీకృష్ణుడు పాండవులకు దైవంవంటి మిత్రుడు, గురువు, బంధువు. అందువలన మహాభారతంలో కృష్ణుడు ఉపనాయకుడు. స్వీయప్రయోజనంతోపాటు నాయక ప్రయోజనాన్ని కూడా సాధించి పెట్టేవాడు ఉపనాయకుడు. ఒక్కొక్కసారి నాయకునికంటె ఉపనాయకుడు మహిమాన్వితుడు కావచ్చును. ఇటువంటి సందర్భమే ధర్మరాజుకు సిద్ధించింది. దానివలన ధర్మరాజు ఉభయార్థసిద్ధి అయ్యాడు. శ్రీకృష్ణుడు, పాండవులు, ద్రౌపది, కుంతి - అనే పాత్రలు పాండవపక్షంలో ఇక ముందుకథలో ప్రధానపాత్రలు నిర్వహించబోతున్నారన్న అర్థాన్ని ధ్వనిమయం చేశాడు నన్నయ. (సంపా.)

**వ. కని త మ్మెఱింగించి యతిస్నేహంబున నయ్యుధిష్ఠిరునకుం గుంతీదేవికి మ్రొక్కి భీమార్జుననకుల సహదేవులం గౌఁగిలించుకొని, పరమసమ్మదరసపూరితహృదయు లై యున్న, వారల కుశలం బడిగి ధర్మరా జి ట్లనియె. 218**

**ప్రతిపదార్థం:** కని= చూచి; తమ్ము+ఎఱింగించి= తమను పరిచయం చేసికొని; అతి, స్నేహంబునన్= మిక్కిలి ప్రేమతో; ఆ యుధిష్ఠిరునకున్= ఆ ధర్మరాజుకు; కుంతీదేవికిన్, మ్రొక్కి; భీమ+అర్జున, నకుల, సహదేవులన్= భీముని, అర్జునుని నకులుని సహదేవుని; కౌఁగిలించుకొని; పరమ, సమ్మద, రస, పూరిత, హృదయులు+ఐ= మిక్కిలి ఆనంద మనే రసంచేత

నిండిన హృదయాలు కలవాళ్ళయి; ఉన్నన్= ఉండగా; వారల= వారియొక్క; కుశలంబు= క్షేమం; అడిగి; ధర్మరాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** చూచి, తమను పరిచయం చేసికొని మిక్కిలిప్రేమతో ధర్మజునికి, కుంతీదేవికి నమస్కరించి, భీమార్జుననకులసహదేవులను కౌగలించుకొని పరమానందంతో నిండిన హృదయాలతో ఉండగా, వాళ్ళను కుశల మడిగి ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**క. ఒవ్వమిఁ గౌరవులకుఁ గడు । దవ్వయి మఱి విప్రవేషధారుల మయి మ**
**మ్మెవ్వరు నెఱుంగకుండఁగ । నివ్విధమున నున్న నెట్టు లెఱిఁగితి రీరల్. 219**

**ప్రతిపదార్థం:** ఒవ్వమిన్= విరోధంచేత; కౌరవులకున్; కడున్= మిక్కిలి; దవ్వు+అయి= దూరమై; మఱి= ఇంకా; విప్ర, వేష, ధారులము+అయి= బ్రాహ్మణవేషాలను ధరించినవాళ్ళమై; మమ్ము+ఎవ్వరున్= మమ్మల్ని ఎవరుకూడా; ఎఱుంగక; ఉండఁగన్= తెలియకుండగ; ఈ, విధమునన్= ఈ విధంగా; ఉన్నన్= ఉండగా; ఈరల్+మీరు; ఎట్టులు= ఏవిధంగా; ఎఱిఁగితిరి= గుర్తించినారు?

**తాత్పర్యం:** విరోధంతో కౌరవులకు మేము దూరమై, బ్రాహ్మణ వేషాలు ధరించి, మమ్మల్ని ఎవ్వరూ గుర్తించకుండ ఈ విధంగా ఉంటే, మీ రెట్లా తెలిసికొన్నారు?

**వ. అనిన నగుచు వాసుదేవుం డి ట్లనియె. 220**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధర్మరాజు అనగా; నగుచున్= నవ్వుతూ; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు అనగా శ్రీకృష్ణుడు నవ్వుతూ ఈ విధంగా అన్నాడు.

**ఉ. అంబుజమిత్రుఁ డంబుదచయాంతరితుం డగుడుం దదీయ తే**
**జంబు జగజ్జనంబులకు శక్యమె కప్పఁగ; మీరు గూఢభా**
**వంబున నున్న మీదగు నవారితతేజము భూజనప్రసి**
**ద్ధం బగుఁ గాక; దానిఁ బిహితంబుగ నెవ్వరుఁ జేయనేర్తురే. 221**

**ప్రతిపదార్థం:** అంబుజ, మిత్రుఁడు= నీటినుండి పుట్టిన పద్మాలకు స్నేహితు డైన సూర్యుడు; అంబుద, చయ, అంతరితుండు= మేఘ సమూహంచేత కప్పబడినవాడు; అగుడున్= కాగా; తదీయ, తేజంబు= అతనియొక్క తేజస్సు; జగత్+జనంబులకున్= లోకంలోని మానవులకు; కప్పఁగన్= అగుపడకుండ చేయుట; శక్యమే= సాధ్యమా; మీరు; గూఢ భావంబునన్= రహస్య మైన విధంగా; ఉన్నన్= ఉండగా; మీది+అగున్= మీకు సంబంధించినదగు; ; అవారిత, తేజము= అడ్డగింప సాధ్యం కాని తేజస్సు; భూ, జన, ప్రసిద్ధంబు= భూమి యందలి జనులకు తెలిసినదే; అగున్= ఔనుకదా!; కాక, దానిన్= ఆ తేజస్సును; పిహితంబుగన్= కప్పబడిన దానినిగా; ఎవ్వరున్= ఎవరైనను; చేయ, నేర్తురే= చేయగలరా!

**తాత్పర్యం:** సూర్యుడిని మేఘసమూహం కప్పినా అతనితేజస్సును లోకంలోని జనులకు కనిపించకుండ చేయటం సాధ్యమా? అట్లాగే మీరు రహస్యంగా మారువేషంలో ఉన్నా, అడ్డగించ సాధ్యం కాని మీ తేజస్సు లోకంలోని ప్రజలకు ప్రసిద్ధమే. దానిని అగుపడకుండ ఎవ్వరు చేయగలరు?

**విశేషం:** అలం: దృష్టాంతం. పాండవులు ఎన్నో కష్టా లనుభవించి, చివరకు గొప్పగా ద్రౌపదిని గెల్చుకొని మహానందంతో ఉన్న సమయంలో శ్రీకృష్ణుడు మొదటిసారిగా కలిసి చేసిన ఈ ప్రశంస, వారి ఆనందాన్ని అంతకు అంత పెంచటమే గాక వారి హృదయాలను గట్టిగా తనవశం చేసుకోగలదు.

**పాండవుల వంశాదికము నెఱింగి ర మ్మని ద్రుపదుండు ధృష్టద్యుమ్నుం బనుచుట (సం.1-184-3)**

**వ.** **'సకలరాజసమక్షంబున నిట్టి యతిమానుషం బయిన యద్భుతకర్మం బర్జునునక కా కన్యులకుఁ జేయ శక్యంబె? యని యెఱింగితిమి; మీపరాక్రమంబ మిమ్ము నెఱింగించె; నధర్మనిరతు లగు ధృతరాష్ట్రదుర్యోధనులు సేసిన లాక్షాగారదాహప్రయోగంబువలన విముక్తుల రయితి; రింక మీకు ల గ్గగు' నని చెప్పి బలదేవసహితుం డయి వాసుదేవుం డరిగిన; నిట ద్రుపదుండు దనకూఁతునకు వరుం డైన వాఁ డెవ్వఁడో యేవంశంబునవాఁడో వాని చరితం బెట్టిదో యెఱింగి రమ్మని ధృష్టద్యుమ్నుం బనిచిన, నతండు భీమార్జున ద్రౌపదుల పిఱుందన వచ్చి త న్నొఱు లెఱుంగకుండ నక్కుంభకారగృహంబున నుండి యంత వృత్తాంతంబు నెఱింగిపోయి ద్రుపదున కి ట్లనియె.222**

**ప్రతిపదార్థం:** సకల, రాజ సమక్షంబునన్= అందరు రాజుల ఎదుట; ఇట్టి; అతిమానుషంబు+ఐన= మానవులకు సాధ్యంకాని దైన; అద్భుత, కర్మంబు= ఆశ్చర్యకరమైన పని; అర్జునునకు+అ+కాక= అర్జునునకు తప్ప; అన్యులకున్= ఇతరులకు; చేయ; శక్యంబె= సాధ్యమా; అని= అని; ఎఱింగితిమి= తెలిసికొంటిమి; మీ, పరాక్రమంబు+అ=మీ పరాక్రమమే; మిమ్మున్+ ఎఱింగించెన్= తెలియజేసింది; అధర్మ, నిరతులు+అగు= అధర్మంలో ఇష్టంకలవాళ్ళయిన; ధృతరాష్ట్ర, దుర్యోధనులు= ధృతరాష్ట్రుడు, దుర్యోధనుడు; చేసిన; లాక్షా+అగార, దాహ, ప్రయోగంబువలనన్= లక్కయింటిని తగులబెట్టే ప్రయత్నంనుండి; విముక్తులరు+అయితిరి= తప్పించుకొన్నవా ళ్ళయితిరి; ఇంకన్= ఇకపై; మీకు; లగ్గు= మేలు; అగున్= అవుతుంది; అని; చెప్పి; బలదేవ, సహితుండు+అయి= బలరామునితో కూడి; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; అరిగినన్= వెళ్లగా; ఇట; ద్రుపదుండు= ద్రుపదమహారాజు; తన, కూఁతునకు= తన కుమార్తెకు; వరుండు+ఐన, వాఁడు= భర్త అయిన, అతడు; ఎవ్వడో= ఎవరో; ఏ వంశంబున వాఁడో= ఏ వంశంలోని అతడో; వాని చరితంబు= అతని చరిత్ర; ఎట్టిదో= ఎటువంటిదో; ఎఱింగి= తెలుసుకొని; రమ్ము+అని; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుని; పనిచినన్= పంపగా; అతండు; ఆ ధృష్టద్యుమ్నుడు; భీమ+అర్జున, ద్రౌపదుల; పిఱుందన్+అ= భీముడు అర్జునుడు ద్రౌపది వెనుకనే; వచ్చి; తన్నున్= తనను; ఒరులు= ఇతరులు; ఎఱుంగక+ఉండన్= తెలియకుండ; ఆ+కుంభకార, గృహంబునన్= ఆ కుండలు చేసేవాని ఇంట్లో; ఉండి= విశ్రమించి; అంత, వృత్తాంతంబున్= విషయము అంతా; ఎఱింగి= తెలిసికొని; పోయి; ద్రుపదునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అందరు రాజులముందు మానవులకు అసాధ్యమైన ఇటువంటి అద్భుతకార్యం చేయటం అర్జునునికి కాక ఇతరులకు సాధ్యమా? అని తెలిసికొన్నాము. మీ పరాక్రమమే మిమ్మల్ని తెలియపరచింది. అధర్మంలో ఆసక్తి కలవా ళ్ళయిన ధృతరాష్ట్ర దుర్యోధనులు చేసిన లాక్షాగృహ దహనంనుండి తప్పించుకొన్నారు. ఇక మీకు మేలు కలుగుతుంది' అని చెప్పి బలరామునితోగూడి శ్రీకృష్ణుడు వెళ్లిపోయాడు. ఇక్కడ ద్రుపదుడు తన పుత్రికకు భర్త

అయినవాడు ఎవ్వడో? ఏ వంశంవాడో; అతనిచరిత్ర ఎటువంటిదో? తెలిసికొని ర మ్మని ధృష్టద్యుమ్నుడిని పంపాడు. అతడు భీమార్జునద్రౌపదుల వెనుకనే వచ్చి, ఇతరులు తనను చూడకుండ, ఆ కుమ్మరివాని యింట్లో ఉండి, వృత్తాంతమంతా గ్రహించి వెళ్లి ద్రుపదునితో ఈ విధంగా చెప్పాడు.

**సీ. అ య్యిద్దఱును గృష్ణ న ట్లొప్పఁ దోడ్కొని । చని యొక్క ముదుసలి సాని కపుడు**
**మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించి మఱియొక్క । గౌరవర్ణుఁడు పంపఁ గడఁకతోడ**
**నలువురు భూసురనాథగృహంబుల । కరిగి భైక్షము దెచ్చి యంతగూడు**
**నొగిన యయ్యవ్వకు నొప్పించియున్న న । య్యవ్వయు ద్రౌపది నర్థిఁ బిలిచి**

**ఆ. బలివిధానములకు బ్రాహ్మణాతిథులకు । నన్నకాంక్షు లైన యధ్వగులకు**
**నగ్రమిందుఁ బుచ్చి యయ్యగ్రశేషంబుఁ । జెలువ రెండు పాళ్ళు సేయు మొనర. 223**

**ప్రతిపదార్థం:** ఆ+ఇద్దఱును; కృష్ణన్= ద్రౌపదిని; అట్లు; ఒప్పన్= తగు విధంగా; తోడ్కొని; చని; ఒక్క, ముదుసలి, సానికి= ఒక ముసలి అవ్వకు; అపుడు= ఆ సందర్భంలో; మ్రొక్కి; ఆ+కన్యను= ఆ కన్నెను; మ్రొక్కించి= నమస్కరింపజేసి; మఱి= పిదప; ఒక్క= ఇంకొక; గౌరవర్ణుఁడు= తెల్లని వన్నెగలవాడు-ధర్మరాజు; పంపన్= ఆజ్ఞాపింపగా; కడఁకతోడన్= ప్రయత్నంతో; నలువురు= నలుగురు; భూసుర, నాథ, గృహంబులకున్= బ్రాహ్మణ శ్రేష్ఠుల ఇండ్లకు; అరిగి= వెళ్ళి; భైక్షము= భిక్షాసమూహం; తెచ్చి= తీసికొనివచ్చి; అంత, కూడున్= అంత అన్నమును; ఒగిన్= క్రమముగ; ఆ+అవ్వకున్; ఒప్పించి= అప్పగించి; ఉన్నన్= ఉండగా; ఆ+అవ్వయున్= ఆ అవ్వకూడా; ద్రౌపదిన్; అర్థిన్= ప్రీతితో; పిలిచి; చెలువ= సుందరీ; బలివిధానములకు= బలులు వేయుటకు; బ్రాహ్మణ+అతిథులకున్= బ్రాహ్మణులైన అతిథులకు; అన్న, కాంక్షులు+ఐన= అన్నమును కోరేవా ళ్ళయిన; అధ్వగులకున్= బాటసారులకు; ఇందున్= దీనిలో; అగ్రము= అధికభాగం; పుచ్చి= గ్రహించి; ఆ+అగ్రశేషంబున్= అగ్రభాగం పోగా మిగిలిన దానిని; రెండు, పాళ్ళు; ఒనరన్= ఒప్పగ; చేయుము.

**తాత్పర్యం:** 'ఆ యిద్దరు (భీమార్జునులు) ద్రౌపదిని ఆ విధంగా తమవెంట పిలిచికొని పోయి, ఒక ముసలి అవ్వకు నమస్కరించారు. ఆ కన్యచేతకూడా మ్రొక్కించారు. ధర్మరాజు ఆజ్ఞాపించగా పూనికతో తక్కిన నలుగురు, బ్రాహ్మణశ్రేష్ఠుల గృహాలకు వెళ్లి, భిక్షాసమూహాన్ని తెచ్చి, ఆ ఆహారాన్నంతా ఆ అవ్వకు అప్పగించారు. ఆ అవ్వ ద్రౌపదిని ఆప్యాయంగా పిలిచి, 'సుందరీ! ఇందులో అగ్రభాగం బలివిధానాలకు, బ్రాహ్మణాతిథులకు, అన్నం కోరి వచ్చే బాటసారులకు వేరుగా ఉంచి, మిగిలినదాన్ని రెండు భాగాలు చేయు' మని చెప్పింది.

**విశేషం:** భిక్షాన్నంలో కూడా అన్యులకు అగ్రభాగం సమర్పించే ఆర్షసంప్రదాయం అమోఘం. కోడలుగా ఇంట్లో అడుగుబెట్టిన ద్రౌపదికి అత్తగారైన కుంతి తనయింటి ఆచారవ్యవహారాలను, సంస్కృతి విశేషాలను తెలియజెప్పి, వాటి బాధ్యతలను ఆమెకు అనుభవ మయ్యేటట్లు బోధించటం ఉత్తమగృహస్థాశ్రమధర్మం. అత్తాకోడళ్ళు ఒక వంశంలో సాగే అవిచ్ఛిన్న సంప్రదాయాన్ని పోషించే ధర్మకర్త లనే భారతీయసంప్రదాయంకూడా ఇందులో రమణీయంగా చిత్రించబడింది.

**క. వెడఁదయురంబును నన్నువ । కడుపును దృఢకఠినతనువుఁ గల యాతని కిం**
**దడర నొకపాలు వెట్టుము । వడి; నాగాయుతబలంబువాఁ డతఁ డబలా! 224**

**ప్రతిపదార్థం:** అబలా= ఓకాంతా!; వెడద, ఉరంబునున్= విశాలమైన రొమ్మును; అన్నువ కడుపును= సన్నని కడుపును; దృఢ, కఠిన, తనువున్= దృఢమైన కఠినమైన దేహమును; కల= కలిగిన; అతనికిన్= అతనికి; ఇందున్+అడరన్= ఇందులో ఒప్పుగా; ఒక, పాలు= ఒక భాగం; వడి= వేగమే; పెట్టుము; అతడు= ఆ వ్యక్తి; నాగ+అయుత; బలంబువాడు= పదివేల ఏనుగుల బలం కలవాడు.

**తాత్పర్యం:** ఓ కాంతా! విశాలమైన రొమ్ము, సన్నని కడుపు, దృఢము కఠినము అయిన దేహం కల అతనికి వెంటనే ఒకభాగం ఆహారం పెట్టుము. అతడు పదివేల యేనుగుల బలం కలవాడు.

**విశేషం:** 'అమ్మ కడుపు చూస్తుంది. ఆలు వీపు చూస్తుంది' అని సామెత. అంటే ఊరినుండి వచ్చినబిడ్డలకయ్యే ఆకలిని ముందుగా గమనించి అన్నంపెట్టి ఆనందపెట్టేది తల్లి. ఊరినుండి ఏమి సంపాదించి తెచ్చాడో ముందుగా మగని వీపుమీది మూటను గమనించేది భార్య అని దీనిభావం. ఇల్లాలుగా బాధ్యతలు నిర్వహించటంలో ద్రౌపది తల్లిమనసుకూడా పెంచుకొన్న దని చెప్పటం ఇందులో ధ్వని. బిడ్డలు పెక్కుమంది ఉన్నప్పుడు తల్లి వివేకవతి అయి వారివారి అవసరాలను గుర్తించి ఆహారం పెట్టటం ధర్మం. భీమునికి భిక్షలో సగం పెట్టటానికి హేతువునుకూడా కుంతి చెప్పింది. అది పక్షపాతం కా దని తెలియచెప్పింది. పాండవులకు భీమునిబలమే పెద్దరక్ష అని వస్తుధ్వని. (సంపా.)

**వ. 'మఱియు రెండగుపా లన్నలువురకుం బెట్టి తద్భుక్తశేషం బేనును నీవు నుపయోగింత' మని పంచినఁ గృష్ణయు నయ్యవ్వ పంచినరూపున నందఱకుం గుడువం బెట్టి, తానును గుడిచి, దర్భపూరులు విద్రిచి యందఱకు వేఱువేఱ శయనమ్ము లిమ్ముగా రచియించి, వానిపయి వారల కృష్ణాజినంబులు పఱచి సుఖశయను లై యున్న వారి పాదంబులకు నుపధానభూత యై శయనించి. 225**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; రెండు+అగు, పాలు= రెండవ భాగం; ఆ నలువురకున్= ఆ నలుగురికి; పెట్టి; తద్+భుక్త, శేషంబు= వారిచే తినబడగా మిగిలిన దానిని; ఏనును= నేనూ; నీవున్= నీవూ; ఉపయోగింతము= ఉపయోగిద్దాం; అని= అంటూ; పంచినన్= ఆజ్ఞాపించగా; కృష్ణయున్= ద్రౌపదియు; ఆ+అవ్వ; పంచిన= ఆజ్ఞాపించిన; రూపునన్= తీరున; అందరకున్= అందరికీ; కుడువన్+పెట్టి= తినటానికి పెట్టి; తానును, కుడిచి; దర్భపూరులు= దర్భపోచలు; విద్రిచి= విదిలించి; అందఱకున్= అందరికీ; వేఱువేఱు+అ= విడివిడిగా; శయనమ్ములు= పడకలు; ఇమ్ముగా= ప్రీతిగా; రచియించి= ఏర్పాటు చేసి; వాని, పయి= వాటిమీద; వారల, కృష్ణ+అజినంబులు= వాళ్ళవైన జింకచర్మాలు; పఱచి; సుఖశయనులు+ఐ= సుఖంగా పడుకొన్నవా ళ్ళయి; ఉన్నన్= ఉండగా; వారి, పాదంబులకున్= వారికాళ్లకు; ఉపధాన, భూత+ఐ= దిండువంటి దై; శయనించి= పడుకొని.

**తాత్పర్యం:** 'రెండవభాగం అన్నం ఆ నలుగురికి పెట్టి, వాళ్ళు తినగా మిగిలిన దానిని నేనూ, నీవూ ఉపయోగిద్దా' మని ఆజ్ఞాపించగా ద్రౌపది ఆమె చెప్పినట్లే అందరికీ అన్నం పెట్టి, తానూ తిన్నది. దర్భగడ్డిపోచలు విదిలించి, అందరికీ వేరువేరుగా పడకలు ప్రీతితో వేసి, వాటిమీద జింకచర్మాలు పరచింది. వాళ్ళు సుఖంగా పడుకొన్న తర్వాత వాళ్ళపాదాలకు దిండువలె తాను పడుకొన్నది.

**ఆ. కఱకు దర్భపూరి పఱపులు; భిక్షాన్న । మశన; మట్టివారి నతిముదమున**
**నాదరించెఁ బ్రీతి; నాదిగర్భేశ్వరి । యయ్యు నేవగింపదయ్యెఁ గృష్ణ. 226**

**ప్రతిపదార్థం:** కఱకు, దర్భపూరి, పఱవులు= కఠినమైన దర్భగడ్డి పఱుపులు; భిక్షా+అన్నము= బిచ్చమెత్తుకొని తెచ్చిన అన్నం; అశనము= ఆహారం; అట్టివారిన్= అటువంటి వాళ్లను; కృష్ణ= ద్రౌపది; ఆది, గర్భ+ఈశ్వరి= మొదటినుండి - గర్భంలో ఉన్నప్పటినుండి సంపద కలది; అయ్యున్= అయినను; అతి, ముదమునన్= మిక్కిలి సంతోషంతో; ప్రీతిన్= ప్రేమతో; ఆదరించెన్; ఏవగింపదు+అయ్యెన్= అసహ్యపడదయ్యెను.

**తాత్పర్యం:** దర్భగడ్డి పరుపులు; భిక్షాన్నం ఆహారం - వీటిని ఆగర్భశ్రీమంతురా లైనా ద్రౌపది మిక్కిలి సంతోషంతో, ప్రేమతో ఆదరించింది కాని, ఏవగించుకొనలేదు.

**క. కడవసములుఁ గోలలుఁ గ । ప్పడములు వీరలధనంబు పరికింపఁగ నె**
**క్కడి దేశికు లని వగవక । మడవక తనుమధ్య నిండుమనమున నుండెన్. 227**

**ప్రతిపదార్థం:** కడవసములున్= జింకచర్మాలూ; కోలలున్= దండాలూ; కప్పడములు= చినిగిన గుడ్డలూ; వీరల, ధనంబు= వీళ్ల ధనం; పరికింపఁగన్= ఆలోచించగా; ఎక్కడి, దేశికులు= ఎక్కడి పెద్దలు - అనగా ఏమి భర్తలు; అని= అని తలచి; వగవక= దుఃఖించక; మడవక= ఏవగించక; తనుమధ్య= సన్నని నడుము కల ద్రౌపది; నిండుమనమునన్, ఉండెన్= నిండుమనస్సుతో ఉన్నది.

**తాత్పర్యం:** జింకచర్మాలు, దండాలు, చినిగిన గుడ్డలు - వీళ్ళ ధనాలు. ఆలోచిస్తే వీ ళ్ళేం భర్తలు? అని దుఃఖించక, అసహ్యపడక ద్రౌపది నిండుమనస్సుతో ఉన్నది.

**సీ. 'అంత నయ్యేవురు నయ్యయికథ లొప్పఁ । జెప్పుచు మఱి రథసింధురాశ్వ**
**విషయంబులును, సమవిషమ మహావ్యూహ । నిర్భేదనోపాయనిపుణవిధులు,**
**నాయుధవిద్యారహస్య ప్రయుక్తులుఁ । బలికిరి; పలికినబాసఁ జూడ**
**నత్యుత్తమక్షత్రియాన్వయు లగుదురు; । చరితఁ జూడఁగ విప్రజాతు లగుదు;**

**ఆ. రెఱుఁగరాదు వారి; నీ రెండు జాతుల । వార కాని, కారు వైశ్య శూద్ర**
**హీనజాతు' లనిన నెంతయు సంతస । మందెఁ బృషతపుత్త్రుఁ డాత్మలోన. 228**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ సమయంలో; ఆ+ఏవురున్= ఆ ఐదుగురు; అయ్యయి, కథలు= ఆయా కథలు; ఒప్పన్= తగు విధంగా; చెప్పుచున్= చెప్పుకొంటూ; మఱి; రథ, సింధుర+అశ్వ విషయంబులును= రథముల, ఏనుగుల, గుఱ్ఱాల సంగతులూ; సమ, విషమ, మహావ్యూహ, నిర్భేదన+ఉపాయ, నిపుణ, విధులున్= సమములు, విషమములు అయిన మహాయుద్ధ వ్యూహాలను భేదించునట్టి ఉపాయాలయొక్క నిపుణ మైన పద్ధతులూ; ఆయుధ, విద్యా, రహస్య, ప్రయుక్తులున్= ఆయుధవిద్యయందలి రహస్య ప్రయోగాలూ; పలికిరి; పలికిన, బాసన్= మాటాడిన మాటతీరును; చూడన్= పరిశీలింపగా; అత్యుత్తమ, క్షత్రియ+అన్వయులు= మిక్కిలి శ్రేష్ఠమయిన రాజవంశం కలవాళ్ళు; అగుదురు= అవుతారు; చరితన్= నడతను; చూడఁగన్= గమనింపగా; విప్ర, జాతులు= బ్రాహ్మణజాతికలవారు; అగుదురు= అవుతారు; వారిన్= వారలను; ఎఱుఁ గరాదు= తెలియటం సాధ్యపడదు; ఈరెండు జాతులవారు+అ= ఈ రెండుజాతులకు చెందినవారే; కాని; వైశ్య, శూద్ర, హీన, జాతులు, కారు; అనినన్= అని అనగా; పృషత; పుత్త్రుఁడు= పృషతుని కుమారు డైన ద్రుపదుడు; ఆత్మలోనన్= మనస్సులో; ఎంతయున్= ఎంతో; సంతసము, అందెన్= సంతోషాన్ని పొందాడు.

**తాత్పర్యం:** 'అప్పుడు ఆ ఐదుగురు ఆ యా కథలు చెప్పుకొంటూ రథాలు, ఏనుగులు, గుర్రాలు - వీటికి సంబంధించిన విషయాలు, సమవిషమాలైన మహాయుద్ధవ్యూహాలను భేదించే ఉపాయాలలో నిపుణమైన పద్ధతులు, ఆయుధాల రహస్యప్రయోగాలు మాట్లాడుకొన్నారు. మాటాడిన మాటలు చూస్తే, వాళ్ళు మిక్కిలి శ్రేష్ఠమైన రాజవంశంవాళ్ళుగా ఉన్నారు. ప్రవర్తన చూస్తే బ్రాహ్మణజాతివా ళ్ళనిపిస్తుంది. వా ళ్ళెవరో స్పష్టంగా తెలిసికొనటం సాధ్యపడదు. కాని, వాళ్ళు ఈ రెండుజాతులవాళ్ళే! వైశ్య, శూద్ర, హీనజాతులవాళ్ళుమాత్రం కాదు' అని తెల్పగా, ద్రుపదుడు మనస్సులో మిక్కిలి ఆనందం పొందాడు.

**విశేషం:** ద్రౌపదికి స్వయంవరం ప్రకటించిన ద్రుపదుడు ఆశించింది ఒకటి - అయింది ఇంకొకటి. అర్జునుడు లేదా ఏ రాకుమారుడో మత్స్యయంత్రాన్ని భేదించి ద్రౌపదిని చేపట్టగల డని ఆశిస్తే - ఒక బ్రాహ్మణుడు దాన్ని కొట్టాడు; ఆమెను చేపట్టాడు. ఒక మహారాజ పుత్రి పేద బ్రాహ్మణుని వెంట జీవితం పంచుకొనటానికి వెళ్ళింది. ఎంత చిత్రమైన మలుపు! సహజంగానే ఏ తల్లిదండ్రులైనా తమ పిల్ల వెళ్ళినచోట ఎలా ఉందో - అల్లుడు ఏలాంటివాడో - తెలిసికొనటానికి పరోక్షంగా లేదా ప్రత్యక్షంగా ప్రయత్నిస్తారు. అటువంటప్పుడు ముక్కూ మొగం తెలియని ఒక బ్రాహ్మణుని వెంట ఎక్కడికో వెళ్ళిన తన కూతురి స్థితిగతులు తెలిసికొనా లని ద్రుపదుడు తహతహలాడటంలో ఆశ్చర్యమేముంది? అందుకే ఆ మహారాజు మొదట కొడుకును పంపాడు. పిల్లనిచ్చినవాళ్ళు తమను పరిశీలిస్తున్నా రని తెలిస్తే అత్తింటివాళ్ళు గ్రహించే అవకాశం ఉన్నది. అందుకే ధృష్టద్యుమ్నుడు రహస్యంగా విషయం సేకరించి వచ్చాడు. మాటలు చూస్తే వాళ్ళు రాకుమారు లని, ప్రవర్తన చూస్తే బ్రాహ్మణు లని, ఇతర జాతుల వాళ్ళు ఏ మాత్రం కా రని చెప్పాడు. అంతమాత్రాన తండ్రి ఉత్కంఠ ఆగుతుందా? వా ళ్ళెవరో వివరంగా తెలియాలికదా. అందుకే ద్రుపదుడు మళ్ళీ తన పురోహితుడిని పంపాడు. మహాభారతంలో చిత్రమైన మలుపులతో సహజమనోహరంగా సాగిన కథాకథన మిది.

**వ. వెండియు వారల నిమ్ముగా నెఱుంగవేఁడి తనపురోహితుం బుత్తెంచినం, బురోహితుండును బ్రాహ్మణ సమూహంబుతోడ వచ్చి పాండవులం గని ధర్మరాజు నియోగంబున భీమసేనుచేత నర్ఘ్యాదివిధుల నర్చితుం డయి యి ట్లనియె. 229**

**ప్రతిపదార్థం:** వెండియున్= మఱియు; వారలన్= వాళ్లను; ఇమ్ముగాన్= చక్కగా; ఎఱుంగన్= తెలియుటకై; వేఁడి= ప్రార్థించి, తన పురోహితున్; పుత్తెంచినన్= పంపగా; పురోహితుండును= పురోహితుడుకూడా; బ్రాహ్మణ, సమూహంబుతోడన్= బ్రాహ్మణ సమూహంతో; వచ్చి= వచ్చి; పాండవులన్; కని= చూచి; ధర్మరాజు= ధర్మరాజుయొక్క; నియోగంబునన్= ఆజ్ఞచే; భీమసేనుచేతన్; అర్ఘ్య+ఆది, విధులన్= అర్ఘ్యం మొదలైన పూజాపద్ధతులచేత; అర్చితుండు+అయి= పూజింపబడినవా డై; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఇంకా వాళ్ళవిషయం చక్కగా తెలిసికొని ర మ్మని తన పురోహితుడిని ప్రార్థించి, పంపగా, అతడు బ్రాహ్మణసమూహంతో వచ్చి పాండవులను చూచి - ధర్మరాజు ఆజ్ఞాపించగా భీమసేనుడు ఇచ్చిన అర్ఘ్యాది పూజలు అందుకొని, ఇట్లా అన్నాడు.

**ఉ. మీ కులగోత్ర నామములు మిమ్మును నెమ్మి నెఱుంగవేఁడి చిం**
**తాకులు డైనవాఁడు ద్రుపదాధిపుఁ; డాతనికిం బ్రియంబుగా**
**నా కెఱిఁగింపుఁ డింతయు; ఘనంబుగ నద్భుతయంత్ర మత్స్యమున్**
**వీకున నట్టు లేసిన సువిక్రము నాతఁడు గోరుఁ జూడఁగన్. 230**

**ప్రతిపదార్థం:** మీ, కుల గోత్ర, నామములన్= మీయొక్క కులం గోత్రం పేర్లు; మిమ్ములన్= మిమ్మల్ని; నెమ్మిన్= ప్రీతితో; ఎఱుంగన్= తెలియుటకై; వేఁడి= కుతూహలపడి; ద్రుపద+అధిపుఁడు= ద్రుపద మహారాజు; చింతా+ఆకులుఁడు+ఐనవాఁడు= చింతచేత కలతచెందినవాడైనాడు; అతనికిన్; ప్రియంబుగాన్= ప్రీతిగా; ఇంతయున్= అంతా; నాకున్+ఎఱిఁగింపుడు; ఘనంబుగన్= గొప్పగా; అద్భుత, యంత్ర మత్స్యమున్= ఆశ్చర్యకరమైన మత్స్యయంత్రాన్ని; వీకునన్= పరాక్రమంతో; అట్టుల= ఆ విధంగా; ఏసిన= కొట్టిన; సువిక్రమున్= మంచిపరాక్రమం కల వాడిని; ఆతడు, చూడఁగన్, కోరున్= ఆతడు చూచుటకై కోరుతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** మీ కులం, గోత్రం, పేర్లు, మిమ్మల్నిగురించి ప్రీతితో తెలిసికొనా లని ద్రుపదమహారాజు చింతిస్తున్నాడు. ఆయనకు సంతోషం కలిగే విధంగా అంతా నాకు తెలియజేయండి. ఆశ్చర్యకరమైన ఆ మత్స్యయంత్రాన్ని తన పరాక్రమంతో ఆ విధంగా పడగొట్టిన మహావీరుడిని అతడు చూడగోరుతున్నాడు.

**వ. అనిన విని నగుచు ధర్మతనయుండు ద్రుపద పురోహితున కి ట్లనియె. 231**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; నగుచున్= నవ్వుతూ; ధర్మతనయుఁడు= ధర్మరాజు; ద్రుపద, పురోహితునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని నవ్వుతూ ధర్మరాజు ద్రుపదపురోహితునితో ఈ విధంగా అన్నాడు.

**క. ఇవ్వైహాయసలక్ష్యం। బివ్విలు మోపెట్టి నెట్టనేసిన వీరుం**
**డివ్వనితకు వరుఁ డగు నని। నెవ్వగ మీ రాజు చులక నియమము సేసెన్. 232**

**ప్రతిపదార్థం:** ఈ+వైహాయస, లక్ష్యంబు= ఈ ఆకాశమందలి గుఱిని; ఈ+విలున్= ఈ ధనుస్సును; మోపెట్టి= ఎక్కుపెట్టి; నెట్టన్= క్రమముగ; ఏసిన= కొట్టిన; వీరుండు; ఈ+వనితకు= ఈ ద్రౌపదికి; వరుఁడు= మగడు; అగున్= అవుతాడు; అని; నెవ్వగన్= నిండైన ఆలోచనతో; మీ, రాజు; చులక, నియమము= సులువైన ఏర్పాటు; చేసెన్.

**తాత్పర్యం:** 'ఈ ఆకాశ మత్స్యయంత్రాన్ని, ఈ విల్లు ఎక్కుపెట్టి కొట్టినవీరుడు ఈ వనితకు భర్త అవుతాడు'- అని మీ ద్రుపదమహారాజు ఎంతో ఆలోచించి సులువైన నియమం చేశాడు.

**తే. అతని నియమించి నట్లు యయ్యంత్ర మేసి। యీతఁ డిక్కన్యఁ బడసె నుర్వీశు లొద్ద;**
**నేల మమ్ముఁ దా నెఱిఁగెడు? నెఱిఁగి యేమి। సేయువాఁ డింక మీ పతి సెప్పుమయ్య! 233**

**ప్రతిపదార్థం:** అతని, నియమించిన +అట్టుల+అ= అతనియొక్క నియమించినట్లుగ - అనగా అతడు చెప్పినట్లు; ఆ+యంత్రము; ఏసి= పడగొట్టి; ఈతఁడు; ఉర్వీ+ఈశుల+ఒద్దన్= రాజుల ఎదుట; ఈ+కన్యన్; పడసెన్= పొందాడు; మీ, పతి= మీ రాజు; ఏల= ఎందుకు; మమ్మున్= మమ్మల్ని; తాన్= తాను; ఎఱిఁగెడున్= తెలియగోరుతున్నాడు; ఇంకన్= ఇకపై; ఎఱిఁగి= తెలిసికొని; ఏమి, చేయువాఁడు= ఏమి చేయగలవాడు; చెప్పుము+అయ్య.

**తాత్పర్యం:** అతడు చెప్పినట్లే ఆ మత్స్యయంత్రాన్ని పడగొట్టి ఇత డీ కన్యను రాజు లందరి సమక్షంలో పొందాడు. ఇక మీ రాజు మమ్మల్ని తెలిసికొనటం యెందుకు? తెలిసికొని ఏం చేస్తాడు? చెప్పండి.

**క. బలహీనుఁ డైన వానికి । నలవియె? మోపెట్టి తివియ న క్కార్ముకముం;**
**గులహీనున కకృతాస్త్రున । కలవియె? యా లక్ష్యమేయ? నశ్రమలీలన్. 234**

**ప్రతిపదార్థం:** బలహీనుఁడు+ఐన, వానికిన్ = బలము లేనివానికి; ఆ+కార్ముకము= ఆ విల్లును; మోపెట్టి= ఎక్కుపెట్టి; తివియన్= లాగుట; అలవియె= శక్యమా; కులహీనునకున్= కులంతక్కువవానికి; అకృత+అస్త్రునకున్= నేర్వబడని అస్త్రములు కలవానికి - అంటే అస్త్రవిద్య తెలియనివానికి; ఆ, లక్ష్యము = ఆ గుఱిని; అశ్రమలీలన్= శ్రమలేని విలాసంతో; ఏయన్= కొట్టటం; అలవియే= సాధ్యమా!

**తాత్పర్యం:** ఆ విల్లును ఎక్కుపెట్టి లాగటం బలహీను డైనవానికి సాధ్యమౌతుందా? కులహీనుడికి, అస్త్రవిద్య నేర్వనివాడికి ఆ లక్ష్యాన్ని (మత్స్యయంత్రాన్ని) అనాయాసంగా కొట్టటం సాధ్య మౌతుందా?

### పాండవులు ద్రుపదమహారాజు గృహంబునకుఁ బోవుట (సం.1-185-25)

**వ. ' మీ రాజు మనోరథంబు సఫలం బయ్యె వగవ నేల?' యనిన ధర్మరాజుపలుకు విని పురోహితుండు వోయి ద్రుపదున కెఱింగించిన; ద్రుపదుండు ధృష్టద్యుమ్నుం జూచి 'చాతుర్వర్ణ్యోచితంబు లయిన రథంబులు గొనిపోయి వారల దోడ్కొని ర' మ్మని పంచిన వాఁడును నాక్షణంబ పాండవుల పాలికి వచ్చి 'యీరథంబు లెక్కి మారాజునొద్దకు రం' డనినఁ బాండవులు రాజయోగ్యంబు లయి రత్నాంచితంబు లయిన కాంచన రథంబు లెక్కి కుంతీదేవిని, ద్రౌపదిని నొక్కరథం బెక్కించి తోడ్కొని ధృష్టద్యుమ్నుతో ద్రుపదరాజనివేశంబున కరుగుదెంచునంత ద్రుపదుండును వారల కనేకవిధంబు లైన వస్తువు లతిప్రీతిం బుత్తెంచినఁ, బరార్ఘ్యంబు లైన యొండువస్తువులఁ బరిగ్రహింపక సాంగ్రామికంబు లైన యసిచర్మకార్ముకబాణతూణీరరథవరూథ వాజివారణ నివహంబులఁ బరిగ్రహించి తనయొద్దకు వచ్చువారి. 235**

**ప్రతిపదార్థం:** మీ, రాజు; మనోరథంబు= కోరిక; సఫలంబు+అయ్యెన్= సఫలం అయింది; వగవన్+ఏల= చింతించటం ఎందుకు; అనినన్= అనిఅనగా; ధర్మరాజు పలుకు; విని; పురోహితుండు; పోయి; ద్రుపదునకున్; ఎఱింగించినన్= తెలుపగా; ద్రుపదుండు= ద్రుపదుడు; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; చూచి= కాంచి; చాతుర్వర్ణ్య+ఉచితంబులు= నాలుగుజాతులవారికి తగినవి; అయిన= అయినటువంటి; రథంబులు; కొనిపోయి= తీసుకునివెళ్లి; వారలన్= వాళ్లను; తోడ్కొని= తీసికొని; రమ్ము+అని= రమ్ము అని; పంచినన్= ఆజ్ఞాపించగా; వాఁడునున్= ఆ ధృష్టద్యుమ్నుడుకూడా; ఆ, క్షణంబు+అ= ఆ క్షణమే; పాండవుల, పాలికిన్= పాండవుల దగ్గరకు; వచ్చి; ఈ, రథంబులు+ఎక్కి; మా, రాజు, ఒద్దకు; రండు; అనినన్; పాండవులు; రాజ యోగ్యంబులు+అయి= రాజులకు తగిన వై; రత్న+అంచితంబులు+అయిన= రత్నములచేత ఒప్పుచున్న వైన; కాంచన, రథంబులు= బంగారు తేరులు; ఎక్కి; కుంతీదేవిని; ద్రౌపదిని; ఒక్క, రథంబు= ఒక్క తేరుపై; ఎక్కించి= ఎక్కునట్లు చేసి; తోడ్కొని= తీసికొనివచ్చి; ధృష్టద్యుమ్నుతో; ద్రుపదరాజ= ద్రుపదరాజునియొక్క; నివేశంబునకున్= ద్రుపదమహారాజుయొక్క నివాసానికి; అరుగుదెంచున్+అంత= వస్తుండగా; ద్రుపదుండును= ద్రుపద మహారాజుకూడ; వారలకున్= వాళ్లకు; అనేక, విధంబులు+ఐన= అనేకరకాలైన; వస్తువులు= కానుకలైన పదార్థాలు; అతి, ప్రీతిన్= అమితమైన సంతోషంతో; పుత్తెంచినన్= పంపగా; పరార్ఘ్యంబులు+ఐన= శ్రేష్ఠము లైన; ఒండు, వస్తువులన్= ఇతర వస్తువులను; పరిగ్రహింపక=తీసుకొనక; సాంగ్రామికంబులు+ఐన= యుద్ధానికి సంబంధించిన వైన; అసి, చర్మ, కార్ముక, బాణ, తూణీర, రథ, వరూథ, వాజి, వారణ, నివహంబులన్= కత్తులయొక్క, డాలులయొక్క, విండ్లయొక్క, బాణాలయొక్క, అమ్ములపొదులయొక్క, రథాలయొక్క,

రథములమీది కప్పులయొక్క, గుఱ్ఱాలయొక్క, ఏనుగులయొక్క సమూహాలను; పరిగ్రహించి=తీసికొని; తన ఒద్దకు= తన దగ్గరకు; వచ్చువారిన్= వస్తూ ఉన్న పాండవులను.

**తాత్పర్యం:** 'మీ రాజుకోరిక సఫలమైనది. విచారించటం ఎందుకు? అని ధర్మరాజు పల్కగా విని, పురోహితుడు వెళ్ళి ద్రుపదునికి తెలియజేశాడు. అతడు ధృష్టద్యుమ్నుడిని చూచి, 'నాలుగుజాతులవాళ్ళకు ఉచితా లైన రథాలను తీసికొనివెళ్ళి, వాళ్ళను తోడ్కొని ర' మ్మని ఆజ్ఞాపించాడు. అతడు తత్క్షణమే పాండవులదగ్గరకి వెళ్ళి; 'ఈ రథా లెక్కి మా రాజు దగ్గరికి రండి' అని పల్కగా, వాళ్ళు రత్నాలు పొదిగినవి, రాజులకు తగినవి అయిన బంగారు రథాలెక్కి కుంతీదేవిని, ద్రౌపదిని ఒక రథంలో కూర్చోబెట్టి తోడ్కొని ధృష్టద్యుమ్నునితో గూడి ద్రుపదమహారాజు ఇంటికి వచ్చారు. అప్పుడు ద్రుపదుడు వాళ్ళకు అనేకవిధాలైన వస్తువులను మిక్కిలి ప్రేమతో పంపాడు. వాటిలో శ్రేష్ఠాలైన ఇతర వస్తువులను పరిగ్రహించక, యుద్ధసంబంధాలైన కత్తులు, డాలులు, ధనుస్సులు, బాణాలు, అమ్ముల పొదులు, రథాలు, రథంమీదికప్పులు, గుఱ్ఱాలు, ఏనుగులు - వీటి సమూహాలను మాత్రమే స్వీకరించారు. ఈ విధంగా స్వీకరించి తనదగ్గరకు వస్తున్న పాండవులను.

**విశేషం:** ధర్మరాజు గంభీరుడు; వాగ్మి; కార్యచతురుడు అని ఈ ఘట్టం నిరూపిస్తున్నది. తననుగురించి సాటివాడైన ద్రుపదరాజుకే చెప్పుతాడు కాని ఇతరులకు చెప్పని ఆత్మాభిమాని. 'మీరాజు పెద్దగా ఆలోచించి ఈ చిన్న నియమాన్ని పెట్టా' డని తన ఔన్నత్యాన్ని తెలిపాడు. నియమమే ముఖ్య మన్నాడు. కాని ద్రుపదుడు ఇతర వివరాలను ప్రకటించలేదుకదా. నియమం ప్రకారం ద్రౌపదిని గెలుచుకొన్న తరువాత వివరాలను గురించి విచారించి దుఃఖించటం ఎందుకని పలికి వివేకాన్ని ప్రదర్శించాడు. అంతటి బలపరాక్రమాలను ప్రదర్శించినవాళ్ళు సామాన్యులు కా రని తెలిసికొనటం సులభమేకదా? అని విజ్ఞత ప్రదర్శించాడు. చివరకు ముక్తాయింపుగా 'మీ రాజుమనోరథం సఫలం అయ్యింది. ఇంకా చింతించడం దేనికి'? అని అన్నాడు. ఈ వాక్యం ధర్మరాజు నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నది. పైకి చూస్తే అనుకొన్నట్లుగా మత్స్యయంత్రం భేదించి కన్యను వివాహమాడ గలిగిన వరుడు దొరికాడు. ద్రుపదునికోరిక తీరిం దని భావం. లో నారసి చూస్తే 'అర్జునునికే ద్రౌపది నిద్దా మని ద్రుపదుని మనోరథంకదా! అది తీరింది. ఇంకా విచారమెందుకు? అని రమణీయార్థం. ఈ రెండర్థాలలో ధర్మజుని అంతరార్థాన్ని తెలుసుకుందా మని ద్రుపదుడు రథాలను పంపాడు. వివిధ వస్తువులను కానుకలుగా పంపాడు. ధర్మజుడు తాము బ్రాహ్మణులం కా మని, సుక్షత్రియుల మని తమ చర్యలద్వారా వ్యక్తం చేశాడు. వస్తుధ్వని సహజంగా పండిన కథాశిల్పక్షేత్రం ఈ ఘట్టం. (సంపా.)

**సీ.** **అజినోత్తరీయుల నతిసంభృత బ్రహ్మ । తేజుల సముదితాదిత్యసముల**
**నాజానులంబి మహాబాహుపరిఘుల । నత్యున్నతాంసుల నతివిశాల**
**వక్షుల నవిరళవ్యాయామ దృఢ కటి । నాంగుల వృషభాక్షు లయిన వారిఁ**
**బాండుకుమారుల భరతవంశేశులఁ । జూచి సుతభ్రాతృ సుహృదమాత్య**

**ఆ.** **బంధుజనులతోడఁ బరమవిద్వన్మహీ । సురగణంబుతోడ సోమకుండు**
**గరము సంతసిల్లె ఘనుల నత్యుత్తమ । క్షత్త్రవంశవరులఁ గా నెఱింగి.** **236**

**ప్రతిపదార్థం:** అజిన+ఉత్తరీయులన్= జింకచర్మం పైగుడ్డగా కలవాళ్ళను; అతి, సంభృత, బ్రహ్మ, తేజులన్= మిక్కిలిగా భరించబడిన బ్రహ్మతేజస్సు కలవాళ్ళను; సముదిత+ఆదిత్య, సములన్= ఉదయించిన సూర్యుడితో సమానమైనవాళ్ళను;

ఆజాను, లంబి, మహాబాహు; పరిఘులన్= మోకాలివరకు వ్రేలాడుతున్న ఇనుపగుదియలవంటి పెద్దబాహువులు కలవాళ్ళను; అతి+ఉన్నత+అంసులన్= మిక్కిలి ఎత్తైన భుజశిఖరాలు కలవాళ్ళను; అతి, విశాల, వక్షులన్= మిక్కిలి వెడ ల్పయిన రొమ్ములు కల వాళ్ళను; అవిరళ, వ్యాయామ, దృఢ, కఠిన+అంగులన్= ఎడతెగని వ్యాయామంచేత గట్టిపడి కఠినా లైన అవయవాలు కలవాళ్ళను; వృషభ+అక్షులు+అయిన, వారిన్= ఆబోతు కన్నులవంటి కన్నులు కలవాళ్ళను; భరత వంశ+ఈశులన్= భరతవంశరాజులను; ఘనులన్= గొప్పవాళ్ళను; పాండు, కుమారులన్= పాండవులను; చూచి= కనుగొని; సోమకుండు= ద్రుపదుడు; అతి+ఉత్తమ, క్షత్త్ర, వంశ, వరులన్+కాన్= మిక్కిలి శ్రేష్ఠమైన క్షత్రియవంశమందు పుట్టిన శ్రేష్ఠులుగా; ఎఱింగి= తెలిసికొని; సుత, భ్రాతృ, సుహృత్+అమాత్య, బంధుజనుల తోడన్= కొడుకులతో; తమ్ములతో, స్నేహితులతో, మంత్రులతో, బంధువులతో; పరమ, విద్వత్+మహీసుర, గణంబుతోడ= గొప్పవిద్వాంసు లైన బ్రాహ్మణసమూహంతో; కరము= మిక్కిలి; సంతసిల్లెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** జింకచర్మం ఉత్తరీయంగా కలవాళ్ళు, అత్యధికమైన బ్రహ్మతేజస్సు కలవాళ్ళు, ఉదయించిన సూర్యుడితో సమానులైనవాళ్ళు, మోకాలివరకు వ్రేలాడే ఇనుపగడియలవంటిచేతులు కలవాళ్ళు; మిక్కిలి ఎత్తైన భుజశిఖరాలు కలవాళ్ళు, అతివిశాలమైన వక్షఃస్థలం కలవాళ్ళు, ఎడతెగని వ్యాయామంతో గట్టిపడి, కఠినమైన అవయవాలు కలవాళ్ళు, ఆబోతుకన్నులవంటికన్నులు కలవాళ్ళు, భరతవంశరాజులు, ఘనులు అయిన పాండుకుమారులను చూచి, వాళ్ళు అత్యుత్తమక్షత్రియవంశశ్రేష్ఠు లని తెలిసికొని - పుత్రులతో, తమ్ములతో, మిత్రులతో, మంత్రులతో, బంధువులతో, మహావిద్వాంసులైన బ్రాహ్మణసమూహాలతో కలిసి ద్రుపదుడు మిక్కిలి సంతోషించాడు.

**విశేషం:** ఆబోతుకన్నులు గుండ్రంగా-ఎర్రగా అందంగా ఉంటాయి. పాండవులకన్నులు అంత పౌరుషవంతంగా, అందంగా ఉన్నాయి.

**వ. 'మఱియుం దనయొద్దకు వచ్చి యశంకితు లయి క్షత్త్రియోచితంబు లైన మహార్హాసనంబుల నున్నవారల రాజపుత్త్రులంగా నెఱింగియు, సంశయాపనోదనపరుండై ధర్మతనయునకు ద్రుపదుం డి ట్లనియె 'నయ్యా! మీరు క్షత్త్రియులరో బ్రాహ్మణులరో మాయావు లయి క్రుమ్మరుచున్న మంత్రసిద్ధులరో కాక కృష్ణాపరిగ్రహణార్థంబు దివంబున నుండి వచ్చిన దివ్యులరో యెఱుంగము; మాకు సందేహం బయి యున్నయది; మీ కలరూ పెఱింగి కాని యిక్కన్య వివాహంబు సేయనేర' మనిన ద్రుపదునకు ధర్మతనయుం డి ట్లనియె. 237**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకనూ; తన, ఒద్దకు వచ్చి= తన కడకు వచ్చి; అశంకితులు+అయి= జంకులేనివాళ్ళయి; క్షత్రియ+ఉచితంబులు+ఐన= రాజులకు తగినవైన; మహా+అర్హ+ఆసనంబులన్= ఉత్తమా లైన ఆసనములందు; ఉన్న= ఉండేవాళ్ళను; రాజపుత్త్రులన్, కాన్= రాజకుమారులుగా; ఎఱింగియు= తెలిసికొనియు; సంశయ+అపనోదన, పరుండు+ఐ= సందేహాన్ని తీర్చుకొనటమే ప్రధానంగా కలవా డై; ధర్మ, తనయునకున్= ధర్మరాజునకు; ద్రుపదుండు; ఇట్లు+అనియెన్; అయ్యా; మీరు= తమరు; క్షత్రియులరో= రాజులో; బ్రాహ్మణులరో= బ్రాహ్మణులో; మాయావులు+అయి= మాయచేయువా ళ్ళయి; క్రుమ్మరుచున్న= తిరుగుచున్న; మంత్ర, సిద్ధులరో = మంత్రసిద్ధి కలవారో; కాక; కృష్ణా, పరిగ్రహణ+అర్థంబు= కృష్ణను (ద్రౌపది) పెండ్లాడటం కొరకు; దివంబున నుండి= స్వర్గం నుండి; వచ్చిన= విచ్చేసిన; దివ్యులరో= దేవతలో; ఎఱుంగము; మాకున్= మాకు; సందేహంబు+అయి+ఉన్న+అది= సంశయం కలిగి ఉన్నది; అది; మీ, కలరూపు= మీ నిజరూపం; ఎఱింగి= గ్రహించి; కాని= తప్ప; వివాహంబు= పెండ్లి; చేయనేరము= చేయజాలము; అనిన= అని అనగా; ద్రుపదునకున్= ద్రుపదమహారాజుకు; ధర్మతనయుండు= ధర్మజుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అంతేకాక, తన దగ్గరికి వచ్చి జంకులేక క్షత్రియులకు తగిన ఉన్నతాసనాలపై కూర్చొన్న పాండవులను-రాజపుత్రులుగా తెలిసికొన్నప్పటికి, సందేహం తీర్చుకొనా లని ద్రుపదుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు - 'అయ్యా! మీరు క్షత్రియులో? బ్రాహ్మణులో? మాయావు లై తిరుగుతున్న మంత్రసిద్ధులో? లేక ద్రౌపదిని వివాహ మాడటానికి దేవలోకంనుండి దిగివచ్చిన దేవతలో? తెలియడంలేదు. మాకు సందేహంగా ఉన్నది. మీ నిజస్థితి తెలిసికొని కాని ఈ కన్యకు వివాహం చేయలేము' అని ద్రుపదుడు పల్కగా అతనితో ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**క. క్షత్రియులము, పాండుప్రియ । పుత్త్రుల; మే నగ్రజుండ, భూనుతులు మరు**
**త్పుత్త్రార్జునయము లమల చ । రిత్రులు నలువురును వీ రరిందము లెందున్. 238**

**ప్రతిపదార్థం:** క్షత్రియులము, పాండు, ప్రియపుత్త్రులము= క్షత్రియులము, పాండురాజుయొక్క ప్రియమైన కుమారులం; ఏన్= నేను; అగ్రజుండు+అ= ముందుపుట్టినవాడను; భూ, నుతులు= భూమియందు కొనియాడబడినవాళ్ళు; మరుత్+ పుత్త్ర+అర్జున, యములు= వాయుపుత్త్రుడైన భీముడు, అర్జునుడు, కవ లైన నకులసహదేవులు; వీరు; నలువురును; అమల, చరిత్రులు= నిర్మలమైన నడవడి కలవాళ్ళు; ఎందున్= ఎక్కడైన; అరిందములు= శత్రువులను జయించేవాళ్ళు.

**తాత్పర్యం:** మేము క్షత్రియులం. పాండురాజు ప్రియపుత్రులం. నేను పెద్దవాడను. లోకంకొనియాడే భీమార్జున నకులసహదేవు లైన వీళ్ళు నలుగురు నిర్మలమైన నడవడి కలవాళ్ళు. ఎక్కడైనా శత్రువులను జయించగలవాళ్ళు.

**వ. 'వీరు కుంతీమహాదేవు' లని తన్నునుం దమ్ములనుం దల్లిని నెఱింగించిన, ద్రుపదుం డతిహర్షరసావేశపరవశుం డయి పెద్దయుం బ్రొద్దునకుఁ దెలిసి, యానందజలభరితనయనుం డగుచు 'నా పుణ్యంబున లాక్షాగృహదాహం బువలన విముక్తుల రయితి' రని సంతసిల్లి తద్వృత్తాంతం బంతయు ధర్మతనయునివలన విని, ధృతరాష్ట్ర దుర్యోధనుల నిందించి, సామప్రియభాషణంబుల నభీష్టసత్కారంబులను వారిం బూజించి, యొక్కనాఁడు పుత్త్రమిత్త్రామాత్య బాంధవబ్రాహ్మణపరివృతుం డయి ద్రుపదుండు సుఖాసీను లయి యున్న పాండవుల కి ట్లనియె. 239**

**ప్రతిపదార్థం:** వీరు, కుంతీమహాదేవులు= కుంతీమహాదేవిగారు; అని= అని; తన్నునున్= తనను; తమ్ములనున్= తమ్ముళ్లను; తల్లినిన్= తల్లిని; ఎఱింగించినన్= తెలుపగా; ద్రుపదుండు; అతి, హర్ష, రస+ఆవేశ, పరవశుండు+అయి= మిక్కిలి ఆనంద రసముయొక్క కూడికచే మైమరచినవాడై; పెద్దయున్+ప్రొద్దునకున్, తెలిసి; ఆనంద, జల, భరిత, నయనుండు+అగుచున్= సంతోషంచేత కలిగిన కన్నీటితో నిండిన కన్నులు కలవాడౌతూ; నా, పుణ్యంబునన్= నా అదృష్టంవలన; లాక్షా, గృహ, దాహంబువలనన్= లక్కఇంటి నిప్పునుండి; విముక్తులరు= బయటపడినవారు; అయితిరి= అయినారు; అని=అని; సంతసిల్లి= సంతోషించి; తద్+వృత్తాంతంబు= ఆ కథను; అంతయున్= అంతా; ధర్మతనయునివలనన్= ధర్మరాజువల్ల; విని; ధృతరాష్ట్రుని, దుర్యోధనుల= ధృతరాష్ట్ర, దుర్యోధనుని; నిందించి= తూలనాడి; సామ, ప్రియ భాషణంబులన్= మంచిఇష్టమైన మాటలతో; అభీష్ట, సత్కారంబులను= మిక్కిలిప్రియాలైన సమ్మానాలచేత; వారిన్, పూజించి; ఒక్కనాఁడు= ఒకనాడు; పుత్త్ర, మిత్ర+అమాత్య, బాంధవ, బ్రాహ్మణ, పరివృతుండు+అయి= పుత్త్రులతో, మిత్రులతో, మంత్రులతో, బంధువులతో, బ్రాహ్మణులతో చుట్టబడినవాడై; ద్రుపదుండు= ద్రుపదమహారాజు; సుఖ+ఆసీనులు+అయి= సుఖంగా కూర్చున్న వాళ్ళయి; ఉన్నన్= ఉండగా; పాండవులకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'వీరు కుంతీమహాదేవులు' అని తనను, తమ్ములను, తల్లిని తెలియజేయగా - ద్రుపదుడు - అత్యధిక సంతోష రసావేశంలో మైమరచి, చాలాసేపటికి తేరుకుని, ఆనందబాష్పాలతో నిండిన కళ్ళతో 'నా పుణ్యం వలన లాక్షాగృహదహనంనుండి మీరు తప్పించుకొన్నారు' అని సంతోషించి, ఆ కథనంతా ధర్మరాజువలన విని, ధృతరాష్ట్రదుర్యోధనులను నిందించి, ఇంపైన మాటలతో, ఇష్టమైనసమ్మానాలతో వాళ్ళను పూజించాడు. తరువాత ఒకరోజు పుత్రులతో, మిత్రులతో, మంత్రులతో, బంధువులతో, బ్రాహ్మణులతో కూడి ద్రుపదుడు సుఖాసీను లై ఉన్న పాండవులతో ఇట్లా అన్నాడు.

**క. సుత్రామపుత్త్రుఁ డభిజన । పాత్రుండు, విచిత్ర వీర్యపౌత్త్రుఁడు, శుభ చా**
**రిత్రుం డీ విజయుఁడు మ । త్పుత్రికి వరుఁ డయ్యె నెట్టి పుణ్యోదయమో! 240**

**ప్రతిపదార్థం:** సుత్రామ, పుత్త్రుఁడు= ఇంద్రునియొక్క కుమారుడు; అభిజన, పాత్రుండు= వంశానికి తగినవాడు; విచిత్రవీర్య, పౌత్త్రుండు= విచిత్రవీర్యుని మనుమడు; శుభ, చారిత్రుండు= మంచి నడవడి కలవాడు; ఈ, విజయుఁడు= ఈ అర్జునుడు; మత్+పుత్రికి= నా యొక్క కూతురికి; వరుఁడు+అయ్యెన్= భర్త అయ్యాడు; ఎట్టి, పుణ్య+ఉదయమో= ఎంతటి పుణ్యముయొక్క అతిశయమో.

**తాత్పర్యం:** ఇంద్రునికుమారుడు, జన్మించిన వంశానికి తగినవాడు, విచిత్రవీర్యుని మనుమడు, మంచినడవడి కలవాడు అయిన ఈ అర్జునుడు నాకుమార్తెకు భర్త అయ్యాడు. నా భాగ్య మేమన గలను?

**వ. 'స్వయంవర లబ్ధ యయిన యి క్కన్యక నర్జునుండు ధర్మవిధిం బాణిగ్రహణంబు సేయువాఁ' డనిన ద్రుపదునకు ధర్మతనయుం డి ట్లనియె; 'నది యె? ట్లేను వివాహం బైనఁ బదంపడి భీమసేనుండు వివాహం బయిన మఱి యర్జునుండు వివాహం బగుఁగాక! ముంద రర్జునునకుఁ బాణిగ్రహణంబు సేయ నె ట్లగు?' ననిన ద్రుపదుండు ధర్మతనయున కి ట్లనియె. 241**

**ప్రతిపదార్థం:** స్వయంవర, లబ్ధ+అయిన= స్వయంవరమునందు పొందబడిన దైన; ఈ+కన్యకన్; అర్జునుండు; ధర్మవిధిన్= ధర్మప్రకారంగా; పాణిగ్రహణంబు, చేయువాఁడు= పెండ్లిచేసికొంటాడు; అనినన్= అని అనగా; ద్రుపదునకున్= ద్రుపదునితో; ధర్మతనయుండు; ఇట్లు+అనియెన్; అది, ఎట్లు= అది ఏ విధంగా!; ఏను= నేను; వివాహంబు+ఐనన్= పెళ్ళి చేసుకొంటే; పదంపడి= తరువాత; భీమసేనుండు; వివాహంబు+అయిన= వివాహం కాగా; మఱి= అటుపై; అర్జునుండు; వివాహంబు+ అగున్+కాక; పెండ్లాడతాడు కాని; ముందర= ముందుగా; అర్జుననకున్= అర్జునునికి; పాణిగ్రహణంబు= పెండ్లి; చేయన్= చేయుట; ఎట్లు+అగున్= ఏ విధంగా అవుతుంది; అనినన్= అని అనగా; ద్రుపదుండు; ధర్మతనయునకున్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'స్వయంవరంలో లభించిన ఈ కన్యకను అర్జునుడు ధర్మపద్ధతిలో వివాహం చేసికొంటాడు' అని ద్రుపదుడు పల్కగా; ధర్మరాజు ఇట్లా అన్నాడు ' అదెలా వీలవుతుంది? నేను పెళ్లాడిన తర్వాత భీమసేనుడు పెళ్లాడతాడు. తరువాత అర్జునుడు. ముందుగానే అర్జునుడు పెళ్లాడటం ఎట్లా జరుగుతుంది? అనగా ద్రుపదుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**తే. 'అట్ల యగునేని యిక్కన్య నభిమతముగ । వసుమతీనాథ । నీవ వివాహ మగుము;**
**ధర్మమార్గ మెవ్వరికిని దప్ప నగునె?' । యనిన నాతని కనియె ధర్మాత్మజుండు. 242**

**ప్రతిపదార్థం:** అట్లు+అ= ఆ విధంగానే; అగున్=ఏని= అయ్యే పక్షంలో; ఈ+కన్యన్= ఈ కన్నెను; వసుమతీనాథ= ఓ రాజా; నీవు+అ= నీవే; అభిమతముగన్= ఇష్టముగా; వివాహము+అగుము= పెండ్లిచేసుకో; ధర్మ, మార్గము= ధర్మమార్గాన్ని; ఎవ్వరికిన్= ఎవ్వరికైనను; తప్పన్+అగునె= తప్పవచ్చునా; అనినన్= అని అనగా; ధర్మ+ఆత్మజుండు= ధర్మరాజు; అతనికిన్, అనియెన్= ఆ ద్రుపదునితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'అట్లయితే ఓ రాజా! నీ ఇష్టప్రకారం ఈ కన్యను నీవే వివాహం చేసికొమ్ము. ధర్మమార్గం ఎవరూ తప్పరాదు కదా!' అని ద్రుపదుడు చెప్పగా, ధర్మరాజు అతనితో ఇట్లా అన్నాడు.

**వ. 'ఏన కా, దిక్కన్యక నే మేవురము వివాహం బయ్యెద; మస్మన్మాతృ నియోగం బిట్టిద; యది మాకు నలంఘనీయం' బనిన విని విస్మితుం డై ద్రుపదుం డి ట్లనియె. 243**

**ప్రతిపదార్థం:** ఏను+అ= నేనొక్కడినే; కాదు= కాదు; ఈ+కన్యకన్= ఈ కన్నెను; ఏము= మేము; ఏవురము= ఐదుగురం; వివాహంబు+అయ్యెదము= పెండ్లి చేసుకొంటాము; అస్మద్+మాతృ, నియోగంబు+ఇట్టిది+అ= మాతల్లి ఆజ్ఞ ఇట్టిదై ఉన్నది; అది= ఆ ఆజ్ఞ; మాకున్= మాకు; అలంఘనీయంబు= దాటరానిది; అనినన్= అని తెల్పగా; విని= ఆలకించి; విస్మితుండు+ఐ= ఆశ్చర్యపడినవా డై; ద్రుపదుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నేనే కాదు. ఈ కన్యను మే మైదుగురం వివాహం చేసికొంటాము. ఇదే మా తల్లి ఆజ్ఞ. అది మాకు దాటరానిది' అనగా విని ద్రుపదుడు ఆశ్చర్యపడి ఇట్లా అన్నాడు.

**క. ఒక్క పురుషునకు భార్యలు । పెక్కం డ్రగు టెందుఁ గలదు; పెక్కండ్రకు నా**
**లొక్కత యగు టే యుగముల । నెక్కథలను వినియు నెఱుఁగ మెవ్వరివలనన్. 244**

**ప్రతిపదార్థం:** ఒక్క, పురుషునకున్; భార్యలు; పెక్కండ్రు= అనేకులు; అగుట= కావటం; ఎందున్= ఎక్కడ; కలదు= ఉన్నది; పెక్కండ్రకున్= పలువురికి; ఆలు= భార్య, ఒక్కతి+అ= ఒక్కతయే; అగుట= కావటం; ఏయుగములన్, ఏ+కథలను, ఎవ్వరి వలనన్, వినియున్, ఎఱుంగము= ఏ యుగాలలో, ఏ కథలలో, ఎవరివల్ల వినికూడా తెలియము,

**తాత్పర్యం:** ఒక్కమగవానికి పెక్కుమంది భార్య లుండటం ఎక్కడైనా ఉన్నది. కాని పెక్కుమంది మగవాళ్ళకి ఒక్కతే భార్యకావటం ఏ యుగాలలోను, ఏ కథలలోను, ఎవ్వరివలనా విని ఎరుగం.

**వ. 'నీవు లౌకిక వైదిక ధర్మస్వరూప విదుండవు ధర్మాత్మజుండవు; నీ పలుకులు ధర్మవిరుద్ధంబులు నా నోడుదు; మయినను లోకంబున నిది యశ్రుతపూర్వంబు; దీని నింక నీవును నేనును గుంతీదేవియును ధృష్టద్యుమ్నుండును విచారించి యెల్లి నిశ్చయింత' మని. 245**

**ప్రతిపదార్థం:** నీవు; లౌకిక, వైదిక, ధర్మ, స్వరూప, విదుండవు= లోకసంబంధమైన, వేదసంబంధమైన, ధర్మస్వరూపాన్ని తెలిసిన వాడవు; ధర్మ+ఆత్మజుండవు= ధర్మదేవతయొక్క కుమారుడవు; నీ పలుకులు; ధర్మ, విరుద్ధంబులు= ధర్మానికి

వ్యతిరేకమైనవి; నాన్= అని అనటానికి; ఓడుదుము= భయపడతాము; అయినను; లోకంబునన్= లోకంలో; ఇది, అశ్రుత, పూర్వంబు= మున్నెన్నడు వినబడనట్టిది; దీనిన్= దీన్ని; ఇంక= ఇంకనూ; నీవును= నీవు; నేనును= నేను; కుంతీదేవియును= కుంతీదేవి; ధృష్టద్యుమ్నుండును; విచారించి= ఆలోచించి; ఎల్లి= రేపు; నిశ్చయించుదము= నిర్ణయిద్దాం; అని.

**తాత్పర్యం:** 'నీవు లోక సంబంధమైన, వేదసంబంధమైన ధర్మస్వరూపం తెలిసినవాడవు, ధర్ముని కుమారుడవు. నీ మాటలు ధర్మవిరుద్ధా లని అనటానికి వెనుకాడుతాము. అయినా ఇది లోకంలో ముం దెన్నడు విననట్టిది. దీనిని గురించి నీవు, నేను, కుంతీదేవి, ధృష్టద్యుమ్నుడు మరింత ఆలోచించి రేపు నిర్ణయిద్దాం' అని.

## వ్యాసమహాముని ద్రుపదునియొద్దకు వచ్చుట (సం.1-186-38)

**ఉ. ఈహితకార్యసిద్ధి యిది యెట్లొకొ తా సమకూరు నంచు సం**
**దేహముఁ బొంది సోమక యుధిష్ఠిరు లున్నఁ, దదీయధర్మసం**
**దేహనివృత్తిపొంటెఁ జనుదెంచెఁ బరాశరసూనుఁ డాత్మతే**
**జోహృతసూర్యతేజుఁ డగుచున్ దిశలెల్ల వెలుంగుచుండఁగన్. 246**

**ప్రతిపదార్థం:** ఈహిత, కార్యసిద్ధి= కోరుకొన్న కార్యం నెఱవేరటం; ఇది; ఎట్లు+ఒకొ= ఇది ఏ విధంగా; తా= తాను; సమకూరున్= నెఱవేరుతుంది; అనుచున్; సందేహమున్; పొంది; సోమక, యుధిష్ఠిరులు= ద్రుపద, ధర్మజులు; ఉన్నన్= ఉండగా; తదీయ, ధర్మ,సందేహ, నివృత్తిపొంటెన్= వాళ్ళయొక్క ధర్మసందేహాన్ని నివారించటంకొరకు; పరాశర, సూనుఁడు= పరాశరుని కుమారు డైన వ్యాసుడు; ఆత్మ, తేజోహృత, సూర్యతేజుఁడు= తన తేజస్సుచేత అణచబడిన సూర్యతేజస్సు కలవాడు; అగుచున్= అవుతూ; దిశలు+ఎల్లన్, వెలుంగుచుండఁగన్= దిక్కులు అన్నీ వెలుగుతూ ఉండగా; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** కోరుకొన్న కార్యం నెరవేరటం ఎట్లా అని ద్రుపద ధర్మజులు సందేహపడుతూ ఉండగా, వాళ్ళ ధర్మ సందేహాన్ని నివారించటానికై వ్యాసమహాముని - సూర్యతేజస్సును అణచే తన తేజస్సుతో దిక్కులన్నీ వెలుగుతుండగా అక్కడికి వచ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ. కొఱకు - అనే అర్థంలో నన్నయనా డున్న 'పొంటెన్' అనే చతుర్థీవిభక్తిప్రత్యయం ఈనాటి తెలుగుభాషలో లేదు.

**వ. ఇట్లు వచ్చిన కృష్ణద్వైపాయనునకుఁ గుంతీదేవియుఁ బాండవులును బాంచాలుండు నతిభక్తి మ్రొక్కి యమ్మహామునిం గాంచనమణిమయోచ్చాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యున్న వారల కుశలం బడిగి హిత మధురసత్యసంభాషణామృతరసప్రవాహసందోహంబున నందఱం బరమానందహృదయులం జేసియున్న యమ్మునీంద్రునకు ముకుళితకరకమలుండయి ద్రుపదుం డి ట్లనియె. 247**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వచ్చిన; కృష్ణద్వైపాయనునకున్= వ్యాసునికి; కుంతీదేవియున్; పాండవులును; పాంచాలుండున్= ద్రుపదుడును; అతి=మిక్కిలి; భక్తిన్= భక్తితో; మ్రొక్కి; ఆ+మహామునిన్= ఆమహర్షిని; కాంచన, మణిమయ+ ఉచ్చ+ ఆసనంబునన్= బంగారుతో, మణులతో చేయబడిన ఎత్తైన ఆసనంమీద; ఉనిచి= కూర్చుండబెట్టి; అర్ఘ్య, పాద్య+ఆది,

విధులన్= అర్ఘ్యం, పాద్యం మొదలైన పూజాపద్ధతులచేత; పూజించి= సేవించి; ఉన్నన్= ఉండగా; వారల= వాళ్ల; కుశలంబు= క్షేమాన్ని; అడిగి= అడిగి; హిత, మధుర, సత్య, సంభాషణ+అమృత, రస, ప్రవాహ, సందోహంబునన్= మేలు చేయునది, మనస్సుకు హాయి కొలుపునది, సత్యమైనది అయిన సంభాషణ మనెడి అమృతరస ప్రవాహాల సమూహాలచేత; అందఱన్= అందరినీ; పరమ+ఆనంద, హృదయులన్= మిక్కిలి ఆనందించిన మనస్సులు కలవాళ్ళనుగా; చేసి= కావించి; ఉన్న= ఉండు; ఆ+మునీంద్రునకున్= ఆ మునిశ్రేష్ఠునికి; ముకుళిత, కర, కమలుండు+అయి= ముడిచిన కమలములవంటి చేతులు కలవాడై; ద్రుపదుండు= ద్రుపదమహారాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా వచ్చిన వేదవ్యాసునికి కుంతీదేవి, పాండవులు, ద్రుపదుడు మిక్కిలి భక్తితో నమస్కరించారు. బంగారుతో, మణులతో చేసిన ఎత్తైన ఆసనంమీద ఆ మహామునిని కూర్చుండబెట్టారు. అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించారు. ఆ మహాముని వాళ్ళను కుశల మడిగి, మనస్సుకు హాయి కలిగించే, సత్య సంభాషణ అనే అమృతరససమూహంలో అందరు పరమానందహృదయు లయ్యేటట్లు చేశాడు. అప్పుడు ద్రుపదుడు తనకరకమలాలను జోడించి నమస్కరిస్తూ ఇట్లా అన్నాడు.

**క. తన పలుకు లోక మెల్లను । గొనియాడఁగఁ దగిన లోకగురుఁ డీ యమనం**
**దనుఁ డే మేవురమును నీ । తనుమధ్య వివాహ మయ్యెదము నని పలికెన్. 248**

**ప్రతిపదార్థం:** తన పలుకు= తనమాట; లోకము+ఎల్లను= లోకం అంతా; కొనియాడఁగన్= మెచ్చుటకు; తగిన= యోగ్యుడైన; లోకగురుఁడు= లోకానికి ఆచార్యుడు; ఈ, యమనందనుఁడు= ఈ ధర్మరాజు; ఏము= మేము; ఏవురమును= ఐదుగురమును; ఈ, తనుమధ్యన్= ఈ సన్నని నడుము కల దానిని - ద్రౌపదిని; వివాహము= పెండ్లి; అయ్యెదము= చేసుకుంటాము; అని, పలికెన్.

**తాత్పర్యం:** లోకమంతా మెచ్చుకొనదగిన మాట కలవాడు, లోకగురుడు అయిన ఈ ధర్మరాజు 'మే మైదుగురమూ ఈ ద్రౌపదిని వివాహం చేసికొంటాము' అని అన్నాడు.

**క. మీ రెఱుఁగనట్టి లోకా । చారము గలదయ్య? తొల్లి చన్న మహాత్ముల్**
**ధీరమతు లిట్లు సేసిన । వా రెవ్వరుఁ గలరె యాప్తవచనానుమతిన్. 249**

**ప్రతిపదార్థం:** మీరు; ఎఱుఁగని అట్టి= తెలియనటువంటి; లోక+ఆచారము కలదయ్య?;= లోకాచారం ఉన్నదా? తొల్లి= పూర్వం; చన్న= గతించిన; మహాత్ముల్= పెద్దలు; ధీర, మతులు= గొప్పబుద్ధి కలవారు; ఆప్త, వచన+అనుమతిన్= పెద్దల మాట సమ్మతిచేత; ఇట్లు= ఈ విధంగా; చేసినవారు; ఎవ్వరున్= ఎవరైనా; కలరె?= ఉన్నారా!

**తాత్పర్యం:** మీకు తెలియని లోకాచారం లేదు. పూర్వం గతించిన మహాత్ములు, ధీరమతులు ఎవరైనా పెద్దల సమ్మతితో ఇట్లా చేసినవారు ఉన్నారా?

**క. విమలమతి యన్యులకు విష । యమె ధర్మాధర్మనిర్ణయము సేయఁగ ది**
**వ్యమునీంద్ర । దీని సువిచా । రము సేయుము ధర్మసంకరము గాకుండన్. 250**

**ప్రతిపదార్థం:** దివ్య, ముని+ఇంద్ర=మునీంద్రా; విమలమతి= నిర్మలమైన బుద్ధి కలవాడా!; ధర్మ+అధర్మ, నిర్ణయము= ధర్మా ధర్మములను గూర్చిన నిర్ణయం; చేయఁగన్= చేయటానికి; అన్యులకున్= ఇతరులకు; విషయమె= సాధ్యమా?; ధర్మ, సంకరము= ఇది ధర్మం, ఇది కాదు అని తెలియని సంకటస్థితి; కాక, ఉండన్= ఏర్పడకుండ ఉండేటట్లు; దీనిన్= దీన్ని; సువిచారము= చక్కని విమర్శ; చేయుము.

**తాత్పర్యం:** దివ్యమునీంద్రా! నిర్మలమైన బుద్ధి కలవాడా! ధర్మాధర్మనిర్ణయం చేయటం ఇతరు లెవ్వరికీ సాధ్యం కాదు. ధర్మసంకరం ఏర్పడకుండా మీరే దీనిని ఆలోచించండి.

**విశేషం:** ద్రుపదుడు వ్యాసునితో ఇట్లా అనటం ధర్మరాజు ధార్మికతను శంకించి కాదు, చిన్నచూపు చూచీ కాదు, విచిత్రము, అసహజము, అశ్రుతపూర్వము అయిన ఆచారాన్ని జీర్ణించుకోలేక. ధర్మరాజు ధార్మికతను ముందే మనసారా అంగీకరించాడు ద్రుపదుడు. (చూ.ప.245) కాని ధర్మరాజు చెప్పేది - ఏ ఆడపిల్ల తండ్రి అయినా అన్నివిధాల ఆలోచించి, మనః స్ఫూర్తిగా చేయవలసిన పని. అంతేకాదు - ధార్మికదృష్టితో చూస్తే, ఇది సామాన్యమైన విషయం కాదు. లోకధర్మానికి, వ్యక్తి ధర్మానికి ఏర్పడిన సంఘర్షణ. అందువలన ఈ విషయంలో సువిచారం చాలా అవసరం. అందుకే ద్రుపదుడు ధర్మజుని ధార్మికతమీద ఎంతగౌరవం ఉన్నా త్వరపడి నిర్ణయం తీసికొనక, నీవూ, నేనూ, కుంతీదేవీ, ధృష్టద్యుమ్నుడూ విచారించి రేపు నిర్ణయిద్దాం' అన్నాడు. ఇంతలో అర్థించకుండానే విజ్ఞానసంపద్విఖ్యాతుడు, సంయమిప్రకరసంభావ్యానుభావుడు వేదవ్యాస మహామునీంద్రుడు వచ్చాడు. ద్రుపదుడు తన మనస్సును ఊగిసలాడించే అనుమానాన్ని ఆయన ముందుంచాడు. అంతే.

**వ. అనిన నా ద్రుపదునకుఁ గృష్ణద్వైపాయను సమక్షంబున ధర్మజుం డి ట్లనియె. 251**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ, ద్రుపదునకున్= ఆ ద్రుపదునికి; కృష్ణద్వైపాయను, సమక్షంబునన్= వ్యాసుని ఎదుట; ధర్మజుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని అనగా ఆ ద్రుపదునితో వ్యాసునిఎదుట ధర్మరాజు ఈ విధంగా పలికాడు.

**చ. నగియును బొంకునందు వచనంబు, నధర్మువునందుఁ జిత్తముం**
**దగులదు నాకు నెన్నఁడును; ధర్ము వవశ్యము; నట్ల కావునన్**
**వగవక మాకు నేవురకు వారిజలోచనఁ గృష్ణ నీఁ దగుం**
**దగ దను నీ విచారములు దక్కి వివాహ మొనర్పు మొప్పఁగన్. 252**

**ప్రతిపదార్థం:** నగియును= నవ్వులాట కైనా; బొంకునందు= అసత్యమునందు; వచనంబున్= మాటా; అధర్మువు నందున్= అధర్మమునందు; చిత్తమున్= మనస్సు; నాకున్= నాకు; ఎన్నడును= ఎప్పుడుకానీ; తగులదు= తగులుకోదు; అవశ్యమున్= తప్పక; ధర్మువు= ధర్మము; అట్లు+అ= అట్లే; కావునన్; వగవక= విచారించక; మాకున్; ఏవురకున్= ఐదుగురకు; వారిజ, లోచనన్= పద్మముల వంటి కన్నులు కలదానిని; కృష్ణన్= ద్రౌపదిని; ఈన్+తగున్= ఈయతగును; తగదు+అను= ఈయతగదు అనే; నీ, విచారములు= నీ ఆలోచనలు; తక్కి= మాని; ఒప్పుఁగన్= చక్కగా; వివాహము+ ఒనర్పుము= పెండ్లి చేయుము.

**తాత్పర్యం:** నవ్వులాటకైనా నా మాట అసత్యంలో, నా మనస్సు అధర్మంలో ఎన్నడూ తగులుకొనదు. ధర్మం ఆ విధంగానే ఉన్నది. అందువలన పద్మాలవంటి కన్నులు కల ద్రౌపదిని 'ఇవ్వదగును, ఇవ్వకూడదు' అని ఆలోచించడం మానుకొని, బాధపడకుండా, మా ఐదుగురికి ఇచ్చి వివాహం జరిపించుము.

**వ. మఱియుం దొల్లి గౌతమి యయిన జటిల యను ఋషికూఁతురు తపఃప్రభావంబున నేడ్వురు ఋషులకు నొక్కతియు భార్య యయ్యె ననియును, దాక్షాయణి యను మునికన్యక యేకనామంబునఁ బ్రచేతసు లనంబరఁగిన పదుండ్రకు నొక్కతియ భార్యయయ్యె ననియును గథల వినంబడు; మఱి యట్లుం గాక. 253**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; తొల్లి= పూర్వం, గౌతమి+అయిన= గౌతముని వంశంలో పుట్టిన దైన; జటిల; అను; ఋషి, కూఁతురు= ఋషి కుమార్తె; తపస్+ప్రభావంబునన్= తపస్సు యొక్క ప్రభావంచేత; ఏడ్వురు= ఏడుగురు; ఋషులకున్; ఒక్కతియ= ఒక్కతె; భార్య, అయ్యెన్= భార్య అయింది; అనియును; దాక్షాయణి, అను= దాక్షాయణి అనే; మునికన్యక= మునికన్య; ఏక, నామంబునన్= ఒకే పేరున; ప్రచేతసులు; అనన్= అనగా; పరఁగిన= ఒప్పిన; పదుండ్రకున్= పదిమందికి; ఒక్కతియ= ఒక్కతె; భార్య= భార్య; అయ్యెన్+అనియును= భార్య అయింది అనికూడా; కథలన్= కథలలో; వినంబడున్= వినబడుతూ ఉంది; మఱి; అట్లున్+కాక= ఇక ఆ విధంగానే కాక.

**తాత్పర్యం:** అంతేగాక పూర్వం గౌతమునివంశంలో పుట్టిన జటిల అనే ఋషికూతురు తన తపఃప్రభావం చేత ఏడుగురు ఋషులకు ఒక్కతే భార్య అయిం దనీ, దాక్షాయణి అనే మునికన్యక ఒకే పేరుతో ప్రచేతసు లనబడే పదిమందికీ భార్య అయిం దనీ కథలలో వినబడుతూ ఉన్నది. అంతేకాక ఇంకా.

**విశేషం:** 'గౌతమి యయిన జటిల యను ఋషి కూతురు' అనే దానికి బదులు 'గౌతముం డయిన జటిలుం డను ఋషి కూతురు' అని కొన్ని ప్రతులలో పాఠాంతరం ఉన్నది.

**ఆ. 'గురులలోనఁ బరమగురువు దల్లియ; యట్టి । తల్లి వచనమును, విధాతృకృతము**
**నన్యథాకరింప నలవియే?' యనిన నం । దొఱకు నిట్టు లనియె ద్రుపదవిభుఁడు. 254**

**ప్రతిపదార్థం:** గురులలోనన్= గురువులలో; తల్లి+అ= తల్లియే; పరమ, గురువు= శ్రేష్ఠమైన గురువు; అట్టి= అటువంటి; తల్లి, వచనమును= తల్లిమాటను; విధాతృ, కృతమున్= బ్రహ్మదేవునిచేత చేయబడినదానిని; అన్యథాకరింపన్= వేరుగా చేయటం; అలవియే= సాధ్యమా?; అనినన్; ద్రుపద విభుఁడు= ద్రుపదరాజు; అందొఱకున్= అందరికి; ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** గురువులలో తల్లి ఉత్తమగురువు. అటువంటి తల్లిమాటను, బ్రహ్మ చేసిన పనిని మార్పుచేయటం సాధ్యమా? అని ధర్మజుడు పల్కగా, అందరితో ద్రుపదరాజు ఇట్లా అన్నాడు.

**విశేషం:** యువకుడైన ధర్మరాజు - వయోవృద్ధు, జ్ఞానవృద్ధు, మహాతపస్వి, అన్నింటిని మించి తమ శ్రేయోభిలాషి అయిన వ్యాసుని ముందు తన మాటను తాను సమర్థించుకొన్నాడు. తాను చెప్పిన దానికి కొన్ని ఉదాహరణలుకూడా చూపాడు.

**వ. 'ధర్మసూక్ష్మత నిర్ణయింప మన కశక్యంబు; త్రిలోకవంద్యుండు త్రికాలప్రవర్తనవిజ్ఞాననిధి యీ కృష్ణద్వైపాయనుండు విచారించి యెద్ది యాన తిచ్చె నదియ యిప్పుడు కర్తవ్యం' బనిన విని యమ్మునివరుండు ద్రుపదునకి ట్లనియె. 255**

**ప్రతిపదార్థం:** ధర్మ, సూక్ష్మత= ధర్మంలోని రహస్యాన్ని; నిర్ణయింపన్= నిర్ణయించడానికి; మనకున్; అశక్యంబు= అసాధ్యం; త్రిలోక, వంద్యుండు= మూడులోకాలచే నమస్కరింప తగినవాడు; త్రికాల, ప్రవర్తన, విజ్ఞాన నిధి= మూడులోకాలలో ప్రవర్తిల్లే

విజ్ఞానానికి నిధి అయినవాడు; ఈ, కృష్ణద్వైపాయనుండు= ఈ వేదవ్యాసుడే; విచారించి= ఆలోచించి; ఎద్ది= ఏది; ఆనతి+ఇచ్చెన్= ఆజ్ఞాపిస్తాడో; అదియ= అదే; ఇప్పుడు= ఇపుడు; కర్తవ్యంబు= చేయదగినది; అనినన్= అని అనగా; విని; ఆ+మునివరుండు= ఆ మునిశ్రేష్ఠుడు - వ్యాసుడు; ద్రుపదునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ధర్మసూక్ష్మాన్ని నిర్ణయించటం మనకు సాధ్యం కాదు. ముల్లోకాలచే నమస్కరింప దగినవాడు, మూడులోకాల్లో ప్రవర్తిల్లే విజ్ఞానానికి నిధి అయిన ఈ వేదవ్యాసుడు ఆలోచించి ఏది ఆజ్ఞాపిస్తే, అదే ఇప్పుడు చేయదగింది' అని పల్కగా విని, ఆ మునిశ్రేష్ఠుడు ద్రుపదునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** సంశయగ్రస్తుడైన ద్రుపదుడు ఒకవైపు, నిశ్చితధర్మబుద్ధి అయిన ధర్మరాజు మరొకవైపు తమతమ వాదాలను పేర్కొన్న తరువాత, ద్రుపదుడు నిర్ణయాధికారాన్ని వ్యాసమహామునికి అప్పగించాడు. ఇక వ్యాసుడు చెప్పిందే ధర్మం,తీర్పు.

**సీ.** **'ధర్మతత్త్వజ్ఞుఁ డీ ధర్మతనూజుండు । ధర్మమార్గం బేల తప్పఁబలుకు?**
**దేవతామూర్తి యిద్దేవి మాధవి యేల । తా నెఱుంగక యనృతంబు పలుకు?**
**వీరల పలుకులు వేల్పుల మతమును । నొక్కండ కావున నొండు దక్కి**
**యీ యేవురకుఁ గూఁతు నిచ్చి వివాహంబుఁ । గావింపు; మఱి దీని కల తెఱంగు.**

**ఆ.** **వినఁగ నిష్టమేని విను 'మని ద్రుపదు చే । యూఁది యింటిలోని కొనర నరిగి.**
**తాను నతఁడు నేకతమ యుండి, వాని కం । తయును జెప్పఁదొడఁగె ధర్మవిదుఁడు.** **256**

**ప్రతిపదార్థం:** ధర్మ, తత్త్వజ్ఞుఁడు= ధర్మతత్త్వమును తెలిసినవాడు; ఈ, ధర్మతనూజుండు= ఈ ధర్మరాజు; ఏల=ఎందుకు; ధర్మమార్గంబు; తప్పన్= తప్పునట్లుగా; పలుకున్= మాటాడుతాడు; దేవతా, మూర్తి= దేవతామూర్తి అయిన; మాధవి= కుంతి; ఏల= ఎందుకు; తాన్= తాను; ఎఱుంగక= తెలియక; అనృతంబు= అసత్యం; పలుకున్= మాట్లాడుతుంది; వీరల, పలుకులు; వేల్పుల, మతమునన్= దేవతల అభిప్రాయం కూడ; ఒక్కండు+అ= ఒకటే; కావునన్; ఒండు= ఇతర విచారము; తక్కి= మాని; ఈ, ఏవురకున్= ఈ ఐదుగురుకి; కూతున్+ఇచ్చి; వివాహంబున్, కావింపు= పెండ్లి చేయవలసింది; మఱి= ఇక; దీని= దీనియొక్క; కలతెఱంగు= యథార్థము; వినఁగన్= వినటానికి; ఇష్టము+ఏని= ఇష్టమైతే; వినుము+అని= విను అని; ద్రుపదు, చేయి= ద్రుపదునియొక్క చేతిని; ఊఁది= పట్టుకొని; ఇంటిలోనికి; ఒనరన్= ఒప్పుగా; అరిగి= వెళ్ళి; తానున్= తాను (వ్యాసుడు); అతఁడున్= అతడు అనగా ద్రుపదుడు; ఏకతము+అ= ఒంటరిగా; ఉండి; వానికిన్, అంతయును= ఆ ద్రుపదునికి అంతా; ధర్మవిదుఁడు= ధర్మము నెఱింగిన వ్యాసుడు; చెప్పన్+తొడఁగెన్= చెప్పటానికి ప్రారంభించాడు.

**తాత్పర్యం:** 'ఈ ధర్మరాజు ధర్మతత్త్వం తెలిసినవాడు. ధర్మమార్గం తప్పి ఎందుకు మాట్లాడుతాడు? దేవతామూర్తి అయిన ఈ కుంతీదేవి తెలియక ఎందుకు అసత్యం పలుకుతుంది? వీళ్ళమాటలు, దేవతల అభిప్రాయం ఒక్కటే. అందువలన వేరే ఆలోచన మాని, ఈ ఐదుగురికి నీ కుమార్తె నిచ్చి వివాహం చెయ్యి. దీని యథార్థస్థితి వినటం నీ కిష్టమైతే వినుము' అని ద్రుపదుని చేయి పట్టుకొని ఇంటిలోపలికి పిలిచికొని వెళ్ళి, ధర్మం' తెలిసిన వ్యాసుడు ఏకాంతంగా అతనికి విషయమంతా చెప్ప నారంభించాడు.

**విశేషం:** కుంతీధర్మజుల అభిప్రాయాలూ, దేవతల అభిప్రాయాలూ ఒకటే అని వేదవ్యాసుడు చెప్పాడు. లౌకికు లైన వీళ్ళ మాటలలో దేవతల సంకల్పాలు ఎట్లా ప్రతిఫలిస్తున్నాయో వివరించటమే వ్యాసుడు చేయవలసిన పని. అది దేవరహస్యం.

అందువలననే ఆ ఏకాంతసంభాషణ, ఆ దివ్యదృష్టిప్రసాదం. వీటి అవసరం లేకుండానే విషయాన్ని గ్రహించిన దార్శనికుడు ధర్మజుడు. ప్రత్యక్ష ప్రమాణంతో అనుమానం తీర్చుకొన్నవాడు ద్రుపదుడు. మాధవి= కుంతి; యదువంశంలో మధుడనేవాడు ఒక ప్రసిద్ధుడు. అతని వంశంలో జన్మించింది కనుక కుంతికి మాధవి అనే పేరు వచ్చింది.

## ద్రుపదునకు వేదవ్యాసుండు ఇంద్రసేనయను పతివ్రతకథ సెప్పుట (సం.1-100-60)

**వ. ఇది తొల్లి నాలాయని యైన యింద్రసేన యనంబరఁగిన పరమ పతివ్రత; మౌద్గల్యుం డను మహామునికి భార్య యయి, కర్మవశంబున నమ్మునిం గుష్ఠవ్యాధిబాధితత్వగస్థిభూతకష్టశరీరు వయోవృద్ధు వలిపలితధరు దుర్గంధవదను దుఃఖజీవు నతికోపను విశీర్యమాణనఖత్వచుం బరమభక్తి నారాధించి తదుచ్ఛిష్టంబు కుడుచుచున్న నొక్కనాఁడు. 257**

**ప్రతిపదార్థం:** ఇది= ఈమె; తొల్లి= పూర్వం; నాలాయని+ఐన; నలునికుమార్తెఐన; ఇంద్రసేన; అనన్= అనుపేరుతో; పరఁగిన= ఒప్పిన; పరమ, పతివ్రత= మహా పతివ్రత; మౌద్గల్యుండు+అను; మహా, మునికి; భార్య; అయి; కర్మవశంబునన్= చేసినకర్మ కారణంగా; కుష్ఠ, వ్యాధి, బాధిత, త్వక్+అస్థి, భూత, కష్ట, శరీరున్= కుష్ఠరోగంచేత బాధింపబడిన దై చర్మం ఎముకలు మాత్రమే అయి బాధతో కూడిన శరీరం కలవాడిని; వయోవృద్ధున్= వయస్సుచేత వృద్ధుడైనవాడిని; వలి, పలితధరున్= కడుపుమీద ముడుతలు కల వాడిని, నెఱసిన వెంద్రుకలను ధరించినవాడిని; దుర్గంధ, వదనున్= చెడువాసనతో కూడుకొన్న ముఖం కలవాడిని; దుఃఖజీవున్= దుఃఖంతో జీవించేవాడిని; అతి, కోపనున్= మిక్కిలి కోపం కలవాడిని; విశీర్యమాణ, నఖ, త్వచున్= ఊడిపోతున్న గోళ్ళు, చర్మం కలవాడిని; ఆ+మునిన్= అగు ఆ మునిని; పరమ, భక్తిన్= మిక్కిలి భక్తితో; ఆరాధించి= సేవించి; తత్+ ఉచ్ఛిష్టంబు= అతని ఎంగిలి-అనగా అతడు తినగా మిగిలింది; కుడుచుచున్= తింటూ; ఉన్నన్= ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజు.

**తాత్పర్యం:** ఈమె పూర్వం నలుని కుమార్తెఐన ఇంద్రసేన అనే పరమపతివ్రత. ఈమె మౌద్గల్యుడు అనే మహామునికి భార్య అయింది. అతడు ముసలివాడు; కుష్ఠరోగ పీడితుడై చర్మం ఎముకలు మాత్రమే మిగిలినవాడు. బాధతో కూడిన శరీరం కలవాడు. కడుపుమీద చర్మపుముడుతలు కలవాడు, నెరసిన వెంద్రుకలు ఉన్నవాడు. దుర్వాసనతో కూడినముఖం కలవాడు. దుఃఖంతో జీవించేవాడు, మిక్కిలికోపం కలవాడు, ఊడిపోతున్న గోళ్లు, చర్మం కలవాడు, అటువంటి ఆ మునిని ఆమె కర్మవశంతో, పరమభక్తితో సేవించింది. ఒకనాడు అతడు తిని విడిచినయెంగిలిఅన్నం తింటూ ఉండగా-ఒకరోజు

**విశేషం:** ఈ నాలాయన్యుపాఖ్యానం భండార్కర్ ప్రతి, నీలకంఠప్రతి, వావిళ్ల ప్రతి మొదలైన సంస్కృతభారతప్రతులలో మూలగ్రంథ భాగంలో లేదు. నీలకంఠీయవ్యాఖ్యలో మాత్రం దీనిప్రశంస ఉన్నది. అందులో దీనికి 'నారాయణ్యుపాఖ్యానం' అనే పేరు కనిపిస్తున్నది.

**తే. కుడుచునెడ వాని పెనువ్రేలు కూటిలోనఁ । దునిసి పడియున్న వ్రేల్ పుచ్చి తోయజాక్షి**
**యేవగింపక యుచ్ఛిష్ట మిష్టలీలఁ । దగిలి కుడుచుచున్నంత నత్తరుణిఁ జూచి. 258**

**ప్రతిపదార్థం:** కుడుచు, ఎడన్= తినునప్పుడు; వాని= ఆ మునియొక్క; పెను, వ్రేలు= పెద్దవ్రేలు; కూటిలోన్= అన్నములో; తునిసి= తునిగి; పడి, ఉన్నన్= పడిఉండగా; తోయజాక్షి= నీటినుండి పుట్టిన కమలాలవంటి కన్నులు కల ఆ ఇంద్రసేన;

వ్రేల్= వ్రేలిని; పుచ్చి= తీసివేసి; ఏవగింపక= అసహ్యపడకుండ; ఉచ్ఛిష్టము= ఎంగిలి అన్నాన్ని; ఇష్ట, లీలన్= ఇష్టమైన పద్ధతిగా, సంతోషంగా; తగిలి= ఆసక్తితో; కుడుచుచున్= తినుచు; ఉన్నంతన్= ఉన్నప్పుడు; ఆ+తరుణిన్= ఆ కాంతను; చూచి.

**తాత్పర్యం:** తింటూ ఉండగా, అతని బొటనవ్రేలు తునిగి అన్నంలో పడి ఉండటం చూచి, పద్మాలవంటి కన్నులు కల ఆ ఇంద్రసేన ఆ వ్రేలిని తీసివేసి, అసహ్యపడక ఆ ఎంగిలి అన్నాన్ని మిక్కిలి ప్రీతితో తినసాగింది. అప్పు డామెను చూచి.

**వ. దానిదయిన పతిభక్తి గుణంబునకు మెచ్చి మౌద్గల్యుండు ప్రసన్నుం డయి 'నీ కెద్ది యిష్టంబు వేఁడు మిచ్చెద' ననిన నది యి ట్లనియె; 'మునీంద్రా! నాకుం గామోపభోగేచ్ఛ పెద్ద గలదు; నీవునుం దపశ్శక్తిఁ గామరూప ధరుండ వయి యీ బీభత్సంబగు రూపం బుడిగి, మనోహరం బయిన రూపంబునం బంచధా విభక్తుండవయి నన్ను రమియించి కామభోగంబులం దనుపు' మనిన దాని కిష్టంబైనవిధంబున నేను దేహంబులు దాల్చి మర్త్య దేవలోకంబులయందు బ్రహ్మర్షిదేవర్షిపూజితుం డై సూర్యరథం బెక్కి చని యాకాశగంగాజలంబుల నాప్లుతదేహుం డయి శీతాంశునంశు జాలంబుల వసియించి మేరుకైలాసంబులయందుఁ గ్రీడించుచు ననేకస్థానంబుల ననేక సహస్రవర్షంబులు నాలాయని యైన యింద్రసేన నుపభోగించి తృప్తుం డై, మౌద్గల్యుండు దాని విడిచి ఘోరతపంబు సేసి బ్రహ్మమయుం డై బ్రహ్మలోకంబునకుఁ జనిన; నది కామభోగములందుఁ దనియక కాలవశంబున శరీరము విడిచి కాశిరా జను రాజర్షికిం బుట్టి పెరుగుచుం గన్యాత్వమునఁ బెద్దకాలం బుండి తన దౌర్భాగ్యమునకు నిర్వేదించి, పతిం గోరి పశుపతి నుద్దేశించి యుగ్రతపంబు సేయుచున్నంత. 259**

**ప్రతిపదార్థం:** దానిది+అయిన= ఆమెకు సంబంధించినదైన; పతిభక్తి, గుణంబునకున్= పతిభక్తి గుణానికి; మెచ్చి= కొనియాడి; మౌద్గల్యుండు; ప్రసన్నుండు+అయి= దయతలచినవా డై; నీకున్; ఎద్ది, ఇష్టంబో= ఏది ఇష్టమో; వేడుము= కోరుకో; ఇచ్చెదన్= ఇస్తాను; అనినన్= అని అనగా; అది; ఇట్లు+అనియెన్; ముని+ఇంద్ర= మునిశ్రేష్ఠా; నాకున్= నాకు; కామ+ఉపభోగ+ ఇచ్ఛ= కామాన్ని అనునభవించటంలో కోరిక; పెద్ద, కలదు= మిక్కిలి ఉన్నది; నీవునున్= నీవుకూడా; తపః+శక్తిన్, కామరూప, ధరుండవు+అయి= ఇష్టమైన రూపాన్ని ధరించినవాడవై; ఈ, బీభత్సంబు+అగు= ఈ అసహ్యమైన; రూపంబు= రూపాన్ని; ఉడిగి= మాని; మనోహరంబు+అయిన, రూపంబునన్= అందమైన రూపంలో; పంచధా, విభక్తుండవు+అయి= ఐదు విధాలుగా విభాగం పొందిన వాడవై; నన్నున్; రమియించి; కామ భోగంబులన్; తనుపుము= తృప్తిపొందింపుము; అనినన్= అనిఅనగా; ఆ+ముని; దానికిన్, ఇష్టంబు+ఐన= ఆమెకు ఇష్టమైన; విధంబునన్= విధంగా; ఏను= ఐదు; దేహంబులు= శరీరాలు; తాల్చి= ధరించి; మర్త్య, దేవ, లోకంబుల, అందున్= మనుష్యలోకంలో; దేవలోకంలో; బ్రహ్మర్షి, దేవర్షి, పూజితుండు+ఐ= బ్రహ్మర్షులచేత, దేవర్షులచేత పూజింపబడినవాడై; సూర్య, రథంబు+ఎక్కి= సూర్యుని రథంఎక్కి; చని= వెళ్ళి; ఆకాశ, గంగా, జలంబులన్= ఆకాశగంగలోని నీళ్లతో; ఆప్లుతదేహుండు+అయి= తడిసిన శరీరం కలిగినవాడయి అంటే స్నానం చేసినవాడయి; శీత+అంశున్+ అంశు, జాలంబుల= చల్లని కిరణాల గల చంద్రుని కిరణ సమూహాలలో; వసియించి= నివసించి; మేరు, కైలాసంబుల, అందున్= మేరువులో, కైలాసంలో; క్రీడించుచున్= క్రీడిస్తూ; అనేక, స్థానంబులన్= అనేక ప్రదేశాలలో; అనేక, సహస్ర, వర్షంబులు= ఎన్నో, వేల సంవత్సరాలు; నాలాయని, ఐన ఇంద్రసేనన్= నాలాయని అగు ఇంద్రసేనను; ఉపభోగించి= అనుభవించి; తృప్తుండు+ఐ= తృప్తి పొందినవా డై; మౌద్గల్యుండు, దాని; విడిచి= ఆమెను వదలి; ఘోర, తపంబు; చేసి= కఠోర తపస్సు గావించి; బ్రహ్మమయుండు+ఐ= బ్రహ్మత్వాన్ని పొందినవాడై; బ్రహ్మ, లోకంబునకున్; చనినన్= వెళ్ళగా; అది= ఇంద్రసేన; కామభోగంబులన్= ఇష్టభోగాలతో; తనియక= తృప్తిపొందక; కాలవశంబునన్= కాలవశాన; శరీరంబు= దేహము;

విడిచి; కాశిరాజు+అను; రాజ+ఋషికిన్= రాజర్షికి; పుట్టి; పెరుగుచున్= పెరుగుతూ; కన్యాత్వమునన్= కన్యగానే; పెద్దకాలంబు= చాలాకాలం; ఉండి; తన, దౌర్భాగ్యంబునకున్= తన యొక్క దురదృష్టానికి; నిర్వేదించి= నిరాశచెంది; పతిన్= భర్తను; కోరి; పశుపతిని, ఉద్దేశించి= శివుని గూర్చి; ఉగ్ర, తపంబు= భయంకరమైన తపస్సు; చేయుచున్+ఉన్నంతన్= చేస్తూఉండగా.

**తాత్పర్యం:** ఆమెపతిభక్తి గుణానికి మెచ్చి మౌద్గల్యుడు దయతో 'నీ కేది ఇష్టమో కోరుకో. ఇస్తాను' అన్నాడు. ఆమె 'మునీంద్రా! నాకు కామాన్ని అనుభవించాలన్న కోరిక మిక్కిలిగా ఉన్నది. నీవు తపశ్శక్తితో కోరిన రూపాన్ని ధరించి, ఈ అసహ్యమైన రూపాన్ని వదలి, మనోహరమైన రూపంతో ఐదు విభాగాలుగా విభాగం పొంది నాతో రమించు. కామభోగాలతో నన్ను తృప్తి పరచుము' అని కోరగా ఆ మహాముని ఆమెకు ఇష్టమైన విధంగా ఐదు దేహాలు ధరించాడు. మానవలోకంలో, దేవలోకంలో బ్రహ్మర్షులు, దేవర్షులు తనను పూజించగా, సూర్యరథాన్ని ఎక్కి, ఆకాశగంగలో స్నానం చేసి, చంద్రునికిరణసమూహంలో నివసించి, మేరుకైలాసపర్వతాలలో క్రీడిస్తూ ఎన్నో చోట్ల వేల సంవత్సరాలు నాలాయని అయిన ఇంద్రసేనను అనుభవించి తృప్తిపడ్డాడు. తరువాత ఆమెను విడిచి, గొప్పతపస్సు చేసి బ్రహ్మత్వాన్ని పొంది, బ్రహ్మలోకానికి వెళ్లాడు. కాని ఆమె ఆ కామభోగాలతో తృప్తిపడక కాలవశాన శరీరం వదలి, కాశిరాజు అనే రాజర్షికి పుత్రికగా జన్మించింది. కన్యగానే చాలాకాలం ఉండి, తనదౌర్భాగ్యానికి బాధపడి, భర్తకొరకు శివుణ్ణిగూర్చి భయంకరమైన తపస్సుచేస్తుండగా.

**తే.** **దానికడకుఁ బ్రత్యేకంబ ధర్మవాయు । వాసవాశ్వినుల్ ప్రీతు లై వచ్చి దాని**
**నాత్మ దేహాంశజులకు దేహాంతరమునఁ । బత్నిగాఁ గోరి రధికసౌభాగ్యయుక్తి.** **260**

**ప్రతిపదార్థం:** దాని, కడకున్= దానిదగ్గరకు; ప్రత్యేకంబు+అ= వేరువేరుగా; ధర్మ, వాయు, వాసవ+ఆశ్వినుల్= యముడును, వాయువును, ఇంద్రుడును, అశ్వినీదేవతలును; ప్రీతులు+ఐ= సంతోషంపొందినవాళ్ళయి; వచ్చి; దానిన్= ఆమెను; ఆత్మ, దేహ+అంశజులకున్= తమదేహాలయొక్క అంశాలవలన పుట్టినవాళ్ళకు; దేహాంతరమునన్= మరొకజన్మలో; అధిక, సౌభాగ్య, యుక్తిన్= ఎక్కువ అందముయొక్క పొందికచేత; పత్నిన్+కాన్= భార్య అయ్యేటట్లు; కోరిరి= కోరారు.

**తాత్పర్యం:** ఆమెదగ్గరకు యముడు, వాయువు, ఇంద్రుడు, అశ్వినీదేవతలు సంతోషంతో వేర్వేరుగా వచ్చి, జన్మాంతరంలో తమ తమఅంశలతో పుట్టినవాళ్ళకు అధికసౌందర్యంతో ఆమె భార్య కావా లని కోరారు.

**వ.** **అదియును గొండొకకాలంబు జలానిలాహార యై, కొండొకకాలంబు నిరాహార యై, కొండొకకాలం బేకపాదంబున నిల్చి, కొండొకకాలంబు పంచాగ్నిమధ్యంబున నుండి యత్యుగ్రతపంబు సేసిన నీశ్వరుండు ప్రసన్నుం డయి వరంబు వేఁడు మనిన, నక్కన్యక 'నాకు బతిదానంబుఁ బ్రసాదింపు' మని యర్థిత్వంబున నేనుమాఱులు వేఁడినం గరుణించి యీశ్వరుండు 'నీకు దేహాంతరంబున నేవురుపతు లగుదు' రనిన నది యి ట్లనియె.** **261**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ ఇంద్రసేనయు; కొండొకకాలంబు= కొంతకాలం; జల+అనిల+ఆహార+ఐ= నీటిని, గాలిని, ఆహారంగా కలదై; కొండొకకాలంబు= కాంతకాలం; నిరాహార+ఐ= ఆహారం లేనిదై; కొండొకకాలంబు= కాంతకాలం; ఏక, పాదంబునన్= ఒకే పాదంతో; నిల్చి; కొండొకకాలంబు; పంచ+అగ్ని, మధ్యంబునన్= అయిదు అగ్నులనడుమ; ఉండి; అతి+ఉగ్ర, తపంబు= మిక్కిలి భయంకరమైన తపస్సు; చేసినన్= చేయగా; ఈశ్వరుండు= పరమేశ్వరుడు; ప్రసన్నుండు+అయి= ప్రత్యక్ష మైనవాడై; వరంబు= వరం; వేడుము+అనినన్= కోరుకో అనగా; ఆ+కన్యక; నాకున్; పతిదానంబు= పతిదానాన్ని;

ప్రసాదింపుము+అని= ఇమ్ము అని; అర్థిత్వంబునన్= కోరికచేత; ఏను, మాఱులు= ఐదుసార్లు; వేఁడినన్= ప్రార్థింపగా; కరుణించి= దయ తలచి; ఈశ్వరుండు; నీకున్, దేహ+అంతరంబునన్= నీకు మరొకదేహమునందు - అనగా మరుసటిజన్మలో; ఏవురు= ఐదుగురు; పతులు= భర్తలు; అగుదురు= అవుతారు; అనినన్= అనగా; అది= ఆమె; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** తరువాత ఆమె కొంతకాలం నీరు, గాలి ఆహారంగా, కొంతకాలం ఆహారమే లేకుండా, కొంతకాలం ఒకేపాదంమీద నిల్చి, కొంతకాలం ఐదుఅగ్నులమధ్యలో ఉండి, మహాభయంకరమైన తపస్సు చేసింది. ఈశ్వరుడు ప్రత్యక్షమై వరం కోరు కొ మ్మనగా, ఆ కన్యక 'నాకు పతిదానం ఇ' మ్మని ప్రబలమైన కోరికతో ఐదుసార్లు అడిగింది. ఈశ్వరుడు కరుణించి 'నీకు మరొకజన్మలో ఐదుగురు భర్తలౌతా' రని అనగా - ఆమె ఇట్లా అన్నది.

**ఆ. సతికి నొక్కరుండ పతిగాక యెందును । బతులు పలువు రవుట కతలఁ గలదె?**
**లోకనాథ! యిట్టి లోకవిరుద్ధంపు । వరము వడయ నమరవరద! యొల్ల. 262**

**ప్రతిపదార్థం:** సతికిన్= స్త్రీకి; ఒక్కరుండు+అ= ఒక్కడే; పతి= భర్త; కాక; ఎందును= ఎచ్చటనైన; పతులు= భర్తలు; పలువురు= అనేకులు; అవుట= కావటం; కతలన్= కథలందు; కలదె= ఉన్నదా? లోకనాథ!= లోకాలకు ప్రభువైనవాడా; అమర, వరద= దేవతలకు వరము లిచ్చేవాడా! ఓ పరమేశ్వరా; ఇట్టి; లోకవిరుద్ధంపు= లోకానికి విరుద్ధమైన; వరము= కోరిక; పడయన్= పొందటానికి; ఒల్లన్= ఇష్టపడను.

**వ. అనిన దానికి రుద్రుం డి ట్లనియె. 263**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; దానికిన్= ఆ ఇంద్రసేనకు; రుద్రుండు= శివుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా ఆమెతో ఈశ్వరుడు ఈ విధంగా అన్నాడు.

**క. నా వచనంబున నీ క । య్యేవురు పతులందు ధర్మ వెడపకయుండుం**
**గావున నిట్టి వరం బిం । దీవరదళనేత్ర! యిచ్చితిని దయతోన్. 264**

**ప్రతిపదార్థం:** నా, వచనంబునన్= నా మాటచేత; నీకున్; ఆ+ఏవురు, పతులందున్= ఆ ఐదుగురు భర్తలందును; ధర్మువు= ధర్మం; ఎడపక= తొలగక; ఉండున్= ఉంటుంది; కావునన్; ఇందీవర, దళ, నేత్ర= నల్లకలువరేకులవంటి కన్నులు కలదానా!; ఇట్టి వరంబున్; దయతోడన్; ఇచ్చితిని.

**తాత్పర్యం:** నల్లకలువరేకులవంటి కన్నులు కల ఓ కన్యకా! నా మాటవలన నీకు ఆ ఐదుగురుభర్తలలో ధర్మం తప్పకుండ ఉంటుంది. అందువల్లనే దయతో నేను నీ కీ వర మిచ్చాను.

**వ, 'అనిన నది యట్లేని నయ్యేవురుపతులయందును బ్రత్యేకసంగమంబునను నాకుఁ గౌమారంబును బతిశుశ్రూషా సిద్ధియుఁ గామభోగేచ్ఛయు సౌభాగ్యంబునుం బ్రసాదింప వలయు' ననిన రుద్రుండు దాని కోరిన వరంబు లెల్ల నిచ్చి, గంగాతీరంబున నున్న యింద్రు నాయొద్దకుం దోడ్కొని ర మ్మని పంచిన వల్లె యని. 265**

**ప్రతిపదార్థం:** అనినన్, = అని అనగా; అది= ఆమె; అట్లు+ఏని= అట్లయినచో; ఆ ఏవురు= ఐదుగురు; పతుల, అందును= భర్తలందును; ప్రత్యేక, సంగమంబునను= ఒక్కొక్కరితోడి కలయికయందును; నాకున్= నాకు; కౌమారంబునున్= కన్యాత్వమును; పతి, శుశ్రూషా, సిద్ధియున్= పతిసేవాభాగ్యము; కామ, భోగ+ఇచ్ఛయు= కామాన్ని అనుభవించేకోరిక; సౌభాగ్యంబునున్= ముత్తైదువతనము; ప్రసాదింపవలయున్= అనుగ్రహింపవలయును; అనినన్= అని అనగా; రుద్రుండు= శివుడు; దాని, కోరిన, వరంబులు+ఎల్లన్= ఆమె (యొక్క) కోరిన వరాలన్నింటిని; ఇచ్చి, గంగా, తీరంబునన్; ఉన్న; ఇంద్రున్= ఇంద్రుణ్ణి; నా+ఒద్దకున్; తోడ్కొని; రమ్ము+అని; పంచినన్= ఆజ్ఞాపించగా; వల్లె, అని= సరే అని.

**తాత్పర్యం:** అని పల్కగా ఆమె 'అట్లైతే, ఆ అయిదుగురు భర్తలలో ఒక్కొక్కరితో కలయిక ఉన్నప్పటికి నాకు కన్యాత్వం, పతిసేవాభాగ్యం, కామాన్ని అనుభవించా లనే కోరిక, ముత్తైదువతనం అనుగ్రహించ వలసిం'దని కోరగా, శివుడు ఆమె కోరినవరాలన్నీ ఇచ్చి, గంగాతీరంలో ఉన్న ఇంద్రుడిని నాదగ్గరికి తోడ్కొని రమ్మని పంపాడు. ఆమె సరే అని.

**క. దక్షాధ్వరమథనునకుఁ బ్ర। దక్షిణపూర్వముగ మ్రొక్కి తడయక చని ప**
**ద్మేక్షణ సహస్రచక్షుఁ బ్ర।తీక్షించుచు నుండె సురనదీతీరమునన్. 266**

**ప్రతిపదార్థం:** పద్మ+ఈక్షణ= పద్మాలవంటికన్నులు కలది - ఆ కాశీరాజుకూతురు; దక్ష+అధ్వర, మథనునకున్= దక్షయజ్ఞాన్ని చెడగొట్టిన శివునికి; ప్రదక్షిణ, పూర్వముగన్= ముందుగా ప్రదక్షిణం చేసి; మ్రొక్కి; తడయక= ఆలస్యం చేయక; చని= వెళ్ళి; సురనదీ, తీరమునన్= గంగానది ఒడ్డున; సహస్ర, చక్షున్= వేయికన్నులు కలవాడైన ఇంద్రునికొరకు; ప్రతీక్షించుచున్= ఎదురు చూస్తూ; ఉండెన్.

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు కల ఆ కాశీరాజుకూతురు శివునికి ప్రదక్షిణం చేసి, నమస్కరించి వెంటనే గంగాతీరానికి వెళ్ళి, ఇంద్రునిరాకకై యెదురుచూస్తూ ఉండింది.

### ద్రుపదునకు వ్యాసుండు పంచేంద్రోపాఖ్యానంబు సెప్పుట (సం.1-189-1)

**వ. అట వైవస్వతుండును నైమిశారణ్యంబున సత్త్రయాగదీక్షితుం డయి ప్రాణిహింస సేయకుండుటం చేసి మానవు లప్రాప్తమరణు లయి వర్తించుచున్న దాని సహింపనోపక యింద్రాదిదేవతలందఱు బ్రహ్మపాలికిం జని 'భట్టారకా! మర్త్యు లమర్త్యు లయి వర్తిల్లువా రయిన వారికిని మాకును విశేషం బెద్ది?' యని దుఃఖించిన నయ్యమరుల కమరజ్యేష్ఠుం డి ట్లనియె. 267**

**ప్రతిపదార్థం:** అట= అచ్చట; వైవస్వతుండును= యముడును; నైమిశ+అరణ్యంబునన్= నైమిశారణ్యంలో; సత్త్రయాగ దీక్షితుండు+అయి= సత్రయాగంలో దీక్షపూనినవాడై; ప్రాణి హింస= ప్రాణులను చంపటం; చేయక+ఉండుటన్+చేసి= చేయకుండుటం చేత; మానవులు; అప్రాప్త, మరణులు+అయి= పొందబడని చావుకలవా ళ్ళయి - అనగా చావులేనివాళ్ళయి; వర్తించుచున్+ఉన్నన్= వర్తిస్తూ ఉండగా; దానిన్= దానిని; సహింపన్+ఓపక= ఓర్చుకొనలేక; ఇంద్ర+ఆది, దేవతలు+అందరు= ఇంద్రుడు మొదలైన దేవతలంతా; బ్రహ్మపాలికిన్= బ్రహ్మ దగ్గరకు; చని= వెళ్ళి; భట్టారకా= ఓమహామునీ!; మర్త్యులు= చావుకలవాళ్ళు - మనుష్యులు; అమర్త్యులు+అయి= చావులేని వాళ్ళయి; వర్తిల్లువారు+ఐనన్= జీవించే వా ళ్ళయితే; వారికిని; మాకును; విశేషంబు= భేదం; ఎద్ది= ఏది; అని; దుఃఖించినన్= దుఃఖించగా; ఆ+అమరులకున్= ఆ దేవతలకు; అమర, జ్యేష్ఠుండు= దేవతలందరిలో పెద్దవాడైన బ్రహ్మ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అక్కడ యముడు నైమిశారణ్యంలో సత్రయాగదీక్షవహించి, ప్రాణిహింస మానివేయటంవలన మానవులు మరణం లేనివాళ్ళయి జీవించసాగారు. దానిని ఓర్వలేక ఇంద్రుడు మొదలైన దేవతలంతా బ్రహ్మదేవునిదగ్గరికి వెళ్ళి, 'మహామునీ! మృతి చెందే మానవులు మృతిలేనివాళ్ళయి జీవిస్తే, వాళ్ళకూ మాకూ భేద మేమిటి?' అని దుఃఖించగా వాళ్ళతో బ్రహ్మ ఇట్లా అన్నాడు.

**క. ఎంతకుఁ గృతకార్యుం డగు । నంతకుఁ డీ రంతకును భయం బందక ని**
**శ్చింతమున నుండుఁ డాతం । డంతము నొందించుఁ దొంటియట్టుల నరులన్. 268**

**ప్రతిపదార్థం:** అంతకుఁడు= యముడు; ఎంతకున్= ఎప్పటికి; కృత, కార్యుండు= చేయబడిన సత్రయాగకార్యం కలవాడు; అగున్= అగునో; ఈరు= మీరు; అంతకును= అంతవరకు; భయంబు+అందక; నిశ్చింతమునన్= చింతలేనివిధంగా; ఉండుఁడు; ఆతండు= ఆ యముడు; తొంటి; అట్టులు+అ= మునుపటివలెనే; నరులన్= మానవుల్ని; అంతమున్+ఒందించున్= చంపును.

**తాత్పర్యం:** యమునిసత్రయాగం ఎప్పటికి పూర్తి అవుతుందో అప్పటివరకు మీరు భయపడకుండా నిశ్చింతగా ఉండండి. అతడు మునుపటివలెనే మానవులను అంత మొందిస్తాడు.

**క. ఆ వైవస్వతు వీర్యము । మీ వీర్యముఁ దాల్చి సూర్యమితతేజులు దా**
**రేవు రుదయింతు రాతని । కావించు విధానమునకుఁ గారణ మగుచున్. 269**

**ప్రతిపదార్థం:** ఆ, వైవస్వతు, వీర్యము= ఆ యమునియొక్క తేజస్సును; మీ, వీర్యమును= మీ తేజస్సును; తాల్చి= ధరించి; సూర్య, మిత, తేజులు= సూర్యుని అంతటి తేజస్సు కలవాళ్ళు; తారు= తాము; ఏవురు= ఐదుగురు; అతని, కావించు, విధానమునకున్= ఆ యముడు చేసే పనికి; కారణము+అగుచున్= కారణం అవుతూ; ఉదయింతురు= పుట్టుతారు.

**తాత్పర్యం:** ఆ యమునితేజస్సు, మీతేజస్సు ధరించి, సూర్యునంతటితేజస్సు కలవాళ్ళు అయిదుగురు, యముడు చేసేపనికి సాధనంగా జన్మిస్తారు.

**వ. అనిన నమరపతి పురోగము లయిన యమరు లెల్ల నమరాపగాసమీపంబునకుం జనునప్పుడు, తత్సలిలమధ్యంబున నొక్కకన్యక యేడ్చుచున్న, దానికన్నీళ్ళు కనకకమలంబు లయినం జూచి వేల్పులుం దానును విస్మయం బంది, యింద్రుఁ డక్కన్యకయొద్దకుం జని 'యేడ్చెద వెందుల దాన?' వని యడిగిన నది యింద్రున కి ట్లనియె. 270**

**ప్రతిపదార్థం:** అనినన్= అని బ్రహ్మదేవుడు పలుకగా; అమరపతి, పురోగములు+అయిన= దేవేంద్రుడు ముందు నడచువాడుగా కలవాళ్ళయిన; అమరులు+ఎల్లన్= దేవతలంతా; అమర+ఆపగా, సమీపంబునకున్= దేవనది యైన గంగానదిదగ్గరకు; చనునప్పుడు= వెళ్ళునప్పుడు; తత్+సలిల, మధ్యంబునన్= ఆ నీళ్ళనడుమ; ఒక్క; కన్య; ఏడ్చుచున్+ఉన్నన్; దాని, కన్నీళ్ళు= ఆమె కన్నీరు; కనక, కమలంబులు+అయినన్= బంగారుతామరలు కాగా; చూచి= కనుగొని; వేల్పులున్= దేవతలును; తానును= తాను; విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; ఇంద్రుఁడు; ఆ+కన్యక, ఒద్దకున్= ఆ కన్యదగ్గరకు; చని= వెళ్ళి; ఏడ్చెదవు= ఏడుస్తూ ఉన్నావు; ఎందులదానవు= ఎక్కడిదానవు; అని, అడిగినన్= అని అడుగగా; అది= ఆమె; ఇంద్రునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని బ్రహ్మదేవుడు పల్కగా, దేవతలంతా వెనుదిరిగి, దేవేంద్రుడు ముందు నడువగా గంగానది దగ్గరకు వెళ్లాడు. ఆ సమయంలో ఆ నీటిమధ్యలో ఒకకన్య యేడుస్తుండగా, ఆమెకన్నీళ్లు బంగారుతామరలు కావటంచూచి, దేవతలూ, ఇంద్రుడూ ఆశ్చర్యపడ్డారు. ఆకన్యదగ్గరికి వెళ్ళి 'ఎందుకు ఏడుస్తున్నావు? ఏ ప్రదేశానికి చెందినదానవు?' అని అడుగగా ఆమె ఇంద్రునితో ఇట్లా పలికింది.

**ఆ. 'నాదు రోదనంబు, నన్ను నెఱుంగఁగ । వలతయేని యమరవల్లభుండ!**
**నా పిఱుంద రమ్ము' నావుడు నప్ప డ । వ్వనితపజ్జ నరిగె వాసవుండు. 271**

**ప్రతిపదార్థం:** నాదు, రోదనంబున్= నా ఏడ్పును; నన్నున్; ఎఱుంగఁగన్= తెలిసికొనటానికి; వలతు+అ, ఏని= కోరుదువేని; అమర, వల్లభుండ!= దేవతల రాజైన ఓ దేవేంద్రా!; నా పిఱుందన్= నా వెంట రమ్ము; నావుడున్= అని అనగా; వాసవుండు= దేవేంద్రుడు; అప్పుడు; ఆ+వనిత, పజ్జన్= ఆ కన్యవెంబడి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'దేవేంద్రా! నా దుఃఖాన్నిగురించి, నన్నుగురించి తెలిసికొనా లనుకుంటే, నావెంట రమ్ము!' అని ఆ కన్య చెప్పగా దేవేంద్రుడు ఆమెను అనుసరించి వెళ్లాడు.

**వ. ఇ ట్లక్కన్యక పిఱుంద నరుగువాఁడు ముందఱ హిమవదచలకందరారచితరత్నవేదికాతలంబున సింహాసనాసీనుం డయి తరుణరూపంబున నొక్కతరుణితో జూదం బాడుచున్న యాదిదేవుం గని తరుణుండ కా వగచి సురపతి కరం బలిగి యి ట్లనియె. 272**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ఆ+కన్యక పిఱుందన్= ఆ కన్య వెంట; అరుగువాఁడు= వెళ్తున్న దేవేంద్రుడు; ముందఱ= ఎదుట; హిమవత్+అచల, కందరా, రచిత, రత్న, వేదికా, తలంబునన్= హిమాలయపర్వతముయొక్క గుహయందు రూపొందించబడిన రత్నపుటరుగుమీద; సింహాసన+ఆసీనుండు+అయి= సింహాసనంమీద కూర్చున్నవాడై; తరుణ, రూపంబునన్= యౌవనంలో ఉన్న వాని రూపమున; ఒక్క+తరుణితోన్= యౌవనంలో ఉన్న ఒక కాంతతో; జూదంబు+ఆడుచున్+ఉన్న= జూదం ఆడుతూ ఉండే; ఆదిదేవున్= శివుడిని; కని= చూచి; తరుణుండు+అకా= యౌవనంలో ఉన్నవాడు అని; వగచి= తలచి; సుర, పతి= దేవేంద్రుడు; కరంబు= మిక్కిలి; అలిగి= కోపించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ కన్యకవెంట వెళ్తూ దేవేంద్రుడు - ఎదుట హిమాలయపర్వతగుహలో నిర్మించబడిన రత్నపుటరుగుమీద సింహాసనంపై కూర్చొని యువకునిరూపంలో ఒక యువతితో జూదమాడుతున్న పరమేశ్వరుడిని చూచి, అతడిని సాధారణయువకుడు అని భావించి, దేవేంద్రుడు మిక్కిలి కోపించి ఇట్లా అన్నాడు.

**మ. అమితస్థావరజంగమం బయిన బ్రహ్మాండంబు దా నింతయున్**
**మమతాగోచర మీ త్రిలోకములు నస్మద్బాహువజ్రానుపా**
**ల్యము ; లే నింద్రుఁడ; నిట్టి న న్నుఱక లీలన్ జూదమాడంగ ను**
**త్తమసింహాసన మెక్క నీకుఁ జనునే దర్పించి నాముందటన్. 273**

**ప్రతిపదార్థం:** అమిత, స్థావర, జంగమంబు+అయిన= అంతులేని స్థావరాలు (కదలిక లేనివి); జంగమాలు (కదలిక కలవి) కలదైన; బ్రహ్మాండంబు= బ్రహ్మాండము; తాన్= తాను; ఇంతయున్= అంతా; మమతా గోచరము= నాదిగా అగుపించునట్టి;

ఈ, త్రిలోకములున్= ఈమూడులోకాలూ; అస్మత్+బాహు, వజ్ర+అనుపాల్యములు= నా చేతిలోని వజ్రాయుధంచేత పాలించదగినవి; ఏన్= నేను; ఇంద్రుఁడన్= ఇంద్రుణ్ణి; ఇట్టి= ఇటువంటి; నన్నున్= నన్ను; ఉఱక= లెక్కపెట్టక; దర్పించి= గర్వించి; నా, ముందటన్= నా ఎదుట; ఉత్తమ, సింహాసనము; ఎక్కన్= ఎక్కటానికి; లీలన్= విలాసంగా; జూదము+ఆడంగన్= జూదమాడటానికి; నీకున్+చనునే= నీకు తగునా!

**తాత్పర్యం:** అంతులేని స్థావరజంగమాలతో నిండిన ఈ బ్రహ్మాండమంతా నాది. ఈ మూడులోకాలు నా చేతి వజ్రాయుధంతో పాలించబడుతూ ఉన్నాయి. నేను దేవేంద్రుడిని. ఇటువంటి నన్ను లెక్కపెట్టక, గర్వించి నా యెదుట విలాసంగా జూదమాడటం, పెద్దసింహాసన మెక్కటం నీకు తగునా?

**వ. అనిన రుద్రుం డలిగి రౌద్రాకారంబున వానిం జూచి 'మదీయ క్రీడారసభంగంబుఁ జేసిన యిద్దుర్మదుం బట్టి తె' మ్మని య క్కన్యకం బంచిన నప్పుడు దానికరస్పర్శనంబున విచేష్టితుం డయి మహీతలంబుపయిం బడిన యయ్యింద్రునకు రుద్రుం డి ట్లనియె. 274**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; రుద్రుండు= శివుడు; అలిగి= కోపించి; రౌద్ర+ఆకారంబునన్= భయంకరమైన రూపంతో; వానిన్= ఆ దేవేంద్రుడిని; చూచి; మదీయ, క్రీడా, రస, భంగంబున్= నా యొక్క ఆటయందలి ఆనందానికి ఆటంకం; చేసిన= కలిగించిన; ఈ+దుర్మదున్= ఈ పొగరుబోతును; పట్టితెమ్ము+అని= పట్టి తీసుకొని రా అని; ఆ+కన్యకన్= ఆ కన్యను; పంచినన్= పంపగా; అప్పుడు; దాని, కర, స్పర్శనంబునన్= ఆమెచేతితాకిడిచేత; విచేష్టింతుడు+అయి= చేష్టలు కోల్పోయినవా డై; మహీతలంబు, పయిన్= నేలమీద; పడిన= పడిపోయిన; ఆ+ఇంద్రునకున్; రుద్రుండు= పరమేశ్వరుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని దేవేంద్రుడు పల్కగా శివుడు కోపించి, భయంకరమైన ఆకారంతో అతణ్ణి చూచి 'నా ఆటలోని ఆనందాన్ని ఆటంకపరచిన ఈ పొగరుబోతును పట్టి తె'మ్మని ఆ కన్యను పంపగా, అప్పు డామె చేతిస్పర్శతో చేష్టలు లేనివాడై నేలమీద పడిన ఇంద్రునితో శివుడు ఇట్లా అన్నాడు.

**క. 'గర్వించి పలికి, తగు, నీ । గర్వము భుజవీర్యమును బ్రకాశంబుగ నీ**
**పర్వతవివరము దెర్చి వి । గుర్వింపుము చూత' మనిన గోత్రభిదుండున్. 275**

**ప్రతిపదార్థం:** గర్వించి= దర్పించి -పొగరుగలిగి; పలికితి= పలికితివి; అగున్= అట్లే అగుగాక; నీ, గర్వము; భుజ, వీర్యమును= బాహుబలమును; ప్రకాశంబుగన్= వెల్లడి అయ్యేటట్లు; ఈ పర్వత, వివరము= ఈ పర్వతంయొక్క రంధ్రం; తెర్చి= తెరచి; విగుర్వింపుము= విరువుము; చూతము= చూస్తాము; అనినన్= అని పలుకగా; గోత్రభిదుండున్= పర్వతాలయొక్కరెక్కలను విరిచిన దేవేంద్రుడు.

**తాత్పర్యం:** 'గర్వంతో మాట్లాడావు. నీ గర్వం, బాహుబలం వెల్లడి అయ్యేటట్లు ఈ పర్వతరంధ్రాన్ని తెరచి, విరువుము చూద్దాం' అని శివుడు పల్కగా, దేవేంద్రుడు.

**విశేషం:** 'వివరము' అనే పదానికి బదులు కొన్నిప్రతులలో ఉన్న 'శిఖరము' అనే పాంఠాంతరం మేల్తర మనిపిస్తుంది. 'తెర్చి' అనే దానికి 'తీర్చి' అనే పాంఠాంతరం ఉంది. వివరాన్ని విరవటం కంటె శిఖరాన్ని విరవటం సమంజసం. 'శిఖరం బెత్తి

విగుర్వింపుము' అనే పాఠం అన్నిటికంటె స్పష్టార్థాన్ని కలిగివున్నది. కాని శివు డున్నది గుహలో కనుక ఇక్కడ 'వివరము' అనే పాఠాన్నే గ్రహించటం జరిగింది.

**సీ. హరువచనమున నా గిరిరాజవివరంబు । గరములఁ బట్టి చెచ్చెర దినేశ**
**చండమయూఖముల్ రెండు విధంబు లై । యుండంగఁ దెర్చి యాఖండలుండు**
**దనయట్టివారల ఘనశరీరుల నందు । నలువుర నన్యుల వెలయఁ జూచి,**
**'యే నిట్టు లేలొకో యేనుప్రకారంబు । లయితి నిం?' దనుచు విస్మయముఁ బొంది**

**ఆ. యున్నఁ జూచి హరుఁడు గ్రన్న నయ్యింద్రుల । నేవురను మహానుభావ మెసఁగ**
**మనుజయోనిఁ బుట్టుఁ డని పంచె గీర్వాణ । హితము సేయుపొంటె మతిఁ దలంచి. 276**

**ప్రతిపదార్థం:** హరు, వచనమునన్= శివునియొక్క మాటచేత; ఆ, గిరి, రాజ, వివరంబు= ఆ పర్వత శ్రేష్ఠంయొక్క రంధ్రమును; కరములన్+పట్టి= చేతులతో పట్టుకొని; చెరన్+చెరన్ = వేగమే; దిన+ఈశ, చండ, మయూఖముల్= సూర్యునియొక్క వేడికిరణాలు; రెండు; విధంబులు+ఐ= రెండు పాయలై; ఉండంగన్= ఉండగా; తెర్చి= తెరచి; ఆఖండలుండు= దేవేంద్రుడు; తన అట్టి, వారలన్; ఘన, శరీరులన్= గొప్ప శరీరాలు కలవారిని; నలువురన్= నలుగురిని; అన్యులన్= ఇతరులను; అందున్= ఆ రంధ్రమునందు; వెలయన్= మెరయగా; చూచి; ఏను= నేను; ఇట్టులన్; ఏల+ఒకో= ఎందుచేతనో; ఏను, ప్రకారంబులు= అయిదువిధాలు; ఇందున్= ఇచ్చట; అయితిన్= అయినాను; అనుచున్; విస్మయమున్= ఆశ్చర్యాన్ని; పొంది= పొంది; ఉన్నన్= ఉండగా; చూచి= కనుగొని; హరుఁడు= శివుడు; క్రన్నన్= వెంటనే; ఆ+ఇంద్రులన్, ఏవురను= ఆ ఇంద్రులను ఐదుగురను; మహా+అనుభావము= గొప్ప వ్యక్తిత్వము; ఎసఁగన్= అతిశయించగా; మనుజ, యోనిన్= మానవస్త్రీయందు పుట్టుడు; అని; గీర్వాణ, హితము= దేవతలకు మేలు; చేయు, పొంటెన్= చేయుటకొరకు; మతిన్= బుద్ధియందు; తలంచి= భావించి; పంచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** శివుని మాటప్రకారం దేవేంద్రుడు ఆ పర్వతరంధ్రాన్ని రెండుచేతులతో పట్టుకొని సూర్యుని కిరణాలు రెండుపాయలైనట్లుగా తెరచి, ఆ రంధ్రంలో తనవలె గొప్పశరీరంకలవాళ్ళు మరో నలుగురు వెలుగుతుండటం చూచి, 'నే నెందుకు అయిదువిధాలుగా అయ్యా' నని ఆశ్చర్యపడగా, శివుడు వెంటనే ఆ ఇంద్రులైదుగురిని దేవతల మేలు కోరి, 'మానవస్త్రీయందు మహానుభావులుగా జన్మించండి' అని ఆజ్ఞాపించాడు.

**వ. 'వారలు ధర్మానిలశక్రాశ్వినులు దమకు నాధారకర్తలుగా ధర్మజభీమార్జుననకులసహదేవు లనంగాఁ బుట్టిరి; కమలభవప్రముఖనిఖిలసురగణప్రార్థితుం డయి నారాయణుసితాసితకేశద్వయంబు బలదేవవాసుదేవు లై దేవహితార్థం బుద్భవించిన, నందు వాసుదేవుండు వారలకుఁ గార్యసహాయం డయ్యె; నయ్యింద్రుల కేవురకును నేకపత్నిగాఁ దపంబుసేసి శ్రీమూర్తి యయిన యాజ్ఞసేని యజ్ఞవేదిం బుట్టె; నమ్మవేని వీరల పూర్వదేహంబులఁ జూడు' మని కృష్ణద్వైపాయనుండు ద్రుపదునకు దివ్యదృష్టి యిచ్చి చూపిన. 277**

**ప్రతిపదార్థం:** వారలు= వాళ్లు; ధర్మ+అనిల, శక్ర+అశ్వినులు= యముడు, వాయుదేవుడు, ఇంద్రుడు, అశ్వినీదేవతలు; తమకున్, ఆధారకర్తలుగా; ధర్మజ, భీమ+అర్జున, నకుల, సహదేవులు; అనన్+కాన్= అనే పేర్లతో; పుట్టిరి; కమలభవ, ప్రముఖ, నిఖిల, సురగణ, ప్రార్థితుండు+అయి= పద్మంనుండి జన్మించిన బ్రహ్మ మొదలైన అందరు దేవతల సమూహంచేత

ప్రార్థింపబడినవాడై; నారాయణు, సిత+అసిత, కేశ, ద్వయంబు= విష్ణుమూర్తి యొక్క తెల్లని, నల్లని వెంట్రుకల జంట; బలదేవ, వాసుదేవులు+ఐ= బలరామశ్రీకృష్ణు లై; దేవహిత+అర్థంబు= దేవతలమేలుకొరకు; ఉద్భవించెన్= పుట్టగా; అందున్= వారిలో; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; వారలకున్= వారికి; కార్య సహాయుండు= కార్యాలందు సాయం చేసేవాడు; అయ్యెన్= అయినాడు; ఆ+ఇంద్రులకు; ఏవురకున్= ఆ ఇంద్రులైన ఐదుగురికి; ఏకపత్నిగాన్= ఒకే భార్యగా; తపంబు; చేసి, శ్రీమూర్తి, అయిన= లక్ష్మీదేవి ఆకారమైన; యాజ్ఞసేని= ద్రౌపది; యజ్ఞవేదిన్= యజ్ఞ వేదికలో ; పుట్టెన్= జన్మించింది; నమ్మవు+ఏని= నమ్మకున్నచో; వీరల, పూర్వ, దేహంబులన్= వీళ్ల ముందటి శరీరాలు; చూడుము+అని; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; ద్రుపదునకున్= ద్రుపదునికి; దివ్య, దృష్టి, ఇచ్చి, చూపి= దివ్యదృష్టి ప్రసాదించి చూపి.

**తాత్పర్యం:** ఆ అయిదుగురు ఇంద్రులు యముడు, వాయుదేవుడు, ఇంద్రుడు, అశ్వినీదేవతలు ఆధార కర్తలుగా ధర్మజ భీమార్జున నకులసహదేవులు అనే పేర్లతో జన్మించారు. బ్రహ్మాదిదేవత లంతా ప్రార్థింపగా విష్ణుమూర్తి యొక్క తెల్లని నల్లని వెంట్రుకల జంట, దేవతల మేలుకొరకు బలరామకృష్ణులుగా అవతరించారు. వారిలో శ్రీకృష్ణుడు ఆ అయిదుగురికి వాళ్ళపనులలో సాయంచేసేవా డయ్యాడు. ఆ అయిదుగురు ఇంద్రులకు ఒకే భార్యగా తపస్సుచేసి లక్ష్మీస్వరూపురాలైన యాజ్ఞసేని (ద్రౌపది) యజ్ఞవేదిలో జన్మించింది. నీకు నమ్మకం లేకుంటే వీళ్ళ పూర్వదేహాలు చూడు' అని వ్యాసుడు ద్రుపదునికి దివ్యదృష్టి నిచ్చి చూపాడు.

**ఉ. చారు మణి ప్రభా పటల జాల విచిత్ర కిరీట మాలికా**
**భారములన్ సముద్యదినపావక వర్ణములన్ సువర్ణకే**
**యూర విభూషణావళుల నొప్పుచునున్న తదీయదేహముల్**
**ధీరుఁడు సూచెఁ దాళసమదీర్ఘతఁ బొల్చినవాని నేనిటిన్. 278**

**ప్రతిపదార్థం:** చారు, మణి, ప్రభా, పటల, జాల విచిత్ర, కిరీట, మాలికా, భారములన్= అందమైన రత్నాలకాంతి సమూహాల వలలచే మిక్కిలి చిత్రమైన రంగులు కల కిరీటాలయొక్క, దండలయొక్క బరువులచేత; సముద్యత్+ఇన, పావక, వర్ణములన్= లెస్సగా ప్రకాశించే సూర్యునియొక్క, అగ్నియొక్క రూపాలచేత; సువర్ణ కేయూర, విభూషణ+ఆవళులన్= బంగారు సందె కడియంవంటి ఆభరణసమూహాలచేత; ఒప్పుచున్+ఉన్న= ప్రకాశిస్తూ ఉండే; తదీయ, దేహముల్= వారియొక్క శరీరాలు; తాళ, సమ, దీర్ఘతన్= తాటిచెట్టుతో సమానమైన పొడవుతో; పొల్చిన, వానిన్= ఒప్పిన వాటిని; ఏనిటిన్= ఐదింటిని; ధీరుఁడు= ధైర్యశాలి, ద్రుపదుడు; చూచెన్.

**తాత్పర్యం:** అందమైనరత్నకాంతిసమూహాలవలలచే మిక్కిలిచిత్రమైనరంగులు కల కిరీటాల, దండల భారాలతో, లెస్సగా ప్రకాశించే సూర్యునివంటి, అగ్నివంటిరూపాలతో, బంగారు సందెకడియాలవంటి ఆభరణాలతో ఒప్పుతూ, తాటిచెట్టంత పొడవైన వాళ్ళ దేహా లైదింటిని ద్రుపదుడు చూచాడు.

**వ. మఱియు సకలలావణ్యమూర్తి యై వారల కేవురకుఁ బత్నిగాఁ దపంబు సేసిన యక్కన్యకపూర్వదేహంబును జూచి విస్మితుం డయి హర్షించి యున్న ద్రుపదునకు వెండియుం గృష్ణద్వైపాయనుం డి ట్లనియెఁ; 'దొల్లి నితంతుం డను రాజర్షికొడుకు లనంతబలపరాక్రములు సాల్వేయ శూరసేన శ్రుతసేన బిందుసారాతిసారు లను వా రేవురుం బరస్పర స్నేహవినయంబుల నతిప్రసిద్ధు లయి పెరుఁగుచు నౌశీనరపతి కన్యక నజిత యను దాని స్వయం వరంబునఁ బడసి వివాహం బయి. 279**

**ప్రతిపదార్థం:** మఱియున్; సకల, లావణ్య, మూర్తి+ఐ= సమస్తసౌందర్యంయొక్క స్వరూపమై; వారలకున్; ఏవురకున్= ఐదుగురకు; పత్ని, కాన్= భార్య అగుటకు; తపంబు, చేసి,= తపస్సు కావించి; ఆ+కన్యక, పూర్వ, దేహంబును= ఆ కన్యకయొక్క (తొలుతటి ఇంద్రసేన, ఇప్పటి కృష్ణ) మొదటిశరీరాన్ని; చూచి; విస్మితుండు+అయి= ఆశ్చర్యపడినవా డై; హర్షించి= సంతోషించి; ఉన్న= ఉండు; ద్రుపదునకున్; వెండియున్= మరల; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; ఇట్లు+అనియెన్; తొల్లి= పూర్వం; నితంతుండు+అను= నితంతుడు అనే పేరుగల; రాజర్షి= రాజర్షియొక్క; కొడుకులు; అనంత, బల, పరాక్రములు= అంతులేని బలం, పరాక్రమం కలవారు; సాల్వేయ= శూరసేన, శ్రుతసేన, బిందుసార+అతిసారులు; అనువారు; ఏవురున్= ఐదుగురును; పరస్పర, స్నేహ, వినయంబులన్= ఒకరిమీద మరొకరికి కల ప్రేమ; వినయాలతో; అతి, ప్రసిద్ధులు; అయి, పెరుఁగుచు; ఔశీనరపతి= ఔశీనరపతి యొక్క; కన్యకన్= కన్యను; అజిత; అను, దానిన్= అనుదానిని; స్వయంవరంబునన్; పడసి= పొంది; వివాహంబు+అయి= పెండ్లాడి.

**తాత్పర్యం:** అంతేగాక, సమస్త సౌందర్యం రూపుదాల్చిం దై, ఆ అయిదుగురికి భార్య కావటానికి తపస్సు చేసిన ఆ కన్యయొక్కమొదటిదేహాన్ని చూచి ఆశ్చర్యపడి, సంతోషించి ఉన్నద్రుపదునితో మరల వ్యాసుడు ఇట్లా అన్నాడు. ' పూర్వం నితంతు డనే రాజర్షికుమారులు సాల్వేయ, శూరసేన, శ్రుతసేన, బిందుసార, అతిసారు లైదుగురు అంతులేని బలపరాక్రమాలు కలవాళ్ళు. వాళ్ళు పరస్పరం ప్రేమ, వినయం కలిగి మహాప్రసిద్ధు లై పెరుగుతూ ఔశీనరపతిపుత్రికను స్వయంవరంలో పొంది వివాహమాడారు.

**విశేషం:** 'నితంతుడు' అనే పేరుకు బదులు కొన్ని ప్రతులలో సితతంతుడు, శిలావంతుడు అనే పేర్లు ఉన్నాయి. అట్లే బిందుసారుడికి బదులుగా తిందుసారుడు, అతిసారునికి బదులుగా అద్రిసారుడు అనే పాఠాలు శ్రీ పి.పి.యస్.శాస్త్రి గారి సంస్కృత భారతప్రతిలో ఉన్నాయి.

**క. కాంతి విశేష విలాసా । నంతశ్రీఁ దనరు నజితయం దనఘులు నై**
**తంతువు లేవురుఁ బడసిరి । సంతానము వేఱువేఱ సత్కుల మెసఁగన్. 280**

**ప్రతిపదార్థం:** కాంతి, విశేష, విలాస+అనంత శ్రీన్= అధికకాంతియొక్క విలాసంయొక్క అంతులేని సంపదతో; తనరు= ఒప్పు; అజిత, అందున్= ఆ అజితలో; అనఘులు= పాపరహితులైన వాళ్ళు; నైతంతువులు= నితంతుని కుమారులు; ఏవురున్= ఐదుగురును; సత్+కులము= మంచివంశం; ఎసఁగన్= వృద్ధిపొందగా; వేఱు వేఱు+అ= విడివిడిగా; సంతానము; పడసిరి= పొందారు.

**తాత్పర్యం:** అధికకాంతి, విలాసాలు - అనే అంతులేని సంపదతో ప్రకాశంతో ఆ అజితయందు, పుణ్యాత్ములైన నితంతునికుమారు లైదుగురు మంచివంశం వృద్ధి పొందేటట్లు విడివిడిగా సంతానాన్ని పొందారు.

**వ. 'తొల్లింటి మహాత్ములయందును నిట్టి చరితంబులు గలవుం గావున బాండవుల కేవురకు ద్రౌపదిం గ్రమంబునఁ బాణిగ్రహంబు సేయింపు; మిది మన చేసినయది గాదు; దైవాధిష్ఠితం' బని ద్రుపదు నొడంబఱచి కుంతియుఁ, బాండవులు నున్న చోటికి ద్రుపద సహితుం డయి కృష్ణద్వైపాయనుండు వచ్చి యుధిష్ఠిరున కి ట్లనియె. 281**

**ప్రతిపదార్థం:** తొల్లింటి= పూర్వపు; మహా+ఆత్ముల అందునున్= మహాత్ముల యందుకూడా; ఇట్టి; చరితంబులు; కలవు; కావునన్; పాండవులకున్; ఏవురకున్= ఐదుగురికి; ద్రౌపదిన్= ద్రౌపదిని; క్రమంబునన్= వరుసగా; పాణి, గ్రహణంబు=

వివాహం; చేయింపుము= జరిపించు; ఇది, మన, చేసిన, అది= ఇది మనం చేసింది; కాదు; దైవ+అధిష్ఠితంబు= దైవము నాశ్రయించింది - అనగా దేవునిచేత చేయబడింది; అని= అని; ద్రుపదున్= ద్రుపదుణ్ణి; ఒడంబఱచి= ఒప్పించి; కుంతియున్; పాండవులున్, ఉన్న; చోటికిన్; ద్రుపద, సహితుండు+అయి= ద్రుపదునితో కూడినవాడై; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; వచ్చి; యుధిష్ఠిరునకున్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'పూర్వపుమహాత్ములలోకూడ ఇటువంటిచరిత్ర లున్నాయి. అందువలన పాండవు లైదుగురికి ద్రౌపది నిచ్చి వరుసగా వివాహం జరిపించుము. ఇది మనం చేసింది కాదు. దైవనిర్ణయం' అని ద్రుపదుడిని ఒప్పించి వ్యాసుడు అతనితోకూడ కుంతీపాండవు లున్నచోటికి వెళ్లి, ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

## ద్రౌపదీవివాహమహోత్సవము (1-190-5)

**ఆ. నేఁడు పుణ్యదినము నెమ్మితో రోహిణీ। యుక్తుఁ డయి శశాంకుఁ డున్నవాఁడు;**
**మంత్రవంతముగఁ గ్రమంబున నేవురుఁ। బెండ్లియగుఁడు కృష్ణఁ బ్రీతితోడ. 282**

**ప్రతిపదార్థం:** నేఁడు= ఈ దినం; పుణ్య, దినము; నెమ్మితో= ప్రేమతో; శశాంకుఁడు= కుందేలును గుర్తుగా కల చంద్రుడు; రోహిణీ; యుక్తుడుఁ+అయి= రోహిణీ నక్షత్రంతో కూడి; ఉన్నవాఁడు= ఉన్నాడు; మంత్రవంతముగన్= మంత్రాలతో; ఏవురున్= ఐదుగురూ; ప్రీతితోడన్= సంతోషంతో; కృష్ణన్= ద్రౌపదిని; క్రమంబుగన్= వరుసగా; పెండ్లి, అగుడు= పెండ్లి చేసికొనండి.

**తాత్పర్యం:** ఈ రోజు పుణ్యదినం. చంద్రుడు ప్రేమతో రోహిణీనక్షత్రాన్ని కూడి ఉన్నాడు. మంత్రయుక్తంగా మీ రైదుగురు సంతోషంగా ద్రౌపదిని వివాహం చేసికొనండి.

**విశేషం:** వ్యాసమహర్షి ద్రుపదరాజుకు ద్రౌపదీపాండవుల పుట్టుక వెనుక ఉన్న దివ్యరహస్యాలు తెలియచెప్పాడు. వాటిని దర్శించటానికి అవసరమైన దివ్యదృష్టిని అనుగ్రహించాడు. ఇదివరలో కూడ ఇటువంటిది ఉన్న దని ఒక ఉదాహరణ ఇచ్చాడు. ఆ కన్యాదాత మనస్సును ఆవరించిన అనుమానతిమిరాన్ని పూర్తిగా తొలగించాడు. 'గతం న శోచామి కృతం స్మరామి' అన్నట్లు కర్తవ్యాన్ని నిర్ణయించాడు. ద్రౌపదీ వివాహానికి ఆటంకమే లేని రాచబాట వేశాడు. ధర్మజుని తీర్పే వ్యాసుని తీర్పుకావటం, ధర్మజుని స్థాయి మరో మెట్టు ఈ ఘట్టంలో పెరగటం విశేషం.

**వ. అని నిశ్చయించి పంచినం బాంచాలపతియును గరం బనురాగంబునఁ బురం బష్టశోభనంబు సేయించి, సమారబ్ధవివాహమహోత్సవుం డయ్యె; నంత నిరంతర క్రముకకదళీస్తంభ శుంభత్సంభృత నవామ్రాశ్వత్థ పల్లవ మాలాలంకృత ద్వారతోరణంబులను, జందనోదక సంస్తిక ప్రాంగణ రంగవల్లీ కృత కర్పూరమౌక్తిక ప్రకరంబులను, గౌతుకోత్సవమంగళశృంగార వారాంగనా ప్రవర్త్యమాన స్వనియోగకృత్యంబులను, నుత్సవ సందర్శనాగతానేకరాజన్య సుహృద్బాంధవబ్రాహ్మణ సంకులంబుననుం జేసి యొప్పుచున్న ద్రుపదరాజ మందిరంబునం బూర్వోత్తర దిగ్భాగంబున విచిత్రనేత్ర వితత వితాన ముక్త మౌక్తిక కుసుమ మాలాలంబనాభిరామంబును, సమీచీన చీనాంశుక విరచితస్తంభ వేష్టనంబును, బ్రత్యగ్ర పల్లవ శాల్యక్షతాంచిత కాంచన పూర్ణ కలశోపశోభితంబును, లాజాజ్య సంపూర్ణ సౌవర్ణ పాత్ర నవసౌరభ బహువిధపుష్ప సమిత్కుశాశ్మశమ్యాభిరమ్యంబును, నవగోమయ శ్యామ మరకత మణి ప్రభాపటల**

**విలిప్త హిరణ్మయవేదీమధ్యసమిద్ధాగ్నికుండమండితంబును, సర్వాలంకారసుందరంబును నయిన వివాహ మంటపంబునకుం జని నిజ పురోహితుం డయిన ధౌమ్యుం డాదిగా ననేకవిద్వన్మహీసుర నివహంబుతోఁ గరం బొప్పి. 283**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; నిశ్చయించి; పంచినన్= ఆజ్ఞాపించగా; పాంచాల, పతియును= ద్రుపదుడును; కరంబు= మిక్కిలి; అనురాగంబునన్= ప్రీతితో; పురంబున్= నగరాన్ని; అష్టశోభనంబు= ఎనిమిదివిధాల మంగళాలంకారం; చేయించి; సమారబ్ధ, వివాహ, మహా+ఉత్సవుండు= చక్కగా ఆరంభింపబడిన వివాహమహోత్సవం కలవాడు; అయ్యెన్= అయ్యాడు; అంత= అప్పుడు; నిరంతర, క్రముక, కదళీస్తంభ, శుంభత్+సంభృత, నవ+ఆమ్ర+అశ్వత్థ, పల్లవ, మాలా+అలంకృత, ద్వారతోరణంబులను= ఎడతెగని పోకల అరటుల స్తంభాలందు ప్రకాశిస్తూ నిండుగా భరింపబడిన క్రొత్త మామిడి, రావి చివుళ్ళ దండనల చేత అలంకరింపబడిన లోపలి వెలుపలి ద్వారాలచేత; చందన+ఉదక, సంసిక్త, ప్రాంగణ, రంగవల్లీకృత, కర్పూర మౌక్తిక ప్రకరంబులను= మంచి గంధపు నీటిచేత చక్కగా తడుపబడిన ముంగిళ్ళయందు ముగ్గులుగా చేయబడిన పచ్చకర్పూరాలయొక్క, ముత్యాలయొక్క సమూహాలచేత; కౌతుక+ఉత్సవ, మంగళ, శృంగార, వార+అంగనా, ప్రవర్త్యమాన, స్వనియోగ, కృత్యంబులను= వివాహ మహోత్సవంకొరకైన మంగళాలంకారాలు కల వేశ్యలచే చేయబడుతున్న, తమకు నియ మింపబడిన పనులచేత; ఉత్సవ, సందర్శన+ఆగత+అనేక, రాజన్య, సుహృత్+బాంధవ, బ్రాహ్మణ, సంకులంబునున్+చేసి= వివాహమహోత్సవాన్ని చూడటానికి వచ్చిన పెక్కుమంది రాజులతో, మిత్రులతో, బంధువులతో, బ్రాహ్మణులతో క్రిక్కిరియటంచేత; ఒప్పుచు+ఉన్న; ద్రుపదరాజు, మందిరంబునన్= ద్రుపదరాజుయొక్క ఇంటిముందు; పూర్వ+ఉత్తర, దిక్+భాగంబునన్= ఈశాన్యదిక్కునందు; విచిత్ర, నేత్ర, వితత, వితాన, ముక్త, మౌక్తిక, కుసుమ, మాలా+ఆలంబన+అభిరామంబును= రంగురంగుల వస్త్రాలయొక్క విశాలాలైన మేల్కట్లనుండి క్రిందికి విడువబడిన ముత్యాలయొక్క పూలయొక్క దండలు వ్రేలాడటంచేత మనోహరమైనదీ; సమీచీన, చీన+అంశుక, విరచిత, స్తంభ, వేష్టనంబును= చక్కని పట్టువస్త్రాలచేత కల్పించబడిన స్తంభపు చుట్టు కలదీ; ప్రత్యగ్ర, పల్లవ, శాలి+అక్షత+అంచిత, కాంచన, పూర్ణ, కలశ+ఉపశోభితంబును= క్రొత్త చిగుళ్ళచేత, వరి అక్షతలచేత ఒప్పుచున్న బంగారు పూర్ణకలశాలచేత ప్రకాశిస్తున్నదీ; లాజ+ఆజ్య, సంపూర్ణ, సౌవర్ణ, పాత్ర, నవ, సౌరభ, బహువిధ, పుష్ప, సమిత్, కుశ+అశ్మ, శమ్యా, అభిరమ్యంబును= పేలాలతో, నేతితో నిండిన బంగారు పాత్రలచేత, క్రొత్త వాసనలతో, దర్భలచేత, సన్నెకల్లుచేత, యజ్ఞపాత్రలచేత మనోహర మైనదీ; నవ, గోమయ, శ్యామ, మరకత, మణి, ప్రభా, పటల, విలిప్త, హిరణ్మయ, వేదీ, మధ్య, సమిద్ధ+అగ్ని కుండ, మండితంబును= క్రొత్త ఆవుపేడవలె నల్లనిమరకతమణుల కాంతిసమూహంచేత అలుకబడిన బంగారుపెండ్లిఅరుగునడుమ మండుతున్న హోమగుండంచేత అలంకరింపబడినదీ; సర్వ+ అలంకార, సుందరంబును= అన్ని అలంకారాలచేత అందమైనదీ అయిన, వివాహ మంటపంబునకున్; చని= వెళ్ళి; పురోహితుండు+అయిన= తనయొక్కపురోహితు డైన; ధౌమ్యుండు+ఆది, కాన్+అనేక, విద్వత్+మహీసుర, నివహంబుతోన్= ధౌమ్యుడు మొదలైన పెక్కుమంది పండితులగు బ్రాహ్మణసమూహంతో; కరంబు= మిక్కిలి; ఒప్పి= ప్రకాశించి.

**తాత్పర్యం:** అని నిర్ణయించి వ్యాసమహర్షి ఆజ్ఞాపించగా, ద్రుపదరాజుకూడ మిక్కిలిప్రీతితో పురానికి ఎనిమిది, విధా లైన మంగళాలంకారాలు చేయించి, వివాహమహోత్సవాన్ని చక్కగా ప్రారంభించాడు. అప్పుడు ఎడతెగని పోక, అరటిస్తంభాలతో, నిండుగా ధరించిన క్రొత్తమామిడి, రావిచివుళ్లదండలతో అలంకరించబడిన లోపలి వెలుపలి ద్వారాలతోను, మంచిగంధపునీటితో చక్కగా తడుపబడిన ముంగిళ్లలో ముగ్గులుగా చేయబడిన పచ్చకర్పూరాల, ముత్యాల సమూహాలతో, వివాహమహోత్సవంకొరకు కావించుకొన్న మంగళాలంకారాలు కల వేశ్యలు చేస్తున్న నియమితకార్యాలతో, వివాహమహోత్సవం చూడవచ్చిన పెక్కుమందిరాజులతో, మిత్రులతో, బంధువులతో, బ్రాహ్మణులతో క్రిక్కిరిసి శోభిల్లుతున్న ద్రుపదునిఇంటిలో - ఈశాన్యదిక్కున రంగు రంగులవస్త్రాలతో నిర్మించబడిన

విశాలమైన మేల్కట్లనుండి క్రిందికి విడువబడిన ముత్యాల పూలదండలు వ్రేలాడటంచేత మనోహర మైనదీ, చక్కని పట్టువస్త్రాలతో కల్పింపబడిన స్తంభపుచుట్లు కలదీ, క్రొత్తచివుళ్లతో, బియ్యపు అక్షతలతో ఒప్పుతున్న బంగారుపూర్ణకలశాలతో ప్రకాశిస్తున్నదీ, పేలాలతో నేతితో నిండిన బంగారుపాత్రలతో, క్రొత్త వాసనలతో కూడిన పెక్కువిధా లైన పువ్వులతో సమిధలతో, దర్భలతో, సన్నెకల్లుతో, యజ్ఞపాత్రలతో మనోహర మైనదీ, అప్పుడే పెట్టిన ఆవుపేడవలె నల్లనిమరకతమణుల కాంతిసమూహంతో అలుకబడిన బంగారు వివాహవేదికనడుమ మండుతున్న హోమకుండంచేత అలంకరింపబడినదీ, అన్ని అలంకారాలతో అందమైనదీ అయిన కల్యాణమంటపానికి వెళ్లి, తమ పురోహితుడైన ధౌమ్యుడు మొదలైన పెక్కుమంది పండిత బ్రాహ్మణసమూహంతో మిక్కిలి ఒప్పి.

**సీ. అనఘులు కృతమంగళాభిషేకులు, ధృత । సముచిత వేష ప్రశస్త రత్న**
**భూషణుల్, కౌరవపుంగవు లేవురు । నేతెంచి ; రంతఁ బూర్ణేందువదన**
**యధికవిదగ్ధ పుణ్యాంగనా విరచిత । లలిత ప్రసాధనాలంకృతాంగి**
**కమలాక్షి కమనీయకాంతాసహస్రంబు । తోఁ జనుదెంచె నాద్రుపదతనయ;**

**ఆ. భూరి భూసురేంద్ర పుణ్యాహరవమును । మంగళ ప్రగీత మధురరవము**
**వివిధతూర్యవేణు వీణారవంబును । విస్తరిల్లె దిశల విభవయుక్తి. 284**

**ప్రతిపదార్థం:** అనఘులు= పాపంలేనివారు; కృత, మంగళ+అభిషేకులు= చేయబడిన మంగళస్నానం కలవారు; ధృత, సముచిత, వేష, ప్రశస్త, రత్న, భూషణుల్= ధరించబడిన తగినవేషాలు, ప్రసిద్ధా లైన రత్నాభరణాలు కలవారు; కౌరవ, పుంగవులు= కురు వంశంలో పుట్టినవారిలో శ్రేష్ఠులైన పాండవులు; ఏవురున్= ఐదుగురు; ఏతెంచిరి= వచ్చారు; అంతన్= అప్పుడు; పూర్ణ+ఇందు, వదన= నిండు చంద్రునివంటి ముఖం కలది, అధిక, విదగ్ధ, పుణ్యాంగనా, విరచిత, లలిత, ప్రసాధన+అలంకృత+అంగి= మిక్కిలి నేర్పరు లైన ముత్తైదువులచేత కూర్చబడిన అంద మైన అలంకారాలచేత అలంకరించబడిన అవయవాలు కలది; కమల+అక్షి= కమలాలవంటి కన్నులు కలది; ఆ, ద్రుపద, తనయ= ఆ ద్రౌపది; కమనీయ, కాంతా, సహస్రంబుతోన్= అందమైన స్త్రీలు వేయిమందితో; చనుదెంచెన్= వచ్చెను; భూరి, భూసుర+ఇంద్ర, పుణ్యాహధ్వని= బ్రాహ్మణశ్రేష్ఠుల పుణ్యాహవచనాల అధికమైన ధ్వని; మంగళ, ప్రగీత, మధుర, రవము= మంగళగానాలయొక్క మధురమైన ధ్వని; వివిధ, తూర్య, వేణు, వీణా, రవంబును= వివిధాలైన వాద్యాలయొక్క, పిల్లనగ్రోవులయొక్క, వీణలయొక్క ధ్వని; విభవ, యుక్తిన్= వైభవంతో; దిశలన్=దిక్కులలో; విస్తరిల్లెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** పుణ్యాత్ములు, మంగళస్నానం చేసినవాళ్ళు, తగినవేషం, ప్రసిద్ధమైన రత్నాభరణాలు ధరించినవాళ్ళు, కురువంశశ్రేష్ఠులు అయిన పాండవులు అయిదుగురు వచ్చారు. అప్పుడు నిండుచంద్రుని ముఖంవంటి ముఖం కలది, మిక్కిలినేర్పరులైన ముత్తైదువులచేత అలంకరించబడిన అవయవాలు కలది, కమలాలవంటి కన్నులు కలది అయిన ద్రౌపది అందమైన స్త్రీలు వేయిమందితో కలిసి వచ్చింది. పెక్కుమంది బ్రాహ్మణశ్రేష్ఠుల పుణ్యాహధ్వని, మంగళగీతాల మధురధ్వని, పిల్లనగ్రోవుల, వీణల వివిధవాద్యాలధ్వని - మహావైభవంతో దిక్కులకు వ్యాపించాయి.

**క. వితత ప్రదక్షిణావ । ర్తితదీప్త శిఖానలమున ధృతి వేల్చెఁ బురో**
**హితుఁ డగు ధౌమ్యుఁడు బుధ స । మ్మతుఁడు వివాహప్రయుక్త మంత్రాహుతులన్. 285**

**ప్రతిపదార్థం:** బుధ, సమ్మతుఁడు= పండితులకు ఇష్టమైనవాడు; పురోహితుఁడు; అగు; ధౌమ్యుఁడు; వివాహ; ప్రయుక్త, మంత్ర+ ఆహుతులన్= పెండ్లికొరకు చేయవలసిన మంత్రపూర్వకా లైన ఆహుతులను; ధృతిన్= సంతోషంతో; వితత, ప్రదక్షిణ+ఆవర్తిత, దీప్త, శిఖా+అనలమునన్= విస్తరిల్లి ప్రదక్షిణంగా చుట్టు తిరిగిన వై మండు మంటలు కల అగ్నియందు; వేల్చెన్= దహనమయ్యేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** పండితులకు ఇష్టమైనవాడు, పురోహితుడు అయిన ధౌమ్యుడు వివాహసమయంలో చేయవలసిన మంత్రపూర్వకాలైన ఆహుతులను - విస్తరిల్లి ప్రదక్షిణంగా చుట్టు తిరిగి మండే మంటలున్న అగ్నిహోత్రంలో దహన మయ్యేటట్లు వేశాడు.

**విశేషం:** వేదధర్మోద్ధరణ మహాభారతరచనాలక్ష్యాలలో ప్రధానమైనది కనుక వైదికాంశాలు, వేదోక్త క్రియాకలాపాలు కథలో ఎక్కడ వచ్చినా నన్నయ విశేషించి ప్రవర్తిస్తాడు. వేదోక్తంగా సాగిన ద్రౌపదీపాండవుల వివాహవైభవవిపులవర్ణన అట్లాంటిదే.

**వ.** **ఇట్లు వేల్చి ముందఱ ధర్మపుత్రునకు ద్రుపదరాజపుత్త్రిం బాణిగ్రహణంబు సేయించి, తొల్లి యేవురకు వివాహంబు సేయునప్పుడు కన్యాత్వంబు దూషితంబు గాకుండ నీశ్వరువరంబునం గౌమారంబు వడసిన యక్కన్యకం గ్రమంబున భీమార్జున నకుల సహదేవులకుం బాణిగ్రహణంబు సేయించిన.** **286**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వేల్చి= ఆహుతులువేసి; ధర్మపుత్రునకున్; ద్రుపదరాజు; పుత్త్రిన్= ద్రౌపదిని; పాణిగ్రహణంబు= వివాహం; చేయించి; తొల్లి= పూర్వం; ఏవురకున్= ఐదుగురకు; వివాహంబు, చేయునప్పుడు; కన్యాత్వంబు= కన్నెరికం; దూషితంబు, కాకుండన్= చెడకుండ; ఈశ్వరు, వరంబునన్= ఈశ్వరుని వరముచే; కౌమారంబు= కన్యాత్వం; పడసిన= పొందిన; ఆ+కన్యకన్= ఆ కన్యను; క్రమంబునన్ =క్రమంగా; భీమ+అర్జున, నకుల, సహదేవులకున్; పాణిగ్రహణంబు= వివాహం; చేయించినన్= కావింపగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆహుతులువేసి, మొదట ధర్మజునికి ద్రౌపది నిచ్చి వివాహం చేయించాడు. అయిదుగురిని వివాహం చేసికొన్నా కన్యాత్వం చెడకుండ ఈశ్వరునివలన పూర్వం వరంపొందినద్రౌపది మళ్ళీ కన్యాత్వం పొందగా, ఆమెను వరుసగా భీమార్జుననకులసహదేవుల కిచ్చి వివాహం చేయించాడు. అప్పుడు.

**తే.** **జనుల ఆశీరవంబును జదలఁ దివురు । దేవ దుందుభినాదంబు దివ్యగంధ**
**మందగంధవహామోదమానకుసుమ । వృష్టియును మహాముదముతో విస్తరిల్లె.** **287**

**ప్రతిపదార్థం:** జనుల, ఆశీరవంబును= జనులయొక్క ఆశీర్వాదధ్వని; చదలన్= ఆకాశమున; తివురు= మ్రోగునట్టి; దేవ, దుందుభి, నాదంబు= దేవతల యొక్క భేరులయొక్క ధ్వని; దివ్య, గంధ, మంద, గంధవహ+ఆమోదమాన, కుసుమ, వృష్టియును= మంచివాసన కల మెల్లని గాలిచే పరిమళిస్తున్న పూలవాన; మహా, ముదముతోన్= మిక్కిలి సంతోషంతో; విస్తరిల్లెన్= అతిశయించాయి.

**తాత్పర్యం:** జనుల ఆశీర్వాద ధ్వని, ఆకాశంలో మ్రోగే దేవతల భేరుల ధ్వని, మంచివాసన కల మందమారుతంతో పరిమళించే పూలవాసన మిక్కిలిసంతోషంతో అతిశయించాయి.

**వ. అని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె నని. 288**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; వైశంపాయనుండు; జనమేజయునకున్= జనమేజయునికి; చెప్పెన్, అని= చెప్పాడని.

**తాత్పర్యం:** అని వైశంపాయనుడు జనమేజయునికి చెప్పా డని.

## ఆశ్వాసాంతము

**క. విద్యావిలాస ! పార్థివ । విద్యాధర ! నిఖిలరాజవిద్యానిధి ! శీ**
**తద్యుతి విశదయశః ప్రస । రద్యోతిత సర్వలోక! రాజమహేంద్రా! 289**

**ప్రతిపదార్థం:** విద్యా, విలాస= విద్యలచేత ప్రకాశించేవాడా!; పార్థివ, విద్యాధర=రాజులలో విద్యాధరుడైన జీమూతవాహనుని వంటివాడా! - అనగా మహాదాతా అని భావం; నిఖిల, రాజవిద్యా, నిధి= అన్ని రాజవిద్యలకు నిధియైనవాడా!; శీత, ద్యుతి, విశద, యశస్, ప్రసర, ద్యోతిత, సర్వలోక= చల్లనికాంతి కల చంద్రునివలె తెల్లనికీర్తియొక్క వ్యాప్తిచేత ప్రకాశింప చేయబడిన అన్ని లోకాలు కలవాడా!; రాజమహేంద్రా= ఓ రాజరాజ నరేంద్రా!

**తాత్పర్యం:** విద్యలలో ప్రకాశించేవాడా! రాజులలో విద్యాధరుడైన జీమూతవాహనునివంటివాడా! అన్ని రాజవిద్యలకు నిధివైనవాడా! చంద్రునివలె తెల్లని కీర్తియొక్క వ్యాప్తితో అన్నిలోకాలను ప్రకాశింప చేసినవాడా! ఓ రాజరాజ నరేంద్రా!

**స్వాగతము.**

**రాజరాజ ! గుణరాజిత ! రాజ । త్తేజ! రాజకులదీప ! విశిష్టాం**
**భోజమిత్ర! నృపపూజిత పాదాం । భోజ! భూవినుత! పుణ్యవరేణ్యా! 290**

**ప్రతిపదార్థం:** రాజరాజ!= రాజరాజుఅనే పేరుగలవాడా!; గుణ; రాజిత= మంచి గుణాలచేత ప్రకాశించేవాడా!; రాజత్+తేజ= ప్రకాశించే పరాక్రమం కలవాడా!; రాజ, కుల, దీప= రాజవంశంలో దీపమువంటివాడా!; విశిష్ట+అంభోజ, మిత్ర= సదాచార సంపన్నులు అనే కమలాలకు సూర్యుడి వంటివాడా!; నృప, పూజిత, పాద+అంభోజ= రాజులచేత పూజింపబడిన పద్మాలవంటి పాదాలు కలవాడా!; భూ, వినుత= లోకంచేత కొనియాడబడేవాడా!; పుణ్య, వరేణ్యా= పుణ్యాత్ములలో శ్రేష్ఠుడా!

**తాత్పర్యం:** రాజరాజ! మంచిగుణాలతో ప్రకాశించేవాడా! ప్రకాశించేపరాక్రమం కలవాడా! రాజవంశంలో దీపం వంటివాడా! సదాచారసంపన్నులు అనే కమలాలకు సూర్యునివంటివాడా! రాజుల పూజలందుకొన్న పాదపద్మాలు కలవాడా! లోకప్రశంసలు పొందినవాడా! పుణ్యాత్ములలో శ్రేష్ఠుడా!

**విశేషం:** ఈ వృత్తంలోని ప్రతిపాదంలో వరుసగా ర, న, భ, గగ అనే గణా లుంటాయి. 7వ అక్షరం యతిమైత్రి స్థానం.

**గద్యము.**

**ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబున ధృష్టద్యుమ్న ద్రౌపదీసంభవకథనంబును, గృష్ణద్వైపాయనసందర్శనంబును, గంగాతీరంబున నంగారపర్ణు నర్జునుండు**

**జయించుటయుఁ, దాపత్యవసిష్ఠౌర్వోపాఖ్యానంబును, ద్రౌపదీస్వయంవరంబును, బంచేంద్రోపాఖ్యానంబును, ద్రౌపదీవివాహంబును నన్నది సప్తమాశ్వాసము.** **291**

**తాత్పర్యం:** ఇది, సకలసత్కవుల ప్రశంస లందుకొన్న నన్నయభట్టు రచించిన శ్రీమహాభారతంలో మొదటిదైన ఆదిపర్వంలో - ధృష్టద్యుమ్నద్రౌపదుల జన్మనుగూర్చి చెప్పటం, వేదవ్యాసమహామునీంద్రులను దర్శించటం, గంగాతీరంలో అంగారపర్ణుడిని అర్జునుడు జయించటం, తపతీసంవరణ, వసిష్ఠ, ఔర్వుల కథాకథనం, ద్రౌపదీ స్వయంవరం, పంచేంద్రోపాఖ్యానం, ద్రౌపదీవివాహం - అనే అంశాలు కల ఏడవఆశ్వాసం.

ఆదిపర్వంలో సప్తమాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - అష్టమాశ్వాసము

**శ్రీవిభవనిత్యనిలయ! ద । యావర్ధితధారుణీసురాన్వయ ! వేంగీ**
**భూవల్లభ! నిఖిలజగ । త్పావనశుభచరిత! భావభవనిభసుభగా!** **1**

**ప్రతిపదార్థం:** శ్రీ, విభవ, నిత్య, నిలయ= ఐశ్వర్యాతిశయానికి శాశ్వతస్థానమైనవాడా!; దయా, వర్ధిత, ధారుణీసుర+అన్వయ= దయతో వృద్ధిపొందించబడిన బ్రాహ్మణవంశాలు కలవాడా!; వేంగీ, భూ, వల్లభ= వేంగీదేశపురాజా!; నిఖిల, జగత్+పావన, శుభ, చరిత= లోకాలన్నింటినీ పవిత్రం చేసే శుభమైన నడవడి కలవాడా!; భావభవ, నిభ, సుభగా= మన్మథునితో సమానమైన సౌందర్యం కలవాడా!

**తాత్పర్యం:** ఐశ్వర్యాతిశయానికి శాశ్వతస్థానమైనవాడా! దయతో వృద్ధిపొందించిన బ్రాహ్మణవంశాలు కలవాడా! వేంగీదేశప్రభూ! లోకాలన్నింటినీ పవిత్రంచేసే శుభచరిత్ర కలవాడా! మన్మథునితో సమానమైన సౌందర్యం కలవాడా!

**విశేషం:** భావభవుడు - భావంలో పుట్టేవాడు మన్మథుడు. ఇది రాజరాజుయొక్క ప్రశంసాపూర్వకమైన ఆశ్వాసారంభపద్యం.

**పాండవులు ద్రుపదరాజుపురంబున నిష్టోపభోగంబు లనుభవించుచు సుఖంబుండుట (సం.1-190-25)**

**వ. అ క్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె; నట్లు పాండవు లేవురకుం బాంచాలిం బరమోత్సవంబున వివాహంబు సేయించి ద్రుపదుం డయ్యేవురకు వేఱువేఱ యనర్ఘ్యమణిఖచితంబులైన యాభరణంబులను నపరిమితంబు లైన యర్థరాసులను, సౌవర్ణంబు లయిన శయ్యాసనపరికరంబులను, నూఱేసిభద్రగజంబులను, నూఱేసి కాంచనరథంబులను, వేయేసికాంభోజహయంబులను, పదివేవురేసి వరవస్త్రాభరణభూషితు లగు దాసదాసీజనంబులను, నూఱేసివేలు పాఁడిమొదవులను నగ్నిసాక్షికంబుగా నరణం బిచ్చిన.** **2**

**ప్రతిపదార్థం:** ఆ, కథకుండు= ఆ కథను చెప్పేవాడు - ఉగ్రశ్రవసుడు; శౌనక+ఆది, మహామునులకున్= శౌనకుడు మొదలైన మహామునులకు; చెప్పెన్; అట్లు; పాండవులు+ఏవురకున్= పాండవులు ఐదుగురకు; పాంచాలిన్= ద్రౌపదిని; పరమ+ఉత్సవంబునన్= మహావైభవంగా; వివాహంబు, చేయించి= పెండ్లి గావించి; ద్రుపదుండు= ద్రుపదుడు; ఆ+ఏవురకున్= ఆ ఐదుగురికి; వేఱువేఱు+అ= విడివిడిగా; అనర్ఘ్య, మణి, ఖచితంబులు, ఐన= వెలలేనిరత్నాలు పొదగబడినవైన; ఆభరణంబు లనున్= భూషణాలను; అపరిమితంబులు+ఐన= పరిమితంకానివైన; అర్థ, రాసులను= ధనరాసులను; సౌవర్ణంబులు+అయిన= బంగారంతో చేయబడిన; శయ్యా+ఆసన, పరికరంబులను= పాన్పులు, పీటలు, ఇతరవస్తువులను; నూఱు+ఏసి= వందవంతున; భద్రగజంబులను= మదపుటేనుగులను; నూఱు+ఏసి= వందవంతున; కాంచన, రథంబులను= బంగారు రథాలను; వేయి+ఏసి=

వేయి వంతున; కాంభోజ, హయంబులను= కాంభోజదేశపుగుర్రాలను; పదివేవురు+ఏసి= పదివేలమందివంతున; వర, వస్త్ర+ఆభరణ, భూషితులు+ అగు= శ్రేష్ఠాలైన వస్త్రాలతో సొమ్ములతో అలంకరిచబడినవాళ్ళయిన; దాన, దాసీ, జనంబులను= సేవకులను, పనిగత్తెలను; నూఱు+ఏసి, వేలు= లక్షవంతున; పాఁడి, మొదవులనున్= పాడి ఆవులను; అగ్ని, సాక్షికంబుగాన్= అగ్నిసాక్షిగా; అరణంబు= అల్లుడికి, కూతురికి ఇచ్చే సొమ్ముగా; ఇచ్చినన్= ఈయగా.

**తాత్పర్యం:** ఆ కథను చెప్పే ఉగ్రశ్రవసుడు, శౌనకుడు మొదలైన మహామునులకు చెప్పాడు; ఆ విధంగా పాండవులు అయిదుగురికి ద్రౌపదిని ఇచ్చి మహావైభవంగా వివాహం చేయించి, ద్రుపదుడు ఆ అయిదుగురికి వేరువేరుగా ఎంతో విలువైన మణులు పొదిగినఆభరణాలను, బంగారంతో చేసినపానుపులను, పీటలను, ఇతరవస్తువులను, నూరేసి మదపుటేనుగులను, నూరేసి బంగారు రథాలను, వేయేసి కాంభోజ దేశపు గుర్రాలను, శ్రేష్ఠమైన వస్త్రాలతో అలంకరించిన పదివేలదాసదాసీజనాలను, లక్షపాడిఆవులను అరణంగా ఇచ్చాడు.

**క. చతురుదధివలయ నిఖిల । క్షితితలసామ్రాజ్యలక్ష్మి కిని మూలం బై**
**సతి యాజ్ఞసేని పతులకు । నతిముద మొనరించెఁ దుల్యమగు శుశ్రూషన్. 3**

**ప్రతిపదార్థం:** చతుః+ఉదధి, వలయ, నిఖిల, క్షితి, తల, సామ్రాజ్యలక్ష్మికిని= నాలుగుసముద్రాలు చుట్టుకొని ఉన్న సమస్త భూమండలంయొక్క సామ్రాజ్యాధికారసంపదకు; మూలంబు+ఐ= కారణమై; సతి, యాజ్ఞసేని= పతివ్రత అయిన ద్రౌపది; తుల్యము+అగు= సమానమైన; శుశ్రూషన్= సేవతో; పతులకున్= భర్తలకు; అతి, ముదము= మిక్కిలి సంతోషాన్ని; ఒనరించెన్= కలిగించింది.

**తాత్పర్యం:** నాలుగుసముద్రాలు చుట్టుకొనిఉన్న సమస్తభూమండల సామ్రాజ్యాధికారసంపదకు కారణమై పతివ్రతద్రౌపది, సమానంగా సేవచేసి భర్తలందరికీ మిక్కిలిసంతోషాన్ని కలిగించింది.

**సీ. కోడలి యుత్తమ గుణముల కెంతయు । సంతుష్టచిత్త యై కుంతిదేవి**
**'లలితాంగి! హరియందు లక్ష్మిని, మఱి చంద్రు । నందు రోహిణి, నింద్రునందు శచిని**
**నవ్వసిష్ఠమునీంద్రునం దరుంధతిఁ బోలి । సుందరి! నీపతులందుఁ బ్రీతిఁ**
**బతిభక్తి యొప్ప నపత్యంబుఁ బడయుము; । గురు వృద్ధబాంధవాతుర విశిష్ట**

**ఆ. జనుల నతిథిజనుల సతతంబుఁ బూజింపు, । మన్నదానమున ధరామరేంద్ర**
**వరులఁ దనుపు, మఖిలవసుమతీప్రజ కెల్లఁ । గరుణ గలుగు మమ్మ కమలనేత్ర! 4**

**ప్రతిపదార్థం:** కోడలి, ఉత్తమ, గుణములకున్, ఎంతయు, సంతుష్టచిత్త ఐ, కుంతిదేవి; లలిత+అంగి!= సుకుమారమైన శరీరం కలదానా!; హరియందున్= విష్ణుమూర్తియందు; లక్ష్మిని; మఱి, చంద్రుని, అందున్; రోహిణిన్; ఇంద్రుని, అందున్; శచినిన్= శచీదేవిని; ఆ+వసిష్ఠముని+ఇంద్రు, అందున్; అరుంధతిన్; పోలి; సుందరి!; నీ పతుల, అందున్; ప్రీతిన్= ప్రేమతో; పతి, భక్తి; ఒప్పన్; అపత్యంబున్= సంతానాన్ని; పడయుము= పొందుము; గురు, వృద్ధ, బాంధవ+ఆతుర+విశిష్టజనులన్= గురువులను, వృద్ధులను, బంధువులను, రోగులను, పూజ్యులను; అతిథిజనులన్= అతిథులుగా విచ్చేసినవారిని; సతతంబున్= ఎల్లప్పుడు; పూజింపుము; అన్న, దానమునన్= అన్నదానంతో; ధర+అమర+ఇంద్ర, వరులన్= బ్రాహ్మణ శ్రేష్ఠులను; తనుపుము= తృప్తిపరచుము; కమల, నేత్ర= పద్మాలవంటి కన్నులు కలదానా!; అఖిల, వసుమతీ, ప్రజకు+ఎల్లన్= సమస్త భూమండలంమీది ప్రజలందరికీ; కరుణ= దయ; కలుగుము+అమ్మ= కలిగి ఉండుము తల్లీ!

**తాత్పర్యం:** కుంతీదేవి, కోడలి ఉత్తమగుణాలకు ఎంతో సంతోషించి, 'ద్రౌపదీ! విష్ణుమూర్తిపై లక్ష్మీదేవివలె, చంద్రునిమీద రోహిణీదేవివలె, ఇంద్రునిమీద శచీదేవివలె, వసిష్ఠునిపై అరుంధతివలె నీ భర్తల మీది ప్రేమతో పతిభక్తి ప్రకాశించగా సంతానాన్ని పొందుము. గురువులను, వృద్ధులను, బంధువులను, రోగులను, పూజ్యులను, అతిథులను అన్నివేళలా పూజించుము. అన్నదానంతో శ్రేష్ఠులైన బ్రాహ్మణులను తృప్తిపెట్టుము. భూమిమీదిప్రజలందరిపట్ల దయ కలిగి ఉండుము.

**ఉ. పూని పరాక్రమం బెసఁగ భూతలనాథుల నోర్చి, వీరు లై**
**యీ నవఖండమండితమహీతల మేలుచు, నీపతుల్ పయో**
**జానన! రాజసూయమఖ మాదిగ నధ్వరపంక్తి సేయుచో**
**మానుగఁ బత్ని వీ వగుము మానితధర్మవిధానయుక్తితోన్. 5**

**ప్రతిపదార్థం:** పయోజ+ఆనన= పద్మంవంటి ముఖం కలదానా!; నీ, పతుల్= నీ భర్తలు; పూని= ప్రయత్నించి; పరాక్రమంబు; ఎసఁగన్= అతిశయించగా; భూతలనాథులన్= రాజులను; ఓర్చి= జయించి; వీరులు+ఐ= పరాక్రమముకలవారై ఈ, నవ ఖండ, మండిత, మహీతలము= ఈ తొమ్మిది దీవులతో అలంకరించబడిన భూమండలాన్ని; ఏలుచున్= పాలించుచు; రాజసూయ, మఖము+ఆదిగన్= రాజసూయయాగం మొదలైన; అధ్వర, పంక్తి= యాగాల సమూహం; చేయుచో; ఈవు= నీవు; మానిత, ధర్మ, విధానయుక్తితోన్= గౌరవించబడిన ధర్మపద్ధతియొక్క కూడికతో; మానుగన్= ఒప్పుగా; పత్నివి= యజ్ఞంవంటి ధర్మకార్య సంబంధం కల భార్యవు; అగుము= కావలసింది.

**తాత్పర్యం:** పద్మంవంటిముఖం కల ఓ ద్రౌపదీ! నీ భర్తలు పూనికతో, పరాక్రమాతిశయంతో రాజులను జయించి, వీరులై, ఈ తొమ్మిదిదీవులతో అలంకరించబడిన భూమండలాన్ని పరిపాలిస్తూ రాజసూయయాగం మొదలైన అనేకయాగాలు చేసేటప్పుడు, నీవు వాళ్ళ ధర్మపత్నిగా ఉండుము.

**విశేషం:** నవఖండాలు- భరత, ఇంద్ర, పురు, గభస్తి, నాగ, తామ్ర, వారుణ, సౌమ్య, గంధర్వ ఖండాలు. జాయ, దార, కళత్రం, పత్ని- మొదలైనవి 'భార్యకు' పర్యాయపదాలే అయినా యజ్ఞంవంటి ధర్మకార్యాలలో భర్తప్రక్కన కూర్చుండి పాలుపంచుకొనే భార్యనే ప్రత్యేకించి 'పత్ని' అనటం ఉన్నది. తన పుత్రులు రాజసూయం చేయాలనేభావం ఆ రాజమాత అయిన కుంతీదేవి హృదయంలో ఇంతముందుగా మోసులెత్తింది. పాండవుల భవిష్యదుజ్జ్వల జీవితాన్నిగురించి ఆకాశవాణి, దేవతలు, వ్యాసాది మహర్షులు చెప్పినవాక్యాలు ఆమె ఆశలకు, ఆశయాలకు ఆలంబనాలై ఉంటాయి. ఆ రాజసూయం మహాభారతకథనే మలుపు తిప్పింది.

**క. 'ఇందీవరలోచన! నీ । యం దే నభినందితాత్మ నైనట్టులు నీ**
**నందనులయందుఁ బౌత్రుల । యందును నభినంద్య వగుమ' యని దీవించెన్. 6**

**ప్రతిపదార్థం:** ఇందీవర, లోచన= నల్లకలువలవంటి కన్నులు కలదానా!; ఏను= నేను; నీయందు; అభినందిత+ఆత్మను= సంతోషించిన మనస్సు కలదానిని; ఐన, అట్టులు= అయినవిధంగా; నీ, నందనుల, అందున్= నీ కుమారులలో; పౌత్రుల, అందున్= మనుమలలో; అభినంద్యవు= సంతోషించదగినదానివి; అగుము+అ; అని, దీవించెన్= కమ్ము అని దీవించింది.

**తాత్పర్యం:** 'నల్లకలువలవంటి కన్నులు కల ఓ ద్రౌపదీ! నేను నిన్ను పొంది సంతోషించినట్లే, నీవు కూడా నీ కొడుకులను, మనుమలను పొంది సంతోషించు' అని దీవించింది.

**విశేషం:** "నీవు సంతోషించదగిన యోగ్యులైన కొడుకులు, మనుమలు నీకు కలుగుదురు గాక"! అని కుంతీదేవి దీవెన. ఏ స్త్రీమూర్తికైనా జీవితంలో ఇది గొప్ప దీవెనే.

**వ. అట వాసుదేవుండు ద్రౌపదిని బాండవు లేవురు వివాహం బగుట విని సంతసిల్లి, వా రేవురకు వజ్ర వైడూర్య మరకత మౌక్తిక విభూషణంబులును, నానాదేశవిచిత్రవస్త్రంబులును, ననేకకరితురంగరథరత్న శిబికావిలాసినీనివహంబులుం బుత్తెంచిన. 7**

**ప్రతిపదార్థం:** అట= అక్కడ; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; ద్రౌపదిని; పాండవులు; ఏవురు= ఐదుగురు; వివాహంబు+అగుట= పెండ్లిచేసుకొనుట; విని= ఆలకించి; సంతసిల్లి; వారు+ఏవురకున్= ఆ పాండవులైదుగురికి; వజ్ర, వైడూర్య,మరకత, మౌక్తిక, విభూషణంబులును= వజ్రాలు, వైడూర్యాలు, మరకతం, ముత్యాల ఆభరణాలు; నానాదేశ; విచిత్ర, వస్త్రంబులునున్= అనేక దేశాలకు సంబంధించిన విచిత్రవస్త్రాలు; అనేక, కరి, తురంగ, రథ, రత్న, శిబికా, విలాసినీ, నివహంబులున్= పెక్కు ఏనుగుల, గుర్రాల, రథాల, రత్నాల, పల్లకీల, వేశ్యల సమూహాలను; పుత్తెంచిన= పంపిన.

**తాత్పర్యం:** పాండవులైదుగురు ద్రౌపదిని వివాహమాడటం విని ద్వారకలో ఉన్న శ్రీకృష్ణుడు సంతోషించాడు. ఆ అయిదుగురికి వజ్రాలు, వైడూర్యాలు, మరకతాలు, ముత్యాలు పొదిగిన ఆభరణాలను, వివిధ దేశాలకు సంబంధించిన చిత్రవిచిత్రాలైన వస్త్రాలను, ఎన్నో ఏనుగుల, గుర్రాల, రథాల, రత్నాల, పల్లకీల, వేశ్యల సమూహాలను పంపించాడు.

**చ. విలసిత రాజ్యలీలఁ బరవీరభయంకరు లై గుణంబులన్**
**వెలయుచుఁ బాండవుల్ విదితవిక్రము లుండుటఁజేసి దేవతా**
**దులవలనన్ భయంబు ద్రుపదుం డెఱుఁగండ; తదీయదేశముల్**
**దలరక యొప్పె రోగ భయ తస్కర డామర వర్జితంబు లై. 8**

**ప్రతిపదార్థం:** విలసిత, రాజ్య, లీలన్= ప్రకాశిస్తున్న రాజ్యాధికారవిలాసంతో; పర, వీర, భయంకరులు+ఐ= శత్రువీరులకు భయాన్ని కలిగించేవాళ్ళయి; గుణంబులన్= మంచిగుణాలతో; వెలయుచున్= ఒప్పుతూ (ప్రకాశిస్తూ); విదిత, విక్రములు= ప్రసిద్ధమైన పరాక్రమం కలవాళ్ళు; పాండవుల్; ఉండుటన్+చేసి= ఉండటంచేత; ద్రుపదుండు; దేవతా+ఆదుల, వలనన్= దేవతలు మొదలైన వారివలనకూడా; భయంబు= భీతిని; ఎఱుఁగండు+అ= పొందలేదు; దేశముల్= అతనియొక్క దేశాలు; రోగ భయ, తస్కర, డామర, వర్జితంబులు+ఐ= రోగభయంచేత, దొంగలచేత, కొల్లగొట్టుటచేత విడువబడినవై - అంటే రోగం, దొంగలు, కొల్లగొట్టటాలు లేనివై; తలరక= కలతపొందక; ఒప్పెన్= ప్రకాశించాయి.

**తాత్పర్యం:** వెలుగుతున్న రాజ్యాధికారవిలాసంతో, శత్రువీరులకు భయం కలిగించేవాళ్ళయి, సుగుణాలతో ప్రకాశిస్తూ, మహాపరాక్రమశాలులైన పాండవులు ఉండటంవలన ద్రుపదునికి దేవతలవలనకూడా భయం లేకుండా ఉన్నది. అతని దేశాలు - రోగాలు, దొంగలు, కొల్లగొట్టటాలు లేనివై కలతలేక సుఖంగా ఉన్నాయి.

## చారులవలన పాండవుల యభ్యుదయమును విని దుర్యోధనుఁడు నిర్వేదించుట (సం.1-191-1)

**వ. ఇట్లు పాండవులు ద్రుపదుపురంబున నఖిలరాజ్యవిభవసమన్వితు లయి యొక్క సంవత్సరం బుండునంత నంతయు నెఱింగి దుర్యోధనగూఢచారు లరిగి కర్ణదుశ్శాసనసౌబలసోమదత్తపరివృతుం డయి యున్న దుర్యోధనునకు మ్రొక్కి యి ట్లనిరి. 9**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవులు= పాండుకుమారులు; ద్రుపదు, పురమునన్= ద్రుపదునినగరంలో; అఖిల, రాజ్య, విభవ, సమన్వితులు+అయి= సమస్తరాజ్యవైభవంతో కూడుకొన్నవాళ్ళయి; ఒక్క, సంవత్సరంబు; ఉండునంతన్= ఉండగా; అంతయున్= అంతా; ఎఱింగి= తెలిసికొని; దుర్యోధన, గూఢ+చారులు= దుర్యోధనునివేగులవాళ్ళు; అరిగి= వెళ్ళి; కర్ణ, దుశ్శాసన, సౌబల, సోమదత్త, పరివృతుండు+అయి= కర్ణ దుశ్శాసన శకుని సోమదత్తులచే కొలువబడినవాడై, ఉన్న= ఉండు దుర్యోధనునకున్; మ్రొక్కి; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవులు ద్రుపదునినగరంలో సమస్తరాజ్యవైభవంతో ఒక్కసంవత్సరం ఉండగా; విషయాన్నంతా తెలిసికొని దుర్యోధనునివేగులవాళ్ళు, హస్తినాపురానికి వెళ్ళి, కర్ణ దుశ్శాశన శకుని సోమదత్తులు చుట్టూ చేరి ఉండగా, కొలువున్న దుర్యోధనునికి మ్రొక్కి ఇట్లా అన్నారు.

**సీ. కర్ణశల్యులు మొదల్గాఁ గల భూపతు । లత్యంత బలవంతు లస్త్రవేదు**
**లుద్ధతుల్ మోపెట్టనోపని చాప మ । శ్రమమున మోపెట్టి, చదలఁ దిరుగు**
**నయ్యంత్ర మేసి, మీయందఱముందరఁ । గృష్ణఁ దోడ్కొని యొక్క కృష్ణవర్ణుఁ**
**డెక్కటి రణములో నేపునఁ గానీను । నోడించి జయలీల నున్న యాతఁ**

**ఆ. డర్జునుండు; మఱిమహాబాహుబలమున । శల్యుఁ ద్రెళ్ల వైచి శత్రువరుల**
**నెల్లఁ దల్లడిల్ల నెగచిన యాతండు । భీమసేనుఁ డమితభీమబలుఁడు. 10**

**ప్రతిపదార్థం:** కర్ణ, శల్యులు= కర్ణుడు, శల్యుడు; మొదల్, కాన్+కల= ఆదిగా ఉన్న; భూపతులు= రాజులు; అత్యంత, బలవంతులు= మిక్కిలి బలముకలవాళ్లు; అస్త్ర, వేదులు= అస్త్రవిద్యను ఎరిగినవాళ్ళు; ఉద్ధతుల్= గర్వించినవాళ్ళు; మోపెట్టన్= ఎక్కుపెట్టటానికి; ఓపని= సాధ్యంకాని; చాపము= ధనుస్సును; అశ్రమమునన్= సులువుగా; మోపెట్టి= ఎక్కుపెట్టి; చదలన్= ఆకాశంలో; తిరుగు, ఆ+యంత్రము= కదిలే ఆ మత్స్యయంత్రాన్ని; ఏసి= కొట్టి; మీ, అందఱ ముందరన్= మీ అందరి సమక్షంలో; కృష్ణన్= ద్రౌపదిని; తోడ్కొని= తీసికొని; ఎక్కటి, రణములోన్= ద్వంద్వయుద్ధంలో; ఏపునన్= పరాక్రమంతో; కానీనున్= కన్యాపుత్రుడు అయిన కర్ణుడిని; ఓడించి; జయ, లీలన్= జయముయొక్కవిలాసంతో; ఉన్న= ఉండే, ఆతఁడు= అతడు; ఒక్క= ఆ ఒకే ఒక్క; కృష్ణవర్ణుఁడు= నల్లటికాంతికలవాడు; అర్జునుండు; మఱి= ఇక; మహా, బాహు, బలమునన్= గొప్ప భుజబలంతో; శల్యున్= శల్యుణ్ణి; త్రెళ్ళ, వైచి= పడవేసి; శత్రు, వరులన్= మేటి శత్రువులందరిని; తల్లడిల్లన్= భయపడగా, బాధపడగా; ఎగచిన= తరిమిన; ఆతండు; అమిత, భీమ, బలుఁడు= అంతులేనిభయంకరమైన బలం కలవాడు; భీమసేనుఁడు;

**తాత్పర్యం:** మహాబలవంతులు, అస్త్రవిద్యావేత్తలు, గర్వితులు అయిన కర్ణుడు, శల్యుడు మొదలైన రాజులంతా ఎక్కుపెట్టలేని ధనుస్సును సులభంగా ఎక్కుపెట్టి, ఆకాశంలో తిరిగే మత్స్యయంత్రాన్ని కొట్టి, అందరిఎదుట ద్రౌపదిని చేపట్టి, ద్వంద్వయుద్ధంలో తన పరాక్రమం ప్రకాశించేటట్లు కర్ణుడిని ఓడించి విజయవిలాసంతో ఉన్న ఆ

నల్లటివాడు - అర్జునుడు. గొప్ప భుజబలంతో శల్యుడిని పడవేసి, మేటిశత్రువులందరినీ తల్లడిల్లజేసి తరిమిన, ఆ మహాభయంకరమైన బలం గలవాడు భీముడు.

**చ. 'అనిమొన నట్లు దాఁకిన మహారథులన్ ధృతరాష్ట్రరాజనం**
**దనుల బలాఢ్యులన్ దళితదర్పులఁ జేసినవారు ధర్మనం**
**దనయము లుగ్రవీరు' లని తద్విధమంతయు నేర్పడంగఁ జె**
**ప్పిన విని కౌరవప్రభుఁడుఁ బెల్కుఱి తద్దయు దుఃఖితాత్ముఁ డై. 11**

**ప్రతిపదార్థం:** అని, మొనన్= యుద్ధంమొదట; అట్లు; తాఁకిన= ఎదుర్కొన్న; మహారథులన్= గొప్పయోధుల్ని; బల+ఆఢ్యులన్= బలవంతులను; ధృతరాష్ట్రరాజ, నందనులన్= ధృతరాష్ట్రమహారాజు కుమారులను; దళిత, దర్పులన్= ఖండింపబడిన గర్వం కలవాళ్ళనుగా - అంటే అణచివేయబడిన గర్వం కలవాళ్ళనుగా; చేసినవారు= చేసినవాళ్ళు; ఉగ్రవీరులు= భయంకరమైన పరాక్రమం కలవాళ్ళు; ధర్మనందన, యములు= ధర్మరాజు, కవల లైన నకులసహదేవులు; అని= ఆ ప్రకారం; తత్+విధము= ఆ విధం; అంతయున్, ఏర్పడంగన్= స్పష్టం అయ్యేటట్లు; చెప్పినన్= చెప్పగా; విని; కౌరవ, ప్రభుఁడున్= దుర్యోధనుడు కూడ; పెల్కుఱి= వెలవెలపోయి; తద్దయున్= మిక్కిలి; దుఃఖిత+ఆత్ముఁడు+ఐ= దుఃఖించిన మనస్సు కలవాడై.

**తాత్పర్యం:** యుద్ధప్రారంభంలో ఆ విధంగా ఎదుర్కొని మహారథులూ, బలవంతులూ అయిన ధృతరాష్ట్ర మహారాజుకుమారులగర్వాన్ని అణచినవాళ్ళు - ధర్మజ నకుల సహదేవులనీ, ఆ విషయాన్నంతా స్పష్టంగా చెప్పగా విని, దుర్యోధనుడు వెలవెలబోయి మిక్కిలి దుఃఖించాడు.

**విశేషం:** ఈ వివరాలు ద్రౌపదీస్వయంవరఘట్టంలో చెప్పకుండ ఇక్కడ చారులచేత చెప్పించటంవలన పునరుక్తిదోషం కలుగకుండ విశేష వృత్తాంతాన్ని ప్రతిపాదించి కథాంశాలకు ఉత్కంఠ నాపాదించటం జరిగింది. ఈ వివరణ లేకపోతే ధర్మరాజు, నకులసహదేవులు సభను వీడి ఎందుకు ముందుగానే వెళ్ళారో, భీము డొక్కడే సభలో ఎందుకు ఆగాడో తెలియదు. ఇప్పుడు స్వయంవర ఘట్టంలో పాండవులు కూడబలుకుకొని కార్యాన్ని సమన్వయంతో సమర్థవంతంగా నిర్వహించినట్లు స్పష్టమవుతున్నది.

**వ. 'అక్కట! పురోచనుం డొక్కరుండ లక్కయింట దగ్ధుం డయ్యెం గా కేమి; దైవానుకూల్యంబు లేక మానుషం బెంతయయ్యు నేమి సేయుఁ; బాండవు లేమిదైవసంపన్నులైరో యని వగచి, యీ యవసరంబున ద్రుపదు భేదించి పాండవుల నుత్సాదింపవలయు నె ట్లనిన. 12**

**ప్రతిపదార్థం:** అక్కట= అయ్యో!; పురోచనుండు; ఒక్కరుండు+అ= ఒక్కడే; లక్కయింటన్= లక్కఇంటిలో; దగ్ధుండు+ అయ్యెన్= కాలిపోయాడు; కాక+ఏమి= కాబోలు; దైవ+అనుకూల్యంబు= దైవముయొక్కతోడ్పాటు; లేక= లేకుండా; మానుషంబు= మానవప్రయత్నం; ఎంత, అయ్యున్= ఎంతయినా; ఏమి, చేయున్= ఏమి చేయగలదు!; పాండవులు; ఏమి= ఎంత; దైవసంపన్నులు+ ఐరో= దైవబలసంపదతో కూడినవాళ్ళు అయ్యారో; అని= ఆ విధంగా; వగచి= విచారించి; ఈ, అవసరంబునన్= ఈ సమయంలో; ద్రుపదున్, భేదించి= ద్రుపదుడిని వేరుచేసి; పాండవులన్; ఉత్సాదింపవలయున్= పెకలించాలి; ఎట్లు+అనినన్= ఏ విధంగా అంటే.

**తాత్పర్యం:** 'అయ్యో! పురోచనుడు ఒక్కటే లక్కఇంటిలో మాడిపోయాడు కాబోలు! దైవం అనుకూలించకుంటే మానవప్రయత్నం ఎంత ఉన్నా ప్రయోజనం ఏమిటి? పాండవులు ఎంతదైవబలసంపన్నులో గదా!' అని చింతించి, ఈ సమయంలో ద్రుపదుడిని వేరు చేసి పాండవులను పెకలించివేయాలి. ఎట్లాగంటే.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**ఉ. యాదవవృష్ణిభోజవరు లందఱుఁ బాండవపక్షపాతు; ల**
**చ్చేదివిభుండు వారలన చేకొనువాఁడగు; వీరలెల్ల నా**
**త్మోదయవృద్ధి పొంటెను దదున్నతిఁ గోరుదు; రట్లు గావునన్**
**భేదము సేయఁగావలయుఁ బెల్చన యందఱుఁ గూడకుండఁగన్. 13**

**ప్రతిపదార్థం:** యాదవ, వృష్ణి, భోజ, వరులు= యాదవ, వృష్ణి, భోజ(కుల)శ్రేష్ఠులు; పాండవపక్షపాతులు= పాండవులపై పక్షపాతం కలవాళ్లు; ఆ+చేది, విభుండు= ఆ చేది రాజైన శిశుపాలుడూ; వారలన్+అ= వారినే; చేకొనువాఁడు= చేపట్టేవాడు- అంటే వారి పక్షాన్నే గ్రహించేవాడు; అగున్= అగును; వీరలు+ఎల్లన్= వీళ్ళంతా; ఆత్మ+ఉదయ, వృద్ధిపొంటెను= తమ అభ్యుదయం యొక్క అభివృద్ధికంటె; తత్+ఉన్నతిన్= ఆ పాండవులయొక్క అభివృద్ధిని; కోరుదురు= కోరుతారు; అట్లు+కావునన్= అందువల్ల; అందఱు= వీళ్ల అంతా; కూడక+ఉండఁగన్= కలియకుండా ఉండేటట్లు; పెల్చనన్= వెంటనే; భేదము= వేర్పాటు; చేయఁగావలయున్= కలిగించాలి.

**తాత్పర్యం:** యాదవ వృష్ణి భోజ కుల శ్రేష్ఠులంతా పాండవ పక్షపాతులు. ఆ చేది రాజైన శిశుపాలుడుకూడా వాళ్ళ పక్షం వహించేవాడే. వీళ్ళంతా తమ అభ్యుదయంకంటె పాండవుల అభివృద్ధినే కోరుతారు. అందువలన వీళ్ళంతా ఒకటి కాకుండా భేదం కల్పించాలి.

**విశేషం:** పాండవులకు పెదతండ్రి కొడుకులైన దుర్యోధనాదులు శత్రువులయ్యారు. ద్రుపదరాజు పుత్రికను వివాహంచేసికొనటంవలన, పాండవులకు బంధువర్గం ఏర్పడింది. ఈ సంగతి వ్యాసు డిదివరకే సూచించాడు. పాండవ మిత్రులూ, బంధువులూ వారివారి స్వార్థాలకంటె పాండవుల అభ్యుదయాన్నే కోరుతారు. కౌరవపక్షం దానికి విరుద్ధం. వారికి స్వార్థమే లక్ష్యం. ఈ సంగతి తెలిసికొన్న దుర్యోధనుడు పాండవబలాన్ని అంచనావేసి, భయపడి, వాళ్ళపట్ల భేదోపాయాన్ని ప్రయోగించాలని యోచించాడు. కణికుడు బోధించిన శుక్రనీతి ప్రకారం శత్రువుల పట్ల భేదోపాయాన్ని ప్రయోగించటానికి దుర్యోధనుడు ప్రయత్నం చేస్తున్నాడు. (కణికనీతి. చూడు: ఆది. 6.119,120).

**వ. అని దుర్యోధనుండు పాండవ పాంచాల విభేదనోపాయంబుఁ జింతించుచుండె; నంత విదురుండు పాండవాభ్యుదయంబును బాంచాలీస్వయంవరంబును దుర్యోధనాదులు భగ్నదర్పు లగుటయు విని సంతసిల్లి, పాండవులు ద్రుపదరాజపుత్త్రిం బెండ్లి యై ద్రుపదుపురంబున సుఖంబున్న వా రని ధృతరాష్ట్రునకుం జెప్పిన నతం డి ట్లనియె. 14**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; దుర్యోధనుండు; పాండవ, పాంచాల, విభేదన+ఉపాయంబున్= పాండవులను ద్రుపదుడిని వేరుపరచే ఉపాయాన్ని; చింతించుచుండెన్= ఆలోచిస్తూఉన్నాడు; అంతన్= అంతలో; విదురుండు= విదురుడు; పాండవ+

అభ్యుదయంబును= పాండవుల అభివృద్ధిని; పాంచాలీ, స్వయంవరంబును= ద్రౌపదీ స్వయంవరాన్ని; దుర్యోధన+ఆదులు= దుర్యోధనుడు మొదలైనవాళ్ళు; భగ్న; దర్పులు= పోయినగర్వం కలవాళ్ళు; అగుటయును= కావటం; విని= ఆలకించి; సంతసిల్లి; పాండవులు= పాండుకుమారులు; ద్రుపదరాజు, పుత్త్రిని= ద్రౌపదిని; పెండ్లి+ఐ= పెండ్లాడి; ద్రుపదు, పురంబునన్= ద్రుపదుని నగరంలో; సుఖంగా+ఉన్నవారు= సుఖంగా ఉన్నారు; అని= ఆ విధంగా; ధృతరాష్ట్రునకున్, చెప్పినన్= ధృతరాష్ట్రునికి చెప్పగా; అతండు= ఆ ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడు పాండవులను ద్రుపదునుండి వేరుచేసే ఉపాయాన్ని ఆలోచిస్తూ ఉన్నాడు. అంతలో విదురుడు పాండవుల అభ్యుదయాన్నీ, ద్రౌపదీస్వయంవరాన్నీ, దుర్యోధనుడు భంగపడటాన్ని విని సంతోషించి, పాండవులు ద్రౌపదిని పెండ్లిచేసికొని ద్రుపదుడినినగరంలో సుఖంగా ఉన్నారని ధృతరాష్ట్రునికి చెప్పగా, అతడు ఇట్లా అన్నాడు.

**ఆ. యజ్ఞసేనుకూఁతు నభిజాత నాతని । యజ్ఞవేది నుదిత యయినదాని**
**ననఘవిధి వివాహ మయి పాండునందనుల్ । మిగుల మిత్త్రబలసమృద్ధు లయిరి. 15**

**ప్రతిపదార్థం:** యజ్ఞసేనుకూఁతున్= ద్రుపదునికూతురిని; అభిజాతన్= ఉత్తమవంశం కలదానిని; అతని= ఆ ద్రుపదుని; యజ్ఞవేదిన్= యజ్ఞవేదికలో; ఉదిత, అయిన, దానిన్= పుట్టిన దానిని; అనఘ, విధిన్= దోషం లేని పద్ధతిలో; వివాహము+అయి= పెండ్లాడి; పాండు, నందనుల్= పాండుకుమారులు; మిగులన్= మిక్కిలి; మిత్ర, సమృద్ధులు= మిత్రబలంతో నిండినవాళ్ళు; అయిరి= అయ్యారు.

**తాత్పర్యం:** యజ్ఞవేదికలో పుట్టి, ఉత్తమవంశం కల ద్రౌపదిని చక్కగా వివాహమాడటంవలన పాండవులు మిక్కిలిమిత్రబలాన్ని పొందారు.

**విశేషం:** గృహస్థధర్మంలో ఉత్తమవంశంలో పుట్టి గుణవతి అయిన వధువుకుండే ప్రాధాన్యం ధృతరాష్ట్రునిమాటలో ధ్వనిస్తున్నది.

**క. కొడుకుల యభ్యుదయము విని । కడు సంతస మయ్యె నిపుడు; కౌరవకుల మే**
**ర్పడ వెలిఁగె నెల్లరాజుల । నొడిచిన భుజవీర్యమున మహోత్సాహమునన్. 16**

**ప్రతిపదార్థం:** కొడుకుల, అభ్యుదయము= కొడుకుల అభివృద్ధిగురించి; విని, కడు=మిక్కిలి; సంతసము+అయ్యెన్; ఇపుడు; కౌరవకులము= కౌరవవంశం; ఎల్ల, రాజులన్= అందరి రాజుల్ని; ఒడిచిన= ఓడించిన; భుజ, వీర్యమునన్; మహా+ఉత్సాహమునన్= గొప్ప ఉత్సాహంతో; ఏర్పడన్= స్పష్టంగా; వెలిఁగెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** పాండవుల అభివృద్ధినిగూర్చి వినటంవలన ఎంతోసంతోషం కలిగింది. ఇప్పుడు కౌరవవంశం రాజులందరినీ ఓడించిన భుజబలంతో, మహోత్సాహంతో బాగా ప్రకాశించింది.

**వ. అని విదురునకు మనఃప్రియంబుగాఁ బలికి, యంతఃపురంబునకుం జని యంతస్తాపం బేర్పడకుండ నుండునంత; గర్ణ దుర్యోధనులు ధృతరాష్ట్రు పాలికిం జని యి ట్లనిరి. 17**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; విదురునకున్= విదురునితో; మనఃప్రియంబుగాన్= మనసుకు సంతోషం కలిగేటట్లు; పలికి, అంతఃపురంబునకున్= అంతఃపురానికి; చని= వెళ్ళి; అంతస్+తాపము= లోపలి దుఃఖం - అంటే మనస్సులోని

దుఃఖం; ఏర్పడకుండన్= బయటపడకుండా; ఉండున్, అంతన్= ఉన్న సమయంలో; కర్ణదుర్యోధనులు= కర్ణుడు, దుర్యోధనుడు; ధృతరాష్ట్ర, పాలికిన్= ధృతరాష్ట్రుని దగ్గరకు; చని= వెళ్ళి; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** అని విదురునిమనస్సుకు సంతోషం కలిగేటట్లు పలికి, అంతఃపురానికి వెళ్ళి, తనమనస్సులోని దుఃఖం బయటపడకుండా ఉండగా - కర్ణదుర్యోధనులు, ధృతరాష్ట్రునిదగ్గరకు వెళ్ళి ఇట్లా అన్నారు.

## దుర్యోధనుఁడు తండ్రితోఁ బాండవపాంచాలవిభేదనోపాయంబు నాలోచించుట (సం.1-192-25)

**క. రేయును బగలును విదురుఁడు । నీయొద్దన యునికిఁజేసి నేరము పలుకన్**
**మాయిష్టం బెఱిఁగింపఁగ । ధీయుత ! యెడఁ గంటి మిన్ని దివసంబులకున్. 18**

**ప్రతిపదార్థం:** రేయును= రాత్రి; పగలును= పగలూ; విదురుఁడు; నీ, ఒద్దన= నీ ప్రక్కనే; ఉనికిన్+చేసి= ఉండటంచేత; పలుకన్, నేరము= చెప్పలేకపోయాము; ధీయుత= బుద్ధిబలంతో కూడినవాడా!; ఇన్ని, దివసంబులకున్= ఇన్నిరోజులకు; మా, ఇష్టంబు= మా కోరిక; ఎఱిఁగింపఁగన్= తెలపటానికి; ఎడన్= అవకాశాన్ని; కంటిమి= పొందాము.

**తాత్పర్యం:** రాత్రీ పగలూ విదురుడు నీ వద్దనే ఉండటంచేత మా మనస్సులోని మాట చెప్పలేకపోయాము. మేధావీ! మా కోరిక తెలపటానికి ఇన్నిరోజులకు అవకాశం ఏర్పడింది.

**క. విదురుఁడు పాండవహితుఁ డని । మొదలన యెఱిఁగియును నతి విమోహంబున న**
**వ్విదురువచనంబ నిలుపుదు । హృదయంబున; నతఁడు పెద్దయిష్టుఁడు మీకున్. 19**

**ప్రతిపదార్థం:** విదురుఁడు; పాండవ, హితుఁడు= పాండవుల మేలు కోరేవాడు; అని, మొదలన= అని స్పష్టంగా మొదటనే; ఎఱిఁగియును= తెలిసికూడా; అతి, విమోహంబునన్= మిక్కిలి అజ్ఞానంచేత; ఆ+విదురు, వచనంబు+అ= ఆ విదురునియొక్క మాటే; హృదయంబునన్= మనసులో; నిలుపుదు= నిలుపుకొంటావు; అతడు= ఆ విదురుడు; మీకున్; పెద్ద= మిక్కిలి; ఇష్టుఁడు= ఇష్టమైనవాడు.

**తాత్పర్యం:** విదురుడు పాండవుల మేలు కోరేవాడని మొదటనే తెలిసికూడా మిక్కిలి అజ్ఞానంతో ఆ విదురుడి మాటే మనస్సులో నిలుపుకొంటావు. అతడు మీకు బాగా ఇష్టమైనవాడు.

**విశేషం:** ఈ మాటలు ధృతరాష్ట్రుడిని వ్యంగ్యంగా నిష్ఠూరమాడుతున్నట్లున్నాయి. మనసును విరిచే మాటలు ఇట్లాగే ఉంటాయి.

**వ. అనిన వారలకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 20**

**ప్రతిపదార్థం:** అనినన్= అని మాటాడగా; వారలకున్= ఆ కర్ణ దుర్యోధనులకు; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అనగా వారితో ధృతరాష్ట్రుడు ఈ విధంగా అన్నాడు.

**సీ. 'పలుకులఁ జెయ్వులఁ బాండవులకుఁ బ్రీతి । గలయట్ల యుండుదుఁగాని నాదు**
**హృదయంబు విదురున కెన్నండు నెఱిఁగింప; నేను మీతలఁచిన యువ్విధంబ**

**తలఁచుచు నుండుదు; దైవసంపద గల । వారలఁ బాండవవరుల నేమి**
**సేయంగ నగు? నెద్ది చెప్పుఁ డిష్టం బింక?' । ననిన విచిత్రవీర్యాత్మజునకు**

**ఆ. దుష్టచేష్టితుండు దుర్యోధనుం డిట్టు । లనియెఁ 'జిత్తగింపు మవనినాథ!**
**పాండురాజసుతులఁ బాంచాలపతియొద్ద । నుండకుండఁ జేయు టుచిత మిపుడు' 21**

**ప్రతిపదార్థం:** పలుకులన్= మాటలలో; చెయ్వులన్= చేతలలో; పాండవులకున్; ప్రీతి= ప్రీతి; కల, అట్లు+అ= ఉన్నట్లే; ఉండుదున్+కాని= ఉంటానుకానీ; నాదు, హృదయంబు= నా మనస్సు; విదురునకున్; ఎన్నండున్= ఎప్పుడుగానీ; ఎఱిఁగింపన్= చెప్పను; ఏను= నేను; మీ, తలఁచిన, ఈ+విధంబు+అ= మీరు ఆలోచించినట్లే; తలఁచుచున్= ఆలోచిస్తూ; ఉండుదున్= ఉంటాను; దైవ, సంపద= దైవబల సంపత్తి; కల= కలిగిన; వారలన్= వాళ్ళను; పాండవ, వరులన్= ఉత్తములైన పాండవులను; ఏమి; చేయంగన్+అగున్= ఏమి చేయగలం!; ఇంకన్= ఇంకా; ఎద్ది= ఏది; ఇష్టంబు= ఇష్టమో; చెప్పుఁడు= చెప్పండి; అనినన్= అని అనగా; విచిత్రవీర్య+ఆత్మజునకున్= విచిత్రవీర్యుని కుమారుడైన ధృతరాష్ట్రునికి; దుష్ట, చేష్టితుండు= చెడ్డపనులు చేసేవాడు; దుర్యోధనుండు; ఇట్టులు, అనియెన్; అవనినాథా= మహారాజా!; చిత్తగింపుము= దయతో వినుము; పాండురాజు సుతులన్= పాండురాజుకుమారులైన పాండవులను; పాంచాలపతి, ఒద్దన్= ద్రుపదునిదగ్గర; ఉండకుండన్, చేయుట= ఉండకుండా చేయడం; ఉచితము= తగినపని.

**తాత్పర్యం:** 'మాటలలో, చేతలలో పాండవులపట్ల ప్రీతి ఉన్నట్లే ఉంటాను. కాని, నా మనస్సును విదురునికి ఎన్నడూ తెలియనీయలేదు. మీ అభిప్రాయమే నా అభిప్రాయం. పాండవులు దైవబలం కలవాళ్ళు. ఏం చేయగలం? ఇక మీకు ఏది ఇష్టమో చెప్పండి' అని ధృతరాష్ట్రుడు అనగా దుర్మార్గపు పనులు చేసే దుర్యోధనుడు ఈ విధంగా అన్నాడు. 'మహారాజా! చిత్తగించండి. పాండవులను పాంచాలరాజు దగ్గర ఉండకుండా చేయటం ఇప్పుడు ఉచితమైన పని.

**విశేషం:** ఇది ధృతరాష్ట్రునిస్వభావాన్ని వ్యక్తంచేసే సీసం. బహిరంగంగా పాండవప్రీతి, అంతరంగంలో పాండవద్వేషం అతని స్వభావం. అందులో తండ్రికొడుకులు బింబ ప్రతిబింబాలు. ఆలోచన కొడుకుది, ఆచరణ తండ్రిది. సీసంవంటి కఠిన పాషాణ హృదయం ఈ సీసపద్యంలో సూచితం.

**వ. అది యె ట్లనినం బుత్త్ర మిత్త్ర బాంధవ బలసంపన్నుం డైన ద్రుపదునొద్దఁ బాండవు లుండువా 'రైన వారలం గృష్ణబలదేవులు యదువృష్ణిభోజాంధకవర్గములతో వచ్చి కూడిన నెవ్వరు సాధింపనోపరు; గావున, నెడసేయక ద్రుపదుండు పాండవుల విడుచునట్లుగా భేదింత; మొండె, వలనుగలవారలం బంచి కౌంతేయమాద్రేయులను దమలో విరక్తు లగునట్లుగాఁ జేయుంత; మొండె నతిలలితప్రమదాజనంబులఁ బ్రత్యేకంబ యేవురకుం బ్రయోగించి ద్రౌపదివలన విరక్తిఁ బుట్టింత; మొండె, నేవురకు నొక్కతియ యా లగుట కష్టం బని ద్రోవదిఁ బాండవులవలన విగత స్నేహఁ గావింత; మొండె, నుపాంశుప్రయోగంబుల భీము వధియించి తక్కినవారల బలహీనులం జేయుదము.22**

**ప్రతిపదార్థం:** అది= ఆ కార్యం; ఎట్లు+అనినన్= ఏ విధంగా అంటే; పుత్త్ర, మిత్త్ర, బాంధవ, బల, సంపన్నుండు+ఐన= పుత్రులతో, స్నేహితులతో, బంధువులతో, బలంతో నిండినవాడైన; ద్రుపదు, ఒద్దన్= ద్రుపదుని దగ్గర; పాండవులు= పాండు కుమారులు; ఉండువారు+ఐన= ఉండేవాళ్ళైతే; వారలన్= వాళ్ళను; కృష్ణ, బలదేవులు; యదు, వృష్ణి, భోజ+అంధక, వర్గములతో; వచ్చి= చనుదెంచి; కూడినన్= కలసినట్లైతే; ఎవ్వరు= ఎవ్వరు కూడా; సాధింపన్+ఓపరు= జయించలేరు; కావునన్= కాబట్టి;

ఎడచేయక= ఆలస్యం చేయక; ద్రుపదుండు; పాండవులన్= పాండవుల్ని; విడుచునట్లుగా; భేదింతము= చీలిక కలిగింతము; ఒండెన్= కానియెడల; వలను, కలవారలన్= నేర్పుకలవాళ్ళను; పంచి= పంపి; కౌంతేయ, మాద్రేయులను= కుంతికొడుకులను, మాద్రికొడుకులను; తమలో= వారిలో; విరక్తులు+అగునట్లుకాన్= ప్రేమలేనివాళ్ళు అయ్యేటట్లుగా; చేయింతము= చేయిద్దాము; ఒండెన్= కాదేని; అతి, లలిత, ప్రమదా, జనంబులన్= మిక్కిలి అందమైన స్త్రీలను; ఏవురకున్= ఐదుగురకు; ప్రయోగించి= ఉపయోగించి; ద్రౌపదివలనన్= ద్రౌపదియెడ; విరక్తిన్= ఏవగింపు; పుట్టింతము= కలిగిస్తాము; ఒండెన్= కాదేని; ఏవురకున్= ఐదుగురికి; ఒక్కతియు+అ= ఒకతె; ఆలు+అగుట= భార్య కావటం; కష్టంబు+అని= కష్టం అని; ద్రోవదిన్= ద్రౌపదిని; పాండవులవలన= పాండవులపై; విగత, స్నేహన్= తొలగిన ప్రేమకలదానినిగా; కావింతము= చేద్దాం; ఒండెన్= కాదేని; ఉపాంశు, ప్రయోగంబులన్= రహస్యాలైన మంత్రతంత్రాలచేత; భీమున్= భీముణ్ణి, వధియించి= చంపి; తక్కిన, వారలన్= మిగతావాళ్లను, బలహీనులన్, చేయుదము.

**తాత్పర్యం:** అది ఎట్లాగంటే, పుత్రమిత్రబంధుబలం సమృద్ధిగా కల ద్రుపదుని దగ్గర పాండవులుండి, వాళ్ళకుతోడుగా శ్రీకృష్ణబలరాములు యదువృష్ణి భోజాంధకవర్గాలతో వచ్చి చేరితే, ఇక వాళ్ళను జయించటం ఎవ్వరికీ సాధ్యం కాదు. అందువలన ఆలస్యం చేయక ద్రుపదుడు పాండవులను వదిలేటట్లుగా చీలిక కలిగిద్దాం. లేకుంటే, నేర్పరులైన వాళ్ళను పంపి కుంతికొడుకులకు, మాద్రికొడుకులకు తమలో తాము ప్రేమ లేని వాళ్ళయ్యేటట్లు చేద్దాం. అట్లా కాకుంటే, మిక్కిలి అందగత్తెలైన ఆడవాళ్ళను పాండవులైదుగురిపై ప్రయోగించి, ద్రౌపదిపట్ల ఏవగింపు పుట్టిద్దాం. కాకుంటే, ఐదుగురికి ఒక్కతె భార్య కావటం కష్టం అని ద్రౌపదిని పాండవుల మీద ప్రేమలేనిది అయ్యేటట్లుగా చేద్దాం. లేకుంటే చాటుమాటు మంత్రతంత్రాలు నడిపి భీముడిని చంపి మిగిలినవాళ్ళను బలహీనులుగా చేద్దాం.

**విశేషం:** సామదానాలు ఫలించినప్పుడు భేదోపాయాన్ని ప్రయోగించటం రాజనీతి. అవసరాన్నిబట్టి దుర్యోధనుడు ముందుగానే ప్రయోగిస్తున్నాడు. ఇందులో ఆరురకాల భేదోపాయాలను తంత్రిముందు ప్రతిపాదిస్తున్నాడు. అవి 1.బంధువులబలగం కూడి ఒక కూటమిగా ఏర్పడకుండ చూడటం. 2. పాండవులకూ వారిబంధువులలో ముఖ్యుడైన ద్రుపదునికీ నడుమ భేదం కలిగించటం, 3. బంధువుల మధ్య భేదోపాయం పనిచేయకపోతే అన్నదమ్ముల మధ్య సవతితల్లుల బిడ్డలనే భావంతో కౌంతేయులు, మాద్రేయులు అనే భేదం కలిగించటం, 4. ద్రౌపదికంటె అందగత్తెలను పాండవులమీద ప్రయోగించి భర్తలకు భార్యపట్ల మక్కువలేకుండా చేయటం. 5. పంచభర్తృక అయిన ద్రౌపదికి భర్తలపై భేదభావం కలిగించటం. 6. పాండవబల మూలస్తంభంగా భావించబడే భీముడిని వధించి, వాళ్ళను నిర్వీర్యం చేయటం. ఇది దుర్యోధనుని దుర్విదగ్ధత, దుర్మార్గ ప్రవృత్తి, ప్రతిఫలించే ప్రతిపాదనలు. (సంపా.)

**ఆ. గాడ్పుచూలి పిఱుఁదుఁ గావంగ నర్జును। నోర్వ నమరులైన నోప రాజి;**
**నతఁడు నిహతుఁ డగుడు నశ్రమంబునఁ। బార్థు నొక్కరుండ కర్ణుఁ డోర్వ నోపు. 23**

**ప్రతిపదార్థం:** గాడ్పు, చూలి= వాయుతనయుడు - భీముడు; పిఱుఁదున్= వెనుకభాగాన్ని; కావంగన్= కాపాడగా; ఆజిన్= యుద్ధంలో; అర్జునున్= అర్జునుణ్ణి; ఓర్వన్= జయించటానికి; అమరులు+ఐనన్= దేవతలైన; ఓపరు=చాలరు; అతఁడు= ఆ భీముడు; నిహతుఁడు= చంపబడినవాడు; అగుడున్= కాగా; పార్థున్= అర్జునుణ్ణి; కర్ణుఁడు; ఒక్కరుండు+అ= ఒక్కడే; అశ్రమంబునన్= సులభంగా; ఓర్వన్+ఓపున్= జయించగలడు.

**తాత్పర్యం:** వాయుపుత్రుడైన భీముడు సహాయంగా వెనుక నిలిస్తే - అర్జునుడిని యుద్ధంలో జయించటం ఆ దేవతలకైనా సాధ్యం కాదు. భీముడిని చంపితే అర్జునుణ్ణి కర్ణ డొక్కడే అనాయాసంగా జయించగలడు.

**విశేషం:** దుర్యోధనుని అంచనాలో పాండవబలానికి పెట్టనికోట భీమసేనుడు. అతడు అండగా నిలిస్తేనే అర్జునుని పరాక్రమం దేవతలకుకూడా అసాధ్యమౌతుందట. భీముడు లేకపోతే అర్జునుడు కర్ణునికి అసాధ్యుడు కా డని అతనివాదం. వాస్తవానికి అది నిజం కాదు. మత్స్యయంత్రసభలో అర్జుననిచేతిలో ఓడిపోయిన కర్ణుడిని సమర్థించుకొనే కుంటిసాకు ఇది. దుర్విదగ్ధులవాదం ఇట్లాగే ఉంటుంది.

**వ. 'ఈ యుపాయంబులలో నెయ్యది యుచితంబును నపగతదోషంబును నదీర్ఘసూత్రంబును నగు నట్టి దానిం**
**జెచ్చెర ననుష్ఠించు నది' యనినఁ గర్ణుం డి ట్లనియె. 24**

**ప్రతిపదార్థం:** ఈ, ఉపాయంబులలోన్= ఈ నాలుగువిధాల ఉపాయాలలో; ఏ+అది, ఉచితంబును= ఏది తగినదీ; అపగత, దోషంబునున్= పోయినదోషం కలదీ - అంటే లోపం లేనిది; అదీర్ఘ, సూత్రంబునున్= ఆలస్యంచేయకుండా చేయదగిందీ; అగున్= అవుతుందో; అట్టి= అటువంటి; దానిన్= దాన్ని; చచ్చెరన్= వేగమే; అనుష్ఠించునది= ఆచరించవలసింది; అనినన్= అని అనగా; కర్ణుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ ఉపాయాలలో ఏది యోగ్యమవుతుందో, ఏది దోషం (లోపం) లేకుండా ఉంటుందో, చాలాకాలం పట్టకుండా స్వల్పకాలంలోనే సత్ఫలితాల నిస్తుందో అటువంటిదానిని వెంటనే ఆచరించవలసింది' అని దుర్యోధను డనగా, కర్ణుడు ఈ విధంగా పలికాడు.

**విశేషం:** చతుర్విధోపాయాలను ప్రయోగించేటప్పుడు తీసికొనవలసిన జాగ్రత్తలు మూడింటిని ఇందులో సూచించటం జరిగింది.

**సీ. ఆర్యవృత్తుండు రాజాన్వయసమ్మతుఁ । డభిమతసంబంధుఁ డయినవాఁడు**
**గుణవంతు లగుచున్న కొడుకులు గలవాఁడు । పాంచాలుఁ డేల యప్పాండుసుతుల**
**వినయసంపన్నుల విడుచువాఁడగు?; మఱి । పాండునందను లేకపత్నియంద**
**కర మనురక్తులు గావునఁ దమలోన । నేల భేదిల్లుదు?; రెన్నఁడయ్యు**

**ఆ. నొక్కసతికిఁ బతులు పెక్కండ్రు రగు టిది । సతులకోర్కిగాన యతివ కృష్ణ**
**సుందరాంగి వారియం దేల యపరక్త । యగు మనోముదంబుఁ దగులుఁ గాక. 25**

**ప్రతిపదార్థం:** ఆర్య, వృత్తుండు= మంచినడవడి కలవాడు; రాజ+అన్వయ, సమ్మతుఁడు= రాజవంశాలకు ఇష్టమైనవాడు; అభిమత, సంబంధుఁడు= ఇష్టమైన చుట్టరికం కలవాడు; అయినవాఁడు= అయినటువంటి అతడు; గుణవంతులు+అగుచు+ ఉన్న; కొడుకులు; కలవాడు; పాంచాలుఁడు= ద్రుపదుడు; ఏల= ఎందువల్ల; ఆ+పాండు, సుతులన్= ఆ పాండురాజు కుమారులైన పాండవులను; వినయ, సంపన్నులన్= అణకువ మిక్కిలిగా కలవాళ్ళను; విడుచువాఁడు, అగున్ = వదలేవాడు అవుతాడు; మఱి= ఆపై; పాండు, నందనులు= పాండవులు; ఏక, పత్ని, అందు+అ= ఒక భార్యమీదనే; కరము= మిక్కిలి; అనురక్తులు= ప్రేమకలవాళ్ళు; కావునన్; తమలోనన్; ఏల= ఎందుకు; భేదిల్లుదురు= విరోధం వహిస్తారు; ఎన్నఁడు+అయ్యున్= ఎప్పుడైనా; ఒక్క, సతికిన్= ఒక్క స్త్రీకి; పతులు= భర్తలు; పెక్కండ్రురు= పెక్కుమంది; అగుట= కావటం; ఇది; సతుల, కోర్కి= స్త్రీల కోరిక; కాన; సుందర+అంగి= అందమైనదేహం కలది; అతివ= స్త్రీ, కృష్ణ= ద్రౌపది; వారి, అందు, ఏల= ఆ పాండవులపై ఎందుకు; అపరక్త= ప్రేమలేనిది; అగున్= అవుతుంది; మనస్ ముదంబున్= మనస్సులోని సంతోషంతో; తగులున్, కాక= ప్రేమించునుకదా!, అనగా ఆసక్తితో ఉంటుంది కదా!

**తాత్పర్యం:** మంచి నడవడికలవాడు, రాజవంశాలకు ఇష్టమైనవాడు; ప్రియమైన బంధుబలంకలవాడు; గుణవంతులైన కొడుకులుకలవాడు అయిన ద్రుపదుడు, వినయసంపన్నులైన ఆ పాండవులను ఎందువలన వదలివేస్తాడు? అంతేకాదు, పాండవులంతా ఒకే భార్యమీద మిక్కిలిప్రేమకలవాళ్ళు. అందువలన వాళ్ళమధ్య ఎందుకు వైరం ఏర్పడుతుంది? కాగా, ఎప్పుడైనా స్త్రీలు, పెక్కుమందిభర్తలను కోరుకొంటారు. అందువలన అందగత్తె ద్రౌపది పాండవులను మనసారా ప్రేమిస్తుందే కాని తిరస్కరిస్తుందా?

**విశేషం:** అలంకారం - కావ్యలింగం. దుర్యోధనుడు ప్రతిపాదించిన భేదోపాయాలన్నీ సఫలాలు కావని కర్ణుడు సహేతుకంగా పేర్కొన్నాడు.

**వ. మఱి భీమసేనుండు దొల్లి మీచేసిన యుపాంశువధల నేమి యయ్యె? నింకను నట్ల కావున నీ యుపాయప్రయోగంబు లన్నియు నుడిగి యిప్పడ పాండవులయందు విక్రమంబు ప్రయోగించుట కార్యంబు. 26**

**ప్రతిపదార్థం:** మఱి= ఇక; భీమసేనుండు; తొల్లి= ఇంతకుముందు; మీ, చేసిన= మీయొక్క చేసిన - మీరు చేసిన; ఉపాంశు, వధలన్= రహస్య హత్యా ప్రయత్నాలచేత; ఏమి అయ్యెన్= ఏమైనాడు; ఇంకను; అట్లు+అ= ఇకముందుకూడా అంతే; కావునన్; ఈ, ఉపాయ, ప్రయోగంబులు= ఈ ఉపాయాలకు సంబంధించిన; అన్నియున్= అన్నీ; ఉడిగి= మాని; ఇప్పుడు+అ= ఇపుడే; పాండవుల, అందున్= పాండవుల మీద; విక్రమంబు= పరాక్రమం; ప్రయోగించుట; కార్యంబు= చేయదగిన పని.

**తాత్పర్యం:** అంతే కాదు, ఇదివరకు మీరు చేసిన రహస్యహత్యాప్రయత్నాలతో భీముడు ఏమయ్యాడు? ఇక ముందుకూడా అంతే. అందువలన ఈ ఉపాయాలు మాని ఇప్పుడు పాండవులమీద పరాక్రమం ప్రయోగించటమే మనకర్తవ్యం.

**చ. ఘన మగు విక్రమంబునన కాదె జగత్త్రితయంబుఁ బాకశా**
**సనుఁడు జయించె; భూతలము సర్వము మున్ భరతుండు విక్రమం**
**బునన జయించె; విక్రమము భూరి యశఃప్రియు లైన రాజనం**
**దనులకు సర్వసాధనము, ధర్మువు శత్రునిబర్హణంబులన్. 27**

**ప్రతిపదార్థం:** పాకశాసనుఁడు= దేవేంద్రుడు; జగత్+త్రితయంబున్= లోకాలు మూడింటిని; ఘనము+అగు= గొప్పదైన; విక్రమంబునన, కాదె= పరాక్రమంచేతనేకదా; జయించెన్= జయించాడు; భరతుండు; భూతలము, సర్వము= భూమండలాన్నంతా; మున్= మునుపు; విక్రమంబునన= పరాక్రమంచేతనే; జయించెన్= జయించాడు; భూరి, యశః ప్రియులు+ఐన= గొప్ప కీర్తి మీద ఇష్టంకలవాళ్ళు అయిన; రాజనందనులకున్= రాజకుమారులకు; విక్రమము= పరాక్రమమే; సర్వసాధనము= అన్నింటిని సాధించేది; శత్రు, నిబర్హణంబులన్= శత్రువధలు చేయటంలో; ధర్మువు= ధర్మం.

**తాత్పర్యం:** దేవేంద్రుడు ముల్లోకాలను గొప్ప పరాక్రమం చేతనే కదా జయించాడు. భరతుడు భూమండలాన్నంతా పూర్వం జయించింది పరాక్రమంచేతనే కదా! గొప్పకీర్తిని కోరుకొనే రాజకుమారులకు పరాక్రమమే సర్వసాధనం; శత్రువధలలో ధర్మం.

**విశేషం:** అలంకారం - అర్థాంతరన్యాసం. పాకశాసనుడు = వృత్రాసురుని సోదరుడైన పాకాసురుడిని చంపినవాడు - దేవేంద్రుడు. కర్ణుడు వీరుడు. దుర్యోధనధృతరాష్ట్రులవలె కపటికాడు, సామదానభేదోపాయాలు విఫలమైన తరువాత దండోపాయం ప్రయోగించాలి - రాజనీతిప్రకారం. దుర్యోధనుడు ప్రయోగించదలచుకొన్న భేదోపాయం ఫలవంతం కాదని కర్ణుడు నిరూపించి ప్రతాపప్రదర్శకమైన యుద్ధమే ( దండోపాయం) శరణ్యమని పేర్కొన్నాడు. యుద్ధమే వీరధర్మమని ప్రతిపాదించాడు.

**వ. 'కావునఁ జతురంగ బల సాధనసన్నద్ధుల మయి యుద్ధంబునం బాంచాలు భంజించి పాండవుల నొండుగడ నుండనీక తోడ్కొనితెత్త' మనినఁ గర్ణుపలుకు లాకర్ణించి ధృతరాష్ట్రుం 'డిది యకార్యం బగు; నయినను మతిమంతులతో విచారించి చేయుద మని భీష్మద్రోణవిదురశల్యకృపాశ్వత్థామసోమదత్తాదులం బిలువంబంచి యంతయు నెఱింగించిన భీష్ముండు దుర్యోధనుం జూచి యి ట్లనియె. 28**

**ప్రతిపదార్థం:** కావునన్; చతురంగ, సాధన, సన్నద్ధులము+అయి= రథ గజ తురగ పదాతి బలాలతో, యుద్ధపరికరాలతో సిద్ధమై; యుద్ధంబునన్= యుద్ధంలో; పాంచాలున్= ద్రుపదుని; భంజించి= ఓడించి; పాండవులన్; ఒండు, కడన్= మరొకచోట; ఉండనీక= ఉండనీయకుండా; తోడ్కొని తెత్తము = తీసికొనివద్దాం; అనినన్= అని అనగా; కర్ణు, పలుకులు= కర్ణుని మాటలు; ఆకర్ణించి= విని; ధృతరాష్ట్రుండు; ఇది, అకార్యంబు+అగున్= చేయతగని పని అవుతుంది; అయినను; మతిమంతులతోన్= బుద్ధిబలం కలవారితో; విచారించి= ఆలోచించి; చేయుదము=చేద్దాం; అని= అని చెప్పి; భీష్మ, ద్రోణ, విదుర, శల్య, కృప+అశ్వత్థామ, సోమదత్త+ఆదులన్= భీష్ముడు; ద్రోణుడు మొదలైన వారిని; పిలువన్+పంచి= పిలిపించి; అంతయున్= అంతా; ఎఱింగించినన్= తెలియపరచగా; భీష్ముండు; దుర్యోధనున్; చూచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అందువలన చతురంగబలాలతో, యుద్ధపరికరాలతో సిద్ధమై వెళ్ళి, యుద్ధంలో ద్రుపదుడిని ఓడించి, పాండవులను వేరొకచోట ఉండనీయక వెంటతీసికొని వద్దాం' అని కర్ణుడు అనగా - అతనిమాటలు విని ధృతరాష్ట్రుడు, 'ఇది చేయ తగని పని, అయినా బుద్ధిబలం గలవాళ్ళతో ఆలోచించి చేద్దాం' అని భీష్ముడు, ద్రోణుడు, విదురుడు మొదలైనవాళ్ళను పిలిపించి జరిగినదంతా చెప్పాడు. అప్పుడు భీష్ముడు దుర్యోధనుడిని చూచి ఇట్లా అన్నాడు.

**విశేషం:** మహాభారతంలో మహావీరుడు కర్ణుడు చేసిన యుద్ధప్రతిపాదనలలో ఇదొకటి. కర్ణుడు చేసే యుద్ధప్రతిపాదనలను దుర్యోధనుడు అంగీకరిస్తాడు. అందుకు ప్రధానకారణం - పాండవులను పరిమార్చాలన్న ద్వేషం. కాని కర్ణుని యుద్ధ ప్రతిపాదనలకు ప్రధానకారణం పార్థుడిని యుద్ధంలో ఓడించి, అతడిని మించిన వీరుడని కీర్తి గడించాలనే ఆశయం.

ధృతరాష్ట్రుడు కర్ణదుర్యోధనుల ప్రతిపాదనలు విన్నాడు. దుర్యోధనునిది కుటిలభేదోపాయప్రతిపాదన. కర్ణునిది వీరోచితయుద్ధ ప్రతిపాదన. అయితే దుర్యోధనుని ప్రతిపాదన కర్ణుడే ఖండించాడు. ఇబ్బంది లేదు. ఇక మిగిలింది కర్ణుని యుద్ధ ప్రతిపాదన. పుత్రమమకారపీడితుడు, లోభగుణపూరితుడు అయిన ధృతరాష్ట్రునికి నొసటి కళ్ళు లేవుగాని - కడుపు నిండా కళ్ళే. ఆ వృద్ధరాజు లోతైన ఆలోచన కల వ్యక్తి. అందుకే యుద్ధ ప్రతిపాదన వినగానే ఇదేమి దుర్బుద్ధి అని కొడుకును, కర్ణుడిని గట్టిగా మందలించలేదు; ప్రతిపాదనను తత్క్షణమే పూర్తిగా తిరస్కరించనూలేదు. 'మతిమంతులతో విచారించి చేయుదము' అన్నాడు. భీష్మద్రోణవిదురాదులను పిలిపించాడు. యుద్ధ ప్రతిపాదన కార్యరూపం దాల్చి, సఫలం కావాలంటే భీష్మద్రోణ విదురాదుల సహకారం కావాలి. భీష్మ ద్రోణులకు ద్రుపదుడు ఇష్టుడు కాదు. అందుకు ఎవరి కారణం వారికి ఉన్నది. కాబట్టి భీష్మ ద్రోణులు అంగీకరిస్తే యుద్ధ ప్రతిపాదన బాగా సఫలమౌతుంది. కొడుకులకు గొప్పగా లాభిస్తుంది. లేకుంటే ఆ పెద్దలే కర్ణదుర్యోధనులకు బుద్ధి చెపుతారు. తాను అప్రియంగా మాట్లాడవలసిన అవసరం తప్పుతుంది. ఆ దుడుకుయువకుల అసంతృప్తిని, ఆగ్రహాన్ని ఆ పెద్దలే పంచుకొంటారు.

**మత్తకోకిల.**

**ధీరు లౌ ధృతరాష్ట్రపాండు లతిప్రశస్తగుణుల్ ప్రసి**

**ద్ధోరుకీర్తులు; నాకు నిద్దఱు నొక్కరూప; తలంపఁగా**

**వీరు వా రను నట్టిబుద్ధివిభేద మెన్నఁడు లేదు గాం**

**ధారిపుత్త్రశతంబునందుఁ బృథాతనూజులయందునున్. 29**

**ప్రతిపదార్థం:** ధీరులు+ఔ= ధైర్యవంతులైన; ధృతరాష్ట్ర, పాండులు= ధృతరాష్ట్రుడు,పాండురాజు; అతి, ప్రశస్త, గుణుల్= మిక్కిలి శ్రేష్ఠములైన గుణాలు కలవారు; ప్రసిద్ధ+ఉరు, కీర్తులు= ప్రసిద్ధమైన గొప్ప కీర్తి కలవారు; ఇద్దఱున్; నాకున్; ఒక్కరూపు+అ= ఒక్కవిధమే; గాంధారి, పుత్త్ర, శతంబు, అందున్= గాంధారియొక్క కొడుకులు నూరుగురిలో; పృథా, తనూజుల, అందునున్= కుంతీదేవికొడుకులలో; వీరు, వారు, అనునట్టి; బుద్ధి, విభేదము= బుద్ధిలో భేదభావం; ఎన్నఁడు, లేదు= ఏనాడూ లేదు.

**తాత్పర్యం:** ధైర్యవంతులు, మిక్కిలి శ్రేష్ఠమైనగుణాలు కలవాళ్ళు, ప్రసిద్ధమైన గొప్పకీర్తి కలవాళ్ళు అయిన ధృతరాష్ట్ర పాండురాజు లిద్దరూ నా కొక్కటే. గాంధారికొడుకులలో, కుంతికొడుకులలో వీళ్ళు, వాళ్ళు అనే భేదభావం నా కెన్నడూ లేదు.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు: ఆది.1.153 విశేషం. ఇది భీష్ముని సమత్వదృష్టిని ప్రకటించటంలో ఒక ప్రత్యేకతను, విశిష్టతను విస్పష్టం చేస్తూ ఉన్నది.

## భీష్మద్రోణులు దుర్యోధనునకు బుద్ధి సెప్పుట (సం.1-195-1)

**వ. అ ప్పాండవులతోడి విగ్రహంబుసేఁత కెన్నండును నొడంబడనేరఁ; బితృపైతామహం బయిన రాజ్యంబునకు నీయట్లు వారు నర్హులు; గావున వారికి నర్ధరాజ్యం బిచ్చిన నీకును నీ బాంధవులకును లోకంబులకును బ్రియం బగు; నట్లు గానినాఁ డపకీర్తి యగుఁ; గీర్తి నిలుపుటయ కాదె రాజులకు జన్మఫలంబు. 30**

**ప్రతిపదార్థం:** ఆ+పాండవులతోడి; విగ్రహంబు, చేఁతకు= యుద్ధంచేయటానికి; ఎన్నండును= ఎప్పుడుకానీ; ఒడంబడనేరన్= సమ్మతించలేను; పితృ, పైతామహంబు+అయిన= తండ్రితాతలకు సంబంధించిన; రాజ్యంబునకున్; మీ, అట్లు= మీవలె; వారున్= వాళ్లుకూడా; అర్హులు= యోగ్యులు; కావునన్= కాబట్టి; వారలకున్= వాళ్లకు; అర్ధ, రాజ్యంబు= సగం రాజ్యం; ఇచ్చినన్= ఇస్తే; నీకును; నీ, బాంధవులకును; లోకంబులకును; ప్రియంబు= సంతోషం; అగున్= అవుతుంది; అట్లు, కాని నాఁడు= ఆవిధంగా జరుగనినాడు; అపకీర్తి, అగున్; కీర్తి, నిలుపుటయకాదె= కీర్తిని నిల్పుకోవటమేకదా; రాజులకున్, జన్మ, ఫలము= క్షత్రియులకు పుట్టుకతో వచ్చినఫలం.

**తాత్పర్యం:** ఆ పాండవులతో యుద్ధం చేయటానికి నేను ఎన్నడూ సమ్మతించను. తండ్రితాతలరాజ్యానికి మీవలెనే వాళ్ళుకూడా అర్హులు. కాబట్టి వాళ్ళకు సగంరాజ్యం ఇస్తే నీకూ, నీ చుట్టాలకూ, లోకాలకూ సంతోషం కలుగుతుంది. అట్లా కాకపోతే అపకీర్తి కలుగుతుంది. కీర్తి నిలపటమే రాజులకు జన్మఫలం.

**ఆ. కీర్తి లేనివానికిని జీవనంబు ని । రర్థకంబ చూవె! యవనిమీఁద**

**నిత్య మయిన ధనము నిర్మల కీర్తియ; । యట్టి కీర్తి వడయు టశ్రమంబె? 31**

**ప్రతిపదార్థం:** కీర్తిలేనివానికిని; జీవనంబు= బ్రదుకు; నిరర్థకంబు+అ= వ్యర్థమే; చూవె= సుమా; అవనిమీఁదన్= భూమిమీద; నిత్యము+అయిన= శాశ్వతమైన; ధనము; నిర్మల, కీర్తి+అ=స్వచ్ఛమైన కీర్తి మాత్రమే; అట్టి; కీర్తి, పడయుట= కీర్తిని పొందుట; అశ్రమంబె= సులభమా?

**తాత్పర్యం:** కీర్తి లేనివానిబ్రతుకు వ్యర్థమే. భూమిమీద శాశ్వతమైన ధనం స్వచ్ఛమైన కీర్తే. అట్లాంటి కీర్తిని పొందటం సులభమా?

**విశేషం:** నన్నయ రుచిరార్థసూక్తులలో కీర్తినిగూర్చిన సూక్తి ఇది.

**క.** **ఇలఁ గీర్తి యెంత కాలము । గలిగి ప్రవర్తిల్లె నంతకాలంబును ని**
**త్యుల కారె కీర్తి గల పు । ణ్యులు; కీర్తివిహీనుఁ డెందునుం బూజ్యుండే.** **32**

**ప్రతిపదార్థం:** ఇలను= భూమిమీద; కీర్తి; ఎంతకాలము, కలిగి= నిలిచి; ప్రవర్తిల్లెన్= ఉంటుందో; అంత, కాలంబును; కీర్తి, కల, పుణ్యులు= కీర్తి గల పుణ్యాత్ములు; నిత్యులు= శాశ్వతంగా ఉండేవాళ్ళు; కారె?; కీర్తి, విహీనుఁడు= కీర్తిలేనివాడు; ఎందునున్= ఎక్కడైనా; పూజ్యుండే= పూజింపతగినవాడా? (కాదని భావం)

**తాత్పర్యం:** లోకంలో కీర్తి ఎంత కాలం నిలిచి ఉంటుందో, కీర్తిమంతులైన పుణ్యాత్ములు అంత కాలం జీవించి ఉంటారు. కీర్తి లేనివాడు ఎక్కడైనా పూజార్హుడవుతాడా?

**వ.** **'కీర్తియు నపకీర్తియు జనులకు స్వర్గ నరక నిమిత్తంబులు గావున, నపకీర్తి పరిహరించి, కీర్తిం బ్రతిష్ఠించి, పైతృకం బగు రాజ్యంబు పాండవుల కిచ్చి, వారితోడ బద్ధప్రణయుండవయి కీర్తి నిలుపు' మనిన భీష్మపలుకులకు సంతసిల్లి ద్రోణుండు దుర్యోధనున కి ట్లనియె.** **33**

**ప్రతిపదార్థం:** కీర్తియున్, అపకీర్తియున్; జనులకు= ప్రజలకు; స్వర్గ, నరక, నిమిత్తంబులు= స్వర్గానికి, నరకానికి కారణాలు; కావునన్; అపకీర్తిన్= చెడ్డపేరును; పరిహరించి= వదలి; కీర్తిన్= మంచిపేరును; ప్రతిష్ఠించి= నిలుపుకొని; పైతృకంబు+అగు= తండ్రివలన వచ్చినదైన; రాజ్యంబు= రాజ్యాన్ని; పాండవులకున్+ఇచ్చి; వారితోడన్; బద్ధ, ప్రణయుండవు+అయి= చేయబడిన స్నేహం కలవాడవయి; కీర్తి; నిలుపుము= కీర్తిని నిలుపుకో; అనినన్= అని చెప్పగా; భీష్మ పలుకులకున్= భీష్ముని మాటలకు; సంతసిల్లి; ద్రోణుండు; దుర్యోధనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'కీర్తి మానవులకు స్వర్గకారణం. అపకీర్తి నరకకారణం. అందువలన అపకీర్తి వదలి కీర్తిని నిలుపుకొమ్ము. వంశపారంపర్యంగా వచ్చినరాజ్యం పాండవుల కిచ్చి వాళ్ళతో స్నేహంగా ఉండి కీర్తిని నిలుపుము' అని భీష్ముడు అనగా, ఆయనమాటలకు సంతసిల్లి ద్రోణుడు దుర్యోధనునితో ఇట్లా అన్నాడు.

**చ.** **బహుగుణ ముత్తమోత్తమము పథ్యము ధర్మ్యము సాధుసమ్మతం**
**బహిత బలప్రమాథివిపులార్థయుతం బగుటన్ భవత్పితా**
**మహువచనంబుఁ జేకొనుము; మానుగ వారలతోడ నీవు వి**
**గ్రహ మొనరింప నేమిటికిఁ గౌరవసౌబలకర్ణశిక్షలన్.** **34**

**ప్రతిపదార్థం:** బహుగుణము= అనేకవిధాల మంచిదైనది; ఉత్తమ+ఉత్తమము= మహాశ్రేష్ఠమైనది; పథ్యము= మేలు చేసేది; ధర్మ్యము= ధర్మమైనది; సాధు, సమ్మతంబు= సజ్జనులకు ఇష్టమైనది; అహిత, బల, ప్రమాథి= శత్రుబలాన్ని చంపటానికి తగినది; పీడింప (హింసింప) కలది; విపుల+అర్థ, యుతంబు= అధికమైన ప్రయోజనంతో కూడినది; అగుటన్= కావటంచేత; భవత్+పితామహు, వచనంబు= నీ తాత అయిన భీష్మునిమాటను; మానుగన్= చక్కగా; చేకొనుము= గ్రహించుము; నీవు; కౌరవ, సౌబల, కర్ణ, శిక్షలన్= కౌరవులయొక్క, శకునియొక్క, కర్ణునియొక్క ఉపదేశాలతో; వారలతోడన్= పాండవులతో; విగ్రహము= యుద్ధం; ఒనరింపన్=చేయటం; ఏమిటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** నీ తాత భీష్మునిమాట అనేకవిధాల మంచిది. మిక్కిలి శ్రేష్ఠమైనది. మేలు చేసేది. ధర్మమైనది. సజ్జనులకు ఇష్టమైనది. శత్రుబలాన్ని అణచేది. అధికమైన లాభం కలది. అందువల్ల ఆయనమాట స్వీకరించుము. కౌరవులు, శకుని, కర్ణుడు చెప్పేమాటలు విని, నీవు పాండవులతో యుద్ధం చేయటం ఎందుకు?

**విశేషం:** కౌరవ శబ్దాన్ని దుర్యోధనుని గురించిన సంబోధనగా కూడా గ్రహింపవచ్చు. భీష్ముని వాక్యాలు నిర్దేశాత్మకంగా, సూటిగా ఉన్నాయి. ద్రోణునిమాటలు నిషేధాత్మకమార్గంలో నడిచాయి. ఉభయుల స్వభావాలు వాళ్ళమాటలలో ప్రతిఫలించాయి.

**మ. విలసద్ధర్మవిశుద్ధవృత్తులు వయోవృద్ధుల్ కుశాగ్రీయబు**
**ద్ధులు మధ్యస్థులు కార్యనిర్ణయసమర్థుల్ మానమాత్సర్యదూ**
**రులు నాఁ జాలినవారిపల్కులకు వైరుద్ధ్యంబు గావించున**
**జ్ఞులు భూనాథున కాప్తులున్ సఖులు నై శోషింతు రత్యంతమున్. 35**

**ప్రతిపదార్థం:** విలసత్+ధర్మ, విశుద్ధ, వృత్తులు= ప్రకాశించేటటువంటి ధర్మంతో పరిశుద్ధమైన నడవడి గలవాళ్ళు; వయోవృద్ధుల్= వయస్సులో పెద్దవాళ్ళు; కుశాగ్రీయ బుద్ధులు= దర్భకొనలవంటి పదునైన బుద్ధికలవాళ్ళు; మధ్యస్థులు= పక్షపాతం లేనివాళ్ళు; కార్య, నిర్ణయ, సమర్థుల్= చేయదగిన పనిని నిర్ణయించటంలో నిపుణులు; మాన మాత్సర్య, దూరులు= కోపానికి, మాత్సర్యానికి దూరమైనవాళ్ళు; నాన్+చాలిన= అని అనదగిన; వారి, పల్కులకు; వైరుద్ధ్యంబు= విరోధాన్ని; కావించు, అజ్ఞులు= చేయు (కల్పించు) అవివేకులు; భూనాథునకున్= రాజునకు; ఆప్తులున్= చుట్టాలూ; సఖులున్+ఐ= స్నేహితులై; అత్యంతమున్= మిక్కిలి; శోషింతురు= పాడయిపోతారు.

**తాత్పర్యం:** ధార్మికులు, వృద్ధులు, బుద్ధిబలం కలవాళ్ళు, పక్షపాతం లేనివాళ్ళు, చేయదగిన దానిని నిర్ణయించటంలో సమర్థులైనవాళ్ళు, కోపం, మాత్సర్యం లేనివారు అని చెప్పదగినవాళ్ళమాటలను కాదనే అవివేకులు - రాజుకు ఆప్తులు, స్నేహితులై అతడిని పాడుచేయడమేగాక, తామూ పాడయిపోతారు.

**విశేషం:** మతిమంతుల మాటలను కాదనే అవివేకులను ప్రభువు స్నేహితులుగా గౌరవించరాదని ధ్వని.

**చ. తనరుచు దైవయుక్తి మెయి ధర్మువు సత్యముఁ దప్పకున్న య**
**య్యనఘుల పైతృకం బయిన యంశము మిన్నక వజ్రపాణి కై**
**నను గొనఁబోలు నయ్య కురునందన! పాండుతనూజు లున్న వా**
**రని విని వారికిం దగు ప్రియం బొనరింపక యున్కి ధర్మువే? 36**

**ప్రతిపదార్థం :** దైవయుక్తి మెయిన్= దైవయోగంచేత; తనరుచున్= ఒప్పుతూ; ధర్మువు= ధర్మము; సత్యమున్= సత్యము; తప్పక+ఉన్న= విడువకుండా ఉండు; ఆ+అనఘుల= ఆ పాపరహితులైన పాండవులయొక్క; పైతృకంబు+అయిన= తండ్రిదైన; అంశము= భాగం; మిన్నక= ఊరక; కొనన్= తీసికొనటానికి; వజ్రపాణికిన్+ఐనను= దేవేంద్రునికైనా; పోలును+అయ్యె= సాధ్యమగునా? కురునందన= కురువంశకుమారా! ఓ దుర్యోధనా!; పాండు, తనూజులు= పాండవులు; ఉన్న, వారు+అని= సుఖంగా ఉన్నారని; విని= ఆలకించి; వాళ్లకున్; తగు; ప్రియంబు= తగినట్లు సంతోషకరమైన పని; ఒనరింపక= చేయక; ఉనికి= ఉండటం; ధర్మువే= ధర్మమా? (కాదని భావం.)

**తాత్పర్యం:** దైవయోగంవలన వెలుగుతూ - ధర్మాన్ని, సత్యాన్ని తప్పని పుణ్యాత్ములైన పాండవులతండ్రి భాగాన్ని ఊరకే తీసికొనటం ఆ వజ్రాయుధుడైన దేవేంద్రునికికూడా సాధ్యం కాదు. దుర్యోధనా! పాండవులు సుఖంగా జీవించి ఉన్నారని విని, వాళ్ళకు సంతోషకరమైన పని చేయకుండుట ధర్మమా?

**విశేషం:** పాండవులకు వచ్చే రాజ్యభాగాన్ని నిష్కారణంగా అపహరించటానికి దేవేంద్రునికైనా సాధ్యం కాదని చెప్పటంలో ద్రోణుని సత్యప్రతిపాదనం ఎంత కనపడుతున్నదో నిర్మొగమాటంకూడా అంతే స్పష్టమౌతున్నది. పాండవులను చంపటానికి యత్నించికూడా, వాళ్ళు బ్రతికారని తెలిసినప్పుడు గౌరవించకుండా ఉండటం అధర్మమని ముఖంమీద గ్రుద్దినట్లు విప్రస్వాభావికంగా చెప్పాడు.

**వ. 'వారితో విగ్రహించుట కార్యంబు గాదు; 'కావునఁ బాండవద్రుపదధృష్టద్యుమ్నకుంతీద్రౌపదులకుఁ బ్రియపూర్వకంబున నుచితభూషణాంబరావళులు వేఱు వేఱ యిచ్చిపుచ్చి, పాండవుల నిందులకుఁ దోడ్కొనివచ్చువారుగా దుశ్శాసనవికర్ణ ప్రభృతుల సమకట్టి పంపు' మనిన ద్రోణుపలుకు లవకర్ణించి కర్ణుం డి ట్లనియె. 37**

**ప్రతిపదార్థం:** వారితోన్= ఆ పాండవులతో; విగ్రహించుట= యుద్ధంచేయటం; కార్యంబు= చేయదగిన పని; కాదు; కావునన్, పాండవ= పాండవులకు; ద్రుపద= ద్రుపదునికి; ధృష్టద్యుమ్న= ధృష్టద్యుమ్నునికి; కుంతీ, ద్రౌపదులకున్= కుంతికీ, ద్రౌపదికీ; ప్రియ, పూర్వకంబునన్= స్నేహపూర్వకంగా; ఉచిత, భూషణ+అంబర+ఆవళులు= తగినసొమ్ములయొక్క, వస్త్రాలయొక్క, సమూహాలను; వేఱు, వేఱ= విడివిడిగా; ఇచ్చి, పుచ్చి= ఇచ్చిపంపి; పాండవులన్= పాండవుల్ని; ఇందులకున్= ఇక్కడికి; తోడ్కొనివచ్చువారుగా= పిలుచుకొనివచ్చేవాళ్ళుగా; దుశ్శాసన, వికర్ణ, ప్రభృతులన్= దుశ్శాసనుడు, వికర్ణుడు మొదలైనవాళ్ళని; సమకట్టి= సిద్ధంచేసి; పంపుము= పంపవలసింది; అనినన్= అనగా; ద్రోణు, పలుకులు= ద్రోణుని మాటలు; అవకర్ణించి= పెడచెవిని పెట్టి; కర్ణుండు= కర్ణుడు, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'పాండవులతో యుద్ధం చేయటం తగని పని. అందువలన పాండవులకు, ద్రుపదునికి, ధృష్టద్యుమ్నుడికి, కుంతీదేవికి, ద్రౌపదికి స్నేహపూర్వకంగా తగినసొమ్ములను, వస్త్రాలను వేర్వేర ఇచ్చి పంపి, పాండవులను ఇక్కడికి పిలిచికొని రావటానికి దుశ్శాసనుడు, వికర్ణుడు మొదలైనవాళ్ళని సిద్ధంచేసి పంపుము' అని అనగా ద్రోణునిమాటలు పెడచెవిని పెట్టి కర్ణుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** భీష్మద్రోణులు చేసిన తొలిసంధి ప్రయత్నం. భీష్ముడు అర్ధరాజ్యప్రతిపాదననుకూడా మొదటిసారి ఈ ఘట్టంలోనే చేశాడు. భీష్ముడు కీర్తి, అపకీర్తులను నిరూపించి, వ్యంగ్యంగా పాండవ కౌరవ తారతమ్యానుశీలనం చేశాడు. ద్రోణుడు భీష్ముడిని సమర్థించి శకుని కర్ణుల బోధనలను అధిక్షేపించి, పాండవపరాక్రమాన్ని కీర్తించి, వాస్తవాలను వాచ్యం చేశాడు. దుర్యోధనుడు కర్ణాదుల చెప్పుడుమాటలవలన చెడిపోతున్నట్లు ద్రోణుడు చెప్పటంతో కర్ణుడు కోపగించి అధిక్షేపిస్తూ వాదానికి దిగాడు.

**తే.** **ముదుసళులు దమ కిమ్ముగాఁ జదివికొండ్రు। గాక పతులకు హిత మగు కర్జ మేల**
**యొలసి చెప్పదు? రహితుఁ గలపికొనుట। ధర్ము వని; రిది నయవిరుద్ధంబు గాదె?** 38

**ప్రతిపదార్థం:** ముదుసళులు= ముసలివారు; తమకున్+ఇమ్ముగాన్= తమకు అనుకూలంగా; చదివికొండ్రు, కాక= చెప్పుదురుగాని; పతులకున్= రాజులకు; హితము+అగు= మేలగు; కర్జంబు= కార్యం; ఏల=ఎందుకు; ఒలసి= పూనుకొని; చెప్పుదురు= చెప్పుతారు; అహితులన్= మేలుకోరనివారిని - శత్రువులను; కలపికొనుట= చేర్చుకోవటం; ధర్మువు= ధర్మం; అనిరి= అన్నారు; ఇది, నయ, విరుద్ధంబు= ఇది న్యాయానికి విరుద్ధమైనది; కాదె= అగునుకదా!

**తాత్పర్యం:** ముసలివాళ్ళు తమకు అనుకూలంగా ఉండేటట్లు చెప్పుతారు కాని రాజులకు మేలుకలిగేటట్లు చెప్పరు. శత్రువులైన పాండవులను చేర్చుకోవటం ధర్మం అన్నారు. ఇది న్యాయవిరుద్ధం కాదా?

**విశేషం:** భీష్మాదులకు కర్ణాదులకు వాదుపెట్టే ఈ సన్నివేశం ధృతరాష్ట్రుడే (సం) కల్పించాడు. ఇరువర్గాల విభిన్నమతాలకు సంఘర్షణ గమ్యమానమౌతుంది-ఇక్కడ. ధార్తరాష్ట్రులకు పాండవు లహితు లని కర్ణుడు బహిర్గతంగా ప్రకటించాడు. భీష్మాదులు మనసులో ఒకటి పెట్టుకొని పైకి మరొకటి మాట్లాడే అహితులైన అమాత్యులవంటివారని వ్యాఖ్యానించాడు. దుర్యోధనుడిని మెప్పించే ప్రియమే ధర్మమని వాదించి తన మిత్రత్వాన్ని ప్రకటించుకొన్నాడు-కర్ణుడు. నిందకు ప్రతినింద ఈ వాక్య సముదాయం.

**వ.** **'మంత్రులు దమ తమ బుద్ధిదోషంబులు నెట్లునుం బలుకుదురు. వారల సాధుత్వంబును నసాధుత్వంబును నెఱుంగవలయు; నె ట్లనినఁ దొల్లి నితంతు వను మగధరాజు వికలేంద్రియవర్గుం డయి శ్వాసమాత్రంబ తక్కి రాజ్యతంత్రంబునం దసమర్థుం డై యున్న నాతనిమంత్రి యేకప్రధానుం డయి రాజ్యతంత్రం బెల్లఁ దనవశంబ యగుటంజేసి వాని నవమానించి తదీయరాజ్యవిభవం బెల్లఁ జేకొనియె; వాఁడును విక్రమహీనుం డయి రాజ్యంబు గోల్పడియెం; గావున మంత్రులు హితులపోలె నుండి యహితం బాచరింతురు; మీ యిద్దఱపలుకులు మాకుం జూడ నహితంబు' లనిన నలిగి వానికి ద్రోణుం డి ట్లనియె.** 39

**ప్రతిపదార్థం:** మంత్రులు; తమతమ, బుద్ధి దోషంబులన్= తమ మనస్సులలో ఉండే కల్మషాలను; ఎట్లునున్= ఎట్లయినా; పలుకుదురు=పలుకుతారు; వారల; సాధుత్వంబును= మంచితనాన్ని; అసాధుత్వంబును= చెడుతనాన్ని; ఎఱుంగవలయున్= తెలిసికొనాలి; ఎట్లు= ఏవిధంగా; అనినన్= అంటే; తొల్లి= పూర్వం; నితంతువు+అను= నితంతువు అనే ; మగధరాజు= మగధరాజు; వికల+ఇంద్రియ, వర్గుండు+అయి= చెడిన ఇంద్రియాల సమూహం కలవాడై; శ్వాస, మాత్రంబు= ఊపిరిమాత్రమే; తక్కి= మిగిలి; రాజ్య, తంత్రంబు, అందున్= రాజ్యపరిపాలనలో; అసమర్థుండు+ఐ= నేర్పులేనివాడై; ఉన్నన్= ఉండగా; అతని, మంత్రి= ఆ రాజుయొక్క మంత్రి; ఏక, ప్రధానుండు+అయి= ఒక్కడే ముఖ్యుడై; రాజ్యతంత్రంబు+ఎల్లన్= రాజ్యపాలన అంతా, తన, వశంబు= తన స్వాధీనం; అగుటన్+చేసి=కావటంచేత; వానిన్= ఆ నితంతుమహారాజును; అవమానించి; తదీయ, రాజ్య, విభవంబు+ఎల్లన్= ఆతని రాజ్యసంపదనంతా; చేకొనియెన్= గ్రహించాడు; వాఁడును= ఆ మంత్రికూడా; విక్రమ, హీనుండు+అయి= పరాక్రమం లేని వాడై; రాజ్యంబున్, కోల్పడియెన్; కావునన్= కాబట్టి; మంత్రులు= అమాత్యులు; హితులపోలెన్+ఉండి= మేలుకోరేవారివలె కనిపించి; అహితంబు= కీడు; ఆచరింతురు= చేస్తారు; మీ, ఇద్దఱు+అ= మీ ఇరువురి; పలుకులు= మాటలు; మాకున్; చూడన్= పరికింపగా; అహితంబులు= కీడు చేసేవి; అనినన్= అని పలుకగా; ద్రోణుండు; అలిగి= కోపించి; వానికిన్= కర్ణునికి (కర్ణుడితో); ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'మంత్రులు తమమనస్సులలో కల్మషం ఉంచుకొని ఏదో విధంగా మాట్లాడతారు. వాళ్ళ మంచితనాన్ని, చెడ్డతనాన్ని తరచి తెలుసుకోవాలి. పూర్వం నితంతువు అనే మగధరాజు శక్తి సన్నగిల్లి, ఇంద్రియాలు చెడి, ఊపిరి మాత్రమే మిగిలి రాజ్యపాలనలో అసమర్థుడై ఉండగా; అతనిమంత్రి తా నొక్కడే ప్రాధాన్యం వహించి రాజ్యపాలన నంతా తన వశం చేసికొని, నితంతుమహారాజును త్రోసిపుచ్చి, అతని రాజ్యసంపదనంతా గ్రహించాడు. ఆ మంత్రికూడా పరాక్రమహీనుడై రాజ్యాన్నే కోల్పోయాడు. ఈ విధంగా మంత్రులు మేలు కోరేవాళ్ళవలెనే ఉండి, కీడు చేస్తారు. మీ ఇద్దరిమాటలూ మాకు కీడు చేసేటటువంటివి' అని అనగా, ద్రోణుడు కోపించి, కర్ణునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** భీష్మద్రోణులు కర్ణుని యుద్ధ ప్రతిపాదనలు పూర్తిగా తిరస్కరించారు. పైగా భీష్ముడు అర్ధరాజ్యప్రతిపాదన చేశాడు. దాన్ని ద్రోణుడు బలపరిచాడు. విశేషించి - పాండవులను, ద్రుపదధృష్టద్యుమ్నకుంతీద్రౌపదులను విలువైన కానుకలిచ్చి గౌరవించండని అంటున్నాడు. కయ్యానికి కాలుదువ్వే కర్ణునిభావావేశప్రవాహానికి పెద్దబండ అడ్డుపడ్డది. అతనిభావావేశం ప్రక్కకు తిరుగక తప్పదు. అందుకే అతడు తన కనుకూలమైన నీతులవైపు మళ్ళాడు. భీష్మ ద్రోణుల మీద విరుచుకు పడ్డాడు. వాళ్ళ చిత్తశుద్ధిని, విశ్వసనీయతను ధృతరాష్ట్రదుర్యోధనులు శంకించేటట్లు నేర్పుగా నీతులను సమన్వయించాడు.

**క. ఉడుగక యే మహితముఁ బలి । కెడు వారము; నీవు హితవు క్రియ గొనఁగాఁ బ**
**ల్కెడు వాఁడవు; మాకంటెను । గడు హితుఁడవు నీవ కావె కౌరవ్యులకున్. 40**

**ప్రతిపదార్థం:** ఉడుగక= మానక; ఏము= మేము; అహితమున్= మేలుకాని దానిని; పలికెడు వారము= పలికేవాళ్లము; నీవు; హితవు= మేలు; క్రియ, కొనఁగాన్= ఫలించేటట్లు; పల్కెడువాఁడవు= పలికేవాడివి; కౌరవ్యులకున్= కౌరవులకు; మాకంటెను= మాకంటే; నీవ, కావె= నీవే కదా; కడు, హితుఁడవు= మిక్కిలి మేలుకోరేవాడివి.

**తాత్పర్యం:** మేము చెడు చెప్పేవాళ్ళమా? నీవు హితం చెప్పేవాడివా? కౌరవులకు మా కంటె నీవే హితుడవా?

**విశేషం:** కాకువుతో చేసే అధిక్షేపోక్తికి ఈ పద్యం చక్కని ఉదాహరణం. కర్ణుని అధిక్షేపానికి ద్రోణునిప్రత్యాఖ్యానం.

**క. నీకఱపుల నిక్కురుకుల । మాకులతం బొందు టేమి యాశ్చర్యము? సౌ**
**మ్యాకృతులు గానివారల । వాకులు శిక్షలు నుపద్రవంబుల కావే! 41**

**ప్రతిపదార్థం:** నీ, కఱపులన్= నీ బోధనంవలన; ఈ+కురుకులము= ఈ కురువంశం; అకులతన్= కలతను; పొందుట; ఏమి; ఆశ్చర్యము; సౌమ్య+ఆకృతులు= శాంతమైన ఆకారం కలవాళ్ళు; కాని, వారల, వాకులు, శిక్షలున్= కానట్టివారల యొక్క మాటలు, ఉపదేశాలు; ఉపద్రవంబులు+అ, కావే, = హానికరాలే కదా!

**తాత్పర్యం:** నీ ఉపదేశాలవల్ల ఈ కురుకులం కలత పొందటం ఆశ్చర్యం కాదు. శాంతమైన ఆకారం లేనివాళ్ళ మాటలు, ఉపదేశాలు కీడునే కలిగిస్తాయి కదా!

**విశేషం:** అలంకారం: అర్థాంతరన్యాసం.

**వ. అనుచున్న సమయంబున నయ్యిద్దఱ వారించి విదురుండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 42**

**ప్రతిపదార్థం:** అనుచున్+ఉన్న= అని అంటూ ఉండే; సమయంబునన్= సమయంలో; ఆ+ఇద్దఱన్= ఆ ద్రోణకర్ణులను; వారించి= ఆపి; విదురుండు; ధృతరాష్ట్రునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని అంటూ ఉన్నసమయంలో ఆ ద్రోణకర్ణుల నిద్దరినీ ఆపి, విదురుడు ధృతరాష్ట్రునితో ఈ విధంగా అన్నాడు.

**సీ. ధర్మార్థవిత్తముల్ తథ్యవాదులు వయో । వృద్ధులు మధ్యస్థవిమలమతులు**
**ద్రోణగాంగేయులు దురితవిదూరులు । ని న్నెద్దిగఱపిరి నెమ్మితోడ**
**దానిన చేయుట ధర్మువు; వారల । కంటె హితుల్ నీకుఁ గలరె యొరులు;**
**దుర్యోధనుండును దుశ్శాసనుండును । గర్ణుండు శకునియుఁ గరము బాలు;**

**ఆ. రెఱుఁగ రిదియు ధర్మ విది యధర్మం బని; । యట్టివారిపలుకు లాదరించి**
**వినక పాండుసుతుల వేగ రావించి వా । రలకుఁ బ్రీతి నర్ధరాజ్య మిమ్ము. 43**

**ప్రతిపదార్థం:** ధర్మ+అర్థ, విత్తముల్= ధర్మమును, అర్థమును తెలిసినవాళ్ళలో శ్రేష్ఠులు, తథ్య, వాదులు= నిజం చెప్పేవాళ్ళు; వయోవృద్ధులు= వయస్సులో పెద్దవారు; మధ్యస్థ, విమల, మతులు= పక్షపాతం లేని నిర్మలమైన బుద్ధికలవాళ్ళు; దురిత, విదూరులు= పాపానికి దూరమైనవాళ్ళు; ద్రోణ, గాంగేయులు= ద్రోణభీష్ములు; నిన్నున్; నెమ్మితోడన్= ప్రేమతో; ఎద్ది; కఱపిరి= బోధించారో; దానిన్+అ= దానినే; చేయుట; ధర్మువు= ధర్మం; వారలకంటెన్= వాళ్లకన్న; హితుల్= మేలుకోరేవాళ్ళు; నీకున్= నీకు; ఒరులు= ఇతరులు; కలరె= కలరా?; దుర్యోధనుండును; దుశ్శాసనుండును; కర్ణుండు, శకునియున్; కరము= మిక్కిలి; బాలురు= అజ్ఞానులు; ఇదియు, ధర్మువు= ఇది ధర్మం; ఇది, అధర్మంబు= ఇది ధర్మము కాదు; అని, ఎఱుఁగరు= అని తెలియరు; అట్టివారి, పలుకులు= అటువంటివాళ్లమాటలు; ఆదరించి, వినక= పాటించి వినకుండా; పాండుసుతులన్= పాండవుల్ని; రావించి= రప్పించి; ప్రీతిన్= ప్రేమతో;, అర్ధ, రాజ్యము; ఇమ్ము= సగం రాజ్యాన్ని ఇవ్వడంమంచిది.

**తాత్పర్యం:** ధర్మార్థాలను తెలిసినవాళ్ళలో శ్రేష్ఠులు, సత్యం చెప్పేవాళ్ళు, వయస్సులో పెద్దవాళ్ళు, పక్షపాతం లేని నిర్మలబుద్ధి కలవాళ్ళు, పుణ్యాత్ములు అయిన ద్రోణభీష్ములు నీ కేది ఉపదేశించారో దానిని చేయటమే ధర్మం. ఆ యిద్దరికంటె నీ మేలు కోరేవాళ్ళు ఇంకెవరున్నారు? దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని చాలా అవివేకులు. ఇది ధర్మమనీ, ఇది అధర్మమనీ వాళ్ళకు తెలియదు. అట్లాంటివాళ్ళమాటలు వినక పాండవులను వెంటనే రప్పించి ప్రేమతో వారికి అర్ధరాజ్యాన్ని ఇమ్ము.

**విశేషం:** ధర్మార్థవిత్తముల్ - అనేసమాసంలో 'అర్థ' శబ్దానికి ప్రయోజనం అనే అర్థాన్ని గ్రహించాలి. ద్రోణ, భీష్ములు ధర్మాన్నే కాక నీకు ఏది ప్రయోజనకరమో అదికూడా తెలిసినవాళ్ళని భావం. విదురుడి వాక్యాలను తర్కబద్ధంగా నిబంధించటం ఇక్కడ గమనింపదగినవిశేషం. పాత్ర ఒక అంశంమీద దీర్ఘసంభాషణం చేసేటప్పుడు నన్నయ తర్కశాస్త్రసంబంధాలైన అంశాలను పొందుపరచటం సహజంగా కనబడుతుంది. ప్రమాణాదిషోడశపదార్థాలు న్యాయశాస్త్రం పరిశీలించేవి. 'ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజనదృష్టాంతసిద్ధాంతావయవతర్కనిర్ణయవాదజల్పవితండాహేత్వాభాసచ్ఛలజాతినిగ్రహస్థానానాం తత్త్వజ్ఞానా న్నిశ్శ్రేయసాధిగమః' అని న్యాయసూత్రం. ఈ పద్యంలో యథార్థ జ్ఞానాన్ని కలిగించే ద్రోణ గాంగేయుల వాక్యాలు ప్రమాణాలు. కర్ణాదుల వాక్యాలు అప్రమాణాలు. పాండవులను రావించి అర్ధరాజ్యం ఇమ్మనటం యథార్థజ్ఞాన విషయమైన ప్రమేయం.(సంపా.)

**మ. తమకుం దార యజేయు లెవ్వరికి దోర్దర్పంబునన్, దానిపై**
**శమితారాతి బలుండు వారలకుఁ బాంచాల ప్రభుం డిప్డు సు**
**ట్టము దా నయ్యెఁ; దదాత్మజుండయిన ధృష్టద్యుమ్నుడున్ వారితో**
**సమవీర్యుం డొడఁగూడె నిష్ట సఖుఁ డై సంబంధబంధంబునన్. 44**

**ప్రతిపదార్థం:** తమకున్, తార= తమంతట తామే; దోః+దర్పంబునన్= బాహుబలగర్వంతో; ఎవ్వరికిన్= ఎవరికికూడా; అజేయులు= జయింపసాధ్యంకానివాళ్ళు; దానిపైన్= దానికిపైగా, మీదుమిక్కిలి; శమిత+అరాతి, బలుండు= అణగించబడిన శత్రుబలం కలవాడు; పాంచాల, ప్రభుండు= పాంచాలరాజైన ద్రుపదుడు; ఇపుడు= ఇప్పుడు; వారలకున్; తాను= ఆ ద్రుపదుడు; చుట్టము; అయ్యెన్; తత్+ఆత్మజుండు+అయిన= అతని కుమారుడైన; ధృష్టద్యుమ్నుడున్= ధృష్టద్యుమ్నుడు కూడ; వారితోన్= ఆ పాండవులతో; సమ, వీర్యుండు= సమానమైన బలం కలవాడు; సంబంధ, బంధంబునన్= బంధుత్వ మనే కట్టుచేత; ఇష్ట, సఖుఁడు+ఐ= ఆప్తుడైన స్నేహితుడై; ఒడన్+÷కూడెన్= చేరాడు.

**తాత్పర్యం:** పాండవులు తమంతట తామే ఎవరికీ జయింప శక్యంకానివాళ్ళు. మీదుమిక్కిలి శత్రువులందరినీ అణచిన మహాబలవంతుడైన పాంచాలరాజు వాళ్ళకు ఇప్పుడు చుట్టం. అతని కుమారుడు ధృష్టద్యుమ్నుడు పాండవులతో సమానమైన పరాక్రమంకలవాడు, బాంధవ్యబంధంవలన ఇష్టమిత్రుడై వాళ్ళతో చేరాడు.

**మ. బలదేవాచ్యుతసాత్యకుల్ దమకు నొప్పన్ మిత్రులుం గూర్చు మం**
**త్రులుఁగా దైవము మానుషంబుఁ గల నిత్యుల్, నీకు దుర్యోధనా**
**దులకంటెం గడుభక్తు లెంతయు వినీతుల్, వీరు లప్పాండుపు**
**త్రులు నీపుత్త్రుల కారె ! వారిఁ దగునే దూరస్థులం జేయఁగన్. 45**

**ప్రతిపదార్థం:** బలదేవ+అచ్యుత, సాత్యకుల్= బలరాముడు, శ్రీకృష్ణుడు, సాత్యకి; తమకున్= పాండవులకు; కూర్చు= ప్రియమైన; మంత్రులున్+కాన్= మంత్రులుగా; దైవము= దైవబలం; మానుషంబున్= మానవబలం; కల= కలిగిన; నిత్యుల్= నిలుకడవాళ్ళు; నీకున్; దుర్యోధన+ఆదులకంటెన్= దుర్యోధనుడు మొదలైనవాళ్ళకంటె; కడున్= మిక్కిలి; భక్తులు= భక్తికలవాళ్ళు; ఎంతయున్= మిక్కిలి; వినీతులు= వినయం కలవాళ్ళు; వీరులు; ఆ+పాండు, పుత్త్రులు= ఆ పాండవులు; నీ, పుత్త్రుల; కారె?; వారిన్= వాళ్లను; దూరస్థులన్= దూరంగా ఉన్నవాళ్ళుగా; చేయన్+కన్; తగునె= చేయటం న్యాయమౌతుందా?

**తాత్పర్యం:** బలరాముడు, శ్రీకృష్ణుడు, సాత్యకి పాండవులకు మిత్రులు, ప్రియమంత్రులు. ఆ విధంగా దైవబలం మానవబలం కూడి, నిలుకడ కలిగి, నీ పట్ల దుర్యోధనాదులకంటె భక్తి వినయాలు కల పాండవవీరులు నీకు పుత్రులు కారా? వాళ్ళని దూరం చేయటం తగునా?

**విశేషం:** "పాండుపుత్రులు నీ పుత్రుల కారె? వారిఁ దగునే దూరస్థులన్ జేయగన్" అని ధృతరాష్ట్రుని హృదయంలో పాండవులపట్ల ఉన్న అనుమానాలను తొలగించి 'సంశయము'ను తొలగించ యత్నించాడు-విదురుడు. సంశయనివారణమనే ఈ అంశం 44, 45 పద్యాలలో వ్యాపించి ఉన్నది. అందువలన ఈ రెండింటిని మత్తేభవిక్రీడితాలుగా రచించి ఛందశ్శిల్పాన్నికూడా నన్నయ పాటించాడు. ధార్తరాష్ట్రుల కెంత బలగం ఉందో అంతకంటె మిన్న అయిన బలగం కలిగి, దైవమానుషశక్తులతో

ఒప్పారే పాండవులు ఆదరణీయులని చెప్పి, బలవన్నిరాకరణం భంగపాటుకు దారితీస్తుందని విదురుడు వ్యంగ్యంగా హెచ్చరించాడు. వస్తుస్వభావాన్ని స్ఫుటంగా వ్యక్తంచేసే ఝటిత్యర్థప్రతిపత్తిహేతుత్వం ఉండటంచేత 44, 45 పద్యాలలో అర్థవ్యక్తి అనే గుణం సార్థకంగా పోషింపబడింది. (సంపా.)

**ఉ. ఆహవభూమిలోనఁ బరమార్థము పార్థుఁడు వైరివాహినీ**
**వ్యూహము వ్రచ్చుచోట మఘవుండును వానికి మార్కొనంగ ను**
**త్సాహముసేయఁ డన్న; లఘుసారు లధీర లసాహసుల్ నిరు**
**త్సాహులు ద్రోహులై యెదిరి చత్తురొ మందురొ మానవేశ్వరా! 46**

**ప్రతిపదార్థం:** మానవ+ఈశ్వరా!= ధృతరాష్ట్రమహారాజా!; ఆ, భూమిలోనన్= ఆ యుద్ధరంగంలో; పరమ+అర్థము= పరమ ప్రయోజనం కొరకు - అంటే శత్రువుల అంతు తేల్చటంకొరకు; పార్థుఁడు= అర్జునుడు; వైరి, వాహినీ, వ్యూహము= శత్రుసైన్యంయొక్క మొగ్గరాన్ని; వ్రచ్చుచోటన్= చీల్చేచోట; మఘవుండును= దేవేంద్రుడుకూడా; వానికిన్= ఆ అర్జునునికి; మార్కొనంగన్= ఎదుర్కొనటానికి; ఉత్సాహము, చేయఁడు= ఉత్సాహంతో పూనుకోడు; అన్న= అని అనగా; లఘు, సారులు= తక్కువ బలం కలవాళ్ళు; అధీరులు= ధైర్యం లేనివాళ్ళు; అసాహసుల్= తెగింపులేనివాళ్ళు; నిరుత్సాహులు= ఉత్సాహంలేనివాళ్ళు; ద్రోహులు+ఐ= కీడు చేసే తలంపు కలవాళ్ళయి; ఎదిరి= ఎదిరించి; చత్తురొ= చస్తారో; మందురొ - (మనుదురా)= బతుకుతారో?

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రమహారాజా! యుద్ధభూమిలో శత్రువీరుల అంతు తేల్చటానికి పార్థుడు శత్రుసేనా వ్యూహాన్ని చీల్చేచోట దేవేంద్రుడుకూడా అతడిని ఎదుర్కోటానికి పూనుకోలేడు. ఇక పెద్దబలం, ధైర్యం, సాహసం, ఉత్సాహం లేనివాళ్ళు ద్రోహబుద్ధితో ఎదుర్కొని చస్తారో, బ్రతుకుతారో నీవే ఆలోచించుకొమ్ము.

**విశేషం:** విదురుడు పాండవులను పిలిచి వాళ్ళకు అర్ధరాజ్యమిచ్చి కుమారుల నడుమ శాంతిసౌఖ్యాలు కలిగించటం మంచి దని చెప్పటంతోనే ఆగలేదు. దుర్యోధనుని దుష్టచరిత్రంవలన లోకానికి హాని కలుగుతుంది. అతడు పుట్టిననాటినుండి చెప్పుతున్న విషయాన్ని జ్ఞాపకం చేసి, ఇప్పటి అతని వర్తనమే జననాశనానికి కారణం కావచ్చునని హెచ్చరించాడు. దానికి దృష్టాంతంగా ఈ పద్యం చెప్పాడు. ప్రతిపాదించదలచుకొన్న విషయాన్ని సమర్థించటానికై ప్రసిద్ధమైన దృష్టాంతం చూపించటం న్యాయ ప్రయోగ విషయం. అర్జునుని పరాక్రమాన్ని ఎదుర్కొనటానికి ఇంద్రుడే వెనకాడతాడనీ, ఇక దుర్యోధనాదులు బలహీనులనీ, అధీరులనీ, అసాహసులనీ, నిరుత్సాహులనీ, ద్రోహులనీ, వాళ్ళు అర్జుననెదిరించి చావటం తథ్యమనీ హెచ్చరిస్తాడు. ద్రౌపదీస్వయంవరంలో కర్ణదుర్యోధనాదుల వర్తనాలను గమనిస్తే పై విశేషణాలు వాళ్ళ నుద్దేశించినవే అని తెలుస్తుంది.(సంపా.)

**ఉ. ఆయతబాహుఁ డాతనికి నగ్రజుఁ డగ్రణి పోరులందు నా**
**గాయుతసత్త్వుఁ డుద్ధతయుగాంతకృతాంతనిభుండు భీముఁ డ**
**వ్వాయుజసవ్యసాచుల నవార్యబలోన్నతిఁ బోలుచున్న మా**
**ద్రేయు లజేయు లెవ్వరికి దేవసముల్ సమరాంతరంబునన్. 47**

**ప్రతిపదార్థం:** అతనికిన్= ఆ అర్జునునికి; అగ్రజుఁడు= అన్న, భీముఁడు; ఆయత, బాహుఁడు= పొడవైన చేతులు కలవాడు; పోరులందు= యుద్ధాలలో; అగ్రణి= ముందుండేవాడు; నాగ+అయుత, సత్త్వుఁడు= పదివేలఏనుగుల బలమంతటి బలం కలవాడు; ఉద్ధత, యుగ+అంత, కృత+అంత, నిభుండు= విజృంభించిన ప్రళయకాలయమునితో సమానమైనవాడు; ఆ+వాయుజ, సవ్యసాచులన్= ఆ భీమార్జునులను; అవార్య, బల+ఉన్నతిన్= అడ్డగింపరాని బలాతిశయంతో; పోలుచున్+ఉన్న; మాద్రేయులు=

నకులసహదేవులు; దేవ, సముల్= దేవతలతో సమానమైనవాళ్ళు; సమర+అంతరంబునన్= యుద్ధ మధ్యంలో; ఎవ్వరికిన్= ఎవరికీ; అజేయులు= జయించటానికి సాధ్యం కానివాళ్ళు?

**తాత్పర్యం:** ఆ అర్జునుని అన్న భీముడు మహావీరుడు. యుద్ధరంగంలో ముందుండేవాడు. వెయ్యి ఏనుగుల బలం కలవాడు. విజృంభిస్తే ప్రళయకాలయమునితో సమానమైనవాడు. ఆ భీమార్జునులను బలాధిక్యంలో పోలుతూ, దేవతలతో సమానులైన నకులసహదేవులనుకూడా యుద్ధమధ్యంలో జయించటం ఎవ్వరికీ సాధ్యం కాదు.

**విశేషం:** అర్జునుడే అంతటివాడు. ఇక అతని అన్న భీముడు 'ఉద్ధతయుగాంతకృతాంతనిభుండు' అని చెప్పటం సార్థకం. కౌరవులనందరినీ మట్టుబెట్టే భీమపరాక్రమాన్ని ఉదాహరిస్తున్నప్పుడు భావికథార్థాలు స్ఫురించి వస్తుధ్వని రాణిస్తుంది. ఇందులోకూడ 'దృష్టాంతం' అనే అంగం పోషింపబడింది. యుద్ధవీరులైన అర్జున భీముల చైతన్యమూర్తులను వీరరసోజ్జ్వలమైన కాంతి అనే గుణంతో 46, 47 పద్యాలను ఉత్పలమాలావృత్తాలలో రచించటం రచనాశిల్పం. దృష్టాంతమనే అంగాన్ని ప్రదర్శిస్తున్న పద్యాలు రెండింటి ఛందస్సామ్యం. గుణసామ్యం సార్థకం. రసపోషకం. (సంపా.)

**క. తమ్ములయట్టుల తనకు వ । శమ్మయి ధర్మువును ధృతియు సత్యముఁ గారు**
**ణ్యమ్మును నొప్పఁగఁ బేర్మి ని । జమ్ముగ మను ధర్మజున కసాధ్యము గలదే! 48**

**ప్రతిపదార్థం:** తమ్ముల, అట్టుల= తమ్ములవలె; తనకున్; ధర్మువునున్= ధర్మమూ; ధృతియున్= ధైర్యమూ; సత్యమున్= సత్యమూ; కారుణ్యమ్మునున్= దయా; వశమ్ము+అయి= స్వాధీనమై; ఒప్పఁగన్= ప్రకాశింపగా; నిజమ్ముగన్= నిజముగా; పేర్మి= గొప్పతనంతో; మను= ఉండేటటువంటి; ధర్మజునకున్; అసాధ్యము= పొందలేనిది; కలదె?= ఉన్నదా?(లేదని భావం.)

**తాత్పర్యం:** తమ్ములవలె తనకు ధర్మం, ధైర్యం, సత్యం, దయ వశమై గొప్పగా జీవించే ఆ ధర్మరాజుకు అసాధ్యమైనది ఏముంది?

**విశేషం:** సద్గుణప్రధానుడైన ధర్మరాజువ్యక్తిత్వాన్ని ప్రసాదగుణబంధురంగా చిత్రించటం సార్థకం. (సంపా.)

**వ. 'వారల బలపరాక్రమంబు లెల్లవారికి దృష్టపూర్వంబుల; యట్టివారితోడ విగ్రహంబు సేయు దుర్బుద్ధులుం గలరె? నీపుణ్యమ్మున నమ్మహాత్ములు జననీసహితంబు లక్కయింట బ్రతికిరి; నీయందుఁ బురోచనదిగ్ధం బయిన దుర్యశః పంకంబుఁ బాండవానుగ్రహజలంబులం జేసి కడిగికొనుము; దుర్యోధనాపరాధంబున నఖిల మహీప్రజకు నపాయం బగు నని తొల్లియు నీకుం జెప్పితి; నట్లు గాకుండ రక్షింపు' మనిన ధృతరాష్ట్రుండు విదురున కి ట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** వారల, బల, పరాక్రమంబులు= వాళ్ల శక్తిశౌర్యాలు; ఎల్లవారికిన్= అందరికీ; దృష్ట, పూర్వంబులు+అ= ముందు చూడబడినవే; అట్టివారితోడన్= అటువంటివాళ్లతో; విగ్రహంబు, చేయు= యుద్ధం చేసే; దుర్బుద్ధులున్= దుష్టబుద్ధులు; కలరె= ఉన్నారా!; నీ, పుణ్యమ్మునన్= నీ పుణ్యంవల్ల; ఆ+మహాత్ములు; జననీసహితంబు= తల్లితోకూడా; లక్కయింటన్= లక్కయింటిలో; బ్రతికిరి; నీ, అందున్= నీలోని; పురోచన, దిగ్ధంబు+అయిన= పురోచనునిచే పూయబడిన; దుర్+యశ, పంకంబున్= అపకీర్తి అనే బురదను; పాండవ+÷అనుగ్రహ, జలంబులన్‌చేసి= పాండవులమీద దయచూపటం అనే నీళ్ళతో; కడిగికొనుము= కడుక్కో; దుర్యోధన+అపరాధంబునన్= దుర్యోధనుడితప్పువలన; అఖిల, మహీ, ప్రజకున్= సమస్తభూమండలం మీదిప్రజలకు; అపాయంబు= హాని; అగును= కలుగుతుంది; అని= అని; తొల్లియు= ఇదివరకు కూడా; నీకున్, చెప్పితిన్; అట్లుకాకుండ; రక్షింపుము; అనినన్; విని; ధృతరాష్ట్రుండు; విదురునకున్= విదురునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'వాళ్ళబలపరాక్రమాలు అందరూ ఇదివరకు చూచినవే. అట్లాంటివాళ్ళతో యుద్ధం చేసే దుర్బుద్ధు లున్నారా? నీ పుణ్యంవలన ఆ మహాత్ములు లక్కయింట్లో తల్లితోకూడ బ్రతికారు. పురోచనునివలన నీ కంటిన అపకీర్తి అనే బురదను, పాండవులపట్ల దయ చూపటం అనే నీళ్ళతో కడుక్కో. దుర్యోధనుడు చేసే తప్పువలన లోకంలోని ప్రజలందరికీ అపాయం కలుగుతుందని ఇంతకుముందే నీకు చెప్పాను. అట్లా కాకుండా రక్షించు' అనగా విని ధృతరాష్ట్రుడు విదురునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: రూపకం. పాండవుల పరాక్రమాలు 'దృష్టపూర్వములే' అని చెప్పి, ప్రసిద్ధమైన దృష్టాంతాలుగా పరిగణించాడు. ఆ తరువాత పాండవులను గౌరవిస్తే లాక్షాగృహదహనంవలన ఏర్పడిన అపకీర్తిని మాపుకొనవచ్చు నని 'ప్రయోజనం' చూపించాడు. ఆపైన దుర్యోధనుడు చేసే పాపంవలన భూప్రజలకు అపాయంరాకుండా చూడుమని సిద్ధాంతీకరించాడు. ఈ విధంగా ఆరువిధాల తర్కశాస్త్ర, న్యాయశాస్త్రాంశాలను ప్రయోగించి, వాదకుశలునిగా విదురుడిని నన్నయ తీర్చిదిద్దాడు.(సంపా.)

**క. నీవును భీష్ముఁడు ద్రోణుఁడు। భూ వినుత విశుద్ధ ధర్మబుద్ధుల రగుటన్**
**మీ వచనమున కవజ్ఞత। గావింపఁగ నంత కార్యగతి మూఢుఁడనే? 50**

**ప్రతిపదార్థం:** నీవును= నీవూ; భీష్ముఁడు; ద్రోణుఁడు; భూ వినుత, విశుద్ధ, ధర్మ, బుద్ధులరు+అగుటన్= భూమిమీద పొగడబడిన పరిశుద్ధమైన ధర్మబుద్ధి కలవాళ్ళు అవటంచేత; మీ, వచనమునకున్= మీమాటకు; అవజ్ఞత= త్రోసిపుచ్చటం; కావింపఁగన్= చేయటానికి; అంత, కార్యగతి, మూఢుఁడనే= అంత, పని వైనం తెలియని అవివేకినా?

**తాత్పర్యం:** నీవు, భీష్మద్రోణులు లోక ప్రశంసలందుకొన్న ధర్మబుద్ధి కలవాళ్ళు. మీ మాటను త్రోసిపుచ్చుతానా? అంత పనివైనం తెలియని అవివేకినా?

**విశేషం:** విదురుని తర్కబద్ధమైన వాదం ఫలించింది. వక్రబుద్ధి అయిన ధృతరాష్ట్రుడు సవ్యమైన నిర్ణయం తీసికొనలేక తప్పలేదు.

### పాండవులను దోడ్తేర ధృతరాష్ట్రుండు విదురునిఁ బంచుట (సం.1-198-3)

**వ. 'మీపంచినవిధంబున నప్పాండవుల కర్ధరాజ్యం బిచ్చెద' నని భీష్మవిదురద్రోణాదు లయిన బాంధవప్రధానులయు దుర్యోధనాదు లయిన పుత్త్రులయు సమక్షంబున నిశ్చయించి, యప్పుడ పాండవులం దోడ్తేర విదురుం బంచిన, నాతండును ధృతరాష్ట్రశాసనంబున ద్రుపదుపురంబునకుం జని, పుత్త్రభ్రాతృపరివృతుం డై యున్న ద్రుపదుని వాసుదేవసహితులై యున్న పాండవులనుం గాంచి ధృతరాష్ట్రుండు పుత్తెంచిన వివిధరత్నభూషణాదుల వేఱువేఱ యిచ్చి తానును వారిచేతఁ బ్రతిపూజితుం డై కేశవపాండవసమక్షంబున విదురుండు ద్రుపదున కి ట్లనియె. 51**

**ప్రతిపదార్థం:** మీ, పంచిన, విధంబునన్= మీరు ఆజ్ఞాపించినపద్ధతిలో; ఆ+పాండవులకున్; అర్ధ, రాజ్యంబు= సగంరాజ్యం; ఇచ్చెదన్+అని; భీష్మ, విదుర, ద్రోణ+ఆదులు+అయిన= భీష్ముడు, విదురుడు, ద్రోణుడు మొదలైన; బాంధవ, ప్రధానులయు= బంధువులయొక్క, మంత్రులయొక్క; దుర్యోధన+ఆదులు+అయిన= దుర్యోధనుడు మొదలగువాళ్ళయిన; పుత్త్రులయు= కుమారులయొక్క; సమక్షంబునన్= ఎదుట; నిశ్చయించి; అప్పుడు+అ= వెంటనే; ఆ, పాండవులన్; తోడ్తేరన్= తీసికొనిరావటానికి; విదురున్= విదురుణ్ణి; పంచినన్= పంపగా; ఆతండును= ఆ విదురుడుకూడా; ధృతరాష్ట్ర, శాసనంబునన్= ధృతరాష్ట్రునియొక్క ఆజ్ఞచేత; ద్రుపదు= ద్రుపదుని; పురంబునకున్= నగరానికి; చని= వెళ్ళి; పుత్త్ర, భ్రాతృ, పరివృతుండు+ఐ= కొడుకులచే,

తోబుట్టువులచే చుట్టబడినవాడై; ఉన్న; ద్రుపదునిన్; వాసుదేవ, సహితులు+ఐ= శ్రీకృష్ణునితో కూడినవాళ్ళయి; ఉన్న; పాండవులనున్; కాంచి= చూచి; ధృతరాష్ట్రుండు; పుత్తెంచిన= పంపిన; వివిధ, రత్న, భూషణ+ఆదుల= నానావిధాలైన రత్నాలు, సొమ్ములు మొదలైనవాటిని; వేఱువేఱ, ఇచ్చి; తానును; వారిచేతన్; ప్రతి, పూజితుండు+ఐ= మారుగా పూజించబడినవాడై; కేశవ, పాండవ, సమక్షంబునన్= శ్రీకృష్ణునియొక్క, పాండవులయొక్క ఎదుట; విదురుండు; ద్రుపదునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'మీరు ఆజ్ఞాపించిన విధంగా ఆ పాండవులకు సగభాగం రాజ్యం ఇస్తాను' అని భీష్ముడు, ద్రోణుడు, విదురుడు మొదలైన బంధువులు, మంత్రులూ, దుర్యోధనుడు మొదలైన పుత్రులూ ఉన్నప్పుడు అందరి ఎదుట నిర్ణయించి, పాండవులను పిలుచుకొని రావటానికి విదురుడిని పంపాడు. విదురుడు ధృతరాష్ట్రుని ఆజ్ఞప్రకారం ద్రుపదుని పురానికి వెళ్ళి - కొడుకులతో తోబుట్టువులతో కూడిఉన్న ద్రుపదుడిని, శ్రీకృష్ణునితో కూడిఉన్న పాండవులను చూచి, ధృతరాష్ట్రుడు పంపిన వివిధరత్నాలను, ఆభరణాలను ఎవరి కీయవలసినవి వాళ్ళకిచ్చి, తానుకూడా వాళ్ళచేత పూజితుడై శ్రీకృష్ణపాండవులయెదుట ద్రుపదునితో ఇట్లా అన్నాడు.

**మ. అభిజాతుండవు ధర్మశీలుఁడవు నీయం దైన సంబంధ మిం**
**దభిరమ్యం బనురూప మిష్ట మని సౌహార్దంబునన్ జాహ్నవీ**
**ప్రభవుండున్ ధృతరాష్ట్రుఁడుం గృపుఁడుఁ గుంభప్రోద్భవుండున్ యశో**
**విభవాలంకృత! సంతసంబువడి రుర్వీవంద్యు లిష్టంబునన్.** 52

**ప్రతిపదార్థం:** యశస్+విభవ+అలంకృత= కీర్తితో, ఐశ్వర్యంతో అలంకరించబడినవాడా!; అభిజాతుండవు= మంచివంశం కలవాడవు; ధర్మశీలుఁడవు= ధర్మస్వభావం కలవాడవు; నీ, అందు+ఐన, సంబంధము= నీతో ఏర్పడిన బంధుత్వం; ఇందున్= ఇచ్చట; అభిరమ్యంబు= మనోహరం; అనురూపము= తగినది; ఇష్టము= ఇష్టమైనది; అని= అని; సౌహార్దంబునన్= స్నేహభావంతో; జాహ్నవీ, ప్రభవుండున్= గంగాదేవికి జన్మించినవాడు - భీష్ముడు; ధృతరాష్ట్రుండున్; కృపుఁడున్= కృపాచార్యుడు; కుంభ, ప్ర+ఉద్భవుండున్= కుండనుంచి పుట్టినవాడు - ద్రోణుడు కూడా; ఉర్వీ, వంద్యులు= భూమిలో పొగడదగినవాళ్ళు; ఇష్టంబునన్= ప్రీతితో; సంతసంబు, పడిరి=సంతోషాన్ని పొందారు.

**తాత్పర్యం:** కీర్తి, ఐశ్వర్యం అలంకారాలుగా కల ఓ ద్రుపదమహారాజా! నీవు మంచివంశం కలవాడవని, ధర్మస్వభావం కలవాడవని, నీతో ఏర్పడిన బంధుత్వం మనోహరమైనది, తగినదని, ఇష్టమైనదని - లోకం కొనియాడదగిన భీష్మ, ధృతరాష్ట్ర, కృప, ద్రోణులు స్నేహభావంతో సంతోషించారు.

**ఉ. తల్లియుఁ బుత్త్రులేవురు నుదాత్తమతుల్ దమయొద్ద వాసినం**
**దల్లడమంది యందఱును దద్దయు దుఃఖితచిత్తు లైరి, నీ**
**యల్లురఁ బాండుపుత్త్రులఁ బ్రియంబునఁ జూడఁగఁ గోరుచున్న వా**
**రెల్ల జనంబులుం గురుకులేశ్వరుఁ డాదిగ బంధువర్గమున్.** 53

**ప్రతిపదార్థం:** ఉదాత్త, మతుల్= గొప్పబుద్ధికలవాళ్ళు; తల్లియున్= తల్లి కుంతీదేవి; పుత్త్రులు+ఏవురున్= కొడుకులు ఐదుగురుకూడా; తమ, ఒద్ద, పాసినన్= తమదగ్గరనుంచి వెళ్ళగా; తల్లడము+అంది= చలించి; అందఱును= అందరూ; తద్దయున్= మిక్కిలి; దుఃఖిత చిత్తులు= దుఃఖపడిన మనస్సు కలవాళ్ళు; అయిరి= అయ్యారు; కురు, కుల+

ఈశ్వరుఁడు= కురువంశప్రభువైన ధృతరాష్ట్రుడు; ఆదిగ= మొదలుగా; బంధు, వర్గమున్= బంధువుల సమూహం; ఎల్ల, జనంబులున్= ప్రజలంతా, నీ అల్లురన్, పాండు, పుత్త్రులన్= నీ అల్లుళ్లైన పాండుకుమారుల్ని; ప్రియంబునన్= ప్రీతితో; చూడఁగన్= చూడటానికై; కోరుచున్+ఉన్నవారు= ఇష్టపడుతూ ఉన్నారు.

**తాత్పర్యం:** గొప్ప బుద్ధి కలవాళ్ళయిన కుంతీదేవి, పాండవులు తమ దగ్గరనుండి వెళ్ళటంవలన చలించి అంతా ఎంతో దుఃఖించారు. కురువంశప్రభువైన ధృతరాష్ట్రుడు మొదలుకొని సమస్తబంధువర్గం, సకలప్రజలు నీ అల్లుళ్ళైన పాండవులను ప్రియమార చూడగోరుతున్నారు.

**విశేషం:** విదురుడు వెళ్ళిన పని అంతసులభమైనది కాదు - లక్కయింటిలో పాండవులను తగులబెట్టిన కౌరవులవద్దకు మళ్ళీ పాండవులను పంపండని అడగటం, వాళ్ళను వెంట పిలుచుకొనిరావటం. దానికి ద్రుపదుని అనుమతి కావాలి. అందువలననే విదురుడు చాలా నేర్పుగా మొదట ద్రుపదుడిని పొగడాడు. పాండవుల అభ్యుదయానికి, మీతో ఏర్పడిన బాంధవ్యానికి హస్తినలో అంతా ఆనందిస్తున్నారనీ, పాండవులను ప్రియమార చూడగోరుతున్నారనీ, వాళ్ళను పంపవలసిన దనీ, ఎంతో చాకచక్యంగా ద్రుపదుడిని అడుగుతున్నాడు.

**క. గురుగుణయుతు లగు కొడుకులఁ। గురుకులము వెలుంగ నయిన కోడలిఁ గృష్ణం**
**బరమపతివ్రత గొంతిని। గరుణను రాఁ బనిచె రాజు గజపురమునకున్. 54**

**ప్రతిపదార్థం:** గురు, గుణ యుతులు+అగు= గొప్పగుణాలతో కూడుకొన్నవాళ్ళయిన; కొడుకులన్; కురు, కులము= కురువంశం; వెలుంగన్+అయిన= ప్రకాశించటానికై ప్రాప్తించిన; కోడలిన్, కృష్ణన్= కోడలగు ద్రౌపదిని; పరమ పతివ్రత= పరమ పతివ్రతయైన; గొంతిని= కుంతీదేవిని; రాజు= ధృతరాష్ట్ర మహారాజు; గజ,. పురమునకున్= హస్తినాపురానికి; కరుణన్= దయతో; రాన్+పనిచెన్= పిలుచుకొని రమ్మని పంపాడు.

**తాత్పర్యం:** గొప్పగుణాలతో కూడుకొన్న కొడుకులను, కురువంశం వెలిగేటట్లుగా కోడలైన ద్రౌపదిని, పరమపతివ్రత అయిన కుంతిని దయతో ధృతరాష్ట్రమహారాజు హస్తినాపురానికి పిలుచుకొని రమ్మన్నాడు.

**వ. 'నీచేత ననుజ్ఞాతు లై కాని వీరలు రా నేరరు గావున వీరలం బుత్తెంచు నది' యనిన విదురునకు ద్రుపదుం డి ట్లనియె. 55**

**ప్రతిపదార్థం:** నీచేతన్; అనుజ్ఞాతులు+ఐ, కాని= అనుమతింపబడినవాళ్ళయితే తప్ప; వీరలు= వీళ్లు; రానేరరు= రాజాలరు; కావునన్; వీరలన్= వీళ్లను; పుత్తెంచునది= పంపునది; అనినన్; విదురునకున్; ద్రుపదుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీ అనుమతి లభిస్తేనే పాండవులు రాగలరు. అందుచేత వీళ్ళను మీరు పంపండి' అని అనగా విదురునితో ద్రుపదుడు ఇట్లా అన్నాడు.

**చ. రవినిభతేజుఁ డైన ధృతరాష్ట్రుఁడు పంపఁగ నీవు కార్యగౌ**
**రవమున వచ్చినప్పుడ తిరంబుగ వీరికి నిష్టసిద్ధి దా**
**నవు టది యేమి సందియమె; యంబుజనాభుఁడు నీవుఁ బాండవ**
**ప్రవరుల కెల్లప్రొద్దును శుభంబ తలంతురుకాదె నెమ్మితోన్. 56**

**ప్రతిపదార్థం:** రవి, నిభ, తేజుఁడు+ఐన= సూర్యునితో సమానమైన తేజస్సు కలవాడైన; ధృతరాష్ట్రుఁడు, పంపఁగన్= పంపగా; నీవు= నీవు; కార్య, గౌరవమునన్= పనియొక్క గొప్పతనంవలన; వచ్చినప్పుడు+అ= ఏతెంచిన ఆ క్షణమే; తిరంబుగన్= స్థిరంగా; వీరికిన్= వీళ్లకు; ఇష్ట, సిద్ధి= ఇష్టమైనది లభించటం; తాన్, అవుట, అది; ఏమి; సందియమె; అంబుజనాభుఁడు= శ్రీకృష్ణుడు; నీవున్; పాండవ, ప్రవరులకున్= శ్రేష్ఠులైన పాండవులకు; ఎల్ల, ప్రొద్దును= ఎల్లప్పుడుకూడా; నెమ్మితోన్= స్నేహంతో; శుభంబు+అ= శుభాన్నే; తలంతురు కాదె= కోరుతారు కదా.

**తాత్పర్యం:** సూర్యునితో సమానమైన తేజస్సు కల ధృతరాష్ట్రుడు పంపగా, గొప్ప పని బూని నీవు రాగా, పాండవులకు ఇష్టమైనది లభిస్తుందనటంలో సందేహం లేదు. శ్రీకృష్ణుడు, నీవు, ఉత్తములైన పాండవులకు ఎల్లప్పుడూ స్నేహంతో శుభమే కోరుతారుకదా!.

**విశేషం:** ఇక్కడ ద్రుపదుడుకూడా ఎంతో నేర్పుగా మాట్లాడాడు. పాండవుల యోగక్షేమాలు చూచేబాధ్యతను పరోక్షంగా విదురునికి అప్పగించాడు. శ్రీకృష్ణుడిని కూడా విదురునితో చేర్చాడు.

**క. నీవును ద్రోణుండును వసు । దేవతనూజుండు భీష్మధృతరాష్ట్రులు స**
**ద్భావమున నెద్ది సేయం । గా వగచితి రది హితంబ కా కొం డగునే? 57**

**ప్రతిపదార్థం:** నీవును= నీవూ; ద్రోణుండును= ద్రోణుడూ; వసుదేవ, తనూజుండు= శ్రీకృష్ణుడుకూడా; భీష్మ, ధృతరాష్ట్రులు= భీష్ముడు, ధృతరాష్ట్రుడు; సత్+భావమునన్= మంచిఉద్దేశంతో; ఎద్ది, చేయన్+కాన్= ఏది చేయటానికి; వగచితిరి= తలంచారో; అది= అది; హితంబు+అ, కాక= మేలుచేసేదికాకుండా; ఒండు= మరొకటి; అగునే= ఔతుందా? (కాదని భావం)

**తాత్పర్యం:** నీవు, ద్రోణుడు, శ్రీకృష్ణుడు, భీష్ముడు, ధృతరాష్ట్రుడు మంచిఉద్దేశంతో ఏది చేయ తలచారో అది పాండవులకు మేలే అవుతుంది కాని మరొకటి కాదు.

**వ. అనిన వాసుదేవుం డి ట్లనియె. 58**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ద్రుపదుడు అనగా; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**క. ఎవ్వరును నేమి సేయుదు । రివ్విదురుఁడు పాండవులకు హిత మొనరింపన్**
**నెవ్వగ నొండు దలంపకుఁ డివ్వీరుల కగు నభీష్ట మిది మొదలుంగాన్. 59**

**ప్రతిపదార్థం:** ఈ+విదురుఁడు; పాండవులకున్; హితము= మేలు; ఒనరింపన్= చేస్తుండగా; ఎవ్వరున్, ఏమి; చేయుదురు; నెఱ+వగన్= మిక్కిలి విచారంతో; ఒండు= వేరొకటి; తలంపకుఁడు= ఆలోచింపకండి; ఈ+వీరులకున్= ఈ వీరులైన పాండవులకు; ఇది, మొదలున్+కాన్= ఇది మొదలుకొని; అభీష్టము= కోరుకొన్నది; అగున్= సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** ఈ విదురుడు పాండవులకు మేలు చేసేవాడై ఉండగా - వాళ్ళను ఎవరు ఏమి చేయగలరు? అతిగా విచారించి వేరొకవిధంగా మీరు ఆలోచించ వద్దు. ఇది మొదలుగా పాండవులకు కోరుకొన్నది సిద్ధిస్తుంది.

**విశేషం:** ఇక కృష్ణుడు మాత్రం తక్కువవాడా? ఆయన పాండవుల శ్రేయోబాధ్యతను, అభీష్టసిద్ధిని మొత్తం విదురునికి

అప్పుజెప్పాడు. విదురుడు సామాన్యవ్యక్తి కాదు. పరమధార్మికుడు. గొప్పతాత్త్వికుడు. విశేషించి, హస్తినాపురరాజ్యవ్యవహారాలలో ప్రముఖపాత్ర నిర్వహించే మంత్రిసత్తముడు.

**వ. అనిన నందఱకు ధర్మనందనుం డి ట్లనియె. 60**

**ప్రతిపదార్థం:** అనినన్= అని శ్రీకృష్ణుడు అనగా; అందఱకున్= అందరితో; ధర్మనందనుండు= ధర్మరాజు; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అనగా అందరితో ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**క. కురు ముఖ్యులు ధృతరాష్ట్రవి । దుర భీష్ములు గురులు మాకు; ద్రుపదప్రభుఁడున్**
**గురుఁడు; మురాంతకుఁడు జగ । ద్గురుఁ; డిందఱ మతమునను నగున్ శుభయుక్తుల్. 61**

**ప్రతిపదార్థం:** కురు, ముఖ్యులు= కురువంశశ్రేష్ఠులు; ధృతరాష్ట్ర, విదుర, భీష్ములు= ధృతరాష్ట్రుడు, విదురుడు, భీష్ముడు; మాకున్=మాకు; గురులు= పెద్దలు; ద్రుపదప్రభుఁడున్= ద్రుపదరాజుకూడా; గురుఁడు= పెద్ద; మురాంతకుఁడు= మురుడు అనే రాక్షసుడిని సంహరించిన శ్రీకృష్ణుడు; జగత్+గురుఁడు= లోకానికే పెద్ద; ఇందఱ= వీళ్లందరియొక్క; మతమునను= సమ్మతితో; శుభ, యుక్తుల్= శుభంతోడి కూడికలు; అగున్= అవుతాయి.

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠులైన ధృతరాష్ట్ర విదుర భీష్ములు మాకు పెద్దలు. అట్లాగే ద్రుపద మహారాజుకూడా పెద్దలే. ఇక శ్రీకృష్ణుడు లోకానికంతా పెద్ద. వీళ్ళందరిసమ్మతివలన మాకు శుభాలే కలుగుతాయి.

### పాండవులు హస్తిపురంబునకు వచ్చుట (సం. 1-199-10)

**వ. అని యుధిష్ఠిరుండు వారి యనుమతంబు వడసి, తమ్ములు దానును హస్తిపురంబునకుఁ బోవ నిశ్చయించి, ద్రుపదు వీడ్కొని ప్రయాణోన్ముఖుం డయ్యె; నిట్లు విదురుండు పాండవులఁ బాంచాలిని గుంతీదేవినిం దోడ్కొని వాసుదేవ ధృష్టద్యుమ్ను లపరిమిత సేనాసమన్వితు లై తోడ రాఁగా వచ్చునంత, వారలరాక విని ధృతరాష్ట్రుండు వికర్ణ చిత్రసేన ద్రోణ కృపాచార్యుల నెదురు పుత్తెంచినం దత్సైన్యసమేతులయి మహోత్సవంబుతోఁ బాండవులు గజపురప్రవేశంబు సేయునప్పుడు వారలం జూచి. 62**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; వారి= వాళ్లయొక్క; అనుమతంబు= అనుమతి; పడసి= పొంది; తమ్ములు; తానును= తానూ; హస్తిపురంబునకున్= హస్తినాపురానికి; పోవన్= పోవటానికై; నిశ్చయించి= నిర్ణయించి; ద్రుపదున్, వీడ్కొని= ద్రుపదునిదగ్గర సెలవు తీసికొని; ప్రయాణ+ఉన్ముఖుండు= ప్రయాణంవైపు ఎత్తినముఖం కలవాడు - అంటే ప్రయాణానికి పూనుకొన్నవాడు; అయ్యెన్= అయ్యాడు; ఇట్లు= ఈ విధంగా; విదురుండు= విదురుడు; పాండవులన్= పాండవుల్ని; పాంచాలిని= ద్రౌపదిని; కుంతీదేవినిన్; తోడ్కొని= వెంటతీసుకొని; వాసుదేవ= శ్రీకృష్ణుడు; ధృష్టద్యుమ్నులు= ధృష్టద్యుమ్నుడు; అపరిమిత, సేనా, సమన్వితులు+ఐ= అంతులేని సైన్యంతో కూడినవాళ్ళయి; తోడ రాఁగా= వెంటరాగా; వచ్చునంతన్= వస్తూ ఉండగా; వారల, రాక, విని; ధృతరాష్ట్రుండు; వికర్ణ, చిత్రసేన, ద్రోణ, కృపాచార్యులన్; ఎదురు= ఎదురుగా; పుత్తెంచినన్= పంపగా; తత్+సైన్య, సమేతులు+అయి= ఆ సైన్యంతో కూడినవాళ్ళయి; మహా+ఉత్సవంబుతోన్= గొప్ప ఉత్సాహంతో; పాండవులు; గజపుర, ప్రవేశంబు; చేయునప్పుడు= హస్తినాపురంలో ప్రవేశించేటప్పుడు; వారలన్+చూచి;

**తాత్పర్యం:** అని ధర్మరాజు తనవాళ్ళ అనుమతి పొంది, తమ్ములు, తాను హస్తినాపురం వెళ్ళాలని నిశ్చయించాడు. ద్రుపదునిదగ్గర సెలవు తీసుకొని ప్రయాణానికి పూనుకొన్నాడు. ఈ విధంగా విదురుడు పాండవులను, ద్రౌపదిని, కుంతిని తోడ్కొని, శ్రీకృష్ణధృష్టద్యుమ్నులు, అంతులేనిసైన్యంతో వెంటరాగా, హస్తినాపురానికి వస్తూండగా, వాళ్ళరాక విని ధృతరాష్ట్రుడు, వికర్ణ, చిత్రసేన, ద్రోణ, కృపాచార్యులను ఎదురు పంపగా, సైన్యసమేతులై పాండవులు మహోత్సవంతో హస్తినాపురం ప్రవేశించేటప్పుడు వాళ్ళను చూచి.

**విశేషం:** అపారసైన్యం పాండవుల అపాయనివారకం, ఐశ్వర్యప్రదర్శకం. వాసుదేవ ధృష్టద్యుమ్నులు పాండవులకేర్పడిన నిజమైన అండదండలు.

**సీ.** **పుర జను లెల్లను గర మనురక్తు లై । 'ధర్మస్వరూపుఁ డీ ధర్మతనయుఁ**
**డనుజులుఁ దానును జనుదెంచెఁ; బాండుభూ । జనపతి జీవించి మనలఁ గావఁ**
**బ్రీతితోఁ దా నిప్పు డేతెంచె, మే లయ్యెఁ । నిమ్మహాత్ములకు దైవమ్ముఁ బురుష**
**కారంబుఁ గలుగంగ ధారుణీరాజ్యంబు । వాయునే యాపదల్ వాయుఁగాక;**

**ఆ.** **దాన హోమ జప విధానముల్ మన కివి । గలవయేని ధరణివలయరాజ్య**
**మింద యుండి ధర్మనందనుఁ డొనరించు । చుండుఁ గావుతమ యఖండితముగ.** **63**

**ప్రతిపదార్థం:** పుర, జనులు ఎల్లను; కరము= మిక్కిలి; అనురక్తులు+ఐ= ప్రేమ కలవాళ్ళయి; ధర్మ, స్వరూపుఁడు; ఈ, ధర్మతనయుఁడు; అనుజులున్= తమ్ములుకూడా; తానును= తానూ; చనుదెంచెన్= వచ్చాడు; పాండుభూజనపతి= పాండురాజు; జీవించి= మళ్లీ బ్రతికి; మనలన్= మనల్ని; కావన్= కాపాడటానికి; ప్రీతితోన్= ప్రేమతో; తాన్= తానే; ఇప్పుడు; ఏతెంచెన్= వచ్చాడు; మేలు+అయ్యెన్= శుభం అయింది; ఈ+మహా+ఆత్ములకున్= ఈ మహనీయులకు; దైవమ్మున్= దైవబలం; పురుషకారంబున్= మానవబలం; కలుగన్+కన్= ఉండగా; ధారుణీరాజ్యంబు= భూసామ్రాజ్యం; పాయునే= తొలగునా; ఆపదల్= ఆపదలు; పాయున్+కాక= తొలగిపోవునుకాని; మనకున్= మనకు; దాన, హోమ, జప, విధానముల్= దానాలు, హోమాలు, జపాలు; చేయటాలు; ఇవి కలవు+అ; ఏని= ఇవి ఉన్నట్లయితే; ధర్మనందనుఁడు= ధర్మరాజు; ఇందు+అ, ఉండి= ఈ హస్తినాపురంలోనే ఉండి; అఖండితముగన్= అవిచ్ఛిన్నంగా; ధరణివలయరాజ్యము= భూమండలపాలనం; ఒనరించుచున్= చేస్తూ; ఉండున్= ఉండటం; కావుతమ= అగుగాక.

**తాత్పర్యం:** నగరంలోని జనులంతా పాండవులను చూచి మిక్కిలి ప్రేమతో ఇట్లా అనుకొన్నారు. 'ధర్మస్వరూపుడైన ధర్మరాజు తమ్ములతోకూడి ఇక్కడకి వచ్చాడు. పాండురాజే మళ్ళీ బ్రతికి మనలను కాపాడటానికి ప్రీతితో తాను ఇపుడు వచ్చినట్లున్నది. మనకు మేలైనది. మహాత్ములైన ఈ పాండవులకు దైవబలం మానవబలం ఉండటంవలన ఆపదలు తొలగుతాయి కాని రాజ్యం తొలగిపోతుందా? మనం చేసిన దానహోమజపాల పుణ్యమే ఉన్నట్లైతే ఈ ధర్మరాజు ఈ హస్తినాపురిలోనే ఉండి అవిచ్ఛిన్నంగా భూమండలాన్ని పరిపాలిస్తూ ఉండుగాక'.

**విశేషం:** పాండవులు హస్తినాపురంలో ప్రవేశించేటప్పుడూ, ఏ కారణంవలననైనా హస్తినాపురి వదలిపోవలసివచ్చినపుడూ ప్రజలు వారిపట్ల ప్రదర్శించే ఆదరాభిమానాలను వాచికంగా, ఆంగికంగా, సాత్త్వికంగా ప్రదర్శించినట్లు వర్ణించటం నన్నయరచనలోనే కానవచ్చే సంవాదరచనాశిల్పం. పాండవులే హస్తినాపురానికి పాండురాజు తరువాత పరిపాలించ తగినవాళ్ళని ప్రజాభిప్రాయం. రాజ్యంలో పాండవులకు ఉన్న ప్రజానురాగానికి ఇది పెద్దతార్కాణం. దుర్యోధనాదులకు ఇటువంటి ప్రజాదరణ లేదు.(సంపా.)

**వ. అని పౌరులెల్ల దీవించుచుండఁ బౌరవకులనందను లయిన పాండునందనులు వచ్చి, భీష్మధృతరాష్ట్రాది కురువృద్ధులకు మ్రొక్కి, సకలజనానురాగం బొనరించుచు దుర్యోధనాదులతోఁ గలసి యెప్పటియట్ల రాజ్యవిద్యా వినోదంబుల నేను సంవత్సరంబు లుండు నంత, నొక్కనాఁడు ధృతరాష్ట్రుండు భీష్మవిదురద్రోణ దుర్యోధనాదుల సమక్షంబునఁ బాండవుల కి ట్లనియె. 64**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పౌరులు+ఎల్లన్= పురప్రజలంతా; దీవించుచున్+ఉండన్= దీవిస్తూ ఉండగా; పౌరవ, కుల, నందనులు+అయిన= పూరువంశకుమారులైన; పాండు, నందనులు= పాండురాజుపుత్రులు; వచ్చి; భీష్మ, ధృతరాష్ట్ర+ఆది= భీష్ముడు, ధృతరాష్ట్రుడు మొదలైన; కురు, వృద్ధులకున్= కురువంశంలోని పెద్దలకు; మ్రొక్కి; సకల, జన+అనురాగంబు= ఎల్ల జనులకు సంతోషం; ఒనరించుచున్= కలిగిస్తూ; దుర్యోధన+ఆదులతోన్= దుర్యోధనుడు మొదలైన వాళ్ళతో; కలిసి= కలిసిమెలసి; ఎప్పటి+అట్లు+అ= ఎప్పటివలెనే; రాజ్య, విద్యా, వినోదంబులన్= రాజ్యానికి, విద్యకు సంబంధించిన వేడుకలతో; ఏను, సంవత్సరంబులు= ఐదు సంవత్సరాలు; ఉండునంతన్= ఉండగా; ఒక్కనాఁడు= ఒక్కరోజు; ధృతరాష్ట్రుండు; భీష్మ, విదుర, ద్రోణ, దుర్యోధన+ఆదుల, సమక్షంబునన్= భీష్ముడు, విదురుడు, ద్రోణుడు, దుర్యోధనుడు మొదలైనవారి ఎదుట; పాండవులకున్, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని హస్తినాపురపౌరులంతా ఆశీర్వదిస్తుండగా పూరువంశరాజకుమారులు పాండవులు వచ్చి కురువంశపు పెద్దలైన భీష్ముడు, ధృతరాష్ట్రుడు మొదలైనవాళ్ళకి నమస్కరించి, సకలజనులకు సంతోషం కలిగిస్తూ దుర్యోధనాదులతో కలిసి, ఎప్పటివలె రాజ్యవిషయాలకు, విద్యావిషయాలకు సంబంధించిన వినోదాలతో ఐదుసంవత్సరాలు గడపగా, ఒకరోజు ధృతరాష్ట్రుడు- భీష్మ, ద్రోణ, దుర్యోధనాదుల సమక్షంలో పాండవులతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** రాజ్యవిద్యావినోదాలు - అనేచోట రాజ్యానికి, విద్యకు సంబంధించిన వినోదాలనే గాక-రాజ్యవిద్యకు సంబంధించిన వినోదాలనికూడా చెప్పుకోవచ్చు. రాజ్యవిద్య అంటే రాజనీతి.

**ఆ. సర్వలోక కర్మసాక్షి యీకృష్ణుండు । సాక్షి గాఁగ మీకు సకలవృద్ధ**
**రాజు లొద్ద నర్ధరాజ్య మిచ్చితిఁ బాండు । రాజవిభవ మెల్ల రమణఁ గొనుఁడు. 65**

**ప్రతిపదార్థం:** సర్వలోక, కర్మసాక్షి= సర్వజనులయొక్క కర్మములకు సాక్షి అయినవాడు; ఈ, కృష్ణుండు; సాక్షి, కాఁగన్= సాక్షిగా; మీకున్, సకల, వృద్ధ, రాజుల+ఒద్దన్= అందరు పెద్దలయొక్క, రాజులయొక్క ఎదుట, అర్ధరాజ్యము= సగరాజ్యం; ఇచ్చితిని; పాండురాజ, విభవము+ఎల్లన్= పాండురాజుయొక్క ఐశ్వర్యాన్నంతా; రమణన్= సంతోషంతో; కొనుఁడు= తీసికొనండి.

**తాత్పర్యం:** సర్వజనులకర్మసాక్షి అయిన ఈ కృష్ణుడు సాక్షిగా, అందరు పెద్దలఎదుట, రాజులఎదుట మీకు అర్ధరాజ్యం ఇచ్చాను. పాండురాజు ఐశ్వర్యమంతా సంతోషంతో స్వీకరించండి.

**విశేషం:** ఇదివరకు (అంటే లాక్షాగృహదహనానికి ముందు) ధర్మరాజును యువరాజుగా అభిషేకించింది-అర్ధరాజ్యానికి కాదు. ఇప్పుడు ధర్మరాజును అభిషేకించేదిమాత్రం అర్ధరాజ్యానికి. దానిలో మీ తండ్రి పాండురాజుకు సంబంధించిన సగభాగానికి అనే సూచనకూడా ఉన్నది.

**వ. అని ధర్మరాజు నభిషిక్తుం జేసి. 66**

**ప్రతిపదార్థం:** అని= అనిపలికి; ధర్మరాజున్=ధర్మరాజును; అభిషిక్తున్+చేసి= అభిషేకించి.

**తాత్పర్యం:** అని పలికి ధర్మరాజును రాజుగా అభిషేకించి.

**క. 'నెమ్మిఁ జని ఖాండవప్ర। స్థమ్ము నివాసమ్ముఁ జేసి తద్దయు ననురా**
**గ మ్మెసఁగ నుండుఁ డందుఁ ది। రమ్ముగ' నని పనిచెఁ బాండురాజాత్మజులన్. 67**

**ప్రతిపదార్థం:** నెమ్మిన్= సంతోషంతో; చని= వెళ్ళి; ఖాండవప్రస్థమ్ము= ఖాండవప్రస్థము అను ప్రదేశాన్ని; నివాసమ్మున్+చేసి= నివసించేచోటు చేసికొని; తద్దయున్= మిక్కిలి; అనురాగమ్ము= స్నేహం; ఎసఁగన్= పెంపొంద; అందున్= అక్కడ; తిరమ్ముగన్= స్థిరంగా; ఉండుఁడు= ఉండండి; అని= అని చెప్పి; పాండురాజ+ఆత్మజులన్= పాండురాజుయొక్క కుమారులను; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** 'సంతోషంగా వెళ్ళి ఖాండవప్రస్థాన్ని రాజధానిగా చేసికొని స్నేహం పెంపొందేటట్లు అక్కడ స్థిరంగా ఉండండి' అని పాండవులను ఆజ్ఞాపించాడు.

**వ. పాండవులును ధృతరాష్ట్రశాసనంబునను, భీష్మాదులయనుమతంబునను వాసుదేవసహితు లయి ఖాండవప్రస్థమ్మునకుం జని రంత. 68**

**ప్రతిపదార్థం:** పాండవులును= పాండవులు కూడా; ధృతరాష్ట్ర, శాసనంబునను= ధృతరాష్ట్రునియొక్క ఆజ్ఞవలన; భీష్మ+ఆదుల, అనుమతంబునను= భీష్ముడు మొదలైన వాళ్ళయొక్క అంగీకారంతో; వాసుదేవ, సహితులు+అయి= శ్రీకృష్ణునితో కూడినవాళ్ళయి; ఖాండవప్రస్థమ్మునకున్= ఖాండవప్రస్థానికి; చనిరి= వెళ్ళారు; అంత= తర్వాత.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుని ఆజ్ఞతో, భీష్మాదుల అంగీకారంతో పాండవులు వాసుదేవునితో కలిసి ఖాండవప్రస్థానికి వెళ్ళారు. ఆ తరువాత.

## విశ్వకర్మ యింద్రప్రస్థపట్టణమును నిర్మించుట (1-199-28)

**క. హరి యింద్రుఁ దలఁచె; నింద్రుఁడు। కర మనురాగమున విశ్వకర్మను బనిచెన్**
**'సురపురమున కెన యగు పుర। మరుదుగ నిర్మింపు ముర్వి' నని కడుఁ బ్రీతిన్. 69**

**ప్రతిపదార్థం:** హరి= శ్రీకృష్ణుడు; ఇంద్రున్= ఇంద్రుణ్ణి; తలఁచెన్; ఇంద్రుఁడు; కరము= మిక్కిలి; అనురాగమునన్= ప్రేమతో; సుర, పురమునకున్= దేవతలనగరమైన అమరావతికి; ఎన, అగు= సాటి అయిన; పురము= నగరం; ఉర్విన్= భూమిమీద; అరుదుగన్= ఆశ్చర్యకరంగా; నిర్మింపుము; అని; కడున్, ప్రీతిన్= మిక్కిలి ప్రీతితో; విశ్వకర్మను; పనిచెన్= ఆజ్ఞాపించెను.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ఇంద్రుడిని తలవగా ఇంద్రుడు 'అమరావతికి దీటైన పట్టణాన్ని భూమిమీద ఆశ్చర్యకరంగా నిర్మించు' మని ప్రియమార దేవశిల్పి విశ్వకర్మను ఆజ్ఞాపించాడు.

**విశేషం:** ఒకరు తలచారు. మరొకరు ఆజ్ఞాపించారు. పని చకచక జరిగిపోవాలనే వారిఆకాంక్ష. లఘుబహుళమైన కందపద్యపు ఉత్తరార్ధంలోని ద్రుతగతి త్వరత్వరగా పని జరిగేతీరుకు అనుగుణంగా కూర్చబడింది. ఇది అక్షరరమ్యంగా ధ్వనింపచేస్తున్నది. (సంపా.)

**సీ. ద్వైపాయనుండును ధౌమ్యుండు నాదిగా । భూసురుల్ సూత్రవిన్యాస మమరఁ**
**జేసి, శాంతికవిధుల్ సేయఁగ, సుప్రశ । స్తం బైన రమ్యదేశంబునందు,**
**వాసవాదిష్టుఁ డై వసుధకు నేతెంచి । పేర్మితో నవ్విశ్వకర్మ పురము**
**నిర్మించె, నదియును నిరుపమలీలలఁ । దనరి యింద్రప్రస్థ మనఁగ నింద్రు**

**ఆ. పురముతోఁ గుబేరుపురముతో వరుణేంద్రు । పురవరంబుతోడ నురగరాజ**
**పురవిభూతితోడ నురువిలాసంబుల । సరి యనంగ నొప్పె ధరణిమీఁద. 70**

**ప్రతిపదార్థం:** ద్వైపాయనుండును= వ్యాసుడూ; ధౌమ్యుండున్= పాండవపురోహితుడైన ధౌమ్యుడూ; ఆదిగాన్= మొదలుగా; భూసురుల్= బ్రాహ్మణులు, సూత్రవిన్యాసము= దారంతో కొలవటాన్ని; అమరన్= ఒప్పుగా; చేసి= కావించి; శాంతిక, విధుల్+ గ్రహశాంతిని కలిగించేటటువంటికర్మలు; చేయన్+కన్= ఒనరింపగా; సుప్రశస్తంబు+ఐన= మిక్కిలిశ్రేష్ఠమైన; రమ్య, దేశంబు, అందున్= అందమైన ప్రదేశంలో; ఆ+విశ్వకర్మ= దేవశిల్పి అయిన ఆ విశ్వకర్మ; వాసవ+ఆదిష్టుఁడు+ఐ= దేవేంద్రునివలన ఆజ్ఞాపించబడినవాడై; వసుధకున్= భూమికి; ఏతెంచి= వచ్చి; పేర్మితోన్= గొప్పగా; పురము= నగరాన్ని; నిర్మించెన్= నిర్మించాడు; అదియును= ఆ నగరం; నిరుపమ, లీలలన్= సాటిలేని విలాసాలచేత; తనరి= ఒప్పి; ఇంద్రప్రస్థము, అనఁగన్= ఇంద్రప్రస్థం అను పేరుతో; ఇంద్రు, పురముతోన్= ఇంద్రునిరాజధానితో; కుబేరు, పురముతో= కుబేరునిరాజధానితో; వరుణ+ఇంద్రు, పుర, వరంబుతోడన్= వరుణరాజుయొక్క శ్రేష్ఠమైనరాజధానితో; ఉరగ, రాజ, పుర, విభూతితోడన్= నాగరాజుయొక్క రాజధానిసంపదతో; ఉరు, విలాసంబులన్= గొప్పవిలాసాలచేత; సరి, అనంగన్= సాటి అన్నట్లుగా; ధరణి మీఁదన్= భూమిమీద; ఒప్పెన్= వెలిగింది.

**తాత్పర్యం:** వ్యాసుడు, ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులు కొలతలు ఏర్పరచి, శాంతికర్మలు చేసిన తరువాత, శ్రేష్ఠమైన, అందమైన ప్రదేశంలో, ఇంద్రుని ఆదేశానుసారం విశ్వకర్మ భూలోకానికి వచ్చి, సాటిలేని విలాసాలతో వెలిగే, ఇంద్రప్రస్థం అనే పేరుగల మహానగరాన్ని నిర్మించాడు. అది ఇంద్ర కుబేర వరుణ నాగరాజుల రాజధానులతో సరిపోలి ప్రకాశించింది.

**విశేషం:** ఇంద్రునిరాజధాని అమరావతి. కుబేరునిరాజధాని అలకాపట్టణం. వరుణునిరాజధాని శ్రద్ధావతి. నాగరాజురాజధాని భోగవతి.

**ఉ. ఇమ్ముగ విశ్వకర్మ రచియించిన కాంచన హర్మ్య తుంగ శృం**
**గమ్ముల రశ్మిరేఖలు ప్రకాశములై కడుఁ బర్వి, తత్సమీ**
**పమ్మునఁ బాఱుచున్న ఘన పంక్తులయం దచిరద్యుతి ప్రతా**
**నమ్ములఁ గ్రేణి సేయుచు ననారతమున్ విలసిల్లుఁ దత్పురిన్. 71**

**ప్రతిపదార్థం:** తత్+పురిన్= ఆ ఇంద్రప్రస్థపురంలో; ఇమ్ముగన్= ఇంపుగా; విశ్వకర్మ= దేవశిల్పి ఆ విశ్వకర్మ; రచియించిన= నిర్మించిన; కాంచన, హర్మ్య, తుంగ, శృంగమ్ముల, రశ్మి, రేఖలు= బంగారుమేడల ఎత్తైన శిఖరాల కాంతివరుసలు; ప్రకాశములు+ఐ= వెలువడినవై; కడున్= మిక్కిలి; పర్వి= వ్యాపించి; తత్+సమీపమ్మునన్= ఆ శిఖరాలదగ్గర; పాఱుచున్+ఉన్న= పోతూఉన్న; ఘన, పంక్తుల, అందున్= మేఘసమూహాల్లో; అచిర, ద్యుతి, ప్రతానమ్ములన్= మెరుపుల సమూహాలను; క్రేణి, చేయుచున్= గేలి చేస్తూ; అనారతమున్= ఎల్లప్పుడు; విలసిల్లున్= ఒప్పి ఉంటాయి.

**తాత్పర్యం:** ఆ ఇంద్రప్రస్థనగరంలో విశ్వకర్మ ప్రియమార నిర్మించిన బంగారుమేడల ఎత్తైనశిఖరాల కాంతిరేఖలు విశేషంగా వ్యాపించి, వాటి సమీపాన పోతున్న మేఘాలలోని మెరుపుతీగలను ఎగతాళిచేస్తూ ప్రకాశిస్తున్నాయి.

**విశేషం:** అలం: అతిశయోక్తి, ఉపమ.

**చ. అలఘుతరంబు లై తుహినహారిసుధారుచి నిందురోచిరా**
**కులశశికాంతవేది పృథుకుంజగళ జ్జలనిర్ఝరంబులన్**
**విలసిత జాహ్నవీ విమలవీచి విలోల లసత్పతాకలం**
**బొలుపగుఁ దత్పురీభవనముల్ హిమశైలముఁ బోలి యున్నతిన్. 72**

**ప్రతిపదార్థం:** తుహిన, హారి, సుధారుచిన్= మంచువోలె మనోహరమైన సున్నపుకాంతిచేత; ఇందు, రోచిః+ఆకుల, శశికాంత, వేది, పృథు, కుంజ, గళత్+జల, నిర్ఝరంబులన్= చంద్రుని కిరణాలచేత కలత నొందిన (కరగిన) చంద్రకాంత మణుల తిన్నెలు కల పెద్ద పొదరిండ్లనుండి జాలువారుతున్న నీటిప్రవాహాలచేత; విలసిత, జాహ్నవీ, విమల, వీచి, విలోల, లసత్+పతాకలన్= మెరుస్తున్న గంగానదియొక్క నిర్మలాలైన తరంగాలవలె చలిస్తూ ప్రకాశించే జెండాలచేత; తత్+పురీ, భవనముల్= ఆ పట్టణంలోని మేడలు; అలఘుతరంబులు+ఐ= మిక్కిలి గొప్పవై; ఉన్నతిన్=ఎత్తులో; హిమ, శైలమున్= హిమాలయపర్వతాన్ని; పోలి; పొలుపు+అగున్= ఒప్పి అందంగా ఉన్నాయి.

**తాత్పర్యం:** మంచువలె మనోహరమై, సున్నపుకాంతిచేత, చంద్రునికిరణాలచేత కరిగిన చంద్రకాంతమణుల అరుగులు గల పెద్దపొందరిండ్ల నుండి జాలువారే నీటిప్రవాహాలచేత, గంగానదీనిర్మలతరంగాల వలె చలిస్తూ ప్రకాశించేజెండాలచేతనూ, ఆ ఇంద్రప్రస్థపురంలోని ఎత్తైన పెద్దమేడలు హిమాలయపర్వతాన్ని పోలి వెలుగుతున్నాయి.

**విశేషం:** అలం: ఉపమ. ఆ పట్టణంలోని మేడలు ఎంతపెద్దవో, ఎంతఎత్తైనవో ఈ పద్యం ధ్వనింపచేస్తున్నది. కావ్యాలలో కథావసరాన్నిబట్టి అష్టాదశవర్ణనలుంటాయి. వాటిలో పురవర్ణనకు ఒజ్జబంతిగా నన్నయ అలంకారసుందరంగా ఇంద్రప్రస్థపుర వర్ణనం చేశాడు. కావ్యేతిహాసనిర్మాణంలో కావ్యస్ఫృహను వెలార్చే రచనాశిల్పంలో ఇదొక విశేషం. (సంపా.)

**చ. వననిధిలోని రత్నములు వాసుకిమూర్ధజరత్నసంఘముల్**
**గొనఁగ నవశ్యమున్ జనులకున్ సమకూరదు గాన నెప్పుడుం**
**గొనుఁడు పరార్థ్యరత్నములు గోరినవానిన యిత్తు మన్తెఱం**
**గునఁ బచరింతు రంగడులఁ గోమటు లప్పురి నిద్ధరత్నముల్. 73**

**ప్రతిపదార్థం:** ఆ+పురిన్= ఆ పట్టణంలో; కోమటులు; వన, నిధి, లోని, రత్నములు= సముద్రంలో ఉన్నరత్నాలూ; వాసుకి, మూర్ధజ, రత్న, సంఘముల్= వాసుకియొక్క శిరస్సులో పుట్టినరత్నాల సమూహాలూ; కొనఁగన్= కొనటానికి; జనులకున్; అవశ్యమున్= తప్పక; సమకూరదు, కానన్= లభించదు కనుక; పరార్థ్య, రత్నములు= శ్రేష్ఠములైన రత్నాలను; కోరిన, వానిన్+అ= కోరినవాటినన్నిటిని; ఇత్తుము= ఇస్తాము; ఎప్పుడున్= ఎల్లప్పుడు; కొనుఁడు= కొనండి; అన్+తెఱంగునన్= అనేవిధంగా; అంగడులన్= అంగళ్లలో; ఇద్ధ, రత్నముల్= కాంతి గల రత్నాలను; పచరింతురు= (అంగళ్ళలో అమ్మటానికి) అమర్చిపెడతారు.

**తాత్పర్యం:** సముద్రంలోని రత్నాలను, వాసుకి శిరస్సుమీది రత్నాలను కొనటం జనులకు సాధ్యం కాదు కాబట్టి, 'మీరు కోరిన శ్రేష్ఠరత్నాలన్నింటినీ మీకు ఇస్తాము, ఎప్పుడైనా కొనండి' అన్నట్లు ఆ పట్టణంలోని కోమట్లు కాంతిమంతాలైనరత్నాలను అంగళ్ళలో అమ్మటానికి అమరుస్తారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. చాతుర్వర్ణ్యాన్ని ఉదాత్తంగా వర్ణించటం పురవర్ణనంలో ఒక అంశం. అందులో వైశ్యులవర్ణన మిది.

**సీ.** **వలరాజు సచివుల వడువున బెడఁగగు । కర్కశస్తనములఁ గరమువాఁడి**
**చూడ్కుల నతిరాగసురుచిరాధరముల । మదవిలాసాలసమందగతుల**
**వక్రాలకంబుల వలుఁదపిఱుందుల । దర్పగద్గదభాషితములఁ జేసి**
**జనులచిత్తములకు సంక్షోభ మొనరించు । కామినీజనములు గలిగి, సకల**

**తే.** **కామభోగములకు సదేకాంతగృహముఁ । బోలి పొలిచియు, ధర్మార్థములకు నిదియ**
**యాస్పదంబు నా వర్గత్రయావిరుద్ధు । లైన జనుల కెంతయు నొప్పు నప్పురంబు.** 74

**ప్రతిపదార్థం:** వలరాజు, సచివుల, వడువునన్= మన్మథునిసహాయులవలె; బెడఁగు+అగు= అందమైన; కర్కశ, స్తనములన్= కఠినములైన చన్నులచేతను; కరము, వాఁడి, చూడ్కులన్= మిక్కిలి పదునైన చూపులచేతను; అతి, రాగ, సురుచిర+అధరములన్= మిక్కిలి ఎర్రనైన, మనోహరాలైన పెదవులచేతను; మద, విలాస+అలస, మంద, గతులన్= మదంయొక్క ఒయ్యారంతో, సోమరితనంతో కూడిన మెల్లని నడకలచేతను; వక్ర+అలకంబులన్= వంకరలు తిరిగిన ముంగురుల చేతను; వలుద, పిఱుందులన్= లావైన పిరుదులచేతను; దర్ప, గద్గద; భాషితములన్+చేసి= గర్వంతో తడబడుతున్న మాటలచేతను; జనుల, చిత్తములకున్, ప్రజల మనస్సులకు; సంక్షోభము+ఒనరించు= కలత కలిగించే; కామినీ, జనములు= స్త్రీ జనాలు; కలిగి= ఉండి, వసించి; సకల, కామ, భోగములకున్= అన్ని విధాలైన కామభోగాలు అనుభవించటానికి; సత్+ఏకాంత, గృహమున్= మంచి రహస్యగృహాన్ని; పోలి, పొలిచియున్= ఒప్పారి ఉన్నప్పటికి; ధర్మ+అర్థములకున్= ధర్మానికీ, అర్థానికీ, ఇదియు+అ= ఈ పట్టణమే; ఆస్పదంబు= ఉనికిపట్టు; నాన్= అని అనేటట్లు; వర్గత్రయ+అవిరుద్ధులు+ఐన= ధర్మార్థకామాలు మూడింటికీ విరోధులు కాని - అంటే మూడు పురుషార్థాలలో ఆసక్తి కలవాళ్ళయిన; జనులకున్; ఆ+పురంబు= ఆ ఇంద్రప్రస్థపురం; ఎంతయున్= మిక్కిలి; ఒప్పున్= ప్రకాశిస్తూ ఉన్నది.

**తాత్పర్యం:** మన్మథుని సహాయంచేసేవాళ్ళవలె - అందమై, కఠినాలైన స్తనాలచేతా, పదునైన చూపులచేతా, ఎర్రనై మనోహరాలైనపెదవులచేతా, మదంయొక్కఒయ్యారంతో మెల్లనైననడకలచేతా, పెద్దపిరుదులచేతా, గర్వంతో తడబడే మాటలచేతా, జనులమనస్సులను కలవరపరిచే స్త్రీలను కలిగి, కామభోగాలన్నిటికీ ఏకాంత మందిరమువలె ఉండి, 'ధర్మార్థాలకు ఇదే స్థానం' అన్నట్లు, ధర్మార్థకామాలు మూడింటిలోనూ ఆసక్తులైనవాళ్ళకు ఆ ఇంద్రప్రస్థపురం ఎంతో తగి ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ, ఉత్ప్రేక్ష. పురవర్ణనంలో వేశ్యావర్ణనం ఒక అంశం. ధర్మమూర్తి అయిన ధర్మరాజుయొక్క ముఖ్య పట్టణమైన ఇంద్రప్రస్థపురంలో నన్నయ 'కామినీజన' వర్ణనం చేశాడు. కామినీశబ్దానికి వేశ్య అనే అర్థం రూఢిలో ఏర్పడిందేకాని, వస్తుతః అది స్త్రీవాచకమే. ప్రియసంగమంలో మిక్కిలి ఆసక్తిగల ఆడుది అనే అర్థవిశేషం కలది. ఆ పురకామినులు విలాస సంపదచేత మారవికారాలు కలిగించేవాళ్ళయినా, ధర్మార్థకామసాధకులై ఆ పౌరజనుల ధార్మికప్రవృత్తికి విరుద్ధలు కారని వర్ణించి నన్నయ ఔచిత్యాన్ని పాటించాడు. 'కామినీజనములు' అనే సమాసం రుచిరార్థసూక్తి. (సంపా)

క. **శరనిధినినాదనిభ మగు । పురఘోషముఁ గీడుపఱిచి పొలుపగుఁ గర మ**

**ప్పురి బ్రహ్మపురి మహీసుర । వరవేదాధ్యయనరవ మవార్యం బగుచున్.** 75

**ప్రతిపదార్థం:** ఆ+పురి, బ్రహ్మ, పురి= ఆ ఇంద్రప్రస్థపురంలోని బ్రాహ్మణపురంలో; మహీసుర, వర, వేద+అధ్యయన,రవము= బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క వేదం చదివే ధ్వని; అవార్యంబు+అగుచున్= అడ్డగింపరానిదై; శరనిధి, నినాద, నిభము+అగు= సముద్రధ్వనితో సమానమైన; పుర, ఘోషమున్= పట్టణ ధ్వనిని; కీడు, పఱిచి= అణచివేసి; కరము= మిక్కిలి; పొలుపు+అగున్= ఒప్పును.

**తాత్పర్యం:** ఆ ఇంద్రప్రస్థంలోని బ్రాహ్మణపురంలో బ్రాహ్మణశ్రేష్ఠుల వేదాధ్యాయనధ్వని, ఆపటానికి సాధ్యం కానిదై, సముద్రధ్వనితో సమానమైన ఆ పట్టణధ్వనిని మించి మిక్కుటంగా వినిపిస్తూ ఉంది.

**విశేషం:** అలం: పర్యాయోక్తం, ఉపమ. పురధ్వనికంటె వేదధ్వని మించిందని చెప్పటంవలన పురజనులలో అందరికంటె బ్రాహ్మణులకు అధిక గౌరవం లభిస్తున్నదని పర్యాయంగా చెప్పినట్లయింది. నిరంతరం యజ్ఞయాగాదులు జరుగుతున్నా యనికూడా చెప్పవచ్చును. వేదాధ్యయనపరులైన బ్రాహ్మణులను వర్ణించటం పురవర్ణనలోని చాతుర్వర్ణ్యవర్ణనలో ఒకటి.

చ. **పరిఘుజలంబులం దమలపంకరుహోత్పలకైరవాదిసుం**

**దరకుసుమంబులున్ ఘనపథంబున నుజ్జ్వలతారకానిరం**

**తరకుసుమంబులున్ వెలయుఁ దత్పురవప్రము పాదపీఠికా**

**శిరముల కొప్ప నర్చనలు సేసిన పువ్వుల యవ్విధంబునన్.** 76

**ప్రతిపదార్థం:** పరిఘ, జలంబులందున్= అగడ్తనీళ్ళలో; అమల, పంకరుహ+ఉత్పల, కైరవ+ఆది, సుందర, కుసుమంబులున్= నిర్మలమైన పద్మాలు, నల్లకలువలు, తెల్లకలువలు, మొదలైన అందమైన పూలూ; ఘన, పథంబునన్= ఆకాశంలో; ఉజ్జ్వల, తారకా, నిరంతర, కుసుమంబులున్= బాగాప్రకాశించే నక్షత్రాలనే దట్టమైన పూలూ; తత్+పుర, వప్రము, పాదపీఠికా, శిరములకున్= ఆ పట్టణముయొక్క ప్రాకారపాదపీఠానికి, శిరస్సుకు; ఒప్పన్= ఒప్పునట్లుగా; అర్చనలు= పూజలు; చేసిన= కావించిన; పువ్వుల, ఆ+విధంబునన్= పువ్వులా అన్నట్లు; వెలయున్= ప్రకాశిస్తున్నాయి.

**తాత్పర్యం:** అగడ్త నీళ్ళల్లో ఉన్న పద్మాలు, నల్లకలువలు, తెల్లకలువలు మొదలైన అందమైన పూలు, ఆకాశంలో బాగా ప్రకాశించే నక్షత్రాలనే దట్టమైన పూలు, ఆ పట్టణంయొక్క ప్రాకారపాదపీఠానికి, శిరస్సుకు పూజచేసిన పువ్వులా అన్నట్లు ప్రకాశిస్తున్నాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, క్రమం. ఆ పట్టణప్రాకారాలు ఆకాశాన్ని అంటేటంత ఎత్తైనవని ధ్వని. ఎత్తైనకోటను, లోతైన అగడ్తల వైభవాన్ని వర్ణించటం పురవర్ణనాంశంలో ఒకటి.

చ. **తమము నడంచుచున్ వెలుఁగుతత్పురగోపురశాతకుంభకుం**

**భముల విచిత్రసన్మణిగభస్తివితానములన్ విచిత్రవ**

**ర్ణములగు నాత్మవాహముల నమ్మక పల్మఱుఁ జూచి యన్యవా**

**హము లని సంశయప్రణిహితాత్ముఁ డగున్ హరిదశ్వుఁ డెప్పడున్.** 77

**విశేషం:** తమమున్= చీకటిని; అడంచుచున్= అణచివేస్తూ; వెలుఁగు= ప్రకాశిస్తున్న; తత్+పుర, గోపుర, శాతకుంభ, కుంభముల, విచిత్ర, సత్+మణి, గభస్తి వితానములన్= ఆ పుర ద్వార గోపురాలయొక్క బంగారుకలశాల చిత్రవిచిత్రాలైన మంచిమణుల కాంతుల సమూహాలచేత; విచిత్ర, వర్ణములు+అగు= నానావిధాలైన రంగులు కలవైన; ఆత్మవాహములన్= తన గుర్రాలను; నమ్మక= విశ్వసింపక; పల్మఱున్= అనేక పర్యాయాలు; చూచి; అన్య, వాహములు+అని= ఇతరాలైన గుర్రాలని; హరిదశ్వుఁడు= పచ్చనిగుర్రాలు గల సూర్యుడు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; సంశయ, ప్రణిహిత+ఆత్ముఁడు= సందేహంలో ఉంచబడిన మనస్సు కలవాడు; అగున్= అవుతూ ఉంటాడు.

**తాత్పర్యం:** చీకటిని అణచివేస్తూ వెలుగుతున్న ఆ ఇంద్రప్రస్థపురద్వారగోపురాలమీది బంగారుకలశాలకు పొదిగిన చిత్రవిచిత్రాలైన రత్నకాంతులసమూహంవలన తనగుర్రాలరంగు నానావిధాలుగా మారిపోయి, పసుపుపచ్చగుర్రాలు కల సూర్యుడు, అనేకపర్యాయాలు తనగుర్రాలను చూచుకొని, అవి తనగుర్రాలని నమ్మక, వేరే గుర్రాలని ఎప్పుడూ సందేహపడుతూంటాడు.

**విశేషం:** అలం: అతిశయోక్తి, సందేహం. ఆ పట్టణద్వారగోపురాలు అంత ఎత్తు ఉన్నవని ధ్వని.

**చ. సరళ తమాల తాల హరిచందన చంపక నారికేళ కే**
**సర కదలీ లవంగ పనస క్రముకార్జున కేతకీలతా**
**గరుఘనసార సాల సహకార మహీరుహరాజ రాజి సుం**
**దర నవనందనావళులఁ దత్పురబాహ్యము లొప్పఁ జూడఁగన్. 78**

**ప్రతిపదార్థం:** తత్+పుర, బాహ్యములు= ఆ పట్టణంయొక్క వెలుపలి ప్రదేశాలు; చూడఁగన్= చూడగా; సరళ, తమాల, తాల, హరిచందన, చంపక, నారికేళ, కదలీ, లవంగ, పనస, క్రముక+అర్జున, కేతకీలతా+అగరు, ఘనసార, సాల, సహకార, మహీరుహ, రాజ, రాజి, సుందర, నవ, నందన+ఆవళులన్= తెల్లతెగడ, చీకటి, తాటి, మంచిగంధం, సంపెంగ, కొబ్బరి, కేసర, అరటి, లవంగ, పనస, పోక, ఏరుమద్ది, మొగలి, అగరు, పచ్చకర్పూరం, మద్ది, మామిడి - శ్రేష్ఠమైన వృక్షాల వరుసలతో అందమైన క్రొత్త ఉద్యానవనాల సమూహాలచే; ఒప్పున్= ప్రకాశించాయి.

**తాత్పర్యం:** ఆ ఇంద్రప్రస్థంయొక్క వెలుపలిప్రదేశాలు తెల్లతెగడ, తాటి, మామిడి మొదలైన చెట్లవరుసలతో, అందమైన క్రొత్తఉద్యానవనాలతో చూడ ముచ్చటగా ఉంటాయి.

**మ. అనిలం బప్పురిఁ బౌరచిత్తముల కత్యానంద మొందంగ నం**
**దిని యన్నేటితరంగలం బెనఁగుచున్ దివ్యద్రుమాకీర్ణ నం**
**దనసందోహముఁ దూఱుచున్ వికచకేతక్యాదినానాలతాం**
**తనవామోదముఁ బొందుచున్ సుడియు నిత్యంబుం గరం బిష్ట మై. 79**

**ప్రతిపదార్థం:** ఆ+పురిన్= ఆ ఇంద్రప్రస్థపురంలో; అనిలంబు= గాలి; పౌర, చిత్తములకున్= ఆ పురంలో నివసించే జనులమనస్సులకు; అత్యానందము= మహానందం; ఒందంగన్= కలిగేటట్లు; నందిని అన్= నందిని అనేటటువంటి; ఏటి, తరంగలన్= ఏటిఅలలతో; పెనఁగుచున్= కూడుచు; దివ్య, ద్రుమ+ఆకీర్ణ, నందన, సందోహమున్= శ్రేష్ఠములైన వృక్షాలచే

దట్టమైన ఉద్యానవనాల సమూహాన్ని; తూఱుచున్= చొచ్చుతూ; వికచ, కేతకీ+ఆది, నానా, లతాంత, నవ+ఆమోదమున్= వికసించిన మొగలిపువ్వుమొదలుగా గల వివిధాలైన పుష్పాలయొక్క క్రొత్తసువాసనను; పొందుచున్= పొందుతూ; కరంబు= మిక్కిలి; ఇష్టము+ఐ= ఇష్టమైనదియై, నిత్యంబున్= నిరంతరం; సుడియున్= వీస్తుంది.

**తాత్పర్యం:** ఆ ఇంద్రప్రస్థపురంలోని గాలి పౌరజనులమనస్సులకు మహానందం కలిగేటట్లు నందిని అనే నది అలలమీదుగా వచ్చి, శ్రేష్ఠాలైన వృక్షాలచే దట్టమైన ఉద్యానవనాలలో దూరి, వికసించిన మొగలిపూలు మొదలైన వివిధ, పుష్పాలక్రొత్తవాసనలను సమకూర్చుకొని మిక్కిలిప్రియంగా వీస్తుంది.

**విశేషం:** నది అలలమీదుగా, ఉద్యానవనాలమధ్యగా రావటంవలన ఆ గాలికి చల్లదనం, పూలసువాసనలను గ్రహించటంవలన పరిమళం, సమకూరి అది ఆ పురజనులకు హాయిని గొలుపుతూ ఉన్నది. పురవర్ణనాన్ని మందమలయానిలప్రశస్తితో ముగించటం ఒక ఔచిత్యం. సుగంధమయమైన గాలి ఆ పట్టణజీవితంలోని ఉత్తమవాసనలను ధ్వనింపచేస్తుంది. వాసనలంటే భావాలనీ అర్థం.

ఈ ఇంద్రప్రస్థపురవర్ణన తరువాతి కవులకావ్యాలలోని పురవర్ణనలకు మార్గదర్శకం అయ్యేటట్లు నడిచింది. కావ్యంలో అష్టాదశవర్ణనలుండటం లక్షణం. ఆ వర్ణనలో పురవర్ణనం ఒకటి. కావ్యలక్షణవిశిష్టమైన ఇతిహాసాన్ని (కావ్యేతిహాసాన్ని) నన్నయ రచిస్తున్నాడు కాబట్టి ఈ పురవర్ణనం కావ్యేతిహాసంలో కావ్యస్వభావాన్ని పెంచే ఒక రమణీయమైన అంశం. (సంపా.)

**వ. ఇట్టి యింద్రప్రస్థపురంబున నింద్రవిలాసంబుతో వ్యాసవాసుదేవానుమతుం డై ధర్మతనయుండు ధౌమ్యపురస్సర మహీసురప్రవరవేదఘోషంబులు, సకలజనాశీర్వాదనాదంబులు, మృదుమధుర మంగళ సంగీత రవంబులు, వివిధ తూర్యధ్వనులు నతిసమృద్ధంబులై యెసంగ వర్గచతుష్టయంబునుం బోని యనుజవర్గంబుతో శుభముహూర్తం బునం బురప్రవేశంబు సేసి సర్వప్రకృతిజనానురాగకరుం డయి. 80**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఇటువంటి; ఇంద్రప్రస్థ, పురంబునన్= ఇంద్రప్రస్థనగరంలో; ఇంద్ర, విలాసంబుతోన్= ఇంద్రునియొక్క విలాసంవంటి విలాసంతో; వ్యాస, వాసుదేవ+అనుమతుండు+ఐ= వ్యాసునితో, శ్రీకృష్ణునితో అనుమతి పొందినవాడై; ధర్మతనయుండు= ధర్మరాజు; ధౌమ్య, పురస్సర, మహీసుర, ప్రవర, వేదఘోషంబులు= ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణశ్రేష్ఠుల యొక్క వేదధ్వనులూ; సకల, జన+ఆశీర్వాద, నాదంబులును= ప్రజలందరియొక్క ఆశీర్వాదశబ్దాలూ; మృదు, మధుర, మంగళ, సంగీత, రవంబులు= సున్నితాలూ, మనోహరాలూ, శుభంకరాలూ అయిన సంగీతనాదాలూ; వివిధ, తూర్య, ధ్వనులున్= అనేకవిధాలైన వాద్యధ్వనులూ; అతి, సమృద్ధంబులు+ఐ= మిక్కిలి నిండినవై; ఎసంగన్= అతిశయించగా; వర్గ, చతుష్టయంబునున్+పోని= ధర్మార్థకామమోక్షాలు అనే నాలుగుపురుషార్థాలనుపోలిన; అనుజ, వర్గంబుతోన్= తమ్ముల సమూహంతో; పుర, ప్రవేశంబు, చేసి= నగర ప్రవేశం గావించి; సర్వ, ప్రకృతి, జన+అనురాగ, కరుండు+అయి= సామాన్య జనులందరికీ సంతోషం కలిగించేవాడై.

**తాత్పర్యం:** ఈవిధమైన ఇంద్రప్రస్థపురంలో దేవేంద్రునివలె విలాసంతో, వ్యాస, శ్రీకృష్ణుల అనుమతితో ధౌమ్యుడుమొదలైన బ్రాహ్మణశ్రేష్ఠుల వేదధ్వనులు, సకలజనులఆశీర్వాదశబ్దాలు, మృదు, మధుర, శుభ, సంగీతనాదాలు, వివిధవాద్యధ్వనులు మిక్కిలి అతిశయించగా, నాలుగువిధాలైన పురుషార్థాలనుపోలిన నలుగురితమ్ములతో పురప్రవేశం చేసి, ప్రజలందరికీ ఆనందం కలిగించేవాడై.

**చ. అనుజులు నల్వురుం దనకు నత్యనురాగమునన్ విధేయు లై**
**తనరుచు నుండ వేదవిహితం బగు యజ్ఞమపోలె సర్వపా**

**వనశుభమూర్తి యై భువనవంద్యుఁడు ధర్మపరుండు ధర్మనం**

**దనుఁడు ధరాధిరాజ్యము ముదంబునఁ జేయుచునుండెఁ బేర్మితోన్. 81**

**ప్రతిపదార్థం:** అనుజులు= తమ్ముళ్లు; నల్వురున్= నలుగురూ; తనకున్; అతి+అనురాగమునన్= మిక్కిలి ప్రేమతో; విధేయులు+ఐ= లొంగినవాళ్ళయి; తనరుచున్= ఒప్పుతూ; ఉండన్= ఉండగా; వేద, విహితంబు+అగు= వేదముచే విధింపబడిన దైన; యజ్ఞముపోలె; సర్వ, పావన, శుభమూర్తి+ఐ= సమస్తాన్ని పవిత్రం చేసే శుభకరమైన ఆకారం కలవాడై; భువన వంద్యుఁడు =లోకాలచే నమస్కరించతగినవాడు; ధర్మపరుండు= ధర్మమే ప్రధానంగా కలవాడు; ధర్మనందనుఁడు= ధర్మరాజు; ధరా+అధిరాజ్యము= భూమండల పరిపాలనం; ముదంబునన్= సంతోషంతో; పేర్మితోన్= గొప్పతనంతో; చేయుచున్, ఉండెన్= చేస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** తమ్ముళ్లు నలుగురు ఎంతో ప్రేమతో తనకు విధేయులై వెలుగుతుండగా, వేదం విధించిన యజ్ఞం వలె సమస్తాన్నీ పవిత్రం చేసే శుభకరమైన ఆకారం కలవాడై లోకాలచే నమస్కరించదగినవాడు, ధర్మమే ప్రధానంగా కలవాడు అయిన ధర్మరాజు సంతోషంతో గొప్పగా రాజ్యపాలన చేస్తూ ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. రాజ్యపాలనాన్ని ధర్మరాజు పవిత్రమైన యజ్ఞంగా భావించాడు. నలువురు తమ్ముళ్లూ నలువురు ఋత్విక్కులు.

**సీ. అనఘు వేదాధ్యయనాసక్తు నారభ్య । మాణమహాధ్వరు మనుచరిత్రు**

**సర్వవర్ణాశ్రమసంరక్షణక్షము । సత్యసంధాను నజాతశత్రు**

**భరతవంశోత్తముఁ బ్రభు ధర్మనందను । రాజుఁగాఁ బడసి సురాజ యయ్యె**

**వసుధ, యధిష్ఠానవతి యయ్యె మఱి లక్ష్మి । బంధుమంతం బయ్యెఁ బరమధర్మ**

**ఆ. మన్నరేంద్రునందు నాపూర్ణతరశర । దైందవాతపంబునందుఁ బ్రీతి**

**సమమ కా సమస్తజనులచిత్తంబు లా । నందరసభరంబు నొందఁ దాల్చె. 82**

**ప్రతిపదార్థం:** అనఘున్= పాపంలేనివాడిని; వేద+అధ్యయన+ఆసక్తున్= వేదాన్ని చదువుకోవటంలో ఆసక్తికలవాడిని; ఆరభ్యమాణ, మహా+అధ్వరున్= ఆరంభం కానున్న గొప్పయజ్ఞాలు కలవాడిని; మనుచరిత్రున్= వైవస్వతమనువుయొక్క చరిత్రవంటి చరిత్రకలవాడిని; సర్వ, వర్ణాశ్రమ, సంరక్షణ, క్షమున్= అన్నివర్ణాలను, ఆశ్రమాలను సంరక్షించటంలో సమర్థుడైనవాడిని; సత్యసంధానున్= ఆడితప్పనివాడిని, అజాతశత్రున్= పుట్టబడనిశత్రువులు కలవాడిని - అంటే శత్రువులు లేనివాడిని; భరతవంశ+ఉత్తమున్= భరతవంశంలో శ్రేష్ఠుడిని; ప్రభున్= ప్రభువైన; ధర్మనందనున్= ధర్మరాజును; రాజున్+కాన్= రాజుగా; పడసి= పొంది; వసుధ= భూమి, సురాజ అయ్యెన్= మంచిరాజు కలిగినది అయింది; మఱి= అటుపై; లక్ష్మి; అధిష్ఠానవతి= ఆక్రమించుకొన్నభర్త కలది; అయ్యెన్= అయింది; ఆ+నర+ఇంద్రు, అందున్= ఆ రాజులోన; ఆపూర్ణతర, శరత్+ఐందవ+ ఆతపంబునందున్= మిక్కిలి నిండైన శరత్కాలంలోని చంద్రసంబంధమైన కాంతిలోను; ప్రీతి= ప్రీతి; సమమకా= సమానం కాగా; సమస్త, జనుల, చిత్తంబులు= అందరు ప్రజల మనస్సులు; ఆనందరస, భరంబున్= సంతోషాతిశయాన్ని; ఒందన్= కలిగేటట్లు; తాల్చెన్= ధరించాయి.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడు, వేదాన్ని చదువుకోవటంలో ఆసక్తి కలవాడు, గొప్పయజ్ఞాలు ప్రారంభించేవాడు, మనువువంటి ధార్మికమైన నడవడి కలవాడు, అన్నివర్ణాలను ఆశ్రమాలను రక్షించే సమర్థత కలవాడు, ఆడి తప్పనివాడు, శత్రువులు లేనివాడు, భరతవంశశ్రేష్ఠుడు అయిన ధర్మరాజును రాజుగా పొంది- భూమండలం మంచిరాజును కలది అయింది. లక్ష్మి స్థిరమైన భర్త కలది అయింది. ధర్మం మంచి బంధువు కలది అయింది. జనులు శరత్కాలపూర్ణచంద్రుని వెన్నెల్లోను, ఆ ధర్మరాజులో సమానమైన ప్రీతికలవాళ్ళయి సంతోషిస్తూ ఉన్నారు.

**విశేషం:** వర్ణాలు నాలుగు - బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. ఆశ్రమాలు నాలుగు - బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాలు. అలం: ప్రహర్షణం, తుల్యయోగిత. పై పద్యంలో వర్ణించిన వన్నీ ధీరోదాత్తనాయకలక్షణాలే.

**క. ధరణిప్రజ ధర్మసుతు సు । స్థిరనిర్మలధర్మచరితఁ జేసి రుజా త**
**స్కరపరరాష్ట్రవిబాధలఁ । బొరయక సంతతసమృద్ధిఁ బొందె విభూతిన్. 83**

**ప్రతిపదార్థం:** ధరణిప్రజ= భూమిమీదిజనులు; ధర్మసుతు, సుస్థిర, నిర్మల, ధర్మ, చరితన్+చేసి= ధర్మరాజుయొక్క మిక్కిలి స్థిరమై, స్వచ్ఛమైన ధర్మం గల నడవడితో; రుజా, తస్కర, పరరాష్ట్ర, విబాధలన్= రోగాలవలన, దొంగలవలన, శత్రుదేశాలవలన విశేషమైన బాధలు; పొరయక= పొందక, విభూతిన్= ఐశ్వర్యంతో; సంతత, సమృద్ధిన్= ఎడతెగని సంపూర్ణతను; పొందెన్= పొందారు.

**తాత్పర్యం:** ధర్మరాజు మిక్కిలి స్థిరమైన స్వచ్ఛమైన ధర్మప్రవర్తన కలవాడుకావటంచేత ప్రజలు రోగాలవలన, దొంగలవలన, శత్రుదేశాలవలన బాధలు లేక ఎడతెగని సంపదలు సమృద్ధిగా పొందారు.

**క. తనరిరి తద్దేశంబున । ననవరతము యజనయాజనాధ్యయనాధ్యా**
**పనదానములుఁ బ్రతిగ్రహ । మును నను షట్కర్మములను భూసురవంశ్యుల్. 84**

**ప్రతిపదార్థం:** భూసుర, ముఖ్యుల్= ఉత్తములైన బ్రాహ్మణులు, తత్+దేశంబునన్= ఆ దేశంలో; అనవరతము= ఎల్లప్పుడు; యజన, యాజన+అధ్యయన+అధ్యాపన, దానములున్= యజ్ఞం చేయటం, చేయించటం, వేదం చదివించటం, దానం చేయటం; ప్రతిగ్రహమును= దానం పుచ్చుకోవటం; అను; షట్+కర్మములను= ఆరుకర్మ(ము)లచేత; తనరిరి= ఒప్పారు.

**తాత్పర్యం:** ఆ దేశంలోని బ్రాహ్మణోత్తములు యజ్ఞంచేయటం, చేయించటం, వేదం చదవటం, చదివించటం, దానం చేయటం, పుచ్చుకోవటం అనే ఆరుకర్మలను ఎల్లప్పుడూ ఆచరిస్తూ ఉన్నారు.

**క. పంబి యజనాధ్యయన దా । నంబుల వర్తిల్లె బ్రాహ్మణప్రియ మయి ధ**
**ర్మ్యం బయి క్షత్రియవైశ్యకు । లం బవిరతపుణ్యకర్మలాలస మగుచున్. 85**

**ప్రతిపదార్థం:** క్షత్రియ, వైశ్య, కులంబు; పంబి= వృద్ధి పొంది; బ్రాహ్మణ, ప్రియము+అయి= బ్రాహ్మణులు ఇష్టమైన వాళ్ళుగా కలదై; ధర్మ్యంబు+అయి= ధర్మంనుండి తొలగనిదై; అవిరత, పుణ్యకర్మ, లాలసము+అగుచున్= ఎడతెగని పుణ్యకార్యాల్లో ప్రీతి కలది అవుతూ; యజన+అధ్యయన, దానంబులన్= యజ్ఞం చేయటంలోను; వేదం చదవటంలోను, దానం చేయటంలోను; వర్తిల్లెన్= ఉన్నది.

**తాత్పర్యం:** క్షత్రియులు, వైశ్యులు వృద్ధిపొంది, బ్రాహ్మణభక్తి గలవారై, ధర్మమార్గం తప్పక, ఎల్లప్పుడు పుణ్యకార్యాల్లో ప్రీతి కలిగి, యజ్ఞాలు చేస్తూ, వేదాలు చదువుతూ, దానాలు చేస్తూ జీవిస్తూ ఉన్నారు.

**క. పరమద్విజశుశ్రూషా । పరు లయి శూద్రాదు లవనిఁ బరగిరి ధర్మ**
**స్థిరమతు లయి ధర్మజు ధర్మరాజ్య మభివృద్ధిఁ బొందె మహిమాన్విత మై. 86**

**ప్రతిపదార్థం:** శూద్ర+ఆదులు= శూద్రులు మొదలైనవాళ్ళు; పరమ, ద్విజ, శుశ్రూషా, పరులు+అయి= కేవలం బ్రాహ్మణులకు సేవచేయటంలో మిక్కిలి కోరిక కలవాళ్ళయి; ధర్మ, స్థిర, మతులు+అయి= ధర్మంమీద నిలకడ గల బుద్ధిగలవాళ్ళయి; పరగిరి= ప్రవర్తిల్లారు; ధర్మజు, ధర్మరాజ్యము; మహిమ+అన్వితము+ఐ= గొప్పతనంతో కూడినదై; అభివృద్ధిన్, పొందెన్= అభివృద్ధి పొందింది.

**తాత్పర్యం:** శూద్రులు మొదలైనవాళ్ళు కేవలం బ్రాహ్మణులకు సేవచేయటంలో ఎంతో ఆసక్తి కలవాళ్ళయి; ధర్మం మీద స్థిరమైన బుద్ధికలవాళ్ళయి నడుచుకొన్నారు. ధర్మజుని ధర్మరాజ్యం గొప్పగా అభివృద్ధి పొందింది.

**విశేషం:** రాజధానిలోనే కాక రాజ్యమంతటాకూడా చాతుర్వర్ణ్యప్రజలు వర్ణాశ్రమధర్మాలతో ధర్మం తప్పక బ్రాహ్మణభక్తితో వర్ధిల్లుతున్నారని చెప్పి, 'యథా రాజా తథా ప్రజా' అనే సూక్తి సార్థకమైనట్లు ధ్వనింపచేశాడు నన్నయ.

**వ. అంత. 87**

**తాత్పర్యం:** అట్లా ఉండగా.

**క. 'నారదుఁడు వచ్చుఁ; దద్వచ । నారంభుల రగుఁడు మీర' లని కఱపి మహో**
**దారుఁడు వారల వీడ్కొని । నారాయణుఁ డరిగెఁ దత్క్షణమ తనపురికిన్. 88**

**ప్రతిపదార్థం:** నారదుఁడు; వచ్చున్= వస్తాడు; మీరలు; తత్+వచన+ఆరంభులరు= అతనిమాటప్రకారం చేసేవాళ్ళు; అగుఁడు, అని= కండి అని; కఱపి= బోధించి; మహా+ఉదారుఁడు= మిక్కిలి గొప్పవాడు; నారాయణుఁడు= శ్రీకృష్ణుడు; వారలన్; వీడ్కొని= వీడి; తత్+క్షణము+అ= వెంటనే; తన, పురికిన్= తననగరానికి - ద్వారకానగరానికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'మీ దగ్గరకు నారదుడు వస్తాడు. అతడు చెప్పిన విధంగా మీరు నడచుకోండి' అని పాండవులకు చెప్పి మహాత్ముడైన శ్రీకృష్ణుడు వెంటనే ద్వారకానగరానికి వెళ్ళాడు.

**వ. పాండవులును పరాక్రమ, ప్రణయ, వశీకృతాఖిలరాజన్యు లయి సుఖం బుండు నంత నొక్కనాఁడు. 89**

**ప్రతిపదార్థం:** పాండవులును; పరాక్రమ, ప్రణయ, వశీకృత+అఖిల, రాజన్యులు+అయి= పరాక్రమంచేత, స్నేహంచేత స్వాధీనులుగా చేసికొనబడిన ఎల్లరాజులు కలవాళ్ళయి - అనగా పరాక్రమంచేత, స్నేహంచేత రాజులందరినీ తమవశం చేసికొని; సుఖంబు+ఉండు; అంతన్= సుఖంగా ఉండగా; ఒక్కనాఁడు.

**తాత్పర్యం:** పాండవులు తమపరాక్రమంతో, స్నేహంతో రాజులందరినీ తమ వశం చేసికొని సుఖంగా ఉండగా, ఒకనాడు.

## నారదుఁడు పాండవులపాలికి వచ్చుట (సం. 1-200-8)

**తరలము.**

> **ప్రవిమలాగమతత్త్వవేది తపఃప్రభాసి జగత్త్రయీ**
> **శివకరుండు హితోపదేశము సేయఁగాఁ గడువేడ్కతో**
> **దివిజవంద్యుఁడు ప్రీతితోఁ జనుదెంచె నారదుఁ డంబుజో**
> **ద్భవతనూజుఁడు భానుతేజుఁడు పాండవేయులపాలికిన్.** **90**

**ప్రతిపదార్థం:** ప్రవిమల+ఆగమ, తత్త్వ, వేది= పరిశుద్ధములైన వేదాలయొక్క తత్త్వాన్ని తెలిసినవాడు; తపః, ప్రభాసి= తపస్సుచే ప్రకాశించేవాడు; జగత్+త్రయీ, శివకరుండు= లోకాలు మూడిటికీ మేలుచేసేవాడు; దివిజ, వంద్యుఁడు= దేవతలచే పూజింపదగినవాడు; భాను, తేజుఁడు= సూర్యునితో సమానమైన తేజస్సు కలవాడు; అంబుజ+ఉద్భవ, తనూజుఁడు= పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవుని కుమారుడు; నారదుఁడు; హిత+ఉపదేశము= మంచి ఉపదేశం; చేయఁగాన్= చేయటానికి; కడు, వేడ్కతోన్= మిక్కిలి సంతోషంతో; పాండవేయుల, పాలికిన్= పాండవులదగ్గరకు; ప్రీతితోన్= ప్రేమతో; చనుదెంచెన్.

**తాత్పర్యం:** పవిత్రాలైన వేదాలతత్త్వం తెలిసినవాడు, తపస్సుచేత ప్రకాశించేవాడు, ముల్లోకాలకు శుభం చేకూర్చేవాడు, దేవతలచేత పూజించదగినవాడు, సూర్యునితో సమానమైన తేజస్సు గలవాడు, బ్రహ్మదేవుని పుత్రుడు అయిన నారదుడు హితాన్ని ఉపదేశించటానికి మిక్కిలి సంతోషంతో పాండవుల దగ్గరకు వచ్చాడు.

**మానిని**

> **తమ్ములుఁ దానును ధర్మతనూజుఁడు తత్క్షణసంభృతసంభ్రముఁ డై**
> **యమ్మునినాథవరేణ్యునకున్ వినయమ్మున మ్రొక్కి సమున్నతపీ**
> **ఠమ్మున నుంచి యథావిధి పూజ లొడంబడఁ జేసి మునీశ్వర నె**
> **య్యమ్మున నీ విట వచ్చుటఁజేసి కృతార్థుల మైతిమి యిందఱమున్.** **91**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజుఁడు= ధర్మరాజు; తమ్ములున్= తమ్ముళ్లూ; తానును= తానూ; తత్+క్షణ, సంభృత, సంభ్రముఁడు+ఐ= ఆ క్షణంలో చక్కగా భరింపబడిన ఆదరం కలవాడై; ఆ+ముని, నాథ, వరేణ్యునకున్= ఈ ఋషిశ్రేష్ఠుడైన నారదునకు; వినయమ్మునన్= వినయంతో; మ్రొక్కి= నమస్కరించి; సమున్నత, పీఠమ్మునన్= మిక్కిలి ఎత్తైన పీఠంపై; ఉంచి= కూర్చుండబెట్టి; యథావిధి= శాస్త్రవిధిగా; పూజలు= పూజలు; ఒడంబడన్= అంగీకరించేటట్లు; చేసి; ముని+ఈశ్వర= మునిశ్రేష్ఠా!; నెయ్యమ్మునన్= స్నేహంతో; నీవు; ఇటన్= ఇచ్చటకు; వచ్చుటన్+చేసి= రావటంవలన; ఇందఱమున్= ఇంతమందిమి; కృతార్థులము+ ఐతిమి= ఈడేరిన కోరిక కలవారమయ్యాము.

**తాత్పర్యం:** ధర్మరాజు తమ్ములతో కూడ అమితమైన ఆదరభావంతో ఈ ఋషిశ్రేష్ఠుడైన నారదునికి వినయంగా మ్రొక్కి, మిక్కిలి ఎత్తైన పీఠంమీద కూర్చుండబెట్టి, యథావిధిగా పూజలు చేసి, 'మునీశ్వరా! మీరు స్నేహంతో ఇక్కడికి రావటంవలన మేమంతా కృతార్థులం అయ్యాం' అన్నాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు. ఆది. 4.20 విశేషం. మానినీవృత్తాన్ని నన్నయ ఆదిపర్వంలో రెండుసార్లు, తిక్కన స్త్రీపర్వంలో రెండుసార్లు వాడారు.

**వ. 'మాపుణ్యంబునంజేసి భవద్దర్శనంబు సంభవించె' నని పరమప్రీతిహృదయులై పలికి, పరమభక్తిం బాంచాలిమ్రొక్కించి యున్నంత, నందఱ నాశీర్వచనంబుల నభినందించి వారల కుశలం బడిగి నారదుండు ద్రౌపదిం బోవం బనిచి, వా రేవురకు నేకాంతంబున ని ట్లనియె. 92**

**ప్రతిపదార్థం:** మా, పుణ్యంబునన్+చేసి= మా పుణ్యంవలన; భవత్+దర్శనంబు= మీ దర్శనం; సంభవించెన్= కలిగింది; అని= అని; పరమ, ప్రీత, హృదయులు+ఐ= మిక్కిలి సంతోషించిన హృదయం కలవాళ్ళయి; పలికి; పరమ, భక్తిన్= మహాభక్తితో; పాంచాలిన్= ద్రౌపదిని; మ్రొక్కించి; ఉన్నంతన్= ఉండునంతలో; అందఱన్= అందరిని; ఆశీర్వచనంబులన్= దీవెనలతో; అభినందించి= కొనియాడి; వారల, కుశలంబు+అడిగి; నారదుండు; ద్రౌపది, పోవన్+పనిచి= వెళ్ళవలసిందని ఆజ్ఞాపించి; వారు+ఏవురకున్= పాండవులైదుగురికి; ఏకాంతంబునన్= రహస్యంగా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'మా పుణ్యంవలన మీ దర్శనం మాకు లభించింది' అని పాండవులు మిక్కిలి సంతోషంతో పలికి, మహాభక్తితో ద్రౌపదిచేత ఆ మహర్షికి మ్రొక్కించాడు. నారదమహర్షి అందరినీ ఆశీర్వదించి, కొనియాడి, కుశల మడిగి, ద్రౌపదిని పొమ్మని పాండవులైదుగురితో రహస్యంగా ఇట్లా అన్నాడు.

**సీ. సర్వధర్మజ్ఞుల రుర్వీశపూజ్యుల । రన్యోన్యనిత్యసౌహార్దయుతుల**
**రగణితగుణయుక్తిఁ బొగడంగఁ దగువార । లిట్టి మీ కేవుర కిపుడు ద్రుపద**
**సుత యొక్కతియ ధర్మమతి ధర్మపత్ని యై । నది; యీక్రమంబు లోకాగమంబు**
**లందు విరుద్ధ; మీసుందరికారణం । బున మీకు విప్రీతి పుట్టకుండ**

**ఆ. నుండవలయుఁ; బ్రియసహోదరుల్ దొల్లి సుం । దోపసుందు లొక్కయువతి కడరి**
**విగ్రహించి యసురవీరులు దమలోనఁ । బొడిచి మృత్యునిలయమునకుఁ జనిరి. 93**

**ప్రతిపదార్థం:** సర్వ, ధర్మజ్ఞులరు= అన్నిధర్మాలు తెలిసినవాళ్ళు; ఉర్వీ+ఈశ, పూజ్యులరు= రాజులచే పూజింపతగినవాళ్ళు; అన్యోన్య నిత్య, సౌహార్దయుతులరు= పరస్పరం శాశ్వతమైన స్నేహంతో కూడినవాళ్ళు; అగణిత, గుణ, యుక్తిన్= లెక్కలేనన్ని గుణాల కూడికచే; పొగడంగన్= కొనియాడ; తగు= తగిన, వారలు= వాళ్లు; ఇట్టి, మీకున్= ఇటువంటి మీకు; ఏవురకున్= ఐదుగురికి; ఇపుడు, ద్రుపద, సుత= ద్రుపదరాజుకూతురు; ఒక్కతియ= ఒక్కతియే; ధర్మమతిన్= ధర్మబుద్ధితో; ధర్మ, పత్ని= ఇల్లాలు, ఐనది, ఈ క్రమంబు= ఈ పద్ధతి; లోక+ఆగమంబుల+అందున్= లోకంలో, శాస్త్రంలో; విరుద్ధము= పొసగనట్టిది; ఈ, సుందరి= ఈ అందగత్తె; కారణంబునన్= కారణంగా; విప్రీతి= విరోధం; పుట్టకుండన్= కలుగకుండా; ఉండవలయునన్; తొల్లి= పూర్వం; అసుర, వీరులు= రాక్షసవీరులు; ప్రియ, సహోదరుల్= ప్రేమగల అన్నదమ్ములు; సుంద+ఉపసుందులు= సుందుడు, ఉపసుందుడు; ఒక్క, యువతికిన్= ఒక్కస్త్రీకోసం; అడరి= అతిశయించి; తమలోనన్= తమలో తాము; విగ్రహించి= కలహించి; పొడిచి= కొట్టుకొని; మృత్యు, నిలయమునకున్= యమునిఇంటికి; చనిరి= వెళ్ళారు. (మరణించారు.)

**తాత్పర్యం:** మీరు అన్నిధర్మాలు తెలిసినవాళ్ళు. రాజులచే పూజింపదగినవాళ్ళు. ఒకరిపై ఒకరు శాశ్వతస్నేహం కలవాళ్ళు. లెక్కలేనన్ని మంచిగుణాలు కలవాళ్ళు. కొనియాడదగిన వాళ్ళు. ఇట్లాంటి మీ అయిదుగురికి ఇప్పుడు ద్రౌపది ఒక్కతే భార్య అయింది. ఈ పద్ధతి లోకవిరుద్ధం, శాస్త్రవిరుద్ధం. ఈ అందగత్తె కారణంగా మీలో మీకు

విరోధం పుట్టకూడదు. పూర్వం ప్రేమగల అన్నదమ్ములు, సుందోపసుందులు అనే రాక్షసవీరులు, ఒక స్త్రీకోసం కలహించి కొట్టుకొని మృతిచెందారు.

**క. అనిన నది యెట్టు లని యమ । తనయుఁడు గడువేడ్కతోడఁ ద న్నడిగిన నా**
**తనికిఁ దదీయానుజులకు । నినసన్నిభుఁ డమ్మునీంద్రుఁ డి ట్లని చెప్పెన్. 94**

**ప్రతిపదార్థం:** అనినన్= అని నారదుడు చెప్పగా; అది, ఎట్టుల+అని= అది ఏ విధంగా అని; యమ, తనయుఁడు= యముని కుమారుడైన ధర్మరాజు; కడున్= మిక్కిలి; వేడ్కతోడన్= కుతూహలంతో; తన్నున్+అడిగినన్= తనను అడిగినంతనే; అతనికిన్= ఆ ధర్మరాజుకు; తదీయ, అనుజులకున్= అతని తమ్ములకు; ఇన, సన్నిభుఁడు= సూర్యునితో సమానమైనవాడు; ఆ+ మునీంద్రుఁడు= ఆ మునిశ్రేష్ఠుడైన నారదుడు; ఇట్లు+అని, చెప్పెన్= ఈ విధంగా అని చెప్పాడు.

**తాత్పర్యం:** అని నారదుడు చెప్పగా ధర్మరాజు మిక్కిలి కుతూహలంతో అది ఎట్లని అడుగగా, అతనికి, అతని తమ్ములకు సూర్యసమానుడైన నారదమునీంద్రుడు ఇట్లా చెప్పాడు.

## సుందోపసుందోపాఖ్యానము (సం.1-201-1)

**వ. తొల్లి దితిపుత్త్రుండైన హిరణ్యకశిపువంశంబున నికుంభుం డనువానికి సుందోపసుందు లన నిద్దఱుగొడుకులు పుట్టి, నియతాత్ములయి తపంబునన కాని సర్వంబునుం బడయంగా దని యేకనిశ్చయులై, వింధ్యాచలంబున కరిగి నిగృహీతేంద్రియు లై నిదాఘకాలం బెల్లఁ బంచాగ్నిమధ్యంబున నిలిచి, వానకాలంబును శీతకాలంబును జలాశయంబుల వసియించి, మఱియు వాయుభక్షులు నేకపాదస్థితులు నూర్ధ్వబాహులు నధోముఖులును నై పెద్దకాలంబు తపంబు సేసిన. 95**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; దితి, పుత్త్రుండు+ఐన= దితియొక్క కుమారుడైన; హిరణ్యకశిపు= హిరణ్యకశిపుని; వంశంబున= వంశంలో; నికుంభుండు= నికుంభుడు; అను వానికిన్= అనేపేరుగల వానికి; సుంద+ఉపసుందులు= సుందుడు, ఉపసుందుడు; అనన్= అనగా; ఇద్దఱు, కొడుకులు, పుట్టి= ఇరువురు కొడుకులు కలిగి; నియత+ఆత్ములు+అయి= నిగ్రహించబడిన మనస్సు కలవారై; తపంబునన, కాని= తపముచేత తప్ప; సర్వంబునున్= అంతా; పడయన్+కాదు+అని= పొందటం సాధ్యపడదని; ఏక, నిశ్చయులు+ఐ= ఒకే నిర్ణయంకలవాళ్ళయి; వింధ్య+అచలంబునకున్= వింధ్యపర్వతానికి; అరిగి= వెళ్ళి; నిగృహీత+ఇంద్రియులు+ఐ= అదుపులో పెట్టబడిన ఇంద్రియాలు కలవాళ్ళయి; నిదాఘకాలంబు+ఎల్లన్= ఎండకాలమంతా; పంచ+అగ్ని, మధ్యంబునన్= అయిదుఅగ్నులమధ్య; నిలిచి=నిల్చుకొని; వాన, కాలంబును= వర్షాకాలం; శీత, కాలంబును= చలికాలముకూడా; జల+ఆశయంబులన్= నీటి మడుగులలో; వసియించి= ఉండి; మఱియున్= ఇంకా; వాయు, భక్షులున్= గాలిని తిన్నవాళ్ళు; ఏక, పాద, స్థితులున్= ఒంటికాలిమీద నిలబడేవాళ్ళు; ఊర్ధ్వ, బాహులును= మీదికి ఎత్తిన చేతులు కలవాళ్ళూ; అధో, ముఖులును= వంచినముఖాలు కలవాళ్ళూ; ఐ; పెద్ద, కాలంబు= చాలాకాలం; తపంబు, చేసినన్= తపస్సు గావింపగా.

**తాత్పర్యం:** పూర్వం దితి కుమారుడైన హిరణ్యకశిపునివంశంలో నికుంభుడు అనే వానికి సుందోపసుందులనే ఇద్దరు కుమారులు జన్మించారు. వాళ్ళు నిగ్రహంతో కూడిన మనస్సు కలవాళ్ళయి తపస్సుచే తప్ప సర్వాన్ని

పొందటం సాధ్యం కాదని ఒకే నిర్ణయం కలవాళ్ళయి, వింధ్యపర్వతానికి వెళ్ళారు. ఇంద్రియాలను అదుపులో ఉంచుకొని, వేసవికాలం అయిదుఅగ్నులమధ్య; వర్షాకాలంలో, చలికాలంలో నీటిమడుగులలో ఉండి, గాలిని భక్షిస్తూ, ఒంటికాలిమీద నిలబడి, చేతులు పైకెత్తి తలలు వంచి చాలాకాలం తపస్సు చేయగా.

**విశేషం:** పంచాగ్నులు - పూర్వాగ్ని, దక్షిణాగ్ని, పశ్చిమాగ్ని, ఉత్తరాగ్ని, సూర్యుడు. (నాల్గుదిక్కుల్లో అగ్ని-పైనసూర్యుడు)

**సీ.** **వారిదారుణతపోవహ్నిదాహంబున । వింధ్యాద్రిదరుల నావిర్భవించి,**
**యత్యుచ్చ మయి ధూమ మాకాశమెల్లను । గప్పిన, నమరులు గరము వెఱచి,**
**రత్నంబులను వధూరత్నంబులను జేసి । తత్తపోవిఘ్నవిధాననిరతు**
**లయి ప్రబోధింపంగ నలవిగాకున్నఁ, దో । యజుగర్భుపాలికి నరిగి యసుర**

**ఆ.** **వరులతపముఁ జెఱుపవలయు నావుడుఁ, గమ । లాసనుండు త్రిభువనార్చితుండు**
**సురహితంబుపొంటె సుందోపసుందుల । కడకు వచ్చె వరము కరుణ నీఁగ.** **96**

**ప్రతిపదార్థం:** వారి, దారుణ, తపస్+వహ్ని, దాహంబునన్= ఆ సుందోపసుందులయొక్క భయంకరమైన తపస్సు అనే అగ్నియొక్క కాల్చటంచేత; వింధ్య+అద్రి, దరులన్= వింధ్యపర్వతంయొక్క గుహలలో; ధూమము= పొగ; ఆవిర్భవించి= పుట్టి, అతి+ఉచ్చము+ అయి= మిక్కిలిగా పైకి వ్యాపించినదై; ఆకాశము+ఎల్లను= ఆకాశంఅంతా; కప్పినన్= కప్పివేయగా; అమరులు= దేవతలు; కరము= మిక్కిలి; వెఱచి= భయపడి; రత్నములను= రత్నాలచేతా; వధూ, రత్నంబులను+చేసి= ఉత్తమస్త్రీలచేతా; తత్+తపస్+విఘ్న, విధాన, నిరతులు+అయి= వారితపస్సుకు ఆటంకం కలిగించటంలో మిక్కుటమైన కోరికగలవాళ్ళయి; ప్రబోధింపంగన్= మేలుకొలుపటానికి; అలవి, కాకున్నన్= సాధ్యం కాకపోగా; తోయజ, గర్భు, పాలికిన్= బ్రహ్మదేవునిదగ్గరకు; అరిగి= వెళ్ళి; అసుర, వరుల, తపమున్= రాక్షసశ్రేష్ఠులైన ఆ సుందోపసుందులతపస్సును; చెఱుపవలయున్, నావుడున్= చెడగొట్టాలని అనగా; త్రిభువన+అర్చితుండు= ముల్లోకాలచే పూజింపబడినవాడు; కమల+ఆసనుండు= పద్మాన్ని పీఠంగా కల బ్రహ్మదేవుడు; సుర, హితంబు, పొంటెన్= దేవతలకు మేలు చేయటంకోసం; కరుణన్= దయతో; వరము= వరాన్ని; ఈఁగన్= ఇవ్వటానికి; సుంద+ఉపసుందుల, కడకున్; వచ్చెన్= సుందోపసుందుల దగ్గరకు వచ్చాడు.

**తాత్పర్యం:** వాళ్ళ భయంకరమైన తపస్సు అనే అగ్ని కాల్చటంచేత వింధ్యపర్వతగుహలలో పొగ పుట్టి, ఎంతో పైకెగసి, ఆకాశం అంతా కప్పగా, దేవతలు భయపడ్డారు. రత్నాలచేత, అందమైన స్త్రీలచేతా వాళ్ళతపస్సుకు విఘ్నం కలిగించా లని ప్రయత్నించారు. విఫలులయి బ్రహ్మదేవునిదగ్గరకు వెళ్ళి, ఆ రాక్షసులతపస్సు చెడగొట్టాలని అనగా - ముల్లోకాలచే పూజింపబడినవాడు, పద్మం పీఠంగా కలవాడు అయిన ఆ బ్రహ్మదేవుడు దేవతలకు మేలు చేయా లని, దయతో వరం ఇవ్వటానికి సుందోపసుందుల దగ్గరకు వచ్చాడు.

**వ.** **ఇట్లు పితామహుండు సుందోపసుందులతపంబునకు మెచ్చి సన్నిహితుం డయి 'మీ కిష్టం బైన వరం బిచ్చెద వేఁడుం' డనిన వారలు వారిజాసనునకు ముకుళితకరకమలు లయి 'దేవా! మాయిష్టంబు దయసేయ మీ కిష్టం బేని, మాకుఁ గామరూపత్వంబును గామగమనత్వంబును సకలమాయావిత్వంబును నన్యులచేత నవధ్యత్వంబును నమరత్వంబునుం బ్రసాదింపుం' డనిన.** **97**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; పితామహుండు= బ్రహ్మదేవుడు; సుంద+ఉపసుందుల= సుందుని, ఉపసుందుని; తపంబునకున్= తపస్సుకు; మెచ్చి= పొగడి; సన్నిహితుండు+అయి= ఎదుట నిలిచినవాడై; మీకున్+ఇష్టంబు+ఐన= మీకు ఇష్టమైన; వరంబు= వరాన్ని; ఇచ్చెదన్= ఇస్తాను; వేఁడుండు= వేడుకొనండి; అనినన్= అని అనగా; వారలు= వాళ్లు; వారిజ+ఆసనునకున్= నీటినుండి పుట్టినపద్మాన్ని పీఠంగా గల ఆ బ్రహ్మదేవునికి; ముకుళిత, కర, కమలులు+అయి= ముడిచిన కమలాలవంటిచేతులు కలవాళ్ళయి; దేవా!= ప్రభూ! మా; ఇష్టంబు= మాకోరిక; దయ, చేయన్= అనుగ్రహించటానికి; మీకు+ఇష్టంబు, ఏనిన్ = మీకు ఇష్టమైతే; మాకున్= మా ఇరువురికి; కామరూపత్వంబును= కోరినరూపాన్ని కలిగి ఉండటాన్ని; కామగమనత్వంబును= కోరిన విధంగా వెళ్ళగలగటాన్ని; సకల, మాయావిత్వంబును= అన్నిమాయలు కలిగిఉండటాన్ని; అన్యులచేతన్= ఇతరులచేత; అవధ్యత్వంబునున్= చంపబడకుండటాన్ని; అమరత్వంబునున్= చావులేకుండటాన్ని; ప్రసాదింపుండు= అనుగ్రహించండి; అనినన్= అని కోరగా.

**తాత్పర్యం:** ఈ విధంగా బ్రహ్మదేవుడు సుందోపసుందులతపస్సుకు మెచ్చి; వాళ్ళకు ప్రత్యక్షమై, 'మీకు ఇష్టమైన వరం ఇస్తాను. వేడండి' అనగా వాళ్ళు చేతులు జోడించి, 'మా కోర్కె తీర్చటానికి మీకు ఇష్టం ఉన్నట్లయితే, కోరినరూపం కలిగి ఉండటాన్ని, కోరిన విధంగా వెళ్ళగలగటాన్ని, అన్ని మాయలు కలిగి ఉండటాన్ని, ఇతరులచేత చావు లేకుండటాన్ని, అసలు చావే లేకుండటాన్ని అనుగ్రహించం' డని కోరారు.

**ఆ. కమలభవుఁడు వారి కమరత్వ మొక్కటి । దక్కఁ గోర్కులెల్ల నక్కజముగఁ**
**గరుణ నిచ్చె, నిట్లు సరసిజగర్భుచే । వరము వడసి యసురవరులు పెటిఁగి. 98**

**ప్రతిపదార్థం:** కమలభవుఁడు= పద్మంనుండి పుట్టినవాడు - బ్రహ్మ; వారికిన్= ఆ ఇద్దరికీ; అమరత్వము= చావులేకుండటం; ఒక్కటి, తక్కన్= ఒకటి తప్ప; కోర్కులు+ఎల్లన్= కోరికలు అన్నింటినీ; అక్కజముగన్= ఆశ్చర్యకరంగా; కరుణన్= దయతో; ఇచ్చెన్= ఇచ్చాడు; ఇట్లు=ఈ విధంగా; సరసిజ, గర్భుచేన్= సరస్సునుంచి పుట్టినపద్మం పుట్టుకస్థానంగా కలవాడైన బ్రహ్మదేవునిచే; వరము; పడసి= వరాన్ని పొంది; అసుర, వరులు= రాక్షసశ్రేష్ఠులైన సుందోపసుందులు; పెటిఁగి= విజృంభించి.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు వాళ్ళకు 'చావు లేకుండటం' అనే వరం ఒక్కటి తప్ప తక్కినవాటినన్నింటిని దయతో అనుగ్రహించాడు. ఈ విధంగా వాళ్ళు బ్రహ్మవలన వరాలు పొంది చెలరేగి.

**క. అనుపమరాజ్యవిభూతిం । దనరి జగద్విజయకాంక్ష దైత్యులకు ముదం**
**బొనరఁగ నకాలకౌముది । యను నుత్సవ మొప్పఁ జేసి రగణితబలు లై. 99**

**ప్రతిపదార్థం:** అనుపమ, రాజ్య విభూతిన్= సాటిలేని రాజ్యవైభవంతో; తనరి= ఒప్పి; జగత్+విజయకాంక్షన్= లోకాన్ని జయించాలనే కోరికచేత, దైత్యులకున్= రాక్షసులకు; ముదంబు= సంతోషం; ఒనరఁగన్= కలిగేటట్లు; అకాలకౌముది; అను ఉత్సవము; అగణిత, బలులు+ఐ= లెక్కలేనంతబలం కలవాళ్ళయి; ఒప్పన్; చేసిరి.

**తాత్పర్యం:** సాటిలేని రాజ్యవైభవంతో వెలిగి, లోకాన్ని జయించాలనే కోరికతో, రాక్షసులకు ఆనందం కలిగించేటట్లు అకాలకౌముది అనే ఉత్సవాన్ని, లెక్కింప సాధ్యం కానంత బలం కలవాళ్ళయి చేసిరు.

**విశేషం:** కౌముది అనే ఉత్సవాన్ని ఆశ్వయుజపౌర్ణమినాడు లేదా కార్తికపౌర్ణమినాడు జరుపుతారు. ప్రజలంతా ఈ ఉత్సవంతో సంతోషిస్తారు. సుందోపసుందులు దీనిని ఇతరకాలంలో చేయటంవలన ఇది 'అకాలకౌముదిఉత్సవం'.

**క. సురగరుడోరగకిన్నర । పురములు వడిఁ జూఱకొనుచు భూలోకమునం**
**బరఁగిన రాజర్షి మహీ । సురవరులకు బాధసేయుచును గర్వమునన్. 100**

**ప్రతిపదార్థం:** గర్వమునన్= గర్వంతో; సుర, గరుడ+ఉరగ, కిన్నర, పురములు= దేవతల, గరుడుల, ఉరగుల, కిన్నరుల నగరాలు; వడిన్= వేగమే; చూఱకొనుచున్= కొల్లగొట్టుతూ; భూలోకమునన్= భూలోకంలో; పరఁగిన= ఒప్పిన; రాజ+ఋషి, మహీసుర, వరులకున్= రాజులకు; ఋషులకు, బ్రాహ్మణశ్రేష్ఠులకు; బాధ, చేయుచును= బాధ కలిగిస్తూ;.

**తాత్పర్యం:** ఆ సుందోపసుందులు గర్వించి దేవతలయొక్క, గరుడులయొక్క, నాగులయొక్క, కిన్నరులయొక్క పురాలను వేగంగా కొల్లగొట్టుతూ; భూలోకంలోని రాజులను, ఋషులను, బ్రాహ్మణశ్రేష్ఠులను బాధిస్తూ.

**క. ద్విజవరవినిర్మితము లగు । యజనస్వాధ్యాయకవ్యహవ్యతపోదా**
**నజపంబులఁ బితృదేవత । లజస్రమును దృప్తు లగుదు రని కడునలుకన్. 101**

**ప్రతిపదార్థం:** ద్విజ, వర, వినిర్మితములు+అగు= బ్రాహ్మణశ్రేష్ఠులచే చేయబడిన వైన; యజన, స్వాధ్యాయ, కవ్య, హవ్య, తపస్; దాన, జపంబులన్= యజ్ఞాలచేతా, వేదాధ్యయనాలచేతా, శ్రాద్ధాలచేతా, హోమాలచేతా, తపస్సులచేతా, దానాలచేతా, జపాలచేతా; పితృదేవతలు; అజస్రమును= ఎల్లప్పుడూ; తృప్తులు+అగుదురు+అని= తృప్తిపొందినవాళ్ళవుతారని; కడున్= మిక్కిలి; అలుకన్= కోపంతో.

**తాత్పర్యం:** బ్రాహ్మణోత్తములు చేసిన యజ్ఞాలచేతా, వేదాధ్యయనాలచేతా, శ్రాద్ధాలచేతా, హోమాలచేతా, తపస్సులచేతా, దానాలచేతా, జపాలచేతా, పితృదేవతలు ఎల్లప్పుడూ తృప్తిపొందుతున్నారని కోపించి.

**వ. పుణ్యవంతుల నిత్యనైమిత్తికకర్మంబులకు విఘ్నంబులు సేయుచు, సింహవ్యాఘ్రగజరూపధరు లై వనంబులం దిరుగుచు, మునిపల్లియలు సొచ్చి మునులకుఁ బ్రాణభయంబు సేయుచున్న వారలక్రూరకర్మంబులకు వెఱచి వేల్పులును మునులును బురాణముని యైన బ్రహ్మపాలికిం జని కృతాంజలు లయి జగంబులకు సుందోపసుందులు సేయు నుపద్రవంబులు సెప్పిన విని విశ్వగురుండు విస్మితుం డయి వార లన్యులచేత వధ్యులు గారు గావున పరస్పర యుద్ధంబునఁ బంచత్వంబుఁ బొందవలయు నని విచారించి, విశ్వకర్మ రావించి 'రూపలావణ్యవతియైన యొక్క యువతి సృజియింపు' మని పంచినఁ బ్రసాదం బని మ్రొక్కి యప్పుడు. 102**

**ప్రతిపదార్థం:** పుణ్యవంతుల= పుణ్యాత్ముల; నిత్య, నైమిత్తిక, కర్మంబులకున్= ప్రతిరోజు చేసే బ్రహ్మయజ్ఞం మొదలైన కర్మలకు, కారణం ఏర్పడటంవలన గ్రహణంమొదలైన వాటిలో చేసే కర్మలకు; విఘ్నంబులు= ఆటంకాలు; చేయుచున్= కలిగిస్తూ; సింహ, వ్యాఘ్ర, గజ, రూప, ధరులు+ఐ= సింహం, పెద్దపులి, ఏనుగు రూపాలను ధరించినవాళ్ళయి; వనంబులన్= అడవులలో; తిరుగుచున్; ముని, పల్లియలు= మునుల పల్లెల్ని; చొచ్చి= ప్రవేశించి; మునులకున్= మునులకు; ప్రాణభయంబు= ప్రాణభీతి; చేయుచున్+ఉన్నన్= కలిగిస్తూ ఉండగా; వారల, క్రూర, కర్మంబులకున్= వాళ్ల భయంకరమైన పనులకు; వెఱచి= భయపడి; వేల్పులును= దేవతలూ; మునులును= ఋషులూ; పురాణ, ముని+ఐన= పురాతనముని అయిన; బ్రహ్మ, పాలికిన్= బ్రహ్మదగ్గరికి; చని= వెళ్ళి; కృత+అంజలులు+అయి= చేయబడిన కైమోడ్పుకలవాళ్ళయి - అంటే నమస్కరించి; జగంబులకున్= లోకాలకు; సుంద+ఉపసుందులు= సుందుడు, ఉపసుందుడు; చేయు ఉపద్రవంబులు= కలిగించే కష్టాలు; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; విశ్వ, గురుండు= విశ్వానికి పెద్ద అయిన బ్రహ్మదేవుడు; విస్మితుండు+అయి= ఆశ్చర్య

పడినవాడై; వారలు= వాళ్లు; అన్యులచేతన్= ఇతరులచేత; వధ్యులుకారు= చంపబడరు; కావున= కాబట్టి; పరస్పర, యుద్ధంబునన్= ఒకరితో ఒకరు చేసే యుద్ధంలో; పంచత్వంబున్= మృతిని; పొందవలయున్= పొందాలి; అని= అని; విచారించి= ఆలోచించి; విశ్వకర్మన్= విశ్వకర్మను; రావించి= రప్పించి; రూప, లావణ్యవతి+ఐన= అందమైన రూపం, కాంతికల; ఒక్క, యువతిన్= ఒక స్త్రీని; సృజియింపుము+అని= సృష్టించుము అని; పంచినన్= ఆజ్ఞాపించగా; ప్రసాదంబు+అని= మీరు దయతో అప్పగించినపని చేస్తానని; మ్రొక్కి= నమస్కరించి; అప్పుడు= ఆ సందర్భంలో.

**తాత్పర్యం:** పుణ్యవంతుల నిత్యనైమిత్తికకర్మలకు ఆటంకాలు కలిగిస్తూ, సింహం, పెద్దపులి, ఏనుగు రూపాలు ధరించి అడవులలో తిరుగుతూ, మునిపల్లెల్లో ప్రవేశించి మునులకు ప్రాణభయం కలిగిస్తూ ఉండగా, మునులంతా బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి, లోకాలకు సుందోపసుందులు కలిగించే ఉపద్రవాలనుగూర్చి చెప్పారు. బ్రహ్మ మునులు చెప్పింది విని, ఆశ్చర్యపడి, వాళ్ళు ఇతరులచేత చావరనీ, ఒకరితో మరొకరు యుద్ధం చేసి మాత్రమే మరణించాలనీ ఆలోచించి, విశ్వకర్మను పిలిపించి 'అందం, కాంతి గల ఒకస్త్రీని సృజింపు' మని ఆజ్ఞాపించాడు. అతడు మహాప్రసాదం అని బ్రహ్మకు మ్రొక్కి, అప్పుడు.

**పృథ్వి.**

> **తిలాణుమణికోటి సంఘటిత దివ్యదేహంబుతోఁ**
> **దిలోత్తమ యనంగ నొక్కయువతీలలామంబు ను**
> **త్పలాక్షి నొనరించె సర్వగుణభాసిరూపక్రియా**
> **కలావిదుఁడు విశ్వకర్మ తనకౌశలం బేర్పడన్.** **103**

**ప్రతిపదార్థం:** సర్వగుణ, భాసి, రూప, క్రియా, కలా, విదుఁడు= అన్నిగుణాలచే ప్రకాశించే రూపాన్ని చేసే కళను ఎరిగినవాడు; విశ్వకర్మ; తన, కౌశలంబు= తననేర్పు; ఏర్పడన్= తెలిసేటట్లు; తిల+అణు, మణి, కోటి, సంఘటిత, దివ్య, దేహంబుతోన్= నువ్వులవలె సూక్ష్మములైన మణుల సమూహంతో కూర్చబడిన ఉత్తమదేహంతో; తిలోత్తమ= తిలోత్తమ; అనంగన్= అనగా; ఒక్క= ఒక; యువతీ, లలామంబున్= ఉత్తమ స్త్రీని; ఉత్పల+అక్షిన్= నల్లకలువలవంటి కన్నులు కలదానిని; ఒనరించెన్= సృజించాడు.

**తాత్పర్యం:** సర్వగుణాలతో ప్రకాశించే రూపాన్ని చేసే కళను ఎరిగిన విశ్వకర్మ, తన నేర్పు ప్రకాశించగా, నువ్వులవలె సూక్ష్మాలైన రత్నాలుకూర్చి చక్కటిదేహం గల తిలోత్తమ అనే ఉత్తమస్త్రీని, నల్లకలువలవంటి కన్నులు గలదానిని సృజించాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు; ఆది. 2.165 విశేషం.

**వ. అదియును సురేంద్రప్రముఖ బృందారక మునిబృంద పరివృతుండై యున్న పరమేష్ఠికిం బరమభక్తిం బ్రణమిల్లి పనియేమి యని ముందట నిలిచిన, నరవిందసంభవుం డాసుందరిం జూచి 'సుందోపసుందు లను దైత్యులు దర్పితు లయి జగంబుల కహితంబులు సేయుచు వింధ్యాచలకందరంబున నున్నవారు; వార లిద్దరు నీకారణంబునం దమలో నొండొరులతోఁ బొడిచి దండధరుపురంబున కరుగునట్లుగాఁ జేయు' మని పంచిన వల్లె యని.** **104**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ తిలోత్తమ; సుర+ఇంద్ర, ప్రముఖ, బృందారక, ముని, బృంద, పరివృతుండు+ఐ= దేవేంద్రుడు మొదలుగా గల దేవతలయొక్క, మునులయొక్క సమూహంచే చుట్టబడినవాడై; ఉన్న= ఉండు; పరమేష్ఠికిన్= బ్రహ్మదేవునికి; పరమ, భక్తిన్= మిక్కిలి భక్తితో; ప్రణమిల్లి= నమస్కరించి; పని; ఏమి; అని= అని పలికి; ముందటన్= సమక్షంలో; నిలిచినన్= నిలువగా; అరవింద, సంభవుండు= పద్మంనుండి పుట్టినవాడైన బ్రహ్మ; ఆ, సుందరిన్= ఆ అందగత్తెను; చూచి; సుంద+ఉపసుందులు= సుందుడు, ఉపసుందుడు; అను= అనే; దైత్యులు= రాక్షసులు; దర్పితులు+అయి= గర్వించినవాళ్ళయి; జగంబులకున్= లోకాలకు; అహితంబు= కీడు; చేయుచున్= చేస్తూ; వింధ్య+అచల, కందరంబునన్= వింధ్యపర్వతగుహాలో; ఉన్నవారు= ఉన్నారు; వారలు+ఇద్దఱు= వాళ్లిరువురు; నీ, కారణంబునన్= నీ కారణంచేత; తమలోన్= తమలో; ఒండు+ఒరులతో= ఒకరితో ఒకరు; పొడిచి= కొట్లాడుకొని; దండధరు, పురంబునకున్= యమలోకానికి; అరుగునట్లుగా= వెళ్ళునట్లుగా; చేయుము+అని= చేయవలసింది అని; పంచినన్= ఆజ్ఞాపించగా; వల్లె, అని= సరే అని.

**తాత్పర్యం:** దేవేంద్రుడు మొదలైన దేవతల సమూహాలూ, మునుల సమూహాలూ కొలుస్తూఉన్న బ్రహ్మదేవునికి ఆ తిలోత్తమ మహాభక్తితో నమస్కరించి 'పని ఏమి?' అని ఎదుట నిలిచింది. బ్రహ్మదేవుడు ఆ అందగత్తెను చూచి, 'సుందుడు, ఉపసుందుడు అనే రాక్షసులిద్దరూ పొగరెక్కి లోకాలకు కీడుచేస్తూ వింధ్యపర్వతగుహాలో ఉన్నారు. వాళ్ళిద్దరు నీ కారణంగా తమలో తాము పోరాడుకొని మరణించేటట్లుగా చేయు' మని ఆజ్ఞాపించాడు. తిలోత్తమ 'అట్లాగే' అని.

**సీ.** **అబ్జజు వీడ్కొని యది దేవసభకుఁ బ్ర । దక్షిణం బొనరించెఁ; దత్క్షణంబ**
**తద్రూపసౌందర్యదర్శనలోలుఁ డై । యజుఁడు నాలుగుదిక్కులందుఁ దనకు**
**గావించుకొనియె ముఖంబులు; మఱిరెండు । కన్నులఁ జూచినం గాదు తృప్తి**
**యని సురేంద్రుండు సహస్రాక్షుఁ డయ్యె; న । య్యమరులు కామమోహాంధు లైరి;**

**ఆ.** **ముదిత యిట్లు సర్వమోహిని యై మర్త్య । భువనమునకు మెఱుఁగుఁ బోలె నొప్పి**
**యరుగుదెంచె సుందరాంగి వింధ్యాచల । విపినదేశ మెల్ల వెలుఁగుచుండ.** **105**

**ప్రతిపదార్థం:** అది= ఆ తిలోత్తమ; అబ్జజు= పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవుడిని; వీడ్కొని= పోయివస్తానని చెప్పి వదలి; దేవసభకున్= దేవసభకు; ప్రదక్షిణంబు= ప్రదక్షిణం; ఒనరించెన్= చేసింది; తత్+క్షణంబు+అ= ఆ క్షణమే; తత్+రూప, సౌందర్య, దర్శన, లోలుఁడు+ఐ= దానిరూపంయొక్క చక్కదనాన్ని చూడటంలో ఆసక్తుడై; అజుఁడు= బ్రహ్మదేవుడు; తనకున్= తనకు; నాలుగు, దిక్కుల+అందున్= నాలుగు దిక్కులలో; ముఖములు= ముఖాలు; కావించుకొనియెన్= చేసికొన్నాడు; మఱి= ఇక; రెండు; కన్నులన్= రెండుకళ్ళతో; చూచినన్= చూస్తే; తృప్తి, కాదు అని= సంతృప్తి కలగదని; సుర+ఇంద్రుండు= దేవేంద్రుడు; సహస్ర+అక్షుడు+అయ్యెన్= వేయికన్నులు కలవాడు అయ్యాడు; ఆ+అమరులు= ఆ దేవతలు; కామ, మోహ+అంధులు+ఐరి= మన్మథమోహంచేత గ్రుడ్డివాళ్ళు అయ్యారు; ముదిత= ఆ స్త్రీ; ఇట్లు= ఈ విధంగా; సర్వ, మోహిని+ఐ= అందరినీ మోహింపచేసేదై; మర్త్య, భువనమునకున్= మనుష్యలోకానికి; మెఱుఁగున్+పోలెన్= మెరుపుతీగవలె; ఒప్పి= ప్రకాశించి; సుందర+అంగి= అందమైన శరీరం గల ఆ తిలోత్తమ; వింధ్య+అచల,విపిన, దేశము+ఎల్లన్= వింధ్యపర్వతంయొక్క అరణ్యప్రాంతమంతా; వెలుగుచుండన్= వెలుగుకలుగుతున్నట్లు; అరుగుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** తిలోత్తమ బ్రహ్మదగ్గర సెలవు తీసికొని, దేవసభకు ప్రదక్షిణం చేసింది. అప్పుడు బ్రహ్మ దాని సౌందర్యాన్ని చూడటానికి తనకు నాలుగుదిక్కులలో ముఖాలు కల్పించుకొని చతుర్ముఖుడు అయ్యాడు. దేవేంద్రుడు తన రెండుకళ్ళతో చూస్తే తృప్తి కలగదని వేయికళ్ళవాడయ్యాడు. దేవతలు కామమోహితులయ్యారు. ఈ విధంగా తిలోత్తమ అందరినీ మోహింపజేసి, మానవలోకానికి మెరుపుతీగవలె ప్రకాశిస్తూ, వింధ్యపర్వత అరణ్యప్రాంతం అంతా వెలుగుతుండగా వచ్చింది.

**విశేషం:** అలం: కావ్యలింగం, ఉపమ.

**క.** **అమ్ముదితఁ జూచి యన్నయుఁ దమ్ముఁడు నొక్కట మనోజతాడితు లై రా**
**గమ్మున నన్యోన్యస్నే । హమ్ములు చెడి దృష్టు నిలిపి రయ్యువతిపయిన్.** **106**

**ప్రతిపదార్థం:** ఆ+ముదితన్= ఆ కాంతను; చూచి; అన్నయున్, తమ్ముఁడున్= అన్నా తమ్ముడూ; ఒక్కటన్= ఒకే సమయంలో; మనోజ, తాడితులు+ఐ= మన్మథునిచే కొట్టబడినవాళ్ళయి; రాగమ్మునన్= అనురాగంతో; అన్యోన్య, స్నేహమ్ములు= ఒకరిమీద మరొకరికి గల స్నేహాలు; చెడి= నశించి; ఆ+అతివ= ఆ స్త్రీమీద; దృష్టు= చూపులు; నిలిపిరి= నిలిపారు.

**తాత్పర్యం:** సుందోపసుందులు ఆ తిలోత్తమను చూచి, ఒక్కసారిగా మన్మథపీడితులై, పరస్పరస్నేహాన్ని వదలి, అనురాగంతో ఆమెమీద చూపులు నిలిపారు.

**క.** **ఘను లయ్యిరువురు నేకా । సనభోజనయాననిలయశయనక్రియలం**
**దనరెడువా రేకస్త్రీ । వినిహితకాము లయి రపుడు విధినియమమునన్.** **107**

**ప్రతిపదార్థం:** ఘనులు= బలవంతులైన; ఆ+ఇరువురున్= ఆ సుందోపసుందులిద్దరూ; ఏక+ఆసన, భోజన, యాన, నిలయ, శయన, క్రియలన్= ఒకే ఆసనంచేత, భోజనంచేత, వాహనంచేత, గృహంచేత, పడకచేత, పనిచేత; తనరెడు, వారు= ఒప్పేవాళ్ళు; అపుడు= ఆ సమయంలో; విధి, నియమమునన్= దైవనిర్ణయంచేత; ఏకస్త్రీ, వినిహిత, కాములు+అయిరి= ఒకే స్త్రీమీద (ఉంచబడిన) కామం కలవాళ్ళు అయ్యారు.

**తాత్పర్యం:** ఒకే ఆసనంమీద కూర్చొంటూ, ఒకే ఆహారం భుజిస్తూ, ఒకే వాహనం ఎక్కుతూ, ఒకే ఇంట్లో ఉంటూ, ఒకే పడకమీద పడుకొంటూ, ఒకే పనిచేస్తూ, ఒకటిగా ఉన్న బలవంతులు ఆ సుందోపసుందులిద్దరూ దైవనిర్ణయంవలన ఒకే స్త్రీని కామించారు.

**క.** **ఇది నావల్లభ యిది నా । హృదయేశ్వరి యనుచుఁ గోరి యిరువురు మదనో**
**న్మదు లయి పరిగ్రహించిరి । తదీయ కమనీయ సవ్యదక్షిణకరముల్.** **108**

**ప్రతిపదార్థం:** ఇది; నా, వల్లభ= ఇది నా భార్య; ఇది; నా, హృదయ+ఈశ్వరి= ఇది నా హృదయానికి రాణి - నా భార్య; అనుచున్= అంటూ; కోరి= ఇష్టపడి; ఇరువురు= ఇద్దరూ; మదన+ఉన్మదులు+అయి= మన్మథునిచేత మిక్కిలిమదించినవాళ్ళయి; తదీయ, కమనీయ, సవ్య, దక్షిణ, కరముల్= ఆమెయొక్క చక్కని యెడమ కుడి చేతులు; పరిగ్రహించిరి=పట్టుకొన్నారు.

**తాత్పర్యం:** వాళ్ళిద్దరు మన్మథునివలన మిక్కిలి మదించినవాళ్ళయి 'ఇది నా భార్య', ఇది నా భార్య' అని ఆమె ఎడమకుడిచేతులను పట్టుకొన్నారు.

**విశేషం:** 'సవ్య' శబ్దానికి ఎడమ, కుడి - అని రెండర్థాలూ ఉన్నాయి. పద్యంలో 'సవ్య దక్షిణ', శబ్దాలు ఉన్నందున- 'సవ్య=ఎడమ. దక్షిణ= కుడి-' అని గ్రహించాలి. 'దక్షిణ'మంటే 'కుడి' అనియే అర్థం.

**వ. ఇట్లు పట్టుకొని** **109**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పట్టుకొని= బిగియపట్టి, గట్టిగా బంధించి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆమె రెండుచేతులు పట్టుకొని.

**క. 'సుందరి । మాయిద్దఱలో । నిం దెవ్వరి వలతు చెప్పు మీ' వనవుడుఁ బూ**
**ర్ణేందుముఖి వారి కను 'మీ । యం దెవ్వఁడు పొడిచి యొడుచు నతనిన వలతున్'.** **110**

**ప్రతిపదార్థం:** సుందరి! = ఓ సుందరీ!; మా, ఇద్దఱలోన్= మా ఇరువురిలో; ఇందున్= ఇచ్చట; ఎవ్వరిన్, వలతు(వు)= ఎవరిని కోరుతావో; ఈవు= నీవు; చెప్పుము; అనవుడున్= అని, సుందోపసుందు లడుగగా; పూర్ణ+ఇందు, ముఖి= పూర్ణచంద్రునివంటి ముఖం కలది; వారికిన్= వాళ్లతో; అనున్= అనింది; మీ, అందున్= మీలో; ఎవ్వఁడు= ఎవ్వడు; పొడిచి= పోరాడి; ఒడుచున్= గెలుస్తాడో; అతనిన్+అ= అతనినే; వలతున్= కోరుతాను.

**తాత్పర్యం:** 'సుందరీ! మా ఇద్దరిలో నీవు ఎవ్వరిని కోరుతావో చెప్పు' మని సుందోపసుందులడుగగా 'మీలో మీరు యుద్ధం చేసి, ఎవడు గెలుస్తాడో అతడినే కోరుతాను' అని తిలోత్తమ చెప్పింది.

**విశేషం:** కొన్నిప్రతుల్లో ఈ పద్యం లేదు. దీని స్థానంలో ఈక్రింది వచనం ఉన్నది 'నీ వెవ్వరివల' తనిన అది రూప సౌందర్యంబుల మీ రొక్కరూప, కావున మి మ్మొకళ్ళ గోరనేర, మీలో పొడిచినవాని వలతు' ననిన. (శ్రీమదాంధ్ర మహాభారతసంశోధితప్రతి, పు.500)

## సుందోపసుందు లొండొరులతోఁ బోరి చచ్చుట

**క. అనవుడు నిద్దఱుఁ దమలోఁ । బొనుపడ కొండొరులతోడ భుజబలు లలుకన్**
**ఘనవజ్రతనులు దాఁకిరి । తనరఁగ నటఁ గొండ గొండఁ దాఁకినభంగిన్.** **111**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని తిలోత్తమ చెప్పగా; ఇద్దఱున్= ఇరువురున్నూ; పొనుపడక= ఉడుగక; తమలోన్= తమలో; ఒండొరులతోడన్= ఒకరితో ఒకరు; అలుకన్= కోపంతో; భుజ, బలులు= భుజబలం కలవాళ్ళు; ఘన, వజ్ర, తనులు= గొప్ప వజ్రంవంటి (అంటే వజ్రంవలె కఠినమైన) శరీరం కలవాళ్ళు; తనరఁగన్= విజృంభించి; అటన్= అక్కడ; కొండ= పర్వతం; కొండన్= పర్వతాన్ని; తాఁకిన, భంగిన్= ఎదుర్కొన్న విధంగా; తాకిరి= (ఒకరిని ఒకరు) ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** అని తిలోత్తమ చెప్పగా ఇద్దరూ తగ్గక భుజబలం కలవారు, వజ్రంవంటి శరీరం కలవాళ్ళు అయిన సుందోపసుందులు తమలో తాము విజృంభించి, కొండను కొండ ఎదుర్కొన్నట్లుగా ఒకరినొకరు ఎదుర్కొన్నారు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. విపరీతమతిని సుందుఁడు । నుపసుందుఁడుఁ దాఁకి పొడిచి రొండొరుతోడం**
**గుపితాత్ము లయి తిలోత్తమ । నెపమున దృఢముష్టిఘాతనిర్ఘాతములన్. 112**

**ప్రతిపదార్థం:** విపరీత, మతిని= విరుద్ధమైన బుద్ధిచేత; సుందుఁడున్= సుందుడూ; ఉపసుందుఁడున్=ఉపసుందుడూ; తిలోత్తమ, నెపమునన్= తిలోత్తమ కారణంగా; కుపిత+ఆత్ములు+అయి= కోపంతో కూడిన మనస్సు కలవాళ్ళయి; దృఢ, ముష్టి, ఘాత, నిర్ఘాతములన్= పిడుగులవంటి గట్టి పిడికిటి పోట్లచేత; ఒండు+ఒరుతోడన్= ఒకరిని ఒకరు; తాఁకి= ఎదుర్కొని; పొడిచిరి= పోరాడినారు.

**తాత్పర్యం:** తిలోత్తమ కారణంగా సుందోపసుందులు వ్యతిరేకబుద్ధితో కోపాత్ములై పిడుగులవంటి గట్టి పిడికిలి పోట్లతో ఒకరినొకరు పోరాడినారు.

**క. అన్యోన్యప్రియభాషణు । లన్యోన్యహితైషు లసుర లన్యులపోలెన్**
**మన్యుపరిప్రేరితు లై । యన్యోన్యాభిహతిఁ జనిరి యమపురమునకున్. 113**

**ప్రతిపదార్థం:** అన్యోన్య, ప్రియ, భాషణులు= పరస్పరం సంతోషకరాలైన మాటలు కలవాళ్ళు; అన్యోన్య, హితైషులు= పరస్పరం మేలుకోరేవాళ్ళు; అసురులు= రాక్షసులు; అన్యుల, పోలెన్= పరాయివాళ్ళవలె; మన్యు, పరిప్రేరితులు+ఐ= కోపంచేత మిక్కిలి ప్రేరేపింపబడినవాళ్ళయి; అన్యోన్య+అభిహతిన్= ఒకరిని ఒకరు కొట్టుకొనటంచేత; యమ, పురమునకున్= యమ నగరానికి; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ఒకరితో ఒకరు సంతోషకరంగా మాట్లాడేవాళ్ళు, ఒకరి మేలు ఒకరు కోరేవాళ్ళు అయిన ఆ రాక్షసులు పరాయివాళ్ళవలె కోపంతో రెచ్చిపోయి, ఒకరినొకరు కొట్టుకొని చనిపోయారు.

**విశేషం:** పద్యంలోని అన్యోన్య శబ్ద పునరావృత్తి, నకార, యకార సంయోగం సుందోపసుందుల అన్యోన్యత ఎంతటిదో తెలియజేసేదిగా ఉన్నది. అభిహతిలో కూడా - అంటే కొట్టుకోవటంలో కూడా కనిపించే అన్యోన్యత చాలా చమత్కారమైనది.

**క. ఇంతుల నిమిత్తమున ధృతి । మంతులుఁ బొందుదురు భేదమతి గావున మీ**
**రింతయు నెఱింగి యొండులు । చింతింపక సమయ మిందు సేయుఁడు బుద్ధిన్. 114**

**ప్రతిపదార్థం:** ఇంతుల, నిమిత్తమునన్= స్త్రీల కారణంగా; ధృతి, మంతులున్= ధైర్యంకలవాళ్ళుకూడా; భేద, మతిన్= విరోధబుద్ధిని; పొందుదురు= పొందుతారు; కావునన్= కాబట్టి; మీరు, ఇంతయున్= ఇది అంతా; ఎఱింగి= తెలిసి; ఒండులు= ఇతరములు; చింతింపక= ఆలోచించక; సమయము= ఏర్పాటు; బుద్ధిన్= మనఃపూర్వకంగా; ఇందున్, చేయుఁడు= ఇచ్చట చేయండి.

**తాత్పర్యం:** ధైర్యవంతులు కూడా స్త్రీల కారణంగా విరోధం పొందుతారు. కాబట్టి దీనిని అంతా తెలిసి, ఇతర ఆలోచనలు చేయకుండా బుద్ధిపూర్వకంగా ఒక ఏర్పాటు చేసికొనండి.

### నారదప్రేరితులయి పాండవులు సమయము సేయుట (సం.1-204-27)

**సీ. అనిన నారదమహామునిపల్కు చేకొని । దమలో నొడంబడి విమలబుద్ధి**
**నేవురయందును ద్రోవది ప్రీతితో । నొక్కొక్కయింట దా నొక్కయేఁడు**

**క్రమమున నుండను; గమలాక్షి యెవ్వరి । యింటఁ దా నుండె నయ్యింటివలనఁ**

**బెఱవారు చనకుండ; నెఱుఁగక చనిరేని । వెలయఁగఁ బండ్రెండునెలలు తీర్థ**

**ఆ. సేవ సేయుచును విశేషవ్రతంబులు । ధీరవృత్తిఁ జలుపువారుగాను**

**సన్మునీంద్రునొద్ద సమయంబు సేసిరి । రాజనుతులు పాండురాజసుతులు. 115**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన; నారదమహాముని; పల్కు= మాట; చేకొని= గ్రహించి - అనగా అంగీకరించి; రాజ, నుతులు= రాజులచే కొనియాడబడేవాళ్ళు; పాండురాజసుతులు= పాండురాజుయొక్క కుమారులు - పాండవులు; విమల, బుద్ధిన్= నిర్మలమైన మనస్సుతో; ఒడంబడి= ఒప్పుకొని; ఏవుర, అందును= పాండవులు అయిదుగురిపట్ల; ద్రోవది= ద్రౌపది; ప్రీతితోన్= ప్రేమతో; తాన్= తాను; ఒక్కొక్క, ఇంటన్= ఒక్కొక్క ఇంటిలో; ఒక్క, ఏఁడు= ఒక సంవత్సరం; క్రమమునన్= వరుసగా; ఉండన్= ఉండటానికి; కమల+అక్షి= పద్మాలవంటి కన్నులు కలది - ద్రౌపది; ఎవ్వరి, ఇంటన్= ఎవ్వరి ఇంటిలో; తాన్= తాను; ఉండెన్= ఉంటుందో; ఆ+ఇంటివలనన్= ఆ ఇంటివైపు; పెఱవారు= ఇతరులు; చనకుండన్= వెళ్ళకుండా; ఎఱుఁగక= తెలియక; చనిరి+ఏని= వెళ్ళినట్లయితే; వెలయఁగన్= ఒప్పుగా; పంద్రెండు నెలలు= ఒక సంవత్సరం అంటే పన్నెండు మాసాలు; తీర్థసేవ; చేయుచును= చేస్తూ; విశేష, వ్రతంబులు= విశేషాలైన వ్రతాలు; ధీర, వృత్తిన్= ధైర్యంతో; చలుపువారుగాను= చేసేవాళ్ళుగా; సత్+ముని+ఇంద్రు, ఒద్దన్= నారదమహామునిఎదుట; సమయంబు= ప్రతిజ్ఞ; చేసిరి= చేశారు.

**తాత్పర్యం:** రాజులందరి ప్రశంసలందుకొనే పాండవులు నారదమహాముని చెప్పిన మాటను గ్రహించి, అరమరికలు లేని మనస్సుతో ఒప్పుకొనినారు. పాండవులైదుగురిపట్ల ద్రౌపది ప్రేమతో ఒక్కొక్కరి ఇంట ఒక్కొక్క సంవత్సరం క్రమంగా ఉండటానికీ, ద్రౌపది ఉన్న ఇంటివైపు ఇతరులు వెళ్ళకుండా ఉండటానికీ, ఒకవేళ ఎవరైనా తెలియక వెళ్ళితే, అతడు పన్నెండునెలలు తీర్థయాత్రలు, విశేషవ్రతాలు చేయటానికీ అంగీకరించారు. ఆ మేరకు ఆ మహర్షి ఎదుట ప్రతిజ్ఞ చేశారు.

**విశేషం:** కలసిఉన్నవారి నడుమ కలహాలు కల్పించటం కలహభోజనుడైన నారదుని స్వభావం. కాని ఇక్కడ పాండవుల మధ్య ద్రౌపది కారణంగా ఎప్పుడూ కలహాలు ఏర్పడకుండ నారదమహర్షి ప్రయత్నించటం ఒక పెద్ద ప్రత్యేకత. నారదమహర్షి ప్రయత్నం పాండవుల దైవానుగ్రహానికి పరోక్షచిహ్నం.

**వ. ఇట్లు హితోపదేశంబు సేసి నారదుం డరిగినం బాండవులు దమచేసినసమయస్థితిం దప్పక సలుపుచు సుఖంబుండఁ; గొండొకకాలంబున కొక్కనాఁ డొక్కబ్రాహ్మణుండు ముచ్చులచేతఁ దనహోమధేనువు గోల్పడి వచ్చి యాక్రోశించిన, నశ్రుతపూర్వం బయిన యయ్యాక్రోశంబు విని విస్మితుం డయి విజయుండు విప్రులకయిన బాధ దీర్పక యుపేక్షించుట పాతకం బని యప్పడ యవ్విప్రు రావించి 'యిది యేమి కారణం?' బని యడిగిన నర్జునునకు విప్రుం డి ట్లనియె. 116**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; హిత+ఉపదేశంబు, చేసి= మేలు కలిగించే మాటలు చెప్పి; నారదుండు; అరిగినన్= వెళ్ళగా; పాండవులు, తమ, చేసిన; సమయ, స్థితిన్= తాము కావించిన ప్రతిజ్ఞావిధాన్ని; తప్పక= విడువక; సలుపుచున్= శ్రద్ధతో పాటిస్తూ; సుఖంబు+ఉండన్= సుఖంగా ఉండగా; కొండు+ఒక, కాలంబునకున్= కొంత కాలానికి; ఒక్కనాఁడు; ఒక్క,

బ్రాహ్మణుండు; ముచ్చులచేతన్= దొంగలచేత; తన= తన; హోమధేనువు= యాగసంబంధమైన ఆవును; కోలు+పడి= పోగొట్టుకొని; వచ్చి, ఆక్రోశించినన్= ఏడ్వగా; అశ్రుతపూర్వంబు+అయిన= ఇదివరకు వినబడనిదైన; ఆ+ఆక్రోశంబు= ఆ ఏడుపు; విని, విజయుండు= అర్జునుడు; విస్మితుండు+అయి= ఆశ్చర్యపడినవాడై; విప్రులకున్+అయిన= బ్రాహ్మణులకు కలిగిన; బాధ; తీర్పక; ఉపేక్షించుట= ఊరకుండుట; పాతకంబు= పాపము అని; అప్పుడు+అ= అప్పటికప్పుడే; ఆ+విప్రున్= ఆ బ్రాహ్మణుని; రావించి= రప్పించి; ఇది, ఏమి, కారణంబు అని = ఈ దుఃఖం ఏ కారణంగా అని; అడిగినన్= అడుగగా; అర్జునునకున్= అర్జునునికి; విప్రుండు= బ్రాహ్మణుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా హితోపదేశం చేసి నారదుడు వెళ్ళగా, పాండవులు తమప్రతిజ్ఞను తప్పక పాలిస్తూ సుఖంగా ఉన్నారు. కొంతకాలంతర్వాత ఒకనాడు ఒక బ్రాహ్మణుడు తన హోమధేనువును దొంగలచే పోగొట్టుకొని వచ్చి ఏడ్వగా, అర్జునుడు పూర్వం ఎప్పుడూ వినని ఆ ఏడ్పు విని, బ్రాహ్మణులకు ఏర్పడిన బాధ తీర్చకపోతే పాపం వస్తుం దని ఆ బ్రాహ్మణుని దుఃఖకారణాన్ని అడుగగా, అతడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** అశ్రుతపూర్వంబయిన అనే దానికి కొన్ని ప్రతులలో 'శ్రుత పూర్వం బయిన' అనే పాఠాంతరంకూడా ఉన్నది. అపుడు 'ముందు విన్నట్టిదైన' అని అర్థం.

**క. యమతనయు ధర్మరాజ్యము । తమరాజ్యమ యని మహాముదంబున విప్రో**
**త్తము లున్నచోటనే బ । న్నమువడి కోల్పడితి గోధనము ముచ్చులచేన్. 117**

**ప్రతిపదార్థం:** యమతనయు= ధర్మరాజుయొక్క; ధర్మరాజ్యము= ధర్మసామ్రాజ్యం; తమ, రాజ్యము= తమ రాజ్యమే అని; మహా, ముదంబునన్= మిక్కిలి సంతోషంతో; విప్ర+ఉత్తములు= బ్రాహ్మణశ్రేష్ఠులు; ఉన్నచోటనే; బన్నము+పడి= ఆపదపొంది; ముచ్చులచేన్= దొంగలచేత; గోధనము; కోల్పడితిన్= కోల్పోయాను.

**తాత్పర్యం:** ధర్మజుని ధర్మసామ్రాజ్యం తమరాజ్యమే అని బ్రాహ్మణోత్తములు మహానందంతో ఉన్నచోటనే ఆపదనొంది, దొంగలచేత గోధనాన్ని నేను కోల్పోయాను.

**విశేషం:** పూర్వం ధనమంటే గోధనమే. గోవులు ఎక్కువగా ఉండటం ఆనాటి గృహస్థులకు ఉత్తమధనం.

**సీ. 'వదలక ముచ్చుల వధియించి నాహోమ । ధేనువుఁ గ్రమ్మఱఁ దెచ్చియిమ్ము**
**జననుత! దానివత్సంబు నిన్నటఁగోలె । నుడుగక యఱచుచునున్నయదియ;**
**పలుకుల కెడ లేదు; బాణాసనము గొని । చనుదెమ్ము నాతోడఁ జట్ట' ననిన**
**ద్రౌపదీసహితుఁ డై ధర్మరాజాయుధా । గారంబునం దున్న గార్ముకంబుఁ**

**ఆ. బుచ్చికొనఁగఁ దనకుఁబోలమి యెఱిఁగియు । విప్రునార్తరవము వినఁగ నోప**
**కర్జునుండు నిజశరాసనగ్రహణార్థ । మాయుధాలయమున కరిగె నపుడు. 118**

**ప్రతిపదార్థం:** జననుత!= ప్రజలచే కీర్తింపబడేవాడా! ఓ అర్జునా!; వదలక= విడిచిపెట్టక; ముచ్చులన్= దొంగలను; వధియించి= చంపి; నా, హోమధేనువున్= నా హోమధేనువును; క్రమ్మఱన్= మరల; తెచ్చిఇమ్ము; దాని, వత్సంబు= దానిదూడ;

నిన్నటన్+కోలెన్= నిన్నటినుండి; ఉడుగక= ఆపక; అఱచుచున్+ఉన్న, అది+అ= అరుస్తూనే ఉన్నది; పలుకులకున్= మాటలకు; ఎడలేదు= అవకాశం లేదు; చట్టన్= శీఘ్రమే; బాణ+ఆసనము= ధనుస్సు; కొని= తీసికొని; నాతోడన్= నాతోకూడ; చను దెమ్ము= రమ్ము; అనినన్= అని చెప్పగా; ధర్మరాజు, ద్రౌపదీసహితుఁడు+ఐ= ద్రౌపదీదేవితో కూడినవాడై; ఆయుధ+ అగారము+ అందున్= ఆయుధాలున్న ఇంటిలో; ఉన్నన్= ఉండగా; కార్ముకంబు= ధనుస్సు; పుచ్చుకొనఁగన్= తీసికొనటం; తనకున్= తనకు; పోలమి= సరికాకుండటం; ఎఱిఁగియు= తెలిసికూడా; అర్జునుండు= అర్జునుడు; విప్రు+ఆర్తరవము= బ్రాహ్మణుడియొక్క ఏడ్పు; వినఁగన్+ఓపక= వినలేక; నిజ= తనయొక్క; శర+ఆసన, గ్రహణ+అర్థము= ధనుస్సు తీసికొనటంకొరకు; ఆయుధ+ఆలయమునకున్= ఆయుధాలున్న ఇంటికి; అపుడు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'జనులచే కీర్తింపబడే ఓ అర్జునా! దొంగలను వదలక బంధించి, నా హోమధేనువును మళ్ళీ తెచ్చి నాకు ఇమ్ము. దానిదూడ నిన్నటినుండి అట్లాగే అరుస్తూ ఉన్నది. మాటలకు వ్యవధి లేదు. వెంటనే ధనుస్సు తీసికొని నావెంట రమ్ము' అని ఆ బ్రాహ్మణుడు అనగా ధర్మరాజు ద్రౌపదితో కూడి ఆయుధాల ఇంట్లో ఉన్నాడనీ, అక్కడికి వెళ్ళి ధనుస్సు తీసికొనటం తప్పనీ తెలిసికూడా, అర్జునుడు విప్రునిఏడ్పు వినలేక తనధనుస్సు తీసికొనటానికి ఆయుధాలున్న ఆ ఇంటికి అప్పుడు వెళ్ళాడు.

**క. 'ధరణీసురవరులకుఁ గడు సెరగై నెడ నెఱిఁగి యెడయుఁ జేయుదురె మహా**
**పురుషు' లని నరుఁడు విలుగొని । యరిగెను మ్రుచ్చులపిఱుంద నవ్విప్రుపనిన్. 119**

**ప్రతిపదార్థం:** మహాపురుషులు= దైవాంశగల గొప్పవాళ్లు; ధరణీ, సుర, వరులకున్= బ్రాహ్మణోత్తములకు; కడున్= మిక్కిలి; సెరగు+ఐన= ఆపద కలిగిన; ఎడన్= చోటును; సమయాన్ని; ఎఱిఁగి= తెలిసి; ఎడయున్+చేయుదురె= తొలగుతారా - అంటే ముఖం తప్పించి వెళ్తారా; అని; నరుఁడు= అర్జునుడు; విలు= విల్లు; కొని= తీసికొని; ఆ+విప్రు, పనిన్= ఆ బ్రాహ్మణునియొక్క పనిమీద; మ్రుచ్చుల; పిఱుందన్= దొంగలవెంబడించి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణోత్తములకు ఆపద ఏర్పడిన సంగతి తెలిసి మహాపురుషులు మొహం తప్పించి వెళ్తారా? అని అర్జునుడు ధనుస్సు తీసికొని, ఆ విప్రునిపనిమీద దొంగలవెంట పడ్డాడు.

**విశేషం:** ఉత్తమక్షత్రియులకు తమకు సంబంధించిన ధర్మంకంటె సంఘానికి సంబంధించిన ధర్మం అవశ్య కర్తవ్యం. ఒక్కొకసారి వ్యక్తి (స్వీయ) ధర్మానికి ఆపదవాటిల్లినా సామాజికధర్మాన్ని మాత్రం తప్పకుండ నిర్వర్తించాలి. పాండవులు చేసికొన్న నియమాన్ని అనుసరించి ద్రౌపది ఎవరి ఇంటిలో ఉంటుందో ఆ యింటికి మిగిలినవాళ్ళు వెళ్ళకూడదు. ఇది జరిగినప్పుడు ద్రౌపది ధర్మరాజు వద్ద ఉన్నది. అతడు ఆమెతో కలిసి ఆయుధాగారంలో ఉన్నాడు. అది ధర్మజు ఇల్లు కాదు. ఆయుధాగారం పాండవులందరు ఉపయోగించతగినదే. అందువలన, అర్జునుడు ద్రౌపది ఉన్న ఆ చోటికి పోవటం అధర్మం అనటానికీ వీలు లేదు. కాని, ద్రౌపది ధర్మజునితో కలిసి ఉన్న ఏ ఇంటిలోనైనా ప్రవేశించకూడదనే నియమాన్ని వ్యాఖ్యానించుకొంటే అది తప్పు అవుతుంది. అయితే, ఈ ధర్మాధర్మవిచారం చేయడానికీ, ధర్మరాజుకుముందుగా తెలియపరచి, ద్రౌపదితోకూడా అతడు అవతలికి పోయినతర్వాత ఆయుధాగారంలోని విల్లును తీసికొనిపోవటానికీ వ్యవధానం లేదు. ధర్మనిర్వహణలో తనకు కలిగే కష్టంకంటె సమాజానికి కలిగే నష్టాన్ని పరిగణించి ప్రవర్తించే ధర్మవీరుడు-అర్జునుడు. అట్లా ప్రవర్తించటం ఉత్తమవీరలక్షణం.

**వ. ఇ ట్లరిగి యర్జునుం డతివీరు లయిన చోరుల వధియించి, బ్రాహ్మణునకు గోధనంబు నిచ్చి క్రమ్మఱి వచ్చి ధర్మజునకు మ్రొక్కి, 'లోకంబులమర్యాదలు విచారించి రక్షించుచున్న మనయందు మర్యాదాభంగం బయ్యె నను నింతకంటె**

**దుర్యశం బొండెద్దియు లేదు గావున నాకు ద్వాదశమాసికవ్రతంబు సలుపవలయు' నని పోవ సమకట్టి యున్న నర్జుననకు యుధిష్ఠిరుం డి ట్లనియె. 120**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అరిగి= ఈవిధంగా వెళ్ళి; అర్జునుండు; అతి, వీరులు+అయిన= గొప్ప వీరులైన; చోరులన్= దొంగలను; వధియించి= చంపి; బ్రాహ్మణునకున్= ఆ విప్రునికి; గోధనంబున్= గోరూపధనాన్ని; ఇచ్చి= తెచ్చిఇచ్చి; క్రమ్మఱి= తిరిగి; వచ్చి= ఇంటికివచ్చి; ధర్మజునకున్= ధర్మరాజునకు; మ్రొక్కి= నమస్కరించి; లోకంబుల, మర్యాదలు= లోక నియమాలు; విచారించి= ఆలోచించి; రక్షించుచున్+ఉన్న= కాపాడుతూ ఉండే; మనయందున్= మనలో; మర్యాదా, భంగంబు= నియమభంగం; అయ్యెన్= అయింది; ఇంతకంటెన్= ఇంతకన్న; దుర్+యశంబు= అపకీర్తి; ఒండు= మరొకటి; ఎద్దియున్, లేదు = ఏదీ లేదు; కావునన్= కాబట్టి; నాకున్= నేను; ద్వాదశమాసికవ్రతంబు= పండ్రెండు నెలల వ్రతం; సలుపవలయున్= చేయాలి; అని= అని చెప్పి; పోవన్= పోవటానికి; సమకట్టి= పూని; ఉన్నన్= ఉండగా; అర్జుననకున్= అర్జునునికి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈవిధంగా వెళ్ళి అర్జునుడు అతివీరులైన ఆ దొంగలను చంపి, బ్రాహ్మణునికి గోధనాన్ని ఇచ్చి, తిరిగి వచ్చి, ధర్మజునికి మొక్కి - 'లోకనియమాలను విచారించి రక్షిస్తున్న మనలోనే నియమభంగం జరిగిందన్న అపకీర్తికి మించింది మరొకటి లేదు. అందువలన నేను ద్వాదశమాసికవ్రతాన్ని చేయాలి' అని వెళ్ళడానికి సిద్ధంకాగా, అతనితో ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**ఆ. క్రూర కర్ము లయ్యు గో బ్రాహ్మణుల కగు । బాధ లుడుచుజనులఁ బాపచయము**
**లెట్టియెడలఁ బొంద వింద్రనందన! నీకు । సమయభంగభీతిఁ జనఁగ నేల? 121**

**ప్రతిపదార్థం:** ఇంద్రనందన= ఇంద్రుని కుమారుడవైన ఓ అర్జునా!; క్రూర, కర్ములు+అయ్యున్= పాపపు పనులు చేసిన వారైనా; గో, బ్రాహ్మణులకున్+అగు= ఆవులకు, బ్రాహ్మణులకు కలిగే, బాధలు; ఉడుచు= పోగొట్టే; జనులన్= ప్రజల్ని; పాప, చయములు= పాపాల సమూహాలు; ఎట్టి, ఎడలన్= ఎటువంటి చోట్లలో గూడా; పొందవు= చేరవు; నీకున్; సమయ, భంగ, భీతిన్= నియమం చెడింది అనే భయంతో; చనఁగన్= వెళ్ళటం; ఏల= ఎందుకు?

**తాత్పర్యం:** అర్జునా! ఎంత దుర్మార్గులైనా ఆవులకు, బ్రాహ్మణులకు కలిగిన బాధలను తొలగించే జనులను పాపాలు ఎటువంటి చోట్ల కూడా పొందవు. అట్లాంటప్పుడు నీవు నియమభంగం అయిందన్న భయంతో పోవటం ఎందుకు?

**విశేషం:** రెండుధర్మాలకు సంఘర్షణ ఏర్పడినప్పుడు ధర్మసూక్ష్మాన్ని అనుసరించటం లోకధర్మం. ద్రౌపది ధర్మజునితో కూడి ఏ ఇంట్లో ఉన్నా, ఆ ఇంట్లోకి మిగిలిన పాండవులు వెళ్ళకూడదని నియమం. ఆ నియమం తప్పినట్లు అర్జునుడు భావించి, ప్రాయశ్చిత్తాన్ని చేసికొనటానికి అన్నను అనుమతి కోరాడు. ధర్మజుడు బ్రాహ్మణబాధను తొలగించే సందర్భంలో ఎటువంటిచోట్ల కూడా పాపాలు పొందవనే ధర్మసూక్ష్మాన్ని ప్రతిపాదించాడు. అది అపద్ధర్మమౌతుందనీ, ప్రజలు దానిని నిందించే అవకాశం ఉంటుందనీ అర్జునుడు భావించాడు.

**వ. 'మఱి యట్లుంగాక తస్కరవధోపేక్షల నశ్వమేధ భ్రూణహత్యల ఫలం బగు నని వేదంబులయందు వినంబడుఁ; దస్కరుల వధియించి బ్రాహ్మణహితంబు చేసినవాఁడవు; నీకు సమయోల్లంఘనప్రాయశ్చిత్తంబు సేయ నేల?' యనిన నర్జునుం డి ట్లనియె. 122**

**ప్రతిపదార్థం:** మఱి= ఇంకా; అట్లున్+కాక= ఆ విధంగానూకాక; తస్కర, వధ+ఉపేక్షలన్= దొంగలను చంపటంవలన, వదలివేయటం వలన; అశ్వమేధ, భ్రూణ, హత్యల, ఫలంబు= అశ్వమేధయాగం చేయటంవలన, పసిబిడ్డను చంపటంవలన కలిగేఫలం; అగును+అని= అవుతుంది అని; వేదంబుల, అందున్= వేదాలలో; వినన్+పడున్= వినపడుతూంది; తస్కరులన్= దొంగలను; వధియించి= చంపి; బ్రాహ్మణ, హితంబు= బ్రాహ్మణునికి మేలు; చేసినవాడవు= చేసినావు; నీవు= నీవు; సమయ+ఉల్లంఘన, ప్రాయశ్చిత్తంబు= నియమాన్ని తప్పి నడచుకొన్న పాపాన్ని పోగొట్టుకోవటానికి చేసే పని; చేయన్+ఏల= చేయటం ఎందుకు; అనినన్= అని అనగా; అర్జునుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అంతేకాక దొంగలను చంపటంవలన అశ్వమేధం చేసినంత పుణ్యఫలం, వాళ్ళను వదలివేస్తే (కడుపులో) పసిబిడ్డను చంపినంత పాపఫలం కలుగుతుందని వేదాలవలన వింటున్నాం. దొంగలను చంపి బ్రాహ్మణుడికి మేలు చేసిన నీవు నియమం తప్పి నడచుకొన్నందుకు చేసికొనే ప్రాయశ్చిత్తాన్ని చేసికొనటం ఎందుకు?' అని ధర్మజుడు అనగా అర్జునుడు ధర్మజునితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: క్రమాలంకారం. ఒకవేళ అర్జునుడు చేసింది పాపమని గ్రహించి దానికి ప్రాయశ్చిత్తం చేసికొనటానికే ద్వాదశమాసవ్రతం పాటించినట్లయితే తస్కరవధవలన అశ్వమేధయాగం చేసిన పుణ్యం వస్తుందనీ, ఆ పుణ్యప్రభావంవలన పాపప్రాయశ్చిత్తం అవసరంలేదనీ ధర్మజుడి ప్రతిపాదన. పుణ్యప్రాప్తి పాపప్రాయశ్చిత్తానికి ప్రత్యామ్నాయం కాదని అర్జునుడి అభిప్రాయం.

**క. భూజనపరివాదం బ । వ్యాజంబునఁ బరిహరింపవలయును మనకున్**
**వ్యాజమున ధర్మలోపం । బాజిజయా! పరిహరింతురయ్య మహాత్ముల్.** **123**

**ప్రతిపదార్థం:** ఆజి, జయా = యుద్ధంలో జయించేవాడా! ఓ ధర్మరాజా!; అవ్యాజంబునన్= కారణం లేకపోయినా; భూజన; పరివాదంబు= భూమిలోని ప్రజలవలన కలిగేనిందను; మనకున్= మనకు; పరిహరింపవలయును= తొలగించాల్సిఉంది; మహాత్ములు= మహనీయులు; వ్యాజమునన్= సాకుతో; ధర్మ, లోపంబున్= ధర్మం తప్పటాన్ని; పరిహరింతురు+అయ్య= త్రోసి పుచ్చుతారా!

**తాత్పర్యం:** యుద్ధంలో జయించే ఓ ధర్మరాజా! అకారణంగా భూజనులవలన కలిగిన నిందనైనా మనం తొలగించాలి. అటువంటప్పుడు ఏదో సాకు పెట్టి మహాత్ములైనవాళ్ళు ధర్మం తప్పటాన్ని త్రోసిపుచ్చుతారా?

**విశేషం:** నన్నయ రుచిరార్థసూక్తి అనదగిన సుభాషితం. ఏ కారణం లేకుండానే రాజులకు ఒక్కొక్కసారి నిందలు వస్తూ ఉంటాయి. కారణం లేదుకదా అని దానిని నిర్లక్ష్యం చేయకుండా ఆ నిందను తొలగించుకొనటానికి ప్రయత్నించటం రాజధర్మం. మరి ఇక్కడ 'ఏదో ఒక సాకు చెప్పి నియమాన్ని పాటించామని పాండవులు సమర్థించుకొన్నారు' అని సహేతుకంగా ప్రజలు విమర్శించటానికి పాలకులు అవకాశం కలిగించటం సమర్థనీయం కాదని అర్జునుడు పేర్కొని, నిర్మల ధర్మ కర్మ దీక్షాపరతంత్రుడనిపించుకొన్నాడు. ధర్మజుడు అతనిమాటను కాదనలేకపోయాడు.

### సమయభంగకారణమున నర్జునుండు తీర్థయాత్రకుం జనుట (సం.1-206-12)

**వ. కావున వ్రతదానంబు నా కనుగ్రహింప వలయు' నని మ్రొక్కి యర్జునుం డగ్రజు వీడ్కొని గురుజనానుమతుం డై యఖిలవేదవేదాంగపారగు లైన బ్రాహ్మణులు ననేకశాస్త్రవిదు లయి వివిధకథాకథనదక్షు లయిన పౌరాణికులును దనకు సహాయులుగా నరిగి సకలతీర్థసేవచేయుచు నయ్యైతీర్థంబులందు.** **124**

**ప్రతిపదార్థం:** కావున వ్రతదానంబు= కాబట్టి ద్వాదశమాసికవ్రతం అనే దానాన్ని; నాకున్; అనుగ్రహింపవలయును= ఇవ్వాలి; అని= అని చెప్పి; మ్రొక్కి; అర్జునుండు= అర్జునుడు; అగ్రజున్, వీడ్కొని= అన్నదగ్గర సెలవు తీసికొని; గురుజన+ అనుమతుండు+ఐ= పెద్దలచే అనుమతించబడినవాడై; అఖిల వేద, వేద+అంగ, పారగులు+ఐన= అన్ని వేదాలను, వేదాంగాలను, తుదముట్ట చదివిన; బ్రాహ్మణులున్= విప్రులూ; అనేక, శాస్త్ర, విదులు+అయి= పెక్కుశాస్త్రాలు తెలిసినవాళ్ళయి; వివిధ, కథా, కథన, దక్షులు+అయిన= అనేక విధాలైన కథలను చెప్పటంలో సమర్థులైన పౌరాణికులును; తనకున్= తనకు; సహాయులుకాన్= తోడైనవాళ్ళుగా; అరిగి= పోయి; సకలతీర్థసేవ చేయుచున్= అన్నితీర్థాలు సేవిస్తూ; అయ్యైతీర్థముల, అందున్= ఆయా తీర్థాలలో.

**తాత్పర్యం:** 'అందుచేత నాకు ద్వాదశమాసికవ్రతదానాన్ని అనుగ్రహించండి' అని నమస్కరించి అర్జునుడు అన్నదగ్గర సెలవుతీసికొని, పెద్దలందరి అనుమతి పొంది, అన్నివేదాలు, వేదాంగాలు తుదముట్ట చదివిన బ్రాహ్మణులూ, పెక్కుశాస్త్రాలూ తెలిసి అనేక విధాలైనకథలు చెప్పటంలో సమర్థులైన పౌరాణికులూ తనకు తోడై రాగా ఆ యాతీర్థాలు సేవిస్తూ.

**ఆ. ధరణిసురుల గురులఁ బరమయోగుల మహా । భాగు లయిన యట్టి భాగవతుల**
**రాజవంశవరుఁడు పూజించుచును వారి । వలనఁ బుణ్యకథలు వెలయ వినుచు. 125**

**ప్రతిపదార్థం:** రాజవంశవరుఁడు= చంద్రవంశశ్రేష్ఠుడైన అర్జునుడు; ధరణిసురులన్= బ్రాహ్మణులను; గురులన్= పెద్దలను; పరమయోగులన్= గొప్పయోగులను; మహాభాగులు+అయిన+అట్టి= నిర్మలమనస్సు గల ప్రసిద్ధులైనట్టి; భాగవతులన్= పుణ్యాత్ములను; పూజించుచును= పూజిస్తూ; వారివలనన్= వాళ్లవల్ల; పుణ్యకథలు= పుణ్యకథలను; వెలయన్= ఒప్పుగ; వినుచున్= వింటూ.

**తాత్పర్యం:** చంద్రవంశశ్రేష్ఠుడైన అర్జునుడు బ్రాహ్మణులను, పెద్దలను, పరమయోగులను, గొప్ప పుణ్యాత్ములను పూజిస్తూ, వారివలన పుణ్యకథలు వింటూ.

**క. గంగాధర పింగజటా । సంగమ మంగళ విశాల చటుల తరంగన్**
**గంగానది సేవించెను । గంగాద్వారమున విగతకల్మషుఁ డగుచున్. 126**

**ప్రతిపదార్థం:** గంగాధర, పింగ, జటా, సంగమ, మంగళ, విశాల, చటుల, తరంగన్= శివునియొక్క గోరోచనపువర్ణంగల జటలతో కలియటంచేత మంగళకరాలై, విశాలాలై చలించే అలలు కలదానిని; గంగానదిన్; గంగా, ద్వారమునన్= గంగానదియొక్క ద్వార ప్రదేశంలో; విగత, కల్మషుఁడు+అగుచున్= తొలగిన పాపాలు కలవాడవుతూ; సేవించెన్= సేవించాడు.

**తాత్పర్యం:** శివునిగోరోచనపురంగు జటలతో కలవటంవలన మంగళకరాలై, విశాలాలై, చలించేఅలలుగల గంగానదిని, గంగాద్వారంలో అర్జునుడు తనపాపాలు తొలగిపోయేటట్లు సేవించాడు.

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం. గంగాతరంగనాదసౌందర్యాన్ని బిందుపూర్వక గకారంతో ధ్వనింపచేయటం అక్షరరమ్యత.

**వ. అందు నిత్యంబును గంగాస్నానంబు సేసి తత్తీరంబున హోమంబు సేయుచు వాసవసుతుండు మహీసురవర సహితుం డయి కొన్ని దివసంబులు వసియించి, యొక్కనాఁడు ప్రభాతంబ విధిపూర్వకంబునం గృతాభిషేకుం డయి దేవర్షి పితృతర్పణంబులు సేసి. 127**

**విశేషం:** అందున్= గంగానదీద్వారంలో; వాసవ, సుతుండు= దేవేంద్రుని కుమారుడైన అర్జునుడు; నిత్యంబును= ప్రతిదినమూ; గంగా, స్నానంబు చేసి; = గంగలో స్నానం చేసి; తత్+తీరంబునన్= ఆ గంగానది ఒడ్డున; హోమంబు, చేయుచున్= హోమం చేస్తూ; మహీసుర, వర, సహితుండు+అయి= బ్రాహ్మణోత్తములతో కూడినవాడై; కొన్ని, దివసంబులు= కొన్నిరోజులు; వసియించి= ఉండి; ఒక్కనాఁడు; ప్రభాతంబు+అ= వేకువనే; విధిపూర్వకంబునన్= నియమప్రకారం; కృత+ అభిషేకుండు+అయి= చేయబడిన స్నానం కలవాడై - అంటే స్నానంచేసి; దేవ+ఋషి, పితృ, తర్పణంబులు, చేసి= దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తర్పణాలు చేసి.

**తాత్పర్యం:** ఆ గంగానదీద్వారంలో అర్జునుడు ప్రతిదినం (గంగా) స్నానం చేసి, గంగ ఒడ్డున హోమంచేస్తూ, బ్రాహ్మణశ్రేష్ఠులతో కూడి, కొన్నిరోజులు గడిపి, ఒకనాడు వేకువనే లేచి, నియమంప్రకారం స్నానం చేసి, దేవ, ఋషి, పితృతర్పణాలు చేసి.

### ఉలూచి యర్జునునిఁ గామించుట (సం. 1-206-12)

**సీ. వేల్వంగ సమకట్టి వెలువడ నున్న న । య్యింద్రనందను రుచిరేంద్రనీల**
**సుందరశ్యామాంగు సురరాజకరికరా । కారమహాబాహుఁ గట్టిఁ జూచి**
**నలినాక్షి యం దొక్కనాగకన్యక కామ । పరవశ యై వానిఁ బట్టి తిగిచి**
**కొని నాగపురమునకును జని నిజరమ్య । హర్మ్యంబునందు నెయ్యమున నునిచె;**

**ఆ. నందు నగ్ని తొంటియట్టు లభ్యర్చితం । బయి వెలుంగుచున్న నర్జునుండు**
**హోమకార్య మొప్ప నొనరించి యప్పు డ । య్యింతిఁ జూచి నగుచు నిట్టు లనియె. 128**

**ప్రతిపదార్థం:** వేల్వంగన్= హోమం చేయటానికి; సమకట్టి= పూనుకొని; వెలువడన్+ఉన్న= వెలుపలికి రానున్న; ఆ+ఇంద్ర, నందనున్= ఇంద్రుని కుమారుడైన అర్జునుడిని; రుచిర+ఇంద్రనీల, సుందర, శ్యామ+అంగున్= కాంతిమంతమైన ఇంద్రనీలమణివలె అందమైన నల్లని శరీరం కలవాడిని; సుర, రాజ, కరి, కర+ఆకార, మహాబాహున్= దేవతలరాజైన దేవేంద్రుని ఏనుగుతొండంవంటి గొప్ప బాహువులు కలవాడిని; కట్టిన్= నల్లనివాడైన అర్జునుడిని; చూచి; అందున్= అచ్చట; ఒక్క; నలిన+అక్షి= పద్మంవంటి కన్నులు కలది; నాగకన్యక= నాగజాతికన్య; కామ, పరవశ+ఐ= కామానికి మిక్కిలి లొంగిపోయినదై; వానిన్= ఆ అర్జునుడిని; పట్టి= బంధించి; తిగిచికొని= లాగికొని; నాగపురమునకును; చని= వెళ్ళి; నిజ, రమ్య, హర్మ్యంబు, అందున్= అందమైన తన మేడలో; నెయ్యమునన్= స్నేహంతో; ఉనిచెన్= ఉంచింది; అందున్= ఆ నాగపురంలో; అగ్ని= అగ్ని; తొంటి, అట్టుల= పూర్వంవలెనే; అభి+అర్చితంబు+అయి= పూజింపబడినదై; వెలుంగుచున్నన్= వెలుగుతూఉండగా; అర్జునుండు; హోమకార్యము; ఒప్పన్; ఒనరించి= చేసి; అప్పుడు+అ= ఆ క్షణమే; ఆ+ఇంతిన్= ఆ నాగకన్యకను; చూచి; నగుచున్= నవ్వుతూ; ఇట్టుల+అనియెన్.

**తాత్పర్యం:** హోమం చేయపూని వెలుపలికి వచ్చిన ఆ పార్థుడిని, ఇంద్రనీలంవలె అందమైన నల్లటిశరీరం గలవాడిని, ఐరావతంతొండంవంటి పెద్దబాహువులు కలవాడిని-చూచి, కమలాలవంటి కన్నులు కల నాగకన్యక, కామపరవశ అయి అతడిని పట్టి లాక్కొని నాగపురానికి వెళ్ళి, అందమైన తనమేడలో ప్రేమతో ఉంచింది. అక్కడ వెలుగుతున్న అగ్నిలో అర్జునుడు హోమకార్యం జరిపి, ఆ నాగకన్యను చూచి నవ్వుతూ ఇట్లా అన్నాడు.

**క. 'తామరసనేత్ర! నీ పే । రేమీ? యెవ్వరితనూజ; వి ట్లేల మహా**

**వ్యామోహిత వై?' తనవుడుఁ గోమలి సురరాజపుత్త్రకున కి ట్లనియెన్. 129**

**ప్రతిపదార్థం:** తామరసనేత్ర= తామరలవంటి కన్నులు కలదానా!; నీపేరు; ఏమీ; ఎవ్వరి, తనూజవు= ఎవ్వరికూతురివి; ఇట్లు; ఏల= ఎందుకు; మహా, వ్యామోహితవు+ఐతి(వి)= మిక్కిలి వలపు కొన్నదానివి అయ్యావు; అనవుడున్= అని అనగా; కోమలి= సుకుమారి - ఆ నాగకన్యక, సురరాజ, పుత్త్రకునకున్= దేవేంద్రుని కుమారునికి (అర్జునునికి); ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులు కలదానా! నీపేరేమి? నీ వెవ్వరి కూతురివి? ఈ విధంగా ఎందుకు ఇంత వలపు గొన్నదానివి అయ్యావు? అని అనగా ఆ నాగకన్యక అర్జునునితో ఇట్లా అన్నది.

**వ. ఏ నులూచి యను నాగకన్యక; నైరావతకులసంభవుం డయిన కౌరవ్యుకూఁతుర; నిన్నుం జూచి మనోజబాణబాధిత నయితి; నామనోరథంబు సలుపుము. 130**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఉలూచి; అను, నాగకన్యకను; ఐరావత, కుల, సంభవుండు+అయిన= ఐరావతవంశంలో పుట్టినవాడైన; కౌరవ్యుకూతురన్= కౌరవ్యుని కుమార్తెను; నిన్నున్; చూచి, మనోజ, బాణ, బాధితను+అయితిన్= మన్మథబాణాలచేత బాధింపబడిన దాననయ్యాను; నా, మనోరథంబు= నా కోరిక; సలుపుము= ఈడేర్చుము.

**తాత్పర్యం:** నేను ఉలూచి అనే నాగకన్యకను. ఐరావతవంశంలో పుట్టిన కౌరవ్యుని కూతురిని. నిన్ను చూచి వలచాను. నా కోరిక తీర్చుము.

**విశేషం:** ఐరావతము - కద్రువకుమారులలో ఒకడు. అతనివంశంలో పుట్టిన కౌరవ్యునికూతురు ఉలూచి. ఉలూచికి ఉలూపి అనే పాఠాంతరం అనేకప్రతులలో ఉన్నది.

**క. నీ గుణములు దొల్లియు నా । గీగీతములందు విని తగిలి యిపుడు మనో**

**రాగమునఁ జూడఁ గంటిని । భాగీరథియందు నిన్నుఁ బరహితచరితా! 131**

**ప్రతిపదార్థం:** పరహిత, చరితా= ఇతరులకు మేలు చేసే నడవడి కలవాడా!; నీ, గుణములు; తొల్లియు= ఇదివరకే; నాగీ, గీతముల+అందున్= నాగకన్యకలపాటలలో; విని; తగిలి= ఆసక్తి కలిగి; ఇపుడు; మనోరాగమునన్= ప్రేమతో; నిన్నున్= నిన్ను; భాగీరథి, అందున్= గంగానదిలో; చూడన్+కంటిని= చూడగలిగాను.

**తాత్పర్యం:** ఇతరులకు మేలు చేసేనడవడి కల ఓ అర్జునా! ఇదివరకే నీ గుణాలు నాగకన్యకలపాటలలో విని, ఆసక్తి గొన్నాను. ఇపుడు ప్రేమతో నిన్ను గంగానదిలో చూడగలిగాను.

**విశేషం:** పరహితచరితా! అనే సంబోధనలో - ఇతరులమేలుకోరి నడుచుకొనే నీవు ఇపుడు నా మేలు కోరి నా కోరిక మన్నింపుము అనే ఉలూచి హృదయం చక్కగా వ్యక్తమవుతున్నది. పార్థుని ఈ తీర్థయాత్రలకు కారణంకూడా పరహితచరితమే కదా! భగీరథుడు భూమిమీదకు తీసికొనిరావటంవలన గంగకు భాగీరథి అనే పేరు వచ్చింది.

**వ. అనిన దాని కర్జునుం డి ట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ఉలూచి అనగా; దానికిన్= ఆమెకు; అర్జునుఁడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని పలికిన ఉలూచితో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**మధ్యాక్కర.**

> **ద్వాదశమాసికవ్రతము సలుపుదుఁ దరుణి! మాయన్న**
> **యాదేశమునఁ జేసి సర్వతీర్థము లాడుచు బ్రహ్మ**
> **వాదులసంగతి బ్రహ్మచర్యసువ్రతుఁడ నై యుండి**
> **నీదుమనోరథ మెట్లు సలుపంగనేర్తు నే నిపుడు? 133**

**ప్రతిపదార్థం:** తరుణి! = ఓకాంతా!; మా, అన్న= మా అన్నగారి; ఆదేశమునన్+చేసి= ఆజ్ఞతో; ద్వాదశమాసికవ్రతమున్= ద్వాదశమాసవ్రతాన్ని; సలుపుదున్= చేస్తున్నాను; సర్వతీర్థములు+ఆడుచున్= అన్ని పుణ్యతీర్థాలలో స్నానం చేస్తూ; బ్రహ్మవాదుల, సంగతి= వేదవిదులయినవారితో కలిసి; బ్రహ్మచర్య, సువ్రతుఁడను+ఐ= బ్రహ్మచర్యవ్రతం ఆచరిస్తూ; ఉండి= ఉంటూ; నేను; ఇపుడు= ఇప్పుడు; నీదు, మనోరథము= నీకోరిక; ఎట్లు; సలుపంగనేర్తున్= ఏవిధంగా తీర్చగలను?

**తాత్పర్యం:** ఓ కాంతా! మా అన్నగారి ఆజ్ఞతో ద్వాదశమాసికవ్రతం చేస్తూ, అన్ని పుణ్యతీర్థాలలో స్నానమాడుతూ వేదవిదులైన బ్రాహ్మణోత్తములతో కలిసి బ్రహ్మచర్యవ్రతాన్ని సలుపుతూ ఉండగా, నేను ఇపుడు నీ కోర్కెను ఎట్లా తీర్చగలను?

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు. ఆది.2.183 విశేషం.

**వ. అనిన నవనతానన యయి నాగకన్యక యర్జునుం జూచి ' ద్రుపదరాజపుత్త్రియందు మీచేసిన సమయంబును, భవత్తీర్థాగమననిమిత్తంబును వ్రతంబును నెఱుంగనిదానఁ గాను; సర్వతీర్థసేవనంబును సర్వవ్రతంబులు సలుపుటయును సర్వదానధర్మక్రియలును బ్రాణదానంబుతో సమానంబులు గావు; నామనోరథంబు విఫలం బయిన మనోజానలంబునం బ్రాణపరిత్యాగం బగుం గావున నన్ను రక్షింపుము; దీన నీకు వ్రతభంగంబు గా' దనిన నర్జునుండు దానిమనోరథంబు సలిపి యారాత్రి నాగభువనంబున వసియించి నాగకన్యకయందు సద్యోగర్భంబున నిరావంతుం డను కొడుకుం బడసి, నాగలోకంబు వెలువడి యాదిత్యోదయంబుతోడన గంగాద్వారంబునకు వచ్చి, తద్వృత్తాంతం బంతయుఁ దనసహాయు లయిన విప్రులకుం జెప్పి, వారలకు హృదయానందంబు సేయుచు. 134**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అర్జునుడు; చెప్పగా; అవనత+ఆనన, అయి= వంచిన ముఖం కలదై; నాగకన్యక; అర్జునున్, చూచి; ద్రుపదరాజ, పుత్త్రి, అందున్= ద్రౌపదియందు; మీ, చేసిన= మీయొక్క చేసిన- అంటే మీరు చేసిన; సమయంబును= ప్రతిజ్ఞను; భవత్+తీర్థ+ఆగమన, నిమిత్తంబును= మీ తీర్థయాత్రాకారణాన్ని; వ్రతంబునున్; ఎఱుంగదానన్, కాను= తెలియనిదానను కాను; సర్వ, తీర్థ, సేవనంబును= అన్ని తీర్థాలను సేవించుట; సర్వ, వ్రతంబులు, సలుపుటయున్= అన్ని వ్రతాలు చేయటం; సర్వ, దాన, ధర్మ, క్రియలును= అన్ని దానాల ధర్మాల పనులు; ప్రాణదానంబుతోన్+సమానంబులు= ప్రాణదానంతో సరికావు; నా, మనోరథంబు= నా కోరిక; విఫలంబు+అయినన్= నెరవేరకుంటే; మనోజ+అనలంబునన్= మన్మథాగ్నిలో; ప్రాణ, పరి త్యాగంబు+అగున్= ప్రాణం వదలటం జరుగుతుంది; కావునన్; నన్నున్; రక్షింపుము; దీనన్=

దీనవలన; నీకున్; వ్రత, భంగంబు= వ్రతానికి భంగపాటు; కాదు= కలుగదు; అనినన్= అని అనగా; అర్జునుండు; దాని= ఆ ఉలూచియొక్క; మనోరథంబు= కోరిక; సలిపి= తీర్చి; ఆ రాత్రి; నాగభువనంబునన్= నాగలోకంలో; వసియించి= నివసించి; నాగకన్యక+అందున్= నాగకన్యకయందు; సద్యస్+గర్భంబునన్= అప్పటికప్పుడు కలిగిన గర్భంలో; ఇరావంతుండు+ అను= ఇరావంతుడు అను పేరుగల; కొడుకున్; పడసి= పొంది; నాగలోకంబు= నాగలోకంనుండి; వెలువడి= వెలుపలికివచ్చి; ఆదిత్య+ఉదయంబుతోడన= సూర్యోదయంతోనే; గంగా ద్వారంబునకున్= గంగాద్వారానికి; వచ్చి= చని; తత్+వృత్తాంతంబు= ఆ సంగతి; అంతయున్= అంతా; తన; సహాయులు+ అయిన= తోడుగా ఉన్న; విప్రులకున్= బ్రాహ్మణులకు; చెప్పి; వారలకున్, హృదయ+ఆనందంబు, చేయుచున్= ఆ బ్రాహ్మణులకు మనస్సంతోషము కలిగిస్తూ.

**తాత్పర్యం:** అని అర్జునుడు చెప్పగా ఉలూచి తలవంచి అర్జునుడిని చూచి - 'ద్రౌపదివిషయంలో మీరు చేసిన ప్రతిజ్ఞ, మీతీర్థయాత్రకారణం, మీవ్రతం తెలియని దాన్ని కాను. అన్నితీర్థాలు సేవించటం, అన్నివ్రతాలు సలపటం; అన్నిదానాలు, ధర్మకర్మలు చేయటం, ప్రాణదానంతో సమానం కావు. నా కోర్కె నెరవేరకుంటే మన్మథాగ్నిలో ప్రాణం వదలటం జరుగుతుంది. కాబట్టి నన్ను రక్షించు. దీనివలన నీకు వ్రతభంగం కాదు' అనగా అర్జునుడు ఉలూచి కోరిక తీర్చి, ఆ రాత్రి నాగలోకంలో గడిపి, ఆమెయందు సద్యోగర్భంలో ఇరావంతుండు అనే కొడుకును పొంది, సూర్యోదయంకాగానే గంగాద్వారానికి వచ్చి, జరిగిన వృత్తాంతమంతా తనకు తోడుగా ఉన్న బ్రాహ్మణులకు చెప్పి, వాళ్ళకు హృదయానందం కలిగిస్తూ.

**క. వితతయశుఁ డరిగి హిమప । ర్వతపార్శ్వంబున నగస్త్యవటమును నత్యు**
**న్నతభృగుతుంగముఁ జూచుచు । ధృతి నేఁగి హిరణ్యబిందుతీర్థంబునకున్. 135**

**ప్రతిపదార్థం:** వితత, యశుఁడు= విశాలమైన కీర్తికలవాడు - అర్జునుడు, అరిగి= వెళ్ళి, హిమపర్వత, పార్శ్వంబునన్= హిమాలయ పర్వతంప్రక్కన; అగస్త్యవటమున్ (పుణ్యక్షేత్రం); అతి+ఉన్నత, భృగుతుంగమున్= మిక్కిలి ఎత్తైన భృగుతుంగక్షేత్రాన్ని; చూచుచున్; ధృతిన్= సంతోషంతో; హిరణ్య, బిందు తీర్థంబునకున్= హిరణ్యబిందు తీర్థానికి; ఏఁగి= వెళ్ళి.

**తాత్పర్యం:** విశాలమైన కీర్తి గల అర్జునుడు హిమాలయం ప్రక్కన ఉన్న అగస్త్యవటక్షేత్రాన్ని, మిక్కిలి ఎత్తైన భృగు తుంగక్షేత్రాన్ని చూస్తూ సంతోషంతో హిరణ్యబిందుతీర్థానికి వెళ్ళి.

**వ. అందును గోదాన భూదాన హిరణ్యదానంబు లాదిగాఁ బెక్కుదానంబులు సేసి, యజ్ఞార్థంబుగా భూసురోత్తములకు గోసహస్రంబు లిచ్చి, ప్రాగ్దేశంబున కరిగి నైమిశారణ్యంబునందు జగన్నాథునారాయణు నారాధించి యుత్పలినియుఁ గౌశికియు నందయు నపరనందయు గయయు గంగయు గంగాసాగరసంగమంబును జూచుచు. 136**

**ప్రతిపదార్థం:** అందును= ఆ హిరణ్యబిందుతీర్థంలో; గోదాన, భూదాన, హిరణ్యదానంబులు= ఆవులను దానంచేయుటం, భూములనుదానంచేయుట; బంగారాన్ని దానంచేయటం; ఆదిగాన్= మొదలుగా; పెక్కు; దానంబులు; చేసి; యజ్ఞ+అర్థంబుగాన్= యజ్ఞంకొరకు; భూసుర+ఉత్తములకున్= బ్రాహ్మణోత్తములకు; గోసహస్రంబులు= వేలకొద్దిఆవులు; ఇచ్చి= దానమొసగి; ప్రాక్+దేశంబులకున్= తూర్పుదేశానికి; అరిగి= వెళ్ళి, నైమిశ+అరణ్యంబునందున్= నైమిశారణ్యంలో; జగన్నాథు నారాయణున్= లోకప్రభువైన నారాయణుని; ఆరాధించి= పూజించి; ఉత్పలినియున్= ఉత్పలిని; కౌశికియున్= కౌశికిని; నందయున్= నందను; అపరనందయున్= అపరనందను; గయయున్= గయను; గంగయున్= గంగను; గంగాసాగరసంగమంబును= గంగానది సముద్రంలో కలిసేచోటును; చూచుచున్= చూస్తూ.

**తాత్పర్యం:** ఆ హిరణ్యబిందుతీర్థంలో గోదాన, భూదాన, సువర్ణదానాది అనేకదానాలు చేసి, యజ్ఞంకొరకు బ్రాహ్మణోత్తములకు వేలాది ఆవులను ఇచ్చి, తూర్పుదేశానికి పోయి నైమిశారణ్యంలోని జగన్నాథుడిని ఆరాధించి ఉత్పలిని, కౌశిక, నంద, అపరనంద, గయ, గంగ, గంగాసాగరసంగమస్థలం మొదలైన ప్రదేశాలను చూస్తూ.

**క.** **ఏలావనరమ్యము లగు । వేలావనములను బవనవిచలద్వీచీ**
**లాలితసముద్రవిద్రుమ । మాలాపులినస్థలముల మసలుచు లీలన్.** **137**

**ప్రతిపదార్థం:** ఏలా, వన, రమ్యములు+అగు= ఏలకితీగలతోటలచే అందములైన; వేలా, వనములను= సముద్రతీరపు అడవులలో; పవన, విచలత్+వీచీ, లాలిత, సముద్ర, విద్రుమ, మాలా, పులిన, స్థలముల= గాలిచే కదలుతున్న అలలచే ఊగించ బడిన సముద్రంయొక్క పగడపుచెట్ల వరుసలతో కూడిన ఇసుక తిన్నెలున్న ప్రదేశాలలో; లీలన్= విలాసంగా; మసలుచున్= తిరుగుతూ.

**తాత్పర్యం:** ఏలకితీగలతోటలలో అందంగా ఉన్న సముద్రతీరవనాలతో, గాలికి కదలే అలలు ఊగించే పగడపు చెట్లవరుసలతో కూడిన ఇసుకతిన్నెలున్నప్రదేశాలలో విలాసంగా తిరుగుతూ.

**వ.** **కళింగవిషయంబు సొచ్చు నంతఁ దోడిబ్రాహ్మణులు కొందఱు కళింగద్వారంబునఁ గ్రమ్మఱి యుత్తర కురుదేశంబులకుం జనిన; నందుం గతిపయబ్రాహ్మణసహాయుం డయి పార్థుం డరిగి పూర్వసముద్రతీరంబునఁ బురుషోత్తమదేవరకు నమస్కరించి మహేంద్రపర్వతంబు చూచుచు.** **138**

**ప్రతిపదార్థం:** కళింగ, విషయంబు= కళింగదేశం; చొచ్చునంతన్= ప్రవేశించగానే; తోడి బ్రాహ్మణులు; కొందఱు= వెంటగల బ్రాహ్మణులు కొంతమంది; కళింగద్వారంబునన్= కళింగద్వారంలో; క్రమ్మఱి= మరలి;ఉత్తర, కురుదేశంబులకున్; చనినన్= వెళ్ళగా; అందున్= అక్కడి; కతిపయ, బ్రాహ్మణ, సహాయుండు+అయి= కొద్దిమంది బ్రాహ్మణుల సహాయం కలవాడై; పార్థుండు= అర్జునుడు; అరిగి= వెళ్ళి; పూర్వ, సముద్ర, తీరంబునన్= తూర్పుసముద్రతీరంలో; పురుషోత్తమదేవరకున్= జగన్నాథస్వామికి; నమస్కరించి; మహేంద్రపర్వతంబు, చూచుచున్= మహేంద్రపర్వతాన్ని చూస్తూ.

**తాత్పర్యం:** కళింగదేశంలో ప్రవేశించగానే అర్జునునివెంట వచ్చిన బ్రాహ్మణులలో కొందరు కళింగదేశ ద్వారం నుండి తిరిగి ఉత్తరకురుదేశాలకు వెళ్ళారు. మిగిలినవాళ్ళసాయంతో పార్థుడు తూర్పుసముద్రతీరంలో ఉన్న జగన్నాథస్వామిని సేవించి, మహేంద్రపర్వతం చూస్తూ.

**సీ.** **దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పిన । గోదావరియు, జగదాది యైన**
**భీమేశ్వరంబును, బెడఁగగుచున్న శ్రీ । పర్వతంబును జూచి, యుర్విలోన**
**ననఘు మై శిష్టాగ్రహారభూయిష్ఠ మై । ధరణీసురోత్తమాధ్వరవిధాన**
**పుణ్యసమృద్ధమై పొలుచు వేంగీదేశ । విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి**

**తే.** **ణాంబురాశితీరంబున కరిగి, దురిత । హారి యైన కావేరీమహాసముద్ర**
**సంగమంబున భూసురేశ్వరుల కభిమ । తార్థదానంబుఁ జేసి కృతార్థుఁ డగుచు.** **139**

**ప్రతిపదార్థం:** విభుఁడు= ప్రభువు - అర్జునుడు; దక్షిణగంగ; నాన్= అన్నట్లు; తద్దయున్= మిక్కిలి; ఒప్పిన= ప్రకాశించిన; గోదావరియు= గోదావరిని; జగత్+ఆది, ఐన= లోకానికి మొదలైన; భీమేశ్వరంబును= భీమేశ్వరాన్ని; బెడఁగు+అగుచున్+ఉన్న= మనోహరమైన; శ్రీపర్వతంబును= శ్రీశైలాన్ని; చూచి= కాంచి; ఉర్విలోనన్= భూమిలో; అనఘము+ఐ= పవిత్రమైన; శిష్ట+అగ్రహార, భూయిష్ఠము+ఐ= సదాచారసంపన్నులయొక్క అగ్రహారాలతో నిండినదై; ధరణీసుర+ఉత్తమ, అధ్వర, విధాన, పుణ్య, సమృద్ధము+ఐ= బ్రాహ్మణోత్తములయొక్క యజ్ఞకార్యాలచే కలిగే పుణ్యంతో నిండినదై; పొలుచు= ఒప్పు; వేంగిదేశ, విభవంబున్= వేంగిదేశంయొక్క వైభవాన్ని; చూచుచున్= చూస్తూ; దక్షిణ+అంబురాశి, తీరంబునకున్= దక్షిణ సముద్రతీరానికి; అరిగి= వెళ్ళి; దురిత, హారి+ ఐన= పాపాన్ని పోగొట్టేదైన; కావేరీ, మహాసముద్ర, సంగమంబునన్= కావేరీనది సముద్రంలో కలిసే చోట; భూసుర+ ఈశ్వరులకున్= బ్రాహ్మణశ్రేష్ఠులకు; అభిమత+అర్థ, దానంబున్+చేసి= కోరుకొన్నవాటిని దానం ఇచ్చి; కృత+అర్థుఁడు+అగుచున్= ధన్యుడై.

**తాత్పర్యం:** అర్జునుడు దక్షిణగంగ అని ప్రసిద్ధి పొందిన గోదావరీనదిని, లోకానికే మొదలు అనిపించుకొన్న భీమేశ్వరాన్ని, మనోహరమైన శ్రీశైలాన్ని చూచి, పవిత్రమై, శ్రోత్రియుల అగ్రహారాలకు నిలయమై, బ్రాహ్మణోత్తముల యజ్ఞకార్యాల పుణ్యఫలంతో నిండినదై వెలసి ఉన్న వేంగీదేశవైభవాన్ని చూస్తూ దక్షిణసముద్రతీరానికి వెళ్ళిపాపాలను పోగొట్టే కావేరీసముద్రసంగమంలో బ్రాహ్మణశ్రేష్ఠులకు ఇష్టమైన దానాలన్నీ ఇచ్చి, ధన్యుడయ్యాడు.

**విశేషం:** మనోహరమైన ఈ వేంగిదేశవర్ణనం స్వీయదేశాభిమానంతో నన్నయ తెలుగుభారతంలో చొప్పించిందే. ఇది అమూలకం. గోదావరిప్రశంసమాత్రం పి.పి.యస్.శాస్త్రిగారిప్రతిలో ఉన్నది.

## అర్జునుండు చిత్రాంగదను వివాహంబగుట (సం.1-207-14)

**వ. పదుమూఁడగు మాసంబున మణిపూరపురంబునకుంజని, యందున్న రాజుఁ జిత్రవాహనుం గని, వానిచేతం బూజితుం డయి, తత్పుత్త్రిఁ జిత్రాంగద యనుదాని వివాహంబుగా నపేక్షించిన, నయ్యర్జుననభిప్రాయం బాప్తులవలన నెఱింగి చిత్రవాహనుం డర్జునున కి ట్లనియె. 140**

**ప్రతిపదార్థం:** పదుమూఁడు+అగు= పదమూడవనెలలో; మణిపూర, పురంబునకున్= మణిపూర నగరానికి; చని= వెళ్ళి; అందున్+ఉన్న, రాజున్= అక్కడ ఉన్న రాజును; చిత్రవాహనున్= చిత్రవాహనుణ్ణి; కని= చూచి; వానిచేతన్= ఆ రాజుచే; పూజితుండు+అయి= పూజింపబడినవాడై; తత్+పుత్రిన్= అతని కుమార్తెను; చిత్రాంగద, అను, దానిన్= చిత్రాంగద అను పేరుగల ఆమెను; వివాహంబు, కాన్= పెండ్లిచేసుకొనటానికి; అపేక్షించినన్= కోరగా; ఆ+అర్జును= ఆ అర్జునుని; అభిప్రాయంబు= అభిప్రాయాన్ని; ఆప్తులవలనన్= ఆప్తులమూలంగా; ఎఱింగి= తెలిసికొని; చిత్రవాహనుండు= చిత్రవాహనుడు; అర్జుననకున్= అర్జునునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అర్జునుడు పదమూడవమాసంలో మణిపూరమనే నగరానికి వెళ్లాడు. ఆ దేశపురాజైన చిత్రవాహనుణ్ణి చూచాడు. అతనిగౌరవం పొందాడు. అతనికూతురైన చిత్రాంగదను ప్రేమించాడు. వివాహంచేసికొనాలని అనుకొన్నాడు. అతనిఅభిప్రాయాన్ని ఆప్తులవలన తెలిసికొన్న చిత్రవాహనుడు అర్జునునితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** అర్జునుని వ్రతం ద్వాదశ మాసాత్మకం-అంటే సంవత్సరం. ఇట "పదుమూడవమాసంబున" అనుటచే పండ్రెండుమాసాలు దాటాయికదా! వ్రతం ముగిసినా-అర్జునుడు ఇంకా పుణ్యతీర్థాటనం చేస్తూనే ఉన్నాడనుకోవాలి.

**క. ధన్యుండ నైతి నీ కీ। కన్యక నీఁ గాంచి; యైనఁగలతెఱఁగు జగ**

**న్మాన్య! యెఱిఁగింపవలయు; న। నన్యమనస్కుండ వయి దయన్ విను మనఘా! 141**

**ప్రతిపదార్థం:** జగత్+మాన్య= లోకంచే పూజింపబడేవాడా! నీకున్; ఈ, కన్యకన్= ఈ కన్నెను; ఈన్+కాంచి= ఈయగలిగి; ధన్యుండన్+ఐతిని= కృతార్థుణ్ణి అయ్యాను; ఐనన్= అయినప్పటికి; కల, తెఱఁగు= ఉన్నసంగతి; ఎఱిఁగింపవలయున్= తెలపాలి; అనఘా!= పాపరహితుడా! అనన్యమనస్కుండవు+అయి= మరొకదానిలో మనస్సు లేనివాడవై; దయన్= దయతో; వినుము.

**తాత్పర్యం:** అర్జునా! నీకు ఈ కన్యకను ఇవ్వగలిగి ధన్యుడనయ్యాను. అయినా ఉన్న సంగతి చెప్పాలి. పుణ్యాత్మా! సావధానంగా దయతో వినుము.

**క. మా కులమునందుఁ దొల్లి ప్ర। భాకరుఁ డను రాజవరుఁ డపత్యము దనకున్**

**లేకున్న నుమేశ్వరునకుఁ। బ్రాకటముగ భక్తితోఁ దపం బొనరించెన్. 142**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; మా కులమునందు; ప్రభాకరుఁడు+అను; రాజ, వరుఁడు= రాజశ్రేష్ఠుడు; తనకున్; అపత్యము= సంతానం; లేకున్నన్= లేకపోగా; ప్రాకటముగన్= ప్రసిద్ధంగా; ఉమా+ఈశ్వరునకున్= ఉమాదేవి భర్తఅయిన పరమేశ్వరుడినిగూర్చి; భక్తితోన్= భక్తితో; తపంబు= తపస్సు; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** పూర్వం మా వంశంలో ప్రభాకరుడు అనే రాజశ్రేష్ఠుడు తనకు సంతానం లేకపోవటంవలన పరమేశ్వరుడినిగూర్చి భక్తితో తపస్సు చేశాడు.

**వ. పరమేశ్వరుండును వానికిం గరుణించి నీకు నొక్కపుత్త్రుం డుద్భవించు; నీకులంబున వారికెల్ల సంతానం బిట్ల యగు నని వరం బిచ్చిన; నది మొదలుగా మావంశంబునవారికెల్ల నొక్కొక్కపుత్త్రుండ కా జన్మించుచు వచ్చిన నిప్పడు నాకు నిక్కన్యక పుట్టె; నేను దీనిం బుత్త్రీకరణంబునం బెనిచితి. 143**

**ప్రతిపదార్థం:** పరమ+ఈశ్వరుండును= పరమశివుడును; వానికిన్= ఆ ప్రభాకరునికి; (అతనిని); కరుణించి; నీకున్; ఒక పుత్త్రుండు; ఉద్భవించున్= పుట్టుతాడు; నీ, కులంబునవారికిన్+ఎల్లన్= నీ వంశంలోనివాళ్ళందరికీ; ఇట్లు+ఆ= ఈ విధంగానే; సంతానంబు= సంతతి; అగున్= కలుగుతుంది; అని, వరంబు= అని వరం; ఇచ్చినన్= ఈయగా; అదిమొదలు= నాడు మొదలుగా; మా, వంశంబునవారికిన్+ఎల్లన్= మా వంశలోనివాళ్లకు అందరికీ; ఒక్కొక్కపుత్త్రుండు+అ, కా= ఒక్కొక్కకొడుకే; జన్మించుచున్= పుట్టుతూ; వచ్చినన్= రాగా; ఇప్పుడు; నాకున్= నాకు; ఈ+కన్యక; పుట్టెన్= జన్మించింది; నేను; దీనిన్= ఈ కన్నెను; పుత్త్రీకరణంబునన్= పుత్త్రికగా; పెనిచితిన్= పెంచాను.

**తాత్పర్యం:** పరమేశ్వరుడు ఆ ప్రభాకరుడిని అనుగ్రహించి, 'నీ కొకకొడుకు పుడతాడు. నీ వంశంలోని వాళ్ళందరికీ ఇట్లాగే సంతానం కలుగుతుంది. (అంటే ఒక్కొక్కకొడుకుమాత్రమే పుట్టటం) అని వరమిచ్చాడు. అది మొదలుగా మా వంశంలోని వాళ్ళందరికీ ఒక్కొక్కకొడుకే జన్మిస్తూ వచ్చాడు. ఇప్పుడు నా కీ కన్యక పుట్టింది. నేను ఈ కన్యకను వంశం నిలిపే దానినిగా పెంచాను.

**విశేషం:** ఏ కుమారికి పుట్టిన పుత్త్రుడు తనకు పుత్రుడు కావాలని తండ్రి తలుస్తాడో ఆ కుమారికి పుత్త్రిక అనే సంజ్ఞ ఉన్నది. 'పుత్త్రికరణంబునం' అనేదానికి. 'పుత్రాకారంబున' అనే పాఠాంతరం కూడా ఉన్నది. మొత్తం మీద చిత్రాంగద కుమారుడు (దౌహిత్రుడు) తన వంశకరుడు కావాలని చిత్రవాహనుని అభిమతం.

**తే. ఇందుఁ బుట్టినసుతుఁడు మా కిందువంశ్య! । వంశవిస్తారకుండు గావలయు; నిదియ**
**యీలతాంగికి నుంకు; వి ట్లీఁగనోపు । దేని పెండిలియగుమ యీయింతిఁ బ్రీతి. 144**

**ప్రతిపదార్థం:** ఇందున్= ఈ చిత్రాంగదకు; పుట్టిన, సుతుఁడు= పుట్టిన కుమారుడు; మాకున్; ఇందువంశ్య= చంద్రవంశానికి చెందినవాడా! ఓ అర్జునా!; వంశ, విస్తారకుండు= వంశాన్ని వృద్ధి చేసేవాడు; కావలయున్= కావాలి; ఇదియ= ఇదే; ఈ, లతా+అంగికిన్= ఈ సుకుమారికి; ఉంకువ= శుల్కం; ఇట్లు; ఈఁగన్= ఇవ్వటానికి; ఓపుదు(వు)+ఏని= చాలుదువేని; ఈ, ఇంతిన్= ఈ కాంతను; ప్రీతిన్= ప్రేమతో; పెండిలి, అగుము+అ= పెండ్లాడుమా!

**తాత్పర్యం:** అర్జునా! ఈ చిత్రాంగదకు పుట్టినకుమారుడు మా వంశం నిలిపేవాడు కావాలి. ఇదే నీవు ఈ కన్యకు ఇవ్వవలసిన శుల్కం. ఇట్లా ఇవ్వగలిగితే ప్రేమతో ఆమెను పెళ్ళి చేసికొమ్ము.

**వ. అనిన నర్జునుండు చిత్రవాహనువచనంబున కొడంబడి చిత్రాంగద వివాహం బై. 145**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; అర్జునుండు= అర్జునుడు; చిత్రవాహనువచనంబునకున్= చిత్రవాహను మాటకు; ఒడంబడి= సమ్మతించి; చిత్రాంగదన్; వివాహంబు+ఐ= పెండ్లాడినవాడై, పెండ్లి చేసికొని.

**తాత్పర్యం:** అని అనగా అర్జునుడు చిత్రవాహనునిమాటకు ఒప్పుకొని చిత్రాంగదను పెండ్లాడి.

**ఉ. అంగజరాజ్యలక్ష్మి పొడవైనదియొక్కొ యనంగ నొప్పు చి**
**త్రాంగదయందుఁ బార్థుఁడు మహాప్రణయప్రవణాంతరంగుఁ డై**
**యంగజభోగసంగమున నమ్మణిపూరపురిన్ సమస్తలో**
**కాంగణరంగసంగతవిహారయశోంగదుఁ డుండె లీలతోన్. 146**

**ప్రతిపదార్థం:** అంగజ, రాజ్యలక్ష్మి= మన్మథునియొక్క రాజ్యలక్ష్మి; పొడవు+ఐనది, ఒక్కొ= రూపుతాల్చిందా; అనంగన్= అనునట్లు; ఒప్పు= ప్రకాశించు; చిత్రాంగద; అందున్= చిత్రాంగదపై; సమస్త, లోక+అంగణ, రంగ, సంగత, విహార, యశోంగదుఁడు= అన్నిలోకాల ముంగిళ్ళు అనే రంగస్థలాలలో కూడుకొన్న విహారం కల కీర్తి అనెడి బాహుపురి (సందికడియం) గలవాడు - అంటే అన్నిలోకాలలో వ్యాపించిన కీర్తి కలవాడు; పార్థుఁడు= అర్జునుడు; మహా, ప్రణయ, ప్రవణ+అంతరంగుఁడు+ఐ= మిక్కిలి ప్రేమలో ఆసక్తి కల మనస్సు కలవాడై; అంగజ, భోగ, సంగమునన్= మన్మథభోగాలతో కూడి; లీలతోన్= విలాసంగా; ఆ+మణిపూర, పురిన్, ఉండెన్= ఆ మణిపూరనగరంలో ఉండినాడు.

**తాత్పర్యం:** మన్మథుని రాజ్యలక్ష్మి రూపు తాల్చిందా అన్నట్లు మహాసౌందర్యవతి అయిన చిత్రాంగద మీద తగులు కొన్న మనస్సుతో, మన్మథభోగాలనుభవిస్తూ, మహాకీర్తిమంతుడైన అర్జునుడు మణిపూరపురంలో విలాసంతో ఉన్నాడు.

**విశేషం:** అలం : ఉత్ప్రేక్ష. మన్మథరాజ్యలక్ష్మివంటి ఆ చిత్రాంగదమీద తనివి తీరక అలలు అలలుగా పెల్లుబికిన పార్థుని శృంగారభావం - ప్రాసస్థానంలోనే గాక పద్యమంతటా ప్రయోగించబడిన బిందుపూర్వక 'గ' కారంతో చక్కగా వ్యక్తం చేయబడింది. అక్షరరమ్యమైన నన్నయపద్యాలలో ఇది ఒకటి.

## అర్జునుండు పంచతీర్థంబులం దప్సరసలను శాపవిముక్తుల నొనరించుట (సం.1-208-1)

**వ. ఇట్లుండి యొక్కనాఁడు తపోధనబ్రాహ్మణసమేతుం డై తత్సమీపంబున సముద్రతీరతీర్థంబులు చూచుచుం జని సౌభద్రం బను తీర్థంబుఁ గని యందు స్నానంబు సేయ సమకట్టిన నర్జునుం జూచి యందుల మును లి ట్లనిరి. 147**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఉండి; ఒకనాఁడు; తపస్+ధన, బ్రాహ్మణ, సమేతుండు+ఐ= తపస్సే ధనంగా కల బ్రాహ్మణులతో కూడుకొన్నవాడై; తత్+సమీపంబునన్= ఆ మణిపూరపురానికి దగ్గర; సముద్రతీర, తీర్థంబులు= సముద్రం ఒడ్డున గల తీర్థాలు; చూచుచున్= చూస్తూ; చని=వెళ్ళి; సౌభద్రంబు+అను= సౌభద్రం అను పేరుగల ; తీర్థంబున్= తీర్థాన్ని; కని= చూచి; అందున్= ఆ తీర్థంలో; స్నానంబుచేయన్= స్నానం చేయటానికి; సమకట్టినన్= పూనుకోగా; అర్జునున్= అర్జునుణ్ణి; చూచి= కనుగొని; అందులన్= అందున్న; మునులు= ఋషులు; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఉన్న అర్జునుడు ఒకనాడు తపోధనులైన బ్రాహ్మణులతో కలిసి ఆ మణిపూరపురానికి దగ్గరగా ఉన్న సముద్రతీరతీర్థాలను చూస్తూ సౌభద్రతీర్థాన్ని దర్శించాడు. అందులో స్నానం చేయటానికి పూనుకోగా, అక్కడ ఉన్న మునులు అతనితో ఇట్లా అన్నారు.

**తరలము.**

**ఇది సొరంగ నసాధ్య మెవ్వరి కిందువంశవరేణ్య! వి**
**న్మిదియ కా దివి యేనుతీర్థము లీసముద్రతటంబునన్**
**విదితముల్ దురితాపహంబులు వీని నెన్నఁడు నాడనో**
**డుదురు సన్మును లిందుఁ గోల్మొసళుల్ గొనున్ వడిఁ జొచ్చినన్. 148**

**ప్రతిపదార్థం:** ఇందు, వంశ, వరేణ్య= చంద్రవంశశ్రేష్ఠుడా!; ఓఅర్జునా!; ఇది= ఈ తీర్థం; చొరంగన్= ప్రవేశించటానికి; ఎవ్వరికిన్= ఎంతటివారికైనా; అసాధ్యము= వీలుకాదు; వినుము; ఇదియ, కాదు= ఇది ఒక్కటే కాదు; ఇవి, ఏను, తీర్థముల్= ఇవి అయిదు తీర్థాలు; సముద్ర, తటంబునన్= ఈ సముద్రతీరాన; విదితముల్= ప్రసిద్ధాలు; దురిత+అపహంబులు= పాపాన్ని పోగొట్టేవి; సత్+మునులు = మహామునులు; వీనిన్= వీటిలో; ఎన్నఁడున్= ఎప్పుడును; ఆడన్= స్నానమాడటానికి; ఓడుదురు= భయపడతారు; ఇందున్= ఈ నీటిలో; చొచ్చినన్= ప్రవేశిస్తే; వడిన్= వెంటనే; కోల్+మొసళుల్= పెద్ద మొసళ్ళు; కొనున్= పట్టుకొంటాయి.

**తాత్పర్యం:** చంద్రవంశశ్రేష్ఠా! ఓ అర్జునా! ఈ తీర్థాన్ని ప్రవేశించటం ఎవ్వరికీ సాధ్యం కాదు. వినుము. ఇదే కాదు. ఈ సముద్రతీరాన ప్రసిద్ధాలు, పాపహరాలు అయిన అయిదుతీర్థాలు ఉన్నాయి. మహామునులుకూడా వీటిలో స్నానం చేయటానికి భయపడతారు. దీనిలో ప్రవేశిస్తే వెంటనే పెద్దమొసళ్ళు పట్టుకొంటాయి.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు. ఆది. 1.21.విశేషం.

**వ. 'సౌభద్ర పౌలోమ కారంధమ ప్రసన్న భారద్వాజంబు లను నామంబుల దక్షిణసముద్ర తీరంబునం బ్రసిద్ధంబు లయిన యిప్పంచతీర్థంబు లిప్పుడు నూఱేండ్లంగోలె నుగ్రగ్రాహగృహీతంబు లయి దుర్జనగృహీతంబు లయిన**

**రాజులవిభవంబులుంబోలె సాధుజనవర్జితంబు లయి యుండు' ననిన విని విజయుం 'డశేషతీర్థసేవార్థి నయి**
**వచ్చిన నాకు నీతీర్థంబు లాడకునికి పౌరుషంబు గా' దని యందు. 149**

**ప్రతిపదార్థం:** సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న, భరద్వాజంబులు, అను, నామంబులన్= సౌభద్రము, పౌలోమము, కారంధమము, ప్రసన్నము, భారద్వాజము లను పేర్లతో; దక్షిణ, సముద్రతీరంబునన్ = దక్షిణసముద్రపు ఒడ్డులో; ప్రసిద్ధంబులు+అయిన; ఈ+పంచ, తీర్థంబులు= ఈ అయిదు తీర్థాలు; ఇప్పుడు; నూఱేండ్లన్+కోలెన్= నూరుసంవత్సరాల నుండి; ఉగ్ర, గ్రాహ, గృహీతంబులు+అయి= భయంకరాలైన మొసళ్ళచే గ్రహింపబడినవై; దుర్జన, గృహీతంబులు+అయిన= దుర్మార్గులచే గ్రహింపబడిన; రాజుల, విభవంబులున్+పోలెన్= రాజుల ఐశ్వర్యాలవలె; సాధుజన, వర్జితంబులు+అయి= మునీశ్వరులచేత విడువబడినవై; ఉండున్= ఉన్నాయి; అనినన్= అని అనగా; విని; విజయుండు= అర్జునుడు; అశేష, తీర్థసేవా+అర్థిన్+అయి= అన్ని తీర్థాలు సేవించాలన్న కోరిక కలవాడినై; వచ్చిన; నాకున్; ఈ, తీర్థంబులు; ఆడక+ఉనికి= స్నానమాడకుండటం; పౌరుషంబు; కాదు; అని; అందున్ = ఆ తీర్థాలలో;

**తాత్పర్యం:** 'సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న, భారద్వాజంబు లనే పేర్లతో దక్షిణసముద్రతీరంలో ప్రసిద్ధా లైన ఈ అయిదు తీర్థాలను నూరేండ్లనుండి భయంకరాలైన మొసళ్ళు ఆక్రమించాయి. దుర్మార్గులవశం అయిన రాజుల ఐశ్వర్యాలవలె ఇవి మునీశ్వరులచేత విడువబడి ఉన్నాయి' - అనగా విని అర్జునుడు, 'అన్ని తీర్థాలు సేవించగోరిన నాకు ఈ తీర్థాలలో స్నానం చేయకుండా ఉండటం పౌరుషం కాదు' అని.

**విశేషం:** అలం: ఉపమ.

**క. సాహసికుం డై నరుఁ డవ । గాహము సేయుటయు జలము గ్రక్కదల మహా**
**గ్రాహము బీభత్సు బృహ । ద్బాహుబలుం బట్టికొనియెఁ బఱతెంచి వడిన్. 150**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; సాహసికుండు+ఐ= సాహసంకలవాడై; అవగాహము= స్నానం; చేయుటయు; మహాగ్రాహము= పెద్దమొసలి; జలము= నీరు; కదల+కదల= మిక్కిలి కలత చెందగా; వడిన్= వేగంగా; పఱతెంచి= పరుగెత్తి వచ్చి; బృహత్+బాహుబలున్= గొప్పభుజంబలంకలవాడిని; బీభత్సున్= అర్జునుడిని; పట్టుకొనియెన్= పట్టుకొన్నది.

**తాత్పర్యం:** అర్జునుడు సాహసించి స్నానం చేయుటానికి నీటిలో మునుగగా; పెద్దమొసలి ఒకటి నీరంతా కలత చెందేటట్లు వేగంగా పరుగెత్తి వచ్చి అతడిని పట్టుకొన్నది.

**ఆ. దాని నశ్రమమునఁ దజ్జలాశయము వె । ల్వడఁగ వైచె నరుఁడు బాహుశక్తి;**
**నదియుఁ దత్క్షణంబ యభినవ యౌవనో । ద్భాసమాన దివ్యభామ యయ్యె. 151**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; బాహుశక్తిన్= భుజబలంతో; దానిన్= ఆ మొసలిని; అశ్రమమునన్= సులువుగా; తత్+జల+ఆశయము= ఆ మడుగునుండి; వెల్వడఁగన్= బయటపడేటట్లు; వైచెన్= విసరివేశాడు; అదియున్= ఆ మొసలికూడా; తత్+క్షణంబు+అ= ఆ క్షణమే; అభినవ, యౌవన+ఉద్భాసమాన, దివ్యభామ= కొత్తయౌవనంతో ప్రకాశిస్తున్న దివ్యస్త్రీ; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** అర్జునుడు తన భుజబలంతో ఆ మొసలిని సులభంగా మడుగునుండి బయటపడేటట్లు విసిరాడు. అది వెంటనే నూత్నయౌవనంతో ప్రకాశించే దివ్యకాంత అయింది.

**ఉ. ఆ లలితాంగిఁ జూచి నరుఁ డద్భుత మంది 'మృగాయతాక్షి! యి**
**ట్లేల జలేచరత్వమున నిజ్జలధిన్ వసియించి? తిప్పు డి**
**ట్లేల సురూప భామ వయి? తెందులదానవు నీవు?' నావుడున్**
**బాలిక పాండుపుత్త్రునకుఁ బార్థున కి ట్లనియెం బ్రియంబునన్. 152**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; ఆ, లలిత+అంగిన్= ఆ అందమైన శరీరం కలదానిని; చూచి, అద్భుతము+అంది= ఆశ్చర్యపడి; మృగ+ఆయత+అక్షి= లేడి కన్నులవంటి విశాలమైన కన్నులు కలదానా!; ఇట్లు, ఏల = ఈ విధంగా ఏల; జలేచరత్వమునన్= నీటిలో తిరిగే ప్రాణివి - మొసలివి కావటంవలన; ఈ+జలధిన్= ఈ మడుగులో; వసియించితి(వి)= ఉన్నావు; ఇప్పుడు= ఇపుడు; ఇట్లు; ఏల= ఎందుకు; సు, రూప, భామవు+అయితి(వి)= అందమైన కాంతవు అయ్యావు; నీవు, ఎందుల, దానవు= నీవు, ఎక్కడిదానవు; నావుడున్= అని అనగా; బాలిక= ఆ కాంత; పాండుపుత్త్రునకున్= పాండుకుమారునికి; పార్థునకున్= అర్జుననకు; ప్రియంబునన్= ప్రీతితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అందమైన ఆ కాంతను చూచి అర్జునుడు ఆశ్చర్యపడి 'నీ వేల మొసలివై ఈ విధంగా మడుగులో ఉన్నావు? ఇప్పుడు ఈ విధంగా ఎందుకు అందాలభామవయ్యావు? ఎక్కడి దానవు? అని అడుగగా ఆమె అర్జునునితో ఇట్లా అన్నది.

**వ. 'ఏను వంద యను నప్సరసఁ, గుబేరుననుంగ; నాసఖులు సౌరభేయియు సమీచియు బుద్బుదయు లతయు ననువారలు నలువురు నాయట్ల యత్తీర్థంబులం దున్నవారలు; వారిని శాపవిముక్తలం జేసి రక్షింపు' మనిన దానికి నర్జునుం డి ట్లనియె. 153**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; వంద, అను= వంద అనే పేరుగల; అప్సరసన్= అప్సరసను; కుబేరు, అనుంగన్= కుబేరునియొక్క చెలిని; నా సఖులు= నా స్నేహితురాండ్రు; సౌరభేయియు; సమీచియు; బుద్బుదయు; లతయున్; అనువారలు= అనేవాళ్లు; నలువురు= నలుగురు; నాయట్ల= నావలెనే; ఆ తీర్థంబులందున్= ఆ తీర్థాలలో; ఉన్నవారలు= ఉన్నారు; వారిని= వాళ్లను; శాపవిముక్తలన్= శాపంనుండి తొలగచేసి; రక్షింపుము= కాపాడు; అనినన్= అనిఅనగా; దానికిన్= ఆ అప్సరసకు; అర్జునుండు= అర్జునుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నా పేరు వంద, కుబేరుని స్నేహితురాలిని. నా స్నేహితురాండ్రు సౌరభేయి, సమీచి, బుద్బుద, లత అనేవాళ్ళు నలుగురూ నావలె తీర్థాలలో ఉన్నారు. వాళ్ళనికూడా శాపవిముక్తులను చేసి రక్షింపుము' అని అనగా ఆమెతో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** వంద అనేదానికి అనేకప్రతులలో నంద అనే పాఠాంతరం ఉన్నది. భాండార్కరు ప్రతి అథస్సూచికలో వర్షా; వర్చా, వృందా, వర్గా, వందా, విందా, నందా అనేవిధంగా అనేక పాఠాలున్నాయి. మూలభారతం వావిళ్ళవారి తెలుగులిపి ప్రతిలో 'అహం చ సౌరభేయీచ, సమీచీ బుద్బుదా లతా' అని ఉన్నది.

**క. 'వనజాక్షి! యేమికారణ। మున నుగ్రగ్రాహరూపములు దాల్చితి రీ?'**
**రని యడిగిన వేడుక నా। తని కది యి ట్లనుచుఁ జెప్పెఁ దద్విధమెల్లన్. 154**

**ప్రతిపదార్థం:** వనజ+అక్షి!= పద్మాలవంటి కన్నులుకలదానా! ఈరు= మీరు; ఏమి, కారణమునన్= ఏకారణంచేత; ఉగ్ర, గ్రాహ, రూపములు= భయంకరాలైన మొసళ్ళ రూపాలు; తాల్చితిరి= ధరించారు; అని, అడిగినన్= అని అడుగగా; అది= ఆ అప్సరస; వేడుకన్= సంతోషంతో; అతనికిన్= అర్జునునికి; ఇట్లు+అనుచున్= ఈ విధంగా అంటూ; తత్+విధము+ఎల్లన్= ఆ విధమంతా చెప్పెన్.

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులు కలదానా! ఏ కారణంవలన మీరు భయంకరాలైన ఈ మొసళ్ళరూపాలు తాల్చారు?' అని అడుగగా, ఆమె సంతోషంతో ఆ విధమంతా చెప్పింది.

**వ. వినవయ్య! యే మేవురము నఖిలలోకపాలపురంబులు చూచుచు భూలోకంబునకు వచ్చి యొక్క వనంబునం దుగ్రతపంబు సేయుచున్నవాని నత్యంతశాంతు నేకాంతచారి నగ్నికల్పు నొక్కబ్రాహ్మణుం గని వానితపంబునకు విఘ్నంబు సేయ సమకట్టి. 155**

**ప్రతిపదార్థం:** వినవయ్య!; ఏము= మేము; ఏవురము= అయిదుగురం; అఖిల, లోకపాల, పురంబులు= అందరు దిక్పాలకుల పట్టణాలు; చూచుచున్; భూలోకంబునకున్; వచ్చి; ఒక్క, వనంబునందున్= ఒక అడవిలో; ఉగ్ర, తపంబు= భయంకరమైన తపస్సు; చేయుచున్+ఉన్న= చేస్తూ ఉన్న; వానిన్= అతనిని; అత్యంత, శాంతున్= మిక్కిలిశాంతం కలవాడిని; ఏకాంతచారిన్= ఒంటరిగా ఉన్నవాడిని; అగ్నికల్పున్= అగ్నిదేవునితో సమానమైనవాడిని; ఒక్క, బ్రాహ్మణునిన్; కని= చూచి; వాని, తపంబునకున్; విఘ్నంబు, చేయన్= భంగం కలిగించటానికి; సమకట్టి= పూనుకొని.

**తాత్పర్యం:** మే మైదుగురం దిక్పాలకులందరిపట్టణాలు చూస్తూ, భూలోకానికి వచ్చాము. ఒక అడవిలో ఒంటరిగా కూర్చుండి భయంకరమైన తపస్సు చేస్తూ మిక్కిలిశాంతంగా, అగ్నిదేవునితో సమానంగా ఉన్న ఒక బ్రాహ్మణుడిని చూచి అతనితపస్సు చెడగొట్ట పూనుకొని.

**విశేషం:** ఆ బ్రాహ్మణుడు అత్యంతశాంతుడు, అగ్నికల్పుడు అని చెప్పటం పరస్పరవిరుద్ధంగా భాసించినా - కాని, అతడు సహజంగా అత్యంతశాంతుడనీ, ఆగ్రహిస్తే అగ్నితో సమానుడనీ ఇక్కడ గ్రహించాలి. అగ్నిహోత్రుడు పవిత్రతకు పెట్టింది పేరు కాబట్టి అగ్నికల్పుడనటంలో ఆ బ్రాహ్మణుని పవిత్రతకూడా వ్యక్తమవుతున్నది.

**క. వేడుక నమ్ముని ముందటఁ । బాడితి మాడితిమి; పెక్కుపరిహాసంబుల్**
**రూఢిగఁ బలికితి; మెట్లుం । జూడఁడు మావలను; నీరసుం డన నుండెన్. 156**

**ప్రతిపదార్థం:** వేడుకన్= వినోదంగా; ఆ+ముని, ముందటన్; పాడితిమి; ఆడితిమి; పెక్కు, పరిహాసంబుల్; రూఢిగన్=ప్రసిద్ధంగా; పలికితిమి; ఎట్లున్= ఏవిధంగానూ; మావలను= మావైపు; చూడడు; నీరసుండు+అనన్= అనురాగం లేనివాడు అన్నట్లు; ఉండెన్.

**తాత్పర్యం:** మేము వినోదంగా ఆ మునిముందట పాడాము. ఆడాము, అనేకపరిహాసాలు పలికాము. ఆయన ఏ విధంగా కూడా మా వైపు చూడక అనురాగం లేని వానివలె ఉన్నాడు.

**క. ధృతిహీనులచిత్తము ల । ట్లతివలయం దేల తగులు నత్యంతదృఢ**
**వ్రతులమనంబులు వారల । మతులఁ దృణస్త్రైణములు సమంబుల కావే. 157**

**ప్రతిపదార్థం:** ధృతి; హీనుల, చిత్తముల్+అట్ల= ధైర్యంలేని వాళ్ళ మనస్సులవలె; అత్యంత, దృఢవ్రతుల, మనంబులు= మిక్కిలి దృఢమైన నిష్ఠ కలవారి మనస్సులు; అతివల, అందున్= స్త్రీలలో; ఏల; తగులున్= తగుల్కొంటాయి; వారల, మతులన్= మిక్కిలి దృఢవ్రతులైనవారి మనస్సులలో; తృణ, స్త్రైణములు= గడ్డి, స్త్రీలసమూహం; సమంబులు+అ= సమానములే; కావె= కదా!

**తాత్పర్యం:** మనోనిగ్రహం కలవారిమనస్సులు, నిగ్రహం లేనివారి మనస్సులవలె స్త్రీల విషయంలో ఎందుకు తగులుకొంటాయి? నిగ్రహపరుల దృష్టిలో స్త్రీలు, గడ్డిపరకలు సమానములే కదా!

**వ. ఏము రాగకారణవికారంబులు గావించిన నవి దనకుం గోపకారణంబు లయిన నతికుపితుం డయి బ్రాహ్మణుండు మమ్మేవురను మహాగ్రాహంబులుగా శపియించిన నమ్మునివరునకు ముకుళితహస్తల మై యి ట్లంటిమి. 158**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; రాగ, కారణ, వికారంబు= అనురాగాన్ని కలిగించే పనులు; కావించినన్, అవి; తనకున్; కోప, కారణంబులు+అయినన్= కోపాన్ని కలిగించినవి కాగా; అతి, కుపితుండు+అయి= మిక్కిలికోపం కలవాడై; బ్రాహ్మణుండు; మమ్ము+ఏవురను= మా అయిదుగురిని; మహా, గ్రాహంబులు, కాన్= పెద్ద మొసళ్ళు అయ్యేటట్లు; శపియించినన్; ఆ+మునివరునకున్= ఆ మునిశ్రేష్ఠునికి; ముకుళిత, హస్తలము+ఐ = చేతులు జోడించినవాళ్ళమై - అంటే నమస్కరించి; ఇట్లు+అంటిమి.

**తాత్పర్యం:** మేము అనురాగాన్ని రేకెత్తించే చిలిపిచేష్టలు చేయగా - అవి, అతనికి కోపం తెప్పించాయి. ఆ బ్రాహ్మణుడు బాగా కోపించి మా అయిదుగురిని పెద్దమొసళ్ళు కండని శపించాడు. అప్పుడు మేము చేతులు జోడించి ఈ విధంగా అన్నాం.

**చ. అలుగుదురయ్య విప్రులు ? మహాపురుషుల్ పరుషాపరాధముల్**
**దలఁగెడువారు ధర్మువులు దప్పక సల్పెడువారు సత్యముల్**
**పలికెడువారు; వారల కపాయము డెందములం దలంచు మూ**
**ర్ఖులకు విధాతృచెయ్యువ నగున్ దురితంబులు దుర్యశంబులున్. 159**

**ప్రతిపదార్థం:** మహాపురుషులు= ఎంతోగొప్పవాళ్ళు; పరుష+అపరాధముల్= కఠినమైన మాటలను, తప్పులను; తలిఁగెడువారు= తొలగించేవాళ్ళు అంటే కఠినంగా మాట్లాడనివాళ్ళు, తప్పులను చేయనివాళ్ళు; ధర్మువులు= ధర్మాలను; తప్పక; సలిపెడువారు= ఆచరించేవాళ్ళు; సత్యముల్; పలికెడువారు; అయిన; విప్రులు= బ్రాహ్మణులు; అలుగుదురు+అయ్య= కోపపడతారా?; వారలకున్= అట్లాంటి బ్రాహ్మణులకు; అపాయము= హాని; డెందములన్= మనస్సులలో; తలంచు= ఆలోచనచేసే; మూర్ఖులకున్= బుద్ధి లేనివాళ్ళకు; విధాతృ, చెయ్యువనన్= బ్రహ్మదేవునిచేష్టలవలన దురితంబులు= పాపాలు; దుర్+యశంబులున్= అపకీర్తులు-అంటే చెడ్డపేరు; అగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఎంతో గొప్పవాళ్ళు, కఠినంగా మాట్లాడనివాళ్ళు, తప్పులు చేయనివాళ్ళు, ధర్మంగా నడచుకొనేవాళ్ళు; సత్యాలు పలికేవాళ్ళు అయిన బ్రాహ్మణులు కోపించటం తగునా? అట్లాంటి బ్రాహ్మణులకు హాని తలపెట్టే మూర్ఖులు బ్రహ్మదేవునివలన పాపాలు, అపకీర్తులు పొందుతారు.

**విశేషం:** అలుగుదురయ్య విప్రులు అని ప్రారంభించి సంస్కృతభాషాసంప్రదాయానుసారంగా విశేష్యం తరువాత పెక్కు విశేషణాలను ప్రయోగించటం భావతీవ్రతను పెంచటానికి బాగా దోహదం చేసింది.

**వ. 'కావున మాచేసిన యజ్ఞానంబు సహించి మాకు శాపమోక్షంబుఁ బ్రసాదింపు' మనిన నవ్విప్రుండును గరుణించి 'యెవ్వండేని మీచే గృహీతుం డయి మీయున్న జలాశయంబు మిమ్ము వెలువరించు నాతండ మీకు శాపమోక్షకారణుం డగు' ననిన. 160**

**ప్రతిపదార్థం:** కావున; మా, చేసిన= మేముచేసిన; అజ్ఞానంబు = తెలివితక్కువతనాన్ని; సహించి= ఓర్చుకొని; మాకున్; శాప, మోక్షంబున్= శాపం తొలగటాన్ని; ప్రసాదింపుము= అనుగ్రహింపుము - ఇమ్ము; అనినన్= అని అనగా; ఆ+విప్రుండును= ఆ బ్రాహ్మణుడుకూడా; కరుణించి= దయతలచి; ఎవ్వండు+ఏని= ఎవడైతే; మీచేతన్; గృహీతుండు+అయి= పట్టుకొన బడినవాడై; మీ, ఉన్న= మీరున్న; జల+ఆశయంబు= మడుగునుండి; మిమ్మున్, వెలువరించున్= బయటకు వేయునో; ఆతండు+అ= అతడే; మీకున్; శాప, మోక్ష, కారణుండు= శాపాన్ని తొలగించటానికి కారణమైనవాడు; అగున్; అనినన్.

**తాత్పర్యం:** 'అందువలన మా తెలివితక్కువతనాన్ని సహించి మాకు శాప విమోచనాన్ని ప్రసాదించండి' అని అడుగగా, ఆ బ్రాహ్మణుడుకూడా దయతలచి, 'మీరు పట్టుకున్నపుడు ఎవడైతే మిమ్మల్ని మీ మడుగునుండి బయటకు పడవేస్తాడో వాడే మీ శాపవిమోచనానికి కారకుడు అవుతాడు' అనగా.

**సీ. అట్టిమహాబాహుఁ డత్యంతబలుఁ డెవ్వఁ । డగునొక్కొ! యనుచు నే మరుగుదెంచు**
**వారము త్రైలోక్యవర్తి నంబుజభవ । ప్రభవు నారదుఁ గని భక్తితోడ**
**మ్రొక్కిన మమ్ము నమ్ముని చూచి 'యి ట్లేల । వగఁ బొంది కందినవార?' లనియు**
**నడిగి మావృత్తాంత మంతయు మాచేత । విని, 'విప్రునలుకయు విధికృతంబుఁ**

**ఆ. గ్రమ్మఱింప లావె! కావున దక్షిణ । జలధితీరమునఁ బ్రశస్త పంచ**
**తీర్థములకు నేఁగి ధృతి నందు నూఱేఁడు । లుండుఁ డట్లు మీర లుండు నంత'. 161**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; మహా, బాహుఁడు= పెద్దచేతులు గలవాడు; అత్యంత, బలుఁడు= మిక్కిలిబలంకలవాడు; ఎవ్వఁడు+అగున్+ఒక్కొ= ఎవడై ఉన్నాడో; అనుచున్= అని అనుకొంటూ; ఏము= మేము; అరుగుదెంచువారము= వస్తున్నవాళ్ళము; త్రైలోక్యవర్తిన్= మూడులోకాలు తిరిగేవాడిని; అంబుజభవ, ప్రభవు= పద్మంనుండి జన్మించిన బ్రహ్మదేవుడికి పుట్టినవానిని; నారదున్= నారదమహర్షిని; కని= చూచి; భక్తితోడన్= భక్తితో; మ్రొక్కి= నమస్కరించి; మమ్మున్= మమ్ములను; ఆ+ముని= ఆ నారదుడు; చూచి; ఇట్లు; ఏల= ఎందుకు; వగన్= దుఃఖాన్ని; పొంది; కందినవారలు= నలుపెక్కినవారు; అనియున్= అనికూడా; అడిగి; మా వృత్తాంతము+అంతయు; మాచేతన్= మావల్ల; విని; విప్రు, అలుకయున్= బ్రాహ్మణునియొక్క కోపాన్ని; విధి, కృతంబున్= బ్రహ్మచేసిన పనిని; క్రమ్మఱింపన్= మరల్చటానికి; లావె= సాధ్యమా (కాదనిభావం); కావున; దక్షిణ, జలధి, తీరమునన్= దక్షిణసముద్రతీరంలో; ప్రశస్త, పంచ, తీర్థములకున్= ప్రసిద్ధిపొందిన అయిదు నీటిమడుగులకు; ఏఁగి= వెళ్ళి; ధృతిన్= ధైర్యంతో; అందున్= ఆ మడుగులలో; నూఱు+ఏఁడులు= వందసంవత్సరాలు; ఉండుఁడు= ఉండండి; అట్లు, మీరలు= ఆ విధంగా మీరు; ఉండు, అంతన్= ఉండగా.

**తాత్పర్యం:** అట్లాంటి (మాచేత పట్టుబడి మమ్మల్ని మడుగులనుండి బయట పడవేయగలిగిన) గొప్ప చేతులు కలవాడు; మిక్కిలి బలం కలవాడు; ఎవడా? అని అనుకొంటూ వస్తున్న మేము, ముల్లోకాలలో సంచరించే, బ్రహ్మపుత్రుడైన నారదుడిని చూచి, భక్తితో నమస్కరించాము. ఆ మహాముని మమ్మల్ని చూచి 'ఇట్లా ఎందుకు దుఃఖంతో నల్లబడ్డా'? రని అడిగాడు. మా వృత్తాంతమంతా చెప్పగా విని, 'బ్రాహ్మణులకోపం, బ్రహ్మదేవునిచేష్ట మరలింప సాధ్యం కాని' వని 'దక్షిణసముద్రతీరంలో ప్రసిద్ధికెక్కిన అయిదు మడుగులకు వెళ్ళి, వాటిలో ధైర్యంగా నూరుసంవత్సరాలు ఉండండి; అట్లా మీరు ఉండగా'.

**క. 'జననుతుఁడు పాండుతనయుఁడు । ధనంజయుఁ డశేషతీర్థదర్శనకాంక్షం**
**జనుదెంచి మీకు దయ నమ్ముని చెప్పినయట్ల శాపమోక్షము సేయున్'. 162**

**ప్రతిపదార్థం:** జన, నుతుఁడు= ప్రజలచే కొనియాడబడేవాడు; పాండు, తనయుఁడు= పాండురాజుకుమారుడు; ధనంజయుఁడు= అర్జునుడు; అశేష, తీర్థ, దర్శన కాంక్షన్= అన్ని పుణ్యతీర్థాలను చూడాలనే కోరికతో; చనుదెంచి= వచ్చి; ఆ+ముని; చెప్పిన, అట్ల= చెప్పినట్లే; దయన్= దయతో; మీకున్, శాప, మోక్షము= మీకు శాపాన్ని తొలగించటం; చేయున్= చేస్తాడు.

**తాత్పర్యం:** ప్రజల ప్రశంసలందుకొన్నవాడు, పాండురాజుకుమారుడు అయిన అర్జునుడు అన్ని పుణ్యతీర్థాలను చూడాలన్న కోరికతో వస్తాడు. ఆ ముని చెప్పినట్లే దయతో మీకు శాపవిమోచనాన్ని కలిగిస్తాడు.

**వ. 'అనిన నన్నారదువచనంబులు విని వచ్చి మహోగ్రగ్రాహముల మై భవదాగమనంబు ప్రతీక్షించుచు నిప్పంచతీర్థంబుల నుండి నేఁడు నీకారణంబునం గృతార్థుల మయితి' మనిన నర్జునుండును గరుణాయత్తచిత్తుం డయి వంద చెప్పినయన్నలువురకు శాపమోక్షణంబు సేసిన, నమరకన్యక లతిహర్షంబున నమరేంద్రనందను దీవించి దేవలోకంబున కరిగి; రదిమొదలుగా నిప్పంచతీర్థంబులు నారీతీర్థంబులు నాఁ బరగె; నర్జునుండును గ్రమ్మఱ మణిపూరపురంబునకు వచ్చి రాజ్యలీల సుఖంబుండి చిత్రాంగదయందు బభ్రువాహనుం డను పుత్త్రుం బడసి చిత్రవాహనునకు వంశకరుంగా నిచ్చి, వాని వీడ్కొని గోకర్ణంబుఁ జూచుచుఁ బశ్చిమసముద్రపార్శ్వంబునఁ బ్రభాసం బను తీర్థంబునకుఁ జని, యందులకు ద్వారవతి పురంబు కుఱంగలి యని విని. 163**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; ఆ+నారదు, వచనంబులు= ఆ నారదుని మాటలు; విని; వచ్చి; మహా+ఉగ్ర, గ్రాహములము+ఐ= మిక్కిలి భయంకరమైన మొసళ్ళమై; భవత్+ఆగమనంబు= మీయొక్క రాకను; ప్రతీక్షించుచున్= ఎదురుచూస్తూ; ఈ+ పంచ తీర్థంబులన్= ఈ అయిదు తీర్థాలలో; ఉండి; నేఁడు= ఈ దినం; నీ, కారణంబునన్= నీ వల్ల; కృత+అర్థులము= తీరిన కోరిక కలవాళ్ళం; అయితిమి; అనినన్= అని అనగా; అర్జునుండును; కరుణా+ఆయత్త, చిత్తుండు+అయి= దయతో కూడిన మనస్సు కలవాడై; వంద, చెప్పిన= వంద తెలిపిన; ఆ+నలువురకున్= ఆ నలుగురికి; శాప, మోక్షణంబు= శాపంనుండి విడిపించటాన్ని; చేసినన్= చేయగా; అమర, కన్యకలు= దేవకన్యకలు; అతి, హర్షంబునన్= మిక్కిలి సంతోషంతో; అమర+ఇంద్ర, నందనున్= దేవేంద్రుని కుమారుడైన అర్జునుడిని; దీవించి= ఆశీర్వదించి; దేవ లోకంబునకు= దేవలోకానికి; అరిగిరి= వెళ్ళారు; అదిమొదలుగాన్; ఈ+పంచతీర్థంబులు= ఈ ఐదు తీర్థాలు; నారీ, తీర్థంబులునాన్= నారీ తీర్థాలని; పరఁగెన్= ఒప్పిఉన్నాయి; అర్జునుండును; క్రమ్మఱ= తిరిగి; మణిపూర, పురంబునకున్ =

మణిపూర నగరానికి; వచ్చి, రాజ్యలీల, సుఖంబు+ఉండి= రాజ్యభోగాలతో సుఖంగా ఉండి; చిత్రాంగద, అందున్= చిత్రాంగదయందు; బభ్రువాహనుండు+అను; పుత్త్రున్= కుమారుని; పడసి= పొంది; చిత్రవాహనునకున్= చిత్రవాహనునికి; వంశకరున్+కాన్= వంశంనిలిపేవాడినిగా - అంటే వంశవృద్ధి చేసేవాడినిగా; ఇచ్చి; వానిన్= ఆ చిత్రవాహనుడిని; వీడ్కొని; గోకర్ణంబున్= గోకర్ణతీర్థాన్ని; చూచుచున్, పశ్చిమ, సముద్ర, పార్శ్వంబునన్= పడమటి సముద్రం ప్రక్క; ప్రభాసంబు+అను, తీర్థంబునకున్= ప్రభాసం అనే పేరుగల తీర్థానికి; చని= వెళ్ళి; అందులకున్= అక్కడికి; ద్వారవతి, పురంబు= ద్వారకా నగరం; కుఱంగలి= దగ్గర; అని; విని.

**తాత్పర్యం:** 'అని చెప్పిన ఆ నారదునిమాలు విని వచ్చి, మిక్కిలి భయంకరమైన మొసళ్ళమై, మీ రాకకోసం ఎదురుచూస్తూ, నేడు నీవలన కోరిక తీరినవాళ్ళం అయ్యాము' - అని అనగా అర్జునుడుకూడా వంద అడిగినట్లు ఆ నలుగురికి దయతో శాపవిమోచనం కావించాడు. ఆ దేవకన్యలు ఎంతో సంతోషించి, దేవేంద్రతనయుడైన అర్జునుడిని ఆశీర్వదించి దేవలోకానికి వెళ్ళారు. ఆనాటినుండి ఆ పంచతీర్థాలకు నారీతీర్థాలనే పేరు కలిగింది. అర్జునుడుకూడా మణిపూరపురానికి తిరిగి వచ్చి రాజ్యభోగాలనుభవిస్తూ చిత్రాంగదయందు బభ్రువాహనుడనే కుమారుడిని పొంది, ఆ బాలుడిని చిత్రవాహనునికి వంశకరునిగా - అంటే వంశం నిలిపేవాడిగా ఇచ్చి, అక్కడి నుండి బయలుదేరి గోకర్ణతీర్థాన్ని చూస్తూ, పడమటిసముద్రంప్రక్కన ప్రభాసతీర్థానికి వెళ్ళి, అక్కడికి ద్వారవతి దగ్గర, అని విని.

**విశేషం:** చిత్రవాహనుడు కోరినట్లు (చూడు.144. పద్యం) చిత్రాంగదకు పుట్టిన బభ్రువాహనుడిని (దౌహిత్రుడిని) వంశకరునిగా అర్జునుడు అతనికి ఇవ్వటం జరిగింది.

**సీ. 'అందుల కేఁగి యే నిందీవరశ్యాము । నరవిందనాభు నంబురుహనేత్రు**
**సన్మిత్రుఁ జూచి నాజన్మంబు సఫలంబు । సేయుదు నఘములు వాయుపొంటె;**
**నదియునుంగాక, మున్ గదుఁ డనువానిచే । వింటిఁ దిలోత్తమకంటె రూప**
**వతియట్టె సద్గుణాన్వితయట్టె నా కట్టి । భద్రేభగమన సుభద్రఁ జూచు**

**ఆ. వేడుకయును గలదు; విష్ణుభట్టారకు । దయ నభీష్టసిద్ధి దనరు' ననుచుఁ**
**దద్ద సంతసిల్లి తద్ద్వారకాపురి । కరుగ నిశ్చయించె నర్జునుండు. 164**

**ప్రతిపదార్థం:** అందులకున్= ఆ ద్వారవతికి; ఏఁగి= వెళ్ళి; ఏన్=నేను; ఇందీవర, శ్యామున్= నల్లకలువవంటి నల్లనిరంగు కలవాడిని; అరవింద, నాభున్= పద్మాన్ని బొడ్డుగా కలవాడిని; అంబురుహ, నేత్రున్= పద్మాలవంటి కన్నులు కలవాడిని; సత్+మిత్రున్= మంచిస్నేహితుడిని; చూచి, నా, జన్మంబు; సఫలంబు; చేయుచున్; అఘములు= పాపాలు; పాయుపొంటెన్= పోగొట్టుకోవటం కొరకు; అదియునున్+కాక= అదీకాక; మున్= పూర్వం; గదుఁడు+అనువానిచే; వింటిన్; (సుభద్ర) తిలోత్తమకంటెన్; రూపవతి; అటె= అందమైనదట; సద్గుణ+అన్విత, అట్టె= మంచిగుణాలతో కూడుకొన్నదట; నాకున్; అట్టి; భద్ర+ఇభ, గమన= మదపుటేనుగువంటి నడకకలదైన - అంటే అందమైన నడకగల; సుభద్రన్; చూచు; వేడుకయును= కుతూహలంకూడా; కలదు; విష్ణుభట్టారకు, దయన్= శ్రీకృష్ణునియొక్క దయచేత; అభీష్ట, సిద్ధి= కోరిక నెరవేరటం; తనరున్= ఒప్పును (కలుగుతుంది); అనుచున్= అంటూ; తద్ద= మిక్కిలి; సంతసిల్లి; అర్జునుండు; తత్; ద్వారకాపురికిన్= ఆ ద్వారకానగరానికి; అరుగన్= వెళ్ళటానికి; నిశ్చయించెన్.

**తాత్పర్యం:** అక్కడికి వెళ్ళి నల్లకలువవంటి నల్లనిశరీరం కలవాడు, పద్మాన్ని బొడ్డుగా కలవాడు; పద్మంవంటి కన్నులు కలవాడు; నాకు మంచి స్నేహితుడు అయిన శ్రీకృష్ణుడిని చూచి, జన్మ సఫలత పొందేటట్లు, పాపాలు పోగొట్టుకొంటాననీ - ఇదివరకు గదుడు అనేవాడు చెప్పగా తిలోత్తమకంటె రూపవతి, సుగుణాలరాశి అని విన్న ఆ అందమైన నడక గల సుభద్రను చూచేవేడుక కూడ కలదనీ- శ్రీకృష్ణునిదయతో తనకోరికకూడా (సుభద్రను చేపట్టాలన్న కోరిక) నెరవేరుతుందనీ - ఎంతో సంతోషించి అర్జునుడు ఆ ద్వారకానగరానికి వెళ్ళాలని నిశ్చయించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. మఱియు నప్పురంబునం ద న్నొరు లెఱుంగకుండ వలయు ననియు, యాదవులు యతుల కతిభక్తు లనియును మనంబునం దలంచి కృతకయతివేషధరుం డయి. 165**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఆ+పురంబునన్= ఆ ద్వారవతీనగరంలో; తన్ను= తనను; ఒరులు= ఇతరులు; ఎఱుంగకుండవలయున్= తెలియకుండా ఉండాలి; అనియున్= అని; యాదవులు; యతులకున్= సన్న్యాసకులకు; అతిభక్తులు= మిక్కిలి భక్తులని; అనియును; మనంబునన్= మనస్సులో; తలంచి= అనుకొని; కృతక, యతి, వేష, ధరుండు+అయి= కపట సన్న్యాసివేషాన్ని ధరించినవాడై.

**తాత్పర్యం:** అంతేకాక ఆ ద్వారవతీనగరంలో తన్ను ఇతరులు తెలిసికొనకుండా ఉండాలని, యాదవులు సన్న్యాసులపట్ల మిక్కిలి భక్తి గలవాళ్ళని - ఆలోచించి, కపటసన్న్యాసి వేషాన్ని ధరించి.

**విశేషం:** ఇంతవరకు అర్జునుడు వ్రతయాత్రా సముచిత వేషంతోనే ఉన్నాడు. ఇప్పుడు మాత్రమే కృతక యతివేషధరుడయ్యాడు.

**క. పరమబ్రహ్మణ్యు జగద్గురు । గరుడధ్వజు ననంతగుణు నేకాగ్ర**

**స్థిరమతి యై నిజహృదయాం । తరసుస్థితుఁ జేసి భక్తిఁ దలఁచుచు నుండెన్. 166**

**ప్రతిపదార్థం:** పరమబ్రహ్మణ్యున్= మిక్కిలిగా బ్రాహ్మణులమేలు కోరేవాడిని; జగత్+గురున్= లోకానికంతకూ గురుడైన వాడిని; గరుడ, ధ్వజున్= గరుత్మంతుడిని రథకేతనంగా కలవాడిని; అనంత, గుణున్= అంతులేని సుగుణాలు కలవాడిని; ఏక+అగ్ర, స్థిరమతి+ఐ= ఒకదానిపైనే స్థిరమైన బుద్ధికలవాడై; నిజ, హృదయ+అంతర, సుస్థితున్+చేసి= తన మనస్సులో చక్కగా ఉన్నవాడిని చేసి; భక్తిన్= భక్తితో; తలఁచుచున్, ఉండెన్ = భావిస్తూ (ధ్యానిస్తూ) ఉండినాడు.

**తాత్పర్యం:** మిక్కిలిగా బ్రాహ్మణులమేలుకోరేవాడు, లోకానికంతకూ గురుడైనవాడు, గరుత్మంతుని ధ్వజంగా కలవాడు, అంతులేని సుగుణాలు కలవాడు అయిన శ్రీకృష్ణుడిని ఏకాగ్రచిత్తుడై మనస్సులో నిలిపి భక్తితో ధ్యానించాడు.

**క. నరు నునికి యెఱిఁగి కృష్ణుడు । తిరముగ దయతోఁ బ్రభాసతీర్థమునకు నొ**

**క్కరుఁడ చనుదెంచె; సర్వే । శ్వరుఁ డెప్పుడు భక్తులకుఁ బ్రసన్నుఁడ కాఁడే. 167**

**ప్రతిపదార్థం:** నరు, ఉనికి= అర్జునుడు ఉండటాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; కృష్ణుఁడు; తిరముగన్= స్థిరంగా; దయతోన్= అనుగ్రహంతో; ఒక్కరుఁడు+అ= ఒక్కడే; ప్రభాసతీర్థమునకున్; చనుదెంచెన్= వచ్చాడు; సర్వ+ఈశ్వరుఁడు= సర్వమునకు ప్రభువైన భగవంతుడు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; భక్తులకున్; ప్రసన్నుఁడు+అ, కాఁడే= అనుగ్రహించేవాడే కదా!

**తాత్పర్యం:** అర్జునుడున్నాడని తెలిసికొని దయతో శ్రీకృష్ణుడు తానొక్కడే ప్రభాసతీర్థానికి వచ్చాడు. భగవంతుడు ఎల్లప్పుడు భక్తులకు ప్రసన్నుడే గదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

### అర్జునుండు ద్వారకానగరంబునకుఁ జనుట (సం. 1-210-4)

**వ. ఇట్లు దనకడకు వచ్చిన యాదిదేవునకు దేవకీనందనునకు నతిసంభ్రమంబున నమస్కరించి పురందరనందనుం డానందజలభరితనయనుం డయి యి ట్లనియె. 168**

**ప్రతిపదార్థం:** ఇట్లు; తన, కడకున్= తన దగ్గరకు; వచ్చిన= విచ్చేసిన; ఆదిదేవునకున్= శ్రీమహావిష్ణువుకు; దేవకీ, నందనునకున్= దేవకీదేవియొక్క కుమారునికి, శ్రీకృష్ణునికి; అతి, సంభ్రమంబునన్= మిక్కిలి వేగిరపాటుతో; నమస్కరించి; పురందర, నందనుండు= దేవేంద్రునికుమారుడు - అర్జునుడు; ఆనంద, జల, భరిత, నయనుండు+అయి= ఆనందబాష్పాలతో నిండిన కన్నులు కలవాడై; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా తన దగ్గరకు వచ్చిన మహావిష్ణువు, దేవకీదేవి తనయుడు అయిన శ్రీకృష్ణునికి ఎంతో వేగిరపాటుతో నమస్కరించి అర్జునుడు ఆనందబాష్పాలు నిండిన కన్నులతో ఇట్లా అన్నాడు.

**ఉ. ద్వాదశమాసికవ్రతము ధర్మవిధిం జలుపంగ నేఁగి గం**
**గాదిమహానదీహిమవదాదిమహాగిరిదర్శనంబు మీ**
**పాదపయోజదర్శనముఁ బన్నుగఁ జేయుటఁ జేసి పూర్వసం**
**పాదిత సర్వపాపములుఁ బాసె భృశంబుగ నాకు నచ్యుతా! 169**

**ప్రతిపదార్థం:** అచ్యుతా= శ్రీకృష్ణా!; ద్వాదశ, మాసిక, వ్రతము= పండ్రెండునెలల వ్రతము; ధర్మ, విధిన్= ధర్మపద్ధతిగా; చలుపంగన్= చేయటానికి; ఏఁగి= వెళ్ళి; గంగా+ఆది; మహా, నదీ, హిమవత్+ఆది, మహా, గిరి, దర్శనంబు= గంగ మొదలైన మహానదులయొక్క, హిమాలయం మొదలైన మహాపర్వతాలయొక్క దర్శనం; మీ, పాద, పయోజ, దర్శనమున్= మీ పాదపద్మాలయొక్క దర్శనాన్ని; పన్నుగన్= క్రమంగా; చేయుటన్+చేసి= చేయటంవలన; నాకు= నాకు; పూర్వ; సంపాదిత,సర్వ, పాపములు= ఇదివరకు సంపాదించుకొన్న అన్నిపాపాలు; భృశంబుగన్= అధికంగా - అంటే పూర్తిగా; పాసెన్= తొలగిపోయాయి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! ద్వాదశమాసికవ్రతాన్ని ధర్మపద్ధతిగా ఆచరించటంకోసం వెళ్ళి, గంగ మొదలైన మహానదుల దర్శనం, హిమాలయం మొదలైన మహాపర్వతాల దర్శనం, మీ పదపద్మాల దర్శనం చేయటం వలన నాకు పూర్వ పాపాలన్నీ పూర్తిగా తొలగిపోయాయి.

**విశేషం:** 'ద్వాదశమాసికవ్రతము'ను గురించి పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు ఈ విధంగా వివరించారు. "సంస్కృతభారతము, శ్లో॥ ద్రౌపద్యా వ స్సమాసీన మన్యోన్యం యోఽభిదర్శయేత్, సనోద్వాదశవర్షాణి బ్రహ్మచారీ వనే వసేత్॥" - ఈ విధముగా పండ్రెండేళ్ళు వ్రతము సలుపవలెనని యుండఁగా నన్నయభట్టారకుఁడు 'ద్వాదశమాసికవ్రతము' అని సంవత్సరపదమునకు మాసమని అర్థము చెప్పుట మీమాంసాద్యనుసారముగా నని యెఱుంగునది. మీమాంసశాస్త్రమందు సహస్రసంవత్సరవ్రతము మనుష్యులకెట్లు సాధ్యమగునని విచారించి యొకపక్షంబున సంవత్సరశబ్దము మాసపర్యాయమని చెప్పఁబడినది. దానికి

శ్రుతిప్రమాణముకలదు - 'యో మాస స్సంవత్సరః' (శ్రీమదాంధ్రమహాభారతము ఆదిపర్వము లఘుటీక) ద్వాదశమాసికవ్రతం ప్రాయశ్చిత్తరూపమైన వ్రతం. సకల తీర్థ స్నానాలవలన పూర్వం చేసిన పాపాలు తొలగిపోతాయని సామాన్యులైన తైర్థికుల అభిప్రాయం. కాని, అర్జునుడు నారాయణభక్తుడు. గంగాస్నానం చేయటంవలననే కాక ఆ గంగ పుట్టినచోటైన నారాయణ పాదపద్మాలను దర్శించినప్పుడే పూర్వ (జన్మ) పాపాలన్నీ పోయి నిర్వాణం సిద్ధిస్తుందని అర్జునుని ప్రౌఢోక్తి. అందుకే చివరి క్షేత్రం ద్వారవతి కావటం విశేషం. ప్రౌఢోక్తిమూలమైన వస్తుధ్వని గమ్యమానం. అర్థవ్యక్తి అనే శబ్దగుణాన్ని ఈ రచనలో సార్థకంగా ప్రయోగించాడు నన్నయ.

**వ. అనిన విని నగుచు నబ్జనాభుం డర్జును నతిస్నేహంబునం గౌఁగిలించుకొని యెల్లవారల కుశలంబును నడిగి, యాతని తీర్థాభిగమననిమిత్తంబును సుభద్రయందు బద్ధానురాగుం డగుటయు నుపలక్షించి, ద్వారకాపురంబునకుఁ దోడ్కొని యరిగి. 170**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిఅనగా; విని; నగుచున్= నవ్వుతూ; అబ్జనాభుండు= పద్మనాభుడైన శ్రీకృష్ణుడు; అర్జునున్; అతి, స్నేహంబునన్= మిక్కిలి ప్రీతితో; కౌఁగిలించుకొని; ఎల్లవారల, కుశలంబును= అందరి క్షేమాన్ని; అడిగి; అతని; తీర్థ+అభిగమన; నిమిత్తంబును= తీర్థయాత్రలకు వెళ్ళటానికి కల కారణాన్ని; సుభద్ర, అందున్; బద్ధ+అనురాగుండు+ అగుటయున్= తగులుకొన్న ప్రేమ కలవాడు కావటమూ; ఉపలక్షించి= గమనించి; ద్వారకా, నగరంబునకున్; తోడ్కొని= తీసికొని; అరిగి= వెళ్ళి.

**తాత్పర్యం:** అర్జునునిమాటలు విని శ్రీకృష్ణుడు నవ్వుతూ అతడిని గాఢంగా కౌగిలించుకొని, ఇంద్రప్రస్థంలో అందరి కుశలం అడిగి, అతడు తీర్థయాత్రలు చేయటానికి గల కారణాన్నీ, సుభద్రపై అతనికున్న అనురాగాన్నీ తెలిసికొని ద్వారకానగరానికి పిలిచికొని వెళ్ళి.

**విశేషం:** ఆ జగన్నాటకసూత్రధారి శ్రీకృష్ణుని నవ్వులో, కౌగిలింతలో అర్జునుని రాకవలన, అతనిభక్తిస్నేహాలవలన కలిగిన ఆనందం ఉన్నది. సుభద్రను చేపట్టాలన్న అతని ఆంతర్యాన్నిగూర్చిన అవగాహనం ఉన్నది. అది సఫలం చేస్తానన్న సూచనకూడ ఉన్నది.

**ఉ. భ్రాజితశాతకుంభగృహపంక్తులఁ బుష్పితవల్లివేల్లితో**
**ర్వీజవనావృతిన్ విమలవిద్రుమవజ్రవిచిత్రవేదికా**
**రాజిఁ గరంబు రమ్య మగు రైవతకాచలకందరంబునన్**
**రాజకులైకసుందరుఁ బురందరనందను నుంచి లీలతోన్. 171**

**ప్రతిపదార్థం:** భ్రాజిత, శాతకుంభ, గృహ, పంక్తులన్= ప్రకాశిస్తున్న బంగారుమేడలసమూహాలచేతా; పుష్పిత, వల్లి, వేల్లిత+ఉర్వీజ, వన+ఆవృతిన్= పూసినతీగలచే చుట్టబడిన చెట్లు కల పెంపుడువనాలు చుట్టబడటంచేతను; విమల, విద్రుమ, వజ్ర, విచిత్ర, వేదికా, రాజిన్= నిర్మలాలైన పగడాలచేతా, వజ్రాలచేత, వింతయైన అరుగుల సమూహంచేతా; కరంబు= మిక్కిలి; రమ్యము+అగు= అందమైన; రైవతక+అచల, కందరంబునన్= రైవతకమనే పేరుకల పర్వతంయొక్క గుహలో; రాజ, కుల+ఏక, సుందరున్= రాజవంశానికంతటికీ అందగాడైన వాడిని; పురందర, నందనున్= దేవేంద్ర తనయుడిని - అర్జునుడిని; ఉంచి= ఉండునట్లు చేసి; లీలతోన్= విలాసంతో.

**తాత్పర్యం:** మెరుస్తున్న బంగారు మేడల సమూహాలు, పూసినతీగల పెనవేసికొన్న చెట్లతో కూడిన ఉద్యానవనాలు చుట్టూ ఉండగా నిర్మలాలైన పగడాలతో, వజ్రాలతో, చిత్రవిచిత్రాలైన అరుగులతో ఎంతో అందమైన రైవతకాద్రి గుహలో రాజవంశానికంతా అందగాడైన అర్జునుడిని ఉంచి - విలాసంతో.

**విశేషం:** ఇందులో శ్లేష అనే గుణం సందర్భోచితంగా పోషింపబడింది. రమణీయమైన అర్థఘటనతో కూడిన మసృణత్వం ఇందులో సార్థకం. రాజకులైకసుందరుడు - అన్నప్పుడు రాజంటే క్షత్రియుడు, రాజు, చంద్రుడనే అర్థాలు చెప్పుకొనవచ్చు. అంటే అర్జునుడు చంద్రునివంశంలో అందమైనవాడు, పైపెచ్చు పురందరనందనుడు. అతనియోగ్యతకు తగినస్థలం రైవతకాద్రి. బంగారుమేడలు, తోటలు, అరుగులు మొదలైనవి రాజభోగాల చిహ్నాలు. రమణీయసన్నివేశాన్ని అక్షరరమ్యంగా, బహుపదాలు ఏకపదవద్భావం పొందినట్లుగా చేసిన రచన శ్లేష. అది ఇందులో అనువుగా అందగించింది. (సంపా.)

**క. శ్రీపతి గడునెయ్యంబున । నాపోవక పార్థునొద్ద నారాత్రి ప్రియా**
**లాపములఁ దగిలి యుండెను । దీపమణుల్ వెలుఁగ భువనదీపుఁడు దానున్. 172**

**ప్రతిపదార్థం:** భువనదీపుఁడు= లోకాలను వెలిగించేవాడు; తానున్= తానూ; శ్రీపతి= శ్రీకృష్ణుడు; కడున్= మిక్కిలి; నెయ్యంబునన్= స్నేహంచేత; ఆపు+ఓవక= తనివితీరక; పార్థు, ఒద్దన్= అర్జునునిదగ్గర; ఆ, రాత్రి; దీప, మణుల్= మణిదీపాలు; వెలుఁగన్; ప్రియ+ఆలాపములన్= ఇష్టమైన సంభాషణలతో; తగిలి; ఉండెను.

**తాత్పర్యం:** ఆ రాత్రి మణిదీపాలు వెలుగుతుండగా శ్రీకృష్ణుడు స్నేహాతిశయంతో తనివితీరక అర్జునునితో ఇష్టమైనసంభాషణలతో గడిపాడు.

**వ. ఇట్లు పరమపురుషు లయిన నరనారాయణులు దమ పూర్వజన్మ సహవాసంబున య ట్లప్పుడు పరమానందంబునఁ బరస్పరప్రియమధురసంభాషణంబుల నొక్కటనుండి యారాత్రి సలిపి; రంతఁ బ్రభాతంబ వాసుదేవుండు వాసవనందను నంద యుండం బంచి కాంచనరథారూఢుం డయి పురంబునకుం జని పౌరజనప్రధానసమక్షంబున రైవతకమహోత్సవంబు ఘోషింపం బంచిన. 173**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పరమపురుషులు+అయిన= మహాపురుషులైన; నర, నారాయణులు= అర్జునుడు, శ్రీకృష్ణుడు; పూర్వజన్మ, సహవాసంబునన్= తాము పూర్వజన్మలో కూడి ఉండటంవలన (బదరికాశ్రమంలో ఇద్దరూ తపస్సు చేశారు); అట్లు= అప్పుడు; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషంతో; పరస్పర, ప్రియ, మధుర, సంభాషణంబులన్= ఒకరితో ఒకరు ఇంపైన తీయని మాటలతో; ఒక్కటన్+ఉండి= ఒకటిగా ఉండి; ఆ రాత్రి= ఆ దినం రాత్రి; సలిపిరి= గడిపారు; అంతన్= తరువాత; ప్రభాతంబు+అ= వేకువనే; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; వాసవ, నందనున్= దేవేంద్రతనయుడిని - అర్జునుడిని; అందు+అ= అక్కడే; ఉండన్; పంచి= ఉండుటకై నియోగించి; కాంచన; రథ+ఆరూఢుండు+అయి= బంగారురథాన్ని ఎక్కినవాడై; పురంబునకున్= ద్వారకానగరానికి; చని= వెళ్ళి; పౌరజన, ప్రధాన, సమక్షంబునన్= పురజనులయొక్క, మంత్రులయొక్క ఎదుట; రైవతక= రైవతకపర్వత సంబంధమైన; మహా+ఉత్సవంబు= గొప్పపండుగను; ఘోషింపన్= చాటటానికి; పంచినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా పరమపురుషులైన అర్జునుడు; శ్రీకృష్ణుడు తాము పూర్వజన్మలో నరనారాయణులుగా బదరికాశ్రమంలో తపస్సు చేస్తూ సహవాసం చేశారు కనుక - మహానందంతో, పరస్పరం ఇంపైన తీయని మాటలతో

ఆ రాత్రి గడిపారు. వేకువనే శ్రీకృష్ణుడు అర్జునుడిని అక్కడే ఉండవలసిందని చెప్పి, తాను బంగారురథం ఎక్కి, ద్వారకాపురానికి వెళ్ళి, పురజనుల, మంత్రుల సమక్షంలో రైవతకమహోత్సవాన్ని చాటించటానికి ఆజ్ఞాపించాడు.

**చ. పొలుపుగఁ బూసి కట్టి తొడి భూరివిభూతిప్రకాశితంబుగాఁ**
**గలయఁగఁ దత్పురీజనులు కాంస్యమృదంగముకుందవేణుకా**
**హలపటహధ్వనుల్ చెలఁగ నాటలుఁ బాటలు నొప్పె నెల్లవా**
**రలుఁ జని చేసి రర్చనలు రైవతకాద్రికి నుత్సవంబుతోన్. 174**

**ప్రతిపదార్థం:** తత్+పురీ, జనులు= ఆ ద్వారకానగర ప్రజలు; ఎల్లవారలున్= అందరూ; పొలుపుగన్= అందంగా; పూసి= మైపూతలు పూసుకొని; కట్టి= వస్త్రాలు కట్టి; తొడి= సొమ్ములు ధరించి; భూరి, విభూతి= గొప్పసంపద; ప్రకాశితంబు, కాన్= ప్రకటమయ్యేటట్లుగా; కలయఁగన్= కూడగా; కాంస్య, మృదంగ, ముకుంద, వేణు, కాహళ; పటహ, ధ్వనుల్= కంచుతాళాల యొక్క, మృదంగాలయొక్క, ముకుంద వాద్య విశేషాలయొక్క, పిల్లన గ్రోవులయొక్క, కాహళవాద్యాలయొక్క, తప్పెటలుయొక్క; శబ్దాలు; చెలఁగన్= వ్యాపించగా; ఆటలున్, పాటలున్= ఆటలూ, పాటలూ; ఒప్పన్= తనరగా; రైవతక+అద్రికిన్= రైవతక పర్వతానికి; ఉత్సవంబుతోన్= పండుగగా (ఊరేగింపుగా) చని= వెళ్ళి; అర్చనలు=పూజలు; చేసిరి= చేశారు.

**తాత్పర్యం:** ఆ ద్వారకానగరప్రజలంతా - అందంగా, మైపూతలు పూసికొని, మంచివస్త్రాలు కట్టుకొని, సొమ్ములు అలంకరించుకొని ఐశ్వర్యమంతా ప్రకటమయ్యేటట్లు కలిసి బయలుదేరారు. వివిధ వాద్యాల ధ్వనులు చెలరేగగా -ఆటలతో, పాటలతో రైవతకాద్రికి ఊరేగింపుగా వెళ్ళి, అక్కడ పూజలు చేశారు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. పృథక్పదత్వంతోకూడిన మాధుర్యగుణం జనుల హృదయోల్లాసాన్ని ధ్వనింపచేస్తున్నది.

**చ. గురు కుచ యుగ్మముల్ గదలఁ గ్రొమ్ముడులందుల పుష్పముల్ పయిం**
**దొరఁగ నిదాఘబిందువితతుల్ చెదరన్ మదిరామదంబునన్**
**బరవశ లయ్యు నింపెసఁగఁ బాడుచుఁ దాళము గూడ మెట్టుచుం**
**దరుణియ లొప్ప నాడిరి ముదంబునఁ దమ్ము జనాలి మెచ్చఁగన్. 175**

**ప్రతిపదార్థం:** తరుణియలు= యౌవనవతులు; జన+ఆలి= జనసమూహం; ముదంబునన్= సంతోషంతో; మెచ్చఁగన్= మెచ్చుకోగా; గురు, కుచ, యుగ్మముల్= పెద్దపాలిండ్లజంటలు; కదలన్= చలింపగా; క్రొత్త+ముడులందుల, పుష్పముల్= క్రొత్త ముడులలోని పూలు; పయిన్+తొరగన్= మీదికి జారగా; నిదాఘబిందు, వితతుల్= చెమట బిందువుల సమూహాలు; చెదరన్= చెదరగా; మదిరా మదంబునన్= మద్యం త్రాగటంవలన కలిగిన మదంచేత; పరవశలు+అయ్యున్= మైమరచినవాళ్ళయి కూడా; ఇంపు+ఎసఁగన్= ఆనందం అధికం అయ్యేటట్లు; పాడుచున్= పాడుతూ; తాళము కూడ, మెట్టుచున్= తాళానికి తగినట్లు అడుగులు వేస్తూ; ఒప్పన్, ఆడిరి= అందంగా నాట్యం చేశారు.

**తాత్పర్యం:** యౌవనంలో ఉన్న ఆడవాళ్ళు, జనసమూహం సంతోషంతో తమను చూచి మెచ్చగా - పెద్ద చన్నుల జంటలు కదలగా, క్రొత్తగా ముడిచిన కొప్పులలోని పూలు మీదికి జారగా, చెమటబిందువులు చెదరగా, మద్యపానమదంచేత మైమరిచినా, ఇంపార పాడుతూ, తాళానికి తగినట్లు అడుగులు వేస్తూ నాట్యం చేశారు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. రచనలో ఉదారత అనే గుణం పోషింపబడటంవలన ఈ పద్యం రసవత్తరంగా ఉన్నది. మదిరాపానంచేత పరవశలై ఉన్నా, కొప్పులూడేటట్లు, కుచాలు కదిలేటట్లు, చెమటబిందువులు చిందేటట్లు నాట్యంచేస్తున్నా తాళం తప్పకుండా ఆడుతూ, శ్రుతులు తప్పకుండా పాడుతున్న తరుణుల నాట్యం అగ్రామ్యత్వానికీ, నృత్యత్పదవద్భావానికీ (వికటత్వం) రూపుకట్టటంతో 'ఉదారత' రక్తికట్టింది. గ్రామ్యత్వం ప్రదర్శింపబడవలసినచోట మదిరాపానమత్తలైన యువతులు అగ్రామ్యత్వాన్ని సందర్భోచితంగా నాట్యంలో ప్రదర్శించే ఈ సన్నివేశవర్ణనం ఉదారతకు ఉత్తమోదాహరణం. (సంపా.)

**సీ. సారణ సత్య కాక్రూర విదూరథ। సాంబ సంకర్షణ శంబరారి**
**భాను సుషే ణోగ్రసేన శైనే యాని। రుద్ధ హార్దిక్య గ దోద్ధవాది**
**యాదవు లధికప్రమోదు లై యొక్కటఁ। దరుణులుఁ దారును గరికరేణు**
**హయశిబికారూఢు లయి తదుత్సవమున। కరిగిరి; మఱి జగద్గురుఁడు గృష్ణుఁ**

**ఆ. డింద్రలీలతో నుపేంద్రుండు రుక్మిణీ। దేవి మొదలుగాఁగ దేవు లెల్ల**
**నొప్పతోడ రాఁగ నప్పర్వతమునకుఁ। జనియె సకలజనులుఁ దనకు నెరఁగ. 176**

**ప్రతిపదార్థం:** సారణ, సత్యక+అక్రూర, విదూరథ, సాంబ, సంకర్షణ, శంబర+అరి, భాను, సుషేణ, ఉగ్రసేన, శైనేయ, అనిరుద్ధ, హార్దిక్య, గద, ఉద్ధవ; ఆది= మొదలైన; యాదవులు= యదువంశీయులు; అధిక, ప్రమోదులు+ఐ= మిక్కిలి ఆనందించినవాళ్ళయి; ఒక్కటన్= ఒకటిగా; తరుణులు= భార్యలు; తారును= తామూ; కరి, కరేణు, హయ, శిబికా+ఆరూఢులు+అయి= ఏనుగులను, ఆడయేనుగులను; గుఱ్ఱాలను, పల్లకీలను ఎక్కినవాళ్ళయి; తత్+ఉత్సవమునకున్= ఆ రైవతకాద్రి మహోత్సవానికి; అరిగిరి= వెళ్ళారు; మఱి= అటుపై; జగత్+గురుఁడు= లోకానికంతటికి గురుడైనవాడు - కృష్ణుడు; ఇంద్ర, లీలతోన్= దేవేంద్రుని (వంటి) వైభవంతో; ఉపేంద్రుఁడు= శ్రీకృష్ణుడు; రుక్మిణీదేవి; మొదలుగాఁగ= మొదలైన; దేవులు+ఎల్లన్= భార్యలంతా; ఒప్పుతోడన్= అందంగా; రాఁగన్= వెంటరాగా; సకల, జనులు; తనకున్= శ్రీకృష్ణునికి; ఎరఁగన్= నమస్కరించగా; ఆ+పర్వతమునకున్= ఆ రైవతకపర్వతానికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** సారణుడు, సత్యకుడు, అక్రూరుడు, ఉగ్రసేనుడు, గదుడు, ఉద్ధవుడు మొదలైన యాదవులంతా మహానందంగా భార్యలతో కూడి - ఏనుగులను, ఆడఏనుగులను, గుఱ్ఱాలను, పల్లకీలను అధిరోహించి ఆ ఉత్సవానికి వెళ్ళారు. జగద్గురుడైన శ్రీకృష్ణుడుకూడా రుక్మిణి మొదలైన భార్యలంతా వెంటరాగా, జనులంతా తనకు నమస్కరించగా దేవేంద్రవైభవంతో ఆ రైవతకాద్రికి వెళ్ళాడు.

**వ. ఇ ట్లరిగి జనార్దనుండు ధనంజయుం దలంచి, తత్సమీపగతుం డై తోడ్కొని, యాతనికి న ప్పర్వత రమణీయ ప్రదేశంబులం జూపుచు విహరించి, యిద్దఱు నొక్కవిమలమణివేదికయం దభిమతసంభాషణంబుల నుండు నంత. 177**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అరిగి= ఈ విధంగా వెళ్ళి; జనార్దనుండు= శ్రీకృష్ణుడు; ధనంజయున్= అర్జునుడిని; తలంచి= అనుకొని; తత్+సమీప, గతుండు+ఐ= అతనిదగ్గరకు వెళ్ళినవాడై; తోడ్కొని= అతనినివెంట తీసికొని; ఆతనికిన్= అర్జునునికి; ఆ+పర్వత, రమణీయ, ప్రదేశంబులన్= ఆ పర్వతమందలి అందమైన చోట్లను; చూపుచున్; విహరించి; ఇద్దఱున్; ఒక్క, విమల, మణి, వేదిక, అందున్= ఒక నిర్మలములైన మణులతో నిర్మించిన అరుగుమీద; అభిమత, సంభాషణములన్= ఇష్టములైన సంభాషణలలో; ఉండు, అంతన్= ఉండగా.

**తాత్పర్యం:** ఈ విధంగా వెళ్ళి శ్రీకృష్ణుడు అర్జునునిగూర్చి ఆలోచించి, అతనిదగ్గరకు వెళ్ళి, అతడిని వెంటబెట్టుకొని, ఆ పర్వతమందలి అందమైన ప్రదేశాలను చూపుతూ విహరించాడు. తరువాత ఇద్దరూ నిర్మల మణులతో నిర్మితమైన ఒక అరుగుమీద కూర్చుండి ఇష్టాగోష్ఠి సలుపుతుండగా.

**చ. క్వణదణుకింకిణీకలితకాంచనకాంచికలాపమున్ రణ**
**న్మణికలనూపురంబులు సమధ్వని నొప్పఁగ భక్తిఁ బాదచా**
**రిణి యయి కన్యకాజనపరీత సుభద్ర తదద్రిపూజన**
**ప్రణతులు సేసె నింద్రసుతుఁ బార్థు నిజేశ్వరుఁగాఁ దలంచుచున్. 178**

**ప్రతిపదార్థం:** క్వణత్+అణు, కింకిణీ, కలిత, కాంచన, కాంచి, కలాపమున్= మ్రోయుచున్న చిరుగజ్జెలతో కూడిన బంగారు మొలనూళ్ళ సమూహాన్ని; రణత్+మణి, కల, నూపురంబులు= ధ్వనిస్తూ మణులచే మనోహరాలైన అందెలూ; సమ, ధ్వనిన్= సమాన ధ్వనిలో; ఒప్పఁగన్= ఒప్పుచుండగా; భక్తిన్= భక్తితో; పాదచారిణి, అయి= కాలినడకన వెళ్ళినదై; కన్యకా, జన, పరీత= పెళ్ళికాని ఆడపిల్లలతో చుట్టబడినదైన; సుభద్ర; ఇంద్రసుతున్= దేవేంద్రునియొక్క కుమారుడిని; పార్థున్= పృథ (కుంతీదేవి) పుత్రుడైన అర్జునుడిని; నిజ+ఈశ్వరున్+కాన్= తనభర్త అయ్యేటట్లు; తలంచుచున్= భావించుచూ; తద్+అద్రి, పూజన, ప్రణతులు= ఆ రైవతకపర్వతాన్ని పూజించటాన్ని, మ్రొక్కటాన్ని; చేసెన్= చేసింది.

**తాత్పర్యం:** మ్రోగుతున్న చిరుగజ్జెలతో కూడిన బంగారు మొలనూళ్ళ సమూహం, మణులచేత మనోహరాలై మ్రోగుతున్న అందెలు సమానధ్వనితో ఒప్పుతుండగా, కన్యకాజనం తనచుట్టు రాగా, సుభద్ర అర్జునుడిని భర్తగా తనమనస్సులో తలచి భక్తితో కాలినడకన తిరిగి, ఆ రైవతకాద్రికి పూజలూ, నమస్కారాలు చేసింది.

**విశేషం:** నన్నయ అక్షరరమ్యతకు ఈ పద్యం ఒక చక్కని ఉదాహరణం. అర్జునునిమనస్సును ఆకర్షించి, అతనిలోని అనురాగాన్ని పెంచిన సుభద్ర కాంచీ కలాప కింకిణీ ధ్వనులు, మణి నూపుర ధ్వనులు - పదాల కూర్పులో 'ణ'కార పునరావృత్తిలో చక్కగా ధ్వనిస్తున్నాయి. ఈ పద్యంలో సమాధి అనే గుణం సమగ్రంగా పోషింపబడింది. సుభద్ర తన మొలను గల గజ్జెలూ కాలిఅందెలూ సమంగా మ్రోగుతూ ఉండగా నడచివచ్చి అర్జునుడు తనకు భర్త కావాలని గాఢంగా భావిస్తూ (సమాధి) రైవతకాద్రిని పూజించి నమస్కరించింది. పద్యంకూడా సుభద్రవలెనే నడిచింది. మొదటి రెండుచరణాల్లో నాయిక నడకసొబగు, ఆ తరువాత ఆగి పూజించి నమస్కరించిన విశ్రాంతి సౌందర్యం పద్యగతిలో అవరోహక్రమంలో చిత్రించటం గమనార్హం. దానివలన నాయిక మనోభీష్టంలో (త్వరగా అర్జునుడు భర్తకావాలన్న తీవ్రమైన ఆకాంక్ష) అర్థదర్శనం కావటం గమనిస్తే నన్నయగారి సమాధిగుణపద్యరచనకు ఈ పద్యం సార్థకోదాహరణం. (సంపా.)

**ఉ. దాని సుభద్రఁగా నెఱిఁగి తత్క్షణజాతమనోజసంచల**
**న్మానసుఁ డైన యవ్విజయు మానుగఁ జూచి 'మునీంద్ర! నీకుఁ జ**
**న్నే నలినాక్షులందు మది నిల్పఁగ' నంచును మందహాసగ**
**ర్భాననుఁ డై రథాంగధరుఁ డాతని కి ట్లనియెం బ్రియంబునన్. 179**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆమెను; సుభద్రన్+కాన్, ఎఱిఁగి; తత్+క్షణ, జాత, మనోజ, సంచలత్+మానసుఁడు+ఐన= ఆ క్షణంలో పుట్టిన మన్మథునిచే చలింపబడిన మనస్సు కలవాడైన; ఆ+విజయున్= ఆ అర్జునుణ్ణి; మానుగన్= మనోహరంగా;

చూచి; ముని+ఇంద్ర= మునిశ్రేష్ఠా!; నలిన+అక్షుల+అందున్= పద్మాలవంటి కన్నులు కలవారైన స్త్రీలపై; మదిన్= మనస్సును; నిల్పఁగన్= నిలుపగా; నీకున్; చన్నే= తగునా; అంచును= అని అంటూ; రథ+అంగ, ధరుఁడు= చక్రాన్ని ధరించేవాడు - శ్రీకృష్ణుడు; మందహాస, గర్భ+ఆననుఁడు+ఐ= చిరునవ్వు నిండిన ముఖం కలవాడై; ఆతనికిన్= అర్జునునికి; ప్రియంబునన్= ప్రీతిగా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆమె సుభద్ర అని తెలిసికొని, ఆ క్షణమే పుట్టిన మన్మథునిచే చలింపచేయబడిన మనస్సు కలవాడైన ఆ విజయుడిని, శ్రీకృష్ణుడు మనోహరంగా చూచి, 'మునీంద్రా! స్త్రీలమీద మనసు నిలపటం నీకు తగునా?' అని చిరునవ్వు నిండినముఖంతో అతనితో ప్రియమార ఇలా అన్నాడు.

**విశేషం:** ఈసందర్భంలో శ్రీకృష్ణుని సరసపుచూపులో, మాటలో, చిరునవ్వులో ఎంతో ఆనందం ఉన్నది; కొంత కొంటెతనం కూడ ఉన్నది. మునివేషంలో ఉన్న అర్జునుడు సుభద్రను చూచినంతనే మన్మథావేశాన్ని ప్రదర్శించబోవటం సందర్భౌచిత్యం కాదు. పాత్రౌచిత్యంకూడా కాదు. పైపెచ్చు జగద్గురువైన శ్రీకృష్ణుడి సన్నిధానంలో ఆ విధంగా బైటపడటం అనుదాత్తం. దానిని తెలిసిన శ్రీకృష్ణుడు అర్జునుడిని పరుషంగా మందలించవలసిన తరుణమది.కాని, అతనిపై గల అపారమైన అనురాగంవలన నవ్వుతూ వ్యంగ్యంగా హెచ్చరించాడు. అంటే పరుషార్థప్రకటనం చేయవలసినచోట అపారుష్యాన్ని ప్రదర్శించాడన్నమాట. ఇదే సౌకుమార్యమనే గుణం. సౌకుమార్యం శ్రీకృష్ణుడివాక్కులో అజరరత్వంగా, ఆసక్తికరంగా అనుసంధింపబడింది. (సంపా.)

**వ. 'నీవు సుభద్రయందు బద్ధానురాగుండ వగుట తొల్లియు నే నెఱుంగుదు; నోడకుండుము; నీ కోర్కి వసుదేవ దేవకీ దేవులకుం జెప్పి సఫలంబు సేయుదు' నని యర్జునునకు హృదయానందంబుగాఁబలికి, యప్పుడ వడిగల చారుల రావించి ద్వారవతియం దర్జునుం డున్న వాఁ డనుకుశలవార్త ధర్మజున కెఱింగింప నింద్రప్రస్థపురంబునకుం బుచ్చియున్నంత; నచ్చటికి వచ్చి బలదేవాదియాదవు లతిభక్తులై యతియకా వగచి యర్జునునకు నమస్కరించి యాతనివలన సర్వతీర్థంబులుఁ దత్సేవాఫలంబులును విని సంతసిల్లి, యి వ్వర్షాకాలంబు మాయంద యుండి చాతుర్మాస్యంబు సేసి మమ్ముం గృతార్థులం జేయుం డని ప్రార్థించి, పార్థుం దోడ్కొని చని, వానికి నన్నపానాది విధులం బరిచరింప సుభద్రం బంచి, కన్యాపురంబునందు నివాసంబు సేసిన. 180**

**ప్రతిపదార్థం:** నీవు; సుభద్ర+అందున్= సుభద్రపై; బద్ధ+అనురాగుండవు= కట్టివేయబడిన ప్రేమకలవాడవు, సుభద్రను ప్రేమించినవాడవు; అగుట, తొల్లియున్= ఇదివరకుకూడా; నేను= నేను; ఎఱుంగుదున్= తెలుసుకున్నాను; ఓడక+ఉండుము= భయపడకుము; నీ, కోర్కి= నీ ఇష్టం; వసుదేవ, దేవకీదేవులకున్= వసుదేవునికి, దేవకీదేవికి; చెప్పి; సఫలంబు= ఫలించునట్లు; చేయుదున్+అని= చేస్తాను అని; అర్జునునకున్; హృదయ+ఆనందంబుకాన్= మనస్సుకు సంతోషం కలిగేటట్లుగా; పలికి= చెప్పి; అప్పుడు+అ= అప్పటికప్పుడే; వడిగల= వేగంగల; చారులన్= వేగులవారిని; రావించి= రప్పించి; ద్వారవతి, అందున్= ద్వారకావతి నగరంలో; అర్జునుండు; ఉన్నవాఁడు= ఉన్నాడు; అను, కుశలవార్త= అనే క్షేమవృత్తాంతం; ధర్మజునకున్; ఎఱిగింపన్= తెలపటానికి; ఇంద్రప్రస్థ పురంబునకున్; పుచ్చి= పంపి; ఉన్న+అంతన్= ఉండగా; బలదేవ+ఆది, యాదవులు= బలరాముడు మొదలైన యాదవులు; అచ్చటికిన్; వచ్చి; అతి భక్తులు+ఐ= మిక్కిలిభక్తికలవాళ్ళయి; యతి+అ+కా ముని అని; వగచి= తలచి; అర్జునునకున్; నమస్కరించి; అతనివలన; సర్వ, తీర్థంబులున్= అన్నిపుణ్యతీర్థాలు; తత్+సేవా, ఫలంబులును= వాటిని సేవించటంవలన కలిగే ఫలాలు; విని, సంతసిల్లి; ఈ+వర్షాకాలంబు; మా, అందు+అ, ఉండి= మాదగ్గరే ఉండి; చాతుర్మాస్యంబున్= యతులు నాలుగునెలలు చేసే వ్రతాన్ని; చేసి; మమ్మున్; కృత+అర్థులన్= నెరవేరిన కోరిక కలవాళ్ళనుగా; చేయుండు+అని= చేయండి అని; ప్రార్థించి; పార్థున్= అర్జునుని; తోడ్కొని= వెంటతీసికొని; చని=వెళ్ళి; వానికిన్= అతనికి;

అన్న, పాన+ఆది, విధులన్= అన్నం; పానం మొదలైనవాటి ఏర్పాట్లలో; పరిచరింపన్= సేవ చేయటానికి; సుభద్రన్; పంచి= నియమించి; కన్యా, పురంబు, అందున్= కన్యలయొక్క అంతఃపురంలో; నివాసంబు= ఉనికి; చేసినన్= ఏర్పాటుచేయగా.

**తాత్పర్యం:** 'నీకు సుభద్రమీద అనురాగం ఉన్నసంగతి నాకు ఇదివరకే తెలుసు. భయపడకుము. నీ కోర్కె వసుదేవునికి, దేవకీదేవికి చెప్పి సఫలం చేస్తాను' అని అర్జునునిమనస్సుకు ఆనందం కలిగేటట్లుగా పలికాడు. అప్పటి కప్పుడే వడి గల వేగులవాళ్ళను పిలిచి ద్వారవతిలో అర్జునుడు ఉన్నాడన్న కుశలవార్తను ధర్మరాజుకు తెలియజేయటానికి ఇంద్రప్రస్థపురానికి పంపాడు. కృష్ణుడు అక్కడ ఉండగానే బలరాముడు మొదలైన యాదవులంతా అక్కడి వచ్చారు. అతిభక్తులై అర్జునుడిని యతిగా భావించి, ఆయనకు నమస్కరించారు. ఆయనవలన పుణ్యతీర్థవిశేషాలు, వాటిని సేవించటంవలన కలిగే ఫలాలు విని సంతోషించి 'ఈ వర్షాకాలంలో ఇక్కడే ఉండి చాతుర్మాస్యవ్రతం జరిపి మమ్ములను కృతార్థులను చేయండి' అని ప్రార్థించి అర్జునుడిని తోడ్కొని వెళ్ళి, ఆయనకు అన్నపానాదులతో సేవ చేయటానికి సుభద్రను నియోగించి, కన్యాంతఃపురంలోనే ఆయన ఉండటానికి ఏర్పాటు చేయగా.

**విశేషం:** చాతుర్మాస్యం - ప్రతి సంవత్సరం ఆషాఢ శుద్ధఏకాదశి మొదలు కార్తిక శుద్ధఏకాదశి వరకు నాలుగు నెలలు చేసే వ్రతం. ఈ వర్షాకాలంలో యతులు తీర్థయాత్రలు సాగించకుండా ఒక్కచోటనే ఉండి ఈ వ్రతం ఆచరిస్తాను.

### అర్జునుండు యతిరూపంబున కన్యాపురంబున నుండుట (సం- అను. 1-114-64 పంక్తి)

**క. అందు ధృతిమందరుండు పు । రందర నందనుఁడు దనకు రమణి గుణశ్రీ**
**సుందరి సుభద్ర నెయ్యం । బొందఁగఁ బరిచర్య సేయుచుండఁగ నుండెన్. 181**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ కన్యాంతఃపురంలో; ధృతి, మందరుండు= ధైర్యంలో మందరపర్వతంవంటివాడు; పురందర, నందనుఁడు= దేవేంద్రుని కుమారుడైన అర్జునుడు; తనకున్; రమణి= అందమైనది; గుణశ్రీ, సుందరి= సుగుణాల సంపదచేత మనోహరమైనది; సుభద్ర; నెయ్యంబు+ఒందఁగన్= ప్రేమతో; పరిచర్య= సేవ; చేయుచున్+ఉండఁగన్, ఉండెన్= చేస్తూ ఉండగా, ఉన్నాడు.

**తాత్పర్యం:** ధైర్యంలో మందరపర్వతంవంటివాడైన అర్జునుడు - రూపవతి, గుణవతి అయిన సుభద్ర తనకు సేవచేస్తూ ఉండగా ఆ కన్యాంతఃపురంలో ఉన్నాడు.

**క. ధీరుఁడు యతిరూపంబున । నారఁగ నిందున్నయాతఁ డర్జునుఁ డని స**
**త్యారుక్మిణులకుఁ జెప్పె ము । రారాతి రహస్యమున ననంత ప్రీతిన్. 182**

**ప్రతిపదార్థం:** ముర+అరాతి= మురుడు అనే రాక్షసునికి శత్రువైనవాడు - శ్రీకృష్ణుడు; అనంత, ప్రీతిన్= మిక్కిలిసంతోషంతో; సత్యా, రుక్మిణులకున్= సత్యభామకు, రుక్మిణీదేవికి; ధీరుఁడు= ధైర్యవంతుడు; యతి, రూపంబునన్= యతివేషంలో; ఆరఁగన్= ఒప్పుగా; ఇందున్+ఉన్న= ఇక్కడ ఉండేవాడు; ఆతఁడు, అర్జునుఁడు; అని= అని; రహస్యమునన్, చెప్పెన్= రహస్యంగా చెప్పాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు మహాసంతోషంతో - 'ఇక్కడ యతివేషంలో ఉన్న ధీరుడు అర్జునుడు' అని సత్యభామకు, రుక్మిణీదేవికి రహస్యంగా చెప్పాడు.

**చ. అలయక నాఁడు నాఁటికి లతాంగి యపూర్వము లైన భోజనం**
**బులు గడుభక్తిఁ బెట్టుచు, నపూర్వము లైన వపుర్విలాస యు**
**క్తులు వెలయించుచున్, ముదముతోఁ బెనిచెన్ మఱి నాఁడునాఁటి క**
**గ్గల మగుచుండ నెయ్యమును గామవికారము సవ్యసాచికిన్. 183**

**ప్రతిపదార్థం:** లతా+అంగి= లతవంటి సుకుమారమైన శరీరంకలది - సుభద్ర; అలయక= విసుగులేకుండా; నాఁడు, నాఁటికిన్= ఏరోజు కా రోజు; అపూర్వములు+ఐన= ముందులేనివైన, క్రొత్తవైన; భోజనంబులు; కడు, భక్తిన్= మిక్కిలి భక్తితో; పెట్టుచున్= పెట్టుతూ; అపూర్వములు+ఐన= సరిక్రొత్తవైన; వపుస్+విలాస, యుక్తులు= శరీర విలాసాల కూడికలు - అంటే అందాల హొయలు; వెలయించుచున్= ప్రకటిస్తూ; మఱిన్= పైగా; సవ్యసాచికిన్= అర్జునునికి; నెయ్యమును= స్నేహాన్ని; కామ, వికారమున్= శృంగారభావాన్ని; నాఁడు, నాఁటికిన్= నానాటికి; అగ్గలము+అగుచుండన్= ఎక్కువగుచుండగా; ముదముతోన్= సంతోషంతో; పెనిచెన్= పెంచింది.

**తాత్పర్యం:** సుందరాంగి సుభద్ర విసుగులేకుండా ఏరోజు కారోజు సరిక్రొత్త భోజనాలు భక్తితో పెట్టుతూ, తన శరీరంలో సరిక్రొత్త అందాలు ప్రదర్శిస్తూ, ఏరోజు కా రోజు అర్జునునిలో స్నేహాన్నీ, శృంగారభావాన్నీ పెంచింది.

**విశేషం:** సుభద్ర సహజతనూవిలాసాలను ప్రదర్శిస్తూ మునిసేవ చేస్తున్నది. ప్రతిదిన ప్రవర్ధమానమౌతున్న ఆమె యౌవనం రోజురోజుకూ అర్జునునికి ఆసక్తిని పెంచుతున్నది. ఇది మధురమైన సన్నివేశం. మధురభావముద్రితం. అందువలననే నన్నయ మాధుర్యమనే గుణాన్ని పద్యరచనలో ప్రపంచించి ప్రౌఢిని ప్రదర్శించాడు. ఈ మాధుర్యాన్నే రాబోయే రెండుపద్యాలలో వరుసగా పోషించటం శిల్పం. (సంపా.)

**వ. మఱియును. 184**

**ప్రతిపదార్థం:** అంతేకాకుండా.

**సీ. అలినీలకుంతలుం డనియును హరినీల। సమవర్ణుఁ డనియు నాజానులంబి**
**తాయతస్థిరబాహుఁ డనియును రక్తాంత। నలినదళాకారనయనుఁ డనియు**
**నుత్తుంగఘనవిశాలోరస్కుఁ డనియును। గవ్వడి యనియును గరము వేడ్క**
**వివ్వచ్చు నెప్పుడు వినియెడునది; దన। వినినట్ల యతిఁ జూచి, 'వీఁడు విజయుఁ**

**ఆ. డొక్కొ!' యనుచు సంశయోపేతచిత్త యై। యుండి, యుండ నోప కొక్కనాఁడు**
**భోజనావసానమున నున్న యమ్మునిఁ। కిందువదన ప్రీతి నిట్టు లనియె. 185**

**ప్రతిపదార్థం:** అలి, నీల, కుంతలుండు+అనియును= తుమ్మెదవలె నల్లనివెంట్రుకలు కలవాడని; హరినీల, సమ, వర్ణుఁడు+అనియున్= ఇంద్రనీలమణితో సమానమైన రంగుకలవాడని; ఆజాను, లంబిత+ఆయత, స్థిర, బాహుఁడు+అనియును= మోకాళ్ళదాకా వ్రేలాడుతున్న పొడవైన, బలమైన బాహువులు కలవాడని; రక్త+అంత, నలిన, దళ+ఆకార, నయనుఁడు+అనియున్= ఎర్రనికొలకులు కలిగి తామరరేకులవంటి ఆకారం గల కన్నులు కలవాడని; ఉత్తుంగ, ఘన, విశాల+ఉరస్కుడు+అనియును= మిక్కిలి ఎత్తైన కఠినం, విశాలమైన వక్షఃస్థలం కలవాడని; కవ+వడి= రెండుచేతుల వడిగలవాడు; అనియును;

కరము, వేడ్కన్= మిక్కిలి కుతూహలంతో; వివ్వచ్చున్= అర్జునునిగూర్చి; ఎప్పుడున్= ఎల్లప్పుడు; వినియెడు, అది= వినునట్టి సుభద్ర; తన, వినిన+అట్లు+అ= తాను విన్నవిధంగానే; యతిన్= యతిని; చూచి; వీఁడు= ఇతడు; విజయుఁడు+ఒక్కొ, అనుచున్= అర్జునుడో ఏమో అని; సంశయ+ఉపేత, చిత్త+ఐ= అనుమానంతో కూడుకొన్న మనసు కలదై; ఉండి= ఉంటూ; ఉండన్+ఓపక= ఉండలేక; ఒక్కనాఁడు; భోజన+అవసానమునన్= భోజనం చివర; ఉన్న= ఉండే; ఆ+మునికిన్= ఆ యతిని; ఇందు, వదన= చంద్రబింబంవంటి ముఖం కలది - సుభద్ర; ప్రీతిన్= ప్రేమతో; ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** తుమ్మెదవలె నల్లని జుట్టు కలవాడని, ఇంద్రనీలపు రంగువాడని, మోకాలివరకు వ్రేలాడే పొడవైన, బలమైన బాహువులు కలవాడని, ఎర్రని కొలకులతో తామరరేకులవంటి కళ్ళు కలవాడని, ఎంతో ఎత్తై కఠినం, విశాలం అయిన వక్షఃస్థలం కలవాడని, రెండుచేతులు వడి కలవాడని - మిక్కిలి కుతూహలంతో అర్జునుని గూర్చి ఎప్పుడూ వినే సుభద్ర, తాను విన్నవిధంగానే ఆ యతిని చూచి, ఇతడు విజయుడో ఏమో అని అనుమానించి, ఉండలేక ఒకనాడు భోజనంచివర ఆ మునితో ప్రియమార ఇట్లా అన్నది.

**విశేషం:** అలం: ఉపమ, సందేహం. రసానుకూలంగా అలంకారాన్ని ధ్వనిమయంగా నిర్వహించాడు నన్నయ. విశేషం ఏమంటే ఉపమాలంకారంతో మొదలై అది మధ్యలో వదలిపెట్టబడి సందేహాలంకారంతో పద్యాన్ని ముగించటం ఇందులోని శిల్పం. అర్జునుని పోలికలు యతిలో కనపడుతున్నాయి. అతడే అర్జునుడేమో అని మనస్సు సంశయిస్తున్నది. కాని, నిశ్చయంగా తెలియకపోయినప్పుడు ఆ భావంలో రమించటం ఉచితం కాదు. రతిభావపోషణకనువైన విభావస్ఫూర్తి యతిరూపంలో కనపడుతున్నా బింబమని భ్రమించి ప్రతిబింబాన్నే రమిస్తే రసభంగమౌతుందన్నసందేహంతో ఆమె సముచితంగా ఆగినట్లు వర్ణించటం రసధ్వనిశిల్పం. సుభద్రాహృదయగత మధురభావాన్ని మాధుర్యగుణముద్రితమైన పద్యరచనలో ప్రదర్శించటం నన్నయరసవద్గుణపోషణకు నిదర్శనం. (సంపా.)

**వ. మునీంద్రా! నీ యాడనితీర్థంబులుం జూడనిపురంబులు నెఱుంగనిరాజకులంబును లే వని విచారింతు. 186**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా= మునిశ్రేష్ఠా!; నీ, ఆడని= నీయొక్క స్నానం చేయని - అనగా నీవు స్నానమాడని; తీర్థంబులున్= తీర్థాలూ; చూడని= సందర్శించని; పురంబులున్= నగరాలూ; ఎఱుంగని= తెలియని; రాజకులంబును= రాజసమూహాలూ; లేవు+అని= లేవని; విచారింతున్= అనుకొంటాను.

**తాత్పర్యం:** మునివరా! నీవు స్నానం చేయని పుణ్యతీర్థాలూ, చూడని పట్టణాలూ, తెలియని రాజవంశాలూ లేవని అనుకొంటాను.

**సీ. 'అమరావతికి నెన యనఁగ నివ్వసుమతిఁ। బరఁగు నింద్రప్రస్థపురవరంబు**
**చూచితిరే? పాండుసుతు లందు సుఖ మున్న। వారె? మాయత్త యంభోరుహాక్షి**
**కుంతీమహాదేవి కుశలయే? యమ్మహా। వీరుఁ డర్జునుఁడు జితారి తీర్థ**
**గమనోత్సుకుం డయ్యెఁ; గ్రమ్మఱి వచ్చెనే?। యెఱుఁగుదురేని నా కెఱుఁగఁ జెప్పుఁ '**

**ఆ. దనిన నేన చూవె యయ్యర్జునుండ; నీ। యొద్ద నివ్విధమున నున్నవాఁడఁ;**
**దరుణి! నీకు నాకు ధరణీధరుం డను। జలజభవుఁడు సేసె సంగమంబు. 187**

**ప్రతిపదార్థం:** అమరావతికిన్= (దేవేంద్రుడిరాజధాని) అమరావతీనగరానికి; ఎన= సాటి; అనఁగన్= అనునట్లుగా; ఈ+వసుమతిన్= ఈ భూమిమీద; పరఁగు= ఒప్పు; ఇంద్రప్రస్థ, పుర, వరంబున్= ఇంద్రప్రస్థం అనేపేరుగల గల పురశ్రేష్ఠాన్ని - అంటే గొప్పదైన ఇంద్రప్రస్థపురాన్ని; చూచితిరే= చూచినారు కదా; పాండు, సుతులు= పాండవులు; అందున్= అక్కడ; సుఖము+ఉన్నవారె= సుఖంగా ఉన్నారా; మా, అత్త, అంభోరుహ+అక్షి= పద్మాలవంటి కన్నులు కలది; కుంతీమహాదేవి; కుశలయే= క్షేమంగా ఉన్నదా?; ఆ+మహావీరుఁడు; జిత+అరి= జయింపబడిన శత్రువులు కలవాడు; అర్జునుఁడు; తీర్థ, గమన+ఉత్సుకుండు= తీర్థయాత్రలకు వెళ్ళటంలో ఉత్సాహం కలవాడు; అయ్యెన్= అయ్యాడు; క్రమ్మఱి= తిరిగి; వచ్చెనే= వచ్చినాడా? ఎఱుగుదురు+ఏని= తెలిస్తే; నాకున్; ఎఱుఁగన్; చెప్పుఁడు= తెలియచేయండి; అనినన్= అని అనగా; తరుణి= ఓ కాంతా!; నేను+అ= నేనే; చూవె= సుమా; ఆ+అర్జునుండ; నీ, ఒద్దన్= నీ దగ్గర; ఈ+విధమునన్= ఈ విధంగా; ఉన్నవాఁడన్= ఉన్నాను; నీకున్; నాకున్; ధరణీ, ధరుండు+అను= భూమిని ధరించినవాడు - శ్రీకృష్ణుడు అనే; జలజభవుఁడు= బ్రహ్మదేవుడు-పద్మంనుండి పుట్టినవాడు; సంగమంబు= కలయిక; చేసెన్= ఏర్పాటు చేశాడు.

**తాత్పర్యం:** 'దేవేంద్రుని రాజధాని అమరావతితో సమానమని ఈ భూమిమీద పేరుపొందిన ఇంద్రప్రస్థపురశ్రేష్ఠాన్ని మీరు చూచారా? అందు పాండవులు సుఖంగా ఉన్నారా? మా అత్త కుంతీదేవి కుశలమా? ఆ మహావీరుడు, శత్రువులను జయించినవాడు అయిన అర్జునుడు తీర్థయాత్రలకు వెళ్ళాలన్న ఉత్సాహంతో ఉండేవాడే - ఆయన తీర్థయాత్రలనుండి తిరిగి వచ్చాడా? తెలిసినట్లైతే నాకు చెప్పండి' అని సుభద్ర అడుగగా, 'ఓ కాంతా! నేనే అర్జునుడను; ఈ విధంగా నీవద్ద ఉన్నాను. శ్రీకృష్ణుడు అనే బ్రహ్మ నిన్నూ నన్నూ కలిపాడు'.

**విశేషం:** పృథక్పదత్వం, ఉక్తివైచిత్ర్యం అనే లక్షణాలు గల మాధుర్యగుణవద్రచనకు ఈ పద్యం హృద్యమైన ఉదాహరణం. రూపసామ్యం గల యతి అర్జునుడేమో అని ఆమె అనుమానం. కాని, ఆ విషయం సూటిగా అడగటానికి వీలులేదు. అందువలన చేపకొరకు గాలంవేస్తున్నట్లు సంభాషణ సాగించింది. తీర్థయాత్రలమీద ఆసక్తిగల ఆ అర్జునుడు తిరిగి ఇంద్రప్రస్థపురం చేరాడా? అని చివరి ప్రశ్న. చేరితే ఈ యతి అర్జునుడు కాడు. చేరకపోతే యతి ఎవరో తెలుస్తుంది - మాటనేర్పరితనం గల సుభద్ర ఉక్తిచమత్కారంతో సత్యం బైట పెట్టించింది. అందుకే అర్జునుడు మరేమీ చెప్పక తన ఉనికిని బయటపెట్టుకొన్నాడు. సుభద్రార్జునుల మధురాభిలాషల మధురాభివ్యక్తికి మాధుర్యగుణం మధుర సాధనమైనది. (సంపా.)

**వ. 'బ్రాహ్మంబు మొదలుగాఁ గల యెనిమిది వివాహంబులయందును గాంధర్వరాక్షసంబులు క్షత్త్రియులకు నుత్తమ వివాహంబులు గావున నిది గాంధర్వ వివాహంబున కవసరం' బనిన సుభద్ర లజ్జావనతవదన యయి. 188**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మంబు= బ్రాహ్మం; మొదలుగాన్+కల= ఆదిగా ఉండే; ఎనిమిది, వివాహంబుల, అందున్= ఎనిమిదిరకాల వివాహాలలోనూ; గాంధర్వ, రాక్షసంబులు= గాంధర్వం, రాక్షసం; క్షత్రియులకున్= క్షత్రియులకు; ఉత్తమ= శ్రేష్ఠమైన; వివాహంబులు= వివాహాలు; కావునన్= కాబట్టి; ఇది = ఈ సందర్భం; వివాహంబునకున్= గాంధర్వ వివాహానికి; అవసరంబు= సమయంబు; అనినన్= అని అనగా; సుభద్ర= సుభద్ర; లజ్జా+అవనత, వదన, అయి= సిగ్గుచేత వంచుకొన్న ముఖం కలదై.

**తాత్పర్యం:** 'బ్రాహ్మము మొదలైన ఎనిమిదిరకాలవివాహాలలో గాంధర్వరాక్షసాలు క్షత్త్రియులకు ఉత్తమ వివాహాలు కాబట్టి ఇది గాంధర్వవివాహానికి సమయం' అనగానే సుభద్ర సిగ్గుతో తలవంచుకొని.

**విశేషం:** ఎనిమిది రకాల వివాహాలు - బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము. వివరాలకు చూడు (ఆది.4-55)

**తే. 'నన్ను నీ నర్హు లెల్ల నిం దున్నవారు;। వార యెఱిఁగి చేయుదురు వివాహ' మనుచు**
**వనజనేత్ర యంతఃపురంబునకుఁ జనియె;॥ నరిగెఁ దన లతాగృహమున కర్జునుండు. 189**

**ప్రతిపదార్థం:** నన్నున్; ఈన్= ఇవ్వటానికి; అర్హులు+ఎల్లన్= తగినవారంతా; ఇందున్= ఇక్కడ; ఉన్నవారు= ఉండేవారే; వారు+అ= వారే; ఎఱిఁగి చేయుదురు= తెలిసి చేస్తారు; వివాహము= పెండ్లి; అనుచున్= అంటూ; వనజ, నేత్ర= పద్మాలవంటికన్నులు కలది-సుభద్ర; అంతఃపురంబునకున్= అంతఃపురానికి; చనియెన్= వెళ్ళింది; అర్జునుండు; తన= తనయొక్క; లతా, గృహమునకున్= తీగెలతో నిర్మించిన ఇంటికిన్, పొదరింటికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'నన్ను ఇవ్వటానికి అర్హులైనవాళ్ళంతా ఇక్కడే ఉన్నారు. వాళ్ళే తెలిసికొని వివాహం చేస్తా' రంటూ సుభద్ర అంతఃపురానికి వెళ్ళింది. తరువాత అర్జునుడు తన పొదరింటికి వెళ్ళాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడే సుభద్రార్జునుల వివాహవ్యూహాన్ని రచించాడని తెలిసిన తరువాత సుభద్ర తనంత తాను గాంధర్వ వివాహానికి ఒడబడటం ఉచితం కాదు. సూత్రధారుడు అయిన కృష్ణుడే సమయాన్ని గమనించి సముచిత విధంగా సమర్పించ నున్నాడని సన్నివేశం ధ్వనింపచేస్తున్నది. అంతరంగంలో ఇష్టమే కాని ఈ అంతర్నాటకమెందుకో తెలిసిన తరువాతనే వివాహంకావటం ఇరువురికీ మంచిది అన్న భావాన్ని వ్యంగ్యంగా సూచించిన వివేకవతి, లజ్జావతి సుభద్ర. అర్జునునికి రహస్యం చెప్పి తనకు చెప్పకుండా ఉంచిన పెద్దలే తనను ఇస్తారులే; అంతవరకు నాకు తెలిసిందని నేను ఎందుకు బైటపడాలి? అన్న గూఢాభిమానంకూడా ఆమె మాటలలో ప్రతీయమానమౌతున్నది. పైపెచ్చు ఆ మాటలు తేటగీతి పూర్వార్ధంలో సమతను ప్రదర్శించటం, ఉత్తరార్ధంలో వాళ్ళచర్యలు సమంగా రెండుచరణాలలో వర్ణింపబడటంవలన పద్య రచనలో సమత అనే గుణం శోభిస్తున్నది. (సంపా.)

**వ. అయ్యిరువుర యన్యోన్యప్రణయంబులు దనదివ్యజ్ఞానంబునం జేసి దివ్యపురుషుండు పురుషోత్తముం డెఱింగి, యర్జునునకు భోజనవిధు లమర్ప రుక్మిణీదేవిం బంచి, యొక్కనాఁ డేకాంతంబున దేవకీవసుదేవప్రద్యుమ్న సాంబసంకర్షణసారణసాత్యకు లకు నర్జును స్థితియును' నాతనియందు సుభద్రనెయ్యంబును నెఱింగించి, తమతొల్లింటి విచారంబున కనుగుణం బగుటకు సంతసిల్లి, బలదేవాదు లెఱుంగకుండ సుభద్రార్జునుల వివాహంబు సేయ సమకట్టి, తమనిశ్చయం బయ్యిరువురకుం జెప్పి, పశుపతిపూజా మహోత్సవవ్యాజంబున నఖిలయాదవ భోజాంధకవృష్ణివరులతో నంతర్ద్వీపంబునకుం జని. 190**

**ప్రతిపదార్థం:** ఆ+ఇరువుర= ఆ సుభద్రార్జునులయొక్క; అన్యోన్య, ప్రణయంబులు= పరస్పరప్రేమలు; తన దివ్యజ్ఞానంబునన్+చేసి= తన దివ్యజ్ఞానంచేత; దివ్య, పురుషుండు; పురుష+ఉత్తముండు= పురుషులలో శ్రేష్ఠుడు - శ్రీకృష్ణుడు; ఎఱింగి= తెలిసికొని; అర్జునునకున్= అర్జునునికి; భోజన, విధులు= భోజన సంబంధకార్యములు; అమర్పన్= అమర్చుటకు; రుక్మిణీదేవిన్; పంచి= పంపి; ఒక్కనాఁడు; ఏకాంతంబునన్= ఏకాంతంలో; దేవకీ, వసుదేవ, ప్రద్యుమ్న, సాంబ, సంకర్షణ, సారణ, సాత్యకులకున్; అర్జును స్థితియును= అర్జునుని ఉనికిని; అతని అందున్= అతనిపై; సుభద్ర, నెయ్యంబును= సుభద్రయొక్క స్నేహాన్ని; ఎఱింగించి= తెలిపి; తమ, తొల్లింటి= తమ పూర్వపు; విచారంబునకున్= ఆలోచనకు; అనుగుణంబు= తగినది; అగుటకున్= కావటానికి; సంతసిల్లి; బలదేవ+ఆదులు= బలరాముడు మొదలైనవాళ్ళు; ఎఱుంగకుండన్= తెలియకుండా; సుభద్రా+అర్జునుల= సుభద్రార్జునుల; వివాహంబు= పెండ్లి; చేయన్= చేయటానికి; సమకట్టి= పూనుకొని; తమ, నిశ్చయంబు=

తమ నిర్ణయం; ఆ+ఇరువురకున్= ఆ ఇద్దరికి; పశుపతి, పూజా, మహ +ఉత్సవ, వ్యాజంబునన్= శివపూజా మహోత్సవం నెపంతో; అఖిల, యాదవ, భోజ+అంధక, వృష్ణి, వరులతోన్= యాదవ, భోజ, అంధక, వృష్ణివంశ శ్రేష్ఠులందరితో; అంతర్+ద్వీపంబునకున్= లోపలి ద్వీపానికి; చని= వెళ్ళి.

**తాత్పర్యం:** ఆ సుభద్రార్జునుల పరస్పరానురాగాలు తనదివ్యజ్ఞానంతో శ్రీకృష్ణుడు తెలిసికొని, అర్జునునికి భోజనవిధులు అమర్చటానికి రుక్మిణీదేవిని పంపి, ఏకాంతంలో దేవకీ వసుదేవ ప్రద్యుమ్న సాంబ సంకర్షణ సారణ సాత్యకులకు అర్జునునిఉనికిని, అతనిపై సుభద్రకున్న ప్రేమను తెలియజేశాడు. మొదటినుండి తమకున్న ఆలోచనకు అది అనుకూలమే కనుక సంతోషించాడు. బలరాముడు మొదలైనవాళ్ళకు తెలియకుండా సుభద్రార్జునుల వివాహం చేయటానికి నిశ్చయించాడు. తమనిశ్చయాన్ని ఆ ఇద్దరికి చెప్పాడు. శివపూజా మహోత్సవం నెపంతో అఖిలయాదవ భోజాంధకవృష్ణివంశశ్రేష్ఠులతో ఆంతరద్వీపానికి వెళ్ళి.

**వ.** **అం దమరబృందవంద్యు । కిందుకళాభరణునకు నుమేశ్వరునకు నా**
**నందం బొందఁగ నందఱ । నందకధరుఁ డుత్సవం బొనర్పఁగఁ బంచెన్.** **191**

**విశేషం:** నందక, ధరుడు= నందకం అనే పేరుకల ఖడ్గాన్ని ధరించినవాడు - విష్ణుమూర్తి - కృష్ణుడు; అందున్= ఆంతర ద్వీపంలో; అమర, బృంద, వంద్యునకున్= దేవతాసమూహానికి పూజ్యుడైనవానికి; ఇందు, కళా+ఆభరణునకున్= చంద్రకళ ఆభరణంగా కలవానికి; ఉమా+మహేశ్వరునకున్= ఉమాదేవి భర్తకు; ఆనందంబు= సంతోషం; ఒందఁగన్= కలిగేటట్లు; ఉత్సవంబు= పండుగ; ఒనర్పఁగన్= చేయటానికి; అందఱన్= అందరినీ; పంచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** 'ఆంతరద్వీపంలో దేవతలందరికీ పూజ్యుడు, చంద్రశేఖరుడు ఉమాపతి అయిన పరమేశ్వరునికి ప్రీతిగా ఉత్సవం చేయండి' అని శ్రీకృష్ణుడు అందరినీ ఆజ్ఞాపించాడు.

**క.** **తగఁగ వివాహం బెన్నం । డగునొకొ, యెన్నండు సంగమావాప్తియు మా**
**కగునొకొ యని యెడఁ గోరుచు । నొగి నిట యుండిరి సుభద్రయును విజయుండున్.** **192**

**ప్రతిపదార్థం:** తగన్+కన్= తగురీతిగా; వివాహంబు= పెండ్లి; ఎన్నండు= ఎప్పుడు; అగున్+ఒకొ= అవుతుందోకదా!; ఎన్నండు= ఎప్పుడు; సమాగమ+అవాప్తియున్= కలయిక లభించటం; మాకున్= మాకు; అగున్+ఒకొ= కలుగుతుందోకదా!; అని; ఎడన్= హృదయంలో; కోరుచున్= కోరుకొంటూ; సుభద్రయును= సుభద్రయును; విజయుండును= అర్జునుడూ; ఒగిన్= క్రమంగా; ఇటన్= ద్వారవతిలో; ఉండిరి= ఉన్నారు.

**తాత్పర్యం:** 'తగురీతిలో వివాహం ఎన్నడు జరుగుతుందో! మాకు సమాగమ - అవకాశం ఎన్నడు లభిస్తుందో!' అని హృదయంలో కోరుకొంటూ సుభద్రార్జునులు ద్వారకలో ఉన్నారు.

**విశేషం:** నాయికానాయకులలో రతిభావం దేదీప్యమానంగా (ఉజ్జ్వలంగా) ధ్వనింపచేయటంలో నన్నయ 'కాంతి' అనే గుణాన్ని కమనీయంగా పోషించాడు. (సంపా.)

**క. హరిఁ దలఁచె సుభద్ర ; పురం । దరుఁ దలఁచె ధనంజయుండు; దడయక వా ర**
**య్యిరువురఁ బెండిలి సేయఁగ । వరదులు తద్ద్వారవతికి వచ్చిరి ప్రీతిన్. 193**

**ప్రతిపదార్థం:** సుభద్ర, హరిన్= శ్రీకృష్ణుడిని; తలఁచెన్= తలచింది; ధనంజయుండు= అర్జునుడు; పురందరున్= దేవేంద్రుడిని; తలఁచెన్= అనుకున్నాడు; వరదులు= వరాలిచ్చేవారు; వారు= ఆ శ్రీకృష్ణదేవేంద్రులు; తడయక= ఆలస్యంచేయక; ఆ+ఇరువురన్= ఆ ఇద్దరిని; పెండిలి= పెండ్లి; చేయఁగన్= చేయటానికి; ప్రీతిన్= ప్రేమతో; తత్+ద్వారవతికిన్= ఆ ద్వారకానగరానికి; వచ్చిరి= వచ్చారు.

**తాత్పర్యం:** సుభద్ర మనస్సులో శ్రీకృష్ణుడిని తలచుకొన్నది. అర్జునుడు దేవేంద్రుడిని తలచుకొన్నాడు. వరాలిచ్చే వాళ్ళిద్దరు వెంటనే వాళ్ళపెండ్లి చేయటానికి ప్రీతితో ద్వారవతీనగరానికి (ద్వారకానగరానికి) వచ్చారు.

**విశేషం:** ఈ పద్యంలో నాయికానాయకుల సంకల్పాలలోనూ, ఇంద్రోపేంద్రుల ఆగమనంలోనూ, పద్యనిర్మాణంలోనూ సమతాగుణం సార్థకం. (సంపా.)

### అర్జునుండు సుభద్రను వివాహంబగుట (సం. అను 1-144-270 పంక్తి)

**వ. ఇట్లు వాసుదేవుండు వసుదేవాక్రూరసారణసాంబసాత్యకిసహితంబుగా నంతర్ద్వీపంబుననుండి వచ్చిన యనంతరంబ యమరావతినుండి యమరసిద్ధసాధ్యమునిగణపరివృతుం డై యమరేంద్రుండు వచ్చె; నంత బృహస్పతి యిచ్చిన యుత్తమలగ్నంబున నగ్నియమనిర్ఋతివరుణవాయుధనదేశానాదిసురవరులు, నత్రిభృగు నారద వసిష్ఠవామదేవప్రభృతి మహామునులును సదస్యులుగాఁ, గశ్యపప్రజాపతి హోమకర్తగా, నరుంధతియు శచియు సత్యభామయు రుక్మిణియు నప్సరోగణంబులతోడం బురంధ్రీకార్యంబులు నిర్వహింప సుభద్రార్జునుల వివాహమహోత్సవం బతిరమ్యం బయ్యె నంత. 194**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు, వసుదేవ+అక్రూర, సారణ, సాంబ, సాత్యకి, సహితంబుగాన్= వసుదేవుడు, అక్రూరుడు మొదలైన వాళ్ళతోకూడి; అంతర్+ద్వీపంబునుండి; వచ్చిన= వచ్చిన; అనంతరంబు+అ= తరువాత; అమరావతినుండి; అమర, సిద్ధ, సాధ్య, ముని, గణ పరివృతుండు+ఐ= దేవతలతో, సిద్ధులతో, సాధ్యులతో, మునిసమూహాలతో చుట్టబడినవాడై; అమర+ఇంద్రుండు= దేవేంద్రుడు; వచ్చెన్; అంతన్; బృహస్పతి; ఇచ్చిన= పెట్టిన; ఉత్తమ, లగ్నంబునన్= మంచి ముహూర్తంలో; అగ్ని, యమ, నిర్ఋతి, వరుణ, వాయు, ధనద+ఈశాన+ఆది, సుర, వరులున్= అగ్నిదేవుడు, కుబేరుడు, ఈశానుడు (అష్టదిక్పాలకులు) మొదలైన దేవతాశ్రేష్ఠులూ; అత్రి, భృగు, నారద, వసిష్ఠ, వామదేవ, ప్రభృతి, మహామునులు= అత్రి, భృగువు, నారదుడు, వసిష్ఠుడు, వామదేవుడు మొదలైన మహామునులూ; సదస్యులుగాన్= సభలోని సభ్యులుగా; కశ్యప, ప్రజాపతి= కశ్యప ప్రజాపతి; హోమకర్తగాన్= హోమం చేసేవాడుగా; అరుంధతియు= అరుంధతి; శచియు, సత్యభామ, రుక్మిణియును= శచీదేవి, సత్యభామ, రుక్మిణి; అప్సరస్+గణంబులతోడన్= అప్సరసలసమూహాలతో; పురంధ్రీ, కార్యంబులు= ముత్తైదువులు చేయదగినపనులు; నిర్వహింపన్= నిర్వహించగా; సుభద్రా+అర్జునుల= సుభద్రార్జునుల; వివాహ= పెండ్లి; మహా+ఉత్సవంబు= గొప్ప పండుగ; అతి, రమ్యంబు= ఎంతో చూడముచ్చటైనది; అయ్యెన్= జరిగింది; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా శ్రీకృష్ణుడు వసుదేవ అక్రూర సారణ సాంబ సాత్యకులతో ఆంతరద్వీపంనుండి వచ్చిన తర్వాత దేవేంద్రుడు అమర సిద్ధ సాధ్య ముని సమూహాలతో అమరావతినుండి వచ్చాడు. బృహస్పతి పెట్టిన ఉత్తమ లగ్నంలో అష్టదిక్పాలకులు మొదలైన దేవతాశ్రేష్ఠులు, అత్రి, భృగు, నారదాదిమహామునులు సదస్యులుగా, కశ్యప ప్రజాపతి హోమకర్తగా, అరుంధతీ శచీ సత్యభామా రుక్మిణులు అప్సరసల సాయంతో ముత్తైదువులు చేసే పనులన్నీ నిర్వహించగా, సుభద్రార్జునుల వివాహం చూడముచ్చటగా జరిగింది. అప్పుడు.

**తరువోజ.**

**అనిమిషప్రభుఁడు నిజాత్మజు ననఘు । నర్జునుఁ బ్రీతితో నభిషిక్తుఁ జేసి**
**మనుజేంద్రుఁ గాంచనమణిమయోత్తుంగ । మకుటవిభూషణమస్తకుఁ జేసి**
**యనుపమకేయూరహారాదిభూష । ణాభిశోభితుఁ జేసి యప్పు డానంద**
**జనితాంబుకణికార్ద్రచక్షుస్సహస్ర । జలరుహంబులు దాల్చె సమ్మదం బెసఁగ. 195**

**ప్రతిపదార్థం:** అనిమిష, ప్రభుఁడు = దేవేంద్రుడు; నిజ+ఆత్మజున్= తన కుమారుడిని; అనఘున్= పాపరహితుడిని; అర్జునున్= అర్జునుని; ప్రీతితోన్, అభిషిక్తున్+చేసి= అభిషేకింపబడినవాడినిగా చేసి, మనుజ+ఇంద్రున్= రాజును; కాంచన, మణిమయ+ఉత్తుంగ, మకుట, విభూషణ, మస్తకున్= బంగారంతో, మణులతో నిర్మించిన కిరీటంచేత అలంకరింపబడిన శిరస్సుకలవాడిని; చేసి; అనుపమ, కేయూర, హార+ఆది, భూషణ+అభిశోభితున్= సాటిలేని బాహుపురులు, హారాలు మొదలైన ఆభరణాలచే ప్రకాశించేవాడినిగా; చేసి, అప్పుడు; ఆనంద, జనిత+అంబు, కణిక+ఆర్ద్ర, చక్షున్+సహస్ర, జల రుహంబులు= ఆనందంనుండి పుట్టిన నీటిబిందువులచే తడిసిన పద్మాలవంటి కళ్ళు వేయింటిని; సమ్మదంబు= సంతోషం; ఎసఁగన్= అతిశయించగా; తాల్చెన్= ధరించాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు - తన కుమారుడు, పుణ్యాత్ముడు అయిన అర్జునుడిని అభిషేకించి (మంగళస్నానం చేయించి), బంగారంతో మణులతో రూపొందించిన కిరీటాన్ని శిరస్సుపై అలంకరించి, సాటిలేని బాహుపురులు, హారాలు మొదలైన ఆభరణాలు - అలంకరించి' ఆనంద బాష్పాలచేత తడిసిన పద్మాలవంటి కళ్ళు వేయింటిని సంతోషం అతిశయిల్లగా ధరించాడు.

**విశేషం:** అలం: రూపకం. అనిమిషులు అంటే రెప్పపాటులేనివారు - దేవతలు. వృత్తలక్షణానికి చూడు. ఆది.2-150 విశేషం. ఈ పద్యంలో ఓజోగుణంతోకూడికొన్న ప్రసాదగుణం సన్నివేశగతమైన ఉదాత్తతను ప్రసన్నంగా పోషిస్తున్నది. (సంపా.)

**మాలిని.**

**నరునకు దయ ని ట్లానంద మొందించి యింద్రుం**
**డరిగె దివికి దివ్యానంతరత్నాంశుజాల**
**స్ఫురితసురవిమానంబుల్ నభోభాగ మెల్ల**
**న్మెరసి వెలుఁగుచుండన్ నిర్జరశ్రేణితోడన్. 196**

**ప్రతిపదార్థం:** ఇంద్రుండు= దేవేంద్రుడు; నరునకున్= అర్జునునికి; ఇట్లు= ఈ విధంగా; ఆనందము= సంతోషం; ఒందించి= కూర్చి; దివ్య+అనంత, రత్న+అంశు, జాల, స్ఫురిత, సుర, విమానంబుల్= శ్రేష్ఠములైన అంతులేని రత్నకిరణాల సమూహంతో ప్రకాశిస్తున్న దేవతా విమానాలు; నభస్+భాగము+ఎల్లన్= ఆకాశమంతటా; మెరసి= బయల్పడి; వెలుఁగుచున్ +ఉండన్= ప్రకాశిస్తూ ఉండగా; నిర్జర, శ్రేణితోడన్= దేవతల సమూహంతో; దివికిన్= స్వర్గానికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు అర్జునునికి ఇట్లా ఆనందం కలిగించి - శ్రేష్ఠాలైన అనంత రత్నకిరణ సమూహంతో ప్రకాశించే దేవతావిమానాలు ఆకాశమంతా వెలుగుతుండగా దేవతలతో కలిసి స్వర్గలోకానికి వెళ్ళాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు. ఆది. 2-81 విశేషం.

**వ. ఇట్లు నారాయణుండు నిజారంభంబు సఫలం బగుటకు సంతసిల్లి, సంప్రాప్తమనోరథుం డయిన యప్పార్థుం గౌఁగిలించుకొని, 'యక్షయబాణతూణీరబాణాసనసనాథం బయి పవనజవనహయంబులం బూన్చిన యక్కాంచనరథం బెక్కి సుభద్రం దోడ్కొని యింద్రప్రస్థపురంబున కరుగు' మని పంచి, యనంతరం బంతర్ద్వీపంబున కరిగిన. 197**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నారాయణుండు= శ్రీకృష్ణుడు; నిజ+ఆరంభంబు= తనప్రయత్నం; సఫలంబు+అగుటకున్= సఫలం కావటానికి; సంతసిల్లి= సంతోషించి; సంప్రాప్త; మనోరథుండు+అయిన= పొందబడిన కోరిక గలవాడైన; ఆ+పార్థున్= ఆ అర్జునుడిని; కౌఁగిలించుకొని= ఆలింగనంచేసి; అక్షయ, బాణ, తూణీర, బాణ+ఆసన, సనాథంబు+అయి= తరుగని బాణాల అమ్ములపొదితో, ధనుస్సుతో కూడినదై; పవన, జవన, హయంబులన్= వాయువేగం గల గుర్రాలను; పూన్చిన= కట్టిన; ఆ+కాంచన, రథంబు= ఆ బంగారురథాన్ని; ఎక్కి, సుభద్రన్= సుభద్రను; తోడ్కొని= వెంటతీసుకొని; ఇంద్రప్రస్థ, పురంబునకున్= ఇంద్రప్రస్థ నగరానికి; అరుగుము= వెళ్ళుము; అని= అని పలికి; పంచి= పంపి; అనంతరంబు+అ= తరువాత; అంతర్+ద్వీపంబునకున్= అంతర్ద్వీపానికి; అరిగినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** ఈ విధంగా శ్రీకృష్ణుడు తన ప్రయత్నం సఫలం అయినందుకు సంతోషించి, కోరిక నెరవేరిన అర్జునుడిని కౌగిలించుకొని, 'తరుగని బాణాల అమ్ములపొదితో, ధనుస్సుతో కూడి, వాయువేగం గల గుర్రాలను పూన్చిన ఆ బంగారురథం ఎక్కి సుభద్రతో ఇంద్రప్రస్థపురానికి వెళ్ళు' మని పంపి, తరువాత తాను కూడ అంతర ద్వీపానికి వెళ్ళగా.

**క. హరి పంచిన మార్గంబునఁ । గురువిభుఁడు సుభద్రఁ దోడుకొని చనునెడఁ ద**
**త్పురపరిరక్షకు లతిభీ । కరులు పృథుశ్రవసుఁ డాదిగాఁ గల వీరుల్. 198**

**ప్రతిపదార్థం:** హరి= శ్రీకృష్ణుడు; పంచిన= పంపిన; మార్గంబునన్= దారిలో; కురు, విభుఁడు= కురువంశరాజు అర్జునుడు; సుభద్రన్= సుభద్రను; తోడుకొని= వెంట తీసికొని; చను+ఎడన్= వెళ్ళేటప్పుడు; తత్+పుర, పరిరక్షకులు= ఆ పట్టణానికి కాపలా ఉండేవాళ్ళు; అతి, భీకరులు= మిక్కిలి భయాన్ని కలిగించేవాళ్ళు; పృథుశ్రవసుడు+ఆదిగాన్+కల= పృథుశ్రవసుడు మొదలుగా ఉన్న; వీరుల్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు పంపినమార్గంలో అర్జునుడు సుభద్రను తోడ్కొని వెళ్ళుతుండగా, ఆ పట్టణానికి కాపలా ఉన్న పృథుశ్రవసుడు మొదలైన భయంకరవీరులు.

**ఉ. 'వీరుఁడు వీఁడు పాండవుఁడు వృష్ణికులోత్తము లైన సీరిదై**
**త్యారు లెఱుంగకుండఁగ మహారథుఁ డై తరుణిన్ సుభద్ర నం**
**భోరుహనేత్రఁ దోడ్కొనుచుఁ బోయెడి; నీతనిఁ బోవనిచ్చినన్**
**ధీరుఁడు మాధవుండు బలదేవుఁడు నల్గుదు' రంచు నడ్డ మై. 199**

**ప్రతిపదార్థం:** వీఁడు= ఇతడు; పాండవుఁడు= పాండురాజుకుమారుడు; వీరుఁడు; వృష్ణి, కుల+ఉత్తములు+ఐన= వృష్ణివంశశ్రేష్ఠులైన; సీరి, దైత్య+అరులు= బలరామ శ్రీకృష్ణులు; ఎఱుంగక+ఉండఁగన్= తెలియకుండా; మహారథుఁడు+ఐ= గొప్ప రథంమీద కూర్చున్నవాడై; తరుణిన్= కాంతను; సుభద్రన్= సుభద్రను; అంభోరుహ, నేత్రన్= పద్మాలవంటి కళ్ళు కలదానిని; తోడ్కొనుచున్= వెంటతీసికొంటూ; పోయెడిన్= పోతున్నాడు; ఈతనిన్= ఇతనిని; పోవనిచ్చినన్= పోనిస్తే; ధీరుఁడు; మాధవుండు= శ్రీకృష్ణుడు; బలదేవుఁడున్= బలరాముడు; అల్గుదురు+అంచున్= కోపపడతారని; అడ్డమై= అడ్డగించి.

**తాత్పర్యం:** ఇతడు పాండవవీరుడు - వృష్ణికులశ్రేష్ఠులైన బలరామశ్రీకృష్ణులకు తెలియకుండా పెద్ద రథాన్ని ఎక్కి, పద్మాలవంటి కన్నులు గల సుభద్రాకాంతను తోడ్కొని పోతున్నాడు. ఇతడిని వదలితే ధీరులు శ్రీకృష్ణుడు, బలరాముడు కోపపడతారని అడ్డగించి.

**విశేషం:** "వీరుడు వీఁడు" అనే ప్రశంసాత్మకవాక్యంతో ప్రారంభమయ్యే ఈ పద్యంలో అర్జునుడి వీరకృత్యం భటులచేత వితర్కింపబడింది. ఇది అర్థవైమల్యాన్ని వ్యక్తం చేసే ప్రసాదగుణ విశిష్టరచన. (సంపా.)

**క. వీఁకఁ బఱతెంచి నలుగడఁ । దాఁకినఁ గడు నలిగి ఘోరతరశరహతి న**
**మ్మూఁకలు విరియఁగ నర్జునుఁ । డాఁకరమున నేసె నుగ్రుఁ డయి రణభూమిన్. 200**

**ప్రతిపదార్థం:** వీఁకన్= పరాక్రమంతో; పఱతెంచి= పరుగెత్తివచ్చి; నలుగడన్= నాలుగువైపుల; తాఁకినన్= ఎదుర్కోగా; అర్జునుఁడు; కడున్+అలిగి= మిక్కిలికోపించి; ఉగ్రుఁడు+అయి= భయంకరుడై; రణ, భూమిన్= యుద్ధరంగంలో; ఘోరతర, శర+ఆహతిన్= మిక్కిలి భయంకరాలైన బాణాల దెబ్బలచే; ఆ+మూఁకలు= ఆ సేనలు; విరియఁగన్= చెల్లాచెదురయ్యేటట్లు; ఆఁకరమునన్= ఆగ్రహంతో; కోపంతో; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** పరాక్రమంతో పరుగెత్తి వచ్చి నలువైపుల ముట్టడించగా అర్జునుడు భయంకరుడై యుద్ధరంగంలో మిక్కిలి తీవ్రాలైన బాణాలతో ఆ సేనలు చెల్లాచెదరయ్యేటట్లు కోపంతో కొట్టాడు.

**చ. హరితనయుండు పార్థుఁడు రయంబున నందఱ నాహవక్రియా**
**విరతులఁ జేసి యప్పురమువీథుల వేదుల రమ్యహర్మ్య గో**
**పురములఁ దద్గిరీంద్రమణిభూముల భూరితటాకపంకజా**
**కరనవనందనావళులఁ గాండమయంబులఁ జేసె నీసునన్. 201**

**ప్రతిపదార్థం:** హరి, తనయుండు= దేవేంద్రునికుమారుడు; పార్థుఁడు= అర్జునుడు; రయంబునన్= వేగంగా; అందఱన్= ఆ సైనికులందరినీ; ఆహవ, క్రియా విరతులన్+చేసి= యుద్ధపు పనినుండి విరమించుకొన్నవాళ్ళనుగా చేసి; ఈసునన్= కోపంతో; ఆ+పురము= ఆ పట్టణంయొక్క; వీథులన్; వేదులన్= అరుగులను, రమ్య, హర్మ్య, గోపురములన్= అందములైన మేడల గోపురాలను; తత్+గిరి+ఇంద్రమణి, భూములన్= ఆ పర్వతశ్రేష్ఠంయొక్క రత్నాల నేలలను; భూరి, తటాక, పంకజ+ఆకర,

నవ, నందన+ఆవళులన్= పెద్దచెరువులయొక్క, పద్మాలకు నిలయాలైన సరస్సులయొక్క, కొత్తఉద్యానవనాలయొక్క సమూహాలను; కాండమయంబులన్= బాణాలతో నిండినవాటినిగా; చేసెన్.

**తాత్పర్యం:** దేవేంద్రునితనయుడైన అర్జునుడు వెంటనే ఆ సైనికులు యుద్ధం విరమించుకొనేటట్లు చేసి, ఆ కోపంతో ఆ పట్టణంలోని వీథులను, అరుగులను, అందాలైన మేడల గోపురాలను, ఆ మహాపర్వతంయొక్క రత్నాల నేలలను, పెద్దచెరువులను, సరస్సులను, ఉద్యానవనాలను బాణాలతో నింపాడు.

**విశేషం:** అర్జునుని యుద్ధక్రీడ రమణీయం. ద్వారవతీనగర రక్షకులను, యాదవసైన్యాలను అంతమొందించటం ఆయన లక్ష్యం కాదు - తనకు అడ్డురాకుండా చెల్లాచెదురు చేయటం, మళ్ళీ విజృంభించకుండా తన శక్తిసామర్థ్యాలు చూపి, చతికిల పడేటట్లు చేయటం ఆయన ఉద్దేశం. అందుకే ఆయన ద్వారవతి వీథులను, అరుగులను, మేడల గోపురాలను, పర్వతప్రదేశాలను, చెరువులను, సరస్సులను, ఉద్యానవనాలను తన బాణాలతో నింపాడు. అడుగు ముందుకు వేస్తారేమో - జాగ్రత్త! అన్నట్లు - భాషతో కాక బాణాలతో హెచ్చరించి వెళ్ళాడు. అందువలన నన్నయ ఈ పద్యంలో శుద్ధఓజస్సును పోషించకుండ ప్రసాదగుణయుక్తమైన ఓజస్సునే ప్రదర్శించాడు. రసోదంచితగుణవద్రచన కిది ఉదాహరణం. ఈవిధంగా సుభద్రావివాహఘట్టంలో నన్నయ దశగుణాలను ఆవిష్కరించే రచనను చేసి తన శైలియొక్క ప్రత్యేకతను ప్రదర్శించాడు. (సంపా.)

**క. అమరేంద్రసుతుఁడు దనకుం । గమలాక్షి సుభద్ర రథముఁ గడపఁగ ననిలో**
**నమిత యదుసైన్యముల న । శ్రమమున నోడించి లబ్ధ జయుఁ డయి యరిగెన్. 202**

**ప్రతిపదార్థం:** అమర+ఇంద్ర, సుతుఁడు= దేవేంద్రునియొక్కకుమారుడు - అర్జునుడు; తనకున్; కమల+అక్షి= పద్మాలవంటి కన్నులు కలది; సుభద్ర; రథమున్= రథాన్ని; కడపన్+కన్= నడపగా; అనిలోన్= యుద్ధంలో; అమిత, యదు, సైన్యములన్= పరిమితి లేని యాదవసైన్యాలను; అశ్రమమునన్= సులభంగా; ఓడించి, లబ్ధ, జయుఁడు+అయి= జయాన్ని పొందినవాడై - అంటే జయాన్ని పొంది; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఇంద్రతనయుడైన అర్జునుడు తనకు సుభద్ర రథం నడుపగా - యుద్ధంలో అపరిమితాలైన యాదవసైన్యాలను సులభంగా ఓడించి, విజయాన్ని పొంది వెళ్ళాడు.

**వ. అంత సభాపాలుండు ప్రబల జలధార ధ్వాన గంభీరభేరీధ్వనిచే నర్జునుపరాక్రమం బెఱింగించిన దాని విని యంతర్ద్వీపంబున నున్న బలదేవాదియాదవులందఱు నాక్షణంబ పురంబునకు వచ్చి సభాసీను లయి. 203**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; సభాపాలుండు; ప్రబల, జలధర, ధ్వాన, గంభీర, భేరీ, ధ్వనిచేన్= గొప్ప మేఘధ్వనివంటి గంభీరమైన నగారా మ్రోతచేత; అర్జును= అర్జునుని; పరాక్రమంబున్= పరాక్రమాన్ని; ఎఱింగించినన్= తెలుపగా; దానిన్= దానిని; విని; అంతర్+ద్వీపంబునన్, ఉన్న, బలదేవ+ఆది, యాదవులు+అందఱున్= అంతర్ద్వీపంలో ఉండే బలరాముడు మొదలైన యాదవులంతా; ఆ, క్షణంబు+అ= ఆ వెంటనే; పురంబునకున్= ద్వారవతీపురానికి; వచ్చి; సభా+ఆసీనులు+అయి= సభలో కూర్చున్నవాళ్ళయి.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా విజయాన్ని సాధించి వెళ్ళిన తరువాత - సభాపాలుడు పెద్ద మేఘధ్వనివంటి గంభీరమైన నగారామ్రోతతో అర్జునునిపరాక్రమం తెలుపగా, అది విని, అంతర్ద్వీపంలో ఉన్న బలరాముడు మొదలైన యాదవులంతా అప్పటికప్పుడే ద్వారవతీపురానికి వచ్చి సభ చేసి.

**క. యాదవుల నాదరింపక । యాదవిఁ దోడ్కొని కిరీటి యరిగెను గంభీ**

**రోదధిఁ గరముల నీఁదం । గా దనక కడంగె నధికగర్వోద్ధతుఁ డై. 204**

**ప్రతిపదార్థం:** కిరీటి= అర్జునుడు; యాదవులన్= యాదవుల్ని; ఆదరింపక= లెక్కపెట్టక; యాదవిన్= యాదవకాంతను; తోడ్కొని= వెంటతీసికొని; అరిగెను= వెళ్ళాడు; గంభీర+ఉదధిన్= లోతైన మహాసముద్రాన్ని; కరములన్= చేతులతో; ఈఁదన్+కాదు+అనక= ఈదటం సాధ్యం కాదనకుండా; అధిక, గర్వ+ఉద్ధతుఁడు+ఐ= మిక్కిలిగర్వంతో విజృంభించినవా డై; కడంగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** యాదవులను లెక్కపెట్టక అర్జునుడు యాదవకాంతను తోడ్కొని వెళ్ళాడు. లోతైన మహాసముద్రాన్ని చేతులతో ఈదటం సాధ్యం కాదని తెలిసికొనకుండా గర్వాతిశయంతో విజృంభించి ఈ పనికి పూనుకొన్నాడు.

**మత్తకోకిల.**

**ఏల పార్థుపరాక్రమంబు సహింప? నాతని నాహవ**

**వ్యాలు నిప్పడ పట్టి తెత్తము; వాతధూతదవానల**

**జ్వాలకున్ వనరాశివేల కసంఖ్యయాదవసేనకున్**

**దేలిపోవక చక్కనయ్యెడు ధీరు లెవ్వరు పోరిలోన్. 205**

**ప్రతిపదార్థం:** పార్థు, పరాక్రమంబున్= అర్జునునియొక్క పరాక్రమాన్ని; సహింపన్= ఓర్చుకొనటం; ఏల= ఎందుకు? ఆహవ, వ్యాలున్= యుద్ధంలో పొగరుపట్టిన ఏనుగువంటివాడిని; అతనిన్= అతనిని; ఇప్పుడు+అ; పట్టితెత్తము= పట్టి తెస్తాము; వాత, ధూత, దవానల, జ్వాలకున్= గాలిచే కదలింపబడిన దావాగ్నిజ్వాలకు; వనరాశి, వేలకున్= సముద్రం ఉప్పెనకు; అసంఖ్య, యాదవ, సేనకున్= అంతులేని యాదవసైన్యానికి; పోరిలోన్= యుద్ధంలో; తేలిపోవక= తొలగిపోక; చక్కన+అయ్యెడు= ఎదుట నిలువగల; ధీరులు= ధైర్యవంతులు; ఎవ్వరు?= ఎవరు?

**తాత్పర్యం:** అర్జునునిపరాక్రమాన్ని సహించటం ఎందుకు? యుద్ధంలో మదించిన ఏనుగువంటి అతడిని పట్టుకొని తీసికొనివద్దాము. గాలిచే రగుల్కొన్న దావాగ్ని జ్వాలకు, సముద్రపుటుప్పెనకు, అంతులేని యాదవసైన్యానికి యుద్ధంలో తొలగిపోకుండా ఎదరు నిలువగలిగిన ధైర్యవంతులెవరు?

**విశేషం:** అలం: దీపకం, ఉపమ. వృత్తలక్షణాలకు చూడు; ఆది.1.153.విశేషం.

**వ. అని విజృంభించి విలయసమయ సముద్ధూత వారాశియుంబోలె ఘూర్ణిల్లుచున్న యాదవవీరుల వారించి వాసుదేవుం జూచి, బలదేవుం డి ట్లనియె. 206**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; విజృంభించి= అతిశయించి; విలయ, సమయ, సముద్ధూత, వారాశియున్+పోలెన్= ప్రళయకాలంలో మిక్కిలి వృద్ధి పొందింపబడిన సముద్రంవలె; ఘూర్ణిల్లుచున్+ఉన్న= తిరుగుపడుతున్న; యాదవ, వీరులన్= యాదవవీరుల్ని; వారించి= అడ్డగించి; వాసుదేవున్= శ్రీకృష్ణుణ్ణి; చూచి; బలదేవుండు= బలరాముడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని విజృంభించి ప్రళయకాలంలో పొంగిన మహాసముద్రంవలె తిరుగుడుపడుతున్న యాదవ వీరులను ఆపి, శ్రీకృష్ణునితో బలరాముడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'నీ వెఱుఁగకుండ గర్వము । తో విజయుఁడు దా సుభద్ర దోడ్కొని బలిమిం**
**బోవఁగ నంతసమర్థుఁడె' । నావుడుఁ గృష్ణుండు రాముసకు ని ట్లనియెన్. 207**

**ప్రతిపదార్థం:** నీవు+ఎఱుంగకుండన్= నీకు తెలియకుండానే; విజయుఁడు= అర్జునుడు; గర్వముతోన్, తాన్= తాను; బలిమిన్= బలవంతంగా; సుభద్రన్; తోడ్కొని= వెంటతీసికొని; పోవఁగన్= పోవటానికి; అంత, సమర్థుఁడు+ఎ= అంత మొనగాడా? నావుడున్= అనిఅనగా; రాముసకున్= బలరామునికి; కృష్ణుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీకు తెలియకుండానే అర్జునుడు గర్వంతో బలవంతంగా సుభద్రను తోడ్కొని పోవటానికి అంత సమర్థుడా!' అని అనగా బలరామునితో శ్రీకృష్ణుడు ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** గూఢమైన అధిక్షేప చతురోక్తికి ఇది చక్కని ఉదాహరణ.

**సీ. భరతకులాగ్రణి పాండవసింహంబు । సర్వధర్మజ్ఞుఁ డాసవ్యసాచి**
**దనమేనమఱఁదలి ధవళాక్షిఁ దోడ్కొని । చనియె; నాతని కది చనదె చెప్పుఁడ!**
**యప్పార్థుపిఱుఁద మీ రరుగంగ వాఁ డంత । యశ్రమసాధ్యుఁడె యాహవమున?**
**నఖిలాస్త్రవిదుఁడు ద్రోణాచార్యశిష్యుండు । జితకాశి యని వానిఁ జెప్ప వినరె?**

**ఆ. వలవ దుడుగుఁ' డనిన వాముసు పలు కను । వేలఁ గడవదయ్యె వృష్ణిభోజ**
**యాదవాంబురాశి యట ధనంజయుఁ డవి । జేయుఁ డభిమతార్థసిద్ధిఁ బొంది. 208**

**ప్రతిపదార్థం:** భరత, కుల+అగ్రణి= భరతవంశశ్రేష్ఠుడు; పాండవ, సింహంబు= పాండవశ్రేష్ఠుడు; సర్వ, ధర్మజ్ఞుఁడు= అన్నిధర్మాలు తెలిసినవాడు; సవ్యసాచి= అర్జునుడు; తన= తనయొక్క; మేనమఱఁదలిన్= మేనమరదలిని; ధవళ+అక్షిన్= తెల్లని కన్నులు కలదానిని, అందమైన కన్నులు కలదానిని; తోడ్కొని= వెంటతీసికొని; చనియెన్= వెళ్లాడు; అతనికిన్= ఆ అర్జునునికి; అది, చనదె= అది తగదా; చెపుఁడు+అ= చెప్పండి; ఆ+పార్థు, పిఱుఁదన్= ఆ అర్జునుని వెనుక; మీరు+అరుగంగన్= మీరు వెళ్ళగా - అంటే దండెత్తి వెళ్ళగా; వాఁడు= అతడు; ఆవహమునన్= యుద్ధంలో; అంత, అశ్రమ, సాధ్యుఁడు+ఎ= అంత సులభంగా లొంగేవాడా; వానిన్= అతనిని; అఖిల+అస్త్ర, విదుఁడు= అన్ని అస్త్రాలు తెలిసినవాడు; ద్రోణ+ఆచార్య, శిష్యుండు; జితకాశి= యుద్ధంలో జయించి ప్రకాశించేవాడు; అని= అని; చెప్పన్; వినరె= అనగా వినలేదే మీరు; వలవదు= వద్దు; ఉడుగుఁడు= (మీ ప్రయత్నం) మానుకోండి; అనినన్= అని చెప్పగా; వాముసు, పలుకు= శ్రీకృష్ణునియొక్క మాట; అను; వేలన్= చెలియలికట్టను; వృష్ణి, భోజ, యాదవ; అంబు, రాశి=వృష్ణి, భోజ, యాదవ వంశాలవాళ్ళనే సముద్రం; కడవదు+అయ్యెన్= దాటదాయెను; అవిజేయుఁడు= జయింపసాధ్యం కానివాడు; ధనంజయుఁడు= అర్జునుడు; అభిమత+అర్థ, సిద్ధిన్= ఇష్టమైన కోరిక సఫలం కావటాన్ని; పొంది.

**తాత్పర్యం:** 'భరతవంశశ్రేష్ఠుడు, పాండవశ్రేష్ఠుడు, సర్వధర్మాలు తెలిసినవాడూ అయిన అర్జునుడు తన మేనమరదలిని తోడ్కొని వెళ్ళటం తగదా? చెప్పండి. మీరు అతడిని వెంబడించి దండెత్తితే యుద్ధంలో అతడంత సులభ సాధ్యుడా? అతడు అన్నిఅస్త్రాలు తెలిసినవాడనీ, అంతటి ద్రోణాచార్య శిష్యుడనీ, యుద్ధంలో జయించి

ప్రకాశించేవాడనీ, మీరు వినలేదా?' - అని శ్రీకృష్ణుడన్నాడు. శ్రీకృష్ణునిమాట అనే చెలియలికట్టను వృష్ణి భోజ యాదవ వంశాలవారనే సముద్రం దాటలేకపోయింది. జయింపసాధ్యం కాని అర్జునుడు తాను కోరినదానిని పొందాడు.

**విశేషం:** అలం: రూపకం. యాదవులమీద శ్రీకృష్ణుని పట్టు, వ్యూహరచనలో ఆయన నేర్పు, మాటల చాకచక్యం ఈ ఘట్టంలో స్పష్టం.

### అర్జునుండు సుభద్రాసహితుండై యింద్రప్రస్థపురంబునకుఁ జనుట (సం.1-213-13)

**వ.** **ఇ ట్లింద్రప్రస్థపురంబున కభిముఖుం డై యానర్తకదేశంబులకుం జని, యందు ముందఱ ముకుందప్రేషితు లయిన దాశార్హవీరులతో నగణ్యారణ్యంబులు గడచుచుఁ, బుణ్యతీర్థంబుల నాడుచు నానాజనపదంబుల విహరించుచు వచ్చి యింద్రప్రస్థపురసమీపంబున.** **209**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ఇంద్రప్రస్థ, పురంబునకున్; అభిముఖుండు+ఐ= ఎదురు ముఖం కలవాడై - అంటే ఇంద్రప్రస్థపురంవైపు పయనించినవాడై; ఆనర్తక, దేశంబులకున్= ఆనర్తక దేశాలకు; చని= వెళ్ళి; అందున్= అచ్చట; ముందఱన్= ముందుగా; ముకుంద, ప్రేషితులు+అయిన= శ్రీకృష్ణునిచే పంపబడినవాళ్ళయిన; దాశార్హ, వీరులతోన్= దాశార్హునివంశానికి సంబంధించిన వీరులతో; అగణ్య+అరణ్యంబులు= లెక్కించటానికి సాధ్యం కానన్ని అడవులు; కడచుచున్= దాటుతూ; పుణ్య తీర్థంబులన్= పుణ్య తీర్థాలలో; ఆడుచున్= స్నానమాడుతూ; నానా జనపదంబులన్= అనేక గ్రామాలలో; విహరించుచున్; వచ్చి; ఇంద్రప్రస్థ, పుర, సమీపంబునన్= ఇంద్రప్రస్థనగరానికి దగ్గరలో.

**తాత్పర్యం:** ఈ విధంగా ఇంద్రప్రస్థపురం వైపు పయనించి, ఆనర్తకదేశాలకు వెళ్ళి, అక్కడ శ్రీకృష్ణుడు పంపిన దాశార్హవంశవీరులతో కలిసి లెక్కించసాధ్యంకానన్ని అడవులను దాటుతూ, పుణ్యతీర్థాలలో స్నానమాడుతూ అనేక గ్రామాలలో విహరిస్తూ వచ్చి, ఇంద్రప్రస్థపురానికి సమీపంలో.

**ఆ.** **ఘనభుజుండు నరుఁడు దనతొఱ్ఱుపట్టుల । విశ్రమించి భువనవిశ్రుతుండు**
**మతిఁ దలంచి యాత్మహిత మగు నట్లుగా । నిష్టమున సుభద్ర కిట్టు లనియె.** **210**

**ప్రతిపదార్థం:** ఘన, భుజుండు= దృఢమైన భుజాలు కలవాడు; భువన, విశ్రుతుండు= ప్రపంచమంతటా ప్రసిద్ధి కెక్కినవాడు; నరుఁడు; తన, తొఱ్ఱుపట్లున్= తన ఆవులమందలున్నచోట; విశ్రమించి= అలసట తీర్చికొని; మతిన్= మనస్సులో; తలంచి= ఆలోచించి; ఆత్మ, హితము+అగునట్లుగాన్= తనకు మేలు కలిగేటట్లుగా; సుభద్రకున్; ఇష్టమునన్= ప్రీతితో; ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** బలమైన భుజాలు కలవాడు, ప్రపంచంలో ప్రసిద్ధికెక్కినవాడు అయిన అర్జునుడు తన ఆవులమంద లున్నచోట విశ్రమించి, తనకు మేలు కలిగేటట్లుగా ఆలోచించి ప్రియమార సుభద్రతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** తొఱ్ఱుపట్టు అంటే ఆలమంద. ఆలమందలు సామాన్యంగా ఊరి పొలిమేరలలో ఉంటాయి. అర్జునుడు తన 'తొఱ్ఱుపట్టుల' విశ్రమించాడనగా ఇంద్రప్రస్థపట్టణపు పొలిమేరలకు చేరి విశ్రమించాడని భావం. ఇక మిగిలింది ఇంద్రప్రస్థపురప్రవేశమే. మూలంలో పి.పి.యస్.శాస్త్రిగారి ప్రతిలో "క్రోశమాత్రేపురస్యాసీత్ గోష్ఠం పార్థస్యశోభనం" అని ఉన్నది.

**వ.** **'మన మివ్విధంబునఁ జనునప్పుడు నిన్నుఁ జూచి ద్రుపదరాజపుత్త్రి యప్రియంబులు వలుకునో; యప్పరమ పతివ్రతపలుకు నిక్కువం బగుం గావున, నీ వేకతంబ గోపాలబాలికలతో ముందఱ నరిగి యక్కోమలిం గను మని**

**పనిచిన సుభద్రయు నిజేశ్వరుపంచిన మార్గంబున నింద్రప్రస్థపురంబునకుం బోయి కుంతీదేవికి ద్రౌపదికి మ్రొక్కిన.**
**211**

**ప్రతిపదార్థం:** మనము; ఈ+విధంబునన్; చను, అప్పుడు= వెళ్ళేటప్పుడు; నిన్నున్= నిన్ను; చూచి, ద్రుపద, రాజ, పుత్రి= ద్రుపదరాజుయొక్క కూతురు-ద్రౌపది; అప్రియంబులు= కఠినమైన మాటలు; పలుకునో= అంటుందో ఏమో; ఆ+పరమ, పతివ్రత పలుకు= ఆ మహాపతివ్రత మాట; నిక్కువంబు= నిజం; అగున్= అవుతుంది; కావునన్; నీవు; ఏకతంబు+అ= ఒక్కదానివే; గోపాల, బాలికలతో= గొల్లపిల్లలతో; ముందఱన్= ముందుగా; అరిగి= వెళ్ళి; ఆ+కోమలిన్= ఆ అందగత్తెను - ద్రౌపదిని; కనుము= చూడుము; అని; పనిచిన= ఆజ్ఞాపించగా; సుభద్రయున్= సుభద్రకూడా; నిజ+ఈశ్వరు, పంచిన, మార్గంబునన్= తన భర్త ఆజ్ఞాపించిన విధంగా; ఇంద్రప్రస్థ, పురంబునకున్; పోయి= వెళ్ళి; కుంతీదేవికిన్, ద్రౌపదికిని; మ్రొక్కినన్= నమస్కరింపగా.

**తాత్పర్యం:** 'మనం ఈ విధంగా కలిసి వెళ్ళితే నిన్ను చూచి ద్రౌపది పరుషవాక్యాలు పలుకుతుందేమో! ఆ పరమపతివ్రత పలుకు నిజమవుతుంది. అందువలన నీవే ప్రత్యేకంగా గోపబాలికలతో కలిసి ముందుగా వెళ్ళి ఆమెను చూడుము' అని ఆజ్ఞాపించగా - సుభద్ర తనభర్త ఆజ్ఞాపించిన విధంగానే ఇంద్రప్రస్థపురానికి వెళ్ళి కుంతీదేవికి, ద్రౌపదికి మ్రొక్కగా.

**విశేషం:** సామాన్యంగా ఏ ఇల్లాలుకూడా తన మగడు మరొక కాంతను వెంటబెట్టుకొని రావటాన్ని సహించదు కదా! అందువలననే అర్జునుడు సుభద్రకు ఆ ఉపాయం చెప్పాడు. దక్షిణనాయకులకు ఈ దూరదృష్టి, ఉపాయజ్ఞత ఉండక తప్పదు. కొన్ని భారతప్రతులలో 'కని యడుగులం బడు మని' అర్జునుడు సుభద్రకు చెప్పినట్లు కూడా ఉన్నది.

**తే.** **'పంకజాక్షి! నీపతి ప్రతిపక్షవీర । విజయుఁ డయ్యేడు; నీవును వీరపుత్ర**
**జనని వగు' మని దీవించె సంతసంబు । తోడ వసుదేవపుత్త్రి నాద్రుపదపుత్త్రి.** **212**

**ప్రతిపదార్థం:** పంకజ+అక్షి= పద్మాలవంటి కన్నులు కలదానా!; నీ, పతి= నీయొక్క భర్త; ప్రతిపక్ష, వీర, విజయుఁడు= శత్రుపక్షవీరులను జయించేవాడు; అయ్యెడున్= అగుగాక; నీవును= నీవుకూడా; వీర, పుత్ర, జననివి= వీరుడైన పుత్రునికి తల్లివి - అనగా వీరమాతవు కమ్ము; అని; ఆ, ద్రుపద, పుత్రి= ఆ ద్రుపదరాజు కూతురు - ద్రౌపది; వసుదేవుని, పుత్రిన్= వసుదేవుని కూతురైన సుభద్రను; సంతసంబుతోడన్, దీవించెన్= సంతోషంతో దీవించింది.

**తాత్పర్యం:** పద్మాలవంటి అందమైన కన్నులు కలదానా! నీ భర్త శత్రుపక్ష వీర విజయుడు అగుగాక! నీవు కూడా వీరమాతవు అగుదువు గాక! అని ఆ ద్రౌపది సంతోషంతో సుభద్రను దీవించింది.

**విశేషం:** విజయుడు అనే పదం ఈ సందర్భంలో విశేషార్థాన్ని సాధించింది. నీ భర్త శత్రుపక్షవీరులను జయించే వాడగు గాక - అనే అర్థంలో ద్రౌపది ఆ పదాన్ని ప్రయోగించినా, అర్జునునికి విజయుడు అనే పేరు ఉండటంవలన - నీ భర్త శత్రుపక్ష వీరులను జయించే అర్జునుడగుగాక అనే అర్థంకూడా ఇక్కడ విశేషించి వ్యక్తమవుతున్నది. 'అప్పరమపతివ్రత పలుకు నిక్కువం బగు' అని అర్జునుడు అంతకుముందే సుభద్రతో అన్నట్లు - ద్రౌపది తెలిసి పలికినా, తెలియక పలికినా సుభద్రకు విజయుడే భర్త అయ్యాడు. అంతేకాక 'వీరపుత్ర జనని వగుము' అని దీవించింది. మున్ముందు ఆమె అభిమన్యునివంటి వీరాగ్రేసరుణ్ణి కని వీరమాత ఔతుంది. ఇది భావికథార్థ వ్యంజకమైన పతాకస్థానం.

**వ. ఇట్లు ద్రోవదిచేత దీవనలు సేకొని కుంతీదేవియొద్ద సుభద్ర యున్నంత; నట యర్జునుండును నసంఖ్యాకదాశార్హసైన్య సమేతుం డై యనేకబ్రాహ్మణాశీర్వాదంబు లెసంగ నింద్రప్రస్థపురంబుం బ్రవేశంబుసేసి ధౌమ్యునకు ధర్మరాజునకు భీమునకుఁ గుంతీదేవికి మ్రొక్కి; తనకు మ్రొక్కిన కవలం గౌఁగిలించుకొని పరమానందంబున నుండు నంత. 213**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ద్రోవదిచేత= ద్రౌపదిచేత; దీవెనలు= ఆశీర్వాదాలు; చేకొని= గైకొని; కుంతీదేవి, ఒద్దన్= కుంతీదేవి దగ్గర; సుభద్ర; ఉన్నంతన్= ఉండగా; అచట= అచ్చట; అర్జునుండును= అర్జునుడుకూడ; అసంఖ్యాక, దాశార్హ, సైన్య, సమేతుండు+ఐ= లెక్కింప సాధ్యంకాని దాశార్హమైన సైన్యంతో కూడుకొన్నవాడై; అనేక, బ్రాహ్మణ+ఆశీర్వాదంబులు= పలువురు విప్రుల దీవెనలు; ఎసంగన్= అతిశయిల్లగా; ఇంద్రప్రస్థ, పురంబున్= ఇంద్రప్రస్థపురాన్ని; ప్రవేశంబు, చేసి,= ప్రవేశించి; ధౌమ్యునకున్= ధౌమ్యునికి; ధర్మరాజునకున్= ధర్మరాజునకు; భీమునకున్= భీమునికి; కుంతీదేవికిన్; మ్రొక్కి; తనకున్; మ్రొక్కిన= నమస్కరించినట్టి; కవలన్= నకులసహదేవులను; కౌఁగిలించుకొని; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషంతో; ఉండు+అంతన్= ఉండగా;

**తాత్పర్యం:** ఈ విధంగా సుభద్ర ద్రౌపదిచేత దీవెనలు పొంది కుంతీదేవిదగ్గర ఉండగా, అర్జునుడు అపరిమితమైన దాశార్హసైన్యంతో; పెక్కుమందిబ్రాహ్మణులఆశీర్వచనాలతో ఇంద్రప్రస్థపురంలో ప్రవేశించి తమ పురోహితుడైన ధౌమ్యునికి, అన్నలైన ధర్మజభీములకు, తల్లి కుంతీదేవికి మ్రొక్కి, తనకు మ్రొక్కిన తమ్ములు నకులసహదేవులను కౌగిలించుకొని పరమానందంతో ఉండగా.

**క. చెలియలు మఱఁదియుఁ జని యి । మ్ముల నింద్రప్రస్థనగరమున నభిమతబం**
**ధులయొద్ద నున్నవా రని । జలశయనుఁడు విని కరంబు సంతుష్టుం డై. 214**

**ప్రతిపదార్థం:** చెలియలు= చెల్లెలు; మఱఁదియున్= మరిది; చని= వెళ్ళి; ఇమ్ములన్= సుఖంగా; ఇంద్రప్రస్థ, నగరమునన్; అభిమత, బంధుల, ఒద్దన్= ఇష్టమైన బంధువులదగ్గర; ఉన్నవారు= ఉన్నారు; అని= అని; జల, శయనుఁడు= నీటిమీద పవళించేవాడు- శ్రీమహావిష్ణువు- శ్రీకృష్ణుడు; విని= విని; కరంబు= మిక్కిలి; సంతుష్టుండు+ఐ= సంతోషం పొందినవాడై.

**తాత్పర్యం:** చెల్లెలు సుభద్ర, మరది అర్జునుడు ఇంద్రప్రస్థపురానికి వెళ్ళి, సుఖంగా ఇష్టమైన బంధువులతో కలిసి ఉన్నారని విని - శ్రీకృష్ణుడు సంతోషించినవాడై.

### శ్రీకృష్ణబలదేవాదులు పాండవులకుఁ గానుకలు తెచ్చియిచ్చుట (సం.1-213-23)

**సీ. బలదేవ సాత్యకి ప్రద్యుమ్న వసుదేవు । లాదిగా బెరసిన యాదవాగ్ర**
**గణ్యులుఁ దాను నగణ్యమహావస్తు । వాహనంబులు గొని వాసుదేవుఁ**
**డనుజకు నరణ మీ నర్థితోఁ జనుదెంచె; । హరిరాక యెఱిఁగి ధర్మాత్మజుండు**
**గరము గారవమునఁ గవలను గృష్ణున । కెదురు పుత్తెంచిన నింద్రలీల**

**ఆ. నిందువంశవిభుఁ డుపేంద్రుఁ డింద్రప్రస్థ । పురము సొచ్చె నతివిభూతి మెఱసి**
**యనుజవరులతోడ నంతఁ బ్రత్యుద్గతుం । డై యుధిష్ఠిరుండు హర్ష మెసఁగ. 215**

**ప్రతిపదార్థం:** వాసుదేవుఁడు= శ్రీకృష్ణుడు; అనుజకున్= చెల్లెలికి-సుభద్రకు; అరణము= ఆడపడుచులను అత్తవారింటికి పంపినపుడు ఇచ్చే ధనం, ఇచ్చే కానుకలను; ఈన్= ఇవ్వటానికి; అగణ్య, మహా, వస్తు, వాహనంబులు= లెక్కింపసాధ్యం కానన్ని గొప్పవస్తువులు, వాహనాలు; కొని= తీసికొని; బలదేవ, సాత్యకి, ప్రద్యుమ్న, వసుదేవులు+ఆదిగాన్= బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు, వసుదేవుడు మొదలుగా; బెరసిన= కూడిన; యాదవ+అగ్రగణ్యులు= యాదవశ్రేష్ఠులు; తానున్; అర్థితోన్= వేడ్కతో; చనుదెంచెన్= వచ్చాడు; ఇందువంశ, విభుఁడు= చంద్రవంశపురాజు; ధర్మ+ఆత్మజుండు= ధర్మునియొక్క కుమారుడు- ధర్మరాజు; హరి, రాక= శ్రీకృష్ణునిరాక; ఎఱిఁగి= తెలుసుకొని; కరము= మిక్కిలి; గారవమునన్= ప్రీతితో; ఇంద్రలీలన్= దేవేంద్రునివలె; కవలను= నకుల సహదేవులను; కృష్ణునకున్; ఎదురు, పుత్తెంచినన్= ఎదురు పంపగా; ఉపేంద్రుఁడు= శ్రీకృష్ణుడు; ఇంద్రప్రస్థ, పురము= ఇంద్రప్రస్థపురాన్ని; చొచ్చెన్= ప్రవేశించాడు; అంతన్= అపుడు; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అతి, విభూతిన్= మిక్కిలి ఐశ్వర్యంతో; మెఱసి= ప్రకాశించి; అనుజ, వరులతోడన్= శ్రేష్ఠులైన తమ్ములతో కూడా; ప్రతి+ఉద్గతుండు+ఐ= ఎదురేగినవాడై; హర్షము= సంతోషం; ఎసఁగన్= అతిశయిల్లగా.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు చెల్లెలికి అరణంగా ఇవ్వటానికి లెక్కింప సాధ్యంకానన్ని గొప్ప వస్తువులను, వాహనాలను తీసికొని - బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు, వసుదేవుడు మొదలైన యాదవకులశ్రేష్ఠులతో కలిసి ఎంతో సంతోషంతో వచ్చాడు. చంద్రవంశప్రభువైన ధర్మరాజు శ్రీకృష్ణునిరాక తెలిసికొని మిక్కిలిగౌరవంతో, దేవేంద్ర విలాసంతో, నకులసహదేవులను ఎదురు పంపగా, ఆయన ఇంద్రప్రస్థపురంలో ప్రవేశించాడు. అప్పుడు యుధిష్ఠిరుడు శ్రేష్ఠులైన తమ్ములతో తానుకూడా ఎదురేగి ఆనందాతిశయంతో.

**వ. వసుదేవాది యాదవవృద్ధుల కెల్ల మ్రొక్కి బలదేవ వాసుదేవ సాత్యకి సారణ ప్రద్యుమ్నాదుల నుచితప్రియ పూర్వకంబున సత్కృతులం జేసిన. 216**

**ప్రతిపదార్థం:** వసుదేవ+ఆది= వసుదేవుడు మొదలైన, యాదవ, వృద్ధులకున్+ఎల్లన్= యాదవవృద్ధుల కందరికీ; మ్రొక్కి; బలదేవ, వాసుదేవ, సాత్యకి, సారణ, ప్రద్యుమ్న+ఆదులన్= బలరాముడు, శ్రీకృష్ణుడు, సాత్యకి, సారణుడు, ప్రద్యుమ్నుడు మొదలైనవారిని; ఉచిత, ప్రియ, పూర్వకంబునన్= ప్రేమతో తగినరీతిగా; సత్కృతులన్+చేసినన్= సమ్మానింపగా.

**తాత్పర్యం:** వసుదేవుడు మొదలైన యాదవవృద్ధులకు నమస్కరింపగా - వాసుదేవుడు, సాత్యకి, సారణుడు, ప్రద్యుమ్నుడు మొదలైనవాళ్ళను ప్రియమార గౌరవింపగా.

**ఉ. ఆనకదుందుభిప్రభృతియాదవులుం గురుముఖ్యులున్ మృదం**
**గానకదుందుభుల్ సెలఁగ నత్యనురాగముతో నిరంతర**
**శ్రీనుతు లొప్ప నుత్సవము సేసిరి సప్తదినంబు లిష్టస**
**మ్మానములన్ మహీసురసమాజసమీహితపూజనంబులన్. 217**

**ప్రతిపదార్థం:** ఆనకదుందుభి= వసుదేవుడు; ప్రభృతి= మొదలైన; యాదవులున్=యాదవులు; కురు, ముఖ్యులున్= కురువంశశ్రేష్ఠులు; మృదంగ+ఆనక, దుందుభుల్, చెలఁగన్= మద్దెలలు, తప్పెటలు; భేరులు, మ్రోగుతుండగా; నిరంతరశ్రీ, నుతులు= ఎడతెగని సంపద, పొగడ్తలు; ఒప్పన్= ఒప్పగా; ఇష్ట, సమ్మానములన్= ఇష్టములైన గౌరవాలచేత (బంధువులకు); మహీసుర, సమాజ, సమీహిత, పూజనంబులన్= బ్రాహ్మణ సమూహంచే కోరబడిన పూజలచేత; అతి+అనురాగముతో= మిక్కిలి ప్రీతితో; సప్త, దినంబులు= ఏడురోజులు; ఉత్సవము, చేసిరి= పండుగచేశారు.

**తాత్పర్యం:** వసుదేవుడు మొదలైన యాదవులు, కురువంశప్రముఖులు - మద్దెలలు, తప్పెటలు, నగారాలు మ్రోగుతుండగా - అంతులేని సంపద, స్తోత్రాలు శోభిల్లగా - బంధువులను గౌరవించి, బ్రాహ్మణసమూహాన్ని కోరుకొన్న విధంగా పూజించి ఎంతో ప్రీతితో ఏడురోజులు పండుగ చేశారు.

**విశేషం:** వసుదేవుడు దేవమీఢునికి, మారిషకు పుట్టిన కుమారుడు. ఇతడు పుట్టేటప్పుడు ఆకాశంలో దుందుభులు మ్రోగాయి. అందువలన ఇతనికి ఆనకదుందుభి అనే పేరుకూడా కలిగింది. వసుదేవునికి రోహిణియందు బలరాముడు, గదుడు, సారణుడు మొదలైనవాళ్ళు జన్మించారు. దేవకియందు కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రుడు, సంకర్షణుడు, శ్రీకృష్ణుడు మొదలైనవాళ్ళు జన్మించారు. దేవమీఢునికే 'శూరు' డని పేరు.

**వ. అంత.** **218**

**తాత్పర్యం:** అప్పుడు.

**క. నిరుపమపరార్ధ్యరుచి సుం। దరరత్నావళుల శోభితము లగువానిన్**
**వరదుఁడు సహస్రసంఖ్యా। భరణంబులఁ బార్థునకు సుభద్రకు నిచ్చెన్.** **219**

**ప్రతిపదార్థం:** వరదుఁడు= వరాలను ఇచ్చేవాడు - శ్రీకృష్ణుడు; నిరుపమ, రుచి, సుందర, రత్న+ఆవళులన్= సాటిలేని ఉత్తమకాంతిచే అందమైన రత్న సమూహాలతో; శోభితములు+అగు, వానిన్= ప్రకాశిస్తున్న వాటిని; సహస్రసంఖ్య+ ఆభరణంబులన్= వేయి సొమ్ములను; పార్థునకున్= అర్జునునికి; సుభద్రకున్, ఇచ్చెన్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు - సాటిలేని శ్రేష్ఠమైనకాంతితో, అందమైన రత్నసమూహాలతో ప్రకాశించే వెయ్యి ఆభరణాలను అర్జునునికి, సుభద్రకు ఇచ్చాడు.

**వ. మఱియును.** **220**

**తాత్పర్యం:** అంతేకాక.

**సీ. అవిరళక్షరితదానార్ద్రగండస్థల। గజసహస్రంబును, గనకరత్న**
**రచిత మై తురగసారథిసహితం బైన। రథసహస్రంబును, రమ్యభూష**
**ణాలంకృతస్త్రీసహస్రంబుఁ, గాంచన। శిబికాసహస్రంబుఁ, జిత్రలలిత**
**గతి నొప్పు నేనూఱుగాడిదలను, సింధు। బాహ్లికకాంభోజపారసీక**

**ఆ. జాత మైన తురగశతసహస్రము, లక్ష। గోధనంబు, నధికఘోరవీర**
**దర్పయుక్తు లైన దశలక్షదాశార్హ। వరుల నరణ మిచ్చె వామనుండు.** **221**

**ప్రతిపదార్థం:** అవిరళ, క్షరిత, దాన+ఆర్ద్ర, గండస్థల, గజ, సహస్రంబును= ఎడతెగకుండా కారుతున్న మదజలంతో తడిసిన చెక్కిళ్ళు గల ఏనుగులు వేయింటిని; కనక, రత్న, రచితము+ఐ= బంగారంతో; రత్నాలతో నిర్మింపబడి, తురగ, సారథి,

సహితంబు+ఐన= గుఱ్ఱాలతో, సారథితో కూడుకొన్న; రథ, సహస్రంబును= రథాలు వెయ్యింటిని; రమ్య, భూషణ+అలంకృత, స్త్రీ, సహస్రంబున్= అందమైన ఆభరణాలచే అలంకరింపబడిన స్త్రీలను వెయ్యిమందిని; కాంచన, శిబికా, సహస్రంబును= బంగారు పల్లకీలు వెయ్యింటిని; చిత్ర, లలిత, గతిన్= చిత్రమూ, మనోహరమూ అయిన నడకతో; ఒప్పు= శోభిల్లు; ఏనూఱు, గాడిదలను= ఐదువందల గాడిదలను; సింధు, బాహ్లిక, పారసీక, జాతము+ఐన= సింధు బాహ్లిక కాంభోజ పారసీక దేశాలలో పుట్టిన; తురగ, శత, సహస్రము= గుఱ్ఱాలు నూరువేలను; లక్ష, గోధనంబున్= లక్ష గోరూప ధనాన్ని; అధిక, ఘోర, వీర, దర్ప, యుక్తులు+ఐన= మిక్కిలి భయంకరమైన వీరగర్వంచే కూడుకొన్న; దశ, లక్ష, దాశార్హ, వరులన్= పదిలక్షలమంది దాశార్హ వీరశ్రేష్ఠులను; వామనుండు= శ్రీకృష్ణుడు, అరణము+ఇచ్చెను= అత్తవారింటికి పంపిన ఆడపడుచులకు ఇచ్చే కానుకగా ఇచ్చాడు.

**తాత్పర్యం:** ఎడతెగకుండా కారుతున్న మదజలంచేత తడిసిన చెక్కిళ్ళు గల ఏనుగులు వెయ్యింటిని, బంగారుతో రత్నాలతో రూపొంది, గుఱ్ఱాలతో సారథితో కూడుకొన్న రథాలు వెయ్యింటిని, అందమైన ఆభరణాలతో అలంకరించిన స్త్రీలను వెయ్యిమందిని, బంగారు పల్లకీలను వెయ్యింటిని, చిత్రమై అందమైన నడకతో ఒప్పే గాడిదలు అయిదు వందలను, సింధు బాహ్లిక కాంభోజ పారశీకదేశాలలో పుట్టిన గుఱ్ఱాలను నూరువేలను; ఆవులు ఒక లక్షను, మహాభయంకరమైన వీరగర్వం కల దాశార్హవీరులను పదిలక్షలమందిని - శ్రీకృష్ణుడు అరణంగా ఇచ్చాడు.

**క. క్రమముననుఁ గొంతిదేవిని । యమనందను భీముఁ గవల నాద్రౌపది ను**
**త్తమరత్నాభరణాదుల । నమరఁగ వేర్వేఱ నెయ్యుఁ డయి పూజించెన్. 222**

**ప్రతిపదార్థం:** క్రమముననుఁ= వరుసగా; గొంతిదేవిని= కుంతీదేవిని; యమ, నందనున్=ధర్మరాజును; భీమున్= భీముని; కవలన్= నకుల సహదేవులను; ఆ, ద్రౌపదిన్= ఆ ద్రౌపదిని; ఉత్తమ, రత్న+ఆభరణాదులన్= శ్రేష్ఠములైన రత్నాభరణాలతో; వేరు+వేఱు+అ= వేరువేరుగా; నెయ్యుఁడు+అయి= స్నేహితుడై; అమరఁగన్= ఒప్పగా; పూజించెన్.

**తాత్పర్యం:** క్రమంగా కుంతీదేవిని, ధర్మరాజును, భీముడిని, కవలలను, ద్రౌపదిని శ్రేష్ఠాలైన రత్నాభరణాలతో వేరువేరుగా పూజించాడు.

**వ. మఱియు బలదేవాదియాదవముఖ్యు లెల్ల సుభద్రార్జునులం బూజించి, పాండవులచేతం బ్రతిపూజితు లై ద్వారవతికిం జని; రుపేంద్రుం డింద్రనందనుతోడి యిష్టవినోదంబుల నింద్రప్రస్థపురంబున నుండె నంత. 223**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; బలదేవ+ఆది; యాదవ, ముఖ్యులు+ఎల్లన్= బలరాముడు మొదలైన యాదవ ప్రముఖులంతా; సుభద్రా+అర్జునులన్= సుభద్రను అర్జునుని; పూజించి= పూజించి; పాండవులచేతన్= పాండుకుమారులచేత; ప్రతిపూజితులు+ఐ= ఎదురు పూజింపబడినవాళ్ళయి; ద్వారవతికిన్= ద్వారవతికి; చనిరి= వెళ్ళారు; ఉపేంద్రుండు= శ్రీకృష్ణుడు; ఇంద్ర, నందనుతోడి= అర్జునునితో; ఇష్ట, వినోదంబులన్= ఇష్టములైన వినోదాలతో; ఇంద్రప్రస్థ, పురంబునన్= ఇంద్రప్రస్థపురంలో; ఉండెన్= ఉన్నాడు; అంతన్= అటుపై.

**తాత్పర్యం:** బలరాముడు మొదలైన యాదవప్రముఖులంతా సుభద్రార్జునులను పూజించి, పాండవులచేత బదులు పూజలు అందుకొని ద్వారవతికి వెళ్ళారు. శ్రీకృష్ణుడు అర్జునునితో కలిసి ఇంద్రప్రస్థంలో ఇష్ట వినోదాలలో ఉన్నాడు. తరువాత.

## అభిమన్యు ప్రభృతుల జననము (సం.1-213-58)

**ఉ. ధన్యుల కా సుభద్రకు శతక్రతుపుత్త్రున కుద్భవించె స**
**మ్మాన్య యశుండు పుత్త్రుఁ డభిమన్యుఁడు వైన్యనిభుం డనన్యసా**
**మాన్యపరాక్రమప్రబలమాన్యుఁడు పుణ్యచరిత్రుఁ డన్యరా**
**జన్యభయంకరుండు రణశౌర్యుఁడు పాండవవంశకర్త యై.** **224**

**ప్రతిపదార్థం:** ధన్యులకున్= పుణ్యవంతులకు; ఆ, సుభద్రకున్; శతక్రతు, పుత్త్రునకున్= దేవేంద్రుని కుమారునకు - అర్జునునకు; సమ్మాన్య, యశుండు= మిక్కిలి పూజింపదగిన కీర్తి గలవాడు; వైన్య, నిభుండు= పృథుచక్రవర్తితో సమానమైనవాడు; అనన్య, సామాన్య, పరాక్రమ, ప్రబల, మాన్యుఁడు= ఇతరులెవ్వరికీ లేని పరాక్రమాధిక్యంచేత గౌరవించదగినవాడు; పుణ్య, చరిత్రుఁడు= పవిత్రమైన నడవడిక కలవాడు; అన్య, రాజన్య, భయంకరుడు= ఇతరరాజులకు భయాన్ని కలిగించేవాడు; రణ, శౌర్యుఁడు= యుద్ధంలో శూరత్వం కలవాడు; అభిమన్యుడు; పాండవ, వంశ, కర్త+ఐ= పాండవవంశాన్ని నిలిపేవాడై; ఉద్భవించెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** పుణ్యవంతులైన సుభద్రార్జునులకు - మిక్కిలి పూజింపదగిన కీర్తికలవాడు, పృథుచక్రవర్తితో సమానమైనవాడు, ఇతరులెవ్వరికీ లేని పరాక్రమాధిక్యంచేత గౌరవింపదగినవాడు, పవిత్రమైన నడవడిక కలవాడు, ఇతరరాజులకు భయాన్ని కలిగించేవాడు, యుద్ధంలో శౌర్యం కలవాడు అయిన కుమారుడు - పాండవవంశం నిలిపేవాడై జన్మించాడు.

**విశేషం:** అభిమన్యుడు సుభద్రార్జునులకు పుట్టినకొడుకు. అతడు పుట్టినప్పుడు ఆకాశవాణులు పలుకలేదు. దేవతలు పూలవానలు కురిపించలేదు. అయితే, అతనిజీవితంలో క్రమంగా ఆవిష్కృతమయ్యేవీ, భావికథాసూచకాలూ అయిన సార్థక విశేషణాలు నన్నయ వాడి ప్రసన్నకథాకలితార్థయోజనం సాధించాడు. అతడు పుట్టుకతోనే పృథుచక్రవర్తివంటివాడు - పరాక్రమవంతుడు, పుణ్యచరిత్రుడు, శత్రుభయంకరుడు, వంశకర్త - అనే విశేషణాలు అభిమన్యుని జీవితచరిత్రకు సూచకాలు. సుభద్రార్జునులు నిజంగా ధన్యులు!

**చ. సుతజననోత్సవంబున విశుద్ధయశుండు యుధిష్ఠిరుండు సం**
**భృతహృదయప్రమోదుఁ డయి పెంపున నిచ్చె సువర్ణభూషణ**
**ప్రతతులు గోధనాయుతము బ్రాహ్మణముఖ్యులకున్ నిరంతర**
**వ్రతులకు వేదవేదులకు వారిజసంభవునట్టివారికిన్.** **225**

**ప్రతిపదార్థం:** సుత, జనన+ఉత్సవంబునన్= కుమారుడు పుట్టినపుడు చేసే పండుగలో; విశుద్ధ, యశుండు= స్వచ్ఛమైన కీర్తి కలవాడు; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; సంభృత, హృదయ, ప్రమోదుఁడు+అయి= నిండిన హృదయానందం కలవాడై; వారిజ, సంభవు, అట్టివారికిన్= పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవునివంటివారికి; వేద, వేదులకున్= వేదాలు తెలిసినవారికి - వేదపండితులకు; నిరంతర వ్రతులకున్= ఎల్లప్పుడు వ్రతాలు చేసేవారికి; బ్రాహ్మణ, ముఖ్యులకున్= బ్రాహ్మణ శ్రేష్ఠులకు; సువర్ణ, భూషణ, ప్రతతులు= బంగారు ఆభరణాల సమూహాలు; గోధన+అయుతము= గో ధనం పదివేలు - అంటే పదివేల గోవులు; పెంపునన్= సమృద్ధిగా; ఇచ్చెన్.

**తాత్పర్యం:** అభిమన్యుడు పుట్టినపుడు జరిపినపండుగలో స్వచ్ఛమైన కీర్తిగల ధర్మరాజు - మహానందంతో బ్రహ్మదేవునివంటివాళ్ళు, వేదవేత్తలైనవాళ్ళు, ఎల్లప్పుడు వ్రతాలు చేసేవాళ్ళు అయిన బ్రాహ్మణశ్రేష్ఠులకు బంగారు ఆభరణాలు, పదివేలగోవులు సమృద్ధిగా ఇచ్చాడు.

**వ. ఇట్లుదయించిన యభిమన్యుండు దల్లిదండ్రులకు సకల జనులకు నానందం బొనరించుచు ధౌమ్య నిర్మిత జాతకర్మ చౌలోపనయనుం డయి పెరుఁగుచు. 226**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ఉదయించిన= జన్మించిన; అభిమన్యుండు; తల్లిదండ్రులకున్; సకల, జనులకున్; ఆనందంబు; ఒనరించుచున్= కూర్చుచు; ధౌమ్య, నిర్మిత, జాతకర్మ, చౌల+ఉపనయనుండు= పురోహితుడైన ధౌమ్యునిచే చేయబడిన, జాతకర్మ, ఉపనయనం కలవాడు; అయి; పెరుఁగుచున్= పెరుగుతూ.

**తాత్పర్యం:** ఇట్లా జన్మించిన అభిమన్యుడు తల్లిదండ్రులకూ, జనులకూ ఆనందం కలిగిస్తూ, ధౌమ్యుడు జాతకర్మను, ఉపనయనాన్నీ చేయగా, పెరుగుతూ.

**విశేషం:** జాతకర్మ, చౌలం, ఉపనయనం - షోడశకర్మలలోనివి. జాతకర్మ - పుట్టినప్పుడు చేసే క్రియ. చౌలం - జుట్టుపెట్టి తలవెంట్రుకలు తీయటం; ఉపన యనం - వేదవిద్యాభ్యాస యోగ్యతను కలిగించే సంస్కారం.

**మత్తకోకిల.**

**ఆదిఁగోలెను గృష్ణుచే దయ నావృతుం డయి ధౌమ్యుతో**
**వేద మంగయుతంబుగాఁ జదివెన్, ధనంజయుతో ధను**
**ర్వేద మిమ్ముగ నభ్యసించెఁ; బ్రవీరవైరిపతాకినీ**
**భేదమార్గము లెల్ల నేర్చె నభేద్యవిక్రమసంపదన్. 227**

**ప్రతిపదార్థం:** ఆదిన్+కోలెన్= మొదటినుండి; కృష్ణుచే=కృష్ణునిచే; దయన్= దయతో;ఆవృతుండు+అయి= చుట్టబడినవాడై; ధౌమ్యుతోన్= ధౌమ్యునిద్వారా; వేదము; అంగ, యుతంబుగాన్= అంగాలతోకూడి; చదివెన్; ధనంజయుతోన్= అర్జునునిద్వారా; ఇమ్ముగన్= విరివిగా; ధనుర్వేదము= ధనుర్వేదాన్ని; అభ్యసించెన్= నేర్చుకొన్నాడు; అభేద్య, విక్రమ, సంపదన్= ఓడింప సాధ్యంకాని పరాక్రమం అనే సంపదచే; ప్రవీర, వైరి, పతాకినీ, భేద, మార్గములు+ఎల్లన్= మిక్కిలి శూరులైన శత్రువుల సైన్యాలను భేదించే విధాలన్నింటినీ; నేర్చెన్= నేర్చుకొన్నాడు.

**తాత్పర్యం:** మొదటినుండి అభిమన్యుడు - శ్రీకృష్ణుని దయ నిండుగా కలిగి పాండవపురోహితుడైన ధౌమ్యుని దగ్గర ఆరు అంగాలతో కూడి వేదవిద్యను చదివాడు. తండ్రి అర్జునునిదగ్గర విరివిగా ధనుర్వేదాన్ని అభ్యసించాడు. అభేద్యమైన పరాక్రమసంపదతో ప్రబలశత్రుసైన్యాలను భేదించే విధాలన్నింటినీ నేర్చుకొన్నాడు.

**విశేషం:** వేదాంగాలు - శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిష్యం, కల్పం. మత్తకోకిల వృత్తలక్షణం. చూడు. ఆది.1.153 విశేషం. అభిమన్యుడు 'కృష్ణునిదయనావృతుడై' పెరిగెనని చెప్పటం సార్థకం. సారమతులైనవాళ్ళు అభిమన్యు మరణానంతరం అతని సంతానాన్ని రక్షించటంలో చూపించే దయ ఇక్కడ వస్తుధ్వని.

**వ. అంత ద్రుపదరాజనందనయుం గ్రమంబునఁ బాండురాజనందనులవలనఁ బ్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేను లనువారిఁ బంచోపపాండవులను సుపుత్త్రులం బడసిన. 228**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; ద్రుపదరాజ, నందనయున్= ద్రుపదరాజుకూతురుకూడా - అంటే ద్రౌపదికూడా; క్రమంబునన్= వరుసగా; పాండురాజ, నందనులవలనన్= పాండురాజుకుమారులవలన - పాండవులవలన; ప్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేనులు+అను= అనే పేర్లుగలవాళ్లను; వారిన్, పంచ+ఉపపాండవులు+అను= ఐదుగురు ఉపపాండవులు అనే; సుపుత్త్రులన్= మంచికుమారులను; పడసినన్= పొందగా.

**తాత్పర్యం:** తరువాత ద్రౌపదికూడా వరుసగా పాండవులవలన అయిదుగురు ఉపపాండవులు అనే సుపుత్రులను పొందింది. ఆ అయిదుగురు - ప్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేనులు.

**విశేషం:** ఉపపాండవులు - ప్రతివింధ్యుడు ద్రౌపదికి ధర్మరాజువలన జన్మించినవాడు; శ్రుతసోముడు భీమునివలన జన్మించినవాడు; శ్రుతకీర్తి అర్జునునివలన జన్మించినవాడు; శతానీకుడు నకులునివలన జన్మించినవాడు; శ్రుతసేనుడు సహదేవునివలన జన్మించినవాడు.

**క. సుతవంతు లయి విశుద్ధ । శ్రుతనయవంతు లయి పాండుసుతు లతులగుణా**
**న్వితులు జగజ్జన నుత వి । శ్రుతులు మహారాజ్యలీల సుఖ మున్నంతన్. 229**

**ప్రతిపదార్థం:** పాండు, సుతులు= పాండురాజు కుమారులు - పాండవులు; సుతవంతులు+అయి= కొడుకులను కలిగినవాళ్ళయి; విశుద్ధ, శ్రుత, నయవంతులు+అయి= నిర్మలమైన విద్య, నీతి కలవాళ్ళయి; అతుల, గుణ+అన్వితులు= సాటిలేని సద్గుణాలతో కూడినవాళ్ళు; జగత్+జన, నుత, విశ్రుతులు= లోకంలోని జనులచే పొగడబడిన ప్రసిద్ధులు; మహా, రాజ్యలీలన్= మహారాజ్యవిలాసంతో; సుఖము+ఉన్నంతన్= సుఖంగా ఉండగా.

**తాత్పర్యం:** పాండవులు కొడుకులను పొంది, నిర్మలమైన నీతి కలవాళ్ళయి, సాటిలేనిసద్గుణాలతో, ప్రపంచ ప్రజల ప్రశంసలు అందుకొన్న ప్రసిద్ధులై మహారాజ్యవిలాసంతో సుఖంగా ఉండగా.

**చ. ఉరుతర దావపావక శిఖోత్కలిత శ్వసనంబులున్, సితే**
**తరగతి తీవ్రతిగ్మకరధామ సహస్రములున్, బహుప్రవా**
**హరహితనిమ్నగాతతులు నై, కడుదీర్ఘము లై, నిదాఘవా**
**సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబు లై. 230**

**ప్రతిపదార్థం:** నిదాఘ, వాసరములు= వేసవి కాలపు పగళ్ళు; ఉరుతర, దావ, పావక, శిఖా+ఉత్కలిత, శ్వసనంబులున్= మిక్కిలి గొప్పవైన కార్చిచ్చు మంటలతో కూడిన గాడ్పులు కలవీ; సిత+ఇతర, గతి, తీవ్ర, తిగ్మ, కర, ధామ, సహస్రములున్= నిప్పులవలె తీక్ష్ణములైన సూర్యకిరణకాంతులు వేయి కలవీ; బహు, ప్రవాహ, రహిత, నిమ్నగా, తతులును+ఐ= గొప్ప ప్రవాహాలు లేని నదుల సమూహాలు కలవై; కడు, దీర్ఘములు+ఐ= మిక్కిలి పొడవైనవై; దారుణంబులు+ఐ= భయంకరాలై; సర్వ జీవులకున్= అన్నిప్రాణులకు; అసహ్యములు+అయ్యెను= ఓర్చుకొనటానికి సాధ్యం కానివి అయ్యాయి.

**తాత్పర్యం:** వేసవిలో పగటిపూట మహాతీవ్రాలైన కార్చిచ్చుమంటలతో కూడినగాడ్పులతో నిప్పులవలె తీక్ష్ణములైన సూర్య సహస్రకిరణకాంతులతో, ప్రవాహాలు పెద్దగా లేని నదులసమూహాలతో - మిక్కిలి పొడవైనవి, భయంకరాలైనవి, ప్రాణులన్నింటికీ ఓర్చుకొనటానికి సాధ్యం కానివి అయ్యాయి.

**విశేషం:** వేసవిలో పగటిపూట ప్రొద్దెక్కువ. అందువలన వేసవిలో పగళ్ళు దీర్ఘాలనటం, వర్ణనం. స్వభావోక్తిసుందరం. ఓజోగుణభరితం.

**వ. అట్టి ఘర్మ దివసంబులు సహింప నోప కర్జునుం డొక్కనాఁడు కృష్ణున కి ట్లనియె. 231**

**ప్రతిపదార్థం:** అట్టి; ఘర్మ, దివసంబులు= వేసవికాలపు పగళ్ళు; సహింపన్+ఓపక= ఓర్చుకొనలేక; అర్జునుండు; ఒక్కనాఁడు; శ్రీకృష్ణునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అటువంటి వేసవికాలపుఎండలు తట్టుకొనలేక అర్జునుడు శ్రీకృష్ణునితో ఇట్లా అన్నాడు.

**చ. జలరుహనాభ! రమ్యగిరిసానువనంబుల వేఁటలాడుచున్**
**జలుపుద మీనిదాఘదివసంబుల నీవును నేను నున్మిష**
**న్నలిన రజస్సుగంధి యమునాహ్రద తుంగ తరంగ సంగతా**
**నిలశిశిరస్థలాంతరవినిర్మితనిర్మలహర్మ్యరేఖలన్. 232**

**ప్రతిపదార్థం:** జలరుహ, నాభ= పద్మనాభా! - ఓ కృష్ణా!; నీవును= నీవూ; నేనున్= నేనూ; రమ్య, గిరి, సాను, వనంబులన్= మనోహరాలైన కొండచరియలలోని అడవులలో; వేటలాడుచున్= వేటాడుతూ; ఉన్మిషత్+నలిన, రజస్+సుగంధి, యమునా, హ్రద, తుంగ, తరంగ, సంగత+అనిల, శిశిర, స్థల+అంతర, వినిర్మిత, నిర్మల, హర్మ్యరేఖలన్= వికసిస్తున్న పద్మాలయొక్క పరాగంచే మంచివాసన కల యమునానది మడుగుయొక్క ఎత్తైన అలలతో కూడిన గాలులచేత చల్లనైన ప్రదేశాల మధ్య గొప్పగా కట్టబడిన పరిశుద్ధమైన మేడలయొక్క వరుసలలో; ఈ, నిదాఘ, దివసంబులన్= ఈ వేసవి రోజులను; చలుపుదము= గడుపుదాము.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! నీవూ, నేనూ మనోహరాలైన కొండచరియలలోని అడవులలో వేటాడుతూ, వికసిస్తున్న పద్మపరాగంతో మంచివాసన గల యమునానదిమడుగుయొక్క ఎత్తైనఅలలమీది గాలులచే చల్లనైన ప్రదేశాల మధ్య, గొప్పగా నిర్మించబడిన నిర్మలంగా ఉన్న మేడల వరుసలో ఈ వేసవిరోజులు గడుపుదాము.

**విశేషం:** వేసవినుండి తప్పించి శీతలసుఖపవనాల నిచ్చే పర్వతసానువులలో కట్టబడిన మేడలపై యమునానదినుండి వచ్చే గాలులను అనుభవిద్దామని అర్జునుడు కృష్ణుడితో చెబుతున్నాడు. ఆయా వస్తువులవలన కలిగే సుఖాలను ధ్వనింపచేసే అక్షరరమ్యతను సంతరించటం మొదట గమనింపదగింది. ఆ గాలులనూ, ఆ మేడలనూ మనసులో రూపుకట్టేటట్లు వర్ణించటంలో నన్నయ సమాధి అనే గుణాన్ని సాధించి ఆరోహక్రమంలో పద్యరచనచేసి, భావనాసుందరంగా శ్రోత అనుభవించేటట్లు చేయటం తరువాత తెలియదగింది. అక్షరరమ్యమైన నన్నయశైలికి అద్దంపట్టే పద్యాల్లో ఇదొకటి. (సంపా.)

**వ. అని పురందరనందనుండు గోవిందు ననుమతంబు వడసి మిత్రామాత్యభృత్యసమేతులయి యిద్దఱు నరిగి యథారుచి ప్రదేశంబుల విహరించుచు నొక్కనాఁడు ఖాండవవనసమీపంబున నొక్కచందనలతాభవన**

**చంద్రకాంతవేదికయందు మందశీతలసురభిమారుతం బనుభవించుచు నిష్టకథావినోదంబుల నుండునంత.233**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; పురందర, నందనుండు= దేవేంద్రునికుమారుడు - అర్జునుడు; గోవిందు, అనుమతంబు= శ్రీకృష్ణునియొక్క సమ్మతిని; పడసి= పొంది; మిత్ర+అమాత్య, భృత్య, సమేతులు+అయి= స్నేహితులతో, మంత్రులతో, సేవకులతో కూడుకొన్నవాళ్ళయి; ఇద్దఱున్; అరిగి= వెళ్ళి; యథారుచి, ప్రదేశంబులన్= ఇష్టమైనచోట్ల; విహరించుచున్= విహరిస్తూ; ఒక్కనాఁడు; ఖాండవ, వన, సమీపంబునన్= ఖాండవవనానికి దగ్గరగా; ఒక్క; చందన, లతా, భవన, చంద్రకాంత, వేదిక, అందున్= మంచిగంధపు తీవల ఇంటిలోని చలువరాతి తిన్నెపై; మంద, శీతల, సురభి, మారుతంబు= మెల్లగా వీచేది, చల్లనిది, సువాసన కలది అయిన గాలిని; అనుభవించుచున్= అనుభవిస్తూ; ఇష్టకథా, వినోదంబులన్= ఇష్టములైన కథలతో, వినోదాలతో; ఉండు, అంతన్= ఉండగా.

**తాత్పర్యం:** అని అర్జునుడు శ్రీకృష్ణుని అనుమతి పొంది స్నేహితులతో, మంత్రులతో, సేవకులతో కూడి వెళ్ళి, ఇద్దరు (కృష్ణార్జునులు) ఇష్టమైన చోట్ల విహరిస్తూ, ఒక రోజు ఖాండవవనానికి దగ్గరగా ఒక మంచిగంధపు తీగెల ఇంటిలోని చలువరాతిఅరుగుమీద కూర్చుండి - మెల్లగా వీచేది, చల్లనిది, సువాసన కలది అయిన గాలిని అనుభవిస్తూ, ఇష్టకథలతో వినోదిస్తూ ఉండగా.

**అగ్నిదేవుఁడు ఖాండవసమీపమున విహరించుచున్న కృష్ణార్జునులకడకు వచ్చుట (సం.1-214-29)**

**మాలిని.**

**అసితపథుఁడు విప్రుం డై మహాశ్రాంతలీలన్**
**మసృణకపిలకేశశ్మశ్రు లొప్పంగఁ దేజం**
**బెసఁగ ముదముతో నయ్యిద్దఱన్ డాయవచ్చెన్**
**వసునిభు లగు వారిన్ వాసవిన్ వాసుదేవున్. 234**

**ప్రతిపదార్థం:** అసిత, పథుఁడు= తెల్లదికాని (నల్లని) మార్గం కలవాడు - అగ్నిదేవుడు; విప్రుండు+ఐ= బ్రాహ్మణుడై; మహా, శ్రాంత, లీలన్= మిక్కిలి బడలిక పొందిన వాని విధంగా; మసృణ, కపిల, కేశ, శ్మశ్రులు= నునుపైన గోరోజనం వంటి రంగు గల వెంట్రుకలు, మీసాలు; ఒప్పంగన్= అందగింపగా; తేజంబు= కాంతి; ఎసఁగన్= అతిశయిల్లగా; వసు, నిభులు+అగు, వారిన్= వసువులు అనే దేవతల సమానమైనవాళ్ళను, వాసవిన్= వాసవుని (దేవేంద్రుడి) కుమారుడిని - అర్జునుడిని; వాసుదేవున్= శ్రీకృష్ణుడిని; ఆ+ఇద్దఱన్= ఆ ఇరువురినీ; ముదముతో= సంతోషంతో; డాయవచ్చెన్= సమీపించాడు.

**తాత్పర్యం:** ఎంతో ప్రకాశిస్తూ సమానులైన ఆ కృష్ణార్జునులదగ్గరకు అగ్నిదేవుడు బ్రాహ్మణరూపంలో మిక్కిలి బడలిక పొందినవాడివలె, నునుపైన గోరోజనంరంగు గల వెంట్రుకలతో, మీసాలతో సంతోషంగా వచ్చాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు. ఆది.2.81 విశేషం.

**వ. వారు న వ్విప్రు నతిభక్తిఁ బూజించిన, వారలకు నవ్విప్రుం డి ట్లనియె. 235**

**ప్రతిపదార్థం:** వారున్= ఆ శ్రీకృష్ణార్జునులుకూడా; ఆ+విప్రున్= ఆ బ్రాహ్మణుడిని; అతి, భక్తిన్= మిక్కిలి భక్తితో; పూజించినన్= పూజింపగా; వారలకున్= వాళ్లతో; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ కృష్ణార్జునులు ఆ బ్రాహ్మణుడిని ఎంతో భక్తితో పూజించారు. ఆ బ్రాహ్మణుడు వాళ్ళతో ఈ విధంగా అన్నాడు.

**క. ఏ నమితభోజనుండ న । హీనాగ్నిబలుండ నాకు నిష్టాన్నము స**
**మ్మానముగఁ బెట్టుఁ డోపుదు । రేని సుతృప్తుండ నగుదు నే న ట్లయినన్. 236**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అమిత, భోజనుండన్= పరిమితి లేకుండా భోజనం చేసేవాడిని; అహీన+అగ్ని, బలుండన్= మిక్కిలి జఠరాగ్ని - అంటే ఆకలి కలవాడిని; ఓపుదురు+ఏనిన్= చేతనైనవాళ్ళయితే - అంటే మీ చేతనైతే; నాకున్= నాకు; ఇష్ట+అన్నము= ఇష్టమైన ఆహారం; సమ్మానముగన్= గౌరవంగా; పెట్టుఁడు= పెట్టండి; అట్లు+అయినన్= ఆ విధంగా అయితే; నేను= నేను; సుతృప్తుండన్= బాగుగా తృప్తిపొందినవాడిని; అగుదున్= అవుతాను.

**తాత్పర్యం:** నేను అమితంగా భోజనం చేసేవాడిని. మిక్కిలి ఆకలి గలవాడిని. మీకు చేతనైతే నాకు ఇష్టమైన అన్నం గౌరవంగా పెట్టండి. నేను బాగా తృప్తి పొందుతాను.

**విశేషం:** బ్రాహ్మణుడికి, అగ్నికీ అన్వయించే విశేషణాలను చతురంగా వాడటం ఈ పద్యంలోని రుచిరార్థసూక్తినైపుణ్యం. బ్రాహ్మణుడు అమితభోజనుడు, అగ్నిసర్వభక్షకుడు. బ్రాహ్మణుడు అహీనమైన జఠరాగ్ని కలవాడు. అగ్ని అనంతమైన దహనశక్తి కలవాడు. ఈ రెండుగుణాలూ అగ్నిలోని ఖాండవదహనశక్తికి వ్యంజకాలు. బ్రాహ్మణుడగ్నివంటివాడనీ, అతని కోర్కె తీర్చటం యజ్ఞక్రియవంటిదనీ ధ్వని.

**వ. అనిన 'నీ కెద్దిభోజనం బిష్టంబు, దానిన పెట్టెద' మడుగు; మనిన వారికి నవ్విప్రుం డి ట్లనియె. 237**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; నీకున్; ఎద్ది, భోజనంబు= ఏ భోజనం; ఇష్టంబు; దానిన్+అ= దానినే; పెట్టెదము; అడుగుము= అడుగు; అనినన్=అనగా; వారికిన్; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా, 'నీకు ఏ భోజనం ఇష్టమో దానినే పెడతాము అడుగుము' అని అనగా వారితో ఆ బ్రాహ్మణుడు ఈ విధంగా అన్నాడు.

**ఆ. అగ్ని నేను; నాకు నాహార మయ్యింద్రు । ఖాండవంబు; దీనిఁ గాల్పఁ గడఁగి**
**యెగువఁ బడితి ముంద రింద్రుపంచిన మహా ॥ దారుణాంబుధరశతంబుచేత. 238**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అగ్నిన్= అగ్నిదేవుడిని; నాకున్; ఆహారము; ఆ+ఇంద్రు, ఖాండవంబు= ఆ దేవేంద్రునియొక్క ఖాండవవనం; దీనిన్= దీనిని; కాల్పన్= కాల్చుటకై; కడఁగి= పూనుకొని; ముందర= ఇదివరకు; ఇంద్రు, పంచిన= ఇంద్రుడు పంపిన; మహా, దారుణ+అంబుధర, శతంబుచేతన్= మిక్కిలి భయంకరాలైన మేఘాలు నూరింటిచేత; ఎగువన్+పడితిన్= తరుమబడ్డాను.

**తాత్పర్యం:** నేను అగ్నిదేవుడిని; నాకు ఆహారం ఆ దేవేంద్రుని ఖాండవవనం. ఇదివరకు దీనిని కాల్చటానికి పూనుకొన్నాను. ఇంద్రుడు మహాభయంకరాలైన వందమేఘాలను పంపాడు. అవి నన్ను తరిమివేశాయి.

**వ. తక్షకుం డను పన్నగేంద్రుఁ డింద్రున కిష్టసఖుం డయి ఖాండవంబునం దుండుటంజేసి దీని నమృతంబు రక్షించున ట్లతిప్రయత్నంబున నింద్రుండు రక్షించుకొనియుండు; నది నిమిత్తంబుగా సర్వసత్త్వంబులు నిందు సుఖం బుండు; మీరు మహాసత్త్వుల రఖిలాస్త్రవిదుల; రమరేంద్రుండు గావించువిఘాతంబులు మీయస్త్రబలంబున వారింపనోపుదు; రేనును దీని ననాకులంబున నుపయోగించి కృతార్థుండ నగుదు. 239**

**ప్రతిపదార్థం:** తక్షకుండు, అను; పన్నగ+ఇంద్రుండు= నాగరాజు; ఇంద్రునకున్= దేవేంద్రునికి; ఇష్ట, సఖుండు+అయి= ప్రియమిత్రుడై; ఖాండవంబు+అందున్= ఖాండవవనంలో; ఉండుటన్+చేసి= ఉండటంచేత; దీనిన్= దీనిని; అమృతంబున్= అమృతాన్ని; రక్షించు+అట్లు= కాపాడునట్లు; అతి, ప్రయత్నంబునన్= మిక్కిలి ప్రయత్నంతో; ఇంద్రుండు; రక్షించుకొని= కాపాడుతూ; ఉండున్= ఉంటాడు; అది, నిమిత్తంబుగా= అది, కారణంగా; సర్వ, సత్త్వంబులున్= అన్నిప్రాణులు; ఇందున్= ఇక్కడ; సుఖంబు+ఉండున్= సుఖంగా ఉంటాయి; మీరు; మహాసత్త్వులరు= మిక్కిలి బలం కలవారు; అఖిల+అస్త్ర, విదులరు= అన్ని అస్త్రాలు తెలిసినవారు; అమర+ఇంద్రుండు= దేవేంద్రుడు; కావించు= చేయు; విఘాతంబులు= ఆటంకాలు; మీ, అస్త్ర, బలంబునన్= మీయొక్క అస్త్రాలబలంచేత; వారింపన్+ఓపుదురు= తొలగించగలరు; ఏనును= నేనుకూడా; దీనిన్= ఈ ఖాండవవనాన్ని; అనాకులంబునన్= అడ్డులేకుండా; ఉపయోగించి= వినియోగించి అనగా ఆరగించి; కృత+అర్థుండన్= నెరవేరిన కోరిక కలవాడను; అగుదున్= అవుతాను.

**తాత్పర్యం:** తక్షకుడు అనే నాగరాజు దేవేంద్రునికి ప్రియమిత్రుడై, ఈ ఖాండవవనంలో ఉండటంవలన దీన్ని అమృతాన్ని రక్షిస్తున్నట్లు అతిప్రయత్నంతో ఇంద్రుడు రక్షిస్తూ ఉంటాడు. ఆ కారణంవలన అన్నిప్రాణులు ఈ వనంలో సుఖంగా ఉంటాయి. మీరు మహాబలవంతులు, అన్నిశాస్త్రాలు తెలిసినవాళ్ళు. దేవేంద్రుడు కలిగించే ఆటంకాలను మీ అస్త్రబలంచేత తొలగించగలరు. నేను ఈ ఖాండవాన్ని అడ్డులేకుండా భుజించి (దహించి) కృతార్థుడినవుతాను.

**క. అని యగ్నిదేవుఁ డయ్యు । ర్జునదామోదరుల శౌర్యశోభితులఁ బ్రియం**
**బునఁ బ్రార్థించెను బలసూ । దనరక్షితఖాండవప్రదాహోత్సుకుఁ డై. 240**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; బలసూదన, రక్షిత, ఖాండవ, ప్రదాహ+ఉత్సుకుఁడు+ఐ= దేవేంద్రునిచేత రక్షింపబడినదైన ఖాండవవనాన్ని లెస్సగా దహించటంలో ఉత్సాహం కలవాడై; శౌర్య, శోభితులన్= పరాక్రమంచేత ప్రకాశించేవాళ్ళను; ఆ+అర్జున, దామోదరులన్= ఆ అర్జునుడిని, శ్రీకృష్ణుడిని; ప్రియంబునన్, ప్రార్థించెన్= ప్రీతితో ప్రార్థించాడు.

**తాత్పర్యం:** అని దేవేంద్రుడు రక్షించేఖాండవవనాన్ని బాగా దహించాలన్న ఉత్సాహం కల అగ్నిదేవుడు పరాక్రమంతో ప్రకాశించే కృష్ణార్జునులను ప్రీతితో ప్రార్థించాడు.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 241**

**తాత్పర్యం:** అనగా విని జనమేజయుండు వైశంపాయనునితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'ఏమి కారణమున నింద్రుఖాండవ మగ్ని । దేవుఁ డట్లు గాల్పఁ దివిరె? దీని**
**విప్రముఖ్య నాకు వినఁగ వేడుకయయ్యెఁ । దెలియఁగఁ జెప్పుమయ్య యిదియు' ననిన. 242**

**ప్రతిపదార్థం:** ఏమి; కారణమునన్; ఇంద్రు, ఖాండవము= ఇంద్రునియొక్క ఖాండవవనాన్ని; అగ్నిదేవుఁడు; అట్లు; కాల్పన్; తివిరెన్= ప్రయత్నించాడు; విప్రముఖ్య= ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! - వైశంపాయనమహర్షీ! నాకున్; దీనిన్; వినఁగన్; వేడుక, అయ్యెన్= కుతూహలం కలిగింది; ఇదియున్= ఈ విషయం కూడా; ఎఱుఁగన్; చెప్పుము+అయ్య= తెలియచెప్పవయ్యా; అనినన్.

**తాత్పర్యం:** 'ఓ వైశంపాయనమహర్షీ! ఏ కారణంచేత ఇంద్రునిఖాండవవనాన్ని అగ్నిదేవుడు ఆ విధంగా కాల్చ ప్రయత్నించాడో వినాలని నాకు కుతూహలంగా ఉన్నది. తెలిసేటట్లు చెప్పండి' అన్నాడు.

## శ్వేతకి యను రాజర్షి వృత్తాంతము (సం.1-215-11 (అను 1-18))

**వ. జనమేజయునకు వైశంపాయనుం డి ట్లని చెప్పెఁ; దొల్లి శ్వేతకి యనురాజర్షి ఘృతసంపూర్ణదక్షిణానేకాధ్వరుం డయి శతవార్షికసత్త్రయాగంబు సేయ సమకట్టి ఋత్విజులం బ్రార్థించిన, ఋత్విజులు 'నేము నిరంతర క్లేశంబున కోపము; నీ వనవరతయజనశీలుండవు; నీకు నీశ్వరుండ యాజకత్వంబు సేయనోపుంగాని, యొరు లోప' రని విసివి పలికిన, నాతండును గైలాసంబున కరిగి, కైలాసవాసు నిఖిలలోకవంద్యు నిందుశేఖరు నీశ్వరు నుద్దేశించి యుగ్రతపంబు సేసినఁ బరమేశ్వరుండు ప్రత్యక్షం బయి వాని కి ట్లనియె. 243**

**ప్రతిపదార్థం:** జనమేజయునకున్= జనమేజయునికి; వైశంపాయనుఁడు; ఇట్లు+అని= ఈ విధంగా నిర్దేశించి; చెప్పెన్; తొల్లి= పూర్వం; శ్వేతకి, అను; రాజ+ఋషి; ఘృత, సంపూర్ణ, దక్షిణా+అనేక+అధ్వరుండు+అయి= నేతితో నిండిన, దక్షిణలతో కూడిన అనేక యజ్ఞాలు కలవాడై; శత, వార్షిక సత్త్రయాగంబు= నూరుసంవత్సరాలు సత్త్రయాగం; చేయన్= చేయటానికి; సమకట్టి= పూనుకొని; ఋత్విజులన్= యజ్ఞంచేయించే బ్రాహ్మణులను; ప్రార్థించినన్= వేడగా; ఋత్విజులున్= యజ్ఞంచేయించే విప్రులు ; ఏము= మేము; నిరంతర, క్లేశంబునకున్= ఎడతెగని కష్టానికి; ఓపము= ఓర్చుకోలేము; నీవు; అనవరత, యజన, శీలుండవు= నీవు ఎల్లప్పుడు యజ్ఞం చేసే స్వభావం కలవాడవు; నీకున్, ఈశ్వరుండు+అ= శివుడే; యాజకత్వంబున్= యజ్ఞం చేయంచే పని; చేయన్+ఓపున్+కాని= చేయకలడు కాని; ఒరులు= ఇతరులు; ఓపరు+అని= చేయ లేరని; విసివి= విసుగుచెంది; పలికినన్= మాట్లాడగా; ఆతండును= ఆ శ్వేతకియు; కైలాసంబునకున్; అరిగి= వెళ్ళి; కైలాస, వాసున్= కైలాసంలో నివసించేవాడిని; నిఖిల, లోక, వంద్యున్= అన్నిలోకాలకు పూజ్యుడైనవాడిని; ఇందు, శేఖరున్= చంద్రుని సిగదండగా కలవాడిని; ఈశ్వరున్= శివుడిని; ఉద్దేశించి= గురించి; ఉగ్ర, తపంబు= భయంకరమైన తపస్సు; చేసినన్= చేయగా; పరమ+ఈశ్వరుండు; ప్రత్యక్షంబు+అయి= సాక్షాత్కరించి; వానికిన్= శ్వేతకికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** జనమేజయునకు వైశంపాయనుడు ఈ విధంగా చెప్పాడు - పూర్వం శ్వేతకి అనే రాజర్షి సమృద్ధిగా నేతితో, దక్షిణలతో అనేకయజ్ఞాలు చేసి, నూరుసంవత్సరాలు చేసే సత్రయాగాన్ని చేయటానికి పూనుకొన్నాడు. ఆ యాగం చేయించే బ్రాహ్మణులను ప్రార్థించగా, వాళ్ళు - 'మేము ఎడతెగని శ్రమకు ఓర్వలేము. నీవు ఎల్లప్పుడు యజ్ఞం చేసే స్వభావం కలవాడివి. ఈశ్వరుడే నీ యజ్ఞానికి ఋత్విక్కుగా ఉండి దాన్ని చేయించగలడు కాని ఇతరులకు అది సాధ్యం కాదు' - అని విసుగుతో అన్నందువలన శ్వేతకి కైలాసానికి వెళ్ళాడు. అక్కడ కైలాసవాసుడు, సకలలోకపూజ్యుడు, చంద్రశేఖరుడు అయిన శివుడినిగూర్చి తీవ్రమైన తపస్సు చేశాడు. పరమేశ్వరుడు ప్రత్యక్షమై అతనితో ఇట్లా అన్నాడు.

**క. 'శ్వేతకి! నీతపమున కేఁ । బ్రీతాత్ముఁడ నయితి; నీకుఁ బ్రియ మెయ్యది వి**
**ఖ్యాతముగ నిత్తు దానిన; । యాతతమతి వేఁడు' మనిన నన్నరపతియున్. 244**

**ప్రతిపదార్థం:** శ్వేతకి= ఓ శ్వేతకీ!; నీ, తపమునకున్= నీ తపస్సుకు; ఏన్= నేను; ప్రీత+ఆత్ముఁడన్= తృప్తి పొందిన మనస్సు కలవాడను; అయితిన్= అయ్యాను; నీకున్; ప్రియము= ఇష్టమైనది; ఎయ్యది= ఏది; దానిన్+అ= దానినే; ఆతత మతిన్= నిండుమనస్సుతో; విఖ్యాతముగన్= ప్రసిద్ధంగా; ఇత్తున్= ఇస్తాను; వేడుము= కోరుకొమ్ము; అనినన్= అని అనగా; ఆ+నరపతియున్= ఆ రాజు (శ్వేతకి) కూడా.

**తాత్పర్యం:** 'ఓ శ్వేతకీ! నీ తపస్సుకు నేను తృప్తిపొందాను. నీ కేది ఇష్టమో దానినే నిండు మనస్సుతో గొప్పగా ఇస్తాను. కోరుకొమ్ము' అని అనగా ఆ శ్వేతకి.

**వ. 'దేవా! నీప్రసాదంబున శతవార్షికసత్త్రయాగంబు చేసెద; నాకు నీవు ఋత్విజుండవు గావలయు' నని ప్రార్థించినం గరుణించి' యాజకత్వంబు బ్రాహ్మణులకు విధిదృష్టం బగుటంజేసి దాని నొరులకుఁ జేయంగాదు గావున, నింక నీవు బ్రహ్మచర్యంబునఁ బండ్రెండేండ్లు నిరంతరఘృతధారంజేసి హుతాశనుఁ దృప్తుం జేయు' మనిన వాఁడును బరమేశ్వరుపంచిన విధంబున నగ్నితర్పణంబు సేసిన సంతుష్టుండై యీశ్వరుండు వానిపాలికి వచ్చి యప్పుడ దుర్వాసు రావించి. 245**

**ప్రతిపదార్థం:** దేవా!; నీ ప్రసాదంబునన్= నీ అనుగ్రహంచేత; శత, వార్షిక, సత్త్రయాగంబు= నూరు సంవత్సరాల సత్త్రయాగాన్ని; చేసెద= చేస్తాను; నాకున్, నీవు; ఋత్విజుండవు= యజ్ఞంచేసేవాడవు; కావలయును; అని; ప్రార్థించినన్= వేడుకోగా; కరుణించి= దయతలచి; యాజకత్వంబు= యజ్ఞం చేయించే పని; బ్రాహ్మణులకున్; విధి, దృష్టంబు= శాస్త్రం చేత చెప్పబడింది; అగుటన్+చేసి= అట్లు కావటంచేత; దానిన్= దాన్ని; ఒరులకున్= ఇతరులకు; చేయన్+కాదు= చేయకూడదు; కావునన్; ఇంకన్= ఇక; నీవు; బ్రహ్మ, చర్యంబునన్= బ్రహ్మచర్యవ్రతంచేత; పండ్రెండు+ఏండ్లు; నిరంతర, ఘృత, ధారన్+చేసి= ఎడతెగని నేతిధారతో; హుత+అశనున్= అగ్నిదేవుడిని; తృప్తున్= తృప్తిపొందినవాడినిగా; చేయుము; అనినన్= అని అనగా; వాడును= ఆ శ్వేతకికూడా; పరమేశ్వరు, పంచిన, విధంబునన్= శివుడు ఆజ్ఞాపించిన విధంగా అగ్ని, తర్పణంబు= అగ్నితృప్తి; చేసినన్= చేయగా; ఈశ్వరుండు; సంతుష్టుండు+ఐ= బాగా తృప్తి పొందినవాడై; వాని, పాలికిన్= ఆ శ్వేతకి దగ్గరకు; వచ్చి; అప్పుడు+అ= ఆ క్షణమే; దుర్వాసున్= దుర్వాసుని; రావించి= రప్పించి.

**తాత్పర్యం:** 'దేవా! నీ దయవలన నూరుసంవత్సరాల సత్రయాగం చేస్తాను. నీవు నాకు ఋత్విజుడివి కావాలి' -అని ప్రార్థించగా - పరమేశ్వరుడు, 'యజ్ఞం చేయించేపని శాస్త్రంలో బ్రాహ్మణులకు చెప్పబడింది. ఇతరులు యాజకత్వం వహించకూడదు. అందుచేత నీవు బ్రహ్మచర్యవ్రతం పూని పండ్రెండేళ్ళు ఎడతెగని నేతిధారతో అగ్నిదేవుడిని తృప్తిపొందించుము' అన్నాడు. ఆ శ్వేతకికూడా పరమేశ్వరుడు ఆజ్ఞాపించిన విధంగా అగ్నిదేవునికి తృప్తి కావించగా, ఈశ్వరుడుకూడా తృప్తిపొంది, శ్వేతకి దగ్గరకు వచ్చి, దుర్వాసుణ్ణి రప్పించి.

**వ. 'ఈతఁ డనవరతయజన । ప్రీతుం; డీతనికి దురితభీతునకు మనః**
**ప్రీతిగ నార్త్విజ్యమ్ము మ । హాతేజోऽధికుఁడ! చేయు' మని దయఁ బంచెన్. 246**

**ప్రతిపదార్థం:** ఈతడు; అనవరత, యజన, ప్రీతుండు= ఎడతెగక యజ్ఞాలు చేయటంలో ప్రీతి కలవాడు; దురిత, భీతునకున్= పాపాలకు భయపడేవానికి; ఈతనికిన్= ఈ శ్వేతకికి; మనఃప్రీతిఁగన్= మనస్సుకు సంతోషం కలిగించేటట్లు; మహా, తేజస్+అధికుఁడ!= గొప్పతేజస్సుచేత అధికుడవైనవాడా; ఆర్త్విజ్యమ్ము= యాజకత్వం; చేయుము+అని= కావింపుమని; దయన్= దయతో; పంచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** 'ఈ శ్వేతకి ఎడతెగకుండా యజ్ఞాలు చేయటంలో ప్రీతి కలవాడు. పాపభీతి కలవాడు. ఇతని మనస్సుకు సంతోషం కలిగేటట్లు గొప్పతేజస్సుచే అధికుడవైన ఓ దుర్వాసమహర్షీ! యజ్ఞం చేయించుము' అని దయతో శివుడు ఆజ్ఞాపించాడు.

**వ. శ్వేతకియుఁ దనకు దుర్వాసుండు ఋషిగణంబులతో ఋత్విజుండుగా నభిమతం బయిన సత్త్రయాగంబు సేసె; న ట్లాశ్వేతకి చేసిన నిరంతరఘృతధారాకారణంబున నగ్నిదేవుండు దన కగ్నిమాంద్యంబును దేజోహీనతయు దప్పియు నైన; బితామహుపాలికిం జని తనశరీరస్థితి చెప్పినఁ బితామహుండును దాని నపరిమితఘృతోపయోగంబున నయిన మహావ్యాధిగా నెఱింగి యగ్నిదేవున కి ట్లనియె. 247**

**ప్రతిపదార్థం:** శ్వేతకియున్= శ్వేతకికూడా; తనకున్; దుర్వాసుండు; ఋషి, గణంబులతోన్= ఋషులసమూహాలతో; ఋత్విజుండుగాన్= యజ్ఞం చేయించేవాడుగా; అభిమతంబు+అయిన= ఇష్టమైన; సత్త్రయాగంబు= సత్రయాగం; చేసెన్; అట్లు; ఆ, శ్వేతకి; చేసిన= కావించిన; నిరంతర, ఘృత, ధారా, కారణంబునన్= ఎడతెరపి లేని నేతిధార కారణంగా; తనకున్, అగ్ని, మాంద్యంబును= జీర్ణశక్తి తగ్గటమూ; తేజస్+హీనతయున్= కాంతి పోవటమూ; దప్పియున్= దప్పికా; ఐనన్= కలుగగా; పితామహు, పాలికిన్= బ్రహ్మదేవుని దగ్గరకు; చని= వెళ్ళి; తన, శరీర, స్థితి= తన దేహ పరిస్థితి; చెప్పినన్= చెప్పగా; పితామహుండును= బ్రహ్మదేవుడుకూడా; దానిన్= దానిని; అపరిమిత; ఘృత+ఉపయోగంబునన్= మిక్కిలి ఎక్కువగా నేతిని ఉపయోగించటంవలన; అయిన, మహా, వ్యాధిన్+కాన్= పెద్దజబ్బుగా; ఎఱింగి= తెలిసికొని; అగ్నిదేవునకున్= అగ్నిదేవునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శ్వేతకికూడా ఋషుల సమూహాలతో దుర్వాసుడు తనకు ఋత్విజుడు (యజ్ఞం చేయించేవాడు) కాగా, తన కిష్టమైన సత్త్రయాగాన్ని చేశాడు. ఆ విధంగా శ్వేతకి చేసినయాగంలోని ఎడతెరపి నేతిధార కారణంగా అగ్నిదేవునికి జీర్ణశక్తి తగ్గింది, కాంతి సన్నగిల్లింది, దప్పిక ఎక్కువైంది. ఆయన బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళాడు. తన శరీరస్థితి చెప్పుకొన్నాడు. బ్రహ్మదేవుడు అది నేతిని అపరిమితంగా ఉపయోగించటంవలన కలిగిన మహావ్యాధిగా గ్రహించి అగ్నిదేవునితో ఇట్లా అన్నాడు.

**క. 'ఈవ్యాధి యొంటఁ దీఱదు; । దివ్యౌషధయుక్త మైన దివిజవనంబున్**
**హవ్యాశన! భక్షింపు; మ । హావ్యాధి శమంబు దాన నగు నీ' కనినన్. 248**

**ప్రతిపదార్థం:** ఈ, వ్యాధి; ఒంటన్= మరొకదానిచేత; తీఱదు; హవ్య+అశన= దేవతలకు ఈయదగిన అన్నాన్ని ఆహారంగా కలవాడా- అగ్నిహోత్రా!; దివ్య+ఔషధ, యుక్తము+ఐన= దేవలోకసంబంధమైన మందుచెట్లతో కూడిన; దివిజ, వనంబున్= దేవతావనాన్ని; భక్షింపు(ము); దానన్= దానివలన; నీకున్= నీకు; మహా, వ్యాధి, శమంబు= గొప్పజబ్బు తగ్గటం; అగున్= జరుగుతుంది; అనినన్= అని అనగా.

**తాత్పర్యం:** 'ఈ వ్యాధి మరొక దానిచేత తీరదు. అగ్నిహోత్రా! దివ్యౌషధాలతో కూడిన దేవతావనాన్ని భక్షించు. దానివలన నీ మహావ్యాధి పోతుం' దని అనగా.

**క. చని ఖాండవంబుఁ గాల్పఁగ । మొనసి మహాహస్తియూథములఁ బోని ఘనా**
**ఘనములచే బాధితుఁ డయి । వనజజుకడ కరిగి హవ్యవాహనుఁ డనియెన్. 249**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; ఖాండవంబున్= ఖాండవవనాన్ని; కాల్పన్+కన్= దహింపగా; మొనసి= పూని; మహా, హస్తి, యూథములన్+పోని= గొప్ప ఏనుగుల గుంపులనుపోలిన; ఘనా ఘనములచేన్= వర్షించే మేఘాలతో; బాధితుఁడు+అయి= బాధింపబడినవాడై; హవ్యవాహనుఁడు= దేవతలకు ఇవ్వదగిన అన్నాన్ని మోసేవాడు - అగ్నిహోత్రుడు; వనజజు, కడకున్= నీటినుండి పుట్టిన పద్మంనుండి జన్మించిన బ్రహ్మదేవునిదగ్గరకు; అరిగి= వెళ్ళి; అనియెన్.

**తాత్పర్యం:** అగ్నిహోత్రుడు ఖాండవవనాన్ని దహించటానికి పూనుకొన్నాడు. పెద్దఏనుగుగుంపులవంటి వర్షించే మేఘాలు బాధించగా ఆయన బ్రహ్మదేవునిదగ్గరకు వెళ్ళి ఇట్లా అన్నాడు.

**వ. 'ఏను మీయానతిచ్చినవిధంబున ఖాండవం బుపయోగింపం బోయి, తద్రక్షకులు గావించువిఘాతంబులు వారింపనేరక యేడుమాఱులు విఫలప్రయత్నుండ నైతి; నింక నెద్ది యుపాయంబు? నాకు నెవ్విధంబున ఖాండవభక్షణంబు దొరకొను? నని దుఃఖించిన యతనిం జూచి కమలభవుండు కరుణించి, భావికార్యం బప్పుడు దలంచియుఁ; 'గొంతకాలంబునకు నరనారాయణు లను నాదిమునులు నరలోకంబున దేవహితార్థం బర్జునవాసుదేవు లయి జన్మించి యాఖాండవసమీపంబున విహరింతురు; వారు భవత్ప్రార్థితు లై తమ యస్త్రబలంబున నఖిలవిఘ్నంబుల నపనయించి నిరాకులంబున నీకు ఖాండవోపయోగంబు ప్రసాదింతు' రనిన, నగ్నిదేవుండు గరంబు సంతసిల్లి, కమలజువచనం బవలంబంబుగాఁ బెద్దకాలం బుండి, తద్వనమార్గంబున నప్పుడు కృష్ణార్జునులం గని ఖాండవదహనార్థంబు ప్రార్థించిన నగ్నిదేవున కర్జునుం డి ట్లనియె. 250**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మీ, ఆనతి+ఇచ్చిన, విధంబున= మీ యొక్క ఆజ్ఞ ఇచ్చిన విధంగా - అంటే మీరు ఆజ్ఞాపించినట్లుగా; ఖాండవంబు; ఉపయోగింపన్, పోయి; తత్+రక్షకులు= దాన్ని రక్షించేవాళ్ళు; కావించు; విఘాతంబులు= ఆటంకాలు; వారింపన్= నివారించటానికి; నేరక= చేతగాక; ఏడు, మాఱులు, విఫల, ప్రయత్నుండన్= నెరవేరనిప్రయత్నం కలవాడిని; ఐతిన్= అయ్యాను; ఇంకన్, ఎద్ది= ఇక ఏది; ఉపాయంబు; నాకున్; ఏ+విధంబునన్= ఏ విధంగా; ఖాండవ, భక్షణంబు= ఖాండవవనాన్ని తినటం; దొరకున్= లభిస్తుంది; అని, దుఃఖించినన్= అంటూ విలపింపగా; అతనిన్, కని= అతనిని చూచి; కమల భవుండు= పద్మంనుండి పుట్టినవాడు-బ్రహ్మదేవుడు; కరుణించి= దయదలచి; భావి, కార్యంబు= మున్ముందు జరిగేపని; అప్పుడు= ఆ క్షణంబు; తలంచియున్= తలచికూడా; కొంత, కాలంబునకున్= కొంత కాలానికి; నరనారాయణులు; అను; ఆది, మునులు= నరుడు నారాయణుడు అనే మొట్టమొదటి మునులు; నర, లోకంబునన్= మానవలోకంలో; దేవ, హిత+అర్థంబు= దేవతల మేలుకోసం; అర్జున, వాసుదేవులు+ఐ; జన్మించి= పుట్టి; ఆ, ఖాండవ, సమీపంబునన్= ఆ ఖాండవవనం దగ్గర; విహరింతురు= విహరిస్తారు; వారు= ఆ ఇరువురు; భవత్+ప్రార్థితులు+ఐ= నీచే ప్రార్థింపబడినవాళ్ళయి; తమ, అస్త్ర, బలంబునన్= తమ అస్త్రబలంచేత; అఖిల, విఘ్నంబులన్ = అన్ని ఆటంకాలను; అపనయించి= తొలగించి; నిర్+అకులంబునన్= నిరాటంకంగా; నీకున్; ఖాండవ+ఉపయోగంబు= ఖాండవవనాన్ని ఉపయోగించటాన్ని - అంటే ఖాండవవనాన్ని దహించటాన్ని; ప్రసాదింతురు= దయతో కలుగజేస్తారు; అనినన్= అని అనగా; అగ్నిదేవుండు; కరంబు= మిక్కిలి; సంతసిల్లి; కమలజు, వచనంబు= పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవునిమాట; అవలంబంబుగాన్= ఊతగా; పెద్ద, కాలంబు= చాలాకాలం; ఉండి, తత్+వచన, మార్గంబునన్= అతనియొక్క మాటప్రకారం; అప్పుడు; కృష్ణ+అర్జునులన్= కృష్ణుని అర్జునుని; కని= చూచి; ఖాండవ, దహన+అర్థంబు= ఖాండవవనాన్ని కాల్చటంకోసం; ప్రార్థించినన్= ప్రార్థింపగా; అగ్నిదేవునకున్= అగ్నిదేవునితో; అర్జునుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నేను మీరు ఆజ్ఞాపించిన విధంగా ఖాండవవనాన్ని దహించబోయాను. దాన్ని రక్షించేవాళ్ళు కల్పించిన ఆటంకాలు నివారించలేకపోయాను. ఏడుసార్లు నా ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఇక నాకు ఉపాయమేది? ఏ

విధంగా ఖాండవవనాన్ని దహిస్తాను? అని దుఃఖించగా అతడిని చూచి బ్రహ్మదేవుడు దయతలచి, మున్ముందు జరుగ వలసిన పనిని తలచి - 'కొంతకాలానికి ఆదిమునులైన నరనారాయణులు మానవలోకంలో దేవతల మేలుకోరి అర్జునుడు-కృష్ణుడుగా జన్మిస్తారు. ఆ ఖాండవవనందగ్గర విహరిస్తారు. వాళ్ళను నీవు ప్రార్థిస్తే తమ అస్త్రాలబలంతో అన్నిఆటంకాలు తొలగించి, నీవు ఖాండవవనాన్ని దహించేటట్లు చేస్తారు' అని అనగా -అగ్నిదేవుడు ఎంతో సంతోషించగా, బ్రహ్మదేవునిమాట ఆధారంగా చాలాకాలం ఉండి, ఆయన మాటప్రకారం అప్పుడు కృష్ణార్జునులను చూచి ఖాండవవనాన్ని కాల్చటంకోసం ప్రార్థించగా, అగ్నిదేవునితో అర్జునుడు ఇట్లా అన్నాడు.

### అగ్నిదేవుండు కృష్ణార్జునులకుఁ జక్రకార్ముకాదు లొసంగుట (సం.1-215-12)

**సీ. వారణహస్తానుకారంబు లగు వారి । ధారలు గురియు దుర్వారఘోర**
**తరవారివాహప్రకరములు వారింప । సురనివహంబుతో సురగణేశు**
**నైన నోర్వ సుశక్త మైన మహాదివ్య । శరసంచయము నా కపరిమితంబు**
**గల; దట్టిసాయకావలికి నాదగు భుజ । బలశీఘ్రసంధానములకుఁ దగిన.**

**ఆ. ధనువు సర్వవహనఘనరథాశ్వములుఁ గృ ష్ణునకు నాయుధములు ననఘ! యిపుడు**
**లేమిఁ జేసి చూవె యీమహాకార్యంబు । గడఁగకున్నవార మెడయుఁ జేసి. 251**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపరహితుడా!; వారణ; హస్త+అనుకారంబులు+అగు= ఏనుగుతొండాన్ని పోలినవైన; వారి, ధారలు= నీటిధారలు; కురియు= కురిసే; దుర్+వార; ఘోరతర, వారి, వాహ, ప్రకరములు= నివారింప సాధ్యం కాని మిక్కిలి భయంకరాలైన మేఘాల సమూహాలను; వారింపన్= అడ్డగించటానికి; సుర, నివహంబులతోన్= దేవతల సమూహంతో; సుర, గణ+ఈశున్+ఐనన్= దేవతా సమూహాల రాజునైనా - అంటే దేవేంద్రుడినైనా; ఓర్వన్= ఓడించుటకు; సుశక్తము+ఐన= మంచి సమర్థవంతమైన; మహా, దివ్య, శర, సంచయము= గొప్ప దేవతా సంబంధాలైన అస్త్రాల సమూహం; నాకున్, అపరిమితంబు= లెక్కలేనంత; కలదు= ఉన్నది; అట్టి= అటువంటి; సాయక+ఆవలికిన్= బాణాల సమూహానికి; నాది+అగు= నాదయిన; భుజ, బల, శీఘ్ర, సంధానములకున్= బాహుబలానికి, వేగంగా బాణాలను వింటినారిలో కూర్చటానికి; తగిన= తగినట్టి; ధనువు= విల్లు; సర్వ, వహన, ఘన, రథ+అశ్వములున్= అన్నింటిని మోయగల గొప్పరథం, గుర్రాలూ; కృష్ణునకున్= కృష్ణునికి; ఆయుధములు; ఇపుడు; లేమిన్+చేసి= లేకుండటంచేత; చూవె= సుమా!; ఈ, మహా, కార్యంబు= ఈ మహాకార్యం; ఎడయున్+చేసి= ఆలస్యంచేసి; కడగక+ఉన్న, వారము= పూనుకొనకున్నాము.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! అగ్నిహోత్రా! ఏనుగు తొండమంతటి నీటిధారలను కురిసే దుర్వారాలైన మహా భయంకర మేఘసమూహాల్ని తొలగించటానికి, దేవతాసమూహంతో కూడిన దేవేంద్రుడినైనా ఓడించటానికి - సమర్థాలైన దివ్యాస్త్రసమూహం నా దగ్గర లెక్కలేనంత ఉన్నది. అట్లాంటి అస్త్రసమూహానికి, నా భుజబలానికి, వేగంగా బాణాలను వింటిలో సంధించే నేర్పుకు తగిన ధనుస్సు - అన్నింటిని మోయగల గొప్పరథం- శ్రీకృష్ణునికి ఆయుధాలు, ఇప్పుడు లేవు. అందువలననే సుమా ఆలస్యంచేసి ఈ మహాకార్యానికి పూనుకొనకుండా ఉన్నాం.

**వ. అనిన నగ్నిదేవుండును నప్పడ వరుణుం దలంచి వానిం దనకు సన్నిహితుం జేసికొని, 'తొల్లి నీకు సోముం డిచ్చిన బ్రహ్మనిర్మితకార్ముకంబు నక్షయతూణీరయుగళంబును, గంధర్వజహయంబులం బూన్చిన రథంబు నియ్యతిరథుం**

**డయిన యర్జునున కిమ్ము; మఱి చక్రంబును గదయును వాసుదేవున కి' మ్మని పంచిన. 252**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అర్జునుడనగా; అగ్నిదేవుండును; అప్పుడు+అ= అప్పటికప్పుడే; వరుణున్= వరుణుని; తలంచి= స్మరించి; వానిన్= అతనిని; తనకున్= తనకు; సన్నిహితున్= దగ్గరకు వచ్చినవాడిగా; చేసికొని=ఒనరించుకొని; తొల్లి= పూర్వం; నీకున్; సోముండు+ఇచ్చిన= చంద్రుడిచ్చినట్టి; బ్రహ్మ, నిర్మిత, కార్ముకంబున్= బ్రహ్మచే రూపొందించబడిన ధనుస్సును; అక్షయ, తూణీర, యుగళంబును= తరుగులేని బాణాలు గల అమ్ములపొదల జంటను; గంధర్వజ, హయంబులన్= గంధర్వలోకంలో పుట్టిన గుర్రాలను; పూన్చిన= కట్టిన; రథంబున్= రథాన్ని; ఈ+అతి, రథుండు= పెక్కుమంది విలుకాండ్రతో పోరాడే ఈ మహావీరుడు; అయిన, అర్జునునికిన్; ఇమ్ము; మఱి= ఇక; చక్రంబును= చక్రాన్ని; గదయును= గదను; వాసుదేవునకున్= శ్రీకృష్ణునకు; ఇమ్ము= ఈయవలసింది; అని= అంటూ; పంచినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** అని అర్జునుడు చెప్పగా అగ్నిదేవుడు అప్పటికప్పుడే వరుణుని స్మరించాడు. తన దగ్గరకు రప్పించాడు. 'పూర్వం నీకు చంద్రుడిచ్చిన బ్రహ్మనిర్మితమైన ధనుస్సును, తరుగులేని బాణాలు కల అమ్ముల పొదుల జంటను; గంధర్వలోకంలో పుట్టిన గుర్రాలను కట్టిన రథాన్ని అతిరథుడైన ఈ అర్జునునికి - చక్రాన్ని, గదను శ్రీకృష్ణుడి కిమ్ము' అని ఆజ్ఞాపించగా.

**మ. అమరాహీంద్రవియచ్చరాదుల కజేయం బప్రధృష్యం బభే**
**ద్యము వజ్రస్థిర మన్యసాధనభిదాదక్షంబు నై సర్వలో**
**కమనోజ్ఞం బయి దివ్య మై వెలుఁగు నగ్గాండీవ మన్ చాప ర**
**త్నము నిచ్చెన్ వరుణుండు పార్థునకు నుద్యద్విక్రమోద్భాసికిన్. 253**

**ప్రతిపదార్థం:** వరుణుండు; ఉద్యత్+విక్రమ+ఉత్+భాసికిన్= వృద్ధి పొందుతున్న పరాక్రమంచేత గొప్పగా ప్రకాశించేవానికి; పార్థునకున్= అర్జునునికి; అమర+అహి+ఇంద్ర, వియత్+చర+ఆదులకున్= దేవతలు, నాగరాజులు, గంధర్వులు మొదలైనవాళ్ళకు; అజేయంబు= జయింపసాధ్యంకానిది; అప్రధృష్యంబు= త్రోసిపుచ్చటానికి సాధ్యంకానిది; అభేద్యము= చీల్చటానికి సాధ్యం కానిది; వజ్రస్థిరము= వజ్రంవలె గట్టిది; అన్య, సాధన, భిదా, దక్షంబును+ఐ= ఇతరములైన ఆయుధాలను భేదించటంలో సమర్థమైనదై; సర్వ, లోక, మనోజ్ఞంబు+ఐ= అన్నిలోకాలకు మనోహరమైనదై; దివ్యమై= దేవతాసంబంధమైనదై; వెలుఁగు= ప్రకాశించునట్టి; ఆ+గాండీవము; అన్= అనే; చాప, రత్నమును= శ్రేష్ఠమైన ధనుస్సును; ఇచ్చెన్.

**తాత్పర్యం:** వరుణుడు, వృద్ధిపొందే పరాక్రమంలో ప్రకాశిస్తున్న అర్జునునికి- దేవతలు, నాగరాజులు, గంధర్వులు మొదలైనవాళ్ళకు జయించ శక్యంకానిదీ, త్రోసిపుచ్చ వీలుకానిదీ, భేదించ సాధ్యంకానిదీ, వజ్రంవలె కఠినమైనదీ, ఇతర ఆయుధాలను నాశనంచెయ్యటంలో సమర్థమైనదీ, అన్ని లోకాలకు మనోహరమైనదీ, దివ్యమైనదీ - అయి వెలుగుతున్న ఆ గాండీవం అనే ఉత్తమధనుస్సును ఇచ్చాడు.

**విశేషం:** సమాసఘటితం, సంధిబంధురం అయిన నన్నయరచన. ఓజోగుణవిశిష్టమై ఇక్కడ గాండీవంయొక్క ఔన్నత్యాన్నీ దృఢత్వాన్నీ భీకరత్వాన్నీ స్ఫురింపచేసేదిగా ఉన్నది.

**వ. మఱియుఁ బ్రతిపక్ష సంక్షయకరంబులయిన యక్షయబాణంబులు గల తూణీరంబులును, వివిధాయుధభరితం బై, సింహలాంగూలకపిధ్వజవిరాజమానంబై, మహాంబుధరధ్వానబంధురంబై, మనోవాయువేగసితవాహవాహ్యమానం**

**బై, రణితరమణీయమణికింకిణీకలాపాలంకృతం బై, సకలదిగ్విజయాధిష్ఠానంబై యొప్పుచున్న దివ్యరథంబు నర్జునున కిచ్చి, సహస్రకరసహస్రదుస్సహమహఃపటలభాసురం బగుచు దేవదైత్యదానవయక్షరాక్షసపిశాచోరగప్రశమనంబయి వెలుంగుచున్న సుదర్శనం బను చక్రంబును, గౌమోదకి యను గదయును నారాయణున కిచ్చె; నట్లు సంప్రాప్తదివ్య చాపరథాయుధు లయి యున్న నరనారాయణులం జూచి యగ్నిదేవుం డి ట్లనియె. 254**

**ప్రతిపదార్థం:** మఱియున్; ప్రతిపక్ష, సంక్షయ, కరంబులు+అయిన= శత్రువులను నాశనం చేసేటటువంటివైన; అక్షయ, బాణంబులు కల; తూణీరంబులును= అమ్ములపొదులూ; వివిధ+ఆయుధ, భరితంబు+ఐ= నానావిధాలైన ఆయుధాలతో నిండి; సింహ, లాంగూల, కపి, ధ్వజ, విరాజమానంబు+ఐ= సింహపు తోకవంటి (తోకగల) కోతిగుర్తు కల జెండాచే ప్రకాశించేటటువంటిదై; మహా+అంబుధర, ధ్వాన, బంధురంబు+ఐ= గొప్పమేఘంయొక్క ధ్వనిలాంటి ధ్వనితో నిండినదై; మనో, వాయు, వేగ, సిత, వాహ, వాహ్యమానంబు+ఐ= మనస్సుయొక్క, గాలియొక్క వేగంవంటి వేగంకల తెల్లనిగుర్రాలచే లాగబడుతున్నదై; రణిత, రమణీయ, మణి, కింకిణీ, కలాప+అలంకృతంబు+ఐ= ధ్వనిస్తున్న అందాలైన రత్నాల చిరుగంటల సమూహాలచే అలంకరింపబడినదై; సకల, దిక్+విజయ+అధిష్ఠానంబు+ఐ= అన్ని దిక్కులను జయించటానికి స్థానమై; ఒప్పుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; దివ్య, రథంబున్= దేవతా సంబంధమైన రథాన్ని; అర్జునునకున్+ఇచ్చి; సహస్రకర, సహస్ర, దుస్+సహ, మహఃపటల, భాసురంబు= వేయికిరణాలు గల సూర్యులు వేయిమందివంటి ఓర్వరాని గొప్పకాంతులచే ప్రకాశించేది; అగుచున్= అవుతూ; దేవ, దైత్య, దానవ, యక్ష, రాక్షస, పిశాచ+ఉరగ, ప్రశమనంబు+అయి= దేవతలను, దైత్యులను, దానవులను, యక్షులను, రాక్షసులను, పిశాచాలను, నాగులను; అణగింపజేయునట్టిదై; వెలుంగుచున్+ఉన్న= ప్రకాశిస్తూ ఉండే; సుదర్శనంబు; అను= సుదర్శనం అనే; చక్రంబును= చక్రాన్ని; కౌమోదకి; అను, గదయును= కౌమోదకి అను పేరుగల గదనుకూడా; నారాయణునకున్= శ్రీకృష్ణునికి; ఇచ్చెన్= ఇచ్చాడు; అట్లు+ఆవిధంగా; సంప్రాప్త, దివ్య, చాప; రథ+ఆయుధులు+అయి= పొందిన దివ్యధనుస్సును, రథాన్ని, ఆయుధాలను కలవారై; ఉన్న; నర, నారాయణులన్= అర్జునశ్రీకృష్ణులను; చూచి; అగ్నిదేవుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అంతేకాక శత్రువులను నాశనంచేసేటటువంటివి, తరుగని బాణాలు కల అమ్ములపొదులను, వివిధాయుధాలతో నిండి, సింహపుతోకవంటి తోక గల కోతిగుర్తున్న జెండాతో ప్రకాశిస్తూ, గొప్ప మేఘధ్వనివంటి ధ్వని కలిగి, మనోవేగ, వాయువేగాలవంటి వేగం గల తెల్లటిగుర్రాలు లాగుతూండగా, మ్రోగుతున్న అందాల రత్నపు చిరుగంటల సమూహాలతో అలంకరించబడి, అన్నిదిక్కులను జయించటానికి స్థానమై ప్రకాశిస్తున్న దివ్యరథాన్ని అర్జునుని కిచ్చాడు. వేయిసూర్యులవలె ఓర్వరాని గొప్ప కాంతులతో ప్రకాశిస్తూ, దేవ, దైత్య, దానవ, యక్ష, రాక్షస, పిశాచ, నాగులను అణచివేసే సుదర్శనచక్రాన్ని, కౌమోదకి అనే గదను శ్రీకృష్ణునికి ఇచ్చాడు. ఆ విధంగా దివ్య ధనుస్సును, రథాన్ని, ఆయుధాలను పొంది ఉన్న అర్జున శ్రీకృష్ణులను చూచి అగ్నిదేవుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** దైత్యులు - కశ్యపునికి దితియందు పుట్టినవాళ్ళు. దానవులు - కశ్యపునికి దనువునందు జన్మించినవాళ్ళు.

**క. ఘనభుజ! యిది గాండీవం । బనఁబరఁగిన ధనువు దీని నస్త్రావలి పె**
**ల్చన తాఁకి భగ్న మగు న । త్యనుపమవజ్రాభిహతశిలావలి వోలెన్. 255**

**ప్రతిపదార్థం:** ఘన, భుజ= గొప్పభుజాలు కలవాడా! - ఓ అర్జునా!; ఇది= ఇది; గాండీవంబు+అనన్= గాండీవం అనగా; పరఁగిన= ఒప్పిన; ధనువు= ధనుస్సు; దీనిని= దీన్ని; అస్త్ర+ఆవలి= మంత్రసహిత బాణాల సమూహం; పెల్చనన్= గట్టిగా;

తాఁకి= తాకి, తగిలి; అతి+అనుపమ, వజ్ర+అభిహత, శిలా+ఆవలి పోలెన్=మిక్కిలి సాటిలేని వజ్రాయుధంచేత కొట్టబడిన రాళ్ళ సమూహంవలె; భగ్నము+అగున్= ముక్కలైపోతాయి.

**తాత్పర్యం:** ఉన్నత భుజాలు కల ఓ అర్జునా! ఇది గాండీవం అనే ధనుస్సు. మంత్రసహిత బాణసమూహాలు సైతం దీన్ని తాకి వజ్రాయుధంచేత కొట్టబడిన రాళ్ళవలె ముక్కలవుతాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఈ రథ మప్రతిహతము, స । మీరజవోపేతహయసమేతము; దీనిన్**
**భూరిబలుఁ డెక్కి సోముఁడు । ధీరుం డయి తొల్లి యెల్లదిక్కుల నొడిచెన్. 256**

**ప్రతిపదార్థం:** రథము= ఈ రథం; అప్రతిహితము=ఎదురులేనిది; సమీర, జవ+ఉపేత, హయ, సమేతము= వాయువేగంతో కూడుకొన్న గుర్రాలతో కూడినది; తొల్లి= పూర్వం; దీనిన్= దీన్ని; భూరి, బలుఁడు=గొప్ప బలం కలవాడు; సోముఁడు= చంద్రుడు; ఎక్కి; ధీరుండు+అయి= ధైర్యవంతుడై; ఎల్ల, దిక్కులన్= అన్ని దిక్కుల్ని; ఒడిచెన్= ఓడించాడు.

**తాత్పర్యం:** ఈ రథం ఎదురులేనిది. వాయువేగం కల గుర్రాలతో కూడుకొన్నది, పూర్వం దీన్ని మహాబలుడైన చంద్రుడుఎక్కి అన్నిదిక్కులు జయించాడు.

**క. ఈ చక్రము మధుసూదన! । నీచేత విముక్త మగుచు నీరిపులఁ ద్రియా**
**మాచరులఁ జంపి క్రమ్మఱ । నీచేతికి వచ్చు దేవనిర్మితశక్తిన్. 257**

**ప్రతిపదార్థం:** మధు, సూదన= మధువు అనే రాక్షసుడిని సంహరించినవాడా! - శ్రీకృష్ణా!; ఈ చక్రము; నీచేతన్= నీచే; విముక్తము= విడువబడినది; అగుచున్= అవుతూ; నీ, రిపులన్= నీ శత్రువులను, త్రియామా, చరులన్= రాత్రులలో తిరిగేవాళ్ళను- రాక్షసులను; చంపి= సంహరించి; దేవ, నిర్మిత, శక్తిన్= దేవతలచే కూర్పబడిన శక్తిచేత; క్రమ్మఱన్= మరల; నీచేతికిన్ వచ్చున్= నీచేతికి వచ్చి చేరుతుంది.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! ఈ చక్రాన్ని నీవు ప్రయోగిస్తే నీ శత్రువులైన రాక్షసులను సంహరించి, దేవతలు కూర్చిన శక్తితో మళ్ళీ నీ చేతికి వచ్చి చేరుతుంది.

## కృష్ణార్జును లగ్నిహోత్రునిచే ఖాండవంబు దహింపఁజేయుట (సం-1-216-28)

**వ. అని తత్ప్రభావప్రకారంబు చెప్పినఁ గృష్ణార్జునులు సంతసిల్లి, సన్నద్ధు లయి రథం బెక్కి, యగ్నిదేవుం జూచి 'సురాసుర పరివృతుండయి సురపతి వచ్చినను జయింతు' మింక శంకింపక ఖాండవదహనార్థం బుపక్రమింపు మనిన నగ్నిదేవుండు హర్షించి తైజసంబయిన రూపంబు ధరియించి. 258**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; తత్+ప్రభావ, ప్రకారంబు= వాటియొక్క ప్రభావవిధం; చెప్పినన్= చెప్పగా; కృష్ణ+అర్జునులు= కృష్ణుడు, అర్జునుడు; సంతసిల్లి= సంతోషించి; సన్నద్ధులు+అయి= పూనుకొని; రథంబు+ఎక్కి= రథమెక్కి; అగ్నిదేవున్+చూచి= అగ్నిదేవుణ్ణి చూచి; సుర+అసుర, పరివృతుండు+అయి= దేవ దానవులచేత చుట్టబడినవాడై; సుర, పతి= దేవేంద్రుడు;

వచ్చినను= వచ్చినప్పటికి; జయింతుము= జయిస్తాము; ఇంకన్= ఇక; శంకింపక= అనుమానించక; ఖాండవదహన+అర్థంబు= ఖాండవవనాన్ని దహించటంకొరకు; ఉపక్రమింపుము= ప్రారంభించుము; అనినన్= అని అనగా; అగ్నిదేవుండు; హర్షించి= సంతోషించి; తైజసంబు+అయిన= కాంతిమంతమైన, రూపంబు= రూపాన్ని; ధరియించి= తాల్చి.

**తాత్పర్యం:** అని వాటియొక్క ప్రభావాన్ని గూర్చిచెప్పగా - కృష్ణార్జునులు సంతోషించి, పూని రథం ఎక్కి, అగ్నిదేవుడిని చూచి - 'దేవేంద్రుడు దేవదానవులతో కలిసి దండెత్తి వచ్చినా జయిస్తాము. ఇంక సంకోచించవద్దు. ఖాండవవనాన్ని దహించటానికి ప్రారంభించుము' అని అనగా, అగ్నిదేవుడు సంతోషించి కాంతిమంతమైన రూపం ధరించి.

**చ. పెడిలి సువర్ణపర్వతము పెక్కుదెఱంగుల వ్రయ్యునట్టు ల**
**ప్పుడు వివిధప్రకారముల భూరిశిఖావలి ఖాండవంబు న**
**ల్గడఁ గడుఁబర్వఁగాఁ బెఱిఁగి కాల్పఁదొడంగె హుతాశనుండు సే**
**డ్పడఁగ వనంబులోని మృగపక్షిభుజంగమభూతసంఘముల్. 259**

**ప్రతిపదార్థం:** సువర్ణ, పర్వతము= బంగారుకొండ (మేరువు); పెడిలి= పెట్లి; పెక్కు, తెఱంగులన్= అనేకవిధాలుగా; వ్రయ్యునట్టులు= ముక్కలయ్యేటట్లు; అప్పుడు; హుతాశనుండు= అగ్నిహోత్రుడు; భూరి, శిఖా+ఆవలి= పెద్దమంటల సమూహం; వివిధ ప్రకారములన్= అనేకవిధాల; ఖాండవంబు, నల్గడన్= ఖాండవవనంలో నాలుగువైపుల; కడున్= మిక్కిలి, పర్వఁగాన్= వ్యాపించగా; పెఱిఁగి= విజృంభించి, వనంబులోని= అడవిలోని; మృగ, పక్షి, భుజంగమ, భూత, సంఘముల్= మృగాలయొక్క, పక్షులయొక్క, పాములయొక్క, ప్రాణులయొక్క సమూహాలు; చేడ్పడఁగన్= బాధపడేటట్లు; కాల్పన్= కాల్చటానికి; తొడంగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** మేరుపర్వతం పెట్లి పెక్కువిధాల ముక్కలయ్యేటట్లు అగ్నిహోత్రుడు తనయొక్క పెద్ద మంటల సమూహం అనేకవిధాల ఖాండవవనంలో వ్యాపించగా విజృంభించాడు. మృగాల పక్షుల పాముల ప్రాణుల సమూహాలు బాధపడేటట్లు కాల్చటానికి పూనుకొన్నాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. అంత. 260**

**తాత్పర్యం:** అప్పుడు.

**సీ. చక్రధరుం డయ్యు జలరుహనాభుండు । గాండీవధరుఁ డయ్యుఁ బాండవుండు**
**నుండి రవ్వనమున కుభయపార్శ్వంబులఁ । దొల్లింటి యట్టులు పెల్లు రేఁగి**
**యనలంబు నార్పంగ నార్చుచుఁ బఱతెంచి । వనరక్షకులు పార్థు సునిశితాస్త్ర**
**ధారల నపగతదర్పు లై యరిగిరి । యమసదనంబున కమితబలులు;**

**ఆ. శిఖియు నుగ్రదీర్ఘజిహ్వలు సాఁచి యు । ద్ధురసమీరణంబు తోడు సేసి**
**కొని యుగాంతకాల కుపితానలాకారుఁ డయ్యె ఖాండవమున కద్భుతముగ. 261**

**ప్రతిపదార్థం:** ఆ+వనమునకున్= ఆ ఖాండవవనానికి; ఉభయ, పార్శ్వంబులన్= రెండువైపుల; చక్ర, ధరుండు+అయ్యు= చక్రాయుధాన్ని ధరించినవాడై; జలరుహనాభుండు= పద్మం నాభిలో కలవాడు - శ్రీకృష్ణుడు; గాండీవ, ధరుఁడు+అయ్యున్= గాండీవాన్ని ధరించినవాడై; పాండవుండు= అర్జునుడు; ఉండిరి; తొల్లింటి; అట్టులు= పూర్వంవలె; పెల్లురేఁగి= విజృంభించి; అమితబలులు= మిక్కిలి బలం కలవాళ్ళు; వన, రక్షకులు= ఆ ఖాండవవనాన్ని రక్షించేవాళ్ళు; అనలంబున్= నిప్పును; ఆర్పంగన్= ఆర్పటానికి; ఆర్చుచున్= అరచుచు; పఱతెంచి= పరుగెత్తుకొని వచ్చి; పార్థు, సునిశిత+అస్త్రధారలన్= అర్జునుని యొక్క మిక్కిలి వాడి అయిన బాణాల వర్షంచే; అపగత, దర్పులు+ఐ= కోల్పోయిన గర్వం కలవాళ్ళయి; యమ, సదనంబునకున్= యముని ఇంటికి; అరిగిరి= వెళ్ళారు - అనగా, మరణించారు; శిఖియున్= అగ్నిదేవుడుకూడా; ఉగ్ర, దీర్ఘ, జిహ్వాలు= భయం కరాలు, దీర్ఘాలు అయిన నాలుకలు; చాచి= చాచి; ఉద్ధుర, సమీరణంబు= విజృంభించిన గాలిని; తోడు= సహాయంగా; చేసికొని= గావించుకొని; ఖాండవమునకున్= ఖాండవానికి; అద్భుతముగన్= ఆశ్చర్యకరంగా; యుగాంత, కాల, కుపిత+అనల+ఆకారుఁడు= ప్రళయకాలకోపంలో ఉన్న అగ్నివంటి ఆకారం కలవాడు; అయ్యెన్.

**తాత్పర్యం:** ఆ ఖాండవవనానికి రెండువైపులా - చక్రాయుధాన్ని ధరించి శ్రీకృష్ణుడూ, గాండీవాన్ని ధరించి అర్జునుడూ నిలబడ్డారు. అంతకుముందువలె అమితబలులైన ఖాండవవనరక్షకులు నిప్పు నార్పటానికి అరుస్తూ పరుగెత్తుకొని వచ్చారు. అర్జునుని వాడిబాణాలవర్షంవల్ల గర్వాన్ని కోల్పోయి మరణించారు. అగ్నిదేవుడు భయంకరాలైన పొడవైన నాలుకలు చాచి, విజృంభించిన గాలిని తోడుచేసికొని, ఆ ఖాండవానికి ప్రళయకాలాగ్నివంటివాడయ్యాడు.

**మ. ఘనధూమధ్వజ దహ్యమాన లవలీ కర్పూర తక్కోల చం**
**దన కాలాగరు సల్లకీతరుల యుద్యద్ధూమధూపానువా**
**సన నొప్పెన్ సురభీకృతంబు లగుచున్ సంక్రీడమానామృతా**
**శనవిద్యాధరసద్విమానవితతుల్ సావిత్రవర్త్మంబునన్. 262**

**ప్రతిపదార్థం:** ఘన, ధూమ, ధ్వజ, దహ్యమాన, లవలీ, కర్పూర, తక్కోల, చందన, కాలాగరు, సల్లకీ, తరుల= గొప్పవాడు పొగను జెండాగా కలవాడు అయిన అగ్నిహోత్రునిచే కాల్చబడుతున్న లవలి తీవలు, తక్కోలాలు, మంచిగంధాలు, నల్లఅగరులు, అందుగులు అనే వృక్షాలయొక్క; ఉద్యత్+ధూమ, ధూప+అను, వాసనన్= మీది కెగుస్తూ ఉన్న పొగ అనే ధూపాన్ని అనుసరించిన వాసనచేత; సావిత్ర, వర్త్మంబునన్= సూర్యునిదైన మార్గంలో - అంటే ఆకాశమంతటా; సంక్రీడమాన+ అమృత+అశన, విద్యాధర, సత్+విమాన, వితతుల్= విహరిస్తున్న దేవతలయొక్క, విద్యాధరులయొక్క ఉత్తమాలైన విమానాల సమూహాలు; సురభీ, కృతంబులు+అగుచున్= మంచివాసన కలవిగా చేయబడినవై; ఒప్పెన్= ప్రకాశించాయి.

**తాత్పర్యం:** బాగా విజృంభించిన అగ్నిహోత్రుడు కాల్చే లవలితీగలు, కర్పూరాలు, తక్కోలాలు, మంచిగంధాలు, నల్లఅగరులు, అందుగులు అనే వృక్షాలనుండి మీది కెగుస్తున్న పొగ అనే ధూపాన్ని అనుసరించిన వాసనచేత- ఆకాశమందంతటా విహరించే దేవతలయొక్క, విద్యాధరులయొక్క ఉత్తమవిమానాలు మంచివాసనతో ప్రకాశించాయి.

**విశేషం:** అలంకారం - రూపకం, అతిశయోక్తి. అగ్నిహోత్రుని మహాభయంకరవిజృంభణం పద్యంలో ఓజోగుణవిశిష్టంగా ప్రకాశిస్తున్నది.

**చ. జ్వలన శిఖాలియున్ విజయుసద్విశిఖాలియుఁ జుట్టుముట్టినం**
**దలరి భయాకులంబు లగు తద్వనజీవులయార్తనాద మం**

**దులియుచు నొక్కపెట్ట దివి నుద్గత మయ్యె నమందమందరా**

**చలపరివర్తనప్రసభసంక్షుభితార్ణవఘోషఘోర మై. 263**

**ప్రతిపదార్థం:** జ్వలన, శిఖా+ఆలియున్= అగ్నిహోత్రునియొక్క మంటల సమూహం; విజయు, సత్+విశిఖ+ఆలియున్= అర్జునునియొక్క మేలిమి బాణాల సమూహం; చుట్టు, ముట్టిన్; తలరి= కలత నొంది; భయ+ఆకులంబులు+అగు= భయంతో చెదరినవైన; తత్+వన, జీవుల, ఆర్తనాదము= ఆ ఖాండవవనంలోని ప్రాణులయొక్క ఏడుపు; అందు, ఉలియుచున్= మ్రోగుతూ; ఒక్కపెట్ట= ఒక్కసారిగా; అమంద, మందర+ఆచల, పరివర్తన, ప్రసభ, సంక్షుభిత+అర్ణవ; ఘోరము+ఐ= తక్కువ కాని మందరపర్వతంయొక్క తిరుగుడువలన బలవంతంగా కలతనొందింపబడిన సముద్రంయొక్క శబ్దంవలె భయంకరమై; దివిన్= ఆకాశంలో; ఉద్గతము+అయ్యెన్= మీదికి లేచింది.

**తాత్పర్యం:** అగ్నిహోత్రుని మంటల సమూహం, అర్జునునిమేలిమిబాణాలసమూహం చుట్టుముట్టగా, ఆ ఖాండవవనంలో కలతనొంది భయంతో చెల్లాచెదురైన ప్రాణుల ఏడ్పుధ్వని - ఎంతోపెద్ద మందరపర్వతం తిరగటంవలన కలతనొందిన మహాసముద్రధ్వనివలె భయంకరమై ఒక్కసారిగా ఆకాశంలో మీదికి ఎగిసింది.

**విశేషం:** అలం: ఉపమ. నన్నయరచనలో అక్షరరమ్యత కిది చక్కని ఉదాహరణ. శిఖాలి. విశిఖాలి చుట్టుముట్టినవైనం లకార ప్రాసలో సూచింపబడింది. చివరి పంక్తిలో పరుష స్థిరాక్షర సంయోజనంతో సంక్షోభం ధ్వనింపచేయబడింది.

**క. నెగయుడు నెగసి పిఱుందం । దగిలెడు మిడుఁగుఱులచేత దగ్ధచ్ఛద మై**

**గగనమునఁ బఱవ నోపక । ఖగనివహము వహ్నియంద కడువడిఁ బడియెన్. 264**

**ప్రతిపదార్థం:** నెగయుడున్= ఎగురగానే; ఎగసి= మీదికి లేచి; పిఱుందన్= వెనుకనే; తగిలెడు; మిడుగుఱులచేతన్= తాకుతున్న నిప్పు రవ్వలచేత; దగ్ధ, ఛదము+ఐ= కాల్పబడిన రెక్కలుకలదై; గగనమునన్= ఆకాశంలో; పఱవన్+ఓపక= పరుగెత్తలేక; ఖగ, నివహము= పక్షులసమూహం; వహ్ని, అందు+అ= నిప్పులలోనే; కడున్, వడిన్= మిక్కిలివేగంగా; పడియెన్= పడ్డాయి.

**తాత్పర్యం:** అక్కడి పక్షులు తప్పించుకొని వెళ్ళాలని మీదికి ఎగురగానే, వాటిని వెంబడించి తాకే నిప్పురవ్వలచే రెక్కలు కాలి ఆకాశానికి ఎగురలేక అగ్నిలోనే పడ్డాయి.

**విశేషం:** అలం: స్వభావోక్తి. లఘుబహుళమైన ఈ కందం సత్వరగతినీ, పతనాన్నీ అక్షరరమ్యంగా సూచిస్తున్నది.

**క. తనతేజోజాలము ప । ర్వివ దగ్ధము లగు ననేకవిధదేహుల దే**

**హనికాయంబుల బహువిధ । తనువులు గలవాఁడవోలె దహనుం డొప్పెన్. 265**

**ప్రతిపదార్థం:** తన, తేజస్+జాలము= తనయొక్క కాంతుల సమూహం; పర్వినన్= వ్యాపించగా; దగ్ధములు+అగు= కాలిపోతున్న; అనేక, విధ, దేహుల, దేహ, నికాయంబులన్= పెక్కు విధాలైన ప్రాణులయొక్క దేహాల సమూహాలచేత; దహనుండు= అగ్నిహోత్రుడు; బహువిధ, తనువులు, కలవాడు+అ, పోలెన్= అనేక విధాలైన దేహాలు కలవానివలె; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** తన కాంతిసమూహం వ్యాపించగా కాలిపోతున్న అనేకవిధాలైన ప్రాణుల సమూహాలతో అగ్నిదేవుడు అనేకవిధాలైన దేహాలు కలవానివలె ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. అమితకృశానుదగ్ధ మగు నయ్యమరేంద్రువనంబులోని యు**
**త్తమసలిలాశయావళుల తప్తజలంబులయం దపేతజీ**
**వము లయి తేలుచుండె వరవారిచరంబులు వారిపక్షులుం;**
**గమరె నశేషకోకనదకైరవపంక్తులు శైవలంబులున్. 266**

**ప్రతిపదార్థం:** అమిత, కృశాను, దగ్ధము+అగు= అంతులేని అగ్నిచేత కాల్చబడినదగు; ఆ+అమర+ఇంద్రు, వనంబులోని= ఆ దేవేంద్రునియొక్క ఉద్యానవనంలోని; ఉత్తమ, సలిల+ఆశయ+ఆవళుల= శ్రేష్ఠములైన నీటిమడుగుల సమూహాలయొక్క; తప్త, జలంబుల, అందున్= కాగిననీటిలో; వర, వారి, చరంబులు= శ్రేష్ఠములైన నీటిలో చరించే ప్రాణులు; వారి, పక్షులున్= నీటిపక్షులూ; అపేత, జీవములు+అయి= పోయిన ప్రాణాలు కలవై; తేలుచున్= తేలుతూ; ఉండెన్= ఉన్నవి; అశేష, కోకనద, కైరవపంక్తులు= అన్ని ఎర్రకలువల, తెల్లకలువల సమూహాలు; శైవలంబులున్= నాచుతీగలు; కమరెన్= మాడిపోయాయి.

**తాత్పర్యం:** అపరిమితంగా విజృంభించిన అగ్నిచేత కాల్చబడిన ఆ ఖాండవవనంలోని శ్రేష్ఠాలైన నీటిమడుగుల కాగిన నీటిలో - జలచరాలు, నీటిపక్షులు చచ్చి తేలాడుతూ ఉన్నాయి. ఎర్రకలువలు, తెల్లకలువలు, నాచుతీగలు మాడిపోయాయి.

**విశేషం:** మహాప్రమాదకరమైన అగ్నిహోత్రుని విజృంభణాన్ని ఈ పద్యం చక్కగా ప్రకటం కావిస్తూ ఉన్నది. సరోవరాలను వర్ణించే ఈ పద్యంలో అంతస్థాల, నాదాక్షరాల పునరావృత్తి అక్షరరమ్యతను వ్యక్తీకరిస్తున్నది.

**క. అలుగుల పడి ఖాండవమునఁ । గల యాశీవిషమహోరగము లెల్ల విషా**
**గ్నులు గ్రక్కుచు నత్యుగ్రా । నలబహులజ్వాలలందు నాశము వొందెన్. 267**

**ప్రతిపదార్థం:** అలుగులపడి= బాధపడి; ఖాండవమునన్+కల= ఖాండవవనంలో ఉండే; ఆశీ, విష, మహా+ఉరగములు+ఎల్లన్= ముఖంలో విషం కల పెద్దపాములన్నీ; విష+అగ్నులు= విషమనే నిప్పులను; క్రక్కుచున్= క్రక్కుతూ; అతి+ఉగ్ర+అనల, బహుల, జ్వాలల, అందున్= మిక్కిలి భయంకరమైన అగ్నియొక్క పెక్కుమంటలలో; నాశము; పొందెన్= నశించిపోయాయి, నాశాన్ని పొందాయి.

**తాత్పర్యం:** ఖాండవవనంలో నివసించే పెద్ద పాములన్నీ బాధపడి విషమనే నిప్పులు క్రక్కుతూ మహాభయంకరమైన అగ్నియొక్క అనేకజ్వాలలలో పడి నశించిపోయాయి.

**వ. అంత దేవత లెల్ల మహావహ్నిశిఖాహతికి వెఱచి దేవేంద్రుపాలికిం బోయి ఖాండవవనంబున కైనయకాండ ప్రళయంబు సెప్పిన విని యదరిపడి యింద్రుండు తక్షకరక్షణాపేక్ష ననేకధారాధరనివహంబుతో నతిత్వరితగతి ఖాండవంబునకు వచ్చి హుతాశనుమీఁద మహావారిధారలు గురియించిన. 268**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; దేవతలు+ఎల్లన్= దేవతలు అందరూ; మహా, వహ్ని, శిఖా, హతికి= గొప్పనిప్పుమంటలదెబ్బకు; వెఱచి= భయపడి; దేవేంద్రు; పాలికిన్= దేవేంద్రునిదగ్గరకు; పోయి= వెళ్ళి; ఖాండవంబునకున్+ఐన= ఖాండవానికి జరిగిన; అకాండ, ప్రళయంబు= అకాల వినాశం; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; అదరిపడి= త్రుళ్లిపడి; ఇంద్రుండు= మహేంద్రుడు; తక్షక, రక్షణ+అపేక్షన్= తక్షకుడిని కాపాడాలన్న కోరికతో;, అనేక, ధారాధర, నివహంబుతోన్= పెక్కు మేఘాల సమూహంతో; అతి, త్వరిత, గతిన్= మిక్కిలివేగంగా; ఖాండవంబునకున్= ఖాండవవనానికి వచ్చి; హుతాశనుమీదన్= అగ్నిహోత్రునిమీద; మహా, వారి, ధారలు= పెద్దనీటిధారలు; కురియించినన్= కురిపించగా.

**తాత్పర్యం:** అప్పుడు దేవతలంతా ఆ గొప్ప నిప్పుమంటల దెబ్బకు భయపడి, దేవేంద్రునిదగ్గరకు వెళ్ళారు. ఖాండవవనానికి జరిగిన అకాలవినాశాన్నిగూర్చి చెప్పారు. అది విని దేవేంద్రుడు అదిరిపడ్డాడు. తక్షకుణ్ణి కాపాడా లనే కోరికతో అనేకమేఘాలను వెంట పెట్టుకొని, వేగంగా వచ్చి, అగ్నిహోత్రునిమీద పెద్దనీటిధారలు కురిపించాడు.

**విశేషం:** తక్షకుడు కద్రువపుత్రుడు. పాము. ఉదంకుని కుండలాలు అపహరించిందీ, పరీక్షిత్తును కాటువేసి చంపిందీ ఇతడే. జనమేజయుని సర్పయాగంలో అగ్నిలో పడకుండా ఇతడు దేవేంద్రుడిని శరణువేడి, అతని సింహాసనాన్ని కౌగలించుకొన్నాడు.కడకు ఆస్తీకుని అనుగ్రహంవలన అగ్నిలో పడకుండా బ్రతికాడు.

**క. ఆ వారిధార లెల్ల మ । హావహ్ని శిఖాహతంబు లయి శుష్కము లై**
**లావఱి నడుమన యడఁగుటఁ । బావకు పయి నొక్కచినుకుఁ బడదయ్యె వడిన్. 269**

**ప్రతిపదార్థం:** ఆ, వారి, ధారలు+ఎల్లన్= నీటిధారలన్నీ; మహా, వహ్ని, శిఖా, హతంబులు+అయి= గొప్పఅగ్నియొక్క మంటలచే కొట్టబడినవై; శుష్కములు+ఐ= ఎండిపోయినవై; లావు+అఱి= బలం చెడి; నడుమన్+అ= నడుమనే; అడఁగుటన్= నాశనం కావటంచేత; పావకు, పయిన్= అగ్నిహోత్రునిమీద; ఒక్క, చినుకున్= ఒక్క చినుకుకూడా; వడిన్= వేగంగా; పడదు+అయ్యెన్= పడలేదు.

**తాత్పర్యం:** ఆ నీటిధారలన్నీ గొప్ప నిప్పుమంటలచేత కొట్టబడి, ఎండి, బలం చెడి, నడుమనే నాశనం కావటంవలన అగ్నిహోత్రునిమీద ఒక్కచినుకైనా వేగంగా పడలేదు.

**క. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు । వఱలఁగ నలుగడలఁ బడ నవారితవృష్టుల్**
**గుఱుకొని కురియఁగఁ బంచెను । మఱియును నయ్యనలుమీఁద మఘవుం డలుకన్. 270**

**ప్రతిపదార్థం:** మఘవుండు= దేవేంద్రుడు; అలుకన్= కోపంతో; ఉఱుముచున్; మెఱుముచున్; పిడుగులు; వఱలఁగన్= ప్రకాశిస్తూ; నలుగడలన్= నాలుగువైపుల; పడన్= పడేటట్లుగా; మఱియును= ఇంకా; ఆ+అనలుమీదన్= ఆ అగ్నిహోత్రుని మీద; గుఱుకొని= ప్రయత్నించి; అవారిత, వృష్టుల్= అడ్డగింప సాధ్యంకాని వానలు; కురియఁగన్= కురియుటకై; పంచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** ఉరుముతూ, మెరుస్తూ, నాలుగువైపుల పిడుగులు పడేటట్లు - అడ్డగించ సాధ్యంకాని వానలు - మళ్ళీ ఆ అగ్నిహోత్రుని మీద ప్రయత్నించి గొప్పగా కురవండని దేవేంద్రుడు కోపంతో మేఘాలను ఆజ్ఞాపించాడు.

**క. పాండుసుతుఁ డంత నానా । కాండసహస్రముల నేసి ఘనముగఁ జేసెన్**
**ఖాండవగృహము నఖండా । ఖండలధారలకు దూఱఁ గాకుండంగన్. 271**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు, పాండు, సుతుఁడు= పాండురాజు కుమారుడైన అర్జునుడు; అఖండ+ఆఖండల, ధారలకున్= ఎడతెగని దేవేంద్రుని వర్షధారలకు; దూఱన్+కాకుండన్+కన్= దూరుటకు వీలులేకుండా; నానా, కాండసహస్రములన్= అనేక విధాలైన బాణాలు వేలకొద్దిగా; వేసి= వేసి, ప్రయోగించి; ఖాండవ, గృహమున్= ఖాండవవనానికి ఇంటిని; ఘనముగన్= గొప్పగా; చేసెన్= నిర్మించాడు.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు దేవేంద్రుడు కురిపించే వర్షధారలు దూరటానికి వీలులేకుండా అనేక విధాలైన బాణాలు వేలకువేలు ప్రయోగించి ఖాండవవనానికి గొప్పగా ఇల్లు కట్టాడు.

**వ. ఇట్లు కావించిన. 272**

**తాత్పర్యం:** ఈ విధంగా చేయగా.

**తే. దాని వెల్వడనేరక తద్వనంబు । జీవులెల్లను బావకశిఖలఁ జేసి**
**దగ్ధ లగుచున్నఁ దక్షకతనయుఁ డశ్వ । సేనుఁ డను భుజంగమ మగ్నిశిఖల కపుడు. 273**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ గృహాన్ని; వెల్వడనేరక= దాటి బయటకు రాలేక; తత్+వనంబు, జీవులు+ఎల్లను= ఆ వనంలోని ప్రాణులన్నీ; పావక, శిఖలన్+చేసి= నిప్పుమంటలవలన; దగ్ధలు+అగుచున్+ఉన్నన్= కాలిపోతుండగా; తక్షక, తనయుఁడు= తక్షకుని యొక్క కుమారుడు; అశ్వసేనుఁడు; అను; భుజంగమము= పాము; అగ్ని, శిఖలకున్= నిప్పుమంటలకు; అపుడు= అప్పుడు.

**తాత్పర్యం:** అర్జునుడు నిర్మించిన ఆ ఇంటిని దాటి బయటకు రాలేక, ఆ వనంలోని ప్రాణులన్నీ నిప్పు మంటల వలన కాలిపోతుండగా, తక్షకునికుమారుడైన అశ్వసేనుడు అనే పాము ఆ నిప్పుమంటలకు అప్పుడు.

**ఆ. వెఱచి తల్లిఁదోఁకఁ గఱపించుకొని దివిఁ । బఱచువానిఁ జూచి పార్థుఁ డలిగి**
**వానితల్లిశిరముతోన తత్పుచ్ఛంబు । దునిసి యగ్నిశిఖలఁ దొరఁగ నేసె. 274**

**ప్రతిపదార్థం:** వెఱచి= భయపడి; తల్లిన్= తల్లిని; తోకన్= తోకయందు; కఱపించుకొని= కరిపించుకొని; దివిన్= ఆకాశంలో; పఱచు, వానిన్= పరుగెత్తేవాడిని; చూచి= కనుగొని; పార్థుఁడు= అర్జునుడు; అలిగి= కోపించి; వాని, తల్లి= అతని తల్లి; శిరముతోన= తలతోకూడా; తత్+పుచ్ఛంబు= అతనియొక్కతోక; తునిసి= తెగి; అగ్ని, శిఖలన్= నిప్పుమంటలలో; తొరఁగన్= పడేటట్లు; ఏసెన్= కొట్టాడు. (బాణం ప్రయోగించాడు.)

**తాత్పర్యం:** భయపడి తల్లిని తనతోకయందు కరపించుకొని ఆకాశంలో పరిగెత్తే ఆ అశ్వసేనుడిని అర్జునుడు చూచాడు. కోపపడ్డాడు. తల్లి తలతోకూడా అతనితోక తెగి నిప్పుమంటలలో పడేటట్లు కొట్టాడు.

**వ. వెండియు నశ్వసేను నేయసమకట్టిన యప్పార్థునకుఁ దత్క్షణంబ మోహిని యను మాయ గావించి యమరేంద్రుఁ డశ్వసేను విడిపించి యందుఁ దక్షకుండు దగ్ధుం డయ్యెను కా వగచి కడు నలిగి. 275**

**ప్రతిపదార్థం:** వెండియున్= మరల; అశ్వసేనున్; ఏయన్= కొట్టటానికి; సమకట్టిన= పూనుకొన్నట్టి; ఆ+పార్థునకున్= ఆ అర్జునునికి; తత్+క్షణంబు+అ= ఆ క్షణమే; మోహిని= మోహిని; అను= అనే; మాయ= మాయను; కావించి= చేసి; అమర+

ఇంద్రుఁడు= దేవేంద్రుడు; అశ్వసేనున్; విడిపించి; అందున్= ఆ ఖాండవవనంలో; తక్షకుండు; దగ్ధుండు+అయ్యెను, కా, వగచి= కాలిపోయాడని తలచి; కడున్= మిక్కిలి; అలిగి= కోపించి.

**తాత్పర్యం:** మళ్ళీ అశ్వసేనుడిని కొట్టటానికి పూనుకోగా, దేవేంద్రుడు వెంటనే అర్జునునికి మోహిని అనే మాయ కావించి, అశ్వసేనుడిని విడిపించి, ఖాండవవనంలో తక్షకుడు కాలిపోయాడేమో అని భావించి మహాకోపంతో.

## ఇంద్రుండు కృష్ణార్జునులతోఁ బోరుట (సం 1-218-13)

**ఉ. ఆ నరుమీఁద ఘోరనిశితాశని వైచె నఖండ చండ ఝం**
**ఝానిలజర్జరీకృతమహాజలధారలతో నిరంతరా**
**నూన పయోధరప్రకర ముద్ధత మై హరిదంతరంబులన్**
**భానుపథంబు నొక్కమొగిఁ బర్వి భయంకరలీలఁ గప్పఁగన్. 276**

**ప్రతిపదార్థం:** అఖండ, చండ, ఝంఝ ఝా+అనిల, జర్జరీకృత, మహా, జల, ధారలతో= తక్కువకాని భయంకరమైన గాలివానచే చెదరగొట్టబడిన పెద్ద నీటిధారలతో; నిరంతర+అనూన, పయోధర, ప్రకరము= ఎడతెగనట్టి వెలితిలేని నీటిని ధరించే మేఘాల సమూహం - అంటే ఎడతెగని నిండైన మేఘాల సమూహం; ఉద్ధతము+ఐ= విజృంభించి; హరిత్+అంతరంబులన్= దిక్కుల మధ్య భాగాలను; భాను, పథంబున్= సూర్యునిమార్గాన్ని - అంటే ఆకాశాన్ని; ఒక్క, మొగిన్= ఒక్కసారిగా; పర్వి= పరుగెత్తి (వ్యాపించి); భయంకరలీలన్= భయం కలిగించే విధంగా; కప్పఁగన్= కప్పివేయగా; ఆ, నరు, మీఁదన్= ఆ అర్జునునిమీద; ఘోర, నిశిత+అశనిన్= భయంకరమైన వజ్రాయుధాన్ని; వైచెన్= వేశాడు.

**తాత్పర్యం:** తక్కువ కానిది, భయంకరమైనది అయిన గాలివానచేత చెదరగొట్టబడిన పెద్ద నీటిధారలతో - ఎడతెగని పెద్ద మేఘాల సమూహం విజృంభించి - ఒక్కసారి పరుగెత్తి దిక్కుల మధ్య ప్రదేశాలను ఆకాశాన్ని కప్పివేయగా - దేవేంద్రుడు ఆ అర్జునునిమీద భయంకరమైన వజ్రాయుధాన్ని ప్రయోగించాడు.

**ఉ. అ న్నవవారివాహ నివహమ్ములఁ జూచి భయప్రపన్నుఁ డై**
**యున్నహుతాశనున్ విజయుఁ డోడకు మంచును మారుతాస్త్రమ**
**త్యున్నతచిత్తుఁ డేసె; నదియున్ విరియించె రయంబుతో సము**
**త్పన్నసమీరణాహతి నపార పయోద కదంబకంబులన్. 277**

**ప్రతిపదార్థం:** ఆ+నవ, వారివాహ, నివహమ్ములన్= ఆ కొత్తమేఘాల సమూహాలను; చూచి, భయ, ప్రపన్నుఁడు+ఐ= భయంచే శరణువేడినవాడై; ఉన్న= ఉన్నట్టి; హుతాశనున్= అగ్నిహోత్రుడిని; అతి+ఉన్నత, చిత్తుఁడు= మిక్కిలి గొప్పదైన మనస్సు కలవాడు; విజయుఁడు= అర్జునుడు; ఓడకుము= భయపడకుము; అంచును= అంటూ; మారుత+అస్త్రము= వాయువ్యాస్త్రాన్ని; ఏసెన్= ప్రయోగించాడు; అదియున్= ఆ వాయవ్యాస్త్రమూ; సముత్పన్న, సమీరణ+ఆహతిన్= అప్పటికప్పుడు గొప్పగా పుట్టిన గాలిదెబ్బచే; అపార, పయోద, కదంబకంబులన్= అంతులేని మేఘాలగుంపులను; రయంబుతో= వేగంతో; విరియించెన్= చెదరగొట్టింది.

**తాత్పర్యం:** ఆ క్రొత్త మేఘాల సమూహాలను చూచి, భయపడి శరణువేడిన అగ్నిహోత్రుడిని చూచి, అర్జునుడు పెద్దమనస్సుతో - భయపడవద్దని చెప్పి, వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ వాయవ్యాస్త్రం అప్పటికప్పుడు పుట్టిన గాలిదెబ్బచే అంతులేని ఆ మేఘాలగుంపులను వెంటనే చెదరగొట్టింది.

**విశేషం:** ఇక్కడ అర్జునుడు విజయుడనటంలో మున్ముందు అతడు సాధించబోయే విజయంకూడా ధ్వనింపచేయబడింది.

**వ. అంత. 278**

**తాత్పర్యం:** అప్పుడు.

**సీ. బలవైరి కృష్ణుపైఁ బార్థుపై గడునల్గి । పంచినఁ గలయంగఁ బన్ని కడఁగి**
**సురగరుడోరగాసురసిద్ధగంధర్వు । లార్చుచుఁ దాఁకి యుగ్రాహవంబు**
**సేసిన నమరులఁ జెచ్చెరఁ బార్థుండు । భంజించెఁ దనదివ్యబాణశక్తిఁ;**
**జక్రధరుండును జక్రబలంబున । గరుడోరగాసురఖచరవరులఁ**

**ఆ. దత్క్షణంబ విగతదర్పులఁ జేసె; న । య్యిద్దఱకు సురాసురేశు లెల్ల**
**భీతు లగుట చూచి పెద్దయు విస్మిత । హృదయుఁ డయ్యె సురగణేశ్వరుండు. 279**

**ప్రతిపదార్థం:** బలవైరి= దేవేంద్రుడు; కృష్ణు, పైన్= కృష్ణుని మీద; పార్థు, పైన్= అర్జునుని మీద; మిక్కిలి, అలిగి= చాలా కోపించి; పంచినన్= ఆజ్ఞాపించగా; సుర, గరుడ+ఉరగ+అసుర, సిద్ధ, గంధర్వులు= సురాసురులు గరుడోరగులు సిద్ధగంధర్వులు; కలయంగన్= కలిసి; పన్ని= యుద్ధం చేయటానికి వ్యూహం తీర్చి; కడఁగి= పూని; ఆర్చుచున్= అరుస్తూ; తాఁకి= ఎదుర్కొని; ఉగ్ర+ఆహవంబు= భయంకరమైన యుద్ధం; చేసినన్= చేయగా; పార్థుండు= అర్జునుడు; తన, దివ్య, బాణ, శక్తిన్= తనయొక్క దివ్యమైన బాణాల శక్తిచేత; అమరులన్= దేవతలను; చెచ్చెరన్+చెరన్= తత్క్షణమే; భంజించెన్= ఓడించాడు; చక్ర, ధరుండును= శ్రీకృష్ణుడుకూడా; చక్ర, బలంబునన్= చక్రాయుధంయొక్క బలంచేత; గరుడ+ఉరగ+అసుర, ఖచర, వరులన్= శ్రేష్ఠులైన గరుడులను, నాగులను, అసురులను, ఆకాశసంచారులను; విగత, దర్పులన్= కోల్పోయిన గర్వం కలవాళ్ళనుగా; చేసెన్; ఆ+ఇద్దఱకున్= ఆ కృష్ణార్జునులకు; సుర+అసుర+ఈశులు+ఎల్లన్= దేవదైత్యనాయకులంతా; భీతులు+అగుట= భయం పొందినవాళ్ళు కావటం; చూచి; సుర, గణ+ఈశ్వరుండు= దేవతా సమూహాల ప్రభువు- దేవేంద్రుడు; పెద్దయున్= మిక్కిలి; విస్మిత హృదయుఁడు= ఆశ్చర్యం పొందిన మనస్సు కలవాడు; అయ్యెన్.

**తాత్పర్యం:** దేవేంద్రుడు కృష్ణార్జునులపై మిక్కిలి కోపించి ఆజ్ఞాపించగా - సురలు, గరుడులు, నాగులు, అసురులు, సిద్ధులు, గంధర్వులు ఏకమై వ్యూహం తీర్చి, పూనికతో అరుస్తూ ఎదుర్కొని భయంకర యుద్ధం చేశారు. అర్జునుడు తనదివ్యబాణాల శక్తిచేత దేవతలను తత్క్షణమే ఓడించాడు. శ్రీకృష్ణుడుకూడా తన చక్రబలంతో గరుడులకు, నాగులకు, అసురులకు, ఆకాశ సంచారులకు గర్వభంగం కావించాడు. ఆ కృష్ణార్జునులకు దేవదైత్యనాయకులంతా భయపడటం చూచి, దేవేంద్రుడు ఆశ్చర్యపడ్డాడు.

**వ. మఱియును వారల బల పరాక్రమంబు లెఱుంగ వేఁడి శక్రుండు శిలావర్షంబుఁ గురియించిన. 280**

**ప్రతిపదార్థం:** మఱియును= అంతేగాక; వారల= కృష్ణార్జునులయొక్క; బల, పరాక్రమంబులు; ఎఱుంగన్+వేఁడి= తెలిసికొనా లనుకొని; శక్రుండు= దేవేంద్రుడు; శిలా, వర్షంబున్= రాళ్ళవానను; కురియించినన్= కురిపించగా.

**తాత్పర్యం:** అంతేకాక కృష్ణార్జునుల బలపరాక్రమాలను తెలిసికొనగోరి ఇంద్రుడు రాళ్ళవాన కురిపించగా,

**క. నిశితశరవర్షమున ను । గ్రశిలావర్షమ్ముఁ జిత్రగతి నస్త్రకలా**

**కుశలుఁడు నరుఁ డశ్రమమునఁ । బ్రశాంతిఁ బొందించె నమరపతి వెరఁగందన్. 281**

**ప్రతిపదార్థం:** అస్త్ర, కలా, కుశలుఁడు= బాణప్రయోగకళలో నేర్పరి అయినవాడు; నరుఁడు= అర్జునుడు; నిశిత, శర, వర్షమునన్= వాడి అయిన బాణ వర్షంచేత; చిత్ర, గతిన్= ఆశ్చర్యకరమైన విధంగా; ఉగ్ర, శిలా, వర్షమునన్= భయంకరమైన రాళ్ళవాన; అమర, పతి= దేవేంద్రుడు; వెరఁగు+అందన్= ఆశ్చర్యంపొందగా; అశ్రమమునన్= శ్రమలేకుండా - సులువుగా; ప్రశాంతిన్+పొందించెన్= అణగిపోయేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** బాణ ప్రయోగకళలో నిపుణుడైన అర్జునుడు, వాడి అయిన తన బాణాల వర్షంతో ఆశ్చర్యకరంగా, భయంకరమైన ఆ రాళ్ళవానను దేవేంద్రుడుకూడా ఆశ్చర్యపడేటట్లు అవలీలగా అణగించాడు.

**క. కొడుకుభుజవిక్రమమునకుఁ । గడుసంతసపడియుఁ దృప్తిగానక చల మే**

**ర్పడఁగ హుతాశను నార్పం । గడఁగి మహారౌద్రభంగిఁ గౌశికుఁడు వడిన్. 282**

**ప్రతిపదార్థం:** కౌశికుఁడు = దేవేంద్రుడు; కొడుకు= కుమారుడైన అర్జునుని; భుజపరాక్రమానికి= బాహుబలానికి; కడున్= మిక్కిలి; సంతసపడియున్= సంతోషంపొందికూడా; తృప్తి, కానక= తృప్తిలేక; చలము= కోపం; ఏర్పడన్+కన్= బయలుపడేటట్లు; హుతాశనున్-హుత+అశనున్= అగ్నిహోత్రుడిని; ఆర్పన్= అణచటానికి; కడఁగి= పూనుకొని; మహా, రౌద్ర, భంగిన్= మిక్కిలి భయంకరమైన విధంగా; వడిన్= వేగమే.

**తాత్పర్యం:** దేవేంద్రుడు తన కుమారుడైన అర్జునుని బలపరాక్రమం చూచి, మిక్కిలి సంతోషించి, తృప్తిపొందక కోపంతో అగ్నిహోత్రుడిని ఆర్పివేయటానికి పూనుకొని మహాభయంకరంగా వేగమే.

**చ. అరుదుగ దివ్యరత్ననివహంబులఁ జేసి వెలుంగుచున్న మం**

**దర శిఖరంబు నెత్తికొని తద్దహనార్చు లడంగునట్లుగాఁ**

**దెరలఁగ వైచినం దపనతేజుఁడు పాండుసుతుండు దానిజ**

**ర్ఝరితము సేసె వజ్రమయశాతశిలీముఖచండధారలన్. 283**

**ప్రతిపదార్థం:** అరుదుగన్= ఆశ్చర్యం కలిగించేటట్లు; దివ్య, రత్న, నివహంబులన్+చేసి= శ్రేష్ఠాలైన రత్న సమూహాలతో; వెలుంగుచున్+ఉన్న= వెలుగుతూఉండే; మందర, శిఖరంబున్= మందరపర్వతంయొక్క శిఖరాన్ని; ఎత్తికొని; తత్+దహన+అర్చులు= ఆ అగ్నిహోత్రునిమంటలు; అడంగు, అట్లుగాన్= అణగిపోయేటట్లుగా; తెరలన్+కన్= కలతనొందేటట్లుగా; వైచినన్= వేయగా; తపన, తేజుఁడు= సూర్యునివంటి కాంతి కలవాడు; పాండు, సుతుండు= పాండురాజు కుమారుడు - అర్జునుడు; దానిన్= ఆ మందరపర్వతశిఖరాన్ని; వజ్రమయశాత, శిలీముఖ, చండ, ధారలన్= వజ్రాయుధంవలె వాడి అయిన బాణాల భయంకర వర్షాలచేత; జర్జరితము= శిథిలం; చేసెన్.

**తాత్పర్యం:** ఆశ్చర్యకరంగా దివ్యరత్న సమూహాలతో వెలుగుతున్న మందరపర్వతశిఖరాన్ని ఎత్తి దేవేంద్రుడు అగ్నిహోత్రునిమంటలు అణగేటట్లు వేయగా, సూర్యునివంటి కాంతిమంతుడైన అర్జునుడు వజ్రాయుధంవలె వాడి అయిన బాణవర్షాలతో దాన్ని ముక్కలు చేశాడు.

**క. ధరణీధరుచక్రమునకుఁ । బురుహూతతనూజుబాణముల కనిలో నె**

**వ్వరు మార్కొ ననోపరు సుర । గరుడోరగ సిద్ధసాధ్యగణములలోనన్. 284**

**ప్రతిపదార్థం:** ధరణీధరు, చక్రమునకున్= భూమిని ధరించినవాడైన శ్రీకృష్ణుని చక్రాయుధానికి; పురుహూత, తనూజ, బాణములకున్= దేవేంద్రుని కుమారుడైన అర్జునునియొక్క బాణాలకు; అనిలోన్= యుద్ధంలో; సుర, గరుడ+ఉరగ, సిద్ధ, సాధ్య, గణములలోనన్= దేవతలయొక్క, గరుడులయొక్క, నాగులయొక్క, సిద్ధులయొక్క, సాధ్యులయొక్క సమూహాలలో; ఎవ్వరున్= ఎవరుకూడా; మార్కొనన్+ఓపరు= ఎదుర్కోలేరు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణునిచక్రాయుధాన్ని, అర్జునునిబాణాలను, యుద్ధంలో దేవ గరుడ నాగ సిద్ధ సాధ్యుల సమూహాలలో ఎవ్వరుకూడా ఎదుర్కొనలేరు.

**విశేషం:** ధరణీధరుడు - భూమిని ధరించిన - శ్రీమహావిష్ణువు - ఇక్కడ అతని అవతారమైన శ్రీకృష్ణుడు. పురుహూతుడనగా- యజ్ఞాలలో ప్రచురమైన పిలుపుకలవాడు; పురువను రక్కసుడిని చంపినవాడు - దేవేంద్రుడు.

**వ. అంత నొక్కయశరీరవాణి పాకశాసనున కి ట్లనియె. 285**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; ఒక్క; అశరీరవాణి= ఆకాశవాణి; పాకశాసనునకున్= దేవేంద్రునితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అప్పుడు ఒక ఆకాశవాణి ఇంద్రునితో ఇట్లా అన్నది.

**విశేషం:** పాకశాసనుడు - వృత్రాసురుని సోదరుడైన పాకాసురుడిని చంపినవాడు - దేవేంద్రుడు.

**క. పరమమును లయిన తొల్లిటి । నరనారాయణులు కృష్ణనామంబుల ను**

**ర్వర నుదయించిరి; నీ క । య్యిరువుర పేర్మియును వింతయే దివిజేంద్రా! 286**

**ప్రతిపదార్థం:** దివిజ+ఇంద్రా!= దేవేంద్రా; పరమ, మునులు; అయిన= శ్రేష్ఠ మునీశ్వరులైన; నర, నారాయణులు; కృష్ణ, నామంబులన్= కృష్ణులు అనే పేర్లతో; ఉర్వరన్= భూమియందు (పై); ఉదయించిరి= పుట్టారు; నీకున్= నీకు; ఆ+ఇరువుర= ఆ ఇద్దరియొక్క; పేర్మియును= గొప్పతనం; వింతయే= ఆశ్చర్యకరమా?

**తాత్పర్యం:** దేవేంద్రా! పరమమునులైన నరనారాయణులు కృష్ణులనే పేర భూమిమీద పుట్టారు. ఆ ఇద్దరి గొప్పతనం నీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నదా?

**విశేషం:** శ్రీకృష్ణునికే గాక అర్జునునికి కూడా కృష్ణుడు అనే పేరు ఉన్నది. శ్లో॥ అర్జునః ఫల్గుణః పార్థః, కిరీటీ శ్వేతవాహనః । బీభత్సో విజయః, కృష్ణ, స్సవ్యసాచీ, ధనంజయః ॥ అని అర్జునుని పేర్లు.

**చ. అలఘులు కృష్ణపార్థులు మహాత్ములు యాదవకౌరవాన్వయం**

**బులు వెలుఁగించుచున్న నృపపూజ్యులు; వీరల నీకు నోర్వఁగా**

**నలవియె? వీరు దొల్లియు సురాసుర యుద్ధమునాఁడు దైత్యులన్**

**వెలయఁగ నోర్చియున్న రణవీరులు గావుట ము న్నెఱుంగవే? 287**

**ప్రతిపదార్థం:** కృష్ణ, పార్థులు= కృష్ణార్జునులు; అలఘులు= తక్కువ కాని వాళ్ళు - అంటే గొప్పవాళ్ళు; మహా+ఆత్ములు = మహనీయులు; యాదవ, కౌరవ+అన్వయంబులు= యాదవ కౌరవవంశాలు; వెలుఁగించుచున్+ఉన్న= వెలిగించే; నృప, పూజ్యులు= పూజించదగిన రాజులు; వీరలన్= వీళ్లను; నీకున్; ఓర్వగాన్= ఓడించడానికి; అలవియె= సాధ్యమా?; వీరు= వీళ్లు, తొల్లియున్= పూర్వంకూడా; సుర+అసుర, యుద్ధము, నాఁడు= దేవ దానవ యుద్ధ సమయంలో; దైత్యులన్= రాక్షసులను; వెలయన్+కన్= గొప్పగా; ఓర్చి, ఉన్న= ఓడించిఉన్న; రణ, వీరులు= యుద్ధవీరులు, కావుట= కావటం; మున్ను= ఇదివరకు; ఎఱుంగవే= తెలిసికొనలేదా!

**తాత్పర్యం:** కృష్ణార్జునులు గొప్పవాళ్ళు, మహాత్ములు. యాదవ కౌరవ వంశాలను వెలిగించే పూజ్య ప్రభువులు. వీళ్ళను ఓడించడం నీకు సాధ్యమా. పూర్వం దేవదానవయుద్ధంలో రాక్షసులను వీళ్ళు ఓడించడం ఇదివరకు నీకు తెలియదా?

**వ. నీయిష్టసఖుం డయిన తక్షకుం డిం దుండక ముందరన కురుక్షేత్రంబున కరిగి ఖాండవప్రళయంబునకుఁ దప్పెఁ; ఖాండవం బగ్నిచేత దగ్ధం బగు నని తొల్లి బ్రహ్మవచనంబు గలుగుటం జేసి యిది హుతాశనున కశనం బయ్యెఁ; నింక దీనికి వగవం బనిలేఁ దనిన దాని విని సురపతి సురగణంబులతో మరలిన. 288**

**ప్రతిపదార్థం:** నీ, ఇష్ట, సఖుండు+అయిన= నీకు మిక్కిలి ఇష్టమైన స్నేహితుడైన; తక్షకుండు; ఇందున్= ఇక్కడ; ఉండక= వసింపక; ముందరన= ముందుగానే; కురుక్షేత్రంబునకున్= కురుక్షేత్రానికి; అరిగి= వెళ్ళి; ఖాండవ, ప్రళయంబునకున్= ఖాండవవనంలోని ప్రమాదానికి; తప్పెన్= దూరమయినాడు; ఖాండవంబు; అగ్నిచేతన్= అగ్నిచే; దగ్ధంబు+అగున్= కాలిపోతుంది; అని= అని; తొల్లి= పూర్వం; బ్రహ్మ, వచనంబు= బ్రహ్మదేవునిమాట; కలుగుటన్+చేసి= ఉండటంచేత; ఇది, హుతాశనునకున్= అగ్నిహోత్రుడికి; అశనంబు= ఆహారం; అయ్యెన్= అయింది; ఇంకన్= ఇంక; దీనికి= దీనికై; వగవన్= చింతింప; పనిలేదు; అనినన్= అని అనగా; దానిన్= ఆ మాటను విని; సుర, పతి= దేవతలరాజు - దేవేంద్రుడు; సుర, గణంబులతోన్= దేవతా సమూహాలతో; మరలినన్= తిరిగి వెళ్ళగా.

**తాత్పర్యం:** 'నీ ప్రియమిత్రుడైన తక్షకుడు ఇక్కడ లేడు. ముందుగానే కురుక్షేత్రానికి వెళ్ళి, ఈ ఖాండవ దహనంవలన కలిగే ప్రమాదాన్ని తప్పించుకొన్నాడు. అగ్నిచే ఖాండవం కాలిపోతుందని పూర్వమే బ్రహ్మ చెప్పాడు. అందుచేత ఇది అగ్నిహోత్రునికి ఆహారమైనది. ఇక దీనికి దుఃఖింపనక్కరలేదు' అని చెప్పగా విని దేవేంద్రుడు దేవతాసమూహాలతో తిరిగి వెళ్ళగా.

**క. బలయుతులు మనుజసింహులు । నలిఁ గృష్ణార్జునులు సింహనాదముల వియ**
**త్తలమును దిక్కులు బధిరం । బులుగాఁ జేసిరి త్రిలోకములు భయ మందన్. 289**

**ప్రతిపదార్థం:** బల, యుతులు= బలంతో కూడినవాళ్ళు; మనుజ, సింహులు= మానవశ్రేష్ఠులు; కృష్ణ+ అర్జునులు= కృష్ణుడు, అర్జునుడు; నలిన్= అతిశయంగా; సింహనాదములన్= సింహనాదాలచేత; వియత్+తలమును= ఆకాశంయొక్క క్రిందిభాగం; దిక్కులు= అన్ని దిక్కులు; బధిరంబులు+కాన్= చెవిటివి అయ్యేటట్లుగా; త్రిలోకములు= మూడులోకాలు; భయము+అందన్= భయపడగా; చేసిరి= చేశారు;

**తాత్పర్యం:** బలవంతులు, మానవశ్రేష్ఠులు అయిన కృష్ణార్జునులు ముల్లోకాలు భయపడేటట్లుగా-ఆకాశం, దిక్కులు చెవిటివయ్యేటట్లుగా పెద్ద సింహనాదాలు చేశారు.

**వ. అట్టియవసరంబున నముచి యను దనుజుననుజుండు మయుం డనువాఁడు ఖాండవంబు వెలువడనేరక తక్షకుగృహంబునఁ బరిభ్రమించుచున్నంతఁ ద న్నగ్ని చుట్టుముట్టిన నచ్యుతుండును జంప వచ్చిన నతిభీతుం డై యర్జునుమఱువు సొచ్చిన. 290**

**ప్రతిపదార్థం:** అట్టి, అవసరంబునన్= అటువంటి సమయంలో; నముచి, అను= నముచి అనే పేరుగల; దనుజ; అనుజుండు= రాక్షసుడిని అనుసరించి పుట్టినవాడు; మయుండు= మయుడు; అనువాఁడు; ఖాండవంబు, వెలువడన్, నేరక= ఖాండవవనంనుండి బయటకి రాలేక; తక్షకు, గృహంబునన్; పరిభ్రమించుచున్= అంతటా తిరుగుతూ; ఉన్న+అంతన్= ఉండగా; తన్నున్= తనను; అగ్ని= అగ్ని; చుట్టుముట్టినన్= చుట్టుముట్టగా; అచ్యుతుండును= శ్రీకృష్ణుడుకూడా; చంపవచ్చినన్= చంపుటకైరాగా; అతి, భీతుండు+ఐ= మిక్కిలిభయపడినవాడై; అర్జును, మఱువు= అర్జునునిచాటు; చొచ్చినన్= ప్రవేశింపగా.

**తాత్పర్యం:** అట్లాంటి సమయంలో నముచి అనే రాక్షసునితమ్ముడు, మయుడు అనేవాడు ఖాండవవనంనుండి బయటపడలేక తక్షకుని ఇంట్లో దిక్కుతోచక తిరుగుతూ, తనను అగ్ని చుట్టుముట్టగా, శ్రీకృష్ణుడు చంపటానికి రాగా, మిక్కిలి భయపడి అర్జునునిచాటు చొచ్చాడు.

**వ. శరణాగతరక్షణత । త్పరుఁడు ధనంజయుఁడు మయునిప్రాణము గాచెం;**
**గరుణను శరణాగతులగు । పురుషుల రక్షించునంత పుణ్యము గలదే. 291**

**ప్రతిపదార్థం:** శరణ+ఆగత, రక్షణ, తత్+పరుఁడు= శరణుకోరివచ్చినవాళ్ళను రక్షించటంలో మనస్సు కలవాడు; ధనంజయుఁడు= అర్జునుడు; మయుని= మయుని; ప్రాణము= ప్రాణాన్ని; కాచెన్= కాపాడాడు; కరుణను= దయతో; శరణ+ఆగతులు+అగు= శరణుకోరి వచ్చిన వాళ్ళయిన; పురుషులన్= పురుషులను; రక్షించు, అంత= రక్షించేంతటి; పుణ్యము, కలదే= వేరే ఉన్నదా? (లేదని భావం).

**తాత్పర్యం:** శరణుకోరివచ్చినవాళ్ళను రక్షించటంలో మనస్సు కల అర్జునుడు మయునిప్రాణాలు కాపాడాడు. శరణుకోరినవాళ్ళను దయతో రక్షించటంవంటిపుణ్యం ఇంకొకటి కలదా! (లేదని భావం)

**విశేషం:** అలంకారం - అర్థాంతరన్యాసం. నానారుచిరార్థసూక్తినిధి అయిన నన్నయ కవితలో 'శరణాగతరక్షణ మహాపుణ్యాకార్య' మని ప్రవచించిన ఈ సూక్తి ఒక మేలిమిరత్నం.

**తే. మయుఁడు నశ్వసేనుండును మందపాల । సుతులు నలువురు శార్ఙ్గకు లతులదావ**
**దాహభీతి కయ్యార్వురుఁ దప్పి రన్య । జీవులెల్ల నం దపగతజీవు లైరి. 292**

**ప్రతిపదార్థం:** మయుడున్, అశ్వసేనుండును; మందపాల, సుతులు= మందపాలునియొక్క కుమారులు; శార్ఙ్గకులు= శార్ఙ్గకులు, నలువురు= నలుగురు; ఆ+ఆర్వురు= ఆ ఆరుగురు; అతుల, దావ, భీతికిన్= సాటిలేని కార్చిచ్చువలన కలిగే భయానికి; తప్పిరి= తప్పించుకొన్నారు; అన్య, జీవులు+ఎల్లన్= తక్కినప్రాణులన్నీ; అందున్= ఆ అగ్నిలో; అపగత, జీవులు+ఐరి= ప్రాణాలు కోల్పోయారు.

**తాత్పర్యం:** మయుడు, అశ్వసేనుడు, మందపాలుని కుమారులు శార్ఙ్గకు లనేవాళ్ళు నలుగురు - మొత్తం ఆరుమంది ఆ దావాగ్నినుండి తప్పించుకొన్నారు. తక్కిన ప్రాణులన్నీ ఆ దావాగ్నిలో మరణించాయి.

## మందపాలోపాఖ్యానము (సం. 1-220-1)

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 293**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; జనమేజయుండు; వైశంపాయనునకున్; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని జనమేజయుండు వైశంపాయనునితో ఇట్లా అన్నాడు.

**క. మయభుజగమోక్షణము ని । ర్ణయముగ నెఱిఁగితి, నెఱుంగ నా కర్థిత్వం**
**బయినది నలుగురు శార్ఙ్గకు । లయు మోక్షణ మెట్లు నిర్మలజ్ఞాననిధీ! 294**

**ప్రతిపదార్థం:** నిర్మల, జ్ఞాన, నిధీ= అచ్చపు జ్ఞానానికి స్థానమైనవాడా! ఓ వైశంపాయనమహర్షీ!, మయ, భుజగ, మోక్షణము= మయునియొక్క, పామైన అశ్వసేనునియొక్క విముక్తి - అంటే మయుడు, అశ్వసేనుడు ఆ దావాగ్నినుండి తప్పించుకొని బయటపడిన విధం; నిర్ణయముగన్= నిశ్చయంగా అంటే పూర్తిగా; ఎఱిఁగితిన్= తెలిసికొన్నాను; నలుగురు; శార్ఙ్గకులయు, మోక్షణము= నలుగురు శార్ఙ్గకులు తప్పించుకోవటం; ఎట్లు= ఏ విధంగా జరిగిందో; నాకున్= నాకు ; ఎఱుంగన్= తెలిసికోవటానికి; అర్థిత్వంబు+అయినది= కోరిక కలిగింది.

**తాత్పర్యం:** నిర్మల జ్ఞానానికి నిధివంటి ఓ వైశంపాయనమహర్షీ! మయుడు, అశ్వసేనుడు ఆ దావాగ్నినుండి తప్పించుకొన్నవిధం పూర్తిగా తెలుసుకొన్నాను. మందపాలుడి కుమారులైన నలుగురు శార్ఙ్గకు లెట్లా తప్పించుకొన్నారో తెలిసికొనాలనే కోరిక కలిగింది.

**వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డి ట్లనియె. 295**

**ప్రతిపదార్థం:** అని, అడిగినన్= అని అడుగగా; జనమేజయునకున్= జనమేజయమహారాజుకు; వైశంపాయనుండు= వైశంపాయనమహర్షి; ఇట్లు= ఈవిధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అడుగగా వైశంపాయనుడు జనమేజయునితో ఈ విధంగా అన్నాడు.

**క. జనపాల! మందపాలుం । డనుమునిముఖ్యుండు దొల్లి యత్యుగ్రతపం**
**బొనరించె బ్రహ్మచర్యం । బున దివ్యసహస్రవర్షములు నైష్ఠికుఁ డై. 296**

**ప్రతిపదార్థం:** జనపాల= జనులను పాలించేవాడా! ఓ జనమేజయమహారాజా!; తొల్లి= పూర్వం; మందపాలుండు; అను; ముని, ముఖ్యుండు= ప్రసిద్ధుడైన ముని; బ్రహ్మచర్యంబునన్= బ్రహ్మచర్యవ్రతాన్ని అవలంబిస్తూ; దివ్య, సహస్ర, వర్షములు= వెయ్యి దేవతాసంవత్సరాలు; నైష్ఠికుఁడు+ఐ= నిష్ఠకలవాడై - అంటే స్థిరమైన బుద్ధి కలవాడై; అతి+ఉగ్ర, తపంబున్= మిక్కిలి భయంకరమైన తపస్సును; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఓ జనమేజయ మహారాజా! పూర్వం మందపాలుడనే మహాముని బ్రహ్మచర్యవ్రతాన్ని అవలంబించి వెయ్యిదేవతాసంవత్సరాలు నిష్ఠతో భయంకరమైనతపస్సు చేశాడు.

**క. అమ్ముని యోగాభ్యాసవ । శమ్మున దేహంబు విడిచి చని పుణ్యు లలో**
**కమ్ములు సారఁ గానక వడిఁ । ద్రిమ్మరి దేవతలఁ గాంచి ధృతి ని ట్లనియెన్. 297**

**ప్రతిపదార్థం:** ఆ+ముని= ఆ మందపాలమహాముని; యోగ+అభ్యాస, వశమ్మునన్= యోగాభ్యాసంచేత; దేహంబు= శరీరం; విడిచి= వదలి; చని= వెళ్లి; పుణ్యుల, లోకమ్ములు= పుణ్యం చేసికొన్నవాళ్ళు ఉండే లోకాలు - దివ్యలోకాలు; చొరన్+కానక= ప్రవేశించలేక; వడిన్= వేగమే; త్రిమ్మరి= వెనుదిరిగి; దేవతలన్= దేవతలను; కాంచి= చూచి; ధృతిన్= ధైర్యంతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ మందపాలమహాముని యోగాభ్యాసంచేత శరీరం విడిచి, పుణ్యలోకాలను ప్రవేశించలేక, వెంటనే వెనుదిరిగి దేవతలతో ధైర్యంగా ఇట్లా అన్నాడు.

**వ. 'నాకుఁ బుణ్యలోకంబులు లేకుండ నే నేమి దుష్కృతంబు సేసితి?' ననిన నమ్మునీంద్రునకు దేవత లి ట్లనిరి. 298**

**ప్రతిపదార్థం:** నాకున్; పుణ్య, లోకంబులు; లేకుండన్= లేకుండుటకు; ఏను= నేను; ఏమి; దుష్కృతంబు చేసితిన్= పాపం చేసితిని; అనినన్= అని అనగా; ఆ+ముని+ఇంద్రునకున్= ఆ మునీశ్వరునికి; దేవతలు, ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** 'నాకు పుణ్యలోకాలు లేకుండా పోవటానికి నే నేమి పాపం చేశాను?' అని అనగా ఆ మునిశ్రేష్ఠునితో దేవతలు ఇట్లా అన్నారు.

**క. ఎంతతపం బొనరించియు । సంతానము లేనివారు సద్గతిఁ బొందం**
**గాంతురె? నీతప మేటికి । సంతానమువడయు మరిగి సన్మునినాథా! 299**

**ప్రతిపదార్థం:** సత్+ముని, నాథా!= పూజింపదగిన మునిశ్రేష్ఠా!; ఎంత= ఎంతగా; తపంబు= తపస్సు; ఒనరించియు= చేసినా; సంతానము; లేని; వారు; సత్+గతిన్= మోక్షాన్ని; పొందన్+కాంతురె= పొందగలరా?; నీ, తపము= నీ తపస్సు; ఏటికి= ఎందుకు; అరిగి= వెళ్ళి; సంతానము= సంతానాన్ని; పడయుము= పొందుము.

**తాత్పర్యం:** పూజింప తగిన ఓ మునీశ్వరా! ఎంత తపస్సు చేసినా సంతానం లేనివాళ్ళు మోక్షాన్ని పొందకలరా? నీ తపస్సెందుకు? వెళ్ళి సంతానం పొందుము.

**వ. అనిన విని మందపాలుండు మర్త్యలోకంబునకుఁ దిరిగివచ్చి 'నాకుం జెచ్చెరం బెక్కండ్రుపుత్త్రుల నెవ్విధంబునం బడయనగునో' యని చింతించి, పక్షులయందు వేగంబ యపత్యంబు పెద్ద యగుటం జూచి, తానును శార్ఙ్గకుండై, జరిత యను లావుక పెంటియందు రమియించి, దానివలన జరితారి సారిసృక్కస్తంబమిత్ర ద్రోణు లనువారల నలువురఁ గొడుకులఁ బరమబ్రహ్మవిదులం బడసి, వారల ఖాండవవనంబునం బెట్టి, తనపూర్వభార్యయైన లపితయుం దానును విహరించుచు నొక్కనాఁడు ఖాండవదహనోద్యతుండై వచ్చుచున్న యగ్నిభట్టారకుం గని, యగ్నిసూక్తంబుల స్తుతియించి యి ట్లనియె. 300**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; విని, మందపాలుండు, మర్త్య, లోకంబునకున్= మానవలోకానికి; తిరిగివచ్చి, నాకున్, చెరన్+చెరన్= వేగమే; పెక్కండ్రు= పలువురు; పుత్త్రులన్= కుమారులను; ఏ, విధంబునన్; పడయన్= పొందటానికి; అగునో= సాధ్యపడునో; అని= అంటూ; చింతించి = ఆలోచించి; పక్షుల, అందు= పక్షులలో, వేగంబు+అ= త్వరగా, అపత్యంబు=

సంతానం; పెద్ద, అగుటన్= ఎక్కువకావటాన్ని; చూచి= గ్రహించి; తానును; శార్ఙ్గకుండు+ఐ= శార్ఙ్గకపక్షి (లావుకపక్షి) రూపం దాల్చినవాడై; జరిత, అను; లావుక, పెంటియందున్= ఆడు లావుక పక్షియందు; రమియించి= సంభోగించి; దానివలనన్= జరితారి, సారిసృక్క, స్తంబమిత్ర, ద్రోణులు; అనువారలన్= అనే వాళ్ళను, నలువురన్= నలుగురిని; కొడుకులన్= కొడుకులను; పరమ, బ్రహ్మ, విదులన్= గొప్ప బ్రహ్మజ్ఞానం కలవాళ్ళను; పడసి= పొంది; వారలన్= వాళ్ళను; ఖాండవంబునన్= ఖాండవవనంలో; పెట్టి= ఉంచి; తన, పూర్వ, భార్య+ఐన= తన మొదటి భార్య అయిన; లపితయున్= లపితయూ, తానును= తానూ; విహరించుచున్= విహరించుచు; ఒక్కనాఁడు; ఖాండవ, దహన+ఉద్యతుండు+ఐ= ఖాండవవనాన్ని కాల్చటానికి పూనుకొన్నవాడై; వచ్చుచున్+ఉన్న= వస్తూ ఉండే; అగ్నిభట్టారకున్= అగ్నిహోత్రుడిని; కని=చూచి; అగ్ని, సూక్తంబులన్= అగ్నిని స్తుతించే వేదమంత్రాలతో; స్తుతియించి= స్తోత్రంచేసి-కొనియాడి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దేవతలు ఆ విధంగా చెప్పగా విని, మందపాలుడు మానవలోకానికి తిరిగివచ్చాడు. త్వరగా తాను పుత్రులను పొందటం ఏ విధంగా సాధ్యమౌతుందో నంటూ ఆలోచించాడు. పక్షులలో సంతానం చాలా ఎక్కువ కావటం చూచి, మగలావుకపక్షిరూపం తాల్చాడు. ఆడులావుకపక్షి అయిన జరితతో సంభోగించాడు. జరితారి, సారిసృక్క, స్తంబమిత్ర, ద్రోణు లనే నలుగురు కొడుకులను - గొప్ప బ్రహ్మజ్ఞానంకలవాళ్ళను కన్నాడు. వాళ్ళను ఖాండవవనంలో ఉంచి తాను మొదటి భార్య అయిన లపితతో కలిసి విహరిస్తూ ఒక రోజు ఖాండవవనాన్ని కాల్చే ప్రయత్నంతో వస్తున్న అగ్నిహోత్రుడిని చూచి, అగ్నిసూక్తాలతో ఆయనను స్తోత్రం చేసి ఇట్లా అన్నాడు.

**విశేషం:** కథాప్రసన్నతను దృష్టిలో ఉంచుకొని నన్నయ ఇక్కడ మూలంలోని అగ్నిస్తోత్రాత్మకాలైన శ్లోకాలను అనువదించక వదిలాడు.

**క. నీ వఖిల ధర్మమూర్తివి; । నావీర్యప్రభవు లయిన నలువురుసుతులన్**
**లావుకలఁ గరుణఁ గావుము । పావక! భువనోపకారపర్యాప్తమతీ! 301**

**ప్రతిపదార్థం:** భువన+ఉపకార= లోకానికి ఉపకారం చేయటంలో; పర్యాప్తమతీ!= శక్తిమంతమైన మనస్సుకలవాడా!; పావక!= ఓ అగ్నిహోత్రా!; నీవు, అఖిల, ధర్మ మూర్తివి= సర్వధర్మస్వరూపుడవు; నా, వీర్య, ప్రభవులు+అయిన= నా వీర్యం నుండి పుట్టిన వాళ్ళయిన; నలువురు, సుతులన్= నలుగురు కుమారులను; లావుకలన్= లావుక పిట్టలను; కరుణన్= దయతో; కావుము= కాపాడుము.

**తాత్పర్యం:** లోకానికి ఉపకారం చేయటంలో శక్తిమంతమైన మనస్సు గలవాడా! ఓ అగ్నిహోత్రా! నీవు పరిపూర్ణ ధర్మమూర్తివి. నా వీర్యంనుండి పుట్టిన నలుగురు కుమారులు లావుకపిట్టలను దయతో రక్షింపుము.

**వ. అనిన నమ్మందపాలుప్రార్థనంజేసి యానలువురు శార్ఙ్గకులను నగ్నిదేవుండు రక్షించువాఁ డయ్యె; నంత నిట 302**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; ఆ+మందపాలు= ఆ మందపాలునియొక్క; ప్రార్థనన్, చేసి= ప్రార్థనవల్ల; ఆ నలువురు శార్ఙ్గకులను= నలుగురు కుమారులైన శార్ఙ్గకుల్ని; అగ్నిదేవుండు= అగ్నిదేవుడు; రక్షించువాఁడు= కాపాడగల్గినవాడు; అయ్యెన్= అయ్యాడు; అంతన్= అంతలో.

**తాత్పర్యం:** అనగా, ఆ మందపాలుని ప్రార్థనవలన ఆ నలుగురు శార్ఙ్గకులను అగ్నిదేవుడు రక్షించాడు. ఇక ఇక్కడ.

**క. తనయుల నజాతపక్షుల । ననలశిఖాభీతిచంచలాత్ముల నెటయుం**
**జననేరనిబాలకులను । జననియు వీక్షించి శోకసంతాపిత యై. 303**

**ప్రతిపదార్థం:** అజాత, పక్షులన్= మొలవని రెక్కలు కలవాళ్ళను; అనల, శిఖా, భీతి, చంచల+ఆత్ములన్= అగ్నిజ్వాలలవలన కలిగే భయంవలన కంపించే హృదయాలు కలవాళ్ళను; ఎటయున్= ఎక్కడికీ; చననేరని= వెళ్ళలేని; బాలకులను= చిన్నపిల్లలను; తనయులన్= కుమారులను; జననియు= తల్లికూడా; వీక్షించి= చూచి; శోక, సంతాపిత+ఐ= దుఃఖంచేత మిక్కిలితాపం పొందినదై.

**తాత్పర్యం:** రెక్కలు మొలవనివాళ్ళు, నిప్పుమంటలు చూచి భయంచేత చలించే మనస్సు కలవాళ్ళు, ఎక్కడికీ వెళ్ళ లేనివాళ్ళు, పసివాళ్ళు అయిన కుమారులను చూచి తల్లికూడా మిక్కిలి దుఃఖించింది.

**క. వీరలఁ దోడ్కొనిపోవఁగ । నేరను బాలకులఁ బెట్టి నిర్దయబుద్ధిన్**
**వీరలతండ్రిక్రియం జన । నేరను; విధికృతము గడవనేరఁగ లావే. 304**

**ప్రతిపదార్థం:** వీరలన్= వీళ్లను; తోడ్కొని= వెంటపెట్టుకొని; పోవఁగన్, నేరను= పోలేను; వీరల, తండ్రి, క్రియన్= వీళ్ళతండ్రివలె; బాలకులన్= పసివాళ్లను; పెట్టి= ఇక్కడే వదలిపెట్టి; నిర్దయ, బుద్ధిన్= దయలేని మనస్సుతో; చన నేరను= వెళ్ళలేను; విధికృతము= బ్రహ్మచే చేయబడింది; కడవనేరఁగన్= దాట కలగటం; లావే= అశక్యమేకదా!

**తాత్పర్యం:** వీళ్ళను వెంటబెట్టుకొని పోలేను. వీళ్ళతండ్రివలె దయమాలి ఇక్కడే విడిచిపోలేను. విధికృతం తప్పించుకోవటం ఎవరికి సాధ్యం?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 'విధికృతము గడవనేరఁగ లావే' - నన్నయ నానారుచిరార్థసూక్తులలో ఇది ఒకటి.

**చ. ఇది ప్రళయాగ్నిపోలె దెసలెల్లను గప్పఁగ విస్ఫులింగముల్**
**వదలక వాయుసారథిజవంబునఁ దా నిట వచ్చె నేమి సే**
**యుదు సుతులార! యీబిలము నొయ్యన పోయి చొరుండు దీనిఁ గ**
**ప్పెద ఘనపాంసుజాలముల భీమశిఖావళి దాఁకకుండఁగన్. 305**

**ప్రతిపదార్థం:** సుతులార!= కుమారులారా!; ఇది, ప్రళయ+అగ్ని, పోలెన్= ప్రళయకాలంలోని అగ్నివలె; విస్ఫులింగముల్= నిప్పుకణాలు; వదలక= విడువక; దెసలు+ఎల్లను= దిక్కులన్నింటా; కప్పఁగన్= కప్పివేయగా; వాయు, సారథి= గాలిని సారథిగా కలవాడు - అగ్నిదేవుడు; జవంబునన్= వేగంగా; తాన్= తాను; ఇట= ఇటువైపు; వచ్చెన్; ఏమి; చేయుదున్; ఈ, బిలమున్= ఈ రంధ్రాన్ని; ఒయ్యనన్= చక్కగా; పోయి, చొరుండు+అ= ప్రవేశించండి; భీమ, శిఖా+ఆవళి= భయంకరాలైన మంటల సమూహాలు; తాఁకకుండఁగన్= తగలకుండా; ఘన, పాంసు, జాలములు= గొప్ప దుమ్ముకణాల సమూహాలచే - అంటే పెద్ద దుమ్ముచేత; దీనిన్= ఈ రంధ్రాన్ని; కప్పెదన్= కప్పివేస్తాను.

**తాత్పర్యం:** పుత్త్రులారా! ప్రళయాగ్నివలె నిప్పుకణాలు దిక్కులన్నింటినీ కప్పగా అగ్నిదేవుడు వేగంగా ఇటువైపు వచ్చాడు. ఏం చేయాలి? తిన్నగా మీరు ఈ బొరియలో ప్రవేశించండి. భయంకరాలైన మంటలు తాకకుండా పెద్ద దుమ్ముతో నేను ఈ బొరియను కప్పేస్తాను.

**చ.** **కొడుకుల బ్రహ్మవిత్తములఁ గోరినయట్టుల వీరి నల్వురం**
**బడసితి; నిమ్మహాత్ముల నపాయము నొందకయుండఁ బెంచుచున్**
**నడపుమటంచు నన్ను మునినాథుఁడు మీజనకుండు పంచి యి**
**ప్పుడ యెటయేనిఁ బోయె హుతభుక్ప్రళయంబు దలంప కక్కటా!** **306**

**ప్రతిపదార్థం:** ముని, నాథుఁడు= మునీంద్రుడైన మందపాలుడు; మీ, జనకుండు= మీ తండ్రి; కోరిన, అట్టులు+అ= కోరుకొన్నట్లే; బ్రహ్మవిత్తములన్= బ్రహ్మజ్ఞానం కలవాళ్ళలో శ్రేష్ఠులను; కొడుకులన్; వీరి= వీళ్ల; నల్వురన్= నలుగురిని; పడసితిన్= పొందాను; ఈ+మహాత్ములన్= ఈ మహనీయుల్ని; అపాయము; ఒందక, ఉండన్= పొందకుండా; పెంచుచున్= పెంచుతూ; నడపుము= ప్రవర్తిల్లుము; అటంచున్= అంటూ; నన్నున్= నన్ను; పంచి= ఆజ్ఞాపించి; హుత్‌భుక్+ప్రళయంబు= అగ్నిప్రమాదాన్ని; తలంపక= ఆలోచించక; అక్కటా;= అయ్యో!; ఇప్పుడు+అ= ఇప్పుడే - అంటే ఈ ప్రమాదపరిస్థితులేర్పడిన సమయంలోనే; ఎట, ఏనిన్= ఎక్కడికో; పోయెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** మునీశ్వరుడైన మీ తండ్రి కోరుకొన్నట్లు బ్రహ్మజ్ఞానం కలవాళ్ళను నలుగురుకొడుకులను కన్నాను. 'ఈ మహాత్ములకు అపాయం కలగకుండా పెంచు' అని నన్నాజ్ఞాపించి, అగ్నిప్రమాదాన్ని తలపక, ఈ ప్రమాదపరిస్థితులేర్పడినప్పుడే ఎక్కడికో వెళ్ళాడు.

**వ.** **అని దుఃఖిత యై యున్న తల్లిం జూచి యగ్రతనయుం డైన జరితారి యి ట్లనియె.** **307**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; దుఃఖిత+ఐ= దుఃఖించినదియై; ఉన్న= ఉన్నట్టి; తల్లిం+చూచి= తల్లిని చూచి; అగ్రతనయుండు+ఐన= పెద్ద కొడుకైన జరితారి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని దుఃఖించే తల్లిని చూచి పెద్దకొడుకైన జరితారి ఇట్లా అన్నాడు.

**తే.** **బిలము సొచ్చితిమేని నం దెలుక చంపు; । నింద యుండితిమేనిఁ దా నేర్చు నగ్ని;**
**యెలుకచేఁ జచ్చుకంటె నీజ్వలన శిఖలఁ । గ్రాఁగి పుణ్యలోకంబులఁ గాంతు మేము.** **308**

**ప్రతిపదార్థం:** బిలము= రంధ్రం; చొచ్చితిమి+ఏనిన్= ప్రవేశిస్తే; అందున్= అందులో; ఎలుక; చంపున్= చంపుతుంది; ఇందు+అ= ఇక్కడే; ఉండితిమి+ఏనిన్= ఉంటిమా; అగ్ని; తాన్= తాను; ఏర్చున్= కాలుస్తాడు; ఎలుకచేన్= ఎలుకచేత; చచ్చుకంటెన్= చావటంకంటె; ఏము= మేము; ఈ, జ్వలన, శిఖలన్= ఈ అగ్నిహోత్రునిమంటలలో; క్రాఁగి= మాడి; పుణ్యలోకంబులన్= పుణ్యలోకాలను; కాంతుము= పొందుతాము.

**తాత్పర్యం:** కలుగులోకి దూరితిమా అందులో ఎలుక మమ్మల్ని చంపేస్తుంది. ఇక్కడే ఉన్నామా అగ్నిదేవుడు కాలుస్తాడు. ఎలుకచేత చావటంకంటె అగ్నిజ్వాలలోపడి మాడి పుణ్యలోకాలకు పోవటం మాకు మేలు.

**వ. మఱియు మాంసపిండంబుల మయియున్న మాకు బిలప్రవేశంబున మూషకభయంబు నియతం బింద యుండిన నగ్నిభయంబు సంశయితం బె ట్లనిన. 309**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; మాంస, పిండంబులము= మాంసపు ముద్దలం; అయి= అయి; ఉన్న=ఉండే; మాకున్, బిల, ప్రవేశంబునన్= రంధ్రప్రవేశంలో; మూషక, భయంబు= ఎలుకవలనిభయం; నియతంబు= తప్పనిది; ఇందు+అ= ఇక్కడే; ఉండినన్= ఉంటే; అగ్ని, భయంబు= నిప్పులవలనిభయం; సంశయితంబు= అనుమానింపదగింది; ఎట్లు+అనినన్= ఏ విధంగా అంటే.

**తాత్పర్యం:** అంతేకాక మేము మాంసపుముద్దలమై ఉన్నందున నేల బొరియలో ప్రవేశిస్తే ఎలుకవలన ప్రమాదం తప్పదు. ఇక్కడే ఉంటే అగ్నిభయం అనుమానాస్పదం. ఎట్లా అంటే.

**క. జ్వలనంబు వాయువశమునఁ । దొలఁగుడు జీవనము మాకు దొరకొనుఁ; గృచ్ఛం**
**బుల సంశయయుతకార్యం । బులు గర్తవ్యములు; నియతములు వర్జ్యమ్ముల్. 310**

**ప్రతిపదార్థం:** జ్వలనంబు= మంట; వాయు, వశమునన్= గాలికి లొంగటంవలన; తొలఁగుడు= తొలగిపోతే; మాకున్; జీవనము= బ్రతుకు; దొరకొనున్= కలుగుతుంది; కృచ్ఛ్రంబుల= బాధలలో; సంశయ, యుత, కార్యంబులు= అనుమానంతో కూడుకొన్న పనులు - అంటే బాధ కలిగితే కలుగవచ్చు లేకుంటే తప్పిపోవచ్చు అనే పనులు; కర్తవ్యములు= చేయదగినవి; నియతములు= తప్పనివి - అంటే బాధ తప్పక కలుగుతుంది అని తోచేపనులు ; వర్జ్యమ్మల్= విడువదగినవి.

**తాత్పర్యం:** మంట గాలివశాన తొలగిపోతే మేము బ్రతుకుతాము. కష్టసమయాలలో బాధ కలిగితే కలుగవచ్చు లేకుంటే తప్పిపోవచ్చు అని అనిపించే పనులు చేయతగినవి. బాధ తప్పదు అని అనిపించే పనులు విడువదగినవి.

**విశేషం:** కష్టసమయాలలో కరదీపికవలె మానవునికి ఉపయోగించే ఈ సూక్తి నానారుచిరార్థసూక్తినిధి అయిన నన్నయ కవితలో ఒక మేలిమి రత్నం.

**వ. 'కావున నీవు మెచ్చినచోటికిఁ బోవనోపము; మావలని మోహంబు విడిచి యరుగు; మేము దహనక్లేశంబునం బొందినను నీవు జీవించి పుత్త్రులం బడయనోపుదువు; నీపుణ్యవశంబున మాకు నగ్నిభయంబు దొలంగెనేని నీవు మాయొద్దకు వచ్చి యెప్పటియట్ల రక్షింతు' వని కొడుకు లెల్ల మ్రొక్కినం జూచి, జరితయు బాష్పపూరితనయన యై యాసన్నతరుగుల్మగహనదహనమహోత్సాహుం డయి వచ్చు హవ్యవాహనుం జూచి, ప్రాణభయంబున గగనంబున కెగసి చనె నంత. 311**

**ప్రతిపదార్థం:** కావునన్; నీవు, మెచ్చిన= నీ కిష్టమైన; చోటికిన్= ప్రదేశానికి, బిలంలోకి; పోవన్+ఓపము= పోలేము; మావలని; మోహంబు, విడిచి= మా మీద మమకారం వదలి; అరుగుము= వెళ్ళుము; ఏము= మేము; దహనక్లేశంబునన్= కాలుట అనే కష్టంలో; పొందినను= మేము కాలిపోయినా; నీవు, జీవించి, పుత్త్రులన్; పడయన్+ఓపుదువు= పొందగలుగుతావు; నీ, పుణ్య, వశంబునన్= నీ పుణ్యంకారణంగా; మాకున్= మాకు; అగ్నిభయంబు= అగ్నివలన భయం; తొలంగెన్+ఏని= తొలగిపోతే; నీవు, మా, ఒద్దకున్, వచ్చి; ఎప్పటి, అట్లు+అ= ఎప్పటివలె; రక్షింతువు= కాపాడుతావు; అని= అని; కొడుకులు+ఎల్లన్= కుమారులందరు; మ్రొక్కినన్= నమస్కరింపగా; చూచి, జరితయు=.జరిత; బాష్ప, పూరిత, నయన+ఐ= కన్నీటిచే నిండిన కన్నులు గలదై; ఆసన్న, తరు, గుల్మ, గహన, దహన, మహా+ఉత్సాహుండు+అయి= దగ్గరగా ఉన్న చెట్లను, పొదలను,

అడవులను దహించటంలో మిక్కిలి ఉత్సాహం కలవాడై; వచ్చు; హవ్య, వాహనున్= అగ్నిహోత్రుడిని; చూచి, ప్రాణభయంబునన్=ప్రాణభీతితో; గగనంబునకున్= ఆకాశానికి; ఎగసి= ఎగిరి; చనెన్= వెళ్ళింది; అంతన్= అంతట.

**తాత్పర్యం:** 'అందువలన మేము నీవు చెప్పినట్లు బిలంలోకి వెళ్ళం. నీవు మా మీద మమకారాన్ని వదలి వెళ్ళు. మేము కాలిపోయినా నీవు జీవించి ఉంటే మళ్ళీ పుత్రులను పొందగలవు. నీ పుణ్యంవలన మాకు అగ్నిభయం తొలగిపోతే నీవు మా వద్దకు వచ్చి ఎప్పటిలాగా రక్షిస్తావు' అని కొడుకులంతా మ్రొక్కగా, వాళ్ళను చూచి జరిత కన్నీరు నిండిన కన్నులు కలదై, ప్రక్కనున్న చెట్లను, పొదలను, అడవులను దహించటానికి ఉత్సాహంతో వస్తున్న అగ్నిహోత్రుడిని చూచి ప్రాణభయంతో ఆకాశానికి ఎగిరింది.

**క. నలుగురు నాలుగు వేద । మ్ములమంత్రము లొప్ప బ్రహ్మముఖములు వోలెన్**
**వెలయంగ సంస్తుతించుచు । నలఘులు మా కభయ మభయ మని రయ్యనలున్. 312**

**ప్రతిపదార్థం:** అలఘులు= తక్కువవారు కానివాళ్ళు - అంటే గొప్పవాళ్ళు; నలుగురు; నాలుగువేదమ్ముల= నాలుగువేదాల; మంత్రములు= మంత్రాలు; ఒప్పన్= బాగుగా; బ్రహ్మ, ముఖములు, పోలెన్= బ్రహ్మదేవునియొక్క నాలుగు ముఖాలవలె; వెలయంగన్= ప్రకాశించగా; సంస్తుతించుచున్= గొప్పగా స్తోత్రం చేస్తూ; ఆ+అనలున్= ఆ అగ్నిదేవుడిని; మాకున్, అభయము, అభయము; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** మహాత్ములైన శార్ఙ్గకులు నలుగురూ బ్రహ్మదేవుని నాలుగు ముఖాలవలె నాలుగు వేదమంత్రాలతో గొప్పగా స్తోత్రం చేస్తూ మాకు అభయం ఇమ్మని అగ్నిహోత్రుడిని ప్రార్థించారు.

**విశేషం:** అలం: ఉపమ. 'ఆదరాత్ ద్విరుక్తిః, అనాదరాత్ ద్విరుక్తిః' అన్నట్లు ఒక పదాన్ని ఒకటికి రెండుమార్లుగా పలికినప్పుడు అది అప్పటి పరిస్థితి యొక్క తీవ్రతను ధ్వనింపజేస్తుంది. అందులోనూ అది స్తోత్రించే సందర్భం. అప్పటి ఆద్రుతగతిని హ్రస్వాక్షరాలు సన్నివేశం సముచితంగా అక్షరరమ్యతను కథాగమనాన్ని సమన్వయింపజేశాయి.

**వ. అగ్నిదేవుం డప్పుడు మందపాలుప్రార్థనం దలంచి యన్నలువురు శార్ఙ్గకులు నున్న వృక్షంబు భక్షింపక పరిహరించిన జరితయు దానిం జూచి సంతసిల్లి కొడుకులయొద్దకు వచ్చి సుఖం బుండె; నంత నక్కడ మందపాలుండు పురందరువనంబు దహనుచేత దగ్ధం బగుట యెఱింగి, యం దున్న జరితను బుత్త్రులం దలంచి యతిదుఃఖితుం డయి లపిత కిట్లనియె. 313**

**ప్రతిపదార్థం:** అగ్నిదేవుండు; అప్పుడు = ఆ సందర్భంలో; మందపాలు= మందపాలుని; ప్రార్థనన్; తలంచి= జ్ఞప్తికి తెచ్చుకొని; ఆ+నలువురు= ఆ నలుగురు పుత్త్రులు; శార్ఙ్గకులు= శార్ఙ్గకులు; ఉన్న= ఉండే; వృక్షంబున్= చెట్టును; భక్షింపక= తినక; పరిహరించినన్= వదలివేయగా; జరితయు= జరిత; దానిన్= తనకొడుకులను అగ్ని భక్షింపక వదలివేయటం; చూచి= కనుగొని; సంతసిల్లి= సంతోషించి; కొడుకుల= కుమారుల; ఒద్దకున్= దగ్గరకు; వచ్చి; సుఖంబు+ఉండెన్= సుఖంగా ఉండింది; అంతన్= అప్పుడు; అక్కడ; మందపాలుండు; పురందరు, వనంబు= దేవేంద్రునియొక్కతోట ఖాండవం; దహనుచేత= అగ్నిదేవునిచేత; దగ్ధంబు= కాలిపోయింది; అగుట; ఎఱింగి= తెలిసికొని; అందున్+ఉన్న= ఆ ఖాండవవనంలో ఉన్న; జరితను= జరితను; పుత్త్రులన్= కుమారుల్ని; తలంచి= తలచుకొని; అతి, దుఃఖితుండు, అయి= మిక్కిలి దుఃఖం పొందినవాడై; లపితకున్= లపితకు (తో); ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అగ్నిదేవుడు మందపాలునిప్రార్థనను గుర్తు తెచ్చుకొని ఆ నలుగురు శార్ఙ్గకులున్న చెట్టును భక్షించకుండా వదలివేయగా, జరిత దానిని చూచి సంతోషపడి, కొడుకుల దగ్గరకు వచ్చి సుఖంగా ఉన్నది. అప్పుడు మందపాలుడు దేవేంద్రునివనం ఖాండవం అగ్నిదేవునిచేత కాల్చబడినట్లు తెలిసికొని, దానిలో ఉన్న తనభార్యాపుత్త్రులను తలచి మిక్కిలి దుఃఖించి, తన మొదటిభార్య అయిన లపితతో ఇట్లా అన్నాడు.

**క. తరుణుల నజాతపక్షులఁ । జరణంబులు లేనివారి శార్ఙ్గేయుల న**
**ల్వుర నొక్కతె యెట దోడ్కొని । యరుగంగా నేర్చు జరిత యాపద గడవన్. 314**

**ప్రతిపదార్థం:** తరుణులన్= చిన్నవారిని; అజాత, పక్షులన్= పుట్టని రెక్కలు కలవారిని-రెక్కలు రానివాళ్లను; చరణంబులు= కాళ్ళు; లేని, వారిన్; శార్ఙ్గేయుల= శార్ఙ్గేయులైన; నల్వురన్= నలుగురు కుమారుల్ని; జరిత, ఒక్కతె; ఆపద, కడవన్ (ఆపద) విపత్తు దాటునట్లు; ఎట= ఎక్కడికి; తోడ్కొని= వెంటతీసికొని; అరుగన్+కాన్= వెళ్ళటానికి; నేర్చున్= ఓపును.

**తాత్పర్యం:** చిన్నవాళ్ళు, రెక్కలు రానివాళ్ళు, కాళ్ళు రానివాళ్ళు అయిన శారఙ్గేయులు నలుగురిని జరిత ఒక్కతే ఆపద గడచేటట్లు ఎక్కడి తీసికొని వెళ్ళగలదు?

**క. మఱచునొకొ! మఱవకుండియు । నెఱుఁగక యుండునొకొ! యనలుఁ డెఱిఁగియు నెడ నే**
**మఱునొకొ! పుత్త్రులఁ గావక । గుఱుకొని; నమ్మంగ నగునె క్రూరాత్మకులన్. 315**

**ప్రతిపదార్థం:** అనలుఁడు= అగ్నిహోత్రుడు; మఱచున్+ఒకొ= నా ప్రార్థనను మఱచిపోవునో ఏమో; మఱవకుండియున్= మరవకపోతే; ఎఱుఁగక(తెలియక); ఉండున్+ఒకొ= వీరు నా పుత్త్రులు, శార్ఙ్గకులని తెలిసికొనలేకపోవునేమో!; ఎఱిఁగియున్= తెలిసికొనికూడా; ఎడన్= సమయం వచ్చినపుడు; గుఱుకొని= యత్నించి; పుత్త్రులన్= కుమారుల్ని; కావక= రక్షించక; ఏమఱున్+ఒకొ= మోసంచేయునేమో; క్రూర+ఆత్మలకున్= క్రూరమైన మనస్సు గలవాళ్ళను - అంటే దుర్మార్గులను; నమ్మన్+కన్+అగునె= నమ్మతగునా!

**తాత్పర్యం:** అగ్నిహోత్రుడు నా ప్రార్థనను మరచిపోతాడేమో? ఒకవేళ మరవకపోయినా నా పుత్త్రులైన శార్ఙ్గకులను గుర్తించలేకపోతాడేమో! లేదా గుర్తించినసమయం వచ్చినప్పుడు ప్రయత్నించి రక్షించక మోసగిస్తాడేమో. దుర్మార్గులను నమ్మతగదుకదా!

**విశేషం:** సర్వాన్ని దహించి బాధించే స్వభావం కలవాడు కావటంవలన అనలుడు క్రూరాత్ముడని అనటం. తనయుల క్షేమాన్ని గూర్చిన తండ్రి హృదయాందోళన ప్రతిఫలించే పద్యం ఇది. ఎఱుకలో కృతజ్ఞతను, మఱపులో కృతఘ్నతను నన్నయ ఎంతో ప్రసన్నగంభీరంగా ఈ కందపద్యంలో ప్రతిపాదించాడు. అనేక లఘువుల మధ్య ఎక్కడనో ఒక గురువు ప్రయోగించి అది హృదయాందోళనకు సూచికగా ఛందశ్శిల్పౌచితి పాటించిన విధానం అనుపమానం.

**వ. అనిన విని లపిత యిట్లనియె. 316**

**ప్రతిపదార్థం:** అనినన్= అని మందపాలుడు అనగా; విని; లపిత= లపిత; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** అతనిమాటలు విని లపిత ఇట్లా అన్నది.

**క. నాయొద్దన ప్రార్థించిన । వాయుసఖుం డపుడు నీకు వరదుం డయి శార్**
**ఙ్గేయుల నలువురఁ గాతును । ధీయుత! యని పలికె మఱచితే మునినాథా! 317**

**ప్రతిపదార్థం:** ముని, నాథా! = మునీశ్వరా!; నా, ఒద్దన= నా దగ్గర; ప్రార్థించినన్= ప్రార్థింపగా; వాయు, సఖుండు= గాలి దేవుని యొక్క స్నేహితుడు - అగ్నిదేవుడు; అపుడు, నీకున్, వరదుండు+అయి= వరాన్ని ఇచ్చేవాడై; శార్ఙ్గేయుల నలువురన్, శార్ఙ్గేయుల్ని నలుగురిని; కాతును= రక్షిస్తాను; ధీయుత!= ఓ బుద్ధిమంతుడా; అని; పలికెన్, మఱచితే= మరచిపోయావా?

**తాత్పర్యం:** మునీశ్వరా! నా ఎదుట నీవు ప్రార్థించినప్పుడు ఆ అగ్నిదేవుడు శార్ఙ్గేయులు నలుగురిని రక్షిస్తానని పలికిన సంగతి మరచిపోయావా!

**వ. 'ఆలికి నెయ్యుండ వయి దానియోగక్షేమం బరయం దలంచి; తది పులుఁ గెటయేనియుం బఱచుం గా కేమి యయ్యెడు; వగవకుండు' మనిన మందపాలుండు మందస్మితవదనుం డగుచు 'వసిష్ఠు నట్టి పురుషు నైన నరుంధతియట్టి భార్య యైనను నిర్నిమిత్తంబున స్త్రీవిషయంబునందు సంశయింపకుండ' దిది స్త్రీలకు నైజంబ యని పలికి లపిత వీడ్కొని, ఖాండవంబునకు వచ్చి పుత్త్రసహిత యయి కుశలిని యయి యున్న జరితం జూచి సంతుష్టుండై నిజేచ్ఛ నరిగె; నగ్నిదేవుండు నిట్లు నిర్విఘ్నంబున ఖాండవవనౌషధంబు లుపయోగించి విగతరోగుండయి కృష్ణార్జునుల దీవించి చనియె; నంత. 318**

**ప్రతిపదార్థం:** ఆలికిన్= భార్యకు; నెయ్యుండవు+అయి= స్నేహితుడవై; దాని= ఆ జరితయొక్క; యోగ, క్షేమంబు; అరయన్= విచారింప; తలంచితి(వి)= తలచావు; అది; పులుఁగు= పక్షి; ఎట, ఏనియున్= ఎక్కడికైనా; పఱచున్+కాక= పరుగెత్తగలదు; ఏమి, అయ్యెడు= (దానికి) ఏమవుతుంది; వగవక+ఉండుము= విచారింపకుము; అనినన్= అని పలుకగా; మందపాలుండు; మంద, స్మిత, వదనుండు= చిరునవ్వుతో కూడినముఖం కలవాడు; అగుచున్= అవుతూ; వసిష్ఠు, అట్టి= వసిష్ఠుని అంతటి; పురుషుని+ఐనన్= పురుషుణ్ణి అయినా; అరుంధతి, అట్టి భార్య= అరుంధతి వంటి భార్య; ఐనను= అయినను; నిర్+నిమిత్తంబునన్= కారణంలేకయే; స్త్రీ, విషయంబు, అందున్= స్త్రీ విషయంలో; సంశయింపక= అనుమానింపక; ఉండదు= ఉండదు కదా!, ఇది; స్త్రీలకున్; నైజంబు+అ= సహజమే; అని; పలికి, లపిత= లపితను; వీడ్కొని= వీడి; ఖాండవంబునకున్= ఖాండవవనానికి; వచ్చి= చనుదెంచి; పుత్త్ర, సహిత, అయి= కొడుకులతో కూడినదై; కుశలిని, అయి= క్షేమం కలదై; ఉన్న= ఉన్నట్టి; జరితన్= జరితను; చూచి= కనుగొని; సంతుష్టుండు+ఐ= తృప్తి పొందినవాడై; నిజ+ఇచ్ఛన్= తన ఇచ్ఛవచ్చినట్లు; అరిగెన్= వెళ్ళాడు; అగ్నిదేవుండును= అగ్నిదేవుడుకూడా; ఇట్లు= ఈ విధంగా; నిర్విఘ్నంబునన్= అడ్డులేకుండా; ఖాండవ, వన+ఔషధంబులు= ఖాండవవనంలోని (వృక్షసంబంధాలైన) మందులు; ఉపయోగించి= భక్షించి, అనుభవించి; విగత, రోగుండు+అయి= పోయిన రోగం కలవాడై; కృష్ణ+అర్జునులన్= కృష్ణుని అర్జునుని; దీవించి; చనియెన్= వెళ్ళాడు; అంతన్= అనంతరం.

**తాత్పర్యం:** 'భార్యమీది ప్రేమతో నీవు దాని యోగక్షేమాలు విచారిస్తున్నావు. అది (జరిత)పక్షి. ఎక్కడికైనా పరుగెత్తగలదు. దానికేమీ కాదు. చింతించకు' అని లపిత అనగా మందపాలుడు చిరునవ్వుతో 'వసిష్ఠునివంటి పురుషుడిని అయినా అరుంధతివంటి భార్యకూడా స్త్రీ విషయంలో అనుమానించకుండా ఉండదు. ఇది స్త్రీలకు సహజమే'- అని లపితను వదలి, ఖాండవవనానికి వచ్చి కొడుకులతో కూడి క్షేమంగా ఉన్న జరితను చూచి తృప్తిపొంది, తన ఇష్టం వచ్చిన

చోటికి వెళ్ళాడు. అగ్నిదేవుడుకూడా ఏ ఆటంకం లేకుండా ఖాండవవనంలోని మందులను ఉపయోగించి, రోగం తొలగిపోగా కృష్ణార్జునులను దీవించి వెళ్ళాడు. ఆ తరువాత

**విశేషం:** యోగక్షేమాలు - యోగం అంటే ఇంతకుముందు లేని భాగ్యం కలగటం; క్షేమం అంటే కలిగినది చెడకుండా ఉండటం. అరుంధతీవసిష్ఠులు ఆదర్శదంపతులు. అట్టిదంపతులలో కూడా స్త్రీ విషయంలో భార్య భర్తను శంకిస్తుందని అభిప్రాయం. లోకంలో అన్యస్త్రీయోగక్షేమాలలో భర్త ఆసక్తి చూపటాన్ని ఏ భార్యకూడా సహించదు. అది స్త్రీసహజం.

## ఇంద్రుం డర్జునునకు నాగ్నేయ వారుణ వాయవ్యాది దివ్యబాణంబు లిచ్చుట (సం- 1-225-7)

**వ. అతిమానుష మత్యద్భుత । మతిదుష్కర మయిన కేశవార్జునకృతి గో**
**పతి చూచి మెచ్చి సురపరి । వృతుఁ డయి చనుదెంచెఁ గృష్ణవిజయులకడకున్. 319**

**ప్రతిపదార్థం:** అతి, మానుషము= మానవులకు మించింది - మానవాతీతం; అతి+అద్భుతము= మిక్కిలి ఆశ్చర్యకరమైనది; అతి, దుష్కరము= మిక్కిలి కష్టమైనది; అయిన, కేశవ+అర్జున, కృతి= కృష్ణార్జునులు చేసినపని; గోపతి= స్వర్గాధిపతి - దేవేంద్రుడు; చూచి, మెచ్చి; సుర, పరివృతుఁడు+అయి= దేవతలచే చుట్టబడినవాడై - అంటే దేవతలు చుట్టు చేరి రాగా; కృష్ణ, విజయుల, కడకున్= కృష్ణార్జునుల దగ్గరకు; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** మానవులు చేయలేనిది, మిక్కిలి ఆశ్చర్యకరమైనది, మహోత్కృష్టమైనది అయిన కృష్ణార్జునుల ఘన కార్యాన్ని చూచి మెచ్చుకొని దేవేంద్రుడు, దేవతలంతా తనచుట్టు చేరి రాగా, వాళ్ళవద్దకు వచ్చాడు.

**క. అనఘులు నరనారాయణు । లన నాదియుగంబునన్ సురాసురనుతు ల**
**య్యును నపుడు మనుజు లగుటను । వినయంబున మ్రొక్కి రమరవిభునకు నంతన్. 320**

**ప్రతిపదార్థం:** అనఘులు= పాపంచేయనివాళ్ళు - పుణ్యాత్ములు; ఆది, యుగంబునన్= తొలియుగంలో; నర, నారాయణులు; అనన్= అనగా; సుర+అసుర, నుతులు+అయ్యును=దేవతలచేత, దేవతలు కానివాళ్ళచేత (రాక్షసులచేత) స్తుతింపబడినవాళ్ళయి కూడా; అపుడు= ఆ సందర్భంలో; మనుజులు+అగుటను= మానవులు కావటంవలన; అమర, విభునకున్= దేవేంద్రునికి; వినయంబునన్= వినయంతో; మ్రొక్కిరి= నమస్కరించారు; అంతన్= తరువాత.

**తాత్పర్యం:** పుణ్యాత్ములు తొలియుగంలో నర నారాయణులుగా ప్రసిద్ధిపొంది, దేవదానవులచేత స్తుతింపబడిన వాళ్ళయినా, అపుడు మానవులు కావటంవలన కృష్ణార్జునులు దేవేంద్రునికి వినయంతో మ్రొక్కారు.

**వ. ఇంద్రుండు నుపేంద్రార్జునుల నతిస్నేహంబునఁ గౌఁగిలించుకొని యర్జునునకు నాగ్నేయవారుణ వాయవ్యాది దివ్యబాణంబు లిచ్చి, 'వీని కెప్పుడు నిష్టసఖుండ వయి యుండు' మని కృష్ణుం బ్రార్థించి, దివ్యవిమానారూఢుం డయి దివిజాప్సరోగణసేవితుం డయి దివంబున కరిగె; నిట వాసుదేవార్జునులు మయుం దోడ్కొని మగిడి యింద్రప్రస్థపురంబునకు వచ్చి, ధర్మరాజునకు మ్రొక్కి ఖాండవదహనప్రకారంబు సెప్పి మయుం జూపి సుఖం బుండి రని. 321**

**ప్రతిపదార్థం:** ఇంద్రుండున్= ఇంద్రుడుకూడా; ఉపేంద్ర+అర్జునులన్= కృష్ణార్జునులను; అతి, స్నేహంబునన్= మిక్కిలి ప్రీతి(మైత్రి)తో; కౌఁగిలించుకొని; అర్జునునకున్; ఆగ్నేయ, వారుణ, వాయవ్య+ఆది= ఆగ్నేయం (అగ్నిసంబంధం కలది),

వారుణం (వరుణ సంబంధం కలది); వాయవ్యం (వాయుసంబంధం కలది); మొదలైన, దివ్య, బాణంబులు= దేవతాసంబంధాలైన బాణాలు; ఇచ్చి= ప్రసాదించి; వీనికిన్= ఈ అర్జునునికి; ఎప్పుడున్= ఎల్లప్పుడు; ఇష్ట, సఖుండవు+అయి= ప్రియమిత్రుడవై; ఉండుము= ఉండు; అని= ఆ విధంగా; కృష్ణున్, ప్రార్థించి, దివ్య, విమాన+ఆరూఢుండు+అయి= దేవతాసంబంధమైన విమానాన్ని ఎక్కినవాడై; దివిజ+అప్సరస్+గణ, సేవింతుడు+అయి= దేవతలయొక్క, అప్సరసలయొక్క సమూహంచేత కొలువబడినవాడై; దివంబునకున్= స్వర్గానికి; అరిగెన్= వెళ్ళాడు; ఇట= ఇక్కడ; వాసుదేవ+అర్జునులు= కృష్ణార్జునులు; మయున్= మయుడను విశ్వశిల్పిని; తోడ్కొని= వెంటబెట్టుకొని; మగిడి= తిరిగి; ఇంద్రప్రస్థ, పురానికి = ఇంద్రప్రస్థనగరానికి; వచ్చి= ఏతెంచి; ధర్మరాజునకున్, మ్రొక్కి, ఖాండవ, దహన, ప్రకారంబున్= ఖాండవవనం కాలిపోయిన విధం; చెప్పి; మయున్, చూపి; సుఖంబు, ఉండిరి= సుఖంగా ఉన్నారు, అని; ఆ ప్రకారంగా.

**తాత్పర్యం:** ఇంద్రుడుకూడా కృష్ణార్జునులను మిక్కిలిప్రేమతో కౌగిలించుకొని - అర్జునునికి ఆగ్నేయం, వారుణం, వాయవ్యం మొదలైన దివ్యాస్త్రాలిచ్చి, 'నీవు ఈ అర్జునునికి ఎల్లప్పుడూ ప్రియమిత్రుడవై ఉండు' మని శ్రీకృష్ణుడిని ప్రార్థించి, దివ్యవిమానం ఎక్కి, దేవతలు, అప్సరసలు తనను సేవిస్తుండగా స్వర్గానికి వెళ్ళాడు. ఇక్కడ కృష్ణార్జునులుకూడా మయుడిని వెంటబెట్టుకొని మళ్ళీ ఇంద్రప్రస్థానికి వచ్చి, ధర్మరాజుకు మ్రొక్కి, ఖాండవం కాలిపోయిన విధం చెప్పి, మయుడిని పరిచయం చేసి సుఖంగా ఉన్నారు - ఆ ప్రకారంగా.

**క. జనమేజయజనపాలున । కనఘచరిత్రునకుఁ బ్రీతుఁ డయి వైశంపా**
**యనుఁ డాదిపర్వకథ యె । ల్లను నిమ్ముగఁ జెప్పె నని విలాసమహేంద్రా! 322**

**ప్రతిపదార్థం:** విలాస, మహేంద్రా= విలాసంలో దేవేంద్రునివంటివాడా - రాజరాజనరేంద్రా! అని= అంటూ; జనమేజయ, జనపాలునకున్= జనమేజయమహారాజుకు; అనఘ, చరిత్రునకున్= పాపం లేని నడవడి కలవానికి; వైశంపాయనుఁడు; ప్రీతుఁడు+అయి= సంతోషించినవాడై; ఆది, పర్వ, కథ, ఎల్లనున్= ఆదిపర్వ కథ నంతా; ఇమ్ముగన్= ఇంపుగా; చెప్పెన్= చెప్పాడు; అని= అని;

**తాత్పర్యం:** విలాసంలో దేవేంద్రునివంటివాడవైన రాజరాజనరేంద్రా! - పుణ్యచరిత్రుడైన జనమేజయ మహారాజుకు వైశంపాయనుడు ప్రీతితో ఆదిపర్వకథ అంతా ఇంపుగా చెప్పాడు - అని సూతుడు శౌనకాదిమహామునులకు చెప్పాడు.

## ఆశ్వాసాంతము

**క. అభిమానమహార్ణవ! హరి । నిభ విభవ విభాసమాన! నిరవద్య! రవి**
**ప్రభ! రాజమనోహర! వై । రిభయంకరశౌర్య! నృపవరేణ్యశరణ్యా! 323**

**ప్రతిపదార్థం:** అభిమాన, మహా+అర్ణవ= అభిమానానికి సముద్రునివంటివాడా! (అంటే గొప్ప అభిమానం కలవాడా!); హరి, నిభ, విభవ, విభాసమాన= ఇంద్రునివంటి ఐశ్వర్యంచేత ప్రకాశించేవాడా!; నిరవద్య= నిందింపదగనివాడా! (స్తుతింపదగినవాడా); తక్కువతనం లేనివాడా!; రవి, ప్రభ= సూర్యునితేజస్సువంటి తేజస్సు కలవాడా!; రాజ, మనోహర= చంద్రునివలె అందమైనవాడా!; వైరి, భయంకర, శౌర్య= శత్రువులకు భయాన్ని కలిగించే పరాక్రమం కలవాడా!; నృప, వరేణ్య, శరణ్యా= రాజశ్రేష్ఠులకు శరణు పొందదగినవాడా!

**తాత్పర్యం:** అభిమానానికి సముద్రునివంటివాడా! ఇంద్రునితో సమానమైన ఐశ్వర్యంతో ప్రకాశించేవాడా! స్తుతిపాత్రమైనవాడా! సూర్యునివంటి తేజస్సు కలవాడా! చంద్రునివలె అందమైనవాడా! శత్రువులకు భయం కలిగించే పరాక్రమంకలవాడా! రాజశ్రేష్ఠులకు శరణుపొంద తగినవాడా! అని ప్రశంసాపూర్వకంగా నన్నయమహాకవి ఆశ్వాసాంతంలో రాజరాజనరేంద్రుడిని సంబోధిస్తున్నాడు.

**మత్తకోకిల**

> **రాజభూషణ! నిత్యసత్య! సరస్వతీవిలసన్ముఖాం**
> **భోజ! రాజమనోజ! భూజనపూజ్యమాన! మహాయశో**
> **రాజహంసపయోజినీవనరమ్యదిఙ్ముఖ! విక్రమో**
> **ద్వేజితాహిత! విష్ణుసన్నిభ! విష్ణువర్ధనభూపతీ!** **324**

**ప్రతిపదార్థం:** రాజ, భూషణ= రాజులకు అలంకారమైనవాడా!; నిత్య, సత్య= శాశ్వతసత్యాన్ని కలవాడా! సరస్వతీ, విలసత్+ముఖ+అంభోజ= సరస్వతీదేవీచేత ప్రకాశించే పద్మంవంటి ముఖంకలవాడా! (అంటే విద్యా తేజస్సుతో ప్రకాశించే ముఖం కలవాడా!); రాజ, మనోజ= రాజులలో మన్మథునివంటివాడా! భూ, జన, పూజ్యమాన= భూమిలోని జనులచేత పూజింపబడువాడా!; మహా, యశో, రాజహంస, పయోజినీ, వన, రమ్య, దిక్+ముఖ=గొప్పకీర్తి అనే రాజహంసకు పద్మవనమైన చక్కనిదిగ్భాగాలు కలవాడా! (అంటే దిక్కులలో వ్యాపించిన గొప్పకీర్తి కలవాడా!); విక్రమ+ఉద్వేజిత+అహిత= పరాక్రమంచేత భయపెట్టబడిన శత్రువులు కలవాడా!; విష్ణు, సన్నిభ= విష్ణుమూర్తితో సమానమైనవాడా; విష్ణువర్ధన, భూపతీ!= విష్ణువర్ధనమహారాజా!

**తాత్పర్యం:** రాజులకు అలంకారమైనవాడా! ఎల్లప్పుడు సత్యం చెప్పేవాడా! విద్యా తేజస్సుతో ప్రకాశించే పద్మం వంటి ముఖం కలవాడా! రాజులలో మన్మథునివంటివాడా! భూమిమీద ప్రజలచేత పూజింపబడేవాడా! దిక్కులన్నిటా వ్యాపించిన గొప్పకీర్తి కలవాడా!; పరాక్రమంచేత భయపెట్టబడిన శత్రువులు కలవాడా! విష్ణుమూర్తితో సమానమైనవాడా! విష్ణువర్ధనమహారాజా!

**గద్యము**

> **ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబున విదురాగమనంబును, గృష్ణసందర్శనంబును, రాజ్యార్థలాభంబును, ఖాండవప్రస్థనివాసంబును, సుందోపసుందోపాఖ్యానంబును, నారదువచనంబున ద్రౌపదియందు సమయక్రియయు, నర్జునుతీర్థాభిగమనంబును, నులూచిసమాగమంబును, జిత్రాంగదయందు బభ్రువాహనుజన్మంబును, ద్వారకాగమనంబును, వాసుదేవానుమతుం డయి యర్జునుండు సుభద్ర వివాహం బగుటయు, సుభద్రాహరణంబును, హరణహారికయు, నభిమన్యుసంభవంబును, గాండీవ దివ్యరథాశ్వలాభంబును, ఖాండవదహనంబును, నగ్నిభయంబువలన మయభుజంగమోక్షణంబును, మందపాలోఖ్యానంబును నన్నది సర్వంబును నష్టమాశ్వాసము.** **325**

**శ్రీ మహాభారతమునందలి యాదిపర్వము సమాప్తము**

**తాత్పర్యం:** ఇది ఉత్తమకవులందరిచేత స్తుతింపబడిన నన్నయభట్టు అనే పేరుగల కవిచేత రచింపబడిన శ్రీమహాభారత మనే గ్రంథంలో మొదటిదైన ఆదిపర్వంలో - విదురునిరాక, శ్రీకృష్ణుడు పాండవులను దర్శించటం, అర్ధరాజ్యం

పాండవులకు లభించటం, ఖాండవప్రస్థంలో పాండవులు ద్రౌపదియందు నియమాన్ని పాటించటం, అర్జునుడు తీర్థయాత్రలకు పోవటం, అర్జునుడు ఉలూచిని కూడటం, చిత్రాంగద బభ్రువాహనునికి జన్మనివ్వటం, అర్జునుడు ద్వారకానగరానికి రావటం; వాసుదేవుని అంగీకారంతో అర్జునుడు సుభద్రను పెండ్లాడటం, సుభద్రను తనతో తీసికొనిపోవటం, సుభద్రకు యాదవముఖ్యులు అరణాలను అందించటం, అభిమన్యుడు జన్మించటం, గాండీవం, దివ్యరథం; దివ్యాశ్వాలూ అర్జునుడికి లభించటం, ఖాండవవనాన్ని దహించటం, అగ్నిభయంనుండి మయుడిని, అశ్వసేనుడిని రక్షించటం, మందపాలునికథ - మొత్తం ఎనిమిదవ ఆశ్వాసం.

ఆదిపర్వంలో అష్టమాశ్వాసం సమాప్తం.

శ్రీమహాభారతంలో ఆదిపర్వం ముగిసింది.



# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపుటం -2

## ఆదిపర్వము

### రెండవ భాగము (5, 6, 7, 8 ఆశ్వాసములు)

## గద్యపద్య ప్రథమపాదసూచి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ( సరళ వ్యాఖ్యాన సహితం )

**సంపుటము - 3**

**సభాపర్వము**

కృతికర్త

## నన్నయభట్టారకుడు

వ్యాఖ్యాత

డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య

ప్రధాన సంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం




ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

**KAVITRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATAM**

With Commentary
Sabhaparvamu of Nannaya Bhattarakudu
Vol. III.

Commentary by
**Dr. Appajodu venkatasubbaiah**

Edited by
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious Series No.602
First Edition : August 2000
First Re-print : 2006

Second Edition: 2013
Copies : 5,000



Published by
**Sri. M.G. Gopal, I.A.S.**
Executive Officer,
T.T.Devasthanams,
Tirupati - 517 507

D.T.P. Type Setting
**Editor-In-Chief Office**
T.T.D., Tirupati.

Cover Design:

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్ఫైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం **18** పర్వాలను **15** సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# సరళవ్యాఖ్యాన సహిత
# కవిత్రయ భారతం ద్వితీయ ముద్రణ
# పూర్వాపరాలు

భారతీయ సనాతన సంస్కృతి మణి కిరీటంలో జాజ్వల్యమానంగా మెరుస్తున్న ముచ్చటైన మూడు అమూల్యరత్నాలు రామాయణ, భారత, భాగవత గ్రంథాలు. అనాదిగా ఆసేతుహిమాచలం ధర్మప్రచారంలోను, ధర్మపరిరక్షణలోను ఈ అమూల్యగ్రంథాలు అద్భుతమైన ఎనలేని పాత్రను పోషిస్తున్నాయి. అందులోను త్రిలింగాలమధ్య నెలకొన్న ఆంధ్రులకు అత్యంత ఆదరణీయమైనవి, ప్రీతిపాత్రమైనవి ఈ మూడు గ్రంథాలు. అందువల్లే తిరుమల తిరుపతి దేవస్థానం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నినాదంతో ధర్మపరిరక్షణకోసం ఈ మహాగ్రంథాల ప్రచురణ పెద్దఎత్తున చేపట్టింది.

మహోన్నతమైన ఈ బృహత్సాహితీయజ్ఞంలో తొట్టతొలిగా సవ్యాఖ్యానంగా కవిత్రయ భారత గ్రంథ ప్రచురణను చేపట్టింది తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ మహా ఆధ్వర్యవానికి అధిదైవతం శ్రీ వేంకటేశ్వరుడు కాగా, ఎందరో పండితవరేణ్యులైన వ్యాఖ్యాతలు ఋత్విక్కుల పాత్రను పోషించారు. సుమారు 30 ఏండ్లపాటు సాగిన ఈ సాహితీక్రతు నిర్వహణకుగాను నాటి శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామి రెడ్డిగారి కార్యనిర్వహణలో ప్రజాసంబంధాల అధికారిగా కొనసాగిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు విశేషకృషి చేసినారు. అలాగే ఆనాడు ప్రధాన సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, సంపాదకులుగా వ్యవహరించిన డా॥ నండూరి రామకృష్ణమాచార్యులుగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు భారత ముద్రణలో ప్రత్యేకమైన పాత్రను పోషించారు. తరువాత కవిత్రయ మహాభారత వ్యాఖ్యాన రచనాకార్యక్రమానికి పూర్తిగా ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఈ కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహించి పద్దెనిమిది పర్వాల భారతాన్ని పదిహేను సంపుటాలుగా వెలుగులోనికి తీసుకురావటంలో కీలకపాత్రను వహించారు. ఇదే పరంపరలో 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారు, ఆ తర్వాత 'సప్తగిరి' సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. పిదప 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు, డా॥ సి.శైలకుమార్ గారు మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారల పర్యవేక్షణ కాలంలో 'కవిత్రయ భారతం' ప్రచురణ పూర్తి అయింది. ఆ తరువాత అనతికాలంలోనే ఆ గ్రంథ ప్రతులు అన్నీ పూర్తిగా చెల్లిపోయి ద్వితీయముద్రణకు ఆవశ్యకత ఏర్పడింది.

డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి సలహా మేరకు నాటి శ్రీకార్యనిర్వహణాధికారి డా॥ కె.వి.రమణాచార్యులుగారు భారత తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సరిచేయుటకుగాను **1) డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు 2) ఆచార్య రవ్వా శ్రీహరి 3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు 4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య 5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య 6) ఆచార్య కె. సర్వోత్తమరావు 7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** – ఈ ఏడుగురు పండితులతోకూడిన ఒక పండిత పరిషత్తును ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి శ్రీకార్యనిర్వహణాధికారిగా బాధ్యతలను స్వీకరించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. పండిత పరిషత్తు వివిధ పండితులు వ్రాసిన వ్యాఖ్యాన భాగాలను పరిశీలించి అన్వయ దోషాలను, ముద్రారాక్షసాలను, శైలీ భేదాలను వీలైనంతవరకు గుర్తించి సవరించి శైలిలో ఏకరూపత సాధించేందుకు తగిన కృషి చేసింది. ఆ పండిత పరిషత్తులో నన్ను కూడా ఒక సభ్యుడిగా దేవస్థానం స్వీకరించడం శ్రీనివాసుని నిర్హేతుకమైన అనుగ్రహానికి తార్కాణం! అంతేగాక 2011 ఫిబ్రవరిలో దేవస్థానం గ్రంథ ప్రచురణ విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నన్ను నియమించడమే గాక, 'కవిత్రయ భారత పునర్ముద్రణ'ను పర్యవేక్షించే బాధ్యతను కూడా దేవస్థానం నాకు అప్పగించింది. ఆనందనిలయుని అపారకృపవల్ల 'కవిత్రయ భారతం' పునర్ముద్రణకార్యంకూడ పూర్తి అయింది.

మలిముద్రణ ఈ రూపంలో రావడానికి అన్నివిధాలా సహాయసహకారాలందించిన తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరి బాపిరాజుగారికి మరియు పాలకమండలి సభ్యులకు నా కృతజ్ఞతలు.

సవ్యాఖ్యాన మహాభారత ద్వితీయ ముద్రణను వేగవంతం చేసి ప్రజాబాహుళ్యానికి అందించడంలో విశేషకృషి చేసిన శ్రీకార్యనిర్వహణాధికారులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్. గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పి.వెంకటరామిరెడ్డి, ఐ.ఏ.ఎస్; శ్రీ కె.యస్.శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్. గారలకు నా కృతజ్ఞతలు.

సరళ వ్యాఖ్యాన సహిత కవిత్రయ మహాభారత ముద్రణల్లో నాటి నుండి నేటివరకు తమ అమూల్య సహాయ సహకారాలు అందించిన తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారులకు, సంయుక్త కార్యనిర్వహణాధికారులకు, ప్రజాసంబంధాల అధికారులకు, ముద్రణాలయ అధికారులకు అందరికీ నా కృతజ్ఞతలు.

వృత్తిరీత్యా ఇంజనీర్ అయినప్పటికి సాహిత్యాభిలాషతో తి.తి.దే. మహాభారతంలోని కొన్ని సవరణలను గుర్తించి తెలియజేసిన శ్రీ పుత్తా పుల్లారెడ్డి గారికి ధన్యవాదాలు.

కవిత్రయభారత పునర్ముద్రణకార్యక్రమంలో అవసరమైన సహకారమందించిన సహృదయులు 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు డా॥ సి.శైలకుమార్ మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారలకు కృతజ్ఞతలు. అలాగే పునర్ముద్రణ విషయంలో అడుగడుగునా, చేదోడు వాదోడుగా వుంటూ పూర్తి సహాయ సహకారాలందించిన పండితులు మహాకవి విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, ఉపసంపాదకులు డా॥ కంపల్లె రవిచంద్రన్, డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తర ఫల్గుణి, పరిశోధక సహాయకులు, డా॥ డి.భారతి, డా॥ టి.సావిత్రి, డా॥ వి.గోపాలకృష్ణమూర్తి, ప్రచురణ సలహాదారులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ జల్లి శ్రీరఘుపతిరావుగార్లకు మరియు కార్యాలయ సిబ్బందికి, డి.టి.పి. ఆపరేటర్లకు కృతజ్ఞతలు.

ఈ బృహద్గ్రంథముద్రణలో ఎంతగానో సహకరించిన దేవస్థానం ప్రజాసంబంధాల అధికారి శ్రీ టి.రవిగారికి, ముద్రణాలయాధికారి శ్రీ సాంబశివరావుగారికి, మరియు వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

**మరోమాట!**

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయదీక్షితులు చెప్పినట్లుగా ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాష మాట్లాడటం ఎంతో గొప్ప తపస్సు చేస్తేకానీ లభించని అదృష్టాలు. అలాంటి భాషలో కవిత్రయంవారు పంచమవేదమైన వ్యాసభారతాన్ని ఆంధ్రులకు అందించటం ఆంధ్రుల పుణ్యవిశేషం ! ఆంధ్రమహాభారతం తెలుగువారికి లభించిన అమృతఫలం ! ఆ అమృతఫలరసాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా ఆస్వాదిస్తారనీ, మహాభారత సందేశాన్ని సుగమం చేసుకొంటారనీ ఆశిస్తున్నాము.

కవిత్రయ మహాభారత ద్వితీయముద్రణకార్యం నాచేతుల మీదుగా జరిపించిన దేవదేవుడైన ఆ శ్రీనివాసుని ప్రార్థిస్తూ....

*సదా శ్రీవారి సేవలో*

**ఆచార్య రవ్వా శ్రీహరి**

ఎడిటర్–ఇన్–చీఫ్

తిరుమల తిరుపతి దేవస్థానములు

# ముందుమాట

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

మహాభారతం మన జాతీయ కావ్యం (National Epic). ఈ ఇతిహాసంలో వ్యాసమహర్షి ధర్మం, అర్థం, కామం, మోక్షం - అనే నాలుగు పురుషార్థాలను సాధించటానికి అవసరమయ్యే విజ్ఞానం అంతా చక్కగా ఇమిడ్చాడు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఉపనిషత్తుల సారం ఇందులో సముచితంగా చోటుచేసికొన్నందువల్ల, ఈ గ్రంథం 'పంచమవేదం'గా, 'భారతీయ విజ్ఞాన సర్వస్వం'గా ప్రశస్తి పొందింది.

వ్యాసభగవానుడు లోకశ్రేయస్సును కోరి మూడు సంవత్సరాలు నిష్ఠతో భారతకథను 'జయ' కావ్యంగా రచించాడు. దానిని తన శిష్యులద్వారా వివిధ లోకాలలో వ్యాపింపజేశాడు. వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు ఈ కథను వినిపించాడు. అట్లా వినిపింపగా పెంపొందిన కావ్యాన్ని 'భారత' మని పిలిచారు. తరువాత ఆ కథను రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో సత్రయాగం చేస్తున్న శౌనకాది మహామునులకు వివరించాడు. అక్కడి మునులడిగిన ప్రశ్నలకు ఉగ్రశ్రవసుడు చెప్పిన కథార్థాలతో కలిసి భారతం 'మహాభారతం'గా వాసి గాంచింది.

ఉగ్రశ్రవసుడు (సూతుడు) శౌనకాది మునులకు భారత కథనంతా చెప్పి, చివర ఇలా అంటాడు-

**"యదిహాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి న తత్ క్వచిత్"**

'ఇందులో ఉండేదే ఎక్కడైనా ఉంటుంది, ఇందులో లేనిది ఎక్కడా లేదు' (What is in Mahabharata is every where; what is not in Mahabharata is nowhere) - అని.

ఆసక్తికరమైన విషయం, ఏమంటే మహాభారతం ప్రపంచంలోని గ్రంథాలన్నింటిలోకి గొప్పది. ఉదాహరణకు "ఇలియడ్", "ఒడెస్సీ"- అనేవి గ్రీకుల ప్రాచీన ప్రసిద్ధ వీరకావ్యాలు. మహాభారతం ఆ రెంటికన్నా అనేకరెట్లు పెద్దది. ఈ పెద్దతనం ఒక పరిమాణంలోనేగాక, పాత్ర చిత్రణ (Character delineation ), భావాల వైవిధ్యం (Range of emotion) వంటి అంశాల్లో స్పష్టంగా తెలుస్తుంది.

మహాభారతంలో పాండవుల ఉత్తమ చరిత్ర, కౌరవుల దుర్వృత్తం చక్కగా ఆవిష్కరింపబడ్డాయి. పాండవులు ధార్మిక, సాత్త్విక, దైవీశక్తులు; కౌరవులు అధార్మిక, రాజస, తామసిక, ఆసురీశక్తులు. ఈ రెండురకాల శక్తుల నడుమ జరిగిన సంఘర్షణయే కురుక్షేత్ర సంగ్రామం. అందులో ధార్మికశక్తులకు జయాన్ని కలిగించి, అధర్మశక్తులను అంతమొందించి, అవతార పురుషుడుగా, జగద్గురువుగా నిలిచి ఉపదేశించిన దివ్యశక్తి శ్రీకృష్ణుడు.

భగవద్గీత భారతానికి ఆత్మ; పాండవుల చరిత్ర శరీరం; చతుర్విధ పురుషార్థ విజ్ఞానం జీవితం; ఇతిహాసాలు, ఉపాఖ్యానాలు జవసత్త్వాలు. మానవ జీవితమనే మహాసముద్రాన్ని మథించి బాదరాయణుడు మానవాళికి అందించిన

అమృతకలశం మహాభారతం. మానవజీవిత క్రమానికి మహాభారత ఇతివృత్తగమనానికి ఎంతో సాదృశ్యం గోచరిస్తుంది. ఒక్కమాటలో మానవ ధార్మిక జీవన ప్రవృత్తికి మహాభారతం ప్రాణాధారం.

మహాభారతం వేదాలు మొదలుకొని పురాణాలవరకు గల భారతీయ వాఙ్మయంయొక్క సారాంశాన్ని అందించటమేగాక, ఆ యా అంశాలకు వైరుద్ధ్యం ఏర్పడినప్పుడు, వాటికి సామరస్యపూర్వక మార్గాన్ని నిర్దేశించే సమన్వయ సంహితగా పేరు గాంచింది:

**"వేదములకు, అఖిలస్మృతి**
**వాదములకు, బహుపురాణ వర్గంబులకున్**
**వాదైన చోటులను తా**
**మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్"**

ఈ విధంగా ఆర్షవాఙ్మయానికి అంతటికీ మూదల (ప్రమాణం) అయి ఉండటం మహాభారతం యొక్క ప్రత్యేకత!

దేవభాషలో అవతరించిన భారతం కాలక్రమేణ తమిళ, కర్ణాటాది దేశభాషలలోనికి అనువదింపబడుతూ వచ్చింది. ప్రాంతీయ భాషలలో వెలువడిన ఆ యా భారత అనువాదాలన్నిట్లోనూ తెలుగులో 'కవిత్రయం' వారు రచించిన ఆంధ్రమహాభారతానికి ఒక ప్రత్యేకత నెలకొనిఉంది. తెనుగుభారతం కేవల అనువాదం కాదు; కృష్ణద్వైపాయనుడు వైదికమైన ఏ పరమార్థాన్ని మూలంలో నిరూపించాడో, ఆ నిరూపితార్థం చెక్కుచెదరకుండా పుణికిపుచ్చుకొని అవతరించిన స్వతంత్ర రచన ఆంధ్రమహాభారతం. కవిత్రయం కావించిన పునఃసృష్టి!

'తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి,' 'భారతం చదివినవాడు పండితుడు'- ఇత్యాది లోకోక్తులు తెలుగులో వెలిశాయంటే ఆంధ్రులకు మహాభారతమంటే ఎంతటి ఆదరమో తేటపడుతోంది. ఆంధ్రావళికి అలాంటి ఆదికావ్యాన్ని ప్రసాదించిన మహాకవులు ముప్పురూ త్రిమూర్తుల లాంటివారు. వారిలో ఆదికవియే విష్ణువు, కవిబ్రహ్మయే బ్రహ్మదేవుడు, ప్రబంధ పరమేశ్వరుడే పరమేశ్వరుడు. ఈ ముగ్గురు సారస్వత మూర్తులు వేరువేరు కాలాల్లో, తెలుగుదేశంలోనూ వేరువేరు ప్రాంతాల్లో తమతమ రచనల్ని కొనసాగించినప్పటికీ, కవిత్రయ భారతం స్వరూపంలోనూ, సందేశంలోనూ ఏకవాక్యతతో విలసిల్లుతూవుంది. ఇది ఆంధ్రావనికి దైవికంగా సిద్ధించిన అదృష్ట విశేషం. తరతరాల తెలుగుజాతికి ఆదర్శంగా తెనుగు సంస్కృతి మందిరంపై నిర్మించిన సమున్నత స్వర్ణగోపురం ఆంధ్రమహాభారతం. ఆ సుందర గోపురాన్ని నెలకొల్పిన అక్షర శిల్పులు "కవిత్రయం" అందరకూ ఆరాధ్యులు.

పై త్రిమూర్తుల్లో ఆద్యుడు, ఆంధ్రసారస్వతానికి 'అపర వాల్మీకి' నన్నయభట్టారకుడు. ఆ మహాకవి వేంగీదేశపు రాజధాని అయిన రాజమహేంద్రవరంలో చాళుక్యవంశ ప్రభువగు రాజరాజుయొక్క ప్రోత్సాహంతో క్రీ.శ. 1053 ప్రాంతంలో వ్యాసభారత ఆంధ్రీకరణకు శ్రీకారం చుట్టాడు. ఆంధ్రవాఙ్మయ చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయ సన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982-83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం"గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్రాబ్ది జయంతి- ఉత్సవాలు తెలుగుదేశంలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడినాయి.

ఆ సందర్భంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షధర్మానికి, ఆంధ్రభాషా సాహిత్యాలకు, సంస్కృతీ సభ్యతలకు మార్గదర్శకమైన ఆది కావ్యానికి - ముఖ్యంగా తొలి మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచే ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషాలను వ్రాయించి ప్రచురించే ధార్మిక కార్యక్రమాన్ని ఆసక్తితో చేపట్టారు. తొలుదొలుత నన్నయ భారతభాగంతో ఆరంభమైన ఈ కార్యక్రమం క్రమేణ తరువాతి పదిహేను పర్వాలకు కూడా వ్యాఖ్య వ్రాయించాలనే ఉదాత్త సంకల్పానికి దారితీసింది.

ఈనాటి విద్యార్థుల పాఠ్యప్రణాళికల్లో భారతీయ సంస్కృతి వైశిష్ట్యాన్ని బోధించే అంశాలకు తగినంత ప్రాధాన్యం లేక, అరుదైపోతూ ఉన్నందున, కవిత్రయమహాభారతం అందించే సందేశం సామాన్య జనులకూ, అలాగే నేటి యువతరానికీ అందేటట్లు చేయవలసిన ఆవశ్యకతను గుర్తించి, తిరుమల తిరుపతి దేవస్థానం వ్యాఖ్యానసహిత కవిత్రయ భారత ప్రచురణను అందుకు అనువైన మహోద్యమంగా చేపట్టి పురోగమిస్తున్నది.

మొదట నన్నయ భారతభాగానికి సరళగ్రాంథికంలోనూ, తరువాత తిక్కన భారత భాగానికి శిష్టవ్యావహారిక భాషలోనూ- అందులోనూ భిన్న భిన్నశైలులలో - వ్యాఖ్య రచింపబడి ఉన్నందున, ఈ మొత్తం సంపుటాల వ్యాఖ్యాన స్వరూపానికి ఏకవాక్యతనూ, సామాన్యపాఠకులకు సైతం సుబోధంగా ఉండే విశిష్ట వ్యావహారికరీతినీ సంతరించటానికి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని సంపాదకులుగా నియమించటమైనది.

వెయ్యేళ్ల తెలుగు సాహిత్యానికే కీర్తికిరీటమైన ఆంధ్రమహాభారతాన్ని సరళవ్యాఖ్యతో అచిరకాలంలో సమగ్రంగా ముద్రించి, ఈ రీతిగా ఆంధ్రావళికి సమర్పింపగలుగుతున్నందుకు తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యం ఎంతో సంతోషిస్తూన్నది.

ఆదికవి నన్నయభట్టారకుణ్ణి ఆంధ్రమహాభారత రచనకు ప్రోత్సహించిన రాజరాజు క్రీ.శ. 1022 ఆగస్టు 22వ తేదిన పట్టాభిషిక్తుడయ్యాడు. ఈ అద్వితీయ చారిత్రక సన్నివేశాన్ని పురస్కరించుకొని తిరుమల తిరుపతి దేవస్థానం ఈ సంవత్సరం ఆగస్టు 22న శ్రీ పద్మావతీ శ్రీనివాసుల మంగళాశాసనములతో ఆది, సభా పర్వాలను తిరుపతిలో ఆవిష్కరించడం జరిగింది. ఆదినుండి ఈ వాఙ్మయయజ్ఞంలో పాలుపంచుకొన్న సుగృహీతనామధేయులయిన విద్యావేత్త లందరికి పేరు పేరున కృతజ్ఞతలు తెలుపుతూ వున్నాము.

వేదత్రయమూర్తి అయిన వేంకటేశ్వరుని అనుగ్రహంవల్ల, వ్యాఖ్యానసహితమైన ఈ 'జయేతిహాసం' సర్వులకు జయప్రదము, ఆనంద సంధాయకము కాగలదని మా ఆశయము, ఆకాంక్ష.

అనతి కాలంలోనే ప్రతులన్నీ చెల్లిపోయిన కారణంగా పునర్ముద్రిస్తున్నాము (2006). ఎప్పటిలాగే పాఠకులు సమాదరిస్తారని ఆశిస్తున్నాను.

**వ్యాసరచిత భారతామ్నాయ మాంధ్రభా**
**షగనొనర్చి జగతిఁ బొగడు గనిన**
**నన్నపార్యుఁ, దిక్కనను గృతక్రతు, శంభు**
**దాసు నెఱ్ఱసుకవిఁ దలఁతు భక్తి.**

**కార్యనిర్వహణాధికారి**
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

# కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు : పుట్టు పూర్వోత్తరాలు

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యానుగ్రహంతో తిరమల తిరుపతి దేవస్థానం ఆదినుండీ ఆర్షధర్మప్రబోధం నిమిత్తం అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తూవుంది. అలాంటి కార్యక్రమాల్లో ధార్మిక సాంస్కృతిక గ్రంథాల ప్రచురణ అత్యంత ప్రధానమైంది. ఆర్షధర్మానికి, భారతీయసంస్కృతికి, మూలాధారాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలైనవాటిని, తత్సంబంధి రచనలను పలుభాషల్లో, పలురీతుల్లో అసంఖ్యాకంగా ప్రచురిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షసంస్కృతి సముద్ధరణలో తమవంతు కృషిని విజయవంతంగా కొనసాగించటం జరుగుతూ వుంది.

## పూర్వరంగం:

ఇటీవల 1982 మార్చినెలలో మహాకవి పోతనపంచశతాబ్ది జయంతి ఉత్సవాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధిపత్యంలో ఏకశిలా (వరంగల్లు) నగరంలో వైభవోపేతంగా జరుపబడినాయి. ప్రభుత్వసూచన ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ఉత్సవాల్లో సముత్సాహంతో పాల్గొన్నది. వరంగల్లు పట్టణంలో ప్రతిష్ఠించే నిమిత్తంగా పోతన విగ్రహాన్ని నిర్మించడం, పోతన భాగవతం ప్రథమస్కంధాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించటం, 'శ్రీనివాస బాలభారతి' పక్షాన "పోతన" పుస్తకాన్ని ప్రకటించడం, పోతన కవితామహత్త్వాన్ని చాటే స్మారక సంచికను ముద్రించటం - ఇత్యాదికార్యక్రమాలను నిర్వహించడంద్వారా దేవస్థానం ఆ ఉత్సవాల వైభవానికి ఎంతగానో తోడ్పడింది! పోతనపంచశతాబ్ది జయంత్యుత్సవాలు ఆంధ్రభాగవత ప్రచురణకు దోహదకారులైనట్లే, అటు తర్వాత 1983లో జరిగిన నన్నయ సహస్రాబ్ది జయంత్యుత్సవాలు "వ్యాఖ్యానసహిత ఆంధ్రమహాభారత" గ్రంథప్రచురణకు అంకురార్పణ గావించాయి.

## నన్నయ భారత ప్రాజెక్టు :

ఆంధ్రమహాభారతం ఆంధ్రజాతి వెయ్యేండ్ల తపఃఫలం! ఇది తెలుగులో ఆదికావ్యం. ఈ కావ్యరచయిత నన్నయభట్టారకుడు. క్రీ.శ.1053 ప్రాంతంలో - అనగా దాదాపు వెయ్యివత్సరాల క్రిందట, గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరంలో, చాళుక్యరాజగు - రాజరాజనరేంద్రుని కోరికననుసరించి, ఆ మహాకవి ఈ ఉత్తమ కావ్యరచనకు శ్రీకారం చుట్టినాడు. ఆంధ్రసాహిత్య చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయసన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 - 83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం" గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్ర వార్షిక జయంతి - ఉత్సవాలు ఆంధ్రావనిలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి.

ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అంతకు మునుపటి పోతన జయంత్యుత్సవాల్లో తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించిన విశిష్టపాత్రను ప్రశంసాత్మకంగా ప్రస్తావిస్తూ, అదే విధంగా నన్నయ జయంత్యుత్సవాల్లో పాల్గొని చరితార్థం చేయవలసిందిగా కోరుతూ, దేవస్థానంవారికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. ఆ సూచనల ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించే నిమిత్తం నన్నయ విగ్రహాన్ని నిర్మించింది; 'భారతావతరణము' (రూపకం) 'నన్నయ భట్టారకుడు' (వచనం) - అనే పుస్తకాలను, 'నన్నయ వ్యాస పీఠము' - అనే ప్రశస్త సంచికను ప్రచురించింది.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సూచించిన సూచనలలో అత్యంత ప్రధానమైనది నన్నయభారతానికి (తొలి మూడు పర్వాలకు) వ్యాఖ్య వ్రాయించి ప్రకటించటం. ఈ బృహత్తరవ్యాఖ్యా గ్రంథప్రచురణ బాధ్యతను దేవస్థానంవారు ఇటీవల పదవీవిరమణ చేసిన అప్పటి పౌరసంబంధాధికారి డా॥ రావుల సూర్యనారాయణమూర్తికి అప్పగించారు. అనంతరం నన్నయ భారత వ్యాఖ్యా రచనా ప్రణాళికను రూపొందించటానికి ప్రసిద్ధ విద్వన్మణులతో ఈ క్రింది సంపాదకమండలి ఏర్పాటయింది.

**కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి (సమావేశకర్త)**

ఈ సంపాదకమండలి 1983 జూలై 11వ తేదీన హైదరాబాదు బాలాజీభవనంలో తొలిసారిగా సమావేశమై, నన్నయభారత వ్యాఖ్యారచనకు ఆవశ్యకమైన మార్గదర్శక సూత్రాలను రూపొందించింది.

**ఆ సూత్రాల సారాంశం :**

"ఇది మహాభారతము. ఆంధ్రవాఙ్మయములో పరమప్రామాణికమైన ఆది గ్రంథము. ఆరణ్య పర్వములో శేషభాగము ఎఱ్ఱన వ్రాసినను, నన్నయ పేరుమీదనే వ్రాసియున్నాడు గనుక, ఆ పర్వము పూర్తిగ ప్రచురించవలెనని నిర్ణయము గైకొనబడినది. టీకా తాత్పర్యసహితముగా ప్రచురించుటలో గల ఉద్దేశము సామాన్యులకు గూడ అర్థమగుట. కనుక, వ్యావహారికభాషకు సన్నిహితమైన సరళగ్రాంథికములో వ్రాయవలెనని నిర్ణయము జరిగినది. పదాలు ప్రయోగించుటలో సామాన్యులకు అర్థమగునట్లు, భారతముయొక్క ప్రామాణికత చెడకుండ - భాషను సాధ్యమైనంతమేరకు సులభముగా నుండునట్లు వ్రాయవలెను. అరసున్నలు, శకటరేఫములు పాటింప నక్కరలేదు. విసంధులు అంగీకరింపబడినవి. సరళాదేశము అనవసరము. మూలములో ఉన్న కఠినపదములు పరిహరించి, సుబోధములైన పదాలు వాడవలెను.

మూలపదాలు యథాతథముగ వ్రాయవలెను. అరసున్నతోగాని, సున్నతోగాని పదము ముగియునపుడు దానిని ద్రుతాంతముగా వ్రాయవలెను. సరళాదేశము వచ్చినపుడు పరుషములే గ్రహించవలెను. మొదట మూలపద్యము, దానిక్రింద ప్రతిపదార్థము, తరువాత తాత్పర్యము, పిమ్మట- ఉన్నచో విశేషాలు, అతిముఖ్యములైన వ్యాకరణవిశేషాలు, అలంకార విశేషాలు పొందుపరచవలెను. వచనమునకుగూడ పద్యాలకు వ్రాసినట్లే అర్థతాత్పర్యాలు వ్రాయదగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధితప్రతిని ఆధారముగా స్వీకరింపవలెను. అందలి శీర్షికలను యథాతథముగా ఉంచవలెను. సంస్కృతమూలములోని అధ్యాయ సంఖ్యగూడ వేయవలెను. మూలవిభిన్నత పీఠికలో సూచించవచ్చు; లేదా విశేషాంశములలో చేర్చవచ్చు. పాఠాంతరాలలో - సంశోధితప్రతిలో ఉన్నదానికంటె ఇతర పాఠము మేల్తరముగా తోచినచో రచయిత దానినికూడ స్వీకరించి అర్థము వ్రాయవలెను. దానిని విశేషములలో చేర్చునది.

రచన కొనసాగిన పిమ్మట రెండుమూడు నెలలకు ఒకసారి రచయితల సమావేశాలు ఏర్పాటుచేసి అన్యోన్య సమీక్షలు జరుపవలెను. ఇది రచనలో సామరస్యము ఏర్పడుటకు సదవకాశము కలిగించును. (మూడుపర్వముల) రచనలో ఏకరూపత

కలుగునట్లు చూచుటకు ఒక ప్రధాన సంపాదకుడు కావలసి యున్నది. ఈ బాధ్యత ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి అప్పగించుటకు ఏకగ్రీవముగా తీర్మానింపబడినది. ప్రధాన సంపాదకుడు వ్రాతప్రతిని సాధ్యమగునంత త్వరలో అచ్చుకు (Finalise) సంసిద్ధముచేయగానే, ఒక సమష్టి సమీక్షా సమావేశము ఏర్పాటుచేసి, అనంతరము వ్రాతప్రతిని ముద్రణకు ఇయ్యవలెను. ప్రతి సంపుటికి పీఠిక, విషయసూచిక, చివర పద్యానుక్రమణిక ఉండవలెను.''

పై ఆదేశిక సూత్రాల ననుసరించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఆదిపర్వానికి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య సభాపర్వానికి, డా॥ నండూరి రామకృష్ణమాచార్య ఆరణ్యపర్వానికి- వ్యాఖ్యలను రచించే కార్యక్రమం చేపట్టారు. ఇలా వ్యాఖ్యను సమకూర్చే పని ఒకవైపు కొనసాగుతూ ఉండగా, దేవస్థానం ఇంచుమించు ఆరేసి మాసాల కొక పర్యాయం, అంతదనుక జరిగిన కృషినిగూర్చి సమీక్షించేందుకు, పై ముప్వురు రచయితలతో కూడిన సంపాదకవర్గ సమావేశాలను నిర్వహిస్తూ వచ్చింది.

ప్రధాన సంపాదకుడు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు తక్కిన ఇరువురి రచనలను పునఃపరిశీలన చేస్తూ, తుదిమెఱుగులు దిద్ది వ్రాతప్రతులను అచ్చుకు సిద్ధంచేస్తున్న దశలో - 1986 అక్టోబరులో పరమపదించారు. ఈ ఆకస్మికసంఘటనవల్ల "వ్యాఖ్యాసహిత నన్నయభారత ప్రచురణ'' కార్యక్రమ పురోగతికి విఘాతం ఏర్పడింది.! ప్రణాళిక ఈ ఆటంకాన్ని అధిక్రమించటానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు తగినపెద్దలతో విస్తృతంగా సమాలోచించారు. తదుపరి, కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు కీ.శే. దివాకర్లవారి స్థానంలో ముఖ్య సంపాదకులుగా 1987 మే నెలలో నియుక్తులయ్యారు.

అప్పటినుండి, మళ్ళీ వ్యాఖ్యారచయితల పరస్పరసమీక్షా సమావేశాలు యథారీతిగా నిర్వహింపబడుతూ వచ్చాయి. వీటితోపాటు, ప్రధాన సంపాదకుడు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు మూడుపర్వాల వ్రాతప్రతులను క్రమంగా పర్యవేక్షిస్తూ, వాటిని ముద్రించవలసినదిగా తీర్మానించారు.

ఆ యా పర్వాల ముద్రణకార్యం ఒకప్రక్క జరుగుతూవుంటే, మరోవైపున ఆ యా సంపుటాల సంపాదకులు పీఠిక, ఉపోద్ఘాతము - మున్నగు అంశాలను సమకూర్చాలని ఒకానొకసమావేశంలో నిర్ణయింపబడింది. అవసరాన్నిబట్టి పీఠికలకు తుదిరూపం ఇవ్వటానికి సంపాదకవర్గం మరొకసారి సమావేశం కావడానికి కూడ అందులోనే నిశ్చయింపబడింది. అయితే, ఈ నిర్ణయాలు చోటుచేసికొన్న సమావేశమే నన్నయ భారత ప్రణాళికకు సంబంధించిన సమావేశాల్లో చిట్టచివరిదయింది! ఈ సమావేశం రాజమహేంద్రవరంలో శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి గృహంలో 1991 జూలై 3వ తేదిన జరిగింది. అనంతరం ఈ గ్రంథాన్ని ముద్రించే ప్రయత్నాలు కొనసాగాయి.

**తిక్కన భారత సంయోజన :**

ఇటువంటి పరిస్థితుల్లో, తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకుల కార్యాలయమందలి ప్రచురణల విభాగంలో 'పబ్లికేషన్సు ఎడిటర్'గా పనిచేస్తూ వుండిన విద్వాన్ డి. నాగసిద్ధారెడ్డిగారు (రిటైర్డు ప్రిన్సిపాల్, యస్.వి.ఓరియంటల్ కళాశాల, తిరుపతి) తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగారికి "తిక్కన భారత వ్యాఖ్యారచనాప్రణాళిక''ను గూర్చి 1992 ఆగష్టు ఆరంభంలో ఒక నివేదికను సమర్పించారు.

**ఆ నివేదిక సారాంశం :**

"తిరుమల తిరుపతి దేవస్థానంవారు నన్నయ భారతం మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచేత వ్యాఖ్య వ్రాయించిన విధంగానే, తిక్కన భారతం పదునైదు పర్వాలకు రాష్ట్రంలోని ప్రముఖపండితులచేత వ్యాఖ్య వ్రాయించి ప్రచురించటం సముచితంగానూ, సమగ్రంగానూ ఉంటుంది. తాము అనుమతిస్తే ఈ ప్రణాళికకు నేను సమన్వయ సంపాదకుడనుగా, సమావేశకర్తగా (కో ఆర్డినేటింగ్ ఎడిటర్ అండ్ కన్వీనర్) బాధ్యతవహించి నిర్వర్తించగలను".

తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన సమావేశమైన గ్రంథనిపుణుల సంఘం (Experts Committee) పై ప్రతిపాదనను ఆమోదించింది. తదనుసారంగా తిక్కన భారతవ్యాఖ్యా రచనా ప్రణాళికకు సంబంధించిన తొలిసమావేశం తిరుమల తిరుపతి దేవస్థాన పరిపాలనా భవనం (తిరుపతి)లో కార్యనిర్వహణాధికారిగారి ఆధ్వర్యంలో 1992 నవంబరు 5వ తేదిన జరిగింది. ఈ ప్రణాళికా నిర్వహణకు తొలుత ఒక సలహాసంఘం ఏర్పాటయింది. అనంతరం ఈ సలహాసంఘం 1) సంపాదకవర్గం 2) సలహాసంఘం- అని ఈ క్రింది రెండు సంఘాలుగా విభజింపబడింది.

**సంపాదక వర్గం**

**శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**
**ప్రొ॥ కే. సర్వోత్తమరావు**
**ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య**
**శ్రీ డి. నాగసిద్ధారెడ్డి (కన్వీనర్)**

**సలహాసంఘం**

**ఆచార్య తూమాటి దొణప్ప**
**ఆచార్య బిరుదురాజు రామరాజు**
**ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు**
**ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి**
**ఆచార్య నండూరి రామకృష్ణమాచార్య**
**ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం**
**ఆచార్య మడుపు కులశేఖరరావు**
**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి**
**శ్రీ కాట్రపాటి సుబ్బారావు**
**శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రి**

పై సమావేశంలో చర్చింపబడిన అంశాల్లో అత్యంతప్రధానమైనది వ్యాఖ్యాన విధానానికి సంబంధించినది. సభ్యులందరి సలహాలు, సూచనలమేరకు - వ్యాఖ్యానరచనకు మార్గదర్శకాలైన - కొన్ని ముఖ్య నియమాలు క్రోడీకరింపబడ్డాయి.

**ఆ నియమాల సారాంశం :**

"రచనావిషయంలో ప్రధానంగా సామాన్య ప్రజానీకాన్ని దృష్టియందుంచుకొనవలెను. భాష వ్యావహారికంగానే ఉండాలి. మాండలికాలు ఉండరాదు. సాధ్యమైనంతవరకు విసంధుల్ని పాటించాలి. సంధి విడదీసిన తర్వాత పదస్వరూపం తెలిసేటట్లుగా పదాదిన అచ్చుల్ని వాడాలి. దుస్సంధులు తగదు. శకటరేఫలు, అరసున్నలు ఉండరాదు. కథాభాగాన్ని అతికేసమయంలో పూర్వాపర సందర్భాలను అనుసంధానంచేస్తూ అవసరమైనచోట స్థూలంగా ఐదారు పంక్తులు అవతారిక (పరిచయం) వ్రాయాలి. ప్రతిపద్యానికి అక్కరలేదు.

విశేషాంశాల్లో అలంకారాలు, వర్ణనలు కథా సందర్భానికి ఏవిధంగా అతికాయో చెప్తూ, పద్యంలో గుర్తించిన ముఖ్యమైన విశేషాంశాలు విస్తారంగా కాకుండా, సంగ్రహంగా చెప్పాలి. (రచయితలు వ్రాయని విశేషాంశాదులను 'సంపాదకులు' 'ఎడిటోరియల్ నోటు' వ్రాసి నమోదుచేయవలసినది.) అవసరమైన చోట్ల రచనలో మార్పులు, చేర్పులు చేయడానికీ, సంతృప్తికరం కాకపోతే తిరస్కరించి మరొకర్ని ఎంపిక చేసుకొనడానికీ సంపాదకవర్గానికి అధికారం ఉంది. (రచయితలు) ఉస్మానియా యూనివర్సిటీవారి భారతప్రతిని రచనకు ప్రమాణంగా స్వీకరించాలి. ఇతర ప్రతులలో సొబగైన పాఠములున్నచో వాటిని రచనలో ఉటంకించవచ్చు."

పై సూచనల ప్రకారం, తిక్కన భారతం పదునైదు పర్వాల్లోని 46 ఆశ్వాసాలకు సరళవ్యాఖ్య సమకూర్చటానికి మొత్తం ముప్పదిముగ్గురు పండితులు ఎంపిక చేయబడ్డారు. వీరిలో చాలమంది తమవంతు వ్యాఖ్యారచనను సకాలంలో పూర్తిచేసి దేవస్థానానికి సమర్పించారు. 'తిక్కనభారత ప్రణాళిక' యొక్క చివరి సమావేశం 1994 జూలై 15వ తేదిన కార్యనిర్వహణాధికారిగారి అధ్యక్షతన తిరుమల తిరుపతి దేవస్థానపరిపాలనాభవనం (తిరుపతి)లో జరిగింది.

1995 జూన్‌లో శ్రీ డి. నాగసిద్ధారెడ్డి పదవినుండి విరమించేనాటికి, తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలకు వ్యాఖ్య - ఆ యా రచయితలు వ్రాసి పంపనందున - దేవస్థానానికి అందలేదు. అలా, వ్యాఖ్యానింపబడక శేషించి ఉన్న తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలను స్థానికులగు మరికొందరు విద్వాంసులచేత వ్రాయించి, ఈ వ్యాఖ్యాన క్రతువును సమాప్తి నొందించడం జరిగింది. ఈ విధంగా తొలుత 'నన్నయభారత ప్రణాళిక'గా ఆరంభమైన ఈ వ్యాఖ్యారచన, తరువాత తిక్కన భారతంలోకి విస్తరించి, సమగ్రతను సంతరించుకొని, చివరకు "కవిత్రయ మహాభారత ప్రణాళికగా" సార్థకమయింది.

**కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు :**

మొదటి మూడు పర్వాలు సరళగ్రాంథికంలోను, తక్కిన భాగమంతా భిన్నభిన్నశైలుల వ్యావహారికంలోనూ రచింపబడిన ఈ మొత్తం పదునెనిమిది పర్వాల వ్యాఖ్యాన స్వరూపానికి ప్రామాణికమైన ఏకరూపతను, నవ్యతను సముచితంగా సంతరింపజేయగల సంపాదకుణ్ణి సూచించవలసిందని తిరుమల తిరుపతి దేవస్థానం, స్థానికులైన నిపుణులను కోరింది.

అనుభవజ్ఞులగు నిపుణుల అభిప్రాయానుసారం దేవస్థానం - సుగృహీతనామధేయులైన సాహితీవేత్తలు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని "కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు"కు సంపాదకత్వం నిర్వహింపవలసిందిగా 1996 అక్టోబరులో ఆహ్వానించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆహ్వానాన్ని శ్రీ స్వామివారి ఆదేశంగా స్వీకరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తిరుపతికి వచ్చి 'ఎడిటరు' కార్యాలయంలోని ప్రచురణల విభాగం (Publications Wing)లో భద్రపరుపబడియున్న భారతం వ్రాతప్రతిని విశదంగా పరిశీలించి, ఇచ్చటి ఉద్యోగుల సహకారంతో వారు ఈ బృహద్ గ్రంథ పరిష్కరణకు అవలంబించవలసిన కొన్ని ముఖ్యపద్ధతులను, విధానాలను ప్రతిపాదించారు.

**ఆ ప్రతిపాదనల సారాంశం :**

"మహాభారత కథార్థాలు సామాన్యజనానికి అందుబాటులో ఉండేటట్లు చేయటానికీ, మహాభారతంలోని ధర్మసందేశం

అందరికీ అవగాహనకావడానికి ఈ వ్యాఖ్యానం లక్షింపబడింది కాబట్టి, వ్యాఖ్యానమంతా ప్రామాణిక వ్యావహారిక భాషలో ఒకేరీతిగా ఉండేటట్లు చూడాలి. అవసరమైన చోట్ల వ్యాఖ్యాతలు వ్రాసిన వివిధశైలులను ప్రామాణిక వ్యావహారిక శైలిలోనికి మార్చి, ఒకే గ్రంథకర్త రచించిన రచనను చదువుతున్న స్ఫూర్తిని పఠితలకు కల్పింపచేయాలని నిర్ణయించడమైనది. భాషాశైలులు మార్చవలసి వచ్చినపుడు ఇపుడున్న 'ఒరిజినల్' వ్రాతప్రతిని చెడగొట్టకుండా 'ప్రెస్‌కాపీ'ని లేఖకులచే వ్యావహారిక భాషలో మరల వ్రాయించవలసివుంటుంది.

వ్యాఖ్యానరచనకు ఒకస్థూలమైన ప్రణాళికను ఇదివరలో రూపొందించి వ్యాఖ్యాతలకు తెలియపరచటమయింది. కాని, అందరూ ఆ అంశాలను తు.చ. తప్పకుండా పాటించినట్లు కనబడదు. అందువలన వ్యాఖ్యానరచనలో ఏకరూపత (Uniformity) ఒక్కొక్కచోట లోపించినట్లు కనబడుతోంది. కాబట్టి, వ్యాఖ్యానం అవసరానికి మించి ఉన్నచోట్ల తగ్గించటానికీ, అవసరం ఉన్నచోట్ల కొన్ని అంశాలను చేర్చటానికీ సంపాదకునికి స్వేచ్ఛ ఇవ్వాలని నిర్ణయించడమైనది.

వ్యాఖ్యానం వ్రాయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఆంధ్రమహాభారత సంశోధితప్రతిని ఆధారం చేసికోవాలని ఇదివరలోనే నిర్ణయించడమైనది. ఆ నిర్ణయాన్ని వ్యాఖ్యానరచయితలకు తెలుపడం కూడా జరిగింది. కాని, కొందరు రచయితలు నిర్దేశించిన ప్రతిని కాకుండా, వేరే ప్రతులను ప్రామాణికంగా తీసికొని వ్యాఖ్యానం వ్రాశారు. అటువంటి ఘట్టాలలో దేవస్థానంవారు ఎన్నుకొన్న ప్రతిని దృష్టిలో ఉంచుకొని వ్రాతప్రతులను తగినవిధంగా మార్చవలెనని నిర్ణయించటం జరిగింది.

మహాభారత వ్యాఖ్యానాన్ని 1/4 'డెమ్మీసైజు'లో పంద్రెండు సంపుటాల్లో ప్రచురించాలని నిర్ణయించడమైనది. పుస్తకం 'సైజు'ను నిర్ణయించడంలో పాఠకుణ్ణి, విషయాన్ని, ప్రచురణకర్త సౌకర్యాన్ని సాధారణంగా దృష్టిలో ఉంచుకొంటారు. పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొంటే, అతడు భారతంలో ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సంపుటంగా భద్రపరచుకోవాలని భావిస్తుంటాడు. అందువల్ల, 'వాల్యూమ్'కు పర్వాన్ని ప్రమాణంగా తీసికోవటం సౌకర్యంగా ఉంటుంది. విషయాన్ని బట్టిచూచినా పర్వవిభాగమే అందరికీ సౌకర్యం. ప్రచురించేసంపుటికి 'క్లాసిక్' (Classic) గౌరవం ఆకృతిలో కల్పించాలన్నా 1/4 'డెమ్మీసైజు' బాగుంటుందని తీర్మానించటమైనది. అయితే ఆదిపర్వం, ఆరణ్యపర్వం, శాంతిపర్వంలాంటి పెద్దపర్వాలు, మహాప్రస్థానిక పర్వంలాంటి చిన్నపర్వాలు ప్రచురిస్తున్నప్పుడు 'వాల్యూమ్' విభాగంలో కొంత వెసులుబాటు కల్పించుకోవచ్చు.

ఒక్కొక్క సంపుటానికి మొదట తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారి ముందుమాట, 'ఎడిటరు' గారి ఉపోద్ఘాతం తప్పకుండా ఉండాలి. విషయసూచిక తయారుచేయాలి. ప్రతి పర్వం చివర అకారాది పద్యానుక్రమణిక తప్పనిసరిగా ఉండాలి''.

పై పద్ధతుల ననుసరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పరిష్కరించి ఇస్తున్న భారత సంపుటాలను తిరుమల తిరుపతి దేవస్థానం వరుసగా ప్రచురింప బూనుకొన్నది. ఈ సంపుటుల ప్రచురణకార్యం త్వరితగతిన పూర్తి చేయించాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం 1999 నవంబరు 3,4 తేదీల్లో శ్రీ పద్మావతి అతిథి గృహంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన కీలకమైన సమావేశాన్ని నిర్వహించింది. ఈ సమావేశంలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తయారు చేయించిన ఆదిపర్వ, సభాపర్వాల డి.టి.పి. 'మాస్టరు కాపీ'లను సభ్యులు సమీక్షించారు. తదనంతర పర్వాల ప్రకటన ఇతోధికమగు వేగం అందుకోవటానికి వీలుగా ఈ సమావేశంలో కవిత్రయ భారతానికి సంబంధించిన సంపాదకమండలి (Editorial Board), సలహామండలి (Advisory Board) - అనే రెండు సంఘాలను ఈ దిగువ పేర్కొన్న విధంగా పునర్వ్యవస్థీకరించటం జరిగింది.

## సంపాదక మండలి సభ్యులు



## సలహా మండలి సభ్యులు



తరువాత 2000 సంవత్సరం ఫిబ్రవరి 25వ తేదీన తిరుమలలో కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన 'క్యాంప్ ఆఫీస్'లో పై రెండు మండలుల లోని సభ్యుల సంయుక్త సమావేశం నిర్వహింపబడింది. ఈ సమావేశంలో 2000 సంవత్సరాంతానికి కవిత్రయ భారతసంపుటా లన్నింటినీ వెలువరించాలనే ముఖ్యతీర్మానం కావింపబడింది. ఇందులకు అనువుగా ఆ యా పర్వాల వ్యాఖ్యాతలతో కూడిన ఒకటి, రెండు 'వర్క్‌షాప్'లను కూడ నిర్వహించడానికి నిర్ణయం గైకొనబడింది.

కవిత్రయ భారతాన్ని వ్యాఖ్యతో ముద్రించటంద్వారా తిరుమల తిరుపతి దేవస్థానంవారు 'పంచమవేద' మందలి ధర్మప్రబోధాన్ని యావదాంధ్రులకు అందించే ఉదాత్తపాత్రను నిర్వహిస్తున్నారు. ఆ క్రమంలో ఇప్పుడు ప్రథమ సంపుటం– ఆదిపర్వం (రెండు భాగాలు), ద్వితీయ సంపుటం – సభాపర్వం వెలువడినాయి. తరువాతి సంపుటాలు సైతం త్వరలోనే వెలుగుచూడనున్నాయి. అక్షరాస్యులైన ఆంధ్రులు భారతాన్ని స్వయంగా చదివి అర్థం చేసికోవటానికి ఈ సరళవ్యాఖ్య 'కరదీపిక' కావాలని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆశయం. తిరుమల తిరుపతి దేవస్థానం తొలుదొలుత ప్రచురిస్తూవున్న ఈ 'వ్యాఖ్యానసహిత కవిత్రయ భారతం' ముద్రణలో ఏవైనా నూత్నాంశాలు చేర్చవలసివున్నట్లు అభిప్రాయపడితే సహృదయసాహితీవేత్తలు వాటిని మాకు తెలియజేయగలరని మనవి.

### కృతజ్ఞతలు:


ఈ ప్రణాళిక ఫలప్రదం కావటానికి ఆధికారికమైన తమ ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులకు, పాలకమండలి సభ్యులెల్లరకు కృతజ్ఞతాభివాదములు. ఈ మహాగ్రంథం వెలుగు చూడటంలో

ముఖ్యకారకులైన సహృదయులు తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారులు డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారికి అనేక ధన్యవాదాలు.

ఈ ప్రణాళిక ద్వారా "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారతము"ను ఆంధ్రావళికి అందజేయటంలో ప్రధానపాత్ర వహించిన – వ్యాఖ్యాతలు, పై ఉభయ మండలుల (సంపాదకమండలి, సలహామండలి) యందలి విద్యావేత్తలు ప్రధాన సంపాదకుడు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు – ఈ విద్వాంసులందరికి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

"సప్తగిరి" సంపాదకులుగా ఉండి, ఈ ప్రణాళిక కొనసాగటంలో ఆదినుండి ప్రముఖ పాత్ర వహించిన కీ.శే. కాట్రపాటి సుబ్బారావుగారికి హార్దిక కృతజ్ఞతలు. "సప్తగిరి" సంపాదక కార్యాలయ ప్రచురణల విభాగంలో 'సబ్ ఎడిటరు'గా ఉద్యోగిస్తూ 1995లో పదవినుండి విరమించేదాకా ఈ ప్రణాళిక విషయమై మిగుల సహకరించిన విద్వత్కవివర్యులు శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులుగారికి, ఆచార్య కె.జె.కృష్ణమూర్తి (కంట్రోలర్ ఆఫ్ పబ్లికేషన్స్) గారికి అనేక కృతజ్ఞతలు. ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ, అన్ని విధాలా సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగమందలి సహోద్యోగులు రీసెర్చ్ అసిస్టెంట్ శ్రీ కోరాడ రామకృష్ణ, తెలుగు సబ్–ఎడిటర్లు డాక్టర్ కె. రాధారమణ, డాక్టర్ ఎ. సంధ్య, సప్తగిరి పత్రిక కన్నడ సబ్–ఎడిటర్ శ్రీ బి.ఎన్.శ్రీనివాసన్ గారలకు, తదితర సిబ్బందికి, టి.టి.డి. ముద్రణాలయ అధికారి శ్రీ ఎం. లక్ష్మణరావు గారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహ విశేషం వల్ల ఈ మహోత్తమగ్రంథం వెలుగు చూస్తున్నందుకు, ఆ వేదత్రయ స్వరూపునకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాము.

డా॥ ఎన్.ఎస్.రామమూర్తి
కన్వీనర్
సంపాదకుడు – సప్తగిరి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

| వ్యాఖ్యాతలు | పర్వాలు, ఆశ్వాసాలు |
|---|---|
| 1. డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | ఆది. ఆశ్వా. 1,2,3 |
| 2. డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం | ఆది. ఆశ్వా. 4; శాంతి. ఆశ్వా. 1 |
| 3. డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆది. ఆశ్వా. 5,6,7,8; సభా. ఆశ్వా. 1,2 |
| 4. డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు | ఆరణ్య. ఆశ్వా. 1 నుండి 7 వరకు; భీష్మ. ఆశ్వా. 1,2 |
| 5. డాక్టర్ కె. సర్వోత్తమరావు | విరాట. ఆశ్వా. 1 |
| 6. డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు | విరాట. ఆశ్వా. 2 |
| 7. శ్రీ సింగరాజు సచ్చిదానందం | విరాట. ఆశ్వా. 3; ద్రోణ. ఆశ్వా. 3,4; శల్య. ఆశ్వా. 2 |
| 8. డాక్టర్ మేడవరం వేంకటనారాయణశర్మ | విరాట. ఆశ్వా. 4 |
| 9. డాక్టర్ కె. రామగోపాలకృష్ణమూర్తి | విరాట. ఆశ్వా. 5 |
| 10. డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు | ఉద్యోగ. ఆశ్వా. 1,2; సౌప్తిక. ఆశ్వా. 1,2 |
| 11. శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఉద్యోగ. ఆశ్వా. 3,4 |
| 12. శ్రీ కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి | భీష్మ. ఆశ్వా. 3 |
| 13. డాక్టర్ జి. హరిహరనాథ్ | ద్రోణ. ఆశ్వా. 1 |
| 14. డాక్టర్ మల్లెల గురవయ్య | ద్రోణ. ఆశ్వా. 2 |
| 15. డాక్టర్ కె. రాజన్నశాస్త్రి | ద్రోణ. ఆశ్వా. 5 |
| 16. శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య | కర్ణ. ఆశ్వా. 1 |
| 17. డాక్టర్ యస్వీ. రామారావు | కర్ణ. ఆశ్వా. 2 |
| 18. డాక్టర్ మరుపూరి కోదండరామరెడ్డి | కర్ణ. ఆశ్వా. 3 |
| 19. డాక్టర్ పి. వెంకటరాజు | శల్య. ఆశ్వా. 1 |
| 20. డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద | స్త్రీ. ఆశ్వా. 1,2; అశ్వ. ఆశ్వా 1,2; మౌసల-1; మహా.1; స్వర్గా-1 |
| 21. డాక్టర్ ఎస్. గంగప్ప | శాంతి. ఆశ్వా. 2 |
| 22. డాక్టర్ దావులూరి కృష్ణకుమారి | శాంతి. ఆశ్వా. 3 |
| 23. డాక్టర్ ఆకురాతి పున్నారావు | శాంతి. ఆశ్వా. 4 |
| 24. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | శాంతి. ఆశ్వా. 5 |
| 25. డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం | శాంతి. ఆశ్వా. 6 |
| 26. డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వరరావు | ఆను. ఆశ్వా. 1,2 |
| 27. డాక్టర్ శలాక రఘునాథశర్మ | ఆను. ఆశ్వా. 3,4 |
| 28. డాక్టర్ ఎమ్. కులశేఖరరావు<br>శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఆను. ఆశ్వా. 5 |
| 29. శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | అశ్వ. ఆశ్వా. 3,4 |
| 30. డాక్టర్ ఎ. నాగభూషణం | ఆశ్ర. ఆశ్వా. 1,2 |

# సంకేతాక్షర సూచి

| | | |
|---|---|---|
| ఆది. | – | ఆదిపర్వం |
| సభా. | – | సభాపర్వం |
| ఆర. | – | ఆరణ్యపర్వం |
| విరా. | – | విరాటపర్వం |
| ఉద్యో. | – | ఉద్యోగపర్వం |
| భీష్మ. | – | భీష్మపర్వం |
| ద్రోణ. | – | ద్రోణపర్వం |
| కర్ణ. | – | కర్ణపర్వం |
| శల్య. | – | శల్యపర్వం |
| సౌప్తి. | – | సౌప్తికపర్వం |
| స్త్రీ. | – | స్త్రీ పర్వం |
| శాంతి. | – | శాంతిపర్వం |
| అను. | – | అనుశాసనికపర్వం |
| అశ్వ. | – | అశ్వమేధపర్వం |
| ఆశ్ర. | – | ఆశ్రమవాసపర్వం |
| మౌస. | – | మౌసలపర్వం |
| మహా. | – | మహాప్రస్థానికపర్వం |
| స్వర్గా. | – | స్వర్గారోహణపర్వం |
| సం. | – | భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి |
| సం.మ.భా. | – | సంస్కృత మహాభారతము |
| అను. | – | పై ప్రతిలోని అనుబంధాలు |
| సంపా. | – | ప్రధాన సంపాదకుడు |
| క. | – | కందపద్యం |
| వ. | – | వచనం |
| ఆ. | – | ఆటవెలది |
| తే. | – | తేటగీతి |
| సీ. | – | సీసం |
| ఉ. | – | ఉత్పలమాల |
| చ. | – | చంపకమాల |
| మ. | – | మత్తేభవిక్రీడితం |
| శా. | – | శార్దూలవిక్రీడితం |
| ఆశ్వా. | – | ఆశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| య. | – | యగణం |
| మ. | – | మగణం |
| త. | – | తగణం |
| ర. | – | రగణం |
| జ. | – | జగణం |
| భ. | – | భగణం |
| న. | – | నగణం |
| స. | – | సగణం |
| ల. | – | లఘువు |
| గ. | – | గురువు |
| అలం. | – | అలంకారం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |

# పీఠిక





ఆ. "ధర్మజుండు ధర్మతరు, వర్జునుఁడు ఘన
స్కంధ, మనిలసుతుఁడు శాఖ, కవలు
పుష్పఫలము, లేను భూసురులును వేద
ములుఁ దదీయ మైన మూలచయము."

ఆ. "రోషమయ మహాతరువు సుయోధనుఁ, డురు
స్కంధ మందులోనఁ గర్ణుఁ, డలరుఁ,
గొమ్మ సౌబలుండు, గుసుమఫలములు దు
శ్శాసనుండు, మూలశక్తి తండ్రి."

**(ఉద్యో. 1. 356, 355)**

### సభాపర్వంలో రెండు మహావృక్షాలు

ధర్మరాజు ధర్మవృక్షం. దుర్యోధనుడు రోషవృక్షం. వీరిద్దరూ మహావృక్షాలుగా సభాపర్వంలో దర్శన మిస్తారు. ఉద్యోగపర్వంలో ఘర్షణపడతారు. చెట్టు మహావృక్షం కావాలంటే కొమ్మలతో విస్తరిల్లాలి. మూలబలంతో స్కంధం చేవతేలాలి. పూలుపండ్లు దాని వైభవంగా నిలవాలి. అది ధర్మవృక్ష మైతే లోకహితంకొరకు సువాసనలు విరజిమ్ముతుంది. అధర్మవృక్ష మైతే స్వార్థంతో లోకప్రళయానికి దోహదం చేస్తుంది. ఇటువంటి రెండు విరుద్ధవృక్షాల ప్రకృతిని, విస్తృతిని దర్శింపచేసే పర్వం సభాపర్వం.

ఆంధ్రమహాభారతంలోని పదునెనిమిది పర్వాలను నాలుగుభాగాలుగా విభజించుకొని చదివే పరిపాటి ఆంధ్రులలో కనపడుతుంది. మొదటిభాగం - ఆదిపంచకం (ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగపర్వాలు); రెండవభాగం- యుద్ధషట్కం (భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు); మూడవభాగం- శాంతిత్రయం (శాంతి, అనుశాసనిక, అశ్వమేధపర్వాలు); నాల్గవభాగం- ఆశ్రమవాస చతుష్టయం (ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వాలు).

పదునెనిమిది పర్వాలలో సభాపర్వం కీలక మైనది. ఇది లేకపోతే తరువాతి కథ లేదు. మహాభారతాన్ని ఒక మహానాటకంగా భావిస్తే, అందులో సభాపర్వం ప్రతిముఖసంధిస్థానంలో ఉంటుంది. ఆదిపర్వం ముఖసంధిస్థానీయం. బీజ, బిందు, పతాక, ప్రకరీ, కార్యాలు అర్థప్రకృతులు. ఆరంభ, యత్న, ప్రాప్త్యాశా, నియతాప్తి, ఫలాగమాలు అవస్థలు. అర్థప్రకృతులు అవస్థ లైదింటితో వరుసగా కలిసి ప్రవర్తిల్లటంవలన పంచసంధులు ఏర్పడతాయి. ముఖ, ప్రతిముఖ, గర్భ, అవమర్శ(విమర్శ), నిర్వహణ సంధులు అయిదు.

చతుర్విధపురుషార్థ సాధనాత్మకమైన జీవితాన్ని నడుపుతూ, అధర్మవర్తనులను శిక్షించి, ధర్మాన్ని ఉద్ధరించి చంద్రవంశచరిత్రలో సమగ్రగుణోపేతులు కావాలని పాండవుల ధర్మవీరవ్రతం. పాండవులు పుట్టినప్పటినుండి దివ్యశక్తియుతులు కావటంచేత దుర్యోధనాదులచేత ద్వేషించబడుతూనే ఉన్నారు. ఉపాంశువధనుండి భీముడు ఎన్నోసార్లు బయటపడ్డాడు. కుమారాస్త్రవిద్యాసందర్శన ఘట్టంలో పాండవకౌరవులు వైరివర్గాలుగా చీలిపోయారు. పాండవుల నందరినీ సామూహికంగా చంపాలనే పన్నాగంలో భాగంగా దుర్యోధనుడు పన్నిన లాక్షాగృహదహన వ్యూహంవలన పాండవులకు కౌరవులు దాయాదులైనా ప్రబలశత్రువులుగా పరిణమించారు. ద్రౌపదీవివాహానంతరం పాండవులకు క్రొత్తగా ఏర్పడిన బంధుమిత్రుల బలాన్నీ, బలగాన్నీ గమనించి కౌరవులు పాండవులకు రాజ్యంలో భాగ మివ్వటంతో పైకి సయోధ్యతలు కుదిరినా అంతశ్శైత్యాలు అట్లాగే ఉండిపోయాయి. ఆదిపర్వం ముగిసేనాటికి శ్రీకృష్ణుడి ప్రేరణచేత విశ్వకర్మ నిర్మించియిచ్చిన ఇంద్రప్రస్థంలో పాండవులు ప్రజారంజకులుగా ప్రకాశిస్తూ ఉన్నారు. కథలో బీజారంభాల ప్రకాశనం ప్రకృష్టంగా జరిగింది. ముఖసంధి ముచ్చటగా రూపుకట్టింది.

సభాపర్వంలో ధర్మరాజు పాండురాజాదులకు ఉత్తమగతులు కలగటానికి రాజసూయం తలపెట్టాడు. శ్రీకృష్ణుడి సహాయంతో మయసభను పొందాడు; జరాసంధుడిని వధించి వివిధదేశాధిపతులకు విముక్తిని ప్రసాదించి వారిని మిత్రులుగా చేసికొన్నాడు. నలుగురు తమ్ములతో నాలుగుదిక్కులను జయించి అపారసంపదను గడించాడు. రాజసూయాన్ని శాస్త్రోక్తంగా నిర్వహించి, శ్రీకృష్ణుడిని పూజించి, శిశుపాలుడి అడ్డు తొలగించి, సమ్రాట్టుగా సత్కీర్తిని సంపాదించాడు. ధర్మరాజుజీవితంలో రాజసూయం ఒక మహాయోగం!

ధర్మరాజుచరిత్ర రెండుయజ్ఞాలతో ప్రకాశించిన ప్రఖ్యాతేతివృత్తం; ఒకటి రాజసూయం, మరొకటి అశ్వమేధం. ధృతరాష్ట్రుడు, భీష్ముడు, ద్రోణుడు, కృపాశ్వత్థామలు, దుర్యోధనాదులు ఉండగా ధర్మజుడు స్వతంత్రించి సమ్రాట్టుగా ప్రకాశింపచేసిన యజ్ఞం రాజసూయం. దానివలన ఇహంలో ప్రజలు, పరంలో పాండురాజు లాభించారు. కాని, భవిష్యత్తులో విస్తారంగా ప్రజాక్షయ మయ్యే మహాయుద్ధం జరిగే ప్రమాదం ఏర్పడింది. దానికి చూళికవలె జ్వలించి, పాండవవైభవాన్ని చూచి దుర్యోధనుడి గుండెలో రగిలిన ఈర్ష్యాగ్ని పాండవులకు అష్టకష్టాలు కలిగించింది. మయసభలో ఎంత ఐశ్వర్యాన్ని పొందాడో ధర్మరాజు మాయాద్యూతసభలో అంత కోల్పోయాడు. తననూ తన తమ్ములనూ భార్యనూ జూదంలో ఓడిపోయాడు. పాంచాలి నిండుసభలో అవమానించబడింది. వస్త్రాపహరణ సమయంలో ఆమెను శ్రీకృష్ణుడు రక్షించాడు. దుశ్శకునాలు వెలువడ్డాయి. ధృతరాష్ట్రుడు గాంధారీవిదుర ప్రేరితుడై ద్రౌపదికి వరాలరూపంగా రాజ్యాన్నంతా ఇచ్చి దాసదాసీత్వాలను తొలగించాడు. పునర్ద్యూతంలో కూడా ధర్మజుడు ఓడిపోయి తమ్ములతో భార్యతో కూడి అరణ్య అజ్ఞాతవాసాలు చేయటానికి పూనుకొన్నాడు. శకునిమాయవలన దుర్యోధనుడు అతిసులభంగా అనంతసంపదను సంపాదించి అడ్డులేని అహంకారంతో వ్యవహరించాడు. అతడి దుష్ప్రవర్తనాన్ని ఎవ్వరూ ఆపలేకపోయారు. వికర్ణవిదురాదులు ధర్మంచెప్పబోయి మాటపడ్డారు. పాండవులు వెంటనే ప్రతీకారం తీర్చికొనే అవకాశం లేకపోయినా, భవిష్యత్కాలంలో జరిగే భయంకరమైన యుద్ధంలో ధార్తరాష్ట్రులనందరినీ, కర్ణశకునులను చంపుతామని భీమాదులు భీకర ప్రతిజ్ఞలు చేశారు. సభాపర్వంలోని ప్రథమాశ్వాసంలో ధర్మతేజం సముజ్జ్వలంగా ప్రకాశించింది. ద్వితీయాశ్వాసంలో కుత్సిత స్వార్థ దురహంకారం అసూయాగ్నితో విజృంభించి

ధర్మతేజాన్ని చుట్టుముట్టింది. రెండురకాల విరుద్ధ విచిత్ర శక్తుల మహాప్రతాపం ప్రజ్వరిల్లింది. ఆదిపర్వంలో ఆరిపోయినట్లు కనిపించిన పాండవ కౌరవద్వేషం సభాపర్వంలో కార్చిచ్చువలె రగులుకొని వ్యాపించి ధార్తరాష్ట్రవనాన్ని కాల్చటానికి పూనుకొన్నది. అరణ్యవాసమంతా పాండవులు కౌరవులపై పగసాధించి విజయం పొందటానికి కావలసిన తపస్సంపదను, శస్త్రాస్త్ర సంపదను పొందటానికే వినియోగించుకొన్నారు. ఆపైన కురుక్షేత్రయుద్ధంలో ధార్తరాష్ట్రులను చంపి, ప్రతిజ్ఞ లన్నీ నెరవేర్చి విజయాన్ని పొందారు. అంటే- రాజసూయంలో ధర్మరాజు సంపాదించిన వైభవాన్ని, తీవ్రయత్నంతో యుద్ధానంతరం తిరిగిపొందా డన్నమాట!

యుద్ధానికి పూర్వం రాజసూయంలో ధర్మరాజు సమ్రాట్టు. యుద్ధానంతరం అశ్వమేధంలో మరల సమ్రాట్టు. ఈ రెండు యాగాలూ అతడి చరిత్రలో రెండు మహర్దశలు. ఈ రెండింటి నడుమ సాగిన సంఘర్షణ భారతంలోని ప్రధానకథ. అందులో 'బిందువు' మాయాద్యూతం. 'యత్నం' పాండవ శపథాలు. అందువలననే ఆదిపర్వం ముఖసంధి కాగా, సభాపర్వం ప్రతిముఖసంధి అవుతుంది.

ధర్మరాజు ధర్మతరువుగా యౌవరాజ్య పట్టాభిషేకంతో నిలిచాడు. కాని, రాజసూయంలోమాత్రమే కొమ్మలు సాచి విస్తృతినీ, వైభవాన్నీ ప్రదర్శించకలిగాడు. ఆదిపర్వంలో భీమార్జునుల బలపరాక్రమాలు ప్రకటితా లైనాయి. సభాపర్వప్రథమాశ్వాసంలో దిగ్విజయసాధనలో తమ్ములప్రతాపం ప్రకాశితమైనది. ధర్మం, శ్రీకృష్ణుడు, ధౌమ్యుడు, ధర్మజుడి ఔన్నత్యానికి మూలబలంగా నిలిచారు. భూతలంమీద నున్న రాజులందరి మ్రొక్కు లందుకొన్న ధర్మరాజు మూర్తికట్టిన ధర్మంగా కీర్తించబడ్డాడు. "రామో విగ్రహవాన్ ధర్మః" అని శ్రీరామచంద్రుడు ప్రశంసితు డైనట్లే 'ధర్మజో విగ్రహవాన్ ధర్మః' అని యుధిష్ఠిరుడు ప్రఖ్యాతి నొందాడు. పుష్పఫలాలతో చేవతో పెరిగిన ధర్మ మహాకల్పవృక్షం ధర్మరాజు. యజ్ఞదీక్షితు డైన ధర్మజుడు మూర్త మైన ధర్మ మని కీర్తించాడు నన్నయ.

ఉ. "సమ్మదమంది చూచిరి భృశంబుగ భూజను లెల్ల బ్రహ్మతే
జమ్మును రాజతేజమును సద్బహుభూషణరత్నరాజితే
జమ్మును విస్తరించుచు నిజద్యుతి యొప్పఁగ మూర్త మైన ధ
ర్మమ్మునుబోలె నున్న గుణమండితు దీక్షితు ధర్మనందనున్." **(సభా. 1.290)**

మహాభారతంలో ప్రతినాయకు డైన దుర్యోధనుడు మూర్తీభవించిన క్రోధం. రోషమయమహాతరువు. క్రోధప్రధానుడు- ఉద్ధతుడు, అర్థ పురుషార్థ సాధకుడు, అధర్మరతుడు, ఆత్మశ్లాఘానిరతుడు, కపటి, నయవంచకుడు కావటం సహజం. కణికనీతి బోధతో దుర్యోధనుడు రోషవృక్షంగా అవతరించాడు. అతడికి కర్ణుడు చేవగల స్కంధం అయ్యాడు. కుమారాస్త్రవిద్యా ప్రదర్శనంలో ఆ చెట్టుకు ఆ బోదె సిద్ధించింది. శకుని మాయోపాయాలు ఆ చెట్టుకు కొమ్మలు. లాక్షాగృహదహనం, మాయాద్యూతం, అనుద్యూతం ఆ కొమ్మల విలాసాలు. శకుని దుర్మంత్రానికీ, దుర్యోధనుడి అసూయాగ్రహాలకూ అనుస్పందించి, అనుమతించి, కపటనాటకం ఆడగలిగిన రెండునాల్కల ధృతరాష్ట్రుడు ఆ చెట్టుకు మూలబలం. అది శ్రీకృష్ణుడంతటి దృఢమైనది కాదు. భయ మోహాలచేత కంపించిపోయేది. అందువలన రోషతరువు ఎప్పటికైనా కూలేదే. ధృతరాష్ట్రుడివలన దుర్యోధను డనే చెట్టు నిలిచింది. కర్ణుడివలన చేవ తేలింది. శకునివలన విస్తరించింది. దుశ్శాసనుడివలన దుర్వాసనలను వెదజల్లింది. ధృతరాష్ట్రాదులు దుర్యోధనుడి ఈర్ష్యాగ్నిని చూచి భయపడ్డారు. శకుని ఆజ్యం పోశాడు. కర్ణుడు గాలిగా వీచి రెచ్చగొట్టాడు. దుశ్శాసనుడు జ్వాలాజిహ్వలవలె పెచ్చుపెరిగి శత్రువులను అవమానాలతో దహించాడు. భీముడు చేసిన ప్రతిజ్ఞలు దుర్యోధన దుశ్శాసనులను సంహరించటానికి ఉద్దేశించబడినవి. వాటికి బలమైన హేతువు కర్ణుడు. ద్రౌపదికి జరిగిన ఘోరమైన పరాభవానికి కారణం కర్ణుడి మాటలూ, సూచనలే. నిండుసభలో బంధకిని వివస్త్రను చేసినా తప్పులేదన్నదీ, జూదంలో ఓడని ఆరవ భర్తను ఎన్నుకొనుమని అవహేళనం చేసిందీ కర్ణుడే. అతడి మాటలు, దుర్యోధనుడు పాండవ ధర్మపత్నిని తన తొడపై కూర్చొను మని చేసిన సైగలు, దుశ్శాసనుడు లజ్జలేక ఆమె శిరోజాలు పట్టి లాగి వస్త్రాపహరణం చేసిన దుశ్చర్యలు భావికాలంలో పాండవుల మనస్సులలో ములుకులై బాధించి ప్రతీకారజ్వాలలను ప్రజ్వలింపచేశాయి.

దుర్యోధనుడి దౌష్ట్యవిశ్వరూపం చూడగలిగిన పర్వం సభాపర్వమే! అర్థలోభంవలన కల్పవృక్షాలనుసైతం బొగ్గులకొరకు కాల్చే అంగారకారుడివంటి కరుణారహితుడు దుర్యోధనుడు. విదురుడు ధృతరాష్ట్రుడితో అన్నమాటలలో-

మధ్యాక్కర.

"అంగారములు గొనువేడ్కఁ బుష్పఫలావళీలలిత
తుంగద్రుమప్రకరంబుఁ గరుణావిదూరుఁడై కాల్చు
నంగారకారుఁ బోలంగ సమకట్టె నర్థలోభంబు
నం గురుకులహానికరుఁడు ధారుణీనాథ! నీసుతుఁడు." **(సభా. 2.182)**

ఈవిధంగా ధర్మవృక్ష రోషవృక్ష సమగ్ర విస్ఫూర్తులు సభాపర్వంలో రూపుకట్టాయి.

### సభాపర్వం: నామసార్థక్యం

ఆంధ్రమహాభారతంలోని అష్టాదశపర్వాలలో రంగస్థలసూచకా లైనవి సభాపర్వం, అరణ్యపర్వం, విరాటపర్వం, ఉద్యోగపర్వం. సభలను ఆలంబనంగా చేసికొని ప్రవర్తిల్లిన పాండవ జీవితవృత్తాన్ని అధికరించి చెప్పేది సభాపర్వం. వనవాసవ్రతాన్ని నిర్వహిస్తూ అరణ్యాలలో గడపిన పాండవ జీవిత విశేషాలను ఆయా ఘట్టాలలో వివరించేది అరణ్యపర్వం. విరాటనగరంలో మారువేషాలతో ఎవ్వరికీ తెలియరాకుండ అజ్ఞాతవాసాన్ని పాండవులు నిర్వహించిన ఆసక్తికరమైన కథను వివరించేది విరాటపర్వం. ఉపప్లావ్యంలోని ధర్మరాజు సభలోనూ, హస్తినాపురంలోని ధృతరాష్ట్రుడి సభలోనూ దూతకార్యాలు నాటకీయంగా నిర్వహించే వస్తువు కలది ఉద్యోగపర్వం. ఇవి వేర్వేరు పర్వాలుగా కనపడుతున్నా తత్త్వతః ఒక్కటే మహాపర్వం అనవచ్చును. సభాపర్వంలో జరిగిన కథకు అనుబంధాలే అరణ్య విరాట ఉద్యోగాలు. ఉద్యోగపర్వం ఆది సభాపర్వ కథార్థాల పునర్విచారణమే. అందులోనూ పాండవ కౌరవ సభలలో దౌత్యాలు నడుస్తాయి. కురుక్షేత్రయుద్ధానికి శంఖాలు పూరించబడతాయి. ఈవిధంగా భారతంలోని ఆది పంచకంలో సభలు కీలకపాత్రలు నిర్వహిస్తున్నాయి. ఆ యా సభలలో సాగిన కథార్థాలకు మూల మైనది మయసభ. అది దివ్యసభ. దానికి ప్రతిగా ధృతరాష్ట్రుడు నిర్మించింది మణిమయ (ద్యూత)సభ- ఫలితాలనుబట్టి చూస్తే అతడి సంతానానికి యమసభ. పుణ్యం ప్రోగుచేసింది మయసభ. పాపం మూటకట్టింది ధృతరాష్ట్రసభ. 'అత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫల మశ్నుతే' అన్న న్యాయానికి ఆ సభలు బొమ్మాబొరుసులు!

సభాపర్వంలోని రెండుసభలూ, ఉద్యోగపర్వంలోని రెండుసభలూ శ్రీకృష్ణ మహిమలకు వ్యంజకాలుగా నిలవటం పాండవుల దైవీసంపదకు నిదర్శనం. 'ధర్మో రక్షతి రక్షితః' అనే న్యాయాన్ని అనుసరించి శ్రీకృష్ణుడు ధర్మరక్షకుడుగా పాండవులను నాలుగురకాలుగా ఆదుకొన్నాడు నాలుగుసభలలో. రాజసూయయాగంలో మయసభలో ధర్మజుడిని సమ్రాట్టుగా నిలిపింది శ్రీకృష్ణుడే. అతడి వ్యూహబలమే ధర్మజుడి మూలబలం. ధృతరాష్ట్రనిర్మిత మైన సభలో అంతసంపదను ఆ విధంగా మాయాద్యూతంలో కోల్పోతున్న సందర్భంలోకూడా ధర్మజుడుకాని, అతడి తమ్ములుకాని శ్రీకృష్ణుని స్మరించలేదు. బలవంతంగానైనా పిలువబడినప్పుడు క్షత్రియుడు జూదమాడక తప్పదనే ధర్మపన్నం చదివాడేకాని ధర్మరాజు తనకు హృదయస్థానీయు డైన శ్రీకృష్ణపరమాత్మను తలంచనేలేదు. కాని, విపత్తులో మునిగిన ద్రౌపది శ్రీకృష్ణుడిని స్మరించి తనను తాను ఉద్ధరించుకొనటమే కాక పాండవులను కూడ ఉద్ధరించగలిగింది. అనుద్యూతంలోకూడా ధర్మజుడికి శ్రీకృష్ణుడు తలపులో నిలువలేదు. వ్యసనమున్నచోట వాసుదేవు డుండడు కాబోలు! అయినా ధర్మాన్ని రక్షించే పాండవులను మయసభలో ప్రత్యక్షంగానూ, ధృతరాష్ట్రసభలో పరోక్షంగానూ రక్షించి శ్రీకృష్ణుడు దివ్యశక్తిని ప్రదర్శించాడు.

ఉద్యోగపర్వంలో ఉపప్లావ్యంలోని ధర్మజుడిసభలో తీర్పరిగా నిలిచి సంజయురాయబారంలోని బండారాన్ని బయటపెట్టాడు. హస్తినాపురసభలో మధ్యవర్తిగా నిలిచి ధార్తరాష్ట్రుల అధర్మప్రవృత్తినీ, పాండవుల నీతివర్తనాన్నీ లోకంలో ప్రకటమయ్యేటట్లు వర్తించి నైతికమైన విజయాన్ని పాండవులకు సాధించిపెట్టాడు.

సభాపర్వంలో శ్రీకృష్ణుడు పాండవులకు యోగదాయకుడు. ఉద్యోగపర్వంలో క్షేమకారకుడు. ఇది సభల కథలవలన ప్రతీయమానమయ్యే ప్రబంధధ్వని.

మయసభ ఇంద్ర, యమ, వరుణ, కుబేర, బ్రహ్మసభలకంటె మనోహరంగా ఉన్నదని నారదుడు చెప్పటం యథార్థంగా కథార్థంగా నిలిచినా, పాండురాజు యమసభలో, హరిశ్చంద్రుడు ఇంద్రసభలో ఉండట మెందు కనే ప్రశ్న ధర్మజుడికి పుట్టటం, పరమార్థంగా పాండురాజు ధర్మరాజును రాజసూయం చేయుమని ఆదేశించిన వార్తచెప్పటానికి పోషకంగా, హరిశ్చంద్ర మాహాత్మ్యాన్ని చెప్పటానికి ఉపాయంగా సాగింది సభాప్రశంస. మయసభ రాజసూయసంకల్పానికి రంగమై నిలిచింది. రాజసూయసంకల్పం ప్రజాక్షయాన్ని కలిగించే మహాయుద్ధానికి పూర్వరంగమై తారసిల్లింది. ఎంతోసేపు ఆలోచించి మయసభా నిర్మాణాన్ని సూచించిన శ్రీకృష్ణుడిసంకల్పంలోనే మహాభారతయుద్ధప్రయోగానికి ప్రరోచనం జరిగింది.

సభాపర్వాని కున్న ఇన్నిరకాల ప్రాముఖ్యాన్ని నన్నయ సారమతిగా భావించి, రంగస్థలప్రాధాన్య మున్న కథలోని సన్నివేశ చారుత్వాన్ని వివేచించి, నాటకీయతను ప్రసన్నకథాకలితార్థయుక్తితో మేళవించి, అపూర్వఫణితిలో రచించాడు. అంటే- శ్రవ్యకావ్య మర్యాదలలో దృశ్యకావ్యమర్యాదలను ప్రవేశపెట్టి రూపకమర్యాదావిశిష్టమైన కావ్యకళను ఇతిహాసేతివృత్తంలో నిబంధించా డన్నమాట. ఆంధ్రమహాభారతాన్ని కావ్యేతిహాస మనే మిశ్రప్రక్రియలో రచించటమే కాకుండ శ్రవ్య దృశ్య కావ్య మిశ్రప్రయోగాన్ని సాధించి నన్నయ తన ప్రత్యేకతను ప్రదర్శించాడు. అందుచేతనే సభాపర్వం- 'పండిత చేతో నిర్వృతి' చేస్తూ 'రమ్యం'గా ఉంటుందన్నాడు నన్నయ పర్వసంగ్రహంలో. (ఆది. 1.38) 'కావ్యేషు నాటకం రమ్యం' అనికదా ఆర్యోక్తి!

## నన్నయరచనలో నాటకీయత

'నాటకీయత' అనంగానే తెలుగులో తిక్కనసోమయాజి జ్ఞాపకం వస్తాడు. కాని, తిక్కనకుకూడ మార్గదర్శి నన్నయభట్టారకుడే. నన్నయ నాటకీయతకు మార్గంవేసి మనోజ్ఞంగా చూపించాడు. తిక్కన దానిని ఘంటాపథంగా మార్చి రసవంతంగా అలంకరించాడు.

శ్రవ్యకావ్యంలో నాటకీయతను వివేచించటానికి నన్నయరచనాశిల్పం బాగా తోడ్పడుతుంది. ఈ క్రింది అంశాలు అందులో ముఖ్యంగా పరిగణించదగినవి.

1. **రంగపరికల్పన:** కథలో ప్రదర్శన కనుకూలంగా ఉండే ఘట్టాలను గుర్తించి, వాటిని నిర్వహించేటప్పుడు కథాకథనంకంటె పాత్రల చేష్టలకు సంభాషణలకు ప్రాధాన్యం కలిగించి, ఒక నాటకరంగాన్ని చూస్తున్న అనుభూతిని పఠితలకు కలిగించటం.

2. **దశరూపకవివేకం:** కథలో వచ్చే ఉపాఖ్యానాలనుకాని, రసవత్తరఘట్టాలనుకాని లోతుగా పరిశీలించి, వాటి నిర్మాణ స్వభావాలనుబట్టి దశవిధరూపకాలలో వేటికైనా దగ్గరగా ఉన్నాయేమో వివేచించి, ఆ యా రూపకలక్షణాలు అచ్చుపడేటట్లు వాటిని రూపొందించటం.

3. **చతుర్విధాభినయవిన్యాసం:** దృశ్యకావ్యం అభినయప్రధాన మైనది. అభినయం నాలుగువిధాలు. ఆంగికం, ఆహార్యం, వాచికం, సాత్త్వికం. శరీరావయవాలవలన ప్రకటితమయ్యే హావభావముద్రల విన్యాసం ఆంగికం. వేషభూషాదులవలన వ్యక్తమయ్యే భావవిన్యాసం ఆహార్యం. వాక్యవిన్యాసంతో పాత్రోచితంగా, సందర్భోచితంగా, రసోచితంగా సాగే సంభాషణశిల్పంవలన వ్యక్తమయ్యే భావవిన్యాసం వాచికం. సమాహితచిత్తం సత్త్వం. దానినుండి పుట్టిన అభినయం సాత్త్వికం. కంప స్వేదరోమాంచ వైవర్ణ్యస్తంభాదులవలన వ్యక్తమయ్యే భావవిన్యాసం సాత్త్వికాభినయం. ఈ నాలుగురకాల అభినయాలకు ప్రాధాన్యం కలిగించే వర్ణనలను కావ్యంలో ప్రవేశపెట్టటంవలన నాటకీయత రక్తికట్టుతుంది.

4. **రసపోషణ:** శ్రవ్యకావ్యంలో శబ్దార్థ, అలంకార, గుణ, రీతి, వృత్తులను రసాభివ్యక్తికి అనుకూలంగా, పోషకంగా నిర్వహించటంవలన రసదీప్తి కలుగుతుంది. నాటకంలో రచనకంటె కథ కెక్కువ ప్రాముఖ్యం ఉంటుంది. కథలో నాయకుడు కాని, ప్రధానపాత్రకాని, లేదా వ్యక్తివంటి శక్తికాని ఒక ప్రధానకార్యాన్ని ఆరంభించి నిర్వహించటంలో స్థాయి భావోత్కటస్థితిని నిర్వహించటంద్వారా రసపోషణం చేయటం దృశ్యకావ్య మర్యాద. కథా కార్యపరంగానూ,

కవితాపరంగానూ నాయకాశ్రిత మైన స్థాయిభావాన్ని పోషించి రసాభివ్యక్తిని కలిగించటం నాటకీయతలో గోచరించే శిల్పం. అంటే అది శ్రవ్య దృశ్య రసపోషణ విధానాల సమష్టిశిల్ప మన్నమాట!

5. **నాటకరచనాంగాల ప్రకాశనం:** సంధి, సంధ్యంగాలు, వృత్తులు, పతాక, గండం, పూర్వాపరకథార్థసూచన, మొదలైన నాటకరచనాంగాలను యథావకాశంగా ఆ యా సందర్భాలకు సముచితంగా సమకూర్చటం.

సభాపర్వంలో సహజంగా నాలుగుఘట్టాలు నాటకీయతకు అనుగుణంగా అమరి ఉన్నాయి. అవి- జరాసంధవధ, శిశుపాలవధ, మాయాద్యూతం (ద్రౌపదీవస్త్రాపహరణం), దుర్యోధనుడి భంగపాటు. మొదటి మూడూ స్వయంసమగ్రమైన కథలుగా, నాటకాలుగా, హరికథలుగా, జానపదకళారూపాలుగా లోకంలో ప్రచారం పొందిఉన్నాయి. తెలుగువారిరంగప్రక్రియలలో ఏకపాత్రాభినయం ఇప్పుడు ఎనలేని ప్రచారం పొందిఉన్నది. ఆ ప్రక్రియలో ప్రథమతాంబూలం అందుకొనేది మయసభలో దుర్యోధనుడి భంగపాటు. పాండవులు మయసభలో జీవించిన వృత్తాంతాలు విశేషాలు తెలుగువారి కంతగా తెలియవు కాని, దుర్యోధనుడు మయసభలో ఉన్న ఆ మధుర(విషమ)క్షణాలు చరిత్రలో కలకాలం కళాత్మకంగా నిలిచిపోయాయి. ఈ ఘట్టాలన్నీ ఇంత రక్తికట్టటానికి కారణం ఏమిటి? అని ప్రశ్నించుకొంటే- నన్నయ ఆ సన్నివేశాలను నాటకీయంగా దిద్ది తీర్చిన శిల్పమే- అని సమాధానం వస్తుంది. నేటికీ పద్యనాటకాలలో సైతం ఆ యా ఘట్టాలలో నన్నయ వ్రాసిన పద్యాలే ఒరవళ్ళుగా, ఒజ్జబంతులుగా నిలుస్తున్నాయి- అంటే నన్నయరచనలో నాటకీయత ఎంత గొప్పదో స్పష్టమౌతుంది.

సభాపర్వంలో పురుషులే పాల్గొన్న యుద్ధప్రాయా లైన సన్నివేశాలు ఎక్కువగా ఉండటంచేత నన్నయ వ్యాయోగ, సమవకార, డిమాలనే రూపకాలలక్షణాలు అచ్చుపడిన శ్రవ్యకావ్య ఘట్టాలుగా వాటిని గుర్తించి, ఆ రూపకచ్ఛాయలు ముద్రిత మయ్యేటట్లు దిద్దితీర్చి నాటకీయతను పోషించాడు. ఆది సభారణ్యపర్వ కథాఘట్టాలలో శ్రీకృష్ణుడు, భీముడు, అర్జునుడు శత్రువులతో తలపడి వారిని వధించిన ఆయా సన్నివేశాలు రూపక ప్రయోగప్రాయాలే. శ్రీకృష్ణుడు శిశుపాలుడిని వధించాడు; భీముడు జరాసంధుడిని ఈ పర్వంలోనే చంపాడు; ఆదిపర్వంలో హిడింబుడిని, బకుడిని, అరణ్యపర్వంలో కిమ్మీరుడిని వధించాడు; కృష్ణార్జునులు ఖాండవదహనాన్ని చేశారు; ఆదిపర్వంలోని కుమారాస్త్రవిద్యాప్రదర్శన సందర్భంలో భీమార్జునులు దుర్యోధనకర్ణులతో తలపడ్డారు.

వాటిలో శ్రీకృష్ణుడు చేసిన శిశుపాలవధను నాట్యశాలలో ప్రదర్శించిన సమగ్రసుందర మైన వ్యాయోగంగానూ, కుమారాస్త్ర విద్యాప్రదర్శనను బహిరంగ ప్రదేశంలో ప్రదర్శించిన వ్యాయోగంగానూ నన్నయ తీర్చిదిద్ది ప్రకరణ గౌరవాన్ని సమున్నతంగా నిలిపాడు. ఆ తరువాత భీమనాయకమైన రాక్షసవధ ఘట్టాలను వీరరౌద్రరసరమ్యంగా సమవకారాలుగా చిత్రించాడు. మాయాద్యూత ఘట్టంలో డిమ లక్షణాలను సమగ్రంగా నిలిపి రసవత్తరంగా నాటకీయతను పోషించాడు. అంతేకాదు, స్వతంత్రోపాఖ్యానాలుగా లెక్కించదగిన యయాతి, దుష్యంత, నలమహారాజులచరిత్రలలో నాటకలక్షణాలను అచ్చుపడేటట్లు రూపొందించాడుకూడ నన్నయ. ఈవిధంగా నన్నయ రచనలో తొమ్మిదిఘట్టాలలో దశరూపకప్రయోగనాటకశిల్పాన్ని దర్శనీయమయేటట్లు స్పష్టంగా చిత్రించి తెలుగుకావ్యరచనలో నాటకీయతను పోషించటం ఒక అనివార్యలక్షణంగా భావితరాలకు సూచించాడు; తిక్కనాదులకు త్రోవచూపించాడు. ఇంతేకాక దుర్యోధనుడు మయసభను దర్శించి భంగపడిన ఘట్టం తెలుగువారికి 'ఏకపాత్రాభినయ'మనే ప్రక్రియకు పురుడుపోసింది. అందులో వర్ణ్యవస్తువు, రచనాశైలి నన్నయ చూపించిన బాటలోనే నడవటం ఒక సంప్రదాయమైపోయింది. ఈ విధంగా రెండున్నర పర్వాలలో పదిదృశ్యకావ్యశిల్పాలను ప్రదర్శించటం సామాన్యమైన విషయం కాదు.

కథాస్వభావాన్నిబట్టి రూపకచక్రాన్ని అమర్చి శ్రవ్యకావ్యంలో దృశ్యకావ్యదర్శనం చేయించటం నన్నయనాటకీయత. మూలంలోని వస్తువును రూపకమర్యాదలకు అనువుగా మలచుకొని పునర్నిర్మించటంలోనూ, కథాకథనసంభాషణాదుల నిష్పత్తిని సవరించుకొని సంవిధానంచేయటంలోనూ, నన్నయ నాటకీయతనుకూడా దృష్టిలో ఉంచుకొనటంవలన ఆంధ్రమహాభారతం పునస్సృష్టిగా గోచరించింది. నన్నయరచనలోని నాటకీయత వ్యాసుడిలో లేదా? అని కొందరు ప్రశ్నిస్తారు. అందుకు శ్రీ ఎస్వీ.భుజంగరాయశర్మగారి సమాధానం గమనించతగింది- "ఈ నాటకీయత సంస్కృతభారతంలో లేదా అని

ప్రశ్న. సంస్కృతభారతంలోనూ- ఉంది. ఫోకస్ తప్పిన ఫోటోగ్రాఫ్‌లా, బూజర బూజరగా! నన్నయగారి కున్నంతటి స్పష్టమైన నాటకీయదర్శనం వ్యాసునిలో కనపడదు. ఎన్ని శిల్పాలకో ఒరవడిపెట్టినట్లు నాటకీయశిల్పానికికూడా తెలుగులో ఒరవడిపెట్టింది నన్నయగారే అనుకొంటాను.'' (నన్నయభారతి- వ్యాససంకలనం- ప్రథమసంపుటి. నన్నయనాటకీయత (వ్యా.) పు.561)

నన్నయనాటకీయతలో ఆకృతిశిల్పం అగ్రతాంబూలం అందుకొంటుంది; తిక్కననాటకీయతలో అభినయశిల్పం అగ్రస్థానంలో నిలుస్తుంది. నన్నయనాటకీయత ప్రయోగసంబంధి; తిక్కననాటకీయత ప్రదర్శనసంబంధి.

### శిశుపాలవధ - సమగ్రవ్యాయోగప్రయోగం

ఆంధ్రమహాభారత సభాపర్వ ద్వితీయాశ్వాసారంభంలో శిశుపాలవధఘట్టాన్ని నన్నయ 72 పద్యగద్యాలలో రచించాడు. ధర్మజ రాజసూయాధ్వరంలో శ్రీకృష్ణుడిని పూజించే ప్రతిపాదనంతో ప్రారంభమైన ఈ ఘట్టం శిశుపాలవధానంతరం యజ్ఞసమాప్తితో ముగుస్తున్నది. (సభా. 2.1-72)

శిశుపాలవధ కథాఘట్టంలో దశరూపకాలలో ఒకటైన 'వ్యాయోగం' అనే రూపకలక్షణాలు * అధికంగా అమరి ఉన్నాయి. యుద్ధప్రాయమైన వ్యాయోగంలో పురుషులే వర్తిస్తారు కాబట్టి దాని కా పేరు వచ్చింది. దానిలక్షణాలు ఈ కథాఘట్టానికి సమన్వయిస్తున్నాయి. ఇందులోని వస్తువు ప్రఖ్యాతమే. నాయకుడు ప్రసిద్ధుడే. స్త్రీ పాత్ర లేనే లేదు. ఇందులో వీరరసం అంగి, రౌద్రరసం అంగం. శిశుపాలాదుల పరుషవాక్యాలతో నిండిన రణవిజృంభణం, భీష్మకృతధిక్కారవచనాలు, భీమసహదేవుల రౌద్రోద్రేకం, శ్రీకృష్ణుడి పౌరుషపరాక్రమ ప్రదర్శనం, ధర్మజుడి నయనీతివర్తనం- ఈ ఘట్టంలో బహుపురుషుల యుద్ధాభిముఖ్యాన్ని గోచరింపజేస్తున్నవి. కాబట్టి శ్రవ్యకావ్యమర్యాదలలో ఒదిగియున్న వ్యాయోగంగా ఈ ఘట్టం సహజస్వభావాన్ని సంతరించుకొని ఉన్నది. నన్నయ ఈ రహస్యాన్ని గుర్తించి ఆ యా రూపకలక్షణాలు ప్రస్ఫుట మయ్యేటట్లు రచించి, తన కథాకథనకౌశలానికి ఒక వైశిష్ట్యాన్ని సంతరించుకొన్నాడు.

నాందీప్రయోగం సర్వరూపకసామాన్యలక్షణం. 'ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశోవాఽపి తన్ముఖమ్' అని దానినియమం. ఆశీర్నమస్క్రియలలో ఏదో ఒకదానిని ఎన్నుకొని వస్తునిర్దేశాన్నిమాత్రం తప్పక పాటించటం రూపకరచయితల పరిపాటి. అది శబ్దంచేత కాని, అర్థంచేత కాని సూచించబడవచ్చును. నన్నయ ఈ అదను కనిపెట్టి సభాపర్వ ద్వితీయాశ్వాసారంభంలో కృతిపతిని సంబోధించే పద్యాన్నే నాందిగా తీర్చిదిద్దాడు. ఇది ఒక అపూర్వమైన నాటకీయరచనాప్రయోగం.

క. ''శ్రీరమణీప్రియ! ధర్మవి
శారద! వీరావతార! సౌజన్యగుణా
ధార! భువనైకసుందర!
వీరశ్రీరమ్య! బుధవివేకనిధానా'' **(సభా. 2.1)**

ఇందులోని సంబోధన లన్నీ బహువ్రీహులై అన్యపదార్థ మైన రాజరాజనరేంద్రు డనే అర్థాన్ని కలిగిస్తున్నాయి. ఈ పద్యం నన్నయ రాజరాజును సంబోధిస్తూ చెప్పిందని తెలియపరచకుండా ఏ పఠితకైనా వినిపిస్తే ఇది రాజరాజు నుద్దేశించిన దని తెలియటం కష్టం! ఈ పద్యంలో సంబోధనం కాదు కావ్యార్థసూచనం ముఖ్యం.

కావ్యార్థసూచనంలో కథార్థాలను సూచించటం ఒక పద్ధతి. కావ్య పాత్రలపేర్లను నిర్దేశించి ముద్రాలంకారంగా నాందీపద్యాన్ని రచించటం మరొకపద్ధతి. నన్నయ రెండవదానిని పాటించాడు. ఈ కథాఘట్టంలో నాయకపక్షంలో కానవచ్చే

---

* ''వ్యాయోగస్తు విధిజ్ఞైః కార్యః ప్రఖ్యాత నాయక శరీరః । అల్పస్త్రీ జనయుక్త స్త్వేకాహకృత స్తథా చైవ ॥
బహవ స్తత్ర చ పురుషాః కవిభిః కార్యా యథా సమవకారే । న చ తత్రప్రమాణయుక్తాః కార్యా ఏకాంక ఏవాయమ్ ॥
న చ దివ్యనాయక కృతః కార్యో రాజర్షి నాయక నిబద్ధః । యుద్ధ నియుద్ధాక(ధ)రణ సంహ(ఘ)ర్ష కృతశ్చ కర్తవ్యః ॥
ఏవం విధాస్తు కార్యో వ్యాయోగో దీప్త కావ్య రసయోనిః''

**- భరతనాట్యశాస్త్రమ్. 16 అధ్యా. శ్లో. 142-145**

పాత్రలు ప్రధానంగా ఏడుగురు. వారిలో శ్రీకృష్ణుడు పూజనీయుడు. కాబట్టి అతడు ప్రథమగణ్యుడు. తరువాత నాయకులైన పాండవులు. ఆ తరువాత- వారికి ధర్మనిర్దేశం చేసిన కురుపితామహుడు భీష్ముడు. వీరిని చెపితే కథార్థాలను సూచించినట్లే అవుతుంది. నన్నయ నాందీపద్యరచనా సంప్రదాయంలోని ఈ విధానాన్ని ఇందులో అనుసరించాడు.

శ్రీరమణీప్రియు డంటే రమావల్లభు డైన శ్రీమహావిష్ణువు. ఇక్కడ తదవతారమూర్తి అయిన శ్రీకృష్ణుడు. ధర్మవిశారదు డంటే ధర్మాచరణకోవిదు డైన ధర్మరాజు. వీరావతారు డంటే భీముడు. ధర్మతేజమైన ధర్మరాజుకు ఆతడు కార్యసాధనంలో పురుషకారసాధకుడు, ఉత్సాహమూర్తి. సౌజన్యగుణాధారు డనే సమాసంలోని 'గుణాధార' శబ్దార్థశక్తిచేత ప్రతీయమాన మయ్యే గాండీవం, దాన్ని ధరించే పార్థుడు సూచించబడుతున్నారు. సౌజన్య(స్నేహ) గుణానికి ఆధారుడనే అర్థం స్వీకరించినా నరనారాయణ స్నేహాన్ని పురస్కరించుకొని అర్జునుడు స్ఫురిస్తాడు. సౌజన్యగుణమంటే దేవతాగుణమనీ, అందులోనూ ఇంద్రుడి గుణమనీ దానికి ఆధారమైనవాడు అర్జునుడనీ ఊహకు అందుతాడు. భువనైకసుందరు డనే విశేషణంవలన నకులుడు స్ఫురణకు తగులుతున్నాడు. స్వర్గారోహణపర్వంలో అతడి పతనానికి కారణంగా అతడి సౌందర్యగర్వాతిశయం చెప్పబడి ఉండటం గమనించదగిన అంశం. 'వీరశ్రీరమ్య' అనే విశేషణం ఈ కథాఘట్టంలోని సహదేవుడికి అన్వర్థమౌతుంది. శిశుపాలవిజృంభణంతో సంకులమైన సభను తన వీరోక్తులతో అనుశాసించి దేవతల మెప్పులను పొందిన ఆ వీరుడు పరాక్రమసంపదచేత అందమైనవా డనటం సార్థకం. అశ్వినీదేవతల వరంవలన పుట్టిన నకులసహదేవు లిద్దరూ అందమైనవారే. అయితే వారిలో అన్నకంటె తమ్ముడు రణపాండిత్యంలో రెండాకులు ఎక్కువ చదివాడు. అందువలన వీరశ్రీరమ్యుడు. ఇక- 'బుధవివేకనిధానా!' అనే సంబుద్ధి భీష్ముడిని స్మరింపజేస్తున్నది. బుధు డనగా పండితుడు. "పండానామ ఆత్మవిషయక జ్ఞానః." ఆత్మజ్ఞానవేత్త బుధుడు. అతడి వివేకం సదసద్వివేకం. సత్తు పరమాత్మ. తద్వివేకానికి నిధానమైనవాడు జ్ఞాని. భీష్ముడు అట్టి జ్ఞాని. కాబట్టే భావికథలో శ్రీకృష్ణుడి పరమాత్మతత్త్వాన్ని ఆతడు ధర్మరాజుకు నిరూపించిచెప్పాడు. ఆశ్వాసాదిపద్యాన్ని పఠితలు అంతగా పట్టించుకోరు- అందులో రసభావాలు ఉండవు కనుక. కాని, నన్నయ రచనలో అట్టి నీరసపద్యంకూడ నాటకీయ రచనాశిల్పానికి ఒక అనర్ఘపద్యరత్నమై నాందీశ్లోకగౌరవాన్ని పొందగలుగుతున్నది. మహాకవి సృష్టి అటువంటిది!

నాంది ముగిసిన తరువాత స్థాపకు డనే రెండవసూత్రధారుడు రంగంలో ప్రవేశించి ప్రస్తావన అనే పూర్వరంగప్రయోగాన్ని నిర్వహించటం రూపకసంప్రదాయం. ప్రస్తావనలోని చివరి అంశం పాత్రప్రవేశసూచనం. నన్నయ ఈ అంశాన్ని నారదపాత్రను ప్రవేశపెట్టి నిర్వహించాడు. సభాపర్వద్వితీయాశ్వాసం ఈ క్రింది వచనంతో ఆరంభమౌతున్నది:

"అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె: నట్లు రాజసూయ మహోత్సవంబు నొప్పను ధర్మరాజు ధర్మనిత్యతయును స్తుతియించి నారదుం డాసదంబున సకలరాజసమూహంబును రాజలోకంబులో మనుష్యసామాన్యుం డయియున్న జగన్మాన్యు జనార్దనుం జూచి, తొల్లి బ్రహ్మాది సురగణ ప్రార్థితుం డయి యఖిల మహీభారావతరణార్థంబు నారాయణుండు యదువంశంబున నుదయించుటయు, నయ్యయిక్షత్రియ కులంబుల సురదైత్యదానవ యక్ష రాక్షస గంధర్వాదుల యంశావతారంబులుం దలంచి భవిష్యద్భారతరణంబునకు సంహృష్టహృదయుం డయి యుండునంత"

**(సభా. 2.2)**

మహాభారతంలో నాయకుడు ధర్మరాజు. అతడు ధర్మనిరతుడు. అతడి ధర్మనిత్యతను నారదుడు మొదట స్తుతించాడని చెప్పటంచేత కథానాయకప్రశస్తిని. అంగిరస సూచనను నన్నయ చేశాడు. ఆ తరువాత అవతారపురుషు డైన శ్రీకృష్ణుడి మహత్త్వాన్ని కీర్తించాడు. అతడికి ప్రత్యర్థు లై ఉన్న రాజలోకాన్నీ, భక్తు లై ఉన్న పార్థివసమూహాన్నీ పేర్కొన్నాడు. కలహభోజనుడైన నారదుడి దృష్టి సహజవిరోధవర్గాలు బలసి ఉన్న సభపై పడిందంటే అక్కడ చిచ్చు పుట్టినట్లే. ఈ కథాఘట్టానికి సంబంధించినంతవరకు శిశుపాలుడితో జరిగే సంఘర్షణం ముఖ్యం. కాని, మహాభారతకథాదృష్టికి కురుక్షేత్రసంగ్రామం ముఖ్యం. ఆ మహాఫలాన్ని అందుకొనటానికి ఏర్పడిన కథాసోపానాలలో ఈ ఘట్టం బలమైనది. అట్లవటంచేత ప్రస్తుతసంఘర్షణను వ్యంగ్యంగానూ, భారతరణాన్ని వాచ్యంగానూ నన్నయ నారదుడితలపులో సూచ్యమయ్యేటట్లు నిబంధించాడు. పూర్వరంగప్రక్రియకును, రూపకప్రయోగప్రక్రియకును భేదం సూచించేందుకు నన్నయ ఇట్లా రచించాడు.

నన్నయ ఈ ఘట్టంలో కథాకథనాన్ని సంగ్రహంగానూ, సంభాషణలను అధికంగానూ రచించి నాటకీయతను అచ్చుపడేటట్లు చేశాడు; వాక్క్రియారూప సంఘర్షణలలో వాగ్రూప మైనదానిని అధికంగా చిత్రించాడు. శ్రీకృష్ణుడు శిశుపాలుడిని వధించిన క్రియను నన్నయ ఒకపద్యంలో చెప్పాడు. మిగిలినదంతా ధర్మజ భీష్మ శ్రీకృష్ణాదులకున్నూ, శిశుపాలునకున్నూ నడుమ జరిగిన వాగ్వివాదమే. కాబట్టి ఈ ఘట్టంలో సంభాషణలు ఉద్దీప్తాలై, శక్తిమంతాలై, పూర్వాపరసమన్వయ సంబద్ధాలై సంఘర్షణను సృష్టింపజేయగలిగినట్టివిగా రూపొందించటంలోనే నాటకీయరచనాశిల్పం రాణించ వీలౌతున్నది. నన్నయ దానిని నిపుణంగా నిర్వహించాడు.

నిజానికి ఈ ఘట్టంలో చెప్పుకొనదగిన కథే లేదు. రాజసూయం ఉత్తమపూజతో ముగియాలి. అట్టి ఉత్తముడు శ్రీకృష్ణ డని భీష్ముడు ప్రతిపాదించాడు. ధర్మజుడు అతడిని పూజించాడు. కార్యం అంతటితో ముగియనుండగా శిశుపాలుడు 'శ్రీకృష్ణుడు పూజార్హుడు కా'డని అధిక్షేపించాడు. అతడు ధర్మజుడితో, భీష్ముడితో వితండవాదం చేశాడు. వారు యథాశక్తి నయానా భయానా అతడిని ఒడబడేటట్లు చేయటానికి యత్నించారు. అతడు సభను వెలువడి యుద్ధసన్నద్ధు డైనాడు. యజ్ఞదీక్షితు డైన ధర్మజుడు యుద్ధంచేయటానికి వీలు లేదు. పైపెచ్చు అతడు రాజలోకాన్ని ఆహ్వానించిన యజమాని. భీష్ముడు సమర్థుడే. అతడినికూడా శిశుపాలుడు పడతిట్టాడు. కాని, శిశుపాలుడిమరణం శ్రీకృష్ణుడిచేత వ్రాయబడిఉన్నదని తెలిసిన విజ్ఞు డాతడు. అందువలన భీష్ముడు శ్రీకృష్ణుడి మాహాత్మ్యాన్ని కీర్తించటమే కాకుండా, అతడిని శిశుపాలవధోన్ముఖుడిగా పురికొల్పాడు. పూజ గైకొన్న పురుషోత్తముడే తన ఉత్తమత్వాన్ని స్థాపించుకొనవలసివచ్చింది. చేసిన వాగ్దానాన్ని అనుసరించి శ్రీకృష్ణుడు శిశుపాలుడిని చంపవలసివచ్చింది. దానితో యజ్ఞం సమాప్త మైనది. పాండవులకార్యం సఫల మైనది. ఈ ఘట్టంలో 'శ్రీకృష్ణుడు పూజార్హుడా?' అనే అంశంపై జరిగిన వాదోపవాదాలు ఏవిధంగా ఒకదానిపై ఒకటి కార్యకారణసంబద్ధాలై శిశుపాలవధ కార్యానికి దోహదాలైనవో గమనించటమే సంభాషణశిల్పాన్ని సమీక్షించటం.

కథారంభంలో నన్నయ- భీష్ముడు ప్రశాంతు డనీ, ధర్మజుడు ధృతిమంతు డనీ, సత్యధర్మమతి అనీ పరిచయం చేశాడు. ధర్మమతికి ప్రశాంతుడి హితబోధ కలిగింది. అది ధృతిమంత మైన ఉత్సాహంతో ఆచరించబడింది. అత్యంత క్లిష్టపరిస్థితులలోకూడ చలించని ధీశక్తి ధృతి. అది దీప్తిమంతం కావాలంటే బంగారం పుటంపెట్టబడినట్లు కథలో అత్యంత సంఘర్షణానికి గురి అయి సమర్థవంతంగా విజయం సాధించాలి. అంటే- శిశుపాలుడి దుర్వ్యవసాయం ధర్మజుడిధృతిని, ధర్మనియతిని ప్రకాశింపజేసేటట్లు కథలో నిబంధించబడిం దని నన్నయసూచన. పరమశాంతు డైన భీష్ముడు పరతత్త్వప్రతిపాదనసమర్థు డని తాత్పర్యం.

మత్తకోకిల.

"స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్
భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు వీరిలోఁ
బ్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టి మహాత్ము వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌరవాన్వయవర్ధనా!" (సభా. 2.4)

అని భీష్ముడు ధర్మరాజును ప్రబోధించాడు. ధర్మజుడు యజ్ఞంలో భీష్మద్రోణులను 'కృతాకృత పరిజ్ఞానంబునందు' నియోగించాడు. అందువలన భీష్ముడు కర్తవ్యాన్ని తెలియపరచాడు. ఆ చెప్పటంలో పూజార్హు డైన మహాత్ముడి లక్షణాలు పేర్కొని భీష్ముడు ఆతడి నామనిర్దేశం చేయకుండా ధర్మజుడినిర్ణయానికి వదలివేశాడు. ధర్మజుడు తాతకు దగ్గలు నేర్పగల చతురుడు. నిర్ణయం తానే తీసికొంటే దానికి బాధ్యుడు తానే ఔతాడు. కాబట్టి ఆ పాపపుణ్యాలనుకూడ ఆ తాతపైనే త్రోయనెంచి 'అట్టివా డెవ్వండు? నా కెఱింగింపు' మని భీష్ముడినే అడిగాడు. మనుమ డిచ్చే పెద్దరికానికి అన్నింటా తగిన పితామహు డాతడు. అందువలన నిశ్శంకగా అఖిలలోకపూజ్యు డైన శ్రీకృష్ణుడినే (అచ్యుతుడినే) పూజార్హుడుగా నిర్దేశించాడు. తాను తలచిందే తాత చెప్పాడు. సహదేవుడు అర్ఘ్యపాద్యాది పూజాద్రవ్యాలు తెచ్చాడు. ధర్మరాజు వాసుదేవుడికి పూజ చేశాడు. శ్రీకృష్ణుడు కిమ్మనకుండ పూజలు స్వీకరించాడు.

శిశుపాలుడు గోపాలుడికి బద్ధవిరోధి. భీష్ముడిహితబోధ, ధర్మజుడివర్తనం, శ్రీకృష్ణుడిఅంగీకారం ఒక్కొక్కటే అతడి చిత్తాన్ని ఉడు కెక్కించాయి. ఆ పూజకు కర్త ధర్మరాజు. ప్రేరకుడు తాత. ఫలభాక్కు గోవిందుడు. అందువలన శిశుపాలుడు ధర్మరాజును కేంద్రంగా చేసి ఆ ముగ్గురిని అధిక్షేపించాడు. గాంగేయుడి దుర్వ్యవసాయానికి లొంగి కష్టచరితు డైన కృష్ణుడిని పూజించి ధర్మజుడు తన అవివేకాన్ని ప్రకటించా డనీ, 'దాశార్హుడు పూజార్హుడు' కాడనీ అతడిఅభ్యంతరం. వాది యెదుటివారి వాదాన్ని మొదట ఖండిస్తాడు. ఆపైన దానిలోని అసంబద్ధాలైన అంశాలను ఉటంకించి వరుసగా అధిక్షేపిస్తాడు. శిశుపాలుడు అటువంటి వాదకౌశలాన్ని ప్రకటించాడు.

శిశుపాలుడు ధర్మతాత్పర్యాన్ని ప్రతిపాదించే తలంపుతో వాదాన్ని ఆరంభించినప్పటికీ అందులో వ్యక్తిదూషణానికి తావు కల్పించాడు. అది వాదకుశలుడు చేసేపని కాదు. దానికితోడు శిశుపాలుడు తనకు తలకుమించిన ధర్మపన్నాలు చదివి, తన వివేకాన్ని ప్రదర్శించబోయి కొన్నియెడల ఆ వాక్యాలు తనకే తగిలివచ్చేటట్లు మాట్లాడి ఎదుటివారి వాదానికి బలంచేకూర్చే బలహీనతకు గురిఅయ్యాడు.

చ. "కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము; ధర్మబాహ్యు ని
న్నొడఁబడ నిష్టుఁడై కఱపి యుత్తము లుండఁగ వాసుదేవుఁ డ
న్జడునకుఁ బూజ యిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁ డెంతయున్
వెడఁగుఁదనంబునం బనిచె; వృద్ధులబుద్ధులు సంచలింపవే?". **(సభా. 2.9)**

భీష్ముడు వృద్ధుడే కావచ్చును. అతడిబుద్ధి వార్ధక్యంవలన చలించియే ఉండవచ్చును. కాని, అతడు విచారవిదూరు డని అనటం, అతనిది 'వెడఁగుదన'మని వెక్కిరించటం, అతడు ధర్మబాహ్యు డని నిందించటం, వాసుదేవుడు జడు డని నోటికసి తీర్చికొనటం- శిశుపాలుడివాదబలంకంటె, ఎదుటివాడిని అధిక్షేపించే చిత్తవృత్తిని, వాక్పారుష్యాన్నీ పట్టియిస్తున్నాయి. 'కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్య' మనే సత్యాన్ని చెప్పిన శిశుపాలుడు మత్సరగ్రస్తుడు కావటం విచారం. తా నన్నమాట తగిలివస్తున్న దన్న వివేకం లే దతనికి. సద్ధర్మాన్ని చూచి అధర్మ మని శంకించే అజ్ఞానినోట సాభిప్రాయంగా ఆ మాటను అనిపించటం నన్నయ చేసిన చమత్కారం. ధర్మరా జున్న సభలో ధర్మస్థాపనం చేయాలని అతడి ప్రయత్నం! అది అనధికారిచేత పడి హాస్యాస్పద మౌతున్నదని కవి సాధించిన వ్యంగ్యం!

ఈవిధంగా నోటికసి తీర్చికొని, శిశుపాలుడు పూజార్హు డైనవాడి కుండదగిన వని భీష్ముడు నిర్దేశించిన గుణగణాలు శ్రీకృష్ణుడియందు లేవని వరుసగా ఖండించటం ప్రారంభించాడు. పై మత్తకోకిలలోని గుణాలన్నింటిలో పాండవులు సమర్థించుకొనటానికి బాగా సులభమైనది- శ్రీకృష్ణుడు వారికి ఇష్టుడై ఉండటం. ఇష్టుడైనంతమాత్రాన సభలో అర్హులైనవా రుండగా అతడికి పూజచేయటం పాడి కాదని శిశుపాలుడు మొదట వాదించాడు.

చ. "ఇతనికిఁ గూర్తు రేని ధన మిత్తు రభీష్టము లైన కార్యముల్
మతి నొనరింతు రిష్టుఁ డని మంతురుగాక మహాత్ము లైన భూ
పతులయు విప్రముఖ్యులసభన్ విధిదృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుఁ డని యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే?" **(సభా. 2.10)**

పూజార్హు డైనవాడు ఇష్టుడై ఉన్నా, తగిన అర్హతలుకూడా కలవాడై ఉండాలని ఈ పద్యంలో శిశుపాలుడు నిష్కర్షించాడు. ఆపైన తరువాతి అర్హతలుకూడ ఆ అచ్యుతుడియందు లేవని వరుసగా ఖండించాడు. వసుదేవాదు లుండగా కృష్ణుడు వృద్ధు డెట్లా ఔతాడు? వ్యాసు డుండగా అతడు ఋత్విజు డనీ, ద్రోణకృపాదు లుండగా ఆతడు ఆచార్యుడనీ, భూనాథు లనేకులు ఉండగా యాదవు డైన ఆతడు రాజనీ ఎట్లా పూజించటానికి అర్హుడైనా డని ప్రశ్నించాడు. ఆవిధంగా నిండుసభలో అనర్హుడిని పూజించటం ధర్మజుడి గౌరవానికీ, భూమీశుల విశ్వాసానికీ గొడ్డలిపెట్టని వర్ణించాడు. ధర్మజుడు శ్రీకృష్ణుడిని పూజించి సభికు లైన ధారుణీశ్వరులను అవజ్ఞ చేశాడనీ, అది ధర్మవిరుద్ధ మనీ అధిక్షేపించాడు.

అంతటితో ఆగక ధర్మనందనుడితో-

క. "నీ వెఱుఁగక యిచ్చిన నిది
నా విషయమె యని మనంబునం దలఁపక ల
జ్జావిరహితుఁ డయి యర్ఘ్యము
గోవిందుఁడు గొనియెఁ దనకుఁ గొను టుచితంబే?" **(సభా. 2.13)**

అని ముకుందుడిని మొగం మొత్తేటట్లు ఎత్తిపొడిచాడు. అంతటితో తనివితీరక-

క. "చనఁ బేడికి దారక్రియ
యును జెవిటికి మధురగీతియును జీకున క
న్యనుపమసురూపదర్శన
మును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించు టిలన్." **(సభా. 2.14)**

అని వాక్కండూతిని తీర్చుకొన్నాడు. ధర్మరాజుపేరు నిరర్థకమై నవ్వులపాలైపోయిందని నోటితో నొవ్వబలుకుతూ శిశుపాలుడు సపుత్రబలుడై సభను వీడి బయటికి వెళ్లిపోయాడు.

శిశుపాలుడి అధిక్షేపంవలన కథలో రెండంశాలు ప్రశ్నించబడుతున్నాయి. ఒకటి: శ్రీకృష్ణుడి పరమేశ్వరత్వం. రెండు: పాండవుల ధర్మపరత్వం. మహాభారతంలో ఈ రెండూ పరస్పరపోషకాలు. వీటిలో మొదట నిరూపించబడవలసింది శ్రీకృష్ణుడి పరమేశ్వరత్వం. అప్పుడు రెండోది తనంతట తానే నిరూపిత మౌతుంది. ధర్మరాజు ఈ అంశాన్ని గుర్తించాడు. సదస్యులను ఆహ్వానించిన యజమానిగా తన సభ్యతను ప్రకటిస్తూ శిశుపాలుడివెంట పోయి ధర్మనందనుడు ప్రియవచనాలతో అతడిని అనునయించాడు. సమయోచిత ప్రజ్ఞాప్రదర్శనంలో ధర్మజుడు అందెవేసిన చేయి!

ధర్మజుడు మాట్లాడిన అనునయవాక్యాలు ఎంత మెత్తగా ఉంటాయో అంత వాడిగాకూడా ఉంటాయి. 'మెత్తనిపులి' అయిన ధర్మజుడి లక్షణం అది. అన్నిమాటలన్న శిశుపాలుడిమీద మరొకడైతే అగ్గిమీద గుగ్గిలంవలె భగ్గుమనేవాడు. ప్రశాంతు డైన భీష్ముడే ఈ ఘట్టంలో భీషణహుతాశనకీలవలె మండిపడ్డాడు. తాతకన్న మనుమడు ధృతిమంతు డని నన్నయ అందుకే నిర్దేశించాడు. ధర్మరాజుమాటలు సంగ్రహాలు, సారవంతాలు, సార్థకాలు. నారసతుల్యాలు.

క. "భూరిగుణోన్నతు లనఁ దగు
వారికి ధీరులకు ధరణివల్లభులకు వా
క్పారుష్యము చన్నె? మహా
దారుణ మది విషముకంటె దహనముకంటెన్". **(సభా. 2.17)**

శిశుపాలుడివాదనలో వాక్పారుష్యాన్ని తొలగిస్తే వాక్యతాత్పర్యం మిగులుతుంది. పారుష్యం భావప్రకటనంలో వ్యక్తిసంస్కారాన్ని తెలుపుతుంది. వాక్యతాత్పర్యం వ్యక్తివివేకాన్ని తెలుపుతుంది. ధర్మజుడు మొదట అతడి సంస్కారాన్ని ఎత్తిచూపించాడు. వాక్పారుష్యం ఉండకూడనివాడికి ఉంటే ఆతడి భూరిగుణౌన్నత్యం, ధీరత్వం, ప్రభుత్వం రాణించవని ధర్మజుడి తాత్పర్యం. అంటే- శిశుపాలుడియందు ఆ మూడు లక్షణాలు వాక్పారుష్యంవలన దూషితా లైనవని వ్యంగ్యమైన ధర్మజుడి అధిక్షేపం. వాక్పారుష్యం విషంకంటెను, దహనంకంటెను మహాదారుణ మైనదని ధర్మజుడి బెదిరింపు. విషంవలన మూర్ఛ కలుగుతుంది. అది మంత్రతంత్రాలవలన నివారించదగింది. దహనం అట్టిది కాదు. మనిషిని బూడిద చేస్తుంది. వాక్పారుష్యం ఈ రెండింటికంటె మహాభయంకర మైనదట! వాక్శక్తి ఎఱిగినవాడు ధర్మజుడు. అందువలననే ఇంత తీవ్రమైన విషయాన్ని, ప్రతిపాదిస్తున్నా పారుష్యం కానుపించ దాతడిపలుకులలో. ఎత్తుకొనటంలోనే ప్రతివాదిదోషాన్ని నిరూపించి, అతడిని అప్రతిభుడిని చేసే వాదకౌశలం ధర్మజుడు ప్రదర్శించాడు. ఆపైన తనయందు దోషం లే దని వాదించాడు.

క. "ఆదిజుఁ డైన బ్రహ్మయుదయంబున కాస్పద మైనవాఁడు వే
దాది సమస్తవాఙ్మయములందుఁ బ్రశంసితుఁ డైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని; యుక్తము కా కిది యేమి దోసమే!" **(సభా. 2.18)**

ఆదిదేవు డైన బ్రహ్మకు ఆదియై, ఆదివాఙ్మయ మైన వేదానికి ఆదియై, లోకత్రయసృష్టికి మూలమైనవాడు దామోదరు డని పితామహుడు చెప్పాడట! 'పితామహ' శబ్దప్రయోగంలో ఈ పద్యప్రాణం ఉన్నది. దానికి బ్రహ్మ అనీ, భీష్మ డనీ అర్థాలు చెప్పవచ్చును. భీష్మార్థం ప్రకృతం. బ్రహ్మ అనే అర్థం అప్రకృతం, వ్యంగ్యం. బ్రహ్మ చెప్పినదే తాత చెప్పాడని చమత్కారం. పూర్వప్రసిద్ధ సిద్ధాంతాలను ప్రమాణంగా చూపించి వాదానికి బలం కల్పించుకొనే నేర్పు ఈ ధర్మరాజువాక్కులలో ధ్వనించబడుతున్నది.

క. "పరమార్థప్రతిభఁ దమో
హరు నచ్యుతు భీష్ముఁ డెఱిఁగిన ట్లెఱుఁగఁగ నీ
కరిది శిశుపాల! పెద్దల
చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్?" **(సభా. 2.19)**

అచ్యుతుడి తత్త్వాన్ని నిరూపించటానికి పరమార్థప్రతిభ కావాలనీ, అది భీష్మడి కున్నట్లుగా శిశుపాలుడికి లేదనీ చెప్పి ప్రతివాది అజ్ఞానాన్ని ధర్మజుడు బయటపెట్టటమే కాక- "పెద్దలచరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్!' అనే అర్థాంతరన్యాసంచేత తన వాక్యార్థాలను సమర్థించుకొన్నాడు. 'పిన్నలకు' అని వాడినా సరిపోయేచోట 'అల్పుల' కని వాడటం ధర్మరాజువాక్కులోని గూఢ మైన తీక్ష్ణత.

ఇప్పటికి ధర్మజుడు శిశుపాలుడిదోషాన్నీ, శ్రీకృష్ణుడిపూజార్హతనూ, భీష్మడిపరమార్థప్రతిభనూ వరుసగా నిరూపించాడు. పూజనీయు లైన పురుషులు సభలో ఉండగా శ్రీకృష్ణు డేవిధంగా పూజ్యుడైనా? డని శిశుపాలుడు చేసిన వితండవాదానికి కీలెరిగి వాతపెట్టినట్లు సమాధానం చెప్పాడు.

క. "గురుఁ డని సమస్తలోకో
త్తరుఁ డని నీకంటె వృద్ధతము లైన నరే
శ్వరు లచ్యుతు నర్చననెడఁ
గర మభినందింప నీకుఁ గాదనఁ దగునే?" **(సభా. 2.20)**

పూజార్హు లని శిశుపాలుడు చెప్పినవారే అచ్యుతుడిని పూజార్హు డని అభినందించగా, కా దనిన శిశుపాలుడివాదంలోకంటె వ్యక్తిస్వభావంలోనే దోషం ఉన్నదని ధర్మజుడు ఈ వాక్యంవలన నిరూపించాడు. అది తరువాతి భీష్మడివాక్యాలకున్నూ, శిశుపాలుడి వధకున్నూ పోషకమై ఉండటం సంభాషణక్రమవిన్యాసశిల్పానికి చక్కని ఉదాహరణం.

ధర్మజుడు ఈ పద్యచతుష్టయంలో ప్రతిపాదించిన అంశాలు శిశుపాలుడివాదాన్ని నిర్వీర్యంచేశాయి; శిశుపాలుడిని ఒక అవివేకిగా నిరూపించాయి. ధర్మజుడిపాత్ర ఈ ఘట్టంలో నిర్వహించవలసిన పని అయిపోయింది. ఇక ఆ పాత్ర ఈ విషయమై మాటలాడితే చర్వితచర్వణ మౌతుంది. ధర్మజుడివాక్కులలో గూఢమైన వాడిమి ఉన్నది. అది ప్రజ్వలనప్రక్రియకు తోడుపడదు. సన్నివేశంలో సంఘర్షణ సృష్టించబడాలి. యజమానివాక్కులు అనునయాత్మకాలు కావటంచేత ప్రతినాయకుడిలో కోపాగ్నిని ప్రజ్వలింపజేయవు. అందువలన కథలో భీష్మడు ఉద్రేకంతో శిశుపాలుడికి ఉడు కెక్కించేమాట లన్నట్లు చిత్రించబడినాయి.

భీష్ముడు ధర్మరాజుతో అనిన మాట లివి-

ఉ. "పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు; వీని నేల భూ
పాలక! నీకుఁ బట్టువఱుపన్? మఱి ధర్ము వెఱుంగ వీనికిం
బోలునె రాగకోపపరిభూతమనస్కున కల్పరాజ్యల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్తమహత్పరివాదశీలికిన్." **(సభా. 2.22)**

ఎదుటివాడు తూలనాడినప్పుడు ఓరిమితో పరువం చెడకుండ ప్రవర్తించే నిగ్రహం ధర్మజుడి కున్నంతగా భీష్ముడికి లేదు. అందువలననే భారతంలో తాతకన్న మనుమనికి గౌరవం. భీష్ముడు ఉపాలంభనంతో మొదలు పెట్టాడు సంభాషణను. శిశుపాలుడు తననుగురించి అన్నమాటలకు ఆ వృద్ధసింహం క్రుద్ధమై నెమరువేసికొంటూ ఎదురుదెబ్బ తీయటానికి యత్నించింది. శిశుపాలుడిలో మొదట విమర్శించతగింది అవినయం. దానివలన పెద్దలను దూషించే వాక్పారుష్య మేర్పడింది. తరువాతివి అజ్ఞానం, అప్రౌఢత్వం. వాటివలన అతడు ధర్మాధర్మవివేచనం లేని మాటలు వ్యక్తిదూషణ ప్రధానంగా మాటలాడాడు. ధర్మరాజు అతడిని బ్రతిమిలాడవలసిన అవసరం లేదనటంలో శిశుపాలుడి అయోగ్యత నిరూపించబడింది. ఈ మాటలన్నీ ఒక యెత్తు! 'కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము' అనే అధిక్షేపానికి ఈ వాక్యం ప్రత్యాఖ్యానం. అతడి గూఢామర్షకు తార్కాణం. ధర్మనిర్ణయవేత్త అయినవాడి కుండకూడని మూడుగుణాలు శిశుపాలుడిలో ఉన్నాయని భీష్ముడు అధిక్షేపించాడు. అవి:- 1. రాగకోపదూషిత మైన మనస్సు కలిగిఉండటం. 2. రాజ్యసంపదవలని మదంచేత వివేకాన్ని కోల్పోవటం. 3. నిష్కారణవాదబుద్ధి. తుల్యపరిశీలనంవలన పఠితకు ఈ అవలక్షణాలు ధర్మజుడిలో లేకపోవటంచేత అతడిఉత్తమత్వం ద్యోతమానం అవుతున్నది.

భీష్ముడు ధర్మరాజును వారించి శిశుపాలుడితో ముఖాముఖి వాదానికి దిగాడు. అతడివాద మంతా శ్రీకృష్ణుడి పూజార్హతను నిరూపించటానికి వెచ్చించబడింది. వాదాంశ విశ్లేషణంలోనూ, విశ్లిష్టాంశవివరణంలోనూ, తాత్పర్యాంశ ప్రతిష్ఠాపనంలోనూ భీష్ముడు కడు శ్రద్ధవహించాడు. 'వృద్ధుల బుద్ధులు సంచలింపవే' అనిన శిశుపాలుడితో సుసంగత మైన తాత్పర్యాలు గల వాక్యాలను మాట్లాడి తన సుస్థిరవివేకచిత్తాన్ని సభకు వ్యక్తం చేసికొన్నాడు.

సభలో శ్రీకృష్ణుడి పూజార్హతను ప్రతిపాదించినవాడు భీష్ముడు కావటంచేత అతడే దానిని సమర్థిస్తూ మాటలాడటం సమంజసంగా ఉన్నది. దానికి శిశుపాలుడు ఒడబడేటట్లు లేడు. ధర్మజుడి నయవాక్యాలవెంట వెలువడిన భీష్ముడి వివేకవాక్యాలుకూడా విఫలాలైతే ఇక కార్యం ఎట్లా సఫలమయ్యేటట్లు? కోపం వచ్చి కొలువు వీడిపోయే కొరకరానికొయ్యపై కఱకుమాటలూ, చేష్టలూ పనిచేస్తాయని భావించి సహదేవుడు సంక్షుభితసభ స్తంభించేటట్లు భీషణప్రతిజ్ఞ చేశాడు.

చ. "ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి; మిచ్చిన దీనికిం దొడం
బడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై
నిడియెద నంచు దాఁ జరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై" **(సభా. 2.30)**

ఇది సహదేవుడి సమయోచిత ప్రజ్ఞాప్రదర్శనం. దీనికి దేవతలు పూలవాన కురిపించారు. సభికులు విస్మయభావావిష్టు లైనారు. నారదు డానందంతో చిందులు త్రొక్కాడు.

కథ కిది ఒక విశ్రాంతిస్థానం. నాయకపక్షాన ఆరంభ, ప్రయత్నావస్థలు స్ఫురించాయి. బీజబిందువు లనే అర్థప్రకృతులు సార్థకంగా ప్రయుక్తా లైనవి. ప్రతిముఖసంధి ప్రత్యక్షమై ఉన్న ఈ కథాఘట్టంలో ముఖసంధిలోని బీజార్థాలు విచ్ఛిన్నమయ్యేటంతటి సంఘర్షణ సృష్టించబడాలి. గర్భ అవమర్శసంధులు వ్యాయోగంలో ప్రత్యక్షం కాకపోయినా వాటి ప్రభావం ప్రదర్శితం కావచ్చన్నారు. అందువలననే అంతటి సహదేవప్రతిజ్ఞను ధిక్కరించి శిశుపాలుడి సేనాపతి అయిన సునీథుడు విజృంభించాడు.

ప్రళయజలధివలె పరవాహిను లుప్పొంగివచ్చాయి. క్రియాబహుళమైన ఈ సన్నివేశాన్ని నన్నయ రసోదంచితమైనఛందోవిన్యాసంచేత వ్యంగ్యరమణీయం చేశాడు.

చ. “రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్చటులసైనికమత్స్యములన్ భయంకరం
బయి యదు వృష్ణి భోజ కుకురాంధక వాహినియుం గలంగె ని
ర్దయతరరోషమారుతనితాంతసమీరిత మై క్షణంబునన్”. (సభా. 2.33)

ఇందులోని శ్లేష సన్నివేశంలోని సంశ్లిష్టతను, రూపకాలంకారం రూపకరసప్రక్రియను వ్యంజింపజేస్తున్నాయి.

ఆ సైన్య సంక్షోభాన్ని చూచి ధర్మజుడు భయసంభ్రమాక్రాంత మనస్కుడై తాతతో ఇట్లని విన్నవించుకొన్నాడు.

తరలము.

“ధరణిలోఁ గల రాజు లెల్లను దారుణక్షయకాలసా
గరము లట్లు గలంగి రిప్డు; మఖప్రయోగము విఘ్నముం
బొరయకుండఁ బ్రజాపకారము పుట్టకుండఁగ నీవు చె
చ్చెరఁ బితామహ! వీరి కిచ్చుటఁ జిత్తశాంతి యొనర్పవే!” (సభా. 2.35)

నన్నయ కథాకథనంలో ప్రయోగించిన రూపకాలంకారాన్నీ, ధర్మరాజపాత్రముఖాన ఉపమాలంకారాన్నీ నిబంధించి నాటకీయసంభాణశిల్పాన్ని పోషించాడు. పై వర్ణనాత్మక పద్యాన్ని వీడి ధర్మజుడి పద్య మొక్కటి చదువుకొన్నా కథాప్రభావం చెడకుండ రక్షించటం ఈ రచనలోని శిల్పం! తాత చెప్పిన సలహాను పాటించటంవలన ధర్మరాజుకు శత్రువ్రాతాన్ని ఎదుర్కొనవలసి వచ్చింది. వారిని ఉపశాంతింపజేసే బాధ్యత మరల ఆ తాతపై ఉంచటం ఆ మనుమని లౌకికప్రజ్ఞావిశేషం. కథ భీష్ముడిసంభాషణలతో ముందుకు సాగుతుం దని సూచన. రంగంమీద ప్రదర్శనకు అసాధ్య మైన యుద్ధక్రీడకు బదులు వాగ్వివాదం ప్రవేశపెట్టే అవకాశం ఆ ధర్మరాజువాక్యంవలన కథలో సిద్ధిస్తున్నది.

భీష్ముడు తనబాధ్యత నిపుణంగా శ్రీకృష్ణుడిమీద ఉంచాడు-

క. “నీ యజ్ఞమునకు విఘ్నము
సేయఁగ నోపుదురె యొరులు జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ
జేయపరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్” (సభా. 2.37)

అనటంలో కథ ఒక క్రొత్తమలుపు తిరిగింది. సవనప్రయోగ భంగభీతి కలిగిన నాయకుడికి శ్రీకృష్ణుడి అండ చూపి భీష్ముడు ప్రాప్త్యాశ అనే అవస్థను కల్పించాడు. శ్రీకృష్ణుడే యజ్ఞరక్షకు డనేసరికి శిశుపాలుడికి మహామర్షం పొడుచుకొని వచ్చింది. శ్రీకృష్ణుడి పరాక్రమాలన్నిటినీ విపరీతార్థాలతో అధిక్షేపిస్తూ నిష్ఠురాలకు దిగాడు శిశుపాలుడు. స్త్రీగోవధపాపాలను ఆ గోవిందుడికి అంటగట్టి నిండుసభలో అతడిని గర్హించాడు. ఆపైన భీష్ముడి దుర్వ్యవసాయాన్ని దృష్టాంతరూపంగా చెప్పి దుయ్యబట్టటానికి వృద్ధహంసోపాఖ్యానం చెప్పాడు. నన్నయ శిశుపాలుడు ‘రూక్షాక్షరవచనంబుల’ నాక్షేపించాడని వర్ణించి సంభాషణస్వభావాన్ని ధ్వనింపచేశాడు.

గురునింద చేస్తున్న శిశుపాలుడివాక్కులు భీముడికి భీషణరౌద్రోద్రేకాన్ని కలిగించాయి.

చ. "ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖ మై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటిత్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజనప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్". (సభా. 2.51)

భీముడు శిశుపాల నిర్మూలనాభిలసంరంభంతో ముందుకు ఉరికాడు. భీష్ముడు అతడిని వారించి, శిశుపాలుడివృత్తాంత మంతా చెప్పి, అతడు శ్రీకృష్ణుడివలనతప్ప, ఇతరులచేత అసాధ్యు డనే సత్యం తేటపడేటట్లు చేశాడు. అట్లా కాకపోతే-

చ. "ఇతనికి నిట్లు న న్నుఱక యెగ్గులు వల్కఁగఁ బోలెఁగాక! యు
ద్ధతిమతి నన్యు లీతనివిధంబునఁ బల్కి మదీయచాపని
ర్గతచటులోగ్రమార్గణనికాయపయోధి మునుంగ కిట్లు ద
ర్పితు లయి పోవనేర్తురె? గభీరపరాక్రమ! మారుతాత్మజా!" (సభా. 2.61)

అని అనునయించి మనుమడిక్రోధోద్రేకాన్ని మాన్పాడు.

కథలో శ్రీకృష్ణుడే శిశుపాలుడిని వధించగలిగినవాడనే తాత్పర్యం ఈ సంభాషణలచేత స్థిరీకరించి నాటకీయతను పోషించటంతోపాటు కథలో నిర్వహణ సంధిని సూచించాడు నన్నయ. వృద్ధహంసోపాఖ్యానాన్ని, శిశుపాలవృత్తాంతాన్ని పాత్రసంభాషణలలో నిబంధించటం రూపకమర్యాద!

శిశుపాలుడు శ్రీకృష్ణుడిని యుద్ధానికి ఆహ్వానించటంకంటె మరొక గత్యంతరం లేనిస్థితిలో పడ్డాడు. అతడి యుద్ధాహ్వానాన్ని మన్నించిన శ్రీకృష్ణుడు అతడి వధార్హతను నిరూపించే దుశ్చేష్టితాలను ఏకరువు పెట్టాడు. సహనానికీ, సమయపాలనానికీ సమయం తీరిందని సూచించాడు. శిశుపాలుడు శ్రీకృష్ణుడి మనసును మండించేమాట లన్నాడు-

"నీ కూర్మియు నీ యలుకయు
నా కవి యేమిటికి దుర్గుణప్రియ! మొదలన్
నా కిచ్చిన యక్కన్యకఁ
జేకొని నీ కిట్లు వలుక సిగ్గును లేదే?" (సభా. 2.67)

అర్హతానర్హతల చర్చతో ఆరంభమైన వాదులాట అంతఃపురచరిత్రలను తడవుకొనేంతవరకు ముదరజొచ్చింది. చక్రధారి ఇక శిశుపాలుడికథకు చక్రం అడ్డంవేశాడు. శిశుపాలుడిమొండెం నేల కొరిగింది. తేజం విశ్వాత్ము డైన శ్రీకృష్ణుడిలో లీనమైపోయింది. రూపకతుల్య మైన ఈ సన్నివేశం నిర్వహణంలో అద్భుతంగా ముగిసింది.

నన్నయ ఈ ఘట్టంలో యజ్ఞవిధానాన్ని పేర్కొంటూ ప్రయోగశబ్దాన్ని వాడటం గమనించ తగింది.

"మఖప్రయోగము విఘ్నముం బొరయకుండన్" (సభా. 2-35)

"జగన్నాథరక్షితంబయి రాజసూయమహాధ్వరంబు సమాప్తప్రయోగం బయిన" (సభా. 2-72)

ఈ ప్రయోగంవెనుక నాందినుండి నిర్వహణంవరకు సాంగంగా నిర్వహించిన తన రూపకప్రయోగ సంవిధానాన్ని నన్నయ వ్యంగ్యంగా సూచించా డనటం కావ్యశిల్పాంశం! నన్నయనాటకీయశిల్పప్రపంచంలో ఇది ఒక కళారేఖ!

### కుమారాస్త్రవిద్యాప్రదర్శనం: బహిరంగవ్యాయోగప్రదర్శనం

రూపకప్రయోగం నాట్యమంటపంలోనూ, బహిరంగ మంటపంలోనూ ప్రదర్శించబడటం ప్రాచీనకాలంలో పరిపాటిగా ఉండేది. ఆ సంప్రదాయాన్ని అనుసరించి నన్నయ శిశుపాలవధ సభామంటపంలో జరిగిన వ్యాయోగంగానూ, కుమారాస్త్ర విద్యాసందర్శనం బహిరంగప్రదేశంలో ప్రయోగించబడిన వ్యాయోగంగానూ రూపొందించి తన రచనలోని నాటకీయతలో వైవిధ్యం ప్రదర్శించాడు. ఈ ఘట్టం ఆదిపర్వ షష్ఠాశ్వాసంలో 60 పద్యగద్యాలలో వ్యాపించిఉన్నది. (ఆది.6. 2-61)

పాండవధార్తరాష్ట్రకుమారులు శస్త్రాస్త్రవిద్యలలో ఆరితేరారు. వారి విద్యానైపుణ్యాన్ని ధృతరాష్ట్రాదులముందు ప్రదర్శించి చూపించటానికి ఒకసభను ఏర్పాటుచేయుమని ద్రోణుడు రాజును కోరాడు. ధృతరాష్ట్రుడు విదురుడిని కుమారాస్త్రవిద్యా ప్రదర్శన సందర్శనలకు అనుకూలమైన ఒక రంగాన్ని సిద్ధం చేయించుమన్నాడు. వెంటనే శాస్త్రోక్తంగా ఒక అపూర్వమైన రంగం సిద్ధమైనది. నన్నయ ఆ రంగాన్ని నాటకీయంగా బహిరంగప్రదర్శనంగా రచనలో వాడుకొని నాటకీయతనుకూడా కలిపి సంయుక్తంగా సాగించాడు. కన్నులపండువుగా ప్రదర్శనసందర్శనరంగాలు అలంకరించబడ్డాయి. ప్రదర్శకులు ప్రదర్శనరంగంమీద కనపడతారు. ప్రేక్షకులు సందర్శనరంగంలో ఉపవిష్టులై ఉంటారు. ప్రదర్శనను చూచిన ప్రేక్షకుల స్పందనలుకూడ నాటకీయంగా వర్ణించబడుతుంటాయి. అది యొక మిశ్రమప్రయోగం.

ప్రదర్శనరంగమధ్యంలో తెల్లనివస్త్రాలతో, ఆభరణాలతో అలంకరించుకొన్నవాడు, తెల్లనిగడ్డాలు మీసాలతో ఒప్పారేవాడు అయిన ద్రోణుడు శిష్యగణంతో వచ్చి నిలిచాడు. రణరంగోచిత వేషాలతో ఆహార్యాభినయం అచ్చుపడేటట్లు ధర్మజాదులు వీరవేషాలలో ఉన్నారు. రంగం నిండుగా రంగురంగుల శృంగారాలంకారాలతో రంజిల్లిపోయింది. ప్రదర్శన ప్రారంభమైనది. కత్తులు, బాణాలు, గుర్రాలు, ఏనుగులు, కుంతకాలు, గదలు మొదలైన వాహన, ఆయుధాలలో తమతమ ప్రజ్ఞలను రాజకుమారులు సామూహికంగా ప్రదర్శించారు. ద్రోణుడు అందరి ప్రదర్శన లైపోయిన తరువాత భీమదుర్యోధనుల గదాయుద్ధాన్ని ప్రదర్శింపజేయించాడు. వా రిద్దరూ మదగజాలవలె గదాయుద్ధం సాగించారు. చూచేవారిలో భీమదుర్యోధనుల అభిమాను లేర్పడ్డారు. వారుకూడా తమ తమ అభిమానవీరులు గెలవాలని కేకలు వేయటం పరుషంగా పరస్పరం మాట్లాడుకొనటం మొదలుపెట్టారు. రంగభంగ మయ్యే పరిస్థితి ఏర్పడింది. ద్రోణుడు అశ్వత్థామను పంపి భీమదుర్యోధనుల బలప్రదర్శనను ఆపించాడు. దానిని నన్నయ ఇట్లా వర్ణించాడు.

మ. "అవనీచక్రము పాదఘాతహతి నల్లాడంగ నత్యుగ్ర భై
రవహుంకారరవంబునన్ వియదగారం బెల్ల భేదిల్లఁ బాం
డవకౌరవ్యగదావిఘట్టన మకాండప్రోత్థమై భావిపాం
డవకౌరవ్యరణాభిసూచనపటిష్ఠంబయ్యె ఘోరాకృతిన్". **(ఆది. 6.14)**

ఇది నన్నయ తీర్చిదిద్ద దలచుకొన్న వ్యాయోగానికి చూళిక.

అసలురంగం మొదలుకావటానికి ముందు ఇంతవరకు పూర్వరంగం ప్రవర్తిల్లింది. ఆచార్యుడు సూత్రధారుడు. మిగిలిన రాజకుమారులందరి ప్రదర్శన ప్రస్తావన. భీమ దుర్యోధనుల గదాయుద్ధం విష్కంభం. అందులో వారి పోరు కురుక్షేత్రయుద్ధాన్ని సూచించింది. ప్రజలుకూడా పాండవ కౌరవపక్షవర్తులై పరస్పరక్రోధవచనాలకు దిగారు. అటువంటి సంకుల సంక్షుభితవాతావరణం ఈ బహిరంగ ప్రయోగంగా సాగబోయే అర్జునుడి శస్త్రాస్త్రప్రయోగరంగ మనే వ్యాయోగానికి భిత్తికవలె చిత్రించి నన్నయ ఒక మహానాటకకర్తలక్షణాన్ని వెలార్చాడు.

ద్రోణుడు 'నా ప్రియశిష్యుడైన అర్జునుడి ధనుఃకౌశలాన్ని చూడండి' అని ప్రకటించాడు. రంగంమీద ఏకైకవీరుడు అర్జునుడు నిలబడ్డాడు. అప్పటికి భీముడికి దుర్యోధనుడు ఎదురున్నాడు. కాని, అర్జునుడికి సాటివీరుడు లేడని గురువు సూచించాడు. అతడి శస్త్రాస్త్ర ప్రదర్శన గురువుగారి గొప్పతనానికి కీర్తికిరీటంవలె నిలుస్తుంది. అదే కథావస్తువైతే అందులో

నాటకీయత లేదు. ప్రతివీరుడు లేడని ప్రకటించిన పార్థుడికి ప్రతివీరుడు రంగంమీదకు రావటం, అతడిని పాండవవర్గంవారు ప్రతివీరుడు కా డని అధిక్షేపించటం, దుర్యోధనవర్గంవారు అతడిని ప్రతివీరుడిగా రంగంమీద ప్రతిష్ఠాపించటం ఈ రంగంలోని ఉద్వేగకరమైన వస్తువు. ఒక అంకంవలె సాగే ఈ ఘట్టంలో పాత్రలు పరుషవాక్యాలతో పరాక్రమప్రదర్శనకు పూనుకొని వాక్క్రియారూపసంఘర్షణను సృష్టించారు కాబట్టి దీనిని వ్యాయోగంగా పరిగణించ వీలున్నది. నన్నయ దీని కా రూపకశిల్ప వైభవాన్ని సంతరించి కృతకృత్యు డైనాడు.

ఉదాహరణకు కొన్ని నాటకీయాంశాలు గమనించదగినవి.

1. నాయకప్రతినాయకస్థానీయులుగా ఆ రంగంలో నిలిచినవారు అర్జునకర్ణులు. వారి వీరాకృతులను వర్ణించి వీరవిభావ విస్ఫూర్తిని రంగసుందరంగా వెలార్చాడు నన్నయ. అర్జునుడు రంగంమీదకు రాగానే ఇట్లా కనపడ్డాడు-

ఉ. "హారివిచిత్రహేమకవచావృతుఁ, డున్నతచాపచారుదీ
ర్ఘోరుభుజుండు, భాస్వదసితోత్పలవర్ణుఁడు, సేంద్రచాపశం
పారుచిమేఘమో యనఁగఁ బాండవమధ్యముఁ డొప్పి బద్ధతూ
ణీరుఁడు రంగమధ్యమున నిల్చె జనంబులు దన్నుఁ జూడఁగన్". **(ఆది. 6.17)**

ఇంద్రధనుస్సుతో ఇంపుగా సొంపారే నల్లనిమేఘమో అన్నట్లు అందరిచూపులను ఆకట్టుకొన్న అందమైన వీరరసమూర్తి అర్జునుడు. అడ్డులేని చాపవీరుడుగా వెలిగిపోతున్న అర్జునుడిపై సవాలు విసురుతూ పిడుగువంటి శబ్దం పుట్టేటట్లు భుజాస్ఫాలనంచేసి రంగద్వారం వద్ద- అందరూ తనవైపు ఆశ్చర్యంతో చూచేటట్లు- నిలిచాడు కర్ణుడు.

శా. "సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితున్
బాలార్కప్రతిమున్ శరాసనధరున్ బద్ధోగ్రనిస్త్రింశు శౌ
ర్యాలంకారు సువర్ణవర్ణు ఘనుఁ గర్ణాఖ్యున్ జగత్కర్ణపూ
ర్ణాలోలద్గుణుఁ జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్.". **(ఆది. 6.31)**

నల్లకలువ వన్నెవాడు అర్జునుడు. అందువలననే మేఘంవలె మనోహరంగా ఉన్నాడు. అతనికి కోదండం అద్భుత విశేషం. కవచం ఒక వైచిత్రి. భుజబలం ఒక అలంకారం. బంగారు మేనిచాయవాడు కర్ణుడు. అందువలననే సూర్యబింబంవలె ప్రకాశమానంగా ఉన్నాడు. అతడి కవచకుండలాలే అద్భుతవిశేషాలు. నిస్త్రింశం ఒక వైచిత్రి. శౌర్యం ఒక అలంకారం. అర్జునుడు ఆహ్లాదాన్ని కలిగించాడు; కర్ణుడు ఆశ్చర్యం కలిగించాడు. అర్జునుడిఆకృతిలో అగ్రగణ్యం కోదండం. కర్ణుడిఆకృతిలో కవచకుండలాలు. ఒకడు పరాక్రమానికీ మరొకడు శౌర్యానికీ ప్రతీకలు. ఈ తారతమ్యాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే కర్ణుడికంటె అర్జును డధికుడని వస్తుధ్వని. శ్రవ్యకావ్యమర్యాద రంగమధ్యంలో దృశ్యకావ్యమర్యాదగా ఆకృతులు పొంది నిలిచినట్లు సాగింది.

2. కర్ణుడు రంగప్రవేశం చేసి అర్జునుడు ప్రదర్శించిన విద్యలన్నీ ప్రదర్శించి చూపటంతో కౌరవపక్షానికి ఒక ఆశాకిరణం ఆవిర్భవించింది. దుర్యోధనుడు కర్ణుడిని చేరదీసి, స్నేహం కలిపి, తనచేత కురురాజ్యం ఏలించు మని రంగమధ్యంలోనే కోరాడు; అర్జునుడితో పోటీపెట్టి ద్వంద్వయుద్ధం చేయించాడు. కృపాచార్యుడు కర్ణుడిని కులగోత్రాలను చెప్పుమని అధిక్షేపించగా కర్ణుడు తలవంచి నిలబడినప్పుడు దుర్యోధను డతనికి రంగమధ్యంలోనే అంగరాజ్య పట్టాభిషేకం చేశాడు. దానికి ప్రత్యుపకారంగా కర్ణుడి స్నేహాన్ని వాగ్దత్తంగా తీసికొన్నాడు. కర్ణుడు సూతపుత్రు డని తెలియగానే భీముడు అధిక్షేపించాడు. కర్ణుడు మహాపురుషు డై ఉంటా డని వాదించి దుర్యోధనుడు కర్ణసహాయుడై ఇంటికిపోయాడు. ఈ అంకంలో చర్య లెన్ని ఉన్నాయో సంభాషణ లన్ని ఉన్నాయి. అందువలన కథనంతోపాటు నాటకీయతకూడా సమంగా రాణించింది.

3. "నీవ కడు నేర్పుకాడవు గావలవదు"- (ఆది. 6.33) అనే పద్యం కర్ణుడి పౌరుషోక్తికి, "పిలువంగఁబడక సభలకు బలిమిం జని పలుకు పాపభాగుల లోకంబులకు" (ఆది. 6.36) అనే పద్యం అర్జునుడి పరుషోక్తికి. 'ఘననిశితాస్త్రములఁ బలుకఁ గడఁగుము నాతోన్" "ఈ రంగభూమి" (6.37,38) మొదలైన పద్యాలు కర్ణుడివీరోక్తులకు ప్రసిద్ధోదాహరణాలు. "కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు"........ "దొరయగుదేని నీకెదిరి దోర్బలశక్తి నితండు సూపెడిన్" (6.45) అనే పద్యంలో కృపాచార్యుడి అధిక్షేపోక్తులు, "కులము గలవాఁడు...." "రాజవరుఁడైన పార్థుతో....." (6.47,48) మొదలైన పద్యాలలో దుర్యోధనుడి అభిమానోక్తులు, "నీదు కులమునకుఁ దగఁగ(....." "ఉత్తమక్షత్త్రియప్రవరోపయోగ్యమైన...." (6.55.57) అనే పద్యాలలో భీముడి నిందోక్తులు, "అనిలజ! నీ కిట్లని పల్కను దలఁపను...." "శూరులజన్మంబు....." (6.59,60) అనే పద్యాలలో దుర్యోధనుని అధిక్షేపోక్తులు ఈ ఘట్టంలో వాగ్యుద్ధవాతావరణాన్ని కలిగించి వ్యాయోగస్వభావాన్ని పోషించాయి. వీరరౌద్రరసముద్రితమైన ఈ రంగం దీప్తసత్వానికి ఆలవాలమై సహృదయరంజకంగా సాగింది.

4. ఈ రంగాన్ని ప్రదర్శనసందర్శనరంగంగా నన్నయ తీర్చిదిద్దటంతో- రంగంమీద నిలిచి మాటలతో చేతలతో అభినయించేవారిని ఎంత శ్రద్ధగా చిత్రించాడో, వారిని చూచి స్పందించిన ప్రేక్షకలోకాన్నికూడా అంత శ్రద్ధగా చూపించాడు.

ఉదాహరణకు-

(1) "నరు, నింద్రాత్మజు నింద్రావరజసఖున్ వీరుఁ బాండవప్రవరు, ధనుర్ధరుఁ జూచి చూపఱెల్లన్ - పరమాద్భుత చిత్తులగుచు" అర్జునుడిని ప్రశంసించారట (ఆది. 6. 18).

(2) ప్రజల ప్రశంసలు విని కుంతి ఉప్పొంగిపోయి 'అనంతహర్షవిస్తారితలోచన' అయిందట! (6.20)

క. "చారుమనస్సమ్మదరస
పూరము వెలివేర్చునట్లు పొలఁతికి విగళ
ద్భూరిస్తనజనితపయో
ధారలు నానందబాష్పధారలు నొప్పెన్!" **(ఆది. 6.21)**

(3) రంగద్వారం వద్ద కర్ణుడు భుజాస్ఫాలనం చేయగానే పాండవ కౌరవులలో కలిగిన ప్రతిస్పందన రమణీయంగా వర్ణించాడు నన్నయ.

మ. "జను లెల్లం గడు సంభ్రమింపఁగ నజస్రంబై భుజాస్ఫాలన
ధ్వని శైలప్రకరంబుపైఁ బడు మహాదంభోళిశబ్దంబొకో
యన వీతెంచినఁ బాండవుల్ సనిరి ద్రోణాచార్యు డాయన్, సుయో
ధను వేష్టించిరి తమ్ము లందఱును దద్ద్వారంబు వీక్షించుచున్." **(ఆది. 6.29)**

భయసంభ్రమాలు కలిగినప్పుడు తమకు రక్షకు డనీ ఆత్మీయుడనీ ఎవరిని భావిస్తుంటారో వారివద్దకు అప్రయత్నంగా పరుగెత్తటం మానవసహజం. పాండవులు ద్రోణుడిని సమీపించారు. ధార్తరాష్ట్రులు దుర్యోధనుడిచుట్టూ చేరారు. ఈ సన్నివేశంలో బెదరక కుదురుగా నిలిచింది ద్రోణుడు, దుర్యోధనుడు. మిగిలినవారు రెండు పక్షాలుగా చీలి వా రిద్దరినీ ఆశ్రయించారు. పాండవ కౌరవులు ఆవిధంగా చీలిపోవటానికీ, పాండవుల గురుభక్తి, కౌరవుల భ్రాతృభక్తి ప్రకాశంకావటానికీ కర్ణుడు భవిష్యత్కథలో కారకుడు కాగలడనీ ఈ వర్ణనద్వారా వస్తుధ్వనిని సాధించాడు నన్నయ.

(4) కర్ణుడి అధిక్షేపోక్తులు వినగానే జనులకు ఆశ్చర్యం కలిగిందట. అర్జునుడికి కోపం, సిగ్గూ రెండూ మొలుచుకొని వచ్చాయట. దుర్యోధనుడికి ప్రీతి కలిగిందట. ఈవిధంగా సహృదయస్పందనను ప్రదర్శనకళగా నాటకీయతతో చేర్చటం నన్నయ తిక్కనకు చూపించిన వెలుగుబాట.

(5) కర్ణుడు వేసిన పర్జన్యాస్త్రంవలన మేఘాలు క్రమ్మి అర్జును డందులో మరుగుపడి కనపడకపోయినప్పుడు కన్నతల్లి కుంతి మోహమూర్ఛాన్విత అయినదట. ఆమెను చల్లనీళ్ళతో సేదదీర్చవలసివచ్చిందట! (ఆది. 6. 42,43).

(6) కర్ణుడు తన తల్లిదండ్రులపేర్లను చెప్పటానికి సిగ్గుపడి తలవంచాడట(ఆది. 6. 46); దుర్యోధనుడు అతడికి అంగరాజ్యాభిషేకం చేయగా 'పరమహర్షం' ప్రకటించాడట (ఆది. 6. 49); సూతుడు కర్ణుడిని కౌగిలించుకొని మూర్ధాన్ని ఆఘ్రాణించాడట, అభిషేకంతో అసలే తడిసి ఉన్న కొడుకుతలను హర్షాశ్రువులతో మరొకసారి తడిపివేశాడట! (ఆది. 6. 53).

(7) భీముడు కర్ణుడిని అధిక్షేపించినప్పుడు కర్ణుడు "వెల్లనయి యెద్దియుం జేయునది నేరక దీర్ఘోష్ణ నిశ్వాసవ్యాకులితవదనుం డయి యాకాశంబువలన నున్న యాదిత్యుం జూచుచు మిన్నకుండె"నట. (ఆది. 6.63)

(8) ధనుర్విద్యాపారగుడైన కర్ణుడు మిత్రుడు కావటంచేత అర్జునుడివలని భయంపోయి ఆనాటిరాత్రి దుర్యోధనుడు 'ముదితాత్ముడై' నిశ్చింతగా గుండెమీద చేతులుపెట్టుకొని నిద్రించాడట. (ఆది. 6. 63)

విభావానుభావ సాత్త్వికభావవర్ణనంలో నన్నయ తిక్కనకు గురుపీఠమని ఈ ఘట్టంలో నిరూపించుకొన్నాడు. శిశుపాలవధ ఘట్టంవలెనే, కుమారాస్త్రవిద్యాప్రదర్శనంకూడా ఆశ్వాసాదిలో ఉన్నది. అయినా ఆశ్వాసాదిపద్యాన్ని శిశుపాలవధలో నాందిగా నిలిపినట్లు కుమారాస్త్రవిద్యాప్రదర్శనంలో కూర్చలేదు. ఇది ఆదిపర్వంకంటె సభాపర్వంలో నన్నయ సాధించిన నాటకీయశిల్పపరిణతి అనవచ్చును. లేదా బయలురంగంలో ప్రదర్శించే రూపకంకంటె నాటకశాలలో ప్రదర్శించే రూపకప్రయోగంలో నాంది ఉండటం ఔచిత్యమని భావించియుండవచ్చును. ఏమైనా రంగ-బహిరంగ ప్రయోగంగా వ్యాయోగాన్ని శ్రవ్యకావ్యరంగంమీద ప్రదర్శించిచూపిన ఆదికవి నన్నయ అభినందనీయుడు!

## వ్యాయోగం: సమవకారం

వాగ్రూపయుద్ధం విస్తారంగా ప్రవర్తిల్లి, తదనుబంధంగా క్రియారూపయుద్ధం సాగినట్లు సూచించే ఘట్టాలలో వ్యాయోగలక్షణాలను ఉపలక్షించవచ్చును. దీనికి విపరీతంగా ఉంటే- అంటే క్రియారూపయుద్ధానికి ఉపస్కారకంగా, ఉపబలకంగా వాగ్రూపయుద్ధంగాని, వాగ్వివాదంగాని ప్రవర్తిల్లినట్లు వర్ణించి యుద్ధాన్ని ఫలంగా నిర్వహించే ఘట్టాలలో 'సమవకార' స్వభావాన్ని ఎక్కువగా సంలక్షించవచ్చును. ఆదిసభారణ్యపర్వాలలో భీముడు రాక్షసులను సంహరించిన ఘట్టాలు ప్రసిద్ధాలు. అతడు హిడింబ, బకాసుర, కిమ్మీర, జటాసురులను ఏకవీరుడై సంహరించాడు. అరిభయంకరుడైన జరాసంధుడిని శ్రీకృష్ణార్జున సహాయంతో స్వయంగా మల్లయుద్ధంలో సంహరించాడు. భీముడు రాక్షసులను చంపిన ఘట్టాలన్నీ ఒకయెత్తు, రాక్షసుడు కాని జరాసంధుడిని చంపిన ఘట్టం ఒక్కటీ మరొక యెత్తు. స్వీయరక్షణార్థం గానీ, జనరక్షణార్థం గానీ భీముడు రాక్షససంహారం చేశాడు. రాజసూయయాగం నిరంతరాయంగా సాగటానికీ, అతడిచేత బంధితు లైన సమస్త భూపతులను చెర విడిపించి ధర్మాన్ని రక్షించటానికీ, భీముడు జరాసంధుడిని వ్యూహంతో చంపాడు.

సమవకారంలో దేవతలకు, అసురులకు సంబంధించిన ఫలాన్ని సాధించే ఉపాయం బీజంగా ఉంటుంది. అందులో 12మంది నాయకు లుండవచ్చును. వారు ప్రఖ్యాతులూ, ఉదాత్తులూ అయి ఉండాలి. సమవకారంలో మూడు అంకా లుంటాయి. అందులో సందర్భానుకూలంగా మూడురకాల కపటచర్యలూ, మూడురకాల విద్రవాలూ (ఉపద్రవాలూ), మూడురకాల శృంగారాలూ నిబంధించబడవచ్చును. సుఖాన్నీ కానీ దుఃఖాన్ని కానీ కలిగించటానికి చేసే వంచనలు కపటచర్యలు. అవి మూడురకాలుగా ఉంటాయి. 1. వస్తుక్రమ విహితాలైనవి- అంటే కార్యసాధకుడిదోషం లేకపోయినా వంచకులచేత కలిగే మోసం. 2. పరప్రయుక్తం- అంటే కార్యసాధకుడు చేసే అపరాధాన్ని ఆసరాగా చేసికొని వంచకులు చేసే మోసం. 3. దైవవశాగతం- అంటే దైవవశాన కాకతాళీయంగా సంభవించే మోసం. విద్రవం అంటే చెదరిపోవటం. ప్రజలను చెదరిపోయేటట్లు చేసేవి విద్రవాలు. దాన్నే మనం ఇప్పుడు ఉపద్రవాలు అని అంటున్నాం. ఇవి మూడురకాలు.

1. అచేతనకృతాలు- నీటివలన కలిగే వానలు, తుఫానులు, వరదలు, ఉప్పెనలు మొ॥నవి. వాయువువలన అగ్నివలన కలిగే అపాయాలు. 2. చేతనకృతాలు- క్రూరవన్యమృగాలవలన కలిగే సంక్షోభాలవంటివి. 3. ఉభయకృతాలు- యుద్ధాలు, నగరాలముట్టడులు, రాక్షసబాధలు మొ॥నవి. శృంగారాలుకూడా ధర్మ, అర్థ, కామసంబంధాలని మూడువిధాలు. వీటిలో వేటినైనా యథావకాశంగా మూడు అంకాలలోనూ ప్రయోగించాలి. రచనలో విశేషవృత్తాలు వాడాలి. మొత్తంమీద సమవకారం నానారసాశ్రయంగా రాణించాలి. నన్నయ భీమనాయక మైన ఘట్టాలలో సమవకారస్వభావాలను సమయోచితంగా రంగరించి తనరచనలో నాటకీయతను పోషించాడు.

## జరాసంధవధ: సమగ్రసమవకారం

సమవకారస్వభావాన్ని ఎక్కువగా సంతరించుకొన్న సన్నివేశం సభాపర్వంలోని జరాసంధవధఘట్టం. ధర్మరాజుకోర్కెపై శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థానికి వచ్చి రాజసూయయాగం చేయా లని ప్రోత్సహించి, దానికి ముందుగా జరాసంధుడిని వధించా లని సూచించి, వ్యూహం నిర్ణయించి, దానిప్రకారం కార్యం నిర్వహించి, విడుదలైన రాజుల నందరిని ధర్మజుడికి ఒప్పగించి, తిరిగి ద్వారకకు వెళ్ళిపోయేవరకు గల 124 పద్యగద్యాల భాగం (సభా. 1.101-224) జరాసంధవధఘట్టం. ఇందులో ప్రధాననాయకుడు ధర్మరాజు, అతడిపక్షాన జ్ఞానేచ్ఛాక్రియాశక్తులకు ప్రతినిధులవలె శ్రీకృష్ణార్జునభీములు జరాసంధవధను నిర్వహించారు. అంటే నలుగురు ధీరోదాత్తులు నాయకులుగా ఉండి కార్యాన్ని ముందుకు తీసికొనిపోయి నిర్వహించి ఫలాన్ని అనుభవించేవారుగా గోచరిస్తున్నారు. ఈ కార్యమంతా రాజసూయం చేయటానికి, తద్ద్వారా పాండురాజాదులకు ఉత్తమగతులు కలిగించటానికి, శ్రీకృష్ణాదులకు ఇబ్బందులు కలిగించేవారిని తొలగించటానికి ఉద్దేశించబడింది కాబట్టి పితృదేవతల, అవతారపురుషుడైన శ్రీకృష్ణుడికార్యాలను సాధించటానికి ఉపాయాన్ని వెదకటం బీజంగా సాగింది కాబట్టి సమవకార వస్తుస్వభావం సహజంగా అమరింది. కార్యం సార్థకంగా సాగింది.

జరాసంధవధ ఘట్టాన్ని మూడుభాగాలుగా విభజించవచ్చును. అవి సమవకారంలోని మూడంకాలుగా రాణిస్తున్నాయి. మొదటి అంకంవంటి కథాభాగం- ప. 101-171 వరకున్నది. ఇందులో జరాసంధుడి బలపరాక్రమాలూ, అతడి పుట్టుపూర్వోత్తరాలూ, మిత్రులబలాబలాలూ చెప్పి, అతడిని వధించటంలో కల ఆవశ్యకతను పేర్కొని, అతడిని మల్లయుద్ధంలోమాత్రమే చంపే అవకాశం ఉండటాన్నీ, భీముడిని అతనిపై ప్రయోగించి ఉపాయంతో చంపటాన్నీ నిశ్చయించే కథ యీ భాగంలో చెప్పబడింది. ఇక రెండవ అంకంవంటి కథాభాగం - ప. 172-200 వరకున్నది. ఇందులో శ్రీకృష్ణార్జునభీములు కపటస్నాతకవేషాలతో గిరివ్రజపురం చేరి అపసవ్యంగా వెనుకద్వారంనుండి నగరంలో ప్రవేశించి, బలవంతాన రాజమందిరంలోకి చేరి, జరాసంధుడితో వాదించి, తమ ప్రవర్తనను సమర్థించుకొని, తమ లక్ష్యాలను వివరించి, భీముడితో ద్వంద్వ(మల్ల) యుద్ధానికి జరాసంధుడిని ఆహ్వానించిన ఘట్టం వివరించబడింది. ఆ తరువాత మూడోఅంకంవంటి కథాభాగం- భీమజరాసంధుల మల్లయుద్ధాన్ని వర్ణించే ఘట్టం- ప. 201-224. జరాసంధవధ జరిపించి, చెరలో ఉన్న రాజులను విడిపించి, సహదేవుడికి రాజ్య మిచ్చి, జరాసంధుడి దివ్యరథమెక్కి శ్రీకృష్ణుడు అందరితో కలిసి ఇంద్రప్రస్థానికి వచ్చి, విజయఫలాన్ని ధర్మరాజుకు సమర్పించటం ఇందులో ప్రధాన కథాంశాలు. ఈ మూడు ఘట్టాలలోని మొదటి రెండింటిలో కథాకథనంకంటె సంభాషణశిల్పాన్ని నన్నయ ఎక్కువగా పాటించి నాటకీయతను రక్తికట్టించాడు. మూడవది మల్లయుద్ధవర్ణనం కావటంచేత కథాకథనపద్ధతిలో సాగింది. నాటకంలో వేదికమీద మల్లయుద్ధం ప్రదర్శనయోగ్యమైనది కాదు. కాని, శ్రవ్యకావ్యప్రక్రియలో సాక్షాత్తు వేదికమీద జరుగుతుండగా మనోనేత్రంతో చూచి హర్షించేటట్లు నన్నయ దిద్దితీర్చాడు. రెండురంగాల దృశ్యకావ్య రచనాప్రభావం మూడోరంగాన్ని ముంచెత్తుతూ సమవకార స్వభావాన్ని సుసంపన్నం చేస్తున్నది.

జరాసంధవధ ఘట్టంలో మూడువిధాలైన కపటచర్యలూ, ఉపద్రవాలూ, యథావకాశంగా వర్ణించబడ్డాయి. జరాసంధుడు పద్నాలుగు రాజవంశాలలో పుట్టిన క్షత్రియుల నందరినీ జయించాడు. అతడికి మహాబలుడైన శిశుపాలుడు సేనానిగా, హంసడిభకులు సహాయకులుగా ఉండి దండయాత్రలలో సహాయం చేశారు. శ్రీకృష్ణుడు కంసుడిని వధించటంవలన ఆ కంసుడిభార్య జరాసంధుడి కూతురు కావటంచేత, జరాసంధుడు శ్రీకృష్ణుడిపై పగసాధించేయత్నంతో అనేకఉపద్రవాలు కలిగించాడు. జరాసంధుడు, హంసడిభకులు కలిసి రణరంగంలో నిలిస్తే లోకంలో వారికి ఎదురులేదు. వారు ముగ్గురూ

ఆయుధాలతో చావని వరాలు పొందినవారు కావటంచేత వారు మధురపై దండెత్తి వృష్ణిభోజాంధకవీరులను యుద్ధాలతో పీడిస్తుండేవారు. ఈ ఉపద్రవంనుండి తప్పించుకొనటానికి శ్రీకృష్ణాదులు ఒక చిన్న మోసం చేశారు. హంసడిభకు లిద్దరూ ఒకరిని వదలి మరొకరు బ్రతకలేనివారు. అందువలన హంసుడు యుద్ధంలో చనిపోయా డని డిభకుడికి చెప్పించాడు కృష్ణుడు. ఆ మాటను నమ్మి హంసుడు లేనిలోకంలో తాను జీవించలేనని శోకించి డిభకుడు నీటిలో మునిగి ప్రాణాలు వదిలాడు. డిభకుడు చనిపోయాడని తెలిసిన హంసుడుకూడ తమ్ముడిమీది ప్రేమతో నీటమునిగి అసువులు పోగొట్టుకొన్నాడు. మిత్రుల మరణానంతరం జరాసంధుడు మగధకు తిరిగివెళ్ళిపోయాడు. శ్రీకృష్ణాదులు జరాసంధుడికి భయపడి మధుర సురక్షితప్రాంతం కాదని రైవతకపర్వతంమీద దుర్గాన్ని నిర్మించుకొని అక్కడ ఉండసాగారు. పాండవులు వారికి అండగా నిలిచారు.

జరాసంధుడు ఆవిధంగా విజృంభించి భూతలంమీద ఉన్న రాజుల నందరినీ యుద్ధాలలో ఓడించి, బంధించి తెచ్చి గిరివ్రజపురంలో బందీలుగా ఉంచి ప్రతిరోజూ ఒక్కొక్కరిని భైరవపూజలో బలియిస్తూ ఉగ్రవర్తనుడై వ్యవహరించాడు. కాబట్టి అతడిని చంపితేనే సామ్రాజ్యవైభవం సుస్థిర మౌతుందనీ, రాజసూయం చేయటం సుగమమౌతుందనీ శ్రీకృష్ణుడు ధర్మరాజుకు సలహా చెప్పాడు.

నన్నయ ఈ కథాభాగాన్ని కథాకథనంగా కాకుండా శ్రీకృష్ణుడు చేసిన దీర్ఘసంభాషణగా తీర్చిదిద్దటం నాటకీయత. జరాసంధుడివలన కలిగిన యుద్ధోపద్రవం, హంసడిభకులను చంపటంలో శ్రీకృష్ణుడు చేసిన వంచనశిల్పం ఈ కథాభాగంలో ముఖ్యమైనవి. వంచనను వంచనతోనే వంచాలని శ్రీకృష్ణుడి వ్యూహం. ఆయుధాలచేత చావని శత్రువీరులను ఉపాయంచేతనే వధించాలని అతడి రాజనీతి. జరాసంధుడి వృత్తాంతాన్ని శ్రీకృష్ణుడు సంగ్రహంగా వినిపించి, అతడి వధోపాయాన్ని నిశ్చయించటంతో మొదటిభాగం ముగుస్తుంది ప్రథమాంకంవలె.

ఈ కథలో కాగల కార్య మిది-

ఉ. ''అమ్మగధేశు నుగ్రబలు నాయుధయుద్ధమునన్ జయింపఁగా
నిమ్మహి నోప రెవ్వరు; నుమేశ్వరుఁ డట్టివరమ్ము వానికిన్
నెమ్మిన యిచ్చెఁ; గావున వినీతుఁడు వాయుసుతుండు మల్లయు
ద్ధమ్మున నోర్చు నాతని నుదగ్రమహాభుజశక్తి యేర్పడన్''. **(సభా. 1.162)**

రెండవ అంకంగా భాసించే భాగంలో శ్రీకృష్ణార్జునభీములు గిరివ్రజపురంలో అమార్గాన ప్రవేశించటం, శత్రువులవలె వ్యవహరించటం, గమనిస్తే జరాసంధుడిపట్ల వా రనుసరించిన పద్ధతి గత్యంతరంలేని వంచనగా స్ఫురించటం స్పష్టం. ఆ భాగంలో శ్రీకృష్ణుడు వారివర్తనాన్ని సహేతుకంగా సమర్థించుకొన్నట్లు సంభాషణను చిత్రించటం నన్నయ రూపకరచనాశిల్పం!

అభ్యాగతులవలె శ్రీకృష్ణభీమార్జునులు జరాసంధుడిగృహంలో ప్రవేశించారు. జరాసంధుడు వారికి ఎదురువచ్చి ఆహ్వానించాడు. ఆ తరువాత వారినడుమ జరిగే సంభాషణ ఒక రమణీయ మైన రంగంవలె రాణిస్తుంది. దానిని ఇలా అన్వయించుకొనవచ్చును.

**జరా:** మీరు నిజంగా స్నాతకులే అయితే, పూలనూ చందనాన్నీ బలవంతాన గ్రహించటం న్యాయమా? చైత్యకాద్రితటాన్ని పగులగొట్టి మీరు చులుకదనంతో అద్వారాన నగరంలో ప్రవేశించటం తగునా? నే నిచ్చిన మధుపర్కాలను గ్రహించకుండట మెందువలన? మీ వేషాలు బ్రాహ్మణులవి, రూపాలు క్షత్రియులవి. మీరు వేషధారులవలె ఉన్నారు. ఎవరు మీరు?

**కృష్ణుడు:** స్నాతకులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యజాతులలో ఉండటం సనాతనంగా వస్తున్న ఆచారం. మేము క్షత్రియజాతిస్నాతకులం. మిత్రులగృహాన్ని ముఖద్వారంనుండి, శత్రువులగృహాన్ని మారుమార్గంనుండి ప్రవేశించటం క్షత్రియులకు ఉచితం.

గంధపుష్పాలలో లక్ష్మి ఉంటుంది కాబట్టి వాటిని మేము బలాత్కారంగా గ్రహించాం. ఇది క్షత్రియాచారం. నీతో మాకు వేరేపని ఉండటంచేత నీ విచ్చిన అర్ఘ్యాన్నీ మధుపర్కాలనూ గ్రహించలేదు.

**జరా:** మీరు నాకూ, నేను మీకూ ఎన్నడూ కీడు చేసినదిలేదు. నే నెట్లా మీకు శత్రువు నయ్యాను? నేను పాపరహితుడిని, గుణవంతుడిని. సురమునిబ్రాహ్మణభక్తుడిని, ఉత్తమక్షత్రియకులాచారపరుడిని.

**కృష్ణుడు:** సమస్తక్షత్రియవంశాలనూ ఉద్ధరించే సమర్థుడైన ధర్మరాజుఆనతిమేరకు క్షత్రియకులాన్ని రక్షించటానికీ, అపజయమెరుగని శత్రువుల అకుంఠితపరాక్రమాన్నిసైతం వమ్ముచేయటానికీ, దుర్మార్గులను దూషించటానికీ మేము ఇక్కడికి వచ్చాం. జరాసంధా! నీ వేమో 'ఉత్తమక్షత్రియుడ' నన్నావు; ఎవ్వరికీ కీడు చేయలే దన్నావు. మరి నీవలె మూర్ధాభిషిక్తులైన రాజులను చెరబట్టి తెచ్చి, క్రూరంగా పశుపతికి బలియిచ్చినవా రెవరైనా ఉన్నారా? ఇంతకు మించిన కీడు మరేదైనా ఉన్నదా? కారణం లేకుండా సాధుజనులను హింసించే దుర్మార్గుడు అందరికీ శత్రువేకదా! ఉత్తములకు ఇంతకంటె కారణం మరొకటి కావాలా? ఏ తప్పూ చేయని తనకులంవారిని చంపటంకంటె మహాపాపం మరేమైనా ఉన్నదా? నీవంటి పాపకర్ముడిని ఉపేక్షిస్తే ధర్మరక్షకులమైన మాకుకూడా ఆ పాపం అంటుతుంది. కాబట్టి అటువంటి పాపభయంతో నిన్ను దండించటానికి వచ్చాం. నన్ను మించినవాడు లే డని విర్రవీగి ఇతరులను అవమానించవద్దు. పూర్వం జయద్రథ, దంభోద్భవ, కార్తవీర్యులు మహాబలవంతు లైనప్పటికీ అవినీతులై, మహాత్ములకు అవమానంచేసినవారై ఇతరులచేత పరాజితులైనారు. అపారపరాక్రమంతో రణయజ్ఞాలు చేసి, శత్రువులను సంహరించిన వీరులు మహాతపస్వులు పోయే సద్గతి పొందుతారు. కాని, నీవలె అపకారదారుణకార్య మైన భైరవపూజ చేసేవాడికి ఉత్తమగతు లుంటాయా? కాబట్టి, నీవు చెడకుండా ఉండాలంటే నేను చెప్పేమాట చేయుము. నీవు బంధించిన రాజుల నందరినీ విడిపించుము; నేను కృష్ణుడను, ఇతడు భీముడు, అతడు అర్జునుడు, నీవలన పుట్టిన ఈ పాపమనే మహాగ్నిని చల్లార్చటానికి వచ్చిన పరాక్రమవంతులు. కురువంశశ్రేష్ఠులు వీరు. నీవు క్రూరుడవై ఇప్పటికీ ఆ రాజులను విడువకపోతే, ఈ పాండవేయులు నిన్ను యుద్ధంలో ఓడించి వారిని విడిపిస్తారు.

**జరా:** (కోపంతో కనుబొమలు ముడిచి) అపారపరాక్రమంతో రాజుల నోడించి గర్వించటం క్షత్రియులకు ధర్మమే అవుతుంది. కానీ, దోష మెట్లా అవుతుంది? నే నెప్పుడూ పరాక్రమమే జీవితవ్రతంగా కలవాడిని. భైరవపూజకొరకే తెచ్చిన ఈ రాజులను నే నెందుకు వదలుతాను? నేను పరాక్రమంచేత శత్రువులను జయించినవాడిని. కృష్ణా! నా సంగతి నీ కిదివరకే తెలుసు. నేను వేరే చెప్పనవసరం లేదు. మీతో యుద్ధమే చేయవలసివస్తే- మీ కిష్టమైన పద్ధతిలోనే చేస్తాను. సైన్యంతో నైనా సరే, మీ ముగ్గురితో కానీ, ఇద్దరితో కానీ, ఒక్కరితో కానీ నే నొక్కడినే అసహాయశూరుడనై పోరాడుతాను. మీరూ ప్రయత్నించండి. మీ యిష్టం చెప్పండి.

**జరా:** ఒక్కరితో పలువురు యుద్ధం చేయటం న్యాయం కాదు. మేము ముగ్గురమూ బలవంతులమే. మాలో ఒక మహాబలుడిని ఎన్నుకొమ్ము. అతడితో మల్లయుద్ధంలో తలపడుము.

**జరా:** భీముడే యుద్ధంలో నాకు దీటైనవాడు.

ఈ ఘట్టం రంగంమీద ప్రయోగింపబడుతున్న అంకంవలె ఉన్నది. స్నాతకులుగా, మార్గంగాని మార్గంలో ఉద్ధతు లై ప్రవేశించి, మాల్యసుగంధాలను హరించి, అర్ఘ్యాన్ని తిరస్కరించిన శ్రీకృష్ణభీమార్జునులవృత్తం ఉపాయంతో (కపటంతో) చంపటానికి చేసిన ప్రయత్నాల ప్రదర్శనమే. దానిని క్షత్రియోచితవర్తనంగా సమర్థించుకొనటం శ్రీకృష్ణుడిచాతుర్యం. మూర్ధాభిషిక్తులను చెరపట్టటం దోషంకాదు కానీ, వారిని భైరవుడికి బలియివ్వటం అన్యాయ మన్నాడు కృష్ణుడు. వారిని విడిపించటమే ధర్మరాజు కర్తవ్యమనీ, అది ధర్మవ్రతమనీ చెప్పాడు. క్రూరుడిని చంపటానికి ధర్మచ్ఛన్నమైన కాపట్యం న్యాయమని శ్రీకృష్ణుడి మతం. అది నిఖిలరాజబలివధ అనే ఉపద్రవాన్ని తొలగించటానికి ఏర్పరచుకొన్న ఉపాయమని శ్రీకృష్ణుని వ్యాఖ్య. ఇటువంటి వస్తువు కపటచర్యలనూ, ఉపద్రవాలనూ చిత్రించే స్వభావంగల సమవకారానికి సరైన దని

నన్నయ భావించి, ఈ ఘట్టాన్ని రెండవఅంకంవలె సంభాషణచతురంగా. వాదోపవాదతుల్యంగా చిత్రించి నాటకీయతను రక్తికట్టించాడు.

సమవకారంలో విశేషవృత్తాలు వాడాలనే నియమం ఉన్నది. నన్నయ ఈ అంశంలోకూడా శ్రద్ధతీసికొన్నాడు. శ్రీకృష్ణుడు జరాసంధుడిని ధిక్కరిస్తూ భైరవపూజలో రాజులను బలిచేయటం దారుణ మని నిందించటం, ఆ రాజులను వదలిపెట్టు మని ధట్టించటం, వదలిపెట్టకపోతే అతడి పరాక్రమాగ్నిని ఆర్పటం తథ్యమని హెచ్చరించటం, భీమార్జునులనూ తననూ బహిర్గతం చేసికొనటం అనే అంశాలను తెలిపే సంభాషణలు ఈ ఘట్టంలో కీలకా లైనవి. కథావృత్తంలో కేంద్రబిందువులవంటివి. జరాసంధవధను సమర్థించుకొనే సారధర్మసూక్తులవంటివి. ఇంతటి ప్రాధాన్యం కలిగిన శ్రీకృష్ణుడివాక్యాలను రెండు తరలవృత్తాలలో రచించటం నన్నయవిశేషచ్ఛందశ్శిల్పం. పఠితలమనస్సులు ఈ వృత్తాలవైపు ఆకర్షితాలై కథాప్రాణాన్ని గుర్తించేటట్లు చేశాడు నన్నయ.

విశేషవృత్తాలను సందర్భోచితంగా వాడటం, నాటకీయశిల్పానికి అనుగుణంగా అమర్చటం ఛందశ్శిల్పంలో ఒక నేర్పు. సామాన్యవృత్తాలనుకూడా విశేషంగా వాడటం మరొకనేర్పు. జరాసంధవధఘట్టంలో మత్తేభవృత్తాన్ని రెండుచోట్లమాత్రమే వాడాడు నన్నయ. ఒకటి భీమజరాసంధులు మల్లయుద్ధంలో పెనగిన సన్నివేశం చెప్పేది. (సభా. 1.203). మదించిన ఏనుగులు కుమ్ములాడినట్లుంటుంది ఆ మత్తేభం. అందుకే అది సార్థకం. జరాసంధవధానంతరం భీముడు ఇంద్రప్రస్థపురంలో ప్రవేశించినప్పుడు ప్రజ లాతనిని ప్రశంసిస్తూ, ధర్మజరాజ్య ప్రతిష్ఠాపనాచార్యుడివలె భావించిన పద్యంకూడా మత్తేభమే. (సభా. 1.219). మొదటిపద్యంలో భీమజరాసంధులు రెండు మత్తేభాలవలె పోరాడారనీ, చివరకు వీరమత్తేభంవంటి భీముడే విజయాన్ని సాధించి సాటిలేనిమత్తేభంగా మిగిలాడనీ వృత్తధ్వని సాధించాడు నన్నయ. ఇది భారతరచనాశిల్పంలో భాగమే కాకుండా సమవకారరచనాశిల్పమర్మంకూడా కావటం నన్నయనాటకీయతకు నిదర్శనం!

మూడవరంగం యుద్ధకార్యప్రదర్శన ప్రధానమైనది. ఆ ఘట్టంలోని నడిమిభాగంలో శ్రీకృష్ణుడిప్రబోధాన్ని సంభాషణగా ఒకపద్యంలో నిలపటం నన్నయ రచనాశిల్పం. ఈ యుద్ధచక్రానికి ఆ సంభాషణ ఇరుసు. దాని తాత్పర్యమంతా ఆ పిలుపులో ధ్వనిస్తుంది.

చ. "విరహితసత్త్వుఁ డయ్యెఁ బ్రతివీరుఁడు వీని నశేషధారుణీ
శ్వరనికరాపరాధు నతిసాహసికున్ వధియించి నీభుజ
స్థిరత యెలర్ప నయ్యనిలదేవుబలంబును నీబలంబు భా
సురముగ మాకుఁ జూపుము విశుద్ధయశోనిధి! మారుతాత్మజా!". **(సభా. 1.208)**

ఈ పద్యం రూపకప్రక్రియలో చూళిక వంటిది. తెరలోపలి పాత్రతో యుద్ధాదుల సూచనలు చేయటం దీనిస్వభావం. దీని విస్తరణమే మిగిలిన రంగవస్తువర్ణనం. జరాసంధవధ లోకధర్మన్యాయంగానే కాక, నాటకీయధర్మన్యాయంగాకూడా నిరూపించటం ఈ పద్యతాత్పర్యం. అంతేకాదు. శ్రవ్య దృశ్య కావ్య ప్రక్రియల విశిష్టయోజనం- ప్రసన్నకథాకలితార్థయుక్తిలో భాగంగా నన్నయ దీనిని ప్రదర్శించాడు.

ప్రజలు చేసే భీమప్రశంస భరతవాక్యంవలె ప్రకాశింపచేయటం మరొక రూపకశిల్పం!

మ. "జనసంత్రాసకరున్ మహోద్ధతు జరాసంధున్ హరిప్రేరణం
బున భంజించెఁ బ్రభంజనాత్మజుఁడు భూభుగ్వీరులం దన్నిరో
ధననిర్ముక్తులఁ జేసె నింకఁ జతురంతక్షోణికిన్ ధర్మనం
దనుసామ్రాజ్యము పూజ్యమయ్యె నని మోదం బంది రుర్వీజనుల్". **(సభా. 1. 219)**

'సర్వేజనా స్సుఖినో భవంతు' అనే అర్థాన్ని ధ్వనింపచేశాడు 'మోదంబంది రుర్వీజనుల్' అనే చివరివాక్యంలో పరోక్షంగా నన్నయ.

కథారచనలో నాటకీయతను సూచించే కొన్ని పారిభాషికపదాలను తగిన సందర్భాలలో వాడటం నన్నయ పాటించే ఒక మర్యాద. కథారంభంలో 'ఆరంభము' (సభా.1.123) 'కార్యంబు నిర్వహింతుము' (1-126) అనే పదాలూ, అద్భుతంగా ముగిసే నిర్వహణంలో ప్రజల 'ఆశ్చర్యము' (1.221)ను సూచించటం ఇందుకు నిదర్శం. ఆ యా సందర్భాలలో భావానుభావవ్యంజక శబ్దాలను వాడటంకూడ గమనించవచ్చును. ఉదాహరణకు- 'నిర్వేదించి' (1.137), భక్తి-(1.139), భయానకము (1.205) ఆహవహర్షము (1.204) మొదలైనవి. నన్నయ చతుర్విధాభినయాలలో ఆంగికానికీ, వాచికానికీ మాత్రమే ఎక్కువ ప్రాధాన్య మిస్తాడు. ఆహార్యసాత్త్వికాభినయాలను క్వాచిత్కంగా వర్ణిస్తాడు. నన్నయగారు వదలిన ఆ రెండు అభినయాలను గూడా తిక్కన కళాపూర్ణంగా కవితలో పోషించాడు.

**నన్నయఆంగికాభినయవర్ణనానికి ఒక మచ్చుతునక:**

ఆ. "బలియుఁ డపుడు వెంద్రుకలు పాచి ముడిచి గం
టెసఁగఁ దాల్చి వీరరసికవృత్తి
నుద్ధతుండు మల్లయుద్ధప్రసాధనం
బమర నిలిచె వేడ్క నమితబలుఁడు". (సభా. 1.201)

**వాచికాభినయప్రదర్శనకు-**

క. "అమితపరాక్రమమున నా
క్రమించి పరనృపుల నోర్చి గర్వించుట దో
సమె యిది సత్క్షత్త్రియధ
ర్మము; యే నెప్పుడుఁ బరాక్రమవ్రతుఁడ నిలన్!". (సభా. 1.196)

**అలంకారంచేత యుద్ధాదులలో వీరప్రతివీరుల తారతమ్యాన్ని ధ్వనింపచేయటానికి ఉదాహరణం:**

చ. "అతులబలుల్ పరస్పరజయార్థులు పార్థివపుంగవుల్ మరు
త్సుతమగధేశ్వరుల్ సమరశూరులు దారుణలీలఁ బోరి రూ
ర్జితభుజదర్ప మేర్పడఁగ సింహగజేంద్రములట్లు వజ్రప
ర్వతములయట్లు ఘోరతరవాసవవృత్రులయట్లు నిద్దఱున్." (సభా. 1.206)

ఈ వర్ణనంలో మూడు ఉపమానా లున్నాయి. అతులబలుల్- అనే విశేషణానికి సాటిలేని బలం కలవారనీ, సమానం కాని బలం కలవారనీ రెండర్థాలు స్ఫురిస్తాయి. వారు పరస్పరజయార్థులై ఒకరిపై ఒకరు మించాలని వ్యూహాలు వేసికొంటూ మల్లయుద్ధం సాగించారు. కొంతసేపు మొదట్లో సింహగజేంద్రాలుగా అనిపించారు. ఇందులో క్రమాలంకారాన్ని అన్వయించుకోవాలి. భీముడు సింహంవలె, జరాసంధుడు గజేంద్రుడివలె కనిపించారు. అంటే మొదట భీముడిదే పైచేయి. ఆ తరువాత ఇద్దరూ వజ్రపర్వతాలవలె పోరారు కొంతకాలం. అందులో ఇరువురూ తుల్యబలాలను ప్రదర్శించారు. ఇక చివరకు- వా రిద్దరూ వాసవవృత్రాసురులవలె పోరారు. ఈ ఉపమానంవలన భీమవిజయం, జరాసంధమృతి ధ్వనించబడుతున్నది. యుద్ధవీరం పోషించబడే వస్తువును అలంకారంచేత ధ్వనింపజేయటం నన్నయ శిల్పం. ఈ అవస్థల వర్ణనం ఎంత శ్రవ్యకావ్యసుందరమో అంతటి దృశ్యకావ్యరమ్యం!

నానారసా(భావా)శ్రయంగా ఉండటం సమవకారంలో కానవచ్చే మరొక సార్థకలక్షణం. నన్నయ ఈ ఘట్టాన్ని నానారసభావబంధురంగా మలచాడు. ధర్మజ భీమార్జునులలో శ్రీకృష్ణుడిలో ఉత్సాహం, క్రోధం, బృహద్రథుడిలో నిర్వేదం,

హర్షం, భక్తి, పుత్రోత్సాహం, బృహద్రథుడి భార్యలలో భయం, లజ్జ, ఆశ్చర్యం, హర్షం, జరాసంధుడిలో ఉత్సాహ, క్రోధ, భక్తిభావాలు, భీమజరాసంధులలో రౌద్రోద్రేకం, ఉత్సాహశీలం, ప్రజలలో ఆశ్చర్యం- ఇవన్నీ స్పష్టంగా ప్రకటితమయ్యేటట్లు నన్నయ రచించాడు.

ఆదిసభారణ్యపర్వాలలో భీముడు చంపిన వీరులలో సర్వోత్తముడైన ధీరోద్ధతుడు జరాసంధుడు. భీమపరాక్రమ ప్రదర్శకాలైన వీరఘట్టాలు సమవకారాలుగా గోచరిస్తాయి. కాని, వాటన్నిటిలో జరాసంధవధ సమగ్రసుందరంగా సాక్షాత్కరించింది. దానికి కారణం నన్నయనాటకీయరచనారామణీయకత్వప్రసన్నతయే!

భీముడు రాక్షసులను వధించిన ఘట్టాలు ఆదిపర్వంలో రెండు, అరణ్యపర్వంలో రెండు ఉన్నాయి. అవి హిడింబాసురవధ (ఆది. 6.185-227), బకాసురవధ (ఆది. 6.237-309), కిమ్మీరవధ (ఆర.1.107-121), జటాసురవధ. (ఆర. 3.380-397) వీటిని నన్నయ తీర్చిదిద్దినపద్ధతి గమనిస్తే ఈ అంశాలు వ్యక్త మౌతున్నాయి.

1. ఆదిపర్వంలోని ఘట్టాలలో నాటకీయతను పాటించిన నన్నయ అరణ్యపర్వంలోని ఘట్టాలను కథాఘట్టాలుగానే చిత్రించాడు. అవి ఆఖ్యానంలోని భాగాలే కాబట్టి ఉపాఖ్యానా లనటానికి వీలులేదు.

2. హిడింబాసురవధఘట్టంలో భీమాశ్రిత మైన యుద్ధవీరానికి శృంగారం అంగంగా నిలిచింది.

3. బకాసురవధఘట్టంలో భీమాశ్రితయుద్ధవీరానికి, దయాధర్మవీరాలూ, కరుణరసం రౌద్రరసం పోషకాలుగా నిలిచాయి.

4. వస్తుస్వభావాలనుబట్టి హిడింబాసురవధఘట్టం లలితం ఉజ్జ్వలం. బకాసురుడిని లోకహితార్థం చంపాడు. ఆ ఘట్టాలను నాటకీయతతో చిత్రించటంలోకూడ మొదటిదానికంటె రెండవది ఉత్తమం.

5. హిడింబాసురుడిని స్వీయరక్షణంకొరకు చంపాడు భీముడు; బకాసురుడిని లోకహితార్థం చంపాడు. ఆ ఘట్టాలను నాటకీయతతో చిత్రించటంలోకూడ మొదటిదానికంటె రెండవది ఉత్తమం.

6. హిడింబ, బకాసురవధలు మూడురంగాలుగా విభజించబడటానికి అనువైన కథలు. అందుకే సమవకారస్వభావం వాటిలో కుదిరింది.

## హిడింబాసురవధ - పాక్షికసమవకారం

లాక్షాగృహదహనానంతరం పాండవులు దుర్గమారణ్యంలో తలదాచుకొంటూ ఒక మర్రిచెట్టుక్రింద విశ్రాంతితీసికొంటున్న దృశ్యంతో ఈ కథ మొదలౌతుంది. ధర్మజార్జున నకులసహదేవులు, కుంతీదేవి శ్రమవలన ఒడలుతెలియకుండా చెట్టుక్రింద నిద్రపోతుంటారు. రాత్రివేళ రాక్షసాదుల బాధ కలుగకుండ భీముడు జాగరణచేస్తూ వారిని రక్షిస్తూ ఉంటాడు. వారి దైన్యాన్ని చూచి ఖిన్ను డౌతాడు, దుర్యోధనధృతరాష్ట్రులు చేసిన కాపట్యానికి చింతిస్తూ ఉంటాడు. ఆ సన్నివేశం ఒక రూపకంలోని రంగంలాగా శోభించింది.

ఆ ప్రక్కనే ఉన్నది లేతమద్దిచెట్లతోపు. అందులో ఉంటాడు హిడింబు డనే భయంకర రాక్షసుడు. మానవమాంసభక్షకుడు. అతడితో కలసి ఉంటున్నదిఅతడి చెల్లెలు హిడింబ. ఆమెకు వయసు వచ్చింది. మనసు పండింది. అన్న గడిపే భయంకరజీవయాత్ర ఆమెకు గిట్టదు. అయినా అగ్రజుడి ఆనతిని పాటించక తప్పదని కాలంగడుపుతున్నది. ఆమె సంస్కారవతి. ఆమెకు వివాహంచేసి ఒక ఇంటిదాన్ని చేయాలన్న స్పృహ హిడింబుడికి లేదు. తినటం, చెల్లెలిని వేధించుకొని తినటం తప్ప అతడికి మరొక ధ్యాస లేదు. అంతరాంతరాలలో ఆమె తన జీవితమాధుర్యాన్నిగురించి ఎన్నో ఆశలు పెట్టుకొని కలలు కంటున్నది. పాండవులు ఆ అడవిలో ప్రవేశించి వంటింట్లోకి చొరబడిన కుందేళ్ళవలె హిడింబుడికంటపడ్డారు. ఆ రాక్షసుడు హిడింబను పిలిచి 'వారిని తెచ్చి వారి మాంసాలు వండి వడ్డించు' మని ఆజ్ఞాపించాడు. అన్నఆజ్ఞ హిడింబకు యముడిఆజ్ఞయే. ఆమె భీము డున్నచోటకి వచ్చింది - అంటే భీముడున్న రంగంలోకి హిడింబ ప్రవేశించింది.

దూరంగా ఉండి భీముడిని చూచింది. అపూర్వం అతని ఆకారం. అతడి కన్నులు జాగృతాలై విప్పారి ఉన్నాయి వికసించిన పద్మాలవలె. విశాలమైన వక్షఃస్థలం, సింహంనడుమువంటి నడుము, వజ్రాయుధాలవలె ఉన్న స్థిరమైన బాహువులు, మహావీరుడు, అన్నింటికంటె మించి మన్మథాకారుడు. అతడిని చూడగానే మనస్సు చలించింది. ఒకవృక్షం చాటున అట్లాగే నిలువబడి కొంతసేపు కన్నార్పకుండా చూచింది. ఆమెకు తెలియకుండానే హృదయంలో మదనాగ్నివేదన మొదలైనది. ఆమెమనసులో తనను తాను భీముడికి సమర్పించుకొన్నది. ఆమె కామరూపధర కాబట్టి మనోజ్ఞమైన మానవస్త్రీరూపం తాల్చింది. పూచినతీగ నడచివచ్చినట్లు ఉన్నతమైనవక్షోజాలు ఉప్పొంగగా బహురత్నశోభితాలంకారాలతో భీముడిని సమీపించింది. అన్నగారిస్పృహయే లేదు. పవనతనయుడే తన సర్వస్వ మనుకొని మైమరచి నిలిచింది. ఆమెకు రాగోదయ మయింది.

ఆ రాత్రిసమయంలో ఒంటరిగా వచ్చిన ఆ వనితను అనుమానంతో గ్రుచ్చిగ్రుచ్చి అడిగాడు అనిలతనయుడు. ఆమె ఉన్నమాట, అన్నమాట అన్నీ చెప్పింది. మనసులో ఉన్నమాటకూడా మనవిచేసికొన్నది.

క. “నాకుఁ బతివయిన, నిన్నుం
జేకొని మా యన్న యెగ్గుసేయక కాచున్;
నాకు మఱి నీవ పతివి గు
ణాకర! యిజ్జన్మమున మహాస్నేహమునన్”. **(సభా. 6.194)**

అని జన్మజన్మల అనుబంధంగా తనలో కలిగిన అనురాగభావోదయాన్ని గుర్తించి వ్యాఖ్యానించి చెప్పింది. హిడింబు డున్న వనంలో ప్రవేశించటం యముడిగొంతులో దూరటంవంటిదని హెచ్చరించింది. తనను ప్రేమిస్తే భీముడిని హిడింబుడు చంపకుండ ఉంటాడని ఉపాయం సూచించింది. నిద్రపోతున్న ధర్మజాదులను రక్షించవలెనని భీముడి కోరికైతే తాను వారిని కాపాడుతానని మాటయిచ్చింది. అన్నబారిన పడకుండా భీముడిని దక్కించుకొందామని తాపత్రయపడుతూ భీముడికి రక్షణోపాయాలు చెప్పి తన అనురాగాన్ని వ్యక్తంచేసింది.

భీముడు మహాబలశాలి, మహాభిమాని. ఒక రాక్షసుడికి భయపడి తాను, తనవారిని నిద్రలేపి వారిని ‘మీకు మీరే రక్షించుకొనం’ డని ప్రబోధించాలనే సూచన భీముడికి కోపం తెప్పించింది. హుంకరించి ఇట్లా అన్నాడు హిడింబతో.

ఉ. “క్రచ్చఱ నొక్క రక్కసుఁడ కాఁడు సురాసురు లెల్ల నొక్కటై
వచ్చిన నీవ చూడఁగ నవార్యబలోన్నతిఁ జేసి వారలన్
వ్రచ్చి వధింతుఁగాక! యిటు వచ్చి శ్రమంపడి యున్న నిచ్చట
నెమ్మిచ్చగు వీరి దైన సుఖనిద్రకు భంగము సేయ నేర్తునే?” **(సభా. 6.200)**

హిడింబాసురుడిని రమ్మని చెప్పుమని విజృంభించాడు.

భీముడి భీషణసుందరమైన వీరమూర్తిని చూచింది హిడింబ. హిడింబుడికి ఎదురుగా నిలబడి గర్జించగల సింహం ఆమె కంతవరకు కనపడలేదు. అటువంటి మహావీరు డుంటా డని ఆమె కలకూడా కనలేదు. అటువంటి అనంతశక్తియుతుడు మన్మథాకారుడై తనమనసు దోచుకొని ముందు నిలువబడ్డాడు. ఆమె నిలువెల్లా పులకించింది.

ఇక ఆమె జీవితానికి కావలసింది హిడింబుడా? భీమసేనుడా?- సోదరుడా? మనోహరుడా? ఆమె అంతరంగం అరక్షణం సంక్షోభం చెందింది. వాయుతనయుడే తన ప్రాణనాథు డనుకొన్నది. చచ్చినా బ్రతికినా ఆతడే శరణ్యమని నిశ్చయించుకొన్నది.

ప్రళయకాలమేఘంవలె గర్జిస్తూ, మెరుపులవంటి కోరలు మెరుస్తూ ఉండగా అగ్నికుండాలవలె కన్నులు మండుతూ ఉండగా యముడివలె హిడింబుడు రంగంలో ప్రవేశించాడు. తనమాట కాదని మనుషులతో కూడి మసలుతున్నందుకు

చెల్లెలిని గద్దించాడు. ఆగ్రహించిన అన్న ప్రాణం తీస్తాడన్న భయంతో హిడింబ భీముడిచాటుకు పోయి నిలబడింది. భీముడు ఆమెను ప్రసన్నంగా చూచాడు. అన్నబలాన్ని అంతగా పొగడిన అబల తనఅండ చేరటం భీముడికి ఆత్మాభిమానం పెంచింది. "నన్నూ మీఅన్ననూ చూస్తూ ఇక్కడే ఉండుము" అని ధీమాగా పలికి ముందుకు సాగాడు భీముడు.

హిడింబాసురుడు భీముడిని సమీపించాడు. ఒకవైపు అన్నదమ్ములూ తల్లీ నిద్రపోతున్నారు. వారికి నిద్రాభంగం కలుగకూడదు. మరొకవైపు మహారాక్షసుడు యుద్ధానికి వస్తున్నాడు. భీముడు మేనుపెంచి హిడింబుడిభుజం పట్టుకొని సింహం నోటకరచుకొన్న మృగాన్ని లాగి తీసికొనిపోయినట్లు ఎనిమిదిధనువులదూరం లాగికొని పోయాడు.

రంగంప్రక్కనే మరోరంగం మొదలైనది. ఇప్పు డసలురంగ మిది. భీమహిడింబాసురులు ముష్టియుద్ధం ఘోరంగా చేస్తున్నారు. చప్పుడు లౌతున్నా ధర్మరాజాదుల నిద్ర భగ్నం కాలేదు. ఒకసారి హిడింబుడు భీముడిని బాహువులతో బిగియబట్టి పెద్దగా అరిచాడు విజయగర్వంతో. ఆ చప్పుడుకు ధర్మరాజాదులు నిద్రలేచారు. ఎదుట మానవాకారంలో ఉన్న హిడింబను చూచారు. అబ్బురపాటుతో ఆమెను 'నీ వెవ' రని అడిగారు. ఆమె తనసంగతంగా పూసగ్రుచ్చినట్లు చెప్పింది. కుంతిచెంత చేరి ఆత్మీయతను కలుపుకొన్నది. 'మీ కొడుకు ఆ రాక్షసుడిని అవలీలగా చంపి, నన్నూ మిమ్మల్నీ రక్షిస్తాడు చూడండి' అని భీముడు యుద్ధంచేస్తున్న స్థలాన్ని చూపించింది. అక్కడికి అర్జునుడు హుటాహుటిగా వెళ్ళాడు. తెల్లవారకపూర్వమే రాక్షసుడిని చంపు మని భీముడిని హెచ్చరించాడు. భీముడు హిడింబుడి కడకాలు పట్టుకొని గాలిలో నూరుసార్లు త్రిప్పాడు. అతడి ముక్కునా నోటా రక్తం కాలువలు కట్టింది. హిడింబుడిని నేలమీద వేసి కొట్టి వెన్నముక విరిచి విసిరివేశాడు. ఆ చిత్రవధతో హిడింబుడు చచ్చాడు.

హిడింబ కుంతికి ధర్మరాజుకు నమస్కరించింది. తననుగురించి దాపరికం లేకుండా చెప్పింది. భీముడిమీది వలపు ప్రాణంకంటె లోతైన దని తెలిపింది. తన కున్న శక్తులనుగురించి ఎరిగించింది. భవిష్యత్తులో జరుగబోయే సంగతులను ముందే తెలియచెప్పింది. ఆమె రాక్షసిగా పుట్టినా సాత్త్వికచైతన్యం గల సాధ్వి అని కుంతి గుర్తించింది. ధర్మరాజు ఆమె దివ్యవనిత అని పసికట్టాడు. (ఆ తరువాత వ్యాసుడు ఆమెను కమలపాలికగా గుర్తిస్తాడు). ఆమెను కపటిగా భావించి తిరస్కరించిన భీముడికి నచ్చచెప్పి హిడింబను వివాహమాడటానికి అంగీకరింపజేశారు కుంతీధర్మజులు. హిడింబకు బుద్ధులు చెప్పి భీముడిమనసుకు నచ్చేటట్లు మసలుకొమ్మని కోరింది కుంతీదేవి. పుత్రుడు పుట్టేంతవరకు హిడింబతో ఉండటానికి భీము డంగీకరించాడు. హిడింబాసురవధ హిడింబ వివాహంతో సుఖాంత మయింది.

కథలో సహజంగా మూడురంగా లున్నాయి. మానవమాంసం తినే రాక్షసులను హతమార్చాలన్నది పాండవవ్రతం. వారివలన కలిగే అవరోధాలనుండి ఋషులను, సాధుజనులను రక్షించాలని వారి దీక్ష. అందులో భాగంగా సాగింది హిడింబాసురవధ. ఆత్మరక్షణ సన్నిహితలక్ష్యమైనా, సాధురక్షణ పాండవుల జీవితలక్ష్యం. అందువలన సమవకారబీజం కొంతవరకు సార్థకమౌతున్నది.

హిడింబాసురవధ యుద్ధప్రధానం కావటంచేత క్రియాప్రధానమైనది. రంగంమీద యుద్ధం ప్రదర్శనయోగ్యం కాదు కాబట్టి ఆ సందర్భాలలో నాటకీయత తక్కువ. ఇకపోగా, మిగిలిన ఘట్టాలలో పాత్రల సంభాషణలు, చర్యలు రంగపరికల్పన సామగ్రులై సొంపు నింపుతాయి. ఇందులో హిడింబ కేంద్రబిందువు, హిడింబుడి వైపునుండి చూస్తే హిడింబ ఆడింది కపటనాటకం. అన్నయందున్న దోషాన్ని ఎంచి అన్నను మోసంచేసింది. కాని, ఆమె ఆత్మవంచన చేసుకొనలేదు, ప్రేమవంచన చేయలేదు. ధర్మశృంగారం ప్రధానమైన ఈ ఘట్టంలో హిడింబుడివలన కలిగే ఉపద్రవం చర్చించబడుతుంది. దానిని నివారించగలిగిన ధీరుడు వీరుడు భీముడై నిలవటంతో - కార్యదక్షుడైన నాయకుడు భీముడైనాడు. అతనివెంట నిలిచినవారు ధర్మజాదులు మరి నల్గురైనారు నాయకులు.

సమవకారస్వభావం కల ఈ ఘట్టంలో ఆ రూపకనిర్మాణస్వరూపస్వభావాలను పఠితలకు ప్రసన్నంచేస్తూనే కథాకథనానికి నాటకీయతను పోషకంగా నిలిపిన రచనాశిల్పం కనపడుతుంది. వాగ్యుద్ధం సగానికి పైగా సాగిన జరాసంధవధ సమగ్ర సమవకారంగా భాసిస్తే, హిడింబాసురవధ పాక్షికసమవకారంగా పరిఢవిల్లింది.

## బకాసురవధ - సలక్షణసమవకారం

హిడింబాసురవధలోకంటె బకాసురవధఘట్టంలో నాటకీయత ఎక్కువగా కనపడుతుంది. లక్షణాన్ని ముందుపెట్టుకొని వ్రాసినట్లుకూడా అనిపిస్తుంది. బ్రాహ్మణుడిఇంటిలో సాగిన సన్నివేశం మొదటిరంగం. అది కరుణరసనిర్భరం. కుంతియింట జరిగిన సన్నివేశం దయాధర్మవీరపోషకం. భీముడు బకాసురుడిని చంపినరంగం యుద్ధవీరాద్భుతం. భీముడిది వంచనగా అనిపించటం సమవకారస్వభావం. అది ఆభాస నిజానికి. ఇది సంభాషణ బహుళం కావటంచేత నాటకీయతతో రక్తికట్టింది. ఇందులో రాక్షసకృత ఉపద్రవం చర్చనీయాంశం. భూదేవహితార్థం రాక్షససంహారం కార్యం. రచనలో తరువోజ, మధ్యాక్కర, తరలం అనే విశేషవృత్తాలు వాడబడిఉన్నాయి. కరుణ, వీర, రౌద్రాద్భుతహాస్యాదిరసబాహుళ్యం ఇందులో తరళసుందరంగా పోషించబడింది. ఈ ఘట్టంలోని నాటకీయతను, సమవకారస్వభావాన్నీ సహృదయులు సులభంగా గ్రహించగలిగేటట్లుగా నన్నయ రచించటంవలన బకాసురవధ సలక్షణసమవకారం అనవచ్చును.

నన్నయగారిరచనలో నాటకీయతను సూక్ష్మంగా పరిశీలిస్తే సమవకారరూపకాన్ని కథలో ఇమడ్చటంలో ఉత్తమప్రయోగం జరాసంధవధ, మధ్యమస్థానీయం బకాసురవధ. చివరకు పేర్కొనతగింది హిడింబాసురవధ. ఈ వరుసను నిజానికి తిరుగబెట్టి గమనించాలి. అప్పుడు నన్నయ నాటకీయతలో కలిగిన పరిణామక్రమంకూడ స్పష్టమౌతుంది. హిడింబాసురవధ పాక్షిక సమవకారం, బకాసురవధ సలక్షణ సమవకారం, జరాసంధవధ సమగ్రసమవకారం.

## ద్యూతసభ - డిమప్రయోగం

సభాపర్వంలో అత్యంతసంఘర్షణాత్మక మైన సన్నివేశం మాయాద్యూతం. అది మహాభారత కథాచక్రానికే ఇరుసు. దానిలో సహజంగా డిమమనే రూపకంలో కానవచ్చే లక్షణాలు ప్రతిఫలిస్తున్నాయి. వాటిని నన్నయ గమనించి పోషించి నాటకీయతలో మరొక నాణ్యమైన శిల్పమర్యాదను ప్రపంచించాడు.

"డిమతే ఇతి డిమః"- అంటే ఉద్ధతనాయకులు, వారి ఆత్మవ్యాపారం ఎక్కడ ఉంటుందో దానిని డిమ మంటారు. 'డిమ్' అనే ధాతువుకు గాయపరచటం అనే అర్థాన్ని ధనికుడు చెప్పాడు. ఇతరులను బాధపెట్టటం, గాయపరచటం ఉద్ధతుల సహజస్వభావం. అది తేట తెల్లమయ్యేటట్లు ప్రయోగించబడేది డిమమని భావం. డిమానికి విద్రవ మనే పేరుకూడా ఉన్నది. విద్రవం (ఉపద్రవం)తో కూడుకొన్నదని దాని అర్థం. (నాట్యశాస్త్రము.పు. 525). భరతనాట్యశాస్త్రంలో డిమం లక్షణాలు స్థూలంగా ఇట్లా ఉన్నాయి- డిమంలో నాయకుడు ప్రఖ్యాతుడు, ఉదాత్తుడూ అయి ఉండాలి. నాలుగు అంకా లుండాలి. శృంగారహాస్యాలు తప్ప మిగిలిన ఆరురసాలూ పోషించబడాలి. కావ్యవస్తువు దీప్తరసమై, నానాభావోపసంపన్నమై ఉండాలి. నిర్ఘాత-ఉల్కాపాత- సూర్యేందు గ్రహణాలు, యుద్ధ-నియుద్ధ-ఆధర్షణ, సంఫేటాలు ఇందులో ప్రయుక్తం కావాలి. అంతేకాక, మాయ, ఇంద్రజాలం, నానావిధాలైన పుస్తాలు ఉండాలి. దేవ, భుజగేంద్ర, రాక్షస, యక్ష, పిశాచుల చరిత్రలుకూడా ఉండవచ్చును. సాత్త్వతి, ఆరభటి వృత్తులతో రచన సంపన్నంకావాలి. నాయకులు 16 మందివరకు ఉండవచ్చును. ఇవన్నీ దాదాపుగా సభాపర్వంలోని ద్యూతసభాఘట్టాలలో ద్యోతకమౌతూ ఉన్నాయి.

ఈ లక్షణాలను స్థూలంగా ఈ క్రిందివిధంగా కథకు అన్వయించుకొనవచ్చును.

1. ఉద్ధతు లైన దుర్యోధన ధృతరాష్ట్రాదుల కుటిలక్రూరస్వభావాలు, అధర్మశీలాలు ఈ సన్నివేశంలో సమగ్రంగా చిత్రించబడ్డాయి కాబట్టి ద్యూతసభ ముమ్మాటికీ డిమమే.
2. ద్యూతంవలన కలిగే ఉపద్రవాలను గురించి విదురాదులు వివరించి చెప్పటం, ద్రౌపదీవస్త్రాపహరణంవంటి ఉపద్రవకారకాలైన సన్నివేశాలు జరగటం గమనిస్తే డిమానికి ఉన్న విద్రవ మనే పేరుకూడా ఈ సభకు సార్థకంగా అన్వయిస్తుంది.
3. నాయకుడు ధర్మజుడు ధీరోదాత్తుడు, బలవంతాననైనా పిలువబడిన జూదానికి క్షత్రియుడు కాదనరాదన్న ధర్మానికి కట్టుబడినవాడు, అరణ్యాజ్ఞాతవాసాలను నిర్వహించటానికి సత్యసంధుడై అంగీకరించినవాడు.

4. ఇందులోని నాలుగంకాలకు సరియైన కథాఘట్టాలను ఈ క్రిందివిధంగా గుర్తించవచ్చును.
    (1) దుర్యోధనుడితోనూ, విదురుడితోనూ ధృతరాష్ట్రుడు మంతనాలాడిన రంగం.
    (2) ధర్మరాజు శకునితో జూదమాడిన రంగం.
    (3) ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరాలిచ్చిన రంగం.
    (4) ధర్మరాజు శకునితో అనుద్యూత మాడిన రంగం.
5. శృంగారహాస్యాలు తప్ప అన్ని రసాలూ పోషించబడినాయి.
6. కావ్యవస్తువు దీప్తరసత్వం కలిగి, నానాభావోపసంపన్నం అయిఉన్నది.
7. ఉల్కాపాతాది అరిష్టాలు, అపశకునాలు ఎన్నో పొడసూపాయి.
8. శకునిమాయ ఇంద్రజాలంవంటిదే. శ్రీకృష్ణుడి మాహాత్మ్యం దివ్యమాయ. ఆ రెండూ ప్రదర్శితమయ్యాయి.
9. సాత్త్వతీ ఆరభటీవృత్తులు ప్రదర్శితమయ్యాయి. ఈ వృత్తుల సమగ్రచిత్రణం ఈ ఘట్టంలోని నాటకీయశిల్పం.
10. ఇది బహునాయక మైన రంగం. నాయకులంటే ప్రధానపాత్రలు నిర్వహించేవా రని గ్రహించాలి. పాండవులలో ధర్మజ భీమార్జునులు, కౌరవులలో దుర్యోధన కర్ణ శకుని దుశ్శాసనులు, వికర్ణవిదురులు, ధృతరాష్ట్రభీష్మాదులు ఇట్లా ఎందరో పాల్గొని వాగ్వివాదాలు చేసికొనిన ఘట్టాలు ఇందులో ఉన్నాయి.

ఈ లక్షణాలన్నీ మాయాద్యూతఘట్టం డిమప్రాయమై ప్రకాశిస్తుందని స్పష్టంచేస్తున్నాయి.

డిమరూపక నిర్వహణంలో రసపోషకాలై నిలిచే అభినయాంగాలు వృత్తులు. అవి నాలుగు- భారతి, సాత్త్వతి, ఆరభటి, కైశికి, బీభత్స కరుణరసాలలో భారతి, వీరాద్భుతశమాలలో సాత్త్వతి, రౌద్రభయానకాలలో ఆరభటి, శృంగారహాస్యాలలో కైశికి రాణిస్తాయని భరతుడి మతం. డిమం వీర రౌద్ర భయానకాద్భుతరసాలు ప్రధానంగా ఉండే రూపకం కాబట్టి దీప్తరసప్రయోగంగా ప్రకాశిస్తుంది. నన్నయ డిమాని కుండే ఈ స్వభావాన్ని లోనారసి దాన్ని నాటకీయమైన వృత్తులతో రమణీయంగా దిద్దితీర్చాడు.

## సాత్త్వతీ, ఆరభటీవృత్తుల సమగ్ర నిర్వహణ

నన్నయ ఈ ఘట్టంలో సాత్త్వతీ ఆరభటీవృత్తులను సర్వాంగసమగ్రంగా నిర్వహించటం గమనిస్తే నన్నయ రూపకకళాశిల్పనైపుణ్యం ప్రకటిత మౌతుంది.

సాత్త్వతీవృత్తిలో పాత్రల మనఃప్రవృత్తులు ప్రకాశమానా లయ్యేటట్లు చిత్రించబడతాయి. మాయాద్యూతసభలో గోచరించే పాత్రల మనఃప్రవృత్తులను చిత్రిస్తూ నన్నయ నాటకీయతను పోషించటం గమనించదగిన ముఖ్యాంశం. సాత్త్వతీవృత్తిలో నాలుగురకా లుంటాయని భరతుడు పేర్కొన్నాడు. అవి:- ఉత్థాపకం, పరివర్తకం, సల్లాపకం, సంఘాత్యం. ఉత్థాపక మంటే- మానసికసంఘర్షణ సూచించే వ్యాపారం. పరివర్తక మంటే- మానసిక సంఘర్షణవలన చేయదలచిన కార్యాన్ని వదలి కారణాంతరంచేత మరొకకార్యాన్ని చేయటం. ఆధర్షణసహితంగా కానీ, రహితంగా కానీ ఇతరులను అధిక్షేపించటం సల్లాపకం. ఆధర్షణ మంటే నేరం మోపటం, తిరస్కరించటం, వాదాన్ని ఖండించటం, అన్యాయంగా పీడించటం. ధర్మార్థాంశాల చర్చలో రాగదోషసహితంగా సాధిక్షేపవచనాలు పలకటంకూడా సల్లాపక మని కొందరంటారు. ఇక సంఘాత్య మంటే- సామాద్యుపాయశక్తిచేతగాని, అర్థశక్తిచేత గాని, దైవవశంగా గాని, ఆత్మదోషంవలన గాని సంఘాతం (గట్టిదెబ్బ) భేదించబడటం. ఇది వ్యష్టిగా సమష్టిగా ప్రయోగించబడవచ్చును. కొందరు కూటమిగా చేరి అనేక కపటాలతో, ఇతరులను చంపవలెననీ వంచించాలనీ ఆశించి చేసే ప్రయోగం కూటసంఘాతం అంటారు. దానిని భేదించటం సంఘాత్యం. సాత్త్వతీవృత్తిలో కానవచ్చే భేదాలన్నీ సభాపర్వంలోని ఈ ఘట్టంలో సాంగంగా సాక్షాత్కరిస్తాయి.

ఆరభటు డంటే శూరుడు. అతడి చిత్తవృత్తినుండి జనించే క్రోధ ఆవేగాదులు, అనేకరకాల కపటచర్యలు, వంచనలు, దంభాలు, అనృతవాక్యాలూ కలిగి దీప్తరసాలైన రౌద్రాదులందు ప్రవర్తిల్లేది ఆరభటీవృత్తి. షాడ్గుణ్యంతో, వంచనా విద్రవాలతో, లాభా లాభాలతో కూడి ఉండేది ఆరభటీవృత్తి అని కొందరంటారు. ఇది నాలుగువిధాలు. 1.సంక్షిప్తకం. 2.అవపాతం. 3.వస్తూత్థాపనం. 4.సంఫేటం. అన్వర్థా లైన శిల్పాలు విపులమైన పుస్తములు (రంగదృశ్యాలు) విచిత్రమైన నేపథ్యం మొదలైనవాటిచేత సంజ్ఞామాత్రంగా వస్తువులను సూచించటం సంక్షిప్తకం. అధికమైన హర్షభయాదులతో పాత్రల ప్రవేశ నిర్గమాదులు జరగటం, విద్రవం (ఉపద్రవం)చేతకాని, వినిపాతం (పాటు, భంగపాటు, బాధ, దుఃఖం, అమర్యాద, అగౌరవం) వలనగాని ఆవేగప్రధానమైన చేష్టలను ప్రదర్శించటం అవపాతం. భావివస్తువును అనేకవిధాలుగా హృదయగోచర మయ్యేటట్లు (ధ్వనింప) చేయటం వస్తూత్థాపనం, సంరంభంచేత ప్రయుక్త మయ్యేదీ, యుద్ధ, నియుద్ధ, కపటాదులతో కూడుకొన్నదీ, శస్త్రప్రహారాలతో నిండిందీ సంఫేటం. ఆరభటీవృత్తిని సాంగంగా కపటద్యూతఘట్టంలో నన్నయ ఆవిష్కరించిన వైనం గమనిస్తే అతడి నాటకీయరచనాప్రతిభ మనలను ఆశ్చర్యపరుస్తుంది.

పరాక్రమార్జితమైన పాండవుల ఐశ్వర్యాన్ని మోసంతో అపహరించి, వారిని అపహసించి అవమానించే ప్రయత్నం కపటద్యూత ఘట్టంలోని కార్యం. ఇందులో ప్రతినాయకవిజృంభణం, నాయకపరాజయం వస్తువు. ప్రతినాయక కుటిలప్రయత్నమే మహాభారత రణానికి హేతువౌతున్నది. కర్మఫలభోగరూపమైన వస్తువు ఇతిహాసంలో ఉండటం సహజం కాబట్టి దుర్యోధన ధృతరాష్ట్ర స్వయంకృతా పరాధమే వారి స్వీయనాశానికి దారితీస్తుందనటం ప్రయోజనం. దానికి తగినట్లుగా ఈ కథ డిమప్రాయమై ఉండటం ఉచితం.

మహాభారతయుద్ధంలో (కురుక్షేత్రయుద్ధంలో) పాల్గొనే పాండవ కౌరవుల మనఃప్రవృత్తులను క్రమంగా ఆవిష్కరించే ఒక వికాసపద్ధతికి డిమరూపక నిర్మాణపద్ధతిని నన్నయ శక్తిమంత మైన వాహికగా వాడుకొన్నాడు. అందులో సాత్త్వతీ, ఆరభటీ వృత్తులు రెండు రెక్కలవలె పనికివచ్చాయి.

పాండవ రాజసూయవైభవాన్ని చూచి అందరూ ఆనందించారు. దుర్యోధను డొక్కడే అసూయతో అంతర్వేదనకు గురి అయ్యాడు. చిక్కి శల్యమైపోయాడు. తన దీనావస్థకు హేతువును తండ్రితో ఈవిధంగా మొరపెట్టుకొన్నాడు.

ఉ. “భావిపురాతనాద్యతన పార్థివలక్ష్ములు పాండవేయుల
క్ష్మీవిభవంబుతోడ నుపమింప సమంబులు గా; వశేష రా
జావళిలోన నత్యధికు లైన సపత్నులపేర్మిఁ జూచి యేఁ
జూవె సహింప నోపక కృశుండ వివర్ణుఁడ నైతి నెంతయున్”. **(సభా. 2.114)**

శత్రువుచేతకూడ ప్రశంసించబడి, అసూయపొందేటట్లు అతిశయించిన పాండవవైభవం ఇందులో ధ్వనించబడి ప్రశంసనీయ మైనది. కాని, దానిని అవలీలగా అపహరించాలన్న దుర్యోధనుడి సంకల్పం ధూర్తలక్షణం. ఉద్ధతస్వభావం. ఈ రూపంలో కార్యం ప్రారంభిస్తున్నది ప్రతినాయకుడు. తీవ్రమనోవేదనానంతరం ప్రతినాయకుడు బీజాన్ని తండ్రియెదుట నాటాడు. దానికి శకుని నీరుపోసి ప్రోత్సహించాడు.

క. “భానుప్రభు లగు పాండుమ
హీనాథాత్మజులలక్ష్మియెల్లను నీకున్
నే నపహరించి యిత్తు ధ
రానుత! మాయాదురోదరవ్యాజమునన్.” **(సభా. 2.122)**

అని ఉపాయాన్ని చూపాడు. శకుని పన్నాగాన్ని ధృతరాష్ట్రుడిచేత అంగీకరింపజేయాలని దుర్యోధనుడు ప్రయత్నించాడు. కాని, ధృతరాష్ట్రుడు విదురుడి నడిగి చేయటం ఉచిత మని భావించాడు. విదురుడిని పాండవపక్షపాతిగా పేర్కొని దుర్యోధనుడు

నిందించాడు. దుర్యోధనుడు తలపెట్టిన మహావంచనకు ధృతరాష్ట్రుడు వెంటనే అనుకూలంగా స్పందించలేదు. విదురభీష్మద్రోణాదు లీ యత్నాన్ని గర్హిస్తారని భయపడ్డాడు. డోలాయమానస్థితిలో ఉన్న తండ్రిమనస్సును గమనించి దుర్యోధనుడు తనమాట మన్నించకపోతే అగ్నిలో దూకి ఆహుతి అయిపోతానని బెదిరించాడు. పుత్రవ్యామోహం అధర్మభీతిని మ్రింగివేసింది. ఉచితం కాదని అంతరాత్మ చెపుతున్నా కొడుకును కాదనలేక ఆ పాపకార్యానికి అంకురారోపణం చేశాడు ధృతరాష్ట్రుడు. సుయోధనుడి మనశ్శాంతికై మణిమయమహాసభను నిర్మింపచేశాడు.

దుర్యోధనుడు ధృతరాష్ట్రుడిని ఏవిధంగా మెడలు వంచి ఒప్పించాడో, అట్లాగే ధృతరాష్ట్రుడుకూడా విదురుడిచేత ఒప్పింపజేయటానికి ప్రయత్నించాడు. విదురుడితో ఏకాంతంగా ఒకనాడు దుర్యోధనశకునుల పన్నాగాన్ని గురించి ప్రస్తావించాడు. విదురుడు విరుచుకొని పడ్డాడు. పుత్రులనడుమ భేదబుద్ధి కలిగించటం అన్యాయమనీ, జూదంవలన కలహం తప్పదనీ హెచ్చరించి, శకుని దుర్యోధనుల ప్రయత్నాన్ని మాన్పు మని ప్రబోధించాడు. ధృతరాష్ట్రుడు దానికి మెత్తపడలేదు సరికదా మెత్తబడని విదురుడినే మెత్తపరచటానికి పూనుకొన్నాడు. తన మనసులోని మర్మం బైటపడకుండా ధర్మపన్నం చదివాడు.

ఉ. "పుత్త్రుల కేల భేదమగు? భూనుత! యేనును నీవు జాహ్నవీ
పుత్త్రుఁడు నుండఁగా నహితమున్ భయమున్ దొరకొన్నె? నాకు నా
పుత్త్రులకుం బ్రసాదకృతబుద్ధులు వేల్పులు గాన దీనికిన్
మిత్త్రనిధీ! యొడంబడుము మిన్నక సంశయమంద నేటికిన్?" **(సభా. 2.133)**

మనస్సులో పుత్రుడివైపు. మాటలలో విదురుడివైపు పలికిన ధృతరాష్ట్రుడు మేకతోలు కప్పుకొన్నపులివలె మాట్లాడాడు. జూదమాడటంవలన కలహంవస్తే మాన్పే శక్తులుగా ముగ్గురిని చూపించాడు- తాను, విదురుడు, భీష్ముడు. తనమీద విదురుడికి నమ్మకం లేకపోయినా విదురుడిమీద, భీష్ముడిమీద తనకు నమ్మక మున్నట్లు పలికాడు. విదురుడి విద్వత్తును బంగారుగొలుసుతో కట్టి కదలకుండ చేశాడు. ఇంద్రప్రస్థపురానికి పోయి ధర్మజుడిని పిలిచికొని రమ్మన్నాడు. విదురుడు భీష్ముడి కీ సంగతి చెప్పాడు. ఇద్దరూ మ్రింగలేక క్రక్కలేక ఉక్కిరిబిక్కి రయ్యారు.

విదురుడు చెప్పింది నిప్పువంటి నిజం. జూదంవలన తగాదా వస్తుంది. దానివలన యుద్ధ మౌతుంది. ప్రజానష్టం జరుగుతుంది. ఆ యుద్ధంలో వీరులే గెలుస్తారేమో! కపటులైన తన పుత్రులకు అపాయం వాటిల్లుతుందేమో! గ్రుడ్డిరాజుగుండెలో గుబులు మొదలైనది. విదురుడు చెప్పిన హితబోధలో దుర్యోధనుడి మనస్సును మార్చే ప్రయత్నంచేయాలన్న సూచన ఉన్నది. అది అతడికి సాధ్యం కాదేమో! అయినా ప్రయత్నంచేయటంలో తప్పులేదని ఒకనాడు తన కొడుకును పిలిచి, జూదం వలన కలిగే అహితాలన్నీ చెప్పి,

ఉ. "ఇమ్మహి నీవుఁ బాండవులు నెప్పటియట్ల పరస్పరానురా
గమ్మున నేలుచున్కి యిది కార్యము; పాండవలక్ష్మి నీ కస
హ్యమ్మన నేల? వంచనఁ బరార్థపరిగ్రహబుద్ధిఁ జేసి పా
పమ్మగుఁ; బాపకారులకుఁ బాయు నవశ్యము నర్థధర్మముల్." **(సభా. 2.136)**

అని హితవు చెప్పాడు. జూదం విదురసమ్మతం కాదనీ, పాండవసంపదకంటె కౌరవులకు అయిదురెట్లు ధనమున్నదనీ, ధర్మజుడు చేసినన్ని యజ్ఞాలు దుర్యోధనుడుకూడా చేసి భూలోకంలోని రాజులందరి సంపదలను ఉపాయనాలుగా పొందవచ్చుననీ, బుజ్జగించి చెప్పాడు. దానికి దుర్యోధనుడు సుముఖుడు కాకపోగా, పైపెచ్చు తనకు జూదమే యజ్ఞమని ఘోషించాడు.

క. "ఇమ్ముల ధర్మజుతో జూ
దమ్మాడఁగఁ గాన్న నాకు ధరణీశ్వర! య
జ్ఞ మ్మదియ సమస్తైశ్వ
ర్యమ్ములు వడయఁగ నుపాయ మభిమతసిద్ధిన్" **(సభా. 2.138)**

అని తన మనోభీష్టాన్ని స్పష్టంచేసి, తాను స్వయంగా చూచిన పాండవసంపదను, దర్శించిన మయసభా వైభవాన్నీ, పొందిన భంగపాటును, అవి తనను హృదయశల్యాల వలె బాధిస్తున్న వైఖరినీ వివరించి, సుఖోపాయంతో పరసంపదను గ్రహించటం ఉత్తమ పురుషార్థ మనీ, సుహృద్ద్యూతం ఉత్తమపుణ్యప్రద మనీ వాదించి, ఇంద్రుడు నముచిని చంపి అతడి సంపదను హరించిన ఐతిహ్యాన్ని దృష్టాంతంగా చెప్పి, తన వంచనయత్నం అధర్మం కాదని తేల్చి చెప్పి, తన ప్రయత్నాన్ని ధ్రువపరిచాడు.

తే. "అహితవృద్ధి యుపేక్షితం బగుడు నల్ప
మగు మహావ్యాధియును బోలె నది యసాధ్య
మయి యుపేక్షకు నిర్మూలితాత్ముఁ జేయుఁ
గానఁ బాండవశ్రీ యుపేక్ష్యంబు గాదు." **(సభా. 2.145)**

అని నీతిశాస్త్రాన్ని తనకు ఉపబలకంగా చూపించుకొన్నాడు. పాండవసంపదను ఏవిధంగానైనా సాధిస్తాననీ, లేకపోతే తన మనస్తాపం తీరదనీ గంద్రగొండిగా చెప్పాడు. శకుని దానికి వంతపాట పాడాడు. కాని, వారివ్యూహానికి ధృతరాష్ట్రుడు అంగీకరించలేదు. విదురుడి ధర్మబుద్ధిని సమర్థించి, జూదయత్నాన్ని మానుమని కొడుకుకు హితవు చెప్పాడు. ఇక్కడ ప్రతిముఖసంధి ప్రవర్తిల్లింది.

తన ప్రయత్నానికి పెద్ద అడ్డు తగలటంతో దుర్యోధనుడు తీవ్రయత్నం మొదలుపెట్టాడు. తండ్రికి వ్యక్తిత్వం లేదని, తనవా రెవరో పరాయి వారెవరో తెలియదనీ, తనపని ఇతరుల అభిప్రాయాల కనుగుణంగా చేయకూడదనీ, విదురుడు పాండవహితం కోరేవాడనీ, ఆ పక్షపాతబుద్ధి కలవాడిని ఆప్తుడిగా పరిగణించరాదనీ, జూదం పురాణాలలోకూడా పుణ్యకార్యంగా చెప్పబడిందనీ నీతిసమ్మతంగా తన వాదాన్ని వినిపించాడు. ధృతరాష్ట్రుడు చాలసేపు ఆలోచించాడు. తనకు కావలసింది పుత్రసంతోషమా? ధర్మప్రవర్తనమా? అన్న ప్రశ్న అతడి మనసులో సంఘర్షణగా నిలిచింది. మథనపడ్డాడు. చివరకు పుత్రవ్యామోహమే గెలిచింది. 'బుద్ధిః కర్మానుసారిణీ'. విదురుడిని పిలిచి ధృతరాష్ట్రుడు విస్పష్టంగా ఆదేశించాడు- ధర్మరాజును కొనితెమ్మని, దుర్యోధన ధర్మజులనడుమ సుహృద్ద్యూతం ప్రవర్తిల్లుతుందని. విదురుడు తలవంచాడు- జరుగబోయేది సుహృద్ద్యూతం కాదని మాయాదురోదరమనీ దానివలన దురర్థం పుడుతుందనీ భావిస్తూ విషణ్ణుడై కర్తవ్యోన్ముఖు డైనాడు.

విదురుడిని పంపటంవలన ధృతరాష్ట్రుడు భావికార్యం తప్పక జరిగే వ్యూహం సాధించగలిగాడు. దుర్యోధనుడి యత్నానికి విదురుడి సౌముఖ్యం బిందువు వంటిది. ముఖ ప్రతిముఖసంధులు ప్రవర్తిల్లిన ఈ సన్నివేశం ఒక అంకం వంటిది. ఇందులో కథాకథనంకంటె సంభాషణలు విస్తృతంగా సాగాయి. ఆణిముత్యాలవంటి పద్యాలు సార్థక సంభాషణలవలె ఆ యా పాత్రల మానసిక ప్రవృత్తులను, మనస్సంఘర్షణలను వ్యక్తంచేస్తూ సాత్త్వతీ వృత్తిలోని ఉత్థాపక మనే శాఖను సుసంపన్నం చేశాయి. దుర్యోధన, ధృతరాష్ట్ర, విదుర పాత్రల మనస్సంఘర్షణలతో ఈ అంకం రక్తికట్టింది. దానికి పోషకంగా సంక్షిప్తకం అనే ఆరభటీ వృత్తిభేదం - దుర్యోధనుడు పాండవవైభవాన్నీ, మయసభ విలాసాన్నీ, తన భంగపాటు పరితాపాన్నీ చెప్పేటప్పుడు రాణించింది. మయసభా శిల్పాలను గురించి, అందులోని దృశ్యాలను గురించి ప్రశంసించటం అందులో పొందిన అవమానమే మాయాద్యూత వ్యూహానికి నేపథ్యమనే సత్యాన్ని వెల్లడించటం సంక్షిప్తక మనే ఆరభటీవృత్తిని పోషించాయి. సుయోధనుడి ప్రయత్నం అర్థమూలం కాబట్టి అతడి క్రోధంవలన రౌద్రం పోషించబడుతున్నది. అది అధర్మమూలం కావటంచేత విదురాదులకు విషాదం కలిగించింది. కొడుకును సమర్థించిన ధృతరాష్ట్రుడు సైతం నిప్పు రగులుకొన్న కట్టెవలె లోలోన దహించుకొనిపోయాడు. రసోద్దీప్తి రంగాన్ని రక్తికట్టించింది.

ధర్మరాజు శకునితో బలవద్ద్యూతం ఆడిన ఘట్టం డిమంవంటి రూపకంలోని శక్తిమంత మైన రెండవ అంకంవంటిది. అందులో గర్భసంధి భాసించింది. అంతేకాక పరివర్తనం, సల్లాపకం అనే సాత్త్వతీవృత్తులూ, అవపాతం, వస్తూత్థాపనం అనే ఆరభటీవృత్తులూ విస్తారంగా ప్రయోగించబడ్డాయి. నన్నయ ఉభయకావ్యకళాశిల్పానికి ఈ ఘట్టం (రంగం) ఉన్నతపతాకగా నిలిచింది.

హృదయసంఘర్షణవలన చేయదలచిన కార్యాన్ని విడిచి, కారణాంతరంచేత వేరొకకార్యాన్ని ఆచరించే పరివర్తక సాత్త్వతీవృత్తి ధర్మజుడిలో మొదట దర్శన మిస్తుంది. సుయోధనుడు చూపించగా ధృతరాష్ట్రనిర్మిత మణిమయసభను చూచి ధర్మజుడు మెచ్చుకొన్నాడు. దుర్యోధనుడు కపటమైన తన పావును కదిలించాడు.

క. ''అనఘ! సుహృద్ద్యూతం బిం
దొనరింతము; ప్రొద్దువోకయును నగు; జూదం
బునకుం బ్రియుఁడవు దక్షుఁడ
వన విందుము నిన్నుఁ బ్రీతి నక్షజ్ఞులచేన్'' **(సభా. 2.164)**

అని ద్యూతానికి ఆహ్వానించాడు. ధర్మరాజు ఆవులించిన ప్రేవులు లెక్కపెట్టగలడు. దుర్యోధనుడు ద్యూత మాడలేడు. శకుని అతడి భుజంవంటివాడు. అతడు మాయాదురోదరంలో మహానిపుణుడు. మోసగాడు. దుర్యోధనుడికి బదులు అతడు రంగంలోకి దిగవచ్చును. అసలు ఆ ఊహకు అతడే కారకుడు. ఇవన్నీ కడుపులో పెట్టుకొని ధర్మజుడు కపటద్యూతాన్ని అధిక్షేపిస్తూ మాట్లాడాడు. సాత్త్వికంగా అధిక్షేపించాడు. తనను బలవంత పెట్టకుండా ముందుకాళ్ళకు బందాలు వేశాడు. ఆమాట లివి-

తే. ''క్షత్త్రనీతిక్రమంబులు గావు సూవె
నికృతియును జూదమును ధర్మనిత్యు లైన
వారి కీ రెండు వర్జింపవలయు నెందుఁ;
బాపవృత్తంబు జూదంబు పార్థివులకు.

ఆ. ''కుటిలమార్గు లయిన కుత్సితకితవుల
తోడఁ గడఁగి జూదమాడఁ జనదు;
దానఁజేసి యర్థధర్మవివర్జితు
లగుదు రెట్టివారు జగములోన.'' **(సభా. 2.166,167)**

కుటిలమార్గులు, కుత్సితులు అయిన కితవుల ప్రసక్తి పైకి సాధారణంగా వినపడినా ప్రక్కనున్న శకునికి అధిక్షేపమై తగిలి వచ్చింది. పిలిచిన దుర్యోధనుడు నిరుత్తరుడైనాడు కాని, మోసగాడైన శకునిమాత్రం మాటందుకొన్నాడు. 'ధర్మజా! నీవంటి కళాకుశలుడే ఆ కళను దూషించటం నీతి కా'దన్నాడు. బలహీనులు బలవంతులను జయించేటప్పుడు మోసం తప్పదనే లోకనీతిని పేర్కొన్నాడు. జూదానికి నీవు భయపడితే, మానుకొనవచ్చు' నన్నాడు.

ధర్మజుడు మొదట జూదంనుండి తప్పుకొందా మనుకొన్నాడు. కపటద్యూతాన్ని తిట్టి, తనకు పనికివచ్చే ధర్మసూత్రాన్ని ప్రతిపాదించాడు. శకుని నిపుణంగా పథకం మార్చాడు 'ఆటకు భయపడితే మానుకోవచ్చు' అన్నాడు. అభిమానధనుడైన యుధిష్ఠిరుడికి అది సవాలుగా తగిలింది. 'బలవద్ద్యూతానికి పిలువబడి ఆడకుండా తిరిగిపోవటం న్యాయం కాదుకదా! ఇక పెక్కుమాట లెందుకు?' అని అనుకొంటూ ముగ్గులోకి దిగాడు. ఊహించినట్లే దుర్యోధనుడు తనకు బదులు శకునితో పందెం వేయిస్తా నన్నాడు. అతడు కాచిన పందాలకు తాను పూచీపడతానన్నాడు. ధర్మజుడు కటకటపడ్డాడు. 'ఒకరికొరకు మరొకరు జూదం ఆడటం అన్యాయం' అని విసుక్కొన్నాడు. కాని, తెగించి జూదాన్ని మానలేకపోయాడు. పోగా, తెగించి

జూదానికి దిగాడు. దానితో- రెండవ అంకం రసకందాయంలో పడింది. ధర్మజుడు మొదట తలచిం దొక్కటి, శకుని తెచ్చిన ధర్మసంఘర్షణ వలన చివరకు చేసింది మరొక్కటి, ఇది కథాగతికి బలమైన హేతువు. ఇక్కడ పరివర్తన మనే సాత్త్వికవృత్తి పరిపూర్ణంగా ప్రకాశించింది.

ధర్మజుడు జూదంలో ఓడుతూ ఒక్కొక్క పందానికి కోల్పోయిన విలువైన కథనం సంక్షిప్తకం అనే ఆరభటీవృత్తికి నిదర్శనం. ధర్మరాజు సంపదనంతా కోల్పోయి ఓటుపడ్డాడు. పుత్రులమధ్య తగవు రాకుండా చూచే బాధ్యత తనమీదా ధృతరాష్ట్రుడిమీదా ఉన్నదనిచెప్పిన ధృతరాష్ట్రుడి మాటలను మనసులో తలంచి విదురుడు ధృతరాష్ట్రుడితో రహస్యంగా హితవు చెప్పాడు. ఇక ఇక్కడినుండి సల్లాపక మనే సాత్త్వతీవృత్తీ, అవపాతం అనే ఆరభటీవృత్తీ సర్వాంగసమగ్రంగా రంగప్రయోగంలో ప్రవర్తిల్లాయి. సల్లాపకంలో ఇతరులను అధిక్షేపించే సంభాషణలు విశేషంగా ఉంటాయి. అవి- ఒకరిమీద ఒకరు నేరం మోపుకొనే తీరులో కాని, పరస్పరం తిరస్కరించుకొన్నట్లుగా గాని, ఒకరి వాదాన్ని మరొకరు ఖండించుకొన్నట్లుగాగాని, అన్యాయంగా పరులను పీడించినట్లుగాగానీ, ధర్మాంశాలను చర్చించేటప్పుడు రాగదోషసహితంగా సాధిక్షేపంగా పలికినట్లుగా గాని సల్లాపకంలో అధిక్షేపాలు సాగుతాయి. సల్లాప సాత్త్వతీవృత్తితోపాటు అవపాతమనే ఆరభటీవృత్తి ప్రవర్తిల్లటంచేత- రంగంమీద భయహర్షాతిశయంతో పాత్రలు ప్రవేశనిర్గమాలు చేయటం, ఉపద్రవాలు కాని, భంగపాట్లు గాని జరిగినట్లు ప్రదర్శించటం జరుగుతుంది. ఈ దృష్టితో ఈ క్రింది అంశాలలో నాటకీయతను అన్వయించుకొనవచ్చును.

1. విదురుడు ధృతరాష్ట్రుడితో - దుర్యోధనుడు పుట్టినప్పుడు కలిగిన దుర్నిమిత్తాలను పేర్కొని, అతడివలన కులానికి కలుగుతున్న ఎగ్గును సూచించి, కులరక్షణార్థం అతడిని వధించటమో దేశబహిష్కృతుడిని చేయటమో తగునని ప్రతిపాదించాడు. పాండవులను దరికితీసి మన్నించు మని ప్రబోధించాడు. ఫలవృక్షాలను కట్టెలకొరకు తగులబెట్టే బొగ్గులవాడివలె, బలిసిన యెద్దు దర్పంతో కొండచరియను చీల్చటానికి పూనుకొన్నట్లు దుర్యోధనుడు పాండవులతో తగవుపెట్టుకొంటున్నాడనీ, ఆ దుష్టద్యూతాన్ని ఇకనైనా ఆపుమనీ చెప్పిన హితోక్తులలో దుర్యోధనుడి దుర్మార్గంవలన కలిగే ఉపద్రవాల ప్రసక్తి ఏర్పడి ఆరభటీవృత్తి పోషించబడింది.

2. ధృతరాష్ట్రుడు తన హితవు వినకపోవటంతో విదురుడు స్వయంగా దుర్యోధనుడిని అధిక్షేపిస్తూ మాట్లాడాడు. దానికి ప్రత్యాఖ్యానంగా దుర్యోధనుడు విదురుడిని అహితుడిగా నిందించి తమకు తొడమీద ఉంచుకున్న పామువంటివాడని నేరంమోపాడు. దానికి విదురుడు కోపించి అధిక్షేపోక్తులతో మందలించి ధర్మంచెప్పి ఊరుకొన్నాడు. ఆ ఇరువురి మధ్య ఒకరిమీద ఒకరు దోషం మోపుకొనే తీరులో అధిక్షేపసంభాషణలు సాగి సాత్త్వతీవృత్తి భాసించింది.

3. ధర్మరాజు తమ్ములను, తనను, ద్రౌపదిని క్రమంగా జూదంలో ఓడిపోయి, తలవంచుకొని మిన్నకుండగా, దుర్యోధనాదులు హర్షాతిశయంతో సభలో అనౌచిత్యంగా వ్యవహరించారు. దుర్యోధనుడు విదురుడిని పోయి ద్రౌపదిని తీసికొనిరమ్మన్నాడు. ఆ అనుచితపు పనికి, మాటలకు విదురుడు కోపించాడు.

క. “మదమలినమనస్కుఁ డరుం
తుదుఁడు నృశంసుఁ డనఁ బరఁగు దుర్జనునకు సం
పద లెడ లయ్యును నాతని
మొదలిటి సంపదలతో సమూలంబు సెడున్” **(సభా. 2.202)**

అని భావికథార్థసూచకంగా దుర్యోధనుడిని శపించినట్లు తిరస్కరించాడు.

దుర్యోధనుడు ప్రాతికామిని పంపాడు. అతడు పాంచాలివద్దకు పోయి సంగతులన్నీ చెప్పి దుర్యోధను డున్న సభకు రమ్మని పిలిచాడు. భార్యను జూదంలో ఓడినవారు రాజలోకంలో ఎవ్వరూ లేరని ఆశ్చర్యపోయింది ద్రౌపది. ఒక ధర్మసందేహాన్ని రేపి, దానిని ధర్మరాజు నడిగి సమాధానం తెమ్మన్నది. అతడు రమ్మంటే వస్తానని ప్రాతికామిని తిరిగిపంపింది. ఆమె ప్రశ్న ఇది:

తె. “మున్ను దన్నోటువడి మఱి నన్ను నోటు
వడియెనో? నన్ను మున్నోటువడి విభుండు
గ్రన్నఁ దన్నోటువడియెనో యన్న! నాకు
నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని.” **(సభా. 2.209)**

ప్రాతికామి తిరిగి సభకు వచ్చాడు. పైప్రశ్నను ధర్మజుడికి నివేదించాడు. అత డేమి పలుకక దుఃఖాతిశయంతో మిన్నకున్నాడు. దుర్యోధనుడు కల్పించుకొని, అధిక్షేపకాత్మకంగా 'ద్రౌపదిని తానే వచ్చి నిండుకొలువులో తెలిసికొ'మ్మని వెటకారంచేస్తూ మరల ప్రాతికామిని ద్రౌపదిదగ్గరకు పంపాడు. పరిస్థితుల వైపరీత్యాన్ని ద్రౌపది గుర్తించి ఏకవస్త్ర అయిఉన్నా, కన్నీటిధారలతో కదలి ప్రాతికామివెంట కౌరవసభకు వచ్చింది. భీతయై ధృతరాష్ట్రుడి చెంత నిలిచింది. దుర్యోధనుడు మదోద్ధతుడై దుశ్శాసనుడిని ఆజ్ఞాపించాడు- ఆమెను సభామధ్యప్రాంతానికి తీసికొనిరమ్మని, ఆమె భయకంపితురాలై గాంధారియొద్దకు పరుగెత్తిపోయి నిలిచింది. దుశ్శాసనుడు ఆమెను సమీపించాడు. ద్రౌపది తాను రజస్వల ననీ, ముట్టవద్దనీ, ఏకవస్త్రనై పెద్దలున్న సభకు రాజాల ననీ మొరపెట్టింది. ఆమెమాటలు తిరస్కరించి 'నీవు ఏకవస్త్రవైతే నేమి? విగతవస్త్రవైతే నేమి?' అని ధిక్కరించి, దుశ్శాసనుడు నిర్దయుడై రాజసూయావభృథ స్నానంతో పవిత్రమైన ఆమె దీర్ఘశిరోజాలను పట్టి నిండుసభకు లాగికొనివచ్చాడు. ఈవిధంగా హర్షంతో దుర్యోధనవర్గంవారూ, భయంతో ద్రౌపదీ, సభలో ప్రవేశనిర్గమాలు చేయటంవలనా, ఆ తరువాత ద్రౌపదీవస్త్రాపహరణ ఘట్టంలో ఆవేగప్రధానమైన చేష్టలు ప్రదర్శితం కావటంవలనా అవపాత మనే ఆరభటీవృత్తి రచనలో ఉద్దీప్తంగా పోషించబడింది.

నిండుసభలో పాంచాలి దుఃఖితఅయి నిలచిఉండగా భీముడు సహించలేక కోపోద్రిక్తుడై, భార్య నూరడించాలని భావించి, ధర్మరాజును తూలనాడి, శకునిమోసం తెలిసికూడ జూదమాడిన అతని చేతులు కాల్చాలని విజృంభించాడు. దుఃఖాతిశయంతో మనసు కలతచెంది ఒకటి చేయబోయి మరొకటి చేసిన ఉదంతం భీముడిది. అర్జునుడు అతడిని సమాధానపరచాడు. ఇందులో పరివర్తకమనే సాత్త్వతీవృత్తి ఉన్నది.

వికర్ణుడు సభలో నిలువబడి ఇట్లా హెచ్చరించాడు-

క. “సమచిత్తవృత్తు లగు బు
ద్ధిమంతులకు నిపుడు ద్రౌపదీప్రశ్న విచా
రము సేయవలయు నవిచా
రమునఁ బ్రవర్తిల్లు టది నరకహేతు వగున్”. **(సభా. 2.226)**

ద్రౌపది అధర్మవిజిత అనీ, ఏకవస్త్రను సభకు తేవటం అధర్మమనీ ఎలుగెత్తి చాటాడు. అతడిని కర్ణుడు తిరస్కరించి మాట్లాడి, అతడి వాదాన్ని ఖండించి, ఆమె ధర్మవిజితయే అనీ, ఆమె బహుభర్తృక కాబట్టి వివస్త్రను చేసితెచ్చినా తప్పు లేదనీ వాదించాడు. ఆ సూచనకు రెచ్చిపోయి దుర్యోధనుడు ద్రౌపదివలువలు పాండవుల వలువలు వలువవలసిందని దుశ్శాసనుడిని ఆజ్ఞాపించాడు. ఇది పరులను అన్యాయంగా పీడించే ఆధర్షణం. ఇది సల్లాపక మనే సాత్త్వతీవృత్తి స్వభావం. ఇది దుర్యోధనుడిలో పరాకాష్ఠ నందుకొన్నది. దుశ్శాసనుడు ద్రౌపదీవస్త్రాపహరణం చేయ ప్రయత్నించాడు. శ్రీకృష్ణుడు ద్రౌపది మేనిమీది వస్త్రం తొలగకుండ తన మహిమతో ఆమె మానాన్ని, ధర్మాన్ని కాపాడాడు. దుశ్శాసనుడు ఎన్ని చీరలు లాగినా ఆమె మేనిమీది చీర తొలగక నిలిచిఉండేది. పర్వతమంత కుప్ప పడేంతవరకు చీరలు ఒలిచి ఒలిచి, అలసి సొలసి ఊరకుండిపోయాడు. భీము డప్పుడు భీషణప్రతిజ్ఞ చేశాడు.

మ. “కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్”. **(సభా. 2.233)**

ఇందులో సల్లాపం, అవపాతం, వస్తూత్థాపనం ముప్పేటగా మోహరించాయి. భీముడి ప్రతిజ్ఞలు దుర్యోధన కర్మఫలసూచికలు, భావికథార్థ పతాకలు, వీరరౌద్రరస పోషకాలుగా వర్తించే సాత్త్వతీ ఆరభటీవృత్తుల సమగ్ర విస్ఫూర్తులు! అభినయాకృతులు!

భీముడి అతిమానుష మైన ప్రతిజ్ఞకు సభ దద్దరిల్లింది. సభికులు ధృతరాష్ట్రుడినీ, అతడికొడుకులనూ మనసులో నిందించారు. సభ క్షోభించింది. విదురుడు సభాసదులను సద్దుమణగింపచేసి, ద్రౌపది అడిగిన ప్రశ్నకు సభలోని పెద్దలు సమాధానం చెప్పాలని కోరాడు. వికర్ణుడి తెగువను ప్రశంసించాడు. సభలో ధర్మం చెప్పకుండా మిన్నకుండేవారు ఆ పాపంలో పాలుపంచుకొంటారనీ, అసత్యదోషం అనుభవిస్తా రనీ హెచ్చరించాడు. విరోచనుడి కథను ఇతిహాసదృష్టాంతంగా చూపించాడు. అతడి దీర్ఘోపన్యాసం బూడిదలో పోసిన పన్నీరైపోయింది. దుర్యోధనుడికి భయపడి సభికు లెవ్వరూ నోరెత్తలేదు.

నన్నయ రచనలోని నాటకీయశిల్పంలో ఇక్కడ ఒక రంగనిర్వహణ నైపుణ్యాన్ని గమనించాలి. మాయాదురోదరంవలన పుడుతున్న ఉపద్రవాన్ని అడ్డుకొనటానికి యత్నించే ధార్మికశక్తి విదురుడు. అతడు నిండుసభలో ధర్మప్రసక్తి తెచ్చినప్పు డల్లా దుర్యోధనుడు తిరస్కారభావంతో రెచ్చిపోయేవాడు. హర్షగర్వాతిశయంతో అనౌచిత్యపు ఆఘాయిత్యాలు చేసేవాడు. అవి పాండవులకు, ప్రత్యేకంగా భీముడికి, అపారకోపాన్నీ, ద్రౌపదికి అపారదుఃఖాన్నీ కలిగించేవి. భీము డొక భీషణప్రతిజ్ఞ చేసేవాడు. దానితో ఒక రకమైన కార్యవర్తులం పూర్తి అయినట్లయ్యేది. విదురుడి బోధ- దుర్యోధనుడి దుశ్చర్య- భీముడి ప్రతిజ్ఞ- ఇట్లా రెండు ఆవృత్తులు తిరిగాయి ఈ రంగంలో. దానివలన కౌరవుల హర్షాతిరేకం, కర్ణాదుల దుష్టాలాపం, విదురాదుల ఆగ్రహాతిరేకం, ద్రౌపది దుఃఖావేశం, భీమాదుల రౌద్రోద్రేకం ప్రవర్తిల్లి సాత్త్వతీ ఆరభటీవృత్తులు రసోపస్కారకాలుగా వర్తిల్లటానికి తోడ్పడ్డాయి. ఈ రెండు రంగప్రయోగవర్తులాలలో ఒకదాని కంటె మరొకటి రసవత్తరమై రాణించటం విశేషం. ఈ చివరి వర్తులం శిల్పసుందరం.

విదురుడి దీర్ఘోపన్యాసంతరువాత సభలో దీర్ఘనిశ్శబ్దం. ద్రౌపదిని సమర్థించే సత్పురుషుడు ఒక్కడుకూడా ఆ సభలో లేడని తేలిపోయింది. అదీ ఆ సభలోని దారుణవాతావరణం. అప్పుడు ద్రౌపది ఎలుగెత్తి మరొక ప్రశ్న వేసింది.

సీ. ''అవ్విధంబున నొప్పి యాస్వయంవరమునాఁ । డఖిలభూపతులచే నట్లు సూడఁ
బడి పాండవులధర్మపత్నినై, గోవిందు । చెలియలినై, వీనిచేత నిట్లు
పరిభూత నగుచు సభామధ్యమున మహీ । పతులచేఁ జూడంగఁ బడితి; నింత
వడుదునె? యిపుడు నా పలుకుల కెవ్వరుఁ । బ్రతివచనం బేల పలుకరైరి?

ఆ. ధన్యులార! యే నదాసినే? దాసినే? । యెఱుఁగఁ జెప్పి పనుపుఁ డెల్లదాని.....'' **(సభా. 2.244)**

నని అడిగింది. అలనాడు స్వయంవరసభలో అందరిచేత ఆమె ఒక్కతె అంత గౌరవంగా చూడబడింది; ఈనాడు కురుసభలో ఇందరిచేత ఈవిధంగా అగౌరవంగా చూడబడింది. ఆమె జీవితంలో ఆ రెండు సభలు నిర్వహించిన పాత్రలను తులనాత్మకంగా సభికులముందు చలనచిత్రంవలె ప్రదర్శించింది. ఇది కౌరవులపట్ల వ్యంగ్యమైన అధిక్షేపం. ఆ ద్రుపదుడిసభలో ఆమె పాండవపత్ని అయింది. ఈ సభలో గోవిందుడి చెల్లెలుగా నిరూపించుకొన్నది. అవమానంనుండి తనను తాను రక్షించుకొనగలిగింది. దుశ్శాసనుడు చేసిన దుశ్చర్యను తన సచ్ఛీలంతో త్రిప్పికొట్టగలిగింది. ఆమె తన పతివ్రతాశక్తిని, శ్రీకృష్ణశక్తిని, ధర్మానురక్తిని ప్రదర్శించి కర్ణుడు చేసిన (బంధకివంటి) అధిక్షేపాలకు వ్యంగ్యంగా సమాధానం చెప్పింది. ఆమె మొదట అడిగిన ప్రశ్నకు సమాధానం వివరించి చెప్పే నాథుడు లేని ఆ సభలో, ఆ ప్రశ్నయొక్క ఫలితాంశాలను రెండు ముక్కలలో అడిగింది- 'నేను అదాసినా? దాసినా?' అని. అందులో ఏ ఒక్కమాట చెప్పినా చాలు అని సభికులముందు ఆక్రోశించింది. ద్రౌపది మానసికసంఘర్షణ మంటలాగా రేగి సభను చురుక్కు మనిపించిన ప్రశ్న అది.

దానికీ ఎవ్వరూ మాట్లాడ లేదు. ఎంతో నిగ్రహంతో నిశ్శబ్దంగా ఉన్న భీష్ముడు ఎట్టకేలకు నిగ్రహించుకోలేక ఒక్కమాట అన్నాడు. ''అమ్మా! నీ వడిగిన ప్రశ్నకు యుధిష్ఠిరుడు మాత్రమే బదులుచెప్పగలడు. దీనిలోని ధర్మసూక్ష్మం తెలియటం మరెవ్వరికీ సాధ్యంకాదు. దీనికి ఫలం ఈ కురుకుల కంటకులు త్వరలోనే అనుభవిస్తారులే' అని పలికి

ఊరుకొన్నాడు. భీష్ముడి సమాధానం సమస్యను తీర్చేది కాదు. పైపెచ్చు- ద్రౌపది ఆ ప్రశ్నను మొదట ధర్మరాజుకే వేసింది కదా! అత డేమీ మాట్లాడకపోయె; మరిం కెవ్వరు మాట్లాడగలరు? ఆమె మమ్ములను ముందు అడుగలేదు....అన్నట్లు మెత్తగా మందలించినట్లయింది. అంతటితో ఆగకుండ ధార్తరాష్ట్రులను నిందించాడు. భీష్ముడి మాటలు విదురుడి వాక్యాలవలెనే ఆధర్షణ రహితమైన అధిక్షేపాలకు ప్రతినిధులుగా నిలిచాయి.

భీష్ముడు దుర్యోధనుడి దుష్టవర్తనాన్ని దూషించినట్లు వ్యంగ్యంగా మాట్లాడేసరికి, మిత్రుడిమీద ఈగవాలనివ్వని ప్రాణమిత్రుడు కర్ణుడు, నిస్సహాయురాలుగా నిలువబడిన ద్రౌపదిని చూచి, అధిక్షేపాత్మక మైన అవహేళనం చేశాడు. దానివెనుక భీష్మవచన ప్రభావంకూడా లేకపోలేదు. ధర్మసందేహం తీర్చగల భర్త ధర్మరాజు, అతడే ఊరుకున్నాడు. దానికి కారణం జూదంలో ఓడిపోవటం. దాసుడు మాట్లాడకూడదు కాబట్టి, మౌన మర్ధాంగీకార మన్నట్లు ధర్మజుడు దాసుడని మౌనంతోనే ఒప్పుకొన్నాడు. అతడితోపాటు అతడి తమ్ములు, వారందరితోపాటు వారి భార్య పాంచాలి. ఇది చెప్పకుండానే స్పష్టమౌతున్న కథార్థం. ఈ దైన్యస్థితిని గమనించి కర్ణుడు ద్రౌపదిని నిష్కారణంగా పీడించాలని పూనుకొన్నాడు. 'ఓ తరుణీ! నీకు ఐదుగురికంటె ఒకే భర్త ఉండటం మంచిది. జూదంలో ఓడిపోనివాడిని ఒకడిని భర్తగా ఎన్నుకోవటం సబబు' అని వికటంగా నవ్వాడు. స్వయంవరసభతో కౌరవసభను పోల్చి తమను అధిక్షేపించిన ద్రౌపదికి తగిన జవాబిచ్చినట్లు మాట్లాడాడు. 'ఇప్పుడు ఈ సభనే మరొక స్వయంవరసభగా మార్చుకొ' మ్మన్నట్లు 'దాసీత్వాన్ని తొలగించుకొమ్ము' అన్నట్లు ఎగతాళిచేశాడు. మాటకు మాట ఘాటుగా వడ్డించాడు. నిజానికి ద్రౌపదీస్వయంవరసభలో పెద్దదెబ్బ తిన్నది కర్ణుడే కదా!

కర్ణుడి మాటలలోని వెటకారం పాండవులనూ, ద్రౌపదినీ బాధించింది. దుర్యోధనుడికి మరొక దురాలోచన చేయటానికి దోహదం చేసింది. సుయోధనుడు ద్రౌపదిని తన తొడమీద కూర్చుండు మని సైగచేశాడు. ఆ సైగను చూచి భీముడు భగ్గున మండిపడ్డాడు. ఉగ్రరణాంతరంలో భీమగదాఘాతంతో దుర్యోధనుడి తొడలు విరుగగొట్టుతానని భీషణప్రతిజ్ఞ చేసి, ఆయుధాలవైపు చూచాడు. ధర్మజుడి ఆజ్ఞకొరకు తేపతేపకు అతడివైపు చూచాడు. భీముడు కార్యవీరుడైతే కథలో కార్యం దెబ్బతింటుందని భీష్మద్రోణాదులు భీముడిని అనునయించి కూర్చోబెట్టారు. ఈ ఘట్టంలో ప్రవర్తిల్లిన వీరరౌద్ర రసాలకు పోషకంగా సల్లాపక, అవపాతాలనే సాత్త్విక ఆరభటీవృత్తులు నిలిచాయి. ఇంతటితో రెండవరంగం పూర్తయింది. ఈ డిమప్రాయమైన కథాఘట్టంలో.

మూడవరంగం ముచ్చటైన చిన్నఅంకం. ద్రౌపదీవస్త్రాపహరణసభానంతరం ధృతరాష్ట్రుడి మందిరంలో మహోత్పాతాలు పుట్టాయి. అగ్నిహోత్రగృహాలలో నక్కలు అరిచాయి. అగ్నులు ఆరిపోయాయి. కౌరవుల భార్యల హృదయాలు అధికశోకంతో ఉడికిపోయాయి. ధార్తరాష్ట్రుల శయ్యాగృహాలలో కాకులూ గ్రద్దలూ అరిచాయి. ఆ దుశ్శకునాలను గురించి విని విదురభీష్మద్రోణులు కౌరవులకు అరిష్టం దాపురించిం దని భావించి మనస్సులలో సంతోషించారు.

రాజమందిరంలో గుప్పున పొడచూపిన ఆ దుశ్శకునాలకు గాంధారిగుండె చెదిరిపోయింది. విదురుడిని పిలిపించుకొని అతడితోపాటు తాను ధృతరాష్ట్రుడివద్దకు గబగబా పోయింది. ఆవేగంతో కురుసభలో జరిగిన వృత్తాంతాన్నీ, దుర్నిమిత్తాలనూ చెప్పింది. ధృతరాష్ట్రుడు వెంటనే కొడుకును పిలిపించాడు.

చ. ''పరమపతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతిమానవభామినిఁగాఁ దలంచి దె
ప్పరములు వల్కఁగాఁ దగునె? బాల్యము నాదిగ దుష్టభావనం
బెరిఁగితి; నీ నిమిత్తమునఁ బెద్దయు దుఃఖితు లైరి పాండవుల్''. **(సభా. 2.255)**

అని మందలించి పాండవులపట్ల గల ఆగ్రహాన్ని మానుకొమ్మని హితవుచెప్పి పంపాడు. ఆ తరువాత దుర్యోధనుడికి తెలియకుండా ద్రౌపదిని పిలిపించి, ఆమెను నయవాక్యాలతో బుజ్జగించి, 'నా కోడండ్రలో నీవే పూజనీయ'వని ప్రశంసించి, వరాలిస్తాను కోరుకొమ్మన్నాడు. ఆమె క్షత్రియవనితకు తగినట్లుగా రెండువరాలు కోరుకొన్నది. ఒకటి- ధర్మరాజును దాస్యంనుండి విముక్తి చేయుమని కోరింది. దానివలన ద్రౌపదికి అతడివలన కలిగిన ప్రతివింధ్యుడు దాసపుత్త్రు డనే అపప్రథకు

దూరమౌతాడని భావించింది. ధర్మరాజు తరువాత తన పుత్త్రుడు మూర్ధాభిషిక్తు డైతే మిగిలిన ఉపపాండవులకు, సుభద్రాతనయుడికి ఉండే దాస్యులనే మచ్చ తన కొడుకుకు లేకుండా ఉండాలని ఆమె మనసులోని మాట. ఆ తరువాత భీమార్జున నకులసహదేవులు ఆయుధాలతోసహా దాస్యవిముక్తులు కావాలని కోరింది. ధృతరాష్ట్రు డావరా లిచ్చాడు. కోడలి గుణాలకు ధర్మతత్పరతకు మెచ్చుకొన్నాడు. ధర్మజుడిని పిలిపించి అతని రాజ్యం అతని కిచ్చి వైభవోపేతంగా ఇంద్రప్రస్థానికి తిరిగిపంపాడు. పంపుతూ-

తే. "నీవు నిత్యంబు వృద్ధోపసేవఁ జేసి
యెఱుఁగు దెల్లధర్మంబుల; నెఱుక లేక
కడఁగి నీ కెగ్గు సేసె నా కొడుకు; దీని
మఱచునది; నీకు నే నొండ్లు గఱపనేల?" **(సభా. 2.265)**

అని ధర్మరాజును ప్రశంసించి పలకటమే కాకుండా తననూ తన కొడుకునూ కించపరచుకొని దయాభిక్ష కోరినట్లు మాట్లాడాడు. ఉత్తములైనవారు ఇతరుల అపరాధాలను మనసులో పెట్టుకోరనీ, ఓర్పును ప్రకటిస్తారనీ, గుణాలను గ్రహించి దోషాలను విడిచిపెడతారనీ పేర్కొన్నాడు. తాను బుద్ధిలేక జూదాన్ని ఉపేక్షించాననీ, ముసలితనంచేత తెలివిమాలినవాడైన తనను, తల్లి అయిన గాంధారిని చూచిఅయినా దుర్యోధనాదుల దుర్నయాలను సహించు మనీ ధర్మరాజును వేడుకొన్నాడు. ధర్మరాజుకు పాండురాజు రాజ్యాన్ని సమర్పించాడు. రంగం ముగియవచ్చింది. ఆ రంగంలో ద్రౌపది నిర్వహించిన పాత్రను పఠితహృదయంలో ప్రతిష్ఠిత మయ్యేటట్లు తరల మనే విశేషవృత్తాన్ని వాడి నన్నయ సూత్రధారుడిగా గానంచేశాడు. నాటకప్రయోగంలో ఇది ఒక చూళికవంటిది.

తరలము.

"తరుణి ద్రౌపది యిట్లు పాండవధార్తరాష్ట్రుల దైన భీ
కరపరస్పరకోపవేగము గ్రన్నఁ బాచి విపత్తిసా
గరనిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల ధీరులం
బురుషసింహములన్ నిజేశులఁ బూని తద్దయుఁ బ్రీతితోన్." **(సభా. 2.268)**

ఈ సన్నివేశాన్ని నాటకీయశిల్పదృష్టితో, డిమలక్షణయుక్తితో గమనిస్తే కొన్ని విశేషాలు గోచరిస్తాయి.

1. గాంధారి విదురుడితో కలసివచ్చి ధృతరాష్ట్రుడిముందు నివేదించిన విశేషాలూ, ధృతరాష్ట్రుడు వెంటవెంటనే దుర్యోధనుడినీ ద్రౌపదినీ, ధర్మరాజునూ పిలిపించి, వారితో మాట్లాడి తీసికొన్న నిర్ణయాలూ కలిసి అవపాతమనే ఆరభటీ వృత్తిభేదాన్ని సమగ్రంగా చిత్రించాయి.

2. ధృతరాష్ట్రుడు ప్రదర్శించిన రాజనీతి సంఘాత్యం అనే సాత్త్వతీవృత్తికి సమగ్రోదాహరణం. దుర్యోధన కర్ణ శకుని దుశ్శాసనాదులు ఒక కూటమిగా కూడి కపటద్యూతాన్ని నడిపి, పాండవసంపదను హరించి, వారిని వారిభార్యను అవమానించారు. వారి దుష్టవ్యాపారంవలన కలిగే విపత్తునుండి తప్పించుకొనటానికి ధృతరాష్ట్రుడు సామదానోపాయాలను ప్రయోగించాడు, రాజ్యదానం చేసి అర్థశక్తిని ప్రదర్శించాడు. ఆత్మదోషాన్ని చెప్పుకొని క్రుద్ధులను అనునయించాడు. అనేక కపటాలతో ఇతరులను చంపటానికి గానీ, కీడు కలిగించటానికి గానీ ఒక కూటమి ప్రయత్నిస్తే, దానిని భేదించటానికి చేసే బలమైన యత్నంలోనే సంఘాత్యమనే సాత్త్వతీవృత్తి రూపుకట్టుతుంది. అది ఈ అంకంలో ప్రదర్శితమైనది.

నిజానికి ఇంతటితో ఈ రూపకం ముగిసే అవకాశం ఉన్నది. కౌరవులచేత ఆరంభించబడిన కార్యం ఫలించినట్లు ఫలించి విఫలమైపోయింది. బీజప్రగతి దృశ్యాదృశ్యమైపోయింది. ఈ సన్నివేశం గర్భసంధివంటిది. ఇందులో ప్రాప్త్యాశగా ప్రవర్తిల్లినవి రెండంశాలు.

1. సతికారణంగా వచ్చిన సామ్రాజ్యం పురుషులకు పౌరుషచిహ్నం కాదని శత్రువులమీద విరుచుకొనిపడటానికి పూనుకొన్నాడు భీముడు. ధర్మజుడు చేయెత్తి అతడిని వారించాడు. దీనివలన ధృతరాష్ట్రు డిచ్చిన రాజ్యం పాండవుల పరిపూర్ణమైన అంగీకారాన్ని పొందలేకపోయింది. దానితో యుద్ధం అనివార్యమైనది.

2. దుర్యోధనుడు తండ్రిని కలిసి పాండవులతో ఇకపై స్నేహం కుదరదనీ, వారిని అవమానించి అనునయించటం పాములను రెచ్చగొట్టి గొంతులదగ్గర ఉంచుకొన్నట్లే అని వివరించి అనుద్యూతంలో వారి నోడించి పన్నెండేళ్ల అరణ్యవాసం, ఒకయేడు అజ్ఞాతవాసం చేయటానికి పంప నిశ్చయించటం.

3. దుర్యోధనుడి చర్యలలో మరొక సంఘాత్యస్ఫూర్తి భాసించి కథను ముందుకు నడిపించింది. దీనితో బీజఫలాని కనువైన ప్రాప్త్యాశ సిద్ధించింది. అవమర్శసంధి ఆకృతి తాల్చింది.

అనుద్యూతం చివరిదైన నాల్గవ అంకంవంటిది. అందులో ధర్మజుడు మరల ఓడి అరణ్యఅజ్ఞాతవాస వ్రతాన్ని నిర్వహించ పూనుకొంటాడు. అది ఆకృతిలో చిన్నదైనా అందులోని శకునిమాటలు నాటకీయతను పోషించాయి. అందులో కపటంతోకూడిన సంఫేట మనే ఆరభటీవృత్తి ద్యూతయుద్ధపరంగా ప్రయోగించబడింది.

ఈ డిమప్రాయమైన కథాఘట్టంలో జూదానికి కూర్చున్నది మొదలు ధర్మరాజు పాత్రనోట ఒకమాటకూడా పలికించకుండ కార్యాన్ని నడిపించిన ప్రజ్ఞ నన్నయది. లోనారసి చూస్తే- ఒక విశేషం భావించవచ్చును. భరతుడు నాట్యశాస్త్రంలో ఏ యే వృత్తులు ఏ యే రసాలలో ప్రయోగించబడతాయో వివరిస్తూ "సాత్త్వతీ చాపి విజ్ఞేయా వీరాద్భుత శమాశ్రయా" (భరతనాట్యశాస్త్రమ్. 18.73 శ్లో) అని అన్నాడు. దీనికి "వీరాద్భుతసమాశ్రయా" అని పాఠాంతరం ఉన్నదన్నారు కొందరు. శాంతరసవాదులు 'శమ' శబ్దాన్ని గ్రహిస్తారు. ఇతరులు 'సమ' శబ్దాన్ని సమర్థిస్తారు. శమ శబ్దమే సార్థకమని ధర్మజుడి పాత్రవైఖరి స్పష్టంచేస్తున్నది. కురుసభలో అంతటి సంక్షోభం తనవలన రేగినా, చుట్టూ ఉన్న పాత్రలన్నీ వీర రౌద్ర కరుణోద్వేగాలతో ఆవేశాన్ని ప్రదర్శిస్తూ ఉన్నా, ధర్మజుడు మాత్రం మూర్తికట్టిన శమం లాగా స్థిరుడై నిలిచాడు. సుడిగాలివలె యుద్ధానికి సిద్ధమైన భీమసేనుడిని చేయెత్తి సైగచేసి ఆపగలిగాడు. భీష్మాదులచేత, అర్జునుడిచేత సమున్నతుడుగా కీర్తించబడ్డాడు. శమంకూడా సాత్వతీవృత్తిచేత పోషించబడుతుందని నాటకీయంగా నిరూపించాడు. డిమంలో భాసించే మానసికసంక్షోభ వాతావరణంలోకూడా శాంతపర్వతంవలె నిలిచిన ధర్మజుడినిగురించి అర్జునుడు చాటిన ధర్మవీరగీతం మహాభారతనాయకుడైన ధీరోదాత్తుడి కీర్తి కెత్తిన విజయపతాకం.

సీ. "ధర్మతనూజుండు ధర్మువు తప్పిన । ధరణీతలంబెల్లఁ దల్లడిల్లుఁ
దగిలి సుహృద్ద్యూతధర్మయుద్ధములకుఁ । బరులచేఁ బిలువంగఁబడి విభుండు
గడఁగక విముఖుండు గాఁ జన దని శుభ । క్షాత్త్రధర్మంబు లోకంబునందు
నిలిపెఁ దా నిది పతినేరమియే? దైవ । వైపరీత్యంబైన వనరఁ దగునె?". **(సభా. 2.224)**

అన్నది సభాపర్వనాయకధర్మశీలసంకీర్తనం! నన్నయ నాటకీయరచనాశిల్పసుకేతనం!

ఈవిధంగా పరిశీలిస్తే నన్నయరచనలో నాటకీయత సంతరించుకొన్న సన్నివేశాలు మరికొన్ని గమనించవచ్చును. స్థాలీపులాక న్యాయాన్ని అనుసరించి యీ వివేచన చేయడ మైనది. నాటకలక్షణాలతో తీర్చిదిద్దిన కథలు యయాతి, దుష్యంత, నలమహారాజు చరిత్రలు. వాటినిగురించి ఆరణ్యపర్వపీఠికలో పరిశీలించటం సందర్భోచిత్యం.

నన్నయనాటకీయత ఆయన చెప్పుకొన్న 'ప్రసన్నకథాకలితార్థయుక్తి'లో భాగమే. నన్నయకథాకథనశిల్పం తల్లివంటిదైతే నాటకీయత ఎత్తుడుబిడ్డవంటిది. చంకబిడ్డ తల్లిని కేంద్రంగా చేసికొని చుట్టూ పారాడుతుంది, తిరుగుతుంది. ఒడిలోనుండి

లేచి ఆటలాడి మరల ఒడిలో చేరటమే ఎత్తుడుబిడ్డ లక్షణం. నన్నయ నాటకీయతకూడా అటువంటిదే. నాటకీయతకూ కథాకవితకూ పోష్యపోషకసంబంధం నన్నయ కల్పించిన అనుబంధం.

## ప్రసన్నకథాకలితార్థయుక్తి

సంస్కృతమహాభారతంలోని సభాపర్వంతో పోల్చిచూస్తే నన్నయ సభాపర్వం సగానికి సగం తగ్గినట్లు కనపడుతుంది. కథలో వాపు తగ్గి బలుపు పెరిగింది. అంటే వ్యాసభారతాన్ని సర్వార్థప్రధానంగా కాక పరమార్థప్రధానంగా నన్నయ తెలుగులో పునర్నిర్మించాడన్నమాట! వ్యాసుడిది శాస్త్రేతిహాసం; నన్నయది కావ్యేతిహాసం! శాస్త్రం వాచ్యప్రతిపత్తిమీద నిలుస్తుంది; కావ్యం వ్యంగ్యగౌరవంతో జీవిస్తుంది. ఇతిహాసం చతుర్విధపురుషార్థప్రధానమైన జీవితాన్ని సత్యదృష్టితో ఆవిష్కరిస్తుంది. అందువలన వ్యాసభారతాన్ని చూచే చూపుకంటె భిన్నమైన దృక్పథం ఆంధ్రమహాభారతానుశీలనంలో అనుసరించాలి. వ్యాసరచన శాస్త్రేతిహాసప్రక్రియలో మేరునగశిఖరం. నన్నయరచన కావ్యేతిహాసప్రక్రియలో ఎవరెస్టుశిఖరం!

వ్యాసనన్నయుల రచనాదృక్పథాలలోని భేదం తెలియటానికి ఒకఅంశాన్ని గమనిద్దాం. మహాభారతంలో శ్రీకృష్ణమహత్త్వాన్ని విస్తృతంగా వర్ణించి దానిని కార్ష్ణవేదంగా రూపొందించటం వ్యాసహృదయం. ఆ అర్థాన్ని వీలైనప్పుడెల్లా వివరించి, వర్ణించి, వ్యాఖ్యానించి విస్తృతంగా చెప్పటం వ్యాసరచనాశిల్పం. నన్నయ ఆ అంశాలను సంగ్రహం చేస్తాడు. కాని, శ్రీకృష్ణమహత్త్వాన్ని తగ్గించడు. వ్యాసుడు వాచ్యం చేసినచోట వ్యంగ్యమర్యాదను పాటించి దానిని భావనామయం చేస్తాడు. అంటే- అల్పాక్షరాలలో అనల్పార్థరచన చేస్తాడన్నమాట. అది ఇతిహాసానికి కావ్యస్వభావాన్ని సంయోజనం చేయటం.

సభాపర్వంలో రెండుచోట్ల ప్రధానంగా శ్రీకృష్ణమహత్త్వం ప్రకటితమౌతుంది. మొదటిచోటు- రాజసూయంలో శ్రీకృష్ణుడిని గురించి భీష్ముడు చేసిన ప్రశంసలు. శిశుపాలుడు చేసిన దూషణలు. రెండవచోటు- కౌరవసభలో ద్రౌపది శ్రీకృష్ణుడిని ఆర్తితో ఎలుగెత్తి పిలవటం- విస్తృతంగా ఉన్నాయి. వాటిని తగ్గించి నన్నయ సంగ్రహమైన సారవద్రచన చేశాడు. కాని, దానివలన 'కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారతబద్ధనిరూపితార్థము' చెడలేదు. పైపెచ్చు ధ్వనిమయమై రమణీయమై నిలిచింది. మచ్చుకు ద్రౌపదీవస్త్రాపహరణ ఘట్టంలోని నన్నయరచనను గమనిస్తే ఈ సత్యం బైటపడుతుంది.

శ్లో. "ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చింతితో హరిః
గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ
కౌరవైః పరిభూతాం మాం కిం నజానాసి కేశవ! ॥
హేనాథ హే రమానాథ ప్రజానాథార్తినాశన
కౌరవార్ణవమగ్నాం మా ముద్ధరస్వ జనార్దన ॥
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన
ప్రపన్నాం పాహి గోవింద కురుమధ్యేఽవసీదతీం ॥
ఇత్యనుస్మృత్య కృష్ణం సా హరిం త్రిభువనేశ్వరం
ప్రారుద ద్దుఃఖితా రాజ న్ముఖ మాచ్ఛాద్య భామినీ ॥
యాజ్ఞసేన్యా వచ శ్రుత్వా కృష్ణో గహ్వరితోఽభవత్
త్యక్త్వా శయ్యాసనం పద్మాం కృపాళుః కృపయాఽభ్యగాత్ ॥
కృష్ణంచ విష్ణుంచ హరిం నరంచ త్రాణాయ విక్రోశతి యాజ్ఞసేనీ
తతస్తు ధర్మోఽంతరితో మహాత్మా సమావృణో ద్వై వివిధై స్సువస్త్రైః ॥"

**(సం. సభా. 61. 40; 542 అథస్సూచి)**

ఈ వర్ణనం గమనిస్తే భాగవతంలోని గజేంద్రమోక్షణఘట్టంలో గజేంద్రుడిఆర్తి గుర్తుకు వస్తుంది. గజేంద్రుడిని కాపాడటానికి శ్రీవిష్ణువు వలెనే ద్రౌపదిని రక్షించటానికి శ్రీకృష్ణుడు సిద్ధమయ్యాడు. 'ద్రౌపద్యా చింతితో హరిః' అనే వాక్యంతో మొదలై 'విక్రోశతి యాజ్ఞసేనీ' అనే వాక్యంతో ముగిసే పై ఘట్టంలో శ్రీకృష్ణుడిని ఆమె ఆర్తితో పిలిచినట్లూ, ఆత డామెను రక్షించినట్లూ స్పష్టమౌతున్నది. అప్పుడు ఆ సంగతి సభలో అందరికీ తెలిసిఉంటుంది. తెలిస్తే దానిప్రసక్తి కథలో వచ్చిఉండేది. నన్నయ దీనిని లోనారసి భావించి పునర్నిర్మించాడు. అసలీ కృష్ణస్తుతినంతా ఎత్తివేశాడు. ''భామిని కృష్ణుఁ దలంచె భీతయై'' అని మాత్రం చెప్పి ఊరుకొన్నాడు.

దీనివలన నన్నయ అనేకార్థాలను సాధించాడు. నన్నయరచనలో ద్రౌపది మూలంలోవలె ఆక్రోశించదు. ధీరోదాత్తురాలువలె దుఃఖిస్తుంది. బేలవలె శ్రీకృష్ణుడి నామావళి చదువదు. 'కృష్ణ' అనే నామాన్ని ఒక్కదానినే స్మరిస్తుంది. అది ఆమెకూ ఆ గోపాలుడికీ అద్వైతంగా కుదిరిన పేరు. దాన్ని స్మరిస్తే శ్రీకృష్ణుడు ఆ వస్త్రాపహరణం తనకే జరుగుతున్నట్లు భావించాలి. ద్రౌపదికీ శ్రీకృష్ణుడికీ అభేదభావం నన్నయ వ్యంగ్యంగా సాధించటంవలన శ్రీకృష్ణుడు శయ్యాసనం వదలి కదలిరావలసిన అవసరం తప్పింది. ద్రౌపది మనసులో స్మరించిన కృష్ణనామం సభలోనివారికి వినపడే అవకాశం లేదు. అందువలన ఆమె జఘనప్రదేశంపై వస్త్రం తొలగకుండా, ఆమెకు నగ్నత్వం ఏర్పడకుండా రక్షించినశక్తి ఎవరైఉంటారనే యోచన సభికులకు ఏర్పడుతుంది. కృష్ణుడు రక్షించా డని కృష్ణకు తెలుసు. సభికులుమాత్రం ఆమెపాతివ్రత్యమే ఆమెను రక్షించిందని భావించినట్లు ధ్వనిమయంగా తెలుస్తుంది. బంధకిని వివస్త్రను చేసినా తప్పులే దనీ, పలువురు భర్తలకు భార్యఅయిన ద్రౌపదిని ఎవరు ఉపభోగించినా దోషం లేదనీ, అటువంటి సామాన్యవనిత పట్టమహిషిగాకంటె దాసిగా ఉండటం సమంజసమనీ దుర్యోధనకర్ణాదుల తలంపులు. అందుకే వా రామెను సభలో వివస్త్రను చేయాలని తలపెట్టారు. వారి మొగాలు బొప్పులు కట్టేటట్లు ద్రౌపది తన శీలమాహాత్మ్యంతో సభలోనే సమాధానం చెప్పినట్లు రచించటం నన్నయ తాత్పర్యం. అది సన్నివేశౌచిత్యంకూడ. కావ్యదృష్టితో చూస్తే నన్నయరచన మిన్న. పురాణదృష్టితో పరిశీలిస్తే వ్యాసుడిరచన పైచేయి.

నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తినిగురించి మౌలికంగా ఎన్నో అంశాలను వివరించినవారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. వాటిలోనూ సభాపర్వంలోని నన్నయ కథాకథనశిల్ప విశేషాలనుగురించి వారు చేసిన వ్యాఖ్యలు అపూర్వంగా ఉన్నాయి. కాళిదాసుకు మల్లినాథుడివలె నన్నయకు విశ్వనాథ తెలుగులో పేరుతెచ్చారు. వారు చెప్పిన కొన్ని విలువైన అంశాలను స్మరించటం అవసరం.

### 1. సభాపర్వంలో ద్రౌపదికి గల ప్రాధాన్యం

''పాండవ కౌరవ ద్యూత కథాసౌధ మూలస్తంభము ద్రౌపది. ఇది నన్నయగారు చేసిన నిర్ణయము. అందుచేత నీ కథయొక్క యాద్యంతములందు నన్నయగారు ద్రౌపదిని నిక్షేపించిరి. గాంధారి కోడండ్రు

తే. అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుఁడు
మెలఁతగా దీనియందు నిర్మించె నొక్కొ
కానినాఁ డిట్టి కాంతి యేకాంతలందు
నేల లే దని సామర్షహృదయ లైరి. ॥ (సభా. 2.160)

ఆమెయొక్క లావణ్యమును జూచి కౌరవుల భార్యలు చుప్పనాతితనమునుఁ బొందిరి. నన్నయ్యగారు వాడిన శబ్దము లావణ్యము. సౌందర్యము కాదు. లావణ్య శబ్దమునకు సౌందర్యమని సామాన్యముగా నర్థము చెప్పినను నిజమైన యర్థ మదికాదు. లవణము యొక్క భావము లావణ్యము. రాతిఉప్పు పగులగొట్టినచోఁ బలకలు పలకలుగా నుండును. ఒక ద్రవ్యము పలకలు పలకలుగా నున్నపుడు, నది స్నిగ్ధమైన వస్తువైనపుడు దానిమీఁద సూర్యకిరణ ప్రసారము జరిగి యది తళతళలాడును. ఆ మెఱుపు లావణ్యము. స్త్రీయొక్క శరీరచ్ఛాయయు, స్నిగ్ధత్వమును, బోషణచేత వచ్చిన సౌకుమార్యమును, నైగనిగ్యమును- నివి యన్నియు లావణ్య మనిపించుకొనును. అట్టి లావణ్యము ద్రౌపదీశరీరమందుఁ

గౌరవుల భార్యలు మాత్సర్యము వహించఁ దగినంతగా నుండెను. దీనిచేత ద్రౌపదీదేవియొక్క భోగలక్షణాధిక్యము వ్యజ్యమాన మగుచున్నది. అందుచేత వారు మత్సరము పడిరి. వా రంద ఱా రాత్రి తమభర్త లందఱితో నామెయొక్క యీ భోగవైశిష్ట్యమునుఁగూర్చి చెప్పియుందురు. వా రందఱకు ద్రౌపది యన్నచోఁ జుప్పనాతితనము బలిసినది. మఱునాఁడు జరుగఁబోవు నధర్మమునకు నందఱును హర్షించిరి. ఇంత ప్రయోజనకారిగా నన్నయ్యగా రీ పద్యము నిచ్చట నిక్షేపించిరి. ఒక్క ద్యూత కథా మూలస్తంభ మగుటయే కాదు. అట్టి మూలస్తంభ మగుటకుఁ బ్రధానకారణమయిన ద్రౌపదియందలి లక్షణములు, నా లక్షణములు వారిమాత్సర్యమునకు హేతువులు, నా మాత్సర్యము ద్రౌపదిపరాభవము హర్షించుటకు హేతువులు. ఈ రీతిగా నన్నయ్యగారు ద్యూతకథా మహాభవన మూలస్తంభ మయిన ద్రౌపదినిఁ దొట్టదొలుత స్థాపించి తరువాత ద్యూతకథలోనికి వెళ్ళిరి.

మఱియు నీ ద్యూతకథావసానము ద్రౌపది. ఆమెకు ధృతరాష్ట్రుఁ డిచ్చిన వరములచేతనే యా విచిత్ర ద్యూతఫల మహావైపరీత్యము మఱియొక త్రోవ పట్టినది. ఆ వరము లీయకున్నచో భారతకథ యేమి యయ్యెడిది? పాండవులు బ్రదికినన్నాళ్లు కౌరవదాసులుగా నుండిపోదురా? ఉండిపోయెడినాడు భారతకథయే లేదు. పాండవులు దాసులై యుండి కౌరవులతో యుద్ధము చేయుదురా? ఇది యొక చిత్రమైన సమస్య. ఆ సమస్య సమాధానములేని సమస్య. ద్రౌపదిచేతఁ బరిష్కరించఁబడినది. ఈ రీతిగా ద్రౌపది భారతకథలో నున్న యనేకములయిన కథాప్రవాహ భంజకము లయిన ఘట్టములలోఁ గథ సాగించిన యొక సహకారిణి. ఈ ఘట్టమునందు ద్రౌపదియొక్క ప్రాధాన్య మిట్టిది. దానినిఁ దెలిసికొని నన్నయగారు రచనచేసిరి. మహాకవి తాను వ్రాసెడి కథయొక్క స్వరూపము తెలిసికొని వ్రాయును. ఆ కథాగత సమస్యలనుఁ బరిష్కరించును. ఆ పరిష్కరించిన వైఖరి ఘట్టములుగాఁ గనిపించును. ఆ ఘట్టములు మనకు సువ్యక్తములుగా నుండును. వానియొక్క సువ్యక్తతచేతనే పాఠకులకు మహాకవి చేసిన కథానిర్ణయము తెలియును. అవి సువ్యక్తమగుటకుఁ గవి నిరూపించిన విషయములు శిల్పతీర్థములు.

ఈ కథావసానమునందు మఱల నన్నయగా రిట్లు వ్రాసెను.

తరలము.

తరుణి ద్రౌపది యిట్లు పాండవధార్తరాష్ట్రులదైన భీ
కరపరస్పరకోపవేగము గ్రన్నఁ బాచి విపత్తిసా
గర నిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల ధీరులం
బురుషసింహములన్ నిజేశులఁ బూని దద్దయుఁ బ్రీతితోన్. ॥ **(సభా. 2.268)**

ఈ రెండు పద్యములచేత ద్యూతకథయంతయు నెట్లు ద్రౌపదిమీఁద నాధారపడియున్నదో, భారతకథా ప్రవాహములో నిది యెటువంటి ఘట్టమో నన్నయ్యగారు నిరూపించిరి. ఈ రెండును నన్నయ్యగారి మహాశిల్పమున కుదాహరణములు.'' (ఆంధ్రమహాభారతోపన్యాసములు: నన్నయగారి భారతాంధ్రీకరణము (వ్యా). పు. 12-14).

### 2. ద్రౌపదీవస్త్రాపహరణం - వివస్త్రత

''నన్నయగారు తా నొక విషయమును గాఢముగా నాలోచించికాని వ్రాయరు. ద్రౌపదీవస్త్రాపహరణవిషయమున భారతమునం దిట్లున్నది.

శ్లో. ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యాస్తు విశాంపతే
తద్రూప మపరం వస్త్రం ప్రాదురాసీ దనేకశః ॥
నానారాగవిరాగాణి వసనాన్యథ వై ప్రభో
ప్రాదుర్భవంతి శతశః ధర్మస్య పరిపాలనాత్ ॥

తతో హలహలా శబ్ద స్తత్రాసీద్ ఘోరనిస్స్వనః
త దద్భుతతమం లోకే వీక్ష్య సర్వే మహీభృతః ॥
శశంసు ర్ద్రౌపదీం తత్ర కుత్సంతో ధృతరాష్ట్రజం
శశాప తత్ర భీమస్తు రాజమధ్యే బృహత్స్వనః ॥ **(సం. సభా. 61. 41-43; అథస్సూచికలు 553,554)**

దీనిని నన్నయగా రిట్లు తెనుఁగు చేసిరి.

సీ. ఇది సేయఁగాదని మది విచారింపక సద్గర్వితుండు దుశ్శాసనుండు
నెట్టన ద్రౌపది గట్టిన పుట్టంబు సభలోన విడ్చె నాశంక లేక
యుడుగక యొలువంగఁబడియు ము న్నపనీత మైన తద్వస్త్రంబునట్టి వలువ
లలితాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచునున్న న య్యువిదఁ జూచి

ఆ. సభ్యులెల్ల నుదితసమ్మదు లయిరి దుశ్శాసనుండు వస్త్రచయము పర్వ
తోపమాన మైన నొలువంగనోపక యుడిగె లజ్జఁ బొంది యుక్కుదక్కి. ॥

వ. ఇట్లు భీమసేనుఁడు ద్రుపదరాజనందనకు దుశ్శాసనుండు సేసినయవమానంబు సూచి, కోపరక్తాంత నయనుం డగుచు నంతకాకారంబున దంతసందష్ట దారుణముఖుం డయి యెల్లవారును విన నిట్లనియె.

**(సభా. 2.231, 232)**

వివిధములైన యనేక వర్ణములు కలిగిన వసనములు పుట్టుచున్నవి. దీనికి హేతువు ధర్మము పరిపాలింపఁబడుట, సభలోఁ బెద్ద ధ్వని కలిగెను. ఈ యద్భుతమునుఁ జూచి రాజు లందఱు ద్రౌపదినిఁ బొగడిరి. దుర్యోధనునియందుఁ గుత్స వహించిరి. భీముఁడు శపథముఁ జేసెను. నన్నయగారు వస్త్రములయొక్క నానారాగవిరాగత్వము వర్ణించలేదు. అది యనవసరము, జనులలో హలాహలశబ్ద ముదయించినది. దానిని నన్నయగారు వదలిపెట్టిరి. ఇది యొక మహాఘోరము జరుగుచున్నపుడు జనులు నిస్తబ్ధులై నీరవులై యుండిపోదురు. అందుచేత నన్నయగారు దానిని వదలిపెట్టెను. ఆమెను జూచి సభ్యు లుదితసమ్మదు లయిరి. ప్రశంసించలేదు.

'తద్రూప మపరం వస్త్రం ప్రాదుర్భవతి' యన్న మాటను 'ఉడుగక యొలువంగఁ బడియు ము న్నపనీతమైన త ద్వస్త్రమ్మునట్టి వలువ లలితాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచునున్న'దని నన్నయగారు తెలుఁగుచేసిరి. ఈ తెలుఁగు సేతలోనున్న సొగసేమి? ద్రౌపదికి మానభంగము చేయవలయు నని దుర్యోధనాదుల యూహ, మానభంగ మనఁ గా నేమి? ఆమె వివస్త్రయగుట. వివస్త్రత యనఁగా నగ్నత, నగ్నత యనఁగా నేమి? ఇచట విచారణ చేయవలెను. వస్త్రము ధరించినందువలన శరీరావయవములు కప్పఁబడు నని యనుకొందుము. కప్పఁబడుట యనఁగా నొక వస్తువుయొక్క స్వరూపజ్ఞాన మేర్పడకుండ నుండుట, శరీరముయొక్క నగ్నత్వ మనఁగా శరీరాంచలములు భాసించుట, మన కొక వస్తువు కనిపించుచున్న దనఁగా నా వస్తువుయొక్క యవధిభూతములయిన రేఖలు సువిస్పష్టముగాఁ గనిపించుటయే, ఒక పేటికను జూచితిమి. ఒక ఘటమును జూచితిమి. మఱి యింకొక వస్తువును జూచితిమి. త ద్వస్తువుయొక్క లోపలిభాగమును జూడలేదు. దాని పై యంచులనుఁ జూచితిమి. ఈ యంచులు రేఖలు. దృష్టికిఁ గనిపించునది రేఖ. అందుచేతనే చిత్రకారుఁడు రేఖలతో మనకు వస్తుదర్శన మీయగలఁడు. వస్త్రముచేత శరీరాంచలరేఖలు కప్పఁబడును. అపుడు శరీరము వస్త్రాచ్ఛాదిత మైనదని చెప్పుదుము. అంచల రేఖలు విస్పష్టముగా భాసించుచు దానిపయిన వస్త్రమున్నను వస్తువు వస్తువుగా భాసించును. కొందఱు పెట్టెలకు మాసిపోకుండఁ బైన గుడ్డలువేసి కుట్టింతురు. పెట్టె కనిపించుచునే యుండును. ఆ పెట్టె కనిపించుట లేదు. పెట్టె యని గుర్తుపట్టుటకు వీలులేదని చెప్పుటకు వీలులేదు. పురుషులు వస్త్రములు ధరించుట యీ ప్రయోజనముకొఱకు. శరీరాంచలరేఖలు భాసించకుండ ముడుతలతోఁ, గుచ్చెళ్ళతో, మడతలతో వస్త్రములను

ధరించుట పేరు వస్త్రము ధరించుట. నగ్నత లేకుండఁ జేయుట. శరీరము నంటుకొనియున్న వస్త్రము నగ్నతను రక్షించదు. అందుచేతఁ బాశ్చాత్యులు వేయు దుస్తులు నగ్నతను సరిగా రక్షించవు. అది యనాగరకమైన వేషము. భారతీయులు కుచ్చెళ్లు పెట్టుకొని కట్టెడు ధోవతి పరమనాగరకమైన వేషము.

అట్టి కుచ్చెళ్లు, నట్టి మడతలు- నేది తొలఁగినను నగ్నత భాసించును. ద్రౌపది ధరించిన చీర యామెయొక్క నగ్నతను రక్షించునదిగా నున్నది. దుశ్శాసనుఁ డొక చీర తీసిన తరువాత మఱియొక చీర యచట భాసించినచో నది తొలఁగి యిది వచ్చులోన నగ్నత భాసించును. గాలిచేతఁ జీర తొలఁగినప్పుడే వేణీసంహారమున దుర్యోధనుఁడు భానుమతీవిషయమున నాటకరంగమైన గండము నిక్షేపించు స్థలములో నూరుప్రస్తావన చేసెను. అది నగ్నత. నగ్నత రేఖామాత్రమున భాసించినను ద్రౌపదికిఁ బరాభవము జరిగినట్లే. అందుకనియే 'మున్నపనీతమైన తద్వస్త్రమ్ము నట్టి వలువ'యని చెప్పుట. నానారాగవిరాగములైన వసనము లైనచో నొలిచిన వలువకు మఱల మొలిచిన వలువకు భేద మేర్పడి నగ్నతాభ్రాంతి కలుగవచ్చును. తద్వస్త్రము నట్టివలువ యనుటచేత నొకవలువ యొలువఁబడినది లేదు. మఱియొక వలువ, తత్స్థానీయమైనది, మొలిచినట్లు లేదు. నగ్నత లేదు సరికదా నగ్నతాభ్రాంతికూడ లేదు. ఇది యాశ్చర్యకరమైన రచన. నన్నయగా రీ విషయము నంత పరమసూక్ష్మముగా విచారించి, యా మాటల నచ్చుటఁ బొదివెను. పరమేశ్వరానుగ్రహ మున్నచో నింత పరాభద్రమైన స్థితి యేర్పడుటయే. నగ్నత యనఁగా నేమి? యన్న విషయమును బహుముఖములుగా విచారించిన మహామేధాశాలి కాని యిట్లు వ్రాయలేఁడు.'' (ఆంధ్రమహాభారతోపన్యాసములు - నన్నయగారి భారతాంధ్రీకరణము (వ్యా)- పు. 6-9)

### 3. సంబుద్ధి - సంస్కృతి

''దుర్యోధనుడు ధర్మరాజుతో నెప్పుడు మాట్లాడడు. నన్నయ్యగారు వ్రాసిన భాగములో దుర్యోధనుడు ధర్మరాజుతో ద్యూతసమయమునందుతప్ప మరి యెప్పుడును మాటాడలేదు. ఈ ద్యూతసమయమున రెండుసారులే మాటాడెను. మొదటిసారి జూదమాడు మని, రెండవసారి తనబదులు తన మామయైన శకుని యాడు నని. ఈ రెండు పద్యములు చూడుడు.

''అనఘ! సుహృద్ద్యూతం బిం । దొనరింతము ప్రొద్దువోకయును నగు''

''అనఘ! మా మామ శకుని నాకై కడంగి । జూద మాడెడి నీతోడ''

మరియెచ్చటను దుర్యోధనుడు ధర్మరాజుతో మాటాడలేదు. ఈ మాటాడిన రెండుసార్లు ధర్మజుని 'అనఘా' అని సంబోధించెను. మొదటి పద్యములో సంబోధన మేదో పద్యరచన యట్లే యుండునని యనుకొన్నను రెండవపద్యములోని మొదటిసంబోధనము నన్నయ్యగారు బుద్ధిపూర్వకముగా నొక ప్రయోజన మర్థించియే యట్లు వ్రాసెనని తెలియగలదు. ఇది దుర్యోధనుడు ధర్మరాజుకు చేయుగౌరవము. వారికుటుంబములోని మర్యాద. దుర్యోధనునకు పాండవులయం దెంత మాత్సర్యమున్నను సముదాచారము నుల్లంఘించడు. పైన నతనికి ధర్మరాజునందు మిక్కిలి గౌరవము.

ఇట్లు రెండు సంబోధనలచేత నొక విచిత్రమైన నాగరకతయు, సముదాచారమును, కుటుంబమర్యాదయు, దుర్యోధనుని శీలములోని యొకయంశమును రహస్యముగా గుప్తపరచి లోనారసి తెలియఁదగిన శిల్పమును నన్నయ్యగారు ప్రదర్శించిరి.'' (నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి - పు. 135-136).

### 4. అన్నగారి అదుపు - అంతరార్థం

భీముడు దుశ్శాసనుడినీ, దుర్యోధనుడినీ భయంకరమైన యుద్ధంలో చంపుతానని రెండుప్రతిజ్ఞలు చేశాడు. 1.''కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్...... ఉర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్'' (సభా.2.233); ''ధారుణిరాజ్యసంపదమదంబున.... మదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భగ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.'' (సభా. 2. 249). ఈ రెండు ప్రతిజ్ఞలు చేసినప్పుడు ధర్మజుడు కిమ్మనలేదు. ద్రౌపది వరాలరూపంగా రాజ్యాన్ని ధృతరాష్ట్రుడినుండి తిరిగి పొందినప్పుడు భీముడు సతి కారణంగా వచ్చిన రాజ్యాన్ని అంగీకరించటానికి

అసమ్మతిని తెలిపి, శత్రువులను ఉగ్రరణంలో జయించి రాజ్యాన్ని పొందుతా నని ఆగ్రహించాడు. అప్పుడు ధర్మజుడు చేయెత్తి సైగజేసి భీముడిని అదుపులో పెట్టాడు. పైరెండు ప్రతిజ్ఞలకు స్పందించని ధర్మజుడు మూడవసారి ఎందుకు వారించాడు? అన్నప్రశ్నకు విలువైన వ్యాఖ్యానం చేశారు విశ్వనాథవారు-

1. "మొదటిసారి ప్రతిజ్ఞలు చేసినపుడు భీముడు యుద్ధమున కింత సిద్ధపడలేదు. దుర్యోధనుని తొడలు విరుగఁ గొట్టెదనని యాయుధమ్ము లున్న వలనికి దృష్టులు సలుపుచు నగ్రజుమొగంబు చూచెను. అప్పుడు భీష్మ విదుర ద్రోణాదు లాపిరి. మొదటిసారి ప్రతిజ్ఞచేసి యూరకుండెను. ధృతరాష్ట్రుడు రాజ్యమిచ్చినతర్వాత, కౌరవులను చంపుదు నని వాచ్యముగా చెప్పెను. ఈ మూఁడు భేదములు చమత్కారముగా నున్నవి. మనకు చూచినచో ద్రౌపది వస్త్రము లొలుచుట మిక్కిలి దుర్భరము. తన తొడమీఁదఁ గూర్చుండ రమ్మనుట దానికంటె తక్కువది. ద్రౌపదివలన రాజ్యము మరల వచ్చుట తత్పూర్వము గల రెంటికంటె తక్కువది. కాని భీము డొకదానికంటె నొకదానికి నుత్తరోత్తర మధికాధిక కోపము పొందుచున్నట్లు కాన్పించుచున్నాడు. అతని కోప ముత్తరోత్తర బలీయ మని చెప్పుటకు గారణము? మొదటిసారి ప్రతిజ్ఞచేసి యూరకుండెను. రెండవ ప్రతిజ్ఞచేసి యాయుధాగారమువంకఁ జూచెను. మూఁడవసారి వాచ్యముగా చెప్పి వెంటనే యుద్ధము చేయుటకు బయలుదేరఁ బోవుచుండెను. ఇవి కారణములు. మొదటిసారి తాను ప్రతిజ్ఞ చేసెనుగాని వెంటనే కౌరవులను చంపు నూహ వెలిపరుచనే లేదు. అప్పు డతని కా యూహ లేదు. ఆ యూహ రెండవసారి కలిగెను. దానిని భీష్మ ద్రోణ విదురులు వారించినమాత్రతో సరిపోయినది. మూడవది అన్నగారే వారించెను. చేయి వలదన్నట్లు పై కెత్తెను. ధర్మరాజు చేసిన దింతమాత్రమే. తొడలు విరుగ గొట్టెద నన్నప్పు డన్నగారి యంగీకార మున్నదో లేదో యని తెలిసికొనుట కతనివంక చూచుచుండెను. శత్రువు లంతటి యపకృతి చేసినప్పుడు, తన కంతటి కోపము వచ్చినపు డన్నగా రంగీకరించునా లేదా యన్న విచారణ విచిత్రముగా నున్నది. ఆ యన్న యదుపెట్టిదో? అతని నాయకత్వ మెట్టిదో? ఈ తమ్ముల యనుయాయిత్వ మెట్టిదో? మనసు పట్టని యొక శైష్యోపాధ్యాయిక వ్యంగ్యమగుచున్నది."

2. "ఇప్పు డీ మూఁడు పరిస్థితులలో నుత్తరోత్తర మధికాధిక మగుటకు కారణ మేమి?

మొదటిది జంతుత్వమాత్రసంబంధ మయినది; రెండవది నరత్వ సంబంధ మయినది. మూఁడవది స్త్రీసంబంధమయిన మరల రాజ్యము సమకూరుట వట్టి ధర్మవిషయము. పాండవులు ధర్మనిష్ఠులు. ధర్మముమీఁద నాధారపడి మోక్షమున్నది. తా నార్జించిన విత్త ముత్తమము, పిత్రార్జితము మధ్యమము, భ్రాతృవిత్త మధమము, స్త్రీవిత్త మధమాధమము. అందుచేత భీముడు మిక్కిలియు కోపించెను. ధర్మరాజు వారించెను.

ద్రౌపదీసంపాదిత మయిన రాజ్యానుభూతియందు ధర్మరాజునకుమాత్ర మీ యధమాధమబుద్ధి లేదా? ఎందుకు వారించెను? ధర్మజునియొక్క ధర్మస్వరూపము చాల నిగూఢ మయినది. ధృతరాష్ట్రుఁ డిచ్చుటచేత రాజ్య మిప్పుడు వచ్చినది. పాండవులకు మరల స్వాతంత్ర్యము వచ్చినది. తత్పూర్వమునందు తమమీఁద తమకు, తమ యాయుధములమీఁద తమకు తమ వర్మవరూథమ్ములమీఁద తమకు నధికారము లేదు. అందుకనియే ద్రౌపది యడిగిన రెండవవరము.

క. "నెమ్మిని ధర్మజు నలువురు
తమ్ములుఁ దమయాయుధములఁ దమవర్మవరూ
ధమ్ములయుఁదోడ సకలహి
తమ్ముగఁ బాయంగవలయు దాస్యమువలనన్." **(సభా. 2.261)**

అని యున్నది. అందుచేత నిప్పటి భీముని పౌరుషము, ఆయుధప్రయోగము చేయగల సామర్థ్యముకూడ స్త్రీవిత్తముక్రింద లెక్కగట్టబడవలయును. రాజ్యసంపద ననుభవించుటకు స్త్రీవిత్తదోష మెంత యున్నదో తమ పరాక్రమము ప్రకటించుటకు స్త్రీ ప్రసాదకృతసామర్థ్య మను దోస మంతియే యున్నది. ఇందుచేత ధర్మజుడు కరతలమ్మున వారించెను. తొడలు విరుగ గొట్టెద నన్నప్పుడు పరాక్రమము ప్రదర్శించుటకు వీలే లేదు. అందుచేత ధర్మరా జతనివంకనే చూడలేదు. ఇవి నన్నయ్యగారి రచనాంతర్నిగూఢమహార్థములు." (నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి- పుట. 155-159).

## నన్నయకథాకథనశిల్పం

### 1. కార్యకారణపద్ధతి

కథ చెప్పటంలో రెండు పద్ధతులు ప్రసిద్ధం. 1. కాలక్రమపద్ధతి నాశ్రయించి చెప్పటం. 2. కార్యకారణపద్ధతి నాశ్రయించి చెప్పటం. ఈరెండు పద్ధతులు సందర్భాన్నిబట్టి శిల్పసుందరంగా శోభిల్లుతుంటాయి. అయితే మొదటిపద్ధతిలోకంటె రెండవ దానిలో ఉత్కంఠ, భావనం, పూర్వాపరసమన్వయం అనే గుణాలు ఆసక్తిదాయకంగా రాణిస్తాయి. సభాపర్వంలో సహజంగా కొంతకథ కార్యకారణసంబద్ధంగా చెప్పబడింది. ముఖ్యంగా- ధర్మజరాజసూయఘట్టం.

ఇందులో విశేషమేమంటే - ప్రథమాశ్వాసమంతా రాజసూయయాగం చేయటం ఫలంగా సాగే కార్యచైతన్యాన్ని ఉజ్జ్వలంగా వివరంగా వర్ణిస్తుంది. కాని, చివరకు రాజసూయయాగవర్ణనం అయిదారు పద్యాలలో ముగించివేస్తుంది. పఠిత ఈ సంగ్రహ రచనకు అసంతృప్తి చెందుతాడు. వివరాలు చెపితే బాగుండేది అనుకుంటాడు. ముందు వివరాలు తెలుస్తాయేమో అని ఒక ఆసక్తి కలిగిస్తూ ఆశ్వాసాన్ని ఆపటం నన్నయకథాకథనంలో ఒక శిల్పం. రెండోఆశ్వాసంలో పఠిత (శ్రోత) కోరే వివరాలన్నీ దుర్యోధనుడిచేత చెప్పించడం గమనిస్తే ఆశ్చర్యం వేస్తుంది. శత్రువులకు అసూయ పుట్టేటంత వైభవంగా రాజసూయం జరిగిందనే వస్తుధ్వని అందులో ఉన్నది. ధర్మరాజు రాజసూయ వైభవాన్ని కన్నులతో చూడలేని ధృతరాష్ట్రుడికి మనసుకు రూపుకట్టేటట్లు వర్ణించిచెప్పటం విశేషం. దానివలన కథలో పునరుక్తి తొలగి ఆసక్తి పెరిగింది.

ఇటువంటివే మరికొన్ని అంశాలు సభాపర్వకథాకథనశిల్పానికి వన్నె తెచ్చిపెట్టాయి. మచ్చుకు జరాసంధ శిశుపాలుర జన్మవృత్తాంతాలను వారివారి వధలకు ఉపబలకంగా చెప్పటం, వాటివలన శ్రీకృష్ణభీష్ముల వర్తనాలలోని లోతులను శ్రోతలు లోనారసి గ్రహించే గాఢత సాధించబడింది.

### 2. సమన్వయసూత్రం

ప్రతిపర్వంలోనూ ఆ యా కథార్థాలను సమన్వయించుకొనటానికి కొన్ని కీలకమైన సమన్వయ సూత్రాలను అందించటం కథాకథనంలో కనపడే ఒక ప్రౌఢశిల్పం.

క. "నయనములు నాకుఁ, బవనత
నయవిజయులు, మనము కమలనాభుఁడు, వీరిం
బ్రియహితులఁ బాసి నిమిషం
బయినను నెట్లుండ నేర్తు నవిచేష్టుఁడనై". **(సభా. 1.169)**

అని ధర్మరాజు అనుకొంటాడు. ధర్మరాజు మూర్తికట్టిన ధర్మం. ఆ ధర్మానికి రెండు కళ్ళు భీమార్జునులు, అంటే ప్రవృత్తి నివృత్తులు, పురుషార్థపరార్థాలు. మానుష దైవీశక్తులు. మనసు శ్రీకృష్ణుడు. అతడు ధర్మతత్త్వస్వరూపుడు. కన్నులు చూస్తాయి. మనసు భావిస్తుంది. అనుభవిస్తుంది. మనస్సునుకూడా నేత్రంగా చెప్పటం ప్రసిద్ధి. మనోనేత్రం భౌతికనేత్రాలకంటె బలమైనది. అది తత్త్వాన్ని దర్శించగలుగుతుంది. కన్నులది వాస్తవజ్ఞానం, మనస్సుది తత్త్వదర్శనం. సభాపర్వకథార్థాలను ఈ దృష్టితో అర్థం చేసికొంటే ధర్మానికి మూడోకన్ను దైవం. ఇహపరాలు ఉభయనేత్రాలు. రాజసూయం చేసే ధర్మమూర్తిని విజయమూర్తిగా చేసినవి భీమార్జునుల భుజశౌర్యబలం, శ్రీకృష్ణుడి బుద్ధిబలం. అయినా వీరు ధర్మజుడికి సహాయకులే. నాయకుడికి అనునాయక, ఉపనాయకప్రాయులే అనే తాత్పర్యం గ్రాహ్యం. ఈ తాత్పర్యాన్ని శ్రీకృష్ణుడే వ్యాఖ్యానించి చెప్పాడు.

క. "బలిమిమెయిఁ బార్థురక్షా
బలమును బవనసుతుబాహుబలమును నా ని
ర్మలనీతిబలము నీకుం
గలుగ నసాధ్యంబు గలదె కౌరవనాథా!" **(సభా. 1. 163)**

రక్షాకవచమైన అర్జునుడు దైవీశక్తిని ధర్మరాజుకు కవచంగా అమర్చే బలం. నరు డెక్కడుంటే అక్కడ నారాయణుడు. వారిద్దరు కలిసి ఎక్కడుంటే అక్కడ శ్రీవిజయం. అర్జునుడు అస్త్రశస్త్రాలను, దేవతలవరాలను పొందుతూ దివ్యశక్తులను తనలో సమీకరించుకొంటూ సాగే నిరంతరసాధకుడు. భీముడు జన్మసిద్ధంగా వచ్చిన వజ్రకాయంతో స్థిరమైన దేహబలంతో సిద్ధుడు. కృష్ణుడు బుద్ధిబలానికి ప్రతినిధి. పై రెండింటికి పరిమితు లున్నాయి. నిర్మలనీతికి నియతి లేదు, హద్దులు లేవు. ఈ మూడింటిని సంగమించుకొనిన త్రేతాగ్ని ధర్మజుడు. శ్రీకృష్ణ డనే మూడోకన్ను తెరిస్తే, నీతిబలాన్ని సారిస్తే ధర్మమూర్తి అయిన ధర్మరాజు త్రినేత్రుడు కాగల డని ధ్వని. భీమార్జునకృష్ణులు ధర్మజుడి భౌతికసంపద కాదు. సహజమైన అక్షయసంపద. దిగ్విజయంవలన పొందిన సిరి అనిత్యం, కాని, ఆ సహజసంపదమాత్రం ఎవరూ అపహరించలేనిది.

### 3. ప్రశంసలు : ప్రయోజనాలు

సభాపర్వంలో నాయకుడైన ధర్మజుడు ప్రతినాయకుడైన దుర్యోధనుడి కపటోపాయంచేత వంచితుడై రాజ్యసంపదలను కోల్పోయి అవమానాలకు లోనై అడవుల పాలవుతాడు. అయినా ప్రతినాయక ప్రశంసలు మాత్రం అతడి నాయకత్వానికి గౌరవచిహ్నాలై రాజిల్లుతూ ఉంటాయి. దుర్యోధనుడు రాజసూయయాగ మహత్త్వాన్ని విస్తృతంగా - అసహనంతో నైనా - కీర్తించి ధర్మజుడి ఉత్తమ నాయకత్వాన్ని ఉన్మీలింపచేశాడు. ఆ వర్ణనమంతా ఒకయెత్తు; ధర్మజుడు రాజసూయాంతంలో అవభృథస్నాతుడై సమ్రాట్టుగా శోభిల్లిన సన్నివేశవర్ణనం మరొక యెత్తు.

సీ. అభిషిక్తుఁడయిన యయ్యమరాజసుతునకు । సాత్యకి మౌక్తికచ్ఛత్ర మొప్పఁ
బట్టె; భీముండును బార్థుండు మణిహేమ । దండచామరయుగధారు లయిరి;
కమలనాభుండును గవలును ద్రుపదేశ । పుత్త్రుండు వేర్వేఱ భూమిపతుల
మూర్ధాభిషిక్తుల మ్రొక్కించుచుండిరి । దర్పంబు వెలయంగ; దానిఁ జూచి

ఆ. యేను మొదలుగా మహీపతు లెల్లను । దీప్తి దఱిఁగి యుండఁ దివిరి మమ్ము
నగిరి కృష్ణపాండునందన ద్రౌపదీ । సాత్యకులుఁ గరంబు సంతసమున." **(సభా. 2. 119)**

భారతంలో కురుసామ్రాజ్యపట్టాభిషేకగౌరవం ధర్మజుడికి తప్ప దుర్యోధనుడి కుండ దని ఈపద్యంలోని వస్తుధ్వని.

ఉ. "భూవిదితప్రతాపపరిభూతవిపక్షుఁడు సవ్యసాచి గాం
డీవము గొన్న, భీముఁడు వడిన్ గద గొన్నఁ, గవల్ కృపాణచ
ర్మావరణాదిభాసితమహాభుజవిక్రములైన వారలన్
లావె రణంబులో మన కలంఘ్యబలాఢ్యుల నింక నోర్వఁగన్." **(సభా. 2. 273)**

ఈ పద్యం అనుద్యూతానికి అనువుగా దుర్యోధనుడు ధృతరాష్ట్రుడితో చెప్పిన ముందుమాట! ఏమైనా - ప్రతినాయకుడి అంతరంగంలోని అసలైన మాట! అంతేకాదు కురుక్షేత్రయుద్ధంలో కాబోయే నిజమైన మాట!

కథలో ప్రతినాయకుడిచేత నాయకవర్గాన్ని ప్రశంసింపచేసే వాక్యాలు స్థాయిభావపోషకాలై రాణించటం కథాశిల్పరహస్యం. ఇటువంటివి మరెన్నో!

### సహానుభూతి : సానుభూతి

కావ్యంలోని పాత్రలు వారి వారి స్వభావాలనుబట్టి సహృదయులలో మూడు రకాలైన అనుభవాలను కలిగిస్తూ ఉంటారు. వాటిని ఈ విధంగా వివేచించవచ్చును. 1.ఆదర్శపాత్రలలో కాని, ధర్మబద్ధమైన ప్రవర్తన కలిగిన పాత్రలలో కాని, ధర్మబద్ధమైన ఏ కావ్యంలోనైనా ఉత్కటభావస్థితి ప్రదర్శించే పాత్రలలో కాని సహృదయులు తాదాత్మ్యాన్ని పొంది,

సాధారణీకరణంవలన వారి భావాలే తమ భావాలుగా చర్వణంచేసి రసానందాన్ని అనుభవిస్తారు. దీనిని సహానుభూతి అంటారు. 2.ఉదాత్తగుణసమన్వితులై కూడా ఏదో ఒక లోపంవలన కాని, బలమైన విధివలనగాని, అపజయానికి- ఒక్కొకసారి మరణానికి - గురిఅయ్యే పాత్రలు పఠితలనుండి తమపట్ల సానుభూతిని సాధించుకొంటారు. పాశ్చాత్య రూపకాలలో విషాదాంత పాత్రల స్వరూపం కూడా ఇటువంటిదే. 3.అధర్మబద్ధమైన ప్రవృత్తి కలిగిన దుష్టపాత్రల ప్రవృత్తులు పఠితలలో సహానుభూతిని గాని, సానుభూతిని గాని కలిగించకపోగా ప్రతికూలస్పందనను కలిగిస్తాయి. ఆ ప్రతికూలస్పందనలు ఉదాత్తపాత్రలపట్ల కలిగే సహానుభూతి, సానుభూతులకు బలాన్ని చేకూరుస్తాయి. ఈ రసానుభవసూత్రాన్ని దృష్టిలో ఉంచుకొని సభాపర్వ కథార్థాలు కలిగించే అనుభవాలను విశ్లేషించుకొంటే అవి అంత ఆసక్తిదాయకంగా ఎందుకు ఉన్నాయో తేటపడుతుంది.

## ప్రథమాశ్వాసంలో సహానుభూతి : ద్వితీయాశ్వాసంలో సానుభూతి

ధర్మజుడు పాండురాజుహితం కోరి, రాజుల ప్రజల బాగునుకోరి రాజసూయం నిర్వహించటంలో ధర్మబద్ధమైన యుద్ధవీరాన్ని సహానుభూతిగా సహృదయుడు సభాపర్వ ప్రథమాశ్వాసంలో పొందుతాడు. జరాసంధవధలో జరాసంధుడు ప్రతినాయకప్రాయుడు. మూర్ధాభిషిక్తులను భైరవపూజలో బలిచేసే క్రూరకర్మ అతడిలో గల దోషం. దానివలన అతడు అపారబలపరాక్రమాలు కలిగి ఉన్నా పఠితకు సహానుభూతిని గాని, సానుభూతిని గాని కలిగించలేకపోయాడు. పైపెచ్చు పఠితల ప్రతికూలస్పందనకు గురిఅయ్యాడు. అట్లా కావటానికి శ్రీకృష్ణుడి అధిక్షేపణలు ఎంతగానో తోడ్పడతాయి. జరాసంధవధ చేసిన భీమాదుల కృత్యాలు ధర్మసమ్మతాలు కావటంచేత పఠితలు వారితో సహానుభూతి పొందుతారు.

వీరరసం ధర్మమూలం. ధర్మార్థకామాలను ధర్మబద్ధంగా సాధించే ఉత్కటోత్సాహమే వీరం. ''తతోఽర్థకామయో ర్ధర్మ మూలకత్వాత్ ధర్మప్రధానో వీరః'' అని అభినవగుప్తపాదులు. కాబట్టి ధర్మవిరుద్ధమైన ఉత్సాహం వీరానికి స్థాయి కాలేదు. అది వీరరసంగా సహృదయులచేత సహానుభూతితో అనుభవించబడలేదు.

సభాపర్వ ప్రథమాశ్వాసంలో ధర్మజుడి రాజసూయ ప్రయత్నమంతా ధర్మప్రధానం కావటంచేత వీరరసానుభవాన్ని సాంద్రంగా సహృదయుల కందిస్తుంది. ఇక ద్వితీయాశ్వాసంలో ధర్మజునిప్రవర్తనం మాయాద్యూతఘట్టంలో సహృదయుల సహానుభూతిని కోల్పోయి సానుభూతినిమాత్రం పొందే స్థితికి రావటం అనుభవసత్యం.

ధర్మరాజు తెలిసి తెలిసి కపటద్యూతంలో పాల్గొని వంచనకు గురిఅయి తన సంపదనంతా ఓడిపోవటం చదువుతూ ఉంటే ఆ పాత్రలో మనకు తాదాత్మ్యం కలుగదు. అట్లని ప్రతికూలస్పందనకూడా కలుగదు. అంతటి నిర్మలచరిత్రుడు ద్యూతవ్యసనం అనే బలహీనతకు లొంగి, 'బలవద్ద్యూతార్థముగాఁ బిలువంబడి మగుడ నగునె?' అనే ధర్మాన్ని చూపిస్తూ తనచర్యను బలపరచుకొంటూ అనుద్యూతంలోకూడా ఓడిపోవటాన్ని పఠిత ఆదర్శవర్తనగా గ్రహించడు. భీము డన్నట్లుగా అతడి చేతులు కాల్చదగిన వని ప్రతికూలస్పందన పొందడు. అర్జును డన్నట్లుగా ఉత్తమక్షత్రియ సంప్రదాయాన్ని నిలుపుతున్నాడని ధర్మరాజును మెచ్చుకొనలేడు. కాని, ''విధినియుక్తుఁడయి'' (2.157) ''విధినియోగంబు నతిక్రమించలేక'' ధర్మరాజు జూదానికి దిగవలసి వచ్చిందనీ, తత్ఫలాన్ని అనుభవించవలసి వచ్చిందనీ జాలి పొంది అతని పట్ల సానుభూతిని ప్రకటిస్తాడు. కాబట్టి అడవులకు పోతున్నా పాండవులు పాఠకుల సహానుభూతిని పొందరు. సానుభూతిని పొందుతారు. పాఠకులు విషాదపాత్రల స్వభావాన్ని వారిలో దర్శించగలుగుతారు. ఈ విధంగా- సహృదయులు కథార్థాలలో సహానుభూతిని, సానుభూతిని పొందే రెండుమార్గాలకు సభాపర్వపూర్వోత్తరార్థాలు రంగస్థలాలైన వన్నమాట!

సభాపర్వంలో ధీరోద్ధతులైన జరాసంధ, శిశుపాల, దుర్యోధనుల అధర్మబద్ధమైన అర్థప్రవృత్తులు ధర్మజాదుల ధర్మవీరప్రవృత్తులకు వ్యతిరేకవైఖరితో పోషకంగా నిలవటం గమనార్హం. జరాసంధ శిశుపాల దుర్యోధనులు అర్థపురుషార్థసాధకులు, అందువలన ఉద్ధతులు. వారి నాశ్రయించుకొని ఉన్న రసం రౌద్రం. క్రోధం దానికి స్థాయిభావం. 'శత్రుకృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః' అని ప్రతాపరుద్రయశోభూషణం. ఇది జరాసంధుడియందుకంటె శిశుపాలుడిలో, అంతకంటె దుర్యోధనుడిలో పరిపూర్ణతను సాధించింది. కారణం- మొదటిరెండూ ఉపకథలు, మూడవది ప్రధానకథ కావటమే.

అర్థ కామాలను ధర్మంతో ముడిపెట్టినవాడు ధర్మజుడు. అర్థకామాలనుండి ధర్మాన్ని దూరం చేసినవాడు దుర్యోధనుడు. త్రివర్గాలను సేవించేవిధం భారతంలోనే ఇట్లా చెప్పబడి ఉన్నది.

సీ. "ధర్మకామంబులు దఱుగంగ నర్థార్థి । యగువాఁడు పతితుఁడౌ, నర్థసేవ
నర్థార్థముగఁ జేయునతఁ డుగ్రవనములో । గోరక్ష సేయు నక్కుమతిఁబోలు,
నర్థధర్మములకు హానిగాఁ గామార్థి । యగు నాతఁ డల్పజలాశయమున
జలచరం బెట్టు లజ్జలములతోఁ జెడు । నట్లు కామంబుతో హానిఁ బొందు

ఆ. నర్థధర్మములు మహాబ్ధిమేఘము లట్టు । లుభయమును పరస్పరోదయమ్మ
లిట్లుగాఁ ద్రివర్గ మెఱిఁగి సామ్యమున సే । వించువాఁడు సర్వవిత్తముండు". **(అరణ్య. 1. 245)**

దీనినిబట్టి గమనిస్తే దుర్యోధనుడు - ధర్మకామాలను కాదని అర్థాన్ని కోరేవాడు కాబట్టి-పతితుడు. అసూయాగ్రస్తుడై పాండవధనాన్ని మాయోపాయంతో అపహరించబూనిన అతడిపట్ల, అతడికి సహకారులుగా వర్తించినవారిపట్ల పఠితల సానుభూతి ఉండకపోగా ప్రతికూలస్పందన బలంగా ఉంటుంది. వారిని దుష్టపాత్రలుగా భావించి గర్హిస్తారు. సభాసదులు ధృతరాష్ట్రుడినీ, అతని పుత్రులనూ గర్హించినట్లు నన్నయ అనేకసార్లు వర్ణించడం కథార్థాలలో సహృదయ ప్రతికూలస్పందనలకు అనుస్పందనలను అనుసంధించటానికే. అందువలన కపటద్యూతంలో ఓడినా, ధర్మజుడు సానుభూతితో తన ఔదాత్త్యాన్నీ, ఔన్నత్యాన్నీ నిలువబెట్టుకొని, భావికథలో పఠితల సహానుభూతిని పొందటానికి వీలుకలిగించుకొన్నాడు.

అధర్మమూలమైన రౌద్రం దుర్యోధనాదులదైతే, ధర్మబద్ధమైన రౌద్రం భీముడిది, అతడి భీషణప్రతిజ్ఞలన్నీ సహృదయుల సహానుభూతిని పొందగలగటం విశేషం. పఠితలకు ధర్మజుడిపై సానుభూతి, భీముడిపట్ల సహానుభూతి. విదురవికర్ణుల ధర్మసంభాషణలవలె ఆదర్శాలుగా ఉండక పోవచ్చును. కాని, భీముడి ప్రతిజ్ఞలు అధర్మానికి ప్రతిగా తీవ్రంగా స్పందిస్తున్న ధర్మచైతన్యంగా పఠితలు భావిస్తారు. అక్కడక్కడ శ్రుతిమించి ధర్మజుడిని నిందించినా సహిస్తారు. అర్జునుడి హితబోధతో అతడు తన స్వల్పదోషాలను సరిదిద్దుకొనే సత్పురుష ప్రవృత్తిని ప్రకటించటంచేత భీముడు పాండవపాత్రలందరిలో ప్రశంసాపాత్రుడౌతాడు. అతడి ప్రతిజ్ఞలకు మారుగా దుర్యోధనాదులలో, చివరకు దుర్యోధనుడిని అంతగా బుజాన వేసికొని మోసే కర్ణుడుకూడ, మారుపల్కలేకపోవటం, ధర్మబద్ధమైన రౌద్రరసస్థితిని తెలుపుతున్నది. ధర్మజుడు భీముడిని ప్రతిజ్ఞలు చేయకుండా వారించకపోవటం గమనార్హం. ధర్మజుడి మనసే భీముడుగా పలుకుతున్నట్లు పఠితలు భావిస్తారు. అందువలననే ధర్మజధర్మ ప్రవృత్తికి పోషకంగా నిలిచింది భీముడి రౌద్రోద్రేకం!

మొత్తంమీద ధర్మజుడిది స్థిరమైన ధర్మవీరం. ప్రథమాశ్వాసంలో భీమాదుల దిగ్విజయ యుద్ధవీరంతో పరిపుష్టమై రాజసూయ నిర్వహణంలో అది ద్విగుణీకృతమైనది. రెండవ ఆశ్వాసంలో ప్రతినాయక రౌద్రంచేత ధిక్కరించబడి మందీకరించబడినదైనా ధర్మజు ధర్మవీరం భీముడి రౌద్రంచేత, అర్జునుడి వీరంచేత, ద్రౌపది ధర్మవీర ప్రవర్తనచేత, శ్రీకృష్ణుడి మహత్త్వంచేత మాన్యతను పొంది సహృదయుల రసానుభూతిని చూరగొన్నది. ధర్మబద్ధమైన రౌద్రం ప్రక్కనే ధర్మవిరహితమైన రౌద్రం ఆభాసగా అనుభూతి కందుతుంది. అట్టి విశిష్టరసచిత్రం కపటద్యూతసభలో ప్రత్యక్షమౌతుంది. అందుకే సభాపర్వం అంటే వీరకావ్యరసవైవిధ్య వర్ణచిత్రంగా పండితుల నాకర్షించేది.

క. "పర్వి సభాప్రభృతిగ నవ
పర్వములను విస్తరిల్లి పండితచేతో
నిర్వృతిఁ జేయుచు రెండవ
పర్వమునా రమ్య మగు సభాపర్వ మిలన్". **(ఆది. 1.38)**

**'ఎఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని'**

తెలుగువారి నోట ఈ తేటగీతి పాదం ఒక పొడుపు కథ తోక ప్రశ్నగా ఎప్పటికీ తురంగలిస్తూ ఉంటుంది. ఇది ద్రౌపది ప్రాతికామికి వేసిన ప్రశ్న. తిరిగి ప్రాతికామి ధర్మరాజుకు వేసిన ప్రశ్న. మరల కురుసభలో ఆసాధ్వి అందరినీ అడిగిన ప్రశ్న. ఆ ప్రశ్నకు సరైన సమాధానం ఇచ్చినవారు లేరు. ఒకరిద్దరు ఇచ్చినా వాటిని పట్టించుకొన్న నాథుడు లేడు. ధర్మజుడు కిమ్మన లేదు. ధర్మమర్మం జనంమధ్యలోనే నిద్రపోయింది. ద్రౌపదికి జరుగవలసిన అవమానం జరిగిపోయింది. అసలుసంగతి వ్యాసుడైనా చెప్పినట్లు స్పష్టంగా తెలియదు. నన్నయ వ్యాసుడివలె వాచ్యం చేసేవాడు కాడు. మూలాన్ని ఒరపిడి పెట్టి తన కథామూల్యాన్ని మెరుగుపెట్టుతాడు. ఒక్కమాటలో మూటెడు కథార్థాలను గుబాళింప చేస్తాడు. అందువలన అసలువిషయం అంత తేలికగా బైటపడదు.

ఈ కథాఘట్టాన్ని చదువుతుంటే పఠితల ముందు ఎన్నో ప్రశ్నలు తలలెత్తుతాయి. వాటికి నన్నయ వాచ్యంగా సమాధానం చెప్పడు. సారమతులై లోనారసి చూడండి అంటాడు. అటువంటివాటిని కొన్నింటిని గమనిద్దాం.

**1. కపటద్యూతవ్యూహాన్ని భీష్ముడు ఎందుకు వారించలేదు?**

**సమాధానం** : భీష్ముడు దాశరాజుఎదుట సత్యవతికి పుట్టిన సంతానమే తనకు రాజుగా ఉంటాడనీ, తాను అతడి నియుక్తుడుగా ఉంటాననీ శపథం చేశాడు. అందువలన ధృతరాష్ట్రుడికి అతడు యావజ్జీవ నియోజ్యుడు. అది కారణంగా ధృతరాష్ట్రుడు రాజుగా తీసికొన్న నిర్ణయాన్ని కాదని తిరస్కరించలేడు. సలహా అడిగితే చెప్పగలడు అంతే. భీష్ముడి శపథమే అతడి మాటను చేతను కదలకుండా బంధించింది. అందువలన రాజాజ్ఞకు విరుద్ధంగా ఒక్కమాట కూడా ఈ ఘట్టంలో భీష్ముడు పలుకడు.

**2. విదురుడు పాండవులను హస్తినాపురానికి తెచ్చాడు. అడుగడుగునా ధర్మాన్ని ప్రబోధిస్తూ, అధర్మాన్ని వారిస్తూ ఉండి కూడా ఏమీ చేయలేని స్థితిలో ఎందుకు ఉండిపోయాడు?**

**సమాధానం** : విదురుడు మహామంత్రి స్థానీయుడు. రాజుకు హితవు చెప్పగలడు కాని, అతడిని బలవంతం చేయలేడు. అతడు తనమాట విననప్పటికీ చెవులలో జోరీగవలె హోరుపెట్టి చెప్పగలడు. కాని, అతడి పక్షాన తాను మాట్లాడ లేడు. రాజు నిర్లిప్తుడై తన మాటను పట్టించుకొనకపోయినా రాజుహితాన్ని కోరి రాజకుటుంబ సభ్యులకు, సభికులకు, ప్రజలకు తన మాటగా చెప్పగలడే కాని రాజుగా పలకలేడు. తనమాట కాదని రాజు తనను ఆజ్ఞాపిస్తే అతడు ఆ పని తప్పక చేయకతప్పదు. అట్లని దుర్యోధనుడు ఆజ్ఞాపిస్తే ఆచరించ నవసరం లేదు. దుర్యోధనుడు ఎన్ని నిందించినా తాను కటకట పడగలడు. తిరిగి నాలుగుమాట లనగలడు కాని, రాజు తనను నిందిస్తే, పాండవపక్షపాతి వని తూలనాడితే హస్తినాపురిని వదలిపోవలిసిందే. ఇతిహాసమైన మహాభారతంలో కురుసభలో మిత్రుడివలె (మిత్రసమ్మితంగా) హితం బోధించే ధార్మికమూర్తి విదురుడు. అతడి మాటను పాటించనివారు వారి పాపాన వారే పోతారు.

**3. పాచికలాడి పాండవ సంపదలను అవలీలగా హరిస్తానని అంత ధీమాగా శకుని ప్రకటించటంలో గల రహస్య మేమై ఉంటుంది?**

**సమాధానం** : పాండవులను పరాక్రమంతో దుర్యోధనుడు జయించలేడు కాబట్టి కపటోపాయంతో రాజ్యసంపదను అపహరించటం తప్ప మరొక మార్గం లేదు. ధర్మరాజులో జూదమాడే వ్యసనం చంద్రుడిలోని మచ్చ వలె నిలిచి ఉన్నది. అయితే అది అధర్మం కాదు. క్షత్రియులు వ్యసనపరులై వేటనూ, జూదాన్నీ అప్పుడప్పుడూ ఆడుతూ ఉంటారు. సుహృద్ద్యూతం దేవతలాడే ఆట అని ఒక ప్రతీతి ఉన్నది. ధర్మంగా జూదమాడితే యజ్ఞంచేసిన పుణ్య మనే భావం కూడా ప్రచారంలో ఉన్నది. పైపెచ్చు ఎవరైనా సుహృద్ద్యూతానికి పిలిస్తే జూదరి రానననటం ఆ ఆటగాళ్ళు పాటించే మర్యాద కాదు. ధర్మజుడు మర్యాదను పాటించే ధార్మికుడు. హాస్యానికికూడా అబద్ధమాడడు. అధిక్షేపంలోకూడా అన్యాయం చేయడు. అందువలన దుర్యోధనుడు

ధర్మరాజును సుహృద్ద్యూతానికి పిలిచి కపటద్యూతం మొదలుపెట్టినా - ముగ్గులోకి దిగిన తర్వాత మొగం తప్పుకోలేడు. లోకంలో జూదగాళ్ళ స్వభావం విచిత్రమైనది. పందెం ఓడిన కొద్దీ వారికి పంతం పెరుగుతూ ఉంటుంది. ఒడలు తెలియకుండా పందెములు కాస్తారు. చివరకు ఉన్నదంతా పణంగా పెట్టుతారు. చివరకు భార్యలనుకూడా ఒడ్డి ఓడిపోతారు. తనను తాను పణంగా పెట్టి ఓడిపోవటంతో ఆట ముగుస్తుంది. సాటి జూదగాళ్ళు ఓడిపోయినవాడినీ వాడి భార్యనూ వస్త్రహీనులను చేయటం, నిష్ఠురాలాడటం, పీడించటం, బాధించడం, దాసీ పనులు చేయించుకోవటం మొదలైన దుశ్చేష్టలతో అవమానాల పాలుచేస్తారు. అయినా ఓడినవారు కిమ్మనక చూస్తూ కూర్చుండవలసిందే. ఇవన్నీ ద్యూతలోకంలో సర్వసామాన్యాలే. ఇటువంటి వివరాలు ఋగ్వేదంలోని అక్షసూక్తంలో వివరించబడి ఉన్నాయి. (ఋగ్వేదం. మం10, అ 3, సూ. 32-33). శకుని కపటద్యూతపరుడు. అతని ద్యూతలోకంలో ఇదంతా ఆక్రీడకు సంబంధించిన సంస్కృతి. కపటం తెలియని ధర్మరాజుయొక్క జూదవ్యసనాన్ని, అతని ధార్మికవర్తనాన్నీ గుర్తించి కొల్లగొట్టాలని వ్యూహం పన్నాడు. ధర్మరాజును పిలిస్తే అతడు రాక తప్పదు. వస్తే ఆడక తప్పదు. ఆడితే ఓడక తప్పదు. ఓడితే పైనచెప్పిన జూదరుల మర్యాదలతో అతడిని అతని భార్యను తమ్ములను అవమానించటానికి అవకాశం దొరుకుతుంది. వస్త్రాపహరణం ఓడినవారికి గెలిచినవారు చేసే ద్యూతావమానక్రీడ. అందువలననే పాండవుల వస్త్రాలను, ద్రౌపది వస్త్రాలను అపహరించుమని దుర్యోధనుడు దుశ్శాసనుడిని ఆజ్ఞాపించాడు. ఆ ద్యూతావమాన క్రీడలలో వస్త్రాపహరణం ఉత్కృష్టదశగా నిలిచింది. దీన్ని గమనిస్తే శకునివ్యూహం సందు లేనిది. తిరుగు లేనిది.

**4. 'మున్ను తన్నోడి ఆపై న న్నోడెనా? నన్ను మున్నోడి విభుడు ఆ మీద త న్నోడెనా? - ఈ ప్రశ్నలో ఉన్న కిటుకు ఏమిటి? మెలిక ఏమిటి?**

**సమాధానం** : శకునితో జూదమాడుతూ ధర్మరాజు క్రమంగా తన తమ్ములనూ చివరకు తననూ పణాలుగా పెట్టి ఓడిపోయాడు. నన్నయరచనలో ధర్మరాజు తమ్ముల నోడినట్లే తానూ ఓడినట్లు చెప్పబడి ఉన్నది. వ్యాసు డీ ఘట్టంలో - జూదమాడుతున్నప్పుడు జూదరులు ఆటలో ఒక్కొక్క పందెం వేసేటప్పుడు ఏయే మాటలంటూ ఆడారో వాటిని ఆయా సందర్భాలలో వివరంగా చెప్పాడు. అందులో ధర్మజుడు తమ్ములలో ఒక్కొకడిని పణంగా పెట్టి ఓడినప్పుడు - 'ఇతడిని పణంగా పెట్టి ఆడుతున్నాను' అని అనేవాడు శకుని పందెం వేసి 'నీవు దీనిని ఓడావు' అని పలికేవాడు. అయితే ధర్మజుడు తనను తాను పణంగా పెట్టుకొన్నప్పుడు మాత్రం మాట మార్చి ఇట్లా అన్నాడు.

శ్లో. "అహం విశిష్టః సర్వేషాం భ్రాతౄణాం దయిత స్తథా
కుర్యామస్తే జితాః కర్మ స్వయ మాత్మన్యుపప్లవే." **(సం. సభా. 58. 27)**

నా సోదరులలో నేను విశిష్టుడను, సోదరులకు ప్రీతిపాత్రుడను. జయించబడితే జితదాసుడి వలె స్వయంగా పనిచేస్తా నన్నాడు. కాని, నన్ను నేను పణంగా ఒడ్డి ఆడుతున్నానని మామూలుగా చెప్పలేదు. శకుని మాత్రం ధర్మజుడు తనను తాను పణంగా పెట్టి ఓడినట్లే ప్రకటించాడు. కాని, ధర్మజుడు తాను పణంగా ఓడలేదని, ఓడితే దాసుడిగా ఉండటానికి అంగీకరించాడనీ తలంచి ఉండవచ్చును. శకుని ఈ భేదాన్ని గుర్తించకుండా వ్యవహరించాడు. ఏమైనా ధర్మజుడియందు దాసత్వం మాత్రం ఏర్పడింది. దానిచేత యజమాని ఏమి చెపితే అది చేయటం అతడి ధర్మమైపోయింది. శకుని మాట దుర్యోధనుడి మాటే కాబట్టి వారిద్దరిమాట కాదన లేని స్థితి ఏర్పడింది. భీమాదుల కట్టి స్థితి లేదు. అందువలన వారు శపథాలు చేశారు.

శకుని ధర్మరాజును ఆ సమయంలో "ఇ ట్లేల ని న్నొడ్డి తథిప! నీకు నొండుధనము గలదు, మఱచి తెట్లు? కమలాక్షి పాంచాలకన్య నీకు ధనము కాదె?' అని అన్నాడు. ఆమాట విని ఆటమీది ఆసక్తితో తన భార్యను పణంగా పెట్టి ఒడ్డి ఓటుపడ్డాడు. అంతటితో పణం పెట్టే ధనం ధర్మరాజుదగ్గర లేకపోవటంచేత ఆట ఆగవలసి వచ్చింది. తల వంచుకొని ఖిన్నుడై ధర్మరాజు కూర్చున్నాడు. ఇది నన్నయ చెప్పిన తీరు.

వ్యాసు డిచ్చిన వైనం ఇంతకంటె వివరంగా ఉన్నది.

శకుని రువాచ - ఏత త్పాపిష్ఠ మకరోత్ యదాత్మానం పరాజితః
శిష్టే సతి ధనే రాజన్ పాప ఆత్మపరాజయః ॥

వైశంపాయన ఉవాచ - ఏవ ముక్త్వా మతాక్షస్తాన్ గ్లహే సర్వానవస్థితాన్
పరాజయ ల్లోకవీరా నాక్షేపేణ పృథక్ పృథక్ ॥

శకుని రువాచ - అస్తి వై తే ప్రియా దేవీ గ్లహ ఏకోఽపరాజితః
పణస్వ కృష్ణాం పాంచాలీం తయాత్మానం పునర్జయ ॥ (సం. సభా. 58. 29-31)

శకుని ధర్మరాజుతో 'నీ సొమ్ము మిగిలి ఉండగా నిన్ను నీ వోడటం పాపిష్ఠి కర్మ, అట్లా చేయటం పాపహేతువు, అని పలుకుతూ పాండవులందరూ పరాజితు లైనా రని సభలో ప్రకటించాడు. ఆ తరువాత ధర్మరాజు ఓడని ధనం మరొకటి ఉన్నదనీ, అది పాంచాలి అనీ పేర్కొన్నాడు. ప్రియురాలైన కృష్ణను పణంగా పెట్టుమని ధర్మరాజును ప్రేరేపించాడు. ద్రౌపదీ పణానికి ధర్మజుడి దాస్యవిముక్తి ప్రతిపణంగా ప్రతిపాదించాడు. ఆమాటలు కొసమెరుపు ఆశలు కలిగించగా ధర్మజుడు శకుని సూచన నంగీకరించి ద్రౌపదిని పణంగా పెట్టి జూదంలో ఓడిపోయాడు.

వ్యాసుడు చెప్పిన సంభాషణ వివరాలు కొన్ని విశేషాలను బయట పెట్టుతున్నాయి. (1) ధర్మజుడు తన్ను తా నోడి దాసుడైనాడు. (2) దాసుడి సొమ్ము రెండు రకాలు. దాసుడు కాకపూర్వం సంపాదించుకొన్న ధనం. దాసుడైన తరువాత సంపాదించే ధనం. ధర్మరాజుకు ద్రౌపది ఇందులో మొదటిరకం ధనమే అవుతుంది. దానిని తానోడకపూర్వం పణంగా పెట్టినట్లైతే ఆమె యజమాని సొత్తు అయి ఉండేది. అట్లా చేయటం ధర్మరాజు అభిమతం కాదని అతడి చర్య స్పష్టం చేస్తున్నది. తమ్ములను ఓడి భార్యను ఓడక తనను తానే ఓడిన ధర్మరాజు ఉచితజ్ఞుడు. ధర్మపత్ని గౌరవప్రతిష్ఠలను కాపాడటానికి యత్నించిన ధర్మజ్ఞుడు. అందుకే ద్రౌపది నిండుసభలో తన భర్త ధర్మస్వరూపుడని కీర్తిస్తుంది. (3) ధర్మరాజుచర్యలోని ఈ మెళకువను శకుని పసికట్టాడు. ధర్మజుడితో పాటు ద్రౌపదిని కూడా దాసిని చేయాలని అతడి పన్నాగం. అందువలన ద్రౌపదిని పణంగా పెట్టుమని ధర్మజుడిని ప్రేరేపించాడు. అయితే ఇక్కడ ఒక చిక్కు ఏర్పడింది. ధర్మజుడు సహదేవనకులార్జునభీములను ఒడ్డి ఓడిపోవటంతో వారికి ద్రౌపదిమీది అధికారం పోయింది. పెద్దవాడైన ధర్మజుడియందు అది నిలిచి ఉన్నది. అతడు ఆమెను ఓడకుండా తనను ఒడ్డి ఓడిపోవటంతో ద్రౌపది స్వతంత్రురాలుగా మిగిలిపోయింది. ఆమె ధర్మరాజు దాసుడు కాకపూర్వం సంపాదించుకొన్న ధనం వంటిది కాబట్టి దాసుడైన ధర్మరాజుయొక్క యజమానికి- అంటే- దుర్యోధనుడికి ఆమె అధీనురాలు, లేదా, దాసి కాజాలదు. ఈ ధర్మసూక్ష్మాన్ని కపటోపాయంతో భేదించాలని శకుని పూనుకొన్నాడు. (4) శకునిమాట దాసుడైన ధర్మజుడికి దాటరాని గీత. అందువలన అతడి ఆజ్ఞ ప్రకారం ద్రౌపదిని పణంగా పెట్టి ఓడిపోయాడు. అందులోనూ భీమాదులను ఓడినట్లు ఓడాడు. తాను ఓడినట్లు ఓడ లేదు. ఆమె దాసి కాదు. వాక్స్వాతంత్ర్యం ఉన్నది. సభలో ప్రశ్నించవచ్చును. పరుషంగా మాట్లాడవచ్చును. ఆమె నెవ్వరు కాదనటానికి వీలు లేదు. కాని ధర్మజుడికి ఆ వెసులుబాటు లేదు. (5) శకుని ఆడిన జూదమంతా ఒకయెత్తు; ధర్మరాజుకు చివరియెత్తును (పందెం వేసే అవకాశాన్ని) కలిగింపచేయటానికి వేసిన మలియెత్తు ఒక్కటీ ఒక్కయెత్తు, అందులో ఒక మడతపేచీ ఉన్నది. భార్యను పణంగా పెట్టుమని సూచిస్తే నలమహారాజువలె ధర్మజుడు కూడ తిరస్కరించవచ్చును. అప్పుడు శకుని చేయగలిగిం దేమి లేదు. అందుకే భార్యను పణంగా పెట్టి ధర్మజుడుఓడాడని విన్నప్పుడు ద్రౌపది ఆశ్చర్యపోయింది. "ఏ యుగంబునందు నెట్టి దుష్కితవుండు, భార్య నొడ్డి యోటువడిన భర్త గలడె? ఇది వినంగఁ గడు నపూర్వం బయ్యె! ఇట్లు చేయునొక్కొ ఇందుకులుడు?' అని తల్లడిల్లిపోయింది. ధర్మజు డంతపని అంత తేలికగా చేయ డని శకునికి తెలుసు. అందుకే - ద్రౌపదిపణానికి ధర్మజుని దాస్యవిముక్తి ప్రతిపణంగా పలికాడు. ఈ యెత్తులో ఉభయపక్షాలవారికీ ద్విగుణీకృత లాభం ఉన్నది. ఎట్లాగంటే - ధర్మజుడు గెలిస్తే ద్రౌపది అతడికి దక్కుతుంది, దాసత్వం పోతుంది. శకుని గెలిస్తే ధర్మజుడు మరల దాసుడుగా మిగులుతాడు. ద్రౌపది దాసురా లౌతుంది. ద్రౌపది పణంగా పెట్టబడాలంటే ధర్మజుడు దాసుడుగా మొదట విముక్తుడు కావాలి. ఆ వెసలుబాటుకోసం శకుని ఆ ప్రతిపణం పెట్టాడు. ఆ పందెం కాయటానికి అనువుగా అతడిని దాసత్వంనుండి విముక్తుడయ్యే అవకాశాన్ని ధర్మపరంగా కలిగించాడు. ఆ దాస్యవిముక్తి ద్రౌపదిని పణంపెట్టినప్పుడే

వర్తిస్తుంది. అందులో గెలిస్తేనే సిద్ధిస్తుంది. అది అసాధారణమైన అవకాశం. దానిని ధర్మజుడు వినియోగించుకొనటానికి ముందుకు వచ్చి ఉచ్చులో పడతా డని శకుని వ్యూహం. అనుకొన్నట్లే జరిగింది. (6) ధర్మజుడు ఒకసారి ఓడి దాసుడైన తరువాత, యజమాని ఆజ్ఞకు కట్టుబడి ఉండవలసిందే. శకుని సూచనను కాదనే హక్కు ఆయనకు లేదు. అందువలన భార్యను పణంగా పెట్టాడు. అదృష్టం కలిసి వస్తే తానూ తన భార్యా ఇద్దరూ బయటపడవచ్చు ననుకొన్నాడు. ఉన్నంతలో అంతకంటె గత్యంతరం లేదు. (7) ఇక్కడ మరొక ప్రశ్న ఉదయిస్తుంది. ధర్మజుడు ద్రౌపదిని పరిపూర్ణమైన అంగీకారంతోనే పణంగా పెట్టాడా? యజమాని బలవంతాన పెట్టాడా? మరేదైనా వ్యూహంలో భాగంగా పెట్టాడా? అన్నది. ఆయనకు ఇష్టం లేదని ముందే స్పష్టం. శకుని సూచనపై చేసినదనీ, బలవంతుడైన యజమాని ఆజ్ఞను పాటిస్తున్న ధర్మంగా చేసినదని సుస్పష్టం. దానివలన ధర్మరాజు నిర్ణయం ప్రకారం కూడా ద్రౌపది ధర్మవిజిత కాదు; బలవద్ధర్మ విజిత. (8) బలవద్ధర్మవిజిత భర్త సంకల్పపూర్వకంగా ఒడ్డినప్పుడు విజితురాలైన వనితతో తుల్యురాలౌతుందా? అన్నది ధర్మ మీమాంస. ఆప్రశ్న ఎవరు అడగాలి? ఆపద్ధర్మాన్ని అంగీకరించి పణంగా పెట్టి ఓడిపోయిన ధర్మరాజు అడగలేడు. అసలు ప్రశ్నించటమే దాసధర్మం కాకపోవచ్చును. భీమాదులకు అడిగే అవకాశం లేకుండా ధర్మరాజే చేశాడు. అందుకే అతడి చేతులు కాలుస్తానని భీము డొకసారి మండిపడ్డాడు. ఇక అడుగ గలిగింది - అడుగవచ్చునా అని అనుమతిని ముందుగా ధర్మజుడిని వ్యంగ్యంగా అడగగలిగింది ద్రౌపది మాత్రమే. బలవంతంమీద పణం పెట్టుతున్నానని ధర్మజుడు చెప్పకచేసిన దోషమని వాదించే అవకాశం ఉన్నది. అంతకంటె గత్యంతరం లేక అట్లా వర్తించాడు కాని, తత్త్వతః అది మనిషిని ఇరకాటంలో పెట్టి ఇబ్బందిగా పెట్టించిన పణమని సభికులు గ్రహించారు. దానిని సభలో చెప్పి, వాదించినా బలంగా నిలబడుతుందని నమ్మకం లేదు. శకుని అందుకే పొల్లు మాట మాట్లాడలేదు. ధర్మరాజు అందుకే కాబోలు, లేదా మరెందుకో, అసలు మాట్లాడలేదు.

**5. ద్రౌపది నిండుకొలువులో అడిగిన ప్రశ్నకు సభాసదు లెవ్వరూ ఎందుకు మారుపలుక లేదు? భీష్ము డా ధర్మసూక్ష్మం ధర్మజుడికే తెలుసు నని ఎందుకు అన్నాడు?**

**సమాధానం :** ప్రాతికామి నిండుకొలువులో ధర్మరాజును ద్రౌపది వేసిన ప్రశ్ననే అడిగినప్పుడు అతడు మాట్లాడలేదు. దానికి కారణం ధర్మరాజు 'దురోదర పరాజయ దుఃఖిత చేతస్కుఁడు' కావటంగా నన్నయ పేర్కొన్నాడు. అప్పుడు దుర్యోధనుడు ప్రాతికామితో ఇట్లా అన్నాడు.

క. 'సందిగ్ధ మయినయర్థము । నిందఱసన్నిధిన యడిగి; తింద తెలియంగన్
సుందరిఁ బాంచాలేంద్రసు । తం దోడ్కొని రమ్ము పొమ్ము తడయక' ..... అని, **(సభా. 2.211)**

ఇందులో దుర్యోధనుడు ఆప్రశ్నకు సమాధానం ఇతమిత్థంగా చెప్పకుండా, సందిగ్ధమని చెప్పటం విశేషం. ప్రాతికామి ద్రౌపదివద్దకు వెళ్ళి 'దేవీ! నీ యడిగిన యర్థంబు నిర్ణయించువారయి సభ్యులు నిన్ను రాఁబనిచిరి' అని ఆమెను సభకు రమ్మని నిర్దేశించాడు. ఆమె దుర్యోధనుడి దుశ్చేష్టితానికీ, ధర్మరాజు సమ్మతానికీ భయపడి ప్రాతికామి వెంట వచ్చింది. సభలో పాండవులు ఆమె దీనస్థితిని చూడలేక తలలు వంచి కూర్చొని ఉన్నారు. ఆ సన్నివేశాన్ని చూచి అసూయాపరుడైన దుర్యోధనుడు సంతోషించాడు. కురువృద్ధుడి సమీపంలో ఉన్న ద్రౌపదిని సభామధ్యానికి తోడ్కొని రమ్మని దుశ్శాసనుణ్ణి పంపాడు. ద్రౌపది భయపడి గాంధారి చెంతకు పరుగెత్తింది. అప్పుడు దుశ్శాసనుడు ద్రౌపదితో ఇట్లా అన్నాడు- "సౌబలుండు నిన్నొడిచె దురోదరంబునఁ, గురూత్తము నర్థమ వైతి; నిన్నునుం బుడమిని దమ్ముఁ గోల్పడిరి పొల్తి! భవత్పతులైన పాండవుల్." ఆ తరువాత ఆమె శిరోజాలను పట్టి బలవంతాన సభామధ్యానికి లాగికొని వచ్చాడు. అందరూ సంభ్రమంతో ఆ దృశ్యాన్ని చూచారు. ఆమె కురువృద్ధులను సంబోధిస్తూ ఇట్లా అన్నది -

చ. "అనుపమదైవయోగహతుఁడయ్యు నవశ్యము ధర్మసంపదం
దనరున కాక ధర్మజుఁడు ధన్యుఁడు, ధర్మపథంబు తప్పఁ ద్రొ
క్కునె కురువృద్ధులార! భృశకోపనుఁ డీతఁడు నన్ను నేల దు
ర్జనుఁ డిట యీడ్చి తెచ్చె? నవిచారపరుం డయి దుర్మదంబునన్". **(సభా. 2.218)**

ఇది ద్రౌపది అడిగిన మొదటి ప్రశ్న. దానికి పెద్ద లెవ్వరూ మాట్లాడ లేదు. వికర్ణుడు లేచి 'కితవాహూతుండై వ్యసనవర్తి యయి పరాజితుం డయిన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణ ధనంబయిన పాంచాలిఁ బణంబుఁ జేసెం గావున ద్రౌపది యధర్మవిజిత; యక్కోమలి నేకవస్త్ర నిట దోడ్కొనితెచ్చుట యన్యాయంబు' అని వాదించాడు. అతని వాదనను కర్ణుడు ఖండించాడు. ధర్మరాజు సర్వస్వం ఒడ్డి ఓడినప్పుడు ద్రౌపది అతడికి వెలి కాదు కాబట్టి 'ధర్మవిజిత' అని పేర్కొన్నాడు. కాకపోతే పాండవులు మారుపలుకకుండా ఎందుకు ఉంటారు? అని దట్టించాడు. ఆమె బంధకి కాబట్టి వివస్త్రను చేసి తెచ్చినా ధర్మవిరోధం కాదన్నాడు. వికర్ణుడివాదంలో వివేకం ఉన్నది కాని ధర్మతత్త్వవిజ్ఞానం లేదు. కర్ణుడి వాదనలో దబాయింపు ఉన్నది కాని ధర్మం లేదు.

ద్రౌపదీ వస్త్రాపహరణ ప్రయత్నం సాగింది. భీముడి భీషణ ప్రతిజ్ఞ వెలువడింది. 'ద్రుపదరాజపుత్త్రి వాక్యంబులు విచారింపక వృద్ధరాజు లుపేక్షించి'రని సభాసదులు గగ్గోలు పెట్టారు. విదురుడు కల్పించుకొని సభలో అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండటం మహాపాప మని దృష్టాంతసహితంగా వివరించి "ద్రౌపదీ ప్రశ్నంబునందు ధర్మబుద్ధి సేయుం" డని సభాసదులను కోరాడు. దుర్యోధనుడివలని భయంతో సభలో ఎవ్వరూ నోరు పెకలించలేదు.

అప్పుడు ద్రౌపది ఎలుగెత్తి 'ఇపుడు నాపలుకుల కెవ్వరుఁ బ్రతివచనం బేల పలుకరైరి? ధన్యులార! యే నదాసినే, దాసినే యెఱుఁగఁజెప్పి పనుపుఁ డెల్లదాని' అని సభలోనివారి నడిగింది. అప్పుడు భీష్ముడు 'అవ్వా నీ ప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుఁడు సెప్పవలయుఁ; గానినాఁడు ధర్మసూక్ష్మత యెవ్వరికి నెఱుంగ గహనంబు; దీనిఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతురు' అని పలికి ఊరుకొన్నాడు. ధర్మజుడు ఆ ధర్మసూక్ష్మాన్ని చెప్పలేదు. అంతటితో ఆమె ప్రశ్న సమాధానం లేనిదిగా మిగిలిపోయింది. (ఆ ప్రశ్నార్థాలకూ ఆ యా సన్నివేశాలలో ఆ యా వ్యక్తుల అభిప్రాయాలకూ సంబంధం ఉన్నది కాబట్టి కొంత పునరుక్తిగా తోచినా సౌలభ్యంకొరకు ఇక్కడ వివరించటం జరిగింది.)

## పై కథాంశాలలో స్పష్టమౌతున్న అంశాలు:

1. ప్రాతికామిద్వారా ద్రౌపది అడిగిన ప్రశ్నకు ధర్మరాజు మౌనంగా ఉండిపోగా దుర్యోధనుడు 'అది సందిగ్ధమైన అర్థం' అని ప్రకటించటం గమనార్హం. అంటే అది ఎటూ చెప్పలేని సందిగ్ధమైన ధర్మ మన్నమాట. అందుకే ఎటూ వాదించటానికి భయపడ్డారు సభాసదులు. రాజసభల చరిత్రలో తన్నోడి సతినోడిన సన్నివేశం అపూర్వంగా అప్పుడు ఆసన్న మైనది. దాని ధర్మస్థితి నిరూపించటం కష్టమని దుర్యోధనుడి భావం. దానిని భీష్ముడుకూడా అంగీకరిస్తూనే ధర్మజుడు ఒక్కడుమాత్రమే దానికి తీర్పుచెప్పగల డన్నాడు. అయితే దానికి ధర్మసూక్ష్మాన్ని ఆశ్రయించాలని భీష్ముడు భావించాడు.

మూలభారతంలో భీష్ముడు ద్రౌపది ప్రశ్నించిన రెండు సందర్భాలలోనూ సమాధానం చెప్పినట్లున్నది. నన్నయ రెండవప్రశ్నకు మాత్రమే ఆతడి అభిప్రాయానికి అనుగుణమైన సమాధానం చెప్పించి ఊరుకొన్నాడు. భీష్ముడి అభిప్రాయం తెలుగులో తేటపడుతున్నా అతడు ఆలోచించిన విధానం మనకు తెలియకుండా పోయింది. మూలంలో భీష్ముడు పలికిన మాటలనుగురించి పండితులు చేసిన వ్యాఖ్యలు గమనిస్తే ఆ సమస్య ఎంత జటిలమైనదోకూడా స్పష్టమౌతుంది. మచ్చుకు డాక్టర్ మూలంపల్లి చంద్రశేఖరశర్మగారి విలువైన సమీక్ష గమనించదగింది.

"భీష్ముడు సభలోని వా రందరికిని పెద్దవాడు గావున ద్రౌపది ప్రశ్నమున కిట్లు సమాధానము జెప్పెను. అందుగూడ ధర్మతత్త్వ మిమిడియున్నది. నన్నయ యీ భాగమును వదలివేసెను. వస్త్రాపహరణానన్తరమునగూడ భీష్ముడు ద్రౌపదీ ప్రశ్నమును విచారించుట సంస్కృత భారతమున గలదు. గావున నన్నయ యా రెండవ సమాధానమునే తెనిగించి యుండును. కాని సంస్కృత భారతమున వస్త్రాపహరణమునకు ముందు భీష్ముడు చేసిన ధర్మవిచారమున కొంత వైశిష్ట్యమున్నది. ద్రౌపదికూడ "ద్రోణస్య భీష్మస్య చ నాస్తి సత్త్వం క్షత్తు స్త థైవాస్య మహాత్మనోఽపి రాజ్ఞ స్తథా హీమమధర్మ ముగ్రం నలక్షయన్తే కురువృద్ధముఖ్యాః" అని కురువృద్ధులను పేరెత్తి సత్త్వహీనులైనా రని యున్నది. కావున కురువృద్ధుడైన భీష్ముడు మొదట సమాధానము జెప్పుట యుచితము. అతడు చెప్పిన సమాధాన మిది-

శ్లో. “న ధర్మసౌక్ష్మ్య త్సుభగే వివక్తుం శక్నోమి తే ప్రశ్న మిమం యథావత్ ।
అస్వో హ్యశక్తః పణితుం పరస్వం స్త్రియశ్చ భర్తు ర్వశతాం సమీక్ష్య ॥
త్యజేత సర్వాం పృథివీం సమృద్ధాం యుధిష్ఠిరో ధర్మ మథో న జహ్యాత్ ।
ఉక్తం జితోఽస్మీతి చ పాండవేన తస్మా న్న శక్నోమి వివేక్తు మేతత్. ॥
. ద్యూతేఽద్వితీయః శకుని ర్నరేషు కున్తీసుత స్తేన నిసృష్టకామః ॥
న మన్యతే తాం నికృతిం యుధిష్ఠిరః తస్మా న్న తే ప్రశ్న మిమం బ్రవీమి”.

**(సం. సభా.60. 40-42)**

ధర్మసూక్ష్మతవలన నీ ప్రశ్నకు వివేచన మున్నది యున్నట్లుగా జేయలేకున్నాను- అని భీష్ము డనెను. ద్రౌపదికూడ “ధర్మశ్చ సూక్ష్మో నిపుణోపలక్ష్యః” అని తన నోడుటలో ధర్మసూక్ష్మ ముండు నని యొప్పుకున్నది. ద్రౌపదీ ప్రశ్న వివేచనము జేయమికి భీష్ముడు చూపిన కారణములు-

1. ధర్మజుడు తన్నోడుటచే, నస్వామియై దాసుడై, తన సోదరులకును సామ్యై పరస్వమైన ద్రౌపది నోడుటకు స్వామ్యము లేకుండుటచే ద్రౌపది యధర్మజిత యనవలసి యుండుట.

2. స్త్రీ భర్త్రధీన యగుటచేతను భర్త లోడిపోవుటవలన వారితోడి భార్యయు నోటుపడిన దగుటచే ద్రౌపది ధర్మజితయే యనవలసి యుండుట.

3. సమస్తమును వదలియు ధర్మమును వదలనట్టి ధర్మజుడే “జితోఽస్మి” యని పుంలింగైక వచన శబ్దముచే తా నొక్కడే యోడినట్లు జెప్పి ద్రౌపదియు సోదరులు ఓడబడలే దని సూచించుటచే ద్రౌపది జితయే కాదనవలసి యుండుట.

4. ద్యూతమున నద్వితీయ పరమ ప్రామాణిక విద్వాంసు డగు శకుని ద్రౌపదీ విషయ సంబంధము వదలునట్లు ధర్మజుని ప్రేరేపించి, ద్రౌపదిని ప్రత్యేక పణముగా బెట్టించుటవలనను ద్యూత మాత్మపరాజయావసానమే యగుటచే ధర్మజుని మరల ద్యూత మాడింప జేసి, ద్రౌపదిని జయించుటవలన, ద్రౌపది శకునికాపట్యధర్మజితయే యైనను శకుని యొప్పుకొనక ధర్మజితయే యని యనుచుండుటచేత ద్రౌపది ధర్మజిత యనవలసి యుండుట.

ఈ సందర్భమున భీష్మవచనములకు నీలకంఠ వ్యాఖ్య యిట్లున్నది. “భర్తు రీశ్వరతాం దాసభార్యాపి దాస్యే వేతి భావః జితోఽస్మీతి వదతా ఆత్మైవ పరాజితో న తు స్త్రీ, నచ రాజజయేనైవ త్వజ్జయః సిద్ధ్యతి ద్యూతమర్యాదావిదా శకుని నైవ తవ పృథక్ పణీకరణా దిత్యాహ ద్యూతే ఇతి. రాజాతు పరాజ్ఞయా త్వాం పణీకృతవాన్ న స్వేచ్ఛయాఽతోఽస్వామీ కథం పణితవా నితి రాజ్ఞోఽపి దోషో నాస్తి. తథాచ శకుని బుద్ధ్వైవ త్వమజితా తచ్చ శకుని ర్న మన్యతే ఇత్యాహ నేతి. యతః పణీకృతా అతః ప్రాగజితా. యతశ్చా పరదాసేన పణీకృతా తతోఽప్యజితై వేతి భావః” (సం.భా. నీలకంఠ వ్యాఖ్య, సభా. 67, 47-49. పుటలు 108-109)

భర్తలు దాసులైనపుడు భార్యయు దాసి యగును. కాని ధర్మజుడు “జితోఽస్మి” యని మాత్ర మనుటచే తాను మాత్రమే జితుడయ్యెను గాని ద్రౌపది కాదనియు, ద్యూతమర్యాదను దెలిసిన శకుని ద్రౌపదిని వేరుగా పణముగా బెట్టించుటచే ధర్మజుని యోటమితో ద్రౌపది యోటుపడినట్లు కాదనియు, ధర్మజుడు తన స్వేచ్ఛతోగాక శకునియాజ్ఞచేతనే ద్రౌపదిని పణముగా బెట్టుటచే “దాసుడై ద్రౌపది నెట్లు పణముగా బెట్టె”నను దోషము ధర్మజునియందుగూడ లేదనియు కావున శకుని మతమునగూడ ద్రౌపది జయింపబడలేదు. కాని దానిని యొప్పకున్నా డనియు, ద్రౌపదిని పణముగా బెట్టించుటచే నంతకుపూర్వ మామె జిత కాదనియు ఇతరదాసుడైన ధర్మజునిచే పణముగా బెట్టబడినందున ఆమె జయింపబడనే లేదనియు భీష్ముడు చెప్పినట్లు నీలకంఠ వ్యాఖ్య వివరించినది.

ఇట్లు భీష్ముడు ద్రౌపదీ ప్రశ్నకు ధర్మనిశ్చయమును కొంతవరకు జెప్పినను "తస్మాన్న తే ప్రశ్న మిమం బ్రవీమి" యని దానిని సందిగ్ధముగనే యుంచెను. భీష్ముడు ద్రౌపదీ మాహాత్మ్యమును బ్రకటింపజేయు తలంపుతోడనే ద్రౌపదీ ప్రశ్నమునకు సందిగ్ధముగనే సమాధానము జెప్పెనని నీలకంఠుడు తన వ్యాఖ్యలో జెప్పెను. ("తథేతి.... భీష్మేణ ద్రౌపదీ మాహాత్మ్యఖ్యాపనాయ ప్రశ్న స్యోత్తరం నోక్తం దుశ్శాసనస్తు పాండవ పక్షపాతినాపి భీష్మేణ సంశయోపన్యాసా దస్మాక మేవ జయ ఇతి మన్వానో యత్కించి త్ప్రలలాపే త్యర్థః". ఈ సందర్భమున క్షేమేంద్రుని భారతమంజరి:

శ్లో. "సూక్ష్మా ధర్మగతిః పుత్రి వాచా తాం వివృణోతి కః?
హారితాత్మా నృపో నేశః పతిః స్త్రీణాం చ దైవతః"

అని యనుచున్నది. ద్రౌపదియు భీష్ముని సందిగ్ధ సమాధానమునకు ప్రతిప్రశ్నముగా "కర్ణదుర్యోధన శకుని సైంధవాది దుష్టభూయిష్ఠంబైన సభకు న న్నేల పిలిపించి నన్నవమానించు నవకాశమును గల్పింపవలసి వచ్చెను? పై దుష్టు లందరిచే గలిసి మోసమున జయింపబడియు దెలిసికొనక (ద్యూత మాత్మపరాజయావసాన మనియు గూడ దెలిసికొనక) ధర్మజుడు మరల నెట్లు జూదమాడెను? శకునియు నాతని జూదమాడునట్లు ఏల చేసెను" అని యడిగి కురువృద్ధు డైన భీష్ముడు ధర్మమును జెప్ప వెనుకాడుచున్నా డని సర్వాధికారిగా నున్న ధృతరాష్ట్రుని లక్ష్యముగా జేసికొని సభలోని కౌరవుల నందరిని-

శ్లో. "తిష్ఠన్తి చేమే కురవ స్సభాయాం । ఈశా స్సుతానాం చ తథా స్నుషాణామ్,
సమీక్ష్య సర్వే మమ చాపి వాక్యం । విబ్రూత మే ప్రశ్న మిమం యథావత్" అని యడిగినది.

ఈ ప్రశ్నలో "తాను జితయా? అజితయా? ధర్మజునకు దనపై యధికార మున్నదా? లేదా? ఎవరి కధికార మున్నది?" అను విషయములను సుసూక్ష్మవిచారము చేసి సూచించి ఏ యొక్కరు ధర్మనిర్ణయము చేయలేనపుడు సభలోని వారినందరిని గలిసి ధర్మనిర్ణయము చేయుడని యడిగినది.

ఈ సభలో కొడుకులకు కోడండ్రకును సర్వాధికారు లైన ప్రభువు లున్నారు. దుర్యోధనాది కుమారులకు వారి భార్యలకును ధృతరాష్ట్రుడు, అతని తరువాత భీష్మాదులు అధికారులు. అటులనే పాండురాజు లేనికారణమున పాండవులకును వారిభార్యయగు ద్రౌపదికిని అధికారి ధృతరాష్ట్రుడు. కావున సుహృద్ద్యూత మాడరమ్మని యాత డాజ్ఞాపింపగనే పాండవులు వచ్చి యాడిరి. ఆజ్ఞానువర్తు లైన పాండవులను పాండవపత్నిని అవమానింపజేయుట న్యాయము గాదు. ఆ యవమానము దుర్యోధనాదులయు వారిభార్యలయు అవమానమువంటిది. ఇది కురురాజుగా రాజుగా సర్వాధికారియైన ధృతరాష్ట్రుడుపేక్షింపదగినది గాదు.

ఒక అధికారి పోయిన నాయధికారము పైయధికారికి సంక్రమించుట, పై యధికారి పోయిన వానియుత్తరాధికారి కాయధికారము సంక్రమించుట ధర్మరహస్యము. భీష్ముడు ప్రతిజ్ఞచే నధికారము వీడుటచే విచిత్రవీర్యు డధికారి యయ్యెను. తదనంతరము అతని సంతానములలో నంధత్వమున నధికారయోగ్యత లేమి పాండురా జధికారి యయ్యెను. పాండురాజు కిందమశాపవిరక్తుడై శతశృంగమునకు బోవుటచే ధృతరాష్ట్రు డధికారి యయ్యెను. శతశృంగమున పాండువు మరణించుటచే ధర్మజునకు పితృవ్యునితో సమభాగమైన రాజ్యము నీయవలసివచ్చినది. మనుస్మృతివ్యాఖ్యాకారుడగు కుల్లూకభట్టు వ్రాసిన "అస్మాదేవలింగాత్ పౌత్రస్యాపి మృతపితృకస్య పైతామహే ధనే పితృవ్య విభాగోస్తీతి గమ్యతే" (మనుస్మృతి. 9అ. 120 శ్లోకవ్యాఖ్య) అను వాక్యమునుబట్టి విచిత్రవీర్యుని రాజ్యమునందు అతని పౌత్రుడైన ధర్మజునకు తండ్రియైన పాండువు మరణించుటచే పితృవ్యుడైన ధృతరాష్ట్రునితో సమవిభక్తమగు రాజ్యము రావలసియున్నది. అది ఖాండవప్రస్థము రాజధానిగా ధృతరాష్ట్రునిచే నీయబడినది. దానికి దోడు స్వసద్గుణపరాక్రమమున రాజసూయము నెరవేర్చి ధర్మజుడు సార్వభౌము డైనాడు.

కావుననే ధృతరాష్ట్రుడు దుర్యోధనుని జననమందు గలిగిన యపశకునములకు పెద్దలందరిని సభచేయించి-

శ్లో. "యుధిష్ఠిరో రాజపుత్రో జ్యేష్ఠో నః కులవర్ధనః ।
ప్రాప్తః స్వగుణతో రాజ్యం న తస్మి న్వాచ్య మస్తి నః ॥
అయ న్వనంతర స్తస్మా దపి రాజా భవిష్యతి ।
ఏత ద్విబ్రూత మే తథ్యం యదత్ర భవితా ధ్రువమ్" ॥ **(సం.మ.భా. ఆది. అ.115. శ్లో. 31,32)**

'జన్మజ్యేష్ఠుడైన ధర్మజుడు మనకు రాజు. అదియునుగాక నాతడు స్వగుణములతోడనే రాజయ్యెను. అందేమాత్రము దోషము లేదు. కాని వాని యనంతరమైనను దుర్యోధనుడు రాజు గాగలడా? ఈ విషయమున నేమి జరుగనున్నదో నిశ్చితముగా వివరించి చెప్పుడు'- అని యడుగును.

ఇట 'అయన్వనంతరః' అను పదముచేత దుర్యోధనుడు, విచిత్రవీర్యునకు మొదటి భార్యయైన యంబిక యందు బుట్టిన ధృతరాష్ట్రుని కొడుకుగావున ధర్మజుని కన్నను దుర్యోధనుడే రాజు గావలయు నను నభిప్రాయము ధృతరాష్ట్రుడు వ్యక్తము చేయకపోలేదు. అందుకే ధర్మజుని రాజసూయప్రాప్త వైభవమునకు తండ్రికొడుకులలో నసూయాద్వేషములు గలిగినవి. కపటద్యూతమున ధర్మజుని సర్వస్వము నపహరించి (ద్రౌపదిని విడిచి) చివరి కాతనినిగూడ జయించిరి.

ఇట్లు ద్రౌపదిపై నధికారము 'సోదరులలో నొక్కొక్క రోడుటచే పైపైవారికి సంక్రమించి చివరికి సర్వాధికారము ధర్మజునిపై బడినది. అతడుగూడ తన్నోడుటచే నామెపై నాతనికున్న సర్వాధికారము ధర్మజుని పైయధికారియైన ధృతరాష్ట్రునకు సంక్రమించినది. కావుననే "తిష్ఠన్తి చేమే కురవ స్సభాయా మీశా స్సుతానాం చ తథా స్నుషాణాం" ఇపుడు నాకు (మాకు) సర్వాధికారులైన పెద్దలు(ధృతరాష్ట్రాదులు) సభలో నందరియెదుట నిదిగో బ్రతికియే స్థాణువులవలె కూర్చొని యున్నారు. వా రుండగా వారి యుత్తరాధికారికి దుర్యోధనునకు నాపై నధికారము ఎట్లు వచ్చును? కావున నా వాదము సమీక్షజేసి యథార్థమైన ధర్మస్వరూపమును సభలోని వారందరు నిర్ణయింపు డని ధర్మతత్త్వమును స్పష్టముగా ప్రకాశింప జేసి యంగీకరింపు డనును.

ఇట ద్రౌపది జిత యైనచో దుర్యోధనుడు సాక్షాదధికారి యగును. అజితయైనచో ధృతరాష్ట్రుని యనంతరము అధికారి అగును. కావుననే చివరకు ధృతరాష్ట్రుడు వరముల వేడుకొమ్మనగా ద్రౌపది, ధర్మజునకు స్వాతంత్ర్యమును, భీమాదులకు స్వాతంత్ర్యమును వరములుగా గోరునే కాని అంతటి యవమానమును బొందినను తన దాస్య విముక్తిని వరముగా గోరలేదు. మూడవ వరమును (పరీక్షగాను) తన దాస్యవిముక్తి కవకాశముగా నిచ్చినను క్షత్రియస్త్రీ మూడవవరము గోరరా దనునే కాని స్వదాస్య విముక్తిని గోరదు. ఇట్లు తాను దాసిని గానను సుదృఢ ధర్మతత్త్వమును దెలిసి త్రికరణములతో వెలిబుచ్చినది. నన్నయగూడ "నే నదాసినే. దాసినే"! యని సంగ్రహముగా నీ తత్త్వమును ద్రౌపదితోనే యనిపించును. దీనివలన తాను దాసిని గానని నిరూపించు నవకాశ మున్నను కౌరవు లధర్మ మాచరించుట యందరు తెలిసికొనియున్నను, తన భర్తలతో బాటు ప్రశాన్తసహనము వహించి పాండవులకు దగిన భార్యయని నిరూపించుకొన్నది. లేనిచో ద్రౌపది యప్పటికప్పుడు శపింపగల పతివ్రతా తపోనిధి. ఆమె కోపించిన కౌరవులు నిలుతురా? తమలో ఒక్కొక్కరే కౌరవులనందరిని పరిమార్చగల పాండవులు తమ ప్రశాన్త సహనము వీడినచో కౌరవులు బ్రతికియుందురా? వికారహేతు వున్నపుడే వికారము జెందనివారు ధీరులు. ద్రౌపదియును పాండవులును కోప విజృంభణమునకు దగిన కారణము లున్నను ఏ వికారమునకు గురికాక ప్రశాన్తసహనముల నుండుటచే నిజమైన ధీరులు.

ఇంతటి సహన మున్నందుననే నిండుసభలో రజస్వలయై ఏకవస్త్రయైన ద్రౌపదిని వివస్త్రను జేయబూనిన దుశ్శాసనునకు ద్రౌపదికి మించిన యవమానమే జరిగినది. ద్రౌపదిని వివస్త్రను జేయునపుడు ఆమె కృష్ణుని రక్షింపు మని మొరలిడెను. వెంటనే యా మహాత్ముడగు కృష్ణుడు ధర్మస్వరూపమై యామెమానమును రక్షించు వస్త్రరూపమై అనేక వస్త్రములతో నామెను గప్పెను. ఆమె ధర్మపాలనము జేయుటచే దుశ్శాసనుడు లాగినకొలది, యెడతెగని వస్త్రము లామె యొడలిపైననే పుట్టుచుండెను. వస్త్రములు గుట్టలై పడుచుండెను. నిత్యధర్మవస్త్రబద్ధయైన యామెవస్త్రము హీనమగుట లేదు. దుశ్శాసను డలసి సిగ్గిలి కూర్చుండెను. ద్రౌపది యవమానమునకు ధర్మమడ్డుపడినది కాని దుశ్శాసనుని యవమానమునకు

వానిద్వారా దుర్యోధనాదులకు గలిగిన యవమానమునకును ఎవ్వ రడ్డు పడరైరి. ఈ యకృత్య ఫలితమును భావిభారతరణమున ననుభవించినపుడు గూడ నెవ్వరడ్డురాకుండిరి.'' (మహాభారతము - విశ్వవిజ్ఞాన కోశము. (సిద్ధాంత వ్యాసము) (1989) -పు. 118-124)

2. మూలంలో వివరించబడిన అంశాలను మరికొన్నింటిని నన్నయ సూచ్యప్రాయంగా తెలుగులో చెప్పటంవలన కథార్థసమన్వయంలో ఆయనదైన ఒకవైఖరి స్పష్టమౌతున్నది. ఉదాహరణ (1) దుర్యోధనుడి దుశ్చేష్టితానికీ, ధర్మజుడి సమ్మతానికీ భయపడి ప్రాతికామివెంటపోవటం-(2.212) అనే వాక్యం అల్పాక్షరాలలో అనల్పార్థరచన. దుర్యోధనుడు పాండవసంపదను వంచనతో అపహరించి వారికి అవమానం చేయటమే కాకుండా తనను అపహసించిన ద్రౌపదిని అవమానించి వారి అభిమానధనాన్నికూడ వమ్ముచేయాలని పన్నిన కుట్రలో భాగమే- బలవంతంగా ధర్మజుడిచేత ద్రౌపదిని పణంగా పెట్టించటం. అది అతడి దుశ్చేష్టితం. పోగా, దానికి అవకాశ మివ్వటమే కాకుండా ధర్మరాజు తాను దాస్యంనుండి విముక్తుడు కాకుండానే ద్రౌపదినికూడ దాసిని చేసే దుష్టవ్యూహానికి తలఒగ్గటం ఆమెకు ఆశ్చర్యం వేసింది. ధర్మజుడి నిశ్శబ్దం 'ద్రౌపదికూడ దాసియే' అనే అంశాన్ని పరోక్షంగా అంగీకరించిన ట్లౌతుందని ఆమె భయం. దాన్ని సభలోనే తేల్చుకొనటం మంచిదని ఆమె కదలివచ్చింది. ఇక్కడ ఒక విషయం మాత్రం స్పష్టం. ద్రౌపది తాను దాసిని కాను- అనే నిశ్చితాభిప్రాయంతోనే ఆలోచించింది; దాని కనుగుణంగా మొదటినుండి తుదిదాకా వ్యవహరించింది. ఈ అంశాల నన్నింటినీ దుశ్చేష్టితం-సమ్మతం అనే రెండు పదాలలో ఊహించుకొమ్మంటాడు సారమతి నన్నయ.

3. మూలంలోని కొన్ని అంశాలను పూర్తిగా వదలిపెట్టటంలో కూడ నన్నయతీరు గోచరమౌతుంది. ప్రాతికామిని ద్రౌపది అడిగిన ప్రశ్నను, తానే వచ్చి ధర్మరాజునే నిండుసభలో అడిగి, సమాధానం తెలిసికొమ్మని ఆదేశించాడు దుర్యోధనుడు. ప్రాతికామిని తిరిగి ఆమెవద్దకు పంపాడు. ద్రౌపది సభలోని వారి నిశ్చయమేమిటో తెలిసికొనివస్తేదానిప్రకారం నడచుకొంటానని మరల ప్రాతికామిని త్రిప్పిపంపింది. ప్రాతికామి సభికుల నందరినీ ఉద్దేశించి ద్రౌపది అడిగినట్లుగా ఆమె ప్రశ్నను అడిగాడు. సభికులందరు తలలువంచి నిశ్శబ్దంగా ఉండిపోయారు. అప్పుడు మూలంలోని ధర్మరాజు ఆ పరిస్థితిని గమనించాడు. దుర్యోధనుడు ఏ విధంగానైనా ద్రౌపదిని సభకు రప్పించాలనే పట్టుదలతో ఉన్నాడని గ్రహించి, తానే ద్రౌపదివద్దకు విశ్వాసపాత్రుడైన ఒక దూతను పంపుతూ రహస్యంగా ఇట్లా నిర్దేశించాడు-

శ్లో. ''ఏకవస్త్రా త్వధో నీవీ రోదమానా రజస్వలా ।
సభా మాగమ్య పాంచాలి శ్వశురస్యాగ్రతో భవ ॥
అథ త్వా మాగతాం దృష్ట్వా రాజపుత్రీం సభాం తదా ।
సభ్యా స్సర్వే వినిందేరన్ మనోభి ర్ధృతరాష్ట్రజమ్'' ॥ **(సం. సభా. 60. 15)**

ఏకవస్త్రవూ, అధోనీవివీ, రజస్వలవూ అయిన ఓ పాంచాలీ! నీవు రోదిస్తూ సభకు వచ్చి మామగారైన ధృతరాష్ట్రుడి ఎదుట నిలువబడు. రాజపుత్రి వైకూడా అట్లా వచ్చిన నిన్ను చూచి సభ్యులందరూ దుర్యోధనుడిని మనస్సులలో నిందిస్తారు అని ధర్మరాజు నిర్దేశం. ధర్మజుడి సందేశాన్ని అనుసరించి ద్రౌపది సభకు వచ్చింది.

ఆమె సభకు వచ్చి ధృతరాష్ట్రుడి ఎదుట నిలువబడిందంటే సభకు చెప్పకుండానే తెలిసే విషయం ఒకటి ఉన్నది. తనను ముందుగా ఓడిన ధర్మజుడు ఆమెను పణంపెట్టి ఓడటం ధర్మం కాదు. అందువలన ఆమె ద్యూతంలో విజిత కాదు. ఆమె స్వతంత్ర, అయితే భర్తల బాధ్యత అధికారం ఆమెపట్ల లేనప్పుడు వారి తరువాత మామగారైన ధృతరాష్ట్రుడియందు ఆమెరక్షణ బాధ్యత లుంటాయి. ఆ అంశాన్ని స్థిరీకరించటానికే ధర్మజు డామె నట్లా నిర్దేశించాడు. నన్నయ ఈఅంశాన్ని తెలుగులో చెప్పలేదు. దానివలన ద్రౌపది స్వయంగా ఈఅంశాన్ని ఊహించి వర్తించిన వివేకవతిగా నన్నయ రచనలో రూపొందింది. 'తాను మున్నోడి ఆపైన నన్నోడెనా?' అని ధర్మజుడి సలహా లేకుండానే ప్రశ్నించిన ప్రజ్ఞావతికి సభలో వచ్చి ఏమి చేయాలో ధర్మజుడు చెప్పాలా? కాబట్టి నన్నయ ద్రౌపదివ్యక్తిత్వానికి విలువ పెంచటానికే మూలంలోని ఆ భాగాన్ని గ్రహించలే దని స్పష్టం!

4. ఈ అంశాల పరిశీలనంవలన తేలిందేమంటే- జూదంలో శకుని అక్షవిద్యాకుటిల విశారదుడు. అతడు ధర్మరాజును ఏనుగును ఆకులుకప్పిన గుంటలో త్రోసినట్లు ద్యూత ధర్మకూపంలో దింపాడు. ధర్మరాజుపడుతూ కూడా తనధర్మాన్ని రక్షించుకొని శత్రువుల కాపట్యాన్ని సూక్ష్మబుద్ధులకు తెలిసేటట్లు వ్యవహరించాడు. ద్యూతంవలన ఎట్లాగూ యుద్ధం తప్పదు. ద్యూతంలో ఓడిన ధర్మరాజుకు ప్రజలసానుభూతి లభించటం కష్టం. ద్రౌపదిని అవమానించటంవలన ప్రజలు కౌరవులను నిందించి పాండవులపట్ల సానుభూతిని ప్రదర్శిస్తారు. ద్రౌపదిని ఓడకపోతే పాండవులకు సానుభూతికూడా మిగలదు. కౌరవులు పాండవసంపదలను ప్రారంభించడానికి ద్రౌపదిని పణంగా పెట్టుమన్న శకునిసలహాను దోహదంగా తీసికొన్నాడు ధర్మజుడు. పాండవసంపదను సమూలంగా నాశనం చేశా ననుకొన్నాడు - శకుని ద్రౌపదీపణానికి అవకాశాన్ని కల్పిస్తూ. కాని ధర్మజుడి లోతైన ఎత్తుగడను గమనించలేకపోయాడు. సభలో ధర్మరాజు నిశ్శబ్దం భవిష్యత్తులో కౌరవుల జీవితాలలో వ్యాపించే మృత్యునిశ్శబ్దానికి బీజరూపం.

ధర్మజుడి నిశ్శబ్దంలోని అంతరార్థాన్ని తెలిసినవారు ఆ సభలో ఇద్దరే. ఒకడు భీష్ముడు, మరొకడు విదురుడు. విదురుడు ద్రౌపది అధర్మవిజిత అన్నాడు. జూదాన్ని బలవంతులతో ఆడటం విరోధమని వ్యాఖ్యానించాడు వాచ్యంగా. భీష్ముడు ధర్మజునికి ధర్మతత్త్వం తెలుసునని పరమవ్యంగ్యంగా చెప్పాడు తనమాటలలో. 'ధర్మసూక్ష్మం ధర్మజుడికే తెలుసు. దాని ఫలితం కౌరవులు త్వరలోనే అనుభవిస్తా' రని. ఆ ఫలిత మేమిటో ధర్మజుడికి తెలుసు. భీష్మ విదురులకు తెలుసు. ద్రౌపదికీ తెలుసు. వ్యాసుడి రెండు ఉపన్యాసాల సారాంశాన్ని నన్నయ రెండువాక్యాలలో భీష్మునినోట నిబంధించి చెప్పాడు. నానారుచిరార్థ సూక్తులంటే ఇవే. ప్రసన్నకథాకలి(వి) తార్థ యోజనమంటే ఇదే!

పైకిచూస్తే మాయాద్యూత పర్వాన్ని నన్నయ సంగ్రహంగా వ్రాసినట్లు కనపడుతుంది. కాని సారమతితో ఆలోచిస్తే సారమతి చేసిన సారవద్రచనగా ప్రసన్నమౌతుంది.

అనుద్యూతంలో ధర్మరాజు పణాన్ని తప్పదు కాబట్టి ఒప్పుకొన్నట్లు ఉంటుంది కథలో. కాని దాని లోతులుకూడా తక్కువకావు. కపటద్యూతం తరువాత హస్తినాపుర సార్వభౌములుగా ఎవరో ఒకరే ఉండాలని తేలిపోయింది. ధర్మరాజు పాండురాజు భాగం పొంది రాజ్యం చేస్తూ ఉండగా ధృతరాష్ట్రుడి భాగాన్ని ఆక్రమించడానికి ధర్మబద్ధమైన ఉపాయం లేదు. అంతేకాక స్త్రీ సంపాదించి యిచ్చిన రాజ్యాన్ని అనుభవించటం అనుజులకు ఇష్టం లేదు. ఒకసారి కురురాజ్యం వదలిపోతే కాని మరలరాజ్యం మొత్తం వీరభోజ్యంగా హరించే అవకాశం దొరకదు. ఆ అవకాశం ఎప్పుడు కలగాలి? అనుద్యూతాహ్వానం దానికి సూచికగా తోచింది. వెంటనే అనుద్యూతానికి ధర్మజుడు అంగీకరించాడు. మూలంలో భీష్మాదులు, కుంతి మొదలైన ఆప్తులు, హితులు, మంత్రులు ధర్మరాజును అనుద్యూతాహ్వానాన్ని తిరస్కరించు మని ఎన్నోవిధాల చెప్పినట్లు ఉన్నది. నన్నయ దానిని వదలి ధర్మజుడి మౌనానికే, స్వయం నిర్ణయానికే కథనంలో ప్రాధాన్యమిచ్చి నడిపించాడు. అనుద్యూతంలోనిమౌనం హస్తినాపుర సామ్రాజ్య సార్వభౌమార్హతకైన మార్గాన్వేషణం. శకుని వాక్కులలో సర్వేశ్వరుడు ప్రవేశించి తమకు సర్వరాజ్య సర్వంసహాధికార యోగ్యతాసిద్ధికొరకు పుణ్యాహవచనం చేస్తునట్లు ధర్మజుడు భావించిఉండాలి. అడవికి పోయే పాండవుల వైఖరి ఆ సామ్రాజ్యసిద్ధికొరకైన మహారణయజ్ఞానికి చేస్తున్న విఘ్నేశ్వరపూజ. భస్మంలోనుండి కూడ బంగారాన్ని సృష్టించగల ధర్మజనీతిశక్తికి సభాపర్వం సంజీవనిమంత్రం!

### పాండవదిగ్విజయం: ప్రాచీనభారతం

మహాభారతంలోని సభాపర్వంలో పాండవులు చేసిన దిగ్విజయ వివరాలూ, భీష్మపర్వంలో కౌరవ పాండవులకు సహాయకులుగా నిలిచిన రాజుల వివరాలూ గమనిస్తే ఆకాలంనాటి భారతదేశం (భరతఖండం) రూపురేకలు మనకు కొంతవరకు గోచరిస్తాయి. అప్పటి భౌగోళికాంశాలనుగురించి, రాజ్యాలస్థితి గతులను గురించి పండితు లెందరో చర్చించి ఉన్నారు. శ్రీచర్ల నారాయణ శాస్త్రిగారు మహాభారత మీమాంస (మూడవభాగంలో) (1984 ప్రథమ ముద్రణ) లోని పన్నెండవ ప్రకరణంలో ఈ విషయాలు విపులంగా వివరించి చెప్పారు. అంతకు 50 ఏళ్ళముందు 1933లోనే శ్రీపెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు రచించి ప్రచురించిన గ్రంథం 'మహాభారత చరిత్రము' లో 'మహాభారతకాలపు రాజ్యములు' అని ఒక అధ్యాయాన్ని ప్రత్యేకంగా రచించారు. వారు పాఠకుల సౌకర్యార్థం 'భారతకాల భరతఖండము' అనే దేశపటాన్ని,

రాజ్యాల రాజుల పట్టీని అనుబంధంగా ఇచ్చారు. వారికి కృతజ్ఞతలతో ఈనాటి పఠితలకొరకు ఆ పటాన్ని ఇక్కడ పొందుపరచటమైనది. (మిగిలిన వివరాలకు ఆ గ్రంథాన్ని చూడవచ్చును.) భీమాదులు నాలుగు దిక్కులలో దండయాత్ర చేసి జయించిన దేశాలపేర్లు, స్నేహంతో వర్తించిన దేశాలపేర్లు, కొంతమంది రాజులపేర్లూ నన్నయ మూలాన్ని అనుసరించి తెలుగులో చెప్పాడు. ఆ దేశాలపట్టీని ఇక్కడ ఇవ్వటం జరుగుతున్నది. వాటిలో కొన్నింటిని పఠితలు ఆ పటంలో గుర్తించి తెలిసికొనగలరని భావిస్తున్నాము. కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొనే రాజ్యాల రాజుల వివరాలు భీష్మపర్వపీఠికలో ఇవ్వటం జరుగుతుంది.

**అర్జునుడి ఉత్తరదిగ్విజయయాత్రలో పేర్కొనబడిన దేశాలు, రాజులు : (సభా.1.229-241)**

1. పుళిందదేశ ప్రభువు. 2. ప్రతివింధ్యుడు. 3. ద్వీప మండలేశ్వరులు. 4. ప్రాగ్జ్యోతిషం-భగదత్తుడు. 5. శబరులు, 6. సాగరతీర వాసులు. 7. అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరి భూపతులు. 8. ఉలూక దేశాధిపతి బృహంతుడు. 9. ఉత్తర ఉలూక, కామదేవ, మోదాపుర, సుదామ, సుసంకులము అనేదేశాలు, రాజులు. 10. దేవప్రస్థప్రభువు సేనాబిందుడు. 11. విష్వగశ్వుడు అనేరాజు. 12. పార్వతేయులు. 13. బర్బర, శబర, తురుష్క పతులు. 14. మాళవ, పౌండ్ర, కాశ్మీర, త్రిగర్త, లోహిత, సుధన్వ, గాంధార, కాంభోజ, కోసలపతులు. 15. సింహపురాధీశుడు చిత్రాయుధుడు. 16. వనచర దస్యుల రాజులు. 17. శ్వేతపర్వతం దాటిన తరువాత ఉన్న కాంభోజకటకుడు అనేరాజు, 17. హాటకదేశం, మానససరోవరం ఋషికుల్య ప్రాంతరాజులు, 18. హేమకూట నిషధాచలాలను దాటిన తరువాత గంధర్వనగరం. 19. జంబూవృక్షాన్ని జంబూనదిని చూచి మేరువును, గంధమాదనాన్ని దాటి సిద్ధ, విద్యాధర, చారణ, గంధర్వులచేత పూజితుడైనాడు. 20. మాల్యవంతం నీలపర్వతం దాటిన తర్వాత నున్న ఉత్తర కురుదేశాలు - హరివాసర నగరం.

**భీముడి పూర్వ దిగ్విజయయాత్రలో పేర్కొనబడినదేశాలు, రాజులు: - (సభా.1.242-245)**

1. పాంచాల దేశం. 2. విదేహరాజు జనకుడు. 3. దశార్ణపతి సుధన్వుడు. 4. అశ్వమేధేశ్వరుడైన రోచమానుడు. 5. చేది భూపాలుడు శిశుపాలుడు. 6. పుళిందవిషయంలో సుకుమార సుమిత్రులు. 7. కుమారవిషయంలో శ్రేణిమంతుడు. 8. కోసలదేశంలో బృహద్బలుడు. 9. అయోధ్యాపురంలోని దీర్ఘప్రజ్ఞుడు. 10. కాశీరాజు సుపార్శ్వుడు. 11. రాజపతిఅయిన సుధన్వుడు. 12. మత్స్య మలదపతులు. 13. కర్ణాట దక్షిణమల్లులు. 14. మగధపతి సహదేవుడు. 15. హిమవత్పర్వతపార్శ్వంలో ఉన్న జలోద్భవ మనేదేశం. 16. భల్లాటదేశం. 17. ఇంద్రపర్వత సమీపంలోని ఏడుగురు కిరాత పతులు, 18. శర్మక వర్మకులు. 19. ఇంద్రసేన సముద్రసేనులు. 20. కర్ణవత్సపతులు. 21. పుండ్రపతి. 22. పౌండ్రక వాసుదేవుడు.

**సహదేవుడి దక్షిణదిగ్విజయయాత్రలో పేర్కొనబడిన దేశాలు, రాజులు: (సభా.1.246-264)**

1. సుమిత్ర, శూరసేన, దంతవక్త్ర, యవనులు, 2. గోశృంగగిరి నివాసులు. 3. కుంతిభోజుడు. 4. భూరిబలుడి పుత్రుడైన జంభకుడు. 5. నర్మదానదీ సమీపంలో అవంతి దేశాధిపతులు విందానువిందులు. 6. మాహిష్మతీ పురాధీశుడు నీలుడు. 7. సౌరాష్ట్ర దేశంలో ఉండి దూతలద్వారా రుక్మి, భీష్మక, శూర్పారక, దండకపతులనుండి కప్పాలు కొన్నాడు. 8. సాగరద్వీపవాసులైన నిషాదులు, పురుషాదులు, ఏకపాదులు, కాలముఖులు, కర్ణప్రావరణులు, నరరాక్షస జాతులవారు. 9. రామశైల, కోలశైల, తామ్రద్వీప, సంజయంతీపుర నివాసులు. 10. తాళవన, పాండ్య, కేరళ, కాళింగ, ద్రవిడ, యవన, కరహాటక రాజులు. 11. లంకాధిపతి విభీషణుడు (దూతలద్వారా)

**నకులుడి పశ్చిమదిగ్విజయయాత్రలో పేర్కొనబడిన దేశాలు, రాజులు: (సభా.1.265-270)**

1. మహితక విషయం. దత్తక మయూరకాదులు. 2. మరు, మాళవ, బర్బర, కర్బర, శైరీషక, దశార్ణదేశాలు. 3. పుష్కరారణ్య నివాసులైన ఆభీరగణాలు. 4. సరస్వతీ, సింధు నదుల నాశ్రయించి ఉన్న స్రువణీయులు. 5. పంచనద-

# భారతకాల భరతఖండం - (దేశపటం)



(కీ.శే. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారి 'మహాభారతచరిత్రము' (1933) నుండి కృతజ్ఞతలతో)

అమర పర్వతనివాసులు. 6. ద్వారవతిలో వాసుదేవుడు. 7. మద్రపతి శల్యుడు (శాకలపురం). 8. పశ్చిమ సముద్ర గర్భనివాసులు బర్బర కిరాతవీరులు.

ఈ వివరాలు మహాభారతేతివృత్తంలోని చారిత్రక వాస్తవికతకు అద్దంపట్టుతాయి. ప్రాచీన భారతవర్ష పరిజ్ఞానానికి చుక్కానిపట్టుతాయి.

**సభాపర్వం: సూక్తిసుధాకరం**

ధర్మాధర్మ ప్రవృత్తుల సంఘర్షణలతో కూడుకొన్న సభాపర్వంలో నన్నయ కూర్చిన రుచిరార్థసూక్తులు కొన్ని తెలుగువారి నిత్యవ్యవహారంలో బాగా ప్రచారం పొంది ఉన్నాయి. సభాపర్వం అనగానే తెలుగువారినోట వినిపించే సుభాషితం వార్తను గురించినది.

ఆ. "వార్తయంద జగము వర్తిల్లుచున్నది, యదియు లేనినాఁడ యఖిలజనులు
నంధకారమగ్న లగుదురు గావున, వార్త నిర్వహింపవలయుఁ బతికి"- **(సభా.1.51)**

వార్తనుగురించి ఇంత చక్కని సూక్తి వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో ఇంతవరకు వెలువడలేదు.

ఆదిపర్వంలోని 'నిండుమనంబు నవ్యనవనీత సమానము.....' అనే పద్యం తరువాత ప్రజాదరం బాగాపొందిన రుచిరార్థసూక్తి నన్నయ వాక్పారుష్యాన్ని గురించి సభాపర్వంలో చెప్పినది.

క. 'భూరిగుణోన్నతు లనఁదగు, వారికి ధీరులకు ధరణివల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా, దారుణ మది విషముకంటె దహనముకంటెన్". **(సభా.2.17)**

కథార్థ సందర్భాలలో పొదగబడి ఉన్నప్పటికీ సూక్తులు స్వతంత్రప్రతిపత్తిగల పద్యాలుగా రాణించటం గమనార్హం. ఇటువంటి సూక్తులు జీవితంలోని అనేకరంగాలకు సంబంధించినవై ఉండటంచేత సమాజంలోని అన్నివర్గాలవారూ నన్నయసూక్తులను నోరారా పలుకుతూ ఉంటారు. వీటిని గురించి వ్యాఖ్యానంలో యథావకాశంగా వివరించటం జరిగింది కాబట్టి ఈ పీఠికలో వాటి ప్రస్తావన మాత్రం చేయబడుతున్నది. సూక్తులుగా సుప్రసిద్ధాలైన కొన్ని పద్యాలు-సభాపర్వం-1వ అశ్వా. పద్యాలు- **122, 123, 131, 2వ అశ్వా- పద్యాలు: 25, 49, 144, 149, 166, 167, 169, 170, 191, 192, 202, 237, 242, 263, 271.** సభాపర్వంలోని సూక్తులు ఎక్కువగా మానవుడి ఆర్థిక ధార్మిక జీవితానికి సంబంధించినవై ఉండటంచేత త్రివర్గసాధనలో అవి వెలుగు కిరణాలను ప్రసరిస్తూ ఉంటాయి.

సూక్తులు పూర్తి పద్యాలే కానక్కరలేదు. వాటిలోని వాక్యాలుకూడా కావచ్చు. లోకోక్తులుగా, ఛలోక్తులుగా, హాస్యోక్తులుగా, అధిక్షేపోక్తులుగా, వ్యంగ్యోక్తులుగా నన్నయ ఆయా సందర్భాలలో వాడినవాక్యాలు తెలుగువారి సంభాషణలలో వెలుగులు నింపుతూ ఉంటాయి- మచ్చుకు కొన్ని.

1. వృద్ధుల బుద్ధులు సంచలింపవే. సభా.2.9.
2. దాశార్హుండు పూజార్హుఁడే. సభా.2.8.
3. యుక్తమ కా కిది యేమి దోసమే? సభా.2.18.
4. పెద్దలచరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్. సభా.2.19
5. పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు. సభా.2.22.
6. బాలుఁ డయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు. సభా.2.25.

7. బూతు వొగడినట్లు వొగడెదు. సభా.2.48.

8. నీ కిట్లు పలుక సిగ్గను లేదే? సభా.2.67.

9. భూపతి సహియింపనోపునె సపత్నులవృద్ధియు నాత్మహానియున్. సభా.2.98.

10. మిత్రనిధీ! యొడంబడుము మిన్నక సంశయమంద నేటికిన్? సభా.2.133.

11. పాపకారులకుఁ బాయు నవశ్యము నర్థధర్మముల్. సభా.2.136.

12. ఒక నక్క నిచ్చి సింహమ్ముల విల్చికో లుఱదె? సభా.2.181.

13. చిఱుతవాని కింత తఱుసంటి పలుకులు సన్నె వృద్ధజనము లున్నచోట. సభా.2.228.

14. ఇట్లు చేయనైతినేని పితృపితామహులగతికిం దప్పినవాఁడ నగుదు. సభా.2.234.

15. దీని మఱచునది. నే నొండ్లు గఱపనేల? సభా.2.265.

ఇంకెన్నో అలంకృతోక్తులనుకూడ వ్యాఖ్యలో గమనించవచ్చును. మొత్తానికి సభాపర్వం ఒక సూక్తిసుధాకరం!

## సభాపర్వం: ఉద్యోగపర్వం

మహాభారతంలో సభాపర్వం, ఉద్యోగపర్వం చెల్లెలు, అక్కవలె ఉంటాయి. నిడివిలో సభాపర్వం రెండాశ్వాసాలు. ఉద్యోగపర్వం నాలుగాశ్వాసాలు. ఈ భౌతికమైన భేదం ఉన్నా అంతర్గత లక్షణాలలో పోలిక చాలవరకు భాసిస్తుంది.

ఈ రెండిట్లో ఉండే కొన్ని సాధారణలక్షణా లివి: 1. శృంగారాది లలితరసాలు లేవు. 2. వీరరౌద్రరసాభ్యుదయోల్లాసాలు ఉద్దీప్తంగా పోషించబడతాయి. 3. శోకభయాది భావాల తీవ్రత కనిపిస్తుంది. 4. పాండవ ధార్తరాష్ట్రుల చిత్తవృత్తులూ, స్వభావాలూ సంఘర్షణాత్మకమైన సన్నివేశాలలో వారివారి దీర్ఘసంభాషణలద్వారా వ్యక్త మౌతాయి. 5. అర్థసాధనలో సార్థకాలైన వ్యూహాలను ప్రదర్శించే క్రియాచైతన్యం కథలో వెల్లివిరుస్తుంది. 6. ధర్మనీతివర్తనానికీ, కపటనీతివర్తనానికీ గల తారతమ్యం కొట్టవచ్చేటట్లుగా సన్నివేశాలు తీర్చిదిద్దపడతాయి. 7. భారతంలోని ప్రసిద్ధపాత్రల వాగ్వృత్తులకు అనుగుణంగా పాత్రోచితసంభాషణశిల్పం అభినయదర్పణంగా ఆవిష్కృత మౌతుంది. 8. రసపోషకాలైన శబ్దార్థగుణప్రధాన రచనాప్రయోగాలు కవుల స్వీయ శైలీవిన్యాస వైభవాన్ని ప్రదర్శించుకొనటానికి రంగస్థలాలై రాణిస్తాయి. 9. దశరూపకప్రయోగవైచిత్రి యథావకాశంగా ప్రకాశిస్తుంది. 10. తెలుగువారి నాల్కలమీద నిలువగలిగిన ప్రసిద్ధమైన తెలుగుపద్యాలకు హృద్యమైన రంగాలుగా వెలుగొందాయి.

ఈ రెండుపర్వాలకూ వస్తుకవితాస్వభావాలనుబట్టి భేదంకూడా లేకపోలేదు. 1. సభాపర్వంలో ద్యూతం ప్రధానం. ఉద్యోగపర్వంలో దౌత్యం ప్రధానం. 2. సభాపర్వంలో పాండవుల ఆర్థికమైన ఉత్థాన పతనావస్థలు వర్ణించటం ప్రధానం. ఉద్యోగపర్వంలో కౌరవుల ధార్మికమైన ఉత్థానపతనాలు వర్ణించబడతాయి. 3. సభాపర్వంలో పాండవుల రాజసూయవైభవం విస్తృతంగా వర్ణించబడి, తత్ఫలమంతా కపటవ్యాపారపూరితమైన మాయాదురోదరంతో వైపరీత్యాన్ని పొందటం చిత్రింపబడింది. ఉద్యోగపర్వంలో ధృతరాష్ట్రకృత కపటరాజనీతికి కవాటాలు తెరిచిన దౌత్యకార్యం విస్తృతంగా వర్ణింపబడి చివర కది శ్రీకృష్ణుడిరాయబారంతో శిథిలం కావించబడుతుంది. 4. సభాపర్వంలో పాండవులు ప్రతిజ్ఞలు చేస్తూ అరణ్యవాసానికి వెళ్ళుతారు. వారు అడవులకు పోతున్నా యుద్ధానికి పోతున్నట్లుంటుంది. ఉద్యోగపర్వంలో కౌరవులు పదకొండు అక్షౌహిణీల సైన్యంతో యుద్ధానికి పోతున్నా పాండవులవలె భయంకర ప్రతిజ్ఞలు చేయటం లేకపోగా ధార్తరాష్ట్రులు ధూర్తులవలె మృత్యుముఖంలోకి ప్రవేశిస్తున్న ట్లుంటుంది. 5. సభాపర్వం ధర్మయుద్ధానికి నాందిగా ముగుస్తుంది. ఉద్యోగపర్వం అధర్మపరిపాలనకు భరతవాక్యంవలె ధ్వనిస్తుంది. 6. సభాపర్వంలో నన్నయగారి శబ్దగుణప్రధానరచన లాస్యంచేస్తుంది. ఉద్యోగపర్వంలో తిక్కనగారి అర్థగుణప్రధాన రచన అభినయిస్తుంది.

ఈవిధంగా సామ్యభేదాలున్నా అంతర్గతస్వభావంలో ఆనురూప్యం గల ఈ రెండుపర్వాలనూ ఇటు నన్నయా, అటు తిక్కనా రచించటం ఆంధ్రసరస్వతి చేసికొన్న అదృష్టం. అందువలన ఈ ఉభయపర్వాలలో కథార్థవిశేషాల తులనాత్మకానుశీలనం ఎంతటి ప్రాధాన్యాన్ని వహిస్తుందో కవితార్థవిశేషాల పరిశీలనంకూడా అంతటి ప్రాముఖ్యాన్ని సంతరించుకొంటుంది.

## శబ్దగుణశాలి నన్నయచతురశైలి - అర్థగుణశాలి తిక్కనయజ్వశైలి

రచనకు రూపాన్నిచ్చేది శబ్దం. ప్రాణచైతన్యాన్ని ప్రసాదించేది అర్థం. ప్రాణచైతన్యంతో కూడుకొన్న రూపమే శరీరం. అందువలననే భామహాదులు కవితకు శబ్దార్థాలు రెండూ కలిసి శరీర మన్నారు. కావ్యశరీరమైన శబ్దార్థాలలో శబ్దానికి ప్రాముఖ్యముండే రచనను చేసేవారు కొందరూ, అర్థానికి ప్రాధాన్యం ఉండే రచన చేసేవారు కొందరూ, ఉభయప్రాధాన్యం ఉండేరచన చేసేవారు కొందరూ కనపడతారు. కవిత్రయంలో శబ్దార్థోభయ ప్రాధాన్యమున్న రచనచేసేవాడు నన్నయ. అర్థప్రాధాన్యాన్ని మన్నించినవాడు తిక్కన. శబ్దవైచిత్రిచేత అర్థాన్ని దీపింపచేసేవాడు ఎఱ్ఱన. అందువలన ముగ్గురిశైలులూ మూడువిధాలుగా ఉంటాయి. ప్రాణచైతన్యంతోపాటు రూపవిలాసంకూడా ఉన్న ఆకృతిమాధుర్యాన్ని నన్నయ తెలుగుకవితకు ప్రసాదించాడు. ఆ మార్గాన్ని తరతరాల కవులు తన్మయత్వంతో అనుసరించారు. ఆకృతి వైభవంకంటె ఆత్మచైతన్యం అనంతంగా ప్రకాశించే తేజశ్శరీరాన్ని కవితకు తిక్కన ప్రసాదించాడు. నన్నయకవిత వివేకానందుడివలె రూపకాంతిమనోజ్ఞంగా ఉంటుంది. తిక్కనకవిత రామకృష్ణపరమహంసవలె భావతేజస్సుందరంగా ఉంటుంది. ఎఱ్ఱన ఆకృతిని అలంకరిస్తాడు; భావంచేత రూపారాధనం చేయిస్తాడు. ఆహార్యంచేత అలంకృతుడైన రాజకుమారుడివలె ఎఱ్ఱయకవిత రాణిస్తుంది.

కావ్యశరీరం శబ్దార్థోభయరూప మైతే- ఆ శరీరానికి శోభను కలిగించే గుణాలుకూడా శబ్దార్థగుణాలుగా ఉండాలని వామనుడు వింగడించాడు. ఉదాహరణకు- ఒక యువతి ఉన్నది. ఆ యువతి శరీరానికి శోభను కలిగించేది యౌవనం. ఇది కావ్యంలోని శబ్దగుణంవంటిది. శరీరశోభను కలిగించే యౌవనం యువతికి ఉన్నా, ఆమె ముగ్ధ కాకుండా గయ్యాళిగా ఉన్నదనుకోండి. ఆమె ఆస్వాదయోగ్యతను కోల్పోతుంది. లజ్జ మొదలైన ముగ్ధాలక్షణాలు ఆమె శరీరగుణాలు కావు. ఆమె సంస్కారంనుండి పుట్టిన ఆత్మగుణాలు. కావ్యానికి అర్థగుణాలవంటివి. యువతి సిగ్గులమొలక అయినప్పుడే ఉపభోగంలో శోభిస్తుంది. లేకపోతే రసభంగ మయ్యే అవకాశం ఉన్నది. ఈ తార్కాణంవలన కావ్యరచనలో శబ్దార్థగుణాల కున్న సార్థకమైన స్థానం స్పష్టమౌతుంది.

కావ్యానికి ఆత్మ రసం. అది ధ్వనిమయంగా శబ్దార్థాల నాశ్రయించి ఉంటుంది. ఆత్మలక్షణాలను గుణాలు వ్యంజింపచేస్తాయి. రసాన్ని ఆస్వాదించటానికి అనుగుణమైన సౌందర్యాభివ్యక్తిని గుణాలు కల్పిస్తాయి. నన్నయ కవితలోని ఆస్వాదనీయ మైన సౌందర్యం శబ్దగుణసంయోజనంవలన ప్రధానంగా ఏర్పడుతుంది. గుణవర్ధకమైన శబ్దం అతడి రచనకు ప్రాణం. దానివలన రచనకు నాదమాధుర్యం ఏర్పడుతుంది. సహజశోభాహేతువు లైన గుణాలను నన్నయ రచనలో పోషించినా వాటివలన రీతులు రూపుకట్టినట్లు సాధారణంగా కనపడవు. కాని, అక్కడక్కడ అటువంటి రచనను ఆవిష్కరించి రీతివైభవాన్ని ప్రదర్శించటం నన్నయకవితలో కనపడుతుంది. మచ్చునకు కుబేరసభలో పరమేశ్వరుడు సదా నివసించి ఉంటాడనే అంశాన్ని వర్ణించినపద్యం-

ఉ. వానికి నెయ్యుఁడై యమరవంద్యపదాంబుజుఁ డంబికా బృహ
త్పీనపయోధరాగ్రపరిపీడితవక్షుఁడు, భూషణీకృతా
హీనుఁ, డశేషలోకగురుఁ డీశ్వరుఁ డెప్పుడు నంద యుండు నా
నానిశితాయుధాయుతసనాథమహాద్భుతభూతకోటితోన్. **(సభా. 1.78)**

ఈ పద్యంలో ఓజఃప్రసాదగుణమిశ్రమం వైదర్భీరీతిని రూపుకట్టించింది. ఇందులో శివుడికి వేసిన విశేషణాలు నన్నయలో అపూర్వంగా కనపడతాయి. శ్రీనాథుడిరచనలో విశేషించి భీమఖండ, కాశీఖండాలలో శివుడి శృంగార రసికత్వం, శివగణ వీరవ్రతత్వం- సాధారణంగా గోచరిస్తాయి. 'అంబికా బృహత్పీనపయోధరాగ్ర పరిపీడితు' డనటంలోని శృంగారం.

'భూషణీకృతాహీనుడు' అన్న సమాస సంఘటనలో ఉన్న సంస్కృత వ్యాకరణ ప్రయోగప్రౌఢి, 'నానా నిశితాయుధాయుత సనాథ మహాద్భుత భూతకోటి'ని వర్ణించే విశిష్టపదరచనా రీతి నన్నయ అప్పుడప్పుడు ప్రదర్శించే రీతి విన్యాసం. శ్రీనాథుడు తరువాత దీనిని సొమ్ముచేసికొన్నాడు. 'కుంభినీధర సుతాకుచకుంభ పరిరంభ మహాలోలుపాయోం నమశ్శివాయ' అని శ్రీనాథుడు ఈ రీతిమార్గాన్ని తన నీతిగా మార్చుకొన్నాడు. ఆ శిల్పంలో శ్రీనాథుడు ఆ తరువాత నన్నయకు వారసుడై రసానుగుణమైన రీతులను పోషించే రచనకు ఒక కళాపూర్ణత్వాన్ని కల్పించాడు. నన్నయ ఆ మార్గంలో శ్రీనాథుడికి గురువైనాడు.

క. "నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయసార్వభౌముని గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢప్రతిభున్" అని శ్రీనాథుడిచేత కీర్తించబడ్డాడు.

ఓజఃప్రసాదగుణమిశ్రమంవలన వైదర్భీరీతి, ఓజఃకాంతిగుణాలవలన గౌడీయరీతి, మాధుర్యసౌకుమార్యాలవలన పాంచాలిరీతి ఏర్పడతాయని లాక్షణికు లంటారు. ఈ రీతుల రీతులను శ్రీనాథుడి కవితలో గుర్తించినంత సులభంగా నన్నయలో కనుగొనలేము. అయినా గుణవద్రచనాసౌందర్యాన్ని మాత్రం గుర్తించి ఆస్వాదించగలం. నన్నయకవితలో ప్రసాదగుణం ప్రధానపాత్ర నిర్వహిస్తుంది. ఓజోమాధుర్యాది గుణాలలో ప్రసాదాన్ని ఆస్వాదయోగ్యంగా కలిపి ప్రయోగిస్తాడు నన్నయ. దానితో పద్యరచనకు హృద్యమైన సౌందర్యం ఏర్పడుతుంది. రసగుణాలైన దశవిధగుణాలను రసోదంచితంగా మేళవించి రచనలో రామణీయకత్వాన్ని సృష్టిస్తాడు నన్నయ. "నన్నయగారి రచన ప్రవాహము వంటిది. పద్యము విరుగదు. అమృతాధారగా బోవుచుండును. అట్లుపోవుచున్న పద్యము తా నొక్కొక్కచోట విరుగును. ఎందుకు విరుగు ననగా, నచ్చటి భావము రచనచేత ధ్వనింపజేయుటకు-" అని కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి వ్యాఖ్య (నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి- పు. 172) నన్నయరచనలో గుణప్రధానస్వభావాన్ని తెలుపుతున్నది. నన్నయ రచనలో అలంకారరీతివృత్తులు గుణపోషకాలుగా నిలవటం విశేషం. అది నన్నయకవితా శీలం.

తిక్కన అర్థగుణప్రధానవాది. అర్థగుణాలసంయోజనంవలన ప్రధానంగా రసాన్ని పోషిస్తా డాయన. అందువలననే పాత్రల ఆకృతులకంటె అభినయాన్ని విశేషంగా చిత్రిస్తాడు. శబ్దగుణం ఆకృతి వైభవాన్నీ, అర్థగుణం అవస్థావిలాసాన్నీ ధ్వనింపచేస్తాయి. అవస్థలను దీపింపచేసేవి అనుభావసాత్త్వికభావాలు. అనుభావాదులు రసభావవ్యంజకాలు. వాటి వ్యక్తీకరణంవలన శ్రవ్యకావ్యంలో దృశ్యకావ్యచిత్రణ వెల్లివిరుస్తుంది. దానికి సంభాషణాదులు రసవద్వృత్తులను అనుసంధింపజేస్తాయి. దానివలన కావ్యానికి రూపరామణీయకత్వంతోపాటు రసాభ్యుదయోల్లాసంకూడా ఏర్పడుతుంది. నన్నయ శబ్దగుణాలవలన కలిగించే రామణీయకత్వం వలన రసాభ్యుదయం కవితకు సిద్ధిస్తుంది. తిక్కన అర్థగుణపోషణంవలన రసాభ్యుదయంతోపాటు ఉత్+లాస్యస్థితి (నృత్యాయమానస్థితి)కూడా ఏర్పడుతుంది. నన్నయ శబ్దగుణప్రధానరచనకు మార్గదర్శకుడు. తిక్కన అర్థగుణప్రధానరచనకు ప్రస్థానాచార్యుడు.

శబ్దార్థగుణ స్వభావాలు ఈవిధంగా ఉంటాయి.

| | **గుణం** | **శబ్దగుణం** | **అర్థగుణం** |
|---|---|---|---|
| 1. | ఓజస్సు | గాఢబంధత్వం | అర్థప్రౌఢి |
| 2. | ప్రసాదం | బంధశైథిల్యం | అర్థవైమల్యం |
| 3. | శ్లేషము | మసృణత్వం | ఘటన |
| 4. | సమత | మార్గాభేదం | అవైషమ్యం, ప్రక్రమాభేదం |
| 5. | సమాధి | ఆరోహావరోహక్రమం | అర్థదర్శనం |

| | | | |
|---|---|---|---|
| 6. | మాధుర్యం | పృథక్పదత్వం | ఉక్తివైచిత్ర్యం |
| 7. | సౌకుమార్యం | అజరఠత్వం | అపారుష్యం |
| 8. | ఉదారత | బంధవికటత్వం | సభ్యప్రసంగంలో అగ్రామ్యత్వం |
| 9. | అర్థవ్యక్తి | అర్థవ్యక్తిహేతుత్వం | వస్తుస్వభావస్ఫుటత్వం |
| 10. | కాంతి | బంధౌజ్జ్వల్యం | దీప్తరసత్వం |

మరే వివరాలకు పోకుండానే పై శబ్దార్థ గుణ వివేచనను ముందుంచుకొని సమీక్షించినా సహృదయలోకానికి నన్నయ తిక్కనల రచనలలోని తారతమ్యం గోచరమౌతుంది. శబ్దబంధానికి సంబంధించినవి శబ్దగుణాలు, అర్థప్రకటనకు సంబంధించినవి అర్థగుణాలు. నన్నయ కవితలో అర్థప్రకటన చేస్తున్న శబ్దసౌందర్యం అనుభవానికి అందుతుంది. చక్కగా చిక్కగా అల్లిన పూలదండ పరిమళం వెదజల్లు తున్నట్లుంటుంది. తిక్కన రచనలో శబ్దం అర్థసమర్పణం చేసి అంతర్హిత మౌతుంది. అందువలన తిక్కన రచనలో శబ్దం పానకంలో చక్కెరవంటిది. మరొకవిధంగా చెప్పాలంటే- నన్నయశబ్దగుణరచన పండు తింటూ రసాన్ని ఆస్వాదించినట్లుంటుంది. తిక్కనరచన పండ్లరసాన్నే త్రాగుతున్నట్లుంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే- శబ్దగుణశాలి నన్నయ చతురశ్శైలి; అర్థగుణశాలి తిక్కనయజ్వశైలి.

వామనాదులు శబ్దార్థగుణ వివేచనం చేసి విశ్లేషించి చూపించినా ఆ తరువాతి లాక్షణికులు ఆ విభాగాన్ని అంతగా పాటించలేదు. దానికి కారణం కవిత్వంలో శబ్దగుణాలను గుర్తించినంత సులభంగా అర్థగుణాలను గుర్తించలేము. అసలు కవులుకూడా అర్థగుణప్రధానమైన రచనం చేయటం చాలకష్టం. తెలుగులో తిక్కన అటువంటి కవిత వ్రాసి 'తన కావించిన సృష్టి తక్కొరులచేతం గాదునాన్'' అని ఎఱ్ఱయగారిచేత ప్రశంస లందుకొన్నాడు. ఆ భేదం నన్నయ తిక్కన కవితలలో కనపడుతుంది. నన్నయ శబ్దగుణవాది కాబట్టే అనుయాయులు అసంఖ్యాకంగా ఏర్పడ్డారు. తిక్కనరచన క్లిష్టం కాబట్టి ఆయన ఒక్కడే మిగిలిపోయాడు. అందువలన లక్షణగ్రంథకర్తలుకూడా అర్థగుణాలను ప్రత్యేకంగా పరిగణించటం మాని శబ్దగుణాలకు అనుబంధాలుగానే భావించారు. అంటే నన్నయశబ్దగుణాలను అనుశీలించేటప్పుడు శబ్దగుణలక్షణాలను ముఖ్యంగానూ, అర్థగుణలక్షణాలను గౌణంగానూ పరిగణించాలన్నమాట. తిక్కనకవితలో ఇది వ్యత్యస్తంగా మారుతుంది.

శబ్దార్థగుణవిభాగం ధ్వనిసిద్ధాంతం వచ్చినతరువాత వెనుకపడింది. ధ్వనివాదులు గుణాలు రసధర్మాలే కాని శబ్దార్థధర్మాలు కావని స్పష్టంగా చెప్పారు. అవి పది కాని, ఇరవై కాని కావని, రసానుభవదృష్టితో వాటిని మూడుగానే గుర్తించవచ్చుననీ పేర్కొన్నారు మమ్మటాదులు. రసానుభవంలో చిత్తద్రుతివలన కలిగే ఆహ్లాదకత్వం శృంగారాదులలో ఉంటుంది కాబట్టి ఆ రసగుణం మాధుర్య మని గుర్తించారు. మాధుర్యం కరుణ, విప్రలంభ, శాంతరసధర్మా లనికూడా పేర్కొన్నారు. రసానుభూతిలో చిత్తవిస్తారరూపమైన దీప్తత్వం వీరరసంలో కలుగుతుంది కాబట్టి ఓజస్సు ఆ రసగుణమని నిర్దేశించారు. వీరంకంటె రౌద్రబీభత్సాలలో ఓజస్సు రాణిస్తుందని కొందరు భావించారు. సర్వరసానుభవాలలో చిత్తవికాసం సర్వసామాన్యధర్మ మనీ అది సర్వరసాభ్యుదయ హేతు వనీ భావించి లాక్షణికులు ప్రసాదగుణం అటువంటి సర్వరస సామాన్యధర్మ మనీ గుర్తించారు. నన్నయరచనలో ప్రసాదగుణం ప్రధానమని గమనిస్తే అది సర్వరసరమ్యంగా ఉంటుందనీ, నానారుచిరార్థసూక్తికి నాణ్యంగా పనికివస్తుందనీ, అర్థయోజనాన్ని రసార్థయోజనంగా గ్రహిస్తే సర్వరసగుణాలను ప్రసాదంలో మిశ్రితంచేసి నన్నయ వాడతాడనీ స్పష్ట మౌతుంది.

పదిగుణాలూ వస్తుతః మూడుగుణాలలోనే అంతర్భవిస్తాయని మమ్మటాదుల అభిప్రాయం. కవిత్రయమార్గంలో ధ్వన్యనంతరయుగంలో రసధ్వనిమార్గదర్శకత్వాన్ని నిర్వహించిన లాక్షణికులలో మమ్మటుడు ముఖ్యుడుకూడ. అతనికాలం క్రీ.శ. 1020-1100. నన్నయసమకాలీనుడు. అంటే- నన్నయదృక్పథం ఆనాటికి ఆధునిక మన్నమాట!

ఆనాటి లాక్షణికులు ఓజస్సు, ప్రసాదం, మాధుర్యం అనేవి మూడే ప్రధానగుణాలనీ, పదిగుణాలలో శ్లేష, సమాధి, ఉదారగుణాలు ఓజస్సులోనూ, అర్థవ్యక్తి ప్రసాదంలోనూ, సుకుమారకాంతి సమతలు మాధుర్యప్రసాదాలలోనూ అంతర్భవిస్తాయనీ

భావిస్తున్నట్లు తెలుస్తున్నది. రసధ్వనిమార్గంలో పయనించే నన్నయ దీనికి అనుకూలుడే. అందువలన నన్నయ తిక్కనాదులలో గుణవిచారం చేసేటప్పుడు రసధర్మాలుగా, తదనుకూల రచనాధర్మాలుగా పరిశీలించటం సమంజస మౌతుంది.

సభాపర్వంలో వివిధరసగుణాలను పోషించే ప్రసిద్ధపద్యాలు నూటికిపైగా ఉన్నాయి. అందులో సగానికి పైగా ప్రసాదం, అర్థవ్యక్తిగుణాలకు, మిగిలినవాటిలో చెరిసగం ఓజస్సుకు, మాధుర్యానికి చెందుతాయి. వాటిలో అంతర్భవించే గుణాలన్నీ ఆ యా సందర్భాలలో పోషించబడినాయి.

## నన్నయకవితలో ఓజస్సు

సభాపర్వంలో వస్తువు వీర రౌద్రరస ప్రధానమైనది. పాండవ రాజసూయం ధర్మయుద్ధ దాన వీరాలతోనూ, వాటికి పోషకంగా నిలిచే రౌద్రవిస్ఫూర్తితోనూ, మాయాద్యూత ఘట్టం రౌద్ర కరుణరసాలతోనూ ఉద్దీప్తంగా సాగాయి. అందువలన ఇందులో లలితరసాల ప్రసక్తి తక్కువ. అందువలన ఓజస్సు అనేగుణం విస్తృతంగా ప్రయోగించే అవకాశం ఉన్నది.

ధర్మజుడు ధర్మవీరుడు కావటంచేతను, ఉదాత్తుడు, శమప్రవృత్తి కలవాడు కావటంచేతను అర్థపురుషార్థసాధకులలో వెలుగొందే రౌద్రం పరుషంగా వ్యక్తం కాదు. ఆయనకు సహాయకులైన శ్రీకృష్ణ భీష్మాదులయందుకూడ శిశుపాలాదులవలె శుద్ధరౌద్రం భాసించే అవకాశం లేదు. ఇక శత్రువులలో దుర్యోధన, శకుని, కర్ణాదులు కపటవర్తనులై వ్యవహరించటంచేత వారియందు శుద్ధరౌద్రం రాణించదు. ఇకపోగా సభాపర్వంలో భీమసేను డొక్కడే భీషణయుద్ధాలూ, ప్రతిజ్ఞలూ చేసేవాడు. అయినా అతడు ధర్మజుడికి అనునాయకుడు. అనివార్యమైన అతని ఆగ్రహాన్ని అందరూ అదుపుచేయటానికి ప్రయత్నించారు. అందువలన శుద్ధమైన ఓజస్సు ఆతనియందూ ఆవిష్కరించబడటానికి వీలులేదు. ఈ పరిస్థితులలో నన్నయకవితలో వీరరౌద్రరసానుగుణమైన ఓజస్సు ప్రసాదమిశ్రితమై ఉండటమే సహజం. అటువంటిరచన ఉండటమే గమనార్హం.

నన్నయకవితలో రౌద్రరసగుణమైన ఓజస్సును ప్రదర్శించిన ప్రసిద్ధమైన పద్యపంచరత్నాలు సభాపర్వంలోనే కొలువుతీర్చి ఉండటం, అవి రౌద్రరసవిస్తారమైన రెండో ఆశ్వాసంలోనే ఉండటం విశేషం.

1. 'రయవిచలత్తురంగమతరంగములన్....... క్షణంబునన్.' (2.33)
2. 'ప్రకటితకోపవేగమున.......... అంతకమూర్తి కచ్చటన్.' (2.51)
3. 'కురువృద్ధుల్........... ఉగ్రాకృతిన్' (2.233)
4. 'ధారుణిరాజ్యసంపదమదంబున..... ఉగ్రరణాంతరంబునన్' (2.249)
5. 'కనకోర్వీధరసానుసారరుచి..... సంగ్రామరంగంబునన్.' (2.297)

అంగ, నేపథ్య, వాక్యభేదాలచేత రౌద్రరసం మూడువిధా లని భరతుడు నిర్దేశించాడు. పై పద్యాలైదింటిలో మొదటిది నేపథ్యానికీ, రెండవది అంగానికీ, మిగిలినమూడూ వాక్యరౌద్రానికీ ఉదాహరణలు. వాక్యరౌద్రాన్ని స్వభావరౌద్ర మనికూడా అంటారు కాబట్టి భీమార్జున రౌద్రప్రతిజ్ఞలను వర్ణించే పద్యాలు వారి రౌద్రస్వభావాన్నికూడా వ్యక్తంచేస్తున్నాయి. మొదటిరెండురకాలూ కథాకథనంలోని వర్ణనలు, మిగిలినమూడూ వీరప్రతిజ్ఞలు, పాత్రోచితవాచ్యాభినయపతాకలు!

'రయవిచలత్తురంగమతరంగములన్'- అనే పద్యంలోనిది శిశుపాలవధ అనే రౌద్రకర్మకు నేపథ్యాన్ని కల్పించే యదు వృష్ణి భోజ కుకురాంధకవాహినుల సంకుల విజృంభణవర్ణనం. ఇది నిర్దయతర రోషమారుతనితాంత సమీరితమైన వాహినిని దర్శింపజేసే సావయవరూపకం. రోషశబ్దంచేత అది రౌద్రరసానికి సంబంధించిన క్రోధభావోద్వేగస్థితిని నన్నయ ధ్వనింపజేస్తూ ఓజస్సును నిబంధించాడు. అలంకారాన్ని అక్షరరమ్యతతో సంవదించి క్రోధభావదీప్తిని భావనామయం చేశాడు. సైనికసమూహం ప్రదర్శించే కోపం రసస్ఫూర్తిని పొందదు. కాని, ఉద్దీపనవిభావంగా రాణిస్తుంది. ఇది క్రోధభావదీప్తిని మాత్రం తెలిపే అలంకారధ్వనిమయమైన పద్యం. ఇది రౌద్రరసభావం ప్రకటిస్తున్న విభావవర్ణనం. ఇందులో అనుభావవర్ణనం అస్పష్టం.

'ప్రకటితకోపవేగమున'-అనే పద్యం-భీష్ముడిని రూక్షాక్షరవచనాలతో ఆక్షేపిస్తూఉన్న శిశుపాలుడిని చూచి సహించలేక కోపించి భీమసేనుడు రౌద్రాకారంతో నిలిచిన అతడి అనుభావాలను వర్ణించేది. శత్రుకృతమైన నిందావమానాలవలన అభిమానధనుడైన ధీరుడికి కలిగే క్రోధోద్రేకం ఇందులో వర్ణ్యవస్తువు. క్రోధాన్ని ఎఱ్ఱబడిన కన్నులు, ముడివడిన కనుబొమ్మలు, నిప్పులు రాలే చూపులు, ఎఱ్ఱబారిన ముఖం, స్వేదం, పళ్ళు పటపటకొరకటం, పరుషవాక్యాలు పలకటం మొదలైన అనుభావాలతో వ్యక్తంచేస్తారు. భీముడియందు ఆ అనుభావాలను అలంకృతంచేసి నన్నయ రౌద్రవిభావాన్ని భావనామయం చేశాడు.

ఇందులో గమనించవలసిన అంశాలు ముఖ్యంగా మూ డున్నాయి.

1. శ్రవ్యకావ్యమర్యాద నాశ్రయించి అలంకారం విభావాన్ని ఆస్వాదమధురంగా మారుస్తుంది.

2. ఓజోగుణంవలన పఠితలకు చిత్తవిస్తారరూపమైన రౌద్రరసానుభవం కలుగుతుంది.

3. 'అతిరౌద్రాకారమున నలిగిన' 'భయానకతరలీలఁదాల్చి' 'అంతకమూర్తి' 'నిఖిలక్షత్రియత్రాసజనకంబుగా నలిగి' అనేమాటలు రౌద్రరస అభినయానికి సంబంధించిన సాంకేతికపదాలవంటివి. రౌద్రాకారంతో కోపించటం అనేది భరతనాట్యశాస్త్రంలోని అష్టమాధ్యాయంలో చెప్పిన ఉత్తమాంగాభినయంలో భాగమైన రౌద్రదృష్టికి సంబంధించింది. చలనంలేని కనురెప్పలతో, తారకలతో, బొమముడితో కూడిన క్రూరమూ, పరుషమూ, అరుణమూ, ఉద్ధృతమూ అయిన చూపు గల ముద్ర-రౌద్రాకారం- రౌద్రరసంలో ప్రయోగించేది. ఆ ముద్రలో సాక్షాత్ నాట్యరసమైన రౌద్రరసం ఆకృతిగొన్నట్లుగా భీముడు ఉన్నా డని నన్నయవర్ణన. 'భయానకతరలీల' అన్నదికూడా రసదృష్టికి సంబంధించిందే. చూచేవారికి భయం కలిగించేదిగా ఉండేది భయానకం. అంటే చూచేవారుకూడా భీముడి ఆకారాన్ని చూచి రెండురెప్పలూ బాగా విప్పారి నిశ్చలంగా ఉండగా, తారకలు మెరుస్తూ తిరుగుతూఉండగా, అత్యధికమైన భయాన్ని చూపించే దృష్టిగల భంగిమ భయానకదృష్టి, అటువంటి భంగిమలో చూపరులు భయంతో నిలబడేటట్లు భీముని రౌద్రాకారం ఉన్న దని భావం. ఇవి నాట్యపరిభాషకు సంబంధించినవి కాగా, 'అంతకమూర్తికి' అనేది కావ్యాలంకారానికి సంబంధించింది. ఈవిధంగా రౌద్రరసవర్ణనం చేసేటప్పుడు నాట్యపరిభాషను కావ్యపరిభాషతో కలిపి వాడే రచనాశిల్పంలో నన్నయగారే తిక్కనకు మార్గదర్శకు లయ్యారు. "కనుగొనికోపవేగమున....." (విరా.2.133) అనే తిక్కనపద్యం ఈపాదులో మొలిచిందే.

'కురువృద్ధుల్ గురువృద్ధబాంధవులు'- అనే పద్యంలో రౌద్రరసపోషక మైన వాచికాభినయానికీ, పాత్రోచితసందర్భోచిత సంభాషణానికీ ఓజస్సు సమర్థమైన సాధకంగా నిలిచింది. గాఢబంధత్వంతోపాటు అర్థప్రౌఢికూడా ఈ శపథంలో రాణించింది. ఇంతమంది పెద్దలు చూస్తూఉండగా ఖలుడైన దుశ్శాసనుడు ద్రౌపదిని "ఇట్లు" చేశాడు అన్నాడు భీముడు. "ఇట్లు" అనే పదం వాచికాభినయంలో అనంతమైన భావాభివ్యక్తికి పనికివచ్చే వాఙ్మయసాధనం. ఇట్లు-అన్నప్పుడు దుశ్శాసనుడు ద్రౌపదికి చేసిన అవమానం అవాచ్యం(నోటపలుకరానిది) అనీ, అంతటి అవమానంచేశాడనీ సందర్భోచితంగా గమ్యమానమైన అర్థం. దానితోపాటు మరొక అర్థంకూడా ప్రతీయమానం అవుతుంది. భీముడికి అంతటి కోపం వచ్చేటట్లు అవమానంచేయటానికి ఎంత వీలుందో ఆవిధంగా అని అర్థం. ఆ కోపం ఎంతటిది? ఇంతమంది చూచేటట్లు అవమానంచేయటానికి కారకుడైన దుర్యోధనుడిముందు దుశ్శాసనుడి రొమ్ముచీల్చి అందులోనుండి పారే నెత్తురుటేరులను త్రాగితేకాని తీరనంతటిది. రౌద్రం రాక్షసప్రవృత్తికి సంబంధించిందని భరతనాట్యశాస్త్రం. పచ్చినెత్తురు త్రాగటం ఎంత రాక్షసమో అంత రౌద్రం, అంత ఉగ్రత్వం. దుశ్శాసనుడు చేసింది అంతటి రాక్షసకృత్య మని భీముడి భావం. ఇంతటి అర్థప్రౌఢి భీముడి వాక్కులలో ఉన్నప్పుడు ఈ పద్యంలోది అర్థగుణమైన ఓజస్సు అనవచ్చును కదా? కాదు. ఆ అర్థప్రౌఢిని గాఢబంధానికి గౌణం చేశాడు నన్నయ. అందువలన ఇది శబ్దగుణమైన ఓజస్సు సార్థకంగా సాగిన సమర్థవంతమైన పద్యం. భావిరణరంగంలో దుర్యోధనుడికంటె దుశ్శాసనుడిచావు ముందుగా జరుగుతుందనీ, అతడి కర్మానుభవానికి ప్రేరకుడైన దుర్యోధనుడు అప్పుడు పరితపించక తప్ప దనీ వ్యంగ్యార్థం. రౌద్రరసంనుండి కరుణరసం పుడుతుంది. దుర్యోధనుని రౌద్రంనుండి ద్రౌపదియందు కరుణం జనించింది. శత్రుకృత అవమానంనుండి భీముడిలో రౌద్రం జనించింది. దానివలన దుర్యోధనాదులకు శోకం కలిగిస్తా నని

అతడు శపథం చేశాడు. రౌద్రానుప్రాణిత యుద్ధవీరం ఇందులో రసం. అందువలననే అతడిశపథం విని సభ్యులు అద్భుతరసావిష్టు లైనారు. వీరం జనకరసం. అద్భుతం జన్యరసం.

దుశ్శాసనుడిని చంపుతా నని భీముడు శపథం చేసినప్పుడు ఆలోచిస్తూ ఆగ్రహాన్ని అభివ్యక్తీకరించాడు. మరి- దుర్యోధనుడి తొడలు విరుగగొడతా నన్నప్పుడు భీముడు 'సర్వజనభయానకక్రోధావేశవివశు'డైనాడు. 'రౌద్రాకారం' తాల్చాడు. అప్పుడు పలికినపద్యం "ధారుణిరాజ్యసంపద మదంబున......". చెయ్యకూడని పనిని వివేకం లేకుండ చేశాడు కాబట్టి దుశ్శాసనుడు ఖలుడు, పశుతుల్యుడు. అతడి నెత్తురు త్రాగటం అతడి పశుత్వానికి అనువైనపని. కాని, దుర్యోధనుడు తెలిసి మదంచేత ఇల్లాలిని అవమానించ దలచిన "దురాత్ముడు" (చెడుబుద్ధి కలవాడు, దుష్టమైన స్వభావం కలవాడు) వీడు చావకూడదు, చచ్చినట్లు పడి తన కర్మఫలాన్ని భీము డనే రౌద్రాకారుడివలన ఇహంలోనే అనుభవించి అవమానం పొందాలి అన్నది అతడి భావం. అర్థప్రౌఢికంటె గాఢబంధత్వమే ఈ రచనలో శబ్దగుణమైన ఓజస్సుకు ప్రాణంపోస్తున్నది. ఈ నాలుగుపద్యాలు ఒకటికంటె మరొకటి విలక్షణమైనవి, విశిష్టమైనవి.

భీముడిశపథాలు ద్వంద్వయుద్ధాలకే పరిమితమైనవి. అయితే, అరణ్యానికి పోతూ 'దుర్యోధనాదులగు రిపుల'ను చంపుతా నని శపథం చేసినట్లు భీముడిచేత నన్నయగారు అనిపించారు (సభా.2.295) కాని అందులో ఓజస్సు లేదు. పైపద్యాలలోని తేజస్సుకూడా లేదు. కాగా, అరణ్యానికి పోతూ పాండవులు చేసిన ప్రతిజ్ఞలలో కవ్వడి చేసిన ప్రతిజ్ఞ కవోష్ణంగా ఉన్నది. "కనకోర్వీధర....." అన్న మత్తేభం ఓజోగుణభూయిష్ఠం. అర్జునుడి ప్రతిజ్ఞలో అంతర్నిగూఢ క్రోధం గర్జించినట్లయింది. వికటత్వ మనే ఉదారతతో కూడుకొన్న ఔజ్జ్వల్యంకూడా ఆ మాటలలో ఉన్నది. పక్షులముందు పిండాలు వేసినట్లుగా, రక్తతర్పణాలతో పక్షులు (ప్రేతాలకు ప్రతినిధులు) సంతోషపడేటట్లు కర్ణాదులను చంపుతా నన్నాడు పార్థుడు. అగ్రామ్యత్వంతోడి వికటత్వం. అర్థప్రౌఢితోకూడిన గాఢబంధత్వం అర్జునుడి ధీరోదాత్తప్రవృత్తిని వీరరసమూర్తిని ధ్వనింపజేస్తున్నాయి. (మరిన్ని వివరాలకు వ్యాఖ్యానంలోని విశేషాంశాలు చూడండి).

నన్నయగారి సభాపర్వంలో ఈ అయిదుపద్యాలూ ఓజో(శబ్ద)గుణప్రధానకవితకు పద్యపతాకలు!

రౌద్రరసపోషణంలో తిక్కన శబ్దగుణంకంటె అర్థగుణానికి ఏవిధంగా ప్రాధాన్యా న్నిస్తాడో గమనిస్తే నన్నయతిక్కనల గుణవద్రచనలలోని భేదాన్ని తెలిసికొనటం తేలికౌతుంది. ముందుగా తిక్కన నన్నయవలె ఓజోగుణాన్ని శబ్దగుణంగా వెలార్చే విధానానికి ప్రసిద్ధమైన పద్యం ఒకటి-

శా. "దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పుతుల్
గీర్వాణాకృతు లేవు రిప్లు నిను దోర్లీలన్ వెస న్గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా!". **(సభా. 2-55)**

పాండవుల రౌద్రవిభావవిస్ఫూర్తిని ప్రకటింపజేసే ద్రౌపదివాక్యాలలో ఆకృతినిరూపణసామర్థ్యం గల శబ్దగుణమైన ఓజస్సును కూర్చటం ఔచిత్యం. అయితే, తిక్కన రచనలో విభావాలను భావమూర్తులుగా చిత్రించే శిల్పమే అధికం; భౌతికరూపచిత్రణంకంటె భావక్రియారూపచిత్రణమే విస్తారం. పైపద్యంలో రౌద్రవిభావ ప్రదర్శనం చేసిన పద్ధతి శబ్దగుణాశ్రయంగా తిక్కన రచించి చూపించినా ఆయన ప్రధానంగా భావోచితవాక్యవిన్యాసంద్వారా పాత్రలప్రవృత్తులను వ్యంజింపజేసే అర్థగుణాశ్రితమైన రచనాశక్తిని ప్రకటించడంలో తన ప్రజ్ఞాప్రాభవాన్ని ప్రసిద్ధంగా ప్రదర్శించాడు. అందుచేత తిక్కన రచనలో అర్థగుణదీప్తి భాసిస్తుంది. ఉదాహరణకు భీముడి రౌద్రప్రవృత్తిని ప్రకటించే ఈ పద్యం చూడండి:

మ. "అవనీచక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొంద న

ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతార్థత్వంబు నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్''. **(సభా. 2.284)**

రౌద్రరసోన్నిద్ర మైన ఈ పద్యంలో నిజానికి తిక్కన శబ్దగుణప్రధాన మైన సమాససంఘటనను ప్రవేశపెట్టియుండవలసింది. కాని, గాఢబంధత్వంతో కాక అర్థప్రౌఢితో భీమరౌద్రాన్ని తిక్కన వ్యక్తీకరించాడు. తిక్కన కిట్టిరచన అత్యంతప్రీతిపాత్రం. ఓజస్సును రౌద్రంలో నిబంధించటం రసవద్రచనాధర్మం. అయితే, దానిని శబ్దగుణంగా వెలార్చాలా, అర్థగుణంగా వెలార్చాలా అన్నది కవి ఇచ్ఛాధీనం. తిక్కన పైపద్యంలో అర్థగుణ మైన ఓజస్సును ప్రదర్శించిన తీరు అపూర్వం. క్రోధం స్థాయిభావం. అది కృతార్థత్వం పొందటం అంటే రౌద్రంగా మారటమే. దానిని భావరూపంగా, క్రియారూపంగా కీచకుడి పట్ల ప్రదర్శించి చూపుతా నని భీమప్రతిజ్ఞ. రౌద్రరసమూర్తి అంటే ప్రళయకాలరుద్రునిమూర్తి అనే అర్థవిశేషం ధ్వని. ఆ రుద్రమూర్తిని చూచి ప్రకృతి సంక్షోభిస్తుంది. అటువంటి రౌద్రమూర్తిని ప్రదర్శిస్తానని భీముడి భావం. అప్పుడు కీచకుడుకూడ సంక్షోభాన్ని పొంది చిత్రవధకు గురిఔతాడట. భీముడిని ప్రళయరుద్రుడిగా భావింపజేసే అర్థప్రౌఢి ఇందులో ప్రధానం. రౌద్రరసంనుండి జనించే కరుణరసం భావనారమ్యం. ఇక్కడ శబ్దం అర్థంలో మునిగింది. శబ్దగుణంకంటె అర్థగుణం సాత్త్వికమైనదీ, సూక్ష్మమైనదీ, సుందరమైనదీ అయి, ఆస్వాదమాధుర్యాన్ని పఠితకు భావనామయంగా అందిస్తుంది. ఈ పద్యాలు రెండింటినీ గమనిస్తే నన్నయమార్గాన్ని అనుసరిస్తూనే తనప్రత్యేకతను తిక్కన ఎట్లా ప్రపంచించాడో స్పష్టమౌతుంది. ఉభయులమార్గాలలో ఉన్న సామ్యభేదాలు తేటపడతాయి.

శ్లేష, సమాధి, ఉదారత అనే గుణాలు ఓజస్సులో అంతర్భవిస్తాయి. వాటిని నన్నయ సభాపర్వంలో నిర్వహించినతీరు గమనించదగింది. బహుపదముల ఏకవద్భావం శబ్దాశ్రితమైన శ్లేషం. సన్నివేశఘటన అర్థాశ్రితమైన శ్లేషం. ఈ రెండింటియొక్క చక్కని సంయోజనంతో శ్లేషను శబ్దగుణప్రధానంగా ఆవిష్కరించిన నన్నయపద్యం-

ఉ. ''ఆ వనజాననం గురుకులాపశదుండు గడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్రపవిత్రవారిధా
రావళిఁ జేసి పావనములైన శిరోజములం దెమల్చి పా
పావహుఁ డీడ్చి తెచ్చె సభ కందఱు సంభ్రమమంది చూడఁగన్''. **(సభా. 2.216)**

సన్నివేశం రౌద్రరసగంభీర మైనది. నిర్దయుడైన దుశ్శాసనుడు ద్రౌపదిపవిత్రదీర్ఘకేశాలను పట్టి నిండుసభకు లాగుకొనివచ్చే క్రియాబహుళమైన సన్నివేశాన్ని నన్నయ శ్లేషలో నిబంధించాడు. అక్షరాలు వేరైనప్పటికీ ఒకేపదంవలె తోపింపజేసే సంహిత(సమీపోచ్చారణం)కు అనుకూలమైన వర్గాక్షరాల విన్యాసవిశేషంచేత గాఢంగా భాసించేది శబ్దగుణం. పవర్గ, కవర్గాక్షరాలతో మిళిత మైన అంతస్థశ్వాసాక్షరాల వర్ణవిన్యాసం రౌద్రభావోచిత మైన అక్షరరమ్యతను సాధించి శ్లేషను రూపుకట్టించింది. ద్రౌపది దీర్ఘశిరోజవర్ణనంలో గల దీర్ఘసమాసబంధం శ్లేషలోని ఓజస్సును పోషిస్తూ ఉండగా, దానిని పట్టి లాగుతున్న దుశ్శాసనుడిచర్యను వర్ణించే పదాలలోని శైథిల్యం పఠితకు స్ఫురించకుండా రచించటంలో శ్లేష భాసించింది. ఓజస్సుకు అంగంగా నిలిచి తన అస్తిత్వాన్ని ఆకృతికట్టించుకొన్నది. సన్నివేశం నిర్విరామంగా, ఏకధాటిగా ఒక్కుమ్మడిగా దానినిగురించి విశ్లేషించి తెలుసుకొనటానికి వీలులేకుండా సాగినట్లు చిత్రించిన ఈ శ్లేషగుణం సార్థకం. శబ్దప్రధానమైన మసృణత్వం ఘటనను తనలో ముంచివేసినట్లు రచించిన నన్నయరచన రౌద్రరసోన్నిద్ర మైన శబ్దశ్లేషగుణానికి ఉదాహరణం. అది ఓజస్సును తనలో నిలుపుకొన్నది కాబట్టి ఓజోగుణసుందరం.

నన్నయ తిక్కన రచనలలో శ్లేష శబ్దార్థఘటనల వ్యక్తిత్వాలను అపూర్వంగా ఆవిష్కరించే శిల్పాన్ని వెలార్చగలిగింది. అందువలన నన్నయశ్లేష అక్షరరమ్యతను సంతరించుకొన్నది తిక్కనశ్లేష అర్థసంఘటనకు ఆయువుపోసింది.

శ్లేష తిక్కన అర్థగుణ ప్రయోగ పాండిత్యాన్ని పట్టియిచ్చే గుణం. పదబంధంలోని మసృణత్వమే శబ్దగుణమైన శ్లేషలక్షణం. బహుపదా లున్నప్పటికీ ఏకపదంవలెనే భాసించటం దానిస్వభావం. అర్థగుణమైన శ్లేష అర్థఘటనకు

సంబంధించింది. అనేక భావా లున్నప్పటికీ అవన్నీ నీరక్షీరన్యాయంగా కలిసి వేరుపరచటానికి వీలుకాకుండా మెలగుతూ ఉండే ఐక్యఘటనాన్ని సంవదింపజేసేదిగా అది కనపడుతుంది. మచ్చుకు - తిక్కనప్రసిద్ధపద్యం:

చ. "పగ యడఁగించు టెంతయు శుభం; బది లెస్స; యడంగునే పగం
బగ; వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే; కడుం
దెగ మొద లెత్తిపోవఁ బగఁ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు; నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు గేశవా!". **(ఉద్యో. 3-21)**

శ్లేషలో క్రమమూ, కౌటిల్యమూ, అనుల్బణత్వమూ ఉపపన్నమై ఉండా లని వామనుడు పేర్కొన్నాడు. ఈ మూడు లక్షణాలూ ధర్మజుడి వాక్యఘటనలో అర్థగుణసిద్ధిని పొందాయి. తిక్కనపాత్రలు ఆలోచిస్తూ మాట్లాడుతున్నట్లుండటం ప్రసిద్ధి. వారి మాటల పొందికలో ఎంత మన్నిక ఉంటుందో వాక్యాల కూర్పులో అంత అర్థసంఘటన ఉంటుంది. మాటలను అతకటం శబ్దగుణం; ఊటగా ఊరే భావాలను బహు వాక్యాలలో ప్రవహింపజేసినా ఏకధారను అర్థస్ఫూర్తియందు సంఘటింపజేయడం అర్థగుణం. తిక్కన రచనలో శబ్దగుణమైన శ్లేష అర్థగుణమైన శ్లేషకు ఊడిగం చేస్తుంది. వాక్యవిన్యాసంలో ఏకసూత్రంగా ఉండే ఆలోచనాక్రమం ఒక్కొక్కప్పుడు వక్రతతో కూడివున్నా అనుల్బణత్వాన్ని ఆద్యంతమూ సమాదరిస్తుంది. ఇది తిక్కన సంభాషణశిల్పంలోని ఆయుస్సూత్రం. పైపద్యంలోని ధర్మజుడి వాక్యరచన అర్థగుణమైన శ్లేషకు శీర్షప్రాయమైన ఉదాహరణం.

ఆరోహావరోహక్రమం శబ్దగుణమైన సమాధిలక్షణం. పద్యంలోని రచనాబంధం క్రమంగా హెచ్చుతూ తగ్గుతూ, దిగుతూ ఎక్కుతూ శ్రోతలకు రచనమీదా, తద్ద్వారా రసభావప్రకటనం మీదా రక్తి కలిగించటమే శబ్దగుణప్రయోజనం. అర్థగుణమైన సమాధి పద్యంలోని తాత్పర్యంమీద పఠితబుద్ధిని సమాహితంచేసి అర్థదర్శనం చేయిస్తుంది. నన్నయరచనలో శబ్దసమాధికి అర్థసమాధి అంగం. ఉదాహరణకు-

మ. "అవనీనాథు లనేకు లుండఁగ విశిష్టారాధ్యు లార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులు పల్వు రుండఁగ ధరిత్రీనాథ! గాంగేయు దు
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితున్ వార్ష్ణేయుఁ బూజించి నీ
యవివేకం బెఱిఁగించి తిందఱకు; దాశార్హుండు పూజార్హుఁడే!". **(సభా. 2.8)**

శిశుపాలుడి ఈ అధిక్షేపవాక్యాలలో మూడురకాల వాక్యవిన్యాసా లున్నాయి. సభలో నిండియున్న అవనీనాథులనూ, విశిష్టారాధ్యులనూ, ఆర్యులనూ, మహీదివిజులనూ, పూజ్యులైన అనేకులనూ చేయెత్తి నిర్దేశించిచూపిస్తూ, వా రందరి మహత్త్వాన్నీ ఎలుగెత్తి చెప్తూతూ ఉదాత్తఫణితిలో ఆరోహక్రమంలో మొదటివాక్యం అన్నాడు. ధరణీనాథ! అనే సంబుద్ధి అధిక్షేపాత్మకం; అవివేకిని పట్టుకొని మహారాజా! అని పిలిచినట్లు పిలిచే వైఖరితో పిలిచిన పిలుపది. అక్కడినుండి 'నీ అవివేకం బెఱిఁగించి తిందఱకు'- అనేంతవరకూ అభిశంసనాత్మకంగా మాట్లాడుతూ వాక్యవిన్యాసంలో అవరోహక్రమం భాసించేటట్లు పలికాడు - శిశుపాలుడు. 'దాశార్హుండు పూజార్హుఁడే?' అనే వాక్యం అమర్షాధిక్షేపాత్మక మైన ఆవేశంతో వేసిన ప్రశ్న. శిశుపాలుడి కోపం తీవ్రస్థాయిని అందుకొన్న దీర్ఘాక్షర రూక్షవచనం, ఆరోహక్రమానికి అచ్చమైన అభివ్యక్తి.

శిశుపాలుడి రౌద్రప్రవృత్తికి ఈ పద్యం అద్దంపట్టుతుంది. ఆరోహావరోహక్రమంలో ఒక వర్తులం ప్రదర్శిత మైన అక్షరవిన్యాసం ఈ పద్యంలోని శబ్దసమాధి శిల్పం. పద్యంలోని 'కృష్ణుఁ గష్టచరితున్ వార్ష్ణేయుఁ బూజించి' అన్నప్పుడూ, 'దాశార్హుండు పూజార్హుఁడే' అని అధిక్షేపించినప్పుడూ అర్థం గూఢంగా ద్యోతక మౌతున్నది కాబట్టి అర్థదర్శనప్రధానమైన అర్థగుణసమాధికంటె ఆరోహావరోహక్రమ విన్యాసప్రధానమైన వాక్యవిన్యాసమే ప్రస్ఫుటంగా ఉండటంచేత ఇది శబ్దగుణప్రధానమైన సమాధిగా నిశ్చయించవచ్చును.

సమాధిలో లఘ్వక్షరవిన్యాసమున్న రచనలో అవరోహం, గుర్వక్షర విన్యాసమున్న రచనలో ఆరోహం అధికంగా భాసిస్తాయి. అందులో- అవరోహంనుండి ఆరోహాన్ని అందుకొనే శబ్దగుణసమాధిని నిబంధించే పద్ధతి ఒకరకం. వక్తవ్యాంశాన్ని క్రమపరిణామపద్ధతిలోగాని, ఆరంభవివరణపద్ధతిలోగాని చెప్పే ప్రతిపాదనవిధానంలో శబ్దగుణం రాణిస్తుంది. అటువంటి పద్యంలోని రచన రక్తిని కలిగించినా అది అంతటితో ఆగకుండా ప్రతిపాద్యాంశంలో పఠితమనస్సును అవహితం చేసే గుణాన్ని ప్రకటిస్తుంది. అర్థప్రతిపాదనకంటె అక్షరవిన్యాసం ఆకర్షణీయంగా ఉండేది శబ్దగుణం. అక్షరవిన్యాసంకంటె అర్థప్రతిపాదన ఆకట్టుకొనేది అర్థగుణం. ఒకటి నన్నయసొత్తు. మరొకటి తిక్కనసొత్తు.

ఆరోహక్రమాన్ని అందంగా ప్రదర్శించే శబ్దసమాధిగుణానికి ఉదాహరణం-

ఉ. "పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు, వీని నేల భూ
పాలక నీకుఁ బట్టువఱుపన్, మఱి ధర్మ్మ వెఱుంగ వీనికిం
బోలునె రాగకోపపరిభూతమనస్కున కల్పరాజ్య ల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్తమహత్పరివాదశీలికిన్". **(సభా. 2.22)**

శిశుపాలుడిని బాలుడిగా చెప్పి అధిక్షేపించే మాటలనుండి, తనకు ధర్మం తెలియ దని నిందించిన శిశుపాలుడిలో ధర్మం తెలియలేని అవగుణాలను ఏకరువుపెట్టే ఆవేశాత్మకమైన వాక్యవిన్యాసంవరకు సాగే ఈ పద్యంలోని అక్షరవిన్యాసంతోపాటు వాక్యవిన్యాసంకూడా అవరోహంనుండి ఆరోహంవరకు సాగే సమాధిని సాక్షాత్కరింపజేస్తూ క్రోధభావద్యోతకంగా నిలిచింది.

పద్యంలో అవరోహక్రమం భాసించే పద్ధతికి ఉదాహరణం-

చ. "అతులపరాక్రమార్జితములైన ధనంబుల పేర్మిఁ జేసి యు
న్నతమగుచున్నపాండునరనాథతనూజులలక్ష్మి నా కస
మ్మత మయి సూ వెలింగె విను మాతుల! మానధనాఢ్యుఁ డైన భూ
పతి సహియింపనోపునె సపత్నులవృద్ధియు నాత్మహానియున్." **(సభా. 2.98)**

దుర్యోధనుడి అర్థప్రధానమైన రౌద్రరసానికి పాండవసంపదను చూచి సహించలేకపోవడమే మూలం. పాండవసంపద ప్రసక్తివచ్చినప్పుడు ఆరోహక్రమం, దానిని చూచి సహించలేక విచారిస్తున్నప్పుడు అవరోహక్రమం రచనలో ఉండటం సహజంకూడా. ఆ క్రమమే ఈ పద్యశిల్పంలో పాటించిన శబ్దసమాధిగుణం. రచనలో అర్థదర్శనంకంటె అక్షరప్రదర్శనకే ఆధిక్యం ఉండటం శబ్దగుణస్వభావం. దీనిలో నన్నయ అందెవేసిన చేయి.

తిక్కనరచనలో ఆరోహావరోహాలక్రమం అందంగా అమరి ఉన్నా దానికంటె అర్థదర్శనం అగ్రతాంబూలం అందుకొంటూ ఉంటుంది. పై రెండురకాలకూ తిక్కనగారి పద్యాలు-

చ. "అనయము పుట్టె జూదమున; యప్పుడ యెంతయుఁ జిచ్చువెట్టి కా
ల్చినయది నీ యుపేక్షయ; వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి; యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వినఁడును గానఁడుం; బిదప నీకును నాకు మరల్పవచ్చునే?". **(ఉద్యో. 2.14)**

ఇది తిక్కనగారిప్రసిద్ధపద్యం. ధర్మరాజును 'మెత్తనిపులి'గా తెలుగువారికి పరిచయం చేసిన పద్యం. ఇందులోని వాక్యవిన్యాసం గూఢమైన ధర్మజుడి క్రోధాన్ని సమాధిగుణమయంగా ఆవిష్కరించటానికి వినియోగించిన సంభాషణశిల్పం. ధృతరాష్ట్రుడికి ఆమోదం కాని తాత్పర్యాన్ని సత్యకథనదృక్పథంతో చెప్పిన సంజయుడివాక్యాలలో రచన అవరోహంనుండి ఆరోహానికి

ఎక్కటం రచనలోని శబ్దగుణసార్థక్యం. అయితే ఆ గుణంకంటె అర్థదర్శనమే ఈ పద్యంలో అధికంగా ప్రకాశిస్తున్నది. అది తిక్కనకవితాకళ!

శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడితో చెప్పిన మాటలలో దీర్ఘాక్షరబహుళమైన రచనతో ఎత్తుకొని లఘ్వక్షరబహుళమైన రచనతో పద్యాన్ని ముగించి, ఆరోహణనుండి అవరోహణంగా దిగివచ్చే పద్ధతిని తిక్కన ప్రదర్శించాడు.

ఉ. "కౌరవపాండవుల్ తెఱఁగు గైకొని శాంతతఁ బొందియున్కి మే
లారయ నాకు నీకుఁ గులమంతకు నీనృపకోటి కుర్వికిం;
బోరితమైన నింతకును బుట్టు మహాపద; గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య! గణుతించి యవశ్యముఁ బొం దొనర్పవే!" **(సభా. 3.262)**

సచివుడైన సంజయుడు అవరోహంతో ఆరంభించి అర్థసమాధిని మాటలలో రంగరించటం, స్వతంత్రుడైన శ్రీకృష్ణుడు ఆరోహణంలో ఆరంభించటం అర్థవంతంగా బోధించటం గమనిస్తే తిక్కనకూడా సందర్భశుద్ధి నెరిగి శబ్దార్థగుణాలను సార్థకంగా ప్రయోగించటం నన్నయనుండి గ్రహించా డని తెలుస్తుంది.

వికటత్వం ఉదారత. ఏ రచనలో శబ్దాలు నృత్యంచేస్తున్నట్లు వికటత్వాన్ని ప్రదర్శిస్తాయో అది శబ్దగుణమైన ఉదారతాగుణంతో కూడిఉన్న దని చెప్పాలి. కాని, ఉదారతాగుణం అర్థగుణంలో అగ్రామ్యత్వంగా శోభిస్తుంది. ఉపాలంభనాదులలో ఔచిత్యపోషణకు ఉదారతాగుణం ఉదాత్తపాత్రలకు ఉపాలంబనంగా ఉంటుంది. జరాసంధుడు శ్రీకృష్ణభీమార్జునులతో అన్నమాటలు-

ఆ. "మీరు నాకు నేను మీకు నెన్నండు ము
న్నహిత మాచరించినదియు లేదు
మీకు నేల నే నమిత్రుండ నైతి? ని
రాగసుండ సద్గుణాన్వితుండ." **(సభా. 1.186)**

శ్రీకృష్ణుడి మాటలకు జరాసంధుడు మనసులో ఉడికిపోయి, ఉవ్వెత్తుగా రేగుతున్న రోషకోపాలను అదుముకుంటూ కసిగా అంటున్న మాట లివి. గలగలగలగల- నడకతో నడిచిన మాటలు నృత్యాయమానంగా ఉన్నాయి. నన్నయరచనకు తోడుగా ఆటవెలదిని ఛందంగా వాడటం విశేషం. క్రోధఘూర్ణితవచనంలోని వికటత్వం ఆత్మసమర్థనంలో, ఆత్మస్తుతిలో అర్థవంతంగా రాణిస్తున్నాయి. అగ్రామ్యత్వంకంటె పైపద్యంలో వికటత్వమే ప్రచురంగా వెలువడింది.

పాండవులు అడవులకు ఎట్లా పోయారో వివరంగా విని, వారివలన కౌరవులకు కీడు తప్పదని శంకించి దుఃఖిస్తూ ఉన్న ధృతరాష్ట్రుడిని చూచి, కుపితుడైన విదురుడు పలికిన మాటలు నిప్పులవలె చిటపటలాడిన వాక్యవిన్యాసాలు; వికటత్వానికి అక్షరరూపాలు. అవి తరలవృత్తంలో తురంగలించాయి.

తరలము.
"వగవ నేటికి నింక నైనను వారలం బిలిపించి యీ
జగతి నెప్పటియట్ల యేలుచు సంతసంబున నుండఁగా
జగదధీశ్వర! పంపు, వంచన చన్నె! యన్యులసంపదల్
మిగిలి చేకొన నిట్లు సేసిన మెత్తురే మది నుత్తముల్?" **(సభా. 2.315)**

తిట్టవలసినచోట గౌరవంగా మొట్టినట్లు మాట్లాడిన ఈ మాటలు అగ్రామ్యత్వాన్ని ప్రదర్శిస్తున్నా, ఆ మాట లనే తీరులో గోచరించే వికటత్వం పరితలహృదయాలను ప్రధానంగా ఆకర్షిస్తుంది. ఇది నన్నయ శబ్దగుణమైన ఉదారతాగుణం.

తిక్కనకూడా రసౌచిత్యపాలనంలో ఈ గుణాన్ని నిపుణంగా వాడతాడు. అర్జునుడు దుర్యోధనుడిని ఉపాలంభిస్తూ అన్నమాటలు ఇందుకు ఉదాహరణాలు.

ఉ. "క్షత్రియుఁ డోడునే తగదు కౌరవరాజ! యొకండ నేఁ బృథా
పుత్త్రులలోనఁ బిన్న, నినుఁ బోరికిఁ బిల్వఁగ మాని నాఁగ ని
ర్ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కి బలదర్పసమగ్రుఁడ వైన నీవు నీ
మిత్త్రులుఁగూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ భూపతుల్?" **(విరా. 5.203)**

అర్జునుడిఅధిక్షేపం సభాపర్వంలోని కథార్థాలమీద ఆధారపడి ఉన్నది. సుహృద్ద్యూతానికి పిలిచినా, యుద్ధానికి పిలిచినా క్షత్రియుడు ఎదురొడ్డి యశస్సో మృత్యువో తేల్చుకోవాలికాని రణభూమి వదలిపారిపోకూడదు. ఈ ధర్మాన్ని ఆధారంగా చేసికొని ధర్మజుడిని జూదంలో ఓడించాడు శకుని సాయంతో దుర్యోధనుడు. ఇక్కడ అర్జునుడు యుద్ధానికి పిలిచాడు. కాని దుర్యోధనుడు నిలువలేక పారిపోతున్నాడు. నేతిబీరకాయ తీరుగా వీరుడైన దుర్యోధనుడిని నోరారా ఎగతాళిగా ఎత్తిపొడుపుగా వాక్యాలను ఉదాత్తానుదాత్తాలుగా పలుకుతూ అర్జును డంటున్న మాటలు ఉదారతకు ఊపిరిపోస్తున్నాయి. అవి అధిక్షేపాలే కాని గ్రామ్యాలు కావు. శబ్దగుణాలకు నన్నయ రమణీయతను నేర్పితే, తిక్కన రంజకత్వం అలవరచాడు.

ఈ విధంగా శ్లేష, సమాధి, ఉదారతలు వీర రౌద్ర రసపోషకాలై ఓజస్సుకు అంగాలుగా రాణిస్తాయి. అందులో లీనమౌతాయి.

## నన్నయకవితలో ప్రసాదం

ఓజోగుణంతో కూడుకొన్న శిథిలబంధం ప్రసాదం. ప్రసాదం శబ్దగుణమైతే బంధశైథిల్యంవలె కనపడుతుంది. శిథిలబంధంలో కూడా అర్థవైమల్యం అర్థగుణప్రసాదం. ప్రసన్నంగా చెప్పే పద్ధతికి సంబంధించింది శబ్దగుణప్రసాదం. పద్ధతి నాశ్రయించి ప్రతిపాద్యాంశాన్ని ప్రసన్నంచేసేది అర్థగుణప్రసాదం. నన్నయలో శబ్దప్రసాదం ఎక్కువ; తిక్కన్నలో అర్థప్రసాదం అధికం.

చ. "ప్రియహితసత్యవాక్య! యరిభీషణ! కృష్ణ! భవన్నిదేశసం
శ్రయమున నున్న మా కధికశత్రుజయం బగు టేమి పెద్ద? ని
శ్చయముగ నింక మోక్షితుల సర్వమహీశులు; నిమ్మహాధ్వర
క్రమమును సిద్ధిఁ బొందె నయకిల్బిషకీర్తి వెలుంగుచుండఁగన్". **(సభా. 1. 166)**

ఈ పద్యంలో గాఢమైన రచనాబంధం శిథిలమైనట్లు కనపడుతున్నది. ఎందుకొరకు? అది వీరరౌద్రరసభావచర్వణంవలన కలిగే చిత్తవిస్తారంకంటె ఆహ్లాదంవలన కలిగే చిత్తవికాసం వంటి అనుభవాన్ని అందించాలి కాబట్టి. రాజసూయ యజ్ఞ నిర్వహణ ప్రయోగాని కంతా సూత్రధారుడుగా నిలిచిన శ్రీకృష్ణుడినిగురించి కృతజ్ఞతాబద్ధంగా ధర్మజుడు ప్రదర్శిస్తున్న ఆహ్లాదమానసికస్థితికి అభివ్యక్తి ఈ పద్యం. ఇటువంటి రచన నన్నయకు ప్రీతిపాత్రం. ఇది సర్వరససామాన్యమైన రచన.

భారతంలో నాయకుడైన ధర్మజుడి ప్రశంసలుగాని, ప్రసంగాలుగాని సాధారణంగా ప్రసాదగుణభూయిష్ఠాలుగా ఉండేటట్లు నన్నయ రచించాడు. ఆవిధంగా నాయకుడిని ఆశ్రయించుకొని సాగే స్థాయిభావంగాని, తత్పోషకాలైన భావాలుకాని ప్రసాదగుణప్రధానంగా ఉండటం ఔచిత్యమని నన్నయ భావించినట్లున్నాడు. ఉదాహరణకు- ఈ పర్వంలో కొన్నిపద్యాలు.

1. పాండవులలో అగ్రజుడైన ధర్మజుడిని రాజసూయయాగం చేయగలిగిన సమర్థుడిగా పాండురాజు పలికినమాటలలో అతని యుధిష్ఠిరత్వం వ్యంగ్యం. ఆ వీరరసమూర్తిని వర్ణించినపద్యం. "అనుపమశక్తిమంతులు......" (సభా.1.90)

2. అర్జునుడు ధర్మరాజును రాజసూయం చేయుమని ప్రశంసిస్తూ చెప్పిన పద్యం వీరరసానుగుణం. "భూభుజులం జయింపుము....." (సభా.1.128)

3. దిగ్విజయానంతరం ధర్మజుడు శ్రీకృష్ణుడిని ప్రశంసించటం "ధారుణీధర! ధర్మతత్త్వనిధాన!......" (సభా. 1.270) భక్తిభావపోషకం.

4. శ్రీకృష్ణుడు ధర్మజుడిని భారతాన్వయభూషణుడిగా ప్రశంసించటం. "పూజ్యుఁడ వెల్లవంశముల భూపతులందును...... (సభా. 1.279)

5. ప్రజలు దర్శించిన రాజసూయయాగదీక్షితుడైన ధర్మజుడిస్వరూపవర్ణన. "సమ్మదమంది చూచిరి...... ధర్మనందనున్" (సభా. 1.290)

6. ధర్మరాజు భీష్ముడిని సభలో పుట్టిన కలకలాన్ని మాన్పు మని ప్రార్థించటం, భయభావం- "ధరణిలోఁ గల రాజు లెల్లను......... (సభా. 2.35)

7. రాజసూయయాగం ముగించిన ధీరుడు ధర్మజుడివర్ణన. (సభా. 2.73) రాజుల ప్రశంస. (సభా. 2.75)

8. ధర్మజుడినిగురించిన శ్రీకృష్ణప్రశంస. (సభా. 2.81)

9. ధర్మజవైభవాన్ని దుర్యోధనుడు ప్రశంసించిన పద్యాలు- (సభా. 2.110, 111)

10. ధర్మరాజువ్యక్తిత్వాన్ని అర్జునుడు ప్రశంసించినపద్యం (సభా. 2.224)

11. ఉదాత్తులవర్ణనలలోనూ, దిక్పాలకాదుల సభలను వర్ణించటంలోనూ నన్నయప్రసాదగుణాన్నే రచనలో పోషించి ఔదాత్యాన్నీ, ఓచిత్యాన్నీ పాటించాడు.

తిక్కనఅర్థగుణమైన ప్రసాదాన్నే ఎక్కువ రమిస్తాడు.

ఉ. "దక్కెను రాజ్యమంచు నకటా! యిటు దమ్మునిభాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచె దది యె ట్లఋగున్? విను- మీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినచాడ్పునూవె యి
ట్లుక్కివుఁడైన నీకొడుకు నుల్లము నున్నటు లాడఁగూడునే?" **(ఉద్యో. 2.52)**

ఈ పద్యంలో బంధశైథిల్యం ఉన్నా దాన్ని మించిన భావనైర్మల్యం ఉన్నది. ప్రతిపాద్యాంశంకంటె పదరచనాన్ని చూపించి పరవశింపచేసేది శబ్దగుణమైన ప్రసాదం. రచనాన్ని ఆలంబనంగా చేసికొని రమణీయభావాభివ్యక్తిని రమింపచేసేది అర్థగుణ మైన ప్రసాదం. తిక్కన ఉభయగుణ నిర్వహణ ప్రౌఢిని ప్రకటించగల ప్రజ్ఞావంతుడైనా ఉత్తరోత్తరాలు బలీయాలని భావించే అర్థగుణవాది.

ప్రసాదగుణంలో పర్యవసించే గుణం అర్థవ్యక్తి. ఝటిత్యర్థప్రతిపత్తిహేతుత్వం శబ్దగుణమైన అర్థవ్యక్తిలక్షణం. వస్తుస్వభావ తత్త్వం అర్థగుణమైన అర్థవ్యక్తి. నన్నయ తిక్కనలకు అర్థవ్యక్తి అంటే అలవిమాలిన అభిమానం. ఇరువురికవిత్వాలలోనూ ఈ వ్యక్తిగుణబలంతో ఎన్నో అనర్ఘరత్నాలవంటి పద్యాలు వెలువడ్డాయి. మచ్చు కొక్కొక్కటి- శిశుపాలవధ ఘట్టంలో ధర్మజుడినోట కృష్ణుడి మహత్వాన్నిగురించి నన్నయ పలికించిన పద్యరత్నం.

ఉ. "ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పద మైనవాఁడు, వే
దాది సమస్తవాఙ్మయములందుఁ బ్రశంసితుఁ డైనవాఁడు, లో
కాది త్రిలోకపూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని; యుక్తమ కాకిది యేమి దోసమే?" **(సభా. 2.18)**

కౌరవసభలో శ్రీకృష్ణుడు చేసిన ఉపన్యాసంలో ధర్మరక్షకుడైన భగవంతుడితత్త్వాన్ని గురించి చెప్పిన పద్యరత్నం.

ఉ. "సారపుధర్మమున్ విమలసత్యముఁ బాపముచేతఁ బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచేటగుఁగాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్." **(ఉద్యో. 3.273)**

నన్నయపద్యంలో శ్రీకృష్ణుడే పరమాత్ము డని చెప్పే తాత్పర్యం పండుఒలిచి చేతిలో పెట్టినట్లు చెప్పబడింది. తత్సమపదబహుళంగా, నాతిదీర్ఘసమాససుందరంగా, అర్థగంభీరంగా చెప్పిన ధర్మజుడిమాటలలో ఓజస్సుయొక్క శిథిలబంధం అర్థవ్యక్తిహేతువుగా రాణిస్తున్నది. పితామహుడు, లోకాది, త్రిలోకపూజ్యుడు, ఆత్మ నెఱింగి- అనేమాటలలోని గాఢమైన అర్థాన్ని భావన చేస్తే పురుషోత్తమతత్త్వం తేటపడుతుంది. తిక్కనపద్యంతో పోలిస్తే నన్నయపద్యం శబ్దసుందర మనటంలో అనుమానం లేదు. నన్నయది సార్థకశబ్దప్రయోగం. తిక్కనది సాభిప్రాయశబ్దప్రయోగం. తిక్కనరచనలో శబ్దాలు నన్నయరచనలోకంటె దేశీయముద్రను కలిగిఉన్నాయి. నన్నయకంటె తిక్కన తేటతెలుగుమాటలలో చెప్పటానికి ప్రయత్నించాడు. అందువలన శబ్దంకంటె అర్థం ప్రధానమైన రచనగా అనిపిస్తుంది. ధర్మాన్ని తెలిసిన దక్షులు సారపుధర్మాన్నీ, సత్యాన్నీ రక్షించక ఉపేక్ష చేస్తే వారికి చేటు కలుగుతుందనీ, ధర్మాన్నీ సత్యాన్నీ దైవం తానై పూనుకొని రక్షిస్తుందనీ భారతకథాతత్త్వవ్యంజకంగా పలికాడు శ్రీకృష్ణుడు. ధర్మరక్షాదక్షు డైన దైవంయొక్క స్వభావాన్ని వ్యాఖ్యానించే వాక్యసముదాయం ఇందులో ప్రసన్నంగా ప్రకాశిస్తుంది కాబట్టి అర్థవ్యక్తి అర్థవంతంగా అవతరించింది. నన్నయ తిక్కనల పద్యాలు కలిపి చదువుకొనే తెలుగువారికి అర్థవ్యక్తియొక్క ఉభయశక్తులూ అనుభవంలోకి వస్తాయి. అర్థవ్యక్తి ప్రసాదగుణంలోనే అంతర్భవించగలదు. ఎందువల్లనంటే ప్రసాదానికి అర్థదీప్తిని కలిగించే శక్తి అర్థవ్యక్తి కాబట్టి.

## నన్నయకవితలో మాధుర్యం

పరుషగుణాల పోషకశక్తి ఓజస్సయితే, లలితగుణాల రంజకశక్తి మాధుర్యం. సర్వగుణాల దీపకశక్తి ప్రసాదం. ప్రసాదమాధుర్యాలు కవలపిల్లలవంటివి. ఓజఃప్రసాదాలు ప్రాణస్నేహితులవంటివి. మాధుర్యంలో అంతర్భవించే గుణాలు- సౌకుమార్యం, కాంతి, సమత. ఇవి ప్రసాదానికికూడా పోషకంగా నిలుస్తాయి. మమ్మటుడు ప్రధానత్రిగుణాలనుగురించి చెప్పుతూ ఇట్లా అన్నాడు-

శ్లో. "మాధు ర్యౌజః ప్రసాదాఖ్యా స్త్రయ స్తే న పునర్దశ"
"కేచి దంతర్భవం త్యేషు దోషత్యాగా త్పరేశ్రితాః
అన్యే భజంతి దోషత్వం కుత్రచి న్న తతో దశ" **(కావ్యప్రకాశమ్. 8 ఉల్లాసం. కా. 68, 72)**

మాధుర్యం, ఓజస్సు, ప్రసాదం అనేవి మూడేగుణాలనీ, అందులోనే మిగిలిన కొన్నిగుణాలు అంతర్భవిస్తాయనీ చెప్పుతూనే, కొన్ని గుణాలు దోషాలను తొలగించటంవలన స్ఫురించేగుణాలేననీ, మరికొన్ని గుణాలుగా చెప్పబడినా వాటిని అట్లాగే గ్రుడ్డిగా వాడితే దోషాలుగాగూడా మారవచ్చు ననీ పేర్కొన్నాడు. దోషనివారణంవలన స్ఫురించేది సౌకుమార్యం. కష్టత్వ, గ్రామ్యత్వాదులు దోషాలు. వాటిని నివారించి నిరూపిస్తే సౌకుమార్యం అవుతుంది. మార్గాభేదత్వం సమత. అయితే

కొన్నిచోట్ల సమత పాటించబడకపోవటంకూడా గుణంగా పరిగణించబడుతుంది. కాబట్టి సౌకుమార్యం, సమత ప్రత్యేకగుణాలుగా కాకుండా ప్రసాదమాధుర్యాలలోని అంతర్భాగాలుగా మాత్రమే గ్రహించా లని మమ్మటాదుల మతం. ఔజ్జ్వల్యం లక్షణంగా కలిగిన కాంతికూడా ప్రసాదమాధుర్యాదులకంటె భిన్నంగా పరిగణించవలసిన అవసరం లేదని మరికొందరు భావిస్తారు. ఏమైనా రసానుభవానుకూల చిత్తవృత్తులను దృష్టిలో ఉంచుకొని గుణత్రయవిభాగం చేసే సంప్రదాయంలో చిత్తద్రుతిని కలిగించేది మాధుర్యం. "గుణానాం చైషాం ద్రుతిదీప్తి వికాసాఖ్యా స్త్రిస్ర శ్చిత్తవృత్తయః క్రమేణ ప్రయోజ్యాః । తత్తద్గుణవిశిష్టరసచర్వణా జన్యా ఇతి యావత్" అని జగన్నాథపండితరాయలు. చిత్తాన్ని కరగింపజేసే గుణం లలితం. అందుకే అది మధురం.

పృథక్పదత్వం శబ్దగుణమాధుర్యం. ఉక్తివైచిత్ర్యం అర్థగుణమాధుర్యం, ఉక్తివైచిత్ర్యం లేకుండా వట్టి పృథక్పదత్వం రసపోషకం కాదు. అందువలన నన్నయ ఈ రెండు లక్షణాలనూ కలిపి మాధుర్యాన్ని కలిగించి మనసును కరిగిస్తాడు. మచ్చుకు ఒక్కపద్యం.

ఉ. "ఇచ్చకు వచ్చుపూజనల నెంతయు సంతసమంది తొల్లి నా
కిచ్చె మునీశ్వరుండు దయ నిత్తనయున్; మఱి యిప్డు నెమ్మితో
నిచ్చితి; వీవు రాక్షసివె? యిక్కుల మెల్లను నుద్ధరింపఁగా
వచ్చిన పుణ్యదేవతవు వారిరుహాయతచారులోచనా!" **(సభా. 1.153)**

రెండుముక్కలుగా పుట్టిన పుత్రుడికి ఒక్కరూపు నిచ్చి వంశాన్ని నిలువబెట్టిన జరను 'నీవు రాక్షసివి కావు మా కులదేవతవు' అని కీర్తించే ఈ పద్యంలో బృహద్రథుడి మాటనేర్పరితనం మనసును కరిగించేదిగా ఉన్నది. ఉక్తివైచిత్రి అపహ్నవాలంకారంవలన కలుగుతున్నది. దానివలన కలిగే అర్థచమత్కారంకంటె పద్యంలోని నడకలో ఒడుపుగా సాగే పృథక్పదాల వినియోగసౌందర్యం పఠితలమనస్సులను ఆకర్షిస్తుంది. "వచ్చిన పుణ్యదేవతవు" అనే అభివ్యక్తి మనసును కరగించే బిందువు. ఆ అనుభూతిని అందుకొనటానికి అనువుగా ద్విత్వచకారప్రాస మూడుమెట్లుగా పనికివచ్చింది. 'వారిరుహాయతచారులోచనా' అనే సంబుద్ధిలో బృహద్రథుడితోపాటు పఠితకూడా ఆర్ద్రుడై రసానుభూతి పొందుతాడు.

ఇటువంటి మధురమైన పద్యాలు నన్నయ్యలో కొల్లలు. లలితరసాలలో నన్నయకవిత మధురమూర్తి.

పృథక్పదత్వంకంటె ఉక్తివైచిత్ర్యం శక్తిమంతంగా ఉంటే- అది అర్థగుణమైన మాధుర్యం అవుతుంది. తిక్కనకవితలో ఈ గుణం అధికం. మచ్చు కొకపద్యం.

క. "ఆ రాజు మాదెసం గల
కారుణ్యము కతముననను సుఖంబున ని ట్లు
న్నారము నినుఁ బుత్తెంచిన
గారవమున నాదుమది వికాసముఁ బొందెన్." **(ఉద్యో. 1.276)**

ఇందులో కాకువువలన ఏర్పడే అర్థవైచిత్రియే అర్థగుణం. శబ్దగుణం అర్థగుణంలో మునిగిపోయినట్లుంది ఈ పద్యంలో. ధర్మరాజు మాటల్లో అతడు చెప్పదలచుకొన్న భావం అంబరంవంటిది. దానికి సూచికలుగా నిలిచే నక్షత్రాలవలె పదాలు వెలుగుతూ ఉంటాయి. శబ్దం వాచ్యార్థా న్నిచ్చి, ప్రతీయమానమైన వ్యంగ్యాన్ని స్ఫురింపచేసి, తనను అప్రధానం చేసికొని ఒదిగిపోతుంది తిక్కనకవితలో. అందువలన పానకంత్రాగిన తరువాత గొంతులో నిలిచిపోయిన మాధుర్యంవలె అర్థగుణమే అనుభవంలో నిలుస్తుంది. ఈ అనుభూతి నందించే తిక్కనరచనకు వివరణ అనవసరం.

పదబంధం చెవికి కటువుగా తోపకుండటం శబ్దగుణమైన సౌకుమార్యం. దాన్నే అజరఠత్వం అంటారు. కఠినమైన విషయాన్నిగాని, కరకుగా చెప్పదలచుకొన్న అంశాన్నిగాని చెప్పవలసివచ్చినప్పుడు ఆ కాఠిన్యం, ఆ కరకుదనం స్ఫురించకుండా చెప్పటమే అర్థగుణమైన సౌకుమార్యం. నన్నయతిక్కనలు పాత్రచిత్రణంలో సంభాషణలలో ఈ గుణాన్ని సంజీవనిగా వాడుకొంటారు. మచ్చుకు- దుర్యోధనుడు సభలో చేసిన దుష్కృత్యాలకు అంతఃపురాలలో అపశకునాలు పుట్టాయి. వాటిని చూచి భయపడి గాంధారి విదురుడితో కలసివచ్చి ధృతరాష్ట్రుడితో మొరపెట్టుకొన్నది. అప్పుడు ధృతరాష్ట్రుడు తెలివితో కొడుకును మందలించాడు. ద్రౌపదిని పిలిపించి ప్రశంసించాడు. ఈ ఘట్టంలో నన్నయ సౌకుమార్యాన్ని సలక్షణంగా పోషించాడు. ధృతరాష్ట్రుడు ద్రౌపదితో ఇట్లా అన్నాడు.

క. “సుందరి! నా కోడండ్రుర
యం దభ్యర్హితవు నీవ; యతిముదమున నీ
కొందఁగఁ బ్రియంబు సేసెద
నిందుముఖీ! వేఁడు మెద్ది యిష్టము నీకున్” **(సభా. 2.257)**

అని అన్నాడు. నిండుసభలో అంత జరుగుతున్నా కళ్ళుమూసికొని కూర్చున్న ధృతరాష్ట్రుడూ, దుశ్శాసనుడు లాగుకొనిపోవటానికి వచ్చినప్పుడు ద్రౌపది తనప్రక్కనే నిలిచిఉన్నా పట్టించుకొనక కళ్ళకు పట్టీకట్టుకొని కూర్చున్న గాంధారీ, తమకు కీడు వస్తుందేమో నన్న భయంతో నిష్ఠురా లాడకుండా నెమ్మదిగా నెమ్మిమీర మాట్లాడుతున్నారు. విదురుడు నిష్ఠురంగా చెప్పినా పట్టించుకోని ధృతరాష్ట్రుడు ఇప్పుడు నీతివాక్యాలు పలుకుతున్నాడు. ప్రాణభీతితో పలుకుతున్న మెత్తని మాటలేకాని ప్రేమమీర పలుకుతున్నవి కావు ధృతరాష్ట్రుడివి. ద్రౌపదికూడా ఆ మాటలతీరును గమనించి ఎత్తిపొడిచి పలుకలేదు. మెత్తగానే, చిత్తంలోని నిప్పును కొంగున దాచిపెట్టుకొనే మాట్లాడింది.

ఆ. “కరుణతోడ నాకు వరము ప్రసాదింప
బుద్ధియేని లోకపూజితుండు
మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు
వలనఁ బాయవలయు వసుమతీశ!” **(సభా. 2.259)**

‘దయతో నాకు వర మిచ్చే సంకల్పం నీకు నిజంగా ఉంటే’- అని మొదలుపెట్టిన వాక్యంలో ఎంతటి పారుష్యం ఎంత సుకుమారంగా మారింది! ‘వసుమతీశ!’ అని ధృతరాష్ట్రుడిని సంబోధించి, ఇప్పుడు రాజ్యానికంతా నీవే రాజువు అని అధిక్షేపంగా కాకుండా గౌరవప్రదంగా పలికింది. మాయాద్యూతంవలన లోకపూజితుడు, మనువువంటివాడు, యమధర్మరాజుకొడుకు అయిన ధర్మరాజు దాసుడైనాడు. అది అధర్మం. అతడిని దాస్యంనుండి విడిపించటం న్యాయం. నేను న్యాయబద్ధమైన కోరికను కోరుతున్నాను అని పారుష్యంలేకుండా పలకటమే కాకుండా ప్రతిపదసార్థక్యం గల వాక్యాలతో ఉక్తులను పరమసుకుమారంగా ప్రదర్శించింది. ఇటువంటివి సుకుమారగుణరచనలు.

తిక్కనకూడా నన్నయకు సరితూగేరచనలు చేశాడు సుకుమారగుణంతో. మచ్చు కొకటి. సంజయుడి వాక్యాలలో తిక్కన ఈ గుణం రెక్కలు విచ్చుకొన్నది.

క. “పాలీక కౌరవులు దు
శ్శీలతఁ జెడఁ దలఁచిరేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నంబునకంటెను
మేలగు భిక్షాన్న మైన మీ నడవడికిన్”. **(ఉద్యో. 1.329)**

సంజయుడి పలుకులకు ధర్మజు డిచ్చిన ధ్రువపత్రమే ఇందుకు సాక్ష్యం.

క. "ఎదు రున్నరూపు పలుకఁగఁ
దుదిఁ గటకటఁ బడవు నీవు; దుర్ణయమును బె
ట్టిదమును రెండును నగు పలు
కొదువదు నీ నాలుకకు నయోన్నత! యెపుడున్". **(ఉద్యో. 1.363)**

కొరవులవంటి అర్థాలను కుసుమపేశలంగా నయనీతితో ఆవిష్కరించే నేర్పు నన్నయవలెనే తిక్కన సంజయుడికీ, ధర్మజుడికీ నేర్పాడు. దూషణలుకూడా సౌకుమార్య మనే అర్థగుణంవలన వాగ్భూషలుగా మారటం ఆ గుణంలో ఉన్న విశేషం. మహామంత్రి తిక్కన వాక్పాకానికి వాడితోపాటు వాల్లభ్యంకూడా నేర్పిన అర్థగుణం సౌకుమార్యం.

శబ్దబంధానికి ఔజ్జ్వల్యాన్ని కూర్చి రసాన్ని పోషించటమే శబ్దగుణమైన కాంతిలక్షణం. దీప్తరసత్వం అర్థగుణమైన కాంతిలక్షణం. నన్నయ ఈ రెండులక్షణాలనూ కాంతిలో కలిపి పోషించినా శబ్దగుణానికే తూకం ఎక్కువగా కల్పిస్తాడు. మచ్చుకొకటి- పాండవు లడవులకు పోయే సమయంలో కుంతీదేవిమాతృహృదయం దుఃఖావేశంతో తురంగలించింది.

మత్తకోకిల.

"వీర లిట్టు లనాథులై మునివృత్తి నుండెడివారె? హా
ద్వారకాపురనాథ! కేశవ! దైత్యభేది! భవత్పదాం
భోరుహాశ్రితు లైన వీరలఁ బూని కావకయుండఁగా
ధారుణీధర! నీకు ధర్మువె ధర్మనిర్మలమానసా!". **(సభా. 2.286)**

ఇందులో శ్రీకృష్ణుడికి వాడిన సంబుద్ధులన్నీ సార్థకాలై సందర్భోచితంగా ఆమె దుఃఖతీవ్రతకు తోడ్పడ్డాయి. వరుసగా బంధుత్వాన్నీ, పరమాత్మతత్వాన్నీ, దుష్టశిక్షణస్వభావాన్నీ స్మరించి 'ఆశ్రితుల యోగక్షేమాలు చూడకుండా ఉండటం న్యాయమా?' అని ఆక్రందించింది. భూతలాన్ని ధరించేవాడా! విష్ణురూపుడా! ధర్మాన్ని నిర్మలంగా భావించే మనసుకలవాడా! ధార్మికులను ధరణీపతులను ఈవిధంగా అనాథులనుగా చేయటం ధర్మమా? అని ఆక్రోశించింది. 'ధర్మో రక్షతి రక్షితః' అంటారే! ధర్మనిర్మలవర్తనులైన పాండవులను రక్షించకుండా ఎందుకు ఊరుకొన్నా? వని అడిగింది. ఈ పద్యంలోని శబ్దా లెంత ముఖ్యమో అర్థం అంత ముఖ్యం. ఔజ్జ్వల్యం రెండింటినీ ఆశ్రయించుకొని ఉన్నది. అయినా సార్థకశబ్దంవలన రచన రూపుకట్టుతున్నది. దీప్తకరుణరసత్వం ప్రసన్నమౌతున్నది. నన్నయ కవితాకాంతివైఖరి ఇది.

తిక్కనలో శబ్దాలు దీప్తరసత్వంలో జలకా లాడతాయి. రససిద్ధితో తిక్కనశబ్దం కరిగిపోతుంది. అందుకే తిక్కనది అర్థగుణప్రధానరచన. కాంతి కొక ఉదాహరణం.

చ. "అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు వోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో, యటుగాక పాడి మై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ! నిశ్చయింపుమా!" **(ఉద్యో. 3.112)**

సంధికై హస్తినాపురి పోబోతున్న శ్రీకృష్ణుడితో ద్రౌపది అన్నమాట లివి. నిప్పులు మూటకట్టినట్లు వేడిగా ఉన్నమాటలు. ఆత్మాభిమానాన్ని ఉజ్జ్వలంగా వెలిగించే భావప్రకటనం ఈ పద్యప్రాణం. 'ఆ మహాపురుషునిపాలికిన్', 'కోటరంబు' 'పాడిమై' 'వరవుడము' అనే మాటలవేడిదనం ఆమెగూఢామర్షంలో మునిగిపోయింది ఈ రచనలో. తిక్కనతీరు ఇది.

ఒకపద్యంగాని, ఒకఘట్టంగాని ఏమార్గాన ఆరంభించబడుతుందో, ఆ మార్గాన్ని విడువకుండా చివరిదాకా నిర్వహించబడటం శబ్దగుణమైన సమతాగుణలక్షణం, ప్రారంభించిన అర్థంయొక్క పద్ధతి ప్రక్రమంలో భేదంలేకుండా ఉండే అవైషమ్యమే అర్థగుణమైన సమతాగుణం. శబ్దగుణంలో భాగంగా పద్యనిర్మాణశిల్పంలోకూడ సమతను పాటించిన పద్యం-

చ. "అనిలజవాశ్వయుక్త మయి హాటకరత్నవిచిత్రతార్క్ష్యకే
తన మయి మేఘనాద మయి దారుకసారథి యైన దివ్యకాం
చనరథ మెక్కి యాక్షణమ సాత్వతకుంజరుఁ డేఁగె, భక్తి నా
తని ననిచెన్ యుధిష్ఠిరుఁడు దమ్ములు దానును బాదచారి యై." **(సభా. 2.84)**

రథ మెక్కిన శ్రీకృష్ణుడు, అతడిరథంతో కొంతదూరం సమంగా నడిచిన భాతృయుతుడైన ధర్మరాజు ఈ పద్యంలో వర్ణించబడుతున్నారు. నన్నయ వస్తువులోని ఆ సమతను శబ్దగుణంలోకూడ పాటించాడు. యతిస్థానంవద్ద పాదం విరగటం, పాదాల కొసళ్ళు పైపాదాల మొదళ్ళలోకి చొప్పించుకొనిపోవటం, పద్యపూర్వార్ధం రథవర్ణనం, ఉత్తరార్ధంలో చెరిసగం శ్రీకృష్ణధర్మజుల ప్రశంసచేయటంవంటి వృత్తనిర్మాణసామ్యాలు సమతను సమర్థిస్తున్నాయి.

నన్నయ కథాకథనంలోనే కాక సంభాషణలలోకూడ ఎడనెడ సందర్భోచితంగా సమతను పాటించి రసభావాలను పోషించాడు. ఉదాహరణకు విదురుడిని కోపంతో మందలిస్తూ దుర్యోధనుడు అతనిస్వభావంలో పాండవులపట్ల గల అభిమానాన్నీ, తమపట్ల ఉన్న కాపట్యాన్నీ సమతాగుణస్ఫూర్తి గలిగిన సీసపద్యంలో ప్రవచించాడు.

సీ. "పరులగుణంబులు పలుమాఱుఁ గీర్తింతు । పక్షంబ పలుకుదు పాండవులకు
ధార్తరాష్ట్రుల సతతంబు నిందింతువు । కుడిచినచోటికిఁ గూర్ప వెపుడు
నుత్సంగతలమున నుగ్రవిషోరగం । బున్నట్లు నీవు మాయొద్ద నునికి
పరులసంపద సుఖోపాయబలంబునఁ । గొనుట భూపతులకు గుణమ కాదె?

ఆ. యడుగకయును గర్జ మది యిష్టుఁడై చెప్పు । నతని కాడఁ దగినయదియ నన్ను
నిట్టు నట్టు ననఁగ నేల? నీయిమ్ముల । నుండు బుద్ధి సెప్పకుండు మాకు" **(సభా. 2.188)**

దుర్యోధనుడికోపం క్రమక్రమాభివృద్ధి చెందినట్లు సీసపద్యగతిలోని సమతద్వారా తెలుపదలచుకొన్నాడు నన్నయ. పద్యాన్ని మూడుభాగాలు చేశాడు. మొదటి రెండుచరణాలలో సగానికే ఒక్కొక్కవాక్యం- ఆతరువాతిరెండుచరణాలలో చరణాని కొక్కొక్కవాక్యం. ఆ తరువాతి ఆటవెలదిలో నాలుగుపాదాలలో మూడువాక్యాలు అనే రచనాశిల్పాన్ని ప్రవేశపెట్టాడు. చిన్నవాక్యాలతో మొదలైన కోపం పెద్దవాక్యాలతో పెంపొందింది. విదురుడిని మందలించటంలో ఆ సమత మార్గం మారింది. ఈ విధంగా ఒక పాత్రలోని రెండు భావావస్థలకు రెండురకాల వాక్యప్రయోగంలో కానవచ్చే సమతలతో రచించటం శబ్దగుణమైన సమత స్వభావం. అయితే, ఒకే పద్యంలో మూడురకాలైన వాక్యవిన్యాసవైఖరులు ప్రదర్శిస్తున్నప్పుడు అది మార్గాభేదం కా దని కొందరి మతం. కాని, అది అవైషమ్యం ప్రక్రమాభేదం కావచ్చును. దీనిని గమనిస్తే ఈ పద్యం శబ్దగుణసమత కాక అర్థగుణసమతకు ఉదాహరణ మని చెప్పబడుతుంది. ఇటువంటి చిక్కు లున్నాయి కాబట్టి సమతను ప్రత్యేకగుణంగా పరిగణించక ప్రసాదమాధుర్యాలలో అంతర్భవింపజేస్తారు కొందరు.

తిక్కన రచనలో అర్థగుణ మైన సమత కీ శబ్దగుణ మైన సమత ఎప్పుడూ అంగంగానో, పోషకంగానో ఉండటం గమనిస్తాం. ఉదా॥

సీ. "లీల నా ముందట నా లేమ వొలసినఁ । జూడ్కికిఁ జుబ్బనచూఱ గాదె;
కను విచ్చి నన్ను నా తనుమధ్య సూచినఁ । దనువున కమృతసేచనము గాదె;
చిఱునవ్వు బెరయ నచ్చెలువ నాతోడఁ బ । ల్కినఁ జెవులకు రసాయనము గాదె;
యెలమి నమ్మెలఁత న న్నెలయింపఁ దివిరిన । నెడఁద కానందంబు నిక్కగాదె;

తే. "యా నితంబిని మక్కువ ననఁగి పెనఁగి । యింపుపొంపిరివోవ న న్నేలికొనఁగఁ
దలఁచి పొందిన నది జన్మఫలము గాదె । యనుచు వలరాజుబారికి నగ్గమయ్యె." **(విరా. 2.86)**

ఈ పద్యనిర్మాణంలో శబ్దగుణ మైన సమత పాటించబడినా మూడవచరణంలో స్వల్పవిపర్యయం సూక్ష్మదృష్టికి గోచరిస్తుంది. అయినా, అది అంత పట్టింపుకు రాదు. కాని, ఇందులో అర్థగుణలక్షణా లైన అవైషమ్యమూ ప్రక్రమాభేదమూ సలక్షణంగా, నిర్వహించబడటం విశేషం. సైరంధ్రి క్రమంగా పొలయుట, చూచుట, పల్కుట, ఎలయింప దివురుట, ఏలికొనుట అనే అనుభవాలవలన కీచకుడు పొందే అనుభవవిశేషాన్ని ప్రక్రమభంగం లేకుండా సుగమం చేసే సమతను తిక్కన శిల్పసుందరంగా, అన్వయబంధురంగా ఇందులో సాధించాడు. తిక్కనదృష్టి అర్థగుణపుష్టిని కల్గించటంలో వ్యగ్రత వహించినంతగా శబ్దగుణసృష్టియందు వ్యామోహాన్ని ప్రకటించ దని దీనివలన స్పష్టమౌతుంది.

కవిత్రయంవారు తెలుగుకవితను గుణవతిగా తీర్చిదిద్దారు. శ్రీనాథుడు ఆమెకు రీతిమాధుర్యాన్ని నేర్పాడు. పోతన భక్తిపారవశ్యాన్ని అలవరచాడు. ప్రబంధకవులు అలంకారవైభవాన్ని అందించారు. నిజానికి మొదట గుణ మున్నప్పుడే మిగిలినవి జీవితంలో పూజాస్థానా లయ్యేవి. 'గుణాః పూజాస్థానం గుణిషు నచలింగం న చ వయః' అనికదా లోకోక్తి.

నన్నయ సభాపర్వంలో ప్రదర్శించిన ప్రసన్నకథాకలితార్థయుక్తిని, శబ్దగుణప్రయోగాన్నిగురించీ, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తులనుగురించీ వ్యాఖ్యానంలో యథావకాశంగా వివరించటం జరిగింది. పాఠకులు వాటినికూడ పరిశీలించ ప్రార్థన.

### సభాపర్వం - సందేశం

సభాపర్వంలో ప్రత్యక్షమయ్యే రెండుసభలలోనూ జరిగిన సంఘర్షణాత్మకమైన కథార్థాలను ఉపదేశదృష్టితో సమీక్షించుకొంటే దైవాసురసంపద్విభాగయోగాన్ని దర్శించినట్లు అనిపిస్తుంది. పాండవపక్షం దైవసంపదకూ, కౌరవపక్షం ఆసుర సంపదకూ ప్రాతినిధ్యాన్ని వహిస్తాయి. మానవహృదయమే సభ అయితే, అందులో దైవాసురస్వభావాల సంఘర్షణం సహజస్వభావమైతే, ఆరెండింటిలో దైవీశక్తుల విజయాన్ని సూచించేది మయసభ, ఆసురీశక్తుల విజృంభణాన్ని ప్రదర్శించేది కురుసభ.

భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు "మహాత్మానస్తు మాం పార్థ!, దైవీం ప్రకృతి మాశ్రితాః! భజం త్యనన్యమనసో, జ్ఞాత్వా భూతాది మవ్యయమ్" (9.13) (అర్జునా! మహాత్ములైనవారు దైవీప్రవృత్తి నాశ్రయించి, అన్నిటికీ ఆదినీ, అవ్యయుడనూ అయిన నన్ను తెలిసికొని అనన్య చిత్తంతో సేవిస్తున్నారు) అని దైవీప్రవృత్తుల స్వభావాన్ని పేర్కొన్నాడు. రాజసూయంలో శ్రీకృష్ణుడిని పూజిస్తూ, 'ఆదిజుడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాడు, లోకాది, త్రిలోకపూజ్యుడని - ఆత్మ నెఱింగి' పితామహుడు చెప్పగా, దాని నెఱింగి పాండవులు పరమాత్మను సేవించారు. పరమేశ్వరానుగ్రహాన్ని పొందారు. ఆ సభలోనే శిశుపాలాదులు ఆసురీప్రవృత్తిని ప్రదర్శించి చెడిపోయారు.- 'అవజానంతి మాం మూఢా, మానుషీం తను మాశ్రితం। పరం భావ మజానంతో, మమ భూతమహేశ్వరమ్' (9.11) (సర్వభూత నియామకుడనై మానవశరీరధారినైన నన్ను మూఢులు తిరస్కరిస్తున్నారు. వారికి నా శ్రేష్ఠత్వం తెలియదు) అనే తాత్పర్యం శిశుపాలుడి ప్రవర్తనలో స్పష్టమైనది. దాని ఫలాన్నికూడా అత డనుభవించాడు. శిశుపాలుడి తరువాత రాజసూయంలో రాక్షసీప్రవృత్తిని ప్రదర్శించినవాడు దుర్యోధనుడు. దైవీవైభవాన్ని

చూచి దుఃఖితుడైన దుర్యోధనుడు "మోఘాశా, మోఘకర్మాణో, మోఘజ్ఞానా విచేతసః । రాక్షసీ మాసురీం చైన ప్రకృతిం మోహినీం శ్రితాః" (9.12) (వారి ఆశలు అడుగంటాయి. వారికోర్కెలు గొడ్డుపోయాయి. వారి తెలివి తెల్లవారింది. అట్టివారు మోహకరమైన రాక్షసీప్రవృత్తికిన్నీ, ఆసురీప్రవృత్తికిన్నీ వశులై చెడిపోతారు) అనే తాత్పర్యానికి అచ్చమైన ఉదాహరణంగా నిలిచాడు. శిశుపాలుడు అజ్ఞాని. దుర్యోధనుడు అహంకారి. మోహానికి వీరిద్దరూ బొమ్మా బొరుసులు. వారివిషాదాంతవృత్తాలు లోకానికి వివేకకరదీపికలు!.

భగవద్గీతపదారవఅధ్యాయంలో చెప్పబడిన దైవాసురసంపద్విభాగంలో ఆసురీగుణాలు కలిగినవారి లక్షణాలన్నీ దుర్యోధనుడిలో మూర్తీభవించి ఉండటం గమనిస్తే అతడు కలిఅంశతో జన్మించిన సార్థక్యం స్పష్టమౌతుంది. "ఆత్మ సంభావితాః స్తబ్ధా, ధనమానమదాన్వితాః, యజంతే నామ యజ్ఞై స్తే, దంభే నావిధిపూర్వకమ్." (16.17) "అహంకారం బలం దర్పం, కామం క్రోధంచ సంశ్రితాః । మామాత్మ పరదేహేషు, ప్రద్విషంతోఽభ్యసూయకాః" (16.18) (ఆసురీ ప్రవృత్తి కలవారు అహంకారంతో విఱ్ఱవీగుతూ, ధనాభిమానమదాంధులై విధివిధానాలను లెక్కచేయకుండా, డంబంకొరకు పేరుకొరకు యత్నాలు చేస్తారు. అహంకారాన్నీ, పశుబలాన్నీ, దర్పాన్నీ, కామాన్నీ, క్రోధాన్నీ కలిగి, అసూయాపరులై తమయందూ, ఇతరులందరియందూ ఉండే నన్ను తిరస్కరిస్తూ ఉంటారు). అతడి అసూయ వెనుక ఆసురీప్రవృత్తు లుంటాయని శ్రీకృష్ణభవానుడు చెప్పిన లక్షణాలన్నీ మోహరించి ఉన్నట్లు పాండవసంపదను హరించే అతడి దుష్టస్వభావంలో ధ్వనించబడుతూ ఉన్నది.

దైవీప్రవృత్తులు ఆసురీప్రవృత్తులచేత ధిక్కరించ బడినప్పుడు దైవం దైవీప్రవృత్తులను ప్రత్యక్షంగా రక్షించిన దివ్యవృత్తం శిశుపాలవధ ఘట్టం. వెంటనుండి విజయపథంలో నడిపించే ఆచార్యతత్త్వం ప్రకటించిన వృత్తం జరాసంధవధఘట్టం. ఆశ్రితులను పరోక్షంగాకూడా ఆదుకొనే ఆర్తత్రాణపరాయణరూపమైన పరమాత్మమాహాత్మ్యం ప్రదర్శించినవృత్తం ద్రౌపదీమానసంరక్షణ ఘట్టం. పరమాత్మవిభూతిని తెలిసికొనగోరే జిజ్ఞాసువులకు సభాపర్వం వివేకచూడామణి.

సభాపర్వంలోని ధార్తరాష్ట్రుల ప్రవర్తనాన్ని శ్రీకృష్ణభగవానుడి మాటలలో ఈవిధంగా అన్వయించుకొనవచ్చును. ఆ మాట లివి-

శ్లో. "త్రివిధం నరక స్యేదం । ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభః । తస్మా దేతత్త్రయం త్యజేత్." **(భ.గీ.16.21)**

కామ, క్రోధ, లోభా లనేవి నరకానికి మూడుద్వారాలు. వాటివలన మనుష్యుడు సర్వనాశనం చెందుతాడు. కాబట్టి వాటిని పరిత్యజించటం కర్తవ్యం- అని ఆ మాటల తాత్పర్యం. పాండవసంపదను చూచి దాని నేవిధంగానైనా అపహరించాలని పూనుకొన్న దుర్యోధనుడిలో కామం పడగవిప్పింది. పాండవులూ, ద్రౌపదీ తనను జూచి నవ్వా రని అహంకరించి వారిపై ప్రతీకారం తీర్చుకొని అవమానాలపాలు చేయాలనే క్రోధం దుర్యోధనుడిలో విశ్వరూపం తాల్చింది. శత్రుసంపదను హరించటమే కాకుండా వారికి జీవితంలో ఎన్నడూ రాజ్యానుభవసౌఖ్యం లేకుండా చేయాలనే లోభం అతడిలో వికృతనాట్యం చేసింది. ఈమూడుగుణాల సంపుటి దుర్యోధనుడు. అందువలన నరకద్వారాలన్నీ తెరుచుకొన్న జీవనమార్గం దుర్యోధనుడిది.

కామంతో మొదలైన అతడి ప్రస్థానం ఏవిధంగా సాగుతుందో తెలిపేసూత్రం భగవద్గీత ద్వితీయాధ్యాయంలోని సాంఖ్యయోగ కథనంలో శ్రీకృష్ణుడు స్పష్టంచేశాడు.

శ్లో. "ధ్యాయతో విషయాన్ పుంసః । సంగ స్తే షూపజాయతే,
సంగా త్సంజాయతే కామః । కామా త్క్రోధోఽభిజాయతే.
క్రోధా ద్భవతి సమ్మోహః । సమ్మోహా త్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః । బుద్ధినాశాత్ ప్రణశ్యతి". **(భ.గీ. 2.62-63)**

విషయవాంఛలవలన కామం పుట్టుతుంది. దానివలన కోపం సంభవిస్తుంది. కోపంవలన అవివేకం ఆవేశిస్తుంది. దానివలన మతిభ్రమ కలుగుతుంది. దానివలన బుద్ధి నశిస్తుంది. బుద్ధినాశంవలన సర్వస్వం నశిస్తుంది. ఇది దుర్యోధనుడి ప్రస్థానం.

దీనిని పరిత్యజించటమే ఉత్తముల కర్తవ్యం. దుష్టద్యూతంతో మతిభ్రంశం పొంది వ్యవహరించిన దుర్యోధనుడు కురుకులనాశన కారకుడౌతా డని విజ్ఞుడైన విదురుడు ధృతరాష్ట్రుడితో చెప్పటం గమనించదగిన అంశం. కౌరవులు తమ పాపకర్మకు తగినఫలం త్వరలో అనుభవిస్తా రని భీష్ము డనటం మరొక తార్కాణం. సపుత్రకుడైన ధృతరాష్ట్రుడిని ప్రజలు నిందించటం మరొక దృష్టాంతం. దుర్యోధనుడిని త్యజించటానికి ధృతరాష్ట్రుడు ఇష్టపడడు. అతడు మోహావిష్టుడైన జీవివంటివాడు. సత్యధర్మాలను చూడలేని గ్రుడ్డివాడు.

మనలోకూడా ధర్మరా జున్నాడు. దుర్యోధను డున్నాడు. అంతేకాదు విదురుడుకూడా ఉన్నాడు. ఆ సత్యాన్ని మనం గుర్తించాలి. ధర్మాధర్మాలకు సంఘర్షణ జరిగినప్పుడు మనలో వివేకమనే విదురుడు ధర్మబోధ చేస్తూనే ఉంటాడు. దానిని పెడచెవినిపెట్టి మనం ధృతరాష్ట్రులం కారాదు. కామం ఒక్కటే మనలను సర్వనాశనం చేయగలదు. దానికి తోడూ దుశ్శాసనుడనే మదం చేరకూడదు. మదం దుష్టచర్యలను చేయిస్తుంది. ఇక దానికితోడూ కాపట్యంకూడా కలిసి కార్యోన్ముఖమైతే ధర్మం నిలువునా దగ్ధమౌతుంది. లోకహాని ఏర్పడుతుంది. ఆరెండింటికీ కృపణత్వం తోడ్పడితే గాలితోకూడిన అగ్నికి ఆజ్యంతోడైనట్లవుతుంది. సభాపర్వంలో కామం దుర్యోధనుడు, కాపట్యం శకుని, కృపణత్వం (కుత్సితం) కర్ణుడు, మదం దుశ్శాసనుడు. ఈ దుష్టచతుష్టయం కలసినచోట ప్రళయం తథ్యం. అదే సభాపర్వసందేశం.

అయితే, ఈ ఆసురీప్రవృత్తి సమాజంలో విజృంభించినప్పుడు మానవుడి కర్తవ్య మేమిటి? సమర్థులైనవారు, దైవీప్రవృత్తి కలవారు కలిసి ఆసురీప్రవృత్తులను ఎదుర్కొని ధర్మాన్ని రక్షించాలి. విశ్వశ్రేయస్సును సాధించాలి. కురుసభలోవలె ఒక్కొక్కసారి సమర్థులు అసమర్థులై ఉపేక్షిస్తే దైవంమాత్రం చూస్తూ ఊరుకోదు. వారికి తగిన గుణపాఠాన్ని తానే పూనుకొని చెప్పుతుంది. ధర్మాన్ని విజయపథంలో నడిపిస్తుంది - ఉద్యోగపర్వంలో అదే కురుసభలో శ్రీకృష్ణుడు ఈ సత్యాన్ని ప్రకటించాడు.

ఉ. “సారపుధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱిన దైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారల చే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్”. **(ఉద్యో. 3.273)**

ఈ సందేశం సభాపర్వంలో ప్రదర్శితమైన సత్యం. కురుక్షేత్రయుద్ధంలో ప్రవర్తిల్లబోయే సత్యం. ధర్మసాధకుడైన మానవుడు ఎప్పుడూ జ్ఞాపకముంచుకోదగిన నిత్యసత్యం!

### కవిత్రయమహాభారతం - వ్యాఖ్యానం

తెలుగులో ఆదికావ్యమైన మహాభారతానికి వ్యాఖ్యానం సమగ్రంగా రావటం ఆంధ్రావళికి ఆనందం కలిగించే అంశం. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీవేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో అవతరించటంవలన ఇది సారస్వత యజ్ఞగౌరవం పొందింది. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు దీనిని ఒక బృహత్తరధార్మికకార్యంగా భావించి, సర్వాంగసుందరంగా ప్రచురించి, సామాన్యులకుకూడ అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారి వెలుగులపుణ్యం. ఈ పవిత్రమహత్తరప్రయత్నానికి ఏడుకొండలస్వామిపక్షాన బాధ్యత వహించి విజయవంతంగా ముందుకు సాగిస్తున్న మాన్యులు, పుణ్యులు టి.టి.డి. బోర్డు ఛైర్మన్, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, సంపాదక సలహామండలి సభ్యులూ, సంపాదక మండలి సభ్యులూ, శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం సంపాదకులూ, వారిసహాయకులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, వివిధరకాలుగా దీనికి తోడ్పడుతున్న అధికార అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్సులు. ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి ఆమోదించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం కంట్రోలర్ ఆఫ్ పబ్లికేషన్స్‌కు ప్రత్యేకకృతజ్ఞతలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటిగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటంగా రూపుదిద్దుకొన్నది. సభాపర్వం విద్వత్సభలలో విశేషంగా చర్చించుకొనే భారతభాగం. ఆకృతికి రెండాశ్వాసాలతో చిన్నదిగా పైకి కనపడుతున్నా లోనారసి చూస్తే జీవితంలోని మూడుపురుషార్థాలకు సంబంధించిన ఎన్నో విషయాలను మథించిన విలువైన పర్వం. నన్నయ తన కవితాకళాశక్తిని రూపకరమణీయంగా, గుణసుందరంగా, తత్త్వగంభీరంగా ప్రదర్శించిన మహత్తరపర్వం. మానవుడిలోని దైవాసురప్రవృత్తులు ఒకదానితో ఒకటి పోటీపడి సంఘర్షించిన సారవంతమైన పర్వం. అంతేకాక ఈ పర్వం భారతకథలో కీలకస్థానం నిర్వహించేది. అందువలన ఇది పరిమాణంలో చిన్నదైనా ప్రభావంలో పెద్దది. అందుకే కొంత విస్తృతమైన పీఠికకూడ అవసరమైనది. అది సరిక్రొత్త సమన్వయాలతో సమకూర్చబడినది. సహృదయులు సాదరంగా సమీక్షించ ప్రార్థన.

తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మప్రచారపరిషత్తు పూర్వాధ్యక్షులు, సద్విమర్శకులు, పండితులు అయిన డాక్టర్ అప్పజోడు వేంకట సుబ్బయ్యగారు సభాపర్వంలోని అనేకాంశాలను పండు ఒలిచి చేతిలో పెట్టినట్లు వ్యాఖ్యానంలో చెప్పారు. వారు ఆదిపర్వంలోని పంచమాశ్వాసం నుండి నాలుగాశ్వాసాలకూ, సభాపర్వంలోని రెండాశ్వాసాలకూ మొదట సరళ గ్రాంథికభాషలో వ్యాఖ్యానం వ్రాశారు. తిరుమల తిరుపతి దేవస్థానంవారి నిర్ణయానుసారం భారత వ్యాఖ్యానం ప్రజల కందుబాటులో ఉండటానికై శిష్టవ్యావహారికంలోకి వారే మార్చి వ్రాశారు. ఈ పర్వాల శుద్ధప్రతిని తయారుచేయటంలో సహకరించిన సంస్కృతాంధ్ర భాషాసాహిత్యకోవిదులు డాక్టర్ అట్లా వెంకటరామిరెడ్డి, డాక్టర్ శ్రీమతి కె. జయశ్రీ, శ్రీ ఎ.వి.బి.కె. శాస్త్రి, శ్రీమతి ఎస్.వి. విజయలక్ష్మి, డాక్టర్ వి. విశ్వనాథయ్య, డాక్టర్ బి. జయరాములుగారలకు నేను కృతజ్ఞుడను. ప్రూపులు సరిచూడటంలో సహాయపడిన శ్రీమతి జి.లక్ష్మీ విద్యానాథ్, శ్రీమతి జి. సుశీల గార్లకు, డాక్టర్ వెలుదండ నిత్యానందరావు గారికి, భారతంమీద వచ్చిన లఘువ్యాఖ్యలను సేకరించటంలో సహకరించిన డాక్టర్ దంటు హేమలతగారికి, ముద్రణకు అనువైన అక్షరాకృతి నిచ్చిన శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ అధినేత్రి డాక్టర్ జి.యస్.లక్ష్మి గారికి ఆశీస్సులు.

వ్యాఖ్యాతలు చెప్పిన అంశాలకు మరికొన్ని విశేషాంశాలు చేర్చి ప్రతి సంపుటికీ ఒక పీఠికను కూర్చి, వీలైనంత సమగ్రతను, ఏకవాక్యతను, కథార్థ ప్రసన్నతను, కావ్య శిల్పతత్త్వ సమన్వయాన్నీ సంతరించి, ఎక్కువమంది సహృదయులకు సమ్మోదాన్ని కలిగించే దిశగా సంపాదకుడి కృషి సాగింది. ప్రతిపదార్థ తాత్పర్యాలు సరళసుందరంగా సాగాలనీ, విశేషాంశాలు వివేకచూడామణులుగా ప్రకాశించాలనీ భావించి రూపొందించటం జరిగింది. ఇది ప్రబంధవ్యాఖ్యలవంటిది కాదు; ప్రసన్నవ్యాఖ్యమాత్రమే!

భక్తజనకల్పద్రుమమైన భద్రమూర్తి పద్మావతీసహిత శ్రీ వేంకటేశ్వరస్వామివారు ధర్మద్రుమమైన ఈ భారతవ్యాఖ్యకు ప్రభువు. ఆస్వామి సత్య శివ సుందరమైన దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యా సంపుటిని వాఙ్మయారాధనలో పుణ్యపూజాకుసుమమంజరిగా సమర్పించుకొంటున్నాను!

హైదరాబాదు
బహుధాన్య సంక్రాంతి
**15-1-1999**

**జి.వి.సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు
కవిత్రయమహాభారతంప్రాజెక్టు
తిరుమల తిరుపతి దేవస్థానం

# సభాపర్వకథాసారం

శ్రీకృష్ణుడి కోరికపై మయుడు ఒక అపూర్వమైన సభను నిర్మించి పాండవులకు సమర్పించాడు. ఒక శుభముహూర్తాన పాండవు లందులో ప్రవేశించారు. దిక్పాలకుల సభలకంటె, బ్రహ్మసభకంటె, మయనిర్మితమైన సభ మహిమాన్వితమైన దని నారద మహర్షి ప్రశంసించాడు. ఆ సందర్భంలో పాండురాజాదులు యమసభలో ఉన్నా రనీ, హరిశ్చంద్రుడు ఇంద్రసభలో ఉన్నా డనీ నారదుడు ప్రస్తావించాడు. పరమధర్మాత్ముడైన పాండురాజు యమసభలో ఉండటానికీ హరిశ్చంద్రుడు ఇంద్రసభలో ఉండటానికీ కారణమేమిటని ధర్మరాజు నారదుడి నడిగాడు. హరిశ్చంద్రుడు రాజసూయయాగం చేయటంవలన ఆ యోగాన్ని పొందాడనీ, పాండురాజు ధర్మరాజును రాజసూయంచేసి తనకూ పితృగణానికీ ఇంద్రసభా నివాససౌఖ్యాన్ని కల్పించుమని కోరుతున్నాడనీ తెల్పాడు. అంతటితో ఆగక ఆ మహర్షి ధర్మజుడిని రాజసూయయాగం చేయుమని ప్రోత్సహించాడు. రాజసూయంవలన ప్రజలు పుణ్యాత్ము లౌతారనీ, దానివిఘ్నంకొరకు బ్రహ్మరాక్షసులు ప్రయత్నిస్తారనీ, అది నిర్విఘ్నంగా పూర్తిఅయితే ప్రజాప్రళయం జరిగే మహాయుద్ధం జరుగుతుం దనికూడా పేర్కొన్నాడు. ధర్మరాజు తమ్ములతో మంత్రులతో యోచించి రాజసూయం చేయా లని సంకల్పించాడు. ధర్మరాజు శ్రీకృష్ణుడిని ఇంద్రప్రస్థానికి పిలిపించుకొని, రాజసూయం చేయటానికి ఆశీస్సుల నర్థించాడు. శ్రీకృష్ణుడు రాజసూయం నిర్వహించే యోగ్యత ధర్మరాజుకు అన్ని విధాలా ఉన్న దని నిర్దేశించి, జరాసంధుడినీ, అతడికి ఆసట బాసటగా నిలచి ఉన్న శిశుపాలుడినీ, హంసడిభకులనూ సంహరించనిదే రాజసూయయాగం నిరాటంకంగా సాగ దని సూచించాడు.

### ధర్మజరాజసూయం

గిరివ్రజపురాన్ని రాజధానిగా చేసికొని, చండశాసనుడుగా పాలిస్తూ, భరతవర్షంలో మూర్ధాభిషిక్తులైన రాజులనందరినీ బంధించి, రోజు కొక్కడిని భైరవుడికి బలియిస్తూ సమకాలీన రాజలోకంలో సింహస్వప్నంగా దాపురించాడు జరాసంధుడు. అతడికి ఆయుధాల వలన చావు లేదు. అట్లాగే హంసడిభకులకుకూడా. శిశుపాలుడు నూరు తప్పులు చేసేంతవరకు ఎవరూ ఏమీ చేయలేరు. అపార సేనతో జరాసంధుడు శ్రీకృష్ణుడినికూడా బాధించాడు. అతడు మధురను వీడి మరోచోటికి ఎన్నోసార్లు పోవలసి వచ్చింది. అటువంటి జరాసంధుడిని భీము డొక్కడే చంపగలడు. అందువలన శ్రీకృష్ణుడు భీమార్జునులతో కలిసి బ్రాహ్మణవేషాలతో గిరివ్రజానికి వెళ్లి ద్వంద్వయుద్ధంలో జరాసంధుడిని భీముడిచేత చంపించే పథకాన్ని వేశాడు. శ్రీకృష్ణుడిమాట పాండవులకు శిరోధార్యం. శ్రీకృష్ణ దర్శకత్వంలో భీముడు జరాసంధుడిని ద్వంద్వయుద్ధంలో చంపాడు. బందీలుగా ఉన్న వేలాది భూపతులను విడుదల చేయించాడు. శ్రీకృష్ణుడు గిరివ్రజానికి జరాసంధుడి కుమారుడైన సహదేవుడిని రాజును చేశాడు. విముక్తులైన రాజులనందరినీ వెంటపెట్టుకొని భీమార్జునశ్రీకృష్ణులు ఇంద్రప్రస్థపురం చేరారు. ధర్మరాజు ఆ రాజులకు వారి వారి రాజ్యాలిచ్చి సగౌరవంగా పంపాడు. శ్రీకృష్ణుడికి కృతజ్ఞతాంజలి సమర్పించాడు.

రాజసూయానికి ముందు జరాసంధసంహారం ఒక విజయారంభం అయింది. ధర్మరాజు నలుగురుతమ్ములనూ నాలుగు దిక్కులూ జయించటానికి పంపాడు. భీమసేనుడు తూర్పుదిక్కున నున్న రాజులను నిరాఘాటంగా సాధించాడు. అర్జునుడు ఉత్తరదిశపై దండెత్తి విజయాన్ని కరతలామలకం చేసికొన్నాడు. నకులుడు పశ్చిమ దేశ ప్రభువులను పాదాక్రాంతులను చేసికొన్నాడు. సహదేవుడు దక్షిణదిగ్విజయాన్ని దక్షతతో నిర్వహించాడు. నాలుగు దిక్కులనుండీ అపారధనరాసులు తెచ్చి ధర్మరాజుకు సమర్పించారు భీమాదులు. రాజసూయానికి కావలసిన సంపద చేకూరింది. శ్రీకృష్ణుడిఅనుమతి తీసికొని ధర్మరాజు యాగానికి సన్నాహాలు ప్రారంభించాడు. సహదేవుడిని సకలసన్నాహాలకూ సారథిగా నియమించాడు. నకులుడిని హస్తినాపురానికి స్వయంగా పంపి భీష్మాదులనందరినీ సగౌరవంగా ఇంద్రప్రస్థానికి రప్పించాడు. ధృతరాష్ట్ర దుర్యోధనాదులను కలుపికోలుతనంతో గౌరవించాడు. దక్షిణలిచ్చే నిర్ణయం కృపాచార్యుడి కిచ్చాడు; కృతాకృతనిర్ణయాధికారాన్ని భీష్మద్రోణులకు వప్పచెప్పాడు. వస్తువ్యయభారాన్ని విదురుడి చేతుల్లో ఉంచాడు. నానా దేశాల నుండి వచ్చే రాజులు తెచ్చే విలువైన కానుకలను గ్రహించే పరువైన బాధ్యతను దుర్యోధనుడి కిచ్చాడు. భక్ష్యభోజ్యాదివినియోగపర్యాలోకనాన్ని దుశ్శాసనుడి

కందించాడు. ఇట్లా అందరికీ అన్నిబాధ్యతలు ఇచ్చి, ధర్మరాజు తాను యజ్ఞదీక్షితుడై యజమాని చేయవలసిన కార్యక్రమాలను ఆరంభించాడు. యజ్ఞం మహేంద్రవైభవంగా సాగింది; అఖిల జనాలకు ఆనందాన్ని కలిగించింది.

## శిశుపాలవధ

రాజసూయయాగం జరిగిన విధానాన్ని చూచి కురువృద్ధుడు భీష్ముడు ఉప్పొంగిపోయాడు. ధర్మరాజును ఆప్యాయంగా దగ్గరికి పిలిచి ఇట్లా బోధించాడు: 'మహాయజ్ఞం మహాత్ముని పూజతోకాని పరిపూర్ణం కాదు. స్నాతకుడైనా, ఋత్విజుడైనా, సద్గురుడైనా, సన్మిత్రుడైనా, భూతలేశుడైనా, సంయమీంద్రుడైనా - వీరిలో ఎవరినైనా ఒక్కరిని ఉత్తముడిని ఎన్నికచేసి పూజించుము; యజ్ఞఫలాన్ని పొందుము' - అని నిర్దేశించాడు. 'తాతా! అట్టివా డెవ్వడో నీవే నిర్ణయించి చెప్పాలి' అని ధర్మరాజు అర్థించాడు. పితామహుడు చిరునవ్వు నవ్వి. ఒకతన్మయభావంతో ఇట్లా అన్నాడు 'యుధిష్ఠిరా! సూర్యచంద్రులు ఎట్లా తమకాంతి కిరణాలతో లోకాలను వెలిగిస్తూ ఉన్నారో, అట్లాగే తనదివ్యతేజంతో మనలనందరినీ ఆనందపరవశుల్ని చేస్తున్న ఆ పుండరీకాక్షుడు, ఆ అనాది నిధనుడు, ఆ అబ్జనాభుడు ఈ కృష్ణుడు మన మధ్య ఉన్నాడు. ఆ అచ్యుతుడిని పూజించి, యజ్ఞపురుషుడిని పూజించిన అమృతఫలాన్ని పొందుము'.

భీష్ముడిమాటలు ధర్మరాజు శిరసావహించాడు. సహదేవుడు పూజాపాత్రలను తేగా ధర్మతనయుడు విధివిధానంగా వాసుదేవుడిని అగ్రాసనంమీద కూర్చుండపెట్టి అర్ఘ్యాన్ని ఇచ్చాడు. దానికి శిశుపాలుడు ఆగ్రహించాడు. నిండుసభలో పెద్దగా అధిక్షేపించటం ఆరంభించాడు.

'ధర్మరాజా! పూజించదగిన రాజులు, ద్విజులు, పూజ్యులు ఇంతమంది ఈ సభలో కొలువుదీరి ఉంటే ఈ గాంగేయుడు ఏదో నెపంతో ఈ కృష్ణుడిని పూజించమంటే, వెంటనే పూజించి నీ అవివేకాన్ని ప్రకటించుకొన్నావు. నిజంగా దాశార్హుడు పూజార్హుడా? సభలలో ధర్మతత్త్వాన్ని నిరూపించి చెప్పటం సాధ్యంకాని పని. భీష్ముడు వెర్రితనంతో ధర్మబాహ్యుడైన కృష్ణుడిని పూజించుమని చెప్పాడు. వృద్ధుల బుద్ధులు సంచలించటంలో ఆశ్చర్యం లేదు. ఇష్టముంటే కానుక లిచ్చుకొనవచ్చును కాని, పలువురు పెద్దలున్న సభలో అయోగ్యుడిని యోగ్యుడిగా ప్రకటించి పూజించటం న్యాయం కాదు. కృష్ణుడు ఏ విధంగా అర్హుడైనాడు? వృద్ధు డందామా సభలో అతని తండ్రి వసుదేవు డున్నాడే? ఋత్విజు డని గౌరవిద్దామా ఎదురుగా వేదవ్యాసు డున్నాడే? ఆచార్య డందామా అరుగో కృపాచార్యులూ, ద్రోణాచార్యులూ, భూనాథు డందామా ఈసభలో ఎందరో ప్రభువులూ ఉన్నారు. యుధిష్ఠిరుడు యోగ్యు డని భావించి మే మందరమూ ఈ యజ్ఞానికి వచ్చాం. ఇట్లా భీష్ముడు చెప్పిన మాటలు విని మమ్మల్ని అవమానిస్తా వని ఊహించలేకపోయాం. ఒకవేళ నీవు తెలియక అర్ఘ్య మిచ్చినా, తగుదునమ్మా అని ఈ గోవిందు డెట్లా గ్రహించాడు?' - అంటూ ధర్మజ భీష్మ శ్రీకృష్ణులను నిందిస్తూ పుత్రమిత్రులతో కలిసి సభను వీడి బయటకు నడిచాడు శిశుపాలుడు.

యజమానియైన ధర్మజుడు నయవినయవాక్యాలతో శిశుపాలుడిని సమాధాన పెట్టటానికి ప్రయత్నం చేశాడు. 'ఉత్తములకు వాక్పారుష్యం చెల్లుతుందా? విషంకంటె, దహనంకంటె అది ఎంతో దారుణం. పితామహుడు దామోదరుడు పూజ్యు డని చెప్పాడు. బ్రహ్మోత్పత్తికి మూలమైనవాడు, వేదాది సమస్త వాఙ్మయాలలో ప్రశంసితుడైనవాడూ, లోకాలకు ఆదియైనవాడూ త్రిలోక పూజ్యుడు అయిన అచ్యుతుడే ఈ కృష్ణు డని తాతగారు ఆత్మలో దర్శించి చెప్పారు. ఇది ఒప్పగాక తప్పెలా అవుతుంది? అదీకాక మహాత్ముల చరిత్రలు అల్పులకు అర్థం కావటం కష్టంకూడా. నీకంటె పెద్దలందరు తమందరికంటె పెద్దగా శ్రీకృష్ణుడిని గౌరవిస్తుంటే, నీ వభ్యంతరం చెప్పటం ఉచితమా?' అని శిశుపాలుడిని ధర్మజుడు మందలించాడు.

శిశుపాలుడి మాటలకు భీష్ముడు మండిపడ్డాడు. 'అవినయపరుడైన శిశుపాలుడు బాలుడు. అజ్ఞాని, ధర్మరాజా! వాడి నెందుకు నీవు అనునయించటానికి యత్నిస్తావు? రాగకోపాలతో పరిభవించబడిన మనస్సుకలవాడూ, స్వల్పరాజ్యలక్ష్మివలననే కన్నులు తలకెక్కినవాడు, నిష్కారణంగా ఇతరులతో తగాదాలకు దిగేవాడైన శిశుపాలుడికి ధర్మ మిది అని తెలిసికొనే వివేకం ఉండటానికి వీలుందా?'-అని ధర్మరాజును వారించి శిశుపాలుడితో ఇట్లా నిష్ఠురంగా పలికాడు. 'శిశుపాలా! నీవు మూర్ఖుడవురా.

అవినయబుద్ధితో హరికి అర్పిస్తున్న అర్ఘ్యాన్ని అయోగ్య మని నిందించావు. నేను వేరే చెప్పవలెనా? ఈ సభలో ఉన్నవారందరూ ఆతడి దయచేత పరిముక్తులైనవారే. అతడి శరణార్థులే, బాలుడైనా, జ్ఞాని అయితే బ్రాహ్మణులలో పూజ్యుడు; విక్రమంలో అధికుడైతే క్షత్రియులలో పూజ్యుడు. గోవిందుడియందు ఈ రెండుగుణాలూ ఉన్నాయి. అతడు వయోవృద్ధ డని కాదు గుణవృద్ధ డని పూజించాలి' అని మందలించాడు.

సహదేవుడు శిశుపాలుడిఅవినయవర్తనానికి ఆగ్రహించాడు. 'మేము అచ్యుతునికి అర్ఘ్యమిచ్చాం. దీనికి అంగీకరించని దుర్మార్గుల శిరస్సులమీద ఇదుగో నా పాదాన్ని ఉంచి తగినశాస్తి చేస్తాను' అని సహదేవుడు పాదాన్ని ఎత్తి ఝళిపించాడు. సభాసదులు కిమ్మనకుండా సద్దుమణిగి కూర్చున్నారు. దేవతలు పూలవాన కురిపించారు.

ఆ తరువాత శిశుపాలుడు కొందరురాజులను కూడగట్టుకొని ససైన్యంగా ధర్మరాజుయజ్ఞంపై దాడిచేయ యత్నించాడు. యజ్ఞదీక్షితుడైన ధర్మజుడు భయసంభ్రమాలతో భీష్ముడివైపు చూచాడు. శ్రీకృష్ణు డున్నంతవరకు భయ మేమీ లే దని పితామహుడు ధైర్యం చెప్పాడు. ఆ మాటలు విని శిశుపాలుడు భీష్ముడిని పరుషవచనాలతో నిందించాడు; 'శ్రీకృష్ణుడు పరమేశ్వరుడా?' అని అవహేళనం చేశాడు. అతనివీరగాథలను పేర్కొని అధిక్షేపం చేశాడు. ఆ విధంగా ఇచ్చవచ్చినట్లు ప్రేలుతున్న శిశుపాలుడిని చూచి భీముడు రౌద్రోద్రేకుడైనాడు. పండ్లు పటపటా కొరుకుతూ అతడిని చంపటానికి ఉద్యుక్తుడైనాడు. అప్పుడు భీష్ముడు భీముడిని వారించి శిశుపాలుడిని చంపవలసినవాడు శ్రీకృష్ణుడే నని వానిజన్మగాథ చెప్పి, నూరునేరాలవరకు హరి అతడిని సహించి ఊరుకుంటా డనీ, ఆ తరువాత అతని చావు ఆయన చేతులలో తప్ప దనీ వివరించాడు. ఆ మాటలు విని శిశుపాలుడు శ్రీకృష్ణుడితో ముఖాముఖిగా నిలిచి ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించాడు. శ్రీకృష్ణుడు - శిశుపాలుడు చేసిన నూరుతప్పులను ఏకరువు పెట్టి అందరికీ తెలియచెప్పి, ఇక శిశుపాలుడు క్షమార్హుడు కా డని నిరూపించి, సుదర్శనచక్రంతో అతడి శిరస్సును ఖండించాడు. శిశుపాలుడి శరీరంలో నుండి ఒక వెలుగు లేచి వెలుగుల కన్నింటికి వెలుగైన శ్రీకృష్ణుడిలో లీనమయిపోయింది. సభాసదు లందరు ఆశ్చర్యమగ్ను లయ్యారు; జయజయనినాదాలు చేశారు.

### మయసభ: సుయోధనుడిఅసూయ

రాజసూయయాగం నిర్విఘ్నంగా నారాయణుడిదయవలన పరిసమాప్తమయింది. బంధుమిత్రులు ఒక్కరొక్కరే తరలి వెళ్లటం మొదలయింది. శ్రీకృష్ణుడు ద్వారకకు పయనమైపోయాడు. ధృతరాష్ట్రాదులు హస్తినకు తిరిగి వెళ్లారు. దుర్యోధనుడు, శకుని మాత్రం మయసభావైభవాన్ని చూడటానికై కొన్నాళ్ళు ఇంద్రప్రస్థంలో ఆగారు. సుయోధనుడు మయసభాశిల్పరమణీయ కల్పన లన్నింటిని చూస్తూ విహరిస్తున్న తరుణంలో మిట్టలు జలాశయాలుగా, జలాశయాలు మిట్టలుగా, ద్వారాలు కుడ్యాలుగా, కుడ్యాలు ద్వారాలుగా గోచరించే విచిత్రశాలలో తిరుగుతూ ద్వార మని భావించి కుడ్యాన్ని ఢీకొనటం, మిట్టలని భావించి నీటిలో పడటం జరిగింది. అప్పుడు పాంచాలి, పాండుకుమారులు నవ్వారు. ధర్మరాజు దివ్యాంబరాలను, భూషణాలను దుర్యోధనుడు ధరించటానికి భీముడి ద్వారా పంపాడు. నకులసహదేవులను త్రోవచూపటానికి పంపాడు. ఆ విధంగా జరిగిన సభాప్రలంభనం దుర్యోధనుడికి సహించరాని అవమానంగా హృదయాన్ని బాధించింది. అతడు లజ్జతో పాండవులను వీడ్కొని హస్తినాపురం చేరాడు.

ధర్మరాజు చేసిన రాజసూయం అందరికీ సంతోషాన్ని కలిగించింది. కాని, దుర్యోధనుడిలో అసూయ రగిలించింది. సకలజన నయనానందాన్ని కలిగించిన పాండవ సభాలక్ష్మి ఆ సుయోధనుడికి మాత్రం గుండెలలో మంటలు పెట్టినట్లు బాధించింది. రాజధానికి తిరిగి వచ్చాడే కాని రారాజు కంటినిండా నిద్రపోలేదు. పాండవులపై పాపచింతతో, అన్నిభోగాలూ వదలి, దిగులుతో రోజులు గడుపసాగాడు. శకుని దానిని గమనించి దుర్యోధనుడిని ఏకాంతంగా ఊరడించటానికి వచ్చాడు. దుర్యోధనుడు తనబాధ బయటపెట్టుకొన్నాడు.

'మామా! మయుడు నిర్మించి పాండవుల కిచ్చిన సభను నీవుకూడా చూచావు కదా! ఏ యుగంలోనూ, ఏ లోకంలోనూ దానివంటి వైభవం వినపడదు, కనపడదు. దానితో ధర్మరాజు సూర్యతేజంతో వెలిగిపోతున్నాడు. అదేమి ఆశ్చర్యమో భూతలంమీది ప్రభువులందరూ ధనరాసులను కానుకలుగా తెచ్చి ధర్మరాజుకు భృత్యుల్లా చెల్లించారు. పాండవుల పరాక్రమం, ధర్మరాజు ప్రభుత్వం భూమిమీద స్థిరపడ్డాయి. అపార పరాక్రమార్జితమైన పాండవమహాలక్ష్మిని చూచి నేను

సహించలేకపోతున్నాను. అభిమానధనులైనవారు జ్ఞాతుల అభివృద్ధిని చూచి సహించగలరా! కాబట్టి ఏ విధంగా ఆ పాండవలక్ష్మిని అపహరించటానికి వీలౌతుందో యోచించాలి' - అని ఆవేదన వ్యక్తంచేశాడు.

దుర్యోధనుడి దురాలోచనకు ధృతరాష్ట్రుడి అనుమతి సాధించా లని శకుని అతడిని ధృతరాష్ట్రుడివద్దకు తీసికొని పోయాడు. దుర్యోధనుడు తనమనోవేదనను తండ్రిముందు చెప్పుకొన్నాడు. రాజు లిచ్చిన కానుకల నన్నిటినీ తానే స్వయంగా లెక్కించాడు. ధర్మరాజు సంపదల నంచనా కట్టాడు. కాబట్టి వాటన్నింటి విలువలనూ చెప్పి వాపోయాడు. గతంలోనూ, భవిష్యత్తులోనూ, వర్తమానంలోనూ పాండవలక్ష్మీవైభవంతో సరితూగే సంపదను ఎన్నడూ చూడలే దనీ, దాని నిప్పుడు చూస్తూ తాను సహించి ఉండటంకూడా కష్ట మనీ, అందువలననే క్రుంగి కృశించిపోయినా ననీ తండ్రిముందు చెప్పుకొన్నాడు.

'అవభృథస్నానానంతరం ధర్మరాజు ఉన్నతసింహాసనంమీద కూర్చున్నాడు. సాత్యకి ముత్యాలగొడుగు పట్టాడు. భీమార్జునులు చామరాలు వీవసాగారు. నకులసహదేవులు ధృష్టద్యుమ్నుడు శ్రీకృష్ణుడు మూర్ధాభిషిక్తులైన రాజు లందరిచేత అతడి పాదాలకు మ్రొక్కించారు. ఆ మహారాజు వైభవం చూచి మే మందరం చిన్నబోయాం. మమ్మల్ని చూచి శ్రీకృష్ణ పాండునందన ద్రౌపదీ సాత్యకులు నవ్వారు. ధర్మజు డారాజ్య వైభవాన్ని అనుభవించడం నేను సహించలేను'- అని దుర్యోధనుడు పలికాడు. 'అనుమతిస్తే ఆ సంపదనంతా మాయాద్యూతనెపంతో అపహరించి దుర్యోధనుడికి ఇస్తా'నని శకుని సూచించాడు. శకుని ఉపాయానికి అంగీకరించు మని తండ్రిని బలవంతపెట్టాడు దుర్యోధనుడు. అంగీకరించకపోతే అగ్నిలో పడి ఆత్మాహుతి చేసికొంటా నని బెదిరించాడు. పుత్రవ్యామోహంతో ధృతరాష్ట్రుడు శకుని వ్యూహానికి తలఊపాడు.

## మాయాద్యూతం

హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు వేయిమంది శిల్పులను పిలిపించి ఒక విచిత్ర మణిమయమహాసభను నిర్మించాడు. దానిలో మాయాద్యూతం జరిపించా లని నిర్ణయించి విదురుడికి చెప్పాడు. విదురుడు జూదంవలన కలిగే ఆపదలను పేర్కొని, దుర్యోధనాదులను ఆ ప్రయత్నంనుండి విముఖులయ్యేటట్లు ప్రయత్నించు మని ధృతరాష్ట్రుడిని హెచ్చరించాడు. గ్రుడ్డిరాజు ఏ విధంగానైనా జూదం జరగా లనీ, ఎటువంటి కీడులూ జరగకుండా పెద్దలు చూడా లనీ చెప్పి, పాండవులను తీసికొని రావటానికి విదురుడిని ఇంద్రప్రస్థపురానికి రథాలతో పంపాడు. విదురు డీసంగతి భీష్ముడికి నివేదించి బయలుదేరాడు.

మహేంద్ర వైభవంతో ఉన్న ధర్మరాజును విదురుడు దర్శించాడు. ధృతరాష్ట్ర సందేశాన్ని వినిపించాడు. నూత్న సభాసందర్శన సందర్భంలో సుహృద్ద్యూతం సమంజసం కా దనీ, అది కలతలకు దారి తీస్తుం దనీ ధర్మజుడు భావించాడు. కాని, పెదతండ్రి ఆనతిని శిరసావహించి భీమాదులను ద్రౌపదిని, ధౌమ్యాదులను వెంటబెట్టుకొని బయలుదేరి హస్తినాపురికి చేరాడు.

మణిమయమహాసభను దుర్యోధనుడు చూపగా ధర్మజుడు దర్శించి హర్షించాడు. ఆ తరువాత రారాజు ద్యూతానికి ఆహ్వానించాడు ధర్మరాజును. ద్యూతంవలన కలిగే కీడును పేర్కొని ధర్మరాజు ఆ ఆహ్వానాన్ని వారించాడు. శకుని కల్పించుకొని ఆట నేర్చినవారే దానిని నిందిస్తే ఆ కళ ఏమైపోతుం దని చమత్కరించి, ధర్మజుడు జూదమాడటానికి భయపడితే ఆడవలసిన అవసరం లే దని అధిక్షేపించాడు. ధర్మజుడు ఆ మాటకు నొచ్చుకొన్నాడు. 'బలవంతంగా జూద మాడించటానికి పిలిచిన తరువాత వెనుకాడటానికి వీలౌతుందా?' అని అంటూ విధిప్రేరితుడై మాయాద్యూతానికి ఉన్ముఖుడైనాడు.

జూదంలో తన పక్షాన శకుని ఆడతా డనీ, అత డొడ్డిన ధనరాసులు తాను చెల్లిస్తా ననీ రత్నరాసులు కుప్పలు పోసి దుర్యోధనుడు ముందుకు వచ్చాడు. 'ఇతరులకొరకు జూదం ఆడటం అసమంజసం' - అని అంటూనే ధర్మరాజు సాగరావర్త సంభవాలైన మణిరాసులను ఒడ్డాడు. సుహృద్ద్యూతం ఆరంభమయింది. భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాశ్వత్థామాదులు సముచితాసనాలలో కూర్చొని జూదాన్ని పరికిస్తున్నారు.

శకుని మాయావిదుడు. అందువలన పాచికలతో కావలసిన పందాన్ని జయప్రదంగా వేయగలడు. దానితో వరుసగా పందాలు శకుని గెలుచుకొంటున్నాడు. ధర్మరాజు ఓడిపోతున్నాడు. అట సాగే కొద్దీ ధర్మరాజుకు పంతంకూడా పెరిగింది. ఒక ఒడ్డుకు సువర్ణ భాండాగారాలు పెట్టి ఓడిపోయాడు. మరొక పందానికి రత్న భాండాగారాలను కోల్పోయాడు. ఇంకొకసారి చతుశ్శతనిధులను, మరొకసారి గుర్రాలను, ఏనుగులను, పరిచారికలను, పరిచారకులను ఇలా క్రమంగా ఉన్న సంపదనంతా, చివరకు రాజ్యాన్నికూడా మాయాద్యూతంలో చేజార్చుకొన్నాడు. విదురు 'డా కపటద్యూతాన్ని అంతటితో ఆపించు' మని ధృతరాష్ట్రుడిని కోరుకొన్నాడు. కాని, అతడు పుత్రవ్యామోహంతో కిమ్మనకుండా మిన్నకున్నాడు.

అప్పుడు విదురుడు దుర్యోధనుడిని ఇలా మందలించాడు: 'అన్యాయంగా, శకునిమాయతో, పాపమతివై జూదంలో పాండవుల సంపదలను ఇట్లా మోసంతో సంగ్రహించటం న్యాయమా? పాండవులు పరాక్రమాన్ని ప్రకటించి సంపాదించుకొన్నారు సంపదను; మీరు మోసంచేసి దోచుకొంటున్నారు'అన్నాడు. విదురుడి మాటలు దుర్యోధనునికి కోపం తెప్పించాయి. 'మావద్ద తిని పరాయివారిని పొగిడే కుత్సితబుద్ధి నీది! ఓ విదురా! నీవు మాయింట్లో విషసర్ప మున్న ట్లున్నావు. ఇతరులసంపద సులభోపాయంతో గ్రహించటం రాజనీతికాదా! అడగకుండానే నీవు మాకు నీతులు చెప్పవచ్చావు. ఇక చాలు. మాటలు కట్టిపెట్టటం మంచిది' - అని దుర్యోధనుడు విదురుడిని గద్దించాడు.

'దుర్యోధనా! నిన్ను పాడుచేసేవారిమాటలు విని సంబరపడుతున్నావు. నీకు హితుడైనవాడు - ముందుగా కొంత అప్రియంగా ఉన్నా తరువాత హితం చేకూర్చే మాటలు చెపుతాడు. హితులు మొగమోటం లేకుండా, బలవంతంగానైనా హితవును బోధిస్తారు. నీ విప్పుడు హితు లెవ్వరో, అహితు లెవ్వరో తెలిసికొనలేని స్థితిలో ఉన్నావు' - అని చెప్పి మాటలాడక మిన్నకున్నాడు విదురుడు.

ధనాల నన్నింటినీ ఓటువోయిన ధర్మరాజును మరొక పందెం కాయు మని శకుని బలవంతపెట్టాడు. ఆ తరువాత కూడా శకుని అవహేళనచేస్తూ పందాలు కాయుమనేవాడు. పౌరుషానికి ధర్మరాజు కాస్తుండేవాడు. వరుసగా సహదేవ నకుల పార్థభీములనూ, చివరకు తననుకూడా పణంగా పెట్టి జూదంలో ఓడిపోయాడు. ఆపైన శకుని 'ద్రౌపదికూడా నీ ధనమే కదా' అని ధర్మరాజుకు జ్ఞాపకం చేశాడు. గతిలేక కులభామనుకూడా జూదంలో ఒడ్డి చివరకు ఆమెనుకూడా ఓడిపోయాడు. ధర్మజుడు దీనవక్త్రుడై దిగాలుపడి కూర్చున్నాడు. భీష్మద్రోణులకు చెమటలు క్రమ్మాయి. విదురుడు మొగం ప్రక్కకుపెట్టి కంటతడి పెట్టుకొన్నాడు. మిగిలిన సదస్యు లందరూ ఏకధారగా దుఃఖించారు. దుర్యోధన దుశ్శాసన కర్ణ సైంధవులు విప్పారిన మొగాలతో ఒకరినొకరు చూచుకొంటూ నవ్వుకొన్నారు. సభలో కలకలం బయలుదేరింది. దుర్యోధనుడికి పట్టపగ్గాలు లేవు. పాండవులు తనకు దాసులైనా రని పొంగిపోతున్నాడు. ఆ గర్వాతిశయంతో పాంచాలిని దాసీలతో కలిసి తమయిళ్లు తుడవటానికి ఆజ్ఞాపించాడు. సభలో సంక్షోభం కలిగింది. గ్రుడ్డిరాజు ఆ గోల విని విషయ మేమి టని విదురుడిని అడిగి తెలిసికొన్నాడు.

## ద్రౌపదీవస్త్రాపహరణం

దుర్యోధనుడు తన ఆజ్ఞను నెరవేర్పజేయటానికి విదురుడిని పోయి ద్రౌపదిని సభకు తీసికొని రమ్మని కోరాడు. విదురు డందుకు అతడిని మందలించాడు. దుర్యోధనుడు విదురుడిని తూలనాడి, ద్రౌపదిని తోడ్కొని రావటానికి ప్రాతికామిని పంపాడు. అతడు ద్రౌపది దగ్గరకు పోయి జరిగిందంతా చెప్పాడు. 'ఎన్నడైనా ఇలా తననూ తన భార్యనూ జూదంలో ఓడిపోయిన జూదరి ఉంటాడా?' అని విచారిస్తూ ప్రాతికామిని ఒక ప్రశ్న వేసింది పాంచాలి. 'అన్నా! ధర్మజుడు ముందుగా తన నోడి ఆ తరువాత న న్నోడాడా? నన్ను ముందుగా ఓడి ఆపై తనను తా నోడాడా? ఈ వివరం నీకు తెలిస్తే నాకు తెలియచెప్పుము. నీకు తెలియకపోతే ఆ ధర్మరాజునే అడిగి తెలిసికొని వచ్చి, ఉచిత మైతే నన్ను తీసికొని పో'' అని నిర్దేశించింది.

ప్రాతికామి సభకు వచ్చి ధర్మరాజును ఈ ప్రశ్న నడిగాడు. అత డేమీ సమాధానం ఇవ్వలేక మిన్నకున్నాడు. దుర్యోధనుడు 'నిండుసభలోనే ఆ సందిగ్ధమైన అర్థాన్ని నిర్ణయించుకొనవచ్చును; పాంచాలిని వేగంగా తీసికొని ర'మ్మని

ప్రాతికామిని మరలా పంపాడు. ద్రౌపది పరిస్థితుల ప్రాబల్యాన్ని గమనించింది. ఏకవస్త్రగా, అధోనీవిగా, అవిరళాశ్రుధారాపాతగా సభకు వచ్చి కురువృద్ధుడి సమీపంలో నించున్నది. ద్రౌపదిమోము చూడలేక లజ్జితులై, దుఃఖాయమానమానసులై, తలలు వంచియున్న పాండవులను చూచి దుర్యోధనుడు సంతోషించాడు. దుశ్శాసనుడిని పిల్చి 'నీవు పోయి పెద్దలవద్ద నున్న ద్రౌపదిని ఈవలకు లాక్కొని ర' మ్మని నియోగించాడు. అతడు ఆమెను సమీపించాడు. భయంతో ద్రౌపది గాంధారి దగ్గరకు పోయింది. దుశ్శాసనుడు ఆమెను వెన్నంటి వెళ్ళాడు. 'ఇం కెక్కడికి పోతావు? నీమగళ్ళు ని న్నోడారు. రారాజు నిన్ను గెలుచుకొన్నాడు. వెంటనే రా!' అని గద్దించాడు. 'నేను రజస్వలను. ఏకవస్త్రను. నన్ను ముట్టకుము; పెద్ద లున్న సభకు నే నీ స్థితిలో రాలేను' అని దీనంగా పలికింది పాంచాలి. 'నీవు ఏకవస్త్ర వైతే నేమి? వివస్త్ర వైతే నేమి? నిన్ను ఎట్లాగైనా తీసికొని పోతాను' - అని ఆ దుశ్శాసనుడు బలవంతంగా రాజసూయావభృథస్నానంతో పవిత్రమైన ఆమెశిరోజాలను ఒడిసిపట్టి సభకు ఈడ్చితెచ్చాడు. కర్ణ దుర్యోధన శకుని సైంధవాది దుష్టభూయిష్ఠమైన ఆ సభలో నిలబడి ద్రౌపది వివర్ణవదనంతో ఇట్లా సభికులను ఉద్దేశించి పలికింది -

'ఓ కురువృద్ధులారా! ధర్మరాజు ఎంత దురదృష్టకరమైన పరిస్థితులలో చిక్కుకొన్నా, ధర్మమార్గాన్ని మాత్రం వీడని ధన్యుడు. దుర్జనుడైన ఈ దుశ్శాసనుడు న న్నీసభ కెందుకు ఈడ్చుకొని తెచ్చాడు? సర్వధర్మసంవిదు లని పేరుగాంచిన కురుముఖ్యులు చూస్తూ ఉండగానే ఈ దుర్మదాంధుడు న న్నిట్లా అవమానిస్తున్నాడు. భరతవంశం నేడు అధర్మంతో అతినింద్యమై పోయింది' అని ఆక్రోశిస్తూ, 'అన్యథా శరణం నాస్తి' అనే భక్తిభావంతో ద్రౌపది శ్రీకృష్ణుడిని మనసులో తలచింది.

ద్రౌపదిదీనస్థితి చూచి భీముడు ధర్మరాజుపై మండిపడ్డాడు. జూదానికి కారణమైన అతడిచేతుల్ని కాలుస్తా నన్నాడు. అర్జునుడు అడ్డం వచ్చి ధర్మరాజువర్తనంలోని ధర్మనీతిని తెలియపరిచాడు. సభలో వికర్ణుడు లేచి ద్రౌపది అన్యాయవిజిత అని వాదించాడు. ఆమె అడిగిన ప్రశ్నలకు సమాధానం ఇవ్వటం సభాధర్మ మని మనవి చేశాడు. కర్ణుడు అతడిని అధిక్షేపించాడు. అడగకుండానే నీతులు చెప్పే అధికప్రసంగానికి పోవ ద్దని మందలించాడు. ద్రౌపది ధర్మవిజితయే అని సమర్థించాడు. ఒక పతిని దైవంగా భావించి కాపురం చేసే వనితను ఏకవస్త్ర యని గౌరవించాలిగాని, అనేకభర్తృక అయిన బంధకిని వివస్త్రను చేసినా దోషం లే దని కర్ణుడు వాదించాడు. ఆ మాటలు విని రెచ్చిపోయి దుర్యోధనుడు 'పాండవుల వస్త్రాలను గ్రహించు'మని, 'పాంచాలిని వివస్త్రను చేయు'మని దుశ్శాసనుడిని ఆజ్ఞాపించాడు. అతడు అన్నమాటను అక్షరాలా పాటించాడు.

అయినా, అఖిలజగద్రక్షాదక్షుడైన నారాయణుడిమహిమవలన ద్రౌపదిశరీరంమీద చీర తొలగకుండా నిలిచి ఉండింది. దుశ్శాసనుడు లాగిన చీరలు కుప్పలు కుప్పలుగా పర్వతాకారంగా పడినాయి. అత డా మహిమకు సిగ్గుపడ్డాడు. అలసిపోయి ఊరుకొన్నాడు. దుశ్శాసనుడు ద్రౌపదికి చేసిన అవమానాన్ని భీమసేనుడు చూచి, ప్రతిక్రియ ఏమీ చేయలేని దయనీయ స్థితిలో ఉండికూడా రౌద్రాకారుడై ఇట్లా భయంకర శపథం చేశాడు: 'కురువృద్ధులు, గురువృద్ధులు, బంధువులు అనేకులు చూస్తూ ఉండగా మదోన్మత్తుడై ద్రౌపది నీవిధంగా చేసిన దుర్మార్గుడైన దుశ్శాసనుడిని యుద్ధంలో లోకాలు భయపడేటట్లు ఉగ్రాకారంతో చంపి అతడిగుండెలలోనుండి పెల్లుబికే రక్తప్రవాహాలను మనసారా రుచిచూస్తాను.' 'అట్లా చేయకపోతే పితృపితామహులగతికి తప్పినవాడి నవుతాను.' భీమశపథం విన్న సభాసదు లందరూ సపుత్రకుడైన ధృతరాష్ట్రుడిని నిందించారు. పాంచాలిప్రశ్నలను పట్టించుకొనని సభను విమర్శించారు. పాంచాలి ప్రశ్నలకు సమాధానం చెప్పకపోతే ధర్మవిదులకు పుట్టగతులుండ వని విదురుడు హెచ్చరించాడు. ఆమెప్రశ్నకు ధర్మరాజుమాత్రమే తగిన జవాబివ్వగల డని భీష్ముడు మారు పల్కాడు.

ఇంతలో కర్ణుడు పెచ్చు పెరిగి ద్రౌపదిని చూచి నవ్వుతూ 'తరుణీ! నీకు ఆరవ భర్త ఉండటం ఉచితం. జూదంలో ఓడనివాడినిగా చూచి అతడిని ఎన్నుకో'' అని ఎగతాళి చేశాడు. ఆ మాటలను ఆసరాగా తీసికొని దుర్యోధనుడు ఆ యిల్లాలిని తన యెడమ తొడమీద కూర్చొను మని సైగచేశాడు. ఆ దారుణమైన దృశ్యం చూచి వాయునందనుడు ఆగ్రహోదగ్రుడై లయకాలరుద్రుడివలె విజృంభించి భయంకరశపథం చేశాడు. 'రాజ్యసంపద మదంతో కన్ను మిన్ను కానకుండ

కోమలిని ద్రౌపదిని తన తొడమీద కూర్చో మని పిలిచిన దురాత్ముడైన దుర్యోధనుడిని భయంకరమైన రణరంగంలో నా బాహువులతో త్రిప్పే ప్రచండగదాఘాతాలతో తొడలు విరుగ గొట్టి చంపుతాను'- అని అరుణలోచనాలతో ఆయుధా లున్నవైపు చూపులు సారిస్తూ అన్నగారిఅనుమతికొరకు ఎదురు చూస్తున్న భీముడిని భీష్మవిదురద్రోణాదులు 'ఇది కోపానికి సమయం కా'దని వారించారు. ఆ సమయంలో ధృతరాష్ట్రుడి అంతఃపురంలో ఎన్నో అపశకునాలు గోచరించాయి. గాంధారి విదురుడిని తోడ్కొని ధృతరాష్ట్రుడి దగ్గరకు పోయి, జరిగినదంతా చెప్పింది. ధృతరాష్ట్రుడు దుర్యోధనుడిని పిలిచి కోపించి, సకలబాంధవహితం చేయసమకట్టి ద్రౌపదిని దగ్గరికి పిలిచి శాంతవచనాలు పలికాడు. ధృతరాష్ట్రుడు ద్రౌపదిని వరాన్ని కోరుకొ మ్మని అడిగాడు. ఆమె ధర్మరాజుదాస్యవిముక్తిని వరంగా కోరుకొన్నది. దానిని గ్రుడ్డిరాజు ప్రసాదించి రెండో వరాన్ని కోరుకో మన్నాడు. భీమాదులు నలుగురును వారిఆయుధాదులతోసహా దాస్యవిముక్తులు కావా లని అడిగింది. దానినీ ఇచ్చాడు. మూడోవరం వేడుకో మన్నాడు. 'క్షత్రియవనితకు రెండువరాలు కోరుకొనటం న్యాయం కాబట్టి మూడోవరం కోరుకొన'నన్నది. కోడలిధర్మనిష్ఠకు మెచ్చుకొని ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు అతనిరాజ్యాన్ని యిచ్చి యేలుకొ మ్మని ఇంద్రప్రస్థపురానికి పంపాడు. పాండవులు బంగారురథా లెక్కి తమరాజధానికి చేరి సుఖంగా ఉన్నారు.

### అనుద్యూతం

ఈ విషయం తెలిసికొన్న దుర్యోధనుడు ఖిన్నుడై తండ్రి వద్దకు పోయి ఇట్లా అన్నాడు- 'ఇకపై ఎంతమేలుచేసినా పాండవులకు మనం హితులం కాగలమా? పాములను తోకలు త్రొక్కి వదిలిపెట్టాం. అవి పగపట్టి కాటేయక మానవు. గాండీవంతో ఉన్న సవ్యసాచిని, గదగొన్న భీముడిని ఎదుర్కొనటం సాధ్యమా? కాబట్టి వారలను మరల పిలిపించి అనుద్యూతంలో ఓడించి, అడవులకు పంపుదాం' అని ధృతరాష్ట్రుని ఒప్పించి, ప్రాతికామిని పాండవులను తీసికొనిరావటానికి పంపాడు.

ధర్మరాజాదులు మరల హస్తినాపురికి వచ్చారు. అనుద్యూతానికి పూనుకొన్నారు. అందులో ఓడినవారు వల్కలాలు కట్టి, కందమూలాలు తింటూ, బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ పన్నెండేళ్లు వనవాసం చేసి, పదమూడవయేడు జనపదంలో అజ్ఞాతవాసం చేయాలి. అజ్ఞాతవాసంలో ఎవరైనా గుర్తిస్తే మరల పన్నెండేళ్ల అరణ్యవాసం, ఒకయేడు అజ్ఞాతవాసం చేయా లని కట్టడి చేసికొన్నారు. ధర్మరాజు అనుద్యూతంలో శకునిమాయవలన ఓడిపోయాడు. పాండవులు వనవాసాజ్ఞాతవాసాల దీక్షను గ్రహించారు. కుంతిని విదురునియింట ఉంచారు. సతీసమేతులై పాండవులు అడవులకు బయలుదేరారు.

తలవిరబోసుకొని పతుల వెంట నడచిపోయే ద్రౌపదిని చూచి కౌరవేంద్రుడి అంతఃపురవనిత లందరూ ఏదో చెప్పలేని భయంతో తలలు వంచారు. 'నా భయంకరగదాదండంతో ఆ దుర్యోధనునితొడలను ఉగ్రరణంలో విరగకొడతాను. శిరస్సు కాలితో తన్ని అవమానిస్తాను, దుశ్శాసనుడిని వధించి వేడిరక్తం త్రాగుతా' నంటూ బుసలు కొడుతూ సాగాడు వాయుపుత్రుడైన భీమసేనుడు. 'రాబోయే పదునాల్గవయేట జరగబోయే మహాయుద్ధంలో నా గాండీవం ఈ కర్ణుడు మొదలుగాగల దుర్జన సంఘాన్ని హతమారుస్తా' నని హుంకరిస్తూ అర్జునుడు వెళ్ళాడు. 'మాయాద్యూతంలో మోసం చేసి యింత విపత్తుకు మూలమైన శకునిని చంపుతా' మని భీమార్జుననకులసహదేవులు శపథం చేశారు.

ధృతరాష్ట్రుడిమందిరంలో పట్టపగలే నక్కలు కూశాయి. గ్రహణకాలం కాకుండానే సూర్యుడిని రాహువు పట్టాడు. భూమి కంపించింది. నారదుడు మింట నాట్యం చేస్తూ 'పదునాల్గవయేట భారతయుద్ధం జరుగుతుంది. భీమార్జునపరాక్రమాలవలన పాండవులు జయిస్తారు' అని ప్రకటించాడు.

**ఇది సభాపర్వకథాసారం.**

**జి.వి. సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సభాపర్వము

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము

# ద్వితీయాశ్వాసము





శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సభాపర్వము -ప్రథమాశ్వాసము

**శ్రీదయితోరస్థ్సల! విమ । లాదిత్యాత్మజ! నిరంతరానందమతీ!**
**కోదండపార్థ! నిఖిల ధ । రాదేవ స్తుత్య! రాజరాజ నరేంద్రా!** **1**

**ప్రతిపదార్థం:**శ్రీ,దయితా+ఉరస్+స్థల=ప్రియురాలైన లక్ష్మీదేవిని వక్షస్థ్సలంలో కలవాడా (శ్రీమహావిష్ణువా!); విమల+ఆదిత్య+ ఆత్మజ= విమలాదిత్యుని యొక్క కుమారుడా!; నిరంతర+ఆనంద, మతీ= ఎల్లప్పుడు ఆనందంతో కూడుకొన్న మనస్సు కలవాడా!; కోదండ, పార్థ= విలువిద్యలో అర్జుననివంటివాడా!; నిఖిల, ధరా, దేవ, స్తుత్య= అందరు బ్రాహ్మణులచేత కొనియాడబడేవాడా!; రాజరాజ నరేంద్రా!

**తాత్పర్యం:** ప్రియురాలైన లక్ష్మీదేవిని వక్షస్థ్సలంలో కల విష్ణువువంటివాడా! విమలాదిత్యునికుమారా! అన్నివేళలా ఆనందమయమైన మనస్సుకలవాడా! విలువిద్యలో పార్థుడితో సమానమైనవాడా! బ్రాహ్మణు లందరి ప్రశంసలందుకొనేవాడా! ఓ రాజరాజనరేంద్రా!- (అని నన్నయ ప్రశంసాపూర్వకంగా రాజరాజును సంబోధించి, సభాపర్వప్రథమాశ్వాసరచన ప్రారంభించాడు).

**విశేషం:** ఆశ్వాసారంభంలో, ఆశ్వాసాంతంలో కృతిపతి గుణవిశేషాలు కొనియాడుతూ అతణ్ణి సంబోధించి కథను ప్రారంభించటం, ముగించటం ప్రాచీనకావ్య సంప్రదాయం. ఆ సంప్రదాయానుసారంగా జరిగిందే ఈరాజరాజ నరేంద్రుడి ప్రశంస; సంబోధన. అయినా తన భారతకృతిపతి రాజరాజనరేంద్రు డని నన్నయ ఎక్కడ స్పష్టంగా చెప్పలేదు. 'నావిష్ణుః పృథివీపతిః'- విష్ణువు కానివాడు పృథ్వీపతి (రాజు) కాలే డనిగదా ఆర్యోక్తి. అందువలన రాజరాజనరేంద్రుని విష్ణుత్వాన్ని, శత్రుశిక్షణ సమర్థమైన ఆయన పరాక్రమాన్ని నన్నయ భారతంలో అనేకసందర్భాల్లో అనేకవిధాలుగా వర్ణించాడు. ప్రస్తుతపద్యంలో 'శ్రీదయితోరస్థ్సల' అనే సంబోధనలో ఆయన విష్ణుత్వం, 'కోదండపార్థ' అనే సంబోధనలో ఆయన పరాక్రమం ప్రకటం కావటం గమనార్హం. కుంతి మొదటి పేరు పృథ. పృథపుత్రుడు పార్థుడు. పృథాపుత్రు లందరు పార్థులే. కాని పార్థ డంటే స్మృతికి వచ్చేది ఒక్క అర్జునుడే. అర్జునుని పదిపేర్లలో పార్థ డనేది ఒకటి. అర్జునుని పదిపేర్లు - అర్జునుడు, ఫల్గునుడు, పార్థుడు, కిరీటి, శ్వేతవాహనుడు, బీభత్సుడు, విజయుడు, జిష్ణుడు, సవ్యసాచి, ధనంజయుడు.

### మయుం డొక్కసభను నిర్మించి ధర్మజున కిచ్చుట (సం. 2-1-1)

**వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె: నట్లు ధర్మతనయునొద్ద వాసుదేవ సహితుం డయి యున్న యర్జునున కతిప్రీతిం గృతాంజలి యయి మయుం డిట్లనియె.** **2**

**ప్రతిపదార్థం:**ఆ+కథకుండు= ఆ కథను చెప్పేవ్యక్తి (భారతకథను చెప్పే ఉగ్రశ్రవసుడనే సౌతి); శౌనక+ఆది, మహా, మునులకున్= శౌనకుడు మొదలైన మహామునులకు; చెప్పెన్= (ఖాండవవనదహనంవరకు జరిగిన కథను) చెప్పాడు; అట్లు= ఆ విధంగా-

అంటే ఖాండవదహన కారణంగా అగ్నిదేవునివల్ల దివ్యధనుర్బాణతూణీరలాభాన్ని పొంది; ధర్మతనయు+ఒద్ద= ధర్మరాజుదగ్గర; వాసుదేవ, సహితుండు+అయి= శ్రీకృష్ణునితో కూడినవాడై; ఉన్న; అర్జునునకున్; అతి ప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; కృత+అంజలి, అయి= చేయబడిన నమస్కారం కలవాడై- అంటే నమస్కరించి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నైమిశారణ్యంలో ఉగ్రశ్రవసుడనే మహర్షి, శౌనకాదులైన మహామునులకు ఖాండవదహనందాకా జరిగిన భారతకథను చెప్పాడు. ఖాండవ దహనం తరువాత శ్రీకృష్ణునితో కలిసి ధర్మరాజు దగ్గర ఉన్న అర్జునునికి మయుడు మహాసంతోషంతో నమస్కరించి ఇలా అన్నాడు. (అని ఉగ్రశ్రవసుడు మళ్ళీ కథ ప్రారంభించాడు.)

**విశేషం:** ఉగ్రశ్రవసుడు రోమహర్షణునిపుత్రుడు. అందువల్ల ఆయనకు రౌమహర్షణి అని కూడ పేరు. 'రౌమహర్షణి సుపౌరాణికుండు' (ఆది, ఆశ్వా. 1-28). వాసుదేవుడు-అన్నింటా, అంతటా వసించటంచేత భగవంతునికి వాసుదేవు డని పేరు. భగవంతుని అవతారం కావటంచేత, వసుదేవుని పుత్రుడు కావటంచేత శ్రీకృష్ణునికి కూడ వాసుదేవు డని పేరు. మయుడు రాక్షసశిల్పి. నముచి తమ్ముడు.

**క. ఘనముగఁ బ్రాణము రక్షిం । చిన యుపకారికిఁ బ్రియంబు సేయుదు నన నే**
**ర్తునె; యైనను నీకుఁ బ్రియం । బనఘా! చేయంగ నిష్టమైనది నాకున్. 3**

**ప్రతిపదార్థం:** అనఘా= పాపరహితుడవైన ఓ అర్జునా!; ఘనముగన్= గొప్పగా; ప్రాణము, రక్షించిన= (నా) ప్రాణాన్ని కాపాడిన; ఉపకారికిన్; ప్రియంబు, చేయుదున్, అనన్, నేర్తునె= ఇష్టమైనది చేయగలనని చెప్పగలనా; ఐనను; నీకున్; ప్రియంబు; చేయంగన్; నాకున్; ఇష్టము+ఐనది= కోరిక కలిగింది.

**తాత్పర్యం:** అర్జునా! నీవు నా ప్రాణాలనే కాపాడిన మహోపకారివి. అలాంటి నీకు ఏదో మేలు చేస్తా నని చెప్పటానికి సమర్థుడినా! అయినా నీకు ఇష్టమైన దేదో చేయా లని నాకు కోరికగా ఉంది.

**విశేషం:** మయునిమాటల్లో ఎంతో వినయం, అంతులేని ఆనందం, అపారకృతజ్ఞత వ్యక్తమౌతున్నాయి. ఉపకారం పొందిన ఏ వ్యక్తికైనా ఇవి ఉండదగిన గుణాలు.

**వ. 'ఏను దానవ విశ్వకర్మ, ననేకవిధ శిల్ప కలా కుశలుండ; మీ కిష్టంబయిన దాని నిర్మించెదం బనుపుం' డనిన నర్జునుం డచ్యుతుమొగంబు చూచి 'యతని నెద్దియేనియు నొక్క యపూర్వం బయినదాని నిర్మింప నియోగింపు' మనినఁ గృష్ణుండు పెద్దయుంబ్రొద్దు విచారించి మయున కిట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; దానవ, విశ్వకర్మన్= రాక్షసజాతికి చెందిన శిల్పిని; అనేక, విధ, శిల్ప, కలా, కుశలుండన్= పలువిధాలైన శిల్పకళలలో నేర్పరిని; మీకున్+ఇష్టంబు+అయిన, దానిన్; నిర్మించెదన్= సృజిస్తాను, చేస్తాను; పనుపుండు= ఆజ్ఞాపించండి; అనినన్= అని అనగా, అర్జునుండు; అచ్యుతు, మొగంబు= శ్రీకృష్ణుని ముఖాన్ని; చూచి; అతనిన్= ఆ మయుణ్ణి; ఎద్ది; ఏనియున్= ఏదైనా; ఒక్క, అపూర్వంబు+అయిన, దానిన్= ఇంతకుముం దెన్నడు లేనిదొక దానిని; నిర్మింపన్; నియోగింపుము= ఆజ్ఞాపించుము; అనినన్= అని అనగా; కృష్ణుండు; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; విచారించి= ఆలోచించి; మయునకున్+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నేను దానవశిల్పిని, వివిధకళల్లోనేర్పరిని. మీ కిష్టమైనదాన్ని నిర్మించి ఇస్తా, ఆజ్ఞాపించండి' అని మయుడు అర్జునుణ్ణి అడిగాడు. అర్జునుడు శ్రీకృష్ణునిముఖం చూచి 'ఏదైనా ఒక అపూర్వమైనదాన్ని నిర్మించవలసిందిగా ఆజ్ఞాపించం'డని అన్నాడు. శ్రీకృష్ణుడు చాలాసేపు ఆలోచించి మయునితో ఇలా అన్నాడు.

**విశేషం:** అచ్యుతుడు - చ్యుతిలేనివాడు - అంటే పతనం లేనివాడు - శ్రీమహావిష్ణువు. ఆయన అవతారం కావటంచేత శ్రీకృష్ణునికి కూడ అచ్యుతు డనేపేరు.

**చ. కురుపతికిన్ యుధిష్ఠిరునకున్ సకలక్షితిపాలసేవ్యసు**
**స్థిర విభవాభిరామున కతిప్రమదంబుగ రత్నరాజిసుం**
**దర మగు దాని నొక్క సభ ధాత్రి కపూర్వముగా నొనర్చి చె**
**చ్చెరఁ గొనిరమ్ము నీదయిన శిల్పకలాకుశలత్వ మేర్పడన్. 5**

**ప్రతిపదార్థం:**కురుపతికిన్=కురువంశరాజుకు; యుధిష్ఠిరునకున్=ధర్మరాజుకు;సకల, క్షితి,పాల,సేవ్య,సుస్థిర,విభవ+అభిరామునకున్= అందరుభూపతులచేత - అంటే రాజులచేత కొలువదగిన శాశ్వత వైభవంతో వెలిగేవానికి; అతి, ప్రమదంబుగన్= ఎంతో సంతోషం కలిగేవిధంగా; రత్న, రాజి, సుందరము+అగు, దానిన్= రత్న సమూహంతో అందమైనదానిని; ఒక్క, సభన్= ఒక సభాభవనాన్ని; ధాత్రికిన్+అపూర్వముగాన్= భూమిమీద మున్నెన్నడు లేనివిధంగా; నీది+అయిన, శిల్ప, కలా, కుశలత్వము+ఏర్పడన్= నీయొక్కశిల్పకలానైపుణ్యం ప్రకాశించేవిధంగా; ఒనర్చి= నిర్మించి, చెచ్చెరన్= వేగమే; కొని, రమ్ము= తీసికొనిరా.

**తాత్పర్యం:** ధర్మరాజు కురువంశప్రభువు. అంతేకాదు, అందరు రాజులు సేవించదగిన శాశ్వతవైభవంతో విరాజిల్లే ప్రభుడు. అలాంటి ధర్మరాజుకు ఆనందదాయకంగా, నానావిధరత్నసమూహాలతో అందంగా, లోకానికే అపూర్వంగా నీ శిల్పకళానైపుణ్యానికి నిదర్శనంగా ఒక మహాసభను నిర్మించి వెంటనే తీసికొనిరా.

**విశేషం:** ధర్మరాజు అప్పటికి ఇంకా 'సకలక్షితిపాలసేవ్యసుస్థిరవిభవాభిరాముడు' కాలేదు. అయినా శ్రీకృష్ణుడు ఆ విశేషణాన్ని ప్రయోగించి అతని భావి సార్వభౌమయోగాన్ని అందరికీ ధ్వనింపజేయటం, ఏదో సామాన్యమైన సభనుగాక, సార్వభౌమయోగ్యమయిన మహాసభను నిర్మించి తెమ్మని మయునికి సూచించటం ఈ సందర్భంలో గమనించదగిన అంశాలు. మహాత్ముల మాటలు సార్థకాలు; భావ్యర్థసూచకాలు. శ్రీకృష్ణుడు అన్నట్లే తర్వాత ధర్మరాజు సార్వభౌము డయ్యాడు కదా! యుధిష్ఠిరుడు- 'ధృతిఁజేసి యుధిష్ఠిరుఁడు' (ఆది. ఆశ్వా.5-97)- యుద్ధంలో స్థిరంగా ధైర్యంతో నిలిచేవాడు ధర్మరాజు. పద్యంలో 'సకలక్షితిపాలసేవ్యసుస్థిరవిభవాభిరాముఁడు' - అనే సుదీర్ఘసంస్కృతసమాసం, అర్థం తెలియనివాళ్ళకుకూడ మున్ముందు ధర్మరాజుకు పట్టబోయే సార్వభౌమమహాయోగాన్ని ధ్వనింప చేసేదిగా ఉంటే- 'ఒనర్చి చెచ్చెరఁ గొనిరమ్ము'- అనే అలతి అలతి తెలుగు పదాలకూర్పు 'అపూర్వసభానిర్మాణం కదా అని ఆలస్యం చేసేవు- సత్వరం పని పూర్తిచేసి సభను తీసుకురా', అని మయుణ్ణి త్వరపెట్టి తరిమేదిగా ఉంది. అక్షరరమ్యమైన నన్నయశైలికి ఈ మాటలకూర్పులు మెరుగుటద్దాలు. ఈ పద్యంలో గుణం ప్రసాదం.

**వ. అనిన వాసుదేవునకు మయుం డిట్లనియె. 6**

**తాత్పర్యం:** ఆ విధంగా అనిన శ్రీకృష్ణునితో మయుడు ఇలా అన్నాడు.

ఉ. ఇమ్మనుజేంద్రుఁ డింద్రదనుజేంద్రులకంటె మహావిలాస సౌ
ఖ్యమ్ములఁ బెద్ద యిద్ధరణిఁ గావున, నీతని పేర్మికిం దగన్
నెమ్మి నొనర్చెదన్ సభ మణిప్రభ నొప్పఁగ, దేవతావిమా
నమ్ములు నిట్టివే యని జనమ్ములు దానిన మెచ్చి చూడఁగన్. 7

**ప్రతిపదార్థం:** ఈ+మనుజ+ఇంద్రుఁడు= మానవులకు రాజైన ఈ ధర్మరాజు; ఇంద్ర, దనుజ+ఇంద్రులకంటెన్= దేవతల రాజైన ఇంద్రునికంటె, రాక్షసులకు రాజైనవానికంటె; మహా, విలాస, సౌఖ్యమ్ములన్= గొప్పవైభవంలో, సుఖాల్లో; ఈ+ధరణిన్= ఈభూమిమీద; పెద్ద;కావునన్; ఈతని, పేర్మికిన్=ఇతని గొప్పతనానికి; తగన్= తగినట్లు; మణిప్రభన్, ఒప్పఁగన్= మణులకాంతితో ప్రకాశించేవిధంగా; జనమ్ములు= ప్రజలు; దేవతావిమానమ్ములున్= దేవతలయొక్కసౌధాలు(మేడలు)అయినా; ఇట్టివే=ఈ విధంగా ఉంటాయా!; అని; దానిన్+అ= ఆ సభనే; మెచ్చి; చూడఁగన్; నెమ్మిన్= ప్రేమతో; సభ=సభను; ఒనర్చెదన్= నిర్మిస్తాను.

**తాత్పర్యం:** వైభవంలో, భోగానుభవంలో, దేవేంద్ర రాక్షసేంద్రులకంటె మనుజేంద్రుడైన ధర్మరాజే ఈ ధరమీద మిన్న. ఆయన గొప్పతనానికి తగ్గట్లు, దేవతలమేడలైనా ఇంత బాగుంటాయా అని జనులంతా దానినే మెచ్చి చూచేటట్లు, మణుల కాంతితో మెరిసే ఒక మహాసభను మనసార నిర్మించి ఇస్తా.

**విశేషం:** అలం: సందేహం. 'మెచ్చిచూడఁగన్' అనటానికిబదులు 'వచ్చిచూడఁగన్' అని కొన్ని ప్రతుల్లో ఉన్నపాఠం కూడ ఉచితమైనదే. దేవతావిమానాలు అంటే- దేవతలు ఆకాశంలో పయనించే వాహనాలు, దేవతలు నివసించే సౌధాలు, దేవాలయ గర్భగుడి గోపురాలు- అని మూడర్థాలూ చెప్పవచ్చు. కాని, ఇక్కడ దేవతలు నివసించే సౌధాలు- అని చెప్పటమే ఎక్కువ ఉచితంగా ఉంటుంది. దనుజేంద్రు డంటే బలిచక్రవర్తి అని ప్రసిద్ధి. ఈ పద్యంలో 'ఇంద్ర' శబ్దం మూడుసార్లు వచ్చింది- మనుజేంద్రుడు, ఇంద్రుడు, దనుజేంద్రుడు. ఈ ముగ్గురూ వరుసగా మర్త్య, స్వర్గ, పాతాళాలకు అధిపతులు. సాంప్రదాయికంగా చెప్పుకొనే వరుసక్రమం- స్వర్గ, మర్త్య, పాతాళాలు. ఈ ముల్లోకాల ఇంద్రుల్లో మనుజేంద్రుడు రెండవవాడు. మధ్య ఉండేవాడు. కాని పద్యంలో అతడు మొదటివా డయ్యాడు. దీనివల్ల త్రిలోకాధిపతుల్లో ధర్మరాజు శ్రేష్ఠు డని ధ్వని. అందుచేత అతని యోగ్యతకు తగ్గట్లు మహాసభ ఉండా లని మయుని ఉద్దేశం. దనుజేంద్రునిసభకంటె దేవేంద్రునిసభ గొప్పది. అంతకంటె గొప్పదిగా ధర్మరాజు సభ ఉండా లనీ, ఆ సభను చూచి, దేవతల సౌధాలుకూడా ఇలా ఉండవే- అని జనులంతా ఆశ్చర్యపోవా లనీ మయుని అభిప్రాయం. శ్రీకృష్ణుడు ధర్మరాజును మనుజేంద్రుల్లో గొప్పవా డని భావిస్తే, మయుడు ఆ మహారాజును ముల్లోకాధిపతుల్లో అధికు డని అన్నాడు. అతని ఆధిక్యానికి తగ్గట్లే ఆ సభను తీర్చిదిద్దుతా నన్నాడు. దేవేంద్రాదులసభలకంటే ఈ సభ దివ్యమైం దని, మున్ముందు తేల్చిచెప్పే త్రిలోకసంచారి నారదమహర్షిమాటకు ఇది సూచ్యార్థసూచన. పద్యంలోని అర్థవ్యక్తిప్రసాదగుణపరిపోషకం- వస్తుధ్వనికి వ్యంజకం. నన్నయ రచనాశిల్పానికి చక్కనిదర్పణం.

వ. తొల్లి వృషపర్వుండను దానవేంద్రున కొక్కసభ నిర్మింప సమకట్టి వివిధ రత్నమయంబులయిన యుపకరణంబు లొడఁగూర్చి బిందుసరంబను కొలన సంగ్రహించినవాఁడ; నయ్యుపకరణంబుల దాని విచిత్రంబుగా రచియించి తెచ్చి ధర్మరాజున కిచ్చెద; మఱియును భౌమాదిత్యుండను రాజర్షిచేత నిహితంబయి సకలశత్రుఘాతినియైన దాని భీమసేనున కొక్కగదను. దారుణంబయిన దివ్యఘోషంబు గలుగు దేవదత్తంబను శంఖం బర్జునునకు నిచ్చెద'నని చెప్పి ధర్మరాజుచేత సత్కృతుండై మయుం డరిగె; నంత నిట నారాయణుండును బాండవుల వీడ్కొని పితృదర్శనలాలసుండై ద్వారవతీపురంబున కరిగె; నట

**మయుండును బూర్వోత్తరదిశాభిముఖుండై పోయి కైలాసంబునుత్తరంబున మైనాకశైలంబునందు హిరణ్యశృంగంబున. 8**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; వృషపర్వుండు+అను; దానవ+ఇంద్రునకున్= రాక్షసరాజుకు; ఒక్కసభ; నిర్మింపన్; సమకట్టి= పూనుకొని వివిధరత్నమయంబులు+అయిన= అనేకరకాలైన రత్నాలతో కూడుకొన్న; ఉపకరణంబులు= సాధనాలు; ఒడన్+కూర్చి= ప్రోగుచేసి; బిందుసరంబు+అను, కొలనన్= బిందుసరం అనేపేరుగలకోనేటిలో; సంగ్రహించినవాఁడన్= సేకరించిఉంచాను; ఆ+ఉపకరణంబులు+అ= ఆ సామగ్రితోనే; దానిన్= ఆ సభను; విచిత్రంబుగాన్= మిక్కిలిఆశ్చర్యకరమైనదానినిగా; రచియించి= నిర్మించి; తెచ్చి; ధర్మరాజునకున్; ఇచ్చెద; మఱియును; భౌమ+ఆదిత్యుండు+అను; రాజ+ఋషిచేతన్= ఋషివంటిరాజుచేత; నిహితంబు+అయి=ఉంచబడింద్రై; సకల, శత్రు, ఘాతిని, ఐన, దానిన్= అందరు శత్రువులను చంపునట్టిదైనదానిని; ఒక్కగదను; భీమసేనునకున్; దారుణంబు+అయిన= భయంకరమైన; దివ్య, ఘోషంబు, కలుగు= శ్రేష్ఠమైనశబ్దం వచ్చే; దేవ, దత్తంబు+అను= దేవదత్తం అనేపేరుగల; శంఖంబు; అర్జుననకున్+ఇచ్చెదన్+అని; చెప్పి; ధర్మరాజుచేతన్; సత్, కృతుండు+అయి= సమ్మానించ బడినవాడయి; మయుండు; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= తరువాత; ఇటన్= ఇక్కడ; ఇంద్రప్రస్థమున; నారాయణుండును= శ్రీకృష్ణుడుకూడ; పాండవులన్, వీడ్కొని= పాండవుల దగ్గర సెలవుతీసికొని; పితృ, దర్శన, లాలసుండు+ఐ= తండ్రిని చూడటంలో మిక్కుటమైన కోరిక కలవాడై- అంటే తండ్రిని చూడాలన్న తహతహతో; ద్వారవతీ, పురంబునకున్= ద్వారకానగరానికి; అరిగెన్= వెళ్ళాడు; అటన్= అక్కడ; మయుండు; పూర్వ+ఉత్తర, దిశా+అభిముఖుండు+ఐ= ఈశాన్యదిశవైపు తిరిగినవాడై; పోయి; కైలాసంబు= కైలాసపర్వతానికి; ఉత్తరంబునన్ మైనాక, శైలంబు+అందున్= మైనాక పర్వతంలో; హిరణ్యాశృంగంబునన్= హిరణ్యమనే పేరున్న శిఖరంలో.

**తాత్పర్యం:** 'పూర్వం వృషపర్వుడనే రాక్షసరాజుకు ఒక సభను నిర్మించి ఇవ్వా లని, నానావిధరత్నాలతో కూడిన నిర్మాణ సామగ్రిని సమకూర్చాను. ఆ సామగ్రినంతా బిందుసరం అనే సరోవరంలో భద్రపరచాను. ఇప్పుడా సామగ్రిని ఉపయోగించి చిత్ర, విచిత్రమైన సభను నిర్మిస్తాను. దాన్ని ధర్మతనయునికి బహూకరిస్తాను. అంతే కాదు, భౌమాదిత్యుడనే రాజర్షి ఉంచిన గదాశంఖాలు నా అధీనంలోనే ఉన్నాయి. సర్వశత్రువుల్ని హతమార్చే ఆ గదను భీమసేనుని కిస్తాను. మహాభయంకరమైన దివ్యధ్వని గల దేవదత్తశంఖాన్ని అర్జునునికిస్తాను' - అని మయుడు ధర్మరాజుచేత సమ్మానంపొంది అక్కడినుండి బయలుదేరాడు. శ్రీకృష్ణుడుకూడ తనతండ్రిని చూడాలన్న ప్రబలకుతూహలంతో- పాండవులదగ్గర సెలవు తీసికొని ద్వారవతికి వెళ్ళాడు. మయుడు ఈశాన్యదిశగా పయనించి కైలాసపర్వతానికి ఉత్తరాన మైనాకపర్వతంమీది హిరణ్యశిఖరాన్ని చేరుకొన్నాడు.

**విశేషం:** వృషపర్వుడు - రాక్షసరాజు, శర్మిష్ఠతండ్రి. భౌమాదిత్యుడు - తపస్సు చేసి ఋషిత్వాన్ని పొందిన ఒక మహారాజు. నారాయణుడు - నీరు స్థానంగా కలవాడు; నరులసమూహం నివాసంగా కలవాడు; ఒక మన్వంతరంలో నరుడనే ఋషికి మిత్రుడైనవాడు - విష్ణుమూర్తి. విష్ణుమూర్తి అవతార మవటంచేత శ్రీకృష్ణుడికికూడ నారాయణు డని పేరు. శ్రీకృష్ణుడు పాండవుల వీడ్కొని వెళ్ళే కార్యక్రమం సంస్కృతంలో చాలా విపులంగా ఉన్నది. సుభద్రార్జునుల వివాహం జరిపించి పాండవులతో బాంధవ్యాన్ని, ప్రత్యేకించి అర్జునుడితో ఆత్మీయతను పెంచుకొని, ఖాండవదహనాన్ని జరిపించటంలో, దేవేంద్రుడిని ఓడించటంలో అర్జునుడికి తోడయి, ఆ గాండీవివెంట ఇంద్రప్రస్థానికి వచ్చినవాడు శ్రీకృష్ణుడు. అంతేకాక తాను సంకల్పించిన దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపనరూపమైన మహోద్యమసఫలతకు బలమైన ఉపకరణాలుగా పాండవులను ఉపయోగించదలచాడు శ్రీకృష్ణుడు. అందుచేత ఆ సందర్భంలో ఆ మహానుభావుడు పాండవులను వీడ్కొని వెళ్ళే కార్యక్రమం, విపులంగా, విలంబంగా సాగటం సహజమే. సంస్కృతభారతవర్ణన ఒకవిధంగా సందర్భోచితమే. కాని, పాఠకుడిదృష్టి ఆ సందర్భంలో అపూర్వసభానిర్మాణానికై

బయలుదేరిన మయునివెంట వెళ్తుందిగాని, పాండవులదగ్గర సెలవుతీసికొనే శ్రీకృష్ణుడికార్యక్రమంమీద నిలవదు. అందువలననే నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తికోసం ఒక్కవాక్యంలో ఆ వీడ్కోలుకార్యక్రమాన్నంతా ముగించి, మయుని అపూర్వసభానిర్మాణాన్ని మనోహరంగా విపులీకరించి వర్ణించాడు. ప్రసన్నకథాకలితార్థయుక్తి అంటే ప్రసన్నాలైన కథలలో కూర్చబడిన అర్థంయొక్క యుక్తి (కూడిక) అనికూడ చెప్పవచ్చును. కథాకథనంలో ప్రధానభాగాలు మూడు - చెప్పటం, వర్ణించటం, వివరించటం. చెప్పడంలో సరళత, స్పష్టత, పొందిక ఉండాలి. అప్పుడుగాని కథకు ప్రసన్నతాగుణం కలుగదు. కాని ఒక్క ప్రసన్నతాగుణంతోమాత్రమే కథ రక్తి కట్టదు. కథాకథనంలో అనేక చమత్కారవర్ణనలు, అవసరమైన వివరణలు సందర్భోచితాలుగా చోటుచేసికొనాలి. అప్పుడుగాని కథకు అర్థయుక్తి అమరదు; కథ గొప్పగా రక్తి కట్టదు. అప్పుడుగాని అది ఉపదేశం చక్కగా నిర్వహించదు. కాని పెక్కుమంది కథకులకు - ఈవర్ణనకు, వివరణకు సంబంధించిన అర్థయుక్తిమీదనే ప్రలోభం మెండు. అర్థయుక్తి ఏమాత్రం మితిమీరినా కథా ప్రసన్నత దెబ్బతినక మానదు. అందుచేత కథాకథనంలో - కథ చెప్పటానికి, చమత్కారంగా వర్ణించటానికి, వివిధ కథాంశాలను, ధర్మసూక్ష్మాలను వివరించటానికి చక్కని సమన్వయం, సరైన నిష్పత్తి ఉంటేగాని కథ ప్రసన్నంగా సాగజాలదు; రసమయమై రక్తి కట్టనేరదు; ఉపదేశయుతమై సార్థకం కాలేదు. నన్నయ ఉత్తమకథకుడు. ఆయన మహాభారతకావ్యం ప్రసన్నకథాకలితార్థయుక్తి విశిష్టం.

**సీ. ఎందేని సర్వభూతేశుండు సృజియించె । సచరాచరములైన జగము లెల్ల,**
**గంగఁ బ్రత్యక్షంబు గావింప నెందేనిఁ । గృతవాసుఁ డయ్యె భగీరథుండు.**
**నలినసంభవ నరనారాయణస్థాణు । వాసవప్రభృతి గీర్వాణముఖ్యు**
**లెందేనిఁ గ్రతువు లనేకయుగంబులఁ । జేసిరి, రత్నవిచిత్ర వితత**

**ఆ. చైత్యములు మహా విశాల హిరణ్మయ । యూపతతులు నోలి నొప్పు చుండ,**
**నట్టి బిందుసరమునందున్న వివిధర । త్నోపకరణచయము లొనరఁ గొనియె. 9**

**ప్రతిపదార్థం:** ఎందు+ఏనిన్= ఎక్కడైతే; సర్వ, భూత+ఈశుండు= అన్నిభూతాలకు (పృథివ్యాదిపంచభూతాలు, సమస్తప్రాణులు, ప్రమథగణాలు మొదలయినవాటికి) ప్రభువైన పరమేశ్వరుడు; స, చర+అచరములు+ఐన= కదలిక గలవి, కదలికలేనివి అయిన వస్తువులతో కూడిన; జగములు+ఎల్లన్= లోకాలనన్నింటిని; సృజియించెన్= పుట్టేటట్లు చేశాడో; ఎందు+ఏనిన్= ఎక్కడైతే; గంగన్= గంగను; ప్రత్యక్షము, కావింపన్=అగుపడేటట్లుచేయటానికి; భగీరథుండు= సగరుడి ముమ్మనుమడు; కృతవాసుఁడు+అయ్యెన్= ఏర్పరచుకొన్ననివాసం కలవాడయ్యాడో- అంటే నివాసం ఏర్పరచుకొన్నాడో!; ఎందు+ఏనిన్= ఎక్కడైతే; రత్న, విచిత్ర, వితత, చైత్యములు= రత్నాలచేత విచిత్రాలై- అంటే తమ రంగురంగుల కాంతులతో ఆశ్చర్యాన్నిగొలిపేవై, విశాలాలైనయజ్ఞశాలలు; మహా, విశాల, హిరణ్మయ, యూప, తతులున్= మిక్కిలి విశాలాలై, బంగారుతో చేయబడి, బలిపశువును, బంధించటానికి నాటబడిన స్తంభాల సమూహాలు; ఓలిన్= వరుసగా; ఒప్పుచున్+ఉండన్= ప్రకాశిస్తుండగా; నలిన సంభవ, నర, నారాయణ, స్థాణు, వాసవ, ప్రభృతి, గీర్వాణ, ముఖ్యులు= బ్రహ్మ, నరుడు, నారాయణుడు, శివుడు, ఇంద్రుడు మొదలైన ముఖ్యులైన దేవతలు; అనేక, యుగంబులన్= ఎన్నో యుగాల్లో; క్రతువులు= యజ్ఞాలు; చేసిరి; అట్టి= అలాంటి; బిందుసరము+అందు+ఉన్న= బిందుసరం అనే సరోవరంలో ఉన్న; వివిధ, రత్న+ఉపకరణ, చయములు= అనేకవిధాలైన రత్నాలతో కూడిన సాధనాల సమూహాలు; ఒనరన్= ఒప్పుగా- చక్కగా; కొనియెన్= తీసికొన్నాడు.

**తాత్పర్యం:** ఎక్కడ పరమేశ్వరుడు చరాచరాలైన సర్వలోకాలను సృజించాడో, ఎక్కడ భగీరథుడు గంగావతరణకు ప్రయత్నం చెయ్యా లని తనస్థానాన్ని ఏర్పరచుకొన్నాడో, ఎక్కడ రత్నకాంతులతో చిత్రవిచిత్రాలైన విశాల యజ్ఞశాలలు, బలిపశువుల్ని బంధించటానికి నాటిన సువిశాలసువర్ణస్తంభాలు ప్రకాశిస్తుండగా బ్రహ్మ, నర, నారాయణ, శివ,

దేవేంద్రాది దేవతాముఖ్యులంతా ఎన్నో యుగాలు యజ్ఞాలు చేశారో - అలాంటి బిందుసర సరోవరంలో ఉన్న వివిధరత్నసాధనసమూహా లన్నింటిని మయుడు గ్రహించాడు.

**విశేషం:** అలం: ఉదాత్తం. నన్నయ వడివడిగా కథ నడపటానికీ, దేనినైనా విపులంగా వర్ణించటానికీ సామాన్యంగా సీసాన్ని స్వీకరిస్తాడు. ఇది ఒక వర్ణనాత్మకసీసం. బిందుసరంయొక్క మనోహరవర్ణనం. నలినసంభవుడు - (నలినము అంటే కమలం) విష్ణుమూర్తి నాభికమలంనుండి పుట్టినవాడు - బ్రహ్మ, నరనారాయణులు - బదరీవనంలో చాలకాలం తపస్సుచేసిన ఋషులు, నరుడు అర్జునుడుగా, నారాయణుడు కృష్ణుడుగా అవతరించా రని పురాణగాథ, స్థాణువు - ప్రళయకాలంలో కూడ చలనంలేకుండ స్థిరంగా నిలచిఉండేవాడు - శివుడు. వాసవుడు - వసువులు (అంటే రత్నాలు) కలవాడు - ఇంద్రుడు.

**క. దేవబ్రాహ్మణులకు నా । నావిధపూజనలఁ దర్పణము సేసి ధరి**
**త్రీవనిత కపూర్వశ్రీఁ । గావింపఁ దొడంగె మయుఁడు గడు రమ్యముగన్. 10**

**ప్రతిపదార్థం:** మయుఁడు; దేవ, బ్రాహ్మణులకున్= దేవతలకు, బ్రాహ్మణులకు; నానావిధ, పూజనలన్= అనేక విధాలైన పూజలచేత; తర్పణము+చేసి= తృప్తి కావించి; ధరిత్రీ, వనితకున్= భూమిఅనేకాంతకు(భూదేవికి); అపూర్వ, శ్రీన్= మున్నెన్నడులేనిశోభను - సభారూపమైన అలంకారాన్ని; కడురమ్యముగన్= ఎంతో అందంగా; కావింపన్= రూపొందించటానికి; తొడంగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** మయుడు ముందుగా దేవతలను, బ్రాహ్మణులను పూజలతో తృప్తిపరచి, భూకాంతకు అందమైన అపూర్వాలంకారంగా సభా నిర్మాణానికి పూనుకొన్నాడు.

**విశేషం:** మహాకార్యారంభాలకు ముందు దేవబ్రాహ్మణపూజలు చెయ్యటం ఆర్షసంప్రదాయం.

**క. విమల మణిమయము లగు దూ । లములం గంబముల గోడలను వేదులఁ గు**
**ట్టిమములఁ జుట్టిన ప్రాకా । రములను గర మొప్పచుండ రచియించె సభన్. 11**

**ప్రతిపదార్థం:** విమల, మణిమయములు+అగు= స్వచ్ఛమైన మణులతో కూడినవయిన; దూలములన్= దూలాలతో; కంబములన్= స్తంభాలతో; గోడలను= గోడలతో; వేదులన్= అరుగులతో; కుట్టిమములన్= రాతికట్టడపుప్రదేశాలతో; చుట్టిన, ప్రాకారములను= చుట్టును వ్యాపించిన ప్రహరిగోడలతో; కరము+ఒప్పుచు+ఉండన్= మిక్కిలిప్రకాశిస్తుండగా; సభన్; రచియించెన్= నిర్మించాడు.

**తాత్పర్యం:** నిర్మలమణిమయాలైన దూలాలతో, స్తంభాలతో, గోడలతో, అరుగులతో, రాతికట్టడపుప్రదేశాలతో, ప్రహరిగోడలతో ఎంతో అందమైన సభను మయుడు నిర్మించాడు.

**విశేషం:** పై పద్యంలో ద్వితీయావిభక్తి ప్రత్యయమైన 'ను', తృతీయావిభక్త్యర్థంలో ఉంది - ఒక విభక్తికి మరో విభక్తి.

**వ. మఱియును. 12**

**తాత్పర్యం:** అంతేకాక.

సీ. సురుచిరహరినీలకిరణజలంబులఁ । బద్మరాగారుణపద్మములను
రాజితరాజీవరాజహంసావళి । నిర్మలసౌవర్ణకూర్మములను
గమనీయవైదూర్యకుముదంబులను వజ్ర । మీనమౌక్తికనవఫేనములను
మరకతశైవలోత్కరముల విలసిల్లఁ । గొల నని సన్మణిస్థలము చూచి

ఆ. పలుఁగురాలకుడ్యముల రుచుల్ గప్పిన । జలము లున్నయెడల వెలయఁ జూచి
యననుపస్థలంబు లని జను లెఱుఁగక । యుండునట్లుగా మయుండు సేసె. 13

**ప్రతిపదార్థం:** సు, రుచిర, హరినీల, కిరణ, జలంబులన్= మంచికాంతులు గల ఇంద్రనీలమణులయొక్క కిరణాలు అనే నీళ్ళతో; పద్మ, రాగ+అరుణ, పద్మములను= పద్మరాగమణులతో చేసిన ఎర్రనిపద్మాలతో; రాజిత, రాజీవ, రాజహంస+ఆవళిన్= (ఇక్కడ రాజత అనేపాఠం యుక్తం - అప్పుడు రజతసంబంధమైన - అంటే వెండితో చేసిన అని చెప్పవచ్చు) ప్రకాశించే తెల్లతామరలయొక్క, రాజహంసలయొక్క సమూహంతో; నిర్మల, సౌవర్ణ, కూర్మములను= మాలిన్యం లేని మేలిమిబంగారుతో చేసిన తాబేళ్ళతో; కమనీయ, వైదూర్య, కుముదంబులను= మనోహరాలైన వైదూర్యాలతో చేసిన కలువలతో; వజ్ర, మీన, మౌక్తిక, నవఫేనములను= వజ్రాలతో చేసిన చేపలతో, ముత్యాలతో రూపొందించిన క్రొత్తనురుగులతో; మరకత, శైవల+ ఉత్కరములన్= మరకతమణులతో కూర్చిన నాచుసమూహాలతో; విలసిల్లన్= ఒప్పుచుండిన; సత్+మణి, స్థలము, చూచి= మంచిమణులు పొదిగినప్రదేశాన్ని చూచి; కొలను, అని=కొలను అనుకొని, పలుఁగు, రాల, కుడ్యముల, రుచుల్= స్ఫటికపురాళ్ళగోడలయొక్క కాంతులు; కప్పిన= మీదికి వ్యాపించిన; జలములు+ఉన్న+ఎడలన్= నీళ్ళుండే ప్రదేశాలను; వెలయన్+చూచి= ప్రకాశిస్తుండగా చూచి; (ఇక్కడ 'పులుగురాల కుడ్యముల రుచుల్' అనే పాఠాంతరంగూడ ఉంది - పులుగురాలు అంటే గరుడపచ్చరాళ్ళు, గరుడపచ్చలకాంతులు ముదురు ఆకు పచ్చగా ఉంటాయి. అది నీళ్ళరంగుకు దగ్గరరంగు. నీళ్ళు లేని ప్రదేశ మని అనిపించాలి కాబట్టి 'పలుగురాలు' అనే పాఠమే ఉచితం); అననుప, స్థలంబులు+అని= నీరు లేని ప్రదేశా లని; (అనుపము= జలప్రాంత ప్రదేశం, న+అనుపము= నీరులేని ప్రదేశం); (ఇచ్చట 'అనుపమస్థలము' లని ఒక పాఠాంతరం ఉంది. 'అనుపమస్థలా' లంటే చక్కని, చదునైన స్థలాలని అర్థం. అందువల్ల ఇదికూడ పరిగణించదగినపాఠమే); జనులు+ఎఱుఁగక+ఉండు+అట్లుగాన్= జనులు తెలిసికొనలేకుండ ఉండేటట్లుగా; మయుండు; చేసెన్= సభను నిర్మించాడు.

**తాత్పర్యం:** ఇంద్రనీలమణుల కిరణా లనే నీళ్ళతో, పద్మరాగమణులతో చెక్కిన ఎర్రనిపద్మాలతో, వెండితో చేసిన తెల్లతామరలతో, రాజహంసలతో, మేలిమి బంగారుతో పోతపోసిన తాబేళ్ళతో, మనోహరవైదూర్యాలతో మలచిన కలువలతో, వజ్రాలతో చేసిన చేపలతో, ముత్యాలతో కల్పించిన కొంగ్రొత్తనురుగులతో, మరకతాలతో రూపొందించిన నాచులతో ప్రకాశించే మణిమయప్రదేశాలు చూచి అవి నీటిమడుగు లని - స్ఫటికపురాళ్ళగోడల కాంతులు కప్పటంచేత నీళ్ళుండే చోట్లను చూచి నీళ్ళులేనిచో ట్లనీ - జనులు భ్రమపడేటట్లుగా మయుడు సభను నిర్మించాడు.

**విశేషం:** అలం: ఉదాత్తం, భ్రాంతిమంతం. మయునిశిల్పచాతురి అనుపమానం. ఈ శిల్పచాతురియే దుర్యోధనుని భంగపాటుకు, పాండవులమీద అతనిగుండెలో అప్పటికే గూడుకట్టుకున్న అసూయాద్వేషాలు అంతకంత పెరగటానికి పరోక్ష కారణమైంది. అక్షర రమ్యమైన ఈ పద్యం మయసభా రమణీయత ప్రతిఫలించే మెరుగుటద్దం. నవరత్నాలు - ఇంద్రనీలం, పద్మరాగం, వైదూర్యం, వజ్రం, మౌక్తికం, గోమేధికం, మరకతం, పుష్యరాగం, ప్రవాళం.

**వ. మఱియు సకలజన మనోహరంబు లైన నానావిధ యంత్రంబులును, ననవరత కుసుమఫలభరితంబు లైన తరువనంబులును, వికచ కమల కుముదాభిరామంబులైన జలాశయంబులును, వివిధ విచిత్ర పతాకావలంబిత తోరణ విటంకప్రదేశంబులునుం గలిగి దశ కిష్కు సహస్ర ప్రమాణవృత్తాయతంబును. సహస్రకర ప్రభా ప్రసర విస్తార విభూతియును వివిధరత్న విభవాభిశోభితంబునుంగా నపూర్వ సభా భవనంబు నందుఁ బదునాలుగు నెలలు నిర్మించి, దాని నెనిమిది వేల రాక్షస కింకరుల మహాకాయుల మహాజవసత్త్వ సంపన్నుల నంతరిక్ష చరులం బనిచి మోపించికొని వచ్చిధర్మరాజున కిచ్చి, గదయును శంఖంబును భీమార్జునుల కిచ్చి, ధర్మరాజుచేత సత్కృతుండయి మయుం డరిగిన. 14**

**ప్రతిపదార్థం:** మఱియున్, సకలజన, మనః+హరంబులు+ఐన= అందరుప్రజలమనస్సుల్ని దోచుకొనేవి అయిన; నానావిధ, యంత్రంబులును= అనేకవిధాలైన యంత్రవిశేషాలున్నూ; అనవరత, కుసుమ, ఫల, భరితంబులు+ఐన= ఎల్లప్పుడు పువ్వులతో, పండ్లతో నిండినవైన; తరువనంబులును= చెట్లతోపులున్నూ; వికచ, కమల, కుముద+అభిరామంబులు+ఐన= వికసించిన కమలాలతో, కలువలతో, మనోహరాలైన; జల+ఆశయంబులును= నీటి మడుగులున్నూ; వివిధ, విచిత్ర, పతాకా+అవలంబిత, తోరణ, విటంక, ప్రదేశంబులును= రకరకాల చిత్రవిచిత్రాలైన జెండాలతో వ్రేలాడగట్టిన తోరణాలతో కూడిన గువ్వల గూళ్ళున్న ప్రదేశాలున్నూ, కలిగి; దశ, కిష్కు, సహస్ర, ప్రమాణ. వృత్త+ఆయతంబును=పదిమూరలకు వెయ్యిరెట్లు - అంటే పదివేలమూరల కొలత ఉండే కైవారంచేత (చుట్టుకొలతచేత) విశాలమైనదియు; సహస్రకర, ప్రభా, ప్రసర, విస్తార, విభూతియును= వెయ్యి కిరణాలు గల సూర్యుని కాంతిప్రసారంచేత ఎక్కువైన వైభవంకలదియున్నూ; వివిధ, రత్న, విభవ+అభిశోభితంబునున్+కాన్= రకరకాలైన రత్నకాంతులతో మిక్కిలిశోభిల్లేది అయ్యేటట్లుగా; అపూర్వసభాభవనంబున్= ఇంతకుముం దెన్నడు లేనట్టి సభాభవనాన్ని; అందున్= అక్కడ - బిందుసరోవరందగ్గర; పదునాలుగు నెలలు; నిర్మించి; దానిన్= ఆ సభాభవనాన్ని; ఎనిమిదివేలరాక్షస, కింకరులన్= ఎనిమిదివేలమంది రాక్షసభటులను; మహాకాయులన్= పెద్దశరీరాలు కలవాళ్ళను; మహా, జవ, సత్త్వ, సంపన్నులన్= గొప్పవేగం, బలం అధికంగా కలవాళ్ళను; అంతరిక్షచరులన్= ఆకాశంలో తిరిగేవాళ్ళను; పనిచి= నియమించి; మోపించికొని; వచ్చి; ధర్మరాజునకున్; ఇచ్చి; గదయును; శంఖంబును; భీమ+అర్జునులకున్+ ఇచ్చి; ధర్మరాజుచేతన్; సత్, కృతుండు+అయి= సమ్మానించబడినవాడై; మయుండు; అరిగినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** అపురూపమైన ఆ సభాభవనంలో మయుడు మనోహరాలైన అనేక యంత్రాలు అమర్చాడు. ఎప్పుడూ పూలతో, పండ్లతో కనులపండువుగా కనిపించే చెట్లతోపులను రూపొందించాడు. పూచిన తామరలతో, విచ్చిన కలువలతో కళకళలాడే కొలనులు కల్పించాడు. చూడ ముచ్చటగా వ్రేలాడే రకరకాల పతాకాల తోరణాలతో కూడి గువ్వల గూళ్ళున్న ప్రదేశాలు ఏర్పాటుచేశాడు. పదివేల మూరల చుట్టుకొలతతో సువిశాలమై, సూర్యకిరణప్రసారంతో వైభవోపేతమై, వివిధరత్నకాంతులతో విశేషంగా శోభిల్లే ఆ సభాభవనాన్ని బిందుసరం దగ్గర పదునాలుగునెలలు పరిశ్రమించి నిర్మించాడు. పెద్దశరీరాలతో, అమితవేగంతో అత్యధికబలంతో ఆకాశాన సంచరించే ఎనిమిదివేలమంది రాక్షసభటులచేత ఆ భవనాన్ని మోయించి తెచ్చి ధర్మరాజుకు ఇచ్చాడు. భీమునికి గదను, అర్జునునికి శంఖాన్ని అందించాడు. ధర్మరాజుచేత సన్మానంపొంది వెళ్ళాడు.

**విశేషం:** ఈ వచనరచన నన్నయ అక్షరరమ్యతకు చక్కని ఉదాహరణ. ఏ ఉద్దేశంతో ఆ జగన్నాటక సూత్రధారి శ్రీకృష్ణుడు ఈసభను నిర్మించుమన్నాడో, ఏ ముహూర్తంలో మయుడు దీనిని నిర్మించి తెచ్చాడో కురుపాండవ వైరవృద్ధికి ఇది పెద్దగా దోహదం చేసింది. విశేష్యం తరువాత విశేషణాలు వాడే సంప్రదాయం సంస్కృతంలో ఉన్నది. ఆ సంప్రదాయంప్రకారమే

నన్నయ రాక్షస కింకరులు అనే విశేష్యం తరువాత వరుసగా మూడువిశేషణాలు ప్రయోగించటం జరిగింది. (తెలుగులో మయసభావర్ణన సందర్భాలకు నన్నయవర్ణనం మార్గదర్శకం. అంతేకాదు ఆంధ్రులకు ఎంతో ప్రీతిపాత్రమైన దుర్యోధనుడి ఏకపాత్రాభినయ మనే ఆంధ్రుల రూపకప్రక్రియలో వాచికాభినయానికి నన్నయరచనయే ప్రేరకం. -సంపా.).

### ధర్మరాజు సభాప్రవేశము కావించుట (సం. 2-4-1)

**ఉ. వీరుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల కొప్పఁ బాయసా**
**హారము భక్తిఁ బెట్టి మఱి యందఱకుం జెఱు వేయునేసి వి**
**స్తారయశుండు ధేనువుల ధర్మవిధిన్ మణి ముద్రికాద్యలం**
**కార దుకూల పుష్పఫల గంధయుతంబుగ నిచ్చి లీలతోన్. 15**

**ప్రతిపదార్థం:** వీరుఁడు; విస్తార, యశుండు= విరివిగా వ్యాపించిన కీర్తి కలవాడు; (అయిన); ధర్మజుండు; పదివేవురు= పదివేలమంది; విప్రులకున్= బ్రాహ్మణులకు, ఒప్పన్= తగినట్లుగా; పాయస+ఆహారము= పాయసంతోకూడినభోజనం; భక్తిన్= భక్తితో; పెట్టి; మఱి= ఇంకా; అందఱకున్; చెఱు= ఒక్కొక్కరికి, ('చెఱి' అని శబ్దరత్నాకరం); వేయున్+ఏసి= వెయ్యివంతున; ధేనువులన్= ఆవులను; మణి, ముద్రికా+ఆది+అలంకార, దుకూల, పుష్ప, ఫల, గంధ, యుతంబుగన్= మణులు పొదిగిన ఉంగరాలు మొదలైన ఆభరణాలతో, సన్నని వస్త్రాలతో, పువ్వులతో, పండ్లతో, గంధంతోకూడ; ధర్మవిధిన్= ధర్మపద్ధతితో; లీలతోన్= వేడుకతో; ఇచ్చి= దానం చేసి.

**తాత్పర్యం:** వీరుడు, విశేషకీర్తిమంతుడు అయిన ధర్మరాజు పదివేలమంది బ్రాహ్మణులకు భక్తితో పాయసాన్నం పెట్టాడు. అంతేకాదు ఒక్కొక్కరికి వెయ్యిగోవులతోపాటు, మణిముద్రికాదులైన ఆభరణాలు, సన్నినివస్త్రాలు, పుష్పఫలగంధాలు వేడుకతో దానమిచ్చాడు.

**విశేషం:** ఈ పద్యం ధర్మజుని దానవీరం ప్రతిఫలించే దర్పణం.

**వ. అనుజసహితుం డయి దైవజ్ఞదత్తశుభముహూర్తంబున ధౌమ్యాదిభూసురాశీర్వాదపుణ్యాహనాదంబు లెసంగ సభాప్రవేశంబు సేసి యంత. 16**

**ప్రతిపదార్థం:** అనుజ, సహితుండు+అయి= తమ్ములతో కూడినవాడై; దైవజ్ఞ, దత్త, శుభ, ముహూర్తంబునన్= జ్యోతిశ్శాస్త్రనిపుణులచేత నిర్ణయించ (ఇవ్వ)బడిన శుభసమయాన; ధౌమ్య+ఆది, భూసుర+ఆశీర్వాద, పుణ్యాహనాదంబులు= ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులయొక్క ఆశీర్వచన, పుణ్యాహవాచన ధ్వనులు; ఎసంగన్= అతిశయిల్లగా; సభా, ప్రవేశంబు= మయసభాప్రవేశాన్ని; చేసి; అంతన్.

**తాత్పర్యం:** ధర్మరాజు తమ్ములతో కూడి దైవజ్ఞులు నిర్ణయించిన శుభముహూర్తాన ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణుల ఆశీర్వచనపుణ్యాహవాచన మంత్రధ్వనులు మారుమ్రోగుతూ ఉండగా మయసభాప్రవేశం చేశాడు.

**విశేషం:** ధౌమ్యుడు - పాండవులపురోహితుడు. పుణ్యాహవాచనం - అశుద్ధిని నివారించటానికి, పవిత్రతను సిద్ధింపచేయటానికి, శుభాన్ని కలిగించటానికి పుణ్యాహశబ్దాన్ని మూడుమారులు చెప్పే శుభకర్మం.

**ఉ. మంచిగ భూరి భూసుర సమాజమునెల్లను భక్తితోడఁ బూ**
**జించి, యభీష్టదానములు సేసి, ధనార్థులఁ దన్పి దిక్కులన్**
**నించె యశంబు; బంధులకు నెయ్యురకున్ హృదయప్రియంబు గా**
**వించె విభూతి యేర్పడఁ బవిత్రుఁడు ధర్మసుతుండు నెమ్మితోన్. 17**

**ప్రతిపదార్థం:** పవిత్రుడు, పుణ్యాత్ముడు (అయిన); ధర్మసుతుండు= ధర్మరాజు; మంచిగన్= బాగుగా; భూరి, భూసుర, సమాజమున్+ఎల్లన్= గొప్పబ్రాహ్మణ సమాజాన్నంతా; భక్తితోడన్; పూజించి; అభీష్ట, దానములు= వాళ్ళకు ఇష్టమైనదానాలు; చేసి; ధన+అర్థులన్= ధనం కోరి వచ్చినవాళ్ళను; తనిపి= తృప్తిపొందించి, దిక్కులన్= అన్నిదిశలలోను; యశంబు= కీర్తిని; నించెన్= నింపాడు; విభూతి= ఐశ్వర్యం; ఏర్పడన్= ప్రకాశించే విధంగా; నెమ్మితోన్= ప్రేమతో; బంధులకున్= బంధువులకు; నెయ్యురకున్= స్నేహితులకు; హృదయ, ప్రియంబు= మనస్సుకు సంతోషాన్ని; కావించెన్= చేశాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడైన ధర్మరాజు ఎందరెందరో బ్రాహ్మణుల్ని భక్తితో పూజించాడు. కోరినవాళ్ళకు కోరినదానాలిచ్చి తృప్తిపరచాడు. తనకీర్తి అన్నిదిక్కుల వ్యాపింపజేశాడు. తనఐశ్వర్యం ప్రకాశించేటట్లు ప్రేమతో బంధు మిత్రులకు ఆనందం కలిగించాడు.

**విశేషం:** క్త్వార్థక, భూతార్థక క్రియాపదాలతో పద్యంలోని మూడు పాదాల మొదట ఉన్న విరుపులు- ధర్మరాజు ఎంత ఉత్సాహంగా, ఎంత వేగంగా ధార్మిక క్రియలు నిర్వహించాడో స్ఫురింపచేసేవిగా ఉన్నాయి. నన్నయ పద్యరచనా శిల్పానికి, ప్రత్యేకించి ఆయన అక్షరరమ్యతకు నిదర్శనాలుగా నిలుస్తున్నాయి.

**వ. తదవసరంబున. 18**

**తాత్పర్యం:** ఆ సమయాన.

**మ. మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం**
**పద లోలిం గొని వచ్చి యిచ్చి, ముదమొప్పం గాంచి, సేవించి, ర**
**య్యుదయాస్తాచల సేతుశీతనగ మధ్యోర్వీపతుల్ సంతతా**
**భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్. 19**

**ప్రతిపదార్థం:** ఆ+ఉదయ+అస్త+అచల, సేతు, శీతనగ, మధ్య+ఉర్వీపతుల్= సూర్యుడు ఉదయించే ఆ పర్వతానికి, అస్తమించే పర్వతానికి, సేతువుకు (దక్షిణపుచివర), హిమవత్పర్వతానికి (ఉత్తరపుచివర) నడుమ ఉండే రాజులందరు - అంటే నేల నాలుగుదిక్కుల్లో ఉన్న రాజులంతా; సంతత+అభ్యుదయున్= ఎడతెగక వృద్ధిపొందే సంపద కలవానిని, జగత్+పూర్ణ, ప్రతాప+ఉదయున్= ప్రపంచమంతా నిండిన పరాక్రమంయొక్క ఔన్నత్యం కలవానిని; తత్+సభా, స్థితున్= ఆ మయసభలో కొలువుదీరినవానిని; ధర్మజున్= ధర్మరాజును; మద, మాతంగ, తురంగ, కాంచన, లసత్+మాణిక్య, గాణిక్య, సంపదలు= మదపుటేనుగులు, గుర్రాలు, బంగారు, మెరిసే మాణిక్యాలు, వేశ్యాసమూహరూపమైనధనాలు; ఓలిన్= వరుసగా; కొనివచ్చి= తీసికొనివచ్చి; ఇచ్చి; ముదము+ఒప్పన్= సంతోషం శోభిల్లగా; కాంచి= చూచి; సేవించిరి= సేవించారు.

**తాత్పర్యం:** నేల నాలుగు దిక్కుల్లో ఉన్న రాజులంతా - ఎడతెగక వృద్ధిపొందే సంపద కలవాడు, లోకమంతటా నిండిన పరాక్రమంచేత ఔన్నత్యం వహించినవాడు అయిన ధర్మనందనుని సంతోషంతో దర్శించుకొన్నారు.

మదపుటేనుగుల్ని, గుఱ్ఱాల్ని, బంగారాన్ని, మాణిక్యాలను, వేశ్యల్ని ప్రియమార కానుకలుగా సమర్పించుకొని మనసార ఆ మహారాజును సేవించుకొన్నారు.

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం. నన్నయ కవితాశైలికి ఈ పద్య మొక చక్కని ఉదాహరణ. కీర్తిప్రతాపాల వర్ణనకు మత్తేభాన్ని వాడటం వృత్తౌచిత్యానికి నిదర్శనం. నన్నయశైలి సంస్కృతపదబహుళం, సమాసఘటితం, సంధి బంధురం. అలా అని అది వినటానికి కటువైంది కాదు. విశేషించి విన సొంపైంది. మదపుటేనుగు నడకలా ఉదాత్త మనోహరమైంది. అందుచేతనే ఎఱ్ఱాప్రెగ్గడ 'నన్నయభట్టకుంజరం బెన్న నిరంకుశోక్తిగతి' అని అన్నాడు. నన్నయ పేర్కొన్న అక్షరరమ్యతకూడ ఇదే. అక్షరాల కూర్పువలన కవితకు కలిగే రమ్యతయే అక్షరరమ్యత. వాఙ్మయంలో అక్షరం విశ్వంలో పరమాణువు లాంటిది. పరమాణువుల కూర్పులోని మార్పు వల్లనే వస్తువైవిధ్యం, పదార్థస్వరూప స్వభావాల్లో తారతమ్యం, అలాగే అక్షరాల కూర్పులోని మార్పు వల్లనే వివిధ పదాలు, అర్థాలు, శైలీభేదాలు ఏర్పడతాయి. పదంలోని శబ్దభాగం ఆపాతమధురం; అర్థభాగం ఆలోచనామృతం. ఆపాతమధురమైన శబ్దసంయోజనమే అక్షరరమ్యత. సామాన్యులచేత ఏ రచననైనా చదివించే మొదటిగుణం ఇదే, శ్రోతను ఆకర్షించే ప్రధానగుణంకూడ ఇదే. అక్షరరమ్యమైన రచన పూర్తిగా అర్థం కాకపోయినా అందలిభావంమాత్రం స్థూలంగా మనస్సుకు స్ఫురిస్తుంది. దీనినే ఆంగ్ల సాహిత్య విమర్శకులు 'Sound echoing the sense' అంటారు. నన్నయ కవితలో ఈగుణం మెండు. సామాన్య పాఠకునికి పై పద్య ప్రతిపదార్థం తెలియకున్నా - ఎందరెందరో రాజులు, ఎన్నెన్నో గొప్ప వస్తువులు, ఎంతో ఎక్కువగా ధర్మరాజుకు ఇస్తున్నా రని మాత్రం సూటిగా స్ఫురించకమానదు. ఆయన వైభవం అత్యధిక మని ధ్వనించక తప్పదు. ఈ పద్యంలోని అక్షరాల కూర్పు, సమాసఘటన అలాంటివి. 'ముదమొప్పన్' అనే విశేషణంకూడ ఇక్కడ గమనింపదగిందే. రాజులంతా ఆ కానుకలు తెచ్చి ఇవ్వటంలో ఏవిధమైన బలాత్కారం లేదు, భయం లేదు. అందరూ ఆ ధర్మరాజు ఆధిక్యాన్ని, ఆధిపత్యాన్ని మనఃపూర్వకంగా అంగీకరించి ఆనందంగా తెచ్చి యిస్తున్నారన్న విషయాన్ని ఆ విశేషణం తెలుపుతున్నది. మూలంలో ఎవరెవరు ఏ యే కానుకలు తెచ్చి యిచ్చారో ఎంతో విస్తృతంగా ఉంది. నన్నయ ఆ విస్తృతి నంతా 'అయ్యుదయాస్తాచల...' అన్న ఒక్క సమాసంతో చక్కగా సూచించాడు. (ఇది ఒక గొప్పసంఘటన. రాజులంతా కానుకలన్నీ కుప్పలు పోస్తున్నారు. కలిసి ధర్మరాజును సేవిస్తున్నారు. సేవించేరాజులు ఎవరైనా, ఎందరైనా అందరూ సేవాభావంలో మాత్రం అంతా ఒకటేకదా!. ఈ అర్థసంఘటనను శ్లేష అనే గుణంలో వ్యక్తం చేశాడు నన్నయ. బహుపదాల ఏకవద్భావం శబ్దశ్లేష, మనోహరమైన సన్నివేశసౌందర్యం అర్థశ్లేష, ఆ రెండుగుణాలు కల శ్లేషను వీరరసపోషకమైన ఓజోగుణరంజితంగా పద్యరచనలో ప్రపంచించటం నన్నయశిల్పం. ఓజస్సులో ఒదిగిన శ్లేష నన్నయకు ప్రీతిపాత్రమైన రచనాకళ!- సంపా.)

**వ. మఱియును** **20**

**తాత్పర్యం:** అంతేకాక.

**సీ. సుబల మార్కండేయ శునక మౌం జాయన । మాండవ్య శాండిల్య మందపాల**
**బక దాల్భ్య రైభ్యక భాలుకి జతుకర్ణ । గౌతమ కౌశిక కణ్వ కుత్స**
**సావర్ణి పర్ణాద సత్య గోపతి గోప । వేష మైత్రేయ పవిత్రపాణి**
**ఘటజాను కాత్రేయ కఠకలాప సుమిత్ర । హారీత తిత్తిరి యాజ్ఞవల్క్య.**

**ఆ. వాయుభక్ష భార్గవ వ్యాస జైమిని । శుక సుమంతు పైల సువ్రతాదు**
**లయిన మునులు నేము నరిగితి మెంతయు । రమ్యమయిన ధర్మరాజుసభకు.** **21**

**ప్రతిపదార్థం:** ఎంతయున్= మిక్కిలి; రమ్యము+అయిన= అందమైన; ధర్మరాజు, సభకున్; సుబల, మార్కండేయ, శునక, మౌంజాయన, మాండవ్య... సువ్రత+ఆదులు+ఐన= సుబలుడు, మార్కండేయుడు, శునకుడు, మౌంజాయనుడు, మాండవ్యుడు, సువ్రతుడు-మొదలయిన; మునులున్; ఏమున్= మేముకూడ; (అంటే ఉగ్రశ్రవసుడు ఆయన అనుచరులు); అరిగితిమి= వెళ్ళాము.

**తాత్పర్యం:** సుబల మార్కండేయ శునక మౌంజాయన మాండవ్య సువ్రతాది మహామునులు, మేము ఎంతో అందమైన ఆ ధర్మరాజుసభకు వెళ్ళా మని ఉగ్రశ్రవసుడు ఆ శౌనకాదిమహర్షులకు చెప్పాడు.

**విశేషం:** మునులపేర్ల విషయంలో భిన్నప్రతుల్లో భేదా లున్నాయి. మునులపేర్లను పట్టీగా చెప్పే ఈ సీసపద్యరచన ఉత్తమకవితగా చెప్పలేము కాని, ఉత్తమకథనశిల్ప మని చెప్పవచ్చును. ఈ పేర్లు వచనంలో చెప్పితే నీరసంగా ఉండేది. ఉగ్రశ్రవసుడు కథకుడు. ఆతడుకూడా అంతమంది మునులతో కలిసి వెళ్ళాడు. అందువలన అతని ఆత్మీయత ఇందులో ఉన్నది. తనతోపాటు ఎందరో మహర్షులను ఆకర్షించిన ఆ సభావైభవాన్ని చెప్పదలచుకొన్నాడు. మహర్షులవరుస వస్తుధ్వనిగా మారింది. ద్రష్టలైన ఋషులు దర్శించా లని కోరుకొన్న ధర్మరాజుసభ పరమపూజ్య మని ధ్వని. పేర్లనుకూడా కథార్థప్రయోజనంకొరకు ఒకవరుసగా చెపితే అది ఉక్తివైచిత్ర్య మౌతుంది. బహుపదాలు ఏకవద్భావం పొంది శ్లేషమనే శబ్దగుణం రాణించింది. పద్యం దీర్ఘసమాసభూయిష్ఠమైనా గాఢబంధత్వంకంటె మసృణత్వం రాణించింది. శ్లేషగుణం ఓజస్సులో ఒదిగిన రచన ఇది. ఇటువంటి రచనను తరువాతి కవు లాయాసందర్భాలలో సార్థకంగా వాడుకొన్నారు. (సంపా.)

**వ. అమ్మహామునుల నెల్ల నతిభక్తిం బూజించి లబ్ధాశీర్వచనుండై ధర్మతనయుండు వారలవలన ధర్మకథలు వినుచుఁ దమ్ములుం దానును సుఖంబుండునంత నొక్కనాఁడు. 22**

**ప్రతిపదార్థం:** ఆ+మహామునులన్+ఎల్లన్= ఆ మహామునుల నందరిని; అతిభక్తిన్= మిక్కిలిభక్తితో; పూజించి; లబ్ధ+ఆశీర్వచనుండు+ఐ= పొందబడిన ఆశీర్వచనం కలవాడై; ధర్మతనయుండు; వారలవలనన్= ఆ మహర్షులవలన; ధర్మకథలు= ధర్మసంబంధాలైన కథలు; వినుచున్; తమ్ములున్; తానును; సుఖంబు+ఉండు+అంతన్= సుఖంగా ఉండగా; ఒక్కనాఁడు= ఒక్క రోజు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ మహాముని లందరిని అతిభక్తితో పూజించాడు. వాళ్ళ ఆశీర్వచనాలు పొందాడు. ఆ మహర్షులు చెప్పే ధర్మకథలు వింటూ తమ్ముళ్లతో కలిసి తాను సుఖంగా ఉండగా- ఒకనాడు

**విశేషం:** సుఖము+ఉండు-ప్రథమావిభక్తికి తృతీయార్థ ప్రయోగం - సుఖంతో ఉండు. ధర్మజుడు మహర్షులను ఎప్పుడు కలిసినా వాళ్ళవల్ల ధర్మకథలు, పుణ్యకథలు వినటం ధర్మరాజుస్వభావం. ఆ మహారాజుజ్ఞానతృష్ణ అపారం.

### నారదుఁడు పాండవులయొద్దకు వచ్చుట (సం. 2-5-2)

**ఉ. నీరజమిత్త్రుఁ డేల ధరణీగతుఁ డయ్యెడు నొక్కొ యంచు వి**
**స్మేర మనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి చూచుచుండఁగా**
**నారదుఁ డేఁగుదెంచె గగనంబుననుండి సురేంద్రమందిర**
**స్ఫారవిలాసహాసి యగు పార్థుగృహంబునకుం బ్రియంబునన్. 23**

**ప్రతిపదార్థం:** నీరజమిత్త్రుఁడు= నీటిలోపుట్టిన పద్మాలకు స్నేహితుడైన సూర్యుడు; ఏల= ఎందుచేత; ధరణీగతుఁడు+అయ్యెడున్+ ఒక్కొ= నేలకు దిగివస్తున్నాడో; అంచున్= అంటూ; విస్మేర, మనస్కులు+ఐ= ఆశ్చర్యంతోకూడుకొన్నమనస్సుకలవారై; మెచ్చి; నిజద్యుతిన్= తనయొక్కకాంతిని; చూచుచున్+ఉండఁగాన్: నారదుఁడు; గగనంబుననుండి= ఆకాశంనుండి; సుర+ఇంద్ర, మందిర, స్ఫార, విలాస, హాసి= దేవతలరాజైన దేవేంద్రునిభవనంయొక్క విస్తారమైన శోభను ఎగతాళి చేసేది; అగు; పార్థ, గృహంబునకున్= పృథ(కుంతీదేవి) పుత్రుడైన ధర్మరాజు ఇంటికి (పార్థనామంతో ప్రసిద్ధుడు అర్జునుడే అయినా-ఇక్కడ- నారదుడు పృథ పుత్రుడైన ధర్మరాజు ఇంటికి వచ్చా డనటమే ఎక్కువ ఉచిత మనిపిస్తుంది. యజమాని ధర్మరాజుకదా); ప్రియంబునన్= ప్రీతితో; ఏఁగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** సూర్యు డేల నేలకు దిగి వస్తున్నాడో! అని తన దేహకాంతిని చూచి జనులంతా ఆశ్చర్యపడుతుండగా- నారదమహర్షి, ఆకాశంనుండి - దేవేంద్రుని గృహాశోభనే గేలిచేసే ధర్మరాజు గృహానికి ఎంతో ప్రీతితో వచ్చాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. బ్రహ్మమానసపుత్రుడైన ఆ నారదమహర్షి తేజస్సు ఎంత ఎక్కువో ఈ ఉత్ప్రేక్షతో నన్నయ భావుకులకు ప్రత్యక్షం చేశాడు. "నారదః సుమహాతేజాః..." అనే సంస్కృతాని కిది పెంపు. అక్షరరమ్యమైన ఈ పద్యగుణం మాధుర్యం.

**క.** **తన పిఱుఁద ధర్మ సంబో । ధన వాంఛను వచ్చు దేవతా ఖచర మహా**
**మునివరులఁ దపనమార్గం । బునఁ గ్రమ్మఱఁ బంచె బ్రహ్మపుత్త్రుఁడు నెమ్మిన్.** **24**

**ప్రతిపదార్థం:** బ్రహ్మపుత్త్రుఁడు= బ్రహ్మదేవునికుమారుడైన నారదుడు; తన, పిఱుఁదన్= తన వెనుక; ధర్మ సంబోధనవాంఛను= ధర్మబోధను వినాలనే కోరికతో; వచ్చు; దేవతా, ఖచర, మహామునివరులన్= దేవతలను, ఆకాశసంచారులను, మహాముని శ్రేష్ఠులను; తపనమార్గంబునన్= ఆకాశమార్గంలోనే; నెమ్మిన్= ప్రేమతో; క్రమ్మఱన్+పంచెన్= త్రిప్పిపంపాడు.

**తాత్పర్యం:** బ్రహ్మపుత్రుడైన నారదుడు, తన ధర్మబోధ వినా లని వెంటవస్తున్న దేవతల్ని, ఆకాశసంచారుల్ని, మహామునిశ్రేష్ఠుల్ని - ఆకాశమార్గానే త్రిప్పిపంపాడు.

**వ.** **పర్వతపారిజాతరైవత సుముఖు లను మహామునులతో నిట్లు వచ్చిన నారదమహామునికిం బ్రత్యుద్గతుండయి ధర్మరాజు దమ్ములుం దానును నమస్కరించి తోడ్కొని తెచ్చి యున్నతాసనంబున నునిచి యడుగులు గడిగి, యర్ఘ్యపాద్యాదివిధులం బూజించిన, వారల కుశలం బడిగి నారదుఁడు రాజనీతి విషయంబుల నయ్యుధిష్ఠిరు ని ట్లని యడిగె.** **25**

**ప్రతిపదార్థం:** పర్వత, పారిజాత, రైవత, సుముఖులు+అను మహామునులతోన్= ఈ మహామునులు నలుగురితోమాత్రమే కలిసి; ఇట్లు= ఈవిధంగా; దివినుండి= ఆకాశంనుండి; భువికిన్= భూమికి; దిగివచ్చిన; నారదమహామునికిన్; ప్రతి+ ఉద్గతుండు+ఐ= లేచి ఎదురేగినవాడై; ధర్మరాజు; తమ్ములన్; తానును; నమస్కరించి; తోడ్కొని, తెచ్చి= ఆహ్వానించి వెంటతీసికొని వచ్చి; ఉన్నత+ఆసనంబునన్= ఎత్తయినపీఠంమీద; ఉనిచి= కూర్చుండబెట్టి; అడుగులు= పాదాలు; కడిగి; అర్ఘ్య, పాద్య+ఆది, విధులన్= పూజకు తగినపూలు, అక్షతలు మొదలైనవాటిని సమర్పించటం, పాదాలమీద నీటిని చల్లి ఆ నీటిని శిరస్సుపై చల్లుకోవటం మొదలైన పూజా పద్ధతులతో; పూజించినన్= పూజించగా; వారల= ఆ పాండవులయొక్క; కుశలంబు= క్షేమవిశేషాలు; అడిగి; రాజనీతి, విషయంబులన్= రాజనీతి విశేషాలగురించి; ఆ+యుధిష్ఠిరున్= ఆ ధర్మరాజును, ఇట్లు+అని; అడిగెన్.

**తాత్పర్యం:** పర్వత పారిజాత రైవత సుముఖు లనేమహర్షులతో కలిసి వచ్చిన నారదమహామునికి ధర్మరాజు తమ్ములతో కూడ ఎదురేగి నమస్కరించాడు. ఆహ్వానించి వెంటగొని వచ్చి ఉన్నతాసనంమీద కూర్చుండబెట్టాడు. అర్ఘ్యపాద్యాది పూజావిధానాలతో పూజించాడు. నారద మహర్షి పాండవు లందరిని కుశల మడిగాడు. ప్రత్యేకించి ధర్మరాజుతో రాజనీతి విషయాలు ప్రస్తావించాడు.

### నారదుఁడు ధర్మరాజును రాజనీతివిషయంబులం గొన్నింటి నడుగుట (సం. 2-5-7)

**సీ.** **మీ వంశమున నరదేవోత్తములదైన । సద్ధర్మమార్గంబు సలుపుదయ్య?**
**ధర్మవిదుండవై ధర్మార్థకామంబు । లొండొంటి బాధింపకుండ నుచిత**
**కాల విభక్తముల్ గా లీల సేవింతె? । ధర్మువునంద చిత్తంబు నిలిపి**
**యిమ్ముల నపరరాత్రమ్ములం దెప్పుడుఁ । జింతింతె నిజబుద్ధిఁ జేయఁదగిన**

**ఆ.** **రాజకృత్యములఁ? దిరంబుగా నిఖిల ని । యోగ వృత్తులందు యోగ్యులయిన**
**వారిఁ గరము గారవమ్మునఁ బంచితె । నీవు వారిదైన నే ర్పెఱింగి.** **26**

**ప్రతిపదార్థం:** మీ, వంశమునన్; నరదేవ+ఉత్తముల+అది+ఐన= రాజశ్రేష్ఠులదైన; సత్+ధర్మ, మార్గంబు= మంచిధర్మపద్ధతిని; సలుపుదు+అయ్య= ఆచరిస్తున్నావుకదా!; ధర్మవిదుండవు+ఐ= ధర్మంతెలిసినవాడివై; ధర్మ+అర్థ+కామంబులు= ధర్మం, అర్థం, కామం అనే మూడుపురుషార్థాలు; ఒండు+ఒంటి= ఒకదాన్ని ఒకటి; బాధింపక+ఉండన్= బాధించకుండా; ఉచితకాలవిభక్తముల్= ఆయాకాలాలకు తగినట్లు విభజించబడినవి; కాన్=కాగా; లీల= సంతోషంగా; సేవింతె (సేవింతువు+ఎ)= సేవిస్తున్నావుకదా!; ధర్మువు+అందు+అ= ధర్మమందే; చిత్తంబు= మనస్సును; నిలిపి; ఇమ్ములన్= ప్రీతిగా; ఎప్పుడున్= ఎల్లప్పుడు; అపర, రాత్రమ్ముల+అందున్= రాత్రి ఉత్తరభాగంలో- అంటే అర్ధరాత్రి తరువాత; నిజ, బుద్ధిన్= స్వబుద్ధిచేత; చేయన్+తగిన; రాజకృత్యములన్= రాజకార్యాలను; చింతింతె (చింతింతువు+ఎ)= ఆలోచిస్తున్నావుకదా! తిరంబుగాన్= స్థిరంగా; నిఖిల, నియోగ, వృత్తుల+అందున్= అన్ని ప్రభుత్వ ఉద్యోగాల్లో; యోగ్యులు+ఐన= తగిన; వారిన్= వాళ్ళను; వారిది+ఐన; నేర్పు+ఎఱింగి= సామర్థ్యాన్ని తెలిసికొని; కరము= మిక్కిలి; గారవమ్మునన్= గౌరవభావంతో; నీవు; పంచితే (పంచితివి+ఏ)= నియమించావుకదా!

**తాత్పర్యం:** మీవంశంలో జన్మించిన రాజశ్రేష్ఠులు ఏర్పరచిన ధర్మపద్ధతిని తప్పక ఆచరిస్తున్నావుకదా! ధర్మాన్ని తెలుసుకొని, ధర్మార్థకామాలు ఒకదాని నొకటి బాధించకుండ, కాలోచితాలుగా వాటిని విభజించుకొని సేవిస్తున్నావుకదా! ధర్మమందే మనస్సు నిలిపి, చేయదగిన రాజకార్యాల్ని స్వబుద్ధితో ఎల్లప్పుడూ అర్ధరాత్రి దాటిన తరువాతే ఆలోచిస్తున్నావుకదా! ప్రభుత్వ ఉద్యోగాల్లో స్థిరంగా యోగ్యులైన వాళ్ళను, వాళ్ళ వాళ్ళ శక్తి సామర్థ్యాల్ని గుర్తించి గౌరవభావంగా, స్థిరంగా నియమించావుకదా!

**విశేషం:** పురుషార్థాలు ధర్మార్థకామమోక్షాలు. వీటిలో అర్థకామాలు ఐహిక సంబంధులు. మోక్షం పరలోక సంబంధి. అర్థకామాలు ఐహిక సంబంధులే అయినా, మానవుని ఐహిక జీవితమంతా ఈ అర్థకామాల చుట్టే తిరుగుతూ ఉన్నా అవి ధర్మబద్ధాలయితేనేకాని మోక్షసాధనకు తోడ్పడవు. ధర్మానికి దూరమయితే అవి పాపహేతువులౌతాయి. నరకానికి త్రోవతీస్తాయి. అందుకే పురుషార్థాల్లో అర్థకామాలకు ముందు ధర్మాన్ని చెప్పటం జరిగింది. మానవుడు తన ఐహిక జీవితంనుండి మోక్షాన్ని అధిరోహించటానికి మంచి నిచ్చెన ధర్మం. 'ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ' ('అర్జునా! ప్రాణుల్లో ధర్మవిరుద్ధం కాని కామాన్ని నేనే') అనే గీతావాక్యంకూడ ఇచ్చట గుర్తించదగింది. "చువర్ణంబుతోడి దుగ్దకారం తకారం" అవుతుంది కనుక, సేవించుదువు,

చింతించుదువు- సేవింతువు, చింతింతువు - అవుతాయి. భూతతద్ధర్మార్థ క్రియల్లో వకారం లోపించవచ్చు కనుక సేవింతువు+ఎ= సేవింతె, చింతింతువు+ఎ= చింతింతె, పంచితివి+ఎ= పంచితె - అయ్యాయి.

**క. అనఘుల శాస్త్ర విధిజ్ఞుల । ననురక్తులఁ బితృపితామహక్రమమున వ**
**చ్చిన విపుల మంత్రులఁగా । నొనరించితె కార్య సంప్రయోగము పొంటెన్. 27**

**ప్రతిపదార్థం:** అనఘులన్= పాపాత్ములు కానివాళ్ళను; శాస్త్రవిధిజ్ఞులన్= శాస్త్రనియమాలు తెలిసినవాళ్ళను; అనురక్తులన్= (నీమీద) ప్రేమకల వాళ్ళను; పితృపితామహక్రమమునన్= తండ్రితాతలనుండి వంశపారంపర్యంగా; వచ్చిన= కొలువుచేస్తున్న; విపులన్= బ్రాహ్మణులను; కార్య, సంప్రయోగముపొంటెన్= రాజకార్యనిర్వహణంకొరకు; మంత్రులన్+కాన్= మంత్రులనుగా; ఒనరించితె= చేశావుకదా!

**తాత్పర్యం:** పుణ్యాత్ములు, శాస్త్రనియమాలు బాగా తెలిసినవాళ్ళు, నీమీద ప్రేమగలవాళ్ళు, తాతతండ్రులనాటి నుండి వంశపారంపర్యంగా కొలువుచేస్తున్న వాళ్ళు అయిన బ్రాహ్మణోత్తముల్ని రాజకార్యనిర్వహణకు మంత్రులుగా ఏర్పరచుకొన్నావుకదా!

**విశేషం:** పొంటెన్ - అనేది 'కొఱకు' అనే అర్థంలో చతుర్థీవిభక్తి ప్రత్యయంగా నన్నయకాలంలో ఉంది. ఇప్పు డది వ్యవహారంలో లోపించింది. అరవంలో దీనికి సమానార్థకం 'పొరుట్టు'. విద్యావంతులైన బ్రాహ్మణులు విప్రులని చెప్పే అభియుక్తోక్తి ఒకటి ఉంది- "జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః, సంస్కారా ద్ద్విజ ఉచ్యతే । విద్యయా యాతి విప్రత్వం, త్రిభిః శ్రోత్రియ ఉచ్యతే'. జన్మవల్ల బ్రాహ్మణుడు, సంస్కారంవల్ల ద్విజుడు, విద్యవల్ల విప్రుడు, ఈ మూడూ ఉంటే శ్రోత్రియుడు అంటారు.

**క. రాజునకు విజయమూలము । రాజితమంత్రంబు; సుస్థిరంబుగ దానిన్**
**రాజాన్వయ! రక్షింతె ధ । రాజనులకుఁ గర్ణగోచరము గాకుండన్. 28**

**ప్రతిపదార్థం:** రాజ+అన్వయ!= చంద్రవంశానికి చెందిన ఓ ధర్మరాజా!; రాజునకున్; విజయమూలము= విజయానికి కారణం; రాజిత, మంత్రంబు= చక్కనిరహస్యాలోచనమే; ధరా, జనులకున్= రాజ్యంలోని ప్రజలకు; కర్ణ, గోచరము, కాకుండన్= చెవిని పడకుండ; దానిన్= ఆ రహస్యాలోచనాన్ని; సుస్థిరంబుగన్= పదిలంగా; రక్షింతె= రక్షిస్తున్నావుకదా!

**తాత్పర్యం:** ఓధర్మరాజా! రాజుకు విజయకారణం అతడి రహస్యాలోచనం. ఆ రహస్యాలోచనం నీ ప్రజల చెవిని పడకుండ పదిలంగా రక్షించుకుంటున్నావుకదా!

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం.

**క. ధీరుఁడు ధర్మాధర్మ వి । శారదుఁడు బహుశ్రుతుండు సమచిత్తుఁడు వా**
**ణీ రమణీ శ్రిత వదన స । రోరుహుఁ డనఁ జనునె నీ పురోహితుఁ డధిపా! 29**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; నీ, పురోహితుఁడు; ధీరుఁడు= ధైర్యశాలియు (విద్వాంసుడు); ధర్మ+అధర్మ, విశారదుఁడు= ధర్మాధర్మాల్ని గూర్చి బాగా ఎరిగినవాడు; బహుశ్రుతుండు= అనేక వేదశాస్త్రా లెరిగినవాడు; సమచిత్తుఁడు= రాగద్వేషాలులేకుండ సమత్వాన్ని సాధించిన మనస్సు కలవాడు; వాణీ, రమణీ, శ్రిత, వదన, సరోరుహుఁడు= సరస్వతీదేవిచేత ఆశ్రయించబడిన ముఖపద్మం కలవాడు; అనన్+చనునె= అని అనదగినవాడే కదా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీ పురోహితుడు ధైర్యవంతుడు (పండితుడు), ధర్మాధర్మాలు తెలిసినవాడు, వివిధవేదశాస్త్రాలు బాగా అధ్యయనం చేసినవాడు, రాగద్వేషరహితమైన సమచిత్తం కలవాడు, సరస్వతీదేవి కొలువున్న ముఖపద్మం కలవాడు - అని అనదగినవాడే కదా!

**విశేషం:** పురోహితు డంటే శాంతికపౌష్టికాదివైదికకర్మల్లో ముందుండేవాడు. ధర్మాధర్మాలు తెలిపి శాస్త్రోక్తంగా వివిధ కర్మలు నడిపించేవాడు. మొగమోటమి లేకుండ ధర్మాధర్మాలు తెలియచెప్పటానికి, హితం ఉపదేశించటానికి, పురోహితునికి ధైర్యం కూడా ఉండాలి. ధైర్యం ఉన్నా-అందుకు తగిన వేదశాస్త్రపాండిత్యం, దాని సంస్కారరూపమైన రాగద్వేషరహిత సమచిత్తం లేకుంటే అతడు మంచిచెడ్డల్ని సరిగా నిర్ణయించలేడు, హితం ఉపదేశించ లేడు, నిస్స్వార్థంగా వ్యవహరించలేడు. ధైర్యం, పాండిత్యం, సమచిత్తం ఉన్నా- వాక్శుద్ధి, వాక్చైపుణ్యం లేకుంటే అవి అన్నీ వ్యర్థమే - అతనివాక్కు ఎదుటి హృదయాన్ని వశంచేసుకోలేదు. అందుచేత అతడు వాగ్దేవిని-సరస్వతిని-వశంచేసుకొన్న వ్యక్తిగా ఉండాలి. రజస్తమోగుణప్రధానమైనప్రభువ్యవస్థకు, ప్రాచీనకాలంలో పురోహితవ్యవస్థ సత్త్వశుద్ధిని కూర్చి ధర్మపాలనకు, ప్రభుక్షేమానికి, ప్రజాక్షేమానికి విశేషంగా దోహదం చేసింది. పై పద్యంలో పేర్కొన్నవన్నీ ఉత్తమపురోహిత లక్షణాలు.

**క.** **జనవర! నీ యజ్ఞములం । దనవరతనియుక్తుఁ డయిన యాజ్ఞికుఁడు ప్రయో**
**గ నిపుణుఁడై యేమఱకుం । డునె నిజకృత్యముల నెప్పుడును సమబుద్ధిన్.** **30**

**ప్రతిపదార్థం:** జనవర!= ఓరాజా!; నీ యజ్ఞముల+అందున్; అనవరత, నియుక్తుఁడు+అయిన= ఎల్లప్పుడు నియమించబడినవాడైన; యాజ్ఞికుఁడు= యజ్ఞం చేయించే బ్రాహ్మణుడు; ప్రయోగ, నిపుణుఁడు+ఐ= యజ్ఞంచేయించటంలో నేర్పుకలవాడై; ఎప్పుడును= ఎల్లప్పుడు; సమబుద్ధిన్= రాగద్వేషరహితమైన సమత్వ బుద్ధితో; నిజకృత్యములన్= తాను చెయ్యదగినపనుల్లో; ఏమఱక+ఉండునె= విస్మరించకుండా ఉన్నాడు కదా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీవు యజ్ఞాలలో నియమించిన యాజ్ఞికుడు యజ్ఞం చేయించటంలో నిపుణుడై, రాగద్వేషరహితమైన సమబుద్ధితో తనకర్తవ్యాలను విస్మరించకుండా ఉన్నాడుకదా!

**విశేషం:** ఏయజ్ఞమైనా సక్రమంగా జరగకుంటే సత్ఫలితాలకు బదులు దుష్ఫలితాలు కలిగే ప్రమాదం ఉంది. అందువల్ల యాజ్ఞికుడు ప్రయోగనిపుణుడు, కర్తవ్యపరాయణుడు కావటం ఎంతో ముఖ్యం.

**క.** **నానావిధరణవిజయమ । హానిపుణు లవార్యవీర్యు లనఁదగువారిన్**
**సేనాధ్యక్షులఁ జేసితె । నీ నమ్మినవారి మాననీయుల హితులన్.** **31**

**ప్రతిపదార్థం:** నానావిధ, రణ, విజయ, మహానిపుణులు= వివిధ యుద్ధాల్లో గెలుపు సాధించడంలో గొప్ప నేర్పరులైనవాళ్ళు; అవార్య, వీర్యులు= ఎదిరించ సాధ్యం కాని పరాక్రమం కలవాళ్ళు; అనన్= అని అనటానికి; తగువారిన్= తగినటువంటివాళ్ళను; నీ, నమ్మిన, వారిన్= నీకు నమ్మకం కలవాళ్ళను; మాననీయులన్= గౌరవింపదగినవాళ్ళను; హితులన్= నీమేలు కోరేవాళ్ళను; సేనా+అధ్యక్షులన్= సైన్యానికి అధ్యక్షులుగా; చేసితె= చేశావుకదా!

**తాత్పర్యం:** పలు విధాలైన యుద్ధాల్లో విజయాన్ని సాధించటంలో నిపుణులైన వాళ్ళను, ఎదిరించ సాధ్యంకాని పరాక్రమం కలవాళ్ళను, విశ్వాసపాత్రులైనవాళ్ళను, గౌరవానికి అర్హులైన వాళ్ళను, నీమేలు కోరే వాళ్ళను, సైన్యాధ్యక్షులుగా నియమించావుకదా!

**విశేషం:** రాజ్యవ్యవస్థలో సైన్యాధ్యక్షపదవి చాలా ముఖ్యమైంది. సైన్యాధ్యక్షుడే ప్రధాన దేశరక్షకుడు. అందుచేత అతడు సమర్థుడుగా ఉండాలి. అంతేకాదు, అతడు ప్రభువుకు ఎంతో విశ్వాసపాత్రుడై ఉండాలి. ఇవి మాత్రమే అతనికి చాలవు. అతనికి గౌరవార్హమైన వ్యక్తిత్వం కూడ ఉండాలి. అన్నింటిని మించి అతడు ప్రభువు మేలు కోరేవాడుగా ఉండాలి. లేకుంటే అతనివల్ల ప్రభువుకే ప్రమాదం.

**చ. కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడు నైన మంత్రి పెం**
**పడరఁగ రాజపుత్త్రుల మహాధనవంతులఁ జేసి వారితో**
**నొడఁబడి పక్ష మేర్పడఁగ నుండఁడుగా, ధన మెట్టి వారికిం**
**గడుకొని చేయకుండునె జగన్నుత! గర్వము దుర్విమోహమున్. 32**

**ప్రతిపదార్థం:** జగత్+నుత!= లోకంచేత కీర్తింపబడే ఓధర్మరాజా!; కడున్= మిక్కిలి; చనువాఁడును+ఐ= పలుకుబడికలవాడై; పురుషకారియున్= కృషిచేసేవాడూ! దక్షుఁడును+ఐన= సమర్థుడును అయిన; మంత్రి; పెంపు+అడరఁగన్= అతిశయంమీర; రాజపుత్త్రులన్; మహాధనవంతులన్= గొప్ప సంపన్నులను; చేసి= కావించి; వారితోన్; ఒడఁబడి= చేతులు కలిపి; పక్షము+ ఏర్పడఁగన్= వ్యతిరేకవర్గం ఏర్పడేటట్లుగా; ఉండఁడుగా= ఉండటంలేదుకదా!; ధనము; ఎట్టివారికిన్= ఎటువంటి వాళ్ళకైనా; కడుకొని= పూని; గర్వమున్= గర్వాన్ని; దుర్విమోహమున్= చెడ్డదైన మితిమీరినకాంక్షను; చేయక+ఉండునె= కలిగించకుండా ఉంటుందా!

**తాత్పర్యం:** ఎక్కువ పలుకుబడి కలిగి, క్రియాశీలి, సమర్థుడు అయిన మంత్రి-తన పరిధిమీరి, ఇతర రాజపుత్రుల్ని మహాధనవంతులుగా చేసి, వాళ్ళతో చేతులు కలిపి, నీకు వ్యతిరేకవర్గంగా ఏర్పడేటట్లుగా ఉండటం లేదుకదా! ధర్మరాజా! ధనం ఎటువంటివాళ్ళకైనా దురాశనూ, గర్వాన్నీ కలిగిస్తుంది.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. అధికారపక్షంలో ఉంటూ అన్ని ప్రయోజనాలూ పొంది, అధికంగా బలపడి, దురాశాదురహంకారాలు పెంచుకొని, అన్యులతో చేతులు కలిపి, అధికార పక్షాన్ని బలహీనపరిచే వ్యతిరేకవర్గాన్ని సృష్టించే వెన్నుపోటుదారులందరూ ఈ కోవకు చెందే మంత్రులే. కలియుగరాజకీయాల్లో వీళ్ళ సంఖ్య గణనీయంగా పెరగటం గమనార్హం. అలాంటివాళ్ళను ఓకంట కనిపెట్టటం మంచిదని ఆనాడే నారదుడు హెచ్చరించాడు.

**క. క్షితినాథ! శాస్త్రదృష్టి । ప్రతిభను దివ్యాంతరిక్ష భౌమోత్పాత**
**ప్రతికారులగుచు సన్మా । నితులయి వర్తింతురయ్య నీదైవజ్ఞుల్. 33**

**ప్రతిపదార్థం:** క్షితి, నాథ!= భూమికి అధిపతి అయినవాడా! - ఓధర్మరాజా!; నీ, దైవజ్ఞుల్= నీయొక్క జ్యోతిశ్శాస్త్ర పండితులు; శాస్త్రదృష్టి= శాస్త్రాలు చదవటంవల్ల కలిగిన పాండిత్యంచేత; ప్రతిభను= తమ బుద్ధిబలంచేత; దివ్య+అంతరిక్ష, భౌమ+ఉత్పాత, ప్రతీకారులు+అగుచున్= దేవతా సంబంధాలు, ఆకాశ సంబంధాలు, భూసంబంధాలు అయిన అనర్థాలకు విరుగుడుక్రియలు చేసేవాళ్ళయి; సన్మానితులు+అయి= నీచే తగిన సమ్మానాలను పొంది; వర్తింతురు+అయ్య= నడుచుకుంటున్నారుకదా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీ ఆస్థానజ్యోతిష్కులు శాస్త్రపాండిత్యంచేత, స్వీయప్రతిభచేత దేవతా సంబంధాలు, అంతరిక్ష సంబంధాలు, భూ సంబంధాలు అయిన ఉత్పాతాలను కనిపెట్టి వాటికి విరుగుడుగా శాంతి క్రియాదులు నీచేత జరిపించి, సన్మానాలు పొందుతున్నారు కదా!

**విశేషం:** ఉత్పాతాలు అంటే అపశకునాలు, హఠాత్తుగా వచ్చే అనర్థాలు. ఇవి దివ్యాలు, అంతరిక్షాలు, భౌమాలు అని మూడు విధాలు. దివ్యాలంటే - అపూర్వ గ్రహనక్షత్రాదులు పుట్టటం, అంతరిక్షాలంటే- పరివేషాలు ఏర్పడటం, పిడుగులు పడటం మొదలైనవి. భౌమాలంటే-అపూర్వ చరాచర వస్తువులు పుట్టటం, ఉప్పెనలు, భూకంపాలు మొదలైనవి రావటం. ఇవి ప్రజలకు దుఃఖాన్ని, రోగాన్ని కలిగిస్తాయి. అంతరిక్ష భూవాతావరణపరిశోధకులైన పండితుల సాయంతో సాధ్యమైనంత ముందుగా వీటిరాకను కనిపెట్టి ప్రతిక్రియలు జరిపించటం ప్రభుధర్మం.

**క. అనిశము సేవింతురె ని। న్ననఘా! యష్టాంగమైన యాయుర్వేదం**
**బున దక్షులైన వైద్యులు। ఘనముగ ననురక్తులై జగద్ధితబుద్ధిన్. 34**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడవైన ఓధర్మరాజా!; నిన్నున్; అనిశము= ఎల్లప్పుడు; అష్ట+అంగము+ఐన= ఎనిమిదిభాగాలతో కూడుకొన్నదైన; ఆయుః+వేదంబునన్= ఆయుర్వేదంలో; దక్షులు+ఐన= సమర్థులైన; వైద్యులు; జగత్+హిత, బుద్ధిన్= లోకానికి మేలు చేయాలనే తలంపుతో; ఘనముగన్= ఎక్కువగా; అనురక్తులు+ఐ= ప్రేమగలవారై; సేవింతురె (సేవించుదురె)= సేవిస్తున్నారుకదా!

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్మా! ఆయుర్వేదంలో సమర్థులైన వైద్యులు లోకానికి మేలుచేసేబుద్ధితో ప్రజలమీది ప్రేమతో ఎనిమిది శాఖలుగా వ్యాపించిన ఆ వైద్య విధానంలో సేవలు చేస్తున్నారా?

**విశేషం:** ఆయుర్వేదం-ఆయువును వృద్ధి చేసే మార్గాలను చెప్పేవేదం-భారతీయ వైద్యశాస్త్రం. నాలుగు ఉపవేదాలలో ఆయుర్వేదం ఒకటి. బ్రహ్మ, అశ్వినీదేవతలు, ధన్వంతరి మొదలయిన వాళ్ళు దీని కర్తలు. దీని అష్టాంగాలు - శల్యం, శాలాక్యం, కాయచికిత్స, భూతవిద్య, కౌమారభృత్యం, అగదతంత్రం, రసాయన తంత్రం, వాజీకరణ తంత్రం. 'జగద్ధితబుద్ధిన్' అని నారదమహర్షి వైద్యుల విషయంలో ప్రయోగించిన విశేషణం విశేషించి గుర్తించదగింది. బాధా పీడితుడై ప్రాణాపాయ స్థితిలో ఉన్న రోగికి చికిత్సచేసి అతని బాధ తొలగించి, ప్రాణం నిలిపే వైద్యుణ్ణి భారతదేశం విష్ణుస్వరూపునిగా భావించింది. 'వైద్యో నారాయణో హరిః' అని ప్రవచించింది. విష్ణు స్వరూపుడైన వైద్యునికి ఉండవలసిన బుద్ధి జగద్ధితబుద్ధి-స్వార్థబుద్ధి కాదు. స్వార్థబుద్ధి ప్రబలిన వైద్యుడు సమాజం పాలిటి దేవుడు కాడు- దానవుడు.

**క. సారమతిఁజేసి మానస। శారీర రుజావళులకు సతతంబుఁ బ్రతీ**
**కారములు సేయుచుండుదె। యారఁగ వృద్ధోపసేవ నౌషధసేవన్. 35**

**ప్రతిపదార్థం:** సారమతిన్+చేసి= నిపుణమైన బుద్ధితో - అంటే చక్కగా ఆలోచించి; మానస, శారీర, రుజా+ఆవళులకున్= మనస్సంబంధమైన, శరీరసంబంధమైన వ్యాధుల సమూహాలకు; సతతంబున్= ఎల్లప్పుడు; ఆరఁగన్= ఒప్పగా; వృద్ధ+ఉపసేవన్= వృద్ధులను సేవించటంచేత; ఔషధసేవన్= మందులను సేవించటంచేత, ప్రతీకారములు= విరుగుడుక్రియలు - అంటే చికిత్సలు; చేయుచున్+ఉండుదె= చేస్తున్నావు కదా!

**తాత్పర్యం:** చక్కగా ఆలోచించి పెద్దల సేవతో మనోవ్యాధులకు, ఔషధసేవతో శారీరకవ్యాధులకు చికిత్స చేసుకొంటున్నావు కదా!

**విశేషం:** అలం: క్రమాలంకారం. మనోవ్యాధికి మందు లేదంటారు. కాని వృద్ధసేవ మనోవ్యాధికి మంచిమందు. వృద్ధుల జీవితానుభవం, శాస్త్రవిజ్ఞానం మనోవ్యాధులకు మేలైన చికిత్స చేస్తాయి.

**క.** **ఉపధాశుద్ధులఁ బాప । వ్యపగతబుద్ధుల వినీతివర్తుల సములన్**
**సుపరీక్ష నియోగించితె । నిపుణుల నర్థార్జనాదినృపకార్యములన్. 36**

**ప్రతిపదార్థం:** ఉపధా, శుద్ధులన్= ధర్మపరీక్షలచేత పరిశుద్ధులైనవాళ్ళను; సుపరీక్షన్= లెస్సగా పరీక్షించుటచేత; పాపవ్యపగతబుద్ధులన్= పాపరహితమైన చిత్తవృత్తి కలవాళ్ళను; వినీతి వర్తులన్= విశేషంగా నీతిమార్గంలో ప్రవర్తించేవారిని (వినయవంతులను); సములన్= రాగద్వేషరహితులై అందరిపట్ల సమబుద్ధితో వ్యవహరించేవాళ్ళను; నిపుణులన్= నేర్పరులైనవారిని; అర్థ+ఆర్జన+ఆది, నృపకార్యములన్= డబ్బును వసూలుచేయటం మొదలయిన రాచకార్యాలలో; నియోగించితె= నియమించావుకదా!

**తాత్పర్యం:** పన్నులు వసూలు చేయటం వంటి ధనార్జన రూపమైన రాచకార్యాలలో ధర్మపరీక్షలచే పరిశుద్ధులైన వాళ్ళని, పాపరహితమైన చిత్తవృత్తి కలవాళ్ళని, విశేషంగా నీతిమార్గంలో నడుచుకొనేవాళ్ళని, రాగద్వేషరహితమైన సమబుద్ధితో వ్యవహరించేవాళ్ళని, నైపుణ్యం కలవాళ్ళని చక్కగా పరీక్షించి నియమించావుకదా!

**విశేషం:** పన్నులు వసూలు చెయ్యటంలాంటి ధనార్జనరూపమైన రాచకార్యాల్లో, అవినీతిపరులు, పక్షపాతబుద్ధికలవాళ్ళు, నియుక్తులైతే- ప్రభుత్వకోశానికి నష్టం వాటిల్లటమే కాక, ప్రభుత్వంమీద ప్రజలకు ద్వేషభావం పెరుగుతుంది. అందువల్ల అలాంటి ఉద్యోగ నియామకాల్లో ప్రభువు ప్రత్యేకశ్రద్ధ వహించాలి.

**ఉ.** **ఉత్తమ మధ్యమాధమ నియోగ్యత బుద్ధి నెఱింగి వారి న**
**య్యుత్తమ మధ్యమాధమ నియోగములన్ నియమించితే నరేం**
**ద్రోత్తమ! భృత్యకోటికి ననూనముగాఁ దగు జీవితంబు లా**
**యత్తము సేసి యిత్తె దయ నయ్యయికాలము దప్పకుండఁగన్. 37**

**ప్రతిపదార్థం:** నరేంద్ర+ఉత్తమ!= ఓరాజశ్రేష్ఠ!; ఉత్తమ, మధ్యమ+అధమ, నియోగ్యత= ఉత్తమ మధ్యమ అధమ స్థానాలలో నియమించదగిన వ్యక్తుల యోగ్యతలను; బుద్ధిన్+ఎఱింగి= గ్రహించి; వారిన్; ఆ+ఉత్తమ, మధ్యమ+అధమ, నియోగములన్= ఆ ఉత్తమ మధ్యమ అధమములైన ఉద్యోగాల్లో; నియమించితి(వి)+ఏ= నియమించావుకదా!; భృత్యకోటికిన్= సేవకులసమూహానికి; అనూనముగాన్= కొరతలేకుండా; తగు, జీవితంబులు= తగిన జీతాలను; దయన్= దయతో; ఆ+అయి, కాలము, తప్పక+ ఉండఁగన్= ఆయా సమయం దాటకుండ; ఆయత్తము, చేసి= సిద్ధంచేసి; ఇత్తె (ఇచ్చుదువు+ఎ)= ఇస్తున్నావుకదా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! వ్యక్తుల ఉత్తమ మధ్యమాధమ యోగ్యతలను తెలుసుకొని వాళ్ళను ఉత్తమ మధ్యమాధమ ఉద్యోగాల్లో నియమించావుకదా! సేవకు లందరికి, కొరతలేకుండా తగుజీతాలు దయతోసకాలంలో అందజేస్తున్నావుకదా!

**విశేషం:** ద్వ్యక్షరప్రాసతో వృత్తం అలంకృతమై ప్రతిపాద్యవస్తువును ఆస్వాదయోగ్యం చేస్తున్నది. సమత అనే గుణం పద్యనిర్మాణంలోనూ రచనలోనూ కనపడుతున్నది. మొదటి మూడు చరణాలు చివరిఅక్షరం ముందు విరిగి పైపాదంలో కొనసాగటం నిర్మాణంలోని సమత. మార్గాభేదం, అవైషమ్యం ఉండటంచేత సమతాగుణం స్ఫురించి, సేవకుల నందరినీ సమంగా చూస్తున్న రాజుయొక్క చిత్తవృత్తిని వ్యంజింపచేస్తున్నది. (సంపా.)

**క.** **తమ తమ కనియెడు తఱి జీ । తము గానక నవయు భటుల దౌర్గత్య విషా**
**దము లేలినవాని కవ । శ్యము నెగ్గొనరించు నతఁడు శక్రుం డైనన్. 38**

**ప్రతిపదార్థం:** తమ తమ, కనియెడు, తఱిన్= తాము తాము పొందవలసిన సమయాన; జీతము, కానక= జీతంపొందక; నవయు= శుష్కించే, (బక్కచిక్కే); భటుల, దౌర్గత్య, విషాదములు= సేవకులయొక్కదారిద్ర్య దుఃఖాలు; ఏలిన, వానికిన్= రాజుకు; అతఁడు; శక్రుండు+ఐనన్= దేవేంద్రుడైనా; అవశ్యమున్= తప్పక; ఎగ్గు+ఒనరించున్= కీడు కలిగిస్తాయి.

**తాత్పర్యం:** తాము పొందవలసిన సమయంలో జీతాన్ని పొందక శుష్కించే సేవకుల దారిద్ర్యదుఃఖాలు ప్రభువుకు- అతడు దేవేంద్రుడైనా సరే - తప్పక కీడు కలిగిస్తాయి.

**విశేషం:** సేవకులదుఃఖం ప్రభువుకు క్షేమకరం కాదు. తమ తమకు+అనియెడు. అని కొందరు విడదీస్తారు.

**క. కులపుత్త్రులైన సద్భృ । త్యులకును సత్కార మర్థితోఁ జేయుదె? వా**
**రలు నీప్రస్తవమున ని । మ్ములఁ గృతము దలంచి ప్రాణములు విడుతు రనిన్. 39**

**ప్రతిపదార్థం:** కులపుత్రులు+ఐన= వంశపారంపర్యంగా వచ్చే (ఇచట 'కులభృత్యులైన' అనే పాఠం పెక్కు ప్రతులలో ఉంది); సత్+కారము= సమ్మానం; అర్థితోన్= ప్రీతితో; చేయుదె= చేస్తున్నావుకదా; వారలు; నీ ప్రస్తవమునన్= నీ విషయంలో, (అంటే నీ పనికోసం); ఇమ్ములన్= ఇంపుగ; కృతము= నీవు చేసిన ఉపకారం; తలంచి= తలచుకొని; అనిన్= యుద్ధంలో; ప్రాణములు; విడుతురు.

**తాత్పర్యం:** వంశపారంపర్యంగా వచ్చే మంచి సేవకులకు ప్రీతితో సమ్మానం చేస్తున్నావుకదా! వారు మనసార నీ ఉపకారాన్ని స్మరించి యుద్ధభూమిలో నీకై ప్రాణాలు వదలుతారు.

**క. అనఘా! నీ ప్రస్తవమున । నని నీల్గినవీరభటుల యనుపోష్యుల నె**
**ల్లను బ్రోతె భోజనాచ్ఛా । దనముల వారలకు నెమ్మి దఱుఁగక యుండన్. 40**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడవైన ఓధర్మరాజా!; నీ, ప్రస్తవమునన్= నీవిషయంలో; అనిన్= యుద్ధంలో; ఈల్గిన= మరణించిన; వీరభటుల, అనుపోష్యులన్+ఎల్లన్= వీరులైన భటులను అనుసరించి పోషించదగిన వాళ్ళందరిని, అంటే వారిపోషణపై ఆధారపడి జీవించే భార్యాపుత్రులు, తల్లిదండ్రులు మొదలయిన వాళ్ళందరిని; భోజన+ఆచ్ఛాదనములన్= కూడుగుడ్డలతో; వారలకున్; నెమ్మి= సంతోషం; తఱుఁగక+ఉండన్= తగ్గకుండా; ప్రోతె (ప్రోచుదువు+ఎ)= పోషిస్తున్నావుకదా!

**తాత్పర్యం:** పుణ్యాత్ముడవైన ఓ ధర్మరాజా! నీకొరకు యుద్ధంలో మరణించిన వీరసైనికుల కుటుంబాలకు కూడుగుడ్డలు లోటు లేకుండా ఇచ్చి, వాళ్ళ సంతోషం తగ్గకుండా పోషిస్తున్నావు కదా!

**విశేషం:** కుటుంబపు పింఛనుపథకం (**Family pension**) భారతకాలంలోనే ఉన్నదన్నమాట.

**క. ధనలుబ్ధుల మ్రుచ్చులఁ గూ । ర్పని వారలఁ బగఱవలని వారల ధృతి చా**
**లని వారల దుర్జనులం । బనుపవుగా రాజకార్యభారము దాల్పన్. 41**

**ప్రతిపదార్థం:** ధన, లుబ్ధులన్= ధనంపట్ల లోభబుద్ధికలవాళ్ళను; మ్రుచ్చులన్= దొంగల్ని; కూర్పనివారలన్= స్నేహానికి యోగ్యులు కానివాళ్ళను; పగఱవలనివారలన్= శత్రువులపట్ల పక్షపాతం కలవాళ్ళను; ధృతి, చాలని, వారలన్= ధైర్యం చాలని

వాళ్ళను; దుర్జనులన్= దుర్మార్గులైన వాళ్ళను; రాజ, కార్యభారము, తాల్పన్= రాచకార్యం యొక్క భారాన్ని వహించటానికి; పనుపవుగా= పంపటంలేదుకదా!

**తాత్పర్యం:** ఓధర్మరాజా! ధనంపట్ల లోభబుద్ధి కలవాళ్ళని, దొంగల్ని, స్నేహానికి యోగ్యులు కానివాళ్ళని, శత్రువులపట్ల పక్షపాతం కలవాళ్ళని, ధైర్యం చాలనివాళ్ళని, దుర్మార్గులైనవాళ్ళని రాజకార్యాలు నిర్వహించటానికి పంపటం లేదు కదా!

**క. చోరభయవర్జితముగా । ధారుణిఁ బాలింతె, యధికధనలోభమునం**
**జోరుల రక్షింపరుగా । వారలచే ధనముగొని భవద్భృత్యవరుల్. 42**

**ప్రతిపదార్థం:** చోర, భయ, వర్జితముగాన్= దొంగలవల్ల భయం లేకుండా; ధారుణిన్= భూమిని; పాలింతె (పాలించుదువు+ఎ)= పాలిస్తున్నావుకదా!; భవత్+భృత్యవరుల్= నీయొక్క సేవకుల్లో ముఖ్యులు; అధిక, ధన, లోభమునన్= ధనంమీద మితిమీరిన కోరికతో; వారలచేన్= ఆదొంగలచేత; ధనము, కొని= డబ్బుతీసుకొని; చోరులన్= ఆ దొంగలను; రక్షింపరుగా= రక్షించటంలేదుకదా!

**తాత్పర్యం:** ధర్మరాజా! దొంగభయం లేకుండా నీవు రాజ్యాన్ని ఏలుతున్నావుకదా! నీ ప్రభుత్వోద్యోగుల్లో ముఖ్యులైనవాళ్ళు ధనాశాపరులై ఆ దొంగలదగ్గర డబ్బు పుచ్చుకొని వాళ్ళకు రక్షణ కల్పించటం లేదు కదా!

**విశేషం:** కాలం గడిచేకొలదీ, నాగరకత పెరిగేకొలదీ దొంగల సంఖ్య, దొంగల్లో రకాల సంఖ్య, విపరీతంగా పెరుగుతున్నది. ఈ కలికాలంలో-నవనాగరక యుగంలో - వ్యక్తుల జేబుల్ని, ఇండ్లను, బ్యాంకుల్ని, బస్సుల్ని, రైళ్ళని దోచుకొనే వాళ్ళు మాత్రమే కాదు, 'స్మగ్లింగ్' చేసేవాళ్ళు, 'బ్లాక్‌మార్కెట్' చేసేవాళ్ళు పెక్కు విధాల పన్నులు ఎగవేసేవాళ్ళు, అనేక కారణాలు చెప్పి చందాలు వసూలుచేసి దిగమ్రింగేవాళ్ళు-వీళ్ళంతా రకరకాల దొంగలే. ప్రభుత్వంలో ఉన్నతపదవుల్లో ఉన్న ఉద్యోగులు లంచగొండులైతే ఇలాంటి దొంగల్ని పట్టటం, పట్టి వాళ్ళని శిక్షించటం సక్రమంగా జరుగదు. ఫలితం-ప్రభుత్వ కోశానికి నష్టం, ప్రజలకు బాధ, ప్రభుత్వానికి చెడ్డపేరు. అందుచేత లంచగొండులైన ప్రభుత్యోద్యోగుల పట్ల ప్రభువు ఏవిధంగా అప్రమత్తుడై ఉండాలో నారదమహర్షి సూచించాడు. (సంపా.)

**క. ధరణీనాథ! భవద్భుజ । పరిపాలితయైన వసుధఁ బరిపూర్ణములై**
**కర మొప్పచున్నె చెఱువులు । ధరణి కవగ్రహభయంబు దనుకక యుండన్. 43**

**ప్రతిపదార్థం:** ధరణీ, నాథ!= భూపతీ - ఓ ధర్మరాజా!; భవత్+భుజ, పరిపాలిత+ఐన= నీభుజబలంచేత పరిపాలించబడినదైన; వసుధన్= భూమిలో (రాజ్యంలో); చెఱువులు; పరిపూర్ణములు+ఐ= నిండినవై; ధరణికిన్= భూమికి; అనుగ్రహభయము= వానలేమివల్ల భీతి; తనుకక+ఉండన్= కలుగకుండ; కరము= మిక్కిలి; ఒప్పుచున్+ఉండున్+ఎ= ఒప్పుతున్నాయి కదా!(బాగున్నాయి కదా).

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! భుజబలంతో నీవు పరిపాలిస్తున్న ఈ భూమిలో అనావృష్టి భయంలేకుండా చెరువులు నిండి కనులపండువుగా ఉన్నాయి కదా!

**క. హీనులగు కర్షకులకును । భూనుత! ధాన్యంబు బీజములు, వణిజులకున్**
**మానుగ శతైకవృద్ధి న । నూనముగా ఋణము లిత్తె యుత్తమబుద్ధిన్. 44**

**ప్రతిపదార్థం:** భూనుత!= లోకంచేత కొనియాడబడే ఓ ధర్మరాజా!; ఉత్తమబుద్ధిన్= గొప్పబుద్ధితో-ఉదారబుద్ధితో; హీనులు+అగు= పేదలైన కర్షకులకును; ధాన్యంబు, బీజములు= ధాన్యపు విత్తనాలు; వణిజులకున్= వర్తకులకు; మానుగన్= ఒప్పుగా, తగురీతిగా; శత+ఏక, వృద్ధిన్= నూటికి ఒక వడ్డీవంతున(1%); అనూనముగాన్= కొరతలేకుండ; ఋణముల్= అప్పులు; ఇత్తె(ఇచ్చుదువు+ఎ)= ఇస్తున్నావు కదా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఉదారబుద్ధితో పేద రైతులకు ధాన్యపు విత్తనాలూ, వర్తకులకు నూటికి ఒక రూపాయి వడ్డీ వంతున అప్పులు ఇస్తున్నావుకదా!

**విశేషం:** ఏ ప్రభువైనా వ్యవసాయాన్ని, వ్యాపారాన్ని ప్రోత్సహించాలి. సమాజశ్రేయస్సుకు అవి చాల అవసరం. నారదమహర్షి మాటల్నిబట్టి మహాభారతకాలంలోనే అధికాహారోత్పత్తికి విత్తనాలు, అధికాభివృద్ధికి తక్కువ వడ్డీతో ఋణాలు ప్రభువులు ఇస్తున్నట్లు తెలుస్తున్నది.

**క. పంగుల మూకాంధుల విక । లాంగులను నబాంధవుల దయం బ్రోతె? భయా**
**ర్తుం గడఁది శత్రునైనను । సంగరరంగమునఁ గాతె శరణం బనినన్. 45**

**ప్రతిపదార్థం:** పంగులన్= కుంటివాళ్ళను; మూక+అంధులన్= మూగవాళ్ళను, గ్రుడ్డివాళ్ళను; వికల+అంగులన్= అంగవిహీనులైనవాళ్ళను; అబాంధవులన్= బంధువులు లేనివాళ్ళను-అంటే దిక్కులేనివాళ్ళను; దయన్= దయతో; ప్రోతె(ప్రోచుదువు+ఎ)= పోషిస్తున్నావుకదా!; సంగరరంగమునన్+ యుద్ధభూమిలో; శరణంబు+అనినన్= శరణుఅనిఅంటే; కడఁది, శత్రున్+ఐనను= పెద్దశత్రువునైనా; భయ+ఆర్తున్= భయంతో దుఃఖించేవాణ్ణి; కాతె(కాచుదువు+ఎ)= కాపాడుతున్నావుకదా!

**తాత్పర్యం:** కుంటివాళ్ళను, మూగవాళ్ళను, గ్రుడ్డివాళ్ళను, అంగవిహీనులైన వాళ్ళను, బంధువులు లేనివాళ్ళను దయతో పోషిస్తున్నావుకదా! భయంతో దుఃఖిస్తూ శరణువేడిన పెద్దశత్రువునైనా యుద్ధభూమిలో కాపాడుతున్నావుకదా!

**విశేషం:** దయార్ద్రత ప్రభువుకు ఉండవలసిన ఒక ప్రధానగుణం. వికలాంగులకు, అనాథులకు ప్రభుత్వం చేయూత ఇవ్వటం మహాభారతకాలంలోనే ఉంది.

**క. కృత మెఱిఁగి కర్త నుత్తమ । మతుల సభల సంస్తుతించి మఱవక తగు స**
**త్కృతి సేయుదె? కృత మెఱిఁగెడు । పతియె జగజ్జనుల నెల్లఁ బరిపాలించున్. 46**

**ప్రతిపదార్థం:** కృతము+ఎఱిఁగి= చేసినమేలును గుర్తించి; కర్తన్= ఆ మేలు చేసిన వ్యక్తిని; ఉత్తమ, మతులన్, సభలన్= గొప్పబుద్ధిమంతు లున్న సభల్లో; సంస్తుతించి= ప్రశంసించి; మఱవక= మరచిపోకుండ; తగు, సత్+కృతి= తగిన సన్మానం; చేయుదె(చేయుదువు+ఎ)= చేస్తావుకదా!; కృతము+ఎఱిఁగెడు= చేసిన మేలును గుర్తించగల; పతియె= ప్రభువే; జగత్+జనులన్+ ఎల్లన్= లోకప్రజలనందరిని; పరిపాలించున్= (చక్కగా) పరిపాలించగలడు.

**తాత్పర్యం:** చేసినమేలు గుర్తించి, ఆ మేలు చేసినవ్యక్తిని పదిమంది పెద్దలున్న సభల్లో ఉచితరీతిని సత్కరిస్తున్నావుకదా! చేసినమేలు గుర్తించగల ప్రభువే ప్రపంచప్రజల నందరిని చక్కగా పరిపాలించగలడు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. కృతజ్ఞత ఒక గొప్ప గుణం. అది మానవతాలక్షణం. మంచిని గుర్తించి పదిమందిముందు ప్రశంసించటంకంటె మంచిని పెంచటానికి మేలైన మార్గం మరొకటి లేదు.

**సీ. ఆయంబునందు నాలవ భాగమొండె. మూఁ। డవ భాగమొండె, నం దర్ధమొండె**
**గాని మిక్కిలి సేయఁగాదు వ్యయం బని। యవధరించితె బుద్ధి నవనినాథ!**
**యాయుధాగారధనాధ్యక్ష్యములయందు। వరవాజివారణావళులయందు**
**బండారములయందుఁ బరమవిశ్వాసుల। భక్తుల దక్షులఁ బంచితయ్య?**

**ఆ. గురుల వృద్ధశిల్పివరవణి గ్బాంధవ। జనుల నాశ్రితులను సాధుజనులఁ**
**గరుణఁ బేదఱికము వొరయకుండఁగఁ బ్రోతె। సకలజనులు నిన్ను సంస్తుతింప. 47**

**ప్రతిపదార్థం:** అవనినాథ!= భూమికి ప్రభువైన-ఓధర్మరాజా!; ఆయంబు+అందున్= ఆదాయంలో; నాలవభాగము+ఒండెన్= నాల్గవవంతుకాని; మూఁడవభాగము+ఒండెన్= మూడవవంతుకాని; అందు+అర్ధము+ఒండెన్= అందులో సగభాగంకాని; మిక్కిలి= మించి; వ్యయంబు= ఖర్చు; చేయన్, కాదు= చేయకూడదు; అని; బుద్ధిన్; అవధరించితె= గ్రహించావుకదా!; ఆయుధ+అగార, ధన+ఆధ్యక్ష్యముల+అందున్= ఆయుధశాలలయొక్క భాండాగారాలయొక్కపాలనలో; వర, వాజి, వారణ+ఆవళుల+అందున్= శ్రేష్ఠాలైన అశ్వగజ సమూహాల పాలనలో; బండారముల+అందున్= కోశాగారాల్లో; పరమ విశ్వాసులన్= మిక్కిలి నమ్మదగినవాళ్ళను; భక్తులన్= నీయందు భక్తి ఉన్న వాళ్ళను; దక్షులన్= సమర్థులైనవాళ్ళను; పంచితివి+అయ్య= నియమించావుకదా!; నిన్నున్; సకల, జనులు; సంస్తుతింపన్= ప్రశంసించగా; గురులన్= గురువులను; వృద్ధ, శిల్పి, వర, వణిక్+బాంధవ, జనులన్= ముసలివారైన శిల్పులను, శ్రేష్ఠులైన వ్యాపారులను, బంధువులను; ఆశ్రితులను= ఆశ్రయించినవాళ్ళను; సాధుజనులన్= సజ్జనులను; పేదఱికము+పొరయక+ఉండఁగన్= పేదరికం కలుగకుండ; కరుణన్= దయతో; ప్రోతె (ప్రోచుదువు+ఎ)= పోషిస్తున్నావుకదా!

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆదాయంలో నాల్గవభాగాన్ని లేదా మూడవభాగాన్ని లేదా సగభాగాన్ని మాత్రమే ఖర్చు చెయ్యాలికాని, అంతకుమించి చేయకూడ దని గ్రహించావుకదా! ఆయుధశాలలు, ధనాగారాలు, అశ్వశాలలు, గజశాలలు, కోశాగారాలు-వీటి పాలనలో ఎంతో నమ్మదగిన వాళ్ళను, నీపట్ల భక్తిగల వాళ్ళను, సమర్థులైన వాళ్ళను నియమించావుకదా! ప్రజలంతా నిన్ను ప్రశంసించేటట్లుగా గురువుల్ని, వృద్ధశిల్పుల్ని, గొప్ప వ్యాపారుల్ని, బంధువుల్ని, ఆశ్రితుల్ని, సజ్జనుల్ని పేదరికం రాకుండ దయతో పోషిస్తున్నావు కదా!

**క. వలయు నమాత్యులుఁ జుట్టం। బులు మూలబలంబు రాజపుత్త్రులు విద్వాం**
**సులు బలసియుండ నిచ్చలుఁ। గొలువుండుదె లోక మెల్లఁ గొనియాడంగన్. 48**

**ప్రతిపదార్థం:** వలయు= ఇష్టులైన(కావలసిన); అమాత్యులున్= మంత్రులును; చుట్టంబులున్= బంధువులును; మూల, బలంబు= ప్రధాన సైనిక సమూహం; రాజ పుత్త్రులు; విద్వాంసులు; బలసి+ఉండన్= ఎక్కువగా చేరిఉండగా; లోకము+ఎల్లన్; కొనియాడంగన్= కీర్తించగా; నిచ్చలున్= ప్రతిదినం; కొలువు+ఉండుదె(ఉండుదువు+ఎ)= కొలువుతీరి ఉంటావుకదా!

**తాత్పర్యం:** ఇష్టులైన మంత్రులు, బంధువులు, సైన్యాధిపతులు, రాకుమారులు పండితులు- అధికసంఖ్యలో ఆసీనులై ఉండగా ప్రపంచమంతా ప్రశంసించే విధంగా ప్రతిదినం నీవు కొలువుతీరుతున్నావు కదా!

**క. పరికించుచు బాహ్యాభ్యం। తరజనములవలన సంతతము నిజరక్షా**
**పరుఁడ వయి పరమహీశుల। చరితము వీక్షింతె నిపుణచరనేత్రములన్. 49**

**ప్రతిపదార్థం:** పరికించుచున్= జాగ్రత్తగా గమనిస్తూ; బాహ్య+అభి+అంతర, జనములవలనన్= బయట, లోపల ఉండే జనులవల్ల, (ప్రమాదం కలుగకుండా); సంతతము= ఎల్లప్పుడూ; నిజ, రక్షా, పరుఁడవు+అయి= నిన్ను నీవు రక్షించుకోవటంలో శ్రద్ధకలవాడివై; పర, మహీశుల= శత్రురాజులయొక్క; చరితము= ప్రవర్తన; నిపుణ, చర, నేత్రములన్= నేర్పుగల చారు లనే కళ్ళతో - అంటే సమర్థులైన గూఢచారులవల్ల; వీక్షింతె (వీక్షించుదువు+ఎ)= చూస్తున్నావుకదా!

**తాత్పర్యం:** జాగ్రత్తగా గమనిస్తూ వెలుపల లోపల ఉండే శత్రువులనుండి నిన్ను నీవు రక్షించుకుంటూ, శత్రురాజుల ప్రవర్తనను గూఢచారులు అనే కళ్ళద్వారా కనుగొంటున్నావుకదా!

**విశేషం:** అలం: రూపకం. తా నుంటేనేకదా తక్కినవి చెయ్యటం. అందుచేత ఆత్మరక్షణ అందరికీ ముఖ్యమే. అందులోనూ అధికార పీఠాన్ని అధిష్ఠించిన మహారాజుకు ఆత్మరక్షణ అతిముఖ్యం. దేశం వెలుపల లోపల ఆయనకు ఎంతోమంది శత్రువు లుంటారు. ఎన్నో ప్రమాదాలు కల్పిస్తారు. అందువల్ల ఏ ప్రభువైనా ఎంతో సమర్థులైన గూఢచారుల్ని నియమించాలి. ఎప్పటికప్పుడు ఎదుటివాళ్ళ ఎత్తుగడలను తెలుసుకోవాలి. ఆత్మరక్షణకు, శత్రుశిక్షణకు అవసరమైన చర్యలు తీసుకోవాలి. ప్రభుశ్రేయానికి, విజయానికి పెద్దగా దోహదం చేసేది గూఢచారి వ్యవస్థ. ఒకవిధంగా ప్రభువుయొక్క చరించే చక్షువులే గూఢచారులు. అందుకే ప్రభువుకు చారచక్షువని పేరు.

**క. వెలయఁగ విద్వజ్జన ము । ఖ్యులతోడ నశేషధర్మకుశలుఁడ వయి యి**
**మ్ముల లోకవ్యవహార । మ్ములు దయఁ బరికింతె నిత్యమును సమబుద్ధిన్. 50**

**ప్రతిపదార్థం:** నిత్యమును= ప్రతిదినము; వెలయఁగన్= ఒప్పుగా-తగువిధంగా; విద్వత్+జన, ముఖ్యులతోడన్= పండితప్రముఖులతో; అశేష, ధర్మ, కుశలుఁడవు+అయి= అన్ని ధర్మాల్లో నేర్పరివై; సమబుద్ధిన్= రాగద్వేష రహితమైన బుద్ధితో, ఇమ్ములన్= శ్రద్ధగా; లోక, వ్యవహారమ్ములు; దయన్= దయతో; పరికింతె(పరికించుదువు+ఎ)= విచారిస్తున్నావుకదా!

**తాత్పర్యం:** గొప్ప పండితులతో కలిసి, సర్వధర్మాల్లో నేర్పరివై, రాగద్వేషరహితమైన సమబుద్ధితో శ్రద్ధగా దయతో లోకవ్యవహారాలు విచారిస్తున్నావు కదా!

**ఆ. వార్తయంద జగము వర్తిల్లుచున్నది; । యదియు లేనినాఁడ యఖిలజనులు**
**నంధకారమగ్ను లగుదురు గావున । వార్త నిర్వహింపవలయుఁ బతికి. 51**

**ప్రతిపదార్థం:** వార్త+అందు+అ= వార్త (న్యూస్) యందే; జగము= ప్రపంచం; వర్తిల్లుచున్+ఉన్నది= నడుస్తున్నది; అదియున్= ఆ వార్త; లేని, నాఁడు+అ= లేనిరోజే; అఖిలజనులున్; అంధకారమగ్నులు+అగుదురు= అజ్ఞానంఅనే చీకట్లో మునిగిపోయిన వాళ్ళుఅవుతారు; కావున; పతికిన్= రాజుకు; వార్త, నిర్వహింపవలయున్= వార్తను నడపవలసిన అవసరం ఉంది.

**తాత్పర్యం:** ప్రపంచమంతా వార్తమీదే నడుస్తున్నది. అది లేకుంటే ప్రజలంతా పెనుచీకట్లో మునిగినట్లే. అందువల్ల ప్రభువు వార్తను బాగా నడపాలి.

**విశేషం:** వార్త అంటే- వృత్తాంతం, వర్తనం, అర్థానర్థవివేచన విద్య- అనే అర్థాలు ఉన్నాయి. వార్తలను సేకరించటం, ప్రసరించటం, ప్రభుత్వబాధ్యత. అంతేకాదు. అది గొప్ప సామాజికావసరం కూడ. వార్తా నిర్వహణ సరిగా లేకుంటే ప్రభుత్వంలో ఒక విభాగానికి మరొక విభాగానికి, దేశంలో ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి, సమాజంలో ఒక ప్రాంతానికి మరొక

ప్రాంతానికి, ప్రభుత్వానికి ప్రజలకు మధ్య అవగాహన కుంటుపడుతుంది. సమన్వయం లోపిస్తుంది. ఎక్కడ ఏం జరుగుతున్నదో, ఎవరి అభిప్రాయాలు ఎలా ఉన్నాయో, ఏయే సమస్యలకు ఏయే పరిష్కారాలో ఎవ్వరికి తెలియని స్థితి ఏర్పడుతుంది. అందరు అంధకారంలో ఉన్నట్లే అవుతుంది. అందుచేత ప్రభువు వార్తను సమర్థంగా నిర్వహించాలి. ప్రత్యేకించి ప్రజాస్వామ్య ప్రభుత్వంలో వార్తా నిర్వహణకు అత్యధిక ప్రాధాన్యం ఉంది. ఒక విధంగా ప్రభుత్వానికి కళ్ళు, చెవులు-ప్రజలకు కళ్ళు, చెవులు- వార్తాపత్రికలే. ఇవి మామూలు కళ్ళకు అందని దృశ్యాల్ని చూపిస్తాయి. మామూలు చెవులకు వినిపించని విషయాల్ని వినిపిస్తాయి. వార్త అనే శబ్దం చేత కృషి గోరక్షాదులు కూడా గ్రాహ్యాలే.

**ఆ. దారసంగ్రహంబు ధరణీశ! రతి పుత్త్రఫలము, శీలవృత్తఫలము శ్రుతము,**
**దత్తభుక్తఫలము ధనము, వేదము లగ్ని । హోత్ర ఫలము లనియు నొగి నెఱుంగు. 52**

**ప్రతిపదార్థం:** ధరణి+ఈశ= భూమికి ప్రభువు అయిన ఓధర్మరాజా!; దార, సంగ్రహంబు= భార్యను పొందటం; రతి=(ఆమెతో) సంభోగించటం; పుత్త్ర, ఫలము= పుత్త్రోత్పత్తి ఫలాలుగా కలిగినట్టిది; శ్రుతము= ధర్మాల్నిగూర్చి వినటం; శీల, వృత్త, ఫలము= శీలాన్ని, మంచి నడవడిని ఫలాలుగా కలిగినట్టిది; ధనము; దత్త, భుక్త, ఫలము= దానాన్ని అనుభవాన్ని ఫలంగా కలిగినట్టిది; వేదములు; అగ్ని, హోత్ర, ఫలములు= అగ్నిహోత్రాల్ని ఫలాలుగా గలిగినట్టివి, అనియున్; ఒగిన్= క్రమంగా; ఎఱుంగు= తెలుసుకొనుము.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! భార్యను పొందటానికి ఫలం- సంభోగసుఖం, పుత్రులు పుట్టటం, ధర్మాలు వినటానికి ఫలం-సచ్ఛీలం, సత్ప్రవర్తన సిద్ధించటం, సంపాదించినధనానికి ఫలం-దానం చెయ్యటం, అనుభవించటం, వేదాలకు ఫలం - అగ్నిహోత్రాలు. ఈ సంగతి క్రమంగా తెలుసుకో.

**విశేషం:** ఇట్టి పద్యాలు సంస్కృత మూలానికి యథాతథానువాదాలు. భారతీయ సంస్కృతిలో వైవాహిక జీవిత ఫలం- పాశవికమైన కామవాంఛ తీర్చుకోవటంమాత్రమే కాదు. సమాజకల్యాణానికి, ఐహికాముష్మిక సుఖసాధనకు, జీవితచరితార్థతకు దోహదం చెయ్యగల సత్‌సంతానాన్ని కనటం. అలాగే, ధనార్జనకు ఫలం, ధర్మాధర్మ విచక్షణ లేకుండ మనసుపడ్డ భోగా లన్నీ అనుభవించటం కాదు; నిరుపయోగంగా కూడబెట్టటం కాదు - సత్పాత్రదానంచెయ్యటం. ధర్మబద్ధాలైన భోగాలు అనుభవించటం. ఈ రెండింటి విషయంలో కాళిదాస మహాకవి- రఘువంశరాజుల్నిగూర్చి చెప్పిన 'త్యాగాయ సంభృతార్థానాం ..... ప్రజాయై గృహమేధినామ్' అనే మాటలు ఈ సందర్భంలో గుర్తుంచుకోతగ్గవి. కాగా, ధర్మశ్రవణానికి ఫలం- ఉబుసుపోక కాదు; ఒక చెవితో విని మరొక చెవితో వదలివెయ్యటం కాదు- జీవితంలో ఆచరించటం; జన్మచరితార్థతకు, సమాజశ్రేయస్సుకు దోహదంచేసే మంచి శీలాన్ని, నడవడిని అలవరచుకోవటం. అలాగే వేదాలకు ఫలం అగ్నిహోత్రాలు. వేదంలో- కర్మకాండలో ప్రాధాన్యం వహించేది అగ్నిహోత్రం. వేల్చిన హవిస్సులను దేవతల కందించి, ఆ దేవతలవల్ల లోకానికి ఫలా లందించేవాడు అగ్నిహోత్రుడు. పాండవులు ద్రౌపదిని వివాహమాడి అర్ధరాజ్యాన్ని పొంది, ఇంద్రప్రస్థం కేంద్రంగా రాజ్యపాలన సాగించే తరుణంలో ధర్మరాజుకు నారదు డీ ధర్మాలు, రాజనీతి విశేషాలు, బోధించటం ఎంతో ఉచితంగా ఉంది.

**చ. బహుధనధాన్యసంగ్రహము బాణశరాసనయోధవీరసం**
**గ్రహము నిరంతరాంతరుదకంబులు ఘాసరసేంధనౌఘ సం**
**గ్రహము ననేకయంత్రములుఁ గల్గి యసాధ్యములై ద్విషద్భయా**
**వహు లగుచుండ నొప్పునె భవత్పరిరక్ష్యములైన దుర్గముల్. 53**

**ప్రతిపదార్థం:** భవత్+పరిరక్ష్యములు+ఐన= నీచే రక్షింపబడుతున్నవైన; దుర్గముల్= కోటలు; బహు, ధన, ధాన్య, సంగ్రహము= ఎక్కువ, ధన, ధాన్యాల నిల్వ; బాణ, శర+ఆసన, యోధవీర, సంగ్రహము= బాణాలయొక్క, ధనుస్సులయొక్క, యుద్ధవీరుల యొక్క కూడిక; నిరంతర+అంతః+ఉదకంబులు= ఎల్లప్పుడు లోపల ఉండే నీళ్ళు; ఘాస, రస+ఇంధన+ఓఘ, సంగ్రహము= (పశువులకు) గడ్డి, (మానవులకు) ఉప్పు, పులుపు, కారం మొదలైన పదార్థాలు, వివిధ పానీయాలు, వంటకట్టెల సమూహం యొక్క కూడిక; అనేక యంత్రములున్; కలిగి; అసాధ్యములు+ఐ= భేదించశక్యంకానివై; ద్విషత్+భయ+ఆవహులు+అగుచు+ ఉండన్+ఒప్పునె= శత్రువులకు భయం కలిగించేవై ఒప్పి ఉన్నాయి కదా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీ రక్షణలో నున్న కోటలన్నీ- ఎక్కువగా ధనధాన్యాల్ని, ధనుర్బాణాల్ని, యుద్ధవీరుల్ని, ఎప్పుడూ తరుగని నీళ్ళని, పశువుల గడ్డిని, ఉప్పు, పులుపు, కారంవంటి ఆహార పదార్థాల్ని, వివిధపానీయాల్ని వంటకట్టెల్ని, సమృద్ధిగా కలిగి అనేకయంత్రసాధనాలతో కూడి దుర్భేద్యాలై శత్రుభయంకరాలై ఒప్పుతున్నాయి కదా!

**విశేషం:** ముఖ్యంగా ముట్టడి సమయాల్లో పై పదార్థాలన్నీ కోటల్లో నిల్వ ఉండటం చాల అవసరం. రసశబ్దానికి అనేక అర్థాలు ఉన్నాయి. రుచిపరంగా రసాలు ఆరు-కషాయం(వగరు), మధురం(తీపి), లవణం(ఉప్పు), కటువు(కారం), తిక్తం(చేదు), ఆమ్లం (పులుపు). (అర్థవ్యక్తి అనే శబ్దగుణం ఇందులో చక్కగా పోషించబడింది - సంపా.)

**చ.** **వదలక బుద్ధి నంతరరివర్గము నోర్చి జితేంద్రియుండ వై**
**మొదలన దేశకాలబలముల్ మఱి దైవబలంబుఁ గల్గి భూ**
**విదిత బలుండవై యహితవీరుల నోర్వఁగ నుత్సహింతె దు**
**ర్మద మలినాంధ చిత్తులఁ బ్రమత్తుల నింద్రియనిర్జితాత్ములన్.** **54**

**ప్రతిపదార్థం:** వదలక= విడువక; బుద్ధిన్= నీబుద్ధిబలంచేత; అంతః+అరి, వర్గమున్+ఓర్చి= లోపలి(నీలోని) శత్రుసమూహాన్ని జయించి; జిత+ఇంద్రియుండవు+ఐ= జయించిన ఇంద్రియాలు కలవాడివై; మొదలన= మొదటనే; దేశ, కాల, బలముల్; మఱి= అంతేకాక; దైవబలంబున్; కలిగి; భూ, విదిత, బలుండవు+ఐ= ప్రపంచంలో తెలియబడిన బలం కలవాడివై; దుర్మద+మలిన+అంధ, చిత్తులన్= మితిమీరిన గర్వమనే మాలిన్యంచేత గ్రుడ్డిదైన మనస్సుకలవాళ్ళను; ప్రమత్తులన్= మిక్కిలి మత్తెక్కినవాళ్ళను; ఇంద్రియ, నిర్జిత+ఆత్ములన్= ఇంద్రియాలచేత జయించబడిన బుద్ధికలవాళ్ళను; అహిత, వీరులన్= శత్రువీరులను; ఓర్వఁగన్= జయించటానికి, ఉత్సహింతె(ఉత్సహింతువు+ఎ)= ఉత్సాహపడుతున్నావుకదా!

**తాత్పర్యం:** దేశకాల దైవబలాల్ని ముందుగ పొంది, బుద్ధిబలంతో అంతశ్శత్రువులైన కామక్రోధాదుల్ని, ఇంద్రియాల్ని జయించి, ప్రపంచ ప్రసిద్ధిగల బలవంతుడివై, మితిమీరిన మదం అనే మాలిన్యంతో గ్రుడ్డిదైన మనస్సు కలవాళ్ళు, మిక్కిలి మత్తెక్కిన వాళ్ళు, ఇంద్రియాలకు వశమైన బుద్ధికలవాళ్ళు అయిన శత్రువుల్ని జయించాలన్న ఉత్సాహంతో ఉన్నావు కదా!

**విశేషం:** అంతరరివర్గం - కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు. కర్మేంద్రియాలు - వాక్, పాణి, పాద, పాయు, గుహ్యాలు. జ్ఞానేంద్రియాలు-త్వక్కు, చక్షువు, శ్రోత్రం, జిహ్వ, ఘ్రాణం; మనస్సునుకూడ చేర్చితే మొత్తం ఇంద్రియాలు పదకొండు. మదములు - విద్యామదం, ధనమదం, కులమదం, ఉద్యోగమదం, యౌవనమదం మొదలైనవి.

**తే.** **కడిఁది రిపులపైఁ బోవంగఁ గడఁగి యున్న। నీకు ముందఱఁ జని రిపున్నృపులయందుఁ**
**దగిలి సామాద్యుపాయంబు లొగిన సంప్ర। యోగమునఁ జేసి వర్తిల్లుచున్నె చెపుమ.** **55**

**ప్రతిపదార్థం:** కడఁది= గొప్ప; రిపులపైన్+పోవంగన్= శత్రువులమీద దండెత్తిపోవటానికి; కడఁగి, ఉన్న= పూనుకొని ఉన్న; నీకున్; ముందఱన్+చని= ముందుగా వెళ్ళి; రిపు నృపుల, అందున్= శత్రురాజుల్లో; తగిలి= ప్రయత్నించి; సామ+ఆది+ ఉపాయంబులు= సామం, దానం మొదలయిన నాలుగు ఉపాయాలు; ఒగిన్+అ= వరుసగా, సంప్రయోగమునన్+చేసి= చక్కగా ప్రయోగించటంచేత, వర్తిల్లుచున్+ఉన్నె= ప్రవర్తిల్లుతున్నాయికదా!; చెపుమ= చెప్పుము.

**తాత్పర్యం:** నీవు దండెత్తటానికి ముందే-బలవంతులైన శత్రురాజులమీద సామదానాది చతుర్విధోపాయాల్ని చక్కగా ప్రయోగిస్తున్నావు కదా!

**విశేషం:** ఉపాయాలు - సామం, దానం, భేదం, దండం.

**వ. 'మఱియు నాస్తిక్యం బనృతంబు ప్రమాదం బాలస్యం బనర్థజ్ఞులతోడి చింతనంబు క్రోధంబు దీర్ఘచింత దీర్ఘ సూత్రత యెఱుకగలవారి నెఱుంగమి యర్థంబుల యందనర్థక చింత నిశ్చితకార్యంబులు సేయమి మంత్రంబుల రక్షింపమి శుభంబులఁ బ్రయోగింపమి విషయంబులం దగులుట యనంబరఁగిన పదునాలుగు రాజదోషంబులఁ బరిహరింతె?' యని యడిగిన నారదునకు ధర్మరా జి ట్లనియె. 56**

**ప్రతిపదార్థం:** మఱియున్; నాస్తిక్యంబు= నాస్తికత - అంటే భగవంతుణ్ణి వేదప్రామాణ్యాన్ని అంగీకరించకుండటం; అనృతంబు= అబద్ధంచెప్పటం; ప్రమాదంబు= ఏమరుపాటు; ఆలస్యంబు= సోమరితనం; అనర్థజ్ఞులతోడి చింతనంబు= అజ్ఞానులతో ఆలోచించటం; క్రోధంబు; దీర్ఘ, చింత= ఎక్కువకాలం దుఃఖించటం; దీర్ఘసూత్రత= చేయవలసిన పనులనుగురించి దీర్ఘంగా ఆలోచించటం, ఆలస్యంగా చేయటం; ఎఱుక, కల, వారిన్= జ్ఞానులను; ఎఱుంగమి= గుర్తించకుండటం; అర్థంబుల, అందున్+అనర్థక, చింత= ప్రయోజనకరమైన విషయాల్లో ప్రయోజనభంగకరమైన ఆలోచన; నిశ్చితకార్యంబులు= నిర్ణయించినపనులు; చేయమి= చేయకుండటం; మంత్రంబులన్= రహస్యాలోచనల్ని; రక్షింపమి= కాపాడకుండటం; శుభంబులన్= శుభకార్యాలను; ప్రయోగింపమి= జరిపించకుండటం; విషయంబులన్= ఇంద్రియసుఖాల్లో; తగులుట= తగుల్కొనటం; అనన్+పరఁగిన= అనేటటువంటి; పదునాలుగు; రాజదోషంబులన్; పరిహరింతె(పరిహరించుదువు+ఎ)= విడుస్తున్నావుకదా!; అని; అడిగిన; నారదునకు; ధర్మరాజు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నాస్తికత, అసత్యమాడటం, ఏమరుపాటు, సోమరితనం, తెలివితక్కువవాళ్ళతో కార్యాలోచనచెయ్యటం, అతికోపం, అధికకాలం దుఃఖించటం, చేయవలసిన పనిని గూర్చి అతిదీర్ఘంగా ఆలోచించటం, ఆలస్యంగా చెయ్యటం, జ్ఞానుల్ని గుర్తించకపోవటం, ప్రయోజనకరమైన విషయాల్లో ప్రయోజనభంగకరమైన ఆలోచనలు చెయ్యటం, నిర్ణయించిన పనులు చెయ్యకుండటం, రహస్యాలోచనలు బయటపడకుండ కాపాడకపోవటం, శుభకార్యాలు చెయ్యకుండటం, ఇంద్రియ సుఖాల్లో తగుల్కోవటం- అనే పదునాలుగు రాజదోషాలను విడనాడావుకదా!" అని అడిగిన నారదమహర్షితో ధర్మరాజు ఇలా అన్నాడు.

**తే. నాయథాశక్తిఁ జేసి యన్యాయపథముఁ । బరిహరించి మహాత్ముల చరితలందు**
**బుద్ధి నిలిపి మీ యుపదేశమున శుభంబు । లయిన వాని ననుష్ఠింతుఁ బ్రియముతోడ. 57**

**ప్రతిపదార్థం:** నా యథాశక్తిన్+చేసి= నాచేతనైనంతవరకు; అన్యాయ, పథమున్= అన్యాయమార్గాన్ని; పరిహరించి= వదలి; మహాత్ముల, చరితల+అందున్= మహాత్ములయొక్క చరిత్రల్లో; బుద్ధి, నిలపి= మనస్సు ఉంచి; మీ, ఉపదేశమునన్=

మీధర్మబోధవల్ల; శుభంబులు+అయిన= శుభాన్ని కలిగించేవి అయిన; వానిన్; ప్రియముతోడన్= ప్రీతితో; అనుష్ఠింతున్= ఆచరిస్తాను.

**తాత్పర్యం:** నారదమునీంద్రా! చేతనైనంతవరకు అన్యాయమార్గాన్ని వదలి, మహాత్ముల చరిత్రల్ని ఆదర్శంగా ఉంచుకొని, మీధర్మబోధవల్ల శుభాలైనవాటిని మనఃపూర్వకంగా ఆచరిస్తాను.

**విశేషం:** 'నాయథాశక్తిఁ జేసి'- అనటంలో ధర్మజుడి వినయం. 'అనుష్ఠింతుఁ బ్రియముతోడ'-అనటంలో ఆయన ధర్మప్రియత్వం చక్కగా వ్యక్తమవుతున్నాయి. యథాశక్తి-అవ్యయీభావ సమాసం. నన్నయ ఇట్టి వాటిని విశేష్యాలుగా వాడుతుంటాడు. శౌనకాది మహామునులకు సౌతి చెప్పింది యథాతథ భారతకథనమే అయినా - నారదమహర్షి ప్రవేశంవల్ల, ఆయన కుశలప్రశ్నలవల్ల, ధర్మరాజు సమాధానాలవల్ల, సన్నివేశానికి ఒక నాటకీయత వచ్చింది. నారదమహర్షి ధర్మరాజును సాధారణ కుశలప్రశ్నలు అడుగకుండా-రాజనీతి విశేషాలకు, ఆదర్శరాజ్యపాలన ప్రమాణాలకు అద్దంపట్టే కుశలప్రశ్న లడగటం విశేషం. అభిషిక్తుడైన ధర్మరాజు తన రాజ్యప్రజలకు ఎలాంటి పరిపాలన అందివ్వాలో తెలియచేయటం విశేషం. నారదమహర్షి కుశలప్రశ్నలు- ఏ ప్రభువుకైనా ఉత్తమరాజనీతి పాఠాలు. ఆదర్శరాజ్యపాలనకు ఉత్తమప్రమాణాలు; ప్రభుజీవితచరితార్థతకు మహోపదేశాలు.

### ఇట్టి సభ నెచ్చటనైనఁ జూచితిరా యని ధర్మజుఁడు నారదు నడుగుట (సం. 2-6-8)

**వ. అని కృతాంజలి యయి 'మునీంద్రా! యీత్రిలోకంబులయందును మీ చూడనివి లే; వెందే నిట్టి యపూర్వంబైన సభ చూచి యెఱుంగుదురే?' యని మయ నిర్మితం బయిన సభ చూపినం జూచి విస్మితుండయి నారదుండు ధర్మరాజున కి ట్లనియె. 58**

**ప్రతిపదార్థం:** అని; కృత+అంజలి+అయి= చేయబడిన నమస్కారం కలవాడై - అంటే నారదునికి నమస్కరించి; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠా!; ఈ త్రిలోకంబుల, అందును= ఈమూడు లోకాలల్లోకూడ; మీ, చూడని+అవి= మీరు చూడనటువంటివి; లేవు; ఎందున్+ఏన్= ఎచ్చటనైనా; ఇట్టి; అపూర్వంబు+ఐన= అపురూపమైన; సభ, చూచి; ఎఱుంగుదురే; అని; మయ, నిర్మితంబు+ అయిన= మయునిచేత నిర్మించబడినదైన; సభ; చూపినన్= చూపించగా; విస్మితుండు+అయి= ఆశ్చర్యపడినవాడై; నారదుండు; ధర్మరాజునకున్+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని ధర్మరాజు నారదమహర్షికి నమస్కరించి 'మునీంద్రా! ముల్లోకాలలోను మీరు చూడని విశేషాలు లేవు. అపూర్వమైన ఈ మయసభలాంటి సభను ఇం కెక్కడైన మీరు చూచారా?' అని ఆ సభను చూపించగా నారదమహర్షి ఆశ్చర్యపరవశుడై ఆయనతో ఇలా అన్నాడు.

**క. భూనాథ! యిది యపూర్వ, మ । మానుషము, విచిత్ర రత్నమయ; మిట్టి సభన్**
**మానవలోకేశ్వరులం । దే నెన్నఁడుఁ జూచి వినియు నెఱుఁగ ధరిత్రిన్. 59**

**ప్రతిపదార్థం:** భూనాథ!= ఓరాజా!; ఇది= ఈమయసభ; అపూర్వము= ఇంతకు ముం దెన్నడు లేనిది; అమానుషము= మానవాతీతమైనది; విచిత్ర, రత్న, మయము= విచిత్రాలైన రత్నాలతో కూడుకొన్నట్టిది; ఇట్టి; సభన్; ధరిత్రిన్= ఈభూమిమీద; మానవలోక+ఈశ్వరుల+అందున్= మానవలోక పరిపాలకులైన రాజుల దగ్గర; ఏన్=నేను; ఎన్నడున్= ఏనాడుకూడ; చూచి; వినియున్; ఎఱుఁగన్.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ సభ అపూర్వం. మానవాతీతం. చిత్రవిచిత్ర రత్నమయం. మానవలోకంలో ఏ మహారాజు దగ్గర కూడ నేను ఇలాంటి సభను ఎన్నడూ చూడలేదు, ఉన్నట్లు వినలేదు.

**విశేషం:** నారదుడు త్రికోకసంచారి, మహర్షి, దేవర్షి. అందుచేత 'ఇటువంటి సభను ముల్లోకాలలో మీ రెచ్చటైనా చూచారా?' అని ధర్మరాజు అడుగదగిన వ్యక్తి ఒక్క నారదుడే. ఆ మహర్షి మయసభనుగురించి చెప్పినమాట పరమప్రమాణం.

**క. సురపతి యమ వరుణ ధనే। శ్వర కమలాసనుల దివ్యసభలెల్ల నరే**
**శ్వర! చూచితి; నవి దీనికి। సరిగా వత్యంతవిభవసౌందర్యములన్. 60**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= మానవులకు ప్రభువువైన ఓధర్మరాజా!; సురపతి, యమ, వరుణ, ధన+ఈశ్వర, కమల+ఆసనుల= దేవేంద్ర, యమ, వరుణ, కుబేర, బ్రహ్మదేవులయొక్క; దివ్యసభలు+ఎల్లన్= దేవతా సంబంధాలైన సభల నన్నింటిని; చూచితిన్; అవి; అత్యంత, విభవ, సౌందర్యములన్= అపారమైన ఐశ్వర్యంలో; అందమునందును; దీనికిన్; సరి, కావు= సమానం కావు.

**తాత్పర్యం:** ధర్మరాజా! దేవేంద్ర, యమ, వరుణ, కుబేర, బ్రహ్మదేవులయొక్క దివ్యసభలన్నీ నేను చూచాను. అవి ఏవీ ఐశ్వర్యసౌందర్యాల్లో దీనికి సరితూగలేవు.

**విశేషం:** దివ్యసభల్లో అందమైనవీ, ఐశ్వర్యంతో కూడినవీ అయినవాటిని అయిదింటిని నారదమహర్షి పేర్కొన్నాడు. అవన్నీ ధర్మజుని మయసభకు సాటిరా వని ప్రకటించాడు. ధర్మజుడు ఆ సంగతి విని ఊరుకుండేవాడు కాడు. ఏ విధంగా మయసభ దేవసభలకంటె గొప్పదో వివరంగా తెలుసుకోవా లని కుతూహలపడతాడు. అది అతని స్వభావం. వార్తలను సేకరించటంలో, వినటంలో, ప్రత్యక్ష పరిజ్ఞానాన్ని సంపాదించుకోవటంలో ధర్మజుడు సూక్ష్మబుద్ధి. ఆసక్తితో నిండిన అతనిభావిప్రశ్నకు నారదునివాక్యం చొరవ కలిపిస్తున్నది. (సంపా.)

**వ. అనిన విని 'యవి యెట్టివి? వాని వినవలతు నానతిం'డని లోకపాల సభావిభవ శ్రవణ ప్రభూత కుతూహల చేతస్కుండై యడిగిన ధర్మరాజునకు నారదుం డి ట్లనియె. 61**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అవి; ఎట్టివి; వానిన్= వాటినిగూర్చి; వినన్, వలతున్= వినాలని కోరుకుంటున్నాను; ఆనతి+ ఇండు+అని= ఆజ్ఞాపించం డని; లోకపాల, సభా, విభవ, శ్రవణ, ప్రభూత, కుతూహల, చేతస్కుండు+ఐ= దిక్పాలకులయొక్క సభావైభవాన్నిగూర్చి వినాలని ఎక్కువగా ఏర్పడిన కుతూహలంతో కూడుకొన్న మనస్సు కలవాడై; అడిగిన; ధర్మరాజునకు; నారదుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నారదమహర్షి మాటలు విని దిక్పాలుర సభావైభవాన్నిగూర్చి వినాలన్న విశేష కుతూహలంతో ధర్మరాజు అవి ఎలాంటివి? వాటినిగూర్చి వినా లని ఉంది. ఆజ్ఞాపించండి' అని అడిగేసరికి నారదమహర్షి ఇలా అన్నాడు.

**విశేషం:** ఆనతివ్వండి, సెలవివ్వండి- ఇలాంటి మాటలు పెద్దల్ని ఏదైనా విషయాన్ని చెప్పండి అని అడిగేటప్పుడు ఎంతో గౌరవసూచకంగా వాడే క్రియాపదాలు. ఇక్కడ ఆనతివ్వండి అంటే చెప్పండి అని అర్థం. అంతేకాదు-మీరు చెప్పిందే ప్రమాణంగా, శాసనంగా, తిరుగులేనిదిగా భావిస్తాను- అనే భావం కూడ ఆ పదంలో ధ్వనిస్తుంది. ధర్మరాజు అలా అనటం ఆయన వినయసంపన్నతకు, సంస్కారానికి చక్కని సూచిక.

## ఇంద్రసభావర్ణనము (సం. 2-7-1)

**క. శతమఖుసభ శుభరత్నాం । చితకాంచనరచిత, మతివిచిత్రము, లోక**
**త్రితయాఖిల లక్ష్మీ సం । శ్రిత; మలవియె దానిఁ బొగడ శేషున కయినన్. 62**

**ప్రతిపదార్థం:** శతమఖు, సభ= నూరు యజ్ఞాలుచేసిన దేవేంద్రునియొక్క సభ; శుభ, రత్న+అంచిత, కాంచన, రచితము= మంచి రత్నాలతో ఒప్పుతున్న బంగారుతో చేయబడింది; అతివిచిత్రము= మిక్కిలి ఆశ్చర్యకరమైనది; లోక, త్రితయ+అఖిల, లక్ష్మీ, సంశ్రితము= ముల్లోకాల్లోని సమస్త ఐశ్వర్యంచేత ఆశ్రయించబడింది; దానిన్; పొగడన్; శేషునకున్+అయినన్= ఆదిశేషునికి కూడా; అలవియె= సాధ్యమా!

**తాత్పర్యం:** దేవేంద్రుని సభ రత్నమయం, స్వర్ణమయం, చిత్రవిచిత్రం. ముల్లోకాల్లోని సకలైశ్వర్యాలకు నిలయం. ఆ సభను పొగడటానికి ఆదిశేషునికికూడా సాధ్యంకాదు.

**విశేషం:** శేషుడు వెయ్యితలలు, రెండువేల నాల్కలు కలవా డని ప్రసిద్ధి. అలాంటి ఆదిశేషునికి కూడ దేవేంద్రుని సభా వైభవం పొగడటానికి సాధ్యం కాకుంటే ఒకతల, ఒక నాలుక ఉన్నవాళ్ళకు సాధ్యమౌతుందా?

**వ. అదియును నూఱుయోజనంబుల వెడల్పును, నూటయేఁబది యోజనంబుల నిడుపును, నేను యోజనంబుల తనర్పునుం గలిగి, వైహాయసంబయి, కామగమనంబయి, వ్యపేతశీతాతపంబయి, సకల కాల కుసుమ ఫలభరిత పాదపవన సంకీర్ణ సరోవర విరాజితంబయి, తపఃప్రభావంబున నమరేంద్రుచేత నిర్మితంబయి కరం బొప్పుచుండు; నట్టి సభయందు. 63**

**ప్రతిపదార్థం:** అదియును; నూఱు, యోజనంబులు, వెడల్పును= నూరామడలవెడల్పును; నూట, ఏఁబది, యోజనంబుల, నిడువునున్= నూటయాభై ఆమడల పొడవును; ఏను, యోజనంబుల, తనర్పునున్= ఐదామడ లెత్తును; కలిగి; వైహాయసంబు+అయి= ఆకాశానికి సంబంధించింద్రై-అంటే ఆకాశంలో ఉండేదై; కామగమనంబు+అయి= కోరుకొన్నట్లు వెళ్ళ గలిగిందై (కోరిక ననుసరించిన గతికలదై); వి+అపేత, శీత+ఆతపంబు+అయి= పూర్తిగా తొలగించబడిన చలి, ఎండ కలదై; సకల, కాల, కుసుమ, ఫల, భరిత, పాదప, వన, సంకీర్ణ, సరోవర, విరాజితంబు+అయి= అన్నికాలాలలోను పువ్వులతో, పండ్లతో నిండిన చెట్లతోపులతో క్రిక్కిరిసినదియున్నూ, సరోవరాలతో శోభిల్లేదియున్నూఅయి; తపః ప్రభావంబునన్= తపోబలంతో; అమర+ ఇంద్రుచేతన్= దేవేంద్రుడిచేత; నిర్మితంబు+అయి= నిర్మింపబడిందై; కరంబు= మిక్కిలి; ఒప్పుచున్+ఉండున్= ప్రకాశిస్తూ ఉంటుంది; అట్టి; సభయందు.

**తాత్పర్యం:** ఆ సభ వెడల్పు నూరామడలు. పొడవు నూటయాభై ఆమడలు. ఎత్తు ఐదామడలు. అది ఆకాశంలో ఉంటుంది. కోరుకొన్న చోటికి వెళ్ళుతుంది. చలిబాధ లేదు. ఎండబాధ లేదు. చెట్లతోపు లున్నాయి. అవి అన్ని కాలాల్లో పూలతో, పండ్లతో నిండి ఉంటాయి. సరస్సులూ ఉన్నాయి. అవి నిండుగా శోభిల్లుతుంటాయి. ఆ సభను దేవేంద్రుడే స్వయంగా తనతపోబలంతో నిర్మించుకున్నాడు.

**విశేషం:** 'తనర్పు' విషయంలో కొన్ని ప్రతుల్లో ఏనూరు, ఎనుబది అనే పాఠభేదా లున్నాయి. కాని, మూలంలో భండార్కరు ప్రతిలో 'పంచయోజన ముచ్ఛ్రితా' అని ఉంది.

**చ. అతుల విభూతితో మణిమయాభరణద్యుతు లొప్పఁగా శత**
**క్రతుఁడు శచీసమేతుఁడయి కాంచన చారు విమానమాలికా**
**గత దివిజోత్తముల్ గొలువఁగాఁ గొలువుండు వరాప్సరోంగనా**
**యత విలసత్కటాక్ష కుసుమార్చిత సుందర వక్త్ర చంద్రుఁడై. 64**

**ప్రతిపదార్థం:** అతుల, విభూతితోన్= సాటిలేని ఐశ్వర్యంతో; మణి, మయ+ఆభరణ, ద్యుతులు= మణులతోకూడినసొమ్ముల కాంతులు; ఒప్పఁగాన్= మెరయగా; శతక్రతుఁడు= నూరుయజ్ఞాలు చేసినవాడైన ఇంద్రుడు; శచీ, సమేతుఁడు+అయి= భార్య అయిన శచీదేవితో కూడుకొన్నవాడై; కాంచన, చారు, విమాన, మాలికా+ఆగత, దివిజ+ఉత్తముల్= బంగారుతో చేయబడిన అందమైన విమాన సమూహాల్లో వచ్చిన దేవతాశ్రేష్ఠులు; కొలువఁగాన్= సేవించగా; వర, అప్సరః+అంగనా+ఆయత, విలసత్+ కటాక్ష, కుసుమ+అర్చిత, సుందర, వక్త్ర, చంద్రుఁడు+ఐ= మేటి అప్సరఃకాంతలయొక్క విశాలాలు, ప్రకాశవంతాలు అయిన కడగంటిచూపు లనే పూవులతో పూజించబడే అందమైన ముఖమనే చంద్రుడు కలవాడై; కొలువు+ఉండున్= కొలువుతీరి ఉన్నాడు.

**తాత్పర్యం:** అందమైన బంగారు విమానాల్లో వచ్చిన దేవతాశ్రేష్ఠులు, కాంతిమంతాలైన విశాలనేత్రాల కడగంటి చూపులు అనే పూలతో పూజించే అప్సరసలు తనను సేవిస్తుండగా, సాటిలేని ఐశ్వర్యంతో, మణిమయాలైన ఆభరణాల కాంతులతో, శచీసమేతుడై, అందమైన చంద్రబింబంలాంటి ముఖంతో దేవేంద్రుడు ఆ సభలో కొలువు తీరి ఉంటాడు.

**విశేషం:** అలం: రూపకం. గాఢబంధమైన ఓజస్సు శిథిలబంధమైతే ఎంత మనోహరంగా ఉంటుందో, అది ప్రసాదగుణమనే పేరుతో ఎంత ప్రసన్నమౌతుందో ఈ పద్యరచన ప్రదర్శించి చూపుతున్నది. ఇందులో గల మసృణత్వం ఇంద్రుని ధీరలలితస్వభావానికి వ్యంజకంగా అమరింది. ఓజస్సు, శ్లేష అనే శబ్దగుణాలచేత రూపుకట్టిన ప్రసాదగుణం ఇంద్రసభావైభవాన్ని రచనామర్యాదతో రక్తికట్టింపచేస్తున్నది. ఇది నన్నయ ప్రసాదగుణప్రధానమైన రచనకు మంచి ఉదాహరణం. (సంపా.)

**వ. మఱియును. 65**

**తాత్పర్యం:** ఇంకను.

**సీ. వదలక యేలినవాని ప్రస్తవమునఁ । బోరిలో నీల్గిన వీరభటులుఁ,**
**దమకుల ధర్మముల్ దప్పక సలిపిన । గృహమేధులును, జగన్మహితకీర్తిఁ**
**బరఁగిన ధన్యులుఁ, బరహితవ్రతులైన । పురుషులు, రుగ్జరా మరణ శోక**
**భయ బుభుక్షార్తి పిపాసా వ్యపేతులై । కొలుతురు సురరాజు నొలసి యర్థ**

**ఆ. ధర్మకామములు సదక్షిణ క్రతువులు । శ్రీ విలాసములు విశేషయజ్ఞ**
**వాహమంత్ర తతులు వచ్చి సేవింతురు । మూర్తిమంతు లగుచు ముదముతోడ. 66**

**ప్రతిపదార్థం:** వదలక= విడువక; ఏలినవాని= తన ప్రభువుయొక్క; ప్రస్తవమునన్= విషయంలో; పోరిలోన్= యుద్ధంలో; ఈల్గిన= మరణించిన; వీరభటులున్= వీరులైనసైనికులూ; తమ, కులధర్మముల్; తప్పక; సలిపిన= ఆచరించిన; గృహమేధులు= గృహస్థులు; జగత్+మహిత, కీర్తిన్= ప్రపంచ ప్రసిద్ధిపొందిన కీర్తితో; పరగిన= ఒప్పిన; ధన్యులున్= పుణ్యాత్ములూ; పర, హిత,

వ్రతులు+ఐన= ఇతరులకు మేలు చెయ్యటమే వ్రతంగా కలవాళ్ళయిన; పురుషులు; రుక్+జరా, మరణ, శోక, భయ, బుభుక్షా+ఆర్తి, పిపాసా, వి+అపేతులు+ఐ= రోగం, ముసలితనం, మరణం, శోకం, భయం, ఆకలి, బాధ, దప్పిక పూర్తిగా తొలగినవాళ్ళయి; కొలుతురు= సేవిస్తారు; అర్థ, ధర్మ, కామములు; స దక్షిణ, క్రతువులు= దక్షిణలతో కూడిన యజ్ఞయాగాదులు; శ్రీవిలాసములు= లక్ష్మీదేవి కాంతులు(సంపదలు); విశేష, యజ్ఞవాహ, మంత్ర, తతులు= విశేషాలైన యజ్ఞాలను నిర్వహించే మంత్రాల సమూహాలు; మూర్తిమంతులు+అగుచున్= ఆకారాలు కలవారై; వచ్చి; సురరాజున్= దేవతలకు రాజయిన దేవేంద్రుడిని; ఒలసి= చుట్టుచేరి; ముదముతోడన్= సంతోషంతో; సేవింతురు.

**తాత్పర్యం:** ప్రభువును వదలకుండా ఆయనకోసం యుద్ధంలో మరణించిన వీరసైనికులు, తమకులధర్మాలను తప్పక పాటించిన గృహస్థులు, ప్రపంచ ప్రసిద్ధ కీర్తితో ఒప్పిన పుణ్యాత్ములు, ఇతరులకు మేలు చేయటమే వ్రతంగా గల మహాపురుషులు-రోగం, ముసలితనం, మరణం, శోకం, భయం, ఆకలి, బాధ, దప్పిలేనివాళ్ళయి దేవేంద్రుణ్ణి సేవిస్తుంటారు. అంతేకాదు ధర్మార్థకామాలు, దక్షిణలతో కూడిన యజ్ఞయాగాలు, లక్ష్మీవిలాసాలు, విశేషయజ్ఞాల్ని నిర్వహించే మంత్రసమూహాలు - ఆకారాలు తాల్చివచ్చి ఆ దేవతారాజును సంతోషంతో సేవిస్తుంటారు.

**విశేషం:** ధర్మకామాదులు అమహద్వాచకాలైనా, మూర్తిదాల్చి వస్తాయి. కాబట్టి 'మూర్తిమంతు'లనే మహద్విశేషణం వాడబడింది. 'మూర్తిమంతములయి ముదముతోడ' అనే పాఠాంతరం కూడ ఉంది.

**వ.** **మఱియు శుక్రబృహస్పతులు నగ్నీషోములు నాశ్వినులు విశ్వదేవతలును ధాతయు విధాతయు హరిశ్చంద్రుం డను రాజర్షియు సురేంద్రసభ నుండుదురు.** **67**

**ప్రతిపదార్థం:** మఱియున్; శుక్ర బృహస్పతులున్, అగ్నీషోములును= అగ్నిదేవుడు, చంద్రుడు; ఆశ్వినులున్= అశ్వినీదేవతలు; విశ్వదేవతలును= విశ్వాపుత్రు లని భావింపబడే 10 మంది దేవతలు; ధాతయు= పండ్రెండు మంది సూర్యులలో ఒకడైన ధాత; విధాతయు= మన్మథుడు; హరిశ్చంద్రుండు+అను, రాజ+ఋషియు; సుర+ఇంద్ర, సభన్= దేవతలరాజైన ఇంద్రునిసభలో; ఉండుదురు= ఉంటారు.

**తాత్పర్యం:** అంతేకాక, శుక్రుడు, బృహస్పతి, అగ్నిదేవుడు, చంద్రుడు, అశ్వినీదేవతలు, విశ్వదేవతలు, ధాత, మన్మథుడు, హరిశ్చంద్రు డనే రాజర్షి దేవేంద్రునిసభలో ఉంటారు.

**విశేషం:** అశ్వినీదేవతలు- నాసత్యుడు, దస్రుడు, వీరు దేవవైద్యులు. సూర్యుడు అశ్వరూపం పొంది రమించటంచేత సంజ్ఞాదేవికి కలిగిన సుతు లవటంచేత వీళ్ళకు ఆశ్విను లనిపేరు. విశ్వదేవతలు- వసుబంధులు, క్రతుదక్షులు, కాలకాములు, ధురివిరోచనులు, పురూరవార్ద్రవులు (10మంది). ద్వాదశాదిత్యులు- ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూష, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు. ఇచట మూలంలో పెక్కుమంది ఋషుల పేర్లుకూడ ఉన్నాయి (భండార్కరు ప్రతి 2-7-8) ధాత, విధాత అనే సితాసితపటాన్ని వయించే (నేసే) ఇరువురు స్త్రీల ప్రసక్తి ఉదంకోపాఖ్యానంలో ఉంది.

## యమసభావర్ణనము (సం. 2-8-1)

**క.** **ధర్మసభ లోక ధర్మా । ధర్మ వివేకాస్పదంబు, తైజసము; లస**
**ద్ధర్మమణితతుల దానిన్ । నిర్మించెను విశ్వకర్మ నిపుణత యొప్పన్.** **68**

**ప్రతిపదార్థం:** ధర్మ, సభ= యమధర్మరాజుయొక్క సభ; లోకధర్మ+అధర్మ, వివేక+ఆస్పదంబు= లోకంలోని ధర్మాధర్మాల్ని గూర్చి చేసే వివేచనానికి ఉనికిపట్టు; తైజసము= కాంతిమంతం; లసత్+భర్మ, మణి, తతులన్= ప్రకాశించే బంగారంతో, మణి సమూహాలతో; విశ్వకర్మ= దేవశిల్పి; నిపుణతన్= నేర్పుతో; ఒప్పన్; దానిన్, నిర్మించెను.

**తాత్పర్యం:** యమధర్మరాజుసభ లోకంలోని ధర్మాధర్మాలనుగూర్చి చేసే వివేచనానికి ఉనికిపట్టు. అంతేకాదు అది కాంతిమంతం. మెరిసే బంగారంతో, మణులసమూహాలతో విశ్వకర్మ ఎంతో నేర్పుతో దాన్ని నిర్మించాడు.

**విశేషం:** విశ్వకర్మ దేవశిల్పి. ప్రభావసుడనే వసువు కుమారుడు.

**వ. అది శతయోజనవిస్తారాయామరమణీయంబును గామగామియును సూర్యతేజోనిభశుభతేజంబును సర్వసుఖసంపాదనంబు నయి చూడనొప్పుచుండు; నట్టి సభయం దగస్తిమతంగాదిసిద్ధమునులును బితృదేవతలును గాలకింకరులును మూర్తిమంతులైన కాలచక్రక్రతుదక్షిణదిగ్దేవతలును నుగ్రతపంబులును గృతవీర్యజనమేజయజనకబ్రహ్మదత్తపృషదశ్వశంతనువైన్యభూరిద్యుమ్నేంద్రద్యుమ్నమన్మథ మధుకంఠోపరిచరులును మీ జనకుండయిన పాండుమహారాజును నాదిగాఁ గల యనేకరాజఋషులు నుందురు; వీరిచేత ననవరతంబు సేవితుండయి యమరాజు సమస్తజీవుల శుభాశుభకర్మంబు లారయుచుండు. 69**

**ప్రతిపదార్థం:** అది= ఆ యమసభ; శతయోజనవిస్తార+ఆయామ, రమణీయంబును= నూరు ఆమడల విస్తృతిచేత, నిడుపుచేత అందమైనది; కామగామియును= కోరిన చోటికి వెళ్ళగలిగేది; సూర్య, తేజో, నిభ, శుభ, తేజంబును= సూర్యకాంతితో సమానమైన మంచికాంతి కలిగినది; సర్వ, సుఖ, సంపాదనంబున్+అయి= అన్ని సుఖాలను కూర్చునదయి; చూడన్+ఒప్పుచున్+ఉండున్; అట్టి; సభయందు; అగస్తి, మతంగ+ఆది, సిద్ధమునులును= అగస్త్యుడు, మతంగుడు మొదలైన సిద్ధ మహామునులును; పితృదేవతలును; కాల, కింకరులును= యమభటులును; మూర్తిమంతులు+ఐన= రూపుదాల్చిన; కాల, చక్ర, క్రతు, దక్షిణ, దిక్+దేవతలును= కాలచక్రం, యాగాలు, దక్షిణదిక్కులోనిదేవతలు; ఉగ్ర, తపంబులును= ఘోరాలైనతపస్సులును; కృతవీర్య, జనమేజయ, జనక, బ్రహ్మదత్త, పృషదశ్వ, శంతను, వైన్య, భూరిద్యుమ్న+ఇంద్రద్యుమ్న, మన్మథ, మధుకంఠ+ఉపరిచరులును; మీ, జనకుండు+అయిన= మీతండ్రి అయిన; పాండుమహారాజును; ఆదిగాన్+కల= మొదలుగా గల; అనేక, రాజ+ఋషులున్; ఉందురు; వీరిచేతన్; అనవరతంబు= ఎల్లప్పుడు; సేవితుండు+అయి= సేవించబడినవాడయి; యమరాజు= యమధర్మరాజు; సమస్త, జీవుల= అన్నిప్రాణుల; శుభ+అశుభ, కర్మంబులు= మంచిపనులు, చెడుపనులు; ఆరయుచున్+ఉండున్= విచారిస్తూఉంటాడు.

**తాత్పర్యం:** యమసభ నూరామడల విస్తృతి, నిడుపు కలిగి రమణీయమైంది. కోరుకున్నచోటికి వెళ్ళగలది. సూర్యకాంతితో సమానమైన మంచితేజస్సు కలది. సర్వసుఖాల్ని సమకూర్చేది. చూడ చక్కనిది. ఆ సభలో అగస్త్యమతంగాది సిద్ధమునులు, పితృదేవతలు, యమకింకరులు, రూపుదాల్చిన కాలచక్రం, యాగాలు, దక్షిణదిక్కులోని దేవతలు, ఉగ్రతపస్సులు, కృతవీర్య, జనమేజయ, జనకాదిమహారాజులు, మీతండ్రి అయిన పాండుమహారాజు మొదలుగా గల పెక్కుమంది రాజఋషులును ఉంటారు. వీళ్ళంతా తనను ఎప్పుడూ సేవిస్తుండగా యమధర్మరాజు ప్రాణుల పుణ్యాపాపాల్ని గూర్చి విచారిస్తుంటాడు.

**విశేషం:** పాండురాజుకూడ యమసభలో ఉన్నా డని చెప్పటం భావికథకు ప్రేరకం.

## వరుణసభావర్ణనము (సం. 2-9-1)

**క. వరుణసభ సర్వలోకో । త్తర ముజ్జ్వలమణిమయము సితప్రభ మతిసుం**
**దర మందుండు వరుణుఁడును । వరుణానీసహితుఁడై ధ్రువంబగు మహిమన్. 70**

**ప్రతిపదార్థం:** వరుణ, సభ= వరుణుడియొక్కసభ; సర్వలోక+ఉత్తరము= అన్నిలోకాలలో శ్రేష్ఠం; ఉత్+జ్వల, మణిమయము= మిక్కిలిప్రకాశించే మణులతో కూడుకొన్నది; సిత, ప్రభము= తెల్లని కాంతికలది; అతిసుందరము= మిక్కిలి అందమైనది; వరుణుఁడును; వరుణానీ, సహితుఁడు+ఐ= భార్యతో కూడుకొన్నవాడై; ధ్రువంబు+అగు= స్థిరమైన; మహిమన్= మహిమతో; అందున్+ఉండున్.

**తాత్పర్యం:** వరుణసభ సర్వలోకోత్తరమైంది. మెరిసే మణులతో కూడుకొన్నది. తెల్లనికాంతి కలది. ఎంతో అందమైంది. వరుణుడు భార్యాసహితుడై స్థిరమహిమతో ఆ సభలో ఉన్నాడు.

**వ. అది యమరాజు సభయంతియ విస్తారాయామ రామణీయకంబులును గామగామిత్వంబునుం గలిగి విలసిల్లు; జలస్తంభంబు సేసి జలంబులలో నుండి విశ్వకర్మ దాని రమణీయంబుగా రచియించె. 71**

**ప్రతిపదార్థం:** అది= ఆ వరుణుని సభ; యమరాజు, సభ, అంతియు= యమధర్మరాజు సభ అంతే; విస్తార+ఆయామ, రామణీయకంబులును= వెడల్పు, పొడవు, సొగసులూ; కామగామిత్వంబునన్= కోరుకొన్నచోటికి వెళ్ళగలిగినస్థితి; కలిగి; విలసిల్లున్= ప్రకాశిస్తూ ఉంటుంది; విశ్వకర్మ= దేవశిల్పి; జలస్తంభంబు, చేసి= జలస్తంభనవిద్యతో; జలంబులలోన్+ఉండి= నీళ్ళలో ఉండి; దానిన్= ఆ సభను; రమణీయంబుగాన్= సుందరంగా; రచియించెన్= రూపొందించాడు.

**తాత్పర్యం:** ఆ వరుణసభ యమసభతో సమానమైన వెడల్పు, పొడవు, అందం కలిగి, కోరినచోటికి వెళ్ళగలిగిందై కళకళలాడుతూ ఉంటుంది. విశ్వకర్మ జలస్తంభనవిద్యతో నీళ్ళలో ఉండి ఎంతో మనోహరంగా దాన్ని నిర్మించాడు.

**విశేషం:** జలస్తంభనం- ఊపిరి బిగబట్టి నీళ్ళ అడుగున జీవించగలగటం- ఇది అరవైనాలుగు కళల్లో ఒకటి. దుర్యోధనుడు కూడ ఈ విద్య నేర్చినవాడే.

**సీ. అందు సుఖాసీనుఁడైన యవ్వరుణేంద్రు । నంబుధుల్ నాల్గును నధికభక్తిఁ**
**గాళింది నర్మద గంగ గోదావరి । విదిశ విపాశ కావేరి కృష్ణ**
**వేణి సరస్వతి పెన్న యైరావతి । యనఁగఁ బ్రసిద్ధంబులయిన నదులు**
**సరసీతటాక నిర్ఝర దీర్ఘికాదులు । దిక్కులు నఖిల ధాత్రీధరములు**

**ఆ. వసుమతియును దేహవంతంబులై వచ్చి । మకర కూర్మ శింశుమార సింహ**
**శరభ సామజాది జలచర స్థలచర । తతులతోడ సంతతంబుఁ గొలుచు. 72**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ సభలో; సుఖ+ఆసీనుఁడు+ఐ= సుఖంగా కొలువుదీరిఉన్న; ఆ+వరుణ+ఇంద్రున్= ఆ వరుణదేవుని; అంబుధుల్= సముద్రాలు; నాల్గును; కాళింది, నర్మద, గంగ, గోదావరి, విదిశ, విపాశ, కావేరి, కృష్ణవేణి, సరస్వతి, పెన్న, ఐరావతి; అనఁగన్= అనేపేర్లతో; ప్రసిద్ధంబులు+అయిన; నదులు; సరసీ, తటాక, నిర్ఝర, దీర్ఘికా+ఆదులు= సరస్సులు, చెరువులు, సెలయేళ్ళు, దిగుడుబావులు మొదలైనవి; దిక్కులున్= దిక్కులూ; అఖిల, ధాత్రీ, ధరములు= అన్ని పర్వతాలు;

వసుమతియును= భూమియు; దేహవంతంబులు+ఐ= దేహాలను ధరించినవై; వచ్చి; మకర, కూర్మ, శింశుమార, సింహ, శరభ, సామజ+ఆది, జలచర, స్థలచర, తతులతోడన్= మొసళ్ళు, తాబేళ్ళు, నీటికోతులు, సింహాలు, శరభాలు, ఏనుగులు మొదలైన జలచర, భూచర ప్రాణుల సమూహాలతో; సతతంబున్= ఎల్లప్పుడు; అధికభక్తిన్= మిక్కిలిభక్తితో; కొలుచున్= సేవిస్తారు.

**తాత్పర్యం:** ఆ సభలో సుఖంగా కొలువుదీరిఉన్న వరుణదేవుణ్ణి - నాలుగు సముద్రాలు, కాళిందీ నర్మదా గంగా గోదావరీ, కావేరీ మొదలైన నదులు, సరస్సులు, చెరువులు, సెలయేళ్ళు, దిగుడుబావులు, దిక్కులు, పర్వతాలు, భూమి - దేహాలు ధరించివచ్చి, మొసళ్ళు, తాబేళ్ళు, సింహాలు శరభాలు మొదలైన జలచర భూచర సమూహాలతో అన్నివేళలా అధికభక్తితో ఆయనను సేవిస్తుంటారు.

**విశేషం:** 'అంబుధు లేడు' అని కొన్ని ప్రతుల్లో ఉన్నా 'సముద్రా శ్చత్వారో' (భండార్కరు ప్రతి 2-9-18) అని మూలంలో ఉంది. శింశుమార మంటే మొసలి అనే అర్థంకూడ ఉంది.

**వ.** **మఱియు వాసుక్యైరావతాది నాగరాజులును బ్రహ్లాద విరోచన బలి నరక నముచి విప్రచిత్తి కాలకంఠ కైటభ ఘటోదర దశగ్రీవ విశ్వరూప విరూపాక్షాదులయిన దైత్యదానవ వరులును వరుణు సేవించుచుండుదురు.** **73**

**ప్రతిపదార్థం:** మఱియున్; వాసుకి+ఐరావత+ఆది= వాసుకి, ఐరావతుడు మొదలయిన; నాగరాజులును= సర్పరాజులు; ప్రహ్లాద, విరోచన, బలి, నరక, నముచి, విప్రచిత్త, కాలకంఠ, కైటభ, ఘటోదర, దశగ్రీవ, విశ్వరూప, విరూపాక్ష+ఆదులు+అయిన= ప్రహ్లాదుడు, విరోచనుడు, బలి మొదలయిన; దైత్య, దానవ, వరులును= దైత్యదానవశ్రేష్ఠులూ; వరుణున్; సేవించుచున్+ఉండుదురు.

**తాత్పర్యం:** అంతేకాక వాసుకి, ఐరావతుడు మొదలైన నాగరాజులు, ప్రహ్లాదుడు, విరోచనుడు, బలి, నరకుడు, నముచి, విప్రచిత్తి, కాలకంఠుడు, కైటభుడు, ఘటోదరుడు, దశగ్రీవుడు, విశ్వరూపుడు, విరూపాక్షుడు మొదలైన దైత్యదానవశ్రేష్ఠులు వరుణుణ్ణి సేవిస్తూ ఉంటారు.

**విశేషం:** ఇంతకంటె అధికంగా సర్పరాజుల పేర్లు మూలంలో ఉన్నాయి. వాసుకి, ఐరావతుడు - కద్రువ కుమారులు. దైత్యులు - కశ్యపునికి దితియందు పుట్టినవాళ్ళు. దానవులు - కశ్యపునికి దనువుకు పుట్టినవాళ్ళు. అందరూ రాక్షసులే.

## కుబేర సభావర్ణనము (సం. 2-10-1)

**క.** **ధనదుసభ యింద్రసభతో । నెనయగుచు మహావిభూతి నెంతయు నొప్పుం**
**దన దివ్యశక్తి నాతం । డొనరఁగ నిర్మించె దాని నుత్తమమణులన్.** **74**

**ప్రతిపదార్థం:** ధనదు, సభ= ధనాన్ని ఇచ్చేవాడైన కుబేరుని సభ; ఇంద్రసభతోన్= దేవేంద్రుని సభతో; ఎన, అగుచున్= సాటిగా ఉంటూ; మహా, విభూతిన్= గొప్ప ఐశ్వర్యంతో; ఎంతయున్= మిక్కిలి; ఒప్పున్= ప్రకాశిస్తుంది. అతండు= ఆ కుబేరుడు; తన= తనయొక్క; దివ్య, శక్తిన్= దివ్యమైన శక్తిచేత; దానిన్= ఆ సభను; ఉత్తమ మణులన్= శ్రేష్ఠాలైన మణులతో; ఒనరఁగన్= ఒప్పుగా; నిర్మించెన్= నిర్మించాడు.

**తాత్పర్యం:** కుబేరునిసభ ఇంద్రసభతో సమానంగా ఉంటుంది. అపారమైన ఐశ్వర్యంతో ఎంతో ప్రకాశిస్తూ ఉంటుంది. కుబేరుడు తనదివ్యశక్తిచేత ఉత్తమమణులతో అతిరమణీయంగా దాన్ని నిర్మించాడు.

**వ. అదియును నూఱుయోజనంబుల నిడుపును డెబ్బదియోజనంబుల వెడల్పునుం గలిగి సితప్రభంబయి గగనచరంబయి కనకమయతరులతాలంకృతం బయి తటిల్లతావిచిత్రశరదంబుదంబు ననుకరించు చుండు. 75**

**ప్రతిపదార్థం:** అదియును; నూఱు, యోజనంబుల, నిడుపును= నూరామడల పొడవును; డెబ్బది, యోజనంబుల, వెడల్పును; కలిగి; సిత, ప్రభంబు+అయి= తెల్లటికాంతి కలదై; గగనచరంబు+అయి= ఆకాశంలో తిరుగాడేదై; కనకమయ, తరు, లతా+ అలంకృతంబు+అయి= బంగారుచెట్లతో, తీవలతో అలంకరించబడిందై; తటిత్+లతా, విచిత్ర, శరత్+అంబుదంబున్= మెరుపుతీవలచేత ఆశ్చర్యకరమైన శరత్కాలమేఘాన్ని; అనుకరించుచున్+ఉండున్= పోలి ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ సభ పొడవు నూరామడలు, వెడల్పు డెబ్బది ఆమడలు. తెల్లటి కాంతితో అది ఆకాశంలో చలిస్తూ, బంగారు చెట్లతో, తీవలతో అలంకరించబడి, మెరుపుతీగలతో ఆశ్చర్యకరమైన శరత్కాలమేఘంలా ఉంటుంది.

**విశేషం:** సభకాంతి తెలుపు, శరత్కాల మేఘకాంతి తెలుపు. సభకు అలంకారాలు-బంగారుచెట్లు, తీవలు. మేఘానికి అలంకారాలు- మెరుపుతీగలు. పోలిక మనోహరం. ఆకాశ సంచారం రెండింటికి సమానం.

**క. అందుఁ గుబేరుఁడు పరమా । నందంబున నుండు ధర్మనందన! విలస**
**న్మందార పారిజాతక । నందన మందానిలాభినందితుఁ డగుచున్. 76**

**ప్రతిపదార్థం:** ధర్మనందనా!= ఓధర్మరాజా!; అందున్= ఆ సభలో; కుబేరుఁడు; పరమ+ఆనందంబునన్= మిక్కిలి ఆనందంతో; విలసత్+మందార, పారిజాతక, నందన, మంద+అనిల+అభినందితుఁడు+అగుచున్= శోభిల్లుతున్న మందార పారిజాత వృక్షాలతో కూడిన నందనవనంలోనుండి మెల్లగా వీస్తున్న చల్లనిగాలిచేత సంతోషింప చేయబడినవాడౌతూ; ఉండున్= కొలువుదీరి ఉంటాడు.

**తాత్పర్యం:** ఓధర్మరాజా! ఆ సభలో కుబేరుడు మందార పారిజాతాది వృక్షశోభతో శోభిల్లే నందనవనంనుండి మందమారుతంవీస్తుండగా పరమానందంతో కొలువుదీరి ఉంటాడు.

**వ. అతని ననవరతంబును నరకిన్నర నాములైన గంధర్వులును, వరాహకర్ణ గజకర్ణ మాణిభద్ర హేమనేత్ర విభీషణ పింగళక ప్రవాళకాదులయిన యక్షులును, నలకూబరుండును, నూర్వశీతిలోత్తమా ఘృతాచీ మేనకా విభావరీ రంభా ప్రభృతులయిన యప్సరసలును సేవింతు; రే నెప్పుడు ననేక దేవర్షి గణంబులతో నరిగి చూచుచుండుదు. 77**

**ప్రతిపదార్థం:** అతనిన్= ఆ కుబేరుని; అనవరతంబును= ఎల్లప్పుడును; నర, కిన్నర, నాములు+ఐన= నరులు, కిన్నరులు అనే పేర్లు కల; గంధర్వులును; వరాహకర్ణ, గజకర్ణ, మాణిభద్ర, హేమనేత్ర, విభీషణ, పింగళక, ప్రవాళక+ఆదులు+అయిన= వరాహకర్ణుడు, గజకర్ణుడు-మొదలైన; యక్షులును; నలకూబరుండును; ఊర్వశీ, తిలోత్తమా, ఘృతాచీ, మేనకా, విభావరీ, రంభా, ప్రభృతులు+అయిన= ఊర్వశి, తిలోత్తమ మొదలైన; అప్సరసలును; సేవింతురు; ఏను= నేను; ఎప్పుడున్= ఎల్లప్పుడు; అనేక, దేవ+ఋషి, గణంబులతోన్= పెక్కుమంది దేవర్షి సమూహాలతో; అరిగి= వెళ్ళి; చూచుచున్+ఉండుదున్.

**తాత్పర్యం:** అన్ని వేళల ఆ కుబేరుడిని నరులు, కిన్నరులు అనే పేర్లు గల గంధర్వులును, వరాహకర్ణుడు, గజకర్ణుడు మొదలయిన యక్షులు, నలకూబరుడు, ఊర్వశి, తిలోత్తమ మొదలయిన అప్సరసలు సేవిస్తూ ఉంటారు. నేను కూడ ఎప్పుడూ ఎంతోమంది దేవర్షులతో వెళ్ళి అతణ్ణి చూస్తూ ఉంటాను.

**ఉ. వానికి నెయ్యుఁడై యమరవంద్యపదాంబుజుఁ డంబికా బృహ**
**త్పీనపయోధరాగ్ర పరిపీడితవక్షుఁడు భూషణీకృతా**
**హీనుఁ డశేషలోకగురుఁ డీశ్వరుఁ డెప్పుడు నంద యుండు నా**
**నా నిశితాయుధాయుతసనాథమహాద్భుతభూతకోటితోన్. 78**

**ప్రతిపదార్థం:** వానికిన్= ఆకుబేరునికి; నెయ్యుఁడు+ఐ= స్నేహితుడై; అమర, వంద్య, పద+అంబుజుఁడు= దేవతలచేత నమస్కరించబడే పద్మాలవంటి పాదాలు కలవాడు; అంబికా, బృహత్+పీన, పయోధర+అగ్రపరిపీడిత, వక్షుఁడు= పార్వతీదేవియొక్క పెద్దవైన, బలిసిన పాలిండ్ల చివరలచే నొక్కబడిన వక్షఃస్థలం కలవాడు; భూషణీకృత+అహి+ఇనుఁడు= ఆభరణాలుగా చేయబడిన పాములరాజైన వాసుకి కలవాడు-అంటే పాములను అభరణాలుగా కలవాడు; అశేష, లోక, గురుఁడు= అన్నిలోకాలకు గురువైనవాడు; ఈశ్వరుఁడు= శివుడు; నానానిశిత+ఆయుధ+అయుత, సనాథ, మహా+అద్భుత, భూత, కోటితోన్= నానావిధాలై వాడి అయిన ఆయుధాలు పదివేలతో కూడుకొన్న మిక్కిలి ఆశ్చర్యకరమైన భూతాల సమూహంతో; ఎప్పుడున్= ఎల్లప్పుడు; అందు+అ, ఉండున్= అందే ఉంటాడు.

**తాత్పర్యం:** దేవతలు నమస్కరించే పాదపద్మాలు కలవాడు, పార్వతీదేవి పాలిండ్ల చివరలు నొక్కిన వక్షఃస్థలం కలవాడు, పాములరాజైన వాసుకిని ఆభరణంగా కలవాడు, అన్నిలోకాలకు గురుడు అయిన శివుడు కుబేరుడికి స్నేహితుడై పదునైన నానావిధ ఆయుధాలు ధరించి ఆశ్చర్యకరంగా ఉన్న భూతసమూహంతో ఎప్పుడూ అక్కడనే ఉంటాడు.

**విశేషం:** పిశాచగణాలకు, ప్రమథగణాలకు అధిపతి కనుక శివునికి భూతపతి అనికూడ పేరు. (ఈ పద్యంలో ఓజఃప్రసాదగుణమిశ్రమం వైదర్భీరీతిని రూపుకట్టించింది. ఇటువంటి రచన నన్నయలో విరళంగా కనపడుతుంది. (చూడు. పీఠిక). సంపా.)

## బ్రహ్మసభావర్ణనము (సం. 2-11-1)

**వ. ఏను దొల్లి మనుష్యలోకంబునం గొండొక కాలంబున్న నా కడకు సూర్యుండు వచ్చి పితామహు సభ వర్ణించినఁ దద్దర్శన కుతూహలుండ నయి యాదిత్యుతోడన యరిగి యక్కమలగర్భుసభం జూచితి. 79**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; తొల్లి= పూర్వం; మనుష్య, లోకంబునన్= భూలోకంలో; కొండొక, కాలంబు+ఉన్న= కొంతకాలం ఉండగా; నాకడకున్= నాదగ్గరకు; సూర్యుండు; వచ్చి; పితామహు, సభ= బ్రహ్మదేవునిసభను; వర్ణించినన్= వర్ణించగా; తత్+దర్శన, కుతూహలుండను+అయి= దాన్ని చూడటంలో ఆసక్తి కలవాడినై; ఆదిత్యుతోడన్+అ= సూర్యుని వెంటనే; అరిగి= వెళ్ళి; ఆ, కమల, గర్భు, సభన్= ఆ బ్రహ్మదేవునిసభను; చూచితిన్= చూచాను.

**తాత్పర్యం:** పూర్వం కొంతకాలం నేను భూలోకంలో ఉన్నప్పుడు నా దగ్గరకు సూర్యుడు వచ్చాడు. బ్రహ్మసభనుగూర్చి వర్ణించాడు. నేనుకూడ దాన్ని చూడాలన్న కుతూహలంతో సూర్యునివెంబడి వెళ్ళి ఆ బ్రహ్మసభను చూచాను.

**విశేషం:** పితామహుడు - తండ్రులకు తండ్రి - బ్రహ్మ, కమలగర్భుడు - పద్మాన్ని (శ్రీ మహావిష్ణువు యొక్క నాభి కమలాన్ని) పుట్టుకస్థానంగా కలవాడు (శ్రీమహావిష్ణువుయొక్క నాభికమలంనుండి పుట్టినవాడు) - బ్రహ్మ.

**చ.** **దళితవిరోధి! యిట్టి దని దాని తెఱం గెఱుఁగంగ బ్రహ్మకుం**
**గొలఁదియె తా నవాఙ్మనసగోచర మద్భుతరూప మీ వియ**
**త్తల మను కంబ మొక్కటియ తాల్పఁగ సుస్థిరమై నిజప్రభా**
**వలి వెలుఁగించుచుండు శశివారిజమిత్త్రుల మండలంబులన్.** **80**

**ప్రతిపదార్థం:** దళితవిరోధి!= అణచివేయబడిన శత్రువులు కలవాడా! ఓధర్మరాజా!; ఇట్టి+అది+అని; దాని, తెఱంగు+ ఎఱుఁగంగన్= ఆ సభయొక్క విధం తెలుసుకోటానికి; బ్రహ్మకున్+కొలఁదియె= బ్రహ్మదేవునికైనా సాధ్యమా!; తాన్=తాను (సభ); అవాక్+మనస, గోచరము= మాటకు, మనస్సుకు అందనిది-అంటే చెప్పసాధ్యంకానిది, ఊహించశక్యంకానిది; అద్భుత, రూపము= ఆశ్చర్యకరమైన రూపం కలది; ఈ, వియత్+తలము+అను= ఈ ఆకాశమనే; కంబము+ఒక్కటి+అ= స్తంభమొక్కటే; తాల్పఁగన్= ధరించగా; సుస్థిరము+ఐ= మంచి నిలకడకలదై; శశి, వారిజ, మిత్త్రుల, మండలంబులన్= చంద్రసూర్యమండలాలను; నిజప్రభా+ఆవలిన్= తనయొక్కకాంతి సమూహాలచేత; వెలుఁగించుచున్+ఉండున్= ప్రకాశించేటట్లు చేస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** శత్రువుల్ని అణచివేసిన ఓ ధర్మరాజా! బ్రహ్మసభావైభవం ఇలాంటి దని తెలుసుకోటానికి ఆ బ్రహ్మకైనా సాధ్యం కాదు. అది చెప్ప సాధ్యం కానిది. ఊహకు కూడా అందనిది. దానిరూపం అద్భుతం. ఆకాశమనే స్తంభ మొక్కటే దాన్ని ధరిస్తూ ఉండగా, సుస్థిరంగా నిలిచి, తన కాంతులతో చంద్రసూర్యమండలాల్ని ప్రకాశింపచేస్తూ ఉంటుంది.

**విశేషం:** వారిజము - నీటినుండి పుట్టింది - పద్మం. దానికి మిత్త్రుడు - సూర్యుడు. 'వాఙ్మనసము' - ఇది నిపాతం. స్త్రీపుంసము, వాఙ్మనసము, రాత్రిందివము మొదలయినవి. (అచతు రేత్యాది పాణినీయ సూత్రం చూచేది). (పద్యరచనలో ప్రసాదగుణం ప్రసన్న మౌతున్నది. సంపా.)

**వ.** **'అం దనేకవిధ జీవరాసుల సృజియించుచు నధికతపస్వుల తపఃఫలంబులు విధించుచు విశ్వకర్తలైన మన్వత్రి మరీచి భృగు భరద్వాజ దక్ష వసిష్ఠ వాలఖిల్య పులస్త్య పులహ క్రతు కశ్యప గౌతమాంగిరః ప్రచేతసులును, జంద్రాదిత్యగ్రహనక్షత్రగణంబులును, దేవగణంబులును, వసురుద్రసిద్ధసాధ్యులును, బ్రజావంతులైన పంచాశత్సహస్రమునులును, నూర్ధ్వరేతసులయిన యష్టాశీతిసహస్రమునులును. నాశ్వినులును, విశ్వదేవతలును, విశ్వకర్మయుం, బితృదేవతలునుం దన్నుం బరివేష్టించి యుండ ధర్మార్థకామమోక్షంబులును, శబ్దస్పర్శరూపరసగంధంబులును, దపశ్శమదమంబులును, ధృతి స్మృతి మేధాబుద్ధి క్షమా కీర్తులును, సంకల్ప వికల్పప్రణవంబులును, క్షణలవత్రుటి కాష్ఠా ముహూర్తాహోరాత్ర పక్షమాస ఋతు సంవత్సర యుగాత్మకంబైన కాలచక్రంబును. ఋగ్యజుస్సామాథర్వణవేదవేదాంగంబులును,**

**బురాణేతిహాసంబులును, బహుప్రకారభాషలును, సమస్తవిద్యలును మూర్తిమంతంబులైకొలువ సరస్వతీ సమేతుండై పరమానందంబునం బరమేష్ఠి పద్మాసనంబున నుండు' నని లోకపాలురసభలను బ్రహ్మసభను వర్ణించిన నారదునకు ధర్మరా జి ట్లనియె. 81**

**ప్రతిపదార్థం:** అందున్+అనేకవిధ, జీవరాసులన్= ఆ సభలో పెక్కువిధాలైన ప్రాణుల సమూహాల్ని; సృజియించుచున్= సృష్టిచేస్తూ, అధిక, తపస్వుల= ఎక్కువ తపస్సు చేసినవాళ్ళయొక్క; తపః, ఫలంబులు= తపస్సుల ఫలాలను; విధించుచున్= నిర్ణయిస్తూ; విశ్వకర్తలు+ఐన= విశ్వాన్ని రూపొందించిన; మను+అత్రి, మరీచి, భృగు, భరద్వాజ, దక్ష, వసిష్ఠ, వాలఖిల్య, పులస్త్య, పులహ, క్రతు, కశ్యప, గౌతమ+అంగిరః; ప్రచేతసులును; చంద్ర+ఆదిత్య, గ్రహ, నక్షత్ర, గణంబులును= చంద్రసూర్యగ్రహ నక్షత్ర సమూహాలూ; దేవగణంబులును= దేవతల సమూహాలూ; వసు, రుద్ర, సిద్ధ, సాధ్యులును; ప్రజావంతులు+ఐన= సంతానంగల; పంచాశత్+సహస్ర మునులును= యాభైవేలమంది మునులూ; ఊర్ధ్వరేతసులు+అయిన= ఇంద్రియాన్ని ఊర్ధ్వముఖం కావించిన - అంటే బ్రహ్మచారులైన; అష్ట+అశీతి, సహస్రమునులును= ఎనభైఎనిమిదివేలమంది మునులూ; ఆశ్వినులును= అశ్వినీదేవతలూ; విశ్వదేవతలును; విశ్వకర్మయున్, పితృదేవతలున్, తన్నున్= తనను (ఆబ్రహ్మదేవుణ్ణి); పరివేష్టించి, ఉండన్= చుట్టును చేరి కొలుస్తుండగా; ధర్మ+అర్థ, కామ, మోక్షంబులును; శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులును; తపస్+శమ, దమంబులును= తపస్సును అంతర్బహిరింద్రియ నిగ్రహాలూ; ధృతి, స్మృతి, మేధా, బుద్ధి, క్షమా, కీర్తులును; సంకల్ప, వికల్ప, ప్రణవంబులును; క్షణ, లవ, త్రుటి, కాష్ఠా, ముహూర్త+అహః+రాత్ర, పక్ష, మాస, ఋతు, సంవత్సర, యుగ+ఆత్మకంబు+ఐన, కాలచక్రంబును= క్షణం, లవం వంటి కాలవిభాగాలతో కూడిన కాలచక్రమూ; ఋక్, యజుస్, సామ+అథర్వణవేద, వేద+ అంగంబులును= నాలుగువేదాలు, వేదాంగాలు; పురాణ+ఇతిహాసంబులును; బహు, ప్రకార, భాషలును= అనేకవిధాలైన భాషలూ; సమస్తవిద్యలును; మూర్తి మంతంబులు+ఐ= ఆకారాన్ని ధరించినవై; కొలువన్; సరస్వతీ, సమేతుండు+ఐ= సరస్వతీదేవితో కూడినవాడై; పరమ+ఆనందంబునన్; పరమేష్ఠి= బ్రహ్మదేవుడు; పద్మ+ఆసనంబునన్, ఉండున్+అని; లోకపాలుర, సభలను= లోకపాలురు - దిక్పాలకులైన ఇంద్ర, యమ, వరుణ, కుబేర, సభలను; బ్రహ్మసభను; వర్ణించిన; నారదునకున్; ధర్మరాజు+ ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'విశ్వకర్తలైన మనువు, అత్రి, మరీచి మొదలయినవాళ్ళు, సూర్య చంద్ర గ్రహనక్షత్ర సమూహాలు, దేవగణాలు, వసువులు, రుద్రులు, సిద్ధులు, సాధ్యులు సంతానవంతులైన యాభైవేలమంది మహామునులు, ఊర్ధ్వరేతసు లయిన ఎనభై ఎనిమిదివేలమంది మహర్షులు, అశ్వినీదేవతలు, విశ్వదేవతలు, విశ్వకర్మ, పితృదేవతలు, రూపుదాల్చిన ధర్మార్థకామమోక్షాలు, శబ్దస్పర్శరూపరసగంధాలు, తపస్సు, శమం, దమం, ధృతి, స్మృతి, మేధ, బుద్ధి, క్షమ, కీర్తి, సంకల్పం, వికల్పం, ప్రణవం (ఓంకారం), క్షణం, లవం, త్రుటి, కాష్ఠ, ముహూర్తం, పగలు, రాత్రి, పక్షం, మాసం మొదలయిన విభాగాలతో కూడిన కాలచక్రం, చతుర్వేదాలు, వేదాంగాలు, పురాణేతిహాసాలు, బహువిధ భాషలు, సమస్త విద్యలు, ఆకారం తాల్చి తనను సేవిస్తూ ఉండగా, సరస్వతీ సమేతుడై, వివిధ జీవరాసుల్ని సృజిస్తూ, మహాతపస్వుల తపఃఫలాలు నిర్ణయిస్తూ, బ్రహ్మదేవుడు పద్మాసనంమీద ఆ సభలో కొలువు తీరి ఉంటాడు'- అని దిక్పాలురసభలను, బ్రహ్మదేవునిసభను వర్ణించిన నారదమహర్షితో ధర్మరాజు ఇలా అన్నాడు.

**విశేషం:** బ్రహ్మదేవునిసభ ఎవ రెవరితో ఎంత క్రిక్కిరిసి ఉంటుందో, ఆయన ఎన్నెన్ని విషయాలలో ఎంత నిర్విరామంగా కృషి చేస్తుంటాడో ఈవచనం వ్యక్తం చేస్తుంది. వసువులు-ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు. రుద్రులు- అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు,

అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు. సిద్ధులు, సాధ్యులు దేవతల్లో రెండు తెగలు. ధర్మార్థకామమోక్షాలు- చతుర్విధపురుషార్థాలు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు పంచభూతాలైన ఆకాశ వాయు కాంతి జల పృథివీ ధర్మాలు. వీటినే పంచతన్మాత్ర లని వ్యవహరించటం ఉంది. శమము-శాంతి,- అంతరింద్రియ నిగ్రహం. దమము-ఓర్పు-బాహ్యేంద్రియ నిగ్రహం. ప్రణవం - ఓంకారం. వేదాంగాలు - శిక్ష. వ్యాకరణం, ఛందం, నిరుక్తం జ్యోతిషం, కల్పం, పురాణం - సృష్టి. ప్రతిసృష్టి. వంశం, మన్వంతరం, వంశానుచరితం అనే ఐదు లక్షణాలు గల పురాతన చరిత్ర. పురాణాలు పద్దెనిమిది - మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మవైవర్త, వామన, వాయవ్య, వైష్ణవ, వరాహ, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాందాలు. ఇతిహాసం- ఇతి+హ+ఆస - పూర్వరాజుల చరిత్ర - భారతం లాంటిది.

## హరిశ్చంద్రుమాహాత్మ్యము (సం. 2-11-48)

**మధ్యాక్కర.**

**పరమధర్మాత్మకుఁ డయిన పాండుభూపతిఁదొట్టి సకల**
**ధరణీశులెల్ల యముసభ నుండంగఁ, దా నేమి పుణ్య**
**చరితఁ బ్రవర్తిల్లెనయ్య దేవేంద్రసభ హరిశ్చంద్రుఁ**
**డురుతరమహిమతో దేవపూజ్యుఁడై యుండంగఁ గనియె? 82**

**ప్రతిపదార్థం:** పరమ, ధర్మ+ఆత్మకుఁడు+అయిన= మిక్కిలిధర్మాత్ముఁడైన; పాండుభూపతిన్, తొట్టి= పాండురాజు మొదలుగాగల; సకల, ధరణీ+ఈశులు+ఎల్లన్= సమస్త భూమండలానికి రాజులైన వా రందరు; యము, సభన్= యమధర్మరాజుయొక్క సభలో; ఉండంగన్= ఉండగా; హరిశ్చంద్రుఁడు; తాను+ఏమి; పుణ్యాచరితన్= పవిత్రవర్తనంతో; ప్రవర్తిల్లెన్+అయ్య= నడవడి సాగించాడో; ఉరుతర, మహిమతోన్= గొప్ప మహిమతో; దేవ, పూజ్యుఁడు+ఐ= దేవతలకు పూజించదగినవాడై; దేవ+ఇంద్ర, సభన్= దేవేంద్రునియొక్కసభలో; ఉండంగన్, కనియెన్= ఉండగలిగాడు.

**తాత్పర్యం:** పరమధర్మాత్ముడైన పాండురాజు మొదలుగాగల రాజులంతా యమసభలో ఉండగా, ఏ పవిత్ర చరిత్రవల్ల హరిశ్చంద్రమహారాజు మహామహిముడై, దేవతలకే పూజ్యుడై దేవేంద్రుని సభలో ఉండగలిగినాడో కదా!

**విశేషం:** రాజ్యపాలకులంతా ఏదో ఒక్క కారణంగా యమలోకం చేరక తప్ప దని కాబోలు 'రాజ్యాంతే నరకం ధ్రువమ్' అన్నారు.

**వ. అని యడిగిన ధర్మరాజునకు హరిశ్చంద్రు మహిమాతిశయంబు నారదుం డి ట్లని చెప్పె. 83**

**ప్రతిపదార్థం:** అని; అడిగిన; ధర్మరాజునకు; నారదుండు; హరిశ్చంద్రు, మహిమ+అతిశయంబు= హరిశ్చంద్రుని ప్రభావం యొక్క గొప్పతనాన్ని; ఇట్లు+అని; చెప్పెన్;

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా అడిగేసరికి, నారదమహర్షి హరిశ్చంద్రుని గొప్పతనాన్ని ఈ విధంగా చెప్పాడు.

**ఉ. దీపితసత్యసంధుఁడు ధృతిస్మృతిధర్మపరాయణుం డయో**
**ధ్యాపురనాయకుండు జలజాప్తకులైకవిభూషణుండు వి**

**ద్యాపరమార్థవేది శరదబ్జసముజ్జ్వలకీర్తిచంద్రికా**
**స్నాపితసర్వలోకుఁడు త్రిశంకునరేంద్రసుపుత్త్రుఁ డున్నతిన్.** **84**

**ప్రతిపదార్థం:** త్రిశంకు, నర+ఇంద్ర, సుపుత్త్రుఁడు= త్రిశంకుమహారాజుయొక్క ఉత్తముడైన కుమారుడు - హరిశ్చంద్రుడు; ఉన్నతిన్= గొప్పతనంలో; దీపిత, సత్యసంధుఁడు= ప్రకాశింపజేయబడిన సత్యవాక్యప్రతిజ్ఞకలవాడు; ధృతి, స్మృతి, ధర్మ పరాయణుండు= యజ్ఞ (ధైర్య) శాస్త్రధర్మాలలో ఎంతో ఆసక్తి కలవాడు; అయోధ్యాపుర, నాయకుండు= అయోధ్యానగరానికి రాజు; జలజ+ఆప్త, కుల+ఏక, విభూషణుండు= పద్మాలకు ఆప్తుడైన సూర్యునివంశానికి ప్రధానమైన అలంకారమైనవాడు - అంటే సూర్యవంశంలో ప్రసిద్ధుడైన రాజు; విద్యా, పరమ+అర్థ, వేది= విద్యయొక్క పరమార్థాన్ని తెలిసికొన్నవాడు; శరత్+అబ్జ, సముజ్జ్వల, కీర్తి, చంద్రికా, స్నాపిత, సర్వలోకుఁడు= శరత్కాలంలోని పద్మంవలె మిక్కిలి కాంతిమంతమైన కీర్తి అనే వెన్నెలచేత స్నానం చేయించబడిన అన్నిలోకాలుకలవాడు - అంటే అన్నిలోకాలకు వ్యాపించిన కీర్తి కలవాడు.

**తాత్పర్యం:** త్రిశంకుమహారాజు కుమారుడైన హరిశ్చంద్రుడు పేరుకెక్కిన సత్యసంధుడు. యజ్ఞంలో, ధైర్యంలో, శాస్త్రంలో, ధర్మంలో ఎంతో ఆసక్తి కలవాడు. అయోధ్యానగరానికి ప్రభువు. సూర్యవంశం మొత్తానికి అలంకారమైనవాడు. విద్యాపరమార్థాన్ని తెలుసుకున్నవాడు. అన్నిలోకాలకు వ్యాపించిన కీర్తికలవాడు.

**విశేషం:** అలం: ఉపమ, రూపకం. అనేకప్రతుల్లో ఈ పద్యం లేదు. రచన ప్రసాదగుణబంధురం. (సంపా.)

**సీ.** **జయశీలుఁడయి హరిశ్చంద్రుండు దొల్లి స । ప్తద్వీపములఁ దన బాహుశక్తిఁ**
**జేసి జయించి నిశ్శేషితశత్రుఁడై । ధారుణిలోఁ గల ధరణిపతుల**
**నిజశాసనంబున నిలిపి నిత్యంబైన । మహిమతో సకలసామ్రాజ్య మొప్ప**
**రాజసూయంబు తిరంబుగా నొనరించి । తనరి యథోచితదక్షిణలకు**

**ఆ.** **నేనుమడుఁగు లర్థ మిచ్చి యాజకులఁ బూ । జించి భక్తితో విశిష్ట విప్ర**
**జనుల కభిమతార్థసంప్రదానంబులఁ । దృప్తిసేసె వంశదీపకుండు.** **85**

**ప్రతిపదార్థం:** వంశ, దీపకుండు= వంశం వెలిగించేవాడైన హరిశ్చంద్రుడు; జయశీలుఁడు+ఐ= జయించే స్వభావం కలవాడై; తొల్లి= పూర్వం; సప్త, ద్వీపములన్= ఏడుదీవులను; తన= తనయొక్క; బాహుశక్తిన్, చేసి= భుజబలంతో; జయించి; నిః+శేషిత, శత్రుఁడు+ఐ= మిగలని శత్రువులు కలవాడై, అంటే శత్రువు లందరిని జయించి; ధారుణిలోన్, కల= భూమిలో ఉన్న; ధరణిపతులన్= రాజుల్ని; నిజశాసనంబునన్= తన ఆజ్ఞలో; నిలిపి; నిత్యంబు+ఐన, మహిమతోన్= శాశ్వతమైన గొప్పతనంతో; సకల సామ్రాజ్యము+ఒప్పన్= సమస్త సామ్రాజ్యం ప్రకాశించగా; రాజసూయంబు= రాజసూయమహాయాగం; తిరంబుగాన్= స్థిరంగా; ఒనరించి= చేసి; తనరి= అతిశయించి; యథా+ఉచిత, దక్షిణలన్= ఎవరెవరికి ఎంతెంతగా ఇవ్వదగిన దక్షిణలకు; ఏనుమడుఁగులు= ఐదురెట్లు; అర్థము+ఇచ్చి= ధనాన్ని ఇచ్చి; యాజకులన్= యజ్ఞం చేయించేవారిని; పూజించి; భక్తితోన్; విశిష్ట, విప్ర, జనులకున్= గొప్పవారైన బ్రాహ్మణులకు; అభిమత+అర్థ, సంప్రదానంబులన్= కోరుకొన్నవస్తువులను ఇవ్వటంచేత; తృప్తి, చేసెన్= తృప్తి నొందించాడు;

**తాత్పర్యం:** సూర్యవంశాన్ని ప్రకాశింపజేసే హరిశ్చంద్ర మహారాజు, జయించాలన్న స్వభావంతో, సప్తద్వీపాల్ని తన బాహుబలంతో జయించాడు. శత్రువు లెవ్వరూ మిగులకుండ, నేలమీది రాజులంతా తన ఆజ్ఞ మీరకుండ చేశాడు.

శాశ్వతవైభవంతో తన సామ్రాజ్యమంతా ప్రకాశించేటట్లు - రాజసూయమహాయాగం చేశాడు. యాజ్ఞికు లందరికి ఇవ్వదగిన దక్షిణలకంటె ఐదింత లిచ్చి పూజించాడు. బ్రాహ్మణోత్తముల కోర్కెలన్నీ భక్తితో తీర్చాడు.

**విశేషం:** ద్వీపం - నాల్గువైపుల నీరున్న భూభాగం-దీవి. సప్తద్వీపాలు - జంబూ, ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శాక, పుష్కరాలు, యాజకుడు-యాజ్ఞికుడు-యాగం నడిపేవాడు - ఋత్విక్కు.

**క. ఉరుతరధనసంతర్పిత । ధరణీసురు లతని నతిముదంబున దీవిం**
**చిరి 'రాజులందు లోకో । త్తరతేజోధర్మయుక్తిఁ దనరుమ' యనుచున్. 86**

**ప్రతిపదార్థం:** ఉరుతర, ధన, సంతర్పిత, ధరణీసురులు= గొప్పధనదానాలచేత లెస్సగా తృప్తి పొందించబడిన బ్రాహ్మణులు; అతనిన్= ఆ హరిశ్చంద్రుణ్ణి; అతిముదంబునన్= మిక్కిలి సంతోషంతో; రాజుల+అందున్= రాజుల్లో; లోక+ఉత్తర, తేజః, ధర్మయుక్తిన్= లోకాతీతమైన తేజస్సుతో, ధర్మంతో కూడినవాడివై; తనరుము+అ= ఒప్పుమా!; అనుచున్; దీవించిరి.

**తాత్పర్యం:** హరిశ్చంద్రుడు కావించిన గొప్ప ధనదానాలతో లెస్సగా తృప్తిపొందిన బ్రాహ్మణులు మిక్కిలి సంతోషంతో 'రాజు లందరిలో నీవు లోకాతీతతేజస్సుతో, ధర్మంతో ప్రకాశించు' అని ఆశీర్వదించారు.

**వ. వాఁడును బ్రాహ్మణ వచనంబునం జేసి యెల్ల రాజులకు నధికుండయి రాజసూయమహాయజ్ఞకరణంబునం జేసి దేవేంద్రుసాలోక్యంబు వడసె; నట్టి హరిశ్చంద్రు మహిమాతిశయంబు రాజసూయ నిమిత్తంబున నయినదిగా నెఱింగి రాజలోకంబుతో వైవస్వతసభ నుండు భవజ్జనకుండు పాండురాజు నాతో ని ట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** వాఁడును= ఆ హరిశ్చంద్రుడుకూడ; బ్రాహ్మణ, వచనంబునన్+చేసి= బ్రాహ్మణులయొక్క ఆశీర్వచనంచేత; ఎల్లరాజులకున్= అందరు రాజులకంటె; అధికుండు+అయి= గొప్పవాడై; రాజసూయ, మహాయజ్ఞ, కరణంబునన్+చేసి= రాజసూయ మహాయజ్ఞాన్ని చేయటంచేత; దేవేంద్రు, సాలోక్యంబు= దేవేంద్రుని చేరే స్థితిని; పడసెన్= పొందాడు; అట్టి, హరిశ్చంద్రు, మహిమ+అతిశయంబు= హరిశ్చంద్రుని గొప్పతనంయొక్క ఆధిక్యాన్ని; రాజసూయ, నిమిత్తంబునన్= రాజసూయ యాగ కారణాన; అయినది, కాన్= ఏర్పడినట్టిదిగా; ఎఱింగి= తెలిసికొని; రాజలోకంబుతోన్= రాజుల సమూహంతో; వైవస్వత, సభన్, ఉండు= యమధర్మారాజు సభలో ఉండే; భవత్, జనకుండు= నీయొక్క తండ్రి; పాండురాజు; నాతోన్+ఇట్లు+అనియెన్= నాతో ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** హరిశ్చంద్రుడు బ్రాహ్మణాశీర్వచనంవల్ల అందరు రాజులకంటె అధికుడై, రాజసూయమహాయజ్ఞం చెయ్యటంవల్ల దేవేంద్రలోకాన్ని పొందాడు. హరిశ్చంద్రునికి ఆ మహిమాతిశయం అంతా రాజసూయ మహాయాగ కారణంగానే వచ్చిం దని గ్రహించి, యమసభలో రాజు లందరితో ఉన్న మీ తండ్రి నాతో ఇలా అన్నాడు.

### నారదుఁడు పాండురాజువచనంబులు ధర్మజుని కెఱింగించుట (సం. 2-11-65)

**క. జనపతులు రాజసూయం । బొనరించిన వారు శక్రునొద్దను సురపూ**
**జన లొందుచుండుదురు కో । రిన కోర్కులు వడయుచును హరిశ్చంద్రుక్రియన్. 88**

**ప్రతిపదార్థం:** జనపతులు= రాజులు; రాజ, సూయంబు+ఒనరించినవారు= రాజసూయ మహాయాగం చేసినవారు; హరిశ్చంద్రు, క్రియన్= హరిశ్చంద్రుడివలె; శక్రు, ఒద్దను= దేవేంద్రుడి దగ్గర; కోరిన, కోర్కులు; పడయుచును= పొందుతూ; సుర, పూజనలు+ఒందుచున్= దేవతలయొక్క పూజలు అందుకొంటూ; ఉండుదురు.

**తాత్పర్యం:** రాజసూయయాగం చేసిన రాజులంతా హరిశ్చంద్రునిలా తమ కోర్కెలు తీర్చుకొంటూ దేవతల పూజలు అందుకుంటూ దేవేంద్రుని దగ్గర ఉంటారు.

**చ. గొనకొని మర్త్యలోకమునకుం జని సన్మునినాథ! యిందు నా**
**యునికిని రాజసూయమఖ మున్నతిఁ జేసిన ధన్యు లింద్రునం**
**దునికియు నా తనూజున కనూనయశోనిధి యైన ధర్మనం**
**దనునకుఁ జెప్పి వాని నుచితస్థితిఁ బన్పుఁడు దానిఁ జేయఁగన్. 89**

**ప్రతిపదార్థం:** సత్+మునినాథ!= ఓమహామునీంద్రా!; గొనకొని= పూనుకొని; మర్త్య, లోకమునకున్+చని= మానవలోకానికి వెళ్ళి; ఇందున్= ఈ యమసభలో; నా, ఉనికిని= నేను ఉండటాన్ని; రాజసూయ, మఖము+ఉన్నతిన్+చేసిన, ధన్యులు= రాజసూయ యజ్ఞాన్ని గొప్పగా చేసిన పుణ్యాత్ములు; ఇంద్రునందున్+ఉనికియు= ఇంద్రసభలో ఉండటాన్ని; నా, తనూజునకున్= నా కుమారునికి; అనూన, యశోనిధి+ఐన= సాటిలేని కీర్తికి స్థానమైన; ధర్మనందనునకున్, చెప్పి; వానిన్= అతడిని; దానిన్, చేయఁగన్= ఆ యజ్ఞాన్ని చెయ్యటానికి; ఉచిత, స్థితిన్, పన్పుఁడు= తగువిధంగా ఆజ్ఞాపించండి.

**తాత్పర్యం:** ఓ నారద మునీంద్రా! మీరు మానవలోకానికి వెళ్ళి నేను యమసభలో ఉన్న విషయాన్ని, రాజసూయ మహాయాగం చేసిన పుణ్యాత్ములంతా ఇంద్రసభలో ఉన్న విషయాన్ని, కీర్తి సంపన్నుడైన నా కుమారుడు ధర్మరాజుకు చెప్పండి. ఆ యాగం చెయ్యటానికి ఉచితరీతిని అతణ్ణి ఆజ్ఞాపించండి.

**విశేషం:** అర్థనైర్మల్యంతోకూడిన శిథిలబంధం ప్రసాదగుణాన్ని రూపొందించి పాండురాజు చిత్తవృత్తిని వ్యక్తంచేస్తున్నది. (సంపా.)

**చ. అనుపమశక్తిమంతులు మదాత్మజు లేవురు దేవతావరం**
**బున నుదయించి యున్న కృతపుణ్యులు; వారలలోన నగ్రజుం**
**డనఘుఁడు రాజసూయము మహామతిఁ జేయఁగ నోపు శత్రుసూ**
**దనుఁ డయి సార్వభౌముఁ డయి తమ్ముల బాహుబలంబు పెంపునన్. 90**

**ప్రతిపదార్థం:** అనుపమ, శక్తిమంతులు= సాటిలేని బలం కలవాళ్ళు; మత్+ఆత్మజులు= నాయొక్కకుమారులు; ఏవురు= ఐదుగురు; దేవతావరంబునన్= దేవతలయొక్కవరంచేత; ఉదయించి= పుట్టిఉన్న; కృత, పుణ్యులు= చేయబడిన పుణ్యం కలవారు - అంటే పుణ్యపురుషులు; వారలలోనన్= వారిలో; అగ్రజుడు= పెద్దవాడు; అనఘుఁడు= పాపరహితుడు-అంటే పుణ్యాత్ముడు; రాజసూయము; మహా, మతిన్= గొప్పబుద్ధితో; తమ్ముల= తమ్ములయొక్క; బాహు, బలంబు, పెంపునన్= భుజబలంయొక్క ఆధిక్యంతో; శత్రుసూదనుఁడు+అయి= శత్రువుల్ని జయించినవాడై; సార్వభౌముఁడు+అయి= భూమినంతా పరిపాలించేవాడయి; చేయఁగన్+ఓపున్= చెయ్యగలడు.

**తాత్పర్యం:** నాకుమారులు ఐదుగురు సాటిలేని శక్తి సంపన్నులు. దేవతల వరాలవల్ల పుట్టిన పుణ్యాత్ములు. పెద్దవాడు ధర్మజుడు తమ్ముల భుజబలంతో శత్రువుల్ని జయించి, చక్రవర్తి అయి రాజసూయమహాయాగం చెయ్యగలడు.

**విశేషం:** పైపద్యంలోవలె ఇందులోనూ ప్రసాదగుణం ప్రసన్నమౌతున్నది; ధర్మరాజు ధీరోదాత్తవ్యక్తిత్వాన్ని వ్యంజింపచేస్తున్నది.(సంపా.)

**వ. అట్లేని నాకు నస్మత్పితృ పితామహ నివహంబుతోడ నాకాధిపలోక సుఖావాప్తి యగు ననిన నప్పాండురాజు వచనంబు నీ కెఱింగించు వేడుక నిట వచ్చితి. 91**

**ప్రతిపదార్థం:** అట్లు+ఏనిన్= ఆ విధంగా అయితే-అంటే-ధర్మరాజు రాజసూయమహాయాగం చేస్తే; నాకున్= నాకు; అస్మత్+పితృ, పితామహ, నివహంబుతోడన్= నాతండ్రి తాతల సమూహంతోకూడ; నాక+అధిప, లోక, సుఖ+అవాప్తి, అగున్= స్వర్గానికి అధిపతి అయిన ఇంద్రునియొక్క లోకంలోని సుఖాన్ని పొందటం కలుగుతుంది; అనినన్= అని అనగా; ఆ+పాండురాజు, వచనంబు= ఆ పాండురాజు యొక్కమాట; నీకున్; ఎఱింగించు, వేడుకన్= నీకు తెలియచెయ్యాలన్న కుతూహలంతో; ఇటన్= ఇచ్చటికి; వచ్చితిన్= వచ్చాను.

**తాత్పర్యం:** 'ఆ విధంగా ధర్మరాజు రాజసూయం చేస్తే, నాకు పితృ పితామహ సమూహంతో ఇంద్రలోక సుఖప్రాప్తి కలుగుతుంది' అని ఆ పాండురాజు చెప్పినమాట నీకు తెలియచెయ్యాలన్న కుతూహలంతో ఇక్కడికి వచ్చాను.

**క. న్యాయమున రాజసూయము । సేయుము; నీ పితృగణంబుఁ జెచ్చెర నధిక**
**శ్రీయుత సురగణపూజ్యులఁ । జేయుము; శక్రుసభ నుండఁ జేయుము వారిన్. 92**

**ప్రతిపదార్థం:** అధిక, శ్రీ, యుత= గొప్ప సంపదతో కూడిన ధర్మరాజా!; న్యాయమునన్= న్యాయమార్గంలో; రాజసూయము, చేయుము; చెచ్చెరన్= వేగమే; సురగణపూజ్యులన్= దేవతల సమూహంచేత పూజించదగిన వాళ్ళనుగా; చేయుము; వారిన్= వాళ్ళను; శక్రుసభన్= దేవేంద్రుని సభలో; ఉండన్+చేయుము= ఉండేటట్లు చేయుము.

**తాత్పర్యం:** మహాసంపన్నుడవైన ఓ ధర్మరాజా! న్యాయమార్గంలో రాజసూయం చేసి నీ పితృదేవతాసమూహం దేవతాసమూహంచే శీఘ్రమే పూజలందుకొనేటట్లు, దేవేంద్రసభలో ఉండేటట్లు చెయ్యి.

**విశేషం:** పాండురాజు కోరికను మిత్రసమ్మితంగా ప్రబోధించిన నారదమహర్షియొక్క ఈ వాక్యాలు సభాపర్వకథార్థాలకు బీజతుల్యాలు. భవిష్యద్ద్రష్ట అయిన శ్రీకృష్ణుడు రాజసూయయాగా ధ్వరయోగ్యమైన సభను మయునిచేత నిర్మింపచేసి, నాంది నాలపించి నిష్క్రమించిన సూత్రధారునివలె ద్వారవతీ నగరానికి వెళ్ళాడు. నాంద్యంతాన ప్రవేశించే మరొక సూత్రధారునివలె నారదుడు వచ్చి, సభాసార్థక్యాన్ని సాధించే సవనప్రయోగాన్ని పితృవాక్యపరిపాలనధర్మంలోని అంగంగా నిర్దేశించాడు. నారదుని హితవాక్యాలతో కూడిన ఈ పద్యంలో 'సమత' అనే శబ్దగుణం సందర్భోచితంగా రాణించి, ఋషియొక్క సమతాబుద్ధిని ప్రసన్నతను ధ్వనింపజేస్తున్నది. పద్యనిర్మాణంలోని సమతకూడా గమనించతగింది. (సంపా.)

**వ. 'దిగ్విజయోపార్జితంబులయిన ధనంబుల బ్రాహ్మణసంతర్పణంబును ధర్మమార్గంబునం జాతుర్వర్ణాశ్రమ రక్షణంబునుం జేసి సామ్రాజ్యంబు పూజ్యంబై యొప్పం బ్రకాశింపుము; మఱి రాజసూయంబు బహు**

**విఘ్నంబు, బ్రహ్మరాక్షసులు దానిరంధ్రంబ రోయుచుండుదు; రదియును నిర్విఘ్నంబున సమాప్తం బయ్యేనేని నిఖిల ప్రజాప్రళయ కారణంబయిన రణంబగు'నని చెప్పి నారదుం డరిగినఁ దమ్ములంజూచి ధర్మతనయుండు ధౌమ్య ద్వైపాయన సుహృద్బాంధవ మంత్రి సమక్షంబున ని ట్లనియె. 93**

**ప్రతిపదార్థం:** దిక్+విజయ+ఉపార్జితంబులు+అయిన= దిగ్విజయంచేత సంపాదించబడిన; ధనంబులన్= సంపదలతో; బ్రాహ్మణ, సంతర్పణంబును= బ్రాహ్మణుల్ని తృప్తి పెట్టటం; ధర్మ, మార్గంబునన్, చాతుర్వర్ణ్య+ఆశ్రమ, రక్షణంబునున్+చేసి= ధర్మమార్గంలో బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య శూద్రవర్ణాలవారిని, బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమాలను రక్షించటంచేత; సామ్రాజ్యంబు; పూజ్యంబు+ఐ= గౌరవించదగిందై; ఒప్పన్= శోభిల్లగా; ప్రకాశింపుము; మఱి; రాజసూయంబు; బహు, విఘ్నంబు= పెక్కు విధాలైన ఆటంకాలతో కూడుకొన్నది; బ్రహ్మరాక్షసులు; దాని; రంధ్రంబు+అ= దోషాన్నే; రోయుచుండుదురు= వెదుకుతూ ఉంటారు; అదియును= ఆ రాజసూయంకూడ; నిర్విఘ్నంబున= నిరాటంకంగా; సమాప్తంబు+అయ్యేన్+ఏనిన్= ముగిసినట్లయితే; నిఖిల, ప్రజా, ప్రళయ, కారణంబు, అయిన= సకలప్రజల నాశనానికి కారణమైన; రణంబు+అగున్+అని= యుద్ధం జరుగుతుం దని; చెప్పి; నారదుండు+అరిగినన్= నారదుడు వెళ్ళగా; ధర్మతనయుండు= ధర్మరాజు; తమ్ములన్+చూచి; ధౌమ్య, ద్వైపాయన, సుహృత్, బాంధవ, మంత్రి, సమక్షంబునన్= ధౌమ్యుడు, వ్యాసుడు, మిత్రులు, బంధువులు, మంత్రులు- వీళ్ళందరియెదుట; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'దిగ్విజయంచేత సంపాదించిన ధనంతో బ్రాహ్మణులను తృప్తిపెట్టు. ధర్మమార్గాన నాలుగు వర్ణాలవాళ్ళని, బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థసన్యాసాశ్రమాల్ని (మునుల నివాసాలైన ఆశ్రమాల్ని) రక్షించు. నీ సామ్రాజ్యం గౌరవార్హమై శోభించేవిధంగా ప్రకాశించు. కాగా రాజసూయానికి అనేకవిఘ్నాలు కలుగుతాయి. బ్రహ్మరాక్షసులు దాన్ని భంగంచేసే మార్గాన్ని వెదుకుతుంటారు. నిర్విఘ్నంగా యాగం పూర్తిఅయితే సకల ప్రజా నాశకమైన మహాయుద్ధం సంభవిస్తుంది'- అని నారదమహర్షి చెప్పి అక్కడినుండి వెళ్ళాడు. ధర్మరాజు తన తమ్ముళ్ళవైపు చూచి ధౌమ్య, వ్యాస, మిత్ర, బంధు, మంత్రుల ఎదుట ఇలా అన్నాడు.

**విశేషం:** నారదుడి పలుకులు ప్రస్తావనలో సూత్రధారుడు కథోద్ఘాతం అనే అంగం ప్రయోగిస్తున్న స్ఫూర్తిని కలిగిస్తూ నన్నయ రచనలో నాటకీయతను ధ్వనింపచేస్తున్నాయి. ధర్మజుడు రాజసూయం చేసేటప్పుడు అనేక విఘ్నాలను ఎదుర్కోవలసి వస్తుందనీ, యజ్ఞం నిర్విఘ్నంగా ముగిస్తే కాలాంతరంలో ప్రజాక్షయం కలిగే ప్రళయంవంటి ఒక మహాయుద్ధం సంభవిస్తుం దనీ నారదుడు సూచించాడు. కలహభోజనుడిచేత ఈ అంశాన్ని కబురంపించటం, ఆయన ధర్మరాజుకు నిర్దేశించటం భావికథార్థధ్వనిలో ప్రవర్తిల్లిన ఔచిత్యం. రాజసూయానికి రంగంగా నిలిచింది మయసభ; ధర్మజుడి అంతరంగానికి ప్రేరకంగా సాగింది నారద వాక్యసుధ. (సంపా.)

### ధర్మరాజు నారదవచనప్రబోధితుండై రాజసూయయజ్ఞంబు సేయుటకు నాలోచించుట (సం. 2-12-1)

**క. పితృసంకల్పము సేయఁగ । సుతుల కవశ్యమును వలయు; సుతజన్మఫలం
బతిముదమునఁ బితృవరులకు । హిత మొనరించుటయ కాదె యెంతయు భక్తిన్. 94**

**ప్రతిపదార్థం:** పితృ, సంకల్పము= తండ్రియొక్క కోరిక; సుతులకున్= కుమారులకు; అవశ్యమును, చేయఁగన్, వలయున్= తప్పక చేయాలి; సుతజన్మ, ఫలంబు= పుత్రుని పుట్టుకకు ఫలం; పితృ వరులకున్= పూజ్యులైన తండ్రులకు; ఎంతయున్, భక్తిన్= ఎంతోభక్తితో, అతిముదమునన్= మిక్కిలి సంతోషంతో; హితము+ఒనరించుట+అ, కాదు+ఎ= మేలు చేయటమే కదా!

**తాత్పర్యం:** తండ్రి కోర్కెను తీర్చటం తనయుల విధి, పుత్రుడుగా పుట్టినందుకు ఫలం పితృదేవులకు ఎంతో భక్తితో, సంతోషంతో మేలు చెయ్యటమే కదా!

**విశేషం:** ఈపద్యం పుత్రధర్మప్రబోధకం. చేయఁగ. వలయు= వ్యస్తంగా ఉన్నాయి.

**క. 'పరలోకనిలయు లగు మీ । గురులకు దీనన హితం బగున్ లోకభయం**
**కరసంగరమును గాలాం । తరమున నగు' నని విరించితనయుఁడు సెప్పెన్. 95**

**ప్రతిపదార్థం:** పరలోక, నిలయులు+అగు= పరలోకం నివాసస్థానంగా కలిగి ఉన్నవారయిన; మీగురులకున్= మీ పెద్దలకు అంటే- మీ పితరులకు; దీనన్+అ= దీనిచేతనే-ఈ రాజసూయము చెయ్యటంవల్లనే; హితంబు+అగున్= మేలు కలుగుతుంది; లోక, భయంకర, సంగరమును= ప్రపంచానికి భయంకరమైన యుద్ధంకూడ; కాల+అంతరమునన్+అగున్= తరువాతికాలంలో జరుగుతుంది; అని; విరించి, తనయుఁడు= బ్రహ్మదేవునియొక్క కుమారుడైన నారదుడు; చెప్పెన్.

**తాత్పర్యం:** 'ఈరాజసూయంవల్ల పరలోకవాసు లయిన మీ పెద్దలకు మేలు కలుగుతుంది. లోకంలో మున్ముందు మహాభయంకరమైన సంగ్రామం సంభవిస్తుంది' - అని నారదమహర్షి చెప్పాడు.

**క. పితృగణహితార్థముగ స । త్క్రతు వొనరింపంగ బుద్ధిగలదు, ప్రజా సం**
**హృతి తత్క్రతువున నగు నని । మతి నాశంకయును గలదు మానుగ నాకున్. 96**

**ప్రతిపదార్థం:** మానుగన్= తగువిధంగా; నాకు; పితృ, గణ, హిత+అర్థముగన్= పితృదేవతల సమూహంయొక్క మేలుకొరకు; సత్+క్రతువు+ఒనరింపంగన్= శ్రేష్ఠమైన ఆ రాజసూయయాగం చెయ్యటానికి; బుద్ధి= కోరిక; కలదు; తత్, క్రతువునన్= ఆ యాగంవల్ల; ప్రజా, సంహృతి= ప్రజానాశం; అగున్+అని= కలుగుతుం దని; ఆశంకయును= అనుమానం (భయం) కూడ; కలదు.

**తాత్పర్యం:** పితృదేవతల మేలుకోరి ఆ మహాయాగం చెయ్యాలన్న కోరిక ఉంది. కాని, ఆ యాగం చెయ్యటంవల్ల ప్రజానాశం కలుగుతుందన్న భయం కూడా ఉంది.

**వ. ఏమి సేయుదు నని దోలాయమాన మానసుం డయి యున్న ధర్మరాజునకు ధౌమ్యప్రభృతు లి ట్లనిరి. 97**

**ప్రతిపదార్థం:** ఏమి, చేయుదున్+అని; డోలాయమాన, మానసుండు+అయి= ఊయలవలె ముందు వెనుకలకు ఊగుతున్న మనస్సు కలవాడై; ఉన్న; ధర్మరాజునకు; ధౌమ్య, ప్రభృతులు= ధౌమ్యుడు మొదలయినవారు; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** ఏమి చెయ్యటానికి తోచక ఉయ్యాలమాదిరిగా ముందువెనుకలకు ఊగుతున్న మనస్సు కల ధర్మరాజుతో ధౌమ్యాదులు ఇలా అన్నారు.

**ఉ. చేయుము రాజసూయ మెడసేయక; దానన చేసి దోషముల్**
**వాయు నిలేశ! భూప్రజకుఁ; బార్థివులెల్ల భవత్ప్రతాపని**

**ర్జేయులు; సర్వసంపదలు చేకొనఁగాఁ దఱియయ్యెఁ గౌరవా**
**మ్నాయలలామ! నీ కెనయె మానవనాథులు మానుషంబునన్.** **98**

**ప్రతిపదార్థం:** ఇలా+ఈశ!= ఓ భూపతీ-ధర్మరాజా!; ఎడ, చేయక= ఆలస్యం చెయ్యకుండ; రాజసూయము, చేయుము; దానిన్+అ, చేసి= దానిచేతనే; భూప్రజకున్= లోకంలోని జనులకు; దోషముల్= పాపాలు; పాయున్= తొలగుతాయి; పార్థివులు+ఎల్లన్= రాజులంతా; భవత్, ప్రతాప, నిర్జేయులు= నీయొక్క పరాక్రమంచేత జయించతగినవారు; సర్వసంపదలు; చేకొనన్+కాన్= తీసుకోటానికి; తఱి+అయ్యెన్= సమయం అయింది; కౌరవ+ఆమ్నాయ, లలామ!= కౌరవ వంశశ్రేష్ఠా!; మానుషంబునన్= మానవయత్నంలో (పురుషకారంలో); మానవనాథులు= రాజులు; నీకున్; ఎనయె= సాటియా, సమానమా!

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆలస్యం కాకుండా రాజసూయం జరిపించు. దానివల్ల ప్రజల పాపాలు తొలగిపోతాయి. రాజులంతా నీ ప్రతాపానికి లొంగిపోయేవాళ్ళే. సర్వసంపదలు సేకరించటానికి ఇది తగిన సమయం. ఓ కౌరవాన్వయశ్రేష్ఠా! మానవయత్నంలో రాజు లెవ్వరూ నీకు సరిగారు.

**విశేషం:** ఈ పద్యంలో అర్థవ్యక్తి అనే గుణం సార్థకంగా పోషించబడింది. రాజసూయయాగం చేయాలా వద్దా అని డోలాయమానమైన మనస్సుతో ఉన్న ధర్మరాజుకు నిశ్చయబుద్ధి కలిగేటట్లు ధౌమ్యాదులు ఇందులో వక్తవ్యార్థం స్ఫుటంగా ఝటిత్యర్థస్ఫోరకంగా వ్యక్తమయ్యేటట్లు చెప్పటంవలన అర్థవ్యక్తి రూపుకట్టింది. ఈ పద్యరచనలో వాక్యనిర్మాణపద్ధతికూడ దానికి తోడ్పడుతున్నది. 'చేయుము రాజసూయ మెడసేయక'- అనే వాక్యం విధ్యర్థక క్రియాపదంతో ప్రారంభమై ధర్మజుని అనుమానాన్ని నివారిస్తున్నది. ఆ తరువాత రాజసూయ మనే కర్మను వాడటం, వెంటనే 'ఎడసేయక' అని వాడి, వెంటనే నిర్వహించవలసింది అని నిర్దేశించటం జరిగింది. ఈ పద్యంలోని తరువాతివాక్యాలన్నీ ఆలస్యంచేయకుండా రాజసూయం ఎందుకు చేయాలో నిరూపించేవే. అందుకు మూడు కారణాలు-చెప్పారు. 1. ప్రజలకు దోషాలు తొలుగుతాయి. అందువలన దేశంలో ఈతిబాధలు లేకుండ జనులు సుఖంగా జీవించగలుగుతారు-అంటే అది విశ్వశ్రేయోదాయక మని భావం. 2. రాజు లందరు ధర్మజునిచేత జయింపబడి ఉన్నారు. 3. అందువలన వా రందరు తమసంపదలను కప్పాలుగా, కానుకలుగా ధర్మజుడికి అర్పించగలరు. ఈ మూడుకారణాలవలన ధర్మరాజుకు ఆ కాలంలో దీటైనవాడు మరొక రాజు లేడు. కాబట్టి రాజసూయానికి అదే సమయ మని నొక్కిచెప్పారు. 'ఆలస్యా దమృతం విషమ్' అనే న్యాయంచొప్పున అనుకూలమైన కాలాన్ని అనువుగా ఉపయోగించుకొని అభ్యుదయాలను సాధించు మని ధౌమ్యాదులు బోధించారు. సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనం' అనే లక్షణంచేత ఇందులో కావ్యలింగాలంకారం ఉన్నది. 'నీ కెనయె' అనేది అర్థాంతరసంక్రమిత వాచ్యం. పైన చెప్పిన కారణాలవలన ఏర్పడిన సమున్నతస్థితివలననే కాక, సర్వసద్గుణాలలోనూ, మహాపరాక్రమవంతులైన తమ్ములను కలిగి ఉండటంలోను, పరమాత్ముడైన శ్రీకృష్ణుని అండదండలు ఉండటంలోనూ ధర్మరాజుకు సాటిగా నిలిచే రాజులు మరెవ్వరూ భూతలంలో లే రని తాత్పర్యం. (సంపా.)

**వ.** **అనిన వారల వచనంబుల కనుగుణంబుగా ననుజానుమతుండయి ధర్మరాజు రాజసూయంబు సేయ సమకట్టి, 'దీని నిర్విఘ్నంబున నిర్వహించుట కనాదినిధనుం డాదిపురుషుండు పురుషోత్తముండు పుండరీకాక్షుం డజుం డయ్యును జగద్ధితార్థంబుగా మర్త్యంబున జనియించిన యమ్మహాత్ముండు వాసుదేవుండ యోపుంగాని యన్యుల కశక్యం' బని యప్పుడ యాప్తచరులం బిలువంబనిచి.** **99**

**ప్రతిపదార్థం:** అనిన, వారల; వచనంబులకున్; అనుగుణంబుగాన్= తగినట్లుగా; అనుజ+అనుమతుండు+అయి= తమ్ములచేత సమ్మతించబడినవాడై, అంటే - తమ్ముల సమ్మతి పొంది; ధర్మరాజు; రాజసూయంబు; చేయన్; సమకట్టి= పూనుకొని; దీనిన్= ఈ రాజసూయాన్ని; నిర్విఘ్నంబునన్= ఆటంకంలేకుండా; నిర్వహించుటకున్= జరపటానికి; అనాది, నిధనుండు=

పుట్టుక, చావు లేనివాడు; ఆదిపురుషుండు= మొట్టమొదటిపురుషుడు; పురుష+ఉత్తముండు= పురుషుల్లో శ్రేష్ఠుడు; పుండరీక+అక్షుండు= తెల్ల తామరలవంటి కన్నులు కలవాడు; అజుండు= పుట్టుకలేనివాడు-విష్ణువు; అయ్యును; జగత్+హిత+అర్థంబుగాన్= లోకానికి మేలు చేయటంకోసం; మర్త్యంబునన్= భూలోకంలో; జనియించిన= పుట్టిన; ఆ+మహాత్ముండు; వాసుదేవుండు+అ= వసుదేవుని పుత్త్రుడైన శ్రీకృష్ణుడే; ఓపున్+కాని= సమర్థుడవుతాడు గాని; అన్యులకున్+ఇతరులకు; అశక్యంబు+అని= అసాధ్యమని; అప్పుడు+అ= అప్పటికప్పుడే; ఆప్తచరులన్= ఆప్తులైన సేవకులను; పిలువన్+పనిచి= పిలిపించి.

**తాత్పర్యం:** ధౌమ్యుడు మొదలయినవాళ్ళు చెప్పిన దానికి తగినట్లే ధర్మరాజు తమ్ముల సమ్మతి పొందాడు. రాజసూయం చేయటానికి పూనుకొన్నాడు. 'ఈ యాగాన్ని నిర్విఘ్నంగా నిర్వహించటానికి శ్రీకృష్ణుడే సమర్థుడనుకున్నాడు. ఇతరు లెవ్వరు కా దనుకున్నాడు. ఎందుకంటే - శ్రీమహావిష్ణువే శ్రీకృష్ణుడు. ఆద్యంతరహితుడు, ఆదిపురుషుడు, పురుషోత్తముడు అయిన శ్రీమహావిష్ణువు పుట్టుకలేనివాడే అయినా-లోకానికి మేలు చెయ్యా లని వసుదేవసుతుడుగా మానవలోకంలో అవతరించాడు. అందుచేత ఆ మహాత్ముడే ఈ యాగాన్ని నిర్విఘ్నంగా జరిపించటానికి సమర్థు డని, ఆప్తులైన సేవకుల్ని పిలిపించి.

**క. అనిలజవాశ్వంబులఁ బూ । నిన యరదం బెక్కి ధారుణీధరు మధుసూ**
**దను దోడ్తెం డని ముదమునఁ । బనిచి తదాగమనకాంక్షఁ బార్థివుఁ డుండెన్. 100**

**ప్రతిపదార్థం:** అనిల, జవ+అశ్వంబులన్= వాయువేగం గల గుర్రాల్ని; పూనిన= కట్టిన; అరదంబు+ఎక్కి= రథాన్నిఎక్కి; ధారుణీ, ధరున్= భూభారాన్ని, నిర్వహించేవాడు; మధుసూదనున్= మధు డనే రాక్షసుడిని సంహరించిన వాడు అయిన శ్రీకృష్ణుని; తోడ్తెండు+అని= వెంట పిలుచుకొనిరం డని; ముదమునన్= సంతోషంతో; పనిచి= పంపి; తత్+ఆగమన కాంక్షన్= ఆయన రాకను కోరుతూ; పార్థివుఁడు+ఉండెన్= ధర్మరాజు ఉన్నాడు.

**తాత్పర్యం:** 'వాయువేగం గల గుర్రాల్ని కట్టిన రథంఎక్కి వెళ్ళండి. ధరాభారాన్ని వహించేవాడు, మధుసూదనుడు అయిన శ్రీకృష్ణుణ్ణి వెంటతీసుకురండి' అని సంతోషంతో ధర్మరాజు సేవకుల్ని పంపాడు. ఆయన రాకకై ఎదురు చూస్తూ ఉన్నాడు.

**విశేషం:** ఈ సందర్భంలో శ్రీకృష్ణుడికి ధారుణీధరుడు, మధుసూదనుడనే విశేషణాలు ప్రయోగించటం ఎంతో ఉచితంగా ఉంది. రాజసూయమహాయాగనిర్వహణభారం సామాన్యమైంది కాదు. రాజసూయానికి ముందు దిగ్విజయయాత్ర జరగాలి. తరువాత దుర్మార్గులవల్ల ప్రమాదంలేకుండ యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగాలి. అందువల్ల, భూభారాన్ని వహించేవాడు, మధువనే రాక్షసుణ్ణి సంహరించినవాడు అయిన శ్రీకృష్ణుణ్ణి తీసుకొని రమ్మనటం ఎంతో అర్థవంతంగా ఉంది. నిరాటంకంగా దిగ్విజయయాత్ర పూర్తికావటానికి, నిర్విఘ్నంగా యజ్ఞం పరిసమాప్తి నొందటానికి, మున్ముందు జరిగే జరాసంధ శిశుపాలవధల్లో శ్రీకృష్ణుడు నిర్వహించనున్న గణనీయపాత్రను సూచించేదిగా ఉంది.

## శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబునకు వచ్చుట (సం. 2-12-30)

**వ. అయ్యుధిష్ఠిరు సందేశంబున దాశార్హుండును దద్దర్శనోత్సుకుం డయి ద్వారవతి గదలి యతిత్వరితగతిం జని నిరంతర ప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకు వచ్చి. 101**

**ప్రతిపదార్థం:** ఆ+యుధిష్ఠిరు, సందేశంబునన్= ఆ ధర్మరాజు పంపిన సందేశంతో; దాశార్హుండును= దశార్హుని సంతతివాడు-యాదవుడు అయిన - శ్రీకృష్ణుడు; తత్+దర్శన+ఉత్సుకుండు+అయి= ఆ ధర్మరాజును చూడాలన్న కుతూహలం కలవాడై; ద్వారవతి, కదలి= ద్వారకానగరంనుండి బయలుదేరి; అతి, త్వరితగతిన్= మిక్కిలి వేగంతో కూడిన గమనంతో; చని= వెళ్ళి; నిరంతర ప్రయాణంబులన్= మధ్య ఎక్కడా ఆగకుండ చేసిన ప్రయాణాలతో; ఇంద్రప్రస్థపురంబునకున్; వచ్చి.

**తాత్పర్యం:** ధర్మరాజు పంపిన సందేశాన్ని అందుకొని శ్రీకృష్ణుడుకూడ, ఆయనను చూడాలన్న కుతూహలంతో ద్వారవతి నుండి బయల్దేరి, ఎక్కడా మధ్యలో ఆగకుండ ప్రయాణాలు చేసి ఇంద్రప్రస్థపురానికి వచ్చాడు.

**ఉ. కుంతికి ధర్మనందనునకున్ వినయంబున మ్రొక్కి, భీము ధీ**
**మంతునిఁ గౌఁగిలించుకొని, మధ్యమపాండవు మాద్రిపుత్త్రులన్**
**సంతతభక్తినమ్రులఁ బ్రసాదనయోత్కటదృష్టిఁ జూచి, తా**
**నెంతయుఁ బ్రీతి నెత్తికొనియెన్ మహినెత్తిన పుణ్యుఁ డున్నతిన్. 102**

**ప్రతిపదార్థం:** మహిన్+ఎత్తిన, పుణ్యుఁడు= భూమిపై అవతారమెత్తిన పుణ్యాత్ముడు లేదా, (వరాహావతారంలో) భూమిని ఎత్తిన పుణ్యాత్ముడు-శ్రీకృష్ణుడు; ఉన్నతిన్= గొప్పగా; కుంతికిన్; ధర్మనందనునకున్; వినయంబునన్; మ్రొక్కి= నమస్కరించి; ధీమంతునిన్= బుద్ధిమంతుని; భీమున్= భీముని; కౌఁగిలించుకొని; సంతత, భక్తి, నమ్రులన్= ఎల్లప్పుడు భక్తితో శిరం వంచిన వాళ్ళయిన; మధ్యమ, పాండవున్= పాండవుల్లో నడిమివాడైన అర్జునుణ్ణి; మాద్రిపుత్త్రులన్= మాద్రియొక్క కుమారులైన నకుల సహదేవుల్ని; ప్రసాద, నయ+ఉత్కట, దృష్టిన్= అనుగ్రహభావం, మృదుభావం అధికమైన దృష్టితో; చూచి; తాన్= తాను; ఎంతయున్= మిక్కిలి; ప్రీతిన్= ప్రేమతో; ఎత్తికొనియెన్= (కొద్దిగా) పైకెత్తుకొన్నాడు.

**తాత్పర్యం:** భూమిమీద అవతరించిన పుణ్యపురుషుడు, ఇదివరలో వరాహంగా అవతరించి భూమిని ఎత్తిన పుణ్యాత్ముడు అయిన శ్రీకృష్ణుడు కుంతీ ధర్మజులకు సవినయంగా నమస్కరించాడు. బుద్ధిమంతుడైన భీమసేనుణ్ణి కౌగిలించుకొన్నాడు. భక్తిభావంతో శిరస్సువంచి నిలిచిన అర్జున నకుల సహదేవుల్ని అనుగ్రహించినట్లు అల్లన చూచి అలా పైకెత్తుకొన్నాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడు పెద్దలకు నమస్కరించి భక్తిని, పిన్నలను కౌగిలించుకొని ప్రేమను ప్రదర్శించాడు. 'మహినెత్తినపుణ్యుడు' అంటే వరాహావతారంలో భూమిని రక్షించినవాడనే అర్థాన్నికూడ భావించవచ్చు. ఈ సందర్భంలో అర్జున నకుల సహదేవులను ప్రేమతో ఎత్తుకొన్న శ్రీకృష్ణుని 'మహినెత్తిన పుణ్యుఁ' డనటం ఎంతో రమ్యంగా ఉంది. ఈవిధంగానే పాండవులను కష్టసమయాల్లో రక్షిస్తా డని వస్తుధ్వని. శ్రీకృష్ణుడు 'ప్రసాదనయోత్కటదృష్టిఁ జూచె'ననటంలో నన్నయ తనరచనలోని ప్రసాదగుణాన్ని ధ్వనిమయం చేశాడు.

**వ. తదనంతరంబ ధర్మతనయుండు. 103**

**తాత్పర్యం:** అటు పిమ్మట ధర్మరాజు.

**క. పరమాసనమున నునిచి య । పరిమిత హర్షంబుతో సపర్యావిధులన్**
**గురుఁ బూజించిన విధమునఁ । గురువృషభుఁ డశేషలోకగురుఁ బూజించెన్. 104**

**ప్రతిపదార్థం:** కురు, వృషభుఁడు= కురువంశశ్రేష్ఠుడైన ధర్మరాజు; పరమ+ఆసనమునన్= ఉన్నతమైన పీఠంపై; ఉనిచి= కూర్చుండబెట్టి; అపరిమిత, హర్షంబుతోన్= మిక్కిలి ఆనందంతో; గురున్= గురువును; పూజించిన, విధమునన్= పూజించినట్లు; అశేష లోకగురున్= అన్ని లోకాలకు గురువైన వానిని- శ్రీకృష్ణుణ్ణి; పూజించెన్= పూజించాడు.

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠుడైన ధర్మరాజు - సర్వలోకగురుడైన శ్రీకృష్ణుణ్ణి, ఉన్నతాసనంమీద కూర్చోపెట్టాడు. అంతులేని ఆనందంతో, అన్ని ఉపచారపద్ధతులతో, గురువును పూజించినట్లు పూజించాడు.

**విశేషం:** అలం: ఉపమ. 'గురు' శబ్దానికి తండ్రి, పెద్ద, అనే రెండర్థాలను భావింపవచ్చును. గురు కురు శబ్దాలవలన అక్షరరమ్యత రచనకు కలిగింది.

**క.** **ఏమఱక జనుల యోగ । క్షేమంబుల నడపుచున్న కృష్ణుని యోగ**
**క్షేమంబు లడిగి యపుడు మ । హాముదమున ధర్మసుతుఁడు హరి కి ట్లనియెన్.** **105**

**ప్రతిపదార్థం:** అపుడు; ఏమఱక= మరవక; జనుల, యోగక్షేమంబుల; నడపుచున్న; కృష్ణుని; యోగక్షేమంబులు; అడిగి; ధర్మసుతుఁడు; మహా, ముదమునన్= మిక్కిలి ఆనందంతో; హరికిన్+ఇట్లు+అనియెన్= శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** ఏమరుపాటు లేక, ఎల్లప్పుడు జనుల యోగక్షేమాల్ని నడిపే శ్రీకృష్ణపరమాత్మనే ధర్మజుడు యోగక్షేమాలు అడిగాడు. మహానందంతో ఇలా అన్నాడు.

**విశేషం:** 'యోగక్షేమం వహా మ్యహం' అని ప్రకటించిన పరమాత్ముడు శ్రీకృష్ణుడు. అతనిని లౌకికాచారాన్ని అనుసరించి యోగక్షేమా లడిగాడట ధర్మరాజు. అంటే తమ యోగక్షేమాలనుగురించి (దిగ్విజయ యాత్ర, రాజసూయం రెండూ ముందున్నాయి కనుక) శ్రీకృష్ణునికి జ్ఞాపకం చేయటమే అందులోని చమత్కారం. ఉక్తివైచిత్ర్యంతో కూడికొనిన ధర్మజుని హర్షపూర్ణాలైన మాటలు మధురగుణపూర్ణాలు. (సంపా.)

**క.** **ధ్యేయుఁడవు సకల లోక । స్థేయుండవు నమ్రులకు విధేయుఁడవు నయో**
**పాయజ్ఞుఁడ విజ్జగముల । నీ యెఱుఁగని యవియుఁ గలవె నీరజనాభా!** **106**

**ప్రతిపదార్థం:** నీరజనాభా!= నీటినుండి పుట్టిన పద్మాన్ని బొడ్డుగా కలవాడా..పద్మనాభా! శ్రీకృష్ణా!; ధ్యేయుఁడవు= ధ్యానించదగినవాడివి; సకల, లోక, స్థేయుండవు= అన్నిలోకాల్లో స్థిరంగా ఉండేవాడివి; నమ్రులకున్= భక్తులకు; విధేయుఁడవు= లొంగి ఉండేవాడివి; నయ+ఉపాయజ్ఞుఁడవు= నీతిని, ఉపాయాలను తెలిసిన వాడివి; ఈ+జగములన్= ఈ లోకాల్లో; నీ+ ఎఱుఁగని; అవియున్= నీకు తెలియని విశేషాలుకూడా; కలవు+ఎ= కలవా? (లేవు.)

**తాత్పర్యం:** ఓ పద్మనాభా! శ్రీకృష్ణా! నీవు అందరిచేత ధ్యానించదగినవాడివి. అన్నిలోకాల్లో స్థిరంగా ఉండేవాడివి. భక్తులకు వశమైనవాడివి. నీతి, ఉపాయాలు తెలిసినవాడివి. ఈ లోకాల్లో నీకు తెలియని విశేషాలు ఏమున్నాయి?

**విశేషం:** అంత్యప్రాసలతో కూడికొన్న విశేషణాలను వాడి, మనసులోని శ్రీకృష్ణభక్తిని మధురంగా వ్యక్తంచేశాడు ధర్మరాజు. రాజసూయయాగ రక్షణదక్షతకు యోగ్యమైన విశేషణాలనే ఎన్నుకొని ఒకవరుసలో వాడటంలో ఉక్తివైచిత్ర్యం ఉన్నది. వినయగుణం వ్యక్తమయ్యేటట్లు రచనలో పృథక్పదత్వం రాణించింది. కాబట్టి ఈ పద్యంలోని గుణం మాధుర్యం. (సంపా.)

**వ. అయినను నాయర్థిత్వంబునంజేసి నీ కెఱింగించెద. 107**

**ప్రతిపదార్థం:** అయినను; నా, అర్థిత్వంబునన్+చేసి= నేను కోరికకలవాడినవటంచేత; నీకున్+ఎఱింగించెదన్= నీకు తెలియచేస్తాను.

**తాత్పర్యం:** అయినా నా కోరికను నీకు తెలియచేసుకుంటాను.

**సీ. 'పాండుమహీపతి పనిఁజేసి నారద । ముని వచ్చి వీ రెల్ల వినుచు నుండ**
**రాజసూయంబు తిరంబుగాఁ జేసి నీ । పితృపితామహులకు హితము సేయు**
**మని పంచె నన్నుఁ నెయ్యముననో, నాకట్టి । బలము సామర్థ్యంబుఁ గలుగు టెఱిఁగి**
**పంచెనో, తత్క్రతు ప్రారంభమున కొడం । బడితి వీ రిందఱుఁ గడఁగి దీని**

**ఆ. నిత్యసత్యవచన! నిపుణనిర్మలబుద్ధి । నిర్ణయించి పనుప నీ నియోగ**
**కాంక్ష నున్నవాఁడఁ గమలాక్ష!' యనిన ధ । ర్మాత్మజునకు నిట్టు లనియెఁ జక్రి. 108**

**ప్రతిపదార్థం:** కమల+అక్ష!= పద్మాలవంటి కన్నులు కల ఓ శ్రీకృష్ణా!; పాండు మహీపతి= పాండురాజుయొక్క; పనిన్+చేసి= పనికారణంగా; నారదముని; వచ్చి; వీరు+ఎల్లన్= వీరంతా; వినుచున్+ఉండన్= వింటూ ఉండగా; రాజసూయంబు= రాజసూయయాగాన్ని; తిరంబుగాన్+చేసి= స్థిరంగా చేసి; నీ, పితృ, పితామహులకున్= నీతండ్రి తాతలకు; హితము, చేయుము+ అని= మేలు చెయ్యవలసిందని; నన్నున్; పంచెన్= ఆజ్ఞాపించాడు; నెయ్యమునన్= ప్రేమచేతనో; నాకున్+అట్టి, బలము, సామర్థ్యంబున్= నాకు అలాంటి బలం, సామర్థ్యం; కలుగుట+ఎఱిఁగి= ఉండటం తెలుసుకొని; పంచెనో= ఆజ్ఞాపించాడో; నిత్య, సత్య, వచన!= ఎల్లప్పుడు సత్యాన్నే చెప్పేవాడా!; వీరు+అందఱున్= ఈసభలో ఉన్నవాళ్ళంతా; కడఁగి= పూనుకొని; దీనిన్= ఈ యాగాన్ని; నిపుణ, నిర్మల, బుద్ధిన్= నేర్పుతో కూడిన నిర్మలమైన బుద్ధితో; నిర్ణయించి; పనుపన్= ఆజ్ఞాపించగా; తత్+క్రతు, ప్రారంభమునకున్= ఆయాగాన్ని ప్రారంభించటానికి; ఒడంబడితిన్= అంగీకరించాను; నీ, నియోగకాంక్షన్= నీ ఆజ్ఞయందలి కోరికతో, అంటే నీ ఆజ్ఞకోసం; ఉన్నవాఁడన్= వేచి ఉన్నాను; అనినన్; చక్రి= చక్రాయుధం కలవాడు - శ్రీకృష్ణుడు; ధర్మ+ఆత్మజునకున్= యముని కుమారుడైన ధర్మరాజుకు; ఇట్టులన్+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! పాండురాజు పంపిస్తే నారద మహాముని వచ్చి, వీళ్ళంతా వింటూ ఉండగా, 'రాజసూయం చేసి పితృపితామహులకు మేలుచెయ్యి' అని చెప్పాడు. అది నా తండ్రి మీదిప్రేమతో చెప్పాడో!- లేక అందుకు తగిన శక్తిసామర్థ్యాలు నా కున్నా యని చెప్పాడో! వీళ్ళంతా నిర్మలబుద్ధితో ఎంతో నిపుణంగా ఆలోచించి, నిర్ణయించి నన్ను ప్రేరేపిస్తే ఆయాగాన్ని ప్రారంభించటానికి అంగీకరించాను. నీ ఆజ్ఞకోసం వేచిఉన్నాను.

**విశేషం:** ధర్మజుని మాటనేర్పుకు ఈ పద్యం చక్కని ఉదాహరణం. ఇక్కడ శ్రీకృష్ణునికి ప్రయోగించిన 'చక్రి' అనే విశేషణం మున్ముందు రాజసూయంలో ఆయన చక్రాయుధం నిర్వహించే పాత్రను సూచించేదిగా ఉంది. చక్రాయుధం - ఇది విశ్వకర్మనిర్మితం. దేవశిల్పి విశ్వకర్మ - తన కూతురు సంజ్ఞ, ఆమె భర్త అయిన సూర్యుడి తేజస్సుకు తాళలేక పోవటంచేత సూర్యుణ్ణి సానపట్టాడట; అప్పుడు రాలిన చూర్ణంతో చక్రాయుధాన్ని రూపొందించాడట!

### కృష్ణుఁడు ధర్మజునికి జరాసంధుని సామర్థ్యము నెఱిఁగించుట (సం. 2-13-1)

**క. కురువృషభ! సర్వగుణముల । సురుచిర తేజమున రాజసూయాఖ్య మహా**
**ధ్వరమునకు నీవ యర్హుఁడ । వరిసూదనశౌర్యు లయిన యనుజులబలిమిన్. 109**

**ప్రతిపదార్థం:** కురు, వృషభ!= కురు వంశ శ్రేష్ఠా!; సర్వ, గుణములన్= అన్ని సుగుణాలచేత; సురుచిర, తేజమునన్= గొప్పగా ప్రకాశించే పరాక్రమంచేత; అరి, సూదన, శౌర్యులు+అయి= శత్రువులను సంహరించగల శౌర్యం కలవాళ్ళయిన; అనుజుల బలిమిన్= తమ్ముల యొక్క బలంచేత; రాజసూయ+ఆఖ్య, మహా+అధ్వరమునకున్= రాజసూయం అనే పేరున్న మహాయాగం చేయటానికి; నీవు+అ= నీవే; అర్హుఁడవు= తగినవాడివి.

**తాత్పర్యం:** ఓ కురువంశశ్రేష్ఠా! యుధిష్ఠిరా! అన్ని సుగుణాలచేత, గొప్పగా ప్రకాశించే పరాక్రమంతో, శత్రుసంహారం చెయ్యగల శౌర్యవంతులైన తమ్ముళ్ళతో రాజసూయమహాయాగం చెయ్యటానికి నీవే సమర్థుడివి.

**వ. తొల్లి జమదగ్నిసుతుం డయిన రామునిచేత ధాత్రి యపగతక్షత్త్రం బయిన నంతనుండి యైలవంశంబును నిక్ష్వాకువంశంబును దక్కఁ దక్కిన క్షత్త్రియవంశంబు లెల్లం గృత్రిమంబులు గాని విమల మకుటార్హంబులుగా; వీ రెండు వంశంబులవలన నేకోత్తరశతవంశంబు లయ్యెఁ; మఱి యయాతి భోజ వంశంబులవలనం జతుర్దశ వంశంబు లయ్యెఁ; నిట్టి సకలక్షత్త్రంబునెల్ల జయించి జరాసంధుం డున్నవాఁడు; వాని సామర్థ్యంబు చెప్ప నశక్యంబు. 110**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; జమదగ్ని; సుతుండు+అయిన= జమదగ్ని యొక్క కుమారుడయిన; రామునిచేతన్= పరశురామునిచేత; ధాత్రి= భూమి; అపగతక్షత్త్రంబు+అయినన్= తొలగింపబడిన క్షత్రియులుకలదికాగా; అంతన్+ఉండి= అప్పటినుండి; ఐల, వంశంబును; ఇక్ష్వాకు వంశంబును; తక్కన్= తప్ప; తక్కిన; క్షత్త్రియ, వంశంబులు+ఎల్లన్= రాజవంశాలన్నీ; కృత్రిమంబులు, కాని= కేవలం కల్పించబడినవే కాని; విమల, మకుట+అర్హంబులు= స్వచ్ఛమైన రాజకిరీటాన్ని ధరించటానికి తగినవి; కావు; ఈ, రెండు, వంశంబుల వలనన్= ఈ ఐల, ఇక్ష్వాకు వంశాలు రెండింటివల్ల; ఏక+ఉత్తర, శత, వంశంబులు+ అయ్యెన్= నూటొక్క రాజవంశాలు ఏర్పడ్డాయి; మఱి= ఇంకను; యయాతి, భోజ, వంశంబులవలనన్= యయాతియొక్క, భోజుడియొక్క వంశాలవలన; చతుః+దశ, వంశంబులు+అయ్యెన్= పద్నాలుగువంశాలు ఏర్పడ్డాయి; ఇట్టి= ఇటువంటి; సకల క్షత్త్రంబున్+ఎల్లన్= సకలరాజసమూహాన్ని; జయించి; జరాసంధుండు+ఉన్నవాఁడు; వాని; సామర్థ్యంబు; చెప్పన్; అశక్యంబు= సాధ్యం కాదు.

**తాత్పర్యం:** పూర్వం జమదగ్నికొడుకు పరశురాముడు నేలమీద క్షత్రియులు లేకుండ చేశాడు. ఐల ఇక్ష్వాకు రాజ వంశాలు మాత్రమే ఈ భూమిమీద మిగిలాయి. అప్పటినుండి ఆ రెండే సహజ రాజవంశాలు. తక్కిన రాజవంశాలన్నీ కల్పితాలే. రాజకిరీటాన్ని ధరించటానికి యోగ్యాలు కావు. క్రమంగా ఈ రెండువంశాలు నూటొక్క వంశాలుగా విస్తరిల్లాయి. అంతేకాక, యయాతి, భోజవంశాలవల్ల పదునాల్గువంశాలు ఏర్పడ్డాయి. జరాసంధుడు ఈ రాజుల నందరిని జయించాడు. అతనిసామర్థ్యం చెప్పశక్యం కాదు.

**విశేషం:** ఇల - వైవస్వతమనువు కూతురు. ఈశ్వరానుగ్రహంచేత ఈమెకు పుంస్త్వం ప్రాప్తించింది. సుద్యుమ్ను డయ్యాడు. ఉత్కళుడు, గయుడు, విమలుడు-ఇతని కుమారులు. ఇతడు వేటకై వెళ్ళి, కుమారవనంలో శివపార్వతుల సంగమం చూచాడు. పార్వతి శాపంతో మళ్ళీ స్త్రీత్వాన్ని పొంది ఇలగా మారాడు. ఈ దశలో ఇలకు బుధునితో సమాగమం ఏర్పడింది. పురూరవుడు జన్మించాడు. మళ్ళీ ఈశ్వరానుగ్రహంచేత ఇల పురుషుడుగా మారింది. ఇలకు సంబంధించిన క్షత్రియవంశం ఐలం. ఇక్ష్వాకువు - వైవస్వత మనువు కుమారుడు. శ్రీరాముని వంశానికి మూలపురుషుడు. యయాతి - నహుషుని కుమారుడు. చంద్రవంశప్రభువు. దేవయానికి, శర్మిష్ఠకు భర్త.

**క. అతిదర్పోద్ధతుఁడు మహా । ద్భుతభూరిబలుండు చేదిభూపతి సేనా**
**పతి యయి శిశుపాలుఁడు సం । తతమును నాతనిన కొలుచుఁ దద్దయు భక్తిన్. 111**

**ప్రతిపదార్థం:** చేది భూపతి= చేది దేశంయొక్కరాజు; శిశుపాలుడు; అతి, దర్ప+ఉద్ధతుఁడు= మిక్కిలి గర్వంచేత విజృంభించేవాడు; మహత్+అద్భుత, భూరి, బలుండు= మిక్కిలి ఆశ్చర్యకరమైన గొప్ప బలం కలవాడు; సేనాపతి, అయి; సంతతమును= ఎల్లప్పుడు; తద్దయున్, భక్తిన్= ఎంతో భక్తితో; అతనిన్+అ= ఆ జరాసంధుణ్ణే; కొలుచున్= సేవిస్తాడు.

**తాత్పర్యం:** చేదిభూపతి అయిన శిశుపాలుడు, అమితగర్వంతో విర్రవీగేవాడు. ఆశ్చర్యకరమైన అపారబలం కలవాడు. అతడు సేనాధిపతిగా ఆ జరాసంధుణ్ణి భక్తితో ఎప్పుడూ సేవిస్తూ ఉంటాడు.

**క. ఆయతభుజవీర్యులు మా । యాయోధులు హంసడిభకు లనువార లని**
**ర్జేయులు పరస్పర స్నే । హాయత్త సుచిత్తు లతని యాప్తు లధీశా! 112**

**ప్రతిపదార్థం:** అధీశా!= రాజా!; హంస, డిభకులు+అనువారలు= హంసడిభకు లనే పేరు కలవారు; ఆయత భుజవీర్యులు= అధికమైన భుజబలంకలవాళ్ళు; మాయాయోధులు= మాయోపాయాలతో కూడిన యుద్ధవీరులు; అనిర్జేయులు= జయింపసాధ్యం కాని వారు; పరస్పర, స్నేహ+ఆయత్త, సుచిత్తులు= ఒకరి పట్ల ఒకరు స్నేహానికి అధీనమైన చక్కని మనస్సు కలవాళ్ళు; అతని= ఆ జరాసంధుని యొక్క; ఆప్తులు= స్నేహితులు, హితులు.

**తాత్పర్యం:** హంస డిభకులు మహాబలవంతులు, మాయోపాయాల్లో అరితేరిన యుద్ధవీరులు, అజేయులు. పైగా ఒకరి కొకరు మంచిమిత్రులు. ఇద్దరూ ఆ జరాసంధునికి ఆప్తులు.

**వ. అయ్యిద్దఱును గౌశిక చిత్రసేను లను నామంబులతో మహాసేనాన్వితులై వానికి వామదక్షిణ భుజంబులుంబోలె సర్వసాధనసమర్థు లయి వర్తిల్లుదురు; మఱియు వరుణు నంతియ బలవంతుండు పశ్చిమ దిఙ్మహీపతి భగదత్తుం డనువాఁడు పాండురాజుసఖుం డగుటంజేసి నీకు మనంబున భక్తుం డయ్యును భయంబున జరాసంధునకు వాక్కర్మంబులం బనిసేయుచుండుఁ; జేదిపతులలోనఁ బురుషోత్తముండును నంగ వంగ పుండ్ర కిరాతపతులలోనఁ బౌండ్రకవాసుదేవుండు మదీయ నామంబులు దాల్చి జరాసంధుం గొలుతురు; ప్రాగ్దక్షిణ దిగ్భాముల రాజులు పురుజితుండును గరూశ కలభ నకుల సంకర్షణ సూపహిత మనోదత్త చక్ర సాల్వేయ యవనులును వానిన సేవింతు; రుదీచ్యులయిన యష్టాదశక్షత్త్రకులంబుల వారును నుత్తరపాంచాల శూరసేన పుష్కర పుళింద కళింగ కుంతి మత్స్యదేశంబుల రాజు ల్లెలను దద్భయంబునఁ దమ తమ దేశంబుల విడిచి యున్నవారలు మఱియును. 113**

**ప్రతిపదార్థం:** ఆ+ఇద్దఱును= ఆ హంసడిభకు లిద్దరూ; కౌశిక, చిత్ర సేనులు+అను; నామంబులతో; మహాసేనా+అన్వితులు+ఐ= గొప్పసైన్యంతో కూడుకున్నవాళ్ళయి; వానికిన్= జరాసంధుడికి; వామ, దక్షిణ, భుజంబులున్+పోలెన్= ఎడమ, కుడి భుజాల్లాగా; సర్వ, సాధన, సమర్థులు+అయి= అన్నింటిని సాధించగల సామర్థ్యం కలవాళ్ళయి, వర్తిల్లుదురు= ప్రవర్తిస్తూ ఉంటారు; మఱియు; వరుణు, అంతియ= వరుణదేవునంతటి; బలవంతుండు= బలం కలవాడు; పశ్చిమ, దిక్+మహీపతి= పడమటి దిశకు రాజు; భగదత్తుండు+అనువాఁడు= భగదత్తుడనే పేరు కలవాడు; పాండురాజు, సఖుండు+అగుటన్+చేసి= పాండురాజుకు స్నేహితుడు కావటంవల్ల; నీకున్; మనంబునన్= మనస్సులో; భక్తుండు+అయ్యును=

భక్తుడైనా; భయంబునన్= భయంచేత; జరాసంధునకున్; వాక్, కర్మంబులన్= మాటలతో, చేతలతో; పనిచేయుచున్+ఉండున్= పనిచేస్తూ ఉంటాడు; చేదిపతులలోనన్= చేది రాజుల్లో; పురుష+ఉత్తముండును; అంగ, వంగ, పుండ్ర, కిరాత, పతులలోనన్= అంగ, వంగ, పుండ్ర, కిరాత రాజుల్లో; పౌండ్రకవాసుదేవుండున్; మదీయ, నామంబులు; దాల్చి= నాయొక్క పేర్లు పెట్టుకొని; జరాసంధున్; కొలుతురు(కొలుచుదురు)= సేవిస్తున్నారు; ప్రాక్+ దక్షిణ, దిక్+భూముల, రాజులు= తూర్పు, దక్షిణ దిక్కుల్లో ఉన్న రాజులు; పురుజితుండును; కరూశ, కలభ, నకుల, సంకర్షణ, సూపహిత, మనోదత్త, చక్ర, సాల్వేయ, యవనులును; వానిన్+అ= ఆ జరాసంధుణ్ణే; సేవింతురు= కొలుస్తారు; ఉదీచ్యులు+అయిన= ఉత్తర దిక్కులో ఉన్న; అష్టాదశ, క్షత్ర కులంబులవారును= పద్దెనిమిది క్షత్రియ వంశాలవాళ్ళు; ఉత్తరపాంచాల, శూరసేన, పుష్కర, పుళింద, కళింగ, కుంతి, మత్స్యదేశంబుల; రాజులు+ఎల్లను= రాజులంతా; తత్+ భయంబునన్= ఆ జరాసంధునివల్ల కలిగిన భయంచేత; తమతమదేశంబులన్ విడిచి; ఉన్నవారలు; మఱియును.

**తాత్పర్యం:** కౌశిక చిత్రసేను లనే పేర్లుగల ఆ హంసడిభకు లిద్దరు పెద్దసైన్యంతో జరాసంధుడికి కుడి ఎడమభుజాల్లా ప్రవర్తిల్లుతున్నారు. అంతేకాదు, వరుణునిఅంతటి బలవంతుడైన పడమటిదేశ ప్రభువు భగదత్తుడు- మీ తండ్రి పాండురాజుకు స్నేహితుడే. నీపట్ల మనస్సులో భక్తి కలవాడే. అయినా జరాసంధునికి భయపడి మాటల్లో, చేతల్లో అతనినే అనుసరిస్తున్నాడు. చేదిరాజుల్లో పురుషోత్తముడు, అంగ, వంగ, పుండ్ర, కిరాత రాజుల్లో పౌండ్రక వాసుదేవుడు నాపేర్లు పెట్టుకొని జరాసంధుణ్ణి సేవిస్తున్నారు. తూర్పు దక్షిణ దేశాల రాజులు- పురుజితుడు, కరూశ, కలభ, నకుల, సంకర్షణ, సూపహిత, మనోదత్త, చక్ర, సాల్వేయ, యవనులు అతనినే కొలుస్తున్నారు. ఉత్తర దిక్కున ఉండే పదునెనిమిది రాజవంశాలవారు, ఉత్తరపాంచాల, శూరసేన, పుష్కర, పుళింద, కళింగ, కుంతి, మత్స్యదేశంబుల రాజు లందరు జరాసంధుని భయంతో తమతమదేశాలు విడిచి వెళ్ళారు.

**ఉ. ఘోరరణంబులోన నధికుం గృతబంధు జనాపకారు నే**
**దారుణ లీలఁ గంసు నతిదర్పితుఁ జంపుటఁ జేసి, యమ్మహా**
**క్రూరుఁడు కంసుభార్య దన కూఁతురు గావున, దానిసంతత**
**ప్రేరణ నా కుపద్రవముఁ బెక్కు విధంబులఁ జేసె నీసునన్. 114**

**ప్రతిపదార్థం:** నేన్= నేను; ఘోర, రణంబులోనన్= భయంకరమైన యుద్ధంలో; అధికున్= బలవంతుడైనవానిని; కృత, బంధుజన+అపకారున్= బంధుజనులకు అపకారాలు చేసినవానిని; అతి, దర్పితున్= మిక్కిలి గర్వించినవానిని; కంసున్= కంసుణ్ణి; దారుణలీలన్= ఘోరమైన పద్ధతిలో; చంపుటన్, చేసి= చంపటంచేత; కంసు, భార్య= కంసునియొక్క భార్య; తన, కూఁతురు, కావునన్; దాని= ఆ కంసుని భార్యయొక్క; సంతత= ఎడతెగని; ప్రేరణన్= ప్రేరేపణచేత; ఆ+మహా+క్రూరుఁడు= పరమ దుర్మార్గుడైన ఆ జరాసంధుడు; ఈసునన్= రోషంతో; నాకున్; ఉపద్రవమున్= కీడును; పెక్కు, విధంబులన్= అనేక విధాలుగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** బలవంతుడు, బంధుజనులకు అపకారం చేసినవాడు, గర్వంతో విర్రవీగేవాడు అయిన కంసుణ్ణి నేను ఘోరంగా వధించాను. కంసునిభార్య తనకూతురు కావటంచేత ఆమెప్రేరణతో పరమదుర్మార్గు డైన ఆ జరాసంధుడు నామీద వైరంపూని అనేకవిధాల నాకు అపకారం చేశాడు.

**విశేషం:** జరాసంధుడు శ్రీకృష్ణాదులకు ఉపద్రవం కలిగించటానికి గల అర్థహేతువును చెప్తుతూ వస్తుస్వభావస్ఫుటత్వాన్ని కలిగించినట్లు రచించిన ఈ పద్యంలో అర్థవ్యక్తి అనే శబ్దగుణం ఉన్నది. ఇది ప్రసాదగుణంలో అంతర్భవించేది. (సంపా.)

**క. భూమీశ! హంసడిభకులు । నా మగధాధీశ్వరుండు నమ్మువ్వురు ను**
**ద్దామ భుజవీర్య సంపద । తో మూఁడుజగములు నోపుదురు సాధింపన్. 115**

**ప్రతిపదార్థం:** భూమి+ఈశ!= భూపతీ! ఓధర్మరాజా!; హంసడిభకులున్; ఆ+మగధ+అధీశ్వరుండున్= ఆమగధరాజైన జరాసంధుడు; ఆ+ముప్పురున్= ఆ ముగ్గురూ; ఉద్దామ, భుజ, వీర్య, సంపదతోన్= అధికమైన భుజబలంయొక్క సంపదతో (పెంపుతో); మూడు, జగములన్= ముల్లోకాలను; సాధింపన్= జయించటానికి; ఓపుదురు= చాలుదురు.

**తాత్పర్యం:** ధర్మరాజా! హంసడిభకులు, ఆ మగధరాజైన జరాసంధుడు - ముగ్గురూ తమ భుజ బల పరాక్రమంతో ముల్లోకాలనైనా జయించగలరు.

**వ. ఆ జరాసంధుండును నాయుధనిహతులు గాని హంసడిభకులతో వచ్చి మధురపై విడిసిన నతి వీరులయిన యదు వృష్ణిభో జాంధక వరు లష్టాదశ సహస్ర రథవ్రాతంబులతో నేమును సమకట్టి మహాయుద్ధంబు సేయుచు వాని నెట్లును జయింపరాకున్న నుపాయంబున హంసుండు సమరనిహతుం డయ్యె నని డిభకునకుం జెప్పంబంచిన నప్పలుకులు నిక్కువంబ కా వగచి. 116**

**ప్రతిపదార్థం:** ఆ, జరాసంధుండును; ఆయుధ, నిహతులు, కాని= ఆయుధంచేత చావులేని; హంస, డిభకులతో; వచ్చి; మధురపై= మధురానగరంపై; విడిసినన్= దండెత్తగా; అతి, వీరులు+అయిన= గొప్ప వీరులైన; యదు, వృష్ణి, భోజ+అంధక, వరులు= యదువృష్ణిభోజాంధక శ్రేష్ఠులు; అష్టాదశసహస్ర, రథ, సమూహములతోన్= పదునెనిమిది వేల రథ సమూహాలతో; ఏమును= మేమును; సమకట్టి= పూనుకొని; మహాయుద్ధంబు; చేయుచున్; వానిన్= ఆ జరాసంధుని; ఎట్లును= ఏవిధంగాకూడా; జయింపరాక+ఉన్నన్= గెలవలేకుండా ఉండగా; ఉపాయంబునన్= యుక్తిచేత; హంసుండు; సమరనిహతుండు+అయ్యెన్+ అని= యుద్ధంలో చంపబడినవాడయ్యాడని-అంటే యుద్ధంలో మరణించాడని; డిభకునకున్+చెప్పన్+పంచినన్= డిభకునికి చెప్పి పంపగా; ఆ+పలుకులు= ఆమాటలు; నిక్కువంబు+అ, కా= నిజమే అని; వగచి= దుఃఖించి(తలచి).

**తాత్పర్యం:** ఆయుధాలవల్ల చావు లేని ఆ హంసడిభకులతో కలసి ఆ జరాసంధుడు మధురమీద దండెత్తాడు. ఆసమయంలో మేముకూడ మహావీరులైన యదువృష్ణి భోజాంధక శ్రేష్ఠులు పద్దెనిమిదివేలమంది రథికులతో అతణ్ణి ఎదిరించి ఎంత యుద్ధం చేసినా విజయం లభించటం లేదు. అప్పు డొక ఉపాయం పన్నాము. హంసుడు యుద్ధంలో మరణించా డని డిభకునికి చెప్పి పంపాము. ఆ మాటలు నమ్మి ఎంతో దుఃఖించి.

**చ. 'అనవరతంబు నిష్టుఁడగు హంసుఁడు లేని జగంబులోని జీ**
**వన మది యేల నా' కనుచు వారినిమగ్న శరీరుఁ డై క్షణం**
**బున డిభకుండు మృత్యుగతిఁ బొందె; ఘనంబుగ; దాని నక్కడన్**
**విని మృతుఁడయ్యె హంసుఁ డతివీరుఁడు తద్గత సౌహృదంబునన్. 117**

**ప్రతిపదార్థం:** అనవరతంబున్= ఎల్లప్పుడు; ఇష్టుఁడు+అగు= ప్రియమైనవా డయిన; హంసుఁడు; లేని; జగంబులోని= ప్రపంచంలోని; జీవనము= బ్రదుకు; అది, నాకు, ఏల, అనుచు; వారి, నిమగ్న, శరీరుఁడు+ఐ= నీళ్ళలో పూర్తిగా మునిగిన శరీరం కలవాడై; క్షణంబునన్; డిభకుండు; మృత్యు, గతిన్+పొందెన్= మరణవిధాన్ని పొందాడు అంటే- మరణించాడు;

ఘనంబుగ= గట్టిగా; దానిన్= ఆ మరణవార్తను; అక్కడన్= యుద్ధభూమిలో; విని; తత్, గత, సౌహార్దంబునన్= అతని పట్ల ఉన్న స్నేహభావంచేత; అతివీరుఁడు, హంసుఁడు= మహావీరుడైన హంసుడు; మృతుఁడు+అయ్యెన్= మరణించాడు.

**తాత్పర్యం:** తనకు అత్యంతం ఇష్టుడైన హంసుడు లేని లోకం ఎందుకని డిభకుడు నీళ్ళలో మునిగి ప్రాణాలు వదిలాడు. అది విని హంసు డిక్కడ డిభకునిమీది స్నేహభావంతో ఊపిరి విడిచాడు.

**వ.** **అట్లు కౌశిక చిత్రసేనులు పరలోకగతులైన నసహాయుండై జరాసంధుండు మగిడి మగధపురంబునకుం జనియె; నేమును వానితోడి వైరంబు బలవంతంబైన, నమ్మధుర నుండ నొల్లక కుశస్థలంబునకు వచ్చి రైవతక పర్వతంబున ఘనంబుగా దుర్గంబు నిర్మించికొని భవదాశ్రయంబున సుఖంబున్నవారము. 118**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆవిధంగా; కౌశిక చిత్రసేనులు= హంసడిభకులు; పరలోక గతులు+ఐనన్= పరలోకానికి వెళ్ళినవాళ్ళు కాగా - అంటే మరణించగా; అసహాయుండు+ఐ= సాయంలేనివాడై; జరాసంధుండు; మగిడి= వెనుదిరిగి; మగధ పురంబునకున్; చనియెన్= వెళ్లాడు; ఏమును= మేము కూడా; వానితోడన్, వైరంబు; బలవంతంబు+ఐనన్= (బలం కలది) ఎక్కువకాగా; ఆ, మధురన్= ఆ మధురా నగరంలో; ఉండన్+ఒల్లక= ఉండటానికి ఇష్టపడక; కుశస్థలంబునకున్; వచ్చి; రైవతక పర్వతంబున; ఘనంబుగాన్= గట్టిగా; దుర్గంబు= కోటను; నిర్మించికొని= కట్టుకొని; భవత్+ఆశ్రయంబునన్= నీ అండలో; సుఖంబు+ఉన్నవారము= సుఖంతో ఉన్నాము.

**తాత్పర్యం:** ఆ విధంగా హంస డిభకులు హతులుకాగా జరాసంధుడు నిస్సహాయుడై-తన రాజధాని మగధకు మరలి వెళ్ళాడు. మేముకూడ అతనితో వైరం అధికం కాగా, ఆమధురానగరాన్ని వదలి కుశస్థలంలో రైవతకాద్రిమీద గట్టికోట కట్టుకొని, నీ అండలో సుఖంగా ఉన్నాము.

**విశేషం:** శక్తిమంతులైన బంధువు లుంటే శత్రుబాధ ఉండదు. భీమార్జునుల బలపరాక్రమాలు ప్రసిద్ధాలు; శత్రుభయంకరాలు. శ్రీకృష్ణునికి పాండవులతో బాంధవ్యమే కాక ప్రగాఢమైత్రికూడ ఉంది. బలవంతులైన పాండవుల ప్రాపు ఉన్న శ్రీకృష్ణునిమీదికి దండెత్తటానికి జరాసంధుడు సాహసించలేడు. అందుకే నీ అండతో మేము సుఖంగా ఉన్నా మని ధర్మరాజుతో శ్రీకృష్ణు డన్నాడు. పైగా ఈమాట జరాసంధునిమీద పాండవుల్ని ఉసిగొల్పటానికై కూడ ఉపయోగపడుతుంది. మూలంలో - 'సామర్థ్యవంతః సంబంధా ద్భవన్తం సముపాశ్రితాః' - అని కూడా ఉంది. వానితోడన్, వైరంబు-సమాసంలో చేత, తోడ, వలనలకు ఇత్వం అవుతుంది కనుక - వానితోడి వైరంబు. సుఖంబు+ఉన్నవారము - ప్రథమావిభక్తి తృతీయార్థంలో వాడబడింది - సుఖంతో ఉన్నవారము.

**చ.** **ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడై మహిలోని రాజులం**
**బెలుకుఱఁ బట్టి తెచ్చి చెఱఁబెట్టి గిరివ్రజము న్పురంబులోఁ**
**జొలయక నిత్య మొక్కొకని సూనరివోలె వధించి నేమమున్**
**బలిమియు నేర్పడం గడఁగి భైరవపూజ యొనర్చు నుగ్రుఁడై. 119**

**ప్రతిపదార్థం:** బృహద్రథ+ఆత్మజుఁడు= బృహద్రథుని కుమారుడైన జరాసంధుడు; ఖలుఁడు= దుర్మార్గుడు; గర్వితుఁడు+ ఐ= గర్వించిన వాడై; మహిలోని రాజులన్= భూమిలోని రాజులందరిని; పెలుకుఱన్+పట్టి= భయపడేటట్లుగా బంధించి; తెచ్చి; గిరివ్రజము+అన్+పురంబులోన్= గిరివ్రజమనే పేరుగల నగరంలో; చెఱన్+పెట్టి= చెరసాలలో బంధించి; చొలయక= వెనుకాడక;

నిత్యము+ఒక్కొకనిన్= ప్రతిదినం ఒక్కొకరిని; సూనరి, పోలెన్= కసాయివానిలా; వధించి= చంపి; నేమమున్= నియమాన్ని; బలిమియున్= బలాన్ని; ఏర్పడన్= స్పష్టమయ్యేటట్లు; కడఁగి= పూని; ఉగ్రుఁడు+ఐ= భయంకరుడై; భైరవపూజ= భైరవరూపుడైన రుద్రుని పూజ; ఒనర్చున్= చేస్తున్నాడు.

**తాత్పర్యం:** దుర్మార్గుడు, గర్వితుడు అయిన జరాసంధుడు లోకంలోని రాజులనందరినిపట్టి బంధించి, రోజుకు ఒక్కడి వంతున తన నియమం, బలం ప్రకటమయ్యేటట్లు కసాయివానిలా వాళ్ళను వధించి, భయంకరంగా భైరవపూజ చేస్తున్నాడు.

**క.** **ధరణీశ! వానిఁ జంపుడు । నురుతర సామ్రాజ్య విభవ మున్నతితో సు**
**స్థిరమగు నీకును; మఱి భా । సురముగ సమకూరు రాజసూయము సేయన్.** **120**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ= భూపతి అయిన ఓధర్మరాజా!; వానిన్= ఆ జరాసంధుడిని; చంపుడున్= చంపిన అనంతరం; నీకును; ఉరుతర, సామ్రాజ్య, విభవము= అధికమైన సామ్రాజ్యవైభవం; ఉన్నతితోన్= గొప్పగా; సుస్థిరము+అగున్= గట్టిగా స్థిరపడుతుంది; మఱి= అంతేకాక; భాసురముగన్= ప్రకాశమానంగా; రాజసూయము, చేయన్= రాజసూయయాగం చేయటానికి; సమకూరున్= సాధ్యమవుతుంది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆ జరాసంధుణ్ణి సంహరిస్తే నీ సామ్రాజ్య వైభవం గొప్పగా స్థిరపడుతుంది. అంతేకాక జగత్ ప్రసిద్ధంగా రాజసూయం చేయటం కూడ సాధ్యమౌతుంది.

**సీ.** **రక్షణంబున భగీరథుఁడు, జయంబున । నయ్యౌవనాశ్వుండు, నత్యుదగ్ర**
**బాహుబలంబున భరతుండు, తపమునఁ । గార్తవీర్యుండును, గరముబుద్ధి**
**నమ్మరుత్తుండును, నఖిల సామ్రాజ్యంబుఁ । బడసిరి తొల్లి భూపాల! యిప్పు**
**డిన్ని గుణంబులు నెన్నంగఁ గలవు నీ; । కిది యేమి దుర్లభ, మిద్దురాత్ముఁ**

**ఆ.** **డెంత బలియుఁడయ్యు, నెంత గర్వితుఁడయ్యుఁ । దన కఠోర దుష్కృతాపమునను**
**విగతవిభవుఁ డగు; వివేకవిహీనుల । కైన లక్ష్మి సుచిర మగునె యెందు?** **121**

**ప్రతిపదార్థం:** భూపాల!= భూమిని ఏలే ఓ ధర్మరాజా!; తొల్లి= పూర్వం; రక్షణంబునన్= ప్రజల్ని రక్షించటంచేత; భగీరథుండు; జయంబునన్= విజయంచేత; యౌవనాశ్వుండున్; అతి+ఉదగ్ర; బాహు, బలంబునన్= మిక్కిలి భయంకరమైన భుజబలంచేత; భరతుండు; తపమునన్= తపోబలంచేత; కార్తవీర్యుండును; కరము= మిక్కిలి; బుద్ధిన్= బుద్ధిబలంచేత; ఆ+మరుత్తుండును; అఖిల సామ్రాజ్యంబున్= సమస్త సామ్రాజ్యాన్ని; పడసిరి= పొందారు; ఇప్పుడు; ఇన్ని, గుణంబులున్= వాళ్ళందరిలోఉన్న ఈ సుగుణాలన్నీ; ఎన్నంగన్= లెక్కిస్తే; నీకున్; కలవు; ఇది= ఈరాజసూయయాగం చెయ్యటం; ఏమి, దుర్లభము= ఏమి కష్టం?; ఈ దురాత్ముఁడు= ఈదుర్మార్గుడైన జరాసంధుడు; ఎంత, బలియుఁడు+అయ్యున్= ఎంత బలం కలవాడైనప్పటికి; ఎంత, గర్వితుఁడు+అయ్యున్= ఎంతగర్వం కలవాడైనప్పటికి; తన= తనయొక్క; కఠోర= తీవ్రమైన; దుష్కృతాపమునను= చెడుపరాక్రమంచేత; విగత, విభవుఁడు+అగున్= కోల్పోయిన వైభవం కలవా డౌతాడు; ఎందున్= ఎక్కడైనా; వివేక, విహీనులకున్+ ఐన, లక్ష్మి= వివేకం లేని వాళ్ళకు లభించిన సంపద; సుచిరము+అగును+ఎ= ఎంతో ఎక్కువకాలం ఉంటుందా? - ఉండదు.

**తాత్పర్యం:** ధర్మరాజా! పూర్వం భగీరథుడు ప్రజారక్షణచేత, యౌవనాశ్వుడు విజయసాధనచేత, భరతుడు భయంకర భుజబలంచేత, కార్తవీర్యుడు తపోబలంచేత, మరుత్తుడు బుద్ధిబలంచేత సమస్త సామ్రాజ్యాన్ని పొందారు. ఇప్పుడీ సుగుణాలన్నీ నీలో ఉన్నాయి. అందువలన రాజసూయం చేయటం ఏం కష్టం? జరాసంధుడు ఎంత బలవంతుడైనా, గర్వితుడైనా అతని పరాక్రమం చెడుమార్గంలో ప్రవర్తిల్లటంచేత అతని వైభవం పతనం కాక తప్పదు. వివేకశూన్యులసంపద స్థిరంగా ఉండదు కదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

### భీమసేనార్జునులు ధర్మరాజున కుత్సాహంబు గలిగించుట (సం. 2-14-7)

**వ. అనిన విని భీమసేనుండు ధర్మరాజున కిట్లనియె. 122**

**తాత్పర్యం:** అని కృష్ణుడు అనగా విని భీముడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**క. ఆరంభరహితుఁ బొందునె । యారయ సంపదలు? హీనుఁ డయ్యును బురుషుం**
**డారంభశీలుఁ డయి యకృ । తారంభుల నోర్చు నెంత యధికుల నయినన్. 123**

**ప్రతిపదార్థం:** ఆరయ= విచారిస్తే; ఆరంభరహితున్= ప్రయత్నమే చేయనివానిని; సంపదలు; పొందును+ఎ; పురుషుండు; హీనుఁడు+అయ్యును= బలహీనుడైనా; ఆరంభ, శీలుఁడు+అయి= ప్రయత్నం చేసే స్వభావం కలవాడై; అకృత+ఆరంభులన్= చేయబడని ప్రారంభం కలవారిని, అంటే- ప్రయత్నమే చెయ్యనివాళ్ళను; ఎంత, అధికులన్+అయినన్= ఎంత బలవంతులనైనా; ఓర్చున్= జయిస్తాడు.

**తాత్పర్యం:** లోకంలో ప్రయత్నమే చేయనివాడికి సంపదలు సమకూరవు. బలహీనుడైనా సరే పురుషుడు తాను ప్రయత్నం చేసే స్వభావం కలవాడైతే, ప్రయత్నమే చెయ్యని ఎంత బలవంతులనైనా జయించగలడు.

**క. కడు నధికుతోడఁ దొడరినఁ । బొడిచిన నొడిచినను బురుషు పురుషగుణం బే**
**ర్పడుఁగాక, హీను నొడుచుట । కడిఁదియె? పౌరుషము దానఁ గలుగునె చెపుమా! 124**

**ప్రతిపదార్థం:** కడున్+అధికుతోడన్= మిక్కిలి బలవంతునితో; తొడరినన్= ఎదుర్కొంటే; పొడిచినన్= పోట్లాడితే; ఒడిచినన్= ఓడిస్తే; పురుషు= పురుషుడియొక్క; పురుషగుణంబు= పౌరుషం; ఏర్పడున్, కాక= ప్రకాశిస్తుంది కాని; హీనున్= బలహీనుని; ఒడుచుట= ఓడించటం; కడిఁది+ఎ= గొప్పయా? కాదు; దానన్= దానివలన; పౌరుషము; కలుగునె; చెపుమా?

**తాత్పర్యం:** లోకంలో బలవంతునితో వైరం పూనినా, యుద్ధం చేసినా, అతణ్ణి ఓడించినా పురుషుని పౌరుషం ప్రకాశిస్తుంది. అంతేకాని బలహీనుణ్ణి ఓడించటం ఒక విశేషమా? అది పరాక్రమమా?

**విశేషం:** శ్రీకృష్ణుడు జరాసంధుని బలపరాక్రమాల్ని ప్రశంసించింది ధర్మరాజుకొరకే అయినా, ఆ ప్రశంస ప్రక్కనే ఉన్న భీమసేనునిలో కయ్యపువేడిని గొప్పగా పుట్టించింది. ఆ జగన్నాటక సూత్రధారిమాటలు, చేతలు బహుళార్థసాధకాలు కదా!

**క. ఈహరి కరుణయు నర్జును । సాహాయ్యముఁ గలుగ నీ ప్రసాదమున జగ**
**ద్ద్రోహు జరాసంధు మహా । సాహసు వధియింతు నుగ్ర సంగ్రామమునన్. 125**

**ప్రతిపదార్థం:** ఈ, హరి, కరుణయున్= ఈకృష్ణునియొక్కదయ; అర్జును, సాహాయ్యమున్= అర్జునునియొక్క తోడ్పాటు; కలుగన్= కలిగితే; నీ ప్రసాదమునన్= నీ అనుగ్రహంచేత; జగత్+ద్రోహు, జరాసంధు= లోక ద్రోహి అయిన జరాసంధుణ్ణి; మహాసాహసున్= మిక్కిలి సాహసం కలవాణ్ణి; ఉగ్ర, సంగ్రామమునన్= భయంకరమైన యుద్ధంలో; వధియింతున్= చంపుతాను.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుని దయ, అర్జునుని సాహాయ్యం నాకు ఉంటే, నీ అనుగ్రహంతో లోకద్రోహి, మహాసాహసుడు అయిన జరాసంధుణ్ణి భీకరసంగ్రామంలో సంహరిస్తాను.

**తే. అనఘ! యేము ముష్వరము మూఁడగ్నులట్లు । నీ మహాయజ్ఞ కార్యంబు నిర్వహింతు**
**మూ జరాసంధ పశువున నఖిల శాత్ర । వాహుతులఁ జేసి తృప్తుల మగుచు బలిమి. 126**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ధర్మరాజా!; ఏము, ముష్వరము= మేము ముగ్గురం; మూఁడు+అగ్నుల+అట్లు= ఆహవనీయ; దక్షిణ, గార్హపత్యా లనే మూడు అగ్నుల్లా; జరాసంధ, పశువునన్= జరాసంధు డనే బలిపశువుతో; అఖిల, శాత్రవ+ఆహుతులన్+చేసి= సమస్త శత్రువు లనే హోమద్రవ్యాలతో - ఆహుతులతో; తృప్తులము+అగుచున్= తృప్తిచెందిన వాళ్ళమై; బలిమిన్= బలంతో; నీ, మహా, యజ్ఞ, కార్యంబు, నిర్వహింతుము= నీ రాజసూయ మహాయజ్ఞ కార్యాన్ని నిర్వహిస్తాము.

**తాత్పర్యం:** మేము ముష్వరం ఆహవనీయ, దక్షిణ, గార్హపత్యాలనే మూడు అగ్నుల్లా జరాసంధు డనే బలిపశువుతో, సర్వశత్రువులనే ఆహుతులతో నీరాజసూయమహాయజ్ఞకార్యాన్ని నిర్వహిస్తాము.

**విశేషం:** అలం: ఉపమ, రూపకం. ఆహవనీయ, దక్షిణ, గార్హపత్యాలు త్రేతాగ్నులు. ఇవి క్రమంగా వేదికి పూర్వ, దక్షిణ, పశ్చిమదిశలలో ఉంటాయి. ఇవిగాక సభ్యం, అపసభ్యం అనేవి ఈశాన్యదిశలో ఉంటాయి. పై పద్యానికి 3,4 పాదాలకు సంబంధించి 'శస్త్రాస్త్రతీవ్రహతిని జేసియుఁదృప్తుల మగుచు బలిమి - దివ్యాస్త్రశస్త్రహతునిఁగాఁ జేసి' వంటి పాఠాంతరా లున్నాయి. జరాసంధుడు శస్త్రాస్త్రాలచేత వధించ సాధ్యంకానివాడు. అందుచేత ఈ పాఠాంతరాలు ఉచితాలు కావనిపిస్తుంది.

**వ. అనిన భీమసేను విక్రమవచనంబుల కనుగుణంబుగా నర్జునుం డిట్లనియె. 127**

**ప్రతిపదార్థం:** అనినన్; భీమసేను= భీమసేనుడియొక్క; విక్రమ, వచనంబులకున్= పరాక్రమంతో కూడిన మాటలకు; అనుగుణంబుగాన్= తగినట్లుగా; అర్జునుండు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని భీమసేనుడు అనగా, అతని పరాక్రమవాక్యాలకు తగ్గట్లు అర్జునుడు కూడ ఈ విధంగా అన్నాడు.

**ఉ. భూభుజులన్ జయింపుము, విభూతి నొనర్పుము రాజసూయమున్,**
**నాభుజ వీర్య విక్రమ గుణంబులకుం దగుచున్న యీ ధను**
**ర్లాభము, దివ్య బాణరథలాభము, శోభితమైన యీ సభా**
**లాభము నొండుపాట సఫలత్వముఁ బొందునె కౌరవేశ్వరా! 128**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా!= కురువంశ ప్రభుడవైన ఓ ధర్మరాజా!; భూ, భుజులన్= రాజులను; జయింపుము; రాజసూయమున్; విభూతిన్+ఒనర్పుము= ఐశ్వర్యంతోచేయుము; నా, భుజ, వీర్య, విక్రమ, గుణంబులకున్= నాయొక్క భుజ బల పరాక్రమగుణాలకు; తగుచున్+ఉన్న= తగినట్లుగా ఉన్న; ఈ, ధనుః+లాభము= ఈగాండీవ మనే మహాధనుస్సు లభించటం; దివ్య, బాణ, రథ, లాభము= దేవతాసంబంధాలైన బాణాలు, రథం లభించటం; శోభితము+ఐన= ప్రకాశించేదైన; ఈ, సభా, లాభమున్= ఈ మయ సభ లభించటం; ఒండుపాట= వేరొకవిధంగా; సఫలత్వమున్+పొందునె= సార్థకతను పొందుతాయా!

**తాత్పర్యం:** ఓ కౌరవేశ్వరా! ధర్మరాజా! రాజులందరిని జయించు. అపారమైన ఐశ్వర్యంతో రాజసూయం నిర్వహించు. అలా కాకుంటే నా భుజబలపరాక్రమ గుణాలకు తగినట్లు ఈ గాండీవం, ఈ దివ్యబాణాలు, ఈ దివ్యరథం, శోభాయమానమైన ఈ మయసభ పొందినందుకు ఫల మేముంది?

**విశేషం:** గాండీవ దివ్యబాణరథాలు పార్థుని భుజబల పరాక్రమాలకు ఫలాలుగా లభించిన దివ్యఫలాలైతే, శోభాయమానమైన మయసభ ఆయన శరణాగత రక్షణ గుణానికి ఫలంగా లభించిన మహాద్భుతఫలం. (ఇందులోని వీరరసదీప్తి ఉజ్జ్వలమై కాంతి అనే గుణాన్నీ, తద్వారా ప్రసాదాన్నీ రూపుకట్టిస్తున్నది. - సంపా.)

**క. కలరూప గుణ ద్రవ్యం । బులు విక్రమవంతునందు భూవిదితములై**
**నిలుచు నవిక్రమునకు నవి । గలిగియు లేని క్రియ నప్రకాశంబు లగున్. 129**

**ప్రతిపదార్థం:** విక్రమవంతునందున్= పరాక్రమం కలవానివిషయంలో; కల, రూప, గుణ ద్రవ్యంబులు= ఉన్నరూపం, గుణం, సంపద; భూవిదితములు+ఐ= ప్రపంచప్రసిద్ధాలై; నిలుచున్= రాణిస్తాయి; అవిక్రమునకున్= పరాక్రమం లేనివాడికి; అవి= ఆ రూపగుణసంపదలు; కలిగియున్= ఉండికూడ; లేని, క్రియన్= లేనివిధంగా; అప్రకాశంబులు+అగున్= వెలుగు లేనివై పోతాయి.

**తాత్పర్యం:** పరాక్రమవంతుని రూపగుణ సంపదలు ప్రపంచ ప్రసిద్ధాలై రాణిస్తాయి. పరాక్రమహీనునికి అవి ఉన్నా లేనట్లే కాంతివిహీనా లౌతాయి.

**విశేషం:** భండార్కర్ ప్రతిలో (మూలంలో) 'ద్రవ్యభూతాః గుణాః సర్వే తిష్ఠంతి హి పరాక్రమే' అని మాత్రమే ఉన్నా 'కుల రూపగుణ...' అని పెక్కు ప్రతులలో ఉన్న పాఠమే మేల్తర మనిపిస్తుంది. ఎందుకంటే గుణద్రవ్యాలే కాక కులరూపాలు కూడ పరాక్రమవంతుడిపట్ల గొప్పగా రాణిస్తాయి కదా.

**వ. 'మఱియు రాజసూయ మహాధ్వరంబు కారణంబుగాఁ బరాక్రమంబున జరాసంధు వధియించి నిఖిల క్షత్త్రియ నిగ్రహ మోక్షణంబు సేయునంతకంటె మిక్కిలి యశోధర్మంబు లొండెవ్వి?' యనిన భీమార్జునుల పలుకులకు సంతసిల్లి నారాయణుం డి ట్లనియె. 130**

**ప్రతిపదార్థం:** మఱియు, రాజసూయ, మహా+అధ్వరంబు= రాజసూయమహాయాగం; కారణంబుగాన్; పరాక్రమంబునన్= శౌర్యంతో; జరాసంధున్, వధియించి; నిఖిల, క్షత్త్రియ, నిగ్రహ, మోక్షణంబు= అందరు రాజులకు చెరనుండి విముక్తి; చేయు, అంతకంటె= కలుగచెయ్యటంకంటె; మిక్కిలి= ఎక్కువైన; యశః, ధర్మంబులు= కీర్తి, ధర్మము; ఒండు+ఎవ్వి= వేరే ఏమున్నాయి; అనిన; భీమ+అర్జునుల; పలుకులకున్= మాటలకు; సంతసిల్లి= సంతోషించి; నారాయణుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియన్.

**తాత్పర్యం:** 'రాజసూయ మహాయాగ కారణంగా జరాసంధుణ్ణి వధించి, అతనిచేత బంధితులైన రాజులనందరిని చెరనుండి విడిపించటంకంటె ఎక్కువ కీర్తి, ధర్మం, ఇంకేమున్నాయి?' అని పలికిన భీమార్జునుల పలుకులకు శ్రీకృష్ణుడు సంతోషించి ఇలా అన్నాడు.

**క. వెలయ విధిదృష్ట నయమున । వలయుఁ బరాక్రమము సేయ వసుధేశ్వర య**
**గ్గల మగు బుద్ధియుఁ గడఁకయుఁ । గల పురుషుల కిదియె చూవె కర్తవ్య మిలన్. 131**

**ప్రతిపదార్థం:** వసుధా+ఈశ్వర!= ఓభూనాథ! ధర్మరాజా!; వెలయన్= ప్రకాశించేటట్లుగా; విధి, దృష్ట, నయమునన్= శాస్త్రదృష్టితో కూడిన నీతితో; పరాక్రమము, చేయ, వలయున్= పరాక్రమం చూపాలి; అగ్గలము+అగు= అధికమైన; బుద్ధియున్; కడఁకయున్= ప్రయత్నంకూడా; కల; పురుషులకు; ఇలన్= భూమిమీద; కర్తవ్యము= చేయతగినది; ఇది+ఎ, చూవె= ఇదే సుమా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! శాస్త్రోక్తమైన ధర్మపద్ధతిలో పరాక్రమాన్ని ప్రదర్శించాలి. బుద్ధిబలం, ప్రయత్నం గల పురుషులకు భువిలో ఇదే సుమా కర్తవ్యం.

**వ. 'కావున మేము మువ్వురముఁ గ్రమంబునం బరాక్రమించి జరాసంధుడాసి నదీప్రవాహంబులు వృక్షోన్మూలనంబు సేయునట్లు క్రమంబున వాని నిర్మూలితుం జేసెద; మద్దురాత్ముండు భూతంబులయం దంతరాత్మయుం బోలెఁ దన యంతరం బెఱుంగక యేకాంతశీలుఁడై సుఖం బనుభవించుటం జేసి వాని యంతికంబున కరుగుట యశ్రమం' బనిన నారాయణునకు ధర్మరా జిట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** కావున; మేము; ముప్వురమున్; క్రమంబునన్= వరుసగా; పరాక్రమించి; జరాసంధు, డాసి= జరాసంధుణ్ణి సమీపించి; నదీ ప్రవాహంబులు; వృక్ష, ఉత్+మూలనంబు, చేయు, అట్లు= చెట్లను వేళ్ళతో కూడ పెకలించి వేసేటట్లు; క్రమంబునన్; వాని= ఆ జరాసంధుణ్ణి; నిర్మూలితున్+చేసెదము= చంపివేయబడినవాడినిగా చేస్తాము - అంటే చంపివేస్తాము; ఆ+దురాత్ముండు= ఆ దుర్మార్గుడు; భూతంబుల, అందున్= ప్రాణుల్లో; అంతర్+ఆత్మయున్+పోలెన్= అంతరాత్మవలె; తన, అంతరంబు= తనమేర (తనకాలపరిమితి); ఎఱుంగక= తెలియక; ఏకాంత, శీలుఁడు+ఐ= ఒంటరిగా ఉండే స్వభావం కలవాడై; సుఖంబు+అనుభవించుటన్+చేసి= సుఖాన్ని అనుభవిస్తూ ఉండటంవల్ల; వాని= ఆ జరాసంధుని; అంతికంబునకున్= సమీపానికి; అరుగుట= వెళ్ళటం; అశ్రమంబు= కష్టం కాదు; అనిన; నారాయణునకున్= శ్రీకృష్ణునికి; ధర్మరాజు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'భీమార్జునులు, నేను- ముప్వురం విజృంభించి జరాసంధుణ్ణి ఎదుర్కొని నదీప్రవాహాలు చెట్లను వ్రేళ్ళతో కూడ పెకలించివేసేటట్లు పట్టుబట్టి అతణ్ణి నిర్మూలిస్తాం. ప్రాణుల్లోని అంతరాత్మలా తన ఉనికి, తన కాలపరిమితి తెలియకుండా ఏకాంతంగా ఉండే స్వభావం కలవాడై, సుఖాలు అనుభవిస్తూ ఉండటంచేత అతని సమీపానికి వెళ్ళటం కష్టం కా' దని శ్రీకృష్ణు డనగా ధర్మరాజు ఇలా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. ఇచట అర్థం సందిగ్ధంగా ఉంది.

"తే వయం యత్న మాసాద్య శత్రుదేశసమీపగాః, కథ మంతం న గచ్ఛేమ వృక్షస్యేవ నదీరయాః.
పరరంధ్రే పరాక్రాంతః స్వరంధ్రావరణే స్థితః, వ్యూఢానీకస్తు బలవాన్ నోపేయా ద్బలవత్తరమ్.

అనవద్యా హ్యసంబాధాః దృష్ట్వా శత్రుం సమీపతః, శత్రుదేశ ముపాక్రమ్య తం కామం ప్రాప్నుయామహే.
ఏకోహ్యేవ శ్రియం నిత్యం బిభర్తి భరతర్షభ, అంతరాత్మేవ భూతానాం తత్క్షయే వై బలక్షయః" -అని మూలం.
'ఎఱుంగకుండ' అని ఉంటే 'తా నుండే చోటు ఎవ్వరూ ఎఱుగకుండ' - అని అర్థం చెప్పవచ్చు. 'అద్దురాత్ముండు తన యంతరం బెఱుంగక భూతంబులం దంతరాత్మయుంబోలె' - అని ఉంటే అన్వయం సులభంగా ఉండేది.

ప్రాణుల్లో ఉండే అంతరాత్మ ఎవ్వరికీ అగుపించకుండ ఏకాంతంగానే ఉంటుంది. అంతేకాదు- తన కొక కాలపరిమితి ఉంటుం దన్న సంగతికూడ అది తెలుసుకోదు. అలా ఉంటాననే అనుకుంటూ ఉంటుంది. కాలం తీరగానే వెళ్ళిపోతుంది. అలాగే అసాధారణజన్మతో అపారబలసంపన్నుడు, అతిగర్వితుడు అయిన జరాసంధుడు తనకాలపరిమితినిగూర్చి తాను ఆలోచించుకోకుండా ఉండటంలో ఆశ్చర్యం లేదు. పైగా ఎంతో రహస్యస్థానంలో, ఉంటూ ఏకాంతజీవితం గడపటానికి అలవాటు పడ్డాడు కనుక, తన ఉనికిని ఎవ్వరూ కనిపెట్టలేరన్న ధీమాకూడా అతనికి ఉండవచ్చు. రహస్యస్థానానికి మార్గం తెలియాలే కాని- తెలిస్తే ఆ స్థానాన్ని చేరుకోవటం పెద్ద కష్టంకాదు. అక్కడ ఏకాంతంగా ఉన్న వ్యక్తిని అంతమొందించటం కూడ అంతకష్టంకాదు. అంతరాత్మ ఎక్కడ ఉన్నా పరమాత్మ ప్రవేశించటానికి శ్రమ ఏముంటుంది? అందుకే శ్రీకృష్ణుడు లౌకికంగానేకాక తాత్త్వికంగాకూడా జరాసంధుణ్ణి చేరటం కష్టం కా దని అంటున్నాడేమో.

**క. దనుజాహిత! నీ కాహవ । మున నెదిరి మహోగ్ర దహనమునఁ బడియును గా**
**లని మిడుత వోలె నతికో । పనుఁడు జరాసంధుఁ డెట్లు బ్రదుకఁగ నేర్చున్? 133**

**ప్రతిపదార్థం:** దనుజ+అహిత= రాక్షసులకు శత్రువైనవాడా, శ్రీకృష్ణా!; నీకున్; ఆహవమునన్= యుద్ధంలో; ఎదిరి= ఎదిరించి; అతికోపనుఁడు= అధికకోపం కలవాడైన; జరాసంధుడు; మహా+ఉగ్ర, దహనమునన్= మిక్కిలి భయంకరమైన నిప్పులో; పడియును; కాలని; మిడుత, పోలెన్= మిడుత పురుగువలె; ఎట్లు= ఏవిధంగా; బ్రదుకఁగన్= జీవించటానికి; నేర్చున్= జీవించగలడు ?

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! యుద్ధంలో ని న్నెదిరించి ఆ జరాసంధుడు అతిభయంకరమైన అగ్నిలో పడ్డ మిడతలా మాడిపోకుండా బ్రతుకగలడా!

**విశేషం:** అలం: ఉపమ.

**క. అట్టి యతి దారుణత్వము । నట్టి యజేయ భుజ విక్రమాధిక్యము వాఁ**
**డెట్టి క్రియఁ బడసె; నాతని । పుట్టిన విధ మెట్లు చెప్పు పొలుపుగ నాకున్. 134**

**ప్రతిపదార్థం:** వాఁడు= ఆ జరాసంధుడు; అట్టి= ఆవిధమైన; అతి, దారుణత్వమున్= మహాక్రూర స్వభావాన్ని; అట్టి= అంతటి; అజేయ, భుజ, విక్రమ+ఆధిక్యమున్= జయింప సాధ్యంకాని భుజ పరాక్రమాతిశయం; ఎట్టి, క్రియన్, పడసెన్= ఏ విధంగా పొందాడు; ఆతని= అతడియొక్క; పుట్టిన విధము; ఎట్లు= ఎలాంటిదో; నాకున్; పొలుపుగ = ఒప్పుగా; చెప్పు= చెప్పుము.

**తాత్పర్యం:** ఆ జరాసంధుడికి అంత క్రూర స్వభావం, జయించటానికి సాధ్యంకాని అంత భుజ పరాక్రమం ఎలా వచ్చాయో, అతని పుట్టుక ఎలాంటిదో నాకు చెప్పు.

**విశేషం:** చెప్పుము+పొలుపుగ - హల్లు పరమైంది కనుక 'ము' లోపం- చెప్పు.

శ్రీకృష్ణుఁడు ధర్మజునకు జరాసంధుని జననక్రమ మెఱిఁగించుట (సం. 2-16-12)

**వ. అని యడిగిన ధర్మరాజునకుఁ గృష్ణుం డిట్లనియె. 135**

**తాత్పర్యం:** అని అడిగిన ధర్మరాజుతో శ్రీకృష్ణుడు ఈవిధంగా అన్నాడు.

**సీ. అతిసమర్థుండు బృహద్రథుం డనువాఁడు । మగధాధినాథుఁ డున్మార్గదూరుఁ,**
**డక్షౌహిణీ త్రితయంబు బలంబునఁ । బరుల నోడించిన బలిమికాఁడు,**
**కాశిరా జనువానిగాదిలికూఁతులఁ । గవల వారల నతికాంతిమతుల**
**నమరంగఁ బెండ్లి యై యనుపమప్రీతి న । య్యిరువురయందు భోగేచ్ఛ సలిపి**

**తే. యం దపత్యంబు వడయుదు నని తలంచి । విప్ర ముని దేవ పూజల వివిధవిధులఁ**
**బుత్త్రకామేష్టులను నొండు పుణ్యకర్మ । యుక్తులను జేసి పడయంగ నోప కలసి. 136**

**ప్రతిపదార్థం:** అతి సమర్థుండు= మిక్కిలి సమర్థుడైన; మగధ+అధినాథుఁడు= మగధదేశపురాజు; బృహత్+రథుండు; అనువాఁడు= అనే పేరున్నవాడు; ఉన్మార్గదూరుఁడు= చెడునడవడికి దూరమైనవాడు; అక్షౌహిణీ, త్రితయంబు, బలంబునన్= మూడు అక్షౌహిణుల సైన్యంతో; పరులన్= శత్రువులను; ఓడించిన; బలిమికాఁడు= బలవంతుడు; కాశిరాజు+అనువాని; గాదిలికూఁతులన్= ప్రియమైన పుత్త్రికలను; కవల వారలన్= ఒకేసారి జన్మించిన జంట పిల్లలను; అతికాంతిమతులన్= మిక్కిలి తేజస్సుతో వెలిగేవాళ్ళను; అమరంగన్= ఒప్పుగా; పెండ్లి+ఐ= పెండ్లిచేసికొని; అనుపమప్రీతిన్= సాటిలేని ప్రేమతో; ఆ+ఇరువుర+అందున్= ఆ ఇద్దరు భార్యల ద్వారా; భోగ+ఇచ్ఛ= సంభోగ సంబంధమైన కోరిక; సలిపి; అందున్= ఆ భార్యల ఇద్దరి ద్వారా; అపత్యంబున్= సంతానాన్ని; పడయుదున్+అని= పొందుతానని; తలంచి; విప్ర, ముని, దేవపూజలన్= బ్రాహ్మణులను, మునులను, దేవతలను, పూజించటంచేత; వివిధ, విధులన్= అనేక శాస్త్రోక్త పద్ధతులచేత; పుత్త్రకామ+ఇష్టులన్= పుత్త్రులను కోరి చేసే యాగాలచేత; ఒండు= ఇతరాలైన; పుణ్య, కర్మ, యుక్తులను= పుణ్యకార్యాలతో కూడ; పడయంగన్+ఓపక= పుత్రులను పొందనేరక; అలసి= విసిగి.

**తాత్పర్యం:** మహాసమర్థుడైన మగధరాజు బృహద్రథుడు అక్రమ మార్గాలను అనుసరించకుండ, మూడుఅక్షౌహిణుల సైన్యంతో శత్రురాజుల్ని ఓడించాడు. కాశీరాజుకూర్మిపుత్రికల్ని, అందమైన కవలపిల్లల్ని వివాహమాడాడు. అమితప్రీతితో, ఆ యిద్దరితో అనేక సంభోగ సుఖాలు అనుభవించాడు. సంతానకాంక్షతో దేవ బ్రాహ్మణ ముని పూజలు చేశాడు. శాస్త్రనియమానుసారం పుత్త్రకామేష్టి యాగాలు, పెక్కుపుణ్యకార్యాలు చేశాడు. అయినా పుత్రుల్ని పొందలేక జీవితంలో విసిగిపోయాడు.

**విశేషం:** అక్షౌహిణి - 21870 రథాలు, అదేసంఖ్యలో ఏనుగులు, 65610 గుర్రాలు, 109350 పదాతులు గల సేనాసమూహం.

**వ. 'పుత్త్రుండు లేని విభవంబు లన్నియు నేల?'యని నిర్వేదించి పత్నీద్వయ సమేతుండయి వనంబున కరిగి. 137**

**ప్రతిపదార్థం:** పుత్త్రుండు; లేని; విభవంబులు+అన్నియున్= సంపదలన్నీ; ఏల; అని; నిర్వేదించి= నిరాశచెంది; పత్నీద్వయ సమేతుండు+అయి= భార్యలిద్దరితో కూడినవాడై; వనంబునకున్+అరిగి= అడవికి వెళ్ళి.

**తాత్పర్యం:** పుత్రులు లేని సంపదలు ఎందుకని నిరాశచెంది, భార్యలిద్దరితో కలిసి బృహద్రథుడు అడవికి వెళ్ళి.

**ఉ. ఆ విపినాంతరంబున నిరంతర నిష్ఠ ననంత మోక్షకాం**
**క్షావిధి నొక్క బాల సహకార మహీజము క్రింద నుజ్జ్వల**
**త్పావకతేజుఁడై తపము పాయక చేయుచు నున్న ధన్యుఁ గా**
**క్షీవతుఁ గాంచె గౌతము నకిల్బిషమానసుఁ జండకౌశికున్. 138**

**ప్రతిపదార్థం:** ఆ+విపిన+అంతరంబునన్= ఆ, అడవి మధ్యలో; నిరంతర, నిష్ఠన్= ఎడతెగని నియమంతో; అనంత, మోక్ష, కాంక్షా, విధిన్= అంతులేని మోక్షం పట్ల కోరికతో కూడిన విధానంతో; ఒక్క, బాల, సహకార, మహీజము, క్రిందన్= లేతమామిడి చెట్టు క్రింద; ఉత్+జ్వలత్+పావక, తేజుఁడు+ఐ= బాగా మండుతున్న అగ్నిహోత్రుని వంటి కాంతి కలవాడై; తపము= తపస్సు; పాయక= వదలక; చేయుచున్+ఉన్న; ధన్యున్; కాక్షీవతున్; అకిల్బిష, మానసున్= పాపరహితమైన మనస్సు కలవానిని; గౌతమున్= గౌతముని కుమారుడిని; చండకౌశికున్= చండకౌశికు డనే పేరు కలవానిని; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** ఆ అడవి మధ్య నిరంతర నిష్ఠతో, అంతులేని ముక్తికాంక్షతో, మండుతున్న అగ్నిలా మహాతేజస్సుతో, ఒక లేత మామిడి చెట్టుక్రింద ఎడతెగని తపస్సు చేస్తున్న ధన్యుడు, కాక్షీవతుడు, పుణ్యాత్ముడు, గౌతముడు అయిన చండకౌశిక మహర్షిని చూచాడు.

**విశేషం:** కాక్షీవతః పుత్రం గౌతమస్య మహాత్మనః - అని మూలం. కాక్షీవతః అనేది గౌతమస్య అనే దానికి విశేషణం. (ఈ పద్యరచనలో అర్థనైర్మల్యంతో కూడిన బంధశైథిల్యం నన్నయరచనలో మిక్కుటంగా గోచరించే ప్రసాదగుణాన్ని ప్రత్యక్షం చేస్తున్నది. సంపా.)

**క. ధరణీశ్వరుఁ డమ్మునివరుఁ । బురాతనమునినిన్ నిరాశుఁ బుణ్యాత్ము నిరం**
**తర కృత నియమ సపర్యా । వరివస్యుం డగుచు భక్తి వదలక కొలిచెన్. 139**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వరుఁడు= బృహద్రథ మహారాజు; ఆ+మునివరున్= ఆమునిశ్రేష్ఠుని; పురాతన, మునిన్= ప్రాచీనుడైనమునిని; నిర్+ఆశున్= కోరికలేనివానిని; పుణ్య+ఆత్మున్= పవిత్రమైన మనస్సు కలవానిని; నిరంతర, కృత, నియమ, సపర్యా, వరివస్యుండు+అగుచున్= ఎడతెగకుండ చేయబడిన నియమబద్ధమైన, పరిచర్యలతోను కూడిన సేవ కలవాడై; భక్తిన్, వదలక= విడువక; కొలిచెన్= సేవించాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడు, పురాతనుడు, నిష్కాముడు, మునిశ్రేష్ఠుడు అయిన చండకౌశికుణ్ణి ఎడతెగని నియమనిష్ఠలతో, ఎనలేని భక్తితో బృహద్రథమహారాజు సేవించాడు.

**వ. ఇ ట్లుపాస్యమానుం డయి చండకౌశికుండు బృహద్రథునకు మెచ్చి 'నీ కిష్టంబు చెప్పు మిచ్చెద' ననిన వినయ వినమితోత్తమాంగుం డయి వాఁ డి ట్లనియె. 140**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; ఉపాస్యుండు+అయి= సేవించబడినవాడై; చండకౌశికుండు; బృహత్+రథునకున్; మెచ్చి; నీకున్+ఇష్టంబు= నీఇష్టమైనది; చెప్పుము+ఇచ్చెదన్; అనినన్; వినయ, వినమిత+ఉత్తమ+అంగుండు+అయి= వినయంచేత వంచిన శిరస్సు కలవాడై; వాఁడు= ఆ బృహద్రథ మహారాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** బృహద్రథుడి సేవలకు మెచ్చి చండకౌశికుడు 'నీ కేమి కావాలో కోరుకొ'మ్మనగా అతడు వినయంతో శిరస్సు వంచి ఇలా అన్నాడు.

**ఉ. సంతతమైన సర్వ సుఖ సంపద గల్గియు దానికిం దగన్**
**సంతతి లేమిఁ జేసి యది సర్వము హేయము కాఁ దలంచి ని**
**శ్చింతుఁడనై ధృతిం దపము సేయఁగవచ్చితిఁ బుత్త్రజన్మమై**
**నంతన యేను మీ దయఁ గృతార్థతఁ బొందుదు సన్మునీశ్వరా! 141**

**ప్రతిపదార్థం:** సత్+మునీశ్వరా!= ఓమునిశ్రేష్ఠా!; సంతతము+ఐన= ఎడతెగని; సర్వ, సుఖ, సంపద= అన్ని సుఖాల వైభవం; కల్గియున్= పొందియు; దానికిన్, తగన్= అందుకు తగినట్లు; సంతతి, లేమిన్+చేసి= సంతానం లేనందువల్ల; అది, సర్వము= ఆ సంపద అంతా; హేయము+అ, కాన్+తలంచి= విడువదగినదే అని అనుకొని; నిశ్చింతుఁడన్+ఐ= దిగులు లేనివాడినై; ధృతిన్= స్థిరమైన బుద్ధితో; తపము= తపస్సు; చేయఁగన్; వచ్చితిన్; పుత్త్ర, జన్మము+ఐన+అంతన= పుత్రుడు పుట్టటం జరిగినంతనే; ఏను= నేను; మీదయన్= మీదయతో; కృత+అర్థతన్+పొందుదున్= ఈడేరిన కోరిక కలవాడి నౌతాను.

**తాత్పర్యం:** ఓ మునిశ్రేష్ఠా! నాకు అంతులేని సుఖసంపద లున్నాయి. కాని, అందుకు తగ్గట్లు సంతానం లేదు. అందుచేత ఆ భోగభాగ్యా లన్నింటిని వదలి నిశ్చింతగా, స్థిరబుద్ధితో తపస్సు చెయ్యాలని వచ్చాను. మీ అనుగ్రహంచేత నాకు పుత్రోదయ మైతే నాకోరిక తీరుతుంది.

**విశేషం:** నన్నయప్రసాదగుణవిశిష్టమైన రచన కీ పద్యం చక్కని ఉదాహరణం.

**వ. అనినం గరుణించి మునివరుండు పరమధ్యానముకుళిత నయనుండై యున్నంత. 142**

**ప్రతిపదార్థం:** అనినన్= అని బృహద్రథు డనగా; కరుణించి= దయతలచి; మునివరుండు= మునిశ్రేష్ఠుడైన చండకౌశికుడు; పరమ, ధ్యాన, ముకుళిత, నయనుండు+ఐ= గొప్పధ్యానంచేత ముడుచుకొన్న కన్నులు కలవాడై; ఉన్న+అంతన్.

**తాత్పర్యం:** అని బృహద్రథమహారాజు అనగానే, దయతో ఆ మునిశ్రేష్ఠుడైన చండకౌశికుడు ధ్యానంలో కళ్ళుమూసుకొని ఉండగా.

**క. పవనవిధూతము శుకచం । చు విలూనముఁ గాక యొక్క చూతఫలం బ**
**య్యవనిజమువలన నమ్ముని । ప్రవరుపృథూత్సంగతలముపై వడిఁ బడియెన్. 143**

**ప్రతిపదార్థం:** పవన, విధూతము= గాలిచే విసిరివేయబడింది; శుక, చంచు, విలూనమున్= చిలుక ముక్కుచేత త్రుంచి వేయబడింది; కాక= కాకుండ; ఒక్క, చూత, ఫలంబు= ఒక మామిడిపండు; ఆ, అవనిజము వలనన్= ఆ చెట్టునుండి; ఆ, ముని, ప్రవరు, పృథు+ఉత్సంగ, తలముపైన్= ఆ మునిశ్రేష్ఠుడియొక్క విశాలమైన తొడమీద; వడిన్= వేగమే; పడియెన్.

**తాత్పర్యం:** ఒక మామిడిపండు ఆ చెట్టుమీదినుండి చండకౌశికమహర్షియొక్క విశాలమైన తొడమీద పడింది. కాని, అది గాలికి రాలిపడలేదు. చిలుక ముక్కుతో దాన్ని త్రుంచి వెయ్యలేదు. దానంతట అదే పడింది.

**వ. దానిం బుచ్చికొని యభిమంత్రించి చండకౌశికుండు బృహద్రథున కిచ్చి 'యీ ఫలంబువలన నీకొక్క పుత్త్రుం డుద్భవిల్లు' నని చెప్పిన నాతండును గృతార్థుండై క్రమ్మఱ నిజపురంబునకు వచ్చి, తన యిద్దఱు భార్యలకు నప్పండు సమంబుగా విభాగించి పెట్టినం దత్ఫలోపభోగంబున నయ్యిద్దఱు గర్భిణులయినఁ బదియగు మాసంబున నొక్కనాఁటి రాత్రియందు వారలకు. 144**

**ప్రతిపదార్థం:** చండకౌశికుండు; దానిన్= ఆ మామిడిపండును; పుచ్చికొని= తీసికొని; అభిమంత్రించి= మంత్రంచేత సంస్కరించి; బృహత్+రథునకున్; ఇచ్చి; ఈ, ఫలంబువలనన్; నీకున్+ఒక్క, పుత్త్రుండు; ఉద్భవిల్లున్= జన్మిస్తాడు; అని; చెప్పినన్= చెప్పగా; అతండును= ఆ బృహద్రథుడు; కృత+అర్థుండు+ఐ= తీరిన కోరిక కలవాడై; క్రమ్మఱ= మరలి; నిజ, పురంబునకున్= తనయొక్క రాజధానీ నగరానికి; వచ్చి; తన; ఇద్దఱు; భార్యలకున్, ఆ+పండు; సమంబుగా= సమానంగా; విభాగించి= పంచి; పెట్టినన్; తత్, ఫల+ఉపభోగంబునన్= ఆ పండును తినటంచేత; ఆ+ఇద్దఱు; గర్భిణులు+అయినన్; పది, అగు, మాసంబునన్= పదవ నెలలో; ఒక్కనాటి; రాత్రి, అందున్; వారలకున్.

**తాత్పర్యం:** చండకౌశికుడు ఆ పండు తీసుకొన్నాడు. మంత్రించి బృహద్రథమహారాజుకు ఇచ్చాడు. దీనివల్ల నీ కొకకొడుకు జన్మిస్తా డని చెప్పాడు. బృహద్రథునికోరిక తీరింది. ఆయన తనరాజధానికి తిరిగివచ్చాడు. ఆ పండును భార్య లిద్దరికి సమానంగా పంచి ఇచ్చాడు. ఆ పండును తిన్న భార్య లిద్దరు గర్భవతు లయ్యారు. పదినెలల తర్వాత ఒకనాటి రాత్రి ఆ యిద్దరికి.

**విశేషం:** 'అవ' అనటానికి బదులు నన్నయగారు 'అగు' అని వాడుతుంటారు.

**క. ఒక్కొక కన్నును జెవియును। జెక్కును జను బొడ్డు మూఁపుఁ జెలువగు చేయున్**
**బ్రక్కయుఁ గుఱువును గాలును। నక్కజముగ మనుజ శకలమై యుదయించెన్. 145**

**ప్రతిపదార్థం:** ఒక్కొక; కన్నును; చెవియును; చెక్కును= చెంప; చను, బొడ్డు= చన్ను, బొడ్డుయొక్క భాగము; మూఁపున్= భుజమును; చెలువు+అగు= అందమైన; చేయున్= చెయ్యి; ప్రక్కయున్= ప్రక్క భాగమూ; కుఱువును= తొడా; కాలునున్, అక్కజముగ= ఆశ్చర్యకరంగా, మనుజ, శకలము+ఐ= మానవశరీరపు ముక్క అయి; ఉదయించెన్= పుట్టింది.

**తాత్పర్యం:** ఒక కన్ను, ఒక చెవి, ఒక చెంప, ఒక చన్ను, సగంబొడ్డు, ఒక భుజం, ఒక చెయ్యి, ఒక ప్రక్క భాగం, ఒక తొడ, ఒక కాలు ఉన్న మానవశరీరపు సగభాగం ముక్కలు ఆశ్చర్యకరంగా ఆ యిద్దరికి జన్మించాయి.

**విశేషం:** చండకౌశికుడు చెప్పింది ఈ ఫలంవల్ల ఒక పుత్రుడు కలుగుతాడు అని. బృహద్రథుడు ఆ పండును రెండు సమభాగాలుగా కోసి భార్యలకు ఇచ్చాడు. అందువల్లనే ఇలా అయింది. 'ఏకాక్షి బాహుచరణే అర్ధోదరముఖస్ఫిచే' - అని మూలం. చను బొడ్డు - అనే వాటి సంగతి అందులో లేదు.

**క. అమ్మానిసి వ్రయ్యలు గని। యమ్ముదితలు వెఱచి 'వీని నాత్మజుఁ డని నె**
**య్యమ్మున నెట్టులు చూపుదు। మిమ్మనుజేశ్వరున?' కనుచు నెంతయు లజ్జన్. 146**

**ప్రతిపదార్థం:** ఆ+మానిసి, వ్రయ్యలు= ఆ మానవుని ముక్కలు; కని= చూచి; ఆ+ముదితలు= ఆ కాంతలు, - బృహద్రథుని భార్యలు; వెఱచి= భయపడి; వీనిన్= ఈముక్కలుగా పుట్టిన వాడిని; ఆత్మజుఁడు+అని= పుత్రుడని; నెయ్యమునన్=

ప్రేమతో; ఈ+మనుజ+ఈశ్వరునకున్= ఈ మహారాజుకు (భర్త అయిన బృహద్రథుడికి); ఎట్లులు= ఏవిధంగా; చూపుదుము; అనుచున్; ఎంతయున్, లజ్జన్= మిక్కిలి సిగ్గుతో.

**తాత్పర్యం:** ఆ మానవాకారపు ముక్కల్ని చూచి, బృహద్రథుని భార్యలిద్దరు భయపడ్డారు. ఈ ముక్కలుగా పుట్టినవాణ్ణి ప్రియమార పుత్రుడని మహారాజుకు ఎలా చూపించాలా? అని సిగ్గుపడ్డారు.

**వ.** **'వీని నెవ్వరును నెఱుంగకుండ వెలుపల వైచిరం' డని తమదాదులం బంచిన, వార లా రెండు వ్రయ్యలుం గొనిపోయి రాజగృహ ద్వారతోరణ సమీపంబునఁ జదుకంబునొద్ద నొక్కచోట వైచిన, నచ్చదుకంబున నుండెడు రాక్షసి జర యనునది దాని బలియకా వగచి పఱతెంచి.** **147**

**ప్రతిపదార్థం:** వీనిన్= ఈముక్కల్ని; ఎవ్వరును; ఎఱుంగకుండన్; వెలుపలన్; వైచి= వేసి; రండు+అని; తమ; దాదులన్= పనికత్తెల్ని; పంచినన్= పంపించగా; వారలు; ఆ, రెండు; వ్రయ్యలున్= ముక్కలును; కొనిపోయి= తీసుకొని పోయి; రాజ, గృహ, ద్వార, తోరణ, సమీపంబునన్= రాజభవనంయొక్క వెలుపలి వాకిలి దగ్గర; చదుకంబు+ఒద్దన్= నాలుగు త్రోవల కూడలి దగ్గర; ఒక్కచోటన్; వైచినన్= వెయ్యగా; ఆ+చదుకంబునన్= ఆ నాలుగుత్రోవలు కలిసేచోట; ఉండెడు; రాక్షసి; జర, అనునది; దానిన్= ఆ ముక్కల జంటను; బలి+అ, కా, వగచి= బలి ఇచ్చిన ప్రాణిశరీరంయొక్క ముక్కలని తలచి; పఱతెంచి= పరుగెత్తుకొని వచ్చి,

**తాత్పర్యం:** 'ఎవరికి తెలియకుండ ఈ ముక్కల్నిబయట పారేసిరం' డని బృహద్రథుని భార్యలు పనికత్తెల్ని పంపారు. పనికత్తెలు ఆ రెండు ముక్కల్ని తీసుకుపోయి రాజభవనం వెలుపలి వాకిలి సమీపంలో నాలుగు త్రోవలు కలిసేచోట ఒకవైపు వేసి వచ్చారు. అక్కడ ఉండే జర అనే రాక్షసి ఆ ముక్కలను చూచి, బలి యిచ్చిన ప్రాణి శరీరపుముక్కలని అనుకొని పరుగెత్తి వచ్చింది.

### జరయను రాక్షసి బాలకునిఁ దెచ్చి బృహద్రథుని కొసంగుట (సం. 2-16-38)

**ఆ.** **ఎత్తికొని చనంగ నిమ్మగు నట్లుగా । మెదలుచున్న వ్రయ్య లదిమి రెంటిఁ**
**గూడఁబట్టె; నవియుఁగూడి యొండొంటితోఁ । జక్క నంటి రెండు నొక్కఁడయ్యె.** **148**

**ప్రతిపదార్థం:** ఎత్తికొని, చనంగన్= ఎత్తుకొని వెళ్ళటానికి; ఇమ్ము+అగునట్లుగాన్= అనుకూలం అయ్యేటట్లుగా; మెదలుచున్+ ఉన్న= అటు ఇటు కదలుతున్న; వ్రయ్యలు+అదిమి= ముక్కలను ఒత్తి; రెంటిన్; కూడన్, పట్టెన్= రెండింటిని కలిపి పట్టుకొన్నది; అవియున్= ఆ ముక్కలు; కూడి= కలిసి; ఒండు+ఒంటితోన్= ఒకదానితో ఒకటి; చక్కన్+అంటి= సరిగా అతుక్కొని; రెండును+ఒక్కఁడు+అయ్యెన్.

**తాత్పర్యం:** జర అనే ఆ రాక్షసి తా నెత్తుకొని వెళ్ళటానికి అనుకూలంగా-కదులుతున్న ఆ రెండు ముక్కల్ని కలిపి గట్టిగా పట్టుకున్నది. అవి ఒకదానితో ఒకటి చక్కగా అతుక్కొని రెండూ కలిసి ఒకవ్యక్తిగా రూపొందాయి.

**క.** **ఆ రాక్షసి కెత్తికొనన్ । భారముగా వజ్రకఠిన బంధురతనుఁ డై**
**ధీరుఁడు బాలకుఁ డేడ్చె మ । హారవమున దాని చేతు లాడకయుండన్.** **149**

**ప్రతిపదార్థం:** ఆ, రాక్షసికిన్; ఎత్తికొనన్; భారముగాన్= బరువుగా; వజ్ర, కఠిన, బంధుర, తనుఁడు+ఐ= వజ్రంలా కఠినంగా ఉన్న శరీరం కలవాడై; ధీరుఁడు; బాలకుఁడు; మహా, రవమునన్= పెద్దశబ్దంతో; దాని= ఆ రాక్షసియొక్క; చేతులు+ఆడక, ఉండన్= చేతులాడకుండగా; ఏడ్చెన్.

**తాత్పర్యం:** ఆ రాక్షసి ఎత్తుకొనటానికే బరువై, వజ్రంలాంటి కఠినమైన శరీరంతో ఒప్పుతున్న ఆ బాలుడు పెద్దశబ్దంతో ఏడ్చాడు. ఆ ఏడ్పు విన్న జరకు అతణ్ణి ఎత్తుకొని పోవటానికే చేతు లాడలేదు.

**విశేషం:** 'తతః సా రాక్షసీ రాజన్ విస్మయోత్ఫుల్లలోచనా, న శశాక సముద్వోఢుం వజ్రసారమయం శిశుం' (భండార్కరు ప్రతి. 2-16-41) మూలంలోని 'విస్మయోత్ఫుల్లలోచనా' అనే జర ఆశ్చర్యం అనువాదంలో రాలేదు. ఇచట ఆ రాక్షసి ఆశ్చర్యపడటం సహజమే కదా!

**వ.** **అబ్బాలకు రోదన ధ్వని విని యంతిపురంబున నున్న ముదుసలి యవ్వలెల్లం బఱతెంచి మహాహర్షంబుతో వాని నెత్తికొని; రట్టి సంభ్రమం బెఱింగి బృహద్రథుండు వచ్చి తేజోధికుండయి తామ్రతలముష్టిం దనముఖపద్మంబునం బెట్టికొని దిక్కులు సెలంగ నేడ్చుచున్న కొడుకుం జూచి కృతార్థీకృత లోచనుం డయ్యె; నట్టి యవసరంబున నా రాక్షసి కామరూపిణి గావున మనుష్య స్త్రీరూపధారిణి యయి యమ్మగధరాజున కి ట్లనియె. 150**

**ప్రతిపదార్థం:** ఆ+బాలకు; రోదన, ధ్వని= ఏడుపు శబ్దం; విని; అంతిపురంబునన్+ఉన్న= అంతఃపురంలో ఉండే; ముదుసలి; అవ్వలు+ఎల్లన్= ముసలి స్త్రీలందరు; పఱతెంచి= పరుగెత్తుకొని వచ్చి; మహాహర్షంబుతోన్= మిక్కిలి సంతోషంతో; వానిన్= ఆ బాలుణ్ణి; ఎత్తికొనిరి; అట్టి; సంభ్రమంబు+ఎఱింగి= ఆ వేగిరపాటు చూచి; బృహద్రథుండు; వచ్చి; తేజః+అధికుండు+అయి= కాంతిచే మిక్కిలిగా వెలుగుతున్నవాడై; తామ్రతల ముష్టిన్= రాగివలె ఎర్రగా ఉన్న పిడికిలిని; తన= తనయొక్క; ముఖపద్మంబునన్= పద్మంవంటి ముఖంలో; పెట్టికొని; దిక్కులు, చెలంగన్= దిక్కులు మ్రోగేటట్లు; ఏడ్చుచున్+ఉన్న; కొడుకున్; చూచి; కృత+అర్థీకృత, లోచనుండు+అయ్యెన్= ఈడేరిన కోరిక కలవాడివలె చేయబడిన కన్నులు కలవాడయ్యాడు - అంటే పుత్రుడు కావాలనే కోరిక తీరటంచేత కలిగిన ఆనందం అతని కన్నులలో కన్పించింది; అట్టి, అవసరంబునన్= ఆ సమయంలో; ఆ రాక్షసి; కామరూపిణి; కావునన్= కోరుకొన్నరూపాన్ని ధరించేశక్తి కలది కావటంచేత; మనుష్య, స్త్రీ, రూప, ధారిణి, అయి= మానవకాంత రూపాన్ని ధరించిందై; ఆ+మగధరాజునకున్= ఆ బృహద్రథునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ బాలకుడి ఏడుపుశబ్దం విని అంతఃపురంలో ఉండే వృద్ధస్త్రీలందరు పరుగెత్తుకొని వచ్చారు. మహానందంతో ఆ బాలుణ్ణి ఎత్తుకొన్నారు. వాళ్ళ వేగిరపాటును చూచి బృహద్రథుడు కూడా వచ్చాడు. ఎంతో కాంతితో ప్రకాశిస్తూ, రాగివలె ఎర్రగా ఉండే లేత పిడికిలిని తనపద్మంవంటి ముఖంపై పెట్టుకొని దిక్కులు పిక్కటిల్లేటట్లు ఏడుస్తున్న తన పుత్రుణ్ణి చూచి మహానందభరితు డయ్యాడు. ఆ రాక్షసి కోరుకొన్న రూపాన్ని ధరించే శక్తి ఉంది కనుక అప్పుడు మానవకాంతరూపం ధరించి ఆ మగధరాజైన బృహద్రథునితో ఇలా అన్నది.

**తే.** **ఏను జరయను రాక్షసి, నిప్పురంబు । చదుకమునఁ బాయకుండుదు, సంతతంబు**
**నీకు నిష్టంబు సేయంగ నెమ్మితోడఁ । గోరుచుండుదు, నది సమకూరె నేఁడు. 151**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; జర, అను; రాక్షసిన్; ఈ+పురంబు= ఈనగరంయొక్క; చదుకంబునన్= నాలుగుమార్గాల కూడలిస్థలంలో; పాయక+ఉండుదున్= వదలకుండా ఉంటాను; సంతతంబు= ఎల్లప్పుడు; నీకున్= నీకు; ఇష్టంబు= ప్రియమైనది; చేయంగన్; నెమ్మితోడన్= ప్రేమతో; కోరుచున్+ఉండుదున్; అది= అలాంటి అవకాశం; నేడు; సమకూరెన్= లభించింది.

**తాత్పర్యం:** నాపేరు జర. నే నొక రాక్షసిని. ఈ నగరంయొక్క నాలుగు మార్గాల కూడలి నా నివాసస్థలం. సర్వదా నీ కిష్టమైనది చేయాలని నా కోరిక. ఆ అవకాశం ఈరోజు లభించింది.

**వ. 'నీ యిద్దఱు దేవులకు నుద్భవిల్లిన యిమ్మనుష్య శకలంబులు రెండును నీదాదులు దెచ్చి యిచ్చదుకంబు నొద్ద నొక్కచో వైచి పోయిన నేను వానిం గూడఁబట్టుడు నప్పుడు వజ్రఘన ఘటిత కఠిన శరీరుండై యిక్కుమారుండు మేరుగిరి శృంగంబునుంబోలె నా కెత్తికొన నశక్యుం డయ్యె; వీని నొప్పుగొను' మనిన విని బృహద్రథుండు ముదితహృదయుం డయి దాని కి ట్లనియె. 152**

**ప్రతిపదార్థం:** నీ; ఇద్దఱు; దేవులకున్= భార్యలకు; ఉద్భవిల్లిన= పుట్టిన; ఈ+మనుష్యశకలంబులు= ఈమానవుడి ముక్కలు (మానవ దేహభాగాలు); రెండును; నీ, దాదులు= నీ పనికత్తెలు; తెచ్చి; ఈ+చదుకంబు+ఒద్దన్= ఈనాలుగు మార్గాల కూడలి దగ్గర; ఒక్కచోన్= ఒక్కచోట; వైచి= పడవేసి; పోయినన్= వెళ్ళగా; ఏను; వానిన్= ఆముక్కలను; కూడన్= కలిసేటట్లు; పట్టుడున్= పట్టుకోగా; అప్పుడు; వజ్ర, ఘన, ఘటిత, కఠిన, శరీరుండు+ఐ= వజ్రంయొక్క కాఠిన్యంతో కూర్చబడిన గట్టి శరీరం కలవాడై; ఈ+కుమారుండు; మేరుగిరి, శృంగంబునున్+పోలె= మేరుపర్వత శిఖరంవలె; నాకు+ఎత్తికొనన్; అశక్యుండు+అయ్యె= సాధ్యం కానివా డయ్యాడు; వీనిన్= ఈ బాలుణ్ణి; ఒప్పు, కొనుము= అంగీకరించు; అనిన; విని; బృహద్రథుండు; ముదిత, హృదయుండు+అయి= సంతోషించిన మనస్సు కలవాడై; దానికి= ఆ రాక్షసికి; ఇట్లు+అనియె.

**తాత్పర్యం:** 'నీ భార్య లిద్దరికి పుట్టిన ఈమానవదేహపు ముక్కలు రెండింటిని నీపనికత్తెలు తెచ్చి ఈనాలుగుత్రోవల కూడలిలో పారేసి వెళ్ళారు. నేను ఆ ముక్కలను కలిపి పట్టుకోగా వజ్రంలా కఠినమైన దేహంతో, ఈబాలకుడు రూపొందాడు. మేరుపర్వతశిఖరంవలె ఎత్తుకొనటానికి సాధ్యంకానివాడయ్యాడు. ఈ బాలుణ్ణి ప్రేమతో నీవు అంగీకరించు.' అని రాక్షసి అనగానే బృహద్రథుడు సంతోషంతో ఇలా అన్నాడు.

**ఉ. ఇచ్చకు వచ్చు పూజనల నెంతయు సంతసమంది తొల్లి నా**
**కిచ్చె మునీశ్వరుండు దయ నిత్తనయున్; మఱి యిప్డు నెమ్మితో**
**నిచ్చితి వీవు రాక్షసివె! యిక్కులమెల్లను నుద్ధరింపఁగా**
**వచ్చిన పుణ్యదేవతవు వారిరుహాయతచారులోచనా! 153**

**ప్రతిపదార్థం:** వారిరుహ+ఆయత, చారు, లోచనా!= పద్మాలవంటి విశాలమైన అందమైన కళ్ళు కలదానా!; ఇచ్చకున్, వచ్చు, పూజనలన్= ఇష్టమైన పూజలచేత; ఎంతయున్= మిక్కిలి; సంతసము+అంది= సంతోషాన్ని పొంది; తొల్లి= పూర్వం; ముని+ఈశ్వరుండు= ముని శ్రేష్ఠుడైన చండకౌశికుడు; దయన్= దయతో; ఈ+తనయున్= ఈ కుమారుణ్ణి; నాకున్+ఇచ్చె; మఱి; ఇపుడు; నెమ్మితోన్= ప్రేమతో; ఇచ్చితివి= నీవు నాకు ఇచ్చావు; ఈవు= నీవు; రాక్షసివె!= రాక్షసివా?; ఈ కులము+ఎల్లనున్= ఈ మావంశాన్నంతా; ఉద్ధరింపన్+కాన్= ఉన్నతస్థితికి చేర్చటానికి (తరింపచేయుటానికి); వచ్చిన; పుణ్యదేవతవు= పవిత్రదేవతామూర్తివి.

**తాత్పర్యం:** పద్మాలవంటి విశాలమైన అందమైన కళ్ళు కలదానా! పూర్వం చండకౌశిక మహర్షిని పూజిస్తే ఈ పుత్రుణ్ణి ఇచ్చాడు. ఇప్పుడు ప్రేమతో నీ విచ్చావు. నీవు రాక్షసివా? నావంశాన్ని ఉద్ధరించటానికి వచ్చిన పుణ్యదేవతవు.

**విశేషం:** అలం: అపహ్నుతి. ఇందులోని శబ్దగుణం మాధుర్యం. (వివరాలకు పీఠిక చూడండి). (సంపా.)

**వ. అని దాని నతిప్రీతిం బూజించి కొడుకు నెత్తికొని దేవీద్వయంబునకు నిచ్చి, జర యను రాక్షసిచేత సంధింపఁబడినవాఁడు గావున జరాసంధుం డను పేరిడి. పురం బష్టశోభనంబు సేయించి, యా రాక్షసి కేఁటేఁట మహోత్సవంబు సేయించుచుం గొడుకు నతి గౌరవంబునం బెంచిన. 154**

**ప్రతిపదార్థం:** అని; దానిన్= ఆ జరను; అతిప్రీతిన్= మిక్కిలి ఇష్టంతో; పూజించి; కొడుకున్+ఎత్తికొని; దేవీ, ద్వయంబునకున్= భార్యలిద్దరికి ఇచ్చి; జర, అను; రాక్షసిచేత; సంధింపన్+పడినవాఁడు, కావునన్= ఒకటిగా కూర్చబడినవాడు కావటంచేత; జరాసంధుండు+అను; పేరు+ఇడి= పేరుపెట్టి; పురంబు+అష్ట, శోభనంబు, చేయించి= నగరాన్ని ఎనిమిది విధాల మంగళాలు కలదానినిగా చేయించి; ఆ, రాక్షసికిన్; ఏఁట+ఏఁట; మహా+ఉత్సవంబు= గొప్పపండుగ; చేయించుచున్; కొడుకున్; అతి, గౌరవంబునన్= మిక్కిలి ప్రేమతో (గారాబంతో); పెంచినన్.

**తాత్పర్యం:** అని బృహద్రథుడు ఆ జరను ఎంతో ప్రీతితో పూజించాడు. ప్రియమార పుత్రుణ్ణి ఎత్తుకొన్నాడు. భార్యలిద్దరిచేతికి ఇచ్చాడు. జరచేత ఒకటిగా కలుపబడినాడు కనుక జరాసంధు డని పేరుపెట్టాడు. నగరాన్ని అష్టశోభనంగా అలంకరించాడు. ఆ రాక్షసికి ప్రతిసంవత్సరం పండుగ జరిపిస్తూ పుత్రుణ్ణి ఎంతో ప్రేమతో పెంచుతుండగా.

**విశేషం:** 'జరయా సంధితో యస్మాత్ జరాసంధ స్తతోఽభవత్-' (భండార్కరు ప్రతి 2-17-6) అని మూలం. పురం బష్టశోభనంబు, చేయించుట - కొన్ని ప్రతులలో లేదు. మూలంలోకూడా లేదు. "మృగరాజో బుధో నాగః కలశో వ్యజనం తథా, వైజయంతీ తథా భేరీ దీప ఇత్యష్ట మంగలమ్". మరికొందరి ప్రకారం "లో కేఽస్మిన్మంగలాన్యష్ట బ్రాహ్మణో గౌర్హుతాశనః హిరణ్యం సర్పి రాదిత్య ఆపో రాజా తథాష్టమః".

**క. ఈహిత విధానముల లో । కాహిత దుస్సహనతేజుఁ డయి వాఁడు మహో**
**త్సాహముతో వర్ధిల్లె ఘృ । తాహుతులఁ బ్రవృద్ధి నొందు నగ్నియపోలెన్. 155**

**ప్రతిపదార్థం:** వాఁడు= ఆ జరాసంధుడు; ఈహిత, విధానములన్= కోరుకున్న పద్ధతుల్లో; లోక+అహిత, దుస్సహన, తేజుఁడు+అయి= ప్రపంచానికి హితంకానిది, సహించటానికి శక్యంకానిది అయిన పరాక్రమాన్ని కలవాడై; మహా+ఉత్సాహంతో= మిక్కిలి సంతోషంతో; ఘృత+ఆహుతులన్= నేతి ఆహుతులచేత; ప్రవృద్ధిన్+ఒందు= అంతకంతకు అధికమయ్యే; అగ్ని+అ. పోలెన్= నిప్పువలె; వర్ధిల్లెన్= పెరిగాడు.

**తాత్పర్యం:** ఆ జరాసంధుడు తన కిష్టమైనపద్ధతుల్లో లోకానికి హితంకాని, సహించ శక్యంకాని పరాక్రమం కలవాడయ్యాడు. నేతిఆహుతులతో అంతకంతకు అధికమయ్యే అగ్నిహోత్రునిలా అధికోత్సాహంతో అభివృద్ధి చెందాడు.

**విశేషం:** అలం: ఉపమ.

### జరాసంధునియొద్దకుఁ జండకౌశికుండు వచ్చుట (సం. 2-17-8)

**వ. ఇట్లు జరాసంధుండు పెరుగుచున్నఁ గొండొక కాలంబునకు నొక్కనాఁడు చండకౌశికుం డందులకు వచ్చిన నతిముదంబుతోఁ బుత్త్ర కళత్ర మిత్రభృత్యామాత్య సహితుండయి బృహద్రథుం డెదురువోయి యమ్మునీంద్రునకు నమస్కరించి తోడ్కొనివచ్చి యుచితాసనంబున నునిచి యడుగులు గడిగి**

**యర్ఘ్యపాద్యాది విధులం బూజించి తనరాజ్యంబుతోడ సర్వస్వంబును నివేదించి కొడుకుం జూపినం జూచి సంతసిల్లి మునివరుం డిట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** ఇట్లు; జరాసంధుండు; పెరుగుచున్+ఉన్నన్; కొండొక, కాలంబునకున్= కొంతకాలం తరువాత; ఒకనాఁడు; చండకౌశికుండు; అందులకున్= అక్కడికి; వచ్చినన్= రాగా; అతి, ముదంబుతోన్= మిక్కిలి సంతోషంతో; పుత్త్ర, కళత్ర, మిత్త్ర, భృత్య+అమాత్య, సహితుండు+అయి= పుత్రునితో, భార్యలతో, మిత్రులతో, సేవకులతో, మంత్రులతో కూడుకొన్నవాడై; బృహద్రథుండు; ఎదురు, పోయి; ఆ+మునీంద్రునకున్= ఆ చండకౌశికునికి; నమస్కరించి; తోడ్కొని, వచ్చి= వెంట పిలుచుకొని వచ్చి; ఉచిత+ఆసనంబునన్= తగిన పీఠంమీద; ఉనిచి= కూర్చుండబెట్టి; అడుగులు= పాదాలు; కడిగి; అర్ఘ్య, పాద్య+ఆది, విధులన్= అర్ఘ్యమివ్వటం, పాద్యమివ్వటం మొదలైన పూజా పద్ధతులతో; పూజించి; తన రాజ్యంబుతోడన్; సర్వస్వంబును= సమస్త సంపదలను; నివేదించి= అర్పించి; కొడుకున్= తన కుమారుఁడైన జరాసంధుని; చూపినన్; మునివరుండు= మునిశ్రేష్ఠుడు- చండకౌశికుడు; చూచి; సంతసిల్లి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** జరాసంధుడు ఈ విధంగా వృద్ధి పొందుతుండగా కొంతకాలం తరువాత ఒకరోజు చండకౌశికుడు వచ్చాడు. బృహద్రథుడు మహానందభరితుడై పుత్రునితో, భార్యలతో, మిత్రులతో, సేవకులతో, మంత్రులతో ఎదురేగి నమస్కరించాడు. ఆమహామునిని తోడ్తెచ్చాడు. ఉచితపీఠంపై కూర్చుండబెట్టాడు. కాళ్ళు కడిగి, అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించాడు. తన రాజ్యంతో కూడ సర్వస్వాన్ని అర్పించి, ఆయన అనుగ్రహంచేత జన్మించిన తన కుమారుడిని చూపించాడు. ఆ మహామునికూడా జరాసంధుణ్ణి చూచి ఎంతో సంతోషించి ఇలా అన్నాడు.

**క. జరయను రాక్షసి నీకుం। గర ముపకారంబు సేసె ఘనముగ దీనిన్**
**ధరణీశ! యే నెఱింగితి। నిరుపమ నిరతిశయ యోగ నిష్ఠిత బుద్ధిన్. 157**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= ఓ బృహద్రథ మహారాజా!; జర; అను; రాక్షసి; నీకున్; కరము+ఉపకారము= మిక్కిలిమేలు; చేసెన్= చేసింది; ఘనముగన్= గొప్పగా; దీనిన్= ఈసంగతిని; నిరుపమ, నిరతిశయ. యోగ, నిష్ఠిత, బుద్ధిన్= సాటిలేని మేటి యోగంలో నిలుపబడిన బుద్ధిచేత; ఏన్= నేను; ఎఱింగితిన్= తెలుసుకొంటిని.

**తాత్పర్యం:** ఓ బృహద్రథ మహారాజా! జర అనే రాక్షసి నీకు మిక్కిలి మేలు చేసింది. ఈ సంగతి యోగదృష్టితో తెలుసుకొన్నాను.

**వ. 'ఇక్కుమారుండు కుమారునంతియ శక్తి సంపన్నుండయి త్రిపురాంతకు నంతకహరుం బరమేశ్వరుం దనకు సన్నిహితుంజేయు; నెంత బలవంతు లయ్యును వైరివీరులు వీనిం దాఁకి యగ్నిఁ దాఁకిన శలభంబులుంబోలె నడంగుదురు; గరుడనిగతి నన్యవిహంగంబు లనుగమింప నోపనియట్లు మానవులు వీనివీర్యంబు ననుగమింపనోపరు; తేజస్వులలోన నాదిత్యుండు వెలుంగునట్లు వీఁడు మూర్ధాభిషిక్తులలోన మిగిలి వెలుంగు; నదీరయంబులు మహాపర్వతంబుల ఛేదింప నోపనియట్లు దివ్యాస్త్రంబులు వీని దేహంబు భేదింప నోపవు; సముద్రంబు మహానదులం జేకొనునట్లు వీఁడు పరమహీపతుల సంపదలు చేకొను'నని జరాసంధు సామర్థ్యంబు చెప్పి చండకౌశికుం డరిగిన. 158**

**ప్రతిపదార్థం:** ఈ+కుమారుండు; కుమారు+అంతియ= కుమారస్వామి అంతటి; శక్తి, సంపన్నుండు+అయి= శక్తి సంపద కలవాడై; త్రిపుర+అంతకున్= మూడు నగరాలను నాశనం చేసినవాణ్ణి; అంతక, హరున్= మృత్యువును జయించినవాణ్ణి; పరమ+ఈశ్వరున్= సర్వానికి ప్రభువైన శివుణ్ణి; తనకున్; సన్నిహితున్, చేయున్= ప్రత్యక్షం కావించుకొంటాడు; ఎంత, బలవంతులు+అయ్యును= ఎంత బలం కలవాళ్ళయినా; వైరి, వీరులు= శత్రువీరులు, వీనిన్= ఈ జరాసంధుణ్ణి; తాఁకి= ఎదుర్కొని; అగ్నిన్= నిప్పును; తాఁకిన; శలభంబులున్+పోలెన్= మిడుతలవలె; అడంగుదురు= నశిస్తారు; గరుడని= గరుత్మంతునియొక్క; గతిన్= గమనాన్ని; అన్యవిహంగంబులు= ఇతర పక్షులు; అనుగమింపన్+ఓపని అట్లు= వెంబడించి వెళ్ళలేని విధంగా; మానవులు; వీని= ఈ జరాసంధునియొక్క; వీర్యంబున్= పరాక్రమాన్ని; అనుగమింపన్+ఓపరు= పోలజాలరు; తేజస్వులలోనన్= కాంతిమంతుల్లో; ఆదిత్యుండు= సూర్యుడు; వెలుంగునట్లు; వీఁడు= ఈ జరాసంధుడు; మూర్ధ+ అభిషిక్తులలోనన్= పట్టాభిషిక్తులైన రాజులలో; మిగిలి= అధికుడై; వెలుంగున్; నదీ, రయంబులు= ఏటి ప్రవాహవేగాలు; మహా, పర్వతంబులన్= పెద్దకొండలను; ఛేదింపన్+ఓపని, అట్లు= పడగొట్టలేనట్లు; దివ్య+అస్త్రంబులు= దేవతాసంబంధాలైన అస్త్రాలు; వీని, దేహంబున్= ఈ జరాసంధునియొక్క శరీరాన్ని; భేదింపన్+ఓపవు= చీల్చలేవు; సముద్రంబు; మహానదులన్= పెద్ద నదులను; చేకొను+అట్లు= తనలో చేర్చుకొనే విధంగా; వీఁడు= ఈ జరాసంధుడు; పరమహీపతుల, సంపదలు= ఇతర రాజుల సంపదలు; చేకొనున్= గ్రహిస్తాడు; అని; జరాసంధు; సామర్థ్యంబు; చెప్పి; చండకౌశికుండు; అరిగినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** 'ఈ కుమారుడు కుమారస్వామి అంతటి శక్తి సంపన్ను డౌతాడు. త్రిపురాంతకుడు మృత్యుంజయుడు అయిన పరమేశ్వరుణ్ణి ప్రత్యక్షం చేసుకొంటాడు. ఎంత బలవంతులైనా శత్రువీరులు ఈతణ్ణి ఎదుర్కొంటే నిప్పుమీద పడ్డ మిడుతల్లా మాడిపోతారు. గరుత్మంతుని పరుగును తక్కిన పక్షులు అనుసరించలేనట్లే ఈతని పరాక్రమానికి ఇతరులెవ్వరూ సరితూగలేరు. కాంతిమంతులలో సూర్యుడిలా, మహారాజుల్లో ఇతడు మిక్కిలి ప్రకాశిస్తాడు. నదీ ప్రవాహవేగాలు మహాపర్వతాల నెలా పెకలించి వేయలేవో, దివ్యాస్త్రాలు అలా ఇతని దేహాన్ని చీల్చలేవు. సముద్రం మహానదులను ఎలా తనలో చేర్చుకొంటుందో పరరాజులసంపదల్ని ఇతడు అలా చేజిక్కించుకుంటాడు' - అని చండకౌశికుడు జరాసంధుని సామర్థ్యాన్నిగురించి చెప్పి వెళ్ళాడు.

**విశేషం:** అలం: ఉపమ. త్రిపురాసురులు తారకాసురుని కుమారులు - విద్యున్మాలుడు, తారకాక్షుడు, కమలాక్షుడు. వాళ్ళ పురాలు మూడింటిని అంతం చేయటంచేత శివునికి త్రిపురాంతకు డనే పేరు వచ్చింది. మృత్యువును జయించిన వాడు కనుక ఆయనకు మృత్యుంజయు డనే పేరుకూడ ఉంది.

**క. తనయుని నభినవయౌవను । ననుపము నభిషిక్తుఁ జేసి యవనీభర మా**
**తనిఁ బూన్చి సభార్యుండయి । యనఘ! తపోవనమునకు బృహద్రథుఁ డరిగెన్. 159**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ ధర్మరాజా!; బృహద్రథుడు; అభినవయౌవనున్= క్రొత్తగా పొందిన యౌవనం కలవాణ్ణి; అనుపమున్= సాటిలేనివాణ్ణి; తనయునిన్= కుమారుడైన జరాసంధుణ్ణి; అభిషిక్తున్+చేసి= పట్టాభిషిక్తుణ్ణి కావించి-అంటే మగధ రాజ్యానికి రాజుగా చేసి; అవనీభరము= రాజ్యభారం; ఆతనిన్+పూన్చి= అతనిచేత వహింపజేసి; సభార్యుండు+ అయి= భార్యలతో కూడినవాడై; తపః+వనమునకున్= తపస్సు చేసుకోటానికి అనుకూలమైన అడవికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! నూత్నయౌవనుడు, సాటిలేని మేటివీరుడు అయిన తన కుమారుడు జరాసంధుణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చేసి, రాజ్యభారం అతనికి అప్పగించి, భార్యలతో కలిసి బృహద్రథుడు తపోవనానికి వెళ్ళాడు.

**విశేషం:** విశేష్యం తరువాత విశేషణాలు వాడే సంస్కృత సంప్రదాయానుసారంగా నన్నయ - 'తనయునిన్, అభినవయౌవనున్, అనుపమున్' అని అనటం జరిగింది.

### శ్రీకృష్ణుఁడు భీమార్జునులను దనతోఁ బంపు మని ధర్మజు నడుగుట (సం. 2-17-25)

**వ. ఆ జరాసంధుండును నాయుధ నిహతులుగాని హంస డిభకులు దనకు సహాయులుగా నపరాజితంబయిన పరాక్రమంబునం బరచక్రపతుల భంజించుచు. 160**

**ప్రతిపదార్థం:** ఆ, జరాసంధుండును; ఆయుధ, నిహతులు, కాని= ఆయుధాలచేత చావులేని; హంసడిభకులు; తనకున్; సహాయులుకాన్= తోడ్పడేవాళ్ళు కాగా; అపరాజితంబు+అయిన= ఓటమి లేనిదైన; పరాక్రమంబునన్= పరాక్రమంతో; పరచక్రపతులన్= ఇతర రాజ్యాల రాజులను; భంజించుచున్= ఓడిస్తూ.

**తాత్పర్యం:** ఆ జరాసంధుడుకూడా ఆయుధాలచేత చావులేనివారైన హంసడిభకులను తనకు తోడు చేసుకొని ఓటమిలేని పరాక్రమంతో ఇతరరాజ్యాల రాజులను ఓడిస్తూ.

**చ. అయన విహీనుఁడౌ సవితృనట్లు, విఖండిత పక్షతిద్వయుం**
**డయిన ఖగేంద్రునట్లు, మఱి హంసుఁడు నా డిభకుండు నంతక**
**క్షయ గతులైన నిప్డు గతగర్వమునన్ మగధేశ్వరుండు ని**
**శ్చయమతి నున్నవాఁడు నిజసంక్షయకాలవిశంకితాత్ముఁడై. 161**

**ప్రతిపదార్థం:** మగధ+ఈశ్వరుఁడు= మగధరాజైన జరాసంధుడు; మఱి; హంసుఁడున్, ఆ, డిభకుండున్; అంతక, క్షయ, గతులు+ఐనన్= యముని గృహానికి (నరకానికి) వెళ్ళినవారు కాగా - అంటే మరణించగా; ఇప్డు= ఇప్పుడు; అయన, విహీనుఁడు+ఔ= ఉత్తర దక్షిణాయనాలు లేని; సవితృ+అట్లు= సూర్యుడివలె; విఖండిత, పక్షతి, ద్వయుండు+అయిన= పూర్తిగా నరికివేయబడిన రెక్కల జంటగల; ఖగ+ఇంద్రు, అట్లు= పక్షులరాజైన గరుత్మంతుడివలె; గత, గర్వమునన్= కోల్పోయిన గర్వంతో; నిజ, సంక్షయ, కాల, విశంకిత+ఆత్ముఁడు+ఐ= తనయొక్క వినాశకాలాన్ని గురించిన అనుమానంతో కూడుకొన్న మనస్సు కలవాడై; నిశ్చయ, మతిన్= నిశ్చయమైన బుద్ధితో; ఉన్నవాఁడు= ఉన్నాడు.

**తాత్పర్యం:** మగధరాజైన జరాసంధు డిప్పుడు హంసడిభకులు మరణించటంచేత అయనాలు లేని సూర్యునిలా, రెక్కలు రెండూ తెగిన గరుడునిలా గర్వాన్ని కోల్పోయి, తన వినాశకాలాన్ని గూర్చిన అనుమానంతో మనస్సు రాయి చేసుకొని ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. అయనాలు లేని సూర్యునితో, రెక్కలు లేని గరుడునితో జరాసంధుని పోల్చటం వలన అతడు ఎక్కడికీ దండయాత్రకు వెళ్ళక, వెళ్ళలేక తన అంత్యకాలాన్ని గురించిన ఆలోచనలో పడి, ఉన్నచోటనే ఉన్నాడని స్ఫురిస్తున్నది. 'అయనయ హీనుడైన పతి యట్లు' - అని పాఠాంతరం. (అర్థవ్యక్తి అనే శబ్దగుణం సార్థకంగా పోషించబడి ప్రసాదగుణానికి బలాన్ని చేకూర్చింది ఈ పద్యరచనలో. - సంపా.)

**ఉ. అమ్మగధేశు నుగ్రబలు నాయుధయుద్ధమునన్ జయింపఁగా**
**నిమ్మహి నోప రెవ్వరు, నుమేశ్వరుఁ డట్టి వరమ్ము వానికిన్**

**నెమ్మిన యిచ్చెఁ, గావున వినీతుఁడు వాయుసుతుండు మల్లయు**
**ద్ధమ్మున నోర్చు నాతని నుదగ్రమహాభుజశక్తి యేర్పడన్. 162**

**ప్రతిపదార్థం:** ఆ+మగధ+ఈశున్= ఆమగధరాజైన జరాసంధుణ్ణి; ఉగ్ర, బలున్= భయంకరమైన బలం కలవాణ్ణి; ఆయుధ, యుద్ధమునన్= ఆయుధాలతో చేసే యుద్ధంలో; జయింపఁగాన్= జయించటానికి; ఈ+మహిన్= ఈ భూమిమీద; ఎవ్వరున్= ఎవరు కూడ; ఓపరు= సమర్థులు కారు; ఉమా+ఈశ్వరుఁడు= పార్వతీదేవి భర్త అయిన శివుడు; వానికిన్= ఆ జరాసంధుడికి; అట్టి; వరమ్ము; నెమ్మిన్+అ= ప్రేమతో; ఇచ్చెన్; కావునన్; వినీతుఁడు= వినయవంతుడు; వాయు, సుతుండు= వాయుదేవుడియొక్క కుమారుడు-భీముడు; ఉదగ్ర, మహా, భుజ, శక్తి= మిక్కిలి భయంకరమైన గొప్ప బాహుబలం; ఏర్పడన్= ప్రకటమయ్యేటట్లు; ఆతనిన్= ఆ జరాసంధుణ్ణి; మల్లయుద్ధమ్మునన్; ఓర్చున్= ఓడిస్తాడు.

**తాత్పర్యం:** భయంకర బాహుబల సంపన్నుడైన ఆ జరాసంధుణ్ణి ఆయుధయుద్ధంలో జయించటానికి భూమిమీద ఎవరితరం కూడా కాదు. పరమేశ్వరుడు ప్రేమతో అతనికి ఆ వరం ఇచ్చాడు. అందుచేత అతిభయంకరమైన మల్లయుద్ధంలో తన బాహుబలం ప్రకటమయ్యేటట్లు వినయపరుడైన మనవాయుసుతుడు భీముడే అతణ్ణి ఓడిస్తాడు.

**విశేషం:** జరాసంధవధకు భీముణ్ణి పూర్తిగా సుముఖుణ్ణి చెయ్యాలనుకున్న శ్రీకృష్ణుడు మొదట మిక్కిలి చతురంగా జరాసంధుని బలపరాక్రమాల్ని సుదూరం వర్ణించాడు. తరువాత భీముణ్ణి ఉదగ్ర మహాభుజశక్తి యుక్తుడనీ, మహాబలుడైన వాయుదేవుని పుత్రుడనీ వినయపరు డనీ ఎంతో నేర్పుగా ప్రశంసించి జరాసంధుని జయించగల బలసంపద అతనికి ఉందని, తండ్రిపేరు నిలుపగల తనయుడని, నీవంటి పెద్దలు ఆజ్ఞాపించాలేకాని శిరస్సు వంచి చెప్పినపని సాధించే వినయపరుడని పరోక్షంగా సూచించాడు. ఆపినా ఆగకుండ ఆజరాసంధునిమీదికి ఆతడు కాలెత్తి కయ్యానికి వెళ్ళే మానసికస్థితిని మాత్రమే కల్పించాడు. ఇక శ్రీకృష్ణుడు సాధించవలసింది ధర్మజుని అనుమతి. మల్లయుద్ధం భుజబలంతో చేసేది. అందులో ఆయుధాల ఉపయోగం ఉండదు. అందువల్ల ఆయుధంచేత మరణం ఉండదని జరాసంధుడు పొందిన వరం మల్లయుద్ధంలో అతణ్ణి రక్షించలేదు. జరాసంధవధ జరిగితే మల్లయుద్ధంలోనే జరగాలి. అదీ భీమునిచేతిమీదిగానే జరగాలి. అందుకే శ్రీకృష్ణుడు అంతనేర్పుగా భీమునిమనస్సులో జరాసంధవధకు బీజం నాటాడు. పైపద్యం కొన్ని ప్రతులలో లేదు. కొన్నింటిలో 120వ పద్యంగా ఉంది. ఇందులోని శబ్దగుణం అర్థవ్యక్తి.

**క. బలిమిమెయిఁ బార్థురక్షా । బలమును బవనసుతు బాహుబలమును నా ని**
**ర్మలనీతిబలము నీకుం । గలుగ నసాధ్యంబు గలదె కౌరవనాథా! 163**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ఓధర్మరాజా!; బలిమిమెయిన్= దేహబలంతో; పార్థు, రక్షా, బలమును= రక్షణ కల్పించగల అర్జునునియొక్క శక్తి; పవన, సుతు, బాహు, బలమును= వాయుపుత్రుడైన భీముడియొక్క భుజశక్తి; నా, నిర్మల, నీతి, బలము= నాయొక్క మలినం కాని నీతి బలము; నీకున్+కలుగన్= నీకుండటంవలన; అసాధ్యంబు= సాధ్యం కానిది; కలదె= కలదా! (లేదు).

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! పార్థుడి రక్షాబలం, భీముడి భుజబలం, నా నీతిబలం నీకుండగా అసాధ్యమేముంది?

**విశేషం:** పార్థునిది సాంకేతికమైన ధనుర్విద్యాబలం, శస్త్రాస్త్రప్రయోగబలం. భీమునిది దైహికమైన బాహుబలం. శ్రీకృష్ణునిది నైతికమైన బుద్ధిబలం. ఈ మూడూ కూడితే అసాధ్య మేముంది?

**చ.** **తడయక యేఁగి నీతి బలదర్పము లొప్పఁగ వాని డాసి, క**
**వ్వడియును నేను భీముఁడు నవశ్యముఁ బోర బృహద్రథాత్మజుం**
**గడిఁది రిపున్ జయింతుము జగన్నుత! న న్నెద నమ్ముదేని యి**
**ల్లడయిడు భీము నర్జును నలంఘ్యబలాఢ్యుల నావశంబునన్.** **164**

**ప్రతిపదార్థం:** జగత్+నుత!= ప్రపంచంచేత కొనియాడబడేవాడా! ఓ ధర్మరాజా!; తడయక= ఆలస్యం చేయక; ఏఁగి= వెళ్ళి; నీతిబలదర్పములు+ఒప్పఁగన్= నీతి, బలం, దర్పం మెరసేటట్లుగా; కవ+వడియును= అర్జునుడూ; నేను; భీముఁడున్; వానిన్= ఆ జరాసంధుడిని; డాసి= సమీపించి (ఎదుర్కొని); పోరన్= యుద్ధంలో; కడిఁది, రిపున్= బలమైన శత్రువును; బృహద్రథ+ ఆత్మజున్= బృహద్రథుడియొక్క కుమారుడైన జరాసంధుని; అవశ్యమున్= తప్పక; జయింతుము; నన్ను+ఎదన్; నమ్ముదు+ఏనిన్= నన్ను నీవు మనస్సులో నమ్మినట్లయితే; అలంఘ్య, బల+ఆఢ్యులన్= జయించ సాధ్యం కాని బలంతో కూడుకొన్న వాళ్ళైన; భీమున్; అర్జునన్; నావశంబునన్= నా అధీనంలో; ఇల్లడ, ఇడు= ఇల్లడపెట్టుము - అంటే నీ తమ్ముళ్ళను నీకు మళ్ళీ చెక్కుచెదరకుండ అప్పగించే పద్ధతిలో నాకు అప్పగించు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆలస్యం చేయకుండ నేను, భీముడు, అర్జునుడు ముగ్గురం వెళ్ళి, నీతి, బలం, గర్వం ప్రకాశించేవిధంగా బలమైన శత్రువయిన ఆ జరాసంధుణ్ణి ఎదుర్కొని యుద్ధంలో తప్పక జయిస్తాము. నామీద నీకు నమ్మకముంటే అజేయులైన నీ తమ్ముళ్ళు భీమార్జునుల్ని నాకు ఇల్లడపెట్టు.

**విశేషం:** కవ్వడి - బాణ ప్రయోగంలో రెండు చేతుల వడి కలవాడు - అర్జునుడు. శ్రీకృష్ణుని మాటనేర్పు అనుపమానం. అటు జరాసంధుణ్ణిగురించి, ఇటు భీమార్జునుల శక్తి సామర్థ్యాలనుగురించి చెప్పవలసినవన్నీ ఎంతో చతురంగా చెప్పాడు. చిట్టచివరకు నామీద నమ్మకముంటే, నీ తమ్ముళ్ళను నాకు అప్పగించు అన్నాడు. ఇక ధర్మరాజు తప్పించుకోగలడా?

**వ.** **అని నిశ్చయించి పలికిన నారాయణుని, విజయశ్రీ విభాసిత ముఖులైన భీమార్జునులం జూచి సంతుష్టాంత రంగుండయి ధర్మతనయుం డిట్లనియె.** **165**

**ప్రతిపదార్థం:** అని; నిశ్చయించి; పలికిన; నారాయణునిన్= శ్రీకృష్ణుని; విజయశ్రీ, విభాసిత, ముఖులు+ఐన= విజయశోభతో ప్రకాశించే ముఖాలు కలవాళ్ళయిన; భీమ+అర్జునులన్, చూచి; సంతుష్ట+అంతరంగుండు+అయి= సంతోషించిన మనస్సు కలవాడై; ధర్మతనయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని నిర్ణయించి చెప్పిన శ్రీకృష్ణుని, విజయశోభతో ప్రకాశిస్తున్న భీమార్జునుల ముఖాలను చూచి ధర్మరాజు అంతరంగంలో ఎంతో సంతోషించి ఇలా అన్నాడు.

**చ.** **ప్రియహితసత్యవాక్య! యరిభీషణ! కృష్ణ! భవన్నిదేశ సం**
**శ్రయమున నున్న మా కధికశత్రుజయం బగు టేమి పెద్ద, ని**
**శ్చయముగ నింక మోక్షితుల సర్వమహీశులు, నిమ్మహాధ్వర**
**క్రియయును సిద్ధిఁబొందెన యకిల్బిషకీర్తి వెలుంగుచుండఁగన్.** **166**

**ప్రతిపదార్థం:** ప్రియ, హిత, సత్య, వాక్య!= వినటానికి ఇంపైన, మేలు కలిగించే, సత్యమైన మాటలు కలవాడా!; అరి, భీషణ!= శత్రువులకు భయంకరమైనవాడా, కృష్ణ!; భవత్+నిదేశ, సంశ్రయమునన్= నీ ఆజ్ఞ అనే ఆశ్రయంలో; ఉన్న; మాకున్; అధిక, శత్రు జయంబు+అగుట= బలవంతులైన శత్రువులను జయించటం; ఏమి, పెద్ద= ఏమి గొప్ప?; నిశ్చయముగన్= అనుమానం లేకుండ; ఇంకన్=ఇక; సర్వ, మహీ+ఈశులున్= అందరు రాజులు - అంటే జరాసంధుడిచేత బాధించబడుతున్న, బంధించబడిన రాజులంతా, మోక్షితులు+అ= (ఆ బాధలనుండి, బంధాలనుండి) విముక్తి పొందినవాళ్ళే; అకిల్బిష, కీర్తి= నిర్మలమైన కీర్తి; వెలుంగుచున్+ఉండఁగన్; ఈ+మహా+అధ్వర, క్రియయును= ఈ రాజసూయ మహాయజ్ఞ కార్యం కూడ; సిద్ధిన్= సఫలతను; పొందెన్+అ= పొందినట్లే.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! నీవు ప్రియంగా, హితంగా సత్యం పలికేవాడివి. శత్రుభయంకరుడివి. నీ ఆజ్ఞను ఆశ్రయించి ఉండే మాకు బలవంతులైన శత్రువులను జయించటం ఒక విశేషమా! ఇక జరాసంధుడిచేత బాధితులు, బంధితులు అయిన రాజులందరికి ఆ బాధలనుండి బంధాలనుండి విముక్తి కలిగినట్లే. నీ నిర్మలకీర్తి ప్రకాశించేటట్లు రాజసూయ యజ్ఞంకూడ జరిగినట్లే.

**విశేషం:** 'పొందెఁ గృతకృత్యత' - అని పాఠాంతరం ఉంది. మాటనేర్పులో ధర్మజుడు శ్రీకృష్ణుడికి తీసిపోయేవాడు కాడు. 'భవన్నిదేశ సంశ్రయమున నున్న మాకు' - అని జరాసంధుడిని జయించి రాజసూయాన్ని సఫలం కావించే భారాన్నంతా శ్రీకృష్ణుని భుజస్కంధాలపై మోపాడు. (గాఢమైన బంధం శిథిలమైనట్లు చిత్రించే ప్రసాదగుణభూయిష్ఠ మైన రచన నన్నయ శైలి. దాని కిది చక్కని ఉదాహరణం. (చూడు: పీఠిక). - సంపా.)

**క. ధరణీధర! సర్వగుణా । కర! కరుణానిరత! సర్వకార్యైకధురం**
**ధర! నినుఁ బడసిన మాకును । హరివిక్రమ! పడయరానియవియుం గలవే! 167**

**ప్రతిపదార్థం:** ధరణీధర!= భూమిని ధరించినవాడా! శ్రీకృష్ణా!; సర్వగుణ+ఆకర!= అన్ని సుగుణాలకు ఉనికిపట్టు అయినవాడా!; కరుణా, నిరత!= దయయందు ఆసక్తి కలవాడా!; సర్వ, కార్య+ఏక, ధురంధుర= అన్ని పనుల (సఫలం చేసే) భారంమొత్తాన్నీ వహించేవాడా!; హరి, విక్రమ!= సింహంవంటి పరాక్రమం కలవాడా!; నినున్+పడసిన= నిన్ను పొందిన; మాకును; పడయరాని, అవియున్= పొందలేనివికూడా; కలవే= ఉన్నాయా! (లేవు).

**తాత్పర్యం:** ఓకృష్ణా! నీవు భూమిని ధరించినవాడివి. సర్వసుగుణాలకు స్థానమైనవాడివి. దయామయుడివి. సర్వకార్యభారాన్ని నిర్వహించేవాడివి. సింహపరాక్రముడివి. అటువంటి నీవు మావాడివై ఉండగా, మాకు పొందలేనివి ఏవైనా ఉంటాయా!

**విశేషం:** ఇవన్నీ భగవంతుని గుణాలు. భగవంతుడే మా ప్రక్కన ఉంటే అసాధ్యం ఏమున్నది? అంటున్నాడు ధర్మరాజు.

**వ. అని సంతసిల్లి మఱియు నాత్మగతంబున. 168**

**తాత్పర్యం:** అని సంతోషించి, ఇంకా మనస్సులో (ఇలా అనుకొన్నాడు).

**క. నయనములు నాకుఁ బవనత । నయ విజయులు, మనము కమలనాభుఁడు; వీరిం**
**బ్రియహితులఁ బాసి నిమిషం । బయినను నెట్లుండ నేర్తు నవిచేష్టుఁడనై. 169**

**ప్రతిపదార్థం:** పవన తనయ, విజయులు= భీమార్జునులు; నాకున్; నయనములు= కన్నులు; కమలనాభుఁడు= పద్మాన్ని బొడ్డుగా కలవాడు-శ్రీమహావిష్ణువు-శ్రీకృష్ణుడు; మనము= మనస్సు; వీరిన్= ఈముగ్గురిని; ప్రియహితులన్= ఇష్టులై నా మేలుకోరే వాళ్ళను; పాసి= వదలి, అవిచేష్టుఁడను+ఐ= చేష్టలు ఉడిగినవాడినై; నిమిషంబు+అయినను= ఒక్క నిమిషమైనా; ఎట్లు= ఏవిధంగా; ఉండనేర్తున్= ఉండగలను.

**తాత్పర్యం:** భీమార్జునులు నాకు కళ్ళు. కృష్ణుడు మనస్సు. ప్రియులు, హితులు అయిన ఈ ముగ్గురిని వదలి ఒక్కనిమిషమైనా నిర్వికారంగా ఎలా ఉండగలను?

**విశేషం:** కళ్ళు, మనస్సు లేకుండా మనిషి ఉండటం ఎంత కష్టమో ఈముగ్గురూ లేకుండా తాను ఉండటం అంత కష్టమని ధర్మజుని భావన.

**వ.** **'అయినను నా హృదయంబు గరంబు హృద్యంబగుచున్నయది; కృష్ణార్జునులం దలంచినవారికి శ్రీ విజయంబు లగు నినిన నమ్మహాత్ములఁ దనకు సహాయులఁగాఁ బడసిన భీమసేనునకు శ్రీ విజయంబు లగుట యేమి సందేహం?'బని నిశ్చయించి 'మీకుఁ గార్యసిద్ధి యయ్యెడు మరుగుం' డని పంచిన.** **170**

**ప్రతిపదార్థం:** అయినను; నా, హృదయంబు; కరంబు= మిక్కిలి; హృద్యంబు+అగుచున్+ఉన్న, అది= సంతోషాన్ని పొందుతున్నది; కృష్ణ+అర్జునులన్= కృష్ణుణ్ణి, అర్జునుణ్ణి; తలంచినవారికిన్= కేవలం తలచుకొన్నవారికే; శ్రీవిజయంబులు= కలిమి, గెలుపు; అగున్, అనినన్= కలుగుతుందనగా; ఆ+మహాత్ములన్= ఆ మహాత్ములిద్దరిని; తనకున్; సహాయులన్, కాన్= సహాయపడేవాళ్ళుగా; పడసిన= పొందిన; భీమసేనునకున్; శ్రీ, విజయంబులు= ఐశ్వర్యం, విజయం; అగుట= కలగటం; ఏమి, సందేహంబు= ఏమి అనుమానం? అని; నిశ్చయించి; మీకున్; కార్యసిద్ధి= కార్య సఫలత; అయ్యెడుము= అగునుగాక!; అరుగుండు+అని= వెళ్ళండని; పంచినన్= పంపగా.

**తాత్పర్యం:** అయినా నా మనస్సు చాలా సంతోషంగా ఉంది. కృష్ణార్జునులను కేవలం స్మరించే వాళ్ళకే కలిమి, గెలుపు కలుగుతా యంటారు కదా! ఆ మహాత్ము లిద్దరినీ సహాయులుగా పొందిన భీమసేనునికి ఐశ్వర్యం, విజయం కలుగుతా యనటంలో అనుమాన మేముంది? 'మీకు కార్యసిద్ధి ఔతుంది, వెళ్ళిరం' డని ధర్మరాజు వారిని సాగనంపించాడు.

**క.** **ఘోరరిపుఁ జంప నరిగెడు । వీరుల వార్ష్ణేయపాండవేయుల సింహా**
**కారులఁ జూచి మనంబున । ధీరుఁడు ముదమందె నయ్యుధిష్ఠిరుఁ డంతన్.** **171**

**ప్రతిపదార్థం:** ఘోర, రిపున్= భయంకరుడైన శత్రువును; చంపన్= చంపటానికి; అరిగెడు= వెళ్ళే; వీరులన్; వార్ష్ణేయ, పాండవేయులన్= వృష్ణి కులంలో పుట్టిన శ్రీకృష్ణుణ్ణి, పాండురాజు కుమారులైన భీమార్జునులను; సింహ+ఆకారులన్= సింహం వంటి ఆకారం కలవాళ్ళను; చూచి; మనంబునన్= మనస్సులో; ధీరుఁడు= ధైర్యవంతుడు అయిన; ఆ, యుధిష్ఠిరుఁడు= ఆ ధర్మరాజు; అంతన్= అప్పుడు; ముదము+అందెన్= సంతోషాన్ని పొందాడు.

**తాత్పర్యం:** భయంకర శత్రువైన ఆ జరాసంధుణ్ణి చంపటానికి బయలుదేరిన సింహాలవంటి శ్రీకృష్ణ భీమార్జునులను చూచి ధర్మరాజు సంతోషించాడు.

## శ్రీకృష్ణభీమార్జునులు జరాసంధునిఁ జంపఁబోవుట (సం. 2-18-26)

**వ. కృష్ణభీమపార్థులు కృతక స్నాతకులయి చని, యేక పర్వత ప్రభవంబులైన కాల కూట శోణ గండకీ సదానీరలను నేఱుల లంఘించి, సరయూనదియునుం బూర్వకోసల మిథిలా దేశంబులును గంగయుం గడచి, పూర్వాభిముఖులయి నిత్య ప్రయాణంబుల నమ్మగధదేశంబు సొచ్చి గోరథం బనుపర్వతం బెక్కి. 172**

**ప్రతిపదార్థం:** కృష్ణ, భీమ, పార్థులు; కృతక, స్నాతకులు+అయి= కపటమైన స్నాతకవ్రతాన్ని పూనినవాళ్ళయి; చని= వెళ్ళి; ఏక, పర్వత, ప్రభవంబులు+ఐన= ఒకే పర్వతంనుండి పుట్టినవైన; కాలకూట, శోణ, గండకీ, సదానీరలు; అను; ఏఱులన్= నదులను; లంఘించి= దాటి; సరయూ, నదియును= సరయూనదిని; పూర్వకోసల, మిథిలా, దేశంబులును; గంగయున్; కడచి= దాటి; పూర్వ+అభిముఖులు+అయి= తూర్పువైపునకు తిరిగినవాళ్ళయి; నిత్య, ప్రయాణంబులన్= ఎడతెగని ప్రయాణాలతో; ఆ+మగధ, దేశంబు; చొచ్చి= ప్రవేశించి; గోరథంబు+అను; పర్వతంబు+ఎక్కి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణ భీమార్జునులు కపటస్నాతకవ్రతాన్ని స్వీకరించారు. ఒకే పర్వతంనుండి పుట్టిన కాలకూట, శోణ, గండకీ, సదానీర లనే నదులను దాటారు. సరయూనదిని, పూర్వకోసల మిథిలాదేశాలను, గంగానదిని అతిక్రమించారు. తూర్పువైపు తిరిగి, నిరంతర ప్రయాణాలు చేసి ఆ మగధదేశాన్ని ప్రవేశించారు. గోరథం అనే పర్వతం ఎక్కారు.

**విశేషం:** స్నాతకుడు-స్నానశీలవ్రతం కలవాడు; విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత మతకార్యార్థం భిక్షుకత్వం వహించి తీర్థస్నానాలు చేసే బ్రహ్మచారి. 'కృతస్నానులై'- అనే పాఠాంతరం పెక్కుప్రతులలో ఉంది. కాని, మూలంలో 'వర్చస్వినాం బ్రాహ్మణానాం స్నాతకానాం పరిచ్ఛదాన్ ఆచ్ఛాద్య' (భండార్కరు ప్రతి 2-18-22) అని ఉంది. అందుచేత వారిని 'కృతకస్నాతకు' లనటమే సమంజసం.

**చ. ఉరుతర హర్మ్యమాలికల నొప్పు గిరివ్రజ మన్పురంబుఁ గాం**
**చిరి నవసౌరభప్రసవచిత్రవనావళి గల్గుదాని నె**
**వ్వరికి దురాసదంబు లగు వజ్రమయోన్నతవప్రచారు గో**
**పురముల దాని నయ్యలకఁ బోలెడు దాని మహార్థసంపదన్. 173**

**ప్రతిపదార్థం:** ఉరుతర, హర్మ్య, మాలికలన్= చాల గొప్పవైన మేడల వరుసలచేత; ఒప్పు= ప్రకాశిస్తున్న; నవ, సౌరభ, ప్రసవ, చిత్ర, వన+ఆవళి, కల్గు, దానిన్= క్రొత్త సువాసనలు గల పువ్వులతో కూడుకొన్న చిత్రాలైన తోటల సమూహం కలదానిని; ఎవ్వరికిన్= ఎంతశక్తి ఉన్నవాళ్ళకు కూడ; దురాసదంబులు+అగు= ప్రవేశం సాధ్యంకాని; వజ్రమయ+ఉన్నత, వప్ర, చారు, గోపురముల దానిన్= వజ్రాలతో నిండి, ఎత్తైన ప్రాకారాలు (చుట్టుగోడలు), అందమైన గోపురాలు కలదానిని; మహా+అర్థ సంపదన్= మిక్కుటమైన ఐశ్వర్యంలో; ఆ+అలకన్= ఆకుబేరుడి రాజధాని అయిన అలకాపట్టణాన్ని; పోలెడుదానిన్= పోలినటువంటి దానిని; గిరివ్రజము+అన్+పురంబున్= గిరివ్రజమనే పేరుగల పట్టణాన్ని; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** గొప్ప గొప్ప మేడల వరుసలతో క్రొత్త వాసనలు వెదజల్లే పూలతోటలతో, ఎవ్వరికీ ప్రవేశించ సాధ్యం కాని ఎత్తైన వజ్రమయ ప్రాకారాలతో, అందమైన గోపురాలతో అపార ధనసంపదతో అలకాపురిని పోలిన గిరివ్రజమనే పురాన్ని ఆ శ్రీకృష్ణభీమార్జునులు చూచారు.

**విశేషం:** అలం: ఉదాత్తం, ఉపమ, వృత్త్యనుప్రాసం. (శ్లేష మనే శబ్దగుణం ఆ నగరవైభవాన్ని రచనలో రూపుకట్టించింది. - సంపా.)

**వ. కని దాని యపూర్వ రామణీయక సమృద్ధి కచ్చెరువడి యచ్యుతుండు భీమార్జునుల కిట్లనియె. 174**

**ప్రతిపదార్థం:** కని= చూచి; దాని= ఆ గిరివ్రజపురం యొక్క; అపూర్వ, రామణీయక, సమృద్ధికిన్= అపూర్వమైన సౌందర్యాతిశయానికి; అచ్చెరువడి= ఆశ్చర్య పడి; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; భీమ+అర్జునులకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ గిరివ్రజపురాన్ని చూచి, దాని అపూర్వ సౌందర్యాతిశయానికి ఆశ్చర్యపడి, శ్రీకృష్ణుడు భీమార్జునులతో ఇలా అన్నాడు.

**క. గోరథమును ఋషభము వై । హారము ఋషిగిరియుఁ జైత్యకాద్రియు ననఁగా**
**భూరిగిరు లేను దీనికి । శూరభటులువోలెఁ గాచి చుట్టను నుండున్. 175**

**ప్రతిపదార్థం:** గోరథమును; ఋషభము, వైహారము; ఋషిగిరియున్; చైత్యక+అద్రియున్; అనఁగా= అనే పేర్లుగల; భూరి, గిరులు= పెద్ద కొండలు; ఏను= అయిదు; దీనికిన్= ఈ గిరివ్రజమనే పురానికి; శూరభటులు, పోలెన్= వీరులైన భటులవలె; కాచి= కాపాడుతూ; చుట్టునున్+ఉండున్.

**తాత్పర్యం:** గోరథం, ఋషభం, వైహారం, ఋషిగిరి, చైత్యకాద్రి అనే పేర్లున్న అయిదు పెద్దపర్వతాలు గిరివ్రజ మనే ఈ పట్టణానికి చుట్టూ ఉండి వీరభటుల్లా రక్షణ కల్పిస్తున్నాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. 'దానన చేసి యిప్పురంబు గిరివ్రజంబు నాఁబరఁగె; నిందుఁ దొల్లి గౌతముం డౌశీనరి యను శూద్రయందుఁ గాక్షీవాదుల సృజియించె; నట్టి గౌతమానుగ్రహంబునను నీ దుర్గ బలంబుననుం జేసి యిమ్మాగధుల నెవ్వరును జయింప నోప' రనుచుఁ దద్ద్వారంబునం బురంబు సొరనొల్లక చైత్యకగిరి శృంగంబున కరిగి యందున్న మూఁడు భేరులం జూపి, 'తొల్లింటి మాగధులు మానుషాదంబను ఋషభంబు వధియించి దాని చర్మంబున వీని నిర్మించి; రివి యిప్పురంబు వింతవారు చొచ్చునప్పు డమ్మునిశక్తిం జేసి మ్రోయు' ననిన. 176**

**ప్రతిపదార్థం:** దానన్+అ, చేసి= అందుచేతనే - అంటే కొండలసమూహం దాని చుట్టూ ఉండటంచేత; ఈ+పురంబు; గిరివ్రజంబు, నాన్+పరఁగెన్= గిరివ్రజము అనేపేరుతో ఒప్పింది; ఇందున్= ఈపురంలో; తొల్లి= పూర్వం; గౌతముండు= గౌతముడు అనే పేరున్న మహర్షి; ఔశీనరి, అను= ఔశీనరి అనే పేరున్న (ఉశీనర దేశంలో పుట్టింది); శూద్రఅందున్= శూద్రజాతి స్త్రీయందు; కాక్షీవ+ఆదుల= కాక్షీవుడు మొదలయిన వాళ్ళను; సృజియించెన్= పుట్టించాడు; అట్టి; గౌతమ+ అనుగ్రహంబునను= గౌతమ మహర్షి యొక్క దయచేత; ఈ, దుర్గ, బలంబుననున్+చేసి= ఈ దుర్గంయొక్క బలంచేత; ఈ+మాగధులన్= ఈమగధరాజులను; ఎవ్వరును= ఎవ్వరుగూడ; జయింపన్+ఓపరు= గెలువలేరు; అనుచున్= అని అంటూ; తత్+ద్వారంబునన్= దానియొక్క వాకిటినుండి; పురంబు= గిరివ్రజపురాన్ని; చొరన్= ప్రవేశించటానికి; ఒల్లక= ఇష్టపడక; చైత్యకగిరి, శృంగంబునకు+అరిగి= చైత్యక పర్వతంయొక్క శిఖరంమీదికి వెళ్ళి; అందున్+ఉన్న= ఆశిఖరంమీద ఉండే; మూఁడు భేరులన్= మూడు పెద్ద ఢక్కలను; చూపి; తొల్లింటి, మాగధులు= పూర్వకాలపు మగధరాజులు;

మానుషాదంబు+అను= మానుషాదం అనే పేరున్న (మనుషులను తినేది); ఋషభంబు= ఎద్దును; వధియించి= చంపి; దాని; చర్మంబునన్; వీనిన్= ఈభేరులను; నిర్మించిరి; ఇవి; ఈ+పురంబు= ఈ పట్టణాన్ని; వింతవారు= కొత్తవాళ్ళు; చొచ్చునప్పుడు; ఆ+మునిశక్తిన్, చేసి= ఆ గౌతమ మహర్షియొక్క మహిమచేత; మ్రోయున్= మ్రోగుతాయి; అనిన.

**తాత్పర్యం:** 'ఆ అయిదు కొండలూ చుట్టి ఉండటంచేత దీనికి గిరివ్రజ మనే పేరు వచ్చింది. పూర్వం గౌతమ మహాముని ఔశీనరి అనే శూద్రజాతిస్త్రీయందు కాక్షీవుడు మొదలయిన వాళ్ళను సృజించాడు. ఆ గౌతమ మహాముని దయచేత, ఈ దుర్గబలంచేత మగధరాజులను ఎవ్వరూ జయించలేరు' అని చెపుతూ శ్రీకృష్ణుడు ఆ నగరద్వారంనుండి గిరివ్రజపురాన్ని ప్రవేశించటానికి ఇష్టపడక, చైత్యకమనే కొండమీదికి వెళ్ళాడు. అక్కడ ఉండే మూడు పెద్ద ఢక్కలను భీమార్జునులకు చూపించాడు. ప్రాచీన మగధరాజులు మానుషాదమనే ఎద్దును చంపి దాని చర్మంతో వీటిని నిర్మించా రని, కొత్త వాళ్ళెవరైనా ఈ పురాన్ని ప్రవేశిస్తుంటే, ఆ గౌతమమహర్షిమహిమచేత ఇవి మ్రోగుతా యని చెప్పాడు.

**విశేషం:** శ్రీకృష్ణుని దూరదృష్టి, జాగరూకత అమోఘాలు. 'మానుషాద' మనే ఎద్దుకు 'మాషాద' మనే పేరుకూడా ఉన్నది.

**ఉ.** **దారుణ వజ్రచారు భుజదండములన్ బలవద్విచార గం**
**భీరులు ధీరు లాక్షణమ భేరులు మూఁటిని వ్రచ్చి చైత్యక**
**స్ఫార నితంబదేశమును భగ్నము సేసి గిరివ్రజంబు న**
**ద్వారమునందుఁ జొచ్చి రతిదర్పితు లా యదుకౌరవోత్తముల్. 177**

**ప్రతిపదార్థం:** బలవత్+విచార, గంభీరులు= బలవంతుల్లా విచారించటం (అంటే బలమైన ఆలోచన) చేత గంభీరంగా ఉండేవారు; ధీరులు= ధైర్యశాలులు; అతిదర్పితులు= మిక్కిలి గర్వంతో ఉన్నవాళ్ళు; ఆ, యదు, కౌరవ+ఉత్తముల్= ఆ యదువంశ, కురువంశ శ్రేష్ఠులు - శ్రీకృష్ణ భీమార్జునులు; దారుణ, వజ్ర, చారు, భుజ, దండములన్= కఠినమై, వజ్రంవలె అందమైన బాహుదండాలతో; ఆ, క్షణము+అ= అప్పటికప్పుడే; భేరులు; మూఁటిని, వ్రచ్చి= పగులగొట్టి; చైత్యక, స్ఫార నితంబ, దేశమును= చైత్యకపర్వతంయొక్క విశాలమైన నడిమిభాగాన్ని; భగ్నము, చేసి= భేదించి; గిరివ్రజంబున్= ఆ గిరివ్రజ పురాన్ని; అద్వారమునందున్= ద్వారం కాని త్రోవలో; చొచ్చిరి= ప్రవేశించారు.

**తాత్పర్యం:** బలవంతుల్లా ఆలోచించటంవల్ల గంభీరంగా ఉన్నవాళ్లు, ధైర్యవంతులు, ఎంతో గర్వంతో ఉన్నవాళ్ళు అయిన ఆ యదువంశ కురువంశ శ్రేష్ఠులైన శ్రీకృష్ణభీమార్జునులు, వజ్రంలా కఠినాలు సుందరాలు అయిన భుజదండాలతో తత్క్షణమే ఆభేరులు మూడింటిని పగులగొట్టారు. చైత్యకపర్వతంయొక్క నడిమిభాగాన్ని భేదించి, గిరివ్రజపురాన్ని ద్వారం కాని మార్గంలో ప్రవేశించారు.

**విశేషం:** గాఢబంధం శిథిలమైనట్లు భాసించే ఈ పద్యరచన ప్రసాదగుణ విశిష్టం. ఇటువంటి రచన నన్నయకు అభిమానపాత్రం. భేరులు పగులగొట్టిన ఈ వీరక్రియను వర్ణించే ఈ పద్యం తద్భావవ్యంజకంగా అక్షరరమ్యమై ఉంది. (సంపా.)

**క.** **ఘోరాకారులు మాలా । కార గృహంబులకు గంధిక గృహంబునకున్**
**దా రరిగి మువ్వురు బలా । త్కారంబునఁ గొనిరి పుష్పగంధము లొప్పన్. 178**

**ప్రతిపదార్థం:** ఘోర+ఆకారులు= భయంకరమైన ఆకారాలు కలవాళ్ళు - శ్రీకృష్ణ భీమార్జునులు; మాలాకార, గృహంబులకున్= పూలమాలలు కట్టే వాళ్ళ ఇళ్ళకు; గంధిక, గృహంబునకున్= సుగంధ ద్రవ్యాలు అమ్మేవాళ్ళ ఇంటికి; తారు= తాము; అరిగి= వెళ్ళి; ముప్వురు; బలాత్కారంబునన్= బలవంతంగా; పుష్ప, గంధములు= పువ్వులు, గంధం; కొనిరి= తీసికొన్నారు.

**తాత్పర్యం:** భయంకరాకారులైన శ్రీకృష్ణభీమార్జునులు ముప్పురు పూలమాలలు కట్టేవాళ్ళ ఇళ్ళకు, సుగంధాలు అమ్మేవాళ్ళ ఇంటికి వెళ్ళి బలవంతంగా పూలు, గంధం తీసుకొన్నారు.

**విశేషం:** అలం: క్రమం.

**వ.** **అందు మాల్యాలంకృతమౌళులుఁ జందనాగరు రూషితహస్తులు విస్మయమాన మాగధ నిరీక్ష్యమాణులు నయి రాజమార్గంబు గదియం జని, యనవరతంబును బ్రాహ్మణులకు సుప్రవేశంబగుచున్న జరాసంధు మందిరంబు గోవాసంబు హిమవత్సింహంబులు సొచ్చునట్లు యాదవ పాండవ సింహంబులు సొచ్చిన.** **179**

**ప్రతిపదార్థం:** అందున్; మాల్య+అలంకృత, మౌళులున్= పూలమాలలచేత అలంకరించబడిన సిగలు కలవాళ్ళు; చందన+అగరు+ రూషిత, హస్తులు= గంధం అగరు పూతలచేత కప్పబడిన చేతులు కలవాళ్ళు; విస్మయమాన, మాగధ, నిరీక్ష్యమాణులున్+ అయి= ఆశ్చర్యపడే మగధ పౌరులచే చూడబడేవాళ్ళు అయి; రాజ మార్గంబు; కదియన్+చని= చేరువగా వెళ్ళి; అనవరతంబును= ఎల్లప్పుడు; బ్రాహ్మణులకున్; సుప్రవేశంబు+అగుచున్+ఉన్న= చక్కగా ప్రవేశించటానికి అవకాశ మున్న; జరాసంధు మందిరంబున్= జరాసంధుని యొక్క ఇంటిని; గోవాసంబు= ఆవు నివసించేచోటును; హిమవత్+సింహంబులు= హిమాలయ పర్వతాలలో ఉండే సింహాలు; చొచ్చు+అట్లు= ప్రవేశించేవిధంగా; యాదవ, పాండవ, సింహంబులు= యాదవశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు, పాండవశ్రేష్ఠులైన భీమార్జునులు; చొచ్చినన్= ప్రవేశించగా.

**తాత్పర్యం:** యాదవ పాండవ సింహాలైన శ్రీకృష్ణ భీమార్జునులు సిగల్లో పువ్వులు అలంకరించుకొన్నారు. చేతులకు గంధం అగరు పూసుకొన్నారు. మగధపౌరులు ఆశ్చర్యపరవశులై చూస్తుండగా ఆ ముగ్గురూ రాజమార్గానికి చేరువగా వెళ్ళారు. అన్ని వేళలా బ్రాహ్మణులకు చక్కగా ప్రవేశమున్న ఆ జరాసంధుని మందిరంలో గోశాలలో హిమాలయ సింహాలు ప్రవేశించినట్లు ప్రవేశించారు.

**విశేషం:** అలం. ఉపమ. మున్ముందు జరుగనున్న జరాసంధవధను పద్యంలోని అలంకారం ప్రస్ఫుటంగా ధ్వనింపజేస్తుంది. గోవాసంలోకి సింహాలు ప్రవేశిస్తే ఇక ఆ గోవు బ్రతుకగలదా! గో వంటే ఎద్దు అనే అర్థంకూడ ఉంది.

### జరాసంధుఁడు శ్రీకృష్ణ భీమార్జునుల కెదురు వచ్చుట (సం. 2-19-29)

**ఆ.** **అర్ధరాత్ర మయిన నభ్యాగత ద్విజ । స్నాతకులకు నెదురుచని కరంబు**
**భక్తిఁ బూజలిచ్చు పరమవ్రతుం డప్పు । డెదురు వచ్చి వారి కిష్టమెసఁగ.** **180**

**ప్రతిపదార్థం:** అర్ధ రాత్రము+అయినన్= నడిరేయి అయినా; అభ్యాగత, ద్విజ, స్నాతకులకున్= అప్పటి కప్పుడు వచ్చే బ్రాహ్మణ స్నాతకవ్రతులకు; ఎదురు, చని= (ఆహ్వానించటానికి) లేచి ఎదురుగా వెళ్ళి; కరంబు= మిక్కిలి; భక్తిన్= భక్తితో;

పూజలు+ఇచ్చు= పూజలు చేసే; పరమవ్రతుండు= శ్రేష్ఠమైన వ్రతం పూనిన ఆ జరాసంధుడు; అప్పుడు= ఆ సమయంలో; ఎదురు, వచ్చి= శ్రీకృష్ణభీమార్జునులకు ఎదురుగా వెళ్ళి; వారికిన్; ఇష్టము+ఎసఁగన్= ప్రీతి కలిగేలా.

**తాత్పర్యం:** అర్ధరాత్రి అయినా అభ్యాగత బ్రాహ్మణ స్నాతకవ్రతులను ఆహ్వానించి, అమితభక్తితో అర్చనలు చేసే ఆ జరాసంధుడు స్నాతకవ్రతుల్లా అప్పుడు వచ్చిన ఆ శ్రీకృష్ణ భీమార్జునులకు ఎదురు వెళ్ళాడు. వాళ్ళకు ప్రీతిగా.

**విశేషం:** వ్రతభేదాన్నిబట్టి వ్రతులు తొమ్మిది విధాలు - ఋషి, స్నాతకుడు, యతి, స్థాండిలుడు; ద్వయాతిగుడు, మూలికుడు, లోచకుడు, ఔర్వుడు, ఖపుటుడు. వీరిలో స్నానశీలవ్రతుడు స్నాతకుడు. (స్నాతకులుకూడ తొమ్మిదివిధాలుగా ఉంటారు. వారు: 1. సంతానంకొరకు పెండ్లిచేసికొనదలచి ధనాన్ని యాచించేవాడు, 2. తన ధనాన్ని యాగాదులందు బ్రాహ్మణుల కిచ్చి దరిద్రుడై ధనాన్ని కోరేవాడు, 3. యజ్ఞార్థం ధనాన్ని యాచించేవాడు, 4. గురుదక్షిణకోసం ధనాన్ని కోరేవాడు, 5. బాటసారుల పోషణకై ధనాన్ని యాచించేవాడు, 6. రోగులపోషణకై ధనాన్ని యాచించేవాడు, 7. ఆలుబిడ్డల పోషణకై ధనాన్ని యాచించేవాడు, 8. బీదలకు అన్నదానం నిమిత్తం యాచించేవాడు, 9. వేదపఠనానికై కావలసిన సౌకర్యాలను కోరేవాడు.-సంపా.)

**క.** **ధీయుతుఁ డయి మధుపర్కము । సేయఁగ సమకట్టి దానిఁ జేకొనని మహో**
**పాయుల గర్వంబు నభి । ప్రాయంబు నెఱింగి మగధపతి యి ట్లనియెన్. 181**

**ప్రతిపదార్థం:** మగధపతి= మగధరాజైన జరాసంధుడు; ధీయుతుఁడు+అయి= బుద్ధిబలం కలవాడయి; మధుపర్కము= పెరుగు, తేనె కలిపిన తీయని పదార్థం; చేయఁగన్= (వారికి) ఇవ్వగా; సమకట్టి= పూనుకొని; దానిన్= ఆ మధుపర్కాన్ని; చేకొనని= తీసికొనని; మహా+ఉపాయుల= మిక్కిలి ఉపాయంగల వాళ్ళయొక్క - అంటే శ్రీకృష్ణభీమార్జునులయొక్క; గర్వంబున్= గర్వాన్ని; అభిప్రాయంబున్= ఉద్దేశాన్ని; ఎఱింగి= తెలిసికొని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** తా నిచ్చే మధుపర్కాన్ని తీసికోవటానికి ఇష్టపడని ఆ శ్రీకృష్ణభీమార్జునుల గర్వాన్ని, ఉద్దేశాన్ని బుద్ధిబలం గల ఆ మగధరాజు జరాసంధుడు గ్రహించాడు. వాళ్ళతో ఇలా అన్నాడు.

**విశేషం:** జరాసంధుని మందిరంలో ప్రవేశించటానికి తప్పనిసరై ఆ శ్రీకృష్ణ భీమార్జునులు బ్రాహ్మణస్నాతక వేషధారులయ్యారేకాని, నిజానికి వాళ్ళు క్షత్రియులు, శత్రువులు కదా! అందుచేత జరాసంధు డిచ్చే మధుపర్కాన్ని స్వీకరిస్తారా?

**తే.** **స్నాతకులరేని పూవులుఁ జందనంబుఁ । జనునె బలిమిమైఁగొని తాల్పఁ? జైత్యకాద్రి**
**తటము మీ రిట్లు వ్రచ్చి దోర్దర్ప మెసఁగఁ । జులుక నద్వారమునఁ బ్రోలు సొరఁగనగునె? 182**

**ప్రతిపదార్థం:** స్నాతకులరు+ఏని= (మీరు) స్నాతకవ్రతం పూనినే వాళ్ళే అయితే; పూవులున్; చందనంబున్= గంధాన్ని; బలిమిమైన్= బలవంతంగా; కొని= గ్రహించి; తాల్పన్= ధరించటానికి; చనునె= తగునా?; చైత్యక+అద్రి, తటమున్= చైత్యక పర్వత ప్రదేశాన్ని; మీరు; ఇట్లు= ఈవిధంగా; వ్రచ్చి= భేదించి; దోః+దర్పము= భుజగర్వం; ఎసఁగన్= మెరసేటట్లు; చులుకన్= సులువుగా; అద్వారమునన్= ద్వారం కాని మార్గంలో; ప్రోలున్= గిరివ్రజపురాన్ని; చొరఁగన్= ప్రవేశించటం; అగునె= తగునా!

**తాత్పర్యం:** మీరు నిజంగా స్నాతకవ్రతులే అయితే మాలాకార గంధిక గృహాలనుండి పూలను, గంధాన్ని బలవంతంగా గ్రహించి ధరించటం తగునా? అంతే కాదు, మీరు ఈ విధంగా చైత్యకప్రదేశాన్ని భేదించి భుజగర్వంతో ద్వారం కాని మార్గంనుండి గిరివ్రజపురాన్ని ప్రవేశించటం తగునా?

**వ. 'మఱియు నా కావించిన మధుపర్కంబు ప్రతిగ్రహింపనొల్లమి యిది యేమి? మీరలు వేషధారుల కావలయు; మీ వేషంబున బ్రాహ్మణత్వంబును మహాసత్త్వ దీర్ఘబాహు పృథులవక్షోలక్షణంబుల క్షత్రియత్వంబును బ్రకాశించుచున్న యవి' యనిన వానికి నారాయణుం డి ట్లనియె. 183**

**ప్రతిపదార్థం:** మఱియున్; నా కావించిన= నేను ఇచ్చిన; మధుపర్కంబు; ప్రతిగ్రహింపన్= అందుకోటానికి; ఒల్లమి= ఇష్టపడకపోవటం; ఇది; ఏమి; మీరలు= మీరు; వేషధారులు+అ= స్నాతకులవలె వేషం వేసుకొన్నవాళ్ళే; కావలయున్= అయి ఉంటారు; మీ, వేషంబునన్; బ్రాహ్మణత్వంబును; మహా, సత్త్వ, దీర్ఘ, బాహు, పృథుల, వక్షః, లక్షణంబులన్= మిక్కిలి బలంగలవై, పొడవైన బాహువులయొక్క విశాలమైన వక్షస్థ్సలంయొక్క లక్షణాలచేత; క్షత్రియత్వంబును; ప్రకాశించుచున్+ఉన్నయవి; అనిన; వానికిన్; నారాయణుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అంతే కాదు, నే నిచ్చిన మధుపర్కాన్ని మీ రెందుకు స్వీకరించటం లేదు? మీరు కేవల స్నాతకవేషధారుల్లా ఉన్నారు. మీ వేషంలో బ్రాహ్మణత్వం అగుపిస్తూఉంది. బలమైన మీ బాహువుల్లో, విశాలమైన వక్షస్థ్సలాల్లో క్షత్రియత్వం ప్రకాశిస్తూ ఉంది' - అని పలికిన జరాసంధునితో శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

**విశేషం:** నా కావించిన - ఇచట కర్తృపద ప్రథమకు షష్ఠి వచ్చింది. ఈ ప్రయోగాలు నన్నయ భారతంలో మెండు.

**క. స్నాతకులు పుణ్యకర్మస । నాతను లగుచున్న బ్రాహ్మణ క్షత్రియ వి**
**డ్జాతులయందును క్షత్రియ । జాతి స్నాతకుల మేము జనవినుత! మతిన్. 184**

**ప్రతిపదార్థం:** జనవినుత!= జనులచేత కొనియాడబడే ఓ జరాసంధా!; స్నాతకులు; పుణ్యకర్మ, సనాతనులు= పుణ్యకర్మలచేత ప్రాచీనులు; అగుచున్+ఉన్న; బ్రాహ్మణ, క్షత్రియ, విట్+జాతుల, అందును= బ్రాహ్మణక్షత్రియ వైశ్యజాతులలో; మతిన్= బుద్ధిచేత; ఏము= మేము; క్షత్రియజాతి స్నాతకులము.

**తాత్పర్యం:** పుణ్యకర్మలు చేయటంచేత పురాతనులు అయిన బ్రాహ్మణక్షత్రియ వైశ్యజాతి స్నాతకుల్లో మేము క్షత్రియజాతిస్నాతకులము.

**విశేషం:** 'జనవినుతమతిన్' - జనులచేత కొనియాడబడే అభిప్రాయంచేత - అని ఇచ్చట అర్థం చెప్పి అన్వయించవచ్చు. కాని పెక్కుప్రతుల్లో 'జనవినుతనిధీ, జనవినుతమతీ, సౌజన్యనిధీ' అనే పాఠాంతరాలు ఉండటంచేత జనవినుత' అనేదాన్ని జరాసంధునికి సంబోధనగా భావించటమే ఉచిత మనిపిస్తుంది.

**వ. ద్వారంబున మిత్త్రనివాసంబును నద్వారంబున నమిత్త్రనివాసంబును జొచ్చుట యిది బాహువీర్య సంపన్నులయిన క్షత్త్రియులకుం గర్తవ్యంబు; మఱి గంధమాల్యంబులయందు లక్ష్మి యుండుం గావున బలాత్కారంబున గంధ మాల్యంబులు గొంటిమి; నీయందుల మాకు నొండు కార్యంబు గలుగుటం జేసి నీయిచ్చు నర్ఘ్యంబు గొన నొల్ల' మనిన జరాసంధుం డి ట్లనియె. 185**

**ప్రతిపదార్థం:** ద్వారంబునన్; మిత్త్ర నివాసంబును= మిత్రునియొక్క ఇంటిని; అద్వారంబునన్= ద్వారం కాని మార్గంలో - అంటే ప్రవేశించకూడని మార్గంలో; అమిత్త్ర, నివాసంబును= శత్రువుయొక్క ఇంటిని; చొచ్చుట= ప్రవేశించటం; ఇది; బాహు,

వీర్య, సంపన్నులు+అయిన= భుజబలసంపద కలవాళ్ళయిన; క్షత్త్రియులకున్; కర్తవ్యంబు= చేయదగినపని; మఱి; గంధ, మాల్యంబుల, అందున్= గంధంలో, పువ్వుల్లో; లక్ష్మి; ఉండున్; కావున; బలాత్కారంబునన్= బలవంతంగా; గంధ, మాల్యంబులు= గంధం, పూలమాలలు; కొంటిమి= తీసుకున్నాము; నీ, అందుల= నీపట్ల; మాకున్; ఒండు, కార్యంబు= మరొక విధమైనపని; కలుగుటన్, చేసి= ఉండటంచేత; నీ, ఇచ్చు+అర్ఘ్యంబు= నీవు ఇచ్చే అర్ఘ్యాన్ని; కొనన్= తీసికోటానికి; ఒల్లము= ఇష్టపడం; అనినన్; జరాసంధుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ద్వారంనుండి మిత్రునిగృహాన్ని, ద్వారం తప్పించి శత్రుగృహాన్ని ప్రవేశించటం భుజబలసంపన్నులైన క్షత్రియులకు ఉచితమైన పనే. గంధంలో పువ్వుల్లో లక్ష్మి ఉండటంచేత మేము వాటిని బలాత్కారంగా గ్రహించాం. నీతో మాకు వేరే పని ఉంది. అందువల్ల నీ విచ్చే అర్ఘ్యాన్ని అంగీకరించం' అని శ్రీకృష్ణు డనగానే జరాసంధుడు ఇలా అన్నాడు.

**విశేషం:** గంధం, పువ్వులు లక్ష్మీస్థానాలు కనుక - దానం తీసుకోవటం క్షత్రియులకు ఉచితం కాదు కనుక, శ్రీకృష్ణ భీమార్జునులు బలవంతంగా వాటిని గ్రహించారు. అర్ఘ్యం స్వీకరిస్తే ఆర్షసంప్రదాయానుసారం అది ఇచ్చినవారిని ఆశీర్వదించాలి; వాళ్ళ హితాన్ని కోరాలి. శ్రీకృష్ణభీమార్జునులు జరాసంధుడిని చంపటానికి వచ్చారు. అందుచేతనే ఆత డిచ్చే అర్ఘ్యాన్ని గ్రహించలేదు. నన్నయకాలంలో 'అందుల' సప్తమీవిభక్తిప్రత్యయంగా ఉన్నట్లుంది.

**ఆ. మీరు నాకు నేను మీకు నెన్నండు ము । న్నహిత మాచరించినదియు లేదు;**
**మీకు నేల నే నమిత్త్రుండ నైతి? ని । రాగసుండ సద్గుణాన్వితుండ. 186**

**ప్రతిపదార్థం:** మీరు; నాకు; నేను; మీకున్; ఎన్నండున్= ఎప్పుడుకూడ; మున్ను= ఇదివరకు; అహితము= అపకారం; ఆచరించినదియు, లేదు= చేయలేదు; నిరాగసుండన్= తప్పు(పాపం) లేనివాణ్ణి; సద్గుణ+అన్వితుండన్= మంచి గుణాలతో కూడుకొన్న వాణ్ణి; మీకున్; ఏల= ఎందుచేత; అమిత్త్రుండను= శత్రువును; ఐతిన్= అయ్యాను.

**తాత్పర్యం:** ఇదివరకెప్పుడూ మీరు నాకుగాని, నేను మీకుగాని అపకారం చేయలేదు. పైగా నేను ఏ తప్పూ చెయ్యనివాణ్ణి. మంచిగుణాలు కలవాణ్ణి. ఎందుచేత మీకు నేను శత్రువు నయ్యాను?

**విశేషం:** మాటలలోని వికటత్వం ఉదారతాగుణ లక్షణం (చూడు వివరాలకు పీఠిక). (సంపా.)

**క. 'సురమునివరులకు వసుధా । మరులకు భక్తుండ నుత్తమక్షత్త్రకులా**
**చరితుండ' ననిన ధరణీ । ధరుఁ డమ్మగధేశ్వరునకుఁ దా ని ట్లనియెన్. 187**

**ప్రతిపదార్థం:** సుర, ముని, వరులకున్= దేవతలకు, మునిశ్రేష్ఠులకు; వసుధా+అమరులకున్= భూసురులకు - అంటే బ్రాహ్మణులకు; భక్తుండన్= భక్తుణ్ణి; ఉత్తమ, క్షత్త్ర, కుల+ఆచరితుండన్= ఉత్తమమైన క్షత్రియ కుల ధర్మాలను ఆచరించేవాణ్ణి; అనినన్= అని అనగా; ధరణీధరుఁడు= శ్రీకృష్ణుడు; ఆ+మగధ+ఈశ్వరునకున్= ఆ మగధ రాజైన జరాసంధునికి; తాన్= తాను; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'దేవతలకు, మునిశ్రేష్ఠులకు, బ్రాహ్మణులకు నేను భక్తుణ్ణి. ఉత్తమ క్షత్రియ ధర్మాల్ని ఆచరించేవాణ్ణి' - అని జరాసంధు డనగానే శ్రీకృష్ణుడు అతనితో ఇలా అన్నాడు.

**క. కులరక్షార్థ మఖిల నృప । కులోద్వహునియోగమున నకుంఠితశత్రు**
**ప్రళయవిధాయుల మయి యిం । దులకున్ వచ్చితిమి దుష్టదూషణబుద్ధిన్. 188**

**ప్రతిపదార్థం:** కులరక్షా+అర్థము= క్షత్రియ కులాన్ని రక్షించటంకొరకు; అఖిల, నృప, కుల+ఉద్వహు, నియోగమునన్= అన్ని క్షత్రియ వంశాలను ఉద్ధరించేవాడైన ధర్మరాజు ఆజ్ఞచేత; అకుంఠిత, శత్రు, ప్రళయ, విధాయులము+అయి= అపజయ మెరుగని శత్రునాశం కలిగించే వాళ్ళమై; దుష్ట, దూషణ. బుద్ధిన్= దుర్మార్గులను నిందించే ఉద్దేశంతో; ఇందులకున్= ఇక్కడికి; వచ్చితిమి.

**తాత్పర్యం:** క్షత్రియ వంశాలనన్నింటిని ఉద్ధరించేవా డైన ధర్మరాజు ఆజ్ఞతో క్షత్రియకులాన్ని రక్షించటానికి, అపజయ మెరుగని శత్రువుల్ని అంతం చేయటానికి, దుర్మార్గుల్ని దూషించటానికి ఇక్కడికి వచ్చాము.

**సీ. కడఁగి యత్యుత్తమ క్షత్త్రియ చరితంబు । నందు వర్తిల్లుదు నంటి, జనుల**
**కెవ్వరి కెన్నండు నెగ్గొనరింప నే । నంటి, సత్క్షత్త్రియు లవని నొరులు**
**నీయట్లు క్రూరులై నృపతులఁ జెఱఁబెట్టి । పశువరించుచుఁ బశుపతి నుమేశు**
**వరదుఁ బూజించిన వారును గలరె? ము । న్నింతకు నగ్గలం బెద్ది యెగ్గు?**

**ఆ. కారణంబు లేక దారుణుఁ డయి సాధు । హింస సేయు కుజనుఁ డెల్లవారి**
**కప్రియుండ కాక యప్రియలక్షణం । బొండు గలదె తలఁప నుత్తములకు? 189**

**ప్రతిపదార్థం:** కడఁగి= ప్రయత్నించి; అతి+ఉత్తమ, క్షత్త్రియ, చరితంబు+అందున్= మిక్కిలి శ్రేష్ఠమైన క్షత్రియ జీవనంలో; వర్తిల్లుదును+అంటి(వి)= నడుచుకొంటానని అన్నావు; జనులకున్+ఎవ్వరికిన్= ఏమానవులకు కూడ; ఎన్నండున్= ఎప్పుడుకూడ; ఎగ్గు= కీడు; ఏను= నేను; ఒనరింపన్= చేయను; అంటి(వి)= అన్నావు; అవనిన్= భూమిలో; సత్+క్షత్త్రియులు= ఉత్తములైన రాజులు; ఒరులు= ఇతరులు; నీ, అట్లు= నీవలె; క్రూరులు+ఐ= దుర్మార్గులై; నృపతులన్= రాజులను; చెఱన్+పెట్టి= చెరసాలలో బంధించి; పశువరించుచున్= బలియిస్తూ; పశుపతిన్= శివుని; ఉమా+ఈశున్= పార్వతీపతిని; వరదున్= వరాలిచ్చేవాణ్ణి (శంకరుని); పూజించినవారును; మున్ను= ఇదివరకు; కలరె= ఉన్నారా?; ఇంతకున్= ఇంతకంటె; అగ్గలంబు= ఎక్కువైన; ఎగ్గు= కీడు; ఎద్ది= ఏది; కారణంబు, లేక; దారుణుఁడు+అయి= దుర్మార్గుడై; సాధు, హింస, చేయు= మంచివాళ్ళను బాధించే; కుజనుఁడు= దుష్టుడు; ఎల్లవారికిన్= అందరికీ; అప్రియుండు+అ, కాక= శత్రువే కాక; ఉత్తములకున్= సజ్జనులైన వాళ్ళకు; తలఁపన్= ఆలోచిస్తే; అప్రియ, లక్షణంబు= శత్రులక్షణం; ఒండు, కలదె= ఇంకొకటి ఉన్నదా?

**తాత్పర్యం:** ఓ జరాసంధా! నీవు అత్యుత్తమ క్షత్రియ జీవితం గడుపుతున్నట్లు చెప్పావు. ఎవ్వరికీ ఎప్పుడూ ఏ కీడూ చేయలే దన్నావు. భూమిమీద ఉత్తమ క్షత్రియులు నీవలె క్రూరులై రాజులను చెరబట్టి బలియిస్తూ ఇంతకుముం దెన్నడైనా శివుణ్ణి పూజించారా? ఇంతకు మించిన కీడు ఇంకేమైనా ఉందా? అకారణంగా సాధుజనులను హింసించే దుష్టుడు అందరికీ శత్రువే కదా! ఆలోచిస్తే ఉత్తములకు ఇంతకంటె వైరకారణం ఇంకొకటి ఏముంది!

**విశేషం:** పశుపతి - ప్రమథగణాలకు, పశువులకు అనగా జీవులకు - వారిని సంసారబంధము నుండి రక్షించువాడు ప్రభువు - శివుడు.

**వ. నిర్దయుండై సవర్ణుండు నిర్దోషు లైన సవర్ణుల వధియించునంతకంటె మిక్కిలి పాతకం బొం డెద్ది? నీయట్టి పాపకర్ముల నుపేక్షించిన నఖిల ధర్మ రక్షణ క్షములమైన మమ్ముఁ దత్పాపంబు వొందు నని పాపభయంబున నిన్ను నిగ్రహింప వచ్చితిమి; నాకంటె నధికుండైన క్షత్రియుండు లేఁడని గర్వించి యొరుల నవమానించి పలుక వలదు. 190**

**ప్రతిపదార్థం:** నిర్దయుండు+ఐ= దయలేనివాడై; స, వర్ణుండు= తమకులంవాడు; నిర్దోషులు+ఐన= తప్పు చేయని వాళ్ళయిన; స, వర్ణులన్= తనకులం వారిని; వధియించు+అంతకంటెన్= చంపటంకంటె; మిక్కిలి= ఎక్కువైన; పాతకంబు= పాపం; ఒండు+ఎద్ది= ఇంకొకటి ఏముంది?; నీ, అట్టి= నీవంటి; పాప, కర్ములన్= పాపపు పనులు చేసేవాళ్ళను; ఉపేక్షించినన్= వదలివేస్తే; అఖిల, ధర్మ, రక్షణ క్షములము+ఐన= అన్ని ధర్మాలను రక్షించటానికి సమర్థులమైన; మమ్మున్; తత్+పాపంబు= ఆపాపం; పొందున్; అని; పాపభయంబునన్= పాపంవల్ల కలిగే భయంచేత; నిన్నున్; నిగ్రహింపన్= దండించటానికి; వచ్చితిమి; నాకంటెన్; అధికుండు+ఐన= గొప్పవాడైన; క్షత్రియుండు; లేడు+అని; గర్వించి; ఒరులన్= ఇతరులను; అవమానించి; పలుక; వలదు.

**తాత్పర్యం:** కఠినాత్ముడై ఒక కులంవాడు, ఏతప్పూ చేయని తనకులంవాళ్ళను చంపటం కంటె ఎక్కువైన పాపం ఇంకేముంది? నీవంటి పాపపు పనులు చేసేవాళ్ళ సంగతి పట్టించుకోకుండ వదలివేస్తే, సర్వధర్మాలను రక్షించటానికి సమర్థులమైన మాకు, ఆ పాపం సంక్రమిస్తుంది. ఆ పాపభయంచేతనే నిన్ను దండించటానికి వచ్చాము. నన్ను మించిన క్షత్రియుడు లేడన్న గర్వంతో ఇతరులను అవమానించి మాట్లాడవద్దు.

**క. అవినీతులయి మహాత్ముల । కవమానము సేసి మును జయద్రథ దంభో**
**ద్భవ కార్తవీర్యులనువా । రవజితులయి రొరులచే మహాబలులయ్యున్. 191**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; జయద్రథ, దంభోద్భవ, కార్తవీర్యులు+అనువారు; మహాబలులు+అయ్యున్= మిక్కిలి బలంకలవారు అయినప్పటికిని; అవినీతులు+అయి= నీతిలేని వాళ్ళయి; మహాత్ములకున్; అవమానము; చేసి; ఒరులచేన్= ఇతరులచేత; వారు; అవజితులు+అయిరి= ఓడించబడినవా రయ్యారు.

**తాత్పర్యం:** పూర్వం జయద్రథుడు, దంభోద్భవుడు, కార్తవీర్యుడు మహాబలవంతులే అయినా అవినీతిపరులై మహాత్ములను అవమానించటంచేత ఇతరులచేతుల్లో ఓడిపోయారు.

**విశేషం:** జయద్రథుడు - సింధుదేశాధిపతి అయిన వృద్ధక్షత్రుని కుమారుడు. ఇతనికి సైంధవుడనే పేరుకూడ ఉంది. ఇతడు ధృతరాష్ట్రుడి కూతురు దుస్సలకు భర్త. అయితే ఈ సైంధవుడు పార్థునిచేత కురుక్షేత్రంలో చచ్చాడు. అందుచేత ఇక్కడ అతడని చెప్పటం కుదరదు. యశోదా వృహన్మనసుల కొడుకైన జయద్రథు డున్నాడు. అతడే ఇతడు. దంభోద్భవుడు - గంధమాదనంమీద తపస్సు చేసుకొంటున్న నరనారాయణుల దగ్గరకు క్రొవ్వెక్కి వెళ్ళి, యుద్ధానికి రమ్మని పిలిచి వాళ్ళచేతిలో ఓడిపోయిన రాజు. కార్తవీర్యుడు - కృతవీర్యుడి పుత్రుడు. హైహయవంశపు రాజు. దత్తాత్రేయుని వరంతో వెయ్యిచేతులు పొందినవాడు. జమదగ్ని మహామునిని అవమానించి పరశురామునిచేత నాశనమైనవాడు.

**తరలము.**

**అతుల విక్రమ సంపదన్ రణయజ్ఞ దీక్షితులై రిపు**
**ప్రతతి నోర్చిన వీరు, లుగ్రతపంబు సేసినవారు స**
**ద్గతికిఁ బోదురు గాక; యి ట్లపకారదారుణవృత్తి ను**
**ద్ధతిని భైరవపూజ సేసిన దాన సద్గతి గల్గునే?** **192**

**ప్రతిపదార్థం:** అతుల, విక్రమ, సంపదన్= సాటిలేని పరాక్రమమనే సంపదతో; రణ, యజ్ఞ దీక్షితులు+ఐ= యుద్ధమనే యజ్ఞంలో దీక్షగలవాళ్ళయి; రిపు ప్రతతిన్= శత్రు సమూహాన్ని; ఓర్చిన= ఓడించిన; వీరులు; ఉగ్ర, తపంబు= భయంకరమైన తపస్సు; చేసిన, వారు; సత్+గతికిన్= స్వర్గానికి; పోదురుగాక; ఇట్లు= ఈవిధంగా; అపకార, దారుణ, వృత్తిన్= అపకారంతో కూడుకొన్న క్రూరమైన నడవడితో; ఉద్ధతిని= గర్వంతో; భైరవ, పూజ= శివపూజ; చేసిన; దానన్= దానిచే; సత్+గతి= మోక్షం; కల్గునే= కలుగునా?

**తాత్పర్యం:** సాటిలేని పరాక్రమమనే సంపదతో, యుద్ధమనే యజ్ఞంలో దీక్షవహించి, శత్రుసమూహాన్ని ఓడించినవీరులు, గొప్పతపస్సు చేసినవాళ్ళు స్వర్గాన్ని పొందుతారు. కాని, నీవలె సాటిరాజులను క్రూరంగా హింసిస్తూ గర్వంతో శివపూజ చేస్తే మోక్షం లభిస్తుందా!

**విశేషం:** అలం: రూపకం. 'తరలం'లో న-భ-ర-స-జ-జ-గ- అనే గణాలు ఉంటాయి. 12వ అక్షరం యతి స్థానం. ఇందులో మొదటి రెండు లఘువులను ఒక గురువుగా మారిస్తే మత్తకోకిల అవుతుంది. (శ్రీకృష్ణుడు అధిక్షేపాత్మకంగా మాట్లాడిన ఈపద్యంలోని వాక్యవిన్యాసంలో వికటత్వం గోచరిస్తుంది. దానివలన ఉదారత పోషించబడి ఓజోగుణం రాణించింది. అధిక్షేపంలో కూడా అగ్రామ్యత గోచరించటం ఉదాత్తుని స్వభావానికి వ్యంజకం. - సంపా.)

**తరలము.**

**చెడక నా వచనంబు సేయుము; చెచ్చెరన్ ధరణీశులన్**
**విడిచి పుచ్చుమ; యేను గృష్ణుఁడ, వీఁడు భీముఁడు, వాఁడు గ**
**వ్వడి; భవత్కృత దారుణం బను వహ్ని యార్పఁగ నున్న య**
**క్కడిఁది వీరులు వీర లిద్దఱు గర్వితుల్ కురుసింహముల్.** **193**

**ప్రతిపదార్థం:** చెడక= చెడిపోక; నా, వచనంబు, చేయుము= నేను చెప్పినట్లు చేయుము; చెర+చెరన్= వెంటనే, ధరణీ+ఈశులన్= రాజులను (చెరలో ఉన్న వాళ్ళను) విడిచి, పుచ్చుము+అ= విడిచిపెట్టుమా!; ఏను= నేను; కృష్ణుఁడ; వీఁడు; భీముఁడు; వాఁడు; కవ్వడి= అర్జునుడు; భవత్+కృత, దారుణంబు+అను= నీచే చేయబడిన దుర్మార్గమనే; వహ్ని= అగ్నిని; ఆర్పఁగన్= చల్లార్చటానికి; ఉన్న= సిద్ధంగా ఉన్న; ఆ+కడిఁది, వీరులు= ఆగొప్పవీరులు; వీరలు+ఇద్దఱు; గర్వితుల్= గర్వించి ఉన్నవారు- అంటే పెచ్చు పెరిగి ఉన్నవాళ్ళు; కురు సింహముల్= కురువంశశ్రేష్ఠులు.

**తాత్పర్యం:** నీవు చెడిపోకుండా ఉండాలంటే నేను చెప్పినట్లు చెయ్యి; వెంటనే చెరలో ఉండే రాజు లందరిని విడిచిపెట్టు. నేను కృష్ణుణ్ణి. ఇతడు భీముడు. అతడు అర్జునుడు. నీదుర్మార్గం అనే నిప్పును చల్లార్పటానికి సిద్ధంగా ఉన్న ఆ మహావీరు లిద్దరూ గర్వోన్నతులు, కురువంశ శ్రేష్ఠులు.

**విశేషం:** అలం: రూపకం. కవిత్రయంలో తరలవృత్తాన్ని నన్నయయే ఎక్కువగా వాడాడు. (నన్నయ రచించినవి 25; ఎఱ్ఱన రచించినవి-8, తిక్కన రచించినవి-5.). విశేషించి ఈ ఘట్టంలోనే శ్రీకృష్ణుడి మాటలుగా వరుసగా రెండు తరలవృత్తాలను వాడటం గమనార్హం. శ్రీకృష్ణుడు జరాసంధుణ్ణి మందలించి, అతనిని శిక్షించడానికి వచ్చామని బెదిరించిన ఈ వాక్యాలు ఈ విశేషవృత్తంలో ఉండటం ఛందౌచిత్యం. పై వృత్తంలోవలె ఇందులోకూడ ఉదారతను ఓజస్సుకు అంగంగా పోషించటం పాత్రౌచిత్య, సందర్భౌచిత్య కారకం. (సంపా.)

**క. కడుఁ గ్రూరుఁడవయి నృపతుల । విడువనినాఁ డాజిఁ బాండవేయులు నీయు**
**క్కడఁచి భుజశక్తి యేర్పడ । విడిపింతురు గడిమి నిఖిల విషయాధిపులన్. 194**

**ప్రతిపదార్థం:** కడున్= మిక్కిలి; క్రూరుఁడవు+అయి= దుర్మార్గుడివై; నృపతులన్= రాజులను; విడువని, నాఁడు= విడిచిపెట్టనిరోజు; ఆజిన్= యుద్ధంలో; పాండవేయులు= పాండురాజుకుమారులైన ఈ భీమార్జునులు; భుజశక్తి= భుజబలం; ఏర్పడన్= ప్రకాశించగా; నీ, ఉక్కు+అడఁచి= నీయొక్క పొగరును అణచి; కడిమిన్= ఆధిక్యంతో; నిఖిల, విషయ+అధిపులన్= అందరు భూపతులను - అంటే నీకు బందీలుగా ఉన్న రాజు లందరిని; విడిపింతురు.

**తాత్పర్యం:** పరమ దుర్మార్గుడివై నీవు రాజులను చెరనుండి విడిపించకుంటే, పాండుపుత్రులైన ఈ భీమార్జునులు తమ భుజబలంతో నీ పొగరు అణచివేస్తారు. నీకు బందీలైన రాజులందరినీ విడిపిస్తారు.

**విశేషం:** శ్రీకృష్ణుడు భీమార్జునుల పరాక్రమాన్ని ప్రశంసించి వారిని ఉత్సాహపరిచాడు. జరాసంధుణ్ణి నిందించి అతణ్ణి రెచ్చగొట్టాడు. యుద్ధానికి రంగాన్ని సిద్ధం చేశాడు.

**వ. అనిన విని జరాసంధుండు సటాసముత్పాటన కుపితకుంజర వైరియుంబోలెఁ గడునలిగి పటు కుటిల భ్రుకుటి ఘటిత నిటలుం డగుచుఁ బురుషోత్తమున కి ట్లనియె. 195**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; జరాసంధుండు; సటా, సమ్+ఉత్+పాటన, కుపిత, కుంజర, వైరియున్+పోలెన్= జూలు గట్టిగా పట్టి ఊడబెరకటంచేత కోపపడిన, ఏనుగుల శత్రువైన సింహంవలె; కడున్= మిక్కిలి; అలిగి= కోపించి; పటు, కుటిల, భ్రుకుటి, ఘటిత, నిటలుండు+అగుచున్= ఎక్కువగా వంకర తిరిగిన బొమముడిపాటుతో కూడిన నొసలు కలవాడై; పురుష+ఉత్తమునకున్= శ్రీకృష్ణునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుని మాటలకు జరాసంధుడు జూలు గట్టిగా పట్టి పెరకటంచేత కోపించిన సింహంలా ఎంతో కోపంతో మిక్కిలి వక్రమైన బొమముడిపాటుగల నొసలు కలవాడై ఇలా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. అక్షరరమ్యమైన నన్నయశైలికి ఇదొక చక్కని ఉదాహరణ. శ్రీకృష్ణ భీమార్జునుల అక్రమ ప్రవేశంతో, వాళ్ళ అహంకార ప్రదర్శనతో, అన్నింటిని మించి ఆ శ్రీకృష్ణుడి కవ్వింపు మాటలతో, జరాసంధుడు ఎంత కోపోద్రిక్తుడయ్యాడో ఈ వచనంలోని ఉపమానమే కాక ఇందులోని పద ఘటన కూడ పాఠకునికి ప్రత్యక్షం చేస్తున్నది. కటువైన ఉచ్చారణ, వక్రమైన ఆకారం ఉండే 'ట' కారం సటాసముత్పాటనతో ప్రారంభమై, వడివడిగా ఆ జరాసంధుని కోపం ఎట్లా పెరిగిందో ఒక్కపెట్టున అతని ముఖమెంత కటువుగా మారిందో, నొస లెంత వక్రత వహించిందో చక్కగా వ్యక్తం చేస్తూ ఉంది. ఇక్కడ 'ట' కారావృత్తితో వృత్త్యనుప్రాసమనే శబ్దాలంకారం ఉంది.

క. **అమితపరాక్రమమున నా । క్రమించి పరనృపుల నోర్చి గర్వించుట దో**
**సమె? యిది సత్‌క్షత్రియ ధ । ర్మమ; యే నెప్పుడుఁ బరాక్రమవ్రతుఁడ నిలన్.** **196**

**ప్రతిపదార్థం:** అమిత, పరాక్రమమునన్= మిక్కిలి పరాక్రమంతో; ఆక్రమించి= దండెత్తి; పరనృపులన్= శత్రురాజులను; ఓర్చి= జయించి; గర్వించుట; దోసమె= తప్పా?; ఇది; సత్+క్షత్రియ, ధర్మము+అ= ఉత్తమక్షత్రియ ధర్మమే; ఇలన్= భూమిమీద; ఏన్= నేను; ఎప్పుడున్= ఎల్లప్పుడు; పరాక్రమవ్రతుఁడన్= పరాక్రమంతో జీవించటమే వ్రతంగా కలవాణ్ణి.

**తాత్పర్యం:** అమితపరాక్రమంతో పరరాజులమీద దండెత్తి వాళ్ళను జయించి గర్వించటం తప్పా? ఇది ఉత్తమ క్షత్రియధర్మమే కదా! ఈనేలమీద ఎప్పుడూ పరాక్రమంతో జీవించటమే నా వ్రతం.

క. **దేవార్థముగాఁ దెచ్చిన । యీ వసుధాధిపుల నేల యే విడుతుఁ బ్రతా**
**పావజితరిపుఁడఁ గావున । నీ వెఱుఁగవె తొల్లి ధారుణీధర! నన్నున్?** **197**

**ప్రతిపదార్థం:** దేవ+అర్థముగాన్= దేవుడికొరకు - అంటే పరమేశ్వరుడికి బలిఇవ్వటానికని; తెచ్చిన; ఈ, వసుధా+అధిపులన్= ఈ భూపతులను - రాజులను; ఏల= ఎందుకు; ఏన్= నేను; విడుతున్= విడిచిపెడతాను; ప్రతాప+అవజిత, రిపుఁడన్= పరాక్రమంచేత జయింపబడిన శత్రువులు కలవాడిని; కావున= అవటంచేత; ధారుణీ, ధర!= శ్రీకృష్ణా!; తొల్లి= ఇదివరకు; నీవు; ఎఱుఁగవె; నన్నున్.

**తాత్పర్యం:** పరమేశ్వరునికి బలియివ్వటానికై పట్టి తెచ్చిన రాజు లందరిని ఎందుకు వదలిపెడతాను? పరాక్రమంచేత శత్రువుల్ని జయించినవాణ్ణి. శ్రీకృష్ణా! నా సంగతి నీ కిదివరకు తెలియదా?

**విశేషం:** జరాసంధుని దెబ్బకు తాళలేక మధురనుండి ద్వారవతికి తననివాసాన్నే మార్చుకొన్న శ్రీకృష్ణునికి 'నీ వెఱుఁగవె తొల్లి ధారుణీధర నన్నున్' అనే జరాసంధుని మాటపోటు ఆయువుపట్టు తాకేదిగా ఉంది.

### జరాసంధుండు యుద్ధమునకు భీమునిఁ గోరుకొనుట (సం. 2-20-28)

సీ. **'సమకట్టి సైన్యంబు సైన్యంబుతో నొండెఁ, । దొడరి మీ ముఫ్వురతోడ నొండె.**
**నిద్దఱతో నొండె, నెక్కటి యొక్కని । తో నొండెఁ, బొడిచెద దోర్బలమున**
**నే యాయుధంబున నెమ్మెయిఁ బోరంగ । నిష్ట మయ్యది యుత్సహింపుఁ' డనిన,**
**'నొక్కనితోఁ బల్వు రుద్ధతులయి పూని । యుద్ధంబు సేయుట యుచితమగునె?**

ఆ. **యధిక బాహుబలులమయిన మా ముఫ్వుర । యందు నొక్కరుని మహాబలాఢ్యుఁ**
**గోరికొనుము; వాఁడు ఘోరాజిలో నిన్ను । మొనసి మల్లయుద్ధమున జయించు.'** **198**

**ప్రతిపదార్థం:** సమకట్టి= పూనుకొని; సైన్యంబు, సైన్యంబుతోన్+ఒండెన్= సైన్యం సైన్యంతోకాని; తొడరి= ప్రయత్నించి; మీ, ముఫ్వురతోడన్+ఒండెన్= మీ ముగ్గురితోకాని; ఇద్దఱతోన్+ఒండెన్= ఇద్దరితోకాని; ఎక్కటి, ఒక్కనితోన్+ఒండెన్= ఒంటరిగా ఒక్కనితోకాని; పొడిచెదన్= యుద్ధం చేస్తాను; దోః+బలమునన్= బాహుబలంచేతగాని; ఏ, ఆయుధంబునన్= ఏరకమైన ఆయుధంచేతగాని; ఏ, మెయిన్= ఏవిధంగా; పోరంగన్= యుద్ధం చెయ్యటానికి; ఇష్టము= మీకు ఇష్టమో; ఆ+అది= ఆవిధం;

ఉత్సహింపుఁడు= పూనుడు; అనినన్; ఒక్కనితోన్; పలువురు; ఉద్ధతులు+అయి= విజృంభించినవాళ్ళయి; పూని= పూనుకొని; యుద్ధంబు; చేయుట; ఉచితము+అగునె= తగునా?; అధిక, బాహు, బలులము+ఐన= మిక్కిలి భుజబలం కలవాళ్ళమైన; మా, ముప్పుర, అందున్; మహా, బల+ఆఢ్యున్= గొప్ప బలంతో కూడుకొన్నవాణ్ణి; ఒక్కరుని; కోరికొనుము; వాఁడు; ఘోర+ ఆజిలోన్= భయంకరమైన యుద్ధంలో; నిన్నున్; మొనసి= ఎదుర్కొని; మల్ల, యుద్ధమునన్; జయించున్.

**తాత్పర్యం:** 'సైన్యం సైన్యంతోగాని, మీ ముగ్గురితో కాని, మీలో ఇద్దరితోకాని, ఒంటరిగా మీలో ఒక్కరితో కాని యుద్ధం చేయటానికి నేను సిద్ధం. బాహుబలంతోకాని, ఆయుధంతో కాని, ఏవిధంగా పోరాడటం మీకిష్టమో ఆ విధంగా నాతో యుద్ధానికి రండి' అని జరాసంధు డనగానే 'పెక్కుమంది బలవంతులు విజృంభించి ఒక్కడితో యుద్ధం చేయటం ఉచితం కాదు. అధిక బలశాలురమైన మా ముగ్గురిలో మహాబలవంతుడైన ఒక్కణ్ణి కోరుకో. అతడే నిన్ను ఎదుర్కొంటాడు. భయంకరమైన మల్లయుద్ధంలో నిన్ను జయిస్తాడు' అని శ్రీకృష్ణు డన్నాడు.

**విశేషం:** శ్రీకృష్ణుని మాటనేర్పు అమోఘం. మా ముగ్గురిలో ఎవరినైనా ఒక్కడిని కోరుకొమ్మని పైకి అన్నట్లే అని, మహాబలాఢ్యుణ్ణి కోరుకొమ్ము, అతడు మల్లయుద్ధంలో నిన్ను జయిస్తా డని పలికి పరోక్షంగా జరాసంధునిదృష్టిని మహాబలుడైన వాయుపుత్రుడు, మల్లయుద్ధనిపుణుడు అయిన భీముడివైపు మళ్ళించాడు.

**క. అనిన మురవైరి పలుకులు । విని బార్హద్రథుఁడు భూరివీర్యు మరున్నం**
**దనుఁ గోరికొనియె 'నీతం । డని నెన యగు నాకు' ననుచు నతిదర్పితుఁడై. 199**

**ప్రతిపదార్థం:** అనినన్; ముర, వైరి, పలుకులు= మురుడనే రాక్షసునికి శత్రువైన శ్రీకృష్ణుని మాటలు; విని; బార్హద్రథుఁడు= బృహద్రథుడి పుత్రుడైన జరాసంధుడు; భూరి, వీర్యున్= గొప్ప పరాక్రమం కలవాడైన, మరుత్+నందనున్= వాయుతనయుడైన భీమసేనుని; ఈతండు; అనిన్= యుద్ధంలో; నాకున్; ఎన= సరి; అగున్; అనుచున్; అతిదర్పితుఁడు+ఐ= మిక్కిలి గర్వంతో కూడుకొన్నవాడై; కోరికొనియెన్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుని మాటలు విని జరాసంధుడు గర్వంతో 'యుద్ధంలో నాకు సరిజోడు పవన తనయుడైన భీముడే' అని ఆతణ్ణి కోరుకొన్నాడు.

**విశేషం:** భీముడే నాకు యుద్ధంలో సరి ఉద్దీ అని అతణ్ణి కోరుకొన్న జరాసంధుని అభిమానంగూడ అభినందించతగ్గదే.

**వ. ఇట్లు జరాసంధుండు భీమసేనుతో మల్లయుద్ధంబు సేయ నిశ్చయించి తన తనయు సహదేవుని రాజ్యంబున కభిషిక్తుంజేసి పురోహిత కృత స్వస్త్యయనుండై. 200**

**ప్రతిపదార్థం:** ఇట్లు; జరాసంధుండు; భీమసేనుతోన్; మల్ల, యుద్ధంబు; చేయ, నిశ్చయించి, తన, తనయున్= తన కుమారుణ్ణి; సహదేవునిన్; రాజ్యంబునకున్= మగధరాజ్యానికి; అభిషిక్తున్+చేసి= రాజుగా చేసి; పురోహిత, కృత, స్వస్తి+అయనుండు+ ఐ= పురోహితులచేత చేయబడిన మంగళాశీర్వచనాలుకలవాడై.

**తాత్పర్యం:** ఆ విధంగా జరాసంధుడు భీమసేనునితో మల్లయుద్ధం చేయటానికి నిశ్చయించి, ముందుగా తన కుమారుడైన సహదేవుణ్ణి మగధరాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేసి, తాను పురోహితుల మంగళాశీర్వచనాలు పొంది.

**విశేషం:** జరాసంధునికి ఆయుధాలవలన మరణం లేదనే వరం ఉంది. కాని ఇప్పుడు భీమునితో జరుగబోయేది మల్లయుద్ధం. జయం తథ్యం కాదు. అందుకే జరాసంధుడు మరణానికికూడా సిద్ధమై యుద్ధానికి పూనుకొంటున్నాడని సహదేవుని పట్టాభిషేకం సూచిస్తున్నది. జరాసంధుని మరణ సూచన ఉంది కనుక ఇది వస్తుధ్వని. (సంపా.)

**ఆ. బలియుఁ డపుడు వెండ్రుకలు పాచి ముడిచి గం । టెసఁగఁ దాల్చి వీరరసికవృత్తి**
**నుద్ధతుండు మల్లయుద్ధ ప్రసాధనం । బమర నిలిచె వేడ్క నమితబలుఁడు. 201**

**ప్రతిపదార్థం:** బలియుఁడు= బలవంతుడైన జరాసంధుడు; అపుడు; వెం(డుకలు; పాచి= వెనుకకు (త్రోసి; ముడిచి; గంటు+ ఎసఁగన్= ముడి ఒప్పేటట్లుగా; తాల్చి= వేసికొని; వీర, రసిక, వృత్తిన్= వీరరసావేశం పొందిన వాడి విధంగా; ఉద్ధతుండు= విజృంభించినవాడు; అమిత, బలుఁడు= మిక్కిలి బలవంతుడయిన జరాసంధుడు; మల్ల, యుద్ధ, (ప్రసాధనంబు= మల్లయుద్ధానికి తగిన అలంకరణ; అమరన్= ఒప్పగా; వేడ్కన్= సంతోషంతో; నిలిచెన్= నిలిచాడు.

**తాత్పర్యం:** అప్పుడు మహాబలవంతుడైన ఆ జరాసంధుడు తనజుట్టు వెనుకకు నెట్టి, ముడివేసుకొన్నాడు. వీరరసావేశంతో విజృంభించాడు. మల్లయుద్ధానికి తగిన అలంకరణతో ఆ భీమునిముందు నిలిచాడు.

**వ. భీమసేనుండును వానికి నక్కజంబుగా మల్లయుద్ధ సన్నద్ధుం డయి ప్రతిభటించి నిలిచె నంత. 202**

**ప్రతిపదార్థం:** భీమసేనుండును; వానికిన్= ఆ జరాసంధునికి, అక్కజంబుగాన్= ఆశ్చర్యం కలిగేటట్లుగా; మల్ల, యుద్ధ, సన్నద్ధుండు+అయి= మల్లయుద్ధానికి సిద్ధమైనవాడై; (ప్రతిభటించి= ఎదిరించి; నిలిచెన్; అంత= అప్పుడు.

**తాత్పర్యం:** భీమసేనుడు కూడ జరాసంధునికి ఆశ్చర్యం కలిగేటట్లుగా మల్లయుద్ధానికి సిద్ధమై అతనికి దీటుగా ఎదుట నిలిచాడు.

### భీమసేన జరాసంధుల మల్లయుద్ధము (సం. 2-21-10)

**మ. సమసత్త్వాతిశయుల్ వృకోదర జరాసంధుల్ మహోద్యత్పరా**
**క్రమ మొప్పం గడు నల్గి యొండొరులఁ జుల్కం దాఁకి రన్యోన్యదు**
**ర్దమ దోర్దండ పటుప్రహార జనితధ్వానంబు బ్రహ్మాండ భాం**
**డము నిండన్ లయకాల దండధర చండక్షోభమో నా జనుల్. 203**

**ప్రతిపదార్థం:** సమ, సత్త్వ+అతిశయుల్= సమానమైన బలం యొక్క అధిక్యం కలవాళ్ళు; వృకోదర, జరాసంధుల్= భీమసేన జరాసంధులు; మహా+ఉద్యత్+పరా(క్రమము+ఒప్పన్= పెల్లుబికిన శౌర్యం (ప్రకాశించగా; అన్యోన్య, దుర్దమ, దోః+దండ, పటు (ప్రహార, జనిత, ధ్వానంబు= పరస్పరం అణచటానికి సాధ్యం కాని భుజదండాల తీ(వ్రమైన దెబ్బలచే పుట్టిన శబ్దం; (బహ్మాండ, భాండము= కుండవంటి ఆకారంలో ఉన్న భువనగోళం; నిండన్= నిండగా; జనుల్; లయ, కాల, దండధర, చండ, క్షోభమో, నాన్= (ప్రళయకాలంలోని యమునివల్ల ఏర్పడే భయంకరకల్లోలమా అని అనుకొనేటట్లుగా; కడున్+అల్గి= మిక్కిలి కోపించి; ఒండు+ఒరులన్= ఒకరి నొకరు; చుల్కన్= సుళువుగా; తాఁకిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** సమబలులై, విజృంభించిన భీమజరాసంధు లిద్దరు, పెల్లుబికిన పరా(క్రమంతో, పరస్పరం అణచసాధ్యంకాని తమ బాహుదండాల తీ(వ్రమైన దెబ్బల ధ్వని (బహ్మాండ భాండమంతా నిండగా, (ప్రజలంతా అది (ప్రళయకాల

యముని వల్ల ఏర్పడిన అల్లకల్లోలమా అని అనుకొనేటట్లుగా మితిమీరిన కోపంతో మహోద్రిక్తులై ఒకరినొకరు అవలీలగా ఎదుర్కొన్నారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. రెండు మదపుటేనుగులు ఢీకొన్నట్లు భీమజరాసంధుల మల్లయుద్ధపు తొలితాకిడిని మత్తేభవృత్తంలో వర్ణించటం, వారి భుజదండ ప్రహారాలను బిందుపూర్వక డకార పౌనఃపున్యంచేత ధ్వనింప చేయటం శబ్దశాసనుడైన నన్నయ మనోహర కవితాశిల్పం. (వీరరౌద్ర రసస్ఫోరకమైన ఈ పద్యరచనలో కాంతి అనే శబ్దగుణంతో ఉజ్జ్వలంగా భాసించే ప్రసాదం ప్రదర్శితం. - సంపా.)

**క. కర్షితరిపు లన్యోన్యా । కర్షణ సంకర్షణాపకర్షణముల సా**
**మర్షు లయి పెనఁగి రాహవ । హర్షంబునఁ బవనసుత బృహద్రథపుత్త్రుల్. 204**

**ప్రతిపదార్థం:** కర్షితరిపులు= పరస్పరం ఆకర్షితులైన శత్రువులు; పవన, సుత, బృహద్రథ, పుత్త్రుల్= వాయుదేవుని కొడుకైన భీముడు, బృహద్రథుని కొడుకైన జరాసంధుడు; అన్యోన్య+ఆకర్షణ, సంకర్షణ+అపకర్షణములన్= ఒకరి నొకరు లాగటంచేత, నలపటంచేత, త్రోయటంచేత; స+అమర్షులు+అయి= కోపంతో కూడుకొన్నవాళ్ళయి; ఆహవహర్షంబునన్= యుద్ధమందలి ఉత్సాహంతో; పెనఁగిరి= పోరాడారు.

**తాత్పర్యం:** పరస్పరం కలియబడిన శత్రువులు ఆ భీమ జరాసంధులు ఒకరినొకరు లాగటంచేత, నలపటంచేత, త్రోయటంచేత అతిశయించిన కోపంతో యుద్ధోత్సాహంతో పోరాటం సాగించారు.

**విశేషం:** ఒకదాని వెంట ఒకటిగా వచ్చే రకారషకారసంయోగం ఆ మల్లయుద్ధమహావీరుల పెనుగులాటను మనోహరంగా ధ్వనింపజేస్తున్నది. మహాకవుల రచనల్లో అక్షరాల కూర్పు అంతరభావాన్ని ధ్వనింపచేస్తుందనటానికి (Sound echoing the sense) ఇదొక ఉదాహరణ.

**క. వ్యాయామకర్కశ స్థిర । కాయుల యుద్ధము భయానకం బయ్యె మహో**
**గ్రాయస పరిఘాయిత కఠి । నాయత భుజదండ దారుణాఘాతములన్. 205**

**ప్రతిపదార్థం:** వ్యాయామ, కర్కశ, స్థిర, కాయుల= వ్యాయామంచేత - అంటే కసరత్తుచేత - కఠినమై గట్టిపడిన శరీరాలు కలవాళ్ళయొక్క; మహా+ఉగ్ర+ఆయస, పరిఘాయిత, కఠిన+ఆయత, భుజ, దండ, దారుణ+ఆఘాతములన్= మిక్కిలి భయంకరాలైన ఇనుప గుదియల వలె కఠినాలై పొడవైన బాహుదండాలయొక్క; తీవ్రమైన దెబ్బలచేత; భయానకంబు+అయ్యెన్= భయాన్ని కలిగించే దయింది.

**తాత్పర్యం:** వ్యాయామంచేత గట్టిపడిన శరీరాలు కల ఆ భీమజరాసంధుల మల్లయుద్ధం భయంకరమైన ఇనుపగుదియలా కఠినంగా పొడవుగా ఉన్న వాళ్ళ బాహుదండాల దెబ్బలతో భయంకరంగా మారింది.

**విశేషం:** నన్నయగారు పద్యంలో విరివిగా ఇచట ప్రయోగించిన సవర్ణ దీర్ఘసంధులు, భీమ జరాసంధుల బాహుదండాల దీర్ఘతకు, సమానతకు, తీవ్రతకు చక్కని సూచికలు.

**చ.** **అతులబలుల్ పరస్పర జయార్థులు పార్థివపుంగవుల్ మరు**
**త్సుత మగధేశ్వరుల్ సమరశూరులు దారుణలీలఁ బోరి రూ**
**ర్జిత భుజదర్ప మేర్పడఁగ సింహగజేంద్రములట్లు, వజ్ర ప**
**ర్వతముల యట్లు, ఘోరతర వాసవ వృత్రులయట్లు నిద్దఱున్.** **206**

**ప్రతిపదార్థం:** అతుల బలుల్= సాటిలేని బలం కలవాళ్ళు; పరస్పర, జయ+అర్థులు= ఒకరినొకరు జయించగోరే వాళ్ళు; పార్థివ పుంగవుల్= రాజశ్రేష్ఠులు; సమర, శూరులు= యుద్ధవీరులు; మరుత్+సుత, మగధ+ఈశ్వరుల్= వాయుపుత్ర, మగధరాజులైన - భీమ జరాసంధులు; ఊర్జిత, భుజ, దర్పము= దృఢమైన బాహు గర్వం; ఏర్పడఁగన్= మెరయగా; సింహ, గజ+ఇంద్రముల, అట్లు= సింహం మదపుటేనుగులవలె; వజ్ర, పర్వతముల, అట్లు= వజ్రాయుధ పర్వతాల వలె; ఘోరతర, వాసవ, వృత్రుల, అట్లు= మిక్కిలి భయంకరులైన దేవేంద్ర వృత్రాసురులవలె; ఇద్దఱున్; దారుణ, లీలన్= భీకర పద్ధతిలో; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** సాటిలేని బలం కలవాళ్ళు, ఒకరినొకరు జయించాలన్న కాంక్ష కలవాళ్ళు, రాజశ్రేష్ఠులు, యుద్ధవీరులు అయిన భీమ జరాసంధు లిద్దరు - సింహ గజేంద్రుల్లా, వజ్రపర్వతాల్లా, ఇంద్ర వృత్రాసురుల్లా భయంకరంగా యుద్ధం చేశారు.

**విశేషం:** అలం: ఉపమ. వాళ్ళిద్దరూ సమస్థాయిలో ఎంత పట్టుగా పోరుతున్నా, భీముణ్ణి సింహంతో, వజ్రాయుధంతో, దేవేంద్రునితో పోల్చటం, భీమవిజయాన్నీ జరాసంధపరాజయాన్నీ అద్భుతంగా ధ్వనింపజేస్తున్నది. ఇది అలంకార మూలంగా జరిగే వస్తుధ్వని. భీముని విజయాన్ని సూచించటానికై నన్నయ ఇచట మూలంలోని ఉపమానాల క్రమం మార్చటం విశేషం. (వస్తుస్వభావస్ఫూర్తితో కూడిన అర్థవ్యక్తిహేతుత్వం గల అర్థవ్యక్తి అనే శబ్దగుణం ఇందులో ప్రసాదగుణాన్ని సార్థకంగా పోషిస్తున్నది. సర్వరససామాన్యమైన ప్రసాదగుణం రౌద్రరసపోషకంగా ఈ రచనలో రాణిస్తున్నది. - సంపా.)

**వ.** **ఇట్లు కార్తిక మాసంబునం బ్రథమ దివసంబునం దొడంగి భీమజరాసంధు లెడ యుడుగక యొండొరులం బట్టియుఁ గిట్టియు నడిచియుం బొడిచియుఁ దాఁచియుం ద్రోచియు మహాయుద్ధంబు సేయుచుం ద్రయోదశినాఁ డిద్దఱుం గిట్టి మల్లయుద్ధ కౌశలం బేర్పడం బెనంగు నెడఁ జతుర్దశినాఁటి రాత్రియందు జరాసంధు నతిశ్రాంతభావం బుపలక్షించి యధోక్షజుండు భీమున కి ట్లనియె.** **207**

**ప్రతిపదార్థం:** ఇట్లు; కార్తికమాసంబునన్; ప్రథమ, దివసంబునన్= పాడ్యమినాడు; తొడంగి= ప్రారంభించి; భీమ, జరాసంధులు; ఎడ, ఉడుగక= (స్థానం విడువక) విడివడక; ఒండొరులన్= ఒకరినొకరు; పట్టియున్= గట్టిగా పట్టుకొని; కిట్టియున్= ఎదుర్కొని; అడిచియున్= కొట్టి; పొడిచియున్; తాఁచియున్= తన్ని; త్రోచియు= త్రోసి; మహాయుద్ధంబు; చేయుచున్; త్రయోదశినాఁడు= పదమూడవరోజు; ఇద్దఱున్; కిట్టి= సమీపించి (తలపడి); మల్లయుద్ధకౌశలంబు= మల్లయుద్ధంలోని నేర్పు; ఏర్పడన్= ప్రకటమయ్యేటట్లు; పెనంగు+ఎడన్= యుద్ధం చేస్తున్న సమయంలో; చతుర్దశినాఁటి రాత్రియందున్= పదునాల్గవ నాటి రాత్రి; జరాసంధు= జరాసంధునియొక్క; అతి, శ్రాంత, భావంబు= మిక్కిలి అలసిన స్థితిని; ఉపలక్షించి= గుర్తించి; అధోక్షజుండు= శ్రీకృష్ణుడు; భీమునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా కార్తిక శుద్ధ పాడ్యమినాడు ప్రారంభించి భీమ జరాసంధులు ఒకరినొకరు పట్టి, కొట్టి, పొడిచి, తన్ని, త్రోసి ఎడతెగని మహాయుద్ధం చేశారు. త్రయోదశినాడు ఇద్దరు తమ మల్లయుద్ధసామర్థ్యం

ప్రకటమయ్యేటట్లు పెనుగులాడగా చతుర్దశినాటి రాత్రి జరాసంధుడి అలసటను గుర్తించి శ్రీకృష్ణుడు భీమసేనునితో ఇలా అన్నాడు.

**విశేషం:** 'ఎడయుడుగక' కు మూలం - 'అనారతం దివారాత్ర మవిశ్రాంత మవర్తత' (భండార్కరు ప్రతి. 2-21-17). నన్నయ గారు మూలంలో వర్ణింపబడిన భీమజరాసంధుల యుద్ధంయొక్క అవిశ్రాంతత నంతా 'ఎడయుడుగక' అనే ఒక్క చక్కని తెలుగుమాటలో చెప్పి విడిచారు.

### భీముఁడు జరాసంధుని సంహరించుట (సం. 2-22-3)

**చ. విరహితసత్త్వుఁ డయ్యెఁ బ్రతివీరుఁడు; వీని నశేష ధారుణీ**
**శ్వరనికరాపరాధు నతిసాహసికున్ వధియించి, నీ భుజ**
**స్థిరత యెలర్ప నయ్యనిలదేవుబలంబును నీ బలంబు భా**
**సురముగ మాకుఁ జూపుము విశుద్ధయశోనిధి! మారుతాత్మజా! 208**

**ప్రతిపదార్థం:** విశుద్ధ, యశః, నిధి= నిర్మలమైన కీర్తికి నిలయమైన వాడా!; మారుత+ఆత్మజా!= వాయుదేవుని కుమారుడా!- భీమసేనా!; ప్రతివీరుఁడు= శత్రువీరుడైన జరాసంధుడు; విరహిత, సత్త్వుఁడు+అయ్యెన్= కోల్పోయిన బలం కలవాడయ్యాడు అంటే బలాన్ని కోల్పోయాడు; అశేష, ధారుణీ+ఈశ్వర, నికర+అపరాధున్= సకల రాజులసమూహానికి అపకారం చేసినవాణ్ణి; అతి సాహసికున్= మిక్కిలి తెగింపు కలవాణ్ణి; వీనిన్= ఈ జరాసంధుణ్ణి, వధియించి= చంపి; నీ, భుజ, స్థిరత= నీ భుజ బలంయొక్క చెక్కుచెదరని స్థితి; ఎలర్పన్= ప్రకటమయ్యేటట్లు; నీ బలంబు; ఆ+ అనిలదేవు, బలంబును= ఆ వాయుదేవునియొక్క బలంకూడ; భాసురముగన్= ప్రకాశించేటట్లు; మాకున్; చూపుము.

**తాత్పర్యం:** నిర్మలమైన కీర్తికి నిలయుడవైన ఓ వాయుపుత్రా! శత్రువీరు డైన జరాసంధుడు బలహీను డయ్యాడు. సకల రాజ సమూహానికి అపకారం చేసి, మితిమీరిన సాహసుడైన ఇతణ్ణి వధించి, నీ భుజబలంయొక్క చెక్కుచెదరని స్థితి ప్రకటమయ్యేటట్లు, నీ బలం, నీ తండ్రి వాయుదేవుడి బలం ప్రకాశించేటట్లు మాకు చూపు.

**విశేషం:** శ్రీకృష్ణుడు మారుతాత్మజా! అని సమయోచితంగా భీమసేనుణ్ణి సంబోధించటం, 'నీ బలమేకాక నీతండ్రి బలాన్ని కూడ మాకు చూపించు' అని చతురంగా సంభాషించి- ప్రోత్సహించటం, మహాబలుడైన వాయుదేవుని పుత్రుడివై ఉండి ఈ శత్రువీరుణ్ణి ఇంకా సహిస్తావా? - అని హెచ్చరించటం, నీ పితృదేవుణ్ణి స్మరించుమని సూచించటం- రసజ్ఞుల దృష్టిని ఆకర్షించే విశేషాలు. (యుద్ధవీరస్ఫోరకంగా ఈ పద్యంలో కాంతి అనే గుణం గొప్పగా పోషించబడింది. సంపా.)

**వ. అని ప్రబోధించిన ననిలతనయుం డనిలదేవుం దలంచి తత్ప్రసాదంబున నధికసత్త్వసమేతుండై. 209**

**ప్రతిపదార్థం:** అని; ప్రబోధించినన్= కర్తవ్యాన్ని ఉపదేశించగా; అనిల, తనయుండు= వాయుదేవుడి కుమారుడైన భీముడు; అనిల, దేవున్= వాయుదేవుణ్ణి; తలంచి= స్మరించి; తత్+ప్రసాదంబునన్= ఆయన అనుగ్రహంచేత; అధిక, సత్త్వ, సమేతుండు+ఐ= మిక్కిలి బలంతో కూడుకొన్నవాడై.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు కర్తవ్యబోధ చేయగానే, భీమసేనుడు తన తండ్రి అయిన వాయుదేవుణ్ణి మనస్సులో ధ్యానించి, ఆయన అనుగ్రహంతో అధికబలసంపన్నుడై.

**ఉ. ఆతనిఁ బట్టి యెత్తి నిహతాహితవీరుఁడు వానిముక్కునన్**
**వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కఁగా**
**వాతసుతుండు వీచె శతవారము లుద్ధత చండ వాత సం**
**ఘాత వివర్తమాన తృణఖండసముం దగుచుండ మాగధున్. 210**

**ప్రతిపదార్థం:** నిహత+అహిత, వీరుఁడు= చంపబడిన శత్రువీరులు కలవాడు - అంటే శత్రువులను సంహరించినవాడు; వాతసుతుండు= వాయుదేవుని కుమారుడైన భీముడు; ఆతనిన్= ఆ జరాసంధుణ్ణి; పట్టి, ఎత్తి= పట్టుకొని పైకెత్తి; వాని, ముక్కునన్; వాతను= నోటిలో; కర్ణ రంధ్రములన్= చెవి బెజ్జాలలో; వారక= ఎడతెగక; శోణిత, ధారలు= రక్తధారలు; ఒల్కఁగాన్= కారేటట్లుగా; ఉద్ధత, చండ, వాత, సంఘాత, వివర్తమాన, తృణఖండ, సముండు+అగుచుండన్= భయంకరమైన పెనుగాలి తాకిడిచేత తిరుగుడు పడుతున్న గడ్డిపరకతో సమానమైనవా డవుతుండగా; మాగధున్= మగధరాజైన జరాసంధుణ్ణి; శత, వారములు= నూరుసార్లు; వీచెన్= విసిరికొట్టాడు.

**తాత్పర్యం:** శత్రువీరసంహారకుడైన వాయుపుత్రుడు జరాసంధుణ్ణి పట్టి పైకెత్తి, అతడిముక్కు న, నోట, కర్ణరంధ్రాలలో ఎడతెగనిరక్తధారలు ప్రవిస్తుండగా, భయంకరమైన పెనుగాలితాకిడికి తిరుగుడుపడుతున్న గడ్డిపరకతో సమానంగా మగధరాజైన ఆ జరాసంధుణ్ణి నూరుసార్లు విసరివేశాడు.

**విశేషం:** అలం: పరికరం. మహాబలుడైన వాయుదేవుణ్ణి స్మరించి ఆ పితృదేవుని అనుగ్రహంతో అధిక బల సంపన్నుడై విజృంభించిన భీమసేనుణ్ణి ఈ సందర్భంలో వాతసుతు డని సంబోధించటం, బలహీనుడై ఆ భీమసేనునిచేత చిక్కిన జరాసంధుణ్ణి గడ్డిపరకతో పోల్చటం ఎంతో ఉచితంగా, మనోహరంగా ఉండటమేగాక, భీమసేను డా జరాసంధుణ్ణి పట్టి, ఎత్తి, త్రిప్పికొట్టిన తీరుకూడ పాఠకుని కంటికి కట్టినట్లుంది. (భీముడు మల్లయుద్ధాల్లో శత్రువుల్ని ఈవిధంగా చంపటం సాధారణంగా కనపడుతుంది. హిడింబాసురుణ్ణీ, బకాసురుణ్ణీకూడా ఈ విధంగానే తుదముట్టించాడు. - సంపా.)

**వ. మఱియును. 211**

**తాత్పర్యం:** అంతేకాక.

**క. వెఱచఱవఁ బట్టికొని వడిఁ । జఱచి జరాసంధుసంధిసంధుల యెమ్ముల్**
**విఱిచి వధియించి యార్చెను । వఱలఁగ భీముండు భువనవలయం బద్రువన్. 212**

**ప్రతిపదార్థం:** భీముండు; వెఱచఱవన్= భయపడేటట్లుగా; పట్టికొని; వడిన్= తీవ్రంగా; చఱచి= అరచేత కొట్టి; జరాసంధు= జరాసంధునియొక్క; సంధి, సంధుల, ఎమ్ముల్= కీళ్ళకలయికల్లోని ఎముకలు; విఱిచి; వధియించి= చంపి; భువన, వలయంబు= భూమండలమంతా; అద్రువన్= అదరేటట్లు; వఱలఁగన్= వ్యాపించేటట్లు; ఆర్చెను= అరచాడు.

**తాత్పర్యం:** భీమసేనుడు భయంకరంగా జరాసంధుణ్ణి పట్టుకొని, తీవ్రంగా అరచేత కొట్టి, అతని కీళ్ళ కలయికల్లో ఉండే ఎముకలను విరిచి, అతణ్ణి వధించి భూమండలమంతా దద్దరిల్లేటట్లు పెద్దగా అరచాడు.

**విశేషం:** భీముడు మల్లయుద్ధంలో శత్రువును చివరకు క్రిందపడవేస్తాడు. వెన్నెముక విరుస్తాడు. కీళ్ళ ఎముకలూ విరుస్తాడు. కుప్పగూలిన అతణ్ణి చంపేస్తాడు. హిడింబాసురాదులను కూడ అలాగే తుదముట్టించాడు. ఇది భీముని పద్ధతి (సంపా.)

**చ. అవనితలంబు వ్రస్సెనొ, హిమాచలశృంగము వ్రయ్యలయ్యెనో,**
**శ్రవణ విదారణం బయిన శబ్దము దా నిది యేమి యొక్కొ భై**
**రవమయి విన్చె నంచును బురంబునవారు భయంబు వొంది; రం**
**దువిదలగర్భముల్ గలఁగె; నుక్కడఁగెన్ మగధేశు సైన్యముల్. 213**

**ప్రతిపదార్థం:** అవని, తలంబు= భూమండలం; వ్రస్సెనొ= బ్రద్దలయ్యెనో; హిమ+అచల, శృంగము= హిమాలయ పర్వతశిఖరం; వ్రయ్యలు+అయ్యెనో= ముక్కలయిందో; శ్రవణ, విదారణంబు+అయిన= చెవులను బ్రద్దలు చేసేటటువంటిదైన; శబ్దము= ధ్వని; తాన్+ఇది; ఏమి+ఒక్కొ= ఏదోకదా!; భైరవము+అయి= భయంకరమై; వినిచెన్(విన్చెన్)= వినవచ్చింది; అంచును; పురంబునవారు= పురజనులందరు; భయంబు, పొందిరి; అందున్; ఉవిదల, గర్భముల్= స్త్రీలయొక్క కడుపులోని పిండాలు; కలఁగెన్= కలతచెందాయి; మగధ+ఈశు, సైన్యముల్= మగధరాజైన జరాసంధుని సేనలు; ఉక్కు+అడఁగెన్= బలహీనా లయ్యాయి.

**తాత్పర్యం:** 'భూమండలం బ్రద్దలయిందా! లేక హిమాచలశృంగం ముక్కలైందా! చెవులను బ్రద్దలు చేసే ఈ శబ్దం ఏమిటిది? భయంకరంగా వినవస్తున్నదే!' అని పురప్రజలందరు భీతి చెందారు. స్త్రీల గర్భాలు కలత పొందాయి. జరాసంధునిసేనలు బలహీనా లయ్యాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. విజయోత్సాహంతో భీముడు అరచిన అరుపు ఎంత భయంకరమో, అతడిక్రోధవిజృంభణం ఎంత తీవ్రమో ఈపద్యం తెలియచేస్తుంది. (జరాసంధునికథ ఒక భయంకరమైన ఏడ్పుతో మొదలై భీముని దారుణమైన అరుపుతో ముగుస్తుంది. రోదిస్తూ పుట్టి రాజలోకాన్ని రోదింపచేసి, చివరకు దీనుడై ప్రాణాలు వదిలాడు - జరాసంధుడు. - సంపా.)

**వ. ఇట్లు భీమసేనుండు జరాసంధుఁ జంపి వాని వధియించుట జగద్విదితంబుగాఁ దదీయ గృహద్వార తోరణ సమీపంబునం దత్కళేబరంబు వైచిన నది సర్వజన భయంకరంబయి యుండె; నంత నాదిత్యోదయంబున. 214**

**ప్రతిపదార్థం:** ఇట్లు; భీమసేనుండు; జరాసంధున్; చంపి; వాని, వధియించుట= వానిని చంపటం; జగత్+విదితంబు, కాన్= ప్రపంచమంతటికి తెలిసేటట్లుగా; తదీయ, గృహ, ద్వార, తోరణ, సమీపంబునన్= ఆతనియొక్క ఇంటివాకిటితోరణం దగ్గర; తత్+కళేబరంబు= ఆతని శవాన్ని; వైచినన్= పడవేయగా; అది; సర్వ, జన, భయంకరంబు+అయి= అందరు ప్రజలకు భయాన్ని కలిగించేదై; ఉండెన్; అంతన్= తరువాత; ఆదిత్య+ఉదయంబునన్= సూర్యుడు ఉదయించిన సమయాన.

**తాత్పర్యం:** ఈ విధంగా భీమసేనుడు జరాసంధుణ్ణి సంహరించి, అతని చావు లోకానికంతా తెలిసేటట్లు అతని మృతదేహాన్ని అతని భవనద్వారతోరణం దగ్గర పడవేశాడు. అది ప్రజలందరికి భయంకరమై అగుపించింది. తర్వాత సూర్యోదయం కాగానే.

**విశేషం:** భీముడు పూర్వం బకాసురుని కళేబరాన్నికూడ ఏకచక్రపురం ద్వారంవద్ద పడవేశాడు. ప్రజలందరిముందు తన బలప్రదర్శన చేసే ఉద్ధతుని లక్షణం. రాక్షసబాధ తీరిపోయిం దని ప్రజలు తెలిసికొనవలెననే ప్రభుత్వలక్షణం - ఇందులో ధ్వని. (సంపా.)

జరాసంధుని కుమారుడైన సహదేవు నభిషిక్తుఁ గావించి శ్రీకృష్ణుఁడు భీమార్జునులతో నింద్రప్రస్థమున కరుగుట (సం. 2-22-40)

**సీ.** **గరుడధ్వజుం డప్డు కరుణాసమేతుఁడై । యమ్మాగధుల కెల్ల నభయ మిచ్చి,**
**మొగి జరాసంధుచే నిగృహీతులయి యున్న । పృథివీపతుల విడిపించి చెఱలు,**
**మోక్షితు లైన సర్వక్షత్రియులచేత । సంశుద్ధరత్న పుంజములఁజేసి**
**పూజితుండయి, తన తేజంబు వెలుఁగంగ । సహదేవు నజ్జరాసంధతనయు**

**ఆ.** **నోడ కుండు మని తదున్నత రాజ్యంబు । నందు నిలిపి, హృదయహారి వివిధ**
**రత్నరాజి సుందరంబైన మగధేశు । రథముఁ దేరఁ బనిచె రమణతోడ.** **215**

**ప్రతిపదార్థం:** గరుడ ధ్వజుండు= గరుత్మంతుడు జెండాగా కలవాడు - శ్రీకృష్ణుడు; అప్డు; కరుణా, సమేతుఁడు+ఐ= దయతో కూడుకొన్నవాడై; ఆ+మాగధులకున్+ఎల్లన్= ఆ మగధ దేశవాసులందరికి; అభయము+ఇచ్చి= భయంవద్దని మాట ఇచ్చి; మొగి= పూర్వం; జరాసంధునిచే నిగ్రహీతులు+అయి= బాధింపబడినవాళ్ళయి; ఉన్న; పృథివీ, పతుల= రాజులయొక్క; చెఱలు; విడిపించి; మోక్షితులు+ఐన= విడిపించబడిన వారైన; సర్వక్షత్రియులచేతన్= అందరు రాజులచేత; సంశుద్ధరత్న, పుంజములన్, చేసి= స్వచ్ఛములైన రత్న సమూహాలతో; పూజితుండు+అయి= పూజించబడినవాడై; తన, తేజంబు= తనప్రభావం (కాంతి); వెలుగంగన్; ఆ+జరాసంధ, తనయున్= ఆ జరాసంధుని కుమారుణ్ణి; సహదేవున్; ఓడక+ఉండుము+అని= భయపడకుండ ఉండుమని; తత్+ఉన్నత, రాజ్యంబు+అందున్= ఆగొప్ప మగధరాజ్యంలో; నిలిపి= ఉంచి; అంటే మగధరాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేసి; హృదయహారి= మనోహరమైనది; వివిధ, రత్న, రాజి, సుందరంబు+అయిన= అనేకవిధాలైన రత్న సమూహంచేత అందమైన; మగధ+ఈశు, రథమున్= మగధరాజుయొక్క రథాన్ని; రమణతోడన్= ప్రీతితో; తేరన్= తెచ్చుటకు; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** గరుడధ్వజుడైన శ్రీకృష్ణుడు దయామయుడై మగధప్రజలందరికి అభయమిచ్చాడు. ఇదివరకు జరాసంధునిచేత బంధితులైన రాజులందరిని విడిపించాడు. ఆ రాజులంతా అర్పించిన స్వచ్ఛ రత్నసమూహాలతో పూజలందుకొన్నాడు. తన ప్రభావం ప్రకాశించగా జరాసంధసుతుడైన సహదేవునికి ధైర్యం చెప్పాడు. అతణ్ణి మగధరాజ్యానికి రాజుగా చేశాడు. మనోహరంగా వివిధరత్నకాంతులతో అందంగా ఉన్న జరాసంధుని రథాన్ని ప్రీతితో తెప్పించాడు.

**వ.** **'తొల్లి తారకాసుర సంగ్రామంబున నింద్రారూఢంబయిన దాని నింద్రువలన వసువను రాజు వడసె, వానివలన బృహద్రథుండు వడసె' నని తద్దివ్యరథప్రభావంబు సెప్పుచు భీమార్జున సమేతుండయి యా రథం బెక్కి చక్రధరుం డఖిలరాజచక్రంబుతో నింద్రప్రస్థగమనోన్ముఖుండై గరుడనిం దలంచుడుఁ దత్క్షణంబ.** **216**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; తారక+అసుర, సంగ్రామంబునన్= తారకుడనే రాక్షసునితో జరిపిన యుద్ధంలో; ఇంద్ర+ ఆరూఢంబు+అయిన, దానిన్= ఇంద్రునిచే ఎక్కబడినదానిని-అంటే ఇంద్రుడు ఎక్కిన దానిని; ఇంద్రువలన; వసువు+అను, రాజు; పడసెన్= పొందాడు; వాని వలనన్= ఆ వసుమహారాజువల్ల; బృహద్రథుండు= జరాసంధుని తండ్రి అయిన బృహద్రథుడు; పడసెన్= పొందాడు; అని; తత్+దివ్య, రథ, ప్రభావంబు= ఆ దేవతా సంబంధమైన రథంయొక్క గొప్పతనాన్ని; చెప్పుచున్; భీమ+అర్జున, సమేతుండు+అయి= భీమార్జునులతో కూడుకొన్నవాడై; చక్రధరుండు= చక్రాయుధాన్ని ధరించినవాడు -

శ్రీకృష్ణుడు; ఆ, రథంబు+ఎక్కి; అఖిల, రాజ, చక్రంబులతోన్= సకల రాజ సమూహంతో; ఇంద్రప్రస్థ, గమన+ఉన్ముఖుండు+ఐ= ఇంద్రప్రస్థపురం వెళ్ళటానికి పూనుకొన్నవాడై; గరుడనిన్= గరుత్మంతుణ్ణి; తలంచుడున్= తలచుకోగానే; తత్+క్షణంబు+అ= ఆ క్షణమందే.

**తాత్పర్యం:** 'పూర్వం తారకాసురునితో యుద్ధం చేసేటప్పుడు ఇంద్రుడు ఈ రథం ఎక్కాడు. తరువాత ఇంద్రునినుండి ఈ రథాన్ని వసుమహారాజు పొందాడు. అతడినుండి జరాసంధుని తండ్రి బృహద్రథుడు దీనిని గ్రహించాడు' - అని చక్రధరుడైన శ్రీకృష్ణుడు ఆ దివ్యరథవృత్తాంతాన్ని చెపుతూ, భీమార్జునులతో కలిసి ఆ రథ మెక్కి, సకల రాజ సమూహంతో ఇంద్రప్రస్థపురానికి వెళ్ళాలని గరుత్మంతుని మనసులో తలచుకోగానే తత్క్షణం.

**విశేషం:** తారకాసురుడు - రాక్షసుడు, వజ్రాంగుని కుమారుడు - బ్రహ్మనుగూర్చి మహోగ్రతపం చేసి తనతో సమానమైన బలవంతుడు లోకాల్లో లేకుండ వరంపొంది, లోకాల్ని బాధించాడు. చివరకు కుమారస్వామిచేత మరణించాడు.

**క. అనలప్రభాభిశోభిత । ఘనతర తనుదీప్తు లొప్పఁగా వచ్చి వడిన్**
**వినతాతనయుఁడు వినయా । వనతోరుశిరస్కుఁ డయ్యె వనజాక్షునకున్. 217**

**ప్రతిపదార్థం:** వినతా, తనయుఁడు= వినతయొక్క కుమారుడైన గరుత్మంతుడు; అనల, ప్రభా+అభిశోభిత, ఘనతర, తను, దీప్తులు= అగ్నిదేవుడియొక్క కాంతివంటి కాంతితో ప్రకాశించే గొప్ప శరీరకాంతులు; ఒప్పన్= ఒప్పుతుండగా; వడిన్= వేగమే; వచ్చి; వనజ+అక్షునకున్= పద్మాలవంటి కన్నులు గల శ్రీకృష్ణునికి; వినయ+అవనత+ఉరు, శిరస్కుఁడు+అయ్యెన్= వినయంచేత వంగిన గొప్ప శిరస్సు కలవా డయ్యాడు - అంటే వినయంతో శిరస్సు వంచి నిలబడ్డాడు.

**తాత్పర్యం:** వినతాసుతు డైన గరుత్మంతుడు అగ్నిలా ప్రకాశించే దేహకాంతులతో వేగంగా వచ్చి శ్రీకృష్ణుని ఎదుట వినయంతో శిరస్సు వంచి నిలబడ్డాడు.

**వ. ఇట్లు వచ్చిన వైనతేయు నతిప్రీతిం దద్దివ్యరథసారథ్యంబునందు నియోగించి, మనోవాయు వేగంబునం గృష్ణ భీమ విజయు లింద్రప్రస్థపురంబు ప్రవేశించి రంత. 218**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వచ్చిన; వైనతేయున్= వినతాసుతుడైన గరుత్మంతుణ్ణి; అతి, ప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; తత్+దివ్య, రథ, సారథ్యంబునందున్= ఆ దివ్యరథాన్ని నడపటంలో; నియోగించి= నియమించి; మనః, వాయు, వేగంబునన్= మనస్సు, గాలి వెళ్ళేటంత వేగంతో; కృష్ణ, భీమ, విజయులు= కృష్ణుడు, భీముడు, అర్జునుడు; ఇంద్రప్రస్థ పురంబు; ప్రవేశించిరి; అంత.

**తాత్పర్యం:** ఈ విధంగా వచ్చిన గరుత్మంతుణ్ణి అతి ప్రీతితో ఆ దివ్యరథానికి సారథిగా నియమించి, మనోవేగ, వాయువేగాలతో శ్రీకృష్ణభీమార్జునులు ఇంద్రప్రస్థపురంలో ప్రవేశించారు. అంత.

**మ. 'జనసంత్రాసకరున్ మహోద్ధతు జరాసంధున్ హరిప్రేరణం**
**బున భంజించెఁ బ్రభంజనాత్మజుఁడు; భూభుగ్వీరులం దన్నిరో**
**ధన నిర్ముక్తులఁ జేసి; నింకఁ జతురంతక్షోణికిన్ ధర్మనం**
**దను సామ్రాజ్యము పూజ్యమయ్యె' నని మోదం బంది రుర్వీజనుల్. 219**

**ప్రతిపదార్థం:** ప్రభంజన+ఆత్మజుఁడు= వాయుపుత్రుడైన భీముడు; హరి, ప్రేరణంబునన్= శ్రీకృష్ణునియొక్క ప్రేరణచేత; జన, సంత్రాసకరున్= ప్రజలకు మిక్కిలి భయం కలిగించేవాణ్ణి; మహా+ఉద్ధతున్= ఎంతో గర్వించినవాడిని; జరాసంధున్, భంజించెన్= చంపాడు; భూ, భుక్+వీరులన్= భూమిని అనుభవించే వీరులను - అంటే రాజులను; తత్+నిరోధన, నిర్ముక్తులన్= అతని చెరనుండి విముక్తిపొందిన వారినిగా; చేసెన్; ఇంకన్; చతుః, అంత, క్షోణికిన్= నాలుగు సముద్రాలు మేరలుగా గల భూమికి; ధర్మనందను, సామ్రాజ్యము= ధర్మరాజుయొక్క సామ్రాజ్యాధికారం; పూజ్యము+అయ్యెన్+అని= పూజించతగింది అయిందని; ఉర్వీ, జనుల్= భూమిమీద ప్రజలంతా; మోదంబు+అందిరి= సంతోషాన్ని పొందారు.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణుని ప్రేరణతో భీమసేనుడు లోకభయంకరుడు, మహాగర్వితుడు అయిన జరాసంధుణ్ణి వధించాడు. అతడు బంధించిన రాజుల నందరిని విడిపించాడు. ఇక నాలుగు సముద్రాలు హద్దులుగా గల ఈ భూమి కంతటికి ధర్మరాజు సామ్రాజ్యాధికారం పూజించదగింది అయింది' అని ప్రజలంతా మహానందభరితులయ్యారు.

**విశేషం:** ధర్మరాజు సామ్రాజ్యం పూజ్యం కావటానికి హేతువులు ఇందులో సమాలోచించబడ్డాయి. దానివలన వస్తుస్వభావం స్పష్టంగా వ్యక్తమౌతున్నది. ప్రజల సంతోషం ప్రతిఫలించే ఈ రచనలో అర్థవ్యక్తి అనే శబ్దగుణం రాణించింది. కథాప్రసన్నతకు ఈ గుణం ఎంతో తోడ్పడుతున్నది. (సంపా.)

**క. 'ఆయుధనిహతుఁడు గాని య । జేయు జరాసంధు భీమసేనుఁడు విజయ**
**శ్రీ యెసఁగ నోర్చెఁగా క । త్యాయత భుజశక్తి నొరుల కలవియె?' యంచున్. 220**

**ప్రతిపదార్థం:** భీమసేనుడు; ఆయుధ, నిహతుఁడు, కాని= ఆయుధాలతో చావనటువంటి; అజేయున్= జయించసాధ్యం కానివాణ్ణి; జరాసంధున్; అతి+ఆయత, భుజ, శక్తిన్= మిక్కిలి ఎక్కువైన భుజబలంతో; విజయశ్రీ= విజయలక్ష్మి; ఎసఁగన్= ప్రకాశించేటట్లు; ఓర్చెన్, కాక= ఓడించాడుగాని; (ఇది); ఒరులకున్= ఇతరులకు; అలవి+ఎ= చేతనవుతుందా?; అంచున్= అని అంటూ.

**తాత్పర్యం:** 'ఆయుధాలచేత చావులేనివాడు, జయించ సాధ్యంకానివాడు అయిన జరాసంధుణ్ణి భీమసేనుడు గొప్ప భుజబలంతో విజయలక్ష్మి వెలిగేలా వధించాడు. ఇది ఇతరులకు సాధ్యమా!' అని.

**విశేషం:** జరాసంధవధానంతరం ఆ కార్యసాధనలోని కీలకమైన అంశం ప్రజలచేత పరామర్శించబడుతున్నది (చర్వణం చేయబడుతున్నది). ఆయుధాలతో చావని అద్భుతవీరుడు జరాసంధుడు. అతడిని బాహువులతో చంపాడు భీముడు. గాండీవ చక్రధారులుకూడ చేయలేని పనిని తన భుజబలంతో సాధించిన భీముడి యుద్ధవీరం ఇతరులకు అసాధ్యం. అందుచేత అద్భుతం. కథలోని కీలకాంశాన్ని కీర్తించి తాను నిర్వహించిన కథారసార్థసంయోజన శిల్పాన్ని పఠితకు మననం చేయిస్తున్నా డిక్కడ నన్నయ. ఇది కథానిర్వహణ శిల్పంలో కమనీయమైన అంశం. (సంపా.)

**క. పురజను లాశ్చర్యంబునఁ । గర మనురాగమునఁ బరమ కౌతుకమునఁ జూ**
**చిరి బోరన వచ్చి వృకో । దర దామోదర సురేంద్రతనయులఁ బ్రీతిన్. 221**

**ప్రతిపదార్థం:** పురజనులు= ఇంద్రప్రస్థపుర ప్రజలు; ఆశ్చర్యంబునన్= ఆశ్చర్యంతో; కరము= మిక్కిలి; అనురాగమునన్= ప్రేమతో, పరమ, కౌతుకమునన్= ఎంతో ఎక్కువైన ఆసక్తితో; బోరన, వచ్చి= వేగంగా వచ్చి; వృకోదర, దామోదర, సుర+ఇంద్ర, తనయులన్= భీమసేనుణ్ణి, శ్రీకృష్ణుణ్ణి, దేవేంద్రపుత్రుడైన అర్జునుణ్ణి; ప్రీతిన్; చూచిరి.

**తాత్పర్యం:** ఇంద్రప్రస్థపురప్రజలంతా ఆశ్చర్యంతో, ఎంతో ప్రేమతో, ఎక్కువ ఆసక్తితో ఒక్కుమ్మడిగా వచ్చి భీమసేన శ్రీకృష్ణార్జునులను ప్రియమార చూచారు.

**విశేషం:** వృకోదరుడు - వృకంతో అంటే తోడేలుతో సమానమైన మిక్కిలి ఆకలి గల ఉదరం కలవాడు - భీముడు. దామోదరుడు - తులసి మాల ఉదరంపై కలవాడు - శ్రీ మహావిష్ణువు - శ్రీకృష్ణుడు. (వీరంనుండి అద్భుతం పుడుతుందని లాక్షణికు లంటారు. భీముని యుద్ధవీర స్మరణంవలన పురజనులలో ఆశ్చర్యం కలిగినట్లు వర్ణించటం కథాకథనంలోని రసశిల్పం. - సంపా.)

**వ. కృష్ణభీమ విజయు లిట్లు విజయ విభాసితులయి వచ్చి ధర్మరాజునకు మ్రొక్కి జరాసంధు బంధనంబువలనం దమచేత మోక్షితులైన మహీపతుల నెల్లం జూపిన. 222**

**ప్రతిపదార్థం:** కృష్ణ, భీమ, విజయులు+ఇట్లు; విజయ, విభాసితులు+అయి= విజయంచేత ప్రకాశించే వాళ్ళయి; వచ్చి; ధర్మరాజునకున్; మ్రొక్కి; జరాసంధు, బంధనంబు వలనన్= జరాసంధునియొక్క చెరనుండి; తమచేతన్; మోక్షితులు+ఐన= విడిపించబడిన; మహీపతులన్+ఎల్లన్= రాజులందరిని; చూపిన.

**తాత్పర్యం:** శ్రీకృష్ణ భీమార్జునులు ఈ విధంగా విజయకాంతితో వెలుగుతూ వచ్చి ధర్మరాజుకు మ్రొక్కి, జరాసంధుని చెరనుండి తాము విడిపించిన రాజులందరిని చూపించగా.

**క. సవినయ నతోత్తమాంగుల । నవనీశుల నందఱను యథార్హప్రియగౌ**
**రవమునఁ బూజించి కురు । ప్రవరుఁడు తద్దేశములకుఁ బరువడిఁ బంచెన్. 223**

**ప్రతిపదార్థం:** కురు, ప్రవరుఁడు= కురువంశశ్రేష్ఠుడైన ధర్మరాజు; సవినయనత+ఉత్తమ+అంగులన్= వినయంతో వంచిన శిరస్సులు కలవాళ్ళను; అవనీ+ఈశులన్= రాజులను; అందఱను; యథా+అర్హ, ప్రియ, గౌరవమునన్= ఎవరెవరికి తగిన రీతిగా వాళ్ళను ప్రేమతో, గౌరవంతో; పూజించి; తత్+దేశములకున్= ఆ దేశాలకు అంటే వారి వారి దేశాలకు; పరువడిన్= క్రమంగా; పంచెన్= పంపాడు.

**తాత్పర్యం:** కురువంశ శ్రేష్ఠుడైన ధర్మరాజు, తనకు వినయంతో శిరస్సు వంచి నమస్కరించిన ఆ రాజులందరిని, ఎవరికి తగినట్లు వాళ్ళను ప్రేమతో, గౌరవంతో పూజించి, వారి వారి దేశాలకు క్రమంగా సాగనంపాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడు జరిపించిన జరాసంధవధచేత ధర్మజుని భావి సార్వభౌమాధికారానికి పెద్ద అడ్డు తొలగింది. జరాసంధ బంధవిముక్తులైన రాజులంతా ధర్మజుని ఆధిపత్యాన్ని కృతజ్ఞతాపూర్వకంగా అంగీకరించటం జరిగింది. 'ఏక క్రియా ద్వ్యర్థకరీ'- ఒక పనితో రెండు ప్రయోజనాలు సాధించటం అంటే ఇటువంటిదే. ఆ జగన్నాటకసూత్రధారి శ్రీకృష్ణుని రాజనీతి అమోఘం; బహుళార్థసాధకం.

### కృష్ణుఁడు ద్వారకానగరమున కరుగుట (సం. 1-22-53)

**వ. నారాయణుండును ధర్మరాజు వీడ్కొని తద్దివ్యరథారూఢుండయి ద్వారవతీపురంబున కరిగె, నంత నిక్కడ. 224**

**ప్రతిపదార్థం:** నారాయణుండును= శ్రీకృష్ణుడుకూడ; ధర్మరాజున్, వీడ్కొని= ధర్మరాజు దగ్గర సెలవు తీసికొని; తత్+దివ్య, రథ+ఆరూఢుండు+అయి= ఆ దివ్యరథాన్ని ఎక్కినవాడై; ద్వారవతీ, పురంబునకున్= ద్వారకానగరానికి; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= తర్వాత; ఇక్కడ= ఇంద్రప్రస్థంలో.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడుకూడ ధర్మజుని దగ్గర సెలవు తీసికొని ఆ దివ్యరథాన్ని ఎక్కి ద్వారకానగరానికి వెళ్ళాడు. తరువాత ఇంద్రప్రస్థంలో.

**చ. భరతకులైక భూషణుఁడు భాసురతేజుఁడు ధర్మనందనుం**
**డురు భుజ విక్రమంబున జయోన్నతిఁ బోల్పఁగ వీరు లోకపా**
**లురయని భీముఁ బార్థు నకులున్ సహదేవునిఁ బంచెఁ దూర్పు ను**
**త్తరమును బశ్చిమంబు మఱి దక్షిణమున్ వరుసన్ జయింపఁగన్. 225**

**ప్రతిపదార్థం:** భరత, కుల+ఏక, భూషణుఁడు= భరత వంశానికంతటికి ముఖ్యమైన అలంకారమైన వాడు; భాసురతేజుఁడు= ప్రకాశిస్తున్న పరాక్రమం కలవాడు; (అయిన) ధర్మనందనుఁడు; ఉరు, భుజ, విక్రమంబునన్= గొప్పదైనభుజబలంలో; జయ+ ఉన్నతిన్= విజయాన్ని సాధించే గొప్పతనంలో; పోల్పఁగన్= పోల్చి చూస్తే; వీరు; లోకపాలురు+అ, అని= దిక్పాలకుల వంటి వారే అని; భీమున్; పార్థున్; నకులున్; సహదేవునిన్; వరుసన్= వరుసగా; తూర్పున్, ఉత్తరమును; పశ్చిమంబున్; మఱి; దక్షిణమున్; జయింపఁగన్; పంచెన్= పంపాడు.

**తాత్పర్యం:** భరత వంశానికి అంతటికి అలంకారమైన వాడు, ప్రకాశించే పరాక్రమం కలవాడు అయిన ధర్మరాజు - గొప్ప భుజబలంలో, విజయాన్ని సాధించే గొప్పతనంలో తన తమ్ముళ్ళు దిక్పాలకులతో పోల్చదగిన వారని తలచి, భీమార్జున నకుల సహదేవుల్ని వరుసగా తూర్పు, ఉత్తరం, పశ్చిమం, దక్షిణం అనే దిక్కుల్ని జయించటానికి పంపించాడు.

**విశేషం:** అలం: క్రమం. ఓజోగుణవిశిష్టమైన ప్రసాదం వీరరసోన్నిద్రంగా ఈ రచనలో పోషించబడింది. ధర్మరాజును వర్ణించేటప్పుడు నన్నయ ఇటువంటిరచననే సాధారణంగా వాడతాడు. (సంపా.)

**వ. ఇట్లు పంచిన నలువురు నపార చతురంగ బలసమేతులై నాలుగు సముద్రంబులపై నడచు నపూర్వ సముద్రంబులుం బోలె నాలుగు దిక్కులపై నడచి రనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 226**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పంచినన్= పంపగా; నలువురున్, అపార, చతురంగ, బల, సమేతులు+ఐ= మితిమీరిన రథ గజ తురగ పదాతి బలాలతో కూడుకొన్న వాళ్ళయి; నాలుగు, సముద్రంబులపై; నడచు; అపూర్వ, సముద్రంబులున్+ పోలెన్= ఆశ్చర్యకరాలైన సముద్రాలవలె; నాలుగు దిక్కులపై; నడచిరి; అనినన్; విని; జనమేజయుండు; వైశంపాయనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఈ విధంగా ధర్మరాజు పంపగా, భీమార్జున నకుల సహదేవులు నలువురు మితిమీరిన చతురంగ బలాలతో, నాలుగు సముద్రాలమీద నడచే అపూర్వాలైన మరి నాలుగు సముద్రాల్లా నాలుగు దిక్కులకు నడచా' రని వైశంపాయనుడు చెప్పగా జనమేజయుడు అతనితో ఇలా అన్నాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. సముద్రమే సువిశాలం, భయంకరం. ఒక సముద్రంమీద మరొక సముద్రం నడిస్తే ఎట్లా ఉంటుందో ఊహకు అందవలసిందే కాని మాటకు అందదు.

**క. నరసుతు లయ్యై దిక్కుల । కరిగి మహీపతులచేత నరిగొని ధనముల్**
**దెరలఁగఁ దెచ్చిన మార్గముఁ । బరువడి నెఱిఁగింపు నాకుఁ బరమమునీంద్రా! 227**

**ప్రతిపదార్థం:** పరమ ముని+ఇంద్రా!= మహామునిశ్రేష్ఠా! వైశంపాయనమహర్షీ!; నరసుతులు= రాజకుమారులైన భీమార్జున నకుల సహదేవులు; అయ్యై దిక్కులకున్= ఆయా దిశలకు; అరిగి= వెళ్ళి; మహీపతుల చేతన్= రాజులచేత; అరి= కప్పాన్ని; కొని= తీసుకొని; ధనముల్; తెరలఁగన్= పొంగునట్లుగా; తెచ్చిన; మార్గమున్= విధమును; నాకున్; పరువడిన్= క్రమంగా; ఎఱిగింపు= తెలియచెప్పుము.

**తాత్పర్యం:** వైశంపాయన మహామునీంద్రా! ఆ విధంగా భీమార్జున నకుల సహదేవులు నాలుగుదిక్కులకు వెళ్ళి రాజులచేత కప్పాలు తీసికొని అపార ధనాన్ని తెచ్చిన విధం నాకు చెప్పండి.

**వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డి ట్లనియె. 228**

**తాత్పర్యం:** అని అడుగగా వైశంపాయనుడు జనమేజయునితో ఈవిధంగా అన్నాడు.

### అర్జునుం డుత్తరదిగ్విజయంబు సేయుట (సం. 2-23-7)

**సీ. అగ్నిదత్తంబైన యద్దివ్యరథ మెక్కి । గాండీవధరుఁ డతిఘర్మసమయ**
**ఘర్మాంశుఁడును బోలెఁ గౌబేర దిగ్విజ । యార్థ ముగ్ర ప్రతాపాగ్ని వెలుఁగఁ**
**జని పుళిందావనీశ్వరు నోర్చి, ప్రతివింధ్యుఁ । డనువాని నోడించి, యశ్రమమున**
**మఱి యఖిల ద్వీప మండలేశుల నెల్ల । వశవిధేయులఁ జేసి, వారు దన్ను**

**ఆ. భక్తిఁ గొలిచి రాఁగఁ బ్రాగ్జ్యోతిషంబుపై । విడిసెఁ; దత్పురమున విభుఁ డనంత**
**బలముతోడఁ బన్ని భగదత్తుఁ డేతెంచి । విజయుఁ దాఁకె సమరవిజయకాంక్ష. 229**

**ప్రతిపదార్థం:** గాండీవ, ధరుఁడు= గాండీవాన్ని ధరించినవాడు - అర్జునుడు; అగ్ని, దత్తంబు+ఐన= (ఖాండవదహనఘట్టంలో) అగ్నిదేవునిచేత ఇవ్వబడిన; ఆ+దివ్య, రథము+ఎక్కి= ఆ దేవతాసంబంధమైన రథాన్ని ఎక్కి; అతి, ఘర్మ, సమయ, ఘర్మ+అంశుఁడును+పోలెన్= మండువేసవిలోవేడి కిరణాలు గల సూర్యునివలె; కౌబేర, దిక్+విజయ+అర్థము= కుబేరసంబంధమైన దిక్కును జయించటంకొరకు - అంటే ఉత్తర దిగ్విజయ యాత్రకొరకు; ఉగ్ర, ప్రతాప+అగ్ని= భయంకరమైన పరాక్రమ మనే అగ్ని; వెలుఁగన్= ప్రకాశిస్తుండగా; చని= వెళ్ళి; పుళింద+అవనీ+ఈశ్వరున్= పుళిందదేశపురాజును; ఓర్చి= ఓడించి; ప్రతివింధ్యుఁడు; అనువానిన్; ఓడించి; అశ్రమమునన్= సులువుగా; మఱి= ఇంకా; అఖిల, ద్వీప, మండల+ఈశులన్= సమస్తద్వీపమండలాల రాజులను; ఎల్లన్= అందరిని; వశ, విధేయులన్+చేసి= లొంగి తనకు తలవంచిన వాళ్ళుగా చేసి; వారు; తన్నున్= తనను; భక్తిన్= భక్తితో; కొలిచి= సేవించి; రాగన్= వెంట రాగా; ప్రాక్, జ్యోతిషంబుపై= ప్రాగ్జ్యోతిషం అనే పట్టణంమీద; విడిసెన్= దండెత్తాడు; తత్+పురమునన్= ఆ పట్టణంలో; విభుఁడు= రాజు; భగదత్తుఁడు; అనంత, బలముతోడన్= అంతులేని సైన్యంతో; పన్ని= యుద్ధానికి సిద్ధపడి; ఏతెంచి= వచ్చి; విజయున్= అర్జునుణ్ణి; సమర, విజయ, కాంక్షన్= యుద్ధంలో గెలవాలనే కోరికతో; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** గాండీవాన్ని ధరించిన అర్జునుడు అగ్నిదేవు డిచ్చిన దివ్యరథమెక్కి మండు వేసవిలో వెలిగే చండకిరణుడైన సూర్యునివలె భయంకరమైన పరాక్రమాగ్ని ప్రజ్వరిల్లేటట్లు ఉత్తర దిగ్విజయ యాత్రకు బయలుదేరి పుళిందరాజును ఓడించాడు. ప్రతివింధ్యుణ్ణి జయించాడు. అంతేకాక, అఖిల ద్వీపాల మండలేశ్వరులను అతిసులభంగా వశవర్తులను చేసుకొన్నాడు. వాళ్ళందరు తనను భక్తితో కొలిచి వెంటరాగా ప్రాగ్జ్యోతిషంపై దండెత్తాడు. ఆ దేశపురాజు భగదత్తుడు అపారసైన్యంతో దండెత్తివచ్చి అర్జునుణ్ణి గెలవాలన్న కాంక్షతో అతణ్ణి ఎదుర్కొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. గాండీవధరుడు - విజయుడు అనే సంబోధనలు రెండూ ఈ సందర్భంలో సార్థకాలే.

**వ.** **ఇట్లు శబర సాగరానూపవాసులైన యోధవీరులతోఁ బన్ని భగదత్తుండు పార్థుతో నెనిమిది దివసంబులు మహాయుద్ధంబు సేసి తదీయ బాణభగ్న బలుండై పార్థున కి ట్లనియె.** **230**

**ప్రతిపదార్థం:** ఇట్లు; భగదత్తుండు; శబర, సాగర+అనూపవాసులు+ఐన= శబరులు, సముద్రతీరవాసులు అయిన; యోధవీరులతోన్= వీరులైన యోధులతో; పన్ని= దండెత్తి; పార్థుతోన్= అర్జునునితో; ఎనిమిది, దివసంబులు= ఎనిమిదిరోజులు; మహాయుద్ధంబు; చేసి; తదీయ, బాణ, భగ్న, బలుండు+ఐ= అతనియొక్క బాణాలచేత కోల్పోయిన (భంజింపబడిన) బలం కలవాడై; పార్థునకున్+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** భగదత్తుడు, శబరులు, సాగర తీరవాసులు అయిన యుద్ధవీరులతో కలిసి దండెత్తి, అర్జునునితో ఎనిమిది రోజులు పెద్ద యుద్ధం చేశాడు. అతని బాణాలచేత బలం కోల్పోయి ఇలా అన్నాడు.

**విశేషం:** 'అనూప' మంటే జలసమృద్ధి గల నేల. సాగరానూపం అంటే సముద్ర జలవ్యాప్తి గల ప్రదేశం. సాగరానూపవాసులు- సముద్ర తీరవాసులు. శబరులు - ఆటవికులు - అడవులలో నివసించేజాతి వారు. ఇక్కడ 'ఇట్లు సాగరోపవన వాసులైన యాభీర శబర వీర గణంబుతో' అని కూడ ఒక పాఠాంతరం ఉంది.

**క.** **ఏ నింద్ర సఖుఁడ; నీవును । భూనాథ! సురాధినాథ పుత్త్రుండవు; నీ**
**తో నని సేయుట యుచితమె? । యే నోడితిఁ జెప్పు మెద్ది యిష్టము నీకున్.** **231**

**ప్రతిపదార్థం:** భూనాథ!= ఓరాజా!; ఏన్= నేను; ఇంద్ర, సఖుఁడన్= దేవేంద్రుడియొక్క స్నేహితుణ్ణి; ఈవును; సుర+అధినాథ, పుత్త్రుండవు= దేవతలకు రాజైన దేవేంద్రునియొక్క కుమారుడివి; నీతోన్; అని= యుద్ధం; చేయుట; ఉచితము+ఎ= తగునా?; ఏన్= నేను; ఓడితిన్= ఓడిపోయాను; నీకున్; ఎద్ది= ఏది; ఇష్టము; చెప్పుము.

**తాత్పర్యం:** అర్జునా! నేను ఇంద్రునికి స్నేహితుణ్ణి. నీవు ఇంద్రునికి పుత్రుడివి. నీతో యుద్ధం చేయటం ఉచితమా? నేను ఓడిపోయాను. నీ కేది ఇష్టమో చెప్పు.

**వ.** **'దానిన చేయుదు' ననిన విని భగదత్తునకుఁ బార్థుం డి ట్లనియె.** **232**

**తాత్పర్యం:** 'దానినే చేస్తా' - అని భగదత్తు డనగా అర్జునుడు ఇలా అన్నాడు.

**క. కురువిభుఁడు రాజసూయా । ధ్వర మొనరింపం గడంగె; ధర్మజుఁడు నిరం**
**తరధర్మశీలుఁ; డాతని । కరి వెట్టుము; రమ్ము ప్రీతి నమ్మఖమునకున్. 233**

**ప్రతిపదార్థం:** కురు విభుఁడు= కురువంశపురాజు; నిరంతర, ధర్మ, శీలుఁడు= ఎల్లప్పుడు ధర్మంతో కూడిన స్వభావం కలవాడు; ధర్మజుఁడు; రాజసూయ+అధ్వరము= రాజసూయం అనే యాగం; ఒనరింపన్= చేయటానికి; కడంగెన్= పూనుకొన్నాడు; అతనికిన్; అరి, పెట్టుము= కప్పాన్ని చెల్లించు; ప్రీతిన్= ప్రేమతో; ఆ+మఖమునకున్= ఆ యాగానికి; రమ్ము.

**తాత్పర్యం:** కురువంశప్రభువు, నిత్య ధర్మ శీలుడు అయిన ధర్మరాజు రాజసూయ మహాయాగం చెయ్యటానికి పూనుకొన్నాడు. ఆయనకు నీవు కప్పం చెల్లించు. ప్రీతితో ఆ యాగానికి రా.

**వ. అని యా భగదత్తుచేత నపరిమిత ధనరాసులు గొని ధనదదిశాభిముఖుండయి ధనంజయుం డరిగి. 234**

**ప్రతిపదార్థం:** అని; ఆ; భగదత్తు చేతన్, అపరిమిత= లెక్కకు మిక్కిలి అయిన; ధనరాసులు; కొని= తీసికొని; ధనద, దిశ+అభిముఖుండు+అయి= కుబేరుడి దిక్కైన ఉత్తరంవైపు తిరిగినవాడై; ధనంజయుండు= అర్జునుడు; అరిగి= వెళ్ళి.

**తాత్పర్యం:** అని ఆ భగదత్తునినుండి లెక్కకు మిక్కిలిగా ధనరాసులను తీసుకొని అర్జునుడు ఉత్తరదిశవైపు వెళ్ళి.

**విశేషం:** ధనదుడు - అంటే ధనం ఇచ్చేవాడు - కుబేరుడు. ఈయన ఉత్తర దిక్పాలుడు. అందుచేతనే ఉత్తర దిక్కుకు ధనదుదిశ అని పేరు. ఈసందర్భంలో అర్జునుణ్ణి ధనంజయుడని అనటం, ఆయన ఉత్తరదిశవైపు వెళ్ళా డని అనకుండ, ధనదు దిశవైపు వెళ్లా డనటం ఎంతో ఉచితంగా ఉంది. ధనదుదిశలోని రాజులను జయించి రాజసూయానికి అవసరమైన అపార ధనరాసులను తీసుకొని రావటంచేతనే అర్జునుడు ధనంజయు డయ్యాడు. తరువాత ఉత్తర గోగ్రహణంలో గో ధనాన్ని కూడ గెలిచి తేవటంలో ఆయన ధనంజయనామం అంతకంత సార్థకమైంది.

**క. అతుల చతురంగ సేనా । యుతుఁ డంతర్గిరి బహిర్గి రోపగిరుల భూ**
**పతుల నని నోర్చి శౌర్యో । న్నతిఁ గొనియెను వారిచేత నానాధనముల్. 235**

**ప్రతిపదార్థం:** అతుల, చతురంగ, సేనా, యుతుఁడు= సాటిలేని రథ గజ తురగ పదాతి బలంతో కూడుకొన్న వాడైన అర్జునుడు; అంతర్గిరి, బహిర్గిరి+ఉపగిరుల, భూపతులన్= అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరుల రాజుల నందరిని; అనిన్= యుద్ధంలో; ఓర్చి= జయించి; శౌర్య+ఉన్నతిన్= పరాక్రమం యొక్క ఆధిక్యంతో; వారిచేతన్, నానా, ధనముల్, కొనియెను= తీసుకొన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు సాటిలేని చతురంగబలంతో అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరుల భూపతులనందరిని యుద్ధంలో జయించి అత్యధికపరాక్రమంతో వాళ్ళనుండి నానావిధధనాలు గ్రహించాడు.

**విశేషం:** "బహిర్గిరోపగిరుల - విడదీస్తే బహిర్గిర+ఉపగిరుల అని అవుతుంది, 'బహిర్గిరి' అనాలి గాని 'బహిర్గిర' అనటం ఒప్పా! అనిపిస్తుంది. అంతర్గిరించ కౌంతేయ స్తథైవచ బహిర్గిరిమ్ తథోపరిగిరిం చైవ విజిగ్యే పురుషర్షభః - అని మూలం (-భండార్కరు ప్రతి, 2-24-2) కాని 'బహిర్గిరమ్' అనే పాఠాంతరం కూడా ఉంది. ఈ పాఠాంతరాన్ని అనుసరించి

'బహిర్గిరోపగిరుల' అనే రూపం సాధువు. కాగా సిద్ధాంతకౌముదిలోని 'గిరేశ్చ సేనకస్య' అనే అవ్యయీభావ సమాస ప్రకరణంలోని తుది సూత్రంవలన గిర్యంతమైన అవ్యయీభావ సమాసానికి 'అచ్' ప్రత్యయం వైకల్పికంగా వస్తుంది. దీన్ని బట్టి అంతర్గిరి- అంతర్గిరమ్; బహిర్గిరి - బహిర్గిరమ్; ఉపగిరి - ఉపగిరమ్ అనే రూపాలు కలగటానికి అవకాశం ఉన్నది. నన్నయ 'బహిర్గిర+ ఉపగిరుల' అనే చోట 'అచ్' ప్రత్యయం వచ్చిన రూపం వాడి ఉన్నాడు. అందువలన బహిర్గిరోపగిరుల అనే రూపం సాధువే.''- (మహాభారత సంశోధిత ప్రతి).

**వ. మఱియు నులూక దేశాధిపతియగు బృహంతునిఁ బరాజితుం జేసి, యుత్తరోలూక వామదేవ మోదాపుర సుదామ సుసంకులంబు లను దేశంబుల రాజుల జయించి, దేవప్రస్థంబున సేనాబిందు నోడించి, విష్వగశ్వుండనురాజువిక్రమం బడంచి, పార్వతేయుల గర్వం బుడిపి, బర్బర శబర తురుష్కపతుల వశగతులంజేసి, మాళవ పౌండ్ర కాశ్మీర త్రిగర్త లోహిత సుధన్వగాంధార కాంభోజ కోసల పతులచేత విచిత్ర రత్న కాంచన వస్తు వాహన నివహంబులు గొని, చిత్రాయుధ రక్షితంబైన సింహపురంబు మథించి, సింహాసనాసీనులయిన వనచర దస్యుల వశ్యులంజేసి, శ్వేతపర్వతం బతిక్రమించి యట చని కాంభోజ కటకుండను రాజుచేతం బూజితుండై, హాటకదేశంబున మానసం బనుకొలను ఋషికుల్యంబును జూచి, యందుల రాజులచేత నపరిమిత పదార్థంబులం దిత్తిరి కల్మాష మండూకాఖ్య మయూరహంస శుక సవర్ణంబులైన హయంబులం బర్వత నిభంబులైన యిభంబులం గొని, (హేమకూట నిషధాచలంబులు గడచి గంధర్వనగరంబులు గెలిచి, శత సహస్ర యోజనాయతం బయి శుద్ధ సువర్ణమయం బయి తేజోరాశి యయిన మేరు మహీధరంబు నాలోకించి, జంబూ మహావృక్షంబును జంబూ మహానదియునుం జూచి, తత్తీరంబున మేరువునకుం బ్రదక్షిణంబుగాఁజని, గంధమాదన పర్వతం బతిక్రమించి, తద్దిశాధిపతులైన సిద్ధ విద్యాధర చారణ గంధర్వులచేత నానా విచిత్రవస్తు వాహనంబులు గొని మాల్యవన్నీల పర్వతంబులు గడచి) యుత్తర కురుదేశములకుం జని హరివాసం బను పురంబుపై విడిసిన. 236**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతేకాక; ఉలూక, దేశ+అధిపతి+అగు; బృహంతునిన్; పరాజితున్+చేసి= ఓడించి; ఉత్తర+ఉలూక, వామదేవ, మోదాపుర, సుదామ, సుసంకులంబులు; అను; దేశంబుల; రాజుల; జయించి; దేవప్రస్థంబున; సేనాబిందున్= సేనా బిందువు అనే పేరుగల రాజును; ఓడించి; విష్వక్+అశ్వుండు+అను; రాజు= రాజుయొక్క; విక్రమంబున్= పరాక్రమాన్ని; అడంచి= అణచి; పార్వతేయులు= పర్వతదేశరాజుల; గర్వంబు= పొగరును; ఉడిపి= తొలగించి; బర్బర, శబర, తురుష్క, పతుల; వశగతులన్+చేసి= లోబరుచుకొని; మాళవ, పౌండ్ర, కాశ్మీర, త్రిగర్త, లోహిత, సుధన్వ, గాంధార, కాంభోజ, కోసల, పతులచేత; విచిత్ర, రత్న, కాంచన, వస్తు, వాహన, నివహంబులు= విచిత్రాలైన రత్నాలను, బంగారు వస్తువులను, వాహనాల సమూహాలను; కొని= గ్రహించి; చిత్ర+ఆయుధ, రక్షితంబు+ఐన= చిత్రాయుధునిచేత రక్షించబడిందైన; సింహపురంబు; మథించి= జయించి (త్రచ్చి); సింహాసన+ఆసీనులు+అయిన= సింహాసనంపై కూర్చొని ఉన్న; వనచర దస్యులన్= ఆటవికులైన దస్యుజాతులవాళ్ళను; వశ్యులన్+చేసి= లోబడినవాళ్ళనుగా చేసుకొని; శ్వేత, పర్వతంబు; అతిక్రమించి= దాటి; అట, చని; కాంభోజకటకుండు+అను; రాజుచేతన్; పూజితుండు+ఐ= పూజించబడినవాడై; హాటక, దేశంబునన్; మానసంబు+అను= మానసం అనే పేరున్న; కొలను; ఋషికుల్యంబును; చూచి; అందుల, రాజులచేతన్; అపరిమిత పదార్థంబులన్= లెక్కకు మిక్కిలి అయిన వస్తువులను; తిత్తిరి, కల్మాష, మండూక+ఆఖ్య= తిత్తిరి, కల్మాషం, మండూకం అనే పేర్లు కలిగినట్టియు; మయూర, హంస, శుక, సవర్ణంబులు+ఐన= నెమలి, హంస, చిలుక రంగువంటి రంగు కలిగినవైన; హయంబులన్= గుఱ్ఱాలను; పర్వత, నిభంబులు+ఐన= కొండలతో సమానాలైన; ఇభంబులన్= ఏనుగులను; కొని= గ్రహించి; (హేమకూట,

నిషధ+అచలంబులు= హేమకూట నిషధ పర్వతాలు; కడచి= దాటి; గంధర్వ, నగరంబులు; గెలిచి, శత, సహస్ర, యోజన+ఆయతంబు+అయి= నూరువేల యోజనాల వైశాల్యం కలిగి; శుద్ధ, సువర్ణమయంబు+అయి= స్వచ్ఛమైన బంగారుతో కూడినదై; తేజః+రాశి= వెలుగుకుప్ప; అయిన, మేరు మహీధరంబును; జంబూ, మహావృక్షంబును; జంబూ మహానదియునున్, చూచి; తత్+తీరంబున= దాని ఒడ్డున; మేరువునకున్= మేరు పర్వతానికి; ప్రదక్షిణంబుగాన్= కుడినుండి ఎడమవైపుగా; చుట్టుచు; చని= వెళ్ళి; గంధమాదనపర్వతంబు; అతిక్రమించి= దాటి; తత్+దిశా+అధిపతులు+ఐన= ఆదిక్కుకు ప్రభువులయిన; సిద్ధ, విద్యాధర, చారణ, గంధర్వులచేతన్; నానా, విచిత్ర వస్తు వాహనంబులు; కొని= తీసుకొని; మాల్యవత్+నీల, పర్వతంబులు; కడచి= దాటి) ఉత్తరకురుదేశములకున్; చని= వెళ్ళి; హరివాసంబు+అను; పురంబుపై; విడిసినన్= దండెత్తగా.

**తాత్పర్యం:** అంతేకాక, ఉలూకదేశాధిపతి అయిన బృహంతుణ్ణి, ఉత్తర ఉలూక వామదేవాది దేశాల అధిపతుల్ని, దేవప్రస్థరాజయిన సేనాబిందుణ్ణి, విష్వగశ్వుణ్ణి, పార్వతేయుల్ని, బర్బర, శబర, తురుష్కరాజుల్ని, మాళవ, పౌండ్ర, కాశ్మీరాది దేశాధిపతుల్ని ఓడించాడు. వాళ్ళచేత చిత్రవిచిత్రాలైన రత్నాల్ని, కాంచన వస్తు వాహనాల సమూహాల్ని గ్రహించాడు. చిత్రాయుధుని రక్షణలో ఉన్న సింహపురాన్ని జయించాడు. సింహాసనాసీనులైన ఆటవిక దస్యుల్ని వశం చేసుకొన్నాడు. శ్వేతపర్వాతాన్ని దాటి, కాంభోజకటకుడనే రాజుచేత పూజలందుకొన్నాడు. హాటకదేశంలో మానసమనే పేరున్న కొలను, ఋషికుల్యాన్ని దర్శించాడు. అక్కడి రాజులచేత అపరిమిత పదార్థాల్ని, తిత్తిరి, కల్మాష, మండూకాలనే పేర్లు గల నెమలి, హంస, చిలుక రంగులతో సమానమైన రంగులు కల గుర్రాల్ని, కొండలవంటి ఏనుగుల్ని గ్రహించి (హేమకూట నిషధ పర్వతాలు దాటి, గంధర్వ నగరాన్ని జయించి, నూరువేల యోజనాల వైశాల్యంతో, స్వచ్ఛమైన బంగారుతో, కుప్పవోసిన కాంతిలా ఉన్న మేరుపర్వతాన్ని దర్శించి, జంబూమహావృక్షాన్ని, జంబూమహానదిని చూచి, ఆ నదీతీరాన మేరువుకు ప్రదక్షిణంగా వెళ్ళి, గంధమాదన పర్వతాన్ని దాటి, ఆ దిక్కుకు అధిపతులైన సిద్ధ, విద్యాధర, చారణ గంధర్వులచేత వివిధవస్తు వాహనాల్ని గ్రహించి, మాల్యవంతం, నీలం అనే పర్వతాలను దాటి) ఉత్తర కురు దేశాలకు వెళ్ళి, హరివాస మనే పురంపై దండెత్తాడు.

**విశేషం:** ఇది ప్రాచీన ఉత్తర భారత భౌగోళికస్థితిని వర్ణించే వచనం. 'హేమకూటనిషధాచలాలు' మొదలు 'మాల్యవన్నీల పర్వతంబులు గడచి' అనేవరకు ఉన్న వచన భాగానికి మూలం శ్రీ పి.పి.యస్. శాస్త్రిగారి సంపాదకత్వంలో వెలువడ్డ సంస్కృత భారత ప్రతిలో ఉంది కాని, భండార్కర్ ప్రతిలో అది లేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు భారత ప్రతిలో ఈ భాగం కుండలీకృతమై ఉంది. రాజుల పేర్ల విషయంలో, దేశాల పేర్ల విషయంలో కొన్ని ప్రతులలో కొన్ని భేదాలు ఉన్నాయి.

**సీ.** **తద్ద్వారపాలకుల్ దారుణాకారు ల । పార బలాఢ్యులు పార్థుకడకుఁ**
**జనుదెంచి సురరాజసన్నిభు నాతనిఁ । జూచి యచ్చెరు వడి 'శూరు లెందు**
**నీయట్టిరే కురునృపవీర! పర్యాప్త । మయ్యె నీ విజయ వీర్యాతిశయము;**
**వసుమతీనాథు లెవ్వరు నిట్లు బలిమిమై । నిట వచ్చిరే తొల్లి యే యుగముల?**

**ఆ.** **నున్నతప్రతాప! యుత్తర కురు భూము । లండ్రు జనులు వీని; నవనిచరుల**
**కివి యగోచరంబు; లిందు సాధించి యె । ద్దియును గొనఁగలేదు తివిరి నీకు.** **237**

**ప్రతిపదార్థం:** తత్+ద్వారపాలకుల్= ఆ హరివాసపురం యొక్క ద్వారాన్ని కాపాడే భటులు; దారుణ+ఆకారులు= భయంకరమైన ఆకారం కలవాళ్ళు; అపార+బల+ఆఢ్యులు= అమితమైన బలంతో కూడుకొన్నవాళ్ళు; పార్థుకడకున్= అర్జునుని దగ్గరకు;

చనుదెంచి= వచ్చి; సుర, రాజ, సన్నిభున్= దేవతలకు రాజైన ఇంద్రునితో సమానమైన వాణ్ణి; అతనిన్= ఆ అర్జునుణ్ణి; చూచి; అచ్చెరు+పడి= ఆశ్చర్యపడి; కురు, నృప, వీర= వీరుడవైన కురు వంశ రాజా!; శూరులు+ఎందున్, నీ, అట్టిరే= వీరులు ఎచ్చటైనా నీవంటివాళ్ళు ఉన్నారా?; నీ, విజయ, వీర్య+అతిశయము= నీ విజయంలోని పరాక్రమం యొక్క గొప్పతనం; పర్యాప్తము+అయ్యె= తృప్తిని కలిగించింది (సంపూర్ణమయింది); తొల్లి= పూర్వం, ఏ, యుగములన్= ఏ యుగాల్లో అయినా; వసుమతీ, నాథులు= భూపతులు-రాజులు; ఎవ్వరున్= ఎవరుకూడ; ఇట్లు= ఈ విధంగా; బలిమిమైన్= బలంతో; ఇట, వచ్చిరే= ఇక్కడికి వచ్చారా; ఉన్నత, ప్రతాప= గొప్ప ప్రతాపం కలవాడా!; వీనిన్= ఈ ప్రదేశాలను; జనులు; ఉత్తర కురు భూములు; అంద్రు= అంటారు; అవని చరులకున్= భూమి మీద సంహరించేవాళ్ళకు; ఇవి= ఈ ప్రదేశాలు; అగోచరంబులు= అగుపించవు; నీకున్; ఇందు; తివిరి= ప్రయత్నించి; ఎద్దియును= దేనినికూడ; సాధించి; కొనఁగన్= తీసుకోటానికి; లేదు.

**తాత్పర్యం:** భయంకరమైన ఆకారం, అపారమైన బలం కల ఆ హరివాస పుర ద్వారపాలకులు అర్జునుని దగ్గరకు వచ్చి, దేవేంద్రునిలా ఉన్న అతణ్ణి దర్శించి ఆశ్చర్యచకితులై 'కురువంశవీరా! నీవంటి శూరులు ఎక్కడైనా ఉన్నారా! నీ విజయ పరాక్రమంయొక్క గొప్పతనం మాకు తృప్తి కలిగించింది. పూర్వం ఏ యుగాలలో అయినా, ఏరాజులైనా నీవలె బలసంపన్నులై ఇక్కడికి వచ్చారా? ఓ మహావీరా! ఈ ప్రదేశాలను ప్రజలు ఉత్తర కురుభూము లంటారు. నేలమీద సంచరించే సామాన్యులకు ఇవి అగుపించవు. నీవు ప్రయత్నించి సాధించి తీసుకోటానికి ఇక్కడ ఏదీ లేదు.'

**విశేషం:** విశేష్యానికి ముందు విశేషణాలను వాడటం తెలుగు పద్ధతి. విశేష్యం తరువాత విశేషణాలను ప్రయోగించటం సంస్కృత పద్ధతి. నన్నయ పెక్కుచోట్ల సంస్కృత పద్ధతిని అనుసరించారు. ప్రస్తుత పద్యంలో 'ద్వారపాలకులు' అనే విశేష్యం తరువాత 'దారుణాకారులు, అపారబలాఢ్యులు' అనే విశేషణాలు ప్రయోగించటం ఇటువంటిదే. 'ఏ/య్యువియుఁగొనఁగలేరు తివిరి జనులు (ఒరులు)' అని పెక్కు ప్రతులలోను, 'ఎయ్యవి గొనంగ లేవు నీవు' అని కొన్ని ప్రతులలోను పాఠాంతరా లున్నాయి. మూలంలో - నచాపికించిజ్జేతవ్య మర్జునాత్ర ప్రదృశ్యతే (భండార్కరు ప్రతి 2-25-11), (ఇంక నీకు జయించ వలసిన దేదియు లేదు) అనీ; 'పార్థనేదం త్వయా శక్యం పురం జేతుం కథంచన, ఉపావర్తస్వ కల్యాణ పర్యాప్త మిద మచ్యుత' (భండార్కరు ప్రతి, 2-25-9) (పార్థా! ఇది నీకు జయించ శక్యం కాదు. నీ విజయం సంపూర్ణమైనది. తిరిగి వెళ్ళుము) అనీ ఉన్నాయి.

**వ. అయినను నీవచనంబు సేయంగలవారము మమ్ముఁ బనుపు మనిన వారికి నర్జునుం డి ట్లనియె. 238**

**ప్రతిపదార్థం:** అయినను; నీ, వచనంబు= నీవు చెప్పినట్లు; చేయంగలవారము; మమ్మున్; పనుపుము= ఆజ్ఞాపించుము; అనినన్; వారికిన్; అర్జునుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అయినా నీవు చెప్పినట్లు చేస్తాం. మమ్మల్ని ఆజ్ఞాపించు' - అనగానే వారితో అర్జునుడు ఇలా అన్నాడు.

**తే. రాజసూయాధ్వరము ధర్మరాజు సేయ । నుత్సహించినవాఁడు తదుత్సవమున**
**కిందు మీయందుఁ గల వస్తు వెద్దియైన; । నమ్మహీనాథు సామ్రాజ్య మతిశయిల్లు. 239**

**ప్రతిపదార్థం:** ధర్మరాజు; రాజసూయ+అధ్వరము= రాజసూయయాగం; చేయన్= చేయటానికి; ఉత్సహించినవాఁడు= ఉత్సాహంతో ఉన్నాడు; తత్+ఉత్సవమునకున్= ఆయాగానికి; మీయందున్; కల; వస్తువు; ఎద్ది; ఐనన్; ఇందు; ఆ+మహీనాథు, సామ్రాజ్యము; అతిశయిల్లున్= అధికం కాగలదు.

**తాత్పర్యం:** ధర్మరాజు రాజసూయ మహాయాగం చేయాలన్న ఉత్సాహంతో ఉన్నాడు. ఆ యాగానికి మీవద్ద ఉన్న వస్తు వే దైనా ఇవ్వండి. ఆ మహారాజు సామ్రాజ్యం గొప్పగా ప్రకాశిస్తుంది.

**విశేషం:** ఇచ్చు ధాతువునకు సంప్రార్థన విధులందు ఇమ్ము-ఇండు అనునవి ఏకవచన బహువచన రూపాలు.

**వ. అనిన నయ్యుత్తర కురు భూముల రాజు లెల్ల నర్జునున కతిప్రీత చిత్తులయి యమూల్యంబులైన యపరిమిత దివ్యరత్నాభరణంబులు దెచ్చియిచ్చిన. 240**

**ప్రతిపదార్థం:** అనినన్; ఆ+ఉత్తర కురు భూముల, రాజులు+ఎల్లన్; అర్జునునకున్; అతి, ప్రీతి, చిత్తులు+అయి= మిక్కిలి సంతోషించిన మనస్సులు కలవాళ్ళయి; అమూల్యంబులు+ఐన= చెప్పశక్యం కాని విలువలుఉన్న; అపరిమిత, దివ్య, రత్న+ ఆభరణంబులు= లెక్కకు మిక్కిలి యైన మంచిరత్నాలతో కూడిన నగలను; తెచ్చి; ఇచ్చినన్.

**తాత్పర్యం:** అని అర్జునుడు అనగా, ఆ ఉత్తర కురు భూములను పాలించే రాజులంతా అపరిమిత సంతోషంతో అర్జునుడికి అమూల్యాలు అసంఖ్యాకాలు అయిన రత్నాభరణాలను తెచ్చి ఇవ్వగా.

**తరలము.**

**తరణిసన్నిభు ధర్మపుత్త్రు నుదారతేజము పర్వ భా**
**స్వర సుసంపదఁ బాకశాసని శాసనంబున నిట్టు లు**
**త్తర కురూత్తముఁ దొట్టి యుత్తర ధారుణీశులు వశ్యు లై**
**కర ధనంబులు దెచ్చియిచ్చిరి గౌరవంబున ధన్యు లై. 241**

**ప్రతిపదార్థం:** తరణి, సన్నిభు= సూర్యునితో సమానుడైన; ధర్మపుత్త్రు= ధర్మరాజుయొక్క; ఉదార, తేజము= గొప్ప పరాక్రమం; భాస్వర, సుసంపదన్= ప్రకాశించే మంచి సంపదచేత; పర్వన్= వ్యాపించేటట్లు; పాకశాసని, శాసనంబునన్= దేవేంద్రుని కుమారుడైన అర్జునునియొక్క ఆజ్ఞచేత; ఇట్టులు= ఈ విధంగా; ఉత్తర కురు+ఉత్తమున్+తొట్టి= ఉత్తర కురు రాజశ్రేష్ఠుడు మొదలుగా; ఉత్తర ధారుణీ+ఈశులు= ఉత్తర దేశరాజులు; వశ్యులు+ఐ= లొంగిపోయిన వారై; గౌరవంబునన్; ధన్యులు+ఐ= పుణ్యవంతులై; కర, ధనంబులు= కప్పంసొమ్ములు; తెచ్చి; ఇచ్చిరి.

**తాత్పర్యం:** సూర్యసమానుడైన ధర్మరాజుయొక్క గొప్ప తేజస్సు, వెలిగే సంపదతో విశేషంగా వ్యాపించేటట్లుగా, అర్జునుని ఆజ్ఞకు లొంగి ఉత్తరకురుభూముల రాజులంతా గౌరవంతో కప్పాలు తెచ్చి యిచ్చి ధన్యులయ్యారు.

**విశేషం:** 'కరధనంబులు'కు - 'కలధనంబులు' అనే పాఠాంతరం ఉంది. ఇది కూడ ఉచితమైందే. కాని ఈ పాఠాన్ని అంగీకరిస్తే ర, ల లకు ప్రాస చెల్లుతుందని గ్రహించవలసి ఉంటుంది. ఈ వృత్తం తరలం. తరలమంటే హారమధ్యరత్నం, ప్రకాశించేది- అని అర్థం. పాండవమధ్యముడైన పార్థుడు ఉత్తర దిగ్విజయ యాత్రను దేదీప్యమానంగా పూర్తి చేసి, అపార ధనరాసులతో తిరిగి రావటాన్ని తరలవృత్తంలో వర్ణించటం ఎంతో ఉచితంగా ఉంది. పాకశాసని - తారకాసురుడి తమ్ముడైన పాకాసురుణ్ణి చంపటంచేత దేవేంద్రునికి పాకశాసను డని పేరు. పాకశాసనుడి కుమారుడు (అపత్యార్థంలో) పాకశాసని - అర్జునుడు వృత్తలక్షణానికి చూడు: సభా 1.192.

### భీమసేనుండు పూర్వ దిగ్విజయంబు సేయుట (సం. 2-26-1)

**వ. అట భీమసేనుండునుం బరచక్ర మర్దనంబయిన బలచక్రంబుతోఁ బూర్వ దిక్కునకుం జని పాంచాలపతిచేత సత్కృతుండయి, విదేహరాజు జనకుండను వాని జయించి, దశార్ణపతి యయిన సుధన్వుతో మహాయుద్ధంబు సేసి తత్పరాక్రమంబునకు మెచ్చి వానిం దనకు సేనాపతిం జేసికొని, యశ్వమేధేశ్వరుం డయిన రోచమాను ననుజ సహితుం బరాజితుం జేసి, చేదివిషయంబునకుం జనిన. 242**

**ప్రతిపదార్థం:** అట, భీమసేనుండును; పర, చక్ర, మర్దనంబు+అయిన= శత్రుసమూహాన్ని అణచగలిగిన; బల, చక్రంబుతోన్= బలమైన దండుతో; పూర్వదిక్కునకున్= పూర్వదిశకు; చని= వెళ్ళి; పాంచాలపతిచేతన్= పాంచాలదేశప్రభువుచేత; సత్కృతుండు+అయి= గౌరవించబడినవాడై; విదేహరాజు; జనకుండు; అనువానిన్; జయించి; దశార్ణపతి, అయిన; సుధన్వుతో; మహాయుద్ధంబు; చేసి; తత్, పరాక్రమంబునకున్= అతనియొక్క శౌర్యానికి; మెచ్చి; వానిన్; తనకున్; సేనాపతిన్; చేసికొని; అశ్వమేధ+ఈశ్వరుండు+అయిన= అశ్వమేధానికి రాజైన; రోచమానున్; అనుజ, సహితున్= తమ్ములతో కూడిన వాణ్ణి; పరాజితున్+చేసి= ఓడించి; చేది విషయంబునకున్= చేదిదేశానికి; చనిన= వెళ్ళిన.

**తాత్పర్యం:** భీమసేనుడు కూడ శత్రు సమూహాన్ని అణచగలిగిన బలమైన సైన్యంతో తూర్పుదిక్కుకు వెళ్ళి, పాంచాల రాజుచేత పూజ లందుకొని, విదేహరాజైన జనకుణ్ణి జయించాడు. తరువాత దశార్ణపతి అయిన సుధన్వునితో మహాయుద్ధం చేసి అతని పరాక్రమానికి మెచ్చి తనకు సేనాపతిగా చేసుకొన్నాడు. అశ్వమేధం చేసిన రాజైన రోచమానుణ్ణి తమ్ములతో సహా ఓడించి చేదిదేశంలో ప్రవేశించాడు.

**చ. అతని నతిప్రతాపు ననిలాత్మజుఁ గానఁగవచ్చి చేది భూ
పతి శిశుపాలుఁ డెంతయును భక్తిపరుం డయి రాజసూయ ము
న్నతి నొనరింపనున్న యమనందనుయత్న మెఱింగి రత్నశో
భిత ధనరాసు లిచ్చెఁ గడుఁబ్రీతిసమన్వితుఁ డై ముదంబునన్. 243**

**ప్రతిపదార్థం:** అతనిన్; అతి, ప్రతాపున్= మిక్కిలి పరాక్రమం కలవాణ్ణి; అనిల+ఆత్మజున్= వాయుదేవునియొక్క పుత్రుణ్ణి (భీముణ్ణి); చేది, భూపతి= చేది దేశం యొక్క రాజు; శిశుపాలుఁడు; కానఁగన్, వచ్చి= చూడవచ్చి; ఎంతయును= మిక్కిలి; భక్తిపరుండు+అయి= భక్తితో కూడినవాడై; రాజసూయము; ఉన్నతిన్= గొప్పగా; ఒనరింపన్+ఉన్న= చేయటానికి సిద్ధంగా ఉన్న; యమనందను= యముని పుత్రుడైన ధర్మరాజుయొక్క; యత్నము+ఎఱింగి= ప్రయత్నం తెలుసుకొని; కడున్= మిక్కిలి; ప్రీతి, సమన్వితుఁడు+ఐ= ప్రేమతో కూడుకొన్నవాడై; ముదంబునన్= సంతోషంతో; రత్న, శోభిత, ధనరాసులు= రత్నాలతో వెలుగొందే ధనరాసులను; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** మహాపరాక్రమ శాలి అయిన భీముణ్ణి చేది రాజైన శిశుపాలుడు దర్శించాడు. ఎంతో భక్తితో ధర్మరాజు చేస్తున్న రాజసూయ ప్రయత్నాన్ని గూర్చి తెలుసుకొన్నాడు. ఎంతో ప్రీతితో రత్నశోభితాలైన ధనరాసుల్ని ఆయనకు ఇచ్చాడు.

**విశేషం:** శిశుపాలుడు ధర్మరాజుపట్ల భక్తి గౌరవాలు కలవాడే. రాజసూయయాగ ప్రయత్నం తెలిసికొని సంతోషించినవాడే. అయితే ధర్మరాజు శ్రీకృష్ణునికి అర్ఘ్య మివ్వటంచేతనే అతడి వైఖరి పూర్తిగా వ్యతిరేకంగా మారింది.

**వ. భీమసేనుండును శిశుపాలుపురంబునం గొన్నిదినంబు లుండి పూర్వదిక్కున కరిగి, పుళిందపురంబున సుకుమారసుమిత్రులం, గుమారవిషయంబున శ్రేణిమంతునిం, గోసలదేశంబున బృహద్బలు, నయోధ్యాపురంబున దీర్ఘప్రజ్ఞునిఁ, గాశీరాజును సుపార్శ్వుని, రాజపతియైన సుధన్వుని, మత్స్యమలదపతులను గర్ణాట దక్షిణమల్లులను మర్దించి, వారిచేత నపరిమిత ధనంబులుగొని, మగధపతియయిన జరాసంధతనయు సహదేవు నాశ్వాసించి, హిమవత్పర్వత పార్శ్వంబునం జలోద్భవంబనుదేశంబును భల్లాటదేశంబును జయించి, యింద్రపర్వత సమీపంబునం గిరాతపతుల నేడ్వురను శర్మక వర్మకులను జంద్రసేన సముద్రసేనులను గర్ణవత్సపతులను బుండ్రపతినిం బౌండ్రక వాసుదేవుని వశగతులం జేసి. 244**

**ప్రతిపదార్థం:** భీమసేనుండును; శిశుపాల పురంబునన్; కొన్ని; దినంబులు+ఉండి; పూర్వ దిక్కునకున్= తూర్పుదిశకు; అరిగి= వెళ్ళి; పుళింద, పురంబునన్; సుకుమార, సుమిత్రులన్; కుమార, విషయంబునన్= కుమార దేశంలో; శ్రేణిమంతునిన్; కోసల, దేశంబునన్; బృహత్+బలున్; అయోధ్యా, పురంబునన్; దీర్ఘ ప్రజ్ఞునిన్; కాశీరాజును; సుపార్శ్వుని; రాజపతి+ఐన; సుధన్వుని ('రాజపతింక్రథ' మ్మని మూలం); మత్స్య, మలద, పతులను; కర్ణాట, దక్షిణ, మల్లులను; మర్దించి= ఓడగొట్టి; వారిచేతన్; అపరిమిత, ధనంబులు; కొని= తీసుకొని; మగధపతి, అయిన; జరాసంధ, తనయున్; సహదేవున్; ఆశ్వాసించి= అనునయించి; హిమవత్+పర్వత, పార్శ్వంబునన్= హిమవత్పర్వతం ప్రక్కలో; జల+ఉద్భవంబు+అను; దేశంబును; భల్లాట, దేశంబును; జయించి; ఇంద్ర, పర్వత, సమీపంబునన్, కిరాత, పతులన్= బోయరాజులను; ఏడ్వురను= ఏడుమందిని; శర్మక, వర్మకులను; చంద్రసేన, సముద్రసేనులను; కర్ణ, వత్సపతులను; పుండ్రపతినిన్; పౌండ్రకవాసుదేవునిన్; వశగతులన్, చేసి= లోబరచుకొని.

**తాత్పర్యం:** భీమసేనుడు శిశుపాలుడి పురంలో కొన్నిదినా లుండి, తూర్పుదిక్కునకు వెళ్ళి, ఆయాదేశాల రాజుల నందరిని జయించాడు.

**విశేషం:** రాజుల పేర్ల విషయంలో వివిధ ప్రతుల్లో భేదాలు ఉన్నాయి. కర్ణాటపదం మూలంలో లేదు. బహుశః నన్నయగారే దీన్ని చేర్చారేమో!

**ఉత్సాహము.**

**అతులశౌర్యుఁ డనిలతనయుఁ డమిత వాహినీ పదా**
**హతి ధరిత్రి దలర నిట్టు లరిగి పూర్వ దిఙ్మహీ**
**పతులచేత రత్నరజత భర్మతతులఁ గొనియె భూ**
**నుతయశుండు వేఱు వేఱ నూఱు కోట్ల సంఖ్యలన్. 245**

**ప్రతిపదార్థం:** అతులశౌర్యుఁడు= సాటిలేని పరాక్రమం కలవాడు; భూనుత, యశుండు= ప్రపంచంచేత కొనియాడబడిన కీర్తి కలవాడు; అనిల, తనయుఁడు= గాలిదేవుని కొడుకు - భీముడు; అమిత, వాహినీ, పదాహతిన్= మితిమీరిన సైన్యంయొక్క పాదాల తాకిడిచేత; ధరిత్రి= భూమి; తలరన్= అదరగా; ఇట్టులు+అ= ఈ విధంగా; అరిగినన్= వెళ్ళగా; పూర్వదిక్+మహీపతులచేతన్= తూర్పు దిక్కులోని రాజులచేత; రత్న, రజత, భర్మ, తతులన్= రత్నాలయొక్క వెండియొక్క బంగారంయొక్క సమూహాలను; వేఱువేఱు; నూఱుకోట్ల సంఖ్యలన్; కొనియెన్= గ్రహించాడు.

**తాత్పర్యం:** సాటిలేని పరాక్రమశాలి, లోకం కొనియాడిన కీర్తిమంతుడు అయిన వాయుపుత్రుడు భీముడు, అపారసైన్యపాదఘట్టనతో భూమి అదిరేటట్లు దండయాత్ర చేసి, తూర్పు దిక్కులోని రాజులచేత వేర్వేరుగా వందకోట్ల రత్నరజతకాంచన రాసులను కప్పంగా తీసుకొన్నాడు.

**విశేషం:** 'రత్న రజత భర్మతతు' లకు మూలం - 'కాంచనం రజతం వజ్రం విద్రుమంచ మహాధనమ్' (భండార్కరు ప్రతి. 2-27-26). దిగ్విజయయాత్రనుండి సాటిలేని శౌర్యంతో భీమసేనుడు తిరిగి రావటాన్ని ఉత్సాహవృత్తంలో వర్ణించటం ఎంతో ఉచితంగా ఉంది. ఉత్సాహం జాతివృత్తం. అందులో ప్రతిచరణంలోనూ వరుసగా ఏడుసూర్యగణాలమీద ఒక గురువు నిలుస్తుంది. అయిదవగణంలోని మొదటి అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉంది.

### సహదేవుండు దక్షిణ దిగ్విజయంబు సేయుట (సం. 2-28-1)

**వ. అట సహదేవుండు దక్షిణ దిక్కున కరిగి సుమిత్ర శూరసేన దంతవక్త్ర యవనులను, గోశృంగగిరి నివాసులను జయించి కుంతిభోజుచేతం బ్రియపూర్వకంబున సత్కృతుం డయి. 246**

**ప్రతిపదార్థం:** అట; సహదేవుండు; దక్షిణ, దిక్కునకున్; అరిగి= వెళ్ళి; సుమిత్ర, శూరసేన, దంతవక్త్ర, యవనులను; గోశృంగగిరి, నివాసులను; జయించి; కుంతిభోజుచేతన్; ప్రియపూర్వకంబునన్= మనసార; సత్కృతుండు+అయి= పూజించబడినవాడై.

**తాత్పర్యం:** ఇక అక్కడ సహదేవుడు దక్షిణదిశకు వెళ్ళి సుమిత్రుడు, శూరసేనుడు, దంతవక్త్రుడు, యవనులు, గోశృంగగిరి నివాసులు మొదలైన రాజులందరిని జయించి, కుంతిభోజునిచేత మనసార పూజ లందుకొని.

**ఆ. జలజనాభుపగతు జంభకుండనువాని । భూరిబలునిపుత్త్రుఁ బోరిలోన**
**నొడిచి వానిచేత నుత్తమ గజహయ । రత్నతతులు గొని పరాక్రమమున. 247**

**ప్రతిపదార్థం:** జలజనాభు, పగతున్= పద్మనాభునియొక్క - అంటే శ్రీకృష్ణునియొక్క - శత్రువైన; జంభకుండు+అనువానిన్; భూరి, బలుని, పుత్త్రున్= భూరిబలుడు అనేవానియొక్క కుమారుణ్ణి (భూరి బలుడంటే గొప్ప బలం కలవాడు); పోరిలోనన్= యుద్ధంలో; ఒడిచి= ఓడించి; వానిచేతన్; ఉత్తమ, గజ, హయ, రత్న, తతులు= శ్రేష్ఠాలైన ఏనుగుల, గుర్రాల, రత్నాల సమూహాలను; కొని= గ్రహించి; పరాక్రమమునన్= పరాక్రమంతో.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుని విరోధి, భూరిబలుని పుత్రుడు అయిన జంభకుడనే వానిని యుద్ధంలో ఓడించి అతనిచేత శ్రేష్ఠాలైన గజాశ్వరత్నసమూహాల్ని గ్రహించి పరాక్రమంతో.

**వ. నర్మదాసమీపంబున నవంతి పతుల విందానువిందుల మందదర్పులం జేసి చని, మాహిష్మతీపురంబు పయి విడిసిన. 248**

**ప్రతిపదార్థం:** నర్మదా, సమీపంబునన్= నర్మదానదానికి దగ్గర; అవంతి, పతులన్= అవంతిదేశరాజులను; వింద+అనువిందులన్; మంద, దర్పులన్+చేసి= అణగిన పొగరు కలవాళ్ళనుగా చేసి (ఓడించి); చని= వెళ్ళి; మాహిష్మతీ, పురంబు; పయి, విడిసినన్= దండెత్తగా.

**తాత్పర్యం:** నర్మదానదానికి సమీపంలోని అవంతిదేశరాజులైన విందానువిందుల్ని ఓడించి, ముందుకు సాగి మాహిష్మతీపురంమీద దండెత్తగా.

**క. వీరుఁడు తత్పురవిభుఁ డు । గ్రారివిమర్దనుఁడు నీలుఁ డనువాఁడు మహా**
**దారుణబలుఁ డై సమర । ప్రారంభాత్యుగ్రుఁ డయ్యెఁ బాండవుతోడన్. 249**

**ప్రతిపదార్థం:** వీరుఁడు; తత్+పుర, విభుఁడు= ఆమాహిష్మతీపురరాజు; ఉగ్ర+అరి, విమర్దనుఁడు= భయంకరులైన శత్రువుల్ని లెస్సగా అణచేవాడు; నీలుఁడు+అనువాడు; మహా, దారుణ, బలుండు+ఐ= మిక్కిలి భయంకరమైన బలం కలవాడై; పాండవుతోడన్= పాండురాజుపుత్రు డైన సహదేవునితో; సమర, ప్రారంభ+అతి+ఉగ్రుఁడు+అయ్యెన్= యుద్ధాన్ని ప్రారంభించటంలో మిక్కిలి విజృంభించినవా డయ్యాడు.

**తాత్పర్యం:** వీరుడు, మాహిష్మతీపుర ప్రభుడు, భయంకరశత్రు విమర్దనుడు అయిన నీలుడు, మహాదారుణబలుడై సహదేవునితో యుద్ధానికి విజృంభించాడు.

**వ. అంత. 250**

**తాత్పర్యం:** అప్పుడు.

**క. దరికొని దహనుం డెగసెను । వరుసను సహదేవుసకలవాహినిమాద్య**
**త్కరులపయిఁ దురగములపయి । వరరథములపయిఁ బదాతివర్గములపయిన్. 251**

**ప్రతిపదార్థం:** సహదేవు, సకల, వాహినిన్= సహదేవునియొక్క సమస్త సైన్యంలో; మాద్యత్, కరులపయిన్= మదపుటేనుగులమీద, తురగములపయిన్= గుర్రాలమీద; వర, రథములపయిన్= శ్రేష్ఠాలైన రథాలమీద; పదాతివర్గములపయిన్= కాల్బలాల సమూహాలమీద; దహనుండు= అగ్నిదేవుడు; దరికొని= రగుల్కొని; ఎగసెను= విజృంభించాడు.

**తాత్పర్యం:** క్రమంగా సహదేవుని సైన్యంలోని మదపుటేనుగులమీద, గుర్రాలమీద, రథాలమీద, కాల్బలాల సమూహంమీద అగ్నిదేవుడు రగుల్కొని వ్యాపించాడు.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 252**

**తాత్పర్యం:** అనగా విని జనమేజయుడు వైశంపాయనునితో ఇలా అన్నాడు.

అగ్ని సహదేవుసేనపైఁ బ్రచండశిఖలు కప్పుటకుఁ గారణము (సం. 2-28-16)

**ఆ. కడఁగి యనలుఁ డేమి కారణంబున సహ । దేవు సేనపయి నతిప్రచండ**
**శిఖలు గప్పె? దీనిఁ జెప్పు మేర్పడ నాకు । ననఘ! వినఁగ వేడ్కయైన యదియు. 253**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ వైశంపాయన మహర్షీ!; కడఁగి= పూనుకొని; అనలుఁడు= అగ్ని; ఏమి, కారణంబునన్; సహదేవుసేనపయిన్= సహదేవునియొక్క సైన్యంమీద; అతి, ప్రచండ, శిఖలు= మిక్కిలి తీవ్రాలైన మంటలు; కప్పెన్= పరపాడో; వినఁగన్; వేడ్కఐన, అదియు= వినా లని కుతూహలం కలిగింది; దీనిన్; ఏర్పడన్= స్పష్టంగా; నాకున్; చెప్పుము.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఓ వైశంపాయనమహర్షీ! ఏకారణంచేత అగ్నిదేవుడు సహదేవుని సైన్యంమీద మహాతీవ్రమైన మంటలను కప్పాడో వినా లని కుతూహలంగా ఉంది. దీన్ని నాకు స్పష్టంగా చెప్పండి.

**వ. అనిన వైశంపాయనుం డి ట్లని చెప్పెఁ:దొల్లి నీలువంశంబున నిషధుం డనురాజు రాజ్యంబున జాతవేదుండు విప్రుండయి వేదాధ్యయనంబుసేయుచు మాహిష్మతీపురంబున నుండి ప్రమాదవశంబునం బారదారికుండయిన నెఱింగి రాజనియోగులు వానిం బట్టికొని పోయి రాజసమక్షంబున శాస్త్రవిహితదండనంబున దండింపం బోయిన. 254**

**ప్రతిపదార్థం:** అనినన్; వైశంపాయనుండు; ఇట్లు+అని; చెప్పెన్; తొల్లి= పూర్వం; నీలు, వంశంబునన్= నీలునియొక్క వంశంలో; నిషధుండు+అను రాజు, రాజ్యంబునన్= రాజుయొక్క రాజ్యంలో; జాతవేదుండు= అగ్నిదేవుడు; విప్రుండు+అయి= బ్రాహ్మణుడై; వేద+అధ్యయనంబు, చేయుచున్= వేదపాఠాలు నేర్చుకొంటూ; మాహిష్మతీపురంబునన్; ఉండి; ప్రమాద, వశంబునన్= ఏమరుపాటున; పారదారికుండు+అయిననన్= పరపురుషుని భార్యతో రమించినవాడు కాగా; రాజనియోగులు= రాజభటులు; ఎఱింగి= తెలుసుకొని; వానిన్= ఆ అగ్నిహోత్రుణ్ణి; పట్టికొనిపోయి; రాజసమక్షంబునన్= రాజు ఎదుట; శాస్త్ర విహిత, దండనంబునన్= శాస్త్రంలో చెప్పబడిన శిక్షప్రకారం; దండింపన్+పోయినన్= శిక్షించపోగా.

**తాత్పర్యం:** అనిన విని వైశంపాయనుడు ఈవిధంగా చెప్పాడు. పూర్వం నీలునివంశంవాడైన నిషధు డనే రాజు రాజ్యం చేస్తుండగా, అగ్నిహోత్రుడు బ్రాహ్మణరూపం ధరించి మాహిష్మతీపురంలో వేదాధ్యయనం చేస్తూ ఉన్నకాలంలో పొరపాటున పరపురుషుని భార్యతో రమించాడు. రాజభటులు దానిని తెలుసుకొని అతణ్ణి బంధించి తీసుకొనిపోయి రాజసమక్షంలో శాస్త్ర ప్రకారం శిక్షించబోగా.

**విశేషం:** జాతవేదుడు - పుట్టిన వేదాలు కలవాడు - అగ్నిదేవుడు. అంటే ఇతడివల్ల వేదాలు పుట్టాయట. త్రేతాయుగంలో పురూరవుని మనస్సుకు వేదాలు కర్మబోధకాలై మూడు మార్గాలుగా తోచాయి. తాను ఇదివరకు అరణ్యంలో అగ్నిస్థాలిని వదలిన చోటికి వెళ్ళి శమీ(జమ్మి) గర్భంనుండి పుట్టిన అశ్వత్థా(రావిచెట్టు) న్ని చూచి, ఆ అశ్వత్థాన్ని రెండు అరణులుగా చేసి మొదటి అరణి తాననీ, రెండవ అరణి తాను మోహించిన ఊర్వశి అనీ, మధ్యనున్న కాష్ఠం పుత్రుడనీ మంత్రాలు జపించటంచేత జాతవేదు డనే అగ్ని సంభవించిం దట!

**క. అవమానదుఃఖితుండయి । పొవయుచు రోషానలంబు పోఁడిమి వెలుఁగం**
**బవనసఖుఁ డుగ్ర కణములు । నెవయఁగఁ దన పొడవు చూపె నిషధుని మ్రోలన్. 255**

**ప్రతిపదార్థం:** పవనసఖుఁడు= గాలిదేవుని మిత్రుడైన అగ్నిదేవుడు; అవమాన, దుఃఖితుండు+అయి= అవమానంచేత దుఃఖం పొందినవాడై; పొవయుచున్= పొగలుగ్రక్కుతూ; రోష+అనలంబు, పోఁడిమి= రోషమనే అగ్నియొక్క తీవ్రత; వెలుఁగన్= ప్రకాశించగా; ఉగ్ర, కణములు= భయంకరాలైన నిప్పురవ్వలు; నెవయఁగన్= ఎగురగా; నిషధునిమ్రోలన్= నిషధరాజు ఎదుట; తన, పొడవున్= తన యొక్క నిజరూపాన్ని; చూపెన్= చూపించాడు.

**తాత్పర్యం:** వాయుదేవుని మిత్రుడైన అగ్నిదేవుడు అవమానంతో దుఃఖపడి పొగలు క్రక్కుతూ, రోషంతో భయంకరాలైన నిప్పురవ్వలు ఎగిరేటట్లు నిజరూపాన్ని నిషధుని ముందు చూపించాడు.

**వ. వాఁడును గడు భీతుండయి యగ్నిదేవునకు నమస్కరించి 'మహాపురుషా! నాయజ్ఞానంబు సహింపవలయు' నని ముకుళిత కరకమలుం డయిన వానికి వైశ్వానరుండు ప్రసన్నుండయి 'నీ కోరిన వరం బిచ్చెద వేఁడు'మనిన వాఁ డి ట్లనియె. 256**

**ప్రతిపదార్థం:** వాఁడును= ఆ నిషధుడనే రాజుకూడ; కడున్= మిక్కిలి; భీతుండు+అయి= భయపడినవాడయి; అగ్నిదేవునకున్; నమస్కరించి; మహాపురుషా!; నా, అజ్ఞానంబు; సహింపవలయున్+అని; ముకుళిత, కర, కమలుండు+అయినన్= జోడించిన పద్మాల వంటి చేతులు కలవాడు కాగా; వానికిన్; వైశ్వానరుండు= అగ్నిహోత్రుడు; ప్రసన్నుండు+అయి= దయతో కూడినవాడై; నీ, కోరిన, వరంబు= నీవు కోరుకొన్నట్టి వరాన్ని; ఇచ్చెదన్; వేడుము+అనినన్= కోరుకొమ్మని అనగా; వాఁడు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అగ్నిహోత్రుని నిజ రూపం చూచి ఆ నిషధరాజు భయపడ్డాడు. 'మహాపురుషా! నా అజ్ఞానాన్ని సహించు' అని చేతులెత్తి నమస్కరించాడు. అప్పుడు అగ్నిహోత్రుడు దయదలచి 'నీవు కోరినవరం ఇస్తా వేడుకో' అని అనగా, అందుకు నిషధుడు ఇలా అన్నాడు.

**విశేషం:** వైశ్వానరుడు-విశ్వానరుని పుత్రుడు-అగ్ని. వైశ్వానరుడు శివుణ్ణి గురించి తపస్సు చేసి ఆయన అనుగ్రహంచేత ఆగ్నేయ మూలకు అధిపతి అయ్యాడు.

**తే. ఇప్పురంబు జయింపంగ నెవ్వరేని । వత్తు రుద్ధతులయి శత్రువరులు వారు**
**దర్పమేది నీచేత నిర్దగ్ధులై వి । హీను లవునట్లుగా వర మిమ్ము నాకు. 257**

**ప్రతిపదార్థం:** ఈ+పురంబు= ఈ మాహిష్మతీనగరాన్ని; జయింపంగన్= జయించటానికి; ఎవ్వరు+ఏనిన్= ఎవరైనా; శత్రు, వరులు= బలవంతులైన శత్రువులు; ఉద్ధతులు+అయి= విజృంభించిన వారై; వత్తురు (వచ్చుదురు)= వస్తారో; వారు= ఆ శత్రువులు; దర్పము= గర్వం; ఏది= నశించి; నీచేతన్; నిర్దగ్ధులు+ఐ= పూర్తిగా కాల్చబడినవాళ్ళయి; విహీనులు+అవునట్లుగాన్= మిగలకుండ నశించే వారయ్యేటట్లుగా; వరము+ఇమ్ము.

**తాత్పర్యం:** 'ఈ మాహిష్మతీ నగరాన్ని జయించటానికి బలమైన శత్రువులు ఎవరైనా విజృంభించి వస్తే, వాళ్ళు గర్వాన్ని కోల్పోయి నీచేత దగ్ధులై పూర్తిగా నశించేటట్లు నాకు వర మివ్వండి' అని ప్రార్థించాడు.

**వ. అనిన నా రాజునకు నగ్నిదేవుం డభిమతం బయిన వరం బిచ్చి, 'మఱి నీవు నాకుం బ్రతిప్రియంబు సేయు; మిప్పురంబు నింతు లెంతయు మనోజరాగిణులు గావున వీరల స్వైరిణీవృత్తియెల్ల కాలంబు సహింపవలయు' నని యడిగిన, నాఁటంగోలె మాహిష్మతీ పురంబు స్త్రీలకు స్వైరిణీత్వంబు నిర్దోషంబయ్యె; నగ్నిదేవుండును నప్పురంబుపై వచ్చిన వారలనెల్ల దగ్ధ సైన్యులం జేయుచు దాని రక్షించుచుంటంజేసి పరరాష్ట్రపతు లగ్ని భయంబున నప్పురంబు పరిహరింతు; రది కారణంబుగా సహదేవు సైన్యంబెల్ల నగ్నిపరీతంబయినం జూచి సంచలింపక సహదేవుండు శుచియై వార్చి దర్భశయనంబున శయనించి యగ్నిసూక్తంబుల నగ్నిభట్టారకు ని ట్లని స్తుతియించె. 258**

**ప్రతిపదార్థం:** అనినన్= అని నిషధరాజు వర మడుగగా; ఆరాజునకున్, అగ్నిదేవుండు; అభిమతంబు+అయిన= ఇష్టమైన; వరంబు+ఇచ్చి; మఱి; నీవు, నాకున్; ప్రతి ప్రియంబు= బదులుగా ఇష్టమైన దానిని; చేయుము; ఈ+పురంబు; ఇంతులు=

స్త్రీలు; ఎంతయున్= మిక్కిలి; మనోజరాగిణులు= మన్మథరాగాన్ని కలవాళ్ళు; కావునన్; వీరల; స్వైరిణీ, వృత్తి= స్వేచ్ఛా విహారం; వ్యభిచారం; ఎల్ల, కాలంబు; సహింపవలయున్; అని; అడిగినన్; నాటన్+కోలె= ఆనాటి నుండి; మాహిష్మతీ, పురంబు, స్త్రీలకున్; స్వైరిణీత్వంబు= వ్యభిచారం; నిర్దోషంబు+అయ్యె= తప్పులేని దయింది; అగ్నిదేవుండును; ఆ, పురంబుపై; వచ్చిన, వారలన్+ఎల్లన్= దండెత్తి వచ్చిన వారినందరిని; దగ్ధ, సైన్యులన్= దహించబడినసైన్యాలు కలవాళ్ళనుగా; చేయుచున్; దానిన్= ఆమాహిష్మతీపురాన్ని; రక్షించుచున్+ఉంటన్, చేసి= రక్షిస్తూ ఉండటంవల్ల; పరరాష్ట్రపతులు= ఇతరదేశాల రాజులు; అగ్ని, భయంబునన్= అగ్నివల్ల కలిగే భయంచేత; ఆ+పురంబు; పరిహరించుదురు= వదలివేస్తారు; అది; కారణంబుగా; సహదేవు, సైన్యంబు+ఎల్లన్= సహదేవుని సైన్యమంతా; అగ్ని, పరీతంబు+అయినన్= అగ్నిచే చుట్టబడింది కాగా; చూచి; సహదేవుండు; సంచలింపక= కలత చెందక; శుచి+ఐ= స్నానం చేసి పరిశుద్ధుడై; వార్చి= ఆచమనం చేసి; దర్భ శయనంబునన్= దర్భలతో కూర్చిన పడకమీద; శయనించి= పరుండి; అగ్ని సూక్తంబులన్= అగ్నికి సంబంధించిన వేదమంత్రస్తోత్రాలతో; అగ్ని భట్టారకున్= అగ్నిదేవుణ్ణి; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతియించెన్= స్తోత్రం చేశాడు.

**తాత్పర్యం:** అగ్నిదేవుడు నిషధరాజు కోరినట్లు వరమిచ్చి, అందుకు బదులుగా తన కిష్టమయిం దొకటి చేయవలసిందని అడిగాడు. 'మాహిష్మతీ పురస్త్రీలు శృంగారవతులు, మన్మథరాగం(కామం) అధికంగా కలవాళ్ళు, అందువల్ల వాళ్ళ వ్యభిచారాన్ని నీ వెప్పుడూ సహించాలి' అన్నాడు. ఆనాటినుండి ఆ పురస్త్రీల వ్యభిచారం తప్పు కాకుండా పోయింది. అగ్నిదేవుడుకూడ ఆ పురంమీద దండెత్తి వచ్చే వారి సైన్యాల్ని దగ్ధం చేస్తూ ఆ పురాన్ని రక్షిస్తూ ఉండటంచేత పరదేశభూపతులు అగ్నిభయంతో ఆదేశం మీదకి దండెత్తటం వదలివేశారు. అగ్నిదేవుడు ఆ కారణంచేతనే సహదేవుని సైన్యాన్ని చుట్టుకొన్నాడు. అయినా సహదేవుడు కలత చెందలేదు. స్నానం చేశాడు. శుచి అయ్యాడు. ఆచమనం చేసి దర్భలతో కూర్చిన పడకమీద పడుకొన్నాడు. వేదోక్తాలైన అగ్నిసూక్తాలతో అగ్నిదేవుణ్ణి ఈ విధంగా స్తుతించాడు.

**సీ.** **'నీ తదర్థంబులై నిఖిల వేదంబులు । వర్తిల్లు లోకపావనము లగుచుఁ;**
**బావనంబులలోనఁ బావనుండవు నీవ; । యజ్ఞంబులును నీవ హవ్యవాహ!**
**ధర్మనిత్యుండైన ధర్మజు కావించు । క్రతువు భవత్ప్రీతికరము గాదె!**
**దానికి విఘ్నంబు దలఁచుట ధర్మువె? । వరద! వైశ్వానర! వాయుమిత్త్ర!'**

**ఆ.** **యనిన నగ్నిదేవుఁ డతనికి సంప్రీతుఁ । డయి తదీయసేన కగ్నిభయముఁ**
**బాచె; దాని నెఱిఁగి భక్తుఁడై నీలుండు । కౌరవేంద్రుననుజుఁ గానవచ్చె.** **259**

**ప్రతిపదార్థం:** వరద!= వరాలిచ్చేవాడా!; వైశ్వానరా!= అగ్నిహోత్రా!; వాయుమిత్త్ర!= వాయుదేవునికి మిత్రుడా!; నీతదర్థంబులు+ఐ= నీకొరకైనవి; నిఖిల, వేదములు= అన్ని వేదాలు; లోక పావనములు+అగుచున్= లోకాన్ని పవిత్రం చేసేవై; వర్తిల్లున్= ఉంటున్నాయి; హవ్యవాహ!= అగ్నిహోత్రా!; పావనంబులలోనన్= పవిత్రాలైన వాటిల్లో; పావనుండవు= పవిత్రమైనవాడవు; నీవు+అ= నీవే; హవ్యవాహ!= అగ్నిదేవుడా!; యజ్ఞంబులును= యాగాలు కూడా; నీవు+అ= నీవే; ధర్మ, నిత్యుండు+ఐన= ఎడతెగని ధర్మాచరణం కలవాడైన; ధర్మజు, కావించు, క్రతువు= ధర్మరాజు చేసే యజ్ఞం; భవత్, ప్రీతికరము= నీకు ఇష్టమైంది; కాదు+ఎ= కాదా?; దానికిన్= ఆయజ్ఞానికి; విఘ్నంబు; తలఁచుట= ఆటంకాన్ని కలుగజేయాలనుకోవటం; ధర్మువు+ఎ= ధర్మమా?; అనినన్; అగ్నిదేవుఁడు; అతనికిన్= సహదేవుడికి; సంప్రీతుండు+అయి= మిక్కిలి ప్రీతి చెందినవాడయి; తదీయ, సేనకున్= అతనియొక్క సైన్యానికి; అగ్నిభయమున్; పాచెన్= తొలగించాడు; దానిన్+ఎఱిఁగి= దాన్ని తెలుసుకొని; నీలుండు= నీలుని వంశంవాడైన నిషధుడనే రాజు; భక్తుఁడై; కౌరవ+ఇంద్రు, అనుజున్= కౌరవపతి అయిన ధర్మరాజు తమ్ముణ్ణి-సహదేవుణ్ణి; కానవచ్చెన్= దర్శనం చేసుకొనటానికి వచ్చాడు.

**తాత్పర్యం:** 'ఓ వరదా! అగ్నిహోత్రా! వాయుమిత్రా! వేదాలన్నీ నీ కారణంగానే కదా లోకాన్ని పవిత్రం చేస్తున్నాయి. హవ్యవాహనా! పవిత్రాలైన వాటిలో పవిత్రుడివి నీవే. యజ్ఞాలుకూడా నీవే. ధర్మపరుడైన ధర్మరాజు చేసే రాజసూయయాగం నీకు ప్రీతికరం కాదా? దానికి విఘ్నం చెయ్యాలనుకోవటం నీకు ధర్మమా!' అని సహదేవు డనగా, అగ్నిదేవుడు సంతృప్తుడై అతని సేనకు అగ్నిభయాన్ని తొలగించాడు. దాన్ని తెలుసుకొని నీలుని వంశంవాడైన నిషధుడు భక్తితో సహదేవుని దర్శనం చేసుకొన్నాడు.

**విశేషం:** హవ్యవాహుడు - హవ్యాలను (హోమంలో వేసిన ఆహుతులను) దేవతలకు మోసుకొని పోయేవాడు - అగ్నిహోత్రుడు.

సహదేవుఁడు దక్షిణ దిఙ్మహీపతులచేఁ గప్పములు గొనుట (సం. 2-28-37)

క. **దేవప్రభావుఁ డగు సహ । దేవునకు హయద్విపేంద్ర దివ్యాంబర నా**
**నా విధ రత్నమయాభర । ణావలి లలిఁ దెచ్చి యిచ్చె నధిక ప్రీతిన్.** **260**

**ప్రతిపదార్థం:** దేవప్రభావుఁడు+అగు= దేవతా సమానమైన తేజస్సు కలవాడైన; సహదేవునకున్; అధికప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; హయ, ద్విప+ఇంద్ర, దివ్య+అంబర, నానావిధ, రత్నమయ+ఆభరణ+ఆవలిన్= గుర్రాలయొక్క, మదపుటేనుగుల యొక్క, మంచి వస్త్రాలయొక్క, అనేక విధాలైన రత్నాభరణాలయొక్క సమూహాన్ని; లలిన్= క్రమంగా; తెచ్చి, ఇచ్చెన్.

**తాత్పర్యం:** దేవసమానుడయిన సహదేవునికి ఎంతో ప్రీతితో గుర్రాల్ని, మదపుటేనుగుల్ని, మంచి వస్త్రాల్ని నానావిధరత్నాభరణాల్ని క్రమంగా తెచ్చి ఇచ్చాడు.

వ. **ఇట్లు మాహిష్మతీపురంబు సాధించి నీలుచేత నరిగొని సహదేవుండు దక్షిణదిక్కున కరిగి సౌరాష్ట్రదేశంబున నుండి రుక్మి భీష్మక శూర్పారక దండక పతులచేత దూతముఖంబున నసంఖ్యాత ధనంబులు గొని సాగరద్వీపవాసు లైన నిషాదులం బురుషాదుల నేకపాదులం గాలముఖులం గర్ణప్రావరణుల నర రాక్షస యోనుల రామశైల కోలశైల తామ్రద్వీప సంజయంతీపుర నివాసులను వశగతులంజేసి.** **261**

**ప్రతిపదార్థం:** ఇట్లు; సహదేవుండు; మాహిష్మతీపురంబు, సాధించి; నీలుచేతన్; అరి, కొని= కప్పాన్ని గ్రహించి; దక్షిణ దిక్కునకున్+అరిగి= దక్షిణ దిశకు వెళ్ళి; సౌరాష్ట్రదేశంబునన్+ఉండి; దూతముఖంబునన్= దూతద్వారా; రుక్మి, భీష్మక, శూర్పారక, దండకపతులచేతన్; అసంఖ్యాత, ధనంబులు= అపరిమితాలైన సంపదలు; కొని= గ్రహించి; సాగరద్వీప, వాసులు+ఐన= సముద్ర ద్వీపాలలో నివసిస్తున్న; నిషాదులన్; పురుషాదులన్, ఏకపాదులన్; కాలముఖులన్; కర్ణ ప్రావరణులన్; నర, రాక్షస, యోనులన్= నర రాక్షస జాతులవాళ్ళను; రామశైల, కోలశైల, తామ్రద్వీప, సంజయంతీపుర, నివాసులను; వశగతులన్; చేసి= లోబరచుకొని.

**తాత్పర్యం:** ఈవిధంగా సహదేవుడు మాహిష్మతీపురాన్ని జయించి నిషధునిచేత కప్పం గ్రహించి, దక్షిణ దిశగా వెళ్ళి, సౌరాష్ట్రదేశంలో నిలిచి, దూతద్వారా - రుక్మి, భీష్మక, శూర్పారక, దండకరాజులచేత అపారధనాలు గ్రహించి, సముద్రద్వీపవాసులైన - నిషాద, పురుషాద, ఏకపాద, కాలముఖ కర్ణ ప్రావరణులనే నరరాక్షస జాతులవారిని, రామశైల, కోలశైల తామ్రద్వీప సంజయంతీపుర నివాసుల్ని వశపరచుకొని.

**క. తాళవన పాండ్య కేరళ । కాళింగ ద్రవిడ యవన కరహాటక భూ**
**పాలకుల నొడిచి దక్షిణ । వేలావన భూములందు విడిసి కడంకన్. 262**

**ప్రతిపదార్థం:** తాళవన, పాండ్య, కేరళ, కాళింగ, ద్రవిడ, యవన, కరహాటక; భూపాలకులన్= రాజులను; ఒడిచి= ఓడించి; దక్షిణ, వేలా, వన, భూముల+అందున్= దక్షిణ సముద్రపు చెలియలికట్ట చెంత ఉండే అడవి ప్రదేశాల్లో; విడిసి= దండు విడిసి; కడంకన్= పూనికతో.

**తాత్పర్యం:** తరువాత సహదేవుడు తాళవన, పాండ్య, కేరళ, కాళింగ, ద్రవిడ, యవన, కరహాటక రాజులను ఓడించి దక్షిణ సముద్రతీర వనభూముల్లో దండు విడిసి పూనికతో.

**విశేషం:** మూలంలో - ఆంధ్రాం స్తాళవనాంశ్చైవ (భండార్కరు ప్రతి. 2-28-48) అని ఉంది. నన్నయ పద్యంలో ఆంధ్రపదం లోపించింది. ఇది బుద్ధిపూర్వకమో (గౌరవప్రదమైన సందర్భం కాదు గనుక), లేక ఆయన చూచిన ప్రతులలో ఆ పదం లేదో!

**చ. కురువిభు రాజసూయమునకున్ ధన మిచ్చిరి రాజులెల్ల నా**
**దరమునఁ బ్రీతి సేయునది దానును దప్పక యంచు లంక క**
**చ్చెరువుగఁ బుచ్చె దూతలఁ బ్రసిద్ధిగ నంత విభీషణుండు చె**
**చ్చెర సహదేవు శాసనము చేకొని సేసెఁ గరంబు నెమ్మితోన్. 263**

**ప్రతిపదార్థం:** కురువిభు, రాజసూయమునకున్= కురువంశ ప్రభువైన ధర్మరాజుయొక్క రాజసూయ యాగానికి; ఆదరమునన్= మన్ననతో; రాజులు+ఎల్లన్= రాజులందరు; ధనము+ఇచ్చిరి; తానును= తానుకూడ; తప్పక; ప్రీతి, చేయునది= ప్రేమతో ధనం ఇవ్వవలసింది; అంచున్= అని, అంటూ; లంకకున్= లంకానగరానికి; అచ్చెరువుగన్= ఆశ్చర్యం కలిగేటట్లుగా; దూతలన్; పుచ్చెన్= పంపాడు; అంతన్= అప్పుడు; విభీషణుండు= విభీషణుడు; ప్రసిద్ధిగన్= గొప్పగా; చెచ్చెరన్= వేగమే; సహదేవు, శాసనము= సహదేవుని యొక్క ఆజ్ఞ; చేకొని= గ్రహించి; నెమ్మితోన్= ప్రేమతో, కరము, చేసెన్= కప్పాన్ని ఇచ్చాడు. (కరంబు నెమ్మితోన్= మిక్కిలి ప్రీతితో; అతని ఆజ్ఞ చేశాడు; ధనమిచ్చాడు).

**తాత్పర్యం:** సహదేవుడు దక్షిణసముద్రతీరవనభూముల్లో విడిది చేసి లంకాధిపతి అయిన విభీషణునికి దూతలద్వారా- 'ధర్మరాజురాజసూయానికి రాజులంతా ధనమిచ్చా'రని, 'నీవుకూడ ప్రీతితో ఈయవలసిం'దని చెప్పి పంపాడు. విభీషణుడు సహదేవుని ఆజ్ఞను శిరసావహించి వెంటనే ఆవిధంగా చేశాడు. (కప్పం తెచ్చి ఇచ్చాడు)

**విశేషం:** ఈ పద్యానికి ముందు కొన్ని ప్రతుల్లో 'ఇట్లు సేతు బంధన సమీపంబున విడిసిన సహదేవుండు ఘటోత్కచుం దలంచిన తత్క్షణంబ వచ్చి దండప్రణామంబు సేసి ముకుళితహస్తుం డయి పని యేమి యనుటయు, నీవు విభీషణుకడకుం జని యుపాయనంబు గొని రమ్మని పంచిన, వాఁడును గగనమార్గంబున లంకకుం జని రాక్షసేంద్రుండగు విభీషణునిఁ గాంచి, కృష్ణ సహాయుండగు ధర్మరాజు రాజసూయారంభంబును తత్కారణంబున భీమార్జున నకుల సహదేవుల దిగ్విజయార్థం బరుగుటయు, వారలలోన దక్షిణ దిశకుం జనుదెంచిన సహదేవు శాసనంబున తాను దూతయై వచ్చుటయుఁ దనపేరు భీమసేన పుత్త్రుం డయిన ఘటోత్కచుం డని విన్నవించి' అనే వచనం ఉంది. దీనికి మూలం శ్రీ పి.పి.యస్.శాస్త్రిగారి దాక్షిణాత్య సంస్కృత భారత ప్రతిలో 2-27-125 నుండి 203 వరకు ఉందిగాని భండార్కర్‌వారి సంస్కృత భారత ప్రతిలో

లేదు. - (మహాభారత సంశోధిత ప్రతి). (సౌకుమార్యమనే శబ్దగుణం సార్థకంగా ఈ పద్యరచనలో దర్శన మిస్తుంది. - సంపా.) త్రేతాయుగంనాటి విభీషణుడు చిరంజీవి గనుక ద్వాపరయుగంలో కూడా ఉన్నాడు.

**మ.** **పరఁగన్ దక్షిణ దిఙ్మహీపతులచేఁ బౌలస్త్యుచే నిట్లు దు**
**ర్ధర శక్తిన్ సహదేవుఁ డర్థములు రత్నవ్రాతముల్ చందనా**
**గురు కాష్ఠాదులు గప్పముల్ గొనియెఁ బెక్కుల్ పేర్మితో నుర్వరా**
**మరలక్ష్మీకరుఁ డైన ధర్మసుతుసామ్రాజ్యంబు పూజ్యంబుగన్.** **264**

**ప్రతిపదార్థం:** సహదేవుఁడు; ఇట్లు= ఈ విధంగా; దుర్ధర, శక్తిన్= సహించ సాధ్యంగాని బలంతో; పరఁగన్= ఒప్పగా; దక్షిణ, దిక్+మహీపతులచేన్= దక్షిణదిశలో ఉండే రాజులచేత; పౌలస్త్యుచేన్= పులస్త్య బ్రహ్మపుత్రుడైన విభీషణునిచేత; అర్థముల్= ధనాలు; రత్న, వ్రాతముల్= రత్నసమూహాలు; చందన+అగురు, కాష్ఠ+ఆదులు= మంచిగంధంయొక్క, అగురుయొక్క కొయ్యలు మొదలైన; కప్పముల్; పెక్కుల్= అనేకాలు; ఉర్వరా+అమర, లక్ష్మీకరుఁడు+ఐన= భూసురులకు (బ్రాహ్మణులకు) సంపదను కలిగించేవాడైన; ధర్మసుతు, సామ్రాజ్యంబు; పూజ్యంబుగన్= పూజించదగినది అయ్యేటట్లు; పేర్మితోన్= గౌరవంతో; కొనియెన్= గ్రహించాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులకు సగౌరవంగా దక్షిణ లిచ్చే ధర్మరాజుసామ్రాజ్యం పూజ్యార్హ మయ్యేటట్లు సహదేవుడు సహించశక్యంగాని బలంతో, దక్షిణ దిశలో ఉండే రాజులచేత పులస్త్యుని పుత్రుడైన విభీషణునిచేత ధనాలు, రత్న సమూహాలు, మంచి గంధం చెక్కలు, అగరు కొయ్యలు మొదలైన కప్పాలు ఎన్నింటినో గ్రహించాడు.

**విశేషం:** ధర్మజుని చక్రవర్తివైభవం ధ్వనింపజేసే ఈ పద్యం ప్రసాదగుణరంజితంగా నన్నయ తీర్చిదిద్దాడు. (సంపా.)

### నకులుఁడు పశ్చిమ దిగ్విజయంబు సేయుట (సం. 2-29-2)

**క.** **నకులుఁడు పశ్చిమ దిక్కున । కకుటిల శౌర్యంబు మెఱయ నరిగి యరాతి**
**ప్రకర భయానక సేనా । ధికుఁడయి నిజతేజ మెల్లదిక్కుల వెలుఁగన్.** **265**

**ప్రతిపదార్థం:** నకులుఁడు; పశ్చిమదిక్కునకున్= పడమటి దిశకు; అకుటిల, శౌర్యంబు, మెఱయన్= మొక్కవోని శూరత్వం ప్రకాశించగా, అరిగి= వెళ్ళి; అరాతి, ప్రకర, భయానక, సేనా+అధికుఁడు+అయి= శత్రు సమూహానికి భయాన్ని కలిగించే సేన చేత మించినవాడై; నిజ, తేజము= తనయొక్క కాంతి; ఎల్ల, దిక్కులన్, వెలుఁగన్= అన్ని దిశల ప్రకాశించగా.

**తాత్పర్యం:** మొక్కవోని శౌర్యంతో నకులుడు పశ్చిమ దిశకు వెళ్ళి, శత్రు సమూహానికి భయం కలిగించే సేనతో అధికుడై తనకాంతి అన్నిదిక్కుల వెలుగగా.

**ఉ.** **యోధుల సింహనాదము మదోత్కటవారణబృంహితంబు వే**
**గాధికవాజిహేషిత మహారవమున్ రథనేమిఘోషమున్**
**బాధితకర్ణరంధ్రమయి పర్వె దిగంతము లెల్ల మ్రోయ నం**
**భోధిరవంబపోలెఁ గురుపుంగవు నచ్చతురంగవాహినిన్.** **266**

**ప్రతిపదార్థం:** కురుపుంగవు= కురుశ్రేష్ఠుడైన నకులునియొక్క; ఆ+చతురంగ, వాహినిన్= ఆ రథ, గజ, తురంగ పదాతులతో కూడిన సైన్యంలో; యోధుల సింహనాదము= వీరులయొక్క గర్జన ధ్వని; మద+ఉత్కట, వారణ, బృంహితంబు= లెస్సగా మదించిన ఏనుగులయొక్క ఘీంకారం; వేగ+అధిక, వాజి, హేషిత, మహారవమున్= మిక్కిలి వేగంగల గుర్రాల సకిలింతలయొక్క పెద్దశబ్దం; రథనేమి ఘోషమున్= రథచక్రాల కమ్ముల ధ్వని; అంభోధి, రవంబు+అ, పోలెన్= నీటికి నిలయమైన సముద్రంయొక్క ఘోషవలె; బాధిత, కర్ణ, రంధ్రము+అయి= బాధించబడిన కర్ణ రంధ్రాలు కలదై; దిక్+అంతములు+ఎల్లన్= దిక్కులచివరి భాగాలన్నీ; మ్రోయన్= మారుమోగేటట్లు; పర్వెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** కురువంశ శ్రేష్ఠుడైన నకులుడి చతురంగ సైన్యంలో - వీరుల సింహనాదం, మదపుటేనుగుల ఘీంకారం, మిక్కిలి వేగంగల గుర్రాల సకిలింతల శబ్దం, రథ చక్రాల ధ్వని, సముద్రఘోషలా చెవుల్ని బ్రద్దలు చేస్తూ దిక్కులెల్ల మారు మ్రోగేటట్లు వ్యాపించింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **ఇట్లు మాద్రేయుండు రౌద్రాకారంబునఁ గసిమసంగి మహాసేనాన్వితుండయి యరిగి మహాసేనరక్షితంబైన మహితక విషయంబున దత్తక మయూరకాది శూద్రులతోఁ గయ్యంబు చేసి, మరు మాళవ బర్బర కర్బర శైరీషక దాశార్ణ దేశంబుల రాజుల జయించి, పుష్కరారణ్యనివాసులైన యాభీరగణంబులను సరస్వతీసింధు కూలాశ్రితు లైన గ్రామణీయులను బంచనదామరపర్వతనివాసులను వశగతులం జేసికొని వాసుదేవునకు నిజాగమనం బెఱింగించి పుచ్చి.** **267**

**ప్రతిపదార్థం:** ఇట్లు; మాద్రేయుండు= మాద్రీ తనయుఁడైన నకులుడు; రౌద్ర+ఆకారంబునన్= భయంకరమైన రూపంతో; కసిమసంగి= విజృంభించి; మహాసేనా+అన్వితుండు+అయి= గొప్పసేనతో కూడుకొన్నవాడై; అరిగి= వెళ్ళి; మహాసేన, రక్షితంబు+ ఐన= మహాసేనునిచేత రక్షింపబడిందైన; మహితక, విషయంబునన్= మహితకదేశంలో; దత్తక, మయూర+ఆది= దత్తకుడు, మయూరకుడు, మొదలయిన; శూద్రులతోన్; కయ్యంబుచేసి= యుద్ధం చేసి; మరు, మాళవ, బర్బర, కర్బర, శైరీషక, దాశార్ణ దేశంబుల, రాజులన్; జయించి; పుష్కర+అరణ్య, నివాసులు+ఐన; ఆభీరగణంబులను= యాదవ సమూహాలను; సరస్వతీ, సింధుకూల+ఆశ్రితులు+ఐన= సరస్వతీ సింధునదీ తీరాలను ఆశ్రయించి ఉండే; గ్రామణీయులను; పంచనద+అమర, పర్వత, నివాసులను; వశగతులన్+చేసికొని= లోబరచుకొని; వాసుదేవునకున్= శ్రీకృష్ణునికి; నిజ+ఆగమనంబు= తన రాకను; ఎఱింగించి పుచ్చి= తెలియబంపి.

**తాత్పర్యం:** ఈవిధంగా మాద్రీసుతు డైన నకులుడు భయంకరంగా విజృంభించి, పెద్దసైన్యాన్ని వెంటతీసికొని వెళ్లి, మహాసేనుని రక్షణలో ఉన్న మహితక దేశంలో దత్తక మయూరకాది శూద్రులతో యుద్ధం చేసి, మరు, మాళవ, బర్బర, కర్బర శైరీషక దాశార్ణదేశ రాజులను జయించాడు. పుష్కరారణ్యంలో నివసించే యాదవ సమూహాలను సరస్వతీ సింధు తీరాలలో ఉండే గ్రామణీయులను, పంచనద, అమర పర్వతాలలో ఉన్న వాళ్ళను వశపరచుకొని శ్రీకృష్ణునికి తనరాకను తెలియ చేశాడు.

**విశేషం:** ఆయా దేశాల పేర్ల విషయంలో భిన్నప్రతుల్లో భేదాలు ఉన్నాయి. 'గ్రామణేయా మహాబలాః' అని మూలం.

**సీ. శాకలపురమందు శల్యు మద్రేశ్వరుఁ । దమ మేనమామ నుత్తమగుణాఢ్యుఁ**
**గానంగ నరిగి సత్కారపూర్వకముగా । వస్తువాహనములు వానిచేతఁ**
**గొని, పశ్చిమాంబుధి కుక్షినివాసులఁ । బరమదారుణుల బర్బర కిరాత**
**వీరుల నోడించి, విభుఁ డిట్లు వరుణేంద్ర । పాలిత దిఙ్మహీపతులచేత**

**ఆ. బలిమిఁ గొనిన ధనము పదివేలు లొట్టియల్ । పెఱిఁగి రాఁగ వైరిభీకరుండు**
**వచ్చె నకులుఁ డమిత వాహినీ పదహతిఁ । దల్లడిల్లుచుండ ధరణితలము. 268**

**ప్రతిపదార్థం:** వైరి భీకరుండు= శత్రువులకు భయాన్ని కలిగించేవాడైన; నకులుఁడు; శాకల పురమందున్; శల్యు; మద్ర+ఈశ్వరున్= మద్రరాజును; తమ మేనమామన్; ఉత్తమగుణ+ఆఢ్యున్= ఉత్తమ గుణాలతో కూడుకొన్నవానిని; కానంగన్= చూడటానికి; అరిగి= వెళ్ళి; సత్కార పూర్వకముగన్= మర్యాద మున్నుగా; వస్తు, వాహనములు; వానిచేతన్; కొని= గ్రహించి; పశ్చిమ+అంబుధి, కుక్షి, నివాసులన్= పశ్చిమ సముద్ర గర్భంలో నివసించే వాళ్ళను; పరమ, దారుణులు= మిక్కిలి భయంకరులు అయిన; బర్బర, కిరాత వీరులన్; ఓడించి; విభుఁడు= ప్రభువు (నకులుడు); ఇట్లు= ఈవిధంగా; వరుణ+ఇంద్ర, పాలిత, దిక్+మహీపతులచేతన్= వరుణరాజుచేత పాలించబడే దిక్కులోని రాజులచేత; బలిమిన్, కొనిన= బలవంతంగా గ్రహించిన, ధనము= ధనాన్ని; పదివేల లొట్టియల్= పదివేల ఒంటెలు; పెఱిఁగి= మోసికొని; రాఁగన్; ధరణితలము= భూమిపైభాగం; అమిత, వాహినీ, పదహతిన్= అపారమైన సైన్యంయొక్క పాదాల తాకిడిచేత; తల్లడిల్లుచున్+ఉండన్= చలిస్తూ ఉండగా; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** శత్రుజన భయంకరుడైన నకులుడు, శాకలపురంలో సద్గుణసమేతుడైన తన మేనమామ, మద్రపతి, శల్యుడిని చూడటానికి వెళ్ళాడు. మర్యాదపూర్వకంగా అతనిచేత అనేక వస్తు వాహనాలు గ్రహించాడు. పశ్చిమ సముద్ర గర్భంలో నివసించే పరమదారుణులు అయిన బర్బర కిరాత వీరుల్ని ఓడించాడు. పశ్చిమదిశలోని రాజులందరిచేత బలవంతంగా గ్రహించిన ధనాన్నంతా పదివేల ఒంటెలచేత మోయించుకొని అంతులేని సైన్య పాదఘట్టనతో భూతలం గ్రక్కదలేటట్లు వచ్చాడు.

**విశేషం:** అనేక ప్రతుల్లో శాకల్యపురమని ఉంది. 'శాకల మభ్యేత్య' అని మూలం (భండార్కరు ప్రతి 12-29-13). 'పదివేల లొట్టియల్ పెఱిఁగి రాఁగ' - కు 'పదివేల యొంటెలం బెఱికి రాఁగ' అని ఒక పాఠాంతరం ఉంది.

**వ. ఇట్లు భీమార్జున నకుల సహదేవులు పరాక్రమంబున దిగ్విజయంబుసేసి చతురుదధి పరీత మహీతలంబునంగల రాజులచేత నసంఖ్యాత ధన వస్తు వాహన నివహంబులు గొని వచ్చి వేఱు వేఱ ధర్మరాజునకుం జూపి యిచ్చిన. 269**

**ప్రతిపదార్థం:** ఇట్లు; భీమ+అర్జున, నకుల, సహదేవులు; పరాక్రమంబునన్= పరాక్రమంతో; దిక్+విజయంబు, చేసి= నాలుగు దిక్కులను జయించి; చతుః+ఉదధి, పరీత, మహీతలంబునన్= నాలుగు సముద్రాలచే వ్యాప్తి చెందిన భూప్రదేశంలో; కల= ఉన్న; రాజులచేతన్; అసంఖ్యాత ధన, వస్తు, వాహన, నివహంబులు= లెక్కకు మిక్కిలిగా ధన వస్తు వాహన సమూహాలు; కొనివచ్చి= తీసుకొనివచ్చి; వేఱువేఱన్, ధర్మరాజునకున్; చూపి; ఇచ్చినన్.

**తాత్పర్యం:** ఈ విధంగా భీమార్జున నకుల సహదేవులు నలుగురు పరాక్రమంతో దిక్కులను జయించి, నాలుగు సముద్రాలచే వ్యాప్తినొందిన భూమిమీద గల రాజులందరిచేత లెక్కకు మిక్కిలిగా ధన వస్తు వాహన సమూహాలు తీసుకొనివచ్చి, వేరు వేరుగా ధర్మరాజుకు చూపి ఇచ్చారు.

**క. ఉరుగుణవిశుద్ధ రత్నో । త్కర నానాధన సమృద్ధిఁ గడు నధికుండై**
**కురువృషభుఁడు గీడ్పఱిచెను । వరుణ ధనేశ్వరుల విభవ వైభవయుక్తిన్. 270**

**ప్రతిపదార్థం:** కురువృషభుఁడు= కురువంశ శ్రేష్ఠుడైన ధర్మరాజు; ఉరు, గుణ, విశుద్ధ, రత్న+ఉత్కర, నానా, ధన సమృద్ధిన్= గొప్ప శ్రేష్ఠత గల స్వచ్ఛమైన రత్నసమూహాలతో కూడుకొన్న వివిధసంపదలయొక్క నిండుదనంచేత; కడున్= మిక్కిలి; అధికుండు+ఐ= ఎక్కువ వాడై; విభవ వైభవ యుక్తిన్= ఐశ్వర్యంయొక్క ఆధిక్యంతో కూడి ఉండటంలో; వరుణ, ధన+ఈశ్వరుల= వరుణదేవుని, కుబేరుని; కీడు, పఱిచెను= క్రింది చేశాడు.

**తాత్పర్యం:** కురువంశ శ్రేష్ఠుడైన ధర్మరాజు ఎంతో శ్రేష్ఠత గల స్వచ్ఛమైన రత్న సమూహాలతో కూడుకొన్న నానావిధ ధనసమృద్ధితో అత్యధికుడై, ఆ వరుణకుబేరులనే తక్కువ చేశాడు.

**విశేషం:** రత్నాలకు స్థానం సముద్రం. అందుచేతనే దానికి రత్నాకరం అని కూడ పేరు. రత్నాకరా లన్నింటికి అధిపతి వరుణుడు. రత్నసంపదలో ఆయన అందరికంటే అధికుడు. ధనపతి కుబేరుడు. ఆయనకు ధనదు డని కూడ పేరు. ధనసమృద్ధిలో కుబేరుని మించినవాళ్ళు లేరు. రత్నసంపదలో, ధనసంపదలో ధర్మరాజు- అలాంటి వరుణకుబేరులనే తక్కువ చేశాడు.

### రాజసూయము సేయుమని ధర్మజున కతనియాప్తులు సెప్పుట (సం. 2-30-8)

**వ. మఱియు ధర్మోపార్జిత రక్షిత ప్రవర్ధితంబయిన మహాధనవర్గంబుఁ జూచి పాత్రప్రతిపాదనంబు నియోగింప సమకట్టి రాజసూయాధ్వరారంభసుస్థిరనివేశితబుద్ధియై యున్న యయ్యుధిష్ఠిరు నభిప్రాయంబున కనుగుణంబుగా నాప్తమంత్రు లి ట్లనిరి. 271**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతే కాక; ధర్మ+ఉపార్జిత, రక్షిత, ప్రవర్ధితంబు+అయిన= ధర్మ పద్ధతిన సంపాదించబడి, రక్షింపబడి లెస్సగా వృద్ధి పొందించబడిన; మహా, ధన, వర్గంబున్= గొప్ప ధన సమూహాన్ని; చూచి; పాత్ర, ప్రతిపాదనంబు= తగిన రీతిని వినియోగాన్ని-అంటే తగిన రీతిలో ఖర్చు చేయటాన్ని, తగిన వారికి దానరూపంలో ఇచ్చి వేయటాన్ని; నియోగింపన్= ఆజ్ఞాపించ; సమకట్టి= పూనుకొని; రాజసూయ+అధ్వర+ఆరంభ, సుస్థిర, నివేశిత, బుద్ధి+ఐ= రాజసూయయాగాన్ని ప్రారంభించటంలో చొప్పించిన మనస్సు కలవాడై; ఉన్న; ఆ+యుధిష్ఠిరు+అభిప్రాయంబునకున్= ఆ ధర్మరాజుయొక్క ఉద్దేశానికి; అనుగుణంబుగాన్= తగినట్లుగా; ఆప్తమంత్రులు; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** క్షత్రియధర్మాన్ని అనుసరించి ఆర్జించి, రక్షించి, లెస్సగా వృద్ధిచెందించిన మహాధనసమూహాన్నంతా చూచి, తగిన రీతిగా దానివినియోగాన్ని ఆజ్ఞాపించటానికి పూనుకొని, రాజసూయయాగ ప్రారంభాన్నిగూర్చి గట్టిగా ఆలోచిస్తున్న ధర్మరాజు అభిప్రాయానికి తగినట్లు అతని ఆప్తమంత్రులు ఈ విధంగా అన్నారు.

**సీ.** **కురువీర! నీ ధర్మపరిపాలనంబున । నీ గుణసంపద నీ విశుద్ధ**
**చారిత్రమునఁ జేసి ధారుణి ప్రజ కెల్ల । నభివృద్ధియయ్యె నెయ్యంబుతోడ;**
**రాజవంచకులయు రాజవల్లభులయుఁ । దస్కరులయు బాధ దఱిఁగె; రుజయుఁ**
**బగయును భయమును వగయును వెఱపును । నాదిగాఁ గల యెగ్గు లడఁగెఁ బుడమి;**

**ఆ.** **నర్ఘు లోలిఁ బెరిఁగె; నవనీశులెల్ల నీ । యనుజవీర్యవిజితు లయి త్వదీయ**
**శాసనస్థు లయిరి జగతీశ! యిదియ నీ । యజ్ఞ కార్యమునకు నవసరంబు.** **272**

**ప్రతిపదార్థం:** కురువీర= కురువంశ వీరుడివైన ఓ ధర్మరాజా!; నీ, ధర్మ పరిపాలనంబునన్= నీయొక్క ధర్మమైన పరిపాలనచేత; నీ, గుణ, సంపదన్= నీయొక్క సుగుణ సంపదచేత; నీ, విశుద్ధ, చారిత్రమునన్+చేసి= నీ నిర్మలమైన నడవడిచేత; ధారుణి, ప్రజకున్+ఎల్లన్= భూమిమీది జనులందరికి; నెయ్యంబుతోడన్= ఇంపుతో; అభివృద్ధి; అయ్యెన్= కలిగింది; రాజ వంచకులయు= రాజును మోసగించే వాళ్ళ వల్ల; రాజవల్లభులయు= రాజుకు ఇష్టులైనవాళ్ళవల్ల; తస్కరులయు= దొంగలవలన; బాధ; తఱిఁగెన్= తగ్గిపోయింది; పుడమిన్= భూమిలో; రుజయున్= రోగము; పగయును; భయమును; వగయును= దుఃఖమును; వెఱపును; ఆదిగాన్, కల= మొదలయిన; ఎగ్గులు= కీడులు; అడఁగెన్= తొలిగాయి; అర్ఘులు+ఓలిన్= వెలలు క్రమంగా; పెరిఁగెన్; అవనీ+ఈశులు+ఎల్లన్= రాజులందరు; నీ, అనుజ, వీర్య, విజితులు+అయి= నీ తమ్ముల పరాక్రమంచేత జయించబడినవాళ్ళయి; త్వదీయ, శాసనస్థులు+అయిరి= నీయొక్క ఆజ్ఞకు లోబడిన వాళ్ళయ్యారు. జగతీ+ఈశ= మహారాజా! ఇది+అ= ఇదే; నీ, యజ్ఞకార్యమునకున్= నీ రాజసూయ యజ్ఞానికి; అవసరంబు= తగిన సమయం.

**తాత్పర్యం:** కురువంశవీరుడివైన ఓధర్మరాజా! నీ ధర్మపరిపాలనచేత, నీ సుగుణసంపదచేత, నీ నిష్కళంక ప్రవర్తనచేత ఈభూమిమీది ప్రజలందరికి ప్రియమార అభివృద్ధి కలిగింది. రాజును మోసం చేసేవారివల్ల, రాజుకు ఇష్టులైన వాళ్ళవల్ల, దొంగలవల్ల బాధ తగ్గిపోయింది. రోగం, పగ, భయం, దుఃఖం మొదలయిన కష్టాలు తొలగిపోయాయి. వెలలు క్రమంగా పెరిగాయి. పరాక్రమంలో నీ తమ్ములు రాజులందరినీ జయించారు. అందరు రాజులు నీ ఆజ్ఞకు లోబడి ఉన్నారు. మహారాజా! నీవు రాజసూయం చేయటానికి ఇదే తగిన సమయం.

**విశేషం:** 'రాజవల్లభులయు' అనే దానికి 'రాష్ట్రవంచకులయు' అని కొన్ని ప్రతులలో పాఠాంతరం ఉంది. కాని మూలంలో 'రాజవల్లభ' శబ్దమే ప్రయుక్తమై ఉంది. (భండార్కరు ప్రతి 2-30-4,5). రాజవల్లభు లంటే రాజుకు ప్రియులు. -రాజుగారి బావమరిదిలాంటి వాళ్ళు. అలాంటివాళ్ళు రాజుగారికి తామంటే ఉండే ప్రియత్వాన్ని దుర్వినియోగంచేసి ప్రజలను బాధించే అవకాశం ఉంది.

**వ.** **'మఱియు నపరిమిత పరార్ఘ్యరత్న రజత సువర్ణ పరిపూర్ణంబయి మహామేరుశైలంబు సన్నిహితంబైన యట్లు యక్షేశ్వరు నక్షయనిధులు ప్రత్యక్షంబైన యట్లు భాండాగారంబు సమృద్ధంబైన యది; ఘృతలవణతైల తండుల ధాన్యాది సమస్త వస్తు విస్తృతంబయి కోష్ఠాగారంబు సకల సంకల్ప సిద్ధి కరంబై కల్పద్రుమంబు ననుకరించుచున్న యది; వేదంబు లన్నియు మూర్తిమంతంబులయిన యట్లు మహాయాజ్ఞికు లయిన మహీసురవరులు నీ యభ్యుదయంబు గోరుచున్నవారు గావున రాజసూయాధ్వరం బెడసేయక చేయు'మని పలుకుచున్న యవసరంబున.** **273**

**ప్రతిపదార్థం:** మఱియున్; అపరిమిత, పర+అర్ఘ్య, రత్న, రజత, సువర్ణ, పరిపూర్ణంబు+అయి= అపారమైన శ్రేష్ఠత, విలువ గల రత్నాలతో, వెండితో, బంగారుతో నిండి; మహా, మేరు, శైలంబు= గొప్పదైన మేరుపర్వతం; సన్నిహితంబు+ఐన+అట్లు= సమీపానికి వచ్చినట్లు; యక్ష+ఈశ్వరు+అక్షయ, నిధులు= యక్షులరాజైన కుబేరునియొక్క తిరుగులేని నిధులు(తొమ్మిది); ప్రత్యక్షంబు+ఐన+అట్లు= కంటి ఎదుట కన్పించినట్లు; భాండ+అగారంబు= బొక్కసం (ధనం నిలువ ఉంచేచోట; ఖజానా); సమృద్ధంబు+ఐన, అది= పూర్తిగా నిండి ఉన్నది; ఘృత, లవణ, తైల, తండుల, ధాన్య+ఆది, సమస్త, వస్తు, విస్తృతంబు+అయి= నెయ్యి, ఉప్పు, నూనె, బియ్యం, పప్పులు మొదలయిన అన్ని వస్తువులతో నిండి; కోష్ఠ+అగారంబు= వస్తువులను నిలవ చేసే గది; సకల, సంకల్ప, సిద్ధికరంబు+ఐ= అన్నికోర్కెలను తీర్చేటటువంటిదైన; కల్పద్రుమంబును= కల్పవృక్షాన్ని; అనుకరించుచున్+ఉన్న, అది= పోలి ఉన్నది; వేదంబులు+అన్నియున్; మూర్తిమంతంబులు+అయిన, అట్లు= రూపాలు తాల్చినట్లు; మహాయాజ్ఞికులు+అయిన= గొప్పగా యజ్ఞం చేయించేవాళ్ళయిన; మహీసురవరులు= బ్రాహ్మణశ్రేష్ఠులు; నీ, అభ్యుదయంబు= నీయొక్క అభివృద్ధిని; కోరుచున్+ఉన్నవారు; కావునన్; రాజసూయ+అధ్వరంబు= రాజసూయయాగం; ఎడ, చేయక= ఆలస్యం చేయకుండ; చేయుము+అని; పలుకుచున్+ఉన్న; అవసరంబునన్= సమయంలో.

**తాత్పర్యం:** 'అంతేకాదు, అపరిమితమైన శ్రేష్ఠత, విలువ ఉన్న రత్నాలతో, వెండితో, బంగారంతో, మహామేరుపర్వతం సమీపించినట్లు, కుబేరుని అక్షయనిధులు ప్రత్యక్షమైనట్లు ధనాగారం పూర్తిగా నిండుగా ఉంది. వస్తువుల్ని నిలువ ఉంచే గృహం నెయ్యి, ఉప్పు, నూనె, బియ్యం, పప్పులు మొదలైన సమస్తవస్తువులతో నిండి అన్ని కోర్కెలను తీర్చే కల్పవృక్షంలా ఉంది. వేదాలన్నీ రూపుతాల్చి వచ్చినట్లున్న మహాయాజ్ఞికులైన బ్రాహ్మణోత్తములంతా నీ అభివృద్ధిని కోరుతున్నారు. అందుచేత రాజసూయయాగం ప్రారంభించు; ఆలస్యం చేయవద్దు' అని పలుకుతున్న సమయంలో.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, ఉపమ. అలంకారాలు రమణీయాలై ధర్మరాజు సంపత్సమృద్ధిని చక్కగా సూచిస్తున్నాయి. ఇచటి విశేషణాలు ఉపమానోపమేయాలు రెండింటితో అన్వయిస్తాయి.

### శ్రీకృష్ణుఁడు ద్వారకనుండి వచ్చుట (సం. 2-30-9)

**క. ద్వారవతినుండి జగదా । ధారుఁడు గృష్ణుండు వచ్చి ధర్మజు ధర్మ**
**ప్రారంభనిత్యు నుత్తము । భూరిధనంబులను రత్నములఁ బూజించెన్. 274**

**ప్రతిపదార్థం:** ద్వారవతినుండి= ద్వారకానగరంనుండి; జగత్+ఆధారుఁడు= లోకానికి ఆధారమైనవాడు; కృష్ణుండు; వచ్చి; ధర్మ, ప్రారంభ, నిత్యున్= యజ్ఞాన్ని ప్రారంభించటంలో స్థిరమైన మనస్సు కలవాణ్ణి; ఉత్తమున్= శ్రేష్ఠుడైనవాణ్ణి; ధర్మజున్= ధర్మజుని; భూరి ధనంబులను= అధిక ధనాలచేత; రత్నములన్= రత్నాలచేత; పూజించెన్.

**తాత్పర్యం:** ద్వారకానగరంనుండి జగదాధారుడైన శ్రీకృష్ణుడు వచ్చి రాజసూయయాగాన్ని ప్రారంభించాలన్న స్థిరసంకల్పంతో ఉన్నవాడూ, ఉత్తముడూ అయిన ధర్మరాజుకు అధికధనాలు రత్నాలు ఇచ్చి గౌరవించాడు.

**విశేషం:** సరిగా ఈ సమయానికే జగన్నాటకసూత్రధారి శ్రీకృష్ణుడు తనంత తానే రావటం ఒక విశేషం.

**వ. ధర్మరాజును జగదర్చితుం డయిన యచ్యుతు నర్ఘ్యాదివిధులం బూజించి తమ్ములయు ధౌమ్య ద్వైపాయనాదులయు ఋత్విజులయు నాప్తమంత్రులయు సమక్షంబున నధోక్షజున కి ట్లనియె. 275**

**ప్రతిపదార్థం:** ధర్మరాజును= ధర్మరాజు కూడ; జగత్+అర్చితుండు+అయిన= లోకంచే పూజించబడినవాడైన; అచ్యుతున్= శ్రీకృష్ణుణ్ణి; అర్ఘ్య+ఆది= అర్ఘ్య మివ్వటం మొదలైన; విధులన్= పూజా పద్ధతులతో; పూజించి; తమ్ములయు= తమ్ముళ్ళయొక్క ధౌమ్య+ద్వైపాయన+ఆదులయు= ధౌమ్యుడు, వ్యాసుడు మొదలయిన వాళ్ళయొక్క; ఋత్విజులయున్= యజ్ఞం చేయించే బ్రాహ్మణులయొక్క; ఆప్త, మంత్రులయు= ఆప్తులైన మంత్రులయొక్క; సమక్షంబునన్= ఎదుట; అధోక్షజునకున్= శ్రీకృష్ణునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** లోకంచేత పూజలందుకొనే శ్రీకృష్ణుణ్ణి, ధర్మరాజు అర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించాడు. తమ్ముళ్ళు, ధౌమ్య ద్వైపాయనాదులు, ఋత్విజులు, ఆప్తమంత్రులు ఉండగా అందరి సమక్షంలో శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు.

**విశేషం:** అధోక్షజుడు - ఇంద్రియాలను అధఃకరించి జన్మించినవాడు, జితేంద్రియులకు- అంటే ఇంద్రియాలను జయించినవాళ్ళకు- ప్రత్యక్షమయ్యేవాడు - శ్రీకృష్ణుడు. ధౌమ్యుడు పాండవపురోహితుడు.

**మత్తకోకిలము.**

**ధారుణీధర! ధర్మతత్త్వనిధాన! దానవదర్ప సం**
**హార! వారిజనాభ! బంధుజనానురంజనకారి! నీ**
**కారణంబునఁ జేసి మాకు జగంబునం గల భూపతుల్**
**భూరివిక్రమవశ్యు లైరి విభుత్వ మేర్పడుచుండఁగన్.** **276**

**ప్రతిపదార్థం:** ధారుణీధర= భూమిని ధరించినవాడా! శ్రీకృష్ణా! ధర్మ, తత్త్వ, నిధాన= ధర్మతత్త్వానికి ఉనికిపట్టు అయినవాడా!; దానవ, దర్ప, సంహార= రాక్షసులయొక్క గర్వాన్ని అణచినవాడా!; వారిజనాభ= నీటినుండి పుట్టిన పద్మం బొడ్డులో కలవాడా!; బంధు, జన+అనురంజనకారి= బంధుజనులకు సంతోషాన్ని కలిగించేవాడా! నీ, కారణంబునన్+చేసి= నీకారణంచేత; జగంబునన్+కల= లోకంలో ఉండే; భూపతుల్= రాజులు; మాకున్; విభుత్వము+ఏర్పడుచున్+ఉండఁగన్= మాకు సార్వభౌమాధికారం కలిగేటట్లు; భూరి, విక్రమ, వశ్యులు+ఐరి= మా గొప్ప పరాక్రమానికి లొంగిపోయినవా ళ్ళయ్యారు.

**తాత్పర్యం:** భూమిని ధరించినవాడా! ధర్మతత్త్వానికి ఉనికిపట్టయినవాడా! రాక్షసులగర్వం అణచినవాడా! పద్మనాభా! బంధుజనులకు ఆనందాన్ని కలిగించేవాడా! నీ కారణాన్నే కదా మాకు సార్వభౌమాధికారం కలిగేటట్లు లోకంలోని రాజులంతా మా పరాక్రమానికి లొంగిపోయారు.

**విశేషం:** మత్తకోకిలవృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా ర,స,జ,జ,భ,ర అనే గణాలు ఉంటాయి. 18 అక్షరాల చరణంలో 11వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉంది. భక్తికవితకు బీజప్రాయమైన లక్షణాలు ఈ పద్యరచనలో మాధుర్యగుణంతో కలిసి శోభిస్తున్నాయి. (సంపా.)

**క.** **క్షితిపతులవలన సముపా । ర్జితమైన ధనంబు కొలఁదిఁ జెప్పఁగ వాచ**
**స్పతికి నశక్యము; దీనిం । బ్రతిపాదింపంగవలయుఁ బాత్రవశమునన్.** **277**

**ప్రతిపదార్థం:** క్షితి, పతులవలన= భూపతులనుండి - రాజులనుండి; సమ్+ఉపార్జితము+ఐన= లెస్సగా సంపాదించబడిన; ధనంబు, కొలఁదిన్= డబ్బు యొక్క పరిమాణాన్ని; చెప్పగాన్= చెప్పటానికి; వాచస్పతికిన్= బృహస్పతికైనా; అశక్యము= సాధ్యం కాదు; దీనిన్= ఈధనాన్ని; పాత్రవశమునన్= అర్హులైన వాళ్ళకు చెందేటట్లు; ప్రతిపాదింపంగన్ వలయున్= దానంగా ఇవ్వాలి.

**తాత్పర్యం:** రాజులనుండి సంపాదించిన ధనరాసుల పరిమాణమెంతో తేల్చి చెప్పటం ఆ బృహస్పతికికూడ సాధ్యం కాదు. ఇక ఈ ధనాన్ని అర్హులైనవారికి దానం చేయాలి.

**వ. 'దేవముఖం బైన యగ్నిదేవుముఖంబున విధ్యుక్తంబుగా వేల్చి, దేవతర్పణంబును, యథోచితదక్షిణల నభీష్టదానంబుల మహీదేవ తర్పణంబునుం జేయవలయుం గావున నీ కిష్టంబయిన యజ్ఞంబు చేయించి, నాకును, లోకంబులకుం బ్రియంబు సేయు; మొండె నన్ను రాజసూయాధ్వర విధానంబునందు నియోగించి యనుగ్రహింపు' మనిన యుధిష్ఠిరునకు నారాయణుం డి ట్లనియె. 278**

**ప్రతిపదార్థం:** దేవముఖంబు+ఐన= దేవతలకు నోరైన; అగ్నిదేవుముఖంబునన్= అగ్నిదేవునియొక్క నోటితో; విధి+ఉక్తంబుగాన్= శాస్త్రంలో చెప్పబడినవిధంగా; వేల్చి= ఆహుతులను వేసి; దేవ, తర్పణంబును= దేవతలకు తృప్తిని; యథా+ఉచిత దక్షిణలన్= తగిన దక్షిణలను ఇవ్వటంచేత; అభీష్ట, దానంబులన్= కోరినదానాలు ఇవ్వటంచేత; మహీదేవ, తర్పణంబునున్= భూదేవతలైన బ్రాహ్మణులకు తృప్తిని; చేయవలయున్; కావునన్; నీకున్; ఇష్టంబు+అయిన; యజ్ఞంబు; చేయించి; నాకును; లోకంబులకున్; ప్రియంబు; చేయుము; ఒండెన్= అట్లాకాకుంటే; నన్నున్; రాజసూయ+అధ్వర, విధానంబునందున్= రాజసూయయాగ కార్యక్రమంలో, నియోగించి= నియమించి; అనుగ్రహింపుము= దయ చూపుము; అనినన్; యుధిష్ఠిరునకున్= ధర్మరాజుకు; నారాయణుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'దేవతలకు ముఖమైన అగ్నిదేవుని ముఖంలో శాస్త్రోక్తంగా వేసిన ఆహుతులతో దేవతల్ని, తగిన దక్షిణలతో, కోరిన దానాలతో బ్రాహ్మణుల్ని తృప్తి పరచాలి. అందుచేత నీ కిష్టమైన యజ్ఞం చేయించి నాకు, లోకాలకు ప్రియంచేయండి. అలా కాకుంటే, నన్ను రాజసూయ యాగకార్యక్రమంలో నియమించి అనుగ్రహించండి'- అని పలికిన ధర్మరాజుకు శ్రీకృష్ణు డిలా అన్నాడు.

**విశేషం:** పరాక్రమార్జిత మైన సంపదను యజ్ఞంచేసి ప్రభువు యోగ్యులకు పంచిపెట్టటం భారతీయ సంప్రదాయం. దానంతోనే ధనం రాణిస్తుం దని భారతీయభావన. అర్థం ధర్మబద్ధం కాకపోతే, పురుషయత్నం దైవానుకూల్యాన్ని పొందకపోతే వ్యర్థా లౌతాయి. అందువల్ల ధర్మరాజు పరమాత్ముడైన శ్రీకృష్ణుని యెదుట 'సంపదను యోగ్యుల కందజేసే యే యజ్ఞాన్నైనా చేయించు' అన్నాడు - మొదట. 'నీకు అంగీకార మైతే నన్ను రాజసూయయాగ కార్యక్రమంలో నియమించి అనుగ్రహించు' అన్నాడు - తరువాత, మానవుడు కోరుకొంటాడు కాని ఏ కోరిక యోగ్యమైనదో నిర్ణయించేది దైవం. అందువలన శ్రీకృష్ణునిమీదనే భారం ఉంచి, దైవానుకూల్యం ఉన్నకార్యాన్ని నిర్దేశించండి - అని ధర్మరాజు అర్థించాడు. (సంపా.)

**ఉ. పూజ్యుఁడ వెల్ల వంశముల భూపతులందును, ధర్మ నిర్మల**
**ప్రాజ్యవిభూతి నద్దివిజపాలకు నట్టిఁడ నీక యొప్పె సా**
**మ్రాజ్యము దైవసంపదయు మానుషసంపదపేర్మి కావునన్**
**యాజ్యుఁడ విప్టు నీవ భరతాన్వయభూషణ! ధర్మనందనా! 279**

**ప్రతిపదార్థం:** భరత+అన్వయ, భూషణ!= భరతునియొక్క వంశానికి అలంకారమైనవాడా, ధర్మనందనా!; ఎల్ల వంశముల, భూపతుల+అందును= అన్ని వంశాల రాజుల్లోను; పూజ్యుఁడవు= పూజింప దగినవాడివి; ధర్మ, నిర్మల, ప్రాజ్య, విభూతిన్= ధర్మంచేత స్వచ్ఛమై అధికమైన ఐశ్వర్యంలో; ఆ+దివిజ, పాలకు+అట్టిఁడు+అ= ఆ స్వర్గలోక పాలకుడైన ఇంద్రుని వంటివాడా; సామ్రాజ్యము; దైవ, సంపదయు= దైవబలం; మానుష సంపద పేర్మి= మానవ బలంయొక్క ఆధిక్యం; నీకు+అ= నీకే; ఒప్పెన్= అమరిఉంది; కావునన్; యాజ్యుఁడవు= యజ్ఞం చేయదగినవాడివి; ఇప్డు= ఇప్పుడు; నీవు+అ= నీవే.

**తాత్పర్యం:** భరత వంశానికి అలంకారమైనవాడా! ధర్మనందనా! అన్ని రాజ వంశాల్లో నీవు పూజించదగినవాడివి. ధర్మంచేత స్వచ్ఛమైన, అధికమైన ఐశ్వర్యంలో దేవేంద్రుని వంటి వాడివి. సామ్రాజ్యం దైవబలం, మానవబలం గొప్పగా నీకే అమరి ఉన్నాయి. అందుచేత ఇప్పుడు యజ్ఞం చేయదగినవాడివి నీవే.

**విశేషం:** మానుషసంపదతోపాటు దైవీసంపదకూడ కలిసి ధర్మజునికి సామ్రాజ్యయోగాన్ని కలిగించాయని శ్రీకృష్ణు డంగీకరించాడు. యజ్ఞం దైవస్వరూపం. దానిని నిర్వహించే అధికారం ధర్మరాజుకు ఉన్నదని ఈ విధంగా శ్రీమన్నారాయణ స్వరూపుడైన శ్రీకృష్ణుడు ధ్రువీకరించాడు. అర్థవ్యక్తి గుణరంజకమైన రచన ఈ పద్యం. (సంపా.)

**క.** **పంపం దగుఁ దగ దని శం । కింపక నీ కిష్టమయిన కృత్యముల నియో**
**గింపుము నన్ను భవద్గుణ । సంపత్ప్రవణుల సమస్తజనుల జనేశా!** **280**

**ప్రతిపదార్థం:** జన+ఈశా!= జనులకు ప్రభువైన ఓ ధర్మరాజా!; పంపన్+తగున్, తగదు+అని= ఈపని చెప్పదగును, చెప్పతగదు అని; శంకింపక= సంకోచించక; నీకున్+ఇష్టము+అయిన; కృత్యములన్= పనుల్లో, నన్నున్= నన్ను; భవత్+గుణసంపత్+ ప్రవణులన్= నీయొక్క గుణ సంపదలపై ఆసక్తి గలవాళ్ళయిన; సమస్త జనులన్= అందరు వ్యక్తులను; నియోగింపుము= నియమించుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ పని చెప్పతగినది, చెప్పతగనిది - అని ఏమాత్రం సంకోచించకుండ నీ కిష్టమైన పనుల్లో నన్ను, నీ గుణసంపదపట్ల ఆసక్తి ఉన్న అందరు వ్యక్తులను నియమించు.

**విశేషం:** యజ్ఞస్వరూపుడు, యజ్ఞపతి, యజ్ఞభోక్త, యజ్ఞకర్త అన్నీ తానే అయిన శ్రీకృష్ణపరమాత్ముడు తన్ను తాను ఆ విధంగా అర్పించుకోవటం రాజసూయమహాయజ్ఞనిర్వహణకు పూనుకొన్న ఆ ధర్మరాజుకు ఎంత ఆనందహేతువైందో! ఎంత గౌరవకారణమైందో! ఎంత ప్రోత్సాహజనక మైందో!

**చ.** **అనిన నుపేంద్రువాక్య మను నయ్యమృతంబునఁజేసి ధర్మనం**
**దనుఁడు ముదంబు నొంది 'విదితంబుగ నాకు మనోరథంబు లె**
**ల్లను సమకూరె నిప్డు, సఫలత్వము నొందె ధనాగమంబు' లం**
**చును నెడ నిశ్చయించె మధుసూదనదేవు ననుగ్రహంబునన్.** **281**

**ప్రతిపదార్థం:** అనినన్; ఉపేంద్రు, వాక్యము+అను= శ్రీకృష్ణుడి మాట అనే; అ+అమృతంబునన్+చేసి= ఆ అమృతంచేత; ధర్మనందనుఁడు; ముదంబున్= సంతోషాన్ని; ఒంది= పొంది; విదితంబుగన్= స్పష్టంగా; నాకున్; మధుసూదన దేవు= మధువనే రాక్షసుణ్ణి సంహరించిన శ్రీకృష్ణదేవునియొక్క; అనుగ్రహంబునన్= దయచేత; ఇప్డు+అ= ఇప్పుడే; మనోరథంబులు+

ఎల్లన్= కోరికలన్నీ; సమకూరెన్= తీరాయి; ధన+ఆగమంబులు= సంపదలు కలుగుటలు; సఫలత్వమున్, ఒందెన్= సార్థక్యం పొందాయి; అంచునున్; ఎడన్= హృదయంలో; నిశ్చయించెన్.

**తాత్పర్యం:** అని పలికిన శ్రీకృష్ణుడి వాక్యమనే అమృతంచేత ధర్మరాజు సంతోషించి, 'నాకు శ్రీకృష్ణుని అనుగ్రహంచేత ఇప్పుడే కోరికలన్నీ తీరాయి. సమకూరిన సంపదలన్నీ ఫలవంతా లయ్యాయి' అని మనస్సులో నిశ్చయించాడు.

**విశేషం:** ఈ సందర్భంలో శ్రీకృష్ణునికి ప్రయోగించిన మధుసూదన శబ్దం మిక్కిలి అర్థవంతం. మధుడనే రాక్షసుడిని సంహరించిన శ్రీకృష్ణుడు యాగానికి ఆటంకం కలిగించే ఏ దుష్టులనైనా తొలగించగలడనే భావాన్ని అది ధ్వనింపజేస్తుంది. అందుకు తగినట్లే రాజసూయమహాయాగసభలో ఆయన శిశుపాలుణ్ణి హతమార్చటం జరిగింది.

### ధర్మరాజు రాజసూయంబు సేయ నారంభించుట (సం. 2-30-17)

**వ. ఇట్లు నారాయణదేవుచేత ననుజ్ఞాతుండయి తమ్ములయు ధౌమ్య ద్వైపాయనాదులయు ననుమతంబున ధర్మరాజురాజసూయంబు సేయ నుపక్రమించి, సహదేవుంజూచి 'నీవు ధౌమ్యోపదిష్టంబులయిన యజ్ఞోపకరణ ద్రవ్యంబులు దేర నింద్రసేన ప్రముఖులను నర్జును సారథియయిన రుక్మను సమర్పించి, యజ్ఞాయతనంబున నానాదేశాగతులైన రాజులకు సన్నివేశంబులు సేయించి, నిఖిల మహీతలంబునం బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల నెల్ల రాఁబనుపు' మని పంచిన నతండును దద్వాక్యానంతరంబున నింద్రసేనాదుల ననేక శిల్పివరుల నియోగించి. 282**

**ప్రతిపదార్థం:** ఇట్లు; నారాయణదేవుచేతన్= శ్రీకృష్ణునిచేత; అనుజ్ఞాతుండు+అయి= అనుమతించబడినవాడై; తమ్ములయు; ధౌమ్య, ద్వైపాయన+ఆదులయు= ధౌమ్యుడు, వ్యాసుడు మొదలయిన వారియొక్క; అనుమతంబునన్= సమ్మతితో; ధర్మరాజు; రాజసూయంబు; చేయన్; ఉపక్రమించి= ప్రారంభించి; సహదేవున్; చూచి; నీవు; ధౌమ్య+ఉపదిష్టంబులు+అయిన= ధౌమ్యునిచేత ఉపదేశించబడినవైన - అంటే ధౌమ్యులవారు అవసరమని చెప్పిన; యజ్ఞ+ఉపకరణ, ద్రవ్యంబులు= యజ్ఞానికి అవసరమైన వస్తువులు (సాధన సామగ్రి); తేరన్= తేవటానికి; ఇంద్రసేన, ప్రముఖులను= ఇంద్రసేనుని వంటి ముఖ్యులను; అర్జును, సారథి+ఐన; రుక్మను; సమర్పించి= నియమించి; యజ్ఞ+ఆయతనంబునన్= యజ్ఞశాలలో; నానాదేశ+ఆగతులు+ఐన= వివిధదేశాలనుండి వచ్చిన; రాజులకున్; సత్+నివేశంబులు= మంచి మందిరాలు; చేయించి= రూపొందించి; నిఖిల మహీ, తలంబునన్= సమస్త భూమండలంలో; బ్రాహ్మణ క్షత్త్రియ, వైశ్య, శూద్రులన్+ఎల్లన్; రాన్, పనుపుము= రమ్మని చెప్పుము; అని; పంచినన్= ఆజ్ఞాపించగా; అతండును= ఆ సహదేవుడును; తత్+వాక్య+అనంతరంబునన్= ఆమాట తరువాత, - అంటే అన్నగారు చెప్పినదాన్ని అనుసరించి; ఇంద్రసేన+ఆదులన్= ఇంద్రసేనుడు మొదలైన; అనేక, శిల్పవరులన్= పెక్కుమంది శిల్పాచార్యులను; నియోగించి= నియమించి.

**తాత్పర్యం:** ఈవిధంగా శ్రీకృష్ణుని అనుమతిని, తమ్ముళ్ళతోపాటు, ధౌమ్య ద్వైపాయనాదుల సమ్మతిని పొంది ధర్మరాజు రాజసూయం చేయటానికి పూనుకొని, సహదేవునితో 'నీవు ధౌమ్యులవారు చెప్పిన విధంగా యాగానికి అవసరమైన సాధన సామగ్రిని సమకూర్చే పనిని ఇంద్రసేనుడు మొదలైన ప్రముఖులకు, అర్జున సారథి రుక్మకు అప్పగించు' అన్నాడు. 'యాగశాలలో వివిధ దేశాలనుండి వచ్చిన రాజులకు మంచి విడుదులు ఏర్పాటు చేయవలసిం'

దని ఆజ్ఞాపించాడు. 'భూమండలంలో ఉండే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల నందరిని రప్పించవలసిం'దని ఆదేశించాడు. సహదేవుడు అన్నగారి ఆజ్ఞప్రకారం ఇంద్రసేనాదులవంటి పెక్కుమంది శిల్పాచార్యులను నియమించి.

**విశేషం:** 'రుక్మశ్చార్జున సారథిః' - అని మూలం. కనుక 'రుక్ముని' - అని ఉండటం లెస్స.

**సీ.** **శాస్త్రోపదిష్ట ప్రశస్త ప్రమాణల। క్షణముల యజ్ఞోపకరణ తతుల**
**యజ్ఞాయతనమున నతిరమణీయంబు। లయి యుండ నొనరించి, యందు సర్వ**
**సంభారములు నించి, సకలదిక్కుల హరి। ప్రస్థంబుచుట్టు నపార భూరి**
**బహువిధాగారముల్ ప్రమదవనంబుల। వాపుల దీర్ఘికావలుల వెలసి**

**ఆ.** **యాజ్య తైల తండులాది నానా వస్తు। పూరితంబులయి విభూతిఁ దనర**
**జననుతుండు సేసె సహదేవుఁ డపర భూ। తలముఁ బోలి యొప్పెఁ దత్పురంబు.** **283**

**ప్రతిపదార్థం:** శాస్త్ర+ఉపదిష్ట, ప్రశస్త, ప్రమాణ, లక్షణములన్= శాస్త్రంచేత చెప్పబడిన ఉత్తమ ప్రమాణ లక్షణాలతో; యజ్ఞ+ఉపకరణ, తతులన్= యజ్ఞానికి అవసరమైన సాధనసామగ్రియొక్క సమూహాలను; యజ్ఞ+ఆయతనమునన్= యజ్ఞశాలలో; అతిరమణీయంబులు+అయి, ఉండన్= మిక్కిలి అందమైనవిగా అమరేటట్లు; ఒనరించి= చేసి; అందున్= యజ్ఞశాలలో; సర్వసంభారములు= అన్ని వస్తువులు; నించి= నింపి; హరిప్రస్థము చుట్టున్= ఇంద్రప్రస్థం చుట్టు; సకల దిక్కులన్= అన్ని దిశల్లో; అపార, భూరి, బహువిధ+అగారముల్= లెక్కలేనన్ని గొప్పవైన వివిధ గృహాలతో; ప్రమదవనంబులన్= ఉద్యానవనాలతో; వాపులను= కోనేరులతో; దీర్ఘికా+ఆవలులన్= దిగుడుబావి సమూహాలతో; వెలసి= ఏర్పడి; ఆజ్య, తైల, తండుల+ఆది, నానావస్తు, పూరితంబులు+అయి= నెయ్యి, నూనె, బియ్యం మొదలయిన పదార్థాలతో నిండి ఉండేటట్లు, విభూతిన్=ఐశ్వర్యంతో; తనరన్= ఒప్పేటట్లుగా; జననుతుండు= జనులచే కీర్తించబడేవాడు; సహదేవుఁడు; చేసెన్; తత్, పురంబు= ఆపట్టణం; అపర, భూతలమున్+పోలి= రెండవ భూమండలంవలె; ఒప్పెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** శాస్త్రోక్తాలైన ఉన్నత ప్రమాణ లక్షణాలున్న యజ్ఞ సాధన సామగ్రి నంతా యజ్ఞశాలలో అతిరమణీయంగా అమర్చాడు. అవసరమైన పదార్థాల నన్నింటినీ నింపాడు. ఇంద్రప్రస్థానికి అన్ని వైపులా ఉద్యానవనాలతో, కోనేరులతో, దిగుడు బావులతో, అవసరమైన నెయ్యి, నూనె, బియ్యంవంటి ఆహార పదార్థాలు సమృద్ధిగా ఉండేటట్లు అతిథిగృహ సముదాయాన్ని తన ఐశ్వర్యం శోభిల్లేటట్లు ఏర్పరచాడు. అప్పుడు ఇంద్రప్రస్థపురం అపరభూమండలంలా ప్రకాశించింది.

**విశేషం:** వైదికాలైన యజ్ఞవిషయాలు నన్నయగారికి ఎంతో ఆత్మీయాలు. అంతేకాక, ధర్మజుని రాజసూయం రాజకీయ ప్రాధాన్యమున్న యజ్ఞం. ఆ యజ్ఞమూలంగా ఆయన ఐశ్వర్యం, అధిక్యం అందరికీ ప్రకటం కావాలి. భావికురుసార్వభౌముడు ధర్మరాజే అనే అభిప్రాయం ఏర్పడాలి. అందుచేతనే నన్నయగారు ఇక్కడ ఆ యజ్ఞవిషయాల్ని మూలాన్ని మించి మనోహరంగా ఉదాత్తంగా వర్ణించారు. కాగా 'అపరభూతలం' అనే దానికి కొన్ని ప్రతులలో 'అమర భూధరం' అనే పాఠాంతరం ఉంది. ఐశ్వర్యంతో నిండిన ఇంద్రప్రస్థాన్ని అపర భూతలంతో పోల్చటం కంటె, అమర భూధరమైన మేరు పర్వతంతో పోల్చటమే మేల్తరంగా ఉంటుందేమో! అని అనిపించవచ్చు. అయినా, భూతలాన్ని పాలించే ప్రభువులు, కీర్తి కెక్కిన ప్రముఖులు అందరూ కలిసి ఒకచోట ఉండటానికి అనువుగా సర్వవిధసౌకర్యాలతో కూడికొనిఉన్న ఆ మహానగరం అపరభూతలం (Mini World)గా ఉన్న దని నన్నయగారు భావించిఉంటారు. అప్పుడే ధర్మరాజు సమ్రాట్టుగా వైభవాన్ని ప్రదర్శించగలడు.

**వ. మఱియు సహదేవానుశాసనంబునఁ బుత్త్ర మిత్త్ర భ్రాతృసమేతులై విరాట ద్రుపద శిశుపాల గాంధార రాజులును బ్రాగ్జ్యోతిషంబున భగదత్తుండును, శక సాల్వ బృహద్బల చంద్రసేన సముద్రసేన కుంతిభోజ పౌండ్రకవాసుదేవులును, వసుదేవ బలదేవ ప్రద్యుమ్న శూరసేనాది యదు వృష్ణి భోజాంధకవరులును, నంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ గౌడాంధ్ర సింహళ కేరళ కుంతల ద్రవిడ మరు యవనపతులును, బార్వతేయులును సాగరానూపవాసులును నాదిగాఁ జతుస్సముద్ర ముద్రిత వసుంధరా చక్రంబునం గల రాజచక్రంబును, సమగ్ర వేద వేదాంగవిదు లైన యగ్రజన్ములును, స్వకర్మ నిరతులైన వైశ్యశూద్రులును వచ్చి యథాపరికల్పిత సన్నివేశంబుల నుండి; రంత ధర్మపుత్త్రుండు భీష్మాదులం దోడ్కొని తేర గజపురంబునకు నకులుం బంచిన. 284**

**ప్రతిపదార్థం:** మఱియు; సహదేవ+అనుశాసనంబునన్= సహదేవునియొక్క ఆజ్ఞ ప్రకారం; పుత్త్ర, మిత్త్ర, భ్రాతృ, సమేతులు+ఐ= పుత్రులతో, మిత్రులతో, సోదరులతో కూడుకొన్నవాళ్ళయి; విరాట, ద్రుపద, శిశుపాల, గాంధార రాజులును; ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుండును; శక, సాల్వ, బృహద్బల, చంద్రసేన, సముద్రసేన, కుంతిభోజ, పౌండ్రక, వాసుదేవ+ఆదులును= శకుడు, సాల్వుడు మొదలయినవాళ్ళూ; వసుదేవ, బలదేవ, ప్రద్యుమ్న, శూరసేన+ఆది, యదు, వృష్ణి, భోజ+అంధక, వరులును= వసుదేవుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు, శూరసేనుడు మొదలైన యదు, వృష్ణి, భోజ, అంధక వంశాలకు సంబంధించిన శ్రేష్ఠులూ; అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజ, గౌడ, ఆంధ్ర, సింహళ, కేరళ, కుంతల, ద్రవిడ, మరు, యవన పతులును= అంగవంగాది దేశాల రాజులూ; పార్వతేయులును= పర్వతప్రాంతాల రాజులూ; సాగర, అనూప, వాసులును= సముద్రతీరప్రాంతంలో నివసించేవాళ్ళూ; ఆదిగాన్= మొదలుగా; చతుః+సముద్ర, ముద్రిత, వసుంధరా, చక్రంబునన్= నాలుగు సముద్రాలచేత చుట్టబడిన భూమండలంలో; కల= ఉన్న; రాజచక్రంబును= రాజుల సమూహమూ, సమగ్ర, వేద, వేద+అంగ, విదులు+ఐన= పరిపూర్ణంగా వేదాలను, వేదాలయొక్క అంగాలైన శిక్ష, వ్యాకరణం మొదలైనవాటిని తెలిసినవాళ్ళయిన; అగ్రజన్ములును= బ్రాహ్మణులూ; స్వధర్మ, నిరతులు+ఐన= తమ కర్తవ్యాన్ని నిర్వహించటంలో ఆసక్తి కలవాళ్ళయిన; వైశ్య, శూద్రులును; వచ్చి; యథాపరికల్పిత సత్+నివేశంబులన్= వాళ్ళ వాళ్ళ అర్హతలకు తగినట్లు ఏర్పాటు చేయబడిన మంచి విడిది ఇండ్లలో; ఉండిరి; అంత= తరువాత; ధర్మపుత్రుండు= ధర్మరాజు; భీష్మ+ఆదులన్= భీష్ముడు మొదలయిన వాళ్ళను; తోడ్కొని తేరన్= వెంటతీసుకొని రావటానికి; గజపురంబునకున్= హస్తినాపురానికి; నకులున్= నకులుణ్ణి; పంచినన్= పంపగా.

**తాత్పర్యం:** సహదేవుని పిలుపుమేరకు, పుత్రులతో, మిత్రులతో, సోదరులతో కలిసి భూమండలంలో ఉండే అందరు రాజులు, వేదవేదాంగ పారంగతులైన బ్రాహ్మణులు, తమ తమ ధర్మాలను నిర్వర్తించే వైశ్యులు, శూద్రులు వచ్చి, వాళ్ళ వాళ్ళ అర్హతలకు తగినట్లు ఏర్పాటు అయిఉన్న ఇళ్ళలో విడిడి చేశారు. తరువాత భీష్ముడు మొదలయిన పెద్దలను తోడ్కొని రావటానికి ధర్మరాజు నకులుణ్ణి హస్తినాపురానికి పంపగా.

**విశేషం:** వచ్చిన రాజుల విషయంలో వివిధ ప్రతులలో కొన్ని భేదా లున్నాయి. వేదాంగాలు - శిక్ష (కర్త పాణిని), వ్యాకరణం (కర్త పాణిని), ఛందం (కర్త పింగలముని), నిరుక్తం (కర్త యాస్కుడు), జ్యోతిషం (కర్తలు ఆదిత్యాదులు), కల్పం (కర్తలు ఆశ్వలాయన, కాత్యాయన, ఆపస్తంబ, బోధాయన, వైఖానసాదులు). పాండవులచేతిలో ఓడినవాళ్ళలో ఆంధ్రులను చేర్చని నన్నయ రాజసూయ యజ్ఞానికి వచ్చిన రాజుల్లో ఆంధ్రులను చేర్చి తనజాతిగౌరవాన్ని నిలిపాడు.

### రాజసూయమునకు భీష్మాదు లరుదెంచుట (సం. 2-31-4)

**క. అనుపమధనరాసులు గొను । చును ననురాగమున రాజసూయమఖాలో**
**కన కౌతూహలపరు లయి । చనుదెంచిరి భీష్ముఁదొట్టి సద్బంధుజనుల్. 285**

**ప్రతిపదార్థం:** భీష్మన్, తొట్టి= భీష్ముని మొదలు చేసికొని; సత్+బంధు, జనుల్= మంచి (దగ్గరి) బంధువులందరు; అనుపమ, ధనరాసులు= సాటిలేని ధన సమూహాలు; కొనుచున్= వెంటతీసుకొని; అనురాగమునన్= ప్రేమతో; రాజసూయ, మఖ+ఆలోకన, కౌతూహల, పరులు+అయి= రాజసూయ యాగాన్ని చూడటంలో మిక్కిలి కోరిక కలవాళ్ళయి; చనుదెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** భీష్ముడు మొదలైన ఆప్త బంధువులందరు సాటిలేని ధనరాసులు వెంటతీసికొని ప్రేమతో రాజసూయం చూడాలన్న కుతూహలంతో ఇంద్రప్రస్థానికి వచ్చారు.

**విశేషం:** వచ్చిన వాళ్ళలో - భీష్మవిదురాదులే కాక, దుర్యోధనాదులుకూడ అనురాగంతో అపార ధనరాసులు తీసికొని రాజసూయం చూడాలన్న కుతూహలంతో వచ్చారు. కౌరవులకు కన్ను కుట్టిందీ, మనస్సులో కుళ్ళు పెరిగిందీ, రాజసూయం చూచిన తరువాతే.

**వ. ఇట్లు వచ్చిన భీష్మ ధృతరాష్ట్ర విదుర ద్రోణ కృపాశ్వత్థామ సోమదత్త కర్ణ భూరిశ్రవశ్శల్య శకుని సైంధవ దుర్యోధన దుశ్శాసన వికర్ణాదుల నెల్లం బ్రియసత్కారంబులం బూజించి వారలతో ధర్మరా జి ట్లనియె. 286**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; వచ్చిన; భీష్మ, ధృతరాష్ట్ర, విదుర, ద్రోణ, కృప+అశ్వత్థామ, సోమదత్త, కర్ణ, భూరి శ్రవః+శల్య, శకుని, సైంధవ, దుర్యోధన, దుశ్శాసన, వికర్ణ; ఆదులన్+ఎల్లన్= భీష్ముడు, ధృతరాష్ట్రుడు, విదురుడు, ద్రోణుడు మొదలయిన వారి నందరిని; ప్రియ, సత్కారంబులన్= ఇష్టమైన సమ్మానాలతో; పూజించి; వారలతోన్; ధర్మరాజు; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా వచ్చిన భీష్ముడు, ధృతరాష్ట్రుడు, విదురుడు, ద్రోణుడు మొదలయిన వాళ్ళనందరిని ధర్మరాజు సమ్మానించి వారితో ఇలా అన్నాడు.

**విశేషం:** వచ్చిన వారి పేర్ల విషయంలో వివిధ ప్రతులలో పాఠభేదా లున్నాయి.

**ఆ. మీ యనుగ్రహమునఁ జేయంగఁ గడఁగితి । నిమ్మహాధ్వరంబు నెమ్మితోడ**
**దీని నిందఱును ననూనంబుగాఁ బూని । పెంపు మెఱసి నిర్వహింపవలయు. 287**

**ప్రతిపదార్థం:** మీ, అనుగ్రహమునన్= మీ అందరిదయతో; ఈ+మహా+అధ్వరంబున్= ఈ మహాయజ్ఞాన్ని; చేయంగన్= చేయటానికి; కడఁగతిన్= పూనుకొన్నాను; నెమ్మితోడన్= ప్రేమతో; దీనిన్; ఇందఱును= మీరంతా; అనూనంబుగాన్= వెలితి లేకుండ; పూని= పూనుకొని; పెంపు, మెఱసి= ఘనత వహించి; నిర్వహింపవలయున్= జరిపించాలి.

**తాత్పర్యం:** మీ అందరి అనుగ్రహంతో నే నీ మహాయాగాన్ని చేయటానికి పూనుకొన్నాను. ప్రేమతో మీరందరు వెలితి లేకుండ దీన్ని ఘనంగా నిర్వహించాలి.

**విశేషం:** బంధువులకు పెద్దరికం ఇవ్వటం- విశేషించి ఇలాంటి సందర్భాల్లో భారతీయ కుటుంబసంస్కృతి. 'మీ అనుగ్రహంతోనే నే నీయజ్ఞాన్ని చేస్తున్నా నని చెప్పటం బంధుప్రీతికి సూచకం. 'మీరు పూనుకొని యజ్ఞాన్ని వెలితిలేకుండా నిర్వహించా'లని అనటం జ్ఞాతులవలన ఎలాంటి ఇబ్బందులు రాకుండ నిపుణంగా నివారించుకొనే ఉపాయం. (సంపా.)

**వ. అని వారల యనుగ్రహంబు వడసి హిరణ్య రజత రత్న దక్షిణా దాన విషయంబులందుఁ గృపాచార్యునిఁ, గృతాకృత పరిజ్ఞానంబునందు భీష్మద్రోణులను, సకల వస్తు వ్యయంబునందు విదురుని, నానాదేశాగతులైన రాజులు దెచ్చి యిచ్చిన యుపాయనంబులు గైకొన దుర్యోధనుని, భక్ష్యభోజ్యాది వినియోగంబునందు దుశ్శాసనుని నియోగించి. 288**

**ప్రతిపదార్థం:** అని; వారల, అనుగ్రహంబు; పడసి= పొంది; హిరణ్య, రజత, రత్న, దక్షిణా, దాన, విషయంబులందున్= బంగారు, వెండి, రత్నాలు, దక్షిణలు, దానాలు ఇచ్చే విషయాల్లో; కృపాచార్యునిన్; కృత+అకృత, పరిజ్ఞానంబు నందున్= చేయబడిన, చేయని వాటిని ఆలోచించి నిర్ణయించటంలో అంటే కార్యాకార్యాలను గురించి ఆలోచించటంలో; భీష్మద్రోణులను; సకల వస్తువ్యయంబునందున్= అన్ని పదార్థాలను వినియోగపరచటంలో; విదురునిన్; నానాదేశ+ఆగతులు+ఐన= వివిధ దేశాలనుండి వచ్చిన; రాజులు; తెచ్చి; ఇచ్చిన; ఉపాయనంబులు= కానుకలు; కైకొనన్= తీసికోవటానికి; దుర్యోధనునిన్; భక్ష్య, భోజ్య+ఆది, వినియోగంబునందున్= భక్ష్యాలు, భోజ్యాలు మొదలయిన ఆహార పదార్థాలను అందరికి అందచేయటంలో; దుశ్శాసనుని; నియోగించి= నియమించి.

**తాత్పర్యం:** అని, వచ్చిన బంధుజనులందరి అనుగ్రహం పొంది, బంగారు, వెండి, రత్నాలను దక్షిణలుగా, దానాలుగా ఇచ్చే విషయంలో కృపాచార్యుణ్ణి, కార్యాకార్యాలనుగురించి ఆలోచించటంలో భీష్మద్రోణుల్ని, సకల పదార్థాలను వినియోగ పరచటంలో విదురుణ్ణి, వివిధ దేశాల రాజులు తెచ్చి ఇచ్చే కానుకలను గ్రహించటంలో దుర్యోధనుణ్ణి, భక్ష్యభోజ్యాది ఆహార పదార్థాలను అందరికీ అందచేయటంలో దుశ్శాసనుణ్ణి నియమించి.

**విశేషం:** ఈ విధంగా ఆయా వ్యక్తుల్ని ఆయా పనుల్లో నియమించటంలో ధర్మజుని ఉచితజ్ఞత, దూరదృష్టి గొప్పగా వ్యక్తమవుతున్నాయి. ధర్మజుడు అప్పగించినా, పాండవులతో ప్రతి విషయంలో పోటీపడే స్వభావం, వాళ్ళపట్ల అసూయ పడే మనస్తత్త్వం ఉన్న దుర్యోధనుడు, అందరు రాజులు తెచ్చియిచ్చే కానుకలు అందుకొనే పనికి అప్పుడు అంగీకరించకుండా ఉంటే అతనికి ఎంతో బాగుండేది! కాని ఆ అవివేకి ఏ ముహూర్తంలో అంగీకరించాడో ఆ కానుకల విలువ, ధర్మరాజు వైభవం చూచి తన అసూయను అంతకంత పెంచుకొన్నాడు; కృశించాడు. శకుని మాటలు విని పాండవుల పతనానికి ప్రయత్నించాడు. అపకీర్తి పాలయ్యాడు. కడకు అతి దయనీయ మరణాన్ని పొందాడు. రాజసూయం చూడవచ్చి దుర్యోధనుడు అంగీకరించిన ఈ కానుకలందుకొనే పని, జీవితంలో అతణ్ణి ఎంతగానో దెబ్బతీసింది. ఒక విధంగా ఇది- ధర్మరాజు మర్యాదపూర్వకంగా దుర్యోధనునికి నిబంధించిన మానసికశిక్ష. ఎంతో వివేకి అయిన ధర్మరాజు కృతాకృతపరిజ్ఞానంలో కురుపితామహుడైన భీష్ముని, గురువుగారైన ద్రోణుని నియమించి, రాజసూయార్ఘ్య ప్రదాన విషయంలో తాతగారి మాట తల దాల్చినట్లే తాల్చి, తనకు ఇష్టుడైన శ్రీకృష్ణునికే అర్ఘ్యం ఇచ్చే అవకాశం కల్పించుకొన్నాడు.

### ధర్మజుఁడు యజ్ఞాయతనము ప్రవేశించుట (సం. 2-33-1)

**క. ప్రాజ్ఞుఁడు విశేష ధర్మవి । ధిజ్ఞుఁడు ధర్మజుఁడు యజ్ఞదీక్షితుఁ డయి వి**
**ప్రజ్ఞాతిపరివృతుం డయి । యజ్ఞాయతనమున కరిగె నధికవిభూతిన్. 289**

**ప్రతిపదార్థం:** ప్రాజ్ఞుఁడు= వివేకవంతుడు; విశేష, ధర్మ, విధిజ్ఞుఁడు= విశేషాలైన ధర్మ విధులు తెలిసినవాడు; (అయిన) ధర్మజుఁడు; యజ్ఞ, దీక్షితుఁడు+అయి= యజ్ఞదీక్షను వహించిన వాడయి; విప్ర, జ్ఞాతి, పరివృతుండు+అయి= బ్రాహ్మణులతో, దాయాదులతో చుట్టబడినవాడై అనగా బ్రాహ్మణులు, దాయాదులు తన చుట్టు ఉండగా; అధిక, విభూతిన్= మిక్కిలి వైభవంతో; యజ్ఞ+ఆయతనమునకున్= యజ్ఞశాలకు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** వివేకవంతుడు, విశేషధర్మజ్ఞుడు అయిన ధర్మరాజు, యజ్ఞదీక్ష వహించి బ్రాహ్మణులు, దాయాదులు తన చుట్టూ ఉండగా మహావైభవంగా యజ్ఞశాలలో ప్రవేశించాడు.

**విశేషం:** ధర్మరాజుకు ప్రాజ్ఞ డనే విశేషణం ఎంతో తగిఉంది. ఆయన ఆలోచనలు, మాటలు, చేష్టలు ఎంత ధార్మికాలో అంత లౌకికాలు. వాటిని అక్షరరమ్యంగా ఆవిష్కరించబడటం ఈ పద్యరచనాశిల్పం.

**ఉ. సమ్మదమంది చూచిరి భృశంబుగ భూజను లెల్ల బ్రహ్మతే**
**జమ్మును రాజతేజమును సద్బహుభూషణ రత్నరాజి తే**
**జమ్మును విస్తరించుచు నిజద్యుతి యొప్పఁగ మూర్తమైన ధ**
**ర్మమ్మును బోలె నున్న గుణమండితు దీక్షితు ధర్మనందనున్. 290**

**ప్రతిపదార్థం:** భూజనులు+ఎల్లన్= భూమిమీది ప్రజలంతా; భృశంబుగన్= గొప్పగా; బ్రహ్మతేజమ్మును= బ్రాహ్మణుల తేజస్సును; రాజతేజమును= రాజుల తేజస్సును; సత్+బహు, భూషణ, రత్న, రాజి, తేజమ్మును= శ్రేష్ఠాలైన అనేకాభరణాల, రత్నసమూహంయొక్క తేజస్సును; విస్తరించుచున్= అధికం చేస్తూ; నిజద్యుతి= తనయొక్క కాంతి; ఒప్పఁగన్= ప్రకాశించగా; మూర్తము+ఐన= ఆకారం తాల్చిన; ధర్మమ్మును+పోలెన్= ధర్మంవలె; ఉన్న; గుణమండితున్= సుగుణాలచేత అలంకరించ బడినవాణ్ణి; దీక్షితున్= యజ్ఞదీక్ష వహించినవాణ్ణి; ధర్మనందనున్= ధర్మరాజును; సమ్మదము+అంది= సంతోషాన్ని పొంది; చూచిరి.

**తాత్పర్యం:** బ్రహ్మతేజస్సుకు, క్షత్రతేజస్సుకు, ఉత్తమ ఆభరణాల రత్నతేజస్సుకు మెరుగులు దిద్దుతూ తన తేజస్సు ప్రకాశించగా గుణశోభితుడు, యజ్ఞదీక్షితుడు అయి, రూపుతాల్చిన ధర్మంలా ఉన్న ధర్మరాజును రాజ్యప్రజలంతా మహదానందభరితులై చూచారు.

**విశేషం:** అలం: ఉపమ. గుణం ప్రసాదం. అది అక్షరరమ్యంగా ఆవిష్కృతం. 'మూర్తమైన ధర్మమ్మును బోలె నున్న' అనేదానికి 'మూర్తియైన ధర్మమ్మునుబోలె' అనే పాఠాంతరం పెక్కు ప్రతుల్లో ఉంది. 'ధర్మో విగ్రహవా నివ' అని మూలం (భండార్కరు ప్రతి 2-30-45). ('రామో విగ్రహవాన్ ధర్మః' అని శ్రీరామునిగూర్చి మారీచునిచేత వాల్మీకి చెప్పించిన సూక్తి జగద్విదితం. అలాగే భారతంలో ధర్మరాజు ధర్మవీరం ప్రధానరసంగా పోషించబడిన ఆంధ్రమహాభారతంలో మూర్తమైన ధర్మంవలె నున్నట్లు ధర్మరాజును వర్ణించటం సార్థకం. రాజసూయయాగంవల్ల సమకాలీన చక్రవర్తులలో సార్వభౌముడుగా, రాబోయే కురుక్షేత్ర మహాసంగ్రామంలో విజయుడుగా ధర్మరాజు వెలుగబోతున్నాడు. మహాభారత యుద్ధానంతరం అశ్వమేధయాగంతో మరొకసారి తన సార్వభౌమత్వాన్ని నిరూపించుకోబోతున్నాడు. ధర్మవిజయాన్ని తెలిపే మహేతిహాసం మహాభారతం. -సంపా.)

**క. బ్రహ్మవిదు లయిన నిఖిల । బ్రాహ్మణ సత్తములచేతఁ బరివేష్టితుఁడై**
**బ్రహ్మణ్యుఁ డొప్పెఁ గురుపతి । బ్రహ్మర్షి పరీతుఁ డయిన బ్రహ్మయపోలెన్. 291**

**ప్రతిపదార్థం:** బ్రహ్మ, విదులు+అయిన= బ్రహ్మజ్ఞాన సంపన్నులైన; నిఖిల, బ్రాహ్మణ, సత్తములచేతన్= అందరు బ్రాహ్మణశ్రేష్ఠుల చేత; పరివేష్టితుఁడు+ఐ= చుట్టబడినవాడై; బ్రహ్మణ్యుఁడు= బ్రాహ్మణులకు హితుఁడైన; కురుపతి= కురువంశరాజు - ధర్మరాజు; బ్రహ్మ+ఋషి, పరీతుఁడు+అయిన= బ్రహ్మర్షులచేత చుట్టబడినవాడైన; బ్రహ్మ+అ, పోలెన్= బ్రహ్మదేవునివలె; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** బ్రహ్మజ్ఞానసంపన్ను లైన బ్రాహ్మణోత్తములంతా తనచుట్టూ ఉండగా, బ్రాహ్మణుల మేలుకోరే ధర్మరాజు బ్రహ్మర్షులచేత కొలువబడే బ్రహ్మదేవునిలా ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **వేదనినాదము నాశీ। ర్వాదనినాదము ననేకవాదిత్రమహా**
**నాదంబుఁ జెలఁగె నన్యని। నాదంబు జనంబులకు వినంబడకుండన్.** **292**

**ప్రతిపదార్థం:** వేద, నినాదము= వేదమంత్రాల ధ్వని; ఆశీర్వాద, నినాదము= ఆశీర్వచనాల ధ్వని; అనేక, వాదిత్ర, మహానాదంబున్= పెక్కువాద్యాల యొక్క మహాధ్వని; అన్యనినాదంబు= ఇతర ధ్వని, జనంబులకున్; వినంబడక+ఉండన్= వినబడకుండా ఉండేటట్లుగా; చెలఁగెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** ఇతర శబ్దాలేవీ జనులకు వినపడకుండేటట్లుగా వేదమంత్రాలధ్వనీ, ఆశీర్వచనాలధ్వని, అనేక వాద్యాల మహాధ్వని వ్యాపించింది.

**వ.** **అంత ననంత వేదమూర్తులైన పైల ధౌమ్యులు హోతలుగా, యాజ్ఞవల్క్యుం డధ్వర్యుండుగా, ద్వైపాయనుండు బ్రహ్మగా, సుసాముం డుద్గాతగా, వీరల పుత్త్రశిష్యగణంబులు క్రమంబున మైత్త్రావరుణుండును నచ్ఛావాకుండును గ్రావస్తుతుండును బ్రతిప్రస్థాతయు నేష్టయు నున్నేతయు బ్రాహ్మణాచ్ఛంసియు నాగ్నీధ్రుండును బోతయుఁ బ్రస్తోతయుఁ బ్రతిహస్తయు సుబ్రహ్మణ్యుండునుంగా, నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా, భీష్మాది రాజర్షులు సహాయులుగా, సర్వక్రియా సమగ్రంబయి షడంగ సమృద్ధంబయి సంపూర్ణ దక్షిణా సనాథంబయి సకల ధన ధాన్యసమన్వితంబయి జగన్నాథరక్షితంబయి సకలజనానందకరంబయి రాజసూయం బతిరమణీయం బయిన.** **293**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; అనంత వేదమూర్తులు+ఐన= రూపుతాల్చిన అంతం లేని వేదాలవంటి వాళ్ళయిన; పైల, ధౌమ్యులు; హోతలుగా= ఋగ్వేద ఋత్విక్కులుగా; యాజ్ఞ+వల్క్యుండు; అధ్వర్యుండుగా= యజుర్వేదతంత్రం నడిపే వాడుగా; ద్వైపాయనుండు= వేదవ్యాసుడు; బ్రహ్మగా= ప్రధాన ఋత్విక్కైన బ్రహ్మగా; సుసాముండు; ఉద్గాతగా= సామవేద తంత్రం నడిపేవాడుగా; వీరల= వీరియొక్క; పుత్త్ర, శిష్య, గణంబులు= పుత్త్రుల శిష్యుల సమూహాలు; క్రమంబునన్= వరుసగా; మైత్రావరుణుండును, అచ్ఛావాకుండును, గ్రావస్తుతుండును, ప్రతిప్రస్థాతయు, నేష్టయున్, ఉన్నేతయు, బ్రాహ్మణాచ్ఛంసియు, ఆగ్నీధ్రుండును, పోతయున్, ప్రస్తోతయు, ప్రతిహస్తయు, సుబ్రహ్మణ్యుండునుంగాన్= యజ్ఞం చేయించే ఆయా సహాయ ఋత్విక్కులుగా; నారద+ఆది, బ్రహ్మ+ఋషులు= నారదుడు మొదలైన బ్రహ్మర్షులు; సదస్యులుగాన్= యజ్ఞవిధులను పరీక్షించే అధికారులుగా; భీష్మ+ఆది, రాజ+ఋషులు; సహాయులుగా= తోడ్పడేవాళ్ళుగా; సర్వక్రియా, సమగ్రంబు+అయి= అన్ని విధాల సంపూర్ణమై; షట్+అంగ, సమృద్ధంబు+అయి= ఆరు వేదాంగాలతో నిండిందై; సంపూర్ణ

దక్షిణా సనాథంబు+అయి= సంపూర్ణ దక్షిణలతో కూడుకొన్నదై; ధన, ధాన్య సమన్వితంబు+అయి= ధనంతో, ధాన్యంతో కూడుకొన్నదై; జగత్+నాథ, రక్షితంబు+అయి= లోకానికి ప్రభువైన శ్రీకృష్ణునిచేత రక్షించబడిందై; సకల జన+ఆనంద కరంబు+అయి= అందరు జనులకు ఆనందాన్ని కలిగించేదై; రాజసూయంబు; అతి రమణీయంబు+అయినన్= మిక్కిలి మనోహరం కాగా.

**తాత్పర్యం:** మూర్తీభవించిన అనంత వేదాల వంటి వారైన పైలధౌమ్యులు ఋగ్వేదతంత్రాన్ని నిర్వహించే ఋత్విక్కులుగా, యాజ్ఞవల్క్యుడు యజుర్వేదతంత్రాన్ని నడిపే అధ్వర్యుడగా, వేదవ్యాసుడు ప్రధాన ఋత్విక్కైన బ్రహ్మగా, సుసాముడు సామవేద తంత్రాన్ని నడిపే ఋత్విక్కుగా, ఈ నలువురియొక్క పుత్ర శిష్య సమూహాలు, మైత్రావరుణుడు, అచ్ఛావాకుడు మొదలయినవారు సహాయ ఋత్విక్కులుగా, నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా, భీష్మాది రాజర్షులు సహాయులుగా అన్ని విధాల సమగ్రమై, ఆరు వేదాంగాలైన శిక్షావ్యాకరణాదులతో నిండినదై, సంపూర్ణదక్షిణలతో కూడినదై, ధనధాన్యసమేతమై, జగన్నాథుడైన శ్రీకృష్ణునిచే రక్షితమై, సర్వప్రజలకు ఆనందజనకమై రాజసూయం మహామనోహరం కాగా.

**విశేషం:** ఋత్విక్కు - యజమానిచేత యజ్ఞాన్ని చేయించే వేదపండితుడు. ఋత్విక్కులు నలుగురు. వాళ్ళకు సహాయులుగా ఉండే ఋత్విక్కులు పంద్రెండుమంది. నలుగురు ప్రధాన ఋత్విక్కులు - హోత, అధ్వర్యుడు, బ్రహ్మ, ఉద్గాత, పంద్రెండు మంది సహాయ ఋత్విక్కులు - మైత్రావరుణుడు, అచ్ఛావాకుడు, గ్రావస్తుతుడు, ప్రతిప్రస్తోత, నేష్ట, ఉన్నేత, బ్రాహ్మణాచ్ఛంసి, ఆగ్నీధ్రుడు, పోత, ప్రస్తోత, ప్రతిహస్త, సుబ్రహ్మణ్యుడు. ఈ ఋత్విక్కుల క్రమం భిన్నప్రతులలో భిన్నవిధాలుగా ఉంది. నన్నయ వైదిక క్రియాప్రియత ఈ యాజ్ఞికభాగాన్ని మూలాన్ని మించి విపులంగా వర్ణించేటట్లు చేసింది.

**సీ.** **'అమ్మహామఖమునం దగ్నిముఖంబున । విపులమంత్రాహుతివితతిఁజేసి**
**సకలదేవతలును, సంపూర్ణదక్షిణా । దానోత్సవంబున ధరణిసురులు,**
**సముచితసత్కారశతసహస్రంబుల । నఖిలరాజన్యులు, నభిమతాన్న**
**దానంబుపెంపున ధరణీజనంబులుఁ । దద్దయుఁ దృప్తులై ధర్మచరితు**

**ఆ.** **ననఘు ధర్మతనయు ననుజసమన్వితు । సంస్తుతించి రధికసమ్మదమున'**
**నని కురుప్రభునకు నట్లు వైశంపాయ । నోక్తమైన కథ రసోత్కటముగ.** **294**

**ప్రతిపదార్థం:** ఆ+మహా, మఖమునందున్= ఆగొప్పయజ్ఞంలో; అగ్నిముఖంబునన్= అగ్నిహోత్రునియొక్క ముఖంలో; విపుల, మంత్ర+ఆహుతి, వితతిన్, చేసి= అధికంగా హోమం చేసిన మంత్రపూతాలైన ఆహుతుల సమూహంతో; సకల దేవతలును= అందరు దేవతలును; సంపూర్ణ, దక్షిణా, దాన+ఉత్సవంబునన్= నిండుగా దక్షిణలను, దానాలను ఇచ్చే వేడుకతో; ధరణి, సురులు= భూదేవులు - బ్రాహ్మణులు; సముచిత, సత్కార శత, సహస్రంబులన్= తగిన సమ్మానాలు నూరువేలతో; అఖిల రాజన్యులున్= సకలరాజశ్రేష్ఠులును; అభిమత+అన్నదానంబు, పెంపునన్= ఇష్టమైన అన్నదానంయొక్క ఆధిక్యంచేత; ధరణీ జనంబులున్= ప్రజలు; తద్దయున్= మిక్కిలి; తృప్తులు+ఐ= తృప్తిపొందిన వారై; ధర్మచరితున్= ధర్మబద్ధమైన నడవడి కలవాణ్ణి; అనఘున్= పాపరహితుణ్ణి - అంటే పుణ్యాత్ముణ్ణి; ధర్మతనయున్; అనుజ, సమన్వితున్= తమ్ముళ్ళతో కూడుకొన్నవాణ్ణి; అధిక, సమ్మదమునన్= మిక్కిలి సంతోషంతో; సంస్తుతించిరి= లెస్సగా ప్రశంసించారు; అని; కురు ప్రభునకున్= కురువంశ రాజైన జనమేజయునికి; అట్లు= ఆవిధంగా; రస+ఉత్కటముగన్= మిక్కిలి రసవంతంగా-అంటే ఆనందాతిశయం కలిగే తీరున; వైశంపాయన+ఉక్తము+ఐన, కథ= వైశంపాయనమునిచేత చెప్పబడిన కథ.

**తాత్పర్యం:** 'ఆ రాజసూయయాగంలో అగ్నిహోత్రుడిముఖంలో మంత్రపూతాలైన ఆహుతుల్ని అధికంగా వేల్చటంచేత దేవతలు, నిండుగా దక్షిణలు దానాలు ఇవ్వటంచేత బ్రాహ్మణులు, సముచిత సమ్మాన పరంపరలచే వివిధ దేశాధీశులు, అభీష్టమైన అన్నదానం అధికంగా చేయటంచేత సామాన్యప్రజలు పూర్తిగా తృప్తి పొందారు. ధర్మబద్ధమైన నడవడి కలిగి, పుణ్యాత్ముడై, తమ్ముళ్ళతో కూడి ఉన్న ఆ ధర్మరాజును మహానందంతో అందరు అమితంగా ప్రశంసించారు' అని జనమేజయునికి వైశంపాయనుడు ఎంతో రసవంతంగా మహాభారతకథ చెప్పాడు.

## ఆశ్వాసాంతము

**క.** **భూరి గుణ రత్న భూషణ! । నారాయణమూర్తి! రాజనారాయణ! కం**
**ఠీరవ విక్రమ! శారద । నీరద నీహార హీర నిభశుభకీర్తీ! 295**

**ప్రతిపదార్థం:** భూరి, గుణ, రత్న, భూషణ!= గొప్పగుణా లనే రత్నాలు అలంకారాలుగా కలిగినవాడా!; నారాయణమూర్తి= విష్ణు స్వరూపా!; రాజనారాయణ= రాజచంద్రా!; కంఠీరవ, విక్రమ!= సింహంవంటి పరాక్రమం కలవాడా!; శారద నీరద, నీహార, హీర, నిభ, శుభకీర్తి!= శరత్కాలమేఘంతో, మంచుతో, వజ్రమణితో సమానమైన మంచికీర్తి కలవాడా!

**తాత్పర్యం:** గొప్ప గుణాలనే రత్నాలు అలంకారాలుగా కలిగిన వాడా! విష్ణు స్వరూపా! రాజచంద్రా! సింహంవంటి పరాక్రమం కలవాడా! శరత్కాల మేఘంతో, మంచుతో, వజ్రమణితో సమానమైన స్వచ్ఛమైన సత్కీర్తి కలవాడా!

**విశేషం:** ఇది ఆశ్వాసాంతంలో ప్రశంసాపూర్వకంగా చేసిన రాజరాజనరేంద్ర సంబోధన. నన్నయగారు ఆ మహారాజు సుస్వభావాన్ని, విష్ణుత్వాన్ని, రాజశ్రేష్ఠత్వాన్ని, శూరత్వాన్ని, కీర్తినిర్మలత్వాన్ని గొప్పగా ప్రశంసించారు.

**అంబురుహ వృత్తము.**

**రాజకులోత్తమ! రాజమనోహర! రాజసూరి సభాంతర**
**భ్రాజిత సద్గుణ పార్థివశేఖర! పార్థ సన్నిభ! బాంధవాం**
**భోజవనద్యుమణీ! మణికాంచన పుంజ భూషిత! భూమరు**
**ద్రాజసమాజ! పరాక్రమరాఘవ! రాజరాజనరేశ్వరా! 296**

**ప్రతిపదార్థం:** రాజకుల+ఉత్తమ!= రాజవంశంలో శ్రేష్ఠుడవైనవాడా! (రాజ శబ్దానికి చంద్రుడనే అర్థం కూడ ఉంది కాబట్టి రాజరాజనరేంద్రుడు చంద్రవంశపు రాజు కనుక 'చంద్రవంశంలో శ్రేష్ఠుడవైనవాడా!' అని కూడ చెప్పవచ్చు); రాజ, మనోహర!= చంద్రునివలె మనస్సును హరించేవాడా!- అంటే అందరికీ ఆహ్లాదాన్ని కలిగించేవాడా!; రాజ, సూరి, సభా+అంతర, భ్రాజిత, సద్గుణ!= రాజులయొక్క, పండితులయొక్క సభామధ్యంలో ప్రకాశించే మంచి గుణాలు కలవాడా!; పార్థివ, శేఖర!= రాజులకు సిగదండవంటివాడా! - రాజశ్రేష్ఠా!; పార్థ, సన్నిభ!= అర్జునునితో సమానమైనవాడా!; బాంధవ+అంభోజ, వన, ద్యుమణీ!= బంధువు లనే పద్మవనానికి సూర్యుని వంటివాడా!; మణి, కాంచన, పుంజ, భూషిత!= మణులయొక్క, బంగారుయొక్క సమూహంతో అలంకరించబడినవాడా!; భూ, మరుత్+రాజసమాజ!= భూసురుల (బ్రాహ్మణుల)తో కూడుకొన్న రాజసమూహం కలవాడా!; పరాక్రమ, రాఘవ!= పరాక్రమంలో శ్రీరామునితో సమానమైనవాడా!; రాజరాజ, నర+ఈశ్వర!= రాజరాజనరేంద్రా!

**తాత్పర్యం:** రాజవంశంలో ఉత్తముడవైనవాడా! లేదా చంద్రవంశంలో శ్రేష్ఠుడవైనవాడా! చంద్రునిలా ఆహ్లాదం కలిగించేవాడా! రాజులు, పండితులు ఉన్న సభలో శోభిల్లే సద్గుణాలు కలవాడా! రాజులకు శిరోభూషణం వంటివాడా! అర్జునునితో సమానమైనవాడా! బంధువు లనే పద్మవనానికి సూర్యునివంటివాడా, మణిసువర్ణాభరణాలను అలంకరించుకొన్నవాడా! బ్రాహ్మణులతో కూడిన రాజ సమూహం కలవాడా! పరాక్రమంలో శ్రీరామునివంటివాడా! శ్రీ రాజరాజనరేంద్రా!

**విశేషం:** అలం: రూపకం. రాజరాజుయొక్క గుణసంపద, పండితపోషణ, పరాక్రమాధికత, ఇందులో వ్యక్తమవుతున్నాయి. అంబురుహవృత్తంలోని ప్రతిచరణంలోను వరుసగా భ, భ, భ, భ, ర, స, లగ అనే గణాలు ఉంటాయి. 13వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం పాటించబడింది.

**గద్యము.**

> **ఇది సకలసుకవిజనవినుతనన్నయభట్ట ప్రణీతంబయిన శ్రీ మహాభారతంబునందు సభాపర్వంబున ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ, గింకరదర్శనంబును, నారదువలన లోకపాలుర సభాశ్రవణంబును, రాజసూయ మహాధ్వరారంభంబును, జరాసంధవధయు, గిరివ్రజ నిరుద్ధులయిన రాజులం గృష్ణుండు విడిపించుటయు, దిగ్విజయంబును, రాజసూయంబు నన్నది ప్రథమాశ్వాసము. 297**

**తాత్పర్యం:** ఇది ఉత్తమకవిజనులందరి ప్రశంసలందుకొన్న నన్నయభట్టు రచించిన శ్రీమహాభారతంలోని సభాపర్వంలో ధర్మరాజుకు సభ సమకూరటం, కింకరదర్శనం, నారదునివల్ల లోకపాలకుల సభలనుగూర్చి వినటం, రాజసూయ మహాయజ్ఞాన్ని ఆరంభించటం, జరాసంధుని చంపటం, గిరివ్రజపురంలో బందీలై ఉన్న రాజులనందరిని శ్రీకృష్ణుఁడు విడిపించటం, దిగ్విజయం, రాజసూయమున్ను కలది మొదటి ఆశ్వాసం.

**సభాపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం.**



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సభాపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీరమణీప్రియ! ధర్మవి । శారద! వీరావతార! సౌజన్యగుణా**
**ధార! భువనైక సుందర! వీరశ్రీరమ్య! బుధ వివేక నిధానా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ, రమణీ, ప్రియ= లక్ష్మీదేవికి ప్రియమైనవాడా!; ధర్మ, విశారద= ధర్మంలో విద్వాంసుడవైనవాడా!-అంటే ధర్మాన్ని పూర్తిగా తెలిసినవాడా! వీర+అవతార= పరాక్రమం రూపుదాల్చినవాడా! సౌజన్య, గుణ+ఆధార= మంచిగుణాలకు ఆధారమైనవాడా!; భువన+ఏక, సుందర= లోకమంతటికి అందమైనవాడా!; వీరశ్రీ, రమ్య= వీరలక్ష్మిచేత శోభిల్లేవాడా!; బుధ, వివేక, నిధానా= పండిత వివేకానికి నిధివంటివాడా - అంటే పండితులకు ఉండే వివేకాన్ని మెండుగా కలిగినవాడా!

**తాత్పర్యం:** లక్ష్మీదేవికి ప్రియమైనవాడా! ధర్మాన్ని పూర్తిగా తెలిసినవాడా! వీరత్వం రూపుదాల్చినవాడా! మంచిగుణాలకు ఆధారమైనవాడా! లోకాని కంతటికీ అందమైనవాడా! వీరలక్ష్మిచేత శోభిల్లేవాడా! పండితుల కుండే వివేకం మెండుగా కలవాడా! (అని నన్నయగారు ప్రశంసాపూర్వకంగా రాజరాజును సంబోధించి ద్వితీయాశ్వాసాన్ని ప్రారంభించారు.)

### ధర్మజుఁడు శ్రీకృష్ణున కర్ఘ్యం బిచ్చుట (సం. 2-33-10)

వ. **అ క్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె; నట్లు రాజసూయ మహోత్సవంబు నొప్పును ధర్మరాజు ధర్మనిత్యతయును స్తుతియించి నారదుం డా సదంబున సకలరాజసమూహంబును రాజలోకంబులో మనుష్యసామాన్యుండయి యున్న జగన్మాన్యు జనార్దనుం జూచి తొల్లి బ్రహ్మాదిసురగణప్రార్థితుండయి యఖిల మహీభారావతరణార్థంబు నారాయణుండు యదువంశంబున నుదయించుటయు, నయ్యయి క్షత్రియ కులంబుల సురదైత్య దానవ యక్ష రాక్షస గంధర్వాదుల యంశావతారంబులుం దలంచి భవిష్యద్భారత రణంబునకు సంహృష్ట హృదయుండయి యుండు నంత. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= ఆ కథను చెప్పేవాడు - ఉగ్రశ్రవసుడనే మహర్షి; శౌనక+ఆది, మహామునులకున్= శౌనకుడు మొదలయిన మహర్షులకు; చెప్పెన్; అట్లు= ఆ విధంగా; రాజ, సూయ, మహా+ఉత్సవంబు= రాజసూయ యాగమనే గొప్ప ఉత్సవంయొక్క; ఒప్పును= వైభవాన్ని; ధర్మరాజు, ధర్మ, నిత్యతయును= ధర్మరాజు ధర్మంయొక్క ఎడతెగనితనాన్ని; స్తుతియించి= పొగడి; నారదుండు; ఆ, సదంబునన్= ఆ సభలో; సకల, రాజ, సమూహంబును= సమస్తరాజుల సమూహాన్ని; రాజ, లోకంబులోన్= ఆ రాజసమూహంలో; మనుష్య, సామాన్యుండు+అయి= సామాన్యమానవుడై; ఉన్న; జగత్+మాన్యున్= లోకానికి పూజ్యుడైన; జనార్దనున్= శ్రీకృష్ణుని; చూచి; తొల్లి= పూర్వం; బ్రహ్మ+ఆది, సుర, గణ, ప్రార్థితుండు+అయి= బ్రహ్మ మొదలయిన దేవతల సమూహంచేత ప్రార్థించబడినవాడయి; అఖిల, మహీ, భార+అవతరణ+అర్థంబు= సమస్త భూభారాన్ని తగ్గించటం కొరకు; నారాయణుండు= శ్రీమహావిష్ణువు; యదువంశంబునన్= యాదవకులంలో; ఉదయించుటయున్= పుట్టటమూ;

అయ్యయి, క్షత్రియ, కులంబులన్= ఆయా రాజవంశాల్లో; సుర, దైత్య, దానవ, యక్ష, రాక్షస, గంధర్వ+ఆదుల= దేవతలు, దైత్యులు, దానవులు, యక్షులు, రాక్షసులు, గంధర్వులు మొదలయినవాళ్ళయొక్క; అంశ+అవతారంబులున్= అంశాల పుట్టుకలూ; తలంచి= ఆలోచించి; భవిష్యత్+భారత, రణంబునకున్= మున్ముందు జరుగబోయే మహాభారతయుద్ధానికి; సంహృష్ట, హృదయుండు+అయి= సంతోషించిన హృదయం కలవాడయి; ఉండునంతన్= ఉన్నప్పుడు.

**తాత్పర్యం:** ఆ కథను చెప్పే ఉగ్రశ్రవస మహర్షి శౌనకాది మహామునులకు రాజసూయాన్ని గూర్చి ఆ విధంగా చెప్పాడు. నారదమహర్షి రాజసూయ మహోత్సవవైభవాన్ని, ధర్మరాజు శాశ్వత ధర్మపరాయణత్వాన్ని ప్రశంసించాడు. ఆ సభలో సకలరాజ సమూహాన్నీ, ఆ రాజసమూహంలో సామాన్య మానవునివలె ఉన్న లోకపూజ్యుడైన శ్రీకృష్ణుణ్ణీ చూచాడు. పూర్వం బ్రహ్మాది దేవతలు ప్రార్థించగా భూభారాన్ని తగ్గించటానికై శ్రీమహావిష్ణువు యదుకులంలో ఉదయించటాన్ని, సురదైత్య దానవ యక్ష రాక్షస గంధర్వాదుల అంశాలు ఆ యా క్షత్రియకులాల్లో జన్మించటాన్ని ఆలోచించాడు. రాబోయే మహాభారత యుద్ధానికి అంతరంగంలో సంతోషించాడు. అప్పుడు

**విశేషం:** దైత్యులు - కశ్యపునికి దితికి కలిగిన సంతానం. దానవులు - కశ్యపునికి దనువుకు కలిగిన సంతానం.

**క. శాంతనవుఁడు భీష్ముండు ప్ర । శాంతుఁడు దత్క్రతువు సూచి సంతుష్టుండై**
**యంతక తనూజునకు ధృతి । మంతున కత్యంత ధర్మమతి కి ట్లనియెన్. 3**

**ప్రతిపదార్థం:** శాంతనవుఁడు= శంతనుని కుమారుడు; ప్రశాంతుఁడు= మిక్కిలి శాంతం కలవాడు; (అయిన) భీష్ముండు; తత్+క్రతువు= ఆ రాజసూయయాగాన్ని; చూచి; సంతుష్టుండు+ఐ= పూర్తిగా తృప్తిపొందినవాడై; ధృతిమంతునకున్= ధైర్యంతో కూడుకొన్నవానికి; అత్యంత, ధర్మ, మతికిన్= ఎంతో ఎక్కువగా ధర్మంలో నిలిపిన బుద్ధి కలవానికి; అంతక, తనూజునకున్= యమధర్మరాజు కుమారుడయిన ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఎంతో శాంతస్వభావం కలవాడు, శంతనుని కుమారుడు, అయిన భీష్ముడు రాజసూయ యాగాన్ని చూచి సంతృప్తి పొంది - ధైర్యవంతుడు, ధర్మపరాయణుడు అయిన ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**విశేషం:** సంస్కృత సంప్రదాయాన్ని అనుసరించి నన్నయగారు 'అంతక తనూజునకు' అనే విశేష్యం తరువాత అదే విభక్తిలో 'ధృతిమంతునకు', 'అత్యంతధర్మమతికి' అనే విశేషణాలు వాడటం గమనించ దగింది.

**మత్తకోకిలము.**

**స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్**
**భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు; వీరిలోఁ**
**బ్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టి మహాత్ము వి**
**ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌరవాన్వయవర్ధనా! 4**

**ప్రతిపదార్థం:** కౌరవ+అన్వయ, వర్ధనా= కౌరవవంశాన్ని వృద్ధిపొందించేవాడా! - ధర్మరాజా!; స్నాతకుండును= స్నాతకవ్రతశీలుడూ; ఋత్విజుండును= యజ్ఞం చేయించేవాడూ; సత్+గురుండును= ఉత్తముడైన గురువూ; ఇష్టుఁడున్= మిక్కిలి ఇష్టమైనవాడూ;

భూతల+ఈశుఁడు= భూపతీ - అంటే రాజా; సంయుజుండును= జ్ఞానీ; పూజనీయులు= పూజించదగినవాళ్ళు; వీరిలోన్= ఈ ఆర్గురిలో; ఎవ్వఁడు; సత్+గుణంబులన్= మంచిగుణాలచేత; పెద్ద= ఎక్కువవాడో; అట్టి; మహాత్మున్= మహాత్ముణ్ణి; విఖ్యాతున్= ప్రసిద్ధుడైనవాణ్ణి; ఒక్కనిన్; ప్రీతిన్= ప్రేమతో; పూజితున్+చేయుము= పూజించబడినవాణ్ణిగా చేయుము - అంటే పూజించుము.

**తాత్పర్యం:** కురువంశవర్ధనా! ఓధర్మరాజా! స్నాతకుడు, ఋత్విజుడు, సద్గురుడు, ఇష్టుడు, భూపాలుడు, జ్ఞానసంపన్నుడు - పూజించదగినవాళ్ళు. ఈ ఆర్గురిలో సద్గుణాలచేత ఎవడు అధికుడో అలాంటి వాణ్ణి ఒక్కణ్ణి ప్రేమతోపూజించు.

**విశేషం:** తొమ్మిదివిధాలైన వ్రతుల్లో స్నానశీలవ్రతుడు స్నాతకుడు. 'సంయుజుండును' అనేదానికి ఉన్న పాఠాంతరం 'సంయమీంద్రుడు' కూడ స్వీకరింపదగిందే. ధర్మరాజు రాజసూయంలో కృతాకృత పరిజ్ఞానంలో భీష్మద్రోణులను నియమించాడు. కనుక తదనుగుణంగా భీష్ముడు పూజించదగిన వ్యక్తి విషయాన్ని ప్రస్తావించటం ఉచితంగా ఉన్నది. పూజ్యులైన వారిని వివేచించి చెప్పి, 'వాళ్ళందరిలో ఎవడు గొప్పవాడో, ఎవడు మహాత్ముడో, ఎవడు లోకవిఖ్యాతుడో అతణ్ణి పూజించు' అని శ్రీకృష్ణుణ్ణి స్ఫురించేటట్లు చెప్పిన భీష్ముని మాటనేర్పు అద్భుతం. ఈ పద్యంలో నన్నయ పృథక్పదత్వంతో మాధుర్యగుణాన్ని మనోజ్ఞంగా పోషించాడు.

**వ. అనిన 'నట్టివాఁ డెవ్వండు నా కెఱిఁగింపు' మనిన ధర్మరాజునకు భీష్ముం డి ట్లనియె. 5**

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు 'అటువంటివాడు ఎవడో నాకు తెలియచెప్పు' అన్నాడు. అందుకు భీష్ముడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**సీ. రోదసీకుహరంబు రుచిరాంశుతతిఁ జేసి । యర్కుండు వెలిఁగించు నట్లు; లమృత**
**సందోహ నిష్యంద చంద్రికఁ జేసి శీ । తాంశుఁ డానందించు నట్లు; సకల**
**జనులకుఁ దనదైన సదమలద్యుతిఁ జేసి । తనరంగఁ దేజంబుఁ దనుపుఁ దాన**
**చేయుచునున్న సత్సేవ్యుండు పుండరీ । కాక్షుండు గృష్ణుఁ డనాదినిధనుఁ**

**ఆ. డబ్జనాభుఁ డుండ; నర్ఘ్యంబునకు నిందు । నర్హు లొరులు గలరె? యజ్ఞపురుషు**
**నఖిలలోకపూజ్యు నచ్యుతుఁ బూజింపు । మధిప! యదియ చూవె యజ్ఞఫలము. 6**

**ప్రతిపదార్థం:** అర్కుండు= సూర్యుడు; రుచిర+అంశు, తతిన్+చేసి= కాంతిమంతమైన కిరణాలయొక్క సమూహంచేత; రోదసీ, కుహరంబు= అంతరిక్షమనే గుహను; వెలిఁగించునట్టులు; శీత+అంశుఁడు= చల్లని కిరణాలు కలవాడు-చంద్రుడు; అమృత, సందోహ, నిష్యంద, చంద్రికన్+చేసి= అమృత సమూహాన్ని స్రవింపచేసే వెన్నెలచేత; ఆనందించునట్టు= ఆనందింపజేసేటట్లు; సకల, జనులకున్, తనది+ఐన; సత్+అమల, ద్యుతిన్+చేసి= మంచి స్వచ్ఛమైన కాంతిచేత; తనరంగన్= అతిశయించగా; తేజంబున్= వెలుగును; తనుపున్= తృప్తిని; తాను+అ= తానే; చేయుచున్+ఉన్న; సత్+సేవ్యుండు= సత్పురుషులు సేవించదగినవాడు; పుండరీక+అక్షుండు= తెల్లదామరలవంటి కన్నులు కలవాడు; అనాది, నిధనుఁడు= ఆది, అంతం లేనివాడు-అంటే జనన మరణాలు లేనివాడు; అబ్జనాభుఁడు= నీటినుండి పుట్టిన పద్మాన్ని నాభి(బొడ్డు)లో కలవాడు-కృష్ణుడు; ఉండన్= ఉండగా; అర్ఘ్యంబునకున్; ఇందున్= ఇచట; అర్హులు= తగినవాళ్ళు; ఒరులు= ఇతరులు; కలరె= కలరా?; అధిప= ధర్మరాజా!; యజ్ఞ, పురుషున్= యజ్ఞంలో పూజించదగిన ప్రధానపురుషుణ్ణి; అఖిలలోక, పూజ్యున్= అన్నిలోకాలు పూజించదగినవాణ్ణి; అచ్యుతున్= పతనం లేనివాణ్ణి - శ్రీకృష్ణుణ్ణి; పూజింపుము; యజ్ఞఫలము; అదియ, చూవె= అదే సుమా!

**తాత్పర్యం:** సూర్యుడు కాంతిమంతమైన తన కిరణసమూహంతో అంతరిక్షగుహను వెలిగించేటట్లు, చల్లనికిరణాలుగల చంద్రుడు అమృతసమూహాన్ని స్రవించే వెన్నెలచేత ఆనందింపజేసేటట్లు - అందరు మానవులను తనదైన నిర్మలకాంతితో వెలిగిస్తూ, తృప్తిపరుస్తూ, సత్పురుషులచేత సేవించదగినవాడు, తెల్లదామరలవంటి కన్నులు కలవాడు, ఆద్యంతాలు లేనివాడు, పద్మాన్ని నాభిలో కలవాడు అయిన విష్ణుస్వరూపుడు శ్రీకృష్ణు డుండగా - అర్ఘ్యప్రదానానికి అర్హులైనవాళ్ళు ఇక్కడ ఇంకెవ రున్నారు? ధర్మరాజా! యజ్ఞపురుషుడు, సర్వలోకపూజ్యుడు, అచ్యుతుడు అయిన శ్రీకృష్ణుణ్ణి పూజించు. అదే సుమా యజ్ఞఫలం!

**విశేషం:** అలం: ఉపమ. ఇందు శ్రీకృష్ణునికి వాడిన విశేషణాలన్నీ విష్ణుమూర్తికి సంబంధించినవే! శ్రీకృష్ణుడు విష్ణుమూర్తి అవతారం కనుక అవి అన్నీ ఆయనకు అన్వయించేవే.

**వ. అనిన భీష్మవచనంబున నప్పుడు సహదేవోపనీతంబయిన యర్ఘ్యం బర్ఘణీయుండయిన వాసుదేవునకు శాస్త్రదృష్ట విధానంబున ధర్మతనయుం డిచ్చిన, దానింజూచి సహింపక శిశుపాలుం డుపాలంభనపరుం డయి యధోక్షజు నాక్షేపించుచు ధర్మరాజున కిట్లనియె. 7**

**ప్రతిపదార్థం:** అనిన; భీష్మ, వచనంబునన్= భీష్మునిమాటప్రకారం, సహదేవ+ఉపనీతంబు+అయిన= సహదేవునిచేత తీసుకొనిరాబడిన; అర్ఘ్యంబు; అర్ఘణీయుండు+అయిన= పూజించదగినవాడయిన; వాసుదేవునకున్= శ్రీకృష్ణునికి; శాస్త్ర, దృష్ట, విధానంబునన్= శాస్త్రంలో చూడబడిన పద్ధతితో - అంటే శాస్త్రంలో చెప్పబడిన పద్ధతి ప్రకారం; ధర్మతనయుండు, ఇచ్చినన్; దానిన్; చూచి; సహింపక= ఓర్వక; శిశుపాలుండు; ఉపాలంభన పరుండు+అయి= నిందించే స్వభావం కలవాడయి; అధోక్షజున్= శ్రీకృష్ణుని; ఆక్షేపించుచున్= తప్పులు పడుతూ - దూషిస్తూ; ధర్మరాజునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** భీష్ముని మాటను అనుసరించి ధర్మరాజు - సహదేవుడు తెచ్చిన అర్ఘ్యాన్ని పూజార్హుడైన శ్రీకృష్ణునికి శాస్త్రోక్త పద్ధతి ప్రకారం సమర్పించాడు. దాన్ని చూచి సహించలేక శిశుపాలుడు శ్రీకృష్ణుణ్ణి నిందిస్తూ ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**విశేషం:** సంస్కృతభారతంలో పై వచనానికి ముందు శ్రీకృష్ణుని విష్ణుతత్త్వాన్ని చెప్పటానికి, తక్కిన అవతారాల్లో ఆయన సాధించిన ఘనకార్యాలు సుదీర్ఘంగా వర్ణించబడ్డాయి. నన్నయ ఆ వర్ణనను వదలివేశాడు. ఇంతవరకు ప్రశాంతసుందరంగా, సరళరేఖలా సాగిపోయే రాజసూయం, ఉన్నట్టుండి ఈ అర్ఘ్యప్రదానఘట్టంతో పెద్దమలుపు తిరుగుతుంది. పాఠకుని ఆసక్తి ఆ మలుపు మీదికి తిరుగుతుందిగాని, ఎంత చెప్పినా విష్ణుమూర్తి అవతారవర్ణనమీద నిలవదు. అంతటి శ్రీకృష్ణుణ్ణి ఆ శిశుపాలుడు అప్పుడు ఏమని అధిక్షేపించాడో, దానిపరిణామం ఎలా ఉంటుందో తెలుసుకోవాలని పాఠకుడు ఉవ్విళ్ళూరుతాడు. అందుచేతనే నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తిమీద దృష్టి నిలిపి, ఆ వర్ణనను పరిహరించి, పాఠకుని ఆసక్తిని అనుసరించి, శిశుపాలుని అధిక్షేపాన్నీ, దానిపరిణామాన్నీ వర్ణించటం జరిగింది.

### శిశుపాలుఁడు ధర్మరాజు నాక్షేపించుట (సం. 2-34-1)

**మ. అవనీనాథు లనేకు లుండఁగ విశిష్టారాధ్యు లార్యుల్ మహీ**
**దివిజుల్ పూజ్యులు పల్వు రుండఁగ ధరిత్రీనాథ! గాంగేయు దు**
**ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితున్ వార్ష్ణేయుఁ బూజించి నీ**
**యవివేకం బెఱిఁగించి తిందఱకు; దాశార్హుండు పూజార్హుఁడే? 8**

**ప్రతిపదార్థం:** ధరిత్రీనాథ= ఓ ధర్మరాజా! అవనీనాథులు+అనేకులు+ఉండఁగన్= రాజులు పెక్కుమంది ఉండగా; విశిష్ట+ఆరాధ్యులు+ఆర్యుల్= విశేషంగా పూజించదగిన పెద్దలు; మహీదివిజుల్= భూసురులు - బ్రాహ్మణులు; పూజ్యులు= పూజించదగినవాళ్ళు; పలువురు+ఉండఁగన్= పెక్కుమంది ఉండగా; గాంగేయు, దుర్+వ్యవసాయంబునన్= గంగాపుత్రుడైన భీష్మునియొక్క చెడు నిర్ణయాన్ని అనుసరించి; కష్ట, చరితున్= చెడు నడవడి కలవాణ్ణి; వార్ష్ణేయున్= వృష్ణి అనే వాని వంశంలో జన్మించిన వాణ్ణి, కృష్ణున్; పూజించి; నీ, అవివేకంబున్= నీయొక్క తెలివితక్కువతనాన్ని; ఇందఱకున్= ఇంతమందికి; ఎఱిఁగించితి= తెలియజేశావు; దాశార్హుండు= దశార్హసంతతివాడు, యాదవుడు అయిన శ్రీకృష్ణుడు; పూజా+అర్హుఁడే= పూజించటానికి తగినవాడా?

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఈ సభలో ఎందరో మహారాజు లుండగా, విశేషంగా పూజించదగిన పెద్దలు, బ్రాహ్మణులు పెక్కుమంది ఉండగా, భీష్మని చెడు నిర్ణయాన్ని అనుసరించి, వృష్ణివంశంవాడు, చెడు ప్రవర్తన కలవాడు అయిన శ్రీకృష్ణణ్ణి పూజించి, నీ తెలివితక్కువతనాన్ని ఇంతమందికి తెలియజేశావుగాని - ఆ దాశార్హుడు పూజార్హుడా?

**విశేషం:** యాదవులు యయాతిశాపంచేత రాజ్యానర్హులు. ఆ యాదవవంశాల్లో వృష్ణివంశం ఒకటి. దశార్హవంశం మరొకటి. రాజ్యానర్హుడై, తక్కువజాతికి చెందిన వృష్ణివంశంవాడు, చెడుప్రవర్తన కలవాడు అయిన శ్రీకృష్ణుడినా నీవు పూజించటం అని అధిక్షేపం. (దాశార్హుడు) పూజార్హుడు కాడని నిందించటం - శిశుపాలుని అధిక్షేపవాక్యాల్ని నన్నయ అర్థవ్యక్తి అనే శబ్దగుణంచేత విశిష్టంగా రచించాడు. శ్రీకృష్ణుడు పూజార్హుడు కాడనే విషయాన్ని సహేతుకంగా నిరూపించాలనే వాదన ఇందులో ముఖ్యం. తనవాదంలోని తాత్పర్యం ఝటితిస్ఫూర్తితో శ్రోతలు గ్రహించగలిగే అర్థవ్యక్తిహేతుత్వాన్ని శిశుపాలుని మాటల్లో నన్నయ నిబంధించాడు - సంపా.)

**చ.** **కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము; ధర్మబాహ్యు ని**
**న్నొడఁబడ నిష్టుఁడై కఱపి యుత్తము లుండఁగ వాసుదేవుఁ డ**
**న్జడునకుఁ బూజ యిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁ డెంతయున్**
**వెడఁగుఁదనంబునం బనిచె; వృద్ధులబుద్ధులు సంచలింపవే.** **9**

**ప్రతిపదార్థం:** కడుకొని= పూనుకొని; ధర్మతత్త్వము= ధర్మంయొక్క పరమార్థం; ఎఱుఁగంగన్= తెలుసుకోటానికి; అశక్యము= అసాధ్యము; విచారవిదూరుఁడు= ఆలోచనకు దూరమైనవాడు-అంటే తగిన ఆలోచన లేనివాడు; భీష్ముఁడు; ఎంతయున్= మిక్కిలి; వెడఁగు, తనంబునన్= అవివేకంతో; ఉత్తములు+ఉండఁగన్= శ్రేష్ఠులైనవాళ్ళు సభలో ఉండగా; వాసుదేవుఁడు+అన్+జడునకున్= వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణుడు అనే బుద్ధిహీనుడికి; పూజ= అర్ఘ్యం; ఇమ్ము; అని; ధర్మబాహ్యున్= ధర్మానికి దూరమైనవాడివైన; నిన్నున్; ఒడఁబడన్= సమ్మతించేటట్లు; ఇష్టుఁడై= (నీకు)ఇష్టమైనవాడై; కఱపి= బోధించి; పనిచెన్= ఆదేశించాడు; వృద్ధుల, బుద్ధులు; సంచలింపవే= చలిస్తాయికదా! - అంటే చక్కగా పనిచేయవుగదా!

**తాత్పర్యం:** ధర్మతత్త్వాన్ని తెలుసుకోవటం అసాధ్యం. భీష్ముడు ఆలోచన సరిగా లేనివాడు. అందుకే ఎందరో మహానుభావులు ఈ సభలో ఉంటే, అవివేకంగా ఆ శ్రీకృష్ణ డనే బుద్ధిహీనుడికి అర్ఘ్యం ఇమ్మని, ధర్మబాహ్యుడి వైన నిన్ను సమ్మతింపచేశాడు. వృద్ధుల బుద్ధులు నిలకడగా ఉండవుకదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. శిశుపాలుని అహంకారం, ఆక్షేపణం అంతకంతకు శ్రుతిమించుతున్నాయి. మొదట శ్రీకృష్ణణ్ణి నిందించాడు. తరువాత ధర్మరాజునే ధర్మబాహ్యుడి వన్నాడు. పిమ్మట కురుపితామహుడైన భీష్మణ్ణే విచారవిదూరు

డని, అవివేకి అని, వృద్ధుల బుద్ధులు సంచలింపవే - అని తూలనాడాడు. ఫలితం అనుభవించటానికి పాపం పండాలికదా! ఈ పద్యంలోకూడా అర్థవ్యక్తిగుణం సార్థకంగా పోషించబడింది.

**చ. ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తు రభీష్టములైన కార్యముల్**
**మతి నొనరింతు రిష్టుఁడని మంతురుగాక, మహాత్ములైన భూ**
**పతులయు విప్రముఖ్యులసభన్ విధిదృష్ట విశిష్ట పూజనా**
**యతికి ననర్హు నర్హుఁ డని యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే? 10**

**ప్రతిపదార్థం:** ఇతనికిన్= ఈ శ్రీకృష్ణునికి, కూర్చుదురు+ఏనిన్= (మీరు అంతగా) కావలసినవాళ్ళయితే; ధనము+ఇత్తురు= ధనాన్ని ఇస్తారుకాని; అభి+ఇష్టములు+ఐన= మిక్కిలి ప్రీతికరాలైన; కార్యముల్= పనులు; మతిన్= మనసార; ఒనరించుదురు= చేస్తే చేస్తారుకాని; ఇష్టుఁడు+అని= ఇష్టమైనవాడని; మంతురు (మనుచుదురు) కాక= పోషిస్తే పోషిస్తారు కాక; మహాత్ములు+ఐన= మిక్కిలి గొప్పవాళ్ళయిన; భూపతులయు= మహారాజులయొక్క; విప్రముఖ్యుల= బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క; సభన్= సభలో; విధి, దృష్ట, విశిష్ట, పూజన+ఆయతికిన్= శాస్త్రంలో చెప్పబడిన గొప్ప పూజను పొందటానికి; అనర్హున్= యోగ్యత లేనివాణ్ణి; అర్హుఁడు+అని= యోగ్యుడని; అచ్యుతున్= శ్రీకృష్ణుణ్ణి; అర్చితున్+చేయన్= పూజించటం; పాడియే= న్యాయమా?

**తాత్పర్యం:** శ్రీకృష్ణునికి మీరు స్నేహితులైతే ఒంటరిగా మీ ఇంటికి పిలిచి ధనమిస్తే ఇవ్వండి. ఆయనకు ప్రీతికరాలైన పనులు మనసార చేస్తే చెయ్యండి. ఇష్టుడుకదా అని పోషిస్తే పోషించండి. అంతేకాని, మహాత్ములైన మహారాజులు, బ్రాహ్మణశ్రేష్ఠులు ఉండే ఈ మహాసభలో - శాస్త్రంలో చెప్పబడిన ఈ గొప్పపూజ పొందటానికి ఏమాత్రం యోగ్యత లేని అతణ్ణి యోగ్యు డని పూజించటం ఏంన్యాయం? (కాదని భావం).

**విశేషం:** అలంకారాదులచేత అయిన ఉక్తిప్రౌఢత లేకుండా అర్థశక్తివలన ప్రతీయమాన మయ్యే ధ్వని వాక్యాశ్రితంగా ఇందులో పోషింపబడింది. దీనిని స్వతస్సంభవ్యర్థశక్తికృతానురణనధ్వని అంటారు. శిశుపాలుడు ప్రదర్శించే ఈర్ష్యా క్రోధాది భావాలకు ఈ వాక్యార్థాలు పోషకంగా ఉన్నాయి. వీటిలో అర్థవ్యక్తి అనేగుణం పోషింపబడింది. ఇది నన్నయగారి రసభావధ్వనిపోషణకు చక్కని ఉదాహరణ. ఈ పద్యంలోని కొన్నివాక్యాలు బహుళప్రచారం పొందాయి. తెలుగువారి దైనందిన వ్యవహారంలోకూడా చోటుచేసికొన్నాయి. (సంపా.)

**సీ. ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే। వసుదేవుఁ డుండంగ వసుమతీశ!**
**ఋత్విజుం డని విచారించి పూజించితే। ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి;**
**యాచార్యుఁ డని వినయమునఁ బూజించితే। కృతమతుల్ ద్రోణుండుఁ గృపుఁడు నుండ;**
**భూనాథుఁ డనియెడు బుద్ధిఁ బూజించితే। యాదవుల్ రాజులే యవనిమీఁదఁ;**

**ఆ. బూజనీయులైన పురుషులలోపల। నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁ? డిట్టు లేల**
**పూజ్యులయినవారిఁ బూజింపనొల్లక। భీష్ము పనుపుఁ జేసి బేల వయితి. 11**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ= భూనాథా! ఓ ధర్మరాజా!; ఈతనిన్= ఈ శ్రీకృష్ణుణ్ణి; వృద్ధు+అని= పెద్దవాడని; ఎఱిఁగి= గుర్తించి; పూజించితి+ఏ= పూజించావా!; వసుదేవుఁడు= శ్రీకృష్ణుని తండ్రిఅయిన వసుదేవుడు; ఉండంగన్= ఈ సభలో ఉండగా; ఋత్విజుండు+అని= యజ్ఞం చేయించేవాడని; విచారించి= ఆలోచించి; ధర్మయుక్తిన్= ధర్మపద్ధతిని; పూజించితి+ఏ=

పూజించావా! కృష్ణద్వైపాయనుండు+ఉండన్= వేదవ్యాస మునీంద్రుడే ఈసభలో ఉండగా; అచార్యుఁడు+అని= గురువని; వినయమునన్= వినయభావంతో; పూజించితి+ఏ= పూజించావా? కృతమతుల్= గొప్పబుద్ధిశాలురైన; ద్రోణుండు; కృపుఁడున్; ఉండన్= ఉండగా; భూనాథుఁడు+అనియెడు= రాజు అనే; బుద్ధిన్= ఉద్దేశంతో; పూజించితే; అవనిమీఁదన్= భూమిమీద; యాదవుల్= యదువంశీయులు; రాజులే= రాజులా? పూజనీయులు+ఐన= పూజించదగినవాళ్ళయిన; పురుషులలోపలన్; కృష్ణుఁడు; ఎవ్వఁడు+అయ్యెన్= ఎవడై ఉన్నాడు? ఇట్టులన్= ఈ విధంగా; ఏల= ఎందుచేత; పూజ్యులు+అయిన, వారిన్= పూజించదగినవాళ్ళను; పూజింపన్+ఒల్లక= పూజించటానికి ఇష్టపడక; భీష్ము, పనుపున్+చేసి= భీష్ముని ఆజ్ఞచేత; బేలవు+అయితి= మూర్ఖుడి వయ్యావు.

**తాత్పర్యం:** ధర్మరాజా! శ్రీకృష్ణుణ్ణి వృద్ధుడని గుర్తించి పూజించావా? సభలో ఆయన తండ్రి వసుదేవుడే ఉన్నాడుకదా! ఋత్విజు డని ఆలోచించి పూజించావా? సభలో వేదవ్యాస మునీంద్రులే ఉన్నారుకదా! గురువుగా రని వినయంతో పూజించావా? సభలో మహామేధావులైన ద్రోణాచార్య కృపాచార్యులే ఉన్నారుకదా! మహారాజు అని పూజించావా? భూమిమీద యాదవులు రాజులా? ఈ విధంగా పూజించదగిన పురుషుల్లో శ్రీకృష్ణుడు ఎవ డని పూజించావు? పూజించవలసినవాళ్ళను పూజించక, భీష్ముడు చెప్పినమాటలు విని శ్రీకృష్ణుణ్ణి పూజించి మూఢుడి వనిపించుకొన్నావు.

**విశేషం:** మూఢునికి కాళిదాసు చెప్పిన నిర్వచనం: 'మూఢః పరప్రత్యయనేయబుద్ధిః' - ఇతరులు చెప్పింది నమ్మే బుద్ధి గలవాడు. (ఈ పద్యంలోని వాక్యాంత కాకువు, తద్ధిత ప్రయోగాలూ వ్యంజకాలై శిశుపాలుని అసూయను ధ్వనింపచేస్తున్నాయి. అసూయకున్న ప్రధానలక్షణం-గుణాల్లో సైతం దోషారోపణచెయ్యటం. 'అక్షాంతిరీర్ష్యాఽసూయాతు దోషారోపో గుణేష్వపి' - అని అమరకోశం. శిశుపాలు డీలక్షణాన్ని పుష్కలంగా ప్రదర్శిస్తున్నాడు. ఈ సీసపద్యరచనలో ప్రతిపాదంలో పూర్వార్ధం ఆరోహగతిలో, ఉత్తరార్ధం అవరోహగతిలో సాగటంతో సమాధిగుణం సంపన్నమైంది. - సంపా.)

**చ.** **పురుష విశేష విత్తముఁడు పూజ్యుఁడు రాజులలోన నీయుధి**
**ష్ఠిరుఁ డని నీ గుణాళి ప్రకటించి మనంబులలోన ధారుణీ**
**శ్వరులు భవన్మఖంబునకు వచ్చిన నిందఱ కివ్విధంబునం**
**బరఁగ నవజ్ఞ సేయు టిది పాడియె ధర్మువె ధర్మనందనా!** **12**

**ప్రతిపదార్థం:** ధర్మనందనా= ఓ ధర్మరాజా!; ఈ, యుధిష్ఠిరుఁడు; పురుష, విశేష విత్తముఁడు= పురుషు లందరిలో గొప్పపేరు పొందినవాడు; రాజులలోనన్; పూజ్యుఁడు= పూజించతగినవాడు; అని; నీ= నీయొక్క; గుణ+ఆళిన్= సుగుణాల సమూహాన్ని; ధారుణీ+ఈశ్వరులు= భూపతులు-రాజులు; మనంబులలోనన్= మనస్సులలో; ప్రకటించి= స్పష్టపరుచుకొని; భవత్+ మఖంబునకున్= నీయొక్క యాగానికి; వచ్చినన్= రాగా; ఇందఱకున్= ఇంతమందికి; ఈ+విధంబునన్; పరఁగన్= పెద్దగా; అవజ్ఞ, చేయుట= అవమానం చేయటం; ఇది; పాడియె= న్యాయమా? ధర్మువె= ధర్మమా? (కాదని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజా! యుధిష్ఠిరుడు పురుషులందరిలో విశేషంగా పేరుపొందినవా డని, రాజుల్లో ఎంతో పూజ్యు డని, నీ సుగుణాలను స్పష్టంగా తెలుసుకొని, రాజులందరు నీ యజ్ఞానికి రాగా - ఇందరిని ఈ విధంగా ఇంత అవమానంపాలు చెయ్యటం నీకు న్యాయమా? ధర్మమా?

**విశేషం:** 'పురుషవిశేషవిత్తముఁడు' అనేదానికి 'పురుషవరేణ్యుఁ డుత్తముఁడు', 'పురుషవిశేషయుత్తముఁడు', 'పురుషవివేక సత్తముఁడు' అనే పాఠాంతరా లున్నాయి. (ధర్మువె, ధర్మనందనా- అని అనటంలో దెప్పిపొడుపు ధ్వనిస్తున్నది. శ్లేష అనే శబ్దగుణం శిశుపాలుడి వాక్యరచనకు మస్పృణత్వాన్ని కలిగిస్తూ మృదువుగా మందలిస్తున్న వైఖరిని ప్రదర్శిస్తున్నది. - సంపా.)

**క.** **నీ వెఱుఁగక యిచ్చిన నిది । నా విషయమె యని మనంబునం దలఁపక ల**
**జ్జా విరహితుఁ డయి యర్ఘ్యము । గోవిందుఁడు గొనియెఁ; దనకుఁ గొను టుచితంబే? 13**

**ప్రతిపదార్థం:** నీవు; ఎఱుఁగక= తెలియక; ఇచ్చినన్; ఇది; నా, విషయమె, అని= నేను పొందదగినదా అని; మనంబునన్= మనసులో; తలఁపక= ఆలోచించక; లజ్జా, విరహితుఁడు+అయి= సిగ్గులేనివాడై; గోవిందుఁడు= శ్రీకృష్ణుడు; అర్ఘ్యము; కొనియెన్= తీసుకొన్నాడు; తనకున్; కొనుట= తీసుకోవటం; ఉచితంబే= తగిఉన్నదా? (లేదని భావం)

**తాత్పర్యం:** నీవు అజ్ఞానంతో ఇచ్చినా, ఇందుకు నేను తగుదునా అని ఆలోచించకుండా శ్రీకృష్ణుడు సిగ్గులేక అర్ఘ్యాన్ని స్వీకరించాడు. అలా తీసుకోవటం అతనికి ఉచితమా?

**క.** **చనఁ బేడికి దారక్రియ । యును, జెవిటికి మధురగీతియును, జీకునక**
**త్యనుపమ సురూపదర్శన । మును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించు టిలన్. 14**

**ప్రతిపదార్థం:** ఇలన్= భూమిలో; కృష్ణున్; పూజించుట; చనన్= తగునని; పేడికిన్= నపుంసకునికి; దార, క్రియయును= పెండ్లి; చెవిటికిన్, మధురగీతియును= కమ్మని పాటా; చీకునకున్= గ్రుడ్డివాడికి; అతి+అనుపమ, సురూప, దర్శనమును= సాటిలేని సుందరరూపాన్ని చూపటం; చేయుటన్; పోలున్.

**తాత్పర్యం:** ఈ భూమిమీద శ్రీకృష్ణుణ్ణి పూజించటం - నపుంసకుడికి పెండ్లిచేయటంలాంటిది. చెవిటివాడికి కమ్మనిపాట వినిపించటంలాంటిది. గ్రుడ్డివాడికి అందమైనరూపాన్ని చూపించటంలాంటిది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ.** **'ఈ యవనీశ్వర ప్రవరు లిందఱు నిన్ను నగంగ నిట్లుగాఁ**
**జేయుదె ధర్మరా జను విశేషసమాఖ్య నిరర్థకంబుగా**
**ధీయుత!' యంచు ధర్మజ నదీసుత కృష్ణుల నెగ్గులాడుచుం**
**బోయె సదంబు వెల్వడి సపుత్త్రబలుండయి చైద్యుఁ డల్కతోన్. 15**

**ప్రతిపదార్థం:** చైద్యుఁడు= చేదిరాజైన శిశుపాలుడు; ధీయుత= బుద్ధిమంతుడవైన ఓ ధర్మరాజా! ఈ, అవనీ+ఈశ్వర, ప్రవరులు= ఈ రాజశ్రేష్ఠులు; ఇందరు= ఇంతమంది; నిన్ను, నగంగన్= నిన్ను చూచి నవ్వగా; ధర్మరాజు+అను; విశేష, సమాఖ్య= ప్రత్యేకమైన పేరు; నిరర్థకంబుగాన్= వ్యర్థమయ్యేటట్లుగా; ఇట్లు, కాన్= ఈవిధంగా; చేయుదు+ఎ= చేస్తావా? అంచున్, ధర్మజ, నదీసుత, కృష్ణులన్= ధర్మరాజును, గంగానదీసుతు డైన భీష్ముణ్ణి, శ్రీకృష్ణుని; ఎగ్గులు+ఆడుచున్= నిందిస్తూ; సపుత్త్రబలుండు+అయి= పుత్త్రులతో, పరివారంతో కూడుకొన్నవాడయి; అల్కతోన్= కోపంతో; సదంబు; వెల్వడి= సభనుండి బయటికి వచ్చి; పోయెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** చేదిరాజైన శిశుపాలుడు - 'బుద్ధిమంతుడా!' అని ధర్మరాజును ఎత్తిపొడుపుగా సంబోధించి, 'ఈ రాజశ్రేష్ఠులు ఇంతమంది నిన్ను చూచి నవ్వేటట్లు, ధర్మరా జనే నీ ప్రత్యేకనామం వ్యర్థం అయ్యేటట్లు ఈ విధంగా చేశావా?' అంటూ ధర్మజ భీష్మ కృష్ణులను నిందిస్తూ కోపోద్రిక్తుడై పుత్రులతో, బలగంతోగూడి సభనుండి వెళ్ళిపోయాడు.

**విశేషం:** ఈ పద్యంలో అగ్రామ్యత్వంవలన ఉదారత అనే అర్థగుణం రాణిస్తున్నది. (సంపా.)

**వ. ఆ శిశుపాలు పిఱుందన చని ధర్మనందనుండు వానిం బ్రియవచనంబుల ననునయించుచు ని ట్లనియె. 16**

**ప్రతిపదార్థం:** ధర్మనందనుండు; ఆ, శిశుపాలు= ఆ శిశుపాలునియొక్క; పిఱుందన= వెనుకనే; చని= వెళ్ళి; వానిన్; ప్రియ, వచనంబులన్= ఇంపైన మాటలతో; అనునయించుచున్= బుజ్జగిస్తూ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ శిశుపాలుని వెనువెంటనే వెళ్ళి అతణ్ణి ఇంపైన మాటలతో బుజ్జగిస్తూ ఇలా అన్నాడు.

**క. భూరిగుణోన్నతు లనఁదగు । వారికి ధీరులకు ధరణివల్లభులకు వా**
**క్పారుష్యము చన్నె? మహా । దారుణ మది విషముకంటె దహనముకంటెన్. 17**

**ప్రతిపదార్థం:** భూరి, గుణ+ఉన్నతులు= గొప్పగుణాలచేత శ్రేష్ఠులు; అనన్+తగు, వారికిన్= అని అనదగినవాళ్ళకు; ధీరులకున్= విద్వాంసులకు; ధరణి వల్లభులకున్= భూపతులకు - అంటే రాజులకు; వాక్+పారుష్యము= మాటలో కాఠిన్యం - అంటే కటువుగా మాట్లాడటం; చనున్+ఎ= తగునా?; అది= ఆ వాక్పారుష్యం; విషముకంటెన్; దహనముకంటెన్= నిప్పుకంటె; మహాదారుణము= మిక్కిలి భయంకరమైంది.

**తాత్పర్యం:** గొప్పగుణాలచేత శ్రేష్ఠులని చెప్పదగినవాళ్ళకు, పండితులకు, ప్రభువులకు కఠినంగా మాట్లాడటం తగునా? మాటకాఠిన్యం-విషంకంటె, అగ్నికంటె అతిభయంకరం కదా!

**విశేషం:** నన్నయసూక్తుల్లో ఇదొక సుప్రసిద్ధసూక్తి. నన్నయ నానారుచిరార్థ సూక్తినిధి. అంటే అనేకరుచిరాలైన అర్థాలతో కూడుకొన్న సూక్తులకు ఆయన నిధివంటివాడు. సూక్తి అంటే మంచిమాట. లోకాన్ని పరిశీలించి, అనుభవాన్ని ఆధారంగా గొని, ధర్మమార్గానికి దీపికగా, మానవుని మనస్సుకు ఎక్కేట్లు చెప్పే మంచిమాట సూక్తి, సూక్తి సుదీర్ఘంగా ఉండకూడదు. సూత్రప్రాయంగా ఉంటేనే సూక్తికి శోభ. అంటే అది అల్పాక్షరాల అనల్పార్థ రచన. అంతేకాదు, సూక్తిలోని అర్థం సూటిగా ఉండాలి. కొంత ఘాటుగా కూడ ఉండాలి. అది చదివేకొలది చవులూరించాలి. వ్యక్తి జీవితానికి వెలుగునివ్వాలి. కవి లోకహితుడు. ఆతని కవిత రసమయంగానే కాక, ఉపదేశయుతంగా ఉండాలి. 'జగద్ధితంబుగన్ మహాభారత సంహితా రచన బంధురు'డైన మహాకవి నన్నయ నానారుచిరార్థ సూక్తినిధి. రసమయమైన ఆయనకవిత సూక్తిరత్నాకరం. మానవజీవితంలో మాట ఎంతో విలువైంది. అది మానవుణ్ణి "మహాత్మా" అని అనిపించగలదు. 'పశువా' అని పిలిపించగలదు. మాటకాఠిన్యాన్నిగూర్చి మహాకవి నన్నయసూక్తి మరపురానిది; మరువగూడనిది.

**ఉ. ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు, వే**
**దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైన వాఁడు,లో**
**కాది, త్రిలోకపూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు దా**
**మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని; యుక్తమ కా కిది యేమి దోసమే? 18**

**ప్రతిపదార్థం:** ఆదిజుఁడు+ఐన= (సృష్టికి) మొదట పుట్టినవాడైన; బ్రహ్మ, ఉదయంబునకున్= బ్రహ్మదేవుని పుట్టుకకు; ఆస్పదము+ఐన, వాఁడు= స్థానమైనవాడు; వేద+ఆది= వేదాలు మొదలైన; సమస్త, వాఙ్మయముల+అందున్= అన్ని విజ్ఞానగ్రంథాల్లో; ప్రశంసితుఁడు+ఐనవాఁడు= కీర్తింపబడినవాడు; లోక+ఆది= లోకాలకు మొదలైనవాడు; త్రిలోక, పూజ్యుఁడు= మూడు లోకాలచేత పూజించదగినవాడు; అని; ఆత్మన్+ఎఱింగి= బుద్ధిచే గ్రహించి; పితామహుండు= తాత అయిన భీష్ముడు; దామోదరున్= శ్రీకృష్ణుని; పూజ్యుఁడు+అని= పూజించదగినవాడని; చెప్పెన్= చెప్పాడు; ఇది; యుక్తము+అ కాక= ఉచితంకాక; ఏమి, దోసమే= తప్పా ఏమి?

**తాత్పర్యం:** సృష్టికి మొదటపుట్టిన బ్రహ్మపుట్టుకకే స్థానమైనవాడు, వేదాలు మొదలైన మహాగ్రంథా లన్నింట కీర్తించబడేవాడు, లోకాలకే ఆద్యుడైనవాడు, ముల్లోకాలచే పూజించదగినవాడు - అని తెలుసుకొని పితామహుడైన భీష్ముడు, శ్రీకృష్ణుణ్ణి పూజార్హు డని చెప్పాడు. ఇది ఉచితం కాక దోష మౌతుందా ఏమిటి?

**విశేషం:** (అలం: కావ్యలింగం. సమర్థించవలసిన అర్థాన్ని సమర్థించటం కావ్యలింగం. శ్రీకృష్ణుడు పూజ్యు డని సమర్థించటం ఇందలి ప్రకృతాంశం. అందువల్ల ఇందులో అర్థవ్యక్తి అనే గుణం ఆకృతి తాల్చింది. -సంపా.) సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడు విష్ణుమూర్తి నాభికమలంనుండి జన్మించాడు. కనుక బ్రహ్మపుట్టుకకు విష్ణుమూర్తి స్థానమయ్యాడు. దామోదరుడు - తులసిమాల ఉదరంపై కలవాడు.

**క. పరమార్థ ప్రతిభఁ దమో । హరు నచ్యుతు భీష్ముఁ డెఱిఁగిన ట్లెఱుఁగఁగ నీ**
**కరిది శిశుపాల! పెద్దల । చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్? 19**

**ప్రతిపదార్థం:** శిశుపాల; పరమ+అర్థ, ప్రతిభన్= పరమార్థ తత్త్వాన్ని దర్శించగల ప్రజ్ఞచేత; తమోహరున్= చీకటిని తొలగించేవాణ్ణి; అంటే అజ్ఞానాన్ని పారద్రోలేవాణ్ణి; అచ్యుతున్= చ్యుతి-లేదా-పతనంలేనివాణ్ణి, శ్రీకృష్ణుణ్ణి, భీష్ముఁడు; ఎఱిఁగినట్లు= తెలుసుకొన్నట్లు; ఎఱుఁగఁగన్= తెలుసుకొనటానికి; నీకున్, అరిది= అసాధ్యం; ఎందున్= ఎచ్చటైనా; పెద్దల చరితంబు= గొప్పవాళ్ళయొక్క చరిత్ర; అల్పులకున్= తక్కువవాళ్ళకు; ఎఱుఁగన్= తెలుసుకొనటం; శక్యమె= సాధ్యమా! (కాదని భావం.)

**తాత్పర్యం:** ఓ శిశుపాలా! పరమార్థతత్త్వాన్ని దర్శించే ప్రతిభచేత అజ్ఞానం అనే చీకటిని పారద్రోలేవాడు, పతనం లేనివాడు అయిన శ్రీకృష్ణుణ్ణి భీష్ముడు అర్థంచేసుకొన్నట్లు అర్థంచేసుకోవడం నీకు అసాధ్యం. ఎక్కడైనా మహాత్ముల చరిత్రను అల్పులు అర్థంచేసుకోగలరా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. (ఈ రచనలోనూ అర్థవ్యక్తి అనే గుణం సార్థకంగా పోషించబడింది. -సంపా.)

**క. గురుఁ డని సమస్తలోకో । త్తరుఁ డని నీకంటె వృద్ధతములైన నరే**
**శ్వరు లచ్యుతు నర్చన నెడఁ । గర మభినందింప నీకుఁ గాదనఁ దగునే. 20**

**ప్రతిపదార్థం:** గురుఁడు+అని= అందరికంటె గొప్పవా డని, లేదా జ్ఞానదాత అని; సమస్త, లోక+ఉత్తరుఁడు+అని= అన్నిలోకాలకంటె శ్రేష్ఠు డని; నీకంటెన్; వృద్ధతములు+ఐన= మిక్కిలి పెద్దవాళ్ళయిన; నర+ఈశ్వరులు= నరపతులు - అంటే రాజులు; అచ్యుతు, అర్చనన్= శ్రీకృష్ణుని యొక్క పూజను; ఎడన్= హృదయమందు; కరము= మిక్కిలి; అభినందింపన్= పొగడగా; నీకున్; కాదు; అనన్; తగునే.

**తాత్పర్యం:** అందరికంటె గొప్పవా డని, జ్ఞానదాత, అని లోకాలన్నింటికంటె శ్రేష్ఠు డని, నీకంటె ఎంతో పెద్దలైన రాజులే శ్రీకృష్ణుని కిచ్చిన అర్ఘ్యానికి ఎంతో పొగడుతూ ఉంటే నీ విలా వ్యతిరేకించటం తగునా?

**విశేషం:** ధర్మజుని వాక్యవిన్యాసంలో రుచిరార్థసూక్తులను కూర్చాడు నన్నయ. గురుడనే శబ్దం సార్థకం. ఇది శ్రీకృష్ణుడి జగద్గురుత్వాన్నీ, అజ్ఞానాన్ని తొలగించి వెలుగును ప్రసాదించే మహత్త్వాన్నీ ధ్వనింపచేస్తున్నది. సమస్తలోకోత్తరు డనే విశేషణం శ్రీకృష్ణుని పరమాత్మతత్త్వాన్ని వ్యక్తంచేస్తున్నది. 'అచ్యుతుని అర్చన చేయటం' అనే పదాలు శ్రీకృష్ణుని నిత్యత్వాన్ని తెలుపుతూ శిశుపాలుణ్ణి వివేకచ్యుతు డని వ్యంగ్యంగా చెపుతున్నవి. 'వృద్ధతములు' అనేమాట సార్థకం. శిశుపాలునికంటె వయసులోనే కాక అనుభవంలోకూడా పెద్దలైనవాళ్ళు శ్రీకృష్ణుణ్ణి అభినందిస్తే శిశుపాలుడు అభిశంసించి అవివేకి అనిపించుకొన్నా డని భావం. ధర్మజుని వాక్యం ప్రౌఢం. ధ్వనిమయం. ఈ పద్యంలోని వాక్యవిన్యాసవికటత్వంలో నన్నయ ఉదారతను పోషించాడు. అగ్రామ్యత్వలక్షణం ధర్మజుడి సంస్కారవ్యంజకం. (సంపా.)

**వ. అని యా శిశుపాలుం బట్టువఱుచుచున్నంత ధర్మరాజునకు భీష్ముం డి ట్లనియె. 21**

**ప్రతిపదార్థం:** అని; ఆ, శిశుపాలున్; పట్టువఱుచుచున్+ఉన్న+అంతన్= తెలియజెప్పి ఒప్పించటానికి ప్రయత్నిస్తుండగా; ధర్మరాజునకున్; భీష్ముండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని ఆ శిశుపాలుడికి నచ్చచెప్పి ఒప్పించటానికి ప్రయత్నిస్తూ ఉండగా, ధర్మరాజుతో, భీష్ముడు ఈ విధంగా అన్నాడు.

### భీష్ముఁడు శిశుపాలుని నిందించుట (సం. 2-35-6)

**ఉ. పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు; వీని నేల భూ**
**పాలక! నీకుఁ బట్టువఱుపన్? మఱి ధర్ము వెఱుంగ వీనికిం**
**బోలునె రాగకోప పరిభూత మనస్కున కల్పరాజ్య ల**
**క్ష్మీ లలనాంధబుద్ధి కనిమిత్త మహత్పరివాదశీలికిన్? 22**

**ప్రతిపదార్థం:** భూపాలక= ధర్మరాజా; శిశుపాలుఁడు; పాలిత, దుర్ణయుండు= పెంచుకొనబడిన చెడునడత కలవాడు; బాలుఁడు= పరిపక్వం కాని బుద్ధికలవాడు; వీనిన్= ఇటువంటి శిశుపాలుడిని; పట్టు, పఱుపన్= తెలియజెప్పి ఒప్పించటం; నీకున్; ఏల= ఎందుకు; మఱి= అంతేకాక; రాగ, కోప, పరిభూత, మనస్కునకున్= మాత్సర్య కోపాలచేత అవమానించబడిన మనస్సు కలవాడూ - అంటే అసూయా క్రోధాలకు వశమైన మనస్సు కలవాడూ; అల్ప, రాజ్య, లక్ష్మీ, లలనా+అంధ, బుద్ధికిన్= కొద్దిపాటి రాజ్యసంపద అనే కాంత చేతనే గ్రుడ్డిదైన బుద్ధికలవాడూ - అంటే అల్పరాజ్య సంపద అనేకాంతను చూచుకొని మదించి వివక్షను కోల్పోయిన బుద్ధి కలవాడూ; అనిమిత్త, మహత్+పరివాద, శీలికిన్= కారణం లేకుండానే మహాత్ములను నిందించే స్వభావం కలవాడూ అయిన; వీనికిన్= ఈ శిశుపాలుడికి; ధర్మువు+ఎఱుంగన్= ధర్మతత్త్వాన్ని తెలుసుకోవటం; పోలునె= సాధ్యమగునా?

**తాత్పర్యం:** ధర్మరాజా! శిశుపాలుడు పెచ్చుపెరిగిన చెడునడత కలవాడు; పరిపక్వం కాని బుద్ధికలవాడు. ఇలాంటి వీడికి చెప్పి ఒప్పించే ప్రయత్నం నీవు ఎందుకు చేస్తావు? అంతేకాదు, ఇతడు అసూయా క్రోధాలకు వశమైన మనస్సు కలవాడు. కొద్దిపాటి రాజ్యలక్ష్మిచేతనే మదించి వివక్షను కోల్పోయిన బుద్ధి కలవాడు. కారణం లేకుండానే మహాత్ములను నిందించే స్వభావం కలవాడు. ఇలాంటి వీడికి ధర్మతత్త్వం తెలుసుకోవటం సాధ్యమవుతుందా?

**విశేషం:** అలం: రూపకం. ఈ పద్యం శిశుపాలుడి చెడు స్వభావం ప్రతిఫలించే అద్దం. ధర్మతత్త్వాన్ని గ్రహించటానికి రాగద్వేషరహితమైన సమచిత్తం ఉండాలి. అహంకారం, అవివేకం ఉండకూడదు. శిశుపాలుని స్వభావంలో ఉండవలసిన సమచిత్తత లేదు. ఉండగూడని అహంకారం, అవివేకం మెండుగా ఉన్నాయి. అందుచేత 'ధర్మరాజా! ఇతనికి ధర్మతత్త్వాన్ని తెలియజెప్పి ఒప్పించే ప్రయత్నం వ్యర్థ'మని భీష్మ డంటున్నాడు. అంతేకాదు, 'భూపాలక! నేల నాలుగు దిక్కులు జయించి సార్వభౌమ యోగ్యమయిన రాజసూయయాగం చేసే మహారాజా! వీనిన్ - ఈ తక్కువవాణ్ణి, అల్పరాజ్య లక్ష్మీలలనాంధబుద్ధిని, అనిమిత్త మహత్పరివాదశీలిని - ఒప్పించే ప్రయత్నం నీకు అనవసర'మనికూడ అంటున్నాడు. కాగా, ఇక్కడ శ్రీకృష్ణుని మాహాత్మ్యాన్ని, ఆయన పూర్వావతార వృత్తాంతాలను విరివిగా భీష్ముడు వర్ణించినట్లు పి.పి.యస్. శాస్త్రిగారి సంపాదకత్వంలో వెలువడిన దాక్షిణాత్య సంస్కృత భారత ప్రతిలో ఉంది. నన్నయ కథాప్రసన్నతను పోషించటానికే ఆ విపులవర్ణనను పరిహరించి, శ్రీకృష్ణునికి అర్ఘ్యమివ్వటం ఎలా ఉచితమో యుక్తియుక్తంగా, సంక్షిప్తంగా చెప్పించాడు. (పై పద్యంలోని భీష్ముడి క్రోధోక్తులు ఆరోహక్రమంలో సాగి అర్థదృష్టితో ప్రవర్తిల్లటంచేత సమాధి అనే గుణం రసోదంచితంగా రచనలో రాణించింది. ఈ ఘట్టంలోని నన్నయనాటకీయతను గురించిన వివరాలకు పీఠిక చూడండి. - సంపా.)

**వ. అని ధర్మరాజును వారించి శిశుపాలుం జూచి భీష్ముం డిట్లనియె. 23**

**తాత్పర్యం:** అని ధర్మరాజును ఆపి. శిశుపాలుణ్ణి చూచి భీష్ముడు ఇలా అన్నాడు.

**చ. అవినయబుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటి; నీవు మూ**
**ర్ఖువు శిశుపాల! యింకఁ బలుకన్ వలసెన్ సభలోన నున్న యీ**
**యవనిపులెల్ల నాతని దయం బరిముక్తులు, వానిచేత నా**
**హవ జితులుం, దదీయశరణార్థులుఁగా కొరులయ్య చెప్పుమా! 24**

**ప్రతిపదార్థం:** శిశుపాల; అవినయ, బుద్ధివి+ఐ= వినయంలేని బుద్ధికలవాడివై - అంటే అహంకరించి; హరికిన్= శ్రీమహావిష్ణువుకు - అంటే ఆయన అవతారమైన శ్రీకృష్ణునికి; అర్ఘ్యము; అయోగ్యము+అ= తగదు; అంటి= అంటివి; నీవు= నీవు; మూర్ఖువు= తెలివిలేనివాడివి; ఇంకన్= ఇక; పలుకన్, వలసెన్= చెప్పక తప్పటంలేదు; సభలోనన్= ఈసభలో; ఉన్న; ఈ; అవనిపులు+ఎల్లన్= ఈ రాజులందరు; ఆతని, దయన్= ఆశ్రీకృష్ణునిదయచేత; పరిముక్తులు= పూర్తిగా విడిచిపెట్టబడినవాళ్ళు (జరాసంధుని చెరనుండి), వానిచేతన్= శ్రీకృష్ణునిచేత; ఆహవజితులున్= యుద్ధంలో ఓడించబడినవాళ్ళు; కాక; ఒరులు+అయ్య= ఇతరులటయ్యా! చెప్పుమా.

**తాత్పర్యం:** శిశుపాలా! అహంకరించి సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అవతారమైన శ్రీకృష్ణునికే అర్ఘ్యమివ్వటం తగదంటున్నావు. ఇక చెప్పక తప్పిందికాదు. ఈ సభలో ఉండే రాజులంతా, ఆయనదయచేత జరాసంధుని చెరనుండి విడిపించబడినవాళ్ళే. లేదా ఆయనచేత యుద్ధంలో ఓడించబడినవాళ్ళే. లేదా ఆయనను శరణువేడినవాళ్ళే, అలా కాకుండా ఇతరు లెవరున్నారో చెప్పు?

**విశేషం:** ఇక్కడ 'హరి' శబ్దప్రయోగం ఉచితంగా ఉంది. శ్రీకృష్ణుని విష్ణుత్వంమీద, శిశుపాలుని మూర్ఖత్వంమీద ఆ మాట వెలుగులను ప్రసరిస్తున్నది. (భీష్ముని వాక్యవిన్యాసంలో, రచనలో వికటత్వం భాసించి ఉదారత అనే గుణం క్రోధభావోద్దీప్తికి తోడ్పడింది-సంపా.)

**తే. ఉత్తమ జ్ఞానవృద్ధు నా నుండె నేని । బాలుఁ డయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు;**
**క్షత్రియుఁడు పూజ్యుఁ డమితవిక్రమసమృద్ధి । నుర్విపతులలో నధికుఁడై యుండె నేని. 25**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణుండు; ఉత్తమ, జ్ఞాన, వృద్ధునాన్= ఉత్తమమైన జ్ఞానంచేత పెద్దవాడయితే; బాలుఁడు+అయ్యును= వయస్సులో చిన్నవాడయినా; పూజ్యుండు= పూజించదగినవాడు; క్షత్రియుఁడు; అమిత, విక్రమ, సమృద్ధిన్= అపరిమితమైన పరాక్రమంయొక్క నిండుదనంచేత; ఉర్వి, పతులలోన్= భూపతులలో; అధికుఁడు+ఐ= ఎక్కువైనవాడై; ఉండెన్+ఏనిన్= ఉన్నట్లయితే; పూజ్యుఁడు= పూజించదగినవాడు.

**తాత్పర్యం:** ఉత్తమజ్ఞానంచేత గొప్పవాడయితే, వయస్సుచేత బాలుడయినా బ్రాహ్మణుడు పూజించదగినవాడే, అపరిమితమైన పరాక్రమంతో రాజుల్లో అధికుడైతే క్షత్రియుడు పూజార్హు డౌతాడు.

**విశేషం:** నన్నయరుచిరార్థసూక్తి.

**క. ఈ రెండు కారణముల ము । రారాతియ యర్ఘ్యమునకు నర్హుఁడు; జగదా**
**ధారుండు మాక కాదు, స । దారాధ్యుఁడు విష్టపత్రయావాసులకున్. 26**

**ప్రతిపదార్థం:** ఈ, రెండు, కారణములన్= ఉత్తమజ్ఞానం, పరాక్రమసమృద్ధి అనే రెండు కారణాలచేత; ముర+అరాతి+అ= మురుడనే రాక్షసునికి శత్రువైన శ్రీకృష్ణుడే; అర్ఘ్యమునకున్= అర్ఘ్యమివ్వటానికి; అర్హుఁడు= తగినటువంటివాడు; జగత్+ ఆధారుండు= లోకానికి ఆధారమైనవాడు; మాకు+అ, కాదు= మాకు మాత్రమే కాదు; విష్టపత్రయ+ఆవాసులకున్= మూడులోకాలలో నివసించేవారికి; సదా+ఆరాధ్యుఁడు= ఎల్లప్పుడు పూజించదగినవాడే.

**తాత్పర్యం:** ఉత్తమజ్ఞానం, అమితపరాక్రమం అనే ఈ రెండు కారణాలవల్ల - మురుడనే రాక్షసునికి శత్రువైన శ్రీకృష్ణుడే అర్ఘ్యానికి అర్హుడు. జగత్తుకు ఆధారమైన శ్రీకృష్ణుడు, మాకే కాదు ముల్లోకాల్లో నివసించే వాళ్ళందరికీ ఆయన ఎల్లప్పుడూ పూజార్హుడే.

**విశేషం:** ఇక్కడ శ్రీకృష్ణునికి ప్రయోగించిన 'మురారాతి' శబ్దం శిశుపాలునికి పరోక్షంగా హెచ్చరికవంటిది. శ్రీకృష్ణునితో వైరంపూనిన మురుడికి ఏగతి పట్టిందో తెలుసుకొ మ్మని ఆ పదం శిశుపాలునికి ధ్వనింపచేస్తున్నది.

**క. వృద్ధు లొకలక్ష యున్నను । బుద్ధియె యెవ్వరికి వారిఁ బూజింపంగా;**
**నిద్ధరణీశులలో గుణ । వృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్. 27**

**ప్రతిపదార్థం:** వృద్ధులు= వయస్సుచేత పెద్దలైనవాళ్ళు; ఒక; లక్ష; ఉన్నను; ఎవ్వరికిన్= ఎవరికైనా; వారిన్= వాళ్ళను; పూజింపంగాన్= పూజించటానికి; బుద్ధియె= జ్ఞానమే(ప్రమాణం); ఈ+ధరణీ+ఈశులలో= ఈ రాజులందరిలో; గుణ, వృద్ధు+అని= గుణంచేత పెద్దవాడని; త్రివిక్రమున్= శ్రీకృష్ణుణ్ణి; భక్తిన్= భక్తితో; పూజించితిమి.

**తాత్పర్యం:** వయస్సుచేత వృద్ధులైనవాళ్ళు ఒక లక్షమంది ఉన్నా - ఎవరినైనా వాళ్ళ జ్ఞానాన్ని బట్టే పూజిస్తాం. రాజులందరిలో గుణంచేత గొప్పవా డనే శ్రీకృష్ణుణ్ణి భక్తితో పూజించాం.

**విశేషం:** భీష్మునిమాటలు శ్రీకృష్ణునికి అర్ఘ్య మివ్వటాన్ని సమర్థించే ఉక్తులుమాత్రమే కావు, లోకానికి ఉపయోగించే చక్కని సూక్తులుకూడ. కాగా, త్రివిక్రమ పదప్రయోగంకూడా శిశుపాలుణ్ణి హెచ్చరించేదే. శ్రీకృష్ణుణ్ణి తక్కువగా లెక్కగట్టవద్దని, అవసరమైతే ఆయన త్రివిక్రమావతారం తాల్చగల డని, బలిఅంతటివాడు ఏమయ్యాడో భావించుకొమ్మని, నీకొలది తెలుసుకొని ప్రవర్తించు మని ఆ పదం శిశుపాలునికి ధ్వనింపజేస్తున్నది.

**క.** **పూజితుల తృప్తులగుదురు । భూజను లొరు; లచ్యుతుండు పూజితుఁ డగుడుం**
**దేజమున జగత్త్రితయముఁ । బూజితమయి తృప్తిఁబొందుఁ బుణ్యసమృద్ధిన్.** **28**

**ప్రతిపదార్థం:** భూ, జనులు= భూమిమీది ప్రజలు; ఒరులు= ఇతరులు - అంటే శ్రీకృష్ణుడు కాక ఇతరులు; పూజితులు+అ= పూజించబడినవాళ్ళుమాత్రమే; తృప్తులు+అగుదురు= తృప్తి పొందినవా ళ్ళవుతారు; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; పూజితుఁడు= పూజించబడినవాడు; అగుడున్= అయితే; తేజమునన్= ప్రకాశంగా - గొప్పగా; జగత్+త్రితయమున్= మూడులోకాల సమూహం, పూజితము+అయి= పూజించబడిందై; పుణ్య, సమృద్ధిన్= పుణ్యంయొక్క నిండుదనంచేత; తృప్తిన్; పొందున్.

**తాత్పర్యం:** లోకంలో శ్రీకృష్ణుడు కాక ఇతరు లెవ్వరు పూజించబడినా వాళ్ళుమాత్రమే తృప్తిపొందుతారు. శ్రీకృష్ణుడు పూజితుడైతే ముల్లోకాలు పూజితాలై పుణ్యసమృద్ధితో తృప్తిపొందుతాయి.

**సీ.** **'బుద్ధియు మనమును బురుషుండు నవ్యక్త । మగుచున్న ప్రకృతియు నంబరంబు**
**ధరణియుఁ దరణియు దహనుండుఁ జంద్రుండు । గాడ్పును దిక్కులుఁ గాలములును**
**దానయై జంగమస్థావరాత్మకమైన । సకల భూత ప్రపంచంబు నెల్లఁ**
**దన దివ్యశక్తిమైఁ దాల్చిన సర్వాత్ము । సర్వభూతేశ్వరు సర్వవంద్యు**

**ఆ.** **నధికయోగ నిష్ఠితాత్మకులగు మహా । యోగివరులు తత్త్వయుక్తిఁజేసి**
**యెఱిఁగినట్టు నీకు నెఱుఁగంగఁబోలునే?' । యనుచు భీష్ముఁ డన్న యవసరమున.** **29**

**ప్రతిపదార్థం:** బుద్ధియున్; మనమును= మనస్సును; పురుషుండున్= జీవుడు; అవ్యక్తము+అగుచున్న, ప్రకృతియున్= ఇంద్రియాలకు గోచరించని పరమాత్మ; అంబరంబు= ఆకాశం; ధరణియున్= భూమియు; తరణియున్= సూర్యుడును; దహనుండున్= అగ్ని; చంద్రుండు; గాడ్పును= గాలియు; దిక్కులున్; కాలములును= భూతభవిష్యద్వర్తమానాలు; తాన, ఐ= తానే అయి; జంగమ, స్థావర+ఆత్మకము+ఐన= కదలునట్టి, కదలనట్టి వాటితోకూడిన; సకల, భూత, ప్రపంచంబున్+ఎల్లన్= అన్ని ప్రాణులతో కూడిన ప్రపంచాన్నంతటిని; తన, దివ్య, శక్తిమైన్= తనయొక్కదివ్యశక్తిచేత; తాల్చిన= ధరించిన; సర్వ+ఆత్మున్= సర్వాన్నిఆత్మగా కలిగినవాణ్ణి - అంటే సర్వం తానే అయినవాణ్ణి; సర్వ, భూత+ఈశ్వరున్= అన్ని ప్రాణులకు ప్రభువైనవాణ్ణి; సర్వవంద్యున్= అందరికి పూజ్యుడైనవాణ్ణి; అధిక, యోగ, నిష్ఠిత+ఆత్మకులు+అగు= గొప్ప యోగంలో గట్టిగా నిలుపబడిన మనస్సు కలవాళ్ళయిన, మహా, యోగి, వరులు= శ్రేష్ఠులైన గొప్పయోగులు, తత్త్వయుక్తిన్+చేసి= యథార్థజ్ఞానంతో; ఎఱిఁగిన+ అట్టు= తెలుసుకొన్నట్లు; నీకున్; ఎఱుఁగంగన్= తెలుసుకొనటానికి; పోలునే= సాధ్యమవుతుందా? అనుచున్; భీష్ముఁడు; అన్న= అనిన; అవసరమునన్= సమయంలో.

**తాత్పర్యం:** 'బుద్ధి, మనస్సు, జీవుడు, ఇంద్రియాలకు గోచరించని పరమాత్మ, ఆకాశం, భూమి, సూర్యుడు, అగ్ని, చంద్రుడు, వాయువు, దిక్కులు, కాలములు, అన్నీ తానై, చరాచరాలైన సమస్త భూతాలతో కూడిన ప్రపంచాన్నంతటిని తన దివ్యశక్తిచేత ధరించి, సర్వమూ తానై, సర్వభూతాలకు ప్రభువై, సర్వులకు పూజ్యుడైనవాణ్ణి, యోగనిష్ఠలో ఉన్న మహాయోగులు యథార్థ జ్ఞానంతో తెలుసుకొన్నట్లు, తెలుసుకోవటం నీకు సాధ్యమవుతుందా?' అని భీష్ము డన్న సమయంలో.

**విశేషం:** 'యోగ శ్చిత్తవృత్తి నిరోధః' - మనస్సుయొక్క చలనాన్ని అరికట్టి దాన్ని ఏకాగ్రం చెయ్యటం - అంటే పరమాత్మమీద లగ్నం చెయ్యటం యోగం. దీన్నే ధ్యానం అని గూడ వ్యవహరించటం ఉంది. (పై పద్యంలోని శ్లేష పరతత్త్వవివరణ ఘట్టానికి అనువుగా అమరింది. - సంపా.)

చ. **ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి; మిచ్చిన దీని కిం దొడం**
**బడ మని దుర్జనత్వమునఁ బల్కెడువీరుల మస్తకంబుపై**
**నిడియెద నంచుఁ దాఁ జరణమెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో**
**నుడిగి సభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై.** 30

**ప్రతిపదార్థం:** ఎడపక= వెనుకాడక; అర్ఘ్యము; అచ్యుతునకున్= శ్రీకృష్ణునికి; ఇచ్చితిమి; ఇచ్చినన్; దీనికిన్; ఇందున్= ఈ సభలో; ఒడంబడము+అని= ఒప్పుకొనమని; దుర్జనత్వమునన్= చెడు బుద్ధితో; పలికెడు; వీరుల, మస్తకంబు, పైన్= వీరుల నెత్తిమీద; ఇడియెదను= పెట్టెదను; అంచున్= అంటూ; సహదేవుడు; తాన్= తాను; సభన్= సభలో; చరణము+ఎత్తెన్= పాదాన్ని పైకెత్తాడు; అట్టిచోన్= అప్పుడు; సభాసదుల్= సభలోనివాళ్ళు; తద్దయున్= మిక్కిలి; భీతచిత్తులై= భయంతో కూడిన మనస్సుకలవాళ్ళయి; ఉడిగి= అణగి; పలుకక+ఉండిరి= మాటాడకున్నారు.

**తాత్పర్యం:** 'మేము శ్రీకృష్ణునికి అర్ఘ్యం ఇచ్చాం. దీనికి తిరుగులేదు. దుర్బుద్ధితో దీన్ని కాదనే వీరుల తలమీద ఇదిగో నాపాదం పెట్టి అణగత్రొక్కుతా' అని సహదేవుడు పాదాన్ని పైకెత్తగానే సభాసదులంతా భయభ్రాంతులై మారుమాటాడకుండా ఉన్నారు.

**విశేషం:** తాత్కాలికంగానైనా శిశుపాలుని నోటికి తాళంవేసిన సహదేవుని ధార్మికతేజం, సాహసం శ్లాఘించదగినవి. (ఇందులో ప్రదర్శితమైన సహదేవుని రౌద్రానికి సభికుల్లో ఏర్పడిన భావశాంతి అంగంగా నిబంధించబడింది. ఈవిధంగా రసానికి భావశాంతిని అంగంగా పోషిస్తే సమాహితాలంకార మౌతుంది. ఈ అద్భుతసంఘటనలో శ్లేష అనే శబ్దగుణం ప్రసాదగుణపోషకంగా రాణించింది. -సంపా.)

చ. **చెలువుగఁ బుష్పవృష్టి గురిసెన్ సహదేవుపయిన్; దివంబునన్**
**వెలయఁగ సాధువాదములు వించె; సభాసదులెల్ల విస్మయా**
**కులిత మనస్కులైరి; తన కుంచెయుఁ గృష్ణమృగాజినంబునుం**
**బలుమఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁ డాడె వేడుకన్.** 31

**ప్రతిపదార్థం:** సహదేవు, పయిన్= సహదేవునిమీద; చెలువుగన్= అందంగా; పుష్పవృష్టి= పూలవాన; కురిసెన్; దివంబునన్= ఆకాశంలో; సాధువాదములు= బాగుబాగనే శబ్దాలు; వెలయఁగన్= ఒప్పుగా; వించెన్(వినిచె)= వినిపించాయి; సభాసదులు+ఎల్లన్=

సభలోఉన్న వాళ్ళంతా; విస్మయ+ఆకులిత, మనస్కులు+ఐరి= ఆశ్చర్యంచేత కలతచెందిన మనస్సులు కలవాళ్ళయ్యారు; కలహబంధుఁడు= పోట్లాటకు బంధువైనవాడు-నారదుడు; తన కుంచెయున్= తనయొక్క చామరాన్ని; కృష్ణమృగ+అజినంబునున్= నల్ల ఇర్రి చర్మాన్ని; పలుమఱు= పెక్కుమారులు; వీచుచున్; వేడుకన్= ఆనందంతో; ఆడెన్= నృత్యంచేశారు.

**తాత్పర్యం:** అప్పుడు సహదేవునిమీద అందంగా పూలవాన కురిసింది. ఆకాశంలో 'బాగుబాగు' అనే ధ్వనులు పెద్దగా వినిపించాయి. సభాసదులంతా ఆశ్చర్యంతో కలతచెందారు. కలహబంధుడైన నారదుడు తనచామరాన్ని, కృష్ణాజినాన్ని పెక్కుమారులు వీస్తూ ఆనందనృత్యం చేశాడు.

**విశేషం:** దుష్టశిక్షణకు దారితీసే కలహం పెరుగుతూ ఉంది కనుక ఆ కలహబంధుడికి అంత ఆనందం. (అందుకే రచనలో మాధుర్యగుణం. -సంపా.)

**వ. అంత శిశుపాలుసేనాపతి సునీథుండను వాఁ డతిరోషపరుషవచనుం డగుచు, స్వపక్షక్షత్త్రియులనెల్ల నొక్కంతం జేర్చికొని, శిశుపాలు ననుమతంబున యుద్ధసన్నద్ధుం డయియున్న సమయంబున. 32**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; శిశుపాలు, సేనాపతి= శిశుపాలునియొక్క సేనాధిపతి; సునీథుండు+అనువాఁడు; అతి, రోష, పరుష వచనుండు+అగుచున్= మిక్కిలి కోపంతో కూడిన కఠినమైన మాటలు కలవాడై; స్వపక్ష, క్షత్రియులన్+ఎల్లన్= తమవైపున ఉండే రాజులందరిని; ఒక్కంతన్+చేర్చుకొని= ఒక్కటిగా కూర్చుకొని; శిశుపాలు+అనుమతంబునన్= శిశుపాలునియొక్క అనుమతితో; యుద్ధ సన్నద్ధుండు+అయి= యుద్ధానికి సిద్ధమైనవాడయి; ఉన్న; సమయంబునన్.

**తాత్పర్యం:** అప్పుడు శిశుపాలుని సేనాధిపతి సునీథు డనేవాడు మిక్కిలి కోపంతో కఠినంగా మాట్లాడుతూ, తమవైపు ఉండే రాజులందరిని ఒకటిగా కూర్చుకొని, శిశుపాలుని అనుమతితో యుద్ధానికి సిద్ధమయ్యాడు. అప్పుడు

**చ. రయవిచల త్తురంగమ తరంగములన్ మదనాగనక్ర సం**
**చయముల సంచలచ్చటుల సైనిక మత్స్యములన్ భయంకరం**
**బయి యదువృష్ణిభోజ కుకురాంధక వాహినియుం గలంగె ని**
**ర్దయతరరోషమారుత నితాంత సమీరితమై క్షణంబునన్. 33**

**ప్రతిపదార్థం:** యదు, వృష్ణి, భోజ, కుకుర+అంధక, వాహినియున్= యదు, వృష్ణి, భోజ, కుకుర, అంధక వంశాల వీరులయొక్క సైన్యం - వాహిని శబ్దానికి నది అనే అర్థం ఉంది కాబట్టి సైన్యమనే నది; రయ, విచలత్+తురంగమ, తరంగములన్= వేగంగా, ఎక్కువగా కదలుతున్న గుర్రాలనే అలలతో; మద, నాగ, నక్ర, సంచయములన్= మదపుటేనుగులనే మొసళ్ళ సమూహాలతో; సంచలత్+చటుల, సైనిక మత్స్యములన్= మిక్కిలిగాతిరుగుతూ మెరుస్తున్న సైనికులనే చేపలతో; భయంకరంబు+అయి= భయాన్ని కలిగించేదై; నిర్దయతర, రోష, మారుత, నితాంత, సమీరితము+ఐ= ఏమాత్రం దయలేని కోప మనే గాలి ఎడతెగకుండా వీచబడిందై; క్షణంబునన్= ఒక్క నిమిషంలో; కలంగెన్= కలత పొందింది.

**తాత్పర్యం:** యదువృష్ణిభోజ కుకురాంధకవంశ వీరుల సైన్య మనే నది - వేగంగా ఎక్కువగా కదలుతున్న గుర్రాలనే అలలతో, మదపుటేనుగులనే మొసళ్ళ సమూహాలతో, అమితంగా అటుఇటు తిరుగాడుతూ మెరుస్తున్న సైనికులనే చేపలతో, భయంకరమై, ఏమాత్రం దయలేని కోపమనే ఎడతెగని గాలి వీచగా ఒక్క క్షణంలో కలతచెందింది.

**విశేషం:** అలం. సావయవరూపకం - శ్లేష, వృత్త్యనుప్రాసం. అక్షరరమ్యమై, ఓజోగుణ విశిష్టమై, అర్థచమత్కృతితో పాఠకుణ్ణి ఆకర్షించే నన్నయ ప్రసిద్ధ పద్యాల్లో ఇదొకటి. 'వాహినీ' శబ్దాని కున్న రెండర్థాలను ఆధారంగా గ్రహించి, సైన్యంలోని గుర్రాలను నదిలో ఎంతో చలనంతో పైకిలేచే అలలతో, మదపుటేనుగులను లోపల పారాడే భీకర నక్రాలతో, సైనికులను- తళుకు తళుక్కుమంటూ మిక్కిలిగా సంచరించే మీనాలతో రూపించటం మనోహరంగా ఉంది. 'రయ విచలత్ - తురంగమ-తరంగములన్' అనే కూర్పులోని శబ్దాలంకారానికి సంబంధించిన తకార, రకార, బిందుపూర్వక గకారాల సమూహం చెవికి సోకగానే ఏదో మీదికెగసి దూకుతున్న స్ఫూర్తి కలగటమేకాక, ఆశ్వికులు యుద్ధసన్నద్ధులై ఒక్కసారిగా కళ్ళేలు లాగటంచేత మెడలు మలిపి మూతులుపైకెత్తి కదనుత్రొక్కే ఎత్తైన గుర్రాల తలల కదలికలు, గాలితాకిడిచేత అంతకంతకు పై కెగిరే అలల చివరల ఊపులు భావుకుని కంటికి కనిపించగలవు. అలాగే నాగ - నక్ర పదాల్లో గబగబ ముందుకు దూసుకొనిపోయే ఏనుగులను, తలలు వంచి పారాడే నల్లని మొసళ్ళను, 'సంచలత్ - చటుల - సైనిక' శబ్దోచ్చారణలో - యుద్ధ సన్నద్ధులై, తళతళ మెరిసే ఖడ్గాలు చేపట్టి - అటు ఇటు చురుకుగా సంచరించే సైనికులను, నీళ్ళలో తళుకు, తళుక్కున తిరుగాడే మత్స్యాలను భావుకుడు చూడవచ్చు. శబ్దఘటనచేత అర్థస్ఫూర్తిని కలిగించే నన్నయగారి అక్షరశిల్పానికి ఈ పద్యం ఒక చక్కని ఉదాహరణం. 'వాహినియుం' అనేదానికి 'వారిధియుం' అనే పాఠాంతరం ఉంది. 'తత స్సాగర సంకాశం దృష్ట్వా నృపతి సాగరమ్' (భండార్కరుప్రతి 2-37-1) అనే మూలానికి సరైన పదం 'వారిధి'యే కాని వాహినీ శబ్దంచేత సావయవరూపకానికి సమకూరే మనోహర శ్లేష వారిధిశబ్దంవల్ల సంక్రమించదు. కాగా, 'రోషమారుత' మనే పదానికి 'దోషమారుత'మనే పాఠాంతరం ఉంది. ప్రకరణాన్నిబట్టి 'దోషమనేగాలి' అనటం కంటే 'రోషమనేగాలి' అనటమే మేల్తర మనిపిస్తున్నది. ఈ పద్యానికి ప్రతిబింబంవంటి పద్యాన్ని ఎఱ్ఱాప్రెగ్గడ ఆరణ్యపర్వ షష్ఠాశ్వాసంలో వ్రాయటం దీని ఆకర్షణ కొక తార్కాణం.

**వ. అట్టి సకల క్షత్త్రియ క్షోభంబు సూచి భయసంభ్రమాక్రాంత హృదయుండయి ధర్మరాజు భీష్మున కి ట్లనియె 34**

**ప్రతిపదార్థం:** అట్టి= ఆవిధమైన; సకల, క్షత్త్రియ, క్షోభంబు= అందరు రాజులయొక్క అలజడి; చూచి; భయ, సంభ్రమ+ ఆక్రాంత, హృదయుండు+అయి= భయంచేత, వేగిరపాటుచేత, ఆక్రమించబడిన హృదయం కలవాడై; ధర్మరాజు; భీష్మునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ విధంగా అందరు రాజుల్లో ఏర్పడిన అలజడిని చూచి భయం, వేగిరపాటు అలముకొన్న మనస్సుతో ధర్మరాజు భీష్మునితో ఇలా అన్నాడు.

**తరలము.**

**ధరణిలోఁ గల రాజు లెల్లను దారుణక్షయకాలసా**
**గరములట్లు గలంగి; రిప్డు మఖప్రయోగము విఘ్నముం**
**బొరయ కుండఁ బ్రజాపకారము పుట్టకుండఁగ నీవు చె**
**చ్చెరఁ బితామహ! వీరి కిచ్చటఁ జిత్తశాంతి యొనర్పవే. 35**

**ప్రతిపదార్థం:** పితామహ= తాతా!; ధరణిలోన్+కల= భూమిలో ఉండే; రాజులు+ఎల్లను= రాజులందరు; దారుణ, క్షయ, కాల, సాగరముల+అట్లు= భయంకరమైన ప్రళయకాల సముద్రాలవలె, కలంగిరి= కలతచెందారు; ఇపుడు(ఇప్డు)= ఇప్పుడు; మఖ, ప్రయోగము= రాజసూయయాగ కార్యక్రమం; విఘ్నమున్= ఆటంకాన్ని; పొరయకుండన్= పొందకుండా; ప్రజా+అపకారము= ప్రజలకు కీడు; పుట్టక+ఉండఁగన్; నీవు; చెచ్చెరన్= వెంటనే, వీరికిన్= ఈ రాజులకు; ఇచ్చటన్; చిత్తశాంతి= మనశ్శాంతిని; ఒనర్పవే= కలిగించవా?

**తాత్పర్యం:** పితామహా! భూమిమీది రాజులంతా ప్రళయకాల సముద్రాల్లా కలతచెందారు. రాజసూయ కార్యక్రమానికి విఘ్నం కలుగకుండ, ప్రజలకు కీడు పుట్టకుండ, నీవు వెంటనే ఈ రాజులందరికి మనశ్శాంతి కలిగించు.

**విశేషం:** ఈ పద్యరచనలో సౌకుమార్యగుణం అక్షరరమ్యంగా సందర్భోచితంగా ప్రసాదగుణరంజకంగా పోషించబడింది.(సంపా.)

**వ. అనిన ధర్మరాజునకు భీష్ముం డి ట్లనియె. 36**

**తాత్పర్యం:** అనగా భీష్ముడు ధర్మరాజుతో ఈవిధంగా అన్నాడు.

**క. నీ యజ్ఞమునకు విఘ్నము । సేయఁగ నోపుదురె యొరులు? జితదైత్యుఁడు నా**
**రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ । జేయ పరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్. 37**

**ప్రతిపదార్థం:** జితదైత్యుఁడు= జయించబడిన రాక్షసులు కలవాడు - అంటే రాక్షసులను జయించినవాడు; యజ్ఞ, పురుషుఁడు= శ్రీమహావిష్ణువు; నారాయణుఁడు= శ్రీకృష్ణుడు; అజేయ, పరాక్రముఁడు= జయించసాధ్యంగాని పరాక్రమం కలవాడు; దీనిన్= ఈ యజ్ఞాన్ని; చేకొని= తనదిగా చేసుకొని; కావన్ - రక్షించగా; ఒరులు= ఇతరులు, నీయజ్ఞమునకున్; విఘ్నము= చెరుపు; చేయఁగన్= చేయటానికి; ఓపుదురె= చేతనైనవా ళ్ళవుతారా?

**తాత్పర్యం:** రాక్షసులను జయించినవాడు, జయించ సాధ్యంకాని పరాక్రమం కలవాడు, శ్రీమహావిష్ణు స్వరూపుడు అయిన శ్రీకృష్ణుడు- ఈ రాజసూయాన్ని చేపట్టి రక్షిస్తుండగా, ఇతరులు నీ యజ్ఞానికి చెరుపు చెయ్యగలరా?

**సీ. 'చైద్యునకై పూని సన్నద్ధులై యున్న । యీ రాజు లిందఱు నీక్షణంబ**
**హరి యల్గి చూచుడు నంతకక్షయమున । కరిగెడు వార; ఘోరాహవమున**
**దమఘోషనందనుదర్పంబు నిప్పుడ । యడఁగెడుఁ; గడుఁబెక్కులయ్యుఁ గుక్క**
**లిభకుంభదళనమహిష్ఠనిష్ఠురనఖ । ముఖుఁడగు హరిమీఁద మొఱఁగి యేమి**

**ఆ. సేయనోపుఁ? గృష్ణు సింహపరాక్రము । నెఱుఁగకున్నవారె యెల్లవారు?'**
**ననిన భీష్మపలుకు లవి కర్ణశూలంబు । లయినఁ జేదినాథుఁ డాగ్రహించి. 38**

**ప్రతిపదార్థం:** చైద్యునకై= చేదిదేశానికి రాజైన శిశుపాలునికై; పూని= పూనుకొని; సన్నద్ధులై= యుద్ధానికి సిద్ధమైనవాళ్ళయి; ఉన్న; ఈ, రాజులు; ఇందఱున్; ఈ క్షణంబు+అ; హరి= శ్రీకృష్ణుడు; అలిగి= కోపించి; చూచుడున్= చూస్తే; అంతకక్షయమునకున్= యమధర్మరాజుయొక్క ఇంటికి; అరిగెడు, వారు+అ= వెళ్ళేటటువంటివారే-అంటే మరణించేవారే; దమఘోషనందను, దర్పంబు= దమఘోషునియొక్క కుమారుడైన శిశుపాలుని పొగరు; ఘోర+ఆహవమునన్= భయంకరమైన యుద్ధంలో; ఇప్పుడు+అ= ఇప్పటికిప్పుడే; అడఁగెడున్= అణగిపోతుంది; కడున్= మిక్కిలి; పెక్కులు+అయ్యున్= ఎక్కువసంఖ్యలో ఉన్నప్పటికిని; కుక్కలు; ఇభ, కుంభ, దళన, మహిష్ఠ, నిష్ఠుర, నఖ, ముఖుఁడు+అగు= ఏనుగు కుంభస్థలాన్ని చీల్చటంలో మహాకఠినాలైన గోళ్ళ చివరలు కలవాడయిన; హరిమీదన్= సింహంమీద; మొఱఁగి= అరిచి; ఏమి చేయన్+ఓపున్= ఏమిచేయగలవు; సింహపరాక్రమున్ - సింహంవంటి పరాక్రమం కలవాణ్ణి; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; ఎల్లవారున్= అందరును; ఎఱుఁగకన్, ఉన్న, వారె= తెలియకున్నారా - అంటే శ్రీకృష్ణునియొక్క పరాక్రమంగురించి తెలియని వాళ్ళెవరు?; అనిన; భీష్మపలుకులు=

భీష్మునియొక్కమాటలు; అవి; కర్ణశూలంబులు= చెవులకు బల్లెములవంటివి; కాగా; (అంటే వినటానికి మిక్కిలి బాధాకరాలైనవికాగా); చేదినాథుఁడు= చేదిదేశానికి రాజైన శిశుపాలుడు; ఆగ్రహించి= కోపం పొంది.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణుడు కోపగించుకొని చూస్తే చాలు, శిశుపాలునికై యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉండే ఈ రాజులంతా ఒక్క క్షణంలో యమలోకానికి వెళ్ళుతారు. భీకరపోరాటంలో శిశుపాలునిపొగరు ఇప్పటికిప్పుడే అణగిపోతుంది. కుక్కలు మిక్కిలి ఎక్కువ సంఖ్యలో ఉన్నా, ఏనుగు కుంభస్థలాన్ని చీల్చగల మహాకఠినాలైన గోళ్ళ చివరలు గల సింహంమీద మొరిగి ఏంచేస్తాయి? సింహంవంటి మహాపరాక్రమశాలి అయిన శ్రీకృష్ణుని సంగతి తెలియనివా ళ్ళెవరు?' అని పలికిన భీష్మునిమాటలు శిశుపాలునికి కోపాన్ని కలిగించాయి.

**విశేషం:** అలం: నిదర్శన, పరికరం, శత్రుపక్షరాజుల అల్పత్వం, శ్రీకృష్ణుని ఆధిక్యం, పద్యంలోని అర్థాలంకారంచేతనే కాక, అక్షరయోజన చేతగూడ సువ్యక్తమవుతున్నది. 'కడు-పెక్కులు-అయ్యు-కుక్కలు' అనే అలతి అలతి పదాలకూడిక, వాటిలో ఒక్క మహాప్రాణాక్షరంకూడ లేని స్థితి. 'ఇభకుంభ దళన మహిష్ఠ నిష్ఠుర నఖ ముఖుఁడు' అనే సుదీర్ఘ సమాసం, అందలి ఓష్ఠ్య మూర్ధన్య కంఠ్యమహాప్రాణాక్షరాలైన భకార, షకార, ఠకార, ఖకారాల పునరుక్తి-ఇరుపక్షాల శక్తులందుండే వ్యత్యాసాన్ని చక్కగా ధ్వనింపచేస్తున్నాయి. కాగా, సింహం, శ్రీమహావిష్ణువు అనే రెండర్థాలు ఉండే 'హరి' శబ్దప్రయోగంకూడ పద్యాని కొక ప్రత్యేకశోభను పొదుగుతున్నది. ఇభకుంభదళన మహిష్ఠ నిష్ఠుర నఖముఖుడైన హరి అనటంతోనే - ఆనాడు మదించి హరిని దూషించిన హిరణ్యకశ్యపు వక్షస్థ్సలాన్ని, తన మహిష్ఠ నిష్ఠుర నఖముఖాలచే చీల్చి, రుధిరపానంచేసే రౌద్రరసోద్విగ్న భీకరనృసింహమూర్తి భావుకుడైన పాఠకుని మనోనయనానికి పొడగట్టుతున్నాడు.

### శిశుపాలుఁడు భీష్మునిఁ దూలనాడుట (సం. 2-38-1)

**ఉ. 'ఇమ్ముదివెట్టి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొనియాడె; ధర్మత**
**త్త్వమ్ములు పాండవేయులును దానునుగాని యెఱుంగరట్టె; సా**
**మమ్మున నెల్లవారి నవమాన్యులఁ జేసె నమాన్యుఁడంచు రూ**
**క్షమ్మున భీష్ముఁ జూచి బలగర్వితుఁ డి ట్లని పల్కె నల్కతోన్. 39**

**ప్రతిపదార్థం:** ఈ+ముదివెట్టి= ఈ ముసలి వెట్టివాఁడు-భీష్ముడు; వీనిన్= ఈ కృష్ణుణ్ణి; పరమ+ఈశ్వరున్, కాన్= భగవంతునిగా; కొనియాడెన్= పొగిడాడు; ధర్మతత్త్వమ్ములు= ధర్మంయొక్క పరమార్థాలు; పాండవేయులును= పాండవులు; తానును; కాని; ఎఱుంగరు+అట్టె= ఎరుగరట! - అంటే పాండవులు, తాను మాత్రమే తెలుసుకుంటారట!; అమాన్యుఁడు= గౌరవించతగినవాడు - ఈ భీష్ముడు; సామమ్మునన్= మంచిగా మెత్తగా మాట్లాడుతూనే; ఎల్లవారిన్= అందరిని; అవమాన్యులన్+చేసెన్= అవమానించబడినవాళ్ళను చేశాడు - అంటే అవమానించాడు, అంచున్= అంటూ; రూక్షమ్మునన్= కఱకుగా, - చురచుర; భీష్మున్; చూచి; బలగర్వితుఁడు= బలంచేత పొగరెక్కినవాడు; అల్కతోన్= కోపంతో; ఇట్లు+అని, పల్కెన్= పలికాడు.

**తాత్పర్యం:** 'ఈ ముసలి వెర్రి భీష్ముడు, ఈ గుణహీనుడైన శ్రీకృష్ణుణ్ణి, పరమేశ్వరు డని పొగిడాడు. ధర్మతత్త్వాలు ఈ పాండవులకు, తనకే తెలుసు నట! గౌరవార్హుడుగాని ఈ భీష్ముడు మెత్తగా మాట్లాడుతూనే అందరినీ అవమానించాడు!' అని ఆ కురుపితామహుణ్ణి చురచుర చూచి, బలగర్వితుడైన శిశుపాలుడు కోపంతో ఇంకా ఇలా అన్నాడు.

**విశేషం:** నన్నయగారు రూపొందించిన 'ఇమ్ముదివెట్టి' పదంలో శిశుపాలుని ఈసడింపు లెస్సగా వ్యక్తమైంది. ('పీనిన్' అని శ్రీకృష్ణుణ్ణి నిర్దేశించటంలో అతనిపట్ల శిశుపాలునికి గల క్రోధాసహ్యాభావం కూడ ధ్వనిస్తూఉంది. దానికి పోషకంగా రచనలో అర్థవ్యక్తిగుణం అమరింది. - సంపా.)

ఉ. **నెట్టన ధర్మనందనుఁడు ని న్నవలంబము సేసి యోడతోఁ**
**గట్టినయోడవోలె గతగౌరవుఁడై కడుఁదూలెఁ గృష్ణుఁ జే**
**పట్టి బిభీషికల్ ధరణిపాలుర కిప్పుడు సూపి; తెందు నీ**
**యట్టి దురాత్ములుం గలరె; యంత యధీరులె ధారుణీపతుల్?** **40**

**ప్రతిపదార్థం:** నెట్టన= తప్పనిసరై; ధర్మనందనుఁడు= ధర్మరాజు; నిన్నున్+అవలంబము, చేసి= నిన్ను ఆధారంగా చేసుకొని; కృష్ణున్+చేపట్టి= అర్ఘ్యమివ్వటానికి శ్రీకృష్ణుణ్ణి చేకొని; ఓడతోన్+కట్టిన, ఓడ, పోలెన్= ఒక ఓడతో కట్టిన మరొక ఓడవలె; గతగౌరవుఁడు+ఐ= కోల్పోయిన గౌరవం కలవాడై; కడున్= మిక్కిలి; తూలెన్= చలించాడు; ధరణి, పాలురకున్= భూపతులకు; - రాజులకు; ఇప్పుడు, బిభీషికల్= పెద్ద బెదిరింపులు; చూపితివి; ఎందున్= ఎక్కడైనా; నీ, అట్టి= నీవంటి; దురాత్ములున్= దుర్మార్గులు; కలరె; ధారుణీపతుల్= ఈ రాజులందరు; అంత, అధీరులె= అంత ధైర్యంలేనివాళ్ళా?

**తాత్పర్యం:** తప్పనిసరై ధర్మనందనుడు నిన్ను ఆధారంచేసుకొని అర్ఘ్యమివ్వటానికి శ్రీకృష్ణుణ్ణి స్వీకరించాడు. ఓడతో కట్టిన ఓడలా గౌరవాన్ని కోల్పోయి తూలాడు. ఈ సభలోఉన్న రాజులందరిని నీ విప్పుడు బెదిరించావు. ఎక్కడైనా నీవంటి దుర్మార్గులున్నారా? ఈ రాజులంతా అంత ధైర్యం లేనివాళ్ళా?

**విశేషం:** అలం: ఉపమ. భీష్ముణ్ణి ఆధారంచేసుకోవటం ధర్మరాజుకు తప్పనిసరి అవటానికి కారణం - ఆయన తాత అవటం, కృతాకృత పరిజ్ఞానంలో ధర్మజుడే ఆయనను నియమించటం. కాగా భీష్ముడు కావించిన శ్రీకృష్ణుని బలపరాక్రమ మాహాత్మ్య ప్రశంసలన్నీ పరోక్షంగా ప్రతిపక్షులకు బెదిరింపులే. (పద్యరచనలో అర్థవ్యక్తి పౌరుషోక్తులతోకూడిన ప్రసాదానికి పోషకంగా నిలిచింది. సంపా.)

సీ. **పూతనాఘాతంబుఁ, జేతనేతరమైన । శకటంబు త్రోపును జరణనిహతి,**
**వీఁకతోఁ గడుఁబూచుమ్రాకుల విఱుపును, । వల్మీకమాత్రపర్వతము నెత్తి**
**కొని, లావుగలఁడు వీఁ డన నేఁడు దివసంబు । లునికియు, వృషవధయును ననంగఁ**
**బమ్మిన కృష్ణుబీరమ్ములు వొగడుచు । నున్న నీ నాలుక యొక్కఁడయ్యు**

ఆ. **వ్రయ్యవలయు నూఱు వ్రయ్యలుగాఁగ; న । ట్లయినఁ గాని చాల వతనిఁ బొగడ;**
**నెల్లదాని నేన యెఱుఁగుదు; నెందు వాఁ । డర్ఘ్యదానయోగ్యుఁ డయ్యెఁ జెపుమ.** **41**

**ప్రతిపదార్థం:** పూతనా, ఘాతంబు= పూతన అనే రాక్షసిని చంపటం; చరణనిహతిన్= కాలిదెబ్బచేత; చేతన+ఇతరము+ఐన= ప్రాణంకలది కానిదైన; శకటంబు, త్రోపును= బండిని పడగొట్టటం; వీఁకతోన్= గర్వంతో; కడున్= మిక్కిలి - అంటే ఏమాత్రంకూడ; పూచుమ్రాకులన్= చేవలేని చెట్లను; విఱుపును= విరగదీయటాన్ని; వల్మీకమాత్ర, పర్వతమును= పుట్టఅంతటి చిన్నకొండను; ఎత్తికొని= పైకెత్తుకొని; లావు గలఁడు, వీఁడు+అనన్= బలంకలవా డితడు అనేటట్లు; ఏడు, దివసంబులు= ఏడురోజులు; ఉనికియున్= ఉండటమును; వృషవధయునున్= ఎద్దును చంపటమును; అనంగన్= అనేటటువంటి; పమ్మిన=

అతిశయించిన, కృష్ణుబీరమ్ములు= శ్రీకృష్ణుని పరాక్రమాలు; పొగడుచున్+ఉన్న; నీ, నాలుక; ఒక్కడు+అయ్యున్= ఒక్కటే అయినా; నూఱు వ్రయ్యలు, కాఁగన్= వందముక్కలయ్యేటట్లుగా, వ్రయ్యవలయున్= చీలిపోవాలి; అట్లు; అయినన్; కాని; అతనిన్= ఆ శ్రీకృష్ణుణ్ణి; పొగడన్= పొగడటానికి; చాలవు= సరిపోవు; ఎల్లదానిన్= ప్రతివిషయాన్ని, - ఆ కృష్ణునికి సంబంధించిన అన్ని విషయాలను; నేను+అ= నేనే; ఎఱుఁగుదున్; ఎందున్= ఏవిషయంలో; వాఁడు= ఆ కృష్ణుడు; అర్ఘ్య, దాన, యోగ్యుఁడు+అయ్యెన్= అర్ఘ్యాన్ని ఇవ్వటానికి తగినవాడయ్యాడో; చెపుము= చెప్పుమా!

**తాత్పర్యం:** పూతన అనే ఆడుదాన్ని చంపటం, కాలిదెబ్బతో ప్రాణంలేని బండిని పడద్రోయటం, ఏమాత్రం సారంలేని చెట్లను గర్వంతో విరవటం, పుట్టఅంత చిన్నకొండను ఎత్తుకొని వీడు బలవంతు డనిపించేటట్లు ఏడురోజు లుండటం, ఎద్దును చంపటం- అనే శ్రీకృష్ణుని పరాక్రమాలు పొగడుతున్న నీ నాలుక ఒక్కటే అయినా, అది నూరు చీలికలుగా చీలాలి. అట్లయితేగాని అతణ్ణి బాగా పొగడటానికి సరిపోవు. ఆ కృష్ణుని విషయాలన్నీ నాకు తెలుసు. ఏ విషయంలో వాడు అర్ఘ్యమివ్వటానికి తగినవా డయ్యాడో తెలుపు.

**విశేషం:** అంతటి మాయాపూతనా జీవితాపహరణాన్ని ఒక ఆడుదాన్ని చంపటంగాను, శకటాసురుడంతటివాణ్ణి భంజించటాన్ని ప్రాణంలేని బండిని పడద్రోయటంగాను, మహావృక్షరూపులైన మాయావులు యమళార్జునుల్ని పడవేయటం చేవలేనిచెట్లను విరవటంగాను, గోవర్ధనగిరిని ఎత్తి ఏడునాళ్ళు గొడుగుగా పట్టుకొనటాన్ని పుట్ట అంతటి చిన్నకొండను ఎత్తి బలవంతు డని విఱ్ఱవీగటంగాను, ధేనుకాసురుణ్ణి తుదముట్టించటాన్ని ఎద్దు నొకదానిని చంపటంగాను- తక్కువచేసి మాట్లాడే శిశుపాలుని తక్కువదనాన్ని, శ్రీకృష్ణద్వేషాన్ని ఈ పద్యం చక్కగా సూచిస్తున్నది. 'ఎల్లదాని నేన యెఱుఁగుదు నెందు వాఁ డర్ఘ్యదానయోగ్యుఁ డయ్యెఁ జెపుమ'- అనే దానికున్న, 'ఎల్లదాని నేన యెఱుఁగుదు నందు వీఁ డర్ఘ్య దానయోగ్యుఁ డగునె చెపుమ'- అనే పాఠాంతరం కూడ స్వీకరించదగిందే. 'పూచు మ్రాకుల'కు మూలంలో భండార్కర్ ప్రతిలో 'అర్కప్రమాణౌ తౌ వృక్షౌ'- (జిల్లేడుచెట్ల ప్రమాణం గలరెండుచెట్లు) అని ఉంది. (2-38-367).

**వ. స్త్రీలను గోబ్రాహ్మణులం గూడువెట్టువారిని విశ్వసించినవారిని వధియించుట మహాపాతకం బని పెద్దలు సెప్పుదు; రట్టివానియందు గోవిందుఁడు స్త్రీవధయును గోవధయునుం జేసె; నీవునుం గడు ధర్మువెఱింగినవాఁడ వయి వీని కర్ఘ్యం బిప్పించి; తదియునుంగాక యన్యకామ యయిన యంబ యను కన్యక నపహరించి నీవు దెచ్చిన నెఱింగి నీ తమ్ముండు విచిత్రవీర్యుండు ధర్మ వెఱిఁగినవాఁడై దాని విడిచి పుచ్చె. 42**

**ప్రతిపదార్థం:** స్త్రీలను; గోబ్రాహ్మణులన్; కూడు; పెట్టువారిని; విశ్వసించినవారిని= నమ్మినవారిని; వధియించుట= చంపటం; మహా, పాతకంబు+అని= మిక్కిలి పాప మని; పెద్దలు; చెప్పుదురు; అట్టి, వాని, అందున్= ఆ విధా లైన మహాపాపాల్లో; గోవిందుఁడు; స్త్రీవధయును; గోవధయునున్; చేసె; నీవునున్= నీవుకూడ; కడున్= గొప్పగా; ధర్మువు+ఎఱింగినవాఁడవు+అయి= ధర్మం తెలిసినవాడవయి; వీనికిన్= ఇటువంటి పాపాలు చేసిన ఈ కృష్ణునికి; అర్ఘ్యంబు+ఇప్పించితి; అదియునుంగాక; అన్య, కామ, అయిన= ఇతరుణ్ణి వరించినదైన; అంబ; అను; కన్యకన్; అపహరించి= దొంగిలించి; నీవు; తెచ్చినన్; ఎఱింగి= తెలుసుకొని; నీ, తమ్ముండు; విచిత్రవీర్యుండు; ధర్మువు+ఎఱిగినవాఁడు+ఐ= ధర్మాన్ని తెలిసికొన్నవాడై; దానిన్= ఆ కన్యకను; విడిచి; పుచ్చెన్= వదలివేశాడు.

**తాత్పర్యం:** స్త్రీలను, గోవులను, బ్రాహ్మణులను, అన్నంపెట్టినవారిని, నమ్మినవాళ్ళను చంపటం మహాపాప మని పెద్దలు చెప్పుతారు. అటువంటి పాపాల్లో గోవిందుడు స్త్రీవధను, గోవధను చేశాడు. నీకేదో గొప్పగా ధర్మం

తెలిసినట్లు అలాంటి పాపాలు చేసిన కృష్ణునికి అర్ఘ్యం ఇప్పించావు. అంతే కాదు, మరొకరిని ప్రేమించిన అంబ అనే కన్యకను నీవు అపహరించి తెచ్చావు. ఆ సంగతి తెలిసి, ధర్మం తెలిసిన నీ తమ్ముడు విచిత్రవీర్యుడు, ఆమెను విడిచిపెట్టాడు.

**విశేషం:** అంబ కాశీరాజు పెద్దకూతురు. ఆమె సాళ్వుణ్ణి ప్రేమించింది. స్వయంవర సమయంలో భీష్ముడు-తక్కిన రాజుల్ని జయించి తమ్ముడు విచిత్రవీర్యునికొరకు ఆమెను, ఆమె చెల్లెళ్ల - అంబికను, అంబాలికను బలవంతంగా తెచ్చాడు.

**క. జననిందిత మయి నీయం । దనపత్యత యను నధర్మ మది యుండఁగ ధ**
**ర్మనివృత్తచరిత్రక! నీ । యనుశాసన మెట్లు నమ్మ నగు జనములకున్? 43**

**ప్రతిపదార్థం:** జననిందితము+అయి= జనులచేత నిందించబడిందై; నీయందున్; అనపత్యత= సంతానం లేకుండటం; అను; అధర్మము; అది; ఉండఁగన్; ధర్మ; నివృత్త, చరిత్రక!= ధర్మంనుండి మరల్చబడిన చరిత్ర కలవాడా-అంటే ధర్మాన్ని వదలిన చరిత్ర కలవాడా!; నీ, అనుశాసనము= నీ ఆనతి; జనములకున్; ఎట్లు, నమ్మన్, అగున్= ఏవిధంగా సమ్మతమవుతుంది?

**తాత్పర్యం:** ధర్మానికి దూరమైనచరిత్రకలవాడా! సంతానం లేకపోవటం అనే అధర్మం - అందరిచేత నిందింపబడుతూ నీలో ఉంది కదా! అలాంటప్పుడు నీ ఆజ్ఞను జను లెట్లా శిరసావహిస్తారు?

**వ. తొల్లి సముద్రతీరంబున నుండి యొక్క వృద్ధహంస ధర్మాధర్మంబులు సెప్పుచు ధర్మమార్గంబున వర్తిల్లుచుండుఁ డని పక్షుల నెల్ల శిక్షించుచుఁ బ్రాణిహింస సేయక తపోవృత్తి నున్న దానికి సముద్రజలచరంబు లయిన పక్షులు రుచ్యంబు లగు భక్ష్యంబులు దెచ్చి పెట్టుచుం దత్సమీపంబునం దమ తమ యండంబుల నెల్ల నిక్షేపించి భక్షణార్థం బొక్కనాఁ డతిదూరం బరిగిన, నిట యాహంసయు నయ్యండంబుల భక్షించిన దాని నొక్క పక్షి గని యా పక్షులకెల్లం జెప్పిన, నవి దద్దయు దుఃఖించి యా యంచను వధియించెం గావున నట్ల నీవు నధర్మప్రవృత్తుండవై ధర్మశిక్ష సేయుచుఁ గౌరవుల కాపద యాపాదించుచున్నవాఁడవు. 44**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; సముద్రతీరంబునన్; ఉండి; ఒక్క; వృద్ధ, హంస= ముసలిహంస; ధర్మ+అధర్మంబులు= ఇది ధర్మం. ఇది అధర్మం అని; చెప్పుచున్; ధర్మమార్గంబునన్; వర్తిల్లుచున్+ఉండుఁడు= ప్రవర్తిస్తూ ఉండండి; అని; పక్షులన్+ఎల్లన్= అన్ని పక్షులను; శిక్షించుచున్= బోధిస్తూ; ప్రాణి, హింస, చేయక= ప్రాణులను చంపక; తపో, వృత్తిన్= తపస్సు చేసుకొంటూ; ఉన్నన్; దానికిన్= ఆ ముసలిహంసకు; సముద్ర, జల, చరంబులు= సముద్రపునీట తిరుగుతున్న; పక్షులు; రుచ్యంబులు+అగు= మంచి రుచికలిగినటువంటి; భక్ష్యంబులు= ఆహారపదార్థాలు; తెచ్చి; పెట్టుచున్; తత్, సమీపంబునన్= ఆ ముసలిహంస దగ్గర; తమ; తమ; అండంబులన్+ఎల్లన్= గ్రుడ్లనన్నింటిని; నిక్షేపించి= దాచిఉంచి; భక్షణ+అర్థంబు= ఆహారంకోసం; ఒక్కనాఁడు; అతి, దూరంబు; అరిగినన్; ఆ, ముసలి, హంస; ఆ+అండంబులన్= ఆ గ్రుడ్లను; భక్షించినన్= తినగా; దానిన్= ఆ తినటాన్ని; ఒక్క; పక్షి; కని= చూచి; ఆ, పక్షులకున్+ఎల్లన్= ఆ పక్షుల కన్నింటికి; చెప్పినన్; అవి; తద్దయున్= మిక్కిలి; దుఃఖించి; ఆ, అంచను= ఆ ముసలిహంసను; వధియించెన్= చంపాయి; కావునన్; అట్లు= ఆ విధంగా; నీవును; అధర్మ, ప్రవృత్తుండవు+ఐ= అధర్మంలో నడుస్తున్నవాడివై; ధర్మశిక్ష, చేయుచున్= ధర్మబోధచేస్తూ; కౌరవులకున్; ఆపద= కీడు; ఆపాదించుచున్+ ఉన్నవాఁడవు= కలిగిస్తున్నావు.

**తాత్పర్యం:** పూర్వం ఒక ముసలిహంస సముద్రతీరంలో నివసిస్తూ, ధర్మాధర్మాల్ని గూర్చి చెప్తూ, ధర్మమార్గంలో నడచుకొండని పక్షులన్నింటికి ఉపదేశిస్తూ, జీవహింస మాని తపస్సు చేసుకొంటూ ఉండింది. సముద్రపునీట తిరుగాడే పక్షులన్నీ ఆ ముసలిహంసకు రుచికరా లైన ఆహారపదార్థాలు తెచ్చిపెడుతూ, తమ గ్రుడ్లను దానిదగ్గర దాచిపెట్టి, ఒకరోజు దూరప్రాంతానికి ఆహారానికై వెళ్ళాయి. ముసలిహంస ఆ గ్రుడ్లను తినటం ఒకపక్షి చూచి తక్కినవాటికి చెప్పింది. ఆ పక్షులన్నీ మిక్కిలి దుఃఖించి ఆ ముసలిహంసను చంపివేశాయి. అలాగే నీవుకూడ అధర్మమార్గాన నడుస్తూ, ధర్మబోధ చేసి కౌరవులకు కీడు కలిగిస్తున్నావు.

**క. విదితముగ నధికబలసం । పద నోర్చె నుపేంద్రుఁ డవనిపాలుర నంచున్**
**మదిఁ బొగడితి; నా యెఱుఁగని । యదియె జనార్దనుబలంబు నత్యున్నతియున్? 45**

**ప్రతిపదార్థం:** ఉపేంద్రుఁడు= కృష్ణుడు; విదితముగన్= లోకప్రసిద్ధంగా; అధికబలసంపదన్= మిక్కుట మైన బలసమృద్ధితో; అవనిపాలురను= రాజులను; ఓర్చెన్= ఓడించాడు; అంచున్= అంటూ; మదిన్= మనసార; పొగడితి= కొనియాడావు; జనార్దను, బలంబున్= శ్రీకృష్ణునియొక్క బలం; అతి+ఉన్నతియున్= అధికమైన గొప్పతనము; నా, ఎఱుఁగని, అదియె= నాకు తెలియనిదా?

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు లోకప్రసిద్ధంగా అత్యధిక బలసంపదతో రాజులందరిని ఓడించా డని మనసార పొగిడావు. ఆ శ్రీకృష్ణుని బలం, గొప్పతనం నాకు తెలియనివా?

**క. సకలక్షత్రభయంకరు । నకు బార్హద్రథికి ననిమొనన్ మార్కొన నో**
**పక వలియం బాఱడె యీ । ముకుందుఁడు భయాతిరేకమునఁ బదిమాఱుల్. 46**

**ప్రతిపదార్థం:** ఈ ముకుందుఁడు= ఈ శ్రీకృష్ణుడు; సకల, క్షత్ర, భయంకరునకున్= అందరు క్షత్రియులకు భయాన్ని కలిగించేవాడికి; బార్హద్రథికిన్= బృహద్రథుని కుమారుడైన జరాసంధుడికి; అనిమొనన్= యుద్ధంలో ఎట్టయెదుట; మార్కొనన్+ ఓపక= ఎదుర్కొనలేక; భయ+అతిరేకమునన్= విపరీతమైన భయంతో; పదిమాఱుల్; వలియన్= బలహీనతను పొంది; పాఱడె= పరుగెత్తిపోలేదా?

**తాత్పర్యం:** అందరు రాజులకు భయాన్ని కలిగించేవాడు, బృహద్రథుని పుత్రుడు అయిన జరాసంధుణ్ణి యుద్ధంలో ఎదుర్కోలేక, విపరీత భయంతో ఈ శ్రీకృష్ణుడు బ్రతుకుజీవుడా అని పదిమార్లు పరుగెత్తిపోలేదా?

**వ. అమ్మహాసత్త్వు జరాసంధుం బరమబ్రహ్మణ్యు బ్రాహ్మణవేషంబున భీమార్జునులం దోడుసేసికొని వధియించె; నవి యెల్లం ద్రివిక్రము పరాక్రమంబులుగా నశ్రాంతవచనుండ వయి. 47**

**ప్రతిపదార్థం:** ఆ+మహాసత్త్వున్, జరాసంధున్= మహాబలసంపన్ను డైన ఆ జరాసంధుణ్ణి; పరమబ్రహ్మణ్యున్= మిక్కిలిగా బ్రాహ్మణుల హితం కోరేవాణ్ణి; బ్రాహ్మణవేషంబునన్; భీమ+అర్జునులన్; తోడు, చేసికొని= వెంటబెట్టుకొని; వధియించెన్= చంపాడు; అవి; ఎల్లన్; త్రివిక్రము= శ్రీకృష్ణునియొక్క; పరాక్రమంబులుగాన్; అశ్రాంతవచనుండవు+అయి= అలసటలేని మాటలు కలవాడివై.

**తాత్పర్యం:** మహాబలసంపన్నుడు, ఎంతగానో బ్రాహ్మణుల మేలు కోరేవాడు అయిన ఆ జరాసంధుణ్ణి బ్రాహ్మణవేషంలో భీమార్జునుల్ని సహాయులుగా చేసుకొని చంపాడు. వీటి నన్నింటిని శ్రీకృష్ణుని వీరకృత్యాలుగా అలసటలేని మాటలు కలవాడివై.

**ఆ. బూతు వొగడినట్లు వొగడెదు; పొగడంగ । వలయునేని సుగుణవంతు లయిన**
**కర్ణ శల్యు లాదిగాఁ గల వీరులఁ । బొగడుచుండరాదె ప్రొద్దువోక. 48**

**ప్రతిపదార్థం:** బూతు= బట్టువాడు(వంది); పొగడినట్లు; పొగడెదు= పొగడుతున్నావు; పొగడంగన్, వలయున్+ఏనిన్= పొగడదలచుకొంటే; సుగుణవంతులు+అయిన= మంచిగుణాలు కలవాళ్ళయిన; కర్ణ, శల్యులు+ఆదిగాన్= కర్ణుడు, శల్యుడు మొదలుగా గల; వీరులన్; ప్రొద్దు, పోక= కాలం గడపటానికి; పొగడుచున్+ఉండరాదె= పొగడుతూ ఉండకూడదా?

**తాత్పర్యం:** బట్టువానివలె పొగడుతున్నావు. పొగడదలచుకుంటే మంచిగుణాలు కల కర్ణ శల్యుల వంటి వీరు లున్నారు. ప్రొద్దుపోవటానికి వాళ్ళను పొగడుతూ ఉండరాదా?

**విశేషం:** 'ప్రొద్దుపోక'కు 'ప్రొద్దువోవ' అనే పాఠాంతరం ఉన్నది. (రౌద్రానుప్రాణితంగా శిశుపాలుడి వాక్యాలలో వికటత్వం లాస్యంచేస్తూ అగ్రామ్యత్వంవలన ఉదారత అనే గుణం రాణిస్తున్నది. -సంపా.)

**ఆ. అన్యకీర్తనంబు నన్యనిందయుఁ దన్నుఁ । బరఁగఁ బొగడికోలుఁ బ్రబ్బికోలు**
**నాపగాతనూజ! యార్యవృత్తములు గా । వనిరి వీని నాద్యులయిన మునులు. 49**

**ప్రతిపదార్థం:** ఆపగా, తనూజ= నదీతనయా! గాంగేయా!; ఆద్యులు+అయిన, మునులు= ప్రాచీను లైన మహర్షులు; అన్యకీర్తనంబున్= ఇతరులను పొగడటం; అన్య, నిందయున్= ఇతరులను దూషించటం; తన్నున్= తనను; పరఁగన్= ఒప్పుగా; పొగడికోలున్= పొగడుకొనటం; ప్రబ్బికోలున్= నిందించుకోవటం; వీనిన్= ఈ నాల్గింటిని; ఆర్య, వృత్తములు= పెద్దలు చేయదగిన పనులు; కావు+అనిరి.

**తాత్పర్యం:** గాంగేయా! ఇతరులను పొగడటం, నిందించటం, తనను తాను పొగడుకోవటం, నిందించుకోవటం పెద్దలు చెయ్యదగిన పనులు కా వని ప్రాచీను లైన మహర్షులు చెప్పారు కదా!

**వ. అని రూక్షాక్షరవచనంబుల నాక్షేపించుచున్న శిశుపాలుం జూచి సహింపనోవక భీమసేనుం డతిరౌద్రాకారంబున నలిగిన. 50**

**ప్రతిపదార్థం:** అని; రూక్ష+అక్షర, వచనంబులన్= కఠినాలైన అక్షరాలతో కూడుకొన్న మాటలతో; ఆక్షేపించుచున్+ఉన్న= దూషిస్తున్న; శిశుపాలున్; చూచి; సహింపన్+ఓపక= ఓర్చుకొనలేక; భీమసేనుండు; అతి, రౌద్ర+ఆకారంబునన్= మిక్కిలి భయంకరమైన రూపాన; అలిగినన్= కోపించగా.

**తాత్పర్యం:** అని కఠినాక్షరాలతో కూడుకొన్న మాటలతో దూషిస్తున్న ఆ శిశుపాలుణ్ణి చూచి ఓర్చుకోలేక భీముడు మిక్కిలి భయంకరమైన రూపంతో కోపించగా.

**విశేషం:** 'రూక్షాక్షరవచనంబుల' అనేదానికి 'రూక్షేక్షణవచనంబుల' అనే పాఠాంతరం అనేక ప్రతుల్లోఉంది. అర్థాన్నిబట్టి శిశుపాలుని మాటలు కఠినాలే గాని, అందలి అక్షరాల్లో కాఠిన్యమేముంది? కాగా సందర్భాన్నిబట్టి శిశుపాలుడు మాట్లాడిన మాటల్లోనే కాక అతడు కురుపితామహుణ్ణి చూచిన చూపుల్లోకూడ ఎంతో కటుకుదనం ఉండే అవకాశంఉంది. అందువల్ల కటుకుచూపులు, మాటలు - అనే అర్థాన్నిచ్చే 'రూక్షేక్షణవచనంబుల' అనే పాఠాంతరమే మేల్తర మనిపిస్తున్నది. అంతమందిలో, అంతటి కురుపితామహుణ్ణి నోటికి వచ్చినట్లు మాట్లాడే శిశుపాలుడి మాటల్లోని కటుకుదనాన్నే గాక, చూపుల్లోని కటుకుదనాన్నికూడ చూడబట్టే భీముడు అంత ఆగ్రహోదగ్రమూర్తి అయ్యా డనిపిస్తుంది.

**చ. ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా**
**నకతర లీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖ మై**
**భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటిత్రిమార్గగా**
**నుకృతిఁ బ్రభంజనప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్. 51**

**ప్రతిపదార్థం:** అచ్చటన్= ఆ సభలో; అంతకమూర్తికిన్= అందరిప్రాణాలను అంతమొందించేవాడైన యమధర్మరాజువంటి ఆకారాన్ని తాల్చినవానికి; ప్రభంజన, ప్రియ, తనూజునకున్= వృక్షాలు మొదలైనవాటిని విరిచే మహాబలు డైన వాయుదేవుని కూర్మి తనయునికి- భీమసేనునికి; ప్రకటిత, కోప, వేగమునన్= పెల్లుబికిన కోపంయొక్క వేగంచేత; పద్మదళ+ఆయత, నేత్రముల్= పద్మంయొక్క రేకులవంటి విశాలాలైన కన్నులు; అరుణద్యుతిన్= ఎఱ్ఱనికాంతితో; భయానకతర, లీలన్+తాల్చెన్= ఎక్కువభయంకరమైన రూపాన్ని ధరించాయి; భ్రుకుటి= బొమముడి; ఉద్యతము+ఐ= పైకి ఎత్తబడినదై; త్రిశాఖము+ఐ= మూడుభాగాలు కలదై - అంటే మూడు మెలికలు కలదై; త్రికూట, తటి= త్రికూట పర్వతప్రదేశంలో; త్రిమార్గగా+అనుకృతిన్= మూడుమార్గాల్లో వెళ్ళేటటువంటి దైన- అంటే స్వర్గ మర్త్య పాతాళలోకాల్లో ప్రవహించే దైన గంగానదిని పోలినదై; లలాటదేశమునన్= (భీముడియొక్క) నొసటిప్రదేశంలో; పొల్చెన్= ఒప్పింది.

**తాత్పర్యం:** ఆ సభలో యమునివంటి ఆకారం ధరించినవాడు, ప్రభంజను డైన వాయుదేవుడి ప్రియపుత్రుడు అయిన భీమునికి, పెల్లుబికిన కోపవేగంతో పద్మపత్రాలవంటి విశాలనేత్రాలు ఎఱ్ఱబడ్డాయి. భయంకర మైన రూపుదాల్చాయి. అతనినొసట బొమముడి ఎత్తుగా పైకుబికి మూడుభాగాలుగా మెలికలు తిరిగి, త్రికూట పర్వతప్రదేశంలో మూడుపాయలుగా చీలి స్వర్గ మర్త్య పాతాళాల్లో ప్రవహించే గంగానదిలా కన్పించింది.

**విశేషం:** అలం: ఉపమ. ఇది భీమసేనుని కోపవిజృంభణవర్ణనం. శిశుపాలుని దౌష్ట్యాన్ని చూచి ఆగ్రహోదగ్రుడైన భీమసేనుణ్ణి అంతకమూర్తి అనటం ఎంతో బాగుంది. అన్నగారి అనుమతి లభించాలే కాని ఆ కోపోద్రిక్తస్థితిలో శిశుపాలుని పాలిటికి, అతని సైన్యం పాలిటికి అప్పు డా భీమసేనుడు యముడే. 'ప్రభంజన ప్రియతనూజుడు' అనే సంబోధనకూడ ఈ సందర్భంలో భావస్ఫోరకంగా ఉంది. ప్రభంజనుడు ఏ విధంగా విజృంభించి, వీచి ఎంతటి వృక్ష సముదాయా న్నైనా ఏ విధంగా నేలమట్టం చేస్తాడో ఆయన ప్రియతనూజు డైన భీమసేనుడుకూడ- అన్నగారు ఊఁ అంటే చాలు- ఆ శిశుపాలుణ్ణి, అతని సైన్యాన్ని తాకి ఒక్కక్షణంలో మట్టుపెట్టగలడు. పద్మపత్రాల్లా సహజంగా విశాలాలే అయినా కోపోద్రిక్తు డైన ఆ భీమసేనుని కళ్ళు, అప్పు డెంతగా విప్పారి ఎఱ్ఱబడ్డాయో 'పద్మదళాయత' అనే సమాసంలోని సవర్ణదీర్ఘత చక్కగా సూచిస్తున్నది. ఎత్తైన అతని ఫాలభాగంమీది ఆ బొమముడి, ఎంత ఎత్తై ఏ విధంగా మూడు మెలికలు తిరిగిందో- త్రిశాఖమై, త్రికూటతటి, త్రిమార్గగ- అనే పదాల్లో మొత్తం వక్రమై మూడుసార్లు కనిపించే 'త్రి'లో భావుకుడు దర్శించవచ్చు. కాగా భీముని ధార్మికరోషాన్ని- ఎంత పవిత్రమో అంత ప్రమాదకరమైన గంగానదితో పోల్చటం ప్రత్యేకించి బాగున్నది. అక్షరసంయోజనచేతనే కాక, ఓజోగుణరచనచేతనే కాక, అర్థగాంభీర్యంచేతకూడ ఈ పద్యం మనోహరం; ప్రసిద్ధం.

## భీమునకు భీష్ముండు శిశుపాలుని వృత్తాంతంబు సెప్పుట (సం. 2-40-1)

**వ. ఇట్లు నిఖిల క్షత్త్రియత్రాసజననంబుగా నలిగి దంతసందష్ట దారుణ ముఖుండై శిశుపాల నిర్మూలనాభీల సంరంభంబున నున్న భీమసేను వారించి భీష్ముం డిట్లని చెప్పె : 'నిద్దురాత్ముండు తొల్లి చేదివంశంబున దమఘోషుం డనువానికి సాత్వతికిం జతుర్భుజ లలాట నేత్రంబులతో నుదయించి. రాసభరవంబున నేడ్చుచున్నం జూచి తల్లిదండ్రులు భయవిస్మయాధీనమనస్కులయి యున్న వారికి నొక్క యశరీరభూతం బిట్లనియె.' 52**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నిఖిల, క్షత్త్రియ, త్రాస, జననంబుగాన్= అందరు రాజులకు భయంపుట్టేటట్లు; అలిగి= కోపించి; దంత, సందష్ట, దారుణ, ముఖుండు+ఐ= పళ్ళుకొరకటంచేత భయంకర మైన ముఖం కలవాడై; శిశుపాల, నిర్మూలన+ఆభీల, సంరంభంబునన్= శిశుపాలుణ్ణి చంపటంలో భీకరమైన ఆటోపంతో; ఉన్న; భీమసేను; వారించి= ఆపి; భీష్ముండు; ఇట్లు+అని; చెప్పెన్; తొల్లి= పూర్వం; ఈ+దురాత్ముండు= ఈ దుర్మార్గు డైన శిశుపాలుడు; చేది, వంశంబునన్; దమఘోషుండు+అనువానికిన్; సాత్వతికిన్= సాత్వతి అనే పేరుగల ఆమెకు; చతుః+భుజ, లలాట, నేత్రంబులతోన్= నాలుగుభుజాలతో; నొసటి మీది కంటితో; ఉదయించి= పుట్టి; రాసభరవంబునన్= గాడిదకంఠధ్వనితో; ఏడ్చుచున్+ఉన్నన్= ఏడుస్తూ ఉండగా; తల్లిదండ్రులు= సాత్వతీదమఘోషులు; చూచి; భయ, విస్మయ+అధీన, మనస్కులు+అయి= భయానికి, ఆశ్చర్యానికి లొంగిపోయిన- అంటే భయాశ్చర్యాలతో నిండిన- మనస్సులు కలవాళ్ళయి; ఉన్నన్; వారికిన్; ఒక్క; అశరీర, భూతంబు= శరీరం లేకయే పలికే ప్రాణి- ఆకాశవాణి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** ఈ విధంగా కోపించి రాజు లందరికి భీతి కలిగేలా, పళ్ళుకొరుకుతూ భయంకర మైన ముఖంతో శిశుపాలుణ్ణి తుదముట్టించటానికి సమకట్టి, దారుణమైన ఆటోపంతో ఉన్న భీమసేనుణ్ణి ఆపి- భీష్ముడు, శిశుపాలుని చరిత్రను ఇలా చెప్పాడు: 'ఈ దుర్మార్గుడైన శిశుపాలుడు చేదివంశంలో సాత్వతీదమఘోషులకు పుట్టాడు. పుట్టుతూనే ఇతనికి- నాలుగుభుజాలు, నొసట కన్ను, గాడిదకంఠధ్వనితో ఏడ్పు వచ్చాయి. తల్లిదండ్రులు అది చూచి భయపడ్డారు, ఆశ్చర్యపోయారు. అప్పు డొక అశరీరవాణి ఇలా అన్నది.

**విశేషం:** సాత్వతి శ్రీకృష్ణుని మేనత్త.

**ఆ. వీని నొరులు చంపఁగా నోప రెవ్వరు; । నెవ్వరేని వీని నెత్తికొనుడు**
**మిగిలియున్న బాహుయుగళంబుఁ గన్నును । నడఁగు వీని కతఁడ యంతకుండు. 53**

**ప్రతిపదార్థం:** వీనిన్= ఈ బాలుణ్ణి; ఒరులు= ఇతరులు; ఎవ్వరున్= ఎవరుకూడ; చంపఁగాన్+ఓపరు= చంపలేరు; ఎవ్వరు+ఏనిన్= ఎవరైతే; వీనిన్= ఈ బాలుణ్ణి; ఎత్తికొనుడున్= ఎత్తుకొంటూనే; మిగిలి, ఉన్న= ఎక్కువగా ఉన్న; బాహు, యుగళంబున్= చేతులజంట; కన్నునున్= కన్ను; అడఁగున్= అణగిపోతాయో; అతఁడు+అ= అతడే; వీనికిన్; అంతకుండు= అంతమొందించేవాడు- యముడు.

**తాత్పర్యం:** ఈ బాలుణ్ణి ఇతరు లెవ్వరూ చంపలేరు. ఎవరైతే ఇతణ్ణి ఎత్తుకోగానే, ఎక్కువగా ఉన్న రెండుచేతులు, కన్ను అణగిపోతాయో అతడే ఇతడి పాలిటి యముడు.

**వ. అనిన నయ్యశరీరివచనంబులు విని వార లాశ్చర్యమానసులయి, యా కుమారుం జూడవచ్చిన వారికెల్ల నెత్తికొన నిచ్చుచున్నంత. 54**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+అశరీరి= ఆ శరీరంలేనిదానియొక్క; వచనంబులు= మాటలు; విని; వారలు= ఆ శిశుపాలుని తల్లిదండ్రులు; ఆశ్చర్య, మానసులు+అయి= ఆశ్చర్యంతో కూడుకొన్న మనస్సులు కలవాళ్ళయి; ఆ, కుమారున్; చూడ, వచ్చిన, వారికిన్+ఎల్లన్; ఎత్తికొనన్= ఎత్తుకొనటానికి; ఇచ్చుచున్+ఉన్న+అంతన్= ఇస్తూ ఉండగా.

**తాత్పర్యం:** అశరీరవాణి ఆవిధంగా చెప్పేసరికి, శిశుపాలుని తల్లిదండ్రులు ఆశ్చర్యపోయారు. చూడవచ్చినవాళ్ళందరి చేతికి ఎత్తుకోటానికి ఆ బాలుణ్ణి ఇవ్వసాగారు.

**చ. అతివికృతస్వరూపధరుఁ డైన కుమారకుఁ బ్రీతితోడ సా**
**త్వతిఁ దమ మేనయత్తను ముదంబునఁ జూడఁగఁగోరి యద్భుత**
**ప్రతిభులు రామకేశవులు పన్నుగ నేఁగిరి చేదిధారుణీ**
**పతిపురి కొక్కనాఁ డఖిల బాంధవ మంత్రిసుహృత్సమేతులై. 55**

**ప్రతిపదార్థం:** అద్భుత, ప్రతిభులు= ఆశ్చర్యకరమైన బుద్ధిబలం కలవాళ్ళయి; రామకేశవులు= బలరామకృష్ణులు; అతి, వికృత, స్వరూప, ధరుఁడు+ఐన= మిక్కిలి వికారమైన ఆకారాన్ని ధరించిఉన్నవాడైన; కుమారకున్= ఆ బాలుణ్ణి- శిశుపాలుణ్ణి; ప్రీతితోడన్= ప్రేమతో; తమ, మేన+అత్తను; సాత్వతిన్; ముదంబునన్= సంతోషంతో; చూడఁగన్+కోరి; ఒక్కనాఁడు; అఖిల, బాంధవ, మంత్రి, సుహృత్+సమేతులు+ఐ= అందరు బంధువులతో, మంత్రులతో, స్నేహితులతో కూడుకొన్నవాళ్ళయి; చేదిధారుణీపతి, పురికిన్= చేదిభూపతియొక్క పట్టణానికి; పన్నుగన్= ఒప్పుగా; ఏగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** అద్భుతప్రతిభావంతులైన బలరామకృష్ణు లిద్దరూ వికారరూపంలో ఉన్న బాలుడు శిశుపాలుణ్ణి, మేనత్త అయిన సాత్వతిని ప్రియమార చూడా లని బంధువులతో, మంత్రులతో, మిత్రులతో కలిసి ఒకనాడు చేదిభూపతి పట్టణానికి వెళ్ళారు.

**వ. ఇట్లు వచ్చిన రామకేశవులం బ్రియసత్కారంబులఁ బూజించి సాత్వతియు నబ్బాలు బలదేవుచేతికి నెత్తికొననిచ్చి తదనంతరంబ నారాయణుచేతికి నిచ్చిన. 56**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వచ్చిన, రామకేశవులన్; ప్రియసత్కారంబులన్= ఇష్టము లైన సమ్మానాలచేత; పూజించి; సాత్వతియున్; ఆ+బాలున్= ఆ బాలుడైన శిశుపాలుణ్ణి; బలదేవు చేతికిన్; ఎత్తికొనన్; ఇచ్చి; తత్+అనంతరంబ= ఆ తరువాత; నారాయణు, చేతికిన్= శ్రీకృష్ణునిచేతికి; ఇచ్చినన్.

**తాత్పర్యం:** సాత్వతి ఈ విధంగా వచ్చిన బలరామకృష్ణులను ప్రీతితో గౌరవించి, బాలుడైన శిశుపాలుణ్ణి, ఎత్తుకోటానికి మొదట బలరాముని చేతి కిచ్చింది. ఆ తరువాత శ్రీకృష్ణునిచేతికి ఇచ్చింది.

**క. అక్కొడుకు నబ్జనాభుం । డక్కజముగ నెత్తికొనుడు నందఱుఁ జూడన్**
**గ్రక్కున నొక్కట నడఁగెను । మిక్కిలి చేతులును వానిమిక్కిలి కన్నున్. 57**

**ప్రతిపదార్థం:** ఆ+కొడుకున్= ఆ సాత్వతికుమారు డైన శిశుపాలుణ్ణి; అబ్జనాభుండు= పద్మానాభుడు - శ్రీకృష్ణుడు; ఎత్తికొనుడున్= ఎత్తుకొన్నవెంటనే; అందఱున్; చూడన్; అక్కజముగన్= ఆశ్చర్యకరంగా; గ్రక్కునన్= వెంటనే; మిక్కిలి చేతులును= ఎక్కువగా ఉండే చేతులూ; మిక్కిలి కన్నున్= ఎక్కువగా ఉండే కన్నూ; ఒక్కటన్= ఒక్కసారిగా; అడఁగెను= అణగిపోయాయి.

**తాత్పర్యం:** శిశుపాలుణ్ణి శ్రీకృష్ణుడు ఎత్తుకోగానే, అందరూ చూస్తుండగా, ఆశ్చర్యకరంగా - అధికంగా ఉండే అతని చేతులు, కన్ను ఒక్కసారిగా అణగిపోయాయి.

**వ. దానిం జూచి సాత్వతి యద్భుతచిత్తయై యశరీరిపలుకు లప్పుడు దలంచి తన పుత్త్రునకు మురవైరివలన మరణం బగుట యెఱింగి యతని కి ట్లనియె. 58**

**ప్రతిపదార్థం:** దానిన్; చూచి; సాత్వతి; అద్భుత, చిత్త+ఐ= ఆశ్చర్యంతో కూడుకొన్న మనస్సు కలదై; అశరీరి, పలుకులు; అప్పుడు; తలంచి; తన, పుత్త్రునకున్; మురవైరివలనన్= శ్రీకృష్ణునివల్ల; మరణంబు+అగుట= చావు కలగటం; ఎఱింగి= తెలుసుకొని; అతనికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దానిని చూచి సాత్వతి ఆశ్చర్యపోయింది, అశరీరవాణి చెప్పిన మాటలను మనసులో తలచుకొన్నది. శ్రీకృష్ణునివల్లనే తనకొడుకుకు మరణం తప్ప దని తెలుసుకొన్నది. శ్రీకృష్ణునితో ఈ విధంగా అన్నది.

**క. కుపథప్రవృత్తుఁ డయి వీఁ । డపనయమున నీ కనిష్టుఁ డయినను గరుణా**
**నిపుణుఁడవై నీ మఱఁదికి । నపరాధశతంబు సైఁపుమయ్య యుపేంద్రా! 59**

**ప్రతిపదార్థం:** ఉపేంద్రా= ఓ శ్రీకృష్ణా!; వీఁడు= ఈ బాలుడు; కుపథ, ప్రవృత్తుఁడు+అయి= చెడుమార్గంలో నడిచేవాడై; అపనయమునన్= కీడుచేయటంచేత; నీకున్; అనిష్టుఁడు+అయినను= ఇష్టంలేనివాడు అయినప్పటికీ; కరుణా, నిపుణుఁడవు+ఐ= దయచూపటంలో నేర్పరివై; నీ, మఱఁదికిన్= నీమరది అయిన ఈ శిశుపాలునికి; అపరాధశతంబు= తప్పులు నూరింటిని; సైపుము+అయ్య= క్షమించవయ్యా!

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! ఈ బాలుడు చెడుమార్గంలో నడిచేవాడై అపకారం చేసి నీకు అప్రియుడైనా- నీ మరది చేసే తప్పులు నూరింటిని దయతో క్షమించు.

**విశేషం:** ఈపద్యంలో సాత్వతి 'నాకొడుకుకు' అనకుండా 'నీమఱఁదికి' అని అనటం, 'కరుణానిపుణుఁడవై' అని వేడుకొనటం విశేషం. ఆ బాలుడు దుర్మార్గుడైనా నీ బావమరది. బావలు మరదులు పరస్పరం క్షేమం కోరుకుంటా రని తెలుగులో నానుడి. ఆ బంధుత్వాన్ని జ్ఞాపకంచేసి దయచూపటానికికూడా తానే ఉపాయాలూ, దారులూ చూచుకొని రక్షించా లని సూచించి, శిశుపాలునితోపాటు అతని బ్రతుకునుకూడ శ్రీకృష్ణునిచేతుల్లో పెట్టినట్లు పలకటం మెచ్చుకోదగిన మాటనేర్పు. (సంపా.)

**వ. అని వీనితల్లి తొల్లి జగద్వల్లభుండైన జనార్దనుం బ్రార్థించి తత్ప్రసాదంబున వరంబు వడయుటం జేసి శతాపరాధంబులు నిండునంతకు వీఁ డన్యులచేత నప్రతిహతుండు; కృష్ణునిచేత నిహతుండగు; నది కారణంబుగా. 60**

**ప్రతిపదార్థం:** అని; వీని; తల్లి; తొల్లి= మునుపు; జగత్+వల్లభుండు+ఐన= లోకానికి ప్రభువైన; జనార్దనున్= శ్రీకృష్ణుణ్ణి; ప్రార్థించి; తత్+ప్రసాదంబునన్= ఆయన దయచేత; వరంబు; పడయుటన్+చేసి= పొందటంచేత; శత+అపరాధంబులు= నూరుతప్పులు; నిండునంతకున్= పూర్తిఅయ్యేవరకు; వీఁడు; అన్యులచేతన్= ఇతరులచేత; అప్రతిహతుండు= చంపబడడు; కృష్ణునిచేతన్; నిహతుండు+అగున్= చంపబడినవాడవుతాడు; అది, కారణంబుగా.

**తాత్పర్యం:** ఇదివరకు ఇతనితల్లి జగన్నాయకుడైన ఆ కృష్ణుణ్ణి ప్రార్థించి, ఆయనదయతో వరం పొందింది కనుక, నూరుతప్పులు నిండేదాకా ఇతడు ఇతరులచేత హతుడు కాడు. ఆ తరువాత శ్రీకృష్ణునిచేతనే హతు డౌతాడు. అందుచేతనే.

**చ.** **ఇతనికి నిట్లు న న్నుఱక యెగ్గులు వల్కఁగఁ బోలెఁగాక, యు**
**ద్ధతమతి నన్యు లీతని విధంబునఁ బల్కి మదీయచాప ని**
**ర్గత చటులోగ్రమార్గణ నికాయ పయోధి మునుంగ కిట్లు ద**
**ర్పితులయి పోవనేర్తురె గభీరపరాక్రమ! మారుతాత్మజా!** **61**

**ప్రతిపదార్థం:** గభీర, పరాక్రమ= గంభీరమైన పరాక్రమం కలవాడా! మారుత+ఆత్మజ= వాయుపుత్రా! భీమసేనా!; ఇతనికిన్; ఇట్లు= ఈవిధంగా; నన్నున్+ఉఱక= నన్ను లక్ష్యపెట్టక; ఎగ్గులు= నిందలు; పల్కఁగన్= పలకటానికి; పోలెన్+కాక= సాధ్యమైనదికాని; అన్యులు= ఇతరులు; ఈతని విధంబునన్; ఉద్ధతమతిన్= దుడుకుతనంతో; పల్కి= మాటాడి; మదీయ, చాప, నిర్గత, చటుల+ఉగ్ర, మార్గణ, నికాయ, పయోధి, మునుంగక= నాయొక్క ధనుస్సునుండి వెలువడి మెరుస్తున్న భయంకర బాణ సమూహ మనే సముద్రంలో మునగకుండ; ఇట్లు= ఈ విధంగా; దర్పితులు+ఐ= పొగరుబట్టి ప్రవర్తించినవాళ్ళయి; పోవనేర్తురె= బ్రతికిపోగలరా!

**తాత్పర్యం:** గంభీరమైన పరాక్రమం కలవాడా! వాయుపుత్రా! భీమసేనా! ఇతని కీవిధంగా న న్నూరకే నిందలు పలకటం సాధ్యమైందిగాని-ఇతరు లీవిధంగా దుడుకుతనంతో మాట్లాడితే, నా ధనుస్సునుండి వెలువడి మెరుస్తున్న బాణసమూహ మనే సముద్రంలో మునగకుండ ఇలా పొగరుబట్టి ప్రవర్తించి బ్రతకగలరా!

**విశేషం:** అలం: రూపకం. భీష్ముడు భీమసేనునికి ప్రయోగించిన విశేషణాలు రెండూ ప్రశంసాపూర్వకంగా అతని పెనుకోపాన్ని ఉపశమింపజేసేవే. (భీష్ముడు సంయమనంతో కూడుకొన్న క్రోధభావదీప్తిని ప్రకటిస్తున్న ఈ పద్యరచన ఔజ్జ్వల్యంతోకూడిన కాంతిగుణంతో శోభిల్లుతున్నది. - సంపా.)

**వ.** **అని పలుకుచున్న భీష్మభీముల నతిక్రమించి శిశుపాలుండు జనార్దనున కభిముఖుండయి యి ట్లనియె.** **62**

**ప్రతిపదార్థం:** అని; పలుకుచున్+ఉన్న; భీష్మ, భీములన్; అతిక్రమించి= దాటివెళ్ళి; శిశుపాలుండు; జనార్దనునకున్= శ్రీకృష్ణునికి; అభిముఖుండు+అయి= ఎదురుగా నిలిచినవాడై; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలుకుతున్న భీష్ముణ్ణీ, భీముణ్ణీ త్రోసిపుచ్చి శిశుపాలుడు శ్రీకృష్ణునితో ముఖాముఖి ఈ విధంగా అన్నాడు.

**మ. అవమాన్యున్ సభలోన మాన్యుఁ డని సౌహార్దంబునం గౌరవ**
**స్థవిర ప్రేరణ నిన్నుఁ బాండుతనయుల్ తప్పంగఁ బూజించి ర**
**య్యవివేకాస్పదు లైన పాండవులు మోహాంధుండు భీష్ముండుఁ గే**
**శవ! నీవుం గడఁగుండు నాకు నెదురై సంగ్రామరంగంబునన్. 63**

**ప్రతిపదార్థం:** అవమాన్యున్= అవమానించతగినవాణ్ణి; సభలోనన్= నిండుసభలో; మాన్యుఁడు+అని= గౌరవించదగినవాడని; సౌహార్దంబునన్= స్నేహంచేత; కౌరవ, స్థవిర, ప్రేరణన్= కురువంశపు ముదుసలి అయిన భీష్ముని ప్రేరణచేత; పాండు, తనయుల్= పాండురాజు కుమారులు; నిన్నున్; తప్పంగన్= తప్పువడి; పూజించిరి; ఆ+అవివేక+ఆస్పదులు+ఐన= ఆ తెలివితక్కువతనానికి స్థానమైనవాళ్ళయిన; పాండవులు; మోహ+అంధుండు= నీమీది విపరీత ప్రేమచేత గ్రుడ్డివాడైన; భీష్ముండు; కేశవ= కృష్ణా; నీవున్= నీవును; సంగ్రామరంగంబునన్= యుద్ధభూమిలో; నాకున్; ఎదురై= ఎదురుగా నిలిచి; కడఁగుండు= పూనుకొనండి; అంటే యుద్ధంచేయటానికి ప్రయత్నించండి.

**తాత్పర్యం:** అవమానించదగిన నిన్ను- స్నేహంచేత, కురువంశపు ముదుసలి అయిన భీష్ముని ప్రేరణచేత - నిండుసభలో గౌరవించదగినవాడి వని ఎంచి తప్పుగా పూజించారు. కేశవా! అవివేకులైన ఆ పాండవులు, నీ మీది మోహంతో మతికోల్పోయిన ఈ భీష్ముడు, నీవు- నాతో యుద్ధం చెయ్యటానికి సిద్ధం కండి.

**విశేషం:** ఇది మితిమీరిన శిశుపాలుడి మదాన్ని, మూర్ఖతను, మాటల కాఠిన్యాన్ని ప్రదర్శించే పద్యం, సభలో శిశుపాలుడు గర్వంతో ఎంతగా విర్రవీగి, ఎంత నిరసనభావంతో శ్రీకృష్ణుణ్ణి చూచి, ఎంత చులుకనగా ఆయనవైపు వేలెత్తిచూపి 'కేశవ నీవున్' అని పలికాడో ఆదిగురువు ఆవల లఘువులుకల ఆ మూడక్షరాలపదం (కేశవ) మూడవపాదం చివర, నాలుగవపాదంమొదట విరగటంలో ధ్వనిస్తున్నది. శిశుపాలుని అప్పటి మదాతిరేకతకు మత్తేభవృత్తంకూడ చక్కని సూచికగా ఉంది. (ఇందులోని అర్థవ్యక్తిగుణం రౌద్రరసానుగుణమైన ప్రసాదాన్ని పోషిస్తున్నది. -సంపా.)

**వ. అని శిశుపాలుండు గర్వించి పలికిన విని చక్రధరుం డఖిల రాజచక్రంబు విన నిట్లనియె. 64**

**ప్రతిపదార్థం:** అని; శిశుపాలుండు; గర్వించి; పలికినన్; విని; చక్రధరుండు= చక్రాయుధాన్ని ధరించినవాడు - శ్రీకృష్ణుడు; అఖిల, రాజ, చక్రంబు= అందరు రాజుల సమూహం; వినన్= వినేటట్లుగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని శిశుపాలుడు గర్వంతో మాట్లాడగా చక్రధారి అయిన శ్రీకృష్ణుడు సమస్త రాజ సమూహం వినేటట్లు ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** శిశుపాలుని ఉదంతంలో మొదటిసారిగా ఇక్కడ శ్రీకృష్ణుణ్ణి చక్రధరు డని ప్రయోగించటం ఎంతో భావస్ఫోరకంగా ఉంది. కథలో ఇక ప్రాధాన్యం వహించేది, సభలో రాజచక్రం దృష్టి నంతా ఆకర్షించేది ఈ చక్రప్రయోగమే. శిశుపాలుని మాటలు ఎంచి, చూచి, అతనిమాట పడిపోవటానికి కాల మాసన్న మైన దనీ, అతని కయ్యం ఊపును ఆపి యజ్ఞాన్ని నిర్విఘ్నం చేయవలసిన అవసరం ఏర్పడిం దనీ భావించి - బహుశః అప్పుడు శ్రీకృష్ణుడు చక్రాయుధాన్ని స్మరించి కేల గ్రహించి నిలిచాడేమో!

**సీ.** **ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుపయి నేము । వోయిన నీతఁ డన్యాయవృత్తి**
**నిట బాలవృద్ధుల కెల్ల భయంబుగా । ద్వారకాపురిఁ గాల్చె, వీరులైన**
**భోజరాజన్యులు పొలఁతులతోడ రై । వతకాద్రిఁ గ్రీడాభిరతిఁ బ్రమత్తు**
**లయియున్న వారల నదయుఁడై వధియించె; । దేవాభుఁ డగు వసుదేవు చేయు**

**ఆ.** **నశ్వమేధమునకు నభ్యర్చితం బైన । హయము నపహరించి యజ్ఞమునకు**
**విఘ్న మాచరించె; వీఁ డతిపాపుఁ డై । బభ్రుభార్యఁ దనకు భార్యఁ జేసె.** **65**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; ప్రాక్+జ్యోతిషంబునన్= ప్రాగ్జ్యోతిష మనే పట్టణంలో; భగదత్తుపయిన్= భగదత్తు డనే రాజుమీద; పోయినన్= దండెత్తిపోగా; ఈతఁడు= ఈ శిశుపాలుడు; ఇటన్= ఇక్కడ; ద్వారకాపురిన్= ద్వారకానగరాన్ని; బాలవృద్ధులకున్+ఎల్లన్= అందరుపిల్లలకు, ముసలివాళ్ళకు; భయంబుగాన్= భయంకలిగేటట్లుగా; కాల్చెన్= తగులబెట్టాడు; వీరులు+ఐన; భోజరాజన్యులు= భోజవంశపురాజులు; పొలఁతులతోడన్= భార్యలతోకూడి; రైవతక+అద్రిన్= రైవతక మనే పేరున్న పర్వతంలో; క్రీడా+అభిరతిన్= విహరించాలనే కోరికతో; ప్రమత్తులు+అయి= మైమరచి; ఉన్నన్; వారలన్; అదయుఁడు+ఐ= దయలేనివాడై; వధియించెన్= చంపాడు; దేవ+ఆభుఁడు+అగు= దేవతాసమాన మైన దీప్తి కలవాడయిన; వసుదేవు, చేయు= వసుదేవుడు చేసే; అశ్వమేధమునకున్= అశ్వమేధయాగానికి; అభి+అర్చితంబు+ఐన= బాగా పూజించబడిందైన; హయమున్= గుర్రాన్ని; అపహరించి= దొంగిలించి; యజ్ఞమునకున్= ఆ అశ్వమేధయాగానికి; విఘ్నము= ఆటంకం; ఆచరించెన్= చేశాడు(కలిగించాడు); వీఁడు= ఈ(నీచుడైన) శిశుపాలుడు; అతి, పాపుఁడు+ఐ= మిక్కిలి పాపాత్ముడై; బభ్రుభార్యన్= బభ్రువనే వాని భార్యను; తనకున్; భార్యన్+చేసె= భార్యగా చేసుకొన్నాడు.

**తాత్పర్యం:** ప్రాగ్జ్యోతిషాధిపతి భగదత్తునిమీద మేము దండెత్తిన సమయంలో - ఈ శిశుపాలుడు దుర్మార్గుడై బాలురకు, వృద్ధులకు భయం కలిగేటట్లు ద్వారకానగరాన్ని తగులబెట్టాడు. వీరులైన భోజరాజులు భార్యలతో కలిసి రైవతకాద్రిమీద క్రీడిస్తూ మైమరచి ఉన్న సమయంలో, క్రూరుడై వాళ్ళను వధించాడు. దేవతాసమానుడయిన వసుదేవుడు అశ్వమేధయాగానికై పూజించిన గుర్రాన్ని అపహరించి, ఆ యాగానికి చెరుపుచేశాడు. పాపాత్ముడై బభ్రుని భార్యను తన భార్యగా చేసుకొన్నాడు.

**వ.** **'మఱియు వాగ్విషయంబు లయిన యపకారంబు లనేకంబులు సేసె; మా యత్త సాత్వతి నన్నుం బ్రార్థించుటంజేసి యిద్దురాత్ముండు సేసిన యపరాధశతంబు సహించితి; నిప్పుడు మీ రిందఱు నెఱుంగ నాయం దకారణ వ్యతిక్రమం బుపక్రమించి యత్యంతశత్రుం డయ్యె' ననిన విని శిశుపాలుం డతిపరుష వచనుం డగుచుఁ బురుషోత్తమున కి ట్లనియె.** **66**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; వాక్+విషయంబులు+అయిన= మాటలకు సంబంధించిన; అపకారంబులు; అనేకంబులు; చేసెన్; మా, అత్త; సాత్వతి; నన్నున్; ప్రార్థించుటన్+చేసి= వేడుకొనటంచేత; ఈ+దురాత్ముండు= ఈ దుర్మార్గుడు; చేసిన; అపరాధశతంబు= నూరుతప్పులు; సహించితిన్= ఓర్చుకొన్నాను; ఇప్పుడు; మీరు+ఇందఱున్; ఎఱుంగన్; నా, అందున్; అకారణ, వ్యతిక్రమంబు+ఉపక్రమించి= కారణంలేని దుర్మార్గాన్ని ప్రారంభించి; అత్యంత శత్రుండు+అయ్యెన్= మిక్కిలి శత్రువయ్యాడు; అనినన్= అని అనగా; విని; శిశుపాలుండు; అతి, పరుష, వచనుండు+అగుచున్= మిక్కిలి కఠినమైన మాటలు కలవాడై; పురుషోత్తమునకున్= శ్రీకృష్ణునికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అంతేకాక, మాటలకు సంబంధించి అనేక అపకారాలుకూడ చేశాడు. మా అత్త సాత్వతి ప్రార్థించటంచేత ఈ దుర్మార్గుడు చేసిన నూరుతప్పులు సహించాను. ఇప్పుడు మీరంతా చూస్తుండగా నాపట్ల దుర్మార్గప్రవర్తన ప్రారంభించి పరమశత్రు వయ్యాడు' - అని శ్రీకృష్ణు డనగానే శిశుపాలుడు మహాకఠినా లైన మాటలతో ఆ పురుషోత్తముణ్ణి ఇలా అన్నాడు.

**క.** **నీ కూర్మియు నీ యలుకయు । నా కవి యేమిటికి దుర్గుణప్రియ! మొదలన్**
**నా కిచ్చిన యక్కన్యకఁ । జేకొని నీ కిట్లు పలుక సిగ్గును లేదే!** **67**

**ప్రతిపదార్థం:** దుర్గుణప్రియ= చెడుగుణాలు కలవాళ్ళకు ప్రియమైనవాడా!; నీ, కూర్మియున్= నీ స్నేహం; నీ, అలుకయున్= నీ కోపం; నాకున్+అవి, ఏమిటికిన్= వాటితో నాకేమి పని?; మొదలన్= మొదట; నాకున్+ఇచ్చిన; ఆ+కన్యకన్; చేకొని= చేపట్టి; నీకున్+ఇట్లు; పలుకన్; సిగ్గును; లేదే= లేదా!

**తాత్పర్యం:** దుర్జనులకు ప్రియమైనవాడా! నీ స్నేహంతో, నీ కోపంతో నా కేమి పని? మొదట నా కిచ్చిన కన్యను నీదానినిగా చేసుకొని ఈ విధంగా మాట్లాడటానికి సిగ్గులేదా?

**విశేషం:** సభలో శిశుపాలుని వాక్పారుష్యం చివరకు రుక్మిణి విషయంవరకు ప్రాకింది. అతనిపాపం పండింది. ('బభ్రు భార్యను శిశుపాలుడు తనభార్యగా చేసుకొన్నా'డని శ్రీకృష్ణుడు చేసిన నిందకు ప్రతిగా, రుక్మిచేత తనకు దత్త అయిన రుక్మిణిని శ్రీకృష్ణుడు రాక్షసవివాహపద్ధతిలో గ్రహించిన ఉదంతాన్ని పేర్కొన్నాడు శిశుపాలుడు. అంబను తెచ్చినందుకే భీష్ముణ్ణి అధిక్షేపించిన శిశుపాలుడు అన్యుడి భార్యనే తెచ్చి ఏలుకొంటున్న అధర్మవర్తను డని చేసిన శ్రీకృష్ణుని ఎత్తిపొడుపును సహించలేక, రెచ్చిపోయి మాటకుమాట వడ్డించాడు. వాదం ఒక తీవ్రస్థాయికి చేరింది. - సంపా.)

### చక్రాయుధముచేత శిశుపాలుండు చచ్చుట (సం. 2-42-21)

**చ.** **అని శిశుపాలుఁ డొండొకట నప్రియముల్ హరిఁ బల్కుచున్నచో**
**ననలశిఖాలి దూల దనుజాంతకచక్రము రాజచక్ర మె**
**ల్లను భయమంద మూర్ధవికలంబుగ నప్పుడు సేసెఁ జేదినం**
**దను తనువున్ బృహద్రుధిరధారలు బోరన మీఁది కొల్కఁగన్.** **68**

**ప్రతిపదార్థం:** అని; శిశుపాలుఁడు; ఒండు+ఒకటన్= ఒకదానివెంట ఒకటిగా; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; అప్రియముల్= నిందలు; పలుకుచున్+ఉన్నచోన్= పలుకుతుండగా; దనుజ+అంతక+చక్రము= రాక్షసులను అంతమొందించేవాడైన శ్రీకృష్ణునియొక్క చక్రాయుధం; అనల, శిఖా+ఆలి= అగ్నిజ్వాలల సమూహం; తూలన్= చలిస్తుండగా; రాజ, చక్రము+ఎల్లను= రాజుల సమూహమంతా; భయము+అందన్; చేదినందను, తనువున్= చేదిరాకుమారుడైన శిశుపాలుని శరీరాన్ని; బృహత్+రుధిర, ధారలు= పెద్దరక్తధారలు; బోరనన్= ఒక్కుమ్మడిగా; మీఁదికిన్; ఒల్కఁగన్= చిందేటట్లుగా; అప్పుడు; మూర్ధ, వికలంబుగన్= తల తెగిన దాన్నిగా; చేసెన్= చేసింది.

**తాత్పర్యం:** ఈ విధంగా శిశుపాలుడు ఒకదానివెంట ఒకటిగా శ్రీకృష్ణుణ్ణి నిందావాక్యాలతో దూషిస్తుండగా, రాక్షసాంతకు డైన శ్రీకృష్ణుని సుదర్శనచక్రం-అగ్నిజ్వాలలు చలిస్తుండగా, అందరు రాజులు భయపడుతుండగా, శిశుపాలుని శరీరంనుండి రక్తధారలు ఒక్కుమ్మడి మీదికి చిందుతుండగా అతని తలను నరికివేసింది.

**విశేషం:** రౌద్రరసరమ్యమైన ఈ సంఘటనలో శ్లేష మనే గుణాన్ని నన్నయ అక్షరరమణీయంగా వాడాడు. (సంపా.)

**ఉ.** **ప్రల్లదమేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రి తుల్యుఁడై**
**త్రెళ్ళెడు వానిదైన పృథుదేహము వెల్వడి తేజ మంబరం**
**బెల్ల వెలుంగ వచ్చి పరమేశ్వరు దేహము సొచ్చె విస్మయో**
**త్పుల్ల విశాలనేత్రు లయి భూపతులెల్లను జూచుచుండఁగన్.** **69**

**ప్రతిపదార్థం:** ప్రల్లదము+ఏది= నిందిస్తూ మాట్లాడటం (పెరిగి పెరిగి) నశించి; శిశుపాలుఁడు; ఇట్లు= ఈవిధంగా; వజ్ర, హత+అద్రి, తుల్యుఁడు+ఐ= వజ్రాయుధంచేత నరకబడ్డ కొండతో సమానమైనవాడై; త్రెళ్ళెడు= క్రిందపడుతున్న; వానిది+ఐన= ఆ శిశుపాలునియొక్క; పృథు, దేహము, వెలువడి= పెద్దశరీరంనుండి బయటికి వచ్చి; భూపతులు+ఎల్లను= రాజులందరు; విస్మయ+ఉత్పుల్ల, విశాల, నేత్రులు+అయి= ఆశ్చర్యంచేత వికసించిన పెద్ద కన్నులు కలవాళ్ళయి; చూచుచున్+ఉండఁగన్; తేజము= కాంతి; అంబరంబు+ఎల్లన్= ఆకాశమంతా; వెలుంగన్; వచ్చి; పరమ+ఈశ్వరు, దేహమున్= పరమాత్మ అయిన శ్రీకృష్ణుని దేహాన్ని; చొచ్చెన్= ప్రవేశించింది.

**తాత్పర్యం:** నిందిస్తూ మాట్లాడుతున్న శిశుపాలునినోరు మూత పడింది. రాజులంతా ఆశ్చర్యంతో కళ్ళంతా పెద్దవిచేసుకొని చూస్తుండగా-శిశుపాలుని శరీరం, వజ్రాయుధంతో హతమైన కొండలా క్రిందపడింది. ఆ కళేబరం నుండి ఒకకాంతి ఆకాశమంతా వెలుగులు చిమ్ముతూ వెలుపలికి వచ్చింది. శ్రీకృష్ణపరమాత్మ శరీరంలో చేరిపోయింది.

**విశేషం:** అద్భుతరసవ్యంజక మైన ఈ పద్యరచన నన్నయ ప్రసాదగుణప్రధానరచనకు ఒక ఉదాహరణం. (సంపా.)

**క.** **ఘనజాలము లేకయుఁ బెలు । చన పిడుగులతోడి వృష్టి చైద్యుని పాతం**
**బునఁ గురిసె; సముద్ర మహా । ద్రి నికాయముతో ధరిత్రి దిర్దిరఁ దిరిగెన్.** **70**

**ప్రతిపదార్థం:** చైద్యుని పాతంబునన్= చేదిరాజైన శిశుపాలునియొక్క పతనంతోడనే- అంటే శిశుపాలుడు తలతెగి పడటంతోనే; ఘనజాలము= మేఘాలయొక్క సమూహం; లేకయున్= లేకుండానే; పెలుచన= పెద్దగా; పిడుగులతోడి; వృష్టి= వాన; కురిసెన్; సముద్ర, మహా+అద్రి, నికాయముతోన్= సముద్రాలయొక్క, మహాపర్వతాలయొక్క సమూహంతో; ధరిత్రి= భూమి; దిర్దిరన్= గిర్రున; తిరిగెన్.

**తాత్పర్యం:** శిశుపాలుడు తల తెగి పడటంతోనే మేఘాలు లేకుండా పిడుగులతో కూడిన పెద్దవాన కురిసింది. సముద్రసమూహంతో, మహాపర్వత సమూహంతో భూమి దిర్దిర తిరిగింది.

**క.** **జయ జయ నినాదమున న । వ్యయు నంబుజనాభు భువనవంద్యు నుపేంద్రుం**
**బ్రియమునఁ బొగడెడు జనముల । దయిన మహాధ్వనియుఁ జెలఁగె నతితుములంబై.** **71**

**ప్రతిపదార్థం:** అవ్యయున్= నాశం లేనివాణ్ణి; అంబుజనాభున్= పద్మాన్ని నాభిలో కలవాణ్ణి; భువనవంద్యున్= లోకాలచేత పూజించదగినవాణ్ణి; ఉపేంద్రున్= శ్రీకృష్ణుణ్ణి; జయ జయ నినాదమునన్= జయ జయ శబ్దాల ధ్వనితో; ప్రియమునన్= మనసార; పొగడెడు; జనములది+అయిన= ప్రజలయొక్క; మహాధ్వనియున్= పెద్దశబ్దంకూడ; అతి, తుములంబు+ఐ= మిక్కిలి తీవ్రమైనదయి; చెలఁగెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** నాశం లేనివాడు, పద్మనాభుడు, లోకాలచేత పూజించదగినవాడు అయిన శ్రీకృష్ణుణ్ణి జయజయ ధ్వానాలతో మనసార పొగడే జనుల మహాధ్వని తీవ్రమై వ్యాపించింది.

**వ. అంత ననంతశయనుండు శిశుపాలు సంస్కరింపం బంచి వాని కొడుకుం జేదిరాజ్యంబున కభిషిక్తుం జేసె; నట్లు ప్రశాంతవిఘ్నంబయి, సుఖారంభంబయి, ప్రభూతభక్ష్యాన్నధనదానసనాథంబయి, జగన్నాథ రక్షితంబయి రాజసూయమహాధ్వరంబు సమాప్తప్రయోగం బయిన. 72**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; అనంతశయనుండు= శ్రీకృష్ణుడు; శిశుపాలు సంస్కరింపన్= శిశుపాలునికి అంత్యక్రియలు జరపటానికి; పంచి= ఆజ్ఞాపించి; వానికొడుకున్= ఆ శిశుపాలునియొక్క కుమారుణ్ణి; చేదిరాజ్యంబునకున్; అభిషిక్తున్= రాజునుగా; చేసెన్; అట్లు= ఆ విధంగా; రాజసూయ+మహా+అధ్వరంబు= రాజసూయమహాయాగం; ప్రశాంతవిఘ్నంబు+అయి= శాంతింపజేయబడిన విఘ్నం కలదై - అంటే అడ్డులేనిదై, సుఖ+ఆరంభంబు+అయి= సుఖమైన ఆరంభం కలదై; ప్రభూత, భక్ష్య+అన్న, ధన, దాన, సనాథంబు+అయి= అధికమైన పిండివంటలను, అన్నాన్ని, డబ్బును, దానం చేయటంతో కూడుకొన్నదై; జగన్నాథ, రక్షితంబు+అయి= జగత్తుకు ప్రభువైన శ్రీకృష్ణునిచేత రక్షించబడిందై; సమాప్తప్రయోగంబు+అయినన్= పూర్తిచేయబడిన కార్యక్రమం కలది కాగా.

**తాత్పర్యం:** తరువాత శ్రీకృష్ణుడు శిశుపాలుని మృతదేహానికి అంత్యక్రియలు చెయ్యం డని ఆజ్ఞాపించాడు. ఆతని కుమారుణ్ణి చేది రాజ్యానికి రాజుగా చేశాడు. ఆ విధంగా రాజసూయం నిరాటంకంగా సుఖంగా ప్రారంభమై అధికమైన భక్ష్యాన్న ధనదానాలతో, జగన్నాథుడైన శ్రీకృష్ణుని సంరక్షణలో సమాప్తం కాగా-

**విశేషం:** అనంతశయనుడు - అనంతుని (ఆదిశేషుడి)పై శయనించేవాడు - శ్రీమహావిష్ణువు, శిశుపాలుడు పూర్వజన్మలో ఆయన ద్వారపాలకుల్లో ఒకడు. శిశుపాలుని పుత్రుడు ధృష్టకేతుడు.

**ఉ. దేవగురుద్విజప్రకరతృప్తికరున్ వరరాజసూయ య**
**జ్ఞావభృథాభిషేకవిమలాంగు విశుద్ధయశోనిధిన్ జగ**
**త్పావను ధర్మనందను సభాస్థితుఁ జూచి ముదంబు చెంది రిం**
**ద్రావరజాది మిత్రు, లసహత్వముఁ బొందిరి ధార్తరాష్ట్రులున్. 73**

**ప్రతిపదార్థం:** దేవ, గురు, ద్విజ, ప్రకర, తృప్తికరున్= దేవతల, గురువుల, బ్రాహ్మణులయొక్క సమూహానికి తృప్తి కలిగించినవాణ్ణి; వర, రాజసూయ, యజ్ఞ+అవభృథ+అభిషేక, విమల+అంగున్= శ్రేష్ఠమైన రాజసూయయాగంలో అవభృథస్నానం చేయటంవలన పరిశుద్ధమైన శరీరం కలవాణ్ణి; విశుద్ధయశః+నిధిన్= నిర్మల కీర్తికి నిధి అయిన వాణ్ణి; జగత్+పావనున్= లోకాన్ని పవిత్రం చేసేవాణ్ణి; సభా, స్థితున్= సభలో కొలువు తీరినవాణ్ణి; ధర్మనందనున్= ధర్మరాజును; చూచి; ఇంద్ర+అవరజ+ఆది, మిత్రులు= ఇంద్రుని తమ్ముడైన శ్రీకృష్ణుడు మొదలయిన మిత్రులు; ముదంబు, చెందిరి= సంతోషించారు; ధార్తరాష్ట్రులున్= ధృతరాష్ట్రుని కుమారులు- కౌరవులు; అసహత్వమున్= ఓర్వలేమిని; పొందిరి.

**తాత్పర్యం:** దేవతలను, గురువులను, బ్రాహ్మణ సమూహాలను తృప్తినొందించినవాడు, రాజసూయమహాయాగం ముగిసిన సందర్భంలో అవభృథస్నానంతో పవిత్రమైన శరీరం కలవాడు, నిర్మలమైన కీర్తికి నిధివంటివాడు, లోకాన్ని

పవిత్రం చేసేవాడు అయిన ధర్మరాజు సభలో కొలువుతీరి ఉండగా, శ్రీకృష్ణాదు లైన మిత్రులంతా చూచి ఎంతో సంతోషించారు. కౌరవులు అసూయ చెందారు.

**విశేషం:** గుణం: ప్రసాదం. అవభృథము - యజ్ఞాంతంలో చేసేస్నానం. వ్యక్తివైభవాన్ని చూచి మిత్రులు ఆనందించటం, దాయాదులు అసూయ చెందటం లోకసహజం. కొన్ని ప్రతుల్లో ఈ పద్యానికి ముందు అధర్వణాచార్యునివి అని చెప్పబడే రెండు పద్యాలు ఉన్నాయి.

**వ. ఇట్లు మహావిభూతితో నున్న ధర్మరాజు నొద్దకు వచ్చి నానాదేశాగతులయిన రాజు లి ట్లనిరి. 74**

**ప్రతిపదార్థం:** ఇట్లు; మహా, విభూతితోన్= గొప్ప ఐశ్వర్యంతో; ఉన్న; ధర్మరాజు+ఒద్దకున్= ధర్మరాజు దగ్గరకు; వచ్చి; నానా, దేశ+ఆగతులు+ఐన= వివిధ దేశాలనుండి వచ్చిన; రాజులు; ఇట్లు+అనిరి.

**తాత్పర్యం:** ఈ విధంగా గొప్ప ఐశ్వర్యంతో ఉండే ధర్మరాజు దగ్గరకు చేరి, వివిధదేశాలనుండి వచ్చిన రాజులు ఇలా అన్నారు.

**మాలిని.**

**జగదభినుతసామ్రాజ్యంబుతో నొప్పు నీ య**
**త్యగణిత గుణయుక్తం బైన ధర్మప్రవృత్తిన్**
**మిగిలి వెలిఁగె నాజామీఢవంశంబు విద్వ**
**ద్గగనతపన! సర్వక్షత్త్రవంశంబులందున్. 75**

**ప్రతిపదార్థం:** విద్వత్+గగన, తపన= పండితులనే ఆకాశానికి సూర్యుని వంటివాడా!-ధర్మరాజా!; జగత్+అభినుత, సామ్రాజ్యంబుతోన్= లోకంచేత కొనియాడబడే సామ్రాజ్యంతో; ఒప్పు= ప్రకాశించే; నీ, అతి+అగణిత, గుణ, యుక్తంబు+ఐన, ధర్మప్రవృత్తిన్= ఏమాత్రం లెక్కించసాధ్యంగాని సుగుణాలతో కూడుకొన్న నీ ధర్మబద్ధమైన నడవడికచేత; సర్వ, క్షత్త్ర, వంశంబుల+అందున్= అన్నిరాజ వంశాలలో; ఆజామీఢవంశంబు= (మీదైన) ఆజామీఢవంశం; మిగిలి వెలిఁగెన్= ఎక్కువగా ప్రకాశించింది.

**తాత్పర్యం:** విద్వజ్జనులు అనే ఆకాశానికి సూర్యునివంటివాడా! ఓ ధర్మరాజా! లోకం అంతా కీర్తించే సామ్రాజ్యంతో వెలుగుతూ, లెక్కకు మిక్కిలి అయిన సుగుణాలతో కూడిన ధర్మప్రవర్తనతో రాణిస్తూ- అన్ని రాజవంశాల్లో నీ ఆజామీఢవంశమే అధికంగా ప్రకాశించింది.

**విశేషం:** గుణం : ప్రసాదం. అజామీఢుడు కురువంశమూలపురుషుడు. హస్తి అతనికి కుమారుడు. హస్తికుమారుడైన వికంఠనుడి కుమారుడు కూడ అజామీఢ నామధేయుడే.

**వ. 'ఏము భవదీయ రాజసూయ మహోత్సవ దర్శనంబునను భవత్కృత సత్కార గౌరవంబుననుం జేసి కృతార్థుల మయితిమి. మా మా దేశంబులకుం బోయెద' మని చెప్పి వీడ్కొని చని; రప్పుడు ధర్మరాజువచనంబున భీష్మధృతరాష్ట్రుల భీమసేనుండును, యజ్ఞసేను నర్జునుండును, సపుత్త్రకులయిన (కర్ణ) శల్య సుబలుల**

**నకులుండును, గృపద్రోణాశ్వత్థామల సహదేవుండును, విరాట భగదత్తుల ధృష్టద్యుమ్నుండునుం, బార్వతేయులైన రాజుల సౌభద్రద్రౌపదేయులును ననిచి రంత. 76**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; భవదీయ, రాజసూయ, మహా+ఉత్సవ, దర్శనంబునను= మీయొక్క రాజసూయయాగ మహోత్సవాన్ని చూడటంచేత; భవత్+కృత, సత్కార, గౌరవంబుననున్+చేసి= మీచే చేయబడిన సమ్మానంవలన కలిగిన గొప్పతనంచేత-అంటే మీరు చేసిన మర్యాదచేతను; కృతార్థులము+అయితిమి= ధన్యులమయ్యాము; మా, మా, దేశంబులకున్; పోయెదము; అని; చెప్పి; వీడ్కొని= వదలి; చనిరి= వెళ్ళారు; అప్పుడు; ధర్మరాజు, వచనంబునన్= ధర్మరాజుయొక్క మాటను అనుసరించి; భీష్మ, ధృతరాష్ట్రులన్; భీమసేనుండును; యజ్ఞసేనున్= ద్రుపదుణ్ణి; అర్జునుండును; సపుత్త్రకులు+అయిన= కుమారులతో కూడుకొనినవాళ్ళయిన; (కర్ణ), శల్య, సుబలులన్; నకులుండును; కృప, ద్రోణ+అశ్వత్థామల; సహదేవుండును; విరాట, భగదత్తులన్; ధృష్టద్యుమ్నుండునున్; పార్వతేయులు+ఐన, రాజులన్= పర్వత దేశానికి సంబంధించిన రాజులను; సౌభద్ర, ద్రౌపదేయులునున్= సుభద్రాతనయుడైన అభిమన్యుడు, ద్రౌపదీ పుత్రులైన ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు; అనిచిరి= సాగనంపారు; అంతన్= తరువాత.

**తాత్పర్యం:** 'మేము నీ రాజసూయ యాగ మహోత్సవాన్ని చూచి, నీవు చేసిన సమ్మానగౌరవంతో ధన్యుల మయ్యాం. ఇక మా మా దేశాలకు వెళ్ళివస్తాం' అని సెలవు తీసుకొని వెళ్ళారు. అప్పుడు ధర్మరాజు ఆజ్ఞాపించగా భీమసేనుడు భీష్మధృతరాష్ట్రులను, అర్జునుడు ద్రుపదుణ్ణి, నకులుడు (కర్ణ) శల్య సుబలులను, వాళ్ళ కుమారులను, సహదేవుడు కృపద్రోణాశ్వత్థామలను, ధృష్టద్యుమ్నుడు విరాటభగదత్తులను, అభిమన్యుడు ఉపపాండవులు పర్వతదేశాల రాజులను సాగనంపారు. ఆ తరువాత.

**విశేషం:** కర్ణ శల్యుల విషయం మూలంలో లేదు. అనేక ప్రతుల్లో 'సుబలుల' అనటానికి బదులు 'సౌబలుల' అని ఉంది. కాని మూలంలో సుబలుడినే నకులుడు సాగనంపినట్లుంది. 'నకులః సుబలం రాజన్ సహపుత్త్రం సమన్వయాత్' (భండార్కరు ప్రతి 2-42-43) సుబలుడు= గాంధారరాజు, గాంధారియొక్క తండ్రి. ఆయన పెద్దవాడు, గౌరవించదగినవాడు కనుక నకులుడు ఆయనవెంట వెళ్ళి పంపటమే సమంజసం. సౌబలు డంటే సుబలుని కొడుకు - శకుని.

**క. సతత ధన దానములఁ బూ। జితులయి తృప్తులయి గుణవిశిష్టమహీదే**
**వతవరులు ధర్మసుతు మా। నితగుణు దీవించి చనిరి నిజ గృహములకున్. 77**

**ప్రతిపదార్థం:** గుణ, విశిష్ట, మహీదేవత, వరులు= గుణంచేత గొప్పవాళ్ళయిన బ్రాహ్మణశ్రేష్ఠులు; సతత, ధన, దానములన్= ఎడతెగని ధనదానాలచేత; పూజితులు+అయి= పూజించబడినవాళ్ళయి; మానిత, గుణున్= గౌరవించదగినగుణాలు కలవాడయిన; ధర్మసుతున్= ధర్మరాజును; దీవించి; నిజగృహములకున్= తమ ఇండ్లకు; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** గుణాలచేత గొప్పవాళ్ళయిన బ్రాహ్మణోత్తములంతా-ఎడతెగని ధనదానాలతో తృప్తిపొంది, గౌరవించదగిన గుణాలు కలవాడైన ధర్మరాజును దీవించి, తమ తమ ఇండ్లకు వెళ్ళారు.

**వ. నారాయణుండును బాండునందనుల నందఱం గ్రమంబున వీడ్కొని ద్వారవతికిం బోవుచుండి ధర్మరాజున కి ట్లనియె. 78**

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడుకూడ పాండవులందరికి ఒకరి తరువాత ఒకరికి వీడ్కోలు చెప్పి ద్వారవతీనగరానికి పోబోతూ ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**తే.** **సకలభూతసంఘంబు పర్జన్యుఁ, బక్షి । సమితి బహుఫలవృక్షంబు, నమరు లింద్రు**
**ననిశమును నుపజీవించునట్లు బంధు । జనులు ని న్నుపజీవింప మనుము పేర్మి. 79**

**ప్రతిపదార్థం:** సకల, భూత, సంఘంబు= అన్ని ప్రాణుల సమూహం; పర్జన్యున్= మేఘుణ్ణి; పక్షి, సమితి= పక్షుల సమూహం; బహు, ఫల, వృక్షంబున్= పెక్కు పండ్లున్న చెట్టును; అమరులు= దేవతలు; ఇంద్రున్= దేవేంద్రుణ్ణి; అనిశమును= ఎల్లప్పుడూ; ఉపజీవించునట్లు= ఆశ్రయించి బ్రతికేటట్లు; బంధుజనులు; నిన్నున్+ఉపజీవింపన్= నిన్ను ఆశ్రయించి బ్రతికేటట్లుగా; పేర్మిన్= గొప్పగా; మనుము= జీవించుము.

**తాత్పర్యం:** ధర్మరాజా! అన్ని ప్రాణులు మేఘుణ్ణి, పక్షిసమూహం పెక్కుఫలాలున్న వృక్షాన్ని, దేవతలు దేవేంద్రుణ్ణి, ఎల్లప్పుడు ఆశ్రయించి జీవిస్తున్నట్లు- బంధువులందరు ని న్నాశ్రయించి బ్రతికేలా గొప్పగా మనుగడ సాగించు.

**విశేషం:** అలం: ఉపమ. బంధుజనులు రాజును ఆశ్రయించే విధాలను, రాజు వాళ్ళను రక్షించే పద్ధతులను ఈ పద్యంలో వాడిన మూడు ఉపమానాలు సూచిస్తున్నాయి. ప్రాణులకు జలం ప్రాణాధారం, అలాగే బంధుజనుల ప్రాణరక్షణభారం రాజు వహించాలి. పండ్లవృక్షాన్ని పక్షులు ఆహార నివాసాలకొరకు ఆశ్రయిస్తాయి. అలాగే రాజు తనను ఆశ్రయించిన బంధువులకు ఆహారనివాసాలకు అవసరమైన ద్రవ్యాలను అందించాలి. అంటే ఆశ్రయ మిచ్చి పోషించా లని భావం. అమరులు ఇంద్రుణ్ణి ఆశ్రయించి సురక్షితులుగా ఉండా లని ఆశిస్తారు. అలాగే రాజు బంధువులకు రక్షాకవచంగా నిలవాలి. ఈ మాటలు ఒక బంధువుగా శ్రీకృష్ణుడు చెప్పటంలో విశేషం ఉన్నది. (సంపా.)

**వ.** **'మఱియు నప్రమత్తుండవయి నిఖిలప్రజారక్షణంబు సేయు'మనినఁ గృష్ణునకు ధర్మరా జి ట్లనియె. 80**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతేకాక; అప్రమత్తుండవు+అయి= ఏమరుపాటు లేనివాడివై; నిఖిల, ప్రజా, రక్షణంబు, చేయుము= అందరు ప్రజలను రక్షించుము; అనినన్, కృష్ణునకున్; ధర్మరాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అంతేకాక, ఎటువంటి ఏమరుపాటు లేకుండా ప్రజలందరిని రక్షించు' అని శ్రీకృష్ణుడు అనగా ధర్మరాజు ఇలా అన్నాడు.

**ఉ.** **నీకరుణం గరంబు రమణీయతరంబయి సర్వవిఘ్నదూ**
**రీకృతమై సమాప్తి నొనరెన్ ధరణీధర! యిమ్మఖంబు; భూ**
**లోకములోన నేను నృపలోక నమస్కృతిఁ గీర్తిఁ బర్వితిన్;**
**నా కులమున్ వెలింగె సుగుణంబుల కాస్పదమై పవిత్రమై. 81**

**ప్రతిపదార్థం:** ధరణీధర= భూమిని ధరించినవాడా! శ్రీకృష్ణా!; నీ, కరుణన్= నీ దయచేత; ఈ, మఖంబు= ఈయజ్ఞం; కరంబు= మిక్కిలి; రమణీయ తరంబు+అయి= ఎక్కువ మనోహరమైనదయి; సర్వ, విఘ్న దూరీకృతము+ఐ= అన్ని ఆటంకాలకు దూరం చేయబడినదై; సమాప్తిన్+ఒనరెన్= ముగింపుతో ఒప్పింది; లోకములోనన్; నేను; నృప, లోక, నమస్కృతిన్, కీర్తిన్= రాజసమూహం యొక్క నమస్కారంచేత కీర్తితో; పర్వితిన్= ప్రసిద్ధుడనయ్యాను; సుగుణంబులకున్= మంచిగుణాలకు; ఆస్పదమై= ఉనికిపట్టయి; పవిత్రము+ఐ= పరిశుద్ధమై; నా, కులమున్= నాయొక్క వంశంకూడ; వెలింగెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** భూభారాన్ని వహించిన ఓ శ్రీకృష్ణా! నీ దయతో ఈయజ్ఞం ఎంతో మనోజ్ఞమై, నిర్విఘ్నమై, శోభాయమానంగా ముగిసింది. లోకంలో రాజులంతా నమస్కరించటంవల్ల వచ్చిన కీర్తితో నేను ప్రసిద్ధుడి నయ్యాను. నా వంశం కూడ మంచిగుణాలకు నిలయమై, నిర్మలమై ప్రకాశించింది.

**విశేషం:** ధరణీధర! అనే సంబోధనలో 'భూభారాన్నే వహించిన నీకు నా యజ్ఞభారాన్ని వహించటం ఒక లెక్కా' అనే ధ్వని కూడ లేకపోలేదు. (ఆనందపూర్ణమయిన ధర్మరాజు హృదయం అక్షరరమ్యంగా మాధుర్యగుణ బంధురంగా ఈ పద్యంలో ప్రతిఫలించింది. - సంపా.)

**క. ద్వారవతి నుండియును నిట । యారసియుండునది దానవాంతక! లోకా**
**ధార! సమీపస్థుండవ । దూరంబున నుండియుం జతుర్భుజ! మాకున్. 82**

**ప్రతిపదార్థం:** దానవ+అంతక!= రాక్షసులను నాశ మొనర్చేవాడా! లోక+ఆధార= లోకానికి ఆధారమైనవాడా! చతుర్భుజ!= నాలుగుభుజాలు కలవాడా!-శ్రీకృష్ణా!; ద్వారవతిన్+ఉండియును= ద్వారకానగరంలో ఉన్నప్పటికిని; ఇటన్= ఇక్కడ; ఆరసి+ ఉండునది= (మా యోగక్షేమాలను) విచారిస్తూ ఉండవలసింది; దూరంబునన్, ఉండియున్= దూరంలో ఉండికూడ; మాకున్; సమీపస్థుండవు+అ= దగ్గరివాడివే.

**తాత్పర్యం:** రాక్షసుల్ని నాశం చేసేవాడా! లోకానికి ఆధారమైనవాడా! నాలుగు భుజాలు కలవాడా! శ్రీకృష్ణా! నీవు ద్వారకానగరంలో ఉన్నప్పటికీ, ఇక్కడి మా యోగక్షేమాలు విచారించు, దూరంగా ఉన్న నీవు మా కెప్పుడూ దగ్గరివాడివే.

**విశేషం:** ధర్మరాజు శ్రీకృష్ణుని శక్తిసామర్థ్యాల్ని, మాహాత్మ్యాన్ని ప్రశంసించి, 'నీ వెక్కడున్నా ఇక్కడ మా యోగక్షేమాల్ని విచారించవలసిన బాధ్యత నీదే' అని అనన్యభక్తితో అంటున్నాడు. (ఈ మాటల్లో సర్వేశ్వరుని అనంతశక్తిమత్వాన్నీ, అనంత వ్యాపకత్వాన్నీ ధర్మరాజు ధ్వనిమయంగా స్తుతించాడు. ద్రౌపదీమానసంరక్షణ ఘట్టంలో ఈ వాక్యం నిజం కానున్నది. ఇది వస్తుధ్వని. - సంపా.)

**వ. 'నిన్నుం బాసి నిమిషంబయిన నిర్వహింప నేర'మని ధర్మరా జెట్టకేనియు గరుడగమనుగమనంబున కొడంబడియె; నంత. 83**

**ప్రతిపదార్థం:** నిన్నున్+పాసి= నిన్నువిడిచి; నిమిషంబు+అయినన్; నిర్వహింపనేరము= జీవితాన్ని నడుపుకోలేము; అని; ధర్మరాజు; ఎట్టకేనియున్= అతి కష్టంమీద; గరుడ, గమను, గమనంబునకున్= (గరుత్మంతుని మీద ప్రయాణంచేసేవాని ప్రయాణానికి) శ్రీకృష్ణుని ప్రయాణానికి; ఒడంబడియెన్= అంగీకరించాడు; అంతన్= తరువాత.

**తాత్పర్యం:** 'నిన్ను విడిచి నిమిషంకూడా ఉండలేము' అంటూ ధర్మరాజు ఎంతోకష్టంమీద శ్రీకృష్ణుని ప్రయాణానికి అంగీకరించాడు. ఆ తరువాత.

**విశేషం:** గరుడ గమనుఁడు-గరుడునిపై ప్రయాణం చేసేవాడు - విష్ణుమూర్తి - శ్రీకృష్ణుడు.

**చ. అనిలజవాశ్వయుక్తమయి హాటకరత్న విచిత్ర తార్క్ష్య కే**
**తనమయి మేఘనాదమయి దారుక సారథియైన దివ్య కాం**
**చన రథ మెక్కి యాక్షణమ సాత్వతకుంజరుఁ డేఁగె భక్తి నా**
**తని ననిచెన్ యుధిష్ఠిరుఁడు దమ్ములు దానును బాదచారియై. 84**

**ప్రతిపదార్థం:** సాత్వత, కుంజరుఁడు= సాత్వతవంశశ్రేష్ఠుడు - శ్రీకృష్ణుడు; అనిల, జవ+అశ్వ, యుక్తము+అయి= వాయువేగం గల గుర్రాలతో కూడినదై; హాటక, రత్న, విచిత్ర, తార్క్ష్య, కేతనము+అయి= బంగారుతో, రత్నాలతో, చాలా చిత్రమైన రంగు గల గరుడధ్వజం కలదై; మేఘ, నాదము+అయి= మేఘ గర్జనం వంటి శబ్దం కలదై; దారుక, సారథి, ఐన= దారుకుని సారథిగా గలదైన; దివ్య, కాంచన, రథము= దేవతాసంబంధమైన బంగారు రథాన్ని; ఎక్కి; ఆ, క్షణము+ఆ= ఆ నిమిషాన్నే; ఏఁగెన్= వెళ్ళాడు; యుధిష్ఠిరుఁడు= ధర్మజుడు; తమ్ములు; తానును; పాదచారియై= నడిచివెళ్ళి; భక్తిన్= భక్తితో; అతనిన్= ఆ కృష్ణుని; అనిచెన్= సాగనంపాడు.

**తాత్పర్యం:** సాత్వత వంశశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు- వాయువేగం గల గుర్రాలు, బంగారుతో, రత్నాలతో చిత్రమైన గరుడధ్వజం, మేఘగర్జన లాంటిశబ్దం కలిగి- దారుకుడు సారథిగా ఉన్న దివ్యమైన కాంచన రథాన్ని అధిరోహించి ఆ క్షణమే ద్వారకకు బయలుదేరివెళ్ళాడు. ధర్మరాజు తమ్ములతో కూడ నడిచి వెళ్ళి, భక్తి భావంతో శ్రీకృష్ణుణ్ణి సాగనంపాడు.

**విశేషం:** సాత్వతుడు వృష్ణి తండ్రి. ధర్మరాజు స్వయంగా నడిచి వెళ్ళి సాగనంపింది ఒక శ్రీకృష్ణుణ్ణే. (శ్రీకృష్ణుడి రథయాత్రలో కానవచ్చే ఔదాత్త్యాన్ని, గతిగాంభీర్యాన్ని, శబ్దాలంకారభ్రాంతిని కలిగించే వివిధ మధురాక్షరసంయోజనంవలన కలిగిన అక్షరరమ్యత అనుభూతికి అందిస్తున్నది. రథగమనమధురనాదమే ఈ వృత్తరచనమా అనిపిస్తున్నది. వృత్తం ప్రతిపాదం చివరిఅక్షరం దగ్గర విరిగి ముందుపాదంలోకి గతి చొచ్చుకొనిపోయే నిర్మాణసమత మార్గాభేదత్వాన్ని ధ్వనింపచేస్తున్నది. సమత అనే గుణం సంపన్నమై సహృదయహృదయాలను సమ్మోదపరుస్తున్నది. - సంపా.)

**క. తగిలి విలోచన గోచర । మగు నంతకు దృష్టి నిలిపి యట హృదయం బి**
**మ్ముగఁ జొనిపి యెట్టకేనియు । మగిడిరి హరి ననిచి దీనమతిఁ బాండుసుతుల్. 85**

**ప్రతిపదార్థం:** పాండుసుతుల్= పాండురాజుకుమారులు-పాండవులు; తగిలి= వెంటవెళ్ళి; విలోచన, గోచరము+అగునంతకున్= కంటికి కనిపించినంతదూరం; దృష్టి= చూపు; నిలిపి; అటన్= ఆవల; హృదయంబు= మనస్సును; ఇమ్ముగన్= ప్రీతితో; చొనిపి= చొప్పించి - అంటే చూపులకు బదులు మనస్సును ప్రవేశపెట్టి; ఎట్టకేనియున్= అతికష్టంతో; హరిని= శ్రీకృష్ణుణ్ణి; అనిచి= సాగనంపి; దీనమతిన్= దీనతను పొందిన బుద్ధితో - అంటే శూన్యం, నీరసం అయిన మానసిక స్థితితో; మగిడిరి= వెనుదిరిగారు.

**తాత్పర్యం:** పాండవులు శ్రీకృష్ణుని రథం వెంట వెళ్ళి, కంటికి కనిపించినంతదూరం చూచి, ఆవల చూపులకు బదులు మనస్సును పంపి, అతికష్టంమీద ఆయనను సాగనంపి దీనుల్లా తిరిగి వచ్చారు.

**విశేషం:** కొంతవరకే వెళ్ళేది కంటిచూపు. ఎంతవరకైన వెళ్ళేది వ్యక్తిమనస్సు. జీవితంలో తమ కెంతో సాయంచేసి, అండగా నిలిచిన ఆత్మీయుణ్ణి సాగనంపి, ఆయన వెంట మనస్సును పంపి, ఇంటికి తిరిగి వచ్చే వ్యక్తుల దీనమతి, శూన్యస్థితి అనుభవైకవేద్యమే కాని, వివరణ సాధ్యం కాదు.

## పాండవ సభామహిమకు దుర్యోధనుండు లజ్జితుం డగుట (సం. 2-43-1)

**వ. అట దుర్యోధనుండు శకునియుం దానును సభావిభవంబుఁ జూచు వేడుక నందుఁ గొన్ని దినంబు లుండి, యొక్కనాఁడు దాని యపూర్వరమణీయతకు విస్మితుం డగుచు నయ్యయి ప్రదేశంబులం గ్రుమ్మరువాఁడు వివృతంబైన ద్వారదేశంబు సంవృతంబుగా వగచి చొరనొల్లక, సంవృతంబైనదాని వివృతంబుగా వగచి చొరంబోయిలలాట ఘట్టితగృహద్వారుండయి, సమప్రదేశం బున్నతంబుగా వగచి యెక్కసమకట్టి, నీలాశ్మరశ్మి స్థగితంబైన విమలమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగఁద్రోచికొని, స్ఫటికదీప్తిజాల పరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టిన పుట్టంబు దడియంజొచ్చి, క్రమ్మఱిన వానిం జూచి పాంచాలియుఁ బాండుకుమారులును నగి రంత. 86**

**ప్రతిపదార్థం:** అటన్= అక్కడ; దుర్యోధనుండు; శకునియున్; తానును; సభా, విభవంబున్= మయసభయొక్క గొప్పతనం; చూచు, వేడుకన్= చూడాలనే కుతూహలంతో; అందున్= ఇంద్రప్రస్థంలో; కొన్ని, దినంబులు; ఉండి; ఒక్కనాఁడు; దాని= ఆ మయసభయొక్క; అపూర్వ రమణీయతకున్= అరుదైన సౌందర్యానికి; విస్మితుండు+అగుచున్= ఆశ్చర్యంపొందుతూ; ఆ+అయి, ప్రదేశములన్= సభలోపలి ఆయా ప్రదేశాలలో; క్రుమ్మరువాఁడు= తిరుగుతున్నట్టి ఆ దుర్యోధనుడు; వివృతంబు+అయిన= తెరువబడి ఉండే; ద్వార, దేశంబు= వాకిలిని; సంవృతంబుగా= మూసి ఉన్న దానినిగా; వగచి= తలంచి; చొరన్+ఒల్లక= ప్రవేశించటానికి ఇష్టపడక; సంవృతంబు+ఐన, దానిన్= మూసివేయబడి ఉండే వాకిలిని; వివృతంబుగా= తెరువబడి ఉండే దానినిగా; వగచి= తలంచి; చొరన్, పోయి= ప్రవేశించబోయి; లలాట, ఘట్టిత, గృహ, ద్వారుండు+అయి= నొసట కొట్టుకొన్న గృహద్వారం కలవాడై-అంటే నొసలు గృహద్వారానికి కొట్టుకొని; సమ, ప్రదేశంబు= సమతలంగా ఉండే చోటును; ఉన్నతంబుగా= ఎత్తైన ప్రదేశంగా; వగచి= తలంచి; ఎక్కన్= ఎక్కటానికి; సమకట్టి= పూనుకొని; నీల+అశ్మ, రశ్మి, స్థగితంబు+ఐన= నీలపు రాళ్ళ కాంతులచేత కప్పబడిన; విమల, మణి, స్థలంబు= నిర్మలమైన మణులు పొదగబడిన ప్రదేశాన్ని; జల+ఆశయంబుగా= నీటి మడుగుగా; వగచి= తలచి; పరిధానంబు= కట్టుకొన్నధోవతి; ఎగ, త్రోచికొని= పైకెత్తి పట్టుకొని; స్ఫటిక, దీప్తి, జాల, పరివృతంబు+ఐన= పటికపు రాళ్ళ కాంతి సమూహంచేత చుట్టబడిన దయిన; జల+ఆశయంబు= నీటి మడుగును; స్థలంబుగా= నేలగా; వగచి= తలచి; కట్టిన, పుట్టంబు= కట్టుకున్న వస్త్రం; తడియన్= తడిసిపోయేటట్లు చొచ్చి= అందులో ప్రవేశించి; క్రమ్మఱిన= వెనుదిరిగిన; వానిన్= ఆ దుర్యోధనుణ్ణి; చూచి; పాంచాలియున్= ద్రౌపదియు; పాండుకుమారులును= పాండవులును; నగిరి= నవ్వారు; అంతన్= తరువాత.

**తాత్పర్యం:** దుర్యోధనుడు, శకుని - మయసభా విశేషాలు చూడాలన్న కుతూహలంతో ఇంద్రప్రస్థంలోనే కొన్ని రోజులు ఉన్నారు. ఒకరోజు దుర్యోధను డొక్కడే ఆ మయ సభయొక్క అపూర్వసౌందర్యానికి ఆశ్చర్యపడి, అందుండే ఆ యా ప్రదేశాలు తిరిగి చూడటం ప్రారంభించాడు. ఒకచోట తెరచిన ద్వారాన్ని మూసిన దానినిగా తలచి ముందుకు వెళ్ళక వెనుదిరిగాడు. మరొకచోట మూసినద్వారాన్ని తెరచినదానినిగా తలచి ముందుకు పోబోయి నొసలు కొట్టుకొన్నాడు. సమతలప్రదేశాన్ని ఎత్తైన స్థలంగా తలచి ఎక్కబోయాడు. ఒకచోట నీలపురాళ్ళ కాంతులు కప్పిన మణిమయ ప్రదేశాన్ని నీటిమడుగుగా భ్రమించి కట్టుకొన్న బట్టలు ఎగబట్టుకొని నడిచాడు. మరొకచోట స్ఫటికపు రాళ్ళ కాంతులు కప్పిన నీటి మడుగును నేలగా తలచి ముందుకు నడిచి కట్టుబట్టలు తడుపుకొని వెనుదిరిగాడు. అతణ్ణి చూచి ద్రౌపదితోపాటు పాండవులు కూడ నవ్వారు.

**విశేషం:** ఇది అభిమానధనుడైన దుర్యోధనుని భంగపాటు. పాండవులపై అతని అసూయా ద్వేషాలను అంతకంత అధికం చేసిన భంగపాటు. ద్రౌపదీమానభంగయత్నానికి త్రోవతీసిన భంగపాటు. రాజసూయయాగంవల్ల కలుగబోయే మహాసంగ్రామానికి ఇది తొలినాటు.

**ఆ. దాని నెఱిఁగి ధర్మతనయుండు ధృతరాష్ట్ర । తనయునకు సమీరతనయుచేత**
**దివ్యవస్త్రములును దివ్యభూషణములు । నిచ్చి పుచ్చెఁ బ్రీతి యేర్పడంగ. 87**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ దుర్యోధనుని తడిసిన బట్టలతో కూడినస్థితిని; ఎఱిఁగి= తెలుసుకొని; ధర్మతనయుండు= ధర్మరాజు; ధృతరాష్ట్రతనయునకున్= ధృతరాష్ట్రుని కుమారుడైన దుర్యోధనునికి; సమీర, తనయుచేతన్= వాయుపుత్రుడైన భీమసేనునిచేత; దివ్య, వస్త్రములును= మంచి బట్టలను; దివ్యభూషణములును= మంచి ఆభరణాలను; ప్రీతి= ప్రేమ; ఏర్పడంగన్= ప్రకటమయ్యేటట్లుగా; ఇచ్చి పుచ్చెన్= ఇచ్చి పంపించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుని కట్టుబట్టలు తడిసిన స్థితిని చూచి, ధర్మరాజు అతనికి మంచి వస్త్రాలు, ఆభరణాలు తన ప్రేమ ప్రకటమయ్యేలా భీమసేనునిచేత ఇచ్చి పంపించాడు.

**విశేషం:** ధర్మరాజుకు దుర్యోధనునిమీద అంతప్రేమ ఉంటే మంచివస్త్రాలు, ఆభరణాలు ఇచ్చి పంపటం మంచిదే. కాని, అవి భీమసేనునిచేతనే ఇచ్చి పంపాలా? మరొక తమ్ముడిచేత పంపకూడదా? తిక్కనగారు ధర్మజుణ్ణి 'మెత్తనిపులి' అనటం ఇలాంటివాటిని దృష్టిలో పెట్టుకొని కాబోలు. ఆగర్భశత్రువైన భీమసేనుని చేత అలా ఇచ్చి పంపితే అవమానం పాలైన అభిమానధనుడు దుర్యోధనునికి పుండుమీద కారం చల్లినట్లుండదా?

**వ. దుర్యోధనుం డట్లు సభాప్రలంభంబునకు లజ్జితుండయి పాండవుల వీడ్కొని గజపురంబున కరిగి ధర్మరాజు రాజసూయంబు దన కసూయాజననం బగుటయు సకలజనమనో నయనోత్సవంబయిన తత్సభాలక్ష్మి దన మనోనయనంబుల కగ్నిజ్వాలయై మహాదాహంబు సేయుటయు సంతప్తుండై నిదాఘదాహంబున నింకి తఱుఁగు నల్పజలాశయంబునుం బోలెఁ దద్దయుం దఱిఁగి. 88**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు; అట్లు= ఆ విధంగా; సభా ప్రలంభంబునకున్= సభవల్ల మోసపోవటానికి; లజ్జితుండు+ఐ= సిగ్గుపడినవాడై; పాండవులన్; వీడ్కొని= వదలి; గజపురంబునకున్= హస్తిపురానికి; అరిగి= వెళ్ళి; ధర్మరాజు, రాజసూయంబు= ధర్మరాజుయొక్క రాజసూయయాగం; అసూయా, జననంబు+అగుటయున్= అసూయను పుట్టించేది కాగా; సకల, జన, మనః+నయన+ఉత్సవంబు+అయిన= అందరు ప్రజల మనస్సులకు, కన్నులకు పండువు అయిన - అంటే అందరికీ సంతోషాన్ని కూర్చిన; తత్+సభా, లక్ష్మి= ఆ మయసభా వైభవం; తన, మనః+నయనంబులకున్= తనయొక్క మనస్సుకు, నేత్రాలకు; అగ్ని, జ్వాల+ఐ= నిప్పుమంట అయి; మహా, దాహంబు, చేయుటయున్= మిక్కిలిగా కాల్చటంచేత; సంతప్తుండు+ఐ= ఎక్కువ దుఃఖం పొందినవాడై; నిదాఘ, దాహంబునన్= వేసవి వేడిమిచేత; ఇంకి= నీళ్ళు ఇంకిపోయి; తఱుఁగు= తగ్గిపోయే; అల్ప, జల+ఆశయంబునున్+పోలెన్= చిన్ననీటిమడుగువలె; తద్దయున్= మిక్కిలి; తఱిఁగి= కృశించి.

**తాత్పర్యం:** ఆ విధంగా దుర్యోధనుడు మయసభవల్ల మోసపోయి, అవమానం పాలైనందుకు సిగ్గుపడ్డాడు. పాండవుల్ని వదలి హస్తినకు వెళ్ళాడు. ధర్మరాజు రాజసూయం అతనికి అసూయ కలిగించింది. అందువల్ల - అందరి మనస్సులకు, కళ్ళకు ఆనందాన్ని కూర్చిన ఆ మయసభా వైభవం - అతని మనస్సుకు, కళ్ళకు నిప్పుమంట

అయింది. అమితంగా అతణ్ణి దహించింది. దుఃఖంతో కుమిలిపోయాడు. వేసవి వేడికి నీళ్ళింకి తరిగిపోయిన నీటి మడుగులా కృశించి-

**విశేషం:** అలం. ఉపమ.

**క. కందు గల పసిఁడి గాఁచినఁ। గంది వివర్ణమయినట్లు కౌరవుకాయం**
**బొందఁగ వివర్ణమయి కడు। వందె మనస్తాపహవ్యవహదాహమునన్. 89**

**ప్రతిపదార్థం:** కందు= మాలిన్యం; కల; పసిఁడి= బంగారాన్ని; కాఁచినన్= కాల్చగా; కంది= నలుపెక్కి; వివర్ణము+అయిన, అట్లు= రంగును కోల్పోయినట్లు; మనస్తాప, హవ్యవహ, దాహమునన్= మనోవేదన అనే అగ్నియొక్కవేడిచేత; కౌరవుకాయంబు= దుర్యోధనుని శరీరం; ఒందఁగన్= స్పష్టంగా తెలిసేటట్లుగా; వివర్ణము+అయి= కళావిహీనమై - అంటే వెలవెలపోయి; కడున్= మిక్కిలి; వందెన్= దుఃఖంచేత కృశించింది.

**తాత్పర్యం:** మాలిన్యం గల బంగారాన్ని బాగా కాలిస్తే (వేడిచేస్తే) అది నలుపెక్కి ఎంతగా తన రంగును కోల్పోతుందో మనోవేదన అనే నిప్పువేడిచేత దుర్యోధనుని శరీరం అంత కళావిహీనమైంది. కృశించింది.

**విశేషం:** అలం: రూపకానుప్రాణితఉపమ. ఎదుటివారి అభివృద్ధిని చూచి సంతోషించటం సజ్జనలక్షణం. ఈర్ష్యపడటం దుర్జనస్వభావం. ఈర్ష్య చాలాచిత్రమైన దుర్గుణం. అది ఒకరితో చెప్పుకోటానికి వీలులేనిది. అట్లని ఓర్చుకొనటానికి సాధ్యంకానిది. ఒక విధంగా అది కర్రకు అంటుకొన్న నిప్పులాంటిది. ఎదుటివాళ్ళను కాల్చేమాట ఎలా ఉన్నా మొదట కర్రను మాత్రం అది కాల్చకమానదు. ఇప్పుడు దుర్యోధనుని స్థితి ఇదే.

**క. అవనీ రాజ్యవ్యాపా। రవిహీనుం డయి సుహృద్విరంజనుఁ డై కౌ**
**రవపాంసనుండు పాప। వ్యవసాయమునందు బుద్ధి వదలక నిలిపెన్. 90**

**ప్రతిపదార్థం:** కౌరవ, పాంసనుండు= కౌరవ కులానికి అపకీర్తి తెచ్చేవాడు-దుర్యోధనుడు; అవనీ, రాజ్య, వ్యాపార, విహీనుండు+ అయి= రాజ్యపరిపాలన వ్యవహారాలు మానినవాడై; సుహృత్+విరంజనుఁడు+ఐ= స్నేహితులపట్ల ఇష్టంలేనివాడయి; పాప, వ్యవసాయంబునందున్= పాపపుపని చేయటంలో; బుద్ధి= మనస్సు; వదలక= విడువక-అంటే గట్టిగా; నిలిపెన్= నిలిపాడు.

**తాత్పర్యం:** కౌరవకులానికి అపకీర్తి కలిగించే దుర్యోధనుడు, రాజ్యవ్యవహారాలు చూడటం మాని, స్నేహితులను కలయటానికి కూడ ఇష్టపడక, పాపపుపని చెయ్యటంలో పట్టుగా బుద్ధి నిలిపాడు.

**వ. ఇట్లు సకల సుఖోపభోగ విముఖుండయి యెవ్వరితోడం బలుక కున్న దుర్యోధనుం జూచి శకుని యి ట్లనియె. 91**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సకల, సుఖ+ఉపభోగ, విముఖుండు+ఐ= అన్ని సుఖాలను అనుభవించటానికి ఇష్టంలేని వాడై; ఎవ్వరితోడన్= ఎవరితోకూడ; పలుకక+ఉన్న= మాట్లాడకుండ ఉన్నటువంటి; దుర్యోధనున్; చూచి; శకుని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా ఏ సుఖం అనుభవించటానికి ఇష్టంలేని వాడై, ఎవరితో కూడా మాట్లాడకుండా ఉండే ఆ దుర్యోధనుణ్ణి చూచి శకుని ఇలా అన్నాడు.

**ఆ. ఇన్ని దినములయ్యె నేటికి నాతోడ । నిభపురేశ! పలుక విట్టు లేల?**
**నీ ముఖంబు దీర్ఘ నిశ్వాస ధూమ సం । హతులఁ జేసి కలుషమయిన యదియు. 92**

**ప్రతిపదార్థం:** ఇభ, పుర+ఈశ= ఓ హస్తినాపురరాజా! దుర్యోధనా!; ఇన్ని, దినంబులు+అయ్యెన్= ఇన్ని రోజులయింది-అంటే చాలా రోజులనుండి; ఏటికిన్= ఎందుచేత; నాతోడన్; పలుకవు= మాట్లాడవు; ఇట్టుల= ఈ విధంగా; ఏల= ఎందుచేత; నీ, ముఖంబు; దీర్ఘ, నిశ్వాస, ధూమ, సంహతులన్+చేసి= నిట్టూర్పుపొగల సమూహాలచేత; కలుషము+అయిన, అదియు= మలినమైనది.

**తాత్పర్యం:** ఓ హస్తినాపురరాజా! దుర్యోధనా! ఇన్ని రోజులుగా నీవు నాతో ఎందుకు మాట్లాడటం లేదు? ఎందుచేత నీ ముఖం ఈ విధంగా వేడి నిట్టూర్పులతో మలినమైపోయింది?

**విశేషం:** వేడినిట్టూర్పులు వెలితికి చిహ్నాలు. వేదనకు సూచికలు. 'ఇభపురేశ' - అనే సంబోధన - నీవు హస్తినాపురాధీశ్వరుడివి కదా! నీ కేమి కొరత? ఎందుల కీ నిట్టూర్పులు? ఏమి నీ వేదన? తప్పక చెప్పు' అని తరచి అడిగేదిగా ఉంది.

**క. నా కెఱిఁగింపుము దీని, న । నేకాగ్రతఁ బొందనేల యే నుండఁగ? న**
**వ్యాకులభవత్ప్రతాప ని । రాకృతులు ధరిత్రిలోని రాజులు నీకున్. 93**

**ప్రతిపదార్థం:** దీనిన్= నీ దుఃఖకారణాన్ని; నాకున్+ఎఱిఁగింపుము= నాకు తెలియజెప్పుము; ఏన్+ఉండఁగన్= నేనుండగా; అనేకాగ్రతన్= చింతను; పొందన్+ఏల= పొందటమెందుకు? ధరిత్రిలోని= భూమిలోని; రాజులు; నీకున్? అవ్యాకుల, భవత్+ప్రతాప, నిరాకృతులు= కలతచెందని నీ పరాక్రమంచేత అణగించబడినవారు.

**తాత్పర్యం:** నీ దుఃఖకారణాన్ని నాకు చెప్పు. నే నుండగా నీవు చింతించట మెందుకు? భూమిమీద రాజులంతా నీ స్థిరపరాక్రమంచేత అణచివేయబడిన వాళ్ళే కదా!

**వ. 'ఇంత సంతాపింప నేల?' యనిన నాశకునికి దుర్యోధనుం డిట్లనియె. 94**

**తాత్పర్యం:** 'ఇంతగా నీవు దుఃఖించట మెందుకు?' అని అనగానే ఆ శకునితో దుర్యోధనుడు ఇలా అన్నాడు.

### దుర్యోధనుని దురాలోచనము (సం. 2-43-19)

**ఉ. నీవును జూచి, తట్టిసభనేని వినంబడ దేయుగంబులన్;**
**భూవలయంబులో నది యపూర్వము సర్వమనోజ్ఞ మిష్ట భో**
**గావహ మేక్రియం బడసెనయ్య? మహాత్ముఁడు దాన నేమి సం**
**భావితభాగ్యుఁ డయ్యెను బ్రభాకరతేజుఁడు ధర్మజుం డిలన్. 95**

**ప్రతిపదార్థం:** నీవును= నీవుకూడ; చూచితి= చూచావు; అట్టి, సభన్+ఏని= అటువంటి సభనుగురించి ఏ మాత్రం; ఏ యుగంబులన్= ఏ యుగాల్లోకూడ; వినంబడదు= వినబడలేదు; భూవలయంబులోన్= భూమండలంలో; అది= ఆ మయసభ; అపూర్వము= ముందెన్నడూ లేనట్టిది; సర్వ, మనోజ్ఞము= అన్నివిధాల (అందరికీ) అందమైనట్టిది; ఇష్టభోగ+ఆవహము= కోరిన

సుఖాలను కలగజేసేటటువంటిది; మహాత్ముఁడు= గొప్పవాడైన ధర్మరాజు; ఏ క్రియన్= ఏ విధంగా; పడసెన్+అయ్యా= పొందాడయ్యా! దానన్= ఆ సభచేత; ఏమి= ఎంతగొప్పగా; ప్రభాకర తేజుఁడు= సూర్యునితో సమానమైన కాంతికలవాడు; ధర్మజుండు= ధర్మరాజు; ఇలన్= భూమిమీద; సంభావిత భాగ్యుఁడు+అయ్యెను= గౌరవించబడిన వైభవం కలవాడయ్యాడు.

**తాత్పర్యం:** నీవుకూడ చూచావుకదా! ఏ యుగంలో కూడ అలాంటి సభ ఉన్నట్లే వినలేదు. భూమండలంలో అది అపూర్వం. అన్నివిధాల రమణీయం. కోరిన సుఖాలన్నీ ఇచ్చే ఆ సభను, ఆ మహాత్ముడు ధర్మరాజు ఏ విధంగా పొందాడోకదా! సూర్యతేజుడైన ధర్మరాజు దాన్ని పొంది ఈ లోకంలో ఎంత గౌరవం పొందిన భాగ్యం కలవాడయ్యాడు!

**విశేషం:** గుణం : అర్థవ్యక్తి. రాజసూయంలో ఆ మయసభావైభవం అన్నింటికంటె మిన్నగా దుర్యోధనుని కన్ను కుట్టింది. (ఈ సందర్భంలో అతని మనోవేదనను వ్యక్తంచేసిన పద్యాలను అర్థవ్యక్తి గుణరంజకంగా రచించటం గమనార్హం. -సంపా.)

**చ. కడు భయమంది వానికిఁ దగన్ మఱి వైశ్యులపోలె వశ్యులై**
**పుడమి నతిప్రసిద్ధులగు భూపతులెల్ల మహాధనావళుల్**
**దడయక తెచ్చియిచ్చి కరదానము సేయుటఁ బార్థివత్వ మే**
**ర్పడియెఁ బృథాగ్రపుత్త్రునకుఁ; బాండవతేజము పర్వె నెల్లచోన్. 96**

**ప్రతిపదార్థం:** పుడమిన్= భూమిలో; అతిప్రసిద్ధులు+అగు= మిక్కిలిపేరు పొందిన; భూపతులు+ఎల్లన్= రాజులందరు; కడున్ భయము+అంది= మిక్కిలి భయాన్ని పొంది; వానికిన్= ఆ ధర్మరాజుకు; మఱి; వైశ్యులపోలెన్= వైశ్యులవలె; వశ్యులై= లొంగిపోయినవాళ్ళయి; మహాధన+ఆవళుల్= గొప్ప ధన సమూహాలను; తడయక= ఆలస్యంచెయ్యకుండా; తెచ్చియిచ్చి; కరదానము, చేయుటన్= కప్పం చెల్లించటంచేత; పృథ+అగ్ర, పుత్త్రునకున్= కుంతీదేవియొక్క పెద్దకుమారునికి; పార్థివత్వము= చక్రవర్తిత్వం; ఏర్పడియెన్= ఏర్పడింది; పాండవ, తేజము= పాండవులయొక్క పరాక్రమం; ఎల్లచోన్= అన్నిచోట్ల; పర్వెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** భూమిమీద ఎంతో పేరుపొందిన రాజులంతా చాలా భయపడి ధర్మరాజుకు వైశ్యుల్లా లొంగిపోయారు. విపరీత ధనసమూహాలు కప్పాలుగా తెచ్చి ఇచ్చారు. అందువల్ల ఆ కుంతీదేవి పెద్దకొడుకుకు చక్రవర్తిత్వం ఏర్పడింది. పాండవుల పరాక్రమం అన్నివైపులా వ్యాపించింది.

**విశేషం:** గుణం: అర్థవ్యక్తి. ఆ మయ సభావైభవం తరువాత, దుర్యోధనుని కన్నుకుట్టించినవి- వివిధ దేశాధీశ్వరులు ధర్మజునికి తెచ్చిఇచ్చిన ధనరాసులు; ఆయనచక్రవర్తిత్వం; పాండవుల పరాక్రమం. వైశ్యులు వాణిజ్య వ్యాపారాలు వృత్తిగా కలవారు. వాళ్ళు తమ ప్రయోజనాలు పూర్తిగా సాధించుకోటానికి అందరితో మంచిగా మెలగి, విశేషించి ప్రభువులకు వశవర్తులై ఉండక తప్పదు. అందుచేతనే 'వైశ్యులపోలె వశ్యులై' అనటం జరిగిందేమో?

**ఉ. యాదవుచేతిచక్రము భయంకరమై శిశుపాలమస్తక**
**చ్ఛేదము సేసినం గడుఁ బ్రసిద్ధులు శూరులునైన రాజు ల**
**య్యాదవుముందటన్ జయ జయ ధ్వను లిచ్చిరి గాని, వాని శౌ**
**ర్యోదయవృత్తికట్టెదుర నోపర యెవ్వరు విక్రమింపఁగన్. 97**

**ప్రతిపదార్థం:** యాదవుచేతి, చక్రము= యదువంశంవాడైన శ్రీకృష్ణుని చేతిలోని చక్రాయుధం; భయంకరము+ఐ; శిశుపాల, మస్తకచ్ఛేదము, చేసినన్= శిశుపాలునియొక్క తలను నరుకగా; కడున్= మిక్కిలి; ప్రసిద్ధులు= పేరుపొందినవాళ్ళు; శూరులున్+ ఐన; రాజులు; ఆ+యాదవు, ముందటన్= ఆ శ్రీకృష్ణుని ఎదుట; జయ, జయ, ధ్వనులు, ఇచ్చిరి, కాని= 'జయ!జయ!' అని విజయ ప్రశంసలతో కూడిన కేకలు పెట్టారు కాని; వాని= ఆ శ్రీకృష్ణునియొక్క; శౌర్య+ఉదయ, వృత్తి, కట్టెదురన్= పరాక్రమ ప్రవర్తనముందు; ఎవ్వరున్= ఏ ఒక్కరుకూడ; విక్రమింపఁగన్= ఎదిరించటానికి; ఓపర= చాలని వాళ్ళయ్యారు.

**తాత్పర్యం:** యాదవుడైన శ్రీకృష్ణుని చేతిచక్రం భయంకరమై శిశుపాలుని శిరస్సును ఛేదిస్తే- ఎంతో ప్రసిద్ధులు, వీరులు అయిన రాజులు- ఆ శ్రీకృష్ణుని ముందు జయ జయ శబ్దాలు చేశారు కాని, ఆతని ఆ వీరకృత్యాన్ని ఎదిరించటానికి ఏ ఒక్కరు సమర్థులు కాలేకపోయారు.

**విశేషం:** గుణం: అర్థవ్యక్తి. దుర్యోధనుడు ఒకటికి రెండుమార్లు యాదవపదాన్ని ప్రయోగించింది శ్రీకృష్ణుని కులాన్ని ఎత్తిచూపటానికే.

**చ.** **అతుల పరాక్రమార్జితములైన ధనంబులపేర్మిఁ జేసి యు**
**న్నతమగు చున్న పాండునరనాథ తనూజుల లక్ష్మి నా కస**
**మ్మతమయి సూ వెలింగె విను మాతుల! మానధనాఢ్యుఁ డైన భూ**
**పతి సహియింపనోపునె సపత్నులవృద్ధియు నాత్మహానియున్.** **98**

**ప్రతిపదార్థం:** అతుల, పరాక్రమ+ఆర్జితములు+ఐన= సాటిలేని పరాక్రమంచేత సంపాదించబడినవైన; ధనంబుల, పేర్మిన్+చేసి= సంపదల అతిశయంతో; ఉన్నతము+అగుచున్+ఉన్న= ఎక్కువ అవుతున్న; పాండు, నరనాథ, తనూజుల, లక్ష్మి= పాండురాజుకుమారులయొక్క ఐశ్వర్యం; నాకున్; అసమ్మతము+ఐ= సహించరానిదై; వెలింగెన్, సూ= ప్రకాశించిందిసుమా; మాతుల= ఓ మేనమామా!; విను; మాన, ధన+ఆఢ్యుఁడు+ఐన= అభిమాన మనే ధనంతో కూడుకొనినవాడైన; భూపతి= రాజు; సపత్నుల, వృద్ధియున్= దాయాదులయొక్క అభివృద్ధిని; ఆత్మ, హానియున్= తనయొక్క తగ్గుదలను; సహింపన్+ ఓపునే= ఓర్చుకొనగలడా!

**తాత్పర్యం:** సాటిలేని పరాక్రమంతో సంపాదించిన గొప్ప సంపదలతో అంతకంతకు అధికమౌతున్న పాండవుల ఐశ్వర్యం. నాకు సహించరానిదై ప్రకాశించింది సుమా! ఓ మేనమామా! శకునీ! విను. అభిమానధనుడైన రాజు దాయాదుల అభివృద్ధిని, తన తగ్గుదలను సహించగలడా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ఇది దుర్యోధనుని ఈర్ష్యకు అద్దం పట్టే పద్యం. గుణం: అర్థవ్యక్తి.

**వ.** **'ఏమి సేయుదము? పాండవుల లక్ష్మి యెవ్విధంబున మన కపహరించి కొననగు?' ననిన దుర్యోధనునకు శకుని యి ట్లనియె.** **99**

**ప్రతిపదార్థం:** ఏమి, చేయుదము; పాండవుల లక్ష్మి= పాండవులయొక్క సంపద; ఏ, విధమునన్; మనకున్; అపహరించికొనన్= దోచుకోవటానికి; అగున్= సాధ్యమవుతుంది; అనిన; దుర్యోధనునకున్; శకుని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఏం చేద్దాం? పాండవుల సంపదను ఏ విధంగా దోచుకోటానికి సాధ్య మౌతుందో చెప్పు' అని దుర్యోధను డనగా- శకుని ఈ విధంగా అన్నాడు.

**క. దీనికి ధృతరాష్ట్రునను । జ్ఞానము వడయుడును మనకు సమకూరు ధరి**
**త్రీనాథ! భవదభిప్రా । యానుగుణైశ్వర్య మతిశయంబుగఁ బ్రీతిన్. 100**

**ప్రతిపదార్థం:** ధరిత్రీనాథ= భూపతీ! ఓదుర్యోధనా మహారాజా!; దీనికిన్= పాండవుల సంపదను దోచుకొనే ఈ పనికి; ధృతరాష్ట్ర+అనుజ్ఞానము= ధృతరాష్ట్రునియొక్క అనుమతిని; పడయుడును= పొందితే; భవత్+అభిప్రాయ+అనుగుణ+ ఐశ్వర్యము= నీ ఉద్దేశానికి తగిన సంపద; అతిశయంబుగన్= గొప్పగా; ప్రీతిన్= ఇష్టంతో; మనకున్; సమకూరున్.

**తాత్పర్యం:** ఓ దుర్యోధన మహారాజా! పాండవుల సంపదను అపహరించేపనికి ధృతరాష్ట్రుని అనుమతి పొందితే, నీ ఉద్దేశానికి తగిన ఐశ్వర్యం ప్రియమార మనకు సమకూరుతుంది.

**వ. అని యప్పుడ శకుని దుర్యోధనుం దోడ్కొని ధృతరాష్ట్రునొద్దకుం జని యాతని శరీరకార్శ్య వైవర్ణ్యంబులు సెప్పిన విని యదరిపడి ధృతరాష్ట్రుండు కొడుకు నొడలంటి చూచి కడు దుఃఖితుండయి యి ట్లనియె. 101**

**ప్రతిపదార్థం:** అని; అప్పుడు; శకుని; దుర్యోధనున్; తోడ్కొని= వెంటపెట్టుకొని; ధృతరాష్ట్ర+ఒద్దకున్= ధృతరాష్ట్రుని దగ్గరకు; చని= వెళ్ళి; ఆతని= ఆ దుర్యోధనునియొక్క; శరీ, కార్శ్య, వైవర్ణ్యంబులు= శరీరం కృశించటాన్ని, కళావిహీనమవటాన్ని; చెప్పిన; విని; అదిరిపడి; ధృతరాష్ట్రుండు; కొడుకు; ఒడలు= దేహాన్ని అంటి, చూచి= తడవిచూచి; కడున్, దుఃఖితుండు+అయి= మిక్కిలి దుఃఖించినవాడయి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని శకుని, అప్పుడు దుర్యోధనుణ్ణి వెంట బెట్టుకొని ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళాడు. అతని శరీరం కృశించటాన్ని, కళావిహీన మవటాన్ని చెప్పాడు. అది విని ధృతరాష్ట్రుడు అదిరిపడ్డాడు. కుమారుని శరీరాన్ని తడవి చూచి అమితంగా దుఃఖిస్తూ ఇలా అన్నాడు.

**సీ. కౌరవైశ్వర్యంబు గౌరవంబున సమ । ర్పితమయ్యె నీయంద పేర్మితోడ;**
**ననుజులు మిత్రులు ననుచరులును నీకుఁ । బ్రీతుల కాని యప్రియులు లేరు;**
**వివిధోపభోగముల్ దివిజేశునకుఁ గల । యట్టుల కలవు నీ కనుభవింప;**
**సకలభూపతులుఁ బాయక భక్తియుక్తులై । యొలసి నీ పనుపు సేయుదురు; పేర్మి**

**ఆ. నేమి కొఱఁతయయ్యె? నిట్లు డయ్యను దను । చ్ఛాయ దఱిఁగి యుండ సకలధరణి**
**రాజ్యభోగ సుఖ పరాఙ్ముఖత్వముఁ బొంద । నేల నీకుఁ గురుకులేశ్వరుండ! 102**

**ప్రతిపదార్థం:** కురుకుల+ఈశ్వరుండ= కురువంశరాజా! ఓ దుర్యోధనా!; కౌరవ+ఐశ్వర్యంబు= కౌరవులసంపద; గౌరవంబునన్= గొప్పగా; నీయందు+అ= నీకే; పేర్మితోడన్= ఎక్కువగా; సమర్పితము+అయ్యెన్= ఈయబడింది; అనుజులు= తమ్ములు; మిత్రులున్= స్నేహితులును; అనుచరులును= సేవకులును; నీకున్; ప్రీతులకాని= ఇష్టమైనవాళ్ళేకాని; అప్రియులు= ఇష్టంకానివాళ్ళు; లేరు; వివిధ+ఉపభోగముల్= అనేకవిధాలైన సుఖభోగాలు; దివిజ+ఈశునకున్= దేవేంద్రునికి; కల, అట్టుల= ఉన్నట్లు; నీకున్; అనుభవింపన్; కలవు; సకల, భూపతులున్= అందరు రాజులు; పాయక= ఎడతెగక; భక్తియుక్తులు+ఐ= భక్తితో కూడినవాళ్ళయి; ఒలసి= చుట్టుకొని; నీ, పనుపు= నీ ఆజ్ఞను; చేయుదురు; పేర్మిన్= గొప్పతనంలో; ఏమి; కొఱత+అయ్యెన్= లోటు కలిగింది; ఇట్లు= ఈ విధంగా; డయ్యను= కృశించటం; తనుచ్ఛాయ= దేహకాంతి; తఱిఁగి= తక్కువై; ఉండన్= ఉండటం; సకల,

ధరణి, రాజ్య, భోగ, సుఖ, పరాఙ్ముఖత్వమున్= సమస్తరాజ్య భోగసుఖాలలో విరక్తిని; పొందన్= పొందటం; నీకున్; ఏల= ఎందులకు?

**తాత్పర్యం:** దుర్యోధనా! కౌరవసంపద నీకే ఎక్కువగా ఇవ్వబడింది. తమ్ములు, స్నేహితులు, సేవకులు, నీకు ఇష్టమైన వాళ్ళే కాని, ఇష్టం కానివాళ్ళు లేరు. అనేక విధాలైన సుఖభోగాలు దేవేంద్రునికి ఉన్నట్లు అనుభవించటానికి నీకూ ఉన్నాయి. అందరు రాజులు ఎడతెగని భక్తితో నీచుట్టూ చేరి గౌరవంతో నీ ఆజ్ఞ పాలిస్తారు. గొప్పతనంలో నీ కేమి కొరత? ఈ విధంగా నీవు కృశించటం, వెలవెలబోవటం. రాజ్యభోగాల్లో, సుఖాల్లో విరక్తిచెందటం ఎందుకు?

**వ. అనిన విని ధృతరాష్ట్రునకు దుర్యోధనుం డి ట్లనియె. 103**

**తాత్పర్యం:** అనగా విని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు.

**క. పాండవుల విభవ మది యా । ఖండలు విభవంబుకంటెఁ గడుమిక్కిలియై**
**యొండొండ పెరిఁగి దిక్కులు । నిండెఁ దదీయ ప్రతాప నిర్మల రుచితోన్. 104**

**ప్రతిపదార్థం:** పాండవుల, విభవము= పాండవులయొక్క ఐశ్వర్యం; అది; ఆఖండలు, విభవంబుకంటెన్= దేవేంద్రుడియొక్క ఐశ్వర్యంకంటె; కడున్, మిక్కిలి+ఐ= ఎంతో ఎక్కువై; ఒండు+ఒండ, పెరిఁగి= అంతకంతకు పెరిగి; తదీయ, ప్రతాప, నిర్మల, రుచితోన్= వారి పరాక్రమంయొక్క స్వచ్ఛకాంతులతో; దిక్కులు; నిండెన్.

**తాత్పర్యం:** పాండవుల ఐశ్వర్యం- దేవేంద్రుని ఐశ్వర్యంకంటె ఎంతో ఎక్కువై- అంతకంతకు పెరిగి, స్వచ్ఛమైన వాళ్ళ పరాక్రమకాంతులతో అన్ని దిక్కులా నిండింది.

**విశేషం:** అలం: సహోక్తి.

**క. సామాన్యమె యుత్తర కురు । భూములు మొదలుగ సమస్తభూములు విజయ**
**శ్రీమహిమను సాధించెఁ ద్రి । ధామపరాక్రముఁడు శక్రతనయుఁడు బలిమిన్. 105**

**ప్రతిపదార్థం:** త్రిధామ పరాక్రముఁడు= విష్ణుమూర్తితో సమానమైన పరాక్రమం కలవాడు; శక్రతనయుఁడు= దేవేంద్రుని కుమారుడు - అర్జునుడు; బలిమిన్= బలంతో; ఉత్తర కురు భూములు మొదలుగ; సమస్త, భూములు= అన్నిదేశాలు; విజయశ్రీ, మహిమను= విజయలక్ష్మి ప్రభావంచేత; సాధించెన్= జయించాడు; సామాన్యమె= ఇది సామాన్యమైన విషయమా? (కాదని భావం).

**తాత్పర్యం:** విష్ణుమూర్తితో సమానమైన పరాక్రమం గల అర్జునుడు తన బలంతో ఉత్తర కురుభూములు మొదలుగా సమస్తదేశాలను జయించాడు. ఇది సామాన్యమైన విషయమా?

**తే. సఖ్యసంబంధములఁ జేసి చక్రధరుఁడు । ద్రుపదుఁడును దక్కఁ దక్కిన నృపతులెల్ల**
**నరియుఁ బెట్టనివారు లే రఖిల జలధి । వలయిత క్షోణిలోఁ బాండవులకుఁ బ్రీతి. 106**

**ప్రతిపదార్థం:** సఖ్య, సంబంధములన్+చేసి= స్నేహంతో, బంధుత్వంతో; చక్రధరుఁడు= చక్రాన్ని ధరించినవాడు - శ్రీకృష్ణుడు; ద్రుపదుడును; తక్కన్= తప్ప; అఖిల, జలధి, వలయిత, క్షోణిలోన్= అన్ని సముద్రాలచేత చుట్టబడి ఉండే భూమిలో; తక్కిన; నృపతులు+ఎల్లన్= రాజులందరు; ప్రీతిన్= ప్రీతితో; పాండవులకున్; అరియున్= కప్పమును; పెట్టనివారు= చెల్లించనివాళ్ళు; లేరు.

**తాత్పర్యం:** స్నేహంతో, బంధుత్వంతో శ్రీకృష్ణుడు, ద్రుపదుడు తప్ప, ఈ సమస్త భూమండలంలో పాండవులకు ప్రీతిగా కప్పంకట్టని రాజులే లేరు.

**తే. శైల కానన ద్వీప విశాల మయిన । వసుమతీ చక్రమంతయు వారి వశము;**
**యేను నొకరాజసుతుఁడనై యెట్లు దీనిఁ । జూడ నోపుదుఁ బ్రాభవశూన్యునట్లు. 107**

**ప్రతిపదార్థం:** శైల, కానన, ద్వీప, విశాలము+అయిన= కొండలతో, అడవులతో, ద్వీపాలతో విశాలమైన; వసుమతీచక్రము+ అంతయున్= భూమండలమంతా; వారి, వశము+అ= పాండవుల అధీనమే; ఏనున్= నేను; ఒక; రాజసుతుఁడను+ఐ= రాజకుమారుడినై ఉండి; ప్రాభవ, శూన్య+అట్లు= ప్రభుత్వంలేనివాడివలె; ఎట్లు= ఏ విధంగా; దీనిన్= ఈ స్థితిని; చూడన్+ ఓపుదున్= చూడగలను?

**తాత్పర్యం:** కొండలతో, అడవులతో, ద్వీపాలతో విశాలమైన భూమండలమంతా పాండవుల అధీనమై ఉండగా, నే నొక రాజకుమారుడినై అధికారం లేని దీనుడిలా దీన్ని ఎలా చూడగలను.

**తే. నన్ను రత్నపరిగ్రహణంబునందుఁ । బాండవుండు నియోగించెఁ బార్థివేంద్ర!**
**సర్వరత్నాకరైక ప్రశస్త రత్న । పుంజముల కాస్పదము ధర్మపుత్త్రుగృహము. 108**

**ప్రతిపదార్థం:** పార్థివ+ఇంద్ర= ధృతరాష్ట్రమహారాజా!; పాండవుండు= ధర్మరాజు; నన్నున్; రత్న, పరిగ్రహణంబు+అందున్= రత్నాలు అందుకొనటంలో; నియోగించెన్= నియమించాడు; ధర్మపుత్త్రు, గృహము= ధర్మరాజుయొక్క ఇల్లు; సర్వ, రత్న+ ఆకర+ఏక, ప్రశస్త, రత్న, పుంజములకున్= అన్ని సముద్రాల్లోని మిక్కిలి శ్రేష్ఠమైన రత్న సమూహాలకు; ఆస్పదము= ఉనికిపట్టు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రమహారాజా! ధర్మరాజు నన్ను అందరూ కానుకలుగా తెచ్చి ఇచ్చిన రత్నాలు అందుకోటానికి నియమించాడు. ఆ ధర్మజుని ఇల్లు అన్ని సముద్రాల్లోని శ్రేష్ఠరత్నాలకు నిలయం.

**విశేషం:** రత్నాకరము-రత్నాలకు నిలయమైనది సముద్రం.

**తే. యజ్ఞదీక్షితుఁ డయిన ధర్మాత్మజునకు । గౌడకాంభోజపతు లనేక ప్రకార**
**వర్ణకంబళములు శుకవర్ణవాహ । నివహములుఁ దెచ్చియిచ్చిరి నెమ్మితోడ. 109**

**ప్రతిపదార్థం:** యజ్ఞ దీక్షితుఁడు+అయిన= యజ్ఞదీక్ష వహించిన వాడైన; ధర్మ+ఆత్మజునకున్= ధర్మునియొక్క కుమారుడైన ధర్మరాజుకు; నెమ్మితోడన్= ప్రేమతో; గౌడ, కాంభోజపతులు= గౌడ కాంభోజ దేశ రాజులు; అనేక, ప్రకార, వర్ణ, కంబళములు= అనేక విధాలైన రంగులు గల కంబళ్ళును; 'శుక', వర్ణ, వాహ, నివహములున్= చిలుకవన్నె గల గుర్రాల సమూహాలును; తెచ్చి; ఇచ్చిరి.

**తాత్పర్యం:** యజ్ఞదీక్ష వహించిన ధర్మరాజుకు-గౌడ, కాంభోజ దేశాధీశులు రకరకాల రంగుల కంబళ్ళను, చిలుకవన్నె గుఱ్ఱాల సమూహాలను తెచ్చి ఇచ్చారు.

**ఉ. సాగరసారవారిరుహ శౌక్తిక మౌక్తిక విద్రుమద్రుమై**
**లాగురు చందనంబులు ప్రియంబున నిచ్చిరి తెచ్చి యున్నత**
**శ్రీగుణయుక్తిమైఁ బరఁగు సింహళకేరళచోళపాండ్యదే**
**శాగతరాజపుత్త్రులు మహాగుణశాలి కజాతవైరికిన్. 110**

**ప్రతిపదార్థం:** ఉన్నత, శ్రీ, గుణ, యుక్తిమైన్= గొప్ప ఐశ్వర్యంతో, సుగుణాల కూడికతో; పరఁగు= ఒప్పే; సింహళ, కేరళ, చోళ, పాండ్య, దేశ+ఆగత, రాజ, పుత్త్రులు= సింహళ, కేరళ, చోళ, పాండ్య దేశాలనుండి వచ్చిన రాజకుమారులు; మహాగుణశాలికిన్= గొప్పగుణాలు కలవానికి; అజాతవైరికిన్= పుట్టని శత్రువులు గలవానికి- అంటే ధర్మరాజుకు; సాగర, సార, వారిరుహ, శౌక్తిక, మౌక్తిక, విద్రుమ, ద్రుమ+ఏలా+అగురు, చందనంబులు= సముద్రపునీటినుండి పుట్టిన ముత్యపుచిప్పల్లోని మంచిముత్యాలను, పగడపు చెట్లను, ఏలకులను, అగురు చెక్కలను, గంధపు చెక్కలను; ప్రియంబునన్= ప్రీతితో; తెచ్చి; ఇచ్చిరి.

**తాత్పర్యం:** గొప్ప ఐశ్వర్యం, గుణాలు ఉన్న సింహళ కేరళ చోళ పాండ్య దేశరాజులు- మహాగుణవంతుడు, అజాతశత్రుడు అయిన ధర్మరాజుకు- మంచి ముత్యాలను, పగడపు చెట్లను, ఏలకులను, అగరుచెక్కలను, గంధపుచెక్కలను ప్రీతితో తెచ్చి ఇచ్చారు.

**విశేషం:** అలం: ఉదాత్తం. నన్నయ అక్షర రమ్యమైన శైలికి ప్రసాదగుణరచనకు ఈ పద్యమొక చక్కని ఉదాహరణ. 'సాగరసార .... ప్రియంబున నిచ్చిరి తెచ్చి' అనే సుదీర్ఘ సమాసాన్ని చదివినంతనే, అర్థం వివరంగా తెలియకున్నా, ఏవో గొప్ప గొప్ప వస్తువులను విస్తారంగా తెచ్చియిచ్చారనే భావం మాత్రం పాఠకునికి స్ఫురిస్తుంది. పాశ్చాత్య సాహిత్య విమర్శకులు దీనినే **Sound Echoing the Sense** అంటారు.

**ఉ. మందిత సూర్యరశ్మి రుచిమన్మణిహారచయంబుతోఁ గట**
**స్యంది సుగంధిదాన జల సంపద నొప్పెడు వాని దేవకీ**
**నందనుఁ డిచ్చెఁ బ్రీతిఁ బదునాలుగువేలుగజంబులన్ జనా**
**నందనకీర్తియైన యమనాథతనూజున కిష్టమిత్త్రుఁడై. 111**

**ప్రతిపదార్థం:** దేవకీనందనుఁడు= దేవకీదేవి కుమారు డైన శ్రీకృష్ణుడు; జన+ఆనందన, కీర్తి+ఐన= జనులకు ఆనందాన్ని కలిగించే కీర్తి కలవాడైన; యమనాథ, తనూజునకున్= యమధర్మరాజు కుమారుడైన ధర్మరాజుకు; ఇష్ట, మిత్త్రుఁడు+ఐ= ప్రియమైన స్నేహితుడై; మందిత, సూర్యరశ్మి, రుచిమత్+మణిహార, చయంబుతోన్= సూర్యకాంతినే వెలవెలపోయేటట్లు చేసే కాంతి ఉన్న మణిహార సమూహాలతో; కట, స్యంది, సుగంధి, దానజల, సంపదన్= చెక్కిళ్ళనుండి జాలువారుతున్న పరిమళ మదజలంయొక్క అతిశయంతో, ఒప్పెడు, వానిన్; పదునాలుగువేలు; గజంబులన్= ఏనుగులను; ప్రీతిన్= ప్రేమతో; ఇచ్చెన్.

**తాత్పర్యం:** దేవకీదేవి కుమారుడైన శ్రీకృష్ణుడు, యమధర్మరాజు కుమారుడైన ధర్మరాజుకు ప్రియమిత్రుడై - సూర్యరశ్మినే వెలవెల పోయేటట్లు చేసేకాంతిఉన్న మణిహార సమూహాలతో, చెక్కిళ్ళనుండి మిక్కిలిగా జాలువారుతున్న పరిమళ మదజలంతో ఒప్పే పదునాలుగు వేల ఏనుగులను ప్రియమార ఇచ్చాడు.

**విశేషం:** ఈ పద్యంకూడ అక్షరరమ్యమైన నన్నయ ఉదాత్త మనోహర శైలికి ప్రసాద గుణ రచనకు ఒక చక్కని ఉదాహరణ. అలం. ఉదాత్తం.

**క. హరియును గిరీటియును నొం। డొరుల కభీష్టములు సలుపుచుండుదు రంద**
**య్యిరువురు నేకాత్ములు జన। శరణ్యు లుత్తములు నిత్యసాంగత్యమునన్. 112**

**ప్రతిపదార్థం:** అందున్= అక్కడ - ఇంద్రప్రస్థంలో; హరియును= శ్రీకృష్ణుడును; కిరీటియును= అర్జునుడును; ఒండొరులకున్= ఒకరికొకరు; అభీష్టములు= ప్రియములు; సలుపుచున్+ఉండుదురు= చేస్తూ ఉన్నారు; ఆ+ఇరువురు= ఆ కృష్ణార్జును లిద్దరు; నిత్య, సాంగత్యమునన్= ఎడతెగని కలయికచేత; ఏక+ఆత్ములు= ఒకే మనస్సు కలిగిన వాళ్ళు; జన, శరణ్యులు= జనులకు శరణు పొందదగినవాళ్ళు; ఉత్తములు= శ్రేష్ఠులు.

**తాత్పర్యం:** ఒకే మనస్సు కలవాళ్ళు, జనులంతా శరణు వేడదగిన వాళ్ళు, ఉత్తములు - అయిన కృష్ణార్జునులు రాజసూయంలో ఒకరికొకరు ఇష్టమైన పనులు చేస్తూ అగుపించారు.

**వ. మఱియు నయ్యుధిష్ఠిరున కనురక్తుండయి విరాటుండు రెండువేలు గజంబుల నిచ్చె; ద్రుపదుండు వేయి గజంబులను బదివేలు హయంబులను బదునాలుగువేలు విలాసినీజనంబులం బదివేలు దాసీ గృహస్థుల నిచ్చెఁ; గురు కుకురోలూక కేకయ కాశ్మీర కాంభోజ గాంధార మద్ర ద్రవిడ మగధ మాళవ కళింగాంగ వంగ బంగాళగౌడాంధ్రకేరళకోసలాది మహీపతులునుం బ్రాగ్జ్యోతిషంబున భగదత్తుండును మరుకచ్ఛనివాసులును జేదిపతులును నాజానేయ బాహ్లిక హూణ పారసీయ దేశంబులం గల హయంబులం బర్వతనిభంబులైన యిభంబులను దివ్యాంబరాభరణ భూషితంబులయిన యోషిత్సహస్రంబులను నపరిమితంబులయిన యజావి గో మహిషంబులను హిరణ్య రత్నరజత కంబళాంబరాదుల నిచ్చిరి; మఱియు మేరుమందరమధ్య కీచక వనవాసులయిన గుళింద పారద బర్బర తురుష్క టెంకణ కోంకణాధిపతులును వశగతులై హిమశైల రామశైల కురుదేశంబులైన కౌసుమ క్షౌద్ర పాత్రంబులను దివ్యౌషధంబులను నింద్ర నీలేంద్ర గోప పిక చంద్ర మయూర కీర వర్ణ తురంగంబులను సౌవర్ణ కీటజ పట్టజాండజ శయ్యలను నిశిత దీర్ఘ నిస్త్రింశంబులను మణి కాంచన ఖచిత గజ దంతమయ శిబికాసనంబులను నిచ్చిరి; వాసవ సఖుండయిన గంధర్వపతి చిత్రరథుం డనువాఁడు నన్నూఱు గంధర్వ హయంబుల నిచ్చెఁ; దుంబురుండను గంధర్వుండు నూఱు హయంబుల నిచ్చె. 113**

**ప్రతిపదార్థం:** మఱియున్; ఆ+యుధిష్ఠిరునకున్= ఆ ధర్మరాజుకు; అనురక్తుండు+అయి= ప్రేమకలవాడై; విరాటుండు; రెండువేలు; గజంబులన్= ఏనుగులను; ఇచ్చెన్; ద్రుపదుండు; వేయి; గజంబులన్= ఏనుగులను; ఇచ్చెన్; పదివేలు; హయంబులను= గుర్రాలను; పదునాలుగువేలు; విలాసినీజనంబులన్= వేశ్యలను; పదివేలు; దాసీ, గృహస్థులన్= దాసీకుటుంబాలవాళ్ళను; ఇచ్చెన్; కురు, కుకుర+ఉలూక, కేకయ, కాశ్మీర, కాంభోజ, గాంధార, మద్ర, ద్రవిడ, మగధ, మాళవ, కళింగ+అంగ, వంగ, బంగాళ, గౌడ+ఆంధ్ర, కేరళ, కోసల+ఆది, మహీపతులునున్= కురు, కుకుర, ఉలూక, ఆది, రాజులును; ప్రాక్+జ్యోతిషంబునన్= ప్రాగ్జ్యోతిషమనే దేశంలో; భగదత్తుండును; మరుకచ్ఛనివాసులును= మరుకచ్ఛ ప్రదేశంలో నివసించేవాళ్ళూ; చేది పతులునున్= చేదిదేశరాజులూ; ఆజానేయ, బాహ్లిక, హూణ, పారసీయ, దేశంబులన్= ఆయాదేశాలలో; కల= ఉన్న; హయంబులన్= గుర్రాలను; పర్వత నిభంబులు+ఐన= పర్వతంతో సమానాలైన; ఇభంబులను=

ఏనుగులను; దివ్య+అంబర+ఆభరణ, భూషితంబులు+అయిన= మంచి వస్త్రాలతో, సొమ్ములతో అలంకరించబడిన; యోషిత్‌సహస్రంబులనున్= వేలకొలది స్త్రీలను; అపరిమితంబులు+ఐన= లెక్కకు మిక్కిలి అయిన; అజ+అవి, గో, మహిషంబులను= మేకలను, గొఱ్ఱెలను, ఆవులను, బఱ్ఱెలను; హిరణ్య, రత్న, రజత, కంబళ+అంబర+ ఆదులన్= బంగారు, రత్నాలు, వెండి, కంబళ్ళు, వస్త్రాలు మొదలయిన వాటిని; ఇచ్చిరి; మఱియు; మేరు, మందర, మధ్య, కీచక, వన, వాసులు+అయిన= మేరు పర్వతానికి, మందరపర్వతానికి మధ్యనఉండే సన్నవెదుళ్ళ అడవులలో నివసించే వాళ్ళైన గుళింద, పారద, బర్బర, తురుష్క, టెంకణ, కోంకణ+అధిపతులును= ఆయాదేశాలరాజులును; వశగతులై= లొంగిపోయినవాళ్ళయి; హిమశైల, రామశైల, కురుదేశంబులు+ఐన= ఆయా దేశాలలోని; కౌసుమ, క్షౌద్ర, పాత్రంబులను= పూలసంబంధమైన తేనెతో కూడిన పాత్రలను; దివ్య+ఔషధంబులను= మంచి మందులను; ఇంద్రనీల+ఇంద్రగోప, పిక, చంద్ర, మయూర, కీర, వర్ణ, తురంగంబులను= ఇంద్రనీలమణి, ఆరుద్రపురుగు, కోకిల, చంద్రుడు, నెమలి, చిలుక రంగులు కల గుఱ్ఱాలను; సౌవర్ణ, కీటజ, పట్టజ+అండజ, శయ్యలను= బంగారు మయములై, పురుగునుండి పుట్టిన - అంటే పట్టు పురుగుల వంటి పురుగులనుండి పుట్టిన మెత్తని పదార్థంతో; చెట్ల బెరడులనుండి పుట్టిన మెత్తని పదార్థంతో, గుడ్డునుండి పుట్టిన పక్షుల ఈకలవంటి మెత్తని పదార్థంతో రూపొందించిన పరుపులను; నిశిత, దీర్ఘ, నిస్త్రింశంబులను= వాడియై, పొడవైన ఖడ్గాలను; మణి, కాంచన, ఖచిత, గజ, దంతమయ, శిబికా+ఆసనంబులను= మణులు బంగారు పొదుగబడిన ఏనుగు దంతాలతో రూపొందించబడిన పల్లకీలను, పీఠాలను; ఇచ్చిరి; వాసవసఖుండు+అయిన, గంధర్వపతి= దేవేంద్రుని స్నేహితుడైన గంధర్వరాజు; చిత్రరథుండు+అనువాఁడు; నన్నూఱు(నాలుగు+నూఱు), గంధర్వ, హయంబులన్= నాలుగు వందల గంధర్వజాతి గుఱ్ఱాలను; ఇచ్చెన్; తుంబురుండు+అను; గంధర్వుండు; నూఱు, హయంబులన్; ఇచ్చెన్.

**తాత్పర్యం:** అంతేకాక ఆ ధర్మరాజుపట్ల ప్రేమ కలవాడై విరాటుడు రెండువేల ఏనుగులను ఇచ్చాడు. ద్రుపదుడు వెయ్యి ఏనుగులను, పదివేల గుఱ్ఱాలను, పన్నాలుగువేలమంది వేశ్యలను, పదివేల దాసీకుటుంబాలవాళ్ళను ఇచ్చాడు. కురు, కుకుర ఉలూకాది దేశ ప్రభువులు, ప్రాగ్జ్యోతిష దేశాధిపతి భగదత్తుడు, మరుకచ్ఛ నివాసులు, చేది దేశరాజులు పేరుపొందిన ఆజానేయ బాహ్లిక హూణ పారసీక దేశాల గుఱ్ఱాలను, కొండలతో సమానాలైన మదపుటేనుగులను, మంచి వస్త్రాలతో, సొమ్ములతో అలంకరించబడిన వేలకొలది స్త్రీలను, లెక్కకు మిక్కిలిగా మేకలను, గొర్రెలను, ఆవులను, బర్రెలను, బంగారు, రత్నాలు, వెండి, కంబళ్ళు, వస్త్రాలు మొదలయిన వాటిని ఇచ్చారు. అంతేగాక మేరు మందర పర్వతాల మధ్య ఉండే సన్నవెదుళ్ళ అడవుల్లో నివసించే గుళింద, పారద, బర్బర, తురుష్క, టెంకణ, కోంకణ దేశప్రభువులు లొంగిపోయినవాళ్ళయి హిమశైల, రామశైల, కురుదేశాల్లోని పూలతేనెతో కూడిన పాత్రలను, మంచి మందులను, ఇంద్రనీలమణి, ఆరుద్రపురుగు, కోకిల, చంద్రుడు, నెమలి, చిలుక రంగులు గల గుఱ్ఱాలను, బంగారు మయాలై పట్టుపురుగువంటి పురుగులనుండి పుట్టిన పట్టు వంటి మెత్తని పదార్థంతో, చెట్లబెరడులనుండి పుట్టిన మెత్తని పదార్థంతో, గ్రుడ్డునుండి పుట్టిన పక్షుల ఈకలవంటి మెత్తని పదార్థంతో రూపొందించిన పాన్పులను, వాడిగల, పొడవైన ఖడ్గాలను, మణులు బంగారు పొదుగబడిన ఏనుగుదంతాలతో రూపొందించిన పల్లకీలను, పీఠాలను ఇచ్చారు. దేవేంద్రుడి స్నేహితుడైన గంధర్వరాజు చిత్రరథుడు నాలుగు వందల గంధర్వజాతి గుఱ్ఱాలను ఇచ్చాడు. తుంబురుడనే గంధర్వుడు వంద గుఱ్ఱాలను ఇచ్చాడు.

**విశేషం:** బహుశః లోకంలో దుర్యోధనుని వంటి ఈర్ష్యాగ్రస్తులే దాయాదుల ఐశ్వర్యాన్ని ఇంతగా లెక్కించి గుర్తుంచుకోగలరేమో! దేశాల పేర్ల విషయంలో కొన్ని ప్రతుల్లో భేదాలున్నాయి. ఆంధ్ర కేరళ తురుష్కరాజులు ఆకాలంలో ఉన్నారా? ఇవి నన్నయ చేర్చినవే. మూలంలో లేవు. (ధర్మరాజుకు కానుకలుగా వచ్చిన ఈ వివరాలను రాజసూయం జరిగిన ఘట్టంలో వివరించకుండా

దుర్యోధనుడు ధృతరాష్ట్రునికి నివేదించటంలో కథాకథన శిల్పం ఉంది. అప్పుడు చెప్పినట్లైతే ఈ వివరాలు కథలో మునిగిపోయేవి. ఇప్పుడు చెప్పటంవల్ల దుర్యోధనుని అసూయకు గల బలమైన హేతువును చెప్పినట్లయింది. ధర్మరాజు కావాలని దుర్యోధనునికి బహుమతులను స్వీకరించే బాధ్యత ఎందుకు ఇచ్చాడో తేటతెల్లమయింది. ఆత్మీయుడైతే దుర్యోధనుడు ఆ సంపదను చూచి హర్షించేవాడు. దాయాది, అసూయాగ్రస్తుడు కావటంచేత భరించలేకపోతున్నాడు. ఈ వివరాలవల్ల పాండవుల ఔన్నత్యం, దుర్యోధనుని దుష్టత్వం ధ్వనిస్తున్నాయి. మరొక విశేషం - ధర్మరాజు మాయాద్యూతంలో సంపదలను కోల్పోయినప్పుడు ఈ వివరాలు ఇవ్వవలసిన అవసరంకూడా తప్పింది. ఇదంతా నన్నయ కథను చెప్పటంలో సాధించిన అర్థసంయోజనం. -సంపా.)

**ఉ. భావిపురాతనాద్యతనపార్థివలక్ష్ములు పాండవేయు ల**
**క్ష్మీ విభవంబుతోడ నుపమింప సమంబులు గా వశేష రా**
**జావళిలోన నత్యధికులైన సపత్నులపేర్మిఁ జూచి యేఁ**
**జూవె సహింపనోపక కృశుండ వివర్ణుఁడ నైతి నెంతయున్. 114**

**ప్రతిపదార్థం:** భావి, పురాతన+అద్యతన, పార్థివ, లక్ష్ములు= రాబోయే కాలంలోని, గతించిన కాలంలోని, వర్తమాన కాలంలోని రాజులయొక్క ఐశ్వర్యాలు; పాండవేయు, లక్ష్మీ, విభవంబుతోడన్= ధర్మరాజు ఐశ్వర్యంయొక్క గొప్పతనంతో; ఉపమింపన్= పోల్చటానికి; సమంబులు= సమానాలు; కావు, అశేష, రాజ+ఆవళిలోనన్= అందరు రాజులయొక్క సమూహంలో; అతి+అధికులు+ ఐన= మిక్కిలి గొప్పవాళ్ళయిన; సపత్నుల పేర్మిన్= దాయాదులయొక్క ఆధిక్యాన్ని; చూచి; ఏన్= నేను; చూవె= చూడుమా (సుమా) సహింపన్+ఓపక= ఓర్వలేక; ఎంతయున్= మిక్కిలి; కృశుండన్= చిక్కిపోయినవాణ్ణి; వివర్ణుఁడన్= కళావిహీనమైనవాణ్ణి; అయితిన్= అయ్యాను.

**తాత్పర్యం:** భూత భవిష్య ద్వర్తమానాల్లోని రాజుల ఐశ్వర్యా లేవీ ధర్మరాజు ఐశ్వర్యాతిశయంతో పోల్చటానికి సమానాలు కావు. సకలరాజసమూహంలో మిక్కిలి గొప్పవాళ్ళయిన దాయాదుల అతిశయం చూచి ఓర్వలేక నే నెంత కృశించానో, ఎంత కళావిహీనుణ్ణి అయ్యానో చూడు.

**విశేషం:** ఇది దుర్యోధనుడు తన అసూయను స్పష్టం చేసిన పద్యం: అసూయ కర్రకు అంటుకొన్న నిప్పులాంటిది. అది ఎదుటివాళ్ళను కాల్చే మాట ఎలా ఉన్నా మొదట ఆ కర్రను మాత్రం కాల్చక మానదు. దుర్యోధనుడు కృశించటం వెలవెలపోవటం ఇలాంటిదే. (ఈ పద్యరచనలోని దీప్తరసత్వం, ఔజ్జ్వల్యం కాంతిగుణాన్ని కమనీయంగా రూపొందించాయి. - సంపా.)

**ఆ. ఒక్క లక్ష భూసురోత్తముల్ గుడిచిన । మొనసి తనకుఁ దాన మ్రోయు శంఖ;**
**మొక్క నిమిషమేని యుడుగక మ్రోసె న । య్యధ్వరోత్సవంబు నన్నినాళ్ళు. 115**

**ప్రతిపదార్థం:** ఒక్క, లక్ష, భూసుర+ఉత్తముల్= ఒక లక్షమంది బ్రాహ్మణశ్రేష్ఠులు; కుడిచినన్= భోజనంచేస్తే; మొనసి= పూనుకొని; తనకు తాను+అ= తనంతట తానే; మ్రోయు, శంఖము; ఆ+అధ్వర+ఉత్సవంబు, అన్నినాళ్ళు= ఆ రాజసూయయాగం జరిగినన్ని రోజులు; నిమిషము+ఏనిన్= క్షణంకూడా; ఉడుగక= మానక; మ్రోసెన్= మ్రోగింది.

**తాత్పర్యం:** ఒక లక్షమంది బ్రాహ్మణ శ్రేష్ఠులు భోజనంచేస్తే తనకు తానై మ్రోగే శంఖం, ఆ రాజసూయ మహోత్సవం జరిగినన్ని రోజులు ఒక్క నిమిషమైనా ఆగకుండా మ్రోగింది.

సీ. జన్నంబు చూడంగ సకలభూములనుండి । వచ్చిన రాజన్యవరుల నవని
సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయ । బంధుసుహృద్వీరభటనియోగ
జనులను బేదల సాధుల నిత్యంబుఁ । దాన పరీక్షించి, తగ వెఱింగి,
యన్నంబు దయఁ బెట్టి, యందఱుఁ గుడిచినఁ । దనుమధ్య యర్ధరాత్రంబు నపుడు

ఆ. గాని కుడువదట్టె కమలాక్షి ద్రౌపది; । యదియుఁగాక యమ్మహాధ్వరమున
నధముఁ డయ్యుఁ గడుఁబ్రియంబున నభ్యర్చి । తుండ కాని వంచితుండు లేఁడు. 116

**ప్రతిపదార్థం:** తనుమధ్య= సన్నని నడుంగలది; కమల+అక్షి= కమలంవంటి కన్నులు కలది అయిన ద్రౌపది; జన్నంబు= ఆ రాజసూయ యజ్ఞం; చూడంగన్= చూడటానికి; సకల భూముల నుండి= అన్ని దేశాలనుండి; వచ్చిన; రాజన్య, వరులన్= రాజశ్రేష్ఠులను; అవనిసురులను= బ్రాహ్మణులను; వైశ్యులన్; శూద్రులన్; ఆత్మీయ, బంధు, సుహృత్+వీరభట, నియోగజనులను= దగ్గరిబంధువులను, స్నేహితులను, వీరభటులను ఆయాపనుల్లో నియమించిన పరిచారకులను; పేదలన్; సాధులన్; నిత్యంబున్= ప్రతిదినము; తాన= తానే; పరీక్షించి; తగవు+ఎఱింగి= తగినవిధం తెలుసుకొని; దయన్= దయతో; అన్నంబు; పెట్టి; అందఱున్; కుడిచినన్= భోజనంచేసిన తర్వాత; అర్ధరాత్రంబు, అపుడుగాని= అర్ధరాత్రి సమయంలో గాని; కుడువదు+అట్టె= తాను తృప్తిగా భుజింపదు; అదియున్, కాక= అంతేగాక; ఆ+మహా+అధ్వరమునన్= ఆ మహాయజ్ఞంలో; అధముఁడు+అయ్యున్= తక్కువవాడైనా; కడున్= మిక్కిలి; ప్రియంబునన్= ప్రీతితో; అభ్యర్చితుండు+అ కాని= పూజింపబడినవాడే కాని; వంచితుండు= కోరుకున్నది లభించనివాడు; లేఁడు.

**తాత్పర్యం:** ద్రౌపదీదేవి అన్నిదేశాలనుండి రాజసూయయాగం చూడటానికి వచ్చిన రాజశ్రేష్ఠులను, బ్రాహ్మణులను, వైశ్యులను, శూద్రులను, దగ్గరిబంధువులను, స్నేహితులను, వీరభటులను, పనివాళ్ళను, పేదలను, బైరాగులను ప్రతిదినం తానే స్వయంగా విచారించి తగిన రీతిగా, దయతో అన్నంపెట్టి, అందరూ భుజించిన తర్వాత అర్ధరాత్రి కాని తాను తృప్తిగా భుజించదు. అంతేకాదు, ఆ మహాయాగంలో అధముడు కూడ ప్రేమతో పూజలందుకొన్నాడుగాని-కోరుకొన్నది లభించనివాడు ఒక్కడైనా లేడు.

**విశేషం:** రాజసూయంలో జరిగిన అన్నదానం, ఆ అన్నదాన కార్య నిర్వాహకురాలుగా ఆ ద్రౌపదీదేవి వెలిగిన వెలుగు, దుర్యోధనునికి కన్ను కుట్టించాయి. మిత్రుడు అభిమానంతో చేసే ప్రశంసకంటె శత్రువు అసూయతోనైనా చేసే ప్రశంస సత్యమైనది. ప్రశస్తమైనది.

క. ధరణి హరిశ్చంద్రుఁడు భా । సురయశుఁ డయి చేసె రాజసూయం; బదియున్
సరిగా దని యే వగతును । సురుచిరవిభవమునఁ బాండుసుతుయజ్ఞముతోన్. 117

**ప్రతిపదార్థం:** ధరణిన్= భూమిమీద; హరిశ్చంద్రుఁడు; భాసుర, యశుఁడు+ఐ= ప్రకాశించే కీర్తి కలవాడై; రాజసూయంబు; చేసెన్; అదియున్= ఆ రాజసూయంకూడ; సురుచిరవిభవమునన్= మిక్కిలి ఒప్పయిన వైభవంలో; పాండుసుతుయజ్ఞముతోన్= పాండురాజుకుమారుడైన ధర్మరాజుయాగంతో; సరిగాదు+అని= సమానం కాదని; ఏన్= నేను; వగతును= చింతిస్తాను.

**తాత్పర్యం:** ఈ భూమిమీద హరిశ్చంద్రుడు గొప్ప కీర్తిమంతుడై రాజసూయం చేశాడు. కాని వైభవంలో అది కూడ ధర్మరాజు చేసిన రాజసూయయాగంతో సరిగా దని నేను చింతిస్తున్నాను.

**వ. అట్టి రాజసూయాధ్వరంబున నవభృథసమయంబునందు బ్రహ్మర్షి రాజర్షి లోకపాలపరివృతుం డయిన మహేంద్రుండునుం బోలె నున్న ధర్మతనయు నారదపారాశర్యాదిమహామునిసమేతుండయి ధౌమ్యుం డశేషతీర్థజలంబుల నభిషిక్తుం జేసిన. 118**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి, రాజసూయ+అధ్వరంబునన్= రాజసూయ యాగంలో; అవభృథ, సమయంబునందున్; బ్రహ్మర్షి, రాజర్షి, లోకపాల, పరివృతుండు+అయిన= బ్రహ్మర్షులచేత, రాజర్షులచేత, దిక్పాలురచేత కొలువబడి ఉన్న; మహా+ఇంద్రుండునున్, పోలెన్= దేవేంద్రునివలె; ఉన్న; ధర్మతనయున్= ధర్మరాజును; నారద, పారాశర్య+ఆది, మహాముని, సమేతుండు+అయి= నారదుడు, పరాశరుని కుమారుడు వేదవ్యాసుడు మొదలైన మహామునులతో కూడినవాడై; ధౌమ్యుండు; అశేష, తీర్థ, జలంబులన్= అన్ని పుణ్యనదుల జలాలచేత; అభిషిక్తున్+చేసినన్= అభిషేకించబడినవాణ్ణిగా చేయగా.

**తాత్పర్యం:** అలాంటి రాజసూయయాగం చివర చేసే అవభృథస్నానసమయంలో - పాండవ పురోహితుడు ధౌమ్యుడు, నారద వ్యాసాది మహర్షులతో కలిసి - బ్రహ్మర్షులు, రాజర్షులు, దిక్పాలకులు కొలుస్తున్న ఇంద్రునిలా వెలుగుతున్న ధర్మరాజును, అన్ని పుణ్యనదుల జలాలతో అభిషేకించాడు.

**సీ. అభిషిక్తుడయిన యయ్యమరాజసుతునకు । సాత్యకి మౌక్తికచ్ఛత్ర మొప్పఁ**
**బట్టె; భీముండును బార్థుండు మణిహేమ । దండ చామరయుగధారు లయిరి;**
**కమలనాభుండును గవలును ద్రుపదేశ । పుత్త్రుండు వేర్వేఱ భూమిపతుల**
**మూర్ధాభిషిక్తుల మ్రొక్కించుచుండిరి । దర్పంబు వెలయంగ; దానిఁ జూచి**

**ఆ. యేను మొదలుగా మహీపతు లెల్లను । దీప్తిఁ దఱఁగి యుండఁ దివిరి మమ్ము**
**నగిరి కృష్ణ పాండునందన ద్రౌపదీ । సాత్యకులుఁ గరంబు సంతసమున. 119**

**ప్రతిపదార్థం:** అభిషిక్తుఁడు+అయిన= అభిషేకించబడిన; ఆ+యమరాజ, సుతునకున్; సాత్యకి; మౌక్తికచ్ఛత్రము= ముత్యాలగొడుగు; ఒప్పన్= అందంగా; పట్టెన్= పట్టాడు; భీముండును; పార్థుండు= అర్జునుడు; మణిహేమదండ, చామర, యుగ, ధారులు+అయిరి= మణులు పొదగబడిన బంగారుకాడలు గల చామరాల జంటను ధరించిన వాళ్ళయ్యారు; కమలనాభుండును= శ్రీకృష్ణుడును; కవలును= నకుల సహదేవులును; ద్రుపద+ఈశ, పుత్త్రుండును= ద్రుపదరాజుయొక్క కుమారుడైన ధృష్టద్యుమ్నుడును; వేఱు+వేఱ; మూర్ధ+అభిషిక్తులన్= పట్టాభిషిక్తులైన; భూమిపతులన్= రాజులను; దర్పంబు= గర్వం; వెలయంగన్= ప్రకాశిస్తుండగ; మ్రొక్కించుచున్+ఉండిరి; దానిన్; చూచి; ఏను= నేను; మొదలుగ; మహీపతులు+ఎల్లన్= రాజులందరు; దీప్తి= కాంతి; తఱఁగి= తగ్గి; ఉండన్= ఉండగా; తివిరి= ప్రయత్నించి - అంటే పనికట్టుకొని; కృష్ణ, పాండునందన, ద్రౌపదీ, సాత్యకులు= శ్రీకృష్ణుడు, పాండవులు, ద్రౌపది, సాత్యకి; కరంబు= మిక్కిలి; సంతసమునన్= సంతోషంతో; మమ్మున్, నగిరి= మమ్మల్ని చూచి నవ్వారు.

**తాత్పర్యం:** రాజసూయంలో అభిషిక్తుడైన ఆ ధర్మరాజుకు సాత్యకి ముచ్చటగా ముత్యాలగొడుగు పట్టాడు. భీమార్జునులు మణులు పొదిగిన బంగారుకాడలున్న చామరాల జంటను ధరించి చెరొకవైపు నిలిచారు. శ్రీకృష్ణుడు, నకులసహదేవులు, ద్రుపదరాజ పుత్రుడైన ధృష్టద్యుమ్నుడు పట్టాభిషిక్తులయిన రాజు లందరిని వేరువేరుగా కొనిపోయి ధర్మరాజుకు మ్రొక్కించారు. ఆ వైభవాన్ని చూచి నేను, తక్కిన రాజులు వెలవెలబోతూ ఉంటే, శ్రీకృష్ణుడు, పాండవులు, ద్రౌపది, సాత్యకి అదే పనిగా ఆనందాతిశయంతో మమ్మల్ని చూచి నవ్వారు.

**విశేషం:** దాయాది అయిన ధర్మరాజు వైభవంతోపాటు, శ్రీకృష్ణపాండునందన ద్రౌపదీసాత్యకుల నవ్వుకూడ ఈ దుర్యోధనుని హృదయంలో గాఢంగా గ్రుచ్చుకొన్నది.

**వ. మఱియు నయ్యుధిష్ఠిరుండు. 120**

**తాత్పర్యం:** అంతేకాక ఆ ధర్మరాజు.

**సీ. 'అనఘుఁడై యెనుబది యెనిమిది వేవురు । బ్రాహ్మణ ప్రవరుల బ్రహ్మవిదుల**
**వెలయంగ నల్లిండ్ల నిలిపి, ప్రత్యేకంబ । ముప్పండ్రు దాసుల నొప్ప నిచ్చి**
**ముదముతో రక్షించుఁ, బదివేవురుత్తమ । భూసురు లతని యగ్రాసనమునఁ**
**గలధౌతమయ పాత్రములఁ బ్రతిదినమును । గుడువను గట్టను దొడువఁ బూయ**

**ఆ. ననుభవింపఁ గలుగు టది యేమి పురుషార్థ । మయ్యః కష్టపురుషు నట్టు లొరుల**
**పేర్మిఁ జూచుచుండఁ బెద్దయు నే నోప' । ననినఁ బతికి నిట్టు లనియె శకుని. 121**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు+ఐ= పాపరహితుడై; ఎనుబది, ఎనిమిదివేవురు, బ్రాహ్మణ, ప్రవరులన్= ఎనభై యెనిమిది వేలమంది బ్రాహ్మణశ్రేష్ఠులను; బ్రహ్మవిదులన్= బ్రహ్మజ్ఞాన సంపన్నులను; వెలయంగన్= ఒప్పునట్లుగా; నల్లిండ్లన్= అగ్రహారాల్లో; నిలిపి; ప్రత్యేకంబ; ముప్పండ్రు, దాసులన్= ముప్పదేసిమంది సేవకులను; ఒప్పన్= తగురీతిగా; ఇచ్చి; ముదముతోన్= సంతోషంతో; రక్షించున్= రక్షిస్తున్నాడు; పదివేవురు, ఉత్తమ, భూసురులు= పదివేలమంది ఉత్తమ బ్రాహ్మణులు; అతని= ఆ ధర్మరాజుయొక్క; అగ్ర+ఆసనమునన్= ఉన్నతమైన పీఠంలో; కలధౌతమయ, పాత్రములన్= వెండి లేదా బంగారుతో చేయబడిన పాత్రలలో; ప్రతిదినమును; కుడువను= భుజించటాన్ని; కట్టను= వస్త్రాలు కట్టటాన్ని; తొడువను= సొమ్ములుఅలంకరించుకొనటాన్ని; పూయన్= మైపూతలు పూసుకొనటాన్ని; అనుభవింపన్+కలుగుట; అది; ఏమి; పురుష+అర్థము+అయ్యె= మానవ జీవిత సార్థకత అయ్యా? కష్టపురుషున్+అట్టుల= హీనస్థితిలో ఉన్న మానవుడివలె; ఒరుల= ఇతరులయొక్క; పేర్మిన్= గొప్పతనాన్ని; చూచుచున్; ఉండన్; పెద్దయున్= ఎక్కువగా; ఏన్= నేను; ఓపన్= సహించను; అనినన్= అనిఅనగా; శకుని; పతికిన్= దుర్యోధనుడికి; ఇట్టుల+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ముడైన ఆ ధర్మరాజు ఎనభైఎనిమిదివేలమంది బ్రహ్మజ్ఞాన సంపన్నులైన బ్రాహ్మణ శ్రేష్ఠులను అగ్రహారాల్లో నిలిపి, వాళ్ళకు ముప్పదేసిమంది సేవకుల నిచ్చి, సంతోషంతో రక్షిస్తూ, పదివేలమంది బ్రాహ్మణులను ప్రతిదినం తన ప్రక్కన కూర్చుండ బెట్టుకొని భోజనం పెడుతూ, వాళ్ళకు బట్టలు, సొమ్ములు, మైపూతలు ఇచ్చి అనుభవింప జేయ గలగటం జీవితంలో ఎంతధన్యత! నేను హీనస్థితిలో ఉన్న మానవునిలా ఇతరుల గొప్పతనాన్ని చూచి అట్టే సహించి ఉండలేను' అని దుర్యోధనుడు అనగా అతనితో శకుని ఇలా అన్నాడు.

**విశేషం:** దానధర్మాలు కూడ వ్యక్తివైభవానికి అలంకారాలే. ప్రత్యర్థులకు అసహనహేతువులే. ఈర్ష్యాగుణం దుర్యోధనునికి తల్లిగర్భంనుండే సంక్రమించినట్లుంది. అది పాండవుల రాజసూయవైభవం చూచిన తరువాత పరాకాష్ఠ చెందింది. కురుపాండవ సఖ్యానికి తావులేకుండా చేసింది. సాక్షాత్తు చక్రధరుని సంధిప్రయత్నాన్నే చెడగొట్టింది. మహాభారత సంగ్రామానికి దారితీసింది; సర్వనాశనానికి కారణమయింది.

**క. భానుప్రభుఁ డగు పాండుమ । హీనాథాత్మజులలక్ష్మి యెల్లను నీకున్**
**నే నపహరించి యిత్తు ధ । రానుత! మాయాదురోదరవ్యాజమునన్. 122**

**ప్రతిపదార్థం:** ధరానుత= భూమిలోని ప్రజలచే కొనియాడబడేవాడా - ఓ దుర్యోధనా!; భానుప్రభుఁడు+అగు= సూర్యునితో సమానమైన తేజస్సు కలవాడయిన; పాండు మహీనాథ+ఆత్మజుల, లక్ష్మి= పాండు భూపతి కుమారులైన పాండవులయొక్క ఐశ్వర్యం; ఎల్లను= అంతా; నీకున్; ఏను= నేను; మాయా, దురోదర, వ్యాజమునన్= మోసపు జూదం నెపంతో; అపహరించి= దోచి; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** లోకం కొనియాడే ఓదుర్యోధనా! సూర్యునితో సమానమైన తేజస్సుకల ఆ ధర్మరాజుఐశ్వర్యాన్నంతా మాయాద్యూతం నెపంతో నీకు అపహరించి ఇస్తాను.

**వ. 'ధర్మతనయుండు జూదంబునకుఁ బ్రియుండు గాని యందుల యుక్కివం బెఱుంగం; డే నక్షవిద్యయం దతి దక్షుండ; నాతని నశ్రమంబున నోడించి తదీయ రాజ్యవిభూతి నీ కిచ్చెద; వగవకుండు' మని పలికిన శకుని పలుకులకు సంతసిల్లి దుర్యోధనుండు దండ్రిపాదంబులపయిం బడి మ్రొక్కి 'యీ శకునిమతంబున కొడంబడవలయు' ననినఁ గొడుకునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 123**

**ప్రతిపదార్థం:** ధర్మతనయుండు= ధర్మరాజు; జూదంబునకున్; ప్రియుండు; కాని; అందుల= ఆ జూదంలోని; ఉక్కివంబు= కపటం; ఎఱుంగండు= తెలియడు; ఏన్= నేను; అక్షవిద్యయందున్= పాచికలాడటంలో; అతిదక్షుండన్= మిక్కిలి నేర్పరిని; ఆతనిన్= ఆ ధర్మరాజును; అశ్రమంబునన్= సులభంగా; ఓడించి; తదీయ, రాజ్య, విభూతి= అతని రాజ్య సంపద అంతా, నీకున్+ఇచ్చెదన్; వగవక+ఉండుము= దుఃఖించకుండుము; అని; పలికిన; శకుని; పలుకులకున్; సంతసిల్లి; దుర్యోధనుండు; తండ్రి, పాదంబుల; పయిన్; పడి; మ్రొక్కి; ఈ, శకుని, మతంబునకున్= ఈశకునియొక్క అభిప్రాయానికి; ఒడంబడవలయున్= అంగీకరించాలి; అనినన్; కొడుకునకు; ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ధర్మరాజుకు జూదం అంటే ఎంతో ఇష్టం. కాని అందులో ఎంతమోసం ఉంటుందో అతనికి తెలియదు. నేను ద్యూతవిద్యలో చాలా నేర్పరిని. ఆ ధర్మరాజును సులభంగా ఓడించి, అతని రాజ్యసంపదనంతా నీకిస్తా. ఎందుకు అలా దుఃఖిస్తావు' - అని శకుని అనగానే సుయోధనుడు సంతోషించాడు. తండ్రి పాదాలమీద వ్రాలాడు. 'ఈ శకుని అభిప్రాయాన్ని అంగీకరించు' అన్నాడు. అందుకు ధృతరాష్ట్రుడు ఇలా అన్నాడు.

**క. ధీరమతి విదురుతోడ వి । చారింతము; వాఁడు నయవిశారదుఁడు కళా**
**పారగుఁడు దీర్ఘదర్శి య । పార హితారంభుఁ డుభయపక్షంబులకున్. 124**

**ప్రతిపదార్థం:** ధీరమతి= బుద్ధిబలం కలవాడైన - అంటే మేధావి అయిన; విదురుతోడన్; విచారింతము= ఆలోచిద్దాం; వాఁడు= ఆ విదురుడు; నయ, విశారదుఁడు= నీతి, న్యాయం బాగా తెలిసినవాడు; కళాపారగుఁడు= విద్యయొక్క ఆవలిదరి చేరినవాడు - అంటే గొప్ప విద్యావంతుడు; దీర్ఘదర్శి= ముందుచూపు కలవాడు; ఉభయ పక్షంబులకున్= కురుపాండవ పక్షాలు రెండింటికి; అపార, హిత+ఆరంభుఁడు= గొప్పమేలు చేసే పూనిక కలవాడు.

**తాత్పర్యం:** విదురుడు మేధావి. అతనితో ఈ విషయం ఆలోచిద్దాం. అంతేకాదు. అతడు నీతికోవిదుడు. అంతేకాదు దూరదృష్టి కలవాడు. కురుపాండవ పక్షాలు రెండింటి క్షేమం కోరేవాడు.

**విశేషం:** శకునిపన్నాగం దుర్యోధనునికి మేలు చేసేదే. అయితే, దానికి ధృతరాష్ట్రుని ఆమోదముద్ర కావాలి. ఇది కురుపాండవ రాజ్యతంత్రంతో ముడివడి ఉంది. ధృతరాష్ట్రుడు రాజుగా, తండ్రిగా రెండు పాత్రలు నిర్వహించాలి. తండ్రిగా అతడు అనుకూలుడే, అంతకంటె అతడు రాజ్యానికి ప్రభువు. రాజనిర్ణయం మంత్రితో చర్చించి తీసుకోవాలి. విదురుని అంగీకారం. ధృతరాష్ట్రుని ప్రభుత్వముద్రకు ముఖ్యం. దుర్యోధనుడు ధృతరాష్ట్రుని స్వతంత్రనిర్ణయాన్నే కోరుతున్నాడు. కాని, తన నిర్ణయాన్నే తండ్రి ప్రభు నిర్ణయంగా ప్రకటించా లని అతని ఉద్దేశం. అయితే మంత్రిని కా దని తంత్రం సాగించటానికి ధృతరాష్ట్రునికి ధైర్యం చాలలేదు. ఆ చిత్తవృత్తికి ఈ వాక్యాలు అద్దంపట్టుతున్నాయి. (సంపా.)

**వ.** **'సురపతి గురుండైన బృహస్పతి సేసిన నీతిశాస్త్ర రహస్యంబులం దెవ్వరికంటె విదురుం డెంతయు విశారదుం; డాతని బుద్ధిబలంబునను నాపగేయు బాహుబలంబుననుంజేసి యీ రాజ్యతంత్రంబు వర్తిల్లుచున్నయది; గావున నవ్విదురానుమతంబున నెగడుట లగ్గగు' ననిన దుర్యోధనుం డి ట్లనియె.** **125**

**ప్రతిపదార్థం:** సుర, పతి, గురుండు+ఐన= దేవతలరాజు దేవేంద్రుని గురువైన; బృహస్పతి; చేసిన= చెప్పిన; నీతి, శాస్త్ర, రహస్యంబులందున్, ఎవ్వరికంటెన్= అందరికంటె; విదురుండు; ఎంతయున్= ఎంతో; విశారదుండు= నేర్పరి; ఆతని బుద్ధి, బలంబునను= ఆతని బుద్ధిబలంచేతను; ఆపగేయు, బాహుబలంబుననున్+చేసి= గంగాతనయుడైన భీష్ముని భుజబలంచేతను; ఈ, రాజ్యతంత్రంబు; వర్తిల్లుచున్న+అది= నడుస్తున్నది; కావునన్; ఆ+విదుర+అనుమతంబున= ఆ విదురుని సమ్మతితో; నెగడుట= నడుచుకొనటం; లగ్గు+అగున్= మేలవుతుంది; అనినన్; దుర్యోధనుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'దేవేంద్రుని గురువైన బృహస్పతి చెప్పిన నీతిశాస్త్రరహస్యాల్లో విదురుడు అందరికంటె విద్వాంసుడు. అతని బుద్ధిబలంతో, గంగాతనయుడైన భీష్మునిబాహుబలంతో ఈ హస్తినాపురరాజ్యతంత్రం నడుస్తున్నది. అందుచేత ఏదిచేసినా విదురుడి సమ్మతితో చెయ్యటం మంచిది' అని ధృతరాష్ట్రు డనగా- అందుకు దుర్యోధనుడు ఇలా అన్నాడు.

**విశేషం:** ధృతరాష్ట్రుని పుత్రమమకారం 'ఈపాడుబుద్ధి నీ కేల' అని గట్టిగా కొడుకును మందలించలేక, విదురుని సమ్మతితో చేయటం మంచి దని చెప్పింది. లోకంలో పుత్రమమకార పీడితుల స్వభావం ఇలాగే ఉంటుంది. వాళ్ళు తగిన తరుణంలో తనయులను దండించరు. పరిస్థితులు విషమించినప్పుడు బాధపడతారు.

**తే.** **పాండుపుత్త్రుల కెప్పుడుఁ బక్షపాతి । విదురుఁ డని చెప్పఁ దొల్లియు విందు; దీని**
**నెఱిఁగి వారించుఁ గా, కతఁ డేల శకుని । కైతవంబున కొడఁబడుఁ గౌరవేంద్ర!** **126**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= ధృతరాష్ట్రమహారాజా!; విదురుఁడు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; పాండుపుత్త్రులకున్; పక్షపాతి= మొగ్గుచూపేవాడు; అని; చెప్పన్; తొల్లియున్= ఇదివరకే; విందున్= విని ఉన్నాను; దీనిన్= ఈ జూదమాడే ప్రయత్నాన్ని; ఎఱిఁగి= తెలుసుకొని; వారించున్+కాక= ఆపివేస్తాడుగాని; అతఁడు= ఆ విదురుడు; ఏల= ఎందుచేత; శకుని= శకునియొక్క; కైతవంబునకున్= జూదానికి; ఒడఁబడున్= అంగీకరిస్తాడు?

**తాత్పర్యం:** విదురుడు ఎప్పుడూ పాండవపక్షం వైపే మొగ్గుచూపుతా డని ఇదివరకే విన్నాను. ఆత డీప్రయత్నాన్ని ఆపివేస్తాడేకాని, శకునిజూదానికి అంగీకరిస్తాడా?

**తే. దీని కొడఁబడు; మొడఁబడవేని నేఁడ । యీ క్షణమ సర్వభక్షుచే భక్షితుండ**
**నగుదుఁ; దెల్ల మే నట్లైన వగపుఁ దక్కి । విదురుఁడును నీవు నుండుఁడు ముదముతోడ. 127**

**ప్రతిపదార్థం:** దీనికిన్= ఈ జూదప్రయత్నానికి; ఒడఁబడుము= అంగీకరించుము; ఒడఁబడవు+ఏనిన్= అంగీకరించకుంటే; నేడు+అ= ఈ రోజే; ఈక్షణము+అ= ఈ నిమిషాన్నే; సర్వ, భక్షుచే= అన్నింటినీ భక్షించే వాడైన అగ్నిచే; భక్షితుండన్= భక్షించబడినవాణ్ణి; అగుదున్; తెల్లము= ఇది నిజం; ఏన్= నేను; అట్లు+ఐనన్= ఆ విధంగా నశిస్తే; వగపున్= చింతను; తక్కి= వదలి; విదురుఁడును; నీవున్; ముదముతోడన్= సంతోషంతో; ఉండుఁడు.

**తాత్పర్యం:** ఈ ప్రయత్నానికి అంగీకరించు. అంగీకరించకుంటే ఈ రోజే, ఈ క్షణమే అగ్నికి ఆహుతి అవుతా. ఇది నిజం. తరువాత నిశ్చింతగా నీవూ, విదురుడూ సుఖంగా ఉండండి.

**విశేషం:** పుత్రమమకారపీడితులైన తల్లిదండ్రులను లోకంలో దుర్మార్గులైన తనయులు బెదిరించే తీరు ఇదే.

**క. అని కడు నడలుగఁ బలికిన । విని ధృతరాష్ట్రుండు దుఃఖవివశాత్మకుఁ డ**
**య్యును నెద నది యుచితము గా । దని వగచుచు నాత్మజునకు నాహ్లాదముగన్. 128**

**ప్రతిపదార్థం:** అని; కడున్= మిక్కిలి; అడలుగన్= దుఃఖంతో; పలికినన్; విని; ధృతరాష్ట్రుండు; దుఃఖ, వివశ+ఆత్మకుఁడు+ అయ్యునున్= దుఃఖానికి పూర్తిగా లొంగిపోయిన మనస్సు కలవాడైకూడా; ఎదన్= మనస్సులో; అది; ఉచితముకాదు= తగిందికాదు; అని; వగచుచున్= చింతిస్తూ; ఆత్మజునకున్= కుమారునికి; ఆహ్లాదముగన్= సంతోషం కలిగేటట్లుగా.

**తాత్పర్యం:** అని అమితంగా దుఃఖిస్తూ దుర్యోధనుడు అనగానే విని, ధృతరాష్ట్రుడు, తాను కూడా తీవ్రంగా దుఃఖించాడు. అయినా జూదం తగ దని మనస్సులో అనుకొని కొడుకుకు ఆహ్లాదం కలిగేవిధంగా-

**వ. అప్పుడు వేవురు శిల్పాచార్యుల రావించి, కనకరత్న ఖచిత స్తంభ సహస్రంబులను విచిత్రద్వార శతంబులను వివిధ రత్నరుచిర ప్రదేశంబులనుం జేసి రమ్యంబుగా నొక్క సభ నిర్మింపంబనిచి, యొక్కనాఁ డే కాంతంబ విదురునకు శకునిదుర్యోధనుల యభిప్రాయంబు చెప్పిన విని, యతండు విస్మితుండై, కలి ద్వారసమీపం బగుటయు జూదం బఖిలప్రజాక్షయకరం బగుటయు నెఱింగి ధృతరాష్ట్రున కి ట్లనియె. 129**

**ప్రతిపదార్థం:** అప్పుడు; వేవురు= వెయ్యిమంది; శిల్ప+ఆచార్యులన్= శ్రేష్ఠులైన శిల్పులను; రావించి; కనక, రత్న, ఖచిత, స్తంభ, సహస్రంబులను= బంగారు, రత్నాలు పొదుగబడిన వేయిస్తంభాలతో; విచిత్ర ద్వార శతంబులను= ఆశ్చర్యకరాలైన వందలకొలది వాకిళ్ళతో; వివిధ, రత్న, రుచిర, ప్రదేశంబులనున్+చేసి= అనేక విధాలైన రత్నకాంతులతో ఒప్పిన ప్రదేశాలతో; రమ్యంబుగాన్= అందంగా; ఒక్క; సభ; నిర్మింపన్; పనిచి= ఆజ్ఞాపించి; ఒక్కనాడు; ఏకాంతంబు+అ= ఒంటరిగా; విదురునకున్; శకుని, దుర్యోధనుల; అభిప్రాయంబు; చెప్పినన్; విని; అతండు= ఆ విదురుడు; విస్మితుండు+ఐ= ఆశ్చర్యపడినవాడై; కలి, ద్వార, సమీపంబు+అగుటయున్= కలి వాకిటి దగ్గరకు రావటం - అంటే కలియుగం దగ్గర పడటం; జూదంబు; అఖిల, ప్రజా, క్షయ, కరంబు+అగుటయున్= అందరు ప్రజలకు నాశనం కూర్చేది అవటాన్ని; ఎఱింగి= తెలుసుకొని; ధృతరాష్ట్రునకున్+ ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అప్పుడు శ్రేష్ఠులైన శిల్పులను వెయ్యిమందిని రప్పించి, బంగారు రత్నాలు పొదిగిన వెయ్యిస్తంభాలతో, విచిత్రాలైన వందలకొలది ద్వారాలతో, రకరకాలైన రత్నకాంతులతో ప్రకాశించే ప్రదేశాలతో, అందంగా ఒక సభను నిర్మించటానికి ఆజ్ఞాపించాడు. ఒకనాడు ఒంటరిగా విదురునితో శకునిదుర్యోధనుల అభిప్రాయాన్ని చెప్పాడు. అది విన్న విదురుడు ఆశ్చర్యపడి- కలియుగప్రవేశం దగ్గరపడటం, జూదం సర్వజననాశకం కావటం తెలుసుకొని ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు.

**విశేషం:** 'కలి ద్వార సమీపం బగుటయు' అనే దానికి అనేక ప్రతుల్లో 'కలిద్వాపర సమీపంబగుటయు' అనే పాఠాంతరం ఉంది. కాని మూలంలో 'తచ్ఛ్రుత్వా విదురో ధీమాన్ కలిద్వార ముపస్థితమ్ । వినాశముఖ ముత్పన్నం ధృతరాష్ట్ర ముపాద్రవత్' - అని ఉంది. (భండార్కరు ప్రతి - 2-45-50).

### విదురుఁడు ధృతరాష్ట్రునితో జూదమాడఁదగ దని చెప్పుట (సం. 2-51-23)

**ఆ.** **ఇట్టి కార్యమునకు నే నవశ్యంబును । నొడఁబడంగ నోప నుక్కివమున**
**సుతులతోడ నేల సుతులకు భేదంబు । సేయఁ గడఁగి తిదియుఁ జెట్ట యనక. 130**

**ప్రతిపదార్థం:** ఇట్టి; కార్యమునకున్; నేను; అవశ్యంబును= తప్పని సరిగా; ఒడఁబడంగన్+ఓపన్= ఒప్పుకొనలేను; ఇదియున్= దీన్ని; చెట్ట, అనక= చెడ్డ అని అనకుండ; ఉక్కివమునన్= కపటంతో; ఏల= ఎందుచేత; సుతులతోడన్; సుతులకున్= కొడుకులతో కొడుకులకు; భేదంబు= విరోధం; చేయన్= కలిగించటానికి; కడఁగితి= పూనుకొన్నావు.

**తాత్పర్యం:** ఇలాంటి పనికి ఏ మాత్రం నేను అంగీకరించను. ఇది చెడ్డ అని అనకుండ, కపటంతో నీ కొడుకుల్లో- పాండవులకు కౌరవులకు - విరోధం కల్పించటానికి ఎందుకు పూనుకున్నావు?

**తే.** **ఒలసి నీ పుత్త్రులెల్ల నొండొరులతోడ । నె ట్లొడంబడి యుండుదు రట్ల చేయ**
**వలయుఁ; దమలోన జూదంబు వాదు నగుటఁ । గలహ మూలంబ యెట్టి శాంతులకు నైన. 131**

**ప్రతిపదార్థం:** ఒలసి= కలిసి; నీ, పుత్త్రులు+ఎల్లన్= నీ కుమారు లందరు; ఒండు+ఒరులతోడన్= ఒకరితో నొకరు; ఎట్లు= ఏ విధంగా; ఒడంబడి, ఉండుదురు= కూడిఉంటారో; అట్లు+అ= ఆ విధంగా; చేయవలయున్; ఎట్టి, శాంతులకున్+ఐనన్= ఎంతటి శాంత స్వభావం కలవాళ్ళకైనా; తమలోనన్; జూదంబు; వాదున్= వివాదం; అగుటన్; కలహ, మూలంబు+అ= వైరమేర్పడటానికి కారణమే.

**తాత్పర్యం:** నీ పుత్రులంతా ఒకరితో ఒకరు ఎలా కలిసి మెలిసి ఉంటారో అలా చెయ్యి. ఎంత శాంత స్వభావులకైనా జూదం వాళ్ళలో వాళ్ళకు వాదు ఏర్పడటానికి, వైరం కలగటానికి కారణం అవుతుంది.

**విశేషం:** భారతంలో విదురుడు గొప్ప హితవరి, నన్నయ నానారుచిరార్థసూక్తినిధిత్వం విదురుని నోట విశేషంగా శోభిల్లింది.

**వ.** **'నీ నేర్చు విధంబున శకుని దుర్యోధనుల దుర్వ్యవసాయం బుడిగించి యిక్కురువంశంబు రక్షింపు' మనిన విదురునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 132**

**ప్రతిపదార్థం:** నీ, నేర్పు, విధంబునన్= నీకు చేతనైన పద్ధతిలో; శకుని, దుర్యోధనుల; దుర్+వ్యవసాయంబు= చెడ్డపనిని; ఉడిగించి= మాన్పి; ఈ+కురువంశంబు; రక్షింపుము; అనిన; విదురునకు; ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీకు చేతనైన పద్ధతిలో శకుని దుర్యోధనుల చెడ్డపనిని మాన్పించి, కురుకులాన్ని రక్షించు'అని విదురుడు అనగానే విదురుడితో ధృతరాష్ట్రుడు ఇలా అన్నాడు.

**ఉ.** **పుత్త్రుల కేల భేదమగు భూనుత! యేనును నీవు జాహ్నవీ**
**పుత్త్రుఁడు నుండఁగా నహితమున్ భయమున్ దొరకొన్నె? నాకు నా**
**పుత్త్రులకుం బ్రసాదకృత బుద్ధులు వేల్పులు గాన దీనికిన్**
**మిత్రనిధీ! యొడంబడుము మిన్నక సంశయ మంద నేటికిన్? 133**

**ప్రతిపదార్థం:** భూనుత!= లోకంచేత కొనియాడబడేవాడా!; ఏనునున్= నేనూ; నీవు; జాహ్నవీ, పుత్త్రుఁడున్= గంగాతనయుఁడు- భీష్ముడు; ఉండఁగాన్; పుత్త్రులకున్; ఏల= ఎందుచేత; భేదము+అగున్= వైరమేర్పడుతుంది?; వేల్పులు= దేవతలు; ప్రసాద, కృత, బుద్ధులు, కానన్= దయచూపే బుద్ధి కల వా రవటంచేత; నాకున్, పుత్త్రులకున్; అహితమున్= కీడును; భయమున్= భయమూ; దొరకొన్నె= కలుగునా?; మిత్త్రనిధీ= మిత్రులకు నిధియైనవాడా!; దీనికిన్= ఈ జూదానికి; ఒడంబడుము= అంగీకరించుము; మిన్నక= ఊరక - అంటే అనవసరంగా; సంశయము+అందన్= అనుమానపడటం; ఏటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** లోకం కొనియాడే ఓ విదురా! నేను, నీవు, గంగాతనయుడు భీష్ముడు ఉండగా, కొడుకుల కెందుకు వైరం ఏర్పడుతుంది? దేవతలు దయచూపే బుద్ధికలవాళ్ళు కావటంచేత నాకు, నా పుత్త్రులకు కీడు, భయం కలుగుతాయా? మిత్రనిధీ! నీ వీ జూదానికి అంగీకరించు. అనవసరంగా అనుమానపడటం ఎందుకు?

**విశేషం:** ధృతరాష్ట్రుని పుత్ర మమకారంతో పాటు, మాటనేర్పుకూడ ఈపద్యంలో వ్యక్తమవుతున్నది. విదురుణ్ణి ఆజ్ఞాపించగలవాడైనా అతణ్ణి 'మిత్త్రనిధీ!' అని సంబోధించి 'ఇందుకు అంగీకరించు' అని అడుగుతున్నాడు. (ఈ మాటల్లో ప్రభువు పాత్రకంటె తండ్రి పాత్రకే ధృతరాష్ట్రుడు ప్రాధాన్యం ఇస్తున్నట్లు స్పష్ట మౌతున్నది. ఇక విదురునిమాటలు అరణ్యరోదనలే, బూడిదలో పోసిన పన్నీరే. గుణం: ఉదారత. - సంపా.)

**వ.** **'వడిగల తురంగంబులం బూనిన రథం బెక్కి యింద్రప్రస్థపురంబునకుం జని యిందులకు ధర్మనందనుం దోడ్కొని ర' మ్మని విదురుం బంచిన, నాతండును నాపగేయున కంతయు నెఱింగించి 'యిది యపకర్మం' బనుచుండె; నిట ధృతరాష్ట్రుండు దన నిర్మింపంబంచిన సభ దుర్యోధనునకుం జూపి యాతని కేకాంతంబున నిట్లనియె. 134**

**పతిపదార్థం:** వడిగల= వేగంగల; తురంగంబులన్= గుర్రాలను; పూనిన= కట్టిన; రథంబు+ఎక్కి; ఇంద్రప్రస్థపురంబునకున్; చని= వెళ్ళి; ధర్మనందనున్= ధర్మరాజును; తోడ్కొని= పిలిచికొని; రమ్ము+అని; విదురున్; పంచినన్; ఆతండునున్= విదురుడుకూడ; ఆపగేయునకున్= గంగానదీ పుత్రుడైన భీష్మునికి; అంతయున్= జరిగినదంతా; ఎఱింగించి= తెలిపి; ఇది= ఈ జూదం; అపకర్మంబు= చేయకూడని పని; అనుచుండెన్; ఇట; ధృతరాష్ట్రుండు; తన= తాను; నిర్మింపన్; పంచిన = ఆజ్ఞాపించిన; సభ; దుర్యోధనునకున్; చూపి; ఆతనికిన్; ఏకాంతంబునన్= ఒంటరిగా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'వేగంగల గుర్రాలను కట్టిన రథం ఎక్కి ఇంద్రప్రస్థపురానికి వెళ్ళి, ధర్మరాజును ఇక్కడికి పిలుచుకొనిరా' అని విదురుణ్ణి పంపగా, ఆతడు భీష్మునికి జరిగిందంతా చెప్పి, 'ఈ జూదం కూడని పని' అన్నాడు. ధృతరాష్ట్రుడు తాను నిర్మించటానికి ఆజ్ఞాపించిన సభను దుర్యోధనునికి చూపి, ఏకాంతంగా అతనితో ఇలా అన్నాడు.

**క. జూద మిది యేల? దీనను । భేదము మీలోనఁ బుట్టుఁ బెలుచన; యుష్మ**
**ద్భేదమునఁజేసి యె గ్గు । త్పాదిల్లు ధరిత్రిఁ బ్రజకు భయజననంబై. 135**

**ప్రతిపదార్థం:** జూదము+ఇది; ఏల; దీనను= దీనివలన; పెలుచన= పెద్దగా; మీలోనన్; భేదము= వైరం; పుట్టున్; యుష్మత్+ భేదమునన్+చేసి= మీయొక్కవైరంవలన; ధరిత్రిన్= భూమిలోని; ప్రజకున్= ప్రజలకు; భయ, జననంబు+ఐ= భయాన్ని కలిగించేదై; ఎగ్గు= కీడు; ఉత్పాదిల్లున్= పుడుతుంది.

**తాత్పర్యం:** ఈ జూదం ఎందుకు? దీనివల్ల మీలో మీకు తీవ్ర వైరం పుడుతుంది. మీ వైరంవల్ల భూమిమీది ప్రజలందరికి భయంకరమైన కీడు కలుగుతుంది.

**ఉ. ఇమ్మహి నీవుఁ బాండవులు నెప్పటియట్ల పరస్పరానురా**
**గమ్మున నేలుచున్కి యిది కార్యము; పాండవలక్ష్మి నీ కస**
**హ్యా మ్మన నేల? వంచనఁ బరార్థ పరిగ్రహబుద్ధిఁ జేసి పా**
**పమ్మగుఁ; బాపకారులకుఁ బాయు నవశ్యము నర్థధర్మముల్. 136**

**ప్రతిపదార్థం:** ఈ+మహిన్= ఈభూమిని; నీవున్; పాండవులున్; ఎప్పటి, అట్ల= ఎప్పటివలె; పరస్పర+అనురాగమ్మునన్= పరస్పరప్రేమతో; ఏలుచున్+ఉనికి= పాలిస్తూ ఉండటం; ఇది; కార్యము= చేయదగింది; పాండవ, లక్ష్మి= పాండవులఐశ్వర్యం; నీకున్; అసహ్యము+అనన్+ఏల= ఓర్చుకోరానిది అని అనటం ఎందుకు?; వంచనన్= మోసంతో; పర+అర్థ= ఇతరులయొక్క సంపదను; పరిగ్రహ, బుద్ధిన్+చేసి= తీసుకోవాలనే ఆలోచనచేత; పాపమ్ము+అగున్= పాపం కలుగుతుంది; పాపకారులకున్= పాపంచేసేవాళ్ళకు; అవశ్యమున్= తప్పక; అర్థ, ధర్మముల్= సంపద, ధర్మం; పాయున్= తొలగిపోతాయి.

**తాత్పర్యం:** ఈ భూమిని నీవు, పాండవులు ఎప్పటిలాగే పరస్పర ప్రేమతో పాలిస్తూ ఉండటం మంచిది. పాండవుల సంపద నీకు ఎందుచేత సహింపరానిదైంది? మోసంతో ఇతరుల సంపద పరిగ్రహించా లనే ఆలోచనవల్ల పాపం కలుగుతుంది. పాపాత్ములకు సంపద, ధర్మం తప్పక నశిస్తాయి.

**విశేషం:** ఈ పద్యరచనలో ఉదారతాగుణం పోషించబడింది. (సంపా.)

**వ. 'ధర్మాధర్మవిదుండైన విదురున కిది సమ్మతంబు గాదు; ధర్మజు ధనసంపదకంటె నేనుమడుంగులు నీకు ధన సంపద గలదు; వాని చేసిన యజ్ఞంబుకంటె విశేషంబుగా దక్షిణ లిచ్చి నీ కిష్టంబయిన యజ్ఞంబు సేయుము; నీకును భూలోకంబునంగల రాజులెల్లం దమసర్వస్వమ్ములుఁ దెచ్చియిత్తు' రనిన విని దుర్యోధనుండు దండ్రి కి ట్లనియె. 137**

**ప్రతిపదార్థం:** ధర్మ+అధర్మ, విదుండు+ఐన= ధర్మం, అధర్మం తెలిసిన వాడైన; విదురునకున్; ఇది= జూదమాడి మోసంతో పాండవుల సంపదను అపహరించే పని; సమ్మతంబు కాదు; ధర్మజు, ధనసంపదకంటెన్; ఏనుమడుంగులు= ఐదు రెట్లు; నీకున్; ధనసంపద; కలదు; వాని, చేసిన= ఆ ధర్మరాజుచేసిన; యజ్ఞంబుకంటెన్; విశేషంబుగాన్= ఎక్కువగా; దక్షిణలు; ఇచ్చి; నీకున్+ఇష్టంబు+అయిన; యజ్ఞంబు; చేయుము; నీకును; భూలోకంబునన్+కల= భూలోకంలో ఉండే; రాజులు+ఎల్లన్= రాజులందరూ; తమ సర్వస్వమ్ములున్= తమ సకలసంపదలను; తెచ్చి; ఇత్తురు; అనినన్; విని; దుర్యోధనుండు; తండ్రికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ధర్మాధర్మాలు బాగా తెలిసిన విదురునికి ఈ మాయాద్యూతం సమ్మతంకాదు. ధర్మరాజు ధనసంపదకంటె ఐదురెట్లు ధనసంపద నీ కుంది. అతడు చేసిన యజ్ఞంకంటె అధికంగా దక్షిణ లిచ్చి నీకిష్ట మైన యజ్ఞం చెయ్యి. లోకంలోని రాజులంతా నీకుగూడ తమ సంపద లన్నింటిని తెచ్చి ఇస్తారు' అని అనగా విని దుర్యోధనుడు తండ్రితో ఇలా అన్నాడు.

**విశేషం:** ఈర్ష్యాగ్రస్తునికి తనకు లేదన్న బాధకంటె ఎదుటివాళ్ళకు ఉన్నదన్న బాధే ఎక్కువ. తనకు లే దన్న బాధను ఎవరైనా తీర్చగల రేమో కాని, ఎదుటివాళ్ళ కున్నదన్న బాధను కడకు కన్నతండ్రి మాత్రం ఏ విధంగా తీర్చగలడు?

**క. ఇమ్ముల ధర్మజుతో జూ । దమ్మాడఁగఁ గాన్న నాకు ధరణీశ్వర! య**
**జ్ఞ; మ్మదియ సమస్తైశ్వ । ర్యమ్ములు వడయఁగ నుపాయ మభిమతబుద్ధిన్. 138**

**ప్రతిపదార్థం:** ధరణి+ఈశ్వర= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఇమ్ములన్= ఇంపుగా; ధర్మజుతోన్; జూదమ్ము; ఆడఁగన్; కాన్పన్= చూచుటయే; నాకున్; యజ్ఞము; అది+అ= అదే; అభిమతబుద్ధిన్= కోరుకొన్నట్లు; సమస్త+ఐశ్వర్యమ్ములు= సకల సంపదలు; పడయఁగన్= పొందటానికి; ఉపాయము.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రమహారాజా! ధర్మరాజుతో జూదమాడగా చూడటమే నాకు యజ్ఞం. కోరుకొన్న సకల సంపదలు పొందటానికి అదే తగిన ఉపాయం.

**క. మీ రిందుల కందఱుఁ జను । దేరఁగ నే నంద యుండితిని సభ చూడన్;**
**ధారుణి నట్టి యపూర్వ స । భారచనలు వినఁగఁ జూడఁబడ వెవ్వరిచేన్. 139**

**ప్రతిపదార్థం:** మీరు; అందఱున్; ఇందులకున్= ఈ హస్తినాపురానికి; చనుదేరఁగన్= రాగా; నేను; సభ= మయసభను; చూడన్= చూడటానికి; అందు+అ= అక్కడే - అంటే ఇంద్రప్రస్థంలోనే; ఉండితిని; ధారుణిన్= భూమిలో; అట్టి; అపూర్వ, సభా, రచనలు= ఆశ్చర్యకరమైన సభా నిర్మాణ శిల్పాలు; ఎవ్వరిచేన్= ఎవరిచేతగూడ; వినఁగన్, చూడన్, పడవు= వినబడలేదు. చూడబడలేదు.

**తాత్పర్యం:** మీరంతా రాజసూయం తర్వాత హస్తినాపురానికి తిరిగివచ్చారు. నేను ఆ మయసభను చూడా లని అక్కడే ఉన్నాను. లోకంలో ఆశ్చర్యకరమైన అలాంటి సభానిర్మాణాన్ని ఇంతవరకు ఎవ్వరూ వినలేదు. కనలేదు.

**వ. నిర్మల స్ఫటిక శిలానిర్మితం బై శశిప్రకాశంబై వివిధరత్న ప్రభా భాసురంబైన యా సభావిభవంబు చూచువేడుక నందుఁ గ్రుమ్మరు వాఁడ హరినీల బద్ధస్నిగ్ధ మణిస్థలంబునందు జలబుద్ధింజేసి పరిధానోత్కర్షణంబుసేసి, విమల శిలాతలబుద్ధి నుదకపరిపూర్ణం బయిన వాపి సొచ్చి, కట్టిన పుట్టంబు దడియం ద్రెళ్ళిన నన్నుం జూచి వృకోదరుండు నగియె; దాని నంతయు నెఱింగి ధర్మరాజ చోదితులయిన కింకరులు నాకుం బరిధానంబులు దెచ్చి యిచ్చిరి; మఱియు వివృతద్వారంబుఁ గవాట ఘటితం బని చొరనొల్లక, కవాటఘటితంబు వివృతంబుగా వగచి, చొరంబోయి తత్కవాట స్ఫటిక శిలా ఘట్టిత లలాటుండ నైన నన్నుం జూచి యనేక సహస్ర విలాసినీ పరివృతయయియున్న ద్రౌపది నగియె; నంత నకుల సహదేవులు పఱతెంచి 'యిదె వాకిలి యిట వచ్చునది' యని నన్నుం దోడ్కొని పోయి; రట్టి సభాప్రలంభంబు నాకు హృదయశల్యం బయి యున్నది. 140**

**ప్రతిపదార్థం:** నిర్మల, స్ఫటిక, శిలా, నిర్మితంబు+ఐ= స్వచ్ఛమైన స్ఫటికపురాళ్ళతో కట్టబడినదై; శశి, ప్రకాశంబు+ఐ= చంద్రునివలె వెలిగేటటువంటిదై; వివిధ, రత్న, ప్రభా భాసురంబు+ఐన= పలువిధాలైన రత్న కాంతులచేత ప్రకాశించేదైన; ఆ సభా, విభవంబు= ఆ మయ సభయొక్క గొప్పదనం; చూచువేడుకన్= చూడాలనే కుతూహలంతో; అందున్= ఆ మయసభలో; క్రుమ్మరువాఁడన్= తిరుగుతున్న నేను; హరినీల, బద్ధ, స్నిగ్ధ, మణిస్థలంబునందున్= ఇంద్రనీలాలు కూర్చబడటంచేత నునుపైన మణి ప్రదేశంలో; జలబుద్ధిన్+చేసి= నీళ్ళున్నాయని అనుకోవటంచేత; పరిధాన+ఉత్కర్షణంబు, చేసి= కట్టుకున్న వస్త్రాన్ని పైకెత్తుకొని; విమల, శిలా, తల, బుద్ధిన్= స్వచ్ఛమైన రాతినేల అనే తలంపుతో; ఉదక, పరిపూర్ణంబు+అయిన= నీళ్ళతో పూర్తిగా నిండిన; వాపి= నడబావి - అంటే నడిచిపోవటానికి మెట్లు ఏర్పాటుచేసిన బావి; చొచ్చి= ప్రవేశించి, కట్టిన పుట్టంబు= కట్టుకొన్న బట్ట; తడియన్= తడిసిపోయేటట్లు; త్రెళ్ళినన్= పడిపోగా; నన్నున్; చూచి; వృకోదరుండు= భీముడు; నగియెన్= నవ్వాడు; దానిన్; అంతయున్; ఎఱింగి= తెలుసుకొని; ధర్మరాజ, చోదితులు+అయిన= ధర్మరాజుచేత పంపబడిన; కింకరులు= సేవకులు; నాకున్; పరిధానంబులు= కట్టుబట్టలు; తెచ్చియిచ్చిరి; మఱియున్; వివృతద్వారంబున్= తెరవబడిన వాకిలిని; కవాటఘటితంబు+అని= తలుపు మూయబడిన వాకిలి అని; చొరన్= ప్రవేశించటానికి; ఒల్లక= ఇష్టపడక; కవాటఘటితంబు= తలుపు మూయబడిన దానిని; వివృతంబుగాన్= తెరవబడినదానినిగా; వగచి= తలంచి; చొరన్+పోయి= ప్రవేశించబోయి; తత్+కవాట, స్ఫటిక, శిలా, ఘట్టిత, లలాటుండన్+ఐన= దానితలుపుయొక్క స్ఫటికపురాతిచే కొట్టబడిన నొసలు కలవాడినైన; నన్నున్; చూచి; అనేక, సహస్ర, విలాసినీ, పరివృత, అయిన, ఉన్న= పెక్కువేలమంది చెలికత్తెలతో కూడి ఉన్న; ద్రౌపది; నగియెన్= నవ్వింది; అంతన్= అప్పుడు; నకుల, సహదేవులు; పఱతెంచి= పరుగెత్తుకొనివచ్చి; ఇదె; వాకిలి; ఇట; వచ్చునది; అని; నన్నున్; తోడ్కొని= వెంటపిలుచుకొని; పోయిరి; అట్టి; సభా, ప్రలంభంబు= సభవలన కలిగిన వంచన; నాకున్; హృదయ, శల్యంబు+అయి= గుండెలో గుచ్చుకొన్న బాణమై; అంటే మిక్కిలి బాధాకరమై; ఉన్నది.

**తాత్పర్యం:** స్వచ్ఛమైన స్ఫటికపు రాళ్ళతో నిర్మించబడి, చంద్రునిలా ప్రకాశిస్తూ, పలువిధాలైన రత్నకాంతులతో వెలుగుతున్న ఆ మయసభా వైభవాన్ని చూడాలన్న కుతూహలంతో అందులో తిరుగుతూ ఉండగా-ఇంద్రనీలమణుల కూర్పుచేత నునుపైన మణిప్రదేశంలో నీళ్ళున్నా యని, కట్టుకొన్న వస్త్రాన్ని పైకెత్తుకొన్నాను. స్వచ్ఛమైన రాతినేల అనే తలంపుతో నీళ్ళు నిండిన నడబావిలో అడుగుపెట్టి కట్టుకున్న బట్టలన్నీ తడసేటట్లు క్రిందపడ్డాను. నాపాటు చూచి భీముడు నవ్వాడు. ధర్మరాజు పంపితే కొందరు సేవకులు కట్టుబట్టలు తెచ్చిఇచ్చారు. అంతే కాదు, తెరచిన ద్వారాన్ని మూసినదాన్నిగా తలచి అందు ప్రవేశించకుండా ఆవలికి తొలగిపోయాను. మూసినతలుపును తెరచినదాన్నిగా తలచి ప్రవేశించబోగా దానిస్ఫటికపురాతికి నొసలు కొట్టుకున్నాను. అలాగే నా స్థితిని చూచి పెక్కువేలమంది

చెలికత్తెలతో ఉన్నపాంచాలి ఫక్కున నవ్వింది. నకులసహదేవులు పరుగెత్తుకొని వచ్చి-ఇది వాకిలి; ఇటు ర మ్మని పిలుచుకొని పోయారు. ఆ సభలో, నేను పడినభంగపాటు గుండెలో గ్రుచ్చుకొన్న బాణంలా నన్ను అమితంగా బాధిస్తూ ఉంది.

**విశేషం:** అసలే దుర్యోధనుడు పాండవుల పట్ల అసూయాగ్రస్తుడు. అందుకుతోడు వారిముందే అంత ఘోరావమానం. పుండుమీద కారం చల్లినట్లయింది. అంతేకాదు, విశేషించి సూదులు గ్రుచ్చినట్లు ద్రౌపదీ భీమసేనుల నవ్వులు. అప్పటి దుర్యోధనుని మానసిక స్థితి ఊహించుకోవలసిందే కాని వివరించ సాధ్యంకాదు.

**క. పెద్దలు హీనతఁ బొందిరి । తద్దయు హీనులు సమృద్ధిఁ దనరిరి నియమం**
**బెద్ది విధియోగమున కను । హృద్దర్పోన్నతులు సూచి యెట్లు సహింతున్. 141**

**ప్రతిపదార్థం:** పెద్దలు= గొప్పవారు; హీనతన్= తక్కువతనాన్ని; పొందిరి; తద్దయున్= మిక్కిలి; హీనులు= తక్కువవాళ్ళు; సమృద్ధిన్= ఐశ్వర్యంతో; తనరిరి= ఒప్పారు; విధి, యోగమునకున్= బ్రహ్మదేవునిచేష్టకు; నియమంబు= క్రమం; ఎద్ది= ఏది?అ, సుహృత్+దర్ప+ఉన్నతులు= మిత్రులుకాని వాళ్ళయొక్క గర్వం; ఔన్నత్యము; చూచి; ఎట్లు; సహింతున్= ఓర్చుకుంటాను?

**తాత్పర్యం:** గొప్పవాళ్ళు తగ్గిపోయారు. అల్పులు అన్ని సంపదలతో అధికు లయ్యారు. బ్రహ్మదేవుని చేష్టకు క్రమం ఏముంది? మిత్రులు కానివాళ్ళ గర్వాన్ని, ఔన్నత్యాన్ని చూచి నే నెలా సహిస్తాను?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క. పరమసుఖోపాయంబునఁ । బరసంపద చేకొనంగఁ బడునేని నరే**
**శ్వర! యంతకంటె మిక్కిలి । పురుషార్థం బెద్ది యొండు భూనాథులకున్. 142**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర= ధృతరాష్ట్రమహారాజా!; భూనాథులకున్= రాజులకు; పరమ, సుఖ+ఉపాయంబునన్= మిక్కిలి సులభమైన ఉపాయంచేత; పర, సంపద= పగవారి సంపద; చేకొనంగన్, పడున్, ఏనిన్= తీసుకోటానికి వీలైతే; అంతకంటెన్; మిక్కిలి= ఎక్కువైన; పురుష+అర్థంబు= పురుష ప్రయోజనం; అంటే జీవితంలో పురుషుడు పొందదగిన లాభం; ఒండు= మరొకటి; ఎద్ది= ఏది?

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! రాజులు చాలా సులభమైన ఉపాయంతో శత్రువుల సంపదను గ్రహించటానికి వీలు కలిగితే, అంతకంటె అధికంగా వాళ్ళు కోరుకోతగిన ప్రయోజనం ఇంకేముంది?

**క. నముచి యను దనుజుఁ డుగ్రత । పము సేయుచు నున్నవాని బలమథనుఁ డధ**
**ర్మమున వధియించె; రిపుప । క్షము నెమ్మెయి నైనఁ జెఱుపఁగా వలయు నిలన్. 143**

**ప్రతిపదార్థం:** నముచి; అను; దనుజుఁడు= రాక్షసుడు; ఉగ్ర, తపము= భయంకరమైన తపస్సు; చేయుచున్+ఉన్న; వానిన్= అతడిని బలమథనుఁడు= ఇంద్రుడు; అధర్మమునన్= అన్యాయంగా; వధియించెన్= చంపాడు; ఇలన్= భూమిలో; రిపు, పక్షమున్= శత్రుపక్షాన్ని; ఏ+మెయిన్+ఐనన్= ఏవిధంగానైనా; చెఱుపఁగావలయున్= నాశనం చేయాలి.

**తాత్పర్యం:** నముచి అనే రాక్షసుడు భయంకరమైన తపస్సు చేస్తుండగా, దేవేంద్రుడు అన్యాయంగా అతణ్ణి వధించాడు గదా! భూమిమీద శత్రుపక్షాన్ని ఏ విధంగా నైనా నాశనం చెయ్యాలి.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. నముచి కశ్యపునికి, దనువుకు జన్మించిన కుమారుడు. నముచి భార్య ప్రభ. దేవదానవయుద్ధంలో ఇంద్రుడు వజ్రాయుధంతో కొట్టినా ఇతడు కసుగందలేదు. ఇతనికి ఉండే వరాలు అలాంటివి. ఆర్ద్రమైన (తడిసిన) దానితోగాని శుష్కమైన (ఎండిన) దానితోగాని ఇతనికి చావు లేదు. అయినా నముచి దేవేంద్రునికి భయపడి, దాగి, భయంకరమైన తపస్సు చేస్తుండగా- ఇంద్రుడు 'నిన్ను ఆర్ద్రమైన దానితోగాని, శుష్కమైన దానితోగాని కొట్ట' నని నమ్మించి, ఫేనం (నురుగు)తో కొట్టి ఈ రాక్షసుణ్ణి హతమార్చా డని పురాణగాథ.

**ఆ. అల్పుఁడయ్యు మనుజుఁ డతి పరాక్రమమునఁ । బేర్మిఁ దరతరంబ పెరుగుచున్న**
**వాఁడు ప్రాని మొదలి వల్మీక మా ప్రానిఁ । జెఱుచు నట్లు గడఁగి చెఱుచుఁ బగఱ. 144**

**ప్రతిపదార్థం:** మనుజుఁడు; అల్పుడు+అయ్యున్= తక్కువవాడు అయి నప్పటికి; అతిపరాక్రమమునన్= మిక్కిలి పరాక్రమంచేత; పేర్మిన్= గొప్పగా; తరతరంబ= అంతకంతకు; పెరుగుచున్నవాడు; ప్రాని, మొదలి, వల్మీకము= చెట్టుమొదట ఉండే పుట్ట; ఆ, ప్రానిన్= ఆ చెట్టును; కడఁగి= ప్రయత్నించి; పగఱన్= శత్రువులను; చెఱచున్= నాశనం చేస్తాడు.

**తాత్పర్యం:** మానవుడు తక్కువవాడే అయిన ఎక్కువ పరాక్రమంతో అంతకంతకు గొప్పగా అభివృద్ధి చెందుతుంటే చెట్టుమొదలిపుట్ట క్రమంగా ఆ చెట్టునే చెరిచి వేసినట్లు, ఆతడు ప్రయత్నంచేసి తనశత్రువులను నాశనం చెయ్యగలడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. అహితవృద్ధి యుపేక్షితం బగుడు నల్ప । మగు మహావ్యాధియును బోలె నది యసాధ్య**
**మయి యుపేక్షకు నిర్మూలితాత్ముఁ జేయుఁ । గాన పాండవశ్రీ యుపేక్ష్యంబు గాదు. 145**

**ప్రతిపదార్థం:** అహిత, వృద్ధి= మేలుకోరేవారుకాని వాళ్ళయొక్కఅభివృద్ధి-అంటే శత్రువులయొక్క అభివృద్ధిని; ఉపేక్షితంబు+ అగుడున్= పరిగణించక అశ్రద్ధ చేస్తే; అల్పము+అగు= తక్కువగా ఉండే; మహావ్యాధియున్+పోలెన్= పెద్దరోగంవలె; అది; అసాధ్యము+అయి= అదుపుచేయటానికి; వీలుకానిదై; ఉపేక్షకున్= అశ్రద్ధచేసినవాణ్ణి; నిర్మూలిత+ఆత్మున్= నాశనమైనవానిగా, చేయున్; కాన= అందుచేత; పాండవశ్రీ= పాండవులఐశ్వర్యం; ఉపేక్ష్యంబు, కాదు= లెక్కలోకి తీసికొనకుండ విడిచివేయతగింది కాదు.

**తాత్పర్యం:** శత్రువుల అభివృద్ధిని లెక్కలోకి తీసుకోకుండా వదలివేస్తే- మొదట తక్కువగా ఉన్నా పెరిగి పెరిగి పెద్దదై అదుపుచెయ్యటానికి సాధ్యంకాని మహావ్యాధిలా, అశ్రద్ధ చేసినవాణ్ణే అది నాశనం చేస్తుంది. అందువల్ల పాండవుల ఐశ్వర్యం ఏమాత్రం వదిలివేయతగింది కాదు.

**విశేషం:** అలం: ఉపమ. గుణం: అర్థవ్యక్తి.

**వ. 'దాని నెవ్విధంబున నయిన నపహరింపవలయు; నట్లుగాని నాఁడు నా హృదయ తాపంబున కుపశమనంబుగా; దనిన దుర్యోధనునకు శకుని యి ట్లనియె. 146**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ పాండవ ఐశ్వర్యాన్ని; ఏ+విధంబునన్+అయినన్= ఏ పద్ధతిని అనుసరించి అయినా; అపహరింపవలయున్= దొంగిలించాలి; అట్లు; కాని, నాఁడు= ఆ విధంగా జరగని రోజు; నా, హృదయ, తాపంబునకున్= నా గుండెలోని బాధకు; ఉపశమనంబు= తగ్గుదల; కాదు; అనిన; దుర్యోధనునకు; శకుని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'పాండవుల ఐశ్వర్యాన్ని ఏ పద్ధతిని అనుసరించి అయినా అపహరించాలి. ఆ విధంగా జరుగని నాడు నా హృదయంలోని బాధ తీరదు' అని దుర్యోధనుడు అనగా అతనితో శకుని ఇలా అన్నాడు.

**సీ. నాగరథాశ్వసన్నాహ మొనర్పక, । యొడ్డనంబులు దీర్ప, కుభయ సైన్య**
**వీరుల కరముల వివిధాయుధంబుల । నన్యోన్యసంఘట్టనారవంబు**
**లెసఁగంగ సంగ్రామ మేర్పడఁ జేయక, । యక్షముల్ దొలిచి యే నశ్రమమునఁ**
**బ్రతిపక్షతతుల సంపదలు జయించి నీ । కిచ్చెద; వగవంగ నేల? ధర్మ**

**ఆ. రాజుఁ బ్రీతితోడ రావించి యతనితోఁ । గడఁగు జూద మాడఁ గౌరవేంద్ర!**
**యొండు పాటఁ బాండవోన్నతి వేల్పుల । కయిన నపహరింప నలవి గాదు. 147**

**ప్రతిపదార్థం:** నాగ, రథ+అశ్వ, సన్నాహము= గజ, రథ, తురగ బలాల ప్రయత్నం; ఒనర్పక= చేయక; ఒడ్డనంబులు= యుద్ధవ్యూహాలు; తీర్పక= ఏర్పరచక; ఉభయ, సైన్యవీరుల= రెండు సైన్యాలలోని వీరుల యొక్క; కరములన్= చేతులలో; వివిధ+ఆయుధంబులన్= పలురకాలైన ఆయుధాలచేత; అన్యోన్య, సంఘట్టనా, రవంబులు= ఒకరినొకరు తాకిన శబ్దాలు; ఎసఁగంగన్= అతిశయించగా; సంగ్రామము= యుద్ధం; ఏర్పడన్= కలిగేటట్లు; చేయక; అక్షముల్= పాచికలు; తొలిచి= రంధ్రాలు చేసి, రూపొందించి; లేదా, దొలిచి= దొర్లించి; ఏన్= నేను; అశ్రమమునన్= శ్రమలేకుండ; ప్రతిపక్ష, తతుల, సంపదలు= ఎదుటి పక్ష సమూహాల సంపదలు; జయించి= గెలిచి; నీకున్; ఇచ్చెదన్; వగవంగన్= దుఃఖించటం; ఏల= ఎందుకు? కౌరవ+ఇంద్ర= కౌరవరాజా! ఓ దుర్యోధనా!; ధర్మరాజున్; ప్రీతితోడన్= ప్రియమార; రావించి; అతనితోన్; జూదము+ఆడన్; కడఁగు= పూనుకొనుము; ఒండుపాటన్= వేరొక విధంగా; పాండవ+ఉన్నతి= పాండవులయొక్క గొప్పదనం; వేల్పులకున్+అయినన్= దేవతలకైనా; అపహరింపన్= మోసగించి తీసుకోవటం; అలవిగాదు= సాధ్యం కాదు.

**తాత్పర్యం:** గజ రథ తురగ బలాల ప్రయత్నాలు లేకుండ, యుద్ధవ్యూహాల ఏర్పాట్లు చెయ్యకుండ, ఉభయసైన్యాల వీరుల చేతి ఆయుధాల తాకిడి శబ్దాలు పెల్లుబికేటట్లు పోరు సలుపకుండ, పాచికలు దొర్లించి, ఎదుటిపక్షంవాళ్ళ సంపదలు శ్రమలేకుండ గెలిచి నీ కిస్తాను. దుఃఖపడటం ఎందుకు? దుర్యోధనా! ధర్మరాజును ప్రియమార పిలిచి ఆతనితో జూదమాడు. ఇంకో విధంగా పాండవుల గొప్పతనం అపహరించటం ఆ దేవతలకైనా సాధ్యంకాదు.

**విశేషం:** అవినీతి పరులకు అక్రమ సంపాదనమీద అభిలాష మెండు. అక్రమ మార్గానుసరణం ఒక విధంగా వ్యక్తి అశక్తతకు చిహ్నమే. 'అక్షముల్ దొలిచి'- అంటే పాచికలను (యుక్తిగా) దొర్లించటం; దొలుచు అనే ధాతువు సంస్కృత 'దోలనం' నుండి ఏర్పడినరూపం. ఇచట కొన్ని ప్రతుల్లో 'అక్షములొడ్డి', 'అక్షముల్ దాల్చి' అనే పాఠాంతరా లున్నాయి. వీటి అర్థం స్పష్టం.

**వ. అనిన ధృతరాష్ట్రుండు దాని కొడంబడనొల్లక 'యేను విదురు శాసనంబున వర్తిల్లుచున్నవాఁడ; నాతం డర్థానర్థ విదుండు, సకలకార్యసమర్థుండు; జూదంబున విగ్రహం బగు ననియె; బలవంతులతోడి విగ్రహంబు పరిహరించుట లగ్గు; నా వచనంబు ధర్మోపేతంబు; దీని నతిక్రమించి యనుతాపంబు సేయక యిప్పుడు జూదం బుడిగి యెప్పటియట్ల యుండుట కార్యం' బనిన విని దుర్యోధనుం డతని కి ట్లనియె. 148**

**ప్రతిపదార్థం:** అనినన్; ధృతరాష్ట్రుండు; దానికిన్= జూదానికి; ఒడంబడన్, ఒల్లక= ఒప్పుకొనటానికి ఇష్టపడక; ఏను= నేను; విదురుశాసనంబునన్= విదురుడు చెప్పినప్రకారం; వర్తిల్లుచున్+ఉన్నవాఁడన్= నడుచుకొంటూ ఉన్నవాణ్ణి; ఆతండు; అర్థ+అనర్థ, విదుండు= న్యాయాన్యాయాలు లేదా మేలుకీళ్ళు బాగా తెలిసినవాడు; సకల, కార్య, సమర్థుండు= చేయదగిన అన్ని పనులలోను నేర్పుకలవాడు; జూదంబునన్= జూదమాడటంచేత; విగ్రహంబు+అగున్+అనియెన్= యుద్ధంకలుగుతుందని చెప్పాడు; బలవంతులతోడి; విగ్రహంబు= యుద్ధం; పరిహరించుట= విడవటం; లగ్గు= మేలు; నా వచనంబు= నామాట; ధర్మ+ఉపేతంబు= ధర్మంతో కూడుకొన్నది; దీనిన్; అతిక్రమించి= దాటి; అనుతాపంబు= పశ్చాత్తాపం; చేయక= పొందక; ఇప్పుడు; జూదంబు; ఉడిగి= మానుకొని; ఎప్పటి, అట్ల; ఉండుట; కార్యంబు= చేయదగినపని; అనినన్; విని; దుర్యోధనుండు; అతనికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని దుర్యోధను డనగా- ధృతరాష్ట్రుడు జూదానికి ఇష్టపడక, 'నేను విదురుడు చెప్పినట్లు నడుచుకొంటాను. అతడు న్యాయాన్యాయాలు లేదా మేలుకీళ్ళు బాగా తెలిసినవాడు. చేయదగినపను లన్నింటిలో నేర్పుకలవాడు. జూదమాడటంవల్ల యుద్ధం కలుగుతుందని చెప్పాడు. బలవంతులతో యుద్ధం నివారించటం మేలు. నామాట ధర్మంతో కూడుకొన్నది. దీన్ని దాటి, తరువాత దుఃఖించక, ఇప్పుడు జూదం మాని ఎప్పటిలా ఉండు. అది మంచిది' అని అనగా తండ్రితో దుర్యోధనుడు ఇలా అన్నాడు.

**క. తనకార్య మొరుమతంబున। నొనరింపఁగ నేర నగునె యొరునిమతంబుం**
**దనమతము నొకఁడు గా నో। పునె? చెచ్చెర నిశ్చయింపఁబోలునె దానిన్? 149**

**ప్రతిపదార్థం:** తన, కార్యము= తాను చేయదగినపని; ఒరు, మతంబునన్= ఇతరుల ఇష్టంప్రకారం; ఒనరింపఁగ నేరన్+అగునె= చేయదగునా?; ఒరుని, మతంబున్= ఇతరుని అభిప్రాయం; తన, మతమున్= తన అభిప్రాయం; ఒకఁడు, కాన్+ఓపునె= ఒకటి అవుతుందా?; దానిన్= ఇతరుల అభిప్రాయం తన అభిప్రాయం ఒకటి అవుతుందనే విషయాన్ని; చెచ్చెరన్= వెంటనే; నిశ్చయింపన్+పోలునె= నిర్ణయించటం సాధ్యమా?

**తాత్పర్యం:** తాను చెయ్యవలసిన పనిని ఇంకొకడి ఇష్టప్రకారం చెయ్యవచ్చా? ఇతరుల అభిప్రాయం, తన అభిప్రాయం ఒకటిగా ఉంటుందా? ఒకే విధంగా ఉంటుం దని వెంటనే నిర్ణయించటం సాధ్యమా?

**ఆ. విదురుమతము పాండవేయహితార్థంబు; । వానిబుద్ధి నెగడవలవ; దన్య**
**పక్షపాతబుద్ధిఁ బరఁగుచు నుండెడు । నట్టి వాని నాప్తుఁ డనఁగ నగునె? 150**

**ప్రతిపదార్థం:** విదురు, మతము= విదురుని అభిప్రాయం; పాండవేయ, హిత+అర్థంబు= పాండవుల మేలునే ప్రయోజనంగా కలిగినట్టిది - అంటే పాండవుల మేలు కోరేటటువంటిది; వాని= ఆ విదురునియొక్క; బుద్ధి= ఆలోచన; నెగడన్, వలవదు= వర్ధిల్లకూడదు, - అంటే అతడు చెప్పినట్లు చేయకూడదు; అన్య, పక్షపాత, బుద్ధిన్= ఇతరులపట్ల పక్షపాతం గల మనస్సుతో; పరఁగుచున్= ఒప్పుతూ; ఉండెడున్+అట్టివానిన్= ఉన్నట్టివాడిని; ఆప్తుఁడు= స్నేహితుఁడు; అనఁగన్+అగునె= అని అనవచ్చునా?

**తాత్పర్యం:** విదురుని అభిప్రాయం ఎప్పుడూ పాండవుల మేలు కోరేదే. అందువల్ల అతడు చెప్పినట్లు చెయ్యకూడదు. ఇతరుల పట్ల పక్షపాతం గలవాణ్ణి మనం ఆప్తు డని అనుకోవచ్చా?

**విశేషం:** నన్నయ వాక్యాలు కొన్ని సూత్రాల్లా సాగుతాయి. నానారుచిరార్థసూక్తులై శోభిల్లుతాయి. 'విదురుమతము పాండవేయహితార్థంబు'- ఇది సంస్కృత పద్ధతిలో సూత్రంలా సాగిన వాక్యం. 'అన్యపక్షపాత బుద్ధిఁ బరఁగుచు నుండెడు నట్టివాని నాప్తుఁ డనఁగ నగునె' అనేది ఒక చక్కని సూక్తి.

**వ. 'జూదం బన్నది పురాణంబులయందును వినంబడు; దీన దోషంబు లేదు; సుహృద్ద్యూతంబున దేవతలు దేవసాయుజ్యంబు వడయుదురు; గాన, దీనిం బ్రవర్తింప శకుని కానతిచ్చి యిందులకు ధర్మనందను రావింప వలయు' ననిన ధృతరాష్ట్రుండు పెద్దయుం బ్రొద్దు చింతించి, యెట్టకేనియు దాని కొడంబడి, విదురుం బిలిపించి వాని కి ట్లనియె. 151**

**ప్రతిపదార్థం:** జూదంబు; అన్నది; పురాణంబుల, అందును; వినంబడున్; దీనన్= ఈ జూదంలో; దోషంబు; లేదు; సుహృత్+ ద్యూతంబునన్= స్నేహంగా ఆడుకొనే జూదంవల్ల; దేవతలు; దేవ, సాయుజ్యంబు= దేవత్వయోగాన్ని; పడయుదురు= పొందుతారు; కాన= అందువలన; దీనిన్= ఈ జూదాన్ని; ప్రవర్తింపన్= నడిపించటానికి; శకునికిన్; ఆనతి; ఇచ్చి; ఇందులకున్; ధర్మనందనున్; రావింపవలయున్= రప్పించాలి; అనినన్; ధృతరాష్ట్రుండు; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; చింతించి= ఆలోచించి; ఎట్టకేనియున్= చిట్టచివరికి; దానికిన్= ఆ జూదానికి; ఒడంబడి= అంగీకరించి; విదురున్, పిలిపించి; వానికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'జూదం అనేది పురాణాల్లోకూడా వినిపిస్తుంది. దీనిలో దోషం లేదు. స్నేహంగా ఆడుకొనే జూదంవల్ల దేవతలు దేవత్వాన్ని పొందుతున్నారు. అందువల్ల ఈ జూదాన్ని నడిపించటానికి శకునికి అనుమతి ఇచ్చి, ధర్మరాజును ఇక్కడికి రప్పించాలి' అని దుర్యోధను డనగా, ధృతరాష్ట్రుడు చాలా సేపు ఆలోచించి, చివరకు అంగీకరించాడు. విదురుణ్ణి పిలిపించాడు. అతనితో ఇలా అన్నాడు.

**విశేషం:** 'దివు' ధాతువుకు అనేకార్థా లున్నాయి. దివు-క్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న, కాంతి, గతిషు. దీవ్యన్తి ఇతిదేవాః- కాబట్టి దేవనం చేతనే - అంటే ద్యూతక్రీడ చేతనే వాళ్ళు దేవత లయ్యారు. జూదమాడటంచేత దేవతలు దేవత్వాన్ని పొందుతుంటే, మనం జూదమాడటంలో తప్పేమి ఉంది అని దుర్యోధను డంటున్నాడు.

**చ. అనుపమరత్నకాంచనచయాంచిత మీ సభ దీని ధర్మనం**
**దనుఁ డనఘుండు దానుఁ దన తమ్ములు నిందుల కేఁగుదెంచి చూ**
**చినఁ గడు సంతసం బగు విశిష్టజనస్తుత! నీవు వానిఁ దో**
**డ్కొని చనుదెమ్ము భూసురసఖున్ బుధబంధుజనానురంజనున్. 152**

**ప్రతిపదార్థం:** విశిష్ట, జన, స్తుత= గొప్పవారిచేత ప్రశంసించబడేవాడా! ఓ విదురా!; ఈ, సభ; అనుపమ, రత్న, కాంచన, చయ+అంచితము= సాటిలేనట్టి రత్నాలయొక్క, బంగారుయొక్కసమూహంతో కూడుకొన్నది; అనఘుండు= పాపరహితుడైనవాడు; ధర్మనందనుఁడు= ధర్మరాజు; తానున్, తన తమ్ములున్; ఇందులకున్= ఇక్కడికి; ఏఁగుదెంచి= వచ్చి; దీనిన్= ఈ సభను; చూచినన్= చూస్తే; కడున్= మిక్కిలి; సంతసంబు= సంతోషం; అగున్= కలుగుతుంది; నీవు; భూసురసఖున్= బ్రాహ్మణులకు ప్రియమైనవాణ్ణి; బుధ, బంధు, జన+అనురంజనున్= పండితులను, బంధుజనులను సంతోషపరచేవాణ్ణి; వానిన్= ఆ ధర్మరాజును; తోడ్కొని= వెంటబెట్టుకొని; చనుదెమ్ము= రమ్ము.

**తాత్పర్యం:** గొప్పవారిచేత పొగడబడేవాడా! ఓవిదురా! ఈసభ సాటిలేని మేటి రత్నాలతో, బంగారుతో కూడుకొన్నది. పుణ్యాత్ముడైన ధర్మరాజు, అతని తమ్ములు ఇక్కడికి వచ్చి దీనిని చూస్తే చాలా సంతోషం కలుగుతుంది. నీవు వెళ్ళి- బ్రాహ్మణులకు ప్రియమైనవాడు, పండితులను, బంధువులను సంతోషపరచేవాడు అయిన ఆ ధర్మరాజును వెంటపెట్టుకొనిరా.

**విశేషం:** ధర్మరాజును పిలిపించటం జూదమాడటానికా? సభను చూడటానికా? ఈ మాత్రం సభను ధర్మరాజు ఎన్నడూ చూడలేదా? అయినా ఆ మయసభముందు ఇదెంత? పైగా ధృతరాష్ట్రుడు 'విశిష్టజనస్తుత!' అని విదురుణ్ణి సంబోధిస్తున్నాడు. ధర్మజునికి అనఘుడు. భూసురసఖుడు, బుధ బంధు జనానురంజకుడు - అనే విశేషణాలు ప్రయోగిస్తున్నాడు. లోకం ధృతరాష్ట్రుణ్ణి గురించి నోట తీపి, అంగిట విషం' అనటం ఇందుకే కాబోలు. గుణం: అర్థవ్యక్తి.

**వ. 'ఇట్టి విచిత్ర రత్న సభావేదికాతలంబున నతండును దుర్యోధనుతోడం బ్రొద్దువోక సుహృద్ద్యూతంబుఁ బ్రవర్తించు' ననిన విని విదురుండు విషణ్ణహృదయుండయి 'మాయా దురోదరంబు దురర్థంబుగాఁ జింతించి దీని నుడిగిన నుభయపక్షంబులకు ల గ్గగు' నని పెక్కుమాఱులు వారించి. 153**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఈ విధమైన; విచిత్ర, రత్న, సభా, వేదికా, తలంబునన్= ఆశ్చర్యకరాలైన రత్నాలతో కూడిన సభలోని అరుగుమీద; అతండును= ఆ ధర్మరాజు; దుర్యోధనుతోడన్; ప్రొద్దు, పోక= కాలక్షేపానికి; సుహృత్+ద్యూతంబున్= మైత్రితో కూడుకొన్న జూదాన్ని; ప్రవర్తించున్= ఆడుకొంటాడు; అనిన; విని; విదురుండు; విషణ్ణ, హృదయుండు+అయి= దుఃఖాన్ని పొందిన మనస్సు కలవాడయి; మాయా, దురోదరంబు= కపటపుజూదం; దుర్+అర్థంబుకాన్= చెడు ఫలా న్నిచ్చే దానినిగా; చింతించి= ఆలోచించి; దీనిన్= ఈ జూదాన్ని; ఉడిగినన్= మానితే; ఉభయపక్షంబులకున్= రెండు వైపులవాళ్ళకి; లగ్గు= మేలు; అగున్+అని; పెక్కుమాఱులు; వారించి= వద్దని చెప్పి.

**తాత్పర్యం:** 'ఈ విధంగా ఆశ్చర్యకరాలైన రత్నాలతో కూడుకొన్నసభావేదిక మీద, ధర్మరాజు కాలక్షేపానికి దుర్యోధనునితో మిత్రద్యూతం ఆడతా'డని ధృతరాష్ట్రు డనగా, విదురుడు దుఃఖపడి 'కపటపు జూదంవల్ల అనర్థం కలుగుతుం దని ఆలోచించి, దీనిని మానితే రెండుపక్షాలవాళ్ళకి మేలవుతుం'దని, జూదం వద్దని పెక్కుమార్లు చెప్పి.

**విశేషం:** ధర్మరాజును పిలిపించేది అతని ప్రొద్దుపోకకా! దుర్యోధనునితో జూదమాడే అవకాశం కల్పించటానికా? అన్యాయంగా అతని సంపదను అపహరించటానికా? ఎంత తీయగా మాట్లాడినా, తడిగుడ్డతో గొంతుకోసే ధృతరాష్ట్రుని తత్త్వం తలుపు సందునుండి తొంగిచూచినట్లు కొంత కొంత తెలుస్తూనే ఉంది.

### విదురుఁడు ధర్మరాజుం దోడ్కొని వచ్చుట (సం. 2-52-1)

**క. అవిలంఘనీయ మీదు । ర్వ్యవసాయం బనుచు సత్యవచనుఁడు ధర్మా ర్థవిదుం డప్పుడు ధృతరా । ష్ట్రవిధాతృనియోగమున కొడంబడి యంతన్. 154**

**ప్రతిపదార్థం:** ఈ, దుర్+వ్యవసాయంబు= ఈ చెడ్డపని; అవిలంఘనీయము= దాట సాధ్యం కానిది; అనుచున్; సత్య, వచనుఁడు= సత్యమైన మాటలు కలవాడు; ధర్మ+అర్థ, విదుండు= ధర్మంయొక్క అర్థం తెలిసినవాడు అయిన విదురుడు; అప్పుడు; ధృతరాష్ట్ర, విధాతృ, నియోగమునకున్= ధృతరాష్ట్రు డనే బ్రహ్మయొక్క ఆజ్ఞకు, ఒడంబడి= ఒప్పుకొని, అంతన్= తర్వాత.

**తాత్పర్యం:** ఈ చెడ్డపని తప్పించుకోటానికి సాధ్యం కాదని- సత్యం మాట్లాడేవాడు, ధర్మం తెలిసినవాడు అయిన విదురుడు ధృతరాష్ట్రు డనే విధాత ఆజ్ఞకు తలవంచి- అప్పుడు,

**క.** **ఇంద్రప్రస్థపురంబున । కింద్రగురుప్రతిభుఁ డరిగి యింద్రసమానుం**
**జంద్రయశు ననుజసహితు నృ । పేంద్రుని ధర్మసుతుఁ గాంచె నెంతయుఁ బ్రీతిన్.** **155**

**ప్రతిపదార్థం:** ఇంద్ర, గురు, ప్రతిభుఁడు= దేవేంద్రుని గురువైన బృహస్పతితో సమానమైన బుద్ధిబలం కలవా డయిన విదురుడు; ఇంద్రప్రస్థపురంబునకున్; అరిగి= వెళ్ళి; ఇంద్ర, సమానున్= దేవేంద్రునితో సమానమైనవాణ్ణి; చంద్ర, యశున్= చంద్రునివలె ప్రకాశించే కీర్తికలవాణ్ణి; అనుజ, సహితున్= తమ్ములతో కూడుకొన్నవాణ్ణి; నృప+ఇంద్రునిన్= రాజశ్రేష్ఠుని; ధర్మసుతున్= ధర్మరాజును; ఎంతయున్= మిక్కిలి; ప్రీతిన్= ప్రేమతో; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుని గురువైన బృహస్పతితో సమానమైన బుద్ధిబలం గల విదురుడు, ఇంద్రప్రస్థపురానికి వెళ్ళి- దేవేంద్రునితో సమానమైనవాడు, చంద్రుని వలె ప్రకాశించే కీర్తికలవాడు, తమ్ములతో కూడి ఉన్నవాడు, రాజశ్రేష్ఠుడు అయిన ధర్మరాజును ఎంతో ప్రేమతో దర్శించాడు.

**విశేషం:** అలం: ఉపమ, వృత్త్యనుప్రాసం.

**వ.** **అతనిచేత నభ్యర్చితుం డయి కుశలం బడిగి నిజాగమనప్రయోజనం బెఱింగించిన విని, విదురునకు ధర్మతనయుం డి ట్లనియె.** **156**

**ప్రతిపదార్థం:** అతనిచేతన్= ఆ ధర్మరాజుచేత; అభ్యర్చితుండు+అయి= పూజించబడినవాడయి; కుశలంబు= క్షేమం; అడిగి; నిజ+ఆగమన, ప్రయోజనంబు= తనరాకయొక్కకారణం; ఎఱింగించినన్= చెప్పగా; విని; ధర్మతనయుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** విదురుడు ధర్మరాజు పూజలందుకొని, అతని క్షేమ మడిగి, తనరాకకు గల కారణం చెప్పగా, ధర్మరాజు ఇలా అన్నాడు.

**సీ.** **'పుత్త్రవత్సలుఁడు విచిత్రవీర్యాత్మజుఁ । డార్యుండు ధృతరాష్ట్రుఁ డాదరించి**
**నిన్ను నియోగించె నన్నుఁ దోడ్కొని తేర; । నీవును వచ్చితి నెమ్మితోడ;**
**లాలితాపూర్వసభాలోకనంబున । యందు జూదంబు కార్యంబె? చెపుమ;**
**జూదంబు కతమున భేదంబు గాకుండ । నేరదు మాలోన; నీనియోగ**

**ఆ.** **మనఘ! మా కలంఘ్య మయినట్లు ధృతరాష్ట్రు । పనుపుసేయ నీకుఁ బాడి యదియ'**
**యనుచు విధినియుక్తుఁ డయి యప్డు విదురుతో । నేఁగ నిశ్చయించె నిందుకులుఁడు.** **157**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపరహితుడా!; విదురా!; పుత్త్రవత్సలుఁడు= పుత్రులపట్ల స్నేహభావం కలవాడు; విచిత్ర, వీర్య+ ఆత్మజుఁడు= విచిత్రవీర్యునికుమారుడు; ఆర్యుండు= పూజ్యుడుఅయిన; ధృతరాష్ట్రుఁడు; ఆదరించి= మన్నన చూపి; నన్నున్; తోడ్కొనితేరన్= పిలుచుకొని రావటానికి; నిన్నున్; నియోగించెన్= నియమించాడు; నీవును= నీవుకూడ; నెమ్మితోడన్=

ప్రేమతో; వచ్చితి= వచ్చావు; లాలిత+అపూర్వ, సభా, లోకనంబునన్= అందమై మిక్కిలి అరుదైన సభను చూస్తున్నపుడు; అందున్; జూదంబు; కార్యంబె= చేయదగిందేనా?; చెపుము= చెప్పుము; మాలోనన్; జూదంబు; కతమునన్= జూదమాడటం కారణంగా; భేదంబు= వైరం; కాకుండ నేరదు= కలగకుండా ఉండదు; నీ నియోగము= నీ ఆజ్ఞ; మాకున్; అలంఘ్యము= దాటరానిది; అయినట్లు= అయిన విధంగానే; ధృతరాష్ట్ర, పనుపు= ధృతరాష్ట్రుని ఆజ్ఞను; చేయన్= చేయటం; నీకున్; పాడి, అది+అ= న్యాయమే; అనుచున్; ఇందుకులుఁడు= చంద్రవంశపు రాజైన ధర్మజుడు; విధి, నియుక్తుఁడు+అయి= దైవంచేత నియమింపబడినవాడై- అంటే దైవ నిర్ణయానుసారం; విదురునితోన్; ఏఁగన్= వెళ్ళటానికి; నిశ్చయించెన్.

**తాత్పర్యం:** 'పుణ్యాత్మా! విదురా! పుత్రులపట్ల స్నేహభావం కలవాడు, విచిత్రవీర్యునితనయుడు, పూజ్యుడు, అయిన ధృతరాష్ట్ర మహారాజు- ఆదరంతో నన్ను పిలుచుకొని ర మ్మని నిన్ను పంపాడు. ప్రేమతో నీవు నా దగ్గరకు వచ్చావు. అందమై, అపూర్వమైన ఆ సభను చూడటానికి వచ్చి అందులో జూదమాడటం తగునా? చెప్పు. ఈ జూదం కారణంగా మాలో మాకు వైరం ఏర్పడక మానదు. నీ ఆజ్ఞ మా కెట్లా మీరరానిదో, ధృతరాష్ట్రుని ఆజ్ఞ నీకూ అట్లే' అని- చంద్రవంశప్రభువైన ధర్మరాజు విధివశాన విదురుని వెంట వెళ్ళటానికి నిశ్చయించాడు.

**విశేషం:** అంతా దైవనిర్ణయం అనటం వేరు. కాని వ్యసనం మానవస్వభావంలో ఒక బలమైన భాగం. అందువల్ల ధర్మరాజు అన్నీ తెలిసి విదురుని వెంట హస్తినకు వెళ్ళాడు. జూద మాడాడు. ధర్మరాజులో ఈ వ్యసనమే లేకుంటే మహాభారతకథ మరోవిధంగా ఉండేది. (ధర్మరాజువాక్యవిన్యాసంలో వికటత్వం అర్థప్రకటనలో అగ్రామ్యత్వం సందర్భోచితంగా సంవదించటంవలన ఉదారతాగుణం రాణించింది. సంపా.)

**క.** **అనుజులు ద్రుపదాత్మజయును । ననుచరముఖ్యులును ధౌమ్యుఁ డాదిగ విద్వ**
**జ్జనులును దోఁ జనుదేరఁగ । నినసన్నిభతేజుఁ డరిగె నిభపురమునకున్.** **158**

**ప్రతిపదార్థం:** అనుజులు= తమ్ములు; ద్రుపద+ఆత్మజయును= ద్రుపదునికూతురైన పాంచాలియు; అనుచర, ముఖ్యులును= ముఖ్యులైన సేవకులును; ధౌమ్యుఁడు+ఆదిగన్= ధౌమ్యుడుమొదలయిన; విద్వత్+జనులును= పండితులును; తోన్+ చనుదేరఁగన్= వెంటరాగా; ఇన, సన్నిభ, తేజుఁడు= సూర్యునితో సమానమైన తేజస్సుకలవాడు - ధర్మరాజు; ఇభ, పురమునకున్= హస్తినాపురానికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** తమ్ముళ్ళు, ద్రౌపది, ముఖ్యసేవకులు, ధౌమ్యుడు మొదలైన పండితులు వెంటరాగా, సూర్యతేజుడైన ధర్మరాజు హస్తినాపురానికి వెళ్ళాడు.

**వ.** **అందు దుర్యోధన దుశ్శాసనాది పుత్త్రశతంబుతో భీష్మశల్య శకుని సైంధవ కర్ణ గౌతమ ద్రోణాశ్వత్థామ సోమదత్త సమేతుండయి యున్న ధృతరాష్ట్రునకు భానుమతీ ప్రభృతిస్నుషా పరివృతయయి తారకాపరివృత యయి యున్న రోహిణియుంబోలె నున్న గాంధారీదేవికిఁ గురువృద్ధజనులకు నతివినయంబున ననుజ సహితుండయి ధర్మతనయుండు మ్రొక్కె; నంత ద్రుపదరాజనందనయు గాంధారికి మ్రొక్కిన, నక్కోమలిం జూచి గాంధారికోడం డ్రెల్లను విస్మితలయి.** **159**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ హస్తినాపురంలో; దుర్యోధన, దుశ్శాసన+ఆది, పుత్త్ర,శతంబుతోన్= దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలయిన నూరుగురు కొడుకులతో; భీష్మ, శల్య, శకుని, సైంధవ, కర్ణ, గౌతమ, ద్రోణ+అశ్వత్థామ, సోమదత్త, సమేతుండు+

అయి, ఉన్న= భీష్ముడు, శల్యుడు, శకుని మొదలయిన వారితో కూడి ఉండే; ధృతరాష్ట్రునకు; భానుమతీ, ప్రభృతి, స్నుషా, పరివృత, అయి= భానుమతి మొదలైన కోడండ్రచేత చుట్టబడినదై- అంటే భానుమతి మొదలయిన కోడళ్ళందరూ చుట్టూ చేరి ఉన్నారనటం; తారకా, పరివృత, అయి= నక్షత్రాలచేత చుట్టబడినదై; ఉన్న; రోహిణియున్+పోలెన్= రోహిణివలె; ఉన్న; గాంధారీదేవికిన్, కురువృద్ధజనులకున్= కురువంశంలోని పెద్దలకు; అతి, వినయంబునన్= మిక్కిలి వినయంతో; అనుజ, సహితుండు+అయి= తమ్ములతో కూడినవాడై; ధర్మతనయుండు= ధర్మరాజు; మ్రొక్కెన్= నమస్కరించాడు; అంతన్; ద్రుపదనందనయున్= ద్రౌపదికూడ; గాంధారికిన్; మ్రొక్కినన్, ఆ+కోమలిన్= ఆ అందగత్తెను; చూచి; గాంధారి కోడండ్రు+ఎల్లను= గాంధారీదేవికోడ ళ్ళందరూ; విస్మితలు+అయి= ఆశ్చర్యపడినవాళ్ళయి.

**తాత్పర్యం:** హస్తినాపురంలో - దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలైన నూర్గురు కొడుకులతో, భీష్మ, శల్య, శకుని, సైంధవ, కర్ణ, కృప, ద్రోణ, అశ్వత్థామ, సోమదత్తులతో కూడి ఉన్న ధృతరాష్ట్రునికి, భానుమతిమొదలయిన కోడళ్ళతోకూడి, నక్షత్రాల మధ్య రోహిణిలా ఉన్న గాంధారీదేవికి, కురుకులంలోని పెద్దలకు ధర్మరాజు తమ్ముళ్ళతో గూడి ఎంతోవినయంగా నమస్కరించాడు. అప్పుడు ద్రౌపది కూడ గాంధారిదేవికి మ్రొక్కగా, ఆమె అందాన్ని చూచి గాంధారి కోడ ళ్ళందరూ ఆశ్చర్యపడ్డారు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. 'అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుఁడు । మెలఁతగా దీనియందు నిర్మించె నొక్కొ!**
**కానినాఁ డిట్టి కాంతి యే కాంతలందు । నేల లే?'దని సామర్షహృదయ లయిరి. 160**

**ప్రతిపదార్థం:** అబ్జభవుఁడు= పద్మంనుండి పుట్టినవాడు - బ్రహ్మదేవుడు; అఖిల, లావణ్య, పుంజంబున్= సమస్త సౌందర్య కాంతి సమూహాన్ని; మెలఁతగా= స్త్రీగా; దీని+అందున్= ఈ ద్రౌపదిపట్ల; నిర్మించెన్+ఒక్కొ= నిర్మించాడోగదా! కాని, నాఁడు= అలాకానప్పుడు; ఇట్టి, కాంతి; ఏకాంతల+అందున్= ఏ స్త్రీలలోకూడ; ఏలన్= ఎందుచేత; లేదు+అని; స+అమర్ష, హృదయలు= అసూయతో కూడిన మనస్సు కలవాళ్ళు; అయిరి.

**తాత్పర్యం:** 'బ్రహ్మదేవుడు సమస్తసౌందర్యకాంతిసమూహాన్ని ఈ ద్రౌపదీకాంతగా నిర్మించిన ట్లున్నాడు. అందువల్లనే కాబోలు! ఇంతటికాంతి ఏ యితరకాంతల్లోనూ కానరాదు' అని వాళ్ళంతా అసూయ చెందారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. సాటి స్త్రీలే అసూయపడేటంత లావణ్యవతి ద్రౌపది. (ఈ పద్యంలోని వ్యంగ్యవైభవాన్నిగురించి విశ్వనాథ సత్యనారాయణగారు చేసినవ్యాఖ్యను పీఠికలో గమనించవచ్చు.)

**వ. ఇట్లు పాండవ కౌరవు లతిప్రణయగౌరవంబున నద్దివసంబు సలిపి రంతఁ బ్రభాతంబ. 161**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవ, కౌరవులు; అతి, ప్రణయ, గౌరవంబునన్= మిక్కిలి ప్రేమాతిశయంతో; ఆ+దివసంబు= ఆ రోజు; సలిపిరి= గడిపారు; అంతన్; ప్రభాతంబు+అ= ఉదయాన్నే.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవకౌరవులు ఎంతో ప్రేమాదరాలతో ఆరోజంతా గడిపారు. మరునాటి ఉదయం.

**ఉ. ఆ ధృతరాష్ట్రుచేసిన యనర్ఘమణిప్రకరానుబద్ధ శో**
**భాధృతి నొప్పుచున్న సభ పార్థివముఖ్యుఁడు ధర్మజుండు దు**
**ర్యోధనుఁ డర్థిఁ జూపఁగ సహోదరవీరులుఁ దానుఁ జూచి ల**
**క్ష్మీధరమూర్తి యెంతయును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్. 162**

**ప్రతిపదార్థం:** ఆ, ధృతరాష్ట్రు, చేసిన= ఆ ధృతరాష్ట్రమహారాజు నిర్మించిన; అనర్ఘ, మణి, ప్రకర+అనుబద్ధ, శోభా, ధృతిన్= వెలలేనిమణులసమూహంతో కూర్చబడిన శోభను ధరించటంచేత; ఒప్పుచున్+ఉన్న= అందంగా ఉండే; సభన్= సభను; దుర్యోధనుఁడు; అర్థిన్= వేడ్కతో; చూపఁగన్; పార్థివ, ముఖ్యుఁడు= రాజులలో ప్రముఖు డైనవాడు; ధర్మజుండు; తానున్; సహోదర, వీరులు= వీరులైనతమ్ములు; చూచి; లక్ష్మీధరమూర్తి= లక్ష్మిని ధరించిన విష్ణుమూర్తివంటి ధర్మరాజు (నాఽవిష్ణుః పృథివీపతిః - అని గదా ఆర్యోక్తి. అందుచేత పృథ్వీపతి అయిన ధర్మరాజు లక్ష్మీధరమూర్తియే), తత్+విభూతికిన్= ఆ సభాభవనవైభవానికి; మనంబునన్= మనస్సులో; ఎంతయును= మిక్కిలి; మెచ్చెన్.

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్రమహారాజు నిర్మించింది, అమూల్య మణిసమూహశోభతో ప్రకాశించేది - అయిన సభను దుర్యోధనుడు ప్రీతితో చూపించగా, రాజుల్లో ప్రముఖుడైన ధర్మరాజు, వీరులైన తమ్ముళ్ళతో కలిసి ఆ సభావైభవాన్ని చూచాడు. మనస్సులో ఎంతో మెచ్చుకొన్నాడు.

**వ. అయ్యపూర్వసభామణి కుట్టిమంబున నందఱు సుఖాసీనులయి యిష్టసంభాషణాది క్రీడావసరంబున నున్నంత దుర్యోధనుండు యుధిష్ఠిరున కి ట్లనియె. 163**

**ప్రతిపదార్థం:** ఆ+అపూర్వ, సభా, మణి, కుట్టిమంబునన్= ఆ అపురూపమైన సభలో మణులతో నిర్మించబడిన తిన్నెమీద; అందరు; సుఖ+ఆసీనులు+అయి= సుఖంగా కూర్చుండి; ఇష్ట, సంభాషణ+ఆది, క్రీడా+అవసరంబునన్+ఉన్నంతన్= ఇష్టమైన సంభాషణలు మొదలయిన వినోదాలతో ఉన్న సమయాన; దుర్యోధనుండు; యుధిష్ఠిరునకున్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ అపురూపమైన సభలో, మణులతో నిర్మించిన వేదికమీద, అందరు సుఖంగా కూర్చుండి, సరస సల్లాపాది వినోదాలతో ఉన్న సమయాన దుర్యోధనుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**క. అనఘ! సుహృద్ద్యూతం బిం । దొనరింతము ప్రొద్దుపోకయును నగు, జూదం**
**బునకుం బ్రియుఁడవు దక్షుఁడ । వన వింటిమి నిన్నుఁ బ్రీతి నక్షజ్ఞులచేన్. 164**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపరహితుడా! ధర్మరాజా!; సుహృత్+ద్యూతంబు= స్నేహంగా ఆడుకొనే జూదం; ఇందున్= ఇక్కడ; ఒనరింతము= ఆడుదాము; ప్రొద్దు, పోకయును+అగున్= కాలక్షేపం జరుగుతుంది; నిన్నున్; ప్రీతిన్= ప్రియమార; అక్షజ్ఞులచేన్= పాచికలాడటం బాగా తెలిసినవాళ్ళచేత; జూదంబునకున్; ప్రియుఁడవు; దక్షుఁడవు= నేర్పరివి; అనన్= అని అనగా; వింటిము= విన్నాము.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ధర్మరాజా! ఇక్కడ స్నేహంగా జూదం ఆడుకొందాం. కాలక్షేపం అవుతుంది. పాచికలాడటం బాగా తెలిసినవాళ్ళు- నీవు జూదంలో ఆసక్తి గలవాడి వని, సమర్థుడి వని చెప్పితే విన్నాం.

**వ. అనిన వానికి ధర్మతనయుం డి ట్లనియె. 165**

**తాత్పర్యం:** అనగా దుర్యోధనునితో ధర్మరాజు ఇలా అన్నాడు.

**తే.** **క్షత్రనీతిక్రమంబులు గావు సూవె । నికృతియును జూదమును; ధర్మనిత్యులైన**
**వారి కీ రెండు వర్జింపవలయు నెందుఁ; । బాపవృత్తంబు జూదంబు పార్థివులకు. 166**

**ప్రతిపదార్థం:** నికృతియును= మోసం; జూదమును; క్షత్ర, నీతి, క్రమంబులు, కావు= క్షత్రియధర్మానికి తగినవికావు; సూవె= సుమా!; ధర్మనిత్యులు+ఐనవారికిన్= ధర్మాన్ని ఎల్లప్పుడూ ఆచరించేవారికి; ఈ, రెండున్; ఎందున్= ఎచ్చటైనా; వర్జింపవలయున్= విడవాలి; పార్థివులకున్= రాజులకు; జూదంబు; పాప, వృత్తంబు= పాపపుపని.

**తాత్పర్యం:** మోసం, జూదం- క్షత్రియధర్మానికి తగినవి కావు సుమా! ఎప్పుడూ ధర్మాన్ని ఆచరించేవాళ్ళు ఈ రెంటిని వదలివెయ్యాలి. రాజులు జూదమాడటం పాపపు పని.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ధర్మరాజు ఆవులిస్తే ప్రేవులు లెక్కపెట్టగలవాడు. ధర్మరాజు జూదంలో ఆసక్తి కలవాడనీ, అందులో సమర్థుడనీ, 'అక్షజ్ఞుల' వలన విన్నాడట దుర్యోధనుడు. ఆ మాట వినగానే ధర్మజునికి తెలిసిందేమో- ఆ బుద్ధి దుర్యోధనుడి బుర్రలో పుట్టింది కా దని, అక్షవిద్య తెలిసిన శకుని దుష్ట చింతన అని. పైగా దుర్యోధనుడు అక్షవిద్యలో నిపుణుడు కాడు. శకుని మోసగాడు. అతని వ్యూహం సుహృద్ద్యూతం. అందుకే ధర్మరాజు ధర్మనిరతులైన క్షత్రియులు జూదం ఆడకూడ దన్నాడు. ఇది వ్యంగ్యంగా దుర్యోధనునికి ఎత్తిపొడుపు. అంతేకాక, జూదంవల్ల పార్థివులు పాపవృత్తులై చెడిపోతా రనటంలో శకునిమాటలు విని చెడిపోకు మన్న హెచ్చరిక కూడా ఉంది. (సంపా.)

**ఆ.** **కుటిలమార్గు లయిన కుత్సితకితవుల । తోడఁ గడఁగి జూదమాడఁ జనదు;**
**దానఁజేసి యర్థధర్మవివర్జితు । లగుదు రెట్టివారు జగములోన. 167**

**ప్రతిపదార్థం:** కుటిల, మార్గులు+అయిన= మోసపుమార్గాలు అవలంబించేవాళ్ళయిన; కుత్సిత, కితవులతోడన్= నీచపు జూదగాండ్రతో; కడఁగి పూనుకొని; జూదము; ఆడన్+చనదు= ఆడకూడదు; దానన్+చేసి= దానివల్ల; జగములోనన్= ప్రపంచంలో; ఎట్టివారు= ఎటువంటివాళ్ళయినా; అర్థధర్మవివర్జితులు= ధనాన్ని, ధర్మాన్ని కోల్పోయినవాళ్ళు; అగుదురు.

**తాత్పర్యం:** మోసపు మార్గాలు అనుసరించే నీచపు జూదగాళ్ళతో జూదమాడకూడదు. దానివల్ల లోకంలో ఎటువంటి వాళ్ళయినా ధనాన్ని, ధర్మాన్ని కోల్పోతారు.

**విశేషం:** నన్నయభట్టారకుని నానారుచిరార్థ సూక్తినిధిత్వానికి పై పద్యాలు రెండూ చక్కని ఉదాహరణలే. లోకంలో ద్యూతవ్యసన పరులకు కనువిప్పు కలిగించే గొప్ప హెచ్చరికలే. కుటిలమతులు, కుత్సితబుద్ధులు అయిన జూదగాళ్ళతో జూదమాడటంవల్ల అర్థం, ధర్మం రెండూ దూరమౌతాయి అన్నమాటల్లో ఆ లక్షణాలు గల జూదగాడు శకుని అని, దుర్యోధనునిది దుష్టవ్యూహ మని, మోసగాళ్ళతో జూదమాడితే ధనం, ధర్మం రెండూ కోల్పోయే ప్రమాదం ఉం దని ధర్మరాజు గ్రహించకపోలే దని ధ్వనిస్తూ ఉంది. చిత్ర మేమంటే - ఇంత తెలిసి, ఇన్ని ధర్మాలు చెప్పి ధర్మరాజు చివరకు జూదమాడాడు. ఎన్నో కష్టాలు అనుభవించాడు. అతని ద్యూతవ్యసనం అంతబలీయం.

**వ.** **'మఱియు మాయాద్యూతంబున జయించుట మహాపాతకం బనియును, ధర్మద్యూతంబున జయించుట ధర్మయుద్ధంబున జయించు నంతియ పుణ్యం బనియును నసితుండయిన దేవలుండు చెప్పె' ననిన నయ్యుధిష్ఠిరునకు శకుని యి ట్లనియె. 168**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతేకాక, మాయాద్యూతంబునన్= కపటపుజూదంలో; జయించుట= గెలవటం; మహాపాతకంబు= మిక్కిలి పాపం; అనియును; ధర్మ, ద్యూతంబునన్= ధర్మంగా ఆడిన జూదంవల్ల; జయించుట; ధర్మ, యుద్ధంబునన్= ధర్మంగా చేసిన యుద్ధంలో; జయించు, అంతియ= గెలిచేటంతటి; పుణ్యంబు; అనియును; అసితుండు; అయిన; దేవలుండు; చెప్పెన్; అనినన్; ఆ+యుధిష్ఠిరునకున్; శకుని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అంతేకాక, కపటపు జూదంలో గెలవటం మహాపాప మని, ధర్మంగా ఆడిన జూదంలో గెలవటం ధర్మంగా చేసినయుద్ధంలో గెలిచినంత పుణ్య మని అసితుడయిన దేవలుడు చెప్పాడు' అని ధర్మరాజు అనగా అతనితో శకుని ఇలా అన్నాడు.

**విశేషం:** అసితదేవలుడు పితృలోకంలో వ్యాసుని ఆదేశానుసారం భారతాన్ని ప్రచారం చేసిన ఋషీశ్వరుడు. (ధర్మరాజు మాయాద్యూతం మహాపాప మనీ, ధర్మద్యూతం పుణ్యప్రద మనీ ఒక నీతివిశేషం చెప్పాడు. దుర్యోధనుడు పైకి అంటున్నది సుహృద్ద్యూతమైనా, అసలు జరుగబోయేది మాయాద్యూత మని ధర్మజునివాక్యాల్లో ధ్వని, భావికథార్థం భావించి వ్యంగ్యంగా మందలిస్తున్న ధర్మరాజుతో దుర్యోధనుడు మారు మాటాడలేక పోయాడు. పైమాట లన్నీ శకునికి తగిలాయి. ధర్మరాజు తగలాలనే మాట్లాడాడు. అందువల్ల భుజాలు తడువుకుంటూ శకుని బదులుచెప్పాడు. ధర్మరాజు మాట లనే గాలం వేసి, శకుని కుతంత్రాన్ని బైటకు లాగాడు. - సంపా.)

**క. ద్యూతకళాకుశలుండగు । నాతఁడు లోకజ్ఞుఁడును మహామతియును వి**
**ఖ్యాతుఁడు నగు సత్క్షత్రియ । నీతి విదుఁడు దగునె దాని నిందింపంగన్. 169**

**ప్రతిపదార్థం:** ద్యూత, కళా, కుశలుండు+అగు, ఆతఁడు= ద్యూతకళలో నేర్పరి అయినవాడు; లోకజ్ఞుఁడును= లోకజ్ఞానం కలవాడు; మహామతియును= గొప్పమేధావి; విఖ్యాతుఁడున్= ఎంతో పేరు గలవాడు; అగున్; సత్+క్షత్రియ, నీతి, విదుఁడు= ఉత్తమరాజనీతి చక్కగా తెలిసినవాడు; దానిన్= జూదాన్ని; నిందింపంగన్; తగునె= ఒప్పునా? (తగదని భావం).

**తాత్పర్యం:** జూదమాడే కళలో నేర్పరి, లోకజ్ఞానం కలవాడు, గొప్పమేధావి, కీర్తిమంతుడు, ఉత్తమరాజనీతి చక్కగా తెలిసినవాడు ఆ జూదాన్ని నిందించటం తగునా?

**విశేషం:** శకుని ధర్మరాజును పొగడ్తలతో ఉబ్బించటం జూదం ఊబిలో దించటానికే. శకుని సామాన్యుడా! ధర్మరాజు ద్యూతవ్యసనం ఎంత బలియమో అతనికి తెలుసు. ఇంతదూరం ధర్మరాజు వచ్చింది జూదం ఆడటానికే కదా. అయితే ధర్మపన్నాలు వల్లిస్తున్నాడు. అంతే. అతనికి పూనకం తెప్పిస్తే చాలు. జూదంలో పడిపోతాడు. అందుకే ఈ ప్రశంస.

**క. బలహీను లయిన వారలు । బలవంతుల నొడుచునపుడు బహుమాయల న**
**చ్ఛలమునఁ జేయుట యెందును । గలయదియ; జయంబ కాదె కర్తవ్య మిలన్. 170**

**ప్రతిపదార్థం:** బలహీనులు+అయిన, వారలు; బలవంతులన్; ఒడుచునపుడు= ఓడించేటప్పుడు; బహుమాయలన్= పెక్కుమోసాలను; అచ్ఛలమునన్= పూనికతో; చేయుట; ఎందును= ఎచ్చటైనా; కల, అది+అ= ఉన్నదేకదా!; జయంబు+అ, కాదె= జయమేకదా!; ఇలన్= భూమిమీద; కర్తవ్యము= చేయదగింది.

**తాత్పర్యం:** బలహీనులైనవాళ్ళు బలవంతులను ఓడించేటప్పుడు పెక్కుమోసాలకు పూనుకోవటం ఎక్కడైనా ఉన్నదేకదా! లోకంలో ఏ విధంగానైనా జయాన్ని సాధించటమే కదా చెయ్యదగిన పని.

**విశేషం:** ధర్మజుడు ద్యూతంలో మోసాన్ని నిందించాడు. అది శకునికి గట్టిగా తగిలే ఎత్తిపొడుపే. పైగా శకుని జూదంలో ధర్మరాజును మోసం చెయ్యాలన్న సంకల్పంతోనే ఉన్నాడు. అందుకే ధర్మరాజు ఎత్తిపొడుపును త్రిప్పికొట్టటానికి, మున్ముందు తాను చెయ్యబోయే మోసాన్ని సమర్థించుకోటానికి ఇలా అన్నాడు. మోసానికి నీతి ముసుగు తొడిగాడు. శుక్రనీతిని పేరు చెప్పకుండ పేర్కొన్నాడు. జరాసంధవధలో మీరు చేసింది ఇదే కాదా - అని ధ్వనింపచేశాడు.

**వ. 'జూదంబున కీ వోడుదేని యుడుగు' మనిన నాతనికి ధర్మరా జి ట్లనియె. 171**

**ప్రతిపదార్థం:** జూదంబునకున్; ఈవు; ఓడుదు+ఏనిన్= భయపడేటట్లయితే; ఉడుగుము= మానుకొమ్ము; అనినన్; ఆతనికిన్; ధర్మరాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'జూద మాడటానికి నీవు భయపడితే మానుకో' - అని అనగా - శకునితో ధర్మరాజు ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** చివరకు శకుని ధర్మరాజు అభిమానాన్ని రెచ్చగొట్టి అతణ్ణి జూదానికి దించాడు.

### ధర్మరాజు శకునితో జూదం బాడుట (సం. 2-53-13)

**క. 'బలవద్ద్యూతార్థముగాఁ । బిలువంబడి మగుడ నగునె? పెక్కులు పలుకుల్**
**పలుకంగ నేల?' యని య । త్యలఘుఁడు ధర్మజుఁడు జూద మాడఁ గడంగెన్. 172**

**ప్రతిపదార్థం:** బలవత్+ద్యూత+అర్థంబుగాన్= బలవంతంగా జూదానికి; పిలువంబడి; మగుడన్+అగునె= వెనుదిరిగి వెళ్ళదగునా?; పెక్కులు, పలుకుల్= అనేకములైన మాటలు; పలుకంగన్+ఏల= మాట్లాడటం ఎందుకు? అని; అతి+ అలఘుఁడు= మిక్కిలి గొప్పవాడు; ధర్మజుఁడు; జూదము; ఆడన్= ఆడటానికి; కడంగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** బలవంతంగా జూదానికి పిలువబడి వెనుదిరిగి వెళ్ళటమా? ఎక్కువ మాట్లాడటం ఎందుకు? అని ఆ ధర్మరాజు జూదానికి పూనుకొన్నాడు.

**వ. ఇట్లు జూదంబున నయ్యేడు దోసం బెఱింగియు దైవానుశాసనంబున ధర్మజుండు దాని కభిముఖుండయి చందన కర్పూర కస్తూరీ పరిషిక్తంబయిన ద్యూతరంగంబునందు ముందఱ గంధపుష్పార్చితంబు లయిన యభిమతాక్షంబు లమర్చికొనియున్న సౌబల వివింశతి చిత్రసేన వికర్ణులం జూచి 'వీరిలో నెవ్వఁడు నాతో జూదం బాడెడు వాఁ?'డనిన నాతనికి దుర్యోధనుం డి ట్లనియె. 173**

**ప్రతిపదార్థం:** ఇట్లు; జూదంబున్= జూదమాడటంచేత; అయ్యేడు= కలిగే; దోసంబు; ఎఱింగియున్= తెలిసికూడా; దైవ+ అనుశాసనంబునన్= దైవాజ్ఞచేత; ధర్మజుండు; దానికిన్= ఆ జూదానికి; అభిముఖుండు+అయి= ఇష్టపడినవాడై; చందన, కర్పూర, కస్తూరీ, పరిషిక్తంబు+అయిన= మంచిగంధం, కర్పూరం, కస్తూరి కలిసిన నీటిచేత చుట్టును తడుపబడిన; ద్యూత, రంగంబు+అందున్= జూదమాడేస్థలంలో; ముందఱ; గంధ, పుష్ప+అర్చితంబులు+అయిన= గంధంచేత, పూలచేత పూజింపబడినవైన; అభిమత+అక్షంబులు= ఇష్టమైన పాచికలు; అమర్చికొని= ఏర్పాటు చేసుకొని; ఉన్న; సౌబల, వివింశతి, చిత్రసేన వికర్ణులన్= శకుని, వివింశతి, చిత్రసేనుడు, వికర్ణుడు అనేవాళ్ళను; చూచి; వీరిలోన్; ఎవ్వడు; నాతోన్; జూదంబు; ఆడెడువాడు; అనినన్; ఆతనికిన్= ధర్మరాజుకు; దుర్యోధనుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** జూదమాడటం తప్పని తెలిసికూడా, దైవనిర్ణయానుసారం ధర్మరాజు అందుకు అంగీకరించాడు. చుట్టూ మంచిగంధం, కర్పూరం, కస్తూరి, కలిపిన నీళ్ళు చల్లిన జూదమాడే స్థలంలో, గంధంచేత, పూలచేత పూజించబడిన పాచికలు అమర్చుకొని కూర్చున్న శకునిని, వివింశతిని, చిత్రసేనుణ్ణి, వికర్ణుణ్ణి చూచి 'వీరిలో ఎవడు నాతో జూదమాడే వా' డనగా అతనితో దుర్యోధనుడు ఇలా అన్నాడు.

**తే.** **అనఘ! మా మామ శకుని నాకై కడంగి । జూదమాడెడి నీతోడఁ; గాదు నాక**
**యీతఁ డొడ్డిన ధనరాసు లెవ్వియైనఁ । బోఁడిగా నీకు నీఁగలవాఁడ నేను.** **174**

**ప్రతిపదార్థం:** అనఘ= పాపరహితుడా! ధర్మరాజా!; శకుని; నాకై= నాకొరకు; కడంగి= పూని, నీతోడన్; జూదము+ఆడెడిన్; కాదు, నాక= కాదని అనకుండ; ఈతఁడు; ఒడ్డిన; ధన, రాసులు; ఎవ్వి+ఐనన్; పోఁడిగాన్= ఒప్పుగా; నేను; నీకున్; ఈన్+కలవాఁడన్= ఈయగలవాడిని.

**తాత్పర్యం:** పుణ్యాత్మా! ఓ ధర్మరాజా! నా పక్షాన శకుని నీతో జూదమాడతాడు. కాదని అనకుండా- ఇతడు ఒడ్డిన ధనరాసులు ఏవైనా సరే- నీకిస్తా.

**వ.** **అని తనచేతి యనర్ఘ రత్న కటకంబు లొడ్డిన, 'నన్యులకయి యన్యులు జూదం బాడుట యెంతయు విషమం' బనుచు ధర్మతనయుండు సాగరావర్త సంభవంబులయిన పరార్థ్యమణిహారంబు లొడ్డె; నిట్లు సుహృద్ద్యూతంబు ప్రవర్తిల్లు నదియైన నచ్చోటికి వచ్చి భీష్మ ధృతరాష్ట్ర విదురకృపద్రోణాశ్వత్థామలు విచిత్రోచ్చాసనస్థు లయి దానిం జూచుచు నప్రహృష్టహృదయు లయి యుండి రంత.** **175**

**ప్రతిపదార్థం:** అని; తన, చేతి; అనర్ఘ; రత్న, కటకంబులు= వెలకట్ట సాధ్యంగాని రత్నాలతో చేయబడిన కంకణాలు; ఒడ్డినన్; అన్యులకున్+అయి= ఇతరులకై; అన్యులు= ఇతరులు; జూదంబు+ఆడుట; ఎంతయున్= మిక్కిలి; విషమంబు= అక్రమం; అనుచున్; ధర్మతనయుండు; సాగర+ఆవర్త, సంభవంబులు+అయిన= సముద్రపు సుడులలో పుట్టిన; పరార్థ్య, మణి, హారంబులు= శ్రేష్ఠాలైన మణులతో చేయబడిన హారాలు; ఒడ్డెన్; ఇట్లు; సుహృత్+ద్యూతంబు= స్నేహంగా ఆడుకొనే జూదం; ప్రవర్తిల్లునది+ఐనన్= నడిచేది కాగా; ఆ+చోటికిన్; వచ్చి; భీష్మ, ధృతరాష్ట్ర, విదుర, కృప, ద్రోణ+అశ్వత్థామలు; విచిత్ర+ఉచ్చ+ఆసనస్థులు+అయి= విచిత్రాలై ఎత్తైన పీఠాలమీద కూర్చుండి; దానిన్= ఆ జూదాన్ని; చూచుచున్; అప్రహృష్ట, హృదయులు+అయి= సంతోషం లేని మనస్సు కలవాళ్ళయి; ఉండిరి; అంతన్.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడు అమూల్యరత్నాలతో చేసిన తనకంకణాలను ఒడ్డగా, ఒకరికై మరొకరు జూదమాడటం అక్రమ మని అంటూ ధర్మరాజు సముద్రపు సుళ్ళలో ఉద్భవించిన ఉత్తమ మణులతో చేసిన హారాలను ఒడ్డాడు. ఈవిధంగా స్నేహభావంతో జూదం నడుస్తుండగా, అక్కడికి భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాశ్వత్థామలు వచ్చి, ఎత్తైన పీఠాలమీద కూర్చుండి, సంతోషం లేనిమనస్సుతో ఆ జూదాన్ని చూస్తూ ఉన్నారు.

**విశేషం:** ఒకరికై మరొకరు జూదమాడటం అక్రమం అనే ధర్మరాజు ఆ జూదంలో ఎందుకు పాల్గొనాలి? వ్యక్తి స్వభావంలో వ్యసనం ఎంతో బలీయం. అందుచేతనే అంతటి ధర్మరాజుకూడ-అందరికీ తెలియటానికి అది అక్రమం అని అన్నారు కాని-ఆటమాత్రం తాను మానలేదు.

**తే. అభిమతాక్షముల్ దొల్చి మాయావిదుండు । సుబలరాజాత్మజుఁడు ధర్మసుతు జయించె;**
**నొడుతు నే నింక నని వెండియును గడంగె । శకునితో జూదమాడ నా శశికులుండు. 176**

**ప్రతిపదార్థం:** అభిమత+అక్షముల్= తన కిష్టమైన పాచికలు; దొల్చి= యుక్తిగా దొర్లించి; మాయావిదుండు= మోసంచేయటం ఎరిగినవాడు; సుబలరాజ+ఆత్మజుఁడు= సుబలుడనే రాజుయొక్క కుమారుడు-శకుని; ధర్మసుతున్= ధర్మరాజును; జయించెన్; ఆ, శశి, కులుండు= ఆ చంద్ర వంశం వాడైన ధర్మరాజు; ఏను= నేను; ఇంకన్; ఒడుతున్= ఓడిస్తాను; అని; శకునితో; వెండియును= మరల; జూదము; ఆడన్; కడంగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** తన కిష్టమైన పాచికలు రూపొందించుకొని మోసగా డైన శకుని ధర్మరాజును జయించాడు. ఆ చంద్ర వంశంవాడైన ధర్మరాజు 'నే నింక నిన్ను ఓడిస్తాను' అని శకునితో మళ్ళీ జూదం ఆడటానికి పూనుకొన్నాడు.

**వ. ఇట్లు యుధిష్ఠిరుండు బద్ధమత్సరుండయి పెఱిఁగి యొండొండ యొడ్డుచు నిష్కసహస్రభరితానేకాయుత కుండమండితంబు లయిన సువర్ణభాండాగారంబులును, వజ్రవైదూర్యమరకతమౌక్తికనీలప్రవాళ పద్మరాగాది వివిధ శుద్ధ విపుల రత్న పరిపూర్ణంబు లైన రత్నభాండాగారంబులుం, బ్రత్యేకంబ పంచద్రోణ కాంచన సంచితంబు లయిన చతుశ్శతనిధులును, మణికింకిణీ జాలాలంకృతంబు లయిన యసంఖ్యాత హయ యూధంబులును, జాతరూప వరూధంబులుం గనక కక్ష్యాకుథ సనాథంబు లయిన మదాంధ గంధ సింధుర సందోహంబులుం, బరార్థ్య రత్న భూషణ భూషితంబు లయిన యోషిత్సహస్రంబులును, ననుదినాతిథి జన భోజనపాత్రహస్తులయిన శతసహస్రపరిచారకులును, నర్జుననకుఁ జిత్రరథుం డిచ్చిన గంధర్వ హయంబులం దొట్టి దుగ్ధపానశాలి తండుల ఖాదనంబులం బెరుఁగుచున్న జాత్యశ్వానేకాయుతంబులు, నజావి గో మహిష ఖర రాసభ నివహంబులు నొక్కొక్క యొడ్డునన యొడ్డి యోటుపడినం జూచి విదురుండు ధృతరాష్ట్రునకు రహస్యంబున ని ట్లనియె. 177**

**ప్రతిపదార్థం:** ఇట్లు; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; బద్ధ, మత్సరుండు+అయి= క్రోధంతో(అసూయతో) కూడుకొనిన వాడై; పెఱిఁగి= రెచ్చి; ఒండు+ఒండ= ఒకదానివెంట ఒకటి; ఒడ్డుచు; నిష్క, సహస్ర భరిత+అనేక+అయుత, కుండ, మండితంబులు+ అయిన= వేలకొలది వరహాలతో నిండి, పెక్కుపదివేల సంఖ్యలు గల కుండలతో అలంకరించబడినవైన; సువర్ణ భాండాగారంబులును= బంగారు బొక్కసాలును; వజ్రవైదూర్య, మరకత, మౌక్తిక, నీల, ప్రవాళ, పద్మరాగ+ఆది, వివిధ, శుద్ధ, విపుల, రత్న, పరిపూర్ణంబులు+ఐన= వజ్రాలు, వైదూర్యాలు, మరకతాలు, ముత్యాలు, ఇంద్రనీలాలు, పవడాలు, పద్మరాగాలు మొదలైన అనేకవిధాల- స్వచ్ఛాలు. విస్తారాలు అయిన రత్నాలతో నిండిన; రత్నభాండాగారంబులున్= రత్నాల కోశాలును; ప్రత్యేకంబు+అ= వేర్వేరుగా; పంచ, ద్రోణ, కాంచన, సంచితంబులు+అయిన= ఐదుతూముల బంగారు కూడబెట్టబడినవైన; చతుః+శత, నిధులును= నాలుగువందల నిధులను; మణి, కింకిణీ, జాల+అలంకృతంబులు+అయిన= మణుల చిరుగజ్జెల సమూహాలచేత అలంకరించబడిన వైన; అసంఖ్యాత, హయ, యూధంబులును= లెక్కలేనన్ని గుర్రాల సమూహాలును; జాతరూప, వరూధంబులున్= బంగారు కవచాలు కలవియు; కనక, కక్ష్యా, కుథ, సనాథంబులు+అయిన= బంగారుతో చేయబడిన (నడుముకు కట్టే) మోకులతో, (మీదపరిచే) చిత్రకంబళాలతో కూడుకొన్నవియు అయిన; మద+అంధ, గంధ, సింధుర, సందోహంబులున్= మదంచేత కన్నుగానని మదపుటేనుగుల సమూహాలును; పరార్థ్య, రత్న, భూషణ, భూషితంబులు+ అయిన= శ్రేష్ఠములైన రత్నాల సొమ్ములచే అలంకరించబడిన; యోషిత్+సహస్రంబులును= వేలకొలది స్త్రీలును; అనుదిన+ అతిథిజన, భోజన, పాత్ర, హస్తులు+అయిన, శత, సహస్ర, పరిచారకులును= ప్రతిదినం అతిథులైన జనులయొక్క భోజన

పాత్రలను హస్తాలలో కలవాళ్ళయిన నూరువేలమంది సేవకులును; అర్జుననకున్; చిత్రరథుండు= గంధర్వరాజైన చిత్రరథుడు; ఇచ్చిన; గంధర్వ, హయంబులన్+తొట్టి= గంధర్వజాతి గుర్రాలు మొదలుకొని; దుగ్ధపాన, శాలితండుల, ఖాదనంబులన్= పాలు త్రాగటంచేత, వరిబియ్యం తినటంచేత, పెరుగుతున్న; జాతి+అశ్వ+అనేక+అయుతంబులున్= మేలుజాతిగుర్రాలు పెక్కుపదివేల సంఖ్యలును; అజ+అవి, గో, మహిష, ఖర, రాసభ, నివహంబులున్= మేకల, గొఱ్ఱెల, గోవుల, గేదెల, గాడిదల, కంచర గాడిదల సమూహాలును; ఒక్కొక్క; ఒడ్డునన= ఒడ్డనంలో; ఒడ్డి; ఓటుపడినన్= ఓడిపోగా; చూచి; విదురుండు; ధృతరాష్ట్రునకున్; రహస్యంబునన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు క్రోధంతో పెచ్చుపెరిగి ఒకదాని వెంట ఒకటి ఒడ్డుతూ - వేలకొలది వరహాలతో నిండి పదివేల సంఖ్యలు గల పెక్కు కుండలతో ఒప్పుతున్న బంగారు భాండాగారాలను, వజ్ర వైదూర్యమరకతాది పలువిధ స్వచ్ఛ విస్తార రత్నాలతో నిండిన రత్నభాండాగారాలను, ప్రత్యేకంగా ఐదుతూముల బంగారంతో కూడుకొన్న నాలుగువందలనిధులను, మణులసమూహాలతో, చిరుగజ్జెలసమూహాలతో అలంకరించబడిన లెక్కలేనన్ని గుర్రాల సమూహాలను, బంగారుకవచాలతో, నడుముకు కట్టే బంగారుమోకులతో, మీద పరిచే బంగారుచిత్రకంబళాలతో కూడుకొన్న మదపుటేనుగుల సమూహాలను, శ్రేష్ఠాలైన రత్నాల సొమ్ములతో అలంకరించబడిన వేలకొలది స్త్రీలను, ప్రతిదినం అతిథిజనుల భోజన పాత్రలను హస్తాల్లో ధరించిన నూరువేలమంది సేవకులను, అర్జునుడికి గంధర్వరాజు బహూకరించిన గంధర్వాశ్వాలు మొదలుకొని పాలు త్రాగటంచేత, వరిబియ్యం తినటంచేత పెరుగుతున్న పెక్కు పదివేల సంఖ్యల మేలుజాతిగుర్రాలను, మేకల, గుఱ్ఱాల, గోవుల, గేదెల, గాడిదల, కంచరగాడిదల సమూహాలను ఒక్కొక్క ఒడ్డన ఒడ్డి ఓడిపోవటం చూచి, విదురుడు ధృతరాష్ట్రునితో రహస్యంగా ఇలా అన్నాడు.

**క. ఖలుఁ డీ దుర్యోధనుఁ డె । గ్గులతోడన యుద్భవిల్లె; గోమాయురుతం**
**బులు వించె, దుర్నిమిత్తం । బులు పెక్కులు వుట్టె వీని పుట్టిన వేళన్. 178**

**ప్రతిపదార్థం:** ఖలుఁడు= దుర్మార్గుడు; ఈ; దుర్యోధనుఁడు; ఎగ్గులతోడన= దోషాలతోనే; ఉద్భవిల్లెన్= పుట్టినాడు; వీని, పుట్టిన, వేళన్= వీడు పుట్టిన సమయంలో; గోమాయు, రుతంబులు= నక్కల అరుపులు; వించెన్= వినిపించాయి; దుర్నిమిత్తంబులు= చెడ్డశకునాలు; పెక్కులు; పుట్టెన్.

**తాత్పర్యం:** దుర్మార్గుడైన దుర్యోధనుడు దోషాలతోనే జన్మించాడు. వీడు పుట్టినప్పుడు నక్కల అరుపులు వినబడ్డాయి. ఎన్నో చెడుశకునాలు పుట్టాయి.

**వ. తొల్లి యెన్నండును బాపంబుం బొరయని మహాభిష భీమసేన ప్రతీప శంతనుల కులంబు దుర్యోధనుకారణంబునం బాపభూయిష్ఠంబు గానున్నయది; యొక్కని కారణంబునఁ గులంబున కెగ్గగు నేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మం బని శుక్రుండు చెప్పెఁ; గులరక్షణార్థం బంధక యాదవ వృష్ణి వీరులు కృష్ణు నియోగించి కులదూషకుండైన కంసుని వధియించిరి గావున. 179**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; ఎన్నండును; పాపంబున్; పొరయని= పొందని; మహాభిష, భీమసేన, ప్రతీప, శంతనుల, కులంబు; దుర్యోధను కారణంబునన్= దుర్యోధనుని కారణంగా; పాప, భూయిష్ఠంబు= పాపంతో నిండింది; కాన్+ఉన్న, అది= కాబోతున్నది; ఒక్కని, కారణంబునన్= ఒక్కని కారణంగా; కులంబునకున్= వంశానికి; ఎగ్గు+అగున్+ఏనిన్= కీడు

కలిగితే, వానిన్, దూషించి= వాణ్ణి నిందించి; కులంబు= వంశాన్ని అంతటినీ; రక్షించుట; ధర్మంబు+అని; శుక్రుండు; చెప్పెన్, కుల, రక్షణ+అర్థంబు= వంశాన్ని రక్షించటంకొరకు, అంధక, యాదవ, వృష్ణి, వీరులు= అంధక, యాదవ, వృష్ణి వంశాలకు చెందిన వీరులు; కృష్ణున్; నియోగించి= పంపి(ప్రయోగించి); కుల, దూషకుండు+ఐన= కులానికి చెడ్డపేరు తెచ్చేవాడైన; కంసునిన్; వధియించిరి= చంపారు; కావునన్.

**తాత్పర్యం:** ఇదివరకు ఎప్పుడూ పాపం అంటని మహాభిష, భీమసేన, ప్రతీప, శంతనులదైన ఈ వంశం దుర్యోధనుని కారణంగా పాపంతో నిండబోతున్నది. ఒకడి కారణంగా వంశాని కంతటికి కీడు కలిగితే అతణ్ణి నిందించి వంశాన్ని రక్షించటం ధర్మమని శుక్రాచార్యుడు చెప్పాడు. వంశాన్ని రక్షించుకోవటానికై అంధక యాదవ వృష్ణి వీరులు, శ్రీకృష్ణుణ్ణి పంపి, కులానికి చెడ్డపేరు తెచ్చే కంసుణ్ణి వధించారు. అందుచేత

**విశేషం:** మహాభిషుడే బ్రహ్మశాపంచేత ప్రతీపమహారాజుకుమారుడైన శంతనుడుగా జన్మించాడు. భీమసేనుడు ప్రతీపుని తండ్రి, ఋక్షుని కుమారుడు.

**మత్తకోకిలము.**

> **వాసవాత్మజుఁ బంపు మిప్పడ వాఁడు ధర్మవిదుండు నీ**
> **శాసనంబున నిగ్రహించు విచారదూరు సుయోధనున్;**
> **భూసతీశ్వర! దీన నీకులమున్ మహీప్రజయున్ గత**
> **త్రాసవృత్తిసుఖంబు వొందుఁ; బ్రధానవిగ్రహ మేటికిన్?** **180**

**ప్రతిపదార్థం:** భూసతీ+ఈశ్వర!= భూమి అనే స్త్రీకి భర్త అయినవాడా! ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఇప్పుడు+అ= ఈ క్షణమే; వాసవ+ఆత్మజున్= దేవేంద్రుని కుమారుడైన అర్జునుణ్ణి; పంపుము; వాఁడు; ధర్మ, విదుండు= ధర్మం తెలిసినవాడు; నీ శాసనంబునన్= నీ ఆజ్ఞచేత; విచార దూరున్, సుయోధనున్= ఆలోచనకు దూరమైన వాడైన దుర్యోధనుణ్ణి; నిగ్రహించున్= ఆపివేస్తాడు; దీనన్= దీనివలన; నీకులమున్; మహీప్రజయున్= భూమిలోని ప్రజయు; గత, త్రాస, వృత్తిన్= తొలగిపోయిన భయంతో కూడిన నడవడికతో; సుఖంబు; పొందున్; ప్రధానవిగ్రహము= గొప్పయుద్ధం; ఏటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రమహారాజా! ఇప్పుడే దేవేంద్రుని తనయుడైన అర్జునుణ్ణి పంపించు. వాడు ధర్మం తెలిసినవాడు. నీ ఆజ్ఞతో వివేకంలేని ఆ దుర్యోధనుణ్ణి ఆపగలడు. దీనివల్ల నీ కులం, భూమిమీద ప్రజ- భయం తొలగి సుఖంగా జీవిస్తారు. పెద్దయుద్ధం ఎందుకు?

**విశేషం:** విదురుడి వాక్యవిన్యాసాన్ని చిత్రించిన ఈ పద్యంలో దీప్తరసత్వం, ఔజ్జ్వల్యం శోభించి కాంతిగుణాన్ని రూపొందించాయి. (సంపా.)

**ఉ.**
> **ఇమ్మనుజాధమున్ గుణవిహీను బహిష్కృతుఁ జేసి ధర్మమా**
> **ర్గమ్మునఁ గౌరవాన్వయముఁ గావుము; పాండుతనూజులం బ్రతా**
> **ప మ్మెసఁగంగ నేలు; మిది పథ్యము సు; మ్మొక నక్క నిచ్చి సిం**
> **హమ్ముల విల్చికో లుఁబదె? యన్యులె వారలు కౌరవేశ్వరా!** **181**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా!= ఓ ధృతరాష్ట్రమహారాజా! ఈ+మనుజ+అధమున్= ఈ నీచుడైన మానవుణ్ణి; గుణ, విహీనున్= మంచి గుణాలు లేనివాణ్ణి; బహిష్కృతున్+చేసి= వెలివేయబడినవాణ్ణిగా చేసి - అంటే త్రోసిపుచ్చి; ధర్మ, మార్గమ్మునన్; కౌరవ+అన్వయమున్= కౌరవవంశాన్ని; కావుము= రక్షించుము; పాండు, తనూజులన్= పాండురాజకుమారులను; ప్రతాపమ్ము; ఎసగంగన్= అతిశయించేటట్లు; ఏలుము= పాలించుము; ఇది; పథ్యము= అనుసరించదగినమార్గం; సుమ్ము= సుమా!; ఒక; నక్కను; ఇచ్చి; సింహమ్ములన్; విల్చికోలు= కొనటం; ఉఅదు+ఎ= మేలుకాదా!; వారలు= పాండవులు; అన్యులు+ఎ= పరాయివాళ్ళా?

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రమహారాజా! ఈ నీచమానవుడు, గుణవిహీనుడు అయిన దుర్యోధనుణ్ణి వెలివేసి, ధర్మమార్గాన కౌరవవంశాన్ని కాపాడు. పాండవుల ప్రతాపం పెంపొందేటట్లు పాలించు. ఇది నీకు అనుసరించదగిన మార్గం సుమా! ఒక నక్కను ఇచ్చి సింహాలను కొనటం మేలు గాదా? పాండవులుమాత్రం పరాయివాళ్ళా?

**విశేషం:** అలం: దృష్టాంతం. గుణం: కాంతి. విదురుడి వాక్యాలు లోతైనవి. దుర్యోధనుడి చర్యలవలన వంశాని కంతటికీ, ప్రజల కందరికీ కీడు కలుగుతుం దని అతడు పుట్టినప్పుడు కలిగిన దుశ్శకునాలే సూచించా యనీ, అవన్నీ ఈ మాయాద్యూతం కారణంగా నిజం కాబోతున్నా యనీ పూర్వాపర సమన్వయంతో రాబోయే విపత్తును సూచించాడు. ఒకడివలన వంశానికి ముప్పు వచ్చేటట్లుంటే అతడిని నిందించటం ధర్మ మని కర్తవ్యాన్ని నిర్దేశించాడు. అర్జునుడు అతడిని నిర్జించగల డని, కులాన్ని రక్షించగల డని సూచించాడు. స్వీయపుత్రుడిని దూషించి పాండుపుత్రులను రక్షించటం ధర్మం కా దని అనుకోవ ద్దన్నాడు. పాండవులను తనపుత్రులవలెనే భావించు మని హితవు చెప్పాడు. పాండవులను కాపాడటం వంశాన్ని కాపాడటంగా చెప్పాడు. లేకపోతే ఘోరయుద్ధం జరుగుతుం దని హెచ్చరించాడు. సరళమైన దృష్టాంతాన్ని చూపించాడు. కుటిలమైన నక్కను ఇచ్చి సింహాలను కొనటంవంటి దా కార్యమన్నాడు. (సంపా.)

**మధ్యాక్కర.**

> **అంగారములు గొనువేడ్కఁ బుష్పఫలావళీ లలిత**
> **తుంగద్రుమప్రకరంబుఁ గరుణావిదూరుఁడై కాల్చు**
> **నంగారకారుఁ బోలంగ సమకట్టె నర్థలోభంబు**
> **నం గురుకులహానికరుఁడు ధారుణీనాథ! నీ సుతుఁడు.** **182**

**ప్రతిపదార్థం:** ధారుణీ నాథ= ఓ ధృతరాష్ట్రమహారాజా!; కురుకులహానికరుఁడు= కురువంశానికి కీడు కలిగించేవాడు; నీ, సుతుఁడు= నీ కుమారుడు; అర్థ, లోభంబునన్= ధనంమీది అత్యాశతో; అంగారములు= బొగ్గులు; కొను= తీసుకొను; వేడ్కన్= కోర్కెతో; పుష్ప, ఫల+ఆవళీ, లలిత, తుంగ, ద్రుమ, ప్రకరంబున్= పూలు, పండ్ల సమూహంతో అందమైన ఎత్తయిన చెట్ల సమూహాన్ని; కరుణా, విదూరుడు+ఐ= దయలేనివాడై; కాల్చు; అంగారకారున్= బొగ్గులు చేసేవాణ్ణి; పోలంగన్= పోలేటట్లు; సమకట్టెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రమహారాజా! కురువంశానికి కీడు కలిగించే నీకుమారుడు, ధనంమీది అత్యాశతో-పూలతో, పండ్లతో నిండి కనుల పండువుగా ఉన్న ఎత్తైన చెట్ల సమూహాన్ని బొగ్గులకోసం కఠినాత్ముడై కాల్చటానికి పూనుకొన్న బొగ్గులవాడిలా ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. గుణం: కాంతి, నానారుచిరార్థసూక్తిరత్నాకరమైన నన్నయ కవితలో ఈ పద్య మొక మేలిమి రత్నం. అలంకారం వలన వస్తువు ధ్వనిస్తున్నది. మాయాద్యూతంలో పాండవసంపదను మోసంతో హరించటం ఎటువంటి చర్యయో ఇందులో చెప్పబడింది. పుష్పఫలాలతో కూడుకొన్న మహావృక్షాలను బొగ్గులకొరకు తగులబెట్టటంవలె ఉన్నదనటం విశేషం. దానికి కారణం ధనాశ. ఈ గుణం వంశనాశనకరుడికే కలుగుతుం దని సూచన. బొగ్గులవ్యాపారం చేసేవాడు బొగ్గులనే కోరుకొంటాడు. వంశనాశనం కోరుకొనేవాడు ఇక్కడ బొగ్గులుకోరేవాడు. పాండవులను సర్వనాశనం చేయటానికి తలపెట్టిన కపటద్యూతం అప్పుడు పాండవవృక్షదహనంగా భాసించటం సహజం. కాని, కురుక్షేత్రయుద్ధంలో ఏచెట్లు కాలిపోతాయో ఊహించుకొను మని ధ్వని. కౌరవులు తమ వంశాంకురాలుకూడా మిగలకుండ నశించిపోతారు. పాండవవృక్షాలను తగులబెట్టా లనుకొన్న దుర్యోధను డనేఅంగారకారుడు తన కుటుంబాన్నే కాల్చుకొంటాడని ధ్వని. (సంపా.)

**ఆ. అధికదర్పయుక్తమై బలీవర్దంబు । నగముదరి విదారణంబు సేయఁ**
**గాలుద్రవ్వునట్లు గడు బలాఢ్యులతోడ । నేచి వీఁడు విగ్రహింపఁ దొడఁగె. 183**

**ప్రతిపదార్థం:** అధిక, దర్ప, యుక్తము+ఐ= మిక్కిలి పొగరెక్కినదై; బలీవర్దంబు= ఎద్దు; నగము, దరిన్= కొండచరియను; విదారణంబు, చేయన్= చీల్చివేయటానికి; కాలుద్రవ్వునట్లు; వీఁడు= ఈ దుర్యోధనుడు; ఏచి= విజృంభించి; కడున్, బల+ఆఢ్యుల తోడన్= మిక్కిలి బలవంతులతో; విగ్రహింపన్= పోరుసలుపటానికి; తొడఁగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** ఎంతో పొగరెక్కిన ఎద్దు కొండచరియను చీల్చటానికి కాలుద్రవ్వినట్లు, ఈ దుర్యోధనుడు విజృంభించి మహాబలవంతులతో పోరు సలుపటానికి పూనుకొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. (జనజీవనంలోనుండి ఎన్నుకొన్న ఉపమానాలను సార్థకంగా వాడటం నన్నయ ఉపజ్ఞ. ఎద్దు మదించబట్టే ఎవరితో డీకొంటున్నదీ తెలియక కొండతో డీకొనటం. ఫలితం తల పగలటం. ఈ అర్థం అలంకారకృతవస్తుధ్వని. - సంపా.)

**వ. 'ఇంక నయిన నుపేక్షింపక యీ దుష్టద్యూతంబు వారింపు 'మనినఁ బుత్త్రస్నేహంబున నెద్దియుం జేయునది నేరక ధృతరాష్ట్రుండు మిన్నకుండె; నంత విదురుండు దుర్యోధనున కభిముఖుండై యి ట్లనియె. 184**

**ప్రతిపదార్థం:** ఇంకన్; అయినన్; ఉపేక్షింపక= అశ్రద్ధ చేయక; ఈ, దుష్ట, ద్యూతంబు= ఈ దుర్మార్గపు జూదం; వారింపుము= ఆపుము; అనినన్; పుత్త్రస్నేహంబునన్= పుత్రులమీది ప్రేమచేత; ఎద్దియున్= ఏదీ; చేయునది, నేరక= చేయటానికి తోచక; ధృతరాష్ట్రుండు; మిన్నక, ఉండెన్= ఊరకున్నాడు; అంతన్; విదురుండు; దుర్యోధనునకున్; అభిముఖుండు+ఐ= ఎదురు తిరిగిన ముఖం కలవాడై - అంటే దుర్యోధనునివైపు తిరిగి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఇంకా అశ్రద్ధ చెయ్యక ఈ దుర్మార్గపు జూదాన్ని ఆపు' అని అనగా పుత్రులమీది మమకారంతో ఏమీ చెయ్యటానికి తోచక ధృతరాష్ట్రుడు ఊరకున్నాడు. అప్పుడు విదురుడు దుర్యోధనుని వైపు తిరిగి ఇలా అన్నాడు.

**విశేషం:** విదురోపదేశాన్ని వినకుండ ధృతరాష్ట్రుడు ఉపేక్ష వహించాడు. ఇది మాయాద్యూతంకంటె మహాపకారం చేసింది కౌరవులకు. (సంపా.)

**క. న్యాయంబు విడిచి సౌబలు । మాయా ద్యూతమునఁ బాపమతివై భరతా**
**మ్నాయు లగు పాండవేయుల । శ్రీ యిమ్మెయిఁ గొనిన నిన్నుఁ జీ యనరె యొరుల్. 185**

**ప్రతిపదార్థం:** న్యాయంబు; విడిచి; సౌబలు= శకునియొక్క; మాయాద్యూతమునన్= కపటజూదంచేత; పాపమతివి+ఐ= చెడుబుద్ధి కలవాడవై; భరత+ఆమ్నాయులు+అగు= భరతుని సంప్రదాయానికి చెందిన వాళ్ళయిన - అంటే భరతవంశీయులయిన పాండవేయుల= పాండవులయొక్క; శ్రీ= సంపద; ఈ+మెయిన్= ఈ విధంగా; కొనిన= గ్రహించిన; నిన్నున్; ఒరుల్= ఇతరులు; ఛీ, అనరె= ఛీ అని అనరా?

**తాత్పర్యం:** న్యాయం వదలి, శకుని మాయాద్యూతంతో పాపబుద్ధి కలవాడివై, భరతవంశం వాళ్ళయిన పాండవుల సంపద ఈ విధంగా అపహరిస్తే ఇతరులు నిన్ను ఛీకొట్టరా?

**విశేషం:** ప్రజలు ఛీకొట్టే కారణాలు ఇందులో ఆరు చెప్పబడుతున్నాయి. 1. అన్యాయంగా మాయతో పాపబుద్ధితో పాండవసంపదను హరించటం. 2. పాండవులు భరతవంశంవారు కావటంచేత ధర్మాత్ములే కాక దాయాదులు, స్వీయవంశంవారే కావటం, దానివలన తమవారినే తాను నిలువుదోపిడీ చేసినట్లు కావటం. 3. అన్నదమ్ములను శత్రువులుగా భావించటం. 4. పాండవవినాశనం స్వీయవంశనాశనం కా దని అవివేకంగా భావించటం. 5. ఉత్తమవంశజులు ఆచరించవలసిన ఉదాత్తచర్య మాయాద్యూతం కాకపోవటం. 6. అపహరణభావం అధర్మమూలం కావటం. విదురుడి వివేకానికి ఈ హితవు విశిష్టతార్కాణం. (సంపా.)

**క. ధృతిమంతుల భుజవిక్రమ । జితశత్రులఁ బాండవేయసింహులను మదో**
**ద్ధతిమైఁ బరాజితులఁ జే । సితి; వారల కిట్లు నికృతి సేయుట లగ్గే? 186**

**ప్రతిపదార్థం:** ధృతిమంతులన్= ధైర్యవంతులను; భుజ, విక్రమ, జిత, శత్రులన్= భుజ పరాక్రమంచేత జయించిన శత్రువులు కలవారిని; పాండవేయ సింహులను= పాండవశ్రేష్ఠులను; మద+ఉద్ధతిమైన్= పెచ్చుపెరిగిన పొగరుతో; పరాజితులన్= ఓడిపోయినవారినిగా; చేసితి= చేసినావు; వారలకున్; ఇట్లు; నికృతి= మోసం; చేయుట; లగ్గు+ఏ= మంచిదా? (కాదని భావం).

**తాత్పర్యం:** ధైర్యవంతులు, భుజపరాక్రమంచేత శత్రువులను జయించినవాళ్ళు అయిన పాండవశ్రేష్ఠులను పెచ్చుపెరిగిన పొగరుతో జూదంలో ఓడిపోయేటట్లు చేశావు. వాళ్ళను ఇలా మోసం చెయ్యటం మంచిదా?

**విశేషం:** విదురుడు ఉపయోగించిన 'ధృతిమంతులు, భుజవిక్రమజితశత్రులు, పాండవేయసింహులు' అనే పదాలు మూడూ పాండవుల శక్తిసామర్థ్యాలను, రానున్న ప్రమాదాలను ధ్వనింపజేస్తున్నాయి. ఉత్తరపదంగా ఉండే సింహపదం సామాన్యంగా శ్రేష్ఠవాచకమే. కాని ఇక్కడ ఆ పదం ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది. ప్రమాద తీవ్రతను తెలియజేస్తున్నది. ఒకవేళ వంచించి కొట్టినా, సింహాన్ని దెబ్బకొట్టటం మంచిదా? ఆలోచించుకొమ్మనే భావాన్ని స్ఫురింపజేస్తున్నది.

**వ. అనిన విని విదురున కలిగి దుర్యోధనుం డి ట్లనియె. 187**

**తాత్పర్యం:** అనగా విని దుర్యోధనుడు కోపించి విదురుడితో ఇలా అన్నాడు.

**సీ. పరుల గుణంబులు పలుమాఱుఁ గీర్తింతు; । పక్షంబ పలుకుదు పాండవులకు;**
**ధార్తరాష్ట్రుల సంతతంబు నిందింతువు; । కుడిచిన చోటికిఁ గూర్చ వెపుడు;**
**నుత్సంగతలమున నుగ్రవిషోరగం । బున్నట్లు నీవు మా యొద్ద నునికి;**
**పరులసంపద సుఖోపాయబలంబునఁ । గొనుట భూపతులకు గుణము కాదె?**

**ఆ. యడుగకయును గర్జ మది యిష్టుఁడై చెప్పు । నతని కాడఁ దగిన యదియ; నన్ను**
**నిట్టు నట్టు ననఁగ నేల? నీ యిమ్ముల । నుండు; బుద్ధి సెప్పకుండు మాకు. 188**

**ప్రతిపదార్థం:** పరుల, గుణంబులు= శత్రువుల గుణాలనే; పలుమాఱున్= పెక్కుమారులు; కీర్తింతు= పొగుడుతావు; పాండవులకున్; పక్షంబు+అ= పక్షపాతంగానే; పలుకుదు= మాటాడతావు; ధార్తరాష్ట్రులన్= ధృతరాష్ట్రుని పుత్రులను; సంతతంబు= ఎల్లప్పుడు; నిందింతువు; కుడిచిన చోటికిన్= అన్నం తిన్న ఇంటికి; ఎపుడున్= ఎన్నడును; కూర్పవు= అనుకూలంగా ఉండవు; నీవు; మా, ఒద్దన్= మా దగ్గర; ఉనికి= ఉండటం; ఉత్సంగ, తలమునన్= ఒడిలో; ఉగ్ర విష+ఉరగంబు= భయంకరమైన విషసర్పం; ఉన్నట్లు; పరుల, సంపద= శత్రువుల ఐశ్వర్యం; సుఖ+ఉపాయ, బలంబునన్= సుఖమైన ఉపాయబలంచేత; కొనుట= తీసుకోవటం; భూపతులకున్= రాజులకు; గుణము, కాదె= స్వభావంకదా! ఇష్టుఁడు+ఐ= ఇష్టమైనవాడై - అంటే స్నేహితుడై; అడుగకయును= అడగకుండానే; కర్జము+అది= చేయదగినదాన్ని; చెప్పు, అతనికి= బోధించేవాడికి; ఆడన్, తగిన, అదియ= మాటాడదగిందే; నన్నున్; ఇట్టున్, అట్టున్, అనఁగన్= ఈవిధంగా చేసినావు, ఆవిధంగా చేసినావు అని తప్పులెన్నటం; ఏల= ఎందుకు? నీ, ఇమ్ములన్= నీ స్థానంలో; ఉండు=(నీవు) ఉండుము - అంటే నీ హద్దుల్లో నీవు ఉండుము; మాకున్; బుద్ధి; చెప్పక; ఉండు.

**తాత్పర్యం:** శత్రువుల గుణాలనే నీవు పలుమారు పొగడుతావు. పాండవ పక్షాననే పలుకుతావు. ధృతరాష్ట్రుని పుత్రులను ఎల్లప్పుడూ నిందిస్తావు. తిన్నయింటికి ఎన్నడూ అనుకూలంగా ఉండవు. నీవు మావద్ద ఉండటం ఒడిలో భయంకరమైన విషసర్పం ఉన్నట్లే. శత్రుసంపదను సులభోపాయంతో గ్రహించటం రాజుల సహజస్వభావమే కదా! స్నేహితుడు అడగకుండానే ఇది చెయ్యదగు నని చెప్పవచ్చు. కాని నీవు నన్ను 'ఈవిధంగా చేశావు, ఆ విధంగా చేశావు' అని తప్పు లెన్నటం ఎందుకు? నీ హద్దుల్లో నీవు ఉండు. మాకు బుద్ధులు చెప్పవద్దు.

**విశేషం:** అలం: ఉపమ. విదురుని హితం దుర్యోధనునికి ఎంత వెగటుగా ఉందో ఈ పద్యం వ్యక్తం చేస్తున్నది. (దుర్యోధనుడు ఈ విధంగా విదురుణ్ణి నిందించి వివేకవిహీను డని నిరూపించుకొన్నాడు. హితం చెపితే స్నేహితుడు చెప్పా లని ఎత్తిపొడిచాడు. విదురుడు తనకు విరోధి అని బహిరంగంగా నిందించాడు. హితుణ్ణి హితుడిగా గుర్తించే వివేకాన్ని కోల్పోయి, శకునిని హితుడిగా భావిస్తున్న దుర్యోధనుణ్ణి చూచి విదురుడు విసుక్కున్నాడు. హితుడుగా అతణ్ణి మందలించకుండ ఉండలేకపోయాడు. అందుకే మళ్ళీ మాట్లాడుతున్నాడు- నిజానికి తాను కౌరవహితాన్ని కోరేవాడు కాబట్టి. - సంపా.)

**వ. అనిన విదురుం డి ట్లనియె. 189**

**తాత్పర్యం:** అనగా విదురుడు ఇలా అన్నాడు.

**క. చెడఁ గఱపువార చెలులుం । గడుకొని నీయట్టివారి కర్జంబులు చె**
**ప్పెడు వారుఁగాక, నీకున్ । మడవక మా యట్టివారి మాటలు గొఱయే? 190**

**ప్రతిపదార్థం:** చెడన్= చెడిపోయేటట్లు; కఱపువారు+అ= బోధలు చేసేవారే; చెలులున్= స్నేహితులు; కడుకొని= యత్నించి; నీ, అట్టి, వారి= నీవంటి వారియొక్క; కర్జంబులు= చేయదగినపనులు; చెప్పెడువారున్= చెప్పేటటువంటివాళ్ళు; కాక= అట్లాకాక; మా, అట్టి, వారి, మాటలు; నీకున్, మడవక= నిష్ఫలాలుకాక, కొఱయే= ప్రయోజనకరా లౌతాయా?

**తాత్పర్యం:** చెడిపొయ్యేటట్లు చెడ్డబుద్ధులు చెప్పేవాళ్ళే నీకు స్నేహితులు; నీవంటి వాడికి కర్తవ్యాలు చెప్పేవాళ్ళు. మావంటివాళ్ళమాటలు నీపట్ల వ్యర్థా లవుతాయి కాని, ప్రయోజనకరా లౌతాయా?

**విశేషం:** హితాన్ని చెప్పేవాడే హితుడు. స్నేహితుడు. చెడు చెప్పేవాడు హితుడిలా తోచే అహితుడు. దుర్యోధనుడు అహితులను స్నేహితులుగా చేసుకొన్నాడు. వారి పన్నాగాలు మన్నించాడు. హితులను విరోధులుగా భావిస్తున్నాడు. ఇది అతనిలోని విపరీతబుద్ధి. దానిని విదురుడు అధిక్షేపించాడు. కాని, దుర్యోధనుడు వినడు. (సంపా.)

**తే. ప్రియము పలికెడువారిన పెద్ద మెత్తు, । రప్రియంబును బథ్యంబునైన పలుకు**
**వినఁగ నొల్లరు, గావున వేడ్కదానిఁ । బలుక రెవ్వరు నుత్తమప్రతిభు లయ్యు. 191**

**ప్రతిపదార్థం:** ప్రియము= వినటానికి ఇంపైనమాట; పలికెడు; వారిని+అ= వారినే; పెద్ద, మెత్తురు= ఎక్కువగా మెచ్చుకొంటారు; అప్రియంబును= వినటానికి ఇంపు కాకుండ; పథ్యంబును+ఐన= మేలు చేసేదైన, పలుకు= మాట; వినఁగన్= వినటానికి; ఒల్లరు= ఇష్టపడరు; కావునన్= అందుచేత; ఉత్తమ, ప్రతిభులు+అయ్యున్= గొప్పతెలివిగలవాళ్ళయి కూడ; ఎవ్వరున్= ఎవరును; దానిన్= అట్టి మాటను-అంటే వినటానికి కటువుగా ఉన్నను మేలు చేసేమాటను; పలుకరు= చెప్పరు.

**తాత్పర్యం:** వినటానికి ఇంపుగా ఉండే మాటను పలికేవాళ్ళనే ఎక్కువగా మెచ్చుకొంటారు. మేలు చేసేదైనా వినటానికి ఇంపుగా ఉండని మాటను వినటానికి ఎవరూ ఇష్టపడరు. అందుచేత గొప్ప ప్రతిభావంతులుకూడ అలాంటి కటువైన మాట చెప్పరు.

**విశేషం:** 'హితం మనోహారి చ దుర్లభం వచః' వంటి హితోక్తుల ప్రక్క నిలువదగిన రుచిరార్థసూక్తి ఇది. (సంపా.)

**తే. మొదల నప్రియ మయ్యును దుదిఁ గరంబు । పథ్య మగు పల్కు ప్రియులందు బలిమి నైనఁ**
**బలుక వలయు మోమోడక యొలసి యట్టి । వాఁడు దగు సహాయుండు భూవల్లభునకు. 192**

**ప్రతిపదార్థం:** మొదలన్= మొదట; అప్రియము+అయ్యును= వినటానికి ఇంపు కాకున్నను; తుదిన్= చివరకు; కరంబు= మిక్కిలి; పథ్యము+అగు= మేలు చేసేదైన; పల్కు= మాట; ప్రియుల+అందున్= ఇష్టులైనవాళ్ళకు; బలిమిన్+ఐనన్= బలవంతంగానైనా; మోమోడక= మొగమోటమి లేకుండా; ఒలసి= చెంతచేరి; పలుకవలయున్; అట్టివాఁడు; భూవల్లభునకున్= భూపతికి-రాజుకు; తగు, సహాయుండు= తగిన సహాయం చేసేవాడు - అంటే హితుడు.

**తాత్పర్యం:** మొదట వినటానికి ఇంపు కాని దైనా, చివరికి మేలు చేసే మాటను, ఇష్టులైనవాళ్ళ చెంత చేరి, మొగమోటమి లేకుండ, బలవంతంగానైనా చెప్పాలి. అలాంటివాడే రాజుకు తగినసహాయం చేసేవాడు.

**విశేషం:** విదురుని హితవాక్యాలు దుర్యోధనునికి ఎలా ఉన్నా, లోకానికి మాత్రం శిరోధార్యాలు.

**వ. 'ఏను సపుత్త్రకుండైన వైచిత్రవీర్యు కార్యంబునకు హితుండనై నెగడుదు; నట్టి న న్నన్యథాబుద్ధి నొల్లక పలికితి; పాండవులతోడి విగ్రహంబు లగ్గుగా'దని చెప్పి విదురుండు విగతవచనుండై యుండె; నంత శకుని ధర్మనందనున కి ట్లనియె. 193**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; సపుత్త్రకుండు+ఐన= పుత్రులు కలవాడైన; వైచిత్రవీర్యు, కార్యంబునకున్= ధృతరాష్ట్రుడు చేయదగినపనికి; హితుండను+ఐ= మేలు కోరేవాడినై; నెగడుదున్= ఉంటాను; నన్నున్; అన్యథా, బుద్ధిన్= వేరొక విధమైన తలంపుతో; ఒల్లక= ఇష్టపడక; పలికితి= పలికావు; పాండవులతోడి; విగ్రహంబు= వైరం; లగ్గు, కాదు= మేలు కాదు; అని; చెప్పి; విదురుండు; విగత వచనుండు+ఐ= మాట మానినవాడై; ఉండెన్; అంతన్; శకుని; ధర్మనందనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నేను పుత్రులు గల ధృతరాష్ట్రునికి మేలు కోరేవాణ్ణి. నన్ను వేరొక విధంగా అర్థం చేసుకొన్నావు. త్రోసిపుచ్చి మాట్లాడావు. పాండవులతో వైరం మంచిది కాదు' అని విదురుడు మౌనం వహించాడు. అప్పుడు శకుని ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**విశేషం:** 'ఏ నపుత్రకుండయ్యు' అనే పాఠాంతరం కొన్నిప్రతుల్లో ఉంది. ఇది కూడ గ్రహించదగిన పాఠమే. 'నాకు ఏవిధమైన స్వార్థం లేదు'. అనే అర్థంలో విదురుడు ఇలా అనటం ఉచితమే. (ప్రస్తుతపాఠంకూడ సార్థకమే. విదురుడు మహామంత్రిస్థానంలో ఉన్నాడు. అతడు రాజును, రాజ్యాన్నీ రక్షించాలి. రాజు పుత్రవంతుడైతే వాళ్ళను కూడా రక్షించే ఉపాయం ఆలోచించటం అతని కర్తవ్యం. అందువల్ల విదురుడు దుర్యోధనాదుల యోగక్షేమాలనుగూర్చి మాట్లాడాడు. అది రాజ్యవ్యవస్థ తెలిసిన ఉచితజ్ఞునికి తెలియదగిన అంశం. దుర్యోధనుడు విదురుణ్ణి అపార్థం చేసుకున్నాడు. నిందించాడు. కాని, అతనికికూడ హితవుచెప్పటం తన ధర్మ మని విదురుడు భావించాడు. నిండుకొలువులోనే వివరించి చెప్పాడు. మారుమాటాడని ధృతరాష్ట్రునిలా తానుకూడ నిర్లిప్తు డైనాడు. హితవు చెప్పని దోషం అతనికి కలుగదు. హితవు పాటించని దోషం ధృతరాష్ట్ర దుర్యోధనులదే. కపటవర్తనుల నడుమ కటకటపడుతున్న ధర్మస్వరూపుడు విదురుడు. - సంపా.) సంస్కృత భారతంలో విదురునికి సంతానం ఉన్నట్లుగా చెప్పబడింది - (ఆ.పర్వం. 113 ఆధ్యాయం 12,13,14 శ్లోకాలు).

**ఉ. 'ఎల్లధనంబు నోటువడి తిందుకులేశ్వర! యింక నొడ్డఁగా**
**మొల్లము నాకుఁ జూపు'మని ముందట సారెలు ద్రోచి యాడఁగా**
**నొల్లకయున్న సౌబలున కున్నతచిత్తుఁడు ధారుణీతలం**
**బెల్లను నొడ్డి యోటువడియెన్ బలవద్వ్యసనాభిభూతుఁడై. 194**

**ప్రతిపదార్థం:** ఇందు కుల+ఈశ్వర= ఓ చంద్రవంశపురాజా! ధర్మరాజా! ఎల్ల; ధనంబున్= ధనాన్ని అంతను; ఓటు, పడితి= ఓడిపోయావు; ఇంకన్, ఒడ్డగాన్= పందెంఒడ్డటానికి; మొల్లము= ధనం; నాకున్; చూపుము; అని; ముందట; సారెలు= పాచికలు; త్రోచి= పడవేసి; ఆడఁగాన్= ఆడటానికి; ఒల్లక+ఉన్న= ఇష్టపడకున్న; సౌబలునకున్= శకునికి; ఉన్నత, చిత్తుఁడు= గొప్పమనస్సు కలవాడు - ధర్మరాజు; బలవత్+వ్యసన+అభిభూతుఁడు+ఐ= బలమైన ద్యూతవ్యసనంచేత తిరస్కరించబడినవాడై; ధారుణీతలంబు+ఎల్లను= రాజ్యాన్నంతా; ఒడ్డి; ఓటు, పడియెన్= ఓడిపోయాడు.

**తాత్పర్యం:** 'ఓ చంద్రవంశపురాజా! ధర్మరాజా! ఉన్న సంపదనంతా ఓడిపోయావు. ఇంకా పందెం ఒడ్డటానికి నాకు ధనం చూపు' అని సారెలు ముందర పడవేసి ఆట మానిన శకునికి, గొప్ప మనస్సు కల ధర్మరాజు బలమైన ద్యూతవ్యసనానికి లొంగిపోయి రాజ్యాన్నంతా ఒడ్డి ఓడిపోయాడు.

**వ. ఇట్లు దేవభోగ బ్రాహ్మణ వృత్తులు దక్కఁ దక్కిన మహీతలంబును, బ్రాహ్మణులు దక్క సర్వప్రకృతిజనులను, రాజ పుత్త్రుల నొక్కొక్క యొడ్డున నొడ్డి యోటువడి వెండియు. 195**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దేవభోగ, బ్రాహ్మణవృత్తులు= గుడులలో దేవుళ్ళ ధూపదీపాలంకార నైవేద్యాలకొరకు, బ్రాహ్మణుల జీవనోపాధికొరకు ఇచ్చిన భూములు - అంటే దేవాలయాలకు, బ్రాహ్మణులకు దానంగా ఇచ్చిన మళ్ళు, మాన్యాలు; తక్కన్= తప్ప; తక్కిన, మహీతలంబును= తక్కిన భూమిని; బ్రాహ్మణులు; తక్కన్= తప్ప; సర్వ, ప్రకృతి జనులను= అందరు సామాన్య మానవులను; రాజపుత్రులన్; ఒక్కొక్క; ఒడ్డునన్, ఒడ్డి; ఓటు, పడి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** ఈవిధంగా - దేవాలయాల్లోని దేవుళ్ళ ధూపదీపాలంకార నైవేద్యాలకు, బ్రాహ్మణుల జీవనోపాధికి దానాలుగా ఇచ్చిన భూములు తప్ప, తక్కిన భూమిని, బ్రాహ్మణులు తప్ప సామాన్యజనులందరిని, రాజపుత్రులను, ఒక్కొక్క పందెంలో ఒడ్డి ఓడిపోయాడు. మళ్ళీ

## ధర్మరాజు తమ్ములను ద్రౌపదిని జూదమునం దొడ్డి యోడుట

**సీ. తమ్ముల నత్యంత ధర్మసమేతుల । నాయతబాహుల నాజిజయుల**
**నాదిత్యతేజుల నాదిభూపాలక । చరితుల నభిమానసత్యరతుల**
**సహదేవనకులవాసవసుతభీములఁ । గ్రమమున నలువురఁ గౌరవేంద్రుఁ**
**డొక్కొక్క యొడ్డున నొడ్డి తన్నును నొడ్డి । యుక్కివంబున నప్పు డోటు వడిన**

**ఆ. నతనిఁ జూచి శకుని యనియె 'నిట్లేల ని । న్నొడ్డి తధిప! నీకు నొండుధనము**
**గలదు; మఱచి తెట్లు? కమలాక్షి పాంచాల । కన్య నీకు ధనము గాదె?' యనిన. 196**

**ప్రతిపదార్థం:** తమ్ములన్; అత్యంత, ధర్మ, సమేతులన్= మిక్కిలి ధర్మంతో కూడుకొన్నవాళ్ళను - అంటే పరిపూర్ణంగా ధర్మాన్ని అనుసరించేవాళ్ళను; ఆయతబాహులన్= పొడవైన చేతులుగలవాళ్ళను; ఆజిజయులన్= యుద్ధంలో గెలుపొందే స్వభావం కలవాళ్ళను; ఆదిత్య, తేజులన్= సూర్యునితో సమానమైన తేజస్సు కలవాళ్ళను; ఆది, భూపాలక, చరితులన్= తొలిరాజుల నడవడి కలవాళ్ళను; అభిమాన, సత్య, రతులన్= ఆత్మగౌరవంలోను, సత్యంపట్లను ప్రీతి కలవాళ్ళను; సహదేవ, నకుల, వాసవసుత (అర్జున) భీములన్; క్రమమునన్= వరుసగా; నలువురన్; కౌరవ+ఇంద్రుఁడు= కౌరవప్రభువైన ధర్మరాజు; ఒక్కొక్క; ఒడ్డునన్= పందెంలో; ఒడ్డి= (పణంగా) పందెంలో ఒడ్డి; తన్నునున్= తనను కూడ; ఒడ్డి; ఉక్కివంబునన్= మోసంచేత; ఓటు, పడినన్= ఓడిపోగా; అతనిన్= ఆ ధర్మరాజును; చూచి; శకుని; అనియెన్; అధిప= ఓ ధర్మరాజా! ఇట్లు= ఈ విధంగా; ఏల; నిన్ను; ఒడ్డితివి; నీకున్; ఒండు= మరొక; ధనము; కలదు; మఱచితి+ఎట్లు= ఎలా మరిచిపోయావు?; కమలాక్షి= కమలాలవంటి కన్నులు కలదైన; పాంచాల, కన్య= పాంచాలరాజుకూతురు - ద్రౌపది; నీకున్; ధనము; కాదె; అనినన్.

**తాత్పర్యం:** పూర్తిగా ధర్మాన్ని అనుసరించేవాళ్ళు, విశాలమైనభుజాలుగలవాళ్ళు, యుద్ధంలో జయశీలురు, సూర్యునితో సమానమైన తేజస్సు కలవాళ్ళు, తొలిరాజులవలె మంచి నడవడి కలవాళ్ళు, ఆత్మగౌరవంలో, సత్యంలో ప్రీతిగలవాళ్ళు అయిన తమ్ములు - సహదేవనకులార్జునభీమసేనులు నలుగురిని వరుసగా ధర్మరాజు ఒడ్డి ఓడిపోయాడు. కడకు తననుకూడ ఒడ్డుకొని వంచనకు గురిఅయి ఓడిపోగా, శకుని చూచి, 'ఓ ధర్మరాజా! ఈ విధంగా ని న్నేల ఒడ్డుకొన్నావు? నీకు ఇంకొక ధనం ఉందిగదా! ఎలా మరచావు? కమలాక్షి ద్రౌపది నీధనం కాదా?' అన్నాడు.

**విశేషం:** ఇక్కడ శకుని వేసిన ప్రశ్న జటిలమైంది. ఆ చిక్కు ధర్మరాజుకే అర్థమౌతుంది. ధర్మరాజు తనను తాను పణంగా పెట్టుకొన్నప్పుడు శకుని మాట్లాడలేదు. అతను ఓడిన తరువాత మరొక ధనం ఉం దని జ్ఞాపకం చేశాడు. త న్నోడిన ధర్మజుడు దాసుడు కావచ్చు కాని, అతనిభార్యమీది అధికారం అతని కున్న దని సూచనచేయటం ఒక అర్థం. ధర్మజుడు ఓడాడు కాబట్టి శకుని చెప్పినట్లు చేయటం కర్తవ్యం కావటం మరొక అర్థం. ఈ రెండింటిచేత బంధించబడిన ధర్మజుడు

భార్యను పణంగా పెట్టటానికి పూనుకొన్నాడు. దీనిలోని ధర్మసూక్ష్మాన్ని గురించి ద్రౌపది నిండుసభలో ప్రశ్నించబోతున్నది. (వివరాలకు పీఠిక చదవండి - సంపా.)

**చ. అలయక వెండియుం గడఁగి యక్షరతుండయి ద్రౌపదిన్ మహో**
**త్పలదళచారునేత్రఁ గులభామఁ బణంబుగఁ జేసి యొడ్డి సౌ**
**బలఖలుచేత నోటువడి పాండుసుతుం డుడిగెన్ ధనంబు ల**
**గ్గలముగ నొడ్డలేమి గతగర్వమునం గడు దీనవక్త్రుఁడై. 197**

**ప్రతిపదార్థం:** అలయక= ఆలస్యంచేయక; వెండియున్= మళ్ళీ; కడఁగి= పూనుకొని; అక్షరతుండు+అయి= పాచికలందు ప్రీతికలవాడయి; మహా+ఉత్పల, దళ, చారునేత్రన్= పెద్దకలువరేకులవంటి అందమైన కన్నులు కలదానిని; కులభామన్= కులకాంతను; ద్రౌపదిన్; పణంబుగన్+చేసి= పందెంగా జేసి; ఒడ్డి; సౌబలఖలుచేతన్= సుబలునికుమారుడు శకుని అనే దుర్మార్గుని చేత; ఓటు, పడి= ఓడిపోయి; పాండు, సుతుండు= పాండురాజుకుమారుడైన ధర్మరాజు; ధనంబులు; అగ్గలముగన్= అధికంగా; ఒడ్డలేమి= ఒడ్డలేక; గత, గర్వమునన్= కోల్పోయిన గర్వంతో; కడున్, దీన, వక్త్రుఁడు+ఐ= మిక్కిలి దీనమైన ముఖంకలవాడై; ఉడిగెన్= పాచికల ఆట చాలించాడు.

**తాత్పర్యం:** ఆలస్యం చెయ్యకుండా, పాచికలమీది ప్రీతితో, ధర్మరాజు మళ్ళీ ఆటకు పూనుకున్నాడు. కలువరేకులవంటి కన్నులు కలది, కులకాంత అయిన ద్రౌపదిని పణంగా ఒడ్డాడు. దుష్టశకుని చేతుల్లో ఆమెను కూడ ఓడిపోయాడు. ఇంకా ఒడ్డటానికి ధనం లేదు. అందుచేత గర్వాన్ని కోల్పోయాడు. ఎంతో దీనమైన ముఖంతో అప్పుడు ఆట చాలించాడు.

**విశేషం:** ధర్మజుని ద్యూతవ్యసనం కడకు ధర్మపత్ని ద్రౌపదిని ఓడిపోయేదాకా సాగితేకాని ఆగలేదు. మానవస్వభావంలో వ్యసనపరత ఎంత బలీయమో, అన్నిధర్మాలు తెలిసిన ఆ ధర్మరాజుసమతనే అది ఎంతగా తారుమారు చేసిందో - మహాభారతం ఈ ఘట్టంలో మరపురానంత బలంగా ప్రదర్శించింది.

**సీ. ఆతనిఁ జూచి ద్రోణాచార్య కృప భీష్ము । లవిరళ స్వేదాంగు లగుచు వృద్ధ**
**జనులును దారు నిశ్శబ్ద నిరంతర । ముఖులైరి; విదురుండు మొగము వాయ**
**నిడి తలవాంచి త న్నెఱుఁగక దుఃఖితుం । డై యుండెఁ; దక్కిన యా సదస్యు**
**లందఱుఁ బ్రబలబాష్పాంబుధారాకులి । తాక్షులై; రత్యుచ్చమై పయోధి**

**ఆ. పటురవాభమై సభాక్షోభ మయ్యెఁ; దు । శ్శాసనుండుఁ గర్ణసైంధవులును**
**నధికహర్షవికసితాస్యంబు లొప్ప నొం । డొరులఁ జూచి నగుచు నుండి రపుడు. 198**

**ప్రతిపదార్థం:** ఆతనిన్= ఆవిధంగా సర్వం కోల్పోయిన ధర్మరాజును; చూచి; ద్రోణాచార్య, కృప, భీష్ములు; అవిరళ, స్వేద+అంగులు= దట్టమైన చెమటతో కూడిన అవయవాలు కలవాళ్ళు; అగుచున్; వృద్ధజనులును; తారున్= తాము; నిశ్శబ్ద, నిరంతర, ముఖులు+ఐరి= నిశ్శబ్దం ఎడతెగకుండా ఉన్న ముఖాలు కలవాళ్ళయ్యారు-అంటే నోటిమాట, శ్వాస శబ్దంరాని స్థితిలో ఉండిపోయారు; విదురుండు; మొగము; పాయన్+ఇడి= మొగాన్ని ప్రక్కకు త్రిప్పి; తలవాంచి; తన్నున్+ఎఱుంగక=

తనలోతానులేక; దుఃఖితుండు+ఐ; ఉండెన్; తక్కిన; ఆ, సదస్యులు+అందఱున్= ఆ సభలోని సభ్యులందరును; ప్రబల, బాష్ప+అంబు, ధారా+ఆకులిత+అక్షులు+ఐరి= తీవ్రమైన కన్నీటి ధారలచే కలతచెందిన కన్నులుకలవా ళ్ళయ్యారు; అతి+ఉచ్చము+ఐ= మిక్కిలి ఎక్కువైనది అయి (మిక్కిలి పెద్దదై); పయోధి, పటు, రవ+ఆభము+ఐ= సముద్రంయొక్క పెద్ద ధ్వని వలె చాలా తీవ్రమై; సభా, క్షోభము+అయ్యెన్= సభలో కలకలం చెలరేగింది; దుశ్శాసనుండున్; కర్ణ, సైంధవులును; అధిక, హర్ష, వికసిత+ఆస్యంబులు= మిక్కిలి సంతోషంచేత విప్పారిన ముఖాలు; ఒప్పన్= ప్రకాశించగా; ఒండొరులన్= ఒకరినొకరు; చూచి; నగుచున్= నవ్వుతూ; ఉండిరి; అప్పుడు.

**తాత్పర్యం:** ఆ విధంగా సర్వాన్ని కోల్పోయిన ధర్మరాజును చూచేసరికి- ద్రోణ కృప భీష్ములకు శరీరమంతా చెమటపట్టింది. తాము, తక్కిన వృద్ధులు నోటమాట, శ్వాసశబ్దం కూడ రాని స్థితిలో ఉండిపోయారు. విదురుడు మొగం ప్రక్కకు త్రిప్పి, తలవంచుకొని, మనస్సు మనస్సులో లేక ఎంతో దుఃఖంతో ఉన్నాడు. తక్కిన సదస్యులంతా తీవ్రంగా కంటతడి పెట్టారు. మితిమీరిన సముద్రఘోషలా సభలో కలకలం చెలరేగింది. దుశ్శాసనుడు, కర్ణుడు, సైంధవుడు సంతోషాతిరేకంతో విప్పారినముఖాలతో ఒకరి నొకరు చూచుకుంటూ నవ్వుతూ ఉండిపోయారు.

**విశేషం:** దిగ్విజేతగా, రాజసూయం చేసిన మహారాజుగా, కానున్న కురుసార్వభౌముడుగా కొండంత దీప్తితో కౌరవసభలో అడుగుపెట్టిన ధర్మరాజుముఖాన్ని, పిదప కపటద్యూతంలో ఉన్నదంతా కోల్పోయి, కడకు తనను కూడ ఓడిపోయి, ఎవరి వైపు చూడలేక, ఏమి చెయ్యాలో తోచక, దీనాతిదీనస్థితిలో అందరిముందు తలవంచుకొని ఉన్న ధర్మరాజుముఖాన్ని- అక్రమవిజయంతో, వికృతానందంతో విజృంభించి ఒకరివైపు మరొకరు చూచుకొంటూ, పకపక నవ్వుతున్న దుర్యోధన శకుని కర్ణ దుశ్శాసనాదుల ముఖాలను, అన్యాయాన్ని నివారించలేక ఆవేదనపడుతూ, నిస్సహాయులై కళ్ళనీళ్ళు నించుకొన్న భీష్మ ద్రోణ విదురాదుల ముఖాలను, సభలో చెలరేగిన కలకలాన్ని- సహృదయుడు ఒక్కసారి ఊహించుకుంటే అప్పు డెంత తీవ్రమైన స్థితి ఏర్పడిందో తెలుస్తుంది.

**వ.** **ధృతరాష్ట్రుండును 'నిది యేమి సభాక్షోభం? బెవ్వ రెవ్వ రే వస్తువు లొడ్డి?' రని విదురు నడుగుచుండె; నట్టి యవసరంబున దుర్యోధనుండు పాండవులం దనకు దాసులంగా నొడిచినవాఁడై పెటీఁగి.** **199**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండునున్; ఇది; ఏమి; సభా, క్షోభంబు= సభాకలకలం; ఎవ్వరు+ఎవ్వరు; ఏ వస్తువులు; ఒడ్డిరి+అని; విదురున్; అడుగుచున్; ఉండెన్; అట్టి; అవసరంబునన్= సమయంలో; దుర్యోధనుండు; పాండవులన్; తనకున్; దాసులంగాన్= సేవకులనుగా; ఒడిచినవాఁడు+ఐ= ఓడించినవాడై; పెటీఁగి= గర్వంతో పెల్లురేగి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు సభలో 'ఇది ఏమి కలకలం? ఎవ్వరెవ్వరు ఏ యే వస్తువులు ఒడ్డినారు?' అని విదురుణ్ణి అడుగుతున్న సమయంలో- దుర్యోధనుడు, పాండవులను తనదాసులుగా గెలుచుకొన్న గర్వాతిరేకంతో.

**క.** **వరవుళ్ళఁ గలసి తనయిలు । పరువడిఁ దుడువంగఁ గృష్ణఁ బనుచువగన్ భా**
**సుర రాజ్యదర్ప మొప్ప వి । దురుఁ జెచ్చెరఁ బంచె దానిఁ దోడ్కొని తేరన్.** **200**

**ప్రతిపదార్థం:** వరవుళ్ళన్, కలిసి= దాసీజనంతో కలిసి; తన, ఇలు= తన ఇల్లు; పరువడిన్= క్రమంగా; తుడువంగన్= శుభ్రంగా తుడవటానికి; కృష్ణన్= ద్రౌపదిని; పనుచు= ఆజ్ఞాపించు; వగన్= ఆలోచనతో; భాసుర, రాజ్య, దర్పము= వెలుగుతున్న రాజ్యగర్వం; ఒప్పన్; దానిన్= ద్రౌపదిని; తోడ్కొని తేరన్= పిలుచుకొని రావటానికి; విదురున్; చెచ్చెరన్= వెంటనే; పంచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** దాసీజనంతో కలిసి తన ఇల్లు వరుసగా తుడవటానికి ద్రౌపదిని ఆజ్ఞాపించాలనే ఆలోచనతో, రాజ్య గర్వంతో విర్రవీగుతూ- ద్రౌపదిని తోడ్కొని రమ్మని విదురుణ్ణి వెంటనే ఆజ్ఞాపించాడు.

**విశేషం:** కపటద్యూతంలో ధర్మరాజురాజ్యాన్ని గెలుచుకోవటంతో దుర్యోధనునికి అహంకారం అంతులేకుండా పెరిగింది. అది మొదలు తానే రాజైనట్లు, తండ్రితో నిమిత్తమే లేనట్లు విదురునంతటివాణ్ణే ఆజ్ఞాపించే స్థితికి వచ్చాడు. దాసీజనంతో కలిసి ద్రౌపది తనఇల్లు తుడవాలట! విదురుడు వెళ్ళి ఆమెను ఆ పనికి పిలుచుకు రావాలట! ఎంత అహంకారం! ఎంత దుర్విదగ్ధత!

**క. దాని సహింపక విదురుం । డా నరపతి కిట్టు లనియె 'నజ్ఞానులు నీ**
**తో నెన లే రొరు; లిట్లు మ । హానిష్ఠురవృత్తిఁ బనుప నగునే నన్నున్?' 201**

**ప్రతిపదార్థం:** దానిన్, సహింపక; విదురుండు; ఆ, నరపతికిన్= ఆదుర్యోధనునికి; ఇట్టులు+అనియెన్; అజ్ఞానులు= మూర్ఖులు; నీతోన్; ఒరులు= ఇతరులు; ఎనలేరు= సాటిలేరు; ఇట్లు= ఈ విధంగా; మహానిష్ఠురవృత్తిన్= చాలా క్రూరమైన పనిమీద; నన్నున్; పనుపన్+అగునే= పంపదగునా?

**తాత్పర్యం:** దాన్ని సహించక విదురుడు దుర్యోధనునితో 'నీతో సమానమైన మూర్ఖులు లోకంలో మరెవ్వరూ లేరు. ఇంత క్రూరమైన పనికి నన్ను పంపదగునా?' అని అన్నాడు.

**విశేషం:** మాయాద్యూతంలో గెలిచినంతమాత్రాన-పాంచాలరాజపుత్రి, పాండవ ధర్మపత్ని అయిన ద్రౌపదిని తనదాసిగా చేసి ఇల్లు తుడిపించటమా? ఎంత క్రూరమైనపని? పైగా అందుకు అంత గొప్ప విదురుణ్ణి పొమ్మని ఆజ్ఞాపించటమా? ఎంత మూర్ఖత! ఎంత అహంకారం!

**క. మదమలినమనస్కుఁ డరుం । తుదుఁడు నృశంసుఁ డనఁ బరఁగు దుర్జనునకు సం**
**పద లెడలయ్యును నాతని । మొదలిటి సంపదలతో సమూలంబు చెడున్. 202**

**ప్రతిపదార్థం:** మద, మలిన మనస్కుఁడు= పొగరుచేత మాసిన మనస్సుకలవాడు; అరుంతుదుఁడు= ఆయువుపట్టును నొప్పించేవాడు; నృశంసుఁడు= క్రూరుడు; అనన్, పరఁగు= అని అనదగిన; దుర్జనునకున్= దుర్మార్గునికి; సంపదలు; ఎడలు+ అయ్యునున్= చెదిరిపోయినప్పటికి; ఆతని; మొదలిటి= తొలుతటి; సంపదలతో; సమూలంబు= వేరుతో గూడ, -అంటే పూర్తిగా; చెడున్= నశిస్తాయి.

**తాత్పర్యం:** పొగరుచేత మలినమైన మనస్సు కలవాడు. ఆయువుపట్టును (మర్మస్థానాన్ని) నొప్పించేవాడు, క్రూరుడన దగినవాడు అయిన దుర్మార్గుని సంపదలు చెదరిపోవటమే కాక, అతని తొలిసంపదలుకూడ సమూలంగా నాశనమవుతాయి.

**విశేషం:** విదురునిమాటలు పైకిచూస్తే సూక్తులు: లోనారసి చూస్తే భవిష్యద్వాణులు. శాపోక్తులవంటివి. విదురుడు అంతరాత్మబోధితమైన ధర్మసంస్కారప్రజ్ఞవంటివాడు. అతణ్ణి తనకు హితవు చెప్పవ ద్దని దుర్యోధనుడు తిరస్కరించాడు. అంతటితో ఆగకుండ అధర్మంచేయు మని ఆజ్ఞాపిస్తున్నాడు. ఇది ధర్మప్రవృత్తియొక్క ఆయువుపట్టును నొప్పించే పని. దుర్యోధనుడు ఈ చర్యను ద్రౌపదిని ఆజ్ఞాపించా లని అనుకోవటంతో మొదలుపెట్టాడు. విదురుణ్ణి ఆజ్ఞాపించి దానికి ఒక

రూపా న్నివ్వదలచుకొన్నాడు. దీనివల్ల ధర్మజాదుల ఆయువుపట్టులు బాధపడతాయి. ఆ అధర్మఫలంగా వచ్చిన సంపదతోపాటు ఉన్నసంపదకూడ ఊడ్చుకొనిపోతుం దని భవిష్యద్దర్శనంతో విదురుడు మాట్లాడాడు. (సంపా.)

**క. అవనీతలసామ్రాజ్యో । త్సవమునకును యోగ్యమైనసతి ద్రౌపది పాం**
**డవధర్మపత్ని నీ కం । తవమానము సేయ నేమి యనపాశ్రయయే. 203**

**ప్రతిపదార్థం:** ద్రౌపది; అవనీతల, సామ్రాజ్య+ఉత్సవమునకును= భూమండల సామ్రాజ్యాని కంతటికి రాణిగా పట్టాభిషేకం పొందే వేడుకకు; యోగ్యము+ఐన, సతి= తగిన స్త్రీ; పాండవ ధర్మపత్ని= పాండవుల భార్య; నీకున్; అంత; అవమానము; చేయన్, అనపాశ్రయయే= అండ లేనిదా ఏమి?

**తాత్పర్యం:** ద్రౌపది సమస్తభూమండలానికి రాణిగా పట్టాభిషేకం పొందదగిన స్త్రీమూర్తి. పాండవుల ధర్మపత్ని, నీ వంత అవమానం చెయ్యటానికి ఆమె అండ లేనిదా ఏమి?

**తే. ఏల యాశీవిషంబుల నెఱిఁగి యెఱిఁగి । మూర్ఖవై యలిగించెదు? మొనసి యొరుల**
**ధనము నికృతిమై గొను టిది ధర్మువగునె? । శకునిమతమునఁ బాపంబుఁ జనునె చేయ? 204**

**ప్రతిపదార్థం:** ఏల= ఎందులకు; ఆశీవిషంబులన్= ముఖమందు విషం గల పాములను; ఎఱిఁగి, ఎఱిఁగి= తెలిసి తెలిసి; మూర్ఖవు+ఐ= మూర్ఖుడివై; అలిగించెదు= కోపం వచ్చేటట్లు చేస్తావు; మొనసి= పూనుకొని; ఒరుల= ఇతరుల; ధనము; నికృతిమైన్= మోసంతో; కొనుట= గ్రహించటం; ఇది; ధర్మువు; అగునె; శకుని, మతమునన్= శకుని అభిప్రాయాన్ని అనుసరించి; పాపంబున్; చేయన్, చనును+ఎ= చేయవచ్చునా?

**తాత్పర్యం:** ఎందుచేత తెలిసితెలిసి మూర్ఖుడివై పాములకు కోపం తెప్పిస్తావు? ఇతరుల ధనాన్ని మోసంతో గ్రహించటం ధర్మమా? శకునిఅభిప్రాయాన్ని అనుసరించి పాపం చెయ్యదగునా?

**విశేషం:** అలం: రూపకాతిశయోక్తి. చేసిన పనిలోని చెడుగుతోపాటు, రానున్న ప్రమాదాన్నికూడా విదురుడు సూచిస్తున్నాడు.

**వ. జూదంబున నెగ్గు పుట్టు; దీన నయ్యెడు ఫలంబు వేణుఫలంబునుంబోలె సహమూలవినాశంబునకు నిమిత్తం బగు'ననిన దుర్యోధనుండు విదురుం దూలనొదరి, ప్రాతికామి యనువానిం బిలిచి' యీ విదురుం డెప్పుడు నరిష్టంబ కాని పలుకండు; పాండవులకు వెఱచు; నీవు వోయి ద్రౌపదిం దోడ్కొని ర'మ్మని పంచిన. 205**

**ప్రతిపదార్థం:** జూదంబునన్= జూదంవల్ల; ఎగ్గు= కీడు; పుట్టున్; దీనన్= దీనివల్ల; అయ్యెడు= కలిగే; ఫలంబు; వేణు, ఫలంబునున్+పోలెన్= వెదురు ఫలంవలె; సహమూల, వినాశంబునకున్= వేళ్ళతోగూడ నాశనం కావటానికి; నిమిత్తంబు= కారణం; అగున్; అనినన్; దుర్యోధనుండు; విదురున్; తూలన్+ఒదరి= తిరస్కారంగా నిందించి; ప్రాతికామి; అనువానిన్; పిలిచి; ఈ, విదురుండు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; అరిష్టంబు+అ, కాని= కీడే కాని; పలుకండు; పాండవులకున్; వెఱచు= భయపడతాడు; నీవు; పోయి; ద్రౌపదిన్, తోడ్కొని; రమ్ము; అని; పంచినన్= పంపగా.

**తాత్పర్యం:** 'జూదం వల్ల కీడు పుట్టుతుంది. జూదంవల్ల కలిగే ఫలం వెదురు ఫలంలా వేళ్ళతోగూడ నాశనం కావటానికి కారణమవుతుంది' అని అనగా దుర్యోధనుడు విదురుణ్ణి తిరస్కరించి నిందించాడు. ప్రాతికామి అనే

వాణ్ణి పిలిచి 'ఈవిదురు డెప్పుడూ మనకు కీడే పలుకుతాడు. పాండవుల కితడు భయపడతాడు. నీవు పోయి ద్రౌపదిని తోడ్కొని రా' అని పంపాడు.

**విశేషం:** అలం: ఉపమ. వెదురుపంట పండగానే పొద ఆమూలాగ్రం ఎండిపోతుంది.

### ప్రాతికామి ద్రౌపదిని సభకుఁ దోడ్కొని వచ్చుట (సం. 2-60-3)

**ఆ. అవనినాథుచేత నాజ్ఞాపితుం డయి । సూతనందనుండు ప్రాతికామి**
**పాండవాగ్రమహిషిపాలికిఁ జని భక్తి । వినతుఁ డగుచు నిట్టు లనియె సతికి. 206**

**ప్రతిపదార్థం:** అవనినాథుచేతన్= భూపతి దుర్యోధనునిచేత; ఆజ్ఞాపితుండు+అయి= ఆజ్ఞాపించబడినవాడై; సూతనందనుండు= సూతుని కుమారుడు; ప్రాతికామి; పాండవ+అగ్రమహిషి, పాలికిన్= పాండవపట్టమహిషి అయిన ద్రౌపది దగ్గరకు; చని, భక్తిన్, వినతుఁడు+అగుచున్= భక్తితో నమస్కరించినవాడై; సతికిన్= ఆ పతివ్రతకు; ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఆజ్ఞాపించగా, సూతనందనుడైన ప్రాతికామి, పాండవ పట్టమహిషి అయిన ద్రౌపది దగ్గరకు వెళ్ళి, భక్తితో నమస్కరించి, ఆ పతివ్రతతో ఈ విధంగా అన్నాడు.

**తరువోజ.**

**'ధనసంపదలు నిజధరణిరాజ్యంబుఁ దనయులం దమ్ములఁ దన్నును నిన్నుఁ**
**దనరఁ జూదంబాడి ధార్తరాష్ట్రులకు ధర్మతనూజుండు దా నోటువడియె;**
**వనజాక్షి! కౌరవవరుపని నిన్ను వడిఁ దోడుకొని పోవ వచ్చితి నిపుడ;**
**చనుదెమ్ము కౌరవేశ్వరుకడ' కనిన జలజాయతాక్షి పాంచాలి యి ట్లనియె. 207**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజుండు= ధర్మరాజు; తనరన్= ఒప్పగా; జూదంబు+ఆడి; ధార్తరాష్ట్రులకున్= ధృతరాష్ట్రుని కుమారులకు; ధనసంపదలు; నిజ, ధరణి, రాజ్యంబున్= తనభూమిమీది దొరతనాన్ని; తనయులన్= కుమారులను; తమ్ములన్; తన్నును; నిన్నున్; తాన్; ఓటుపడియెన్= ఓడిపోయాడు; వనజ+అక్షి= నీట పుట్టిన పద్మాలవంటి కన్నులు కలదానా!; కౌరవ, వరు, పని= కౌరవశ్రేష్ఠుడైన దుర్యోధనుని పనిమీద; నిన్నున్; వడిన్= వేగమె; తోడుకొనిపోవన్; వచ్చితిన్; ఇపుడు+అ; చనుదెమ్ము= రమ్ము; కౌరవ+ఈశ్వరు, కడకున్= కౌరవరాజు దగ్గరకు; అనినన్; జలజ+ఆయత+అక్షి= నీటినుండి పుట్టిన పద్మాలవలె విశాలమైన కన్నులు గలదైన; పాంచాలి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ధర్మరాజు జూదమాడి-కౌరవులకు తన ధనసంపదలను, రాజ్యాన్ని, కొడుకులను, తమ్ములను, తనను, నిన్ను ఓడిపోయాడు. పద్మాక్షీ! కౌరవశ్రేష్ఠుడైన దుర్యోధనుని పనిమీద నిన్ను వేగమే తోడ్కొని పోవటానికి వచ్చాను. కౌరవేశ్వరుని దగ్గరికి రా' అని అనగా ద్రౌపది అతనితో ఇలా అన్నది.

**విశేషం:** ప్రాతికామికథనంలో నన్నయవాడిన శబ్దాలు గమనించదగ్గవి. ధర్మరాజు ధార్తరాష్ట్రులకు ఓడిపోయాడట! కౌరవశ్రేష్ఠుడు పంపితే ద్రౌపదిని తోడ్కొనిపోవటానికి వచ్చాడట. కౌరవేశ్వరుని దగ్గరకు ఆమె రావాలట. జూదం మొదలైనప్పుడు దుర్యోధనుడు ధృతరాష్ట్రుని పుత్రుల్లో పెద్దవాడు. గెలిచినతరువాత ఆజ్ఞాపించేటప్పుడు అతడే కౌరవశ్రేష్ఠుడు. రమ్మంటున్నది కౌరవేశ్వరుని

దగ్గరికి. దుర్యోధనుడు పాండవులను గెలిచేంతవరకే ధృతరాష్ట్రుని పుత్రు డని- ఆ తరువాత తానే కౌరవేశ్వరుడుగా వెలిగిపోతున్నా డని ధ్వని. ద్రౌపది కౌరవేశ్వరు డంటే ధృతరాష్ట్రు డని వ్యాఖ్యానించుకొని సభలో మొదట ఆయనవద్దకు వెళ్ళి నిలువబడిం దని చెప్పుకొనటానికి అనువుగా ఆ శబ్దాన్ని వాడాడు. ధృతరాష్ట్రునివద్దనున్న ద్రౌపదిని దుర్యోధనుడు తానే కౌరవేంద్రుడ నన్నట్లు ఆజ్ఞాపిస్తాడు. ధృతరాష్ట్రుడు మారుమాటాడలేదు. (వివరాలకు పీఠిక చూడండి). (సంపా.)

**ఆ. 'ఏయుగంబునందు నెట్టి దుష్కితవుండు । భార్య నొడ్డి యోటువడినభర్త**
**గలఁడె? యిది వినంగఁ గడు నపూర్వం బయ్యె; । నిట్లు సేయునొక్కొ యిందుకులుఁడు? 208**

**ప్రతిపదార్థం:** ఏయుగంబునందున్= ఏయుగంలో నయినా; ఎట్టి దుష్కితవుండు= ఎటువంటి చెడుజూదగాడైనా; భార్యను+ఒడ్డి; ఓటుపడిన= ఓడిపోయిన; భర్త; కలఁడె; ఇది; వినంగన్; కడున్= మిక్కిలి అపూర్వంబు+అయ్యెన్= ఆశ్చర్యకరమయింది; ఇందుకులుఁడు= చంద్రవంశ ప్రభువైన ధర్మరాజు; ఇట్లు; చేయున్+ఒక్కొ= చేశాడా?

**తాత్పర్యం:** ఏ యుగంలో నయినా, ఎటువంటి చెడ్డ జూదగాడయినా, భార్యను పణంగా ఒడ్డి ఓడిపోయిన భర్త ఉన్నాడా? వినటాని కిది ఆశ్చర్యకరంగా ఉంది. చంద్రవంశ ప్రభువైన ధర్మరాజు ఇలా చేశాడా?

**విశేషం:** ధర్మజుని 'ఇందుకులు' డనటంలో చంద్రునికాంతితో పాటు అతనిమచ్చకూడ స్ఫురించినట్లే. ధర్మజుని గుణసంపదతోపాటు అతని ద్యూతవ్యసనం కూడా ధ్వనిస్తున్నది.

**తే. మున్ను దన్నోటువడి మఱి నన్ను నోటు । వడియెనో, నన్ను మున్నోటువడి విభుండు**
**గ్రన్నఁ దన్నోటువడియెనో యన్న! నాకు । నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని.' 209**

**ప్రతిపదార్థం:** మున్ను= మొదట; తన్నున్= తనను; ఒటుపడి= ఓడిపోయి; మఱి= తర్వాత; నన్నున్+ఓటు పడియెనో= ఓడిపోయాడో; నన్నున్; మున్ను+ఓటుపడి= ముందుగా ఓడిపోయి; విభుండు= ప్రభువు; క్రన్నన్= పిమ్మట; తన్నున్+ఓటు, పడియెనో= తనను ఓడిపోయాడో; అన్న! దీనిన్; ఈవు; ఎఱుఁగుదు+ఏనిన్; నాకున్; ఎఱుఁగన్; చెప్పుము.

**తాత్పర్యం:** నా భర్త మొదట తన్నోడి తరువాత న న్నోడెనా? లేక ముందే న న్నోడి తరువాత తా నోడెనా? అన్నా! నీకు తెలిస్తే ఈ సంగతి నాకు చెప్పు.

**విశేషం:** పదునైన ద్రౌపదిబుద్ధికి ఈ ప్రశ్న ఒక ప్రబలనిదర్శనం.

**వ. 'ఎఱుంగవేని యక్కితవు నడిగి వచ్చి మఱి నన్నుం దోడ్కొని పోవనగునేని తోడ్కొని పొ'మ్మనినం బ్రాతికామి క్రమ్మఱి వచ్చి పాంచాలిపలుకులు ధర్మరాజునకుం జెప్పిన, దురోదర పరాజయ దుఃఖిత చేతస్కుం డగుటం జేసి యతఁడు వానికి నదత్తప్రతివచనుం డైనఁ, బ్రాతికామికి దుర్యోధనుం డి ట్లనియె. 210**

**ప్రతిపదార్థం:** ఎఱుంగవు+ఏనిన్= నీకు తెలియకుంటే; ఆ+కితవున్= ఆ జూదగాణ్ణి; అడిగి; వచ్చి; మఱి= తర్వాత; నన్నున్; తోడ్కొని, పోవన్, అగున్+ఏనిన్= పిలుచుకొని వెళ్ళదగినట్లయితే, తోడ్కొనిపొమ్ము; అనినన్; ప్రాతికామి; క్రమ్మఱి, వచ్చి= తిరిగివచ్చి; పాంచాలి, పలుకులు= ద్రౌపది మాటలు; ధర్మరాజునకున్; చెప్పినన్; దురోదర, పరాజయ, దుఃఖిత, చేతస్కుండు+ అగుటన్+చేసి= జూదంలో ఓడిపోవటంచేత దుఃఖాన్ని పొందిన మనస్సుకలవాడుకావటంచేత; అతఁడు= ఆ ధర్మరాజు;

వానికిన్= ప్రాతికామికి; అదత్త, ప్రతివచనుండు+ఐనన్= ఇవ్వబడని బదులుమాటలు కలవాడు కాగా, అంటే సమాధానం చెప్పలేకపోగా; ప్రాతికామికిన్; దుర్యోధనుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీకు తెలియకుంటే, ఆ జూదగాణ్ణి అడిగి వచ్చి- నన్ను పిలిచికొని వెళ్ళటం తగినట్లయితే పిలుచుకొని వెళ్ళు'- అని ద్రౌపది పలుకగా, ప్రాతికామి తిరిగి వచ్చి ఆమెమాటలు ధర్మరాజుకు చెప్పాడు. కాని, అతడు జూదంలో ఓడిపోయి దుఃఖంతో ఉండటంవల్ల ప్రాతికామికి బదులు చెప్పలేదు. అప్పుడు దుర్యోధనుడే ఇలా అన్నాడు.

**విశేషం:** 'నీకు తెలియకుంటే ఆ జూదగాడి నడిగి తెలుసుకొనిరా' అనే ఒక్క వాక్యంతో ఆ ప్రాతికామిని త్రిప్పిపంపిన ద్రౌపది వ్యక్తిత్వంలోని నిండుదనం, దిటవుతనం- విశేషించి ధర్మజుని ద్యూతవ్యసనం పట్ల ఆమె కుండే నిరసన, ఆవేదన పాఠకునికి పొడగట్టక మానవు. సామాన్యస్త్రీ ఎవరైనాసరే ఈ పరిస్థితిలో దుఃఖాతిరేకంతో చతికిలబడిపోయేదే. ద్రౌపదిది ఒక మహోన్నత వ్యక్తిత్వం.

**క. 'సందిగ్ధ మయిన యర్థము । నిందఱ సన్నిధిన యడిగి; తింద ఱెఱుంగన్**
**సుందరిఁ బాంచాలేంద్ర సు । తం దోడ్కొని రమ్ము, పొమ్ము! తడయక' యనినన్. 211**

**ప్రతిపదార్థం:** సందిగ్ధము+అయిన= సందేహమైన - అంటే ఖచ్చితంగా సమాధానం చెప్పటానికి వీలులేని దయిన; అర్థమున్= న్యాయాన్ని; ఇందఱ, సన్నిధిన= ఇంతమంది యెదుట; అడిగితి= అడిగావు; ఇందఱు+ఎఱుంగన్= ఈ సభలోని ఇందరూ తెలిసికొనటానికి వీలుగా; తడయక= ఆలస్యంచేయక; సుందరిన్= అందగత్తె అయిన; పాంచాల+ఇంద్రసుతన్= పాంచాలరాజుకూతురు ద్రౌపదిని; తోడ్కొని, రమ్ము.

**తాత్పర్యం:** 'ఖచ్చితంగా సమాధానం చెప్పటానికి వీలులేని న్యాయాన్ని ఇంతమంది ఎదుట అడిగావు. ఈ సభలోని వా రందరూ తెలుసుకొనేట్లు, అందగత్తె అయిన ఆ ద్రౌపదిని ఆలస్యం చేయకుండా తోడ్కొనిరా- వెళ్ళు' అని దుర్యోధను డనగా.

**విశేషం:** 'సందిగ్ధమయిన యర్థము నిందఱి సన్నిధికి వచ్చి యందఱ నడుగన్', 'యేర్పడ నడుగన్' అనే పాఠాంతరాలే ఇక్కడ స్పష్టార్థాలుగా ఉన్నాయి. (మూలంలోకంటె నన్నయచేసిన మార్పులను గురించి పీఠిక చదవండి. - సంపా.)

**వ. వాఁడును ద్రౌపది పాలికింబోయి 'దేవీ! నీ యడిగిన యర్థంబ నిర్ణయించువా రయి సభ్యులు నిన్ను రాఁబంచిరి; ర'మ్మనిన దుర్యోధను దుశ్చేష్టితంబునకు ధర్మరాజుసమ్మతంబునకు వెఱచి, యక్కోమలి ప్రాతికామిపిఱుంద నేకవస్త్రయు నధోనీవియు నవిరళగళితనయనోదకబిందుసందోహపరిపీడ్యమానపీనస్తన పరిధానాంతరయు నగుచు సభకుం జనుదెంచి కురువృద్ధుసమీపంబున నున్నంత; ద్రౌపదిం జూడ నోపక లజ్జితులయి దుఃఖాయమాన మానసులయి తలలు వాంచియున్న పాండవుల వైలక్ష్యం బుపలక్షించి సంతసిల్లి దుర్యోధనుండు దుశ్శాసనుం బిల్చి 'ప్రాతికామి వృకోదరునకు వెఱచు; నీవు వోయి ద్రౌపదిం దోడ్కొని ర'మ్మని పంచిన. 212**

**ప్రతిపదార్థం:** వాఁడును= ఆ ప్రాతికామియు; ద్రౌపది, పాలికిన్= ద్రౌపది దగ్గరకు; పోయి; దేవీ; నీ, అడిగిన= నీవు అడిగిన; అర్థంబు+అ= న్యాయాన్ని; నిర్ణయించువారు+అయి; సభ్యులు; నిన్ను; రాన్, పంచిరి= రమ్మని ఆజ్ఞాపించారు; రమ్ము+అనిన; దుర్యోధను= దుర్యోధనునియొక్క; దుశ్చేష్టితంబునకున్= చెడ్డపనికి; ధర్మరాజు= ధర్మరాజుయొక్క; సమ్మతంబునకున్= అంగీకారానికి; వెఱచి= భయపడి; ఆ+కోమలి= ఆ సుకుమారి అయిన ద్రౌపది; ప్రాతికామి, పిఱుందన్= ప్రాతికామి వెనుక; ఏకవస్త్రయున్= ఒకే బట్టను ధరించినదీ; అధోనీవియున్= కిందికి ఉన్న కోకముడి కలదీ; అవిరళ, గళిత, నయన+ఉదక, బిందు, సందోహ, పరిపీడ్యమాన, పీన, స్తన, పరిధాన+అంతరయున్= మెండుగా పడుతున్నకన్నీటి బిందువుల సమూహంచేత గట్టిగా బాధించబడుతున్న బలిసిన పాలిండ్ల కట్టువస్త్రంయొక్క చాటు కలదీ; అగుచున్; సభకున్; చనుదెంచి= వచ్చి; కురువృద్ధు, సమీపంబునన్= కురువంశంలో పెద్దవాడైన; ప్రభువైన ధృతరాష్ట్రుని ప్రక్కన; ఉన్న+అంతన్= నిలిచిఉండగా; ద్రౌపదిన్, చూడన్+ఓపక= చూడలేక; లజ్జితులు+అయి= సిగ్గుచెందినవాళ్ళయి; దుఃఖాయమానమానసులు+అయి= దుఃఖంతో నిండిన మనస్సులు కలవాళ్ళయి; తలలు, వాంచి= తలలు వంచుకొని; ఉన్న; పాండవులు; వైలక్ష్యంబు= సిగ్గు; ఉపలక్షించి= చూచి; సంతసిల్లి= సంతోషించి; దుర్యోధనుండు; దుశ్శాసనున్; పిల్చి; ప్రాతికామి; వృకోదరునకున్= భీమునికి; వెఱచున్= భయపడతాడు; నీవు; పోయి; ద్రౌపదిన్; తోడ్కొని= వెంటతీసుకొని; రమ్ము, అని; పంచినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఆ ప్రాతికామి ద్రౌపది దగ్గరకు వెళ్ళాడు. 'నీ వడిగిన న్యాయాన్ని నిర్ణయించటానికి సభ్యులు నిన్ను ర మ్మని ఆజ్ఞాపించారు. రా' - అన్నాడు. ద్రౌపది దుర్యోధనుని దుష్కృత్యానికి, ధర్మరాజు అంగీకారానికి భయపడింది. ధరించిన ఏకవస్త్రంతో, క్రిందికి ఉన్న కోకముడితో, ఎడతెరపిలేని కన్నీటి బిందువులతో, తడిసిన చనుకట్టుతో ప్రాతికామివెంట సభకు వెళ్ళింది. కురువృద్ధుడైన ధృతరాష్ట్రునిదగ్గర నిలిచింది. ద్రౌపదిదీనస్థితిని చూడలేక సిగ్గుతో దుఃఖిస్తూ, పాండవులు తలలు వంచుకొన్నారు. సిగ్గుతో తలలువంచుకొన్న పాండవుల్ని చూచి సుయోధనుడు సంతోషించాడు. దుశ్శాసనుణ్ణి పిలిచాడు. 'ప్రాతికామి భీముడికి భయపడతాడు. నీవు వెళ్ళి ద్రౌపదిని తీసుకురా' అని ఆజ్ఞాపించాడు. అప్పుడు

**విశేషం:** ప్రాతికామి మళ్లీ రావటంలోనే పాంచాలికి పరిస్థితుల తీవ్రత అర్థమైంది. దుర్యోధనుని దుర్మార్గ విజృంభణాన్ని, ధర్మజుని నిస్సహాయతను ఆమె గుర్తించింది. ఒక్క మాటలో అప్పుడు ప్రాతికామిని తిప్పిపంపిన ధీరోదాత్త గంభీర స్త్రీమూర్తి ఇప్పుడు 'కోమలి' అయి అతనివెంట కౌరవసభకు నడిచింది. ఈ కురువంశపుకోడలిమానమర్యాదలు కాపాడవలసిన బాధ్యత నీదే అన్నట్లు కురువృద్ధుడు, స్వార్థరహితుడు, ధర్మనిరతుడు అయిన ధృతరాష్ట్రుని ప్రక్క నిలిచింది. భర్తల బలహీనతను పరోక్షంగా ఎత్తిపొడిచింది. ఆనాడు ఓడలు బండ్లయ్యాయి. బండ్లు ఓడలయ్యాయి. అంతటి పాండవులు అడుగంటి క్రుంగిపోయారు. క్రుంగిన కౌరవులు పట్టపగ్గాలు లేని పొంగులో ఉన్నారు. అ దొక భయంకర వాతావరణం. (ఇందులో- కురువృద్ధు డంటే భీష్ము డనే అర్థం రూఢం. కాని, మూలంలో ద్రౌపది సభలోకి వచ్చి మామగారైన ధృతరాష్ట్రుడివద్ద నిలువబడిం దని చెప్పబడి ఉన్నది. ద్యూతంలో అధర్మవిజిత కావటంచేత ఆమె దాసి కాదు. పాండవులు తమ్ము తా మోడిపోవటంచేత వారికి ద్రౌపదిని పణంగా పెట్టే అధికారం లేదు. ఆమె అప్పుడు ధృతరాష్ట్రుడి అధికారంలోకి వస్తుంది. అతడు కాపాడకపోతే గాంధారిపొంతకు పోతుంది. ఇక్కడ అత్తమామల రక్షలోఉన్న కోడలు. మూలంలో ధర్మరాజు తన ప్రత్యేకదూతతో ఆవిధంగానే వ్యవహరించు మని చెప్పిపంపాడు. కాబట్టి ఆమె వచ్చి మామవద్ద నిలిచింది. ఆయన కాపాడకపోతే లోకులు ధృతరాష్ట్రుడిని నిందించా లని ఆ చర్యలోని అంతరార్థం. ఈ సందర్భంలో కురువృద్ధు డంటే ప్రకరణాన్నీ, ప్రయోజనాన్నీ అనుసరించి ధృతరాష్ట్రు డని అర్థం చెప్పాలి. భీష్ముడు ధృతరాష్ట్రుడి ప్రభుత్వాన్ని కా దని ఏ పనీ చేయలేడు. అతడు స్వయంగా చేసికొనిన నియమం అటువంటిది. అందువలననే అతడికి ద్రౌపదిమీద ఆ సందర్భంలో రక్షణాధికారం లేదు. అంతేకాదు అతడు రాజుకు విరుద్ధంగా ధర్మంకూడా చెప్పలేడు. భీష్ముడు నిర్లిప్తుడైతే గాంధారివద్దకు ద్రౌపది పోవటంలో అప్పుడు ఔచిత్యమే ఉండదు.

అందువలన ఇక్కడ కురువృద్ధు డంటే ధృతరాష్ట్రు డని గ్రహించటంవలన మూలంలోని కొన్ని అంశాలను తెలుగులోకి తేకుండా సంగ్రహించిన నన్నయకథనంలోకూడా సమన్వయం సాధించబడుతుంది. (పీఠికలోని వివరాలు చూడండి). (సంపా.)

**ఆ. నిర్దయాత్ముఁ బాపనిరతు దుశ్శాసనుఁ । బనుచు టెఱిఁగి కృష్ణ పంకజాక్షి**
**గడుభయంబు నొంది గాంధారియొద్దకు । నరిగెఁ గడు నడంగి యతిరయమున. 213**

**ప్రతిపదార్థం:** పంకజ+అక్షి= పద్మాలవంటి కన్నులు కలది; కృష్ణ= ద్రౌపది; నిర్దయ+ఆత్మున్= దయలేని హృదయం కలవాడిని; పాప, నిరతున్= పాపం చేయటంలో ఆసక్తి కలవాడిని; దుశ్శాసనున్; పనుచుట= పంపటం; ఎఱిఁగి= చూచి (తెలిసికొని); కడున్, భయంబున్= మిక్కిలి భీతిన్; ఒంది= పొంది; కడున్= చాలా; అడంగి= తగ్గి; అతి, రయమునన్= ఎంతో వేగంగా; గాంధారి, ఒద్దకున్= గాంధారి దగ్గరకు; అరిగెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** దయ లేని హృదయం కలవాడు, పాపం చేయటంలో ఆసక్తి కలవాడు అయిన దుశ్శాసనుణ్ణి పంపటం చూచి, పద్మాలవంటి కన్నులు కల ద్రౌపది మిక్కిలి భీతితో, ఎంతో కుంచించుకుపోయింది. ఒక్కపరుగున గాంధారీదేవి దగ్గరకు వెళ్ళింది.

**విశేషం:** దుర్యోధనదుశ్శాసనుల దౌష్ట్యాన్ని ధృతరాష్ట్రుడు ఆపకుండటం చూచి ఆ అబల - సాటిస్త్రీగా, కౌరవుల ఇంటి పెద్ద కోడలుగా 'నీవైనా నా గౌరవం కాపాడు' అన్నట్లు గాంధారిదగ్గరకు పరుగెత్తింది.

**చ. తడయక కౌరవానుజుఁడు దాని పిఱుందన పాఱి 'యింక నె**
**క్కడ కరుగంగఁబోలుఁ? జులుకం జను దెమ్మిట; సౌబలుండు ని**
**న్నొడిచె దురోదరంబునఁ; గురూత్తము నర్థమ వైతి; నిన్నునుం**
**బుడమిని దమ్ముఁ గోల్పడిరి పొల్తి! భవత్పతులైన పాండవుల్.' 214**

**ప్రతిపదార్థం:** తడయక= ఆలస్యం చేయక; కౌరవ+అనుజుఁడు= కౌరవుడైన దుర్యోధనుని తమ్ముడు; దాని, పిఱుందన= ఆ ద్రౌపది వెనుక; పాఱి= పరుగెత్తి; పొల్తి= ఓ కాంతా! ఇంకన్; ఎక్కడకున్; అరుగంగన్+పోలున్= వెళ్ళటానికి సాధ్యమవుతుంది?; చులుకన్= సులభంగా; ఇటన్= ఇక్కడికి; చనుదెమ్ము= రమ్ము; సౌబలుండు= శకుని; దురోదరంబునన్= జూదంలో; నిన్నున్+ఒడిచెన్= నిన్ను గెలిచాడు; కురు+ఉత్తము= కురుశ్రేష్ఠుడైన దుర్యోధనునియొక్క; అర్థమవు+ఐతి= సొత్తువైనావు; భవత్+పతులు+ ఐన= నీ భర్తలైన; పాండవుల్; నిన్నునున్; పుడమినిన్= భూమిని; తమ్మున్= తమను; కోలుపడిరి= కోల్పోయారు.

**తాత్పర్యం:** వెంటనే దుశ్శాసనుడు ఆ ద్రౌపదివెంట పరుగెత్తి 'ఓ కాంతా! ఇంక నీ వెక్కడికి వెళ్ళగలవు? చెప్పినట్లు విని ఇక్కడికి రా. జూదంలో శకుని నిన్ను గెలిచాడు. కురుశ్రేష్ఠుడైన దుర్యోధనుడి సొత్తువైనావు. నీ భర్తలు నిన్ను, రాజ్యాన్ని, తమను జూదంలో కోల్పోయారు.

**వ. అనుచు డాయ వచ్చిన నక్కోమలి 'రజస్వల నన్ను ముట్టకు; మేకవస్త్ర నయి యున్నదాన; గురుబంధు జనాధిష్ఠితంబైన సభకు నెట్లు రా నేర్తు?' ననిన 'నీ వేకవస్త్ర వైతేమి విగతవస్త్ర వైతేమి? ని న్నెట్లుం దోడ్కొని పోదు'నని బలాత్కారంబున. 215**

**ప్రతిపదార్థం:** అనుచున్; డాయన్, వచ్చినన్= దగ్గరకు రాగా; ఆ+కోమలి= ఆ ద్రౌపది; రజస్వలన్= ముట్టైన దానను (ఋతుమతిని); నన్నున్; ముట్టకుము= తాకకుము; ఏకవస్త్రను= ఒకే బట్టను కట్టుకొన్నదానిని; అయిఉన్నదానన్; గురు, బంధుజన+అధిష్ఠితంబు+ఐన= పెద్దలతో, బంధువులతో ఆక్రమించబడిందైన; సభకున్; ఎట్లు; రా నేర్తున్. అనినన్= అని అనగా; నీవు; ఏక, వస్త్రవు= ఒకే బట్ట కట్టుకొన్న దానివి; ఐతేమి= అయితే ఏమి? విగతవస్త్రవు= పూర్తిగా తొలగిన వస్త్రం కలదానివి; ఐతేమి= అయితే ఏమి? నిన్నున్; ఎట్లున్= ఏ విధంగా నైనా; తోడ్కొనిపోదును+అని= తీసుకొనిపోతా నని; బలాత్కారంబునన్= బలవంతంగా.

**తాత్పర్యం:** అంటూ దగ్గరకు రాగా, ఆ ద్రౌపది - 'నేను రజస్వలను, నన్ను తాకవద్దు. ఒకే బట్ట కట్టుకొని ఉన్నాను. పెద్దలు, బంధువులు కొలువుదీరిన ఈ సభకు ఎలా వస్తాను?' అని అనగా, దుశ్శాసనుడు 'నీవు ఒకే బట్ట కట్టుకొంటే ఏమి? లేదా అసలు బట్ట లేకుండా ఉంటే ఏమి? ఎలాగైనా నిన్ను తీసుకొని పోతాను' అని బలవంతంగా-

**విశేషం:** 'నేను రజస్వల నన్ను ముట్టకుండు మేకవస్త్ర' - అనే పాఠాంతరం పెక్కుప్రతుల్లో ఉంది.

### దుశ్శాసనుఁడు ద్రౌపదిని సభలోని కీడ్చి తెచ్చుట

**ఉ. ఆ వనజాననం గురుకులాపశదుండు గడంగి రాజసూ**
**యావభృథంబునందు వసుధామరమంత్రపవిత్రవారిధా**
**రావళిఁ జేసి పావనము లైన శిరోజములం దెమల్చి పా**
**పావహుఁ డీడ్చి తెచ్చె సభ కందఱు సంభ్రమమంది చూడఁగన్. 216**

**ప్రతిపదార్థం:** కురుకుల+అపశదుండు= కురువంశంలోని నీచుడు; పాప+ఆవహుఁడు= చెడుచేసేవాడు - అయిన దుశ్శాసనుడు; కడంగి= పూనుకొని, ఆ, వనజ+ఆననన్= పద్మంవంటిముఖంగల ఆ ద్రౌపదిని; రాజసూయ+అవభృథంబు+అందున్= రాజసూయయాగం చివర చేసిన అవభృథస్నానంలో; వసుధ+అమర, మంత్ర, పవిత్ర, వారి, ధారా+ఆవళిన్+చేసి= భూదేవతల-అంటే బ్రాహ్మణులయొక్క మంత్రాలచేత పవిత్రాలైన నీటిధారలచేత; పావనములు+ఐన= పవిత్రాలైన; శిరోజములన్= తలవెంద్రుకలను; తెమల్చి= పట్టుకొని; అందఱు= సభలోనివాళ్ళంతా; సంభ్రమము+అంది= భయపడి; చూడఁగన్; సభకున్; ఈడ్చి; తెచ్చెన్.

**తాత్పర్యం:** కురుకులనీచుడు, పాపాత్ముడు అయిన దుశ్శాసనుడు పూని, పద్మంవంటి ముఖం గల ఆ ద్రౌపదిని - రాజసూయ యాగం చివర చేసిన అవభృథస్నానంలో, బ్రాహ్మణుల మంత్రాలచేత పవిత్రాలైన నీటి ధారలతో పావనాలైన తలవెంద్రుకలను పట్టి అందరు భయపడి చూస్తుండగా సభకు ఈడ్చి తెచ్చాడు.

**విశేషం:** ద్రౌపది శిరోజాలకు నన్నయ ప్రయోగించిన సుదీర్ఘ విశేషణాలు-వాటి పవిత్రతనేకాక, పొడవును, సౌందర్యాన్ని, పట్టిలాగబడిన ఆ శిరోజాలు భావిభారత కథలో వహించనున్న ప్రాధాన్యాన్ని పరోక్షంగా సూచించేవిగా ఉన్నాయి. కులకాంతను పదిమందిలో జుట్టుబట్టి లాగటం పెద్దదోషం. అందులోను సార్వభౌమయోగ్యమైన రాజసూయయాగం చేసిన శక్తిసంపన్నుల ధర్మపత్ని ద్రౌపదిని, నిండుసభలో అవభృథస్నానంచేత పవిత్రాలైన ఆమె సుదీర్ఘ శిరోజాలు పట్టి లాగటం మహాపాపమే కాదు, మిక్కిలి ప్రమాదకరంకూడ. పుట్టలోని నల్లత్రాచును పట్టి లాగినట్లే. ఈ శిరోజాలు-సంధికి వెళ్ళే శ్రీకృష్ణునికి ద్రౌపదిచేత 'ఇవి దుస్ససేను వ్రేళ్ళం దవిలి సగము ద్రెవ్విపోయి తక్కిన యవి కౌరవులకడఁ దీఱుమాటల యవసరమునఁ దలపవలయు నచ్యుత నీనిన్' అని చెప్పించాయి. 'ఈ వెంద్రుకలు వట్టి యీడ్చిన యా చేయి దొలుతగాఁ బోరిలో దుస్ససేను, తను వింతలింతలు

తునియలై చెదరి రూపఱియున్నఁ గని యుడుకాఱుఁగాక' అని పలికించాయి. సంధి ప్రయత్నాన్ని చేతనైనంతవరకు బలహీన పరిచాయి. ఈ పద్యరచనలో శ్లేష మనేగుణం రసోదంచితంగా పోషించబడింది (వివరాలకు చూడు: పీఠిక). (సంపా.)

**వ. ఇట్లు వాతావధూతంబైన పతాకయుంబోలె దుశ్శాసనాకృష్టయై ద్రౌపది వికీర్ణకేశయు వివర్ణవదనయునై కర్ణ దుర్యోధన శకుని సైంధవాది దుష్ట భూయిష్ఠంబైన సభకు వచ్చి కోపలజ్జాపరవశ యయి. 217**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వాత+అవధూతంబు+ఐన= గాలిచేత కదలించబడిందైన; పతాకయున్, పోలెన్= జెండావలె; దుశ్శాసన+ఆకృష్ట+ఐ= దుశ్శాసనునిచేత లాగబడినదై; ద్రౌపది; వికీర్ణ, కేశయున్= చెదరిన వెంట్రుకలు గలదియు; వివర్ణవదనయున్+ఐ= వెలవెలబోయిన ముఖం కలదియు అయి; కర్ణ, దుర్యోధన, శకుని, సైంధవ+ఆది= కర్ణుడు, దుర్యోధనుడు, శకుని, సైంధవుడు మొదలయిన; దుష్ట, భూయిష్ఠంబు+ఐన= దుర్మార్గులతో నిండినదైన; సభకున్; వచ్చి; కోప; లజ్జా, పరవశ+ అయి= కోపంచేత, సిగ్గుచేత మై మరచినదై;

**తాత్పర్యం:** ఈ విధంగా గాలిచే కదలించబడిన జెండావలె దుశ్శాసనునిచేత ఈడ్వబడిన ద్రౌపది, చెదిరిన జుట్టుతో, వెలవెలబోయిన ముఖంతో-కర్ణుడు, దుర్యోధనుడు, శకుని, సైంధవుడు మొదలయిన దుర్మార్గులతో నిండిన సభకు వచ్చి, కోపంతో సిగ్గుతో మైమరచినదై.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. అనుపమ దైవయోగహతుఁ డయ్యు నవశ్యము ధర్మసంపదం**
**దనరున కాక ధర్మజుఁడు ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁద్రొ**
**క్కునె కురువృద్ధులార! భృశకోపనుఁ డీతఁడు నన్ను నేల దు**
**ర్జనుఁ డిట యీడ్చి తెచ్చె నవిచారపరుం డయి దుర్మదంబునన్. 218**

**ప్రతిపదార్థం:** కురువృద్ధులార= కురువంశంలోని పెద్దలారా!; అనుపమ, దైవ, యోగ, హతుఁడు+అయ్యున్= సాటిలేని దైవయోగంచేత కొట్టబడినవాడైనను; ధన్యుఁడు= పుణ్యాత్ముడు; ధర్మజుఁడు; అవశ్యము= తప్పక; ధర్మసంపదన్= ధర్మమనే ఐశ్వర్యంతో; తనరును+అ+కాక= ఒప్పునేకాని; ధర్మపథంబు= ధర్మమార్గం; తప్పన్+త్రొక్కునె= తప్పి నడుస్తాడా?; భృశకోపనుఁడు= అధికకోపంకలవాడు; దుర్జనుఁడు= చెడ్డవాడు; ఈతఁడు= ఈ దుశ్శాసనుడు; దుర్మదంబునన్= కండకావరంతో; అవిచారపరుండు+అయి= ఆలోచన లేనివాడై; నన్నున్; ఏల; ఇటన్= ఈ సభకు; ఈడ్చి; తెచ్చెన్.

**తాత్పర్యం:** కురువంశంలోని పెద్దలారా! సాటిలేని దురదృష్టాలచేత దెబ్బతిన్నప్పటికీ, పుణ్యాత్ముడైన ధర్మరాజు ఎల్లప్పుడు ధర్మమనే సంపదతో ప్రకాశిస్తాడేకాని, ధర్మమార్గం తప్పి నడుస్తాడా? అధికకోపం కలవాడు, చెడ్డవాడు అయిన ఈ దుశ్శాసనుడు కండకావరంతో అవివేకంగా న న్నెందుకు ఈ సభకు ఈడ్చి తెచ్చాడు?

**విశేషం:** లౌకిక సంపదలు కోల్పోయినా ధర్మరాజు నిత్యధర్మసంపన్నుడు. అతని చర్యల్లోని ధర్మసూక్ష్మాన్ని గుర్తించలేని అవివేకి దుశ్శాసనుడు. 'అతడు ఏ ధర్మాన్ని ఆశ్రయించి నన్ను సభకు తెచ్చాడు?' అని ద్రౌపది ప్రశ్నించింది. ఆమెను సభకు రప్పించటంలో ధర్మం లేదనీ, మదమొక్కటే కారణ మనీ ఆమె సభకు నివేదించుకొన్నది. (ఈ మాటల కీ ఘట్టంలో లోతైన అర్థాలు ఉన్నాయి. వివరాలకు పీఠిక చూడండి). (సంపా.)

**చ. 'ఇది యుచితంబు గా దనక యిక్కురుముఖ్యులు సూచుచుండ దు**
**ర్మదుఁ డయి వీఁడు నన్ను నవమానితఁ జేసెడి; సర్వధర్మ సం**
**విదు లన నున్న యీ భరతవీరులవంశము నేఁ డధర్మ సం**
**పద నతినింద్య మయ్యె' నని భామిని గృష్ణుఁ దలంచె భీతయై. 219**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ విధంగా జుట్టుపట్టి ఈడ్చితేవటం; ఉచితంబు= తగినది; కాదు+అనక= కాదని అనకుండా; ఈ+కురు, ముఖ్యులు= ఈ కురువంశంలోని ముఖ్యమైనవాళ్ళు - అంటే భీష్మ ధృతరాష్ట్రాది ప్రముఖులు; చూచుచున్+ఉండన్; దుర్మదుఁడు+అయి= క్రొవ్వినవాడై; వీఁడు= ఈ దుశ్శాసనుడు; నన్నున్; అవమానితన్= అవమానించ బడిన దానినిగా; చేసెడిన్= చేస్తున్నాడు; సర్వ, ధర్మ, సంవిదులు+అనన్= అన్నిధర్మాలు బాగుగా తెలిసినవారు అనునట్లుగా; ఉన్న; ఈ భరతవీరుల, వంశము; నేఁడు; అధర్మ, సంపదన్= అధర్మం పెరగటంచేత; అతి నింద్యము= మిక్కిలి నిందించదగినది; అయ్యెన్+ అని; భామిని= కోపం గల స్త్రీ - ద్రౌపది; భీత+ఐ= భయపడిందై; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; తలంచెన్= తలచుకొన్నది.

**తాత్పర్యం:** 'ఈ విధంగా నన్ను జుట్టుపట్టి ఈడ్చితేవటం ఉచితం కాదని భావించక, ఈ కురువంశప్రముఖులంతా చూస్తుండగా, క్రొవ్విన ఈ దుశ్శాసనుడు న న్నవమానిస్తున్నాడు. అన్ని ధర్మాలు పూర్తిగా తెలిసినవా ళ్ళని పేరు పొందిన ఈ భరతవీరుల వంశం ఈనాడు అధర్మం పెరగటంచేత ఎంతో నిందించదగినది అయిం' దని కోపించిన ద్రౌపది భయపడి శ్రీకృష్ణుణ్ణి స్మరించింది.

**విశేషం:** కురువంశపు పెద్దలను ఉద్దేశించి ద్రౌపది అన్నమాటల్లో మంటలు కనబడకపోవచ్చు గాని వేడిమాత్రం విపరీతంగా ఉంది. (భయభావదీప్తిని సూచిస్తూ ఔజ్జ్వల్యంతో కూడుకొన్న మాటలరచన గల ఈ పద్యంలో కాంతిగుణం ప్రకాశిస్తున్నది. -సంపా.)

**వ. ఇట్లు జగత్త్రయ విజయ భుజవీర్య సనాథులైన నాథులు గలిగియు ననాథయుంబోలెఁ బాంచాలరాజపుత్త్రి భయార్తయై యార్తజన శరణ్యుండైన జగన్నాథు జనార్దనుం దలంచుచుఁగపట ద్యూతమధుమదోన్మత్తుండయిన ధర్మపుత్త్రు నిమిత్తంబున నుద్గతంబయిన పాండవపరాజయ దహనంబుఁ దన రూక్ష కటాక్ష వీక్షణ వచనంబులఁ బ్రవర్తించుచున్నదానిఁ జూచి దుఃఖితుండై భీమసేనుండు ధర్మరాజున కి ట్లనియె. 220**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; జగత్త్రయ, విజయ, భుజవీర్య, సనాథులు+ఐన= ముల్లోకాలను జయించగల భుజబలంతో కూడుకొన్న వాళ్ళయిన; నాథులు= భర్తలు; కలిగియున్; అనాథయున్+పోలెన్= భర్తలేని దాని వలె-అంటే దిక్కులేని దాని వలె; పాంచాల రాజపుత్త్రి= ద్రౌపది; భయ+ఆర్త+ఐ= భయంచేత దుఃఖంపొందిందై; ఆర్తజనశరణ్యుండు+ఐన= దుఃఖంలో ఉండే జనులు రక్షణ వేడదగినవాడైన; జగన్నాథున్= జగత్తు కంతటికి ప్రభు వైనవాణ్ణి; జనార్దనున్= శ్రీమహావిష్ణువును - ఆయన అవతారమైన శ్రీకృష్ణుణ్ణి; తలంచుచున్= తలచుకొంటూ; కపట, ద్యూత, మధు, మద+ఉన్మత్తుండు+అయిన= కపటపుజూదమనే మద్యపానమదంచేత మిక్కిలి మత్తెక్కి ఉన్న వాడైన; ధర్మపుత్త్రు, నిమిత్తంబునన్= ధర్మరాజు కారణంగా; ఉద్గతంబు+అయిన= పుట్టిన; పాండవ పరాజయ, దహనంబున్= పాండవుల ఓటమి అనే అగ్నిని; తన, రూక్ష, కటాక్ష, వీక్షణ, వచనంబులన్= తనయొక్క కఠినాలైన చూపులలో, మాటలలో; ప్రవర్తించుచున్నదానిన్= ప్రకటిస్తున్న ద్రౌపదిని; చూచి; దుఃఖితుండు+ఐ= దుఃఖంపొందినవాడై; భీమసేనుండు; ధర్మరాజునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా ముల్లోకాలను జయించగల భుజబలం ఉన్న భర్తలు గల ద్రౌపది, దిక్కులేనిదానిలా భయంతో దుఃఖిస్తూ - దుఃఖంలో ఉన్నవా ళ్ళందరు శరణు వేడదగినవాడు, జగత్తు కంతటికి ప్రభువు అయిన శ్రీకృష్ణుణ్ణి మనస్సులో తలచుకొంటూ, కపటపు జూద మనేమద్యపానమదంచేత మత్తెక్కిన ధర్మరాజువల్ల పుట్టిన పాండవుల ఓటమి అనే అగ్నిని కఠినాలైన తన చూపుల్లో, మాటల్లో వ్యక్తం చేయటం చూచి, భీమసేనుడు దుఃఖపడుతూ ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**విశేషం:** అలం. రూపకం. అందరు ఉన్నా ద్రౌపదికి ఎవ్వరూ లేనట్లే అయింది. ఇక దిక్కులేనివాళ్ళకు దేవుడే దిక్కుగదా! అందుకే ఆమె శ్రీకృష్ణుణ్ణి స్మరించింది.

**క. ధన కనక రత్న వరవా । హన ధరణీ రాజ్యములును నాయుధములు మ**
**మ్మును నోటువడుట యుచితమ । యినసన్నిభ! వీని కెల్ల నీశుఁడ వగుటన్. 221**

**ప్రతిపదార్థం:** ఇన, సన్నిభ= సూర్యునితో సమానమైనవాడా! ఓ ధర్మరాజా!; ధన, కనక, రత్న, వరవాహన, ధరణీ, రాజ్యములునున్= డబ్బును, బంగారాన్ని, రత్నాలను, శ్రేష్ఠములైన వాహనాలను, రాజ్యాన్ని, ఆయుధాలను; మమ్మునున్= తమ్ముళ్ళమైన నలువురను; వీనికిన్+ఎల్లన్= వీటి కన్నింటికి; నీవు; ఈశుఁడవు= ప్రభుడవు; అగుటన్= అవటంచేత; ఓటు, పడుట= జూదంలో ఒడ్డి ఓడిపోవటం; ఉచితము+అ= తగినదే.

**తాత్పర్యం:** సూర్యునితో సమానమైన ఓ ధర్మరాజా! ధన, కనక, రత్న, వాహనాలకు, రాజ్యానికి, ఆయుధాలకు, తమ్ములమైన మా నల్వురకు - నీవు ప్రభుడవు. కాబట్టి, జూదంలో ఒడ్డి ఓడిపోవటం ఉచితమే.

**క. ద్రుపదతనూజం బణముగఁ । గపటద్యూతమునఁ జేయఁగాఁ దగునె జనా**
**ధిప! యిది దుష్టద్యూతము । నెపమునఁ బరిభూత యయ్యె నిష్కరుణులచేన్. 222**

**ప్రతిపదార్థం:** జన+అధిప= రాజా!; ద్రుపద, తనూజన్= ద్రౌపదిని; కపట, ద్యూతమునన్= మోసపు జూదంలో; పణముగాన్= పందెంగా; చేయఁగాన్+తగునె= చేయటం తగునా?; ఇది= ద్రౌపది; దుష్ట, ద్యూతము, నెపమునన్= ఈ చెడుజూదం కారణంగా; నిష్కరుణులచేన్= దయలేని వారి చేత; పరిభూత+అయ్యెన్= అవమానించబడినది అయింది.

**తాత్పర్యం:** ఓరాజా! ద్రౌపదిని కపటపు జూదంలో పందెంగా ఒడ్డదగునా! ఈ చెడుజూదం కారణంగా ఆమె ఈ దయలేనివాళ్ళచేత అవమానింపబడింది.

**వ. 'శకునికైతవం బెఱింగియుం బాపద్యూతంబునఁ బ్రవర్తించి యధర్మ ప్రవృత్తుండ వయితి కావున భవద్బాహు దాహంబు సేయవలయు' నని కోపించి పలికినం బవనతనయునకు నర్జునుం డి ట్లనియె. 223**

**ప్రతిపదార్థం:** శకుని, కైతవంబు= శకునియొక్కకపటాన్ని; ఎఱింగియున్= తెలిసియు; పాప, ద్యూతంబునన్= చెడ్డజూదంలో; ప్రవర్తించి= పాల్గొని; అధర్మ ప్రవృత్తుండవు+అయితి= అధర్మంలో నడిచినవాడి వయ్యావు; కావున; భవత్+బాహు, దాహంబు= నీయొక్క చేతులను కాల్చటం; చేయవలయున్, అని కోపించి; పలికినన్, పవనతనయునకున్= వాయుదేవుని కుమారుడైన భీమునికి; అర్జునుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'శకునిమోసం తెలిసికూడ నీవు చెడుజూదంలో పాల్గొని, అధర్మమార్గాన నడిచినవాడి వయ్యావు. అందుచేత నీ చేతులు కాల్చాలి' అని కోపంతో పలికిన భీమునికి అర్జునుడు ఇలా అన్నాడు.

**విశేషం:** ఇక్కడ మూలంలో "బాహూ తే సంప్రధక్ష్యామి సహదేవాగ్ని మానయ" (భండార్కరు ప్రతి 2-61-6) అని ఉంది. సహదేవుణ్ణి అగ్ని తెమ్మనటం తెలుగులో లేదు. కాగా 'బాహూ తే సంప్రధక్ష్యామి' అనటాన్ని రెండు విధాలుగా పండితులు అన్వయించటం జరిగింది. తే బాహూ= నీ బాహువులను; సంప్రధక్ష్యామి= తగులబెడతాను - అనటం ఒకటి, తే=తే(పురతః), బాహూ=(మమ) బాహూ, సంప్రధక్ష్యామి= తగులబెడతాను (నీ ఎదుట నా బాహువులను తగులబెడతాను) అని అనటం మరొకటి. భీముడు అన్నగారి బాహువులను తగులబెడతానని అంటాడా? అందుచేత ఏమీ చేయలేక తన బాహువులను తానే తగులబెట్టుకొంటా నన్నా డని మరొక వర్గంవారి అభిప్రాయం. కాని, ఆ సందర్భంలో ఆవేశపరుడైన భీముడు అన్నగారిని అలా అనటమే సమంజస మనిపిస్తున్నది. అందుచేతనే అర్జునుడు ధర్మరాజును సమర్థించవలసివచ్చింది. పైగా భీముడు ధర్మరాజును ఎదిరించి మాట్లాడిన సందర్భాలు భారతంలో లేకపోలేదు. నన్నయ అనువాదమే ఈ సందర్భంలో చక్కగా అతుకుతున్నది.

**సీ.** **ధర్మతనూజుండు ధర్మువు దప్పిన । ధరణీతలం బెల్లఁ దల్లడిల్లుఁ;**
**దగిలి సుహృద్ద్యూత ధర్మయుద్ధములకుఁ । బరులచేఁ బిలువంగఁబడి విభుండు**
**గడగక విముఖుండు గాఁ జన దని శుభ । క్షాత్త్రధర్మంబు లోకంబునందు**
**నిలిపెఁ దా; నిది పతినేరమియే? దైవ । వైపరీత్యం బైన వనరఁ దగునె?**

**ఆ.** **గురుల ధర్మపరులఁ గోపించి ధీరు ల । తిక్రమింతురే? తదీయనిత్య**
**ధర్మగౌరవం బధార్మికు లగుచున్న । పరులచేతఁ జెఱుపఁబడియె నిట్లు.** **224**

**ప్రతిపదార్థం:** ధర్మతనూజుండు= ధర్మరాజు; ధర్మువు= ధర్మం; తప్పినన్; ధరణీతలంబు+ఎల్లన్= భూమండలం అంతా; తల్లడిల్లున్; తగిలి= వెంటబడి; సుహృత్+ద్యూత, ధర్మయుద్ధములకున్= స్నేహంగా ఆడుకొనే జూదానికి, ధర్మంకోసం చేసే యుద్ధానికి; పరులచేన్= ఇతరులచేత; పిలువంగఁబడి; విభుండు= రాజు; కడగక= పూనుకొనక; విముఖుండు= పెడమొగం పెట్టినవాడు; కాన్+చనదు+అని= కాకూడ దని; శుభ, క్షాత్ర, ధర్మంబు= శుభమైన క్షత్రియధర్మాన్ని; లోకంబునందున్; తాన్= తాను; నిలిపెన్; ఇది; పతి, నేరమియే= ధర్మరాజుయొక్క అజ్ఞానమా?; దైవవైపరీత్యంబు+ఐనన్= దేవునిదయ తారుమారైతే; వనరన్= దుఃఖించ; తగునె= తగునా?; గురులన్= పెద్దవాళ్ళను; ధర్మపరులన్= ధర్మాన్ని పాటించేవాళ్ళను; కోపించి; ధీరులు= నీవంటి ధైర్యవంతులు; అతిక్రమింతురే= మర్యాదను మీరుతారా!; తదీయ, నిత్య, ధర్మ, గౌరవంబు= ఆయనయొక్క (ధర్మరాజుయొక్క) శాశ్వతమైన ధర్మంయొక్క గొప్పతనం; అధార్మికులు= ధర్మహీనులు; అగుచున్+ఉన్న; పరులచేతన్= ఇతరులచేత; ఇట్లు; చెఱుపన్+పడియెన్= చెడగొట్టబడింది.

**తాత్పర్యం:** ధర్మరాజే ధర్మం తప్పితే భూమండలమంతా తల్లడిల్లదా? స్నేహంగా ఆడుకొనే జూదానికి, ధర్మంకొరకు చేసే యుద్ధానికి ఇతరులు పలుమార్లు పిలిస్తే, ప్రభువైనవాడు అందుకు పూనుకోకుండా, పెడమొగంపెట్టి పోకూడదన్న శుభక్షత్రియధర్మాన్ని, ఆయన లోకంలో నిలిపాడు. అంతేకాని ధర్మరాజు ఈ జూదమాడటం అజ్ఞానంవల్లనా? దైవానుగ్రహం తారుమారైతే అందుకు దుఃఖించటం తగునా? ధర్మజుని శాశ్వతమైన ధర్మగౌరవం- ధర్మహీనులైన ఇతరులచేత ఈ విధంగా చెడగొట్టబడింది.

**విశేషం:** అర్జునునిసమర్థన భీముని ఆగ్రహావేశానికి సకాలంలో చక్కని అడ్డుకట్ట వేసింది.

**వ. అనుచు దుఃఖితులగు చున్న పాండవులను దుశ్శాసనాపకృష్టయై సభాంతరంబున నున్న ద్రౌపదిం జూచి వికర్ణుం డన్యాయశ్రవణవికర్ణులై మిన్నకున్న సభ్యుల కి ట్లనియె. 225**

**ప్రతిపదార్థం:** అనుచున్; దుఃఖితులు+అగుచున్+ఉన్న; పాండవులను; దుశ్శాసన+అపకృష్ట+ఐ= దుశ్శాసనునిచేత ఈడ్వబడిందై; సభా+అంతరమునన్= సభమధ్య; ఉన్న; ద్రౌపదిన్, చూచి; వికర్ణుండు; అన్యాయ, శ్రవణ, వికర్ణులు+ఐ= అన్యాయాన్ని వినటానికి చెవులు లేనివాళ్ళయి - అంటే అన్యాయాన్నిగూర్చి వినటానికి ఒల్లనివాళ్ళయి; మిన్నక+ఉన్న= ఊరకున్న; సభ్యులకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని దుఃఖిస్తున్న పాండవులను, దుశ్శాసనునిచేత ఈడ్వబడి సభామధ్యంలో ఉన్న ద్రౌపదిని చూచి, అన్యాయాన్ని గూర్చి వినటానికి ఇష్టపడని సభాసదులతో వికర్ణుడు ఇలా అన్నాడు.

**విశేషం:** దుర్యోధనుని తొంబయితొమ్మిదిమంది తమ్ముళ్ళలో వికర్ణుడు ఒకడు. కొంత న్యాయాన్యాయ పరిగణన, ధార్మికావేశం కలవాడు.

**క. సమచిత్తవృత్తు లగు బు । ద్ధిమంతులకు నిపుడు ద్రౌపదీప్రశ్న విచా**
**రము సేయ వలయు; నవిచా । రమునఁ బ్రవర్తిల్లు టది నరకహేతు వగున్. 226**

**ప్రతిపదార్థం:** సమచిత్తవృత్తులు+అగు= పక్షపాతం లేని మనస్సు కలవాళ్ళయిన; బుద్ధిమంతులకున్= మేధావులకు- ఆలోచనాపరులకు; ఇప్పుడు; ద్రౌపదీ, ప్రశ్న= ద్రౌపది వేసిన ప్రశ్న; విచారము, చేయవలయున్= ఆలోచించవలసి ఉన్నది; అవిచారమునన్= ఆలోచించకుండ; ప్రవర్తిల్లుట= ఉండటం; అది; నరకహేతువు+అగున్= నరకం పొందటానికి కారణ మవుతుంది.

**తాత్పర్యం:** పక్షపాతంలేని బుద్ధిమంతు లంతా ఇప్పుడు ద్రౌపది అడిగిన ప్రశ్నను విచారించవలసిన అవసరముంది. అలా విచారించకుండ మన కెందుకు లెమ్మని ఊరకుంటే అది నరక హేతు వౌతుంది.

**వ. 'ఇక్కురువృద్ధు లైన భీష్మ ధృతరాష్ట్ర విదురాదులును నాచార్యులయిన ద్రోణకృపాదులుం బలుకరైరి; యున్న సభాసదులెల్లం గామక్రోధాదులు దక్కి విచారించి చెప్పుం'డనిన నెవ్వరుం బలుకకున్న 'నే నిందు ధర్మ నిర్ణయంబు సేసెద; నెల్లవారును వినుండు; జూదంబును వేఁటయుఁ బానంబును బహుభక్షణాసక్తియు నను నాలుగు దుర్వ్యసనంబులం దగిలిన పురుషుండు ధర్మువుం దప్పివర్తిల్లు; నట్టి వాని కృత్యంబులు సేకొనం దగవు; కిత వాహూతుండై వ్యసనవర్తి యయి పరాజితుం డయిన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణ ధనంబయిన పాంచాలిఁ బణంబుఁ జేసెం గావున ద్రౌపది యధర్మవిజిత; యక్కోమలి నేకవస్త్ర నిట దోడ్కొని తెచ్చుట యన్యాయం' బనిన వికర్ణుపలుకుల కొడంబడక కర్ణుండు వాని కి ట్లనియె. 227**

**ప్రతిపదార్థం:** ఈ+కురువృద్ధులు+ఐన= ఈ కురువంశపు పెద్దలైన; భీష్మ, ధృతరాష్ట్ర, విదుర+ఆదులునున్= భీష్ముడు, ధృతరాష్ట్రుడు, విదురుడు మొదలయినవాళ్ళూ; ఆచార్యులు+అయిన= గురువులైన; ద్రోణ, కృప+ఆదులున్= ద్రోణుడు, కృపుడు మొదలయినవాళ్ళూ; పలుకరు+ఐరి= మాటాడకున్నారు; ఉన్న= మిగిలిఉన్న- తక్కిన; సభాసదులు+ఎల్లన్= సభలో

కూర్చున్న ధర్మం తెలిసిన వాళ్ళంతా; కామ, క్రోధ+ఆదులు= రాగం, ద్వేషం మొదలైనవి; తక్కి= మాని; విచారించి= ఆలోచించి; చెప్పుండు; అనినన్; ఎవ్వరున్= ఎవరుకూడ; పలుకక; ఉన్నన్; ఏన్= నేను; ఇందున్= ఇక్కడ; ధర్మనిర్ణయంబు= ధర్మాన్ని గురించిన నిర్ణయం; చేసెదన్; ఎల్లవారును= అందరు; వినుండు; జూదంబును; వేఁటయున్; పానంబును= మద్యపానం; బహు, భక్షణ+ఆసక్తియున్= అతిగా తినటంలోని మితిమీరిన కోరిక; అను నాలుగు, దుర్వ్యసనంబులన్= చెడు వ్యసనాలలో; తగిలిన= తగుల్కొన్న; పురుషుండు= మానవుడు, ధర్మువున్= ధర్మాన్ని; తప్పి, వర్తిల్లున్= ప్రవర్తిస్తాడు; అట్టి వాని; కృత్యంబులు= పనులు; చేకొనన్, తగవు= లెక్కలోకి తీసుకోదగినవికావు; కితవ+ఆహూతుండు+ఐ= జూదరిచేత పిలువబడినవాడై; వ్యసన, వర్తి+అయి= జూదవ్యసనంలో తగుల్కొన్నవాడై; పరాజితుండు+అయిన= ఓడిపోయిన; పాండవ+అగ్రజుండు= పాండవులందు ముందు పుట్టినవాడు - ధర్మరాజు; పాండవులకున్+అందఱకు; సాధారణ ధనంబు+అయిన= ఉమ్మడిసొమ్ము అయిన; పాంచాలిన్= ద్రౌపదిని; పణంబున్+చేసెన్= పందెంగా చేశాడు; కావున; ద్రౌపది; అధర్మ, విజిత= అధర్మంచేత జయింపబడింది; ఆ+కోమలిన్= ఆ సుకుమారిని; ఏక, వస్త్రన్= ఒకే బట్టను ధరించినదానిని; ఇటన్= ఇక్కడికి; తోడ్కొని; తెచ్చుట; అన్యాయంబు; అనిన; వికర్ణు, పలుకులకున్= వికర్ణుని మాటలకు; ఒడంబడక= ఒప్పుకొనక; కర్ణుండు; వానికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఈ కురువంశపు పెద్దలైన భీష్ముడు, ధృతరాష్ట్రుడు, విదురుడు మొదలయినవాళ్ళూ, గురువులైన ద్రోణుడు, కృపుడు మొదలయినవాళ్ళూ మౌనంగా ఉన్నారు. సభలో కూర్చున్నవాళ్ళలో మిగిలిన ధర్మజ్ఞులైనా రాగద్వేషాలు మాని ఆలోచించి చెప్పండి' - అని వికర్ణు డనగా, ఎవ్వరూ పలుకలేదు. అప్పుడు వికర్ణుడు 'నేనే ఇక్కడ ధర్మనిర్ణయం చేస్తాను. అందరు వినండి. జూదం, వేట, మద్యపానం, అతిగా తినటం అనే నాలుగూ చెడు వ్యసనాలు. వీటిలో తగుల్కొన్న మానవుడు ధర్మంతప్పి ప్రవర్తిస్తాడు. అలాంటివాడి పనులు లెక్కలోకి తీసుకోకూడదు. జూదగానిచేత ఆహ్వానించబడి, జూదవ్యసనంలో తగుల్కొని ఓడిపోయిన ధర్మరాజు, పాండవు లందరికి ఉమ్మడిసొమ్ము అయిన పాంచాలిని పందెంగా చేశాడు. అందుచేత ఆమె అధర్మంచేత జయించబడింది. ఆ సుకుమారిని- ఒకేవస్త్రం ధరించి ఉన్నదాన్ని, ఇక్కడికి తీసుకొని రావటం అన్యాయం' అని వికర్ణు డనగా ఆ మాటలను అంగీకరించక కర్ణు డతనితో ఇలా అన్నాడు.

**విశేషం:** వ్యసన మంటే కామక్రోధాదులవల్ల పుట్టే దోషం. ఇవి ఏడు. జూదం, మద్యపానం, వేట, స్త్రీవ్యామోహం (ఈ నాలుగు కామం వల్ల పుట్టేవి), వాక్పారుష్యం, దండపారుష్యం, అర్థదూషణం (ఈమూడూ క్రోధంవల్ల పుట్టేవి). పై వచనంలో 'బహుభక్షణాసక్తి' అనే దానికి 'పరనారీ బహుళాసక్తి' అనే పాఠాంతరం ఉంది. ఇదే మేల్తరం, మూలానుగుణం అనిపిస్తుంది.

**ఆ. 'ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు । బేల! నీకుఁ జెప్ప నేల వలసెఁ?**
**జిఱుతవాని కింత తఱుసంటి పలుకులు । సన్నె వృద్ధజనము లున్నచోట? 228**

**ప్రతిపదార్థం:** ఎల్లవారున్= అందరు; ఎఱుఁగన్+ఒల్లని= తెలియటానికి ఇష్టపడని; ధర్మువు= ధర్మం; బేల= మూఢుడా! నీకున్, ఏల; చెప్పన్, వలసెన్= చెప్పవలసివచ్చింది, వృద్ధ, జనములు= పెద్దవాళ్ళు; ఉన్నచోటన్; చిఱుతవానికిన్= చిన్నవాడికి; ఇంత; తఱుసంటి, పలుకులు= అధికప్రసంగాలు; చన్నె= తగునా? (తగదని భావం).

**తాత్పర్యం:** ఎవ్వరూ తెలియటానికి ఇష్టపడని ధర్మాన్ని మూఢుడా! నీ వెందుకు చెప్పవలసివచ్చింది? పెద్దవాళ్ళుండే చోట చిన్నవాడికి ఈ అధికప్రసంగా లెందుకు?

**విశేషం:** నిండుసభల్లో పెద్ద లెవరైనా పిన్నవారిని ఈసడింపుతో అధిక్షేపించే సందర్భాలలో ఈ పద్యాన్ని వాడుతూ ఉండటం ప్రసిద్ధి. అది నన్నయగారి రుచిరార్థసూక్తిమత్త్వానికి మచ్చుతునక. ఈ పద్యరచనలో 'బేల!' అన్నసంబోధన అవహేళనాత్మకం. 'చిఱుతవాని కింత తఱుసంటిపలుకులు' అనేమాట అధిక్షేపాత్మకం. తెలుగుమాటలతో కూడిన వాక్యాల నృత్యవద్భావం. అగ్రామ్యత్వస్ఫూర్తి కల ఈ పద్యంలో ఉదారత ఉజ్జ్వలంగా పోషించబడింది. (సంపా.)

**వ. నీవు ద్రౌపది నధర్మవిజిత యని పలికితి; సభాసదులెల్ల నెఱుంగ ధర్మజుండు దన సర్వస్వమ్ము నొడ్డి యోటువడి నప్పు డిది వానికి వెలిగాదు గావున ధర్మవిజితయ; యిట్లు గానినాఁడు పాండవు లిందఱును దీని విజితఁగా నేల యొడంబడుదురు? మఱి యేకవస్త్రయై యున్న దీని సభకుం దోడ్కొని వచ్చుట ధర్మువు గాదంటి; భార్యకు దైవవిహితుం డయిన భర్త యొక్కరుండ; యిది యనేకభర్తృక గావున బంధకి యనంబడు; నిట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చినను ధర్మవిరోధంబు లే దని కర్ణుండు వికర్ణువచనంబులకుం బ్రత్యాఖ్యానంబు సేసిన విని, దుర్యోధనుండు దుశ్శాసనుం బిలిచి 'యిప్పాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లపహరింపు' మని పంచిన దాని నెఱింగి. 229**

**ప్రతిపదార్థం:** నీవు; ద్రౌపదిన్; అధర్మ విజిత= అధర్మంచేత జయించబడినది; అని; పలికితి= పలికావు; సభాసదులు+ఎల్లన్= సభలో కూర్చున్న ధర్మం తెలిసిన వాళ్ళంతా; ఎఱుంగన్; ధర్మజుండు; తన, సర్వస్వమ్మున్= తనకున్న సంపద నంతా; ఒడ్డి; ఓటుపడి నప్పుడు= ఓడిపోయి నప్పుడు; ఇది= ఈ ద్రౌపది; వానికిన్= ఆ ధర్మరాజుకు; వెలి, కాదు, కావునన్= పరాయిది కాదు కనుక; ధర్మవిజిత+అ= ధర్మంచేత జయించబడినదే; ఇట్లు; కాని, నాఁడు= కానిరోజు; పాండవులు+ఇందఱును= పాండవులంతా; దీనిన్= ఈ ద్రౌపదిని; ఏల, విజితఁగాన్= జయించబడిన దానినిగా; ఒడంబడుదురు= అంగీకరిస్తారు; మఱి= మరియు; ఏక, వస్త్ర, ఐ= ఒకే వస్త్రాన్ని ధరించినదై; ఉన్న; దీనిన్; సభకున్, తోడ్కొని= వెంటబెట్టుకొని; వచ్చుట; ధర్మువు= ధర్మం; కాదు+అంటి; భార్యకున్; దైవవిహితుండు+అయిన= దైవంచేత ఏర్పాటు చేయబడిన; భర్త; ఒక్కరుండు+అ= ఒక్కడే; ఇది= ఈ ద్రౌపది; అనేక, భర్తృక= పెక్కుమంది భర్తలు కలది; కావునన్; బంధకి= రంకుటాలు; అనంబడున్; ఇట్టిదానిన్; విగతవస్త్రన్+చేసి= తొలగించబడిన వస్త్రాలు కలదానినిగా చేసి - అంటే నగ్నంగా; తెచ్చినను; ధర్మ, విరోధంబు= ధర్మానికి వ్యతిరేకం; లేదు+అని; కర్ణుండు; వికర్ణు, వచనంబులకున్= వికర్ణుని మాటలకు; ప్రతి+ఆఖ్యానంబు; చేసినన్= నిరాకరణ చేసిన - అంటే త్రోసిపుచ్చి మాట్లాడగా; విని; దుర్యోధనుండు; దుశ్శాసనున్; పిలిచి; ఈ+పాండవులయు= ఈపాండవులయొక్క; ద్రౌపదియు= ద్రౌపదియొక్క; వస్త్రంబులు; అపహరింపుము= లాగికొనుము; అని; పంచినన్= ఆజ్ఞాపించగా; దానిన్; ఎఱింగి= తెలుసుకొని.

**తాత్పర్యం:** 'నీవు, ద్రౌపది అధర్మంగా జయించబడిం దని పలికావు. సభలో కూర్చున్న ధర్మజ్ఞులంతా చూస్తుండగా ధర్మరాజు తన సర్వస్వాన్నీ ఒడ్డి ఓడిపోయాడు. ఈ ద్రౌపది అతనికి పరాయిమనిషి కాదు. అందుచేత అదికూడ ధర్మంగా జయించబడినట్లే. అలా కాకుంటే పాండవులంతా దానిని ఎందుకు జయించబడిన దానినిగా అంగీకరిస్తారు? కాగా, ఒకే వస్త్రాన్ని ధరించి ఉన్నదాన్ని సభకు తోడ్కొని రావటం ధర్మం కా దన్నావు. భార్యకు భగవంతుడు విధించిన భర్త ఒక్కడే. ఇది పెక్కుమంది భర్తలు కలది. అందుచేత బంధకి. ఇలాంటిదాన్ని బట్టలు లేకుండ నగ్నంగా తెచ్చినా తప్పు లేదు' అని కర్ణుడు వికర్ణుని మాటలను త్రోసిపుచ్చి పలుకగా - దుర్యోధనుడు విని, దుశ్శాసనుణ్ణి పిలిచి 'ఈపాండవులవి, ద్రౌపదివి వస్త్రాలు లాగితీసుకో' అని ఆజ్ఞాపించగా దానిని తెలుసుకొని.

**విశేషం:** వస్త్రాపహరణాన్ని సూచించినవాడు, ద్రౌపదీ నగ్నసౌందర్యాన్ని చూడ ఉసిగొల్పినవాడు - కర్ణుడు.

**క. కితవవ్యవసాయపరా। జితు లగుటం జేసి బలిమి చెడి పాండుసుతుల్**
**ధృతిఁ దమ పయిపుట్టము లా। యతకీర్తులు మున్నపెట్టి యా సభ నున్నన్. 230**

**ప్రతిపదార్థం:** కితవ, వ్యవసాయ, పరాజితులు+అగుటన్+చేసి= జూదమాడే ప్రయత్నంలో ఓడిపోయిన వాళ్ళుకావటంచేత; పాండుసుతుల్= పాండురాజుపుత్రులు - పాండవులు; ఆయతకీర్తులు= గొప్ప కీర్తికలవాళ్ళు; బలిమి, చెడి= బలహీనులై; ధృతిన్= ధైర్యంతో; తమ; పయి పుట్టములు= పై బట్టలు; మున్న= ముందుగానే; పెట్టి= తీసిపెట్టి; ఆ, సభన్= ఆ సభలో; ఉన్నన్= ఉండగా.

**తాత్పర్యం:** జూద మాడే ప్రయత్నంలో ఓడిపోయినవాళ్ళు కావటంచేత, ఎంతో కీర్తిమంతులైన పాండవులు బలహీనులై తమ పై బట్టలు ముందే తీసిపెట్టి ఆ సభలో నిలిచారు.

### దుశ్శాసనుండు ద్రౌపది కట్టిన పుట్టం బొలుచుట (సం. 2-61-40)

**సీ. ఇది సేయఁ గా దని మది విచారింపక। సద్గర్హితుండు దుశ్శాసనుండు**
**నెట్టన ద్రౌపది గట్టిన పుట్టంబు। సభలోన విడ్చె నాశంక లేక**
**యుడుగక యొలువంగఁ బడియు ము న్నపనీత। మైన తద్వస్త్రంబు నట్టి వలువ**
**లలితాంగిజఘనమండలమునఁ బాయక। యొప్పుచు నున్న నయ్యువిదఁ జూచి**

**ఆ. సభ్యులెల్ల నుదితసమ్మదు లయిరి దు। శ్శాసనుండు వస్త్రచయము పర్వ**
**తోపమాన మయిన నొలువంగ నోపక। యుడిగె లజ్జఁ బొంది యుక్కు దక్కి. 231**

**ప్రతిపదార్థం:** సత్+గర్హితుండు= సజ్జనులచేత నిందించబడినవాడు; దుశ్శాసనుండు; ఇది; చేయన్+కాదు+అని= చేయ కూడని దని; మదిన్= మనస్సులో; విచారింపక= ఆలోచించక; నెట్టన= అడ్డులేకుండా; ద్రౌపది; కట్టిన= కట్టుకొనిన; పుట్టంబు= వస్త్రం; ఆశంక, లేక= సంకోచం లేకుండ; సభలోనన్; విడ్చెన్= విప్పాడు; ఉడుగక= ఆపకుండ; ఒలువంగఁబడియున్= విప్పబడి; మున్ను+అపనీతము+ఐన= ముందు తొలగింపబడిందైన; తత్‌వస్త్రంబు, అట్టి, వలువ= ఆ వస్త్రంవంటి వస్త్రమే; లలిత+అంగి, జఘన, మండలమునన్= మనోహరాలైన అవయవాలు కల ద్రౌపదియొక్క మొలభాగాన; పాయక= ఎడతెగక; ఒప్పుచున్; ఉన్నన్; ఆ+ఉవిదన్= ఆకాంతను; చూచి; సభ్యులు+ఎల్లన్= సభలోని సభ్యులంతా; ఉదిత, సమ్మదులు+అయిరి= పుట్టిన సంతోషం కలవా ళ్ళయ్యారు- అంటే సంతోషించారు; వస్త్రచయము= బట్టల సమూహం; పర్వత+ఉపమానము= పర్వతంతో సమానం; అయినన్; దుశ్శాసనుండు; ఒలువంగన్+ఓపక= విప్పలేక; ఉక్కు, తక్కి= పట్టువిడిచి; లజ్జన్+పొంది= సిగ్గుచెంది; ఉడిగెన్= ఊరకున్నాడు.

**తాత్పర్యం:** సజ్జనులచేత నిందించబడిన దుశ్శాసనుడు, ఇది చేయకూడ దని మనస్సులో విచారించక, అడ్డులేనివాడై, ఆ ద్రౌపది కట్టుకొన్న వస్త్రాన్ని నిస్సంకోచంగా నిండు సభలో విప్పాడు. ఆపకుండా అతడు విప్పుతున్నా ముందు తొలగించబడ్డ వస్త్రంవంటి వస్త్రమే- ఆ లలితాంగి మొలభాగంమీద ఎడతెగకుండా ఉండటం చూచి సభలోని సభ్యులంతా సంతోషించారు. విప్పిన వస్త్రసమూహం కొండలా గుట్టపడగా దుశ్శాసనుడు ఇక విప్పలేక, పట్టు విడిచి, సిగ్గుచెంది ఊరకుండిపోయాడు.

**విశేషం:** కులకాంతకు ఇంతకంటె ఘోరావమానం ఏముంది? అయినా అంతమంది సభలో ఉండి దాన్ని ఆపలేకపోయారు. ఊహించుకొంటే చాలు ఎవరికైనా రక్తం ఉడికిపోతుంది. అది చూచి ఎవరు ఊరుకొన్నా- భీముడు ఊరుకొంటాడా?

**వ. ఇట్లు భీమసేనుండు ద్రుపదరాజనందనకు దుశ్శాసనుండు సేసిన యవమానంబు సూచి కోపరక్తాంత నయనుం డగుచు నంతకాకారంబున దంతసందష్టదారుణముఖుండయి యెల్లవారును విన ని ట్లనియె. 232**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; భీమసేనుండు; ద్రుపదరాజ నందనకున్= ద్రుపదరాజు కూతురైన ద్రౌపదికి; దుశ్శాసనుండు; చేసిన; అవమానంబు; చూచి; కోప, రక్త+అంత+నయనుండు= కోపంచేత ఎరుపెక్కిన చివరలు గల కన్నులు కలవాడు; అగుచున్; అంతక+ఆకారంబునన్= యముని రూపాన; దంత, సందష్ట, దారుణ, ముఖుండు+అయి= పళ్ళుకొరకటంచేత భయంకరమైన ముఖం కలవాడై; ఎల్లవారును; వినన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రుపదరాజపుత్రికి దుశ్శాసనుడు చేసిన అవమానాన్ని చూచి, భీమసేనుడు కళ్ళెర్ర చేశాడు. పళ్ళు కొరుకుతూ, భయంకరముఖంతో యమునిలా అందరూ వినేటట్లు ఇలా అన్నాడు.

**మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో**
**ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ**
**కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘ ని**
**ర్ఘర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్. 233**

**ప్రతిపదార్థం:** కురు, వృద్ధుల్= కురువంశపు పెద్దలు; గురు, వృద్ధ, బాంధవులు= గురువులు, వృద్ధులు, బంధువులు; అనేకుల్= పెక్కుమంది; చూచుచుండన్; మద+ఉద్ధురుఁడు+ఐ= పొగరుచేత బరువైనవాడై- అంటే పొగరు పెరిగి చెలరేగినవాడై; ద్రౌపదిన్; ఇట్లు= ఈ విధంగా; చేసిన; ఖలున్= క్రూరుడైనవాణ్ణి; దుశ్శాసనున్; ఉర్వీపతి= రాజైన దుర్యోధనుడు; చూచుచుండన్; అనిన్= యుద్ధంలో; లోకభీకరలీలన్= లోకానికి భయం కలిగించే రీతిగా; వధియించి= చంపి; తత్+విపుల, వక్షస్+శైల, రక్త+ఓఘ, నిర్ఘరము= ఆ దుశ్శాసనుడియొక్క విశాలమైన రొమ్ము అనే పర్వతంలోని రక్తప్రవాహ మనే సెలయేటిని; ఉగ్ర+ఆకృతిన్= భయంకరమైన రూపంతో; ఆస్వాదింతున్= పానం చేస్తాను.

**తాత్పర్యం:** కురు వంశపు పెద్దలు, గురువులు, వృద్ధులు, బంధువులు పెక్కుమంది చూస్తుండగా- పొగరెక్కి చెలరేగి, ద్రౌపదిని ఈవిధంగా చేసిన దుశ్శాసనుణ్ణి రాజు (దుర్యోధనుడు) చూస్తుండగానే యుద్ధంలో లోకభయంకరమైన రీతిలో వధించి, అతని విశాలవక్షస్థలమనే పర్వతంలోని రక్తప్రవాహమనే సెలయేటిని భయంకరాకారం ధరించి త్రాగుతాను.

**విశేషం:** అలం: రూపకం. అక్షరరమ్యమై, అర్థగంభీరమై, పద్యశిల్పంలో అతిప్రసిద్ధమైన నన్నయ పద్యాల్లో ఇది ఒకటి, భయంకరాలై, భావిభారత మహాసంగ్రామానికి ప్రాతిపదికలై, రౌద్రరసానికి ఉనికి పట్టులైన భీముని ప్రతిజ్ఞల్లో ఇది మొదటిది. వినాలేగాని ఇందులోని ధకారాల్లో మహోగ్రుడైన భీముని గదాఘాతాలు, పిడిగ్రుద్దులు వినిపించగలవు. చూడాలేగాని తరువాతి పదాల్లో, సమాసాల్లో-ఖలున్, దుశ్శాసనున్ - అని ఖంగున తెగబలికి, కళ్ళురిమి, పళ్ళు బిగబట్టి, ఒక్క గ్రుక్కలో 'లోక భీకరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ నిర్ఘర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్' అని బుసలు కొట్టుతూ, ఊగుతూ నిలిచిన భీముని భయంకరముఖాకృతిని చూడవచ్చు. 'ద్రౌపది నిట్లు సేసిన ఖలున్' అనటంలో

దుశ్శాసనుడు చేసిన పని ఎంత అవాచ్యమైనదో వ్యక్తమౌతున్నది. 'ఉర్వీపతి చూచుచుండన్' అనటంలో అవాచ్యం, అతిక్రూరం అయిన ఈ పనికి అతణ్ణి పురికొల్పిన వ్యక్తి కట్టెదుటే దుష్టదుశ్శాసనుణ్ణి ఈ విధంగా కడతేరిస్తే గాని నాకసి తీర దనే భావం స్ఫురిస్తున్నది. 'ఆస్వాదింతు' ననటంలో తన కసితాపం తీరటానికి దుశ్శాసనుడి నెత్తురు భీముడి కెంత తియ్యని పానీయమో తెలుస్తున్నది. ఇక ఆనాటి భీముడి 'ఉగ్రాకృతి' ఊహించదగిందే కాని- వివరించ సాధ్యం కానిది. దుశ్శాసనుడి గుండె పగిలి నెత్తుటిధారలు పైకి చిమ్మినట్లే, పద్యంలోని ప్రతిపదంలోనూ రౌద్రరసం పైకి ఎగుస్తున్నది. అందులోనూ మహాప్రాణాక్షర వర్ణవిన్యాస వైఖరి, అక్షరరమ్యతను రౌద్రరసోన్నిద్రంగా ఆవిష్కరింప చేసింది.

**వ. 'ఇట్లు సేయనైతినేని పితృపితామహుల గతికిం దప్పినవాఁడ నగుదు' ననిన నతని యతిమానుషంబయిన మహావ్యవసాయంబున కద్భుతం బంది దిక్కులు చూడక ధిక్శబ్దముఖరిత ముఖు లగుచు సభాజనులు తమలో సపుత్త్రకుండయిన ధృతరాష్ట్రు నిందించుచు 'ద్రుపదరాజపుత్త్రి వాక్యంబులు విచారింపక వృద్ధరాజు లుపేక్షించి' రనుచుండిఁ; రంత నుద్యతబాహుం డయి విదురుం డెల్లవారిని వారించి యి ట్లనియె. 234**

**ప్రతిపదార్థం:** ఇట్లు= చెప్పినట్లు; చేయన్+ఐతిన్+ఏనిన్= చూయజాలకుంటే; పితృ, పితామహుల, గతికిన్= తండ్రితాతల మార్గానికి; తప్పినవాడన్; అగుదున్; అనినన్; అతని; అతిమానుషంబు+అయిన= మానవశక్తికి మించినదైన; మహావ్యవసాయంబునకున్= గొప్పపనికి; అద్భుతంబు+అంది= ఆశ్చర్యపడి; దిక్కులు, చూడక= ఊరకుండక; ధిక్+శబ్ద, ముఖరిత, ముఖులు= ఛీ అనే శబ్దం మ్రోగుతున్న ముఖాలు కలవారు; అగుచున్; సభా, జనులు; తమలోన్; సపుత్త్రుకుండు+అయిన= పుత్త్రులతో కూడి ఉండే; ధృతరాష్ట్రునిన్; నిందించుచున్; ద్రుపదరాజ, పుత్త్రి, వాక్యంబులు= ద్రౌపదిమాటలు; విచారింపక= ఆలోచించక; వృద్ధ, రాజులు= పెద్దలైనరాజులు; ఉపేక్షించిరి= అశ్రద్ధచేశారు; అనుచుండిరి; అంతన్= అప్పుడు; విదురుండు; ఉద్యత, బాహుండు+అయి= పైకెత్తిన చేతులు కలవాడై; ఎల్లవారినిన్= అందరిని; వారించి= ఆపి - అంటే మాట్లాడకుండ ఆపి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఈ విధంగా చెప్పినట్లు చెయ్యకుంటే నేను తండ్రితాతల మార్గానికి తప్పినవాడి నవుతాను' అని భీము డనగా - అతని మానవాతీతమైన మహాప్రయత్నానికి సభాసదులంతా ఆశ్చర్యపడి, ఊరకుండక, కొడుకులతో కూడి ఉన్న ధృతరాష్ట్రుణ్ణి 'ఛీ' అని నిందిస్తూ- 'ద్రౌపది అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పక పెద్దలైన రాజులు అశ్రద్ధ చేశా'రని అంటుండగా- విదురుడు చేతులు పైకెత్తి అందరిని మాట్లాడకుండ ఆపి- ఇలా అన్నాడు.

**క. సుమతులు పాంచాలీ ప్ర। శ్నము నర్థము నేర్పడన్ విచారింపుఁడు పా**
**పము వొందు ధర్మసందే। హము దీర్పనినాఁడు సభ్యులగు సజ్జనులన్. 235**

**ప్రతిపదార్థం:** సుమతులు= మంచి బుద్ధికలవాళ్ళు; పాంచాలీ ప్రశ్నము, అర్థమున్= ద్రౌపదిప్రశ్నకు సమాధానం; ఏర్పడన్= స్పష్టంగా తెలిసేటట్లు; విచారింపుఁడు= ఆలోచించండి; ధర్మసందేహము= ధర్మాన్నిగూర్చిన అనుమానం; తీర్పనినాఁడు= తీర్చని రోజున; సభ్యులు+అగు= సభలో ఉన్న వాళ్ళయిన; సజ్జనులన్; పాపము, పొందున్= పాపం అంటుతుంది.

**తాత్పర్యం:** బుద్ధిమంతులంతా ద్రౌపది అడిగిన ప్రశ్నకు సమాధానం స్పష్టమయ్యేటట్లు ఆలోచించండి. ధర్మసందేహం తీర్చని రోజు సభలోని సజ్జను లందరికి పాపం అంటుకొంటుంది.

**విశేషం:** 'తీర్పనినాఁడు', 'తీర్పనిరోజు' - అనే వాటికి ఈ సందర్భంలో 'అప్పటికప్పుడు తీర్పుచెప్పకపోతే' అని అర్థం.

**మత్తకోకిలము.**

**ఈ వికర్ణుఁడు బాలుఁ డయ్యును నేర్పరించి యథావిధిన్**
**దేవమంత్రియపోలె ధర్మువుఁ దెల్పెఁ; నీతనిబుద్ధి మీ**
**రేవగింపక చేకొనుం డిది; యెల్లయందును ధర్మ స**
**ద్భావ మొక్కని కేర్పరింపఁగ బ్రహ్మకైనను బోలునే? 236**

**ప్రతిపదార్థం:** ఈ, వికర్ణుఁడు; బాలుఁడు+అయ్యును= చిన్నవాడయినప్పటికి; దేవమంత్రియ, పోలెన్= బృహస్పతివలె; యథావిధిన్= శాస్త్రం ప్రకారం; ఏర్పరించి= స్పష్టమవునట్లు; ధర్మువున్= ధర్మాన్ని; తెల్పెన్= చెప్పాడు; మీరు; ఏవగింపక= తక్కువగా చూచి త్రోసిపుచ్చక; ఈతని, బుద్ధి= ఈతని ఆలోచన; చేకొనుండు= అంగీకరించండి; ఎల్లన్, అందును= అన్నిచోట్లా; ధర్మ, సత్+భావము= ధర్మంయొక్క సరైన అర్థాన్ని; ఒక్కనికిన్; ఏర్పరింపఁగన్= తెలియజేయటానికి; బ్రహ్మకున్+ఐనను; పోలునే= సాధ్యమవుతుందా?

**తాత్పర్యం:** ఈ వికర్ణుడు చిన్నవాడైనా బృహస్పతిలా శాస్త్రప్రకారం స్పష్టంగా ధర్మాన్ని తెలియచెప్పాడు. ఇతని ఆలోచనను మీరు తక్కువ చేసి త్రోసిపుచ్చక అంగీకరించండి. అన్నిచోట్లా ధర్మంయొక్క సరైన అర్థాన్ని నిర్ణయించటం ఏ ఒక్కడికీ- బ్రహ్మకుకూడ సాధ్యం కాదు.

**ఆ. సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన । నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు**
**లనృతదోషఫలమునం దర్ధ మొందుదు । రనిరి ధర్మవేదులైన మునులు. 237**

**ప్రతిపదార్థం:** సభకున్, వచ్చి; ధర్మసందేహము= ధర్మాన్ని గూర్చిన అనుమానం; అడిగినన్, ఎఱిఁగి= తెలిసి; చెప్పక; ఉండిరి+ఏనిన్; సభ్యులు; అనృతదోషఫలమునందున్= అసత్యమాడే తప్పువలన కలిగే ఫలంలో; అర్ధము= సగం; ఒందుదురు= పొందుతారు; అని; ధర్మవేదులు+ఐన= ధర్మాన్ని తెలిసిన; మునులు; అనిరి.

**తాత్పర్యం:** సభకు వచ్చి ఎవరైనాసరే ధర్మసందేహం అడిగితే, తెలిసి చెప్పకుంటే- సభ్యులు, అసత్యమాడే తప్పువల్ల కలిగే ఫలంలో సగం పొందుతా రని ధర్మ మెరిగిన మునులు చెప్పారు.

**ఆ. ధర్మ వెఱిఁగి దానిఁ దా నొండుగా లాభ । లోభ పక్షపాతలోలబుద్ధి**
**సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకు వాఁ । డనృతదోషఫలము ననుభవించు. 238**

**ప్రతిపదార్థం:** ధర్మువు+ఎఱిఁగి= ధర్మం తెలిసికూడ; దానిన్; ఒండుగాన్= మరొకవిధంగా; లాభ, లోభ, పక్షపాత, లోల, బుద్ధిన్= లాభంచేత, కోరికచేత, పక్షపాతంచేత ఊగిసలాడే మనస్సుతో; సభలన్= సభల్లో; ఎవ్వఁడు+ఏనిన్= ఎవ్వడైనా; సభ్యుఁడై; పలుకువాఁడు; అనృత, దోష, ఫలమున్= అసత్య మాడే తప్పువల్ల కలిగే ఫలాన్ని; అనుభవించున్.

**తాత్పర్యం:** ధర్మాన్ని తెలిసికూడా, లాభంచేతనో, లోభంచేతనో, పక్షపాతంచేతనో, ఊగిసలాడే బుద్ధితోనో సభల్లో ఎవడైనా - దానిని మరొక విధంగా పలికితే, అతడు అసత్యమాడే దోషంవల్ల కలిగే ఫలాన్ని అనుభవిస్తాడు.

**విశేషం:** నానారుచిరార్థసూక్తినిధి అయిన నన్నయ కవితలో పై పద్యాలు రెండూ గొప్ప సూక్తిరత్నాలు. న్యాయాన్యాయ నిర్ణయం చేసే సభల్లో కూర్చున్న పెద్దలందరికి ఇవి శిరోధార్యాలు.

## విరోచన సుధన్వుల వృత్తాంతము

**వ. ఈయర్థం బితిహాసంబులయందు వినంబడుఁ; దొల్లి ప్రహ్లాదునికొడుకు విరోచనుండును నంగిరసుండను విప్రునికొడుకు సుధన్వుండును నొక్క కన్యా ప్రతిగ్రహ నిమిత్తంబున నెల్లసుగుణంబుల 'నేన పెద్ద, నేన పెద్ద' నని తమలో నిద్దఱును ప్రాణంబు లొడ్డుగా నొడ్డి వివాదంబు సేసి ప్రహ్లాదు పాలికిం జని; రందు సుధన్వుండు ప్రహ్లాదున కి ట్లనియె. 239**

**ప్రతిపదార్థం:** ఈ, అర్థంబు= ఈ న్యాయం; ఇతిహాసంబుల, అందున్; వినంబడున్= వినిపించును; తొల్లి= పూర్వం; ప్రహ్లాదునికొడుకు; విరోచనుండును; అంగిరసుండు+అను; విప్రుని, కొడుకు= బ్రాహ్మణుని కుమారుడు; సుధన్వుండును; ఒక్క; కన్యా, ప్రతిగ్రహ నిమిత్తంబునన్= కన్యను దానం పుచ్చుకొనే కారణాన; ఎల్ల, సుగుణంబులన్= అన్ని మంచి గుణాలలో; ఏను+అ, పెద్దన్= నేను ఎక్కువ; ఏను+అ, పెద్దన్= నేను ఎక్కువ; అని; తమలోన్; ఇద్దరును; ప్రాణంబులు; ఒడ్డుగాన్, ఒడ్డి= పందెంగా ఒడ్డి; వివాదంబు, చేసి= తగవులాడుకొని; ప్రహ్లాదు, పాలికిన్= ప్రహ్లాదుని దగ్గరకు; చనిరి= వెళ్ళారు; అందున్; సుధన్వుండు; ప్రహ్లాదునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ న్యాయం ఇతిహాసాల్లోకూడ వినిపిస్తుంది. పూర్వం ప్రహ్లాదునికొడుకు విరోచనుడూ, అంగిరసుడనే బ్రాహ్మణునికొడుకు సుధన్వుడూ ఒక కన్యను దానం పుచ్చుకొనే విషయంలో - అన్ని సుగుణాల్లో నే నెక్కువ, నే నెక్కువ అని, ప్రాణాలు పందెంగా ఒడ్డి, తగవులాడుకొని, ప్రహ్లాదునిదగ్గరకు వెళ్ళారు. సుధన్వుడు ప్రహ్లాదునితో ఇలా అన్నాడు.

**తే. నీవు ధర్మవిదుండవు మా వివాద । మెఱిఁగి తీర్పు గుణశ్రేష్ఠుఁ డితఁడొ నేనొ**
**చెప్పు; మన్యథాబుద్ధివై చెప్పితేని । మఘవు కులిశంబు వ్రచ్చు నీ మస్తకంబు. 240**

**ప్రతిపదార్థం:** నీవు; ధర్మ, విదుండవు= ధర్మం తెలిసినవాడివి; మా, వివాదము= మా తగవు; ఎఱిఁగి= తెలుసుకొని; గుణశ్రేష్ఠుఁడు= మంచిగుణాలచేత గొప్పవాడు; ఇతఁడొ; నేనో; తీర్పు చెప్పుము; అన్యథా, బుద్ధివి+ఐ= ఇతరమైన మనస్సు కలవాడివై - అంటే నీ పుత్రుడన్న పక్షపాతబుద్ధి కలిగినవాడివై; చెప్పితేనిన్= తీర్పు చెప్పితే; మఘవు, కులిశంబు= దేవేంద్రునియొక్క వజ్రాయుధం; నీ, మస్తకంబున్= నీ తలను; వ్రచ్చున్= పగులగొట్టుతుంది.

**తాత్పర్యం:** నీవు ధర్మం తెలిసినవాడివి. మా తగవు తెలుసుకొని గుణాలచేత గొప్పవాడు ఇతడో, నేనో తీర్పు చెప్పు. నీ పుత్రు డని పక్షపాతబుద్ధితో తీర్పు చెప్పితే దేవేంద్రుని వజ్రాయుధం నీ తలను పగులగొట్టుతుంది.

**వ. అనినం బ్రహ్లాదుండు భయంపడి కశ్యపుకడకుం జని విరోచన సుధన్వులు తన్ను వివాదనిర్ణయం బడిగిన విధంబును జెప్పిన విని వానికిం గశ్యపుం డి ట్లనియె. 241**

**ప్రతిపదార్థం:** అనినన్; ప్రహ్లాదుండు; భయము+పడి; కశ్యపు, కడకున్= కశ్యపుని దగ్గరకు; చని= వెళ్ళి; విరోచన, సుధన్వులు; తన్నున్; వివాదనిర్ణయంబు= తగవుయొక్కతీర్పు; అడిగిన, విధంబును; చెప్పినన్; విని; వానికిన్; కశ్యపుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా ప్రహ్లాదుడు భయపడి కశ్యపునిదగ్గరకు వెళ్ళి- తగవు తీర్పునుగూర్చి విరోచనుడు, సుధన్వుడు త న్నడిగిన విధము చెప్పగా, కశ్యపుడు అతనితో ఇలా అన్నాడు.

**తే.** **సాక్షియును ధర్మదర్శియు సాక్షిధర్మ। విధులు దప్పంగఁ జెప్పిన నధమవృత్తి**
**వరుణపాశసహస్రంబు వానిఁ గట్టి। పాయు నేఁటేఁట నొక్కొకఁ డాయతముగ.** **242**

**ప్రతిపదార్థం:** సాక్షియును; ధర్మ, దర్శియున్= ధర్మాన్ని దర్శించే న్యాయాధిపతీ; సాక్షి, ధర్మవిధులు= సాక్షియొక్క, ధర్మంయొక్క నియమాలు; తప్పంగన్= తప్పునట్లు; అధమ, వృత్తి= నీచంగా ప్రవర్తించి; చెప్పినన్= చెప్పితే; వరుణ, పాశ, సహస్రంబు= వెయ్యి వరుణపాశాలు; వానిన్; కట్టి; ఏఁట+ఏఁటన్= ప్రతి సంవత్సరం; ఒక్కొకఁడు= ఒక్కొక్కటి; ఆయతముగన్= నిడుపుగ; పాయున్= వదలుతాయి.

**తాత్పర్యం:** సాక్షీ, ధర్మాన్ని దర్శించే న్యాయమూర్తీఐనవాడు- సాక్షినియమాలను, ధర్మనియమాలను తప్పి నీచంగా ప్రవర్తించి సాక్ష్యం, ధర్మం చెప్పితే అలాంటివాణ్ణి వెయ్యివరుణపాశాలు బంధిస్తాయి. ఏటేట ఒక్క పాశం వంతున వదలుతాయి.

**విశేషం:** సాక్షులు పదకొండుమంది. అందులో కృతసాక్షులు - అంటే నిర్ణయించుకొనబడిన సాక్షులు ఐదుగురు. వారు లిఖితుడు, స్మారితుడు, యదృచ్ఛాభిజ్ఞుడు, గూఢుడు, ఉత్తరుడు. అకృతసాక్షులు - అంటే నిర్ణయించుకొనబడని సాక్షులు ఆరుగురు. వారు - గ్రామస్థులు, ప్రాడ్వివాక లేఖకసభ్యులు, రాజు, కార్యాధికారి, వాదిచే పంపబడిన వాడు (కులవివాదాల్లో కులంవాడు).

**వ.** **'ధర్మం బధర్మవిద్ధంబయి సభకు వచ్చిన దానిం దీర్పనిసభ్యు లధర్మవిద్ధు లగుదురు; మఱి సభ్యులు కామక్రోధంబులు విడిచి యధర్మంబు నాపనినాఁ డయ్యధర్మంబునం దొక్కపాదంబు సభ్యుల, నొక్కపాదంబు భూపతిఁ, దక్కినయది గర్తనుం బొందు; సమంజసులైన సభ్యులచేత విధ్యుక్తం బయ్యేనేని నధర్మంబు కర్తనుం బొందుఁ; గావున ధర్మంబు దప్పక చెప్పవలయు'ననినం బ్రహ్లాదుండు ధర్మమతియై విచారించి తనకొడుకుకంటె గుణశ్రేష్ఠుఁడుగా సుధన్వుం జెప్పినఁ, 'బుత్త్రస్నేహంబు విడిచి ధర్మువు దప్పక చెప్పి' తని ప్రహ్లాదుం బ్రశంసించి సుధన్వుం డరిగెఁ; గావున 'మీరును ద్రౌపదీ ప్రశ్నంబునందు ధర్మబుద్ధిసేయుం' డని విదురుండు పలికిన, దుర్యోధను భయంబున సభ్యు లెవ్వరుం బలుకరయిరి; ద్రౌపదియు నట్లు సకలక్షత్త్రియసమక్షంబున దుశ్శాసనుచేతం బరిభవింపంబడి దుఃఖిత యయి.** **243**

**ప్రతిపదార్థం:** ధర్మంబు+అధర్మ, విద్ధంబు+అయి= ధర్మం అధర్మంచేత బాధించబడినదై; సభకున్; వచ్చినన్; దానిన్; తీర్పని; సభ్యులు; అధర్మ, విద్ధులు= అధర్మంచేత బాధించబడినవాళ్ళు; అగుదురు; మఱి; సభ్యులు; కామ, క్రోధంబులు; విడిచి; అధర్మంబును; ఆపని, నాఁడు; ఆ, అధర్మంబునందున్; ఒక్క, పాదంబు= నాల్గవవంతు; సభ్యులన్; ఒక్క, పాదంబు= నాల్గవవంతు; భూపతిన్= రాజును; తక్కినది; కర్తనున్= చేసినవాణ్ణి; పొందున్; సమంజసులు+ఐన= న్యాయంతో కూడిన వాళ్ళయిన; సభ్యులచేతన్; విధి+ఉక్తంబు+అయ్యెన్+ఏనిన్= ఉన్నస్థితి చెప్పబడిందైతే; అధర్మంబు; కర్తనున్= చేసినవాణ్ణి; పొందున్; కావున; ధర్మంబు; తప్పక; చెప్పవలయున్; అనినన్; ప్రహ్లాదుండు; ధర్మమతి+ఐ= ధర్మంతో కూడిన బుద్ధిగలవాడై; విచారించి= ఆలోచించి; తనకొడుకు కంటెన్; గుణశ్రేష్ఠుఁడుగాన్= గుణాల్లో గొప్పవాడుగా; సుధన్వున్= సుధన్వుణ్ణి; చెప్పినన్; పుత్త్ర, స్నేహంబు= పుత్రునిమీది ప్రేమ; విడిచి= వదలి; ధర్మువు= ధర్మం; తప్పక; చెప్పితి= చెప్పావు; అని; ప్రహ్లాదున్;

ప్రశంసించి= పొగిడి; సుధన్వుండు; అరిగెన్= వెళ్ళాడు; కావున; మీరును; ద్రౌపదీ, ప్రశ్నంబు, అందున్= ద్రౌపది అడిగిన ప్రశ్న విషయంలో; ధర్మ, బుద్ధి= ధర్మంతో కూడిన బుద్ధి; చేయుండు= కావించండి - అంటే ధర్మమైన బుద్ధితో ఆలోచించండి; అని; విదురుండు; పలికినన్; దుర్యోధను, భయంబునన్= దుర్యోధనునివల్ల కలిగిన భయంచేత; సభ్యులు; ఎవ్వరున్= ఎవరుగూడ; పలుకరు+అయిరి= మాటాడకున్నారు; ద్రౌపదియున్, అట్లు= ఆ విధంగా; సకల, క్షత్రియ, సమక్షంబునన్= అందరు రాజుల ఎదుట; దుశ్శాసనుచేతన్; పరిభవింపంబడి= అవమానించబడి; దుఃఖిత; అయి= దుఃఖించినదై.

**తాత్పర్యం:** 'ధర్మం అధర్మంచేత బాధింపబడి సభకు వస్తే, దాన్ని తీర్చని సభ్యులు, అధర్మంచేత బాధించబడతారు. అంతేకాదు. సభ్యులు కామక్రోధాలు విడిచి అధర్మాన్ని ఆపనినాడు, ఆ అధర్మంలో ఒక నాల్గవ భాగం సభ్యులకు, మరొక నాల్గవ భాగం రాజుకు, మిగిలింది కర్తకు సంక్రమిస్తుంది. అందుచేత ధర్మం తప్పక చెప్పాలి' అనగా, ప్రహ్లాదుడు ధర్మబుద్ధికలవాడై ఆలోచించి తనకొడుకుకంటె సుధన్వుడు సుగుణాల్లో గొప్పవా డని చెప్పాడు. సుధన్వుడు 'పుత్రప్రేమ వదలి ధర్మం తప్పక చెప్పావు' అని ప్రహ్లాదుణ్ణి పొగడి వెళ్ళాడు. 'అందుచేత మీరుకూడ ద్రౌపది అడిగిన ప్రశ్నను ధర్మబుద్ధితో ఆలోచించండి' అని విదురుడు పలుకగా దుర్యోధనునికి భయపడి సభ్యుల్లో ఎవ్వరూ పెదవి విప్పలేదు. ద్రౌపది ఆ విధంగా దుశ్శాసనునిచేత అవమానించబడి దుఃఖంతో ఉండగా.

**సీ. 'అవ్విధంబున నొప్పి యా స్వయంవరము నాఁ । డఖిల భూపతులచే నట్లు సూడఁ**
**బడి, పాండవుల ధర్మపత్నినై, గోవిందు । చెలియలినై, వీనిచేత నిట్లు**
**పరిభూత నగుచు సభామధ్యమున మహీ । పతులచేఁ జూడంగఁ బడితి; నింత**
**వడుదునె? యిపుడు నా పలుకుల కెవ్వరుఁ । బ్రతివచనం బేల పలుక రైరి?**

**ఆ. ధన్యులార! యే నదాసినే? దాసినే? । యెఱుఁగఁ జెప్పి పనుపుఁ' డెల్ల దాని**
**ననుచు వనరుచున్న నాపగాసుతుఁడు శాం । తనవుఁ డిట్టు లనియె దానిఁ జూచి. 244**

**ప్రతిపదార్థం:** ఆ, స్వయంవరమునాఁడు; ఆ+విధంబునన్; ఒప్పి= ప్రకాశించి; అఖిల భూపతులచేన్= అందరు రాజులచేత; అట్లు= అంత గొప్పగా; చూడబడి; పాండవుల, ధర్మపత్నినిన్+ఐ= పాండవుల భార్యనై; గోవిందు, చెలియలినిన్+ఐ= శ్రీకృష్ణునియొక్క చెల్లెలినై; వీనిచేతన్= ఈ దుశ్శాసనునిచేత; ఇట్లు= ఈ విధంగా; పరిభూతన్= అవమానించబడిన దానినిగా; అగుచున్; సభామధ్యమునన్; మహీపతులచేన్= రాజులచేత; చూడంగన్+పడితిన్; ఇపుడు; ఇంత, పడుదునె= ఇంత దుస్థితిని అనుభవిస్తున్నానే; నా, పలుకులకు; ప్రతివచనంబు= బదులుమాట అంటే సమాధానం; ఎవ్వరున్= ఎవరుగూడ; ఏల; పలుకరు+ఐరి= చెప్పకున్నారు; ధన్యులార= ఓ పుణ్యాత్ములారా!; ఏన్= నేను; అదాసినే= దాసిని కానిదానినే; దాసినే= దాసినా?; ఎల్లదానిన్= సర్వాన్నీ; ఎఱుఁగన్, చెప్పి= తెలియజెప్పి; పనుపుఁడు= ఆజ్ఞాపించండి; అనుచున్; వనరుచున్+ఉన్నన్= దుఃఖిస్తూ ఉండగా; దానిన్= ద్రౌపదిని; చూచి; ఆపగాసుతుఁడు= గంగాతనయుడు; శాంతనవుఁడు శంతనుని పుత్రుడు అయిన భీష్ముడు; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఆ స్వయంవరంరోజు ఆ విధంగా వెలిగి, అందరు రాజులచే అంత గొప్పగా చూడబడి, పాండవుల ఇల్లాలినై, శ్రీకృష్ణునిచెల్లెలినై- ఇప్పుడు ఈ దుశ్శాసనుడిచేత ఇలా అవమానించబడుతూ, ఈ సభామధ్యంలో రాజులందరిచేత చూడబడుతూ ఇంత దుఃస్థితిని అనుభవిస్తున్నానే- నే నడిగిన దానికి ఎవరు గూడ ఎందుకు

బదులు చెప్పరు? నేను దాసినా? కానా? పూర్తిగా తెలియ జెప్పి నన్ను ఆజ్ఞాపించండి' అని దుఃఖిస్తున్న ద్రౌపదిని చూచి భీష్ముడు ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** ద్రౌపదివాక్యవిన్యాసంలో కానవచ్చే అగ్రామ్యత్వం, వికటత్వం ఉదారతాగుణాన్ని రూపుకట్టిస్తున్నాయి. (సంపా.)

**వ. 'అవ్వా! నీ ప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుఁడు సెప్పవలయుఁ; గానినాఁడు ధర్మసూక్ష్మత యెవ్వరికి నెఱుంగ గహనంబు; దీని ఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతు' రని పలుకుచున్న యవసరంబున నక్కోమలిం జూచి నగుచు. 245**

**ప్రతిపదార్థం:** అవ్వా= అమ్మా! నీ ప్రశ్నంబునకున్; ఉత్తరంబు= సమాధానం; ఆ+యుధిష్ఠిరుఁడు= ఆధర్మరాజు; చెప్పవలయున్; కానినాఁడు= అట్లా కాని రోజు; ధర్మ, సూక్ష్మత= ధర్మంయొక్క సూక్ష్మతత్త్వం; ఎవ్వరికిన్= ఇతరు లెవరి కైనా; ఎఱుంగన్= తెలుసుకోవటం; గహనంబు= కష్టం; దీని, ఫలంబున్= ఈ చెడుపనియొక్క ఫలితాన్ని; వేగంబు+అ= త్వరగానే; ఈ, కురుకుల, పాంసనులు= కురువంశాన్ని మలినం చేసే ఈ కౌరవులు; అనుభవింతురు; అని; పలుకుచున్+ఉన్న; అవసరంబునన్= సమయంలో; ఆ+కోమలిన్= అందగత్తె అయిన ఆ ద్రౌపదిని; చూచి; నగుచున్= నవ్వుతూ.

**తాత్పర్యం:** 'అమ్మా! నీ ప్రశ్నకు సమాధానం ఆ యుధిష్ఠిరుడే చెప్పాలి. అలా కానినాడు ధర్మంయొక్క సూక్ష్మతత్త్వాన్ని తెలుసుకోవటం ఇతరు లెవరికైనా అసాధ్యమే. ఈ చెడుపని ఫలితాన్ని వెంటనే ఈ కురువంశ దూషకులైన కౌరవులు అనుభవిస్తారు' అని భీష్ముడు పలుకుతున్న సమయంలో, కోమలి అయిన ఆ ద్రౌపదిని చూచి నవ్వుతూ.

**విశేషం:** భీష్ముడు 'అమ్మా! ఈ ప్రశ్నకు సమాధానం చెప్పవలసింది ఆ యుధిష్ఠిరుడే' అనటంలో ఎన్నో అర్థాలు స్ఫురిస్తున్నాయి. మహావ్యసనపరుడై, ఒళ్ళు తెలియక పందెములొడ్డి ఓడిపోయిన ఆ ధర్మరాజునే సమాధానం అడగ'మన్నట్లు, ఇందులో కొంత నిరసన వ్యక్తమవుతున్నది. 'న్ని న్నొడ్డి ఓడిపోయిన నీ భర్త జూదంలోని మోసాన్నిగూర్చిగాని, ని న్నొడ్డటంలోని ముందు వెనుకలనుగూర్చి గాని విమర్శించక, జరిగిన దానిని అంతా అంగీకరించినట్లు ఊరకుండగా ఎవ్వ రేమని చెప్పగలరు?' అనే భావంగూడ ధ్వనిస్తున్నది. అంతేగాక - 'ఈ దుర్మార్గులమీద దండోపాయం ప్రయోగించటమే నీ ప్రశ్నకు సమాధానం. దీన్ని నిర్ణయించవలసిన వాడు నీ భర్త' అనే భావంకూడ కొంత స్ఫురిస్తున్నది. ధర్మజు డని అనక యుధిష్ఠిరుడనే పదప్రయోగం, 'దీనిఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతురు' అనే వాక్యం ఈ భావానికి బలం చేకూరుస్తున్నాయి. ధర్మరాజును మించి ధర్మసూక్ష్మాలు ఎరిగినవాళ్ళు ఇం కెవ్వ రున్నారు? ఆయనే నీ ధర్మసందేహం తీర్చగల డన్నది వాచ్యార్థం.

**తే. 'తరుణి! యేవురకంటె నొక్కరుఁడ భర్త । యగుట లగ్గు; జూదంబున నాలి నోటు**
**వడని వానిఁగాఁ దగు భర్తఁ బడయు మింక' । ననుచు రాధేయుఁ డుల్లసమాడె నంత. 246**

**ప్రతిపదార్థం:** తరుణి= ఓకాంతా! ద్రౌపదీ!; ఏవురకంటెన్= ఐదుమంది కంటె; ఒక్కరుఁడు+అ= ఒక్కడే; భర్త; అగుట; లగ్గు= మేలు; జూదంబునన్; ఆలిన్= భార్యను; ఓటుపడని= ఓడిపోని; వానిన్, కాన్, తగు, భర్తన్= తగిన భర్తను; ఇంకన్= ఇక; పడయుము= పొందుము; అనుచున్; రాధేయుఁడు= కర్ణుడు; అంతన్= అప్పుడు; ఉల్లసము+ఆడెన్= ఎగతాళి చేశాడు.

**తాత్పర్యం:** 'ద్రౌపదీ! ఐదుగురికంటె ఒక్కడే భర్త కావటం మంచిది. జూదంలో భార్యను ఓడిపోని తగుభర్తను ఇక పొందు' అని కర్ణుడు ఎగతాళి చేశాడు.

**విశేషం:** కర్ణుని పెంపుడు తల్లి రాధ (అధిరథుని భార్య). అందుచేత కర్ణుడు రాధేయుడైనాడు. జూదంలో భార్యను ఓడిపోని వాణ్ణి తగుభర్తగా పొందుమంటే దుర్యోధనుణ్ణి చేపట్టు మని కర్ణునిసూచన. ఏ కులకాంత కైనా కర్ణునిమాటలు కర్ణశూలాలే. కాగా, కర్ణునిసూచన మాయాద్యూతంలో లభించిన అక్రమవిజయంతో మదోద్ధతుడై ఉన్న దుర్యోధనుని దుర్మార్గాన్ని మరొకరీతిగా రగుల్కొల్పింది.

**ఉ.** **అమ్ముదితన్ విభీతహరిణాక్షిఁ గలాపవిభాసికేశభా**
**రమ్మున నొప్పు దానిఁ దన రమ్యపృథూరుతలంబు నెక్కఁగా**
**రమ్మని సన్న సేసె ధృతరాష్ట్రసుతాగ్రజుఁ డప్డు; దాని దూ**
**రమ్మునఁ జూచి కౌరవకురంగమృగేంద్రుఁడు భీముఁ డల్కతోన్.** **247**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్ర, సుత+అగ్రజుఁడు= ధృతరాష్ట్రుని కొడుకుల్లో ముందు పుట్టినవాడు - దుర్యోధనుడు; ఆ+ముదితన్= ఆ కాంతను; విభీత, హరిణ+అక్షిన్= భయపడిన లేడి కన్నులవంటి కన్నులుకలదానిని; కలాప, విభాసి, కేశ, భారమ్మునన్= నెమలి పురివలె ప్రకాశించే తల వెంట్రుకల బరువుచేత; ఒప్పుదానిన్= ప్రకాశించే దానిని; తన, రమ్య, పృథు+ఊరు, తలంబున్= తనయొక్క అందమైన, విశాలమైన తొడమీద; ఎక్కఁగాన్= ఎక్కటానికి - అంటే కూర్చొనటానికి; రమ్ము+అని; సన్న= సైగ; చేసెన్; అపుడు; దానిన్= ఆ సైగను; దూరమ్మునన్+చూచి= దూరాననుండి చూచి; కౌరవ, కురంగ, మృగ+ ఇంద్రుఁడు= కౌరవులనే జింకలపాలిటికి సింహంవంటివాడైన; భీముడు; అల్కతోన్= కోపంతో.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుని జ్యేష్ఠపుత్రుడైన దుర్యోధనుడు, భయపడిన లేడి కన్నులాంటి కన్నులుకలది, నెమలి పురిలా ప్రకాశించే తల వెంట్రుకలభారం కలది అయిన ద్రౌపదిని- అందమై, విశాలమైన తన తొడమీద కూర్చుండ రమ్మని సైగ చేశాడు. ఆ సైగను దూరంనుండి చూచి, కౌరవులు అనే జింకల పాలిటి సింహంలాంటి భీముడు కోపంతో.

**విశేషం:** అలం: ఉపమ, రూపకం. భయపడిన లేడివంటి కన్నులు, నెమలి పురివలె ప్రకాశించే బరువైనజుట్టు స్త్రీకి సౌందర్యహేతువులు. 'విభీతహరిణాక్షి, కలాపవిభాసికేశభారమ్మున నొప్పుదాని' అని నన్నయ ద్రౌపదికి ప్రయోగించిన విశేషణాలు రెండును ఆమె పొందుతున్న భీతిని, దుశ్శాసనుని దుష్టచేష్టవల్ల ఆ జుట్టు చెదరినరీతిని తెలియజెయ్యటంతో పాటు, దుర్యోధనుని కంటికి ఆ స్థితిలోగూడ ఆమె అందంగా కనిపించటాన్ని సూచిస్తున్నది. భీముణ్ణి 'కౌరవ కురంగ మృగేంద్రు' డనటంలో మున్ముందు అతనిచేత కౌరవులకు పట్టనున్న గతికూడ సూచన చేయబడింది. (ఈ పద్యరచనలో పదాలు మసృణత్వంతోనూ అర్థఘటనతోనూ కూడిఉండటంచేత శ్లేష మనే గుణం రౌద్రరసవిభావవర్ణనంలో విశిష్టంగా రూపొందింది. - సంపా.)

**క.** **లయసమయదండధర ని । ర్దయుఁడై ధరణీశు లెల్లఁ దనపలుకులు వి**
**స్మయసంభ్రమభయసంభృతు । లయి వినుచుండంగ నిట్టు లనియెన్ సభలోన్.** **248**

**ప్రతిపదార్థం:** లయ, సమయ, దండధర, నిర్దయుఁడు+ఐ= ప్రళయకాలంలోని యమధర్మరాజువలె దయలేనివాడై; ధరణి+ఈశులు+ఎల్లన్= రాజులందరు; విస్మయ, సంభ్రమ, భయ, సంభృతులు+అయి= ఆశ్చర్యంచేత, తొట్రుపాటుచేత, భయంచేత నిండినవారై; తన, పలుకులు= తనమాటలు; వినుచుండంగన్; సభలోన్; ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** భీముడు ప్రళయకాల యమధర్మరాజులా దయలేనివాడై, రాజులంతా ఆశ్చర్యంతో, తొట్రుపాటుతో, భయంతో తనమాటలు వింటూండగా సభలో ఇలా అన్నాడు.

**ఉ. ధారుణి రాజ్య సంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం**
**భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు**
**ర్వార మదీయ బాహుపరివర్తిత చండ గదాభిఘాత భ**
**గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్. 249**

**ప్రతిపదార్థం:** ధారుణి, రాజ్య, సంపద, మదంబునన్= భూమిమీద దొరతనమనే ఐశ్వర్యంవల్ల కలిగిన పొగరుచేత; కోమలిన్= అందమైన దానిని; కృష్ణన్= ద్రౌపదిని; చూచి; రంభ+ఊరున్= అరటి (బోదెల) వంటి తొడలు గల ఆమెను; నిజ+ఊరు, దేశమునన్= తనతొడమీది స్థలంపై; ఉండఁగన్; పిల్చిన; ఈ+దురాత్మున్= ఈ దుర్మార్గుణ్ణి; సుయోధనున్= దుర్యోధనుణ్ణి; ఉగ్ర, రణ+అంతరంబునన్= భయంకరమైన యుద్ధంలో; దుర్వార, మదీయ, బాహు, పరివర్తిత, చండ, గదా+అభిఘాత, భగ్న+ఉరుతర+ఊరున్= అడ్డగించసాధ్యం కాని నా చేతులచేత త్రిప్పబడిన భయంకరమైన గదయొక్క దెబ్బలచేత విరిగిన పెద్దతొడలు గలవాణ్ణిగా; చేయుదున్.

**తాత్పర్యం:** రాజ్యసంపదవల్ల కలిగిన పొగరుతో అందమైన ద్రౌపదిని చూచి, అరటి(బోదెల) వంటి తొడలు గల ఆమెను, తన తొడమీద కూర్చుండ రమ్మని పిలిచిన ఈ దుష్టదుర్యోధనుణ్ణి భయంకర యుద్ధరంగంలో ఎదుర్కొని, అడ్డగించ సాధ్యంకాని నా చేతులు త్రిప్పే భీకరగదాదండం దెబ్బలతో ఇతనితొడలు విరుగ కొట్టుతాను.

**విశేషం:** ఉదాత్తరమణీయమైన నన్నయ పద్యశైలికి ఉదాహరణాలైన ప్రసిద్ధ పద్యాల్లో ఇదొకటి. భయంకరాలు, భావి భారత మహా సంగ్రామానికి ప్రాతిపదికలు, రౌద్రరసానికి ఉనికి పట్టులు అయిన భీముని ప్రతిజ్ఞల్లో ఇది రెండవది. అనేకంగా ప్రయుక్తమైన 'ఊరు' శబ్దం పద్యశైలికి రమ్యతను కూర్చటమే కాక, ద్రౌపదిని కూర్చుండు మని దుర్యోధనుడు చూపిన ఊరువు భీముని కంటికి ఎంత కటువుగ మాటిమాటికి కనిపించిందో తెలుపుతున్నది. కాగా 'దుర్వారమదీయబాహుపరివర్తితచండగదాభిఘాత భగ్నోరుతరోరు' అని సుదీర్ఘంగా సుళ్ళు తిరుగుతూ సాగిన సమాసంలో- సహృదయుడు, భీముని చేతిలో ఆ చండగద తిరిగే విధాన్ని భావించుకోవచ్చు. (ఇందులో శబ్దశక్తిమూలకానురణనధ్వని, ఓజోగుణం పోషించబడ్డాయి. సంపా.)

**వ. అని సర్వజన భయానక క్రోధావేశ వివశుండయి యాయుధంబు లున్న వలనికి దృష్టులు సలుపుచు నగ్రజు మొగంబు సూచుచున్న భీమసేను నతిరౌద్రాకారంబు సూచి భీష్మ విదుర ద్రోణాదు'లిది కోపంబున కవసరంబు గా'దని యాతనిం బ్రశాంతచిత్తుం జేసి రంత. 250**

**ప్రతిపదార్థం:** అని, సర్వజన, భయానక, క్రోధ+ఆవేశ, వివశుండు+అయి= అందరికీ భయం కలిగించే కోపావేశంచేత మైమరచిన వాడై; ఆయుధంబులు+ఉన్న; వలనికిన్= దిక్కుకు; దృష్టులు= చూపులు; సలుపుచున్= సాగేటట్లు చేస్తూ; అగ్రజు, మొగంబు= అన్న అయిన ధర్మరాజు ముఖాన్ని; చూచుచున్న; భీమసేను, అతిరౌద్ర+ఆకారంబు= భీమసేనునియొక్క మిక్కిలి భయంకరమైన రూపు; చూచి; భీష్మ, విదుర, ద్రోణ+ఆదులు= భీష్ముడు, విదురుడు, ద్రోణుడు మొదలయినవాళ్ళు; ఇది; కోపంబునకున్; అవసరంబు= సమయం; కాదు+అని; ఆతనిన్= ఆ భీమసేనుణ్ణి; ప్రశాంత, చిత్తున్= మిక్కిలి శాంతిని పొందిన మనస్సు కలవాణ్ణిగా చేసిరి; అంతన్.

**తాత్పర్యం:** అని అందరికి భయాన్ని కలిగించే కోపావేశంతో మైమరచి ఆయుధా లుండే దిక్కుకు చూపులు ప్రసరింపజేస్తూ, అన్నమొగం చూస్తున్న ఆ భీమసేనుడి భయంకరాకారం చూచి, భీష్మవిదుర ద్రోణాదులు 'ఇది కోపానికి సమయంకా'దని ఆ భీమసేనుణ్ణి పూర్తిగా శాంతింపజేశారు. అప్పుడు.

**క. ధృతరాష్ట్రు నగ్నిహోత్రా । యతనంబున నఱచె వఱలు, లగ్నులు శాంత**
**ద్యుతులయ్యెఁ, గౌరవ స్త్రీ । తతిహృదయము లధికశోకతప్తము లయ్యెన్. 251**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రు, అగ్నిహోత్ర+ఆయతనంబునన్= ధృతరాష్ట్రుని యొక్క అగ్నిహోత్ర గృహంలో; వఱలు= పెద్దనక్కలు; అఱచెన్; అగ్నులు; శాంత, ద్యుతులు+అయ్యెన్= చల్లారిన వెలుగులు కలవి అయ్యాయి; కౌరవ, స్త్రీ, తతి, హృదయములు= కౌరవ స్త్రీ సమూహాల హృదయాలు; అధిక, శోక, తప్తములు+అయ్యెన్= పెద్దదుఃఖంచేత తపింప జేయబడినవి అయ్యాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుని అగ్నిహోత్రగృహంలో పెద్దనక్కలు అరిచాయి. అగ్నిహోత్రాల్లో వెలుగులు చల్లారినాయి. కౌరవస్త్రీసమూహాల హృదయాలు దుఃఖంతో కలతచెందాయి.

**విశేషం:** అపశకునాలు అశుభసూచకాలు.

**క. క్రూరాత్మకులై దుష్పద । వీ రతులగు ధార్తరాష్ట్రవీరుల శయ్యా**
**గారముల నెగసె నెంతయు । ఘోరంబుగఁ గాక ఘూక ఘూత్కారంబుల్. 252**

**ప్రతిపదార్థం:** క్రూర+ఆత్మకులు+ఐ= క్రూరమైన మనస్సుతో కూడిన వాళ్ళయి; దుష్పదవీ, రతులు+అగు= చెడుమార్గం ఇష్టం గలవాళ్ళయిన; ధార్తరాష్ట్ర, వీరుల= కౌరవ వీరులయొక్క; శయ్యా+అగారములన్= పడకటింట్లలో; ఎంతయున్; ఘోరంబుగన్= భయంకరంగా; కాక, ఘూక, ఘూత్కారంబుల్= కాకుల, గుడ్లగూబల అరుపులు; ఎగసెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** క్రూరమైన మనస్సు కలవాళ్ళు, చెడుమార్గం ఇష్టమైనవాళ్ళు, అయిన కౌరవ వీరుల పడకటింట్లలో ఎంతో భయంకరంగా కాకుల కూతలు, గుడ్లగూబల అరపులు వ్యాపించాయి.

**క. అట్టి మహోత్పాతంబులు । పుట్టినఁ గృప విదుర కలశభూ శాంతనవుల్**
**'నెట్టన ధృతరాష్ట్రజులకుఁ । బుట్టె నరిష్ట' మని రిష్టమునఁ దమలోనన్. 253**

**ప్రతిపదార్థం:** అట్టి; మహా+ఉత్పాతంబులు= పెద్ద అపశకునాలు; పుట్టినన్; కృప, విదుర, కలశభూ, శాంతనవుల్= కృపుడు, విదురుడు, కలశంలో నుండి పుట్టిన ద్రోణుడు; శంతనుని పుత్రుడైన భీష్ముడు; ఇష్టమునన్= ఇష్టంగా; తమలోనన్= తమలో తాము; ధృతరాష్ట్రజులకున్= ధృతరాష్ట్రుని కుమారులకు; నెట్టన= తప్పక; అరిష్టము= కీడు; పుట్టెన్; అనిరి.

**తాత్పర్యం:** అలాంటి పెద్ద అపశకునాలు పుట్టగా- కృప, విదుర, ద్రోణ, భీష్ములు తమలో తాము- ధృతరాష్ట్రుని కుమారులకు కీడు పుట్టిందని ఇష్టంగా అనుకొన్నారు.

**వ. అంత నంతయు నెఱింగి గాంధారి విదురుం దోడ్కొని ధృతరాష్ట్రు కడకుంబోయి పాండవపరాజయంబును ద్రౌపదిపరిభవంబును దుర్నిమిత్తోత్పత్తియుం జెప్పిన విని, ధృతరాష్ట్రుండు దుర్యోధనుం బిలిచి యిట్లనియె. 254**

**ప్రతిపదార్థం:** అంతన్; అంతయున్; ఎఱింగి= తెలుసుకొని; గాంధారి; విదురున్, తోడ్కొని; ధృతరాష్ట్రు, కడకున్= ధృతరాష్ట్రుని దగ్గరకు; పోయి; పాండవపరాజయంబును= పాండవుల ఓటమిని; ద్రౌపది, పరిభవంబును= ద్రౌపదియొక్క అవమానాన్ని; దుర్నిమిత్త+ఉత్పత్తియున్= అపశకునాల పుట్టుకను; చెప్పినన్; విని; ధృతరాష్ట్రుండు; దుర్యోధనున్; పిలిచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అప్పుడు జరిగిందంతా తెలుసుకొని గాంధారి- విదురుణ్ణి వెంట బెట్టుకొని ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళింది. పాండవులు ఓడిపోవటాన్ని, ద్రౌపదికి జరిగిన అవమానాన్ని, అపశకునాలు పుట్టటాన్ని ఆయనకు చెప్పింది. అది విని ధృతరాష్ట్రుడు దుర్యోధనుణ్ణి పిలిచి.

**విశేషం:** ఇంత జరిగిన తరువాత గాంధారి ఇప్పుడు కదిలింది. కోడలిమీద సానుభూతి పెరిగి కదిలిందో? లేక కొడుకుల క్షేమాన్ని కాంక్షించి కదిలిందో?

**చ.** **పరమపతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధ**
**ర్మరత నయోనిజం బ్రకృతిమానవభామినిఁగాఁ దలంచి దె**
**ప్పరములు వల్కఁగాఁ దగునె? బాల్యము నాదిగ దుష్టభావనం**
**బెరిఁగితి నీ నిమిత్తమునఁ బెద్దయు దుఃఖితు లైరి పాండవుల్.** **255**

**ప్రతిపదార్థం:** పరమ, పతివ్రతన్; తపస్వినిన్= తాపసురాలిని; పాండవ, ధర్మపత్నిన్= పాండవుల ఇల్లాలిని; ధర్మరతన్= ధర్మంపట్ల అభిలాష కల దానిని; అయోనిజన్= గర్భంనుండి పుట్టని దానిని; ద్రౌపదినిన్; ప్రకృతి, మానవ, భామినిగాన్= సామాన్య మానవకాంతగా; తలంచి; దెప్పరములు= ఓర్చుకొన సాధ్యంగాని మాటలు; సభన్= సభలో; పల్కఁగాన్= మాట్లాడగా; తగునె= తగునా? బాల్యము+ఆదిగన్= చిన్నతనం మొదలుకొని; దుష్టభావనన్= చెడు తలంపుతో; పెరిఁగితి= పెరిగావు; నీ నిమిత్తమునన్= నీ కారణంగా; పాండవుల్; పెద్దయున్= మిక్కిలి; దుఃఖితులు+ఐరి= దుఃఖాన్ని పొందినవా ళ్ళయ్యారు.

**తాత్పర్యం:** పరమపతివ్రత, తాపసురాలు, పాండవుల ఇల్లాలు, ధర్మంపట్ల ప్రీతి కలది, మానవగర్భంనుండి పుట్టనిది అయిన ద్రౌపదిని- సామాన్య మానవకాంతగా తలచి, ఓర్చుకోటానికిసాధ్యం గాని మాటలు సభలో మాట్లాడటం తగునా? బాల్యంనుండి నీవు చెడు తలంపుతోనే పెరిగావు. నీ కారణంగా పాండవులు ఎంతో దుఃఖం అనుభవించారు.

**విశేషం:** గతజన్మంలో ద్రౌపది ఇంద్రసేన. గొప్పతపస్సు చేసిన పతివ్రత. (ధృతరాష్ట్రుడి మాటలలో అగ్రామ్యత్వం, వికటత్వం ఉదారతాగుణాన్ని రూపొందిస్తున్నాయి. - సంపా.)

**వ.** **'వారలవలన నీ దురాగ్రహం బుడుగు'మని కొడుకును భంగించి సకలబాంధవహితంబు సేయందలంచి ద్రౌపదిని రావించి శాంతవచనంబుల నిట్లనియె.** **256**

**ప్రతిపదార్థం:** వారలవలనన్= వారలపట్ల; నీ, దురాగ్రహంబు= నీ చెడుకోపం; ఉడుగుము= మానుము; అని; కొడుకును; భంగించి= త్రోసిపుచ్చి; సకల, బాంధవ, హితంబు= అందరు బంధువులకు మేలు; చేయన్, తలంచి; ద్రౌపదిని; రావించి; శాంత, వచనంబులన్= మెత్తనిమాటలచే; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'వాళ్ళమీద నీవు కోపం మాను' అని కొడుకును త్రోసిపుచ్చి, అందరు బంధువులకు మేలు చెయ్యాలనే తలంపుతో ద్రౌపదిని పిలిచి మెత్తనిమాటలతో ఇలా అన్నాడు.

ధృతరాష్ట్రుండు ద్రౌపదిగోరినవరంబు లిచ్చుట (సం. 2-63-27)

**క. సుందరి! నా కోడండ్రుర । యం దభ్యర్హితవు నీవ; యతిముదమున నీ**
**కుం దగఁ బ్రియంబు సేసెద । నిందుముఖీ! వేఁడు మెద్ది యిష్టము నీకున్. 257**

**ప్రతిపదార్థం:** సుందరి; నా, కోడండ్రుర, అందున్= నాకోడండ్రందరిలో; నీవు+అ= నీవే; అభ్యర్హితవు= గౌరవించదగినదానవు; ఇందుముఖీ= చంద్రునివంటి అందమైన ముఖం కలదానా!; అతి, ముదమునన్= మిక్కిలి సంతోషంతో; నీకున్; తగన్= తగిన విధంగా; ప్రియంబు, చేసెదన్= ఇష్టమైనది ఇస్తాను; నీకున్; ఎద్ది= ఏది; ఇష్టము; వేఁడుము= కోరుకొనుము.

**తాత్పర్యం:** సుందరీ! ద్రౌపదీ! నా కోడళ్ళందరిలో నీవే గౌరవించదగిన దానివి. చంద్రముఖీ! నీ కేది ఇష్టమో కోరుకో. ఎంతో సంతోషంతో ఇస్తా.

**విశేషం:** ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. ద్రౌపది అందాన్ని గురించి ఆయన విని ఉంటాడే కాని చూడలేదు. అయినా ఈ సందర్భంలో ఆమెను సుందరీ, ఇందుముఖీ- అని సంబోధిస్తున్నాడు. సౌందర్య సూచకాలైన సంబోధనలు స్త్రీలకు సంతోషహేతువులు. ద్రౌపది మనస్సును సుముఖం చేసుకోటానికి ధృతరాష్ట్రుడు ఆమెను అలా సంబోధించి ప్రశంసించా డని అనిపిస్తుంది.

**వ. అనినం బాంచాలి యి ట్లనియె. 258**

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడనగా, ద్రౌపది ఇలా అన్నది.

**ఆ. కరుణతోడ నాకు వరము ప్రసాదింప । బుద్ధియేని లోకపూజితుండు**
**మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు । వలనఁ బాయవలయు వసుమతీశ! 259**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ= ఓ భూనాథ! ధృతరాష్ట్రమహారాజా!; కరుణతోడన్= దయతో; నాకున్; వరము; ప్రసాదింపన్= ఇవ్వటానికి, బుద్ధి, ఏనిన్= మనస్సు కలదేని; లోకపూజితుండు= ప్రపంచంచేత పూజించబడేవాడు; మను, నిభుండు= మనువుతో సమానమైనవాడు; ధర్మతనయుండు= ధర్మరాజు; దాస్యంబువలనన్= సేవకత్వంనుండి; పాయవలయున్= తొలగిపోవాలి, విముక్తుడు కావాలి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! దయతో నాకు వరం ఇవ్వా లని మీకు అనిపిస్తే, లోకంచేత పూజించబడేవాడు, మనువుతో సమానమైనవాడు అయిన ధర్మరాజుకు దాస్యంనుండి విముక్తి కలగాలి.

**విశేషం:** అపౌరుష్యం, అజరరత్వం గల ఈ పద్యరచన సౌకుమార్యానికి చక్కని ఉదాహరణం. (సంపా.)

**వ. 'అ ట్లయినం గురుకుమారులు గురువృద్ధజనలాలితుండై పెరిఁగిన ప్రతివింధ్యు దాసపుత్త్రుం డనకుండుదు; రిదియ నా యిష్టం' బనిన 'నిచ్చితి; నింక రెండవవరంబు వేఁడు' మనిన ద్రౌపది యి ట్లనియె. 260**

**ప్రతిపదార్థం:** అట్లు+అయినన్; కురు, కుమారులు= కౌరవులు; గురు, వృద్ధ జన, లాలితుండు+ఐ= గురువులచేత, పెద్దవారిచేత బుజ్జగించబడిన వాడై; పెరిగిన; ప్రతివింధ్యు= ప్రతివింధ్యుని; దాస పుత్త్రుండు= సేవకుని కొడుకు; అనక+ ఉండుదురు= అని అనకుండా ఉంటారు; ఇదియే; నాకున్; ఇష్టంబు; అనినన్; ఇచ్చితిన్; ఇంక; రెండవ, వరంబు; వేఁడుము= కోరుకొనుము; అనినన్; ద్రౌపది; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'అలా అయితే గురువులచేత, పెద్దవారిచేత బుజ్జగించబడి పెరిగిన మా ప్రతివింధ్యుణ్ణి కౌరవులు సేవకుని కొడు కని అనకుండా ఉంటారు. ఇదే నా కోరిక' - అని ద్రౌపది అనగా- 'ఇచ్చాను- రెండవవరం కోరుకో' అని ధృతరాష్ట్రు డన్నాడు. అందుకు ద్రౌపది ఇలా అన్నది.

**విశేషం:** ప్రతివింధ్యుడు ద్రౌపదికి ధర్మరాజువల్ల జన్మించిన కుమారుడు. ఈ కోరికలో రాచకూతురుగా ద్రౌపది మాతృహృదయం వ్యక్తమవుతుంది.

**క. నెమ్మిని ధర్మజు నలువురు । దమ్ములుఁ దమ యాయుధములఁ దమవర్మవరూ**
**థమ్ములయుఁ దోడ సకల హి । తమ్ముగఁ బాయంగవలయు దాస్యము వలనన్. 261**

**ప్రతిపదార్థం:** నెమ్మినిన్= సంతోషంతో; ధర్మజు, నలుగురు, తమ్ములున్= ధర్మరాజుయొక్క నలుగురు తమ్ములును; తమ, ఆయుధములన్, తమ, వర్మ, వరూథమ్ములయున్+తోడన్= తమయొక్క ఆయుధాలతో కవచాలతో, గృహాలతో గూడ; సకల హితమ్ముగన్= అందరికి మేలు కలిగేటట్లు; దాస్యమువలనన్= దాస్యంనుండి; పాయంగవలయున్= తొలగాలి.

**తాత్పర్యం:** సంతోషంతో ధర్మరాజు నలుగురు తమ్ములు, తమ ఆయుధాలతో, కవచాలతో, గృహాలతో అందరికి మేలు కలిగేటట్లు దాస్యంనుండి విముక్తి పొందాలి.

**వ. అనిన ధృతరాష్ట్రుండు 'నీకోరిన వరం బిచ్చితి; నింక మూఁడవవరంబు వేఁడు' మనిన ద్రౌపది యి ట్లనియె. 262**

**తాత్పర్యం:** అని ద్రౌపది అనగా ధృతరాష్ట్రుడు 'నీవు కోరినవరం ఇచ్చాను. ఇంకా, మూడవవరం కోరుకో' అనగా ద్రౌపది ఇలా అన్నది.

**ఆ. 'వైశ్యసతికి నొక్క వరము, సత్క్షత్త్రియ । సతికి రెండు, శూద్రసతికి మూఁడు,**
**విప్రసతికి నూఱు వేఁడఁజ న్వరములు । గాన యింక వేఁడఁగాదు నాకు.' 263**

**ప్రతిపదార్థం:** వైశ్యసతికిన్= వైశ్య స్త్రీకి; ఒక్క వరము; సత్+క్షత్త్రియ సతికిన్= ఉత్తమక్షత్త్రియస్త్రీకి; రెండు; శూద్రసతికిన్= శూద్ర స్త్రీకి; మూఁడు; విప్రసతికిన్= బ్రాహ్మణ స్త్రీకి; నూఱు, వరములు; వేఁడన్+చన్= కోరదగును; కాన; ఇంకన్; నాకున్; వేఁడన్+కాదు= కోరదగదు.

**తాత్పర్యం:** వైశ్యస్త్రీ ఒకవరం, ఉత్తమక్షత్త్రియస్త్రీ రెండువరాలు, శూద్రస్త్రీ మూడువరాలు, బ్రాహ్మణస్త్రీ వంద వరాలు కోరవచ్చు. అందువల్ల ఇక నేను కోరకూడదు.

**వ. అనిన ధృతరాష్ట్రుండు కోడలి గుణంబులకు ధర్మం బెఱుంగుటకు సంతసిల్లి, యనుజ సహితుం డయిన యుధిష్ఠిరు రావించి 'నీవు సర్వసంపదలు స్వరాజ్యంబు నొప్పుగొని యెప్పటియట్ల యింద్రప్రస్థపురంబున కరిగి సుఖం బుండుము; నీకు లగ్గయ్యెడు' మని వెండియు. 264**

**ప్రతిపదార్థం:** అనిన; ధృతరాష్ట్రుండు; కోడలి; గుణంబులకున్= మంచిగుణాలకు; ధర్మంబు+ఎఱుంగుటకున్= ధర్మం తెలిసి ఉండటానికి; సంతసిల్లి= సంతోషించి; అనుజ, సహితుండు+అయిన= తమ్ములతో కూడిన; యుధిష్ఠిరున్= ధర్మరాజును; రావించి; నీవు; సర్వ, సంపదలు; స్వ, రాజ్యంబున్= నీ యొక్క రాజ్యాన్ని; ఒప్పుగొని= తీసుకొని; ఎప్పటి, అట్ల= ఎప్పటివలె; ఇంద్రప్రస్థ, పురంబునకున్; అరిగి= వెళ్ళి; సుఖంబుండుము; నీకున్; లగ్గు= మేలు; అయ్యెడుము+అని= అవునని; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** ద్రౌపది మాటలు విన్న ధృతరాష్ట్రుడు ఆ కోడలి గుణాలకు, ధర్మపరిజ్ఞానానికి, సంతోషించి, యుధిష్ఠిరుణ్ణి, అతనితమ్ములతో కూడ రప్పించి, 'నీవు సర్వసంపదలు, నీ రాజ్యం తీసుకొని ఎప్పటిలా ఇంద్రప్రస్థానికి వెళ్ళి సుఖంగా జీవించు. నీకు మేలు కలుగుతుంది' అని, మళ్ళీ.

**తే. నీవు నిత్యంబు వృద్ధోపసేవఁ జేసి । యెఱుఁగు దెల్ల ధర్మంబులు; నెఱుక లేక**
**కడఁగి నీ కెగ్గు సేసె నా కొడుకు; దీని । మఱచునది; నీకు నే నొండ్లు గఱపనేల? 265**

**ప్రతిపదార్థం:** నీవు; నిత్యంబు= ఎల్లప్పుడు; వృద్ధ+ఉపసేవన్+చేసి= పెద్దలసేవ చేసి; ఎల్లధర్మంబులన్= అన్నిధర్మాలను; ఎఱుఁగుదు= తెలిసినవాడివి; నా, కొడుకు; ఎఱుక లేక= జ్ఞానం లేక; కడఁగి= పూనుకొని; నీకున్; ఎగ్గు= కీడు; చేసెన్; దీనిన్= ఈ అపకారాన్ని; మఱచునది; నీకున్; నేను; ఒండ్లు= ఇతరాలు; కఱపన్+ఏల= బోధించట మెందుకు?

**తాత్పర్యం:** నీవు పెద్దలసేవ చేసి అన్ని ధర్మాలు తెలుసుకొన్నావు. నాకొడుకు జ్ఞానం లేక నీకు కీడు చేశాడు. ఈ అపకారాన్ని మరచిపో. నీకు నేను ఇంకేమీ బోధించ నక్కరలేదు.

**క. మనమున వేరమిఁ దలఁపమి । యును, సక్షమచిత్తుఁ డగుటయును, గుణములు కై**
**కొని దోషమ్ములు విడుచుట । యును నుత్తముఁ డయిన పురుషు నుత్తమగుణముల్. 266**

**ప్రతిపదార్థం:** మనమునన్= మనస్సులో; వేరమిన్= వైరాన్ని; తలఁపమియును= తలంచకుండటం; సక్షమ, చిత్తుఁడు+అగుటయును= ఓర్పుతో కూడిన మనస్సు కలవాడు కావటం; గుణములు; కైకొని= గ్రహించి; దోషమ్ములు; విడుచుటయును; ఉత్తముఁడు+అయిన= గొప్పవాడైన; పురుషు, ఉత్తమ, గుణముల్= మానవునియొక్క గొప్పగుణాలు.

**తాత్పర్యం:** మనసులో వైరం తలచకుండటం, ఓర్పుతో కూడిన మనస్సు కలిగి ఉండటం, గుణాలు గ్రహించి, దోషాలు విడిచి వేయటం, గొప్పవ్యక్తియొక్క గొప్పగుణాలు.

**విశేషం:** మానవతకు వెలుగు నిచ్చే చక్కని సూక్తుల్లో ఇ దొకటి. (పై పద్యం, ఈ పద్యం మాధుర్యగుణానికి మచ్చుతునకలు. సంపా.)

**వ. ఏను బుద్ధిలేక జూదం బుపేక్షించితి; నల్పబుద్ధిసత్త్వుండయిన వృద్ధు నన్నును, మీతల్లి యయిన గాంధారినిం దలంచి, దుర్యోధనాదులు సేసిన దుర్నయంబులు సేకొన కుండునది; సర్వశాస్త్రవిదుం డయిన విదురుండు మంత్రిగా సర్వధర్మవిదుండవైన నీవు రక్షకుండవుగా నిక్కురుకులంబునకు లగ్గగు'నని ధర్మరాజుఁ బాండురాజు రాజ్యంబునందు సమర్పించిన. 267**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; బుద్ధిలేక; జూదంబు+ఉపేక్షించితిన్= జూదాన్ని అశ్రద్ధచేశాను; అల్ప, బుద్ధి, సత్త్వుండు+అయిన= కొద్దిదైన బుద్ధిబలం గల; వృద్ధున్= ముసలివాణ్ణి; నన్నును; మీ, తల్లి, అయిన; గాంధారినిన్, తలంచి; దుర్యోధన+ఆదులు= దుర్యోధనుడు మొదలయినవాళ్ళు; చేసిన; దుర్నయంబులు= చెడ్డపనులు; చేకొనక+ఉండునది= లెక్కపెట్టకుండ ఉండేది; సర్వ, శాస్త్ర విదుండు+అయిన= అన్ని శాస్త్రాలు తెలిసిన వాడైన; విదురుండు; మంత్రిగా; సర్వ, ధర్మ, విదుండవు+ఐన= అన్ని ధర్మాలు తెలిసిన వాడి వైన; నీవు; రక్షకుండవుగాన్; ఈ+కురుకులంబునకున్= ఈ కురువంశానికి; లగ్గు+అగున్= మే లవుతుంది; అని; ధర్మరాజున్; పాండురాజు, రాజ్యంబునందున్; సమర్పించినన్= గౌరవంగా అప్పగించగా.

**తాత్పర్యం:** 'నేను బుద్ధిలేక జూదాన్ని ఉపేక్షించాను. స్వల్పబుద్ధి గల ముసలివాణ్ణి నన్నూ, మీ తల్లి గాంధారినీ తలచి దుర్యోధనాదులు చేసిన చెడ్డపనులు మనస్సులో పెట్టుకోవద్దు. అన్నిశాస్త్రాలు తెలిసిన విదురుడు మంత్రిగా, అన్ని ధర్మాలు తెలిసిన నీవు రక్షకుడవుగా ఈ కురువంశానికి శుభం కలుగుతుంది' అని ధృతరాష్ట్రుడు పాండురాజు రాజ్యాన్ని ధర్మరాజుకు సమర్పించాడు.

**విశేషం:** ఇది ధృతరాష్ట్రుని మనోవేదనను వ్యక్తం చేసే వచనం. పుత్రమమకారం, అధర్మఫలభీతి అనే అడకత్తెరలో ఆ తండ్రి నలుగుతున్నాడు. 'సమర్పించిన' అనే దానికి అనేకప్రతుల్లో ఉండే 'నియోగించిన' అనే పాఠాంతరం అర్థస్పష్టతకు ఎక్కువ అనుకూలమైనదిగా ఉంది.

**తరలము.**

**తరుణి ద్రౌపది యిట్లు పాండవధార్తరాష్ట్రులదైన భీ**
**కర పరస్పర కోపవేగము గ్రన్నఁ బాచి విపత్తి సా**
**గర నిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల ధీరులం**
**బురుషసింహములన్ నిజేశులఁ బూని తద్దయుఁ బ్రీతితోన్. 268**

**ప్రతిపదార్థం:** తరుణి= యౌవనవతి; ద్రౌపది; ఇట్లు= ఈ విధంగా; పాండవ ధార్తరాష్ట్రులది+ఐన= పాండవులయొక్క; ధృతరాష్ట్రుని కుమారులైన కౌరవులయొక్క; భీకర, పరస్పర, కోప, వేగము= భయంకరమైన పరస్పరకోపంయొక్క తీవ్రతను; క్రన్నన్= త్వరగా; పాచి= తొలగించి; విపత్తి, సాగర, నిమగ్నులన్= ఆపద అనే సముద్రంలో పూర్తిగా మునిగినవాళ్ళను; ప్రకాశ, కీర్తులన్= వెలుగుతున్న కీర్తి కలవాళ్ళను; ధీరులన్= ధైర్యవంతులను; పురుష, సింహములన్= పురుష శ్రేష్ఠులను; నిజ+ఈశులన్= తన భర్తలను; పూని= ప్రయత్నించి; తద్దయున్= మిక్కిలి; ప్రీతితోన్= ప్రేమతో; ఉద్ధరించెన్= లేవనెత్తింది.

**తాత్పర్యం:** ద్రౌపది ఈ విధంగా పాండవులకు, కౌరవులకు ఒకరిమీద మరొకరికున్న భయంకరకోపతీవ్రతను త్వరగా తొలగించింది. ఆపద అనే సముద్రంలో పూర్తిగా మునిగిన కీర్తిమంతులు, ధైర్యవంతులు, పురుషశ్రేష్ఠులు అయిన తనభర్తలను ప్రయత్నించి ఎంతో ప్రేమతో పైకి తీసింది.

**విశేషం:** అలం: రూపకం. గుణం : శ్లేష, (సంపా.)

**సీ.** **దాని నంతయు భీమసేనుండు విని 'రాజ్య । సంప్రాప్తి పాండవసత్తములకు**
**సతికారణంబున ధృతమయ్యె నను నింత । కంటెను గష్టంబు గలదె యొండు;**
**పేర్మి నపత్యంబుఁ గర్మంబు విద్యయు । నను నివి తేజంబు లట్టె తగిన**
**పురుషున కెందును; నిరతంబు మిక్కిలి । తేజంబు కర్మంబు; దీని విడిచి**

**ఆ.** **యలుక గాఁడె పురుషుఁ' డని కోపఘూర్ణిత । రక్తనేత్రుఁడై 'పరాక్రమమున**
**శత్రువరుల నుగ్రసంగరంబునఁ జంపి । కుతలరాజ్యమెల్లఁ గొందు' ననుచు.** **269**

**ప్రతిపదార్థం:** దానిన్; అంతయున్; భీమసేనుండు; విని; పాండవ, సత్తములకున్= పాండవశ్రేష్ఠులకు; రాజ్య, సంప్రాప్తి= రాజ్యలాభం; సతి, కారణంబునన్= భార్యమూలంగా; ధృతము+అయ్యెన్= ధరించబడినది అయినది; అను నింతకంటెను= అనిపించుకొనటంకంటె; కష్టంబు; ఒండు= మరొకటి; కలదె= కలదా? పేర్మిన్= గొప్పగా; అపత్యంబున్= సంతానం; కర్మంబు= చేయవలసిన పని; విద్యయున్; అను, ఇవి; తగిన; పురుషునకున్; ఎందును= ఎచ్చటనైనను; తేజంబులు+అట్టె= వెలుగులను (కీర్తిని) కలిగిస్తాయా?; నిరతంబు= ఎల్లప్పుడు; మిక్కిలి, తేజంబు, కర్మంబు= వీరకృత్యమే; మిక్కిలి శ్రేష్ఠం, దీని; విడిచి; పురుషుఁడు; అలుకగాఁడె= తేలికపడడా! అని; కోప, ఘూర్ణిత, రక్త, నేత్రుఁడు+ఐ= కోపంచేత తిరుగుడు పడిన ఎఱ్ఱని కన్నులు కలవాడై; పరాక్రమమునన్= శౌర్యంతో; శత్రు, వరులన్= శత్రురాజులన్; ఉగ్ర, సంగరంబునన్= భయంకరమైన యుద్ధంలో; చంపి; కుతల, రాజ్యము+ఎల్లన్= భూమిమీది రాజ్యాధికారాన్నంతను; కొందును= గ్రహిస్తాను; అనుచున్.

**తాత్పర్యం:** భీమసేనుడు అంతా విని 'పాండవ శ్రేష్ఠులకు రాజ్యలాభం భార్యమూలంగా వచ్చిం దని అనిపించుకోవటంకంటె కష్టం మరొకటి లేదు. పురుషునికి వెలుగునిచ్చేవి- గొప్ప సంతానం, చేసేపని, విద్య, ఎల్లప్పుడు వీరకృత్యమే శ్రేష్ఠం. దీన్ని విడిచిన పురుషుడు తేలికపడడా!' అని కోపంతో తిరుగుడుబడిన ఎఱ్ఱనికళ్ళు కలవాడై, 'పరాక్రమంతో శత్రురాజులను భయంకరయుద్ధంలో సంహరించి రాజ్యమంతా గ్రహిస్తా' నంటూ.

**విశేషం:** 'అలుకగాఁదె' అనే పాఠానికి 'అలుసుగాఁదె', 'అలతిగాదె' అనే పాఠాంతరా లున్నాయి.

**వ.** **మృగమధ్యంబున నున్న సింహంబునుంబోలె ననుజమధ్యంబున నున్న యాతనిం గరంబున వారించి, ధర్మరాజు ధృతరాష్ట్ర శాసనంబునం దమ్ములుం దానును ద్రౌపదీ సహితంబుగాఁ గాంచనరథారూఢుఁ డై యింద్రప్రస్థపురంబున కరిగిన; నిట దుశ్శాసనుచేత నంత వృత్తాంతంబును విని దుర్యోధనుండు కర్ణశకుని సైంధవులతో విచారించి ధృతరాష్ట్రుపాలికిం జని యి ట్లనియె.** **270**

**ప్రతిపదార్థం:** మృగ, మధ్యంబునన్+ఉన్న= జింకలమధ్య ఉన్న; సింహంబునున్+పోలెన్= సింహంవలె; అనుజమధ్యంబునన్+ఉన్న= తమ్ముల మధ్య ఉండే; ఆతనిన్= ఆ భీమసేనుణ్ణి; ధర్మరాజు; కరంబునన్= చేతితో; వారించి= అడ్డగించి; ధృతరాష్ట్ర, శాసనంబునన్= ధృతరాష్ట్రుని ఆజ్ఞ ప్రకారం; తమ్ములున్; తానును; ద్రౌపదీ, సహితంబుగాన్= ద్రౌపదితోకూడ; ఇంద్రప్రస్థ, పురంబునకున్; అరిగినన్= వెళ్ళగా; ఇట; దుశ్శాసనుచేతన్; అంత, వృత్తాంతంబును= జరిగిన విషయాన్నంతటిని; విని; దుర్యోధనుండు; కర్ణ, శకుని, సైంధవులతో, విచారించి; ధృతరాష్ట్ర పాలికిన్= ధృతరాష్ట్రుని దగ్గరికి; చని= వెళ్ళి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** జింకలమధ్య ఉన్న సింహంలా తమ్ముల మధ్య ఉన్న ఆ భీమసేనుణ్ణి, ధర్మరాజు చేతితో అడ్డగించాడు. ధృతరాష్ట్రునిఆజ్ఞప్రకారం తమ్ములు, తాను, ద్రౌపదితో కలిసి ఇంద్రప్రస్థపురానికి వెళ్ళాడు. జరిగిందంతా దుశ్శాసనునిద్వారా విని దుర్యోధనుడు, కర్ణ శకుని సైంధవులతో ఆలోచించి, ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి ఇలా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. తాను చేసినదంతా తండ్రి తలక్రిందులు చేస్తే దుర్యోధనుని స్థితిలో ఉన్న ఏ తనయుడైనా ఊరకుంటాడా?

**క. అహితుల నెల్ల విధంబుల । విహతులఁగాఁ జేయునది వివేక మని మరు**
**న్మహితుండు చెప్పె నిది మును । బృహస్పతి సురేశ్వరునకుఁ బ్రియహితబుద్ధిన్. 271**

**ప్రతిపదార్థం:** అహితులను= శత్రువులను; ఎల్ల, విధంబులన్= అన్ని విధాల; విహతులన్+కాన్= తెగటార్చ బడిన వాళ్ళనుగా; చేయునది; వివేకము= తెలివి; అని; మరుత్+మహితుండు= దేవతలలో గొప్పవాఁడు; బృహస్పతి; మును= పూర్వం; ప్రియ, హిత, బుద్ధిన్= ప్రేమతో మేలు చేసే తలంపుతో; సుర+ఈశ్వరునకున్= దేవతలరాజుకు-దేవేంద్రునికి; ఇది; చెప్పెన్.

**తాత్పర్యం:** 'శత్రువుల్ని అన్నివిధాల తెగటార్చటమే వివేకం' అని దేవతల్లో గొప్పవాడైన బృహస్పతి- దేవరాజైన దేవేంద్రునికి మేలు చెయ్యా లని ప్రేమతో చెప్పాడు.

**వ. అప్పాండవుల కెంత లగ్గు సేసియు నింక హితుల మయ్యెదమె? యాశీవిషంబుల నలిగించి కంఠ సమీపంబున విడుచునట్లు వారల విడిచిపుచ్చి కర్జంబు దప్పితిమి. 272**

**ప్రతిపదార్థం:** ఆ+పాండవులకున్; ఎంత; లగ్గు= మేలు; చేసియున్; ఇంక; హితులము= మేలు చేసేవాళ్ళము; అయ్యెదము+ ఎ= అవుతామా?; ఆశీ, విషంబులన్= ముఖంలో విషం కలవాటిని- పాములను; అలిగించి= కోపపడేటట్లు చేసి; కంఠసమీపంబునన్= గొంతు దగ్గర; విడుచునట్లు; వారలన్; విడిచి; పుచ్చి= పంపి; కర్జంబు= చేయదగినపని; తప్పితిమి.

**తాత్పర్యం:** ఆ పాండవులకు ఎంతమేలు చేసినా ఇంక మనం మంచివాళ్ళం అవుతామా! పాములను కోపపడేటట్లు చేసి కంఠంపై విడిచినట్లు వాళ్ళను వదలి, పంపి, తప్పు చేశాము.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. భూ విదిత ప్రతాప పరిభూత విపక్షుఁడు సవ్యసాచి గాం**
**డీవము గొన్న భీముఁడు వడిన్ గదగొన్నఁ, గవల్ కృపాణచ**
**ర్మావరణాది భాసిత మహాభుజ విక్రములైన, వారలన్**
**లావె రణంబులో మన కలంఘ్యబలాఢ్యుల నింక నోర్వఁగన్. 273**

**ప్రతిపదార్థం:** భూ, విదిత, ప్రతాప, పరిభూత, విపక్షుఁడు= ప్రపంచప్రసిద్ధమైన పరాక్రమంచేత ఓడించబడిన శత్రువులుకలవాడు; సవ్యసాచి= అర్జునుడు; గాండీవము; కొన్నన్= చేత పట్టితే; భీముఁడు; వడిన్= వేగంగా; గద, కొన్నన్= గదను చేపట్టితే; కవల్= నకుల సహదేవులు; కృపాణ, చర్మ+ఆవరణ+ఆది, భాసిత, మహా, భుజ, విక్రములు+ఐనన్= కత్తి, డాలు, కవచం మొదలైన

వాటిచేత ప్రకాశించిన గొప్ప బాహుపరాక్రమం కలవాళ్ళయితే; వారలన్; అలంఘ్య, బల+ఆఢ్యులన్= దాటసాధ్యంకాని బలంతో కూడుకొన్నవాళ్ళను- అంటే జయింప సాధ్యంగాని బలంతో కూడుకొన్నవాళ్ళను; రణంబులోన్= యుద్ధంలో; ఇంకన్; మనకున్; ఓర్వఁగన్= సహించటం; లావె= శక్యమా?

**తాత్పర్యం:** ప్రపంచ ప్రసిద్ధమైన పరాక్రమంచేత శత్రువుల్ని ఓడించిన సవ్యసాచి, గాండీవం చేతపట్టితే- భీముడు వడిగా గదను చేబూనితే, నకుల సహదేవులు కత్తి, డాలు, కవచం మొదలైనవాటిచేత ప్రకాశించే గొప్ప భుజ పరాక్రమం కలవాళ్ళయితే, జయింప సాధ్యంగాని ఆ బలవంతుల్ని మనం యుద్ధంలో ఎదిరించి నిలవటం సాధ్యమా?

**విశేషం:** సవ్యసాచి అనే పదప్రయోగం, ఆ పదానికి విశేషణంగా కూర్చిన సుదీర్ఘ సమాసం గాండీవం చేపట్టిన అర్జునుని భీకరవీర విహారాన్ని చక్కగా వ్యక్తం చేస్తున్నవి. పాపపు పని చేసినవానికి దానిఫలితాన్ని గూర్చిన భయం ఎక్కువ. అందుచేత దుర్యోధనుని ఈ భయం అసహజమైంది కాదు. (ఈ పద్యరచనలో పాండవ పరాక్రమంవల్ల ప్రదర్శితమైన వీరరసదీప్తి ఔజ్జ్వల్యప్రధానమై కాంతి గుణపోషకంగా ఉంది. - సంపా.)

**వ.** **'కావున వారల ననుద్యూతంబునఁ బరాజితులం గావించి విరళ దేశ నిర్వాసితులం జేయుట కార్యం' బనిన విని ధృతరాష్ట్రుం డొడంబడి, యప్పుడ యనుద్యూతార్థంబు ధర్మనందనుం దోడితేరం బ్రాతికామిం బంచినం 'బితృనియోగంబును విధినియోగంబు నతిక్రమింప నగునే' యని.** **274**

**ప్రతిపదార్థం:** కావున; వారలన్= పాండవులను; అనుద్యూతంబునన్= రెండవ జూదంలో; పరాజితులన్= ఓడిపోయినవాళ్ళనుగా; కావించి= చేసి; విరళదేశ, నిర్వాసితులన్= దూరప్రదేశాలకు వెళ్ళగొట్టబడినవాళ్ళనుగా; చేయుట; కార్యంబు; అనినన్; విని; ధృతరాష్ట్రుండు; ఒడంబడి= ఒప్పుకొని; అప్పుడు+అ= అప్పుడే; అనుద్యూత+అర్థంబు= రెండవమారు జూదమాడటంకొరకు ధర్మనందనున్ - ధర్మరాజును; తోడితేరన్= తోడ్కొని రావటానికి; ప్రాతికామిన్; పంచినన్= పంపగా; పితృ, నియోగంబును= తండ్రియొక్క ఆజ్ఞను; విధి, నియోగంబున్= దైవనిర్ణయాన్ని; అతిక్రమింపన్+అగునే= దాటనవునా; అని.

**తాత్పర్యం:** 'కావున పాండవుల్ని పునర్ద్యూతంలో ఓడించి దేశంనుండి వెళ్ళగొట్టటమే మనం చెయ్యదగినపని' అని అనగా ధృతరాష్ట్రుడు ఒప్పుకొని, అప్పుడు మళ్ళీ జూదమాడటానికి ధర్మరాజును పిలుచుకొని రమ్మని ప్రాతికామిని పంపాడు. 'తండ్రి ఆజ్ఞ, దైవనిర్ణయం దాటనవునా?' అని.

**విశేషం:** పునర్ద్యూత విషయంలో భీష్ముడు తన అసమ్మతిని వెలిబుచ్చటం, గాంధారి దుర్యోధనుణ్ణి వదలివేసి అయినా కులాన్ని రక్షించు మని ధృతరాష్ట్రునికి హితబోధ చేయటం- మొదలయినవి మూలంలో ఉన్నాయి కాని, తెలుగు భారతంలో లేవు.

**క.** **నృపవరుఁ డనుజులుఁ దానును । ద్రుపదతనూజయుఁ బ్రియంబుతో నరిగెను హ**
**స్తిపురంబునకు నశేష । స్వపక్షజన హృదయములకు సంతాపముగన్.** **275**

**ప్రతిపదార్థం:** నృప, వరుఁడు= రాజశ్రేష్ఠుడు- ధర్మరాజు; అనుజులున్= తమ్ములును; తానును; ద్రుపద తనూజయున్= ద్రుపదుని యొక్క పుత్రిక అయిన ద్రౌపదియు; అశేష, స్వ, పక్ష, జన, హృదయములకున్= తన పక్షంలోని జనులందరి హృదయాలకు; సంతాపముగన్= విచారం కలిగేటట్లు; హస్తిపురంబునకున్; ప్రియంబుతోన్= ప్రీతితో; అరిగెను= వెళ్ళాడు.

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠుడైన ధర్మరాజు తన పక్షంలోని జను లందరి హృదయాలకు విచారం కలిగేటట్లుగా తమ్ములతో, ద్రౌపదితో కలిసి ఎంతో ఇష్టంగా హస్తినకు వెళ్ళాడు.

**విశేషం:** 'సంతాపముగన్' అనే దానికి పెక్కు ప్రతుల్లో ఉన్న 'సంతోషముగన్' అనే పాఠాంతరం మూల విరుద్ధం. "వ్యథయం తిస్మ చేతాంసి సుహృదాం" (మూలం భండార్కరు ప్రతి 2-67-6).

**వ. అం దెప్పటియట్ల ధృతరాష్ట్ర నిర్మిత సభాసీనులై యున్నంత నభిమతాక్షుండైన శకుని కితవుండు ధర్మరాజున కి ట్లనియె. 276**

**ప్రతిపదార్థం:** అందున్; ఎప్పటి, అట్ల= ఎప్పటివలె; ధృతరాష్ట్ర, నిర్మిత, సభా+ఆసీనులు+ఐ= ధృతరాష్ట్రునిచే నిర్మించబడిన సభలో కూర్చున్నవాళ్ళయి; ఉన్నంతన్= ఉండగా; అభిమత+అక్షుండు+ఐన= కోరిన పాచికలు కలవాడైన; శకుని, కితవుండు= మోసగాడు, జూదగాడుఅయిన శకుని; ధర్మరాజునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు నిర్మించిన ద్యూతసభలో ఎప్పటిలాగే అందరు కూర్చున్నారు. కోరిన పాచికలు గల జూదగాడు మోసగాడు అయిన శకుని- ధర్మరాజుతో ఇలా అన్నాడు.

**క. ధనసంపద రాజ్యంబున । దినకరతేజుండు మిమ్ము ధృతరాష్ట్రుఁడు పెం**
**పునఁ బూజించెం గావునఁ । జన దింకను వాని నొడ్డి సరి క్రీడింపన్. 277**

**ప్రతిపదార్థం:** దినకర, తేజుండు= సూర్యుని వంటి కాంతి కలవాడైన; ధృతరాష్ట్రుఁడు; ధన సంపదన్, రాజ్యంబునన్= ధనసంపదచేత, రాజ్యంచేత; మిమ్ము; పెంపునన్= గొప్పగా; పూజించెన్= సత్కరించాడు; కావునన్; వానినిన్= ఆ ధన సంపదను, రాజ్యమును; ఒడ్డి= పణంగా పెట్టి; సరి క్రీడింపన్= తగురీతిగా జూదమాడటం; ఇంకను; చనదు= కూడదు.

**తాత్పర్యం:** సూర్యునివంటి తేజస్సు గల ధృతరాష్ట్ర మహారాజు- ధనసంపదను, రాజ్యసంపదను ఇచ్చి మిమ్మల్ని సమ్మానించాడు. కాబట్టి ఇక వాటిని ఒడ్డి జూదమాడటం తగదు.

**వ. 'ఇది యపూర్వంబైన పణంబు; దీని నొడ్డి యోటువడిన వార లజినవల్కలంబులు గట్టి వన్యమూలఫలాశనులై బ్రహ్మచర్యంబునం బండ్రెండేండ్లు వనవాసంబు సేసి, పదుమూఁడగు నేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబు సేసి, యం దెఱుంగఁ బడిరేని వెండియుఁ బండ్రెండేండ్లు వనవాసంబు నొక్కయేఁ డజ్ఞాతవాసంబుఁ జేయుచుండు వా; రిట్లోపుదేని జూదం బాడుద' మనిన 'ననుద్యూతార్థం బాహూతుండనై మగుడ నగునే' యని. 278**

**ప్రతిపదార్థం:** ఇది= నేను చెప్పబోయేది; అపూర్వంబు+ఐన= మున్నెన్నడు లేని, పణంబు= పందెం; దీనిన్; ఒడ్డి; ఓటు, పడిన, వారలు= ఓడిపోయినవాళ్ళు; అజినవల్కలంబులు= జింకచర్మం, నారచీరలు; కట్టి; వన్య, మూల ఫల+అశనులు+ఐ= అడవులలోని వేళ్ళు (దుంపలు), పండ్లు ఆహారంగా కలవాళ్ళయి; బ్రహ్మచర్యంబునన్= బ్రహ్మచర్యవ్రతాన్ని పూని; పంద్రెండు+ ఏండ్లు; వనవాసంబు, చేసి= అడవులలో నివసించి; పదుమూఁడగు, ఏఁడు= పదమూడవ సంవత్సరం; జనపదంబునన్= ఏదో ఒక దేశంలో; అజ్ఞాతవాసంబు= తెలియబడని నివాసం - అంటే వా ళ్ళెవరో తెలియకుండా నివసించటం; చేసి; అందున్= ఆ అజ్ఞాతవాసంలో; ఎఱుంగన్+పడిరి+ఏనిన్= కనపడినట్లయితే; వెండియున్= మళ్ళీ; పంద్రెండేండ్లు; వనవాసంబున్=

అరణ్యావాసాన్ని; ఒక్కఏఁడు; అజ్ఞాతవాసంబున్; చేయుచున్+ఉండువారు; ఇట్లు= ఈ విధంగానైన పందెమునకు; ఓపుదు+ ఏనిన్= చాలినవాడివయితే - అంటే ఈ విధమైన పందెం వేయటానికి చేతనైనవాడి వైతే; జూదంబు; ఆడుదము; అనినన్; అనుద్యూత+అర్థంబు= రెండవమారు జూదమాడటంకొరకు; ఆహూతుండను+ఐ= పిలువబడినవాడనై; మగుడన్= మరలి వెళ్ళటం; అగునే= తగునా? అని.

**తాత్పర్యం:** 'నేను చెప్పబోయేది ఇంతకుముం దెన్నడు లేని పందెం. దీన్ని ఒడ్డి ఓడినవాళ్ళు జింకచర్మం, నారచీరలు ధరించి, అడవుల్లో వేళ్ళు(దుంపలు) ఫలాలు ఆహారంగా, బ్రహ్మచర్యవ్రతం అవలంబించి, పంద్రెండేండ్లు అరణ్యావాసం, పదమూడవయేడు ఏదో ఒక దేశంలో అజ్ఞాతవాసం చెయ్యాలి. ఆ అజ్ఞాతవాసంలో వాళ్ళు కనబడితే మళ్ళీ పంద్రెండేండ్లు అరణ్యావాసం, ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చేస్తారు. ఈ విధమైన పందెం వెయ్యటానికి నీకు శక్తి సరిపోతే జూదమాడదాం' - అని శకుని అనగా 'రెండవసారి జూదానికి ర మ్మని పిలిస్తే వెనుతిరిగి వెళ్ళదగునా' అని.

**విశేషం:** ప్రథమ ద్యూతంలోని పందెములు పాండవులను నిండుసభలో నిట్టనిలువునా దోచుకోవటం వంటివి. పాండవులకే కాదు ప్రజలకు కూడా కోపావేశాన్ని కలిగించేటువంటివి. అందుచేతనే పునర్ద్యూతంలోని పందెములు తడిగుడ్డతో పాండవుల గొంతులు కోసేవిగా రూపొందించటం జరిగింది. పాండవులు పదుమూడేండ్లు పదవి లేక ప్రజకు దూరమైతే వారి విషయం అందరు విస్మరించరా? అంతేకాదు, పంద్రెండేండ్లు అరణ్యావాసం తరువాత వాళ్ళు బ్రతికి ఉంటారనే నమ్మకం ఏముంది? అవసరమైతే అరణ్యావాసంలో అసహాయులైన వాళ్ళను అంతమొందించే ప్రయత్నాలు చెయ్యవచ్చు. ఘోషయాత్ర అటువంటిదే. ఒకవేళ వాళ్ళు బ్రతికి బయటపడినా అజ్ఞాతవాసంలో- ఒక్క సంవత్సరకాలంలో- వాళ్ళ ఉనికి కనిపెట్టటానికి సాధ్యంకాదా? మొత్తం ప్రభుత్వయంత్రాంగం, గూఢచారులదళం సర్వం తమ చేతుల్లోనే ఉంటుంది గదా! అజ్ఞాతవాసంలో వాళ్ళను కనిపెట్టితే మళ్ళీ వాళ్ళ జీవితం పంద్రెండేండ్లు అడవులపాలు. ఇది ఈ రెండవ జూదపు పందెం వెనుక ఉండే క్రూరప్రణాళిక. మొత్తంమీద ధర్మరాజు మళ్ళీ జూదమాడటానికి అంగీకరించాడు. పూర్వానుభవంతో అతడు గుణపాఠం నేర్చుకోలేదు. ఇక ఎవ్వరేం చెయ్యగలరు? భండార్కర్ సంస్కృత భారత సంశోధిత ప్రతిలో భీష్మద్రోణ బాహ్లిక సోమదత్త వికర్ణ యుయుత్సాదులును, గాంధారీ ద్రౌపదీకుంతీదేవులును రెండవసారి జూదం ఆడవద్దని ధర్మరాజుకు బోధించిన ట్లుంది గాని తెలుగు భారతంలో ఇది లేదు. కాగా భండార్కర్ ప్రతిలో - వనవాస అజ్ఞాతవాసాలు సక్రమంగా నెరవేర్చితే ఓడినవాళ్ళు మళ్ళీ తమ రాజ్యాన్ని తాము పొందగల రని ఉంది. ఈ విషయం గూడ తెలుగు భారతంలో లేదు. ధర్మరాజుకు అప్పటికీ ఇప్పటికీ ఒకే ధర్మం- సుహృద్ద్యూతానికి కాని, అనుద్యూతానికి గాని పిలువబడిన తరువాత క్షత్రియుడు దానిని వల దని తిరిగిపోరాదట! ఇది ప్రచ్ఛన్నరణరంగం. గెలుపో ఓటమో ఏదో ఒకటే గమ్యం. ఈ సున్నితమైన ధర్మబలహీనతను ధర్మరాజులో సహజంగా ఉన్న ద్యూతవ్యసన బలహీనతను శకుని కొల్లగొట్టాడు.

### ధర్మరాజు శకునితో రెండవమాఱు జూదంబాడుట (సం. 2-67-21)

**క. ధర్మసుతుఁ డొడ్డి శకుని క । ధర్మ స్థితి నోటు వడియె; దైవము చెయిదిన్**
**నిర్మితమయిన శుభాశుభ । కర్మ ఫలం బెట్లు దేహి గడవఁగ నేర్చున్. 279**

**ప్రతిపదార్థం:** ధర్మసుతుఁడు= ధర్మరాజు; ఒడ్డి= పందెంవేసి; శకునికిన్; అధర్మస్థితిన్= అధర్మపద్ధతిలో; ఓటు, పడియెన్= ఓడిపోయాడు; దైవము, చెయిదిన్= దేవునిచేత; నిర్మితము+అయిన= ఏర్పరచబడిన; శుభ+అశుభ, కర్మ, ఫలంబు= మంచి చెడు పనుల ఫలితాన్ని; దేహి= దేహంగలవాడు; ఎట్లు; కడవఁగన్= దాటటానికి; నేర్చున్. (దాటటానికి వీలు లేదని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజు పందెం వేసి శకునిచేతిలో అధర్మంగా ఓడిపోయాడు. దేవుడు నిర్ణయించిన మంచిచెడ్డల కర్మఫలాన్ని మానవుడు ఎలా దాటగలడు?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ. అంత ననుద్యూతపరాజితులయిన పాండవులు దమరాజ్యోపభోగంబులు విడిచి విప్రసుహృద్బాంధవ జనానుగమ్యమానులయి వనంబునకుం బోవ సమకట్టి భీష్మ ధృతరాష్ట్ర విదురకృప ద్రోణాచార్యుల నా మంత్రించిన విదురుం డి ట్లనియె. 280**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; అనుద్యూత, పరాజితులు+అయిన= రెండవసారి ఆడి జూదంలో ఓడిపోయిన; పాండవులు; తమ; రాజ్య+ఉపభోగంబులు= రాజ్యసుఖానుభవాలను; విడిచి; విప్ర, సుహృత్+బాంధవ, జన+అనుగమ్యమానులు+అయి= బ్రాహ్మణులు, మిత్రులు, బంధువులు, ప్రజలు వెంట వస్తున్నవాళ్ళయి; వనంబునకున్= అరణ్యానికి; పోవన్; సమకట్టి= పూనుకొని; ధృతరాష్ట్ర, విదుర, కృప, ద్రోణాచార్యులను; ఆమంత్రించినన్= వెళ్ళివస్తామని సెలవుతీసుకొనగా; విదురుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అప్పుడు పునర్ద్యూతంలో ఓడిపోయిన పాండవులు తమ, రాజ్యసుఖానుభవాలను వదలి బ్రాహ్మణులు, మిత్రులు, బంధువులు, ప్రజలు వెంటరాగా అరణ్యానికి వెళ్ళ బోతూ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాచార్యుల దగ్గర సెలవు తీసుకున్నప్పుడు, విదురుడు ఇలా అన్నాడు.

**క. వనవాసపరిక్లేశం । బున కోపదు కుంతిదేవి భోజాత్మజ గా**
**వున నా గృహమున నుండెడు । ననవరతము భక్తితో మదభ్యర్చితయై. 281**

**ప్రతిపదార్థం:** భోజ+ఆత్మజ= భోజుని కూతురు; కుంతిదేవి; వనవాస, పరిక్లేశంబునకున్= అరణ్యంలో నివసించటంవల్ల కలిగే కష్టానికి; ఓపదు= ఓర్వలేదు; కావున; నా, గృహమునన్= నా ఇంటిలోనే; అనవరతము= ఎల్లప్పుడు; భక్తితో; మత్+అభ్యర్చిత యై= నాచేత పూజించబడేదై; ఉండెడున్.

**తాత్పర్యం:** భోజుని కూతురు కుంతీదేవి అరణ్యవాసంవల్ల కలిగే కష్టాన్ని ఓర్చుకోలేదు. అందువల్ల ఎప్పుడు నాచేత పూజించబడుతూ నాఇంట్లోనే ఉంటుంది.

**సీ. ధర్మజ్ఞుఁడవు నీవు పేర్మిఁ, బరాక్రమ । ధనుఁడు భీముం, డింద్రతనయుఁ డఖిల**
**యుద్ధ విశారదుం డిద్ధయశోనిధి, । నకులుఁ డర్థాఢ్యుండు, ప్రకట బుద్ధి**
**నెంతయు సంయమవంతుఁడు సహదేవుఁ, । డధ్యాత్మవిద్య నారాధ్యుఁ డెందు**
**ననఘుండు ధౌమ్యుండు, వినుతార్థ ధర్మంబు । లందు విచక్షణ సుందరాంగి**

**ఆ. ద్రుపదతనయ; యిట్లు విపులగుణాళి న । న్యోన్య హితుల రగుట నన్యు లుర్వి**
**నాదరింపఁగాక భేదింపనోపెడు । వారు గలరె మిమ్ము ధీరమతుల. 282**

**ప్రతిపదార్థం:** నీవు; పేర్మిన్= గొప్పగా; ధర్మజ్ఞుఁడవు= ధర్మం తెలిసినవాడివి; భీముఁడు; పరాక్రమధనుఁడు= శౌర్యమే ధనంగా కలగినవాడు - అంటే గొప్ప శౌర్యవంతుడు; ఇంద్రతనయుఁడు= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; అఖిల, యుద్ధ, విశారదుండు= అన్నియుద్ధాల్లో నేర్పరి; ఇద్ధ, యశోనిధి= ప్రకాశించే కీర్తికి నిధివంటివాడు; నకులుఁడు; అర్థ+ఆఢ్యుండు= న్యాయ సంపన్నుడు; సహదేవుఁడు; ప్రకటబుద్ధిన్= ప్రసిద్ధమైన తెలివితో; ఎంతయున్= మిక్కిలి; సంయమవంతుఁడు= నియమశీలం కలవాడు; అధ్యాత్మవిద్యన్= ఆత్మసంబంధమైన జ్ఞానంలో; ఎందున్= ఎచ్చటనైనా; అనఘుండు= పాపరహితుడు; ధౌమ్యుండు; ఆరాధ్యుఁడు= పూజింపదగినవాడు; వినుత+అర్థ, ధర్మంబుల+అందున్= పేరుకెక్కిన ధర్మార్థాలలో; సుందర+అంగి= అందమైన రూపు గలది; ద్రుపద, తనయ= ద్రుపదుని కూతురు; ద్రౌపది; విచక్షణ= బాగోగులు తెలిసినట్టిది; ఇట్లు= ఈ విధంగా; విపుల+గుణ+ఆళిన్= పెక్కు గొప్ప గుణాల సమూహంచేత; అన్యోన్యహితులరు+అగుటన్= ఒకరిమేలు మరొకరు కోరేవారవటంచేత; ధీరమతులు= ధైర్యవంతులు; మిమ్ము; ఉర్విన్= భూమిమీద; అన్యులు= ఇతరులు; ఆదరింపన్+కాక= గౌరవింపక; భేదింపన్+ఓపెడువారు= వైరం పూనే శక్తి కలవాళ్ళు; కలరె= కలరా?

**తాత్పర్యం:** నీవు గొప్ప ధర్మజ్ఞుడివి. భీముడు పరాక్రమవంతుడు, అర్జునుడు యుద్ధవిశారదుడు, కీర్తిమంతుడు. నకులుడు న్యాయసంపన్నుడు. సహదేవుడు మేధావి, నియమశీలి. పుణ్యాత్ముడైన ధౌమ్యుడు అధ్యాత్మవిద్యచేత పూజ్యుడు. అందమైన ద్రౌపది ధర్మార్థాల్లో చక్కని వివేకం గలది. ఈ విధంగా ఎన్నో గొప్ప గుణాలు కలిగి, ఒకరికొకరు హితులై, ధైర్యవంతులైన మిమ్మల్ని లోకంలో ఇతరులు ఆదరించక మీతో వైరం పెట్టుకోగలరా?

**వ.** **మఱియుఁ గృష్ణద్వైపాయనుచేత శిక్షితులరు, నారదుచేత రక్షితులరు, మీకుం బురోహితుండు ధౌమ్యుండు, దైవమానుషసంపన్నులరు, బలపరాక్రమంబులంజేసి రాజులను, ధర్మచరితంబునం జేసి ఋషులను, మహత్త్వంబునంజేసి కుబేరవాసవాదులను జయించిన వారలరు, మిమ్ము భూమియు గాడ్పును జంద్రాదిత్యులు నెల్లకాలము రక్షించుచు నుండెడు; మెల్ల కార్యంబులయందును నప్రమత్తుల రయి వర్తిల్లునది; భవత్పునర్దర్శన మయ్యెడు మరుగుం'డని కఱపిన గురువృద్ధానుమతంబునం దమ తల్లి చరణంబులకు మ్రొక్కినం గొడుకుల.** **283**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతేకాక; కృష్ణద్వైపాయనుచేతన్; శిక్షితులరు= బోధించ బడిన వాళ్ళు; నారదుచేతన్; రక్షితులరు= రక్షించ బడిన వాళ్ళు; మీకున్; పురోహితుండు; ధౌమ్యుండు; దైవమానుషసంపన్నులరు= దివ్యత్వం, మానవత్వం నిండుగా కలవాళ్ళు; బలపరాక్రమంబులన్+చేసి= ధర్మ ప్రవర్తనతోన్; ఋషులను; మహత్త్వంబునన్+చేసి= గొప్పతనంచేత; కుబేర, వాసవ+ఆదులను= కుబేరుడు; ఇంద్రుడు మొదలయినవాళ్ళని; జయించిన వారలరు= జయించినట్టివాళ్ళు; మిమ్మున్; భూమియున్; గాడ్పును= గాలియు; చంద్ర+ఆదిత్యులున్= చంద్రుడు, సూర్యుడును; ఎల్ల, కాలము; రక్షించుచున్; ఉండెడున్+ఎడమ= అన్ని కాలాల్లోను రక్షిస్తూ ఉండుగాక!; ఎల్ల, కార్యంబుల, అందునున్= అన్ని పనులలోను; అప్రమత్తులరు+అయి= జాగరూకులై; వర్తిల్లునది= నడచుకొనండి; భవత్+పునర్దర్శనము= మిమ్మల్ని మరలా చూడటం; అయ్యెడున్= అగునుగాక! అరుగుండు= వెళ్ళండి; అని; కఱపిన= బోధించిన; గురు, వృద్ధ+మతంబునన్= గురువులయొక్క, పెద్దలయొక్క అనుమతితో; తమ, తల్లి; చరణంబులకున్= పాదాలకు; మ్రొక్కినన్; కొడుకులన్.

**తాత్పర్యం:** 'మీరు కృష్ణద్వైపాయనుని బోధ పొందినవాళ్ళు. నారదునిరక్షణ ఉన్నవాళ్ళు. మీకు పురోహితుడు ధౌమ్యుడు. దివ్యత్వం, మానవత్వం నిండుగా కలవాళ్ళు. బలపరాక్రమాలతో రాజులను, ధర్మప్రవర్తనతో ఋషులను, మహత్తుచేత

కుబేర దేవేంద్రాదులను జయించినవాళ్ళు. మిమ్మల్ని నేల, గాలి, చంద్రుడు, సూర్యుడు ఎల్లవేళల రక్షించుగాక! అన్ని పనుల్లో జాగరూకులై నడుచుకొందురుగాక! మిమ్మల్ని మరలా చూడటం జరుగుగాక! వెళ్ళిరండు' అని విదురుడు బోధించగా, గురువులఅనుమతి, పెద్దల అనుమతి పొంది పాండవులు కుంతీదేవి పాదాలకు మ్రొక్కగా, ఆమె కొడుకులను.

**విశేషం:** 'నారదుచేత రక్షితులరు' అనేదానికి పెక్కు ప్రతుల్లో ఉన్న 'నారాయణుచేత రక్షితులరు' అనే పాఠమే ఎంతో ఉచిత మనిపిస్తుంది.

**సీ.** **అధికలజ్జావనతాస్యుల, నపగతా । భరణాంబరుల, ధర్మపరుల, నజిన**
**వల్కలధారుల, వరమునివేషులఁ బాండుకుమారుల భానునిభులఁ**
**జూచి దుఃఖిత యయి సుతులార! యిట్టి దు । ర్వ్యసనోపహతులైనవారి మిమ్ముఁ**
**జూడక ముందఱ సురలోకమున కేఁగి । పాండుభూపతి పుణ్యభాగి యయ్యెఁ;**

**తే.** **భక్తిఁ బతితోన పోవఁ దపంబు సేసె । మాద్రి; యే నేల పోవక మందభాగ్య**
**నయితి నని విలాపించుచు నపుడు గుంతి । యేడ్చె దుఃఖితు లగుచుండ నెల్లవారు.** **284**

**ప్రతిపదార్థం:** అధిక, లజ్జా+అవనత+ఆస్యులన్= మిక్కిలి సిగ్గుచేత వంచుకొన్న మొగాలు కలవాళ్ళను; అపగత+ఆభరణ+అంబరులన్= కోల్పోయిన ఆభరణాలు, వస్త్రాలు కలవాళ్ళను; ధర్మపరులన్= ధర్మంలో ఆసక్తి కలవాళ్ళను; అజిన, వల్కల, ధారులన్= జింకచర్మం, నారచీరలు ధరించినవాళ్ళను; వర, మునివేషులన్= శ్రేష్ఠమైన మునివేషం కలవాళ్ళను; భానునిభులన్= సూర్యుడితో సమానమైన వాళ్ళను; పాండుకుమారులన్; చూచి; దుఃఖిత; అయి= దుఃఖించినట్టిదై; సుతులార= కుమారులార; ఇట్టి; దుర్వ్యసన+ఉపహతులు+ఐనవారిన్= చెడువ్యసనం(జూదం)చేత దెబ్బతినినవాళ్ళను; మిమ్మున్; చూడక; ముందఱన్; పాండుభూపతి= పాండురాజు; సురలోకమునకున్= స్వర్గలోకానికి; ఏఁగి= వెళ్ళి; పుణ్య, భాగి, అయ్యెన్= పుణ్యవంతు డయ్యాడు; మాద్రి; భక్తిన్= భక్తితో; పతితోనన్= భర్తతోకూడ; పోవన్= పోవటానికి; తపంబు; చేసెన్; ఏన్= నేను; ఏల= ఎందుచేత; పోవక= వారివెంట గతించక; మందభాగ్యను= దురదృష్టవంతురాలిని; అయితిని; అని; కుంతి, ఎల్లవారు= అందరు; దుఃఖితులు+అగుచున్+ఉండన్= దుఃఖం పొందినవా రవుతుండగా; అపుడు; విలాపించుచున్= దుఃఖంతో మాటాడుతూ; ఏడ్చెన్.

**తాత్పర్యం:** ఆభరణాలు, వస్త్రాలు పోగొట్టుకొని, సిగ్గుతో ముఖాలు దించుకొని, నారచీరలు కట్టుకొని, జింకచర్మాలు చేతపట్టుకొని- మునివేషధారులు, సూర్యతేజులు, ధర్మపరులు అయిన పాండవులను చూచి దుఃఖించి- 'పుత్రులారా! ఈ విధంగా ద్యూతవ్యసనంతో దెబ్బతిన్న మిమ్మల్ని చూడకముందే పాండురాజు స్వర్గస్థుడై పుణ్యవంతు డయ్యాడు. పతితో సహగమనం చెయ్యటానికి మాద్రి తపస్సు చేసింది. నేను వాళ్ళ వెంట వెళ్ళని దురదృష్టవంతురాల్ని' - అని కుంతి అందరితోపాటుగా తానూ దుఃఖిస్తూ పలికింది.

**వ.** **మఱియును** **285**

**తాత్పర్యం:** అంతేకాక.

**మత్తకోకిలము.**

**వీర లిట్టు లనాథులై మునివృత్తి నుండెడు వారె హా**
**ద్వారకాపురనాథ! కేశవ! దైత్యభేది! భవత్పదాం**
**భోరుహాశ్రితులైన వీరలఁ బూని కావక యుండఁగా**
**ధారుణీధర! నీకు ధర్మువె ధర్మనిర్మలమానసా! 286**

**ప్రతిపదార్థం:** వీరలు= నాకుమారులైన ఈ పాండవులు; ఇట్టులు= ఈ విధంగా; అనాథులు+ఐ= దిక్కులేనివాళ్ళయి; మునివృత్తిన్; ఉండెడువారె; హా! ద్వారకాపురనాథ= ద్వారకాపురప్రభూ!; కేశవ! దైత్య, భేది= రాక్షసులను సంహరించినవాడా!; ధారుణీ, ధర= భూమిని ధరించినవాడా!; ధర్మ, నిర్మల, మానసా= ధర్మంచేత పరిశుద్ధమైన మనస్సుగలవాడా! శ్రీకృష్ణా!; భవత్+పద+అంభోరుహ+ఆశ్రితులు+ఐన= నీయొక్క పాదపద్మాలను ఆశ్రయించిన వాళ్ళయిన; వీరలన్= ఈ పాండవులను; పూని= ప్రయత్నించి; కావక, ఉండఁగాన్= రక్షించకుండా ఉండటం; నీకున్; ధర్మువె= ధర్మమా?

**తాత్పర్యం:** నా కుమారులైన పాండవులు ఈ విధంగా దిక్కులేని వాళ్ళయి మునివృత్తిని అవలంబించి ఉండటమా! హా! ద్వారకానాథా! కేశవా! రాక్షససంహారా! భూమిని ధరించినవాడా! ధర్మంచేత నిర్మలమైన మనస్సు కలవాడా! శ్రీకృష్ణా! నీ పాదపద్మాలను ఆశ్రయించిన ఈ పాండవులను ప్రయత్నించి రక్షించకుండటం నీకు ధర్మమా?

**విశేషం:** ఈ పద్యరచనలో కాంతిగుణం పోషించబడింది. (వివరాలకు చూడు - పీఠిక - సంపా.)

**తరలము.**

**అమితసత్త్వులు ధర్మమూర్తు లహర్పతిప్రతిముల్ రిపు**
**ద్రుమహుతాశను లాపగేయుఁడు ద్రోణుఁడున్ విదురుండు గౌ**
**తముఁడు నుండఁగ ధర్మమార్గము దప్పఁ బాడియె? పాండవో**
**త్తములు రాష్ట్రనిరాసయోగ్యులె ధార్తరాష్ట్రుల వంచనన్? 287**

**ప్రతిపదార్థం:** అమిత, సత్త్వులు= మిక్కిలి బలవంతులు; ధర్మమూర్తులు= ధర్మస్వరూపులు; అహర్పతి ప్రతిముల్= పగటికి నాథుడైన సూర్యునితో సమానమైన వాళ్ళు; రిపు, ద్రుమ, హుతాశనులు= శత్రువు లనే వృక్షాలకు అగ్నిహోత్రులవంటివాళ్ళు; ఆపగేయుఁడు= గంగా తనయుడు - భీష్ముడు; ద్రోణుఁడున్; విదురుండు; గౌతముఁడున్= కృపాచార్యుడును; ఉండఁగన్; ధర్మ, మార్గము; తప్పన్= తప్పటం; పాడియె= న్యాయమా?; ధార్తరాష్ట్రుల, వంచనన్= ధృతరాష్ట్రుని కుమారులయొక్క మోసంచేత; పాండవ+ఉత్తములు= పాండవశ్రేష్ఠులు; రాష్ట్ర, నిరాస, యోగ్యులు+ఎ= దేశం వదలి వెళ్ళదగినవాళ్ళా?

**తాత్పర్యం:** మహాబలవంతులు, ధర్మమూర్తులు, సూర్యతేజులు, శత్రువు లనే వృక్షాలకు అగ్నిహోత్రులవంటివాళ్ళు అయిన భీష్ముడు, ద్రోణుడు, విదురుడు, కృపాచార్యుడు ఉండగా ధర్మమార్గం తప్పటం న్యాయమా? కౌరవుల మోసంచేత పాండవశ్రేష్ఠులు దేశాన్ని వదలి వెళ్ళ దగినవాళ్ళా?

**విశేషం:** కాంతి గుణానికి కుంతీదేవి ఈ వాక్యాలు కూడా ఉదాహరణలు. (సంపా.)

**క. అన్న! సహదేవ! నీవును । నన్నలతో నరిగె దయ్య యట నడవుల కీ**
**వున్నను సుతు లందఱు నిం । దున్నట్టుల నాకుఁ జిత్త మూఱడి యుండున్. 288**

**ప్రతిపదార్థం:** అన్న, సహదేవ= నాయనా! సహదేవా!; అటన్= అక్కడ; అడవులకున్; అన్నలతోన్; నీవును= నీవుకూడ; అరిగెదు+అయ్య= వెళ్లుతావా?; ఈవు= నీవు; ఉన్నను= ఉన్నచో; సుతులు+అందఱున్= కొడుకులందరు; ఇందున్= ఇక్కడ; ఉన్న+అట్టుల; నాకున్; చిత్తము= మనస్సు; ఊఱడి= ఊరటచెంది; ఉండున్.

**తాత్పర్యం:** నాయనా! సహదేవా! నీవుకూడ అన్నలతోపాటు అడవులకు వెళ్ళుతావా? నీవు ఒక్కడివి ఉంటే చాలు. కొడుకు లందరు ఇక్కడ ఉన్నట్లే. నా మనస్సు ఊరట చెంది ఉంటుంది.

**విశేషం:** సవతికొడుకైనా, కడగొట్టువాడైన సహదేవునిమీద కుంతీదేవికి ఎంతో ప్రేమ.

**వ. అనుచు శోకాక్రాంత యయి కుంతీదేవి దనకు వినయవినమితోత్తమాంగ యయిన పాంచాలిం జూచి బాష్పజలంబు లురుల ని ట్లనియె. 289**

**ప్రతిపదార్థం:** అనుచున్; శోక+ఆక్రాంత, అయి= దుఃఖంచేత నిండిందై; కుంతీదేవి; తనకున్; వినయ, వినమిత+ఉత్తమ+అంగ, అయిన= వినయంచేత వంగిన శిరస్సు కలదైన; పాంచాలిన్; చూచి; బాష్పజలంబులు= కన్నీళ్ళు; ఉరులన్= దొరలగా; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** అని అంటూ దుఃఖంతో నిండిన కుంతీదేవి, వినయంతో తలవంచి తనకు నమస్కరించిన ద్రౌపదిని జూచి, కన్నీళ్ళు కారుస్తూ ఇలా అన్నది.

**క. ధవళాక్షి । నీ కతంబునఁ । బవిత్రమై ద్రుపదకులముఁ బాండుకులంబున్**
**భువనముల వెలిఁగె నీ వు । ద్భవ మౌటను జొచ్చుటను శుభస్థితితోడన్. 290**

**ప్రతిపదార్థం:** ధవళ+అక్షి= తెల్లని కన్నులు కలదానా! అంటే అందమైన కన్నులు కలదానా!; నీ కతంబునన్= నీకారణంగా; పవిత్రము+ఐ= నిర్మలమై; నీవు; ఉద్భవము+ఔటను= పుట్టటంచేత, ద్రుపద కులమును= ద్రుపదుడి వంశమును; చొచ్చుటను= ప్రవేశించటంచేత; పాండు, కులంబున్= పాండురాజువంశమును; శుభస్థితితోడన్= మంగళకరమైన ఉనికితో; భువనములన్= లోకాలలో; వెలిగెన్= ప్రకాశించాయి.

**తాత్పర్యం:** అందమైన కన్నులు గల ఓ ద్రౌపదీ! నీకారణంగా పవిత్రమై- నీవు పుట్టటంచేత ద్రుపదవంశం, నీవు మెట్టటంచేత పాండువంశం, శుభస్థితితో లోకాల్లో ప్రకాశించాయి.

**విశేషం:** అలం: క్రమం. అరణ్యవాసకాలంలో సహదేవుణ్ణి ఆదరంతో చూచుకొమ్మని కుంతి ద్రౌపదితో చెప్పినట్లు భండార్కర్‌వారి సంస్కృత భారతప్రతిలో ఉంది. తెలుగులో లేదు.

**ఆ. 'పురుషవృషభు లయిన పురుషులతోడన । యరిగి పరమభక్తిఁ బరిచరింపఁ**
**బోవఁ గనుట నీవు పుణ్యంబు సేసితి' । వంచుఁ బ్రీతిఁ గౌఁగిలించుకొనియె. 291**

**ప్రతిపదార్థం:** పురుష, వృషభులు+అయిన= పురుషశ్రేష్ఠులయిన; పురుషులతోడన= మగవారి వెంట; అరిగి= వెళ్ళి; పరమభక్తిన్= మిక్కిలి భక్తితో; పరిచరింపన్+పోవన్+కనుట= సేవ చేయబోవగలగటంచేత; నీవు; పుణ్యంబు; చేసితివి; అంచున్= అంటూ; ప్రీతిన్= ప్రేమతో; కౌఁగిలించుకొనియెన్.

**తాత్పర్యం:** 'పురుషశ్రేష్ఠు లయిన భర్తలవెంట వెళ్ళి పరమభక్తితో సేవ చేయగలగటం నీపుణ్యం' అని ప్రేమతో కౌగిలించుకొన్నది.

**వ. అని యిట్లు కోడలిం గొడుకులను దీవించి కుంతీదేవి విదురుగృహంబున నుండె; నంత. 292**

**తాత్పర్యం:** అని ఈవిధంగా కోడలిని, కొడుకులను దీవించి కుంతీదేవి విదురుని ఇంట్లో ఉన్నది. తరువాత-

**ఆ. పతులపిఱుఁద మందగతి ముక్తకేశియై । పోవుదాని ద్రుపదపుత్త్రిఁ జూచి**
**వంతఁ గౌరవేంద్రు నంతిపురంబున । వారలెల్లఁ దలలు వాంచి రడలి. 293**

**ప్రతిపదార్థం:** పతుల, పిఱుఁద= భర్తల వెనుక; మందగతిన్= నిదానంగా నడుస్తూ; ముక్తకేశి+ఐ= విడువబడిన తలవెంట్రుకలు కలదై - అంటే విరబోసికొన్న జుట్టుతో; పోవుదానిన్; ద్రుపద, పుత్త్రిన్= ద్రుపదునికూతురైన ద్రౌపదిని; చూచి; కౌరవ+ఇంద్రు; అంతిపురంబున; వారలు+ఎల్లన్= కౌరవరాజుయొక్క అంతఃపురంలోని వాళ్ళంతా; వంతన్= దుఃఖంతో; అడలి= భయపడి; తలలు; వాంచిరి.

**తాత్పర్యం:** భర్తల వెనుక మెల్లగా అడుగులు వేస్తూ, తల విరబోసుకొని వెళ్ళుతున్న ద్రౌపదిని చూచి- కౌరవరాజు అంతఃపురంలో ఉన్న వాళ్ళంతా దుఃఖంతో భయపడి తలలు వంచుకొన్నారు.

**విశేషం:** కౌరవరాజు అంతఃపురకాంతలకు- సాటిస్త్రీ ద్రౌపదికి, ఆమె భర్తలకు కలిగిన దుస్థితి చూడటం వల్ల దుఃఖం- కుములుతూ కానలకు వెళ్ళే పాండవులవల్ల మున్ముందు ఎలాంటి దారుణ పరిణామాలు సంభవిస్తాయో అన్న ఊహవల్ల భయం- కలిగాయి.

**ఆ. ధర్మతనయుపిఱుఁదఁ దమ్ములు నలువురు । నరుగుచుండి తత్సభాంతరమున**
**జనులు వినుచునుండ సంభృతక్రోధులై । పలికి రధికపరుషభాషణముల. 294**

**ప్రతిపదార్థం:** ధర్మతనయు, పిఱుఁదన్= ధర్మరాజు వెనుక; తమ్ములు; నలువురున్, అరుగుచున్+ఉండి= వెళ్ళుతూ; తత్+ సభా+అంతరమునన్= ఆ సభలో; జనులు; వినుచున్+ఉండన్; సంభృత క్రోధులు+ఐ= నిండిన కోపం కలవాళ్ళయి; అధిక, పరుష, భాషణములు= మిక్కిలి కఠినాలైన మాటలను; పలికిరి.

**తాత్పర్యం:** ధర్మరాజువెనుక నలుగురుతమ్ములు వెళ్ళుతూ, సభలోని జనులంతా వింటుండగా అమితకోపంతో కఠినాతికఠినాలైన మాటలను మాట్లాడారు.

**క. సాహసమున మద్బాహు గ। దాహతి దుర్యోధనాదులగు రిపుల జగ**
**ద్ద్రోహులఁ జంపుదు నత్యు। గ్రాహవమున హరిహరాదు లడ్డం బైనన్. 295**

**ప్రతిపదార్థం:** సాహసమునన్= తెగించి; మత్+బాహు, గదా, హతిన్= నా చేతి గద దెబ్బతో; దుర్యోధన+ఆదులు+అగు= దుర్యోధనుడు మొదలయినవాళ్ళయిన; రిపులన్= శత్రువులను; జగత్+ద్రోహులన్= లోకానికి అపకారం చేసేవాళ్ళను; అతి+ఉగ్ర+ఆహవమునన్= మిక్కిలి భయంకరమైన యుద్ధంలో; హరి, హర+ఆదులు= విష్ణువు, శివుడు మొదలయినవాళ్ళు; అడ్డంబు+ఐనన్= అడ్డు తగిలినా, చంపుదున్.

**తాత్పర్యం:** సాహసించి నా చేతిగదదెబ్బతో లోకద్రోహు లైన దుర్యోధనాదిశత్రువులను మహాభయంకరమైన యుద్ధంలో హరిహరాదులు అడ్డమైనా హతమారుస్తాను.

**ఆ. దుష్టచిత్తుఁ డయిన కష్టు దుర్యోధను। శిరము దన్నువాఁడ ధరణిఁ గూల్చి;**
**హీనుఁడైన దుస్ససేనుని వధియించి। వేఁడిరక్త మానువాఁడఁ గడఁగి. 296**

**ప్రతిపదార్థం:** కడఁగి= పూనుకొని; దుష్ట, చిత్తుఁడు+అయిన= దుర్మార్గమైన మనస్సు కలవాడైన; కష్టున్= పాపిని; దుర్యోధనున్; ధరణిన్= భూమిమీద; కూల్చి= పడగొట్టి; శిరము= తలను; తన్నువాఁడన్; హీనుఁడు+ఐన= నీచుడైన; దుస్ససేనునిన్= దుశ్శాసనుని; వధియించి= చంపి; వేఁడి, రక్తము; ఆనువాఁడన్= త్రాగుతాను.

**తాత్పర్యం:** ప్రయత్నించి దుష్టాత్ముడు, పాపి అయిన దుర్యోధనుణ్ణి నేల గూల్చి అతని తలను తన్నుతాను, నీచుడైన దుశ్శాసనుణ్ణి చంపి వాడి వేడినెత్తురు త్రాగుతాను.

**మ. కనకోర్వీధర సానుసార రుచిమద్గాండీవ నిర్ముక్త ప**
**త్రినిపీతారుణ వారిశేషముఁ బతత్రివ్రాతముల్ ద్రావున**
**య్యని నాతోడఁ జతుర్దశాబ్దమున మాఱైపోరు కర్ణాది దు**
**ర్జన సంఘంబుల మార్తురం దునుముదున్ సంగ్రామరంగంబునన్. 297**

**ప్రతిపదార్థం:** కనక+ఉర్వీధర, సాను, సార, రుచిమత్+గాండీవ, నిర్ముక్త, పత్రి, నిపీత+అరుణ, వారి, శేషమున్= మేరు పర్వతపు చరియలాగ నిగ్గుదేలిన కాంతితో కూడిన గాండీవంనుండి విడువబడిన బాణాలచేత లెస్సగా త్రావబడిన నెత్తుటి మిగులును; పతత్రి, వ్రాతముల్= పక్షుల సమూహాలు - అంటే కాకులు, గ్రద్దలు మొదలయినవి; త్రావు= తాగునట్టి; ఆ+అనిన్= ఆ యుద్ధంలో; నాతోడన్; చతుర్దశ+అబ్దమునన్= పదునాల్గవ సంవత్సరంలో; మాఱు+ఐ= ఎదుర్కొని; పోరు= యుద్ధంచేసే; కర్ణ+ఆది, దుర్జన, సంఘంబులన్= కర్ణుడు మొదలయిన దుర్మార్గుల సమూహాలను; మార్తురన్= శత్రులను; సంగ్రామ రంగంబునన్= యుద్ధభూమిలో; తునుముదున్= చంపుతాను.

**తాత్పర్యం:** పదునాల్గవ సంవత్సరంలో (అంటే అరణ్యాజ్ఞాతవాసాల తరువాత) యుద్ధభూమిలో మేరుపర్వతపు చరియలాంటి నిగ్గుదేలిన కాంతిగల గాండీవం నుండి ప్రయోగించిన బాణాలు-లెస్సగా త్రావగా, మిగిలిన రక్తాన్ని కాకులు, గద్దలు మొదలైన పక్షులు త్రాగే యుద్ధంలో - న న్నెదిరించి పోరాడే కర్ణాది దుర్మార్గుల్ని, శత్రు సమూహాల్ని సంహరిస్తా.

**విశేషం:** మేరుపర్వతసానువువంటి నిగ్గుదేలిన కాంతితో కూడిన గాండీవంఅని అనటమే కాక, మిక్కిలిపొడవైన సమాసాన్ని ప్రయోగించటంవల్ల కూడ నన్నయ, పార్థుని గాండీవం పొడవును, లావును, కాంతిని, అతని కోపాతిశయాన్ని పాఠకుని ఊహకు అందేటట్లు చేశాడు. పత్త్రి, పతత్త్రి శబ్దాలు రెండూ రెక్కలు గల బాణాలకు, పక్షులకు గల సామ్యాన్ని చక్కగా చెప్పటమేకాక పద్యశోభను కూడ పెంచాయి. ఉర్వీధరమంటే - భూమిని ధరించింది - కొండ. కనకోర్వీధరం - బంగారుకొండ - మేరువు. ఇది భూమిచుట్టూ ఒడ్డాణంలా ఉంటుం దని, దీనిచుట్టూ సూర్యచంద్రులు తిరుగుతుంటా రని, ఈ పర్వత శిఖరాల్లో దేవతలు విహరిస్తూ ఉంటా రని పురాణాలు చెప్తున్నవి.

**క.** **మాయాద్యూతంబున ని । ర్జేయులఁ గా మమ్ము నిట్లు సేసిన ఖలు న**
**న్యాయపరు శకుని నస్మ । త్సాయకజితహస్తుఁ జేసి చంపుదు మాజిన్.** **298**

**ప్రతిపదార్థం:** మాయా, ద్యూతంబునన్= కపటపు జూదంలో; నిర్జేయులన్, కా= ఓడిపోయిన వార మవునట్లు; మమ్మున్, ఇట్లు; చేసిన; ఖలున్= దుర్మార్గుణ్ణి; అన్యాయపరున్= అన్యాయాన్ని అవలంబించినవాణ్ణి; శకునిన్; ఆజిన్= యుద్ధంలో; అస్మత్, సాయక, జిత+హస్తున్= మా బాణాలచేత ఓడించబడిన హస్తం కలవాణ్ణిగా; చేసి; చంపుదుము.

**తాత్పర్యం:** కపటపుజూదంలో మమ్మల్ని ఓడించి ఇలా చేసిన దుష్టుడు, అన్యాయపరుడు, అయిన శకునిని యుద్ధంలో మా బాణాలచేత ఓడించి చంపుతాము.

**విశేషం:** ఏ చేతుల్తో పాచికలు వేసి, మోసంతో మమ్ము జయించాడో, ఆ చేతులు శకునికి లేకుండా చేసి, చంపుతాము- అని ధ్వని.

**వ.** **అని భీమార్జున నకుల సహదేవులును విజృంభించి కృతప్రతిజ్ఞులై; రట్లు పాండవులు పరిత్యక్తవిభవు లయి నిజాయుధంబులు ధరించి గజపురంబు వెలువడి; రంత.** **299**

**ప్రతిపదార్థం:** అని; భీమ+అర్జున, నకుల, సహదేవులును; విజృంభించి= రెచ్చిపోయి; కృతప్రతిజ్ఞులు+ఐరి= చేయబడిన ప్రతిజ్ఞలు కలవాళ్ళు అయ్యారు; అట్లు; పాండవులు; పరిత్యక్త, విభవులు+అయి= పూర్తిగా విడువబడిన ఐశ్వర్యం కలవాళ్ళయి; అంటే ఐశ్వర్యాన్ని పూర్తిగా కోల్పోయినవాళ్ళయి; నిజ+ఆయుధంబులు= తమయొక్క ఆయుధాలు; ధరించి; గజపురంబు= హస్తినాపురంనుండి; వెలువడిరి; అంతన్.

**తాత్పర్యం:** అని భీమార్జున నకుల సహదేవులు కోపావేశంతో చెలరేగి ప్రతిజ్ఞలు చేసి, ఐశ్వర్యాన్ని పూర్తిగా కోల్పోయిన వాళ్ళయి తమ తమ ఆయుధాలు ధరించి హస్తినాపురంనుండి బయలుదేరారు.

**సీ.** **ధృతరాష్ట్రవిభుని మందిరమున నఱచుచుఁ । బఱచె గోమాయువుల్ పట్టపగల;**
**యప్రదక్షిణముగా నయ్యె నుల్కాపాత; । మపమేఘమై యున్న యంబరమున**
**విద్యుత్సహస్రముల్ విలసిల్లె; మఱి రాహు । పర్వంబు గాకయ భానుఁ బట్టె;**
**భూకంప మయ్యె నప్పుడు; సభాంతరమున । నరులెల్ల వినుచుండ నారదుండు**

**ఆ.** **పలికె నద్భుతముగఁ 'బదునాలుగవ యేఁడు । భారతాజి యగు; నపారవీరు**
**లయిన పాండవులు జయం బందుదురు భీమ । మఘవసుతుల విక్రమమున' ననుచు.** **300**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్ర, విభుని, మందిరమునన్= ధృతరాష్ట్ర మహారాజుయొక్క అంతఃపురంలో; పట్టపగలు+అ; గోమాయువుల్= నక్కలు; అఱచుచున్; పఱచెన్= పరుగెత్తాయి; అప్రదక్షిణముగాన్= అపసవ్యంగా; ఉల్కాపాతము= తోకచుక్కలు పడటం; అయ్యెన్= జరిగింది; అపమేఘము+ఐ= తొలగింపబడిన మేఘాలు కలదై, అంటే మేఘాలు లేనిదై; ఉన్న; అంబరమునన్= ఆకాశంలో; విద్యుత్ సహస్రముల్= వేలకొలదిమెఱుపులు; విలసిల్లెన్= మెరిశాయి; మఱి= అంతేకాక; పర్వంబు, కాకయ= గ్రహణ పర్వదినం కాకుండానే; రాహు= రాహువు; భానున్= సూర్యుణ్ణి; పట్టెన్; భూకంపము+అయ్యెన్; అప్పుడు; సభా+ అంతరమునన్= సభలోపల; నరులు+ఎల్లన్= జనులంతా; వినుచుండన్; నారదుండు; పదునాలుగవ, ఏఁడు= పదునాల్గవసంవత్సరం; అంటే అరణ్య, అజ్ఞాతవాసాల తర్వాత; భారత+ఆజి= భారతయుద్ధం; అగున్; అపార, వీరులు+అయిన= మహాపరాక్రమశాలురైన; పాండవులు; భీమ, మఘవ సుతుల, విక్రమమునన్= భీమునియొక్క, దేవేంద్రపుత్రుడైన అర్జునునియొక్క శౌర్యంచేత; జయంబు+అందుదురు= విజయాన్ని పొందుతారు; అనుచున్; అద్భుతముగన్= ఆశ్చర్యం కలిగేటట్లు; పలికెన్.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రమహారాజు అంతఃపురంలో పట్టపగలే నక్కలు అరుస్తూ పరుగెత్తాయి. అపసవ్యంగా తోకచుక్కలు పడ్డాయి. మేఘాలు లేకుండానే ఆకాశంలో వేలకొలది మెరుపులు మెరిశాయి. గ్రహణానికి తగిన పర్వదినం కాకుండానే రాహువు సూర్యుణ్ణి పట్టుకొన్నాడు. భూమి కంపించింది. అప్పుడు సభలోని వాళ్ళంతా వింటూండగానే నారదుడు- పదునాల్గవ ఏట భారతయుద్ధం జరుగుతుం దనీ, మహాపరాక్రమశాలురైన పాండవులు భీమార్జునుల బలాధిక్యంచేత విజయం పొందుతా రనీ ఆశ్చర్యకరంగా పలికాడు.

**విశేషం:** అపశకునాలు అశుభసూచకాలు. పూర్ణిమ అమావాస్యవంటి పర్వదినాల్లోనే గ్రహణాలు కలుగుతాయి.

**వ. ధృతరాష్ట్రుండును దాని నంతయు విని 'కొడుకుల దుర్ణయంబుల నింక నెట్టి యరిష్టంబులు పుట్టెడునో' యని వగచుచు విదురుం బిలిచి, 'ధౌమ్య ద్రౌపదీ సహితు లయిన పాండవు లెట్లు వోయి' రని యడిగిన నతనికి విదురుం డి ట్లనియె. 301**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండును; దానిన్; అంతయున్; విని; కొడుకుల, దుర్ణయంబులన్= కొడుకుల చెడుపనులవలన; ఇంకన్; ఎట్టి; అరిష్టంబులు= అశుభాలు; పుట్టెడునో= ఏర్పడతాయో; అని; వగచుచున్= చింతిస్తూ; విదురున్; పిలిచి; ధౌమ్య, ద్రౌపదీ, సహితులు+అయిన= ధౌమ్యునితో, ద్రౌపదితో కూడుకొన్న; పాండవులు; ఎట్లు; పోయిరి, అని; అడిగినన్; అతనికి; విదురుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు జరిగిందంతా విని, కొడుకుల దుశ్చేష్టలవల్ల ఇంకా ఎటువంటి అశుభాలు కలుగుతాయో అని చింతిస్తూ, విదురుణ్ణి పిలిచి, పాండవులు ధౌమ్యునితో, ద్రౌపదితో కలిసి ఏ విధంగా వెళ్ళా రని అడుగగా అతనికి విదురుడు ఇలా అన్నాడు.

విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ బాండవు లడవికిఁ బోయిన రీతి సెప్పుట (సం. 2-71-3)

**సీ. వదనసరోజంబు వస్త్రాంతమునఁ గప్పి । కొని యేఁగె ధర్మనందనుఁడు; మఱియు**
**భీమబాహులు రెండుఁ బెద్దలుగాఁ జాచి । ఘనసత్త్వుఁ డమ్మరుత్తనయుఁ డరిగె;**
**నిసుము చల్లుచు నమరేంద్రపుత్త్రుఁడు వోయె; । భూరేణులిప్తశరీరుఁ డగుచు**
**నకులుండు సనియె; మానక లజ్జఁ జేసి య । ధోవక్త్రుఁ డై సహదేవుఁ డరిగె;**

**ఆ. వివృతకేశభరము వ్రేలంగ ద్రౌపది । సనియె; రౌద్రయామ్య సామగాన**
**ముఖరితాస్యుఁ డగుచు మ్రోల ధౌమ్యుం డేఁగె । సకలజనులు శోకజలధిఁ దేల. 302**

**ప్రతిపదార్థం:** సకల జనులు= అందరు ప్రజలు; శోక, జలధిన్= దుఃఖమనే సముద్రంలో; తేలన్= తేలునట్లుగా; ధర్మనందనుఁడు= ధర్మరాజు; వదన, సరోజంబు= పద్మంవంటి ముఖాన్ని; వస్త్ర+అంతమునన్= బట్టకొంగుతో; కప్పికొని; ఏఁగెన్= వెళ్ళాడు; మఱియున్; ఘన, సత్త్వుఁడు= మిక్కిలి బలం కలవాడు; ఆ+మరుత్+తనయుఁడు= ఆ వాయుదేవుని కుమారుడైన భీముడు; భీమ, బాహులు= భయంకరమైన చేతులు; రెండున్; పెద్దలుగాన్= పొడవు (వెడల్పు) అగునట్లుగా; చాచి; అరిగెన్= వెళ్ళాడు; అమర+ఇంద్ర పుత్త్రుఁడు= దేవేంద్రుని కుమారుడైన అర్జునుడు; ఇసుము= ఇసుక; చల్లుచున్; పోయెన్; నకులుండు; భూరేణులిప్త, శరీరుఁడు+అగుచున్= మట్టికణాలు పూయబడిన శరీరంకలవాడై - అంటే దుమ్ము శరీరంపై పూసికొన్నవాడై; చనియెన్= వెళ్ళాడు; సహదేవుఁడు; మానక= ఆగక, లజ్జన్+చేసి= సిగ్గుచేత; అధోవక్త్రుఁడు+ఐ= వంచినముఖం కలవాడై; అరిగెన్= వెళ్ళాడు; ద్రౌపది; వివృత, కేశ, భరము= విరబోసుకొన్న వెంద్రుకల భారం; వ్రేలంగన్= వ్రేలాడుతుండగా; చనియెన్= వెళ్ళింది; ధౌమ్యుఁడు; రౌద్ర, యామ్య, సామగాన, ముఖరిత+ఆస్యుఁడు+అగుచున్= రుద్ర యమ సంబంధాలైన మంత్రాల సామగానం ధ్వనించే ముఖం కలవాడై; మ్రోలన్= ముందుభాగంలో; ఏఁగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** జనులంతా దుఃఖసముద్రంలో తేలుతుండగా, ధర్మరాజు పద్మంవంటి తన ముఖాన్ని గుడ్డకొంగుతో కప్పుకొని వెళ్ళాడు. మహాబలవంతుడైన భీముడు భయంకరమైన తనచేతులు రెండూ పెద్దగా చాచి నడిచాడు. ఇంద్రతనయుడైన అర్జునుడు ఇసుక చల్లుతూ వెళ్ళాడు. నకులుడు దుమ్ము నిండిన శరీరంతో నడిచాడు. సహదేవుడు కుంతి కోరినట్లు అరణ్యవాసం మానక, సిగ్గుతో ముఖం వంచుకొని అన్నల వెంట వెళ్ళాడు. ద్రౌపది విరబోసుకొన్న వెంద్రుకల భారం వ్రేలాడుతుండగా ప్రయాణం సాగించింది. ధౌమ్యుడు రుద్ర యమ సంబంధి మంత్రాలతో సామగానం చేస్తూ ముందు నడిచాడు.

**విశేషం:** రుద్ర యములు ఇద్దరు అంత్యకాలానికి సంబంధించిన దేవతలు, భయంకరులు.

**వ. అనిన 'నట్లేల వార లరిగి?' రని యడిగిన విదురుం డి ట్లనియె. 303**

**తాత్పర్యం:** అనగా 'వాళ్ళు ఆవిధంగా ఎందుకు వెళ్ళా?' రని ధృతరాష్ట్రు డడుగగా విదురుడు ఇలా అన్నాడు.

**క. నీకొడుకునికృతిఁ జేసి య । పాకృత రాజ్యుఁ డయి ధర్మపతి నిజరూక్షా**
**లోకనజనదాహభయ । వ్యాకులుఁ డై చనియె దృష్టి వారించి వడిన్. 304**

**ప్రతిపదార్థం:** ధర్మపతి= ధర్మరాజు; నీ, కొడుకు; నికృతిన్+చేసి= మోసంచేత; అపాకృత, రాజ్యుఁడు+అయి= తొలగించబడిన రాజ్యం కలవాడయి; నిజ+రూక్ష+ఆలోకన, జన, దాహ, భయ, వ్యాకులుఁడు+ఐ= తనయొక్క కఠినమైన చూపులచేత జనులు మండిపోతా రనే భయంవల్ల కలతనొందిన మనస్సుకలవాడై; దృష్టిన్; వారించి= తప్పించి; వడిన్= వేగంగా; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** నీకొడుకు చేసిన మోసంచేత రాజ్యాన్ని కోల్పోయినవాడై ధర్మరాజు తనకోపపుచూపులవల్ల జనం దహించబడతారేమో అన్న భయంతో కలత చెంది తన దృష్టిని తప్పించి (ముఖానికి గుడ్డ కప్పుకొని) వడిగా వెళ్ళాడు.

**క. సమరమున బాహుబల ద । ర్పము మెఱయం గంటి ననుచు బాహు లతివిశా**
**లములుగఁ జేయుచు నరిగెను । సమీరజుఁ డరాతిభీతిసంజననుం డై. 305**

**ప్రతిపదార్థం:** సమీరజుఁడు= వాయుదేవునికి జన్మించినవాడు - భీముడు; సమరమునన్= యుద్ధంలో; బాహు, బల, దర్పము= భుజబలగర్వం; మెఱయన్+కంటిని= ప్రకాశింప జేసే అవకాశాన్ని పొందాను; అనుచున్; బాహులు= చేతులు; అతి విశాలములుగన్= మిక్కిలి పొడవు (వెడల్పు) లయ్యేటట్లుగా; చేయుచున్, అరాతి, భీతి, సంజననుండు+ఐ= శత్రువులకు భయాన్ని కలిగించేవాడై; అరిగెను= వెళ్ళాడు.

**తాత్పర్యం:** భీమసేనుడు యుద్ధంలో తన బాహు బలగర్వాన్ని ప్రకాశింపచేసే అవకాశాన్ని పొందాను - అన్నట్లుగా చేతులు విశాలంగా చాచి, శత్రువులకు భయం కలిగించేవాడై వెళ్ళాడు.

**క. వెఱచఱవ నింతకంటెం । దఱుచుగ బాణంబు లేసి తడయక పగఱం**
**జెఱుతు నని యిసుము చల్లుచు । నుఱక ధనంజయుఁడు రణజయోన్నతుఁ డరిగెన్. 306**

**ప్రతిపదార్థం:** రణ, జయ+ఉన్నతుఁడు= యుద్ధంలోని విజయంచేత గొప్పవాడు; ధనంజయుఁడు= అర్జునుడు; వెఱచఱవన్= భయపడేటట్లుగా; ఇంతకంటెన్, తఱుచుగన్= అధికంగా; బాణంబులు; ఏసి= వేసి; తడయక= ఆలస్యం చేయకుండ; పగఱన్= శత్రువులను; చెఱుతును= చంపుతాను; అని; ఇసుము= ఇసుక; చల్లుచున్; ఉఱక= ఊరక, (నిర్లక్ష్యంగా); అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** యుద్ధ విజయాలతో గొప్పవాడైన అర్జునుడు- ఇసుకచల్లుతూ, భయంకరంగా ఇంతకంటె ఎక్కువగా బాణాలువేసి, సత్వరమే శత్రువుల్ని సంహరిస్తా నని నిర్లక్ష్యంగా నడిచాడు.

**వ. మఱి దుఃఖాను భావంబున కనుచితంబైన తన సుందర రూపంబు సూచి జనులు దుఃఖింప కుండ వలయు నని ధూళి ధూసరిత శరీరుండై నకులుం డరిగె; దీనంబైన తన యాననంబు సూచినవారికి నెల్ల నెగ్గగు నని యవనతవదనుం డయి సహదేవుం డరిగె. 307**

**ప్రతిపదార్థం:** మఱి, దుఃఖ+అనుభావంబునకున్= దుఃఖప్రభావానికి; అనుచితంబు+ఐన= తగనిదైన; తన, సుందరరూపంబు; చూచి; జనులు; దుఃఖింపకుండ వలయును; అని; ధూళి, ధూసరిత, శరీరుండు+ఐ= దుమ్ముచేత కప్పబడిన శరీరం కలవాడై; నకులుండు; అరిగెన్= వెళ్ళాడు; దీనంబు+అయిన; తన; ఆననంబు= ముఖం; చూచిన, వారికిన్+ఎల్లన్= చూచినవారి కందరికి; ఎగ్గు= కీడు; అగున్+అని; అవనత, వదనుండు+అయి= వంచుకొన్న ముఖం కలవాడయి; సహదేవుండు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** దుఃఖాన్ని అనుభవించటానికి తగని తన అందమైన రూపాన్ని చూచి ప్రజలు దుఃఖపడకుండా ఉండా లని, దుమ్ముచేత కప్పబడిన శరీరం కలవాడై నకులుడు వెళ్ళాడు. తన దీనముఖాన్ని చూచినవాళ్ళకు కీడు కలుగుతుం దని సహదేవుడు ముఖం వంచుకొని వెళ్ళాడు.

**చ. తడిసిన యేకవస్త్రపరిధానముతోడ విముక్తకేశియై**
**తొడరుచు దుఃఖభావమున ద్రోవది వోయె మహాహవంబునం**

**బడిన నిజేశ మిత్ర సుత బంధు జనంబులు శోకవేదనం**

**గడుకొని యట్ల యేఁగుదురు కౌరవభామిను లన్విధంబునన్. 308**

**ప్రతిపదార్థం:** తడిసిన; ఏక, వస్త్ర, పరిధానముతోడన్= ఒంటి బట్ట కట్టుకొని; విముక్త కేశి+ఐ= విరబోసికొనిన వెంట్రుకలు గలదై; తొడరుచున్= తొట్రుపడుతు; దుఃఖభావమునన్= దుఃఖంతో కూడిన మనస్సుతో; ద్రోవది; మహా+ఆహవంబునన్= మహాయుద్ధంలో; పడిన= మరణించిన; నిజ+ఈశ, మిత్ర, సుత, బంధు, జనంబుల, శోకవేదనన్= తమయొక్క భర్తలను, స్నేహితులను, కొడుకులను, చుట్టాలను గురించిన దుఃఖబాధతో; కడుకొని= పూనుకొని; కౌరవ, భామినులు= కౌరవుల భార్యలు; అట్లు+అ= ఆ విధంగా; ఏఁగుదురు= వెళ్తారు; అనువిధంబునన్= అనే పద్ధతిగా; పోయెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** తడిసిన ఒంటి బట్ట కట్టుకొని, వెంట్రుకలు విరబోసుకొని, తొట్రుపడుతూ, దుఃఖిస్తూ ద్రౌపది-భర్తలు, మిత్రులు, పుత్రులు, బంధువులు మహాయుద్ధంలో మరణించగా కౌరవుల భార్యలు ఆ విధంగానే వెళ్ళుతా రన్నట్లు వెళ్ళింది.

**క. భారతరణహతు లగు కురు । శూరుల పరలోకవిధులు సూచించి క్రియా**

**పారగుఁడు ధౌమ్యుఁ డరిగె వి । చారజ్ఞుఁడు రౌద్రయామ్యసామోద్గీతిన్. 309**

**ప్రతిపదార్థం:** భారత, రణ, హతులు+అగు= భారత యుద్ధంలో మరణించే; కురు, శూరుల= కౌరవవీరులయొక్క; పరలోక విధులు= ఉత్తరక్రియలు; సూచించి; క్రియాపారగుఁడు= క్రియలు పూర్తిగా తెలిసినవాడు; విచారజ్ఞుఁడు= ఆలోచనను తెలిసినవాడు అయిన; ధౌమ్యుఁడు; రౌద్ర, యామ్య సామ+ఉత్+గీతిన్= రుద్ర, యమ సంబంధి సామవేదమంత్రాలను పెద్దగా గానం చేస్తూ; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** మహాభారతయుద్ధంలో మరణించే కౌరవవీరుల పరలోకక్రియలు సూచించి, ఆ క్రియలు పూర్తిగా తెలిసినవాడు, ఆలోచనాపరుడు అయిన ధౌమ్యుడు రుద్ర యమ సంబంధి సామాన్ని పెద్దగా గానం చేస్తూ వెళ్ళాడు.

**వ. అనిన విని ధృతరాష్ట్రుండు దుఃఖితుం డయి. 310**

**తాత్పర్యం:** అనగా విని ధృతరాష్ట్రుడు శోకించి.

**తరలము.**

**సమరశూరులు పాండవుల్ జితశత్రు లున్నతచిత్తు లు**

**త్తములు వారలతోడి వైరము ధర్మయుక్తిఁ గరం బయు**

**క్తము ప్రజాక్షయకారణం బని తద్దయున్ భయమందుచున్**

**విమనుఁడై పడియుండె హా యని వెచ్చనూర్చుచు విన్న నై. 311**

**ప్రతిపదార్థం:** పాండవుల్; సమర, శూరులు= యుద్ధవీరులు; జిత, శత్రులు= జయింపబడినశత్రువులు కలవాళ్ళు; ఉన్నత, చిత్తులు= గొప్ప మనస్సు కలవాళ్ళు; ఉత్తములు= శ్రేష్ఠులు; వారలతోడి; వైరము= శత్రుత్వం; ధర్మయుక్తిన్= ధర్మంప్రకారం; కరంబు= మిక్కిలి; అయుక్తము= తగనిది; ప్రజా, క్షయ, కారణంబు= జనులు నశించటానికి హేతువు; అని; తద్దయున్=

మిక్కలి; భయము+అందుచున్= భయపడుతూ; హా! అని; వెచ్చన్+ఊర్పుచున్= వేడి నిట్టూర్పులు వదలుతూ; విన్నను+ఐ= వెలవెలబోయి; విమనుఁడు+ఐ= దుఃఖంపొందిన మనస్సు కలవాడై; పడి, ఉండెన్.

**తాత్పర్యం:** 'పాండవులు యుద్ధవీరులు. శత్రువులను జయించినవాళ్ళు. గొప్పమనస్సు కలవాళ్ళు. ఉత్తములు. వారితో వైరం ధర్మంప్రకారం ఏమాత్రం తగనిది. అది ప్రజానాశానికి కారణం' అని మిక్కిలి భయపడుతూ ధృతరాష్ట్రుడు హా! అని వేడి నిట్టూర్పులు విడుస్తూ వెలవెలబోయి దుఃఖిస్తూ పడి ఉన్నాడు.

**విశేషం:** భయదుఃఖభావతీవ్రతను ప్రదర్శించే ఈ రచనలో కాంతిగుణం రసపోషకం. (సంపా.)

**వ. అట్లు వగుచుచున్న ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె. 312**

**తాత్పర్యం:** ఆవిధంగా దుఃఖిస్తున్న ధృతరాష్ట్రునితో సంజయుడు ఇలా అన్నాడు.

**సీ. పాండుకుమారులఁ బరమధార్మికు లని । వగవక రాష్ట్రంబువలనఁ బాపి**
**వసుపూర్ణమైన యివ్వసుమతి సేకొంటి । వసుధేశ! నీ కింక వగవ నేల?**
**కలశజ విదుర గంగాసుత ప్రభృతులు । వారింప వారింప వశము గాక**
**కర్ణ గాంధారుల కఱపులు విని, వారి । కపకారి యయ్యె నీ యాత్మజుండు;**

**ఆ. వగవ కధికు లయిన వారితో వైరంబు । సేసికొంటి కరము చెట్ట యనక;**
**నీవు నీ సుతుండు నేర్తురు గా, కొరు । లేమి సేయనేర్తు రిందుకులుఁడ! 313**

**ప్రతిపదార్థం:** ఇందుకులుఁడ= చంద్రవంశంవాడి వైన ఓ ధృతరాష్ట్రమహారాజా!; పాండుకుమారులన్= పాండురాజు పుత్రులైన పాండవులను; పరమ ధార్మికులు+అని= మిక్కిలి ధర్మాత్ములని; వగవక= ఆలోచించక; రాష్ట్రంబువలనన్+పాపి= దేశంనుండి వెళ్ళగొట్టి; వసుపూర్ణము+ఐన= బంగారుతో నిండిన; ఈ+వసుమతిన్= ఈ భూమిని; చేకొంటి= గ్రహించావు; వసుధ+ఈశ= భూ నాథా! రాజా!; నీకున్; ఇంకన్; వగవన్= దుఃఖించటం; ఏల= ఎందుకు? కలశజ, విదుర, గంగాసుత, ప్రభృతులు= కుండనుండి పుట్టిన ద్రోణుడు; విదురుడు, గంగా తనయుడైన భీష్ముడు మొదలయినవాళ్ళు; వారింపన్= అడ్డగించగా; వారింప వశము, కాక= అడ్డగించటం సాధ్యంగాక; కర్ణ గాంధారుల= కర్ణునియొక్క, శకుని యొక్క; కఱపులు= బోధలు; విని; నీ, ఆత్మజుండు= నీ కుమారుడు; వారికిన్= పాండవులకు; అపకారి, అయ్యెన్= అపకారం చేసినవా డయ్యాడు; వగవక= విచారించక; కరంబు= మిక్కిలి; చెట్ట, అనక= చెడ్డ అని భావించక; అధికులు+అయిన, వారితో= గొప్పవాళ్ళతో; వైరంబు= శత్రుత్వం; చేసికొంటి; నీవు; నీ, సుతుండు= నీ కుమారుడు; నేర్తురుగాక= ఏమి చేయటానికైన తగుదురు; ఒరులు= ఇతరులు; ఏమి, చేయన్, నేర్తురు= ఏమి చేయగలరు?

**తాత్పర్యం:** చంద్రవంశంవాడి వైన ఓ ధృతరాష్ట్ర మహారాజా! పాండవులు మిక్కిలి ధర్మాత్ము లని ఆలోచించక దేశంనుండి వెళ్ళగొట్టి, బంగారుతో నిండిన ఈ భూమినంతా గ్రహించావు. మహారాజా! నీ వింక దుఃఖించటం ఎందుకు? భీష్మద్రోణవిదురాదులు వద్దన్నా వినకుండ, కర్ణశకునుల మాటలు విని, నీ కుమారుడు పాండవులకు అపకారం చేశాడు. ఆలోచించకుండా, ఎంతో చెడ్డ అని అనుకోకుండా గొప్పవాళ్ళతో వైరం తెచ్చుకొన్నావు. నీవు, నీ కుమారుడు ఏమి చెయ్యటానికైనా తగినవాళ్ళు. ఇతరు లేమి చేస్తారు?

**విశేషం:** ఈ సందర్భంలో 'ఇందుకులుఁడ' అనే సంజయుని సంబోధనలో ఆహ్లాదకరుడైన చంద్రునివంశంలో జన్మించి, కొడుకుల క్రూరకృత్యాలను ప్రోత్సహిస్తున్నావా? అనే ఎత్తిపొడుపు ధ్వనిస్తున్నది.

**వ. అని సంజయుండు పలికిన విని విదురుండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 314**

**తాత్పర్యం:** అని సంజయుడు పలుకగా విదురుడు విని ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు.

**తరలము.**

**వగవ నేటికి నింకనైనను వారలం బిలిపించి యీ**
**జగతి నెప్పటియట్ల యేలుచు సంతసంబున నుండఁగా**
**జగదధీశ్వర! పంపు; వంచన చన్నె? యన్యుల సంపదల్**
**మిగిలి చేకొన నిట్లు సేసిన మెత్తురే మది నుత్తముల్? 315**

**ప్రతిపదార్థం:** జగత్+అధీశ్వర= ప్రపంచానికి ప్రభువైనవాడా! ధృతరాష్ట్ర మహారాజా!; వగవన్, ఏటికిన్= దుఃఖించటం ఎందుకు? ఇంకన్+ఐనను; వారలన్= పాండవులను; పిలిపించి; ఈ, జగతిన్= ఈ భూమిని; ఎప్పటి+అట్ల= ఎప్పటివలె; ఏలుచున్= పాలిస్తూ; సంతసంబునన్; ఉండఁగాన్; పంపు= ఆజ్ఞాపించు; వంచన= మోసం; చన్నె= తగునా?; అన్యుల, సంపదల్= ఇతరుల సంపదలను; మిగిలి= హద్దుమీరి - అంటే ధర్మాన్ని అతిక్రమించి; చేకొనన్= గ్రహించటానికి; ఇట్లు+చేసినన్; ఉత్తముల్= గొప్పవాళ్ళు; మదిన్= మనస్సులో; మెత్తురే= మెచ్చుకొంటారా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రమహారాజా! దుఃఖించటం ఎందుకు? ఇప్పు డైనా పాండవుల్ని పిలిపించి ఈ భూమిని ఎప్పటిలా పాలిస్తూ సుఖంగా ఉండండని ఆజ్ఞాపించు. మోసం చెయ్యటం తగునా? ఇతరుల సంపదలు హద్దు మీరి గ్రహించటానికి ఇలా చేస్తే ఉత్తములు మెచ్చుకొంటారా?

**విశేషం:** విదురుడు చేసిన కర్తవ్యబోధ కురుపాండవ సమస్యకు సమయోచిత సులభపరిష్కారం. ధృతరాష్ట్రుని చిత్తశుద్ధికి చక్కని గీటురాయి. 'జగదధీశ్వర!' అనే సంబోధనలో సర్వసర్వంసహాధికారివి నీవై ఉండి, పాండవులను పిలిచి, రాజ్య మిచ్చి ఎప్పటిలా పాలించుకొమ్మని చెప్పితే నీ మాట కాదనే వాళ్ళెవరు? - అనే భావం కూడ ధ్వనిస్తున్నది. (విదురుడి వాక్యవిన్యాసంలో గోచరించే అగ్రామ్యత్వం, వికటత్వం ఉదారతాగుణస్ఫోరకాలై రాణిస్తున్నాయి. సంపా.)

**ఆ. అనిన విదురుపలుకు లా ధృతరాష్ట్రుండు । వినియు విననియట్లు విపినవాస**
**గతులఁ బాండుసుతులఁ గ్రమ్మఱింపక యుపే । క్షించెఁ బూర్వవిహిత కిల్బిషమున. 316**

**ప్రతిపదార్థం:** అనిన; విదురు, పలుకులు; ఆ, ధృతరాష్ట్రుండు; వినియున్; వినని, అట్లు; విపిన, వాస, గతులన్= అరణ్యానికి వెళ్ళే వాళ్ళను; పాండు సుతులన్= పాండురాజు కుమారులను; క్రమ్మఱింపక= మరలించక; పూర్వ విహితకిల్బిషమునన్= గడచిన జన్మలో విధించబడిన పాపంచేత; ఉపేక్షించెన్= ఊరకున్నాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు విదురుని మాటలు వినికూడ, వినని విధంగా ఉండి, అరణ్యానికి వెళ్ళే పాండవులను మరలించకుండా, గతజన్మంలో విధించబడిన పాపంచేత ఊరక ఉండిపోయాడు.

**విశేషం:** ధృతరాష్ట్రునికి చిత్తశుద్ధిలేదనటానికి ఇది చక్కని ఉదాహరణం.

**వ. మఱియు ద్రోణుండు పాండవులకు నెయ్యుం డయ్యును దొల్లి యాజోపయాజుల వరంబున నగ్ని కుండంబున నుద్భవిల్లిన ద్రుపదాత్మజుండు ధృష్టద్యుమ్నుండు పాండవసంబంధి యయి ప్రతివీరుం డగుట నాతనితోఁ దనకు సమరం బగు నని యెఱింగి పాండవానుగమనంబు సేయ నొల్లక గజపురంబున ధృతరాష్ట్రు నొద్దన యుండె; ని ట్లింద్రప్రస్థపురంబున నిరువది మూఁడేఁడులు రాజ్యంబు సేసి పాండవులు పాపద్యూత పరాజితులయి. 317**

**ప్రతిపదార్థం:** మఱియు, ద్రోణుండు; పాండవులకున్; నెయ్యుండు+అయ్యును= స్నేహితుడయినప్పటికీ; తొల్లి= పూర్వం; యాజ+ఉపయాజుల= యాజునియొక్క ఉపయాజునియొక్క; వరంబునన్= వరంచేత; అగ్ని, కుండంబునన్, ఉద్భవిల్లిన= పుట్టిన; ద్రుపద+ఆత్మజుండు= ద్రుపదుని కుమారుడు; ధృష్టద్యుమ్నుండు; పాండవ, సంబంధి, అయి= పాండవుల బంధువై; ప్రతివీరుండు= శత్రువీరుడు; అగుటన్= అవటంచేత; ఆతనితోన్= ఆ ధృష్టద్యుమ్నునితో; తనకున్; సమరంబు= యుద్ధం; అగును+అని; ఎఱింగి= తెలిసికొని; పాండవ+అనుగమనంబు= పాండవుల వెంట వెళ్ళటం; చేయన్= చేయటానికి; ఒల్లక= ఇష్టపడక; గజపురంబునన్= హస్తినాపురాన; ధృతరాష్ట్ర+ఒద్ద= ధృతరాష్ట్రుని దగ్గర; ఉండెన్; ఇట్లు; ఇంద్రప్రస్థపురంబునన్; ఇరువది మూఁడు+ఏఁడులు= ఇరవై మూడు సంవత్సరాలు; రాజ్యంబు, చేసి; పాండవులు; పాప, ద్యూత, పరాజితులు+అయి= చెడుజూదంలో ఓడిపోయినవాళ్ళయి.

**తాత్పర్యం:** ద్రోణుడు పాండవులమీద ప్రేమకలవాడే అయినా-పూర్వం యాజోపయాజుల వరంచేత అగ్నిగుండంనుండి పుట్టిన ద్రుపదపుత్రుడు ధృష్టద్యుమ్నుడు పాండవుల బంధువై తనకు శత్రువీరుడు కావటంచేత, అతనితో తనకు యుద్ధం అవుతుం దని తెలుసుకొని, పాండవులవెంట వెళ్ళటానికి ఇష్టపడక హస్తినాపురంలో ధృతరాష్ట్రుని దగ్గరే ఉండిపోయాడు. ఈ విధంగా పాండవులు ఇంద్రప్రస్థపురంలో ఇరవై మూడేళ్ళు రాజ్యంచేసి పాపపు జూదంలో ఓడిపోయి.

**విశేషం:** యాజోపయాజులు గంగ ఒడ్డున వానప్రస్థవృత్తిలో ఉండే బ్రాహ్మణోత్తములు.

**క. వీరులగు పాండు సుతులు మ । హారణ్యనివాస నిరతులయి ధరణీబృం**
**దారక సహస్రములతో । సారమతుల్ సనిరి నిత్యసత్యవ్రతులై. 318**

**ప్రతిపదార్థం:** వీరులు+అగు; పాండు సుతులు= పాండవులు; మహా+అరణ్య, నివాస, నిరతులు+అయి= మహారణ్యంలో నివసించటంలో మిక్కిలి ఆసక్తి కలవాళ్ళయి; ధరణీ బృందారక, సహస్రములతోన్= వేలకొలది భూసురులతో; సారమతుల్= బుద్ధిమంతులు; నిత్యసత్యవ్రతులు+ఐ= ఎల్లప్పుడు సత్యాన్నే వ్రతంగా కలవాళ్ళయి; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** వీరులు, బుద్ధిమంతులు, నిత్యసత్యవ్రతులు అయిన పాండవులు- వేలకొలది బ్రాహ్మణులు వెంటరాగా అరణ్యవాసానికి వెళ్ళారు.

**క. అని యిట్లు సభాపర్వం । బున కథ జనమేజయునకు మొగి వైశంపా**
**యను చెప్పిన విధమంతయు । మనునిభ! శుభచరిత! నిత్యమహిమాతిశయా! 319**

**ప్రతిపదార్థం:** మను, నిభ= మనువుతో సమానమైన వాడా! శుభచరిత= మంగళకరమైన చరిత్ర కలవాడా! నిత్య, మహిమ+ అతిశయా= శాశ్వతమైన గొప్పతనంచేత మిన్న అయినవాడా! ఓ రాజరాజ నరేంద్రా! అని; ఇట్లు; సభా, పర్వమున, కథ= సభా పర్వంలోని కథ; మొగి= మునుపు; జనమేజయునకున్; వైశంపాయను, చెప్పిన, విధము+అంతయున్= వైశంపాయనుడు చెప్పిన విధం పూర్తిగా ఇది.

**తాత్పర్యం:** మనువుతో సమానమైన వాడా! శుభ చరిత్ర కలవాడా! శాశ్వతమైన మహిమచే మిన్న అయినవాడా! ఓ రాజరాజ మహేంద్రా! ఈ విధంగా సభాపర్వంలోని కథ పూర్తిగా మునుపు జనమేజయునికి వైశంపాయనుడు చెప్పిన విధమంతా ఇది.

**విశేషం:** 'మనునిభ శుభ చరిత!' అనే విశేషణానికి 'మనువుకు సాటియైన శుభచరిత్ర గలవాడా!' అనే అర్థంకూడా చెప్పవచ్చు.

## ఆశ్వాసాంతము

**రథోద్ధతము.**

**హార హీర ధవళాంశు నిర్మలో**
**దార కీర్తి! రణదర్ప! సద్గుణా!**
**వైరి వీర రస వైద్య! మన్మథా**
**కార! ధీర! పరగండభైరవా!** **320**

**ప్రతిపదార్థం:** హార, హీర, ధవళ+అంశు, నిర్మల, ఉదార, కీర్తి= హారంలోని వజ్రంయొక్క తెల్లని కాంతిలా నిర్మలమైన గొప్పకీర్తి కలవాడా!; రణ, దర్ప= యుద్ధంలో గర్వం కలవాడా!; సద్గుణా= మంచిగుణాలు కలవాడా!; వైరి, వీర, రస, వైద్య= శత్రువులయొక్క వీరరసానికి చికిత్స చేసేవాడా!; మన్మథ+ఆకార= మన్మథుని వంటి ఆకారం కలవాడా!; ధీర= ధైర్యం కలవాడా!; పరగండ భైరవా= శత్రువీరులకు భయంకరమైనవాడా!

**తాత్పర్యం:** హారంలోని వజ్రకాంతివంటి తెల్లని నిర్మలమైన గొప్పకీర్తి కలవాడా! యుద్ధంలో గర్వంకలవాడా! ఉత్తమగుణాలు గలవాడా! శత్రువుల వీరరసానికి చికిత్స చేసేవాడా! మన్మథుని ఆకారం కలవాడా! ధైర్యం కలవాడా! శత్రువీరులకు భయంకరమైనవాడా!

**విశేషం:** అలం. ఉపమ, వృత్త్యనుప్రాసం. ఇవి ఆశ్వాసాంత రాజరాజ సంబోధనలు. ఆయన గుణ విశేషాల ప్రశంసలు. (రథోద్ధత వృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా ర,న,ర,లగ గణా లుంటాయి. ఏడవ అక్షరం యతి. ప్రాసనియమం పాటించబడింది. నన్నయ లఘు రకారావృత్తిచేత వృత్తరచనలో అక్షరరమ్యతను పోషించాడు. నన్నయ ఈ వృత్తాన్ని ఈ ఒక్కచోటనే వాడాడు. - సంపా.)

**క. కరుణావతార! ధరణీ । సురవర సురభూజ! రాజసుందర! నయబం**
**ధుర! ధర్మధురంధర! మం । దరధైర్య! సుహృన్నిధాన! దానవినోదీ!** **321**

**ప్రతిపదార్థం:** కరుణా+అవతార= దయా స్వరూపా!; ధరణీ, సుర, వర, సురభూజ= భూదేవతలైన బ్రాహ్మణ శ్రేష్ఠులకు కల్పవృక్షం వంటి వాడా!; రాజ, సుందర= చంద్రునివలె అందమైనవాడా!; నయ, బంధుర= నీతిచేత ఒప్పిదమైనవాడా!; ధర్మధురంధర= ధర్మభారాన్ని వహించేవాడా!; మందర ధైర్య= మందరపర్వతంతో సమానమైన ధైర్యం కలవాడా!; సుహృత్+ నిధాన= మిత్రులకు పెన్నిధివంటివాడా!; దాన, వినోదీ= దానం చేయటంలో సంతోషం కలవాడా!

**తాత్పర్యం:** దయాస్వరూపా! భూదేవతలైన బ్రాహ్మణ శ్రేష్ఠులకు కల్పవృక్షం వంటివాడా! చంద్రుడిలా అందమైనవాడా! నీతితో ప్రకాశించేవాడా! ధర్మభారం వహించేవాడా! మందరపర్వతంతో సమానమైన ధైర్యం కలవాడా! మిత్రులకు పెన్నిధివంటివాడా! దానం చెయ్యటంలో సంతోషం కలవాడా!

**విశేషం:** అలం: ఉపమ. వృత్త్యనుప్రాసం. (సంపా.)

**ఉత్సాహము.**

> **రాజవంశవార్ధిచంద్ర! రాజదేవ! నిత్యల**
> **క్ష్మీ జయాభిరామ! ధర్మమిత్ర! మిత్ర విద్వదం**
> **భోజ వన పయోజమిత్ర! భూరి కీర్తి కౌముదీ**
> **రాజిత త్రిలోక! నిఖిల రాజ నిత్య పూజితా!** **322**

**ప్రతిపదార్థం:** రాజ, వంశ, వార్ధి, చంద్ర= రాజవంశం అనే సముద్రానికి చంద్రునివంటివాడా!; రాజదేవ!; నిత్యలక్ష్మీ, జయ+ అభిరామ= శాశ్వతమైన ఐశ్వర్యంతో, జయంతో మనోహరమైనవాడా!; ధర్మమిత్ర= ధర్మానికి స్నేహితుడివైనవాడా!; మిత్ర, విద్వత్+ అంభోజ, వన, పయోజమిత్ర= స్నేహితులు, పండితులు అనే పద్మవనానికి సూర్యుని వంటివాడా!; భూరి, కీర్తి కౌముదీ, రాజిత త్రిలోక= గొప్పకీర్తి అనే వెన్నెలచేత ముల్లోకాలను ప్రకాశింప చేసేవాడా!; నిఖిల, రాజ, నిత్య, పూజితా= అందరు రాజులచేత ఎల్లప్పుడు పూజించబడేవాడా!

**తాత్పర్యం:** రాజవంశమనే సముద్రానికి చంద్రునివంటివాడా! రాజదేవా! శాశ్వతమైన ఐశ్వర్యంతో, జయంతో మనోహరమైనవాడా! ధర్మానికి మిత్రుడవైనవాడా! స్నేహితులు, పండితులు అనే పద్మవనానికి సూర్యునివంటివాడా! ముల్లోకాలను కీర్తి అనే వెన్నెలచేత ప్రకాశింపచేసేవాడా! సమస్తరాజులచే ఎల్లప్పుడు పూజింపబడేవాడా!

**విశేషం:** అలం: ఉపమ. రూపకం. ఉత్సాహ వృత్తపాదంలో ఏడు సూర్య గణాలమీద ఒక గురువు ఉంటుంది. అయిదవ గణంలోని మొదటి అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉంది. (సంపా.)

**గద్యము.**

> **ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతం బయిన శ్రీమహాభారతంబునందు సభాపర్వంబున నర్ఘ్యాభిహరణంబును, శిశుపాల వధయును, రాజసూయ విభూతికి దుఃఖితుండై సభాస్థలితుండై యున్న దుర్యోధనుం జూచి ద్రౌపదీభీమసేనులు నగుటయు, రాజసూయవిభూతి సూచి సహింపక దుర్యోధనుండు జూదం బొనర్చుటయు, నందు శకుని కైతవంబున ధర్మరాజ పరాజయంబును, ద్యూతదుఃఖార్ణవ**

**మగ్నులయిన పాండవులం బాంచాలి యుద్ధరించుటయుఁ, బునర్ద్యూత పరాజితులయి పాండవులు వనవాసగతు లగుటయు నన్నది సర్వంబును ద్వితీయాశ్వాసము.**

**సభాపర్వము సమాప్తము.**

**తాత్పర్యం:** ఇది ఉత్తమకవు లందరి ప్రశంస లందుకొన్న నన్నయభట్టారకుడు రచించిన శ్రీమహాభారత సభాపర్వంలో, అర్ఘ్యప్రదానం, శిశుపాలుణ్ణి చంపటం, రాజసూయవైభవాన్ని చూచి దుఃఖితుడై సభలో జారిపడిన దుర్యోధనుణ్ణి చూచి ద్రౌపదీ భీమసేనులు నవ్వటం, రాజసూయ వైభవాన్ని చూచి సహించలేక దుర్యోధనుడు జూదమాడటం, అందులో శకుని మోసంవల్ల ధర్మరాజు ఓడిపోవటం, జూదంవల్ల కలిగిన దుఃఖ మనే మహాసముద్రంలో మునిగిన పాండవులను ద్రౌపది ఉద్ధరించటం, మళ్ళీ ఆడిన జూదంలో పాండవులు ఓడి అడవులకు వెళ్ళటం - అన్నది రెండవ ఆశ్వాసం.

**సభాపర్వంలో ద్వితీయాశ్వాసం సమాప్తం.**

**శ్రీమదాంధ్ర మహాభారతంలో సభాపర్వం ముగిసింది.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సభాపర్వము

### పద్య - గద్య ప్రథమపాద సూచి



కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ( సరళ వ్యాఖ్యాన సహితం )

సంపుటము - 4

**ఆరణ్యపర్వము - భాగం -1**

మొదటి భాగము 1,2,3,4 (141వ పద్యంవరకు) ఆశ్వాసములు


కృతికర్త

**నన్నయభట్టారకుడు**

వ్యాఖ్యాత

డా॥ నందూరి రామకృష్ణమాచార్య

ప్రధానసంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం






ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

**KAVITHRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATHAM**

With Commentary
Aranyaparvamu of Nannaya Bhattarakudu-part-I
(Cantos 1,2,3 and 4 upto the poem 141)

Vol. IV.

Commentary by
**Dr. Nanduri Ramakrishnamacharya**

Edited by
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious Publications Series No.603
First Edition : 2003

Second Edition: 2013
Copies : 5,000



Published by

**Sri. M.G. Gopal, I.A.S.**

Executive Officer,

T.T.Devasthanams,

Tirupati - 517 507

D.T.P. Type Setting

**Editor-In-Chief Office**

T.T.D. Tirupati.

Cover Design:

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్పైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం 18 పర్వాలను 15 సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# సరళవ్యాఖ్యాన సహిత
# కవిత్రయ భారతం ద్వితీయ ముద్రణ
# పూర్వాపరాలు

భారతీయ సనాతన సంస్కృతి మణి కిరీటంలో జాజ్వల్యమానంగా మెరుస్తున్న ముచ్చటైన మూడు అమూల్యరత్నాలు రామాయణ, భారత, భాగవత గ్రంథాలు. అనాదిగా ఆసేతుహిమాచలం ధర్మప్రచారంలోను, ధర్మపరిరక్షణలోను ఈ అమూల్యగ్రంథాలు అద్భుతమైన ఎనలేని పాత్రను పోషిస్తున్నాయి. అందులోను త్రిలింగాలమధ్య నెలకొన్న ఆంధ్రులకు అత్యంత ఆదరణీయమైనవి, ప్రీతిపాత్రమైనవి ఈ మూడు గ్రంథాలు. అందువల్లే తిరుమల తిరుపతి దేవస్థానం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నినాదంతో ధర్మపరిరక్షణకోసం ఈ మహాగ్రంథాల ప్రచురణ పెద్దఎత్తున చేపట్టింది.

మహోన్నతమైన ఈ బృహత్సాహితీయజ్ఞంలో తొట్టతొలిగా సవ్యాఖ్యానంగా కవిత్రయ భారత గ్రంథ ప్రచురణను చేపట్టింది తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ మహా ఆధ్వర్యవానికి అధిదైవతం శ్రీ వేంకటేశ్వరుడు కాగా, ఎందరో పండితవరేణ్యులైన వ్యాఖ్యాతలు ఋత్విక్కుల పాత్రను పోషించారు. సుమారు 30 ఏండ్లపాటు సాగిన ఈ సాహితీక్రతు నిర్వహణకుగాను నాటి శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామి రెడ్డిగారి కార్యనిర్వహణలో ప్రజాసంబంధాల అధికారిగా కొనసాగిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు విశేషకృషి చేసినారు. అలాగే ఆనాడు ప్రధాన సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, సంపాదకులుగా వ్యవహరించిన డా॥ నండూరి రామకృష్ణమాచార్యులుగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు భారత ముద్రణలో ప్రత్యేకమైన పాత్రను పోషించారు. తరువాత కవిత్రయ మహాభారత వ్యాఖ్యాన రచనాకార్యక్రమానికి పూర్తిగా ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఈ కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహించి పద్దెనిమిది పర్వాల భారతాన్ని పదిహేను సంపుటాలుగా వెలుగులోనికి తీసుకురావటంలో కీలకపాత్రను వహించారు. ఇదే పరంపరలో 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారు, ఆ తర్వాత 'సప్తగిరి' సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. పిదప 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు, డా॥ సి.శైలకుమార్ గారు మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారల పర్యవేక్షణ కాలంలో 'కవిత్రయ భారతం' ప్రచురణ పూర్తి అయింది. ఆ తరువాత అనతికాలంలోనే ఆ గ్రంథ ప్రతులు అన్నీ పూర్తిగా చెల్లిపోయి ద్వితీయముద్రణకు ఆవశ్యకత ఏర్పడింది.

డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి సలహా మేరకు నాటి శ్రీకార్యనిర్వహణాధికారి డా॥ కె.వి.రమణాచార్యులుగారు భారత తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సరిచేయుటకుగాను **1) డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు 2) ఆచార్య రవ్వా శ్రీహరి 3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు 4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య 5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య 6) ఆచార్య కె. సర్వోత్తమరావు 7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** – ఈ ఏడుగురు పండితులతోకూడిన ఒక పండిత పరిషత్తును ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి శ్రీకార్యనిర్వహణాధికారిగా బాధ్యతలను స్వీకరించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. పండిత పరిషత్తు వివిధ పండితులు వ్రాసిన వ్యాఖ్యాన భాగాలను పరిశీలించి అన్వయ దోషాలను, ముద్రారాక్షసాలను, శైలీ భేదాలను వీలైనంతవరకు గుర్తించి సవరించి శైలిలో ఏకరూపత సాధించేందుకు తగిన కృషి చేసింది. ఆ పండిత పరిషత్తులో నన్ను కూడా ఒక సభ్యుడిగా దేవస్థానం స్వీకరించడం శ్రీనివాసుని నిర్హేతుకమైన అనుగ్రహానికి తార్కాణం! అంతేగాక 2011 ఫిబ్రవరిలో దేవస్థానం గ్రంథ ప్రచురణ విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నన్ను నియమించడమే గాక, 'కవిత్రయ భారత పునర్ముద్రణ'ను పర్యవేక్షించే బాధ్యతను కూడా దేవస్థానం నాకు అప్పగించింది. ఆనందనిలయుని అపారకృపవల్ల 'కవిత్రయ భారతం' పునర్ముద్రణకార్యంకూడ పూర్తి అయింది.

మలిముద్రణ ఈ రూపంలో రావడానికి అన్నివిధాలా సహాయసహకారాలందించిన తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరి బాపిరాజుగారికి మరియు పాలకమండలి సభ్యులకు నా కృతజ్ఞతలు.

సవ్యాఖ్యాన మహాభారత ద్వితీయ ముద్రణను వేగవంతం చేసి ప్రజాబాహుళ్యానికి అందించడంలో విశేషకృషి చేసిన శ్రీకార్యనిర్వహణాధికారులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్. గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పి.వెంకటరామిరెడ్డి, ఐ.ఏ.ఎస్; శ్రీ కె.యస్.శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్. గారలకు నా కృతజ్ఞతలు.

సరళ వ్యాఖ్యాన సహిత కవిత్రయ మహాభారత ముద్రణల్లో నాటి నుండి నేటివరకు తమ అమూల్య సహాయ సహకారాలు అందించిన తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారులకు, సంయుక్త కార్యనిర్వహణాధికారులకు, ప్రజాసంబంధాల అధికారులకు, ముద్రణాలయ అధికారులకు అందరికీ నా కృతజ్ఞతలు.

వృత్తిరీత్యా ఇంజనీర్ అయినప్పటికి సాహిత్యాభిలాషతో తి.తి.దే. మహాభారతంలోని కొన్ని సవరణలను గుర్తించి తెలియజేసిన శ్రీ పుత్తా పుల్లారెడ్డి గారికి ధన్యవాదాలు.

కవిత్రయభారత పునర్ముద్రణకార్యక్రమంలో అవసరమైన సహకారమందించిన సహృదయులు 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు డా॥ సి.శైలకుమార్ మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారలకు కృతజ్ఞతలు. అలాగే పునర్ముద్రణ విషయంలో అడుగడుగునా, చేదోడు వాదోడుగా వుంటూ పూర్తి సహాయ సహకారాలందించిన పండితులు మహాకవి విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, ఉపసంపాదకులు డా॥ కంపల్లె రవిచంద్రన్, డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తర ఫల్గుణి, పరిశోధక సహాయకులు, డా॥ డి.భారతి, డా॥ టి.సావిత్రి, డా॥ వి.గోపాలకృష్ణమూర్తి, ప్రచురణ సలహాదారులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ జల్లి శ్రీరఘుపతిరావుగార్లకు మరియు కార్యాలయ సిబ్బందికి, డి.టి.పి. ఆపరేటర్లకు కృతజ్ఞతలు.

ఈ బృహద్గ్రంథముద్రణలో ఎంతగానో సహకరించిన దేవస్థానం ప్రజాసంబంధాల అధికారి శ్రీ టి.రవిగారికి, ముద్రణాలయాధికారి శ్రీ సాంబశివరావుగారికి, మరియ వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

**మరోమాట!**

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయదీక్షితులు చెప్పినట్లుగా ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాష మాట్లాడటం ఎంతో గొప్ప తపస్సు చేస్తేకానీ లభించని అదృష్టాలు. అలాంటి భాషలో కవిత్రయంవారు పంచమవేదమైన వ్యాసభారతాన్ని ఆంధ్రులకు అందించటం ఆంధ్రుల పుణ్యవిశేషం ! ఆంధ్రమహాభారతం తెలుగువారికి లభించిన అమృతఫలం ! ఆ అమృతఫలరసాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా ఆస్వాదిస్తారనీ, మహాభారత సందేశాన్ని సుగమం చేసుకొంటారనీ ఆశిస్తున్నాము.

కవిత్రయ మహాభారత ద్వితీయముద్రణకార్యం నాచేతుల మీదుగా జరిపించిన దేవదేవుడైన ఆ శ్రీనివాసుని ప్రార్థిస్తూ....

*సదా శ్రీవారిసేవలో*

**ఆచార్య రవ్వా శ్రీహరి**

ఎడిటర్–ఇన్–చీఫ్

తిరుమల తిరుపతి దేవస్థానములు

# ముందుమాట

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్

భారతీయుల విజ్ఞాన సర్వస్వం భారతం. ఈ గ్రంథం తొలుతటిపేరు 'జయం'. వేదవాఙ్మయం యొక్క సారం ఇందులో ఇమిడి ఉన్నందున ఇది పంచమ వేదంగా ప్రశస్తిగాంచింది. పూర్వం దేవతలు, ఋషులు – దీని మహిమను పరీక్షించదలచి – నాలుగు వేదాలను ఒక వైపు, ఈ గ్రంథాన్ని మరోవైపు తులలోపెట్టితూచినారట! ఈ గ్రంథం ఉన్నవైపే అధికంగా ముల్లు చూపినందువలన, ఈ జయేతిహాసం మిగుల మహత్త్వం కలదిగా, చతుర్వేదాలకన్న బరువైనదిగా వెల్లడయింది. ఆనాటి నుండి ఈ గ్రంథానికి 'మహాభారత' మనే నామధేయం సార్థకంగా స్థిరపడింది. "మహత్త్వాత్ భారవత్త్వాత్ చ మహాభారత ముచ్యతే" – అనే నిర్వచనం అలా ఏర్పడింది. 'భరత వంశీయుల చరిత్ర భారతం' – అనే వ్యుత్పత్తి కూడ ఇందుకు తోడయింది.

భారతంలోని భాగాలకు పర్వాలని పేరు. 'పర్వ' మంటే చెఱకు గణుపు. మహాభారతం పదునెనిమిది గణుపులు గల చక్కని చిక్కని చెఱకు గడవంటిదని వ్యాసభగవానుని అభిప్రాయం. చెఱకుగడలో ప్రతి గణుపులోనూ మధురరసం సమృద్ధిగా ఉన్నట్లే, భారతంలో గల ప్రతి పర్వంలోనూ కావ్యరసం పుష్కలంగా నెలకొని ఉంటుందనే భావం ఇందులో వెల్లడౌతున్నది. "భారతం చేక్షుఖండం చ ప్రతిపర్వరసోదయమ్"– అనే ఆర్యోక్తి ఈ సత్యాన్ని చాటుతూవుంది.

మహాభారతం దివినుండి భువికి దిగివచ్చిన దివ్యగంగావాహిని; పారిజాత కల్పవృక్షం; సమస్త కళలతో విరాజిల్లే పూర్ణచంద్రుడు; అమృతకలశం – ఇలా ఈ జాతీయ కావ్యం యొక్క మాహాత్మ్య వైభవ ఆ యా సందర్భాల్లో అనేక రీతుల అభివర్ణింపబడింది.

దేవభాషలో అవతరించిన భారతం కాలక్రమేణ తమిళ, కర్ణాటాది దేశభాషలలోనికి అనువదింపబడుతూవచ్చింది. ప్రాంతీయ భాషలలో వెలువడిన ఆ యా భారతానువాదాలన్నిట్లోనూ తెలుగులో 'కవిత్రయం' వారు రచించిన ఆంధ్రమహాభారతం విశిష్టమై విలసిల్లుతూవుంది. కృష్ణద్వైపాయనుడు ఏ పరమార్థాన్ని మూలంలో నిరూపించాడో, ఆ నిరూపితార్థం చెక్కుచెదరకుడా పుణికి పుచ్చుకొని ఆవిర్భవించిన స్వతంత్ర రచన ఆంధ్రమహాభారతం. కవిత్రయం కావించిన పునఃసృష్టి !

ఆంధ్రావళికి ఆదికావ్యాన్ని ప్రసాదించిన మహాకవులు ముప్వరూ త్రిమూర్తుల వంటివారు. వారిలో ఆదికవియే విష్ణువు, కవిబ్రహ్మయే బ్రహ్మదేవుడు, ప్రబంధ పరమేశ్వరుడే పరమేశ్వరుడు. ఈ ముగ్గురు సారస్వత మూర్తులు వేరు వేరు కాలాల్లో, తెలుగుదేశంలోని వేరు వేరు ప్రాంతాల్లో తమ తమ రచనల్ని కొనసాగించినప్పటికీ, కవిత్రయ భారతం స్వరూపంలోనూ, సందేశంలోనూ ఏకవాక్యతతో విలసిల్లుతూవుంది. ఇది ఆంధ్రావనికి దైవికంగా సిద్ధించిన అదృష్ట విశేషం ! తరతరాల తెలుగు జాతికి ఆదర్శంగా తెనుగు సాహితీ మందిరంపై నిర్మించిన సమున్నత స్వర్ణగోపురం ఆంధ్రమహాభారతం ! ఆ సుందర గోపురాన్ని నెలకొల్పిన అక్షరశిల్పులు "కవిత్రయం" అందరకూ ఆరాధ్యులు !!

భారతంలోని పర్వాల్లో మూడవది ఆరణ్యపర్వం, ధర్మాత్ములైన పాండునందనులకు విజయం తథ్యమనే విషయానికి స్పష్టమైన నిదర్శనాలు మొదటిసారిగా ఈ పర్వంలో గోచరిస్తాయి. 'ఎక్కడ ధర్మం ఉంటుందో అక్కడ భగవానుడు ఉంటాడు; ఎక్కడ భగవానుడు ఉంటాడో అక్కడ విజయం నిశ్చయం'.

**"యతో ధర్మః తతో విష్ణుః, యతో విష్ణుః తతో జయః'**

– అనేదే ఆరణ్యపర్వం యొక్క ప్రధాన సందేశం !

'ధర్మో విగ్రహవానివ' – అని కొనియాడబడిన ధీరోదాత్తుడు యుధిష్ఠిరుడు. ధర్మమూర్తియైన ఆ మహారాజు రోమశుడనే మహర్షిని అడిగిన ప్రశ్న – తీర్థయాత్రల ప్రయోజనాన్ని గూర్చి తెలిపేది – ఈ సందర్భంలో ముఖ్యంగా ప్రస్తావింపదగి ఉంది :

అచేతనాలైన కొండలు, నదులు, సరస్సులు మొదలైనవి జనుల పాపాలను పోగొట్టేవై ఉండటానికి గల కారణమేమి? – అని ధర్మజుడి ప్రశ్న.

ధర్మపరాయణులైన దేవతలు, ఋషులు వాటిని ఆసక్తితో ఆశ్రయించి ఉండటం చేత పర్వతాలు, నదులు, సరోవరాలు మొదలైనవి పవిత్రాలై, పుణ్యతీర్థాలై, జనుల పాపాలను నివారిస్తూ, వారి వారి కోరికలను ఈడేరుస్తూ, జగత్తును పావనం చేస్తూ ఉంటాయి – అని రోమశుడి సమాధానం.

(ఆరణ్యపర్వం, రెండవ ఆశ్వా., 309వ వచనం, 317వ వచనం.)

ఈ సమాధానం తీర్థయాత్రల యొక్క ప్రాముఖ్యాన్ని, పరమార్థాన్ని చక్కగా విశదీకరిస్తూ వుంది.

తిరుమల తిరుపతి దేవస్థానములు చేపట్టి నిర్వహిస్తూ వున్న అనేక ధార్మిక ప్రచురణల కార్యక్రమాల్లో "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారత ప్రచురణ ప్రణాళిక" విస్తృతమైనది, విశిష్టమైనది. ఈ బృహత్తర ప్రణాళికలో భాగంగా నన్నయభట్టారకుని ఆదిపర్వం (రెండు భాగాలు), సభాపర్వం – ఇటీవలే (కడచిన మే నెలలో) దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులు గౌ॥ శ్రీ దండు శివరామరాజు మహోదయుల కరకమలాల మీదుగా ఆవిష్కరింపబడినాయి.

ఇప్పుడు ప్రచురితమైన ఆరణ్యపర్వం మూడవ సంపుటం. ఈ సంపుటం కూడ గ్రంథ పరిమితి ననుసరించి, పాఠకుల సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకొని రెండు భాగాలుగా వింగడింపబడింది. ఆరణ్యపర్వం రెండు భాగాల్లో ఇది మొదటి భాగం. ఈ భాగం నన్నయభట్టు రచించినది. దీని తరువాతిదైన రెండవ భాగం నన్నయ పేర ఎఱ్ఱన రచించినది. ఈ విధంగా ఆరణ్యపర్వాన్ని తెలుగులో రెండు వేర్వేరు భాగాలుగా ప్రచురించటం ఇదే ప్రథమం.

ఈ పర్వానికి వ్యాఖ్యను సమకూర్చినవారు డా॥ నండూరి రామకృష్ణమాచార్యులుగారు. దీనిని పరిష్కరించినవారు 'వ్యాఖ్యాసహిత కవిత్రయాంధ్రమహాభారతం ప్రాజెక్టు' ప్రధాన సంపాదకులు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు. మరియు, ఈ వాఙ్మయ యజ్ఞంలో పలు తెఱగుల పాలు పంచుకొంటున్న విద్వాంసులు, విద్యావేత్తలు అనేకులు ! సుగృహీత నామధేయులయిన ఈ సహృదయులందరికీ పేరుపేరున కృతజ్ఞతాభివాదాలు తెలుపుతున్నాము.

నిత్యకల్యాణ మూర్తి అయిన వేంకటేశ్వరుని అనుగ్రహ విశేషం వలన, వ్యాఖ్యాన సమేతమైన ఈ జయేతిహాసం సర్వజనులకు జయప్రదము, ఆనంద సంధాయకము కాగలదని మా ఆశయము, ఆకాంక్ష.

**"అమల ధర్మార్థ కామమోక్షముల గుఱిచి**
**యొలయు తెరువెద్దియును నిందుఁ గలుగునదియ**
**యొండెడలఁ గల్గు ; దీన లేకుండు చొప్పు**
**దక్కొకంటను లేదు వేదజ్ఞులార !"**

తిరుపతి,

**కార్యనిర్వహణాధికారి,**
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు : పుట్టు పూర్వోత్తరాలు

శ్రీవేంకటేశ్వరస్వామి వారి దివ్యానుగ్రహంతో తిరమల తిరుపతి దేవస్థానం ఆదినుండీ ఆర్షధర్మప్రబోధం నిమిత్తం అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తూవుంది. అలాంటి కార్యక్రమాల్లో ధార్మిక సాంస్కృతిక గ్రంథాల ప్రచురణ అత్యంత ప్రధానమైంది. ఆర్షధర్మానికి, భారతీయసంస్కృతికి, మూలాధారాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలైనవాటిని, తత్సంబంధి రచనలను పలుభాషల్లో, పలురీతుల్లో అసంఖ్యాకంగా ప్రచురిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షసంస్కృతి సముద్ధరణలో తమవంతు కృషిని విజయవంతంగా కొనసాగించటం జరుగుతూ వుంది.

**పూర్వరంగం:**

ఇటీవల 1982 మార్చినెలలో మహాకవి పోతనపంచశతాబ్ది జయంతి ఉత్సవాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధిపత్యంలో ఏకశిలా (వరంగల్లు) నగరంలో వైభవోపేతంగా జరుపబడినాయి. ప్రభుత్వసూచన ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ఉత్సవాల్లో సముత్సాహంతో పాల్గొన్నది. వరంగల్లు పట్టణంలో ప్రతిష్ఠించే నిమిత్తంగా పోతన విగ్రహాన్ని నిర్మించడం, పోతన భాగవతం ప్రథమ స్కంధాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించటం, 'శ్రీనివాస బాలభారతి' పక్షాన "పోతన" పుస్తకాన్ని ప్రకటించడం, పోతన కవితామహత్త్వాన్ని చాటే స్మారక సంచికను ముద్రించటం - ఇత్యాదికార్యక్రమాలను నిర్వహించడంద్వారా దేవస్థానం ఆ ఉత్సవాల వైభవానికి ఎంతగానో తోడ్పడింది! పోతనపంచశతాబ్ది జయంత్యుత్సవాలు ఆంధ్రభాగవత ప్రచురణకు దోహదకారులైనట్లే, అటు తర్వాత 1983లో జరిగిన నన్నయ సహస్రాబ్ది జయంత్యుత్సవాలు "వ్యాఖ్యానసహిత ఆంధ్రమహాభారత" గ్రంథప్రచురణకు అంకురార్పణ గావించాయి.

**నన్నయ భారత ప్రాజెక్టు :**

ఆంధ్రమహాభారతం ఆంధ్రజాతి వెయ్యేండ్ల తపఃఫలం! ఇది తెలుగులో ఆదికావ్యం. ఈ కావ్యరచయిత నన్నయభట్టారకుడు. క్రీ.శ.1053 ప్రాంతంలో - అనగా దాదాపు వెయ్యివత్సరాల క్రిందట, గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరంలో, చాళుక్యరాజగు - రాజరాజనరేంద్రుని కోరికననుసరించి, ఆ మహాకవి ఈ ఉత్తమ కావ్యరచనకు శ్రీకారం చుట్టినాడు. ఆంధ్రసాహిత్య చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయసన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 -' 83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం" గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్ర వార్షిక జయంతి - ఉత్సవాలు ఆంధ్రావనిలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి.

ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అంతకు మునుపటి పోతన జయంత్యుత్సవాల్లో తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించిన విశిష్టపాత్రను ప్రశంసాత్మకంగా ప్రస్తావిస్తూ, అదే విధంగా నన్నయ జయంత్యుత్సవాల్లో పాల్గొని చరితార్థం చేయవలసిందిగా కోరుతూ, దేవస్థానంవారికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. ఆ సూచనల ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించే నిమిత్తం నన్నయ విగ్రహాన్ని నిర్మించింది; 'భారతావతరణము' (రూపకం) 'నన్నయ భట్టారకుడు' (వచనం) - అనే పుస్తకాలను, 'నన్నయ వ్యాస పీఠము' - అనే ప్రశస్త సంచికను ప్రచురించింది.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సూచించిన సూచనలలో అత్యంత ప్రధానమైనది నన్నయభారతానికి (తొలి మూడు పర్వాలకు) వ్యాఖ్య వ్రాయించి ప్రకటించటం. ఈ బృహత్తరవ్యాఖ్యా

గ్రంథప్రచురణ బాధ్యతను దేవస్థానంవారు ఇటీవల పదవీవిరమణ చేసిన అప్పటి పౌరసంబంధాధికారి డా॥ రావుల సూర్యనారాయణమూర్తికి అప్పగించారు. అనంతరం నన్నయ భారత వ్యాఖ్యా రచనా ప్రణాళికను రూపొందించటానికి ప్రసిద్ధ విద్వన్మణులతో ఈ క్రింది సంపాదకమండలి ఏర్పాటయింది.

**కళాప్రపూర్ణ డా॥ దివాకర్లవేంకటావధాని**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి (సమావేశకర్త)**

ఈ సంపాదకమండలి 1983 జులై11 తేదీన హైదరాబాదు బాలాజి భవనంలో తొలిసారిగా సమావేశమై, నన్నయభారత వ్యాఖ్యారచనకు ఆవశ్యకమైన మార్గదర్శక సూత్రాలను రూపొందించింది.

**ఆ సూత్రాల సారాంశం :**

"ఇది మహాభారతము. ఆంధ్రవాఙ్మయములో పరమప్రామాణికమైన ఆది గ్రంథము. ఆరణ్య పర్వములో శేషభాగము ఎఱ్ఱన వ్రాసినను, నన్నయ పేరుమీదనే వ్రాసియున్నాడు గనుక, ఆ పర్వము పూర్తిగ ప్రచురించవలెనని నిర్ణయము గైకొనబడినది. టీకా తాత్పర్యసహితముగా ప్రచురించుటలో గల ఉద్దేశము సామాన్యులకు గూడ అర్థమగుట. కనుక, వ్యావహారికభాషకు సన్నిహితమైన సరళగ్రాంథికములో వ్రాయవలెనని నిర్ణయము జరిగినది. పదాలు ప్రయోగించుటలో సామాన్యులకు అర్థమగునట్లు, భారతముయొక్క ప్రామాణికత చెడకుండ - భాషను సాధ్యమైనంతమేరకు సులభముగా నుండునట్లు వ్రాయవలెను. అరసున్నలు, శకటరేఫములు పాటింప నక్కరలేదు. విసంధులు అంగీకరింపబడినవి. సరళాదేశము అనవసరము. మూలములో ఉన్న కఠినపదములు పరిహరించి, సుబోధములైన పదాలు వాడవలెను.

మూలపదాలు యథాతథముగ వ్రాయవలెను. అర సున్నతోగాని, సున్నతోగాని పదము ముగియునపుడు దానిని ద్రుతాంతముగా వ్రాయవలెను. సరళాదేశము వచ్చినపుడు పరుషములే గ్రహించవలెను. మొదట మూలపద్యము, దానిక్రింద ప్రతిపదార్థము, తరువాత తాత్పర్యము, పిమ్మట- ఉన్నచో విశేషాలు, అతిముఖ్యములైన వ్యాకరణవిశేషాలు, అలంకార విశేషాలు పొందుపరచవలెను. వచనమునకుగూడ పద్యాలకు వ్రాసినట్లే అర్థతాత్పర్యాలు వ్రాయదగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధితప్రతిని ఆధారముగా స్వీకరింపవలెను. అందలి శీర్షికలను యథాతథముగా ఉంచవలెను. సంస్కృతమూలములోని అధ్యాయ సంఖ్యగూడ వేయవలెను. మూలవిభిన్నత పీఠికలో సూచించవచ్చు; లేదా విశేషాంశములలో చేర్చవచ్చు. పాఠాంతరాలలో - సంశోధితప్రతిలో ఉన్నదానికంటె ఇతర పాఠము మేల్తరముగా తోచినచో రచయిత దానినికూడ స్వీకరించి అర్థము వ్రాయవలెను. దానిని విశేషములలో చేర్చునది.

రచన కొనసాగిన పిమ్మట రెండుమూడు నెలలకు ఒకసారి రచయితల సమావేశాలు ఏర్పాటుచేసి అన్యోన్య సమీక్షలు జరుపవలెను. ఇది రచనలో సామరస్యము ఏర్పడుటకు సదవకాశము కలిగించును. (మూడుపర్వముల) రచనలో ఏకరూపత కలుగునట్లు చూచుటకు ఒక ప్రధాన సంపాదకుడు కావలసి యున్నది. ఈ బాధ్యత ఆచార్య దివాకర్లవేంకటావధానిగారికి అప్పగించుటకు ఏకగ్రీవముగా తీర్మానింపబడినది. ప్రధాన సంపాదకుడు వ్రాతప్రతిని సాధ్యమగునంత త్వరలో అచ్చుకు (Finalise) సంసిద్ధముచేయగానే, ఒక సమష్టి సమీక్షా సమావేశము ఏర్పాటుచేసి,

అనంతరము వ్రాతప్రతిని ముద్రణకు ఇయ్యవలెను. ప్రతి సంపుటికి పీఠిక, విషయసూచిక, చివర పద్యానుక్రమణిక ఉండవలెను."

పై ఆదేశిక సూత్రాల ననుసరించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఆదిపర్వానికి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య సభాపర్వానికి, డా॥ నండూరి రామకృష్ణమాచార్య ఆరణ్యపర్వానికి- వ్యాఖ్యలను రచించే కార్యక్రమం చేపట్టారు. ఇలా వ్యాఖ్యను సమకూర్చే పని ఒకవైపు కొనసాగుతూ ఉండగా, దేవస్థానం ఇంచుమించు ఆరేసి మాసాల కొక పర్యాయం, అంతదనుక జరిగిన కృషినిగూర్చి సమీక్షించేందుకు, పై ముప్పురు రచయితలతో కూడిన సంపాదకవర్గ సమావేశాలను నిర్వహిస్తూ వచ్చింది.

ప్రధాన సంపాదకుడు ఆచార్య దివాకర్లవేంకటావధానిగారు తక్కిన ఇరువురి రచనలను పునఃపరిశీలన చేస్తూ, తుదిమెఱుగులు దిద్ది వ్రాతప్రతులను అచ్చుకు సిద్ధంచేస్తున్న దశలో - 1986 అక్టోబరులో పరమపదించారు. ఈ ఆకస్మికసంఘటనవల్ల "వ్యాఖ్యాసహిత నన్నయభారత ప్రచురణ" కార్యక్రమ పురోగతికి విఘాతం ఏర్పడింది.! ప్రణాళిక ఈ ఆటంకాన్ని అధిక్రమించటానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు తగినపెద్దలతో విస్తృతంగా సమాలోచించారు. తదుపరి, కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు కీ.శే. దివాకర్లవారి స్థానంలో ముఖ్య సంపాదకులుగా 1987 మే నెలలో నియుక్తులయ్యారు.

అప్పటినుండి, మళ్ళీ వ్యాఖ్యారచయితల పరస్పరసమీక్షా సమావేశాలు యథారీతిగా నిర్వహింపబడుతూ వచ్చాయి. వీటితోపాటు, ప్రధాన సంపాదకుడు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు మూడుపర్వాల వ్రాతప్రతులను క్రమంగాపర్యవేక్షిస్తూ, వాటిని ముద్రించవలసినదిగా తీర్మానించారు.

ఆ యా పర్వాల ముద్రణకార్యం ఒకప్రక్క జరుగుతూవుంటే, మరోవైపున ఆ యా సంపుటాల సంపాదకులు పీఠిక, ఉపోద్ఘాతము - మున్నగు అంశాలను సమకూర్చాలని ఒకానొకసమావేశంలో నిర్ణయింపబడింది. అవసరాన్నిబట్టి పీఠికలకు తుదిరూపం ఇవ్వటానికి సంపాదకవర్గం మరొకసారి సమావేశం కావడానికి కూడ అందులోనే నిశ్చయింపబడింది. అయితే, ఈ నిర్ణయాలు చోటుచేసికొన్న సమావేశమే నన్నయ భారత ప్రణాళికకు సంబంధించిన సమావేశాల్లో చిట్టచివరిదయింది! ఈ సమావేశం రాజమహేంద్రవరంలో శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి గృహంలో 1991 జులై3వ తేదిన జరిగింది. అనంతరం ఈ గ్రంథాన్ని ముద్రించే ప్రయత్నాలు కొనసాగాయి.

### తిక్కన భారత సంయోజన :

ఇటువంటి పరిస్థితుల్లో, తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకుల కార్యాలయమందలి ప్రచురణల విభాగంలో 'పబ్లికేషన్సు ఎడిటర్'గా పనిచేస్తూ వుండిన విద్వాన్ డి. నాగసిద్ధారెడ్డి గారు (రిటైర్డు ప్రిన్సిపాల్, యస్.వి.ఓరియంటల్‌కళాశాల, తిరుపతి) తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగారికి "తిక్కన భారత వ్యాఖ్యారచనాప్రణాళిక"ను గూర్చి 1992 ఆగష్టు ఆరంభంలో ఒక నివేదికను సమర్పించారు.

### ఆ నివేదిక సారాంశం :

"తిరుమల తిరుపతి దేవస్థానంవారు నన్నయ భారతం మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచేత వ్యాఖ్య వ్రాయించిన విధంగానే, తిక్కన భారతం పదునైదు పర్వాలకు రాష్ట్రంలోని ప్రముఖపండితులచేత వ్యాఖ్య వ్రాయించి ప్రచురించటం సముచితంగానూ, సమగ్రంగానూ ఉంటుంది. తాము అనుమతిస్తే ఈ ప్రణాళికకు నేను సమన్వయ సంపాదకుడనుగా, సమావేశకర్తగా (కో ఆర్డినేటింగ్ ఎడిటర్ అండ్ కన్వీనర్) బాధ్యతవహించి నిర్వర్తించగలను".

తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన సమావేశమైన గ్రంథనిపుణుల సంఘం (Experts Committee) పై ప్రతిపాదనను ఆమోదించింది. తదనుసారంగా తిక్కన భారతవ్యాఖ్యా రచనా ప్రణాళికకు సంబంధించిన తొలిసమావేశం తిరుమల తిరుపతి దేవస్థాన పరిపాలనా భవనం (తిరుపతి)లో కార్యనిర్వహణాధికారిగారి ఆధ్వర్యవంలో 1992 నవంబరు 5వ తేదిన జరిగింది. ఈ ప్రణాళికా నిర్వహణకు తొలుత ఒక సలహాసంఘం ఏర్పాటయింది. అనంతరం ఈ సలహాసంఘం 1) సంపాదకవర్గం 2) సలహాసంఘం- అని ఈ క్రింది రెండు సంఘాలుగా విభజింపబడింది.

**సంపాదక వర్గం**

| | |
|---|---|
| **శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు** | **ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య** |
| **ప్రొ॥కె. సర్వోత్తమరావు** | **శ్రీడి. నాగసిద్ధారెడ్డి (కన్వీనర్)** |

**సలహాసంఘం**

| | |
|---|---|
| **ఆచార్య తూమాటి దొణప్ప** | **ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం** |
| **ఆచార్య బిరుదురాజు రామరాజు** | **ఆచార్య మడుపు కులశేఖరరావు** |
| **ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు** | **డా॥రావుల సూర్యనారాయణమూర్తి** |
| **ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి** | **శ్రీ కాట్రపాటి సుబ్బారావు** |
| **ఆచార్య నండూరి రామకృష్ణమాచార్య** | **శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రి** |

పై సమావేశంలో చర్చింపబడిన అంశాల్లో అత్యంతప్రధానమైనది వ్యాఖ్యాన విధానానికి సంబంధించినది. సభ్యులందరి సలహాలు, సూచనలమేరకు - వ్యాఖ్యానరచనకు మార్గదర్శకాలైన - కొన్ని ముఖ్య నియమాలు క్రోడీకరింపబడ్డాయి.

**ఆ నియమాల సారాంశం :**

“రచనావిషయంలో ప్రధానంగా సామాన్య ప్రజానీకాన్ని దృష్టియందుంచుకొనవలెను. భాష వ్యావహారికంగానే ఉండాలి. మాండలికాలు ఉండరాదు. సాధ్యమైనంతవరకు విసంధుల్ని పాటించాలి. సంధి విడదీసిన తర్వాత పదస్వరూపం తెలిసేటట్లుగా పదాదిని అచ్చుల్ని వాడాలి. దుస్సంధులు తగదు. శకటరేఫలు, అరసున్నలు ఉండరాదు. కథాభాగాన్ని అతికేసమయంలో పూర్వాపర సందర్భాలను అనుసంధానంచేస్తూ అవసరమైనచోట స్థూలంగా ఐదారు పంక్తులు అవతారిక (పరిచయం) వ్రాయాలి. ప్రతిపద్యానికి అక్కరలేదు.

విశేషాంశాల్లో అలంకారాలు, వర్ణనలు కథా సందర్భానికి ఏవిధంగా అతికాయో చెప్తూ, పద్యంలో గుర్తించిన ముఖ్యమైన విశేషాంశాలు విస్తారంగా కాకుండా, సంగ్రహంగా చెప్పాలి. (రచయితలు వ్రాయని విశేషాంశాదులను 'సంపాదకులు' 'ఎడిటోరియల్ నోటు' వ్రాసి నమోదుచేయవలసినది.) అవసరమైన చోట్లు రచనలో మార్పులు, చేర్పులు చేయడానికీ, సంతృప్తికరం కాకపోతే తిరస్కరించి మరొకర్ని ఎంపిక చేసుకొనడానికీ సంపాదకవర్గానికి అధికారం ఉంది.

(రచయితలు) ఉస్మానియా యూనివర్సిటీవారి భారతప్రతిని రచనకు ప్రమాణంగా స్వీకరించాలి. ఇతర ప్రతులలో సొబగైన పాఠములున్నచో వాటిని రచనలో ఉటంకించవచ్చు.''

పై సూచనల ప్రకారం, తిక్కన భారతం పదునైదు పర్వాల్లోని 46 ఆశ్వాసాలకు సరళవ్యాఖ్య సమకూర్చటానికి మొత్తం ముప్పదిముగ్గురు పండితులు ఎంపిక చేయబడ్డారు. వీరిలో చాలమంది తమవంతు వ్యాఖ్యారచనను సకాలంలో పూర్తిచేసి దేవస్థానానికి సమర్పించారు. 'తిక్కనభారత ప్రణాళిక' యొక్క చివరి సమావేశం 1994 జులై 15వ తేదిన కార్యనిర్వహణాధికారిగారి అధ్యక్షతన తిరుమల తిరుపతి దేవస్థానపరిపాలనాభవనం (తిరుపతి)లో జరిగింది.

1995 జూన్‌లో శ్రీడి. నాగసిద్ధారెడ్డి పదవినుండి విరమించేనాటికి, తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలకు వ్యాఖ్య - ఆ యా రచయితలు వ్రాసి పంపనందున - దేవస్థానానికి అందలేదు. అలా, వ్యాఖ్యానింపబడక శేషించి ఉన్న తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలను స్థానికులగు మరికొందరు విద్వాంసులచేత వ్రాయించి, ఈ వ్యాఖ్యాన క్రతువును సమాప్తి నొందించడం జరిగింది. ఈ విధంగా తొలుత 'నన్నయభారత ప్రణాళిక'గా ఆరంభమైన ఈ వ్యాఖ్యారచన, తరువాత తిక్కన భారతంలోకి విస్తరించి, సమగ్రతను సంతరించుకొని, చివరకు "కవిత్రయ మహాభారత ప్రణాళికగా" సార్థకమయింది.

**కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు :**

మొదటి మూడు పర్వాలు సరళగ్రాంథికంలోను, తక్కిన భాగమంతా భిన్న భిన్నశైలుల వ్యావహారికంలోనూ రచింపబడిన ఈ మొత్తం పదునెనిమిది పర్వాల వ్యాఖ్యాన స్వరూపానికి ప్రామాణికమైన ఏకరూపతను, నవ్యతను సముచితంగా సంతరింపజేయగల సంపాదకుణ్ణి సూచించవలసిందని తిరుమల తిరుపతి దేవస్థానం, స్థానికులైన నిపుణులను కోరింది.

అనుభవజ్ఞులగు నిపుణుల అభిప్రాయానుసారం దేవస్థానం - సుగృహీతనామధేయులైన సాహితీవేత్తలు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని "కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు"కు సంపాదకత్వం నిర్వహింపవలసిందిగా 1996 అక్టోబరులో ఆహ్వానించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆహ్వానాన్ని శ్రీస్వామివారి ఆదేశంగా స్వీకరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తిరుపతికి వచ్చి 'ఎడిటరు' కార్యాలయంలో ని ప్రచురణల విభాగం (Publications Wing)లో భద్రపరుపబడియున్న భారతం వ్రాతప్రతిని విశదంగా పరిశీలించి, ఇచ్చటి ఉద్యోగుల సహకారంతో వారు ఈ బృహద్ గ్రంథ పరిష్కరణకు అవలంబించవలసిన కొన్ని ముఖ్యపద్ధతులను, విధానాలను ప్రతిపాదించారు.

**ఆ ప్రతిపాదనల సారాంశం :**

"మహాభారత కథార్థాలు సామాన్యజనానికి అందుబాటులో ఉండేటట్లు చేయటానికీ, మహాభారతంలోని ధర్మసందేశం అందరికీ అవగాహనకావడానికీ ఈ వ్యాఖ్యానం లక్షింపబడింది కాబట్టి, వ్యాఖ్యానమంతా ప్రామాణిక వ్యావహారిక భాషలో ఒకేరీతిగా ఉండేటట్లు చూడాలి. అవసరమైన చోట్ల వ్యాఖ్యాతలు వ్రాసిన వివిధశైలులను ప్రామాణిక

వ్యావహారిక శైలిలోనికి మార్చి, ఒకే గ్రంథకర్త రచించిన రచనను చదువుతున్న స్ఫూర్తిని పఠితలకు కల్పింపచేయాలని నిర్ణయించడమైనది. భాషాశైలులు మార్చవలసి వచ్చినపుడు ఇపుడున్న 'ఒరిజినల్' వ్రాతప్రతిని చెడగొట్టకుండా 'ప్రెస్‌కాపీ'ని లేఖకులచే వ్యావహారిక భాషలో మరల వ్రాయించవలసివుంటుంది.

వ్యాఖ్యానరచనకు ఒకస్థూలమైన ప్రణాళికను ఇదివరలో రూపొందించి వ్యాఖ్యాతలకు తెలియపరచటమయింది. కాని, అందరూ ఆ అంశాలను తు.చ. తప్పకుండా పాటించినట్లు కనబడదు. అందువలన వ్యాఖ్యానరచనలో ఏకరూపత (Uniformity) ఒక్కొక్కచోట లోపించినట్లు కనబడుతోంది. కాబట్టి, వ్యాఖ్యానం అవసరానికి మించి ఉన్నచోట్ల తగ్గించటానికీ, అవసరం ఉన్నచోట్లకొన్ని అంశాలను చేర్చటానికీ సంపాదకునికి స్వేచ్ఛ ఇవ్వాలని నిర్ణయించడమైనది.

వ్యాఖ్యానం వ్రాయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఆంధ్రమహాభారత సంశోధితప్రతిని ఆధారం చేసికోవాలని ఇదివరలోనే నిర్ణయించడమైనది. ఆ నిర్ణయాన్ని వ్యాఖ్యానరచయితలకు తెలుపడం కూడా జరిగింది. కాని, కొందరు రచయితలు నిర్దేశించిన ప్రతిని కాకుండా, వేరే ప్రతులను ప్రామాణికంగా తీసికొని వ్యాఖ్యానం వ్రాశారు. అటువంటి ఘట్టాలలో దేవస్థానంవారు ఎన్నుకొన్న ప్రతిని దృష్టిలో ఉంచుకొని వ్రాతప్రతులను తగినవిధంగా మార్చవలెనని నిర్ణయించటం జరిగింది.

మహాభారత వ్యాఖ్యానాన్ని 1/4 'డెమ్మీసైజు'లో పండ్రెండు సంపుటాల్లో ప్రచురించాలని నిర్ణయించడమైనది. పుస్తకం 'సైజు'ను నిర్ణయించడంలో పాఠకుణ్ణి, విషయాన్ని, ప్రచురణకర్త సౌకర్యాన్ని సాధారణంగా దృష్టిలో ఉంచుకొంటారు. పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొంటే, అతడు భారతంలో ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సంపుటంగా భద్రపరచుకోవాలని భావిస్తుంటాడు. అందువల్ల, 'వాల్యూమ్'కు పర్వాన్ని ప్రమాణంగా తీసికోవటం సౌకర్యంగా ఉంటుంది. విషయాన్ని బట్టిచూచినా పర్వవిభాగమే అందరికీ సౌకర్యం. ప్రచురించేసంపుటికి 'క్లాసిక్' (Classic) గౌరవం ఆకృతిలో కల్పించాలన్నా 1/4 'డెమ్మీసైజు' బాగుంటుందని తీర్మానించటమైనది. అయితే ఆదిపర్వం, ఆరణ్యపర్వం, శాంతిపర్వంలాంటి పెద్దపర్వాలు, మహాప్రస్థానిక పర్వంలాంటి చిన్నపర్వాలు ప్రచురిస్తున్నప్పుడు 'వాల్యూమ్' విభాగంలో కొంత వెసులుబాటు కల్పించుకోవచ్చు.

ఒక్కొక్క సంపుటానికి మొదట తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారి ముందుమాట, 'ఎడిటరు' గారి ఉపోద్ఘాతం తప్పకుండా ఉండాలి, విషయసూచిక తయారుచేయాలి. ప్రతి పర్వం చివర అకారాది పద్యానుక్రమణిక తప్పనిసరిగా ఉండాలి''.

పై పద్ధతుల ననుసరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పరిష్కరించి ఇస్తున్న భారత సంపుటాలను తిరుమల తిరుపతి దేవస్థానం వరుసగా ప్రచురింప బూనుకొన్నది. ఈ సంపుటుల ప్రచురణకార్యం త్వరితగతిన పూర్తి చేయించాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం 1999 నవంబరు 3,4 తేదీల్లో శ్రీ పద్మావతి అతిథి గృహంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్. గారి అధ్యక్షతన కీలకమైన సమావేశాన్ని నిర్వహించింది. ఈ సమావేశంలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తయారు చేయించిన ఆదిపర్వ, సభాపర్వాల డి.టి.పి. 'మాష్టరు కాపీ'లను సభ్యులు సమీక్షించారు. తదనంతర పర్వాల ప్రకటన ఇతోధికమగు వేగం అందుకోవటానికి వీలుగా ఈ సమావేశంలో కవిత్రయ భారతానికి సంబంధించిన సంపాదక మండలి (Editorial Board), సలహామండలి (Advisory Board) - అనే రెండు సంఘాలను ఈ దిగువ పేర్కొన్న విధంగా పునర్వ్యవస్థీకరించటం జరిగింది.

## సంపాదకమండలి సభ్యులు



## సలహామండలి సభ్యులు



తరువాత 2000 సంవత్సరం ఫిబ్రవరి 25వ తేదీన తిరుమలలో కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన 'క్యాంప్ ఆఫీస్'లో పై రెండు మండలులలోని సభ్యులయొక్క సంయుక్త సమావేశం నిర్వహింపబడింది. ఈ సమావేశంలో 2000 సంవత్సరాంతానికి కవిత్రయ భారత సంపుటా లన్నింటినీ వెలువరించాలనే ముఖ్యతీర్మానం కావింపబడింది. ఇందులకు అనువుగా ఆ యా పర్వాల వ్యాఖ్యాతలతో కూడిన ఒకటి, రెండు 'వర్క్‌షాప్'లను కూడ నిర్వహించడానికి నిర్ణయం గైకొనబడింది.

కవిత్రయ భారతాన్ని వ్యాఖ్యతో ముద్రించటంద్వారా తిరుమల తిరుపతి దేవస్థానంవారు 'పంచమవేద' మందలి ధర్మప్రబోధాన్ని యావదాంధ్రులకు అందించే ఉదాత్తపాత్రను నిర్వహిస్తున్నారు. ఆ క్రమంలో ఇప్పుడు ప్రథమ సంపుటం - ఆదిపర్వం (రెండు భాగాలు), ద్వితీయ సంపుటం - సభాపర్వం వెలువడినాయి. ఇప్పటి కార్యనిర్వహణాధికారి అయిన డా॥ పి. కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్. గారు వచ్చిన తత్క్షణమే ఆంధ్రమహాభారత ప్రచురణను గూర్చి ఆసక్తితో గమనిస్తూ అన్నివిధాల సహకరించి ఆది సభా పర్వాల విడుదలకు ఏర్పాటు చేయడమే కాకుండ తరువాతి సంపుటాలు వెలుగుచూడడానికి ఒక కాల నిర్ణయంతో పని జరగాలని త్వరపరిచినారు. 2002 సంవత్సరానికి ఈ బృహత్ ప్రణాళిక వ్యాఖ్యాసహిత మహాభారతం తుదిమెరుగులు దిద్దుకోవాలని వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో పండిత మండలిని పురమాయించినారు. తరువాతి సంపుటాలు సైతం త్వరలోనే వెలుగుచూడనున్నాయి. అక్షరాస్యులైన ఆంధ్రులు భారతాన్ని స్వయంగా చదివి అర్థం చేసికోవటానికి ఈ సరళవ్యాఖ్య 'కరదీపిక' కావాలని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆశయం. తిరుమల తిరుపతి దేవస్థానం తొలుదొలుత ప్రచురిస్తూవున్న ఈ 'వ్యాఖ్యానసహిత కవిత్రయ భారతం' ముద్రణలో ఏవైనా నూత్నాంశాలు చేర్చవలసివున్నట్లు అభిప్రాయపడితే సహృదయసాహితీవేత్తలు వాటిని మాకు తెలియజేయగలరని మనవి.

**కృతజ్ఞతలు :**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావటానికి ఆధికారికమైన తమ ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులకు, పాలకమండలి సభ్యులెల్లరకు కృతజ్ఞతాభివాదములు. ఈ మహాగ్రంథం వెలుగు చూడటంలో ముఖ్యకారకులైన సహృదయులు డా॥ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారికి అనేక ధన్యవాదాలు. తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి డా॥ పి.కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్. గారి ప్రోత్సాహక పర్యవేక్షణకు కైమోడ్పులు. సాహిత్య ప్రీతి కలవారైన తి.తి.దేవస్థానం సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ కె.నారాయణ, ఐ.ఏ.ఎస్. గారికి వందనములు.

సంబంధిత విభాగాధిపతిగా నూతనముగా వచ్చి సలహామండలి ఎక్స్ అఫిషియో సభ్యులైన డా॥ పి. రంగారావు, పౌరసంబంధాధికారి, తి.తి.దేవస్థానం, తిరుపతి వారికి మరియు ఈ ప్రాజెక్టుకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహాయసహకారాలందించిన తదితర అధికార గణానికి నమస్సులు. ఈ ప్రణాళిక ద్వారా "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారతము"ను ఆంధ్రావళికి అందజేయటంలో ప్రధాన పాత్ర వహించిన - వ్యాఖ్యాతలు, పై ఉభయ మండలుల (సంపాదక మండలి, సలహా మండలి) యందలి విద్యావేత్తలు ప్రధాన సంపాదకుడు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు - ఈ విద్వాంసులందరికి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. తి.తి. దేవస్థానముల సవ్యాఖ్యాన మహాభారతాన్ని ప్రకటించడం వేగాన్ని పుంజుకోవడానికై తీర్మానించినప్పుడు ఎడిటోరియల్ కమిటీ వారు దాని కొరకై ప్రధాన సంపాదకునికి సహాయంగా స్థానిక పండితవర్యుల ఒక ఉపసంఘం (ఎడిటోరియల్ సెల్) నిర్మాణానికి సిఫారసు చేయగా, దేవస్థానం ఆమేరకు ఎడిటోరియల్ కమిటీలో ఉన్న **డా॥ కె.సర్వోత్తమరావు, డా॥ కె.జె.కృష్ణమూర్తి గారలతో స్థానికులైన విద్వాంసులు, పండితవరేణ్యులు శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, మహాకవి శ్రీ ముదివర్తి కొండమాచార్యులు** గారలతో ఎడిటోరియల్ సెల్‌ను ఏర్పరచడం జరిగింది. ఈ మేరకు ఆరణ్యపర్వంలోని ద్వితీయభాగంతో ఆరంభమైన ఈ సెల్ ఉపకారం మరువరానిది. వీరు వర్క్‌షాపువలె శ్రీ వేంకటేశ్వర లైబ్రరీ మరియు పరిశోధన కేంద్రంలో నిర్వహించబడ్డ కవిత్రయ మహాభారత యజ్ఞంలో పాలుపంచుకొన్నారు. అందువలననే అతి త్వరితకాలంలో ఆరణ్యపర్వ శేషభాగం ముద్రణ ఔతూ ఉండగా విరాటపర్వం కూడ ప్రెస్సుకు పంపగల్గుతున్నాము. తక్కిన పర్వసంపుటాలను ఇలాగే అందించగలమని ఆశిస్తున్నాము.

"సప్తగిరి" సంపాదకులుగా ఉండి, ఈ ప్రణాళిక కొనసాగటంలో ఆదినుండి ప్రముఖ పాత్ర వహించిన కీ.శే. కాట్రపాటి సుబ్బారావుగారికి హార్దిక కృతజ్ఞతలు. "సప్తగిరి" సంపాదక కార్యాలయ ప్రచురణల విభాగంలో 'సబ్-ఎడిటరు'గా ఉద్యోగిస్తూ 1995లో పదవినుండి విరమించేదాకా ఈ ప్రణాళిక విషయమై మిగుల సహకరించిన విద్వత్కవివర్యులు శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు గారికి, ఆచార్య కె.జె.కృష్ణమూర్తి (కంట్రోలర్ ఆఫ్ పబ్లికేషన్సు) గారికి అనేక కృతజ్ఞతలు. ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ, అన్నివిధాలా సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగమందలి సహోద్యోగులు రీసెర్చ్ అసిస్టెంటు శ్రీ కోరాడ రామకృష్ణ, తెలుగు సబ్-ఎడిటర్లు డాక్టర్ కె.రాధారమణ, డాక్టర్ ఎ.సంధ్య, సప్తగిరి పత్రిక కన్నడ సబ్-ఎడిటర్ శ్రీ బి.ఎన్. శ్రీనివాసన్ గారికి, తదితర సిబ్బందికి, టి.టి.డి. ముద్రణాలయ అధికారి శ్రీ ఐ.పార్వతీశ్వర రావు గారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

శ్రీవేంకటేశ్వరస్వామివారి అనుగ్రహవిశేషంవల్ల ఈ మహోత్తమగ్రంథం వెలుగు చూస్తున్నందుకు, ఆ వేదత్రయ స్వరూపునకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాము.

**డా॥ఎస్.ఎస్. రామమూర్తి**

కన్వీనర్

సంపాదకుడు - సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

### కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపాదకమండలి

**అధ్యక్షులు**

**శ్రీ అజేయ కల్లం, ఐ.ఏ.ఎస్.,**
**కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి.**

**ప్రధాన సంపాదకుడు: ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం**

**సంపాదకమండలి సభ్యులు**

ఆచార్య నందూరి రామకృష్ణమాచార్యులు
ఆచార్య ఎస్.బి. రఘునాథాచార్య
ఆచార్య కె.జె. కృష్ణమూర్తి
శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు
డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య
ఆచార్య కె. సర్వోత్తమరావు

**సలహామండలి సభ్యులు**

ఆచార్య బిరుదురాజు రామరాజు
ఆచార్య ఎం. బుద్ధన్న
ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు
ఆచార్య ఎం. కులశేఖరరావు

**ఎక్స్ అఫిషియో సభ్యులు**

డా॥ పి. రంగారావు
పౌరసంబంధాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

డా॥ మేడసాని మోహన్, డైరెక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్, తి.తి.దే.

ఆచార్య హెచ్.ఎస్.బ్రహ్మానంద, కార్యదర్శి
ధర్మప్రచార పరిషత్తు, తి.తి.దే.

**కన్వీనర్**

డా॥ ఎన్.ఎస్. రామమూర్తి.
“సప్తగిరి” సంపాదకులు, తి.తి.దేవస్థానములు, తిరుపతి.

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

| వ్యాఖ్యాతలు | పర్వాలు, ఆశ్వాసాలు |
|---|---|
| 1. డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | ఆది. ఆశ్వా. 1,2,3 |
| 2. డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం | ఆది. ఆశ్వా. 4; శాంతి. ఆశ్వా.1 |
| 3. డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆది. ఆశ్వా. 5,6,7,8; సభా. ఆశ్వా 1,2 |
| 4. డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు | ఆరణ్య. ఆశ్వా. 1 నుండి 7 వరకు; భీష్మ ఆశ్వా. 1,2 |
| 5. డాక్టర్ కె. సర్వోత్తమరావు | విరాట. ఆశ్వా 1 |
| 6. డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు | విరాట. ఆశ్వా. 2 |
| 7. శ్రీ సింగరాజు సచ్చిదానందం | విరాట. ఆశ్వా. 3; ద్రోణ. ఆశ్వా. 3,4; శల్య. ఆశ్వా.2 |
| 8. డాక్టర్ మేడవరం వేంకటనారాయణశర్మ | విరాట. ఆశ్వా.4 |
| 9. డాక్టర్ కె. రామగోపాలకృష్ణమూర్తి | విరాట. ఆశ్వా.5 |
| 10. డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు | ఉద్యోగ. ఆశ్వా. 1,2; సౌప్తిక. ఆశ్వా. 1,2 |
| 11. శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఉద్యోగ. ఆశ్వా. 3,4 |
| 12. శ్రీ కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి | భీష్మ. ఆశ్వా. 3 |
| 13. డాక్టర్ జి. హరిహరనాథ్ | ద్రోణ. ఆశ్వా. 1 |
| 14. డాక్టర్ మల్లెల గురవయ్య | ద్రోణ. ఆశ్వా. 2 |
| 15. డాక్టర్ కె. రాజన్న శాస్త్రి | ద్రోణ. ఆశ్వా. 5 |
| 16. శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య | కర్ణ. ఆశ్వా. 1 |
| 17. డాక్టర్ యస్వీ. రామారావు | కర్ణ. ఆశ్వా. 2 |
| 18. డాక్టర్ మరుపూరి కోదండరామరెడ్డి | కర్ణ. ఆశ్వా. 3 |
| 19. డాక్టర్ పి. వెంకటరాజు | శల్య. ఆశ్వా. 1 |
| 20. డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద | స్త్రీ. ఆశ్వా. 1,2; అశ్వ. ఆశ్వా 1,2; మౌసల-1; మహా.1; స్వర్గా-1 |
| 21. డాక్టర్ ఎస్. గంగప్ప | శాంతి. ఆశ్వా. 2 |
| 22. డాక్టర్ దావులూరి కృష్ణకుమారి | శాంతి. ఆశ్వా. 3 |
| 23. డాక్టర్ ఆకురాతి పున్నారావు | శాంతి. ఆశ్వా. 4 |
| 24. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | శాంతి. ఆశ్వా. 5 |
| 25. డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం | శాంతి. ఆశ్వా. 6 |
| 26. డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వరరావు | అను. ఆశ్వా. 1,2 |
| 27. డాక్టర్ శలాక రఘునాథశర్మ | అను. ఆశ్వా. 3,4 |
| 28. డాక్టర్ ఎమ్. కులశేఖరరావు, శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | అను. ఆశ్వా. 5 |
| 29. శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | అశ్వ. ఆశ్వా. 3,4 |
| 30. డాక్టర్ ఎ. నాగభూషణం | ఆశ్ర. ఆశ్వా. 1,2 |

# సంకేతాక్షర సూచి

| | | |
|---|---|---|
| ఆది. | – | ఆదిపర్వం |
| సభా. | – | సభాపర్వం |
| ఆర. | – | ఆరణ్యపర్వం |
| విరా. | – | విరాటపర్వం |
| ఉద్యో. | – | ఉద్యోగపర్వం |
| భీష్మ. | – | భీష్మపర్వం |
| ద్రోణ. | – | ద్రోణపర్వం |
| కర్ణ. | – | కర్ణపర్వం |
| శల్య. | – | శల్యపర్వం |
| సౌప్తి. | – | సౌప్తికపర్వం |
| స్త్రీ. | – | స్త్రీ పర్వం |
| శాంతి. | – | శాంతిపర్వం |
| ఆను. | – | ఆనుశాసనికపర్వం |
| అశ్వ. | – | అశ్వమేధపర్వం |
| ఆశ్ర. | – | ఆశ్రమవాసపర్వం |
| మౌస. | – | మౌసలపర్వం |
| మహా. | – | మహాప్రస్థానికపర్వం |
| స్వర్గా. | – | స్వర్గారోహణపర్వం |
| సం. | – | భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి |
| సం.మ.భా. | – | సంస్కృత మహాభారతము |
| అను. | – | పై ప్రతిలోని అనుబంధాలు |
| సంపా. | – | ప్రధాన సంపాదకుడు |
| క. | – | కందపద్యం |
| వ. | – | వచనం |
| ఆ. | – | ఆటవెలది |
| తే. | – | తేటగీతి |
| సీ. | – | సీసం |
| ఉ. | – | ఉత్పలమాల |
| చ. | – | చంపకమాల |
| మ. | – | మత్తేభ విక్రీడితం |
| శా. | – | శార్దూల విక్రీడితం |
| ఆశ్వా. | – | ఆశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| య. | – | యగణం |
| మ. | – | మగణం |
| త. | – | తగణం |
| ర. | – | రగణం |
| జ. | – | జగణం |
| భ. | – | భగణం |
| న. | – | నగణం |
| స. | – | సగణం |
| ల. | – | లఘువు |
| గ. | – | గురువు |
| అలం. | – | అలంకారం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |

# పీఠిక

ఉ. "ఆదరణీయ సార వివిధార్థగతి స్ఫురణంబు గల్గి య
ష్టాదశ పర్వ నిర్వహణ సంభృతమై పెనుపొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్". **(విరా. 1.6.)**

ఆంధ్ర మహాభారతం పదునెనిమిది పర్వాల నిర్వహణం కలిగిందై పెంపొంది ఉండగా అందులో నన్నయభట్టు మొదటి మూడు పర్వాలను దక్షతతో రచించాడని తిక్కన సోమయాజి పేర్కొన్నారు. భారతం ఆదరించదగిన, సారవంతమైన, నానారుచిరార్థస్ఫూర్తి కలిగిందట! నన్నయ వాడిన 'సారమతి', 'ప్రసన్న కథాకలి(వి)తార్థ యుక్తి', 'నానా రుచిరార్థ సూక్తి నిధిత్వం', అందరూ ఆదరించే 'అక్షరరమ్యత' అనే లక్షణాలన్నీ కలసివచ్చేటట్లు భారతానికి విశేషణం వాడటం తిక్కన్న తీర్పరితనం. పై పద్యంలో మూడుకృతులంటే మూడు పర్వాలు - ఆది, సభా, ఆరణ్య పర్వాలు. ఆ మూడు పర్వాలను దక్షతతో నిర్వహించిన నన్నయ వరుసగా కవిత్వవిశారదుడు, విద్యాదయితుడు, మహితాత్ముడు. ఆదిపర్వంలో నన్నయ కవితాకళ విశ్వరూపం ప్రదర్శించింది. సభాపర్వంలో నన్నయ తెలుగు కావ్య విద్యకు బ్రహ్మకల్పుడుగా రాణించాడు. ఆరణ్యపర్వంలో ఒక మహితాత్ముడుగా ప్రకాశించాడని తిక్కన ప్రౌఢంగా నిర్దేశించాడు. ఆ మాట నిజం. ఆరణ్యపర్వరచనం మహాకవి మాత్రమే కాక మహితాత్ముడైనవాడు మాత్రమే వ్రాయగలడని తిక్కన అభిప్రాయం.

**మూడు పర్వాల ముచ్చట :**

నన్నయ మొదటి మూడు పర్వాలు రచించాడన్న మాట తిక్కన ఔపచారికంగా చెప్పినమాట! నన్నయభట్టు రచన ఆరణ్యపర్వ చతుర్థాశ్వాసంలోని 142వ పద్యంతో ఆగిపోయిందని వ్రాత ప్రతులన్నీ సాక్ష్యం పలుకుతున్నాయి. నన్నయ ఆంధ్ర మహాభారత రచనను సుమారు క్రీ.శ.1054-55 నుండి నాలుగైదేళ్ళు సాగించి సహజంగా తనువును చాలించి ఉంటాడు. ఆ తరువాత రెండు వందలేండ్లకు తిక్కన విరాటపర్వం మొదలుకొని పదునేను పర్వాలు చేపట్టి, భారతం తుదముట్టించాడు. ఆ తరువాత ఎఱ్ఱాప్రెగ్గడ 14వ శతాబ్ది పూర్వార్ధంలో ఆరణ్యపర్వశేషాన్ని పూరించాడు. ఈ విధంగా మహాభారతం తెలుగులో పూర్తికావటానికి మూడు శతాబ్దాలకాలం పట్టింది. ముగ్గురు కవులు చేపట్టి నిర్వహించవలసి వచ్చింది.

అయితే, నన్నయ మొదటి మూడు పర్వాలు రచించాడని భావించేవారు చెప్పే ఉపపత్తులు కొన్ని ఉన్నాయి. నన్నయ తరువాత భారత రచనను చేపట్టిన తిక్కనే కాక, ఆయన శిష్యుడు మారనకూడ నన్నయ మూడుపర్వాలు రచించాడనే పేర్కొన్నాడు- తన మార్కండేయ పురాణావతారికలో

ఉ. "సారకథా సుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచు న్జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహిత న్మును ద్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టి వి
ద్యారమణీయు నాంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్." **(మార్కండేయపురాణము : పీఠిక.9.)**

అప్పకవికూడ నన్నయ మూడు పర్వాలు చెప్పాడని పేర్కొన్నాడు. ఆరణ్యపర్వంలో ఆశ్వాసాంత గద్యలన్నింటిలో నన్నయ రచించినట్లే ఉన్నది. ఆశ్వాసారంభాంత పద్యాలలో రాజరాజనరేంద్రుడికే వినిపిస్తున్నట్లున్నది. దీనినిబట్టి నన్నయ

ఆరణ్యపర్వమంతా రచించి ఉండవచ్చుననీ, ఎఱ్ఱన కాలంనాటికి ఆ పర్వంలో కొంతభాగం చెదలు తిని ఉండవచ్చుననీ, ఆ క్రిమిదష్టమైన భాగాలను ఎఱ్ఱాప్రెగ్గడ పూరించి ఉండవచ్చుననీ కొందరు పండితులు భావించారు. ఎఱ్ఱన నృసింహపురాణంలో తన తాత ప్రశంసించినట్లు ఈవిధంగా చెప్పుకొన్నాడు:

"ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబులఁ గావ్యకర్తవై
యెన్నిక మైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వ శే
షోన్నయ మాంధ్రభాష, సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తౌ
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్" **(నృసింహపురాణము - 1.17)**

ఈ పద్యంలో 'అరణ్య పర్వశేషోన్నయం ఎఱ్ఱాప్రెగ్గడ చేశా'డని చెప్పబడింది. అంటే ఆరణ్యపర్వంలో (శిథిలమై పోగా) శేషించిన దాన్ని ఉద్ధరించటం చేశాడని అర్థం చెప్పారు పర్వత్రయవాదం వారు. నన్నయ మూడు పర్వాలు వ్రాశాడు. కాని, కొంత శిథిలమై పోయింది. ఆ శిథిలమైన చోట్ల ఎఱ్ఱాప్రెగ్గడ పూరించి ఉంటాడని వారి వాద తాత్పర్యం. ఈ వాదాన్ని నన్నయ పక్షాన పర్వత్రయవాదమనీ, ఎఱ్ఱన పక్షాన శిథిలపూరణవాదమనీ పిలువవచ్చును.

ఈ వాదాన్ని చాలమంది అంగీకరించటం లేదు. ఎఱ్ఱన నృసింహపురాణంలోని 'అరణ్యపర్వశేషోన్నయ' మనే సమాసానికి నన్నయ వ్రాయగా మిగిలిన భాగాన్ని ప్రతిభతో భావించి కల్పించటమని వీరు వ్యాఖ్యానించారు. వీరు మొదట శిథిల పూరణ వాదాన్ని సమూలంగా ఖండించారు. ఎఱ్ఱన ఆరణ్యపర్వం చివరలో తాను ఆరణ్యపర్వశేషాన్ని పూరించినట్లే స్పష్టంగా చెప్పుకొన్నాడు. ఆ తరువాతి కవులందరూ ఆ సత్యాన్ని ఏకకంఠంతో సమర్థించారు. నన్నయప్రతి క్రిమిదష్టమై పోవటానికి కారణం ఆతడు వ్రాసికొన్న ప్రతి ఒకటి మాత్రమే ఉండటం కావాలి. నన్నయ రచనకు ప్రతులు కరువయ్యాయన్న వాదం అర్థరహితం, సత్యదూరం. కాబట్టి క్రిమిదష్టవాదం సక్రమం కాదు. అనేక ప్రతులు ఉన్నవని అంగీకరిస్తే అన్నిట్లో ఒకేచోట ఒకేవిధంగా చెదలు పట్టటం అసందర్భం. అది అట్లా ఉండగా, నన్నయ వ్రాసిన మధ్యాక్కరలలో ఎఱ్ఱన వ్రాసిన వాటిలో యతిని పాటించడంలో భేదం కనపడుతుంది. కాబట్టి మధ్యాక్కరలున్నచోటే చెదలు కొరికాయా అన్న అనుమానం రాకమానదు. అందువలన చెదలు పట్టిన భాగాలను ఎఱ్ఱన ఉద్ధరించాడనే వాదం పరాస్తమై పోయింది. ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషాన్ని పూరించాడన్న వాదం నిలిచింది.

### విశిష్ట సాహిత్య నీతి :

ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఆరణ్యపర్వం ఒక విశిష్ట సాహిత్య నీతికి పతాకగా నిలుస్తుంది. నన్నయ రచన అకస్మాత్తుగా ఆగిపోతే, ఆ పర్వాన్ని పూరించటానికి తిక్కనాదులు ముందుకు రాలేదు. నన్నయ రచన నరాంకితమైనది. తిక్కన రచన దైవాంకితమైనది. అందువలన నరాంకితమైన ఆరణ్యపర్వంలోని శేషాన్ని ఎత్తుకొనకపోయి ఉండవచ్చును. ఆ పర్వం నన్నయ పేరు మీదనే ఉండటం ఔచిత్యమని భావించి మూడుపర్వాలనూ నన్నయపేరుమీదనే లెక్కించే ఒక సంప్రదాయాన్ని పాటించి ఉండవచ్చును. తిక్కననాటినుండి వస్తున్న ఆ మర్యాదను ఎఱ్ఱన గౌరవించి ఉంటాడు.

ఆరణ్యపర్వం అనర్థదాయక మని ఒక వదంతి లోకంలో ఉన్నది. అందువలననే నన్నయ ఆ పర్వరచన చేస్తూ మరణించాడని కొందరూ, మతిచాంచల్యానికి గురి అయినాడని కొందరూ, భీమకవి శాపానికి బలి అయినాడని, అథర్వణుడి ఉసురుకొట్టి పోయాడని కొందరూ, కట్టుకథ లనేకం లోకంలో సృష్టించారు. అవన్నీ ఆధార రహితాలనిన్నీ, నన్నయ ఉత్తమశీలుడనీ

చారిత్రికాధారాలే నేడు నిరూపిస్తున్నాయి. ఇక పోతే, అనర్థభీతివలననే తిక్కన ఆరణ్యపర్వశేషాన్ని పూరించకుండా ఆ పర్వమంతా నన్నయే వ్రాశాడని చెప్పాడనీ, అతడి శిష్యుడైన మారన కూడా అదే పాట వల్లించాడనీ కొందరు భావించారు. ఎఱ్ఱన ఎట్లాగో సాహసించి ఆరణ్య పర్వశేష పూరణకు పూనుకొన్నా, తనపేరు పెట్టుకొంటే ఏ ముప్పు వాటిల్లుతుందో అని భయపడి నన్నయ పేరు మీదనే, రాజరాజనరేంద్రుడికి వినిపిస్తున్నట్లుగానే వ్రాశాడని ఆ వాదం వారు భావించారు. ఈ భీరుత్వవాదాన్ని కూడా ధీరు లంగీకరించటం లేదు. అంతేకాక, మహాభారతాన్నంతా ఒకే కలంతో రచించిన మహాకవు లెందరో ఉన్నారు. వారందరికీ పట్టని ఈ అనర్థవాదం కవిత్రయానికి అన్వయించబూనటం అనౌచిత్యం.

అందుకే ఆరణ్యపర్వ రచనం ఒక అపూర్వ సాహిత్యనీతికి నిదర్శనంగా మనం చెప్పుకొని గర్వించటం! ఒక మహాకవి యొక్క సారస్వతాంశ తనయందు ప్రకాశిస్తున్న మరొక మహాకవి ఆయన ప్రారంభించి ముగించలేని ఒక కావ్యభాగాన్ని, ఆయన కవిత్వ లక్షణాలు ముద్రించుకొన్న తన కవితతో ఆయన పేరుమీద, ఆయన రచనగా  రచించటం అపూర్వం! దానికి ఉదాహరణం ఆరణ్యపర్వ శేషాన్ని పూరించి, వినయంగా తన పాత్రను పేర్కొని ఊరుకొన్న వినమ్ర విద్వన్మూర్తి ఎఱ్ఱన. ఆయన వంటి కవులను సాహిత్యక్షేత్రంలో అరుదుగా చూస్తాం. ఎఱ్ఱన అట్లా చేయటానికి కారణం నన్నయమీద పూర్వ మహాకవులందరికి వలెనే ఆయనకూ ఉన్న పరమగురుభావమే. అది ఒక ఉదాత్త సాహిత్యనీతిగా ఎఱ్ఱన పాటించి చూపించాడు. అందువలననే నన్నయ మూడుకృతులు వ్రాశాడన్నా ఆ నీతిలో వైరుధ్యం రాదు. ఎఱ్ఱన రానీయ లేదు. నన్నయను నాటికీ నేటికీ కవిలోకం ఆ గురుస్థానంలోనే నిలిపి గౌరవిస్తున్నది.

**ఆరణ్యపర్వం - రెండు భాగాలు :**

ఇంతవరకు ఆరణ్యపర్వాన్ని ఒక సంపుటిగా ప్రచురించే పరిపాటి సాగుతూ వస్తున్నది. కాని, తిరుమల తిరుపతి దేవస్థానంవారు వ్యాఖ్యాసహితంగా ప్రచురించ బూనటంతో పరిమాణాన్ని దృష్టిలో ఉంచుకొని, పఠితల సౌకర్యం కొరకు ఈ మూడో సంపుటాన్ని రెండు భాగాలుగా వెలువరించవలసి వచ్చింది. అందువలన నన్నయ రచనగా ప్రసిద్ధిచెందిన భాగాన్ని (ఆరణ్యపర్వం మొదటినుండి నాలుగో ఆశ్వాసం 142వ పద్యం వరకు) మొదటి భాగంగానూ, ఎఱ్ఱన రచన అయిన ఆరణ్యపర్వ శేషాన్ని రెండవ భాగంగానూ ప్రచురించటం జరుగుతున్నది. ఈరెండు భాగాలను పూర్వోత్తర భాగాలుగా పేర్కొనటం లేదు. ఎందువల్లనంటే హరివంశంలో వలె, భాగవత దశమస్కంధంలో వలె కథ నాధారంగా చేసికొని కవి ఏర్పరచిన సహజ విభాగం కాదిది. మొదటి భాగం ఆశ్వాసం మధ్యలోనే ఆగుతుంది. రెండోభాగం ఆశ్వాసారంభంతో మొదలు కాదు. కాబట్టి శ్రీకారంతోకూడ మొదలు కాదు. ఈ విధమైన విభాగంతో ఆరణ్యపర్వాన్ని తెలుగులో మొదటిసారి ప్రచురించటం జరుగుతున్నది. మొదటి భాగం నన్నయ భాగమనీ, రెండవభాగం నన్నయరచనగా చెప్పబడుతున్న ఎఱ్ఱాప్రగ్గడ రచనమనీ స్పష్టమైన  వింగడింపుతో ఈ విభాగం చేయబడింది. ఇది ఈ ప్రచురణకు సంబంధించిన విశేషాంశం మాత్రమే సహృదయులు గమనించ ప్రార్థన.

**ఆరణ్య శాంతి పర్వాలు జ్ఞాన నేత్రాలు :**

మహాభారత సాహిత్యమూర్తికి ఆరణ్య శాంతి పర్వాలు జ్ఞాన చక్షువులు. ఇతిహాసంలోని శాస్త్రాంశలను పుష్కలంగా నింపుకొన్న విజ్ఞాన నిధులు. పరిమాణంలో అన్ని పర్వాల కంటె పెద్దది ఆరణ్యపర్వం. దీనికంటె మరికొంత పెద్దది శాంతిపర్వం. 13664 శ్లోకాల సంస్కృత ఆరణ్యపర్వాన్ని నన్నయ ఎఱ్ఱనలు 2894 గద్య పద్యాలలో రచించారు. 14525 శ్లోకాల శాంతి పర్వాన్ని 3093 గద్యపద్యాలతో తిక్కన నిర్మించాడు.

మిగిలిన పర్వాలకూ ఈ రెండింటికీ కొట్టవచ్చినట్లు ఒక తేడా కనపడుతుంది. ఇవి ప్రధానంగా పాండవుల ఇతివృత్తాన్ని రసవత్తరంగా చెప్పటానికి ఉద్దేశించబడినవి కావు. పాండవుల మనఃప్రవృత్తిని, వ్యుత్పత్తిని, జ్ఞానాన్ని ప్రబోధాత్మక ప్రక్రియల ద్వారా వికసింప చేయటానికై ఏర్పడిన జ్ఞాన కాండలు. ఇందులో కేంద్రపాత్ర ధర్మరాజు. అతడు ఇతిహాస నాయకుడు. చతుర్విధ పురుషార్థ సాధకుడు. ధర్మవీరమూర్తి. అతడు జీవితంలో రెండుసార్లు అపార సంతాప సముద్రంలో మునిగి ఉక్కిరిబిక్కిరైనా, ధీరుడై మహాత్ముల విజ్ఞాన ప్రబోధాలతో ఆ విషాదస్థితి నుండి తేరుకొని, కార్యశూరుడై ధర్మసాధనకు పూనుకొన వలసిన విశిష్ట ఘట్టాలను ఎదుర్కొన్నాడు. ఆ రెండు ఘట్టాలను చిత్రించేవే ఆరణ్య శాంతి పర్వాలు.

మాయాద్యూతంలో రాజ్యసంపదలను కోల్పోయి, కురుసభలో దుర్భరమైన అవమానాలకు లోనై, అరణ్య, అజ్ఞాతవాసాలకై అడవులపాలై పడరాని కష్టాలను పొందుతున్న పాండవులు అవమానాగ్నితో దహింపబడుతూ అంతశ్శాంతిని కోల్పోయారు. పెద్దవాడైన ధర్మజుడు క్షమావంతుడై, నిగ్రహంతో ఆ అవమాన ఘూర్ణితమానసిక స్థితినుండి తేరుకొని, క్రమంగా శత్రువులను సంహరించటానికీ, వారిపై పగ సాధించి సర్వసర్వంసహాచక్రవర్తిత్వాన్ని సాధించటానికీ సాగించే నిరంతర నిశ్శబ్ద తపోవీరవికాస చరిత్రమే ఆరణ్యపర్వగాథ. శాంతిపర్వంలో ధర్మజుడు బంధుజన వియోగదుఃఖంతో, బంధు మిత్రజన సంహారం వలన కలిగే పాపభయంతో క్రుంగి కుమిలిపోతాడు. ఆ నిర్వేదంనుండి ధర్మజుడిని తేర్చి, భూమిని పాలించే ఉత్సాహమూర్తిగా మార్చే పరిణామప్రవృత్తిని చిత్రించేది శాంతిపర్వం.

ఈ రెండు పర్వాలూ ధర్మరాజుకు ప్రబోధ గీతాలుగా సాగటం విశేషం. ఆరణ్యపర్వంలో పాండవుల నడుమ సంవాదాలు నడుస్తాయి. పరస్పరం వారు ఎన్నో విషయాలను చర్చించుకొంటారు. అవన్నీ వారు సభాపర్వంలో తమకు కలిగిన అవమానశోకాన్ని ఉపశమింప చేసికొనటానికి ఉపయోగపడే శైత్యోపచారాలే. పాండవుల వద్దకు శ్రీకృష్ణాది బంధువులు వచ్చి పలికే ఓదార్పు మాటలన్నీ వారి దైన్యాన్ని తొలగించటానికి చేసే దోహదాలే. అవమానాగ్ని జ్ఞానవర్షంచేత కాని ఉపశమించదు, అరణ్యవాసాన్ని యోగసాధనగా మార్చుకొంటే కాని విజయోత్సాహానికి మార్గాలు ఏర్పడవు. ఆ వెలుగుబాటను చూపించే మహితాత్ములు మహర్షులు. ఆరణ్యపర్వంలో ధర్మరాజువద్దకు పిలిచినట్లుగా మహర్షులు వచ్చారు, యోగక్షేమాలు విచారించారు, ఉపశమన వాక్యాలు పలికారు. అనుమానాలు తీర్చండని అడిగితే తగిన పురాణేతిహాస కథలను చెప్పి, ధర్మోపదేశాలు చేసి వారికి వెలుగుబాటలు చూపారు. మంత్రాల నిచ్చారు. వరాలు కురిపించారు. ఉపాయాలు చెప్పారు. తీర్థయాత్రలు చేయించారు. దివ్యలోకాలను దర్శింప చేశారు. అరణ్యవాసాన్ని ఒక దివ్యయోగంగా మార్చుకొనేటట్లు చేశారు. ఆరణ్యపర్వం అవమానాగ్ని తాపం చల్లారటానికి పాండవులు చేసిన జ్ఞాన తీర్థస్నాన పరంపరగా భాసిస్తుంది. పాండవాగ్రజుడు భారత నాయకుడు. అతడు సమగ్ర విజయోపాయాలను స్వాయత్తం చేసికొని, చిత్తశాంతితో విజయలక్ష్యంవైపు ఉన్ముఖుడయ్యే ప్రస్థానమే ఆరణ్యపర్వంలోని కథా తాత్పర్యం.

శాంతిపర్వం కూడా ధర్మజుడి చిత్తవృత్తి వికాసం కొరకు ఏర్పడిందే. బాంధవవధవలన కలిగిన శోకాన్నీ, పాపాన్నీ పోగొట్టుకొని రాజ్యపరిపాలనం చేయటానికి కావలసిన చిత్తస్థైర్యాన్నీ, పుణ్యపాకాన్నీ సమకూర్చే భీష్మప్రబోధం శాంతి పర్వ తాత్పర్యం. పెక్కురు చెప్పిన బోధలసారం ఆరణ్యపర్వం. పితామహుడు చెప్పిన నీతిసారం శాంతిపర్వం. చెప్పిన దెవరైనా, ఎంతమందైనా బాగుపడింది ధర్మజుడు, అతడి చలువ వలన పాండవులు, వారి పుణ్యాన భారతం చదివే పాఠకజనులు.

**కథ - బోధ - కాలం :**

మహాభారతేతిహాసానికి నాయకుడు ధర్మరాజనీ, అతడి నాశ్రయించి ధర్మవీరం పోషించబడుతుందనీ కథాపరంగా, తత్త్వపరంగా నిరూపించే ఉదాత్త పర్వాలు ఆరణ్య శాంతిపర్వాలు. శాంతి పర్వ ప్రశస్తిని ఆ పర్వ పీఠికలో చేయటం సముచితం. ప్రస్తుతం ఆరణ్యపర్వ వస్తు విచారం, రసానుకూల తత్త్వవిచారం సమంజసం.

ఆరణ్యపర్వకథ ధర్మరాజు ఎదుర్కొనే రెండు పరీక్షలతో సహజంగా సమవిభక్తమై ప్రత్యక్షమౌతుంది. మొదటిది నహుషప్రశ్నల పరీక్ష. రెండవది యక్షప్రశ్నల పరీక్ష. ఇదొక చిత్రమైన కథానిర్మాణం. ధర్మజుడు వనవాస సమయంలో ఈ రెండు పరీక్షలలో ఉత్తీర్ణుడయ్యే మానసికమైన అధికారాన్ని సంపాదించేందుకు తోడ్పడేదే ఈ పర్వంలోని వస్తువు.

ఆ వస్తువును ఆఖ్యానంగా, ఉపాఖ్యానాలుగా విభజించవచ్చును. ఆఖ్యానంలో కథ సాగుతుంది. ఉపాఖ్యానాలలో బోధ సాగుతుంది. ఈ రెండూ పరస్పర పోషకాలుగా ఉండటం ఈ పర్వంలోని కథామర్మంకూడా! ఉపాఖ్యానాలన్నీ ధర్మజు డడిగిన ప్రశ్నలకు మహర్షు లిచ్చిన సమాధానాలే. ఆ సమాధానాలవలన ఏర్పడిన సంస్కారంతో ధర్మజుడు నహుష, యక్షప్రశ్నలకు సక్రమమైన, సమర్థవంతమైన సమాధానా లివ్వ గలుగుతాడు. పృచ్ఛకుడి ప్రశ్నలకు ఇతిహాస పురాణ గాథలతో సమాధానాలు చెప్పి, మిత్రసమ్మితంగా ధార్మిక ప్రబోధం చేయటమే ఇతిహాస స్వభావం. అది సర్వాంగసుందరంగా ఆరణ్యపర్వంలో పురివిప్పింది.

ఆరణ్యపర్వంలో కథ తక్కువనీ ఉపకథ లెక్కువనీ, గడిచిన కాలం ఎక్కువనీ చెప్పినకథ తక్కువనీ కొందరు విమర్శకులు భావించారు. ఉదాహరణకు డాక్టర్ పాటిబండ మాధవశర్మగారి మాటలు గమనించదగినవి -- ''ఆరణ్యపర్వమున కాలము పండ్రెండేళ్ళు జరిగినకథ. కథ మాత్రము పన్నెండు అంగుళములు కూడ జరుగలేదు. మఱి జరిగిన దేమిటి? ధర్మజుని ధర్మబలము పెరిగినది. భీముని భుజబలము పెరిగినది. అర్జునుని అస్త్రబలము పెరిగినది. అజ్ఞాతవాస సమ్యగనుష్ఠానమునకు, రాజ్య పునఃప్రాప్తికి, ప్రతిజ్ఞాపరిపూర్తికి సదుపాయములు అమరినవి.'' (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ - ఆంధ్రమహా భారతము-ఆరణ్యపర్వము- పీఠిక. పుట9)''. కాలం సాగినంతగా కథ సాగలేదన్నమాట ఆఖ్యానానికి సంబంధించింది. కాలం ఉపాఖ్యాన శ్రవణంతో, తీర్థయాత్రా గమనంతో సాగినట్లు అనిపించినా, అసలు కథలో రమణీయమైన ఘట్టాలు కొన్ని చిత్రించబడినా, ఆ రెండూ కాలగతిని సూచించేవిగానే ఉన్నాయి. అందువలన శర్మగారి మాటలతో మనం పూర్తిగా ఏకీభవించలేం. ఎందువలన అంటే కథకూ బోధకూ గల సంబంధాన్ని ఈ పర్వంలో కాలంతో కవి నిబంధించి చెప్పాడు కాబట్టి. కథ, బోధ, కాలం అనేవి ఈ పర్వంలోని వస్తువుకు మూడు ముఖాలు.

## ఆరణ్య పర్వం ఒక ప్రశ్నోపనిషత్తు

ధర్మరా జడిగిన ప్రశ్నలే ఆరణ్యపర్వ కథా ప్రగతికి సోపానాలు. వాటి తాత్పర్యాన్నీ, తత్త్వాన్నీ గ్రహించి పురోగమించటమే ఈ పర్వంలోని పరమతాత్పర్యం. ఈ దృష్టితో చూస్తే ఆరణ్యపర్వం ఒక ప్రశ్నోపనిషత్తు. ఆ ప్రశ్నల క్రమాన్ని స్థూలంగా గమనిస్తే ఆ సత్యం గోచరిస్తుంది-

1\. ప్రశ్న: ఇష్ట మృష్టాన్నాలతో పూర్వం అన్నివేళలా సంతృప్తులైన బ్రాహ్మణులు అడవులలో కందమూలాలు తింటూ ఉంటే ఎట్లా సహించగలను ? (1.18)

శౌనకుడు : జనకగీతా తాత్పర్యబోధ. తృష్ణాక్షయప్రబోధం.

2\. ప్రశ్న : నాతో కలిసి వచ్చిన బ్రాహ్మణులకు ఉగ్రవనాలలో ఆహారాన్ని ఏ ఉపాయంతో సంపాదించి పెట్టగలను? (1.36)

ధౌమ్యుడు : సూర్యోపాసనవలన చతుర్విధాహార ప్రాప్తి సాధించుమని ప్రబోధం.

3\. ప్రశ్న : భూమినీ, రాజ్యాన్నీ, బంధువులనూ విడిచి మా వలె అడవులలో మృగాలనడుమ నివసిస్తూ పడరాని కష్టాలుపడిన రాజు లెవరైనా ఉన్నారా? ఉంటే ఆ కథ చెప్పండి. (2.3)

బృహదశ్వుడు : నలోపాఖ్యానం చెప్పాడు.

4. ప్రశ్న : భూమికి ప్రదక్షిణంగా వెళ్ళి లోకంలో అనేకులు తీర్థాలను, సేవిస్తూ ఉంటారు. వారికి ఎటువంటి శుభఫలాలు కలుగుతాయి? బహుపుణ్య తీర్థాలనూ, వాటి ఫలాలనూ నాకు పరిచయం చేయండి. (2.235)

నారదుడు : తీర్థాలూ, వాటిని సేవించటంవలన కలిగే ఫలాలు చెప్పాడు.

5. ప్రశ్న : లోకంలో అధార్మికులైన కపటులకు అభ్యుదయం కలగటం, పుణ్యచరిత్రులైన ధార్మికులకు నిరంతరం అవమాన భారం కలగటం న్యాయమేనా? (2.310)

రోమశుడు : అధార్మికులకు కలిగే అభ్యుదయాలు స్వల్పకాలికాలనీ, ధార్మికులు పొందే అభ్యుదయాలు దీర్ఘకాలికా లనీ వివరించాడు.

6. ప్రశ్న : అచేతనాలైన పర్వతాలూ, నదులూ, సరోవరాలూ, పుణ్యతీర్థాలై, జగత్పావనాలై జనుల పాపాలను పోగొట్టుతూ ఉండటానికి గల కారణ మేమిటి? (2.309)

రోమశుడు : ధర్మపరులైన దేవతలు, ఋషులు వాటిని ఆశ్రయించటం చేత పర్వత, నదీ, సరోవరాదులు పవిత్రాలై, సర్వ కామితార్థ ఫలాలను ఇవ్వగలుగుతాయి.

7. ప్రశ్న : (అగస్త్యాశ్రమం దర్శించిన ధర్మజుడు): అగస్త్యుడు వాతాపిని చంపినకథ చెప్పండి. (2.318)

రోమశుడు : వాతాపిని అగస్త్యుడు జీర్ణం చేసికొన్న కథ చెప్పాడు.

8. ప్రశ్న : అగస్త్యుడి కథ మరింత వివరించండి. (3.2)

రోమశుడు : అగస్త్యుడు వింధ్యగర్వాన్ని అణచటం, సముద్రజలాలను త్రాగటం, తరువాత భగీరథుడు గంగను భూతలానికి తెచ్చి, సముద్రాలను మరల నీటితో నింపటం అనే కథలు చెప్పాడు.

9. ప్రశ్న : ఋశ్యశృంగ హ్రదంలో స్నానంచేసి, ఋశ్యశృంగ మహర్షి కథ చెప్పమని ధర్మరాజు అడిగాడు. (3.87)

రోమశుడు : ఋశ్యశృంగుడి చరిత్ర చెప్పాడు.

10. ప్రశ్న : మహేంద్రనగాన్ని దర్శించి అక్కడ ఋషులను పరశురాముడి వృత్తాంతం చెప్పండని అడిగాడు. (3.130)

అకృతవ్రణుడు:పరశురాముడి వృత్తాంతం చెప్పాడు.

11. ప్రశ్న : శర్యాతి యజ్ఞప్రదేశాన్ని దర్శించి అక్కడి చ్యవనుడి కథను చెప్పమని అడిగాడు.

రోమశుడు : సుకన్యోపాఖ్యానం చెప్పాడు.

12. ప్రశ్న : యమునా నదీ తీరంలో మాంధాతృడు యజ్ఞం చేసిన తీర్థాన్ని దర్శించి ఆ రాజుచరిత్ర నడిగాడు. (3.199)

రోమశుడు : మాంధాతృ చరిత్రం చెప్పాడు.

13. ప్రశ్న : సోమకుడు యజ్ఞంచేసి నూరుగురు కొడుకులను ఎట్లా పొందాడు? (3.207)

రోమశుడు : సోమకుడి చరిత్రం చెప్పాడు.

14. ప్రశ్న : భృగుతుంగ పర్వత మాహాత్మ్యం చెప్పమని అడిగాడు. (3.227)

రోమశుడు : శిబి చక్రవర్తి చరిత్రం చెప్పాడు.

15. ప్రశ్న : శ్వేతకేతు తపోవనం గురించి అడిగాడు. (3.237)

రోమశుడు : శ్వేతకేతు, అష్టావక్రుల చరిత్ర చెప్పాడు.

16. ప్రశ్న : భరద్వాజాశ్రమంలో విద్యాగర్వంతో యవక్రీతుడు మృతుడైన విధం చెప్పమన్నాడు. (3.251)

రోమశుడు : యవక్రీతుడి చరిత్ర చెప్పాడు.

17. ప్రశ్నలు : ధర్మపరులమైన మే మీ విధంగా వివిధ దుఃఖాలను పొందటం, నిరంతర పాపకర్ములైన కౌరవులు సుఖోన్నతులు పొందడం - అనే ఈ విపర్యయానికి కారణం ఏమిటి? నరుడు తాను చేసే కర్మలకు ఫలాన్ని ఈ లోకంలోనే పొందుతాడా? పరలోకంలో పొందుతాడా? రెండింటా పొందుతాడా? విశ్వకర్త అయిన ఈశ్వరుడిని సరకు గొనని పురుషుడికి కర్మఫలం కలుగదా? ఈ దేహంతోనే నరుడికి కర్మతోటి సంబంధం తీరిపోతుందా? (4.168)

మార్కేండేయుడు: ఉపవాసాది వ్రతాలతో తీర్థయాత్రాది పుణ్యకార్యాలు చేసినవారు ఇహంలోనూ, పరంలోనూ సుఖిస్తారని చెప్పుతూ మనుష్యుల కర్మగతి ప్రకారాన్ని వివరించాడు.

18. ప్రశ్న : బ్రాహ్మణ ప్రభావాన్ని తెలపండి అని అడిగాడు. (4.181)

మార్కం : హైహయుల వృత్తాంతం చెప్పాడు.

19. ప్రశ్న : బ్రహ్మ క్షత్ర స్వరూప నిరూపణం చేయుమని ప్రశ్న. (4.191)

మార్కం : అత్రి, గౌతముల వృత్తాంతం - దానికి సమాధానంగా చెప్పాడు.

20. ప్రశ్న : వైవస్వతమనువు ఏవిధంగా ప్రభావ సంపన్నుడైనాడు? (4.216)

మార్కం : వైవస్వతమనువు చరిత్ర చెప్పాడు.

21. ప్రశ్న : లోకాలన్నీ ప్రళయం పొందే ప్రకారాన్ని వివరించండి. (4. 239)

మార్కం : జలప్రళయం, వటపత్రశాయి అయిన విష్ణువు గర్భంలోకి మార్కండేయుడు ప్రవేశించి, సంగుప్తమైన సర్వసృష్టిని దర్శించి, వెలువడటం మొదలైన కథలు వివరించాడు.

22. ప్రశ్న : కలియుగంలో ధర్మలోపం ఎట్లా జరుగుతుందో తెలపండి. (4.284)

మార్కం : కలియుగ ధర్మకథనం; కల్కి అవతార కథను చెప్పాడు.

23. ప్రశ్న : బ్రాహ్మణ ప్రభావం గురించి చెప్పండి. (4.317)

మార్కం : పరీక్షితుడికథను, శలుడికథను చెప్పాడు.

24. ప్రశ్న : మార్కండేయ మహర్షి కంటె వృద్ధతముడైన పురుషు డున్నాడా? (4.359)

మార్కం : ఇంద్రద్యుమ్నుడి చరిత్ర చెప్పాడు.

25. ప్రశ్న : ఇక్ష్వాకువంశంలో పుట్టిన కువలాశ్వుడికి ధుంధుమారుడనే పేరు ఎట్లా వచ్చింది ? (4.372)

మార్కం : కువలాశ్వుడి చరిత్ర చెప్పాడు.

26. ప్రశ్న : ధుంధుడు మధుకైటభుల పుత్రుడని చెప్పారు. వారు ఏ కాలం వారు ? వారు ఏవిధంగా, ఎవరిచేతిలో ఏమైనారు? (4.390)

మార్కం : మధుకైటభుల చరిత్ర చెప్పాడు.

27. ప్రశ్న : పతివ్రతలైన వారి చరిత్రలు అత్యంత ధర్మసూక్ష్మాలై ఉంటాయి. కాబట్టి ఆ పుణ్యవ్రతల ప్రభావాన్ని తెలిపే కథలు చెప్పండి. (5.3)

మార్కం : పతివ్రతామాహాత్మ్యం, కౌశికుడికథ, ధర్మవ్యాధుడికథ, అతడి పూర్వజన్మ వృత్తాంతం; అతడి బోధ, అహింసా స్వరూపం, జీవ లక్షణ కథనం, పితృశుశ్రూష చేత ధర్మాన్ని ఆచరించే ఉపాయం మొదలైనవి చెప్పాడు.

28. ప్రశ్న : అగ్నిదేవుడు మహాతపస్సు చేశాడని వింటాం. ఎందుకు చేశాడు? అంగిరసుడు ఎందువలన అగ్ని అయ్యాడు? అగ్నులు ఎన్ని విధాలుగా అతిశయిల్లుతాయి? (5.146)

మార్కం : ఈ ప్రశ్నలకన్నింటికి అనువైన కథలు చెప్పాడు.

29. ప్రశ్న : కుమారస్వామి అగ్నికి, కృత్తికలకు, శివుడికి కొడుకని చెప్పుతారు. దానికి కారణమైన కథను వివరించండి. (5.175)

మార్కం : ఇంద్రుడు కేశి అనే రాక్షసుడిని పారద్రోలి దేవసేనను రక్షించటం; దేవసేనకు అనువైన వరుడిని కూరుస్తానని వరమివ్వటం; పితామహుడు కుమారస్వామి ఉత్పత్తిని సూచించటం, అగ్నికి సప్తర్షుల భార్యలపై వలపువలన విరహం కలగటం, స్వాహాదేవి ఋషిపత్నుల రూపంతో అగ్నిని కూడి అగ్ని వీర్యంతో కుమారస్వామిని ఒక కలశంలో ఉత్పన్నం చేయటం. అందువలన అతడు ఆరుగురు తల్లుల బిడ్డడైనాడు. ఇంద్రుడు కుమారస్వామిపై దాడిచేయటం, ఈశ్వరుడు కుమారస్వామిని పుత్రుడిగా అంగీకరించటం, సప్తమాతృకలను బాలగ్రహాలుగా మార్చటం, భద్రవటంలో కుమారస్వామిని దేవసేనాపతిగా అభిషేకించడం, మహిషాసుర సంహారం, మొదలైన కథలు చెప్పాడు.

30. ప్రశ్న : దానం, తపస్సు - ఈ రెండింటిలో ఏది కష్టమైనది? దేనివలన అధిక ఫలాన్ని పొందవచ్చును? (6.110)

వ్యాసుడు : దానం కంటె తపస్సు గొప్పదని చెప్పే వ్రీహిద్రోణాఖ్యానాన్ని, ముద్గలదేవదూతల సంవాదాన్ని వినిపించాడు.

31. ప్రశ్న : సైంధవుడు ద్రౌపది పట్ల చేసిన దుర్వ్యవసాయానికి పాండవులు నొచ్చుకొని ఉన్నారు. అప్పుడు మార్కండేయ మహర్షి వచ్చాడు. అప్పు డాయనను ధర్మరాజు ఈ విధంగా అడిగాడు: 'ఏ కాలంలోనైన ద్రౌపదివలె అత్యంతదుఃఖాన్ని పొందిన వనిత గాని, నావలె అనంత శోక సముద్రంలో మునిగిన రాజు కాని ఎవరైనా ఉన్నారా?' (6.263)

మార్కం : అందుకు దృష్టాంతంగా సీతారాముల కథ అయిన రామాయణాన్ని వినిపించాడు.

32. ప్రశ్న : మునీంద్రా! పతిభక్తి తాత్పర్యంతో సమస్త దుఃఖాలను సహించి, చివరికి శుభాన్ని పొందిన పుణ్యవతి చరిత్రం వినిపించండి! (7. 169)

మార్కం : సావిత్రి చరిత్ర చెప్పాడు. సావిత్రివలెనే ద్రౌపదికూడ పుణ్యవతి అనీ, మహాభాగ్యవతి అనీ చెప్పి, ఆమె కురువంశాన్ని అంతటినీ ఉద్ధరిస్తుందని ప్రకటించాడు. ఈ ప్రశ్నల పట్టీ ఆరణ్యపర్వంలోని బోధకు సంబంధించిన అంశాలను అనుశీలించటానికి ప్రాథమిక ప్రణాళికగా పనికి వస్తుంది. ఆలోచిస్తే అనేక విషయాలు ఇందులోనుండి బయట పడతాయి.

ఆరణ్య పర్వంలో పాండవకౌరవుల వృత్తాంతాలు సుమారు 45 శాతం, ధర్మరాజు అడిగిన ప్రశ్నలకు మహర్షులు చెప్పిన ఉపాఖ్యానాల, ధర్మోపన్యాసాల భాగం సుమారు 55 శాతం. ఈ ప్రశ్నోత్తర భాగమంతా ధర్మజుడి జిజ్ఞాసకు సంబంధించినదే. కాబట్టి ధర్మజుడి తత్త్వజిజ్ఞాసకు ఆరణ్యపర్వంలో అగ్రతాంబూల మన్నది నిశ్చితార్థం.

## ధర్మరాజు ధర్మవీరుడు, కర్మవీరుడు :

ధర్మరాజు వేసే ప్రశ్నల స్వభావాన్ని గమనిస్తే ఆతడు భక్తుడిగా కంటె, జ్ఞానిగా కంటె కర్మఠుడుగా కర్మసిద్ధాంతాన్ని నమ్మినవాడుగా కనపడుతున్నాడు. కొన్ని అంశాలను గమనిద్దాం.

1. ధర్మరాజు వెంట వేదవిదులైన విప్రులు కూడ అడవులకు కదలివచ్చారు. అప్పుడు అతడు తన గార్హస్థ్య ధర్మాన్ని స్మరించి, తన కర్తవ్యాన్ని పాలించటానికి సంకల్పించాడు. ధర్మజుడి దృష్టిలో ఆశ్రమ ధర్మాలన్నింటిలో గృహస్థాశ్రమ ధర్మం ఉత్తమమైనది. ఆ ఆశ్రమ ధర్మం నిర్వహించే రాజు పాటించవలసిన కర్తవ్యాలను పేర్కొన్నాడు. 'బాధ పడేవారికి ప్రక్క లమర్చాలి. భయపడేవారికి అభయమివ్వాలి. దప్పిగొన్నవారికి నీరందించాలి. ఆకలి గొన్నవారికి అన్నం పెట్టాలి. అలసిన వారికి ఆసన మమర్చాలి. ఇది సనాతన ఉత్తమ గృహస్థధర్మం' అని ధర్మరాజు పేర్కొన్నాడు. (1.31). కారడవులలో కూడా తన గృహస్థాశ్రమధర్మాన్ని మొక్కపోకుండ రక్షించుకొనటానికై సూర్యోపాసన చేసి, అక్షయతామ్రపాత్రను పొంది, అతిథి సత్కారాన్ని అవిచ్ఛిన్నంగా సాగించిన ఆదర్శకర్మఠుడు, గృహస్థుడు ధర్మరాజు. గృహస్థాశ్రమ ధర్మప్రాముఖ్యాన్ని చెప్పే భారతంలో ధర్మజుడు ఆ ఆశ్రమ ధర్మపాలనకు ఆదర్శప్రాయుడిగా చిత్రించబడటం ఆరణ్యపర్వ తాత్పర్యం.

2. తీర్థయాత్రలపట్ల ఆసక్తితో మొదట నారదుడివలన తీర్థాల పేర్లు, మహిమలు తెలిసికొన్నాడు- ధర్మరాజు. ఆ తరువాత ధౌమ్యుడి వలన ప్రేరితుడై తీర్థయాత్రలు చేయాలని సంకల్పించాడు. ఆపై ఇంద్రుడి ఆజ్ఞచొప్పున వచ్చి, ధర్మజుడిని వివిధ తీర్థయాత్రలకు వెంటపెట్టుకొని తీసికొనివెళ్ళి, తీర్థక్షేత్ర దైవ ఋషి స్థల మాహాత్మ్యాదులను వివరించి చెప్పగలిగిన రోమశమహర్షి వలన వివిధ తీర్థమహత్త్వగాథలను అడిగి చెప్పించుకొని చెవులార విన్నాడు. మనసార సంతోషించాడు. మునుగుమన్న తీర్థంలో విసుగులేక మునిగాడు. దీక్షలను, తపస్సులను, వ్రతాలను, దానాలను చేయుమన్నచోట్ల చెప్పినట్లుగా చేశాడు. తీర్థాలలో మునిగి దివ్యదృష్టిని దూర శ్రవణశక్తిని పొంది, దూరదూరాల నున్న దివ్యలోకాలను దర్శించిన ఆనాటి భూతల సార్వభౌముడు- ధర్మరాజు. అర్జునుడు ఇంద్రుడి దయవలన స్వర్గంలో ప్రవేశించి, ఆతడి అర్ధసింహాసనంమీద ఆసీనుడైనాడు. ధర్మజుడు తీర్థసేవలో ఆ దివ్యలోక దృశ్యాన్ని చూడగలిగాడు. తపస్సువలన అర్జునుడు సాధించిన దివ్యలోక గమనశక్తిని, ధర్మజుడు కర్మమార్గంలో తీర్థసేవాపుణ్యఫలంగా సంపాదించ గలిగాడు. భారతీయ గార్హస్థ్యధర్మంలో, కర్మపద్ధతిలో, తీర్థయాత్రావ్రతాన్ని తెలిసి ఆచరించి తత్ఫలితాన్ని సంపూర్ణంగా సాధించిన మహితాత్ముడు- ధర్మరాజు.

3. ధర్మరాజు హృదయంలో ఒక ధర్మ సందేహం బడబాగ్నివలె అతడిని బాధిస్తూ ఉండేది. దానికి తగిన సమాధానంకొరకు ఎదురుపడిన ప్రతి మహర్షిని గ్రుచ్చిగ్రుచ్చి అడిగాడు. ధర్మజుడి ప్రశ్నకు సమాధానం ప్రత్యక్షంగా చెప్పిన ఋషులు ఇద్దరు 1. రోమశుడు. 2. మార్కండేయుడు. పరోక్షంగా చెప్పినవారు మరొక ఇద్దరు. 1. వేదవ్యాసుడు, 2. ధౌమ్యుడు. ఆరణ్యపర్వంలో బోధకొరకే వచ్చిన మహర్షుల ముచ్చట చెప్పుకొంటే సరిపోతుంది.

రోమశమహర్షిని ధర్మజుడు ప్రశ్నించిన విధం ఇది --

''ధరణి నధార్మికులగు కా
పురుషుల కభివర్ధనంబుఁ బుణ్య చరిత్రం
బరఁగెడు ధార్మికులకు దు
ర్ధరమగు నవివర్ధనంబుఁ దగునె మునీంద్రా!' **(ఆర. 2.308)**

ఈ ప్రశ్న ధర్మరాజుకే కాదు, పఠితలకు కూడా గుండెలో కుంపటి వలె కాలుతూనే ఉంటుంది. అధార్మికులైన కౌరవులు అభివృద్ధి చెందారు. పుణ్యచరిత్రులైన పాండవులు అడవుల పాలైనారు. ఇదేమి న్యాయం? ధర్మమంటూ ఒకటి ఉంటే, దైవమంటూ ఒకడు ఉంటే ఇట్లా జరుగుతుందా? అనే అనుమానం అందరికీ కలుగుతుంది. దీని సమాధానం మీదనే ఆరణ్యపర్వ అస్తిత్వం ఆధారపడి ఉన్నది. ధర్మజుడి కర్మఠ స్వభావం బైటపడవలసి ఉన్నది. దీనికి సమాధానాన్ని రోమశుడు ఉత్తమ పౌరాణికుడివలె చెప్పాడు. అధర్మ పరులు అభ్యుదయాన్ని సాధించినా అది ఎక్కువ కాలం నిలువదు. త్వరలో నశించి పోతుంది. వేలసంఖ్యలో దైత్యదానవులు దేవతలను బాధించి సంపదలను దోచుకొని భాగ్యాలను అనుభవించారు. కాని, వారి కాసంపదలు ఎక్కువకాలం నిలువలేదు. దేవతలు ధర్మవర్తనులు కాబట్టి తాత్కాలికంగా సౌఖ్యాలకు దూరమైనా, స్వీయధర్మశక్తితో వారు త్వరలోనే తమ అభ్యుదయాలను తిరిగి పొందగలిగా రని తార్కాణం చూపిస్తూ కపటులైన కౌరవుల సంపదలు కలకాలం నిలువవనీ అమరతుల్యులైన పాండవులు ధర్మారంభ విశిష్టమతులు కాబట్టి రాజ్యాన్ని తిరిగి పొందగలరనీ ధర్మజుడికి ధైర్యం చెప్పాడు. దేవదానవుల దృష్టాంతం పాండవ కౌరవుల పట్ల చక్కగా అమరి, రోమశుడి పురాణ ప్రవచన గౌరవాన్ని కాపాడింది. 'ధర్మో రక్షతి రక్షితః' అనే న్యాయం రోమశుడి ప్రవచనసారం.

మార్కండేయమహర్షిని ప్రశ్నించేనాటికి ధర్మజుడు మరికొంత వివేకాన్ని ప్రదర్శించాడు. రోమశుడు ధర్మప్రాతిపదికమీద సమాధానం చెప్పాడు. ధర్మజుడు కర్మప్రాతిపదికమీద సమాధానాన్ని కోరుతున్నాడు. రోమశుడి వలన దానిని పొందలేక పోయాడు. మార్కండేయుడి వద్ద కర్మఫల రూపమైన ప్రశ్నలతో కలిపి అదే అనుమానాన్ని విశదంగా వెలువరించాడు.

సీ. 'కడఁగి ధర్మముతోడ నడచుచు నే మిట్లు। దందడి దుఃఖంబుఁ బొందుటయును
నేపున నెప్పుడు పాపంబు సేయుచు। ధృతరాష్ట్రజులు సుఖోన్నతు లగుటయుఁ
గని యీ విపర్యయమునకు నే నూహింతుఁ। బాయక నరుఁ డిప్డు సేయు కర్మ
మున ఫల మిందుఁ బొందునొ? పరలోకంబు। నందుఁ బొందునొ? యిందు నందుఁ గనునొ?

ఆ. విశ్వకర్త యైన యీశ్వరుఁగా నని। పురుషుఁ గర్మఫలము పొరయకున్నె ?
యొడలితోనఁ గృతము వెడలిపోవునొ! యిది। దెలియవలయు నాకు నలఘుపుణ్య!

**(ఆర.4.168)**

రోమశుడు చెప్పిన దాని ప్రకారం పాండవులకు అభ్యుదయం కలుగుతుంది. కౌరవులకు సంపదలు నశిస్తాయి. మరి అది ఎప్పుడు కలుగుతుంది? 'అత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫలమశ్నుతే' అన్న న్యాయం ప్రకారం కౌరవుల పాపం పండి త్వరలో రాజ్యభ్రష్టులు కావాలి; పాండవుల పుణ్యం పండి త్వరలో రాజ్యపదవి తిరిగి పొందాలి. అది జరుగుతుందా? చెప్పమని ధర్మరాజు మార్కండేయుడిని పరోక్షంగా అడిగాడు. మార్కండేయుడు కర్మగతి ప్రకారాన్ని వివరించి ఫలితాంశాన్ని తేల్చి చెప్పాడు. ఈ లోకంలో సంపదలు గడించి పుణ్యమార్గాన పోక, లోభమోహహతబుద్ధులై, ఇంద్రియ భోగాలకు లోనై జీవించేవారికి

ఇహంలో సుఖమున్నా, పరంలో మిగిలేది దుఃఖమే. ఉపవాసాదివ్రతాలూ, తీర్థయాత్రలూ, పుణ్యకర్మలూ చేసినవారు ఇహలోకంలో దుఃఖం పొందినా, పరలోకంలో సుఖిస్తారు. ధర్మాన్ని ఆచరిస్తూ గార్హస్థ్యాశ్రమంలో జీవితాన్ని సాగిస్తూ సత్కర్మలూ, సత్క్రతువులూ చేసేవారు ఇహపరసుఖాల ననుభవిస్తారు. సత్యశమ శౌచాలు లేకుండా నాస్తికులై, నిషిద్ధకర్మ లాచరించేవారు రెంటికి చెడ్డ రేవడులు అవుతారు. ఇది కర్మ ప్రవర్తన పద్ధతి. పాండవులు ధర్మశీలురు, పుణ్యవ్రతులు కావటంచేత శత్రువులను జయించి, రాజ్యాన్ని పాలించి, ఇహపరసుఖాల నందుతా రని తీర్పుచెప్పాడు- మార్కండేయుడు. ధర్మజుడిలోని కర్మఠుడు కోరే ఫలంకూడా అదే!

## ప్రశ్నలు ధర్మజుని మానసిక వికాససూచికలు :

ధర్మరాజు వేసిన ప్రశ్నలను ఆతడి మానసిక వికాసదశలకు దర్పణాలుగా తీర్చిదిద్దటం ఆరణ్యపర్వ వస్తు సంవిధాన శిల్పం. ఈ పర్వారంభంలో ధర్మజుడు శోకమూర్ఛితుడు (1.19). పర్వాంతంలో క్రోధమోహాదులు లేకుండా ధర్మంలోనే స్థిరపడిన ధీరచిత్తం కలవాడు (7.466). ఈ పరిణామాన్ని చిత్రించేదే ఈ పర్వకథాంశం.

తనవెంట వస్తున్న విప్రవరులకు మృష్టాన్న భోజనాలు పెట్టలేక కందమూలాలు అందించవలసి వచ్చిందే అని ధర్మరాజు తీవ్రమైన శోకానికి గురై మూర్ఛపోయాడు. అతడిని శీతలోపచారాలతో తేర్చి శౌనకుడనే బ్రహ్మర్షి ధర్మరాజుహృదయం కుదుటపడటానికి జనక గీతా తాత్పర్యాన్ని వినిపించాడు. బంధు మిత్ర ధనాదులమీద స్నేహం విడిచి, లోకంలో తామరాకుమీద నీటి బిందువు వలె ఉండాలి. స్నేహం వలన రాగం, రాగం వలన కామం, కామం వలన క్రోధం, క్రోధం వలన తృష్ణ కలుగుతాయి. తృష్ణ సర్వదోషాలకూ మూలం. అది అన్ని పాపాలకూ మొదలు. నిరంతర దుఃఖానికి నెలవు. కాబట్టి తృష్ణాక్షయం విజ్ఞుల కర్తవ్యం. తృష్ణ కలవాడు తొఱ్ఱలో అగ్ని ఉన్న చెట్టువలె నిలువునా నాశన మౌతాడు. అర్థం అనర్థమూలం. అర్థం వలన దర్పకార్పణ్యమాన భయోద్వేగాదులు పుట్టుతాయి కాబట్టి అర్థోపార్జనచింత వదలిపెట్టటం బుద్ధిమంతుల లక్షణ మని శౌనకుడు బోధించాడు.

శోక విమోహితుడైన ధర్మరాజుకు తృష్ణాక్షయరూపమైన శమాన్ని బోధించాడు- శౌనకుడు. ధర్మజుడు దానిని సున్నితంగా కాదన్నాడు. తనకు అర్థలాభేచ్ఛ ఉన్నా, అది ఆత్మోపభోగార్థం కాదన్నాడు, గృహస్థాశ్రమ ధర్మనిర్వహణం కొరకే అర్థార్జనమని హెచ్చరించాడు. ఇది అసలైన ధర్మజుడి శీలం. అతడికి రాజ్యం కావాలి. కాని, అది భోగం కొరకు కాదు, ధర్మరక్షణం కొరకు. అయితే, అటువంటి అర్థసంపదను కోల్పోయాడు. దానిని తిరిగి సంపాదించుకొనాలి. లేమివలన అతడు శోకమూర్ఛితుడైనాడు. సూర్యోపాసనతో తన లేమిని పోగొట్టుకొన్నాడు. అక్షయతామ్రపాత్రతో నిరతాన్నదానం చేస్తూ ధర్మమయజీవితాన్ని కారడవిలోసైతం సురక్షితంగా సాగించాడు. శోకమూర్ఛితుడు సూర్యానుగ్రహంవలన ధర్మోత్సాహిగా మారాడు.

## ప్రసన్న కథాకలితార్థయుక్తి :

ధర్మజుడి ప్రశ్నలు ఆరణ్యపర్వకథా వాహినిలో చిన్న చిన్న ద్వీపాలవంటివి. వాటి మధ్య ఆఖ్యానం ప్రవాహంగా సాగుతూ ఉంటుంది. అందులోకూడా క్రమం పాటించబడి ఉంటుంది. ఆరణ్యపర్వం ముగిసేసరికి పాండవులు అజ్ఞాత వాసాన్ని నిర్విఘ్నంగా ముగించుకొనే యుక్తినే కాక, ఆపైన రాజ్యాన్ని సాధించుకొనే శక్తిని కూడా సాధించుకొంటారు. అట్టిక్రమ వికాస దశలతో ఆరణ్యపర్వకథా శతపత్రం క్రమంగా విచ్చుకొంటున్నట్లు చిత్రించటంలో ఆరణ్యపర్వంలోని ప్రసన్న కథాకలితార్థ యుక్తి ప్రత్యక్షమౌతుంది. రేఖామాత్రంగా ఆ కథాశిల్ప వికాసవిన్యాసాన్ని గమనిద్దాం.

1. ధర్మరాజు సూర్యదత్తమైన అక్షయతామ్రపాత్రతో ఇష్టభోజన సుఖాన్ని, అతిథి సత్కార ధర్మాన్ని నిర్వహిస్తూ నిశ్చింతుడైనాడు.

2. ఆ తరువాత విదురుడు ధృతరాష్ట్రుడిని వదలి పాండవుల వద్దకు వచ్చాడు. దీనివలన కథలో రెండు ప్రయోజనాలు సాధించబడ్డాయి. మొదటిది విదురుడి వంటి ధర్మవేత్తకు తగిన ధర్మప్రభువు ధర్మరాజే అని ధ్వనించబడటం. పాండవులు హస్తినాపురం వీడి వచ్చినా ఆ రాజ్యంలో వారిని సమర్థించేవారు ఇంకా బలంగా కొంతమంది ఉన్నారన్న వాస్తవం వెల్లడి కావటం. రెండో ప్రయోజనం ఆశ్చర్యం కలిగించేది. విదురుడు వస్తుంటే పాండవులు భయపడ్డారు. దానికి ఒక రహస్యం కారణం ఉన్నది. కౌరవులు మరల మాయాద్యూతానికి పిలిచి పాండవుల ఆయుధాలను వశం చేసికొంటారేమో అన్న భయం ధర్మరాజు మనసులో ములికివలె బాధిస్తూనే ఉన్నది. పాండవులు అరణ్యవాసానికి వచ్చేటప్పుడు అదృష్టవశాత్తు కౌరవులు పాండవుల ఆయుధాలను వశంచేసికొనటం మరచారు. ఆ తరువాత శకుని వలన దానిని తెలిసికొని పునర్ద్యూతానికి పిలుస్తారేమోనని ధర్మరాజుకు గుండెలో గుబులుండేది. దాన్ని బయట పెట్టింది విదురుడిఘట్టం. విదురుడిని తిరిగి హస్తినాపురానికి పంపటంలో ధర్మజుడు మెలకువను ప్రకటించాడు. విదురుడు హస్తినలో ఉంటే- పాండవ యోగక్షేమం విచారించే ఒక ధర్మదేవత శత్రుశిబిరంలో ఉన్నట్లే. అందువలన విదురుడి రాకడ, పోకడ ధర్మజుడికి లాభమే కావటం కథాప్రయోజనం.

3. ధృతరాష్ట్ర విదుర పునస్సమాగమం దుష్టచతుష్టయంలో కలకలం రేపింది. పాండవులకు రాజ్యభాగం గ్రుడ్డిరాజుచేత విదురు డిప్పిస్తాడేమో అని దుర్యోధనుడి అనుమానం. ఒకవేళ వారివ్వదలచుకొన్నా ధర్మజుడు తాను చేసిన ప్రతిజ్ఞను వమ్ముచేసి, రాజ్యాన్ని స్వీకరించడని శకుని తీర్మానం. శకుని అంచనా సక్రమమైనదే. అది ధర్మరాజు శీలానికి కలికితురాయి. కౌరవుల కది పాండవుల అసమర్థతకు చిహ్నం. ఉభయవర్గాలకు అనుకూలమైన శకుని తీర్పు కథా సంవిధానశిల్ప రహస్యం.

4. అడవులలో కందమూలాలు తింటూ కాలం గడుపుతున్న పాండవులమీద మహాసైన్యంతో దాడిచేసి, వారిని చంపి, శత్రుశేషం లేకుండా చేసి, రాజ్యాన్ని పాలించుమని కర్ణుడు దుర్యోధనుడికి సలహా చెప్పాడు. కర్ణదుర్నీతికి ఇది పతాక. దానిని విని, దుర్యోధనుడు పాండవులపై రణభేరి మ్రోగించాడు. వ్యాసుడు వచ్చి వారించాడు. కౌరవ, పాండవులను బిడ్డలుగా సమానమైన అనురాగంతో చూచుకొమ్మని ధృతరాష్ట్రుడికి వ్యాసుడు బోధించి ఇంద్రసురభి సంవాదాన్ని వినిపించాడు. అతడు వినలేదు. కాని యుద్ధాన్ని కొడుకుచేత మాన్పించాడు. మైత్రేయుడు దుర్యోధనుడికి నీతులు చెప్పాడు. అతడు వినకపోగా అవినయంగా ప్రవర్తించాడు. దానికి ఫలంగా భీముడి గదచేత దుర్యోధనుడు తొడలు విరిగి రణంలో నిహతుడయ్యేటట్లు మైత్రేయుడు శపించాడు. ఈ సన్నివేశం వలన పాండవులను ధార్మిక శక్తులు, దివ్యశక్తులు రక్షాకవచంవలె నిలిచి సదా కాపాడుతున్నాయని స్పష్టం ఔతున్నది. భీముడు ఆవేశంతో కురుసభలో సుయోధనుడి తొడలు విరుగగొట్టుతానని శపథం చేశాడు. దాని ఉచితానుచితాలను గురించి చర్చ జరిగింది. దానిని మైత్రేయుడు శాపంగా మార్చాడు. మైత్రేయుడిశాపం పరోక్షంగా భీముడికి వరం. దీనితో దుర్యోధనవధ నిశ్చితమైపోయింది. కౌరవపతనం ప్రారంభమైంది. ఆరణ్యపర్వంలో ధర్మరాజు ధార్మిక విజయప్రస్థానం మొదలయింది.

5. కిమ్మీరవధ భావి దుర్యోధనవధను ధ్వనింపచేసే మరొక మరణమృదంగం. ఆరణ్యపర్వంలో భీమ బలవీరం, అర్జున తపోవీరం, ధర్మజ ధర్మవీరం అనన్యసామాన్యంగా ప్రకాశించేటట్లు ప్రదర్శించటమే వస్తుసంవిధాన శిల్పం. భీమబలవీరం శత్రు హృదయ భయంకరమై రాణించింది- ధృతరాష్ట్రుడు విని భయవిహ్వాలుడు కావటం వలన.

6. యాదవ పాంచాలాదులు పాండవులను కామ్యకవనంలో కలిసిన ఘట్టం ఆ తరువాత రావటం సార్థకం. కథాశిల్ప పోషకం. కామ్యకవనం యాదవ పాంచాల రాజ్యాలకు దగ్గరగా ఉండటం వలన వారందరూ కలిసి వచ్చారు. వారిరాక వలన పాండవులు అడవులలో ఉన్నా ఒంటరివారు కారని తేలింది. వారికొరకు యుద్ధంచేసి విజయాన్ని సాధించి వారికి హస్తినాపురాన్ని అప్పగించగల బలపరాక్రమవంతులు, శ్రేయోభిలాషులు వారి కున్నారని స్పష్టమయింది. వారు బలప్రయోగానికై ముందుకు వచ్చినా ధర్మజుడు ఆశకు లోనై నియమోల్లంఘనానికి లొంగే బలహీనుడు కాడని కూడా స్పష్టమయింది. పాండవులు బలహీనులు కారు, బలగం లేనివారు కారు. కాని, ధర్మబలాన్ని గౌరవించేవారని ఈఘట్టం తేల్చిచెప్పింది. ధర్మజ ధర్మవీర ప్రవృత్తికి ఈ సన్నివేశం బలవర్ధకం.

7. ద్రౌపదీ శ్రీకృష్ణుల సంభాషణం మహాభారత కథార్థాలలో ఒక కీలకాంశాన్ని ప్రకటించింది. అలనాడు మయసభలోని ద్రౌపది నవ్వు కురుసభలో చిచ్చురేపింది, అవమానాగ్నిని ప్రజ్వలింపచేసింది. ఆ కురుసభలో ద్రౌపది తన కందరున్నా ఎవ్వరూ లేని దానివలె ఒంటరిది అయి నిలిచిన ఆ దారుణక్షణంలో కర్ణుడు ఆమెను చూచి నవ్విన నవ్వు దుశ్శాసనుడి దుశ్చర్యకంటె దుర్భరంగా అగ్నిశిఖవలె ద్రౌపది హృదయాన్ని దహించి వేస్తున్నది. కౌరవుల సంహార మంతా ఒక యెత్తు. ఆ కర్ణుడి చావొక్కటి ఒక్కఎత్తుగా ఎత్తిచూపింది- ద్రౌపది. ఇది మహాభారత యుద్ధంలో కడుజటిలమైన సమస్య. అది కాలం తీర్చవలసిందే. లేదా కాలపురుషుడైన శ్రీకృష్ణుడు నిర్వహించవలసిందే. అందుకే ద్రౌపది గోవిందుడితో నివేదించుకొన్నది. అతడు అర్జునుడిచేత కర్ణుడికి చావు మూడుతుందని అభయమిచ్చాడు. త్రోవలు తెరువబడని భవిష్యత్తులోని ఒక పరమార్థాన్ని పరమాత్ముడు అవ్యక్తంగా ఆవిష్కరించాడు. ఆరణ్యపర్వంలోని తరువాతి కథ శ్రీకృష్ణుడి అభయానికి అనుకూలమైన ద్వారాలు తెరిచేదే. ఆ సత్యాన్ని భక్తాగ్రగణ్యుడైన అర్జునుడు ద్రౌపదికి చెప్పి ఆమె నోదార్చాడు.

ఉ. ‘ఈ పురుషోత్తముండు మన కిందఱకుం గుశలంబు సేయుచుం
బాపకలంక పంకములఁ బాయఁగఁ జేయుటఁ జేసి దుర్మదో
ద్దీపిత శత్రుసంహతి హతిం బరమార్థమ పొందు; నేల సం
తాపము నీకుఁ జేయఁగఁ ద్రిధామజయోన్నతి గల్గి యుండఁగన్’ **(ఆర. 1.143).**

శ్రీకృష్ణుడి వాక్యాలవలన అరణ్యాజ్ఞాతవాసాల తరువాత జరిగే మహాయుద్ధంలో అర్జునుడు ఏకైకవీరుడై కౌరవ వీరులనూ, బలాన్నీ నాశనం చేయటం తథ్యం అని తెలుస్తున్నది. అర్జును డటువంటి లోకోత్తర వీరుడుగా ఆరణ్యపర్వంలోనే పరిణతి చెందుతాడని కథాధ్వని.

8. సౌంభకాఖ్యానం పాండవేతివృత్తంలోని ఒక సూక్ష్మమైన అంశానికి సమాధానం చెపుతున్నది. సభాపర్వంలో పాండవుల చెంత శ్రీకృష్ణ డెందుకు ఉండలేకపోయాడు? వారిని భద్రమైన పంథాలో ఎందుకు నడపలేక పోయాడు? అనే ప్రశ్న పఠితల మనస్సులలో కలతపెడుతూనే ఉంటుంది. దానికి కారణం చెప్పేది సౌంభకాఖ్యానం. ధర్మజ రాజసూయం పాండవచరిత్రలో ఒక మహత్తర ఘట్టం. ఆ యజ్ఞం చేయటం వలన బహుళ ప్రజానష్టం జరిగే ప్రళయంవంటి యుద్ధాలను ఎదుర్కొనవలసి వస్తుంది. ఆ సంగతి తెలిసి తెలిసి పాండురాజుకు సద్గతి కల్పించాలని శ్రీకృష్ణుడి సలహాతో ధర్మరాజు రాజసూయం చేశాడు. అందులో శ్రీకృష్ణుడిని పెద్దగా చేసి పూజించాడు. అప్పుడే శిశుపాలుడితో వైరం ఏర్పడింది. రాజసూయం ముగిసిందో లేదో యజమాని అయిన ధర్మరాజు మాయాద్యూతంలో రాజ్యసంపదను కోల్పోవలసి వచ్చింది. మరి ఆ యాగంలో పూజలందుకొన్న శ్రీకృష్ణుడికి తన రాజ్యాన్ని శత్రువుల నుండి రక్షించుకొనవలసిన వచ్చింది. సౌంభక నగరాధిపతి మాయాయుద్ధ నిపుణుడైన సాల్వుడు. అతడు శిశుపాలుడి తమ్ముడు. అన్నను చంపిన శ్రీకృష్ణుడిపై పగ తీర్చుకొనటానికి ఆరునెలలు మాయాయుద్ధం చేశాడు. రాజసూయ యాగంవలన కలిగే విపత్తును భగవంతుడైన శ్రీకృష్ణుడు ఆరునెలలకైనా తప్పించుకొనగలిగాడు. మరి ధర్మజుడు పదమూడేళ్ళు అరణ్య అజ్ఞాతవాసాల పాలు కావలసివచ్చింది. పాండవులకు శ్రీకృష్ణ సహాయంయొక్క మహత్వాన్ని ధ్వనింపచేసే ఈ ఉపాఖ్యానం పరమరమణీయం.

9. మార్కండేయాది మహర్షులు పాండవులను దర్శించటం, వా రా మహర్షులను పూజించటం, వారివలన ధర్మరాజు బహుధర్మవిశేషాలను గ్రహించటం అనేది ఆరణ్యపర్వంలో దాదాపు నిత్యకృత్యంగా సాగే జ్ఞానయజ్ఞం. దీనివలన ధర్మజుడికి కలిగే భావిశుభోదయాలను గురించి బకదాల్భ్యుడనే ముని ఈ విధంగా వ్యాఖ్యానించాడు - ‘బ్రాహ్మణానుగ్రహంబునంజేసి తొల్లి వైరోచనాదు లనేక కాలంబు లక్షయలక్ష్మీ విభవులయి సముద్రనేమి భూచక్రంబు రక్షించిరి; యనిలసహాయుం డయిన యగ్నిదేవుం డరణ్యంబులు దహించునట్లు బ్రాహ్మణసహాయుండయిన మహీశుండు శత్రువర్గంబు నిశ్శేషంబు సేయు... మీరు

బ్రాహ్మణప్రియులరు ధర్మనిత్యుల; రెప్పుడును మీ కభ్యుదయం బగు'. (1.207) ఇది పాండవ భావివిజయ రహస్యం. ఇది ఆరణ్య పర్వమంతా ప్రపంచించబడింది.

10. ద్రౌపదికి ధర్మరాజుకు, భీమధర్మజులకు నడుమ జరిగిన సంవాదాలు భావికథకు పరమ రమణీయమైన పూర్వరంగ ప్రక్రియలు. ద్రౌపదీభీముల వాదాల తాత్పర్య మిది : -

(1) వన్యమూల ఫలాలు తిని కోపం చల్లారి క్షత్రియులు జీవించరాదు. (2) క్షమ, పరాక్రమం అనే గుణాలను రాజు అదనెరిగి ప్రయోగించకపోతే అతడు ప్రజానురాగాన్ని, ప్రతాపాన్ని కోల్పోతాడు. (3) అల్పాపరాధం చేసినా శత్రువులను క్షమించరాదు, కౌరవులా అనేకాపరాధాలు చేశారు. వారిని అసలే క్షమించరాదు. (4) ధర్మజుడు శత్రువులపై కొద్దిగా కోపాన్ని ప్రదర్శిస్తే చాలు భీమాదులు శత్రుసంహారం చేసి రాజ్యాన్నీ, సంపదనూ సాధిస్తారు. (5) కర్మఫలసిద్ధి దైవమానుష సిద్ధం అయినప్పటికి పురుషకారం చేతనే కార్యాలు సమర్థులు సాధిస్తారు. కాబట్టి పాండవులు ఉత్సాహవంతులై శత్రువులను జయించటమే కార్యం. (6) జగత్తు ధర్మమయం. ధర్మాన్ని మించింది మరేదీ లేదు. అయినా అర్థాన్ని సాధించని ధర్మం క్షత్రియులకు యుక్తం కాదు. కరుణాపరత్వం బ్రాహ్మణధర్మం కాని క్షత్రియ ధర్మం కాదు. (7) మిత్రబలం కల రాజుకు అసాధ్యమనేది ఉండదు. అందువలన విజయప్రయాణమే తగిన ఉపాయం. (8) రాజ్యం సంపాదించిన తరువాత యజ్ఞాది పుణ్య కార్యాలు చేసి, పాపాలు పోగొట్టుకొని మచ్చ లేని చంద్రుడివలె రాజు ప్రకాశిస్తాడు. (9) అరణ్యవాసం ఎట్లాగో చేసినా, పాండవులు అజ్ఞాతవాసంలో ఎవరికీ తెలియకుండా ఉండటం అసాధ్యం. కాబట్టి యుద్ధమే శరణ్యం.

ధర్మజుడు ఈ వాదాలను నిపుణంగా సున్నితంగా ఖండించాడు. (1) కోపం పాపం, దానివలన ధర్మకామార్థ హాని కలుగుతుంది. (2) క్షమ కలవాడికి విజయం నిత్యం. క్షమావంతుడైన ధర్మజుడిని వ్యాసాది మహర్షులు ప్రశంసించారు. (3) ఇతరులు అధర్మం, అన్యాయం చేశారని ఉత్తముడు తాను ఆ బాటన పోరాదు. ధర్మం సర్వజనులకు స్వర్గారోహణ సోపానం. (4) మహాకార్యాలన్నీ బాగా విచారించి చేయవలసినవి కాని, క్షణికోద్రేకంతో కోపంతో చేయదగినవికావు. (5) వృద్ధులున్న నిండు సభలో ఒక నియమం చేసి, దానిని తప్పటం ధర్మం కాదు. (6) చంచలమైన లక్ష్యంకొరకు స్థిరమైన సత్యధర్మాలను త్యాగం చేయరాదు. (7) కౌరవుల మిత్రబలాన్ని కూడ ముందుగా మనం గణించి, దానిని జయించే ఉపాయాన్ని కనుగొనాలి. అనాలోచిత ప్రయత్నం ప్రమాదకారి. (8) శత్రువులను జయించటం ప్రస్తుతం భీమాదు లనుకొంటున్నంత సులభం కాదు. కర్ణుడు అభేద్యకవచుడు. అతడిని తలచినప్పుడెల్లా ధర్మజుడికి రాత్రిళ్ళు నిద్రపట్టదు. భీష్మ, ద్రోణులు అపార దివ్యాస్త్రకోవిదులు, వారిని ముందుగా జయిస్తే కదా ఆ తరువాత దుర్యోధనుడిని సంహరించగలిగేది. వారందరిచేత అతడు సురక్షితుడు. కాబట్టి విజయం అంత సులభం కాదు. (9) కాబట్టి కర్ణాదివీరులను చంపగలిగే శక్తి యుక్తులను సంపాదించాలి. అరణ్య, అజ్ఞాత వాసాలు నిర్వహించాలి. ధర్మయుద్ధం చేయాలి. పురుషకారంతో దైవయత్నాన్ని కూర్చుకొని విజయం సాధించాలి.

10. ద్రౌపదీభీముల వాదాలన్నీ కర్ణ భీష్మ ద్రోణ సంహార శక్తియుక్తుల సంపాదన లేకపోతే నిష్ఫలాలే అని ధర్మరాజు తేల్చి చెప్పాడు. ఇంతవరకు పూర్వకథకు సంబంధించిన విచారం సాగింది. ఇక్కడినుండి భవిష్యత్ కార్యక్రమం మొదలౌతుంది.

11. భీష్మ ద్రోణ కృపాచార్య కర్ణులను వధించగల ఉపాయాన్ని అన్వేషిస్తున్న ధర్మజుడికి శాంతిలేదు. కృష్ణద్వైపాయనుడు ధర్మజుడి మనోభారాన్ని దివ్యజ్ఞానంవలన తెలిసికొని, అతడి మనోవేదనను తగ్గించటానికై వచ్చాడు. అధిక యోగంవలన సిద్ధించేదీ, అతిరహస్యమైనదీ అయిన విశేషవిద్య 'ప్రతిస్మృతి'ని ధర్మజుడికి ఉపదేశించి, దానిని అర్జునుడికి అందించుమని అదేశించాడు. 'ఆ మహా విద్యాశక్తి వలన అర్జునుడు తపోవీర్యవిభవు డౌతాడు. అష్టదిక్పాలకులు, పరమేశ్వరుడు ప్రత్యక్షమై దివ్యాస్త్రాల నిస్తారు. వాటి ప్రభావంతో భీష్మాది వీరుల నందరినీ అతడు చంపగలుగుతాడు' అని పేర్కొన్నాడు. దీనినుండి

పుట్టినవే పాశుపతాస్త్ర సంపాదన కథ. ఇంద్రాదిదేవతలు వివిధ దివ్యాస్త్రాలను ప్రసాదించిన కథ, ఆ తరువాత అర్జునుడు దేవలోకానికి దివ్యరథం మీద వెళ్ళి, ఇంద్రుడి అర్ధసింహాసనగౌరవం పొంది, పాశుపతాస్త్రాది ప్రయోగంతో నివాత కవచాది రాక్షసులను పౌలోమకాలకేయాది దానవులను సంహరించి, దేవలోకానికి పరమ హితాన్ని చేకూర్చిన కథ, ఊర్వశి శాపంవలన అర్జునుడు అజ్ఞాత వాసకాలంలో ఇతరులచేత గుర్తించబడకుండా నపుంసకుడిగా ఆడువారి నడుమ ఉండే అవకాశాన్ని పొందిన కథ. నృత్య వాద్య నాట్య విశేషాదులను వజ్రధరుడి వద్ద నేర్చుకొనటానికై అర్జునుడు అయిదేళ్ళు అమరలోకంలో ఉన్న ఉదంతం, అర్జునుడు తిరిగి వచ్చిన తరువాత ఇంద్రుడు ధర్మజుడి యెదుట ప్రత్యక్షమై అర్జునుడు దివ్యవీరుడైనాడని ప్రకటించిన ఉదంతం. ఇవన్నీ వ్యాసమహర్షి మంత్రప్రభావంతో మొదలైన విజయపరంపరలే.

'పాశుపతాస్త్రంచేత అఖిల లోకాలను జయించగల' వన్న పరమేశ్వరుడి వరం -

క. 'ద్రోణ ద్రోణజ కృప గీ
ర్వాణనదీజాంగపతు లవశ్యమును భవ
ద్బాణహతిఁ జేసి సమర
క్షోణిఁ బరిక్షీణబలు లగుదు రవజితులై' **(ఆర. 4.88)**

అన్న ఇంద్రుడివరం పొంది, అర్జునుడు

క. 'ఇమ్ముల ధర్మజునకు జన
సమ్మతునకు రిపుజయంబు సకల మహీ రా
జ్యమ్ము సమకూరె నేఁడు ఘ
నమ్ముగ సర్వప్రయోజనమ్ములతోడన్' **(ఆర. 1.335)**

అని భావించటంలోనూ, అర్జునుడు సాధించిన దివ్యాస్త్రాలనూ దేవలోక విజయాలనూ విని ధర్మజుడు. 'చతురంభోధి పర్యంత మహీరాజ్యాన్ని అప్పుడే పొందినట్లు సంతసించటంలోనూ' (4.90) ఆరణ్య పర్వ కథార్థ ప్రయోజనాలన్నీ ఫలవంతమైనట్లు నన్నయ సూచించాడు. ఆరణ్యపర్వంలోని అర్జునతపోబలవీరాలు పాండవ విజయానికి నాందీగీతాలు. ధర్మజుడి అర్థనిర్ణయశక్తికి, మంత్ర ప్రయోగయుక్తికి దివ్యోదాహరణాలు. దేవత లందరిలో లయకారుడు పరమేశ్వరుడు. అమృతంతో కలిసి పుట్టిన పాశుపతాస్త్రం పొందగలిగింది ఆ మహాదేవుడి తరువాత పార్థమహావీరుడే! అర్జునుడు అనన్య సామాన్య వీరుడుగా అభివృద్ధిని సాధించి, ధర్మజుడి చింతను బాపిన ఘట్టం ఆరణ్యపర్వం.

12. అరణ్యపర్వంలో అర్జునుడి విజయగాథ ఆయువుపట్టు వంటిది. దానినంతా ఒక్కచోట వరుసగా చెప్పకుండా సందర్భోచితంగా పరచి చెప్పటంలో నన్నయ ప్రసన్న కథాకవితార్థయుక్తిని ప్రదర్శించాడు. కాలక్రమ పద్ధతిలో కొంత, కార్యకారణ క్రమ పద్ధతిలో కొంత, ఆ కథ చెప్పటంలో శిల్పంతో పాటు ప్రయోజనంకూడా నన్నయ సాధించాడు. ఎట్లాగంటే-

(1) పాశుపతాస్త్ర సంపాదనం నుండి ఊర్వశి శాపం వరకు జరిగిన కథను అరణ్యపర్వ ప్రథమాశ్వాసంలో చెప్పి 'ప్రతిస్మృతి మంత్రసిద్ధి పరిపూర్ణమైనట్లు, అది అర్జునుడి తపశ్శక్తికి సద్యఃఫలమైనట్లు చిత్రించటం కాలక్రమ కథాకవితా శిల్పం. (2) ఆ కథ ధర్మజాదులకు తెలియకుండా ఉండేటట్లు రోమశ మహాముని దర్శనమయ్యేంత వరకు (ద్వితీయాశ్వాసం చివరి దాకా) రక్షించటం కథలో ఉత్కంఠను పెంచటానికి ఉపయోగపడింది. (3) దేవసభలో నరుడికి అర్ధసింహాసన గౌరవమిచ్చి ఇంద్రుడు రోమశుడితో పల్కిన మాటలు ధర్మరాజుకు పంపే సందేశంలో ఉపశమన మంత్రాలుగా నిబంధించబడటం విశేషం.

క. 'బలవంతులైన భీష్మా
దుల నర్జునుఁ డోర్చు నూర్జితుండై మఱి పో

రులఁ గర్ణుండు పదాఱవ
కళకు సమానుండు గాఁడు గవ్వడితోడన్' **(ఆర. 2-294)**

అనే పద్యంలో కర్ణుడిని గురించి ప్రత్యేకంగా చెప్పినమాట ధర్మరాజు చిత్తశోకం శాంతించటానికే. 'అర్జునుండు మనుష్యుండు కాఁడు దివ్యపురుషుండు' అని ఇంద్రుడు ప్రకటించటం పాండవులలో ఆతడి ఆధిక్యాన్ని ప్రకటించటానికే. (4) దేవకార్యాన్ని ముగించుకొని అర్జునుడు తిరిగివచ్చే వరకు ధర్మరాజు తీర్థయాత్రలు చేయాలని దేవేంద్రుడి హితవు. తీర్థయాత్రల వలన ధర్మజుడు కూడ దివ్యపురుషు డౌతాడు. అర్జునుడి అన్నగా యోగ్యతను రక్షించుకొనాలంటే తీర్థయాత్రలలో ధర్మజుడు తపస్విగా జీవనవ్రతాన్ని సాగించవలసిందే. అందుకే 'నిరతముగఁ దీర్థసేవాపరులగు శాంతాత్ములకుఁ దపస్వులకును దుష్కర మెద్దియు లేదు' (2.296) అని ఇంద్రుడు హెచ్చరించాడు. (5) తీర్థయాత్రలు చేస్తున్నంత సేపూ అర్జునుడిని చూడాలన్న తపన పాండవులందరిలో కనపడుతుంది. అది వియోగబాధగా పరిణతి చెందింది కూడా. కాని, ధర్మజుడు వైతరణీ స్నానం చేసి అఖిలలోకాలనూ దివ్యదృష్టితో దర్శించి, ముప్పైవేల యోజనాల దూరంలో ఉన్న వైఖానసుల వేదధ్వనిని వినగల్గిన 'నీవు దివ్యుండవు' (3.120) అని రోమశుడిచేత ప్రశంస లందుకొన్న తరువాతే అర్జునుడి పునర్దర్శనమైనట్లు రచించటం కథాకథన శిల్పం. (6) అర్జునుడు తన విజయగాథను స్వయంగా చెప్పి, పాండవులతోపాటు పఠితల ఆసక్తిని కూడ పోషించే ఈ కథాకథనం కార్యకారణ సంబద్ధ శిల్పానికి సంబంధించి ఉండటం విశేషం. (7) అర్జునుడి దివ్యాస్త్ర ప్రయోగ ప్రౌఢిని విన్న ధర్మజుడు కళ్ళారా చూడాలని కోరటం ఆతడి కార్యదృష్టికి నిదర్శనం. 'లక్ష్యాలు లేకుండా దివ్యాస్త్ర ప్రయోగాలు చేయటం వలన లోకాలు సంక్షోభిస్తా'యని నారదుడు చెప్పగా, సంతృప్తి చెందిన ధర్మరాజు వాటిని కురుక్షేత్ర యుద్ధంలో శత్రులక్ష్యాలపై ప్రయోగించే పార్థుడి పరాక్రమాన్ని చూడాలనే ఆశతో ఆరణ్యపర్వ జీవితాన్ని నిర్భయంగా గడపగలిగాడు. పర్వారంభంలో ధర్మజుడి హృదయంలో బడబాగ్నిగా రగులుతున్న భీతి పర్వమధ్యంలోనే తొలగింది. విజయం తథ్యమని తేలింది.

13. బృహదశ్వుడు చెప్పిన నలోపాఖ్యానం కథలో రెండు ప్రయోజనాలను సాధించింది. ఒకటి: ధర్మరాజు అధర్మపరులైన శత్రువులచేత మోసగించబడి రాజ్యాన్ని, బంధువులను వదలి అడవులలో ఉన్నాడు. తన వలె పూర్వం ఎవరైనా కష్టాలుపడ్డారేమో తెలిసికొందామని ధర్మజుడు భావించాడు. తమవలె ఇతరులు కూడ కొందరు బాధపడ్డారని తెలిస్తే, ధర్మజుడికి కొంత దుఃఖోపశాంతి కలుగుతుంది; పుణ్యకథాశ్రవణం ఫలం లభిస్తుంది. వారి జీవితాలలోనుండి ఏదైనా ఉపదేశం గ్రహించటానికి వీలౌతుంది. ధర్మరాజు చిత్తశాంతికి నలుడి కథ తోడ్పడింది. రెండు : నలుడు పుష్కరుడితో ఓడిపోవటానికి కారణం అతడికి అక్షహృదయ విద్య తెలియకపోవడమే. అట్లాగే శకుని వలన ధర్మరాజు జూదంలో ఓడటానికి కూడ అదే కారణం. నలుడు ఋతుపర్ణుడి వలన అక్షహృదయం పొందినట్లుగానే ధర్మజుడు కూడ బృహదశ్వుడి వద్ద అక్షహృదయాన్ని ఉపదేశం పొందాడు. ఆనాటితో ధర్మజుడు ఇకముందు కపటద్యూతంలో సైతం ఓడిపోయే అవకాశం జీవితంలో ఏర్పడదని ధ్రువపడింది. మరొకమాటలో చెప్పాలంటే ధర్మరాజు కౌరవుల దుర్నీతికి మూలమైన శకుని అక్షవిద్యను గెలిచాడు. ఇక కౌరవులకు మిగిలింది భీష్మాదివీరుల పౌరుషమే. దానిని అర్జునుడు జయించాడు. ధర్మజుడి విజయం మరొకసారి ధ్రువపడింది.

14. ఆరణ్యపర్వంలోని తీర్థయాత్రల వర్ణన ఘట్టాలను మూడు దశలుగా విభజించవచ్చును. మొదటిది నారద ప్రోక్తమైన తీర్థమాహాత్మ్య కథనం. దానివలన ధర్మజుడికి తీర్థయాత్రలమీద ఇచ్ఛ జనించింది.

క. 'సకల దురితములఁ బాయుదు
రకలంకమనస్కు లగుదు రార్యోత్తమవ

ర్తకు లగుదురు సజ్జనగుణ
నికరంబుల వెలయుదురు సునిశ్చితమతులై ' **(ఆర. 2.283(ఆ))**

అనే ప్రబోధం మనసులో బాగా కుదురు కొన్నది. సునిశ్చితమతితో సకల తీర్థాలను సేవించాలని నిశ్చయించుకొన్నాడు ధర్మజుడు. అర్జునుడు దివ్యాస్త్రాలతో తిరిగి వచ్చేంతవరకు తీర్థయాత్రలలో భూవలయాన్నంతా తిరిగి వచ్చేందుకు ధౌమ్యుడి ప్రబోధాన్ని పొందాడు. అంటే - ఇచ్ఛాశక్తి క్రియాశక్తిగా రూపొందిందన్నమాట. దానికి దైవశక్తి (లేదా జ్ఞానశక్తి) చేకూరినట్లుగా రోమశుడు దేవేంద్రుడి ఆదేశంతో వచ్చాడు. ధర్మజుడి వెంట నుండి తీర్థాలను సేవింపజేశాడు. నారదుడు చెప్పగా తీర్థాలనుగురించి ధర్మజుడికి శ్రుతపాండిత్య మబ్బింది. విన్నస్థలాలను కంటితో చూపించి రోమశుడు వాటి మాహాత్మ్యాలను సంగ్రహించి చెప్పటంవలన ధర్మరాజుకు జ్ఞానశక్తి బలపడింది. గమనిస్తే - రోమశుడు చెప్పిన ఉపాఖ్యానాలన్నీ క్షేత్రమాహాత్మ్య ప్రతిపాదకాలైన ఉపాఖ్యానాలు. అవి జ్ఞానబోధకాలు. ధర్మజుడి ఇచ్ఛాక్రియాజ్ఞానవృత్తుల పరిపోషకం రోమశమహర్షి చెప్పిన కథాప్రవాహం. ఆరణ్యపర్వంలో ఆ ఉపాఖ్యానాల సార్థక్యం అటువంటిది.

15. ఆరణ్యపర్వకథ స్థూలంగా రెండు భాగాలుగా సహజంగా విభక్తమై ఉంటుందని భావించాం. ఆ రెండు భాగాలలో మొదటిది నన్నయ, రెండవది ఎఱ్ఱయ రచించటం ఒక విశేషం. మొదటి భాగం నహుష ప్రశ్నలతో స్థూలంగా ముగుస్తుంది. రెండోభాగం- యక్షప్రశ్నలతో ముగుస్తుంది. ఈ సమవిభక్త భాగాలలో కొన్ని సమాన కథాంశాలను తులనాత్మకంగా దర్శించగలం. ఆ అంశాలు ఆరణ్యపర్వ కథాకథన శిల్పసంపదలు. మచ్చుకు కొన్ని -

**1. మూడు జంటల ముక్తాయింపు** : ఆరణ్యపర్వంలో - పాండవ పక్షంలో, కౌరవపక్షంలో, ఋషుల పక్షంలో పాత్రలు మొత్తం తొమ్మిది జంటలు కనపడుతుంటారు. పాండవులలో - ధర్మరాజు, అర్జునుడు; భీముడు, ద్రౌపది; నకుల సహదేవులు. కౌరవులలో - దుర్యోధనుడు, కర్ణుడు; శకుని, ధృతరాష్ట్రుడు; విదురుడు, సంజయుడు; ఋషులలో- నారదుడు, వ్యాసుడు; రోమశుడు, మార్కండేయుడు; మైత్రేయుడు, బృహదశ్వుడు. వీరందరి వ్యక్తిత్వాలు స్పష్టమయ్యేటట్లు ఆరణ్యపర్వంలోని కథలు రాణించటం విశేషం.

పై జంటలలో కానవచ్చే సమానగుణాలను ఈవిధంగా వివేచించవచ్చును.

1. ధర్మజుడు, అర్జునుడు - పురుషకారానికి తీర్థయాత్రలతో తపస్సుతో దైవానుకూల్యం కల్పించటం.
2. భీముడు, ద్రౌపది - పురుషకారానికి ప్రాధాన్యమిచ్చి సాహసాలు చేయటం.
3. నకుల సహదేవులు - తమ భావా లేవైనా ధర్మజుడిని సమర్థించటం.
4. దుర్యోధన కర్ణులు - పాండవులను ఏ విధంగానైనా మట్టుపెట్టాలని ఆగ్రహంతో వ్యూహాలు పన్నటం.
5. ధృతరాష్ట్ర శకునులు - పాండవ పక్షపాతులను ద్వేషించటం.
6. విదుర సంజయులు - న్యాయమైన సలహాలను ప్రభువుకు అందించటం. అతడు అంగీకరించకపోతే ఊరుకొనటం, పొమ్మంటే వెళ్ళిపోవటం - కాని, తమ మనస్సులు మార్చుకొనకపోవటం.
7. నారద వ్యాసులు - త్రికాలజ్ఞులు, సార్వకాలిక శ్రేయస్సులను సూచించేవారు, ఆచరించేవారు.
8. రోమశ మార్కండేయులు - సృష్టి స్థితి లయాలను గురించి గాని, సర్వలోకవిశేషాలను గురించిగాని బహుపురాణ విజ్ఞాననిరతులుగా దార్శనికులుగా మాట్లాడేవారు.

9. మైత్రేయుడు, బృహదశ్వుడు - పూర్వకథా ప్రవచన కుశలురు. శాపానుగ్రహశక్తి యుక్తులు.

ఈ పాత్రలను ఈ ప్రవృత్తులతో చిత్రించటంలో నన్నయఎఱ్ఱయలు కూడా - ఒక కాలంలో నివసించి ఉండకపోయినా ఒక భావంతో మహాభారత రచనను నిర్వహించిన కవులజంటవలె కనిపిస్తారు.

2. పాండవులలో ధర్మజుడి ఆధిక్యం నిరూపించి అతడియందు నాయకత్వం స్థాపించడం కథా కథన శిల్పంలోని అంతస్సూత్రం. నన్నయ ఎఱ్ఱన్నలు నిపుణంగా ఆ శిల్పాన్ని పోషించారు. మొదటి భాగంలో అస్త్రశస్త్రబలానికి దైవబలానికి ప్రతీకగా అర్జునుడు అనన్యసామాన్య వీరుడుగా నిలిచాడు. భీముడు కిమ్మీర జటాసుర సంహారం చేసి, సౌగంధికాపహరణ సందర్భంలో యక్షరాక్షససైన్యాన్ని సంహరించి, బాహుపరాక్రమంలో ప్రశంస లందుకొన్నాడు. వీరిద్దరికంటె జ్ఞానంలో గొప్పవాడని నిరూపించబడాలి- ధర్మరాజు, అప్పుడే అతడి నాయకత్వం స్థిరపడుతుంది. నహుష ప్రశ్నలు ధర్మజుడి జ్ఞానశక్తికి పతాకలుగా నిలిచాయి. బాహు తపోబలాలకంటె, జ్ఞానబలం  మిన్న అని మొదటి భాగంలో నిరూపిత మైనది. అది నన్నయ రచనలో ఆవిష్కరించబడింది.

ఇక రెండవ భాగంలో మార్కండేయుడు చెప్పిన కథలు ధర్మజుడి జిజ్ఞాసకు పోషకాలు. మొదటి భాగంలో భీమార్జున పరాక్రమాలు విడివిడిగా ప్రదర్శించబడగా, రెండో భాగంలో వారిరువురి పరాక్రమాలు సంయుక్తంగా వర్ణించబడ్డాయి. - అటు ఘోషయాత్రలో, ఇటు సైంధవ పరాభవ ఘట్టంలో. చివరకు మహావీరులైన వారిద్దరు యక్షుడి ముందు విగతజీవులై పోయారు. యక్ష ప్రశ్నలకు సమాధానం చెప్పి ధర్మజుడు వారిని బ్రతికించాడు. ధర్మదేవతను మెప్పించి అజ్ఞాతవాసంలో పరులచేత గుర్తించబడకుండా భద్రంగా ఉండే వరాన్ని పొందాడు. ఆరణ్యపర్వం ముగిసే సరికి ధర్మజుడి హృదయంలో ఉండే కర్ణాది వీరులవలని భయం, భీమాదుల హృదయంలో ఉండే అజ్ఞాతవాస వ్రతాన్ని గురించిన భయం తొలగిపోయాయి. అది పురుషకారం వలన, దైవానుకుల్యంవలన సిద్ధించింది. అట్లా చిత్రించటమే ఇతిహాసకథా స్వభావం.

**ఆరణ్య పర్వం - నన్నయ భాగం :**

ఆరణ్యపర్వంలో నన్నయ దాదాపు 1300 పద్యగద్యాలు రచించాడు. వాటిలో సగం భాగం ప్రధానకథకూ, మిగిలిన సగం ఉపాఖ్యానాలకూ, తీర్థయాత్రా విశేషాలకూ వెచ్చించి, ఒక సమతౌల్యాన్ని పాటించాడు. నన్నయ భాగంలోని వస్తువిన్యాసం కూడా అందుకు తోడ్పడింది. ఎఱ్ఱయ భాగంలో వస్తువులోనే ఆ సమతౌల్యం లేకపోవడం చేత ఆయన పాటించలేదు. అందులో దోష మేమీ లేదు.

నన్నయ సారమతులైన కవీంద్రులు లోనారసి మేలనేటట్లు కథ చెప్పగలడు. కథ చెప్పటంలోకూడా వస్తువును కవితామయం చేయగలడు. వాచ్యలక్ష్యవ్యంగ్యార్థాల సంయోజనంతో కథను ప్రసన్నం చేయగలడు. అక్షర రమ్యతతో రచనకు తరుగని అందాన్నీ, ఆస్వాదయోగ్యతనూ కల్పించగలడు. నానారుచిరార్థ సూక్తి నిధులతో రచనను రమణీయంగా రసోదంచితంగా రాణింపచేయగలడు. నన్నయకు తాను ప్రదర్శిస్తున్న కథా కథన శిల్పరీతిలోని ప్రతిభను ఆశ్వాసాంతంలో అప్పుడప్పుడు సూచించటం అలవాటు. వైశంపాయనుడు ఆదిపర్వకథను 'ఇమ్ముగా' చెప్పాడని ఆదిపర్వం చివర పేర్కొన్నాడు. రమ్యతకు తెలుగుపదం ఇమ్ముగా నన్నయ వాడాడు. సభాపర్వ ప్రథమాశ్వాసం చివర వైశంపాయనుడు రసోత్కటంగా కథ చెప్పాడన్నాడు. ఆది సభాపర్వాలలో ఒకటి రెండు చోట్ల మాత్రమే తన రచనా రమణీయతను గురించి పేర్కొన్న నన్నయ ఆరణ్యపర్వంలో ప్రతి ఆశ్వాసాంతంలోనూ ఒక ప్రత్యేకతను పేర్కొని, పఠితల దృష్టిని తన కవితాకళపై కేంద్రీకరింపజేశాడు. ప్రథమాశ్వాసాంతంలో 'పుణ్యకథ యతిరమణీయంబుగా' చెప్పినట్లు, ద్వితీయాశ్వాసాంతంలో 'కథాక్రమం బతి రమ్యంబుగా' చెప్పినట్లూ, తృతీయాశ్వాసాంతంలో 'కథ రమ్యంబుగ' చెప్పినట్లు ప్రత్యేకించి చెప్పుకొన్నాడు. మొత్తానికి అన్నీ కలిసి ఆరణ్య పర్వకథకు వర్తిస్తాయన్నది రమణీయ సత్యం.

**పుణ్యకథ - రమణీయత - రమ్యత :**

"పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అన్నట్లు, కథలయందు పుణ్యకథలే వేరని స్పష్టం. పుణ్యుల కథలు, పుణ్యం కలిగించే కథలు పుణ్యకథలు. చదివినవారికి పాపం కరిగిపోయి, పుణ్యభావం పెరిగిన అనుభూతి నిచ్చేవి, ఉపదేశాత్మకాలైనవి కూడా పుణ్యకథలే. ఆరణ్యపర్వం వాటికి కాణాచి. వాటిని ఏకవాక్యతతో కూర్చి అందంగా చెప్పటం రమణీయత్వం. కథ చెప్పేక్రమంలో, కథలు అమర్చే క్రమంలో ఉన్న సంవిధానశిల్పం రమ్యత. కథ రమ్యంగా ఉందంటే నిర్మాణంలోనే కాక కవితాపరంగా కూడా ఆస్వాద యోగ్యంగా ఉన్నదని తాత్పర్యం. నన్నయ కథను, కవితను రమణీయంగా, రమ్యంగా తీర్చిదిద్దినట్లు తాత్పర్యం ఏర్పడింది.

ఆరణ్యపర్వంలోని ప్రధాన కథలో పుణ్యకథగా మొదట పేర్కొని తగింది పాశుపతాస్త్ర ప్రదానం, అర్జునుడు నివాత కవచాదులను సంహరించటం. ఆ కథను రెండాశ్వాసాల మీద పరచి చెప్పటం రమణీయం. దాని సార్థక్యాన్ని ముందే గమనించాం. ప్రతిస్మృతి మంత్ర ప్రభావంతో అర్జునుడి తపస్సు ఫలించటం, పరమేశ్వరుడు ప్రసన్నుడు కావటం ఒక విశేషం. నరుడు పరమేశ్వర శరీరాన్ని స్పృశించ గలగటం అపూర్వం. అది అమోఘ పుణ్యఫలం. అర్జును డా పుణ్యఫలాన్ని పరవశించి కీర్తించాడు.

క. 'మంటి హరుదేహ మంటం
గంటి నుమాధీశు నసురకంటకహను ము
క్కంటిఁ గఱకంఠుఁ జూడం
గంటిఁ గృతార్థుండ నైతిఁ గడుఁబుణ్యమునన్'. **(ఆర. 1.334)**

ఈమాటలను నరుడితోపాటు సహృదయుడు కూడా తాదాత్మ్యంతో భావించి పుణ్యకథా శ్రవణ రామణీయకాన్ని ఆస్వాదించగలుగుతాడు.

కథ పుణ్యప్రదం. కవిత అతిరమణీయం. నన్నయ రచనలో భక్తివీరరసాన్ని పోషించే కవితా పాకం ఈ ఘట్టంలో పరిమళించినట్లు మరొకచోట కానం. నన్నయ వ్రాసిన ఏకైక దండకం. ఈ ఘట్టంలోనే ఉన్నది. తెలుగువారి నాల్కల మీద అది నేటికీ లాస్యం చేస్తున్నది.

క. 'హరు శరమును నరు శరమును
సరి నిరుపక్కియలు దాఁకి జవ మఱి శరసం
భరమునఁ దిరిగె వరాహము
శరనిధి మథనమునఁ దిరుగు శైలము పోలెన్' **(ఆర. 1.306)**

ఇది వృత్త్యనుప్రాసంగా కవితకు రామణీయకాన్ని ప్రసాదిస్తున్న నన్నయ అక్షర రమ్యత. పోతన్న కవితకు ఈ కందం మూలకందంవలె అందంగా ఉండటం సహృదయ హృదయైకవేద్యం.

పాశుపతాస్త్ర ఘట్టంలో పార్థుడు ప్రదర్శించింది తపోవీరం, యుద్ధవీరం. కాని, నన్నయ ఆ రెండింటిని అతడి భక్తి వీరానికి అంగంగా చేశాడు. ఈ రస ప్రవృత్తిని బట్టి నన్నయ కవితలో గుణనిష్పత్తి రూపుకట్టి కవితకు రామణీయకాన్ని కలిగిస్తుంది. శుద్ధ యుద్ధ వీరమైతే ఓజస్సు రాజ్యం చేస్తుంది. తపోవీరమైతే ఓజోమిశ్రితమైన ప్రసాదం సమంజసంగా ఉంటుంది. అదే భక్తి వీరమైతే ప్రసాదం, మాధుర్యం రమ్యంగా రాణిస్తాయి. నన్నయ గుణ ప్రధాన రచన చేసే మహాకవి కాబట్టి ఈ రహస్యాన్ని తన కవితాశైలిలో ప్రాణచైతన్యంగా ప్రవహింప జేశాడు. ఈ ఘట్టంలో ప్రసిద్ధమైన పద్యాలు అయిదున్నాయి. అయిదూ రమణీయతకు రమ్యాకృతులు.

అర్జునుడు తపస్సుకై బయలుదేరి వెళ్ళుతున్నాడు. ద్రౌపది సాభిమానంగానూ, సాదరంగానూ, సద్భక్తియుక్తంగానూ పలికిన ఈ పద్యం ప్రసాదమాధుర్య గుణమిశ్రమానికి ఉదాహరణం. శైలిలో పరమరమణీయం.

చ. 'అరికృత దుష్పరాభవ మహార్ణవమగ్నుల మమ్ము నందఱం
గరుణ సముద్ధరింపుము జగన్నుత! యన్యులు పూనఁగాని యీ
భరము వహింపఁ బూనిన యపారగుణోన్నతు నిన్ను దిక్కులున్
దరణియు సోముఁడున్ నభము ధాత్రియు గాడ్పును గాచుచుండెడున్.' **(ఆర. 1.285)**

ఓజోమిశ్రితమైన ప్రసాదగుణ రచనను పాశుపతాస్త్రాన్ని వర్ణించేటప్పుడు మాత్రం వాడి ప్రకరణౌచిత్యాన్ని పాటించాడు- నన్నయ. ఈఘట్టంలో ఈపద్యం సుప్రసిద్ధం.

చ. 'అవిరళ సూర్యమండల సహస్ర సమ ప్రభమై ధనంజయ
ప్రవరుకరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁ జూచి దైత్యదా
నవసురయక్షరాక్షస గణమ్ము గరమ్ము భయమ్ముఁ బొందె, నం
దవనియుఁ దిర్దిరం దిరిగె నబ్ధిశిలోచ్చయ సంచయంబుతోన్.' **(ఆర. 1.332)**

లోకభయంకరమైన పాశుపతాస్త్రాన్ని ఓజోగుణమిశ్రితమైన ప్రసాదగుణంలో వర్ణించి నన్నయ రసానుగుణమైన కవితా గుణౌచిత్యాన్ని పోషించాడు.

పాశుపతాస్త్రవర్ణనంకంటె భిన్నమైన రసవద్గుణరచన పరమేశ్వర సాక్షాత్కార వర్ణన.

చ. 'వరదుఁడు పార్థు శౌర్యవిభవంబున కాతని ధైర్యవృత్తికి
న్నరుదుగ మెచ్చి సన్నిహితుఁ డయ్యె జటామకుటేందురేఖయుం
గరమున శూలమున్ గరళకాలగళంబు బృహద్గజాజినాం
బరముఁ దృతీయలోచనముఁ బన్నగహారము నొప్పుచుండఁగన్.' **(ఆర. 1.321)**

భక్తుడి ముందు ప్రత్యక్షమయ్యే పరమేశ్వరుడి రూపవైభవాన్ని వర్ణించేటప్పుడు ఝటిత్యర్థ ప్రతిపత్తి హేతువును వస్తుస్వభావ స్ఫుటత్వంతో ప్రదర్శించే అర్థవ్యక్తిని భక్తవరప్రసాదుడిని తలపింపజేసే ప్రసాదగుణంతో మేళవించటం కవితారామణీయకం. ఈ పద్యం ప్రసాదంలో పర్యవసించే అర్థవ్యక్తి గుణానికి రమ్యోదాహరణం.

నన్నయ దీప్తరసత్వాన్ని ఉజ్జ్వలశబ్దాలతో కలిసిన కాంతిగుణంతో పోషిస్తూ దాన్ని ప్రసాదానికో, మాధుర్యానికో అంగంగా చేయటం సర్వత్రా కనబడుతుంది. కిరాతరూపంలో ఉన్న పరమేశ్వరుడి పరాక్రమాతిశయాన్ని గమనించి ఆశ్చర్యాన్ని ప్రకటించే అర్జునుడిలో అద్భుతరసదీప్తి కాంతిమంతంగా వెలుగొందుతూ రక్తికట్టిస్తుంది. ఈక్రింది పద్యం దాని కుదాహరణం.

చ. 'ఇతఁడు సురేంద్రుఁ డొండెఁ బరమేశ్వరుఁ డొండె దినేశుఁ డొండెఁ గా
కతుల బలప్రభావయుతుఁ డన్యుఁడు గాఁ డొరుఁ డైన మద్భుజా
వితత ధనుర్విముక్త శరవేగము పోర సహించి యిట్టు ల
క్షతుఁడు నమూర్ఛితుండు నయి కంపముఁ బొందక యుండ నేర్చునే?' **(ఆర. 1.312)**

ఇటువంటిదే 'ప్రతిబలదర్పభంజనుఁడు' (1.311) అనే పద్యంకూడా. ఈ రెండు పద్యాలూ జంటగా ఒకేచోట ఉండటం శిల్పపుపంట.

నన్నయ కవిత్వంలో రసోచిత గుణవద్రచనమే రమ్యత. దానిని శిల్పమయం చేయటం వలన రమణీయత ఏర్పడుతుంది. ఇక్కడ ఒక్క అంశం గమనిస్తే చాలు- నన్నయ శిల్పంలోని గొప్పతనం తెలుస్తుంది. ప్రసాదగుణం అర్జునుడి తపోవీరంలోని భక్తి భావతీవ్రతకు పోషకమని నన్నయ తీర్పు. ప్రసాదంలోనే సమయోచితంగా వివిధ గుణాలను మిశ్రమం చేసి వైవిధ్యాన్ని చిత్రించి రక్తికట్టించాడు. దానిని ఛందశ్శిల్పం ద్వారా నన్నయ వ్యాఖ్యానించాడు. పై అయిదు పద్యాలూ చంపకమాలలే. ఒకే వృత్తంలో భిన్నగుణ మిశ్రమ ప్రయోగం! సారమతులైన కవీంద్రులు లో నారసి మేలనవలసిన మేటి గుణ మది !

## మహాభారతం పారిజాత కల్పవృక్షం

ఆఖ్యానక ఉపాఖ్యానాలతో ప్రఖ్యాతి చెందిన పర్వం ఆరణ్యపర్వం. అందువలన నన్నయ ఎఱ్ఱయల ఉపాఖ్యాన రచనా వైదగ్ధ్యం ఈ పర్వంలోనే పురులు విప్పుకొన్నది. మార్గదర్శి అయిన మహర్షి నన్నయ. నిగ్గులు దిద్దిన నిపుణుడు ఎఱ్ఱయ. నన్నయ ఉపాఖ్యాన శిల్ప విచారమే ఈ పీఠికలో ప్రధానం. వలసినచోట ఎఱ్ఱయ ప్రస్తుతి తప్పదు.

ఆరణ్యపర్వంలోని ద్వితీయ తృతీయాశ్వాసాలలో ఉన్నవి చాలా వరకు ఉపాఖ్యానాలే. వాటిలో కొన్ని తెలుగు సాహిత్యంలో కావ్యగౌరవం అందుకొన్న అనర్ఘరత్నాలు. అవి మొత్తం పన్నెండు.

1. నలోపాఖ్యానం. 2. అగస్త్యవృత్తాంతం. 3. భగీరథ చరిత్రం. 4. ఋశ్యశృంగుడి కథ. 5. పరశురాముడి చరిత్ర. 6. సౌకన్యోపాఖ్యానం. 7. మాంధాతృ చరిత్రం. 8. సోమకుడి కథ. 9. శిబి చక్రవర్తి చరిత్ర. 10. అష్టావక్రుడి కథ. 11. యవక్రీతు చరిత్రం. 12. అర్వావసు వృత్తాంతం.

ఆఖ్యానంలో ఆఖ్యానక ఉపాఖ్యాన పాత్రలు విశిష్టమైనవి. ప్రధాన కథ ఆఖ్యానం. దానిలో భాగంగా దానికి ఉదాహరణంగా కానీ ఉపబలకంగా కానీ, ఉద్దీపకంగా కానీ అఖ్యానకం వర్ధిల్లుతుంది. ఉపాఖ్యానం ఆఖ్యానానికి పరిపోషకంగానూ, పరిపుష్టికరంగానూ, పరివ్యాప్తికరంగానూ అండగా నిలుస్తుంది. ఆరణ్యపర్వంలో ఆఖ్యానకాలు తక్కువ; ఉపాఖ్యానా లెక్కువ. అవి ఆఖ్యానంలో సాధించే ప్రయోజనాన్ని బట్టి చూస్తే వాటిని మూడు రకాలుగా వర్గీకరించ వచ్చును. ఒకటి - ఉదాహరణంకొరకు గానీ, ఉపరంజనంకొరకు గానీ, ఉపశమనంకొరకు గానీ, ఉత్కంఠా పరిపోషణం కొరకు గానీ, చెప్పేవి ఒకరకం. రెండు - ఉపదేశంకొరకు గాని, సందేశంకొరకు గాని, సందేహనివారణకొరకు గాని, సంస్కారంకొరకు గాని చెప్పేవి మరొకరకం. మూడు లోజ్ఞతకు గాని, తత్త్వదర్శనంకొరకు గాని, దృష్టాంతంకొరకు గాని, పుణ్యంకొరకు గాని చెప్పేవి మరింకో రకం. విశేష మేమంటే - ఉపాఖ్యానా లెన్నివిధాలుగా సాహిత్యలోకంలో ప్రవర్తిల్లటానికి వీలుందో వాటినన్నింటిని ఆవిష్కరించటానికే ఆరణ్యపర్వం ఆవిర్భవించిందా అన్నట్లు కనబడుతుంది. నన్నయ ఎఱ్ఱయలు కలిసి ఉపాఖ్యాన శిల్ప సర్వస్వాన్ని నిర్మించి తరువాతి కవులకు సమర్పించిన ఉజ్జ్వలఘట్టం ఆరణ్యపర్వం. నన్నయ ఎఱ్ఱయల తులనాత్మక అధ్యయనంలో మరెన్నో అంశాలు వెలికి వస్తాయి. వచ్చే భాగంలో వాటిని గురించి చూద్దాం. ప్రస్తుతం నన్నయ ఉన్మీలింపచేసిన ఉపాఖ్యాన శిల్పాన్ని గమనిద్దాం. నన్నయ చెప్పుకొన్నట్లుగా ఈ కథాక్రమం అతి రమ్యం.

## నలోపాఖ్యానం-శిల్పసౌందర్యం :

ఉపాఖ్యానాలలో ఉత్తమమైనది నలచరిత్రం. దానిని నన్నయ సర్వాంగ సుందరంగా శిల్పించి, మూలంకంటె అందంగా నిర్మించాడు. 976 శ్లోకాల మూలకథ నన్నయ రచనలో 226 గద్యపద్యాలలో అవతరించింది. ఇది అనువాద మనటానికి వీలులేదు. పునస్సృష్టివలె పునర్భవించింది. రసవత్ప్రబంధమూర్తికి రమణీయ ఉత్సవమూర్తిగా రూపొందింది. కావ్యేతిహాస రచనాకుశలుడైన నన్నయ ప్రదర్శించే మిశ్ర ప్రక్రియా ప్రవృత్తికి ఇది కావ్యత్వస్పృహ నందించే కథాకవితగా రాణించింది. నన్నయ నాటకీయతలో రూపకశిల్పాన్ని రూపొందించుకొన్న రమ్యకృతి ఈ నలోపాఖ్యానం!

నలోపాఖ్యానం ధర్మజుడి దుఃఖోపశాంతి కొరకు చెప్పబడిన కథ. అంటే ఉపశమన ప్రయోజనం కొరకు చెప్పిన కథ. ధర్మజుడు కపటద్యూతంలో వంచించబడ్డాడు. రాజ్యానికి, బంధువులకు దూరమై కానలలో కష్టాల పాలయ్యాడు. అటువంటి కష్టాలు మరొకడు కూడా అనుభవించాడని తెలిస్తే మనస్సు ఊరడిల్లుతుంది. అంతవరకు తా నొక్కడే అటువంటి దురదృష్టానికి గురిఅయినట్లు భావిస్తున్న ధర్మరాజు తనకు ముందు కూడా మరొక దుఃఖితుడున్నాడని తెలిసికొంటే, అతనితో తనను పోల్చుకొని, ఎక్కువ తక్కువలు అంచనా వేసికొని సరిపుచ్చుకొనటానికి వీలుంటుంది.

ఈ సత్యాన్ని గుర్తించిన బృహదశ్వుడు నలుడి చరిత్ర చెప్పాడు. అంటే - ధర్మరాజు పొందిన కష్టాలకంటె దుర్భరమైన వాటిని ఎంతో ఘోరంగా అనుభవించిన మహారాజు కథ చెప్పాడన్నమాట! నల ధర్మరాజుల కథలను పోల్చిచూస్తే నలుడికంటె ధర్మజుడే అదృష్టవంతు డనేటంత ఊరడింపు కలగాలి. నలుడికథ విన్న తరువాత ధర్మరాజు మనసు తేలికపడాలి. ఈ ప్రయోజనం కొరకు ఈ ఉపాఖ్యానం చెప్పబడింది.

నలుడికథ ధర్మజుడికథతో ఎంత సంవదిస్తుందో, అంత వివదిస్తుంది. సంవదించే అంశాలుకూడా నలుడి దురదృష్టాన్ని దుర్భరంగా చిత్రిస్తాయి. నలధర్మజులు నిత్యసత్యధర్మవ్రతులు. ఇద్దరూ ద్యూతవ్యసనం కలవారే. అయినా ఇద్దరికీ అక్షహృదయవిద్య తెలియదు. ఇద్దరూ బలవంతంగా ద్యూతానికి పిలువబడి రాజధర్మాన్ని అనుసరించి కాదనలేక అందులో పాల్గొన్నవారే. ఇద్దరూ దాయాదులతో ద్యూతానికి దిగినవారే! పుష్కరుడు కలిచేత ప్రేరేపించబడి నలుడిని ద్యూతంలో ఓడించాడు. దుర్యోధనుడు శకునిచేత ప్రేరేపించబడి ధర్మరాజును ద్యూతంలో ఓడించాడు. కలిద్వేషమే రెండింటికి కారణం. (దుర్యోధనుడు కలి అవతారం). రెండింట ఈర్ష్యకు కారణం స్త్రీ కావటం విశేషం. దమయంతి తనను వరించలేదని కలికి కోపం. ద్రౌపది తనను మయసభలో పరిహసించిందని సుయోధనుడికి రోషం. నలధర్మజులు ఇద్దరూ ఆడి ఓడించి కపటద్యూతంలోనే. రెండు సందర్భాలలోనూ పునర్ద్యూతం ప్రవర్తిల్లింది. అయితే నలుడు ఓడటానికి కారణం అతడిలో కలి ప్రవేశించి బుద్ధిని వక్రీకరించటం. దమయంతి మంత్రులు హితులు బంధువులు ఎందరు వారించినా నలుడు ద్యూతవ్యసనపరుడైన ఆ ఉన్మాదావస్థకు కారణం- కలి. మరి ధర్మజుడికి? నలుడికి కలిగిన కలిపీడ ధర్మజుడి దేహానికి లేదు, మనసుకు లేదు. ధర్మప్రవృత్తికి లేదు. ధర్మజుడు అందుకు ముందుగా కొంత ఊరట చెందుతాడు.

కథలో మిగిలిన అంశాలను కూడా ఈ తారతమ్య పరిశీలనతో చూడాలి. రెండు కథలలోనూ స్వయంవరాలున్నాయి. ఆ రెండూ వ్యాజస్వయంవరాలే. అర్జునుడిని ఉద్దేశించి ద్రుపదుడూ, నలుడిని ఉద్దేశించి భీముడూ స్వయంవరాలను చాటించారు. దాంపత్యం కూడా ఇరువురికీ పూర్వజన్మలోనే నియతమై ఈ జన్మలో అనుభవానికి వచ్చింది. ఇందులో దమయంతి సౌందర్యం దేవతలను, కలిని ఆకర్షించింది. అందులో ద్రౌపది లావణ్యం కౌరవులకు కన్నెర్ర కావించింది. కలిపగవలెనే దుర్యోధనుడి ఈర్ష్య పాండవులను పట్టి పీడించింది. అయితే, ఒక విషయంలో ధర్మజుడు నయం. రాజ్యం వెలువడి రాగానే నలదమయంతులను పల్కరించటానికే భయపడ్డారు- ప్రజలు. పుష్కరుడి దుష్టశాసనాన్ని ప్రజలు కాదనలేకపోయారు. మూడురోజులు అన్నోదకాలు లేకుండా నగరసీమలో దీనంగా నలదమయంతులు గడపవలసి వచ్చింది. ధర్మరాజుకు ఆ గతి పట్టలేదు. ప్రజలు అతడి వెంట తరలి వచ్చారు. అతడి వినతిమేరకు తిరిగి వెళ్ళారు. ధర్మబాహ్యమైన కౌరవశాసనాన్ని ధిక్కరించి వేలాది విప్రులు ధర్మజుడి వెంట అడవులకు వచ్చారు. అన్నపానీయాలకు అడవులలో కూడా లోపం రాలేదు. నలుడితో పోల్చుకుంటే ధర్మజుడు ప్రజాభిమానాన్ని చూరగొన్న ప్రభువు. అది ఒక ఊరడింపు.

చేసిన సమయాన్ని పాలించటానికి ధర్మజుడు అరణ్య అజ్ఞాతవాసాలు చేశాడు. నలదమయంతులు అభిమానంతో తమకుతాము అరణ్యవాసాన్ని గత్యంతరం లేక ఎన్నుకొన్నారు. ఇల్లాలిని ఒంటరిగా వదలిపెట్టటం, ఆమె చీరలో సగం చించుకొని పోవటం, ఆర్తరక్షావ్రతం పాటించి కర్కోటక విషానికి గురై రూపుమారటం నలుడిచరిత్రలో కలివర్తనకు ప్రతిగా కలిసివచ్చిన అదృష్టాలు. బాహుకుడి రూపం అజ్ఞాతవాసంలోని మారురూపం వంటిదే - అర్జునుడి షండరూపం వలె. వంటలవాడి వేషం భీముడి వలలరూపం వంటిదే. అశ్వరక్షణం నకులుడి అజ్ఞాతవాస సేవావృత్తి వంటిదే. బృహన్నల సారథ్యం వంటిదే బాహుకుడి సారథ్యం. ఇన్ని సామ్యాలున్నా నలుడివలె ధర్మజుడు దయనీయమైన బ్రతుకు సాగించలేదు. వనవాసక్లేశాలు అనుభవించినా పరదాస్యవృత్తి పొందలేదు సరికదా, తపోవృత్తిని తనివితీర సాగించాడు. అజ్ఞాతవాసం వారి నియమంలోని భాగమేకాని

దయనీయమైన కలి శాపం కాదు. నలుడివలె ధర్మజుడు భార్యను వదలిపోలేదు. మాట నిచ్చి తప్పలేదు. ఆ మాట తప్పటం కలిప్రభావంవలన అని తరువాత చెప్పకొని ఇతరులను నమ్మించవలసిన దురవస్థకు పాలుకాలేదు. నలుడిగాథ ధర్మజుడికి కడు దయనీయంగా తోచింది. అతడికంటె తానే వేయిరెట్లు మెరుగని మనసును సముదాయించుకొని ఉంటాడు.

ద్రౌపది పడిన పాట్లు ఒక విధం. దమయంతి అగచాట్లు మరియొక విధం. పాండవులు మీదివస్త్రాలను తీసి కుప్పపెట్టి తమ ఓటమిని ఒప్పకొన్నారు. అక్షముల ప్రతిరూపమైన పక్షులు నలుడి కట్టుబట్టను ఎత్తుకొని పోయి అతడిని అవమానించాయి. ద్రౌపదికి నిండు సభలో వస్త్రాపహరణం, నలుడికి ఊరిబైట వస్త్రాపహరణం. ద్రౌపది చీరలు దుశ్శాసనుడు ఒలిచి, భంగపడ్డాడు. దమయంతి చీర కొంగును చింపికొనిపోయి నలుడు భంగపడ్డాడు. దమయంతి తన పిల్లలను పుట్టింటికి పంపింది. ద్రౌపది కూడా ఉపపాండవులను పుట్టింటికి పంపింది. ద్రౌపదివలె దమయంతి కూడా సైరంధ్రి వృత్తిలో ఉండింది. దమయంతి కిరాతుడిచేత పీడించబడ్డట్టే ద్రౌపది కీచకుడిచేత పీడించబడింది. ఏకవస్త్రధారణం, కురులు ముడివేసికొనకపోవడం దమయంతీ ద్రౌపదులపట్ల సమానమే. దమయంతి చరిత్ర వింటే ద్రౌపది అదృష్టవంతురాలేమో అనిపిస్తుంది. భర్తచేత విడువబడి బహుయాతనలు పడి, భర్తను అన్వేషించే యత్నాలు తానే స్వయంగా నిర్వహించి చివరకు భర్తను తానే చారచక్షువై గుర్తించి, అతడిని తనవద్దకు రప్పించుకొని, అతడిని ప్రసన్నుడిని చేసికొన్న వీరపత్ని దమయంతి. పాండవపత్నికి అటువంటి దుస్థితి రానివ్వకుండా చూడవలసిన అవసరం పాండవుల కున్నదని నలచరిత్ర హెచ్చరించింది. పతిరక్షలేని దమయంతి కంటె పతిరక్షగల ద్రౌపది భద్రం. శాపానుగ్రహశక్తియుక్తురాలైన మహాపతివ్రత దమయంతే అన్ని కష్టాలు పడినప్పుడు ఇక పాండవపత్ని పడుతున్న కష్టాలు సహించదగినవే అన్న ఊరడింపు ఈ కథాప్రయోజనం.

నలధర్మరాజు లిరువురు అక్షహృదయ విద్యను పొందారు. నలుడు ఆ విద్య వలన జూదంలో కోల్పోయిన రాజ్యాన్ని పొందగలిగాడు. ధర్మజుడికి మరల జూదమాడే అవసరమే జీవితంలో లభించలేదు. నలుడివలె ధర్మజుడు అరణ్యాజ్ఞాతవాసవ్రతాల తరువాత రణమో ద్యూతమో అని పందెం వేయలేదు. దానికి కారణం లేకపోలేదు. నలుడికి బైటిశత్రువు ఒక్కడే. అతడు పుష్కరుడు. కలి దాసుడైనాడు. కలి సాయంలేని పుష్కరుడిని నలుడు సులభంగా జయించాడు. మరి ధర్మరాజుకు కురువీరులందరూ శత్రువులే. దుర్యోధన పక్షవర్తులే. వారి నందరిని జూదంలోనే జయించవచ్చును. నలుడివలె ధర్మజు డా పని చేయలేని ధీరోదాత్తుడు. తుల్యపరిశీలనలో నలుడు గొప్పవాడా? యుధిష్ఠిరుడు గొప్పవాడా? ఆ ఆలోచన రేకెత్తించటమే నలోపాఖ్యాన ముఖ్యోద్దేశం. నన్నయ ఉపాఖ్యానశిల్పంలో పొందించిన వస్తుధ్వని.

మరొకవిశేషం- నలధర్మరాజు లిద్దరు ధీరోదాత్తులే. కానీ, కలి ఆవేశించిన తరువాత నలుడు నలుడు కాడు. అతడి చేష్టలు కలిశాసితాలు. అతడి మనోవేదన మాత్ర మతడిది. ధర్మజుడికి ధర్మం ఆవేశించింది. అతడిలో ఎన్నటికీ మార్పు లేదు. అందువలన నలుడి కథ వింటే జాలి కలుగుతుంది. దమయంతి బాధ వింటే దయ పొటమరిస్తుంది. సహానుభూతికి దూరమైన సానుభూతి నలోపాఖ్యాన రసప్రవృత్తి. ధర్మజుడు సహృదయుల సహానుభూతినే పొందాడు కాని సానుభూతిని కోరలేదు.

బృహదశ్వుడు నలకథ నంతా వినిపించి 'అక్షజితుండ నైతినని వగవ వలదు : నీవును దైవమానుష సంపన్నుండ వయి శత్రువుల జయించి సకల మహీసామ్రాజ్యంబు వడయుదువు' అని ఆశీర్వదించాడు. ఆ కథ వింటే కలిదోషం పోతుందని ఫలశ్రుతి చెప్పాడు. ధర్మజుడికి అక్షహృదయవిద్య నిచ్చాడు. ఈ కథ చెప్పిన నన్నయ ధర్మరాజు ద్యూతపరాభవ దుఃఖంనుండి తేరుకొన్నాడనీ, అక్షహృదయ లాభంతో పరాజయభయ రహితుడైన విజయుడైనాడనీ ధ్వనింపచేశాడు.

**ప్రతిపద్యం హృద్యం :**

చ. 'నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానల బాధ్యమానులై
సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవనందనంబులన్
నలినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసారపాంసులం
దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్.' **(ఆర. 2.24.)**

నలోపాఖ్యానానికి ఈ పద్యంతో నన్నయ ప్రాణం పోశాడు. ఇది అమూలకం. నల దమయంతుల పూర్వరాగ విప్రలంభాన్ని ప్రసాదమాధుర్యాల గుణ సమ్మేళనంతో నన్నయ్య ఇందులో ఆవిష్కరించాడు. నలోపాఖ్యానంలో ఒక్క పద్యం చెప్పండంటే తెలుగు రసికులు ఈ పద్యం చెపుతారు. అంతటితో ఆగక - ఈ ఒక్క పద్యమే నలోపాఖ్యాన మంటారు. అంతటిది ఈ పద్య మహత్త్వం.

నలదమయంతులది ప్రణయ జీవితం. వారు అన్యోన్యరూపగుణశ్రవణంవలన అనురక్తులై వివాహమాడారు. దేవతల ఆశీస్సులతో దమయంతి నలుడిని స్వయంవర సభలో వరించింది. వివాహమయ్యేంతవరకు విరహం. అయిన తరువాత పట్టుమని పదునాలుగేళ్ళు కాపురం చేశారో లేదో మరల వియోగం. నలదమయంతుల కథలో సంయోగం కంటె వియోగమే అధికం. అందులోనూ పూర్వరాగవిప్రలంభం కోమలం. వివాహానంతర విప్రలంభం దారుణం. కథలో విప్రలంభాని కున్న ప్రాధాన్యాన్ని గుర్తించి నన్నయ ఈ పద్యాన్ని కల్పించి శిల్పించాడు. కథంతా ఒక యెత్తు; ఈ పద్య మొక్కటి మరొకయెత్తు అన్నంత కీర్తిని నన్నయ దీనితో గడించాడు.

కథను వివిధ ఛందస్సులతో అలంకరించి ఆ యా కథార్థాలను ప్రసన్నం చేయటం నలోపాఖ్యానంలో నన్నయ అనుసరించిన మరొక శిల్పం. అందులో సీసపద్యరచనా శిల్పం అనల్పం. ఫలశ్రుతి సీసంలో చెప్పి, కథలో ఆ పద్యాన్ని ప్రత్యేకంగా పరిశీలించండని నన్నయ సూచించాడు. ఫలశ్రుతి కాక 18 సీసపద్యాలు ఈ ఉపాఖ్యానంలో సహృదయులను ఆకర్షిస్తాయి. సీసం పెద్ద వృత్తం కాబట్టి కథ చెప్పటానికి వాడటం ప్రాథమిక లక్షణం. దమయంతి పుట్టు పూర్వోత్తరాలను గుణగణాలను చెప్పటానికి (2.8), నలుడు రథం మీద వచ్చాడనే ఆశతో చూచి, వచ్చినవాడు ఋతుపర్ణుడని తెలిసి దమయంతి దుఃఖించిందని చెప్పటానికి (2.183) సీసాలను కథాకథనంలో వాడాడు. కథలోనే రమణీయ సన్నివేశాన్ని చిత్రించటానికి సీసాన్ని వాడిన ఘట్టాలు రమ్యతరాలు. దమయంతి అంతఃపురంలో నలదమయంతులు పరస్పరం చూచుకొన్న సన్నివేశం (2-39), దమయంతి స్వయంవర సన్నివేశం (2.54), నలుడు జూదంలో ఓడుతున్నాడని తెలిసి దమయంతి తన సంతానం పట్ల తీసికొన్న జాగ్రత్తలు (2.64), అర్ధరాత్రి గజయూథం సార్థవాహులను చంపిన దృశ్యం (2.111), రాజమాత దమయంతిని గుర్తించి అనురాగంతో కౌగలించుకొని మన్నించిన సన్నివేశం (2.151) మరువలేనివి. సంభాషణకు కూడా సీసాన్ని సమర్థంగా నన్నయ వాడాడు. దిక్పాలకులు నలుడితో చేసిన అభ్యర్థనను (2.34), సభాంతరాలలో విప్రులు ప్రకటించవలసిన వాక్యసముదాయాన్ని (2.158), కేశిని బాహుకుడికి చెప్పిన దమయంతి నియమనిష్ఠలను (2.194) నన్నయ సరళసుందరంగా సీసాలలో చిత్రించాడు.

ఇవన్నీ ఒక యెత్తు; నన్నయ సీసాన్ని రసభావవర్ణనలకై వాడటం మరొక యెత్తు. పూర్వరాగ విప్రలంభాన్ని అనుభవిస్తున్న దమయంతి విరహంలోని గ్లాని, చింత, ఔత్సుక్యం అనే సంచారిభావాలను వ్యక్తీకరించటం (2.23), అడవిలో అలసి నిద్రపోతున్న దమయంతి యొక్క జాలిగొలిపే దైన్యావస్థ (2.77), సార్థంలోని ప్రజలు చూచిన దమయంతి యొక్క దీనమైన రూపం, వారి సమీక్షలు (2.103), సార్థంలో చచ్చినవారితో తా నెందుకు చావలేదని దమయంతి వ్యక్తంచేసే విచారం (2.114), నలుడి వంట నేర్పరితనం (2.197) వస్తువైవిధ్యంతోపాటు వర్ణన వైశిష్ట్యాన్ని ప్రదర్శిస్తున్నాయి.

రసభావతీవ్రతను వ్యక్తంచేసిన నాలుగు సీసపద్యాలను ప్రత్యేకంగా పేర్కొనాలి - 'హా! మహారాజ! మహామహీ రక్షణదక్ష దక్షిణబాహుదండ!' (2.82) అనే సీసం నలుడి అన్వేషణలో దమయంతి పొందిన శోకతీవ్రతను వ్యక్తం చేస్తుంది. నాయికా విరహశోకాన్ని సీసంలో నిర్మించి ఉపాఖ్యానంలోని వర్ణనాంశాలలో ఒక సమతౌల్యాన్ని పాటించాడు నన్నయ. 'ఇభరాజగమన నీ వెందుల కరిగితి' (2.133) అన్నది ఆ సీసం. నలోపాఖ్యానంలోని సీసా లన్నింటిలో తిలకాయమానమైనది ఈ క్రిందిది.

సీ. 'సహకార మత్ప్రియసహకారుఁ బున్నాగ । పున్నాగుఁ దిలక భూభువనతిలకుఁ
జందన బుధహరిచందనుఁ బుష్పితా । శోక సుహృజ్జన శోకదమను

వకుళ కులైకదీపకు విభీతక భయో। పేతార్తిహరు నలుఁ బ్రీతితోడఁ
గానరే కానలలోన లోకోత్తరు'। నని మ్రాని మ్రానికి నరిగి యరిగి

ఆ. యడుగు నడుగు లెండ బొడవొడఁ బొక్కిన। నిర్ఝరాంతరముల నిలుచుఁ బిలుచు
గిరుల దరుల యెడల నురుగుహాగృహములఁ। దొంగి తొంగి చూచుఁ దోయజాక్షి.'**(అర. 2.95)**

పోతన భాగవతంలో గోపికలు శ్రీకృష్ణుడిని అన్వేషించే ఘట్టంలోని "పున్నాగ కానవే పున్నాగవందితు" వంటి సీసాపద్యాలకు ఇది ఆచార్యకం. నన్నయ సామాన్యంగా యమకం ఎచ్చటో కాని వాడడు. నలోపాఖ్యానంలో దానిని విరివిగానే వాడాడు. అలంకారరమ్యత నన్నయగారి అక్షరరమ్యతలో ఒక భాగం.

ఉపాఖ్యానానికి విశేషవృత్తాలతో రమ్యతను కల్పించే శిల్పంలో భాగంగా నన్నయ 5 మధ్యాక్కరలను, 3 మత్తకోకిలలను, 1 తరువోజను, 1 కవిరాజవిరాజితాన్ని వాడాడు. కథలో ప్రత్యేకంగా గమనించదగిన సంభాషణలను, సన్నివేశాలను, వర్ణనలను మధ్యాక్కరలలో నిబంధించి ఛందశ్శిల్పం ద్వారా ప్రధానాంశ ప్రతిపాదనను చేయటం ఒకకళ. నలమహారాజునుండి తనవద్దకు దూతగా వచ్చి అతడి గుణగణాదులను కీర్తించి హంస తనకు హృదయ సమ్మదం కలిగించిన తరుణంలో దమయంతి పలికిన మాటలను నన్నయ మధ్యాక్కరలో ఎత్తుకొన్నాడు. పూర్వార్ధంలో దమయంతి చేత మాటలు చెప్పించి, ఆ మాటలు విని నలుడికి ఆమె సందేశాన్ని అందించిన హంస హృదయ సమ్మోదాన్ని సూచించేటట్లు వృత్త ఉత్తరార్ధాన్ని నడిపి సమాన మానసిక స్థితిని ఛందఃప్రయోగంతో ధ్వనింపచేశాడు- నన్నయ (చూడు 2.22). సమ్మోదాన్ని ఒక మధ్యాక్కరలో చెప్పిన నన్నయ దుఃఖావేశాన్ని మరొక దానిలో నింబంధించి వృత్త ప్రయోగరమ్యతను చూపాడు. రాజమాత హృదయంలో సానుభూతి కలిగేటట్లు నలుడు దమయంతిని ఒంటిగా అడవిలో విడిచి వెళ్ళిన ఉదంతాన్ని (2.118) రసభావతీవ్రతతో అభివ్యక్తం చేయించాడు. నలమహారాజుకథలో అక్షహృదయ, అశ్వహృదయ విద్యల ప్రస్తావన ఒక ప్రత్యేకత సంతరించుకొన్నది. నలు డొకదానిని పొందుతాడు. మరొకదానిని దానం చేస్తాడు. కథ సుఖాంతం కావటానికి ఈ రెండు కీలకాంశాలు కీలకపాత్ర నిర్వహిస్తాయి. నలమహారాజు అరణ్య అజ్ఞాతవాస జీవితాలలో భద్రమైన జీవితాన్ని గడపటానికీ, కలినివారణం కలగటానికీ పరోక్షంగా తోడ్పడిన కర్కోటకుడు స్నేహభావావేశంతో చెప్పిన మాటలను (2.129) మధ్యాక్కరలో నన్నయ నిబంధించి ప్రకరణౌచిత్యాన్ని పాటించాడు. రాజమాత యెదుట దమయంతిని గుర్తించిన నేర్పుతోనే నలుడిని కూడా గుర్తించి కథలో ఒక కీలకమైన పాత్ర నిర్వహిస్తాడు. సుదేవుడి బుద్ధిశక్తిని ప్రజ్వలింప చేసే ఈ వాక్యాలు విశేషచ్ఛందంలో ఉండటం వృత్తౌచిత్యమే కాక సందర్భౌచిత్యం కూడా (2.149). బాహుకుడి రథవేగాన్ని వర్ణించటం మూలాతిశయంగా నన్నయ కల్పించిన కథార్థం.

"ఎదురను దవ్వులఁ జూచిన పొడవు లెల్లఁ దత్క్షణమ
కదియఁగా నవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ బిఱుఁద
నిది దినేశ్వరు రథమో యనూరుఁడో యితఁ డంచు నపుడు
హృదయమునను గడు విస్మయం బందె నిక్ష్వాకుకులుఁడు". **(అర. 2.170)**

రథవేగ మనగానే అభిజ్ఞాన శాకుంతలంలో కాళిదాసు చేసిన దుష్యంతుడి రథవేగవర్ణనం సహృదయులకు తలపున నిలుస్తుంది. నన్నయ ఆ శ్లోకానికి ఛాయగా ఈ విశేషవృత్తాన్ని తీర్చిదిద్దాడు. పఠితయొక్క హృదయాన్ని కథలోని ఒక కీలకాంశంమీద కేంద్రీకరింపజేసి పూర్వాపర కథార్థ సమన్వయంలో అది నిర్వహించే పాత్రను భావింపజేసి కథను ప్రసన్నం చేయటం నన్నయ కథనశిల్పం. దమయంతి పునస్స్వయంవరం ఒక కల్పన. నలుడి అశ్వహృదయ విద్య నిజంగా బాహుకుడి యందు ప్రదర్శితమైతే అతడే నలుడని, కారణాంతరాలవలన కురూపుడైనాడనీ దమయంతి నిర్ణయించుకొన గలుగుతుంది. పైపెచ్చు ఆ కారణంగా

నలుడు భీముడి పట్టణానికి రాగలుగుతాడు. నలదమయంతీ పునస్సమాగమం జరుగుతుంది. ఇంతటి కీలకమైన అంశం రథవేగం. కీలకమైన అంశాలన్నింటినీ నన్నయ మూలాతిశయంగా చిత్రించటమే ఒక విశేషం. విశేషవృత్తాలలో వాటిని వ్యక్తీకరించటం మరీ విశేషం.

ఈ ఉపాఖ్యానంలో నన్నయ వాడిన మత్తకోకిలలు ముచ్చటగా మూడు - వాటిని మూడు రకాలుగా వాడి పాత్ర మనోగత రసభావ వ్యక్తీకరణను మనోజ్ఞంగా చిత్రించాడు. నలుడు వరుడు కాకపోతే ప్రాణత్యాగం చేసికొంటానని ప్రకటించిన దమయంతిని ఊరడిస్తున్నట్లు, దేవతలవైపు మనసు మళ్ళిస్తున్నట్లు మెత్తగా, హేతుబద్ధంగా, బుజ్జగిస్తున్నట్లుగా చెప్పిన నలుడిమాటలు లయబద్ధంగా శ్రుతిబద్ధంగా అక్షరరమ్యంగా పలికాయి- నన్నయ కవితలో. 'భూరిసత్త్వులు సర్వలోకవిభుల్' (2.49) అనే మత్తకోకిల నన్నయ మంచి పద్యాలలో ఒకటిగా నిలిచిపోయింది.

నలుడిని వెదకుకొంటూ అడవులలో పడరాని పాట్లు పడుతూ, కొండచిలువ బారినుండి కోయవాడు రక్షించగా బయటపడి, అతడిచేత భంగపడబోయి తన పతివ్రతా మాహాత్మ్యంతో తనను తాను రక్షించుకొని, అడుగులు బొబ్బలెక్కగా, కొండలను గుట్టలను వేయికళ్ళతో వెదకుతూ వేసారి పోయిన దమయంతికి ఆ భీకరారణ్యంలో పతిని గురించి శుభవార్త తెలిపే ఒక మున్యాశ్రమం కనబడుతుంది. దానిని చూచినప్పుడు దమయంతి చిత్తవృత్తిలో భాసించే సంతోషతరంగాలనూ, ఆశాకిరణాలనూ తలపించే మత్తకోకిలాన్ని నన్నయ చిత్రించాడు.

'వారిభక్షులు పర్ణభక్షులు వాయుభక్షులు శాకనీ
వారభక్షులు వృక్షమూల నివాసయుక్తులు నై తపం
బారఁజేయు మహామునీంద్రుల యాశ్రమం బెడఁ గాంచె నం
భోరుహాక్షి పురాసమార్జిత పుణ్యకర్మ ఫలంబునన్'. **(ఆర. 2.97)**

ఎడారిలో ఒయాసిస్సువలె భీకరారణ్యమధ్యంలో సుందరమున్యాశ్రమ సాక్షాత్కారం శిశిర ఋతువులో వసంతదర్శనం వంటిదే. శబ్దలంకార రూప అక్షరరమ్యత దమయంతి హృదయస్పందనసంకేతం.

మహర్షుల దర్శనం పూర్వజన్మ పుణ్యఫలమని నిర్దేశించటం ద్వారా నన్నయ దమయంతిజీవితంలో శుభకరమైన ఒక మలుపు అక్కడినుండి కనబడుతుందని వస్తుధ్వని చేశాడు. ఈ కీలకాంశాన్ని విశేషవృత్త ప్రయోగం ద్వారా సూచించటం రచనా శిల్పం.

కథాంతంలో నలుడు పుష్కరుడిని యుద్ధానికి ఆహ్వానించే ఉత్సాహభావాభివ్యక్తిని మత్తకోకిలలో రచించటం పరమరమణీయం. అక్షహృదయం తెలిసిన నలుడు అటు జూదానికిగానీ, ఇటు యుద్ధానికిగానీ సిద్ధమే. విజయం తథ్యమని అతడికి తెలుసు. ఆ విజయోత్సాహం మత్తకోకిలలో మనోజ్ఞంగా వినిపించింది. (2.223)

ఈ ఉపాఖ్యానంలో నల దమయంతుల పాత్రప్రవృత్తులు విచిత్రంగా ప్రసరిస్తాయి. కథాగతికి నలుడెప్పుడూ అడ్డంగా తిరుగుతాడు. దమయంతి నలుడిచేత భంగపడిన కథను అప్రయత్నంగా ఫలంవైపు లాగుకొని పోతూ ఉంటుంది. కథలోని ఈ రహస్యాన్ని గుర్తించిన నన్నయ ఉభయ ప్రవృత్తులను విశేషవృత్తాల ద్వారా పఠితల మనోరంగాలపై ప్రత్యక్షం చేయటం శిల్పమర్మజ్ఞులు గమనించదగిన అంశం. ఈ కథలో వజ్రప్రాయమైన సంకల్పం దమయంతిదే. దేవతలను వరించుమని నలుడు పలకటం, వారిని వరించకపోతే తనకు కీడు కల్పిస్తారని భయాన్ని తెలపటం నలుడికే చెల్లింది. దేవతలకొరకై స్వీయప్రయోజనాన్ని సైతం త్యాగం చేసికొన బూనిన ఉదాత్తుడు కావచ్చును- నలుడు. కాని, అతడి ప్రయత్నంవలన కథ

కుప్పకూలి పోతుంది. హంసదౌత్యం కథాగతికి పోషకం, నలదౌత్యం కథాప్రయోజనానికే విఘాతం. నాయికా జీవితానికి అశనిపాతం. ఆ విపత్తునుండి, అంతేకాదు దానివలన భవిష్యత్తులో కలిగే విపత్తులన్నింటినుండి, తనను తాను రక్షించుకొని భర్తను ఉద్ధరించగలిగిన ఉదాత్తచరిత్ర దమయంతి. నలుడియెదుట ఆమె వ్యక్తంచేసిన దృఢనిశ్చయాన్ని నన్నయ తరువోజలో పలికించాడు. దేవ తిరస్కారం, భూదేవ పురస్కారం అతిరమ్యంగా ఆవిష్కరించబడిన పద్యం.

'ఏ నేడ? నింద్రాదు లేడ? వారలకు నెప్పుడు మ్రొక్కుదు; నేను నీ ధనమ
భూనాథ! నీగుణంబులు హంసచేతఁ బొలుపుగా విని మనంబున నిల్పియున్న
దాన ; భవన్నిమిత్తమున ని ట్లఖిల ధారుణీనాథ సార్థంబు రావింపఁ
గా నిష్ట వలసె; లోకఖ్యాతకీర్తి! కరుణించి పతిబుద్ధిఁ గావింపు మిందు'. **(అర. 2.47)**

ఈ కథారథ చక్రాలకు ఈ పద్యం ఇరుసు. ఆమె సంకల్పమే నలదమయంతుల జీవితంలో సుఖదుఃఖాలను వర్షించింది. దానిని విశేషవృత్తంలో పఠితృహృదయంలో నాటటం నన్నయ కథాకథన శిల్పంలోని రమ్యత.

కవితా పరంగానూ, స్థిరచర చిత్రాలను రమ్యంగా రూపొందించటంలోనూ, సన్నివేశచారుత్వంలోనూ పేరుగాంచిన నన్నయ నిర్మించిన 'కవిరాజవిరాజితం' ఒకటి- ఈ ఉపాఖ్యానంలో రత్నం వలె రాణిస్తూ నన్నయను కవిరాజుగా విరాజిల్లచేస్తున్నది.

'రజనికరాననఁ బీనపయోధర రాజితరాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ జందనగంధిఁ బ్రకాశితకాంతిసమన్వితఁ బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు కామనిశాతశరాహతుఁడై
నిజహృదయం బెఱిఁగించె లతాంగి కనింద్యచరిత్రకు వేడుకతోన్'. **(అర. 2.90)**

ఇది నన్నయ రచించిన రమణీయమైన పద్యాలలో ఒకటి. కిరాతుడు దమయంతిని చూచాడు. చూచిన క్రమం ఈ వర్ణనలో వ్యంగ్యం. మొదట చంద్రబింబం వంటి వదనాన్ని చూచాడు. ఆహ్లాదాన్ని అనుభవించాడు. ఆ తరువాత ఆతడి చూపులు క్రమంగా క్రిందికి దిగుతూ వచ్చాయి. దానితోనే అతడి భవిష్యత్తు కూడా పతనం కావటం మొదలైంది. ఆమె పీన పయోధరాలను చూచాడు. కోర్కె తలయెత్తింది. ఆమె శరీరాంగవిన్యాస వైభవాన్ని పరిశీలించాడు. రాచకొలంలో పుట్టిన రత్నంవలె మెరిసిపోతున్నది. 'రాజిత' అనే విశేషణం ఆమె శరీర లావణ్య నైగనిగ్యాన్ని ప్రకాశింపచేస్తున్నది. ఆమె లావణ్యం అతడికి రమణభావం కలిగించింది. తలనుండి క్రమంగా దిగి వస్తున్న చూపులు ఆమె అడుగుల జాడల సింగారాన్ని దర్శించాయి. ఆమె నడకలో గజరాజగమనం గోచరించింది. నెమ్మదిగా నడచివస్తూ సమీపిస్తున్న ఆమెను కన్నార్పకుండా కొంతసేపు చూచాడు. అతడిలో మొలకెత్తిన కోర్కె రతిభావోద్దీప్తిగా మారింది. ఆమె సమీపించింది. ఆమె ఉత్తమజాతి స్త్రీ కావటం వలన శరీరంనుండి మంచిగంధపు వాసన సహజంగా గుబాళిస్తున్నది. అది అతడి మనస్సును మత్తెక్కించింది. ఆమెను నిలువెల్ల కలయచూచాడు. తనువెల్లా ప్రకాశిస్తున్న కాంతిగుణంతో ఆమె వెలిగిపోతున్నది. అది ఆమె పాతివ్రత్య తేజస్సుకు సంబంధించిన లోవెలుగు-వెలికి కాంతిగా ప్రసరిస్తున్నది. దానిని చూచి అతడు దిమ్మరపోయాడు. ఆ తరువాత వెర్రివాడై ఆమె కన్నులలోకి నరాసరి చూడటం మొదలుపెట్టాడు. ఆమె కన్నులు పద్మాలవలె పరమ రమణీయంగా ఉన్నాయి. ఆమె పద్మినీజాతివంటి పరమోత్తమురాలని కాంతితో కూడిన కళ్ళుకూడ చెపుతున్నాయి. వాటిని చూచాడు. కాని వాటి మహిమను తెలిసికొనలేక పోయాడు. అందుకే నన్నయ వాడిని కిరాతుడని, కావాలని అక్కడే పలికాడు. ఆమె సౌందర్యం ఆరాధించదగింది; కాని, అతడు అనుభవించాలని కోరుతున్నాడు. ఆమె పతివ్రత. ఆమెవ్రతాన్ని భగ్నం చేసి ఆమెధర్మాన్ని చెరచి ఆమెతనువును హింసించ

తలపెట్టాడు. అందుకే అతడు కిరాతుడు. అతడు తన కోర్కెను ఆమెపై బాణంగా సంధించబోతున్నాడు. కాని, ఆ కిరాతుడికి తెలియదు. అత డప్పటికే కామనిశాతశరాహతుడని. ఆ కిరాతు డప్పటికే మరొక కిరాతుడిచే కొట్టబడ్డాడు. అతడి మృతి తథ్యం. ఇది నన్నయ రుచిరార్థ సూక్తిరమ్యత. వేడుకతో కిరాతుడు తన హృదయాన్ని లతాంగికి చెప్పాడు - అని కథ చెప్పిన నన్నయ అంతటితో ఆగలేదు. ఆమె అనింద్యచరిత్ర అని విశేషించి చెప్పాడు. ఆ మాట కిరాతు డనుకొన్నది కాదు. అనుకొనేదీ కాదు. అది లోనారసి చూచే సారమతుల కొరకు వాడింది. అందులోని రుచిరార్థ రమ్యతకొరకు వాడింది. పఠిత ఆ సన్నివేశంలో ఉత్కంఠతో ఊగిపోతుంటాడు. దమయంతిశీలం రక్షించబడుతుందా లేదా అని తహతహ లాడుతూ ఉంటాడు. ఆమె అనిందితచరితగానే ఉండాలని ఆశిస్తూ ఉంటాడు. అట్లా సారమతితో కథనుగురించి భావించే భావుకుడికి అందించిన కీలకం ఇది. ఆమె అనిందితచరితగానే ఉంటుందని సూచించి కొంత ఊరట కలిగించాడు- నన్నయ. కాని, అది ఎట్లా సాధ్యమౌతుంది అనే రహస్యం మాత్రం దాచిపెట్టి ఉత్కంఠను పోషించాడు. తరువాత క్రమంగా కథను రమ్యంగా నడిపించాడు.

ఇందులో నన్నయ పద్యాన్ని నడిపిస్తున్నాడా? దమయంతిని నడిపిస్తున్నాడా? కిరాతుడి చూపులను నడిపిస్తున్నాడా? మన మనస్సులను నడిపిస్తున్నాడా? అనే ఆశ్చర్యం కలిగిస్తాడు. అన్నింటినీ నడిపించిన వృత్తం కవిరాజవిరాజితం అని ధ్వనింపజేశాడు. అందుకే నన్నయ అన్నాడు - కథాక్రమం అతిరమ్యం అని.

**శివుడే హంసగా అవతరించాడు :**

మూలకథను నన్నయ పునస్సృష్టి చేస్తాడన్న సత్యాన్ని నిరూపించేది నలోపాఖ్యానంలోని హంసదౌత్యం. నలదమయంతు లిద్దరూ అన్యోన్యరూపగుణ శ్రవణసంజాత ప్రీతులు. జనులు పొగడే గుణగణాలను విని ఇరువురూ అనురక్తులైనారు. అందులో నలుడు మదనానల వేదన భరించలేక ఉద్యానవనంలో విహరిస్తూ ఉన్నాడు. అంతరికకాంతాహారావళి వలె అంచల వరుస అవనీతలం మీద అవతరించింది. నలుడు ఆ హంసల నడకలు చూచి నవ్వుతూ వాటిని ఎగుర కొట్టాడు. అందులో ఒక హంస ఎగురకుండా ఉండగా దానిని పట్టుకొన్నాడు. మిగిలిన హంసలు దానిని విడిచి పోలేక ఆకాశంలో గాలికి కదిలే శరత్కాల మేఘశకలాల వలె తిరుగుతున్నాయి. ఆ హంస నలుడితో మనుష్యవాక్యాలతో ఇట్లా అన్నది: 'అయ్యా! నీకు ప్రియం చేస్తాను. నీ హృదయేశ్వరి అయిన దమయంతి వద్దకు పోయి, నీగుణాలు ఆమెకు వర్ణించి చెప్పి, ఆ కన్యక అన్యులను వరించకుండా నీయందే బద్ధానురాగ అయ్యేటట్లుగా చేస్తా'నని పలికింది. ఆ పలుకులు నలుడికి అమృతధారాపాతాలవలె అనిపించాయి. హంసను అనురక్తుడై వెంటనే వదిలాడు.

ఆ హంస విదర్భకు చేరింది. చెలికత్తెలతో దమయంతి విహరిస్తున్న అంతఃపుర వనంలో అంచలగుంపుతో దిగింది. చెలికత్తెలందరూ ఆ హంసలను పట్టుకొనటానికి పరుగెత్తారు. నలుడిచేత వదలబడిన ఆ హంసమాత్రం నిపుణంగా తనంతటతాను దమయంతిచేత పట్టుబడింది.

క. 'దమయంతికి నలునకు సం
గమకారణదూత యైన కలహంస మనో
జ్ఞ మనుష్య వాక్యముల న
ద్దమయంతికి హర్ష మెసఁగఁ దా నిట్లనియెన్'. **(ఆర.2.18)**

'నీహృదయేశ్వరుడైన నలునొద్ద నుండి వచ్చాను. ప్రభువు లెవ్వరూ అందంలో అతడితో సరికారు. నీవు నలుడి దేవివైతే నీ రూపకాంతి వైభవాదులు సఫలా లౌతాయి. నీవు నారీరత్నానివి. అతడు పురుషరత్నం. మీ ఇద్దరి కలయిక

అన్యోన్యశోభాకరం' అని చెప్పింది. దమయంతి అమితమైన ఆనందం పొందింది. తనకు నలుడిని గూర్చి ఎట్లా చెప్పిందో అట్లాగే తనను గూర్చి కూడా నలుడికి వర్ణించి చెప్పి, మమ్మిలను కూర్చుమని కోరింది. హంస అట్లాగే చేసింది. ఆ తరువాత 'నలదమయంతులిద్దఱు మనఃప్రభవానల బాధ్యమానులై'నారు. ఇది హంసకథ. (క్రీగీట్లున్నవి నన్నయ అమూలకంగా వాడిన పదాలు).

నన్నయ చిత్రించిన హంస వ్యాసుడి హంస కంటె విశిష్టమైనదిగా ఉండటం గమనించతగింది. ఆ అర్థాన్ని తేటపడేటట్లు నన్నయ తెలుగులో రచించాడు. ఆ తాత్పర్యాన్ని మూలంకంటె మిన్నగా తాను వాడిన కొన్ని పదాలచేత నన్నయ ధ్వనింపచేసి కథను ప్రసన్నం చేశాడు. హంసదౌత్యంలో నన్నయ ప్రదర్శించిన అమూలకప్రతిభను మొదటిసారి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు వివేచించి చెప్పారు -

''ఇది హంసదౌత్యము. ఈ హంస ఎవరు? దీని కీ మాటాడు శక్తి యెచ్చటినుండి వచ్చినది? తన ప్రేమ రహస్యము దీనికిఁ దెలియుటను నలు డెట్లు నిశ్శంకముగా స్వీకరించెను? ఈ హంస 'యవతరించెను'. ఇది దమయంతికి నలునకు సంగమ కారణదూత. సంగమమునకు గారణమయిన దూత యని యర్థము. ఈ హంస లేనిచో వారి సంగమము జరుగదా? అదివరకే వా రన్యోన్యలగ్నమనస్కులు. ఈ దౌత్యము వలన దమయంతి యధిక విరహతప్త యగుటయు, భీముడు స్వయంవరమును జాటించుటయు జరిగినమాట నిజమే! అంతమాత్రమున సంగమకారణ దూత యనవలయునా? ఏవిధముగాఁ జెప్పిన చెప్పకూడదు? ఇచ్చటి కారణశబ్దమే చమత్కారముగా నున్నది. కారణజన్ముడు మొదలైన శబ్దములు కలవు. వారి సంగమమే కారణముగా గల దూత. ఈ హంస మరి యెచ్చటను లేదు. ఈ యొక్క కారణము కొరకే యీ హంస భూమి కవతరించెను. ఇతర కావ్యములలోని హంసలు, పక్షులు మాటాడినచోఁ బంచతంత్రములో పక్షులు మాటాడినట్లు. ఇచ్చట నట్లు కాదు. ఈ హంస నలదమయంతులయొక్క సంగమార్థమయిన కారణజన్మ కలది.''

''ఈ హంస శివుడు. ఇది శివపురాణాంతర్గతమైన గాథ. ఆహుకులను భిల్లదంపతులు యుగాంతరములందుఁ దపస్సు చేయఁగా శివుఁ డనుగ్రహించి 'మీ రిద్దఱు నలదమయంతు లయి జన్మింతురు. మీకు నేను దౌత్యము చేయుదు'నని ప్రసాదించెను. ఆ గాథ యిచ్చట ననుసంధిత మయినచో నీ నన్నయగారి రత్నగర్భమైన రచన తెలియును. నన్నయ్యగారు తాను 'నానాపురాణవిజ్ఞాననిరతుఁడ' నని చెప్పికొనెను.'' (నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి' (1954) పు. 95-96)

**మార్పులు - చేర్పులు :**

కథార్థాలలో ఆయువు పట్టులైన కొన్ని అంశాలను పట్టుకొని ఉపాఖ్యానంలోని తాత్పర్యం ప్రసన్నమయ్యేటట్లు నన్నయ కడురమ్యంగా బలపరుస్తాడు. దానితో ఉపాఖ్యానం ఉజ్జ్వలంగా ఉన్మీలిస్తుంది. మచ్చుకు కొన్ని ఉదాహరణలు:

(1) దమయంతీ స్వయంవరానికి ఇంద్రాదు లొకవైపు నుండి, నలుడు మరొక వైపు నుండి వస్తున్నారు. వారి సమావేశం కథలో కీలకమైనది. కథలో నలుడు నాయకుడు. అతడు నరుడు. దమయంతిని ఆశిస్తున్న ఇంద్రాదులు దేవతలు. తారతమ్య పరిశీలన కథనంలో ఏర్పడుతుంది. అప్పుడు నన్నయ నలుడిని అలంకారబలంతో ఉజ్జ్వలుడిగా తీర్చిదిద్దుతాడు. (చూడు.2.33). ఇందులో నన్నయ నలుడికి రెండు విశేషణాలు వాడాడు. 1. ఆదిత్యులలో విష్ణువువలె తేజోధికుడైన వాడట. 2. సౌందర్యంలో రెండవమన్మథుడి వంటివాడట. మూలంలో మొదటి విశేషణంగా ''భ్రాజమానం యథా రవిః'' అని చెప్పబడింది. సూర్యుడివలె ప్రకాశించే వాడిని తెలుగులో సూర్యులలో విష్ణువును చేశాడు. దేవతలకంటె నలుడు మహానుభావుడనీ, తేజస్వి అనీ నన్నయ రచనలో ధ్వని కనిపిస్తుంది. మూలం కంటె ఇది రమణీయం. రెండో విశేషణం మూలంలో లేదు. ''తస్థు ర్విగత సంకల్పాః'' అని మాత్రమే ఉన్నది. అంటే నలుడిని చూడగానే ఇంద్రాదులు తమ ఆశలు వదులుకొన్నారట! ఇది వాచ్యం.

నన్నయ ఈ భావాన్ని అలంకృతం చేసి ధ్వనిమయం చేశాడు. అందంలో దేవతలలో మన్మథుడు మిన్న. నలుడు రెండవమన్మథుడివలె ఉన్నాడనటం ఇక్కడ రమణీయం. నలుడి సర్వాతిశాయిత్వం నన్నయ తాత్పర్యం.

(2) మూలాన్ని కథాప్రవృత్తికి అనుకూలంగా సంస్కరించటం నన్నయ వివేకం. నలుడు దేవదూతగా వచ్చి దమయంతితో 'నీవు వారిని వరించకుండా నన్ను వరిస్తేవారు నన్ను స్వార్థపరుడని నిందిస్తారు. నేను వారి పనిమీద వచ్చాను. నేను స్వప్రయోజనంతో మెలగకూడదు. అది ధర్మం కూడా కాదు. కాబట్టి నాకు ధర్మసంకట మేర్పడకుండా నాకు స్వార్థం నెరవేరేటట్లు ఉపాయం ఆలోచించు' మని అడుగుతాడు- మూలంలో. నన్నయ దీనిని మార్చాడు. 'దేవతల కిష్టం లేని పనులు చేస్తే నరులు అధమగతు లౌతారు. కాబట్టి వారి కిష్టం చేసి నన్ను కాపాడు' మని నలు డన్నట్లు నన్నయ చెప్పాడు. భావికథలో కష్టాలనుభవించేటప్పుడు అవి దేవతలను కాదని నలుడిని పెండ్లాడినందుకు వారు కల్పిస్తున్న బాధలేమో అని శంకించింది దమయంతి. ఆ భావనకు అనుకూలంగా నన్నయ మార్పు రాణించింది.

(3) మార్పులు చేసేటప్పుడు పూర్వాపరవైరుధ్యం లేకుండా కథలో ఏకవాక్యతను సాధించటంలో నన్నయ జాగరూకుడై ఉంటాడు. జూదంలో పుష్కరుడి చేతిలో నలుడు ఓడిపోవటం తప్పదని తెలిసికొనిన దమయంతి చాకచక్యంతో భర్త అనుమతి పొంది కొడుకును, కూతురును విదర్భకు పంపింది. వార్ష్ణేయుడనే సారథి రథంలో వారిని విదర్భకు తీసికొని పోయి పిల్లలతో పాటు రథాన్నీ, గుఱ్ఱాలనూ అక్కడే వదలిపెట్టి రమ్మని వ్యాసదమయంతి ఆజ్ఞాపించింది. నన్నయ దమయంతి రథాన్ని తిరిగి తీసికొని రమ్మని ఆనతిచ్చింది. భావికథలో నలుడు వార్ష్ణేయుడితో కూడి తనరథంమీద ఋతుపర్ణుడి నెక్కించుకొని విదర్భకు పోవలసి ఉన్నది. ఆ రథశబ్దం నలుడిదిగా దమయంతి గుర్తించవలసి వస్తుంది. మూలకథ దాని కనుకూలంగా లేదు. అందువలన నన్నయ దానికి తగినట్లు దమయంతి మాటలు మార్చాడు. వైరుధ్యాన్ని తొలగించాడు. ఔచిత్యాన్ని పోషించాడు.

(4) నలుడి పాత్రలోని అంతస్సంఘర్షణను సృష్టించిన ఈ క్రింది పద్యం యథామూలమైనా తెలుగులో బహుళ ప్రచారం పొందింది.

చ. 'కలి దమయంతిఁ బాప సమకట్టుఁ బొరిం బొరి వాయనోపఁడా
లలన సుదీర్ఘ సౌహృదబలంబున; నిట్టులు రెంటఁ జేసి య
న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారి యైన యు
య్యేలయును బోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై'. **(అర.2.79)**

నలచరిత్రం ప్రాచీన భారతీయ సాహిత్యంలో లభిస్తున్న ప్రసిద్ధ విషాద గంభీర గాథ. విషాదాంత నాటకంలో ఉండే సంఘర్షణ సాంద్రత, విషాద వాతావరణం విషాద గంభీర కావ్యనాటకాలలో కూడా ఉంటాయి. 'టు బి ఆర్ నాట్ టు బి' అన్న అంతస్సంఘర్షణ షేక్స్పియర్ హేమ్లెట్ నాటకంలో ఎంతటి విషాద సంఘర్షణ వాతావరణ సాంద్రతను సృష్టించిందో నలుడి ఈ డోలాయమానస్థితి ఈ కథలో అంతటి విషాదగాఢతను కల్పించి, ఆ పాత్రపై అపార సానుభూతిని కల్గించింది.

(5) నలోపాఖ్యానంలోని ఇతివృత్తం ఒకనాటక వస్తువులో ఉండే సహజ నిర్మాణంతో అమరి ఉన్నది. ఉదాహరణకు హంస దౌత్యంలో ముఖసంధి, నలదౌత్యంలో ప్రతిముఖ సంధి, నలదమయంతులు అరణ్యంలో విడివడి ఒకరు ఋతుపర్ణుడిని ఆశ్రయించి, మరొకరు రాజమాత నాశ్రయించి ఉన్న ఘట్టంలో గర్భసంధి, దమయంతి నలుడిని గురించి బ్రాహ్మణులతో అన్వేషణ సాగించిన ఘట్టంలో అవమర్శ సంధి, పునస్స్వయంవర ఘట్టంలో నిర్వహణ సంధి భాసించాయి. నన్నయ ఈ రూపకమర్యాదను కథాకథనరూపమైన చట్రంలో ఇమిడ్చాడు.

(6) "కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ,
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనమ్ కలినాశనమ్".

ఈ ఫలశ్రుతి ప్రసిద్ధం. నన్నయ దీనికి సీసపద్యం వ్రాశాడు. ఫలశ్రుతి ఉన్నది పుణ్యకథ.

**పుణ్యతీర్థకథలు :**

పదునాలుగు లోకాలు తిరిగే నారదుడు ఒకచోట కూర్చుండి భూవలయంలో ఉన్న తీర్థాలను, వాటి దర్శనం వలన, సేవనంవలన కలిగే ఫలితాలను చెప్పగా, రోమశుడు దేవలోకం నుండి దిగివచ్చి, ధర్మరాజును తనతో పాటు పుణ్యతీర్థాలన్నీ త్రిప్పి సేవింప చేయటమే కాకుండా వాటి మాహాత్మ్యాలనూ, తీర్థక్షేత్ర పురాణాలనూ ధర్మజుడి అభిలాష కనుగుణంగా వివరించాడు. అది ఆరణ్య పర్వ పుణ్యకథా ప్రపంచానికి పుట్టుక నిచ్చింది. తీర్థాలు పవిత్రాలు - ధర్మపరులైన దేవతలు, ఋషులు వాటి నాశ్రయించారు కాబట్టి. తీర్థసేవ సర్వాభీష్టప్రదం. తీర్థాలను సేవిస్తూ క్రతువులను, దానాలను చేస్తూ విప్రాశీస్సులను పొందేవారికి సర్వదుఃఖాలు తొలగిపోతాయి. వారిని సర్వశ్రేయస్సులూ పొందుతాయి. ఈ విశ్వాసంతో పాండవులు తీర్థయాత్రలు చేశారు, యజ్ఞాలు చేశారు, దానాలు చేశారు, బ్రాహ్మణాశీస్సులను పొందారు. అయితే యజ్ఞాలలో జ్ఞానయజ్ఞం ఒకటి. ధర్మరాజు కర్మవలన జ్ఞానం సాధించే అనుష్ఠాన వేదాంతి. అతడు తీర్థాలలో మునిగి పుణ్యం గడించాడు. ఆ పుణ్యతీర్థాలు ఏ మహితాత్ముల చరిత్రలతో ప్రసిద్ధి చెందాయో తెలిసికొని ఆ పుణ్యకథాతీర్థాలలో కూడా మునకలువేసి జిజ్ఞాసువైనాడు. కర్మకాండకు సంబంధించిన దానిని నన్నయ ఊరక చెప్పి ఊరుకొన్నాడు. జ్ఞానకాండకు సంబంధించిన అంశాలను ఉపాఖ్యానాలుగా (స్థలపురాణాలుగా) వివరించి చెప్పాడు. ఆ తీర్థాలను ఆశ్రయించిన మహనీయుల గుణతీర్థావగాహనమే ఈ సాహిత్యతీర్థ సేవాఫలం.

ఈ కథలలో ఎందరో మహానుభావులు కీర్తించబడ్డారు. ఒక్కొక్కరిది ఒక్కొక్క విశిష్టవ్యక్తిత్వం, ఒక్కొక్కపురుషార్థ సాధన మార్గం. అన్ని కథలూ వింటే చతుర్విధ పురుషార్థ తీర్థ సేవనమైనట్లే. ఇతిహాసఫలాలలో అది ఒకటి.

**1. అగస్త్య మహర్షి :** ఈ ఋషిపేరుమీద వెలసిఉన్న పుణ్యక్షేత్రం అగస్త్యాశ్రమం. వాతాపిని జీర్ణం చేసికొని జగద్విఖ్యాతి పొందినవాడు. అందుకే ధర్మజుడు ఆ కథ నడిగాడు. ఆ కథలో తెలిసే అంశాలు నాలుగు. పురుషుడు పుట్టిన తరువాత గృహస్థుడై పుత్ర పౌత్ర లాభాన్ని పొందకపోతే వారి పితరులకు ఉత్తమగతు లుండవు. భార్యకోరికను ఎట్టిప్రయత్నం చేసైనా తీర్చటం భర్త ధర్మం. భర్తవలన ఉత్తమ సంతానాన్ని పొందాలన్న ఉత్తమ సంకల్పం భార్యకూడా కలిగి ఉండాలి. ఉత్తమ గృహస్థుడు తపస్వి అయితే ఎంతటి ఆసురీశక్తినైనా నిగ్రహించగలడు - అనే గుణపాఠాలు నేర్చుకొన్నాడు- ధర్మజుడు.

అగస్త్యుడు అనంత మహిమ కలవాడు. భార్య అయిన లోపాముద్రతో గృహస్థజీవితం గడుపుతున్నా సామాజిక శ్రేయస్సు కొరకు ఎంతటి త్యాగాన్ని చేయటానికైనా, ఎంతటి సాహసం చేయటానికైనా వెనుకాడని తపోవీరుడు. వాతాపిని జీర్ణించుకొన్న దిట్ట. వింధ్యపర్వత గర్వాన్ని భంజించిన గురుమూర్తి. ఉత్తరాపథం నుండి దక్షిణాపథానికి మకాం మార్చిన లోకహిత కారకుడు. లోకకంటకనివారణార్థం సముద్రోదకాలను ఆపోశనం పట్టిన మహితాత్ముడు. అంతటి మహితాత్ముడి మూడంచెల జీవితం వలన మూడు నీతులు తెలుస్తాయి. అవి -గృహనీతిని పాటించు, లోక శ్రేయస్సును సాధించు, అసురశక్తిని దమించు! ధర్మజుడు అగస్త్యాశ్రమంలో ఈ జ్ఞానతీర్థంలో మునిగాడు.

**2. భగీరథుడు** : గంగను నేలకు తెచ్చిన తపోవీరుడు భగీరథుడు. ఎంతో కష్టపడి అసాధ్యమైనదాన్ని సాధిస్తే 'భగీరథ ప్రయత్నం' అంటాం దాన్ని. అతడి చరిత్ర జీవితలక్ష్యం సాధించదలచుకొన్న ఏ ధర్మవీరుడికైనా ఆదర్శప్రాయం. భగీరథుడు

పుట్టినవంశం సాహసవంతులైన వీరులు జన్మించిన ఇక్ష్వాకువంశం. అందులో సగరుడు సంతానంకొరకు శివుడిని గూర్చి తపస్సు చేశాడు. అతడికి ఇద్దరు భార్యలు. పరమేశ్వరుడి వరంవలన పెద్దభార్య వైదర్భికి అరవై వేల మంది కొడుకులు పుట్టారు. శైబ్యకు ఒక్క కొడుకు కలిగాడు. పెద్దభార్య కొడుకులు మదాంధులై కపిలమహర్షి కంటిమంటకు బూడిదై పోయారు. రెండవభార్య కొడుకు క్రూరుడై శిశుహంతగా మారి దేశంనుండి వెళ్ళగొట్టబడ్డాడు. సగరుడు అశ్వమేధయాగం చేశాడు. కాని అది సగంలో ఆగిపోయింది. అతడి మనుమడు తాత గౌరవం నిలువబెట్టాడు. కపిలమునినుండి సవనాశ్వాన్ని తెచ్చి సవనం పూర్తి చేయించాడు. అతడి మనుమడు భగీరథుడు ఘోరతపస్సుచేసి గంగను నేలకు దింపాడు. అగస్త్యుడు నీరు త్రాగగా ఎండిపోయిన సముద్రాలను మరల నీటితో నింపాడు. సాగరుల భస్మరాశులను గంగతో తడిపి వారికి ఉత్తమ గతులు కల్పించాడు. ఈ కథ పుణ్యకథ. ఈ జ్ఞాన తీర్థంలో స్నానం చేసి, ధర్మజుడు నేర్చుకొన్నది అపారం. అందులో ఒక క్రమవిన్యాసం కూడా ఉన్నది. సంతానాన్ని కని పితరులను ఉద్ధరించ వచ్చునని అగస్త్యుడి కథ చెప్పితే, సంతానం ఉత్తమసంతానమైతేనే ఉత్తమగతులు లభిస్తాయని సగరపుత్రుల కథ చెపుతున్నది. ఒక వంశంలో ఒక తరం చెడిపోయినా సంకల్పబలం ఉంటే తరువాతి తరంవారు సత్కర్మలు చేసి, వెనుకటి తరాలవారి నందరినీ ఉద్ధరించగలరనే ఒక ఉపదేశాన్ని ఆశాకిరణంగా అందించింది భగీరథచరిత్ర.

**3. ఋశ్యశృంగముని** : ఈ మహామునిపేర ఒక పుణ్యతీర్థం ఉన్నది. అత డొక అద్భుతవ్యక్తి. విభాండక పుత్రుడు. విభాండకుడు అఖండ బ్రహ్మచారి. ఒకనాడు సరస్సులో స్నానం చేస్తూ ఊర్వశిని చూచాడు. రేతఃపతన మైనది. దానితో కలిసిన నీటిని ఒక దుప్పి త్రాగి గర్భవతి అయి ఋశ్యశృంగుడికి జన్మనిచ్చింది. అతడు తండ్రివద్ద ఆడువారంటే ఎవరో కూడా తెలియని ఏకాంతవాసంలో తపోనిష్ఠలతో పెరుగుతున్నాడు. విభాండకు డొక చిత్రమైన మనిషి. బ్రహ్మచర్యం అతడు పాటించాడు. కొడుకు కూడ బ్రహ్మచారిగానే ఉండాలనుకొన్నాడు. తా నొకసారి ఊర్వశిని చూడటం వలన స్ఖలితుడైనాడు. ఆ తప్పుకూడా కొడుకు పట్ల జరుగకూడదని ఆతడిపై ఆడువారి నీడకూడ పడకుండా నట్టడవిలో పెంచాడు. ఋశ్యశృంగుడు ఎక్కడ ఉంటే అక్కడ వానలు పడే మహిమ కలవాడు. కాని, వానలు కురిసే లోకాన్ని చూడని వానప్రస్థుడు!

అంగదేశాన్ని రోమపాదుడు పాలిస్తూ విప్రులపట్ల అపరాధం చేశాడు. రాజ్యంలో వానలు పడక దుర్భిక్షం ఏర్పడింది. తప్పు తెలిసికొని రాజు విప్రులను సంతోషపెట్టాడు. వారు ఋశ్యశృంగుడిని అంగదేశానికి పిలిపించుమన్నారు. అతడు ఆ ఋషివిషయం తెలిసికొని నిపుణలైన వేశ్యలను తపోవనానికి పంపాడు. విభాండకుడు లేని సమయంలో వేశ్యాపుత్రిక ఋశ్యశృంగుడిని సమీపించి, తన విలాసాలను ప్రదర్శించింది. ఆమెను వింతమునిగా ఊహించి ఋశ్యశృంగు డామెపట్ల పురుషభావంతోనే వ్యవహరిస్తూ ఒక వింతస్పందనను పొందాడు. ఆ వేశ్య అతడిని కౌగిలించుకొని, ముద్దాడి, మణితాది శబ్దాలు చేసి అతడిని ప్రబోధించింది. నిగ్రహించబడి సుప్తమై ఉన్న ఋశ్యశృంగుడి దేహేంద్రియ చైతన్యం ప్రవృత్తి పట్ల జాగృతమైనది. తండ్రి వారించాడు. కానీ, మరునాడు ఋశ్యశృంగుడు ప్రబోధితుడైనాడేకాని వేశ్యతో సంపర్కం పొందలేదు. రోమపాదుడు తనకూతురైన శాంత నిచ్చి పెళ్ళి చేశాడు. గోశాలలు అతడిపేర రాజ్యమంతా ఏర్పాటుచేశాడు. విభాండకుడు ఆసంగతి తెలిసికొని, కొడుకును కోడలిని ఆశ్రమానికి తెచ్చుకొన్నాడు. శాంతాఋశ్యశృంగులు అరుంధతీ వసిష్ఠులవలె, లోపాముద్రాగస్త్యులవలె ఉత్తమ దంపతులై జీవించారు. ఋశ్యశృంగుడికథ అందరినీ ఆశ్చర్యకరంగా ఆకర్షిస్తుంది. నిశ్శబ్దంగా ఒక నీతిని బోధిస్తుంది. నిర్బంధ బ్రహ్మచర్యం వానలు లేని దేశం వంటిది. గృహస్థాశ్రమధర్మంలో చేసే తపస్సు సుభిక్షమైన దేశవైభవం వంటిది. అస్ఖలిత బ్రహ్మచర్యం లోకశ్రేయస్సును అందించదు. గృహస్థాశ్రమమే సర్వత్రా సమాదరణీయం!

**4. పరశురాముడు** : పరశురామనివాసం మహేంద్రపర్వతం. ఆతడి చరిత్ర సారమే ఆ తీర్థసేవన ఫలం. పరశురాముడు ఒక విశిష్ట వ్యక్తి. పుట్టింది బ్రాహ్మణవంశంలో, కలిగింది క్షత్రియ తేజం. అది భృగుడి వరంవలన కలిగిన ఒక మిశ్రప్రకృతి. బ్రాహ్మణక్షత్రియ స్వభావాల మేలికలయిక పరశురాముడు. 'ఇదం బ్రాహ్మ్యం ఇదం క్షాత్రం' అన్న సూక్తికి అచ్చమైన ఉదాహరణం!

'పితృదేవోభవ', 'మాతృదేవోభవ' - అనే ఆర్షసూత్రాలను త్రికరణశుద్ధిగా పాటించే విప్రవీరుడు పరశురాముడు. రేణుకా జమదగ్నులు అతడి తల్లిదండ్రులు. తండ్రి తల్లిని చంపుమంటే మారుపలుకకుండా ఆమె తలనరికి పితృవాక్యపరిపాలనం చేసే క్షాత్రశక్తి అతడికి ఉన్నది. మానవుడు ప్రమాదశాత్తు-మానసికంగానైనా-పాపంకాని, నేరంకాని చేయవచ్చును. దానికి మరణం శిక్ష కాదు. పశ్చాత్తాపమే తరణోపాయమని ఉదారంగా భావించగలిగిన ఉదాత్తప్రవృత్తి అతడికి ఉన్నది. మానసికంగా పరపురుషుడి పొందుకోరిన తల్లినీ, తండ్రిమాటను తిరస్కరించి, శప్తులైన సోదరులనూ బ్రతికించు కొన్నాడు. తల్లిని చంపిన పాపాన్ని పోగొట్టుకొన్నాడు. తండ్రికే తన ప్రవర్తనవలన ఒక కనువిప్పు కలిగించాడు. కోపం కంటె శాంతం, సహనం, క్షమ, క్షమించటం ఎంతటి ఉత్తమ గుణాలో ప్రదర్శించి చూపించాడు. తండ్రి తన తల్లిని అనురాగంతో ఏలుకొనేటట్లు చేశాడు. తల్లి మానసికమైన తన తప్పుకు పశ్చాత్తాపపడి, తనగృహస్థ జీవితాన్ని మరల భగ్నం చేసికొనకుండ భద్రపడటానికి అనువైన శాంతియుత ప్రేమమయ కుటుంబాన్ని పరశురాముడు సృష్టించాడు. ఈ ఘట్టంలో పరశురాముడు పరమ బ్రహ్మణ్యమూర్తి! క్షమాశక్తి!

పరశురాముడి జీవితాన్ని కార్తవీర్యుడి ధూర్తవర్తనం తీవ్రంగా మార్చింది. ఒకనాడు పరశురాము డాశ్రమంలో లేనప్పుడు కార్తవీర్యార్జునుడు ససైన్యుడై వెళ్ళి జదదగ్నివలన ఆతిథ్యాన్ని పొంది, కృతఘ్నుడై ఆశ్రమహోమధేనువును బలవంతంగా హరించాడు. ఆ సంగతి తెలిసి పరశురాముడు ఉగ్రుడైనాడు; కార్తవీర్యుడిని వెన్నంటి వెళ్ళి పోరులో ఘోరంగా చంపాడు. హోమధేనువును తిరిగి తెచ్చాడు. అంతటితో శాంతు డయ్యాడు.

కాని, మరొకసారి మరొక ఘోరం జరిగింది. కార్తవీర్యుడి పుత్రులు పగబట్టి పరశురాముడు ఆశ్రమంలో లేని సమయంలో జమదగ్నిని పట్టి నానాహింసలు పెట్టి దారుణంగా వధించారు. ఆ బాధలు పడుతూ ఆ మహర్షి కొడుకైన రాముడిని ఎలుగెత్తి పిలుస్తూ ఆశ్రమమంతా ప్రతిధ్వనించేటట్లు, ఆశ్రమవాసులంతా రోదించేటట్లు, దారుణ వేదనను అనుభవిస్తూ చనిపోయాడు. రేణుక ఘోరమైన ఆ హత్యను చూచి దిక్కులదిరేటట్లుగా రోదించింది. ఆ కరుణభయంకర దృశ్యాన్ని పరశురాముడు చూచాడు. అపరరుద్రుడైనాడు. పరశువుకు పదునుపెట్టాడు. హైహయులను నిర్దాక్షిణ్యంగా చంపి, అయిదు మడుగులలో రక్తం నింపాడు. ఆ రక్తంతో తండ్రికి తర్పణాలిచ్చాడు. శాంతించాడు. తపోమయ జీవితాన్ని మహేంద్రపర్వతంమీద గడుపుతున్నాడు.

మహేంద్ర పర్వతాన్నీ, పరశురాముడినీ స్వయంగా దర్శించిన ధర్మరాజు గొప్ప నీతిని నేర్చుకొన్నాడు. పితృభక్తి, క్షమ, శాంతం, తపస్సు- అనే విప్రధర్మాలు మనిషిని మహనీయుడిగా చేస్తాయి. పరులవలన అపకారం పొందినప్పుడు దానికి ప్రతీకారం చేసే పరాక్రమాన్ని ప్రదర్శిస్తే అతడు మహావీరుడుగా మారుతాడు. ఒకేవ్యక్తిలో ఈ బ్రాహ్మణ క్షత్రియగుణాలు ఉండటం విశేషం! ఈ జ్ఞానతీర్థంలో మునిగిన ధర్మరాజు అరణ్య, అజ్ఞాత వాసాలలో బ్రాహ్మణ స్వభావాన్నీ, యుద్ధఘట్టంలో క్షత్రియపరాక్రమాన్నీ ప్రకటించి పరశురామ దర్శన తీర్థసేవన ఫలాన్ని జీవితంలో పండించుకొన్నాడు.

ద్రౌపదీ భీములు ధర్మజు డనుసరిస్తున్న క్షమాగుణం బ్రాహ్మణధర్మమని వాదించారు. ధర్మజుడు అదనెరిగి మహాప్రయత్నం చేసి మహాయుద్ధంలో మహాఫలాన్ని పొందటం వీరధర్మ మనీ, ఆ సమయం వచ్చేంతవరకు క్షమతో తపస్సే శరణ్యమనీ ప్రబోధించాడు. క్షత్రియలోకసంహారం చేసిన రౌద్రమూర్తి పరశురాముడు. ధర్మజుడు దర్శించినప్పుడు పరశురాముడు తపశ్శాలి, శాంతమూర్తి. ఆరణ్యపర్వంలో ఆయనను అట్లా దర్శించటమే ఉచితం. అతడి కథ భావికథా జీవితానికి ఒక దివ్యస్ఫూర్తి! ధర్మజుడు ప్రసన్న పరశురాముడు!

**5. చ్యవనుడు-సుకన్య** : చ్యవనుడు ఒక అపూర్వవ్యక్తి; సుకన్య ఒక విచిత్రవ్యక్తి. ఈకథను చెప్పటంలో నన్నయ అపూర్వవ్యంగ్యవైఖరిని అనుసరించి కథార్థాలను భావనామయం చేశాడు. విశ్వనాథ సత్యనారాయణగారు ఈ కథనుగురించి విశేషంగా వ్యాఖ్యానించారు. (చూడండి: 'నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి') రోమశుడు ఒక సరోవరతీరంలో శర్యాతి యజ్ఞ ప్రదేశాన్ని ధర్మరాజుకు చూపిస్తూ- 'ఇక్కడ భృగుపుత్రుడైన చ్యవనుడు శర్యాతి అనే రాజుకూతురు సుకన్యను పెండ్లాడి,

అతడి యజ్ఞంలో ఇంద్రుడిని లెక్కచేయకుండా అశ్వినులను సోమపీథులను చేశాడు' - అని చెప్పాడు. ధర్మజుడు అది ఎట్లా జరిగిందో వివరించుమన్నాడు.

ఈకథలో కేంద్రబిందువు చ్యవనుడు సుకన్యను పెండ్లిచేసికొనటం. దానికి పూర్వ కథ - దాని తరువాతి కథ అని ఉపాఖ్యానం రెండుగా విభక్తమౌతుంది. చ్యవనుడు ఒక సరోవర తీరంలో వీరాసనంలో ఉండి పెక్కువేలేండ్లు తపస్సు చేశాడు. అతడు కన్నులు ఇంచుక తెరిచి తపస్సు చేస్తున్నాడు. చుట్టూ పుట్టలూ చెట్లూ తీగలూ క్రమ్ముకున్నాయి. కాని, అతడి కన్నుల కాంతికి మాత్రం అడ్డం ఏదీ రాలేదు. అతడి కన్నులు ఆ పుట్టలో చెట్లలో మెరుస్తూ ఉన్నాయి. ఆ దృశ్యం చూస్తే అద్భుతంగా, ఆసక్తికరంగా ఉంటుంది. ఎవరైనా సాహసం కలవారు వస్తే ఆ మెరిసే పదార్థా లేమిటో తెలిసికొనాలని ప్రయత్నించే ప్రేరణ కలిగించేవిగా అతడి కన్నులు మెరిసిపోతున్నాయి.

ఒకసారి శర్యాతి ఆ సరోవరతీరానికి వనవిహారానికై వచ్చాడు. అతడి వెంట నాలుగువేల మంది రాణులు కూడా వచ్చారు. వారిరక్షణకై విపుల సైన్యం కూడా వచ్చింది. వారందరిలో 'అతిశయరూప యౌవన గర్విత' ఆతడికూతురు సుకన్య. ఆమె చెలికత్తెలతో కలిసి అడవిలో తిరగటం మొదలు పెట్టింది. చ్యవనుడున్న పుట్టలోనుండి మిడుగురు పురుగుల వలె మెరుస్తున్న ఆ కాంతులను చూచింది. ఉత్కంఠ పెరిగింది. ఆదేమిటో తెలిసికొందామని ఆ పుట్టను త్రవ్వించింది. చ్యవనుడు కళ్ళను నిమీలితం చేశాడు. కొంతసేపు అదృశ్యుడైనాడు. ఆమె కక్కడ ఏమీ కనబడలేదు. తిరిగి తండ్రి వద్దకు వెళ్ళింది.

శర్యాతి సైనికులందరికీ మలమూత్రనిరోధ మేర్పడింది. కారణం తెలియక శర్యాతి బాధపడుతున్నాడు. సుకన్య తాను చేసిన పని చెప్పి ఆ వికారానికి తనపని కారణమై ఉండవచ్చునన్న ఊహ నందించింది. శర్యాతి చ్యవనుడు తపస్సు చేసికొంటున్న చోటికి వచ్చాడు. అస్థిపంజరంవలె చిక్కిశల్యమై ఉన్న పరమవృద్ధుడైన చ్యవనుడిని చూచాడు. కూతురు చేసిన తప్పునకు క్షమాపణ కోరాడు. సైన్యాన్ని బాధనుండి విముక్తి చేయుమని ప్రార్థించాడు. చ్యవనుడు వింతకోరిక కోరాడు. సుకన్య నిచ్చి పెళ్లి చేస్తే సైన్యానికి కలిగిన బాధ తొలగుతుందని పేర్కొన్నాడు. గత్యంతరం లేక కన్య నా ఋషి కిచ్చి శర్యాతి రాజధానికి తిరిగిపోయాడు.

ఇంతవరకు కథలోని పూర్వభాగం. ఇకపై ఉత్తరభాగం. సుకన్య పుట్ట త్రవ్వించటం ఇందులో కీలక సమస్య. సుకన్య యౌవనగర్వంతో ఆ పని చేసింది కానీ, అవినయంతో కాదు, అయోగ్యప్రవర్తనవలన కాదు, ఆమె సార్థక నామధేయురాలు, పుట్టను త్రవ్వించి చ్యవనుడి తపస్సును భగ్నంచేసింది. ఆతడు సుకన్యను వరించాడు. వేలేండ్ల తపస్సు తరువాత అతడు ఒకయింటి వాడవ్వాలని అనుకొన్నాడు. కథ ఎట్లా ఉన్నదంటే - సుకన్య(తగిన ఉత్తమురాలైన కన్య) కొరకే చ్యవనుడు తపస్సు చేస్తున్నాడా? ఆమె దొరికింది కాబట్టి ఇక కళ్ళు నిమీలితం చేసి, ఆలోచించి, ఆమెను దక్కించుకొనే యత్నంలో భాగంగా శర్యాతి సైన్యానికి ఇబ్బంది కల్పించాడా? సైన్యాన్ని దక్కించుకోవాలంటే శర్యాతి సుకన్యను తప్పక ఇవ్వాలి. లేకపోతే' అంతవృద్ధుడికి నాకన్య నివ్వటం ఎట్లా'? అని ఎన్నో అడ్డు ప్రశ్నలు వేయవచ్చును. చ్యవను డెంతటి తపస్వియో అంతటి వ్యూహనిపుణుడి వలె కనబడతాడు. చివరకు తాను కోరుకొంటున్న భార్యను శర్యాతి సుముఖత్వంవలన సులభంగా పొందగలిగాడు. విచిత్రమేమంటే ఈ వ్యూహంలో సుకన్య మనస్సును తెలిసికొనే సమస్యే రాలేదు. ఆమె తండ్రి ఆనతికి బద్ధురాలు. సైన్యం కొరకు సుకన్యను దానంచేసి తండ్రి వెళ్ళిపోయాడు. ఇష్టమున్నా లేకపోయినా వృద్ధమునితో సుకన్య కాపురం చేయవలసి వచ్చింది. ఆమె యౌవనంలో ఉన్నది. అతడు ఆమెతో కామకేళి జరిపే వయస్సులో లేడు. అయినా ఆమెను వివాహమాడాడు. చ్యవనుడు తపస్సులో వయసునంతా వ్యయం చేశాడు. గృహస్థాశ్రమధర్మం నిర్వహించటం జీవితపరమార్థమనుకొన్నాడు, మరి ఆ వృద్ధుడికి ఆ తపస్సు తోడ్పడుతుందా?

ఇది ఒక పెద్దప్రశ్న. భార్య తోడ్పాటుంటే భర్తతపస్సు గృహస్థాశ్రమ ధర్మ ఫలాన్ని పొందటానికి సమర్థమౌతుంది. ఆ రహస్యాన్ని చ్యవనుడు తన జీవితంలో ఆవిష్కరించ దలచాడు. చ్యవనుడు నవయౌవనవతి అయిన తన భార్యను అభిమత కేళీసౌఖ్యాలతో తృప్తురాలిగా చేయవలసిన ధర్మం తనకు ఉన్నదని మనసారా భావించిన మహనీయుడు. దానికి తన తపస్సుతో ఒక కార్యరూపాన్ని ఇవ్వాలి. అయితే. అందుకు సుకన్య సంకల్పశుద్ధి కూడా కావాలి. మరొకమాటలో చెప్పాలంటే ఆమె పాతివ్రత్య దీక్షావ్రత శక్తికూడా కావాలి. ఆ రెండూ కలిస్తే గృహస్థ ధర్మఫలసిద్ధి ఏర్పడుతుంది.

ఉత్తరభాగం ఇక్కడ మొదలౌతుంది. చ్యవనుడు చాల లోతైన మనిషి. ఎక్కడా బయట పడడు. పుట్ట త్రవ్వించినప్పుడు కొంత కొంటెపిల్లవలె కనిపించినా సుకన్య పెండ్లి అయిన తరువాత భర్తకు పరమభక్తితో పరిచర్యలు చేస్తున్నది. ఆమెకు పరిచర్యాభాగ్యమే కలుగుతున్నది కాని భర్తృ సమాగమసుఖం అందటంలేదు. ఆమెకూడా అసంతృప్తిని ప్రకటించలేదు. భర్త ఎంత నిండుగా బైటపడకుండా ఉంటాడో భార్యకూడా అంత నిండుగా బైటపడకుండా ఉంటున్నది. ఆమె చ్యవనుడి కంటె రెండాకులెక్కువ చదివిందా అనిపిస్తుంది.

పుట్టనుండి బైటపడిన తరువాత చ్యవనుడికి పట్టుమని తపస్సు కుదరటం లేదు. తన యిల్లు, ఇల్లాలు కుదుటపడితే తప్ప అతడికి శాంతి లేదు. అతడిలో అతడే అన్వేషణ మొదలు పెట్టాడు. ఆతడు యువకుడు కావాలి, సుకన్యకు సుఖాన్ని పంచిపెట్టాలి. దేవతలలో యౌవనాధిదేవతలు ఆశ్వినులు. వారిని ఉపాసించాడు. వారు ప్రసన్నులైనారు. మార్గం వేశారు.

ఒకనాడు ఒంటిగా ఆశ్వినులు సుకన్యను కలిశారు. ఆమె యోగక్షేమాలు తెలిసికొన్నారు. వారు నవ్వి 'అయ్యో! ఇట్టి అందం, యౌవనం కలిగి ఉండి కూడా కామోపభోగాలకు పనికిరాని ముదుసలిని పెళ్ళాడి, నీ వయసును వృథా చేసికొంటున్నావు. ఇప్పుడైనా సరే, నీ వయోరూపాలకు తగిన వరుడిని వరించుము. మేం వాడిని తెచ్చి నీ కిస్తాం' అన్నారు. సుకన్య వారి మాటలకు అడ్డువచ్చింది. 'నాకు చ్యవనుడిమీద ఎప్పుడూ ప్రీతి ఉంటుండగా మీ రిట్లా మాట్లాడటం ఉచితమా?' అని చెప్పి, వారి నక్కడే ఉంచి, వెంటనే భర్తవద్దకు వెళ్ళి వా రన్నమాటలు చెప్పింది. సుకన్య ఎంత శీలవతియో అంత లోకజ్ఞురాలు. ఆ మాట లన్నవారు అశ్వినీదేవతలు. వారు ఆశ్రమ ప్రాంతానికి ఊరక రారు. ఊరక ఏ ప్రసక్తీ తేరు. వారన్న మాటలలో ఏ భావి భాగధేయాలు దాగి ఉన్నాయో? అయినా, వా రన్న మాటలు తన మనసులో లోలోన దాగి ఉన్న కోరికనే తెలుపుతున్నాయి. భర్తయందు భక్తి ఉన్నది. అది అచంచలం. కాని ఆతడివలన ఆమె రక్తిని కూడా కోరుకొంటున్నది. అశ్వినులా తగిన వరుడిని వరించుము, మేము తెచ్చి ఇస్తా' మంటున్నారు. ఆమె మనసులో భర్త తప్ప మరొకరు లేరు. కాబట్టి ఆమె మరొకరిని సూచించలేదు, కాని, భర్త యువకుడు కాడు. ఇదీ సత్యమే. అదీ సత్యమే. ఇది ఆమె జీవిత వాస్తవం కూడా. ఆమె ఆశ్వినుల మాటలు వెంటనే భర్తకు చెప్పటం వలన చ్యవనుడు ఆమె పతివ్రత అని నిశ్చయించాడు. ఎట్లా? మరొకరిని ఆమె కోరుతున్నట్లయితే దేవతలకు రహస్యంగా నివేదించుకొని వారి దయవలన మరొక యువకుడితో ఇష్టసుఖా లనుభవించి ఉండేదే. కాని, తగిన వరుడిని తెచ్చి యిస్తామని ఆశ్విను లన్నప్పుడు కూడా ఆమె హృదయంలో చ్యవనుడే స్మరణయందు నిలవటం ఆమె పాతివ్రత్యాన్ని ప్రకటించింది.

ఇది ఒక విధంగా ఆమె శీలపరీక్ష. ఆమె నెగ్గింది. ఆశ్వినులు సంతోషించారు. చ్యవనుడు తన వ్యూహం ఫలించినందుకు సంతోషించాడు. ఆశ్వినులు చెప్పినట్లు చేయుమని భార్యను ఆజ్ఞాపించాడు. ఆమె వివేకవతి. 'నాకు నవయౌవన వరుడి' ని ప్రసాదించండని ఆశ్వినులను వేడింది. అత డెవరో ఆమె చెప్పలేదు.

ఆశ్వినులు కొలనులో దిగి మునిగారు. వారివెంట చ్యవనుడు కూడా కొలనులో మునిగాడు. అందరూ నవయౌవనాకారులై బయటికి వచ్చారు. 'మాలో ఒకరిని ఎన్నుకొను' మని ఆశ్విను లన్నారు. సుకన్య యువకుడైన తన భర్తనే ఎన్నుకొన్నది. ఆశ్వినులు సంతోషించారు.

చ్యవనుడి మహావ్యూహంలో ఆశ్వినులు భాగస్వాము లని సుకన్యకు తెలియునా? తెలిస్తే కథ ఇట్లా నడవదు. ఆమె కొంత ఊహించి ఉండవచ్చునని కొందరు భావించారు. సారమతులు లోనారసినంత లోతు ఈ ఉపాఖ్యానంలో కనబడుతుంది.

చ్యవనుడు తనకు తాను నవయౌవనుడిగా సృష్టించుకొనటానికి తోడ్పడిన అశ్వినీదేవతలకు యజ్ఞాలలో సోమపానంలో భాగం కల్పించాడు. ఎదిరించిన ఇంద్రుడిని తన తపోబలంతో తలవంచేటట్లు అంగీకరించేటట్లు చేశాడు. యజ్ఞం శర్యాతి చేత చేయించాడు. ఆశ్వినులకు తాను ఆ ఫలాన్ని అందించాడు.

ఆరణ్యపర్వంలో కర్మప్రధానమైన యజ్ఞయాగాదులకంటె తపస్సు ముఖ్యమనే మహాతాత్పర్యం నిరూపించబడింది. తపస్సువలన కర్మభక్తిజ్ఞాన ఫలాలను పొందవచ్చునన్న పరమతాత్పర్యాన్ని చ్యవనుడి కథ వెల్లడిస్తున్నది. పురుషుడిలోని తపశ్శక్తిని గృహస్థాశ్రమ ధర్మరక్షణశక్తిగా మలచి పోషించే మహాశక్తి గృహిణి. ఆమె సుకన్య. అందుకే దీనికి సౌకన్యోపాఖ్యానం అనే పేరుంది; చ్యవనుడి తపశ్శక్తి వలన వైడూర్యపర్వతం ఆర్చీకపర్వతంగా ప్రసిద్ధి చెందింది. కాబట్టి ఇది చ్యవన చరిత్రం.

**6. మాంధాతృడు** : ఇంద్రుడి అర్ధసింహాసనాన్ని అధిరోహించిన ఇక్ష్వాకువంశ చక్రవర్తులలో ఇతడు ప్రసిద్ధుడు. అతడు అజగవమనే ధనువుతో, దివ్యాస్త్రాలతో, అభేద్యకవచంతో ఎన్నో యుద్ధాలు చేశాడు. పరిపూర్ణ దక్షిణలతో ఎన్నో యాగాలు చేశాడు. పుట్టగానే ఇంద్రుడి చూపుడు వ్రేలినుండి అమృతం త్రాగిన ఈ వీరుడు తనదేశంలో అనావృష్టి ఏర్పడ్డప్పుడు ఇంద్రుడితోనే యుద్ధంచేసి మేఘాలచేత వర్షం కురిపించాడు. ఇతడి గాథ వింటూంటే అర్జునుడి చరిత్రకు ఆచార్యకం వంటిదిగా మన కనిపిస్తుంది.

**7. సోమకుడు** : యజ్ఞకర్మకంటె తపస్సు గొప్పదని చెప్పేకథ- సోమకుడనే రాజర్షిది. సోమకుడు యజ్ఞం చేసి, అందులోనుండి జంతుడనే పేరుకల కొడుకును పొందాడు. అతడి నూర్వురు భార్యలూ ఆ బాలుడిని అల్లారు ముద్దుగా పెంచారు. కాని ఒక కొడుకు ఏకారణంవలన నైనా చనిపోతే తనవంశం ఏం కావాలి? అనే ప్రశ్న అతడికి కలిగింది. జంతుణ్ణి బలిపశువుగా ఉపయోగించి అతడి మెదడునూ, రక్తాన్నీ హోమంచేసి యజ్ఞం చేస్తే నూరుగురు కొడుకులు పుడతారనీ, వారిలో జంతుడు పెద్దవాడౌతాడనీ, ఒక ఋత్విజుడు చెప్పాడు. సోమకుడు యజ్ఞం చేశాడు. పుత్రశతాన్ని పొందాడు. అయితే ఆ యజ్ఞం చేయించిన ఋత్విజుడు చనిపోయి నరకంలో యమయాతనలు పడుతున్నాడు. సోమకుడు ఉత్తమలోకాలకు పోతూ ఋత్విజుడికి తన యజ్ఞం చేయటంవలన ఆ నరకబాధ ఏర్పడిందని తెలిసి, తన తపోయజ్ఞఫలాన్ని పంచి అతడిని కూడా ఉత్తమలోకాలకు తీసికొనిపోయాడు. పుత్రుడిని యజ్ఞం చేసి పొందు కాని, పుత్రుడిని యజ్ఞపశువుగా చేసి యజ్ఞం చేయకు - అన్నది ఈ తీర్థగాథా సందేశం!

**8. భరతుడు** : చంద్రవంశ చక్రవర్తులలో వంశకర్తగా ప్రసిద్ధి చెందిన భరతుడు ప్లక్షావతరణ మనే యమునా తీర్థంలో అనేక యాగాలు చేసి సర్వలోకాలనూ చూచాడు. రోమశుడు ధర్మరాజును కూడా ఆ తీర్థంలో స్నానంచేసి సర్వలోకాలను దర్శించుమని హితువు చెప్పాడు. ధర్మజుడు తమ్ములతో సహా స్నానం చేశాడు. స్నానంచేసి, ధర్మరాజు మాత్రం తాను సర్వలోకాలనూ దర్శించినట్లు ప్రకటించుకొన్నాడు -

శా. 'దేవర్షి ద్యుచరాహిలోకములు నాదిత్యాశ్వినీ లోకముల్
దేవాధీశ్వరుఁ జూచితిన్ మఱియు నద్దేవేంద్రునొద్దన్ సగాం
డీవోద్దామమహాభుజార్గళుఁ గిరీటిన్ సవ్యసాచిన్ జయ
శ్రీవిభాజితుఁ బార్థుఁ జూచితి జగత్సేవ్యా! మునీంద్రోత్తమా!' **(ఆర. 3.222)**

ఈ ఒక్క నిదర్శనం చాలు - ధర్మజుడు ఏ తీర్థంలో స్నానం చేసినా ఆ తీర్థ మాహాత్మ్యానికి కారకుడైన మహాత్ముడు పొందిన మహితానుభూతిని తాను కూడా పొందాడనటానికి. ధర్మజుడి తీర్థయాత్రల పరమార్థమే అది. ఒక్క ధర్మరాజులో యుగయుగాల పుణ్యపురుషుల తేజం సంపుటీకరించబడిందనటానికి ఆరణ్యపర్వంలోని పుణ్యతీర్థ సేవాఘట్టం పరమోదాహరణం.

**9. శిబిచక్రవర్తి :** ఇంద్రాగ్నులు శ్యేనకపోతరూపాలతో శిబి చక్రవర్తి దానశీలాన్ని పరీక్షించినప్పుడు తన శరీరాన్ని దానంగా ఇచ్చి శబ్దబ్రహ్మం ఉన్నంతకాలం నిత్యకీర్తి పొందిన దానవీరుడు శిబి చక్రవర్తి. అతడి క్షేత్రం భృగుతుంగపర్వతంమీద ఉన్నది. ఆశ్రితుల కొరకు శరీరాన్ని గాని, చివరకు స్వర్గ సౌఖ్యాలను గాని త్యాగం చేయగలిగే మహిమోన్నతుడు ధర్మరాజు. ఆతడిలోని త్యాగవీరం ఆ తీర్థసేవనం వలన దృఢపడిఉంటుంది.

**10. అష్టావక్రుడు :**

క. 'అలయక యేండ్లు గడుం బె
క్కులు జీవించుట నర గలుగుటయుం దగు వృ
ద్ధుల లక్షణమే? జ్ఞానము
గలఁడేనిన్ బాలుఁడయినఁ గడు వృద్ధు మహిన్'. **(ఆర. 3.248)**

అన్న సూక్తికి అష్టావక్రుడి చరిత్రం చక్కని ఉదాహరణం. కురుసభలో ద్రౌపది అడిగిన ధర్మసందేహాన్ని ధర్మరాజొక్కడే తీర్చగలడని భీష్మ డన్నాడు. జ్ఞానానికీ, వయసుకూ, సొగసుకూ సంబంధం లేదన్న సత్యం భారతమంతా వినబడుతుంది. ధర్మజుడు విశ్వసించిన ధర్మాలలో ఇది ఒకటి. రాజసూయంలో శ్రీకృష్ణుడిని వృద్ధుడని పూజించలేదు. జ్ఞానవృద్ధుడనే గౌరవించాడు.

**11. యవక్రీతుడు :**

క. 'గురుశుశ్రూష యొనర్చుచుఁ
బరమక్లేశమునఁ జేసి పడసిన విద్యల్
స్ఫురియించుఁ గాక గురుముఖ
విరహితముగఁ బడసినవియు వెలయునె యెందున్?' **(ఆర. 3,282)**

అనే నీతికి చక్కని ఉదాహరణం యవక్రీతుడిచరితం. రోమశుడు రైభ్యాశ్రమాన్నీ, భారద్వాజాశ్రమాన్నీ చూపించి, ఆ తపోవిద్యా కేంద్రాలలో జరిగిన రెండు ఉదంతాలను పేర్కొని, గురుముఖతః చదువని విద్యావంతులు, యజ్ఞంవలన విద్యను పొందిన పండితులు ఏవిధంగా మదమాత్సర్యాలకు గురి అయి నశిస్తారో వివరించి చెప్పాడు. సంతత జ్ఞాన విద్యార్థిగా ధర్మజుడు పెద్దల వలన పొందిన జ్ఞానాన్ని ఉపాసిస్తున్నవాడు. దుర్యోధనుడు ఈతడి వలె కాక విపరీత ప్రవృత్తి కలవాడు. వారిరువురి విద్యావిభవ తారతమ్య పరిశీలనకు ఈ కథ ఎంతో తోడ్పడుతుంది. మంత్రతంత్రాలతో విద్యను గడించి, మిత్రుడి భార్యను కామించి చివరకు రైభ్యుడి మంత్రశక్తికి బలియైన భరద్వాజ పుత్రుడు యవక్రీతుడు దుర్యోధనతుల్యుడు. తమ్ముడు చేసిన పితృహత్యకు ఉపశమనక్రియలు చేసి, తమ్ముడికి మేలు చేయబోయిన అర్వావసుడికి తమ్ముడు కపటియై కీడు చేయబోయాడు. దేవతలు అర్వావసు సత్యశీలాన్ని మెచ్చి అతడికి వరాలిచ్చారు. చని పోయిన బంధుమిత్రులందరు అతడివలన బ్రతికారు. రైభ్య భరద్వాజాశ్రమాలలో జరిగిన కథలవలన దేవతలు చెప్పిన సారాంశమిది- గురుశుశ్రూషా సంతోషకరుడైన వాడు బ్రహ్మజ్ఞానాన్ని ఉపార్జించగలుగుతాడు అని (3.283), యవక్రీతుడి క్షేత్రంలో నివసిస్తే దురితవిముక్తుడౌతాడని, ఇక్కడితో ధర్మరాజు తీర్థయాత్ర ముగుస్తుంది. ధర్మజుడు బ్రహ్మజ్ఞాని అయినాడని, దురితవిముక్తుడైనాడని వస్తుధ్వని.

నన్నయ సూచించినట్లుగా ఈ పుణ్యతీర్థ కథలకు కూడా ఒక క్రమం తెలిసి చదివితే' కథాక్రమం బతి రమ్యంబు' (2.354). క్రమం తెలియకుండా చదివినా 'కథ రమ్యంబు' (3-397). ఇది నన్నయ శిల్పం.

**ఉపాఖ్యానాలలో కూడ అనుసృజనాత్మకత :**

అఖ్యానంలో వలెనే, ఉపాఖ్యానాలలో కూడా నన్నయ రచనలో అనుసృజనాత్మకత అడుగడుగునా కనబడుతుంది. తీర్థ మాహాత్మ్యాలలో కూడా నన్నయ గంటం ఆ ప్రతిభను ప్రదర్శించింది. మచ్చు కొకటి రెండు గమనిస్తే చాలు.

1. అగస్త్యుడు లోపాముద్రను వివాహం చేసికొని, ఆమెను వెంటపెట్టుకొని గంగాద్వారక్షేత్రంలో తపస్సు చేస్తూ ఉంటాడు. లోపాముద్రా రూపయౌవన వైభవం అతడిలో మన్మథప్రేరణను కలిగించింది. ఆ ఘట్టంలో వ్యాసుడు చెప్పే పద్ధతి కంటె నన్నయది శిల్పసుందరం. మూలం :

"తతో బహుతిథే కాలే లోపాముద్రాం విశాంపతే,
తపసా ద్యోతితాం స్నాతాం దదర్శ భగవానృషిః.
స తస్యాః పరిచారేణ శౌచేన చ దమేన చ,
శ్రియా రూపేణ చ ప్రీతో మైథునాయాజుహావ తామ్." **(3.95.13-14)**

నన్నయ తీర్పరితనం :

'నీచతరనాభిఁ జపల వి
లోచనఁ బృథుజఘనచక్ర లోపాముద్రం
జూచి మునీంద్రుఁడు మన్మథ
గోచరుఁడై దానిఁ బ్రీతిఁ గూడఁగఁ దివిరెన్'. (ఆర. 2.332)

నన్నయ తీర్చిన లోపాముద్ర శృంగార విభావం. 'మన్మథ గోచరుడై' అనే మధురమైన అభివ్యక్తి నన్నయకే దక్కింది. "ప్రీతో మైథునాయాజుహావ తాం" అన్న గ్రామ్యధోరణి కంటె "ప్రీతిఁ గూడఁగఁ దివిరెన్" అన్న నాగరక ధోరణి నాణ్యంగా ఉన్నది.

2. అగస్త్యుడు వాతాపి జీర్ణం అని కడుపు నిమురుకొన్నాడు తెలుగులో మరొకవిశేషం కూడా ఉన్నది. మూలంలో పిడుగువంటి అపానవాయువును వదలినట్లున్నది. తెలుగులో గఱ్ఱన త్రేన్చినట్లున్నది. ఎంత ఔచిత్యదృష్టి? గమనించండి:

మూలం : "తతో వాయుః ప్రాదు రభూ దథస్తస్య మహాత్మనః,
శబ్దేన మహతా తాత! గర్జన్నివ యథా ఘనః".

నన్నయ : 'కడుపుఁ దడవిగొనుచుఁ గఱ్ఱనఁ ద్రేఁచిన
నసుర జీర్ణమయ్యె నాక్షణంబ'. **(ఆర. 2.343)**

(3) తీర్థయాత్రలను గురించి ఆరణ్యపర్వంలో ఋషిత్రయం చెప్పిన వర్ణనలు మూలంలో విపులంగా ఉన్నాయి. అందులో మొదట నారదుడు, చివర రోమశుడు, మధ్య ధౌమ్యుడు చెప్పిన అంశాలున్నాయి. ఆ ముగ్గురిలో ధౌమ్యుడిది

అంత ముఖ్యం కాదు. అట్లని అతడిని కాదనటానికి వీలులేదు. దివ్యర్షుల కెన్నివిషయాలు తెలియునో పాండవ పురోహితుడికి కూడా అన్ని తెలియునని చెప్పటమే అందులోని వస్తుధ్వని. అయితే, మూలంలో ధౌమ్యుడు నాలుగు దిక్కులా ఉన్న తీర్థాలను నాలుగు అధ్యాయాలలో చెప్పినట్లున్నది. నన్నయ దాని నొక పద్యభాగంలోకి కుదించి ఔచిత్యాన్ని పాటించాడు.

ఉ. 'నాలుగు దిక్కులందును వినన్ విదితంబగుచున్న పుణ్యతీ
ర్థాలి తెఱంగెఱుంగఁగ మహాత్ముఁడు ధౌమ్యుఁ డజాతవైరి కం
దోలినఁ జెప్పుచున్నతఱి నొప్పుగ రోమశుఁ డేఁగుదెంచె....!' **(అర. 2.290)**

శాస్త్రేతిహాసాన్ని కావ్యేతిహాసంగా మలచే కిటుకుల్లో ఇటువంటి సంగ్రహీకరణలు ముఖ్యమైనవి. ఆ వివరాలు లేకపోతే కావ్యత్వానికీ, కథాశక్తికీ ఏమీ లోపం లేదని నన్నయ తీర్పు.

**అరణ్య రమణీయత - నన్నయ ఆత్మీయత :**

గోదావరీనదిని, వేంగీసీమను ఆత్మీయంగా ప్రేమించిన ఆంధ్రకవి, ఆదికవి నన్నయ. అందువలననే నదులన్నా, వనాలన్నా, తోటలన్నా, ప్రకృతి సౌందర్య విలసితాలైన పర్వతారణ్యాలన్నా నన్నయకు మనసు మత్తెక్కుతుంది. ఆరణ్యపర్వంలో ప్రకృతి పొత్తిళ్ళలో పెరిగినట్లున్న ప్రాంతాలను నన్నయ ఆత్మీయతతో వర్ణించాడు. అటువంటి వాటిల్లో గంధమాదన పర్వతం నన్నయకు నచ్చిన క్షేత్రం. గోదావరీ ప్రకృతి సౌందర్యాన్ని గంధమాదనంలో బింబప్రతిబింబ భావంగా దర్శించాడు. నన్నయ ఆత్మసంగీతం అక్కడ ప్రకృతివర్ణనపద్యాలలో అక్షరరమ్యంగా అవతరించింది.

గంధమాదన పర్వత సానువులలో సహజ రమణీయంగా ఉన్న ప్రకతి ఒడిలో ద్రౌపదీ భీములు ప్రసన్నంగా విహరిస్తున్నారు. వారి ఆనందానికి ప్రతీకయా అన్నట్లు సహస్రదళకమలం వారిముందు పడింది. అదొక మధురమైన తన్మయ సన్నివేశం. పఠితను ఒక పద్యంతో నన్నయ్య ఆ రసానుభూతిలో అక్షరమ్యత అనే సాహితీ కళామంత్రంతో ముంచుతాడు. ఆ పద్యం ఇది.

చ. 'అలఘులు గంధమాదన మహా ధరణీధర సానురత్న వే
దులఁ బవమాననందనుఁడు ద్రోవదియున్ విహరించుచున్నచో
లలిత సహస్ర పత్రకమలంబు సమీరవిధూతమై మహీ
తలముపయిన్ వడిం బడియెఁ దద్దయుఁ బొల్పుఁగ వారిముందటన్'. **(అర. 3.310)**

ఓజస్సులో ప్రసాదం కలిపి భద్రగజంవలె పద్యాన్ని నడిపే రచన నన్నయకు ఆత్మీయం. అందువలననే ప్రసిద్ధికెక్కిన నన్నయ పద్యాలు చాలావరకు ఈ పాకంలోనే పడి రుచిగా ఉంటాయి. ఉదాత్తవస్తు వర్ణనంలో నన్నయ శైలి ఈ రమ్యతను వెలారుస్తుంది. దీన్ని అక్షరరమ్యత అనీ, అక్షరమైన ఆస్వాదనీయత్వం అనీ పిలుస్తాం.

ప్రకృతిని వర్ణించేటప్పుడు నన్నయ పద్యంవలె వచనాన్ని కూడ అక్షరరమ్యం చేస్తాడు. భీముడు గంధమాదనం మీదకు పోయి కుబేరుడి వనంలో ఒక సరోవరం చూచాడు. ప్రకృతి రమణీయంగా ఉన్నది. సరోవరస్నానం సరసంగా సాగింది. నన్నయ వచనం అక్షరరమ్యంగా స్పందించింది.

''చని చని పవనవశ సంచలిత తటమహావన తమాల తాల హింతాల విశాల కదళీదళ వీజ్యమాన శీతలజల పరిపూర్ణంబైన యొక్క సరోవరంబుఁ గని యందుఁ గృతావగాహుండై నవనలినదళమృణాల వలయాలంకృతుం డగుచు దాని

వెలువడి యనేక యోజన విస్తారాయామ రమణీయం బైన కదళీషండంబుఁ జొచ్చి యందు శంఖధ్వానంబుఁ జేసిన'' -**(అర. 3.313)**

భీముడే కాదు నన్నయకూడా ఈ వచనంలో నాదమాధుర్యాన్ని శంఖధ్వానంగా వినిపించాడు. ఇది నన్నయ ఆత్మీయత అక్షరరమ్యతగా అవతరించే తీరు.

కొండ కొమ్ములలో మేఘాలు క్రమ్ముకొంటున్నాయి, చరియలలో ఏనుగులు తిరుగుతున్నాయి. ఆ రెంటికీ తేడా గుర్తించలేని ఒక మబ్బులు క్రమ్మిన కొండ ప్రకృతి సౌందర్యం నిండారిన సుందర సన్నివేశం - భయద గంభీర సుందరంగా ఉన్నది. నన్నయ అటువంటి సన్నివేశంలో ఒడలు మరచి పరవశిస్తాడు. ఆ అనుభూతిని అతడి కవిత మోసుకొని వస్తుంది. ఈ సీసం ఆ రమ్యతకు ఒక రమణీయ అక్షరశిల్పం!

సీ. 'వారిధారల ననివారిత నిర్గళ । ద్దానధారలఁ దటిద్ధామములను
దశన ధామంబుల నశనిఘోషంబుల । ఘోరబృంహిత బృహద్ఘోషణముల
నివి ఘనబృందంబు లివి గజయూథంబు । లని విచారింపంగ నక్కజంబు
లై లలితోత్తుంగ శైలశృంగంబుల ( । గ్రిమ్మరు జలధర ద్విరదతతుల

ఆ. విస్మయంబుతోడ వీక్షించుచుం జని । రజతగిరి సమీప రమ్యభూమి
నక్కుబేరు వనమునందు సౌగంధిక । కమలవనముఁ గనియె ఘనభుజుండు'. **(అర. 3.355)**

ఈ పద్యం చదువుతూ ఉంటే ''ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్ట సానుం, వప్రక్రీడా పరిణత గజ ప్రేక్షణీయం దదర్శ'' అన్న కాళిదాసమహాకవి మేఘసందేశ కావ్యశ్లోకం గుర్తుకు వస్తుంది. ఆరణ్యపర్వంలో కూడా రానున్న వర్షకాలానికి ఈ మబ్బులు ముందు సూచన లేమో! మేఘాలకూ ఏనుగులకూ సామ్యం కవిసమయం. దాన్ని రూపకంగా ప్రదర్శించటం నన్నయ రచనలో రామణీయకం.

మదగజ మనే భావ చిత్రాన్ని సన్నివేశసుందరంగా నిర్వహించటం నన్నయ రుచిరార్థ శిల్ప నిధిత్వం. అసలు గంధమాదన పర్వతాన్ని భీముడు మదగజం వలెనే ఎక్కినట్లు నన్నయ పరిచయం చేశాడు. అక్కడినుండి అతడు చేసిన చేష్టలు, చూచిన స్థలాలు మదగజ భావచిత్రాలతో అలంకారరమ్యంగా భాసింపజేయటం ప్రసన్నకథా కవితార్థయుక్తి!

**నానారుచిరార్థ సూక్తులు :**

ఆరణ్యపర్వం నన్నయ నానారుచిరార్థ సూక్తినిధిగా ప్రసిద్ధిపొందింది. ఈ పర్వంలోని ఈక్రింది పద్యాలు తెలుగువారి సంభాషణలలో రమ్యధర్మోక్తులుగా, సూక్తులుగా, లోకోక్తులుగా నేటికీ జాలువారుతున్నాయి.

ధర్మం -

క. 'ధీరమతియుక్తిఁ జేసి వి । చారింపఁగ నిక్కువంబు సర్వజన స్వ
ర్గారోహణ సోపానం । బారఁగ ధర్మంబ సూవె యతిరమ్యం బై'. **(అర. 1.229)**

క. 'ధర్మజ్ఞులైన పురుషులు । ధర్మువునకు బాధ సేయు ధర్మువు నైనన్
ధర్మముగా మదిఁ దలఁపరు । ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్'. **(అర. 3.230)**

భార్య :

తే. 'అధిక దుఃఖ రోగార్తున కౌషధంబు । సురుచిరంబుగ భార్యయ చూవె యెందు;
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని । కెంతలయ్యును నాపద లెఱుకపడవు'. **(ఆర. 2.74)**

క. 'అలసినెడ డస్సినెడ నాఁ । కలి దప్పియు నైన యెడలఁ గడుకొని ధరణీ
తలనాథ! పురుషునకు ని । మ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్'. **(ఆర. 2.75)**

సంఘబలం :

తే. 'బలము గలవానిఁ బలువురు బలవిహీను
లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి
మధువు గొన నుత్సహించిన మనుజుఁ బట్టి
కుట్టి నిర్జించు మధుకర కులమునట్లు'. **(ఆర. 1.251)**

వృత్తరక్ష :

తే. 'వృత్తవంతుండు వెండియు వివిధ గతుల । వృత్తవంతుండు గానేర్చు; వృత్తహీనుఁ
(పాఠాం: విత్తహీనుండు వెండియు వివిధ విధుల । విత్తవంతుండు గానేర్చు, వృత్తహీనుఁ)
డైనవాఁడు విహీనుండ యండ్రు గాన । విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష'. **(ఆర.4.129)**

ఆరణ్యపర్వంలో ధర్మజుడి శీలచిత్రణాన్నంతా ఒక్కమాటలో చెప్పాలంటే 'విత్త రక్షకుఁ గడుమేలు వృత్తరక్ష' అని పేర్కొంటే చాలు, నహుష ప్రశ్నలలో ధర్మజు డిచ్చిన ఈ సమాధానం ధర్మవీరుల ఉత్తమశీలచిత్రం!

**మహాభారతం కాలంనాటి పుణ్యతీర్థాలు :**

సంస్కృత మహాభారతంలోని వనపర్వంలో వర్ణించబడిన పాండవ తీర్థయాత్రలను ఆధారంగా చేసికొని ఆకాలంనాటి భరతఖండం, అందులో పాండవులు చేసిన తీర్థయాత్రలను గురించి శ్రీ చర్ల నారాయణశాస్త్రిగారు చెప్పిన ఈ క్రింది విశేషాలు గమనించదగినవి. 'మహాభారత మీమాంస' అనే గ్రంథం (1984) - మూడవభాగంనుండి ఈక్రింది అంశాలు కృతజ్ఞతలతో గ్రహించి పాఠకుల సౌకర్యార్థం ఇక్కడ పొందుపరచబడినవి.

వనపర్వంలో నారద ధౌమ్యులు పుణ్యక్షేత్రాలను వర్ణించి చెప్పారు. పాండవులు విన్నారు. రోమశుడు తన వెంట పాండవులను తీసికొని వెళ్ళి వారిని తీర్థస్నానాలు చేయించాడు. చెప్పిన తీర్థాల పేర్లలో నారద ధౌమ్యుల పట్టీలలోనే కొన్ని తేడాలున్నాయి. ఇక చూపించిన రోమశుడి క్షేత్రాలకూ వాటికీ కూడా కొద్దిపాటి భేదాలున్నాయి. చూపిన వాటికంటె చెప్పినవే ఎక్కువున్నాయి. ఆ మూడూ మూడుకాలాల్లో వెలిశాయని కొందరు పండితులు భావిస్తున్నారు. నారద ప్రోక్తమైనది ఆ మూడింటిలో అధునాతన మని విమర్శకుల అభిప్రాయం. ఏమైనా మొత్తం మీద పాండవ తీర్థయాత్రలు భారతకాలంనాటి తీర్థాల స్థితులను మనకు రేఖామాత్రంగా నైనా అందిస్తున్నాయి. వాటి అవగాహనకు ఈక్రింది పంక్తులు కొంత తోడ్పడగలవు.

''పాండవులు ప్రత్యక్షముగా, నేయే తీర్థములకు వెళ్ళిరో యాయా తీర్థముల వర్ణనము వనపర్వములో విస్తరించి యీయఁబడి యుండెను. ఎక్కడెక్కడకుఁ బాండవులు వెళ్ళిరో, యా స్థానములకు నేఁటి తీర్థయాత్రా స్థానములతో మైత్రిఁ గలుపుట యనెడు మనోరంజకకార్యము చేయఁదగియుండెను. మన మందులకై యథాశక్తిని ప్రయత్నింతుము.

ముందుగాఁ బాండవులు కామ్యకవనములో నుండిరని వ్రాసియున్నాఁడు, ప్రాచీనకాలమందుఁ బ్రతిదేశముయొక్క భిన్న భిన్న భాగములలోను వనములుండెను. ఆ వనముల యందుఁ బ్రతివాఁడును నివసించుటకును నెలవుండెను. వనముపై నేదేశపు రాజునకును సత్త లేకుండెను. వనవాసులైన క్షత్రియులు ఇట్టి వనములలో వేఁట మీఁద బొట్టపోసికొనుచుండిరి; మఱియుఁ దపస్సు చేసెడి బ్రాహ్మణులు కందమూలఫలములను దిని తమ్ము నిర్వహించుకొనుచుండిరి. ఈ సంగతి యెంత మాత్రమును గాల్పనికము కాదు. ఇటువంటి పరిస్థితి మహాభారతకాలము వఱకు నుండెను. గ్రీకులు వనములో నిర్భయముగా నివసించెడి తత్త్వవేత్తలైన మునులను వర్ణించి యున్నారు. బౌద్ధ గ్రంథములలోఁగూడ నిట్టి వనేక వర్ణనము లుండెను. బుద్ధుడు రాజ్యమును ద్యజించిన పిమ్మట, ఇట్టి యనేకారణ్యములలో నుండెనని వ్రాసియుండెను. వానిలోఁ బ్రతి వనమునకును భిన్నభిన్న నామములు గలవు. లుంబినీవనము యొక్క పేరు బౌద్ధగ్రంథములలోఁ బలుమాఱు వచ్చుచున్నది. అగుఁగాక; పాండవులు వనవాస కాలమున నెన్నియో వనములందుండిరని మహాభారతమందు వ్రాసియున్నాఁడు. ఆవనముల యొక్క స్థలములను ముందుగా మన మిచ్చట నిశ్చయింతుము. పాండవులు మొట్టమొదటఁ గామ్యకవనమున నుండిరని వ్రాసియున్నాఁడు. వారు భాగీరథీ తీరముపై నుండి ముందుగా గురుక్షేత్రము వైపు వెళ్ళిరి. సరస్వతి, దృషద్వతి, యమునలను దర్శించి వారు పడమటి వైపుగా వెడలిరి. అపుడు గుప్తరూపమున నున్న సరస్వతి యొడ్డున నున్న నిర్జనమగు మైదానములో ఋషిప్రియ మగు కామ్యకవనము వారి కగపడెను. (వన. అధ్యా.5) దీనిఁబట్టి కామ్యకవనము మరుదేశమున నుండెనని ధ్యానములోనికి రాఁగలదు.

ఆ వనమును విడిచి మరల వారు ద్వైతవనమునకు నేగిరి. ద్వైతవనము ఉత్తరము వైపున హిమాలయపు చఱియలందునై యుండును. అందు పశువులు, పక్షులు, మృగములు, ఏనుఁగులును తండోపతండములుగా నుండెను. మఱియు నందు సరస్వతీ నది ప్రవహించుచుండెను. ఈద్వైతవనమునుండియే వారు తీర్థయాత్రకు వెడలిరని వ్రాసి యున్నాఁడు; మరియుఁ దిరుగఁ గామ్యక వనమునకు వచ్చిరి. ఇక్కడకు ముందుగా తూర్పువైపున నైమిశారణ్య మున్నది. ఈ పుణ్య దేశము అయోధ్యకు పడమట గలదు. దీనికిఁ దూర్పున గోమతీతీర్థ మున్నదని వ్రాసియున్నాఁడు. దీని పిమ్మట నైమిశారణ్యమునకు ముందుగా వచ్చిన మీఁదట గోమతిలో స్నానముచేసి వారు బాహుదానది మీఁదుగా వెళ్ళిరని వర్ణించి యున్నాఁడు. ఈ బాహుదానది యిచట రెండవమాఱు వచ్చియున్నది. దీనికిఁ బిదపఁ బాండవులు ప్రయాగమునకు వచ్చిరి. ఈ ప్రయాగము గంగా, యమునా సంగమమేయై యున్నది. గంగా సంగమము నందు వారు బ్రాహ్మణులకు దానములు చేసిరని వ్రాసి యున్నాఁడు. ఇచట ప్రయాగ భూమి దేవతల యజ్ఞభూమియని చెప్పఁబడి యుండెను. మరల ప్రయాగము నుండి పాండవులు గయకు వెళ్ళిరని వ్రాసి యున్నాఁడు. గయలో గయాశిరమను పేరుగల పర్వతమున్నది. మరియు ఇసుకచేత శోభిల్లునట్టి మహానది అనఁగా ఫల్గు నది యున్నది. ఇదిగాక యిచట బ్రహ్మవేదియు దగ్గఱగా నున్నది. మరియు నక్షయవటము కూడఁ గలదని వ్రాసియున్నాఁడు. ఈ యక్షయవటమే శ్రాద్ధము చేయుటకై సర్వశ్రేష్ఠమగు స్థానమని చెప్పబడి యున్నది. ఇచట నక్షయపదము ప్రాప్తమగు చున్నది. ఇచట గయ రాజుయొక్క వర్ణనము కూడ నిచ్చి యున్నాఁడు. దీని తరువాత పాండవులు గయనుండి బయలుదేరి మణిమతి యను పేరి దుర్జయనగరియం దుండిరని వ్రాసియున్నాఁడు; మరియు దిరుగ వారు అగస్త్యాశ్రమమును దర్శించిరి. ఈ తీర్థమెచ్చట నున్నదో నిశ్చయ పూర్వకముగాఁ జెప్పఁబడఁ జాలదు; అయినను ఆ వర్ణనముఁ బట్టి భాగీరథీమీఁద నయ్యాశ్రమ ముండెనని స్పష్టముగాఁ దెలియుచున్నది.అగస్త్యుడు వాతాపిని జంపిన వర్ణనము కూడ నీయఁబడి యున్నది. ఇటు పిమ్మట కౌశికీ నదియొక్క వర్ణన మీయబడి యున్నది. ఈ నది భాగీరథిలో నుత్తరము వైపునుండి కలియుచున్నది. కౌశికీ నదిపై విశ్వామిత్రుడు తపముచేసి బ్రాహ్మణ్యమును సంపాదించెనని వ్రాసియున్నాఁడు. ఇదిగాక భాగీరథియందు భగీరథుఁడు చేసిన యజ్ఞము యొక్కయు వర్ణన మీయఁబడి యున్నది. ఇచటను మరల పాండవులు నంద అలకనంద యనెడు రెండు నదుల మీఁదుగా వెళ్ళిరని వ్రాసి యున్నాఁడు; మరియుఁ దిరుగ హేమకూట పర్వతము మీఁదికి వెళ్ళిరి. ఈ పర్వతముపై నదృశ్యమగు వేదఘోషము వినవచ్చుచున్నది. కౌశికీనది యొద్ద నుత్తములైన నదులుండి యుండును. ఇచటనే విభాండకపుత్రుఁడైన ఋశ్యశృంగుని యాశ్రమమున్నది. ఋశ్యశృంగుని కథ యిచ్చట నీయఁబడియున్నది.

కౌశికినుండి వెడలి పాండవులు సముద్రముమీదికి పోయిరి. మఱియు నే చోటను గంగ సముద్రముతోఁ గలియుచున్నదో, ఆ స్థలమందు నైదువందల నదుల నడుమ భాగమందు వారు సముద్రములో స్నానముచేసిరి. గంగానది సముద్రమందు సహస్ర ముఖములఁ గలియుచుండినదను వర్ణనము ప్రసిద్ధమై యుండెనే, దాని యుల్లేఖము ఈ 500 నదుల నామముతో జేయబడినట్లు తెలియుచుండెను. ఇచటఁ దూర్పు వైపు తీర్థములు సమాప్తములయ్యెను. ఈ వర్ణనములోఁ గాశీక్షేత్రమునకు వెళ్ళిన వర్ణనము లేకుండుట మిగుల నాశ్చర్య విషయమై యుండెను. అయినను ధౌమ్యుఁడు చేసిన తీర్థవర్ణనములో రెండు మూడు తీర్థము లింకను వ్రాయబడియుండెను. వాని సమావేశ మిచ్చటఁ జేయఁబడఁగలదు. కాలింజర పర్వతము మీఁద హిరణ్యబిందు వనెడు పేర నొక పెద్ద స్థాన ముండెను. దీని తరువాత భారవణముని మహేంద్ర పర్వతము చెప్పఁబడియుండెను. ఆ పర్వతముపైని భాగీరథీనది మణికర్ణికా సరోవరములోనుండి వచ్చినదని వ్రాసియుండెను. మహేంద్రపర్వతము యొక్క యీ మణికర్ణికాతీర్థము వాస్తవమునఁ గాశియందే యుండియుండునని యనుమానించుటయందుఁ గొంచెమైనను బాధ యగపడదు. అయినను, కాశి లేక వారణాశి యొక్క విస్తృతమైన వర్ణనము ఈ తీర్థ వర్ణనములో లేదన్న విషయము ఆశ్చర్యకరమై యుండెను. ఏదియేని యగుఁగాక; ఇపుడు మనము దక్షిణతీర్థములవైపు వచ్చుచుంటిమి.

పాండవులు గంగాముఖమునందు స్నానము చేసి సముద్రతీరమువెంటఁ గళింగ దేశమునకుఁ బోయిరి. అచట వారికి ముందుగా వైతరణీనది తగిలెను. ఈ నదిలో స్నానము చేసి వారు పవిత్రులైరి. ఈనదియందు స్నానము చేయగా వారు మహాతపోబలయోగమున మృత్యులోకమునుండి మిగుల దూరముగా వెళ్ళిరని తెలియుచుండెను. ఇక్కడకు దగ్గఱనే మహేంద్ర పర్వతముండెను. ఆ పర్వతముపైఁ బరశురాముఁడు ఉండెను. పృథ్విని గశ్యపుని కిచ్చినపుడు అది సముద్రములో మునుగ నారంభించెను. ఆ సమయమందుఁ గశ్యపుని తపఃప్రభావమువలన నయ్యది సాగరము నుండి వెలుపలికి వేది రూపమున నిచట నుండిపోయియుండెను. ఈ వేది సముద్రములో నొకానొక చిన్న ద్వీపమై యున్నది. పాండవులు సముద్రములో స్నానము చేసి యా వేదిపై నెక్కిరి; మరియు నిట మీఁదట మహేంద్ర పర్వతము మీఁద నాఁగిపోయిరి. ప్రతి చతుర్దశికిని నచటఁ బరశురాముని దర్శనమగుచున్నది. తదనుసారముగా నా దినమందు దర్శనము చేసిన పాండవులు సముద్రపు టొడ్డులమీఁదుగా దక్షిణ దిశవైపు వెళ్ళిరి.

సముద్ర తీరమందలి తీర్థములు ఇచట నామ నిర్దేశము లేకుండ చెప్పఁబడి యున్నవి. ప్రశస్తా నదిని జూచి వారు సముద్ర గామినియగు గోదావరి మీఁదికి వచ్చిరి. అటు పిమ్మట ద్రావిడ దేశములో సముద్రపు టొడ్డున నున్న యగస్త్యతీర్థము నొద్దకు వచ్చిరి. అటు పిమ్మటఁ బవిత్రములైన యితర తీర్థములకుఁ గ్రమముగాఁ బోయిన మీఁదట వారు శూర్పారక క్షేత్రమునకు వచ్చిరి. దక్షిణపూర్వ దేశాల యందలి యీ తీర్థముల వర్ణనమందు రెండు మూఁడు పేరులు మన కగపడకున్నవి. ముఖ్యముగా తూర్పువైపున జగన్నాథస్థానము యొక్క లేక పూరీ యొక్క వర్ణనము లేదు. ఇట్టి స్థితిలో మన యెదుర, ఈక్షేత్రము యొక్క మాహాత్మ్యము పిదప నుత్పన్న మైనదా? యను ప్రశ్న వచ్చుచున్నది. ధౌమ్యుఁడు చెప్పిన తీర్థ వర్ణనములోఁ గూడఁ బూరీ పేరు లేదు; మరియు నారదుని వర్ణనమందుఁ గూడఁ బూరీ పేరు రాలేదు. ఇట్లే రామేశ్వరము పేరు కూడ పాండవుల తీర్థయాత్రలో రాలేదు. దీనిఁబట్టి ఈ తీర్థము లిటీవల నుత్పన్నములై యుండునని సంశయము కలుగుచున్నది. కాని మనము ఉల్లేఖాభావరూపమైన ప్రమాణము అసమర్థమైనదను సంగతి ననేక స్థలములయందు జెప్పియే యున్నాము. ఇదిగాకుండ, పాండవులు సముద్రపు టొడ్డుల మీదఁగా మెట్ట మార్గమున వెళ్ళిరి. నావపైఁ గూర్చుండి వెళ్ళలేదనిన సంగతియుఁ గలదు. ఈ కారణముచేత వారు బహుశః అగస్త్య తీర్థము నుండి ద్రవిడదేశములో నుండుచు నొక్క మాఱుగాఁ బశ్చిమపుటొడ్డుమీఁదికి వచ్చి యుందురనుట యసంభవమై యున్నది.

పశ్చిమపుటొడ్డున ఉన్న గోకర్ణమహాబలేశ్వర తీర్థముయొక్కయు వర్ణనము చేయఁబడలేదు. దీనిఁబట్టి ఆ తీర్థము ఆ సమయమున లేకుండెనని విశ్వసింపఁబడఁజాలదు. మంచిది, ధౌమ్యుఁడు దక్షిణము వైపున చేర్చిన తీర్థముల నిపుడు చూడుఁడు. మొదట గోదావరి, వేగానది, భీమరథీనది, పయోష్ణి ఈ నదులు చెప్పఁ బడియున్నవి. పయోష్ణి యొడ్డున రాజైన నృగుడు వందలకొలది యజ్ఞములను జేసి యుండెనని వ్రాసియున్నాడు. పాండ్యదేశములోని యగస్త్య తీర్థము మఱియు వరుణ తీర్థము యొక్క వర్ణనము కలదు; మఱి జీవద తామ్రపర్ణి గోకర్ణతీర్థముల వర్ణనమున్నది. నారద తీర్థ యాత్రయందు నింకను

నెక్కువగాఁ జెప్పఁబడియున్న తీర్థములు కావేరి నదియుఁ గామారి తీర్థములై యున్నవి. అనఁగా దక్షిణతీరము నందుఁ గన్యాకుమారి యొద్ద నుల్లేఖ మున్నది. కృష్ణ, మరియు దండకారణ్యము యొక్కయు నుల్లేఖము కలదు. సప్తగోదావరము యొక్కయు నుల్లేఖము కలదు; అదిగో గోదావరి యొక్క యేడు ముఖములు నిచ్చట నిర్దేశింపఁబడియున్నవి.

అన్నిటికంటె విశేషసంగతి, ఉజ్జయినిలోని మహాకాళము యొక్క వర్ణన చేయఁబడుటయై యున్నది. మరియు నిచ్చట రెండు స్థానములు, ఇపుడు కూడ ప్రసిద్ధములై యున్న కోటి తీర్థము భద్రవటము ఉల్లేఖితములై యున్నవి. పైని చెప్పఁబడిన వర్ణనముఁబట్టి దక్షిణమువైపు యొక్క యధికజ్ఞాన మెట్లగుచు వచ్చెనో యిది యనుమానింపఁబడఁగలదు. దీనిఁ బట్టి పాండవుల తీర్థయాత్ర కంటె ధౌమ్యతీర్థ యాత్రల వర్ణనమందు నెక్కువ తీర్థముల పేరులున్నవని స్పష్టమగును; మరియు నంతకంటె నధికముగా నారదుని తీర్థయాత్రావర్ణనమందుఁ దీర్థముల పేరులు వచ్చియున్నవి.

ఇపుడు మనము పడమటివైపు తీర్థములను పేర్కొను చున్నాము. పాండవులు శూర్పారక తీర్థమునకు వచ్చిరి; అచట వారు వనములోఁ బ్రాచీన రాజులు చేసిన యజ్ఞములను జూచిరి; మరియు నొడ్డు నుండి లోపలికిఁ బోయినమీఁదటఁ దపస్వులైన బ్రాహ్మణులతో నిండియున్న పరశురాము వేదిని జూచిరి. వసువులు, అశ్వినీకుమారులు, యముఁడు, కుబేరుఁడు, ఇంద్రుడు, విష్ణువు, విభువు, శంకరుఁడు మొదలైనవారి సుందరములైన మందిరము లవలోకించిరి. ఇటు మీదట వారు మరల శూర్పారక తీర్థమునకు వచ్చిరి; మరియు నచట నుండి ప్రభాసతీర్థమునకు వెళ్ళిరి. ప్రభాసతీర్థము కాఠియావాడు నందు దక్షిణ సముద్రముపై ద్వారకకు దూరముగా నున్నది. అచ్చట వారు శ్రీకృష్ణుని, యాదవులను గలిసికొనిరి. ఇచటి నుండి పాండవులు విదర్భదేశాధిపతి చేత వృద్ధినొంది యున్న పవిత్రమైన పయోష్ణీ నదికి వచ్చిరి. దీనిఁబట్టి విదర్భ దేశములోని యీ నది గుజరాతులో నుండి యుండునను ననుమానము బయలుదేఱుచున్నది. కాని, పాండవులు తరువాతఁ దిరుగా పయోష్ణినది అనఁగా తాప్తీ మీఁదికి వచ్చియుందు రనుటయు సంభవమై యున్నది. ఎందుచేత? ఇచటి నుండి వారు వైడూర్య పర్వతము నర్మదా నదులపైకి వెడలిరి. పక్షాంతరమున ప్రభాస తీర్థము కాఠియావాడులోనికిఁ గాక యుండును. ఏవియో యగుఁగాక; నర్మదా నదిలో స్నానము చేసి వారు రాజగు శర్యాతియొక్క యజ్ఞప్రదేశమునకును చ్యవనాశ్రమమునకును వచ్చిరి, ఈ రెండు స్థానములును నర్మదా తీరమందే యుండెను. ఇచట చ్యవన మునియు శర్యాతి యొక్క కన్యయగు సుకన్యక యొక్క గాథ కలదు. ఇచటి నుండి మరల వారు సింధునది తీర్థము మీఁదికి వెళ్ళిరి; మరియు అచట నరణ్యములో నున్న సరోవరమును జూచిరి. అటు పిమ్మట వారు పుష్కర తీర్థము మీఁదికి వచ్చిరి; మరియు నార్చీక పర్వతముపై నుండిరి. తదనంతరము గంగా, యమునా, సరస్వతుల యొడ్డులపై తీర్థములను జూచిరి. పాండవుల యొక్క యీ పశ్చిమతీర్థ యాత్రయొక్క వర్ణనము మిక్కిలి పవిత్రమును మిగుల స్పష్టముగా చేయఁబడినదియునై యున్నది.

విశేషించి పుష్కరము యొక్క వర్ణనము ఇతరస్థలములందు విశేషముగా చేయఁబడినట్లుగా నిచటఁ గనఁబడదు. నారద తీర్థయాత్ర యందును, ధౌమ్యతీర్థ యాత్రయందును పుష్కరము యొక్క యెక్కువ వర్ణనమున్నది. పుష్కర క్షేత్రము బ్రహ్మదియై యున్నది. ఇది పుష్కర మొక్క పెద్దచెఱువై యున్నది. నది కాదు. అయ్యది రాజపుతానా యొక్క మధ్యభాగమునఁ గలదు. దీని యందలి యర్బుదము అనఁగా ఆబూపర్వతము అచట చెప్పఁబడి యున్నది. నారదుని తీర్థయాత్ర వర్ణనమందు ద్వారక వర్ణనమున్నది. వాస్తవమున పాండవుల కాలమందు ద్వారకకుఁ దీర్థత్వము ప్రాప్తము కాలేదు; మరియు నీ కారణము చేతనే పాండవులు ద్వారకకు వెళ్ళలేదు. నారదుని యొక్క వర్ణింపఁబడిన తీర్థయాత్ర మహాభారతము నాఁటిది కాదు. ఆ సమయమున ద్వారక స్వభావము చేత నొక గొప్ప తీర్థస్థానము అయియుండెను. ఈ స్థానము యొక్క బహు విస్తర వర్ణనము చేయఁబడి యున్నది. (ద్వారకలో పిండారక తీర్థమునందు స్నానము చేసిన యెడల సువర్ణలాభము కలుగుచున్నది. ఆ తీర్థమునందు నేఁటికి పద్మరూప చిహ్నములతోఁ గూడిన ముద్రలు (బంగారు నాణెములు) కనఁబడుచుండుట వింత సంగతియై యున్నది. అచటఁ ద్రిశూల చిహ్నములు గల కమలములు కనఁబడు చున్నవి. ఇచట నెల్లపుడును శంకరుని నివాసమున్నది. ఈ వర్ణనముఁబట్టి మహాభారత కాలమున ద్వారక యొక ప్రసిద్ధ క్షేత్రమై యుండెనని తెలియుచున్నది. కాని ద్వారకను క్రొత్తగా శ్రీకృష్ణుడు స్థాపించి, రైవత పర్వతము మీఁద నతఁడు క్రొత్త దుర్గము నిర్మించి, అతఁడు నిజధామమునకుఁ బోఁగా ద్వారక నీటిలో మునిఁగెనన్న సంగతిపై మనము ధ్యానముంచినపుడు శ్రీకృష్ణుని లేక పాండవుల కాలమున ఈ తీర్థము లేకుండెనని స్పష్టముగాఁ బ్రకటమగు చున్నది. దీనిఁబట్టి స్వభావతః ఈ వర్ణనము మఱియు ఈ సంపూర్ణమైన నారదోక్త తీర్థయాత్ర మహాభారత కాలికము అనగా క్రీ.పూ. 250 వత్సరము దాదాపుదింకను ననుమానము కలుగుచున్నది.

ఇటీవల నుత్తరము వైపు తీర్థముల వర్ణనములో యువంధరము, అచ్యుతస్థలము, భూతలవ్యము ననెడి యమునా నదిపై నున్న తీర్థముల వర్ణనము కలదు. ప్లక్షావతరణ తీర్థము యొక్క యుల్లేఖముండి తరువాత కురుక్షేత్రమునకుఁ బాండవులు వెళ్ళిన వర్ణన మున్నది. కురుక్షేత్రమునుండి సరస్వతి యొక్క వినశన తీర్థ వర్ణనము కలదు. దీని తరువాత విపాశ అనగా వ్యాసానది వచ్చియున్నది. విపాశనుండి మరల వారు కాశ్మీరమునకు వెళ్ళిరి. దీని పిమ్మట మరల వారు మానస సరోవరము మీఁదికి వెడలిరి. అచట వారికి వితస్తానది యగపడెను. వితస్తానది యొద్ద జల, ఉపజల యను పేరుగల రెండు నదులు వారికిఁ దగిలెను. తరువాత నాకము శ్వేతగిరి పర్వతములపై నుండి వారు కైలాస పర్వతము మీఁదికి వెళ్ళిరి. అచటనే వారికి భాగీరథియొక్క దర్శన మయ్యెను. దీని తరువాత వారు గంధమాదన పర్వతము మీఁదికి వచ్చి చేరిరి; మఱియు విశాలా సంజ్ఞకమైన బదరి (బైరి)యు నరనారాయణ ఆశ్రమమును నెచట నున్నవో, ఎచటి నుండి యలకనందానది బయలుదేఱు చున్నదో, అచటికి వారు వెళ్ళి చేరిరి. నర నారాయణాశ్రమ మందుఁజేరిన మీఁదట ఘటోత్కచుని సాహాయ్యము చేత ముందునకుఁబోయి మరల వారు భాగీరథీనదిలో స్నానము చేసి తమ తీర్థయాత్రను సాగించిరి.''

## పుష్కర కురుక్షేత్రముల మహత్త్వం :

''మహాభారత కాలమందు రెండు తీర్థముల లేక తీర్థముల స్థానములు మిక్కిలిఁ బ్రసిద్ధములై యుండెను. ఒకటి యర్బుదము నొద్ద పుష్కర తీర్థము, రెండవది కురుక్షేత్రము. పుష్కర తీర్థ మన్ని తీర్థములకును రాజై యున్నది. పుష్కరమును నుదయాస్తమయము లందు స్మరించినవానికిఁ గూడ నన్ని తీర్థముల యందును స్నానము చేసిన ఫలము దొరకఁగలదు. పుష్కర తీర్థము విషయమై మఱియొక సంగతి, బ్రహ్మకు ఏక మాత్రమైన తీర్థ మిదియే యను నదియై యున్నది. మిగిలిన తీర్థములన్నియు శివ విష్ణువులవి యన్య దేవతలవియునై యున్నవి. నారదుఁడు చేసిన తీర్థప్రశంసయందు ఈ తీర్థము అన్నితీర్థములకు నాదిభూతమని చెప్పఁబడి యున్నది. రెండవ తీర్థము కురుక్షేత్రమైయున్నది. నారద తీర్థ వర్ణనమందు ఈ తీర్థమునకై యొక గొప్ప స్వతంత్రమైన యధ్యాయము (వన ప.3వ యధ్యాయము) ఈయఁబడి యున్నది. నేను కురుక్షేత్రమునకు నేగెదను, కురుక్షేత్రములో నుందును, పాప విముక్తుఁడ నగుదునని చెప్పెడు మనుష్యులు కూడ నున్నారు. దృషద్వతికి నుత్తరముననను, సరస్వతికి దక్షిణముననను నున్న క్షేత్రము లన్నియు పుణ్యభూములై యున్నవి. ఇన్ని క్షేత్రములలోను ననేకములు వేవేల నూఱుల కొలది క్షేత్రముల వర్ణనము ఈ యధ్యాయమందుఁ జేయఁబడియున్నది. వానిలో మూఁడు ముఖ్యమై యున్నవి. మొదట పృథూదకము, అన్ని క్షేత్రముల వర్ణనము ఈ యధ్యాయమందుఁ జేయఁబడియున్నది. వానిలో మూఁడు ముఖ్యమై యున్నవి. మొదట పృథూదకము, అన్ని క్షేత్రములలోను కురుక్షేత్రము పవిత్రమైనదని వ్రాసి యున్నాఁడు. కురుక్షేత్రమందు సరస్వతియు, సరస్వతియందుఁ బృథూదకమును నన్నిటికంటె నెక్కువ యుత్కృష్ణమై యున్నవి. శ్యమంత పంచక తీర్థము రెండవ తీర్థము. ఈ యైదు తటాకములను పరశురాముఁడు క్షత్రియులను సంహరించి వారి రక్తముతో నిండించెను. మూడవ తీర్థము సన్నిహతీ నామకమై యున్నది. సూర్యగ్రహణ కాలమందు ఈ తీర్థములో స్నానము చేసి మనుష్యుఁడు శతాశ్వమేధములు చేసినవాని పుణ్యమును పొందునని వ్రాసియున్నాడు. ఈ తీర్థములో అన్ని తీర్థములును గలవు. ఇందుచేత దీనిపేరు సన్నిహతియై యున్నది. సూర్యగ్రహణ కాలమందు కురుక్షేత్రమునఁ గౌరవులు, పాండవులు, యాదవులు, గోపాలురు అందఱు నొక చోటఁబ్రోగైరని భాగవతమున వ్రాసి యున్నాఁడు. మఱియు నేఁడును సూర్యగ్రహణ కాలమునఁ గురుక్షేత్రగమనమునకు విశేష మహిమ విశ్వసింపఁబడుచున్నది. అచట లక్షలకొలఁది మనుష్యులు ప్రోగుపడు చున్నారు.

ఆ కాలమున కురుక్షేత్రమునందు మరణించినవాఁడు ముక్తుఁడగునని దృఢ విశ్వాసముండెను. ఇందుచేతఁ గౌరవ పాండవులు ఈ క్షేత్రములో యుద్ధమునకై చేరియుండిరి. కాని ఇంత పెద్దసేన కురుక్షేత్రమున నుండ గలుగుట యనెడు సంగతి సంభవము కాదు. స్వయముగా మహాభారతమందే కురుక్షేత్రమునకు నడుమను నివసించి రెండువైపుల సేనలును మిగుల విస్తీర్ణమగు ప్రదేశమున వ్యాపించి యుండెనని వ్రాయఁబడియున్నది. పంజాబులోని కొన్ని పూర్తిగాఁ గురుజాంగలము, రోహితకారణ్యము, మరియు మరుభూమి వరకును సైన్యము వ్యాపించి యుండెను. అహిచ్ఛత్రము, కాలకూటము, గంగాపూల్, సేతువు, వారణము, వటధానము అట్లు యమునకు దక్షిణము వైపున నున్న వరగతములవరకు సైన్యములు

వ్యాపించియుండెను. భారత యుద్ధము ఒక ప్రదేశమున జరిగెనని చాలమంది యొక్క కల్పన కలదు. కాని మహాభారతములో మఱియొకచోట కురుక్షేత్రము, అహిచ్ఛత్రము, (నేఁటి రామపురము) వరకు వటధానములనెడి గ్రామములను దక్షిణమున హస్తినాపురమునకుఁ చాలవఱకుగాఁ గలవని వర్ణనము చేయఁబడియున్నది. ఇంతవరకు సేన లుండెను. దీనిఁబట్టి నూఱుకోసుల పొడవును నూటయేఁబది కోసుల వెడల్పుగల ప్రదేశమందు జరిగియుండునని తెలియుచున్నది.

సరస్వతి విషయమై మహాభారతములో నొక స్వతంత్రమైన యాఖ్యానము శల్యపర్వములో నియ్యఁబడియున్నది. దానిఁబట్టి మనకు సరస్వతియొక్క వృత్తాంతము చాలఁ దెలియుచున్నది. బలరాముఁడు యుద్ధమునకు వెళ్ళక సరస్వతీ తీర్థమునకు వెళ్ళెను. ఆ సమయమున నీరు సరస్వతియొక్క పైదిక్కునుండి అనఁగా ముఖమువైపునుండి ప్రవహించెడువైపునకు వెళ్ళెనని వ్రాసియున్నాఁడు. వాస్తవమున సరస్వతి సముద్రములోఁ గలియలేదు. ఇపుడు కూడ నయ్యది ఘాఘరానదికిఁ బోయి కలియుచున్నది. కాని ప్రాచీన కాలమందు నెప్పుడును నీ నది యరబ్బుసముద్రములోఁ గచ్చరణము నొద్దఁ గలియుచుండి యుండును. బలరాముఁడు తన యాత్రను ప్రభాస తీర్థము నుండి మొదలుపెట్టెను. ఈ తీర్థ మిప్పుడు ద్వారకకు దక్షిణమునఁ బడయటి యొడ్డుపై నున్నది. దీనికిఁ బిమ్మట నతఁడు చమసోద్భేద తీర్థముమీదికిఁ బోయెను. అచ్చటి నుండి మరల నుదపాన తీర్థముమీఁద కేగెను. ఈ తీర్థము కేవల మొక నూయియై యుండెనని వ్రాసియున్నాడు. కాని యిచ్చట లతావృక్షముల పచ్చఁదనముచేతను భూమియొక్క నున్నఁదనము చేతను సిద్ధులు సులభముగానే గుర్తింపఁగలరని గూడఁ జెప్పియున్నాఁడు. అవశ్యముగా నా నూయి మార్వాడులోని రేగిస్థానములో నుండి యుండును. దీనికిఁ బిమ్మట బలరాముఁడు వినశన తీర్థమునకుఁ బోయెను. ఇచ్చట శూద్రాభీరుల ద్వేషకారణమున సరస్వతి నష్టమయ్యెను. అనఁగ నిసుకలో గుప్తమైపోయెను. ఇందుచేత దీనిపేరు వినశనయై యున్నది.

అతఁడు సరస్వతీ నదిలో స్నానము చేసెను. ఇచ్చటనుండి యుత్తరమునకుఁబోవుచు నతఁడు సరస్వతి యొడ్డు పై నున్న యనేక తీర్థములను జూచెను. ముందునకుఁ బోవుచుఁ బోవుచుఁ నతఁడు ద్వైతవనమునకుఁ జేరెను. ఈ వనమును మునుపు వర్ణించియే యున్నాము. ఈ వనము హిమాలయపర్వతము క్రింది భూమికి సమీపమున నుండెను. దీనికి ముందు సరస్వతి దక్షిణమువైపున ప్రవహించుచున్నది. ముందునకుఁబోయి యిచ్చట హిమాలయమునుండి యేడునదులు బయలుదేరియున్నవని వ్రాసియున్నాఁడు; మరియు నయ్యవియన్నియుఁ గలిసి సరస్వతిగా నేర్పడెను. ఇందుచేత దీనికి సప్త సారస్వత మను పేరు ప్రాప్తించెను అక్కడ నుండి పిమ్మట ననేక తీర్థములను జూచుచు నతఁడు హిమాలయము లోపలఁ బ్రవేశించెను; మరియు అతడు సరస్వతి పుట్టిన చోటు వఱకు యాత్రచేసెను. సరస్వతియొడ్డున ననేక బ్రాహ్మణులు ప్రాచీన కాలము నుండియు నుండుచుండిరి. ఒకప్పుడు పండ్రెండు వత్సరములు అనావృష్టియయ్యెను, కాబట్టి బ్రాహ్మణులకుఁ గొంచెమైనను దినుటకు దొరకకుండెను. అపుడు సారస్వతముని సరస్వతియొక్క యాజ్ఞవలన మత్స్యములచేతఁ దనపొట్ట పోషించుకొని వేదములను రక్షించెను. భ్రాంతిపడి యితర స్థానములకుఁ బోయిన బ్రాహ్మణులకు సారస్వతముని వేదాధ్యయనమును జెప్పెను, ఇందుచేత వారందఱును సారస్వతమునికి శిష్యులైరి; అప్పటినుండియు మత్స్యములను దినెడు నాచారము ఈ బ్రాహ్మణులకు తటస్థించెను. అగుఁగాక, దీనికిఁ బిమ్మట యమున యొక్క ప్రతియొడ్డునకును వెళ్ళి బలదేవుఁడు కురుక్షేత్రమున శ్యమంత పంచకములో దిగి గదాయుద్ధ సమయమున నుపస్థితుఁడయ్యెను. ఈ విధముగా సరస్వత్యాఖ్యాన మందు సరస్వతీ ముఖమున నుద్గమము వఱకు వర్ణనము వచ్చియున్నది. ఈ యాఖ్యానముఁబట్టి ప్రాచీన కాలమున సరస్వతీనది ప్రత్యక్షముగా మార్వాడనుండి ప్రవహించుచుఁ బశ్చిమ సముద్రమునకుఁ బోయి కలియుచుండెనని యనుమానించుటకు నే మాత్రము బాధయుఁ గన్పడదు.'' (పు.219-230)

**ఇతిహాసంలో పురాణచ్ఛాయలు, పుణ్యతీర్థ వర్ణనలు :**

ఇతిహాసమైన మహాభారతంలో పురాణలక్షణాలను ప్రతిఫలింపజేసే శాస్త్రాంశ సంపత్తిని కలిగించే విశేషాలు నారద రోమశ మార్కండేయ మహర్షులు చెప్పే అంశాలు. 'పురాణం పంచలక్షణమ్' అని ప్రసిద్ధి. సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం అనేవి పురాణ పంచలక్షణాలుగా ప్రసిద్ధికెక్కాయి. వీటిలో వంశానుచరితం స్వతంత్రప్రతిపత్తి కలిగిన ప్రక్రియగా రూపొంది, ఇతిహాసంగా పరిణతి చెందింది. అందుకే ఇతిహాసం పురాణానికి పుత్రికగా భావిస్తారు- పండితులు. పురాణ పంచలక్షణ

శ్లోకంలో 'వంశానుచరితం చేతి' అనే పాదభాగానికి 'భూమ్యాదేః సంస్థానం' అనే పాఠాంతరం ఉన్నది. అంటే ప్రపంచ భౌగోళిక స్థితిగతులను గురించిన వర్ణనమని భావం. ఈ లక్షణానికి కొంతవరకు ప్రాతినిధ్యం వహించే కథాంశం పుణ్యతీర్థవర్ణనం విశిష్టమైనది. పాండవులు విన్న, కన్న పుణ్యతీర్థాలు నాటి భరతఖండ భౌగోళిక స్థితిగతులను గురించి, వాటి స్థలపురాణాలను గురించి, మాహాత్మ్యాలను గురించి, ప్రజల విశ్వాసాలను గురించి తెలియచెపుతున్నాయి. ఈ అంశాన్ని 'వార్త' గా కొన్ని పురాణాలు పేర్కొనటం గమనించదగిన విశేషం. మాత్స్యపురాణం చెప్పిన పురాణ పంచలక్షణాలు గమనించతగినవి -

చ. "ఉత్పత్తిం ప్రలయం చైవ వంశాన్ మన్వన్తరాణి చ,
వంశానుచరితం చైవ భువనస్య చ విస్తరమ్". **(మాత్స్య పురా. 2.22)**

తీర్థవర్ణనం భువనవిస్తర వర్ణనలో భాగమే. ఈ అంశాన్ని నారద ధౌమ్య రోమశ మహర్షులు విస్తరించారు. ఉత్పత్తి ప్రళయాదులను మార్కండేయ మహర్షి వివరించాడు. ఆ విధంగా మహాభారతంలో పురాణలక్షణాలు పరిమిళిస్తున్నాయి.

ఇక్కడ మరొక విశేషాన్ని కూడా గమనించాలి. ఇతిహాసంలో చెప్పబడే పురాణాంశాలు ఇతిహాస స్వభావ ముద్రితాలై ఉండటం ఆ ప్రక్రియా స్వభావం. ఎట్లాగంటే - ధర్మజుడు నారద మహర్షిని తీర్థయాత్రలను, వాటి మాహాత్మ్యాలను గురించి అడిగాడు. త్రిలోకసంచారి అయిన నారదుడు స్వయంగా ఆ వివరాలు చెప్పవచ్చును. కాని, పులస్త్యమహర్షి భీష్ముడికి పూర్వ మెప్పుడో చెప్పిన వివరాలనే అందించాడు. అంటే - ఇదివరకే చెప్పబడిన ఒక ఇతిహాసాన్ని పరంపరా కథనంగా ధర్మజుడికి చెప్పాడు. ఇటువంటివే ధౌమ్యుడు చెప్పినా, రోమశుడు చెప్పినా. రోమశుడు ఇదివరకే లోకంలో, రూఢికెక్కి పరంపరగా చెప్పబడుతున్న క్షేత్రగాథలనే వివరించి చెప్పాడు. అంటే- ఇతిహాసంలో పురాణాంశాలు అంగాలుగా ఉంటాయి. ఇతిహాసముద్రను కలిగి ఉంటాయి. ఆరణ్యపర్వంలో వీటివలన ధర్మజుడు దివ్యుడనే పరమార్థం కూడా కథలో స్థాపించబడుతుంది. పుణ్యతీర్థవర్ణనంవలన ధర్మరాజుకు పుణ్యం, పురుషార్థం లభిస్తే, పఠితకు ప్రపంచవిజ్ఞానం కలుగుతుంది.

### గోదావరీ స్నానం - నన్నయ దేశాభిమానం :

నారద కథనంలో ఆంధ్రప్రాంతానికి చెందిన పుణ్యతీర్థాలను నన్నయ నోరారా అభిమానంతో వర్ణించాడు. కాని, ఔచిత్యాన్ని కాపాడి ముచ్చటగా ముక్తసరిగా చెప్పాడు. శ్రీశైల మహాక్షేత్రంలోని దేవహ్రదాన్ని ప్రత్యేకంగా ఒక తేటగీతిలో రచించాడు. పుణ్యఫలం మూలంలోదే అయినా శ్రీశైలాన్ని తీర్థరాజంగా పేర్కొన్నాడు.

తే. 'పరమమైన తీర్థంబు శ్రీపర్వతంబు । నందు దేవహ్రదం బాడి యాదిదేవు
నీశు నర్చించి పడయుదు రిష్టఫలము । నశ్వమేధ ఫలంబును నవని జనులు.

శ్రీశైలం శ్రేష్ఠమైన తీర్థమట! పుణ్యఫలం అశ్వమేధయాగ ఫలమట! అంతేకాక తెలుగువారి ప్రియమైన నదులను విశేషించి చెప్పాడు- నన్నయ. ఇంద్రుడు నూరుయజ్ఞాలు కృష్ణానది ఒడ్డున చేశాడట! ఆచోటు దేవహ్రదంగా పేరొందింది. అందులో స్నానమాడితే సర్వపాపాలూ ప్రక్షాళనమైనపోతాయట! కృష్ణానదిలో స్నానం చేస్తే పూర్వజన్మస్మృతి కలుగుతుందని మూలమహాభారతం, నన్నయ దానిని చెప్పకుండా సర్వపాపనివారణం జరుగుతుందని మార్చాడు. ఔచిత్యదృష్టి, లోకజ్ఞత ప్రదర్శించాడు. అట్లాగే తుంగభద్ర, పెన్నా, గోదావరి మొదలైన తీర్థాలలో దండకారణ్యం, శరభంగాశ్రమం, శూర్పారకం, సప్తగోదావరి మొదలైన తీర్థాలలో స్నానం చేస్తే పుణ్యలోకాలు సంప్రాప్తిస్తాయట! నారదుడి కంటె నన్నయ ఆంధ్ర ప్రాంత పుణ్యతీర్థ ఫలాలను పెంచి చెప్పాడు. అందులోనూ గోదావరీస్నానఫలం గొప్పగా చెప్పారు.

వారణాసిలోని గంగలో మునిగి రుద్రుడిని సేవిస్తే రాజసూయయాగ ఫలమట! దక్షిణకాశి అయిన శ్రీశైలంలోని దేవహ్రదంలో స్నానమాడితే అశ్వమేధ యాగఫల మట! గోదావరిలో స్నానంచేస్తే గోమేధ యజ్ఞం చేసిన ఫలంతోపాటు వాసుకిలోకం

దక్కుతుందట! ఇది వ్యాసుడివాక్కు. నన్నయ దానిని మార్చాడు. ఉదాత్తీకరించాడు. గోదావరీస్నానం వలన దశాశ్వమేధ యాగఫలం కలుగుతుందని చెప్పాడు. గోదావరికి ఆ గొప్పదనం లేదని ఆంధ్రులం చెప్పలేం. కాని, నన్నయకు గోదావరి అంటే ఎంత అభిమానమో తెలిసికొని ఆ ఆదికవిని అభినందించకుండా ఉండలేం. నన్నయ మూర్తీభవించిన ఆంధ్రాభిమానం!

## నన్నయ వాగనుశాసనత్వం :

ఆంధ్రకవిలోకానికి నన్నయప్రయోగాలు పరమప్రమాణాలు, నన్నయ వాడిన పదాలు, సమాసాలు, ఛందస్సులు మొదలైన అంశాలమీద ఆంధ్రపండితులు ఎన్నో చర్చలు జరిపారు. నన్నయ వ్రాసిన కొన్ని ప్రయోగాలు తప్పన్నవారున్నారు. అవి సరి అయినవేనని సమర్థించినవారున్నారు. ఆ వివరాలన్నీ ఇవ్వటం ఇక్కడ సాధ్యపడదు కాని, ఆరణ్యపర్వంలోని ప్రస్తుతభాగంనుండి కొన్నిటిని మచ్చుకు గమనించవచ్చును. ఈ విశేషాలను శ్రీమాన్ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులవారు ఆరణ్యపర్వానికి వ్రాసిన 'టిప్పణి' నుండి కృతజ్ఞతలతో గ్రహించి ఉదాహరించటం జరుగుతున్నది.

## సమాస ప్రయోగాలు :

**అహోరాత్రులు :** (ఆర. 3.238): ''అహస్సర్వైకదేశ సంఖ్యాతపుణ్యాచ్చ రాత్రేః - అను పాణినీయ సూత్రము చేతను అహర్గ్రహణం ద్వంద్వార్థమ్మనుభాష్యము చేతను ద్వంద్వసమాసమునందు అహన్ - శబ్దముకంటెఁ బరమగు రాత్రి శబ్దమునకు ఆ (చ్) ప్రత్యయము వచ్చి - జాతి రప్రాణినామ్ - అనుసూత్రముచే ఏకవద్భావము వచ్చినచో అహోరాత్రము అని కావలయును. కాని వాగనుశాసనులు అహోరాత్రులు - అని ప్రయోగించుకతన దీని కేదేని మార్గ మారయవలసి యున్నది. మహాభాష్యమునందు అహర్గ్రహణం ద్వంద్వార్థ మ్మని చెప్పియుండుటచే ద్వంద్వసమాసమునందే అహన్‌శబ్దమునకంటెఁ బరమగు రాత్రిశబ్దమునకు అచ్ ప్రత్యయము వచ్చునని తేలుచున్నది కనుక నిట అహ్నా సహితా రాత్రిః అని మధ్యమ పదలోపి సమాసము గావించు కొన్నచో నిది ద్వంద్వ సమాసము కాదు కనుక అచ్ప్రత్యయప్రసక్తి లేమింజేసి అహోరాత్రి అనురూప మేర్పడును. దాని కాంధ్రమునందుఁ బ్రథమాబహువచన మహోరాత్రులని నిర్బాధముగా నగును.''

**ముష్టాముష్టి :** (ఆర. 3.395): ''ఇయ్యది యసాధువని పలువురు తలంతురు. నిర్దుష్టమనియే నా యాశయము. 'ముష్టిభి ర్ముష్టిభిః ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తమ్' అను విగ్రహవాక్యమునందు తత్ర తేనేద మితి సరూపే - అనుసూత్రముచే సమాసాంతమగు ఇ(చ్) ప్రత్యయము వచ్చి అన్యేషామపి దృశ్యతే - అనుదానిచేఁ బూర్వపదమగు ముష్టి - పదమునకు దీర్ఘము రాగా ముష్టీముష్టి అనియే కావలయును, ముష్టాముష్టి యను ఆకార విశిష్టరూప మసాధువని పూర్వపక్షుల శంక. దానికి సమాధాన మేమన - పాణిన్యాచార్యులవారిచే సైతము 'వ్యోర్లఘు ప్రయత్నతర శ్శాకటాయనస్య' - అని యష్టాధ్యాయిలోఁ బేర్కొనఁబడిన శాకటాయనాచార్యుఁడు తన శాకటాయన వ్యాకరణమున 'ఆ దిజంతే' అనుమాత్రముచే ఇజంత ముత్తరపదముగా నున్నపుడు పూర్వపదమునకు ఆత్వము వచ్చునని విధించి ముష్టాముష్టిపదము నుదాహరించియుండుటచే నియ్యది వ్యాకరణాంతరసిద్ధమని యెఱుంగునది.

''మఱియు హేమచంద్రాచార్యులు తన సిద్ధహేమచంద్రమను వ్యాకరణంబునఁ బూర్వపదమునకు దీర్ఘంబును ఆకారమంతా దేశంబుగను విధించి ఉదాహరణముగాఁ దన ద్వ్యాశ్రయకావ్యంబున యష్టీయష్టి-యష్టాయష్టి అని యిచ్చి యుండుటచే ముష్టాముష్టి పదంబు పై రీతిగా సుసాధంబు.''

''ముగ్ధబోధవ్యాకరణంబునఁ గూడఁబైవిధంబుగనే సూత్రించి ముష్టీముష్టి అనునవియే యుదాహరింపఁబడినవి. కనుక బహువ్యాకరణనిర్దుష్టం బగు నీ పదంబును వాగనుశాసనులు వాడుటలో వింతలేదని నా యభిప్రాయము. వ్యాకణాంతర ప్రసిద్ధమైనను ముష్టాముష్టి పదము పాణినీయ విరుద్ధంబుగదా యని తలంపరాదు. పాణినీయవ్యాకరణమునందును దీని

సాధుత్వమున కొక్కింతమార్గము గలదు. శ్రీ నాగేశభట్టుగారు స్వరచితభాష్యప్రదీపమున "తత్ర తేనేద మితి సరూపే" అను సూత్రమున తేన+ఆ+ఇదమ్ అని ఆ కారము ప్రశ్లేషించి కొన్ని చోటులఁ బూర్వపదంబునకు ఆత్వము వచ్చునని ముష్టాముష్టి పదము నుదాహరించియున్నారుగాన ముష్టాముష్టిపద మపాణినీయ మను శంక నిరస్తమని తెలియునది."

1. త్రిణయన - త్రినయన (ఆర. 1.334): "త్రిణయన పదము వస్తుతః దుష్టము కాదుగాని యిచ్చట 'త్రినయన' పదము వాడుటయే సమంజసము. కవిత్రయమునకు నణప్రాస మనభిప్రేతము. త్రినయనపద మెట్లు సాధువనఁగా -- 'కేచిత్తు త్రిణయన: త్రినయనః ఇత్యత్ర వికల్పేన ణత్వ మిచ్ఛంతి' - సారస్వత వ్యాకరణము."

2. ఋతుపర్ణుడు (ఆర. 2.129): "ఋతువనఁగాఁ గాలము. పర్ణ మన వాహనము. కాలము వలె వడిగాఁ బోవు గుఱ్ఱములు గలవాడు. కొన్ని సంస్కృత భారతములలో ఋతపర్ణుఁడని పేరైనట్లు గాన్పించును. అప్పుడు ఋత మన సత్యము గనుక సత్యముగా లెక్కపెట్టఁబడిన ఆకులు కలవాఁడు - అని వ్యుత్పత్తి. అక్షవిద్య నెఱిగినవాఁ డనుట. అక్షహృదయము- అక్షములన ఇంద్రియములు కనుక నిది యింద్రియాభిమాని దేవతల హృదయమును వశపఱచుకొను నొక మంత్రము. దీని శక్తిచేఁ బత్త్రపుష్ప ధాన్యాది రాసులలోని తత్తత్సంఖ్య సరిగాఁ జెప్పవీలగును. కొందఱు అక్షము లన బాచికలు కాన నీ మంత్రముచే జూదమునందుఁ బాచికలు వశ్యములుగా నుండుననియు నిర్వచింతురు."

3. నావాశ్రమమునకున్ (ఆర. 3.95): "నౌ+ఆశ్రమమునకున్, 'ఏచోఽయవాయావః' (అచ్చు పరమగునపుడు ఏ,ఓ, ఐ,ఔ, లకుఁగ్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్, అనునవి ఆదేశములుగా వచ్చును) అనునియమముచే "నౌ" అనుచోట 'ఔ' కారమునకు 'ఆవ్' అను నాదేశము వచ్చి నావాశ్రమమునకున్ అనియయ్యెను, ఓడయందలి యాశ్రమమునకు నని యర్థము. రోమపాదునిచే ఋశ్యశృంగుఁ దోడ్కొనిరాఁబంపఁబడిన వేశ్యాంగనలు ఋశ్యశృంగ ప్రలోభనార్థ మొక యోడయందు నాశ్రమముఁ గల్పించుకొని యట కేగిరని గ్రహించనగు. కొంద ఱోడచే దాఁటఁదగిన యాశ్రమంబున కని వచింతురు. అప్పుడు వీరు కల్పించుకొనిన యాశ్రమంబునకు మధ్య నద్యాదికము కలదనియు దాని నోడచేదాఁటవలసియుండుననియు నెఱుంగునది. ఈ పక్షమున "నౌ" శబ్దమునకుఁ దార్వ్యార్థమును. 'నౌవయోధర్మే'తి పాణినిసూత్రముచే య(త్) ప్రత్యయము వచ్చినచో నావ్యాశ్రమమున కనురూపము సిద్ధించును. సంస్కృతభారతమున నీ రూపమే కలదు. "సాతు నావ్యాశ్రమం చక్రే" - ఈ పక్షమున భగ్నప్రాసదోషము. వాటిల్లును గానఁ బ్రథమపక్షమే స్వీకార్యము."

నన్నయ శబ్దశాసను డనటానికి ఈ ఉదాహరణలు నామమాత్రాలే! నన్నయ శబ్దసాధుత్వాన్ని గురించి ఆంధ్రపండితు లెంతటి చర్చలు చేశారో తెలియటానికే ఈ ప్రయోగాల ప్రసక్తులు.

**లోకతంత్ర పంచకం - కథాక్రమ రమ్యత :**

విజయుడు ఇంద్రలోకంనుండి తిరిగి రావటంతో ఆరణ్యపర్వంలో సగం కార్యం ముగిసింది. పాశుపతాస్త్ర సంపాదనంతో నివాతకవచాదుల సంహారంతో అర్జునుడు దైవీశక్తుల అనుగ్రహంతో ఆసురీశక్తులను అణచే వీరవ్రతాన్ని సాధించాడు. ఇది ఒక పక్షం. మరొకవైపు భీముడు రాక్షసులను, యక్షులను ఏకవీరుడై సంహరించి కుబేర, హనుమదాదుల, సహాయాన్ని పాండవులకు కల్పించాడు. ఇంద్రకీలాద్రి, స్వర్గలోకం ఇంద్రసుతుడి విజయ భూములు. గంధమాదన హిమవత్పర్వతాదులు భీమపరాక్రమ క్షేత్రాలు.

భీముడు ధర్మరాజుతో దైవమానుష యత్నాలలో మానుషయత్నానికే ప్రాధాన్యమిచ్చి వాదించాడు. ధర్మరాజు ఎంత చెప్పినా ఆతడి బుద్ధి కెక్కలేదు. హనుమదాదులు సూచించినా ఆతడి తల కెక్కలేదు. చివరకు కుబేరుడు కూడా మనసులో దాచుకొనలేక బహిర్గతంగా ధర్మరాజుతో ఇట్లా అన్నాడు -

వ. 'అయ్యా! ధృతియును, దాక్ష్యంబు, నుపదేశంబును, గాలంబును, బరాక్రమంబును నను పంచవిధంబులైన లోకతంత్ర విధానంబు లెఱింగిన క్షత్రియుండు ధర్మవిదుండై ధరణీచక్రంబు నిర్వక్రంబుగా రక్షించి పుణ్యలోకంబు వడయుఁ; దత్కర్మవిశేషంబు లెఱుంగక వృథారంభుండై సాహసంబున వర్తిల్లు వానికిం బాతకం బగుట నిశ్చయంబు. **(ఆర. 4.31)**

క. కావున నీ తమ్ము మరు । ద్దేవాత్మజు సాహసైకధృతి గాకుండన్,
భూవల్లభ! శిక్షింపుము । నీ విమలజ్ఞాన ధర్మనిష్ఠిత బుద్ధిన్'. **(ఆర. 4.32)**

ఈ లోకతంత్ర పద్ధతులలో ఆరణ్యవాసంలో ధృతి, దాక్ష్యం, ఉపదేశం అనే తంత్రాలనూ, అజ్ఞాతవాసంలో కాలాన్నీ, ఉద్యోగాదులలో పరాక్రమాన్నీ, పాండవులు ప్రదర్శించారని ధ్వని. అదే ధర్మరాజు వ్యూహంకూడా. తద్భిన్నంగా ఆ క్రమాన్ని మార్చి ప్రయోగించే సాహసం చేస్తే దోషం కలుగుతుందని కుబేరుడి హెచ్చరిక.

ఆరణ్యపర్వ ప్రథమాశ్వాసంలో ద్రౌపదీ భీమసేనుల వాదాలను కాదని ధర్మజుడు తన సమయాన్ని పాటించటానికి కృతనిశ్చయుడు కావటంలో ధృతి ఉన్నది. వ్యాస ప్రేరితుడై ధర్మజుడు అర్జునుడి ద్వారా పాశుపతాస్త్రాది దివ్యాయుధాల నన్నింటిని సాధించి విజయం తథ్యమన్న భావాన్ని పొందటంలో, పాండవులలో కలిగించటంలో దాక్ష్యం (అంటే దక్షత్వం, సామర్థ్యం) ఉన్నది. బృహదశ్వ, నారద, ధౌమ్య, రోమశాది మహర్షులు చెప్పిన ఉపాఖ్యానాలలోని ఉపదేశాలను గ్రహించటంలో ఉపదేశం ఉన్నది. దీనితో ఒక వర్తులం పూర్తి అవుతుంది. దీనికి పరీక్ష నహుష ప్రశ్నలకు ధర్మజుడిచ్చే సమాధానాలు.

రెండవ వర్తులం వెనుకనుండి మొదలౌతుంది. మార్కండేయ మహర్షి చెప్పిన కథాంశాలు ఉపదేశం, ఘోషయాత్రలో సైంధవ దుర్నయ ఘట్టంలో పాండవులు ప్రదర్శించిన పరాక్రమం దక్షత; యక్షఘట్టంలో ధర్మజుడు ప్రదర్శించింది ధృతి. వాటికి యక్షప్రశ్నలు ఒక పరీక్ష, ఈ క్రమంలో కథార్థాలు చదువుకొని అన్వయించుకొనటమే ఆరణ్యపర్వంలోని రమ్యత!

నన్నయ రచించిన భాగంలో లోకతంత్ర వర్తనాల వర్తులం ఎడమనుండి కుడికి ప్రదక్షిణంగా కొనసాగింది; ఎఱ్ఱయ రచించిన భాగంలో ఆ వర్తులం కుడినుండి ఎడమకు మరలి, సవ్యంగా ముగిసింది. అప్పుడే అది పరిపూర్ణం. అందుకే ఎఱ్ఱయ నన్నయ పేరుమీదనే తన భాగాన్ని పూరించి, ఆరణ్యపర్వాన్ని పరిపూర్ణం చేసి ఉంటాడు!.

**కవిత్రయ మహాభారతం – వ్యాఖ్యానం :**

తెలుగులో ఆదికావ్యమైన మహాభారతానికి వ్యాఖ్యానం సమగ్రంగా రావటం ఆంధ్రావళికి ఆనందం కలిగించే అంశం. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీవేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో అవతరించటంవలన ఇది సారస్వతయజ్ఞ గౌరవం పొందింది. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు దీనిని ఒక బృహత్తర ధార్మిక కార్యంగా భావించి, సర్వాంగసుందరంగా ప్రచురించి, సామాన్యులకు కూడ అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారి వెలుగుల పుణ్యం. ఈ పవిత్రమహత్తర ప్రయత్నానికి ఏడుకొండలస్వామి పక్షాన బాధ్యత వహించి, విజయవంతంగా ముందుకు సాగిస్తున్న మాన్యులు, మహనీయులు టి.టి.డి. బోర్డ్ ఛైర్మన్, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, సంపాదకులూ, వారిసహాయకులూ, సంపాదక సలహామండలి సభ్యులు, సంపాదకమండలి సభ్యులు, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, పలురకాలుగా దీనికి తోడ్పడుతున్న అధికార అనధికారులు ధన్యులు. వారికి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకాలు!.

ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి ఆమోదించటమే కాక, కొన్ని మంచి సూచనలిచ్చి ప్రోత్సహించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం కంట్రోలర్ ఆఫ్ పబ్లికేషన్సు శ్రీ కరణం జువ్వలకంటి కృష్ణమూర్తి గారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటిగా - రెండు భాగాలలో - వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన ఆరణ్యపర్వం రెండు భాగాలుగా వెలువడుతున్నది. అందులో మొదటి భాగ మిది.

విద్వత్కవులు, పండితులు, రాష్ట్ర అధికార భాషా సంఘం మాజీ అధ్యక్షులు అయిన డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులవారు దక్షతతో రచించిన వ్యాఖ్యాన మిది. కథార్థ తత్త్వాన్ని విశ్లేషణాత్మకంగా వివేచించిన విద్వన్మణులు వారు. దీనిని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రచురించటం ముదావహం. వారికి నా కృతజ్ఞతలు.

డాక్టర్ కృష్ణమాచార్యులవారు మొదట వ్యాఖ్యానాన్ని సరళ గ్రాంథిక భాషలో రచించారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి నిర్ణయానుసారం భారతవ్యాఖ్యానం ప్రజల కందుబాటులో ఉండటానికై శిష్టవ్యావహారికంలోకి మార్చబడింది. ఆ పరివర్తనంలో తోడ్పడిన సంస్కృతాంధ్రభాషా పండితులు డాక్టర్ అట్లా వెంకటరామిరెడ్డి, డాక్టర్ శ్రీమతి వి. జయశ్రీ గారలు. వారు చేసిన పరివర్తనను డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు గారు పరిశీలించి ఆమెదించారు. శుద్ధప్రతుల తయారీలోను ప్రూఫులు సరిచూడటంలోను డాక్టర్ వెలుదండ నిత్యానందరావు. శ్రీమతి జి. సుశీల, శ్రీమతి లక్ష్మీవిద్యానాథ్ గారలు తోడ్పడ్డారు. భారతంమీద వచ్చిన లఘువ్యాఖ్యలను సేకరించటంలో సహకరించారు డాక్టర్ దంటు హేమలతగారు. ముద్రణకు అనువైన అక్షరాకృతి నిచ్చారు శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ అధినేత్రి డాక్టర్ జి.యస్. లక్ష్మిగారు. వీరందరికి హార్దికమైన కృతజ్ఞతలు.

భక్తజనకల్పద్రుమమైన భద్రమూర్తి పద్మావతీ సహిత శ్రీవేంకటేశ్వరస్వామివారు ధర్మకల్పద్రుమమైన ఈ భారతవ్యాఖ్యకు ప్రభువు. సత్యశివసుందరమైన ఆ స్వామి దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యా సంపుటిని వాఙ్మయారాధనలోని పుణ్యపూజాకుసుమ మంజరిగా సమర్పించుకొంటున్నాను.

**జి.వి సుబ్రహ్మణ్యం**
ప్రధానసంపాదకుడు
కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు
తిరుమల తిరుపతి దేవస్థానం.

హైదరాబాదు
విక్రమ ఉగాది
5-4-2000

# ఆరణ్యపర్వ కథాసారం

**(మొదటి భాగం)**

ద్రౌపది వెంటరాగా పాండవులు ఉత్తరదిశగా పయనించారు. కొంత దూరం పోయినతరువాత ఇంద్రసేనుడు మొదలైన ముఖ్యసేవకులూ, పధ్నాలుగువేల రథాలతో సుభద్రాభిమన్యులూ, ప్రతివింధ్యాది ఉపపాండవులూ వారిని కలిసికొన్నారు. ప్రజలు ధృతరాష్ట్రుడి దుర్నీతిని నిందించి, పాండవులవెంట వనవావసానికి బయలుదేరారు. ధర్మజుడు వారికి నచ్చచెప్పి, వారి వారి ఇండ్లకు వారిని తిరిగి పంపాడు. కాని, కొందరు వేదాచారపరాయణులైన పండితులూ, పాండవపురోహితుడైన ధౌమ్యుడూ వారివెంట సాగివచ్చారు. తమతో వస్తున్నవారు వనవాసంలో ఏమాత్రం ఆకలి బాధకు శ్రమపడినా ధర్మజుడు ఎంతో బాధపడుతూ ఉండేవాడు. ఒక్కొకసారి తీవ్రమైన శోకంతో మూర్ఛపోయేవాడు. శౌనకుడు అనే బ్రహ్మర్షి ధర్మజుడు ఆత్మస్థైర్యం పొందటానికి 'జనకగీతా' సారాన్ని ప్రబోధించాడు. ధర్మజుడు శాంతచిత్తుడైనాడు.

ఆశ్రితులకు అన్నలోపం లేకుండా ఉండాలంటే ఆదిత్యమంత్రాన్ని జపించి సూర్యానుగ్రహాన్ని పొందుమని ధౌమ్యుడు ధర్మరాజుకు సూచించాడు. ధర్మజుడు నిష్ఠతో సూర్యోపాసనం చేశాడు. సూర్యుడు అతడికి ప్రత్యక్షమై ఒకరాగిపాత్రను ప్రసాదించాడు. ఆ పన్నెండేళ్ళ వనవాసకాలంలో వంటశాలలో ద్రౌపది ఆ పాత్రలో వండిన వన్య ఫలమూలశాకాలు అక్షయమైన చతుర్విధాహారాలుగా పరిణమిస్తాయని వరమిచ్చాడు. ఆ వర ప్రభావంతో వేలాది బ్రాహ్మణులకూ, అతిథులకూ నిత్యాన్నసంతర్పణలు చేస్తూ ధర్మజుడు గార్హస్థ్యధర్మాన్ని గౌరవంగా నిర్వహిస్తూ ఉన్నాడు.

### ధృతరాష్ట్రుడిని వదలిన విదురుడు తిరిగి రావటం:

కొంతకాలం తరువాత పాండవులు కామ్యకవనం చేరారు. అప్పుడు ఒకనాడు హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు 'ఇక పాండవులు ఏమిచేయగలరో' చెప్పమని విదురుడిని అడిగాడు. విదురుడు పాండవుల బలపరాక్రమాలను ప్రశంసించాడు. కపటద్యూతంవలన పాండవకౌరవుల నడుమ పగ రేగుతుందని ముందుగా చెప్పినా పట్టించుకొనకుండా ధృతరాష్ట్రుడు కొడుకులమాట విన్నందుకు మందలించారు. కులదూషకుడైన దుర్యోధనుడిని దూషించి, ధర్మరాజుకు పట్టంగట్టి కులాన్నీ, బంధుమిత్రులనూ కాపాడుకొమ్మని హితవు చెప్పాడు.

విదురుడి మాటలకు గ్రుడ్డిరాజు కోపగించాడు. 'నీవు నా కొడుకుల అభ్యుదయాన్ని ఎన్నడూ సహించ లేవు. కాబట్టి నీ సహాయం నాకు అవసరం లేదు. నీవు పాండవులవద్దకు గాని, నీ కిష్టమున్నచోటికి ఎక్కడికైనగాని వెళ్ళిపొమ్ము' అని నిష్ఠురమాడాడు. విదురుడు వెంటనే రథమెక్కి పాండవుల వద్దకు వెళ్ళాడు.

విదురుడి రాకను తెలిసికొని పాండవులు మొదట అనుమానించారు. కౌరవులపక్షాన మరల జూదానికి రమ్మని పిలవటానికి వస్తున్నాడేమోననీ, వారు ఆయుధాలను పణంగా పెట్టించి గెలవాలని వ్యూహం పన్నారేమోననీ ఊహించారు. కాని, విదురుడివలన అసలు సంగతి తెలిసికొని కుదుటపడ్డారు. విదురుడు పాండవులకు సచివుడుగా నిలిచాడు. ధర్మహీనులైన కౌరవుల రాజ్యం నిలువదనీ, ధర్మవ్రతులైన పాండవులను రాజ్యసంపద వరిస్తుందనీ విదురుడు ప్రకటించాడు.

ప్రభువైన ధృతరాష్ట్రుడికి విదురుడు హృదయం, చూపువంటివాడు. అటువంటి విదురుడు దూరమయ్యేసరికి గ్రుడ్డిరాజు విలవిలలాడి పోయాడు. వెంటనే సంజయుడిని పిలిచి 'కామ్యకవనానికి వెళ్ళి, విదురుడిని వెనుకకు తె'మ్మని నియోగించాడు. సంజయుడి సందేశం విని, ధర్మజుడి అనుమతితో విదురుడు హస్తినాపురికి తిరిగి వెళ్ళాడు. ధృతరాష్ట్రుడు అతడిని సాదరంగా ఆహ్వానించి తన తెలివితక్కువతనానికి క్షమించుమని వేడుకొన్నాడు.

**వ్యాసుడి హితవు :**

ధృతరాష్ట్ర విదురుల పునస్సమాగమం దుర్యోధనుడికి కన్నెర్ర చేసింది. అతడు కర్ణ శకుని దుశ్శాసనులతో మంతనం చేశాడు. పాండవులను అడవులనుండి పిలిపించి, ధృతరాష్ట్రుడు తిరిగి వారి రాజ్యం వారికిస్తాడేమో నని శంకించాడు. కాని, శకుని ఆ మాటను కాదని, పాండవులు తాము చేసిన ప్రతిజ్ఞలను మధ్యలో భగ్నం చేయరని చెప్పాడు. పాండవులపై దాడి చేసి, యుద్ధంలో వారిని చంపి, రాజ్యాన్ని నిష్కంటకం చేద్దామని కర్ణుడు సలహా ఇచ్చాడు. ఆ మాట విని దుర్యోధనుడు సమస్తసైన్యాలను మోహరించి యుద్ధభేరి మ్రోగించటానికి సిద్ధమైనాడు. ఆ సంగతిని వ్యాసమహర్షి దివ్యదృష్టితో తెలిసికొని, హస్తినాపురికి వచ్చి దుర్యోధనుడిని వారించి, ధృతరాష్ట్రుడిని మందలించాడు. ఇంద్రసురభి సంవాదాన్ని వినిపించి, కౌరవ పాండవులను సమంగా ఆదరించుమని గ్రుడ్డిరాజుకు హితవు చెప్పాడు. కొన్నాళ్ళు దుర్యోధనుడిని ధర్మరాజువద్ద ఉంచితే సత్సాంగత్యంవలన సద్గుణవంతుడు కావచ్చునని సూచించాడు. కాని, ధృతరాష్ట్రుడు దానిని మన్నించక తన కొడుకు తనమాట వినడని విచారించి, వ్యాసమహర్షినే తన కొడుకుకు ఆ హితవును బోధించుమని కోరాడు. ఆ పనిని మైత్రేయుడనే ముని చేస్తాడని చెప్పి వ్యాసుడు నిష్క్రమించాడు.

**సుయోధనుడి తొడలు విరిగే శాపం :**

ఆ తరువాత మైత్రేయుడు పుణ్యక్షేత్రాలను దర్శించుకొంటూ కామ్యకవనంలో ఉన్న పాండవులనుకూడా చూచి, హస్తినాపురికి వచ్చాడు. ధృతరాష్ట్ర డతనిని పూజించి పాండవుల కుశల మడిగాడు. ఆ ఋషి కుశల వార్తలు చెప్పి, దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు: 'అయ్యా! నీవు పాండవులతో విరోధం మాని బుద్ధి కలిగి ఉంటే, నీకూ, కురుకులానికీ మేలు కలుగుతుంది. నా మాటలు మన్నించుము' - అని, పాండవుల, వారి సహాయకుల బలపరాక్రమ విశేషాలను వివరించాడు. దుర్యోధనుడు ఆ ముని మాటలు లెక్క చేయకుండా, గర్వించి కాలి బొటనవ్రేలితో నేలను రాస్తూ, చేతులెత్తి తొడలు చరుస్తూ, బిగ్గరగా నవ్వ నారంభించాడు. ఆతడి అవినయానికి మైత్రేయుడు మండిపడి దుర్యోధనుడిని శపించాడు - 'నీతొడలు రెండూ భీముడి గద దెబ్బలకు విరిగిపోవుగాక!' అన్నాడు- ఆగ్రహంగా. ధృతరాష్ట్రుడు శాపాన్ని ఉపసంహరించుమని ప్రార్థించాడు. 'దుర్యోధనుడు సమబుద్ధితో వ్యవహరిస్తే ఆ శాపం వర్తించ'దని చెప్పి, మైత్రేయ మహర్షి వెడలిపోయాడు.

**భీముడు కిమ్మీరుడిని వధించటం :**

ఈ కథను విదురుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడు.

పాండవులు హస్తినాపురం వదలి మూడురోజులు ఆగకుండా ప్రయాణం చేసి కామ్యకవనం చేరారు. ఆ అడవిలో ఒకనాటి నడిరేయి భయంకరాకారుడై, రాక్షసమాయలు చేస్తూ గర్జిస్తూ కిమ్మీరుడనే రాక్షసుడు పాండవుల బాటకు అడ్డంగా నిలిచాడు. ఆతడి భీకరరూపం చూచి ద్రౌపది మూర్ఛ పోయింది. పాండవు లామెను తేర్చారు. రాక్షసుడికి తమను గురించి తెలియ చెప్పుకొన్నారు. కిమ్మీరుడు బకాసురుడి తమ్ముడు. బకాసురుడిని వధించిన భీముడిపై పగ తీర్చుకొనాలని అతడు ఎదురుచూస్తున్నాడు. వెదుకబోయిన తీగ కాలికి తగిలినట్లు అతడికి భీముడు దొరికాడు. అతడిపై ఆగ్రహోదగ్రుడై విజృంభించాడు. భీముడిని పట్టాడు. ఆ రాక్షసుడు తనకంటె బలహీనుడని భీముడు గుర్తించాడు. వెంటనే కిమ్మీరుడి నడుమును, కుత్తుకను రెండుచేతులతో పట్టి పైకెత్తి నేలపై పడవేసి, వెన్నెముకను విరిచి చంపివేశాడు. ఆనాటినుండి కామ్యకవనం రాక్షసపీడ లేక సుఖంగా ఉండే వనస్థలిగా మారింది. పాండవులందులో కొంతకాలం సుఖంగా ఉన్నారు.

**నరనారాయణుల నరజన్మం :**

పాండవులు కామ్యకవనంలో నివసించే సమయంలో శ్రీకృష్ణాదియాదవవీరులూ, ధృష్టద్యుమ్నాది పాంచాలవీరులూ వారిని పరామర్శించటానికి వచ్చారు. ధార్తరాష్ట్రులు పాండవులకు చేసిన మోసాన్ని పేర్కొంటూ శ్రీకృష్ణుడు కౌరవులపై మండిపడ్డాడు.

పాంచాల యాదవ వృష్ణి భోజాంధక వీరులందరూ కలిసి హస్తినాపురిపై దండెత్తి కర్ణ శకుని దుర్యోధన దుశ్శాసనులను చంపి, వారినెత్తురుతో భూదేవిని తృప్తిపరచి, ధర్మరాజుకు రాజ్యపట్టాభిషేకం చేస్తామని ప్రళయకాలంలోని యముడివలె ఉగ్రుడై పలికాడు- శ్రీకృష్ణుడు. అర్జునుడు శ్రీకృష్ణుడిని శాంతపరిచాడు. ఆతడి లోకప్రభుత్వాన్నీ, త్రివిక్రమత్వాన్నీ, విశ్వరూపత్వాన్నీ కీర్తించి ధరణీతలం మీద శిశుపాలాదులను సంహరించి ధర్మసంరక్షణం చేసేందుకు పుట్టిన అవతారపురుషుడుగా కీర్తించి, అసత్యం, మాత్సర్యం, క్రోధం అనే వికారాలను జయించి సుర మునీంద్రులచేత పొగడబడే ఆ దేవదేవుడి మహత్త్వాన్ని ప్రశంసిస్తూ నమస్కరించాడు. శ్రీకృష్ణుడు శాంతించి అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'ఓ పుణ్యాత్ముడా! నీవూ నేనూ నరనారాయణులనే పేర్లతో పూర్వం ఉన్న ఆదిమునులం. ఇద్దరం సమానశక్తితో మానవజన్మలెత్తాం. మనిద్దరినడుమ నీవూ నేనూ అనే భేదం లేదు. ఇద్దర మొక్కటే. నీకు ఇష్టుడు నాకు కూడా ఇష్టుడే. నీకు శత్రువు నాకుకూడా శత్రువే. మనిద్దరం ఈ లోకానికి మేలు కలిగే పనులనే చేద్దాం' అంటూ ఆతడితో కలిసి స్నేహపూరిత సంభాషణలలో మునిగిపోయాడు- శ్రీకృష్ణుడు.

ఒకనాడు శ్రీకృష్ణుడు బంధుమిత్రులైన రాజులందరితో కలిసి కొలువుండగా ద్రౌపది ఆతడితో తన పరాభవ దుఃఖాన్ని ఇట్లా నివేదించుకొన్నది. 'దేవా! నీవు ప్రజాపతి వని అసితుడైన దేవలు డన్నాడు. యజ్ఞపురుషుడవని కశ్యపుడు కీర్తించాడు. సర్వమయుడవని నారదుడు సంస్తుతించాడు. అక్షయజ్ఞాననిధివని మునిశ్రేష్ఠులందరూ ప్రశంసించారు. రాజర్షులకు, యోగులకు, సాధులకు, భక్తులకు నీవే గతివి, పతివి. నీకు తెలియని దంటూ ఏమీ లేదు. అయినా నేను పొందిన అవమానాలను గురించి నీకు నివేదించుకొంటున్నాను'.

'నేను మహా ప్రభువైన పాండురాజు కోడలిని, మహా పరాక్రమవంతులైన పాండవుల భార్యను. పూజ్యుడవైన నీ చెల్లెలిని. శక్తిమంతుడైన ధృష్టద్యుమ్నుడి సోదరిని. ఇట్టి నన్ను ఆ దుర్యోధనుడు పగతో నిండుసభ కీడ్పించి తెప్పించాడు. ఆ పాపాత్ముడు దుశ్శాసనుడు నా వలువలను ఒలిచాడు. ఆ దారుణమైన అవమానాన్ని నేను అనుభవించాను. అప్పుడు పాండవులు అభిమానం చచ్చి, చూస్తూ అందరివలెనే ఊరకుండిపోయారు. భీష్మాది కురువృద్ధులు నిశ్శబ్దంగా ఉన్నారు. శరణన్న వారిని కరుణతో రక్షించే పౌరుషమూర్తులు భీమార్జునులు. శరణని నేను అరచినా భార్య పిలుపును వినకుండా రక్షించకుండా మిన్నకున్నారు. ఇక వారి బాహుబల మెందుకు? అన్నలు, కొడుకులు, బంధువులు ఇంతమంది బలగం నాకున్నా, అనాథవలె అలమటిస్తూ ఉంటే, ఆ కర్ణుడు నన్ను చూచి నవ్వాడు. అన్నా! ఆ దుశ్శాసనుడు చేసిన అవమానంకంటె ఆ కర్ణుడు అప్పుడు నవ్విన ఆ నవ్వు ఇప్పటికీ నా మనస్సును అగ్నిశిఖవలె దహించి వేస్తున్నది. అలనాడు దుర్యోధనుడు భీముడిని గంగలో త్రోసి, విషంపెట్టి, పాములతో కరిపించాడు. ఆ తరువాత వారణావతంలో తల్లితో కలిసి నివసిస్తున్న పాండవులను క్రూరుడై అగ్నిపాలు చేసేందుకు కుట్ర పన్నాడు. అతడు చేసిన అపకారాలు అన్నీ ఇన్నీ అని చెప్పలేను. ఇప్పుడు అధర్మద్యూతంలో రాజ్యాన్ని అపహరించి నిండుకొలువులో వారినీ, నన్నూ అవమానించినా పరాక్రమాన్ని ప్రదర్శించటానికి ముందుకు రాని ఈ పాండవులు నా పరాభవ దుఃఖాన్ని ఏ విధంగా మాన్పగలరు?' అంటూ కన్నీరుమున్నీరుగా శ్రీకృష్ణుడి యెదుట దుఃఖించింది. ఆమె నోదారుస్తూ శ్రీకృష్ణార్జునులు ఇట్లా అన్నారు.

శ్రీకృష్ణుడు : సోదరీ! నీ గుండెలో మండుతున్న అవమానాగ్ని చల్లారేటట్లుగా అర్జునుడు ధృతరాష్ట్ర పక్షవీరులను తన బాణపరంపరతో హతంచేసి యమసదనానికి పంపుతాడు. ఇది నిజం. నామాట తప్పక జరిగి తీరుతుంది. సప్తసముద్రా లింకినా రాత్రింబవళ్ళు తలక్రిందులైనా ఇది తథ్యం.

అర్జునుడు : ద్రౌపదీ! ఈ పురుషోత్తముడే మన యోగక్షేమాలను చూస్తూ, మన పాపపంకిలాన్ని తొలగించి, దుర్మదాంధులైన మన శత్రువులను సంహరింప చేస్తాడు. మనకు ముల్లోకవిజయం కలుగుతుంది. నీ వింక దుఃఖించటం ఎందుకు?

వారి మాటలు విని ధృష్టద్యుమ్నుడు కూడా ఇట్లా పలికాడు.

ధృష్టద్యుమ్నుడు : చెల్లీ! అవినయపరులైన ఆ దుర్యోధన దుశ్శాసనులను భీముడు హతమారుస్తాడు. అర్జునుడు ఆ కర్ణుడినీ, ద్రోణుడిని నేనూ చంపుతాం. ఇక నీకు మనశ్శాంతి కలుగుతుంది. - అని అందరూ కలిసి ఆమెను ఓదార్చారు.

అప్పుడు శ్రీకృష్ణుడు తాను పాండవులు మాయాద్యూత మాడే సమయంలో ద్వారకలో లేకపోవటంచేత, వారివెంట ఉండి ఆ విపత్తును తప్పించలేకపోయానని ధర్మరాజుకు సౌంభకవృత్తాంతం చెప్పాడు.

**సౌంభక వృత్తాంతం :**

ధర్మజుడు చేసిన రాజసూయంలో అవినయంగా వర్తించిన శిశుపాలుడిని శ్రీకృష్ణుడు వధించి, పాండవు లర్పించిన పూజనందుకొన్నాడు. శిశుపాలుడి తమ్ముడు సాల్వుడు. శ్రీకృష్ణుడు తన అన్నను చంపినందుకు కోపించి ప్రతీకారం తీసికొనటానికై ద్వారవతిమీద దండెత్తాడు. సాల్వుడికి సౌంభక మనే పేర కామగమనం గల పట్టణం ఉన్నది. దానితో కలిసి వచ్చి ద్వారవతిని చుట్టుముట్టి పరిసరాలను ధ్వంసం చేశాడు. నగరంమీద దాడి మొదలుపెట్టాడు. యదువీరకుమారులు చారుదేష్ణుడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు అనేవారు యుద్ధోత్సాహంతో కోట వెలువడి సాల్వుడిని ఎదుర్కొన్నారు. ముగ్గురూ పౌరుషంతో పోరాడి అనేక మంది వీరులను చంపారు. ఒకసారి ప్రద్యుమ్నుడు యుద్ధంలో మూర్ఛపోయాడు. సారథి ఆతడి రథాన్ని దూరంగా తీసికొనిపోయి అతడిని సేద తీర్చాడు. ప్రద్యుమ్నుడు తేరుకొని తేరెక్కి సాల్వుడిపై దాడిచేసి, అతడిని మేటియుద్ధంలో చంపబోయాడు. కాని, నారద మారుతులు ప్రత్యక్షమై సాల్వుడు శ్రీకృష్ణుడిచేత చంపబడతాడని చెప్పారు. దానితో ప్రద్యుమ్నుడు సాల్వుడిని యుద్ధంలో ఓడించి ప్రాణాలతో వదిలాడు. సాల్వుడు సౌంభక నగరంతో పాటు పలాయనం చిత్తగించాడు.

ఆసమయంలో శ్రీకృష్ణుడు ధర్మజ రాజసూయం ముగించుకొని ద్వారకకు తిరిగివచ్చాడు. చిన్నవోయి, రూపుమాసిన తన రాజధానిని చూచి చిన్నబోయాడు. జరిగిన వృత్తాంతం ఆహుకాత్మజుని (ఉగ్రసేనుని) వలన విని, కోపించి 'సాల్వుడిని చంపి కాని నగరంలో ప్రవేశించనని ప్రతిజ్ఞ చేసి అనంతబలంతో సాల్వుడిమీద దండెత్తాడు. సాల్వుడు సౌంభకనగరంతో సహా సముద్ర గర్భంలో దాగి ఉన్నాడు. ఆతడిని పసికట్టి శ్రీకృష్ణుడు శస్త్రాస్త్రాలతో అతడి సైన్యాన్ని నుగ్గుచేశాడు. సాల్వుడు భయపడి శ్రీకృష్ణుడిపై మాయాయుద్ధం ప్రారంభించి విజృంభించాడు. శ్రీకృష్ణుడు ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించి అతడి మాయను తొలగించాడు. సాల్వుడు వసుదేవుడిని బంధించినట్లు కనుకట్టు సన్నివేశాన్ని ప్రదర్శించాడు. శ్రీకృష్ణుడు వాడి మాయను గ్రహించి శబ్దభేదిని ప్రయోగించాడు. సాల్వుడు తన సౌంభకనగరాన్ని ప్రాగ్జ్యోతిషనగరంగా మార్చి పర్వతాలతో యుద్ధం చేశాడు. శ్రీకృష్ణుడు పర్వతాలను వజ్రాస్త్రంతో నుగ్గుచేశాడు. ఆ తరువాత సారథి ప్రేరణతో సాల్వుడిని చక్రప్రయోగంతో సంహరించాడు. ఈ యుద్ధం ముగియటానికి ఆరునెలలు పట్టింది. ఆ కాలంలోనే పాండవులు కౌరవులచేత మాయాద్యూతంలో ఓడించబడి అడవులపాలైనారు. శ్రీకృష్ణసాన్నిధ్యం వారికి లభించకపోయింది.

శ్రీకృష్ణాదులు కొంతకాలం పాండవులతో కలిసి ఉన్నారు. ఆ తరువాత శ్రీకృష్ణుడు తనతో సుభద్రాభిమన్యులను ద్వారవతికి తీసికొని పోయాడు. ఉపపాండవులైన ప్రతివింధ్యాదులను ధృష్టద్యుమ్నుడు ద్రుపద పురానికి కొంపోయాడు. ఆపైన పాండవులు మూలభృత్యులతో కలిసి ద్వైతవనంలో ప్రవేశించారు. అప్పుడు వారిని మార్కండేయ మహర్షి, బకదాల్భ్య మహర్షి దర్శించారు. వారిరువురూ పాండవుల ధర్మ సత్యనిరతిని ప్రశంసించారు. విశేషించి బకదాల్భ్యుడు ధర్మజుడి బ్రాహ్మణ భక్తిని కొనియాడాడు. బ్రాహ్మణానుగ్రహంవలన సంపదలను పొందిన వైరోచనాదుల వృత్తాంతాలను ప్రస్తావించి, బ్రాహ్మణప్రియులైన పాండవులకు అభ్యుదయాలు కలుగుతాయని ఆశీర్వదించాడు. ఆ మునులిద్దరూ వెళ్ళారు. పాండవులు ఆ వనంలో నివసిస్తూ తమ దుఃఖోపశమనం కొరకు అనేక కథలు చెప్పుకొంటున్నారు. ఆ సందర్భంలో ద్రౌపదికీ ధర్మరాజుకూ ఈ క్రింది విధంగా సంవాదం సాగింది.

**ద్రౌపదీ ధర్మరాజుల సంవాదం :**

ద్రౌపది : ఆ ముసలిరాజు కొడుకుమాటలు విని క్రూరుడై పాపచింతతో మిమ్మల్ని రాజ్యం నుండి వెడలగొట్టి, రాజ్యవైభవాన్నంతా అపహరించాడు. ఇప్పటికైనా అతడు కోపం మాని మంచి మనసుతో ఉన్నాడా? ఆ దురాత్ముడి హృదయం ఇనుమువలె, రాయివలె కఠినమైనది. లేకపోతే ధర్మవిదులైన మిమ్మల్ని తనకొడుకులు అన్ని ఎగ్గుమాట లంటుంటే

వారించకుండా పైపెచ్చు కలహాన్ని పోషిస్తాడా? మహారాజభోగా లనుభవించే మీరు ఈ కారడవులలో పడరాని కష్టాలు పడుతూ ఉంటే నే నెట్లా మిమ్మల్ని చూచి ఓర్చుకొనేది? మిమ్మల్ని ఎట్లా ఓదార్చేది? ఆ ధృతరాష్ట్రుడివలె విధి కూడా మీకు శత్రువైనట్లే కనిపిస్తున్నాడు.

ఓ ధర్మరాజా! నీ తమ్ములు నీ ఆజ్ఞ అనే సంకెళ్ళలో చిక్కి పరాక్రమం ప్రదర్శించలేక బోనులోపడ్డ సింగపుపిల్లలవలె కష్టాల ననుభవిస్తున్నారు. పరరాజుల కిరీటాల రత్నాల కాంతులతో వెలిగిపోయే నీ పాదాలు ఈ పర్వతధాతుశిలల ధూళితో ఎఱ్ఱబడ్డాయి. రోజూ పదివేలమంది బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులు బంగారు పళ్ళేరాలలో భుజించి తృప్తులైన తరువాత నీవు భుజించేవాడివి. ఇప్పుడు వనమూలికలను తింటూ పేదవోయావు. పదివేల యేనుగుల బలంగల భీమసేనుడు కాయగూరలు తిని చిక్కిపోతున్నాడు. కార్తవీర్యార్జునుడివలె బాహుపరాక్రమం ప్రదర్శించగల పార్థుడు వన్యమృగాలతో కలిసి తిరుగుతున్నాడు. సుఖభోగలాలసులైన నకులసహదేవులు దీనులై ఉన్నారు. ఈ స్థితినంతా గమనించికూడా నీవు శాంతుడవై ఉండటం సమంజసం కాదు.

ఓర్పు పరాక్రమం అనే రెండు గుణాలను ఆయాకాలాలలో అద నెరిగి ప్రయోగించకపోతే ఆ రాజుకు ప్రజల గౌరవం లభించదు; వారి ప్రతాపం వారికి ప్రయోజనకారి కాకుండా పోతుంది. ఈ సత్యం ప్రసిద్ధమైన 'బలీంద్రప్రహ్లాద సంవాదం' వలన నిరూపితమయింది. అంతేకాక, శత్రువులు చేసిన అపకారం చిన్నదైతే క్షమించి వారిని వదలివేయవచ్చును. కాని, కౌరవులు అనేక అపరాధాలను నిరంతరం చేస్తున్నారు. వారి పట్ల సహనం ఎందుకు? ఇది పరాక్రమానికి తగిన సమయం. శత్రువులమీద నీవు కొద్దిగా క్రోధాన్ని ప్రకటించుము. చాలు. నీ తమ్ములు ఉగ్రస్వరూపులై దుర్మార్గులైన దుర్యోధనాదులను తునుమాడుతారు.

ధర్మరాజు : కోపమే పాపం. కోపంవలన ధర్మకామార్థాలు చెడిపోతాయి. కోపించే వాడికి కార్యం చెడుతుంది. అతడు పెద్దలను నిందిస్తాడు; చంపకూడనివారిని చంపుతాడు; ఆత్మహత్యకు పాల్పడతాడు. మనవంటి ధర్మాచరణపరులకు కోపం మంచిది కాదు. తెలివికలవాడు కోపమనే మంటను జ్ఞానమనే నీళ్ళతో ఆర్పుతాడు. దేశకాలతత్త్వాలను తెలిసికొని కోపంలేని వాడు ప్రకాశిస్తాడు. భూమివలె ఓర్పు కలవాడికి ఎల్లప్పుడు విజయం కలుగుతుంది. ఓర్పు కలవాడి పరాక్రమం అన్నిపనులు చేయగల సామర్థ్యాన్ని కలిగి ఉంటుంది. అమర్షం, దాక్షిణ్యం, శౌర్యం, శీఘ్రత్వం అనే నాలుగు గుణాలు ఓర్పుకలవాడిలోనే శక్తిమంతంగా వర్ధిల్లుతాయి. ప్రాచీనమైన కశ్యపగీతలోని కథలవలన ఈ అంశాన్ని తెలిసికొనవచ్చును. వేదాలు, యజ్ఞాలు, శుచిత్వం, సత్యం, విద్య, ధర్మం, ఈజగత్తూ అన్నీ ఓర్పులోనే నిలిచి ఉన్నాయి. యజ్ఞకర్తలు, బ్రహ్మవేత్తలు పొందే పుణ్యగతులను క్షమావంతుడు పొందుతాడు. అంతేకాదు, వ్యాస భీష్మ విదుర కృప ద్రోణ సంజయాదులు నా ఓర్పును కీర్తిస్తారు. సహనంలేని దుర్యోధనుడు కారణంగా ధార్తరాష్ట్రులందరూ నాశనమౌతారు.

ద్రౌపది : ఓ అజాత శత్రుడా! ఓర్పుగల బుద్ధితో నిర్మలమైన వర్తనంతో ధర్మాన్ని ఆచరిస్తూ ఉన్న నిన్ను ధర్మం రక్షిస్తుంది. కానీ, నీవు శత్రువుల పట్లకూడా సమబుద్ధితో ఉండటం మంచిది కాదు. అధర్మపరులు, కపట వర్తనులు అయిన ధార్తరాష్ట్రులను నీవు కూడా కపట మార్గంతోనే వధించాలి. లేకపోతే నీవే వధ్యుడవౌతావని ఆర్యులంటారు. ఓ విధీ! మంచివారికి దీనస్థితిని, అయోగ్యులకు ఉన్నతస్థితిని కలిగించి నీవు చేయరానిపని చేశావు. నీకు దుష్టులే చుట్టాలా? ఆర్యులే శత్రువులా?

ధర్మరాజు : నాస్తికులవలె ధర్మాన్ని శంకించి దైవాన్ని దూషిస్తా వెందుకు? ధర్మాన్ని తిట్టేవారికి ప్రాయశ్చిత్తం లేదు. ధర్మాన్ని తప్పక పాటిస్తూ జీవించే మహానుభావు లెందరో ఉన్నారు. మైత్రేయ, మార్కండేయ, వ్యాస, వసిష్ఠ, నారదాదులు మనకు ప్రత్యక్షసాక్షులు; వీరందరూ నన్ను ధర్మపరుడనని మన్నిస్తారు. ఇతరులు అన్యాయం చేశారని నేనెందుకు ధర్మాన్ని తప్పాలి? ధర్మం మానవులకు స్వర్గారోహణ సోపానం వంటిది. తపస్సు, స్వాధ్యాయం, బ్రహ్మచర్యం, దానం, ధర్మం, యజ్ఞం అనేవి పుణ్యకర్మలు. అవి ఫలం లేనివైతే ఇంతమంది ఋషులు ఎందుకు ఆచరిస్తున్నారు? నీ జన్మం, ధృష్టద్యుమ్నుడి పుట్టుక పుణ్య కర్మఫలం వలన కలిగినవే కదా! పూర్వం బ్రహ్మ తన కొడుకులకు

కర్మఫల సద్భావం గురించి చెప్పాడు. వారిలో కశ్యపుడు ఆ ఫలాన్ని పొందాడు. బ్రహ్మ నియోగం చేతనే పుణ్యకర్మపరులు దేవత్వాన్ని పొందుతుంటారు.

ద్రౌపది : భూనాథా! కర్మఫలానికి విధి కారణమనీ తెలుసు. వేదశాస్త్రాలు పరమప్రమాణాలనీ తెలుసు. నే నంత తెలియనిదాన నేమీ కాను. మా తండ్రిగారింట్లో బ్రాహ్మణులు చెప్పగా ఎన్నో ధార్మికాంశాలు తెలిసికొన్నాను. పురుషుడు మనస్సులో అర్థసిద్ధిని నిశ్చయించికొని కర్మ చేయాలి. అతడికి దైవం సహాయపడి కర్మసిద్ధి కావిస్తాడు. నువ్వులనుండి నూనె, కట్టెనుండి నిప్పు- పుట్టుతాయని తెలిసి ఉపాయంతో వాటిని పొందినట్లుగా, ఉత్సాహవంతుడు కర్మసిద్ధి పొందగలుగుతాడు. ఉత్సాహి కీడు పొందలేడు. రైతు దుక్కిదున్ని విత్తులు చల్లి ఉండగా వర్షం కురిసి తత్ఫలసిద్ధిని పొందుతాడు. నడుమ పర్జన్యుడు అనుగ్రహించకపోతే రైతు ఏమి చేయగలడు? రైతు తాను చేయగలిగినంత చేసి మిగిలిదానికి దైవానుకూల్యం సిద్ధించాలని కృషి చేస్తాడు. అట్లాగే నీవుకూడ కర్మఫలం దైవమానుషసిద్ధమని తెలిసికొని, పురుషకారంతో సాధించేవే సుస్థిరాలని తెలిసికో. పురుషయత్నం చేయక దైవంమీద భారం వేసేవాడు నీటిలో పడవ వంటివాడు. కాబట్టి నీవు కర్మఫలసిద్ధిని నిశ్చయించుము. ఉత్సాహవంతుడ వయి నీతమ్ముల పరాక్రమంతో శత్రువులను జయించుము. మన పేదరికాన్ని మాన్పుము.

ద్రౌపది మాటలను సమర్థిస్తూ భీమసేనుడు ఇట్లా అన్నాడు.

భీముడు : ధర్మరాజా! తాతతండ్రుల నుండి మనకు వచ్చిన రాజ్యం శత్రుదుర్భేద్యం. గాండీవిచేత సంరక్షితం. ఇంద్రుడికైనా జయించటానికి అసాధ్యం. అట్టి రాజ్యాన్ని దుర్బుద్ధితో అన్యాక్రాంతం చేయటం న్యాయమా? ఈ కారడవిలో వ్రతాలు చేస్తూ ధర్మలేశచరణ వ్యాసక్తితో ఇట్లా ఉండటం తగునా? సింహాలు కూర్చిన మాంసాన్ని నక్కలు తిన్నట్లు మనం సంపాదించిన సామ్రాజ్యలక్ష్మిని కౌరవులు హరించి మనసులో ఏమని భావిస్తారో? దుర్బుద్ధులను, దుర్జనులను ధర్మంతో జయించటం సాధ్యమా? కాబట్టి, దుష్కర్ములయిన దుర్యోధనాదులను భుజబలశక్తితో అణచివేయుము. ధర్మకామాలనుండి పుట్టి సర్వార్థాలను సాధించే అర్థపురుషార్థాన్ని వదలిపెట్టి, మిత్రులకు దుఃఖాన్నీ, శత్రువులకు సంతోషాన్నీ కలిగేటట్లు మునివృత్తితో ధర్మం ధర్మం అంటూ ధర్మంలోనే మనసు నిలిపి బలహీనుడివలె ఇట్లా నిర్వేదపడుతూ ఉండటం సమంజమా? బలంలేనివాడు పరుల సంపదలు గ్రహించలేక దుఃఖిస్తూ ఉంటాడు కాని, నీకీపని తగునా? ఆ నిండుసభలో ఆనాడే నీవు అనుమతించి ఉండి ఉంటే- విరోధుల నందరినీ యుద్ధంలో వేగంగా అక్కడే మనం చంపి ఉండేవారం. అప్పుడు ఈ కారడవిలో అడవిమృగాల నడుమ పడిఉండే దైన్యం మనకు లేకుండా ఉండేది. చేసిన ప్రతిజ్ఞలను మీరలేక ఓర్పుతో ఉన్న మనలను గురించి కౌరవులు యుద్ధోత్సాహం లేని జడమతులనీ, పరాక్రమంలేని పిరికిపందలనీ భావిస్తారు. ఏకాంతంగా ఉండి ధర్మాచరణం చేసే వాడిని అర్థకామాలు వదలిపెట్టి పోతాయి.

లోకంలో ధర్మకామాలను తక్కువ చేసి అర్థాన్ని కోరేవాడు పతనమౌతాడు. అర్థం కొరకే అర్థాన్ని సాధించేవాడు భయంకరమైన అడవిలో గోవులను రక్షించే మూర్ఖుడివంటివాడు. అర్థ ధర్మాలకు హానికలిగేటట్లు కామాన్ని సాధించేవాడు ఎండుతున్న నీటి మడుగులోని చేపవంటివాడు. అర్థ ధర్మాలు సముద్ర మేఘాలవలె పరస్పరం ఆధారపడి ఉంటాయి. కాబట్టి త్రివర్గాన్ని సమయోచితంగా సాధించేవాడే సర్వసంపన్నుడు. నీ వాచరిస్తున్న ధర్మం అర్థకామాలకే కాక, నీకూ, నీ బంధువులకూ బాధాకరంగా పరిణమించింది. నిజానికి, క్షత్రియులకు అర్థసాధకం కాని ధర్మం నిరర్థకం. శత్రువులను యుద్ధంలో జయించటం, రాజ్యాన్ని నిర్భయంగా గ్రహించి సముచితంగా రక్షించటం, యోగ్యులైన వారికి అర్థాన్ని దానం చేయటం, బ్రాహ్మణులను పూజించటం అనేవి ఉత్తమ క్షత్రియ ధర్మాలు. అవే వారికి మంచి గతుల నిస్తాయి, విపుల సంపదలు కలిగిస్తాయి. కేవలం ధర్మాన్ని ఆచరించటంవలన శత్రువిజయం సాధ్యం కాదు. మోసం చేసేవారిని మోసంతోనే జయించాలి. పూర్వం అసురులను దేవత లట్లాగేకదా జయించింది. కాబట్టి, నీవుకూడా నియమాన్ని పాటించే ధర్మాన్ని మాని శత్రువులను జయించే ప్రయత్నం సాగించుము.

జయశీలివైన నీకు ఆసటగా బాసటగా యదుపాంచాలాది మిత్రరాజు లున్నారు. మిత్రులబలంతో అమిత్రులను జయించటం నీతి. దేహబలం, దేశబలం కలవారికి అసాధ్యమనేది లేనేలేదు. తేనెతుట్టెలోని తేనెను తీసేవాడిని తేనెటీగలన్నీ ఒక్కటై పట్టి కుట్టినట్లుగా ఒంటరిగా ఉన్న బలవంతుడిని పలుపురు బలహీనులు ఒక్కటై జయించటానికి యత్నిస్తారు. దుర్యోధనుడి రాజ్యంలో జానపదులు, బ్రాహ్మణులు నీపట్ల అనురక్తులు. వారు నీ ప్రభుత్వాన్ని సమర్థిస్తారు. కాబట్టి నీవు ఆలస్యం చేయక, ఆయుధాలున్న రథమెక్కి హస్తినాపురంమీద విజయయాత్ర సాగించుము. ఇప్పుడే క్షత్రియోచితమైన విక్రమాన్ని ప్రకటించుము. యుద్ధంలో గాండీవి తన బాణాలతో ధార్తరాష్ట్రులను అరటిచెట్లను నరికినట్లు నరికి కుప్పలు పోస్తాడు. శత్రువులకు అపారమైన సేన ఉన్నదని భయపడబోకుము. నా గదాఘాతాలకు ఆ సైన్యం ప్రాణాలతో బైటపడగలుతుందా? శత్రువుల నోడించి భూవలయాన్ని పాలించుము. ప్రజా పరిపాలనం కంటె ధర్మం వేరే ఉంటుందా? రాజ్యం పొందిన రాజు భూరిదక్షిణ లిచ్చి యజ్ఞాలు చేయగలడు. దానివలన బ్రాహ్మణులకు బహుదానాలిచ్చి పాపాలనుండి విముక్తుడై చీకటినుండి విముక్తుడైన చంద్రుడివలె ప్రకాశించగలడు.

ధర్మరాజు : భీమసేనా! నీమాటలు నీతియుతంగా ఉన్నాయి. ఇష్టసిద్ధి కనుకూలంగా ఉదారంగా ఉన్నాయి. అయినా ఏకార్యమైనా బాగా ఆలోచించి చేయటంవలననే సత్ఫలితాల నిస్తుందని బుద్ధిమంతు లంటారు. నేను పెద్దల యెదుట నిండుసభలో అరణ్యాజ్ఞాతవాసాలు చేస్తానని ప్రతిజ్ఞ చేశాను. ఉత్తముడు రాగకోపాలకు వశుడై ఓర్పును కోల్పోయి చంచలమైన సంపదకు ఆశపడి సత్యం, ధర్మం తప్పి మరల పెద్దలున్నసభలో తలెత్తి నిలువగలడా? నేను చేసిన ప్రతిజ్ఞను దాటలేను. మంచికాలం వచ్చేవరకు వేచి ఉండటం మంచిది. రాజ్యాలు, పుత్రులు, సంపదలు, కీర్తి అనేవి సత్యంతో సమంకావు.

భీముడు : శరీరాలు అశాశ్వతాలు. శరీరానికి మరణం తథ్యం. ఎప్పు డది వస్తుందో తెలియదు. అందువలన పనులు ఎడంచేసి కొనటం కూడదు. మరణించే లోపల ఎవరైనా తనవైరం తీర్చుకొనకపోతే వాడిజన్మ వృథా. కాబట్టి, మనం పరులచేత పడిన పరాభవాలకు ప్రతీకారం తీర్చుకొనేంతవరకు రాత్రింబవళ్ళు నాగుండె మండుతూ ఉన్నది. నాకంటె అధికంగా అర్జున నకుల సహదేవులు, కుంతీదేవి మనస్తాపంతో వేగిపోతున్నారు. వీరల దుఃఖం తీర్చకుండా కారడవిలో ధర్మం. దయ అంటూ ఉండటం తగినపని కాదు. ఈవిధంగా శాంతంగా ఉండటం బ్రాహ్మణధర్మం గాని, క్షత్రియధర్మం కాదు. మనువు ధర్మశాస్త్రంలో శత్రుసంహారం క్షత్రియధర్మంగా చెప్పాడు. శత్రువులను సంహరించనివాడికి హాని తప్పక కలుగుతుంది.

అది అట్లా ఉండనిమ్ము. మనం పన్నెండేళ్ళు అరణ్యవాసాన్ని ఎట్లాగో గడపవచ్చును. కాని, అజ్ఞాతవాసాన్ని ఒకరోజు కూడా గడపలేం. ఎందువల్లనంటే- నిన్నూ నీ తమ్ములను ఎరుగనివారు లేరు. మనం రహస్యంగా ఉండటం అంటే మేరుపర్వతాన్ని దాచటం వంటిది. అది అసాధ్యం. అందువలన మనకు ఈ వనవాసం ఎప్పుడూ తప్పదు. కాబట్టి ఇప్పు డొక ధర్మాంతరాన్ని పాటిద్దాం. లోకంలో సంవత్సరానికి ప్రతినిధిగా మాసాన్ని గ్రహించే పరిపాటి ఉన్నది. కాబట్టి మనం ఇప్పటికి పదమూడు నెలల అరణ్యవాసం చేశాం. దీనిని పదమూడేళ్ళుగా గణించటం ధర్మవిరోధం కాదు. కాబట్టి విజయారంభానికి ఇది తగిన సమయం.

ధర్మరాజు : భీమసేనా! నీవు పాండిత్యంలోనూ, పరాక్రమంలోనూ, గర్వంలోనూ మంచి దిట్టవు. నీవు చెప్పింది చేయతగిందే. అయినా నామాట కూడా వినుము. స్వల్పమైన ఉపాయంతో సాధించే పనిని సాహసంతో చేసినా తప్పు లేదు. కాని, మహాకార్యం సాహసంతో సాధ్యం కాదు. దానిని బాగా ఆలోచించి చేయాలి. అట్లా చేస్తే దైవంకూడా తోడ్పడతాడు. ఆ పక్షంలో ఉన్న దుర్యోధనాదులు శూరులు. కర్ణుడు, భూరిశ్రవసుడు, మద్రభూపతి మొదలైనవారు జయించటం సులభంకాని పరాక్రమం కలవారు. మనచేత ఇదివరలో ఓడించబడిన రాజులందరూ ఇప్పుడు దుర్యోధనుడిచేత సత్కరించబడి అతడివైపే చేరి యుద్ధం చేయనున్నారు. వారుకూడా అస్త్ర శస్త్ర విద్యాకోవిదులు. వారందరూ ఒక ఎత్తు. కర్ణుడు ఒక్కడూ ఒక యెత్తు. అతడు అభేద్యకవచుడు. అతడి విలువిద్యను, బాహుపరాక్రమాన్నీ

తలచుకొన్ననాడు నాకు నిద్ర పట్టదు. ఇంక భీష్మ ద్రోణ కృపాచార్యులు ఉభయులపట్ల సమదృష్టి కలవారైనా వారిపక్షాన్నే ఉన్నారు. వారు అపార దివ్యాస్త్ర విశారదులు. వారలను జయించిన తరువాత కదా దుర్యోధనుడిని ఓడించటం. ఇదే అసలు సమస్య - అని ధర్మరాజు కార్యసాధనం కొరకు గాఢంగా విచారిస్తున్నాడు.

## పాశుపతాస్త్ర సంపాదనం :

ధర్మరాజుచింతను తెలిసికొని వేదవ్యాసుడు ప్రసన్నుడైనాడు. ధర్మరాజుకు 'ప్రతిస్మృతి' అనే విద్యను బోధించి దానిని అర్జునుడికి ఇస్తే తపోవీర్య విభవంతో దేవతలనుండి మహాస్త్రాలను సంపాదించగలడని సూచించాడు. ఆ తరువాత పాండవులు అక్కడినుండి కామ్యకవనం చేరి సరస్వతీ నదీతీరంలో నివసించసాగారు.

ధర్మరాజు అర్జునుడికి ప్రతిస్మృతివిద్యను బోధించాడు. దానితో అతడు తేజోవంతుడైనాడు. దివ్యాస్త్రసంపాదన కొరకు పార్థుడు తపస్సుకు పూనుకొన్నాడు. ఇంద్రకీల పర్వతంమీదకు చేరి ఇంద్రుడి ఆనతితో పాశపతాస్త్రాన్ని పొందటానికి పరమేశ్వరుడిని గురించి తపస్సు చేశాడు. పార్థుడి ఘోరతపస్సుకు పరమేశ్వరుడు మెచ్చి, పరీక్షించి వర మిద్దామని కిరాతవేషంతో దిగివచ్చాడు. ఆ దేవదేవుడి వెంట పార్వతి. ప్రమథగణం, వారిభార్యలు కిరాతవేషాలతో వచ్చి పరమేశ్వరసేవలో నిలిచారు. పరమేశ్వరుడు పార్థుడి పరాక్రమాన్ని పరీక్షించటానికి ఒక దివ్యవ్యూహం పన్నాడు. దాని కనుకూలంగా మూకుడనే రాక్షసుడు అర్జునుడిని చంపాలని అడవిపంది ఆకారంలో పరుగెత్తుతూ వచ్చాడు. ఒకవైపునుండి పార్థుడూ, మరొకవైపునుండి పరమేశ్వరుడూ ఒకేసారి బాణాలు వేశారు. అవి రెండూ ఒకేసారి పందికి గ్రుచ్చుకొన్నాయి. పంది పడిపోయింది. మూకుడు నిజాకారాన్ని పొంది అంతర్ధానం చెందాడు. కిరీటి ఎదుట కిరాతవేషధారి అయిన పరమేశ్వరుడు కనపడ్డాడు. ఇరువురూ వీరాలాపాలు ఆడుకొన్నారు. అడవిపందిని చంపటంపై వివాదం పెంచుకొన్నారు. బాణాలు గుప్పుకొన్నారు. ఎరుకువాడి బాణాల ధాటికి అర్జునుడు ఆశ్చర్యపోయి, మారురూపంలో వచ్చిన ఏ దేవుడో అని భావించాడు. తనవద్ద నున్న అస్త్రశస్త్రాలన్నిటినీ ప్రయోగించాడు. పరమశివుడు తనదివ్యమాయతో వాటి నన్నింటినీ వమ్ముచేశాడు. అంతేకాక, అర్జునుడికి అగ్నిదేవు డిచ్చిన అక్షయతూణీర ద్వయాన్ని ఓటుపడేటట్లు చేసి వాటిని అదృశ్యం చేశాడు. అర్జునుడికి ఆశ్చర్యం వేసింది. గత్యంతరం లేక గాండీవంతో కిరాతుడి మీదికి లంఘించాడు. ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయి. ముష్టియుద్ధానికి తలపడ్డాడు- పార్థుడు. పరమేశ్వరుడు గట్టిగా చరిచాడు. నరుడు మూర్ఛపోయాడు. శివుడు ప్రత్యక్షమై కరుణతో పార్థుడికి పాశుపతాస్త్రాన్ని ప్రసాదించాడు. దానికి అసాధ్యమనేది లేదనీ, అల్పులమీద ప్రయోగిస్తే జగత్ప్రళయం కలిగిస్తుందనీ హెచ్చరిక చేశాడు. అక్షయ తూణీరాలను అనుగ్రహించాడు. పాశుపతాస్త్రంతో సమస్త లోకాలను జయించగలవని చెప్పి పరమేశ్వరుడు అంతర్ధానమైనాడు.

## ఇంద్రుడి వరాలు - ఊర్వశి శాపం :

పాశుపతాస్త్రం పొందిన అర్జునుడి ఎదుట ఇంద్రుడు దేవగణాలతో కలిసి వచ్చి ప్రత్యక్షమైనాడు. దేవతలందరూ పార్థుడిని అభినందించి, తమతమ దివ్యాస్త్రాలను ప్రసాదించి అదృశ్యు లయ్యారు. దేవేంద్రుడు తన రథాన్ని పంపి అర్జునుడిని అమరావతికి రప్పించుకొన్నాడు. అక్కడి భోగభాగ్యాలను చూపించాడు. తనతోపాటు సగంగద్దెమీద సవ్యసాచిని కూర్చుండబెట్టుకొని గౌరవించాడు. ఒక నరుడికి భౌతిక శరీరంతో స్వర్గంలో అటువంటి గౌరవం జరగటం అపూర్వం.

ఒకనాటి రాత్రి వెన్నెలవేళ ఊర్వశి అర్జునుడిపై మరులుగొని అతడిని సమీపించి తన మనసు బైట పెట్టింది. కాని, అర్జునుడు ఆమెయందు మాతృభావాన్ని ప్రకటించి నమస్కరించాడు. దేవవనితలకు వావివరుస లుండవని ఆమె ఎన్నోవిధాల మదనోద్దీపకంగా మాట్లాడింది. అతడు చలించలేదు. ఆమె విసిగి తనకోర్కె ఫలించలేదని కోపించి, అర్జునుడు నపుంసకుడై ఆడువారి మధ్య మసలేటట్లు దారుణంగా శపించింది. మరునాడు ఆసంగతి తెలిసికొని దేవేంద్రుడు అర్జునుడి ధర్మశీలాన్ని మెచ్చుకొని, అభినందించాడు. ఊర్వశిశాపంవలన కలిగే షండరూపం అజ్ఞాతవాస సంవత్సర కాలం మాత్రమే ఉంటుందని వరమిచ్చి, వివిధ దివ్యాస్త్రాలను అతడికి ప్రసాదించాడు. అయిదేళ్ళ కాలం అర్జునుడికి గీతవాద్యనృత్యాలను దేవేంద్రుడు సురలోకంలో నేర్పించాడు. ఆవిధంగా ఊర్వశిశాపం అజ్ఞాతవాస వ్రతంలో అర్జునుడికి వరంగా పరిణమించింది.

ఒకనాడు రోమశుడు దేవేంద్రలోకానికి వెళ్ళాడు. దేవేంద్రుడితోపాటు అర్ధసింహాసనారూఢుడైన అర్జునుడిని చూచి ఆశ్చర్యపోయాడు. దేవేంద్రుడు చెప్పగా - నరుడనే మహర్షి పార్థుడుగా పుట్టాడనీ, పాశుపతాస్త్రం పొందిన నరుడు అర్జునుడే అని తెలిసికొన్నాడు. ఆ అస్త్రంతో దేవతల విరోధులైన రాక్షసులను సంహరించి సురలోకానికి మేలు చేయనున్నాడని దేవేంద్రుడు చెప్పగా విన్నాడు. ఆ తరువాత ఇంద్రుడు రోమశుడిని ధర్మరాజు వద్దకు పంపి అర్జునుడు దేవహితార్థమై సురలోకంలో ఉన్నాడనీ, పాశుపతాస్త్ర ప్రభావంతో రాబోయే యుద్ధంలో భీష్మద్రోణకర్ణాది వీరులను సంహరించగలడనీ, పార్థుడు తిరిగి వచ్చేంతవరకు ధర్మరాజును తమ్ములతో కలిసి తీర్థయాత్రలు చేయుమనీ సందేశం పంపాడు. రోమశుడిని ఆ తీర్థయాత్రలలో సహాయపడుమని దేవేంద్రుడు నిర్దేశించాడు.

పాండవులు వనంలో పార్థుడి రాకకొరకు పరితపించి పోతున్నారు. అప్పుడు భీముడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: 'అర్జునుడు సంపాదించిన దివ్యాస్త్రాలతో ధరణీరాజ్యాన్ని తిరిగి పొందుదామని అనుకొంటున్నాం. అతడి రాక ఎందుకో ఆలస్యమయింది. జనార్దనుడిని పంపి అతడిని త్వరగా రప్పించటం మంచిది. అతడు తిరిగివస్తే మేమంతా కలిసి హస్తినాపురం మీద దండెత్తి, శత్రువులను పరిమార్చి రాజ్యాన్ని ఆక్రమిస్తాం. నీకు సత్యవ్రతభంగ మౌతుందనే భయం ఉంటే పదమూడేళ్ళు అరణ్య, అజ్ఞాతవాసాలు ముగించుకొని వచ్చి రాజ్యపట్టాభిషేకం చేయించుకొమ్ము. మాయాద్యూతంతో మనలను మోసగించిన దుర్యోధనుడు రాజ్యంలో కుదురుకొనక పూర్వమే అతడిని దూషిస్తాం. వంచనపరులను వంచనతో సాధించటమే సముచితం. అదే రాజధర్మం' అని ఆవేశంతో భీమసేనుడు పలికాడు.

ధర్మరాజు భీముడిని ప్రేమతో కౌగలించుకొని శిరస్సు ముద్దు పెట్టుకొన్నాడు. అగ్నికి వాయువు తోడైనట్లు అర్జునుడికి భీముడు తోడైతే యుద్ధంలో ఎవరు నిలువగలరు? అయితే, ఆ యుద్ధం పదమూడేళ్ళు తరువాత జరగాలనీ, అందులో భీమార్జునులే విజయ కారకులు కావాలనీ ఆకాంక్షిస్తూ భీముడి కోపాన్ని ఉపశమింప చేశాడు- ధర్మరాజు.

ఇక హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు పరమేశ్వరుడివలన పార్థుడు పాశుపతాస్త్రాన్ని పొందిన వృత్తాంతాన్ని పారాశర్యుడు చెప్పగా విని పరమవ్యాకుల చిత్తుడై పరితపించాడు. భీముడు కిమ్మీరుడిని చంపిన వార్త విని మనసులో కటకట పడ్డాడు. రాబోయే యుద్ధంలో శ్రీకృష్ణార్జునులు నిర్వహించే మహనీయపాత్రను విదురుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు నిరుత్తరుడైనాడు.

**నలోపాఖ్యానం :**

ధర్మరాజు వద్దకు బృహదశ్వుడనే ముని వచ్చాడు. అతడికి పాండవులు అతిథి సత్కారాలు చేసి, విశ్రాంతి కల్పించారు. అ ఋషితో ధర్మరాజు- కౌరవులు తమకు చేసిన అన్యాయాలనన్నింటిని చెప్పాడు. 'మునీంద్రా! దేశాన్నీ, రాజ్యాన్నీ, బంధువులనూ విడిచి అడవులలో మృగాలతో కలిసి మావలె కష్ట పడిన రాజు లెవరైనా ఉన్నారా?' అని ఆ మునీంద్రుడిని అడిగాడు. బృహదశ్వుడు నలమహారాజుకథ చెప్పాడు. అతడు కూడా జూదమాడి పుష్కరుడిచేతిలో ఓడిపోయి, ఒక్కడే కానలలో ఎన్నోకష్టాలు పడ్డాడు. ఆ సామ్యంతో నలుడిచరిత్రను చెప్పాడు.

వీరసేనుడి కొడుకైన నలుడు నిషధరాజు. అనేక అక్షౌహిణుల సైన్యంతో రాజుల నందరినీ జయించిన చక్రవర్తి. అతడికి జూదమంటే ప్రీతి. అయినా, బ్రహ్మణ్యుడయి బ్రహ్మోత్తరంగా ప్రజాపాలనం చేస్తున్నాడు. విదర్భాధీశుడైన భీముడికి దమయంతి అనే అపూర్వ సౌందర్యవతి కూతురు. ఆమె నలుడి గుణగణాలను విని అతడిపై వలపుపెంచుకొన్నది. నలుడు ఆమె గుణగణాలను విని అనురక్తుడైనాడు.

ఒకనాడు నలుడు దమయంతిని స్మరిస్తూ ఉద్యావనంలో విహరిస్తుండగా ఆకాశంలో నుండి అంచలగుంపు సమీపంలో వాలింది. నలుడు వాటిని పట్టుకొనబోయి ఒకహంసను చిక్కించుకొన్నాడు. పట్టుబడిన హంసను వదలలేక మిగిలినవి ఆకసంలో తెల్లమబ్బులవలె తిరుగుతూనే ఉన్నాయి. అప్పుడా హంస మనుష్య వాక్కులతో ఇట్లా అన్నది. 'అయ్యా! నీకు నేను మేలు

చేస్తాను. నీ ప్రియురాలైన దమయంతి వద్దకు పోయి, నీ గుణాలు ఆమెకు వర్ణించిచెప్పి, ఆమె మరెవ్వరినీ మనసులో కోరకుండా నీయందే అనురాగబద్ధురాలయ్యేటట్లు చేస్తాను' అని అన్నది. ఆ మాటలు విని నలుడు ఆ హంసను వదలిపెట్టాడు.

ఆ హంస తనగుంపుతో కలిసి విదర్భకు పోయింది. అంతఃపురోద్యానవనంలో దిగింది. దమయంతికి కావాలని తనంతట తానే పట్టుబడింది. నలుడినిగురించి వర్ణించి దమయంతికి చెప్పింది. తాను చూచిన రాజులందరిలో ఆతడే సర్వగుణ సుందరుడని కీర్తించింది. దమయంతి కున్న రూపకాంతి వైభవాలు నలుడిని పొందినప్పుడే సార్థకమౌతాయని చెప్పింది. దమయంతి నారీరత్నమనీ, నలుడు పురుషరత్నమనీ పేర్కొని వారిద్దరి సమాగమం పరస్పరశోభాకరమని ప్రశంసించింది. హంసమాటలకు దమయంతి సంతోషించింది. తననుగురించి కూడా నలుడికి అదే విధంగా తెలియజెప్పమని కోరింది. ఆ హంస నిషధకు తిరిగి వెళ్ళి, నలుడికి దమయంతి రూపలావణ్యవైభవాలనుగురించి వర్ణించి చెప్పింది. ఆ విధంగా నలదమయంతు లిద్దరూ అనురక్తులై మదనవిరహాన్ని అనుభవిస్తూ పొద్దుపోని పగళ్ళూ రాత్రుళ్ళూ గడిపేవారు. విరహతాపోపశమనానికి నందనోద్యానాలలో తిరిగేవారు. తామరాకులలో, తామర తూండ్లో కప్పుకొనేవారు. చిగురాకుపాన్పులపై పవళించేవారు. నీటి ధారలతో, గంధపుపూతలతో శైత్యోపచారాలు చేసికొనేవారు.

దమయంతి విరహతాపాన్ని గురించి చెలికత్తెలు చెప్పగా విని, ఆమె తండ్రి భీమరాజు నలమహారాజుకు తనకూతురు నిచ్చే ఉపాయాన్ని ఆలోచించి స్వయంవరం చాటబంచాడు. భూతలం మీది రాజులందరూ ఆ స్వయంవరానికి తరలి వచ్చారు. ఆ సంగతి ఇంద్రుడు నారదుడివలన తెలిసికొని దిక్పాలకసహితంగా తానూ విదర్భకు బయలుదేరి వస్తున్నాడు. మార్గమధ్యంలో నలమహారాజును కనుగొన్నాడు. దమయంతి తమలో ఒకరిని వివాహం చేసికొనేటట్లు ఆమెవద్దకు తమదూతగా వెళ్ళుమని అడిగాడు. దానివలన దేవహితం సాధించబడుతుందని చెప్పాడు. దేవేంద్రుడిమాట కాదనలేక నలు డందుకు అంగీకరించాడు. సురక్షితమైన అంతఃపురంలో ప్రవేశించటానికి వీలుగా దేవేంద్రుడు నలుడికి తిరస్కరిణీ విద్యను ప్రసాదించాడు. నలుడు దమయంతిని ఆమె అంతఃపురంలోకి పోయి చూచాడు. ఆమె సౌందర్యాన్ని చూచి మన్మథ వశుడైనాడు. నలుడు దమయంతికి దర్శనమిచ్చాడు. ఆతడి రూపం దమయంతికి మన్మథావేశాన్ని కలిగించింది. కాని, ఆత డెవరో తెలియదు. దమయంతి ఆతడి గురించిన వివరాలను తెలిసికొనాలని అడిగింది.

నలుడు : నేను దేవదూతను. నాపేరు నలుడు. దిక్పాలకులు నిన్ను ప్రీతితో చూడటానికి వచ్చారు. స్వయంవరంలో వారిలో ఒకరిని వలచి వరించటానికై నాతో ముందుగానే రాయబారం పంపారు. వారి కోర్కెను నీవు తీర్చాలి.

దమయంతి: మీ మాటలు వింటూంటే నాకు దుఃఖం కలుగుతున్నది. నే నెక్కడ? ఇంద్రాదు లెక్కడ? నీ గుణగణాలను హంసవలన విని నిన్నే నామనసులో నిలిపాను. నీ కొరకే ఈ స్వయంవర సన్నాహం. కాబట్టి నీవు నాయందు కరుణించి నా భర్తవుగా అనుగ్రహించుము. నీవు అంగీకరించకపోతే ఏదోవిధంగా చనిపోతాను.

నలుడు : నిన్ను దేవతలే కోరుతున్నారు. నేను వారి కాలిదుమ్ముకు కూడా సరిపోను. దేవత లుండగా మనిషిని నన్ను కోరటం దేనికి? దేవతలకు ప్రియం చేయకపోతే వారు నాకు బాధలు కలిగిస్తారు. కాబట్టి నన్ను ఆ ఆపదనుండి రక్షించుము.

దమయంతి: నే నొక ఉపాయం కనుగొన్నాను. ఇంద్రాదులు రేపు స్వయంవరానికి వస్తే వారి యెదుటనే నిన్ను వరిస్తాను. అప్పుడు నీకు దోషం ఉండదు.

నలుడు తిరిగి వెళ్ళి దిక్పాలకులకు జరిగినదంతా చెప్పాడు. స్వయంవరసభలో ఇంద్రాదులు నలుగురూ నలరూపధారులై ఉన్నారు. దమయంతికి నిజ నలు డెవరో తెలియటం కష్టమైపోయింది. అప్పు డామె దేవతలను ప్రార్థించింది. వారు ఆమెప్రార్థనకు కరుణించి కనురెప్పపాటు లేని, చెమటపట్టని, అడుగులు నేల కానని తమ దేవతా రూపాలను తెలిసేటట్లు చేశారు. దమయంతి కల్యాణకుసుమమాలను నలుడి మెడలో వేసింది. దేవతలు మెచ్చారు. విప్రులు ఆశీర్వదించారు. నలదమయంతుల వివాహం వైభవంగా జరిగింది. ఇంద్రాది దిక్పాలకులు నలుడికి వరాలనిచ్చి నిజలోకానికి బయలుదేరి వెళ్ళసాగారు.

దారిలో వారికి కలి ఎదురుపడ్డాడు. అతడు కూడా దమయంతీ స్వయంవరానికే వస్తున్నాడు. కాని, ఆమె నలుడిని వరించిందనిన వర్తమానాన్ని ఇంద్రాదులవలన విని కోపించాడు. 'ఆ నలదమయంతులకు రాజ్యవైభవం దూరం చేస్తాను. వారిద్దరికీ వియోగం కలిగిస్తాను'- అని నిశ్చయించుకొని, నలుడు ద్యూతప్రియుడని తెలిసి పాచికలలో ప్రవేశించి నిలిచాడు.

నలుడు నిష్ఠాగరిష్ఠుడు. ఏసందర్భంలోనైనా అశౌచం కలిగితే అందులో ప్రవేశించడానికి కలి ప్రయత్నించాడు. ఒకనాడు నలుడు మూత్రవిసర్జనం తరువాత ఆచమించి కాళ్ళుకడుక్కోలేదు. ఆ అశౌచాన్ని ఆలంబనంగా చేసికొని నలుడి శరీరంలో కలి ప్రవేశించాడు.

కలి పుష్కరుడిని ప్రేరేపించాడు. నలుడితో జూద మాడించాడు. ఆ జూదంలో మైమరచి నలుడు సర్వస్వాన్నీ క్రమక్రమంగా ఓడిపోయాడు. అంతకుముందే దమయంతి తన కుమారుడైన ఇంద్రసేనుడిని, ఇంద్రసేన అనే కూతురిని వార్ష్ణేయుడనే సారథితో రథంమీద విదర్భలోని తన తండ్రివద్దకు పంపింది. నలుడు సర్వస్వం కోల్పోయి భార్యాసహితుడై నగరం వెడలి బయట నివసించాడు. పుష్కరుడి శాసనం వలన ప్రజలెవ్వరూ నలదమయంతుల కెటువంటి సహాయం చేయలేదు. నలదమయంతులు మూడునాళ్ళునీళ్ళు త్రాగి గడిపారు. మరునాడు ఆకలిబాధకు ఓర్వలేక నలుడు తమ ప్రక్కన తిరుగుతున్న బంగారు రెక్కల పక్షులను పట్టుకొని తినాలనే కోరికతో తన కట్టుపుట్టాన్ని వాటిపై విసిరాడు. ఆ పక్షులు ఆ గుడ్డతో సహా గగనానికి ఎగిరిపోయాయి. పోతూ, తాము పాచికలమనీ, రాజ్యాన్నే కాక, వస్త్రాన్ని కూడా అపహరించటానికి పక్షుల రూపంలో వచ్చామనీ చెప్పి ఎగిరిపోయాయి. నలుడు ఆశ్చర్యపడ్డాడు; దమయంతి చీరచెరగును చుట్టుకొన్నాడు. ఆ విధంగా దంపతులిద్దరూ ఒకే చీరతో సాగిపోవలసి వచ్చింది.

నలదమయంతులు నాలుగు బాటల కూడలికి చేరారు. ఒకబాట దక్షిణాపథం పోతుంది. మరొకటి విదర్భకు చేరుతుంది. ఇంకొకటి కోసలకు వెళ్ళుతుంది. చివరిది ఉజ్జయినికి తీసికొనిపోతుంది. ఏ బాటలో పోవాలి? అన్నప్రశ్న వచ్చింది. దమయంతి తన పుట్టినిల్లు విదర్భకు పోదామన్నది. నలుడు అడవులకు పోదామన్నాడు. ఎందుకంటే అత్తవారింట - పూలమ్మిన చోట కట్టెలమ్మినట్లుంటుందని నలుడు విదర్భకు చేరటం అవమానంగా భావించాడు. భార్యను విదర్భకు పొమ్మన్నాడు. కాని, దమయంతి నలుడివెంట నడవటానికే కోరుకొన్నది. 'అధికరోగదుఃఖార్తుడికి ఔషధం ఎటువంటిదో ఆపదలలో ఉన్న భర్తకు భార్య అటువంటిది. పురుషుడికి అన్ని దుఃఖాలను పోగొట్టేది భార్య' - అని చెప్పి నలుడిని అనుసరించటానికి అనుమతి కోరింది. ఆమె నెట్టి పరిస్థితులలోనూ వదలిపెట్టనని నలుడు మాటిచ్చాడు.

దంపతు లిద్దలూ ఏకవస్త్రంతో బయలు దేరారు. అడవిమార్గంలో వనమధ్యంలో ఒక వసతిని చూచారు. ధూళితో నిండి ఉన్న ఆ సభలో అలసిసొలసి విశ్రమించారు. మార్గాయాసంవలన దమయంతి ఒడలు మరచి నిదురపోయింది. ఆ మహారాణి పొందిన ఆ దీనావస్థను చూచి నలుడు దుఃఖించాడు. ఆమె నా దీనస్థితిలో చూడలేక ఆమె చీరలో సగం చించుకొని ఆమెనుండి విడివడి, వీడలేక వీడలేక, కలిప్రభావంతో దయారహితుడై, దూరంగా వెళ్ళిపోయాడు.

దమయంతి నిద్ర మేల్కొన్నది. చినిగిన చీరను, భర్త తనప్రక్కనే లేకపోవటాన్నీ గమనించి, నాలుగు దిక్కులా భర్తకొరకు వెదకి పలురకాలుగా ఆక్రందించి, నలుడిని వెదకుతూ ఒంటిగా బయలుదేరింది. తనను ఎట్టి పరిస్థితులలో విడువనని మాట ఇచ్చిన నలుడు తనమాట నిలబెట్టుకొనాలని ఎలుగెత్తి భర్తకొరకు పిలిచింది. గహనమైన వనమార్గంలో భయంతో నడిచింది. ఒకచోట ఒకకొండచిలువ దమయంతిని పట్టి మ్రింగబోయింది. ఆమె తనను రక్షించుమని నలుడిని పెద్దగా పిలిచింది. ఆ సమీపంలో తిరుగుతున్న ఒక ఎరుకులరేడు ఆమె ఆర్తనాదం విని కొండచిలువనోరు చీల్చి దాని మేనును ముక్కలు చేసి రాహువు నుండి చంద్రుడిని విముక్తుడిని చేసినట్లు దమయంతిని ఆ పాము నుండి రక్షించాడు. ఆమె వృత్తాంతాన్నంతా అడిగి తెలిసికొన్నాడు. ఆమెను సమీప సరోవరంలో స్నానం చేయుమన్నాడు. తడిసిన మేనితో ఉన్న దమయంతి సౌందర్యాన్ని చూచి కామించి తనకోర్కెను బైట పెట్టాడు. పతివ్రత అయిన దమయంతి కోపంతో చూచింది. ఆమె వేడిచూపుకు- అగ్నిజ్వాలలకు గురి అయిన చెట్టువలె- ఆ బోయవాడు నిలువున కాలిపోయాడు. ఆమె పాతివ్రత్య మహత్త్వ మటువంటిది.

దమయంతి భయంకరారణ్యంలో కొంతదూరం పోయి మహాత్ములైన మునులు నివసించే ఒక ఆశ్రమాన్ని చూచింది. తనను గురించి చెప్పుకొని నలుడిని గురించి వారి నడిగింది. నలుడు కనిపించకపోతే కొద్ది దినాలలో చనిపోతానని వాపోయింది. అప్పుడు మునులు దివ్యదృష్టితో గమనించి కొద్దిరోజులలో నలుడిని పూర్వ వైభవంతో చూడగలవని ఓదార్చి వారందరూ ఆశ్రమంతో సహా అదృశ్యమైపోయారు. దమయంతి ఆశ్చర్యపడింది.

అప్పు డడవిలో దమయంతికి ఒక వర్తకుల బిడారు కనపడింది. ఆమె ఆ సార్థవాహుడైన శుచి అనే వాడిని కలిసి నలుడి గురించి ప్రశ్నించింది. అతడు నలుడిని చూడలేదన్నాడు. ఆమెను సుబాహుడి పురానికి తమతోపాటు తీసికొని పోవటానికి అంగీకరించాడు. దారి మధ్యలో సార్థవాహం ఒకరాత్రి ఒక పెద్ద చెరువువద్ద విశ్రాంతి తీసికొన్నది. నడిరేయి ఆ అడవిలోనుండి ఏనుగులు నీటికొరకు చెరువు వద్దకు వచ్చి శయనించి ఉన్న జనాన్ని త్రొక్కాయి. చాలమంది చనిపోయారు. ఆ ఆపదను చూచి దమయంతి తనకు చావు రాలేదని వాపోయింది. అలనాడు దేవతలను కాదని నలుడిని స్వయంవరంలో గ్రహించినందుకు వారే కోపించి అటువంటి ఇక్కట్టులను కలిగిస్తున్నారని భావించింది. చావగా మిగిలినవారితో కలసి దమయంతి సుబాహునగరం చేరింది. రాజమార్గంలో నడుస్తున్న దమయంతిని రాజమాత చూచింది. ఆమెరూపవైభవాన్ని గమనించి మెచ్చి ఆమెను పిలిపించుకొని తనవద్ద సైరంధ్రిగా ఉంచుకొన్నది. దమయంతి సైరంధ్రిగా ఉన్నప్పటికీ దాసివలె ఉచ్ఛిష్టం తినలేదు. రాణిపాదాలను పిసుకలేదు. పరపురుషులతో మాట్లాడలేదు. నలుడిని అన్వేషించబోయే బ్రాహ్మణులతో మాత్రం పలికేది. ఆ నియమాలకు రాజమాత అంగీకరించింది. రాణి తన కూతురైన సునందను దమయంతి రక్షలో ఉంచింది. సైరంధ్రిగా ఉన్నా, దమయంతి భర్తృవియోగ దుఃఖం అనుభవిస్తూ కూడా పుణ్యవ్రతాలు చేస్తూ ఉండేది.

ఇక నలుడి సంగతి తెలిసి కొందాం. అలనాడు దమయంతిని ఏకాంతంగా అడవిలో వదలి బయలుదేరిన నలుడు కొంతదూరం పోయేసరికి తీవ్ర దావానలాన్ని ఎదుర్కొన్నాడు. ఆ మంటల మధ్యలో కర్కోటకుడనే నాగకుమారుడు చిక్కుకొని నలుడిని రక్షించుమని ఎలుగెత్తి పిలిచాడు. తనను రక్షిస్తే అతడికి ఒక హితం చేస్తానని పేర్కొన్నాడు. ఎత్తుకొని పోవటానికి వీలుగా బొటనవ్రేలంత పొట్టివాడై నిలిచాడు. నలుడు సాహసంతో ఆ మంటల మధ్య నున్న కర్కోటకుడిని తప్పించి భుజంమీద పెట్టుకొని మోసికొనిపోయి సమీప సరోవరం వద్దకు చేరి దింపబోయాడు. ఆ పాము మరొక పదిఅడుగులు వేసి దింపుమని కోరాడు. అట్లాగే వెళ్ళుతూ ఉండగా పదవ అడుగు వేస్తుండగా కర్కోటకుడు నలుడిని కాటు వేశాడు. నలుడు వికృతరూపాన్ని పొందాడు. అప్పుడు కర్కోటకుడు ఇట్లా అన్నాడు:

'అయ్యా! నీవు నాచేత విషపీడితుడవైనావని విచారించకుము. ఈ వికార రూపంలో ఉన్న నిన్ను ఎవ్వరూ తెలిసికొనలేరు. అందువలన నీకు శత్రుభయం ఉండదు. విషోరగ రాక్షసపిశాచాదుల భయంకూడా ఉండదు. నీకు సర్వరాజ్యం తిరిగి లభిస్తుంది. మరల భార్యతో కలిసి సుఖంగా ఉంటావు. నీ కెప్పుడు నీ నిజరూపం కావాలని ఇష్టం కలిగితే అప్పుడు నన్ను స్మరించుము. నే నొక వస్త్రాన్ని నీవద్దకు పంపుతాను. దానిని ధరించుము. నీరూపం నీకు వస్తుంది. ఇది నా వరం. నీవు ఇక్ష్వాకువంశజుడు, అయోధ్యాధిపతి అయిన ఋతుపర్ణ మహారాజును సేవించుము. అతడికి నీవు నీవద్దనున్న 'అశ్వహృదయ', విద్యను ఇమ్ము. అతడివలన 'అక్షహృదయ' మనే విద్యను స్వీకరించుము. ఆ రాజువద్ద నీవు బాహుకుడనే పేరుతో రథాన్ని నడిపే సూతుడిగా, వంటలవాడిగా కొలువుండుము' అని హితోపదేశం చేసి అదృశ్యుడయ్యాడు.

కర్కోటకుడి హితవు ప్రకారం నలుడు బాహుకుడనే పేరుతో ఋతుపర్ణుడిని సేవిస్తూ అయోధ్యలో అశ్వాధ్యక్షుడుగా ఉంటున్నాడు. అతడికి సహాయకులుగా వార్ష్ణేయుడు, జీవలుడు నియోగించబడ్డారు. ఒకనాడు బాహుకుడు తన భార్యను స్మరిస్తూ విరహవేదనతో నిట్టూర్పులు నిగుడిస్తూ ఉండటం జీవలుడు గమనించాడు. అంతటి వికారశరీరుడిని కూడా ప్రేమించే ప్రియురాలు ఉంటుందా? ఉంటే ఆమెంత కురూపియో? అంటూ అనుమానిస్తూనే బాహుకుడిని అతడి భార్యనుగురించి, వారి వియోగ కారణాన్ని గురించి అడిగాడు. బాహుకుడు 'నా వంటివాడికి ఇల్లా లేమిటి? నన్ను చూచి అందరూ నవ్వుతారు. మందప్రజ్ఞుడనే భటుడొకడు తన ప్రియురాలికి దూరమై విరహాన్ని అనుభవించేవాడు. అతడిమాటలు జ్ఞాపకం వచ్చి నేను అనుకరిస్తున్నా; నంతే' అని అసలు సంగతి బైట పెట్టకుండా దాటవేశాడు.

ఇక, విదర్భలో భీమమహారాజు నలుడు రాజ్యభ్రష్టుడైనాడనీ, భార్యతో కలిసి ఎక్కడికో వెళ్ళాడనీ తెలిసి, నలదమయంతులను వెదకి తీసికొని రావటానికై నిపుణులైన బ్రాహ్మణులను నియోగించాడు. వారు భూవలయంలో ఉన్న రాజ్యాలన్నీ దర్శించి అన్వేషిస్తున్నారు. వారిలో సుదేవుడనే విప్రుడు సుబాహునగరానికి వెళ్ళాడు. పురోహిత బ్రాహ్మణులతో కలసి అంతఃపురంలో ప్రవేశించి, పుణ్యాహవాచన పుణ్య సమయంలో సునందతో కూడి ఉన్న దమయంతిని చూచాడు. ఆమె పొగబారిన అగ్నిజ్వాలవలె, నల్లమబ్బులు క్రమ్ముకొన్న చంద్రరేఖవలె ఉండటం గమనించాడు. ఆమె నుదుట సూక్ష్మమైన లక్షణాన్ని గుర్తించాడు. దమయంతిగా నిశ్చయించుకొని ఆమెతో ఇట్లా అన్నాడు: 'అమ్మా! నీ తల్లిదండ్రులు, కొడుకు, కూతురు, బంధువులు, అందరూ క్షేమంగా ఉన్నారు. వారందరు నీ క్షేమం తెలియనందుకు దిగులుపడుతున్నారు. ఇకమీద వారి చింత తొలగిపోతుంది. నేను నీ అన్నగారి స్నేహితుడిని. సుదేవుడిని. మీతండ్రిగారు మీదంపతుల ఉనికి తెలిసికొనటానికి ఎందరో విప్రులను నలుదిక్కులకు పంపారు. నా అదృష్టంవలన నిన్ను నేను చూడగలిగాను'. సుదేవుడి మాటలు విని తనవారినందరిని పేరుపేరున కుశలమడిగి దుఃఖం ఆపుకొన లేక, కన్నీరు ధారలు కట్టేటట్లుగా ఏడ్చింది. ఆ సంగతి గమనించి సునంద రాజమాతకు చెప్పింది. ఆమె దమయంతి వద్దకు వచ్చి జరిగింది తెలిసికొని దమయంతిని ఎట్లా గుర్తించగలిగావో చెప్పుమని సుదేవుడిని అడిగింది. అతడు తనరాకకు కారణం చెప్పి, దమయంతి కనుబొమల నడుమ పద్మకాంతితో మహిమాన్వితమైన ఒక పుణ్యసంకేతం (పద్మప్రభమైన పుట్టుమచ్చ) దుమ్ముచేత కప్పబడి ఉన్నా నేను దానిని గుర్తించి ఈమెను దమయంతిగా తెలిసికొన్నానని పేర్కొన్నాడు. రాజమాత మంచినీరు తెప్పించి దమయంతి ముఖాన్ని కడిగించి ఆ గుర్తును చూచి ఆశ్చర్యానందాలతో ఇట్లా అన్నది:

'తల్లీ! నీవూ నా కూతురివేనే. నీ తల్లీ, నేనూ దశార్ణరాజపుత్రికలం. మీ అమ్మ విదర్భరాజుకు రాణి అయింది. నేను ఈ చేదిపురాధిపతి పత్ని నయ్యాను' అనగానే దమయంతి రాజమాతకు వినయంతో నమస్కరించింది. రాజమాత దమయంతిని కౌగిలించుకొని గౌరవించింది. కొన్నాళ్ళ తరువాత దమయంతి విదర్భకు వెళ్ళి తల్లిదండ్రులతో, బంధువులతో కలిసి ఉన్నది. అయినా ఆమె ఆనాడు నలుడు తనను వీడినప్పుడు కట్టిన మాసిన చీరనే కట్టింది. దేహసౌఖ్యాలను కోరకుండా నేలపై శయనిస్తూ, ధూళిధూసరితగానే నియమనిష్ఠలతో జీవితం సాగిస్తున్నది. ఈ విధంగా భర్తృవియోగదుఃఖాన్ని అనుభవిస్తూ, ఒకనాడు తల్లితో నలుడిని అన్వేషించటానికై బ్రాహ్మణులను పంపుమని కోరింది. ఆమె భీమానుమతితో బ్రాహ్మణులను నియోగించింది. నలాన్వేషకులైన విప్రులతో దమయంతి ఇట్లా పలికింది.

'నిషధాధిపతి అయిన నలుడు ప్రస్తుతం అసమర్థుడు కావటంచేత తాను ఇతరులచేత గుర్తించబడకుండా గూఢంగా ఉంటుంటాడు. కాబట్టి మీరు పెద్ద పెద్ద రాజసభలకు వెళ్ళి, అందరూ వినేటట్లు ఈ విధంగా ఎలుగెత్తి చెప్పండి. 'నీవు నిత్యం నిజం మాట్లాడేవాడివి. నీ భార్యను వంచించి ఆమె సగంచీరె చించి నీవు కట్టుకొని, ఆమెను ఒంటిగా వదలి వెళ్ళటం న్యాయమేనా? భార్య భర్తచేత భరించతగింది అనే మాట అబద్ధమైపోయింది. నీవంటివాడు ఈ విధంగా నిర్దయుడు కావటం సమంజసమా? కాబట్టి, ఆ సతికి నీవు ప్రసన్నుడవు కమ్ము' అని అన్నిచోట్ల ప్రకటించండి. అప్పుడు ఎవడైనా ఆ మాటలు సహించలేక మారుమాట మాట్లాడితే, అతడిని నలుడిగా గుర్తించండి. ప్రీతితో అతడికి నన్ను గురించి చెప్పి, వెంట పెట్టుకొని తీసికొనిరండి. రాకపోతే అతడున్నచోటు తెలిసికొని మీరు రండి' అని తెలిపింది.

విప్రులందరూ వివిధ దేశాలకు వెళ్ళి తిరిగి వచ్చారు. వారిలో పర్ణాదుడు అనే బ్రాహ్మణు డిట్లా అన్నాడు: 'నేను అయోధ్యకు వెళ్ళాను. ఋతుపర్ణుడి సభలో నీవు చెప్పినట్లే ప్రకటించాను. అప్పుడు ఒక కురుచచేతులవాడు బాహుకుడనేవాడు నన్ను ఏకాంతంలో చూచి వెలవెలపోతూ నిట్టూర్పులు నిగుడిస్తూ నాతో ఇట్లా అన్నాడు. అతడు నూరుగద్యాణాల ఉద్యోగి, వేగంగా రథం నడిపే నేర్పుకలవాడు. వంటలలో నిపుణుడు. కాని, అతడు కురూపి. 'భర్తలో లోపాలున్నాయని తెలిసికూడా మనసులో ఓర్చుకొని ఉంటే ఆ భార్య మరోజన్మలో ఆ భర్తతో ధర్మభోగాలను పొందుతుంది.' అని మరేమీ మాట్లాడక తనఇంటికి వెళ్ళిపోయాడు.

పర్ణాదుడి మాటలు విని దమయంతి చాలాసేపు ఆలోచించింది. నలుడు కానివాడు మారుమాటలు ఎందుకు మాట్లాడతాడు? అతడి వద్దకు మరికొంతమంది నిపుణులను పంపి ఆతడి వివరాలను మరిన్ని సేకరించాలని భావించి తల్లి అనుమతితో సుదేవుడిని పిలిపించి బాహుకుడి వద్దకు పంపుతూ ఇట్లా చెప్పింది:

'ఓ విద్వన్నుతా! నీవు నన్ను గుర్తించి ఎట్లా తెచ్చావో, అట్లాగే నలుడిని కూడా నిపుణంగా గుర్తించి తీసికొని రావాలి. అటువంటి బుద్ధిబలం నీకే ఉన్నది. విదేశవిప్రుడివలె అయోధ్యకు శీఘ్రంగా వెళ్ళుము. ఋతుపర్ణుడిని దర్శించి 'రాజా! భీమమహారాజు నలుడిని గురించి వెదకి వెదకి వేసారి ఎక్కడా చూడలేక దమయంతికి పునస్స్వయంవరం చాటించాడు. దానికి భూవలయంలో ఉన్న రాజు లందరూ పోతున్నారు'- అని చెప్పు మని పంపింది. సుదేవుడు ఋతుపర్ణుడిని దర్శించి రేపే దమయంతి పునస్స్వయంవరమని చెప్పాడు. ఆ మాటలు విని ఆ రాజు బాహుకుడిని పిలిచి 'నేను దమయంతి స్వయంవరం చూడటానికి ఒకరోజులో విదర్భకు పోవాలి. నీ అశ్వశిక్షానైపుణ్యం చూపించాలి' అని అతడితో అన్నాడు.

నలుడు తన మనస్సులో దుఃఖించాడు. 'అడవిలో తనను ఒంటరిగా వదలి వెళ్ళానని అలిగి ఇట్లా దమయంతి చేయటానికి పూనుకొన్నది. మగవారు తమ భార్యలు తమ నెప్పుడూ అంటిపెట్టుకొని ఉంటారని నమ్మి వెర్రివారైపోతుంటారు కదా! నాపని అంతే అయింది. అయినా, దమయంతి పతివ్రత, సంతానవతి. ఆమె ఇట్లా ఎందుకు చేస్తుంది? అని మనసులో అనిపిస్తుంది. ఏమైనా అసలు సంగతి తెలిసికొనాలి. కాబట్టి ఋతుపర్ణుడితో నేనుకూడా పోతాను' అని మనసులో నిశ్చయించుకొన్నాడు. పూర్వం వార్ష్ణేయుడు తెచ్చిన తనరథాన్ని మనోవాయువేగంతో పోగలిగిన తన గుర్రాలతో సిద్ధంచేసి రాజువద్దకు తెచ్చాడు. ఋతుపర్ణుడు రథమెక్కేటప్పుడు గుర్రాలు మొగ్గాయి. అవి బలహీనమైనవని రాజు నవ్వి వాటిని మార్చుమని బాహుకుడిని అడిగాడు. అప్పుడు- 'రాజా! ఇవి వాయువేగంతో పరుగెత్త గలవు. నేడే ప్రొద్దుక్రుంకకుండానే ఇవి రథాన్ని విదర్భకు చేరుస్తా' యన్నాడు. రాజు మెచ్చి రథమెక్కి కూర్చున్నాడు. వార్ష్ణేయుడు కూడా వెంటవచ్చాడు.

రథం మహావేగంతో సాగిపోతున్నది. నలుడొక్కడే రథాన్ని అట్లా నడపగలడని వార్ష్ణేయుడు భావించాడు. కాని, ఆ వికృతాకారుడిని నలుడిగా గుర్తించలేక పోయాడు. ఋతుపర్ణుడి ఉత్తరీయం గాలికి ఎగిరి నేలపై పడింది. దాన్ని గమనించే సరికే రథం కొన్ని ఆమడలు దాటి పోయింది. ఒకచోట లెక్కించలేనన్ని ఆకులు పండ్లు కల ఒక పెద్ద తాండ్రచెట్టును చూచారు. ఋతుపర్ణుడు ఆ చెట్టుకున్న ఆకులను, పండ్లను లెక్కించకుండానే చూచి చెప్పాడు. బాహుకుడు ఆశ్చర్యపడి రథ మాపి ఆ చెట్టుకున్న ఆకులను, పండ్లను లెక్కించాడు. ఋతుపర్ణుడి లెక్క సరిపోయింది. బాహుకుడు ఆశ్చర్యపడి తనకా విద్యను ఉపదేశించుమని కోరాడు. ఋతుపర్ణ డిట్లా అన్నాడు: 'ఇది అక్షహృదయం అనే విద్య. దీనిని దీక్షతో పొందినవాడు సంఖ్యావిదు డౌతాడు. పాపాలనుండి, అపవాదులనుండి, విషం నుండి విముక్తుడౌతాడు. సమస్తసుగుణాలను పొందుతాడు. అందరికీ మిత్రుడౌతాడు' అని చెప్పి విధియుక్తంగా బాహుకుడికి ఋతుపర్ణుడు 'అక్షవిద్యను' ఉపదేశించాడు. నలుడు సంతోషించి ఋతుపర్ణుడికి 'అశ్వ హృదయం' అనే విద్యను ఇస్తానని చెప్పాడు. కాని, ఆ రాజు దానిని తరువాత స్వీకరిస్తానని ఉపదేశాన్ని వాయిదా వేశాడు.

అక్షహృదయ విద్యా ప్రభావం వలన నలుడి శరీరంలో దాగి ఉన్న కలి కర్కోటక విషాన్ని క్రక్కుతూ బైటకు వచ్చి భయంతో వణకుతూ నలుడికి నమస్కారం చేశాడు. అతడిని చూచి నలుడు కోపించి శపించబోయాడు. తా నన్నాళ్ళూ కర్కోటక విషబాధవలన పొందిన దుఃఖాన్ని చెప్పికొని కలి క్షమించుమని వేడాడు. నలదమయంతులను కీర్తించిన జనులకు కలివలన భయం ఉండదని వరమిచ్చాడు. నలు డతడిని దయతో వదిలాడు. కలి ఆ తాండ్రచెట్టును ఆశ్రయించాడు. అది మొదలు తాండ్రచెట్టు పూజార్హతను కోల్పోయింది.

ఆ విధంగా నలుడు వికారరూపం మాత్రంతప్ప మిగిలిన దోషాలనన్నింటినుండి విముక్తుడయ్యాడు. ఆ పై రథమెక్కి ముగ్గురూ వేగంగా సాయంకాలానికి విదర్భకు చేరారు. దమయంతి మేఘనాదం వంటి ఆ రథధ్వని విని అది నలుడి రథఘోషగా గుర్తించింది. నలుడిని చూడగలననే ఆశతో చూచింది. కాని, రథంలో ఋతుపర్ణుడిని చూచి నిరాశ చెంది దుఃఖించింది.

భీమరాజు ఋతుపర్ణుడిని ఒక అందమైన భవనంలో విడిది చేయించాడు. ఆ రాజుకు ఆ నగరంలో స్వయంవర సంరంభ మేమీ కనపడలేదు. ద్వితీయ స్వయంవరానికి ఎవ్వరూ రావటానికి ఇష్టపడలేదేమో అని లోలోన అనుకొన్నాడు. బాహుకుడు రథశాలలో రథాశ్వాలను కట్టివేసి రథం దగ్గర విశ్రాంతి తీసికొంటున్నాడు. దమయంతి కేశిని అనే దాసిని పిలిచి బాహుకుడి వృత్తాంతం తెలిసికొని రమ్మని పంపింది. కేశిని బాహుకుడి వద్దకు పోయింది.

కేశిని : దమయంతి నీ క్షేమం తెలిసికొని రమ్మన్నది. నీ విక్కడికి ఎందుకు వచ్చావు?

బాహు : దమయంతి పునస్స్వయంవర మని తెలిసి ప్రీతితో అనేకమంది రాజులు ఇక్కడికి వస్తూంటే ఋతుపర్ణుడు కూడా రావటానికి ముచ్చటపడ్డాడు. అయోధ్యనుండి ఇక్కడికి నూరామడల దూరం. ఒక్కరోజులో ఆతడు ఇక్కడికి వచ్చాడు. ఆతడి రథసారథిగా నేనూ వచ్చాను.

కేశి : ఆ మూడవ వా డెవడు?

బాహు : అతడా? నలరథసారిథి అయిన వార్ష్ణేయుడు.

కేశి : అతడికి నలభూపాలుడు పోయిన తెరగు తెలియదా?

బాహు : అతడు నలుడి కొడుకును, కూతురిని విదర్భదేశప్రభువు వద్ద ఉంచి తిరిగిపోతూ ఉండగా నలుడు రాజ్యాన్ని కోల్పోయాడని త్రోవలోనే విని ఋతుపర్ణుడి సేవలో చేరాడు. అతడికి నలుడినిగురించి తెలియదు. నలుడితో ఒంటరిగా వెళ్ళిన దమయంతికి తెలియాలి కాని, మరెవ్వరికీ తెలిసే అవకాశమే లేదు.

కేశి : అడవిలో తన సగం చీరను చింపుకొని తన పతి దయారహితుడై తనను ఒంటరిగా వదలి వెళ్ళగా నాటినుండి ఆ సగం చీరనే దమయంతి కట్టుకొని ఉన్నది. దుమ్ముతో మేను క్రమ్ముకొని పోయినా, తలవెంట్రుకలు జడలు కట్టినా నేలమీదనే పడుకొంటూ ఆమె పవిత్ర పాతివ్రత్య వ్రతాన్ని పాటిస్తున్నది.

ఆ మాటలు వింటున్న నలుడి కన్నులు కన్నీరుతో నిండిపోయాయి. అవి కనపడకుండా అతడు మొగం త్రిప్పుకొని మరొకవైపు చూస్తూ ఊరుకొన్నాడు. ఆ సంగతి కేశిని దమయంతికి చెప్పింది. ఆతడే నలుడై ఉండవచ్చునని దమయంతి శంకించింది. బాహుకుడు ఋతుపర్ణుడి వంటలవాడుకూడా. అతడు వంటచేసే పద్ధతిని కూడా గమనించుమని కేశినిని మరల పంపింది.

నలుడు వంటలు వండే వేళలో ప్రదర్శించిన మహిమలు అపూర్వాలు. గుప్పెడు గడ్డి చేతిలో పట్టి అటూ ఇటూ ఊపితే అగ్గి అంటుకొంటుంది. ఆ గడ్డిమంటతో ఎంతవంటైనా ఉడుకుతుంది. నంజుళ్ళు కడగటానికి సంకల్పించినంత మాత్రంలోనే దివ్యగంగాధార పుట్టుకొస్తుంది. కుండలు నిండుతాయి, అక్షయంగా జలధార పారుతుంది. అతడి రెండుచేతులతో మర్దితాలయికూడా సుగంధసుమాలు వాడకుండా ఉంటాయి. (ఇవన్నీ అగ్ని వరుణాది దిక్పాలకులు నలుడికిచ్చిన వరాల ప్రభావాలు). ఈ వివరాలన్నీ చూచి కేశిని దమయంతికి చెప్పింది. ఆమె బాహుకుడి నంజుళ్ళు తెప్పించుకొని రుచిచూచింది. అది నలపాకమని నిశ్చయించుకొన్నది.

అంతటితో ఆగక దమయంతి తనకొడుకునూ, కూతురినీ బాహుకుడి వద్దకు కేశినితో పంపింది. వారిని బాహుకుడు ప్రేమతో దగ్గరికి తీసికొని తొడలపై కూర్చుండబెట్టుకొని పులకిస్తూ ఆర్ద్రుడైనాడు. కేశినికి అనుమానం కలుగకుండా తనకొడుకు, కూతురు ఆ యీడువారే కావటం చేత, వారివలె వీళ్ళూ ఉండటం చేత దుఃఖించానని దాచి చెప్పాడు. తాను విదేశీయుడు కావటం చేత పెక్కుసార్లు కేశిని తనను కలిసి మాట్లాడటం ఉచితం కాదనీ, ఎవరైనా అనుమాన పడవచ్చుననీ చెప్పి ఆమెరాకను వారించాడు. జరిగినదంతా కేశిని దమయంతికి నివేదించింది. ఆమె తన తల్లిదండ్రుల అనుమతితో బాహుకుడిని తన వద్దకు వచ్చేటట్లు ఏర్పాటు చేసింది.

బాహుకుడు వచ్చి తపస్వినిగా కృశించి, మలిన గాత్రంతో, బాష్పనేత్రాలతో మూర్తీభవించిన శోకం వలె ఉన్న దమయంతిని చూచాడు. దమయంతి వికృతాకారుడైన బాహుకుడిని చూచినా నలుడిని చూచినట్లుగానే భావించి వినయంతో తన్మయత్వంతో ఇట్లా అన్నది :

దమ : జనంలేని అడవిలో అలసి నిద్రపోయిన అబలను, సాధ్విని, అనువ్రతను, అగ్నిసాక్షిగా పెండ్లాడిన వనితను వదలి నలుడివలె నిర్దయులై వెళ్ళినవారు లోకంలో మరింకెవ్వరూ లేరు. దేవతలను కాదని అతడిని వరించాను. అతడివలన సంతానాన్ని కన్నాను. అటువంటి నన్ను దయలేకుండా నిష్కారణంగా ఉన్నట్లుండి వదలి వెళ్ళాడు. నే నేమి కీడు చేశాను? 'నిన్ను నే నెప్పుడూ విడువను, భయపడకుము' అని మాట ఇచ్చి కూడా ఎందుకు మరచాడో తెలియదు. (అని అంటూ కన్నీరు మున్నీరుగా దుఃఖించింది.)

నలుడు : (శోకంతో కలవరపాటు చెందుతూ) కలి ఆవేశించిన బుద్ధితో అటువంటి కఠిన పద్ధతిని అనుసరించి పడరాని పాట్లు పడ్డాను. అవన్నీ నా తపస్సువలన నీ వియోగదుఃఖతాపంవలన, నశించిపోయాయి. కలి ఇప్పుడు నన్ను వదలి వెళ్ళిపోయాడు. నే నిక్కడికి నీకొరకే వచ్చాను. అది అట్లా ఉండనిమ్ము. నేను నీకు అనురక్తుడను, అనువ్రతుడను. అయినా, నీవు అన్యాపేక్షతో పునస్స్వయంవరం చాటించావు. ఇది పతివ్రతకు ధర్మం కాదు. నీ స్వయంవరానికి రాజుల నందరిని పిలవటం కారణంగా ఋతుపర్ణుడు వచ్చాడు కదా!

దమ : (దోసిలిపట్టి వినయంతో ఇట్లా అన్నది) నిన్ను అన్వేషించటానికై నేను అనేకమంది విప్రులను పంపాను. వారిలో పర్ణాదుడితో అయోధ్యలో నీవు పలికిన మారుపలుకులను తెలిసికొని, వాటి వలన నిన్ను గుర్తించాను. ని న్నిక్కడికి రప్పించటానికి ఒక ఉపాయం పన్నాను. రేపే స్వయంవరమని సుదేవుడిచేత ఋతుపర్ణుడికి చెప్పించాను. నూరామడల దూరాన్ని ఒక్కరోజులో రథం మీద రాగలిగిన నేర్పు నీ కొక్కడికే ఉన్నది. కాబట్టి నిన్ను ఆ నెపంతో విదర్భకు రప్పించుకొనవలెనని భావించాను. ఇంతకంటె నేను మరే కీడును మనసులో తలంచ లేదు. నీ పాదాల సాక్షి. నా మనస్సులో మరొక భావముంటే దేవతలు, బ్రాహ్మణులు నన్ను చంపి ఉండేవారు.

దమయంతి అట్లా అంటూఉండగానే ఆకాశంనుండి వాయుదేవుడు ఇట్లా ప్రకటించాడు :-

'దమయంతి పరమపవిత్రచరిత్ర, పతివ్రత. సూర్యచంద్రులూ నేనూ కలిసి ఆమె శీలాన్ని ఈ మూడేళ్ళు రక్షించాం. ఈమె నీయందే అనురాగం కలది. కాబట్టి ఈమెను స్వీకరించుము'. ఆ మాట లంటున్నప్పుడు దేవతలు దుందుభులు మ్రోగించారు, పూలవాన కురిపించారు. వాయుదేవుడి ప్రకటన విని నలుడు ఆశ్చర్యపోయాడు. ఆనందించాడు. వెంటనే కర్కోటకుడిని స్మరించాడు. అత డిచ్చిన వస్త్రాన్ని తనపై పెట్టుకొన్నాడు. వెంటనే నలుడు నిజరూపంతో నిలిచాడు.

నలదమయంతులు పరమానందంతో పునస్సమాగమాన్ని పొందారు. బంధుమిత్ర ప్రజలందరూ సంతసించారు. భీముడు నలుడిని సత్కరించాడు. ఋతుపర్ణుడు నలుడిని అభినందించాడు. బాహుకుడిగా ఉన్నప్పుడు చేసిన అవజ్ఞలను మన్నించుమని వేడుకొన్నాడు. నలుడు ఋతుపర్ణుడికి అశ్వహృదయ విద్యను బోధించి పంపాడు. ఆ తరువాత నలుడు ఒక నెల రోజులు విదర్భలో సుఖంగా ఉన్నాడు.

ఆ తరువాత చతురంగ బలంతో నిషధపురానికిపోయి పుష్కరుడిని పిలిచి 'యుద్ధంగానీ, జూదంగానీ పందెంగా వేస్తున్నాను. దేనిలోనైనా నిన్ను ఓడించి నా రాజ్యాన్ని నేను గ్రహిస్తాను. సిద్ధం క' మ్మని పిలిచాడు. పుష్కరుడు యుద్ధం చేయలేక, జూదంలో నలుడిని ఓడించి దమయంతిని గెలుచుకొందామని భావించాడు. పుష్కరు డోడితే రాజ్యం నలుడి కిచ్చేటట్లు, నలు డోడితే దమయంతిని పుష్కరుడికి దత్తంచేసేటట్లు పందెం వేసికొని ఇరువురూ జూదమాడారు. అందులో పుష్కరు డోడాడు. పూర్వం పుష్కరుడు గెలవటం కలిప్రభావంవలన జరిగిందని ప్రకటించి, నలుడు అతడిని క్షమించి వదలివేశాడు. ఆ తరువాత నలుడు దమయంతితో కూడి ఇంద్రవైభవంతో రాజ్యాన్ని పాలించాడు.

'కాబట్టి ధర్మరాజా! జూదంలో ఓడిపోయానని దిగులు పడబోకుము. నీవుకూడా దైవమానుష సంపదలతో శత్రువులను జయించి సకల మహీసామ్రాజ్యాన్ని పొందగలవు' అని బృహదశ్వుడు ధర్మరాజుకు అక్షహృదయాన్ని ఉపదేశించాడు. 'ఈ నలోపాఖ్యానం శ్రద్ధతో విన్నవారూ, సభలలో చదివినవారూ కలిదోషంనుండి విముక్తి చెందుతారు. నిఖిల పుణ్యఫలాలను

అందుకొంటారు. పుత్ర పౌత్ర ఆయురారోగ్య ఐశ్వర్యాలు పొందుతారు. విషాలవలన, దుష్టవిషయాలవలన భయం లేకుండా ఉంటారు. ధర్మాత్ము లౌతారు. అంతే కాదు. కర్కోటకుడు, దమయంతి, నలుడు, ఋతుపర్ణుడు - వీరిపేర్లు ఉచ్చరిస్తే చాలు కలిభయాలు తొలగిపోతాయి'- అని ఫలశ్రుతిని ప్రకటించాడు. ఆ తరువాత పాండవులవద్ద సెలవు తీసికొని బృహదశ్వుడు వెళ్ళిపోయాడు.

## పుణ్యతీర్థ విశేషాలు :

పాండవులు అర్జునుడి రాక కొరకు ఎదురు చూస్తున్నారు. అప్పుడు నారదమహర్షి వచ్చాడు. ధర్మరాజు ధర్మమతికి ఉదాత్తచరిత్రకు మెచ్చుకొని అతడికి ఇష్టమైన దేదైనా అడుగుము- అని అడిగాడు. 'ఈ భూమిలో ప్రదక్షిణంగా కొందరు ధన్యులు తీర్థయాత్రలు చేస్తూ ఉంటారు. వారికి ఎటువంటి ఫలం కలుగుతుందో చెప్పండి. అనేక తీర్థాల గొప్పతనం కూడా తెలియపరచండి' అని ధర్మరాజు కోరాడు. పూర్వం అటువంటి ప్రశ్నే గంగాద్వారంలో పితృదేవతలకు శుభకర్మలు చేస్తున్న భీష్ముడు అడుగగా, పులస్త్య మహర్షి చెప్పిన విశేషాలు వినిపిస్తానని నారదుడు ధర్మరాజుకు ఈక్రింది వివరాలు తెలిపాడు.

'జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలపై నిగ్రహం ఉన్నవారు, అహంకారం లేనివారు, ప్రతిగ్రహాపేక్ష లేనివారు, తక్కువగా భోజనం చేసేవారు, అనారంభకులైనా ఆనందంగా ఉండేవారు, సత్యవ్రతులు, శుభాచారులు, కోపం లేనివారు, ధర్మపరులు అయినవారు వందలాది పుణ్యతీర్థాలను సేవించిన ఫలాన్నీ, సర్వయజ్ఞాలు చేసిన పుణ్యాన్నీ పొందుతారు. దుర్మార్గులు తీర్థసేవల ఫలాన్ని పొందలేరు. నువ్వులను, గోవులను, బంగారాన్ని దానంచేయటం, ఉపవాస వ్రతాలు చేయటం, తీర్థయాత్రలు చేయటంవలన జనులు దారిద్ర్యాన్ని, రోగాలను, ఆత్మదోషాలను పోగొట్టుకొంటారు. దుర్గతులైనవారు యజ్ఞఫలాలు పొందజాలరు. కాని, తీర్థాలు సేవించటంవలన ఆ ఫలితాలు వారికి లభిస్తాయి. తీర్థసేవనం విశేష పుణ్యప్రదం' అని చెప్పి బహువిధ పుణ్యతీర్థసేవలయొక్క ఫలాలను వివరించాడు.

## నారదుడు పేర్కొన్న పుణ్య తీర్థాలు :

1. పుష్కరం (ఇందులో పదివేల కోట్ల తీర్థాలున్నాయి) 2. జంబూమార్గం, 3. తుండులికాశ్రమం, 4. అగస్త్యవటం, 5. కణ్వాశ్రమం, 6. ధర్మారణ్యం, 7. యయాతి పతనం, 8. మహాకాళం, 9. కోటితీర్థం, 10. భద్రవటం, 11. నర్మదాతీర్థం, 12. దక్షిణసింధూతీర్థం, 13. చర్మణ్వతీతీర్థం, 14. వసిష్ఠాశ్రమం, 15. పింగం, 16. ప్రభాస తీర్థం, 17. వరదానం, 18. సరస్వతీసాగరసంగమం, 19. పిండారకం, 20. సాగర సింధు సంగమం, 21. శంకు కర్ణేశ్వరం, 22. వసుధార, 23. వసుసరం, 24. సింధూత్తమతీర్థం, 25. బ్రహ్మతుంగ, 26. శక్రకుమారి, 27. శ్రీకుండం, 28. విమలం, 29. బడబ, 30. దేవిక, 31. కామతీర్థం, 32. రుద్రతీర్థం, 33. యజనం, 34. యాజనం, 35. బ్రహ్మవాలుకం, 36. దీర్ఘసత్రం, 37. వినశనం, 38. నాగోద్భేదం, 39. శివోద్భేదం, 40. చమసోద్భేదం, 41, సరస్వతి, 42. శశయానం, 43. రుద్రకోటి, 44. నైమిశం, 45. కురుక్షేత్రం, 46. శమంతకపంచకం, 47. రామహ్రదం, 48. విష్ణుస్థానం, 49. పారిప్లవం, 50, పృథివీతీర్థం, 51. శాలూకిని, 52. సర్పతీర్థం, 53. వరాహతీర్థం, 54. అశ్వినీతీర్థం, 55. జయంతిలో సోమతీర్థం, 56. కృతశౌచతీర్థం, 57. అగ్నివటం, 58. ముంజవటం, 59. యక్షిణీతీర్థం, 60. కురుక్షేత్రద్వారం, 61. కాయశోధనం, 62. లోకోద్ధారం, 63. శ్రీతీర్థం, 64. కపిలతీర్థం, 65. సూర్యతీర్థం, 66. గోభవనం, 67. శంఖినీతీర్థం, 68. యక్షేంద్రతీర్థం, 69. మాతృతీర్థం 70. బ్రహ్మావర్తం, 71. శరవణం, 72. శ్వావిల్లోమాపహం, 73. మానుషతీర్థం, 74. ఆపగానది, 75. బ్రహ్మోదుంబరం, 76. సప్తర్షికుండం, 77. కేదారం, 78. కపిలకేదారం, 79. సరకం, 80, ఇలాస్పదం 81. కిందానం, 82. కింజప్యం, 83. నారదతీర్థమైన అంబాజన్మం, 84. పుండరీకం, 85. వైతరణి, 86. ఫలకీవనం, 87. మిశ్రకం, 88. వ్యాసవనం, 89. మనోజవం, 90. మధువటి, 91. కౌశికీ దృషద్వతీ సంగమం, 92. కిందత్తం, 93. అహస్సుదినతీర్థాలు, 94. మృగధూమం 95. వామనం, 96. పావనం, 97. శ్రీకుంజం, 98. నైమిశకుంజం, 99. బ్రహ్మతీర్థం, 100. సప్తసారస్వతతీర్థం, 101. ఔశసన తీర్థం, 102. కపాలమోచనం, 103. విశ్వామిత్రం, 104. కార్తికేయం, 105. పృథూదకతీర్థం, 106. సురకన్యాసరస్వతీ సంగమం, 107. అర్థకీల తీర్థం. 108. శతం, 109. సహస్రం, 110. తైజసం, 111. కురుతీర్థం,

112. స్వర్గద్వారం, 113. రుద్రపత్ని, 114. స్వస్తిపురం, 115. గంగమడుపులో మూడు కోట్ల తీర్థాల కూపం, 116. బదరీవనంలోని వసిష్ఠాశ్రమం, 117. ఏకరాత్రం, 118. ఆదిత్యాశ్రమం, 119. దధీచితీర్థం, 120. కన్యాశ్రమం, 121. సన్నిహిత (సన్నిహతి), 122. ధర్మతీర్థం, 123. జ్ఞానపావనం, 124. సౌగంధికం, 125. దేవశ్రవ, 126. సుగంధ, 127. శతకుంభ, 128. పంచయక్ష, 129. త్రిశూలఖాత, 130. శాకంభరీతీర్థం, 131. సువర్ణాఖ్యతీర్థం, 132. ధూమావతి 133. రథావర్తం, 134. ధార, 135. గంగాద్వారం, 136. సప్తగంగాసంగమం, 137. త్రిగంగాసంగమం, 138. శక్రావర్తం, 139. కనస్వలం, 140. గంగాసరస్వతీ సంగమం, 141. భద్రకర్ణేశ్వరం, 142. అరుంధతీవటం. 143. సింధుప్రభవం, 144. యమునా ప్రభవం, 145. వేదిక, 146. ఋషికుల్య, 147. కృత్తికాతీర్థం, 148. మఘతీర్థం, 149. విద్యాతీర్థం. 150. వేతసిక, 151. బ్రహ్మతీర్థం, 152. నైమిశం, 153. గంగోద్భేదతీర్థం, 154. ఇందీవరతీర్థం, 155. దిశాపతితీర్థం, 156. బాహుద, 157. సరయూప్రదేశంలోని గోప్రదానతీర్థం, 158. గోమతి, 159. కోటితీర్థం, 160. వారణాసి, 161. కపిలాహ్రదం, 162. మార్కండేయ తీర్థం అయిన గంగాగోమతీసంగమం, 163. గయ, 164. ఫల్గుతీర్థం, 165. యక్షిణీతీర్థం, 166. మణినాగం, 167. గౌతమవనంలోని అహల్యాహ్రదం, 168. ఉదపానం, 169. రాజర్షిజనకకూపం, 170. కంపన, 171. మహానది, 172. దేవపుష్కరిణి, 173. మహేశ్వరధార, 174. మహేశ్వరపదం, 175. మహేశ్వరపథం, 176. సాలగ్రామతీర్థం, 177. సన్నిహిత చతుస్సముద్రకూపం, 178. చంపకారణ్యంలోని భరతాశ్రమం, 179. కన్యాసంవేద్యం, 180. దేవకూటం, 181. కౌశికహ్రదం. 182. కుమార వీరాశ్రమం, 183. అగ్నిధార, 184. కుమారధార, 185. గౌరీశిఖరకుండం, 186. నందినీకూపం, 187. కాళికాకౌశికా సంగమతీర్థం, 188. ఊర్వశితీర్థం, 189. గోకర్ణం, 190. సరస్వతీతీర్థం, 191. వృషభద్వీపం, 192. నంద, 193. ఔలకం, 194. కరతోయం, 195. గంగాసాగరసంగమం, 196. శోణానర్మదా ప్రభవం, 197. బదరీతీర్థం, 198. మహేంద్రం, 199. రామతీర్థం, 200. మతంగకేదారం, 201. వంశగుల్మం, 202. శ్రీపర్వతంలోని కృష్ణవేణియందలి దేవహ్రదం, 203. పాండ్యపర్వతంలోని కావేరీతీర్థం, 204. తుంగభద్ర, 205. సముద్రతీర్థం, 206. కన్యాతీర్థం, 207. గాయత్రీ స్థానం, 208. పెన్నానది, 209. గోదావరీనది, 210. పయోష్ణి, 211. దండకారణ్యం, 212. శరభంగాశ్రమం, 213. శుక్రాశ్రమం, 214. శూర్పారకం, 215. సప్తగోదావరీ తీర్థం, 216. తుంగకారణ్యం, 217. కాలంజర పర్వతంలోని దేవహ్రదం, 218. మేధికం, 219. చిత్రకూటంలోని మందాకిని, 220. పితృస్థానం, 222. శృంగిబేరపురం, 223. ప్రయాగ, 224. గంగాయమునా సంగమం (దాని నాశ్రయించుకొన్న అరవైకోట్ల పదివేల తీర్థాలు). 225. భోగవతి. 226. వాసుకి, 227. హంసవ్రతం మొదలైనవి.

ఈ తీర్థాలను ఏయేవిధంగా సేవిస్తే ఎంతెంతటి ఎన్నెన్ని ఫలాలు లభిస్తాయో నారదుడు చెప్పాడు. ఈ తీర్థవర్ణనం వింటే శ్రోతలు ధన్యులౌతారని పేర్కొన్నాడు. పులస్త్యుడి కథనం విని భీష్ముడు సర్వతీర్థాలూ సేవించినట్లే, ధర్మరాజు కూడా పుణ్యతీర్థ కథనం విన్న తరువాత తీర్థసేవచేసి పూరు, పురూరవ, భగీరథ, రఘుపతుల వలె కృతకృత్యుడు కావాలని ప్రబోధించాడు. రోమశుడనే ముని దేవలోకంనుండి వస్తాడనీ, అతడి ఉపదేశాన్ని అనుసరించి ధౌమ్యుడి అనుమతితో తీర్థసేవ చేయుమని ధర్మజుడికి చెప్పి నారదుడు వెళ్ళాడు. ఆపైన అర్జునుడు దివ్యాస్త్రాలను పొంది, తిరిగి వచ్చేంతవరకు ధర్మజుడు తీర్థయాత్రలు చేయటానికి నిశ్చయించాడు.

## రోమశుడు చెప్పిన పుణ్యతీర్థ కథలు :

ఇంద్రలోకం నుండి రోమశుడు ధర్మజుడివద్దకు వచ్చాడు. ఈశ్వరుడు మొదలుకొని ఇంద్రాది దేవతలందరూ అభీష్టవరాలివ్వగా కృతార్థుడైన అర్జునుడు మహేంద్రలోకంలో ఆతడి అర్ధసింహాసనం మీద కూర్చుండే గౌరవం పొందాడు. ఆ దృశ్యాన్ని చూచి, రోమశు డాశ్చర్యపోయాడు. అప్పుడు అతడితో ఇంద్రు డిట్లా అన్నాడు- 'ఇక అర్జునుడు భీష్మాదులను జయించగలడు. కర్ణుడు అతడి పదహారోకళకు కూడా సరికాడు. అమృతసంభవమైన పాశుపతాన్ని పరమేశ్వరుడు పార్థుడికి ప్రసాదించాడు. దిక్పాలకులు దివ్యాస్త్రాలు అందించారు. అర్జును డిప్పుడు మనుష్యుడు కాడు. దివ్యపురుషుడు. ఇతరు లెవ్వరూ సాధించలేని ఒక దేవకార్యాన్ని తీర్చి, అర్జునుడు మర్త్యలోకం చేరతా డని తమ్ములతో కూడి ఉన్న ధర్మరాజుతో చెప్పుము. తీర్థసేవ చేసే శాంతాత్ములకు, తపస్వులకు, దుష్కరమనేది ఉండదు. కాబట్టి ధర్మరాజుచేత నీవు తీర్థాలను సేవింపచేయుము- అని ఇంద్రు డాదేశిస్తే నేను నీవద్దకు వచ్చా' నని రోమశుడు పలికాడు.

విజయుడి క్షేమవార్త విన్నందుకూ, ఇంద్రుడే స్వయంగా తనను తీర్థయాత్రలు చేయించటానికి సంకల్పించినందుకూ ధర్మజుడు సంతోషించాడు. తా నిదివరకే నారద ధౌమ్యులచేత ప్రేరేపించబడి తీర్థయాత్రలు చేయటానికి సిద్ధంగా ఉండటంచేత

భార్యతో, తమ్ములతో, ధౌమ్యాది బ్రాహ్మణవర్గంతో కామ్యకవనంలో మూడురోజులున్న తరువాత మార్గశీర్షమాసం చివరి రోజుల్లో తీర్థయాత్రలకు బయలుదేరాడు- ధర్మరాజు.

ధర్మరాజు : మహర్షీ! లోకంలో ధర్మం పాటించని దుర్మార్గులకు అభివృద్ధి కలగటం, పుణ్యచరిత్రులకు, ధార్మికులకు అభివృద్ధి కలగకపోవటం అనేది న్యాయమా? ఇదొక ప్రశ్న. మరొకటి - అచేతనాలైన కొండలు, నదులు, సరోవరాలు పుణ్యతీర్థాలై జగత్తును పావనం చేసేవై, జనులకు పాపాన్ని పోగొట్టేవై ఉండటానికి వెనుక ఉన్న కారణ మేమిటి?

రోమశుడు : ధర్మజా! అధర్మపరులకు అభివృద్ధి కలిగినా అది ఎక్కువకాలం నిలవదు. త్వరలోనే నశించిపోతుంది. రాక్షసులు వేలసంఖ్యలో తమ అభివృద్ధిని కోల్పోవటం గమనించవచ్చును. దేవతలు ధర్మవర్తులు కాబట్టి అభివృద్ధి పొందుతారు. కౌరవులు కూడా రాక్షసులవలె విధిచేత నిర్మూలించబడతారు. అధర్మవర్తనులు మొదట గర్విస్తారు. ఆ పైన అభిమానిస్తారు. తరువాత కోపాన్ని ప్రదర్శిస్తారు. దానివలన వారి శీలం చెడిపోతుంది. లజ్జావిహీనులై అపకీర్తిపాలై సంపదను పోగొట్టుకొంటారు. కౌరవులు అట్లాగే నశిస్తారు. మీరు దేవతలవంటివారు. వారివలె మీరు కూడా ఋషులను ఆశ్రయించండి. తీర్థసేవలు, యజ్ఞాలు, దానాలు, చేసి విప్రాశీస్సులు పొందండి. సర్వదుఃఖాలనుండి విముక్తులై శ్రేయస్సును పొందండి. - అని ప్రబోధించాడు.

రోమశుడివలన ధర్మరాజాదులు ధర్మవిశేషాలు వింటూ అనేక తీర్థాలు సేవించారు. మార్గంలో శమఠమహర్షి గయామాహాత్మ్యాన్ని చెప్పగా విన్నారు. అగస్త్యాశ్రమం దర్శించినప్పుడు అగస్త్యమహర్షి వాతాపి నెట్లా చంపాడో ఆ కథ తెలియచెప్పమని ధర్మజుడు రోమశుడిని అడిగాడు. ఈ ఋషి ఆ కథ చెప్పాడు.

**వాతాపి జీర్ణం :**

మణిమతీ పురంలో ఇల్వలుడు, వాతాపి అనే దైత్యసోదరులు ఉన్నారు. వారిద్దరూ బలగర్వితులు. ఇల్వలుడు ఒకనాడు ఒక బ్రాహ్మణుడిని సమీపించి అన్నికోరికలు తీరే ఒక మంత్రాన్ని అడిగాడు. ఆ విప్రుడు అతడి ప్రార్థనను తిరస్కరించాడు. అతడికి కోపం వచ్చింది. కామరూపుడైన వాతాపిని మేకగా మార్చాడు. అతడి మాంసాన్ని వండి ఆ బ్రాహ్మణుడికి వడ్డించాడు. అతడు తినిన తరువాత వాతాపిని పిలిచాడు. వాతాపి ఆ బ్రాహ్మణుడి పొట్టను చీల్చుకొని వచ్చాడు. విప్రుడు విగతజీవు డయ్యాడు. అతడి మాంసాన్ని అన్నదమ్ము లిద్దరూ కలిసి ఆరగించారు. ఆనాటినుండి ఇల్వలుడు అతిథులైన విప్రులను అదే విధంగా చంపి హింసిస్తూ ఉన్నాడు.

అగస్త్యుడు బ్రహ్మచర్యాశ్రమంలో చాలకాలం ఘోరతపస్సు చేస్తూ ఒకనాడు వనంలో తిరుగుతూ తనపితృదేవతలు ఒక సల్లకీ పల్లవానికి తలక్రిందుగా వ్రేలాడుతూ ఉండటం చూచాడు. వారావిధంగా ఉండటానికి గల కారణాన్ని గురించి అడిగాడు. వారి స్థితికి అగస్త్యుడు అవివాహితుడై సంతానవంతుడు కాకపోవటమే కారణమని పితరులు చెప్పారు. అతడికి సంతానం కలిగితే వారికి పుణ్యగతులు వస్తాయని తెలిపారు.

అగస్త్యుడు తన తపోమహిమవలన విదర్భరాజుకు ఒక కూతురు పుట్టేటట్లు చేశాడు. ఆమె పేరు లోపాముద్ర. ఆమె యుక్తవయస్కురాలు అయింది. అగస్త్యుడు వచ్చి ఆమెను తన కిచ్చి వివాహం చేయుమని విదర్భరాజును అడిగాడు. కాని, ఆ రాజు తన కూతురును తపస్వికి ఇవ్వటానికి ఇష్టపడలేదు. కాని, లోపాముద్ర తనంతట తాను అగస్త్యుడిని వివాహమాడటానికి ముందుకు వచ్చింది. వారిరువురికీ  వివాహం జరిగింది. లోపాముద్ర వల్కలాలు కట్టి భర్తతో గంగాద్వారానికి చేరింది. అక్కడ అగస్త్యుడు తపస్సు చేసికొంటూ ఒకనాడు ఆమె అందాన్ని చూచి మన్మథ ప్రేరితుడై ఆమెను కూడబోయాడు. అప్పుడు లోపాముద్ర తనను అలంకారాలతో అలంకరించి భోగించుమని భర్తను కోరింది.

అగస్త్యుడి వద్ద తపోధనం తప్ప బంగారం లేదు. అందువలన అతడు బంగారాన్ని అర్థించడానికై శ్రుతర్వుడనే రాజువద్దకు వెళ్ళాడు. ఆ రాజు వద్ద పోష్యజన పోషణానికి ఇబ్బంది లేకుండ మిగిలే ధనాన్ని దానంగా కోరాడు. అతడి వద్ద మిగులుధనం

లేదు. అగస్త్యుడు అతడితో కలిసి బ్రధ్నాశ్వుడనే రాజువద్దకు వెళ్ళి అట్లాగే అడిగాడు. ఈతడి వద్దకూడ మిగులు ధనం లేకపోయింది. ఆ తరువాత త్రసదస్యుడనే రాజువద్దకు పోయి అట్లాగే అడిగాడు. అతడి వద్దకూడ మిగులు ధనం లేకపోయింది. కాని, త్రసదస్యుడు ఇల్వలుడి వద్దకు వెళ్ళుమని అగస్త్యుడికి హితవు చెప్పాడు. అతడి వెంట ఆ ముగ్గురు రాజులు వెళ్ళారు.

ఇల్వలుడు అగస్త్యుడికి ధనసహాయం చేయటానికి అంగీకరించాడు. కాని, అంతకు ముందే మామూలుగా భోజనం పెట్టి వాతాపితో చంపిద్దామని ఊహించాడు. కాని, అగస్త్యుడు తృప్తిగా భుజించి 'వాతాపి జీర్ణం' అని త్రేన్చి, అతడిని తనకడుపులో జీర్ణంచేసికొన్నాడు. దానితో ఇల్వలుడి మాట వ్యర్థమైపోయింది. ఆ రాక్షసుడు అగస్త్య డడిగిన ధనాన్ని ఇచ్చాడు. బంగారు రథంలో ఎక్కించి ఇంటికి పంపాడు. అతడి మిత్రులకు కానుక లిచ్చాడు.

అగస్త్యుడు లోపాముద్రను సువర్ణాభరణాలతో అలంకరించాడు. ఆమె నొక ప్రశ్న అడిగాడు. 'నీకు సామాన్యులైన కొడుకులు నూర్గురు కావాలా? ఆ నూరుమంది కొడుకులకు సమానమైన పదిమందిని కోరుకొంటావా? లేదా వేయిమందిని కోరుకుంటావా? వేయిమందికి తుల్యుడైన ఒక్క కొడుకును కోరుకొంటావా?' అని అనగా ఆమె మహాత్ముడైన ఒక్కకొడుకునే కోరింది. ఆమె కోర్కెను మన్నించి ఆమెకు గర్భాధానం చేసి అగస్త్యుడు తపోవనానికి వెళ్ళాడు. ఏడేళ్ళు గర్భంతాల్చి లోపాముద్ర వేదవేదాంగవిదుడైన ఒక కొడుకును కన్నది. అతడి పేరు దృఢస్యుడు. అతడు పుత్రపౌత్రులను పొందాడు. దానివలన అగస్త్యుడి పితరులు పుణ్యలోకాలను పొందారు.

**అగస్త్య చరిత్రం :**

ఈ కథ విని ధర్మరాజు అగస్త్యుడి చరిత్ర ఇంకా వివరించి చెప్పుమని కోరాడు. రోమశుడు ఈ విధంగా చెప్పాడు.

కృతయుగంలో వృత్రుడు కాలకేయాదులతో కలిసి ఇంద్రుడిని ఓడించి దేవతలను బాధించాడు. దేవతలు బ్రహ్మదేవుడితో తమ కష్టాలను గురించి మొరపెట్టుకొన్నారు. సరస్వతీ నదీ తీరంలో తపస్సు చేసికొంటున్న దధీచి వద్దకు పోయి, అతడి ఎముకలను దానంగా పొందేటట్లు బ్రహ్మ సూచించాడు. ఆ ఎముకలనుండి వజ్రాయుధాన్ని ఇంద్రుడు పొంది వృత్రాసురుడిని సంహరిస్తాడని పేర్కొన్నాడు. బ్రహ్మ పేర్కొన్నట్లే ఇంద్రుడు దధీచి ఎముక నుండి పొందిన వజ్రాయుధంతో వృత్రాసురుడిని సంహరించాడు.

దధీచి ఎముకలనుండి దేవతలు కూడా అనేకాయుధాలు పొంది కాలకేయులపై దండెత్తారు. ఆ రాక్షసులు సముద్రంలో దాగి రాత్రిళ్ళు పైకి వచ్చి తపస్వులను వధించేవారు. ధర్మచరితుల వలననే లోకాలు అపాయం పొందకుండా ఉన్నాయని భావించి, అటువంటి తపస్వులను చంపటమే ఒక పనిగా పెట్టుకొన్నారు. వసిష్ఠాశ్రమంలో 197 మందిని, చ్యవనాశ్రమంలో 100 మందిని, భరద్వాజాశ్రమంలో 20 మందిని - ఇట్లా ఋష్యాశ్రమాలలో వరుసగా పుణ్యాత్ములను సంహరిస్తూ హింస సాగించారు. ఆ దారుణకృత్యాలను సహించలేక ఇంద్రాది దేవతలు వైకుంఠానికి పోయి విష్ణుదేవుడితో మొర పెట్టు కొన్నారు. వేదాలను ధరించే విప్రులకు బాధకలిగితే హవ్యకవ్యకర్మలు నశిస్తాయి. అందువలన దేవతలకు, పితరులకు బాధ ఏర్పడుతుంది. కాబట్టి బ్రాహ్మణోపద్రవాన్ని మాన్పి లోకహితాన్ని కలిగించుమని ప్రార్థించారు. 'కాలకేయులు నివసిస్తున్న సముద్ర జలాలను అగస్త్యుడు త్రాగగలడు. అతడిని ప్రార్థించి ఆ నీటిని త్రాగించి, బయలువడిన కాలకేయులను సంహరించం' డని విష్ణువు దేవతలకు ఉపాయం చెప్పాడు.

దేవతలు అగస్త్యుడి వద్దకు వెళ్ళారు. పూర్వం దేవతల హితాన్ని కోరి వింధ్యపర్వత గర్వాన్ని అణచిన అగస్త్యుడి గొప్పతనాన్ని దేవతలు కీర్తించారు. ఆ కథను వివరించుమని ధర్మరాజు రోమశుడిని అడిగాడు. ఆ ముని ఇట్లా చెప్పాడు.

మేరుపర్వతాన్ని సూర్యచంద్రులు ప్రదక్షిణం చేస్తూ ఉండటాన్ని గమనించి వింధ్యపర్వతం గర్వించి తనకు కూడా సూర్యచంద్రులు ప్రదక్షిణం చేయాలని పోటీపడి పెరిగి ఆకాశాన్నంతా అవతరించింది. దాని వలన సూర్యచంద్రుల గతులు ఆగిపోయాయి. రేయింబవళ్ళ స్థితిగతులు స్తంభించాయి. నిత్యకర్మలు వికలమైపోయాయి. దేవతలందరూ వింధ్యం వద్దకు

వెళ్ళి వేడుకొన్నారు. కాని, వింధ్యగిరి వారి మాటలు వినలేదు. వారు అగస్త్యుడి వద్దకు పోయి మొరపెట్టుకొన్నారు. అగస్త్యుడి శిష్యుడు వింధ్యపర్వతం. ఆ ఋషి లోపాముద్రతో కలిసి దక్షిణభారతానికి బయలుదేరి వింధ్యవద్దకు వచ్చాడు. వింధ్య పర్వతం నేలమట్టంగా ఒదిగి మునిదంపతులకు నమస్కరించింది. అగస్త్యుడు తాను దక్షిణాపథంనుండి తిరిగి వచ్చేంతవరకు ఆవిధంగానే వింధ్యను అణగి ఉండుమని ఆజ్ఞాపించాడు; దేవహితాన్ని కోరి భార్యాసహితుడై దక్షిణాపథంలోనే ఉండిపోయాడు. అటువంటి ఉదారుడైన అగస్త్యుడు దేవతల ప్రార్థనను మన్నించి సముద్రజలాలనన్నీ త్రాగాడు. జలనిధి ఓటువడింది. జలజంతువులతోపాటు కాలకేయులు కూడా బయటపడ్డారు. దేవతలు వారిపై దాడిచేసి ఘోరయుద్ధంలో వారినందరినీ సంహరించారు. వారందరూ అగస్త్యుడిని కీర్తించి, మరల, సముద్రాన్ని జలంతో నింపుమని వేడుకొన్నారు. కాని, ఆ నీరు అగస్త్యుడి గర్భంలో జీర్ణమైపోయి ఉండటంచేత మరల ఉత్పత్తిచేయలేక పోయాడు. ఆ సంగతి తెలిసికొని దేవతలు బ్రహ్మను ప్రార్థించారు. ఆ దేవదేవుడు దివ్యదృష్టితో చూచి భవిష్యత్తులో చాలకాలానికి భగీరథుడనే రాజు సముద్రాన్ని జలంతో నింపుతాడనీ, అంతవరకూ ఓర్చుకొనండని దేవతలను సమాధానపరిచాడు. ఈ కథ విని ధర్మరాజు భగీరథుడు జలాలతో సముద్రాన్ని నింపిన కథ చెప్పుమని రోమశుడిని అడిగాడు. ఆతడు ఇట్లా చెప్పాడు.

**భగీరథ యత్నం - గంగావతరణం :**

పూర్వం ఇక్ష్వాకు వంశంలో సగరుడనే రాజు హైహయులను జయించి విశాల సామ్రాజ్యాన్ని పాలించాడు. అతడికి వైదర్భి, శైబ్య అనే ఇద్దరు భార్యలున్నారు. వారికి సంతానం లేదు. సంతానం కొరకు సగరుడు భార్యాసమేతుడై కైలాసానికి పోయి పరమేశ్వరుడిని గురించి తపస్సు చేశాడు. ఆ దేవదేవుడు ప్రసన్నుడై సగరుడికి వైదర్భి వలన అరవైవేలమంది, శైబ్యవలన ఒక్కడు, కొడుకులు పుట్టేటట్లు వరమిచ్చాడు. అయితే, ఆ అరవైవేలమంది గర్వితులై ఒకేసారి చనిపోతారనీ, ఆ ఒక్కకొడుకూ వంశకర్త అవుతాడని పేర్కొన్నాడు. సగరుడికి పుత్రులను పొందికూడా అసంతృప్తి మిగిలిపోయింది. పరమేశ్వరుడి వరం ప్రకారం సగరుడికి అరవై వేలమంది కొడుకులు పుట్టి పెద్దవారై స్వర్గంమీద దాడికి వెడలి, దేవతలను బాధించారు. దేవతలు వారి ఆగడాలను గురించి బ్రహ్మకు నివేదించారు. వారు కొద్ది కాలంలోనే దగ్ధులౌతారని బ్రహ్మ పేర్కొన్నాడు.

సగరుడి రెండవభార్య శైబ్యకు అసమంజసుడనే కొడుకు పుట్టాడు. అతడు పెద్దవాడై రాజ్యంలోని బాలకులను చంపి మహానదిలో పారవేస్తూ ఉండేవాడు. అతడిని సగరుడు రాజ్యంనుండి వెళ్ళగొట్టాడు. అసమంజసుడికి అంశుమంతుడనే కొడుకు ఉన్నాడు.

సగరుడు అశ్వమేధయాగం తలపెట్టాడు. అతడి యజ్ఞాశ్వాన్ని సగరపుత్రులు రక్షిస్తూ దాని వెంట వెళ్ళారు. ఆ గుర్రం నీరులేని సముద్రంలో ప్రవేశించి మాయమైపోయింది. సాగరులు సముద్రాన్ని త్రవ్వి పాతాళంలో ఈశాన్యభాగాన గాఢతపస్సు చేసికొంటున్న కపిలుడనే ముని వద్ద యజ్ఞాశ్వాన్ని కనుగొన్నారు. వారు కపిలుడిపై కోపగించి అతడిని అవమానించారు. ఆ ఋషి ఉగ్రుడై తనకంటిమంటతో అరవై వేల సాగరులను ఒక్కసారిగా బూడిద చేశాడు. ఆ సంగతిని నారదుడు సగరుడికి తెల్పాడు. అతడు దుఃఖించి తన మనుమడైన అంశుమంతుడి కా సంగతి చెప్పాడు. ఆతడు కపిలమునివద్దకు వెళ్ళి, అతడిని ప్రార్థించి ప్రసన్నుడిని చేసికొన్నాడు. ఆ ఋషి యజ్ఞాశ్వాన్ని అంశుమంతుడికి అప్పగించాడు. సగరుడి యజ్ఞం సఫలమయ్యేటట్లు, అతడి వలన తండ్రి తాతలు సుగతిని పొందేటట్లు, అతడి పౌత్రుడైన భగీరథుడివలన గంగాజలం భూమికి వచ్చేటట్లు, సాగరులు స్వర్గస్థులయ్యేటట్లు, సముద్రాలు నిండేటట్లు అనుగ్రహించాడు. అంశుమంతుడు సంతోషించి అశ్వాన్ని సగరుడి కిచ్చాడు. సగరుడు అశ్వమేధాన్ని పూర్తిచేసి కృతార్థుడయ్యాడు.

సగరుడి తరువాత అంశుమంతుడు, అతడి తరువాత దిలీపుడు రాజ్యం చేశారు. దిలీపుడు తన తాతలను గంగావతరణంతో ఉద్ధరిద్దామని ప్రయత్నం చేశాడు కాని విఫలుడయ్యాడు. అతడి కొడుకు భగీరథుడు కృతకృత్యుడయ్యాడు. భగీరథుడు హిమవత్పర్వతం మీద ఘోరతపస్సు చేశాడు. గంగ ప్రత్యక్షమై అవతరణానికి అంగీకరించింది. కాని, ఆకసంనుండి భూమిమీదకు దిగే గంగాప్రవాహాన్ని భరించగలిగినవాడు పరమేశ్వరుడు మాత్రమే. కాబట్టి అతడి అనుగ్రహాన్ని పొందుమని హితవు చెప్పింది. భగీరథుడు కైలాసానికి పోయి పరమేశ్వరుడిని గూర్చి చాలకాలం తపస్సుచేసి గంగను భరించటానికి శంకరుడి

అనుమతిని పొందాడు. సర్వలోకాలు ఆనందించగా గంగ భూతలం మీద అవతరించింది. శివుడు గంగను జటాజూటంతో భరించి నేలపై ధారగా వదిలాడు. భగీరథుడి వెంట మందగమనంతో గంగ నడచి వచ్చి, సాగరులకు ఉత్తమగతుల నిచ్చింది. సాగరాన్ని జలపూర్ణం చేసింది. సగరుడి సంతానంగా భావించబడి సముద్రం సాగరమై ప్రసిద్ధి చెందింది. ఈ విధంగా భగీరథుడి మాహాత్మ్యాన్ని రోమశుడు ధర్మరాజుకు చెప్పాడు.

ఆ తరువాతక్రమంగా అనేక తీర్థయాత్రలు చేస్తూ ఋశ్యశృంగహ్రదం వద్దకువచ్చారు. ధర్మరాజు ఋశ్యశృంగుడి చరిత్రను చెప్పుమని కోరాడు. రోమశుడు ఈ విధంగా చెప్పాడు.

**ఋశ్యశృంగ వృత్తాంతం :**

పూర్వం కశ్యపుడి పుత్రుడు విభాండకుడు అస్ఖలిత బ్రహ్మచారిగా తపస్సు చేస్తున్నాడు. ఒకనాడు సరస్సులో స్నానం చేస్తూ ఉండగా ఊర్వశిని చూచాడు. ఆమె సౌందర్యాన్ని చూడగానే రేతస్ఖలనం జరిగింది. ఆ రేతస్సుతో కలిసిన నీటిని ఒక దుప్పి త్రాగి గర్భం దాల్చింది. దానికి ఋశ్యశృంగుడు పుట్టి తండ్రి వద్ద అమాయకంగా పెరిగాడు. అతడికి ఆశ్రమం తప్ప మరొక లోకజ్ఞానం లేదు. స్త్రీలంటే కూడా తెలియదు. అతడు పుట్టినప్పటినుండి తపస్సులోనే నిమగ్నుడైనాడు.

ఆ కాలంలో అంగదేశానికి అధిపతి రోమపాదుడు. అతడు పురోహితుడికి చేసిన అపరాధంవలన బ్రాహ్మణులు ఆ రాజును పరిత్యజించారు. అందువలన దేశంలో వానలు కురవటం మాని కరువు వ్యాపించింది. రోమపాదుడు తన తప్పు తెలిసికొని బ్రాహ్మణులను పూజించాడు. వారు ఋశ్యశృంగుడిని రోమపాదుడి దేశానికి పిలిపిస్తే వర్షాలు కురుస్తాయని సూచించారు. రోమశుడు ఋశ్యశృంగుడిని రప్పించటానికి ఒక ఉపాయాన్ని పన్ని వేశ్యలను అతడి తపోవనానికి పంపాడు.

రోమపాదుడి ఆదేశం ప్రకారం వేశ్యలు తపోవనంలో ప్రవేశించారు. వివిధ రసాలతో కూడుకొన్న భక్ష్యాలనూ, అనులేపనాలనూ తీసికొని ఆశ్రమానికి వెళ్ళారు. విభాండకుడు ఆశ్రమంలో లేని సమయంలో అభినవ యౌవనవిలాసవతి అయిన వేశ్యకూతు రొకతె ఋశ్యశృంగుడిని సమీపించింది. ఆడువారిని చూచి ఎరుగని ఋశ్యశృంగుడు ఆమెను ఒక వింత ఋషికుమారుడిగా భావించి, ఆమె రూపలావణ్యాలకు ఆశ్చర్యపడ్డాడు. ఆమెను ఆదరంతో గౌరవించాడు. ఆమె శరీరావయవాల పొంకానికి ముగ్ధుడయ్యాడు. ఆమె ఇచ్చిన దివ్యగంధమాల్యాలను, సరసభక్ష్యపానాలను, విచిత్ర వస్త్రాలను స్వీకరించాడు. ఆమె అతడి యెదుట నాట్యం చేసింది. అతడిని కౌగిలించుకొని సంతోషపెట్టింది. అతడిని ఆ విధంగా ప్రబోధించి వేశ్యాపుత్రి వెళ్ళింది. ఋశ్యశృంగుడు ఆ తన్మయత్వంలో యజ్ఞకార్యం మరచాడు. తండ్రి వనంలోనుండి తిరిగి వచ్చి కొడుకు వైఖరికి అబ్బురపడ్డాడు. ఋశ్యశృంగుడు జరిగిన దంతా చెప్పాడు. ఆ మునికుమారుడితో కలిసి తపస్సు చేయాలని ఉన్నదని తన కోర్కెను బయటపెట్టాడు. తండ్రి కటకట పడ్డాడు. అది రాక్షసమాయగా విభాండకుడు భావించి కొడుకును హెచ్చరించాడు.

తండ్రి హెచ్చరికలు వినక, తమకంతో ఋశ్యశృంగుడు మరునాడు ఆ వేశ్యాపుత్రి వెంటతగిలి పోయి అంగదేశం చేరుకొన్నాడు. రోమపాదు డాతడిని రాజాశ్రయమనే భవనంలో ఉంచాడు. ఋశ్యశృంగ ప్రవేశ ప్రభావంతో ఆ దేశాన వానలు మెండుగా కురిశాయి. దేశం సుభిక్షమైంది. ప్రజలు సంతోషించారు. అవగ్రహదోషాలు పోయాయి. రోమపాదుడు ఆనందించి తనకుమార్తె అయిన శాంతాదేవి నిచ్చి, ఋశ్యశృంగుడికి వివాహం చేశాడు. ఋశ్యశృంగుడికి ధనరాసులు, భూషణాలు బహుమానంగా ఇచ్చి, అతడి పేరుమీద దేశంలో అనేక గోశాలలను ఏర్పాటు చేశాడు. వాటిలో నిత్యాతిథిసత్కారాలను ఏర్పాటు చేశాడు.

విభాండకుడు ఆశ్రమంలో కొడుకు కనపడకపోవటంతో వెదకుతూ అంగదేశంలో ప్రవేశించి, ఒకగోశాలలో విశ్రమించి, తనకొడుకు కథనంతా తెలిసికొన్నాడు. రాజధానికి చేరి కొడుకును కోడలిని చూచి ఆనందించి వారిని ఆశ్రమానికి తీసికొనిపోయాడు. శాంతా ఋశ్యశృంగులు వసిష్ఠారుంధతులవలె అన్యోన్య ఆదర్శ దాంపత్యసుఖాలను పొందుతూ ఉన్నారు.

ధర్మజాదులు క్రమంగా ఋశ్యశృంగహ్రదంలో, కౌశికహ్రదంలో, గంగాసాగర సంగమ తీర్థంలో స్నానాలు చేసి కళింగ దేశంలో ఉన్న వైతరణీనదిని దర్శించారు. అప్పుడు రోమశుడు ఇట్లా అన్నాడు: 'మునులు దేవతలు ఇక్కడ అనేక యజ్ఞాలు చేశారు. ఈ నది ఉత్తరతీరాన వేలకొలది అవభృథస్నానాలు చేశారు. అన్ని యజ్ఞాలలోనూ గొప్పదైన పశుభాగాన్ని పశుపతికి దేవతలు, ఋషులు ఇక్కడ కల్పించారు. ఈ తీర్థంలో స్నానం చేస్తే లోకాలన్నింటిని దర్శిస్తారు. దేవతల విమానాలలో పయనిస్తారు'. ఆ మాటలు విని ధర్మరాజు సకుటుంబంగా వైతరణీ స్నానం చేశాడు. చేసి, రోమశుడితో - 'మునీంద్రా! మీ దయవలన నాకన్ని లోకాలు కనపడ్డాయి. వైఖానసుల వేదాధ్యయన శబ్దం వినవచ్చింది' - అని అన్నాడు. ఆ మాటలకు రోమశుడు ఆశ్చర్యపోయాడు. వైఖానసులు నివసించేచోటు అక్కడికి ముప్పదివేల ఆమడల దూరం. అంతదూరంలో వారు చదువుతున్న వేదాల నాదాలు వినపడుతున్నవంటే ధర్మరాజు దివ్యుడని  నిర్ధారించాడు.

ఆ తరువాత ధర్మజాదులు ఒక మహావనానికి వెళ్ళారు. స్వాయంభువుడైన విశ్వకర్మ పూర్వం ఇక్కడ యజ్ఞం చేసి భూవలయాన్ని యజ్ఞదక్షిణగా కశ్యపుడికి దానం చేశాడు. భూదేవి కశ్యపుడికి వశంకావటం ఇష్టంలేక నీటిలో మునిగింది. కశ్యపుడు ఘోరతపస్సు చేసి భూదేవిని ప్రసన్నురాలిని చేసికొన్నాడు. ఆమె నీటిపై తేలి ఒక వేదికగా నిలిచింది. 'ఆ వేదిక ఇదే. దీనిమీదకు ఎక్కగలిగినవారు వీర్యవంతు లౌతారు. ఎక్కడానికి అర్హత లేనివారు. ఎక్కబూనితే ఆ వేది మునిగిపోతుంది'. అని చెప్పి' 'అగ్నిర్మిత్రో యోని' మొదలైన మంత్రాలను ఉపదేశించి, ఆ వేది నెక్కించాడు. సతీ భ్రాతృ సహితుడైన ధర్మరాజు ఆ వేదికపై కెక్కి తేజోవంతుడై ప్రకాశించి, బ్రాహ్మణుల ఆశీస్సుల నందుకొన్నాడు.

ధర్మరాజు మహేంద్రగిరి చేరాడు. అక్కడి మహర్షులు పరశురాముడిని చూడగలరు. వారితో కలిసి ధర్మరాజు పరశురాముడిని చూడాలని కోరుకొన్నాడు. మరునాడు చతుర్దశి. ఆనాడు పరశురామ దర్శనమౌతుందని మునులు చెప్పారు. ధర్మజుడు వస్తున్నసంగతి పరశురాముడికి ముందే తెలియునని అకృతవ్రణుడనే ముని పలికాడు. ఆ మునిని ధర్మరాజు పరశురాముడి వృత్తాంతాన్ని చెప్పమని కోరాడు. అత డీవిధంగా చెప్పాడు.

### పరశురామ వృత్తాంతం :

పూర్వం కన్యాకుబ్జాన్ని గాధి పాలించేవాడు. అతడి కూతురు సత్యవతి గుణవతి, అందగత్తె. ఆమెను వివాహం చేసికొనాలని భృగుపుత్రుడైన ఋచీకుడు కోరికపడి గాధిని అడిగాడు. గాధి కన్యాశుల్కంగా ఒక నల్లని చెవితో, తెల్లని దేహంతోగల గుర్రాలు ఒక వెయ్యింటిని ఇస్తే కన్య నిస్తానన్నాడు. ఋచీకుడు వరుణేంద్రుడి వద్దకు వెళ్ళి ఆ గుర్రాలను పొంది, గాధికి కన్యాశుల్కంగా ఇచ్చి, సత్యవతిని వివాహమాడి, కన్యాకుబ్జంలో సుఖంగా ఉన్నాడు. ఒకసారి భృగుడు కొడుకుదగ్గరకు వచ్చాడు. కోడలు చేసే పరిచర్యలకు మెచ్చాడు. ఆమెను వరాన్ని కోరుకొనుమన్నాడు. 'నీ దయవలన నా కొక పుత్రుడు కలిగేటట్లు వరం ఇమ్ము' అని సత్యవతి ప్రార్థించింది. భృగుడు కరుణించి ఒక ఉపదేశం చేశాడు. కోడలు శుచిస్నాత అయిన తరువాత మేడిచెట్టును, ఆమె తల్లి, రావిచెట్టును కౌగిలించుకొనవలసిందని ఆదేశించాడు. ఆ తరువాత పొరపాటున వారిద్దరు వ్యత్యస్తంగా ఆ చెట్లను కౌగిలించుకొన్నారు. ఆ సంగతి భృగుడు తెలిసికొని ఇట్లా పలికాడు :

'సత్యవతీ! నీకు బ్రాహ్మణకుల పూజ్యుడైన పుత్రుడు పుట్టినా, వాడు పరాక్రమంతో దారుణ క్షత్రియ ప్రవృత్తితో వర్తిస్తాడు. నీతల్లికి పుట్టేవాడు క్షత్రియుడైనా తపస్వి అయి బ్రాహ్మణప్రవృత్తితో వ్యవహరిస్తాడు.' ఆమాట విని సత్యవతి తన కొడుకుకు కాక మనుమడికి ఆ దారుణ క్షత్రియ స్వభావం వచ్చేటట్లు అనుగ్రహించుమని ప్రార్థించి వరం పొందింది.

కొంతకాలానికి సత్యవతికి జమదగ్ని పుట్టాడు. అతడు ప్రసేనజితుడి కూతురైన రేణుకను పెండ్లాడాడు. వారిరువురికి ఐదుగురు కొడుకులు పుట్టారు. వారు - రుమణ్వంతుడు, సుషేణుడు, వసువు, విశ్వావసుడు, రాముడు అనేవారు. జమదగ్ని ఉగ్రతపస్సులో మునిగి ఉన్నాడు. ఒకనాడు కొడుకులందరూ అడవికి పండ్లు తెచ్చేందుకు పోయారు. రేణుక ఒక సరోవరంలో చిత్రరథుడనే రాజు భార్యలతో జలక్రీడలాడటం గమనించింది. ఆ దృశ్యాన్ని తిలకించిన ఆమె హృదయం చలించింది. ఆ మానసిక వ్యభిచారాన్ని తెలిసికొన్న జమదగ్ని మహర్షి కోపోద్రిక్తుడైనాడు. తల్లిని చంపండని కొడుకుల నాజ్ఞాపించాడు. మొదటి

నలుగురూ తండ్రి ఆనతిని తిరస్కరించారు. వారిని అడవులలో పక్షులుగా తిరగండని ఆయన శపించాడు. పరశురాముడు తండ్రిమాటను శిరసావహించి రేణుకశిరస్సును ఖండించాడు. జమదగ్ని మెచ్చి పరశురాముడిని వరాలు కోరుకొనుమన్నాడు. ఆతడు తల్లిని బ్రతికించుమన్నాడు. ఆమెను చంపిన పాపం తనకు రాకుండ అనుగ్రహించుమన్నాడు. సోదరుల శాపాన్ని తొలగించుమన్నాడు. యుద్ధాలలో తనకు ఓటమి లేని శక్తిని, దీర్ఘాయువును ప్రసాదించుమన్నాడు. తండ్రివలన ఆ వరాలన్నీ పొంది ఆనందంతో ఉన్నాడు.

కొంతకాలం తరువాత హైహయుడైన కార్తవీర్యుడు అపారసైన్యంతో ఆశ్రమానికి వచ్చాడు. జమదగ్నిచేత అతిథి సత్కారాలు పొందాడు. కాని, రాజ్యమదం గల అతడికి మెప్పు కలుగలేదు. అందుకని ఆశ్రమవాసులను అవమానించాడు. ఆశ్రమ వృక్షాలను ధ్వంసంచేశాడు. జమదగ్ని హోమ ధేనువును తరుణవత్సంతో (పసిదూడతో) సహా కట్టి లాగికొని పోయాడు. అప్పుడు అడవిలోనుండి సమిత్కుశఫలాలతో పరశురాముడు తిరిగివచ్చాడు. తండ్రివలన విశేషాలు తెలిసికొని, తండ్రి ప్రేరణతో కార్తవీర్యుడిని వెన్నంటి, ఎదురించి, యుద్ధంచేసి, అతడిని రణంలో చంపి కసితీర్చుకొన్నాడు. కపిల ధేనువును ఆశ్రమానికి తెచ్చాడు. తండ్రి మనస్సును సంతోషపెట్టాడు.

కార్తవీర్యుడి పుత్రులు పగపట్టారు. పరశురాముడు ఆశ్రమంలో లేని సమయం చూచికొని జమదగ్న్యాదులపై దాడిచేశారు. ఆశ్రమవాసులను అవమానాల పాలుచేశారు, జమదగ్నిని పట్టి కొట్టి హింసించి 'హా రామా!, హా రామా!' అని అతడు ఆక్రందనం చేస్తూ ఉండగా అతడిని దారుణంగా వధించారు. ఆ దారుణ సంఘటన చూచి రేణుక ఆశ్రమం దద్దరిల్లేటట్లు రోదించింది. పరశురాముడు వచ్చి జరిగినదంతా తెలిసికొని మదాంధులైన క్షత్రియులను సంహరిస్తానని ఘోరప్రతిజ్ఞ చేశాడు. రాజలోకాన్ని నిర్దాక్షిణ్యంగా తన పరశువుతో ఖండించి భూవలయాన్నంతా సాధించి, దానిని యజ్ఞదక్షిణగా కశ్యపుడికి దానం చేశాడు. చివరకు మహేంద్రపర్వతంమీద తపస్సు చేసికొంటూ నిత్యుడై ఉన్నాడు - అని చెప్పగా విని ధర్మరాజాదులు చతుర్దశినాడు పరశురాముడిని దర్శించి, పూజించి సంతుష్టులైనారు.

ధర్మరాజు అక్కడినుండి దక్షిణగంగ అయిన గోదావరీనదిని దర్శించి అందులో స్నానం చేసి, గోదానాలు, హేమరత్నదానాలు చేసి బ్రాహ్మణులను పూజించాడు. అక్కడినుండి ద్రవిడదేశంలోని అగస్త్యతీర్థాన్ని సేవించాడు. అక్కడ పూర్వం అర్జునుడు చేసిన దానాలను గురించి తెలిసికొని సంతోషించాడు. ఆపై క్రమంగా శూర్పారక తీర్థాన్నీ, సముద్ర తీరంలోని ప్రభాస తీర్థాన్నీ దర్శించాడు. అక్కడ పన్నెండు రోజులు పంచాగ్ని మధ్యంలో గాలిని నీరును సేవిస్తూ తపస్సు చేశాడు.

ఆ సంగతి తెలిసికొని బలరామకృష్ణులు వచ్చి తీర్థయాత్రాసేవలలో కృశించిన పాండవులను, ద్రౌపదిని చూచి, ఓదార్చారు. అర్జునుడి దివ్యాస్త్ర లాభవృత్తాంతాన్ని విని సంతోషించారు. బలరాముడు కౌరవుల దుర్గుణాలను నిందించాడు. కౌరవులను రాజ్యభ్రష్టులను చేసి, ధర్మాత్ములైన పాండవులకు రాజ్యం చెందేటట్లు చూడాలని తమవారిని ప్రోత్సహించాడు. అతడి మాటలను సాత్యకి సమర్థించాడు. వారిద్దరి మాటలను శ్రీకృష్ణుడు సమర్థించి, శత్రువులను జయించి ధర్మజుడికి రాజ్యం కట్టబెడతామని అన్నాడు. ధర్మరాజు తాను భీష్మాదుల యెదుట చేసిన ప్రతిజ్ఞను వమ్ముచేయటం ధర్మం కాదని శ్రీకృష్ణాదులకు నచ్చచెప్పి, వారిని ద్వారకకు తిరిగి పంపాడు.

ధర్మరాజు క్రమంగా పుణ్యతీర్థాలను సేవిస్తూ నర్మదలో స్నానం చేసి వైడూర్యపర్వతాన్ని దర్శించాడు. అక్కడి శర్యాతి యజ్ఞ స్థలాన్నీ, చ్యవనుడు ఇంద్రుడిని మన్నించక అశ్వినులను సోమపీథులను చేసిన సోమమిశ్రిత తీర్థాన్నీ చూచి, ఆ కథను చెప్పుమని రోమశుడిని అడిగాడు. అప్పుడు రోమశుడు సౌకన్యాఖ్యానం చెప్పాడు.

**సుకన్య కథ :**

భృగుపుత్రుడైన చ్యవనుడు వీరాసనంలో పెక్కేండ్లు తపస్సు చేశాడు. అతడి మీద పుట్టలు గుట్టలు పెరిగాయి. అతడి కన్నులు మాత్రం మిలమిల లాడుతూ ఆ పుట్టలో మెరుస్తూ ఉంటాయి.

ఒకసారి శర్యాతి అనేరాజు తన నాలుగువేల మంది రాణులతో అక్కడికి వనవిహారానికై వచ్చాడు. అతడి కూతురు సుకన్య చెలికత్తెలతో తిరుగుతూ చ్యవనుడి కనుల కాంతులను చూచి మిణుగురు పురుగులుగా భ్రమించి ఆపుట్టను త్రవ్వించింది. అందుకు చ్యవనుడు కోపించి శర్యాతి సైన్యానికి మలమూత్రాలు కట్టుకొనేటట్లు చేశాడు. ఆ విపత్తుకు కారణం తెలియక రాజు తహతహలాడాడు. సుకన్య పోయి తాను చేసిన పొరపాటును తండ్రికి చెప్పింది. శర్యాతి చ్యవనుడి వద్దకు వచ్చి తనకూతురి తప్పును మన్నించి సైన్యాన్ని కాపాడుమని ప్రార్థించాడు. చ్యవనుడు సుకన్య నిచ్చి వివాహం చేస్తే మేలుచేస్తానన్నాడు. శర్యాతి దాని కంగీకరించి సుకన్యా చ్యవనుల వివాహం జరిపించి సుఖంగా నగరానికి వెళ్ళాడు.

వృద్ధుడైన చ్యవనుడితో నవయౌవన విలాసవతి అయిన సుకన్య కలిసి కాపురం చేస్తున్నది. ఒకనాడు అశ్వినీ దేవతలు ఆమెకు ఎదురుపడి ఆమె యౌవనం వృద్ధుడైన పతివలన అడవికాచిన వెన్నెలై పోతున్నదని జాలిపడి, ఆమె కోరితే ఆమె వయోరూపాలకు తగిన వరుడిని సృజిస్తామని అడిగారు. ఆమె తనభర్తయందలి అనురాగంతో వారి మాటలను తృణీకరించింది. అంతేకాదు, వారి మాటలు తన మగడికి తెలియజెప్పింది. చ్యవనుడు ఆమె ఉత్తమ శీలానికి హర్షించి అశ్వినీదేవతలు చెప్పినట్లు అంగీకరించుమన్నాడు. మరునాడు అశ్వినీదేవతలను 'తనకు తగిన యువవరుడిని' వరంగా కోరింది. వారు సమీప సరోవరంలో ప్రవేశించారు. వారితోపాటు చ్యవనుడు కూడా ఆ నీటిలో మునిగాడు. అందరూ ఒకే విధమైన నవయౌవన విలాసాకారులై వెలుపలికి వచ్చారు. వారిలో ఒక్కరిని వరుడిగా కోరుకొమ్మన్నారు అశ్వినులు. సుకన్య తన భర్తనే ఎన్నుకొన్నది. అందుకు అశ్వినులు హర్షించి ఆమెను ఆశీర్వదించారు. తనకు నవయౌవనం రావటంలో తోడ్పడిన అశ్వినులను శర్యాతిచేత చేయించే యజ్ఞంలో సోమపీథులను చేస్తానని చ్యవనుడు వాగ్దానం చేశాడు. అశ్వినులు సంతోషించారు.

ఇచ్చిన మాట ప్రకారం ఆ తరువాత చ్యవనుడు శర్యాతిచేత యజ్ఞం తానే చేయించి, అందులో ఇంద్రుడు వలదని వారించినా అతడితో వాదించి అశ్వినులకు సోమపానం అందించబోయాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో చ్యవనుడిని చంపబోయాడు. ఆ మహర్షి అగ్నిలోనుండి మదుడనే రాక్షసుడిని సృష్టించి ఇంద్రుడిపై ప్రయోగించాడు. అతడి రౌద్రానికి భయపడి ఇంద్రుడు చ్యవనుడిని శరణువేడాడు. అశ్వినులను సోమార్హులుగా ఇంద్రు డంగీకరించాడు. చ్యవనుడు ఆ రాక్షసుడిని మద్య స్త్రీ మృగయాక్షాలను ఆశ్రయించుమని నిర్దేశించాడు. అశ్వినులు సోమపీథులై సంతృప్తి చెందారు.

**మాంధాతృ చరిత్రం :**

ధర్మజుడు యమునానదిని దర్శించాడు. దాని తీరంలో మాంధాతృడు బహు సంవత్సరాలు యజ్ఞాలు చేశాడని రోమశుడు చెప్పాడు. మాంధాతృ వృత్తాంతం చెప్పుమని ధర్మరాజు రోమశుడిని అడిగాడు. ఆ ముని ఈ విధంగా చెప్పాడు.

పూర్వం యువనాశ్వుడనే ఇక్ష్వాకు వంశ ప్రభువు వేయి అశ్వమేధయాగాలు చేసి కీర్తికెక్కాడు. కానీ, అతడికి సంతానం లేదు. సంతానార్థి అయి భృగుడి ఆశ్రమానికి వెళ్ళి చాలాకాలం అతడిని సేవించాడు. భృగుడు కరుణించి అతడిచేత పుత్రకామేష్టి చేయించాడు. అందులో మంత్రజలంతో నిండి పుత్రుడు కలగటానికి కారణమైన ఒక కలశం ఉద్భవించింది. దానిని ఒకరాత్రి మునుల రక్షలో ఉంచాడు. మును లా రాత్రి అలసి నిద్రపోయారు. యువనాశ్వుడు అర్ధరాత్రివేళ దప్పికకు తాళలేక ఆ కలశంలోని నీటిని తెలియక త్రాగాడు. మరునాడు భృగువు ఆ సంగతి తెలిసికొని రాణి త్రాగవలసిన మంత్రజలాన్నే యువనాశ్వుడు త్రాగటం వలన అతడికే ఒక కొడుకు పుట్టుతాడని చెప్పాడు. రాజు రాజధానికి చేరాడు. నూరేండ్లకు యువనాశ్వుడి ఎడమ ప్రక్కను చీల్చుకొని ఒక కొడుకు పుట్టాడు. బాలసూర్యుడివలె వెలిగిపోయే అతడిని దర్శించటానికి ఇంద్రుడు వచ్చాడు. ఆతడి నోటిలో తన జుట్టనవ్రేలును పెట్టి అమృతమయమైన దానిని త్రావుమన్నాడు. (మాం= నన్ను; ధయ= త్రాగుము (ధేట్= పానంచేయటం); నన్ను (ఇంద్రుడిని, అమృతాన్ని) పానంచేసే వాడు= మాంధాతృడు-అనే అర్థం కలిగించే మాటలన్నాడు ఇంద్రుడు ఆ సమయంలో.) ఆ ఇంద్రుడి మాటలు ఆధారంగా దేవతలందరు అతడిని మాంధాతృడని పేరుపెట్టి పిలిచారు. అతడికి ధ్యానమాత్రంతో వేదశాస్త్రాలన్నీ వచ్చాయి. ధనుర్వేదం, శస్త్రాస్త్రప్రయోగ నైపుణ్యం అలవడ్డాయి. ఇంద్రు డాతడిని భూతలానికి ప్రభువుగా అభిషిక్తుడిని చేశాడు. తన అర్ధ సింహాసన గౌరవాన్నిచ్చి మన్నించాడు. ధనువునూ, అభేద్యకవచాన్నీ

ప్రసాదించాడు. వాటితో మాంధాతృడు సకలలోకాలను జయించి, సంపూర్ణ దక్షిణలతో అనేక యజ్ఞాలు చేసి, పద్మసంఖ్యల గోవులను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు. ఒకసారి దేశంలో అనావృష్టి ఏర్పడగా ఇంద్రుడితో యుద్ధం చేశాడు. బాణాలతో ఏనుగులను కొట్టినట్లు మేఘాలను కొట్టి వానలు కురిపించాడు. అటువంటి మాంధాతృడు యజ్ఞంచేసిన పుణ్యస్థలాన్ని ధర్మరాజు దర్శించాడు.

**సోమకుడి చరిత్రం :**

పూర్వం కురుక్షేత్రంలోని సరస్వతీ నదీ తీరంలో సోమకుడు యజ్ఞం చేసి నూరుమంది కొడుకులను కన్న వృత్తాంతాన్ని రోమశుడు చెప్పగా, ఆ కథను వివరించుమని ధర్మజు డడిగాడు.

సోమకుడు మహాయజ్ఞం ఒకటి చేసి జంతుడు అనే కొడుకును పొందాడు. సోమకుడికి నూర్గురు భార్యలు. వారందరూ ఆ బాలుడిని సమమైన ప్రేమతో పెంచారు. ఒకనాడు ఆ బాలుడి తొడకు చీమ కుట్టింది. అతడు ఆ ఆవేదన భరించలేక పెద్దగా ఏడ్వటం మొదలు పెట్టాడు. తల్లులందరు గుమికూడి అతడిని లాలించారు. సోమకుడు ఆ ఆక్రందన విని నిండు కొలువునుండి వచ్చి కొడుకును ఓదార్చాడు. ఆ పరిస్థితిని గమనించి తనకు ఒకడికంటె ఎక్కువమంది కొడుకు లుండటం అవసరమని గుర్తించి మంత్రులను, ఋత్విక్కులను పిలిపించి వారిని బహుపుత్రలాభానికి తగిన ఉపాయాన్ని చెప్పండని కోరాడు. వారందరూ ఆలోచించి సోమకుడి ఏకైక పుత్రుడైన జంతుడిని బలిపశువుగా చేసి, అతడి మెదడును హవ్యంగా హోమంచేసి, అగ్నిని తృప్తుడిని చేస్తే దానివలన నూరుగురు కొడుకులు పుడతారని సూచించారు. అంతేకాక జంతుడు బంగారుమయమైన ఎడమభాగంతో మరల పుట్టి అగ్రజుడుగా ఉంటాడని చెప్పారు. రాజు యజ్ఞానికి అంగీకరించాడు. ఋత్విజుడు జంతుడిని హుతం చేస్తుంటే రాణులు రోదించారు. ఆ యజ్ఞంనుండి వెలువడిన ధూమాన్ని వాసనచూచి రాణులు గర్భవతులైనారు. ఆ తరువాత రాణులు నవమాసాలు మోసి జంతుడు మొదలుగా నూరుగురు కొడుకులను కన్నారు. కొంతకాలానికి ఆ యజ్ఞం చేయించిన ఋత్విజుడు చనిపోయి నరకంలో పడి పడరాని యాతనలు అనుభవిస్తూ ఉన్నాడు. సోమకుడు మృతిచెంది పుణ్యలోకాలకు పోతూ ఋత్విజుడి నరకయాతనలు చూచి జాలి చెందాడు. తనవలన ఋత్విజుడికి నరకం వచ్చిందని తెలిసి, తన తపోయజ్ఞపుణ్యంలో కొంత ధారపోసి యముడి ఆజ్ఞ పొంది అతడికి కూడా ఉత్తమలోకాలు కలిగేటట్లు చేశాడు.

ఇట్లా అనేక తీర్థాలను దర్శింపచేస్తూ వాటి మహిమలు తెలిపే కథలు చెపుతూ రోమశుడు ధర్మరాజును కృతార్థుడిని చేస్తూ ఉన్నాడు. నాభాగుడు, అంబరీషుడు, నహుషుడు, యయాతి, భరతుడు యజ్ఞాలు చేసిన క్షేత్రాలను, నరనారాయణాశ్రమాన్ని దర్శించి ధర్మరాజు ప్లక్షావతరణం అనే యమునాతీర్థంలో స్నానం చేశాడు. ఆ తీర్థంలో పూర్వం భరతుడు స్నానం చేస్తూ సర్వలోకాలను దర్శించగలిగాడు. అట్లాగే ధర్మరాజు కూడా చూడగలిగాడు. అపుడే ఇంద్రుడి అర్ధ సింహాసనం మీద కూర్చొని శోభిల్లుతున్న అర్జునుడిని కూడా కన్నులారా చూచి ఆనందించాడు. అట్లా అనేక తీర్థాలను సేవిస్తూ భృగుతుంగ పర్వతాన్ని చేరాడు. అక్కడ శిబి చక్రవర్తి యజ్ఞం చేసిన క్షేత్రం చూచాడు. ఇంద్రాగ్నులు శ్యేన కపోతాల రూపాలలో వచ్చి, అతడి దానగుణాన్ని పరీక్షించిన కథను రోమశుడు ధర్మరాజుకు వివరించి చెప్పాడు.

**అష్టావక్ర చరితం :**

ఆ తరువాత ధర్మరాజు శ్వేతకేతుడి తపోవనం దర్శించాడు. అక్కడి సరస్వతీదేవి మనుష్య స్త్రీ రూపంతో శ్వేతకేతుడిని సేవించింది. మేనల్లుడు, మేనమామ అయిన అష్టావక్ర శ్వేతకేతులు అక్కడ ఉగ్రతపస్సు చేశారని రోమశుడు చెప్పాడు. అప్పుడు ధర్మరాజు అష్టావక్రచరిత్ర వినకోరాడు.

పూర్వం ఏకపాదుడు అనే మునివరుడు విద్యావంతుడై సుజాతను వివాహమాడి, అరణ్యంలో ఘోరతపస్సు చేస్తూ ఉన్నాడు. అత డెప్పుడూ శిష్యులచేత వేదాలను చదివిస్తూ ఉండేవాడు. చాలకాలానికి సుజాత గర్భవతి అయింది. ఆమె

గర్భంలో ఉన్న శిశువు తండ్రితో ఇట్లా అన్నాడు: 'విశ్రాంతి లేకుండా నిరంతరం వేదాన్ని చదవటంవలన విద్యార్థులు నిద్రచాలక జడమతులైపోతారు' అని ఉపాలంభించాడు. అందుకు ఏకపాదుడికి కోపం వచ్చింది. వేదాధ్యయనానికి వక్రంగా పలికాడు కాబట్టి ఆ గర్భస్థ శిశువు ఎనిమిది వంకలు గల శరీరంతో పుట్టేటట్లు ఏకపాదుడు శపించాడు. అందువలన ఆ శిశువు అష్టావక్రుడుగా పుట్టి ఆ పేరుతో ప్రసిద్ధికెక్కాడు.

సుజాతకు నెలలు నిండుతున్నాయి. ఇంట్లో నెయ్యి, నూనె, ఆహారపదార్థాలు నిండుకొన్నాయి. ప్రసూతి కానున్న సుజాత తన భర్తను వాటిని సంపాదించి ఇంట్లో ఉంచుమని కోరింది. ఏకపాదుడు ధనసంపాదనకై జనకమహారాజు చేస్తున్న యజ్ఞం దగ్గరికి పోయాడు. అక్కడ వందితో జరిగిన వాదంలో ఓడిపోయి నియమం ప్రకారం జలావాసం చేస్తూ అక్కడే బందీగా ఉండిపోయాడు.

ఇక్కడ ఆశ్రమంలో సుజాతకు అష్టావక్రుడు పుట్టాడు. అప్పుడే ఉద్దాలకుడి భార్య శ్వేతకేతువును కన్నది. అష్టావక్ర శ్వేతకేతు లిద్దరూ అన్యోన్యంగా ఏకోదరులవలె అన్నదమ్ములుగా పిలుచుకొంటూ పన్నెండేళ్ళు కలిసి విద్యాభ్యాసం చేశారు. ఉద్దాలకుడే ఇద్దరికి గురువు. ఒకనాడు అష్టావక్రుడు ఉద్దాలకుడిని తండ్రిగా పిలుస్తూ అతడి తొడమీద కూర్చున్నాడు. శ్వేతకేతువు దానిని సహించలేక అష్టావక్రుడిని 'నీతండ్రితొడమీద నీవు కూర్చో' అని పంపివేశాడు. అంతవరకు తనకు తండ్రి ఉద్దాలకుడే అని భావిస్తున్న అష్టావక్రుడు తల్లివలన తన తండ్రి సంగతి తెలిసికొని, మామగారైన శ్వేతకేతుని వెంటబెట్టుకొని జనకుడి యజ్ఞానికి పోయి, వందిని వాదంలో ఓడించి, తండ్రిని బందీ నుండి విడిపించి, ఆనందంగా ఆశ్రమానికి తీసికొనివచ్చాడు. ఇది అష్టావక్రుడి కథ.

ధర్మరా జనేక పుణ్యస్థలాలను దర్శిస్తూ భరద్వాజాశ్రమాన్ని చేరాడు. అక్కడ భరద్వాజ పుత్రుడైన యవక్రీతుడు విద్యాగర్వంతో విగతజీవుడైన కథను రోమశుడు ధర్మరాజుకు చెప్పాడు.

**యవక్రీతుడి కథ :**

రైభ్యుడు, భరద్వాజుడు, ప్రాణమిత్రులైన తపస్వులు. రైభ్యుడికి అర్వావసుడు, పరావసుడు అనే వా రిద్దరు కొడుకులు. ఇద్దరూ వేదవిద్యలో పండితులు. భరద్వాజుడి కొడుకు యవక్రీతుడు. అతడు తపస్సుతో వేదశాస్త్రాలన్నింటిని సాధించదలచి అగ్నిలో సంధార్యంబు సంధిస్తూ ఉగ్రతపస్సు చేశాడు. ఇంద్రు డాతడి తపస్సును సహించలేక వచ్చి తపస్సుకు కారణ మేమిటని అడిగాడు. చదువకుండానే చదువు లెల్ల రావాలని తపస్సు చేస్తున్నా నని యవక్రీతుడు చెప్పాడు. 'చదువు లెప్పుడూ గురువుల వద్ద నేర్చుకొన తగినవి. అట్లా నేర్చుకొనకపోతే ఎంతటి మంచివారికైనా మదమాత్సర్యాలు ఏర్పడతాయి. కాబట్టి గురుశుశ్రూషయే సద్విద్యోపాయం. తపస్సు కాదు' అని ఇంద్రుడు చెప్పి ఆ ప్రయత్నం మానుమని హితవు పలికాడు. కాని, యవక్రీతుడు ఇంద్రుడిమాట పట్టించుకొనక తపస్సు కొనసాగించాడు. ఇంద్రుడు అతడికి ఒక గుణపాఠం చెప్పాలని తలచుకొని ఒక ముసలివాడి రూపంతో వణుకుతూ గుప్పెళ్ళతో ఇసుకను తీసికొని గంగాప్రవాహానికి ఆనకట్ట కట్టటానికి ప్రయత్నిస్తూ కనపడ్డాడు. యవక్రీతుడు అతడిని చూచి నవ్వాడు. ఇంద్రుడు తన ప్రయత్నం యవక్రీతుడి ప్రయత్నం వంటిదే అని ఎగతాళి చేశాడు. అఘటమానమైన అర్థాన్ని గురించి ప్రయత్నం చేయటం తెలివితక్కువతనమని ఇంద్రుడు పలికాడు. అయినా, యవక్రీతుడు పట్టుదలతో తపస్సు చేసి ఇంద్రుడి వలన వేద వేదాంగ విద్యలను పొందాడు.

దేవేంద్రుడి అభిప్రాయాన్ని యవక్రీతుడు భరద్వాజుడికి తెలిపాడు. భరద్వాజుడు కూడ దేవగీతలలోని అర్థాలను వివరించి చెప్పి ఇంద్రుడి అభిప్రాయాన్నే బలపరిచాడు. తపస్సువలన విద్యను గడించినా గర్వాతిశయాన్ని పొందక రైభ్యుడి కొడుకులతో మాత్సర్యం పెట్టుకొనకుండా స్నేహంతో మెలగాలని హితవు పలికాడు. అందుకు యవక్రీతుడు అంగీకరించాడు. కాని, యథాప్రకారం అతడు మునిసభలలో తన విద్యావిభవాన్ని ప్రదర్శిస్తూ రైభ్యాశ్రమం చేరాడు. ఆ ఆశ్రమ వనంలో పరావసుభార్య రైభ్యుడి కోడలు అయిన కృష్ణను చూచి మోహితుడై ఆమె యెదుట తన కోర్కెను బయటపెట్టాడు. అంగీకరించకపోతే శపిస్తాడేమోననే భయంతో కృష్ణ సిగ్గును అభినయించి మరునాడు సంకేత స్థలానికి వస్తానని చెప్పి వెళ్లింది. జరిగిన దాన్ని రైభ్యుడికి నివేదించింది.

అతడు ఉగ్రుడై ఒక జటను అగ్నిలో వేసి కృష్ణవంటి మరొక వనితను, మరొకజటను కాల్చి భయంకర రాక్షసుడిని సృజించి యవక్రీతుడిని సంహరించటానికై వారిద్దరినీ నియోగించాడు. ఆ మాయాకృష్ణ సంకేతస్థలానికి పోయి యవక్రీతుడి కమండలాన్ని గ్రహించింది. దానితో అతడి తపోమహిమ నశించింది. ఆ పైన కృత్యాకారంతో ఉన్న రాక్షసుడు అతడిని భక్షించటానికి పూనుకొన్నాడు. యవక్రీతుడు పలాయనం చిత్తగిస్తూ అనేక జలాశయాల్లో దాగుకొనటానికి ప్రయత్నంచగా అవన్నీ ఎండిపోవటంతో అతడికి భద్రత లేకపోయింది. చివరకు యవక్రీతుడు తన ఇంట్లో ఉన్న యజ్ఞాగ్నిలో దూకబోయాడు. కాని, అంతలోనే రాక్షసుడు అతడిని పట్టి వధించాడు.

భరద్వాజుడు ఆశ్రమానికి తిరిగివచ్చి తనకొడుకు చనిపోవటం గమనించి అపారశోకానికి గురి అయి, ఆ కొడుకు చితి పై పడి తానూ మరణించాడు.

బృహద్ద్యుమ్నుడనే రాజు సత్రయాగం చేయ తల పెట్టి రైభ్యుడి కొడుకులను ఋత్విక్కులనుగా వరించాడు. యజ్ఞం నిర్విఘ్నంగా సాగుతున్నది. ఒకనాడు పరావసుడు ఒంటరిగా ఆశ్రమానికి వస్తున్నాడు. తెల్లవారు జామున చీకట్లో చిట్టడవిలో దూరంగా ఎదురుగా వస్తున్న తండ్రిని మృగంగా భ్రమించి ఆత్మసంరక్షణార్థం సంహరించాడు. ఆ తరువాత నిజం తెలిసి విచారించాడు. తండ్రికి అపరకర్మలు చేసి సత్రయాగశాలకు వెళ్ళి జరిగిన పొరపాటు అన్నకు నివేదించాడు. అన్నను బ్రహ్మహత్యాదోషానికి ప్రాయశ్చిత్తం చేయుమని వేడుకొన్నాడు. యజ్ఞాన్ని తా నొక్కడే నిర్వహించటానికి పూనుకొన్నాడు. అర్వావసుడు తమ్ముడి మాటను మన్నించి బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్త కాండను జరిపి తిరిగి వచ్చాడు. అప్పుడు పరావసుడు తన అన్న బ్రహ్మహత్య చేశాడని రాజుకు చెప్పి అతడిని యజ్ఞం నుండి వెలివేయించటానికి కపటోపాయం పన్నాడు. కాని, అర్వావసుడి సత్యవర్తనాన్ని అగ్నిపురోగాములైన దేవతలు ప్రకటించారు. అతడికి వరాల నివ్వటానికి ప్రసన్నులయ్యారు. అప్పుడు అర్వావసుడు తన తండ్రి అయిన రైభ్యుడేకాక మృతులైన భరద్వాజుడు, యవక్రీతుడుకూడా జీవించాలనీ, తనతమ్ముడు పరావసుడిచేత చంపబడినట్లు తన తండ్రికి జ్ఞాపకం ఉండకుండా చేయాలనీ వరాలు వేడుకొన్నాడు. దేవతలు, వాటిని ప్రసాదించారు. యవక్రీతుడు బ్రతికి, దేవతలను ఇట్లా అడిగాడు: 'నేనూ రైభ్యుడి వలెనే బహు వేదశాస్త్ర విజ్ఞానాన్ని ఆర్జించాను. కాని, రైభ్యుడిచేత నే నెందుకు చంపబడ్డాను? అతడి కా ఆధిక్యత ఎట్లా వచ్చింది? అని, ఆ ప్రశ్నకు దేవత లిట్లా సమాధానం చెప్పారు: 'గురుశుశ్రూష చేస్తూ అనేక కష్టాలకు లోనై సాధించిన విద్యలే మహిమాన్వితాలు. గురుముఖతః నేర్వని విద్యలు ఎప్పుడూ ప్రకాశించలేవు'. ఇదియే యవక్రీతుడి కథా సందేశం.

ఆపైన ధర్మరాజాదులు కాలశైలాన్ని, సప్తవిధగంగను దర్శించారు. మనుష్యులు చర్మచక్షువులతో చూడలేని మందర పర్వతాన్ని, కైలాస పర్వతాన్ని ఆ క్షేత్రంలో ధ్యానసమాధిలో ఉండి చూడగలిగారు. అప్పుడు ధర్మరాజు భీముడితో ఇట్లా అన్నాడు: 'నడవటానికి సాధ్యంకాని ఈ మార్గంలో రథాలతో పోవటం సాధ్యం కాదు. కాబట్టి నేనూ నకులుడూ కలిసి ముందున్న తీర్థయాత్రలు చేసివస్తాం. మిగిలిన మీరందరూ ఇక్కడే ఉండండి' అని. ఆ మాటలకు భీముడు అంగీకరించలేదు. ధర్మరాజును వీడి మేము క్షణముండ లేమని తెలిపారు. ధౌమ్యుడి సలహామేరకు పాండవులు తపోమహిమతో గంధమాదన పర్వతం చేరాలని నిశ్చయించారు. మార్గమధ్యంలో పుళిందపతి అయిన సుబాహుడి నగరంలో రథాలను, సేనలను, భృత్యులను ఉంచి పాదచారులై గంధమాదనంవైపు నడిచి, అర్జునుడిని అక్కడ చూడగలమనే ఉత్సాహంతో ముందుకు సాగారు.

మార్గమధ్యంలో పాండవులు పెను తుఫానుకు గురి అయ్యారు. ద్రౌపది ఆ గాలివానకు తట్టుకొనలేక మూర్ఛితురాలైంది. రాత్రింబవళ్ళు స్వీయరక్షణకొరకు పాండవులు కష్టపడ వలసి వచ్చింది. గంధమాదన పర్వతశిఖరాలు నిటారుగా ఉన్నాయి. ఎక్కటం సాధ్యంకాని పనిగా తోచింది. భీముడు ఘటోత్కచుడిని స్మరించాడు. అతడు రాక్షస సేనతో వచ్చి, పాండవులను, వారి పరివారాలను మూపులమీద ఎక్కించుకొని ఆకాశమార్గంలో పయనించి, గంగాతీరంలోని నరనారాయణాశ్రమంలోని బదరీవనంలో దింపాడు. ధర్మరాజాదులు భాగీరథిలో స్నానాలు చేశారు. సమాధియోగంలో నిలిచి మైనాకపర్వతాన్నీ, హిరణ్య శిఖరాన్నీ, బిందుసరస్సునూ దర్శించారు. బదరీవనంలో ఆరు రోజులున్నారు.

**సౌగంధికాపహరణం :**

ఒకనాడు ద్రౌపదీ భీములు గంధమాదన పర్వత సానువులలో విహరిస్తున్నారు. అప్పుడు వారి యెదుట సహస్రపత్రాలు గల కోమలమైన కమలపుష్ప మొకటి గాలికి ఎగిరి వచ్చి పడింది. దాని అపూర్వమైన అందానికీ, సుగంధానికీ ద్రౌపది మోజు పడింది. అటువంటిపూలు తనకు కావాలని భీముడిని కోరింది. ఆ అపూర్వ పుష్పాలను చూపటానికి ధర్మరాజు వద్దకు పోయింది. ద్రౌపది మనసుపడి కోరిన ఆ కోరికను తీర్చాలని భీముడు ఉత్సాహపడ్డాడు. గదాధనుర్ధరుడై ఆ పూవు గాలికి వచ్చిన దిక్కువైపు బయలుదేరాడు. ఘోరాటవులను, పర్వత శిఖరాలను దాటాడు. వన్యమృగాలను హేలగా చంపాడు. ఒక రమణీయ సరోవరాన్ని చూచి అందులో స్నానం చేశాడు. ఆ పైన విశాలమైన అరటి తోటలను చూచి, అందులో ప్రవేశించి శంఖాన్ని పూరించాడు. ఆ శంఖనాదం పిడుగుపాటువలె దిక్కులు పిక్కటిల్లేటట్లు చేసింది. ఒక కొండగుహలో ఉన్న హనుమంతుడు ఆ శంఖధ్వని విన్నాడు. అది భీమనాదమని పొంగిపోయాడు. భీముడి బాటలో చెట్లను విరిచి పడవేసి తాను అడ్డంగా పడుకొని, తోకతో నేలను తాడించాడు. ఆ మ్రోతకు భీము డాశ్చర్యపోయాడు. కదళీవనంలో తన దారి కడ్డంగా ఒక వృద్ధుడైన కోతి పడిఉండడం గమనించాడు. సింహనాదం చేశాడు. ముసలికోతిరాజు కన్నులు తెరిచాడు. 'జంతువులను హింసించటం మానవ ధర్మం కాదు కదా! మావంటి పేద జంతువులు భయపడేటట్లు సింహనాదం చేయటం న్యాయమా?' అని అడిగాడు వృద్ధకపీంద్రుడు. మనుష్య గోచరంకాని ఈ వనానికి వచ్చిన కారణమేమిటని భీమసేనుడిని ప్రశ్నించాడు.

భీముడు తనను గురించి వృద్ధవానరుడికి తెలియ చెప్పుకొని, తన బాటకు అడ్డం తొలగుమని కోరాడు. తొలగకపోతే శతయోజన విస్తీర్ణమైన సముద్రాన్ని హనుమంతుడు దాటినట్లుగా నిన్నూ, ఈ పర్వతాన్నీ దాటిపోతానని ప్రతాపోక్తులు పలికాడు. హనుమంతుడి గురించి ముసలికోతిరేడు అడుగగా ఆ రామభక్తుడి పరాక్రమాన్ని భక్తితో కీర్తించాడు భీముడు. హనుమ సంతోషించి, భీముడి బలాన్ని పరీక్షించదలచాడు. అతడిని తన తోకను ప్రక్కకు నెట్టి పొమ్మన్నాడు. భీము డెంత ప్రయత్నించినా ఆ వృద్ధకపీంద్రుడి, వాలాన్ని కదిలించలేక పోయాడు. చివరకు వృద్ధకపీంద్రుడికి నమస్కరించాడు. హనుమ కరుణించి భీముడి కోరికపై తాను పూర్వం మహార్ణవాన్ని దాటిన రూపాన్ని ప్రదర్శించి చూపించాడు. చతుర్యుగ ధర్మాలను బోధించాడు. భీముడు ధన్యుడై హనుమ యొక్క బృహద్రూపాన్ని దర్శించాడు, కీర్తించాడు. హనుమ నిజరూపం తాల్చి, సౌగంధిక సరోవరం యక్షరాక్షస సంరక్షితమనీ సాహసం కంటె ఉపాయం శ్రేయస్కరమనీ, సర్వకార్యాలు మంత్రమూలాలనీ భీముడికి ప్రబోధం చేశాడు. కౌరవులందరినీ మట్టుపెట్టి మహారాజ్యాన్ని పాండవులకు అప్పగిస్తానని పలికాడు. ఆ మాటలు విని భీముడు - 'కపినాథా! మీకు ఆ పని ఎంత? మేము మా శత్రువులను జయించగలం. మీ దయవలన మమ్మల్ని ఓడించగల వీరులు మా శత్రువులలో లేరు' అని అన్నాడు. ఆ మాటలు విని హనుమంతుడు సంతసించి, 'నన్ను రణరంగంలో స్మరించండి. అర్జునుడి రథకేతనం మీద నిలిచి మీ పరాక్రమాల నన్నింటిని చూస్తాను' అని అనుగ్రహించి భీముడిని కౌగిలించుకొని సౌగంధిక సరోవరమార్గం చూపి అంతర్ధానం చెందాడు.

మదించిన ఏనుగుల గుంపులవలె క్రమ్ముకొంటున్న మేఘమాలికలను చూస్తూ భీముడు బంగారుకమలాలపై నుండి వీస్తున్న గాలికి సంతోషిస్తూ సౌగంధిక సరోవరం వద్దకు చేరాడు. రక్షకభటులైన యక్షరాక్షసులు అతడిని వారించారు. అది కుబేరవనమనీ, అందులోకి ఎవరూ పోలేరనీ, పోతే ప్రమాదమనీ, ఆ సరోవరం కుబేర క్రీడావినోదకేంద్రమనీ, దాని తీరంలో దేవర్షిగణాలు దేవతార్చనలు చేసికొంటూ ఉంటారనీ, ఆ సరోవరజలం అమృతతుల్యమనీ, అందులోని కమలాలు అపూర్వ వాసనలుగల బంగారు పూలనీ, వాటివి వైడూర్యనాళాలనీ వివరాలు చెప్పి, సాహసించ వద్దని హెచ్చరించారు. భీముడు సౌగంధిక పుష్పాల కొరకు వచ్చాడని తెలిసికొని, దానికి కుబేరుడి అనుమతి కావాలని పేర్కొన్నారు. ఆ మాటలు విని భీముడు మండిపడ్డాడు. ప్రకృతి పదార్థాలపై అందరికీ అధికార ముంటుందనీ, సత్క్షత్రియుడు ఎవరినీ యాచించడనీ తన పరాక్రమంతో అన్యధనాన్ని ఉపార్జించి అర్థులకు పంచిపెట్టటం అతడి ధర్మమనీ - తన చర్యను సమర్థించుకొంటూ సౌగంధిక సరోవరంలో దిగి జలాలు త్రాగి పుష్పాలు కోసికొని నిర్భయంగా బయటికి వచ్చాడు. అధిక బలసంపన్ను డయ్యాడు. కుబేరుడి భటులు భీముడితో యుద్ధానికి తలపడి ఓడి, పారిపోయి కుబేరుడికి నివేదించుకొన్నారు. భీముడు పాంచాలిని సంతోషపెట్టటానికి మాత్రమే చేసిన ఆ వీరకృత్యాన్ని తెలిసికొని కుబేరుడు మెచ్చుకొని మిన్నకున్నాడు. భీముడు విజయోత్సాహంతో సమీపవనంలో విహరిస్తున్నాడు.

ధర్మరాజాదు లున్నచోట మహోత్పాతాలు గోచరించాయి. అవి భీముడి యుద్ధం వలన కలిగిన ఫలితాలుగా ఊహించాడు- ధర్మరాజు. భీముడు సౌగంధికపుష్పాల కొరకై వెళ్ళినట్లు ద్రౌపదివలన తెలిసికొని వెంటనే ఘటోత్కచుడు మొదలైన వారి మూపులపై అందురూ ఎక్కి సౌగంధిక సరోవరతీరానికి వెళ్ళి భీముడిని కలిసికొన్నారు. భీముడిని ఏకాంతంగా సాహసాలు చేయవద్దని ధర్మరాజు హెచ్చరించాడు. ఆ తరువాత ఆ ప్రాంతంలో నివాసాలు ఏర్పరచుకొని నివసించారు. ఘటోత్కచాదులను వారి నిజప్రదేశాలకు పంపివేశారు.

**జటాసురవధ :**

జటాసురుడనే రాక్షసుడు బ్రాహ్మణ వేషంతో పాండవుల అండజేరి నివసించసాగాడు. తాను వేదవిదుడననీ, ధనుర్వేదవిదుడైన పరశురామ శిష్యుడననీ చెప్పి, వారిని నమ్మించాడు. ఒకనాడు భీముడు వేటకు పోయాడు. జటాసురుడు నిజాకారం ప్రకటించి ద్రౌపదినీ, ధర్మజనకులులనూ వారి ఆయుధాలనూ ఎత్తుకొని ఆకాశానికి ఎగసి వేగంగా వెళ్ళటమారంభించాడు. ధౌమ్యాదులు భయవిహ్వలు లయ్యారు. సహదేవుడు భీముడిని పిలుస్తూ అడవులలో తిరిగాడు. భూమిపై నుండే జటాసురుడిపై దాడి సాగించాడు.

ధర్మరాజు ధర్మబుద్ధితో ఆ రాక్షసుడికి హితవు పలికాడు. 'దేవతలూ, రాక్షసులూ మానవులకు సుఖాల నందిస్తూ ఈ మనుజలోకాన్ని ఉపజీవించి ఉంటారు. ఆ మానవులను కాపాడేవాళ్లం మేము. అటువంటి మాకు అపకారం చేయటం నీకు ధర్మం కాదు. అన్నంపెట్టినవారికి అన్యాయం చేయకూడదనే కనీసధర్మంకూడ నీకు తెలిసినట్లులేదు. మా ఆయుధాలు మా కిచ్చి మాతో యుద్ధం చేయు' మన్నాడు. ఆ అసురుడు మాట వినలేదు. ధర్మజుడు అతడికి భారమయ్యేటట్లు నొక్కి పట్టాడు. జటాసురుడు ఉక్కిరిబిక్కిరై వేగం తగ్గించాడు.

అంతలో భీముడు రంగంలోకి దూకాడు. పరిస్థితిని గమనించాడు. రాక్షసుడిపై మండిపడ్డాడు. 'దుర్మార్గా! నీవు మాయింటికి అతిథివై వచ్చి, మాయింట కుడిచి రాక్షసుడివై మాకే అపకారం తలపెడతావా? అన్నం తిన్న చోటుకు అపకారం ఎటువంటి దుర్మార్గులు కూడా చేయరు. నీకు నిజంగా బుద్ధి ఉంటే వీరిని విడిచి పెట్టి, నీప్రాణాలు రక్షించుకో. లేదా హిడింబుడు, కిమ్మీరుడు చచ్చినట్లే నాచేతులలో నీ చావు మూడింది' అని మందలించాడు. జటాసురుడు మాట వినకపోగా భీముడినే చంపి హిడింబ కిమ్మీరులకు రక్తతర్పణా లిస్తానని ప్రగల్భా లాడాడు. భీముడు ఆగ్రహోదగ్రుడై జటాసురుడిపై లంఘించాడు. జటాసురుడు ధర్మరాజాదులను నేలపై దింపి, భీముడిపై తలపడ్డాడు. ఇరువురి నడుమ ద్వంద్వయుద్ధం ఘోరంగా జరిగింది. చివరకు భీముడు జటాసురుడిని పిడికిలితో పొడిచి క్రింద పడవేసి, మరల పైకెత్తి రాతిపై కొట్టి ముక్కలు చేసి చంపాడు. వాయుపుత్రుడి పరాక్రమాన్ని అందరూ ప్రశంసించారు.

**యక్ష యుద్ధం :**

పాండవులు నరనారాయణాశ్రమంలో కొన్ని రోజు లున్నారు. అర్జునుడు దివ్యాస్త్రాలను సంపాదించటానికై వెళ్ళి అప్పటికి ఐదేళ్లయింది. అన్నేళ్ళు అర్జునుడిని విడిచి ఉన్నందుకు, అతడిని చూడనందుకు ధర్మరాజు దిగులుపడ్డాడు. ఆ ప్రాంతంలో అర్జునుడి పునస్సమాగమం కలుగుతుందన్న ఆశతో పాండవులు ఉన్నారు. రోజులు లెక్కపెట్టుకొంటున్నారు.

గంధమాదన పర్వతంలోని పుణ్యతీర్థాల నన్నింటినీ సేవించారు. పదునేడవ రోజున వృషపర్వుడనే రాజర్షి ఆశ్రమం చేరుకొన్నారు. ఆతడిచేత అతిథి పూజలు పొంది అక్కడ ఏడురోజులున్నారు. బ్రాహ్మణులనందరినీ అక్కడ ఉంచి ధౌమ్యరోమశాదులతో కలిసి ధర్మజాదులు మాల్యవంత పర్వత ప్రాంతంలోని మనోహరమైన వనాలలో శ్వేతకీనదీతీరంలో విహరిస్తూ ఉన్నారు. అప్పుడు అయిదురంగుల వింత వాసనపూలు కొన్ని గాలికి ఎగిరి వచ్చి పాండవుల ముందు పడ్డాయి. అవి సౌగంధిక కనకపుష్పాలకంటె దివ్యసుగంధాలను వెదజల్లుతున్నాయి. వాటిపై ద్రౌపదికి మోజు కలిగింది. ఒకనాడు ఏకాంతంగా తన కాపువ్వులను తెచ్చిపెట్టుమని భీముడిని కోరింది. ద్రౌపదికి హృదయానందం కలిగించాలనే యత్నంతో భీముడు పూవులను

తేవటానికి ప్రయాణమయ్యాడు. చక్రవాళపర్వతం వలె ఎత్తుగా ఉండే ఆ పర్వతం ఎక్కాడు. అక్కడ వివిధ రత్నకాంతులతో వెలిగిపోతున్న కుబేరుడి నివాసాన్ని చూచాడు. భీముడు శంఖధ్వానం చేశాడు. అక్కడి యక్షసైన్యం ఒక్కుమ్మడిగా భీముడిపై దాడిచేసింది. వారి దాడిని ఎదుర్కొని భీముడు వారిని పోరులో ఓడించాడు. వారు పారిపోయారు. అయితే కుబేరుడి స్నేహితుడైన మణిమంతుడు లక్షలాది రాక్షసభటులను వెంటపెట్టుకొని భీముడిపై యుద్ధానికి సిద్ధమైనాడు. మణిమంతుడు బాణాలవర్షాన్ని భీముడిపై కురిపించాడు. ఒక గొప్ప గదను అతడిపై విసిరాడు. భీముడు వాటిని వమ్ముచేశాడు. మణిమంతుడు తన బంగారు దండంలోనుండి ఒక శక్తిని పుట్టించి భీముడిపై ప్రయోగించాడు. అది భీముడి భుజానికి తగిలి క్రిందపడిపోయింది. మణిమంతుడు శక్తిమంతమైన త్రిశూలాన్ని భీముడిపై విసిరాడు. అది నిప్పులు క్రక్కుకుంటూ వచ్చింది. భీముడు దానిని గదతో భగ్నంచేశాడు. రాక్షసులను చాలా మందిని చంపాడు. మణిమంతుడు భయభ్రాంతుడై ఆకసానికి ఎగసి యుద్ధం చేశాడు. భీముడు లంఘించి గదతో నేలమీద పడవేసి చంపాడు. మిగిలిన రాక్షససైన్యం తూర్పుదిక్కుకు పారిపోయింది.

భీముడు ఏకాకిగా పూలకొరకు పోయిన సంగతి ద్రౌపది చెప్పగా ధర్మరాజు తెలిసికొని, ద్రౌపదిని ధౌమ్యాదులను ఆర్ష్టిషేణుడనే ముని ఆశ్రమంలో ఉంచి, రోమశ నకుల సహదేవులతో కలిసి ఆ పర్వతశిఖరం ఎక్కి కుబేరుడి భవనం దగ్గర చనిపోయిన రాక్షసవీరుల మధ్య ఏకవీరుడై నిలిచి ఉన్న భీముడిని చూచి సంతోషించాడు.

రాక్షసవీరుల వలన జరిగిన సంగతి తెలిసికొని, కుబేరుడు భీముడి పరాక్రమానికి ఆశ్చర్యం చెంది గరుడ గంధర్వ యక్ష రాక్షస సైన్యంతో రణరంగానికి వచ్చి పాండవులను చూచాడు. పాండవులు కుబేరుడికి నమస్కరించారు. కుబేరుడు ఇట్లా అన్నాడు : 'ధర్మరాజా! నీ తమ్ముడైన భీముడు నామిత్రుడైన మణిమంతుడిని చంపి నాకు ఉపకారమే చేశాడు కాని అపకారం చేయలేదు. ఎందుకంటే మణిమంతుడికి అగస్త్యుడి శాపం ఉన్నది. ఒకసారి నేను, దేవతలు చేస్తున్న యజ్ఞానికి నా మిత్రులతో, పరివారంతో, శతమహాపద్మ సంఖ్యగల రాక్షససైన్యంతో ఆకాశమార్గాన పోతున్నాను. భూతలం మీద యమునా నదీతీరంలో అగస్త్యమహర్షి ఉగ్రమైన తపస్సు చేసికొంటున్నాడు. నా మిత్రుడు మణిమంతుడు పొరపాటున గగనంలో ఉమ్మివేయగా అది నేలపై తపస్సు చేస్తున్న అగస్త్యుడి పై పడింది. దాని కతడు కోపించి మణిమంతుడు ససైన్యుడై ఒక మనుజుడిచేత చంపబడుతాడనీ, ఆ మనుజుని దర్శించటంచేత నాకు పాపం తొలగుతుందనీ పలికాడు. ఆ శాపం వలన మణిమంతుడు ససైన్యుడై మరణించాడు. నేను మీ దర్శనంవలన పాపవిముక్తుడ నైనాను' అని చెప్పాడు.

అంతటితో ఆగక ధర్మరాజుకు ఒక హితవు కూడా తెలిపాడు. 'ధర్మవిదుడైన క్షత్రియుడు ఐదు విధాలైన లోకతంత్రాన్ని తెలిసికొని వర్తించాలి. ధృతి, దాక్ష్యం, ఉపదేశం, కాలం, పరాక్రమం అనేవి పంచవిధ లోకతంత్రాలు. వాటి విధి విధానాలు తెలియకుండా సాహసంతో వృథారంభం చేసేవారికి పాతకం కలుగుతుంది. కాబట్టి నీ విమలజ్ఞాన నిష్ఠమైన బుద్ధితో నీతమ్ముడైన భీముడిని సుశిక్షితుడిగా చేయాలి. నీవూ నీ తమ్ములూ ధర్మ, అనిల, శక్ర, అశ్వినుల చేత సదా రక్షించబడుతూ ఉన్నారు. నేను కూడా మిమ్మల్ని రక్షిస్తూ ఉంటాను. మీరు ఒక పక్షం రోజులు, ఆ ఆర్ష్టిషేణాశ్రమంలో ఉండండి. అర్జునుడు ఇంద్రుడి వద్దనుండి తిరిగి వచ్చి మిమ్మల్ని కలిసికొంటాడు. మీ కోరికలు సఫలమౌతాయి' అని చెప్పి కుబేరుడు అంతర్ధానమయ్యాడు.

ఆ పక్షం రోజులలో ధర్మజుడు ధౌమ్యుడి తపోబలంవలన ఆతడు చూపిస్తూ ఉండగా మందరనగాన్నీ, మేరుపర్వతాన్నీ చూచి, ఎనిమిది దిక్కుల వసించే దేవతలను దర్శించాడు. పాండవులక్కడ మొత్తం ఒకనెల రోజులున్నారు. ఒకనాడు ఆకాశమార్గం నుండి మాతలి నడిపే దివ్య రథాన్ని అధిరోహించి, అన్ని దిక్కులా కాంతులు వెదజల్లుతూ అర్జునుడు వచ్చి ధర్మజాదులను సగౌరవంగా, ఆప్యాయంగా కలిసికొన్నాడు. ఆరాత్రి సోదరులకు తన అనుభవాల నన్నింటిని అర్జునుడు కథలు కథలుగా వివరించి చెప్పి, వారిని సంతోషపరిచాడు.

**ఇంద్రదర్శనం :**

మరునాడు ఉదయం దేవేంద్రుడు సకల దిక్పాలక దేవసేనా సహితుడై పాండవు లున్నచోటికి వచ్చాడు. ధర్మజుడు ఇచ్చే భక్తిపూజలను గ్రహించి అర్జునుడిని గురించి ధర్మజాదులతో ఈవిధంగా చెప్పాడు : 'ఘనుడైన ఈ పార్థుడు నావలన

దివ్యాస్త్రాలను ప్రయోగ విజ్ఞాంతో సహా పొందాడు. దుర్మార్గులైన నివాతకవచు లనే రాక్షసులను సంహరించి దేవతలకు ఎంతో హితం చేశాడు. ఇతడు తన పరాక్రమంతో శత్రువులను జయించి మహాసామ్రాజ్యాన్ని నీకు ప్రఖ్యాతంగా సమకూరుస్తాడు. అర్జునుడు మహాతేజుడు. అతడిని ఎవ్వరూ జయించలేరు'. ఈ మాటలు పలికి ఇంద్రుడు సపరివారంగా అమరావతికి వెళ్ళాడు.

కుబేర, ఇంద్ర, పాండవ సమాగమాన్ని వర్ణించే ఈ ఘట్టాన్ని ఎవరైనా సరే బ్రహ్మచర్య దీక్షతో ఒక సంవత్సరకాలం రోజూ వింటే, చదివితే వారు నూరేళ్ళు తేజోవంతులుగా జీవిస్తారు.

**నివాతకవచ నిర్మూలనం :**

ఇంద్రుడు సంగ్రహంగా చెప్పిన అర్జునవిజయగాథను వివరించుమని ధర్మజుడు కోరగా అన్నకు పార్థుడు వివరించి చెప్పాడు. ఆ కథాసార మిది -

ధర్మరాజు నియోగించినట్లు పార్థుడు హిమవత్పర్వతానికి వెళ్ళాడు. అక్కడ వృద్ధ బ్రాహ్మణుడి వేషంలో ఇంద్రుడు ప్రసన్నుడైనాడు. అతడి ఆజ్ఞ చొప్పున పరమేశ్వరుడిని గురించి పార్థుడు ఉగ్రతపం చేశాడు. పరమేశ్వరుడు మొదట కిరాత రూపంలో వచ్చి పార్థుడితో ఘోరయుద్ధం చేశాడు. చివరకు నిజ స్వరూపంతో ప్రత్యక్షమై పాశుపతాస్త్రాన్ని ప్రసాదించాడు. ఆ తరువాత ఇంద్రాది దేవతలు ఐంద్రం, ఆగ్నేయం, యామ్యం, రాక్షసం, వారుణం, వాయవ్యం, కౌబేరం, గాంధర్వం, పైశాచం, బ్రాహ్మ్యం అనే దివ్యాస్త్రాలు ప్రసాదించారు. ఆ తరువాత ఇంద్రుడు పంపిన దివ్యరథ మెక్కి అర్జునుడు అమరావతికి వెళ్ళాడు. అక్కడ ఇంద్రుడిని ఆచార్యుడిగా ఆరాధించి, అతడివలన అనేక దివ్యాస్త్రాలను ప్రయోగ, ఉపసంహరణ, నివర్తన, ప్రాయశ్చిత్త, ప్రతిఘాత ప్రక్రియలతో నేర్చుకొన్నాడు. ఈ తరువాత ఇంద్రుడు పార్థుడిని మించిన అస్త్రశస్త్ర కోవిదుడు మరొకరు లేడనీ, అతడిని యుద్ధంలో మరొకరు జయించలేరనీ ప్రకటించాడు. ఆ అమోఘాస్త్ర శస్త్ర పాండిత్యంతో దేవతలకూ, బ్రాహ్మణులకూ హితం చేకూర్చుమని ఇంద్రుడు పార్థుడికి హితవు చెప్పాడు.

నివాతకవచులను సంహరించి, గురుదక్షిణగా సమర్పించుమని ఇంద్రుడు పార్థుడిని కోరాడు. తాను ధరించిన దివ్యకిరీటాన్నీ, భూషణాలనూ స్పర్శరూపమైన అభేద్యకవచాన్నీ అర్జునుడికి అలంకరించి, ఒక గొప్ప అల్లెత్రాటిని తానే స్వయంగా గాండీవానికి తొడిగి, పదివేల మేలిమి గుర్రాలతో కూర్చిన దివ్యరథాన్ని సిద్ధంచేయించి, మాతలిని సారథిగా నిలిపి, పార్థుడిని రథికుడిగా ఎక్కించి, యుద్ధయాత్రకు ఇంద్రుడు స్వయంగా పంపాడు. 'ఇదివరలో దేవేంద్రుడు ఆ రథం మీదనే మహాయుద్ధాలు చేసి వృత్ర, శంబర, బలాదులైన మహారాక్షసులను సంహరించాడు. అట్లాగే నీవూ విజయుడవు కమ్ము' అని ఆశీర్వదిస్తూ పార్థుడికి 'దేవదత్తం' అనే సార్థకనామధేయంగల ఒక దివ్యశంఖాన్ని దేవత లిచ్చారు. అర్జును డారథం మీద నివాతకవచులపై దాడికి వెడలాడు.

నివాతకవచులు సముద్రగర్భంలో నివసిస్తారు. మాతలి దివ్యరథాన్ని సముద్ర తీరం చేర్చాడు. ఆనీటిలో ఒక విశాల పట్టణం కనిపించింది. దాని ముఖద్వారం వద్దకు చేరి అర్జునుడు దేవదత్తం పూరించాడు. ఆ శంఖనాదం విని, నివాతకవచులు బాణాలతో ఆకాశాన్నంతా కప్పారు. చీకటి క్రమ్ముకొన్నది. మాతలి ఆ చీకట్లో రథం నడపలేకపోయాడు. అప్పుడు పార్థుడే రథాన్ని నడుపుతూ రాక్షసులపై నిశిత బాణాలు గుప్పించి నెత్తురుటేరులు పారించాడు. అసురులు మాయాయుద్ధానికి దిగి అర్జునుడిపై వారుణాస్త్రాన్ని ప్రయోగించారు. పార్థుడు శోషణాస్త్రాన్ని వేసి నీటిధారలను ఎండించాడు. దానవులు కొండరాళ్ళు కురిసే అస్త్రం వేశారు. అర్జునుడు వజ్రాయుధాస్త్రాన్ని ప్రయోగించి రాళ్ళను పిండి చేశాడు. వారు అనలాస్త్రం వేశారు. అతడు సలిలాస్త్రంతో దానిని వారించాడు. వారు తిమిరాస్త్రం ప్రయోగించారు. ఆచీకట్లో దారితెలియక మాతలి రథంమీద నుండి క్రిందపడ్డాడు. అర్జునుడిని పిలుస్తూ అరచాడు. అటువంటి యుద్ధం తాను అంతవరకు చూడలేదని పలికాడు. అర్జునుడు వెంటనే సూర్యాస్త్రం వేసి లోకాన్ని వెలుగుతో నింపాడు. గాండీవి ప్రయోగించిన బాణాలకు రాక్షసుల శరీరాలు తునకలై విరిగిన కొండశిఖరాలవలె క్రిందపడసాగాయి. అసుర వనితల ఆక్రందనలు మిన్నుముట్టాయి. రాక్షససంహారం పూర్తి అయింది. మాయ తొలగింది. ఆ నగర శోభ బయటపడింది. ఆ నగరం మొదట దేవతల కొరకే కట్టబడింది. కాని, దానవులు బ్రహ్మదేవుడి అనుగ్రహంతో దానిని

ఆక్రమించారు. ఆ దేవుడి వరంవలన వారు బలగర్వితులైనారు. వారు నరుడిచేతనే జయించబడగలరని బ్రహ్మవచనం. అందువలన నరుడినే ఇంద్రుడు ప్రయోగించి, జయాన్ని సాధించాడు.

అర్జునుడు నివాతకవచులను నిర్మూలనం చేసి తిరిగివస్తూ మార్గమధ్యంలో హిరణ్యపురాన్నీ, అందులో బ్రహ్మవరం వలన అజేయులై ఉన్న పౌలోమ కాలకేయులనూ చూచాడు. వారు అమరులచేత అవధ్యులని తెలిసికొని పార్థుడు వారిపై దాడిచేశాడు. పౌలోమకాలకేయులు అరవైవేల రథాలతో అర్జునుడిని ఎదుర్కొన్నారు. పార్థుడు వారి రథాల గతికి దివ్యబాణాలతో అడ్డాలు కల్పించాడు. వారు మాయాయుద్ధమార్గంలో పట్టణంతో సహా గగనానికి ఎగిసారు. పార్థుడు వారిని దివ్యబాణాలతో గగనంలో బంధించి, వారి శరీరాలను ఖండఖండాలుగా నరకటం మొదలుపెట్టాడు. అయినా, వారిని పూర్తిగా చంపటం సాధ్యంకాదని తెలిసికొని పరమేశ్వరుడిని హృదయంలో స్మరించి పాశుపతాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ దివ్యాస్త్ర ప్రభావం వలన సింహాలు, శరభాలు, పులులు, ఏనుగులు, దున్నలు, ఎలుగుబంట్లు, యక్షులు, రాక్షసులు, పిశాచులు, పన్నగులు, గంధర్వులు అనేకులు ఆ అస్త్రంలోనుండి పుట్టిన అసురులందరిని అంతం చేశారు. ఈవిధంగా హిరణ్యపురవాసులను యమపురానికి పంపించి అర్జునుడు వచ్చి ఇంద్రుడికి నమస్కరించాడు.

ఇంద్రుడు సంతోషించి, సోదరుడి రాకకై ఎదురుచూస్తున్న ధర్మజాదుల వద్దకు వెళ్ళుమని అర్జునుడిని అనుమతించాడు. అతడితో క్లిష్టమైన యుద్ధాలలో కూడ ఎవ్వరూ ఎదుర్కొనలేరని ప్రకటించాడు. భీష్మ, ద్రోణాది మహావీరులు పార్థుడి బాణాలకు రణరంగంలో హతులు కాక తప్పదని చెప్పాడు. అప్పుడు అర్జునుడు ఇంద్రుడిని వీడ్కొని ధర్మరాజాదులవద్దకు వచ్చాడు. అర్జునుడు చెప్పిన ఈ కథనంతా విని ధర్మరాజు విశాల సామ్రాజ్యమంతా అప్పుడే తనకు దక్కినంతగా ఉప్పొంగిపోయాడు. అర్జునుడు పొందిన దివ్యాస్త్రాలను ప్రయోగించి చూపించుమని కోరాడు. అర్జునుడు దివ్యాస్త్ర ప్రయోగాన్ని ప్రదర్శించటం ప్రారంభించాడు. ప్రకృతి దద్దరిల్ల నారంభించింది. దివి నుండి నారదుడు దిగివచ్చి అర్జునుడిని సమీపించి, లక్ష్యం లేకుండా దివ్యాస్త్రాలను ప్రయోగిస్తే అవి లోకాలను దహించి వేస్తాయని హెచ్చరించి, ఆ ప్రయత్నాన్ని మాన్పించాడు. ఆపైన దేవకన్యలు దిగివచ్చి 'అర్జునుడు అజ్ఞాతవాసంలో కన్యకలమధ్య గడిపి ఆ గడువు పూర్తికాగానే విస్తారభూమిని జయిస్తాడనీ, ధర్మరాజు ఆ భూమిని పాలిస్తాడనీ, అలనాటి శ్రీరాముడి కీర్తి వంటి కీర్తి అర్జునుడికి లభిస్తుం' దనీ దీవించి దివానికి వెళ్ళారు. అప్పుడు రోమశుడు కూడ ధర్మజుడి అనుమతితో అమరావతికి వెళ్ళాడు. ఆ తరువాత పాండవులు క్రమంగా వృషపర్వనివాసానికీ, బదరీవనానికీ, హిమవత్పర్వతంలోని వివిధ యజ్ఞపుణ్య ప్రాంతాలకూ వచ్చి అక్కడ కొంతకాలం నివసించారు.

**నహుష ప్రశ్నలు :**

పాండవులు హిమవన్నగ ప్రాంతంలో నివసిస్తున్నపుడు ఒకనాడు భీముడు ఒంటరిగా వేటకు వెళ్ళాడు. అతడు అలసిపోయి ఉన్న సమయంలో ఒక పెద్ద కొండచిలువ భీముడిని బిగియపట్టింది. అదేమి చోద్యమో ఆపాము పట్టుకోగానే భీముడు బలహీనుడై పోయాడు. ఆ పాముపట్టునుండి ఎంత ప్రయత్నించినా బైటపడలేకపోయాడు. తనను గురించిన వివరాలను ఆ పాముకు తెలియపరచుకొన్నాడు. చంద్రవంశజుడని తెలిసినా ఆ పాము భీముడిని వదలలేదు. భీముడు వేటకు వెళ్ళి తిరిగి రావటం ఆలస్యం కావటంతో ధర్మజుడు ఏదో కీడును శంకించి ధౌమ్యుడితో కలిసి అడవిలో వెదకుకొంటూ బయలుదేరాడు. సర్పాధీనంలో చిక్కుకొని ఉన్న భీముడిని చూచాడు. కడు విచారించాడు. ఆ సర్పం సామాన్యమైనది కాదని ఊహించి వివరాలను అడిగాడు. ఆ కొండచిలువ రూపంలో ఉన్నది భరతవంశీయుడైన నహుషచక్రవర్తి అని తెలిసికొన్నాడు. వేదాలన్నీ చదివినా, నూరు యజ్ఞాలు చేసినా, దేవేంద్ర పదవి పొందినా, మదోన్మత్తుడై మునిపుంగవులను అవమానిస్తే ఎటువంటి వాడైనా తప్పులాన్ని అనుభవించక తీరదన్న సత్యాన్ని శాపగ్రస్తుడైన నహుషచక్రవర్తి కథ చెప్పకచెపుతుంది. నహుషుడే స్వీయగాథను, శాపవృత్తాంతాన్ని స్వయంగా ధర్మరాజుకు పశ్చాత్తాపంతో వివరించి చెప్పుకొన్నాడు. తాను వేసే ప్రశ్నలకు సమాధానాలు చెపితే భీముడిని వదలుతా నన్నాడు. సవినయంగా ధర్మజుడు నహుష ప్రశ్నలకు సమాధానా లిచ్చాడు. ఆ వివరా లివి :

నహుషుడు: ఏగుణాలు కలవాడు బ్రాహ్మణుడు? అతడిని గుర్తించటానికి తగిన వస్తు వేది?

ధర్మరాజు : సత్యం, క్షమ, దమం, శౌచం, దయ, తపస్సు, దానశీలం అనేగుణాలు కలవాడు బ్రాహ్మణుడు. సుఖదుఃఖాలు పొందినపుడు మోహాన్ని పొందకుండా ఉండే స్వభావమే బ్రాహ్మణుడని గుర్తించటానికి తోడ్పడే సాధనం.

నహుషుడు: నీవు చెప్పిన గుణాలూ ఆచరణా శూద్రుడియందుకూడా ఉంటే అతడు ఉత్తమ బ్రాహ్మణుడు కాగలుగుతాడా? సత్యాన్ని విడిచిపెడితే బ్రాహ్మణాది వర్ణవిభాగం ఎట్లా కలుగుతుంది? ఉత్తమాధమ వివేకం అపార్థాన్ని కలిగిస్తుంది కదా?

ధర్మరాజు : పొరపాటున వర్ణసాంకర్యం ఏర్పడితే వర్ణపరీక్షను నిర్వహించటంలో బ్రాహ్మణాదుల ప్రవర్తనను స్వాయంభువ మనువు ప్రత్యేకించి చెప్పాడు. సత్యం మొదలైన గుణాలు శూద్రుడియందు కలిగినప్పటికీ అతడు సత్‌శూద్రుడు ఔతాడు కాని, బ్రాహ్మణుడు కాలేడు. ఆ గుణాలు బ్రాహ్మణుడిలో లేకపోతే అతడు శూద్రుడు అనబడతాడు. కావున వృత్తం (శీలం, ప్రవర్తన, స్వభావం) ముఖ్యం. ధనం లేకపోతే వివిధ రీతులలో దానిని సంపాదించుకొని ధనవంతుడు కావచ్చును. శీలం లేనివాడు అస లేమీ లేనివాడే. కాబట్టి విత్తరక్షణం కంటె వృత్తరక్షణమే ఉత్తమం.

నహుషుడు :అప్రియమైన పనులు చేసినా, అబద్ధాలాడినా సరే హింసచేయకుండా ఉంటే చాలు అతడు ఉత్తమగతిని పొందుతాడని కొంద రంటారు. ఆ అహింస అంత గొప్పది ఎందుకైనదో చెప్పగలవా?

ధర్మరాజు : దానం, మేలు చేయటం, సత్యం, అహింస - అనే నాలుగూ సమానాలే అయినప్పటికీ అహింసయే శ్రేష్ఠం. ఎట్లాగంటే - దేవతలలో, మనుష్యులలో, పశుపక్ష్యాదులలో పుట్టిన వారిలో మనుష్యుడు దానాదిగుణాలు కలిగి అహింసాపరుడైతే దేవగతిని పొందుతాడు. ఆ గుణాలు పాటించకపోతే పశుపక్ష్యాదులలో పుట్టి పతితు డౌతాడు.

ఈ విధంగా నహుషుడు వేసిన ప్రశ్నలకు ధర్మరాజు సమాధానా లిచ్చాడు. అందుకు కొండచిలువ రూపంలో ఉన్న నహుషుడు సంతోషించి, భీమసేనుడిని తన పట్టునుండి విముక్తుడిని చేశాడు. తానూ శాపవిముక్తు డైనాడు. ధర్మజు డామహాత్ముడిని అడిగి అనేక ఆధ్యాత్మిక విషయాలను తెలిసికొన్నాడు. నహుషుడికి నమస్కరించి తమ్ముడితో కలిసి ఆశ్రమానికి చేరుకొన్నాడు.

అప్పుడు వర్షర్తువు వచ్చింది. వానలు మెండుగా కురిశాయి. క్రమంగా భూమిపై శరదృతువు విస్తరిల్లింది. పగళ్ళు పరమప్రమోదకరంగా సాగాయి. శారదరాత్రులు పండువెన్నెలలతో ప్రకాశించాయి.

**ఇంతవరకు ఆరణ్యపర్వంలో నన్నయ రచించిన భాగం.**

**ఇది ఆరణ్యపర్వ కథాసారంలో మొదటి భాగం.**

**జి.వి. సుబ్రహ్మణ్యం**
**ప్రధాన సంపాదకుడు.**

# శ్రీమదాంధ్ర మహాభారతం

## సంపుటము - 4

## ఆరణ్యపర్వము

## (మొదటిభాగము)

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

# చతుర్థాశ్వాసము





# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్య పర్వం

### మొదటి భాగం

(1,2,3,4 (141వ పద్యము వరకు) ఆశ్వాసాలు

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీకీర్తిశ్రీవల్లభ! లోకజనస్తుత్య! సర్వలోకాశ్రయ! ర**
**త్నాకర పరివృత సకల ధ । రా కాంత! జితారి! రాజరాజ నరేంద్రా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ, కీర్తిశ్రీ, వల్లభ!= సంపదకున్నూ, యశస్సంపదకున్నూ అధిపతి అయినవాడా! (రాజ్యలక్ష్మికిన్నీ, కీర్తి అనే లక్ష్మికిన్నీ ప్రియమైనవాడా); లోక, జన, స్తుత్య!= లోకంలోని ప్రజలచేత పొగడదగినవాడా! సర్వ, లోక+ఆశ్రయ!= సమస్తలోకానికి ఆధారమైనవాడా! (ఇది బిరుదుకూడ కావచ్చు); రత్న+ఆకర, పరివృత, సకల, ధరా, కాంత!= సముద్రంచేత చుట్టబడిన సమస్తభూమికిని అధినేత అయినవాడా!; జిత+అరి!= జయించబడిన శత్రువులు కలవాడా!; రాజరాజనరేంద్రా!= రాజరాజనరేంద్రుడు అనే పేరు కలవాడా!;

**తాత్పర్యం:** సంపదకున్నూ, కీర్తిసంపదకున్నూ, భర్తఅయినవాడా! లోకంలోని అందరు ప్రజలచేత పొగడ దగినవాడా! 'సర్వలోకాశ్రయ' అనే సార్థక బిరుదనామం ధరించినవాడా! సముద్రంచేత చుట్టబడిన సువిశాల భూప్రదేశాన్ని పరిపాలించే ప్రభువా! శత్రువులను జయించినవాడా! ఓ రాజరాజనరేంద్రా!

**విశేషం:** ఇది నన్నయ మహాకవి ఆరణ్యపర్వం మొదటి ఆశ్వాసంలో వ్రాసిన మొదటి పద్యం. ఈ పద్యంలోని పదాలన్నీ కృతిపతి అయిన రాజరాజనరేంద్రుడికి సంబోధనలే. చాళుక్యప్రభువులు 'లోకాశ్రయ' - 'సత్యాశ్రయ' అనే బిరుదులు వహించటం చరిత్రలో సుప్రసిద్ధం. చాళుక్యసామ్రాజ్యం ఉత్తరంలో చిలకసముద్రంనుంచి దక్షిణాన పులికాట్ సరస్సువరకు సముద్రతీరరేఖను అంటి విస్తరించి ఉండటంచేత 'రత్నాకర పరివృత సకలధరాకాంత' అనే సంబోధన మిక్కిలి సముచితం, సార్థకం. నన్నయ మహాకవి ఆశ్వాస ఆరంభ పద్యాలను అన్నింటిని శ్రీకారంతో ప్రారంభించటం గమనించదగిన విశేషం. శ్రీకార ప్రారంభం భారతదేశంలో మంగళప్రదమైన సాహితీ సంప్రదాయం. నన్నయ మహాకవి ఆంధ్రమహాభారతాన్ని చాళుక్య చక్రవర్తి అయిన రాజరాజనరేంద్రుడి కోరికపై రచించాడు. అందుచేత అతడే కృతిపతి అని భావించవచ్చును. ఆశ్వాస ఆరంభాలలోను, ఆశ్వాసాంతాలలోను కృతిపతిని సంబోధించే సాహిత్య సంప్రదాయాన్ని తెలుగులో ప్రారంభించినవాడు ఆదికవి నన్నయ.

రాజరాజనరేంద్రుడి మాతామహు డైన తమిళ చోళప్రభువు పేరు రాజరాజు. ఆ చోళప్రభువు రాజరాజనరేంద్రుడి తండ్రి అయిన విమలాదిత్యుడిని చేరదీసి, తన పుత్రిక నిచ్చి వివాహంచేసి, ఎన్నోవిధాల అతడికి తోడుపడ్డాడు. విమలాదిత్యుడు మామగారిపట్ల కృతజ్ఞతాపూర్వకంగా తన పుత్రుడికి ఆయన పేరుపెట్టినట్లు చరిత్రవేత్తల అభిప్రాయం.

### పాండవుల వనగమనము (సం. 3-1-8)

**వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె; నట్లు పాండవులు నిజాయుధంబులు ధరియించి కృష్ణాసహితులై యుత్తరము మించి యరిగిన నింద్రసేనాదులైన మూలభృత్యులు పదునాలుగువేల**

**రథంబులతోడ సుభద్రాభిమన్యు ప్రతివింధ్యాదులం దోడ్కొని వారి పిఱుందన యరిగి; రంత నప్పాండవులం జూచి పౌరులెల్లఁ బరమ దుఃఖితులై. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= మహాభారతకథను చెప్పే సౌతి; శౌనక+ఆది, మహత్, మునులకున్= శౌనకుడు మొదలయిన గొప్ప ఋషులకు; చెప్పెన్= చెప్పాడు; అట్లు= ఆ విధంగా; పాండవులు= పాండురాజుకొడుకులు; నిజ+ఆయుధంబులు= తమ ఆయుధాలు; (ధనుస్సు, బాణాలు మొదలైనవి); ధరియించి; కృష్ణా, సహితులు+ఐ= ద్రౌపదితో కూడినవారై; ఉత్తరము, మించి, అరిగినన్= ఉత్తరదిక్కును అతిక్రమించి వెళ్ళగా; ఇంద్రసేన+ఆదులు+ఐన= ఇంద్రసేనుడు మొదలైన; మూలభృత్యులు= ప్రధానులైన సేవకులు; పదునాలుగు, వేల, రథంబులతోడ; సుభద్రా+అభిమన్యు, ప్రతివింధ్య+ఆదులన్= సుభద్ర, అభిమన్యుడు, ప్రతివింధ్యుడు మొదలైనవారిని; తోడ్కొని= వెంటబెట్టుకొని; వారి, పిఱుందన్+అ= వారి వెనుకనే; అరిగిరి= వెళ్ళారు; అంతన్= అంతట; ఆ+పాండవులన్; చూచి; పౌరులు+ఎల్లన్= పురజనులందరు; పరమ దుఃఖితులు+ఐ= మిక్కిలి శోకం పొందినవారై.

**తాత్పర్యం:** మహాభారతకథను సౌతి, శౌనకుడు మొదలయిన మహర్షులకు చెప్పాడు. జూదంలో ఓడిపోయిన తర్వాత పాండవులు అరణ్యవాసానికి ఉపక్రమించి ఉత్తరదిక్కుగా పయనించారు. వారి వెనువెంట వారి ముఖ్యసేవకులైన ఇంద్రసేనుడు మున్నగువారు పద్నాలుగువేల రథాలతో సుభద్ర, అభిమన్యుడు, ప్రతివింధ్యుడు మున్నగు ఉపపాండవులను వెంట పెట్టుకొని వెళ్ళారు. ఆ దృశ్యాన్ని చూచిన పురజనులు మిక్కిలి శోకం పొంది (ఇట్లా అన్నారు).

**విశేషం:** ఇచట అక్కథకుడు అంటే ఉగ్రశ్రవసుడు అనే పేరు గల సౌతి. సమకాలీనులలో సుగృహీతనామధేయు డైన పౌరాణికుడు. నైమిశారణ్యంలో కులపతి శౌనకమహర్షి తన ఆశ్రమంలో పండ్రెండేండ్లు సత్రయాగాన్ని నిర్వహించాడు. కులపతి అంటే నిత్యం పదివేలమంది శిష్యులకు అన్నదానం చేసి, విద్యాదానం చేసే మహామహోపాధ్యాయుడు. ఆ దీర్ఘసత్రయాగానికి అచట చేరిన మహర్షులకు మహాభారతకథ చెప్పిన ఉగ్రశ్రవసుడు రోమహర్షణుడనే సూతుడి కుమారుడు. వ్యాసశిష్యులు ఐదుగురు. జైమిని-సుమంత-శుక-పైల-వైశంపాయన మహర్షులు. వీరిలో వైశంపాయన మహర్షి భారతాన్ని జనమేజయ మహారాజు చేసిన సర్పయాగంలో చెప్పాడు. (జనమేజయుడు పరీక్షిత్తు కొడుకు. పరీక్షిత్తు అభిమన్యుడి పుత్రుడు. అభిమన్యుడు అర్జునుడి సుతుడు). వ్యాసశిష్యులలోని జైమిని రచించిన అశ్వమేధపర్వం మాత్రమే లభిస్తున్నది. వైశంపాయనుడు చెప్పినప్పుడు విన్న భారతాన్నే ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంగా శౌనకాది మునీశ్వరులకు వినిపించాడు.

ప్రతివింధ్యాదులు:- ద్రౌపదికి ధర్మరాజుకు జన్మించిన పుత్రుడు ప్రతివింధ్యుడు. ద్రౌపదికి భీముడికి జనించినవాడు శ్రుతసోముడు. ద్రౌపదికి అర్జునుడికి జన్మించినవాడు శ్రుతకీర్తి. అట్లే ద్రౌపదికి నకులుడికి పుట్టినవాడు శతానీకుడు. ద్రౌపదికి సహదేవుడికి ఉద్భవించినవాడు శ్రుతసేనుడు. వీరినే ఉపపాండవులంటారు.

**క. 'చనునె యధర్మద్యూతం। బున నిట్టుల పాండురాజపుత్త్రులఁ బ్రభులన్**
**వనగతులఁ జేయ దుర్యో। ధన ధృతరాష్ట్రులకు విగతదయహృదయులకున్. 3**

**ప్రతిపదార్థం:** అధర్మ, ద్యూతంబునన్= ధర్మం తప్పిన మాయజూదంలో; ఇట్టులు+అ= ఈ విధంగా; పాండు, రాజ, పుత్త్రులన్= పాండురాజు కొడుకులను; ప్రభులన్= రాచరికం చేస్తున్నవారిని; వన, గతులన్+చేయన్= అరణ్యానికి వెళ్ళినవారినిగా చేయటం; విగతదయహృదయులకున్= పోయిన దయగల హృదయాలు కలవారైన, అంటే దయలేనట్టివారికి; దుర్యోధన, ధృతరాష్ట్రులకు; చనున్+ఎ= తగునా? న్యాయమా?

**తాత్పర్యం:** 'రాచబిడ్డ లై ప్రజానురంజకంగా తమ రాజ్యభాగాన్ని ఏలుకొంటున్న పాండవులను జూదానికి పిలిచి, అన్యాయంగా ఓడించి, అరణ్యాలకు పంపటం నిర్దయచిత్తు లైన దుర్యోధనధృతరాష్ట్రులకు తగునా?

**విశేషం:** జూదం ఆడినవారు ధర్మరాజు, శకుని. దుర్యోధనుడు జూదంలో నేర్పరి అయిన తన మేనమామ శకునిని తన పక్షాన నియోగించాడు. ముందుగా వేసికొనిన పథకం ప్రకారం కౌరవులు ధర్మరాజును వంచించటాన్ని పౌరులు ఈ పద్యంలో పునరుద్ఘాటించారు.

**క. క్రూరతర ధార్తరాష్ట్ర ని । కారము వారింపరైరి గాంగేయుఁడు న**
**బ్భారద్వాజుఁడుఁ గృపుఁడు ను । దారుఁడు విదురుండు నేమి దలఁచిరొ బుద్ధిన్. 4**

**ప్రతిపదార్థం:** గాంగేయుఁడున్= గంగకొడుకైన భీష్ముడు; ఆ+భరద్వాజుఁడున్= ద్రోణుడు; కృపుఁడున్; ఉదారుఁడు= మహాత్ముడు (మంచివాడైన); విదురుండున్; క్రూర, తర, ధార్తరాష్ట్ర, నికారము= మిక్కిలిక్రూరులైన ధృతరాష్ట్రపుత్రుల అపకారాన్ని (వంచనను); బుద్ధిన్= మనస్సులో; ఏమి, తలఁచిరి+ఒ= ఏమని ఆలోచించారోకాని; వారింపరు+ఐరి= అడ్డుకొనలేదుకదా!

**తాత్పర్యం:** కురువంశానికి గౌరవపాత్రుడైన భీష్ముడు కాని, గురుదేవుడైన ద్రోణాచార్యుడు కాని, కృపాచార్యుడు గాని, మహానుభావుడైన విదురుడు కాని, క్రూరులైన ఆ ధార్తరాష్ట్రులు చేసిన అపకారాన్ని ఎందుచేతనో వారించలేదు?

**విశేషం:** ధృతరాష్ట్రుడి సంతానం ధార్తరాష్ట్రులు. ఇది సంస్కృతంలో అపత్యార్థక తద్ధిత ప్రక్రియ. ఇటువంటిదే గంగ కొడుకు గాంగేయుడు మరియు భారద్వాజుడు. 'క్రూరతర' అనేటప్పుడు 'మిక్కిలి క్రూరులు' అని అర్థం. క్రూర- క్రూరతర-క్రూరతమ అనే ప్రయోగాలు ఉత్తరోత్తర ఆధిక్యాన్ని వ్యక్తీకరిస్తాయి. ధర్మ నిర్ణయానికి కురువృద్ధుడుగా భీష్ముడికి, గురువర్యులుగా ద్రోణుడికి, కృపుడికి గల అర్హత సుస్పష్టం. విదురుడు ధర్మమూర్తిగా, యమధర్మరాజు అవతారంగా పేరుకెక్కినవాడు. అందుచేత అతడి వ్యక్తిత్వంపై ఆ పౌరులకు గల విశేషప్రత్యయం ఇక్కడ అభివ్యక్తమైనది.

**సీ. కర్ణ జయద్రథ గాంధారు లాప్తులై । యుండంగ లోభి దుర్యోధనుండు**
**రాజుగా నీతని రాజ్యంబు నందెట్టు । లుండంగ నేర్తు? మీ యుర్వి నింక**
**నేది ధర్మువు? ప్రజ నెవ్వరు గాతురు? పరమధార్మికులైన పాండుసుతుల**
**యరిగిన చోటికి యరుగుద' మని వారి । పిఱుఁదన చని పాపభీతమతులు**

**ఆ. 'వీరులార! మమ్ము విడిచి మీ కరుగంగఁ । జనునె, మాకు నొండు శరణ మెద్ది?**
**సాధులకు నసాధుసహవాసమునఁ బాప । సంప్రయోగ మగుట సందియంబె? 5**

**ప్రతిపదార్థం:** కర్ణ= కర్ణుడు; జయద్రథ= సైంధవుడు; గాంధారుఁడు= శకుని - కర్ణ సైంధవ శకునులు; ఆప్తులు+ఐ= కావలసిన వారై (హితం ఉపదేశించేవారై); ఉండంగ; లోభి= పిసినివాడు; దుర్యోధనుండు; రాజుగాన్= ఏలిక అయి ఉంటే; ఈతని రాజ్యంబునందు; ఎట్టులు; ఉండంగ, నేర్తుము= ఉండగల వాళ్ళం; ఈ, ఉర్విన్= ఈ పుడమిలో; ఇంకన్, ఏది; ధర్మువు= ధర్మం; ప్రజన్+ఎవ్వరు, కాతురు?= ప్రజలను ఎవరు రక్షించగలరు?; పరమ ధార్మికులు+ఐన= మిక్కిలి గొప్పధర్మంతో కూడిన ప్రవర్తనకల; పాండు సుతుల= పాండవులు (ఇక్కడ 'సుతుల' అనటం కర్త్రుపద ప్రథమకు షష్ఠి); అరిగిన, చోటికి+అ= వెళ్ళిన స్థలానికే; అరుగుదము+అని= వెళ్ళుదామని; వారి, పిఱుఁదన్+అ, చని= ఆ పాండవుల వెనువెంటనే వెళ్ళి; పాప, భీత, మతులు= పాపంవలన భయపడిన బుద్ధి గల ఆ పౌరులు; వీరులార!= వీరులైన ఓ పాండవులారా!; మమ్ము, విడిచి=

మమ్మల్ని వదలిపెట్టి; మీకు+అరుగంగన్, చనున్+ఎ= మీరు వెళ్ళిపోవటం భావ్యమా?; మాకున్, ఒండు, శరణము+ఎద్ది= మాకు వేరే ఆశ్రయం ఏది?; సాధులకున్= మంచివారికి; అసాధు, సహవాసమునన్= దుర్జనసాంగత్యంవలన; పాప, సంప్రయోగము+అగుట= పాపం సంప్రాప్తించటం (తోడి కూడిక); సందియంబు+ఎ?= సందేహమా? కాదు.

**తాత్పర్యం:** పిసినిగొట్టువాడైన దుర్యోధనుడు, తనకు అనుగు చెలికాండ్రయిన కర్ణుడు, సైంధవుడు, శకుని తోడు కాగా, రాజ్యం ఏలుతుంటే- ఆతడి రాజ్యంలో మే మెట్లా బ్రతుకగలం? ఈ భువిపై ఇక ఏది ధర్మం? పాండవులు వెళ్ళే చోటికే మేము కూడ వెళ్ళటం మంచిది- అని నిశ్చయించుకొన్న పౌరులు పాండవులతో (ఇట్లా అన్నారు); - 'ఓ వీరులారా! మమ్మల్ని విడిచి వెళ్ళటం మీకు న్యాయం కాదు. మాకు వేరే దిక్కులేదు. దుర్జన సహవాసంవలన మంచివారికి కూడా పాపం సంప్రాప్తిస్తుందనటంలో సందేహం లేదు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ప్రజానురంజకులైన పాండవులపై పౌరులకు ఏర్పడిన ప్రేమానురాగాలను ఈ పద్యం వ్యక్తం చేస్తున్నది. గాంధారుడు - గాంధారరాజపుత్రుడు, గాంధారి - గాంధార రాజపుత్రిక.

**క. తిలలును నీళ్ళును వస్త్రం । బులుఁ బుష్ప సుగంధ వాసమున సౌరభముం**
**బొలు పెసఁగఁ దాల్చుఁ గావున । నలయక సత్సంగమమున నగు సద్గుణముల్. 6**

**ప్రతిపదార్థం:** తిలలును= నువ్వులున్నూ; నీళ్ళను; వస్త్రంబులున్= గుడ్డలున్నూ; పుష్ప. సుగంధ, వాసమున= పువ్వుల పరిమళ సంపర్కంచేత; సౌరభమున్= పరిమళాన్ని; పొలుపు+ఎసఁగన్= ఇంపారేటట్లుగా; తాల్చున్+కావునన్= ధరిస్తాయి కాబట్టి; అలయక= శ్రమపడకుండానే; సత్సంగమమునన్= మంచివారితోడి కలయికవలన; సద్గుణముల్= మంచిగుణాలు; అగున్= ఏర్పడతాయి.

**తాత్పర్యం:** నువ్వులు, నీళ్ళు, గుడ్డలు, పువ్వుల పరిమళ సంపర్కంవలన సుగంధాన్ని సంపాదించుకొన్నట్లు సజ్జన సహవాసంచేత అశ్రమంగా జనులకు సద్గుణాలు అలవడతాయి.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. మహాభారతం విశ్వజనీనమైన విజ్ఞాన సర్వస్వమని నన్నయ మహాకవి ప్రవచనం. 'ధర్మతత్త్వజ్ఞుల' దృష్టిలో అది ధర్మశాస్త్రం. 'నీతివిచక్షణుల' దృష్టిలో అది నీతిశాస్త్రం. అంతేకాక మహాభారతానికి లోకంలో 'పంచమవేదం' అనే ప్రఖ్యాతి ఏర్పడింది. మహాభారతంలో పలుతావులలో నీతిబోధ వినిపిస్తుంది. నీతి ప్రబోధంలో, కర్తవ్య నిర్ణయంలో వేదాలు ప్రభుసమ్మితాలు. మహాభారతంలోని నీతి పద్యాలలో ఈ కందం మిక్కిలి హృదయంగమమైనది.

**వ. సాధుసమ్మతంబులైన గుణంబుల నొప్పి, జన్మవిద్యా కర్మంబులం బ్రశస్తులరై, యార్యవృత్తులరైన మీ సహవాసంబున నుండి, ధర్మపరులమై కృతార్థుల మగుదుము; దుష్కృతంబులయం దనారంభులయ్యును జనులు దుర్జన దర్శన స్పర్శన సంభాషణ సహాసనంబులంజేసి ధర్మవిహీను లగుదురు; గావున నేము దుర్యోధను రాజ్యంబున నుండనోపము; మా యనుగమనంబున కొడంబడవలయు' నని కృతాంజలులైన న ప్పౌరులం జూచి ధర్మతనయుం డిట్లనియె. 7**

**ప్రతిపదార్థం:** సాధు సమ్మతంబులు+ఐన= మంచి వారికి ఇష్టాలైన; గుణంబులన్+ఒప్పి= గుణాలచేత వెలుగొంది; జన్మ, విద్యా, కర్మంబులన్= పుట్టుక చేతను, చదువుచేతను, చేసే పనుల చేతను; ప్రశస్తులరు+ఐ= పేరుకెక్కినవారై;

ఆర్యవృత్తులరు+ఐన= పూజించదగిన నడవడికలు కల; మీ, సహవాసంబునన్+ఉండి= మీతోపాటు నివసించి; ధర్మపరులము+ఐ= ధర్మాన్ని అనుసరించే వాళ్ళమై; కృతార్థులము+అగుదుము= ధన్యులం కాగలం; దుష్కృతంబులయందు= చెడ్డపనులలో; అనారంభులు+అయ్యును= ప్రయత్నంలేనివారైనను, అంటే చెడ్డపనులు చేయటానికి ఉపక్రమించనివాళ్ళు సైతం; జనులు = ప్రజలు; దుర్జన, దర్శన, స్పర్శన, సంభాషణ, సహ+ఆసనంబులన్+చేసి= చెడ్డవారిని చూడటంచేత, తాకటంచేత, మాటాడటంచేత, ఒకేచోట కూర్చుండటంచేత; ధర్మ, విహీనులు+అగుదురు= ధర్మంలోపించిన వారు అవుతారు; కావునన్= కాబట్టి; ఏము= మేము; దుర్యోధను రాజ్యంబునన్= దుర్యోధనుడు ఏలుతున్న రాజ్యంలో; ఉండన్+ఓపము= ఉండజాలం; మా, అనుగమనంబునకు+ఒడంబడవలయున్= మేము మీతో రావటానికి దయచేసి మీరు అంగీకరించాలి; అని; కృతాంజలులు+ఐనన్= చేయబడిన నమస్కారం కలవారైన, అంటే నమస్కరించిన; ఆ+పౌరులన్+చూచి= ఆ పురజనులను చూచి; ధర్మ తనయుండు+ఇట్లు+అనియెన్= ధర్మరాజు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'మీరు సాధువులు మెచ్చుకొనే సద్గుణాలు కలవారుగా పేరుకెక్కినవారు. మీ సాహచర్యంవలన మేము ధర్మాత్ములమై ధన్యులం కాగలం. చెడ్డపనులకు ఉపక్రమించనివారుకూడ దుర్జన సాంగత్యంచేత ధర్మ భ్రష్టులవుతారు. కావున మాకు దుర్యోధనుడి రాజ్యంలో నివసించటానికి ఇష్టం లేదు. అందుచేత మీతోపాటు రావటానికి మాకు అనుమతిని ఇవ్వా'లని పౌరులు నమస్కరించి పలుకగా, వారితో ధర్మరాజు ఈవిధంగా ప్రత్యుత్తర మిచ్చాడు.

**క. 'మాయందు లేని గుణములు । మీ యనురాగమునఁ జేసి మిగిలి వెలింగెన్;**
**మీ యనుగతి మా కనభి । ప్రాయము; వనవాసదుఃఖభర మోపుదురే? 8**

**ప్రతిపదార్థం:** మాయందు, లేని, గుణములు= మాలో లేని మంచిగుణాలు; మీ, అనురాగమునన్+చేసి= మీకు మాపై ఉన్న ప్రేమచేత; మిగిలి, వెలింగెన్= హెచ్చుగా ఉన్నట్లు వెలుగొందాయి; మీ, అనుగతి= మీరు మాతో రావటం; మాకు+అనభిప్రాయము= మా తలంపు కాదు; వన వాస, దుఃఖ, భరము+ఓపుదురే= అరణ్యంలో నివసించటంవలన కలిగే శోకాన్ని మీరు భరించగలరా?

**తాత్పర్యం:** 'మాలో లేని సద్గుణాలు మీరు ఆరోపిస్తున్నారు. అది మా అదృష్టం. కాని, అరణ్యావాసం చేయటంవలన కలిగే దుఃఖభారాన్ని మీరు సహించలేరు. అందుచేత మీరు మాతోపాటు రావటం మాకు ఇష్టం లేదు.

**విశేషం:** ఈ పద్యంలో 'మాకు నభిప్రాయము' - అనే పాఠాంతరం కొన్ని ప్రతుల్లో ఉన్నది.

**తే. వలవ దుడుగుండు మీ' రని వారినెల్లఁ । గరుణఁ బాండవజ్యేష్ఠుండు గ్రమ్మఱించెఁ;**
**బౌరు లట్లు నివర్తింపఁబడి నిరంత । రార్తనాదులై యరిగిరి హస్తిపురికి. 9**

**ప్రతిపదార్థం:** వలవదు= రావద్దు; ఉడుగుండు= (మీ పయనం) విడవండి; మీరు+అని; వారిన్+ఎల్లన్= ఆ పౌరులనందరిని; కరుణన్= దయతో; పాండవజ్యేష్ఠుండు= పాండుసుతులలో పెద్దవాడయిన ధర్మరాజు; క్రమ్మఱించెన్= మరల్చాడు; పౌరులు= పురజనులు; అట్లు= ఆ విధంగా; నివర్తింపఁబడి= వెనుకకు మరల్చబడి; నిరంతర+ఆర్తనాదులు+ఐ= ఎడతెగని శోకధ్వనులు కలవారై, అంటే దుఃఖితులై; హస్తిపురికి= హస్తినానగరానికి; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** 'మాతో రావద్దు. మీరు దయచేసి వెనుకకు మరలిపొండి' అని చెప్పి, కరుణతో ధర్మరాజు పౌరులను వెనుకకు మరలించాడు. పౌరులు శోకిస్తూ హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయారు.

**వ. ఇట్లు పాండవులు గృతప్రస్థానులై గంగాతీరంబునం బ్రమాణాఖ్యవటంబున విడిసి, గంగాస్నానంబు సేసి, నాఁటి పగలును రాత్రియు నంద యుండి; రంతఁ బ్రభాతసమయంబున. 10**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవులు; కృతప్రస్థానులు+ఐ= చేయబడిన ప్రయాణం కలవారై, అంటే ప్రయాణంచేసి; గంగా, తీరంబునన్= గంగానది ఒడ్డున; ప్రమాణ+ఆఖ్య, వటంబున= 'ప్రమాణ' మనే పేరు కల మఱ్ఱిచెట్టుదగ్గర; విడిసి= విడిది చేసి; గంగా స్నానంబు+చేసి= గంగానదిలో స్నానంచేసి; నాఁటి= ఆ రోజు; పగలును; రాత్రియున్; అందు+అ, ఉండిరి= అచటనే ఉన్నారు; అంతన్; ప్రభాత సమయంబున= తెల్లవారు జామున.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవులు అరణ్యంలో ప్రయాణం కొనసాగించి, గంగానదీతీరంలో 'ప్రమాణం' అనే పేరుతో విలసిల్లిన మఱ్ఱిచెట్టు క్రింద విడిది చేసి, గంగాస్నానం చేసి, అచ్చటనే ఒక పగలు, రాత్రి గడిపారు. అంత తెల్లవారే సమయంలో.

**చ. పరువడి నగ్నిహోత్రములు బంధులు శిష్యులుఁ దోడ రా మహీ**
**సురవరులెల్లఁ బాండునృపసూనులయొద్దకుఁ బ్రీతి నేఁగుదెం**
**చిరి బహువేదఘోషములఁ జేసి నిరస్త సమస్త కిల్బిషో**
**త్కరు లగుచున్న ధన్యులు జగత్పరిపూజ్యులు బ్రహ్మసమ్మితుల్. 11**

**ప్రతిపదార్థం:** పరువడిన్= వేగం(శ్రద్ధ)తో; అగ్నిహోత్రములు= (నిత్యవ్రతంగా నిర్వహిస్తున్న) అగ్నులు; బంధులు= చుట్టాలు; శిష్యులున్= తమవద్ద చదువుకొంటున్న వటువులు; తోడ, రాన్= వెంటరాగా; బహు, వేద, ఘోషములన్+చేసి= ఎన్నో వేదమంత్రాలను వల్లెవేస్తూ ఉన్నందున; నిరస్త, సమస్త, కిల్బిష+ఉత్కరులు+అగుచు+ఉన్న= పోయిన సర్వపాపాల అతిశయం కలవారవుతూ ఉన్న, అంటే సమస్త పాపరహితు లయిన; ధన్యులు= చరితార్థులు; జగత్, పరిపూజ్యులు= జగత్తుకంతటికి మిక్కిలి పూజించతగినవారు; బ్రహ్మ సమ్మితుల్= బ్రహ్మదేవుడితో సమానులు; అగు; మహీ సురవరులు+ఎల్లన్= భూమిలోని దేవతలలో శ్రేష్ఠులు అందరు, అంటే బ్రాహ్మణోత్తములందరు; పాండు, నృప, సూనుల+ఒద్దకున్= పాండురాజుకొడుకులవద్దకు; ప్రీతిన్= అనురాగంతో; ఏఁగుదెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** (ఆ వేగుబోకలో) వేదమంత్రాలను పఠించడంవల్ల సమస్త పాపరహితులయి ధన్యులైనవారు, లోకమంతటికి పూజనీయులు, బ్రహ్మదేవునితో సమానులు అయిన బ్రాహ్మణోత్తములందరు, బంధువులు, శిష్యులు వెంటరాగా, తమ తమ అగ్నిహోత్రాలు తీసుకొని పాండవుల వద్దకు ప్రేమతో వచ్చి చేరారు.

**విశేషం:** వేదమంత్రపఠనం సమస్త పాపహరం అని ఆర్షవిశ్వాసం. నన్నయభట్టుకాలంలో తూర్పు చాళుక్య యుగంలో వైదికమత పునర్వికాసం వెల్లివిరిసింది. నన్నయమహాకవి వ్రాసిన ఈ పద్యం సమకాలిక బ్రాహ్మణసమాజాన్ని ప్రతిఫలింపచేసే మణిదర్పణం.

**వ. ఇట్లు దమతోడన వనవాసంబు సేయ నిశ్చయించి వచ్చిన విప్రుల నతిప్రీతి గౌరవంబున నర్చించి తదాశీర్వాదంబుల నభినందితుండై ధర్మతనయుండు వారల కిట్లనియె. 12**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తమతోడన్+అ; వనవాసంబు+చేయ= అరణ్యంలో నివసించటానికి; నిశ్చయించి= నిర్ణయించి; వచ్చిన; విప్రులన్= బ్రాహ్మణులను; అతిప్రీతి, గౌరవంబునన్= మిక్కిలి అనురాగంతో, మన్ననతో; అర్చించి=

పూజించి; తద్+ఆశీర్వాదంబులన్= వారి దీవెనలచేత; అభినందితుండు+ఐ= మెచ్చుకొనబడినవాడై; ధర్మతనయుండు= (యమధర్మరాజు కొడుకు) ధర్మరాజు; వారలకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తమతో అరణ్యావాసం చేయటానికి సంసిద్ధులై వచ్చిన బ్రాహ్మణులను అనురాగంతో, మన్ననతో పూజించి, వారి ఆశీర్వాదాలను పొంది ధర్మరాజు వారితో ఇట్లా అన్నాడు.

**క. 'అపహృత సర్వస్వులమై । సపత్నుల నికారమునఁ బ్రచండాటవిలో**
**విపుల ఫల శాక మూలము । లుపయోగించుచును నిష్ఠ నుండెడు మాతోన్. 13**

**ప్రతిపదార్థం:** అపహృత సర్వస్వులము+ఐ= అపహరించబడిన సమస్తం కలవాళ్ళమై, అంటే సమస్తం కోలుపోయిన వాళ్ళమై; సపత్నుల, నికారమునన్= శత్రువుల వంచనవలన; ప్రచండ+అటవిలో= ఘోరమైన అడవిలో; విపుల, ఫల, శాక, మూలములు= ఎన్నో పండ్లు కూరలు దుంపలు; ఉపయోగించుచును= వాడుతూ; నిష్ఠన్+ఉండెడు= నియమంతో బ్రతికే; మాతోన్.

**తాత్పర్యం:** 'శత్రువుల వంచనచేత అంతయు పోగొట్టుకొని అరణ్యంలో దొరికే పండ్లు, కూరలు, వేళ్ళు (దుంపలు)తిని బ్రతికే మాతో.

**క. రా నేల? వచ్చి నవయం । గా నేల? నివాసములకుఁ గ్రమ్మతి చనుఁ డు**
**గ్రానేకప శార్దూల భ । యానక వనవాస మర్హ మగునే మీకున్!' 14**

**ప్రతిపదార్థం:** రాన్+ఏల= మీరు రావటం ఎందుకు?; వచ్చి; నవయంగాన్+ఏల= కష్టపడుట ఎందుకు?; నివాసములకున్+క్రమ్మతి, చనుఁడు= (మీ)ఇండ్లకు తిరిగి వెళ్ళండి; ఉగ్ర+అనేకప, శార్దూల, భయానక, వనవాసము= క్రూరమైన ఏనుగులతో, పెద్దపులులతో భయంకరమైన అరణ్యనివాసం; మీకున్+అర్హము+అగున్+ఏ= మీకు తగునా?

**తాత్పర్యం:** మీరు రావటం ఎందుకు ? వచ్చి ఎందుకు కష్టపడాలి? మీరు మీ ఇండ్లకు తిరిగిపొండి. భీకరమైన ఏనుగులతో, పెద్దపులులతో కూడిన అరణ్యావాసం మీకు తగునా?'

**వ. అనిన విని బ్రాహ్మణులు పరమ దుఃఖితులై 'మీర కాని మాకు నొండు గతి లేదు; మమ్ము ననన్యశరణ్యుల విడుచుట ధర్మంబు గాదు. 15**

**ప్రతిపదార్థం:** అనిన, విని, బ్రాహ్మణులు; పరమ దుఃఖితులు+ఐ= మిక్కిలి శోకం పొందినవారై; మీరు+అ, కాని= మీరే తప్ప; మాకున్+ఒండు, గతి= మాకు వేరొకమార్గం; లేదు; మమ్మున్; అనన్య శరణ్యుల= వేరేదిక్కు (ఆశ్రయం) లేని వాళ్ళను; విడుచుట= వదలుట; ధర్మంబు, కాదు= న్యాయం కాదు.

**తాత్పర్యం:** ఆ మాటలు విన్న బ్రాహ్మణులు మిక్కిలి దుఃఖించి పాండవులతో - 'అయ్యలారా! మాకు మీరు తప్ప వేరే ఎవరూ దిక్కు లేరు. మీరు మమ్మల్ని వదలటం ధర్మం కాదు.

**ఆ. ఆశ్రితులను భక్తులగువారి నెప్పుడు । నన్యులైన విడువ; రట్టి విప్ర**
**వరుల భక్తిపరుల వసుధేశ! మీ యట్టి । ధార్మికులకు విడువఁదగునె చెపుమ. 16**

**ప్రతిపదార్థం:** ఆశ్రితులను= తమ అండకు చేరిన వాళ్ళను; భక్తులు+అగువారిని= తమపట్ల భక్తికలవాళ్ళను; ఎప్పుడున్; అన్యులైన= ఇతరులైన; విడువరు= వదలిపెట్టరు; అట్టి; విప్రవరుల= బ్రాహ్మణోత్తములను; భక్తిపరుల= భక్తితో కూడిన వాళ్ళను; వసుధా+ఈశ= ఓరాజా!; మీ, అట్టి, ధార్మికులకు= మీవంటి ధర్మాత్ములకు; విడువన్+తగునె= విడుచుట తగునా?; చెపుము+అ= చెప్పండి.

**తాత్పర్యం:** తమప్రాపు గోరి చేరినవాళ్ళను, తమపట్ల భక్తి కలవాళ్ళను ఇతరులు కూడ ఎన్నడూ విడనాడరు కదా! అటువంటప్పుడు బ్రాహ్మణోత్తములను, మీపట్ల భక్తికలవాళ్ళను ఓ ధర్మరాజా! మీబోటి ధర్మాత్ములు విడిచిపెట్టటం భావ్యమా?

**వ. అస్మ త్పోషణోపాయచింత సేయ వలదు; వన్యమూల ఫలంబుల నేమ తెచ్చికొని యుపయోగించుచు జపహోమాది పుణ్యక్రియల మీకుం బ్రియంబు సేయుచు నుండెద; మధర్మవర్తులయి మీ కపకారంబు సేసిన ధార్తరాష్ట్రుల రాష్ట్రంబున నుండ నోప' మనిన వారల రాక కొడంబడి. 17**

**ప్రతిపదార్థం:** అస్మద్+పోషణ+ఉపాయ, చింత= మమ్మల్ని ఎట్లా పోషించాలి అనే ఉపాయాన్నిగూర్చిన ఆలోచన; చేయవలదు; వన్య, మూల, ఫలంబులన్= అడవిలో పుట్టి పెరిగే వేళ్ళు, పండ్లు; ఏము+అ= మేమే; తెచ్చికొని; ఉపయోగించుచు; జప, హోమ+ఆది, పుణ్య, క్రియల= జపం, అగ్నివేల్చటం మొదలైన పుణ్యకార్యాలచేత; మీకున్+ప్రియంబు+చేయుచున్= మీకు ఇష్టం ఒన గూర్చుతూ; ఉండెదము; అధర్మ వర్తులు+అయి= అధర్మాన్ని ఆచరించేవారయి; మీకు+అపకారంబు= మీకు కీడు; చేసిన; ధార్తరాష్ట్రుల= ధృతరాష్ట్రుడి కొడుకుల; రాష్ట్రంబునన్= రాజ్యంలో; ఉండన్+ఓపము= ఉండజాలము; అనిన= అని చెప్పగా; వారల రాకకు= ఆ బ్రాహ్మణులు తమతో రావటానికి; ఒడంబడి= అంగీకరించి.

**తాత్పర్యం:** మా పోషణగురించి మీరు ఆలోచించవలసిన అవసరం లేదు. మేమే అడవిలో దొరికేపండ్లు, వేర్లు తెచ్చుకొని తినగలం. జపతపాలు, యజ్ఞయాగాలు మొదలైన పుణ్యకార్యాలు నిర్వహించి మీకు ప్రియం చేస్తూ ఉంటాము. మీకు కీడు చేసిన దుర్యోధనాదులు పరిపాలించే దేశంలో మేము ఉండలేం' అని చెప్పిన బ్రాహ్మణుల మాటలకు సమ్మతించి.

**తే. ఇష్టమృష్టాన్నములఁ దొల్లి యెల్ల ప్రొద్దుఁ । దృప్తులగుచున్న వసుమతీదేవవరులఁ**
**గానలందు శాకాశనుల్ గాఁగ నెట్లు । సూడ నోపుదు నని ధర్మసూనుఁ డపుడు. 18**

**ప్రతిపదార్థం:** ఇష్ట. మృష్ట+అన్నములన్= తమకు నచ్చినట్టియు శుచి అయినట్టియు అన్నములచేత; తొల్లి= మున్ను; ఎల్లప్రొద్దున్= సర్వవేళల; తృప్తులు+అగుచున్న= తనివి చెందుతున్నవారయిన; వసుమతీ, దేవ, వరులన్= భూదేవ శ్రేష్ఠులను అంటే బ్రాహ్మణోత్తములను; కానలందు= అరణ్యాలలో; శాక+అశనుల్+కాఁగన్= కూరలు తినే వారినిగా; ఎట్లు= ఏవిధంగా; చూడన్+ఓపుదును+అని= చూడగల నని; అప్పుడు; ధర్మసూనుఁడు= ధర్మరాజు.

**తాత్పర్యం:** రుచిగా, శుచిగా ఉన్న వంటకాలతో ఎల్లప్పుడూ తృప్తిగా భుజించే బ్రాహ్మణోత్తములు కేవలం కూరగాయలు తింటూ అరణ్యంలో ఉండటం ఎట్లా చూడగలనని ధర్మరాజు వాపోయాడు.

## శౌనకుఁడు ధర్మరాజునకు ధర్మంబులు సెప్పుట (సం. 3-2-14)

**వ. శోకమూర్ఛితుండై మహీతలంబుపయిం బడిన యాతని నాశ్వాసించి శౌనకుం డను బ్రహ్మర్షి దొల్లి యాత్మ వ్యవస్థానార్థంబు జనకగీతంబు లైన శ్లోకంబుల యర్థంబులు యుధిష్ఠిరున కి ట్లనియె. 19**

**ప్రతిపదార్థం:** శోక, మూర్ఛితుండు+ఐ= దుఃఖంవలన మూర్ఛపొందిన వాడై; మహీతలంబుపయిన్+పడిన, ఆతనిన్= నేలపైబడిన ఆతడిని; ఆశ్వాసించి= ఓదార్చి; శౌనకుండు+అను, బ్రహ్మర్షి= శౌనకుడు అనే బ్రాహ్మణ ఋషి; తొల్లి= పూర్వం; ఆత్మ, వ్యవస్థాన+అర్థంబు= ఆధ్యాత్మిక జ్ఞానం నిల్పటంకోసం; జనక, గీతంబులు+ఐన= జనక మహారాజుచేత పాడబడిన; శ్లోకంబుల= పద్యాల; అర్థంబులు= అభిప్రాయాలు; యుధిష్ఠిరునకు= ధర్మరాజుకు(చెపుతూ); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుఃఖంవలన మూర్ఛిల్లి నేలపై కొరిగిన ధర్మరాజును సేదదీర్చి, శౌనకుడనే బ్రాహ్మణఋషి ధర్మరాజుకు జనకగీతాలలోని వేదాంతపరమార్థాన్ని ఈవిధంగా వివరించాడు.

**విశేషం:** శౌనకుడు జనకగీతాలైన శ్లోకాల అర్థమే చెప్పాడు గాని వాటినన్నింటిని చెప్పి ఉండలేదు. నన్నయ మూలాన్ని సంక్షేపించే విధానాలలో ఇదొకటి.

**క. 'శోకభయస్థానంబు ల। నేకంబులు గలిగినను విహీన వివేకుం**
**డాకులతఁ బొందునట్లు వి। వేకము గలవాఁడు బుద్ధి వికలుం డగునే? 20**

**ప్రతిపదార్థం:** శోక, భయ, స్థానంబులు= దుఃఖానికి, భయానికి నెలవులు; అనేకంబులు= పెక్కులు; కలిగినను= కలిగినప్పటికిని; విహీన వివేకుండు= వివేకం లేనివాడు; ఆకులతన్+పొందునట్లు= ఆరాటం చెందినట్లు; వివేకము, కలవాఁడు= ఉచితానుచిత జ్ఞానం కలవాడు; బుద్ధి, వికలుండు+అగునే= మతిపోగొట్టుకొన్నవాడు అవుతాడా?

**తాత్పర్యం:** 'దుఃఖం, భయం పొందదగిన పట్టులు పెక్కులు దాపురించినప్పటికినీ అవివేకివలె వివేకి వికలుడు కాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. శారీర మానస మహా। దారుణ దుఃఖములఁ జేసి తఱఁగి శరీరుల్**
**క్రూరతరబాధఁ బొందుదు। రా రెంటిని జెఱుతు రార్యు లమలినబుద్ధిన్. 21**

**ప్రతిపదార్థం:** శారీర= దేహానికి సంబంధించినట్టి; మానస= మనస్సుకు సంబంధించినట్టి; మహా, దారుణ= మిక్కిలి భయావహమైన; దుఃఖములన్+చేసి= శోకాల (అనుభవించటం) చేత; తఱఁగి= క్షీణించి; శరీరుల్= దేహధారులైన మనుజులు; క్రూరతర, బాధన్+పొందుదురు= ఎక్కువ నొప్పి కలిగించే కష్టాలను అనుభవిస్తారు; ఆరెంటిని= ఆ రెండింటిని అంటే దేహసంబంధమైన, మనస్సంబంధమైన వెతలను; ఆర్యులు= పూజించతగినవారు; అమలిన, బుద్ధిన్= నిర్మలమైనమతితో; చెఱుతురు= చెడేటట్లు చేస్తారు.

**తాత్పర్యం:** కేవలం దేహధారులని చెప్పతగిన సామాన్యమానవులు శారీరక, మానసిక బాధలచేత క్రుంగి కృశిస్తారు. ఆర్యులు ఆ రెంటిని నిర్మలబుద్ధితో నిగ్రహించగలుగుతారు.

**విశేషం:** ఆంధ్ర మహాభారతంలోని ఎన్నో పద్యాలలో, వచనాలలో పెక్కు పాఠాంతరాలు కనిపిస్తున్నాయి. ప్రాచీన తాళపత్ర గ్రంథాలలో లేఖకులు కారణాంతరాలవలన మార్పులు, చేర్పులు, కూర్పులు ఎడనెడ చేసి ఉన్నారు. అసలు కవిహృదయం నిష్కర్షగా నిర్ణయించటంకూడ కష్టమే. ఆంధ్రమహాభారతం - సంశోధిత ముద్రణం తయారు చేసిన విద్వాంసులు పాఠభేదాలు అన్నింటిని సమగ్రంగా చర్చించి, తమకు నచ్చిన పాఠాన్ని స్వీకరించినప్పటికీ పాఠాంతరాలను కూడ అచ్చుప్రతిలో ఆయా పుటల క్రింద ఉదాహరించి ఉన్నారు. ఇచట 'చెఱుతురు' అనే దానికి 'పాతురు' అనే పాఠాంతరం ఉన్నది. కాని 'చెఱుతురు' అనే పాఠమే కవి హృదయమని తోస్తున్నది.

**వ. వ్యాధి శ్ర మానిష్ట సంస్పర్శ నేష్ట వివర్జనంబు లను నాల్గింటం బుట్టి శారీరదుఃఖంబు లాశుక్రియాది ప్రతి యోగంబుల నుపశమిల్లు; మఱి స్నేహజంబు లైన మానసదుఃఖంబులు జలంబుల నగ్ని యుపశమిల్లునట్లు విమల జ్ఞానంబునం జేసి యుపశమంబునం బొందు. 22**

**ప్రతిపదార్థం:** వ్యాధి, శ్రమ+అనిష్ట, సంస్పర్శన+ఇష్ట, వివర్జనంబులు+అను, నాల్గింటన్= రోగం, అలసట, ఇష్టంలేని వాటిని ముట్టుకోవటం, ఇష్టమైన వాటిని వదలిపెట్టటం అనే నాల్గింటి నుండి; పుట్టి= జనించి; శారీర దుఃఖంబులు= దేహ సంబంధమైన శోకాలు; ఆశు, క్రియా+ఆది, ప్రతియోగంబులన్= అప్పటికప్పుడు చేసే చేష్టలు మొదలైన విరుగుళ్ళ వల్ల; ఉపశమిల్లు= తగ్గుతాయి; మఱి; స్నేహజంబులు+ఐన= మైత్రి వల్ల జనించే; మానస, దుఃఖంబులు= మనస్సుకు సంబంధించిన శోకాలు; జలంబులన్= నీటిచేత; అగ్ని= నిప్పు; ఉపశమిల్లునట్లు= అణగేటట్లు; విమల, జ్ఞానంబునన్+చేసి= నిర్మలమైన జ్ఞానంచేత; ఉపశమంబునన్+పొందున్= తగ్గుతాయి.

**తాత్పర్యం:** రోగం, అలసట, ఇష్టంలేని వాటిని ముట్టుకోవటం, ఇష్టమున్న వాటిని వదలిపెట్టటం అనే నాల్గింటి వలన శరీరదుఃఖాలు పుట్టుతాయి. ఆ శరీరదుఃఖాలు (వేగంగా) అప్పటికప్పుడు చేసే విరుగుడులవలన తాత్కాలికంగా ఉపశమింపవచ్చును. ఇక, స్నేహంవలన ఏర్పడిన మానసిక తాపాలు, నీటివలన నిప్పు అణగినట్లుగా విమలజ్ఞానం వలన ఉపశమనం పొందుతాయి.

**క. స్నేహార్ణవ మగ్నుం డయి । దేహి మహాదుఃఖముల నధృతిఁ బొందును; దుః**
**ఖాహతుఁడు శోకతాపవి । మోహి యగున్; స్నేహమూలములు రాగాదుల్. 23**

**ప్రతిపదార్థం:** స్నేహ+అర్ణవ, మగ్నుండు+అయి= చెలిమి అనే కడలిలో మునిగినవాడై; దేహి= శరీరధారి అయిన మానవుడు; మహాదుఃఖములన్= గొప్ప వెతలను; అధృతిన్= స్థైర్యం లేమిచేత; పొందును; దుఃఖ+ఆహతుఁడు= బాధలచేత కొట్టబడినవాడు; శోక, తాప, విమోహి, అగున్= వగపు అనే వేడిమి సోకి స్పృహతప్పినవాడు అవుతాడు; రాగ+ఆదుల్= ప్రేమ మున్నయినవి; స్నేహమూలములు= స్నేహం కారణంగా కలిగినట్టివి.

**తాత్పర్యం:** స్నేహమనే సముద్రంలో మునిగి మనుజుడు స్థైర్యం కోలుపోయి దుఃఖాన్ని పొందుతాడు. దుఃఖితుడు వగపువేడిమిలో ఉడికిపోయి స్పృహ తప్పుతాడు. అనురాగం మొదలయినవి స్నేహాన్ని ఆధారంగా చేసికొని పుట్టేవే.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 'స్నేహం' - సంస్కృతభాషలో మైత్రి - చెలిమి అనే పదాలకంటె విస్తృతమైన పరిధిలో వాడబడింది. ఒక జీవికి అనేక కారణాలవలన ఏర్పడే అనిర్వచనీయమైన అనుబంధాన్ని, అనురాగాన్ని స్నేహభావంగా అర్థం చెప్పవచ్చును. 'స్నేహమూలములు రాగాదుల్' అనే మనోహర భావన నన్నయను నానారుచిరార్థ సూక్తి నిధిని చేసిన కవితాశిల్పానికి ఉదాహరణగా ఎన్నవచ్చును.

**వ. కావున బంధుమిత్త్రధనసంచయంబులవలని స్నేహంబు విడుచునది; పద్మపత్త్రంబు నీరం బొందనియ ట్లెఱుక గలవారి నెట్టియెడలను స్నేహంబు వొందదు; స్నేహంబున రాగంబును, రాగంబునం గామంబును, గామంబునం గ్రోధంబును, గ్రోధంబునం దృష్ణయు వర్తిల్లు. 24**

**ప్రతిపదార్థం:** కావున= కాబట్టి; బంధు, మిత్ర, ధన, సంచయంబుల వలని, స్నేహంబు= చుట్టాలవలనను, నెచ్చెలులవలనను, డబ్బును ప్రోగుచేయటంవలనను ఏర్పడే మైత్రి; విడుచునది= వదలునది; ఎఱుక, కలవారిన్= తెలిసినట్టివారిని, అంటే ఆ జ్ఞానులను; ఎట్టి, ఎడలను= ఎటువంటి సమయాల్లోనైనను; పద్మపత్రంబు= తామరాకు; (నీరన్+పొందని) నీరంబు+ఒందని, అట్లు= నీటిని పొందని విధంగా; స్నేహంబు= మైత్రి; పొందదు= చేరుకోదు; స్నేహంబున= మైత్రివలన; రాగంబును= ప్రేమయున్నూ; రాగంబునన్+కామంబును= ప్రేమవలన కోరికయున్నూ; కామంబునన్+క్రోధంబును= కోరికవలన కోపమున్నూ; క్రోధంబునన్+తృష్ణయు= కోపంవలన దాహమున్నూ (అంటే తీరని ప్రలోభం); వర్తిల్లున్= ఏర్పడతాయి.

**తాత్పర్యం:** కాబట్టి, చుట్టాలవలన, మిత్రులవలన, ధనం సమకూర్చటంవలన ఏర్పడే కూరిమి విడనాడాలి. తామరాకు నీటిని పొందనట్లు జ్ఞాని ఎప్పుడును స్నేహం పొందడు. కూరిమి వలన అభిమానం, అభిమానం వలన కోరిక, కోరికవలన కోపం, కోపంవలన దాహం ఉద్భవిస్తాయి. (ఇచట దాహమంటే అత్యాశ).

**విశేషం:** అలం: ఉపమ. సంచయంబులవలని స్నేహంబు; సమాసములలో చేత, తోడ, వలనలకు ఇత్వమౌతుంది. సంచయంబుల వలన స్నేహము.

**క. అది సర్వదోషముల కా । స్పద, మది దురితక్రియానుబంధంబులకున్**
**మొదలు, నిరంతర దుఃఖ । ప్రద మని మదిఁ దలఁచి తృష్ణఁ బాతురు సుమతుల్. 25**

**ప్రతిపదార్థం:** అది= తృష్ణ; సర్వ, దోషములకు= అన్ని తప్పిదాలకు; ఆస్పదము= నెలవు; అది; దురిత, క్రియా+ అనుబంధంబులకున్= పాపకృత్యాల కలయికకు; మొదలు= ప్రారంభం; నిరంతర, దుఃఖ, ప్రదము= ఎల్లప్పుడు దుఃఖాన్ని కలిగించేది; అని; మదిన్= మనస్సులో; తలఁచి= ఆలోచించి; తృష్ణన్= అత్యాశను; సుమతుల్= బుద్ధిమంతులు; పాతురు (పాచుదురు)= వదలి వెళ్ళుతారు.

**తాత్పర్యం:** అది సమస్త దోషాలకు నెలవైనదనిన్నీ, అది పాపకార్యాల అనుసంధానానికి ఆరంభమనిన్నీ, నిరంతరం అది దుఃఖాన్ని కలిగించేదనిన్నీ ఆలోచించి మంచిబుద్ధికలవారు తృష్ణను వదలిపెట్టుతారు.

**విశేషం:** పౌరాణికవాఙ్మయంలో, బౌద్ధసాహిత్యంలో తృష్ణయే సర్వదురితాలకు మూలమని నొక్కి వక్కాణించబడింది.

**వ. మఱియుఁ దృష్ణాతురుం డర్థలోభంబునఁ గోటరస్థంబయిన యనలంబునం జేసి దగ్ధంబగు వృక్షంబునుంబోలె వినాశంబునం బొందు; నర్థాసక్తుండైనవాఁడు శుభంబులు వడయ నోపండు; మృత్యువువలనం బ్రాణులకు భయంబు గలుగు నట్లర్థవంతులకు రాజ చోర స్వజన జలానలంబులవలన భయంబు నియతంబు. 26**

**ప్రతిపదార్థం:** మఱియున్; తృష్ణా+ఆతురుండు= తృష్ణచేత కలతచెందినవాడు; అర్థలోభంబునన్= ధనమందలి ఆసక్తివలన; కోటరస్థంబు+అయిన= (చెట్టు) తొఱ్ఱలో ఉన్నట్టి; అనలంబునన్+చేసి= అగ్నిచేత; దగ్ధంబు+అగు= తగులబడే; వృక్షంబునున్+పోలె= చెట్టువలె; వినాశంబునన్+పొందున్= నశించిపోతాడు; అర్థ+ఆసక్తుండు+ఐనవాఁడు= ధనకాంక్ష కలిగినవాడు;

శుభంబులు= మేళ్ళు, అభ్యుదయాలు; పడయన్+ఓపండు= పొందజాలడు; ప్రాణులకు= జీవకోటికి; మృత్యువువలనన్= మరణంవలన; భయంబు, కలుగునట్లు= భయం ఏర్పడేటట్లు; అర్థవంతులకు= ధనం కలవారికి; రాజ, చోర, స్వజన, జల+అనలంబులవలన= రాజులవలన, దొంగలవలన, చుట్టపక్కాలవలన, నీటివలన, నిప్పువలన; భయంబు= భీతి; నియతంబు= నిత్యం. (ఎల్లప్పుడు ఉంటుంది).

**తాత్పర్యం:** మఱియు, తృష్ణచేత కలతచెందినవాడు ధనంమీది ఆసక్తివలన, చెట్టుతొఱ్ఱలోని అగ్నిచేత దగ్ధం అయ్యే చెట్టువలె నాశనం పొందుతాడు. ధనకాంక్ష కలిగినవాడు శుభాలు పొందలేడు. ప్రాణులకు మరణంవలన భయం కలుగునట్లుగా ధనం కలవారికి రాజులవలన, దొంగలవలన, చుట్టాలవలన, నీటివలన, నిప్పువలన భయం ఎల్లప్పుడూ ఉంటుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **జలములందు మత్స్యంబులు, చదలఁ బక్షు । లామిషం బెట్లు భక్షించు నట్లు దివిరి**
**యెల్లవారును జేరి యనేకవిధుల । ననుదినంబును భక్షింతు రర్థవంతు.** **27**

**ప్రతిపదార్థం:** జలములందు= నీళ్ళలో; మత్స్యంబులు= చేపలు; చదలన్= ఆకాశంలో; పక్షులు; ఆమిషంబు= మాంసాన్ని; ఎట్లు= ఏవిధంగా; భక్షించున్= తింటాయో; అట్లు= ఆ విధంగా; తివిరి= పూని; ఎల్లవారును= అందరున్నూ; చేరి= దగ్గరకు చేరి; అనేక విధులన్= పెక్కు రకాలుగా; అనుదినంబును= ప్రతిదినం; అర్థవంతున్= ధనంకలవాడిని; భక్షింతురు= తింటారు (పీడిస్తారు).

**తాత్పర్యం:** నీటిలోని చేపలు, ఆకాశంలోని పక్షులు ఏవిధంగా మాంసాన్ని భక్షిస్తాయో, అదేవిధంగా అందరు ధనవంతుడి చుట్టూ చేరి అనేకవిధాల ప్రతిదినం అతడిని పీడిస్తారు.

**విశేషం:** అలం: ఉపమ. ధనాపహరణం చేసేవాళ్ళు దొంగలు అనేమాట అందరికీ అనుభవసిద్ధం. అది ప్రత్యక్ష ప్రమాణం. ఇక చుట్టపక్కాలు పరోక్షంగా ధనవంతుడిని పీడించటం పరోక్షప్రమాణం.

**క.** **అర్థమ యనర్థ మూలం; । బర్థమ మాయా విమోహనావహము; నరుం**
**డర్థార్జన దుఃఖమున న । పార్థీకృతజన్ముఁ డగుట పరమార్థ మిలన్.** **28**

**ప్రతిపదార్థం:** అర్థము+అ= ధనమే; అనర్థ, మూలంబు= కష్టాలకుకారణం; అర్థము+అ= ధనమే; మాయా, విమోహన+ఆవహము= మాయవలన ఏర్పడే మైకం కలిగించేది; నరుండు= మనుజుడు; అర్థ+ఆర్జన, దుఃఖమునన్= ధనం సంపాదించాలనే బాధతో; అపార్థీకృత, జన్ముఁడు+అగుట= వ్యర్థమైన పుట్టుక కలవాడవటం; ఇలన్= భూలోకంలో; పరమ+అర్థము= మేటి సత్యం.

**తాత్పర్యం:** అన్ని చెడుగులకు ధనమే మూలకారణం. ధనం మాయచేత ఏర్పడే భ్రాంతికి ఆకరం. మనుజుడు ధనసంపాదనవలన ఏర్పడే దుఃఖంవలన వ్యర్థజన్ము డవుతా డనే మాట భూలోకంలోని మేటి సత్యం.

**విశేషం:** ఈ పద్యంలోని ధన నిరసనం సుస్పష్టం. "ధనమూల మిదం జగత్", నానా గుణ గణము కాంచనంబున నిలుచున్", "సర్వే గుణాః కాంచన మాశ్రయంతి" అనే సుభాషితాల అంతరార్థం కూడ వ్యంగ్యగర్భితమైన ధన నిరసనమే.

"అర్థానామార్జనే దుఃఖం ఆర్జితానాం చ రక్షణే । ఆయే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థం దుఃఖభాజనమ్."

ధన సంగ్రహణం దుఃఖంతో కూడిన పని, ఆర్జించిన ధనాన్ని రక్షించటం కూడ దుఃఖంతో కూడిన పనే. ఆదాయం దుఃఖం. వ్యయం దుఃఖం ఛీ! ఛీ! ధనం దుఃఖభాజనం. పై శ్లోకం ఇక్కడ అనుశీలించతగింది.

**వ. అట్టి యర్థంబువలన దర్పకార్పణ్య మాన భయోద్వేగంబులు పుట్టుఁ; గావున నర్థోపార్జనచింత సేయ వలదు. రూప యౌవన ధన విభవ ప్రియ సంవాసంబు లనిత్యంబు లగుట నందు బుద్ధిమంతులు విమోహింప' రనిన నమ్మునివరునకు ధర్మతనయుం డిట్లనియె. 29**

**ప్రతిపదార్థం:** అట్టి= ఆ విధమైన; అర్థంబువలన= ధనం వలన; దర్ప, కార్పణ్య, మాన, భయ+ఉద్వేగంబులు+పుట్టున్= గర్వం, పిసినిగొట్టుతనం, అహంకారం, భీతి, ఉబ్బు ఏర్పడతాయి. కావునన్= కాబట్టి; అర్థ+ఉపార్జన, చింత= ధనాన్ని సంపాదించి కూడ పెట్టాలనే ఆలోచన; చేయవలదు; రూప, యౌవన, ధన, విభవ, ప్రియ సంవాసంబులు= దేహ సౌందర్యం, ప్రాయపుపొంగు, ధనం, ఐశ్వర్యం, ఇష్టమైన మేలైన ఇంటిలో ఉండటం; అనిత్యంబులు= తాత్కాలికాలు; అగుటన్= కావటంచేత; అందు; బుద్ధిమంతులు= ప్రాజ్ఞులు; విమోహింపరు= భ్రాంతి చెందరు; అనినన్= అని చెప్పగా; ఆ+మునివరునకు= మునులలో శ్రేష్ఠుడైన ఆ శౌనకుడితో; ధర్మతనయుండు= ధర్మరాజు (యమధర్మరాజుకొడుకు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అట్టి ధనంవలన గర్వం, పిసినిగొట్టుతనం, అహంభావం, భయం, ఉబ్బు కలుగుతాయి. అందుచేత, అట్టి ధనసంపాదన చేయాలనే కోరికను పెంచుకొనవద్దు. అందం, యౌవనం, సంపద, ఇష్టమైన ఇంటిలో నివసించటం అనేవి తాత్కాలికమైనవి. ప్రాజ్ఞులు అట్టివాటినిగురించి భ్రాంతిని పొందరు' అని చెప్పగా ఆ మునిశ్రేష్ఠుడైన శౌనకుడితో ధర్మరాజు ఈ విధంగా బదులు పలికాడు.

**సీ. 'ఆత్మోపభోగార్థ మర్థలాభేచ్ఛ నా । కెన్నండు లేదు; మహీసురాగ్ర**
**గణ్యుల నత్యుగ్ర కాననాంతరమున । నెవ్విధంబున భరియింతు నొక్కొ**
**యని యిప్డు వగచెద; ననవద్యగుణయుక్తి । ననఘ! మాయట్టి గృహస్థతతికిఁ**
**బోష్యుల నెయ్యెడఁ బ్రోవక యుండను । విప్రుల నతిథుల వృథయ పుచ్చఁ**

**ఆ. జనునె? నిజధనంబు సంవిభాగించి యీ । వలయు, సాధురక్ష వలయుఁ జేయ,**
**నభిమతాశ్రమంబులందు గృహస్థాశ్ర । మంబకాదె యుత్తమంబు వినఁగ. 30**

**ప్రతిపదార్థం:** ఆత్మ+ఉపభోగ+అర్థము= సొంతంగా నేను భోగాలను అనుభవించటం కొరకు; అర్థ, లాభ+ఇచ్ఛ= ధనం పొందాలనే కోరిక; నాకు+ఎన్నండు, లేదు= నాకెప్పుడూ లేదు; మహీ, సుర+అగ్రగణ్యులన్= బ్రాహ్మణోత్తములను; అతి+ఉగ్ర, కానన+అంతరమునన్= మిక్కిలి భయంకరమైన అడవిలో; ఏ+విధంబున= ఏ రీతిగ; భరియింతున్+ఒక్కొ= పోషించగలనో; అని; ఇప్డు= ఇపుడు; వగచెదన్= చింతిస్తున్నాను; అనఘ!= పాపరహితుడా!; అనవద్య, గుణ, యుక్తిన్= మంచిగుణాలుకలిగి ఉండటంచేత; మా, అట్టి, గృహస్థ, తతికిన్= మా వంటి గృహస్థుల సమూహానికి; పోష్యులన్= పోషించదగినవారిని; ఏ+ఎడన్= ఏ చోటనైనా; ప్రోవక, ఉండను= రక్షించకుండ ఉండటానికి; విప్రులన్= బ్రాహ్మణులను; అతిథుల= తాత్కాలిక వసతికి, భోజనానికి, ఇంటికి వచ్చిన వారిని; (అతిథులైన బ్రాహ్మణులను); వృథ+అ, పుచ్చన్+చనునె= వ్యర్థులుగా పంపటం పాడియా?; నిజ, ధనంబు= తన ధనం; సంవిభాగించి= పంచి; ఈ, వలయు= ఇవ్వాలి; సాధు, రక్ష= మంచివారి సంరక్షణం;

వలయున్+చేయన్= చేయాలి; అభిమత+ ఆశ్రమంబులందు= కోరుకొనదగిన ఆశ్రమాలలో; గృహస్థ+ఆశ్రమంబు+అ= గృహమేధియొక్క ఆశ్రమమే; వినఁగ= పెద్దలు చెపుతుంటే విన్న ప్రకారం; కాదె, ఉత్తమంబు= మంచిదికాదా? (అవునని భావం)

**తాత్పర్యం:** 'నేను నా స్వార్థంకొరకు, భోగాలకొరకు ధనాన్ని కోరుకొనటంలేదు. బ్రాహ్మణోత్తములను ఈ మహారణ్యంలో నేను ఏ విధంగా పోషించగలను- అని మాత్రమే నా దిగులు. నాబోటి గృహస్థుడికి అవశ్య కర్తవ్యం అతిథిపూజ. అందులో నా దగ్గరికి అతిథులుగా విచ్చేసినవారు బ్రాహ్మణోత్తములు, సాధుపురుషులు. అట్టివారిని ఊరక పంపవచ్చునా? గృహస్థులైనవారు తమ సంపదలో కొంతభాగం అతిథులకొరకు వెచ్చించాలి. సజ్జనులను సంరక్షించాలి. ఈ రీతిగా అన్ని ఆశ్రమాలలో గృహస్థాశ్రమమే మేల్తరమని పెద్దలు చెప్పితే వింటున్నాంకదా! ఇచట సాధు సంరక్షణం, అతిథి సేవ కలిసి వచ్చాయి. కనుక గృహస్థాశ్రమధర్మం నెరవేర్చాలి కదా!

**విశేషం:** సనాతన ఆర్ష సంస్కృతి ప్రకారం, మానవజీవితం- బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం- అనే ఆశ్రమ చతుష్టయంగా విభాగించబడింది. భారతానికి 'పంచమవేదం' అనే ప్రశస్తి ఏర్పడింది. వ్యాసమహర్షి వేదాలను విభజించిన మహానుభావుడు. అతడే మహాభారతకర్త. అందుచేత మహాభారతం వేదసారమనిన్నీ, వేదాలకు విపుల వ్యాఖ్యానమనిన్నీ పేరు కెక్కింది. ఇంకొక విశేషం - మహాభారతం ప్రారంభ పీఠికలో బ్రహ్మదేవుడు వ్యాసమహర్షికి ప్రత్యక్షమై, మహాభారత రచనా ప్రణాళికను ప్రశంసించాడు. అందులో బ్రహ్మదేవుడి అభినందన -'' ఆశ్రమాలలో గృహస్థాశ్రమం ఎట్లో అట్లే కావ్యాలలో మహాభారతం మేల్తరం'' - అన్నది మిక్కిలి అర్థవంతమైనది. వ్యాసమహర్షి మహాభారతాన్ని గృహస్థులకొరకు ప్రత్యేకించి వ్రాసినట్లు ఈ ఉదంతంవలన తేలుతున్నది. కవిహృదయం మహాభారత పీఠికలో సుకుమార సుందరంగా పొందుపరచబడింది. ప్రాచీన భారతదేశంలో వైదిక మతంపై తిరుగుబాటు నెలకొల్పిన జైన బౌద్ధాలు మున్నగు మతాల నిష్ఠ గృహస్థాశ్రమంపై కాక సన్న్యాసాశ్రమంపైనే ఉండటం ఇచట అనుసంధేయం. మహాభారతంలో వ్యాసమహర్షి గృహస్థాశ్రమాన్ని ఉగ్గడించి గృహస్థులు అనుష్ఠానవేదాంతులు కావాలని ఉద్బోధించాడు.

**వ. మఱి యార్తునకు శయనంబును, భీతున కభయంబును, దృషితునకు జలంబును, బుభుక్షితునకు నన్నంబును, శ్రాంతునకు నాసనంబును నిచ్చుట సనాతనంబైన యుత్తమ గృహస్థ ధర్మంబు; తృణ భూమ్యుదక ప్రియ వచనాదరంబు లెల్లవారికి నవశ్యంబ; యాత్మార్థంబుగా నన్నపాకంబును నసాక్షిక భోజనంబును, వృథాపశు ఘాతంబును బాపహేతువు, లగ్నిహోత్రంబులు ననడ్వాహంబులు నతిథి బాంధవ విద్వజ్జన గురుమిత్ర భామినీ నివహంబు లపూజితంబులై యెగ్గు సేయును; గావున గృహస్థుండు సర్వసంతర్పకుండ గావలయుం, గావునం బ్రతిదినంబును బక్షి శునక శ్వాపదార్థంబు సాయం ప్రాతస్సులయందు వైశ్వదేవంబు సేసి యమృతాశియు విఘసాశియుఁ గావలయు; యజ్ఞశేషం బమృతంబు నాఁ బరఁగు; నతిథిభుక్త శేషంబు విఘసంబు నాఁబడు; నట్టి వృత్తి వర్తిల్లువాఁ డుత్తమగృహస్థుం' డనిన ధర్మరాజునకు శౌనకుం డిట్లనియె. 31**

**ప్రతిపదార్థం:** మఱి; ఆర్తునకు= బాధపడుతున్నవాడికి; శయనంబును= పడకను; భీతునకు= భయపడినవాడికి; అభయంబును= శరణును; తృషితునకు= దప్పిగొన్నవాడికి; జలంబును= నీరును; బుభుక్షితునకున్= ఆకలిగొన్నవాడికి; అన్నంబును= భోజనమును; శ్రాంతునకున్= డస్సినవాడికి; ఆసనంబునున్= కూర్చొనటానికి పీటను; ఇచ్చుట= ఇవ్వటం; సనాతనంబు+ఐన= పూర్వకాలంనుండి వస్తున్న; ఉత్తమ, గృహస్థ, ధర్మంబు= మంచి గృహస్థులు ఆచరించవలసిన ధర్మం; తృణ= తృణమయమైన

ఆసనం; భూమి+ఉదక, ప్రియవచన+ఆదరంబులు= కూర్చుండుటకు లేదా, పరుండుటకు ప్రదేశం, దప్పిక తీర్చటానికి నీళ్లు, ఇంపైన పలుకులతో ఆదరించటం; ఎల్లవారికిన్= అందరకు, అవశ్యంబు+అ= తప్పనిసరి అయినటువంటివి; ఆత్మ+అర్థంబుగాన్= తనకొరకు మాత్రమే ఉద్దేశించబడిన; అన్న, పాకంబునున్= అన్నం వండటమున్నూ; అసాక్షిక, భోజనంబును= తోడులేకుండ తిండి తినటమున్నూ; వృథా, పశు, ఘాతంబును= అనవసరంగా జంతువులను చంపటమున్నూ; పాప, హేతువులు= పాపం కలగజేసే కారణాలు; అగ్నిహోత్రంబులున్= వ్రేల్చిన అగ్నులు; అనడ్వాహంబులున్= ఎద్దులు; అతిథి, బాంధవ, విద్వత్+జన, గురు, మిత్ర, భామినీ, నివహంబులు= అతిథులు, చుట్టాలు, విద్వాంసులైన జనులు, గురువులు, మిత్రులు, స్త్రీలు వీరి సముదాయాలు; అపూజితంబులు+ఐ= పూజించబడనివై (పోషించబడనివై); ఎగ్గు, చేయును= కీడు చేస్తాయి; కావున= కాబట్టి; గృహస్థుండు= గృహమేధి (గృహస్థాశ్రమంలో ఉన్నవాడు); సర్వ సంతర్పకుండు= అందరిని సంతృప్తి పరిచేవాడు; కావలయున్= కావాలి; కావునన్= కాబట్టి; ప్రతిదినంబును= అనుదినం; పక్షి, శునక, శ్వాపద+అర్థంబు= పక్షులు, కుక్కలు, జంతువులకొరకు; సాయం, ప్రాతస్సుల+అందు= సాయంకాలం ఉదయంవేళలలో; వైశ్వదైవంబు, చేసి= వైశ్వదేవం అనే పేరుకెక్కిన యజ్ఞాన్ని నిర్వహించి; అమృత+ఆశియు= అమృతాన్ని తినేవాడున్నూ; విఘస+ఆశియున్= విఘసం తినేవాడున్నూ; కావలయు= కావాలి; యజ్ఞ, శేషంబు= యజ్ఞంలో మిగిలింది; అమృతంబు= అమృతం; నాన్+పరఁగున్= అనబడుతుంది; అతిథి, భుక్త, శేషంబు= అతిథులు తినగా మిగిలింది; విఘసంబు=విఘసం; నాన్+పడున్= అనబడుతుంది; అట్టి, వృత్తి, వర్తిల్లువాఁడు= అటువంటి మర్యాద పాటించేవాడు; ఉత్తమ, గృహస్థుండు+అనిన= మంచి గృహస్థుడు అని చెప్పగా; ధర్మరాజునకు= ధర్మపుత్రుడికి; శౌనకుండు+ఇట్లు+అనియెన్= శౌనకుడు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆర్తుడికి శయ్యాసౌఖ్యం, భయపడినవాడికి శరణం, దప్పిగొన్నవాడికి నీరు, ఆకలిగొన్నవాడికి తిండి, డస్సినవాడికి ఆసనం సమకూర్చటం గృహస్థుడు నిర్వహించవలసిన సనాతనధర్మాలు. అతిథుల పట్ల ఆదరాభిమానాలు చూపవలసిన బాధ్యత గృహస్థుడిది, పక్కన విస్తరి లేకుండ భుజించటం, తనకోసం మాత్రమే వంట చేయించటం, నిష్కారణంగా పశువులను హింసించటం పాతకాలు. అంతేకాక అగ్నిహోత్రాలు, అతిథులు, చుట్టాలు, విద్వాంసులు, గురువులు, మిత్రులు, స్త్రీలు-వీరలకు యథోచిత మర్యాద చూపనప్పుడు ఎగ్గు చేస్తారు (కీడు కలుగుతుంది), అందుచేత గృహస్థుడు ఎల్లవారిని సంతృప్తి పరచక తప్పదు. యజ్ఞశేషానికి అమృతమని పేరు. అతిథి భుక్త శేషానికి విఘసమని పేరు. గృహమేధి అమృతాశియు, విఘసాశియు కావాలి. ఉదయాస్తమయ వేళలలో పక్షి, శునకాదులకు బలి ఆహారం వేయాలి. దానికి వైశ్వదేవ యజ్ఞమని పేరు. ఉత్తమ గృహస్థుడు నిర్వహించవలసిన ఇటువంటి కర్తవ్యాలు ఉన్నాయి గదా!' అని ధర్మరాజు చెప్పిన పై మాటలు విని, శౌనకమహర్షి సమాధానం చెప్పటానికి ఉద్యమించాడు.

**విశేషం:** పాండవులలో జ్యేష్ఠుడైన యుధిష్ఠిరుడికి ధర్మరాజు అనే సార్థకనామం ఎట్లా ఏర్పడిందో పై వాక్యాలవలన తెలుస్తుంది. ధర్మరాజుశీలాన్ని పై వాక్యాలు హృదయంగమంగా చిత్రిస్తున్నాయి. మహాభారతం గృహస్థాశ్రమానికి కల్పించిన గౌరవప్రపత్తులు ధర్మరాజు వెల్లడించిన అభిప్రాయాలవలన తేటతెల్లమవుతున్నాయి. ['విఘసం' అంటే విశేషంగా భక్షింపబడేది అని వ్యుత్పత్తి].

**క. 'హారివిషయాభిలాషము । గారణముగ నెంత యెఱుక గలవారును దు**
**ర్వారవికారముఁ బొందెదు । వారు నిజేంద్రియము లవి యవశ్యము లగుటన్. 32**

**ప్రతిపదార్థం:** హారి, విషయ+అభిలాషము= మనోహరాలైన ఇంద్రియ సౌఖ్యాలపై కోరిక; కారణముగన్= హేతువుగా; ఎంత, ఎఱుక, కలవారును= ఎంతటి జ్ఞానం కలవారైనను; నిజ+ఇంద్రియములు= తమ ఇంద్రియాలు; అవి; అవశ్యములు+అగుటన్= వశంకానట్టివి అవటంచేత; దుర్వార, వికారమున్= వారించరాని వికృతిని; పొందెదువారు= పొందుతారు.

**తాత్పర్యం:** ఆకర్షించే ఇంద్రియసౌఖ్యాలపై కోరిక కారణంగా ఎంతటిజ్ఞానం కలవారైనా, తమ ఇంద్రియాలు తమకు వశం కావు కాబట్టి, వారించటానికి వీలులేని వికారాన్ని పొందుతారు.

**విశేషం:** ప్రాచీన భారతీయసాహిత్యం పలుమారులు-ఇంద్రియాలను జయించటమే విశ్వవిజయమని ఉద్ఘాటించింది.

**వ. సంకల్పజంబైనకామంబునఁదగిలిన మనస్సుచేతంబ్రేరితంబై శ్రోత్రాదీంద్రియంబులు శబ్దాది విషయంబులం బరిభ్రమించుటంజేసి విషయాభిలాష విశిఖవిద్ధులై దేహులు తేజోలుబ్ధంబులైన శలభంబులుంబోలె శోకానలంబునంబడి తమ్మెఱుంగక యవిద్యాకర్మతృష్ణలం జేసి సంసారచక్రంబునందుఁ బ్రవర్తిల్లుదు; రట్టి బ్రాహ్మాదితృణపర్యంతభూతప్రవృత్తియందు రాగద్వేష విముక్తులై యభిమాన మత్సరంబులు విడిచి, వేద చోదితంబైన సమ్యక్సంకల్ప సంబంధం బింద్రియనిగ్రహంబు వ్రతవిశేషంబు గురుసేవనం బాహారయోగం బధ్యయ నాగమంబు కర్మసన్న్యాసంబు చిత్తనిరోధంబను నెనిమిదింటను గర్మానుష్ఠానంబు సేసిన మహాత్ములు దమ తమ తపోమహత్త్వంబునం జేసి సంసారంబు జయింతురు; నీవును శుశ్రూషా శ్రవణ గ్రహణ ధారణోహాపోహార్థవిజ్ఞాన తత్త్వజ్ఞాన సమన్వితుండవు; నీచేతం బ్రారబ్ధంబులైన యవి సర్వంబులును సంపన్నంబులగు. 33**

**ప్రతిపదార్థం:** సంకల్పజంబు+ఐన= చిత్తవృత్తినుండి పుట్టిన; కామంబునన్+తగిలిన= కోరికయందు చేరుకొన్న; మనస్సుచేతన్= చిత్తంచేత; ప్రేరితంబు+ఐ= ప్రేరేపించబడినవై (రెచ్చగొట్టబడినవై); శ్రోత్ర+ఆది+ఇంద్రియంబులు= చెవి మున్నగు ఇంద్రియాలు; శబ్ద+ఆది, విషయంబులన్= శబ్దం మున్నగు ఇంద్రియార్థాలలో; పరిభ్రమించుటన్+చేసి= తిరుగాడుతుండటంవలన; దేహులు= శరీరధారులు; విషయ+అభిలాష, విశిఖ, విద్ధులు+ఐ= ఇంద్రియాలకు సంబంధించిన కోరికలు అనే బాణాలచేత కొట్టబడినవారై; తేజస్+లుబ్ధంబులు+ఐన= వెలుగుపై ఆపుకొనలేని తమకం కలిగినవైన; శలభంబులున్+పోలెన్= మిడత పురుగులవలె; శోక+అనలంబునన్+పడి= దుఃఖమనే అగ్నిలో పడి; తమ్ము+ఎఱుంగక= తమను తాము తెలిసికొనలేక; (అంటే వశం తప్పి); అవిద్యా, కర్మ, తృష్ణలన్+చేసి= అజ్ఞానంచేతను, కార్యాలు చేయటంలోని అభిలాషచేతను; సంసార, చక్రంబునందున్= ఐహిక జీవిత వలయంలో; ప్రవర్తిల్లుదురు= సంచరిస్తారు; అట్టి; బ్రహ్మ+ఆది= బ్రహ్మమొదలుగా; తృణపర్యంత= గడ్డివరకుకల; భూతప్రవృత్తి+అందు= ప్రాణుల స్వభావంపట్ల; రాగ, ద్వేష, విముక్తులు+ఐ= ఇష్టంచేత, అనిష్టంచేత విడువబడినవారై; అభిమాన, మత్సరంబులు, విడిచి= ప్రేమ, అసూయలు వదలిపెట్టి; వేద, చోదితంబు+ఐన= వేదాలచేత నిర్ణయించబడిన; సమ్యక్+సంకల్ప, సంబంధంబు= సరైన చిత్తవృత్తిని ఏర్పరచుకొనటం; ఇంద్రియ, నిగ్రహంబు= ఇంద్రియాలను వశం చేసికొనటం; వ్రత, విశేషంబు= యథోచితమైన దీక్షను స్వీకరించటం; గురు, సేవనంబు= గురువులను ఆరాధించి సేవలు చేయటం; ఆహారయోగంబు= తిండి ఎన్నుకొని తినటంలో నియమం; అధ్యయన+ఆగమంబు= చదువులను వల్లెవేయటం; కర్మ, సన్న్యాసంబు= కర్తవ్యాలను ఫలాల పట్ల అనాసక్తితో నిర్వహించటం; చిత్త, నిరోధంబు= మనఃప్రవృత్తులను అదుపులో పెట్టుకొనటం; అను= అనే; ఎనిమిదింటను= పై ఎనిమిది అంశాలను; కర్మ+అనుష్ఠానంబు+చేసిన= క్రియారూపాన నిర్వహించిన; మహా+ఆత్ములు= గొప్ప ఆత్మ(మనసు)కల మహానుభావులు; తమ, తమ= వారివారి; తపస్+మహత్త్వంబునన్+చేసి= తపస్సు యొక్క ప్రభావంవలన; సంసారంబున్= ఐహిక జీవితబంధాన్ని; జయింతురు= గెలుస్తారు; నీవును(ఓధర్మరాజా!); శుశ్రూషా, శ్రవణ, గ్రహణ, ధారణా+ఊహ+అపోహ+అర్థ, విజ్ఞాన, తత్త్వజ్ఞాన, సమన్వితుండవు= (గురు)సేవ, వినటం, విన్నదాన్ని ఆకళింపు చేసికొనటం, (అవసరమైనదాన్ని) ఊహించటం, అనవసరమైనదాన్ని భావననుండి తొలగించుకొనటం, వస్తువులను గురించిన విజ్ఞానం (తెలివితేటలు), వివిధ వేదాంత దర్శనాల పరిజ్ఞానం అనే వాటితో కూడిన వాడివి; నీ చేతన్+ ప్రారబ్ధంబులు+ఐన+అవి= నీచేత ఆరంభించబడినట్టివి; సర్వంబులును= అన్ని కార్యములును; సంపన్నంబులు+అగున్= అభ్యున్నతిని పొందుతాయి.

**తాత్పర్యం:** చిత్తవృత్తినుండి పుట్టిన కామంలో తగుల్కొన్న మనస్సుచేత ప్రేరేపించబడినవైన చెవి మొదలైన ఇంద్రియాలు, ఇంద్రియార్థాలలో తిరుగాడుతుండటం వలన, దేహధారులు శబ్దం మొదలైన ఇంద్రియాలకు సంబంధించిన కోరికలు అనే బాణాలచేత కొట్టబడినవారై, వెలుగు పైని లోభంచేత అగ్నిలోపడే మిడతలవలె దుఃఖాగ్నిలో పడి తమను తాము తెలిసికొనలేక అజ్ఞానంచేత, కార్యాలుచేయటంలోని అభిలాషచేత సంసారచక్రంలో తిరుగుతుంటారు. బ్రహ్మ మొదలు గడ్డివరకు ఉండే ప్రాణుల స్వభావాల పట్ల రాగద్వేషాలు విడిచినవారై, ప్రేమాసూయలను వదలి, వేదాలలో చెప్పబడిన సరైన చిత్తవత్తిని ఏర్పరచుకోవటం, ఇంద్రియాలను వశం చేసికొనటం, యథోచితమైన దీక్షను స్వీకరించటం, గురుసేవ, ఆహారం తినటంలో నియమం, చదువులను వల్లెవేయటం, ఫలితంపట్ల ఆసక్తిలేకుండ కర్తవ్యాలను నిర్వహించటం, మనఃప్రవృత్తిని అదుపులో పెట్టుకోవటం- అనే ఈ ఎనిమిది అంశాలను క్రియారూపాన నిర్వహించిన మహాత్ములు తమతమ తపఃప్రభావంవలన సంసారాన్ని గెలుస్తారు. ఓ ధర్మరాజా! నీవుకూడ గురుసేవ, వినటం, విన్నదాన్ని అర్థం చేసికొనటం, అర్థం చేసికొన్న విషయాన్ని స్థిరంగా మనస్సులో నిల్పుకొనటం, అవసరమైన దాన్ని ఊహించటం, అనవసరమైనదాన్ని భావనమండి తొలగించుకొనటం, వస్తువిజ్ఞానం, వేదాంతాది శాస్త్రపరిజ్ఞానం అనేవాటితో కూడినవాడవు. కావున నీచేత ప్రారంభించబడిన అన్ని పనులూ అభ్యున్నతిని పొందుతాయి.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ. మహాభారతం ప్రకారం మహాత్ములు చేయవలసిన కర్మానుష్ఠానాలు వేదచోదితాలైనవి ఎనిమిది: 1. సమ్యక్సంకల్ప సంబంధం 2. ఇంద్రియ నిగ్రహం 3. వ్రతవిశేషం 4. గురుసేవనం 5. ఆహార యోగం 6. ఆగమాధ్యయనం 7. కర్మసన్న్యాసం 8. చిత్తనిరోధం- ఇది ఒక అష్టాంగయోగం. బౌద్ధదర్శనం ప్రతిపాదించిన అష్టాంగయోగం కూడ ఇచట అనుశీలించతగింది. 1. సమ్యగ్దృష్టి 2. సమ్యక్సంకల్పం 3. సమ్యగ్వచనం 4. సమ్యక్కర్మ 5. సమ్యగ్జీవిక 6. సమ్యక్కృషి 7. సమ్యక్స్మృతి 8. సమ్యక్సమాధి. పతంజలి మహర్షి యోగదర్శనంలో ఒక అష్టాంగయోగాన్ని ప్రతిపాదించాడు. అది ఈవిధంగా ఉంది: 1. యమం 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధారణ 7. ధ్యానం 8. సమాధి. మహాభారతంలోని ప్రవచనంలో విద్యావిషయకమైన మరొక అష్టాంగ యోగం కూడ ప్రతిపాదించబడింది. 1.శుశ్రూష 2. శ్రవణం 3. గ్రహణం. 4. ధారణ. 5. ఊహ. 6. అపోహ 7. అర్థవిజ్ఞానం 8. తత్త్వజ్ఞానం. జిజ్ఞాసువు లందరు విద్యాభ్యాసంలో పై అష్టాంగయోగాన్ని ఆకళింపు చేసికొనాలి.

**క. వసురుద్రాదిత్యాదులు । వసుధేశ! తపంబు గౌరవంబున నైశ్వ**
**ర్యసమృద్ధులైరి; తపమునఁ । బ్రసిద్ధముగ నిష్టసిద్ధి వడయుము నీవున్. 34**

**ప్రతిపదార్థం:** వసు, రుద్ర+ఆదిత్య+ఆదులు= వసువులు, రుద్రులు, ఆదిత్యులు (అదితిపుత్రులు - సూర్యులు) మొదలైనవారు; వసుధా+ఈశ!= ఓరాజా! (భూమికి ఈశుడవైనవాడా!); తపంబు, గౌరవంబునన్= తపస్సుయొక్క మాహాత్మ్యంవలన; ఐశ్వర్య సమృద్ధులు= సంపన్నులు; ఐరి; తపమునన్= తపస్సుచేత; ప్రసిద్ధముగన్= అందరికి తేటతెల్లం అయ్యేటట్లుగా; నీవున్= నీవుకూడ; ఇష్టసిద్ధి= అభీష్టాన్ని; పడయుము= పొందుము.

**తాత్పర్యం:** వసువులు, రుద్రులు, ఆదిత్యులు మున్నగువారు తపస్సు చేసి ఐశ్వర్యాన్ని సంపాదించగలిగారు. నీవు కూడ తపస్సు చేసి నీ ఈప్సితాలను ఈడేర్చుకో.

**వ. తపస్సిద్ధులైనవారు దమ తలంచిన దానిన క్రమంబునం బడయుదురు; గావున నీవు నుపశమవంతుండవై తపంబు సేసి యోగార్థసిద్ధి వడసి, బ్రాహ్మణుల ననుచరించుచు నీ మనోరథంబు సఫలంబు సేయు' మనిన శౌనకవచనంబు సేకొని బ్రాతృమధ్యగతుండైన ధర్మతనయుండు ధౌమ్యునకు నమస్కరించి యిట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** తపస్+సిద్ధులు+ఐనవారు= తపస్సులో ఫలితం పొందినవారు; తమ, తలంచిన, దానిన్+అ= తాము సంకల్పించినదాన్నే; క్రమంబునన్= వరుసగా; పడయుదురు= పొందుతారు; కావునన్= కాబట్టి; ఈవు= ఓ ధర్మరాజా!; ఉపశమవంతుండవు+ఐ= ఓర్పుకలవాడివై; తపంబు+చేసి= తపస్సు చేసి; యోగ+అర్థ, సిద్ధి= యోగంలో సాఫల్యం; పడసి= పొంది; బ్రాహ్మణులన్= విప్రులను; అనుచరించుచు= అనుసరిస్తూ; నీ మనోరథంబు= నీకోరిక; సఫలంబు+చేయుము= ఈడేర్చుకొనుము; అనిన; శౌనక, వచనంబు+చేకొని= శౌనక మహర్షి చెప్పిన మాటలు అంగీకరించి; భ్రాతృ, మధ్య, గతుండు+ఐన= సోదరుల మధ్య ఉన్నట్టి; ధర్మతనయుండు= ధర్మరాజు; ధౌమ్యునకు= తమ పురోహితుడైన ధౌమ్యుడికి; నమస్కరించి= అభివాదం చేసి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దీక్షతో తపస్సు చేసినవారు వారి కోర్కెలను నెరవేర్చుకొనగలరు. ఓ ధర్మరాజా! నీవు కూడ తపస్సు చేసి, బ్రాహ్మణులను అనుసరిస్తూ నీ కోరికలను ఈడేర్చుకో'- అని శౌనకమహర్షి చెప్పగా సోదరులమధ్య ఉన్న ధర్మరాజు ధౌమ్యుడికి నమస్కరించి ఆయనతో ఇట్లా అన్నాడు.

**తే. 'వనమునకు వచ్చి నవయంగ వలవ దుడుగుఁ; డనిన నుడుగక; 'మీతోన యరుగుదెంతు'**
**మనిరి బ్రాహ్మణుల్; వీరి కాహార మే యు । పాయమున నుగ్రవనమునఁ బడయ నేర్తు? 36**

**ప్రతిపదార్థం:** వనమునకు= అరణ్యానికి; వచ్చి= ఏతెంచి; నవయంగ, వలవదు= బాధ పడవద్దు; ఉడుగుఁడు+అనినన్= మానండని చెప్పినప్పటికీ; ఉడుగక= మానక; మీతోన్+అ= మీతోనే; అరుగుదెంతుము+అనిరి= వస్తామన్నారు; బ్రాహ్మణుల్= విప్రులు; వీరికి; ఆహారము= భోజనం; ఏ, ఉపాయమునన్= ఏ వెరవున; ఉగ్రవనమునన్= భయంకరమైన అడవిలో; పడయన్, నేర్తున్= సంపాదించగలను?

**తాత్పర్యం:** 'అయ్యలారా! మేము చేసేది వనవాసం. మీరు మాతో అడవికి రావ'ద్దని చెప్పి బ్రతిమాలుకొన్నప్పటికీ వినక, వస్తామన్నారు బ్రాహ్మణులు. భయంకరమైన అడవిలో వీరికి నేను ఏవిధంగా ఆహారం సమకూర్చి పెట్టగలను?

**వ. వీరల విడువ నోప; నేమి సేయుదు'? ననిన విని ధౌమ్యుండు పెద్దయుం బ్రొద్దు చింతించి, ధర్మరాజున కిట్లనియె. 37**

**ప్రతిపదార్థం:** వీరల= ఈ బ్రాహ్మణులను; విడువన్+ఓపన్= విడిచి పెట్టజాలను; ఏమి+చేయుదున్?= ఏమి చేయగలను?; అనిన; విని; ధౌమ్యుండు; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; చింతించి= యోచించి; ధర్మరాజునకు+ఇట్లు+అనియెన్= ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** నాపైని మిక్కిలి ప్రేమతో నా కష్టాలను పంచుకొనటానికి ఇచ్చగించి నాతోపాటు వనవాసం చేయటానికి వచ్చిన ఈ బ్రాహ్మణోత్తములను నేను విడవజాలను, వీరలకొరకు నేను ఏమి చెయ్యాలి?' - అని ధర్మరా జనగా, అతడితో పురోహితుడైన ధౌమ్యుడు ఇట్లా పలికాడు.

**ఆ. 'భూతరాశి దొల్లి పుట్టి బుభుక్షాభి । తప్తమయినఁ జూచి తద్భయంబు**
**నపనయింపఁ గడఁగి యదితిసుతాగ్రణి । గమలబాంధవుండు గరుణతోడ. 38**

**ప్రతిపదార్థం:** భూతరాశి= ప్రాణికోటి; తొల్లి= పూర్వకాలంలో; పుట్టి; బుభుక్షా+అభితప్తము+అయినన్= ఆకలిచేత మాడగా; చూచి; తద్+భయంబున్= ఆ భీతిని; అపనయింపన్+కడఁగి= పోగొట్టటానికి పూని; అదితి, సుత+అగ్రణి= అదితిసుతులలో మేటిఅయినవాడు; కమల, బాంధవుఁడు= (పద్మాలకు చుట్టం) సూర్యుడు; కరుణతోడ= దయతో.

**తాత్పర్యం:** 'పూర్వకాలంలో జీవకోటి ఉద్భవించి ఆకలిచేత మలమలమాడుతుంటే చూచి ఆ భయాన్ని తొలగించటానికి పూనుకొని సూర్యుడు దయతో -

**వ. ఉత్తరాయణగతుండై యుర్వీరసంబు పరిగ్రహించి, దక్షిణాయనగతిం బర్జన్యభూతుండై యోషధులం బడసి, రాత్రులయందుఁ జంద్రకిరణామృతంబునం జేసి వానిందడుపుచు వర్ధించి, యం దన్నంబు పుట్టించి, ప్రజారక్షణంబు సేయుటం జేసి యన్నం బాదిత్యమయంబని యెఱింగి, తొల్లి భీమవైన్య కార్తవీర్య నహుషాదులు యోగసమాధి నిష్ఠితులై సూర్యభజనంబున నన్నంబుఁబడసి యాపదలవలనం బ్రజల సముద్ధరించిరి గావున. 39**

**ప్రతిపదార్థం:** ఉత్తర+అయన+గతుండై= ఉత్తర దిక్కుగా పయనించినవాడై; ఉర్వీరసంబు= భూమిలోనిసారం; పరిగ్రహించి= స్వీకరించి; దక్షిణ+అయన, గతిన్= దక్షిణ దిశగా పయనించినవాడై; పర్జన్యభూతుండై= మేఘుడై; ఓషధులన్+పడసి= వరి, గోధుమ మున్నగు సస్యములను (పైరులను) (బీజరూపంలో) పొంది; రాత్రుల+అందున్= రాత్రివేళలలో; చంద్ర, కిరణ+అమృతంబునన్+చేసి= చంద్రుడియొక్క కిరణాలనుండి స్రవించే అమృతంవలన; వానిన్= ఆ ఓషధులను; తడుపుచు; వర్ధించి= పెంపొందింపజేసి; అందు+అన్నంబు+పుట్టించి= వాటినుండి అన్నాన్ని ఉద్భవింపజేసి; ప్రజా, రక్షణంబు+చేయుటన్+చేసి= ప్రజలను రక్షించటంచేత; అన్నంబు= అన్నం; ఆదిత్యమయంబు+అని= సూర్యుడితో నిండిందని; ఎఱింగి= తెలిసికొని; తొల్లి= పూర్వకాలంలో; భీమ, వైన్య, కార్తవీర్య, నహుష+ఆదులు= భీముడు, వైన్యుడు (పృథువు), కార్తవీర్యుడు, నహుషుడు మున్నగువారు; యోగసమాధి నిష్ఠితులు+ఐ= యోగంవలన ఏర్పడే సమాధిలో ఉన్నవారై; సూర్య భజనంబునన్= సూర్యుడిని ఆరాధించటంవలన; అన్నంబున్= ఆహారమును; పడసి= పొంది; ఆపదలవలనన్= ఆపదలనుండి; ప్రజల= జనులను; సముద్ధరించిరి= మిక్కిలి కాపాడారు; కావున= కాబట్టి.

**తాత్పర్యం:** సూర్యుడు ఉత్తర దిక్కుగా పయనించి భూసారాన్ని క్రోలి, దక్షిణ దిక్కుగా పయనించి మేఘ రూపుడై ఓషధులను సమీకరించి, చంద్ర కిరణాల ద్వారా ఆ ఓషధులను పెంపొందించి, వాటి నుండి అన్నాన్ని పుట్టించాడు. తద్వారా ప్రజారక్షణం చేశాడు. అందువలన అన్నం సూర్యమయమని తెలిసికొని పూర్వకాలంలో భీమ, వైన్య, కార్తవీర్య, నహుషాదులు సూర్యుడిని ఆరాధించి ఆహారాన్ని సాధించి ప్రజలను కాపాడారు. కాబట్టి.

**విశేషం:** ఓషధి: ఒకసారి ఫలించి నశించేది (వరి గోధుమ మొ॥ పైరులు) ఔషధము: మందుకు ఉపయోగపడు మొక్క మొ॥నది)

**లయగ్రాహి.**

**వారిరుహమిత్త్రు నమరోరగమునిద్యుచర । చారణగత ప్రణుతచారుగుణు లోకా**
**ధారు నఖిలశ్రుతిశరీరు హరిశంకర స । రోరుహభవప్రతిము దారుణతమిస్రా**

**వారణ మరీచి పరిపూరిత దిగంతరుని । భూరికరుణానిరతు సూరుఁ ద్రిజగద్ర**

**క్షారతు సహస్రకరుఁ గోరి భజియింపుము; మ । నోరథఫలంబు లగు భూరమణ! నీకున్'. 40**

**ప్రతిపదార్థం:** వారి రుహ మిత్రున్= నీటిలో పుట్టిన పద్మాలకు నెచ్చెలిని అంటే సూర్యుడిని; అమర+ఉరగ, ముని, ద్యుచర, చారణ గణ, ప్రణుత, చారు, గుణున్= దేవతలచేత, పాములచేత, మునులచేత, ఆకసంలో చరించే వారిచేత, దేవగాయకులచేత స్తుతించబడిన మనోహరమైన గుణాలు కలవాడిని; లోక+ఆధారున్= లోకాలకు ఆధారమైనవాడిని; అఖిల, శ్రుతి, శరీరున్= సమస్త వేదాలు శరీరంగా కలవాడిని; హరి, శంకర, సరోరుహభవ, ప్రతిమున్= విష్ణువుతో, శివుడితో, బ్రహ్మదేవుడితో సమానుడైనవాడిని; దారుణ, తమిస్రా, వారణ, మరీచి, పరిపూరిత, దిక్+అంతరుని= ఘోరమైన చిమ్మచీకట్లను నివారించే కిరణాలతో నింపబడిన దిగంతరాలు గలవాడిని; భూరి, కరుణా, నిరతున్= గొప్ప దయకలవాడిని; సూరున్= సూర్యుని, త్రిజగత్, రక్షా, రతున్= మూడులోకాలను రక్షించటంలో ఇష్టం కలవాడిని; సహస్రకరున్= వేయి కిరణాలు కలవాడిని; కోరి= పూని; భజియింపుము= పూజించుము; భూరమణ!= ఓరాజా!; నీకున్= నీకు; మనోరథ, ఫలంబులు+అగున్= కోరికలు ఈడేరుతాయి.

**తాత్పర్యం:** ఓరాజా! నీవు సూర్యుడిని పూజించుము. నీ కోరికలు ఈడేరుతాయి. అతడు గొప్ప మాహాత్మ్యం కలవాడు. పద్మాలకు మిత్రుడు. అతడిని దేవతలు, పాములు, మునులు, చారణులు నమస్కరించి పూజిస్తూ ఉంటారు. అతడు సమస్తవేదరూపుడు. విష్ణువుతో, శివుడితో, బ్రహ్మదేవుడితో సమానుడు. తన వేవెలుగులతో చిమ్మచీకట్లను పోగొట్టి, దిగంతరాలను ప్రకాశింపజేసేవాడు. గొప్పదయ కలవాడు. మూడులోకాలను రక్షించటానికి పూనిక వహించి ఉన్నవాడు'.

**విశేషం:** ఈ వృత్తంలో ప్రతిపాదంలోనూ భ,జ,స,న,భ,జ,స,న,భ,య అనే గణాలు వరుసగా ఉంటాయి. ఇందులో ప్రాసయతులు మూడు చోట్ల కూర్చబడతాయి. అంటే 10, 18, 26 అక్షరాలు ప్రాసయతిమైత్రితో ఉంటాయి. ప్రాసనియమం ఉన్నది.

**వ. అని ధౌమ్యుండు విశుద్ధాత్ముండైన ధర్మరాజునకు సూర్యుం డర్యముండు భగుండను నివి మొదలుగాఁ గల నామంబుల యష్టోత్తరశతంబు నభీష్ట సిద్ధిప్రదం బయినదాని విస్పష్టార్థ వర్ణోచ్చారణంబును విధియుక్తంబునుగా నుపదేశించి, 'దీనిం దొల్లి యింద్రువలన నారదుండు వడసె; నారదువలన వసువనురాజు వడసె; నాతనివలన నేను వడసితి; నేను నీ కిచ్చితి; నిది దేవనిర్మితంబు; దీన నాదిత్యు నతిభక్తి నారాధింపు' మనిన. 41**

**ప్రతిపదార్థం:** అని; ధౌమ్యుండు; విశుద్ధ+ఆత్ముండు+ఐన= మిక్కిలి పవిత్రమైన మనస్సుకల వాడైన; ధర్మరాజునకు= ధర్మపుత్రుడికి; సూర్యుండు, అర్యముండు, భగుండు, అను+ఇవి; మొదలుగాన్+ కల; నామంబుల= పేర్లుకల; అష్టోత్తరశతంబున్= నూట ఎనిమిదింటిని; అభీష్ట, సిద్ధి, ప్రదంబు+అయినదాని= కోరినట్టి కోరికలు నెరవేర్చే దానిని (స్తోత్రాన్ని); విస్పష్ట+ అర్థ+ వర్ణ+ఉచ్చారణంబును= మిక్కిలి స్పష్టమయిన భావాన్ని, అక్షరాన్ని, ఉచ్చారణను కలుగునట్లుగా; విధి, యుక్తంబును+కాన్= శాస్త్రం నిర్దేశించిన ప్రకారం కలదగునట్లుగా; ఉపదేశించి= ఉపదేశం చేసి; దీనిన్= దీనిని; తొల్లి= పూర్వం; ఇంద్రువలన= ఇంద్రుడివలన; నారదుండు; పడసెన్= పొందాడు; నారదువలన; వసువు, అనురాజు; పడసెన్; ఆతనివలన; నేను; పడసితి= పొందాను; నేను; నీకు+ఇచ్చితిన్; ఇది; దేవనిర్మితంబు= దేవతలచేత కూర్చబడింది; దీనన్= దీనివలన(ఈమంత్రంవలన); ఆదిత్యున్= సూర్యుడిని; అతిభక్తిన్= మిక్కిలి భక్తిభావంతో; ఆరాధింపుము= పూజించుము; అనినన్= అని అనగా.

**తాత్పర్యం:** పాండవపురోహితుడైన ధౌమ్యుడు ధర్మరాజుకు ఆదిత్యనామాలు (పేర్లు) నూటెనిమిదింటిని, సుస్పష్టమైన అర్థాలు వివరించి చెప్పి, సరైన ఉచ్చారణను నేర్పి ఉపదేశించాడు. ఆ మంత్రాలు నారదుడికి ఇంద్రుడు, ఇంద్రుడు వసురాజుకు, వసురాజు ధౌమ్యుడికి ప్రసాదించినవి. ధౌమ్యుడు ధర్మరాజుకు ఉపదేశించాడు. ఆ మంత్రోపాసనవలన అభీష్టప్రాప్తి అవుతుందని ధౌమ్యుడు ధర్మరాజుకు తెలిపాడు.

**విశేషం:** మంత్రోపాసనలో ముఖ్యంగా గమనించవలసిన అంశాలు: (1) సుస్పష్టమైన అర్థాన్ని తెలుసుకోవాలి (2) ప్రతి అక్షరానికి ఉచ్చారణ తెలియాలి. మూలంలో ఉండే సూర్య అష్టోత్తరశతాన్ని నన్నయ సంగ్రహం చేశాడు.

ధర్మరాజు సూర్యు నారాధించి వరంబు గొనుట (సం. 3-3-13)

**సీ.** **హితుఁడైన తన పురోహితు నుపదేశంబు । పేర్మితోఁ జేకొని ధర్మసుతుఁడు**
**నెమ్మిఁ బుష్పోపహారమ్ముల నాదిత్యుఁ । బూజించి, భాగీరథీజలంబు**
**లం దుండి విషయంబులం దింద్రియంబుల । నమలవ్రతానుభావమున నుడిచి,**
**వాయుభోజనుఁడుఁ బ్రాణాయామపరుఁడు నై । సూర్యాదినామముల్ సూర్యుగుఱిచి**

**ఆ.** **జపము సేయుచున్నఁ దపనుఁ డాతనికిఁ బ్ర । త్యక్షమయి త్రిలోకచక్షుఁ డమర**
**వరుఁడు దురితహరుఁడు తరణి త్రయీమూర్తి । వనజమిత్త్రుఁ డిట్టు లనియెఁ గరుణ.** **42**

**ప్రతిపదార్థం:** హితుఁడు+ఐన= తనకు ఇష్టుడైన; తన, పురోహితు+ఉపదేశంబు= తన మేలు కోరే విప్రుడి బోధనం; పేర్మితోన్= గౌరవంతో; చేకొని= గ్రహించి; ధర్మసుతుఁడు= ధర్మరాజు; నెమ్మిన్= పూనికతో; పుష్ప+ఉపహారమ్ములన్= పూలకానుకలతో; ఆదిత్యున్= సూర్యుడిని; పూజించి= అర్చించి; భాగీరథీ, జలంబుల+అందు+ఉండి= గంగానదినీటిలో నిలిచి; విషయంబులందు= ఇంద్రియార్థాలలో; ఇంద్రియంబులన్= ఇంద్రియాలను (త్వక్కు మొదలయిన వాటిని); అమల, వ్రత+అనుభావమునన్= స్వచ్ఛమైన వ్రతదీక్షతో; ఉడిచి= అదుపులో పెట్టి (ఉడిగించి); వాయు భోజనుఁడున్= గాలిని మాత్రమే ఆహారంగా స్వీకరించినవాడున్నూ; ప్రాణాయామపరుఁడున్+ఐ= ప్రాణాయామాన్ని చేసినవాడున్నూఅయి; సూర్య+ఆది, నామముల్= సూర్యుడు మున్నగు పేర్లను; సూర్యుగుఱిచి= సూర్యుడిని గురించి; జపము, చేయుచు+ఉన్నన్= దీక్షతో వల్లెవేస్తుండగా; ఆతనికిన్= ఆధర్మరాజుకు; త్రిలోక, చక్షుఁడు= మూడులోకాలకు నేత్రమైనవాడు; అమరవరుఁడు= దేవతలలో శ్రేష్ఠుడు; దురిత, హరుఁడు= పాపాలను పోగొట్టేవాడు; తరణి= చీకటి నుండి తరింపజేయువాడు; త్రయీమూర్తి= మూడు వేదాలు రూపం తాల్చినవాడు; వనజ మిత్త్రుఁడు= కమలములకు నెచ్చెలి అయిన; తపనుఁడు= సూర్యుడు; ప్రత్యక్షము+అయి= సాక్షాత్కరించి; కరుణన్= దయతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** తన పురోహితుడైన ధౌమ్యుడు చేసిన ఉపదేశం ప్రకారం ధర్మరాజు గంగాజలాలలో నిలిచి, నిష్ఠతో సూర్యుడినిగురించి అష్టోత్తరశతనామాలు ఉచ్చరిస్తూ జపం చేశాడు. అంత వేదస్వరూపుడు, పాపహరుడు, పద్మాలకు మిత్రుడు, ముల్లోకాలకు నేత్రమైన వాడు అయిన సూర్యుడు అతడికి ప్రత్యక్షమై దయతో ఇట్లా అన్నాడు.

**వ.** **'నీ తపమునకు మెచ్చితి; నీ వరణ్యంబున నుండఁ గల పండ్రెండేండ్లును వన్యఫలమూలశాకంబులు నీ మహాన సంబున ద్రుపదరాజపుత్త్రిచేత సాధితంబులై యక్షయంబులైన చతుర్విధాహారంబులగు' నని యొక్క తామ్రస్థాలి యిచ్చి, వరం బిచ్చి వనజహితుం డంతర్హితుం డైన.** **43**

**ప్రతిపదార్థం:** నీ, తపమునకు= నీ తపస్సుకు; మెచ్చితి; నీవు+అరణ్యంబునన్+ఉండన్+కల= నీవు అడవిలో ఉండే; పంద్రెండు+ఏండ్లును= పన్నెండు సంవత్సరాలున్నూ; వన్య, ఫల, మూల, శాకంబులు= అడవిలో ఉండే పండ్లు, వేళ్ళు, కాయగూరలు; నీ మహానసంబున= నీ వంట ఇంట్లో; ద్రుపదరాజ పుత్త్రిచేత= ద్రౌపదిచేత; సాధితంబులు+ఐ= సంస్కరింపబడినవై (వండబడినవై); అక్షయంబులు+ఐన= తరుగనివైన; చతుర్+విధ+ఆహారంబులు+అగున్+అని= నాలుగు విధాల వంటకాలు తయారవుతాయని; ఒక్క; తామ్రస్థాలి= రాగి పాత్ర; ఇచ్చి; వరంబు+ఇచ్చి= వరాన్ని అనుగ్రహించి; వనజ, హితుండు= సూర్యుడు; అంతర్హితుండు+ఐనన్= మాయం కాగా.

**తాత్పర్యం:** 'నీ తపస్సు నాకు నచ్చింది. నీవు అడవిలో ఉండే పంద్రెండు సంవత్సరాలు, అడవిలో లభించే పండ్లు, వేళ్ళు, కాయగూరలు నీ పాకశాలలో ద్రౌపదిచే వండబడి తరుగని నాలుగు విధాలైన వంటకాలుగా ఏర్పడగల' వని చెప్పి, ఒక రాగిపాత్ర నిచ్చి సూర్యుడు మాయ మయ్యాడు.

**విశేషం:** భక్ష్యం, భోజ్యం, చోష్యం, లేహ్యం - అనేవి నాలుగు విధాలైన ఆహారాలు.

**చ.** **అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ**
**బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నిర్వహించె న**
**ప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండిన శాకమూలముల్**
**గడు రుచి నిష్టభోజనసుఖంబులఁ దృప్తులఁ జేయుచుండఁగన్.** **44**

**ప్రతిపదార్థం:** అడరఁగన్= అతిశయించేటట్లుగా; ధర్మనందనుఁడు= ధర్మసుతుడు; అహః+పతిచేత= పగటికి పతి అయిన సూర్యుడిచేత; పేర్మితోన్= గొప్పతనంతో; వరంబు= వరం; పడసి= పొంది; మహీసుర+ఉత్తములన్= బ్రాహ్మణోత్తములను; భవ్యులన్= పూజించతగిన వాళ్ళను; పల్వురన్= పెక్కుమందిని; నిర్వహించెన్= భరించాడు; అప్పుడు; ద్రుపద+అధిరాజ, సుత= ద్రౌపది (ద్రుపదమహారాజు కూతురు); పొల్పుగన్= చక్కగా; వండిన; శాక, మూలముల్= కాయగూరలు, వేళ్ళు; కడు= మిక్కిలి; రుచిన్= రుచితో; ఇష్ట, భోజన, సుఖంబులన్= కోరిన తిండివలన కలిగిన సుఖాలచేత; తృప్తులన్= తృప్తిచెందిన వాళ్ళనుగా; చేయుచుండఁగన్= చేస్తుండగా.

**తాత్పర్యం:** ధర్మరాజు సూర్యుడివలన అతిశయమైన వరాన్ని పొంది, ఆ అక్షయపాత్రలో ద్రౌపది చక్కగా వండిన శాకమూలాలు మిగుల రుచికరాలైన వివిధ భోజనపదార్థాలుగా మారి, వాళ్లందరినీ సంతృప్తిపరుస్తూ ఉండగా - ఎందరో బ్రాహ్మణోత్తములను చక్కగా పోషించగలిగాడు.

**వ.** **ఇట్లనేకసహస్ర మహీసురవరుల ననుదినంబును నభిమత భోజనంబులం దనిపి, విఘసామృత భోజనంబులం దృప్తులైన తనపతుల భుక్తశేషంబు ద్రుపదపుత్త్రిక యుపయోగించుచుండం గొన్నిదినంబు లంద యుండి, పాండవులు బ్రాహ్మణులచేతం గృతస్వస్త్యయనులై బ్రహ్మర్షిసంఘంబులతోఁ గామ్యకవనంబున కరిగి; రంత నిట ధృతరాష్ట్రుండు విదురుం బిలిపించి 'నీవు భార్గవుకంటె బుద్ధిమంతుఁ డవు; పాండవ కౌరవులకు సముండవు; సమ్మతుండవు, చెప్పు మింక నప్పాండవు లేమి సేయువా?' రనిన విదురుం డిట్లనియె.** **45**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; అనేక సహస్ర, మహీ సుర, వరులన్= పెక్కువేల బ్రాహ్మణశ్రేష్ఠులను; అనుదినంబునున్= నిత్యమున్నూ; అభిమత, భోజనంబులన్+తనిపి= ఇష్టమైన ఆహారాలతో సంతృప్తి కలిగించి; విఘస+అమృత, భోజనంబులన్= అతిథులు తిన్న పిమ్మట మిగిలిన, 'యజ్ఞం'లో దేవతలకు సమర్పించగా శేషించిన ఆహారాలతో; తృప్తులు+ఐన= సంతుష్టి చెందిన వారైన; తన పతుల= తన భర్తల; భుక్తశేషంబు= తినగా మిగిలిన ఆహారం; ద్రుపదపుత్రిక= ద్రౌపది; ఉపయోగించుచుండన్= స్వీకరిస్తుండగా; కొన్ని దినంబులు= కొన్ని రోజులు; అందు+అ, ఉండి= అచటనే నివసించి; పాండవులు, బ్రాహ్మణులచేతన్; కృత, స్వస్తి+అయనులై= ప్రయాణంలో శుభం కలుగుగాక అనే దీవనలు పొందినవారై; బ్రహ్మ+ఋషి, సంఘంబులతోన్= బ్రాహ్మణులైన ఋషుల సముదాయంతో; కామ్యకవనంబునకు= కామ్యకం అనే పేరున్న అడవికి; అరిగిరి= వెళ్ళారు; అంతన్; ఇట; ధృతరాష్ట్రుండు; విదురున్+పిలిపించి; నీవు; భార్గవుకంటెన్= శుక్రుడికంటె; బుద్ధిమంతుఁడవు= తెలివితేటలు కలవాడివి; పాండవ, కౌరవులకు; సముండవు= సమానుడివి; సమ్మతుండవు= అంగీకరించబడేవాడివి; చెప్పుము; ఇంకన్; ఆ+పాండవులు; ఏమి, చేయువారు?= ఏమి చేయగలరు?; అనినన్= అని అడుగగా; విదురుండు= విదురుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రతిదినం వేలమంది బ్రాహ్మణులకు సంతర్పణ జరుగుతూ ఉండింది. యజ్ఞావశిష్టాన్ని, అతిథిభుక్తశేషాన్ని పాండవులు భుజించేవారు. ద్రౌపది తన భర్తల భుక్తశేషాన్ని తింటూ ఉండేది. ఆ విధంగా పాండవులు కొన్ని రోజులు అక్కడనే నివసించి, పిమ్మట బ్రాహ్మణుల దీవనలు పొంది, బ్రహ్మర్షి సంఘాలతో కలిసి కామ్యకవనానికి వెళ్ళారు. అంత, ఇక్కడ ధృతరాష్ట్రుడు విదురుడిని పిలిపించి 'నీవు శుక్రుడికంటె బుద్ధిమంతుడివి; కురుపాండవులకు సమానుడివి, సమ్మతుడివి' అని పొగడి 'ఇక మీద ఆ పాండవులు ఏమి చేయగల?'రని ప్రశ్నించాడు. విదురుడు అతడికి ఇట్లా బదులు పలికాడు.

**మత్తకోకిల.**

> **'దేవమూర్తులు పాండుపుత్త్రులు ధీరచిత్తులు వారి పెం**
> **పీ వెఱుంగనివాఁడవే ధరణీశ! వాయుసుతుండు గాం**
> **డీవియున్ భుజవిక్రమప్రకటీకృతుల్ వివిధాస్త్ర వి**
> **ద్యావిశేషులు వైరివీరులఁ దక్కనిత్తురె పోరులన్. 46**

**ప్రతిపదార్థం:** దేవమూర్తులు= దేవతల ఆకారాల వంటి ఆకారాలు కలవారు; ధీరచిత్తులు= ధైర్యంతో కూడిన మనస్సు కలవారు; పాండు పుత్త్రులు= పాండవులు; వారి, పెంపు= వారి గొప్పతనం; ధరణీశ!= ఓ మహారాజా! (ధృతరాష్ట్రుడా!); ఈవు+ఎఱుంగని వాఁడవు+ఏ= నీవు తెలియనివాడివా; వాయు, సుతుండు=(గాలిదేవరకొడుకు) భీముడు; గాండీవియున్= (గాండీవం అనే విల్లు కలవాడు) అర్జునుడు; భుజ, విక్రమ, ప్రకటీకృతుల్= భుజ పరాక్రమంచేత ప్రకటించబడిన వాళ్ళు; వివిధ+అస్త్ర, విద్యా, విశేషులు= పెక్కు అస్త్రాలకు సంబంధించిన పరిజ్ఞానంలో గొప్పవాళ్ళు; వైరి వీరులన్= శత్రు వీరులను; పోరులన్= యుద్ధాలలో; తక్కన్+ఇత్తురె= మిగుల నిస్తారా?

**తాత్పర్యం:** 'పాండవులు దేవతాంశసంభూతులు, ధైర్యశాలురు. ధృతరాష్ట్రమహారాజా! వారి గొప్పతనం నీకు తెలియనిది కాదు. భీముడు, అర్జునుడు తమ పరాక్రమంచేత లోకానికి ప్రసిద్ధులు; వివిధాస్త్రసంపన్నులు. వారు యుద్ధాల్లో శత్రువులను బ్రతుకనిస్తారా?

**విశేషం:** అస్త్రం = మంత్రయుక్తంగా ప్రయోగించే బాణం. శస్త్రం= ఆయుధ విశేషం. ఈ వృత్తంలో పాదానికి 18 అక్షరాలు. ప్రతిపాదంలోనూ ర, స, జ, జ, భ, ర అనే గణాలు వరుసగా ఉంటాయి. 11వ అక్షరం యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**క. మొనసి యధర్మద్యూతం । బున భేదము వుట్టుఁ బాండుపుత్త్రులకును నీ**
**తనయుల కని మును చెప్పిన । విన నొల్లక కొడుకుపలుకు వింటివి కడఁకన్. 47**

**ప్రతిపదార్థం:** మొనసి= పూని; అధర్మ, ద్యూతంబునన్= మోసపు జూదంవలన; పాండుపుత్త్రులకును= పాండవులకున్నూ; నీ, తనయులకు= నీ కొడుకులకున్నూ; భేదము= కలత; పుట్టున్= ఏర్పడుతుంది; అని= అంటూ; మును= ముందుగా; చెప్పిన= చెప్పినప్పటికీ; వినన్+ఒల్లక= వినటానికి ఇష్టపడక; కడఁకన్= పూనికతో; కొడుకు, పలుకు= (నీ) కుమారుడి మాట; వింటివి=విని ఉన్నావు.

**తాత్పర్యం:** మోసపుజూదంవలన పాండవులకూ కౌరవులకూ వైరం ఏర్పడుతుందని నేను నీకు మొదటేచెప్పి ఉన్నాను కదా! నీవు నామాటలు లెక్కపెట్టక నీ కొడుకు దుర్యోధనుడిమాటనే పాటించావు.

**వ. ఇఁక నయినను వారి రావించి, తొల్లి నీచేతం బడయంబడిన రాజ్యంబునందుఁ బ్రతిష్ఠించి, కీర్తియు ధర్మంబును నిలుపుము; రాజ్యంబును ద్రివర్గంబును ధర్మమూలంబులు గావున నంద వర్తిల్లు; ధర్మువు విడిచి యధర్మవర్తి యయి కర్ణ శకుని దుశ్శాసన శిక్షితుండైన దుర్యోధను దుశ్చేష్టితంబుల కొడంబడ వలవదు. 48**

**ప్రతిపదార్థం:** ఇఁకన్+అయినను= ఇకమీదట నైనను; వారి= ఆ పాండవులను; రావించి= వచ్చేటట్లు చేసి; తొల్లి= మునుపు; నీచేతన్+పడయన్+పడిన= నీ చేత పొందబడిన; రాజ్యంబునందున్; ప్రతిష్ఠించి= నిలిపి; కీర్తియు= మంచిపేరును; ధర్మంబును; నిలుపుము; రాజ్యంబును; త్రివర్గంబును= మూడు తెరగులైన అర్థ కామ మోక్షాలు; ధర్మమూలంబులు= ధర్మమే ఆధారంగా కలిగినట్టివి; కావునన్; అందు+అ= అందే, అంటే ధర్మమందే; వర్తిల్లు= ఉంటాయి; ధర్మువు= ధర్మాన్ని; విడిచి= వదలిపెట్టి; అధర్మ, వర్తి+అయి= అధర్మంలో వర్తించేవాడయి; కర్ణ, శకుని, దుశ్శాసన, శిక్షితుండు+ఐన= కర్ణుడిచేత, శకునిచేత, దుశ్శాసనుడిచేత బోధించబడినవాడైన; దుర్యోధను= దుర్యోధనుడియొక్క; దుస్+చేష్టితంబులకు= చెడ్డపనులకు; ఒడంబడవలవదు= సమ్మతించవద్దు.

**తాత్పర్యం:** జరిగింది జరిగిపోయింది. ఇకనైనను నీవు పాండవులను తిరిగి రప్పించి వాళ్ళ రాజ్యాన్ని వాళ్ళకు ఇవ్వాలి. దానివలన నీకు మంచిపేరు వస్తుంది. నీవు ధర్మాన్ని నిలిపినవాడి వవుతావు. రాజ్యానికిన్నీ, అర్థకామమోక్షాలనే త్రివర్గానికిన్నీ ధర్మమే ఆధారం. కర్ణ శకుని దుశ్శాసనుల చెడుమాటలు విని దుర్యోధనుడు చేసే చెడ్డపనులను నీవు సమ్మతించరాదు.

**తే. వీని పుట్టిన పాపంపువేళఁ బెక్కు । దుర్నిమిత్తముల్ పుట్టిన నిర్ణయించి**
**యేను జెప్పితిఁ దొల్లియు వీనిచేత । నెట్టుఁ గౌరవులకు నెగ్గు వుట్టు ననియు. 49**

**ప్రతిపదార్థం:** వీని, పుట్టిన, పాపంపు+వేళన్= వీడు జన్మించిన దుర్ముహూర్తంలో; పెక్కు, దుర్నిమిత్తముల్= చాల చెడ్డశకునాలు; పుట్టినన్; నిర్ణయించి= ఏర్పరచి; ఏను= నేను; వీనిచేతన్; ఎట్టున్= ఏ విధంగానైనా; కౌరవులకున్; ఎగ్గు= కీడు; పుట్టున్+అనియు= కలుగుతుందని; తొల్లియు= మునుపుకూడ; చెప్పితిన్= చెప్పిఉన్నాను.

**తాత్పర్యం:** ఈ దుర్యోధనుడు పుట్టినపుడు ఎన్నో చెడ్డశకునాలు ఏర్పడితే ఆనాడే నేను వీడివలన కౌరవులకు కీడు కలుగుతుందని చెప్పి ఉన్నాను.

**వ. కులదూషకు దూషించి కులంబు రక్షించుట ధర్మువు; ధర్మరాజు నఖిలమహీరాజ్యరక్షకుం జేసి పుత్త్ర పౌత్త్ర మిత్త్రా మాత్య బంధు వర్గంబుల నెల్ల రక్షింపుము; సభామధ్యంబునందు ద్రౌపదీ భీమసేనులం బ్రార్థింప దుశ్శాసనుం బంపుము. 50**

**ప్రతిపదార్థం:** కులదూషకున్= వంశాన్ని చెరిచేవాడిని; దూషించి= నిందించి; (విడిచి); కులంబు= వంశాన్ని; రక్షించుట= కాపాడటం; ధర్మువు= ధర్మం; ధర్మరాజున్= ధర్మరాజును; అఖిల, మహీ, రాజ్య, రక్షకున్+చేసి= సమస్తమైన భూరాజ్యానికి రాజును చేసి; పుత్త్ర, పౌత్త్ర, మిత్త్ర+అమాత్య, బంధు, వర్గంబులన్= కొడుకులు, మనుమలు, హితులు, మంత్రులు, చుట్టాలు, మున్నగువారిని; ఎల్లన్= అందరిని; రక్షింపుము= కాపాడుము; ద్రౌపదీ, భీమసేనులన్= ద్రౌపదిని, భీముడిని; సభా, మధ్యంబునందు= నిండుసభలో; ప్రార్థింపన్= వేడుకొనటానికి; దుశ్శాసనున్= దుశ్శాసనుడిని; పంపుము= నియోగించుము.

**తాత్పర్యం:** కులానికి చేటు తెచ్చేవాడిని నిందించి కులాన్ని రక్షించటం ధర్మం. సమస్త భూరాజ్యానికి ధర్మరాజును రాజుగా చేయుము. అట్లా చేయటంవలన నీ కొడుకులు, మనుమలు, మిత్రులు, చుట్టాలు అందరున్నూ కాపాడబడతారు. ద్రౌపదికీ, భీమునికీ నిండుసభలో దుశ్శాసనుడిచేత క్షమాపణలు చెప్పించుము.

**విశేషం:** ఈ వచనంలో 'కులము' అనే శబ్దం ఎట్లా ప్రయోగించబడిందో అరయదగింది. అది కుటుంబం కావచ్చును; పలుకుటుంబాల కలయిక కావచ్చును. యుగ యుగాంతరాలలో అర్థపరిణామం సంతరించుకొన్న 'కుల' శబ్దం వంశం అనే అర్థంలో ఇక్కడ గ్రహించాలి.

**చ. అతిశయితామరోత్తముఁ డహర్పతితేజుఁ డజాతశత్రుఁ డూ**
**ర్జితుఁ డజితుండు నీ సుతులు సేసిన యెగ్గు దలంపఁ; డాతనిన్**
**ధృతి నభిషిక్తుఁ జేయుము ప్రతీపకులోద్వహ! యిట్లు యైన నీ**
**కృతమునఁ గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితం బగున్.' 51**

**ప్రతిపదార్థం:** అతిశయిత+అమర+ఉత్తముఁడు= అతిశయింపబడిన ఇంద్రుడు కలవాడు, అంటే దేవేంద్రుడికంటె గొప్పవాడు (అమర+ఉత్తముడు= దేవతలలో శ్రేష్ఠుడు, ఇంద్రుడు); అహస్+పతి, తేజుఁడు= సూర్యుడి వంటి తేజస్సు కలవాడు; అజాత శత్రుఁడు= శత్రువులు లేనట్టివాడు, అంటే ధర్మరాజు; ఊర్జితుఁడు= గొప్పవాడు (మహానుభావుడు); అజితుండు= జయింపబడనివాడు-అపజయం లేనివాడు; నీ సుతులు= నీకొడుకులు; చేసిన; ఎగ్గు= కీడు; తలంపఁడు= మనసులో పెట్టుకోడు; ఆతనిన్= ఆ ధర్మరాజును; ధృతిన్= స్థిరనిశ్చయంతో; అభిషిక్తున్+చేయుము= రాజ్యానికి పట్టం కట్టుము; ప్రతీప, కుల+ఉద్వహ!= ప్రతీప మహారాజు వంశాన్ని ఉద్ధరించేవాడా!; ఇట్లు+అ+ఐన= ఈ విధంగా చేస్తే; నీ, కృతమునన్= నీవు చేసిన పనివలన; కౌరవ+అన్వయము= కౌరవవంశం; అకిల్బిష, కీర్తిన్= పాపంలేని యశస్సుతో; ప్రకాశితంబు+అగున్= వెలుగొందుతుంది.

**తాత్పర్యం:** ఇంద్రుడిని మించినవాడు, సూర్యుడివంటి తేజస్సు కలవాడు. అజాతశత్రుడు, గొప్పవాడు, జయించసాధ్యం కానివాడు అయిన ధర్మరాజు నీ కొడుకులు చేసిన కీడు మనసులో పెట్టుకోడు. ప్రతీపమహారాజుకులంలో పుట్టిన ఓ ధృతరాష్ట్ర మహారాజా! ధర్మరాజును పట్టాభిషిక్తుడిగా చేయుము. అట్లా చేస్తే కౌరవవంశం పాపం లేని కీర్తితో వెలుగొందుతుంది.'

**విశేషం:** ధృతరాష్ట్రుడి తండ్రి విచిత్రవీర్యుడు. అతడి తండ్రి శంతనుడు. అతడి తండ్రి ప్రతీపుడు. 'అజాత శత్రువు' అనే బిరుదు సంపాదించుకొన్నవాడు- ధర్మరాజు. 'అజాతశత్రువు' అనే ధ్యేయాన్ని లోకానికి ప్రసాదించి, ధర్మరాజుపాత్రను తీర్చి దిద్దిన విశిష్టత ప్రపంచవాఙ్మయంలో మహాభారతానికి దక్కింది. ఎవరియెడ కూడా శత్రుత్వంలేని శీలం పుట్టుకతోడనే లభించిన మహామహితాత్ముడు 'అజాతశత్రువు'. ఇది హృదయంగమమైన పరికల్పన. పరమ పవిత్రమైన ధ్యేయం.

**వ. అని పలికిన విదురు పలుకులు విని కడు నలిగి ధృతరాష్ట్రుం డిట్లనియె. 52**

**ప్రతిపదార్థం:** అని, పలికిన= అని చెప్పిన; విదురు, పలుకులు= విదురుడి మాటలు; విని= ఆలకించి; కడున్+అలిగి= మిక్కిలి కోపం పొంది; ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని చెప్పిన విదురుడి మాటలు విని ధృతరాష్ట్రుడు మిక్కిలి ఆగ్రహం చెంది ఈవిధంగా అన్నాడు.

**క. 'నా దేహంబునఁ బుట్టిన । యాదిసుతున్ విడువ నెట్టులగు? నాత్మజులం**
**గాదనక విఘాతించు ద । యాదూరులు గలరె? యిట్టు లన నీ కగునే? 53**

**ప్రతిపదార్థం:** నా, దేహంబునన్= నా శరీరం నుండి; పుట్టిన= జన్మించిన; ఆది, సుతున్= మొదటికొడుకును; విడువన్+ఎట్టులు+అగున్= ఏ విధంగా విడిచిపెట్టటానికి వీలవుతుంది?; కాదు+అనక= కూడదు అనుకోకుండ; ఆత్మజులన్= కన్నకొడుకులను; విఘాతించు= చంపు లేదా కీడుకలిగించు; దయాదూరులు= దయకు దూరమైన కఠినాత్ములు; కలరు+ఎ= కలరా?; ఇట్టులు+అనన్= ఈ విధంగా పలకటం; నీకు+అగునే= నీకు తగునా?

**తాత్పర్యం:** 'నా శరీరంనుండి పుట్టిన మొదటికొడుకును నేను ఎట్లా విడువగలను? కూడదు అని అనుకోకుండ కొడుకులకు చేటు కలిగించే దయాహీనులు ఉంటారా? ఈ విధంగా చెప్పటం నీకు తగునా?

### విదురుఁడు ధృతరాష్ట్రుని విడిచి పాండవులయొద్దకుఁ బోవుట (సం. 3-5-19)

**వ. నీవు నా కొడుకుల యున్నతి కెన్నండును సహింపవు; నీ సహాయత్వంబే నొల్లఁ; బాండవులకడ కేనియు నొండు గడకేనియు నీకిష్టం బైన చోటికి నరుగు' మనిన నా క్షణంబ విదురుండు మనోజవైకరథారూఢుండై పాండవుల కడకుం గామ్యకవనంబున కరిగె; నంత నతనిరాక దవ్వులం గని ధర్మరాజు భీమసేనుని కిట్లనియె.54**

**ప్రతిపదార్థం:** నీవు; నా, కొడుకుల+ఉన్నతికి= నాపుత్రుల అభివృద్ధికి; ఎన్నండును= ఏనాడుకూడా; సహింపవు= ఓర్వలేవు; నీ సహాయత్వంబు= నీ సాయం; ఏన్+ఒల్లన్= నేను సమ్మతించను; పాండవుల, కడకు+ఏనియున్= పాండవుల దగ్గరకైనా; ఒండు, కడకు+ఏనియు= ఇంకొకచోటికైనా; నీకు+ఇష్టంబు+ఐన, చోటికి= నీకు నచ్చినప్రదేశానికి; అరుగుము+అనినన్= వెళ్ళుము- అని అనగా; ఆ క్షణంబు+అ= ఆక్షణంలోనే; విదురుండు; మనస్+జవ+ఏక, రథ+ఆరూఢుండై= మనస్సుయొక్క వేగంవంటి వేగం కల రథాన్ని ఎక్కి; పాండవుల, కడకున్= పాండవు లుండే స్థలానికి; కామ్యక వనంబునకు= కామ్యక మనే పేరుకల అడవికి; అరిగెన్= వెళ్ళాడు; అంతన్; అతని, రాక= ఆ విదురుడు రావటం; దవ్వులన్+కని= దూరాన్నుండి చూసి; ధర్మరాజు; భీమసేనునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** నా కొడుకులు పైకి రావటం నీవు ఏనాడూ సహించలేవు. నీ సాయం నాకు అక్కరలేదు. నీవు పాండవుల దగ్గరకుగాని, లేక నీకిష్టమైన మరొక చోటికి గాని పొమ్ము' అని ధృతరాష్ట్రుడు అనగానే, వెంటనే విదురుడు మనోవేగం గల రథా న్నెక్కి పాండవు లుండే కామ్యకవనానికి వెళ్ళాడు. అతడు రావడం చూచి ధర్మజుడు భీమునితో ఇలా అన్నాడు-

**సీ. 'గాండీవ మాదిగాఁ గల యాయుధావలు । లుక్కివంబున నప్పు డొడిచి కొనఁగ**
**మఱచినవాఁడయ్యు మందాత్ముఁ డా ధార్త । రాష్ట్రుండు గాంధారరాజతనయు**
**వచనముల్ విని యక్షవతి నెపంబున వానిఁ । గష్టుఁడై కొన సమకట్టి మనల**
**మగుడింపఁగా దుష్టమతిఁజేసి విదురుఁ బు । త్తెంచెఁ; గాకున్న నేతేరఁ డితఁడు**

**ఆ నింక జూదమాడ నే నోప; నిది పని । గాఁగ వచ్చు నొక్కొ కడఁగి విదురుఁ;**
**డేమి సేయు వార? మితని నియోగంబు । మనకుఁ జేయ కునికి మానుషంబె?' 55**

**ప్రతిపదార్థం:** గాండీవము+ఆదిగాన్+కల= గాండీవం (అర్జునుడివిల్లు) మొదలుగా కల; ఆయుధ+ఆవలులు= ఆయుధ సమూహాలు; ఉక్కివంబునన్= మోసంతో; అప్పుడు+ఒడిచి, కొనఁగన్= ఆ సమయంలో ఓడించి తీసుకోవటం; మఱచిన, వాఁడు+ అయ్యు; మంద+ఆత్ముఁడు= మందమైన బుద్ధి కలవాడు; ఆ ధార్తరాష్ట్రుండు= ఆ ధృతరాష్ట్రుడి కొడుకు దుర్యోధనుడు; గాంధార, రాజ, తనయు, వచనముల్= గాంధారదేశపు రాజు కొడుకైన శకుని మాటలు; విని; అక్షవతి, నెపంబున= జూదం మిషతో; వానిన్= ఆ ఆయుధాలను; కష్టుఁడు+ఐ= నీచుడై; కొన, సమకట్టి= తీసుకొనాలని పూని; మనల, మగుడింపఁగాన్= మనల్ని వెనుకకు తీసికొనిపోవటానికై; దుష్ట, మతిన్+చేసి= దుర్బుద్ధిచేత; విదురున్+పుత్తెంచెన్= విదురుడిని పంపించాడు; కాక+ఉన్న= కాకపోతే; ఇతఁడున్= ఈ విదురుడు; ఏతేరఁడు= రాడు; ఏను= నేను; ఇంక= ఇకమీదట; జూదము+ఆడన్+ఓపను= జూదమాడటానికి ఇష్టపడను; విదురుఁడు; ఇది= ఈ (జూదం); పనిగాఁగ= పనిమీద; కడఁగి= పూని; వచ్చును+ఒక్కొ= వస్తాడా?; ఏమి+చేయువారము= మనము ఏమి చేద్దాం?; ఇతని, నియోగంబు= ఈ విదురుడి ఆదేశం; మనకున్; చేయక+ఉనికి= చేయకుండటం; మానుషంబె= మానవధర్మ మవుతుందా?

**తాత్పర్యం:** 'ఆనాడు దుర్యోధనుడు గాండీవం మున్నగు ఆయుధాలు సంగ్రహించటం మరచిపోయి, శకునిదుష్టబోధతో నేడు మళ్ళీజూదమాడి వాటిని కూడ కైవసం చేసికొనటానికై, మనలను తీసుకొనిరమ్మని పంపి ఉంటాడు. కాకుంటే ఇప్పుడు విదురుడు ఇక్కడికి ఎందుకు వస్తున్నట్లు? నేను ఇంకొకసారి జూదం ఆడదలచుకోలేదు. అయితే విదురుడి మాట జవదాటటం ఎట్లా?'

**విశేషం:** మహాభారతాన్ని కేవలం కథగా చూచినా, లేక ఇతిహాసంగా గ్రహించినా అందులోనుండి మానవులు నేర్చుకొనదగిన గుణపాఠాలు ఎన్నో ఉన్నాయి. ఇక్కడ విదురుడి రాకకు కారణం తెలియక అజాతశత్రువైన ధర్మరాజే కారణాంతరాలను యోచించాడు. విదురుడు పరమధర్మమూర్తి. ధర్మరాజు ఆ విదురుడిపై అకుంఠితవిశ్వాసం కలవాడు. అయినా సత్యం తెలియనప్పుడు అనేకఅనుమానాలు ఎంతటి మంచివారికైనా, ఎంతటి మంచివారి పట్లనైనా ఏర్పడటం సహజం. నిజం నిదానంగా కాని తెలియదు.

**వ. అని తమలోఁ బలుకుచున్న సమయంబున విదురుం డేతెంచిన నతనికిఁ బ్రత్యుద్గతులై వినయప్రియ సత్కారంబుల సంతుష్టుం జేసి, తదాగమననిమిత్తం బడిగిన, వారికి విదురుం డిట్లనియె. 56**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; తమలోన్= పాండవులు ఒకరితో నొకరు; పలుకుచు+ఉన్న, సమయంబునన్= మాటాడుకొనేటప్పుడు; విదురుండు; ఏతెంచినన్= రాగా; అతనికిన్; ప్రతి+ఉద్గతులు+ఐ= ఎదురువెళ్ళినవారై; వినయ, ప్రియ, సత్కారంబులన్= అణకువతో, ప్రేమతో, అతిథి సపర్యలతో; సంతుష్టున్+చేసి= సంతృప్తుడిని చేసి; తద్+ఆగమన, నిమిత్తంబు= అతడి రాకకు కారణం అడుగగా; వారికి= పాండవులకు; విదురుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని పాండవులు తమలో తాము చర్చించుకొంటూ ఉన్నసమయంలో విదురుడు వచ్చాడు. వారు అతడికి ఎదురేగి, వినయ పూర్వకంగా ప్రియమార స్వాగతసత్కారాలు చేసి, ఆయన వచ్చిన హేతువును గురించి అడిగారు. వారికి విదురుడు ఇట్లా చెప్పాడు.

**క. 'మతి వారికి మాకును గడు । హితుఁడవు; చెపుమయ్య; యింక నెయ్యది కార్య**
**స్థితి?' యని ధృతరాష్ట్రుం డే । కత మిష్టంబైన కార్యగతి నన్నడుగన్. 57**

**ప్రతిపదార్థం:** మతిన్= మనస్సులో; వారికి, మాకును= పాండవులకున్నూ, కౌరవులకున్నూ; కడు= మిక్కిలి; హితుఁడవు= మేలుకోరేవాడివి; ఇంకన్, ఎయ్యది; కార్యస్థితి= కర్తవ్యం; చెపుము+అయ్య= చెప్పవయ్యా; అని; ధృతరాష్ట్రుండు; ఏకతము= రహస్యంగా; ఇష్టంబు+ఐన= సమ్మతమైన; కార్యగతి= కార్యవిధానం; నన్ను+అడుగన్= నన్ను అడుగగా.

**తాత్పర్యం:** 'వారికిన్నీ, మాకున్నూ హితుడవు. ఇక చేయవలసిన పని ఏమిటో చెప్పవయ్యా!' - అని ధృతరాష్ట్రుడు నన్ను ఏకాంతంగా అడిగినప్పుడు.

**వ. ఏ నుభయపక్షంబులవారికి జగంబునకు లగ్గుగ హితంబైన విధంబు సెప్పిన, నది సర్వజన రుచికరంబైన యాహారంబు రోగాతురునకు నరుచికరంబైన యట్ల యతనికి రుచియింపదయ్యె. 58**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఉభయ, పక్షంబుల, వారికి= ఇరువైపుల వారికి; జగంబునకు= లోకానికి; లగ్గుగ= మేలవునట్లుగా; హితంబు+ఐన, విధంబు= మేలైనమార్గం; చెప్పినన్; అది; సర్వ, జన, రుచికరంబు+ఐన= అందరు జనులకు ఇష్టమైన; ఆహారంబు= భోజనం; రోగ+ఆతురునకున్= జబ్బుచేసినవాడికి; అరుచికరంబు+ఐన+అట్లు= రుచించనట్లు; అతనికి; రుచియింపదు+అయ్యెన్= ఇష్టం కాలేదు.

**తాత్పర్యం:** నేను ఉభయపక్షాలవారికి, జగత్తుకు మేలయ్యే మార్గం ఉపదేశించాను. కాని అందరికి రుచిగా ఉన్న ఆహారం జబ్బు చేసినవాడికి రుచించనట్లు అతడికి నాహితవు రుచించలేదు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. కార్యగతులతెఱఁగు కలరూపు సెప్పిన । నధికమతులు దాని నాదరింతు;**
**రల్పకార్యబుద్ధు లగువారలకు నది । విరసకారణంబు విషమ పోలె. 59**

**ప్రతిపదార్థం:** కార్య, గతుల తెఱఁగు= కర్తవ్యమార్గం; కలరూపు+చెప్పినన్= ఉన్నది ఉన్నట్లు చెప్పితే; అధికమతులు= గొప్పబుద్ధి కలవారు; దానిన్+ఆదరింతురు; అల్ప, కార్య, బుద్ధులు+అగువారలకున్= నీచకృత్యాలతో కూడిన బుద్ధి కలవాళ్ళకు; అది; విషము+అ, పోలె= విషంవలెనే; విరస, కారణంబు= బుద్ధిని విరిచివేసే హేతువు, అప్రీతికి కారణం.

**తాత్పర్యం:** ఉన్నదున్నట్లు చెపితే గొప్పబుద్ధి కలవాళ్ళు దాన్ని ఆదరిస్తారు. కాని, నీచకృత్యాలకు పాల్పడేవాళ్ళకు అది రక్తాన్ని విరిచే విషంవలె, బుద్ధికి విరసంగా ఉంటుంది.

**విశేషం:** అలం: ఉపమ. ఈ పద్యం ఆదికవి సూక్తిరత్నాల్లో ఒకటి.

**వ. దానన చేసి ధృతరాష్ట్రుండు నన్నొల్లక యెగ్గులు పలికి 'నీవు విపరీతచేతస్కుండ; విందుండ వలవదు; పాండవుల పాలికిం బొ' మ్మనిన వచ్చితి; రూపలావణ్యవతియై వృద్ధశ్రోత్రియునిచేతం బరిణీతయైన తరుణియుం బోలె రాజ్యలక్ష్మి యద్దురాత్మునందు విరక్తయగాని ప్రీతిఁ బుట్టదండ్రు. 60**

**ప్రతిపదార్థం:** దానన్+అ, చేసి= అందుచేత; ధృతరాష్ట్రుండు; నన్ను+ఒల్లక= నన్ను అంగీకరించక; ఎగ్గులు+పలికి= నిష్ఠురాలాడి; నీవు; విపరీత, చేతస్కుండవు= వ్యతిరేకమైన మనస్సు కలవాడివి; ఇందు+ఉండ, వలవదు= ఇక్కడ ఉండవద్దు; పాండవుల, పాలికిన్+పొమ్ము+అనినన్= పాండవులవద్దకు వెళ్ళుమంటే; వచ్చితిన్; రూప, లావణ్యవతి+ఐ= సౌందర్యం, తళుకు కలిగినదై; వృద్ధశ్రోత్రియుని చేతన్= ముసలివాడై పూర్వ సంప్రదాయ బద్ధుడైన వైదికవిప్రుడిచేత; పరిణీత+ఐన= పెండ్లి యాడబడిన; తరుణియున్+పోలెన్= లేతజవరాలి వలె; రాజ్యలక్ష్మి= రాజ్యమనే లక్ష్మి; ఆ+దురాత్మునందు= ఆ దుర్మార్గుడి పట్ల, విరక్త+అ= వలపులేనిదే; కాని; ప్రీతిన్= ప్రేమను; పుట్టదు+అండ్రు= కలుగదు అని అంటారు.

**తాత్పర్యం:** అందుచేత ధృతరాష్ట్రుడు నన్ను నిందించి, 'నీవు మాకు వ్యతిరేకమైన మనస్సుగలవాడివి. ఇక్కడ ఉండవద్దు. పాండవుల దగ్గరికి పో' అన్నాడు. అందువలన నే నిక్కడికి వచ్చాను. ముసలివాడైన ఛాందసుడు పెండ్లాడిన లేజవరాలివలె, రాజ్యలక్ష్మి ఆ దురాత్ముడి పట్ల వలపు లేనిదే అవుతుందిగాని, ప్రీతికలిగింది కాదని అంటారు కదా.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. ధర్మరహితులైన ధార్తరాష్ట్రులకు భూ । రాజ్యలక్ష్మి సుస్థిరంబు గాదు;**
**ధర్మతనయ! నిన్నుఁ దద్రాజ్యసంపదల్ । వలచి తమకుఁ దామ వచ్చి పొందు. 61**

**ప్రతిపదార్థం:** ధర్మ, రహితులు+ఐన= ధర్మంలేని; ధార్తరాష్ట్రులకు= ధృతరాష్ట్రుడి కొడుకులకు; భూ, రాజ్యలక్ష్మి= భూరాజ్యమనే లక్ష్మి; సుస్థిరంబు= ఎంతో ఎక్కువకాలం నిలిచేది; కాదు; ధర్మతనయ!= ఓ ధర్మరాజా!; నిన్నున్; తద్+రాజ్య, సంపదల్= ఆ రాజ్యంయొక్క ఐశ్వర్యాలు; వలచి= ప్రేమించి; తమకున్, తాము+అ= తమంతట తామై; వచ్చి= చేరి; పొందున్= పొందుతాయి.

**తాత్పర్యం:** ధర్మాన్ని కోలుపోయిన దుర్యోధనాదులకు రాజ్యలక్ష్మిస్థిరంగా ఉండదు. ఓ ధర్మరాజా! ఆ రాజ్యసంపదలు తమంత తామై నిన్ను వలచి వచ్చి పొందుతాయి.

**విశేషం:** భూరాజ్యలక్ష్మి - రూపకాలంకారం. భూరాజ్యానికి లక్ష్మికి ఇక్కడ అభేదాధ్యవసాయం.

**వ. నా వచనంబున నెగడునది' యనిన ధర్మరాజు 'నట్ల చేయుదు' నని యున్నంత; నిట ధృతరాష్ట్రుండు పాండవులయొద్ద విదురు నునికి యెఱింగి ధృతివిహీనుండై, తన హృదయంబును దృష్టియుం బోని విదురుం బాసి నిమిషం బేనియు నిర్వహింప నోపక సంజయున కిట్లనియె. 62**

**ప్రతిపదార్థం:** నా, వచనంబున= నామాట చొప్పున, నెగడునది= నడిచేది; అనినన్; ధర్మరాజును; అట్లు+అ= ఆవిధంగానే; చేయుదును+అని= చేస్తానని; ఉన్నంత= అక్కడ నివసించినంత; ఇట; ధృతరాష్ట్రుండు; పాండవుల+ఒద్ద= పాండవులకడ; విదురు+ఉనికి= విదురుడు ఉండటం; ఎఱింగి= తెలిసికొని; ధృతివిహీనుండు+ఐ= తాలిమిలేనివాడై; తన హృదయంబును= తన గుండెను; దృష్టియున్+పోని= చూపును పోలిన; విదురున్+పాసి= విదురుడిని విడనాడి; నిమిషంబు+ఏనియు= నిమిషమైనను; నిర్వహింపన్+ఓపక= ఏపనియు చేయలేక; సంజయునకు+ఇట్లు+అనియెన్= సంజయుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'నేను చెప్పినట్లు నడచుకోండి' అని విదురుడు అనగా, 'అట్లే చేస్తా'నని ధర్మరాజు బదులు పలికాడు. ఇక్కడ ధృతరాష్ట్రుడికి విదురుడు పాండవులకడ ఉన్నట్లు తెలిసింది. తనకు గుండెవంటివాడున్నూ, చూపు వంటివాడున్నూ అయిన విదురుడిని విడిచి ఉండలేక ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా పలికాడు.

**విశేషం:** విదురుడు ధృతరాష్ట్రుడి హృదయంతో (గుండెతో), చూపుతో పోల్చబడ్డాడు. ఇది ఉపమాలంకారం.

**క. 'నెమ్మిగలవాని, నా చి । త్తమ్మెఱిఁగెడు వాని విదురు ధర్మప్రియు నా**
**తమ్ము నిట వేగఁ దోడ్కొని । ర; మ్మరుగుము కామ్యకాఖ్య రమ్యాటవికిన్. 63**

**ప్రతిపదార్థం:** నెమ్మి కలవానిన్= ప్రేమ కలవాడిని; నా, చిత్తమ్ము+ఎఱిఁగెడు వాని= నామనస్సు తెలిసికొనగలిగిన వాడిని; ధర్మప్రియు= ధర్మంపట్ల ప్రీతి కలవాడిని; నా, తమ్మున్= నా సోదరుడిని; విదురున్, ఇట= ఇక్కడకు; వేగన్= శీఘ్రంగా; తోడ్కొని, రమ్ము= తీసికొని రావాలి; కామ్యక+ఆఖ్య, రమ్య+అటవికిన్= కామ్యకం అనే పేరున్న అందమైన అడవికి; అరుగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** 'ప్రీతిపాత్రుడు, నామనస్సు తెలిసినవాడు, నా సోదరుడు, ధర్మప్రియుడు అయిన విదురుడిని తీసికొనిరమ్ము. కామ్యకవనానికి వెళ్ళుము' - అని ధృతరాష్ట్రుడు సంజయుడితో పలికాడు.

**వ. అని పంచిన నప్పుడ సంజయుం డతిత్వరితగతిం గామ్యకవనంబున కరిగి. 64**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; పంచినన్= ఆజ్ఞాపించగా; అప్పుడు+అ= వెంటనే; సంజయుండు; అతి త్వరితగతిన్= మిక్కిలి వేగంతో; కామ్యక వనంబునకు= కామ్యక మనే పేరున్న అడవికి; అరిగి= వెళ్ళి.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు ఆజ్ఞాపించగానే సంజయుడు మిక్కిలి వేగంగా కామ్యకవనానికి వెళ్ళాడు.

**మ. ధరణీదేవసహస్రసంఘములతో ధౌమ్యుండు ధర్మక్షమా**
**భరణుల్ నల్వురు దమ్ములున్ విదురుఁడుం బాంచాలియుం బ్రీతి బం**
**ధురులై కొల్వఁగ నొప్పుచున్న బుధబంధున్ ధర్మరాజుం బ్రభా**
**స్వరతేజుం బ్రభుఁ గాంచి సంజయుఁడు సంజాతప్రమోదాత్ముఁడై. 65**

**ప్రతిపదార్థం:** ధరణీదేవ, సహస్ర, సంఘములతోన్= వేలకొలది విప్రుల సమూహములతో (ధరణీదేవులు= భూదేవులు, బ్రాహ్మణులు); ధౌమ్యుండు= పురోహితుడైన ధౌమ్యుడు; ధర్మ, క్షమా+ఆభరణుల్= ధర్మం, క్షమ అనే ఆభరణాలు కలవారు; నల్వురు= నలుగురు; తమ్ములున్= సోదరులున్నూ; విదురుఁడున్= విదురుడున్నూ; పాంచాలియున్= పాంచాలదేశరాజపుత్రి అయిన ద్రౌపదియున్నూ; ప్రీతి బంధురులు+ఐ= ప్రీతితో కూడిన వారై; కొల్వఁగన్= సేవిస్తుండగా; ఒప్పుచున్న= ప్రకాశిస్తున్న; బుధ బంధున్= సుజనులకు చుట్టం వంటివాడైన; ధర్మరాజున్= ధర్మరాజును; ప్రభాస్వరతేజున్= మిక్కిలి ప్రకాశంతో కూడిన తేజం కలవాడిని; ప్రభున్= రాజును; సంజయుఁడు; కాంచి= చూచి; సంజాత, ప్రమోద+ఆత్ముఁడు+ఐ= పుట్టిన సంతోషం కల ఆత్మకలవాడై, అంటే వికసించిన సంతోషంతో నిండినవాడై.

**తాత్పర్యం:** వేలకొలది విప్రుల సమూహములతో, పురోహితుడైన ధౌమ్యుడితో, ధర్మం, క్షమ అనే ఆభరణాలు తాల్చిన నలుగురు తమ్ములతో, విదురుడితో, ద్రౌపదితో సేవించబడుతున్నవాడై, సజ్జనబంధువై దేదీప్యమానంగా వెలుగుతున్న ధర్మరాజును చూచి సంజయుడు సంతోషతన్మయత్వంతో-

**క. వనవాసము సేయుచుఁ ద్రిభు । వన రాజ్యము సేయునట్టి వడువున సంతో**
**ష నిబద్ధ బుద్ధి యగు యమ । తనూజునకు భక్తి నెఱఁగి తా నిట్లనియెన్. 66**

**ప్రతిపదార్థం:** వనవాసము+చేయుచున్= అడవిలో నివసిస్తూకూడా; త్రి, భువన, రాజ్యము+చేయు+అట్టి, వడువునన్= మూడు లోకాలు ఏలుతున్న రీతిని; సంతోష నిబద్ధ బుద్ధి+అగు= సంతోషంతో కూడిన బుద్ధి కలవాడయిన, అంటే నిండు సంతోషంతో కూడినవాడైన; యమ తనూజునకు= ధర్మపుత్రుడికి; భక్తిన్= భక్తితో; ఎఱఁగి= నమస్కరించి; తాన్= తాను (సంజయుడు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** తాను అడవిలో నివసిస్తున్నప్పటికిన్నీ ముల్లోకాలు పరిపాలిస్తున్నరీతిని సంతోషంతో నిండినవాడైన ధర్మరాజుకు నమస్కరించి ఈవిధంగా పలికాడు.

**వ. 'మిమ్మును ధర్మార్థవిదుండైన విదురునిం గౌరవేంద్రుం డెప్పుడుం దలంచుచుండు; మీ యనుమతంబునఁ దన యనుజుం దోడ్కొని తేర నన్నుఁ బుత్తెంచె' ననిన విని ధర్మరాజు విదురున కిట్లనియె. 67**

**ప్రతిపదార్థం:** మిమ్మును; (పాండవులను); ధర్మ+అర్థ, విదుండు+ఐన= ధర్మంయొక్క ఆంతర్యాన్ని (ధర్మాన్ని, అర్థాన్ని) ఎరిగిన; విదురునిన్= విదురుడిని; కౌరవ+ఇంద్రుండు= కౌరవప్రభువు, ధృతరాష్ట్రుడు; ఎప్పుడున్+తలంచుచు+ఉండు; మీ, అనుమతంబునన్= మీ అనుజ్ఞ చొప్పున; తన, అనుజున్= తన తమ్ముడిని (విదురుడిని); తోడ్కొని తేరన్= వెంటబెట్టుకొని తీసికొని వచ్చుటకు; నన్నున్= నన్ను; పుత్తెంచెను= పంపించాడు; అనిన; విని; ధర్మరాజు; విదురునకు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'మిమ్ములను, ధర్మవేత్త అయిన విదురుడిని, ధృతరాష్ట్రప్రభువు ఎల్లప్పుడు స్మరిస్తూ ఉంటాడు. మీ అనుజ్ఞ గైకొని, తన తమ్ముడైన విదురుడిని తీసికొని రమ్మని నన్ను ధృతరాష్ట్రుడు మీకడకు పంపాడు' - అని సంజయుడు చెప్పగా విని ధర్మరాజు విదురుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'సర్వజనులును ధృతరాష్ట్ర శాసనంబు । సేయుచున్నచో మనకు విశేషభక్తిఁ**
**జేయవలయుఁ; గావున నెడ సేయ కరుగు' । మనిన విదురుండు గజపురి కరిగె నంత. 68**

**ప్రతిపదార్థం:** సర్వజనులును= సమస్త ప్రజలును; ధృతరాష్ట్ర, శాసనంబు= ధృతరాష్ట్రుడి ఆజ్ఞ; చేయుచున్నచో= పాటిస్తుండగా; మనకు; విశేషభక్తిన్= మిక్కిలి భక్తితో; చేయవలయున్= పాటించాలి; కావునన్; ఎడ+చేయక= ఆలస్యంచెయ్యకుండ; అరుగుము= వెళ్ళుము; అనిన= అని అనగా; విదురుండు= విదురుడు; అంత; గజపురికి= హస్తినాపురానికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'ప్రజలందరు ధృతరాష్ట్రుడి శాసనాన్ని శిరసావహిస్తున్నప్పుడు, ఆతడి ఆజ్ఞను విశేషించి పాటించవలసిన ధర్మం మనపై ఉన్నది. కాబట్టి నీవు ఆలస్యం చేయకుండ వెళ్ళు' మని విదురుడితో ధర్మరాజు అన్నాడు. వెంటనే, విదురుడు హస్తినాపురానికి వెళ్ళాడు.

**వ. ధృతరాష్ట్రుండును దనకు వినయవినమితోత్తమాంగుఁ డైన విదురు నతిస్నేహంబునం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి 'నీవు నిత్యక్షమానిరతుండవు నాబుద్ధిలేమికి క్షమియింపు' మనిన విదురుం డిట్లనియె.69**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండును; తనకు; వినయ, వినమిత+ఉత్తమ+అంగుఁడు+ఐన= నమ్రతతో వంగిన శిరం కలవాడైన; విదురున్= విదురుడిని; అతి స్నేహంబునన్= మిక్కిలి అనురాగంతో; కౌఁగిలించుకొని= ఆలింగనంచేసికొని; మూర్ధ+ ఆఘ్రాణంబు+చేసి= తలను మూర్కొని (అది వాత్సల్య చిహ్నం); నీవు; నిత్య, క్షమా, నిరతుండవు= ఎల్లప్పుడు క్షమించటంలో ఇష్టం కలవాడివి; నా, బుద్ధి, లేమికి= నాకు బుద్ధిలేక పోవటానికి; క్షమియింపుము; అనిన; విదురుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** తనకు భక్తితో శిరస్సు వంచి మ్రొక్కిన విదురుడిని, ధృతరాష్ట్రుడు అనురాగపురస్సరంగా ఆలింగనం చేసికొని 'నిత్యం క్షమాగుణంనందు ఆసక్తుడవైన నీకు క్షమించే సౌశీల్యం ఉన్నది. నాకు బుద్ధిలేకపోయింది. నన్ను క్షమించు' - అని వేడుకొన్నాడు. అప్పుడు ధృతరాష్ట్రుడితో విదురుడు ఇట్లా పలికాడు.

**ఆ. 'నీవు నీ సుతుండు నెఱిఁ దప్పి పలికినఁ । బథ్యమయిన పలుక పలుకవలయు;**
**వీరు లయిన పాండవేయులతో నిగ్ర । హంబు సేయు టిది నయంబు గాదు.' 70**

**ప్రతిపదార్థం:** నీవు; నీ, సుతుండు= నీ కొడుకు; నెఱిన్+తప్పి= న్యాయాన్ని విడిచి; పలికినన్= మాట్లాడగా; పథ్యము+అయిన= మేలు చేకూర్చేటి; పలుకు+అ= మాటనే; పలుకవలయు= చెప్పాలి; వీరులు+అయిన= పరాక్రమవంతులయిన; పాండవేయులతోన్= పాండవులతో; నిగ్రహంబు= వైరం; చేయుట; ఇది; నయంబు, కాదు= నీతి (మంచిది) కాదు.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీవున్నూ, నీకొడుకైన దుర్యోధనుడున్నూ న్యాయం తప్పి మాట్లాడుతున్నపుడు, మీ మేలుకోరి నేను హితవు పలకటం నా కర్తవ్యం. పరాక్రమవంతులైన పాండవులతో వైరం మంచిది కాదు.'

**వ. అనుచు నెప్పటి యట్ల కార్యసహాయుండై విదురుండు ధృతరాష్ట్రునొద్ద నున్న, నయ్యిద్దఱ సంగమంబునకు శంకించి దుర్యోధనుండు కర్ణ శకుని దుశ్శాసనులతో నిట్లనియె. 71**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని చెపుతూ; ఎప్పటి+అట్లు+అ= యథాప్రకారం; కార్య, సహాయుండు+ఐ= పనులను చేయటంలో (తగిన సలహాలనిస్తూ) సాయం చేస్తున్నవాడై; విదురుండు= విదురుడు; ధృతరాష్ట్రు+ఒద్దన్= ధృతరాష్ట్రుడి కడ; ఉన్నన్= ఉండగా; ఆ+ఇద్దఱు+అ= ఆ ఇరువురి; సంగమంబునకున్= కూడికకు; శంకించి= సందేహించి; దుర్యోధనుండు; కర్ణ; శకుని; దుశ్శాసనులతోన్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని చెప్పి విదురుడు మునుపటివలెనే ధృతరాష్ట్రుడికి ఆయా పనులు చేయటంలో తగిన సలహాలు ఇస్తూ సాయం చేస్తున్నాడు. ఆ ఇరువురి కలయికకు సందేహించి దుర్యోధనుడు కర్ణ శకుని దుశ్శాసనులతో ఇట్లా అన్నాడు.

**క. 'పాండవహితుఁ డగు విదురుఁడు । వెండియుఁ జనుదెంచి కార్యవిధులందు సహా**
**యుండయ్యెఁ; నతనితోడ హి । తుండయి మంతనము సేయఁ దొడఁగెన్ విభుఁడున్. 72**

**ప్రతిపదార్థం:** పాండవ, హితుఁడు+అగు= పాండవుల పట్ల ప్రీతి ఉన్న; విదురుఁడు; వెండియున్= మళ్ళీ; చనుదెంచి= వచ్చి; కార్య, విధులందు= పనులు చేసే తీరులలో; సహాయుండు+అయ్యెన్= తోడ్పడేవాడయ్యాడు; అతనితోడన్ - ఆ విదురుడితో; హితుండు+అయి= అనురాగం కలవాడయి; విభుఁడున్= రాజుకూడ (ధృతరాష్ట్రుడును); మంతనము+చేయన్, తొఁడగెన్= ఆలోచనలు చేయటానికి పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** 'పాండవులపట్ల ప్రీతికల విదురుడు మళ్ళీ వచ్చి ధృతరాష్ట్రుడికి మంత్రి అయ్యాడు. రాజైన ధృతరాష్ట్రుడు కూడ ఆతడితో అన్ని విషయాలు సంప్రతించి మన్నిస్తున్నాడు.

**వ. వీరలింకఁబాండవుల నిందులకు రావించు వారలయిన నగ్ని విష జలంబులు ప్రయోగించి వారల కపాయంబు సేయుద' మనిన విని శకుని దుర్యోధనుం జూచి 'యిట్లేల బాలిశంబైన మతిఁ దలంచితివి? విదుర ధృతరాష్ట్రులు విపరీతమతులై రావించినను, నిత్యసత్యనిరతులైన యప్పాండవులు దమ సేసిన సమయంబు సలుపక యేల వచ్చువార గుదు?' రనిన శకునిదుర్యోధనులకుఁ గర్ణుం డిట్లనియె. 73**

**ప్రతిపదార్థం:** వీరలు= (విదురుడు, ధృతరాష్ట్రుడు); ఇంకన్; పాండవులన్; ఇందులకు= ఇక్కడికి; రావించువారలు+అయినన్= రప్పించే వాళ్ళయితే; అగ్ని, విష, జలంబులు= నిప్పు, విషంతో కలిసిన నీరు (విషం, నీరు); ప్రయోగించి= వాడి; వారలకు; (ఆ పాండవులకు); అపాయంబు+చేయుదము= ప్రమాదం కల్పిద్దాము; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; శకుని; దుర్యోధనున్+చూచి; ఇట్లు+ఏల, బాలిశంబు+ఐన= ఈ విధంగా ఎందుకు మూర్ఖమైన; మతిన్+తలంచితివి= బుద్ధితో ఊహ చేశావు; విదుర, ధృతరాష్ట్రులు= విదురుడును, ధృతరాష్ట్రుడును; విపరీతమతులు+ఐ= వ్యతిరేకమైన బుద్ధికలవారై; రావించినను= (పాండవులను) రప్పించినప్పటికి; నిత్య, సత్య, నిరతులు+ఐన= ఎల్లప్పుడు సత్యం పట్ల ప్రీతి కలిగినవారైన; ఆ+పాండవులు; తమ, చేసిన, సమయంబు= తాము గైకొన్న ప్రతిజ్ఞను; సలుపక= పాటించక; ఏల, వచ్చువారు+అగుదురు= ఏ విధంగా వస్తారు?; అనినన్= అని అనగా; శకుని దుర్యోధనులకున్; కర్ణుండు= కర్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఒకవేళ విదురుడు ధృతరాష్ట్రుడు కలిసి పాండవులను వనవాసంనుండి ఇక్కడికి రప్పిస్తే, వారికి అగ్ని విష జల ప్రయోగాలతో అపాయం కలిగిద్దాము' అని దుర్యోధనుడనగా, అందుకు శకుని ఎందుకు ఇట్లా తెలివితక్కువగా ఆలోచిస్తున్నావు'? విదురుడు, ధృతరాష్ట్రుడు విభిన్నంగా ఆలోచించి వాళ్ళను రప్పించినా, సత్యసంధులైన పాండవులు తమ ప్రతిజ్ఞను పాటించకుండ ఎందుకువస్తారు? అని అనగానే - కర్ణుడు, శకుని దుర్యోధనులకు తన అభిప్రాయాన్ని ఇలా వెల్లడించాడు.

**ఉ. 'ఇత్తఱిఁ బన్నిపోయి పయినెత్తి రణం బొనరించి వారలన్**
**మిత్తికి నంపి ధాత్రి నిరమిత్రముఁ జేయుద; మిట్టు లైనఁ ద**
**ద్వృత్తులు నీక దక్కుఁ గురువీర; కడంగుము' నావుడున్ మదో**
**న్మత్తుఁడు గౌరవుం డతనిమాటకు సంతసమంది చెచ్చెరన్. 74**

**ప్రతిపదార్థం:** ఇత్తఱిన్ (ఈ+తఱిన్)= ఈ అదనులో; పన్నిపోయి= యుద్ధమునకుసిద్ధమైవెళ్ళి; పయిన్+ఎత్తి= దండెత్తి; రణంబు+ఒనరించి= యుద్ధంచేసి; వారలన్(పాండవులను); మిత్తికిన్= మృత్యువుకు; అంపి= పంపి; ధాత్రిన్= భూమిని; నిర్+అమిత్రమున్+చేయుదము= శత్రువులు లేనట్లు చేద్దాం; ఇట్టులు+ఐనన్= ఈ విధంగా చేస్తే; తద్+వృత్తులు= వారి జీవనోపాయాలు; నీకు+అ= నీకే; దక్కున్= స్థిరపడతాయి; కురువీర!= కురువంశంలోని వీరుడా! ఓ దుర్యోధనుడా!;

కడంగుము= పూనుము; నావుడున్= అని చెప్పగా; మద+ఉన్మత్తుఁడు= మదంచేత గర్వించినవాడు; కౌరవుండు= దుర్యోధనుడు (కురువంశస్థుడు); అతని మాటకు= కర్ణుడి మాటకు; సంతసము+అంది= సంతోషించి; చెరన్+చెరన్= వేగంగా.

**తాత్పర్యం:** 'ఈ అదనులో మనం పాండవులపై దండెత్తి వారిని సంహరించి, భూమిపై ఇక మనకు శత్రుశేషం లేకుండా చేద్దాం. వారి జీవనోపాయాలు నీకు స్థిరంగా ఉంటాయి'- అని కర్ణుడు చెప్పగా మదోన్మత్తుడైన దుర్యోధనుడు మిక్కిలి సంతోషించాడు.

**విశేషం:** ధాత్రిని 'నిరమిత్రము' చేయటం పేర్కొదగిన ప్రయోగం. నిర్+అమిత్రము= నిరమిత్రము. సంస్కృతవ్యాకరణాన్ని అనుసరించి 'నిర్' అనేది వ్యతిరేకార్థకం.

**వ. సమర సన్నద్ధుఁడై సమస్తబలంబును సమకట్టి వెలువడినం దన దివ్యదృష్టి నంతయు నెఱింగి కృష్ణద్వైపాయనుండు వచ్చి 'యిది ధర్మువు గా దుడుగు' మని దుర్యోధనుని వారించి ధృతరాష్ట్రున కిట్లనియె.75**

**ప్రతిపదార్థం:** సమర, సన్నద్ధుఁడు+ఐ= యుద్ధమునకు సిద్ధమైనవాడై; సమస్త బలంబును= సర్వసేనలను; సమకట్టి= సమీకరించి; వెలువడినన్= దండయాత్రకు బయలుదేరగా; తన దివ్యదృష్టిన్= తనయొక్క దివ్యదృష్టిచేత; అంతయున్+ఎఱింగి; కృష్ణద్వైపాయనుండు= వేదవ్యాసుడు; వచ్చి; ఇది; ధర్మువు+కాదు= ధర్మం కాదు; ఉడుగుము+అని= విరమించుమని; దుర్యోధనుడిని; వారించి= ఆపి; ధృతరాష్ట్రునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు సేనలను సమీకరించి యుద్ధానికి బయలుదేరుతుండగా ఆ వృత్తాంతాన్నంతా తన దివ్యదృష్టితో తెలిసికొన్న వ్యాసమహర్షి అక్కడికి వచ్చి, 'ఇది ధర్మం కా'దని అతడిని వారించి, ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ద్వైపాయనుడు - అనగా వ్యాసుడు. వ్యాసుడు సత్యవతికి పరాశరమహర్షికి జన్మించాడు. యమునపై పడవ నడుపుతున్న సత్యవతిపై మరులుగొన్న పరాశరుడు నీహారయవనికను సృష్టించి, పడవను నదిమధ్యన ఉన్న ఒక ద్వీపం చేర్పించాడు. ఆ ద్వీపంలో సద్యోగర్భం నుండి వ్యాసుడు ఉద్భవించాడు. అందువలన ఆయనకు ద్వైపాయనుడు= ద్వీపంలో పుట్టినవాడు - అని పేరు కలిగింది. కృష్ణద్వైపాయనుడు - అనగా నల్లని వర్ణంకల ద్వైపాయనుడని అర్థం.

**క. 'పుడమియు రాజ్యముఁ గోల్పడి । యడవుల నేకతమ యున్న యప్పాండవులం**
**గడఁగి వధియింతు నని నీ । కొడు కరిగెడు; నిట్లు తలఁపఁ గూడునె బుద్ధిన్? 76**

**ప్రతిపదార్థం:** పుడమియు, రాజ్యమున్= భూమిని, రాజ్యాన్ని; కోల్పడి= పోగొట్టుకొని; అడవులన్= అడవులలో; ఏకతము+అ+ఉన్న= ఒంటరిగా ఉండే; ఆ+పాండవులన్; కడఁగి= పూని; వధియింతును+అని= చంపుతానని; నీ, కొడుకు; అరిగెడున్= వెళ్ళుతున్నాడు; బుద్ధిన్= బుద్ధితో; ఇట్లు, తలఁపన్+కూడునె?= ఈ విధంగా ఆలోచించవచ్చునా?

**తాత్పర్యం:** 'భూ రాజ్యాలను జూదంలో పోగొట్టుకొని అడవుల్లో ఒంటరిగా నివసిస్తున్న పాండవులను సంహరించాలని నీ కొడుకు దుర్యోధనుడు దండెత్తుతున్నాడు. ఇట్లాంటి ఆలోచన చేయవచ్చునా?

**క. ధృతియుతులై సత్యవ్రత । రతులై పదుమూఁడు వత్సరంబులు ధర్మ**
**స్థితి సలిపి వార కడఁగెద । రతులపరాక్రములు మీఁద నాహవమునకున్. 77**

**ప్రతిపదార్థం:** ధృతియుతులు+ఐ= ఓర్పుకలవారై; సత్య, వ్రత, రతులు+ఐ= సత్యాన్ని నిష్ఠగా పాటించటంలో ఇష్టం కలవారై; పదుమూఁడు వత్సరంబులు= పదమూడేండ్లు; ధర్మస్థితి, సలిపి= ధర్మమైన స్థితితో నిర్వహించి; ఆహవమునకున్= యుద్ధానికి; అతుల, పరాక్రములు= సాటిలేని శౌర్యంకలవారు; మీఁదన్= తదుపరి; వారు+అ= వారే(పాండవులే); కడఁగెదరు= పూనుకొంటారు.

**తాత్పర్యం:** సత్యసంధులు, పరాక్రమవంతులు, ఓర్పుకలవారు అయిన పాండవులే పదమూడేండ్లు తమ ప్రతిజ్ఞను పాటించిన తర్వాత యుద్ధానికి పూనుకొంటారు.

**క. వనగతులని వారలపైఁ । జని భంగముఁ బొంది రాఁగ సమకట్టెడు నీ**
**తనయుఁడు గావున నీ వా । తని వారింపు మది యనుచితం బని నెమ్మిన్. 78**

**ప్రతిపదార్థం:** వనగతులు+అని= అడవులకు వెళ్ళారని; వారలపైన్= ఆ పాండవులమీదికి; చని= దండెత్తి వెళ్ళి; భంగమున్+పొంది= పరాజయం పొంది; రాఁగ= మరలి రావటానికి; నీ, తనయుఁడు= నీ కొడుకు; సమకట్టెడు= పూనుతున్నాడు; కావున; నీవు; ఆతని= దుర్యోధనుడిని; నెమ్మిన్= మంచితనంతో; అది, అనుచితంబు+అని= అది సరి అయినది కాదని; వారింపుము= ఆపుము.

**తాత్పర్యం:** అడవుల పాలయ్యారని ఆ పాండవులమీదికి దండెత్తటానికి ఉద్యమించిన నీ కొడుకు పరాజయాన్నే పొంది తిరిగి రావలసి వస్తుంది. నీవు పూనుకొని ఆ అనుచితచర్యను వద్దని చెప్పి ఆతడిని వారించుము.

**క. విను మేనును నీవును శాం । తనవుఁడు విదురుండు నుండి తగునె యధర్మం**
**బు నుపేక్షింపఁగ? ననయం । బును బాండవవిగ్రహంబు పుట్టుట లగ్గే?' 79**

**ప్రతిపదార్థం:** వినుము; ఏనును, నీవును= నేనున్నూ, నీవున్నూ; శాంతనవుఁడు= భీష్ముడు; విదురుండును; ఉండి; అధర్మంబున్= అధర్మాన్ని; ఉపేక్షింపఁగన్+తగున్+ఎ= సహించటం తగునా?; అనయంబును= ఎల్లప్పుడు (దుర్నీతియు); పాండవ విగ్రహంబు= పాండవులతోడి విరోధం; పుట్టుట; లగ్గు+ఏ= మేలా?

**తాత్పర్యం:** వినుము. నీవు, నేను విదురుడు, భీష్ముడు బ్రదికి ఉండగా అధర్మాన్ని సహించటం న్యాయమా? సదా పాండవులపై పగ పూనటం మేలా?'

**విశేషం:** శాంతనవుడు= శంతనుపుత్రుడు- అపత్యార్థక తద్ధితం. ధార్తరాష్ట్రుడు= ధృతరాష్ట్రుడి కొడుకు - ఇట్టిదే.

**వ. అనిన విని ధృతరాష్ట్రుండు దుఃఖితుండై 'నాకును గాంధారికిని భీష్మ విదుర కృప ద్రోణులకు ననిష్టంబైన దుష్ట ద్యూతంబు ప్రవర్తిల్లె; దుర్బుద్ధియైన దుర్యోధనుం బుత్త్రస్నేహంబున విడువనోప; నేమి సేయుదు?' ననిన ధృతరాష్ట్రునకుఁ గృష్ణద్వైపాయనుం డిట్లనియె. 80**

**ప్రతిపదార్థం:** అనిన, విని; ధృతరాష్ట్రుండు; దుఃఖితుండు+ఐ= శోకించినవాడై; నాకును; గాంధారికిని; భీష్మ, విదుర, కృప, ద్రోణులకున్; అనిష్టంబు+ఐన= ఇష్టంకాని; దుష్టద్యూతంబు= చెడు జూదం; ప్రవర్తిల్లెన్= జరిగింది; దుర్బుద్ధి+ఐన= చెడ్డ బుద్ధి

కలవాడైన; దుర్యోధనున్= దుర్యోధనుడిని; పుత్త్ర స్నేహంబునన్= పుత్రుడిపైగల అనురాగంచేత; విడువన్+ఓపన్= విడువజాలను; ఏమి+చేయుదున్= ఏమి చేయగలను?; అనిన= అని చెప్పగా; ధృతరాష్ట్రునకున్; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలు విని ధృతరాష్ట్రుడు దుఃఖించి, 'నాకు, గాంధారికి, భీష్మ విదుర కృప ద్రోణులకు ఇష్టం కాని చెడుజాదం జరిగింది. ఏమి చేయగలను? పుత్రవాత్సల్యంవలన నేను దుర్బుద్ధి అయిన దుర్యోధనుడిని, వదలలేకున్నాను'- అని వ్యాసుడితో విన్నవించుకోగా, వ్యాసుడు ఇట్లా అన్నాడు.

### ధృతరాష్ట్రునకు వ్యాసుఁ డింద్రసురభి సంవాదంబు సెప్పుట (సం. 3-10-6)

**ఆ. 'ఎల్ల నెయ్యములకుఁ దల్లిదండ్రులయందు । సుతులవలని నెయ్య మతిశయంబు;**
**ధనము లెంత గలిగినను సుతరహితుల । కెమ్మెయిని మనఃప్రియమ్ము లేదు. 81**

**ప్రతిపదార్థం:** ఎల్ల, నెయ్యములకున్= సమస్త స్నేహాలకు; తల్లి దండ్రుల యందు= తల్లి దండ్రులలో; సుతుల వలని, నెయ్యము= పుత్రులపై ఉండే ప్రేమ; అతిశయంబు= గొప్పది; ధనములు+ఎంత, కలిగినను= సంపదలు ఎన్ని ఉన్నను; సుత రహితులకు= కొడుకులు లేనివారికి; ఏ+మెయిని= ఏవిధంగానైనను; మనస్+ప్రియమ్ము= మనస్సుకు ప్రీతి; లేదు.

**తాత్పర్యం:** 'తల్లిదండ్రులకు మమకారబంధాలన్నింటిలో పుత్రస్నేహం మిక్కిలి గాఢమైనది. కొడుకులు లేని వారికి ఎంత సంపద ఉన్నా మనశ్శాంతి లభించదు.

**వ. తొల్లి సకలగోమాత యయిన సురభి సురరాజుకడకుం బోయి కరుణంబుగా నేడ్చిన దానింజూచి సురపతి విస్మితుండై' యిట్లేల రోదనాకులితలోచనవయి యున్న దాన; వెల్ల వారికి లగ్గ కదా' యనిన నింద్రునకు సురభి యిట్లనియె. 82**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వకాలంలో; సకల గోమాత, అయిన= అన్ని గోవులకు తల్లి అయిన; సురభి= వేలుపుటావు; సురరాజు, కడకున్+పోయి= ఇంద్రుడి వద్దకు వెళ్ళి; కరుణంబుగాన్= జాలి పుట్టేటట్లుగా; ఏడ్చిన; దానిన్+చూచి; సురపతి= దేవేంద్రుడు; విస్మితుండు+ఐ= ఆశ్చర్యపడి; ఇట్లు+ఏల= ఈవిధంగా ఎందుకు?; రోదన+ఆకులిత లోచనవు+అయి= ఏడుపుచేత కలవరపాటు చెందిన కన్నులు కలదానివయి; ఉన్నదానవు; ఎల్లవారికి= అందరికి; లగ్గు+అ కదా= క్షేమమేకదా?; అనినన్= అని పలుకగా; ఇంద్రునకు; సురభి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** అన్ని ఆవులకు తల్లి అయిన వేలుపుటావు సురభి ఇంద్రుడి వద్దకువెళ్ళి కన్నీరు కారుస్తూ విలపించింది. ఇంద్రునికి ఆశ్చర్యం, జాలి కలిగింది. ఇంద్రుడు సురభితో 'ఇట్లా ఎందుకు ఏడుస్తున్నావు? అందరికిని క్షేమమే కదా!' - అని ప్రశ్నించాడు. ఇంద్రుడితో సురభి ఇట్లా బదులు పలికింది.

**క. 'నీ వజ్రము రక్షింపఁగ । నా వారికిఁ దక్కఁ ద్రిభువనంబులఁ గల జీ**
**వావలి కెల్లను గుశలమ । దేవేంద్ర! జగత్త్రయప్రదీప! మహాత్మా! 83**

**ప్రతిపదార్థం:** దేవ+ఇంద్ర!= ఓ దేవేంద్రా!; జగత్+త్రయ, ప్రదీప!= మూడు లోకాలను వెలిగించేవాడా!; మహా+ఆత్మా= గొప్ప ఆత్మకలవాడా!; నీ, వజ్రము= నీ వజ్రాయుధం; రక్షింపఁగన్= రక్షిస్తుంటే; నా వారికిన్+తక్కన్= నా సంతతికి తప్ప; త్రి, భువనంబులన్+కల, జీవ+ఆవలికి+ఎల్లను= మూడులోకాలలో ఉండే ప్రాణికోటికెల్ల; కుశలము+అ= క్షేమమే.

**తాత్పర్యం:** 'మూడులోకాలను ప్రకాశింపచేసే మహానుభావా! దేవేంద్రా! నీ వజ్రాయుధం రక్షిస్తుండగా మూడులోకాలలో ఉన్న జీవకోటికి క్షేమమే - నా సంతతికి తప్ప.

**వ. దీనిం జిత్తగింపుము; బలంబు గల బలీవర్దంబులతో బలహీనంబులయిన వానిం బూన్చిన నవి దుర్వహ భారవహన మహాలాంగలాకర్షణంబులయం దసమర్థంబు లైన నడిచియుం బొడిచియు ములుకోలలం గుట్టియు దుర్బలబలీవర్దంబుల జనులు బాధింపం జూచి యేను దానికి దుఃఖించెద' ననిన సురభికి సురపతి యిట్లనియె. 84**

**ప్రతిపదార్థం:** దీనిన్= ఈ విషయాన్ని; చిత్తగింపుము= దయతో విని గ్రహించుము; బలంబు, కల= బలంఉన్న; బలీవర్దంబులతోన్= ఎద్దులతో; బలహీనంబులయిన వానిన్= బలంలేనివాటిని; పూన్చినన్= జతపరిస్తే; అవి, దుర్వహ, భార, వహన, మహా, లాంగల+ఆకర్షణంబులయందు= మోయలేని బరువు మోయుటంలో, పెద్దనాగళ్ళు లాగటంలో; అసమర్థంబులు+ఐనన్= సామర్థ్యం లేకపోయినవి కాగా; అడిచియున్= కొట్టిన్నీ; పొడిచియు= గ్రుచ్చిన్నీ; ములుకోలలన్+కుట్టియు= ముల్లుగలకర్రలతో నొప్పించిన్నీ; దుర్బల బలీవర్దంబులన్= బలంలేని ఎద్దులను; జనులు; బాధింపన్+చూచి= కష్టపెట్టటం చూచి; ఏను= నేను; దానికి= ఆ దుఃఖస్థితికి; దుఃఖించెదన్= దుఃఖిస్తున్నాను; అనిన; సురభికి= వేలుపుటావుకు; సురపతి= దేవేంద్రుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దేవా! నామాటలు దయచేసి సావధానంగా వినండి: బలం గల ఎద్దులతో బలంలేని ఎద్దులను పూన్చి (కాడి కట్టి) బరువులను మోయిస్తున్నప్పుడు, పొలాలు దున్నుతున్నప్పుడు బలంలేని ఎద్దులు బరువులు మోయలేక, నాగళ్ళు లాగ లేక మిక్కిలి బాధపడుతున్నాయి. కాని, జనులు బడుగుటెద్దులను కొట్టి, ములుగర్రలతో పొడిచి బాధిస్తూ ఉండటంచేత నేను మిక్కిలి పరితపిస్తున్నాను'- అని అనగా దేవేంద్రు డిట్లా బదులు పలికాడు.

**క. 'నీకు నపత్యశతంబు ల । నేకంబులు గలవు వాని కేకాకృతి దుః**
**ఖాకులత సంభవింపదు । శోకింపకు' మనిన సురభి సురపతి కనియెన్. 85**

**ప్రతిపదార్థం:** నీకున్+అపత్య, శతంబులు= నీకు నూర్ల కొలదీ బిడ్డలు; అనేకంబులు= పెక్కు; కలవు; వానికి; ఏక+ఆకృతి= ఒకే విధమైన; దుఃఖ+ఆకులత= శోక పరితప్తత (దుఃఖంతో వెత చెందటం); సంభవింపదు= ఏర్పడదు; శోకింపకుము= విచారించకు; అనినన్= అని అనగా; సురభి= వేలుపుటావు; సురపతికి= దేవేంద్రుడికి; అనియెన్= చెప్పింది.

**తాత్పర్యం:** 'నీకు ఎన్నోవందల సంతానం ఉంది. అన్నింటికిని ఒకే రీతి దుఃఖం దాపురించదుకదా! శోకించవద్దు' అని దేవేంద్రుడు పలుకగా, సురభి సురపతితో బదులు పలికింది.

**వ. 'దేవా! దీనాననంబులయి దుర్బలంబు లయిన యపత్యంబుల దుఃఖం బే నెట్లు సూడనోపుదు?' ననిన నగి యింద్రుండు దానికిం గరుణించి వర్షంబునఁ దృణవర్ధనంబు సేసి దుర్బల బలీవర్దంబులకు బలంబు గావించె**

**నని యింద్ర సురభి సంవాదంబు వేదంబులయందు వినంబడుఁ గావున నీకుం బుత్త్రస్నేహంబు సామాన్యంబు గా; దైనను దీనులై వనంబున నవయుచున్న యప్పాండవులకు దయాళుండ వగుము. 86**

**ప్రతిపదార్థం:** దేవా! (= ఓ ఇంద్రా!); దీన+ఆననంబులు+అయి= వెత చెందిన ముఖాలు కలవయి; దుర్బలంబులు+అయిన= బలంలేనివయిన; అపత్యంబుల= సంతానంయొక్క; దుఃఖంబు= శోకం; ఏను= నేను; ఎట్లు= ఏ విధంగా; చూడన్+ఓపుదున్= చూడగలను?; అనినన్= అని చెప్పగా; నగి= నవ్వి; ఇంద్రుండు; దానికిన్+కరుణించి= దానిపై దయకలిగి; వర్షంబునన్= వానచేత; తృణవర్ధనంబు+చేసి= గడ్డి బాగా పెరిగేటట్లు చేసి; దుర్బల బలీవర్దంబులకు= బలం లేని ఎద్దులకు; బలంబు, కావించెన్= బలం కలిగేట్లు చేశాడు; అని; ఇంద్ర, సురభి, సంవాదంబు= ఇంద్రుడికి, వేలుపుటావుకు జరిగిన సంభాషణ; వేదంబుల యందు; వినంబడున్; కావున; నీకున్= (ధృతరాష్ట్రా!) నీకును; పుత్త్రస్నేహంబు= కొడుకులపై కల ప్రేమ; సామాన్యంబు, కాదు= సాధారణమైనది కాదు; ఐనను; దీనులు+ఐ= వెతచెందినవారై; వనంబునన్= అడవిలో; నవయుచున్న= కష్టపడుతున్న; ఆ+పాండవులకు= ఆ పాండవులపట్ల; దయాళుండవు+అగుము= దయకలవాడివి కమ్ము.

**తాత్పర్యం:** 'దేవా! బలంలేని నా సంతానం పడుతున్న బాధను నేను ఎట్లా చూడగలను?' అని సురభి చెప్పింది. ఇంద్రుడు నవ్వి, కరుణించి, వాన కురిపించి గడ్డి ఎక్కువగా పెరిగేటట్లు చేసి బలంలేని ఎద్దులకు బలం కలిగేటట్లు చేశాడు. ఈ ఇంద్రసురభి సంవాదం వేదాలలో ఉన్నది. ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీకు కల పుత్రప్రేమ సాధారణమైనది కాదు. ఐనను అడవులలో వెతలతో క్రుగ్గుతున్న పాండవులపట్ల దయ చూపించుము.

**విశేషం:** మహాభారతంలో ప్రధాన కథతో పాటు పెక్కు ఉపాఖ్యానాలు, సంవాదాలు ఉన్నాయి. సంవాదమంటే ఇరువురి మధ్య జరిగే సంభాషణ. ఈ సంభాషణకు అంతరార్థం ఉంటుంది. ప్రస్తుత కథతో అవినాభావ సంబంధం ఉంటుంది. ఇందువలన అప్పుడప్పుడు కథాగమనం కుంటుపడుతుందని కొందరు విమర్శించటం కద్దు. కాని, మహాభారత గ్రంథకర్త వేసికొన్న ప్రణాళిక ప్రకారం విజ్ఞాన సర్వస్వం అయిన ఇతిహాసంలో ఉపాఖ్యానాలు, సంవాదాలు ప్రధానకథకు పరిపుష్టి చేకూర్చేవే. ఈ సురభి సురపతి సంవాదంలోని ప్రధానాంశాలు: (1) నోరు లేని మూగ జంతువుల పట్ల జనులు జాలి చూపాలనే మానవతా ధర్మం (2) సృష్టిలో పుత్రేషణ ప్రాణికోటిపై నెరపే ప్రభావం హృదయంగమంగా చిత్రించబడ్డాయి. ఈషణత్రయం - దారేషణ, ధనేషణ, పుత్రేషణ - ఇవి భూతకోటిపై మిక్కిలి ప్రభావం చూపిస్తున్నాయి. పక్షులలో దారేషణ, పశువులలో పుత్రేషణ, మనుజులలో ధనేషణ ఎక్కువ అని పెద్దల ప్రవచనం. కాని, మానవుల్లో ఈ ఈషణత్రయం ప్రభావాన్ని చూపుతుంది. ధృతరాష్ట్రుడికి ఉండే పుత్రేషణ అతడి శీలాన్ని చాల ప్రభావితంచేసింది. ఆ విషయాన్ని వ్యాసమహర్షి ఈ ఉపాఖ్యానంలో ప్రస్ఫుటం చేశాడు. అంతేకాదు. సుఖాల్లో ఉన్న బిడ్డలమీద కంటె, కష్టాల్లో ఉన్న బిడ్డలమీద ఎక్కువ ప్రేమ చూపాలని ప్రబోధించాడు.

**తే.** **నీవుఁ బాండుండు విదురుండు నెమ్మి నాకు । నొక్క రూపైన యట్లు నీ కుదితయశులు**
**నీ సుతులు నూర్వురును బాండునృపతనూజు । లేవురును నొక్కరూప కా నెఱుఁగవలయు. 87**

**ప్రతిపదార్థం:** నీవున్= (ధృతరాష్ట్రుడు) నీవున్నూ; పాండుండు= పాండురాజున్నూ; విదురుండు; నెమ్మిన్= ప్రేమలో; నాకున్ (వ్యాసుడికి); ఒక్క, రూపు+ఐన, అట్లు= ఒకే విధమైనవారు (సమానులు) అయినట్లే; నీకు+ఉదితయశులు= నీకు, అధిక కీర్తి కలవారు; నీ, సుతులు= నీ కొడుకులు; నూర్వురును= వందమందిన్నీ; పాండు, నృప, తనూజులు+ఏవురును= పాండురాజు కొడుకులు ఐదుగురున్నూ; ఒక్క, రూపు+అ, కాన్= ఒకే రూపం వారని, అంటే సమానులని; ఎఱుఁగవలయున్= (నీవు) తెలిసికోవాలి.

**తాత్పర్యం:** నీవు, పాండురాజు, విదురుడు ప్రేమలో నాకు సమానులు. అలాగే గొప్ప కీర్తి కల వందమంది నీ కొడుకులూ, పాండురాజు ఐదుగురు పుత్రులూ నీకు సమానులని తెలిసికోవాలి.

**క. సుజనుల సహవాసంబునఁ । గుజనులు సద్ధర్మమతు లగుట నిక్కము; ధ**
**ర్మజునొద్ద నుండి నీ యా । త్మజుఁడు ప్రశాంతుండు ధర్మమార్గుండు నగున్. 88**

**ప్రతిపదార్థం:** సుజనుల, సహవాసంబునన్= మంచివారి స్నేహంవలన (మంచివారితో కలిసి మెలిసి ఉండటంవలన); కుజనులు= చెడ్డవారు; సత్+ధర్మమతులు+అగుట= మంచి ధర్మబుద్ధి కలవారవటం; నిక్కము= నిజం; ధర్మజు+ఒద్దన్+ఉండి= ధర్మరాజు దగ్గర ఉండి; నీ, ఆత్మజుఁడు= నీ కొడుకు; ప్రశాంతుండు= మిక్కిలి శాంతం కలవాడు; ధర్మమార్గుఁడున్= ధర్మమార్గంలో సంచరించేవాడు; అగున్= కాగలడు.

**తాత్పర్యం:** మంచివారిమైత్రివలన చెడ్డవారు కూడ మంచివారవుతారు. ధర్మరాజుసహవాసంవలన నీ కొడుకు ధర్మమార్గుడు, ప్రశాంతుడు కాగలడు.

**వ. రాజర్షి యైన ధర్మరాజుతోడి సహవాసంబు సర్వజనహితంబు గావున నాతని నుపాసించి దుర్యోధనుండు గొండొకకాలం బుండు నట్లుగాఁ బనుపు; మట్లయిన నుభయపక్షంబులకు లగ్గగు' ననిన ధృతరాష్ట్రుండు గృతాంజలి యయి 'మునీంద్రా! దుర్యోధనుండు నా పలుకులు వినండు; కురుకులంబు రక్షించు నట్టి బుద్ధి గలదేని వాని మీర శిక్షింపుం' డని మ్రొక్కిన 89**

**ప్రతిపదార్థం:** రాజ+ఋషి+ఐన= రాజులలో ఋషివంటివాడైన; ధర్మరాజుతోడి, సహవాసంబు= ధర్మరాజుతోమైత్రి; సర్వ, జన, హితంబు= సమస్త జనులకు ఇష్టమైనది; కావునన్, ఆతనిన్= ఆ ధర్మరాజును; ఉపాసించి= ఆరాధించి; దుర్యోధనుండు; కొండొక, కాలంబు= కొంతకాలం; ఉండునట్లుగాన్; పనుపుము= నియమించుము; అట్లు+అయినన్= ఆ విధంగా చేస్తే; ఉభయ, పక్షంబులకున్= ఇరువర్గాలవారికి; లగ్గు+అగున్= మేలు కలుగుతుంది; అనినన్= అని చెప్పగా; ధృతరాష్ట్రుండు; కృత+అంజలి+అయి= చేయబడిన నమస్కారం కలవాడయి- అంటే నమస్కరించి; ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడా!; దుర్యోధనుండు; నా పలుకులు= నా మాటలు; వినండు= వినడు; కురు, కులంబు= కురువంశాన్ని; రక్షించు+అట్టి, బుద్ధి, కలదు+ఏని= కాపాడే ఉద్దేశం ఉంటే; వాని= ఆ దుర్యోధనుడిని; మీరు+అ= మీరే; శిక్షింపుండు= ప్రబోధించండి; అని= అని పలికి; మ్రొక్కిన= నమస్కరించగా.

**తాత్పర్యం:** రాజర్షి అయిన ధర్మరాజుతో దుర్యోధనుడు మైత్రి చేయటం సర్వజన హితమైనది. దానివలన ఇరుపక్షాలకు మేలు కలుగుతుంది' అని ధృతరాష్ట్రుడితో వ్యాసుడు పలికాడు. 'మునీంద్రా! కురుకులాన్ని కాపాడాలనే కోరిక మీకు ఉంటే మీరే దుర్యోధనుడికి ప్రబోధం చేయండి. అతడు నా పలుకులను వినడు'- అని ధృతరాష్ట్రుడు వ్యాసుడికి నమస్కరించి బదులు పలికాడు.

**క. 'అనఘుఁడు మైత్రేయుం డను । మునినాథుఁడు వచ్చి ధర్మమున నాతనిఁ దా**
**ననుశాసించుఁ దిరంబుగ' । నని చెప్పుచు నప్పరాశరాత్మజుఁ డరిగెన్. 90**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= పాపంలేనివాడు; మైత్రేయుండు+అను, మునినాథుఁడు= మైత్రేయుడు అనే పేరున్న ఋషి శ్రేష్ఠుడు; వచ్చి; ఆతనిన్= ఆ దుర్యోధనుడిని; ధర్మమునన్= ధర్మంలో; తిరంబుగన్= స్థిరంగా; అనుశాసించున్= ఆజ్ఞాపిస్తాడు (అంటే ప్రబోధిస్తాడు); అని; చెప్పుచున్; ఆ+పరాశర+ఆత్మజుఁడు= పరాశరుడి కొడుకైన వ్యాసుడు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'మహానుభావుడైన మైత్రేయమహర్షి వచ్చి దుర్యోధనుడికి ధర్మప్రబోధం చేయగల' డని చెప్పి వ్యాసమహర్షి నిష్క్రమించాడు.

**వ. అంత. 91**

**తాత్పర్యం:** ఆ తరువాత

**ఉ. న్యాయవిదుండు గామ్యకవనంబున ధర్మజునొద్దనుండి మై**
**త్రేయుఁడు ధీయుతుం డరుగుదెంచిన నప్పుడ యమ్మునీంద్రు నిం**
**ద్రాయితుఁ డాంబికేయుఁ డుచితస్థితిఁ బూజితుఁజేసి నాత్మ ని**
**శ్శ్రేయసలాలసుండయి విశేషసపర్యలఁ జేసె భక్తితోన్. 92**

**ప్రతిపదార్థం:** న్యాయవిదుండు= పాడి తెలిసినవాడు; కామ్యకవనంబునన్= కామ్యకమనేపేరున్న అడవిలో; ధర్మజు+ఒద్దనుండి= ధర్మరాజు దగ్గరనుండి; ధీయుతుండు= బుద్ధిమంతుడైన; మైత్రేయుఁడు; అరుగుదెంచినన్= రాగా; అప్పుడు+అ= ఆ సమయాన్నే; ఆ+ముని+ఇంద్రున్= ఆ మునీశ్వరుడిని; ఇంద్ర+ఆయితుఁడు= ఇంద్రుడితో సమానమైనవాడు; ఆంబికేయుఁడు= అంబికాపుత్రుడైన ధృతరాష్ట్రుడు; ఉచిత స్థితిన్= అర్హమైన విధంగా; పూజితున్+చేసెన్= పూజించాడు; ఆత్మ, నిశ్శ్రేయస, లాలసుండు+అయి= తనకు మేలు లభించాలనే కోరిక కలవాడై; భక్తితోన్= గౌరవభావంతో; విశేష, సపర్యలన్= ప్రత్యేకమైన శుశ్రూషలు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** న్యాయవేత్త అయిన మైత్రేయమహర్షి కామ్యకవనంలో ఉన్న ధర్మరాజు దగ్గరనుండి తన కడకు వచ్చినపుడు ధృతరాష్ట్రుడు తనకు మేలు కలగాలనే కోరిక కలవాడై ఎంతో భక్తితో ఆ మునీంద్రునికి విశేషసపర్యలు చేసి పూజించాడు.

**వ. ఇట్లుదనచేతంబూజితుండై సుఖవిశ్రాంతుండైన మునివరునకు ధృతరాష్ట్రుండు ముకుళితహస్తుండై 'భట్టారకా! యెందుండి వచ్చితి?' రని యడిగిన మైత్రేయుం డిట్లనియె. 93**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తన చేతన్; పూజితుండై= పూజించబడినవాడై; సుఖవిశ్రాంతుండు+ఐన= సుఖంగా విశ్రమించిన; మునివరునకు= ఋషిశ్రేష్ఠుడికి; ముకుళిత, హస్తుండు+ఐ= మొగిడ్చిన హస్తాలు కలవాడై అంటే, నమస్కరించినవాడై; భట్టారకా!= పూజనీయుడా!; ఎందు+ఉండి, వచ్చితిరి+అని+అడిగినన్= ఎక్కడ నుండి విచ్చేశా రని అడుగగా; అతనికి= ఆ ధృతరాష్ట్రుడికి; మైత్రేయుండు= మైత్రేయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** తనచే పూజించబడి విశ్రాంతి గైకొంటున్న మైత్రేయ మహర్షికి నమస్కరించి 'భట్టారకా! తా మెక్కడనుండి ఇక్కడకు దయచేశా?' రని ధృతరాష్ట్రుడు అడిగాడు. ధృతరాష్ట్రుడికి మైత్రేయుడు ఈ విధంగా బదులు పలికాడు.

**చ. 'అలఘుతపోభరంబున జటాజినముల్ ధరియించి రూక్ష వ**
**ల్కలములు గట్టి కూరలును గాయలుఁ బండులు భోజనంబుగా**
**నలయక కామ్యకం బను మహావిపినంబున నున్న పాండవే**
**యులకడనుండి వచ్చితిఁ గురూత్తమ! నీసుతు నిన్నుఁ జూడఁగన్. 94**

**ప్రతిపదార్థం:** అలఘు= గొప్పదైన; తపస్+భరంబున= తపస్సుయొక్క బరువుతో; జటా+అజినముల్= జడలు; తోళ్ళు; ధరియించి; రూక్ష వల్కలములు= కరకు మోటు నారబట్టలు; కట్టి; కూరలును; కాయలున్; పండులు; భోజనంబుగాన్= ఆహారంగా; అలయక= ఆయాసం పొందక; కామ్యకంబు+అను= కామ్యకం అనే పేరున్న; మహా విపినంబునన్= పెద్ద అడవిలో; ఉన్న; పాండవేయుల కడ నుండి= పాండవుల దగ్గరనుండి; కురు+ఉత్తమ!= కురువంశంలో ఉత్తముడైన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నిన్నున్= నిన్ను; నీ సుతున్= నీ కొడుకును; చూడఁగన్= చూడటానికి; వచ్చితిన్= వచ్చాను.

**తాత్పర్యం:** 'కురువంశంలో జనించిన ఉత్తముడవైన ఓ ధృతరాష్ట్ర మహారాజా! నిన్నును, నీ కుమారుడిని చూడటానికై నేను పాండవులకడనుండి వచ్చాను. వారు కామ్యకవనంలో తపోభారంచేత పెరిగిన జడలతో, మోటునారబట్టలు కట్టుకొని కాయలు, కూరలు, పండ్లు ఆహారంగా స్వీకరిస్తూ సమయపరిపాలన చేస్తున్నారు.

**వ. ఏ నఖిలతీర్థదర్శనార్థంబు పరిభ్రమించుచుఁ గురుజాంగలంబున కరిగి యందుఁ గురుకులోత్తము లైన పాండుపుత్త్రులం జూచితి.' 95**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అఖిల, తీర్థ, దర్శన+అర్థంబు= అన్ని దివ్యస్థలాలను చూడటానికై; పరిభ్రమించుచున్= తిరుగుతూ; కురుజాంగలంబునకు= కురుదేశానికి సమీపంలోని అరణ్యప్రదేశానికి; అరిగి= వెళ్ళి; అందున్= అక్కడ; కురు, కుల+ఉత్తములు+ఐన= కురువంశంలో శ్రేష్ఠులైన; పాండుపుత్త్రులన్; చూచితిన్= చూచాను.

**తాత్పర్యం:** నేను తీర్థయాత్రలు చేస్తూ కురుక్షేత్రానికి సమీపంలోని అరణ్యప్రదేశాలకు వెళ్ళి అక్కడ పాండవులను చూచాను.'

**విశేషం:** తీర్థశబ్దానికి వాచ్యార్థం నీరు. తీర్థయాత్రలు అనేచోట దివ్యదేశయాత్రలు అని రూఢ్యర్థం. బహు దివ్యస్థలాలు ప్రాయికంగా నదీతీరాలలో ఉండటంచేత తీర్థానికి అట్టి రూఢ్యర్థం ఏర్పడింది.

**ఆ. అనిన నవనతాస్యుఁ డయి ధృతరాష్ట్రుఁ డి । ట్లనియె 'నెట్లు సెప్పుఁ డయ్య! యందుఁ**
**బాండవులకు సత్యభాషణులకుఁ గుశ । లంబె? వార లిట దలంతు రొక్కొ!' 96**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అవనత+ఆస్యుఁడు+అయి= వంచబడిన మొగం కలవాడయి; ధృతరాష్ట్రుఁడు; ఇట్లు+అనియెన్; ఎట్లు; చెప్పుఁడు+అయ్య; అందున్; సత్యభాషణులకున్= నిజం మాట్లాడే పాండవులకు; కుశలంబు+ఎ= క్షేమమా; వారలు; ఇట= ఇక్కడను గురించి (హస్తినాపురాన్ని గురించి); తలంతురు+ఒక్కొ= స్మరిస్తున్నారా!

**తాత్పర్యం:** అని మైత్రేయమహర్షి అనగా, ధృతరాష్ట్రుడు తలవంచుకొని 'అయ్యా! సత్యభాషణులగు పాండవులకు క్షేమమా? వారు ఇచటివారిని స్మరిస్తుంటారా?' - అని పలికినాడు.

**క. 'అమితభుజశక్తి నంతక । సము లప్పాండుసుతు లిందు సౌభ్రాత్ర స్నే**
**హమునకు విచ్ఛేదముగా । సమయాతిక్రమము సేయ సమకట్టరుగా.' 97**

**ప్రతిపదార్థం:** అమిత, భుజ, శక్తిన్= అంతులేని బాహుపరాక్రమంలో; ఆ+పాండు= సుతులు= ఆ పాండవులు; అంతక, సములు= యముడితో సమానులు; ఇందు, సౌభ్రాత్ర స్నేహమునకు= అన్నదమ్ముల ప్రేమకు - అంటే కౌరవ పాండవుల

మధ్యగల సోదరభావానికి; విచ్ఛేదముగా= భంగకరంగా; సమయ+అతిక్రమము= ప్రతిజ్ఞను మీరటం (అంటే పంద్రెండేండ్ల వనవాసం ఒక ఏడు అజ్ఞాతవాసం చేయకుండానే కౌరవులపై దండెత్తటం); చేయన్= చేయటానికి; సమకట్టరుగా= పూనరుకదా!

**తాత్పర్యం:** 'పరాక్రమంలో యముడితో సమానులైన పాండవులు కురు పాండవసోదరభావానికి విఘాతం కలిగేట్లుగా తాము లోగడ అంగీకరించిన సమయాన్ని మీరటానికి యత్నించరు కదా!'

**వ. అనిన మైత్రేయుం డిట్లనియె. 98**

**తాత్పర్యం:** అనగా మైత్రేయుడు ఈ విధంగా అన్నాడు.

**చ. 'చనుదెంచి మహామునివరు । లనవరతము వారలకుఁ బ్రియం బొనరఁగ దీ**
**వన లీగిఁ జేసి కుశలమ । మనుజేశ్వర! వారు ధర్మమతియుతు లగుటన్. 99**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వర!= ఓ రాజా!; మహాముని వరులు= మహర్షులు; చనుదెంచి= వచ్చి; అనవరతము= ఎల్లప్పుడు; ప్రియంబు+ఒనరఁగ= ప్రీతికలిగేటట్లు; వారలకున్= ఆ పాండవులకు; దీవనలు= ఆశీస్సులు; ఈగిన్, చేసి= ఇవ్వటం చేత; వారు= ఆ పాండవులు; ధర్మ, మతి, యుతులు+అగుటన్= ధర్మబుద్ధితో కూడినవారు కావటంచేత; కుశలము+అ= క్షేమమే.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి ప్రశ్నకు సమాధానంగా మైత్రేయుడు ఇట్లా అన్నాడు: 'ఓ రాజా! మహర్షులు నిరంతరం వచ్చి, ప్రియం కలిగేటట్లుగా పాండవులకు దీవనలు ఇవ్వటంచేత, వారు ధర్మబుద్ధితో కూడినవారు కావటం చేత, క్షేమంగా ఉన్నారు.

**క. వారలు సమయము దప్పిన । వారిజరిపుహితుల గతు లవశ్యముఁ దప్పున్;**
**వారికి నకారణంబ ని । కారము నీ కొడుకు సేసెఁ గడు నహితుండై.' 100**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ పాండవులు; సమయము= ఒడంబడిక; తప్పిన= మీరితే; వారిజ, రిపు, హితుల, గతులు= చంద్ర సూర్యుల నడకలు (వారిజరిపుడు=చంద్రుడు, వారిజ హితుడు= సూర్యుడు ఇక్కడ 'వారిజ' శబ్దం రిపు-హిత శబ్దాలకు రెండింటికి అన్వయిస్తుంది); అవశ్యమున్= విధిగా; తప్పున్= తప్పుతాయి; వారికిన్= ఆ పాండవులకు; అకారణంబు+అ= ఎట్టికారణం లేకుండానే; నీకొడుకు= నీ పుత్రుడు (దుర్యోధనుడు); కడున్+అహితుండు+ఐ= మిక్కిలి శత్రుత్వం వహించినవాడై; నికారము= వంచన; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** పాండవులు చేసిన ప్రతిజ్ఞను మీరితే సూర్యచంద్రులే గతులు తప్పుతారు. అలాంటి వారిని నీ కొడుకు నిష్కారణంగా వైరం వహించి వంచించాడు.'

**వ. అని దుర్యోధనుం జూచి 'యయ్యా! నీవు బుద్ధిగలవేనిఁ బాండవులతో విరోధం బుడుగు; మట్లయిన నీకును వారికిం గురుకులంబునకు లగ్గగు; నా పలుకుఁ జేకొనుము. 101**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; దుర్యోధనున్+చూచి= దుర్యోధనుడిని చూచి; అయ్యా; నీవు; బుద్ధి, కలవు+ఏనిన్= బుద్ధికలవాడివైతే; పాండవులతో; విరోధంబు= శత్రుత్వం; ఉడుగుము= మానుకొమ్ము; అట్లు+అయిన; నీకును; వారికిన్; కురు, కులంబునకున్= కౌరవవంశానికి; లగ్గు+అగు= మేలు చేకూరుతుంది; నా, పలుకున్= నా మాటను; చేకొనుము= స్వీకరించుము(అంగీకరించుము).

**తాత్పర్యం:** అని చెప్పి, మైత్రేయమహర్షి దుర్యోధనుడితో 'అయ్యా! బుద్ధిగలవాడవైతే నీవు పాండవులతో విరోధం విడనాడుము. అట్లయితే నీకూ, పాండవులకూ కురువంశానికీ మేలు కలుగుతుంది. నామాట వినుము.

**సీ.** **వజ్రసంహనను లవార్యపరాక్రముల్ । పాండుకుమారు లాఖండలాభు**
**లందఱు నాగశతాయుతత్రాణు లు । గ్రాహవకాంక్షు లుత్సాహపరులు;**
**వారలలో బలవంతుండు బక హిడిం । బాసురు లనువారి నాసురమునఁ**
**జంపె, నాగాయుతసత్త్వు జరాసంధు । నెక్కటి యోర్చిన యక్కజుండు**

**తే.** **ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁ డను సు । రారి నిశ్చల ఘన భీకరాంగుఁ బట్టి**
**పోర వధియించినట్టి సమీరజునకు । భూరిభుజునకు మార్కొనువారుఁ గలరె?** **102**

**ప్రతిపదార్థం:** పాండుకుమారులు= పాండవులు; వజ్ర సంహననులు= వజ్రం వంటి శరీరం కలవారు; అవార్య, పరాక్రముల్= వారించశక్యంగాని పరాక్రమం కలవారు; ఆఖండల+ఆభులు= ఇంద్రుడితో సమానులు; అందఱు; నాగ, శత+అయుత, త్రాణులు= వంద పదివేల ఏనుగులతో సమానమైన శక్తి కలిగినవారు; ఉగ్ర+ఆహవ, కాంక్షులు= భయంకరమైన యుద్ధం చేసే కోరిక కలవారు; ఉత్సాహపరులు= (లోకోత్తర కృత్యాలు నిర్వహించటంలో) ఉత్సాహం కలవారు; వారలలో; బలవంతుండు= బలం కలవాడు; బక, హిడింబ+అసురులు+అనువారిన్= బకుడు, హిడింబుడు అనే రాక్షసులను; ఆసురమునన్= క్రూరత్వంతో (రాక్షస విధానంతో); చంపెన్= సంహరించాడు; నాగ+అయుత, సత్త్వు= పదివేల ఏనుగులయొక్క బలం కల వాడిని; జరాసంధున్; ఎక్కటి= ఒంటరిగా; ఓర్చిన= జయించిన; అక్కజుండు= అధికుడు; ఘోరవనమునన్= భయంకరమైన అడవిలో; వీరున్= వీరుడైనవాడిని; కిమ్మీరుఁడు+అను= కిమ్మీరుడు అనే; సుర+అరిన్= రాక్షసుడిని; నిశ్చల, ఘన భీకర+అంగున్= చలించని, మిక్కిలి భయంకరమైన శరీరం కలవాడిని; పట్టి= పట్టుకొని; పోరన్= యుద్ధంలో; వధియించినట్టి= చంపినట్టి; సమీరజునకు= వాయుపుత్రుడికి, భీముడికి; భూరి భుజునకు= గొప్ప భుజాలు కలవాడికి (మేటి పరాక్రమం కలవాడికి); మార్కొనువారున్= యుద్ధంలో ఎదిరించేవారు; కలరు+ఎ= ఉన్నారా? (లేరని భావం)

**తాత్పర్యం:** పాండవులు వజ్రశరీరులు, దేవేంద్రసములు, మహాపరాక్రమోపేతులు, ఉత్సాహవంతులు. అందరు పది లక్షల ఏనుగుల బలం కలవారు, భీకర యుద్ధమంటే కుతూహలపడే వారు. వారిలో మిగుల బలవంతుడైన భీముడు పదివేల ఏనుగులబలం కలిగిన జరాసంధుడిని ఒంటరిగా ఓడించి చంపిన అద్భుతవీరుడు. బక హిడింబ కిమ్మీరులను రాక్షసంగా చంపిన ఆ భీముడిని ఎదిరించగల యోధులు ఎక్కడ ఉన్నారు?

**విశేషం:** అలం: ఉపమ. ఎత్తుగీతిలో నన్నయ ప్రాసనియమాన్ని పాటించాడు.

### మైత్రేయుఁడు దుర్యోధనుని శపించుట (సం. 3-11-27)

**వ.** **వారికి వాసుదేవ ధృష్టద్యుమ్నులు సంబంధ సహాయులు; జరామరణవంతులైన మనుజులు వారింజెనకి యెట్లు జీవింతురు? నీవు వారితో నొడంబడియుండు; మిది కార్యం' బనిన మైత్రేయుపలుకు లాదరింపక పాదాంగుష్ఠంబున నేల వ్రాయుచు బాహు వెత్తి తొడలు సఱచి నగుచున్న యా దుర్యోధనుం జూచి, మైత్రేయుం డలిగి 'యీ యపరాధంబున నాహావంబగు నందు భీముగదాఘాతంబున నీ**

**యూరుయుగళంబు భగ్నం బయ్యెడు' మని శాపం బిచ్చిన వెఱచి ధృతరాష్ట్రుండు 'మునీంద్రా! యట్లు గాకుండం బ్రసాదింపు' మనిన నమ్మునివరుం డిట్లనియె. 103**

**ప్రతిపదార్థం:** వారికి; వాసుదేవ, ధృష్టద్యుమ్నులు= శ్రీకృష్ణుడు, ధృష్టద్యుమ్నుడు; సంబంధ సహాయులు= చుట్టరికం చొప్పున సాయం చేసేవారు; జరా, మరణవంతులు+ఐన= ముసలితనం, చావు కలిగిన వారైన; మనుజులు= మనుష్యులు; వారిన్, చెనకి= వారిని ఎదిరించి; ఎట్లు= ఏ విధంగా; జీవింతురు= బ్రదుకగలరు?; నీవు; వారితో= ఆ పాండవులతో; ఒడంబడి, ఉండుము= అంగీకారం కుదుర్చుకొని ఉండుము; ఇది కార్యంబు= ఇది చేయదగిన పని; అనిన; మైత్రేయు పలుకులు= మైత్రేయుడి మాటలు; ఆదరింపక= లెక్కచేయక; పాద+అంగుష్ఠంబునన్= కాలి బొటనవ్రేలితో; నేలన్= భూమిపై; వ్రాయుచు; బాహువు= చేయి; ఎత్తి; తొడలు; చఱచి; నగుచున్న= నవ్వుతున్న; ఆ దుర్యోధనున్+చూచి= ఆ దుర్యోధనుడిని చూచి; మైత్రేయుండు; అలిగి= కోపించి; ఈ అపరాధంబున్= ఈ తప్పువలన; ఆహవంబు+అగున్= యుద్ధం దాపురిస్తుంది; అందు= ఆ యుద్ధంలో; భీము, గదా+ఆఘాతంబున= భీముడి గద యొక్క దెబ్బవలన; నీ+ఊరు, యుగళంబు= నీతొడలజంట; (ఊరు= తొడ, యుగళము= జంట); భగ్నంబు+అయ్యెడు= విరుగగలదు; అని; శాపంబు; ఇచ్చిన; వెఱచి= భయపడి; ధృతరాష్ట్రుండు; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠా!; అట్లు; కాకుండన్; ప్రసాదింపుము+అనిన= ప్రసన్నుడ వగుము అనగా; ఆ, మునివరుండు= ఆ ఋషిశ్రేష్ఠుడు, ఆ మైత్రేయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** పాండవులకు చుట్టరికంవలన ఏర్పడిన అనుబంధంచేత శ్రీకృష్ణుడు, ధృష్టద్యుమ్నుడు తోడుపడగలరు. ముసలితనానికి చావుకు లోనయ్యే మానవమాత్రులు వారిని ఎదిరించి బ్రతుకలేరు. నీవు వారితో పొత్తు కుదుర్చుకొనటం మంచిది' - అని దుర్యోధనుడితో మైత్రేయుడు పలికాడు. దుర్యోధనుడు మైత్రేయుని మాటలను తిరస్కరిస్తూ, తన కాలి బొటనవ్రేలితో నేలపై వ్రాస్తూ, చేయెత్తి తన తొడలపై చరచి చప్పుడు చేస్తూ, మైత్రేయుడిని పరిహసించాడు. మైత్రేయుడు కోపగించుకొని 'ఈ అపరాధంవలన ఘోరయుద్ధం జరుగుతుంది అందులో భీమ గదాఘాతంవలన నీ తొడలు విరుగగల' వని శపించాడు. ఆ శాపానికి ధృతరాష్ట్రుడు భయపడి 'శాపాన్ని ఉపసంహరించు కొ'మ్మని ఆ మునీంద్రుడిని వేడుకొన్నాడు. అప్పుడు మైత్రేయుడు ఇట్లా పలికాడు.

**తే. 'కడఁగి సమబుద్ధి వీనికిఁ గలిగె నేనిఁ । గాదు శాప ఫలం; బట్లు గాక బుద్ధి**
**హీనుఁడై గర్వితుం డగు నేని శాప । హవ్యవాహఫలంబు వీఁ డనుభవించు.' 104**

**ప్రతిపదార్థం:** కడఁగి= పూని; సమబుద్ధి= సవ్యమైన బుద్ధి; వీనికిన్= ఈ దుర్యోధనునికి; కలిగెన్+ఏనిన్= ఏర్పడినట్లయితే; శాప, ఫలంబు, కాదు= శాపం ఫలించదు; అట్లు, కాక= సమబుద్ధి దుర్యోధనునికి ఏర్పడక; బుద్ధి హీనుఁడు+ఐ= బుద్ధిలేనివాడై, అంటే మూర్ఖుడై; గర్వితుండు+అగున్+ఏని= గర్వంకలవాడయితే; శాప, హవ్యవాహ, ఫలంబు= శాపమనే అగ్ని యొక్క ఫలితం (హవ్యమును వహించేవాడు హవ్యవాహుడు అంటే అగ్నిహోత్రుడు. హవ్యమంటే యజ్ఞంలో వ్రేల్చబడే ఆజ్యాది హోమద్రవ్యం); వీఁడు= ఈ దుర్యోధనుడు; అనుభవించున్= అనుభవిస్తాడు.

**తాత్పర్యం:** 'దుర్యోధనుడు పశ్చాత్తాపం పొంది, చేసిన దానికి వగచి, మంచి బుద్ధి ఏర్పరచుకొంటే ఈ శాపం వర్తించదు. అట్లా కాక, బుద్ధిలేనివాడై గర్వంతో ప్రవర్తిస్తే శాపాగ్నిఫలితం ఆతడు అనుభవిస్తాడు'.

**విశేషం:** అలం: రూపకం.

**వ. అని ప్రసన్నుండైన మైత్రేయునకు నాంబికేయుం డిట్లనియె. 105**

**ప్రతిపదార్థం:** అని; ప్రసన్నుండు+ఐన= శాంతించిన; మైత్రేయునకున్; ఆంబికేయుండు= అంబిక పుత్రుడైన ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** శాంతించిన మైత్రేయమహర్షితో ధృతరాష్ట్రుడు ఇట్లా పలికాడు.

**క. 'కిమ్మీరుం డను రక్కసు । డ మ్మారుతతనయుచేత నత్యుగ్ర వనాం**
**తమ్మున నిహతుండయిన వి । ధ మ్మెట్టులు సెప్పు మద్భుతం బిది' యనినన్. 106**

**ప్రతిపదార్థం:** కిమ్మీరుండు+అను, రక్కసుఁడు= కిమ్మీరు డనే పేరుగల రాక్షసుడు; ఆ+మారుత, తనయుచేత= ఆ వాయు పుత్రుడైన భీముడిచేత; అతి+ఉగ్ర, వన+అంతమ్మునన్= మిక్కిలి భయంకరమైన వనంలోపల; నిహతుండు+అయిన, విధమ్ము+ఎట్టులు చెప్పుము= చంపబడినవిధానం ఎటువంటిదో చెప్పుము; ఇది; అద్భుతంబు= ఆశ్చర్యకరం; అనినన్= అని అనగా.

**తాత్పర్యం:** 'కిమ్మీరుడనే రాక్షసుడు భయంకరమైన అడవిలో భీముడిచేత సంహరించబడిన అద్భుతవృత్తాంతాన్ని వివరించు' మని ధృతరాష్ట్రుడు మైత్రేయమహర్షిని అడిగాడు.

**వ. 'నా పలుకులు నీకొడుకు వినండయ్యె; నే నేల చెప్పెద? దీనిం బాండవసహాయులైన విప్రులచేత విదురుం డిమ్ముగా నెఱిఁగినవాఁ; డతనివలన విను' మని చెప్పి మైత్రేయుం డరిగినం, గిమ్మీరవధ కథాశ్రవణపరుండై తన్నడిగిన ధృతరాష్ట్రునకు విదురుం డిట్లనియె; నిందుండి చని పాండవులు మూఁడహోరాత్రంబులు నిరంతర ప్రయాణంబు సేసి, కామ్యకవనంబుఁ జొచ్చు వా రొక్కనాఁటి యర్ధరాత్రంబున రాక్షసప్రచారవేళయందుఁ బరిభ్రమించుచు రాక్షసమాయఁ గావించుచున్నవాని, నతినిశితదంష్ట్రాకరాళంబైన తన వదన గహ్వరంబుఁ దెఱచి గ్రుడ్లు మెఱవ(య) బభ్రుకేశంబులు దూల బాలార్క రశ్మియుతంబయిన బలాహకంబునుంబోలె సకల ప్రాణిభయజననంబుగా గర్జిల్లుచున్నవాని, నిజపాద ఘట్టిత మహీతల ప్రచలన వేగ వేల్లిత వల్లీ పల్లవ బాహు పరిరంభణసుఖంబుఁ బాదపంబుల కాపాదించుచున్నవాని నెదుర నొక్కరక్కసుం గని; రంత వాఁడును బ్రాహ్మణ సంఘంబు ముందటఁ గృష్ణాజినావృతులై వచ్చు పాండవుల దవ్వులం గని మార్గ నిరోధియై మహాపర్వతంబునుంబోలె నున్న, నదృష్ట పూర్వ ప్రమాణంబైన వాని దేహంబుఁజూచి నిమీలితనయన యయి దుశ్శాసన కరాకృష్ట వికీర్ణవేణీభరంబు వెనువెంట నొలయం బాంచాలి పంచపర్వతంబుల నడిమి నదియుంబోలెఁబతుల నడుమ భయవ్యాకుల చిత్తయైన నింద్రియంబులు విషయరతిం బరిగ్రహించు నట్టు లేవురు నక్కోమలిం బట్టుకొని భయపడకుండ నాశ్వాసించుచున్నంత. 107**

**ప్రతిపదార్థం:** నా పలుకులు= నా మాటలు; నీకొడుకు; వినండు+అయ్యె; నేను+ఏల, చెప్పెద; దీనిన్= కిమ్మీర వధ వృత్తాంతాన్ని; పాండవ సహాయులు+ఐన= పాండవులకు సాయంగా నిలిచిన; విప్రులచేత= బ్రాహ్మణులచేత; ఇమ్ముగాన్= బాగుగా; విదురుండు= విదురుడు; ఎఱిఁగినవాఁడు= తెలిసికొన్నవాడు; అతనివలన= ఆ విదురుడివలన; వినుము+అని, చెప్పి; మైత్రేయుండు; అరిగినన్= వెళ్ళగా; కిమ్మీర, వధ, కథా, శ్రవణ, పరుండు+ఐ= కిమ్మీరుడిని చంపటం గురించిన వృత్తాంతం

వినటంలో ఆసక్తి కలవాడై; తన్ను (విదురుడిని); అడిగిన; ధృతరాష్ట్రునకు; విదురుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు; ఇందు+ఉండి= ఇక్కడినుండి; చని= వెళ్ళి; పాండవులు; మూఁడు+అహస్+రాత్రంబులు= మూడు పగళ్ళు, రాత్రులు; నిరంతర, ప్రయాణంబు, చేసి= ఎడతెగని ప్రయాణంచేసి; కామ్యక వనంబున్= కామ్యక మనే పేరుకల అడవిని; చొచ్చువారు= ప్రవేశించేవారు; ఒక్కనాఁటి= ఒక దినం; అర్ధరాత్రంబున= నడికిరేయి; రాక్షస, ప్రచార, వేళయందున్= రక్కసులు తిరుగాడే సమయంలో; పరిభ్రమించుచున్= ఇటునటు తిరుగుతూ; రాక్షస, మాయన్, కావించుచున్నవానిన్= రాక్షసులు కల్పించే మాయను చేస్తున్నవాడిని; అతి, నిశిత, దంష్ట్రా, కరాళంబు+ఐన= మిక్కిలి వాడి అయిన వెలికోరలతో భయాన్ని కలిగించేదయిన; తన, వదన, గహ్వరంబున్+తెఱచి= తన గుహవంటినోరును తెరిచి; గ్రుడ్లు, మెఱవ(య)= కంటిగుడ్లు ప్రకాశించగా; బభ్రుకేశంబులు= (పసుపు) పచ్చని వెండ్రుకలు (బట్టతలపక్క వెండ్రుకలు); తూలన్= కదలగా; బాల+అర్క, రశ్మి, యుతంబు+అయిన= ఉదయభానుడి కిరణాలతో కూడిన; బలాహకంబునున్+పోలెన్= మేఘంవలె; సకల, ప్రాణి, భయ, జననంబుగా= సర్వ ప్రాణులకు భయం కలిగేటట్లుగా; గర్జిల్లుచున్నవాని= పెద్దధ్వని చేస్తున్నవాడిని; (అలంకారం: ఉపమ); నిజ, పాద, ఘట్టిత, మహీతల, ప్రచలన, వేగ, వేల్లిత, వల్లీ, పల్లవ, బాహు, పరిరంభణ సుఖంబున్= తనయొక్క పాదాలచేత కొట్టబడిన భూప్రదేశం యొక్క కదలిక వేగంచేత చుట్టుకొనబడిన తీగల చిగురుటాకులనే చేతుల కౌగిలింతల సౌఖ్యాన్ని; పాదపంబులకు= చెట్లకు; ఆపాదించుచున్నవానిన్= కలిగిస్తున్నవాడిని (అలంకారం: రూపకం); ఎదురన్= ఎదురుగా; ఒక్క; రక్కసున్+కనిరి= రాక్షసుడిని చూచారు; అంత; వాఁడును= ఆ కిమ్మీర రాక్షసుడును; బ్రాహ్మణ, సంఘంబు, ముందటన్= బ్రాహ్మణ సమూహాల ముందు; కృష్ణ+అజిన+ఆవృతులు+ఐ= లేడిచర్మాలతో కప్పబడినవారై; వచ్చు= వస్తున్నట్టి; పాండవుల, దవ్వులన్+కని= దూరంనుండి చూచి; మార్గ, నిరోధి+ఐ= దారిని అడ్డగించినవాడై; మహా, పర్వతంబును+పోలెన్= గొప్ప కొండవలె; ఉన్న; అదృష్ట, పూర్వ, ప్రమాణంబు+ఐన, వాని, దేహంబున్+చూచి= లోగడ ఎన్నడూ చూడబడనంతటి కొలతలు కల వాడి దేహాన్ని చూచి; నిమీలిత, నయన+అయి= మూసికొన్న కనులుకలదై; దుశ్శాసన, కర+ఆకృష్ట, వికీర్ణ, వేణీ, భరంబు= దుశ్శాసనుడి చేతులచేత లాగబడి చెదరిన కొప్పుముడి; వెనువెంటన్+ఒలయన్= వెనువెంట వ్యాపించగా (కదలగా); పాంచాలి= ద్రౌపది; పంచపర్వతంబుల నడిమి, నదియున్+పోలెన్= ఐదు కొండల మధ్య ఉన్న ఏరువలె; పతులనడుమ= భర్తల మధ్య; భయ, వ్యాకుల, చిత్త+ఐనన్= భీతితో కలత చెందిన మనస్సు కలది కాగా; ఇంద్రియంబులు= (ఐదు) ఇంద్రియాలు; విషయ, రతిన్, పరిగ్రహించునట్టులు= ఇంద్రియార్థాల అనుభూతిని చేకొనేటట్లు; ఏవురున్= ఐదుగురును; ఆ+కోమలిన్= ఆ సౌకుమార్యం కలిగిన వనిత అయిన ద్రౌపదిని; పట్టుకొని; భయపడకుండన్; ఆశ్వాసించుచున్నంత= అనునయిస్తుండగా- (అలంకారం: ఉపమ).

**తాత్పర్యం:** 'నీ కొడుకు నా మాటలు వినలేదుకదా- నేనెందుకు చెపుతాను? కిమ్మీర సంహారగాథను విదురుడు పాండవులకు సాయంగా అరణ్యవాసం చేస్తున్న విప్రులచేత విన్నాడు. నీవు ఆ వృత్తాంతం విదురు నడిగి తెలుసుకొమ్ము' అని చెప్పి మైత్రేయమహర్షివెళ్ళాడు. విదురుడు ఆ వృత్తాంతాన్ని ధృతరాష్ట్రుడికి వివరించి చెప్పాడు. వనవాసగతులైన పాండవులు మూడు రాత్రులు, పగళ్ళు పయనించి కామ్యకవనం చేరుతున్నపుడు ఒకనాటి అర్ధరాత్రి లోగడ తా మెప్పుడూ చూడని కొలతలు కల దేహం కలవాడిని, వెలికోరలతో వెరపు పుట్టించే నోరు తెరిచి, కనుగుడ్లు ప్రకాశించగా, బట్టతల పక్క నున్న (పచ్చనైన) వెండ్రుకలు కదలి, ఉదయభానుడి కిరణాలతో వెలుగొందే మేఘంవలె గర్జిస్తున్నవాడిని, తన పాదాల తాకిడిచే భూమికంపించిన వేగానికి తీగల చిగురాకుచేతులతో చెట్లకు కౌగిలింతల సౌఖ్యం కలిగిస్తున్నవాడిని, ఒక రాక్షసుడిని చూశారు. ఆ కిమ్మీర రాక్షసుడు కూడ దూరంనుండి బ్రాహ్మణుల ముందు జింకతోలు ఉడుపులు ధరించి వస్తున్న పాండవులను చూచి వారిదారికి అడ్డుగా నిలిచాడు. ఆ రాక్షసుడిని చూచి ద్రౌపది భయకంపిత అయి కన్నులు మూసికొన్నది. దుశ్శాసనుడి చేతులచేత లాగబడి చెదరిన ఆమె కేశసమూహం వెనువెంట వ్యాపించింది. ఆ సమయంలో ఆమె ఐదుకొండల మధ్య ఉండే నదివలె భర్తలనడుమ మిగుల వ్యాకుల చిత్త అయింది. అపుడు పాండవులైదుగురును పంచేంద్రియాలు విషయరతిని పరిగ్రహించే రీతిగా ద్రౌపదిని పట్టుకొని సేదతీర్చారు.

**విశేషం:** పై రెండు ఉపమాలంకారాలు మిక్కిలి హృద్యాలయ్యాయి. పంచ పాండవుల మధ్య ద్రౌపది ఉపమేయం. ఐదుకొండల మధ్య ఉండే నది ఉపమానం. ఇది సారస్వత వేత్తలు మెచ్చుకొనే ఉపమ. ఇక పంచపాండవులు ద్రౌపదిని ఆశ్వాసించటం పంచేంద్రియాలు విషయరతిని పరిగ్రహిస్తున్నట్లు ఉన్నదనే ఉపమ వేదాంతులు మెచ్చుకొనేది. జ్ఞానేంద్రియాలు ఐదు: 1. శ్రోత్రం 2. త్వక్కు 3. చక్షువు 4. జిహ్వ 5. ఘ్రాణం. కర్మేంద్రియాలు ఐదు: 1. వాక్కు 2. పాణి 3. పాదం 4. పాయువు 5. ఉపస్థ. ఇంద్రియార్థాలు అంటే విషయాలు ఐదు: 1. శబ్దం 2. స్పర్శం 3. రూపం 4. రసం 5. గంధం. ఇందు శ్రోత్రంవలన శబ్దం, త్వక్కువలన స్పర్శం, చక్షువు వలన రూపం, జిహ్వవలన రసం, ఘ్రాణంవలన గంధం అనుభవించబడతాయి. పంచేంద్రియాలు-జ్ఞానేంద్రియాలుగాని, కర్మేంద్రియాలు గాని - విషయరతి నిబద్ధాలు కాబట్టి పంచపాండవులు ద్రౌపదిని ఆశ్వాసించటం వేదాంతవేద్యమైన ఉపమ అయింది.

**క. రక్షోఘ్నమంత్రముల నా । రాక్షస మాయాపరిస్ఫురణఁ జెఱిచెఁ గ్రియా**
**దక్షుఁడు ధౌమ్యుఁడు పాండవు । లీక్షించుచు నుండఁగా నహీనప్రతిభన్. 108**

**ప్రతిపదార్థం:** పాండవులు+ఈక్షించుచున్+ఉండఁగాన్= పాండవులు చూస్తుండగా; క్రియాదక్షుఁడు= కార్యశూరుడైన; ధౌమ్యుఁడు; రక్షస్+ఘ్న, మంత్రములన్= రక్కసులను సంహరించే మంత్రాలచేత; అహీన, ప్రతిభన్= గొప్ప ప్రతిభతో; ఆ రాక్షస, మాయా, పరిస్ఫురణన్; చెఱిచెన్= ఆ రాక్షసుడికి సంబంధించిన మాయల విజృంభణాన్ని భంగం చేశాడు.

**తాత్పర్యం:** ప్రతిక్రియలో దక్షుడైన ధౌమ్యుడు పాండవులు చూస్తుండగా గొప్ప ప్రతిభతో రాక్షసులను ఛేదించే మంత్రాలచేత ఆ రాక్షసుడి మాయావిజృంభణాన్ని భగ్నం చేశాడు.

**వ. అంత. 109**

**తాత్పర్యం:** అప్పుడు.

**క. ప్రతివిహితమాయు నత్యా । యతభుజయుతుఁ గోపఘూర్ణితారుణ విస్ఫా**
**రితనేత్రు నసురఁ జూచి భ । రతకులవర్ధనుఁడు ధర్మరా జిట్లనియెన్. 110**

**ప్రతిపదార్థం:** ప్రతివిహితమాయున్= నిరోధించబడిన మాయకలవాడిని - అంటే తన మాయ వ్యర్థమైనవాడిని; అతి+ఆయత, భుజ, యుతున్= మిక్కిలి పొడుగైన భుజాలు కలవాడిని - అంటే ఆజానుబాహుడిని; కోప, ఘూర్ణిత+అరుణ, విస్ఫారిత, నేత్రున్= ఆగ్రహంచేత తిరుగుడువడి ఎర్రనై పెద్దవైన కన్నులు కలవాడిని; అసురన్= రాక్షసుడిని; చూచి; భరత కుల వర్ధనుఁడు= భరతవంశాన్ని వృద్ధిలోనికి తెచ్చేవాడు; ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** తనమాయ నిరోధించబడటం వలన కలిగిన, కోపంచేత తిరుగుడు పడుతున్న ఎర్రని కన్నులు గల ఆ రాక్షసుడిని చూచి ధర్మరాజు ఈ విధంగా పలికాడు.

**వ. 'నీ వెవ్వరి వాఁడ? వెవ్వండ? వివ్వనంబున నేల యున్న వాఁడ? వనిన వాఁ డి ట్లనియె. 111**

**ప్రతిపదార్థం:** నీవు+ఎవ్వరివాఁడవు= నీవు ఎవరికి సంబంధించినవాడివి; ఎవ్వండవు= ఎవడివి; ఈ+వనంబునన్= ఈ అడవిలో; ఏల= ఎందుకు; ఉన్నవాఁడవు; అనిన; వాఁడు+ఇట్లు+అనియె.

**తాత్పర్యం:** 'నీవు ఎవడివి? నీవా ళ్ళెవరు? ఈ అడవిలో ఎందుకు ఉన్నావు?' అని ధర్మరాజు అడుగగా ఆ రాక్షసుడు ఇట్లా అన్నాడు.

**క. 'ఏను బకాసురు ననుజుఁడఁ, । గీనాశుఁడ మానవులకుఁ, గిమ్మీరుఁ డనం**
**గా నెగడుదు నీ కామ్యక । కాననమున సర్వసత్త్వఖాదనబుద్ధిన్. 112**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; బక+అసురు+అనుజుఁడన్= బకుడనే రాక్షసుడి తమ్ముడిని; మానవులకున్= నరులకు; కీనాశుఁడ= యముడిని; కిమ్మీరుఁడు+అనంగా= కిమ్మీరుడనే నామధేయంతో; నెగడుదు= వర్ధిల్లుతుంటాను; ఈ కామ్యక కాననమున= కామ్యకమనే ఈవనంలో; సర్వసత్త్వ ఖాదనబుద్ధిన్= సమస్త జంతువులను తినే సంకల్పంతో (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** 'నేను బకుడనే రాక్షసుడి తమ్ముడిని. నరులపాలిటి యముడిని. కిమ్మీరుడనే పేరుతో వర్ధిల్లుతుంటాను. సర్వప్రాణులను సంహరించి తినే కోరికతో ఈ అడవిలో (విడువక ఉంటాను).

**క. పాయక యుండుదు, రాక్షస । మాయల సమరంబు సేసి మనుజుల విగతో**
**పాయులఁ జంపుచు భక్షణ । సేయుదు, నమరాదులకు నజేయుఁడఁ బోరన్. 113**

**ప్రతిపదార్థం:** పాయక+ఉండుదు= విడువక ఉంటాను; రాక్షస మాయలన్= రాక్షసుల యొక్క మాయలతో; సమరంబు+చేసి= యుద్ధం చేసి; విగత+ఉపాయులన్+చేసి= పోయిన ఉపాయాలు కల; మనుజులన్= మానవులను; అంటే యుక్తి విహీనులైన అని అర్థం; చంపుచు= సంహరిస్తూ; భక్షణ+చేయుదున్= తింటుంటాను; పోరన్= యుద్ధంలో; అమర+ఆదులకున్= దేవతలు మొదలైన వారికి; అజేయుఁడన్= గెలువరాని వాడిని.

**తాత్పర్యం:** (సకల జంతువులను చంపి తినే బుద్ధితో ఈ కామ్యకవనంలో) విడువక నివసిస్తూ ఉంటాను. మాయా యుద్ధంలో మనుష్యులను యుక్తిహీనులను చేసి సంహరించి భక్షిస్తూ ఉంటాను. దేవతలు మొదలైన వారు కూడా యుద్ధంలో నన్ను గెలువలేరు.

**విశేషం:** పై 112వ పద్యంలోని చివరి భాగం (సర్వసత్త్వఖాదనబుద్ధిన్) 113వ పద్యంలోని మొదటి భాగం (పాయకయుండుదు)తో అన్వయిస్తూ ఉంది. ఇట్లా రెండు పద్యాల నడుమ ఏర్పడే వాక్యాన్వయాన్ని 'కులక'మని అంటారు. ఆంధ్రవాఙ్మయంలో ఇటువంటి అన్వయక్రమానికి నన్నయ రచనయే మార్గదర్శకమైంది.

**వ. నాకు వెఱచి యెల్లవారును దూరంబున దీనిం బరిహరింతురు; మీ రెవ్వ? రిందుల కేల వచ్చితిరి? మిమ్ము వధియించి యిపుడు భక్షించెద' ననిన వానికి యుధిష్ఠిరుం డిట్లనియె. 114**

**ప్రతిపదార్థం:** నాకు, వెఱచి= నాకు భయపడి; ఎల్లవారును= అందరును; దూరంబున= దూరంనుండి; దీనిన్= ఈ కామ్యక వనాన్ని; పరిహరింతురు= విడిచిపెట్టుతారు; మీరు+ఎవ్వరు; ఇందులకు+ఏల; వచ్చితిరి; మిమ్ము; వధియించి= చంపి; ఇప్పుడు; భక్షించెదన్= తింటాను; అనిన; వానికి= ఆ రాక్షసుడికి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** నాకు భయపడి అందరు కామ్యకవనానికి రాకుండా దూరంగా ఉంటారు. మీరు ఎవ్వరు? ఎందుకు ఇక్కడికి వచ్చారు? మిమ్ములను చంపి భక్షిస్తాను' అని కిమ్మీరుడు పలుకగా ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'యిపుడు భక్షించెద' - అనే పాఠాంతరం వావిళ్లప్రతిలో ఉన్నది.

**ఆ. 'ఏను ధర్మసుతుఁడ, నీతఁడు భీముండు, । వాఁడు విజయుఁ, డల్లవారు గవలు;**
**పాండవులము సమయపడి వనవాసంబు । సేయ వచ్చితిమి విశేషయుక్తి.' 115**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ధర్మసుతుఁడన్= ధర్మరాజును; ఈతఁడు, భీముండు; వాఁడు; విజయుఁడు= అర్జునుడు; అల్లవారు= అదిగో అక్కడ ఉన్నవారు; కవలు= జంటబిడ్డలు (నకుల సహదేవులు); పాండవులము; సమయపడి= ఒప్పందం చేసికొని; వనవాసంబు+చేయన్= అడవిలో ఉండటానికై; విశేషయుక్తి= ప్రత్యేకమైన కారణంచేత; వచ్చితిమి= అరుదెంచాం.

**తాత్పర్యం:** 'నేను ధర్మరాజును. ఇతడు భీముడు. అతడు అర్జునుడు. వారు కవలు నకుల సహదేవులు. మేం పాండవులం. విశేషకారణంచేత ఒడంబడిక ప్రకారం వనవాసం చేయటానికి వచ్చాం'

**సీ. అనవుడు రాక్షసుం డట్టహాసంబుతో । 'నెట్టెట్టు! భీముండె యీతఁ? డేమి**
**పుణ్యమో వీని నెప్పుడు సంపఁగాంతునో । యని యున్నచోఁ దాన యరుగు దెంచె;**
**నధికు మా యన్న బకాసురు, నా యిష్ట । సఖు హిడింబాసురుఁ జంపి యున్న**
**ఖలు మ్రింగి జీర్ణంబు గావింతు వాతాపిఁ । దడయక మ్రింగిన తపసి యట్ల'**

**ఆ. యనిన రక్కసునకు నలిగిన యగ్రజు । నలుక యెఱిఁగి వీరుఁ డర్జునుండు**
**మొనసి గాండివంబు మోపెట్టె; సునిశిత । ఖడ్గపాణులైరి కవలు నంత. 116**

**ప్రతిపదార్థం:** అనవుడు= అని చెప్పగా; రాక్షసుండు= ఆ కిమ్మీరుడు; అట్టహాసంబుతోన్= పెద్దవెడనవ్వుతో; ఎట్టెట్టు (ఎట్టు+ఎట్టు)= ఎట్ల, ఎట్ల?; భీముండె= భీముడా!; ఈతఁడు; ఏమి పుణ్యమో= ఏ పుణ్యంవలననో; వీనిన్+ఎప్పుడు, చంపన్, కాంతునో= వీడిని ఎప్పుడు చంపగలనా?; అని; ఉన్నచోన్= ఎదురుచూస్తుంటే; తాను+అ= తానే; అరుగుదెంచెన్= వచ్చాడు; అధికు, మా అన్న బకాసురున్= గొప్పవాడైన మా అన్న బకాసురుడిని; నా+ఇష్ట, సఖున్= నా ప్రియమిత్రుడు; హిడింబ+అసురున్= హిడింబుడనే రాక్షసుడిని; చంపి+ఉన్న= లోగడ సంహరించిన; ఖలున్= నీచుడిని; మ్రింగి= తిని; జీర్ణంబు, కావింతున్= అరిగించుకొంటాను; వాతాపిన్= వాతాపి అనేవాడిని; తడయక= ఆలస్యం చేయక; మ్రింగిన= తినిన; తపసియట్లు+అ= ఋషివలె (అగస్త్యుడి వలె); అనిన; రక్కసునకున్+అలిగిన= రాక్షసుడిపై కినుక వహించిన; అగ్రజు+అలుక= అన్నగారికోపం; ఎఱిఁగి= గ్రహించి; వీరుఁడు; అర్జునుండు; మొనసి= పూని; గాండివంబు= గాండీవం అనే పేరుకల విల్లు; మోపెట్టెన్= ప్రయోగించటానికి సంసిద్ధమయ్యాడు; కవలున్= (నకుల సహదేవులు); అంత; సునిశిత= ఎక్కువవాడి కల; ఖడ్గపాణులు+ఐరి= కత్తులు ధరించారు.

**తాత్పర్యం:** అని ధర్మజుడు చెప్పగా, కిమ్మీరుడు ఉద్రేకాన్ని పొంది వెడనవ్వునవ్వుతూ 'ఏమీ నా అన్నఅయిన బకుడిని, నా ప్రియమిత్రుడైన హిడింబుడిని చంపిన భీముడు వీడేనా? ఎంతటి పుణ్యం? వీడిని ఎప్పుడు చంపగలనా? అని నేను ఇంతకాలం నుండి ఎదురు చూస్తుండగా వీడే నేడు నాకు తారసిల్లాడు. ఇక వీడిని చంపి, అలనాడు అగస్త్యమహర్షి వాతాపిని జీర్ణం చేసికొన్నట్లు నేడు నేను వీడిని అరిగించుకొంటాను' అని అట్టహాసం చేశాడు. ఆ మాటలకు అన్న అయిన ధర్మరాజుకు వచ్చిన ఆగ్రహాన్ని గుర్తించి వీరుడైన అర్జునుడు గాండీవాన్ని ఎక్కుపెట్టాడు. కవలు వాడికత్తులు దూశారు.

**విశేషం:** అలం: ఉపమ. వాతాపిగాథ ఇక్కడ ప్రస్తావించబడింది. రామాయణ మహాభారతాదుల్లో ఈ గాథ సుప్రసిద్ధమైనది. ఇల్వలుడు వాతాపి అన్నదమ్ములు. ఇల్వలుడు మేకరూపం దాల్చిన వాతాపిని చంపి ఆ మాంసంతో ఆర్యఋషులకు అతిథి భోజనం కల్పిస్తూ ఉండేవాడు. భోజనానంతరం ఇల్వలుడు వాతాపిని గొంతెత్తి పిలవటంతో వాతాపి పునర్జీవితుడై అతిథుల పొట్టలు చీల్చుకొని బయట పడేవాడు. అన్నదమ్ము లిరువురు తిరిగి అతిథిమాంసాన్ని భుజిస్తూ ఉండేవారు. ఒకనాడు అగస్త్యమహర్షి ఇల్వలుడికి అతిథిగా విచ్చేశాడు. భోజనానంతరం ఇల్వలుడు గొంతెత్తి వాతాపిని పిలిచాడు కాని అగస్త్యుడు తన పొట్ట నిమిరి వాతాపి జీర్ణమయ్యాడని వచించాడు. అంతటితో వాతాపిజీవితం పరిసమాప్తం అయింది. (చూ. ఆరణ్యపర్వం-ద్వితీయాశ్వాసం).

## కిమ్మీరుఁడను రాక్షసుఁడు భీముచేఁ జచ్చుట. (సం. 3-12-42)

ఉ. **ఘోరపరాక్రముల్ ప్రబలకోపపరుల్ పృథుసారభూరిభూ**
**మీరుహపాణు లుద్ధతు లమిత్రవిఘాతులు వీరబృందబృం**
**దారకు లార్చు చొండొరులఁ దాఁకిరి దారుణభంగిఁ బొంగి కి**
**మ్మీర సమీరసూనులు సమీరవిధూతపయోధులట్ల యై.** **117**

**ప్రతిపదార్థం:** ఘోర, పరాక్రముల్= భయంకరమైన శౌర్యం కలవారు; ప్రబల, కోప, పరుల్= ఎక్కువ కోపం పొందినవారు; పృథు, సార, భూరి, భూమీ, రుహ, పాణులు= ఎక్కువ చేవ గలిగిన పెద్దవైన చెట్లు చేతులలో కలవారు; ఉద్ధతులు= గర్వించినవారు; అమిత్ర, విఘాతులు= శత్రువులను సంహరించేవారు; వీర, బృంద, బృందారకులు= వీరుల సమూహాలలో దేవతలవంటివారు (శ్రేష్ఠులు); కిమ్మీర, సమీర సూనులు= కిమ్మీరుడున్నూ, భీముడున్నూ; ఆర్చుచు= పెడబొబ్బలు పెట్టుతూ; సమీర, విధూత, పయోధులు+అట్ల+ఐ= పెనుగాలిచేత కలచబడిన సముద్రాల వలె; పొంగి= ఉబ్బి; దారుణభంగిన్= భయంకర రీతిగా; ఒండొరులన్= పరస్పరం; తాఁకిరి= ఢీకొన్నారు;

**తాత్పర్యం:** భయంకరమైన పరాక్రమంగల కిమ్మీరుడున్నూ, భీముడున్నూ మిక్కిలి ఉగ్రులై, చేవకలిగిన పెద్ద చెట్లు చేత పట్టుకొని పెడబొబ్బలు పెట్టుతూ పెనుగాలిచేత కలచబడిన సముద్రాలవలె గర్వంతో ఉప్పొంగి, భయంకరంగా ఒకరి నొకరు ఢీకొన్నారు.

**విశేషం:** అలం: ఉపమ. వృత్తరచనలో నన్నయ అర్వాచీనకవులకు ప్రసాదించిన ఒజ్జబంతులలో ఈ పద్యాన్ని ఎన్నుకోవచ్చును. రేఫ ప్రాసాన్ని పూర్వోత్తరపాదాలలోనిప్రాసస్థానాలలో - భూమీరుహ, బృందారక, కిమ్మీర పదాలతో గొలుసుకట్టుగ అను సంధించటం గమనించదగింది. శబ్దాలంకారం- ఛేకానుప్రాసం.

**తరలము.**

**పొరిని వారల చేతి యున్నతభూరుహాయుధముల్ పర**
**స్పర కఠోరశిరస్స్థలంబులపై వడిం బడి మత్తకుం**
**జర శిరఃపతితంబులైన లసన్మృణాలములట్ల జ**
**ర్జరిత మయ్యెఁ దదారవప్రతిశబ్ద మొప్ప నభంబునన్.** **118**

**ప్రతిపదార్థం:** పొరిని= వరుసగా; వారల, చేతి, ఉన్నత, భూరుహ+ఆయుధముల్= వారి చేతులలో ఉన్న పెద్ద చెట్లు అనే పోటు ముట్టులు, (అంటే ఆయుధాలవలె ప్రయోగిస్తున్న చెట్లు); పరస్పర, కఠోర, శిరస్, స్థలంబులపై= ఒండొరుల గట్టి తలలపై; వడిన్+పడి= వేగంగాపడి; మత్త, కుంజర, శిరః, పతితంబులు+ఐన= మదపుటేనుగుల తలలపైపడిన; లసత్+మృణాలములు+అట్లు+అ= సుకుమారమైన తామరతూండ్లవలె; జర్జరితము+అయ్యెన్= ముక్కలు ముక్కలు అయ్యాయి (శిథిలమయ్యాయి); నభంబునన్= ఆకసంలో; తద్+ఆరవ, ప్రతిశబ్దము+ఒప్ప= ఆ శబ్దాల ప్రతిధ్వని ఒప్పగా.

**తాత్పర్యం:** భీముడూ, కిమ్మీరుడూ తలపడగా వారు ఆయుధాలుగా ప్రయోగించిన పెద్ద పెద్ద చెట్లు మదపుటేనుగుల కుంభస్థలాలపై పడిన తామరతూండ్లవలె వారి శిరస్సులపై వేగంగా పడి ముక్కలు ముక్కలుగా అయ్యాయి. ఆ ధ్వనులు ఆకసంలో ప్రతిధ్వనించాయి.

**విశేషం:** అలం: ఉపమ. నన్నయ కవితాశిల్పానికి విశిష్టమైన లక్షణమైన అక్షరరమ్యత ఈ పద్యంలో కానవస్తున్నది. ఈ వృత్తంలోని ప్రతిపాదంలోనూ న,భ,ర,స,జ,జ,గ అనే గణాలు వరుసగా ఉంటాయి. 12వ అక్షరంతో యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది.

**వ.** **ఇ ట్లొక్క ముహూర్తంబు వృక్షయుద్ధంబు సేసి యాసన్నమహీరుహంబులు సమసిన నయ్యిద్దఱు శిలాయుద్ధంబునకుఁదొడంగి చేయునెడం బవనజనిక్షిప్త నిష్ఠుర శిలాహత హృదయుండై భానుంబట్టుకొను స్వర్భానుండునుం బోలెఁ గిమ్మీరుండు భీముం బట్టుకొనిన భీముండును వాని హీనబలుంగా నెఱింగి కృతాంతదండానుకారంబులైన తన బాహుదండంబుల నమ్మనుజకంటకు కటి కంఠ ప్రదేశంబులు పట్టుకొని నేలంబెట్టి దేహయష్టి విఱిచి బకుం జంపిన విధంబునఁ గిమ్మీరు విగతప్రాణుం జేసి.** **119**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఒక్క, ముహూర్తంబు= ఈ విధంగా రెండు గడియల సేపు; వృక్షయుద్ధంబు+చేసి= చెట్లు ఆయుధాలుగా ఉపయోగించి పోరాటం చేసి; ఆసన్న మహీరుహంబులు= సమీపంలోని చెట్లు; (మహీ, రుహములు= భూమినుంచి పుట్టినవి - చెట్లు అని రూఢ్యర్థం ఏర్పడింది); సమసినన్= నశించగా; ఆ+ఇద్దఱు= ఆ ఇరువురు; శిలా, యుద్ధంబునకున్+తొడంగి= శిలలు ఆయుధాలుగా పోరాటం చేయటానికి పూనుకొని; చేయు+ఎడన్= పోరు సల్పేటప్పుడు; పవనజ, నిక్షిప్త, నిష్ఠుర, శిలా+ఆహత, హృదయుండు+ఐ= వాయుసుతుడగు భీముడిచేత విసరబడిన కరకురాళ్ళ దెబ్బలచేత కొట్టబడిన గుండె కలవాడై; భానున్+పట్టుకొను= సూర్యుడిని పట్టుకొనే; స్వర్+భానుండునున్+పోలెన్= రాహువువలె; కిమ్మీరుండు; భీమున్; పట్టుకొనిన; భీముండును; వానిన్= ఆ కిమ్మీరుడిని; హీన బలున్+కాన్= తరిగిన బలం కలవాడినిగా; ఎఱింగి= తెలిసికొని; కృతాంత, దండ+అనుకారంబులు+ఐన= యముడి దండాన్ని అనుకరించేవైన (అంటే ఇతరుల ప్రాణాలు తీయటానికి సమర్థాలైన); తన బాహు దండంబులన్= దండాల వంటి తన భుజాలచేత; ఆ+మనుజకంటకు= మనుష్యులను ముల్లువలెబాధించేవాడి యొక్క, ఆ రాక్షసుడి యొక్క; కటి, కంఠ, ప్రదేశంబులు= మొల, కుత్తుక భాగాలు, పట్టుకొని; నేలన్+పెట్టి= భూమిపై పడద్రోసి; దేహయష్టి= కర్రవంటి శరీరాన్ని; విఱిచి; బకున్+చంపిన, విధంబునన్= బకుడిని చంపిన రీతిగా; కిమ్మీరున్; విగతప్రాణున్+చేసి= పోయిన ప్రాణాలు కలవాడినిగా చేసి, అంటే చంపి.

**తాత్పర్యం:** ఈ విధంగా వారు రెండుగడియలు పోరాడారు. చెట్లతో కొట్టుకొన్నారు. దగ్గరలోని చెట్లు నశించిన తర్వాత రాళ్ళతో కొట్టుకొన్నారు. అంత కిమ్మీరుడు రాహువు సూర్యుడిని పట్టుకొన్నట్లు భీముడిని పట్టుకొన్నాడు. భీముడు వాడిని హీనబలుడిగా గుర్తించి ఆ రక్కసుడి మొలను, కంఠాన్ని పట్టుకొని నేలపై పడవేసి, బకుడిని చంపిన విధంగానే (మోకాలితో) వాడిదేహాన్ని విరుగబొడిచి వధించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **'బక హిడింబులు హతులైనఁ బనవి పనవి । యఱచి శోకింపఁ గానక యమపురమున**
**కరిగి తక్కట రాక్షస!' యనుచుఁ దెరువు । వాయఁ బావని దత్కళేబరము వైచె.** **120**

**ప్రతిపదార్థం:** బక హిడింబులు, హతులు+ఐనన్= బకుడు, హిడింబుడు మరణించగా; పనవి, పనవి= ప్రలాపించి; అఱచి, శోకింపన్+కానక= బిగ్గరగా దుఃఖించలేక (కానక= ఊరట చెందక); యమపురమునకు+అరిగితి+అక్కట= నరకానికి పోయావుకదా!; రాక్షస= ఓ రాక్షసుడా!; అనుచున్= అని పలుకుతూ; తెరువు+పాయన్= దారి నుంచి తొలగేటట్లు; పావని= వాయుసుతుడైన భీముడు; తద్‌కళేబరము= ఆతని దేహాన్ని; వైచెన్= విసిరివేశాడు.

**తాత్పర్యం:** 'బకుడు, హిడింబుడు చనిపోయారని మిక్కిలి దుఃఖించి, ఓ రాక్షసుడా! నీవు కూడ వారిని కలిసికొనటానికి నరకానికి పోయావు కదా!' అని భీముడు కిమ్మీరుడి కళేబరాన్ని దారి కడ్డం లేకుండా దూరంగా విసిరి వేశాడు.

**విశేషం:** 'శోకించి కానక'- అనే పాఠాంతరం ఒకానొక ప్రతిలో ఉన్నది.

**వ.** **ఇట్లు ధర్మరాజువచనంబునఁ గిమ్మీరు నశ్రమంబున వధియించి తద్వనవాసులకు రాక్షసభయం బుడిపిన మహావీరు నమ్మారుతాత్మజు ధర్మార్జుననకులసహదేవులును ధౌమ్యాది మహీసురవరులును బ్రశంసించి' రని విదురుండు గిమ్మీరువధ సెప్పిన విని ధార్తరాష్ట్రులకు హృదయదలనం బయ్యెఁ; నిట పాండవులు గామ్యక వనంబున నుండు నంత.** **121**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ధర్మరాజు వచనంబునన్= ధర్మరాజు మాటవలన; కిమ్మీరున్; అశ్రమంబునన్= శ్రమలేకుండ; వధియించి= చంపి; తద్+వనవాసులకున్= ఆ అడవిలో నివసించే వాళ్ళకు; రాక్షసభయంబు+ఉడిపిన= రాక్షసుడివలన కలిగిన భీతిని పోగొట్టగా; మహావీరున్= గొప్పవీరుడిని; ఆ+మారుత+ఆత్మజు= ఆ వాయునందనుడిని అంటే భీముడిని; ధర్మ+అర్జున, నకుల, సహదేవులును; ధౌమ్య+ఆది, మహీసురవరులును= ధౌమ్యుడు మున్నగు బ్రాహ్మణ శ్రేష్ఠులును; ప్రశంసించిరి= పొగిడారు; అని; విదురుండు; కిమ్మీరువధ= కిమ్మీరుడి సంహారాన్ని; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; ధార్తరాష్ట్రులకు= ధృతరాష్ట్రుడి కొడుకులకు; హృదయదలనంబు+అయ్యెన్= గుండె వ్రయ్యలయింది; ఇట= ఇక్కడ; పాండవులు= పాండురాజు కొడుకులు; కామ్యక, వనంబునన్= కామ్యకం అనే పేరుకల అడవిలో; ఉండు+అంత= ఉండగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజుమాటచొప్పున కిమ్మీరుడు అనే రాక్షసుడిని సులువుగా సంహరించి, ఆ కామ్యకవనంలో నివసించే వాళ్ళకు రాక్షసభయాన్ని పోగొట్టిన వాయుసుతుడైన భీముడిని ధర్మరాజు, అర్జునుడు, నకులసహదేవులు, ధౌమ్యుడు మున్నగు విప్రులు పొగిడారు'- అని విదురుడు కిమ్మీరవధగాథ చెప్పగా వినిన ధృతరాష్ట్రుడి కొడుకులకు గుండెలు పగిలాయి. ఇక్కడ పాండవులు కామ్యకవనంలో నివసిస్తున్నారు. అంతట.

### యాదవ పాంచాలాదులు పాండవులకడ కేతెంచుట (సం. 3-13-1)

**సీ.** **వసుమతీరాజ్యంబువలన నిరస్తులై । మునివృత్తి నత్యుగ్రవనములోన**
**నవయుచుఁ బాండుభూనాథనందను లున్న । వారని విని యతిక్రూరమతుల**

**ధృతరాష్ట్రసుతుల నిందించుచుఁ బాంచాల । యాదవ వృష్ణి భోజాంధు లెల్ల**
**నచ్యుత ప్రముఖులై యప్పాండవుల కడ । కేతెంచి శోకపరీతు లగుచు**

**ఆ. నున్న నధికధర్మయుక్తుఁ డుపేంద్రుండు । నికృతిఁ జేసి పాపనియతబుద్ధిఁ**
**బాండవులకు న ట్లపాయంబు సేసిన । ధార్తరాష్ట్రులకును దద్ద యలిగి. 122**

**ప్రతిపదార్థం:** వసుమతీ, రాజ్యంబువలన, నిరస్తులు+ఐ= భూరాజ్యంనుండి వెళ్ళగొట్టబడినవారై; మునివృత్తిన్= ఋషుల నడవడితో; అతి+ఉగ్ర, వనములోన= మిక్కిలి ఘోరమైన అడవిలో; నవయుచున్= బాధపడుతూ; పాండు, భూనాథ, నందనులు+ఉన్నవారు+అని, విని= పాండురాజు కొడుకులు నివసిస్తున్నారని విని; అతి క్రూరమతుల= ఎక్కువగా ఇతరులను పీడించే బుద్ధి కలవారయిన; ధృతరాష్ట్ర సుతుల= ధృతరాష్ట్రుడి కొడుకులను; నిందించుచున్= తెగడుతూ; పాంచాల, యాదవ, వృష్ణి, భోజ+అంధులు+ఎల్లన్= పాంచాలులు, యాదవులు, వృష్ణులు, భోజులు, అంధులు(అంధకులు) అనే తెగలవారు అందరు; అచ్యుత ప్రముఖులు+ఐ= శ్రీకృష్ణుడిని ముందు పెట్టుకొన్నవారై; ఆ+పాండవుల, కడకు+ఏతెంచి= ఆ పాండవుల దగ్గరకు వచ్చి; శోక, పరీతులు+అగుచున్= దుఃఖంచేత చుట్టుకోబడినవారై; ఉన్నన్= ఉండగా; అధిక, ధర్మ, యుక్తుఁడు= ఎక్కువైన ధర్మంతో కూడిన; ఉపేంద్రుఁడు= శ్రీకృష్ణుడు; నికృతిన్+చేసి= మోసంచేసి; పాప, నియత, బుద్ధిన్= పాపంతో కూడిన బుద్ధితో; పాండవులకున్+అట్లు; అపాయంబు+చేసిన= కీడుచేసిన; ధార్తరాష్ట్రులకును= ధృతరాష్ట్రుడి కొడుకులపట్ల; తద్ద= మిక్కిలి; అలిగి= కోపగించి.

**తాత్పర్యం:** రాజ్యాన్ని కోల్పోయి భయంకరమైన అడవిలో మునివృత్తితో బాధలు పడుతున్న పాండవులకడకు శ్రీకృష్ణుడి నాయకత్వంలో పాంచాల యాదవ వృష్ణి భోజాంధకులైన బంధువులు వచ్చి ధార్తరాష్ట్రులను నిందించారు. (యాదవులందలి తెగలు వృష్ణిభోజాంధకులు).

**క. 'అనిఁ గర్ణ శకుని దుర్యో । ధన దుశ్శాసన నవాస్రధారాపాతం**
**బునఁ దృప్తిఁబొందు వసుధాం । గన రాక్షస కాక గృధ్ర గణములతోడన్. 123**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధంలో; కర్ణ, శకుని, దుర్యోధన, దుశ్శాసన= కర్ణుడియొక్క, శకునియొక్క, దుర్యోధనుడియొక్క, దుశ్శాసనుడియొక్క; నవ+అస్ర, ధారా, పాతంబునన్= క్రొత్త నెత్తుటి ధారలు పడటంచేత; వసుధా+అంగన= భూదేవి, (భూమి అనే స్త్రీ); రాక్షస, కాక, గృధ్ర, గణములతోడన్= రాక్షసుల, కాకుల, గ్రద్దల సమూహాలతో సహా; తృప్తి+పొందున్= తనివి చెందుతుంది.

**తాత్పర్యం:** 'యుద్ధంలో కర్ణ, శకుని, దుర్యోధన, దుశ్శాసనుల శరీరాలనుండి కారిన క్రొత్త నెత్తురుతో రాక్షసులు, కాకులు గ్రద్దలతోపాటు భూదేవి తనివి చెందుతుంది.

**విశేషం:** అలం: సహోక్తి.

**క. అవినీతుల వధ్యులఁ గౌ । రవపాంసులఁ జంపి ధర్మరాజునకుఁ గురు**
**ప్రవరున కొనరింతము, యీ । యవనీరాజ్యాభిషేక మవిజితశక్తిన్. 124**

**ప్రతిపదార్థం:** అవినీతుల= నీతి మాలిన వారైన; వధ్యులన్= చంపదగిన వారైన; కౌరవ పాంసులన్= దుష్టులైన కౌరవులను; చంపి= సంహరించి; కురు ప్రవరునకున్= కురు వంశంలో శ్రేష్ఠుడైనవానికి; ధర్మరాజునకు= ధర్మపుత్రుడికి; అవనీ, రాజ్య+ అభిషేకము= భూరాజ్యానికి పట్టం కట్టటం; అవిజిత శక్తిన్= ఓడించబడిన సామర్థ్యంతో; ఒనరింతము+అ= చేద్దామా.

**తాత్పర్యం:** అవినీతిపరులున్నూ, చంపదగినవారున్నూ, కౌరవవంశాన్ని మలినం చేసే దుష్టులున్నూ అయిన దుర్యోధనాదులను సంహరించి, కౌరవవంశశ్రేష్ఠుడైన ధర్మరాజుకు మనం పూనుకొని పట్టాభిషేకం చేద్దాం.'

**విశేషం:** ఒనరించుదమ - ఒనరింతమ; "చువర్ణంబుతోడి దుగ్దకారంబునకు తకారంబగును"

**వ. అని యుగాంత్యకాల కుపిత కృతాంతాకృతి నున్న జగన్నాథు జనార్దనుం బ్రశాంతచిత్తుం జేసి యర్జునుం డతని నిట్లని కీర్తించె. 125**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; యుగ+అంత్య, కాల, కుపిత, కృతాంత+ఆకృతిన్+ఉన్న= యుగాల కడపటి కాలమైన ప్రళయ సమయంలో కోపించిన యముడి ఆకారాన్ని పోలి ఉన్న; జగత్+నాథున్= విశ్వానికి పరిపాలకుడైన; జనార్దనున్= శ్రీకృష్ణుడిని; ప్రశాంత చిత్తున్+చేసి= శాంతమైన మనస్సు కలవాడినిగా చేసి; అతనిన్= ఆ శ్రీకృష్ణుడిని; అర్జునుండు; ఇట్లు+అని= ఈ విధంగా పలికి; కీర్తించెన్= పొగిడాడు.

**తాత్పర్యం:** అని, ప్రళయకాలంలోని యముడి ఆకృతిని పోలి ఉండే జగన్నాథుడైన శ్రీకృష్ణుడిని శాంతింపజేసి అర్జునుడు ఈ విధంగా ప్రస్తుతించాడు.

**విశేషం:** ప్రళయకాలం యుగాంతంలో వస్తుందని, అప్పుడు యముడు సర్వప్రాణిసంహారం చేస్తాడన్నది-పురాణప్రోక్తం. అప్పుడు యముడు మూర్తీభవించిన కోపం. ఇచట ఉపమేయం శ్రీకృష్ణుడు. ఉపమానం ప్రళయకాల యముడు. అలంకారం: ఉపమ.

**ఆ. 'పూజ్యుఁడవు పురాణపురుషుండ వీశుండ । వప్రమేయుఁడవు చరాచరంబు**
**లయిన భూతరాసు లచ్యుత! నీయంద । పుట్టు, నిలుచు, లయముఁ బొందుచుండు. 126**

**ప్రతిపదార్థం:** పూజ్యుఁడవు= ఆరాధించదగినటువంటివాడివి; పురాణ పురుషుండవు= ప్రాచీనకాలంనుండి ఉండేవాడివి; ఈశుండవు= (విశ్వానికి) పరిపాలకుడివి; అప్రమేయుఁడవు= మితిలేనివాడివి; అచ్యుత!= ఓకృష్ణా! (అ+చ్యుత= జారుపాటు [నాశనము] లేనివాడా!); చర+అచరంబులు+అయిన= కదిలేటి, కదలనట్టి; భూత, రాసులు= ప్రాణి సముదాయాలు; నీయందు+అ= నీలోనే; పుట్టున్= ఉద్భవిస్తాయి; నిలుచున్= బ్రదుకుతాయి; లయంబున్+పొందుచుండున్= వినాశం పొందుతుంటాయి.

**తాత్పర్యం:** 'ఓ అచ్యుతా! నీవు పూజ్యుడవు. అనాదిపురుషుడివి. ఈశ్వరుడివి. అప్రమేయుడివి. స్థావరజంగమాల సృష్టిస్థితిలయాలకు నీవే కారకుడివి.

**వ. నీవు దొల్లి గంధమాదనంబునం గందమూలఫలాశనుండవై పదివేలేండ్లు తపంబు సేసి, పుష్కరంబున నేకాదశసహస్ర వర్షంబులు జలంబు లాహారంబుగా నుండి, ప్రభాసంబను తీర్థంబున దివ్యసహస్ర వర్షంబు లేకపాదస్థితుండ వయి యుండి, బదరీవనంబునం బవనంబు భక్షించుచు నూర్ధ్వబాహుండ వయి**

**యేకపాదంబున ననేకసహస్ర వర్షంబులు నిలిచి, సరస్వతీ సత్త్రంబున నవకృష్టోత్తరాసంగుండవై నియమకృశీకృత శరీరంబుతోఁ బండ్రెండు వర్షంబు లశేష వ్రతంబులు సలిపిన తపోనిధానంబవు. నిఖిలలోకజైత్రుండ వయి చైత్రరథంబున నుత్తమక్రతువు లనేకంబులు సేసి యొక్కొక్కక్రతువునకు నూఱేసి లక్షలు సువర్ణంబులు దక్షిణ లిచ్చిన యజ్ఞపురుషుండవు. తపోయజ్ఞంబులు రెంటను సమృద్ధతేజుండ వయి, దైత్యదానవేంద్రుల వధియించి, యింద్రున కింద్రత్వం బేకాధిష్ఠతంబు సేసిన లోకప్రభుండ, వదితికిం గశ్యపునకు నుదయించి, యింద్రానుజుండవై త్రివిక్రమంబునం ద్రిజగంబుల నభివ్యాపించిన విశ్వరూపధరుండవు.127**

**ప్రతిపదార్థం:** ఓ శ్రీకృష్ణా!; నీవు; తొల్లి= పూర్వం; గంధమాదనంబునన్= గంధమాదనం అనే కొండపై; కంద, మూల, ఫల+అశనుండవు+ఐ= దుంపలు, వేళ్ళు, పండ్లు ఆహారంగా కలవాడివై; పదివేల+ఏండ్లు= పదివేల సంవత్సరాలు; తపంబు+చేసి; పుష్కరంబునన్= పుష్కరమనే పుణ్య ప్రదేశంలో; ఏకాదశ, సహస్ర, వర్షంబులు= పదకొండు వేల ఏండ్లు; జలంబులు= నీళ్ళు; ఆహారంబుగాన్= భోజనంగా; ఉండి; ప్రభాసంబు+అను, తీర్థంబునన్= ప్రభాసం అనే పేరుకల పుణ్యప్రదేశంలో; దివ్య, సహస్ర, వర్షంబులు= దేవమానంప్రకారం వెయ్యి సంవత్సరాలు; ఏక, పాద, స్థితుండవు+అయి= ఒంటి పాదంపై నిలిచి ఉండి; బదరీవనంబునన్= బదరిఅనే పేరుకల అడవిలో; పవనంబు= గాలిని; భక్షించుచున్= తింటూ; ఊర్ధ్వ బాహుండవు+అయి= పైకెత్తిన చేతులు కలవాడివయి; ఏక, పాదంబునన్= ఒంటికాలిపై; అనేక సహస్ర, వర్షంబులు= పెక్కువేల ఏండ్లు; నిలిచి; సరస్వతీ, సత్రంబునన్= సరస్వతీ నదీ తీరంలోని యజ్ఞవాటికలో (సరస్వతీ తీరంలో, సరస్వతీ సరస్సులో); అవకృష్ట+ఉత్తరా సంగుండవు+ఐ= తొలగించబడిన ఉత్తరీయం కలవాడివై (అంటే పై వస్త్రం లేనివాడవై); నియమ, కృశీకృత, శరీరంబుతోన్= నియమాలచేత చిక్కిపోయిన దేహంతో; పండ్రెండు వర్షంబులు= పండ్రెండేండ్లు; అశేషవ్రతంబులు= పెక్కునోములు (పుణ్యకర్మలు); సలిపిన= చేసిన; తపస్+నిధానంబవు= తపస్సుకు నెలవైన వాడివి; నిఖిల, లోక+ఏక, జైత్రుండవు+అయి= సమస్తలోకాలను అసహాయశూరుడివిగా జయించినవాడి వయి; చైత్రరథంబునన్= చైత్రరథం అనే కుబేరుడితోటలో; ఉత్తమ, క్రతువులు= గొప్పయజ్ఞాలు; అనేకంబులు= పెక్కు; చేసి; ఒక్కొక్క, క్రతువునకు= ఒక్కొక్క యజ్ఞానికి; నూఱేసిలక్షలు= కోటి; సువర్ణంబులు= బంగారు నాణేలు; దక్షిణలు+ఇచ్చిన= బహుమతులు ఇచ్చిన; యజ్ఞపురుషుండవు= యజ్ఞాలు చేసిన వాడివి; తపస్+యజ్ఞంబులురెంటను= తపస్సులోను, యజ్ఞంలోను రెండింటను; సమృద్ధతేజుండవు+అయి= పూర్ణమైన కాంతికలవాడి వయి; దైత్య, దానవ+ఇంద్రుల= దితిపుత్రులలో, దనువు పుత్రులలో శ్రేష్ఠులను (రాక్షస నాయకులను); వధియించి= చంపి; ఇంద్రునకు; ఇంద్రత్వంబు= ఇంద్రపదవి; ఏక+అధిష్ఠితంబు+చేసిన= ఒక్కడు మాత్రమే అధిష్ఠించేదానినిగా చేసిన; లోక, ప్రభుండవు= జగన్నాథుడివి (లోకానికి ఏలికవు); అదితికిన్+కశ్యపునకున్+ఉదయించి= అదితికి, కశ్యపుడికి పుట్టి; ఇంద్ర+అనుజుండవు+ఐ= ఇంద్రుడికి తమ్ముడివై; త్రివిక్రమంబునన్= మూడు అడుగుల విజృంభణతో; త్రిజగంబులన్= మూడులోకాలను; అభివ్యాపించిన= పరిపూర్ణంగా విస్తరించిన; విశ్వరూపధరుండవు= విశ్వరూపాన్ని ధరించినవాడివి.

**తాత్పర్యం:** ఓకృష్ణా! నీవు పూర్వకాలంలో గంధమాదనం అనే కొండపై దుంపలు, వేళ్లు, పండ్లు మాత్రమే ఆహారంగా కలవాడివై, పదివేల సంవత్సరాలు తపస్సు చేశావు. పుష్కరంలో పదకొండు వేల సంవత్సరాలు నీళ్ళు మాత్రమే ఆహారంగా స్వీకరించి తపం చేశావు. ప్రభాసతీర్థంలో దేవమానంలో వెయ్యి సంవత్సరాలు ఒంటికాలిపై నిలిచి తపం చేశావు. బదరీవనంలో గాలి మాత్రమే పీల్చి, చేతులు పైకెత్తుకొని ఒంటికాలిపై నిలిచి పెక్కువేల ఏండ్లు గొప్ప తపస్సు చేసినవాడివి. సరస్వతీ నదీ తీరంలో గల సత్రం(వనం) లో శరీరం పై భాగంలో వస్త్రం లేకుండా ఉపవాసవ్రతాలచేత శుష్కించిన దేహం కలవాడివై పండ్రెండు సంవత్సరాలు అనేక వ్రతాలు చేసినవాడివి. సమస్తలోకాలను జయించి కుబేరుడితోట అయిన చైత్రరథంలో పెక్కు గొప్పయజ్ఞాలు చేసి, ఒక్కొక్క యజ్ఞంలో కోటి పసిడి నాణేలు

దక్షిణగా ఇచ్చినవాడివి. తపస్సులోనూ, యజ్ఞంలోనూ గొప్ప తేజస్విని. దితికుమారులు, దనువు కుమారులు అయిన రాక్షసులను సంహరించి, ఇంద్రుడికి ఇంద్రపదవి సుస్థిరం చేసినవాడివి. నీవు సకలలోకప్రభుడవు. అదితికి కశ్యపుడికి కుమారుడివిగా, ఇంద్రుడికి తమ్ముడివిగా (ఉపేంద్రుడివిగా) జన్మించిన నీవు తొలుత వామనుడివై, తదుపరి త్రివిక్రముడివై ముల్లోకాలు విస్తరించిన విశ్వరూపధారివయ్యావు.

**విశేషం:** బదరీవనం-రేగుచెట్లు విస్తారంగా ఉండే అరణ్యం, హిమాలయ పర్వతాలపై మిక్కిలి ఎత్తున 'అలకనంద' తీరంలో ఉండే క్షేత్రం. అలకనంద, క్రిందికి పారి దేవప్రయాగ వద్ద మందాకినితో కలుస్తుంది. అక్కడినుండి సంయుక్త నదికి 'గంగ' అని పేరు. త్రివిక్రమావతారం - విష్ణువు వామనుడుగా అవతరించి బలిచక్రవర్తిని మూడుఅడుగులమేర భూమిని దానంగా అర్థించి 'త్రివిక్రముడై' ముల్లోకాలు ఆక్రమించిన గాథ సుప్రసిద్ధం.

పై వచనం నాలుగవ పంక్తిలో "నవకృష్ణోత్తరాసంగుండవై" - అనుటకు మారుగా కొన్ని ప్రతుల్లో "కృష్ణాజినోత్తరీయాంగుండవై" నవకృష్ణాజినోత్తరాసంగుండవై" - అనే పాఠాంతరాలు గోచరిస్తున్నాయి.

**క. నరక శిశుపాలు రాదిగ । ధరణీకంటకుల నధికతరదర్పులఁ బ**
**ల్వుర వధియింపఁగ మహి నవ । తరించిన మహాత్ముఁడవు నుతస్థిరశక్తిన్. 128**

**ప్రతిపదార్థం:** నరక, శిశుపాలురు+ఆదిగ= నరకుడు, శిశుపాలుడు మొదలుగా కల; ధరణీ కంటకులన్= ముండ్లవలె భూమికి బాధలు కలిగించేవారైన; అధికతరదర్పులన్= మిక్కిలి ఎక్కువ గర్వం కలవారిని; పల్వురన్= పెక్కుమందిని; వధియింపఁగన్= చంపటానికి; మహిన్= భూలోకంలో; నుతస్థిరశక్తిన్= పొగడతగిన దృఢమైన శక్తితో; అవతరించిన= భూలోకంలో మానవరూపాన్ని ధరించిన; మహా+ఆత్ముఁడవు= గొప్పఆత్మ కలవాడివి అంటే మహానుభావుడివి.

**తాత్పర్యం:** లోకకంటకులై మితిమీరిన గర్వంతో ప్రవర్తించే నరకుడు, శిశుపాలుడు మున్నగు అనేకులను వధించటానికి దృఢశక్తితో అవతరించిన మహానుభావుడివి- నీవు. నీ మహత్త్వం పొగడదగింది. నీవు అవతారమూర్తివి.

**క. అనృతము, మదమును, మత్సర । మును, గ్రోధము నను వికారములు వొరయునె ని?**
**న్ననుపమ గుణముల నీ కొరు । లెన పోల్పఁగఁ గలరె సురమునీంద్రప్రణుతా!' 129**

**ప్రతిపదార్థం:** సుర, ముని+ఇంద్ర, ప్రణుతా!= దేవతలచేత, మునివరేణ్యులచేత స్తుతించబడే ఓ కృష్ణా!; నిన్ను; అనృతము= అసత్యం; మదమును= గర్వం; మత్సరమును= అసూయ; క్రోధమున్= కోపము; అను= అనే; వికారములు= మానసికములైన వికృతులు; పొరయునె= పొందునా? (పొందవు); అనుపమ గుణములన్= సాటిలేని గుణాలలో; నీకు+ఒరులు= నీకు ఇతరులు; ఎనపోల్పఁగన్+కలరె= సాటి చెప్పటానికి ఉన్నారా?

**తాత్పర్యం:** దేవతలచేత, మునీంద్రులచేత స్తుతించబడే శ్రీ కృష్ణా! నీకు మరి ఎవరు సాటి? అసత్యం, అసూయ, గర్వం, కోపం అనే మనోవైకల్యాలు నీదరికి చేరకలవా?'

**వ. అని కృతాంజలి యయిన ధనంజయుం జూచి దనుజభంజనుం డిట్లనియె. 130**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా పలికి; కృత+అంజలి+అయిన= చేయబడిన నమస్కారం కలవాడైన; అంటే నమస్కరించిన; ధనంజయున్+చూచి= అర్జునుడిని చూచి; దనుజభంజనుండు= రాక్షసులను సంహరించేవాడు (శ్రీకృష్ణుడు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని తనకు నమస్కరించిన అర్జునుడితో శ్రీకృష్ణుడు ఇట్లా పలికాడు.

**తే.** **'నరుఁడు నారాయణుండు నాఁబరఁగు నాది । మునుల మిద్దఱ; మందు నీ వనఘ! నరుఁడ,**
**నేను నారాయణుండ; ననూనశక్తి । యుతులమై మర్త్యయోనిఁ బుట్టితిమి పేర్మి? 131**

**ప్రతిపదార్థం:** నరుఁడు= నరుడు; నారాయణుండు= నారాయణుడు; నాన్+పరఁగు= అనబడే; ఆదిమునులము= మొదటి ఋషులం; ఇద్దఱము= ఇరువురం; అనఘ!= పాపరహితుడా!; అందున్= ఆ నరనారాయణులలో; నీవు; నరుఁడవు; ఏను= నేను; నారాయణుండను= నారాయణుడిని; అనూన, శక్తి, యుతులము+ఐ= గొప్ప మహిమతో కూడినవారమై; పేర్మిన్= అతిశయంతో; మర్త్యయోనిన్= మనుజగర్భంలో; పుట్టితిమి= జన్మించాం.

**తాత్పర్యం:** 'మనం ఇరువురం నరుడు నారాయణుడు అనే ఆది ఋషులం. వారిలో నీవు నరుడివి, నేను నారాయణుడిని. మనం గొప్పశక్తి కలిగి మనుజలోకంలో అవతరించాం.'

**తరువోజ.**

**నిరతంబుగా నేను నీవను భేద । నియమంబు లే, దైక్యనిష్ఠయ మనకు**
**నిరువురకును, నీకు నిష్టుండ నాకు । నిష్టుండు, మఱి నీ కనిష్టుండ నాకుఁ**
**గర మనిష్టుం, డట్లుగా నమ్ము' మనుచు । ఘనభుజుల్ భువనోపకారైకమతులు**
**హరియు నర్జునుఁడుఁ బ్రియంబుతోఁ దగిలి । యన్యోన్యహితభాషు లగుచుండు నంత. 132**

**ప్రతిపదార్థం:** నిరతంబుగాన్= ఎల్లప్పుడున్నూ; ఏను= నేను; నీవు; అను= అనే; భేద నియమంబు= వేర్పాటు అనే ఏర్పాటు; లేదు; మనకు; ఇరువురకును; ఐక్య నిష్ఠ+అ= ఒకటి అనేదే ఉనికి; నీకున్+ఇష్టుండు+అ= నీకు ఇష్టుడైనవాడే; నాకున్+ఇష్టుండు= నాకు కావలసినవాడు; మఱి; నీకు+అనిష్టుండు+అ= నీకు హితుడు కానివాడే; నాకున్; కరము= మిక్కిలి; అనిష్టుండు= శత్రువు; అట్లుగా= ఆ విధంగా; నమ్ముము; అనుచున్; ఘనభుజల్= గొప్పభుజాలు కలవారు అంటే పరాక్రమశాలులు; భువన+ఉపకార+ఏకమతులు= విశ్వానికి మేలు చేకూర్చటంలోనే గురి కల మనస్సు కలవారు; హరియున్= శ్రీకృష్ణుడున్నూ; అర్జునుఁడున్= అర్జునుడున్నూ; ప్రియంబుతోన్+తగిలి= ప్రేమతో కూడి; అన్యోన్య, హిత, భాషలు+అగుచున్+ఉండున్+అంత= ఒకరితో ఒకరు మాట్లాడుకొంటున్నప్పుడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు, అర్జునుడు తమకు భేదభావమే లేదనిన్నీ, తమలో ఒకరికి మిత్రులు ఇంకొకరికి మిత్రులేననీ. అట్లాగే ఒకరి శత్రువులు ఇంకొకరికి శత్రువులేననీ పరస్పరహితకరమైన మిత్రసల్లాపాలు ఆడుకొంటూ ఉన్నారు. అంతట.

**విశేషం:** ఆదికవిగా ఆంధ్రవాఙ్మయ ప్రపంచంలో సుప్రసిద్ధుడైన నన్నయ మహాకవి అటు సంస్కృతచ్ఛందాలను, ఇటు తెలుగు బాసలోని ఛందాలను రచించాడు. ద్విపదకు ప్రతిపాదంలో 3 ఇంద్రగణాలు 1 సూర్యగణం ఉంటాయి. మంజరీద్విపదకు ప్రాస నియతి లేదు. రెండు ద్విపద పాదాలు కలిసి ఒక తరువోజ పాదం అవుతుంది. తరువోజలో ప్రాస నియతి ఉన్నది. ప్రతిపాదంలోను 1-3-5-7 గణాల మొదటి అక్షరాలకు యతిమైత్రి చెల్లుతుంది.

## ద్రౌపది శ్రీకృష్ణునితోఁ దన పరిభవంబు సెప్పి దుఃఖించుట (సం. 3-13-42)

**వ.** **అఖిల రాజలోక పరివృతుండయి యున్న నారాయణునొద్దకు వచ్చి ద్రుపదరాజపుత్త్రి ముకుళిత కరాంబుజ యయి యిట్లనియె; 'దేవా! నిన్ను నాదిప్రజాసర్గంబునఁ బ్రజాపతివని యసితుం డయిన దేవలుండును,**

**సత్యంబువలన యజ్ఞం బుద్ధరించుటంజేసి నిత్యసత్యమయుండవయిన యజ్ఞపురుషుండ వని కశ్యపుండును, శిరంబున దివంబును, బాదంబుల మేదినియును, లోచనంబుల సూర్యుండును, నవయవంబుల లోకంబులు నభివ్యాపించుటం జేసి సర్వమయుండ వని నారదుండును. నక్షయజ్ఞాననిధి వని సర్వమునిముఖ్యులును జెప్పిరి. 133**

**ప్రతిపదార్థం:** అఖిల, రాజ, లోక, పరివృతుండు+అయి+ఉన్న= అందరు రాజులచేత చుట్టుకొనబడి ఉన్న; నారాయణు+ఒద్దకు= శ్రీకృష్ణుడి కడకు; వచ్చి; ద్రుపద, రాజ, పుత్రి= ద్రౌపది; ముకుళిత, కర+అంబుజ, అయి= ముడుచుకొన్న తామరలవంటి చేతులు కలదయి, అంటే నమస్కరించి; ఇట్లు+అనియె; దేవా!= ఓ శ్రీకృష్ణా!; నిన్నున్; ఆది, ప్రజా, సర్గంబునన్= మొదటి సృష్టి సమయాన; ప్రజాపతివి+అని= బ్రాహ్మదేవుడివని; అసితుండు+అయిన= నల్లని వాడయిన; దేవలుండును= దేవలుడనే ఋషియున్నూ; సత్యంబు వలన= సత్యనిష్ఠతో; యజ్ఞంబు+ఉద్ధరించుటన్+చేసి= క్రతుధర్మాన్ని తిరిగి నెలకొల్పటంచేత; నిత్య, సత్య, మయుండవు+అయిన= ఎల్లప్పుడు సత్యంతోనే కూడినవాడివయిన; యజ్ఞపురుషుండవు+అని= యజ్ఞాన్ని నిర్వహించే పురుషుడవని (యజ్ఞస్వరూపుడవని); కశ్యపుండును= కశ్యపుడున్నూ; శిరంబునన్= తలచేత; దివంబును= ఆకాశమును; పాదంబులన్= కాళ్ళ చేత; మేదినియును= భూమియు; లోచనంబులన్= కన్నులచే; సూర్యుండును= సూర్యుడును; అవయవంబులన్= శరీరభాగాల చేత; లోకంబులు= భువనాలు; అభివ్యాపించుటన్+చేసి= సంపూర్ణంగా నిండి ఉండటంచేత; సర్వమయుండవు+అని= సమస్తంలోనూ వ్యాపించి ఉన్నవాడి వని; నారదుండునున్= నారద మహర్షియు; అక్షయ, జ్ఞాన, నిధివి+అని= నశించని జ్ఞానానికి గనివని; సర్వ, ముని, ముఖ్యులును= అందరు మునివరేణ్యులును; చెప్పిరి= వచించారు.

**తాత్పర్యం:** చుట్టూ చేరిన రాజన్యులందరిచేత ఆరాధించబడుతున్న శ్రీకృష్ణుడికడకు ద్రౌపది వచ్చింది. ఆమె శ్రీకృష్ణుడితో 'దేవా! నీవే తొలిసృష్టిసమయంలో బ్రహ్మదేవుడివి. ఇది అసితుడైన దేవలుడి ప్రవచనం. నీవే నిత్యసత్యమయుడ వయిన యజ్ఞపురుషుడివి. ఇది కశ్యపమహర్షి చెప్పిన మాట. నీవు సర్వవ్యాపివి. నీ అవయవాల్లో విశ్వసృష్టి అమరి ఉన్నది. ఇది నారదుడి వాక్కు. నీవు అక్షయజ్ఞాననిధివి. ఇది సర్వముని ముఖ్యుల ప్రశంస.

**విశేషం:** పౌరాణిక వాఙ్మయంలో దేవలమహర్షికి విశేషణంగా 'అసిత' శబ్దం వాడబడింది. దేవలుడు ప్రాచీనస్మృతికర్త. అతడు 'అసితుడు'. బహుశః మరొక ప్రసిద్ధఋషి దేవలనామధేయుడు ఉండి ఉండవచ్చు ననిన్నీ, ప్రాధాన్యవివక్షకయి 'అసిత' విశేషణం వాడబడిందని కొందరి అభిప్రాయం. అసితచ్ఛవికి= నల్లని దేహకాంతికి ఆనాటి ఆర్యులు కల్పించిన ప్రాముఖ్యం అందరికి తెలిసిందే. కృష్ణుడు అసితుడు. ద్రౌపది కూడ కృష్ణయే. ఈ వచనంలోని 'లోచనంబుల సూర్యుండును నవయవంబుల లోకంబులు' అనే భాగం పెక్కు వ్రాత ప్రతులలో లేదు. దీనికి సంస్కృతమూలం కూడా కనిపించటం లేదు.

**మధ్యాక్కర.**

**అని ననివృత్తులై పుణ్యచరితులై యాత్మప్రబోధ**
**వినిహితచిత్తులై సర్వధర్మార్థవిదులయి తృప్తిఁ**
**దనరెడు రాజర్షివరులకును యోగధరులకు సాధు**
**జనులకు గతి నీవ నిత్యకారుణ్య! సర్వశరణ్య! 134**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధంలో; అనివృత్తులు+ఐ= వెనుకకు తిరుగనివారై; పుణ్యచరితులు+ఐ= పుణ్యప్రదమైన ప్రవర్తన కలవారై; ఆత్మ, ప్రబోధ, వినిహిత, చిత్తులు+ఐ= ఆధ్యాత్మిక జ్ఞానంలో ఉంచబడిన మనస్సు కలవారై; సర్వ, ధర్మ+అర్థ,

విదులు+అయి= అన్ని ధర్మాల ఆంతర్యాన్ని ఎరిగినవారై; తృప్తిన్+తనరెడు= తనివితో ఒప్పెడి; రాజ+ఋషి, వరులకును= రాజులలో ముని శ్రేష్ఠులుగా ఉన్నవారికి; యోగధరులకున్= యోగులకు; సాధుజనులకున్= మంచివారికి; నిత్యకారుణ్య!= దయకలవాడా!; సర్వ శరణ్య!= అందరికి శరణు పొందతగినవాడా!; గతి= దిక్కు; నీవు+అ= నీవే.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! దయామయా! యుద్ధంలో వెనుదిరుగనివారై, సౌశీల్యవంతులై, ఆధ్యాత్మికజ్ఞానులై, సర్వ, ధర్మ సూక్ష్మకోవిదులై, రాజర్షిశ్రేష్ఠులై తృప్తి వహించే వారికి, యోగీశ్వరులకు, సజ్జనులకు సర్వ శరణ్యుడవైన నీవే దిక్కు.

**విశేషం:** మధ్యాక్కరలో ఒక్కొక్క పాదానికి 2 ఇంద్రగణాలు 1 సూర్యగణం మళ్ళీ 2 ఇంద్రగణాలు 1 సూర్యగణం మొత్తం 6 గణాలుంటాయి. ప్రాసనియమం ఉన్నది. నన్నయ పంచమ గణాద్యక్షరంతో యతి వేస్తే తర్వాతివారు చతుర్థ గణాద్యక్షరంతో యతి వేశారు.

**వ. నీ యంతఃకరణ ప్రవృత్తి కగోచరం బెద్దియు లేే; దయినను నా పడిన పరాభవం బెఱింగించెద. 135**

**ప్రతిపదార్థం:** నీ, అంతఃకరణ ప్రవృత్తికి= నీ లోబుద్ధికి; అగోచరము= కానరానిది; ఎద్దియు= ఏది కూడా; లేదు; అయినను; నా పడిన= నేను అనుభవించిన; పరాభవంబు+ఎఱింగించెద= అవమానాన్ని తెలుపుతాను.

**తాత్పర్యం:** నీకు తెలియంది ఏదీ లేదు. అయినా నేను అనుభవించిన పరాభవాన్ని నీకు తెలుపుతాను.

**విశేషం:** అంతఃకరణం= లోపలి ఇంద్రియం 1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తం 4. అహంకారం. ఈ నాలుగింటికి అంతఃకరణ చతుష్టయం అని పేరు.

**సీ. పార్థివప్రభుఁడైన పాండుమహీపతి । కోడల నయి, యుద్ధకుశలు లయిన**
**పాండుతనూజుల భార్యనై, పూజ్యుఁడ । వైన నీ యనుజనై, యధికశక్తిఁ**
**బరఁగు ధృష్టద్యుమ్ను భగినినై, ధృతరాష్ట్రు । పట్టిచే సభఁ దలపట్టి యీడ్వఁ**
**బడి, పాపకర్ముచేఁ బరిధాన మొలువంగఁ । బడి, దారుణం బైన పరిభవంబు**

**ఆ. పడితి; నట్టి నన్నుఁ బాండవుల్ సూచుచు । నుండి రొరులు వోలె నుక్కు దక్కి;**
**యాపగాతనూజుఁ డాదిగాఁ గల వృద్ధ । బంధుజనులు సూచి పలుక రయిరి. 136**

**ప్రతిపదార్థం:** పార్థివ, ప్రభుఁడు+ఐన= రాజులకు రాజు అయిన; పాండు, మహీపతి= పాండురాజు; కోడలను+అయి; యుద్ధకుశలులు+అయిన= యుద్ధంలో నేర్పరులైన; పాండుతనూజుల= పాండవుల; భార్యను+ఐ; పూజ్యుఁడవు+ఐన= పూజించదగినవాడివైన; నీ, అనుజను+ఐ= నీకు చెల్లెలినై; అధిక, శక్తిన్+పరఁగు= గొప్ప బలంచేత ఒప్పునట్టి; ధృష్ట, ద్యుమ్ను, భగినిన్+ఐ= ధృష్టద్యుమ్నుడి సోదరినై; ధృతరాష్ట్రుపట్టిచే= ధృతరాష్ట్రుడి కొడుకుచేత; (దుశ్శాసనుడిచేత); సభన్= సభలో; తలపట్టి= శిరస్సుపట్టుకొని; ఈడ్వఁబడి= లాగబడి; పాపకర్ముచేన్= పాపపు పనులు కలవాడిచేత; పరిధానము= బట్ట; ఒలువంగన్+పడి= అపహరించబడి; దారుణంబు+ఐన= ఘోరమైన; పరిభవంబు పడితిన్= అవమానం పొందాను; అట్టి; నన్నున్, పాండవుల్; ఒరులు+పోలె= ఇతరులవలె; ఉక్కు, తక్కి= చేవ లేక; చూచుచున్+ఉండిరి= చూస్తూ ఉండినారు; ఆపగా తనూజుఁడు= నదీపుత్రుడైన భీష్ముడు; ఆదిగాన్+కల= మొదలుగా ఉన్న; బంధుజనులు= చుట్టాలు; పలుకరు+అయిరి= మౌనంగా ఉన్నారు.

**తాత్పర్యం:** నేను చక్రవర్తి అయిన పాండురాజు కోడలిని. వీరాధివీరులైన పాండవుల భార్యను. మహాబలశాలి అయిన ధృష్టద్యుమ్నుడి సహోదరిని. నీకు చెల్లెలిని. అట్టి నన్ను దుశ్శాసనుడు నిండుసభలో తలవెంట్రుకలు పట్టి ఈడ్చాడు; వలువలొలిచి దారుణంగా అవమానించాడు. అప్పుడు పాండవులు మిన్నకున్నారు. భీష్మాదివృద్ధులు, బంధువులు చూచి ఊరకున్నారు.

**క. శరణనినవారిఁ గరుణా । కరులయి రక్షించు పురుషకారాన్వితులే**
**శరణని యఱచిన నాలిం । పర భీమార్జునుల బాహుబల మేమిటికిన్? 137**

**ప్రతిపదార్థం:** శరణు+అనినవారిన్= రక్షించుమని కోరినవారిని; కరుణా+ఆకరులు+అయి= దయకు నెలవైన వారయి; రక్షించు= కాపాడే; పురుషకార+అన్వితులే= పురుష ప్రయత్నం (పౌరుషం) కలవారే; శరణు+అని, అఱచినన్= కాపాడండని (నేను) మొరపెట్టినప్పటికి; ఆలింపరు+అ= వినలేదుకదా!; భీమ+అర్జునుల= భీముడియొక్క అర్జునుడియొక్క; బాహుబలము= భుజశౌర్యం; ఏమిటికిన్= ఇక దేనికి?

**తాత్పర్యం:** శరణు వేడినవారిని కాపాడేవారే (పాండవులు) 'నన్ను రక్షించండి'అని మొరపెట్టుకొన్న నా ఆక్రందన ఆలకించలేదుకదా! ఇంక భీమార్జునుల భుజబల మెందుకు?

**వ. భ్రాతృ పుత్త్ర బంధుజనంబులు నాకుం గలిగియు లేని వారయి; రట్టియెడం గర్ణుండు నన్నుం జూచి నగియె. 138**

**ప్రతిపదార్థం:** భ్రాతృ, పుత్త్ర, బంధు జనంబులు= సహోదరులు, కొడుకులు, చుట్టాలు; నాకున్+కలిగియు= నాకు ఉన్నప్పటికిని; లేనివారు+అయిరి; అట్టి+ఎడన్= అప్పుడు; నన్నున్+చూచి; కర్ణుండు; నగియెన్= నవ్వాడు.

**తాత్పర్యం:** సోదరులు, కొడుకులు, బంధువులు దండిగా నాకున్నప్పటికి, నా కెవ్వరూ లేనివారు అయినారు. ఆ సమయంలో కర్ణుడు నన్నుచూచి నవ్వాడు.

**ఆ. కర్ణునగవు లోకగర్హితుండగు దుస్స । సేను చెయిదికంటె శిఖియ పోలె**
**నడరి నా మనంబు నతిదారుణక్రియ । నేర్చుచున్నయది మహీధరుండ! 139**

**ప్రతిపదార్థం:** కర్ణ, నగవు= కర్ణుడియొక్క నవ్వు; లోక, గర్హితుండు+అగు= లోకంలోని జనులందరిచేత తెగడబడిన; దుస్ససేను= దుశ్శాసనుడి; చెయిదికంటె= చేష్టకంటె; శిఖి+అ, పోలెన్= అగ్నివలె; అడరి= అతిశయించి; నా, మనంబున్= నా మనస్సును; అతిదారుణ క్రియన్= మిక్కిలి ఘోరమైన రీతిగా; మహీధరుండ= (భూమిని తాల్చిన) శ్రీకృష్ణా!; ఏర్చుచున్న+అది= కాలుస్తున్నది.

**తాత్పర్యం:** ఓకృష్ణా! లోకులచేత నిందించబడే దుశ్శాసనుడి దుష్టచేష్ట కంటె, కర్ణుడు నన్ను చూచి నవ్వినవవ్వు నా మనస్సును మహాఘోరంగా కాలుస్తూ ఉన్నది.

**వ. తొల్లివేదాధ్యయనంబుసేయుచు బాలకేళీవినోదంబున నున్న కాలంబునఁబ్రమాణకోటియందు సుప్తుండయిన భీమసేను నంటఁగట్టి గంగమడువునం ద్రోపించియు, విషంబుఁబెట్టియు, విషసర్పంబులంబట్టి గఱపించియు, జననీసహితులైన యేవురను వారణావతంబున లక్కయిల్లు సొనిపి యందు దహనంబుఁ**

**బ్రయోగింపం బంచియు ననేకంబులైన యపకారంబులు సేసి, యిప్పుడు దుర్యోధనుం డధర్మద్యూతంబున రాజ్యంబు నపహరించి, రాజలోక సమక్షంబునం దమ్ము నిరాకృతులం జేసినను బరాక్రమపరాఙ్ముఖులైన పాండవులు నా పడిన పరిభవంబు నెట్లు దలఁగెద?' రని బాష్పధారా స్నపితపయోధర యయి పాణిపల్లవంబున నయన సమ్మార్జనంబు సేయుచున్న పాంచాలిం జూచి వాసుదేవుం డిట్లనియె. 140**

**ప్రతిపదార్థం:** తొల్లి= కడచిన కాలంలో; వేద+అధ్యయనంబు+చేయుచు= వేదాలను చదువుతూ; బాల, కేళీ, వినోదంబునన్+ఉన్న, కాలంబునన్= చిన్నతనపు ఆటల వేడుకతో ఉన్నప్పుడు; ప్రమాణకోటి+అందు= (గంగా తీరంలో) ప్రమాణకోటి అనే లోతైన గంగమడుగు ప్రదేశంలో; సుప్తుండు+అయిన= నిదురపోయిన; భీమసేనున్+అంటన్+కట్టి= భీముడిని కదలకుండ కట్టివేసి; గంగమడువునన్+త్రోపించియు= గంగనీరు లోతుగా ఉండేచోట త్రోయించియున్నూ; విషంబున్+పెట్టియు= తిండిలో విషం కలిపి తినిపించియున్నూ; విషసర్పంబులన్+పట్టి= విషంకల పాములను పట్టుకొనివచ్చి; కఱపించియు= కరచేటట్లుచేసియున్నూ; జననీ సహితులు+ఐన= తల్లితో కూడి ఉన్న; ఏవురను= అయిదుగురిని (పాండవులను); వారణావతంబునన్= వారణావతం అనే పేరున్న పట్టణంలో; లక్క+ఇల్లు+చొనిపి= లక్కతో నిర్మించిన గృహంలో ఉండేటట్లు చేసి; అందు; దహనంబున్= అగ్నిని; ప్రయోగింపన్+పంచియున్= ముట్టించే ఏర్పాటు చేసియున్నూ; అనేకంబులు+ఐన+అపకారంబులు= పెక్కు కీడులు;, చేసి; ఇప్పుడు; దుర్యోధనుండు; అధర్మద్యూతంబునన్= ధర్మ రహితమైన (మోసంతో కూడిన) జూదంలో; రాజ్యంబున్+అపహరించి= రాజ్యాన్ని లాగుకొని; రాజ, లోక, సమక్షంబునన్= రాజులందరి ముందు; తమ్ము నిరాకృతులన్+చేసినను= అవమానించినప్పటికి; పరాక్రమ+పరాఙ్ముఖులు+ఐన= శౌర్యం చూపనట్టి (పరాక్+ముఖులు= పెడమొగం పెట్టినవారు, విముఖులు); పాండవులు; నా పడిన= నేను పొందిన; పరిభవంబున్, ఎట్లు+తలఁగెదరు= అవమానాన్ని ఏ విధంగా పోగొట్టగలరు?; అని; బాష్ప, ధారా, స్నపిత, పయోధర+అయి= కన్నీటిధారలచేత తడపబడిన స్తనాలు కలదై; పాణి పల్లవంబున= చిగురుటాకువంటి చేతితో; నయన సమ్మార్జనంబు= కన్నులను తుడుచుకొనటం చేస్తున్న; పాంచాలిన్+చూచి= పాంచాలదేశరాజుపుత్రికను ద్రౌపదిని చూచి; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** చాలాకాలం క్రిందట వేదాలు చదువుకొంటూ, పిల్లలతో ఆడుకొంటున్న కాలంలో భీముడు ఒకనాడు ప్రమాణకోటిప్రదేశంలో గాఢనిద్రలో మునిగి ఉంటే, అతడిని ప్రమాణకోటి అనే పేరుగల అగాధమైన గంగమడుగులో త్రోయించారు, విషం తినిపించారు, విషసర్పాలచేత కరిపించారు; పంచపాండవులను తల్లితోపాటు వారణావతంలో లక్కఇంట్లో పెట్టి కాల్పించటానికి ప్రయత్నించారు. ఇప్పుడు మోసపుజూదంలో రాజ్యం లాగుకొన్నారు. అయినా, అన్ని అవమానాలను భరించి పాండవులు నేడు శౌర్యం కోల్పోయి పడి ఉన్నారు. ఇక, నేను పడిన పరాభవాన్ని ఎలా తొలగించగలరు?'- అని ద్రౌపది విలపించింది. అపుడామె కన్నీళ్లు పాలిండ్లను తడుపుతూ ఉండగా, చేతితో కన్నులు తుడుచుకోసాగింది. అట్టి పాంచాలిని చూచి శ్రీకృష్ణుడు ఇట్లా పలికాడు.

**చ. 'తనుకుచు నున్న నీ హృదయతాప నిమిత్తమునన్ సురేంద్రనం**
**దను పటుబాణపాతహతిఁ దద్ధృతరాష్ట్రబలంబు మృత్యుసా**
**దనమున కేఁగుఁ జు; మ్మిదియ తథ్యము; నా వచనంబు దప్ప ది**
**వ్వననిధు లేడు నింకిన, దివంబును రాత్రియు సంచలించినన్. 141**

**ప్రతిపదార్థం:** తనుకుచున్+ఉన్న= తపిస్తున్న; నీ హృదయ, తాప, నిమిత్తమునన్= నీ గుండెలోని బాధ కారణంగా; సుర+ఇంద్ర, నందను= దేవేంద్రుడి కొడుకు అంటే అర్జునుడియొక్క; పటు, బాణ, పాత, హతిన్= తీవ్రమైన అమ్ములు

పడటం వలన కలిగిన దెబ్బలచేత; తద్, ధృతరాష్ట్ర, బలంబు= ఆ ధృతరాష్ట్రుడి బలం (సేన); మృత్యుసాదనమునకున్+ఏఁగున్= మరణగృహ వాటికకు (యమ సదనానికి= నరకానికి) వెళ్తుంది; చుమ్మ= సుమా!; ఇది+అ, తథ్యము= ఇదే నిజం; నా వచనంబు= నామాట; ఈ+వనవిధులు+ఏడున్= ఈ సప్తసాగరాలు; ఇంకిన; దివంబును= పగలును; రాత్రియు= రేయి; సంచలించినన్= కదలి తారుమారైనను; తప్పదు= జరిగి తీరుతుంది.

**తాత్పర్యం:** 'నీ హృదయతాపం కారణంగా, అర్జునుడి యొక్క కఠోర బాణపాతంచేత ధార్తరాష్ట్రులు మృత్యుసదనానికి చేరక తప్పదు. సప్తసాగరాలు ఇంకిపోయినప్పటికిన్నీ, పగలు, రాత్రి తారుమారైనప్పటికిన్నీ నామాట నిజంగా జరిగి తీరుతుంది.

**వ. అనిన నర్జునుండు ద్రౌపదిం జూచి యిట్లనియె. 142**

**ప్రతిపదార్థం:** అనినన్= ఆ విధంగా శ్రీకృష్ణుడు చెప్పగా; అర్జునుండు; ద్రౌపదిన్+చూచి= ద్రౌపదిని చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా శ్రీకృష్ణుడు చెప్పగా అర్జునుడు ద్రౌపదిని చూచి ఇట్లా పలికాడు.

**వ. 'ఈ పురుషోత్తముండు మన కిందఱకుం గుశలంబు సేయుచుం**
**బాపకలంకపంకములఁ బాయఁగఁ జేయుటఁ జేసి దుర్మదో**
**ద్దీపితశత్రుసంహతి హతిం బరమార్థమ పొందు; నేల సం**
**తాపము నీకుఁ జేయఁగఁ ద్రిధామజయోన్నతి గల్గియుండఁగన్.' 143**

**ప్రతిపదార్థం:** ఈ, పురుష+ఉత్తముండు= ఈ శ్రీకృష్ణుడు (పురుషులలో ఉత్తముడు); మనకు+ఇందఱకున్= ఇంతమందికి మనకు; కుశలంబు+చేయుచున్= క్షేమం చేకూర్చుతూ; పాప, కలంక, పంకములన్+పాయఁగన్+చేయుటన్+చేసి= పాపం, నింద అనే బురదలను తొలగించటంచేత; దుర్మద+ఉద్దీపిత, శత్రు, సంహతి= చెడుగర్వంచేత ప్రజ్వలించే శత్రువుల సముదాయం; హతిన్= నాశాన్ని; పరమార్థము+అ, పొందున్= యథార్థంగా పొందుతుంది; త్రిధామ+జయ+ఉన్నతి= మూడులోకాలను జయించ గలిగే గొప్పతనం (విష్ణువువలని జయంయొక్క గొప్పతనం); కల్గి యుండఁగన్= కలిగి ఉండగా; ఏల, సంతాపము, నీకున్+చేయఁగన్= ఎందుకు నీవు దుఃఖిస్తూ ఉండటం?

**తాత్పర్యం:** 'పురుషోత్తముడైన శ్రీకృష్ణుడు మన యోగక్షేమాలను చూస్తూ ఉన్నాడు. పాప కళంక పంకాలను తొలగింపచేస్తున్నాడు. దుర్మదులైన మన శత్రువులు నశించగలరు. మూడులోకాలను జయించగల గొప్పతనం (విష్ణువు బాసటగా ఉండటం చేత) మనకు చేకూరి ఉన్నది. ఇంక నీకు సంతాపం ఎందుకు?'

**వ. అనిన సక్రోధుం డయి ధృష్టద్యుమ్నుం డిట్లనియె. 144**

**ప్రతిపదార్థం:** అనిన= అట్లా చెప్పగా; సక్రోధుండు+అయి= కోపంతో కూడిన వాడయి; ధృష్టద్యుమ్నుండు- ద్రౌపది సోదరుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అట్లా అర్జునుడు చెప్పగా, కోపంతో కూడినవాడయి ధృష్టద్యుమ్నుడు ఇట్లా పలికాడు.

**క. 'వినయవిహీనుల దుర్యో । ధన దుశ్శాసనులఁ బవనతనయుఁడు, రాధా**
**తనయుని నరుఁ, డేఁ గుంభజు । ననిఁ జంపుదు; మేల వగవ నంబుజనేత్రా!' 145**

**ప్రతిపదార్థం:** వినయ, విహీనులన్= అడకువలేని వారైన; దుర్యోధన, దుశ్శాసనులన్= దుర్యోధనుడిని, దుశ్శాసనుడిని; పవనతనయుఁడు= వాయుపుత్రుడైన భీముడు; రాధాతనయుని= (రాధ కొడుకు) కర్ణుడిని; నరుఁడు= అర్జునుడు; ఏన్= నేను; కుంభజున్= (కుండలో పుట్టిన) ద్రోణుడిని; అనిన్= యుద్ధంలో; చంపుదుము= సంహరిస్తాం; అంబుజనేత్రా!= పద్మాలవంటి కన్నులు కలదానా! ఓ ద్రౌపదీ!; వగవన్+ఏల= విచారించట మెందుకు?

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులు కల ఓ ద్రౌపదీ! భీముడు దుర్యోదన దుశ్శాసనులను, అర్జునుడు కర్ణుడిని, నేను ద్రోణుడిని యుద్ధంలో చంపుతాం. నీవు విచారించ నవసరం లేదు' - అని ద్రౌపదితో ధృష్టద్యుమ్నుడు పలికాడు.

**వ. అని యందఱు ద్రుపదరాజపుత్త్రి నాశ్వాసించి; రంత నచ్యుతుండు ధర్మరాజున కిట్లనియె. 146**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా చెప్పి; అందఱు; ద్రుపద, రాజ, పుత్త్రిన్= ద్రౌపదిని; ఆశ్వాసించిరి= ఊరడించారు; అంతన్; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అందరు ద్రౌపదిని ఊరడించారు. అప్పుడు శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లా పలికాడు.

**తే. 'ద్వారవతినుండి యే యుయుధానువలన । ధారుణీశ! యింతయు విని తత్క్షణంబ**
**యరుగుదెంచి యాపన్నుఁడ వైన నిన్నుఁ । జూచి దుఃఖోపహతమనస్కుండ నైతి. 147**

**ప్రతిపదార్థం:** ద్వారవతిన్+ఉండి= ద్వారకలో ఉండి; ఏన్= నేను; యుయుధానువలనన్= సాత్యకి వలన; ఇంతయు= ఈ (ద్యూత) వృత్తాంతమంతయు; విని; తత్, క్షణంబు+అ= వెంటనే; అరుగుదెంచి= వచ్చి; ఆపన్నుఁడవు+ఐన, నిన్నున్= కష్టాలలో ఉన్న నిన్ను; చూచి; దుఃఖ+ఉపహత, మనస్కుండన్+ఐతి= శోకంచేత కొట్టబడిన మనస్సు కలవాడిని అయ్యాను.

**తాత్పర్యం:** 'ఇక్కడి మీ వృత్తాంతాన్ని అంతటిని నేను యుయుధానుడు చెప్పగా ద్వారకలోనే విని మిక్కిలి దుఃఖించి నిన్ను చూడటానికి వెంటనే బయలుదేరి వచ్చాను.

**విశేషం:** సాత్యకికి యుయుధానుడనే పేరు కూడా ఉన్నది.

**వ. అయ్యవసరంబున నేను మీయొద్ద నుండమిం జేసి యిట్టి దుర్వ్యసనంబు సంభవిల్లెం; గామజంబులైన స్త్రీ ద్యూత మృగయా పానంబు లను నాలుగు దుర్వ్యసనంబులం బ్రవర్తిల్లకుండఁ బ్రతిషేధింపవలయు; నందును విశేషంబుగా ననర్థమూలంబయిన పాపద్యూతంబుఁబరిహరింపనినాఁడు పాపం బగు నని హేతుదృష్టాంతంబులు సూపి, కృప ద్రోణ విదుర గాంగేయులం దోడుసేసికొని యాంబికేయు నొడంబఱిచి దుష్టద్యూతంబు సర్వ ప్రకారంబుల వారింతు. 148**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఏను, మీ, ఒద్దన్; ఉండమిన్+చేసి= లేకపోవటంచేత; ఇట్టి; దుర్, వ్యసనంబు= చెడ్డ ద్యూతాసక్తి (వ్యసనం= కామక్రోధాదులవలన కలిగిన దోషం); సంభవిల్లెన్= కలిగింది; కామజంబులు+ఐన=

కోరికలవలన పుట్టిన; స్త్రీ, ద్యూత, మృగయా, పానంబులు+అను= ఆడుది, జూదం, వేట, త్రాగుడు అనే; నాలుగు; దుర్, వ్యసనంబులన్= చెడ్డ ఆసక్తులలో; ప్రవర్తిల్లకుండన్= నడచుకొనకుండ; ప్రతిషేధింపవలయున్= త్రోసిపుచ్చవలెను; అందును; విశేషంబుగాన్= ఎక్కువగా; అనర్థమూలంబు+అయిన= కీడుకు కారణమైన; పాపద్యూతంబున్= పాపంతో కూడిన జూదం; పరిహరింపనినాఁడు= విడువనిరోజు; పాపంబు+అగున్= పాపం దాపురిస్తుంది; అని= అని చెప్పి; హేతు, దృష్టాంతంబులు= కారణాలు, నిదర్శనాలు; చూపి; కృప, విదుర, గాంగేయులన్, తోడుచేసికొని= కృపుడిని, విదురుడిని, భీష్ముడిని వెంట పెట్టుకొని (గాంగేయుడు= గంగకొడుకు భీష్ముడు); ఆంబికేయున్= అంబికకొడుకైన ధృతరాష్ట్రుడిని; ఒడంబఱిచి= అంగీకరింపచేసి; దుష్టద్యూతంబు= చెడ్డజూదాన్ని; సర్వప్రకారంబులన్= అన్ని విధాల; వారింతున్= ఆపి ఉందును.

**తాత్పర్యం:** ఆ సమయంలో నేను నీ దగ్గర లేను. అందువలన ఈ దుర్వ్యసనం సంభవించింది. మహిళ, మద్యం మృగయ(వేట), జూదం అనే నాలుగున్నూ పెద్దవ్యసనాలు. అందులోనూ అనర్థాలకు మూలమైన పాపపు జూదం వదలిపెట్టకపోతే పాపం చుట్టుకొంటుంది; ఆ జూదం జరిగినప్పుడు అక్కడ నేనే ఉండి ఉంటే, అనేక హేతువులను, నిదర్శనాలను చూపి, పెద్దలయిన కృప ద్రోణ విదుర భీష్ముల తోడ్పాటుతో ధృతరాష్ట్రుడిని ఒప్పించి ఆ పాపపు జూదాన్ని ఆపుచేసి ఉండేవాడిని.

**క. వలచి హితంబునఁ బథ్యముఁ । బలికినఁ జేకొనని ధర్మబాహ్యుల నవివే**
**కుల నిగ్రహింతు; మీ కె । గ్గులు మత్సాన్నిధ్యమున నగునె యెయ్యెడలన్? 149**

**ప్రతిపదార్థం:** వలచి= ప్రేమ చూపి; హితంబునన్= మేలు కలగటానికై; పథ్యమున్= మంచిదైన దాన్ని; పలికినన్= చెప్పినప్పటికీ; చేకొనని= స్వీకరించని; ధర్మబాహ్యులన్= ధర్మానికి దూరమైన వారిని; అవివేకులన్= వివేకం లేని వారిని (మూర్ఖులను); నిగ్రహింతున్= కూలద్రోస్తాను; ఏ+ఎడలన్= ఏ పట్టునైనా; మత్, సాన్నిధ్యమునన్= నేను దగ్గరగా ఉన్నప్పుడు; మీకు; ఎగ్గులు= కీడులు; అగునె?= సంభవిస్తాయా?

**తాత్పర్యం:** ప్రేమతో హితవు చెప్పినా వినని మూర్ఖులను, అధర్మపరులను నేను కూలద్రోసి ఉండేవాడిని. నేను దగ్గర ఉంటే మీకు ఎన్నడూ కీడు కలుగదు.

## శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు సౌంభకాఖ్యానంబు సెప్పుట (సం. 3-15-1)

**వ. ఏను సముద్ర తీరంబున సాల్వుతోడం బదినెలలు యుద్ధంబు సేసి వాని వధియించుపొంటె నక్కడ మసలితి; నది గారణంబుగా మీకు దుర్వ్యసనావసరంబున నలబ్ధసన్నిధానుండ నయితి' ననిన 'నది యె' ట్లని యుధిష్ఠిరుం డడిగిన, నాతనికి సౌంభకాఖ్యానంబు సవిస్తరంబుగాఁగృష్ణుండిట్లనిచెప్పె; నీ యజ్ఞంబున నర్ఘ్యనిమిత్తంబున నసహిష్ణుండయిన శిశుపాలుండు నాచేత నిహతుం డగుట విని, వాని తమ్ముండు సాల్వుండను వాఁడు తద్వధ ప్రవర్తిత క్రోధుండయి కామగమనంబైన తన సౌంభకం బను నగరంబుతో సన్నద్ధుండయి వచ్చి ద్వారవతీపురంబు నవరోధించి. 150**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; సముద్ర, తీరంబున= కడలి ఒడ్డున; సాల్వుతోడన్= సాల్వుడితో; పదినెలలు యుద్ధంబు, చేసి= రణంచేసి; వాని, వధియించు, పొంటెన్= వాడిని సంహరించటం కొరకై; అక్కడ= అచట; మసలితిన్= ఉన్నాను; అది;

కారణంబుగా; మీకు; దుర్, వ్యసన+అవసరంబునన్= చెడు కృత్యం (జూదం) జరిగేకాలంలో; అలబ్ధ, సన్నిధానుండున్+అయితిన్= లభించని సమీపత కలవాడిని అయ్యాను (అంటే మీకు దూరంగా ఉండిపోయాను); అనినన్= అని చెప్పగా; అది; ఎట్లు+అని= ఏ విధంగా జరిగిందని; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అడిగినన్= అడుగగా; ఆతనికి= ధర్మరాజుకు; సౌంభక+ఆఖ్యానంబు= సౌంభకానికి సంబంధించిన కథను; సవిస్తరంబుగాన్= విశదంగా (సంపూర్ణంగా) కృష్ణుండు; ఇట్లు+అని, చెప్పె= ఈ విధంగా తెలిపాడు; నీ యజ్ఞంబునన్= నీ రాజసూయ యాగంలో; అర్ఘ్యనిమిత్తంబునన్= అర్ఘ్యం కారణంగా (పూజకొరకైన ద్రవ్యం ఇవ్వటం కారణంగా); అసహిష్ణుండు+అయిన= ఓర్వలేని వాడయిన; శిశుపాలుండు; నాచేత; నిహతుండు+అగుట= చావటం; విని; వాని, తమ్ముండు= శిశుపాలుడి సోదరుడు; సాల్వుండు+అనువాఁడు; తద్, వధ, ప్రవర్తిత, క్రోధుండు+అయి= అతడి మరణం వలన ఏర్పడిన కోపం కలవాడై; కామ, గమనంబు+ఐన= యథేచ్ఛగా తిరిగే శక్తి కలదైన; తన; సౌంభకంబు+అను; నగరంబుతో; సన్నద్ధుండు+అయి= ప్రయత్నాలు చేసిన వాడయి; వచ్చి; ద్వారవతీ, పురంబున్= ద్వారకానగరాన్ని; అవరోధించి= ముట్టడించి.

**తాత్పర్యం:** నేను పదినెలలు సముద్రతీరంలో సాల్వుడితో యుద్ధంచేయవలసి వచ్చింది. అందువలన దుష్టద్యూత సమయంలో మీకు దూరంగా ఉండిపోయాను' - అని అనగా ధర్మరాజు ఆ వృత్తాంతం తెల్పగోరాడు. అప్పుడు శ్రీకృష్ణుడు సౌంభకాఖ్యానాన్ని ఇట్లా వివరించదొడగాడు: నీవు చేసిన రాజసూయయాగంలో నాకు పూజార్ఘ్య ప్రదానం చేయటాన్నిచూచి ఓర్వలేక మత్సరించిన శిశుపాలుడు నాచేత చచ్చాడు కదా! అతడి తమ్ముడే ఆ సాల్వుడు. అతడు కామగమనం గల సౌంభకనగరంతో కదలి వచ్చి ద్వారకాపురిని ముట్టడించాడు.

**చ. 'ప్రతినరపాలకాలు శిశుపాలు బలాధికుఁ జంపి దర్పసం**
**హితుఁ డగుచున్న వృష్ణిఖలుఁ డెక్కడ? నెక్కడ? నాతనిం జయో**
**న్నతి వెలయంగఁ జంపెద రణంబున' నంచు నలంఘ్యవిక్రమో**
**ర్జితుఁ డయి దానిచుట్టు విడిసెం జతురంగమహాబలంబుతోన్. 151**

**ప్రతిపదార్థం:** ప్రతి నరపాల, కాలు= శత్రురాజులకు యముడైన; శిశుపాలు; బల+అధికున్= బలంచేతగొప్పవాడిని; చంపి; దర్పసంహితుఁడు+అగుచున్న= గర్వంతో అతిశయిస్తున్న; వృష్ణిఖలుఁడు= వృష్ణివంశానికి చెందిన దుష్టుడు, కృష్ణుడు; ఎక్కడన్+ఎక్కడన్= ఎక్కడున్నాడు? ఎక్కడున్నాడు? (ద్రుతాంతమైన పదం ఉద్వేగాన్ని తెలుపుతుంది); ఆతనిన్; రణంబునన్= యుద్ధంలో; జయ+ఉన్నతి, వెలయంగన్= గెలుపుయొక్క గొప్పతనం వెలిగేటట్లు; చంపెదన్; అంచున్= అంటూ; అలంఘ్య, విక్రమ+ఊర్జితుఁడు+అయి= దాట శక్యంకాని పరాక్రమంతో గొప్పవాడయి; దాని చుట్టు (ఆ ద్వారకా) నగరం చుట్టూ; చతురంగ, మహా, బలంబుతోన్= నాలుగు అంగాలు గల పెద్ద సేనతో; విడిసెన్= ముట్టడించాడు.

**తాత్పర్యం:** 'శత్రురాజులకు యముడివంటివాడైన శిశుపాలుడిని సంహరించి గర్వంతో విహరిస్తున్న శ్రీకృష్ణుడు వృష్ణివంశంవాడు ఎక్కడ ఉన్నాడు? వాడిని చంపి జయోన్నతితో వెలుగుతాను' అని సాల్వుడు మహాపరాక్రమోపేతుడై చతురంగబలాలతో దండెత్తి ద్వారకాపురిని ముట్టడించాడు.

**విశేషం:** యాదవుల్లో పెక్కు తెగలు ఉన్నాయి. అందులో వృష్ణివంశం ఒకటి. చతురంగబలాలు 1. రథాలు 2. ఏనుగులు 3. అశ్వాలు 4. పదాతి దళం (కాల్బలం)

**క. మేలగు తత్పురబాహ్యవి। శాలోద్యానముల తాల సాల సరళ హిం**
**తాల తమాలావలి ని। ర్మూలితముగఁ జేసెఁ దచ్చమూసామజముల్. 152**

**ప్రతిపదార్థం:** మేలు+అగు= మంచివైన; తద్; పుర, బాహ్య, విశాల+ఉద్యానముల= ఆ పట్టణం బయట మిగుల నిడివి వెడల్పు కల తోటలలోని; తాల, సాల, సరళ, హింతాల, తమాల+ఆవలి= తాటిచెట్లు, మద్దిచెట్లు, దేవదారు వృక్షాలు, గిరకతాడి చెట్లు, చీకటిచెట్లు- వీటి సముదాయాలను; తద్+చమూ, సామజముల్= ఆతడియొక్క అంటే సాల్వుడియొక్క సేనలోని ఏనుగులు; నిర్మూలితముగన్+చేసెన్= వ్రేళ్ళతో పెకలించి వేశాయి.

**తాత్పర్యం:** ఆ సాల్వుడి సేనలోని ఏనుగులు ద్వారకాపట్టణానికి వెలుపలి ఉండే ఉద్యానవనాలలోని తాల, సాల, తమాలాది వృక్ష సమూహాలను సమూలంగా నాశనం చేశాయి.

**వ. మఱి తృణజలధాన్య సమిత్సమృద్ధంబయి శతఘ్నీప్రముఖానేక యంత్రంబుల నలంఘ్య పరిఖా ప్రాకారంబులను, నపార బల రక్షిత ఘనకవాట చతుర్గోపురంబులను, లబ్ధ ప్రభూత వేతన ప్రహృష్ట పుష్ట ధృష్ట వీర సుభట సంకులంబులను, నపరిమిత గజతురంగ శతాంగంబులను, బ్రదీప్తాలాత శాత శర చక్ర తోమర పరశుపాశాంకుశ కూటంబులను, వీరయోధారూఢ విశాలాట్టాలకంబులను నొప్పి పరుల కసాధ్యంబయిన ద్వారవతి భేదింప నేరక దాని వెలిం బ్రపా చైత్య దేవాయతన వల్మీకంబులు వర్జించి సమతలప్రదేశంబున నిబిడంబుగా శిబిరసన్నివేశంబు సేసి నిత్యంబు నుపద్రవంబు సేయుచున్న సౌంభక విజృంభణంబునకు సహింపక, సమరసంరంభంబున సర్వాయుధ సన్నద్ధులయి. 153**

**ప్రతిపదార్థం:** మఱి; తృణ, జల, ధాన్య, సమిధ్+సమృద్ధంబు+అయి= గడ్డితో, నీటితో, ఆహారధాన్యాలతో, సమిధలతో (వంటచెరకుతో) నిండినదై; శతఘ్నీ ప్రముఖ+అనేక, యంత్రంబులన్= శతఘ్నులు మొదలుగాగల పెక్కు యంత్రాలతో (శతఘ్ని= నూరు మందిని ఒకేసారి చంపగల మర ఆయుధం); అలంఘ్య, పరిఖా, ప్రాకారంబులనున్= దాటటానికి వీలుకాని కందకంతో, చుట్టుగోడలతో; అపార, బల, రక్షిత, ఘన, కవాట, చతుర్, గోపురంబులను= మితిలేని సేనచేత రక్షించబడుతున్న పెద్దగుమ్మాలు గల నాలుగు గోపురాలతో; లబ్ధ, ప్రభూత, వేతన, ప్రహృష్ట, పుష్ట, ధృష్ట, వీర, సుభట, సంకులంబులను= ఎక్కువ జీతాన్ని పొందటంచేత సంతోషం పొంది బలిసి ధైర్యంతో ఉండే వీరులైన మంచి భటుల సమూహాలతో; అపరిమిత, గజ, తురంగ, శతాంగంబులను= మితిలేని సంఖ్యల ఏనుగులతో, గుఱ్ఱాలతో, రథాలతో; ప్రదీప్త+అలాత, శాత, శర, చక్ర, తోమర, పరశు, పాశ+అంకుశ కూటంబులను= వెలుగొందుతున్న కొఱవులు, వాడి అయిన బాణాలు, చక్రాలు, చిల్లకోలలు, గండ్రగొడ్డళ్ళు, త్రాళ్ళు, అంకుశాలు- వీటి సమూహాలతో; వీర, యోధ+ఆరూఢ, విశాల+అట్టాలకంబులనున్= వీరులైన భటులతో కూడి విరివి అయిన బురుజులతోను; ఒప్పి= వెలుగొంది; పరులకు= ఇతరులకు; అసాధ్యంబు+అయిన= జయించటానికి వీలులేని; ద్వారవతి= ద్వారకను; భేదించనేరక= నిగ్రహించలేక; దాని వెలిన్= ఆ పురంబయట ఉండే; ప్రపా, చైత్య, దేవాయతన, వల్మీకంబులు= చలిపందిళ్ళు, రావిచెట్టు వంటి నీడనిచ్చే దివ్యవృక్షాల చుట్టూ రాతితో నిర్మించిన రచ్చ కట్టలు; దేవళాలు, పుట్టలు; వర్జించి= విడిచిపెట్టి; సమతల ప్రదేశంబునన్= మైదానపు నేలమీద; నిబిడంబుగా= దట్టంగా; శిబిర సన్నివేశంబు= భటులు నివసించే డేరాలు; చేసి= వేసి; నిత్యంబును= ప్రతిదినం; ఉపద్రవంబు, చేయుచున్న= హాని కలిగిస్తున్న; సౌంభక విజృంభణంబునకున్= సౌంభకంయొక్క చెలరేగటం; సహింపక= ఓర్వలేక; సమర సంరంభంబునన్= పోరు సల్పే ఆవేశంతో; సర్వ+ఆయుధ, సన్నద్ధులు+అయి= సమస్తమైన ఆయుధాలు సమకూర్చు కొన్నవారయి.

**తాత్పర్యం:** ఇది ద్వారక కోట వర్ణనం. 1. ఆ కోట-గడ్డితో, జలంతో, ఆహార ధాన్యాలతో, సమిధలతో పుష్కలం. 2. అందులో శతఘ్నులు మున్నగు ఆయుధయంత్రాలు అమర్చబడి ఉన్నాయి. 3. దాటలేని కందకం, ఎత్తైన ప్రాకారాలు, బురుజులు, నాలుగుదిక్కుల నాలుగు గోపురాలు, పెద్ద కవాటాలు అందులో ఉన్నాయి. 4. అచ్చటి సైనికులు ఎక్కువ జీతబత్తేలు పొందటంచేత సంతృప్తులు. సంతోషం మీరి ఉన్నవారు. 5. అక్కడ రథ-గజ-తురగ-పదాతి దళాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. 6. పదునైన సరికొత్త ఆయుధవిశేషాలు అలాత శర చక్ర తోమర పరశు పాశ అంకుశ కూటాలు అక్కడ ఉన్నాయి. 7. వీర యోధులు కావలి కాస్తున్న విశాలమైన అట్టాలకాలు ఉన్నాయి. అందువలన సాల్వుడు ద్వారకను భేదించలేక కోటవెలుపల మైదానాలలో సైనికశిబిరాలు నిర్మించాడు. అంతేగాక, అతడు తన సౌంభక పట్టణంతో నిత్యం అలజడి సృష్టిస్తున్నాడు. అందువలన యాదవులు ఆ సౌంభకంయొక్క విజృంభణం సహించలేక యుద్ధానికి సర్వాయుధాలతో సిద్ధులయి.

**విశేషం:** మహాభారతంలోని ద్వారకాపురి వర్ణన ప్రాచీనయుద్ధకళను అవగాహనం చేసికొనటానికి తోడ్పడుతుంది. ఈ వర్ణన నేటి ఇరవయ్యవ శతాబ్దిలోని వాళ్ళకు సైతం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇక సౌంభక కల్పన, ఇరవయ్యవ శతాబ్దివారి ఊహలకు కూడ అందనట్టిది. సౌంభకం కామగమనం కల నగర మట! రామాయణంలో సారథి లేనిది, అసంఖ్యాక ప్రజలు పయనించటానికి వీలైనట్టిది అయిన పుష్పక విమాన వర్ణన ఉన్నది. ఇక మహాభారతంలోని సౌంభకం తీరు వేరు. ఆ అభివర్ణన నేటి వైజ్ఞానిక కల్పనాకథలతో సంవదిస్తూ ఉన్నది.

**క. ఉద్యద్బలులు గుమారులు । విద్యాధరసములు పురము వెలువడిరి రణై**
**కోద్యములు చారుదేష్ణుఁడుఁ । బ్రద్యుమ్నుఁడు సాంబుఁడును విపక్షజిఘాంసన్. 154**

**ప్రతిపదార్థం:** ఉద్యత్+బలులు= విజృంభించే బలం కలిగిన వాళ్ళు; కుమారులు= (యాదవ) రాజపుత్రులు; విద్యాధరసములు= విద్యాధరులతో సరితూగేవాళ్ళు (దేవతలలో ఒక తెగవారు విద్యాధరులు); రణ+ఏక+ఉద్యములు= యుద్ధం చేయటంలోనే మిక్కిలి ఆసక్తి కలిగిన వాళ్ళు; చారుదేష్ణుఁడున్; ప్రద్యుమ్నుఁడు; సాంబుఁడును (అనే రాకుమారులు); విపక్ష, జిఘాంసన్= శత్రువులను చంపాలనే కోరికతో; పురము, వెలువడిరి= ద్వారకాపురి కోటలోపలినుండి బయటకు వచ్చారు.

**తాత్పర్యం:** చారుదేష్ణుడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు శత్రునిర్మూలన చెయ్యాలన్న కోరికతో మహోత్సాహంతో ద్వారకాపురికోటలోపలినుండి బయటకు వచ్చారు. ఆ యువవీరులు బలవంతులు, విద్యాధరులవంటివారు, యుద్ధనిపుణులు.

**మణిభూషణము.**

**రామవిక్రముఁ డజేయుఁ డరాతి గజావలీ**
**సామజాహితుఁడు సాంబుఁడు సాల్వచమూపతిన్**
**క్షేమవృద్ధి యనువాని నకృత్రిమ సాహసో**
**ద్దాముఁ దాఁకె శరధారల ధారుణిఁ గప్పుచున్. 155**

**ప్రతిపదార్థం:** రామవిక్రముఁడు= శ్రీరాముడి వంటి పరాక్రమం కలవాడు; అజేయుఁడు= జయించనలవికానివాడు; అరాతి, గజ+ఆవలీ, సామజ+అహితుఁడు= శత్రువులయొక్క ఏనుగుల సముదాయాలకు సింహం వంటి వాడు లేదా శత్రువులనే

ఏనుగుల సమూహాలకు సింహంవంటివాడు; సాంబుఁడు; సాల్వచమూపతిన్= సాల్వసేనాధిపతిని; క్షేమవృద్ధి+అనువానిన్; అకృత్రిమ, సాహస+ఉద్దామున్= సహజమైన ధైర్యంతో (తెగువతో) కూడినట్టివాడిని; శరధారలన్= బాణపరంపరలచేత; ధారుణిన్= భూమిని; కప్పుచున్; తాఁకెన్= డీకొన్నాడు.

**తాత్పర్యం:** శ్రీరాముడి పరాక్రమం వంటి పరాక్రమం కలవాడు, జయింపసాధ్యంకానివాడు, శత్రుగజాలను చీల్చిచెండాడటంలో సింహంలాంటివాడు అయిన సాంబుడు, శరపరంపరలతో భూమిని కప్పుతూ, సహజసాహసంతో భయంకరుడైన సాల్వసేనాధిపతిక్షేమవృద్ధిని ఎదుర్కొన్నాడు.

**విశేషం:** ఈ పద్యంలో 'గజావలీ సామజాహితుఁడు' అనే పదగుంఫనాన్ని 'గజ+ఆవళీ, సామజ+అహితుడు' అని విడదీయాలి. అయితే గజములు అంటే ఏనుగులు; సామజములు అంటే ఏనుగులు. ఇచట పునరుక్తి దోషం ఉన్నట్లు స్థూల దృష్టికి భ్రమ కలుగుతుంది. కాని శత్రువులనే ఏనుగులదండకు సామజ+అహితుఁడు= సింహం వంటివాడు అనే అర్థం చెప్పాలి. రూపకాలంకారం. 'మణి భూషణం' పద్యానికి ర-న-భ-భ-ర- అనే గణాలు ప్రతి పాదంలోను ఉంటాయి. 10వ అక్షరం యతిస్థానం.

**క. జాంబవతేయు బృహద్విశి । ఖంబులకున్ బెదర కెదిరి ఘనుఁ డేసె రణా**
**గ్రంబున నాతనిపై నవి । లంబితుఁడై క్షేమవృద్ధి లక్షశరంబుల్. 156**

**ప్రతిపదార్థం:** జాంబవతేయు= (జాంబవతికొడుకు) సాంబుడియొక్క; బృహత్ విశిఖంబులకున్= పెద్దబాణాలకు; బెదరక; ఎదిరి= ఎదిరించి; ఘనుఁడు= గొప్పవాడు; క్షేమవృద్ధి; అవిలంబితుఁడు+ఐ= ఎడతెగకుండ (ఆలస్యంలేకుండ); రణ+అగ్రంబునన్= అని మొనముందట; ఆతనిపై= సాంబుడిపై; లక్షశరంబుల్= లక్షబాణాలు; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** సాంబుడు వేసిన పెద్ద బాణాలకు బెదరక క్షేమవృద్ధి తిరిగి ఆ యుద్ధంలో సాంబుడిపై లక్షబాణాలను ప్రయోగించాడు.

**వ. వాని యేయు శరంబుల నేర్పునకు సహింపక సాంబుండు జాంబూనదపుంఖంబులయిన విశిఖంబులం దదీయ రథాశ్వమర్మంబుల నేసిన నవి మర్మభేదవేదనలం దలరి యతివేగంబున రణంబు వెలువడ రథం బీడ్చుకొని సారథికి వశంబుగాక పఱచె; నట్లు సాల్వ చమూపతి సమరవిముఖుం డయిన. 157**

**ప్రతిపదార్థం:** వాని, ఏయు, శరంబుల, నేర్పునకున్= వాడు (క్షేమవృద్ధి) వేసే బాణాలనేర్పుకు; సహింపక, సాంబుండు; జాంబూనదపుంఖంబులు+అయిన= బంగారు చివరలు కల; విశిఖంబులన్= బాణాలతో; తదీయ, రథ+అశ్వ, మర్మంబులన్= ఆతడియొక్క రథాలకు పూన్చిన గుఱ్ఱాలయొక్క జీవస్థానాలలో; ఏసినన్= కొట్టగా; అవి, మర్మ, భేద, వేదనలన్+తలరి= జీవస్థానాలు చీలటంచేత కలిగిన బాధతో నొచ్చి; అతివేగంబునన్= మిక్కిలి వేగంతో; రణంబు వెలువడన్= యుద్ధంనుండి తొలగేటట్లు; రథంబు+ఈడ్చుకొని= రథాన్ని ఈడ్చుకొని; సారథివశంబు, కాక= చోదకుడికి లోబడక; పఱచెన్= పారిపోయాయి; అట్లు= ఆ విధంగా; సాల్వచమూపతి= సాల్వసేనాని; సమర, విముఖుండు= యుద్ధంనుండి వెనుదిరిగినవాడు; అయినన్= కాగా.

**తాత్పర్యం:** క్షేమవృద్ధి వేసిన బాణాలకు తాళలేక సాంబుడు, బంగరుచివరలు కలిగిన బాణాలతో ఆతని రథానికి పూన్చిన గుఱ్ఱాల మర్మస్థానాలలో కొట్టాడు. ఆబాధకు గుఱ్ఱాలు తాళలేక, సారథికి లొంగక, రథాన్ని యుద్ధభూమినుండి తొలగించుకొని పారిపోయాయి. ఆ విధంగా సాల్వసేనాపతి యుద్ధవిముఖుడు కాగా-

**స్వాగతము.**

**వేగవంతుఁ డను వీరుఁడు సాంబున్**
**వేగవంతుఁ డయి వీఁకను దాఁకెన్**
**వేగ బాణపదవీ తతులన్ ది**
**గ్భాగముల్ విశిఖపంజరముల్ గాన్.** **158**

**ప్రతిపదార్థం:** వేగవంతుఁడు+అను, వీరుఁడు= వేగవంతుడనే శూరభటుడు; వేగవంతుఁడు+అయి= వేగంకలవాడయి; సాంబున్= సాంబుడిని; వీఁకన్= ఉత్సాహంతో; వేగ, బాణ, పదవీ, తతులన్= శీఘ్రంగా వెళ్ళే అమ్ముల మార్గాల సమూహాలతో; దిశ్+భాగముల్= దిగంతరాలు; విశిఖ, పంజరముల్+కాన్= బాణాలతో ఏసిన గూళ్ళు కాగా; తాఁకెన్= తలపడ్డాడు.

**తాత్పర్యం:** వేగవంతు డనే వీరుడు సాంబుడిని వేగంగా ఎదుర్కొన్నాడు. ఆతడు వేసిన వేగబాణపరంపరలతో దిగంతరాలు బాణపంజరాలయ్యాయి.

**విశేషం:** స్వాగతపద్యానికి ప్రతిపాదంలో ర-న-భ-గగ అనే గణా లుంటాయి. 7వ అక్షరం యతిస్థానం.

**ఆ.** **సాంబుఁ బాయు మనుచుఁ జారుదేష్ణుం డల్గి । వేగవంతుఁ దాఁకి వీఁకతోడ**
**వాని మస్తకంబు వ్రయ్యంగ వడి గదం । బొడిచె రుధిరవారిపూర మొలుక.** **159**

**ప్రతిపదార్థం:** సాంబున్+పాయుము+అనుచున్= సాంబుడిని తప్పుకొమ్మని పలికి; చారుదేష్ణుండు; అల్గి=కోపించి; వేగవంతున్+తాఁకి= వేగవంతుడిని ఎదిరించి; వీఁకతోడ= ఉత్సాహంతో; వాని, మస్తకంబు= వాడితల; వ్రయ్యంగ= పగిలేటట్లు; వడిన్= వేగంగా; గదన్= గదతో; రుధిర, వారి, పూరము+ఒలుకన్= నెత్తురునీటి సమూహం (వెల్లువ) జారి కారగా; పొడిచెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** సాంబుడిని ప్రక్కకు తప్పుకొమ్మని పలికి, చారుదేష్ణుడు వేగవంతుడితో పోరాడి, అతడి తల పగిలేటట్లు తనగదతో కొట్టాడు. ఆ దెబ్బకు వేగవంతుడి తలనుండి నెత్తురు నీటివెల్లువగా ప్రవహించింది.

**వ.** **ఇట్లు చారుదేష్ణు నిష్ఠురగదాఘాతంబున వేగవంతుండు విగతజీవుండయి నిర్ఘాతపాత భిన్నోన్నతగిరి శిఖరంబునుంబోలె నేలఁ ద్రెళ్ళినం జూచి విచింత్యుం డను వాఁ డవిచింత్యవిక్రముం డయి.** **160**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; చారుదేష్ణు= చారుదేష్ణుడియొక్క; నిష్ఠుర, గదా+ఆఘాతంబునన్= కఠోరమైన గద దెబ్బకు; వేగవంతుండు; విగత, జీవుండు+అయి= పోయిన ప్రాణాలు కలవాడై; నిర్ఘాత, పాత, భిన్న+ఉన్నత, గిరి, శిఖరంబునున్+పోలె= పిడుగుపాటుచేత పగిలిన ఎత్తైన కొండకొనవలె; నేలన్+త్రెళ్ళినన్= నేలపై దొర్లి పడగా; చూచి; విచింత్యుండు+అనువాఁడు; అవిచింత్య+విక్రముండు+అయి= ఊహించ నలవికాని పరాక్రమం కలవాడయి (అనాలోచితంగా విజృంభించినట్టివాడయి).

**తాత్పర్యం:** ఈ విధంగా చారుదేష్ణుని గదాఘాతానికి వేగవంతుడు, పిడుగుపాటుకు ఎత్తైన కొండకొన పగిలి నేలపై దొరలి కూలినట్లు క్రిందపడి మరణించాడు. అప్పుడు విచింత్యు డనేవాడు అవిచింత్యపరాక్రముడై చారుదేష్ణుడితో పోరాడటానికి తలపడ్డాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. చారుదేష్ణుపైఁ గడువాఁడిశరము లేసె; । నతఁడు కార్ముకహస్తుఁడై యాక్షణంబ**
**వానిపై నభిమంత్రించి వహ్నిబాణ । మేసె నుగ్రస్ఫులింగంబు లెసఁగఁ జదల. 161**

**ప్రతిపదార్థం:** చారుదేష్ణుపైన్= చారుదేష్ణుడిమీద; (విచింత్యుడు); కడు, వాఁడి శరములు+ఏసెన్= మిక్కిలి వాడి అయిన బాణాలు ప్రయోగించాడు; అతఁడు= ఆ చారుదేష్ణుడు; కార్ముక, హస్తుఁడు+ఐ= విల్లు చేతిలో కలవాడై; ఆ, క్షణంబు+అ= ఆక్షణంలోనే; వానిపైన్= ఆ విచింత్యుడిపై; అభిమంత్రించి= లెస్సగా మంత్రాలు ఉచ్చరించి; వహ్ని, బాణము= ఆగ్నేయాస్త్రాన్ని; చదలన్= ఆకాశంలో; ఉగ్రస్ఫులింగంబులు= భయంకరమైన నిప్పురవ్వలు; ఎసఁగన్= విస్తరించగా; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** విచింత్యుడు చారుదేష్ణుడిపై కడువాడిబాణాలు వేశాడు. చారుదేష్ణుడు ఆ క్షణంలోనే చేతిలో విల్లు ధరించి, అభిమంత్రించి వానిపై ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. అంతట ఆకాశంలో భయంకరంగా నిప్పురవ్వలు క్రమ్ముకొన్నాయి.

**క. అనలాస్త్ర మట్లు వక్షముఁ । గొనిన విచింత్యుండు గూలెఁ గుతలం బద్రువన్;**
**ఘను వానిఁ జూచి హా హా । స్వనము లెసఁగ సాల్వుసేన సంక్షోభించెన్. 162**

**ప్రతిపదార్థం:** అనల+అస్త్రము= ఆగ్నేయాస్త్రం; అట్లు= ఆవిధంగా; వక్షమున్= రొమ్మును; కొనిన= కొట్టగా (ఖండించగా); విచింత్యుండు; కుతలంబు= భూతలం; అద్రువన్= అదిరేటట్లు; కూలెన్= క్రిందపడ్డాడు; ఘను, వానిన్+చూచి= గొప్పవాడైనవాడిని చూచి; హాహాస్వనములు+ఎసఁగన్= హాహాకారాలు వ్యాపింపగ; సాల్వు సేన= సాల్వుడియొక్క సేన; సంక్షోభించెన్= మిక్కిలి కలతచెందింది.

**తాత్పర్యం:** ఆగ్నేయాస్త్రం (అనలాస్త్రం) తన రొమ్మును తాకటంచేత విచింత్యుడు పుడమి అదిరేట్లు క్రిందపడి మరణించాడు. ఘనుడైన ఆతడి మరణం చూచి సాల్వుడి సైనికులు హాహాకారాలు చేసి సంక్షోభం పొందారు.

**విశేషం:** 'అద్రువన్' ఛందస్సులో శిథిలద్విత్వం. ఇది సగణం.

**వ. సాల్వుండు నిజసేనా సంక్షోభం బుడిచి సర్వాయుధసనాథం బయిన రథం బెక్కి యాదవకుమారవాహిని పయి నెత్తియేయుచు వ్రేయుచుంబొడుచుచుఁ బ్రతిబలంబు నెల్ల నాయుధమయంబుగాఁజేయుచున్న వాని కలిగి. 163**

**ప్రతిపదార్థం:** సాల్వుండు= సాల్వుడు; నిజ, సేనా, సంక్షోభంబు+ఉడిచి= తన సేనలో వ్యాపించిన కలవరపాటును ఆపి; సర్వ+ఆయుధ, సనాథంబు+అయిన= అన్ని ఆయుధాలతో సమకూడి ఉన్న; రథంబు= తేరు; ఎక్కి; యాదవ, కుమార, వాహినిపైన్= యాదవకుమారుల సైన్యంమీద; ఎత్తి= దండెత్తి; ఏయుచు, వ్రేయుచున్+పొడుచుచున్= (ఆయుధాలు) విసురుతూ,

ఖండిస్తూ, గుచ్చుతూ; ప్రతిబలంబున్+ఎల్లన్= శత్రుసైన్యాన్నంతటినీ; ఆయుధమయంబుగాన్= ఆయుధాలతో నిండేటట్లుగా; చేయుచున్న; వానికి+అలిగి= వాడిపై కోపించి.

**తాత్పర్యం:** సాల్వుడు సమస్తాయుధాలతో కూడి ఉన్న రథాన్ని ఎక్కివచ్చి, తనసేనలో ఏర్పడిన కలవరపాటును తొలగించి, యాదవసైన్యంపై అనేకాలైన అస్త్రశస్త్రాలతో విజృంభించి పోరాడ సాగాడు. అంతట వాడిపై ఆగ్రహం చెంది.

**సీ. హంసవర్ణోత్తమహయములఁ బూనిన । రథ మెక్కి కాంచనరమ్యయష్టి**
**సంభృత మకరధ్వజం బొప్ప బద్ధ గో । ధాంగుళిత్రాణుఁడై యతులశాత**
**సాయకావళిఁజేసి సాల్వుఁ బిల్చుచు వాని । మీఁదఁ బ్రద్యుమ్నుఁ డమేయబాణ**
**వర్షంబు గురిసిన, వాఁడును వానిపైఁ । గడువాఁడిశరములఁ గడఁగి యేసె;**

**ఆ. నధికవీరు లైన యయ్యిద్దఱకు నస్త్ర । కోవిదులకుఁ బోరు ఘోరమయ్యెఁ**
**దద్ద భయము వొంది తద్ద్వారకాపురి(ర) । సౌంభకముల జనులు సంభ్రమింప. 164**

**ప్రతిపదార్థం:** హంస, వర్ణ+ఉత్తమ, హయములన్+పూనిన, రథము+ఎక్కి= తెల్లని హంసరంగు కల మేలిగుర్రాలు కట్టిన తేరును ఎక్కి; కాంచన, రమ్య, యష్టి, సంభృత, మకర, ధ్వజంబు+ఒప్పన్= బంగారుతో చేయబడిన అందమైన కర్రకు పూన్చబడిన మొసలి జెండా వెలుగొందుతుండగా; బద్ధగోధా+అంగుళి, త్రాణుఁడు+ఐ= చేతి వ్రేళ్లకు అల్లెత్రాటి ఒరిపిడి తగలకుండటానికై ఉడుముతోలుతో కుట్టబడిన కవచం ధరించిన వాడై; అతుల, శాత, సాయక+ఆవళిన్+చేసి= సాటిలేని వాడి అయిన బాణాల సముదాయంచేత; సాల్వున్+పిల్చుచు= సాల్వుడిని (యుద్ధంచేయుమని) ఆహ్వానిస్తూ; వాని మీఁదన్= ఆ సాల్వుడిపై; ప్రద్యుమ్నుఁడు; అమేయ, బాణ, వర్షంబు, కురిసిన= దట్టమైన అమ్ములవాన కురిపించగా; వాఁడును= ఆ సాల్వుడును; వానిపైన్= ప్రద్యుమ్నుడిపై; కడు, వాఁడి, శరములన్+కడఁగి+ఏసెన్= మిక్కిలి పదునైన బాణాలను పూని ప్రయోగించాడు; అధిక, వీరులు+ఐన= గొప్ప శూరులైన (దండిమగలైన); ఆ+ఇద్దఱకున్= ఆ ఇరువురికి; అస్త్ర కోవిదులకున్= అస్త్రాలు తెలిసినట్టి వారికి- అంటే అస్త్రాలలో ప్రావీణ్యం గల ఆ సాల్వప్రద్యుమ్నులు ఇరువురికిన్నీ; పోరు= యుద్ధం; ఘోరము+అయ్యెన్= భయంకరంగా జరిగింది; తద్, ద్వారకా, పురి(ర), సౌంభకముల జనులు= ఆ ద్వారకానగరంలోని, సౌంభకపురంలోని జనులు; తద్ద= మిక్కిలి; భయము+పొంది= భయపడి; సంభ్రమింప= కలవరం చెందగా.

**తాత్పర్యం:** తెల్లగుర్రాల్ని పూన్చిన రథాన్ని ఎక్కి, ఆ రథంమీది బంగారుకొయ్యపై మొసలిగుర్తుజెండా లెస్సగా ప్రకాశిస్తూ ఉండగా, చేతివ్రేళ్ళకు అల్లెత్రాటిఒరిపిడి తగులకుండ ఉడుముతోలుపైకప్పులు తొడుగుకొని ప్రద్యుమ్నుడు పదునైన బాణాలు ప్రయోగిస్తూ సాల్వుడిని యుద్ధానికి ఆహ్వానిస్తూ శరవర్షం కురిపించాడు. సాల్వుడు కూడ పూనికతో వాడి బాణాలు ప్రయోగించాడు. అస్త్రవిద్యలో ఆరితేరిన ఇద్దరిమధ్య పోరు భీకరమయ్యేసరికి ద్వారకాపట్టణంలోని, సౌంభకపురిలోని ప్రజలు మిక్కిలి భీతిల్లి కలవరపడినారు.

**విశేషం:** ఈ పద్యంలో 'బద్ధగోధాంగుళిత్రాణుఁడై' ప్రద్యుమ్నుడు పోరు సలిపినట్లు ఉన్నది. ప్రాచీనకాలంలో యుద్ధంలో వింటికి కల ప్రాముఖ్యం ఎల్లరకు తెలిసిందే. వింటి బద్దకు అల్లె త్రాడు బిగించి బాగుగా ఎక్కుపెట్టి లాగి వీరుడు బాణాలను విడవాలికదా! అప్పుడు అల్లెత్రాటి ఒరిపిడివల్ల వీరుడి వ్రేళ్లు గాసి చెందకతప్పదు. అందుచేత 'అంగుళిత్రాణం' అవసరం.

ప్రాచీనకాలంలో విలుకాండ్రు అంగుళిత్రాణంగా 'గోధ'ను ఉపయోగించేవారు. గోధ అంటే అల్లెత్రాటి దెబ్బతగులకుండ ఉండటానికై చేతికి తొడుగుకొనే ఉడుముతోలుతో కుట్టబడిన కవచం. ఉడుము (గోధ) చర్మంతో తయారుచేయబడేది కనుక. అంగుళిత్రాణానికి 'గోధ' - అనే పేరు ఏర్పడింది.

**క. అనిమొన సాల్వుఁడు ప్రద్యు । మ్ననిశాతశరాలివిద్ధ మర్మ్ముండయి పె**
**ల్చన మూర్ఛవోయి పడియెం । దన రథముపయిన్ ధరిత్రి దల్లడపడఁగన్. 165**

**ప్రతిపదార్థం:** అని, మొన= యుద్ధానికిముందుభాగంలో; ప్రద్యుమ్న, నిశాత, శర+ఆవలి, విద్ధ, మర్మ్మండు+అయి= ప్రద్యుమ్నుడియొక్క వాడి అమ్ముల గుంపుచేత కొట్టబడిన జీవస్థానాలు కలవాడయి; సాల్వుఁడు; ధరిత్రి= భూమి; తల్లడపడఁగన్= కంపించేటట్లు; పెల్చన= వేగంగా; మూర్ఛ+పోయి= స్పృహ తప్పి; తన, రథము పయిన్= తన తేరుమీద; పడియెన్= పడిపోయాడు.

**తాత్పర్యం:** యుద్ధానికి ముందుభాగంలో ప్రద్యుమ్నుడు సాల్వుడి మర్మస్థానాలను వాడిబాణాలతో భేదించాడు. అప్పుడు సాల్వుడు భూమి కంపించేటట్లు వేగంగా రథంపై మూర్ఛిల్లిపడ్డాడు.

**ఉ. అంతన మూర్ఛదేఱి కలుషానలదీప్తముఖుండు సౌంభకుం**
**డంతకదండదారుణము లైన శరంబుల రౌక్మిణేయు ది**
**గ్దంతిబలాఢ్యు నేయుడు, నతండును మూర్ఛితుఁడయ్యెఁ; వాని సం**
**భ్రాంతిఁ దదీయసారథి యపాస్తరణాంతరుఁ జేసెఁ జెచ్చెరన్. 166**

**ప్రతిపదార్థం:** అంతన= అంతట; కలుష+అనల, దీప్త, ముఖుండు= కోపమనే అగ్నిచేత వెలుగొందే మొగం కలవాడు; సౌంభకుండు= సాల్వుడు (సౌంభకం కలవాడు); మూర్ఛ, తేఱి= మూర్ఛనుండి తేరుకొని; అంతక, దండ, దారుణములు+ఐన= యముడి దండం వలె భయంకరాలైన; శరంబులన్= బాణాలతో; దిశ్+దంతి, బల+ఆఢ్యున్= దిగ్గజం వంటి బలం కలవాడిని; రౌక్మిణేయున్= రుక్మిణికొడుకైన ప్రద్యుమ్నుడిని; ఏయుడున్= కొట్టగా; అతండును= ఆ ప్రద్యుమ్నుడుకూడ; మూర్ఛితుఁడు+అయ్యెన్= మూర్ఛచెందిన వాడయ్యాడు; తదీయసారథి= అతని రథచోదకుడు; సంభ్రాంతిన్= కలతనొంది; చెరన్+చెరన్= వెంటనే; వానిన్= ఆ ప్రద్యుమ్నుని; అపాస్త, రణ+అంతరున్+చేసెన్= యుద్ధమధ్యంనుండి తొలగించబడినవాడినిగా చేశాడు.

**తాత్పర్యం:** అంతట సాల్వుడు తెలివొంది, కోపోద్దీపితుడై, బలాఢ్యుడైన ప్రద్యుమ్నుడిపై యమదండంవంటి బాణాలు ప్రయోగించాడు. అందువలన ప్రద్యుమ్నుడు మూర్ఛపోయాడు. అంత అతడిసారథి కళవళపడి, రథాన్ని రణరంగంనుండి ప్రక్కకు తొలగించి తోలుకొనిపోయాడు.

**వ. ఇట్లు మూర్ఛితుండయిన ప్రద్యుమ్నుం దోడ్కొని చని రణంబునకు దూరంబుగా నరదంబు నిలిపికొని దారుకసుతుం డున్నంత, నొక్కింత ప్రొద్దునకు మూర్ఛదేఱి ప్రద్యుమ్నుండు సూతున కిట్లనియె. 167**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మూర్ఛితుండు+అయిన= స్పృహ కోల్పోయిన; ప్రద్యుమ్నున్+తోడ్కొని, చని= ప్రద్యుమ్నుడిని తీసికొని వెళ్ళి; రణంబునకు, దూరంబుగాన్= యుద్ధానికి దూరంగా; అరదంబు= రథం; నిలిపికొని= ఆపి; దారుక సుతుండు= దారుకుని కొడుకు; ఉన్నంతన్= ఉండగా; ఒక్కింత ప్రొద్దునకు= కొంతసేపటికి; ప్రద్యుమ్నుండు; మూర్ఛ, తేఱి= తెలివొంది; సూతునకు= సారథికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆవిధంగా మూర్ఛిల్లిన ప్రద్యుమ్నుడిని తోడ్కొని వెళ్లి, అతనిసారథి రథాన్ని రణరంగంనుండి తొలగించి దూరంగా ఆపి ఉంచగా, కొంతసేపటికి ఆ వీరుడు తేరుకొని సూతుడితో ఇట్లా అన్నాడు.

**క. 'ఘోరాహవరంగమునకు । దూరముగా నన్ను నిట్లు దోడ్కొని తేరన్**
**దారుకసుత! నీ కుచితమె? । వీరారంభంబు సూచి వెఱచితె? చెపుమా!' 168**

**ప్రతిపదార్థం:** ఘోర+ఆహవరంగమునకున్= భయంకరమైన యుద్ధభూమికి; దూరముగా= దవ్వుగా; నన్నున్+ఇట్లు; తోడ్కొని, తేరన్= తీసికొనిరావటం; దారుకసుత!= ఓ దారుకుడి పుత్రుడా!; నీకు; ఉచితమె= తగునా?; వీర+ఆరంభంబు= (ఎదిరి) వీరుని ప్రారంభం; చూచి= అరసి; వెఱచితివి+ఎ= భయపడ్డావా?; చెపుము+ఆ= చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ దారుకుడి పుత్రుడా! భయంకరంగా పోరు జరుగుతున్నపుడు నన్ను యుద్ధభూమినుండి దూరంగా తోడ్కొని తేవటం నీకు తగునా? ఎదుటివీరుల పరాక్రమవిజృంభణం చూచి నీవు భయపడ్డావా? చెప్పుము.'

**విశేషం:** ఇక్కడ ప్రద్యుమ్నుడు తన సారథిని 'దారుకసుత'! అని సంబోధించటం గమనించదగింది. దారుకుడు శ్రీకృష్ణుడి రథసారథి. ప్రాణభీతిచే వీరుడు యుద్ధభూమిని వీడటం అవమానం. ప్రద్యుమ్నుడు రణరంగంలో ప్రాణాలు కోల్పోవటానికైనా సంసిద్ధుడే కాని పరోక్షంగానైనను పిరికితనాన్ని సహించలేడు. కాబట్టి అట్లా పలికాడు. వేరొక సారథిమాట వేరు. దారుకుడి పుత్రుడికి అటువంటి పిరికితనం కూడదని ప్రద్యుమ్నుడి భావం.

**వ. మఱియు సారథిం జూచి విహ్వలమానసుండయి యిట్లనియె. 169**

**ప్రతిపదార్థం:** మఱియు= ఇంకను; సారథిన్+చూచి= రథచోదకుడిని చూచి; (ప్రద్యుమ్నుడు); విహ్వల మానసుండు+అయి= కలత చెందిన మనస్సు కలవాడయి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అంతటితో ఆగక, ప్రద్యుమ్నుడు చెదరిన మనస్సు కలవాడయి సారథితో ఇట్లా పలికాడు.

**విశేషం:** ఇచట 'మఱియు' అనే ప్రయోగం మిక్కిలి అర్థవంతమైంది. ప్రద్యుమ్నుడు అప్పుడు 'విహ్వల మానసుడు'. అంతకు పూర్వమే అతడు సారథిని చీవాట్లు పెట్టి ఉన్నాడు. అది చాల లేదు. అందుచేత 'మఱియు' మాటాడవలసి వచ్చింది. ప్రద్యుమ్నుడి వంటి వీరుల మనస్తత్త్వం, రథికులకూ, సారథులకూ ఉండవలసిన ఆదర్శ అనుబంధాన్ని ఈ సంవాదం వెల్లడిస్తున్నది.

**క. 'సమర విముఖత్వమును రణ । విముఖులఁ జంపుటయు శరణు వేఁడిన రక్షిం**
**పమియును యాదవవంశో । త్తములకుఁ గల నయినఁ గలవె దారుకతనయా! 170**

**ప్రతిపదార్థం:** దారుకతనయా!= ఓ దారుకుడి సుతుడా!; సమర, విముఖత్వమును= యుద్ధంలో పెడమొగం పెట్టటం; రణవిముఖులన్+చంపుటయున్= యుద్ధం నుండి వెనుదిరిగిపోయే వారిని చంపటం; శరణు, వేఁడిన, రక్షింపమియును= కాపాడుమని వేడుకొన్న వారిని రక్షించకపోవటం; యాదవ, వంశ+ఉత్తములకున్= యాదవ వంశంలో పుట్టిన సజ్జనులకు; కలన్+అయినన్= కలలో అయినప్పటికి; కలవె= ఉన్నాయా?

**తాత్పర్యం:** 'పేరుప్రతిష్ఠలను ఆర్జించిన దారుకుడి పుత్రుడవైన సారథీ! యుద్ధంనుండి వెనుదిరిగి పోవటం, రణరంగంలో వెన్నుజూపి పారిపోయేవారిని సంహరించటం, శరణువేడిన వారిని రక్షించకుండా ఉండటం యాదవవంశంలో పుట్టిన వీరశ్రేష్ఠులకు కలలో అయినను ఉన్నాయా!

**క. విక్రమము విడిచి సమరా । పక్రాంతుఁడ నయిన నన్ను బలదేవుఁడునుం**
**జక్రధరుండు కుమారులు । నక్రూరాదులును నేమి యని నగరె సభన్. 171**

**ప్రతిపదార్థం:** విక్రమము, విడిచి= పౌరుషం వీడి; సమర+అపక్రాంతుఁడన్+అయినన్= యుద్ధరంగం నుండి తొలగితే; నన్ను; బలదేవుఁడునున్+చక్రధరుండు= బలరాముడు, శ్రీకృష్ణుడును; కుమారులున్= యాదవ పుత్రులు; అక్రూర+ఆదులునున్= అక్రూరుడు మున్నగువారున్నూ; సభన్= కొలువుకూటంలో; ఏమి+అని= ఇది ఏమిటని; నగరె= నవ్వరా?

**తాత్పర్యం:** పరాక్రమం విడిచి, యుద్ధభూమి నుండి నేను తేజస్సు కోల్పోయి తొలగిపోతే, బలరాముడు, శ్రీకృష్ణుడు, రాకుమారులు, అక్రూరుడు మొదలైన పెద్దలు నన్ను చూచి నవ్వరా?

**విశేషం:** 'ఏమి యని నగరె' అనేది జాతీయం. ఇటువంటి హీనకృత్యం చేశా వేమియని నవ్వరా!

**వ. చెట్టసేసి తింకనయినఁ జెచ్చెర సాంబ చారుదేష్ణు లున్న చోటికి సాల్వాభిముఖంబుగా రథంబు పఱపు 'మనిన, సారథి యిట్లనియె. 172**

**ప్రతిపదార్థం:** చెట్ట= చెడు; చేసితి= చేశావు; ఇంకన్+అయినన్= ఇకనయిన; చెరన్+చెరన్= వెంటనే; సాంబ, చారుదేష్ణులు; ఉన్న చోటికి; సాల్వ+అభిముఖంబుగా= సాల్వుడికి ఎదురుగా; రథంబు, పఱపుము= తేరు సాగనిమ్ము; అనిన, సారథి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నీవు చేసింది తప్పు. ఇకనయిన సాంబుడు చారుదేష్ణుడు యుద్ధం చేస్తున్న చోటికి సాల్వుడికి ఎదురుగా మనతేరు నడుపుము'- అని అనగా ప్రద్యుమ్నుడికి సారథి ఇట్లా బదులు పలికాడు.

**క. 'రథి కిమ్ముగాని యెడ సా । రథి ధృతిమెయిఁ; గావ వలయు, రథియును దత్సా**
**రథిఁ గావవలయు, రథి సా । రథులు పరస్పర శరీర రక్షకు లగుటన్. 173**

**ప్రతిపదార్థం:** రథికి= రథాన్నెక్కి యుద్ధం చేసేవీరుడికి; ఇమ్ముకాని, ఎడ=అనుకూలత లేని సమయంలో; సారథి= రథం నడిపేవాడు; ధృతిమెయిన్= ధైర్యంతో; కావవలయు= కాపాడాలి; రథియును= రథికుడు కూడ; తద్, సారథిన్= ఆ సారథిని; కావ వలయు= రక్షించాలి; రథి, సారథులు= రథికుడు, సారథియును; పరస్పర, శరీర, రక్షకులు+అగుటన్= ఒండొరుల దేహాలకు రక్షణ చేకూర్చేవాళ్ళు కాబట్టి.

**తాత్పర్యం:** 'వీలు, చాలు కానివేళ రథికుడిని సంరక్షించే బాధ్యత సారథిపై ఉంటుంది. అట్లే సారథిని కాపాడే బాధ్యతకు రథికుడు పూనుకోవాలి. రథికుడు, సారథి ఒండొరుల శరీరరక్షణకు బాధ్యులు.

**ఆ. సాల్వబాణవిగతసత్త్వుఁడ వైన ని । న్నిట్లు దెచ్చితిని; సహింప వలయు;**
**నా రథాశ్వముల ఘనస్యందనము నిదె । చూడు' మనుచు సూతసూనుఁ డపుడు. 174**

**ప్రతిపదార్థం:** సాల్వ, బాణ, విగత, సత్త్వుఁడవు+ఐన= సాల్వుడియొక్క బాణాలచేత పోయిన బలం కలవాడివి అయిన; నిన్ను+ఇట్లు, తెచ్చితిని= నిన్ను ఈ విధంగా తీసుకొని తెచ్చాను; సహింపవలయు= ఓర్చుకొనాలి. నా, రథ+అశ్వముల= నా తేరుకు కట్టిన గుర్రాలను; ఘన, స్యందనమును= గొప్పరథాన్ని; ఇదె, చూడుము+అనుచున్; సూతసూనుఁడు= (సూతుడి కొడుకైన) సారథి; అపుడు.

**తాత్పర్యం:** సాల్వుడిబాణాలచేత నీ బలం తరిగింది. అందుచేత ఇట్లా నిన్ను తీసుకొని వచ్చాను. ఓర్చుకొనుము. నా రథాన్ని, రథానికి కట్టిన గుర్రాల పటుత్వాన్ని ఇంక నీవు చూడగలవు!

**వ. సవ్యాపసవ్య విచిత్రమండల గతుల నాక్షణంబ సాల్వునకు నప్రదక్షిణంబుగా రథంబు వఱపిన, దాని సహింపక సాల్వుండు మూఁడమ్ముల సారథినేసి మఱియు రాక్షసమాయ ననేక శరంబులు ప్రద్యుమ్నుపై నేసిన. 175**

**ప్రతిపదార్థం:** ఆ క్షణంబు+అ= వెనువెంటనే; సవ్య+అపసవ్య, విచిత్ర, మండల, గతులన్= కుడి, ఎడమ వైపులుగా ఆశ్చర్యకరంగా, గుండ్రంగా త్రిప్పుతూ; సాల్వునకున్+అప్రదక్షిణంబుగా= ఎడమవైపునుంచి కుడివైపుగా సాల్వుడిని చుట్టుతూ, రథంబు, పఱపిన= తేరునడపగా; దాని, సహింపక= దాన్ని ఓర్వక; సాల్వుండు; మూఁడు+అమ్ములన్= మూడు బాణాలతో; సారథిన్+ఏసి= సూతుడిని కొట్టి; మఱియు; రాక్షస, మాయన్= రక్కసులు చూపే మాయతో; అనేక, శరంబులు= పెక్కుబాణాలు; ప్రద్యుమ్నుపైన్; ఏసినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** వెంటనే సూతుడు రథాన్ని కుడి యెడమల విచిత్రగతులతో ఆశ్చర్యకరంగా నడిపి, సాల్వుడికి అప్రదక్షిణంగా చుట్టి వచ్చాడు. సాల్వుడు దాన్ని తనకు అవమానంగా ఎంచి సారథిని మూడుబాణాలతో కొట్టి, రాక్షసమాయతో కూడిన పెక్కుబాణాలు ప్రద్యుమ్నుడిపై ప్రయోగించాడు.

**క. అమ్మాయాశరములు భ । గ్నమ్ములుగాఁ జేసి తన్ముఖమ్మునఁ దద్వ**
**క్షమ్మున నొక్కట బ్రహ్మ । స్త్రమ్మును బ్రద్యుమ్నుఁ డేసె దారుణభంగిన్. 176**

**ప్రతిపదార్థం:** ఆ+మాయాశరములు= ఆ మాయతో కూడిన బాణాలు; భగ్నమ్ములుగాన్+చేసి= ముక్కలుగా వ్యర్థంచేసి; తద్+ముఖమ్మునన్= అతడి మొగాన; తద్+వక్షమ్మునన్= ఆతడి రొమ్ముమీద; ఒక్కట= ఏకకాలంలో; బ్రహ్మ+అస్త్రమ్మును= బ్రహ్మపేరిటి మంత్రబాణాన్ని; ప్రద్యుమ్నుఁడు; దారుణభంగిన్= భయంకరరీతిగా; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** సాల్వుడు వేసిన మాయాబాణాలను వమ్ముచేసి ప్రద్యుమ్నుడు, అతడి ముఖాన్ని, రొమ్మును ఒకేసారి తాకేటట్లు బ్రహ్మాస్త్రాన్ని భయంకరంగా ప్రయోగించాడు.

**వ. ఇట్లు బ్రహ్మాస్త్రపీడితుండయి సాల్వుండు మూర్ఛవోయి రథంబుపయింబడిన వాని వెండియు నొక్కదివ్యబాణంబున నేయ సమకట్టిన నంతరిక్షంబున హాహారవంబు లెసఁగె,; నంత దేవగణ ప్రేరితులైన నారద మారుతులు ప్రద్యుమ్నుపాలికి వచ్చి యిట్లనిరి. 177**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; బ్రహ్మ+అస్త్ర, పీడితుండు+అయి= బ్రహ్మాస్త్రంచేత బాధించబడినవాడయి; సాల్వుండు; మూర్ఛ, పోయి= మూర్ఛిల్లి; రథంబుపయిన్= తేరిపై; పడిన; వాని= వాడిని; వెండియున్= మళ్ళీ; ఒక్క దివ్యబాణంబునన్= దేవతాసంబంధమైన ఒక బాణంతో; ఏయ, సమకట్టినన్= వేయటానికి పూనుకోగా; అంతరిక్షంబునన్= ఆకాశంలో; హాహారవంబులు=

హాహాఅనేధ్వనులు; (భయోత్పాతాన్ని సూచించే అరుపులు); ఎసఁగెన్= విస్తరిల్లాయి; అంతన్; దేవ, గణ, ప్రేరితులు+ఐ= దేవతల సమూహంచేత ప్రేరేపించబడినవారై; నారద మారుతులు= నారదుడు; వాయుదేవుడు; ప్రద్యుమ్ను పాలికి, వచ్చి= ప్రద్యుమ్నుడి దగ్గరకు వచ్చి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** సాల్వుడు బ్రహ్మాస్త్రపీడితుడై మూర్ఛిల్లాడు. ప్రద్యుమ్నుడు మరొక దివ్యబాణాన్ని సంధిస్తుండగా, ఆకాశంలో హాహాకారాలు ఉప్పతిల్లాయి. దేవతలప్రేరణచొప్పున నారదుడు, వాయుదేవుడు ప్రద్యుమ్నుడి కడకు వచ్చి ఇట్లా పలికారు.

**విశేషం:** కొన్ని ప్రతులలో నారదపర్వతులు వచ్చారని ఉన్నది. సంస్కృతమూలంలో "నారదం ప్రేషయామాసుః శ్వసనం చ మహాజవమ్'' - అని ఉన్నది. అందుచేత నారద మారుతుల అనే పాఠమే ఇచట గ్రహించదగింది.

**తే.** **'వీఁడు నీచేత వధ్యుండు గాఁడు, మిన్న । కేయ కుండుము.; వీని నారాయణుండు**
**మొనసి వధియించు' నని పల్కె వనజగర్భుఁ । డనినఁ బ్రద్యుమ్నుఁ డేయక యనఘుఁ డుండె. 178**

**ప్రతిపదార్థం:** వీఁడు= ఇతడు అంటే సాల్వుడు; నీచేత; వధ్యుండు, కాఁడు= చంపదగిన వాడు కాడు; మిన్నక+ ఏయక+ ఉండుము= (బాణం) వేయకుండ ఊరకుండుము; వీనిన్= ఇతడిని; (ఈసాల్వుడిని); నారాయణుండు= విష్ణువు; మొనసి= పూని; వధియించున్= చంపుతాడు; అని; వనజ గర్భుఁడు= బ్రహ్మదేవుడు (పద్మగర్భంనుండి పుట్టినవాడు); పల్కెన్= పల్కినాడు; అనినన్; అనఘుఁడు= పాపరహితుడు; ప్రద్యుమ్నుఁడు; ఏయక, ఉండెన్= (బాణాన్ని) ప్రయోగించకుండ మిన్నక ఉండిపోయాడు.

**తాత్పర్యం:** 'వీడు నీచేత చంపదగినవాడు కాడు. వీడిని నారాయణుడే వధిస్తాడు' అని బ్రహ్మదేవుడు చెప్పినట్లు నారద మారుతులు పలుకగా ప్రద్యుమ్నుడు ఇంక తాను బాణం వేయక మిన్నకున్నాడు.

## సాల్వుఁడు ప్రద్యుమ్నునిచే బాధితుండై మరలిపోవుట (సం. 3-20-26)

**వ.** **అంత సాల్వుండును నివృత్తుండయి ద్వారకాపురి యవరోధం బుడిగి తన సౌంభక బెక్కి క్రమ్మఱి చనియె; నంత నీ యజ్ఞంబు నిర్వృత్తం బయిన నేనరిగి బల భగ్నీకృత పాదపవనంబుల దాని, ననభిజ్ఞాత ద్వారదేశంబుల దాని, నస్వాధ్యాయ స్వాహాకార మహీసురాగారం బయిన దాని, నపేత భూషణ యోషిజ్జనంబుల దాని ద్వారవతిం జూచి, యాహుకాత్మజువలన నంత వృత్తాంతంబును నెఱింగి, సాల్వుం జంపి కాని యిప్పురంబు సొర నొల్ల నని నిశ్చయించి, దీని నప్రమాదులరై రక్షించుకొని యుండుండని బలదేవాదులం బంచి, యప్పుడ ప్రయాణభేరి సఱవం బంచి, కృత స్వస్తి వచన పురోహిత ప్రముఖ బ్రాహ్మణ వరులకు నమస్కరించి శైబ్యసుగ్రీవంబులను వాహనంబులం బూనిన దివ్యరథం బెక్కి. 179**

**ప్రతిపదార్థం:** అంత; సాల్వుండును; నివృత్తుండు+అయి= మరలిన వాడై; ద్వారకాపురి, అవరోధంబు+ఉడిగి= ద్వారకా నగరాన్ని ముట్టడించటం మాని; తన సౌంభకంబు+ఎక్కి= (కామగమనశక్తి ఉన్న) తన సౌంభకాన్ని ఎక్కి; క్రమ్మఱి= వెనుతిరిగి; చనియెన్= వెళ్ళిపోయాడు; అంత, నీ, యజ్ఞంబు= నీ (రాజసూయ) యాగం; నిర్వృత్తంబు+అయిన= పూర్తికాగా; నేను+అరిగి= నేను వెళ్ళి (అంటే ద్వారకకు వెళ్ళి); బల, భగ్నీకృత, పాదప, వనంబుల దానిన్= సేనలచేత భగ్నం చేయబడిన

చెట్ల తోటలు కలదానిని; అనభిజ్ఞాత, ద్వార దేశంబులదానిన్= గుర్తింపరాని ద్వారసీమలు కల దానిని; అ+స్వాధ్యాయ, స్వాహాకార, మహీసుర+అగారంబు+అయినదానిన్= వేదపారాయణలు, స్వాహాకారాలు (యజ్ఞాలలో హవిస్సులు వేల్చేటప్పుడు మంత్రాల చివర ఉచ్చరింపబడేవి) లేని బ్రాహ్మణ గృహాలు గలదానిని (అంటే ఆనాడు ద్వారకలో వేదపఠనం లేదు, యజ్ఞయాగాదులు జరగటం లేదన్న మాట); అపేత, భూషణ, యోషిత్+జనంబుల దానిన్= తొలగించబడిన ఆభరణాలు కల స్త్రీ జనం కల దానిని; ద్వారవతిన్+చూచి= ద్వారకను చూచి; ఆహుక+ఆత్మజు వలనన్= ఉగ్రసేనుడి వలన (కంసుడి తండ్రి - శ్రీకృష్ణుడి తాత ఉగ్రసేనుడు); అంత, వృత్తాంతంబునున్+ఎఱింగి= జరిగినదంతయు తెలిసికొని; సాల్వున్+చంపి, కాని= సాల్వుడిని సంహరించిన పిమ్మట కాని; ఈ+పురంబు= ఈ పట్టణం; చొరన్+ఒల్లన్+అని= ప్రవేశించనని; నిశ్చయించి= నిర్ణయించి, దీనిన్= దీనిని (ఈ ద్వారకాపురిని); అప్రమాదులరు+ఐ= జాగరూకులై; రక్షించుకొని+ఉండుండు+అని= కాపాడుకొంటూ ఉండండని; బలదేవ+ఆదులన్, పంచి= బలరాముడు మున్నగువారిని ఏర్పరచి; అప్పుడు+అ= అప్పుడే; ప్రయాణ భేరి; చఱవన్, పంచి= ప్రయోగించటానికి ఆజ్ఞాపించి; కృత, స్వస్తివచన, పురోహిత, ప్రముఖ, బ్రాహ్మణవరులకు= చేయబడిన "స్వస్తి" వాక్యాలు కల పురోహితులు మొదలైన బ్రాహ్మణ శ్రేష్ఠులకు; నమస్కరించి= మొక్కి; శైబ్య, సుగ్రీవంబులు+అను= శైబ్యం, సుగ్రీవం అనే పేర్లు కల; వాహనంబులన్= గుర్రాలను; పూనిన= కట్టబడిన; దివ్యరథంబు+ఎక్కి= దేవతామహత్తు కల తేరును ఎక్కి.

**తాత్పర్యం:** అటుపిమ్మట ద్వారకానగరంపై ముట్టడిమాని, సౌంభకం ఎక్కి సాల్వుడు వెళ్ళిపోయాడు. రాజసూయయాగం పూర్తి అయిన పిమ్మట నేను ద్వారకకు వెళ్ళి చూడగా - అచ్చటి ఉద్యానవనాలు శత్రుసైనికులచేత నాశనమయి పోయాయి. ప్రవేశ ద్వారసీమలు గుర్తు పట్టలేనట్లు మారిపోయాయి. విప్రగృహాలలో వేదపారాయణ వినిపించటం లేదు. యజ్ఞ యాగాదులు జరగటం లేదు. స్వాహాకారాలు వినరాలేదు. స్త్రీ జనాల శరీరాలపై ఆభరణాలే లేవు. 'ఇక, సాల్వుడిని చంపి కాని తిరిగి ద్వారకానగరం ప్రవేశించజాల' నని శపథం చేసి, పురరక్షణకై బలరామాదులను నియోగించి వెంటనే ప్రయాణభేరి మ్రోగింపజేసి, పురోహిత బ్రాహ్మణాశీస్సులు అందుకొని, శైబ్య సుగ్రీవా లనే గుర్రాలను పూన్చిన దివ్యరథం అధిరోహించి.

**ఆ.** **పాంచజన్యరవముఁ బంచమహాశబ్ద । రవముఁ జెలఁగె దిశలు సెవుడు వడఁగ**
**నొలసి జనుల దీవనలు మించె రమ్యమై । గరుడకేతనంబు గ్రాలెఁ జదల.** **180**

**ప్రతిపదార్థం:** పాంచజన్య రవమున్= పాంచజన్యమనే పేరున్న శంఖధ్వని (పాంచజన్యం శ్రీ మహావిష్ణువు యొక్క శంఖం); పంచమహాశబ్దరవమున్= ఐదు గొప్ప జంత్రాలనుండి వచ్చే ధ్వనియు; దిశలు= దిక్కులు; చెవుడు+పడఁగన్= వినిపించనంతటి పెద్ద ధ్వని ఏర్పడగా (చెవులకువలె దిక్కులకు చెవుడు వచ్చిందని భావం); ఒలసి= వ్యాపించి; జనుల, దీవనలు= ప్రజల ఆశీస్సులు; రమ్యము+ఐ= అందమై; మించె= అతిశయించాయి; చదలన్= ఆకాశంలో; గరుడకేతనంబు= గరుత్మంతుడు గుర్తుగా ఉండే జెండా; క్రాలెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** పాంచజన్య శంఖారావం, పంచ మహావాద్యాలధ్వనులు దిక్కులు చెవుడు పడేటట్లు అతిశయిల్లాయి. ప్రజల ఆశీస్సులు వెల్లివిరిశాయి. మనోహరంగా గరుడధ్వజం ఆకాశంలో ప్రకాశించింది. (ఢక్కా మృదంగ పటహాది పంచమహావాద్యాల శబ్దాలు పంచమహాశబ్దాలు.)

**విశేషం:** పంచజనుడనే రాక్షసుని శరీరం నుండి లభించినందువలన శ్రీకృష్ణుని శంఖానికి 'పాంచజన్యం' అనే పేరు ఏర్పడింది.

**వ.** **అ ట్లసంఖ్యాత చతురంగ సైన్యంబులతో నరిగి గిరి వన సరోవర సరిద్దేశంబులు గడచి మార్తికావత దేశంబున కరుగునంతకు ముందర సాల్వుండు సౌంభకారూఢుండయి సముద్రకుక్షిదేశంబునకుం బోయిన.181**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ రీతిగా; అసంఖ్యాత, చతురంగ సైన్యంబులతోన్+అరిగి= లెక్కకు మిక్కిలి అయిన (రథ గజ తురగ పదాతి) చతురంగ సైన్యంతో వెళ్ళి; గిరి, వన, సరోవర, సరిత్, దేశంబులు= కొండలు, అడవులు, సరస్సులు, నదులు ఉండే స్థలాలు; కడచి= అతిక్రమించి (దాటి); మార్తికావత దేశంబునకు= మార్తికావత మనే దేశానికి; అరుగునంతకున్= వెళ్ళేటప్పటికి; ముందరన్= ముందుగా; సాల్వుండు; సౌంభక+ఆరూఢుండు+అయి= సౌంభకాన్ని అధిరోహించి; సముద్ర కుక్షి, దేశంబునకున్+పోయినన్= సముద్ర గర్భదేశానికి వెళ్ళగా.

**తాత్పర్యం:** ఆ రీతిగా లెక్కకు మిక్కిలి అయిన చతురంగ బలాలతో కొండలు, అడవులు, సరస్సులు, నదులు దాటి మార్తికావతదేశానికి వెళ్ళగా, అక్కడ సాల్వుడు ముందే సౌంభకాన్ని ఎక్కి సముద్రగర్భంలోకి వెళ్ళాడు.

**విశేషం:** కొన్ని ప్రతులలో మార్తికావత దేశానికి బదులు- పారశీక, వార్తికావతి, వార్తిక, ఆనర్తక- అనే పాఠాంతరాలు కనపడుతున్నాయి. అయితే, మూలంలో ఇట్లా ఉన్నది. "సరాంసి సరితశ్చైవ మార్తికావత మాసదమ్". (వావిళ్ల ప్రతిలో మూర్తికావత దేశంబున'- అనే పాఠాంతరం ఉన్నది.)

**క.** **ఏనును వాని పిఱుందన । మానక చని తచ్చమూసమాజముతోడన్**
**భూనాథ! రణము సేసితి । నానానిశితాస్త్రవర్షణవ్యాప్తముగన్. 182**

**ప్రతిపదార్థం:** భూనాథ!= ఓరాజా!; ఏనును= నేనున్నూ; వాని పిఱుందన్+అ= వాడివెనుకనే; మానక,చని= వదలకవెళ్ళి; తత్+చమూ, సమాజము తోడన్= ఆతడి సేనా సమూహంతో; నానా, నిశిత+అస్త్ర, వర్షణ, వ్యాప్తముగన్= వాడి అయిన పెక్కు అస్త్రాలను వర్షంవలె అంతట వ్యాపించేటట్లు కురిపిస్తూ; రణము+చేసితిన్= యుద్ధం చేశాను.

**తాత్పర్యం:** ఓ రాజా (ఓ ధర్మరాజా)! నేను కూడ వాడివెనుకనే వెళ్ళి పెక్కువాడిఅయిన అస్త్రాలు వర్షంవలె విరివిగా కురిపిస్తూ వాడి సేనాసమూహంతో యుద్ధం చేశాను.

**క.** **వీరు లగు సాల్వయోధుల । నారాచావళులు గప్పె నా రథముపయిన్**
**సారథిఁ దురంగముల పయిఁ । జారుధ్వజయష్టిపయి నసంఖ్యాతముగన్. 183**

**ప్రతిపదార్థం:** వీరులు+అగు= పరాక్రవంతు లయిన; సాల్వయోధుల= సాల్వుని శూరులయొక్క; నారాచ+ఆవళులు= బాణ సమూహాలు; నా రథముపయిన్= నా తేరుపైన; సారథిన్, తురంగములపయిన్= రథచోదకుడిపైన, గుర్రాలపైన; చారు, ధ్వజ, యష్టిపయిన్= అందమైన జెండా కొయ్యపైన; అసంఖ్యాతముగన్= లెక్కకు మిక్కిలిగా; కప్పెన్= కప్పివేశాయి. (కనబడకుండాచేశాయి)

**తాత్పర్యం:** వీరాధివీరులైన సాల్వయోధులు ప్రయోగించిన బాణసముదాయం లెక్కకు మిక్కిలిగా నా రథాన్ని, సారథిని, గుర్రాలను జెండాను కన్పించకుండ దట్టంగా కప్పి వేశాయి.

**వ.** **వాని నెల్ల నస్మదీయ గోచరంబులు గాకుండ ననేకాయుతశరంబు లేసి సాల్వుసైన్యంబుతో మహాయుద్ధంబు సేసిన. 184**

**ప్రతిపదార్థం:** వానిన్+ఎల్లన్= ఆ బాణాలన్నీ; అస్మదీయ, గోచరంబులు, కాకుండన్= నాకు విషయాలు కాకుండా (తగులకుండ); అనేక+అయుత, శరంబులు+ఏసి= పెక్కు పదివేల బాణాలు ప్రయోగించి; సాల్వ సైన్యంబుతో= సాల్వుడి సేనతో; మహాయుద్ధంబు, చేసినన్= గొప్ప యుద్ధం చేయగా.

**తాత్పర్యం:** ఆ బాణాలన్నీ నన్ను చేరకుండానే నేను పెక్కువేలబాణాలు వేసి సాల్వుడిసేనతో గొప్పయుద్ధం చేశాను.

**మ.** **అవనీనాథ! తదాహవాంతరమునం దస్మత్కరాకృష్ట శా**
**ర్ఙ్గ వినిర్ముక్త నిశాతసాయకశతాగ్రచ్ఛిన్నమై దైత్య దా**
**నవదేహప్రకరంబు వాతవిధుతార్ణఃపూర్ణ సంఘూర్ణితా**
**ర్ణవకుక్షిం బడియెం గపిప్రవరసైన్యక్షిప్త శైలాకృతిన్.** **185**

**ప్రతిపదార్థం:** అవనీ, నాథ!= ఓరాజా! (ధర్మరాజా!); తద్+ఆహవ+అంతరమునన్= ఆ యుద్ధమధ్యంలో; అస్మద్, కర+ఆకృష్ట, శార్ఙ్గ, వినిర్ముక్త, నిశాత, సాయక, శత+అగ్ర+ఛిన్నము+ఐ= నాచేతులచేత అనుసంధించబడిన శార్ఙ్గం అనే విల్లునుండి వదలబడిన వాడి అయిన వందల కొలది బాణాల కొనలచేత (ములుకుల చేత) ముక్కలు ముక్కలుగా చేయబడి; దైత్య, దానవ, దేహ, ప్రకరంబు= రాక్షసుల కళేబరాల సముదాయం; వాత, విధుత+అర్ణస్+పూర్ణ, సంఘూర్ణిత+అర్ణవ, కుక్షిన్= గాలిచేత చెదరగొట్టబడిన నీటితో నిండి తిరుగుడు పడిన సముద్రంయొక్క కడుపులో; కపిప్రవర, సైన్య, క్షిప్త, శైల+ఆకృతిన్= వానర శ్రేష్ఠుడి (సుగ్రీవుడి) సైన్యంచే విసరివేయబడిన కొండల రూపాలను సరిపోలుతూ; పడియెన్= పడింది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నాచేత ఎక్కు పెట్టబడిన శార్ఙ్గమనే నా వింటి నుండి వెలువడిన వాడి బాణసమూహాలచేత ముక్కలు ముక్కలై రాక్షసులదేహాలు, సుగ్రీవుడి సేనలచేత విసరబడిన కొండలవలె, గాలిచేత చెదరగొట్టబడిన నీటిచే తిరుగుడు పడిన సముద్రమధ్యంలో పడిపోయాయి.

**విశేషం:** ఈ పద్యం నన్నయ కవితా శిల్పానికి అంతర్వాహిని అయిన అక్షరరమ్యతకు ఉదాహరణమైనది. సుదీర్ఘ సమాసాలు ప్రయోగించినా నన్నయశైలి ప్రసన్నకథాకలితార్థయుక్తికి ఆకరం. దైత్యులు= దితికి జన్మించినవారు, దానవులు= దనువుకు జన్మించినవారు= రాక్షసులు.

**చ.** **ఘనతర దైత్య దానవ నికాయ కళేబర పాత ఘట్టనం**
**దనరి యుగాంత్యకాలచలితంబునుబోలెఁ బయోధి మ్రోసె న**
**వ్వనధి రవంబుకంటె ననివారితమై చెలఁగెన్ మదీయ వా**
**హిని భట సింహనాదహయహేషిత సింధురబృంహితధ్వనుల్.** **186**

**ప్రతిపదార్థం:** ఘనతర, దైత్య, దానవ, నికాయ, కళేబర, పాత ఘట్టనన్+తనరి= మిక్కిలి పెద్దవైన దైత్యుల యొక్కయు, దానవుల యొక్కయు (రాక్షసుల) సమూహాల శరీరాలు పడిన రాపిడిచేత అతిశయించి; యుగ+అంత్యకాల, చలితంబును+పోలెన్= ప్రళయకాలంలో కదలాడేటట్లు; పయోధి= సముద్రం; మ్రోసె= ధ్వని చేసింది; అవ్వనధి (ఆ+వనధి)= ఆ సముద్రంయొక్క; రవంబు కంటెన్= మ్రోతకంటె; మదీయ వాహినిన్= నా సేనలోని; భట, సింహనాద, హయ, హేషిత, సింధుర, బృంహిత, ధ్వనుల్= భటుల సింహనాదాలు, గుర్రాల సకిలింపులు, ఏనుగుల ఘీంకారాలు (వాటిధ్వనులు); అనివారితము+ఐ= నివారించటానికి వీలులేనివై; చెలఁగెన్= శబ్దించాయి.

**తాత్పర్యం:** మిక్కిలి పెద్దవైన రాక్షసుల శరీరాలు సముద్రంలో కుప్పలుతెప్పలుగా కూలుతున్నప్పుడు, సముద్రం ప్రళయకాలంలో ఘూర్ణిల్లుతున్నట్లు పెనురొద చేసింది. నా సైన్యాలలో చెలరేగిన వీరభటుల సింహనాదాలు, గుర్రాల సకిలింపులు, ఏనుగుల ఘీంకారాలు- ఆ సముద్రఘోషనుకూడ మించిపోయాయి.

**విశేషం:** వీరభటులు ఉత్సాహంతో చేసేనాదం సింహనాదం. అది గర్జనవంటిది. సంస్కృత భాషలో గుర్రాల సకిలింపునకు హేష అనిన్నీ, ఏనుగుల ఘీంకారానికి బృంహితం అనిన్నీ ప్రత్యేక పరిభాష. పద్యం మొదటి సగంలో ఉపమాలంకారం. రెండో సగంలో అతిశయోక్తి.

**వ. అట్టి మదీయ సేనోత్సాహంబును నిజసేనాక్షీణతయుం జూచి సహింపక సాల్వుండు వెండియు సౌంభకారూఢుం డయి నాతో మాయాయుద్ధంబు సేయ సమకట్టె. 187**

**ప్రతిపదార్థం:** అట్టి; మదీయ, సేనా+ఉత్సాహంబును= నా భటుల యొక్క ఉత్సాహాన్ని; (ఉత్సాహ మంటే గొప్ప పనులు చేయటంలో స్థిర సంకల్పంతో కూడిన అవిరళ ప్రయత్నం); నిజ, సేనా, క్షీణతయున్+చూచి= తన సేన తగ్గిపోవటాన్ని చూచి; సహింపక= తట్టుకోలేక; సాల్వుండు; వెండియు= మరల; సౌంభక+ఆరూఢుండు+అయి= సౌంభకాన్ని ఎక్కినవాడయి; నాతోన్; మాయాయుద్ధంబు= మాయతో కూడిన యుద్ధం; చేయ, సమకట్టె= చేయటానికి పూనుకొని.

**తాత్పర్యం:** నా సైనికులలో పెల్లుబికిన ఉత్సాహాన్ని తన సేన బలహీనపడటాన్ని గ్రహించిన సాల్వుడు సహింపలేక తిరిగి సౌంభకం ఎక్కి నాతో మాయాయుద్ధం చేయటానికి పూనుకొన్నాడు.

**సీ. పరశు పాశాంకుశ కరవాల శూల ము । ద్గరములు నా మీఁదఁ దెరలఁ గురిసె;**
**నేనును గడఁగి యద్దానవు శస్త్రముల్ । వాయంగఁ జేసితి; మాయఁ జేసి**
**వెఱవక సాల్వుండు వెండియు నామీఁదఁ । బరుషశిలావృష్టిఁ గురిసె; వరుస**
**నమరఁ దమః ప్రకాశములతో దుర్దిన । సుదిన శీతోష్ణముల్ గదియఁ జేసి**

**ఆ. దితిసుతాధముండు శతసూర్య శతచంద్ర । శతసహస్ర వహ్నితతులు వెలుఁగ**
**గగనతలము సేసెఁ బగలిది రేయిది । యని యెఱుంగ నయితి మనములోన. 188**

**ప్రతిపదార్థం:** నామీఁదన్+తెరలన్= నాపై పడేటట్లు; పరశు, పాశ+అంకుశ, కరవాల, శూల, ముద్గరములు= గండ్ర గొడ్డళ్లు, ఉరిత్రాళ్లు, ఏనుగుకోలలు, కత్తులు, బల్లెము, (మూడు మొనలవి), ఇనుపగుదియలు; కురిసెన్= వర్షించాడు; నేనును; కడఁగి= పూని, ఆ+దానవు, శస్త్రముల్= ఆ రాక్షసుడి ఆయుధాలు; పాయంగన్+చేసితిన్= వ్యర్థం చేశాను; మాయన్+చేసి= మాయచేత; సాల్వుండు= సాల్వుడు; వెఱవక= భయపడక; వెండియు= మరల; నామీఁదన్; పరుష, శిలా, వృష్టిన్+కురిసెన్= కఠినమైన రాలవాన కురియించాడు; వరుసన్= క్రమంగా; అమరన్= ఏర్పడ; తమస్+ప్రకాశములతోన్= చీకటి వెలుతురులతో; దుర్దిన, సుదిన, శీత+ఉష్ణముల్= సూర్యరశ్మి కనిపించనట్టి, కనిపించే దినం నాటి చలి, వేడి; కదియన్+చేసి= ఏర్పడేటట్లు చేసి; దితి, సుత+అధముండు= అల్పుడైన దితికొడుకు (రాక్షసుడు); శతసూర్య, శతచంద్ర, శతసహస్ర, వహ్నితతులు వెలుఁగన్= వంద సూర్యులు, వంద చంద్రులు, లక్ష అగ్నిహోత్రుల సమూహాలు వెలుగొందగా; గగనతలము= ఆకాశాన్ని; చేసెన్= చేశాడు; మనములోనన్= మనస్సులో; పగలు+ఇది= ఇది పగలు; రేయి+ఇది= ఇది రాత్రి; అని; ఎఱుంగన్+అయితిన్= తెలిసికొనలేకపోయాను.

**తాత్పర్యం:** నీచ రాక్షసుడైన సాల్వుడు నామీద గండ్రగొడ్డళ్ళు, ఉరితాళ్ళు, అంకుశాలు, కత్తులు, బల్లెములు, ఇనుపగుదియలు వర్షించాడు. నేను వాటిని అన్నింటిని వ్యర్థం చేశాను. అతడు మరల మాయకు ఉపక్రమించి నామీద రాళ్ళవర్షం కురిపించాడు. చీకట్లతో, చలితో మేఘాలు క్రమ్మిన రోజులను, వెలుగుతో, వేడితో ప్రకాశించే రోజులను కల్పించాడు. ఆకాశంలో నూర్గురు సూర్యులు, నూర్గురు చంద్రులు, లక్ష అగ్నిహోత్రులు వెలిగేటట్లు చేసి, ఇది పగలు, ఇది రాత్రి అని నేను తెలిసికొనటానికి వీలులేకుండ చేశాడు.

**విశేషం:** 'మాయన్, చేసి'= నశింప చేసి అని కూడ అర్థం చెప్పవచ్చును. అప్పు డది 'పాయఁజేసి'తో అన్వయిస్తుంది. మేఘాచ్ఛన్నమైన దినం దుర్దినం. పై పద్యం యొక్క ఐదవ పంక్తిలో 'శతసహస్ర విష్ణుతతులు వెలుఁగ' అనే ఈ పాఠం ఆనందాశ్రమ గ్రంథమాల ప్రతిలో ఉన్నది.

**క. మనుజేంద్ర! సర్వ మాయా । పనోదనం బయిన యగ్నిబాణంబున న**
**ద్దనుజ వినిర్మిత మాయా । వినివర్తనఁ జేసితిని సవిస్మయమతినై. 189**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్ర!= ఓరాజా! (ధర్మరాజా!); సర్వ మాయా+అపనోదనంబు+అయిన= సమస్తమైన మాయలు తొలగించే; అగ్ని, బాణంబునన్= ఆగ్నేయాస్త్రంచేత; స, విస్మయ మతిని+ఐ= ఆశ్చర్యంతో కూడిన మతి కలవాడినై; ఆ+దనుజ, వినిర్మిత, మాయా, వినివర్తనన్+చేసితిని= ఆ రాక్షసుడిచేత నిర్మించబడిన మాయను పూర్తిగా మరల్పజేశాను.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! సమస్తమైన మాయలను పరిహరించే ఆగ్నేయాస్త్రంచేత ఆ రాక్షసుడు కల్పించిన మాయను తొలగించాను. ఇది నాకే ఆశ్చర్యకరమైంది.

**వ. అట్టి యవసరంబున ద్వారవతినుండి యాహుకప్రేషితుండయి యొక్కరుం డతిత్వరితగతిం బఱతెంచి 'సాల్వుచేత నక్కడ వసుదేవుండు పట్టువడియె నీ వెవ్వనితోడం గయ్యంబు సేసెదు? క్రమ్మఱి చని పురంబు రక్షించుకొను' మనిన విని యదరిపడి 'మహాబలపరాక్రములైన బలదేవాదులు రక్షించుకొని యుండ వసుదేవుఁ డేల పట్టువడు? నిది పోల' దని సంశయించుచు విమనస్కుండ నయి యుండునంత. 190**

**ప్రతిపదార్థం:** అట్టి+అవసరంబున= ఆ సమయంలో; ద్వారవతి నుండి= ద్వారకనుంచి; ఆహుక, ప్రేషితుండు+అయి= ఆహుకుడిచేత పంపబడినవాడై; ఒక్కరుండు; అతి త్వరితగతిన్+పఱతెంచి= మిక్కిలి వేగంగా వచ్చి; సాల్వుచేతన్= సాల్వుడిచేత; అక్కడ= ఆ ద్వారకలో; వసుదేవుండు; పట్టువడియెన్; నీవు+ఎవ్వనితోడన్= నీవు ఎవరితో; కయ్యంబు= యుద్ధం; చేసెదు; క్రమ్మఱి చని= తిరిగిపోయి; పురంబు, రక్షించుకొనుము+అనిన= ద్వారకను కాపాడుకో అని అంటే; విని; అదరిపడి; మహా, బల, పరాక్రములు+ఐన= గొప్ప బలశౌర్యాలు కల; బలదేవ+ఆదులు= బలరాముడు మున్నగు వారు; రక్షించుకొనిఉండన్; వసుదేవుఁడు+ఏల, పట్టువడున్; ఇది; పోలదు+అని= సరిపడదని; సంశయించుచు= సందేహం పొందుతూ; విమనస్కుండను+అయి= చెదరిన మనస్సు కలవాడినయి; ఉండునంత.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఒక వార్తాహరుడు ఆహుకుడిచేత పంపబడినవాడై ద్వారకనుండి వచ్చాడు. ద్వారకలో వసుదేవుడు సాల్వుడిచేతికి చిక్కినాడనిన్నీ, నీవు వెళ్ళి ద్వారకాపురిని రక్షించుకొనాలనిన్నీ అతడు చెప్పాడు. మహాబలవంతులైన బలరామాదులు ఉండగా వసుదేవుడు ఎట్లా సాల్వుడిచేతికి చిక్కాడు? ఇది సరిపోని విషయం' అని నేను నా మనస్సులో చింతిస్తూ ఉండగా.

**సీ.** **పుణ్యకర్మంబులు వొలిసిన నుర్వికిఁ । బ్రీతి నేతెంచు యయాతి వోలె**
**భూషణదీప్తులు వొలియంగ వివృత కే । శాంబరుం డయి సౌంభకంబువలనఁ**
**బఱతెంచు వసుదేవుఁ బాప నిశాచర । బల పీడ్యమాను దవ్వులను కాంచి**
**యత్యంత మోహశోకాంధుండ నయిన నా । హస్తంబు వలన విస్రస్త మయ్యె**

**ఆ.** **శార్ఙ్గ మప్రియావసన్నదేహుండనై । యుడిగి రథముమీఁదఁ బడితి నేను;**
**దానిఁ జూచి భయము దగిలి మత్సైన్యంబు । దల్లడిల్లి యులిసెఁ బెల్లు రేఁగి.** **191**

**ప్రతిపదార్థం:** పుణ్య, కర్మంబులు, పొలిసినన్= చేసిన పుణ్యఫలాలు క్షీణించగా; ఉర్వికిన్= భూలోకానికి (స్వర్గం వదలి); ప్రీతిన్= మక్కువతో; ఏతెంచు= వచ్చు; యయాతి, పోలె= యయాతివలె; భూషణదీప్తులు= ఆభరణ కాంతులు; పొలియంగన్= తగ్గిపోవగా; వివృత, కేశ+అంబరుండు+అయి= విడివడిన తలజుట్టు, బట్టలు కలవాడయి; సౌంభకంబువలనన్= సౌంభకంనుండి; పఱతెంచు= వచ్చే; వసుదేవున్; పాప, నిశాచర, బలపీడ్యమానున్= పాపులైన రాక్షసులచేత పీడించబడుతున్నవాడిని; దవ్వులన్+అ, కాంచి= దూరం నుండే చూచి; అత్యంత, మోహ, శోక+అంధుండను+అయిన= మిక్కుటమైన భ్రాంతిచేత, దుఃఖంచేత గుడ్డివాడనుకాగా; నా, హస్తంబువలనన్= నా చేతినుండి; శార్ఙ్గము= శార్ఙ్గమనే పేరుకల విల్లు; విస్రస్తము+అయ్యెన్= జారిపడిపోయింది. అప్రియ+అవసన్న దేహుండను+ఐ= దుఃఖంచేత వశం తప్పిన దేహం కలవాడినై; ఉడిగి= విరమించి; ఏను; రథము మీఁదన్= తేరిపై; పడితిన్= కూలబడ్డాను; దానిన్+చూచి= దాన్ని (ఆ సంఘటనను) చూచి; భయము, తగిలి= భయపడి; మత్, సైన్యంబు= నాసేన; తల్లడిల్లి= ఎంతో బాధనొంది; పెల్లురేఁగి= మిక్కిలి ఉద్రేకపడి; ఉలిసెన్= ఆక్రోశించింది (దుఃఖంతో అరిచింది).

**తాత్పర్యం:** చేసినట్టి పుణ్యం క్షీణించిన పిదప స్వర్గలోకంనుండి భూమికి దిగివచ్చే యయాతివలె, ఆభరణకాంతులు తగ్గిపోవగా, చెదరిన తల జుట్టు, బట్టలతో సౌంభకంనుండి వసుదేవుడు రాక్షసులచేత పీడించబడుతూ అవతరించటం నాకు కనిపించింది. దాన్ని చూచి దుఃఖంతో మోహాంధుడి నయిన నాచేతినుండి శార్ఙ్గమనే ధనుస్సు జారి క్రిందపడింది. నేను రథంపై కూలబడిపోయాను. ఆ అవస్థను చూచి నాసేన ఎంతో బాధపడి అతిశయించిన ఉద్రేకంతో ఆక్రోశించింది.

**వ.** **అంత నెంతయుం బ్రొద్దునకుఁ దెలిసి సాల్వ సౌంభకంబున వసుదేవుం గానక దాని మాయగా నెఱింగి, పదంపడి మాయావి యయిన సాల్వుం జూచి వానిపయి నలిగి యే నేసిన నయ్యసురయు సౌంభకంబు నదృశ్యం బగుటయు.** **192**

**ప్రతిపదార్థం:** అంతన్; ఎంతయున్+ప్రొద్దునకున్= చాలాసేపటికి; తెలిసి= తెలివొంది; సాల్వ, సౌంభకంబున= సాల్వుడి సౌంభకంలో; వసుదేవున్, కానక= వసుదేవుడిని చూడక; దానిన్= ఆ సన్నివేశాన్ని; మాయగాన్= కల్పితమైనదాన్నిగా; ఎఱింగి= తెలిసికొని; పదంపడి= పిమ్మట; మాయావి+అయిన= మాయలమారి అయిన; సాల్వున్+చూచి= సాల్వుడిని చూచి; వాని పయిన్+అలిగి= వాడిమీద ఆగ్రహం చెంది; ఏన్= నేను; ఏసినన్= బాణప్రయోగం చేయగా; ఆ+అసురయు= ఆ రాక్షసుడున్నూ; సౌంభకంబున్= సౌంభకమున్నూ; అదృశ్యంబు+అగుటయు= కనిపించక పోవటమున్నూ.

**తాత్పర్యం:** అంత చాలాసేపటికి నాకు తెలివి వచ్చింది. చూశానుకదా సౌంభకంలో వసుదేవుడు కనిపించలేదు. ఇక అదంతయు రాక్షస కల్పితమాయ అని తెలిసికొన్నాను. పిదప మాయావి అయిన సాల్వుడిపై బాణంవేయగా ఆ రాక్షసుడున్నూ, సౌంభకమున్నూ అదృశ్యం కావటం జరిగింది.

**విశేషం:** అసుర శబ్దం వైకల్పికంగా స్త్రీసమం. అసుర-అసురుడు.

**క. అసురుల యాక్రోశధ్వను । లెసఁగెం బదిదిశల నంత నేనును దద్రా**
**క్షసుల గతాసులఁ జేసితిఁ । బ్రసభంబున శబ్దభేది బాణప్రతతిన్. 193**

**ప్రతిపదార్థం:** పది, దిశలన్= పది దిక్కులలో; అసురుల= రాక్షసుల; ఆక్రోశధ్వనులు+ఎసఁగెన్= హాహాకార విలాపనినాదాలు విస్తరించాయి; అంతన్= అంతట; ఏనును= నేనును; తద్, రాక్షసులన్= ఆ రక్కసులను; ప్రసభంబునన్= వేగంతో; శబ్ద, భేది, బాణ, ప్రతతిన్=శబ్దాన్ని బట్టి భేదించే బాణ సమూహాలతో; గత+అసులన్+చేసితిన్= పోయిన ప్రాణాలు కలవారినిగా చేశాను (సంహరించాను).

**తాత్పర్యం:** రాక్షసుల హాహాకారాలు దశదిశల విస్తరించాయి. అంతట నేను శబ్దభేదిబాణాలు ప్రయోగించి ఆ రాక్షసులను సంహరించాను.

**విశేషం:** శబ్దభేది బాణ ప్రయోగం ప్రాచీన భారతీయ సాహిత్యంలోని ఒక మనోహరకళ. లక్ష్యం కనిపించకపోయినప్పటికి కేవలం శబ్దాన్నిబట్టి లక్ష్యాన్ని తాకేటట్లుగా బాణాన్ని ప్రయోగించే నేర్పుకు శబ్దభేదివిద్య అని పేరు.

**వ. అంత సాల్వుండును దన సౌంభకంబుఁ బ్రాగ్జ్యోతిషంబుఁ జేసి తానును దానవుండయి పర్వతవర్షంబు నా పయిం గురిసిన. 194**

**ప్రతిపదార్థం:** అంత; సాల్వుండును; తన సౌంభకంబున్; ప్రాగ్జ్యోతిషంబున్+చేసి= ప్రాగ్జ్యోతిషపురంగా మార్చి; తానును; దానవుండు+అయి= రాక్షసుడుగా మారి; నాపయిన్= నామీద; పర్వత, వర్షంబున్= కొండలవాన; కురిసినన్= కురిపించగా.

**తాత్పర్యం:** అంత సాల్వుడు తన సౌంభకాన్ని ప్రాగ్జ్యోతిషపురంగా చేశాడు. తాను దానవుడై నామీద పర్వతాల వాన కురిపించాడు.

**ఆ. పరుష విషమ భూరి పాషాణ భీషణ । గిరులు వచ్చి నన్నుఁ దెరలఁ గప్ప**
**వజ్రబాణ మేసి వాని నన్నింటిని । బాచియున్న నన్నుఁ జూచి యపుడు. 195**

**ప్రతిపదార్థం:** పరుష, విషమ, భూరి, పాషాణ భీషణ గిరులు= కఠినాలైన వంకర టింకరగా, ఎగుడు దిగుడుగా ఉన్న మిక్కిలి పెద్దవైన బండలతో, భయంకరమైన కొండలు; వచ్చి; నన్నున్+తెరలన్+కప్పన్= నామీదపడి కలత చెందేటట్లు మెండుగా కప్పగా; వజ్ర, బాణము+ఏసి= వజ్రబాణం ప్రయోగించి (కఠినశిలలను భేదించేది వజ్రం); వానిన్+అన్నింటిని= ఆ కొండలను అన్నింటిని; పాచి, ఉన్న= తొలగించి ఉండగా; నన్నున్+చూచి= నన్ను చూచి; అపుడు.

**తాత్పర్యం:** ఆ రాక్షసుడు నాపై పెనుగొండలు తండోపతండంగా విసరగా, నేను పిడుగుటమ్ముతో వాటిని తొలగించిఉండగా నన్ను చూచి అపుడు.

**క. దారుకుఁ డిట్లనియె 'మహా । వీరు నుపేక్షింపఁదగునె? వీనిని మాయా**
**ప్రారంభు నుపేక్షింప ర । పార పరాక్రములు పోరఁ బ్రాకృతు నైనన్'. 196**

**ప్రతిపదార్థం:** దారుకుఁడు+ఇట్లు+అనియె; మాయాప్రారంభున్= మాయలమారితనం మొదలుపెట్టేవాడిని; మహావీరున్= దండిమగని; వీనిని; ఉపేక్షింపన్+తగునె?= నిర్లక్ష్యంగా వదలవచ్చునా?; అపార పరాక్రములు= మహావీరులు; ప్రాకృతున్+ఐనన్= అల్పుడే ఐనను; పోరన్- యుద్ధంలో; ఉపేక్షింపరు= వదలిపెట్టరు.

**తాత్పర్యం:** 'యుద్ధనీతి తెలిసిన మహావీరులు పోరాటంలో అల్పుడైన శత్రువును కూడ వదలిపెట్టరు కదా! వీడు మాయలమారి, పరాక్రమశాలి, వీడిని నిర్లక్ష్యంగా వదలిపెట్టదగునా?' అని సారథి అయిన దారుకుడు శ్రీకృష్ణుడికి హితోపదేశం చేశాడు.

**విశేషం:** రథికుడికి హితోపదేశం చేసే బాధ్యత సారథిది. ఆనాటి రథికుడికి సారథి సేవకమాత్రుడు గాడు, సచివుడు, మిత్రుడు, రాజుగారి మంత్రివర్గంలో సభ్యుడు. అందుచేత శ్రీకృష్ణుడి అంతటివాడికి సయితం సారథి అయిన దారుకుడు చొరవతో సముచిత సూచనలు చేయగలిగాడు. దీనిని బట్టి ఆ కాలంలో 'సారథి' పదవికి ఉండే ప్రాముఖ్యం అరయదగింది.

**వ. అనిన వాని పలుకులు విని యలిగి యనలజ్వాలాకరాళంబయి ప్రతికూల రాక్షస యక్షగంధర్వ దైత్యదానవ భస్మసాత్కరణదారుణం బయిన చక్రంబు నభిమంత్రించి సౌంభకంబు పయి వైచిన నది యుగాంతకాల పరివేషభీషణంబయిన రవిమండలంబునుంబోలె గగనంబునం బఱచి సౌంభకమధ్యంబునం బడిన. 197**

**ప్రతిపదార్థం:** అనిన; వాని పలుకులు= ఆ దారుకుని మాటలు; విని= ఆలకించి; అలిగి= రాక్షసుడిపై కోపించి; అనల, జ్వాలా, కరాళంబు+అయి= నిప్పుమంటలచేత భయంకరమైన; ప్రతికూల, రాక్షస, యక్ష, గంధర్వ, దైత్య, దానవ, భస్మసాత్కరణ, దారుణంబు+అయిన, చక్రంబున్= శత్రు పక్షం వహించిన రాక్షసులను, యక్షులను, గంధర్వులను, దైత్యులను, దానవులను మండించి బుగ్గి చేయటంలో భయంకరమైన చక్రాన్ని; అభిమంత్రించి= మంత్రాలను శాస్త్రీయంగా ఉచ్చరించి; సౌంభకంబుపై; వైచినన్= విసరగా; అది= ఆ చక్రం; యుగ+అంత, కాల, పరివేష, భీషణంబు+అయిన= ప్రళయ సమయంలో బింబం చుట్టూ కంకణం వలె గుండ్రంగా ఏర్పడే గొప్ప వెలుగుల చేత భయంకరమైన; రవి, మండలంబునున్+పోలె= సూర్యమండలంవలె; గగనంబునన్+పఱచి= ఆకసంలో వేగంగా వెళ్ళి; సౌంభక మధ్యంబునన్+పడినన్= సౌంభకమనే పట్టణం యొక్క మధ్యలో పడగా.

**తాత్పర్యం:** ఆ దారుకుడి మాటలు విని, కోపించి మంటలచే భయంకరమై, ప్రతికూలురైన రాక్షసులను, గంధర్వులను, యక్షులను, దైత్యులను, దానవులను మండించి బుగ్గిచేయటంలో దారుణమైన చక్రాన్ని మంత్రించి సౌంభకంమీదికి వేయగా ప్రళయసమయంలో ఏర్పడే గుండ్రని పరివేషంతో వెలుగులు విరజిమ్ముతూ మిగుల భీషణమైన సూర్యమండలంవలె ఆకాశంలో వెళ్ళి సౌంభకం మధ్య పడింది.

**చ. తడయక ఘోరదర్శన సుదర్శన పావకుచే దహింపఁగాఁ**
**బడి పరమేశ్వరోగ్రశరపావకదగ్ధ పురత్రయాభమై**
**యెడరి ధరిత్రి మీఁదఁ బడియెం జెడి సౌంభక; మంత సాల్వుఁడుం**
**బడియె మదీయచక్రపటుపాతరయంబున రెండువ్రయ్యలై.' 198**

**ప్రతిపదార్థం:** తడయక= ఆలస్యం కాకుండ; ఘోర, దర్శన, సుదర్శన, పావకుచేన్= భయంకరంగా కనిపించిన 'సుదర్శన' మనే పేరున్న చక్రమనే అగ్నిహోత్రుడిచేత; దహింపఁగాన్+పడి= తగులబెట్టబడి; పరమ+ఈశ్వర+ఉగ్ర, శర, పావక, దగ్ధ,

పురత్రయ, ఆభము+ఐ= పరమశివుడి యొక్క భీకరమైన బాణమనే అగ్నిహోత్రుడిచేత కాల్చబడిన త్రిపురాలతో సమానమై; చెడి= పాడైపోయి; సౌంభకము; ఎడరి= భగ్నమయి; ధరిత్రిమీఁదన్+పడియెన్= భూమిపై పడిపోయింది; అంత; సాల్వుఁడున్; మదీయ, చక్ర, పటు, పాత, రయంబునన్= నా చక్రంయొక్క తీవ్రమైన తాకుడు వేగానికి; రెండు, వ్రయ్యలు+ఐ= రెండు ముక్కలై; పడియెన్= పడ్డాడు.

**తాత్పర్యం:** అంత సౌంభకం ఘోరమైన సుదర్శన చక్రాగ్నిచేత కాల్చబడి, పరమేశ్వరుడి బాణాగ్నిచేత దగ్ధం చేయబడిన త్రిపురాలవలె పాడై భూమిపై పడింది. సాల్వుడు సైతం తీవ్రమైన నా చక్రవేగానికి రెండు ముక్కలై క్రింద పడ్డాడు.'

**విశేషం:** మహాభారతంలోని సౌంభకవృత్తాంతం ఒక అద్భుతకల్పన. ఇరువదవ శతాబ్దిలో విజ్ఞానశాస్త్రం అత్యద్భుతంగా మానవమేధకు క్రొంగ్రొత్త ఎల్లలు ప్రసాదించింది. మేధావులైన రచయితలు రాబోయే యుగయుగాంతరాల్లో విజ్ఞానవేత్తలు కనిపెట్టబోయే వింతలను గురించి ఊహించి 'వైజ్ఞానిక కల్పనా కథలను' (ఊహాప్రేరితమైన) నవలలను సృష్టించారు. సౌంభకం రోదసీ యానం చేయగల ఒక కృత్రిమగ్రహం వంటిదని తోస్తున్నది. ఇది విజ్ఞులు ఇంకను పరిశోధించదగిన అంశం.

## పాండవులు ద్వైతవనంబునకు వచ్చి యుండుట (సం. 3-23-42)

**వ.** **అని యిట్లు సాల్వుం దన చంపిన విధంబు సెప్పి, చక్రధరుండు పాండవుల వీడ్కొని, సుభద్రాభిమన్యులం గాంచనరథం బెక్కించుకొని తోడ్కొని ద్వారవతి కరిగె; ధృష్టద్యుమ్నుండును బ్రతివింధ్యాదులైన ద్రౌపదేయులం దోడ్కొని ద్రుపదుపురంబునకుం జనియె; నిట పాండవులును రథంబు లెక్కి యాయుధంబులు ధరియించి యింద్రసేనాది మూలభృత్యు లిరువదుండ్రు ముందట రా ననేక సహస్ర బ్రాహ్మణ వరులతో ద్వైతవనంబున కరిగి; రంత ధర్మరాజు తమ్ముల కిట్లనియె.** **199**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; సాల్వున్= సాల్వుడిని; తన, చంపిన, విధంబు= తాను చంపిన రీతి; చెప్పి; చక్రధరుండు= చక్రధారి అయిన శ్రీకృష్ణుడు; పాండవుల వీడ్కొని= పాండవులతో తాను వెళ్ళుతున్నట్లు చెప్పి; సుభద్రా+అభిమన్యులన్= సుభద్రను, అభిమన్యుడిని; కాంచన, రథంబు+ఎక్కించుకొని= బంగరు తేరిపై కెక్కించుకొని; తోడ్కొని= తన వెంట పెట్టుకొని; ద్వారవతికి+అరిగె= ద్వారకకు వెళ్ళాడు; ధృష్టద్యుమ్నుండును; ప్రతి వింధ్యాదులు+ఐన= ప్రతివింధ్యుడు మున్నగు వారైన; ద్రౌపదేయులన్= ద్రౌపదికొడుకులను; తోడ్కొని= తన వెంట బెట్టుకొని; ద్రుపదు, పురంబునకున్= ద్రుపదుడి నగరానికి; చనియెన్= వెళ్ళాడు; ఇట; పాండవులును; రథంబులు+ఎక్కి= తేరులు అధిరోహించి; ఆయుధంబులు; ధరియించి; ఇంద్రసేన+ఆది, మూలభృత్యులు= ఇంద్రసేనుడు మున్నగు ప్రధాన సేవకులు; ఇరువదుండ్రు= ఇరవైమంది; ముందట, రాన్= ముందునడిచి దారి చూపించగా; అనేక, సహస్ర, బ్రాహ్మణ, వరులతో= పెక్కువేలమంది బ్రాహ్మణ శ్రేష్ఠులతో; ద్వైత, వనంబునకు= ద్వైతం అనే పేరున్న అడవికి; అరిగిరి= వెళ్ళారు; అంతన్= అటు పిమ్మట; ధర్మరాజు= ధర్మపుత్రుడు; తమ్ములకు+ఇట్లు+అనియెన్= సోదరులతో ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు తాను సాల్వుడిని చంపిన కథ ధర్మరాజుకు చెప్పాడు. తర్వాత అతడు పాండవులను వీడ్కొని తన చెల్లెలు సుభద్రను, మేనల్లుడైన అభిమన్యుడిని తన బంగరురథంపై కెక్కించికొని ద్వారకకు వెళ్ళాడు. ధృష్టద్యుమ్నుడు తన మేనల్లుండ్రు, ద్రౌపది కొడుకులు అయిన ప్రతివింధ్యుడు మున్నగువారిని తనతోపాటు ద్రుపద

నగరానికి తోడ్కొని పోయాడు. పాండవులు తమ ముఖ్య సేవకులైన ఇంద్రసేనాది భటులు ఇరవైమందితో వేలకొలది బ్రాహ్మణులతో ద్వైతవనానికి వెళ్ళారు. అప్పుడు ధర్మరాజు తమ్ముళ్ళతో ఇట్లా అన్నాడు.

**మధ్యాక్కర.**

**'ఇది మహోగ్రాటవి, సింహశరభోరగేంద్ర శార్దూల**
**మద గజాకీర్ణంబు, దీనిలోన నేమఱకుండ వలయు,**
**నదియునుంగాక పరప్రయోగమాయలు గల, వెఱిఁగి**
**మది నుండునది' యన్న నన్న కిట్లను మఘవనందనుఁడు. 200**

**ప్రతిపదార్థం:** ఇది; మహా+ఉగ్ర+అటవి= మిక్కిలి భీకరమైన అడవి; సింహ, శరభ+ఉరగ+ఇంద్ర, శార్దూల, మదగజ+ఆకీర్ణంబు= సింహాలతో, శరభాలతో, గొప్ప పాములతో, పెద్దపులులతో, మదపుటేనుగులతో నిండినట్టిది; దీనిలోనన్= ఈ అడవిలో; ఏమఱక+ఉండవలయున్= ఏమరుపాటు లేకుండ జాగరూకతతో నివసించవలసి ఉన్నది; అదియునున్+కాక= అంత మాత్రమే కాక; పర, ప్రయోగ, మాయలు= శత్రువులు పన్నే మాయలు; కలవు; మదిన్= మనస్సులో; ఎఱిఁగి= తెలిసికొని; ఉండునది= ఉండాలి; అన్నన్= అని చెప్పగా; అన్నకు= అగ్రజుడైన ధర్మరాజుకు; మఘవ నందనుఁడు= దేవేంద్రసుతుడైన అర్జునుడు; ఇట్లు= ఈ రీతిగా; అనున్= అంటున్నాడు.

**తాత్పర్యం:** 'ఇది మిక్కిలి వెఱపుగొలిపే అడవి. ఇందులో సింహాలు, శరభాలు, గొప్పపాములు, పెద్దపులులు, మదించిన ఏనుగులు ఉన్నాయి. ఇందులో జాగ్రత్తగా మెలగవలసి ఉన్నది. అంతేకాక, శత్రువులు మాయలు పన్నవచ్చును. అన్నిటిని మనస్సులో తెలిసికొని మనం మసలుకొనవలసి ఉన్నది' అని పలికిన ధర్మరాజుతో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.134 విశేషాంశం చూడండి.

**వ. 'బ్రహ్మవిదులును దపోవృద్ధులైన బ్రాహ్మణులును నఖిలలోకద్వారంబులనప్రతిహతులైన నారదద్వైపాయనాది మునివరులును నీచేత నుపాసితులయి నీ కుశలంబ కోరుచుండుదురు; భవత్ప్రతాపం బెల్లవారిని రక్షించు నివ్వనంబు సకలకాలకుసుమ ఫలభరిత వనస్పతిశాఖాశిఖారూఢమయూరకీరకోకిలాలాప మధురంబును, బక బలాక కోక కారండవ సారస రమ్యమధుకర సౌమ్య సరోవర సంకులంబును, విమలశీతల జల ప్రవాహ నదీశోభితంబును, మహర్షి గణ సేవితంబునునై యొప్పుచున్నయది; యిందుండుదమని లలితలతావితానాది రమణీయంబులయిన వృక్షమూలంబుల నేవురు వేఱువేఱ నివాసంబులు సేసి నియతాత్ములయి యిష్టంబున దేవ పితృ కార్యంబులు సేయుచుందమ్ముఁజూడవచ్చిన మహామునులకు, బ్రాహ్మణులకు మనఃప్రియంబులయిన యాహారంబులు వెట్టుచు ద్వైతవనంబున నుండునంత. 201**

**ప్రతిపదార్థం:** బ్రహ్మవిదులును= బ్రహ్మజ్ఞానం తెలిసినవారున్నూ; తపస్+వృద్ధులు+ఐన= తపస్సులో ముసలివారైన; బ్రాహ్మణులునున్= విప్రులున్నూ; అఖిల, లోక, ద్వారంబులన్= అన్నిలోకాల గడపల దగ్గర; అప్రతిహతులు+ఐన= అడ్డులేనట్టి; నారద, ద్వైపాయన+ఆది, మునివరులును= నారదుడు, వ్యాసుడు మొదలైన ఋషివరేణ్యులున్నూ; నీచేతన్+ఉపాసితులు+అయి= నీచేత పూజించబడినవారై; నీ, కుశలంబు+అ= నీక్షేమాన్నే; కోరుచుండుదురు= అభిలషిస్తుంటారు; భవత్, ప్రతాపంబు= నీ

యొక్కతేజం; ఎల్లవారిని= అందరిని; రక్షించున్= కాపాడుతుంది; ఈ+వనంబు= ఈ అడవి; సకల, కాల, కుసుమ, ఫల, భరిత, వనస్పతి, శాఖా, శిఖా+ఆరూఢ, మయూర, కీర, కోకిల+ఆలాప, మధురంబును= అన్ని ఋతువులకు సంబంధించిన పువ్వులతో, పండ్లతో, కూడిన చెట్ల కొమ్మల చివర కెక్కిన నెమళ్ల, చిలుకల, కోకిలల కూతలచేత మనోహరమైనట్టిదిన్నీ; బక, బలాక, కోక, కారండవ, సారస, రమ్య, మధుకర, సౌమ్య, సరోవర, సంకులంబును= కొంగలు, కొక్కెరలు, చక్రవాకాలు, కన్నెలేడి పిట్టలు, బెగ్గురు పిట్టలు, అందమైన తుమ్మెదలు మున్నగు వాటిచే అందగించిఉండే నిర్మలమైన సరస్సులచేత దట్టమైనట్టిదియు; విమల, శీతల, జల, ప్రవాహ, నదీ, శోభితంబును= స్వచ్ఛమైన, చల్లనైన నీటిపారుదల కల నదులచేత సొంపారునట్టిదిన్నీ; మహర్షి, గణ, సేవితంబును= గొప్ప మునుల గుంపులచేత సేవించబడుచుండునట్టిదిన్నీ; ఐ; ఒప్పుచున్న+అది= విలసిల్లుతున్నది; ఇందు+ఉండుదము+అని= ఇచట నివసిద్దామని; లలిత, లతా, వితాన+ఆది, రమణీయంబులు+ అయిన = సుకుమారములైన తీగల గుంపులు మొదలగువాటిచేత సుందరాలైన; వృక్ష, మూలంబులన్= చెట్ల మొదళ్ళలో; ఏవురు= అయిదుగురు; (పంచపాండవులు); వేఱు, వేఱు+అ= ఎవరికి వారు వేరుగా; నివాసంబులు+చేసి= నివసించుచోట్లను ఏర్పరచుకొని; నియత+ఆత్ములు+అయి= నియమంతో కూడిన ఆత్మలు కలవారై, అంటే నిగ్రహం సాధించినవారై; ఇష్టంబునన్= తమ మనస్సుకు నచ్చినట్లు (ఆసక్తితో); దేవ, పితృ, కార్యంబులు, చేయుచున్= దేవకార్యం అంటే పూజలు, పితృకార్యం అంటే తర్పణాలు చేస్తూ; తమ్మున్+చూడవచ్చిన= తమను చూడటానికి వచ్చిన: మహామునులకు= గొప్ప ఋషులకు; బ్రాహ్మణులకు= విప్రులకు; మనస్+ప్రియంబులు+అయిన= మనస్సుకు ప్రీతికరములైన; ఆహారంబులు= భోజనాలు; పెట్టుచు; ద్వైత, వనంబునన్= ద్వైతమనే పేరుకల అడవిలో; ఉండు+అంత= ఉన్నప్పుడు.

**తాత్పర్యం:** 'బ్రహ్మజ్ఞానులు, తపోవృద్ధులు అయిన బ్రాహ్మణులు, అన్ని లోకాల్లోనూ అడ్డు లేకుండ ప్రవేశింపగల మహాత్ములు నారద వ్యాసాది మహర్షులు నీచే పూజితులై నిత్యం నీ కుశలాన్ని కోరుతూ ఉంటారు. నీ పరాక్రమం అందరినీ కాపాడుతుంటుంది. ఈ ద్వైతవనమా? అన్ని ఋతువులలో వివిధ కుసుమ ఫల భరితమైనది. ఈ మనోహర వనంలోని వృక్షాలపై నెమళ్ళు, చిలుకలు, కోకిలలు మధురంగా కూస్తూ వీనులకు విందు కలిగిస్తున్నాయి. ఇందులోని సరస్సులు కొంగలు, కొక్కెరలు, కన్నెలేడిపిట్టలు, బెగ్గురు పిట్టలు-మున్నగు జలపక్షులతో, తుమ్మెదలతో ప్రసన్నంగా ఒప్పుతున్నాయి. ఇందులో ప్రవహిస్తున్న నదులు నిర్మల శీతల జలవాహినులై ప్రకాశిస్తున్నాయి. ఈ అరణ్యంలో మహర్షులెందరో నివసిస్తూ ఉన్నారు. మనం కూడ ఇక్కడే ఉందాము' అని సుకుమారాలైన లతాసమూహాదులతో రమణీయాలైన చెట్ల మొదళ్ళలో అయిదుగురు వేరువేరుగా నివాసస్థానాలు నిర్మించుకొని, నియతాత్ములై దేవపితృకార్యాలు చేస్తూ, తమకడకు వచ్చిన బ్రాహ్మణోత్తములకు సంప్రీతికరాలైన భోజనాదికాలు సమకూరుస్తూ ద్వైతవనంలో సంతోషంతో నివసించసాగారు.

**విశేషం:** నన్నయ మహాకవి రచించిన అరణ్యవర్ణనం తరువాతి ప్రబంధకవులకు ఒజ్జబంతి అయింది.

**క. పాండవులకడకు ధర్మ వి । దుండు తపోదహనదగ్ధదురితౌఘుఁడు మా**
**ర్కండేయుం డను మునినా । థుం డంతేవాసిగణముతోఁ జనుదెంచెన్. 202**

**ప్రతిపదార్థం:** పాండవుల కడకున్= పాండవుల దగ్గరకు; ధర్మవిదుండు= ధర్మం తెలిసినవాడు; తపస్+దహన, దగ్ధ, దురిత+ ఓఘుఁడు= తపస్సు అనే అగ్నిచేత తగులబెట్టబడిన పాపాలసమూహం కలవాడు; మార్కండేయుఁడు+అను, ముని, నాథుండు= మార్కండేయు డనే మునిశ్రేష్ఠుడు; అంతేవాసి, గణముతోన్= శిష్యసముదాయంతో; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** పాండవుల దగ్గరకు, ధర్మవేత్త, తపశ్శక్తివలన పాపాలను భస్మం చేసికొన్నవాడు అయిన మార్కండేయ మహర్షి తన ప్రియశిష్యులతో కలిసి వచ్చాడు.

**వ. ఇట్లు వచ్చి వారలచేత నర్చితుండయి వనవాస క్లేశదుఃఖితులైన పాండవులను ద్రౌపదిం జూచి యమ్మార్కండేయుం డిట్లనియె. 203**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వచ్చి; వారల చేతన్= ఆ పాండవులచేత; అర్చితుండు+అయి= పూజించబడినవాడై; వన, వాస, క్లేశ, దుఃఖితులు+ఐన= అడవిలో నివసించటంవలన ఏర్పడిన కష్టాలచేత దుఃఖం పొందినవారయిన; పాండవులను; ద్రౌపదిన్+చూచి; ఆ+మార్కండేయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ రీతిగా వచ్చి పాండవులచేత పూజించబడినవాడై మార్కండేయమహర్షి, వనవాసకష్టాలను అనుభవిస్తూ ఖిన్నులైన పాండవులను, ద్రౌపదిని చూచి ఇట్లా చెప్పాడు.

**సీ. 'పితృనిదేశమ్మునఁ బృథివీశ్వరత్వంబు। విడిచి సానుజుఁడై పవిత్రచరిత**
**జానకిఁ దోడ్కొని చని వనంబున నున్న। రఘుకులనందను రాముఁ దొల్లి**
**చూచితి; నిపుడు భూసురవంశపోషకు। సాధుజనస్తుత్యు సత్యధర్మ**
**నిత్యు ధర్మజు రమణీయకీర్తిప్రియు। శమవంతుఁ జూచితి; సగర భరత**

**ఆ. నల యయాతి వైన్య నాభాగులాదిగా। నాదిరాజులెల్ల నధిక ధర్మ**
**సత్యయుక్తిఁ జేసి సకలలోకంబులు। వడసి భాగధేయభాగు లయిరి. 204**

**ప్రతిపదార్థం:** పితృ, నిదేశమ్మునన్= తండ్రి ఆజ్ఞవలన; పృథివీ+ఈశ్వరత్వంబు= రాచరికం; విడిచి; స+అనుజుఁడు+ఐ= తమ్ముడితో సహా; పవిత్ర, చరిత= పావనమైన శీలం కల; జానకిన్+తోడ్కొని, చని= జనకుడి కూతు రయిన సీతను వెంటబెట్టుకొని వెళ్ళి; వనంబునన్+ఉన్న= అడవిలో నివసించిన; రఘుకుల, నందనున్= రఘువంశంలో పుట్టినవాడిని; రామున్= శ్రీరాముడిని; తొల్లి= పూర్వకాలంలో; చూచితిన్; ఇపుడు భూసుర, వంశ, పోషకున్= బ్రాహ్మణ వంశాన్ని పోషిస్తున్నవాడిని; సాధు, జన, స్తుత్యున్= సజ్జనులచేత పొగడబడుతున్నవాడిని; సత్య, ధర్మ, నిత్యున్= ఎల్లప్పుడు సత్యాన్ని, ధర్మాన్ని పాటించేవాడిని; రమణీయ కీర్తి, ప్రియున్= సుందరమైన. యశస్సుపట్ల ఇష్టంకలవాడిని; ధర్మజున్= ధర్మరాజును; శమవంతున్= ఇంద్రియ నిగ్రహం కలవాడిని; చూచితి; సగర, భరత, నల, యయాతి, వైన్య, నాభాగులు; ఆదిగాన్= మున్నగు; ఆది, రాజులు+ఎల్లన్= మొదటిరాజులందరు; అధిక, ధర్మ సత్య, యుక్తిన్+చేసి= గొప్పదైన ధర్మం, సత్యం కలిమిచేత; సకల, లోకంబులు, పడసి= అన్నిలోకాలు పొంది (ధర్మాత్ములు ఊర్ధ్వలోకాలు పొందగలరని ప్రాచీన భారతీయ సంస్కృతి ప్రవచిస్తున్నది); భాగధేయ భాగులు+అయిరి= అదృష్టవంతులు అయ్యారు.

**తాత్పర్యం:** 'అలనాడు తండ్రి ఆజ్ఞచేత రాజ్యాన్ని త్యజించి పతివ్రత అయిన సీతతో, తమ్ముడితో వనవాసం చేసిన శ్రీరామచంద్రుడిని చూచాను. నేడు బ్రాహ్మణవంశాలను పోషిస్తూ, సజ్జనులచే కొనియాడబడుతూ, సత్యధర్మాలను పాలిస్తూ, రమణీయ యశస్సుతో, శమాన్వితుడై రాజిల్లుతున్న ధర్మరాజును చూచాను. ప్రాచీన రాజర్షులు సగర, భరత, నల, యయాతి, వైన్య, నాభాగ ప్రభృతులు ఇలాగే సత్యధర్మాలు పాటించి ఉత్తమలోకాలు పొంది అదృష్టవంతులయ్యారు.

**విశేషం:** మార్కండేయమహర్షి అలనాడు శ్రీరామచంద్రుడిని చూచాడు. నేడు ధర్మరాజును చూచాడు. దీనినిబట్టి మార్కండేయ మహర్షి చిరంజీవి అని తెలియవస్తున్నది. అంతటి మహాముని చేత కొనియాడబడిన మహారాజుగా ధర్మజుని గొప్పతనాన్ని చిత్రిస్తూ ఉన్న ఈ పద్యం విశిష్టమైనది.

**వ. పాపసౌబలప్రయుక్తుం డయిన ధార్తరాష్ట్రునట్లు ధర్మువు దప్పినవా రెవ్వరును లేరు; మీరు ధర్మనిత్యులగు సత్యవ్రతులరు గావున మీ కిష్టసిద్ధి యగు' నని మార్కండేయుం డరిగిన, నపరసంధ్యోపాసనాసీనుం డయిన ధర్మరాజును సాయంహోమార్థప్రజ్వలిత జ్వలనంబు లయిన యనేక సహస్ర బ్రాహ్మణాగ్ని హోత్రంబులం జూచి బకదాల్భ్యుండను మహాముని యిట్లనియె. 205**

**ప్రతిపదార్థం:** పాప, సౌబల, ప్రయుక్తుండు+అయిన= పాపాత్ముడైన శకునిచేత ప్రోత్సహించబడిన వాడయిన; ధార్త రాష్ట్రు+అట్లు= దుర్యోధనుడి వలె; ధర్మువు= ధర్మాన్ని; తప్పిన వారు, ఎవ్వరును, లేరు; మీరు; ధర్మ నిత్యులు+అగు= ఎల్లప్పుడు ధర్మం ఆచరించే వారయిన; సత్యవ్రతులరు= సత్యాన్ని దీక్షగా పాటించే వారు; కావున= కాబట్టి; మీకు+ఇష్ట, సిద్ధి+అగును+అని= మీకు కోరినట్టిది లభిస్తుందని చెప్పి; మార్కండేయుండు+అరిగినన్= మార్కండేయుడు వెళ్ళగా; అపర, సంధ్యా+ ఉపాసనా+ ఆసీనుండు+అయిన, ధర్మరాజును= మలిసంజలో చేసే పూజలో కూర్చుండి ఉన్న ధర్మరాజును; సాయం, హోమ+అర్థ, ప్రజ్వలిత, జ్వలనంబులు+అయిన= సాయంకాలం చేసే యజ్ఞం కోసం బాగుగా రాజుకొనేటట్లు చేయబడిన మంటలు గల; అనేక, సహస్ర, బ్రాహ్మణ+అగ్నిహోత్రంబులన్+చూచి= పెక్కువేల బ్రాహ్మణులు వేల్చిన అగ్నిహోత్రాలను చూసి; బకదాల్భ్యుండు; అను; మహాముని= గొప్పఋషి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** పాపాత్ముడైన శకునిప్రోత్సాహంతో ధర్మం తప్పిన దుర్యోధనుడివంటివాడు వేరొకడు లేడు. మీరు నిత్యసత్యవ్రతులు, ధర్మాత్ములు. మీకు అభీష్టసిద్ధి కలుగుగాక' అని ఆశీర్వదించి మార్కండేయమహర్షి వెళ్ళాడు. అంత సాయంకాలసంధ్యావందనం ఆచరిస్తున్న ధర్మరాజును, సాయంసమయ హోమాలను వేల్చుతూ అగ్ని హోత్రాలను ప్రజ్వలింపజేస్తున్న వేలకొలదివిప్రులను బకదాల్భ్యుడు అనే మహాముని చూచి ఇట్లా అన్నాడు.

**విశేషం:** ధార్తరాష్ట్రుడు - ధృతరాష్ట్రుడి కొడుకు. మార్కండేయుడు - మృకండు మహాముని కొడుకు - ఇవి అపత్యార్థక తద్ధితాలు.

**ఉ. 'భూమిసురోత్తముల్ ప్రకృతిపుణ్యవిధాయులు వీరు ఋగ్యజు**
**స్సామపరాయణుల్ పరమసాధుచరిత్రులు మీకు సంతత**
**ప్రేమమునన్ శుభోన్నతులు వెంచుచు నుండుటఁ జేసి సద్గుణో**
**ద్దామ! యరణ్యవాస మిది దద్దయు నొప్పెడు మాకుఁ జూడఁగన్. 206**

**ప్రతిపదార్థం:** సద్గుణ+ఉద్దామ= మంచి గుణాలచేత అధికుడివైన వాడా! ఓ ధర్మరాజా!; భూమిసుర+ఉత్తముల్= బ్రాహ్మణశ్రేష్ఠులు; ప్రకృతి, పుణ్య విధాయులు= సహజంగా పుణ్యాన్ని కలిగించే వారు; వీరు= ఈ బ్రాహ్మణులు; ఋక్+యజుస్+సామ, పరాయణుల్= ఋగ్వేద యజుర్వేద, సామవేదాలలో ఆసక్తికలవారు; పరమ, సాధు, చరిత్రులు= మిక్కిలి మంచిశీలం కలవారు; మీకు; సంతత ప్రేమమునన్= ఎల్లప్పుడు ఉండే వాత్సల్యంతో; శుభ+ఉన్నతులు= శుభాన్ని, గొప్పతనాన్ని; పెంచుచున్= ఎక్కువ చేస్తూ; ఉండుటన్+చేసి= ఉండటంచేత; అరణ్యావాసము+ఇది= మీ ఈ వనవాసం; మాకున్+ చూడఁ గన్= మా ఉద్దేశంలో; తద్దయున్= మిక్కిలి; ఒప్పెడున్= వెలుగొందుతున్నది.

**తాత్పర్యం:** 'సద్గుణాలచేత గొప్పవాడివయిన ఓ ధర్మరాజా! మా దృష్టిలో మీకు అరణ్యావాసం మిక్కిలి మేలు చేకూర్చేదైంది. సహజ పుణ్యశీలురు, పవిత్ర చరిత్రులు, ఋగ్యజుస్సామవేద పారంగతులైన బ్రాహ్మణోత్తములు నిరంతర వాత్సల్యంతో మీ యోగక్షేమాలను చూస్తూ శుభోన్నతులను పెంచుతున్నారు.

**వ. బ్రాహ్మణానుగ్రహంబునం జేసి తొల్లివైరోచనాదు లనేకకాలంబు లక్షయలక్ష్మీవిభవులయి సముద్రనేమి భూచక్రంబు రక్షించిరి; యనిలసహాయుం డయిన యగ్నిదేవుం డరణ్యంబులు దహించునట్లు బ్రాహ్మణ సహాయుం డయిన మహీశుండు శత్రువర్గంబు నిశ్శేషంబు సేయు; వినీతుం డయి విప్రులచేత ననుశాసితుం డయిన రాజునకు నలబ్ధలాభాది త్రితయంబు సంపన్నంబగు; బ్రాహ్మణరహితుం డయి ధర్మహీనుం డయిన రాజును బ్రజ వలవదు; ప్రజానురాగంబు లేనివానికి రాజ్యంబు సుస్థిరంబు గానేరదు; మీరు బ్రాహ్మణప్రియులరు ధర్మనిత్యుల; రెప్పుడును మీ కభ్యుదయం బగు' నని బకదాల్భ్యుం డరిగినఁ, బాండవులుం దమ యిష్టంబున నుండి దుఃఖోపశమనంబు లయిన కథలు సెప్పకొనుచున్న యవసరంబున ద్రౌపది ధర్మరాజున కిట్లనియె.207**

**ప్రతిపదార్థం:** బ్రాహ్మణ+అనుగ్రహంబునన్+చేసి= బ్రాహ్మణులయొక్క దయచేత; తొల్లి= పూర్వకాలంలో; వైరోచన+ఆదులు= వైరోచనుడు (బలి) మున్నగువారు; అనేక, కాలంబులు= పెక్కునాళ్ళు; అక్షయ, లక్ష్మీ విభవులు+అయి= క్షీణించని ఐశ్వర్య ప్రాభవాలు కలవారయి; సముద్రనేమి, భూ, చక్రంబు= కడలియే కమ్మిగా కల భూచక్రాన్ని; రక్షించిరి= కాపాడారు; అనిల, సహాయుండు+అయిన= వాయువు తోడ్పడేవాడుగా కల; అగ్నిదేవుండు; అరణ్యంబులు; దహించునట్లు= కాల్చేటట్లు; బ్రాహ్మణ, సహాయుండు+అయిన= విప్రుల తోడ్పాటు లభించినవాడైన; మహీ+ఈశుండు= రాజు; శత్రు, వర్గంబున్= శత్రుపక్షాన్ని; నిశ్శేషంబు+చేయున్= శేషం లేనట్లుగా (మిగులకుండేటట్లుగా) చేస్తాడు; వినీతుండు+అయి= వినయం కలవాడయి; విప్రులచేతన్= బ్రాహ్మణులచేత; అనుశాసితుండు+అయిన= శిక్షించబడిన; (విద్య కరపబడిన); రాజునకున్; అలబ్ధ, లాభ+ఆది, త్రితయంబు= పొందబడని దాన్ని పొందటం మున్నగు మూడు లాభాలు; సంపన్నంబు+అగు= సమకూరుతాయి; బ్రాహ్మణ, రహితుండు+అయి= బ్రాహ్మణుడు లేకపోయిన వాడై అంటే బ్రాహ్మణుల తోడ్పాటు పొందనివాడై; ధర్మహీనుండు+అయిన= ధర్మం కొరవడిన వాడైన; రాజును= ప్రభువును; ప్రజ= జనసమూహం; వలవదు= ప్రేమించదు; ప్రజా+అనురాగంబు= జనులప్రేమ; లేనివానికి; రాజ్యంబు; సుస్థిరంబు, కానేరదు= చిరకాలం నిలవదు; మీరు; బ్రాహ్మణప్రియులరు= బ్రాహ్మణులకు ఇష్టులు; ధర్మనిత్యులరు= ఎల్లప్పుడు ధర్మం పాటించేవారు; ఎప్పుడును; మీకు+అభ్యుదయంబు+అగున్= మీకు మేలు కలుగుతుంది; అని= అని చెప్పి; బకదాల్భ్యుండు; అరిగినన్= వెళ్ళగా; పాండవులున్, తమ, ఇష్టంబునన్+ఉండి= పాండవులు తమ ఇష్ట ప్రకారం ప్రొద్దు పుచ్చుతూ ఉండి; దుఃఖ+ఉపశమనంబులు+అయిన, కథలు= దుఃఖానికి విరుగుడు కల్పించే (దుఃఖాన్ని శాంతింపజేసే) కథలు; చెప్పుకొనుచున్న; అవసరంబున= కాలంలో; ద్రౌపది, ధర్మరాజునకు+ఇట్లు+అనియెన్= ద్రౌపది ధర్మరాజుతో ఇట్లా పలికింది.

**తాత్పర్యం:** బ్రాహ్మణుల దయవలన పూర్వకాలంలో వైరోచనుడు మున్నగు రాజులు అపార వైభవ ప్రాభవాలతో భూమండలం ఏలగలిగారు. అగ్నికి వాయువు తోడ్పడినట్లు రాజుకు బ్రాహ్మణులు సాయం చేస్తే అతడు శత్రువులను నిశ్శేషంగా పరిమార్చుతాడు. వినయపరుడై బ్రాహ్మణగురువులచేత నడపబడిన రాజుకు అలబ్ధలాభాదిత్రితయం సమకూరుతుంది. బ్రాహ్మణహీనుడు, ధర్మహీనుడు అయిన రాజు ప్రజాభిమానాన్ని కోల్పోతాడు. ప్రజానురాగం లేకుంటే రాజ్యం సుస్థిరంగా నిలవనేరదు. మీరు బ్రాహ్మణప్రియులు, ధర్మనిత్యులు. మీకు అభ్యుదయం కలుగుగాత!' అని చెప్పి బకదాల్భ్యమునివరుడు వెళ్ళాడు. ఇక, పాండవులు అరణ్యావాసంలో తాము అనుభవిస్తున్న ఇక్కట్లు మరచిపోయే కథలను చెప్పుకొంటూ కాలం వెళ్ళబుచ్చుతున్నసమయంలో ద్రౌపది ధర్మరాజుతో ఇట్లా అన్నది.

## ద్రౌపదీ ధర్మరాజుల సంవాదము (సం. 3-28-2)

**ఆ. 'వృద్ధు గొడుకుపలుకు విని క్రూరుఁడై పాప । బుద్ధిఁజేసి మిమ్ము భూతలంబు**
**వెలువరించి రాజ్యవిభవంబు గొని యిప్పు । డలుక సెడి సుచిత్తుఁ డయ్యె నొక్కొ! 208**

**ప్రతిపదార్థం:** వృద్ధు= (వృద్ధుడు), వయసుమళ్ళినవాడు (ధృతరాష్ట్రుడు); కొడుకు పలుకు, విని= కుమారుడి (దుర్యోధనుడి) మాట విని; క్రూరుఁడు+ఐ= కనికరంలేనివాడై; పాప, బుద్ధిన్+చేసి= పాపకరమైన దుష్టబుద్ధితో; మిమ్మున్= మిమ్మల్ని; భూతలంబు, వెలువరించి= భూమిరాజ్యంనుంచి వెడలగొట్టి; రాజ్యవిభవంబు= రాచరికపు పెంపు; కొని= కైకొని; ఇప్పుడు; అలుక, చెడి= కోపం తగ్గి; సుచిత్తుఁడు= మంచి మనస్సు కలవాడు; అయ్యెన్+ఒక్కొ= అయినాడేమొ!

**తాత్పర్యం:** 'కొడుకైన దుర్యోధనుడి మాట విని దుర్మార్గుడైన ముసలిరేడు ధృతరాష్ట్రుడు మిమ్మల్ని రాజ్యంనుండి వెడలగొట్టి రాజ్యవైభవం దక్కించుకొని ఇప్పుడైనా మీపట్ల కోపం విడిచి ప్రసన్నచిత్తు డయ్యాడా?

**ఆ. అద్దురాత్ముహృదయ మది యయఃపాషాణ । నిష్ఠురంబు; ధర్మనిధుల మిమ్ము**
**నట్లు గొడుకు లెగ్గు లాడంగఁ బోయిన । వలదనండ కలహవాంఛఁ జేసి. 209**

**ప్రతిపదార్థం:** ఆ+దురాత్ము= ఆ దుష్టమైన ఆత్మకలవాడి, అంటే ధృతరాష్ట్రుడియొక్క; హృదయము= మనసు; అది; అయస్+పాషాణ, నిష్ఠురంబు= ఇనుమువలె రాయివలె కఠినమైనది; ధర్మ, నిధుల= ధర్మానికి నిధుల వంటి వారైన; మిమ్మున్= మిమ్మల్ని; అట్లు= ఆ రీతిగా; కొడుకులు= పుత్రులు; ఎగ్గులు+ఆడంగన్+పోయినన్= పరుష వాక్యాలు పలికినప్పుడు; కలహ, వాంఛన్+చేసి= దెబ్బలాడాలనే కోరికతో; వలదు+అనండు+అ= వలదని అనలేదు కదా!

**తాత్పర్యం:** దురాత్ముడైన ధృతరాష్ట్రుడి హృదయం ఇనుం వంటిది, బండరాయి వంటిది. ధర్మనిధులైన మిమ్మల్ని తన కొడుకులు పరుషవాక్యాలు పలికినప్పుడు కలహకాంక్ష గల అతడు వాళ్లను వారించలేదుకదా!

**సీ. విమలహర్మ్యంబుల విహరించువారలఁ । బ్రియమహార్ఘ్యాసన శయనరతులఁ**
**జందనాగురులిప్త చారుసర్వాంగుల । నతనరనాథసేవితుల మిమ్ము**
**వనమునఁ గ్రుమ్మరువారిఁగాఁ గుశబ్రుసీ । శయనాభిరతులఁగా నియతరూక్ష**
**భూరేణుధూసరీభూతవిగ్రహులఁగా । ద్రుతవన్యమృగ నిషేవితులఁ గాఁగ**

**ఆ. నిట్లు సూచి చూచి యే నెట్లు చిత్తోప । శాంతి సేయుదాన? సకల భోగ**
**విషయవిరతిఁజేసి విధియును ధృతరాష్ట్రు । నట్లు మీకు నహితుఁడయ్యె నొక్కొ! 210**

**ప్రతిపదార్థం:** విమల= నిర్మలాలైన; హర్మ్యంబులన్= మేడలలో; విహరించువారలన్= సంచరించేవారిని; ప్రియ, మహత్+అర్ఘ్య+ఆసన+శయన, రతులన్= ఇష్టములైన, మిగుల తగినట్టివైన పీఠాలపై పరుపులపై కోరిక కలిగి అనుభవించేవారిని; చందన+అగురు, లిప్త, చారు, సర్వ+అంగులన్= మంచిగంధంతో, అగరుతో పూయబడి మనోహరాలైన అన్ని అవయవాలు కలిగిన వాళ్ళను; నత, నరనాథ సేవితులన్, మిమ్మున్= (దేహం) వంచి నమస్కరించిన రాజులచేత సేవించబడిన మిమ్మల్ని; వనమునన్+క్రుమ్మరు వారిఁగాన్= అడవిలో తిరుగాడే వాళ్ళనుగా; కుశ, బ్రుసీ, శయన+అభిరతులన్+కాన్= దర్భలతో నేయబడిన చాపల పై పరుండటానికి ఆసక్తి గల వాళ్ళనుగా; నియత, రూక్ష, భూరేణు, ధూసరీ భూత విగ్రహులన్+కాన్=

ఎల్లప్పుడు కఠినమైన దుమ్ముచేత ధూసరవర్ణంతో కూడిన ఆకారాలు కలవారినిగా; ద్రుత, వన్య మృగ, నిషేవితులన్+కాన్+కన్= వడిగా పరుగెత్తే అడవిజంతువులచేత బాగా సేవించబడే వారినిగా; ఇట్లు= ఈ విధంగా; చూచి, చూచి; ఏను+ఎట్లు; చిత్త+ఉపశాంతి, చేయుదానన్= మనస్సుకు ఊరట కల్పించుకొనేది; సకల, భోగ, విషయ, విరతిన్+చేసి= సమస్తమైన సుఖాల నుండి, ఇంద్రియార్థాల నుండి (విశ్రాంతి) ఉడుకువ కల్పించి; విధియును= బ్రహ్మదేవుడు సైతం; ధృతరాష్ట్ర+అట్లు+అ= ధృతరాష్ట్రుడివలెనే; మీకున్= మీకు; అహితుఁడు+అయ్యెన్+ఒక్కొ= శత్రు వైనాడేమో?

**తాత్పర్యం:** నిర్మలమైన మేడలపై విహరించేవారు మీరు. ఉచితాసనాలపై మంచి పరుపులపై ఉండేవారు మీరు. చందనం, అగరు మున్నగు సుగంధ ద్రవ్యాలు మైపూతలుగా వాడినవారు మీరు. వినమ్రులైన రాజులచేత సేవలు పొందినవారు మీరు. ఇప్పుడు ఈ అరణ్యంలో దర్భలపై శయనించటానికి ఇష్టపడటం, ధూళి ధూసరిత శరీరులై తిరుగాడటం, పరుగెత్తే వన్యమృగాలను వేటాడి బ్రతకటం మీ వంతు అయింది. అది చూచి నే నెట్లా ఓర్చుకొనగలను? బ్రహ్మదేవుడు కూడ ఆ ధృతరాష్ట్రుడివలెనే మీకు సకలసుఖాల యెడల విశ్రాంతి (ఉడుకువ) కల్పించి మీకు శత్రువైనాడా ఏమి?

**క. భవదాజ్ఞానిగళంబునఁ। దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర! నీ**
**యవరజు లిడుమలఁ బడి కడుఁ। జివికిరి చెఱఁబడిన సింహశిశువుల భంగిన్. 211**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= ఓరాజా! (ధర్మరాజా!); భవత్+ఆజ్ఞా, నిగళంబునన్+తవిలి= నీదైన ఆజ్ఞ అనే గొలుసులతో బంధించబడి; పరాక్రమము= శౌర్యం; విడిచి= వీడి; నీ+అవరజులు= నీతమ్ములు; (నీవు పుట్టిన తర్వాత పుట్టిన వారు); ఇడుమలన్+పడి; చెఱన్+పడిన= నిర్బంధించబడిన; సింహ శిశువుల, భంగిన్= సింగపు బిడ్డలవలె; కడున్+చివికిరి= మిక్కిలి గాసి చెందారు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీ ఆజ్ఞ అనే గొలుసులచేత బంధించబడి, పౌరుషం కోల్పోయి నీ తమ్ములు కట్టివేయబడిన సింహకిశోరాలవలె కష్టాలపాలయ్యారు.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ.

**ఆ. పరనరేంద్రమకుటపద్మరాగద్యుతి। నరుణ మగు భవత్పదాబ్జయుగము**
**పరుషధాతుశిలలపై నిప్పు డరుగుట। నరుణ మయ్యెఁ బర్వతాంతరముల. 212**

**ప్రతిపదార్థం:** పర, నరేంద్ర, మకుట, పద్మరాగ, ద్యుతిన్= ఇతర రాజుల కిరీటాలలోని పద్మరాగ మణుల కాంతిచేత; అరుణము+అగు= ఎర్రనయిన; భవత్, పద+అబ్జ, యుగము= నీ పాద పద్మములజంట; పరుష, ధాతు, శిలలపైన్= కఠినమైన జేగురురంగు కల రాలపై; పర్వత+అంతరములన్= కొండల మధ్య; ఇప్పుడు+అరుగుటన్= ఇప్పుడు నడయాడటంచేత; అరుణము+అయ్యెన్= ఎర్రగా అయింది.

**తాత్పర్యం:** అలనాడు ఇతరరాజుల కిరీటాలలోని పద్మరాగమణులచేత నీ పాదాలు ఎరుపెక్కాయి. (అంటే ఇతర రాజులు పద్మరాగమణులు పొదిగిన కిరీటాలు కల తమ తలలు వంచి ధర్మరాజుపాదాలకు మ్రొక్కేవారు. అప్పుడు సుకుమారాలైన ధర్మరాజుపాదాలలో ఎర్రని పద్మరాగమణుల కాంతులు ప్రతిఫలించేవి). ఈనాడు నీవు కొండలమధ్య నడయాడటంచేత కఠినధాతుశిలలలోని ఎర్రరంగువలన నీ సుకుమారపాదాలు ఎరుపెక్కుతున్నాయి.

**విశేషం:** అలం: విషమం. గైరికాదిధాతువులు కొండలలో లభించటం సుప్రసిద్ధం. ఆ ధాతుద్రవ్యాలు ఎర్రరంగు కలిగి ఉంటాయి.

**క. అనవరత సౌఖ్యసంపదఁ । బెనుపొందుచు నుండు మీకు భీకర కాంతా**
**ర నివాసాయాసంబుల । ననఘా! యిబ్బంగి నవయ నలమట వొడమెన్. 213**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా! (ఓ ధర్మరాజా!); అనవరత, సౌఖ్యసంపదన్= ఎడతెగని సుఖాల విభవంతో; పెనుపొందుచున్+ఉండు, మీకు= విలసిల్లుతుండే మీకు; భీకర, కాంతార, నివాస+ఆయాసంబులన్= భయంకరమైన అడవిలో ఉండటంవలన ఏర్పడిన శ్రమలతో; ఈ+భంగి= ఈ విధంగా; నవయన్= కృశించటంవల్ల; అలమట+పొడమెన్= చింత ఏర్పడింది.

**తాత్పర్యం:** ఏ పాప మెరుగని ధర్మరాజా! ఎల్లప్పుడు సౌఖ్యాలను అనుభవించే మీకు భయంకరమైన అడవిలో నివసించటంచేత ఇట్లా క్లేశం దాపురించింది.

**వ. నిత్యంబునుం బదివేవురు బ్రాహ్మణులు బ్రహ్మవిదులు పసిండితళిగల నిష్టాన్నంబులు గుడిచి తృప్తులయినం దద్భుక్తశేషం బుపయోగించుచుండు నీకు వన్యమూలఫలాశనంబు లుపయోగించుచు నన్యులయందుఁ గ్రోధంబు విడిచి యునికి యుచితంబు గాదు. 214**

**ప్రతిపదార్థం:** నిత్యంబునున్= ప్రతిరోజూ; పదివేవురు= పదివేలమంది; బ్రాహ్మణులు; బ్రహ్మవిదులు= బ్రహ్మను తెలిసికొన్న వారు (జ్ఞానులు); పసిండితళిగలన్= బంగారు కంచాలలో; ఇష్ట+అన్నంబులు= ప్రియమైన ఆహారాలు; కుడిచి= ఆరగించి; తృప్తులు+అయినన్= తృప్తి చెందిన వారు కాగా; పిమ్మట; తద్+భుక్త శేషంబు= వారు తినగా మిగిలింది; ఉపయోగించుచుండు; నీకు; వన్యమూల ఫల+అశనంబులు= అడవిలోని వేళ్ళు, పండ్లు తిండిగా; ఉపయోగించుచున్= వాడుకొంటూ; అన్యుల+అందు= ఇతరుల పట్ల, అంటే శత్రువులపట్ల; క్రోధంబు, విడిచి+ఉనికి= కోపం వీడి ఉండటం; ఉచితంబు, కాదు= సరైనదికాదు.

**తాత్పర్యం:** ఇదివరలో ప్రతిదినము నీవు పదివేలమంది బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులకు, బంగరుకంచాలలో విందుభోజనాలు పెట్టి, ఆ తర్వాత వారి భుక్తిశేషం ఆరగించేవాడివి. ఇప్పుడు అడవిదుంపలు, వేళ్ళు, పండ్లు నీ ఆహారం. నీకు ఇట్టి దుర్దశ తెచ్చిపెట్టిన నీ శత్రువులపై కోపం విడిచిపెట్టటం సరైనది కాదు.

**సీ. పదివేల గజముల బలమున విలసిల్లు । ననిలసుతుండు కాఱడవిలోనఁ**
**గ్రుమ్మరి కాయలుఁ గూరలు దిని పేద । వడినఁ జూచియు, దీర్ఘబాహుయుగళుఁ**
**డయ్యును బాహుసహస్రంబు కలిగిన । యర్జునుకంటె బలాఢ్యుఁ డగుచు**
**నేకవేగంబున నేనమ్ము లొక్క య । మ్మేసిన విధమున నేయ నేర్చు**

**ఆ. నర్జునుండు వనమృగావలిఁ గలిసి యి । ట్లున్నఁ జూచియును సుఖోచితాత్ము**
**లైన కవలు దీనులై యున్నఁ జూచియు । నుపశమంబుఁ దాల్చి యుండఁ దగునె? 215**

**ప్రతిపదార్థం:** పదివేల గజముల= పదివేల ఏనుగుల; బలమున, విలసిల్లు= బలంతో ఒప్పే; అనిల సుతుండు= భీముడు (వాయుపుత్రుడు); కాఱడవిలోనన్= దట్టమైన అడవిలో; క్రుమ్మరి= తిరిగి; కాయలున్+కూరలు; తిని, పేద+పడినన్+చూచియు=

చిక్కిపోవటం చూచి కూడ; దీర్ఘబాహు, యుగళుఁడు+అయ్యును= పొడవైన చేతులు రెండే కలవాడైనప్పటికీ; బాహు, సహస్రంబు, కలిగిన= వేయి చేతులు ఉన్న; అర్జునుకంటె= కార్తవీర్యార్జునుడి కంటె; బల+ఆఢ్యుఁడు+అగుచున్= శక్తి కలిగి ఉన్నవాడవుతూ (అంటే మిక్కిలి పరాక్రమవంతుడవుతూ); ఏక, వేగంబునన్= ఒకే వడితో; ఏను+అమ్ములు= అయిదు బాణాలు; ఒక్క+అమ్ము+ఏసిన, విధమునన్= ఒకే బాణాన్ని ప్రయోగించినట్లు; ఏయ, నేర్చు+అర్జునుండు= ప్రయోగించే నేర్పుగల అర్జునుడు; వన, మృగ+ఆవలిన్= అడవి జంతు సముదాయాలతో; కలిసి; ఇట్లు+ఉన్నన్+చూచియును= ఈ విధంగా నివసించటం చూచి కూడ; సుఖ+ఉచిత+ఆత్ములు+ఐన= సౌఖ్యం పొంద దగిన ఆత్మలు కలవారైన; కవలు= జంట బిడ్డలు (నకులసహదేవులు); దీనులు+ఐ+ఉన్నన్+చూచియున్= అర్తులై ఉండటం చూచికూడా; ఉపశమంబున్= ఓర్పును; తాల్చి+ఉండన్+తగునె= పూని ఉండటం సరియా?

**తాత్పర్యం:** పదివేల ఏనుగుల బలం కల భీముడు కారడవిలో కాయలు కూరలు తిని మిక్కిలి చిక్కిపోయి ఉన్నాడు. పొడవైన రెండు చేతులు కలవాడైనా, వేయిచేతులు కల కార్తవీర్యార్జునుడికంటె బలవంతుడై, ఒకేసారి సమానవేగంతో అయిదు బాణాలు ఒకే బాణంలా వేయగల నేర్పు ఉన్న ఈ అర్జునుడు అడవిజంతువుల మధ్య తిరుగాడుతున్నాడు. సౌఖ్యాలు అనుభవించదగిన నకుల సహదేవులు దీనులై తిరుగాడుతున్నారు. ఇదంతా చూస్తూ నీవు ఓర్పు వహించి ఊరకుండటం న్యాయమా?

**వ. క్షమయును దేజంబును నయ్యయికాలంబులఁ బ్రయోగింపనేరని రాజునకుం బ్రజానురాగ ప్రతాపంబులు లేవను నీ యర్థం బితిహాసంబున వినంబడు; క్షమా తేజంబులలోన నెయ్యది విశేషంబు దానిన నిర్ణయించి చెప్పు మని బలీంద్రుండు దొల్లి తన పితామహుం డయిన ప్రహ్లాదు నడిగిన నాతండు బలీంద్రున కిట్లనియె.216**

**ప్రతిపదార్థం:** క్షమయును= ఓర్పును; తేజంబునున్= ప్రతాపమును; ఆ+అయి, కాలంబులన్= ఆయా సమయాలలో; ప్రయోగింపనేరని= ఉపయోగించ జాలని; రాజునకున్= ప్రభువుకు; ప్రజా+అనురాగ, ప్రతాపంబులు, లేవు+అను= ప్రజలయొక్క ప్రేముడి, పరాక్రమం, ఉండవు అనే; ఈ+అర్థంబు= ఈ భావం; ఇతిహాసంబునన్= జరిగిన చరిత్రలో; వినంబడున్= వినబడుతున్నది; క్షమా, తేజంబులలోనన్= ఓర్పు ప్రతాపాలలో; ఏ+అది= ఏది?; విశేషంబు= గొప్పది; దానిని+అ= దానినే; నిర్ణయించి, చెప్పుము= నిశ్చయించి తెలిపేది; అని; బలి+ఇంద్రుండు= బలి చక్రవర్తి; తొల్లి= పూర్వకాలంలో; తన పితామహుండు+అయిన= తన తాతగారైన; ప్రహ్లాదున్= ప్రహ్లాదుడిని; అడిగినన్; ఆతండు= ఆ ప్రహ్లాదుడు; బలీంద్రునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** క్షమ గొప్పదా? తేజస్సు గొప్పదా? క్షమాతేజస్సులను ఆయా సమయాలలో అవసరాలనుబట్టి ఉపయోగించటం తెలియని రాజు ప్రజాభిమానం, ప్రతాపం కోల్పోతా డని ఇతిహాసంలో వినబడుతున్నది. పూర్వకాలంలో బలీంద్రుడు తన తాతఅయిన ప్రహ్లాదుడిని ఈ ప్రశ్ననే- అంటే, క్షమగొప్పదా? తేజం గొప్పదా? నిశ్చయించి చెప్పవలసిందని - అడిగాడు. అప్పుడు ప్రహ్లాదుడు బలిచక్రవర్తికి ఇట్లా చెప్పాడు.

**ఆ. 'క్షమయ తాల్చియుండఁ జన దెల్ల ప్రొద్దుఁ దే। జంబ తాల్చియుండఁ జనదు పతికి;**
**సంతతక్షముండు సంతతతేజుండు। నగుట దోష మందు రనఘమతులు. 217**

**ప్రతిపదార్థం:** పతికి= ప్రభువుకు; క్షమ+అ= క్షమ మాత్రమే (ఓర్పు ఒక్కటే); ఎల్ల ప్రొద్దున్= అన్ని సమయాలలోను; తాల్చియుండన్+చనదు= పూని ఉండరాదు; సంతతక్షముండు= ఎల్లప్పుడు ఓర్పునే కలిగి ఉండేవాడు; సంతత తేజుండున్=

ఎల్లప్పుడు ప్రతాపమే వహించేవాడు; అగుట; అనఘ, మతులు= పాపరహితులైన బుద్ధిమంతులు; దోషము+అందురు= తప్పు అని చెపుతారు.

**తాత్పర్యం:** సర్వకాల సర్వావస్థలలోనూ ఓర్పు వహించటం తప్పు. అట్లే ఎప్పుడూ ప్రతాపం చూపటం కూడా తప్పే. ప్రభువైనవాడు సంతతక్షముడు, సంతతతేజుడు కాకూడదని, అది దోషమని పెద్దలు చెపుతారు.

**వ. అది యెట్లనిన నిత్యక్షమాన్వితుండయిన వానికి భృత్యులు వెఱవక యవమానంబు సేయుదు; రర్థంబుల యం దధికృతులైన వారలు ధనంబు లపహరించి దర్పంబు సూపుదురు; మఱి నిత్యతేజో ౽ ధికుండైన వాఁ డతిక్రూరదండంబున సర్వజనసంతాపంబు సేయుచు గృహగతంబైన సర్పంబునుం బోలె నెప్పుడు నుద్వేగ కరుం డగుం; గావునఁ గాలోచితంబులుగా క్షమాతేజంబులు గల్పించునది. యథాకాల కల్పిత క్షమా తేజుండైన వానికి నుభయలోకసిద్ధి యగు' నని బలీంద్ర ప్రహ్లాద సంవాదంబు సెప్పి వెండియు ద్రౌపది యిట్లనియె. 218**

**ప్రతిపదార్థం:** అది, ఎట్లు+అనిన; నిత్య, క్షమా+అన్వితుండు+అయినవానికిన్= ఎల్లప్పుడును ఓర్పుతో కూడి ఉండేవాడికి; భృత్యులు= సేవకులు; వెఱవక= భయపడక; అవమానంబు+చేయుదురు= అవమానం చేస్తారు; అర్థంబులు+అందు= ధనాలలో; అధికృతులు+ఐన, వారలు= నియోగించబడినవారు; ధనంబులు+అపహరించి= డబ్బు దొంగిలించి; దర్పంబు, చూపుదురు= గర్వం ప్రదర్శిస్తారు; మఱి; నిత్య, తేజస్+అధికుండు+ఐనవాఁడు= ఎల్లప్పుడు ప్రతాపంలో వెలుగొందుతూ అతిశయించేవాడు; అతి, క్రూర, దండంబునన్= మిక్కిలి కఠిన శిక్షలు వేయటంచేత; సర్వ, జన, సంతాపంబు+చేయుచున్= అందరు జనులకు తీవ్రమైన వేదన కల్పిస్తూ; గృహ, గతంబైన= ఇంటిలో ఉన్నట్టి; సర్పంబును+పోలెన్= పామువలె; ఎప్పుడున్= ఎల్లప్పుడు; ఉద్వేగ, కరుండు+అగున్= ఆరాటం కలిగించేవాడు అవుతాడు; కావునన్= కాబట్టి; కాల+ ఉచితంబులు+కాన్= సమయానుకూలాలుగా; క్షమాతేజంబులు= ఓర్పును, ప్రతాపాన్ని; కల్పించునది= ప్రదర్శించేది; యథా, కాల, కల్పిత, క్షమా, తేజుండు+ఐనవానికిన్= సమయానుకూలంగా ఓర్పు, ప్రతాపం చూపించేవాడికి; ఉభయలోకసిద్ధి= రెండులోకాలలో విజయం (ఐహికాముష్మిక సిద్ధి); అగును+అని; బలీంద్ర, ప్రహ్లాద, సంవాదంబు+చెప్పి; వెండియు= మరల; ద్రౌపది; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** దాన్ని వివరించి చెప్పితే - ఎల్లప్పుడు ఓర్పు చూపేవాడిని చూచి సేవకులు భయపడరు; పైగా అవమానిస్తారు. ధనానికి సంబంధించిన విషయాలలో నియమించబడిన అధికారులు ధనాలను అపహరిస్తారు; పైగా గర్వాన్ని ప్రదర్శిస్తారు. ఇక సదా తేజస్సునే ప్రదర్శించేవాడు మిక్కిలి కఠినశిక్షలు విధించటం చేత జనుల కందరికీ తీవ్రవేదన కలిగిస్తాడు. ఇంటిలో ఉన్న పామువంటి వాడయి నిరంతరం ఆరాటం కలిగిస్తాడు. కాబట్టి సమయానుకూలంగా క్షమ, తేజం ప్రదర్శించేవాడే ఐహికాముష్మికసిద్ధిని పొందగలడు' అని బలిచక్రవర్తికి ప్రహ్లాదుడికి మధ్య జరిగిన సంభాషణ వివరించి, మరల ద్రౌపది ధర్మరాజుతో ఇట్లా అన్నది.

**తే. 'ఆది నపరాధ మొక్కటి యైన నదియు । నల్పమైనను క్షమియించు నదియుఁ గాక**
**చెనసి యపరాధములు పెక్కు సేయుచున్న । పాపకౌరవ్యులకు సహింపంగ నేల? 219**

**ప్రతిపదార్థం:** ఆదిన్= మొదట; అపరాధము= తప్పు; ఒక్కటి+ఐనన్= ఒకటి మాత్రమే చేస్తే; అదియున్+అల్పము+ఐనను= అది చిన్న తప్పు మాత్రమే ఐనచో; క్షమియించు+అదియున్= క్షమించదగినది; కాక= అట్లాకాక; చెనసి= ఎదిరించి; అపరాధములు=

తప్పులు; పెక్కు= అనేకాలు; చేయుచున్న= చేస్తున్న; పాప కౌరవ్యులకు= పాపులైన కౌరవులపట్ల; సహింపంగన్+ఏల= ఎందుకు క్షమ చూపించాలి?

**తాత్పర్యం:** 'మొదట ఏదో ఒక తప్పు చేస్తే- ఆ తప్పు చిన్న తప్పు మాత్రమే అయితే- క్షమించవచ్చును గాని, ఎదిరించి వరుసగా పెక్కు తప్పులు చేస్తున్న పాపులైన కౌరవులను క్షమించట మెందుకు?

**విశేషం:** 'క్షమియించునదియుఁగాక'- అనే పాఠం సందేహాస్పదంగా ఉన్నది. ఎవరు? రాజు లేక జనుడు అని చెప్పాలి. 'క్షమియింపుము' అని ఉండవచ్చు. వావిళ్లప్రతిలో 'క్షమించునదియగాక'- అనే పాఠాంతరం ఉన్నది. 'క్షమియించునదియ - కాక' అనే ఈ పాఠం ఉచితమే. క్షమింపనే వలయును, అట్లు కాకయును; అని అర్థం చెప్పవచ్చును.

**క. ఇది తేజంబున కవసర; । ముదితక్రోధుండ వగుమ యొక్కించుక; దు**
**ర్మదు లగు సుయోధనాదుల । నదయుల వధియింతు రుగ్రులై నీ తమ్ముల్.' 220**

**ప్రతిపదార్థం:** ఇది; తేజంబునకు+అవసరము= ప్రతాపం చూపటానికి తగిన సమయం; ఒక్క+ఇంచుక= కొంచెంగా; ఉదిత క్రోధుండవు+అగుము+అ= ఉదయించిన కోపం కలవాడివి కమ్ము; దుర్మదులు+అగు= చెడుగర్వం కల; సుయోధన+ఆదులన్= దుర్యోధనుడు మున్నగువారిని; అదయులన్= దయలేనివారిని; నీ తమ్ముల్= నీ సహోదరులు; ఉగ్రులు+ఐ= భయంకరులై; వధియింతురు= చంపగలరు.

**తాత్పర్యం:** ఇది తేజం ప్రదర్శించటానికి అనువైన సమయం. ఒకింత కోపం తెచ్చుకొమ్ము. దుర్మదులైన దుర్యోధనాదులను నీ తమ్ములు భయంకరులై సంహరించగలరు.'

**వ. అనిన ధర్మరా జిట్లనియె. 221**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ద్రౌపది చెప్పగా; ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని ద్రౌపది చెప్పగా, ధర్మరాజు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**సీ. 'క్రోధంబు పాపంబు, గ్రోధంబునన చేసి । యగుఁ జువ్వె ధర్మకామార్థ హాని.**
**గడుఁగ్రోధి గర్జంబు గానండు, క్రుద్ధుండు । గురునైన నిందించుఁ, గ్రుద్ధుఁడైన**
**వాఁ డవధ్యులనైన వధియించు, మఱి యాత్మ । ఘాతంబు సేయంగఁ గడఁగుఁ గ్రుద్ధుఁ,**
**డస్మాదృశులకు ధర్మానుబంధుల కిట్టి । క్రోధంబు దాల్చుట గుణమె చెపుమ?**

**ఆ. యెఱుక గల మహాత్ముఁ డెఱుకయ న్జలముల । నార్చుఁ గ్రోధ మను మహానలంబుఁ,**
**గ్రోధవర్జితుండు గుఱుకొని తేజంబు । దాల్చు దేశకాలతత్త్వ మెఱిఁగి. 222**

**ప్రతిపదార్థం:** క్రోధంబు= కోపం; పాపంబు= పాపం (దురితం, చెడ్డది); క్రోధంబునన్+అ+చేసి= కోపంచేతనే; ధర్మ, కామ+అర్థ, హాని= ధర్మానికి, కామానికి, అర్థానికి చేటు; అగున్+చువ్వె= అవుతుంది సుమా! (అంటే పురుషార్థాలకు మూడింటికి క్రోధంవలన కీడు కలుగుతుందని భావం); కడున్+క్రోధి= మిక్కిలి కోపం పొందినవాడు; కర్జంబు+కానండు= కర్తవ్యాన్ని చూడలేడు; క్రుద్ధుండు= కోపించినవాడు; గురున్+ఐన= గురువునైనను; నిందించున్= తెగడుతాడు; క్రుద్ధుఁడు+

ఐనవాఁడు= ఆగ్రహించినవాడు; అవధ్యులను+ఐనన్= చంపదగనివారిని సయితం; వధియించున్= చంపుతాడు; మఱి= ఇంక; క్రుద్ధుఁడు= కోపించినవాడు; ఆత్మఘాతంబు+చేయంగన్+కడఁగున్= ఆత్మహత్యకు పాల్పడతాడు; అస్మాదృశులకున్= నా వంటివారికి; ధర్మ+అనుబంధులకున్= ధర్మంతో ముడివడిన వారికి; ఇట్టి, క్రోధంబు= ఇటువంటికోపం; తాల్చుట= వహించటం; గుణము+ఎ= మంచిగుణం అవుతుందా; చెపుము+అ= చెప్పుము; ఎఱుక+కల, మహత్+ఆత్ముఁడు= జ్ఞానం కల గొప్పవాడు; ఎఱుక+అన్+జలములన్= జ్ఞాన మనే నీళ్ళతో; క్రోధము+అను, మహా+అనలంబున్= కోపమనే పెనుమంటను; ఆర్చున్= ఆర్పివేస్తాడు; క్రోధవర్జితుండు= క్రోధంచేత విడువబడినవాడు (కోపాన్ని విడనాడినవాడు); గుఱుకొని= ప్రయత్నించి; దేశ, కాల, తత్త్వము+ఎఱిఁగి= దేశ సమయాలయొక్క స్వభావం తెలిసికొని; తేజంబు= ప్రకాశాన్ని; తాల్చున్= ధరిస్తాడు.

**తాత్పర్యం:** 'కోపం గొప్ప పాపం. కోపంవలన మూడు పురుషార్థాలకు- ధర్మానికి, అర్థానికి, కామానికి కీడు సంభవిస్తుంది కదా! మిక్కిలి కోపించినట్టివాడు కర్తవ్యాన్ని గ్రహించజాలడు. కోపి గురువు నైనను నిందిస్తాడు. కోపం చెందిన వాడు చంపకూడనివారిని సయితం చంపివేస్తాడు; అంతేకాదు. ఆత్మహత్యకుకూడ పాల్పడతాడు. ధర్మంతో ముడివడిన నడవడిక కల నాబోటివారికి కోపంవహించటం తగునా? నీవే చెప్పుము. జ్ఞాని అయిన మహాత్ముడు జ్ఞానమనే నీటితో కోపమనే పెనుమంటను చల్లార్చుతాడు. క్రోధం విడనాడినవాడు సమయ సీమల నిజస్వభావం తెలిసికొని తేజస్వి అవుతాడు.

**విశేషం:** అలం: రూపకం.

**క. క్షమ గల వానికిఁ బృథ్వీ । సమునకు నిత్యంబు విజయసంసిద్ధి యగున్;**
**క్షమి యైనవాని భుజవి । క్రమము గడున్ వెలయు సర్వకార్యక్షమమై. 223**

**ప్రతిపదార్థం:** క్షమ కలవానికిన్= ఓర్పు ఉన్నవాడికి; పృథ్వీసమునకున్= భూదేవితో సమానుడైన వాడికి; నిత్యంబు= ఎల్లప్పుడు; విజయ, సంసిద్ధి= విశేష జయప్రాప్తి, అంటే గొప్పవిజయం కలగటం; అగున్= ఏర్పడుతుంది; క్షమి+ఐనవాని= క్షమావంతుడి యొక్క; భుజ, విక్రమము= బాహుబలం, అంటే పరాక్రమం; సర్వ, కార్య, క్షమము+ఐ= అన్ని పనులకు సరిపడేటటువంటిదై; కడున్= మిక్కిలి; వెలయున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** భూదేవితో సమానుడైన ఓర్పు కలవాడికి సదా విజయం సిద్ధిస్తుంది. క్షమావంతుడి పరాక్రమం అన్ని సమయాలలోను కార్యసాధకమై రాణిస్తుంది.

**విశేషం:** క్షమాశక్తికి ప్రాచీన భారతీయ సాహిత్యంలో ఉదాహరణ ప్రాయమైంది భూదేవి. "క్షమయా ధరిత్రీ" అని తెలుగువారి సంభాషణలలో సాధారణంగా వినిపిస్తుంది. భూదేవికి గల పేర్లలో 'క్షమా' అనేది సార్థకమైనది, ప్రసిద్ధమైనది.

**వ. తేజఃప్రభవంబులైన యమర్ష దాక్షిణ్య శౌర్య శీఘ్రత్వంబు లను నాలుగు గుణంబులు క్షమావంతునందు వీర్యవంతంబులగుఁ; దొల్లి కశ్యపగీతలైనగాథలయందీ యర్థంబు వినంబడు, వినుము; వేదంబులు యజ్ఞంబులు శౌచంబును సత్యంబును విద్యయు ధర్మువు సచరాచరం బయిన జగమంతయు క్షమయంద నిలిచినవి; తపస్స్వాధ్యాయ యజ్ఞకర్తలయు బ్రహ్మవిదులయుం బడయు పుణ్యగతులు క్షమావంతులు వడయుదు; రదియునుంగాక, కృష్ణ ద్వైపాయన భీష్మ విదుర కృపద్రోణ సంజయ ప్రభృతులు నా యుపశమంబ**

**కీర్తింతు; రుపశమ హీనుండయిన దుర్యోధను కారణంబున ధార్తరాష్ట్రుల కెల్లం బ్రళయం బగు' ననిన ద్రౌపది వెండియు నిట్లనియె. 224**

**ప్రతిపదార్థం:** తేజస్+ప్రభవంబులు+ఐన= తేజస్సునుండి పుట్టిన; అమర్ష, దాక్షిణ్య, శౌర్య, శీఘ్రత్వంబులు+అను= అసహనం (కోపం), దయ, పరాక్రమం, వేగం అనే; నాలుగు, గుణంబులు= నాలుగు లక్షణాలు; క్షమావంతునందు+అ= ఓర్పుకల వాడియందు మాత్రమే; వీర్యవంతంబులు+అగున్= బలం కలవి అవుతాయి; తొల్లి= పూర్వం; కశ్యపగీతలు+ఐన, గాథల+అందు= కశ్యపుడిచే చెప్పబడిన ప్రబోధకాలు అయిన కథల్లో; ఈ+అర్థంబు= ఈ భావం; వినంబడు; వినుము; వేదంబులు, యజ్ఞంబులు, శౌచంబును, సత్యంబును, విద్యయు, ధర్మువు= వేదాలును, యజ్ఞాలును, పారిశుద్ధ్యమును, నిజమును, చదువును, ధర్మమును; స, చర+అచరంబు+అయిన, జగము+అంతయు= కదలేటి, కదలనట్టి వాటితో కూడిన ప్రపంచమంతయు; క్షమయందు+అ= ఓర్పునందు మాత్రమే; నిలిచినవి; తపస్+స్వాధ్యాయ, యజ్ఞకర్తలయు= తపస్సు, వేదాన్ని అభ్యసించటం, (వేదాధ్యయనం) యజ్ఞాలు- చేసిన వారి యొక్కయు; బ్రహ్మ విదులయున్= జ్ఞానులయొక్కయు; పడయు, పుణ్య, గతులు= పొందే పుణ్య పదవులు; క్షమావంతులు= ఓర్పుకల వాళ్ళు; పడయుదురు= పొందుతారు, అదియునున్+కాక= అంతమాత్రమేకాక; కృష్ణద్వైపాయన, భీష్మ, విదుర, కృప, ద్రోణ, సంజయ, ప్రభృతులు= వ్యాసుడు, భీష్ముడు, విదురుడు, కృపుడు, ద్రోణుడు, సంజయుడు మున్నగువారు; నా, ఉపశమంబు+అ= నా ఓర్పునే; కీర్తింతురు= పొగడుతారు; ఉపశమ, హీనుండు+అయిన= ఓర్పులేనివాడయిన; దుర్యోధను, కారణంబునన్= దుర్యోధనుడి మూలంగా; ధార్తరాష్ట్రులకు+ఎల్లన్= ధృతరాష్ట్రుడి కుమారుల కెల్లరకు; ప్రళయంబు+అగున్= వినాశనం దాపురిస్తుంది; అనినన్= అని చెప్పగా; ద్రౌపది; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** కోపం, దయ, పరాక్రమం, వేగం అనే నాలుగు గుణాలు తేజంనుంచి పుట్టాయి. క్షమావంతుడి పట్ల బలం కలవిగా పరిణమిస్తాయి - అని కశ్యపగీతలలో ఉన్నది. వేదాలు, యజ్ఞాలు, శౌచం, సత్యం, ధర్మం, విద్య, సమస్త చరాచర జగత్తు క్షమమీదే నిలుస్తాయి. బ్రహ్మజ్ఞానులున్నూ, తపస్సు, వేదాధ్యయనం చేసిన యజ్ఞకర్తలున్నూ పొందే ఉత్తమగతులను క్షమావంతులు పొందగలరు. వ్యాసుడు, విదురుడు, భీష్ముడు, కృపుడు, ద్రోణుడు, సంజయుడు మున్నగు ధర్మాత్ములు నా క్షమాగుణాన్నే పొగడుతారు. దుర్యోధనుడి క్షమాహీనతవలన ధార్తరాష్ట్రుల కెల్ల వినాశనం ఏర్పడగలదు' అని చెప్పిన ధర్మరాజుతో ద్రౌపది ఇట్లా పలికింది.

**విశేషం:** మహాభారతంలో భగవద్గీతతోపాటు పెక్కు గీతలు ఉన్నాయి. మరికొన్ని గీతల ప్రశంస ఎడనెడ కన్పిస్తుంది. నన్నయ మహాకవి పీఠికలో ఉద్ఘోషించినట్లు - మహాభారతాన్ని వ్యాసమహర్షి విశ్వ జనీనమైన విజ్ఞాన సర్వస్వంగా తీర్చి దిద్దాడు. మహాభారతం సర్వదర్శనసమాహారంగా ప్రశస్తి కాంచటానికి కారణం, అందులో విప్రతిపన్నాలుగా కనిపించే విభిన్నవాదాలు సంవాదరూపంలో పొందుపరచబడటం. వాటిలో ద్రౌపదీ ధర్మరాజుల సంవాదం ఒకటి.

**మధ్యాక్కర.**

> **'క్షమయంద చిత్తంబు నిల్పి నిర్గతకల్మషబుద్ధిఁ**
> **గ్రమమున ధర్మువునంద వర్తిల్లు కరుణాత్మ నిన్ను**
> **నమర ధర్మంబు రక్షించుఁ బ్రీతితో నని శత్రులందు**
> **సమబుద్ధి సేయంగఁ జనునె నీకు నజాతశత్రుండ! 225**

**ప్రతిపదార్థం:** అజాతశత్రుండ!= శత్రువులు లేనట్టివాడా ఓ ధర్మరాజా!; క్షమయందు+అ= ఓర్పునందే; చిత్తంబు, నిల్పి= మనస్సు ఉంచి; నిర్గత, కల్మష, బుద్ధిన్= పోయిన పాపాలుకల బుద్ధితో; క్రమమునన్= వరుసతప్పక; ధర్మువునందు+అ= ధర్మంలో మాత్రమే; వర్తిల్లు= నడుచుకొనే; కరుణా+ఆత్మున్= దయామయుడైన; నిన్నున్; అమరన్= ఒప్పగా; ధర్మంబు= ధర్మం; ప్రీతితోన్= అనురాగంతో; రక్షించున్= కాపాడగలదు; అని; నీకున్; శత్రులందు= విరోధులపట్ల; సమబుద్ధి= ఋజువైన బుద్ధి; (శత్రుత్వం లేని మనస్తత్వం); చేయంగన్+చనునె= అవలంబించటం సరైనదవుతుందా?

**తాత్పర్యం:** 'అజాత శత్రుడవైన ధర్మరాజా! నిర్మలమైన బుద్ధితో ఓర్పునందే మనస్సును లగ్నంచేసి నీవు ధర్మంలో ప్రవర్తిస్తున్నావు. అటువంటి కరుణామయుడవైన నిన్ను ఆ ధర్మమే ప్రీతితో కాపాడగలదన్న విశ్వాసంతో, శత్రువులయెడల సమబుద్ధి వహించడం నీకు తగునా?

**విశేషం:** ద్రౌపదివాదం, ధర్మరాజుపై సునిశితవిమర్శగా స్థూలదృష్టికి గోచరించినా, సూక్ష్మదృష్టికి ధర్మరాజు ఎట్లా సార్థకనాముడు అయ్యాడో, అతడికి ఎట్లా అజాతశత్రుడు అనే బిరుదు ఏర్పడిందో తెల్లమవుతున్నది. వృత్తలక్షణానికి ఆర. 1.134 విశేషాంశం చూడండి.

**ఆ. ధర్మదూరులైన ధార్తరాష్ట్రులయంద । ధర్ము వేమి సేయు ధరణినాథ!**
**నికృతిపరులయందు నికృతి సేయనివారు । వారి నికృతిఁజేసి వధ్యు లండ్రు. 226**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా! (ఓ ధర్మరాజా!); ధర్మ, దూరులు+ఐన= అధర్మపరులైన (ధర్మానికి దూరంగా ఉన్నవారైన); ధార్తరాష్ట్రులయందు+అ= ధృతరాష్ట్రుడి కొడుకులందే; ధర్మువు= ధర్మం; ఏమి, చేయున్= ఏం చేయగలదు? (అధర్మువు= అధర్మం ఏమి చేయకలదని కూడ చెప్పవచ్చును); నికృతి పరుల యందు= మోసగాండ్రపట్ల; నికృతి, చేయనివారు= మోసంగా ప్రవర్తించనివారు; వారి, నికృతిన్+చేసి= వారి మోసంవలన; వధ్యులు= చంపదగినవారు; అండ్రు= అని అంటారు.

**తాత్పర్యం:** ఓ రాజా! అధర్మవర్తనులైన ధార్తరాష్ట్రులపట్ల నీ ధర్మం ఏమి చేయగలదు? (అధర్మం చేసినా దోషం లేదు). వంచకులపట్ల వంచనతో ప్రవర్తించనివారు, వారి వంచనచేత చంపదగినవారవుతారని పెద్దల అభిప్రాయం.

**విశేషం:** అనుదురు - అందురు - అండురు - అండ్రు. కర్త పెద్దలు.

**క. ఆర్యులకు విహీనతయు న । నార్యుల కున్నతియుఁ జేసి యవినీతుఁడ వై**
**కార్యము దప్పితి; నీకు న । నార్యులు చుట్టములె, యార్యు లరులె విధాతా!' 227**

**ప్రతిపదార్థం:** విధాతా!= ఓ బ్రహ్మదేవుడా!; ఆర్యులకున్= పూజ్యులైనవారికి; విహీనతయున్= తక్కువతనాన్నీ; అనార్యులకు= అపూజ్యులకు, అంటే దుష్టులకు; ఉన్నతియున్= అభ్యుదయాన్నీ; చేసి= కల్పించి; అవినీతుఁడవు+ఐ= నీతి లేని వాడివై; కార్యము+తప్పితి(వి)= కర్తవ్యాన్ని ఉజ్జగించావు; నీకు; అనార్యులు= అపూజ్యులు; చుట్టములు+ఎ= బంధువులా?; ఆర్యులు= మహానుభావులు; అరులు+ఎ= శత్రువులా?

**తాత్పర్యం:** (ఈవాక్యాలు ద్రౌపది, బ్రహ్మదేవుడిని సంబోధించి పలికినవి. ఇది ద్రౌపది స్వగతం. ధర్మరాజు వినాలనే ద్రౌపది తన ఆంతరంగిక భావాన్ని బహిర్గత మొనరించింది.) 'ఓ బ్రహ్మదేవుడా! ఆర్యులకు లేమిని,

అనార్యులకు అభ్యుదయాన్ని చేకూరుస్తున్నావు ఈ రీతిగా నీతిని అతిక్రమించి, నీ కర్తవ్యాన్ని వదలిపెట్టావు కదా! నీకు అనార్యులే బంధుగులా? ఆర్యులు శత్రువులా?

**వ. అని, విధాతృని ధర్మువు నాక్షేపించు ద్రౌపదిం జూచి ధర్మ రాజిట్లనియె; 'నాస్తికులయట్లు ధర్మాభిశంకినివై దైవ దూషణంబు సేసెదు; శిష్టచరితంబైన ధర్మంబు నధిక్షేపించుచున్న దుర్మతికిం బ్రాయశ్చిత్తంబు లేదు; ధర్మువు దప్పక నిత్యులై జీవించుచున్న మైత్రేయ మార్కండేయ వ్యాస వసిష్ఠ నారద ప్రభృతులం బరమయోగధరులం బ్రత్యక్షంబ చూచెదము; వీరెల్ల నన్ను ధర్మపరుండని మన్నింతు; రన్యు లన్యాయంబు సేసి రేనియు నే నేల ధర్మువు దప్పుదు? 228**

**ప్రతిపదార్థం:** అని; విధాతృని= బ్రహ్మదేవుడి యొక్క; ధర్మువున్= ధర్మాన్ని; ఆక్షేపించు= తెగడుతున్న; ద్రౌపదిన్+చూచి= ద్రౌపదిని చూచి; ధర్మరాజు; ఇట్లు+అనియెన్; నాస్తికుల వలె; ధర్మ+అభిశంకినివి+ఐ= ధర్మం పట్ల సందేహం కలదానివై; దైవ దూషణంబు= దైవాన్ని దూషించటం; చేసెదు= చేస్తున్నావు; శిష్ట, చరితంబు+ఐన= మంచివారి నడవడి అయిన; ధర్మంబున్+అధిక్షేపించుచున్న, దుర్మతికిన్= ధర్మాన్ని దూషిస్తున్న దుష్టబుద్ధికి; ప్రాయశ్చిత్తంబు= (నిష్కృతి కల్పించే) విరుగుడు; లేదు; ధర్మువు, తప్పక= ధర్మమార్గాన్ని అతిక్రమించక; నిత్యులు+ఐ, జీవించుచు+ఉన్న= ఎల్లప్పుడు జీవిస్తున్న (బ్రతుకుతున్న); మైత్రేయ, మార్కండేయ, వ్యాస, వసిష్ఠ, నారద ప్రభృతులన్= మైత్రేయుడు, మార్కండేయుడు, వ్యాసుడు, వసిష్ఠుడు, నారదుడు మున్నగు వారిని; పరమయోగ ధరులన్= గొప్ప యోగులను; ప్రత్యక్షంబు+అ= మన కనులముందే; చూచెదము= చూస్తున్నాం; వీరు+ఎల్లన్= వీరందరున్నూ; నన్ను; ధర్మపరుండు+అని= ధర్మ నిష్ఠ కలవాడని; మన్నింతురు= గౌరవిస్తారు; అన్యులు= ఇతరులు; అన్యాయంబు+చేసిరి+ఏనియు= అన్యాయం చేసినప్పటికిని; నేను+ఏల= నేనెందుకు; ధర్మువు= ధర్మాన్ని; తప్పుదున్= మీరుతాను?

**తాత్పర్యం:** (ఇక్కడ ధర్మరాజు తన జీవితతత్త్వాన్ని వివరించాడు. ఇది ద్రౌపదివాదానికి పూర్వపక్షం). ద్రౌపదితో ధర్మరాజు ఇట్లా అన్నాడు: 'నాస్తికుల వలె ధర్మాన్ని మిగుల సందేహిస్తూ దైవదూషణ చేయట మెందుకు? శిష్టజనుల నడవడియైన ధర్మాన్ని నిందించే దుర్బుద్ధికి నిష్కృతి లేదు. ధర్మాత్ములైన మైత్రేయ, మార్కండేయ, వ్యాస, వసిష్ఠ, నారద ప్రభృతులు నన్ను ధర్మపరుడని గౌరవిస్తున్నారుకదా! అట్టి పరమ యోగీశ్వరులను మనం మన కనుల ముందే చూస్తున్నాం. శిష్టచరితమే ప్రత్యక్ష ధర్మం. ఇతరులు నాపట్ల అన్యాయంగా ప్రవర్తించినా నే నెందుకు ధర్మాన్ని తప్పాలి?

**విశేషం:** నాస్తికుడు అనే శబ్దానికి 'లేదు' అని చెప్పేవాడు అనిన్నీ; ఆస్తికుడు అనే శబ్దానికి 'ఉన్నది' అని చెప్పేవాడు అనిన్నీ వాచ్యార్థం. ప్రాచీన భారతీయ వాఙ్మయంలో 'నాస్తికుడు' అంటే వేదప్రామాణ్యాన్ని అంగీకరించనివాడు అనిన్నీ, 'ఆస్తికుడు' అంటే వేద ప్రామాణ్యాన్ని అంగీకరించినవాడు అనిన్నీ రూఢ్యర్థం. ఆధునిక వ్యవహారంలో నాస్తికుడంటే దేవుడు లేడనే వాడనిన్నీ, ఆస్తికు డంటే దేవుడు ఉన్నాడనేవాడనిన్నీ పలువురు భావిస్తున్నారు. ద్రౌపది నాస్తికురాలు కాదు. 'నాస్తికుల యట్లు' ఆమె వాదించటం ధర్మరాజుకు నచ్చలేదు. మహాభారతంలో అన్ని వాదాలకు యథోచితంగా వివరణ ఉన్నది. తుదకు తీర్పు చెప్పవలసింది సహృదయులైన చదువరులే.

**క. ధీరమతియుక్తిఁ జేసి వి। చారింపఁగ నిక్కువంబు సర్వజన స్వ**
**ర్గారోహణసోపానం। బారఁగ ధర్మంబ సూవె యతిరమ్యంబై. 229**

**ప్రతిపదార్థం:** ధీర, మతి, యుక్తిన్+చేసి= పండిత బుద్ధితో; విచారింపఁగన్= ఆలోచన చేస్తే; నిక్కువంబు= నిజం; సర్వ, జన, స్వర్గ+ఆరోహణ, సోపానంబు= అందరు ప్రజలకు స్వర్గాన్ని ఎక్కటానికి మెట్టు; ఆరఁగ= పరిపూర్ణంగా; అతి రమ్యంబు+ఐ= మిక్కిలి సుందరమై; ధర్మంబు+అ+చూవె= ధర్మమే సుమా! (చూడవె= చూవె).

**తాత్పర్యం:** తెలివితేటలతో యోచిస్తే సర్వజనులకు స్వర్గారోహణ సోపానం అతిరమ్యమైన ధర్మమే సుమా!

**విశేషం:** మహాభారతంలో ఈ పద్యం మిక్కిలి ముఖ్యమైంది. మహాభారతం స్వర్గారోహణ పర్వంతో ముగుస్తున్నది. ధర్మమే స్వర్గారోహణకు సోపానం అని ఈ పద్యం నొక్కి వక్కాణిస్తున్నది. మహాభారతానికి అంతరాత్మ ధర్మం. ఈ పద్యంలో నాల్గవ పాదం మొదట 'ఆరఁగ' అనే పాఠానికి 'ఆరయ' అనే పాఠం కొన్ని ప్రతుల్లో కనిపిస్తున్నది. ఈ పద్యంలో మొదటనే 'విచారింపఁగ' అనే ప్రయోగం ఉన్నది. కావున 'ఆరయ' అనే పాఠం స్వీకరిస్తే అది పునరుక్తి దోష మవుతుంది. ఇక 'ఆరఁగ' అనే శబ్దం తెలుగుభాషలో నిండైన, పరిపూర్ణమైన అతిశయించు అనే అర్థాల్ని సంతరించుకొని ఉన్నది. (ఆరఁగ్రాగిన పాలు - వీనులార విని - కృపయార సైరింపుము భార. స్త్రీ పర్వం 1-157) అందుచేత 'ఆరఁగ' పాఠం స్వీకరించబడింది.

**వ. తపస్స్వాధ్యాయ బ్రహ్మచర్యదాన ధర్మ యజ్ఞంబులను పుణ్యకర్మంబు లఫలంబు లగునేని వీనినేల ఋషిగణంబులు సేవింతురు; నీ జన్మంబును ధృష్టద్యుమ్ను జన్మంబును బుణ్య కర్మ ఫల సద్భావంబునకు నిదర్శనంబులు గావె? మఱి పుణ్యకర్మఫలంబులు గల యట్ల పాపఫలంబులును గలవు; తొల్లి బ్రహ్మ పుత్త్రులకుం గర్మఫల సద్భావంబుసెప్పె; నందుఁగశ్యపుండు ధర్మప్రబోధనంబునం జేసి పుణ్యఫల ప్రాప్తుండయ్యె; విధాతృ నియోగంబునం బుణ్యపాప ఫలంబు సంప్రాప్తం బగు; విధాతృ ననుగ్రహంబునన కాదె పుణ్యకర్మంబులు ప్రవర్తించి మర్త్యు లమర్త్యత్వంబును బొందుదు' రనిన విని ద్రౌపది యిట్లనియె. 230**

**ప్రతిపదార్థం:** తపస్+స్వాధ్యాయ, బ్రహ్మచర్య, దాన, ధర్మ, యజ్ఞంబులు+అను= తపం, వేద పారాయణం, బ్రహ్మచర్యం, దానం, ధర్మం, యజ్ఞం అనే; పుణ్యకర్మంబులు= పుణ్యకార్యాలు; అఫలంబులు= ఫలాలు లేనట్టివి (అంటే నిరర్థకాలు); అగున్+ఏని= అయితే; వీనిన్= పై వాటిని; ఋషి, గణంబులు= ఋషుల సమూహాలు; ఏల, సేవింతురు= ఎందుకు ఆచరిస్తారు?; నీ, జన్మంబును= నీ పుట్టుకయున్నూ; ధృష్టద్యుమ్ను జన్మంబును= ధృష్టద్యుమ్నుడి పుట్టుకయున్నూ; పుణ్య, కర్మ, ఫల, సత్+భావంబునకున్= పుణ్యకార్యాలు చేయటంవలన ఒనగూడిన ఫలమనే మంచి భావానికి (ఫలం ఉన్నదనటానికి); నిదర్శనంబులు, కావె= ఉదాహరణాలు కావా?; మఱి; పుణ్య, కర్మ, ఫలంబులు= పుణ్యకార్యాలవలన కలిగే ఫలితాలు; కల+అట్లు+అ= ఉన్నట్లే; పాప, ఫలంబులును= పాపాలు చేయటంవలన కలిగే ఫలాలున్నూ; కలవు= ఉన్నాయి; తొల్లి= పూర్వకాలంలో; బ్రహ్మ; తన పుత్త్రులకున్= తన కుమారులకు; కర్మ, ఫల, సత్+భావంబు= కర్మలుచేయటంవలన సంక్రమించే ఫలితాలను బాగా పొందటాన్ని గురించి; చెప్పెన్; అందున్= ఆ కుమారులలో; కశ్యపుండు; ధర్మప్రబోధంబునన్+చేసి= ధర్మబోధచేత; పుణ్య, ఫల, ప్రాప్తుండు+అయ్యె= పుణ్య ఫలాలను పొందినవా డయ్యాడు, విధాతృ, నియోగంబునన్= బ్రహ్మ నిర్ణయం ప్రకారం; పుణ్య, పాప, ఫలంబు= పుణ్యం కాని, పాపం కాని చేస్తే దాని ఫలితం; సంప్రాప్తంబు+అగున్= సంక్రమిస్తుంది; విధాతృ+అనుగ్రహంబునన్+అ, కాదె= బ్రహ్మదేవుడి దయవలననే కదా!; పుణ్య, కర్మంబులు, ప్రవర్తించి= పుణ్యకార్యాలు, చేసి; మర్త్యులు= మనుజులు; (మరణం చెందేవారు); అమర్త్యత్వంబును= చావులేని దివ్యత్వాన్ని; పొందుదురు= పడయుదురు; అనిన, విని, ద్రౌపది, ఇట్లు+అనియెన్= అని చెప్పగా ఆలకించి ద్రౌపది ఇట్లా పలికింది.

**తాత్పర్యం:** తపస్సు, వేదపారాయణం, బ్రహ్మచర్యం, దానం, ధర్మం, యజ్ఞం అనే పుణ్యకార్యాలు ఫలితాలు లేనట్టివయితే వాటిని ఎంతోమంది ఋషులు ఎందుకు ఆచరిస్తున్నారు? నీ పుట్టుక, ధృష్టద్యుమ్నుడి పుట్టుక

పుణ్యకర్మఫలం ఉన్నదనటానికి ఉదాహరణాలే కదా! పుణ్యకర్మఫలాలు ఉన్నట్లే పాపకర్మఫలాలు కూడ ఉన్నాయి. పూర్వం బ్రహ్మ తన కుమారులకు కర్మఫలాల ఉనికిని గురించి చెప్పాడు. వారిలో కశ్యపుడు ధర్మప్రబోధంచేత పుణ్యఫలప్రాప్తు డయ్యాడు. బ్రహ్మనిర్ణయం ప్రకారం పుణ్య పాప ఫలితాలు సంక్రమిస్తాయి. బ్రహ్మదేవుడి దయ వలననే పుణ్యకార్యాలు చేసి మనుజులు చావులేని దివ్యత్వాన్ని పొందుతారు'- అని చెప్పగా విని ద్రౌపది ఇట్లా పలికింది.

**ఆ. 'కర్మఫలము లేదు, కర్మ ఫలాప్తికిఁ। గారణంబు విధియుఁ గా దనంగ**
**నంత యెఱుకలేనె యార్తనై విధి చెయ్ది। కలసి పలికితిం బ్రియంబు దప్పి, 231**

**ప్రతిపదార్థం:** కర్మ ఫలము= చేసిన పనులకు అనుభవించవలసిన ఫలితం; లేదు= ఉండదు; కర్మ, ఫల+ఆప్తికిన్= కర్మఫలాలు పొందటానికి; కారణము= హేతువు; విధియున్= బ్రహ్మయు; కాదు+అనంగన్= కాదని చెప్పటానికి; అంత+ఎఱుక, లేను+ఎ= అంతమాత్రం జ్ఞానం లేనిదాననా?; ఆర్తను+ఐ= కష్టాలు పొందటంచేత కలిగిన మనోవ్యథతో పరితపించిన దానినై; విధిచెయ్దికి= దైవంయొక్క చేతకు, దురదృష్టానికి; అలసి= విసిగి; ప్రియంబు+తప్పి= అప్రియంగా-కటువుగా; పలికితిన్= మాట్లాడాను.

**తాత్పర్యం:** 'చేసిన పనులకు అనుభవించవలసిన ఫలం లేదు; కర్మఫలప్రాప్తికి విధికారణం కాజాలదు'- అని చెప్పేటంతటి జ్ఞానం లేని దాననా నేను? దురదృష్టంవలన పడిన అగచాట్లచేత మనస్తాపం కలిగి అట్లా అప్రియంగా మాట్లాడాను.

**ఆ. వేదశాస్త్రములును విధివిధానములును। నప్రమాణ మను దురాత్మకులకుఁ**
**బుణ్యగతులు లేమి భూనాథ! యెఱుఁగని। దానఁగాను ధర్మతత్త్వయుక్తి. 232**

**ప్రతిపదార్థం:** వేద, శాస్త్రములును= వేదాలు, శాస్త్రాలు (నియమన గ్రంథాలు)న్నూ; విధి, విధానములునున్= వర్తించే తీరులును; అప్రమాణము= అంగీకరించవలసినవి కావు; అను= అనే; దురాత్మకులకున్= చెడ్డవారికి; పుణ్యగతులు, లేమి= పుణ్యఫలాలు లేక పోవటం; భూనాథ= ఓరాజా! (భూమికి భర్త అయిన వాడా!); ధర్మ తత్త్వయుక్తిన్= ధర్మానికి సంబంధించిన తత్త్వజ్ఞానంయొక్క కూడికచే; ఎఱుఁగనిదానన్+కాను= తెలియనిదానిని కాను.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నేను ధర్మంయొక్క తత్త్వాన్ని గూర్చిన (గురించిన) పరిజ్ఞానం బొత్తిగా లేని దానిని కాను. వేదాలు, శాస్త్రాలు, అందులో చెప్పబడిన విధులు, నిషేధాలు, ప్రమాణాలు కావు అని చెప్పే చెడ్డవారికి పుణ్యగతులు లేవు అని తెలియనిదాననూ కాను.

**వ. తొల్లి నీతిమంతులైన బ్రాహ్మణులు మదీయ జనకునకుం జెప్పంగ వింటి; నెఱుక గలవారికిం గర్మంబు గర్తవ్యంబు; గర్మరహితులయి స్థావరంబులయట్లు జనులు జీవింపనేర; రల్పఫలంబునైనను గర్మంబుఁ బ్రవర్తించుచున్నవారిం జూచెదము; దైవమానుషంబులు గర్మఫలప్రాప్తికి నిమిత్తంబులు; పురుషుండు మనంబున నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునందుఁ గృతోత్సాహుండు గావలయు; నట్టివానికి దైవంబు సహాయం బయి కర్మసిద్ధి గావించు. 233**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; నీతిమంతులు+ఐన= నీతి పరిజ్ఞానం కల; బ్రాహ్మణులు= విప్రులు; మదీయ జనకునకున్= నా తండ్రికి (ద్రుపదమహారాజుకు); చెప్పంగ, వింటిన్= చెప్పుతుంటే విన్నాను; ఎఱుక, కలవారికిన్= జ్ఞానులకు; కర్మంబు= క్రియాచరణం (అంటే కర్తవ్యాలు చేయటం); కర్తవ్యంబు= చేయవలసిన ధర్మం; కర్మ, రహితులు+అయి= క్రియాశూన్యులయి; స్థావరంబులు+అట్లు= జడపదార్థాలవలె; జనులు; జీవింపనేరరు= బ్రతుకజాలరు; అల్పఫలంబున్+ఐనను= తక్కువ ఫలితం కలదే అయినప్పటికిన్నీ; కర్మంబున్= క్రియానిరతిన్, (పనులు చేస్తుండటాన్ని); ప్రవర్తించుచున్న వారిన్= నిర్వర్తిస్తున్నవారిని; చూచెదము= చూస్తుంటాం; దైవ, మానుషంబులు= విధియున్నూ, మానవ యత్నమున్నూ; కర్మ, ఫల, ప్రాప్తికిన్= కర్మవలన కలిగే ఫలసిద్ధికి; నిమిత్తంబులు= కారణాలు; పురుషుండు= మనుజుడు; మనంబునన్= మనస్సులో; అర్థసిద్ధి నిశ్చయించి= తన ధ్యేయ ఫలితాన్ని యోజన చేసి నిర్ణయించుకొని; కర్మంబునందున్= తాను చేయవలసిన కృషిలో; కృత+ఉత్సాహుండు= చేయబడిన ఉత్సాహం కలవాడు, అంటే సంతోష పూర్వకమైన దీక్షతో ఉండేవాడు; కావలయున్; అట్టి వానికి; దైవంబు= విధి; సహాయంబు+అయి= తోడై; కర్మసిద్ధి= చేసినపనికి తగిన ఫలితం; కావించున్= ఏర్పరుస్తుంది.

**తాత్పర్యం:** తొల్లి నీతికోవిదులైన విద్వాంసులు నాతండ్రితో మాట్లాడేటప్పుడు విన్నాను. జ్ఞానులకు కర్మచేయటం కర్తవ్యం. జడాల వలె జనులు క్రియాశూన్యులై జీవించలేరు. పొందెడి ఫలం తక్కువే అయినా పురుషకారం చేస్తున్నవారు మన కనులముందే ఉన్నారు. కర్మఫలప్రాప్తికి దైవమున్నూ, పురుషకారమున్నూ కారణాలు. పురుషుడు ముందు తన మనస్సులో తన ధ్యేయాన్ని నిర్ణయించుకొని తదుపరి సంతోషంతో కూడిన దీక్షతో పురుషకారానికి పూనుకోవాలి. అట్టివాడికి, అంటే పురుషకారంతో కర్మ చేసేవాడికి, దేవుడు సాయపడి కర్మసిద్ధి కావిస్తాడు.

**మధ్యాక్కర.**

**తిలలందుఁ దైలంబు గాష్ఠములయందుఁ దిరముగా నగ్ని**
**గలుగు టెఱింగి యుపాయపూర్వము గడఁగి తత్సిద్ధి**
**యలయక యుత్సాహవంతుఁడు వడయున ట్లనుత్సాహ**
**మొలసి దైవపరుఁ డిది వడయంగను నోపునె యెందు. 234**

**ప్రతిపదార్థం:** తిలలందున్+తైలంబు= నువ్వుగింజలలో నూనె; కాష్ఠముల+అందున్= కర్రలలో; తిరముగాన్= స్థిరంగా అగ్ని; కలుగుట+ఎఱింగి= ఉండటం తెలిసికొని; ఉత్సాహవంతుఁడు= సంతోషంతో స్థిరయత్నం చేసేవాడు; ఉపాయ, పూర్వము, కడఁగి= ఉపాయపూర్వకంగా ప్రయత్నించి; అలయక= విడువక శ్రమించి; తద్+సిద్ధి= వాటి లబ్ధిని; పడయు+అట్లు= పొందునట్లుగా, దైవపరుఁడు= విధిని మాత్రమే నమ్ముకొన్నవాడు; అనుత్సాహము= ఉత్సాహం లేమి; ఒలసి= పొంది; ఇది= కర్మఫలసిద్ధిని; ఎందున్= ఎచటనైనను; పడయంగనున్+ఓపునె?= పడయజాలునా?

**తాత్పర్యం:** నువ్వుగింజల్లో నూనె ఉన్నది కదా! కర్రల్లో అగ్ని ఉన్నదికదా! వాటిని పొందటానికి ఉత్సాహవంతుడు ఉపాయపూర్వకమైన ప్రయత్నం చేయవలసి ఉంటుంది. పురుషకారాన్ని వీడి కేవలం దైవాన్నే నమ్ముకొన్నవాడు, ఉత్సాహవంతుడు పొందే ఆ సిద్ధిని పొందగలడా? (అంటే కార్యసాఫల్యం పొందగలడా?)

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.134 విశేషాంశం చూడండి.

**మధ్యాక్కర.**

**కడు నిమ్ముగా దున్ని బీజములు సల్లి కర్షకుం డున్నఁ**
**దడయక వర్షంబు గురిసి కావించుఁ దత్ఫలసిద్ధి**
**నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపనినాఁ డేమి సేయుఁ**
**గడఁగి చేయంగలవానిఁ జేయును గాక కర్షకుఁడు. 235**

**ప్రతిపదార్థం:** కడున్+ఇమ్ముగా= మిక్కిలి అనుకూలంగా; దున్ని; బీజములు= విత్తనాలు; చల్లి; కర్షకుండు+ఉన్నన్= రైతు ఉంటే; తడయక= ఆలస్యం కాకుండ; వర్షంబు, కురిసి; తద్; ఫల, సిద్ధి= ఆ ఫల ప్రాప్తి; కావించున్= ఏర్పరుస్తుంది; నడుమన్= మధ్యలో; పర్జన్యుఁడు= మేఘుడు; అనుగ్రహింపనినాఁడు= దయచూపని నాడు; కర్షకుఁడు= రైతు; ఏమి+చేయున్= ఏమి చేయగలడు?; కడఁగి= పూని; చేయన్+కల వానిన్= చేయగల పనులను; చేయునుగాక= చేస్తాడు అంతే.

**తాత్పర్యం:** మిక్కిలి అనువుగా రైతు పొలాన్ని దున్ని విత్తనాలు చల్లవచ్చును. అప్పుడు ఆలస్యం లేకుండ వర్షం కురిస్తే అతనికి ఫలసిద్ధి కలుగుతుంది. అట్లుగాక మేఘుడు దయ చూపకపోతే కర్షకుడు ఎంత శ్రమించినా ఏమి చేయగలడు? అందుచేత కర్షకుడు పురుషకారం చేస్తుండవలసిందేకదా?

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.134 విశేషాంశం చూడండి.

**వ. కర్మఫలంబులు దైవమానుషసిద్ధం బులయినను బురుషోత్సాహ సముపార్జితంబులయిన నవి సుస్థిరంబు లయి సురక్షితంబులయి వర్తిల్లు; ననీహమానుండయి దైవపరుండయిన వాఁడు నీరిలోని యాన పాత్రంబునుంబోలె నవసన్నుండగుం గావునఁ గర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుండవయి నీ యనుజుల పరాక్రమంబునం బరుల జయించి మనయందలి యర్థకృశత్వం బపనయింపు 'మనిన, యాజ్ఞసేని వచనంబుల కనుగుణంబుగా భీమసేనుండు ధర్మరాజున కిట్లనియె. 236**

**ప్రతిపదార్థం:** కర్మ, ఫలంబులు= చేసిన పనుల వలన వచ్చే ఫలితాలు; దైవ, మానుష, సిద్ధంబులు+అయిననున్= విధివలన, పురుషకారంవలన సిద్ధించేటటువంటివే అయినను; పురుష+ఉత్సాహ, సముపార్జితంబులు+అయినన్= పురుషుడియొక్క సంతోషపూర్వకమైన దీక్షవలన లభించినవైనచో; అవి; సుస్థిరంబులు+అయి= చిరకాలం ఉండేటటువంటివై; సురక్షితంబులు+ అయి= చక్కగా రక్షింపబడినవై; వర్తిల్లున్= ఒప్పుతాయి; అనీహమానుండు+అయి= నిర్లక్ష్యంచేసేవాడై; దైవపరుండు+ అయినవాఁడు= విధిని విశ్వసించినవాడు; నీరిలోని, యానపాత్రంబునున్+పోలెన్= నీటిలోని పడవవలె; అవసన్నుండు+అగున్= నశిస్తాడు; కావునన్= కాబట్టి; కర్మ, ఫల, సిద్ధి= ధ్యేయం; నిశ్చయించి= నిర్ణయించుకొని; ఉత్సాహవంతుండవు+అయి= సంతోషపూర్వకమైన ప్రయత్నం చేసినవాడివై; నీ+అనుజుల, పరాక్రమంబునన్= నీ సహోదరుల, శౌర్యంచేత; పరులన్= శత్రువులను; జయించి= గెలిచి; మన+అందలి; అర్థకృశత్వంబు= దారిద్ర్యం (ధనంలేమి); అపనయింపుము= పోగొట్టుము; అనిన; యాజ్ఞసేని వచనంబులకు= ద్రౌపది పలుకులకు; అనుగుణంబుగా= తగినట్లు; భీమసేనుండు= భీముడు; ధర్మరాజునకు+ఇట్లు+అనియెన్= ధర్మపుత్రుడితో ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** కర్మఫలాలు దైవ మానుష సిద్ధాలు. అయినను పురుషోత్సాహంచేత లభించేవి సుస్థిరాలై, సురక్షితాలై ఉంటాయి. అజాగ్రత్తగాఉంటూ దైవాన్ని మాత్రమే నమ్ముకొన్న వాడు, నీటిలోని పడవవలె మునుగుతాడు. కాబట్టి

లక్ష్యాన్ని నిశ్చయించుకొని, ధ్యేయసిద్ధికై ఉత్సాహంతో నీ సోదరుల పరాక్రమంతో శత్రువులను జయించుము. మన దారిద్ర్యాన్ని తొలగింపుము అని చెప్పగా ద్రౌపదిపలుకులను సమర్థిస్తూ ధర్మరాజుతో భీమసేనుడు ఇట్లా పలికాడు.

### భీమసేన ధర్మరాజుల సంవాదము (సం. 3.34.1)

**మ.** **'పితృపైతామహమైన రాజ్య మరినిర్భేద్యంబు, గాండీవిచే**
**నతిగుప్తంబు, బలారికైనను నహార్యం బిట్టి దానిన్ సుదు**
**ర్మతి నన్యార్థము సేసి నీకుఁ జనునే మర్త్యేశ! యుగ్రాటవిన్**
**వ్రతముల్ సల్పుచు ధర్మలేశచరణవ్యాసక్తి నిట్లుండఁగన్. 237**

**ప్రతిపదార్థం:** పితృ, పైతామహము+ఐన, రాజ్యము= తండ్రితాతలదైన రాజ్యం; అరి, నిర్భేద్యంబు= శత్రువులచేత భేదించరానిది; గాండీవిచేన్= గాండీవ మనే విల్లు ధరించిన అర్జునుడిచేత; అతి, గుప్తంబు= మిక్కిలి కాపాడబడింది; బల+అరికిన్+ఐననున్= ఇంద్రుడికైనను; న+హార్యంబు= హరింపశక్యంకానిది; మర్త్య+ఈశ!= ఓరాజా! (మర్త్యులకు ప్రభువైనవాడా!); ఇట్టి దానిన్= ఇటువంటి రాజ్యాన్ని; సుదుర్మతిన్= మిక్కిలి చెడుబుద్ధితో; అన్య+అర్థము+చేసి= ఇతరుల సొత్తుగా జేసి; ఉగ్ర+అటవిన్= భయంకరమైన అడవిలో; వ్రతముల్, సల్పుచు= నోములు చేస్తూ; ధర్మ, లేశ, చరణ, వి+ఆసక్తిన్= ధర్మంలో అల్పభాగాన్ని ఆచరించే విశేషమైన కోరికతో; ఇట్లు+ఉండఁగన్= ఈ విధంగా ఉండటం; నీకున్+చనున్+ఏ= నీకు తగునా?

**తాత్పర్యం:** 'తండ్రి తాతల దైన రాజ్య మిది. శత్రువులు జయించలేనిది. అర్జునుడిచే రక్షించబడింది. దేవేంద్రుడికైనా హరించ శక్యం కానిది. దీన్ని ఓ రాజా! పెడబుద్ధితో పరులపాలు చేసి, స్వల్పమైన ధర్మాచరణంలో ఆసక్తి గలిగి భయంకరమైన అడవిలో వ్రతాలు ఆచరిస్తూ ఇట్లా ఉండటం నీకు తగునా?

**క.** **ఆమిషము సింహములచే । గోమాయువు గొన్నయట్లు కువలయరాజ్య**
**శ్రీ మనచేఁ గొని కౌరవుఁ । డేమని తలఁచునొకొ బుద్ధి నిష్టులుఁ దానున్. 238**

**ప్రతిపదార్థం:** ఆమిషము= మాంసం; సింహములచే= సింహాలనుండి; గోమాయువు= నక్క; కొన్న, అట్లు= తీసికొన్నట్లు; కువలయ, రాజ్యశ్రీ= భూమండలరాజ్యసంపద; మనచేన్= మనదగ్గరనుండి; కొని= అపహరించి; బుద్ధిన్= మనసులో; కౌరవుఁడు= దుర్యోధనుడు; ఇష్టులు, తానున్= హితులు, తాను; ఏమి+అని, తలఁచున్+ఒకొ= ఏమని ఆలోచిస్తున్నాడో కదా!

**తాత్పర్యం:** సింహాలదగ్గరనుండి మాంసాన్ని నక్క లాగికొన్నట్లు మనదగ్గరనుంచి భూమండలరాజ్యసంపదను అపహరించి దుర్యోధనుడు, హితులు తాను కలిసి ఏమని ఆలోచిస్తున్నాడో కదా!

**విశేషం:** అలం: ఉపమ. 'ఆత్మార్థం బభిహితంబగునపుడు తల్లింగ సంఖ్యాభిధాయి వచనము ధాతువిశేషణంబుల కగును.' 'ఇష్టులు తానున్.... తలచును'; తాను ఆత్మార్థకం. అభిహితంబగుట= క్రియచే చెప్పబడుట. ఈ పద్యంలో ఆత్మార్థకమైన 'తాను' దుర్యోధనుడిని తెలుపుతున్నది. అది క్రియచే చెప్పబడుతున్నది. అందువలననే తలచునొకొ' - అనే క్రియాపదం తదనుగుణంగా ఏకవచనంలో ఉంది.

**క.** **దుర్మతులను దుర్జనులను । ధర్మస్థితి నోర్వఁదగునె ధరణీశ్వర! దు**
**ష్కర్ములగు ధార్తరాష్ట్రుల । పేర్మి యడంగింపఁ గడఁగు పృథుభుజశక్తిన్. 239**

**ప్రతిపదార్థం:** ధరణీశ్వర!= భూమికి ప్రభువైన ఓ ధర్మరాజా!; దుర్మతులను= చెడుబుద్ధి కలవారైన; దుర్జనులను= చెడ్డమనుజులను; ధర్మస్థితిన్= ధర్మమందలి ఉనికిచేత; ఓర్వన్+తగున్= సహించవచ్చునా? (జయించవచ్చునా?); దుష్కర్ములు+అగు= చెడ్డపనులు చేసే వారైన; ధార్తరాష్ట్రుల, పేర్మి= ధృతరాష్ట్రుడి కుమారుల అతిశయం; పృథు, భుజ, శక్తిన్= గొప్పదయిన బాహుబలాన; అడంగింపన్+కడఁగు= అణచటానికి పూనుకొనుము.

**తాత్పర్యం:** భూమికి ప్రభువైన ఓ ధర్మరాజా! దుష్టస్వభావం గల చెడ్డవారిని ధర్మప్రవర్తనతో జయించటం సాధ్యమవుతుందా? కావున చెడు నడవడి గల ధార్తరాష్ట్రుల అతిశయాన్ని గొప్ప పరాక్రమంతో అణచటానికి పూనుకొనుము.

**వ. ధర్మకామప్రభవంబయి సర్వార్థసాధనంబయిన యర్థంబు విడిచి మిత్త్రుల కప్రియంబు నమిత్త్రులకు హర్షం బునుంగా మునివృత్తిం జేకొని ధర్మువు ధర్మువనుచు ధర్మువునందు చిత్తంబు నిలిపి దుర్బలునట్లు నిర్వేదింపఁ దగునె? 240**

**ప్రతిపదార్థం:** ధర్మ, కామ, ప్రభవంబు+అయి= ధర్మాన్ని, కామాన్ని పుట్టించేదై, (అంటే పురుషార్థాలలో ధర్మసాధనకు, కామసంతృప్తికి ఆధారమైనదయి); సర్వ+అర్థ, సాధనంబు+అయిన= అన్ని ప్రయోజనాలను నెరవేర్చేదైన; అర్థంబు= ధనమును; విడిచి= వీడి; మిత్త్రులకు= హితులకు; అప్రియంబును= అనిష్టాన్ని; అమిత్రులకు= శత్రువులకు; హర్షంబునున్+కా= సంతోషం కలిగేటట్లుగా; మునివృత్తిన్= ఋషులవర్తనను; చేకొని= స్వీకరించి; ధర్మువు, ధర్మువు+అనుచు= ధర్మం, ధర్మం, అంటూ; ధర్మువునందు= ధర్మంపైనే; చిత్తంబు, నిలిపి= మనస్సును ఉంచి; దుర్బలు+అట్లు= బలహీనుడి వలె; నిర్వేదింపన్+తగునె= పరితాపం పొందతగునా?

**తాత్పర్యం:** పురుషార్థాలు నాలుగింటిలో ధర్మకామాలకు అర్థం ఆధారంవంటిది. అంతే కాక, అర్థమే సర్వప్రయోజనాలు సాధించేటటువంటిది. అట్టి అర్థ పురుషార్థాన్ని సాధించక వదలిపెట్టి మిత్రులు సంతాపం చెందేటట్లు, శత్రువులు సంతోషించేటట్లు మునివలె ప్రవర్తిస్తూ, ధర్మం, ధర్మం అంటూ, ధర్మంపైనే మనస్సు లగ్నం చేసి బలహీనుడివలె పరితపించటం తగునా?

**ఆ. బాహుబలము మెఱసి పరుల సంపదలు సే । కొనఁగ లావులేని కుత్సితుండు**
**నియతదుఃఖవృత్తి నిర్వేద పరుఁడగుఁ । గాక, నీకుఁ దగునె కౌరవేంద్ర! 241**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కౌరవవంశంలో శ్రేష్ఠుడా!; బాహుబలము= పరాక్రమం; మెఱసి= ప్రకటించి; పరుల సంపదలు= శత్రువుల ఐశ్వర్యం; చేకొనఁగన్, లావు, లేని= పరిగ్రహించటానికి శక్తి లేని; కుత్సితుండు= నీచుడు; నియత, దుఃఖ, వృత్తి= తప్పని సరైన శోకంతో కూడిన వర్తనంతో; నిర్వేదపరుఁడు+అగున్+కాక= పరితపించేవాడు అవుతాడేమో కాని; నీకున్+తగునె= నీకు (అది) సరైనదా?

**తాత్పర్యం:** కౌరవవంశానికి ఇంద్రుడివంటివాడవైన ఓ ధర్మరాజా! ఇతరులకు తన పరాక్రమంచేత ఓడించి వారి ఐశ్వర్యాన్ని చేకొనటానికి బలంలేని నికృష్టుడు ఎవడో పరితాపంతో కృశించి నిరాశ చెందవచ్చునుగాని, నీవంటి గొప్పవాడికి మాత్రం అట్టి నిస్పృహ పనికిరాదు.

**చ. నరనుత! నీ యనుజ్ఞఁగొని నాఁడ విరోధుల నెల్లఁ బోరిలో**
**సరభసవృత్తి నుక్కడఁగఁ జంపితిమేని మహోగ్రకాననాం**
**తరముల నుండకుండ నతిదారుణదుర్మృగ సంగమంబునం**
**బొరయక యుండఁగా మనకుఁ బోలు నమందమనఃప్రియంబుగన్. 242**

**ప్రతిపదార్థం:** నరనుత!= నరులచేత కీర్తించబడినవాడా!; నీ, అనుజ్ఞన్+కొని= నీ అనుమతిని పొంది; నాఁడు+అ= ఆరోజే (అంటే జూదంలో ఓడిన నాడే); విరోధులన్+ఎల్లన్= శత్రువుల నందరిని; సరభస, వృత్తిన్= ఉద్వేగంతో; ఉక్కు+అడఁగన్= చేవ తరిగేటట్లు; చంపితిమి+ఏని= సంహరించి ఉంటే; మహా+ఉగ్ర, కానన+అంతరములన్= మిక్కిలి భయంకరమైన అడవులమధ్య; ఉండకుండన్= నివసించకుండ; అతి, దారుణ, దుర్మృగ, సంగమంబునన్+పొరయక+ఉండఁగాన్= మిక్కిలి ఘోరమైన దుష్ట జంతువులలో కలిసి ఉండకుండటం; అమంద, మనస్+ప్రియంబుగన్= తక్కువకాని అంటే ఎక్కువైన మనస్సంతోషంతో ఉండటం; మనకున్+పోలున్= మనకు సరిపోలుతుంది (సరిపడి ఉండేది).

**తాత్పర్యం:** ప్రజలచేత పొగడబడిన ఓ ధర్మరాజా! నీ అనుమతి తీసికొని ఆనాడే శత్రువులనందరిని యుద్ధంలో వేగంగా సంహరించి ఉంటే, ఈనాడు మనం ఈ భయంకరమైన అడవుల్లో దుష్టమృగాలమధ్య ఉండకుండా, ఎంతో నెమ్మదితో సంతోషంగా ఉండేవాళ్ళం కదా!

**క. సమయాతిక్రమభీతిని । క్షమాయుతులమైన మనలఁ గౌరవులు పరా**
**క్రమహీనులుగాఁ దలఁతురు । సమరోత్సాహంబు విడిచి జడమతి నున్నన్. 243**

**ప్రతిపదార్థం:** సమయ+అతిక్రమ, భీతిని= ఒప్పందాన్ని మీరటం గురించిన భయంచొప్పున; క్షమా, యుతులము+ఐన= ఓర్పుతో కూడిన వాళ్ళమైన; మనలన్= మనల్ని; సమర+ఉత్సాహంబు, విడిచి= యుద్ధాన్ని గురించిన పరాక్రమ ప్రయత్నం విడిచి; జడ, మతిన్= మందబుద్ధితో; ఉన్నన్= ఉంటే; కౌరవులు= దుర్యోధనాదులు; పరాక్రమహీనులుగాన్= శౌర్యం లేనట్టివారినిగా; తలఁతురు= పరిగణిస్తారు.

**తాత్పర్యం:** చేసికొన్న ఒప్పందాన్ని అతిక్రమించటం అవుతుందనే భీతితో, యుద్ధోత్సాహాన్ని విడిచి మందబుద్ధితో ఉంటే - మనల్ని కౌరవులు పరాక్రమహీనులుగా భావిస్తారు.

**తే. తగిలి నిత్యంబు నేకాంతధర్మనిరతుఁ । డగుట యుక్తమె పురుషున? కట్టి వాని**
**వెలయ నర్థకామంబులు విడుచుఁ బ్రాణ । విగతు సుఖదుఃఖములు రెండు విడుచునట్లు. 244**

**ప్రతిపదార్థం:** పురుషునకు= మనుజుడికి; తగిలి= పూని; నిత్యంబున్= ఎల్లప్పుడు; ఏకాంత, ధర్మ, నిరతుఁడు+అగుట= ధర్మాన్ని ఒక్కదాన్ని మాత్రమే ప్రీతితో ఆచరించే వాడవటం; యుక్తము+ఎ= తగునా?; అట్టివానిన్= అటువంటి మనుజుడిని; ప్రాణ, విగతున్= చనిపోయినవాడిని; సుఖ, దుఃఖములు, రెండు; విడుచు+అట్లు= వీడే విధంగా; వెలయన్= సుస్పష్టంగా; అర్థ, కామంబులు= అర్థ పురుషార్థం, కామపురుషార్థం; విడుచున్= విడిచిపోతాయి.

**తాత్పర్యం:** (మానవజీవితం పురుషార్థసాధనకు ఏర్పడింది కదా!) ఏ మానవుడికైనా, ఒక్క ధర్మ పురుషార్థంపైనే సదా చిక్కుకోవటం తగునా? మరణించినవాడిని సుఖదుఃఖాలు రెండున్నూ విడిచినట్లే, కేవల ధర్మపురుషార్థ పరుడిని అర్థకామాలు విడిచి పెడతాయి. అంటే అర్థకామాలను విడిచిన ధర్మపరుడు మృతప్రాయుడు.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ.** **ధర్మ కామంబులు దఱుగంగ నర్థార్థి । యగువాఁడు పతితుఁ డౌ; నర్థసేవ**
**నర్థార్థముగఁ జేయు నతఁ డుగ్రవనములో । గోరక్ష సేయు నక్కుమతిఁబోలు;**
**నర్థ ధర్మములకు హానిగాఁ గామార్థి । యగు నాతఁ డల్పజలాశయమున**
**జలచరం బెట్టు లజ్జలములతోఁ జెడు । నట్లు కామంబుతో హానిఁ బొందు;**

**ఆ.** **నర్థ ధర్మములు మహాబ్ధి మేఘము లట్టు । లుభయమును బరస్పరోదయమ్ము;**
**లిట్లుగాఁ ద్రివర్గ మెఱిఁగి సామ్యమున సే । వించువాఁడు సర్వవిత్తముండు.** **245**

**ప్రతిపదార్థం:** ధర్మకామంబులు= ధర్మం, కామం; తఱుగంగన్= తగ్గిపోగా; (ఈ పద్యం త్రివర్గానికి సంబంధించింది. త్రివర్గ మంటే ధర్మార్థ కామాలు. అందులో ధర్మకామాలు తరిగినపుడు ఇక మిగిలేది అర్థం). అంటే అర్థం మాత్రమే మిగిలినప్పుడు; అర్థ+అర్థి+అగువాఁడు= ధనం మాత్రమే కోరేవాడు; పతితుఁడు+ఔను= పతనం చెందినవాడు అవుతాడు; అర్థసేవన్= ధనార్జనను; అర్థ+అర్థముగన్= అర్థపురుషార్థ నిర్వహణకు మాత్రమే; చేయు+అతఁడు= చేసేవాడు; ఉగ్రవనములో= భయంకరమైన అడవిలో; గోరక్ష+చేయు= ఆవులను కాపాడటానికి పూనుకొనే; ఆ+కుమతిన్+పోలున్= బుద్ధిహీనుడిని పోలుతాడు; అర్థ, ధర్మములకు, హానిగాన్= అర్థపురుషార్థానికి, ధర్మపురుషార్థానికి హాని కలిగేటట్లు; కామ+అర్థి+అగు+ఆతఁడు= కామ పురుషార్థాన్ని మాత్రమే కోరుకొనేవాడు; అల్ప+జన+ఆశయమున= తక్కువ నీరు కల కొలనులోని; జలచరంబు+ఎట్టులు= చేప ఏవిధంగా; ఆ+జలములతోన్= ఆ తక్కువ నీటితో; చెడు+అట్లు= చెడిపోతుందో అట్లా; కామంబుతో= కామ పురుషార్థ సాధనతో; హానిన్+పొందున్= కీడుపొందుతాడు; అర్థ, ధర్మములు; ఉభయమును= రెండును; మహాబ్ధి, మేఘములు+అట్టులు= గొప్పసముద్రం, మేఘంవలె; పరస్పర+ఉదయమ్ములు= ఒకదానికొకటి వృద్ధి కల్పించేవై (సముద్రంలోని నీరు ఆవిరి మేఘాలకు పుష్టిని ఇస్తుంది. మేఘాలు వర్షం కురిసి సముద్రానికి పుష్టిని చేకూరుస్తాయి. అట్లే అర్థంవలన ధర్మానికి, ధర్మంవలన అర్థానికి పరిపుష్టి కలుగుతుంది); ఇట్లుకాన్= ఈ విధంగా; త్రివర్గము= ధర్మం, అర్థం, కామం; ఎఱిఁగి= తెలిసికొని; సామ్యమున= (పోలిక తెలిసి) సమానంగా; సేవించువాఁడు= పాటించేవాడు; సర్వ, విత్+తముండు= సర్వజ్ఞశ్రేష్ఠుడు.

**తాత్పర్యం:** (ఈపద్యం త్రివర్గం= ధర్మం, అర్థం, కామసాధనలోని ఆంతర్యాన్ని వివరించేది). ధర్మం, కామం తగ్గిపోయేటట్లు అర్థపురుషార్థాన్ని సేవించేవాడు పతనం చెందుతాడు. కేవలం అర్థంకోసం అర్థసేవచేసేవాడు భయంకరమైన అడవిలో గోవులను రక్షించబూనే మందబుద్ధిని పోలుతాడు. ఇక అర్థధర్మాలు రెండింటిని విడిచి కేవలం కామపురుషార్థ పరాయణుడైనవాడు, నీరు తక్కువ అయిన చెరువులో ఉండే చేప, ఆ అల్పజలాలతో ఎట్లా చెడుతుందో, కామంతో అట్లే చెడిపోతాడు. అర్థ ధర్మాల అనుబంధం సముద్ర మేఘాల సంబంధం వంటిది. సముద్రజలం ఆవిరై మేఘాలకు పరిపుష్టి చేకూరుస్తుంది. మేఘాలు వర్షించి సముద్రానికి పుష్టిని కలిగిస్తాయి. అవి పరస్పరపోషకాలు. ఈ విధంగా త్రివర్గాన్ని- అంటే ధర్మార్థకామాలను సమానంగా సాధించేవాడు సర్వజ్ఞశ్రేష్ఠుడు.

**వ.** **భవదాచరితంబయిన యీ ధర్మం బర్థకామంబులక కాదు, నీకును నీ బాంధవులకును బాధాకరంబు; దాన యజ్ఞసత్పూజలు గావింప నర్థహీనున కశక్యంబు; జగంబులు ధర్మమయంబులు; ధర్మువునకు మిక్కిలి యొండెద్దియు లే; దయినను నర్థార్థంబు గాని ధర్మువు క్షత్రియుల కయుక్తంబు.** **246**

**ప్రతిపదార్థం:** భవత్+ఆచరితంబు+అయిన= నీచే ఆచరించబడిన; ఈ ధర్మంబు= ఈధర్మం; అర్థ, కామంబులకు+అ, కాదు= అర్థానికి, కామానికి మాత్రమే కాదు; నీకును; నీ బాంధవులకును= నీ చుట్టాలకు; బాధాకరంబు= బాధ కలిగించేది; దాన, యజ్ఞ, సత్+పూజలు+కావింపన్= దానం, యజ్ఞం, సత్పురుషులకు పూజలు చేయటానికి; అర్థహీనునకు= ధనం లేనివాడికి; అశక్యంబు= సాధ్యంకాదు; జగంబులు= భువనాలు; ధర్మమయంబులు= ధర్మంతో నిండినవి; ధర్మువునకు మిక్కిలి= ధర్మాన్ని మించినది; ఒండు= వేరొక్కటి; ఎద్దియు= ఏదియు; లేదు; అయినను; అర్థ+అర్థంబు+కాని, ధర్మువు= అర్థంకొరకు కాని ధర్మం; క్షత్రియులకు; అయుక్తంబు= తగనిది.

**తాత్పర్యం:** నీవు అనుష్ఠిస్తున్న ధర్మం అర్థ పురుషార్థానికి, కామపురుషార్థానికి మాత్రమే కాక, నీకు, నీ బంధువులకు కూడ బాధను కలిగించేది. దానాలు, యజ్ఞాలు, ఉత్తములను పూజించటం ధనహీనుడు చేయలేడు. జగత్తులు ధర్మమయాలు. ధర్మాన్ని మించినది వేరొకటి ఏదీ లేదు. అయినను, అర్థపురుషార్థసాధనకు ఉపకరించని ధర్మం క్షత్రియులకు తగింది కాదు.

**ఉ. శత్రుల నాజి నోర్చుటయు, సర్వభయంబులఁ బొందకుండఁగా**
**ధాత్రిఁ బరిగ్రహించి యుచితస్థితిఁ గాచుటయుం, బ్రియంబుతోఁ**
**బాత్రుల కర్థ మీగియును, బ్రాహ్మణపూజయుఁ జువ్వె! యుత్తమ**
**క్షత్రియధర్మముల్ సుగతికారణముల్ విపులార్థమూలముల్. 247**

**ప్రతిపదార్థం:** శత్రులన్= విరోధులను; ఆజిన్= యుద్ధంలో; ఓర్చుటయు= ఓడించటమున్నూ; సర్వభయంబులన్= ఎల్లభయాలు; పొందక+ఉండఁగాన్= పొందకుండేటట్లుగా; ధాత్రిన్= భూమిని; పరిగ్రహించి= చేకొని; ఉచితస్థితిన్= మంచిగా ఉండేటట్లు; కాచుటయున్= కాపాడటమున్నూ; ప్రియంబుతోన్= ప్రీతితో; పాత్రులకు= యోగ్యత ఉన్నవారికి; అర్థము= ధనం; ఈగియును= దానంగా ఇవ్వటమున్నూ; బ్రాహ్మణ, పూజయున్= విప్రులను ఆరాధించటమున్నూ; చువ్వె= చూవె(సుమా); ఉత్తమ క్షత్రియ ధర్మముల్= ఉత్తములైన క్షత్రియులయొక్క ధర్మాలు; సుగతి, కారణముల్= ఉత్తమ గతి పొందటానికి హేతువులు; విపుల+అర్థమూలముల్= విరివి అయిన ప్రయోజనాలకు (సంపదలకు) కారణాలు.

**తాత్పర్యం:** యుద్ధాలలో శత్రువులను జయించటం, ఎట్టి భయాలు దాపురించకుండ భూమిని తగిన విధంగా ఏలటం, ప్రీతితో పాత్రులైన వారికి ధనం దానంచేయటం, బ్రాహ్మణులను పూజించటం ఉత్తమ క్షత్రియుల ధర్మాలు. సద్గతికి హేతువులైన పుణ్యకార్యాలు. సకలార్థ సాధకాలు.

**వ. కేవల ధర్మాచరణంబు శత్రుజయంబునకు సాధనంబు గాదు; నికృతిపరులయందు నికృతియు వలయుఁ; బూర్వభ్రాతలైన యసురుల నమరులు నికృతినగాదె నిర్జించిరి; కావున నీవు సమయధర్మరక్షణవ్రతం బుడిగి శత్రువుల జయింప నుద్యోగింపుము. 248**

**ప్రతిపదార్థం:** కేవల, ధర్మ+ఆచరణంబు= ధర్మాన్ని అనుష్ఠించటం మాత్రమే; శత్రు జయంబునకు= శత్రువులను జయించటానికి; సాధనంబు= ఉపకరణం; కాదు; నికృతి, పరుల+అందు= మోసంచేసేవారిపట్ల; నికృతియు= మోసం కూడ; వలయున్= అవసరం; పూర్వభ్రాతలు+ఐన= పూర్వం సోదరులైన; అసురులన్= రాక్షసులను; అమరులు= దేవతలు; నికృతిన్+అ, కాదె= మోసంచేతనేకదా; నిర్జించిరి= జయించారు; కావున; నీవు; సమయ, ధర్మ, రక్షణ, వ్రతంబు+ఉడిగి= ఒడబాటు నియమాన్ని పాటించాలనే దీక్షను విడిచి; శత్రువులన్= విరోధులను; జయింపన్= గెలవటానికి; ఉద్యోగింపుము= ప్రయత్నించుము.

**తాత్పర్యం:** కేవలం ధర్మాన్ని అనుష్ఠించటం మాత్రంచేతనే శత్రువులను జయించటానికి వీలు కాదు. మోసగాండ్రపై మోసమే ప్రయోగించాలి. పూర్వం తమకు సోదరులైన రాక్షసులను దేవతలు మోసంచేసేకదా జయించారు. కాబట్టి, నీవు శత్రువులతో చేసికొన్న ఒడంబడికను నెరవేర్చాలనే నియమం విడిచి, వాళ్ళను జయించటానికి ప్రయత్నించుము.

**క. జయశీలివైన నీకుం । బ్రియ మొనరింపంగ నున్న పృథుయశులు ముదా**
**శ్రయు లగుదురు సృంజయకే । కయ యదు పాంచాలు రాదిగాఁగల సుహృదుల్. 249**

**ప్రతిపదార్థం:** జయ, శీలివి+ఐన= గెలుపును కోరుకొనే శీలం కలవాడివైన; నీకున్= నీకు; ప్రియము+ఒనరింపంగన్+ఉన్న= ప్రీతిని కలిగించటానికి ఉండే; పృథుయశులు= గొప్పకీర్తికలవారు; సృంజయ, కేకయ, యదు, పాంచాలురు+ఆదిగాన్+కల, సుహృదుల్= సృంజయులు, కేకయులు, యాదవులు, పాంచాలురు మొదలుగాగల మిత్రులు; ముద్+ఆశ్రయులు+అగుదురు= సంతోషానికి ఆశ్రయమైనవారు అవుతారు- అంటే సంతోషిస్తారు.

**తాత్పర్యం:** జయశీలివైన నీకు, గొప్ప కీర్తి కెక్కిన సృంజయ, కేకయ, యదు, పాంచాలాది మిత్రులు సంతోషంతో ప్రియం చేకూరుస్తారు.

**తే. మిత్త్రసంపన్నుఁ డైన నమిత్త్రు మిత్త్ర । బలముతోడ భేదించి దోర్బలముఁ జలముఁ**
**గలిగి దేశబలంబును గాలబలముఁ । గలుగువాని కసాధ్యంబు గలదె యెందు? 250**

**ప్రతిపదార్థం:** మిత్త్ర సంపన్నుఁడు+ఐనన్= మిత్ర సంపద కలవాడయితే; అమిత్త్రున్= శత్రువును; మిత్త్రబలముతోడన్= మిత్రులయొక్కసాయంతో; భేదించి= భేదిల్లజేసి; దోస్+బలమున్= భుజశక్తిని; చలమున్+కలిగి= మొండిపట్టుదల కలిగి; దేశ, బలంబును= స్థానబలమూ; కాల, బలమున్+కలుగువానికి= కాల బలమూ ఉన్నవాడికి; ఎందున్= ఎక్కడైనా; అసాధ్యంబు= సాధించలేనిది; కలదె= ఉన్నదా?

**తాత్పర్యం:** (ఈ పద్యంలో పేర్కొన బడినవి మిత్రబలం, దోర్బలం, దేశబలం, కాలబలం.) మిత్రబలసహాయంతో శత్రువులను జయించి, పరాక్రమం, పట్టుదల కలిగి, దేశబలం, కాలబలం కూడ కలిసి వచ్చినవాడికి ఎక్కడైనా అసాధ్యం అనేది ఉంటుందా?

**విశేషం:** నన్నయభట్టు మహాభారతాన్ని 'నీతి విచక్షణుల్ నీతిశాస్త్రం బని' కొనియాడుతారని అవతారికలో ప్రశంసించాడు. మహాభారతం నీతిని, నీతిసూక్ష్మాలను పలుతావుల హృదయంగమంగా వింగడించింది. స్వకీయ పరాక్రమానికి మిత్రబలం తోడ్పడితే శత్రువులను నిర్జింపవచ్చును. అంతేకాక స్వకీయ పరాక్రమానికి దేశబలం, కాలబలం సయితం తోడ్పడితే ఇక అసాధ్యమనేది ఉండదు. ఈ ప్రకరణంలో దేశబలానికి, కాలబలానికి వివరణ కల్పించక రచయిత సూత్రప్రాయంగా కుదించి చెప్పాడు. "ఉచితకాల సంభావ్యమైన యత్నవిధిగదా సమగ్రఫలంబు నిచ్చు"-మూషిక మార్జాల సంవాదం, శాంతిపర్వం. దేశబలం అంటే స్థానబలం. వేమన స్థానబలాన్ని గురించి చెప్పిన పద్యం చిరస్మరణీయమైనది. "నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగుఁబట్టు, బయట కుక్కచేత భంగపడును." మహాభారతంలో పలుతావుల నీతి ధర్మసూక్ష్మాలు వివరించబడ్డాయి.

**తే. బలము గలవానిఁ బలువురు బలవిహీను । లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి**
**మధువుఁ గొన నుత్సహించిన మనుజుఁబట్టి । కుట్టి నిర్జించు మధుకరకులమునట్లు. 251**

**ప్రతిపదార్థం:** బలము, కల, వానిన్= శక్తి ఉన్నవాడిని; పలువురు= పెక్కు మంది; బలవిహీనులు= బలంలేని వారు; ఒక్కటి+ఐ, కూడి= ఏకమై; ఉత్సహించి= విజృంభించి; మధువున్+కొనన్= తేనె తీసికొనటానికి; ఉత్సహించిన= ప్రయత్నించిన; మనుజున్= మనుష్యుడిని; పట్టి= గ్రహించి (చేరి); కుట్టి; నిర్జించు= జయించే; మధుకర, కులము+అట్లు= తేనెటీగల గుంపువలె; నిర్జింతురు= ఓడిస్తారు.

**తాత్పర్యం:** బలం కలవాడిని పెక్కుమంది బలహీనులు ఒకటిగాచేరి, తేనెను తీసికొనటానికి ప్రయత్నించిన మనుష్యుడిని పట్టి కుట్టి నిర్జించే తేనెటీగలగుంపువలె జయిస్తారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. శ్వదృతియందలి దుగ్ధంబునుం బోలె దుర్యోధను రాజ్యంబు దూష్యంబగుటఁ బౌర జానపద బ్రాహ్మణ వరులు నీ కనురక్తులయి భవద్రాజ్యంబ వలచి యుండుదురు; దీని నేల యెడ సేసెదు? సర్వాయుధ సనాథంబయిన రథం బెక్కి గజపురంబున కభిముఖుండవై విజయప్రయాణంబు సేయుము. 252**

**ప్రతిపదార్థం:** శ్వదృతి+అందలి= కుక్కతోలుతో తయారుచేసిన తిత్తియందలి; దుగ్ధంబునున్+పోలెన్= పాలవలె; దుర్యోధను, రాజ్యంబు= దుర్యోధనుడియొక్క రాజ్యం; దూష్యంబు= దూషించతగింది; అగుటన్; పౌర, జానపద, బ్రాహ్మణ, వరులు= పట్టణవాసులు, పల్లెపట్టుల నివసించే వాళ్ళు, బ్రాహ్మణశ్రేష్ఠులు; నీకు+అనురక్తులు+అయి= నీ పట్ల ప్రేముడి కల వారయి; భవత్, రాజ్యంబు+అ= నీరాజ్యాన్నే, అంటే పరిపాలననే; వలచి+ఉండుదురు= ప్రేమించి ఉన్నారు; దీనిన్+ఏల+ఎడ+చేసెదు= దీన్ని ఎందుకు ఆలస్యం (దూరం) చేస్తావు; సర్వ+ఆయుధ, సనాథంబు+అయిన= సమస్తమైన ఆయుధాలతో కూడిన; రథంబు+ఎక్కి= తేరు నెక్కి; గజపురంబునకు= హస్తినాపురానికి; అభిముఖుండవు+ఐ= ఎదురైన ముఖం కలవాడివై- అంటే ఆ దిక్కుగా; విజయ ప్రయాణంబు= జయం సాధించే పయనం; చేయుము= కొనసాగించుము.

**తాత్పర్యం:** కుక్కచర్మంతో తయారైన తిత్తియందలి పాలవలె దుర్యోధనుడిరాజ్యం దూష్యం. ఆ రాజ్యంలోని ప్రజలు, పట్టణవాసులు, పల్లెటూళ్ళలో నివసించేవాళ్ళు, బ్రాహ్మణోత్తములు నీ పరిపాలన కోరుకొంటున్నారు. ఇక ఆలస్య మెందుకు? అన్ని ఆయుధాలతోకూడినరథాన్ని అధిరోహించి, రాజధాని అయిన హస్తినాపురివైపు విజయ యాత్ర సాగించుము.

**విశేషం:** ఉ.వి. సంశోధిత ముద్రణప్రతిలో 'శ్వదృతియందలి' అనే పాఠానికి బదులు 'శూద్రాన్నంబునందలి' అనే పాఠం ఉన్నది. మూలంలో ఇట్లా ఉన్నది: "శ్వదృతౌ క్షీరమాసక్తం బ్రహ్మవా వృషలే యథా" (3.34.78); "శ్వదృతౌ సారమేయ చర్మకోశే, బ్రహ్మవేదః వృషలే శూద్రే" అని నీలకంఠీయ వ్యాఖ్య (3.38.81) కాబట్టి 'శ్వదృతియందలి' అనే పాఠమే ఉచితమైనదని గ్రహించడమైనది. ధర్మరాజుకు స్వకీయబలం ఉన్నది. మిత్రబలం, దేశబలం, ప్రజాబలం ఉన్నాయి. ఆలస్యం చేయట మెందుకు? కాలబలం ఉన్నది. ఇక విజయ దండయాత్రకు ఉపక్రమించి హస్తినాపురి వైపు తరలివెళ్ళాలని భీముడి అభిప్రాయం.

**మ. ప్రణుతక్షాత్త్రగుణంబు విక్రమము దర్పం బేర్పడన్ విక్రమ**
**క్షణదానం బొనరింపు మీ క్షణమ; విఖ్యాతంబుగా సంగరాం**
**గణమధ్యంబునఁ జేయు మర్జునబృహద్గాండీవ నిర్ముక్త మా**
**ర్గణ ధారావళి ధార్తరాష్ట్ర కదళీకాంతార విచ్ఛేదమున్. 253**

**ప్రతిపదార్థం:** ప్రణుత, క్షాత్ర, గుణంబు= పొగడబడిన క్షత్రియుల లక్షణం; విక్రమము= పరాక్రమం; దర్పంబు= గర్వం; ఏర్పడన్= స్పష్టపడేటట్లుగా; విక్రమ, క్షణ, దానంబు+ఒనరింపుము= పరాక్రమమనే పండుగను దానం చేయుము; ఈక్షణము+అ= ఈక్షణంలోనే (వెంటనే); విఖ్యాతంబుగా= కీర్తి కలిగేటట్లుగా; సంగర+అంగణ, మధ్యంబునన్= యుద్ధరంగమధ్యంలో; అర్జున బృహత్+గాండీవ, నిర్ముక్త, మార్గణ, ధారా+ఆవళి= అర్జునుడియొక్క గొప్ప విల్లైన గాండీవంనుండి విడువబడిన బాణాల వాదరల సముదాయంచేత; ధార్తరాష్ట్ర, కదళీ, కాంతార, విచ్ఛేదమున్= ధృతరాష్ట్రుడి యొక్క కుమారులనే అరటిచెట్ల అడవిని తెగనరకటాన్ని; చేయుము.

**తాత్పర్యం:** క్షత్రియులలో కొనియాడబడే లక్షణం పరాక్రమం. ఈక్షణంలోనే దర్పం ప్రకాశించేటట్లగా పరాక్రమం అనే పండుగను రణరంగ మధ్యంలో దానం చేయుము. అర్జునుడి గొప్ప గాండీవంనుండి బయలువెడలే బాణపరంపరలచేత ధృతరాష్ట్రుడి కుమారులనే కదళీవనాన్ని తెగనరకుము.

**విశేషం:** విక్రమక్షణదానము= విక్రమం అనే పండుగ అనేచోట ధార్తరాష్ట్ర కదళీకాంతారం అనే చోట అలంకారం రూపకం. ధార్తరాష్ట్రులు ఉపమేయం. అరటిచెట్ల అడవి ఉపమానం. విక్రమం ఉపమేయం. క్షణము= పండుగ ఉపమానం. ఉపమేయ ఉపమానాలకు అభేద అధ్యవసాయం కల్పించబడింది కాబట్టి ఇవి రూపకాలంకారాలు. అరటిచెట్లను నరకటంలో గల సౌలభ్యం అందరికి అనుభవసిద్ధమే.

**క. బహు వాహ సుభట హస్తిక । సహితులు బలవంతులని విచారింపకు నీ**
**యహితులు మద్బాహుగదా । నిహతికి మార్కొనఁగఁ బోర నిలువం గలరే? 254**

**ప్రతిపదార్థం:** నీ+అహితులు= నీ శత్రువులు; బహు, వాహ, సుభట, హస్తిక, సహితులు= పెక్కు వాహనాలతో, మంచి సైనికులతో, ఏనుగులతో కూడి ఉన్నవారు; బలవంతులు= బలం కలవారు; అని; విచారింపకు= దుఃఖించకు; (వారు); మత్+బాహు, గదా, నిహతికి= నా చేతిలోని గద యొక్క దెబ్బకు; మార్కొనఁగన్= ఎదిరించటానికి; పోరన్= యుద్ధంలో; నిలువన్+కలరే= నిలువజాలుదురా?

**తాత్పర్యం:** నీ శత్రువులు పెక్కు వాహనాలతో, మంచి సైనికులతో, ఏనుగులతో కూడి ఉన్నారు. బలం కలవారు అని విచారించకు. నా చేతిలోని గదదెబ్బలకు ఎదిరించి వారు యుద్ధంలో నిలువగలరా?

**క. అరివరుల నోర్చి సాగర । పరివృత భూచక్రమెల్లఁ బాలింపు; ప్రజా**
**పరిపాలనంబు కంటెను । ధరణీశ! విశేష మొండు ధర్మువు గలదే? 255**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= భూమికి ప్రభువైన ఓ ధర్మరాజా!; అరి, వరులన్= శత్రుశ్రేష్ఠులను; ఓర్చి= జయించి; సాగర, పరివృత, భూ, చక్రము+ఎల్లన్= సముద్రంచేత చుట్టుకొనబడిన భూమండలాన్ని అంతటినీ; పాలింపు= ఏలుకొనుము; ప్రజా, పరిపాలనంబు, కంటెను= ప్రజలను పరిపాలించటంకంటె; విశేషము= గొప్పదైన; ఒండు=వేరు; ధర్మువు= ధర్మం; కలదే= ఉన్నదా?

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! శత్రువులను జయించి, సముద్రంచేత చుట్టుకొనబడిఉన్న భూచక్రాన్ని పరిపాలించు. ప్రజలకు చక్కని పరిపాలన సమకూర్చటంకంటె గొప్పదైన ధర్మం వేరొకటి ఉన్నదా?

**వ. రాజ్యపదస్థుండైన క్షత్రియుండు భూరిదక్షిణంబులైన యజ్ఞంబుల దేవబ్రాహ్మణులం దృప్తులం జేసి బ్రాహ్మణులకు నగ్రహారంబులు గోసహస్రంబులు నిచ్చి దురితంబులవలనం బాసి తమోవిముక్తుండైన చంద్రుండునుం బోలె వెలుంగు' ననిన భీమసేనునకు ధర్మరా జిట్లనియె. 256**

**ప్రతిపదార్థం:** రాజ్య, పదస్థుండు+ఐన, క్షత్త్రియుండు= రాజ్యపదవిలో ఉన్న క్షత్రియుడు, అంటే ప్రభువైన క్షత్రియుడు; భూరి, దక్షిణంబులు+ఐన= గొప్ప దక్షిణలతో కూడిన; యజ్ఞంబులన్= క్రతువుల చేత; దేవ, బ్రాహ్మణులన్= దేవతలను, బ్రాహ్మణులను; తృప్తులన్+చేసి= తనివి చెందేటట్లు చేసి; బ్రాహ్మణులకున్= విప్రులకు; అగ్రహారంబులు= ఊళ్ళు; గో, సహస్రంబులున్= వేలకొలది ఆవులు; (దానంగా) ఇచ్చి; దురితంబుల వలనన్+పాసి= పాపాలనుండి తొలగి; తమస్+విముక్తుండు+ఐన= చీకటి నుండి తొలగిన; చంద్రుండునున్+పోలె= చంద్రుడివలె; వెలుంగున్= వెలుగొందుతాడు; అనిన; భీమసేనునకు; ధర్మరాజు: ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** రాజ్యసంపాదన చేసి ప్రభువైన క్షత్రియుడు భూరిదక్షిణ లిచ్చి యజ్ఞాలు చేసి, బ్రాహ్మణులకు అగ్రహారాలు, వేలకొలది ఆవులు దానం చేసి, పాపాలను పోగొట్టుకొని మబ్బుమాటుననుండి వచ్చి వెలుగొందే చంద్రుడివలె ప్రకాశిస్తాడు'- అని భీముడు చెప్పగా ధర్మరాజు ఇట్లా పలికాడు.

**ఉ. 'నీ వచనంబు ధర్మ్యము, వినీతము, నీతియుతంబు, నిష్ట సి**
**ద్ధ్యావహ, మత్యుదార మిదియైనను నిప్డు దలంపఁగా విచా**
**రావసరాప్తికిన్ విషయమైనది; కార్య ఫలంబు లెల్ల స**
**ద్భావమునన్ విచారసులభంబుల యండ్రు విచారపారగుల్. 257**

**ప్రతిపదార్థం:** నీ, వచనంబు, ఇది=ఈ నీ మాట; ధర్మ్యము= ధర్మంతో కూడింది; వినీతము= చక్కగా ప్రతిపాదించబడింది; నీతి, యుతంబున్= నీతితో కూడింది; ఇష్ట, సిద్ధి+ఆవహము= ఆశయాలను నెరవేర్చేటటువంటిది; అతి+ఉదారము= మిక్కిలి గొప్పది; ఐనను= ఐనప్పటికిన్నీ; ఇప్డు= ఇప్పుడు; తలంపన్+కాన్= యోచించగా; విచార+అవసర+ఆప్తికిన్= ఆలోచన చేయవలసిన సమయస్థితిని పొందటానికి; విషయము+ఐనది= అంశమైనది; విచార పారగుల్= మేధావులు; కార్య, ఫలంబులు+ ఎల్లన్= చేసిన పనులకు లభించే ఫలితాలు అన్నికూడా; సత్+భావమునన్= మంచి తలపులు ఉన్నపుడు; విచార, సులభంబులు+అ= యోచనచేత సులువుగా పరిష్కరించదగినవే; అంద్రు= అని అంటారు.

**తాత్పర్యం:** 'నీమాట ధర్మంతో కూడింది. చక్కగా ఆలోచించిన తర్వాత చెప్పింది. నీతితో నిండింది. ఆశయాలను నెరవేర్చేటటువంటిది. గొప్పతనం కలిగింది. అయితే ఇప్పుడు నీ వాదం విచారించి తేల్చవలసిన అంశం. ఇటువంటి కార్యఫలాలన్నిటినీ సద్భావంతో కూడిన యోజ(చ)న చేత పరిష్కరించటం సులువు- అని మేధావులు అంటారు.

**విశేషం:** ధర్మరాజు భీముడి వాదాన్ని అంగీకరించజాల నప్పటికిన్నీ, అతడు మనస్సు ఏమాత్రం నొవ్వకుండ బదులు పలికాడు. ధర్మరాజు భీముడిమాట కాదనకుండానే, అతడి వాదం విచారించిన పిదప తేల్చవలసినట్టిదని సుకుమార సుందరంగా చెప్పాడు. ధర్మరాజు మెత్తని పులి.

**క. వనమునఁ బండ్రెండేండ్లును । జనపదమున నెఱుఁగకుండ సరి నొక వర్షం**
**బును జలుపఁ బూని సత్యము । దనరఁగఁ జేసితిఁ బ్రతిజ్ఞ దగ వృద్ధసభన్. 258**

**ప్రతిపదార్థం:** వనమునన్= అడవిలో; పంద్రెండు+ఏండ్లును= పంద్రెండు సంవత్సరాలున్నూ; జనపదమునన్= ప్రజలు నివసించే చోట; ఎఱుఁగకుండ= అజ్ఞాతవాసంగా; సరిన్= సరిగా; ఒక, వర్షంబును= ఒక సంవత్సరమున్నూ; చలుపన్+పూని= కడపటానికి పూనుకొని; సత్యం= నిజం; తనరఁగన్= ఒప్పేటట్లుగా; తగన్= ఉచితంగా; వృద్ధ, సభన్= పెద్దలు ఉన్న కొలువుకూటంలో; ప్రతిజ్ఞ= శపథం; చేసితిన్= పూని ఉన్నాను.

**తాత్పర్యం:** అరణ్యంలో పంద్రెండేండ్లు, ఊరిలో అజ్ఞాతంగా ఒక సంవత్సరం గడిపేటట్లు పెద్దలుండే సభలో ప్రతిజ్ఞ చేసి ఉన్నాను. ఆ సత్యవ్రతం పాటించవలసి ఉన్నది.

**చ.** **అలఘుగుణంబులం దధికుఁడైన మహాత్ముఁడు రాగకోపమా**
**యలఁ బడి, యక్షమావివశుఁ డై, యచిరాంశులతావిలాసచం**
**చలమగు లక్ష్మి కాసపడి, సత్యము ధర్మువుఁ దప్పి సత్సభా**
**వలిఁ దగువారియొద్దఁ దగువాఁడయి సద్విధి నుండ నేర్చునే?** **259**

**ప్రతిపదార్థం:** అలఘు, గుణంబులందు+అధికుఁడు+ఐన, మహా+ఆత్ముఁడు= గొప్ప లక్షణాల్లో అతిశయం సాధించిన మహానుభావుడు; రాగ, కోప, మాయలన్+పడి= ఎక్కుడు అభిమానంలోను, క్రోధంలోను, మాయలలోను పడి; అక్షమా, వివశుఁడు+ఐ= అసహనానికి లోనై; అచిర+అంశు, లతా, విలాస, చంచలము+అగు= అస్థిరమైన మెరుపుతీగె హొయలువలె తాత్కాలికమైన; లక్ష్మికి= సంపదకు; ఆసపడి= కోరి; సత్యము= సత్యాన్ని; ధర్మువున్= ధర్మాన్ని; తప్పి= అతిక్రమించి; సత్+సభా+ఆవలిన్= సజ్జనుల సభలలో; తగువారి+ఒద్దన్= యోగ్యులైన వారి దగ్గర; తగువాఁడు+అయి= తగినవాడయి; సత్, విధిన్= మంచి ప్రవర్తనతో; ఉండనేర్చునే= మనగలుగునా?

**తాత్పర్యం:** గొప్పగుణాలు ఉండే మహాత్ముడు మెరుపుతీగ వలె చంచలమైన ధనానికి ఆసపడి, రాగకోపాలకు సంబంధించిన మాయలలో పడి అసహనంతో సత్యాన్ని, ధర్మాన్ని అతిక్రమించి యోగ్యత, సభ్యత కలవారి దగ్గర సక్రమంగా మెలగజాలుతాడా?

**వ.** **ఏ నెట్లును సత్యసమయం బతిక్రమింప నోప; శుభోదయకాలంబుఁ బ్రతీక్షించి యుండుము; రాజ్యంబులుఁ బుత్త్రులును ధనంబును యశంబును సత్యంబునకు సమంబులు గా' వనిన భీమసేనుం డిట్లనియె.** **260**

**ప్రతిపదార్థం:** ఏను+ఎట్లును= నేను ఏ రీతిగా అయినను; సత్య, సమయంబు= సత్యం పాటించి చేసిన ప్రతిజ్ఞను; అతిక్రమింపన్+ఓపన్= దాటలేను, (మీరలేను); శుభ+ఉదయ, కాలంబున్= మేలు కలిగే సమయాన్ని; ప్రతీక్షించి+ఉండుము= ఎదురుచూస్తూ ఉండుము; రాజ్యంబులున్; పుత్త్రులును; ధనంబును; యశంబును= కీర్తియు; సత్యంబునకు, సమంబులు, కావు+అనిన= సత్యంతో సరిసమానాలు కావు; అనినన్= అనగా; భీమసేనుండు+ఇట్లు+అనియెన్= భీముడు ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** నేను సత్యవ్రతాన్ని ఎన్నడూ వీడజాలను. చేసిన ప్రతిజ్ఞను మీరజాలను. మేలు కలిగే కాలం కొరకు నిరీక్షించి ఉండుము. రాజ్యం, సంతానం, కీర్తి-సత్యంతో సరితూగజాలవు'- అని ధర్మరాజు చెప్పగా భీముడు ఇట్లా అన్నాడు.

**ఆ. 'అంతకుండు జనుల కాసన్నుఁడై యుండ । నిమిషమాత్రమేని నిశ్చయింపఁ**
**దగని జీవనంబు దద్ద సుస్థిరముగాఁ । జేసి కార్య మెడయుఁ జేయఁదగునె? 261**

**ప్రతిపదార్థం:** అంతకుండు= యముడు; జనులకు= ప్రజలకు; ఆసన్నుఁడు+ఐ+ఉండన్= దగ్గరివాడై ఉండగా; నిమిష, మాత్రము+ఏని= ఒక్క నిమిషమైనను; నిశ్చయింపన్+తగని= నిర్ణయించటానికి తగని; జీవనంబు= బ్రతుకును; తద్ద= మిక్కిలి; సుస్థిరముగాన్= మిక్కిలి స్థిరమైనదిగా; చేసి= నిరూపించుకొని; కార్యము= కర్తవ్యాన్ని, అంటే చేయతగిన పనిని; ఎడయున్+చేయన్+తగునె= ఆలస్యం చేయటం తగునా?

**తాత్పర్యం:** 'ప్రజలకు యముడు చేరువలో ఉండగా, ఒక్క నిమిషమైనా సుస్థిరమని నిశ్చయించరాని జీవితాన్ని సుస్థిరం అనుకొని, కర్తవ్యాన్ని ఆలస్యం చేయతగునా?

**వ. శరీరికి మరణంబు నియతంబు; మరణంబునకు ముందర వైరంబు దీర్పనివాని జన్మంబు నిరర్థకంబు; సకల రాజ సమక్షంబునం బరులచేత నట్లు మన పడిన పరిభవంబునకుం బ్రతీకారంబు సేయునంతకు రేయునుం బగలును నా హృదయంబు దపించుచుండు; నాకంటె నర్జున నకుల సహదేవులుం గుంతీదేవియు నంతస్తాపంబున నెంతయు సంతప్తు లగుచున్నవారు. 262**

**ప్రతిపదార్థం:** శరీరికి= (దేహంకలవాడికి) ప్రాణికి; మరణంబు= చావు; నియతంబు= తప్పని సరైనట్టిది; మరణంబునకు ముందర= చనిపోవటానికి ముందే; వైరంబున్= శత్రుత్వాన్ని; తీర్పని, వాని, జన్మంబు= తీర్చనివాడి పుట్టుక; నిరర్థకంబు= వ్యర్థం; సకల, రాజ, సమక్షంబునన్= అందరు రాజుల ఎదుట; పరులచేతన్= శత్రువులచేత; అట్లు= ఆవిధంగా; మనపడిన= మనం పొందిన; పరిభవంబునకున్+ప్రతీకారంబు= అవమానానికి మారుచేత; చేయు+అంతకున్= చేసేవరకు; రేయునున్+ పగలును= రాత్రింబగళ్ళు; నాహృదయంబు= నా ఎడద; తపించుచుండున్= దుఃఖిస్తూ ఉంటుంది; నాకంటెన్; అర్జున, నకుల, సహదేవులున్+కుంతీదేవియున్; అంతస్తాపంబునన్= లోపలిబాధచేత; ఎంతయు= ఎంతో ఎక్కువగా; సంతప్తులు+అగుచున్నవారు= మిగుల తాపం పొందుతున్నారు.

**తాత్పర్యం:** పుట్టినవారు గిట్టక తప్పదు. మరణించటానికి పూర్వమే వైరం తీర్చుకొనలేని మనుజుడి జన్మ వ్యర్థం. అంతమంది రాజుల ముందు ఆ విధంగా మనం శత్రువులచేత పడిన అవమానానికి ప్రతీకారం చేసేంతవరకు నా హృదయం రాత్రింబగళ్ళు తపిస్తూ ఉంటుంది. నాకంటె మిక్కుటంగా లోలోపల బాధతో క్రుగ్గేవారు అర్జునుడు, కుంతి, నకుల సహదేవులు.

**క. వీరల దుఃఖము దీర్పక । క్రూరనికారులగు రిపులకును ముదముగ ను**
**గ్రారణ్యములో ధర్మువుఁ । గారుణ్యముఁ దాల్చి యునికి కార్యమె నీకున్? 263**

**ప్రతిపదార్థం:** వీరల, దుఃఖము= వీరు అనుభవిస్తున్న శోకం; తీర్పక= తొలగించక; క్రూర, నికారులు+అగు= దయలేని వంచకులైన; రిపులకును= శత్రువులకు; ముదముగన్= సంతసమవునట్లుగా; ఉగ్ర+అరణ్యములోన్= భయంకరమైన అడవిలో; ధర్మువున్= ధర్మాన్ని; కారుణ్యమున్= దయను; తాల్చి= ధరించి; ఉనికి= ఉండటం; నీకున్= నీకు; కార్యమె= కర్తవ్యమా?

**తాత్పర్యం:** వీరి (భీమ, అర్జున, నకుల సహదేవులు, కుంతీదేవి అనుభవించే) దుఃఖం తొలగించకుండ, శత్రువులకు సంతోషం కలిగేటట్లుగా, భయంకరమైన అడవిలో ధర్మాన్ని, దయను ధరించి ఉండటం నీకు తగునా?

**వ. ఇది బ్రాహ్మణ ధర్మంబుగాని క్షత్రియ ధర్మంబు గాదు; మనుప్రణీతంబులైన రాజధర్మంబులు నీ యెఱుంగనియవి లేవు; శత్రుసంహారంబు సేయని నాఁ డత్యంతహాని యగు; నట్లుంగాక. 264**

**ప్రతిపదార్థం:** ఇది= ఇట్టి నీ ప్రవర్తన; బ్రాహ్మణ, ధర్మంబు+కాని= బ్రాహ్మణులు ఆచరించతగిన ధర్మమే కాని; క్షత్రియ ధర్మంబు+కాదు= క్షత్రియులు ఆచరించవలసిన ధర్మం కాదు; మను ప్రణీతంబులు+ఐన= మనువుచేత రచించబడిన; రాజధర్మంబులు= రాజులు ఆచరించతగిన ధర్మాలు; నీ+ఎఱుంగని+అవి, లేవు= నీకు తెలియనివి లేవు; శత్రు సంహారంబు= విరోధులను చంపటం; చేయనినాఁడు= చేయనప్పుడు; అత్యంత, హాని= మిక్కిలి కీడు; అగున్= దాపురిస్తుంది; అట్లున్+కాక= అదీ కాక.

**తాత్పర్యం:** నీ ప్రవర్తన బ్రాహ్మణులకు అనువైన ధర్మం కాని, క్షత్రియులు ఆచరించవలసిన ధర్మం కాదు. మనువు ధర్మశాస్త్రంలో రచించిన రాజధర్మాలు నీకు తెలియనివి కావు. శత్రువులను తుదముట్టించనినాడు కీడు దాపురిస్తుంది.

**తే. వనమునందుఁ బండ్రెండు సంవత్సరంబు । లుండ నేర్చితి మేనియు, నొరు లెఱుంగ**
**కుండ నజ్ఞాతచర్యయం దొక్క దివస । మైన నుండఁగ నేర; మెట్లనిన వినుము. 265**

**ప్రతిపదార్థం:** వనమునందున్= అడవిలో; పండ్రెండు, సంవత్సరంబులు= పండ్రెండేండ్లు; ఉండ, నేర్చితిమి+ఏనియున్= ఉండగలిగినప్పటికిని; ఒరులు+ఎఱుంగక+ఉండన్= ఇతరులు తెలిసికొనకుండ; అజ్ఞాత, చర్య+అందు= తెలియబడని ప్రవర్తనలో (అజ్ఞాతవాసంలో); ఒక్క దివసము+ఐన= ఒక్క రోజుకూడా; ఉండఁగ నేరము= ఉండజాలం; ఎట్లు+అనిన= ఎట్లని అడిగినట్లయితే; వినుము= చెప్పుతాను వినుము.

**తాత్పర్యం:** అడవిలో మనం ఎట్లో పండ్రెండేండ్లు ఉండగలిగినా, తదుపరి అజ్ఞాతవాసంలో ఇతరులకు తెలియకుండ ఒక్క దినంకూడా గడుపజాలము. ఎట్లంటే విను.

**వ. ఆబాలవృద్ధప్రసిద్ధుండవై పార్థివ సూర్యుండవైన నిన్నును, సింహసంహననులైన నీ తమ్ములను నెఱుఁగని వారు లేరు; మన గూఢభావంబు మేరువు నిగూఢభావంబునుంబోలె నఘటమానం; బిట్లేని నవ్వనవాసక్లేశం బెన్నఁడును మనకుఁబాయనేరదు; మన మిప్పు డివ్వనమునఁ బదుమూఁడు మాసంబులు సలిపితిమి; సంవత్సర ప్రతినిధిగా మాసంబులు సేసికొనుట యెందునుం గల యదియ; దీన ధర్మవిరోధంబు లేదు; విజయారంభంబున కిది యవసరం' బనిన భీమసేను పలుకులు విని నిశ్వాస వ్యాకులిత ముఖుండై, పెద్దయుం బ్రొద్దు చింతించి ధర్మరా జిట్లనియె. 266**

**ప్రతిపదార్థం:** ఆ బాల వృద్ధ ప్రసిద్ధుండవు+ఐ= బాలురు మొదలుకొని ముసలివారివరకు పేరు ప్రఖ్యాతులతో విలిసిల్లే వాడివై; పార్థివ, సూర్యుండవు+ఐన= రాజులలో సూర్యుడివంటి వాడివైన; నిన్నును; సింహసంహననులు+ఐన= సింహాలవంటి శరీరాలు కలవారైన; నీ, తమ్ములనున్= నీసోదరులను; ఎఱుఁగని వారు లేరు; మన, గూఢ, భావంబు= మనం రహస్యంగా ఉండటం; మేరువు, నిగూఢ, భావంబునున్+పోలెన్= మేరుపర్వతం రహస్యంగా ఉండగలగటంవలె; అ, ఘటమానంబు= జరుగనటువంటిది (ఒనగూడనిది); ఇట్లు+ఏనిన్= ఇది ఈ విధంగా జరిగితే; ఈ+వన, వాస, క్లేశంబు= ఈ విధంగా అడవిలో నివసించి క్రుగ్గటం; ఎన్నఁడును= ఎప్పటికిని; మనకున్+పాయనేరదు= మనకు తొలగిపోదు (తప్పదు); మనము+ఇప్పుడు; ఈ+వనమునన్=

ఈ అడవిలో; పదుమూఁడు మాసంబులు= పదమూడు నెలలు; సలిపితిమి= గడిపాము; సంవత్సర, ప్రతినిధిగా= ఒక ఏడుకు బదులుగా; మాసంబులు= ఒక్కొక్క నెలను; చేసికొనుట= లెక్కకట్టటం; ఎందునున్+కల+అది+అ= అన్నిచోట్ల ఉన్నట్టిదే; దీనన్= ఈ విధంగా చేస్తే; ధర్మ, విరోధంబు, లేదు= ధర్మవ్యతిరేకత లేదు; విజయ+ఆరంభంబునకున్= గెలుపును పొంద యత్నించటానికి; ఇది, అవసరంబు= ఇది తగినకాలం; అనినన్= అని చెప్పగా; భీమసేను, పలుకులు, విని= భీముడి మాటలు విని; నిశ్వాస, వ్యాకులిత, ముఖుండు+ఐ= నిట్టూర్పులచేత కలత నొందిన మొగం కలవాడై; పెద్దయున్+ప్రొద్దు, చింతించి= చాలాసేపు విచారించి; ధర్మరాజు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! బాలుర నుండి వృద్ధులదాకా అందరిలోప్రసిద్ధుడివై రాజుల్లో సూర్యుడివంటి వాడివైననిన్ను, సింహాలవంటిశరీరాలుగల నీ తమ్ముళ్ళను తెలియనివారులేరు. మనం రహస్యంగా ఉండటం అంటే మేరుపర్వతం మరుగుపడిఉండటం. అది జరిగేదికాదు. అరణ్యావాసాన్ని ఎట్లో గడిపినా- అజ్ఞాతవాసాన్ని ఇతరులకు తెలియకుండ గడపటం ఎట్లా వీలవుతుంది? ఇట్లైతే ఈ మన వనవాసక్లేశం ఎన్నటికీ తొలగిపోదు. ఒక సంవత్సరానికి బదులుగా ఒక నెలను పరిగణించే గణితం లోకంలో బహుళప్రచారంలో ఉన్నది కదా! మనం ఈ అడవిలో పదమూడు నెలలు గడిపాము కావున వీటిని పదమూడు ఏండ్లుగా సరిపెట్టవచ్చును. ఇందు ధర్మవిరోధం లేదు. ఇది విజయ సాధనకు ఒక ఉపకరణం'- అని భీముడు చెప్పగా విని, నిట్టూర్పులచేత కమలిన మొగం కలవాడయి ధర్మరాజు ఇట్లా బదులు పలికాడు.

**క. 'క్రమమునఁ బాండిత్య పరా । క్రమ దర్పములందుఁ గడుఁ బ్రగల్భుండవు, మ**
**ధ్యమ! నీ చెప్పిన యది కా । ర్యమ యయినను ధీరబుద్ధివై విను మనఘా! 267**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాప రహితుడా!; మధ్యమ!= కుంతీపుత్రులలో నడిమివాడా! ఓ భీమసేనా!; క్రమమునన్= వరుసగా; పాండిత్య పరాక్రమ దర్పములందున్= పాండిత్యంలోను, శౌర్యంలోను, ఆటోపంలోను; కడున్= మిక్కిలి; ప్రగల్భుండవు= ప్రతిభ కలవాడివి; నీ, చెప్పిన+అది= నీవు చెప్పింది; కార్యము+అ= చేయదగిన పనే; అయినను= కాని; ధీర, బుద్ధివి+ఐ= స్వతంత్ర బుద్ధి కలవాడివై; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** 'అనఘుడ వైన ఓ భీమసేనా! నీకు పాండిత్యం ఉన్నది; పరాక్రమం ఉన్నది; ఆటోపం ఉన్నది. నీవు మిక్కిలి ప్రతిభావంతుడివి. నీవు చెప్పింది చేయదగినదే. అయినా, నేను చెప్పేది విని స్వతంత్రంగా ఆలోచించు.

**వ. అల్పోపాయం బైన కార్యంబు సాహసారబ్ధం బైనను దోషంబు లే; దిది మహాకార్యంబు; సాహసక్రియా సాధ్యంబు గాదు; సువిచారితంబై సిద్ధింబొందు; విచారపూర్వారబ్ధ కార్యంబునకు దైవంబును ననుకూలం బగుం గావున నిమ్ముగా విచారింపవలయు. 268**

**ప్రతిపదార్థం:** అల్ప+ఉపాయంబు+ఐన, కార్యంబు= చిన్న ప్రయత్నంచేత నెరవేరేపని; సాహస+ఆరబ్ధంబు+ఐనను= తెగువతో మొదలు పెట్టబడిం దైనను; దోషంబు లేదు= తప్పు లేదు; ఇది; మహా, కార్యంబు= గొప్పపని; సాహస, క్రియా, సాధ్యంబు+కాదు= తెగువతో ముందుకు దూకి చేసే పనుల వలన జరిగేటటువంటిది కాదు; సు, విచారితంబు+ఐ= బాగుగా యోచించబడిందై; సిద్ధిన్+పొందున్= ఫలితం పొందుతుంది; విచార, పూర్వ+ఆరబ్ధ, కార్యంబునకు= ముందు యోచించబడి పిమ్మట మొదలు పెట్టబడిన పనికి; దైవంబునున్= విధియు (అదృష్టమును); అనుకూలంబు+అగున్= తోడుపడుతుంది; కావునన్+ఇమ్ముగా, విచారింపవలయున్= కాబట్టి సంపూర్ణంగా (అనుకూలంగా) ఆలోచించవలసి ఉంది.

**తాత్పర్యం:** ఏదో చిరుప్రయత్నంచేత సిద్ధించే పనిని తెగువతో మొదలు పెట్టినను తప్పు లేదు. ఇది మహాకార్యం. తొందరపడి తెగువతో ముందుకు చొచ్చుకొని చేయతగింది కాదు. చక్కగ ఆలోచించి చేయదగింది సుమా! జాగరూకతతో ముందు ఆలోచించి తదుపరి మొదలు పెట్టిన పనులకే దైవం (అదృష్టం) కూడ కలిసివస్తుంది. కాబట్టి సాంగోపాంగంగా ఈ సమస్యగురించి యోచించవలసి ఉన్నది.

**సీ. శూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనా । దులు దురాధర్షు లందొఱును మనకు**
**నాతతాయులు, మఱి యంగభూవిభుఁడును । భూరిశ్రవుఁడు మద్రభూమిపతియు**
**నాదిగాఁ గల వీరు లవిజేయ విక్రము, । లొలసి తత్సుహృదులై యున్నవారు;**
**మనచేత జితులైన మనుజేశు లెల్లను । జని సుయోధనుచేత సత్కరింపఁ**

**ఆ. బడి కడంగి వాని ప్రస్తవంబున నాజి । వేచి ప్రాణములను విడువ నున్న**
**వారు; వారలెల్ల వసుధఁ బ్రసిద్ధులు । వినఁగ నస్త్రశస్త్రవిద్యలందు. 269**

**ప్రతిపదార్థం:** శూరులు= వీరులు; ధృతరాష్ట్ర సుతులు= ధృతరాష్ట్రుడి కుమారులు; దుర్యోధన+ఆదులు= దుర్యోధనుడు మున్నగువారు; అందొఱును= అందరున్నూ; మనకున్; దురాధర్షులు= త్రోసివేయ తగనివారు; ఆతతాయులు= చంపటానికి ఉద్యుక్తులైనవారు; మఱి= అంతేకాక; అంగభూ, విభుఁడును= అంగదేశపు రాజును (కర్ణుడును); భూరిశ్రవుఁడు; మద్ర, భూమి, పతియున్= మద్రదేశపు రాజు (శల్యుడు); ఆదిగాన్+కల, వీరులు= మొదలుగా గల వీరులు; అవిజేయ విక్రములు= జయింపసాధ్యం కాని పరాక్రమంగలవారు; ఒలసి= కూడుకొని; తద్+సుహృదులు+ఐ+ఉన్నవారు= ఆతడికి మిత్రులై ఉన్నారు; మనచేతన్; జితులు+ఐన= లోగడ ఓడిపోయిన (రాజసూయంలో); మనుజ+ఈశులు+ఎల్లను= రాజులందరున్నూ; చని= వెళ్ళి; సుయోధనుచేత= దుర్యోధనుడి చేత; సత్కరింపన్+పడి= గౌరవించబడి; కడంగి= పూని; వాని ప్రస్తవంబునన్= వాడి విషయంలో; ఆజిన్= యుద్ధాన్ని; వేచి= నిరీక్షించి; ప్రాణములను, విడువన్+ఉన్నవారు= ప్రాణాలను అర్పించటానికి సిద్ధంగా ఉన్నారు; వారలు+ఎల్లన్= వారందరూ; అస్త్ర, శస్త్ర, విద్యలందు= అస్త్రాలకు, (మంత్రంతో కూడిన బాణాలకు) శస్త్రాలకు (ఆయుధాలకు) సంబంధించిన కళలలో; వినఁగన్; వసుధన్= భూమిపై; ప్రసిద్ధులు= పేరుకెక్కిన వారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి కుమారులైన దుర్యోధనాదులందరు వీరులు. మనం చులకనగా చూడదగినవారు కారు. పైగా మనలను చంపటానికి ఉద్యమించే వారు. అంతేకాక, కర్ణుడు, భూరిశ్రవుడు, శల్యుడు జయించ సాధ్యం కానివారు. ఆ దుర్యోధనుడికి వారు మిత్రులై ఉన్నారు. లోగడ మనచేత రాజసూయయాగంలో ఓడిపోయిన రాజులందరు వెళ్ళి దుర్యోధనుడిచే సత్కరించబడి, మనపై పగదీర్చుకోవటానికి యుద్ధానికై నిరీక్షిస్తూ ప్రాణాలు వదలటానికికైనా సిద్ధంగా ఉన్నారు. వాళ్ళంతా అస్త్రశస్త్రవిద్యలలో ఆరితేరి ఈ లోకంలో పేరుకెక్కినవారు.

**విశేషం:** మద్రభూపతి శల్యుడు నకులసహదేవుల మేనమామ. అయినను అతడు కురుక్షేత్ర సంగ్రామంలో దుర్యోధనుడి పక్షంలో చేరాడు. ముందు జరుగబోయే ఆ సంగతిని- మునుముందుగానే ధర్మరాజు గుర్తించినట్లు ఆరణ్యపర్వంలోనే సాక్ష్యం లభించింది. ఆతతాయులు ఆరుగురు. 1. ఇంటికి నిప్పు పెట్టేవాడు, 2. విషం పెట్టేవాడు, 3. కత్తితో నరికేవాడు 4. ధనం దోచుకొనేవాడు 5. భూమిని అపహరించేవాడు 6. పరస్త్రీని చెరబట్టేవాడు.

**క. వినవయ్య! కర్ణుగర్వం । బని నాతఁ డభేద్యకవచుఁ డగుటయు, విలునే**
**ర్పున నతని బాహువిక్రమ । మును దలఁచిన నాఁడు గన్ను మొగుడదు నాకున్. 270**

**ప్రతిపదార్థం:** వినవయ్య; కర్ణుగర్వంబు= కర్ణుని బాహు గర్వం (దర్పం); అనిన్= యుద్ధంలో; ఆతఁడు= అతడు; అభేద్య కవచుఁడు= భేదించటానికి వీలులేని మైతొడుగు కలవాడు; అగుటయు; విలునేర్పునన్= ధనుర్విద్యానైపుణ్యంలో; అతని, బాహు విక్రమమును= అతని చేతుల లావును; తలఁచిన, నాఁడు= ఆలోచించిన రోజు; నాకున్= నాకు; కన్ను, మొగడదు= కన్నుమూత పడదు, అంటే నిద్రరాదు.

**తాత్పర్యం:** వినుము. కర్ణుడు బాహుదర్పపూరితుడు. అతడు అభేద్యకవచుడు. అతడి విలునేర్పు, పరాక్రమం తలచినరోజు నాకు నిద్ర పట్టదు.

**వ. మఱియు భీష్మ ద్రోణ కృపాచార్యులు సములయ్యును వారియొద్దన యున్నవారు; వార లపార దివ్యాస్త్ర విశారదులు, వారల నోర్చికాని దుర్యోధను నిర్జింపంబోల' దని విచారించు సమయంబున. 271**

**ప్రతిపదార్థం:** మఱియు= అంతేకాక; భీష్మద్రోణకృప+ఆచార్యులు= భీష్ముడు, ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు; సములు+ అయ్యును= సమానులు అయినప్పటికి; అంటే కౌరవ పాండవులకు సమానులే అయినప్పటికిని; వారి+ఒద్దన్+అ+ఉన్నవారు= వారి దగ్గరే (కౌరవుల దగ్గర) ఉన్నవారు; వారలు+అపార, దివ్య+అస్త్ర, విశారదులు= వారు మితిలేని దివ్యమైన అస్త్రాలలో నేర్పరులు; వారలన్+ఓర్చి, కాని= వారిని జయించికాని; దుర్యోధనున్, నిర్జింపన్+పోలదు= దుర్యోధనుడిని జయించ నలవి కాదు; అని, విచారించు, సమయంబున= అని ఆలోచించే సమయంలో.

**తాత్పర్యం:** అంతేకాక, భీష్మద్రోణకృపాచార్యులు, కురుపాండవులకు సములైనప్పటికీ, కౌరవుల దగ్గరే ఉండటంచేత వారి పక్షాన్నే యుద్ధంలో పాల్గొంటారు. వారు అపార దివ్యాస్త్రకోవిదులు. వారిని జయించిన పిమ్మటే కదా మనం దుర్యోధనుడిని గెలవటం'- అని ఆలోచించేటప్పుడు.

### కృష్ణద్వైపాయనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చుట (సం. 3-37-20)

**క. వారల పుణ్యోదయమున । వారిజభవనిభుఁడు లోకవంద్యుఁడు వచ్చెం**
**బారాశర్యుఁడు ధర్మశ । రీరుఁడు గృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిన్. 272**

**ప్రతిపదార్థం:** వారల= వారి (పాండవుల) యొక్క; పుణ్య+ఉదయమున= పుణ్య సిద్ధివలన అంటే పుణ్యఫలం వలన; వారిజ, భవ, నిభుఁడు= పద్మంలో జనించిన బ్రహ్మతో సమానమైన వాడు; లోక, వంద్యుఁడు= లోకాలన్నింటిచేత నమస్కరించదగినవాడు; పారాశర్యుఁడు= పరాశరుడి కుమారుడు; ధర్మశరీరుఁడు= ధర్మమే దేహమైన వాడు అంటే మూర్తీభవించిన ధర్మం అని అనదగినవాడు; కృష్ణ+అజిన+ఉత్తరీయుఁడు= నల్ల జింక చర్మం కండువాగా కప్పుకొన్నవాడు; ప్రీతిన్= అనురాగంతో; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఆ పాండవుల పుణ్యపరిపాకంచేత పరాశరుడి కుమారుడు, జగదారాధ్యుడు, బ్రహ్మతో సమానుడు, ధర్మస్వరూపుడు, నల్లజింకతోలును ఉత్తరీయంగా కలవాడైన వ్యాసుడు ఆదరంతో అచటికి వచ్చాడు.

**వ. ఇట్లు వచ్చి పరమభక్తిపరులైన పాండవులచేతం బూజితుండై కృష్ణద్వైపాయనుండు ధర్మరాజున కిట్లనియె.273**

**ప్రతిపదార్థం:** ఇట్లు, వచ్చి= ఈ విధంగా వచ్చి; పరమ, భక్తి, పరులు+ఐన= మిక్కిలి పూజ్యభావం (తనపట్ల) కల; పాండవులచేతన్; పూజితుండు+ఐ= ఆరాధించబడి; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఇట్లా వచ్చి తనపట్ల మిక్కిలి భక్తి ఉన్న పాండవులచేత అర్చించబడి వ్యాసమహర్షి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**క. 'వీరులగు భీష్మకుంభజ। శారద్వత కర్ణు లమితసత్త్వులు వారిం**
**బోర వధియించు టెంతయు। భారం బనియున్న నీదు భర మెఱిఁగి మదిన్. 274**

**ప్రతిపదార్థం:** వీరులు+అగు= శూరులైన; భీష్మ, కుంభజ, శారద్వత, కర్ణులు= భీష్ముడు, (కుంభజుడు= కుండలోపుట్టినవాడు) ద్రోణుడు, శారద్వతుడు (శరద్వంతుని కుమారుడైన కృపుడు), కర్ణుడు; అమితసత్త్వులు= మితిలేని బలం కలవారు; వారిన్= వారిని; పోరన్= యుద్ధంలో; వధియించుట= చంపటం; ఎంతయు, భారంబు+అని+ఉన్న= మిక్కిలి బరువు అని ఉండే; నీదు భరము= నీయొక్క బరువు (క్లేశం); మదిన్= మనస్సులో; ఎఱిఁగి= తెలిసికొని.

**తాత్పర్యం:** 'మహావీరులైన భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, కర్ణుడు గొప్ప పరాక్రమవంతులు. అట్టివారిని యుద్ధంలో చంపటం మిక్కిలి భారమైనపని అని భావించే నీ చింతాభారాన్ని నా మనసులో గుర్తించి, (ఇక్కడికి వచ్చాను).

**ఆ. దాని నపనయింపఁగా నిప్డు వచ్చితి; నధికయోగలబ్ధ మతిరహస్య**
**మీ విశేషవిద్య సేవింపఁగాఁ బార్థుఁ। బనుపు; మితఁడు దీనఁ బడయు సిద్ధి.' 275**

**ప్రతిపదార్థం:** దానిన్= దానిని (నీ భారాన్ని); అపనయింపఁగాన్= తొలగించటానికై; ఇప్డు= ఇపుడు; వచ్చితిన్= అరుదెంచాను; ఈ, విశేష, విద్య= ఈ గొప్పదైన విద్య; అధిక, యోగ, లబ్ధము= గొప్ప యోగంవలన పొందబడింది; అతి, రహస్యము= మిక్కిలి రహస్యమైనది; (దీనిని) సేవింపఁగాన్= అభ్యసించటానికి; పార్థున్= అర్జునుడిని; పనువుము= నియోగించుము; ఇతఁడు= ఈ అర్జునుడు; దీనన్= దీనివలన; సిద్ధిన్= ఫలాన్ని; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఆ భారాన్ని తొలగించటానికే వచ్చాను. ఈ విశేష విద్య అధికయోగలబ్ధం, అతిరహస్యం. దీనిని సేవించటానికి అర్జునుడిని నియోగించుము. ఈ (ప్రతిస్మృతి) విద్యాప్రభావం వలన అర్జునుడు ఫలితాన్ని పడసి చరితార్థుడు అవుతాడు'.

**విశేషం:** ఇచట 'యోగ' శబ్దం ప్రయుక్తం. యోగ శబ్ద నిర్వచనాలు వేదాంత వాఙ్మయంలో స్థూలదృష్టికి విభిన్నాలుగా గోచరించవచ్చును. యోగశబ్దానికి వ్యావహారిక జగత్తులో కలయిక- పొందిక అని అర్థం. సాహిత్య ప్రపంచంలో యోగమంటే సామరస్య సంధానం, సమన్వయ సమ్మేళనం. పతంజలి మహర్షి "యోగః చిత్తవృత్తినిరోధః" - 'యోగమంటే చిత్తవృత్తినిరోధ' మని నిర్వచించాడు. భగవద్గీతలో (1) "సమత్వం యోగ ఉచ్యతే" (2) "యోగః కర్మసు కౌశలం.' యోగమనగా సమతాభావం, క్రియా కౌశలం- అని చెప్పబడింది. యోగికి సమబుద్ధి ఉంటుంది. అతడు నిస్సంగుడు. అతడికి అపజయం అనే ప్రసక్తే లేదు. అందుచేత సాధనసిద్ధికి అభేదాధ్యవసాయం ఏర్పడుతుంది. మహాభారతంలో ఈ 'ప్రతిస్మృతి' ఎటువంటి యోగమో నిష్కర్షగా నిర్వచించటానికి నేడు మనకు వీలుకాక పోయినప్పటికీ, అందులో చిత్తవృత్తి నిరోధం, సమబుద్ధి, క్రియాకౌశలం- త్రిభుజంలోని మూడు భుజాలుగా ఇమిడి ఉన్నాయని చెప్పవచ్చును. ఈ యోగసాధనలో అర్జునుడి ధ్యేయం తన క్రియాకౌశలాన్ని పెంపొందించుకొనటమే. అర్జునుడి యోగసాధన భగవద్గీతోపదేశానికి ముందే ఆరంభించినట్లు దీన్నిబట్టి గ్రహించవచ్చును.

**వ. అని ధర్మతనయు నేకాంతప్రదేశంబునకుం దోడ్కొని చని సత్యవతీసుతుండు విధిదృష్ట విధానంబునం బ్రతిస్మృతి యను విద్య నుపదేశించి. 'దీని శక్తి నర్జునుం డధికతపోవీర్యవిభవుండై యింద్ర యమ వరుణ**

**కుబేరాది దేవతలను నీశ్వరునిఁ బ్రత్యక్షంబు సేసికొని, వారలవలన దివ్యాస్త్రంబులు వడసి శత్రువుల జయించు; మఱి యివ్వనంబు భవచ్చిరనివాసంబునం జేసి విరళ ఫల కుసుమ పాదపంబై మృగకులోపరోధియై యొప్పకున్న యది; యొక్కచోటన పెద్దకాలం బునికి యెవ్వరికిం బ్రీతి జననంబు గాదు; కావున నొండువనంబున కరుగునది' యని చెప్పి యమ్మునివరుం డరిగినఁ, దద్వాక్య ముదితులై ద్వైతవనంబు వాసి పాండవులు బ్రాహ్మణవరులతోన కామ్యకవనంబున కరిగి, సరస్వతీ తీరంబునందు నివాసంబుసేసి, కొండొకకాలం బుండ నొక్కనాఁ డజాతశత్రుం డర్జునుఁ జూచి యిట్లనియె. 276**

**ప్రతిపదార్థం:** అని= ఆవిధంగా చెప్పి; ధర్మతనయున్= ధర్మరాజును; ఏకాంత ప్రదేశంబునకున్= రహస్యమైన చోటికి; తోడ్కొని చని= తీసికొనిపోయి; సత్యవతీ సుతుండు= సత్యవతి కుమారుడు (వేదవ్యాసుడు); విధి, దృష్ట, విధానంబునన్= (శాస్త్రంలోని) సూత్రాలలో చెప్పబడిన రీతిగా; 'ప్రతిస్మృతి'+అను, విద్యన్= 'ప్రతిస్మృతి' అనే పేరు కల విద్యను; ఉపదేశించి= బోధించి; దీని శక్తిన్= దీని ప్రభావం వలన; అర్జునుండు; అధిక, తపస్+వీర్య, విభవుండు+ఐ= ఎక్కువ తపస్సు వలన ఏర్పడే తేజస్సు అనే సంపద కలవాడయి; ఇంద్ర, యమ, వరుణ, కుబేర+ఆది, దేవతలను= ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు మున్నగు దేవతలను; ఈశ్వరునిన్= శివుడిని; ప్రత్యక్షంబు+చేసికొని= సాక్షాత్కరింపచేసికొని; వారలవలన, దివ్య+అస్త్రంబులు= ఆయా దేవతలకు సంబంధించిన మంత్ర బాణాలు; పడసి= పొంది; శత్రువులన్, జయించున్= శత్రువులను గెలుస్తాడు; మఱి= అటుమీద; ఈ+వనంబు= ఈ అడవి; భవత్, చిర, నివాసంబునన్+చేసి= మీరు చాలాకాలం నివసించటంచేత; విరళ, ఫల, కుసుమ, పాదపంబు+ఐ= తగ్గి పోయిన పండ్లు, పువ్వులు చెట్లు కలదై; మృగ, కుల+ఉపరోధి+ఐ= జంతువుల సమూహాలకు ప్రతిబంధకమై; ఒప్పక+ఉన్న+అది= పాడయిపోయింది (తగనిది); ఒక్కచోటన్+అ= ఒకేచోటనే; పెద్ద, కాలంబు+ఉనికి= చాలాకాలం ఉండటం; ఎవ్వరికిన్+ప్రీతి, జననంబు+కాదు= ఎవరికైనా సంతోషాన్ని పుట్టించేది కాదు; కావునన్= కాబట్టి; ఒండు, వనంబునకు= వేరొక అడవికి; అరుగునది= వెళ్ళేది; అని; చెప్పి; ఆ+మునివరుండు= ఆ ఋషిశ్రేష్ఠుడు; అరిగినన్= వెళ్ళగా; తద్+వాక్య, ముదితులు+ఐ= ఆయన యొక్క మాటలకు సంతోషించిన వారై; ద్వైత, వనంబు+పాసి= ద్వైత మనే పేరున్న అడవిని విడిచి; పాండవులు; బ్రాహ్మణ, వరులతోన్+అ= విప్రముఖ్యులతోకూడా; కామ్యక, వనంబునకు+అరిగి= కామ్యక మనే పేరుకల అడవికి వెళ్ళి; సరస్వతీ తీరంబునందు= సరస్వతీనది ఒడ్డున; నివాసంబు+చేసి= నివసించి; కొండొక, కాలంబు+ఉండన్= కొన్ని దినాలు నివసించగా; ఒక్క, నాఁడు= ఒక దినం; అజాత, శత్రుండు= ధర్మరాజు; అర్జునున్+చూచి= అర్జునుడిని కాంచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** వ్యాసమహర్షి ధర్మరాజును రహస్యస్థలానికి తీసికొనిపోయి, 'ప్రతిస్మృతి' అనే విద్యను ఉపదేశించాడు. ఆ విద్యాశక్తివలన అర్జునుడు ఇంద్ర యమ వరుణ కుబేరాది దేవతలను ఉపాసించి, ప్రత్యక్షంచేసుకొని, వారలవలన ఆయా దివ్యాస్త్రాలను సంపాదించి శత్రువులను జయించగలడని చెప్పాడు. (అంటే 'ప్రతిస్మృతి'ని ధర్మరాజు అర్జునుడికి ఉపదేశించాలని వ్యాసమహర్షి హృదయమని తేలుతున్నది). మీ రిచ్చట చాలాకాలంనుండి ఉండటంచేత ఈ అడవిలో ఫలాలు, పుష్పాలు, చెట్లు తరిగిపోయాయి. అందువలన ఇచటి జంతువులకు ఆటంకంగా ఉన్నది. ఇదిగాక, ఒకేచోట చాలాకాలం ఎవరైనను ఉంటే ప్రీతి సన్నగిల్లుతుంది. కాబట్టి మీరు ఇంకొక అడవికి వెళ్ళటం మంచిది' అని వ్యాసమహర్షి పలుకగా పాండవులు సంతసించి బ్రాహ్మణులతోకలిసి కామ్యకవనానికి వెళ్ళి సరస్వతీ నదీ తీరంలో నివసించారు. అంత, ఒకనాడు ధర్మరాజు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. 'సాధితశాత్రవులగు భీ । ష్మాదులయం దధిగతాశ్రయం బయ్యెఁ జతుః**
**పాదం బగుచున్న ధను । ర్వేదము బ్రాహ్మణులయందు వేదమపోలెన్. 277**

**ప్రతిపదార్థం:** సాధిత, శాత్రవులు+అగు= సాధించబడిన విరోధులు కలవారయిన- అంటే శత్రులను జయించిన; భీష్మ+ఆదుల+అందు= భీష్ముడు మున్నుగా కలవారి పట్ల; బ్రాహ్మణుల+అందు; వేదము+అ, పోలెన్= వేదంవలె; చతుర్, పాదంబు+అగుచున్న= నాలుగు పాదాలు కలదిగా అవుతున్న; ధనుస్+వేదము= ధనుర్వేదం, వింటికి సంబంధించిన విజ్ఞానం; అధిగత+ఆశ్రయంబు+అయ్యెన్= పొందిన ఆశ్రయం కలదిగా అయింది.

**తాత్పర్యం:** 'వేదం బ్రాహ్మణులలో స్థిరపడినట్లుగా, నాలుగుపాదాలు కలదైన ధనుర్వేదం శత్రువులపై విజయం సాధించిన భీష్మాదులలో స్థిరపడింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అయ్యది మహనీయంబయి దివ్యమంత్ర కలితంబయి వారలకు సన్నిహితం బగుఁ గావున. 278**

**ప్రతిపదార్థం:** ఆ+అది= ఆ ధనుర్వేదం; మహనీయంబు+అయి= గొప్పదై; దివ్య మంత్ర కలితంబు+అయి= దేవతా సంబంధమైన మంత్రాలతో కూడిందై; వారలకు= ఆ భీష్మాదులకు; సన్నిహితంబు+అగున్+కావునన్= చేరువగా ఉంటుంది కాబట్టి.

**తాత్పర్యం:** ఆ మహనీయమైన ధనుర్వేదం దివ్యమంత్రాలతో కూడినదై ఆ భీష్మాదుల దగ్గర ఉన్నది కనుక-

**ఉ. వారలు దుర్యోధనుచే । నారాధితు లిష్టసత్క్రియల నగుట రణ**
**ప్రారంభమయిన నెదిరెడు । వార పరాక్రాంతులై యవశ్యము మనతోన్. 279**

**ప్రతిపదార్థం:** వారలు= భీష్మాదులు; దుర్యోధనుచేన్= దుర్యోధనుడిచేత; ఇష్ట, సత్+క్రియలన్= ఇష్టమైన సత్కారాలచేత; ఆరాధితులు= పూజించబడినవారు; అగుటన్= అవటంచేత; రణ, ప్రారంభము+అయినన్= యుద్ధం మొదలైతే; పర+ఆక్రాంతులు+ఐ= శత్రువులచే ఎదిరింపబడినవారై; మనతోన్; అవశ్యము= తప్పనిసరిగా; ఎదిరెడువారు+అ= తప్పక పోరు సల్పుతారు.

**తాత్పర్యం:** ఆ భీష్మాదులు, దుర్యోధనుడిచేత ఇష్టసత్కారాలతో పూజించబడ్డారు. అందుచేత యుద్ధం ప్రారంభమైనప్పుడు వారు తప్పక మనలను ఎదిరించి పరాక్రమంతో పోరు సల్పుతారు.

**వ. దివ్యాస్త్ర విదులైన వారల నోర్చునట్టి యుపాయంబు గృష్ణద్వైపాయనుండు ప్రసాదించె నీ విద్య నీవు ప్రతిగ్రహించి, కవచకార్ముక ప్రాస ఖడ్గ ధరుండవై యన్యుల కజేయుండవై యుత్తరదిక్కున కరిగి తపోయోగ బలంబున నింద్రుఁ బ్రత్యక్షంబు సేయుము; తొల్లి వృత్రునకు వెఱచి వేల్పులు తమ యాయుధంబులు బలంబులు నింద్రునందు సమర్పించి; రవి యెల్ల నీకుఁ దత్ప్రసాదంబున నగు; మఱి యింద్రునుపదేశంబున నీశ్వరు నారాధించి తదనుగ్రహంబున నిష్టసిద్ధి వడయు; మిది వేదవ్యాసు నుపదేశం' బని. 280**

**ప్రతిపదార్థం:** దివ్య+అస్త్ర, విదులు+ఐన= దేవతలకు సంబంధించిన అస్త్రాలను తెలిసినవారైన; వారలన్+ఓర్చునట్టి= వారిని జయించేటటువంటి; ఉపాయంబు= వెరవు; కృష్ణ ద్వైపాయనుండు= వ్యాసుడు; ప్రసాదించెన్= దయతో ఇచ్చాడు; ఈ విద్య; నీవు; ప్రతిగ్రహించి= (నా దగ్గరనుండి) స్వీకరించి; కవచ, కార్ముక, ప్రాస, ఖడ్గ, ధరుండవు+ఐ= మైతొడుగు, విల్లు, ఈటె , కత్తి

ధరించిన వాడివై; అన్యులకు= ఇతరులకు; అజేయుండవు+ఐ= జయించశక్యం కానివాడివై; ఉత్తర దిక్కునకు+అరిగి= ఉత్తర దిశకు వెళ్ళి; తపస్+యోగ, బలంబునన్= తపస్సుయొక్క, యోగంయొక్క శక్తిచేత; ఇంద్రున్= దేవేంద్రుడిని; ప్రత్యక్షంబు+చేయుము= సాక్షాత్కరింపచేసికొనుము; తొల్లి= పూర్వకాలంలో; వృత్రునకు= వృత్రుడు అనే రాక్షసుడికి; వెఱచి= భయపడి; వేల్పులు= దేవతలు; తమ+ఆయుధంబులు= తమతమ శస్త్రాలు; బలంబులున్= శక్తులు; ఇంద్రునందు= ఇంద్రుడికి; సమర్పించిరి= ఇష్టంతో ఇచ్చారు; అవి+ఎల్లన్= అవి అన్నియు; నీకున్; తద్+ప్రసాదంబునన్= ఆతడి దయవలన; అగున్= లభిస్తాయి; మఱి= అంతేకాక; ఇంద్రు+ఉపదేశంబునన్= ఇంద్రుడియొక్క హితబోధవలన; ఈశ్వరున్= శివుడిని; ఆరాధించి= పూజించి; తద్+అనుగ్రహంబునన్= ఆతడి దయవలన; ఇష్టసిద్ధి= కోరుకొన్న లాభాన్ని; పడయుము= పొందుము; ఇది; వేదవ్యాసు+ ఉపదేశంబు= వేదవ్యాసుడి హితబోధ; అని.

**తాత్పర్యం:** దివ్యాస్త్రవేత్తలైన భీష్మాదులను జయించే ఉపాయం వేదవ్యాసమహర్షి ఉపదేశించాడు. ఆ విద్య నీవు నా దగ్గరనుండి తీసికొనుము. నీవు సమస్తాయుధధారివై ఉత్తర దిక్కుగా వెళ్ళి, తపస్సు చేసి ఇంద్రుడిని సాక్షాత్కరింప చేసికొనుము. తొల్లి వృత్రుడికి భయపడి దేవతలు తమ ఆయుధాలు, బలాలు ఇంద్రుడికి సమర్పించారు. ఆతడి అనుగ్రహంవలన అవి అన్నియు నీకు లభిస్తాయి. తదుపరి ఇంద్రుడి హితబోధన ననుసరించి శివుడిని ఆరాధించి అభీష్టలాభం పొందుము. ఇది వేదవ్యాసమహర్షి ఉపదేశం'- అని ధర్మరాజు అర్జునుడితో చెప్పాడు.

**క. ధృతి నియమవ్రతునకు, దీ । క్షితునకుఁ, బార్థునకు, విగతకిల్బిషునకు ధ
ర్మతనూజుఁడు ప్రీతిఁ బ్రతి । స్మృతి నుపదేశించెఁ దా నమిత్రజిగీషన్. 281**

**ప్రతిపదార్థం:** ధృతి, నియమ, వ్రతునకు= ధైర్యంతో, నియమంతో కూడిన వ్రతం కల వాడికి; దీక్షితునకున్= మంత్ర దీక్షను పూనిన వాడికి; పార్థునకున్= అర్జునుడికి; విగత, కిల్బిషునకు= పోయిన పాపాలు కలవాడికి అంటే పాపరహితుడికి; ధర్మతనూజుఁడు= ధర్మపుత్రుడు; ప్రీతిన్= అనురాగంతో; తాన్= తాను; అమిత్ర జిగీషన్= శత్రువులను జయించాలనే కోరికతో; ప్రతిస్మృతిన్= ప్రతిస్మృతి అనే మంత్రవిద్యను; ఉపదేశించెన్= బోధించాడు.

**తాత్పర్యం:** ధైర్యంగా వ్రతదీక్షపూనినవాడు, పాపరహితుడు, మంత్రాన్ని సాధించాలనే పట్టుదలతో కూడినవాడు అయిన అర్జునుడికి, ధర్మరాజు శత్రువులను జయించాలనే అభిలాషతో 'ప్రతిస్మృతి' అనే విద్యను ఉపదేశించాడు.

**విశేషం:** ధర్మరాజు అర్జునుడితో 'తపోయోగ బలంబున' ఇంద్రుడిని ప్రత్యక్షం చేసికొమ్మని చెప్పి ఉన్నాడు. అంతేకాక, అతడికి 'ప్రతిస్మృతి' ని ఉపదేశించాడు. అందుచేత అర్జునుడు తపస్సు చేయవలసి ఉన్నది. యోగసాధనకూడ చేయవలసి ఉన్నది. పతంజలి ప్రవచించిన అష్టాంగయోగంలోని అంగాలు; 1. యమం 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధారణ 7. ధ్యానం 8. సమాధి. ఇందులో రెండవ అంగమైన నియమాన్ని పతంజలిమహర్షి పంచశీలగా రూపొందించాడు: 1. శౌచం 2. సంతోషం 3. తపస్సు 4. స్వాధ్యాయం 5. ఈశ్వరప్రణిధానం. నియమానికి కావలసింది దీక్ష. అందుచేత దీక్షితుడైన పార్థుడికి ప్రతిస్మృతిని ధర్మరాజు ఉపదేశించాడు.

**వ. అర్జునుండును నయ్యోగవిద్యాగ్రహణప్రభావంబున నధికతేజోమూర్తియై, దివ్యాస్త్రలాభార్థం బగ్రజుచేత ననుజ్ఞాతుండై, విధివిహిత హోమసంతర్పిత వీతిహోత్రుండును బ్రాహ్మణకృత స్వస్త్యయనుండునునై, ధౌమ్యాది మహీసురవరులను భ్రాతృవరులను వీడ్కొని, తపంబున కరుగ సమకట్టిన. 282**

**ప్రతిపదార్థం:** అర్జునుండును; ఆ+యోగ, విద్యా, గ్రహణ, ప్రభావంబునన్= ఆ యోగసాధనను గ్రహించటంచేత సంక్రమించిన మహిమచేత; అధిక, తేజస్+మూర్తి+ఐ= ఎక్కువ తేజంతో కూడిన ఆకారం కలవాడై; దివ్య+అస్త్ర, లాభ+అర్థంబు= దేవతలకు సంబంధించిన అస్త్రాలను పొందటానికై; అగ్రజుచేతన్= (తన కంటె ముందుపుట్టినవాడు) అన్నచేత; అనుజ్ఞాతుండు+ఐ= అనుమతి ఒసగబడినవాడై; విధి, విహిత, హోమ, సంతర్పిత, వీతిహోత్రుండును= శాస్త్రాలలోని సూత్రాలకు అనువుగా వేల్చటంచేత తృప్తిపొందించబడిన అగ్నిహోత్రుడు కలవాడున్నూ; బ్రాహ్మణ, కృత, స్వస్తి+అయనుండునున్+ఐ= విప్రులచేత చేయబడిన 'స్వస్తి' అని చెప్పబడే ఆశీస్సు కలవాడున్నూ (అంటే ప్రయాణం బాగా జరుగకలదనే ఆశీస్సులను బ్రాహ్మణులచేత పొందిన వాడై); ధౌమ్య+ఆది, మహీసురవరులను= ధౌమ్యుడు మొదలుగా గల బ్రాహ్మణశ్రేష్ఠులను; భ్రాతృవరులను= శ్రేష్ఠులైన సోదరులను; వీడ్కొని= వదలి; తపంబునకు= తపస్సు చేసికొనటానికి; అరుగ, సమకట్టిన= వెళ్ళటానికి పూనుకొని ఉండగా.

**తాత్పర్యం:** 'ప్రతిస్మృతి' విద్యా మహిమవలన అర్జునుడు అధికతేజస్వి అయి వెలుగొందాడు. దివ్యాస్త్రాలను సంపాదించటానికి అన్నగారి అనుమతి గైకొన్నాడు. బయలుదేరే ముందు అగ్నిహోత్రంలో హోమాలు వేల్చి, బ్రాహ్మణుల ఆశీస్సులు పొంది, అందరికి వీడ్కోలు చెప్పాడు. అట్లా తపస్సుకు వెళ్లబోతుండగా.

**సీ. ఆతని గాండీవహస్తు, నక్షయబాణ । తూణీరయుగళు, నుత్తుంగభుజునిఁ**
**గనకవర్మావృత ఘనతరతనుఁ జూచి । పొంగి యంతర్హితభూతములును**
**బ్రాహ్మణప్రవరులుఁ 'బార్థుని మనమునఁ । దలఁచిన యర్థంబు దడయ కిష్ట**
**సంసిద్ధి యయ్యెడు! సర్వ విఘ్నములును । శాంతిఁ బొందెడు!' మని సంతసమునఁ**

**ఆ. బలికి; రంతఁ దరుణి పాంచాలి బీభత్సు । కడకు నరుగుదెంచి కమలనేత్ర**
**యరిజయార్థ మరుగు నాతని యుత్సాహ । మెఱిఁగి యిట్టు లనియె నిందువదన. 283**

**ప్రతిపదార్థం:** ఆతనిన్= ఆ అర్జునుడిని; గాండీవహస్తున్= గాండీవం చేతిలో కలవాడిని; అక్షయ, బాణ, తూణీర, యుగళున్= తరుగని అమ్ములతో ఉన్న రెండు అమ్ముల పొదులు కలవాడిని; ఉత్తుంగ భుజునిన్= ఎత్తైన భుజాలు కలవాడిని; కనక, వర్మ+ఆవృత, ఘనతర, తనున్= బంగారు కవచంచేత చుట్టుకొనబడిన గొప్పదైన శరీరం కలవాడిని; చూచి; పొంగి= ఉత్సాహం పొంది; అంతర్హిత భూతములును= కంటికి కనిపించని ప్రాణులును; బ్రాహ్మణ ప్రవరులున్= బ్రాహ్మణ శ్రేష్ఠులును; పార్థుని, మనమునన్+తలఁచిన+అర్థంబు= అర్జునుడు మనస్సులో కోరిన కోరిక; తడయక= ఆలస్యం లేకుండ; సంసిద్ధి+అయ్యెడు= ఈడేరునుగాక!; సర్వవిఘ్నములును= అన్ని అడ్డంకులున్నూ; శాంతిన్+పొందెడున్+అని= సమసిపోవునుగాక! అని; సంతసమునన్= సంతోషంతో; పలికిరి (ఆశీర్వదించారు); అంతన్; తరుణి, పాంచాలి= మహిళామణి అయిన ద్రౌపది; కమలనేత్ర= పద్మాలవంటి కన్నులు కలది; ఇందు, వదన= చంద్రుడివంటి మొగం కలది; బీభత్సు, కడకున్= అర్జునుడి దగ్గరకు; అరుగుదెంచి= వచ్చి; అరి, జయ+అర్థము+అరుగు= శత్రువులపై విజయం సాధించటానికై వెళ్ళుతున్న; ఆతని+ఉత్సాహము+ఎఱిఁగి= అతడి ఎడదపొంగు గుర్తించి; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ ధరించి, బంగారుకవచాన్ని తాల్చి, పయనానికి సిద్ధమవుతున్న ఉన్నతభుజుడైన అర్జునుడిని చూచి బ్రాహ్మణోత్తములున్నూ, కానరాని భూతగణాలున్నూ, సంతోషంతో 'ఇతడికి ఇష్టసంసిద్ధి అగునుగాక!' అని ఆశీర్వదించగా, చంద్రవదన, కమలనేత్ర అయిన పాంచాలి, శత్రువులపై విజయం సాధించటానికై వెళుతున్న ఆతడి ఉత్సాహాన్ని గుర్తించి ఈ విధంగా పలికింది.

**విశేషం:** 'ఎడు, తల ద్రుతమున కచ్చు పరమగునపుడు మకారమగును.' పొందెడున్+అని= పొందెడుమని.

**క. 'అవమానాసహ మగు నీ। యవమక్షత్రియ కులంబునం దిం కిట పు**
**ట్టువు గాకుండెడుఁ; దత్క్షమ। మవు బ్రాహ్మణకులమునంద యయ్యెడు నాకున్. 284**

**ప్రతిపదార్థం:** అవమాన+అసహము+అగు= తిరస్కారం భరించలేని; ఈ+అవమ+క్షత్రియ, కులంబునందు= ఈ తక్కువది అయిన క్షత్రియ కులంలో; ఇంక+ఇట= ఇకమీద; పుట్టువు+కాకుండెడున్= జన్మ కలుగకుండుగాక; తద్+క్షమము+అవు= ఆ అవమానాన్ని భరించే ఓర్పుగల; బ్రాహ్మణ, కులమునందు+అ= బ్రాహ్మణ వంశంలోనే; నాకున్= నాకు; అయ్యెడున్= కలుగునుగాక!

**తాత్పర్యం:** 'అవమానం భరించలేని ఈ పాడు క్షత్రియకులంలో ఇంక నాకు జన్మ కలుగకుండుగాక! ఇకమీద అటువంటి క్షమాగుణం కల విప్రవంశంలోనే నేను పుట్టెదను గాక!

**చ. అరికృతదుష్పరాభవమహార్ణవమగ్నుల మమ్ము నందఱం**
**గరుణ సముద్ధరింపుము జగన్నుత! యన్యులు పూనఁగాని యీ**
**భరము వహింపఁ బూనిన యపారగుణోన్నతు నిన్ను దిక్కులున్**
**దరణియు సోముఁడున్ నభము ధాత్రియు గాడ్పును గాచుచుండెడున్.' 285**

**ప్రతిపదార్థం:** జగత్+నుత!= లోకంచేత పొగడబడినవాడా!; అరి, కృత, దుష్పరాభవ, మహార్ణవ, మగ్నులన్, మమ్మున్= శత్రువులచేత చేయబడిన చెడ్డ అవమాన మనే గొప్ప సముద్రంలో మునిగిపోయిన మమ్ములను; అందఱన్= అందరిని; కరుణన్= దయతో; సముద్ధరింపుము= దరిచేర్చుము; అన్యులు= ఇతరులు; పూనన్+కాని= పూనలేని; ఈ, భరము= ఈ బరువు; వహింపన్+పూనిన= భరించటానికి పూనిన; అపార, గుణ+ఉన్నతు= మితిలేని మంచిగుణాలచేత గొప్పవాడి వయిన; నిన్నున్; దిక్కులున్= దిశలును; తరణియు= సూర్యుడును; సోముఁడున్= చంద్రుడును; నభము= ఆకాశం; ధాత్రియు= భూమియు; గాడ్పును= వాయువును; కాచుచుండెడున్= కాపాడుగాత!

**తాత్పర్యం:** జగత్ప్రశంసలందుకొన్న అర్జునా! శత్రువులు చేసిన అవమానం అనే సముద్రంలో మునిగిన మమ్మ దయతో ఉద్ధరించుము. ఇతరులకు వహింప సాధ్యంకాని ఈ భారాన్ని వహించబూనుకొన్న అపరిమితమైన సద్గుణాలుగల నిన్ను- దిక్కులు, సూర్యుడు, చంద్రుడు, ఆకసం, భూమి, వాయుదేవుడు రక్షింతురు గాక!'

**విశేషం:** అలం: రూపకం.

**వ. అని దీవించి పాంచాలరాజపుత్త్రి దన స్నేహలాలస విలోలాపాంగ విలోకనంబులం బార్థుఁ బరిగృహీత పాథేయుం జేయుచుఁ దద్వియోగతరళంబైన హృదయం బెట్టకేనియు నొక్కింతసేసికొని యుండె; మఱి పార్థుండునుం బూర్వోత్తర దిశాభిముఖుండై యొక్కరుండ యరిగి యైంద్రయోగశక్తినిఖిల భూతదుర్నిరీక్ష్యుం డగుచు హిమశైల గంధమాదనంబుల నతిక్రమించి. 286**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; దీవించి= ఆశీర్వదించి; పాంచాల రాజపుత్త్రి= ద్రౌపది (పాంచాల దేశ ప్రభువు కూతురు); తన, స్నేహ, లాలస, విలోల+అపాంగ, విలోకనంబులన్= తన ప్రేమచేత ఆసక్తములై మిగుల చలించే క్రీగంటి చూపులతో;

పార్థున్= అర్జునుడిని; పరిగృహీత, పాథేయున్+చేయుచున్= తీసికొనబడిన దారిబత్తెం కలవాడినిగా చేస్తూ; తద్+వియోగ, తరళంబు+ఐన, హృదయంబు= అతడి ఎడబాటుబాధచేత చంచలమైన గుండెను; ఎట్టకేనియున్= చివరి కేదో రీతిగా; ఒక్కింత, చేసికొని= కుదుటపరచుకొని; ఉండెన్= ఉండింది; మఱి= ఆ మీద; పార్థుండునున్= అర్జునుడును; పూర్వ+ఉత్తర, దిశా+అభిముఖుండు+ఐ= తూర్పు ఉత్తర దిశలకు నడిమిదైన ఈశాన్య దిక్కుకు ఎదురుమొగం కలవాడై; ఒక్కరుండు+అ= ఒంటరిగానే; అరిగి= వెళ్ళి; ఐంద్ర, యోగ, శక్తిన్= ఇంద్ర సంబంధమైన యోగ మహిమచేత; నిఖిల, భూత, దుర్నిరీక్ష్యుండు+ అగుచున్= సకల ప్రాణికోటికి తేరి చూడరాని వాడవుతూ; హిమశైల= హిమాలయ పర్వతాన్ని; గంధమాదనంబులన్= గంధ మాదన పర్వతాన్ని; అతిక్రమించి= దాటి.

**తాత్పర్యం:** అని ఆశీర్వదించింది- ద్రౌపది. ప్రేమాసక్తిచే చలించిన ఆమె క్రీగంటి చూపులు అర్జునుడికి దారి బత్తెమయ్యాయి. ఆమె అతడి ఎడబాటు చేత చలించే ఎడదను ఎట్లో కుదుట పరుచుకొని ఉండింది. అటుపై అర్జునుడు పూర్వోత్తరదిశగా పయనమై, ఇంద్ర సంబంధి యోగ శక్తిచేత తేరి చూడరాని తేజం కలవాడై, హిమాలయ, గంధమాదన పర్వతాలను అతిక్రమించి పయనం కొనసాగించాడు.

**విశేషం:** పూర్వకాలంలో దూరప్రయాణానికి తరలేవారు దారిబత్యాన్ని తీసికొని వెళ్ళటం అవశ్యకర్తవ్యం. పాథేయ మంటే దారిలో ప్రయాణికుడు జీవించటానికి తనవెంట తీసికొని వెళ్ళే వివిధపదార్థసంచయం. ఇట దూరప్రయాణానికై తరలి వెళ్తున్నవాడు అర్జునుడు. అతడికి ఇక పాథేయ మేది? అనురాగలాలస విలోలాలైన తన క్రీగంటిచూపులనే అర్జునుడు పాథేయంగా స్వీకరించినట్లు చేసిందట ద్రౌపది! ఈ మనోహరకల్పనలోని సాహితీస్వారస్యం సహృదయహృదయైకవేద్యం.

**ఉ. వీరుఁడు యోగవిద్యయును విల్లును దోడుగ నింద్రకీలమన్**
**భూరినగంబుపైఁ గడఁగి పోవఁగఁ బోయినఁ 'బోవకుండు ము**
**గ్రారివిభేది! నీ 'వను మహామధురధ్వని వించె వానికిన్;**
**బోరన నంతరిక్షమునఁ బొల్చె నిరంతర పుష్పవృష్టియున్. 287**

**ప్రతిపదార్థం:** వీరుఁడు= వీరుడైన అర్జునుడు; యోగవిద్యయును= ప్రతిస్మృతి అనే యోగ విద్యయున్నూ; విల్లును= కోదండమున్నూ; తోడుగన్= తనకు సాయంగా; ఇంద్ర, కీలము+అన్, భూరినగంబు, పైన్= ఇంద్రకీలం అనే పేరున్న గొప్ప కొండపై; పోవఁగన్+పోయినన్= పోవటానికి పోతుండగా; ఉగ్ర+అరి, విభేది!= భయంకరులైన శత్రువులను పరిమార్చేవాడా!; నీవు; పోవకుండుము= వెళ్ళవద్దు; అను= అనే; మహా, మధుర, ధ్వని= గొప్ప తియ్యనైన శబ్దం; వానికిన్= అతడికి; వించెన్= వినిపించింది; బోరనన్= శీఘ్రంగా; అంతరిక్షమునన్= ఆకసంలో; నిరంతర, పుష్ప, వృష్టియున్= ఎడతెగని పూలవానకూడ; పొల్చెన్= వెల్లి విరిసింది.

**తాత్పర్యం:** వీరుడైన అర్జునుడు గాండీవాన్నీ, ప్రతిస్మృతి అనే యోగవిద్యనూ తనకుతోడు చేసికొని ఇంద్రకీల పర్వతంమీదికి అరుగుతున్నప్పుడు 'భయంకర శత్రువులను పరిమార్చేవాడా! ఆగుము. కదలవద్దు' అనే మధురశబ్దం వినిపించింది. వెంటనే ఆకాశంనుండి అతడిపై పూలవాన కూడ కురిసింది.

**వ. దానికి విస్మయం బంది చనువాఁడు ముందట నొక్కవృక్షమూలంబున నున్న వృద్ధబ్రాహ్మణు బ్రహ్మతేజో ఽ ధికు నవిరత యమ నియమ కృశీభూతశరీరుం గని నమస్కరించి, తత్సమీపంబున విశ్రమించియున్న నప్పార్థుం జూచి బ్రాహ్మణుం డిట్లనియె. 288**

**ప్రతిపదార్థం:** దానికిన్= దానికి (అంటే ఆగుమని వినిపించిన ధ్వనికి, పుష్పవృష్టికి); విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; చనువాఁడు= వెళ్ళుతున్నవాడు (అర్జునుడు); ముందటన్= ఎదుట; ఒక్క, వృక్ష, మూలంబునన్= ఒక చెట్టు మొదట; ఉన్న; వృద్ధ, బ్రాహ్మణున్= ముసలిబాపడిని; బ్రహ్మ, తేజస్+అధికున్= జ్ఞానతేజంచేత అధికుడైన వాడిని; అవిరళ, యమ, నియమ, కృశీభూత, శరీరున్+కని= ఎడతెగని యమం, నియమం పాటించటంచేత కృశించిన దేహం కలవాడిని చూచి; నమస్కరించి= మ్రొక్కి; తద్+సమీపంబునన్= ఆతడి చెంత; విశ్రమించి+ఉన్నన్= విశ్రాంతిగైకొంటున్న; ఆ, పార్థున్+చూచి= ఆ అర్జునుడిని చూచి; బ్రాహ్మణుండు+ఇట్లు+అనియెన్= విప్రుడు ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** అర్జునుడికి ఆశ్చర్యం కలిగింది. అతడికి ముందు ఒక చెట్టుమొదట యమ, నియమ, తపస్సుల వలన చిక్కిన శరీరం కలవాడైనప్పటికిని మహాతేజస్వి అయిన ఒక ముసలి బ్రాహ్మణుని చూచి, మ్రొక్కి, ఆయనప్రక్కన విశ్రాంతి తీసుకొంటున్న ఆ అర్జునుని చూచి, బ్రాహ్మణుడు ఈవిధంగా అన్నాడు.

**విశేషం:** పతంజలి అష్టాంగయోగంలో 'యమం', 'నియమం' మొదటి రెండు ప్రాథమిక దశలు. యయం:-(1) అహింస (2) సత్యం (3) అస్తేయం (4) బ్రహ్మచర్యం (5) అపరిగ్రహం అనేవి అంగాలు. 281వ పద్యంలోని విశేషాంశాలను అనుశీలించండి.

**క. 'ఎందుండి వచ్చి తయ్య? య । నిందితతేజుఁడవు ధర్మనియతుండవు నీ**
**కిం దుండ నేల? సిద్ధిం । బొందితి, చేకొను మభీష్టపుణ్యఫలంబుల్. 289**

**ప్రతిపదార్థం:** ఎందు+ఉండి= ఎక్కడనుండి; వచ్చితి(వి)+అయ్య!= వచ్చినావయ్యా!; అనిందిత తేజుఁడవు= నిందించబడని, (ప్రస్తుతించతగిన) తేజం కలవాడివి; ధర్మనియతుండవు= ధర్మంతో కూడిన క్రమశిక్షణ కలవాడివి; నీకు+ఇందు+ఉండన్+ఏల?= నీవు ఇక్కడ ఉండటానికి హేతు వేమి?; సిద్ధిన్+పొందితి(వి)= నీవు కృతకృత్యుడివి; అభీష్ట, పుణ్య, ఫలంబున్= మిక్కిలి ఇష్టాలైన పుణ్యఫలాలను; చేకొనుము= స్వీకరించుము.

**తాత్పర్యం:** 'ఎక్కడినుంచి నీవు ఇక్కడికి వచ్చావు? నీవు నిష్కళంక తేజస్వివి. ధర్మనియతి కలవాడివి. నీవు ఇక్కడ ఉండట మెందుకు? నీవు కృతకృత్యుడివి. నీకు ఇష్టాలైన పుణ్యఫలాలు స్వీకరించుము.

**క. ఇది శాంతతపస్వుల కా । స్పద; మిందుఁ గృపాణ కవచ బాణాసన సం**
**పద దాల్చి యుండ నేటికి? విదిత క్షత్రియకులుండవే నీ వనఘా! 290**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; ఇది= ఈ స్థలం; శాంత, తపస్వులకు= వైరాగ్యంతో తపస్సు చేసికొనే ఋషులకు; ఆస్పదము= నెలవు; ఇందున్= ఇక్కడ; కృపాణ, కవచ, బాణ+ఆసన, సంపద= కత్తి, మైతొడుగు, విల్లు వీటి సమృద్ధిని; తాల్చి+ఉండన్+ఏటికి= ఎందుకు ధరించి ఉండాలి; నీవు; విదిత, క్షత్రియకులుండవే= ప్రసిద్ధమైన క్షత్రియకులానికి చెందినవాడివా?

**తాత్పర్యం:** ఇది వైరాగ్యవంతులయిన ఋషులు తపస్సు చేసికొనే ప్రశాంతమైన స్థలం. ఇందు కత్తి, కవచం, ధనుస్సు మున్నగునవి ధరించి ఎందుకున్నావు? అనఘా! నీవు ప్రసిద్ధ క్షత్రియ కులానికి చెందినవాడివా?

**వ. వీత హర్ష క్రోధులైన బ్రాహ్మణులుండెడు పుణ్యనివాసంబున నాయుధంబులు ధరియించి యుండవలవదు; వీని విడువు' మని నిషేధించిన, నవ్విఘ్నవచనంబులకు సంచలింపక యున్న యాతని ధైర్యంబునకు మెచ్చి, సహస్రాక్షుండు నిజరూపంబుఁ జూపి యతని కిట్లనియె. 291**

**ప్రతిపదార్థం:** వీత, హర్ష, క్రోధులు+ఐన= పోయిన సంతోషం కోపం కలవారైన అంటే సంతోషకోపాలకు అతీతులైన; బ్రాహ్మణులు+ఉండెడు= విప్రులు ఉండే; పుణ్య, నివాసంబునన్= పుణ్యస్థలంలో; ఆయుధంబులు= శస్త్రాలు; ధరియించి ఉండవలవదు= తాల్చి ఉండరాదు; వీనిన్= ఈ ఆయుధాలను; విడువుము+అని= వదలిపెట్టుము అని; నిషేధించినన్= కూడదని ఆజ్ఞాపించగా; ఆ విఘ్నవచనంబులకున్= ఆ అడ్డు మాటలకు; సంచలింపక+ఉన్న= కదలక మెదలక ఉండే; ఆతని ధైర్యంబునకు= ఆతడి సాహసానికి; మెచ్చి; సహస్ర+అక్షుండు= వేయికన్నులు కల ఇంద్రుడు; నిజ, రూపంబున్= తన నిజమైన ఆకారాన్ని; చూపి; అతనికి= ఆ అర్జునుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ పుణ్యస్థలంలో సంతోషం, కోపం మున్నగు ఉద్వేగాలు లేని బ్రాహ్మణులు మాత్రమే ఉండటానికి అర్హులు. నీవు ఆయుధాలు ధరించి ఉండకూడదు. వాటిని విసర్జించుము'- అని ఆజ్ఞాపించి నప్పటికిని అర్జునుడు ఏ మాత్రం చలించకపోవటంచేత ఆతని ధైర్యానికి మెచ్చి, ఇంద్రుడు తన నిజరూపాన్ని చూపి ఇట్లా అన్నాడు.

**ఆ. 'ఇష్టమైన వరము లిచ్చెదఁ బ్రీతితో । వేఁడు' మనిన నమరవిభున కపుడు**
**గరము భక్తి మ్రొక్కి కరములు మొగిచి యి । ట్లనియెఁ బురుషవృషభుఁ డర్జునుండు. 292**

**ప్రతిపదార్థం:** ఇష్టము+ఐన, వరములు+ఇచ్చెదన్= నచ్చిన వరాలు నీకు ఇస్తాను; ప్రీతితోన్= సంతోషంతో; వేఁడుము= కోరుకొనుము; అనినన్= అని చెప్పగా; అమరవిభునకు= దేవతల రాజైన దేవేంద్రుడికి; అపుడు, కరము, భక్తిన్, మ్రొక్కి= మిక్కిలి భక్తితో నమస్కరించి; కరములు= మొగిచి= చేతులు మోడ్చి; పురుష, వృషభుఁడు= పురుషశ్రేష్ఠుడు; అర్జునుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'నీకు ఇష్టమైన వరాలు ఇస్తాను. సంతోషంతో కోరుకొనుము'- అని దేవేంద్రుడు పలుకగా, మిక్కిలి భక్తితో అతడికి నమస్కరించి అర్జునుడు ఈ విధంగా బదులు పలికాడు.

**వ. 'దేవా! నా కిష్టంబైన వరంబు భవత్ప్రసాదంబున దివ్యాస్త్రలాభంబ' యనిన 'నది యేమి గహనంబు; దానిన యిచ్చెదఁ; బుణ్యలోకంబులు దేవత్వంబును సర్వకామంబులు వేఁడు' మనిన నర్జునుం డిట్లనియె. 293**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ దేవేంద్రా!; నాకు+ఇష్టంబు+ఐన, వరంబు= నాకు నచ్చిన వరం; భవత్, ప్రసాదంబునన్= నీ దయవలన దివ్య+అస్త్ర, లాభంబు+అ= దేవతా సంబంధాలైన ఆయుధాలను సంపాదించటమే; అనినన్= అని చెప్పగా; అది, ఏమి, గహనంబు= అది ఏమి కష్టసాధ్యమైనది?; దానిన్+అ= దానినే; ఇచ్చెదన్= ఇస్తాను; పుణ్యలోకంబులు= పుణ్యంవలన పొందేలోకాలను; దేవత్వంబును= అమరత్వాన్ని; సర్వకామంబులు= అన్ని కోరికలను; వేఁడుము+అనినన్= కోరుకొనుమని చెప్పగా; అర్జునుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'దేవా! నాకు కావలసింది నీ దయవలన దివ్యాస్త్రసంపాదనం మాత్రమే' అని అర్జునుడు పలుకగా దేవేంద్రుడు 'దాని కేమి? నీవు కోరింది ఇస్తాను, అదేమి కష్టమైనది కాదు. ఇంకా నీవు పుణ్యలోకాలు, అమరత్వం, ఇష్టమైన కోరికల నన్నింటిని కోరుకొనుము' అనగా ఇంద్రుడితో అర్జునుడు ఇట్లా బదులు పలికాడు.

**సీ. 'దివిజాధినాథ! నా కవి యెల్ల నేటికిఁ? । బరమాస్త్రలాభంబ కర మభీష్టః**
**మరులు సేసిన మహాపరిభవక్లేశంబు । వాపంగ నోపక యేపుటడవి**

**నురుదుఃఖితుల సహోదరుల నందఱఁ బెట్టి । చనుదెంచి మిన్నక చనిన నన్నుఁ**

**దగువారు జగములోఁ దెగడరే?' నావుడు । సుతునకుఁ బ్రీతుఁడై శతమఖుండు**

**ఆ. గరుణ నిట్టులనియెఁ 'బరమాస్త్రలాభంబు । నీకు నిష్టమేని లోకవంద్యు**

**గరళకంఠు నీశుఁ బరముఁ బ్రసన్నుఁగా । వేగఁ జేయు మధికయోగశక్తి. 294**

**ప్రతిపదార్థం:** దివిజ+అధినాథ!= దేవతలకు అధిపతివైన ఓ దేవేంద్రా!; నాకు; అవి+ఎల్లన్= అవన్నియు; ఏటికిన్= ఎందుకు? పరమ+అస్త్ర, లాభంబు+అ= గొప్పవైన అస్త్రాలను సంపాదించటం మాత్రమే; కరము= మిక్కిలి; అభీష్టము= ఇష్టం; అరులు= శత్రువులు; చేసిన; మహా, పరిభవ, క్లేశంబు= గొప్ప అవమానబాధ; పాపంగన్+ఓపక= తొలగింపజాలక; ఏపు+అడవిన్= దట్టమైన అడవిలో; ఉరు, దుఃఖితులన్= మిక్కుటమైన దుఃఖాన్ని అనుభవించే వారిని; సహోదరులన్= అన్నదమ్ములను; అందఱన్+పెట్టి= అందరిని ఉంచి; చనుదెంచి= వచ్చి; మిన్నక, చనినన్= ఊరకే వెళ్ళితే; నన్నున్; తగువారు= తగినవారు; జగములోన్= లోకంలో; తెగడరే= నిందించరా!; నావుడు= అని చెప్పగా; శతమఖుండు= నూరు యజ్ఞాలుచేసి ఇంద్రుడైనవాడు; సుతునకున్+ప్రీతుఁడు+ఐ= కొడుకుపట్ల సంతోషించినవాడై; కరుణన్= దయతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికాడు; పరమ+అస్త్రలాభంబు= గొప్ప అస్త్రాలను సంపాదించటం; నీకున్+ఇష్టము+ఏని= నీకు ఇష్టమయితే; అధిక, యోగ, శక్తిన్= మిక్కుటమైన యోగమహిమచేత; లోకవంద్యున్= లోకంచేత నమస్కరించదగిన; గరళకంఠున్= గరళం కంఠంలో కలవాడిని; ఈశున్= శివుడిని; పరమున్= అందరు దేవతలకంటె అధికుడైనవాడిని; ప్రసన్నున్+కాన్= నీపట్ల అనుగ్రహం కలవాడినిగా; వేగన్+చేయుము= శీఘ్రంగా చేసేది.

**తాత్పర్యం:** 'ఓదేవేంద్రా! నాకు ఆ పుణ్యలోకాలు, అమరత్వం మున్నగునవి ఎందుకు? నాకు కావలసింది పరమాస్త్రలాభం. శత్రువులు చేసిన పరాభవబాధచేత క్రుగ్గుతున్న అన్నదమ్ములను కారడవిలో దిగబెట్టి నేను ఊరక వెళ్ళితే తెలిసినవారు నన్ను నిందించరా?' అని అనగా- అర్జునుడి మాటలకు సంతోషించి దేవేంద్రుడు 'నీకు పరమాస్త్రలాభమే కావాలంటే లోకవంద్యుడైన పరమేశ్వరుడిని ఆరాధించుము. అతిశయించిన యోగశక్తిచేత అతడిని ప్రసన్నుడిగా చేసికొనుము.'

**వ. అట్లేని నిఖిల లోకపాల సహితుండై యీశ్వరుండు నీ యభిమతం బొనరించు' నని సహస్రలోచనుండు లోచనాగోచరుం డైన, నర్జునుండును దద్వచనంబున సమాహితచిత్తుండై హిమశైలశిఖరంబున కరిగి వివిధ కుసుమ ఫల వృక్షంబులను విమల నిర్ఝర జలంబులను గమల కుముద కల్హార కలహంస సంకుల పంకజాకరంబులను రమ్యంబైన తపోవనంబునందుఁ బరమేశ్వరు నుద్దేశించి తపంబు సేయందొడంగిన. 295**

**ప్రతిపదార్థం:** అట్లు+ఏని= అట్లయితే; నిఖిల, లోకపాల, సహితుండు+ఐ= అందరు దిక్పాలకులతో కూడినవాడై; ఈశ్వరుండు= శివుడు; నీ+అభిమతంబు= నీకోరిక; ఒనరించున్= ఈడేర్చుతాడు; అని= అనిచెప్పి; సహస్రలోచనుండు= వేయి కన్నులు కలవాడు- ఇంద్రుడు; లోచన+అగోచరుండు+ఐనన్= కన్నులకు కనిపించనివాడు కాగా (అదృశ్యుడు కాగా); అర్జునుండును; తద్+వచనంబునన్= ఆతడి మాటచేత; సమాహిత, చిత్తుండు+ఐ= ఏకాగ్రతతో కూడిన మనస్సు కలవాడై; హిమ, శైల, శిఖరంబునకు= మంచుకొండ కొనకు; అరిగి= వెళ్ళి; వివిధ, కుసుమ, ఫల, వృక్షంబులను= పెక్కు పూలు పూసే చెట్లతో, పెక్కు పండ్లు కాసే చెట్లతో; విమల, నిర్ఝర జలంబులను= నిర్మలాలైన సెలయేటి నీళ్ళతో; కమల, కుముద, కల్హార, కలహంస, సంకుల, పంకజాకరంబులను= పద్మాలు, కలువలు, ఇంచుక తెలుపు ఎరుపు కల కలువలు, ధూమ్రవర్ణాలైన కాళ్ళు,

ముక్కుకల రాజహంసలు మిక్కుటంగా ఉండేసరస్సులతో (పంకజ+ఆకరంబు= పద్మాలకు స్థానం అయింది, సరస్సు); రమ్యంబు+ఐన= అందమైన; తపస్+వనంబునందున్= తపస్సు చేసికొనే అడవిలో; పరమ+ఈశ్వరున్= పరమశివుడిని; ఉద్దేశించి= ధ్యేయంగా పెట్టుకొని; తపంబు= తపస్సు; చేయన్+తొడంగినన్= చేయటానికి మొదలుపెట్టగా.

**తాత్పర్యం:** ఆ విధంగాచేస్తే సకల దిక్పాలకులతోకూడినవాడై శివుడు, నీ కోరిక ఈడేర్చుతాడు'- అని చెప్పి దేవేంద్రుడు అదృశ్యుడయ్యాడు. అర్జునుడు దేవేంద్రుడు చెప్పినట్లు ఏకాగ్రత చెందిన మనస్సు కలవాడై హిమాలయ పర్వతశిఖరాలపైకి వెళ్ళి, అక్కడ ఫలవృక్షాల మధ్య, పూలచెట్ల మధ్య, సెలయేళ్ళ మధ్య, రాజహంసలతో, కలువలతో వివిధపద్మాలతో విలసిల్లే సరస్సుల మధ్య గల తపోవనంలో పరమేశ్వరుడినిగురించి తపస్సు చేయటం మొదలు పెట్టగా-

**క. సురదుందుభి నాదంబులు । సురపాదప సంభవ ప్రసూన సుగంధో**
**త్కర వాసిత పవనము వి । స్తరిల్లె నాతనికి హృదయసమ్మద మెసఁగన్. 296**

**ప్రతిపదార్థం:** సుర, దుందుభి, నాదంబులు= దేవతలు మ్రోగించిన భేరీ రవాలు; సుర, పాదప, సంభవ, ప్రసూన, సుగంధ+ఉత్కర, వాసిత, పవనము= దేవలోకంలోని చెట్లనుండి పుట్టిన పూలయొక్క గొప్పపరిమళంతో ఒప్పుతున్న గాలి- అంటే కల్పవృక్షాలనుండి పూచిన పువ్వుల సువాసనతో నిండిన గాలి; ఆతనికి= అర్జునుడికి; హృదయ, సమ్మదము+ఎసఁగన్= గుండె సంతోషంతో నిండేటట్లు; విస్తరిల్లెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడి హృదయం సంతోషంతో నిండారేటట్లుగా దేవదుందుభులు మ్రోగాయి. కల్పవృక్షాల పువ్వుల సువాసనతో గుబులుకొనిన గాలి వ్యాపించింది.

**వ. అందు మనోవాక్కాయ కర్మ నియతుండై పరమేశ్వరుం దనచిత్తంబున నిలిపి, నిరంతర త్రిరాత్రోపవాసంబుల నొక్క మాసంబుఁ జలిపి, ద్విగుణిత త్రిరాత్రోపవాసంబుల రెండవ మాసంబుఁ జలిపి, పక్షోపవాసంబుల మూఁడవ మాసంబు సలిపి, యూర్ధ్వబాహుండై యేకపాదాంగుష్ఠాగ్రంబున నిలిచి, వాయుభోజనంబు సేయుచు నాలవ మాసంబు సలిపి, యిట్లతిఘోరతపంబు సేయుచున్న యర్జునుం జూచి యందలి ఋషులు విస్మయం బంది యీశ్వరుపాలికిం జని యిట్లనిరి. 297**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ తపోవనంలో; మనస్+వాక్+కాయ కర్మ, నియతుండు+ఐ= మనస్సు, మాట, శారీరక క్రియలను క్రమశిక్షణకు లోబడేటట్లు చేసినవాడై అంటే త్రికరణశుద్ధి కలవాడై; పరమేశ్వరున్= పరమశివుడిని; తన, చిత్తంబునన్, నిలిపి= తన మనస్సులో పాదుకొల్పి; నిరంతర, త్రిరాత్ర+ఉపవాసంబులన్= ఎడతెగకుండ మూడు రాత్రులు ఆహారాన్ని ఉజ్జగించిన స్థితిలో; ఒక్క, మాసంబున్+చలిపి= ఒక్క నెల గడిపి; ద్విగుణిత, త్రి, రాత్ర+ఉపవాసంబుల= రెట్టింపు చేయబడిన మూడు (ఆరు) రాత్రుల నిరాహార దీక్షపూని; రెండవ, మాసంబున్; చలిపి; పక్ష+ఉపవాసంబులన్= పదైదు దినాల నిరాహారదీక్షతో; మూఁడవ, మాసంబు; చలిపి= మూడవ నెల గడిపి; ఊర్ధ్వ బాహుండు+ఐ= ఎత్తిన చేతులు కలవాడై; ఏక, పాద+అంగుష్ఠ+ అగ్రంబునన్= ఒక పాదంయొక్క బొటనవ్రేలికొసపై మాత్రమే; నిలిచి= (దేహం యొక్క బరువునంతను మోపి) నిలబడి; వాయు భోజనంబు+చేయుచు= గాలిని మాత్రమే ఆహారంగా తీసికొంటూ; నాలవ, మాసంబు, చలిపి= నాల్గవనెల గడిపి; ఇట్లు= ఈ విధంగా; అతి, ఘోర, తపంబు, చేయుచున్న= మిక్కిలి కఠినమైన తపస్సు చేస్తున్న; అర్జునున్+చూచి= అర్జునుడిని చూచి; అందలి= ఆ తపోవనంలోని; ఋషులు= మునులు; విస్మయంబు+అంది= ఆశ్చర్యం పొంది; ఈశ్వరు పాలికిన్+చని= శివుడికడ కేగి; ఇట్లు= ఈ విధంగా; అనిరి= పలికారు.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ తపోవనంలో పరమేశ్వరుడిని గురించి త్రికరణ శుద్ధితో ఘోరతపస్సు చేశాడు. మొదటి నెల నిరంతర త్రిరాత్రోపవాసాలు చేశాడు. రెండవ నెల త్రిరాత్రోపవాసాలు రెట్టింపు చేశాడు. మూడవ నెల పక్షోపవాసంతో గడిపాడు. ఊర్ధ్వబాహుడై ఒక కాలి బొటనవ్రేలిపైననే నిలిచి, గాలిని మాత్రమే ఆహారంగా చేసికొని నాల్గవ నెల గడిపాడు. ఇట్లా మిక్కిలి కఠినతపస్సు చేస్తున్న అర్జునుడిని చూచి ఆ వనంలోని ఋషులు ఆశ్చర్యం పొంది పరమశివుడి దగ్గరకు వెళ్ళి ఇట్లా అన్నారు.

**ఉ. 'భూరిబలుండు పాండవుఁ డపూర్వతపం బొనరించుటం దదీ**
**యోరుతపఃప్రభావ దహనోత్థిత ధూమచయంబు లంబుదా**
**కారములై వనాంతరము గప్పె జగత్త్రయనాథ! తత్తపో**
**భారము సర్వజీవుల కపారభయావహ మద్భుతం బిలన్. 298**

**ప్రతిపదార్థం:** జగత్+త్రయ, నాథ!= మూడు లోకాలకు ప్రభువైన ఓ పరమేశ్వరా!; భూరిబలుండు= గొప్ప బలం కలవాడు; పాండవుఁడు= అర్జునుడు; అపూర్వతపంబు+ఒనరించుటన్= ఇంతకుముం దెవరున్నూ చేయని తపస్సు చేయటంచేత; ఇలన్= ఈ భూమిపై; తదీయ+ఉరు, తపః+ప్రభావ, దహన+ఉత్థిత, ధూమ, చయంబులు= ఆతడియొక్క గొప్పదైన తపంయొక్క మహిమ అనే అగ్ని నుండి పైకెగసిన పొగల సముదాయాలు; అంబుద+ఆకారములు+ఐ= మబ్బుల రూపాన్ని పొంది (అంబుద= నీటిని ఇచ్చేది, మేఘం); వన+అంతరము= అడవి మధ్య భాగాన్ని; కప్పెన్= కప్పివేశాయి; తద్+తపస్+భారము =ఆతని తపస్సుయొక్క బరువు (విశేషం); సర్వజీవులకు= అన్నిప్రాణులకు; అద్భుతంబు= అచ్చెరువు గొలిపేటటువంటిది; అపార, భయ+ఆవహము= మితిలేని భయాన్ని కలిగించేటటువంటిది.

**తాత్పర్యం:** 'మూడులోకాలకు ప్రభువైన ఓ పరమేశ్వరా! అర్జునుడు గొప్ప బలం కలవాడై, ఇంతకు ముం దెవ్వరున్నూ చేయనట్టి గొప్పతపస్సు చేస్తున్నాడు. ఆతడి తపఃప్రభావం అనే అగ్నినుండి క్రమ్మిన పొగలు దట్టమైన మబ్బులవలె అడవి నంతటినీ క్రమ్ముకొన్నాయి. ఆతడి తపోభారం సర్వప్రాణులకు అంతు లేని ఆశ్చర్యాన్ని, మితిలేని భీతిని కల్గిస్తున్నది.

**వ. ఆతని యభిమతంబుఁబ్రసాదించి తత్తపోభారంబు వారింపు' మనిన, వారల పలుకులు విని పరమేశ్వరుండు దరహసితవదనుం డగుచు, 'వాని యభిప్రాయం బే నెఱుంగుదు; నిష్టవర ప్రసాదంబున వానికి మనః ప్రియంబుఁ జేసెద; మీరు మీ యాశ్రమంబుల కరిగి సుఖంబుండుం' డని యప్పుడు. 299**

**ప్రతిపదార్థం:** ఆతని+అభిమతంబున్+ప్రసాదించి= ఆ అర్జునుడియొక్క కోరికను దయతో ఒసగి; తద్+తపస్+భారంబు= ఆ తపస్సువలన కలిగిన బరువును; వారింపుము= తొలగించుము; అనినన్= అని చెప్పగా; వారల= ఆ మునుల; పలుకులు= మాటలు; విని= ఆలకించి; పరమ+ఈశ్వరుండు= పరమశివుడు; దర, హసిత, వదనుండు+అగుచు= చిరునవ్వుతో కూడిన ముఖం కలవాడవుతూ; వాని+అభిప్రాయంబు= ఆతడి అభిప్రాయాన్ని; ఏన్= నేను; ఎఱుంగుదున్= తెలియుదును; ఇష్ట, వర, ప్రసాదంబునన్= అతడికి నచ్చిన కోరికలు ఇవ్వటం చేత; వానికి= ఆ అర్జునుడికి; మనస్+ప్రియంబున్= మనస్సుకు సంతోషాన్ని; చేసెదన్= కలిగిస్తాను; మీరు; మీ, ఆశ్రమంబులకు= మీ ఆశ్రమాలకు (ఆశ్రమమంటే తపస్సు చేసికొనటానికై ఋషులు ప్రత్యేకంగా అడవులలో ఏర్పాటు చేసికొన్న వసతి); అరిగి= వెళ్ళి; సుఖంబు+ఉండుండు+అని= సుఖంగా జీవించండి అని చెప్పి; అప్పుడు.

**తాత్పర్యం:** 'అర్జునుడి కోరికను అనుగ్రహించి అతడి తపోభారాన్ని నివారించండి' అని ఋషులు పరమశివుడిని ప్రార్థించారు. పరమేశ్వరుడు చిరునవ్వుతో కూడిన మొగం కలవాడై ఆ మునులతో 'నాకు అర్జునుడి అభిప్రాయం తెలుసు. ఆతడు కోరిన వరాలు ఇచ్చి ఆతడికి సంతోషం కలిగిస్తాను. మీరు మీమీ ఆశ్రమాలకు వెళ్ళి సుఖంగా ఉండండి' అని చెప్పి, అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** సనాతన సంస్కృతిలో మానవజీవితం 1. బ్రహ్మచర్యం 2. గార్హస్థ్యం 3. వానప్రస్థం 4. సన్న్యాసం- అని నాలుగు ఆశ్రమాలుగా విభజించబడింది. గృహం కూడా వాచ్యార్థంలో ఆశ్రమమే. రూఢ్యర్థంలో ఆశ్రమం అంటే వ్రతదీక్ష, నియమ పరిపాలన, పవిత్రత మున్నగు భావాలను సంతరించుకొనటంచేత మునులు అడవిలో ప్రత్యేకంగా నిర్మించుకొన్న ఆవాసాలకు (ఆశ్రమం) పదమైనది.

### ఈశ్వరుఁడు కిరాతవేషంబున నర్జునునొద్ద వచ్చుట (సం. 3-40-2)

**సీ.** **కాంచనవర్ణాపఘనుఁడై మహోన్నత। కార్ముకహస్తుఁడై కాలకంఠుఁ**
**డెఱుకురాజయ్యెఁ; నద్రీంద్రతనూజయు। వనచరీభావంబు వఱలఁ దాల్చెఁ;**
**గుఱుచచేతులు మిడిగ్రుడ్లును గడుకొన్న। తఱటులు మఱి చెంచుఁదలలు నమర**
**దడవిండ్లు చేపట్టి తడయక యెఱుకులై। యార్చుచు భూతమ్ము లాత్మ సతుల**

**ఆ.** **నెఱుకుసతులఁ గావించి యయ్యెఱుకు రాజు। ముందటం బక్కియల నొక్క మొగిన నిలిచి;**
**రంత వేఁటనెపంబున నంధకారి। గదలెఁ దద్వన మెల్లఁ గ్రక్కదలుచుండ.** **300**

**ప్రతిపదార్థం:** కాంచన వర్ణ+అపఘనుఁడు+ఐ= బంగారురంగుతో కూడిన దేహం కలవాడై; మహా+ఉన్నత, కార్ముక, హస్తుఁడు +ఐ= మిక్కిలి ఎత్తైన విల్లు చేబూనినవాడై; కాలకంఠుఁడు= నల్లని కంఠం కల శివుడు; ఎఱుకు, రాజు+అయ్యెన్= కిరాత ప్రభువు అయ్యాడు; అద్రి+ఇంద్ర, తనూజయు= పార్వతియు (గొప్ప కొండ అయిన హిమవంతుడి కూతురు); వనచరీభావంబు= అడవిలో ఉండే స్త్రీ భావాన్ని అంటే ఆటవిక స్త్రీ భూమికను; వఱలన్= ఒప్పేటట్లుగా; తాల్చెన్= ధరించింది; కుఱుచ చేతులు= పొట్టిచేతులు; మిడిగ్రుడ్లను= ఉబ్బెత్తుగా కానవచ్చే కనుపాపలు; కడుకొన్న తఱటులు= అతిశయించిన మొరకుదనాలు; చెంచు+తలలున్+అమరన్= అడవులలో నివసించే చెంచువారి కుండే శిరస్సులు ఏర్పడగా; తడ, విండ్లు, చేపట్టి= 'తడ' అనే చెట్టుకర్రతో తయారైన విండ్లు చేత పట్టుకొని; తడయక= ఎడచేయక; ఎఱుకులు+ఐ= కిరాతులై; ఆర్చుచు= రొదచేస్తూ; భూతమ్ములు= శివుడి అనుచరవర్గమైన భూతగణాలు; ఆత్మ సతులన్= తమ భార్యలను; ఎఱుకు, సతులన్, కావించి= చెంచెతలుగా మార్చి; ఆ, ఎఱుకు, రాజు, ముందటన్= ఆ కిరాత ప్రభువు ముందు; పక్కియలన్= ఇటు అటు ఇరుప్రక్కల; ఒక్క, మొగిన్+అ, నిలిచిరి= వరుసగా నిలిచారు; అంతన్; వేఁట, నెపంబునన్= వేటాడే మిషతో; తద్, వనము+ఎల్లన్= ఆ అడవి అంతయు; క్రక్కదలుచుండన్= అధికంగా కదలుతుండగా; (కదలు+కదలు= క్రక్కదలు); అంధక+అరి= అంధకుడి శత్రువైన శివుడు; కదలెన్= బయలుదేరాడు.

**తాత్పర్యం:** ఆపాదమస్తకం బంగారుమేనిచాయతో ఒప్పారువాడై, పెద్దవిల్లు చేతబట్టినవాడై పరమశివుడు ఎఱుకల ఱేడుగా మారాడు. పార్వతీదేవి చెంచెత అయింది. భూతగణాలు అరుస్తూ కురుచ చేతులు, మిడిగ్రుడ్లు, మొరటు రూపాలతో తడ విండ్లు దాల్చి చెంచులయ్యారు; వాళ్ళ భార్యలను చెంచెతలుగా మార్చారు. ఆ పరివారం శివుడి ఎదుట, ప్రక్కల నిలిచారు. అప్పుడు ఆ అడవి అంతా అదిరేటట్లుగా శివుడు వేటకై బయలుదేరాడు.

**విశేషం:** "మఱి చెంచుఁదనము లమర" - అనే పాఠాంతరం వావిళ్ల ప్రతిలో ఉన్నది. 'తడ' అనేది అడవుల్లో ఉండే ఒకానొకచెట్టు, ఆటవికులు దీని కర్రను విండ్లు చేయటానికి ఉపయోగిస్తారు. ఇందువల్లనే దీనికి 'ధనుర్వృక్షము', 'ధన్వము'- అనే నామధేయాలు ఏర్పడ్డాయి.

**చ. అలబల మంది యందుల మృగావలియున్ విహగంబులున్ భయా**
**కులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీఁకులునైన యట్టు లై,**
**యులియక, యున్నచో నడఁగి యుండఁ, గిరాతబలంబుతోడఁ బిం**
**గలనయనుం డుమేశ్వరుఁడు గవ్వడి డాయఁగ వచ్చెఁ జెచ్చెరన్. 301**

**ప్రతిపదార్థం:** అలబలము+అంది= కలకలంపొంది; అందుల= అడవిలోని; మృగ+ఆవలియున్= జంతువుల గుంపులును; విహగంబులున్= పక్షులును; భయ+ఆకుల, గతిన్+పొంది= భీతిచేత చెదరిన స్థితి కలిగి; మూఁగలును= పెదవులు కదపలేనివి; కుంటులున్= పరుగెత్త లేనట్టివి; చీఁకులున్= గుడ్డివి; ఐన+అట్టులు+ఐ= అయినట్లుయి; ఉలియక= రొదచేయక; ఉన్నచోన్+అడఁగి, ఉండన్= ఉన్నచోటన్ అణకువతో ఉండగా; కిరాత, బలంబుతోడన్= ఆటవిక సేనతో; పింగళ, నయనుండు= అగ్నిని నేత్రంగా కలవాడైన శివుడు; చెరన్+చెరన్= వేగంగా; కవ్వడి= అర్జునుడిని (కవ, వడి అంటే జంటవడులు కలవాడు అంటే సవ్యసాచి - రెండు చేతులతో బాణప్రయోగం చేయగలవాడు); డాయఁగ, వచ్చెన్= సమీపానికి వచ్చాడు.

**తాత్పర్యం:** ఆ అడవిలోని జంతువులు, పక్షులు భయంతో ఆకులపాటు పొందినవై, మూగలుగా, కుంటులుగా, గ్రుడ్డివిగా అయిపోయినట్లు ఉన్నచోటుల్లోనే కదలక మెదలక అణగి ఉన్నాయి. ఆరీతిగా పరమేశ్వరుడు ఆటవిక సేనతో గూడి అర్జునుడిని సమీపించటానికై వేగంగా వచ్చాడు.

**విశేషం:** ఈ పద్యంలో శివుడికి పర్యాయపదంగా 'పింగళ నయనుండు' అనిన్నీ, అర్జునుడికి 'కవ్వడి' అనిన్నీ ప్రయోగించటంలోని స్వారస్యం సహృదయులు గుర్తించగలరు.

**వ. అంత నీశ్వరచోదితుండై మూకుండను దైత్యుండు సూకరంబై భీకరాకారంబున బీభత్సు వధియింప సమకట్టి పయిం బఱతెంచిన. 302**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; ఈశ్వరచోదితుండు+ఐ= శివుడిచేత ప్రేరేపించ బడినవాడై; మూకుండు+అను, దైత్యుండు= మూకుడు అనే పేరుకల రాక్షసుడు; సూకరంబు+ఐ= పంది అయి; భీకర+ఆకారంబున= భయంకరమైన రూపంతో; బీభత్సున్= అర్జునుడిని (రణరంగంలో బీభత్సం కలిగించేవాడిని); వధియింపన్= చంపటానికి; సమకట్టి= పూని; పయిన్+పఱతెంచిన= మీదికి ఉరుకుతూ రాగా.

**తాత్పర్యం:** అంత, మూకుడు అనే రాక్షసుడు ఈశ్వరుడిచేత ప్రేరేపించబడినవాడై భయంకరమైన పందిరూపం తాల్చి అర్జునుడిని చంపటానికి ఉద్యమించి అతడిపైకి పరుగెత్తుతూ రాగా.

**క. అనఘుండు దాని దవ్వులఁ। గని ఘనుఁ డయి పాండవుండు గాండీవ గుణ**
**ధ్వని సేయుచు డాసినఁ బె। ల్చన యేయఁ గడంగి నిలిచె సంరంభమునన్. 303**

**ప్రతిపదార్థం:** అనఘుండు= పాపరహితు డయిన అర్జునుడు; దానిన్= ఆ పందిని; దవ్వులన్+కని= దూరంనుండి చూచి; ఘనుఁడు+అయి= గొప్పవాడయి; పాండవుండు= పాండురాజుకొడుకైన అర్జునుడు; గాండీవ, గుణ, ధ్వని, చేయుచున్= గాండీవం అనే వింటియొక్క అల్లెత్రాటిని ధ్వనింపచేస్తూ; డాసినన్= పంది దగ్గరకు వస్తే; పెల్చన= కోపంతో; ఏయన్+కడంగి= బాణాలను ప్రయోగించటానికి ఉద్యుక్తుడై; సంరంభమునన్= ఉద్వేగంతో; నిలిచెన్= నిలిచాడు.

**తాత్పర్యం:** ఆ పందిని అర్జునుడు దూరంనుండే చూచి గాండీవంయొక్క అల్లెత్రాటిని మ్రోగిస్తూ, ఆ పంది తన సమీపానికి వస్తే బాణప్రయోగం చేయటానికి సంసిద్ధుడై ఉద్వేగంతో నిలబడ్డాడు.

**వ. అదియు నా క్షణంబ యేసిన యమ్మునుంబోలె నతివేగంబున నాసన్నం బయిన 'దాని నేయ కేయకు' మని యెఱుకురాజు వారించినను వాని వచనం బాదరింపక. 304**

**ప్రతిపదార్థం:** అదియున్= ఆ పందియు; ఆక్షణంబు+అ= ఆక్షణంలోనే; ఏసిన+అమ్మునున్+పోలెన్= ప్రయోగించిన బాణంవలె; అతి వేగంబునన్= మిక్కుటమైన వేగంతో; ఆసన్నంబు+అయినన్= దగ్గరకు రాగా; దానిన్= దానిని; ఏయకు+ఏయకుము= కొట్టకు, కొట్టకు; అని; ఎఱుకు రాజు= కిరాతరాజు; వారించినను= అడ్డు చెప్పినను; వాని, వచనంబు= ఆ కిరాతుడి మాట; ఆదరింపక= సరకుగొనక (లెక్కచేయక).

**తాత్పర్యం:** ఆ పంది ఆ క్షణంలోనే ప్రయోగించిన బాణంవలె మిక్కిలి వేగంగా తనను సమీపించగా ఎరుకురాజు వారిస్తున్నప్పటికీ అర్జునుడు లెక్క పెట్టకుండ

**విశేషం:** అలం: ఉపమ.

**చ. పటువిశిఖంబునం బ్రిదశపాలతనూజుఁడు పంది నేసె; ము**
**న్నట పరమేశ్వరుండును రయంబున దానిన యేసె; నిట్టు లొ**
**క్కొటఁ బడియెన్ హరార్జునుల ఘోరశరంబులు పందిపైఁ గుభృ**
**త్తటముపయిన్ వడిం బడు నుదగ్రమహాశనులట్ల మ్రోయుచున్. 305**

**ప్రతిపదార్థం:** పటు విశిఖంబునన్= తీవ్రమైన బాణంతో; త్రిదశ, పాల, తనూజుఁడు= దేవతలను పాలించే ఇంద్రుడి కొడుకు, అర్జునుడు; పందిన్+ఏసె= పందిని బాణంతో కొట్టాడు; మున్ను+అట= అంతకుముందే అట; పరమేశ్వరుండును= పరమ శివుడును; రయంబున= వేగంతో; దానిన్+అ= ఆపందినే; ఏసెన్= బాణంతో కొట్టాడు; ఇట్టులు= ఈవిధంగా; హర+అర్జునుల= శివుడియొక్క, అర్జునుడియొక్క; ఘోర, శరంబులు= మిక్కిలి భయంకరమైన బాణాలు; పందిపైన్= పందిపై; కు, భృత్= భూమిని మోసేకొండయొక్క; తటముపయిన్= పార్శ్వంపై; వడిన్= వేగంగా; పడు= పడే; ఉదగ్ర, మహా+అశనులు+అట్లు= ఘోరమైన గొప్ప పిడుగులవలె; మ్రోయుచున్= ధ్వనిచేస్తూ; ఒక్కొటన్, పడియెన్= ఒకేసారి పడ్డాయి.

**తాత్పర్యం:** ఇంద్రసుతుడు మిక్కిలి తీవ్రమైన బాణంతో పందిని కొట్టాడు. అట్లే పరమశివుడుకూడ వేగంగా పందిని బాణంతో కొట్టాడు. ఘోరమైన ఆ రెండు బాణాలున్నూ కొండగట్టుపై పడే గొప్ప పిడుగులవలె మ్రోగుతూ ఆ పందిని ఒకేసారి తాకాయి.

**విశేషం:** ఈ పద్యం చంపకమాలావృత్తం. తెలుగులో వృత్తరచనలో నన్నయమహాకవి తరువాతికవులకు ఒరవడి తీర్చిదిద్దాడు. ఇందలి అలంకారం ఉపమ.

**క. హరుశరమును నరుశరమును। సరి నిరుపక్కియలు దాఁకి జవ మఱి శరసం**
**భరమునఁ దిరిగె వరాహము। శరనిధి మథనమునఁ దిరుగు శైలమ పోలెన్. 306**

**ప్రతిపదార్థం:** వరాహము= పంది; హరు, శరమును= శివుడి బాణమున్నూ; నరు శరమును= అర్జునుడి బాణమున్నూ; సరిన్=సూటిగా; ఇరుపక్కియలు= రెండు ప్రక్కల; తాఁకి= గ్రుచ్చుకొని; జవము+అఱి= బలం (వేగం) తగ్గి; శర, సంభరమునన్= బాణం గ్రుచ్చుకొనటంచేత ఏర్పడిన భారంచేత; శరనిధి, మథనమునన్= సముద్రాన్ని మథించేటప్పుడు; తిరుగు, శైలము+అ, పోలెన్= తిరిగే కొండవలె; తిరిగెన్= గిరగిర తిరిగింది.

**తాత్పర్యం:** శివుడు ప్రయోగించిన బాణమున్నూ, అర్జునుడు వేసిన అమ్మున్నూ ఏకకాలంలో ఇరువైపుల ఆ పందిని తాకాయి. రెండు ప్రక్కల నాటుకొన్న ఆ రెండు బాణాల భారంవల్ల ఆ వరాహం శక్తి నశించి, క్షీరసాగరమథనసమయంలో తిరిగిన మందరపర్వతంవలె గిరగిర తిరిగింది.

**విశేషం:** అలం: ఉపమ. వరాహం ఉపమేయం. మందరపర్వతం ఉపమానం. ఇందలి రకారం యొక్క ఆవృత్తి వరాహం గిరగిర తిరిగినతీరును కన్నుల గట్టినట్లు చూపుతోంది.

**వ. ఇట్లిద్దఱచేత శరవిద్ధుండై మూకదైత్యుండు సూకరరూపంబు విడిచి నిజరూపంబుతోడ నదృశ్యుండయ్యెఁనంత నర్జునుండు విస్మితుండై ముందట నత్యున్నతచాపధరు మేరుశిఖరాకారు నపార కిరాత పదాతి సమేతు నభినవ యౌవనవనచరీసహస్ర పరివృతు నొక్కపురుషుం గని 'నీ వెవ్వండవు? మనుష్యగోచరంబు గాని యివ్వనంబునఁ బ్రియవనితానుగతుండ వయి యేల క్రుమ్మరియెదు? మఱి నా యేసిన మృగంబు నేసి మృగయాధర్మవిరోధం బేల చేసితి? నిన్ను నిప్పుడ నా నిశితబాణజాలంబుల పాలు సేసెద' ననిన నగుచు నాతనికి నయ్యేఱుకురా జిట్లనియె. 307**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఇద్దఱచేత= ఇరువురిచేత (అంటే శివుడిచేత, అర్జునుడి చేత); శర విద్ధుండు+ఐ= బాణాలచేత కొట్టబడిన వాడై; మూక దైత్యుండు= మూకుడు అనే రాక్షసుడు; సూకర రూపంబు, విడిచి= పంది ఆకృతిని విడిచి; నిజ, రూపంబు తోడన్= తన అసలు ఆకారంతో; అదృశ్యుండు+అయ్యెన్= మాయమయ్యాడు; అంతన్; అర్జునుండు; విస్మితుండు+ఐ= అచ్చెరువు పొందిన వాడై; ముందటన్= ఎదుట; అతి+ఉన్నత, చాపధరున్= మిక్కిలి ఎత్తైన విల్లు ధరించిన వాడిని; మేరు, శిఖర+ఆకారున్= మేరు పర్వత శిఖరం వంటి రూపం కలవాడిని; అపార, కిరాత, పదాతి, సమేతున్= మితిలేనట్టి ఆటవిక భటులతో కూడినవాడిని; అభినవ, యౌవన, వనచరీ, సహస్ర, పరివృతున్= వేలకొలది ఆటవిక లైన లేజవరాండ్రచేత చుట్టుకొనబడి ఉన్నవాడిని; ఒక్క, పురుషున్, కని= ఒక మగవాడిని చూచి; నీవు+ఎవ్వండవు= నీవు ఎవడివి?; మనుష్య, గోచరంబు, కాని= మనుషులు కనిపించని (మనుషులు రాలేని), ఈ+వనంబునన్= ఈ అడవిలో; ప్రియ, వనితా+అనుగతుండవు+అయి= ప్రియమైన ఆడవారిచే అనుసరించబడినవాడివై; ఏల= ఎందుకు; క్రుమ్మరియెదు= తిరుగాడుతున్నావు; మఱి; అంతేకాక; నా+ఏసిన= నేను బాణంతో కొట్టిన; మృగంబున్+ఏసి= జంతువును బాణంతో కొట్టి; మృగయా, ధర్మ, విరోధంబు= వేటలోని సంప్రదాయానికి వ్యతిరేకం; ఏల+చేసితి= ఎందుకు చేశావు; నిన్నున్= నిన్ను; ఇప్పుడు+అ= ఈ సమయంలోనే; నా, నిశిత, బాణ, జాలంబుల= నావాడి అయిన అమ్ముల సముదాయాల; పాలు+చేసెదన్= బారిని పడేటట్లు చేస్తాను; అనినన్= అని పలుకగా; నగుచున్= నవ్వుతూ; ఆతనికిన్= ఆ అర్జునుడికి; ఆ+ఎఱుకు, రాజు= ఆ ఆటవికుల ప్రభువు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ఇరువురి బాణాలు గుచ్చుకోగా, మూకుడనేరాక్షసుడు పంది ఆకారాన్ని విడిచి నిజరూపం ధరించి మాయమయ్యాడు. అర్జునుడు ఆశ్చర్యపోయాడు. అంత అర్జునుడి ఎదుట పెద్దవిల్లు చేతపూనిన ఎరుకురాజు వచ్చి నిలబడ్డాడు. అతడిచుట్టూ ఆటవిక స్త్రీలు. లేజవరాండ్రు వేలకొలది నిలిచి ఉన్నారు. అతడు మేరుశిఖరం వలె మితిలేని ఆటవిక భటులమధ్య గంభీరంగా నిలిచాడు. అర్జునుడు అతడితో 'నీవు ఎవడవు? మనుష్యులు కానరాని ఈ కారడవిలో ప్రేయసీబృందంతో కూడి ఎందుకు తిరుగాడుతున్నావు? నేను బాణంతో కొట్టిన జంతువునే నీవుకూడ ఎందుకు నీ బాణంతో కొట్టావు? ఇది వేటలో పాటించే ధర్మానికి వ్యతిరేకం కదా! ఇప్పుడే నిన్ను నా వాడిబాణాల పాలు చేస్తాను' అని పలికాడు. ఆ ఎరుకురాజు చిరునవ్వుతో ఇట్లా బదులు పలికాడు.

**ఆ. 'ఏను నా మృగంబు నేసితి; నది మదీ! యాస్త్ర నిహతమయ్యె; నవికలముగఁ**
**జనునె నీకు లేని శౌర్యసంపదఁ జెప్పి । కొనఁగ మదము మిగిలి గుజనునట్లు. 308**

**ప్రతిపదార్థం:** ఏనున్= నేను; ఆ+మృగంబున్+ఏసితిన్= ఆ జంతువును బాణంతో కొట్టాను; అది= ఆ పంది; మదీయ+అస్త్ర; నిహతము+అయ్యెన్= నా యొక్క మంత్రబాణంచేత చంపబడింది; అ+వికలముగన్= కలతలేకుండ; నీకు, లేని, శౌర్య, సంపదన్= నీకు లేని పరాక్రమ విభవం; మదము, మిగిలి= కొవ్వెక్కి; కు, జనున్+అట్లు= చెడ్డ మనుజుడి వలె; చెప్పికొనఁ గన్= ప్రకటించుకోవటం; చనునె= సరిపోతుందా?

**తాత్పర్యం:** 'ఆ పందిని బాణంతో కొట్టింది నేను. అది నా దెబ్బకు చనిపోయింది. నీవు మదించి, నీచుడివలె, సిగ్గులేకుండ, నీకు లేని పరాక్రమవిభవం ఉన్నట్లు చాటుకొనటం తగునా?

**క. పలుకుల నొప్పదు, బీరము । గలవేని రణంబు సేయఁ గడఁగుము, నీ దో**
**ర్బల మిప్పుడ యుడిపెద' నని । తలరక యేయుచుఁ బినాకి తాఁకెఁ గిరీటిన్. 309**

**ప్రతిపదార్థం:** పలుకులన్= మాటలలో మాత్రమే; ఒప్పదు= సరిపోదు; బీరము+కలవు+ఏని= శౌర్యం కలవాడివైతే; రణంబు+చేయన్+కడఁగుము= యుద్ధం చేయటానికి పూనుకొమ్ము; నీ, దోస్+బలము= నీ భుజశక్తి; ఇప్పుడు+అ= ఇప్పుడే; ఉడిపెదను= మాపుచేస్తాను; అని= అని పలికి; తలరక= చలించక; ఏయుచున్= బాణాలు ప్రయోగిస్తూ; పినాకి= పినాక మనే విల్లు కలవాడు (శివుడు); కిరీటిన్= అర్జునుడిని; తాఁకెన్= డీకొన్నాడు.

**తాత్పర్యం:** పరాక్రమ దర్పం చూపవలసింది మాటలతో కాదు. నీకు పౌరుషం ఉంటే యుద్ధం చేయటానికి పూనుకొమ్ము. నీ భుజ శక్తిని ఇప్పుడే మాపుచేస్తాను'- అని బాణాలు వేస్తూ పినాకపాణి అయిన పరమశివుడు అర్జునుడితో యుద్ధానికి తలపడ్డాడు.

**వ. అంత. 310**

**తాత్పర్యం:** అప్పుడు.

**చ. ప్రతిబలదర్పభంజనుఁడు పార్థుఁడు దారుణబాణవర్ష ము**
**న్నతి నతివీరుఁడై కురిసినం, బరముండు మహాంబువృష్టిఁ బ**
**ర్వతము గ్రహించునట్లు బలవంతుఁడు దాని గ్రహించి పోర న**
**క్షతతనుఁ డయ్యెఁ; వాని నతిగర్వితుఁ బార్థుఁడు సూచి యాత్మలోన్. 311**

**ప్రతిపదార్థం:** ప్రతిబల, దర్ప, భంజనుఁడు= శత్రువుల బలాన్ని, అహంకారాన్ని భంగపరచేవాడు; పార్థుఁడు= అర్జునుడు; ఉన్నతిన్= గొప్పతనంతో; అతివీరుఁడు+ఐ= వీరాధివీరుడై; దారుణ, బాణ, వర్షము= భయంకరమైన బాణాలవాన; కురిసినన్= కురియించగా; పరముండు= శివుడు; బలవంతుఁడు= బలం కలవాడు; మహా+అంబు, వృష్టిన్= గొప్పవానను (నీటి జల్లులను); పర్వతము= కొండ; గ్రహించునట్లు= స్వీకరించునట్లు; దానిన్= ఆ బాణవర్షాన్ని; గ్రహించి= స్వీకరించి; పోరన్= యుద్ధంలో; అక్షత, తనుఁడు+అయ్యెన్= మొక్కవోని దేహం కలవా డయ్యాడు; అతి, గర్వితున్= మిక్కిలి పొగరుకలవాడిని; వానిన్= ఆ ఎరుకలరేడును; పార్థుఁడు= అర్జునుడు; చూచి; ఆత్మలోన్= తన మనస్సులో.

**తాత్పర్యం:** శత్రువుల అహంకారాన్ని నిర్మూలించే అర్జునుడు బాణాల వానజల్లును ఘోరంగా కురియించాడు. కాని బలవంతుడగు పరమశివుడు, వర్షానికి చలించని కొండవలె ఆ బాణవర్షానికి, చలించక ఉండి, గాయంలేని కాయంతో నిలిచాడు. అప్పుడు ఆ పొగరుబోతు ఎరుకలరేడును చూచి అర్జునుడు తన మనస్సులో ఇట్లా యోచించాడు.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ.

**చ. 'ఇతఁడు సురేంద్రుఁడొండెఁ, బరమేశ్వరుఁడొండె, ధనేశుఁడొండెఁ గా**
**కతులబలప్రభావయుతుఁ డన్యుఁడు గాఁ, డొరుఁడైన మద్భుజా**
**వితత ధనుర్విముక్త శరవేగము పోర సహించి యిట్టు ల**
**క్షతుఁడు నమూర్ఛితుండు నయి కంపముఁ బొందక యుండ నేర్చునే. 312**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ ఎరుకలరేడు; సురేంద్రుఁడు+ఒండెన్= దేవేంద్రుడు కాని; పరమ+ఈశ్వరుఁడు+ఒండెన్= పరమ శివుడు కాని; ధన+ఈశుఁడు+ఒండెన్= ధనపతి అయిన కుబేరుడు కాని; కాక= కాకుండ; అతుల, ప్రభావ, యుతుఁడు= సాటిలేని మహిమతో కూడిన వాడు; అన్యుఁడు= మరి వేరేవాడు; కాఁడు; ఒరుఁడు+ఐన= ఇంకొకడే అయితే; మత్, భుజా+వితత, ధనుస్+విముక్త+శర, వేగము= నాదైన భుజబలంచేత విస్తృతమైన వింటినుండి విడువబడిన బాణాల వేగాన్ని; పోరన్= యుద్ధంలో; సహించి= ఓర్చి; ఇట్టులు= ఈ విధంగా; అ, క్షతుఁడున్= గాయపడనివాడు; న, మూర్ఛితుండున్+అయి= స్పృహ కోల్పోనివాడున్నూ అయి; కంపమున్+పొందక= చలించక; ఉండనేర్చునే= ఉండగలడా?

**తాత్పర్యం:** (ఎరుకలరేడును చూచి అర్జునుడు తనమనస్సులో ఇట్లా తర్కించుకొన్నాడు). 'ఇతడు దేవేంద్రుడైనా లేదా పరమ శివుడైనా లేదా కుబేరుడైనా అయ్యుండాలి. అట్లాకాక, ఇతరుడే అయితే నాభుజశక్తిచేత విస్తృతమైన వింటినుండి ప్రయోగించిన బాణాలధాటికి యుద్ధంలో గాయపడక, మూర్ఛనొందక, చలించక ఇంతసేపు ఉండగలడా?

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. నా యేసిన యపార దుర్వార నారాచంబు లవివేకియందుఁ బ్రయుక్తంబు లయిన సుభాషితంబులుంబోలె వీనియందు నిష్ఫలంబు లగుచున్నయవి. 313**

**ప్రతిపదార్థం:** నా+ఏసిన= నేను ప్రయోగించిన; అపార, దుర్వార, నారాచంబులు= లెక్కకు మిక్కిలి అయినట్టివిన్నీ, వారించటానికి సాధ్యం కానట్టివిన్నీ అయిన బాణాలు; అవివేకి యందున్= వివేకంలేనివాడిపట్ల, అంటే విచక్షణశక్తిలేనివాడిపట్ల; ప్రయుక్తంబులు+అయిన= ప్రయోగించబడిన; సుభాషితంబులున్+పోలె= సూక్తుల వలె; వీనియందు= ఈ ఎరుకురాజుపట్ల; నిష్ఫలంబులు= ప్రయోజనం లేనివి; అగుచున్న+అవి= అవుతున్నాయి.

**తాత్పర్యం:** నేను ప్రయోగించిన బాణాలు అసంఖ్యాకాలు. ఎవ్వరూ ఎదుర్కొనలేనివి. కాని, ఇవి మూర్ఖుడి పట్ల ప్రయోగించబడిన సూక్తుల వలె ప్రయోజనం లేని వవుతున్నాయే!

**విశేషం:** సుభాషితం అంటే చక్కగా చిక్కగా చెప్పబడిన వాక్యం. 'అల్పాక్షరముల అనల్పార్థరచన' సుభాషితశైలి. లోకానుభవం సుభాషితానికి జీవనాడి. సంస్కృత వాఙ్మయం సుభాషితరచనకు పేరుకెక్కింది. అన్ని భాషలలో గల సామెతలు సుభాషితాలే. సామెతలే కాక, మహానుభావులు, జ్ఞాన వయోవృద్ధులు, తమ అనుభూతిని సూత్రప్రాయంగా మరువలేని మాటలలో మట్టసంగా కుదించి మదించి సుభాషితాలలో అందించగలరు. కావున సంక్షిప్తత సుభాషితానికి అంతరాత్మ అని చెప్పవచ్చును. ఎంతటి సుభాషితమైనా మూర్ఖుడి పట్ల బూడిదలో పోసిన పన్నీరువలె వ్యర్థమవుతుంది. అంటే సుభాషితవక్త ఎంతటి ప్రతిభావంతుడో శ్రోత సయితం అంతటి మేధావి అయి ఉండాలి- అని ఈ పద్యం నొక్కి వక్కాణిస్తున్నది. అలంకారం: ఉపమ.

**ఆ. ఎఱుకు నన్ను నుఱక యేసిన శరములు । నెఱఁకులాడి నాకు నిశితదివ్య**
**విశిఖతతులయట్లు వేదన గావించు । టిది యపూర్వ; మీతఁ డెవ్వఁ డొక్కొ! 314**

**ప్రతిపదార్థం:** ఎఱుకు= ఆటవికుడు; నన్నున్; ఉఱక= లెక్కచేయక; ఏసిన= ప్రయోగించిన; శరములు= బాణాలు; నెఱఁకులు+ఆడి= మర్మాలు భేదించి; నాకు; నిశిత, దివ్య, విశిఖ, తతుల+అట్లు= వాడి అయిన దేవతా సంబంధమైన బాణాల సముదాయాలవలె అంటే దివ్యాస్త్రాల వలె; వేదన= బాధ; కావించుట= కల్గించటం; ఇది= ఈ సంఘటన; అపూర్వము= నే నిదివరకు ఎన్నడూ అనుభవించనట్టిది; ఈతఁడు= ఈ ఎరుకు; ఎవ్వఁడు+ఒక్కొ!= ఎవడోకదా!

**తాత్పర్యం:** ఈ ఎరుకు నన్ను లెక్కచేయక నాపై ప్రయోగించిన వాడిబాణాలు నామర్మాలను భేదించాయి. ఇవి సాధారణమైనవి కావు. దివ్యాస్త్రాలను పోలి ఉన్నాయి. ఇది నాకు అపూర్వమైన (ఇది వరకు లేని) అనుభూతి. ఈ ఎరుకు ఎవడై ఉండవచ్చును?

**వ. ఇప్పర్వతంబు దైవనివాసంబుగావున నితండు కిరాత రూప ప్రచ్ఛన్నుండైన యెయ్యేని యొక్క దివ్యపురుషుండు గావలయు' నని యశనికల్పంబులైన దివ్యశరంబు లయ్యెఱుకుపయి నేసి యర్జునుం డక్షయబాణంబు లైన తన తూణీరమ్ములయం దమ్ములు గానక 'ఖాండవదహనంబునాఁ డగ్నిదేవుఁడు నా కిచ్చిన యక్షయశరధు లిప్పుడు యుగాంతకాల రిక్తంబులైన శరధులుంబోలె నున్నయవి; యిది యేమి యద్భుతంబో' యనుచు నలిగి గాండీవం బెత్తికొని యెఱుకుపయిం బఱచి. 315**

**ప్రతిపదార్థం:** ఈ+పర్వతంబు= ఈ కొండ; దైవ నివాసంబు= దేవతలు నివసించేచోటు; కావునన్= కాబట్టి; ఇతండు= ఈ ఎరుకు; కిరాత, రూప, ప్రచ్ఛన్నుండు+ఐన= ఎరుకు రూపంలో మారువేషం ధరించినవాడు అయిన; ఎయ్యేని+ఒక్క= ఎవడో ఒక; దివ్యపురుషుండు= దేవతలకు సంబంధించినవాడు; కావలయున్= అయి ఉంటాడు; అని= అని ఆలోచించి; అశని, కల్పంబులు+ఐన= పిడుగులవంటివైన; దివ్య, శరంబులు= దేవతా సంబంధాలైన బాణాలను; ఆ+ఎఱుకు, పయిన్= ఆ ఎరుకురేని మీద; ఏసినన్= వేయగా; అర్జునుండు; అక్షయ, బాణంబులు+ఐన= తరుగని అమ్ములు ఉండే; తన తూణీరమ్ములయందు= తన అమ్ముల పొదులలో; అమ్ములు కానక= బాణాలు కనిపించక; ఖాండవ, దహనంబు, నాఁడు= ఖాండవ మనే పేరున్న వనాన్ని తగుల బెట్టిన సమయంలో; అగ్నిదేవుఁడు; నాకు; ఇచ్చిన; అక్షయ, శరధులు= తరుగని అమ్ముల పొదులు; ఇప్పుడు= ఈ సమయంలో; యుగ+అంత, కాలరిక్తంబులు+ఐన= యుగాల చివర ఏర్పడే ప్రళయ సమయంలో శూన్యాలైన; శరధులున్+పోలెన్= సముద్రాల వలె; ఉన్న+అవి= ఉన్నాయి; ఇది, ఏమి+అద్భుతంబో= ఇది ఎంతటి అచ్చెరువు కొలిపే సంఘటనో; అనుచున్= అని తలుస్తూ; అలిగి= కోపగించి; గాండీవంబు+ఎత్తికొని= గాండీవ మనే వింటిని చేతితో ఎత్తిపట్టుకొని; ఎఱుకుపయిన్+పఱచి= కిరాతుడిపైకి పరుగెత్తి.

**తాత్పర్యం:** ఈ కొండపై దేవతలు నివసిస్తున్నారుకదా! ఈ ఎరుకు మారువేషంలో ఇక్కడికి వచ్చిన ఏ దివ్యపురుషుడో అయ్యుండాలి' అని తలపోసి, అర్జునుడు అతడిపై పిడుగులవంటి అస్త్రాలను ప్రయోగించాడు. ఖాండవ దహనంవేళ అగ్నిదేవుడు తనకు బహూకరించిన అక్షయతూణీరాలు, ప్రళయకాలంలో ఎండిన సముద్రాలవలె శరవిహీనాలు అయ్యాయి. 'ఇది ఏమి అద్భుతమో!' అని అర్జునుడు తలపోసి ఆగ్రహంతో తనగాండీవాన్నే ఎత్తుకొని ఆ కిరాతుడిపైకి ఉరికాడు.

**విశేషం:** ఇచట 'శరధి' శబ్దాన్ని శ్లేషార్థంలో నన్నయ మహాకవి ప్రయోగించాడు. శరం= బాణం, నీరు. అక్షయ తూణీరాలు 'శూన్యశరధులు' అయ్యాయి అంటే బాణ రహితాలయ్యాయని అర్థం. ప్రళయ కాలంలో సముద్రాలు 'శూన్య శరధులు' అవుతాయి, అంటే శరవిహీనాలు, నీరులేనట్టివి అవుతాయి- అని అర్థం. ఇచట శ్లేషానుప్రాణిత ఉపమాలంకారం ఉన్నది. అక్షయ తూణీరాలు ఉపమేయం, ప్రళయ కాల సముద్రాలు ఉపమానం, శరశూన్యాలవటం ఉభయాలకు సమానధర్మం.

**క. అపహృత గాండీవుఁడు నై । యపరిమిత క్రోధహృదయుఁ డన్నరుఁడు పరం**
**తపుఁ డెఱుకుమస్తకంబునఁ । గృపాణపాతంబుఁ జేసెఁ గిట్టి కడంకన్. 316**

**ప్రతిపదార్థం:** అపహృత గాండీవుఁడును+ఐ= అపహరించబడిన గాండీవం కలవాడై; అపరిమిత క్రోధ హృదయుఁడు= మితిలేని కోపంతో నిండిన హృదయం కలవాడు; పరంతపుఁడు= శత్రువులను బాధించేవాడు; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; కిట్టి= సమీపించి; కడంకన్= పూనికతో; ఎఱుకు, మస్తకంబునన్= కిరాతుడి శిరస్సుపై; కృపాణ, పాతంబున్+చేసెన్= కత్తి పడేటట్లు చేశాడు అంటే కత్తితో గట్టిగా కొట్టాడు.

**తాత్పర్యం:** అర్జునుడు గాండీవం ఎత్తి పట్టుకొని కిరాతుడిపైకి విజృంభించాడు కాని అతడి చేతినుండి గాండీవం అదృశ్యమైపోయింది. అప్పుడు అర్జునుడికి మితిమీరిన కోపం వచ్చి కత్తితో ఆ ఎరుకుతలపై కొట్టాడు.

**క. అదియు వృథయైనఁ బార్థుఁడు । వదలక వృక్షముల రాల వైచెను రణదు**
**ర్మదు వనచరు నవి యెల్లం । దదంగముల నడఁగె నద్భుతంబుగ నంతన్. 317**

**ప్రతిపదార్థం:** అదియు= ఆ విధంగా కత్తిని దూసి కిరాతుడి శిరస్సుపై మొత్తటం కూడా; వృథ+ఐనన్= వ్యర్థం కాగా; పార్థుఁడు= అర్జునుడు; వదలక= విడిచి పెట్టక (అంటే పోరుసల్పటం మానక); వృక్షములన్= వృక్షాలతో; రాలన్= రాళ్ళతో; రణ, దుర్మదున్= యుద్ధంలో చెడు గర్వం కల; వనచరున్= ఆటవికుడిపై; వైచెను= విసిరివేశాడు; అవి+ఎల్లన్= ఆ చెట్లు, రాళ్ళు అన్నియున్నూ; అంతన్= అటుమీద; అద్భుతంబుగన్= ఆశ్చర్యకరంగా; తద్+అంగములన్= ఆ ఎరుకు అవయవాలలో; అడఁగెన్= అణగారిపోయాయి.

**తాత్పర్యం:** తాను విసరిన కత్తి వ్యర్థం కాగా, అర్జునుడు విడువక యుద్ధంలో చెడుగర్వం కల ఎరుకుపై చెట్లు; రాళ్ళు విసిరాడు. అవి కూడ ఆశ్చర్యకరంగా ఆతడి అవయవాలలో అణగారిపోయాయి.

**క. హరుఁ బెనఁగి పట్టుకొని భీ । కరబలుఁ డర్జునుఁడు ముష్టిఘాతంబుల సం**
**గర మొనరించెను; వనచర । వరు లాతని శౌర్యగౌరవముఁ బొగడి రెదన్. 318**

**ప్రతిపదార్థం:** హరున్= శివుడిని; పెనఁగి, పట్టుకొని= కలియబడి పట్టుకొని; భీకరబలుఁడు= భయంకరమైన బలం కలవాడు; అర్జునుఁడు; ముష్టి, ఘాతంబులన్= పిడికిలి పోట్లతో; సంగరము+ఒనరించెను= పోరాటం సలిపాడు; వన, చర, వరులు= ఆటవిక శ్రేష్ఠులు; ఎదన్= తమ హృదయంలో; ఆతని= ఆ అర్జునుడి; శౌర్య గౌరవమున్= పరాక్రమం యొక్క గొప్పతనాన్ని; పొగడిరి= ప్రశంసించారు.

**తాత్పర్యం:** భయంకరమైన పరాక్రమం కల ఆ అర్జునుడు శివుడితో కలియబడి పట్టుకొని పిడికిటి పోట్లతో యుద్ధం చేశాడు. అర్జునుడి ధైర్యసాహసాలను ఆ వనచరశ్రేష్ఠులు తమ హృదయంలో ప్రశంసించారు.

**క. తనదివ్యగాత్రమున న । ర్జును గాత్రనిపీడఁ జేసె శూలధరుం; డం**
**తన మూర్ఛవోయి పీడిత । తనుఁడై పార్థుండు ధరణితలమునఁ బడియెన్. 319**

**ప్రతిపదార్థం:** శూలధరుండు= త్రిశూలాన్ని ధరించినవాడు- శివుడు; తన, దివ్య గాత్రమునన్= తన దివ్యశరీరంతో; అర్జును, గాత్ర, నిపీడన్+చేసెన్= అర్జునుడియొక్క దేహానికి మిక్కిలి రాపిడి కలిగించాడు; అంతన్+అ= అంతట; పార్థుండు; పీడిత, తనుఁడు+ఐ= బాధించబడిన దేహం కలవాడై; మూర్ఛ+పోయి= స్పృహతప్పి; ధరణి, తలమునన్+పడియెన్= భూమితలంపై పడిపోయాడు.

**తాత్పర్యం:** శివుడు తన దివ్యదేహంతో అర్జునుడి శరీరానికి గట్టి రాపిడి కలిగించి నొప్పించాడు. అంతట అర్జునుడు ఆ బాధను ఓర్వలేక మూర్ఛపోయి భూమిపై పడిపోయాడు.

**వ. అంత. 320**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**చ. వరదుఁడు పార్థుశౌర్యవిభవంబున కాతని ధైర్యవృత్తికి**
**న్నరుదుగ మెచ్చి సన్నిహితుఁడయ్యెఁ; జటామకుటేందురేఖయుం**
**గరమున శూలమున్ గరళకాలగళంబు బృహద్గజాజినాం**
**బరముఁ దృతీయలోచనముఁ బన్నగహారము నొప్పుచుండఁగన్. 321**

**ప్రతిపదార్థం:** వరదుఁడు= (వరాల నిచ్చేవాడయిన) శివుడు; పార్థు= అర్జునుడియొక్క; శౌర్యవిభవంబునకున్= పరాక్రమ సంపదకు; ఆతని ధైర్యవృత్తికిన్= ఆతడి సాహస ప్రకృతికి; అరుదుగ, మెచ్చి= అసాధారణంగా సంతోషించి; జటా, మకుట+ఇందు, రేఖయున్= కిరీటంవలె దట్టంగా అల్లుకొన్న జడలుగల తలపై చంద్రవంకయున్నూ; కరమునన్= చేతిలో; శూలమున్= త్రిశూలమున్నూ; గరళ, కాల, గళంబు= విషంచేత నల్లనైన గొంతుకయున్నూ; బృహత్+గజ+అజిన+అంబరమున్= పెద్దదైన ఏనుగుతోలుబట్టయున్నూ; తృతీయ, లోచనమున్= మూడవకన్నూ; పన్నగ, హారమున్= పాముదండ; ఒప్పుచుండఁగన్= విలసిల్లుతుండగా; సన్నిహితుఁడు+అయ్యెన్= దగ్గరగా ప్రత్యక్షమయ్యాడు.

**తాత్పర్యం:** వరదుడైన శివుడు అర్జునుడి ధైర్య సాహసాలకు మెచ్చి కిరీటం వలె జడలు కట్టిన శిరస్సుపై ఉన్న చంద్రవంకతో, చేత త్రిశూలంతో, విషంచేత నల్లనయిన గొంతుకతో, పెద్ద ఏనుగుతోలుబట్టతో, మూడవ కంటితో, పాముదండతో ప్రత్యక్షమయ్యాడు.

**వ. ఇట్లు విరూపాక్షుండు నిజరూపంబుతో నర్జునునకు సన్నిహితుండై 'యర్జునా! క్షత్రియ లొరు లెవ్వరు నీయట్టి శౌర్య ధైర్యవంతు లెందును లేరు; నీ తపఃక్షాత్త్రగుణంబులకు మెచ్చితి; నీ కోర్కి సఫలంబు సేసెద; దేవాసురమానుషంబైన జగం బంతయు నీవ జయింతు; నా స్వరూపంబు సూడు' మని దివ్యదృష్టి యిచ్చినం జూచి పార్థుండు కృతార్థుండై దండప్రణామంబు సేసి. 322**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; విరూపాక్షుండు= (విరూపమైన కన్నులుకలవాడు) శివుడు (ముక్కంటి); నిజ, రూపంబుతోన్= స్వస్వరూపంతో అంటే అసలు రూపంతో; అర్జునునకు; సన్నిహితుండు+ఐ= ప్రత్యక్షమై (బాగుగా దరిజేరినవాడై); అర్జునా! క్షత్త్రియులు+ఒరులు+ఎవ్వరు= క్షత్రియులలో ఇతరు లెవ్వరున్నూ; నీ+అట్టి, శౌర్య ధైర్యవంతులు+ఎందును, లేరు= నీతో సరిపోలే శౌర్యధైర్యాలు కలవారు ఎవ్వరూ లేరు; నీ, తపస్+క్షాత్ర, గుణంబులకు= నీదైన తపస్సు, క్షాత్రగుణమైన పరాక్రమం అనే లక్షణాలకు; మెచ్చితి= సంతసించాను; నీ కోర్కి= నీవాంఛితం; సఫలంబు+చేసెదన్= నెరవేరేటట్లు చేస్తాను; దేవ+అసుర, మానుషంబు+ఐన= దేవతలకు, రాక్షసులకు, మనుజులకు సంబంధించిన; జగంబు+అంతయున్= జగత్తు అంతయు; నీవు+అ= నీవే; జయింతు= గెలువగలవు; నా, స్వరూపంబు= నా అసలైన ఆకారం; చూడుము; అని= అని చెప్పి; దివ్య, దృష్టి+ఇచ్చినన్= అతిలోకమైన చూపు ప్రసాదించగా; చూచి= చూచి; పార్థుండు= అర్జునుడు; కృతార్థుండు+ఐ= ధన్యుడై; దండప్రణామంబు+చేసి= సాగి (సాష్టాంగంగా) నమస్కరించి.

**తాత్పర్యం:** పరమశివుడు నిజరూపంతో అర్జునుడికి ప్రత్యక్షమయి 'ఓ అర్జునా! క్షత్రియులలో శౌర్య ధైర్య సాహసాలలో నీకు సాటి అయినవారు ఎవ్వరూ లేరు. నీ తపస్సు, నీ పరాక్రమం అనే లక్షణాలకు నేను సంతసించాను. నీవు కోరిన వరాలు ఇవ్వగలను. దేవతలకు, రాక్షసులకు, మనుజులకు సంబంధించిన జగాన్నంతటిని నీవు జయించగలవు. నా నిజస్వరూపం చూడుము' అని అతనికి దివ్యదృష్టి ప్రసాదించాడు. అర్జునుడు కృతార్థుడై పరమశివుడికి సాగిలి మ్రొక్కాడు.

**క. వరదు సురాసురవందితుఁ । గరుణాకరు హరుఁ బినాకకరుఁ గరిచర్మాం**
**బరు శంకరు గిరిజాసుం । దరు నిట్లని సంస్తుతించెఁ దద్దయు భక్తిన్. 323**

**ప్రతిపదార్థం:** వరదున్= కోరికలు ఈడేర్చేవాడిని; సుర+అసుర, వందితున్= దేవతలచేతను, రాక్షసులచేతను నమస్కరించబడేవాడిని; కరుణా+ఆకరున్= దయామయుడిని; హరున్= శివుడిని; పినాక, కరున్= పినాకమనే విల్లు చేతిలో కలవాడిని;

కరి, చర్మ+అంబరున్= ఏనుగుతోలు బట్టగా కలవాడిని; శంకరున్= మంగళకరుడైన శివుడిని; గిరిజా; సుందరున్= పార్వతీపతిని; (గిరిజ= కొండ కూతురు); ఇట్లు+అని= ఈ విధంగా; తద్దయు= మిక్కుటంగా; భక్తిన్= గౌరవంతో కూడిన ప్రేమతో; సంస్తుతించెన్= మిక్కిలిగా పొగడాడు.

**తాత్పర్యం:** కోరికలను ఈడేర్చేవాడున్నూ, దేవతలచేత రాక్షసులచేత నమస్కరించబడినవాడున్నూ. దయామయుడున్నూ, పినాకమనే విల్లు చేతిలో కలవాడున్నూ, మంగళకరుడున్నూ, పార్వతీపతియున్నూ అయిన పరమశివుడిని అర్జునుడు అత్యంతభక్తితో ఇట్లా ప్రస్తుతించాడు.

అర్జును(డు పరమేశ్వరుని స్తోత్రము సేయుట (సం 3-40-56)

**దండకము.**

**'శ్రీకంఠ, లోకేశ, లోకోద్భవస్థాన సంహారకారీ, పురారీ, మురారి ప్రియా, చంద్రధారీ, మహేంద్రాది బృందార కానంద సందోహ సంధాయి, పుణ్యస్వరూపా, విరూపాక్ష, దక్షాధ్వరధ్వంసకా, దేవ, నీదైన తత్త్వంబు భేదించి బుద్ధిం బ్రధానంబు గర్మంబు విజ్ఞాన మధ్యాత్మయోగంబు సర్వక్రియాకారణం బంచు నానాప్రకారంబులన్ బుద్ధిమంతుల్ విచారించుచున్ నిన్ను భావింతు రీశాన, సర్వేశ్వరా, శర్వ, సర్వజ్ఞ, సర్వాత్మకా, నిర్వికల్ప ప్రభావా, భవానీపతీ, నీవు లోకత్రయీవర్తనంబున్ మహీవాయుఖాత్మాగ్ని సోమార్కతోయంబులం జేసి కావించి సంసార చక్రక్రియా యంత్ర వాహుండవై తాదిదేవా, మహాదేవ, నిత్యంబు నత్యంత యోగస్థితిన్ నిర్మలజ్ఞాన దీప ప్రభాజాల విధ్వస్త నిస్సార సంసార మాయాంధకారుల్ జితక్రోధరాగాదిదోషుల్ యతాత్ముల్ యతీంద్రుల్ భవత్పాద పంకేరుహధ్యాన పీయూష ధారానుభూతిన్ సదా తృప్తులై నిత్యులై రవ్యయా, భవ్య, సేవ్యా, భవా, భర్గ, భట్టారకా, భార్గ వాగస్త్య కుత్సాది నానామునిస్తోత్ర దత్తావధానా, లలాటేక్షణోగ్రాగ్ని భస్మీకృతానంగ, భస్మానులిప్తాంగ, గంగాధరా, నీ ప్రసాదంబునన్ సర్వగీర్వాణ గంధర్వులున్ సిద్ధసాధ్యోరగేంద్రాసురేంద్రాదులున్ శాశ్వతైశ్వర్య సంప్రాప్తులై రీశ్వరా, విశ్వకర్తా, సురాభ్యర్చితా. నాకు నభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్యమూర్తీ! త్రిలోకైక నాథా! నమస్తే నమస్తే నమః'. 324**

**ప్రతిపదార్థం:** శ్రీకంఠ= గరళం(విషం) కంఠంలో కలవాడా!; లోక+ఈశ= లోకాలకు పరిపాలకుడా!; లోక+ఉద్భవ, స్థాన, సంహార, కారీ= లోకాలు పుట్టటం, ఉండటం, లయంకావటం చేసేవాడా!; పుర+అరీ= (మూడు) పురాలకు శత్రువైన వాడా!; మురి+అరి, ప్రియా= మురుడనే రాక్షసుడికి శత్రువైన విష్ణుదేవుడికి ఇష్టమైనవాడా!; చంద్ర, ధారీ= చంద్రుడిని ధరించినవాడా!; మహా+ఇంద్ర+ఆది= మహేంద్రుడు మొదలుగా గల; బృందారక+ఆనంద, సందోహ, సంధాయి= దేవతలకు ఆనందపరంపరను సంధించేవాడా!; పుణ్య స్వరూపా= పుణ్యమే ఆకృతిగా కలవాడా!; విరూప+అక్ష= ఎగుడుదిగుడు కన్నులు కలవాడా!; దక్ష+అధ్వర, ధ్వంసకా= దక్షుడి యజ్ఞాన్ని ధ్వంసం చేసినవాడా!; దేవ= దేవుడా!; నీదు+ఐన, తత్త్వంబు= నీదైన సత్యస్థితి; భేదించి= వింగడించి; బుద్ధిన్= ఆలోచనలో; ప్రధానంబు= మూలమైంది; కర్మంబు= కర్తవ్యం చేయటం; విజ్ఞానము= విశేషమైన ఎరుక; అధ్యాత్మయోగంబు= ఆత్మను గురించిన, ఆత్మకు అతీతమైన దానిని గురించిన సమన్వయం; సర్వ, క్రియా, కారణంబు= అన్ని పనులకు హేతువు; అంచు= అని తలపోస్తూ; నానా, ప్రకారంబులన్= అనేక విధాల; బుద్ధిమంతుల్= మేధావులు; విచారించుచున్= యోచనలు సలుపుతూ; నిన్ను, భావింతురు= నిన్ను ధ్యానం చేస్తారు; ఈశాన= శివా!; సర్వ+ఈశ్వరా= సమస్తాన్ని శాసించేవాడా!; శర్వ= ముక్కంటి!; సర్వజ్ఞ= సమస్తం తెలిసినవాడా!; సర్వ+ఆత్మకా= అన్నిటికి ఆత్మ అయినవాడా!;

నిర్వికల్పప్రభావా= మొక్కవోని మహిమ కలవాడా!; భవానీపతీ= పార్వతీభర్తా!; నీవు; లోక, త్రయీ, వర్తనంబున్= మూడులోకాల నడవడికను; మహీ, వాయు, ఖ+ఆత్మ+అగ్ని, సోమ+అర్క, తోయంబులన్+చేసి= భూమి, గాలి, ఆకాశం, ఆత్మ, నిప్పు, చంద్రుడు, సూర్యుడు, నీళ్లు వీటితో; కావించి= నిర్మించి; సంసార, చక్ర, క్రియా, యంత్ర, వాహుండవు= ప్రపంచం యొక్క చక్రాన్ని (సృష్టి ప్రవర్తనాన్ని) త్రిప్పటంకొరకు యంత్రాన్ని (కీలకాన్ని) ధరించిన వాడివి; ఐతి= అయినవాడివి; ఆది, దేవా= మొదటిదేవుడా!; మహాదేవా= గొప్పదేవుడా!; నిత్యంబున్= ఎల్లప్పుడు; అత్యంత, యోగ స్థితిన్= మిక్కుటమైన యోగంలో ఆరూఢుడవై ఉండటంచేత; నిర్మల, జ్ఞాన, దీప, ప్రభా, జాల, విధ్వస్త, నిస్సార, సంసార, మాయా+అంధకారుల్= స్వచ్ఛమైన ఎరుక అనే జ్యోతియొక్క వెలుగు వెల్లువచేత నాశం చేయబడిన సారంలేని ఐహికమాయ అనే చీకటి కలవారు అంటే స్వచ్ఛమైన జ్ఞానమనే వెలుగుచేత సారరహితమైన సంసార మాయనుండి, చీకటి నుండి వైదొలగినవారు; జిత, క్రోధ, రాగ+ఆది, దోషుల్= జయించబడిన కోపం, ప్రేమ మొదలైన దోషాలు కలవారు, అంటే కోపం, అనురక్తి మున్నగు దోషాలను జయించినవారు; యత+ఆత్ముల్= ఆత్మ నిగ్రహం కలవారు; యతి+ఇంద్రుల్= ముని శ్రేష్ఠులు; భవత్, పాద, పంకేరుహ, ధ్యాన పీయూష ధారా+అనుభూతిన్= నీయొక్క పాద పద్మాలలో నిమగ్నమైన ఆలోచన అనే అమృతం యొక్క ధారను ఎడతెగకుండ క్రోలేవారై- ఆ అనుభవంతో; సదా= ఎల్లప్పుడు; తృప్తులు+ఐ= తనివి చెందినవారై; నిత్యులు+ఐరి= ఎల్లప్పుడు మనగలిగారు; అవ్యయా= నాశరహితుడా!; భవ్యసేవ్యా= పూజింపతగినవారిచేత సేవించ బడేవాడా!; భవా!= అంతా నీవే అయి ఉండేవాడా! భర్గ= శివా!; భట్టారకా= విద్వాంసుడా!; భార్గవ+అగస్త్య, కుత్స, + ఆది, నానాముని, స్తోత్ర, దత్త+అవధానా= భార్గవుడు, అగస్త్యుడు, కుత్సుడు మొదలైన పెక్కుమునులు చేసే స్తోత్రాలలో ఏకాగ్రతతో నిమగ్నమైన మనస్సు కలవాడా!; లలాట+ఈక్షణ+ఉగ్ర+అగ్ని, భస్మీకృత+అనంగ= నుదుటికంటినుండి వెలువడిన భయంకరమైన మంటచేత బూడిదగా చేయబడిన మన్మథుడు కలవాడా! అంటే నుదుటి కంటిమంటచేత మన్మథుడిని బూడిదగా చేసినవాడా!; భస్మ+అనులిప్త+అంగ= బూడిద పూయబడిన దేహం కలవాడా!; గంగా, ధరా= గంగను ధరించినవాడా!; నీ ప్రసాదంబునన్= నీ దయవలన; సర్వ, గీర్వాణ, గంధర్వులున్= అందరు దేవతలు, గంధర్వులును; సిద్ధ, సాధ్య+(ఉరగ+ఇంద్ర=) ఉరగేంద్ర+(అసుర+ఇంద్ర= అసురేంద్ర+ఆదులున్= సిద్ధులు, సాధ్యులు, సర్పశ్రేష్ఠులు, రాక్షసశ్రేష్ఠులు మున్నగు వారును; శాశ్వత+ఐశ్వర్య, సంప్రాప్తులు+ఐరి= ఎల్లప్పుడు నెలకొని ఉండే సంపద పొందినవా రయ్యారు; ఈశ్వరా= పాలకుడా!; విశ్వకర్తా= సృష్టిని నిర్మించినవాడా!; సుర+అభ్యర్చితా= దేవతలచేత ఆరాధించబడినవాడా!; నాకున్; అభ్యర్థితంబుల్= కోరికలు; ప్రసాదింపు= అనుగ్రహించుము; కారుణ్యామూర్తీ= దయ ఆకృతి కొన్నవాడా!; త్రిలోక+ఏక, నాథా= మూడులోకాలకు ఒకే అధిపతి అయినవాడా!; నమః+తే= = నీకు నమస్కారం; నమః+తే= నీకు నమస్కారం; నమః= నమస్కారం.

**తాత్పర్యం:** 'శ్రీకంఠా! లోకాలకు పాలకుడా! సృష్టి స్థితి లయకారుడా! త్రిపురాలను ధ్వంసం చేసినవాడా! మురుడు అనే రాక్షసుడిని సంహరించిన విష్ణుదేవుడికి ప్రియమైన వాడా! చంద్రవంకను ధరించినవాడా! దేవేంద్రుడు మున్నగు దేవతలకు ఆనందాలను చేకూర్చేవాడా! పుణ్యాలు ఆకృతిగొన్న వాడా! ముక్కంటీ! దక్షుని యజ్ఞాన్ని ధ్వంసం చేసినవాడా! దేవా! మేధావులు నీదైవతత్త్వాన్ని ఆలోచించి, వింగడించి, కర్మం ప్రధానమైనదగు విజ్ఞానం, అధ్యాత్మయోగం సర్వక్రియాకారణమని అనేక విధాల విచారణలు చేస్తూ నిన్ను ధ్యానిస్తారు. సర్వేశ్వరుడవైన శర్వ! సర్వజ్ఞ! సమస్త సృష్టికి ఆత్మవంటివాడా! మొక్కవోని మహిమ కలవాడా! పార్వతీపతీ! నీవు మూడు లోకాల ప్రవర్తనాన్ని - భూమి, గాలి, ఆకాశం, ఆత్మ, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, నీళ్లు- ఈ ఎనిమిదింటితో నిర్మించి, ఈ విశ్వసంసార చక్రబంధయంత్రాన్ని ధరించి నడుపుతున్నావు. ఆది దేవుడివి నీవు. మహాదేవుడివి నీవు. నిర్మలమైన జ్ఞానప్రదీప్తి చేత సంసార మాయాంధకారాన్ని నిర్మూలించి, వైరాగ్య సంపన్నులై జితేంద్రియులైన యతీంద్రులు నీ పాదపద్మాలను ధ్యానించటం అనే అమృతాన్ని నిరంతరం క్రోలుతూ సంతృప్తులై, నిత్యులై ఉన్నారు. నాశం లేనివాడా! పూజ్యులచేత

సేవించబడే వాడా! సర్వం నీవే ఐనవాడా! భర్గా! విద్వాంసుడా! భార్గవుడు, అగస్త్యుడు, కుత్సుడు మున్నగు మహర్షులు చేసిన స్తోత్రాలను చెవియొగ్గి వినేవాడా! నుదుటి కంటిమంటచేత మన్మథుడిని బూడిద చేసినవాడా! భస్మం పూయబడిన దేహం కలవాడా! గంగను ధరించిన వాడా! నీ దయవలన గీర్వాణులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, ఉరగశ్రేష్ఠులు, రాక్షసప్రముఖులు మున్నగువారు ఎడతెగని సంపదలతో వర్ధిల్లినారు. పరిపాలకుడివైనవాడా! విశ్వకర్తా! నా కోరికలు ఈడేర్చుము. ఓ దయామయా! మూడు లోకాలను పాలించే సార్వభౌముడా! సురాభ్యర్చితుడా! నీకు నా నమస్కృతులు.'

**విశేషం:** ఇది దండకం. తెలుగులో బహుళవ్యాప్తిలో ఉన్న దండక ప్రక్రియ నన్నయనాడే ప్రాచుర్యంలో ఉండటం గమనించదగిన విశేషం. దండకంలో ఈ క్రింది లక్షణాలు అనుశీలించదగినవి. 1. దండకం 'త' గణ ప్రయుక్తం. అంటే రెండు గురువులు ఒక లఘువు త గణమవుతుంది. ఛందస్సులో దండకమంటే 'త' గణ పునరావృత్తి 2. దండకం స్తుతి ప్రధానమైనది. 3. దండకం ఇటు వచనానికి అటు పద్యానికి సాహితీసేతువు వంటిది- అని చెప్పవచ్చును.

**వ. అని యిట్లు స్తుతియించి కృతాంజలి యై కిరీటి వెండియు నిట్లనియె. 325**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా పలికి; ఇట్లు= ఈ రీతిగా; స్తుతియించి= పొగడి; కృత+అంజలి+ఐ= చేయబడిన అంజలి కలవాడై అంటే నమస్కరించిన వాడై; కిరీటి= అర్జునుడు; వెండియున్= మరల; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఈ విధంగా పరమేశ్వరుడిని ప్రస్తుతించి మళ్ళీ ఇట్లా పలికాడు.

**క. 'ఎఱుకని యెఱుఁగక నీకున్ । మఱకువ నెదిరితిని; దీని మఱువుము; నన్నుం**
**గఱకంఠా! క్షమియింపుము; । నెఱి నెవ్వరి కెఱుఁగ నగునె నీ చరితంబుల్.' 326**

**ప్రతిపదార్థం:** కఱకంఠా!= నల్లని కంఠం కల పరమశివా!; ఎఱుక+అని= కిరాతుడు అని అనుకొని; ఎఱుఁగక= తెలియక; నీకున్= నిన్ను; మఱకువన్= అజ్ఞానం చొప్పున; ఎదిరితిని= ఎదిరించి పోరాడాను; దీనిన్= దీనిని; మఱువుము= మరచిపొమ్ము; క్షమియింపుము= తప్పు సైరించుము; నీ, చరితంబుల్= నీ ప్రవర్తనలు; నెఱిన్= సంపూర్ణంగా; ఎవ్వరికి+ఎఱుఁగన్+అగునె= ఎవరికైనా తెలియటం సాధ్యమా?

**తాత్పర్యం:** 'నీవు ఎవరో ఒక ఎఱుకు వని తలపోసి, తెలియక నీతో అజ్ఞానంవలన యుద్ధం చేశాను. నా తప్పు సహించుము. ఓ నీలకంఠా! నీ ప్రవర్తనను ఎవరైనా సంపూర్ణంగా తెలిసికొనగలరా?'

**విశేషం:** "యెఱుఁగక మిమ్మున్! మఱుకువ మార్కొన్న తప్పు మఱువుఁడు; నన్నుం"- అనే పాఠాంతరం వావిళ్లప్రతిలో ఉన్నది.

**వ. అనిన యప్పార్థుం గరుణారస ప్రీతి విస్తారిత విలోకనామృతమ్మున సంతర్పితుం జేసి నగుచు నీశ్వరుండు వాని చేయి పట్టుకొని 'ధనంజయా! నీ చేసిన వ్యతిక్రమంబు క్షమియించితి; నతిమానుషంబైన నీ పరాక్రమంబునకు మెచ్చితిఁ; బూర్వజన్మంబున నీవు నరుండను దేవర్షివి; నారాయణ సఖుండవు; నరనారాయణు లనంగా మీరిద్దఱు బదరీవనంబున ననేకాయుతవర్షంబులు తపంబుఁ జేసిన మహావీర్యవంతులరు; మీ తేజంబున జగంబులు రక్షితంబు లగుచున్నయవి; యిగ్గాండీవమ్ము దొల్లియు**

**నీయదియ; దీనన చేసి శక్రాభిషేకమ్మునాఁ డసురుల జయించి; తది యిప్పు డక్షయశరధులతోడి మదీయమాయాగ్రస్తంబయ్యె నీగాండీవమ్మును నక్షయశరధులు నీ కిచ్చితిం గొను; మింక నీకిష్టంబైన వరమ్ము వేఁడు మిచ్చెద' ననిన నర్జునుం డిట్లనియె. 327**

**ప్రతిపదార్థం:** అనిన, అప్పార్థున్+ (ఆ+పార్థున్)= అని చెప్పిన ఆ అర్జునుడిని; కరుణా, రస, ప్రీతి, విస్తారిత, విలోకన+ అమృతమ్మునన్= దయ అనే ద్రవంతో తడిసిన సంతోషంతో వ్యాపించిన చూపులు అనే అమృతంతో; సంతర్పితున్+చేసి= తనివి చెందిన వాడినిగా ఒనరించి; నగుచున్= నవ్వుతూ; ఈశ్వరుండు= శివుడు; వాని, చేయి+పట్టుకొని= ఆ అర్జునుడి చేతినిపట్టుకొని; ధనంజయా!= ఓ అర్జునా!; నీ, చేసిన, వ్యతిక్రమంబు= నీవు చేసిన తప్పు; క్షమియించితిన్= మన్నించి సైరించాను; అతి, మానుషంబు+ఐన= మనుజులకు అతీతమైన; నీ, పరాక్రమంబునకున్= నీ శౌర్యానికి; మెచ్చితిన్= సగౌరవంగా సంతోషించాను; పూర్వజన్మంబునన్= పోయిన జన్మలో; నీవు; నరుండు+అను= నరుడనే పేరున్న; దేవర్షివి= (దేవ+ఋషివి) దేవతలలో మునివి; నారాయణ, సఖుండవు= నారాయణుడి చెలికాడివి; నరనారాయణులు+అనంగ= నరుడు నారాయణుడు అనే; మీరు+ఇద్దఱు= మీరిరువురు; బదరీ, వనంబునన్= బదరి అనే పేరుగల అడవిలో; అనేక+అయుత, వర్షంబులు= పెక్కు పదివేల (దీర్ఘ) సంవత్సరాలు; తపంబున్= తపస్సును; చేసిన= చేసినట్టి; మహావీర్యవంతులరు= గొప్పబలం కలవారు; మీ, తేజంబునన్= మీ ప్రభావంవలన; జగంబులు= లోకాలు; రక్షితంబులు+అగుచున్న+అవి= కాపాడబడుతున్నాయి; ఈ+గాండీవమ్ము= ఈ గాండీవ మనే పేరున్న విల్లు; తొల్లియు= లోగడకూడ; నీ+అది+అ= నీదే సుమా!; దీననచేసి= దీనివలన; శక్ర+అభిషేకమ్మునాఁడు= ఇంద్రుడు పట్టాభిషిక్తుడు అయిన దినాన; అసురుల= రాక్షసుల; జయించితి= గెలిచావు; అది; ఇప్పుడు; అక్షయ, శరధులతోడ= తరుగనట్టి అమ్ములపొదులతో; మదీయ, మాయా, గ్రస్తంబు+అయ్యె= నాయొక్క మాయచేత గ్రహింపబడింది అయింది; నీ, గాండీవమ్మునున్; అక్షయ, శరధులు; నీకు+ఇచ్చితిన్= నీకు ఇచ్చాను; కొనుము= స్వీకరించుము; ఇంక= ఇక; నీకు+ఇష్టంబు+ఐన= నీకు కావలసిన; వరంబు= కోరిక; వేఁడుము= కోరుకొనుము; అనినన్= అని శివుడు చెప్పగా; అర్జునుండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అర్జునుడిపై దయతో కూడిన చూపులనే అమృత రసం ప్రసరింపజేసి అతడిని సంతృప్తి పొందించి, పరమేశ్వరుడు అతని చేయి పట్టుకొని ఇట్లా పలికాడు: 'ఓ ధనంజయా! నీ తప్పు క్షమించాను. లోకాతీతమైన నీ పరాక్రమానికి మెచ్చాను. పూర్వజన్మంలో నీవు నరుడు అనే దేవఋషివి. నారాయణ మహర్షికి ప్రాణ మిత్రుడివి. మీరు ఇరువురు ఎన్నో వేల ఏండ్లు బదరీవనంలో తపస్సు చేసిన మహానుభావులు. మీ ప్రభావంవలన ఈ జగాలు కాపాడబడుతున్నాయి. ఈ గాండీవం పూర్వం కూడా నీదే. దేవేంద్రుడి పట్టాభిషేకసమయంలో నీవు ఈ గాండీవం చేత రాక్షసులను సంహరించావు. ఇప్పుడు నా మాయచేత నీ గాండీవాన్ని, అక్షయతూణీరాలను అదృశ్యం చేశాను. ఇవిగో వాటిని తిరిగి ఇస్తున్నాను. ఇక నీకు ఇష్టమైన వరం కోరుకో, ఇస్తాను' అని పరమశివుడు పలుకగా అర్జునుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** అర్జునుడికి 'ధనంజయుడు' అనే నామాంతరం రాజసూయయాగానికి ముందు అతడు అనేక రాజులను గెలిచి, కప్పాలు గైకొన్నప్పుడు ఏర్పడింది.

**క. 'త్ర్యంబక! నాకు నభీష్ట వ । రంబుఁ బ్రసాదించెదేని రౌద్రము దివ్యా**
**స్త్రంబనఁ బరఁగిన పాశుప । తంబుఁ బ్రసాదింపు మిందుధర! దయతోడన్. 328**

**ప్రతిపదార్థం:** త్ర్యంబక!= ఓ ముక్కంటీ!; నాకున్+అభీష్టవరంబున్= నాకు మిక్కిలి ఇష్టమైన వరాన్ని; ప్రసాదించెదు+ఏని= దయచేసి ఇవ్వటానికి పూనుతావేని; రౌద్రము= రుద్రసంబంధమైనది, భయంకరమైనది; దివ్య+అస్త్రంబు+అనన్+పరఁగిన= దేవత్వంతో కూడిన అస్త్రం అనబడిన; పాశుపతంబున్= పాశుపతాన్ని; ఇందుధర!= చంద్రుడిని ధరించినవాడా! దయతోడన్= కృపతో; ప్రసాదింపుము= అనుగ్రహించి ఇమ్ము.

**తాత్పర్యం:** 'ఓ ముక్కంటీ! ఇందుధరా! నీవు నాకు ఇష్టమైనవరం అనుగ్రహించదలిస్తే అస్త్రాలలో రౌద్రమైన దివ్యాస్త్రంగా చెప్పబడిన పాశుపతాన్ని దయతో ప్రసాదించుము.

**వ. ఇదియును బ్రహ్మ శిరంబను నస్త్రంబును యుగాంతకాలంబునందుఁ బ్రయుక్తమ్ములై జగత్సంహారమ్ము సేయు; దీనివలన నభిమంత్రితమ్ములై యనేక శత సహస్ర సంఖ్యల శూలంబులు గదలు నాశీవిషంబుల యట్టి యమ్ములు నుద్భవిల్లునని విందు; నీ కారుణ్యంబున దీనిం బడసి దైత్య దానవ యక్షరాక్షస పిశాచోరగమ్ముల జయింతు; నతివీరులైన భీష్మ ద్రోణాదులను జయింతు; సహజకుండలుండైన కర్ణుని వధియింతు' ననిన నీశ్వరుండుఁ గరుణించి విశుద్ధాత్ముండైన పార్థునకు మంత్రధ్యాన జపహోమ పూర్వకంబుగా సంధాన మోక్షణ సంహార సహితంబుగాఁ బాశుపతాస్త్రం బిచ్చి 'దీనికి నసాధ్యం బెద్దియును లే, దల్పులయందుఁబ్రయుక్తంబైన జగత్సంహారము సేయు. 329**

**ప్రతిపదార్థం:** ఇదియును= ఈ పాశుపతమును; బ్రహ్మశిరంబు+అను+అస్త్రంబును= బ్రహ్మశిరం అనే పేరుగల మంత్రబాణమూ; యుగ+అంత, కాలంబు+అందున్= ప్రళయవేళలో; ప్రయుక్తమ్ములు+ఐ= ప్రయోగించబడినవై; జగత్+సంహారమ్ము+చేయున్= జగత్తునంతటిని లయం చేస్తాయి: దీనివలనన్= ఈ పాశుపతాస్త్రంవలన; అభిమంత్రితమ్ములు + ఐ= మంత్రాలతో సంధింపబడటంచేత గొప్ప మహిమతో కూడుకొన్న; అనేక, శత, సహస్ర, సంఖ్యల= పెక్కువందలు, వేలు సంఖ్యలలో; శూలంబులు= ఈటెలు; గదలున్= గుదియలు; ఆశీవిషంబుల+అట్టి, అమ్ములున్= పాములవంటి బాణాలు; ఉద్భవిల్లున్+అని, విందు= పుట్టుతాయని విన్నాను; నీ, కారుణ్యంబునన్= నీ దయవలన; దీనిన్, పడసి= ఈ పాశుపతాస్త్రాన్ని సంపాదించి; దైత్య, దానవ, యక్ష, రాక్షస, పిశాచ+ఉరగమ్ములన్= దితిసుతులైన రాక్షసులను, దనువుసుతులైన రాక్షసులను, యక్షులను, ఇతర రాక్షసులను, పిశాచాలను, నాగులను; జయింతును= గెలువగలను; (దేవతలలో సిద్ధసాధ్యచారణాదిజాతులు ఉన్నట్లే రాక్షసులలో కూడ దైత్య, దానవ రాక్షసాదులు ఉన్నారని తెలిసికొనాలి); అతి వీరులు+ఐన= వీరాధి వీరులైన; భీష్మ, ద్రోణ+ఆదులను= భీష్ముడు, ద్రోణుడు మున్నగువారిని; జయింతున్= గెలువగలను; సహజకుండలుండు+ఐన= సహజంగా పుట్టుకతోనే చెవులకు గుండ్రని కర్ణభూషణాలు కలిగిఉన్న; కర్ణుని; వధియింతున్= చంపుతాను; అనినన్= అని అనగా; ఈశ్వరుండున్= శివుడును; కరుణించి= దయగలిగి; విశుద్ధ+ఆత్ముండు+ఐన= పరిశుద్ధమైన- అంటే నిర్మలమైన ఆత్మకల; పార్థునకున్= అర్జునుడికి; మంత్ర, ధ్యాన, జప, హోమ, పూర్వకంబుగా= మంత్రాల ఉచ్చారణ, చాంచల్యం లేని ఏకాగ్రచిత్తంతో తలచటం, ఆవృత్తిచేయటం, అగ్నివేల్చటం-ఈ విధానాలతో కూడ; సంధాన, మోక్షణ, సంహార, సహితంబుగాన్= తొడగటం, విడవటం, వెనుకకు మరలించటం సయితంగా; పాశుపత+ అస్త్రంబు+ఇచ్చి= పాశుపత మనే అస్త్రాన్ని ఇచ్చి; దీనికిన్= ఈ పాశుపతాస్త్రానికి; అసాధ్యంబు= సాధించలేనిది; ఎద్దియును, లేదు= ఏదీ లేదు; అల్పులయందున్= అలతివారిపై; ప్రయుక్తంబు+ఐన= వాడబడినట్లయితే; జగత్+సంహారము+చేయున్= ప్రపంచాన్ని అంతటిని నాశనం చేస్తుంది.

**తాత్పర్యం:** పాశుపతాస్త్రం మరియు బ్రహ్మశిరం అనే అస్త్రం ప్రళయకాలంలో ప్రయోగించబడి జగత్ సంహారం చేస్తాయి. పాశుపతంవలన లక్షల కొలది ఈటెలు, గుదియలు(గదలు), విషసర్పాలవంటి బాణాలు పుట్టుతాయని

విన్నాను. నీ దయవలన ఈ పాశుపతాస్త్రాన్ని పొంది, దైత్య దానవ యక్ష రాక్షస పిశాచ గణాలను, వీరాధివీరులైన భీష్మద్రోణాదులను జయించగలను. సహజ కవచకుండలాలతో పుట్టిన కర్ణుడిని చంపుతాను'- అని ప్రార్థించిన అర్జునుడిని కరుణించి ఈశ్వరుడు అతడికి పాశుపతాస్త్రాన్ని సమంత్రకంగా ప్రయోగ, ఉపసంహారాలు తెలిపి ఇచ్చి, 'ఈ పాశుపతాస్త్రానికి అసాధ్యమైనది ఏదీ లేదు. దీనిని అల్పులపై ప్రయోగిస్తే జగత్తును నాశనం చేస్తుంది.

**విశేషం:** మహాభారతంలో జగత్సంహారశక్తి గల అస్త్రాలను గురించిన ప్రస్తావన పలుచోట్ల కనిపిస్తున్నది. కేవలం ఇవి ఇతిహాసకర్త ఊహించి కల్పించినవా? అని అధునిక హేతువాదులు ప్రశ్న వేయవచ్చును. ఒక వేళ అవి, రచయిత కల్పించినట్టివే అయితే ఆ రచయిత భావనాబలం అత్యద్భుతం అని ప్రశంసించక తప్పదు. అది విషయాంతరం. అస్త్ర ప్రయోగ విషయంలో ప్రస్తుతప్రకరణంలో నిర్దేశించబడిన అంశాలు (1) మంత్రం (2) ధ్యానం (3) జపం (4) హోమం. ఇందులో జాగరూకతతో అధ్యయనం చేయవలసింది మరొక అంశం ఉన్నది. అస్త్రప్రయోగంలో మూడు అంచెలు ఉన్నాయి. (1) సంధానం (2) మోక్షణం(3) ఉపసంహారం, ప్రళయ సదృశమైన అస్త్రాన్ని సంధానం చేయవచ్చును. దాన్ని ప్రయోగించే కౌశలం (మోక్షణం) వేరు. సరే. సంధాన మోక్షణ కౌశలాలు అబ్బినప్పటికీ, ప్రయోగించిన దాన్ని ఉపసంహరించే శక్తి ఉండాలి. లేకుంటే దానివలన శత్రువులకే కాక, ప్రయోక్తకు, తటస్థజగత్తుకుకూడ అకాల ప్రళయం దాపురించవచ్చు. ఈ హెచ్చరిక-విజ్ఞానశాస్త్రం ఊహించలేని విజయ పరంపరలు సాధిస్తున్న ఈ యుగంవారు సుళువుగా అర్థం చేసికొనగలదిగా ఏనాడో మహాభారతకర్త నొక్కి వక్కాణించటం పేర్కొనతగింది.

ఇక మంత్రధ్యాన జపహోమాలను గురించి గ్రాంథిక జ్ఞానం మాత్రమే పలువురికి ఉన్నది. మంత్రం, జపం, హోమంగురించి కొందరికి ప్రాథమిక పరిజ్ఞానం ఉన్నది. ధ్యానం అష్టాంగాలలో ఒకటి. అష్టాంగాలు: (1) యమం (2) నియమం (3) ఆసనం (4) ప్రాణాయామం (5) ప్రత్యాహారం (6) ధారణ (7) ధ్యానం (8) సమాధి, ఇందులో ధారణా-ధ్యాన-సమాధులు మూడింటిని కలిపి సంయమం అని సమష్టివ్యపదేశం. చిత్తవృత్తిని ఏకాగ్రం చేయటం ధారణ. యోగ సాధన చేసేవారు బహువిషయవ్యగ్రులు కారాదు. వ్యావహారిక జగత్తులో క్రియాశూరులు, సమకాలీన చరిత్రను తీర్చిదిద్దినవారు తమ ధ్యేయాలకు ఏకాగ్రచిత్తంతో అంకితమైనవారే. ఆధ్యాత్మిక సాధనలో చివరిమెట్టు సిద్ధిగా పేర్కొన తగింది సమాధి. ధ్యానం- ఇటు ధారణకు అటు సమాధికి మధ్య వారధి వంటిది. ఇక ధ్యానం అంటే ఏమిటి? మానవ బుద్ధికి అతీతమైన అంశాలు ఎన్నో ఉన్నాయి. జంతువులలో మనస్సు ఉంటుంది. అది ప్రకృతి సిద్ధమైన ప్రజ్ఞ, మానవులలో బుద్ధి ఉన్నది. కాని ఈ బుద్ధి, ఆ బుద్ధికి అనువైన తర్కం ఒక పరిధి దాటి పోలేవు గదా! బుద్ధి-తర్క ప్రజ్ఞ ఎచట ఆగిపోతున్నదో అచటనుండి ఆంతరంగికమైన సమ్యక్స్ఫూర్తి ఆరంభమవుతున్నది. ఈ శక్తి ధ్యానయోగంవలన సిద్ధిస్తున్నది. ధ్యానానికి ముందు తపస్వి గొంగళి పురుగు కావచ్చును. ధ్యానాంతరం సీతాకోక చిలుకగా వెల్వడవచ్చును. ఉపమానాలు అసలు తాత్త్విక దర్శనాన్ని పరిపూర్ణంగా వివరించలేవు కాని, వర్ణనాతీతమైన అనుభూతిని దిఙ్మాత్రంగా సూచించటానికి ఉపకరించవచ్చును. మహాభారతకర్త మంత్రానుసంధానంలో ధ్యానానికి, జప హోమాలతో పాటు ప్రత్యేక ప్రాముఖ్యం కల్పించాడు. అర్థవాద రూపంగా ఎన్నో అంశాలను మహాభారతంలో రచయిత నిక్షేపించాడు. ఇవి భావిపరిశోధకులు తేల్చవలసిన అంశాలు.

**క. దీని విధానం బెఱుఁగం । గా నింద్రకుబేర వరుణ కాలాదులకుం**
**దా నతి గహనం బనినను । మానవులకు నెఱుఁగు టఘటమానము గాదే. 330**

**ప్రతిపదార్థం:** దీని విధానంబు= ఈ పాశుపతాస్త్రంయొక్క క్రమ పద్ధతి; ఎఱుఁగంగాన్= తెలియటానికి; ఇంద్ర, కుబేర, వరుణ, కాల+ఆదులకున్= ఇంద్రుడు, కుబేరుడు, వరుణుడు, యముడు మున్నగువారికి; తాన్= అది; అతి, గహనంబు+అనినను= మిక్కిలి క్లిష్టమైనది అనినప్పుడు; మానవులకున్= మనుజులకు; ఎఱుఁగుట= తెలిసికొనటం; న+ఘటమానము, కాదే= అసాధ్యం కాదా?

**తాత్పర్యం:** ఈ పాశుపతాస్త్ర పరిజ్ఞానం, ఇంద్రుడు, కుబేరుడు, వరుణుడు, యముడు మున్నగు వారికే తెలియదు అనినప్పుడు ఇంక మానవమాత్రులు తెలిసికొనటం అసంభవం కదా!

**వ. ఈ దివ్యబాణమ్మున నీ వఖిలలోకమ్ములు జయింతు' వని కౌంతేయునకు వరం బిచ్చి పురాంతకుం డంతర్హితుండయ్యె నంత. 331**

**ప్రతిపదార్థం:** ఈ, దివ్య, బాణమ్మునన్= అతిలోకశక్తిగల ఈ అస్త్రం వలన; ఈవు+అఖిలలోకమ్ములు= నీవు సమస్త భువనాలు; జయింతువు= నెగ్గగలవు; అని= అని చెప్పి; కౌంతేయునకు= కుంతికుమారుడైన అర్జునుడికి; వరంబు+ఇచ్చి= వరాన్ని ఇచ్చి; పుర+అంతకుండు= పురాలను నాశనం చేసిన శివుడు; అంతర్హితుండు+అయ్యెన్= మాయమయ్యాడు; అంత= తర్వాత.

**తాత్పర్యం:** 'ఈ దివ్యాస్త్రం వలన నీవు సమస్త భువనాలు జయిస్తా' వని అర్జునుడికి వరాన్ని ఇచ్చి శివుడు మాయమైన తర్వాత.

**చ. అవిరళ సూర్యమండల సహస్ర సమప్రభమై, ధనంజయ**
**ప్రవరు కరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁ జూచి దైత్యదా**
**నవ సుర యక్ష రాక్షస గణమ్ము గరమ్ము భయమ్ముఁ బొందె; నం**
**దవనియు దిర్దిరం దిరిగె నబ్ధిశిలోచ్చయసంచయంబుతోన్. 332**

**ప్రతిపదార్థం:** అవిరళ, సూర్య, మండల, సహస్ర, సమ, ప్రభము+ఐ= దట్టమైన సూర్య బింబాలు వేయింటితో సమానమైన వెలుగుకలదై; ధనంజయ ప్రవరు, కరమ్మునన్, వెలుఁగు= శ్రేష్ఠుడైన అర్జునుడి చేతిలో మెరసే; పాశుపత+అస్త్రమున్, చూచి= పాశుపతమనే దివ్యబాణాన్ని చూచి; దైత్య, దానవ, సుర, యక్ష, రాక్షస, గణమ్ము= దితిసుతులు, దానవులు, దేవతలు, యక్షులు, రాక్షసుల సమూహాలు; కరమ్ము= మిక్కిలి; భయమ్మున్+పొందెన్= భీతిని చెందాయి; అందు= అచట; అబ్ధి, శిలా+ఉచ్చయ, సంచయంబుతోన్= సముద్రాలు, కొండల సముదాయంతో; అవనియు= భూమికూడ; దిర్దిరన్= గుండ్రంగా; తిరిగెన్= తిరిగింది.

**తాత్పర్యం:** అర్జునుడి చేతిలో వేయి సూర్యమండలాల కాంతితో వెలుగొందుతున్న పాశుపతాస్త్రాన్ని చూచి దైత్యులు, దానవులు, దేవతలు, యక్షులు, రాక్షసులు మిక్కిలి భీతి చెందారు. సముద్రాలతో కొండలతో భూమండలం దిర్దిరా తిరిగింది.

**క. త్రినయనగాత్రస్పర్శన । మున నిజగాత్రము పవిత్రమును, ముక్తాఘం**
**బును, నతితేజోవీర్యం । బును నైనఁ బృథాసుతుండు ముదితుం డగుచున్. 333**

**ప్రతిపదార్థం:** త్రినయన, గాత్ర, స్పర్శనమునన్= ముక్కంటి దేహం తాకటంచేత; నిజ, గాత్రము= తన శరీరం; పవిత్రమును= పావనమున్నూ; ముక్త+అఘంబునున్= విడిపోయిన పాపం గలదిన్నీ; అతి, తేజస్+వీర్యంబునున్= మిక్కుటమైన ప్రకాశంతో, బలంతో కూడినట్టిదిన్నీ; ఐనన్= అవటంచేత; పృథాసుతుండు= అర్జునుడు; ముదితుండు+అగుచున్= సంతోషం చెందినవాడవుతూ,

**తాత్పర్యం:** ముక్కంటి శరీరాన్ని తాకటంచేత తన శరీరం పావనమై, పాపరహితమై, మిక్కిలి ప్రకాశవంతమై, బలసంపన్న మైనందులకు అర్జునుడు మిగుల సంతోషిస్తూ-

**విశేషం:** అలం: అంత్యప్రాసం. (త్రినయన శబ్దసాధుత్వాన్ని గురించి పీఠికలో వివరణ చూడండి - సంపా.)

**క. మంటి, హరుదేహ మంటం । గంటి; నుమాధీశు నమరకంటకహరు ము**
**క్కంటిఁ గళకంఠుఁ జూడం । గంటిఁ; గృతార్థుండ నైతిఁ గడుఁ బుణ్యమునన్. 334**

**ప్రతిపదార్థం:** మంటి= (సార్థకమైన జీవితం కలవాడినిగా) బ్రతికాను; హరుదేహము= శివుడి శరీరాన్ని; అంటన్+కంటిన్= ముట్టుకొనగలిగాను; ఉమా+అధీశున్= పార్వతీపతిని; అమర, కంటక, హరున్= దేవతలకు ముళ్ళవంటి వారిని సంహరించేవాడిని; ముక్కంటిన్= మూడు కనుల దేవరను; కళకంఠున్= నల్లని కంఠం కల శివుడిని; చూడన్+కంటిన్= చూడకలిగాను; కడున్, పుణ్యమునన్= గొప్ప పుణ్యంచేత; కృత+అర్థుండను+ఐతి= ధన్యుడి నయ్యాను.

**తాత్పర్యం:** సార్థకజీవినై బ్రతికాను. పరమశివుడి దేహాన్ని ముట్టుకొనగలిగాను. దేవతలను వేధించే రాక్షసులను సంహరించే ముక్కంటిని, కళకంఠుడిని, ఉమాపతిని చూడగలిగాను. మిక్కుటమైన పుణ్యంవలన చరితార్థుడిని అయ్యాను.

**విశేషం:** అలం: అంత్యానుప్రాసం, వృత్త్యనుప్రాసం. 'అసురకంటకు హరు' - అనే పాఠాంతరం ఆనందాశ్రమ గ్రంథమాల ప్రతిలో ఉన్నది.

**క. ఇమ్ముల ధర్మజునకు జన । సమ్మతునకు రిపుజయంబు సకల మహీ రా**
**జ్యమ్ము సమకూరె నేఁడు ఘ । నమ్ముగ సర్వప్రయోజనమ్ములతోడన్. 335**

**ప్రతిపదార్థం:** ఇమ్ములు= సంప్రీతిగా; ధర్మజునకున్= ధర్మరాజుకు; జన, సమ్మతునకున్= జనులచేత అంగీకరింపబడేవాడికి; రిపు, జయంబు= శత్రువులపై గెలుపు; సకల, మహీ, రాజ్యమ్ము= సమస్తమైన భూమి ఏలుబడి; నేఁడు= ఇప్పుడు (ఈవేళ); సర్వ, ప్రయోజనమ్ములతోడన్= అన్ని లాభాలతో; ఘనమ్ముగన్= గొప్పగా; సమకూరెన్= ఏర్పడింది.

**తాత్పర్యం:** ఈ వేళ ధర్మపుత్రుడికి, ప్రజానురంజకుడైనవాడికి, శత్రువులపై గెలుపు లభించింది. సర్వలాభాలతో ఘనంగా భూమండలరాజ్యం సంప్రాప్తించింది.

ఇంద్రుఁడు దేవగణంబులతో నర్జుననకుఁ బ్రత్యక్షం బగుట ( సం. 3-42-5)

**వ. అని సంతుష్ట హృదయుండై యున్నంత. 336**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా తలపోసి; సంతుష్ట, హృదయుండు+ఐ= తనివి చెందిన హృదయం కలవాడై అంటే సంతృప్తి చెందినవాడై; ఉన్నంతన్= ఉన్నప్పుడు.

**తాత్పర్యం:** ఆ విధంగా మనస్సులో తలపోసి, తృప్తి చెందిన హృదయం కలవాడై (అర్జునుడు) ఉన్న సమయంలో.

**సీ. హరుచేత సంప్రాప్తవరుఁడయ్యె నరుఁ డని । యెఱిఁగి యింద్రుండు ధనేశ ధర్మ**
**వరుణాశ్వినులతోడ సురగణ సహితుఁడై । దివ్యవిమానముల్ దివమునందు**
**వెలుఁగంగఁ గౌరవకులవీరు పాలికి । వరదుఁ డై గరుణతో వచ్చె; నట్టి**
**యవసరమ్మున ఘనరవగభీరం బైన । మధురవాక్యమున ధర్మప్రభుండు**

**ఆ. ప్రీతి నిట్టులనియె బీభత్సునకు 'ధర్మ । నిత్య! పాండుపుత్ర! నీకు మెచ్చి**
**వరము లిచ్చు వేడ్క వచ్చిరి నెయ్యురై । యమరనాథుఁ దొట్టి యమరులెల్ల. 337**

**ప్రతిపదార్థం:** హరుచేత= శివుడిచేత; సంప్రాప్త, వరుఁడు+అయ్యె= లభించిన వరం కలవాడయ్యాడు; నరుఁడు+అని= అర్జునుడని; ఎఱిఁగి= తెలిసికొని; ఇంద్రుండు= ఇంద్రుడు; (ధన+ఈశ) ధనేశ, ధర్మ, వరుణ+ఆశ్వినులతోడ= కుబేరుడు, యముడు, వరుణుడు, ఆశ్వినులతోడ; సురగణ, సహితుఁడు+ఐ= దేవతల సమూహంతో కలిసి; దివ్య, విమానముల్= దైవశక్తి గల విమానాలు; దివమునందు= ఆకాశంలో; వెలుఁగంగన్= ప్రకాశిస్తుండగా; కౌరవ, కుల, వీరు, పాలికిన్= కురువంశంలోని శూరుడి ఒద్దకు; వరదుఁడు+ఐ= వరాలను ఇచ్చేవాడై; కరుణతో= దయతో; వచ్చెన్= అరుదెంచాడు; అట్టి+అవసరమ్మునన్= ఆ సమయంలో; ఘన, రవ, గభీరంబు+ఐన= గొప్ప (లేక మేఘ సదృశమైన) ధ్వనితో లోతైన; మధుర, వాక్యమునన్= తియ్యని పలుకులతో; ధర్మప్రభుండు= యమధర్మరాజు; బీభత్సునకు= అర్జునుడికి; ప్రీతిన్= సంతోషంతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; ధర్మనిత్య!= ఎల్లప్పుడు ధర్మాన్ని పాటించేవాడా!; పాండుపుత్ర!= పాండురాజు కుమారుడా!; అమర, నాథున్+తొట్టి= దేవేంద్రుడితో మొదలుపెట్టి; అమరులు+ఎల్లన్= దేవతాశ్రేష్ఠులందరు; నీకు; మెచ్చి= మన్నించి; వరములు+ఇచ్చు, వేడ్క= కోరిన కోరికలు ఇచ్చే సంబరంతో; నెయ్యురు+ఐ= మిత్రులై; వచ్చిరి.

**తాత్పర్యం:** అర్జునుడు పరమశివుడిచే వరాలు సంపాదించినట్లు తెలిసికొని ఇంద్రుడు- కుబేరుడు, యముడు, వరుణుడు, ఆశ్వినులతో, దేవతల సమూహాలతో కలిసి దివ్యవిమానాలు ఆకాశంలో వెలుగొందుతుండగా, కౌరవవంశంలో వీరుడై వెలసిన అర్జునుడి దగ్గరకు దయతో విచ్చేశాడు. ఆ సమయంలో మేఘనిస్వనగంభీరమైన తియ్యని పలుకులతో యమధర్మరాజు అర్జునుడితో ఇట్లా చెప్పాడు. 'ఎల్లప్పుడు ధర్మాన్ని పాటించే ఓ పాండురాజపుత్ర! నిన్ను మెచ్చుకొని, నీకు మిత్రులై దేవేంద్రుడు మున్నగు దేవనాయకులు నీకు వరాలు అనుగ్రహించాలనే అభిమానంతో నీ దగ్గరకు విచ్చేశారు.

**వ. వీరలం జూడు' మని దివ్యదృష్టి యిచ్చి 'నీవు నరుండను పూర్వఋషివి; బ్రహ్మనియోగంబున మనుష్యుండవై యుత్తమ క్షత్త్రియకులంబున నుద్భవిల్లితి; మఱి సూర్యాంశజుండైన కర్ణుని, దేవ దైత్య దానవ గంధర్వ యక్ష రాక్షసాంశజులైన రాజులను వధియింతు; నీ కక్షయకీర్తి యగు' నని దండధరుం డప్రతివారణం బైన దండంబు విధియుక్తంబుగా నిచ్చిన. 338**

**ప్రతిపదార్థం:** వీరలన్+చూడుము+అని= వీరిని చూడు మని చెప్పి; దివ్య, దృష్టి= దేవతలకు సంబంధించిన చూపు; ఇచ్చి= అనుగ్రహించి; నీవు; నరుండు+అను= నరుడు అనే పేరుకల; పూర్వ+ఋషివి= పూర్వకాలానికి సంబంధించిన మునివి; బ్రహ్మ, నియోగంబునన్= బ్రహ్మదేవుడి ఏర్పాటువలన; మనుష్యుండవు+ఐ= మనుజుడవై; ఉత్తమ, క్షత్త్రియ, కులంబునన్= మంచి క్షత్రియ వంశంలో; ఉద్భవిల్లితి= జన్మించావు; మఱి= ఇంక అదనంగా; సూర్య+అంశజుఁడు+ఐన= సూర్యుడియొక్క అంశతో పుట్టిన; కర్ణుని; దేవ, దైత్య, దానవ, గంధర్వ, యక్ష, రాక్షస+అంశజులు+ఐన= దేవతలయొక్క; దితిసుతులయొక్క,

దానవులయొక్క, గంధర్వులయొక్క, యక్షులయొక్క, రాక్షసులయొక్క అంశలతో పుట్టిన; రాజులను= రాజ్యాలను ఏలే ప్రభువులను; వధియింతు= సంహరిస్తావు; నీకు+అక్షయ, కీర్తి+అగును+అని= నీకు తరుగని యశస్సు కలుగుతుందని చెప్పి; దండధరుండు= యమధర్మరాజు (దండం అనే ఆయుధం ధరించినవాడు); అప్రతివారణంబు+ఐన= తిరుగులేనట్టి (శత్రువులచేత నివారించటానికి వీలుపడని); దండంబు= దండమనే ఆయుధాన్ని; విధి, యుక్తంబుగాన్= శాస్త్రాలు నిర్దేశించిన సూత్రాలకు సరిపడేటట్లు; ఇచ్చినన్= ఇవ్వగా.

**తాత్పర్యం:** వీరినిచూడుము అని యమధర్మరాజు అర్జునుడికి దివ్యదృష్టిని అనుగ్రహించాడు. 'నీవు పూర్వకాలంలో నరుడు అనే ఋషివి. బ్రహ్మదేవుడి ఆదేశంతో మనుజజన్మ ఎత్తి ఉత్తమక్షత్రియవంశంలో ఉద్భవించావు. తదుపరి సూర్యుడి అంశతో పుట్టిన కర్ణుడిని, మఱి, దేవ దైత్య దానవ గంధర్వ యక్ష రాక్షసుల అంశలతో పుట్టిన రాజులను సంహరించగలవు. నీకు తరుగని పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి' అని చెప్పి యమధర్మరాజు తన ఆయుధమైన దండాన్ని అర్జునుడికి శాస్త్రోక్తపద్ధతిలో ఇచ్చాడు.

**విశేషం:** 'దేవదైత్య దానవ గంధర్వ యక్ష రాక్షసులు' అనే ప్రయోగం నన్నయ పలుతావుల చేశాడు. దేవతలలో, రాక్షసులలో పెక్కు తెగలు కలవు. వీరు అందరు ఆయా తెగలకు సంబంధించినవారు. గంధర్వులు సంగీతకోవిదులు. యక్షులు మాయాదక్షులు. రాక్షసులలో కొందరు కామరూపులు. వీరి అంశలు పంచుకొని భూలోకంలో మానవులు పుట్టుతారని మహాభారత కథనం. మానవులలో అతిలోకమైన ప్రజ్ఞలతో పుట్టేవారు కొందరు కనిపిస్తారు. అట్టివారి ప్రజ్ఞకు కారణం వారు ఆయా దివ్య రాక్షసాంశలతో ఉద్భవించటమే అని మహాభారతంలో చెప్పబడింది. కొందరి అభిప్రాయంలో ఇది ఉత్ప్రేక్ష. మరికొందరి కిది విశ్వాసం.

దివ్యదృష్టి : దేవతలు చర్మచక్షువులకు కనిపించరు. వారిని చూడటానికి అప్రాకృతమైన దివ్యదృష్టి ఉండాలి. కాబట్టి అర్జునుడికి యముడు దివ్యదృష్టిని అనుగ్రహించాడు అని చెప్పబడింది.

**ఉ. ఘోరారిదారుణము లగు । వారుణపాశంబు లిచ్చె వరుణుఁడు, మఱి కౌ**
**బేరాస్త్ర మిచ్చె నపుడు కు । బేరుఁడు విజయునకు నహితభేదికిఁ బ్రీతిన్. 339**

**ప్రతిపదార్థం:** ఘోర+అరి, దారుణములు+అగు= భయంకరులయిన శత్రువుల పాలిటి ఉపద్రవకరాలయిన; వారుణ, పాశంబులు= వరుణుడి ఆయుధాలైన పాశాలు (ఉరిత్రాళ్ళు); వరుణుఁడు= వరుణదేవుడు; ఇచ్చెన్= ఇచ్చాడు; మఱి= అటుపిదప; విజయునకున్= అర్జునుడికి; అహిత భేదికిన్= శత్రువులను భేదించేవాడికి; కుబేరుఁడు= కుబేరదేవుడు; అపుడు= అప్పుడు; కౌబేర+అస్త్రము= కుబేరుడి ఆయుధమైన కౌబేర మనే అస్త్రాన్ని; ప్రీతిన్= సంతోషంతో; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** వరుణుడు అర్జునుడికి, శత్రువులకు భయంకరాలైన వారుణపాశాలను అనుగ్రహించాడు. అనంతరం కుబేరుడు శత్రుసంహారకుడైన అర్జునుడికి ప్రేమతో కౌబేరాస్త్రాన్ని ఇచ్చాడు.

**వ. ఇట్లు దివ్యపురుషుండైన పార్థుండు లబ్ధదివ్యదృష్టియై యమర్త్యరూపధరులైన పితృదేవతలతోడం దనముందట నిలిచిన మహానీలవర్ణుండైన వైవస్వతుని, వైడూర్యవర్ణుండై యర్ణవ నదీ శైల సేవితుడైన వరుణేశ్వరుం, జాంబూనద వర్ణుండై యక్ష రాక్షస గణంబుతో నున్న కుబేరునిం జూచి, వారివలన దివ్యాస్త్రంబులు వడసి వాక్పుష్ప ఫల జలంబుల నందఱం దృప్తులం జేసి వెండియు. 340**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దివ్య, పురుషుండు+ఐన= దివ్యత్వం కల మనుజుడయిన; పార్థుండు= అర్జునుడు; లబ్ధ, దివ్య, దృష్టి+ఐ= పొందిన దివ్యదృష్టి కలవాడై; న+మర్త్య, రూపధరులు+ఐన= దేవతల (చావులేనట్టి) రూపాలు ధరించినవారైన; పితృ, దేవతలతోడన్= మరణించిన పిమ్మట దేవతలైన వారితోడ; తన, ముందటన్= తన ఎదుట; నిలిచిన= నిలబడిన; మహా, నీల, వర్ణుండు+ఐన= మిక్కిలి నల్లనిరంగుకలవాడైన; వైవస్వతునిన్= యమధర్మరాజును; వైడూర్య వర్ణుండు+ఐ= వైడూర్య రత్నం వంటి రంగు (ఇంచుక తెలుపు ఇంచుక పసుపు కలిసిన రంగు) కలవాడై; అర్ణవ, నదీ, శైల, సేవితుండు+ఐన= సముద్రాలు, నదులు, కొండలచేత సేవించబడినవాడైన; వరుణ+ఈశ్వరున్= వరుణదేవుడిని; జాంబూనద వర్ణుండు+ఐ= బంగారు రంగు కలిగినవాడై; యక్ష, రాక్షస, గణంబులతోన్+ఉన్న= యక్షులు, రాక్షసుల సముదాయంతో ఉన్న; కుబేరునిన్+చూచి= కుబేరుడిని చూచి; వారివలన= ఆయాదేవుళ్ళవలన; దివ్య+అస్త్రంబులు+పడసి= దివ్యమైన మంత్ర బాణాలు సంపాదించి; వాక్, పుష్ప, ఫల, జలంబులన్= మాటలతో, పువ్వులతో, ఫలాలతో, నీళ్ళతో; అందఱన్= అందరిని; తృప్తులన్+చేసి= తనివి చెందినవారినిగా ఒనరించి; వెండియు= మరల.

**తాత్పర్యం:** ఈ విధంగా దివ్యత్వం సంపాదించుకొని మహాపురుషుడుగా మారిన అర్జునుడు దివ్యదృష్టి కలవాడై దేవతారూపాలు ధరించిన పితృదేవతలతో తన ముందట నిలిచిన నీలవర్ణుడైన వైవస్వతుడిని, సముద్రాలు, నదులు, కొండలచేత కొలువబడే వాడును, వైడూర్యపు రంగు కలవాడును అయిన వరుణదేవుడిని, యక్ష రాక్షసులతో కలసి ఉన్నవాడు, బంగారు రంగు కలవాడును అయిన కుబేరుడిని చూచి, వారివలన దివ్యాస్త్రాలు పొంది, వారిని మాటలతో, పుష్పాలతో, ఫలాలతో, నీళ్ళతో ఆరాధించి, తృప్తిపరచి, మరియు.

**విశేషం:** మర్త్యులు= మరణానికి అధీనులు; అమర్త్యులు= మరణం లేని వారు, దేవతలు. మర్త్యులు మరణానంతరం పితృదేవతలు అవుతారు. అమర్త్యులను చూడటానికి చర్మచక్షువులు చాలవు. దివ్యదృష్టి అవసరం.

**ఆ.** **అమరగణసమేతు నైరావణారూఢు । వజ్రధరుఁ ద్రిలోకవంద్యు నింద్రు**
**వృత్రశత్రు నమరవిభుఁ జూచి యెద నాది । మునివరుండు నరుఁడు ముదము నొందె.** **341**

**ప్రతిపదార్థం:** అమర, గణ, సమేతున్= దేవతల సముదాయాలతో కూడిన వాడిని; ఐరావణ+ఆరూఢున్= ఐరావణం అనే (తెల్ల) ఏనుగుపై అధివసించినవాడిని; వజ్రధరున్= వజ్రమనే ఆయుధాన్ని ధరించిన వాడిని; త్రి, లోక, వంద్యున్= మూడులోకాలకు నమస్కరించతగిన వాడిని; ఇంద్రున్= ఇంద్రుడిని; వృత్ర, శత్రున్= వృత్రుడు అనే విరోధిని కల వాడిని; అమర, విభున్= దేవతల ప్రభువును; చూచి= చూచి; ఎదన్= హృదయంలో; ఆది, ముని, వరుండున్= మొదటి ముని శ్రేష్ఠుడు; నరుఁడు= అర్జునుడు; ముదమున్+ఒందెన్= సంతోషం పొందాడు.

**తాత్పర్యం:** దేవతలచేత పరివేష్టించబడి, ఐరావణమనే తెల్ల ఏనుగును ఎక్కి, వజ్రాయుధాన్ని ధరించి, వృత్రుని శత్రువై, మూడు లోకాలకు ఆరాధ్యుడై ఒప్పుతున్న దేవేంద్రుడిని ఆదిమునిశ్రేష్ఠుడైన అర్జునుడు చూచి హృదయంలో సంతోషం పొందాడు.

**ఉ.** **ఇందుధరప్రసాదమున నిష్టవరంబులు గాంచి బాంధవా**
**నంద విధాయి యైన నిజనందును దండితశత్రు సద్గుణా**
**నందితుఁ జూచి వేడ్క నయనంబులు వేయును గన్న తత్ఫలం**
**బందెఁ బురందరుండు పరమాద్భుత సమ్మదపూరితాత్ముఁడై.** **342**

**ప్రతిపదార్థం:** ఇందు, ధర= చంద్రుని ధరించిన వాడైన శివుడియొక్క; ప్రసాదమునన్= దయవలన; ఇష్ట, వరంబులు+కాంచి= తాను కోరిన వరాలు సంపాదించి; బాంధవ+ఆనంద, విధాయి+ఐన= చుట్టాలకు ఆనందం కల్పించేవాడయిన; నిజ, నందనున్= తనకొడుకును; దండితశత్రున్= శిక్షించబడిన శత్రువులు కలవాడిని; (అంటే శత్రువులను జయించిన వాడిని); సత్+గుణ+ఆనందితున్+చూచి= మంచి గుణాలచేత ఆనందం పొందేవాడిని చూచి; వేడ్కన్= సంతోషంతో; నయనంబులు, వేయును, కన్న, తద్+ఫలంబు+అందెన్= కన్నులు వేయింటిని పడసిన ఆ ప్రయోజనాన్ని పొందాడు. (అంటే దేవేంద్రుడు తన కుమారుడైన అర్జునుడిని చూచి తనకు వేయికన్నులు ఉన్నందుకు తగిన ప్రయోజనాన్ని పొందగలిగాడు); పురందరుండు= ఇంద్రుడు; (పురాలను నాశనం ఒనరించినవాడు); పరమ+అద్భుత, సమ్మద, పూరిత+ఆత్ముఁడు+ఐ= మిక్కుటమైన అచ్చెరువుతో కూడిన సంతోషంతో నిండిన ఆత్మకలవాడై.

**తాత్పర్యం:** ఇందుధరుడైన పరమేశ్వరుడి వరప్రసాదంవలన అభీష్టవరాలు సంపాదించి చుట్టాలకు ఆనందాన్ని కలిగించిన తన కుమారుడిని, శత్రువులను నిర్జించేవాడిని, సద్గుణాలచేత ఆనందం పొందేవాడిని అర్జునుడిని చూచి దేవేంద్రుడు మిక్కుటమైన ఆశ్చర్యంతో, సంతోషంతో నిండిన ఆత్మకలవాడై, వేయికన్నులు ఉన్నందుకు తగిన సత్ఫలాన్ని పొందాడు.

**వ. ఇట్లు దేవేంద్రుండు ధనంజయుం జూచి సంతసిల్లి 'నీవు పరమేశ్వరువలనఁ బరమసిద్ధి వడసితివి; దేవకార్యంబు దీర్ప నర్హుండవు గాన నా రథంబుఁ బుత్తెంచెద; నమరావతికి రమ్ము. నీకు దివ్యాస్త్రంబు లంద యిచ్చెద' నని దేవేంద్రుండు దేవగణంబులతో నమరావతికి నరిగె; నర్జునుండును దద్రథాగమనంబు ప్రతీక్షించుచుండు నంత. 343**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దేవేంద్రుండు; ధనంజయున్+చూచి= అర్జునుడిని చూచి; సంతసిల్లి= సంతోషించి; నీవు; పరమేశ్వరువలనన్= పరమశివుని వలన; పరమ, సిద్ధి= గొప్పలాభం; పడసితివి= పొందావు; దేవ, కార్యంబు+తీర్పన్+అర్హుండవు= దేవతలయొక్క పనులను నిర్వహించటానికి సమర్థుడివి; కానన్= కాబట్టి; నా రథంబున్= నా తేరును; పుత్తెంచెదన్= పంపిస్తాను; అమరావతికి= దేవతల రాజధాని అయిన అమరావతికి; రమ్ము; నీకు; దివ్య+అస్త్రంబులు= దివ్యమైన మంత్రబాణాలు; అందు+అ= అక్కడే (అమరావతి లోనే), ఇచ్చెదన్= ఇస్తాను; అని= అని చెప్పి; దేవేంద్రుండు; దేవ, గణంబులతోన్= దేవతల సముదాయంతో; అమరావతికిన్; అరిగెన్= వెళ్ళాడు; అర్జునుండును; తద్+రథ+ఆగమనంబు= ఆ రథంయొక్క రాకను; ప్రతీక్షించుచుండు+అంత= ఎదురుచూస్తూ ఉన్నాడు. అంత.

**తాత్పర్యం:** ఇట్లా దేవేంద్రుడు తన కుమారుడైన అర్జునుడిని చూచి మిక్కిలి సంతోషించాడు. 'నీవు పరమశివుడి వలన గొప్పవరాలు సంపాదించగలిగావు. దేవతలకు ఉపకారం చేసే యోగ్యత నీకు లభించింది. కావున నా రథం పంపుతాను. అమరావతికి రమ్ము. అచటనే నీకు నేను దివ్యాస్త్రాలు ఇస్తాను' అని పలికి, దేవతల సముదాయంతో దేవేంద్రుడు అమరావతికి వెళ్ళాడు. అర్జునుడు ఆ రథం రాకకై ఎదురుచూస్తూ ఉన్నాడు. అంత.

**సీ. వారిదమార్గంబువలన మహానీల । వైజయంతీ విభవంబు వెలయ,**
**నాబద్ధవివిధరత్నావళిప్రభఁ జేసి । రమ్యమై రోదోంతరంబు వెలుఁగ,**
**నురునేమిరవమున నుర్వరాధర దరీ । ముఖములు ప్రతిశబ్ద ముఖరితంబు**
**లగుచుండ, నానావిధాయుధంబులు దాల్చి, । యశనివిద్యుత్సహస్రాభిశోభి**

**ఆ. తాభ్రసదృశమై మహాజవాశ్వాయుత । వాహ్యమాన మైన వరరథంబు**
**మఘవునాజ్ఞఁ జేసి, మాతలి యుక్తమై । యింద్రతనయుఁ డున్నయెడకు వచ్చె. 344**

**ప్రతిపదార్థం:** వారిద, మార్గంబు వలనన్= మబ్బుల తెరువునుంచి ఆకాశమార్గంనుండి (వారి+ద= నీటిని ఇచ్చేది, మేఘం); మహా, నీల, వైజయింతీ, విభవంబు, వెలయన్= మిక్కుటమైన నీలిరంగుతో నిండిన 'వైజయంతి' అనే ఇంద్రుడి జెండా యొక్క సంపద విలసిల్లగా; ఆబద్ధ, వివిధ, రత్న+ఆవళి, ప్రభన్+చేసి= పొదగబడిన పెక్కు రత్నాల సముదాయాలయొక్క కాంతిచేత; రమ్యము+ఐ= సుందరమై; రోదస్+అంతరంబు, వెలుఁగన్= భూమి ఆకాశాల మధ్య భాగం ధగధగలాడుతుండగా; ఉరు, నేమి, రవమునన్= గొప్పదైన చక్రాల కమ్ముల సవ్వడిచేత; ఉర్వరాధర= భూమిని ధరించే కొండలయొక్క; దరీ, ముఖములు= కొండలలోని గుహల ముందుభాగాలు; ప్రతిశబ్దముఖరితంబులు+అగుచుండన్= ప్రతిధ్వనులచేత మారుమ్రోగు తుండగా; నానా, విధ+ఆయుధంబులు, తాల్చి= అనేక విధాలైన శస్త్రాలను వహించి; అశని, విద్యుత్, సహస్ర+అభిశోభిత+అభ్ర, సదృశము+ఐ= పిడుగులును, వేయి మెరుపు తీగలను గలిగి మిక్కిలి శోభిల్లే మేఘంతో సరిపోలుతున్నవై మహా, జవ+అశ్వ+అయుత= గొప్ప వేగంతో పరుగెత్తగల పదివేల గుర్రాలచే; వాహ్యమానము+ఐన= లాగబడుతున్నదైన; వర, రథంబు= శ్రేష్ఠమైన రథం; మఘవు+ఆజ్ఞన్+చేసి= దేవేంద్రుడి ఆనతి చొప్పున; మాతలి, యుక్తము+ఐ= మాతలి అనే పేరు కల సారథితో కూడినదై; ఇంద్ర, తనయుఁడు+ఉన్న+ఎడకు= అర్జును డుండే తావుకు; వచ్చెన్= వచ్చింది.

**తాత్పర్యం:** ఇంద్రుడి ఆజ్ఞ చొప్పున, గొప్ప వేగంతో పరుగెత్త గలిగిన పదివేల గుర్రాలు పూన్చిన దివ్య రథం మాతలి అనే సారథి నడుపుతుండగా అర్జును డుండే చోటికి వచ్చింది. ఆ రథం మేఘమండలంనుండి వచ్చేటప్పుడు మిక్కిలి నీలపురంగు గల వైజయంతీ (జెండా) వైభవం వెల్లివిరిసింది. ఆ తేరులో పొదగబడిన పెక్కు రత్నాల సముదాయంయొక్క కాంతులచేత భూమికీ ఆకాశానికీ మధ్య ఉండే భాగం అందంగా వెలుగొందింది. చక్రాల కమ్మలు చేసిన పెనుసవ్వడిచేత పర్వతగుహా ముఖాలు ప్రతిధ్వనించాయి. పెక్కు ఆయుధాలు వహించటంచేత అది పిడుగులతో, వేలకొలది మెరుపుతీగలతో ఒప్పే గొప్ప మేఘాన్ని సరిపోలి ఉన్నది.

**విశేషం:** వైజయంతి అంటే ఇంద్రుడి జెండా. విష్ణువు ధరించే మాలపేరు కూడా వైజయంతియే.

**వ. మాతలియు నర్జునుఁజూచి 'సురాసురకిరీటతతటఘటితరత్నప్రభాభాసురపదుండైన మహేంద్రుండు మీయయ్య భవద్దర్శనం బపేక్షించి నిన్ను నమరావతికి రాఁబనిచె, రాజసూయాశ్వమేధ శతంబులం జేసిన వారికైనను దుర్లభం బీరథంబు, దీని నెక్కు' మనిన నర్జునుండును గంగాస్నాన పవిత్రీకృత గాత్రుండై దేవఋషి పితృతర్పణంబులు చేసి మాతలి ప్రయుక్తంబైన యా దివ్యరథం బెక్కి. 345**

**ప్రతిపదార్థం:** మాతలియున్= ఇంద్రుడి సారథి అయిన మాతలియు; అర్జునున్+చూచి= అర్జునుడిని చూచి; సుర+అసుర, కిరీట, తట, ఘటిత, రత్న, ప్రభా, భాసుర, పదుండు+ఐన= దేవతలయొక్క, రాక్షసులయొక్క, మకుటాలయొక్క పార్శ్వాలలో కూర్చబడిన రత్నాలయొక్క కాంతులచేత వెలుగొందే పాదాలు కలవాడు అయిన; మహా+ఇంద్రుండు= మహేంద్రుడు, (దేవేంద్రుడు); మీ, అయ్య= మీ తండ్రి; భవత్+దర్శనంబు= నీయొక్క దర్శనం; అపేక్షించి= కోరి; నిన్ను; అమరావతికి= అమరావతీ పట్టణానికి; రాన్, పనిచెన్= రమ్మని ఆదేశించాడు; రాజసూయ+అశ్వమేధ, శతంబులన్= వందరాజసూయాలు, వంద అశ్వమేధాలు; చేసిన, వారికి+ఐనను= చేసినవారికి సయితం; ఈ, రథంబు= ఈతేరు; దుర్లభంబు= లభించేది కాదు; దీనిన్= దీన్ని; (ఈరథాన్ని); ఎక్కుము= అధిరోహించుము; అనినన్= అని చెప్పగా; అర్జునుండును; గంగా, స్నాన, పవిత్రీకృత, గాత్రుండు+ఐ= గంగలో స్నానం చేయటంచేత పావనం చేయబడిన దేహం కలవాడై; దేవ, ఋషి, పితృ, తర్పణంబులు,

చేసి= దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తర్పణాలు చేసి; (తర్పణం= చనిపోయిన పెద్దల ఆత్మలు తృప్తి పొందటానికై, తరించటానికై వదిలే నీళ్ళు); మాతలి, ప్రయుక్తంబు+ఐన= మాతలిచేత నడపబడే; ఆ, దివ్య, రథంబు+ఎక్కి= ఆ దివ్యమైన తేరును అధిరోహించి.

**తాత్పర్యం:** మాతలి అర్జునుడిని చూచి 'దేవతలు రాక్షసులు మీ తండ్రియైన దేవేంద్రుడికి మ్రొక్కుతుంటారు. అట్లా మ్రొక్కినప్పుడు వారి కిరీటాలలో పొదగబడిన రత్నాలకాంతులచేత ఆయన పాదాలు వెలుగొందుతుంటాయి. అట్టి మహావైభవం గల మీ తండ్రి, నిన్ను చూడాలనే కోరికతో అమరావతికి రమ్మని ఆహ్వానించాడు. వందలకొలది రాజసూయాలు, అశ్వమేధాలు చేసిన వారికి సయితం ఈ రథం దుర్లభం. నీవు ఈ రథా న్నెక్కి స్వర్గలోకానికి రమ్ము' అని పలికాడు. అర్జునుడు గంగలో స్నానం చేసి, పవిత్రమైన దేహంతో దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తర్పణాలు వదలి, మాతలి నడిపే ఆ దివ్యరథాన్ని ఎక్కాడు.

### అర్జునుఁ డమరావతికిఁ బోవుట (సం. 3-43-26)

**చ. 'అలఘు తపస్సమాధి నియతాత్ములకున్, బహుపుణ్యలోకకాం**
**క్షులకు, విశుద్ధమానసులకున్ సతతంబును సంశ్రయంబ వై,**
**లలిత నిలింప దంపతి విలాస విహార మహోత్సవంబులుం**
**గలిగి వెలుంగు రత్నమయ కందర సుందర మందరాచలా! 346**

**ప్రతిపదార్థం:** అలఘు, తపస్, సమాధి, నియత+ఆత్ములకున్= గొప్ప తపస్సువలన చేకూరే సమాధిలో లగ్నమైన ఆత్మకల వారికి- అంటే గొప్ప తపస్సువలన నిర్వికల్పసమాధి యోగాన్ని సాధించిన మహానుభావులకు; బహు, పుణ్య, లోక, కాంక్షులకున్= అనేక పుణ్యలోకాలకు వెళ్లే యోగ్యత సంపాదించుకొనగోరే వాళ్ళకు; విశుద్ధ, మానసులకున్= నిర్మలమైన మనస్సులు కలవాళ్ళకు; సతతంబును= ఎల్లప్పుడు; సంశ్రయంబవు+ఐ= ఆధారానివై; లలిత, నిలింప, దంపతి, విలాస, విహార మహా+ఉత్సవంబులున్+కలిగి= సుకుమారమైన దేవతాదంపతులయొక్క హొయలుతో కూడిన వినోదయాత్రలనే గొప్ప ఉత్సవాలతోకూడి; వెలుంగు= శోభించే; రత్న, మయ, కందర, సుందర, మందర+అచలా!= రత్నాలతో నిండిన గుహలతో అందమైన మందరపర్వతమా!

**తాత్పర్యం:** 'ఓ మందర పర్వతమా! నీవు గొప్ప తపంవలన లభించే నిర్వికల్ప సమాధిని ఆర్జించే మహానుభావులకు, అనేక పుణ్యలోకాలను పొందగోరే మహనీయులకు, పరిశుద్ధమైన మనస్సు కలవారికి ఆశ్రయ మిచ్చేదానివి. సౌకుమార్యం కల స్వర్గదంపతుల విలాసవంతమైన వినోదయాత్రలనే గొప్ప సంబరాలకు నీవు స్థానానివి. రత్నమయాలైన గుహలచేత మనోహరమైనది నీ ఆకృతి.

**విశేషం:** అలం: అంత్యానుప్రాసం, వృత్త్యనుప్రాసం.

**వ. నీయందలి పుణ్యతీర్థంబులు సేవించుచు గంగాంబు ధౌతస్థలరుహ వనస్పతి ఫలంబు లుపయోగించుచు సుఖం బుండితి; నమరావతికిం బోయి వచ్చెద' నని మందరనగంబు వీడ్కొని పురందరనందనుండు దేవ పథంబున కరిగి. 347**

**ప్రతిపదార్థం:** నీ+అందలి= నీలోఉన్న; పుణ్య తీర్థంబులు= పుణ్యాన్ని ఒనగూర్చే స్థలాలు; సేవించుచు= ఆరాధిస్తూ; గంగా+అంబు, ధౌత, స్థల, రుహ, వనస్పతి, ఫలంబులు+ఉపయోగించుచున్= గంగయొక్క నీటిచేత తడుపబడిన చెట్ల పండ్లను వాడుతూ; సుఖంబు+ఉండితిన్= సౌఖ్యం పొందాను; అమరావతికిన్+పోయి, వచ్చెదన్= అమరావతికి వెళ్ళివస్తాను; అని= అని పలికి; మందర, నగంబు= మందర పర్వతానికి; వీడ్కొని= వీడ్కోలు చెప్పి; పురందర, నందనుండు= ఇంద్రుడి కుమారుడైన అర్జునుడు; దేవ, పథంబునకు+అరిగి= దేవతలు పయనించే మార్గానికి వెళ్ళి.

**తాత్పర్యం:** ఓ మందర పర్వతమా! నీలోని పుణ్యప్రదాలైన తీర్థాలను ఆరాధిస్తూ గంగానదీజలాలచేత తడిసిన స్థలాలలో పుట్టిన చెట్లకు కాసినపండ్లను ఉపయోగిస్తూ ఇన్నాళ్ళు సుఖంగా ఉన్నాను; అమరావతికి వెళ్లివస్తాను' - అని అర్జునుడు మందరపర్వతానికి వీడ్కోలు చెప్పి దేవతలు పయనించేమార్గం చేరుకొన్నాడు.

**విశేషం:** దేవపథం= దేవతలు పయనించే మార్గం. మనుజులు ప్రయాణం చేసే మార్గాలు వేరు. దేవపథం ఆకాశమార్గం.

**సీ.** **పరమధర్మస్థితిఁ బ్రజఁ బ్రీతిఁ గాంచిన । రాజులకు, నుదగ్రరణమునందుఁ**
**బతుల ప్రస్తవమునఁ బ్రాణముల్ విడిచిన । వీరులకును, యజ్ఞవిధులఁ జేసి**
**సురలను వసుమతీసురులను దనిపిన । ధర్మాత్ములకు, మహాతాపసులకు,**
**నిలయంబులై రమణీయంబు లగునట్టి । హర్మ్యవిమానసంహతుల దాని,**

**తే.** **సకలభువనంబులం గల సత్పురముల । కెల్ల నెక్కు డనఁ దగి శిఖీందు రవుల**
**దీప్తి లేకున్నఁ దనదైన దివ్యదీప్తి । విస్తరంబున నెప్పుడు వెలుఁగు దాని.** **348**

**ప్రతిపదార్థం:** పరమ, ధర్మ, స్థితిన్= గొప్ప ధర్మాన్ని నిలుపుతూ; ప్రజన్= జనులను; ప్రీతిన్= ప్రేమతో; కాంచిన= (పరిపాలించిన) చూచిన; రాజులకున్; ఉదగ్ర, రణమునందున్= భయంకరమైన యుద్ధంలో; పతుల, ప్రస్తవమునన్= ఏలికల కొరకై (స్వామి భక్తితో); ప్రాణముల్, విడిచిన, వీరులకును= అసువులను అర్పించి పోరాడిన శూరులకు; యజ్ఞ, విధులన్+చేసి= యజ్ఞాలలో విధ్యుక్త కర్మలను నిర్వహించి (శాస్త్ర విధులలో చెప్పబడినట్లు చేసి); సురలను= దేవతలను; వసుమతీ సురులను= భూదేవతలైన బ్రాహ్మణులను; తనిపిన= తృప్తి నందించిన; ధర్మ+ఆత్ములకున్= మహానుభావులకు; మహా, తాపసులకున్= గొప్ప తపస్సు చేసిన వారికి; నిలయంబులు+ఐ= నివసించే స్థలాలై; రమణీయంబులు+అగునట్టి= అందమైనట్టి; హర్మ్య, విమాన సంహతుల, దానిన్= పెక్కు అంతస్తులు కల మేడలు, ఆకాశాన్ని అంటే గోపురాల సమూహాలు కలదానిని; సకల, భువనంబులన్+కల= అన్ని లోకాలలో ఉన్న; సత్, పురములకు+ఎల్లన్+ఎక్కుడు+అనన్+తగి= మంచి పట్టణాలు అన్నిటికంటె అధికమని చెప్పతగిన; శిఖి+ఇందు, రవుల= అగ్ని, చంద్రుడు, సూర్యుల; దీప్తి, లేకున్నన్= వెలుగు లేనప్పటికిని; తనదు+ఐన= తనయొక్క; దివ్య, దీప్తి విస్తరంబునన్= దివ్యమైన వెలుగు వెల్లువచేత; ఎప్పుడు= నిరంతరం; వెలుఁగుదానిన్= ప్రకాశించే దానిని; (అంటే అమరావతీ పట్టణాన్ని).

**తాత్పర్యం:** అర్జునుడు అమరావతీ పట్టణాన్ని చూచాడు. గొప్ప ధర్మాన్ని నిష్ఠతో పాటించి ప్రజలను పరిపాలించిన రాజులకు, ఘోరయుద్ధంలో స్వామిభక్తి పరాయణులై ఏలికలకొరకు తమ అసువులను అర్పించిన శూరులకు, యజ్ఞయాగాది క్రతువులు చేసి దేవతలను, భూదేవత లయిన బ్రాహ్మణులను సంతృప్తి పరచిన ధర్మాత్ములకు, గొప్ప తాపసులకు నివాసాలైన పెక్కు అంతస్తులు కల మేడలు, గోపురాలు కల దానిని; సమస్త లోకాలలోని గొప్ప

పట్టణాలకన్న మిన్న అని చెప్పతగినదానిని, సూర్య, చంద్ర, అగ్నిహోత్రుల కాంతి అచట ప్రసరించకున్నను, స్వయంప్రకాశమానమై శోభతో విలసిల్లే దానిని అమరావతిని అర్జునుడు చూచాడు.

**విశేషం:** (1) అమరావతీ పట్టణం అగ్నిచంద్ర సూర్యుల కాంతి ప్రసారం లేకుండానే స్వయం ప్రకాశమానమైనది. (2) ధర్మాత్ములై ప్రజలను పరిపాలించిన రాజులు స్వర్గానికి వెళ్తారు. (3) యుద్ధంలో పరాక్రమం, స్వామిభక్తి ప్రకటించి అసువులు పాసినవారు (అంటే వీరమరణం పొందినవారు) స్వర్గం చేరతారు. (4) యజ్ఞ యాగాది కర్మలు చేసి దేవతలను, బ్రాహ్మణులను మెప్పించినవారు స్వర్గాన్ని పొందుతారు.

**వ. మఱియు ననాహితాగ్నులకు, నతీర్థసేవకులకు, ననృతవాదులకు, వేద విరుద్ధాచారులకు, మాంసాహారులకు, రణపరాఙ్ముఖులకుఁ జొర నవిషయంబును, నతి గహ్వరంబును నైనదాని నమరావతిఁ జొచ్చి, తద్గోపుర సమీపంబున ననవరత గండస్థల గళదవిరళమదజలకుల్యాభిరామంబై నిరంతర నిర్ఝరనీహార నగంబునుం బోలె నొప్పుచున్న యైరావతంబుఁ జూచుచు. సురసిద్ధ సాధ్య గణంబుతో విద్యాధరాప్సరో గంధర్వ కిన్నర జేగీయమానుం డగుచు చను నప్పుడు. 349**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతేకాక, (అనాహితాగ్నులు (న+ఆహితాగ్నులు)= ఆహితాగ్నులు కానివారు;) అనాహితాగ్నులకున్= శ్రోత్రియులై నిత్యాగ్నిహోత్ర నిరతులుకానివారికి; అతీర్థసేవకులకున్= పుణ్య స్థలాలు సేవించని వారికి; అనృతవాదులకున్= అసత్యం పలికే వారికి; వేద, విరుద్ధ+ఆచారులకున్= వేదాలకు వ్యతిరేకమైన ప్రవర్తన కలవారికి; మాంస+ఆహారులకున్= మాంసం భుజించే వారికి; రణ, పరాక్+ముఖులకున్= యుద్ధంలో పెడమొగం పెట్టిన వారికి అంటే రణరంగంనుండి పారిపోయిన పిరికివారికి; చొరన్= ప్రవేశించటానికి; న+విషయంబునున్= ప్రదేశం కాని దానిని; అతి, గహ్వరంబునున్+ఐనదానిన్= (సాధారణులకు) ప్రవేశించటానికి వీలులేని దానిని; అమరావతిన్+చొచ్చి= అమరావతిలో ప్రవేశించి; తద్+గోపుర, సమీపంబునన్= ఆ పట్టణద్వారానికి దగ్గరగా; అనవరత, గండస్థల, గళత్+అవిరళ, మదజల కుల్య+అభిరామంబు+ఐ= ఎల్లప్పుడును చెక్కిళ్ళ నుంచి జారుతున్న ఎడతెగని మదజలం పారే కాలువలతో మనోహరమై; నిరంతర, నిర్ఝర, నీహార, నగంబునున్+పోలెన్= ఎడతెగక పారే సెలయేళ్ళతో కూడిన మంచు కొండ (హిమాలయపర్వతం) వలె; ఒప్పుచున్న= విలసిల్లుతున్న; ఐరావతంబున్= ఐరావతమనే పేరుకల ఇంద్రుడితెల్లఏనుగును; చూచుచు; సుర, సిద్ధ, సాధ్య, గణంబుతోన్= దేవతలు, సిద్ధులు, సాధ్యుల సమూహంతో; విద్యాధర+అప్సరస్+గంధర్వ, కిన్నర, జేగీయమానుండు+అగుచు= విద్యాధరులు, అప్సరసలు, గంధర్వులు, కిన్నరులు, జయజయ శబ్దాలు ఉచ్చరిస్తుండగా ఒప్పుతూ; చనునప్పుడు= వెళ్ళేటప్పుడు.

**తాత్పర్యం:** అమరావతిని - (1) ఆహితాగ్నులు కానివారు (2) తీర్థయాత్రలు చేయనివారు (3) అసత్యం పలికేవారు (4) వేదాలకు వ్యతిరేకంగా నడచుకొనేవారు (5) మాంసం తినేవారు (6) యుద్ధంలో వెన్ను చూపి పారిపోయేవారు - ప్రవేశించటానికి అనర్హులు. అమరావతీ పట్టణంలోని పురద్వారం సమీపంలో ఐరావతం అనే వెల్ల (తెల్ల) ఏనుగు ఉన్నది. గండస్థలంనుండి మదజలధారలు కాలువలుగా స్రవించి మనోహరమై కన్పట్టుతూ, ఆ ఏనుగు ఎల్లప్పుడు పారే సెలయేళ్ళతో కూడిన హిమాలయపర్వతంవలె ఒప్పుతున్నది. అర్జునుడు ఆ ఐరావతాన్ని చూస్తూ అమరావతీపురంలో ప్రవేశించాడు. అప్పుడు దేవతలు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, అప్సరసలు జయజయ శబ్దాలు చేయసాగారు. అట్లా వెళ్ళేటప్పుడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. సకలర్తు సురభి కుసుమిత । సుకుమారోద్యాన తరుల సుడియుచుఁ బ్రణయో**
**త్సుకుఁడై పవనుఁడు పాండవు । నకు నభిముఖుఁ డయ్యెఁ దన్మనఃప్రియ మెసఁగన్. 350**

**ప్రతిపదార్థం:** సకల+ఋతు, సురభి, కుసుమిత, సుకుమార+ఉద్యాన తరుల, సుడియుచున్= అన్ని ఋతువులలో పూచి పరిమళించే పువ్వులతో మనోహరాలైన పెంపుడు తోటలలోని చెట్ల చుట్టూ తిరుగాడుతూ; ప్రణయ+ఉత్సుకుఁడు+ఐ= స్నేహభావంతో అతిశయించినవాడై; పవనుఁడు= వాయుదేవుడు; పాండవునకున్= అర్జునుడికి; తద్+మనస్+ప్రియము+ఎసఁగన్= అతడియొక్క మనస్సుకు సంతోషం కలిగేటట్లుగా; అభిముఖుఁడు+అయ్యెన్= ఎదురయ్యాడు (ఎదురుగా వీవసాగాడు).

**తాత్పర్యం:** అన్ని ఋతువులలో పుష్పించి పరిమళాలు విరజిమ్మే ఉద్యానవనాలలోని వృక్షాల చుట్టూ తిరుగుతూ, స్నేహానురాగ పురస్సరంగా అర్జునుడికి మనఃప్రీతి కల్గిస్తూ వాయుదేవుడు అతడికి అభిముఖుడై వీవదొడగాడు.

**క. నరుఁడైన యాదిముని యని । హరిసుతుఁ డని హరిసహాయుఁ డని హరుచేతన్**
**వరములు వడసిన వాఁడని । సురలెల్లను వచ్చి పార్థుఁ జూచిరి ప్రీతిన్. 351**

**ప్రతిపదార్థం:** నరుఁడు+ఐన= నరుడు అయిన; ఆది, ముని, అని= మొదటి ఋషి అని; హరి, సుతుఁడు+అని= దేవేంద్రుడికుమారుడని; హరి, సహాయుఁడు+అని= విష్ణువుకు తోడుపడేవాడని లేదా ఇంద్రుడికి సాయం చేసేవాడని; హరుచేతన్= శివుడివలన; వరములు+పడసిన, వాఁడు+అని= వరాలు సంపాదించినవాడని; సురలు+ఎల్లను= దేవతలందరు; వచ్చి= అరుదెంచి; ప్రీతిన్= ప్రేమతో; పార్థున్= అర్జునుడిని; చూచిరి= చూచారు.

**తాత్పర్యం:** ~~ఈ~~తడు నరుడనే ఆదిఋషి అనిన్నీ, ఇంద్రుడికుమారు డనిన్నీ, ఇంద్రుడికి సాయమొనరించే వాడనిన్నీ, పరమశివుడిచేత వరాలు పొందిన వాడనిన్నీ దేవతలు అందరూ వచ్చి అర్జునుడిని ప్రీతితో చూచారు.

**వ. అర్జునుండు నయ్యమరావతీ విభవంబు సూచి హర్షించుచు అప్సరోగీయమాన మంగళహిత గీతావహిత మానసుం డగుచు సిద్ధ మునిగణాశీర్వాదంబులు సేకొనుచుం జని, మాతలి నిర్దేశంబున దివ్య రథావతీర్ణుండై. 352**

**ప్రతిపదార్థం:** అర్జునుండు; ఆ+అమరావతీ, విభవంబు+చూచి= ఆ అమరావతి వైభవం చూచి; హర్షించుచున్= సంతోషిస్తూ; అప్సరస్+గీయమాన, మంగళ, హిత, గీత+అవహిత, మానసుండు+అగుచున్= అప్సరసలచేత పాడబడుతున్న శుభాన్నీ శ్రేయస్సును కోరే పాటలయందు ఏకాగ్రమైన మనస్సు కలవాడు అవుతూ; సిద్ధముని, గణ+ఆశీర్వాదంబులు= సిద్ధులయొక్క, మునిగణాలయొక్క దీవనలు; చేకొనుచున్= స్వీకరిస్తూ; చని= వెళ్ళి; మాతలి, నిర్దేశంబునన్= మాతలి చెప్పిన చొప్పున; దివ్య, రథ+అవతీర్ణుండు+ఐ= దివ్యమైన తేరినుంచి దిగినవాడై.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ అమరావతీ పట్టణవైభవం చూచి మిక్కిలి సంతోషించాడు. అప్సరసలు పాడిన మంగళహిత గీతికలు అతడిని మిగుల ఆకర్షించాయి. సిద్ధులు, ఋషులు అతడిని ఆశీర్వదించారు. వారి దీవనలు గైకొంటూ చని అర్జునుడు మాతలి సూచించిన మేరకు దివ్యరథంనుండి దిగాడు.

**క. శతమఖునకు భువనావన । రతశీలున కఖిలదేవరాజర్షి సమ**
**న్వితునకు వజ్రాభీలో । న్నతపృథుభుజునకుఁ గృతప్రణామం డయ్యెన్. 353**

**ప్రతిపదార్థం:** శతమఖునకున్= నూరుయజ్ఞాలు చేసిన దేవేంద్రుడికి; భువన+అవన, రత, శీలునకు= లోకాలను రక్షించటంలో ఆసక్తితో కూడిన స్వభావం కలవాడికి; అఖిల, దేవ, రాజర్షి, సమన్వితునకున్= దేవఋషులైన, రాజఋషులైన వారందరితో కూడి ఉన్నవాడికి; వజ్ర+ఆభీల+ఉన్నత, పృథు, భుజునకున్= వజ్రాయుధంచేత (వజ్రాయుధాన్ని ధరించి ఉండటం చేత) భయంకరమైన, ఎత్తైన, పెద్దవైన బాహువులు కలవాడికి; (అర్జునుడు) కృత, ప్రణాముండు+అయ్యెన్= చేయబడిన నమస్కారం కలవాడు అయ్యాడు- అంటే నమస్కరించాడని భావం.

**తాత్పర్యం:** లోకాలను కాపాడే అభినివేశంతో కూడిన స్వభావం కలవాడున్నూ, సకల దేవర్షి, రాజర్షులతో కూడి ఉన్నట్టివాడున్నూ, వజ్రాయుధాన్ని ధరించటం చేత భీతిగొల్పుతున్న ఎత్తైన పెద్ద భుజములు (బాహువులు) కలవాడున్నూ అయిన దేవేంద్రుడికి అర్జునుడు నమస్కారం చేశాడు.

**చ. అనిమిషనాథుఁడుం బ్రచలితాంగద తుంగ భుజాయుగంబునం**
**దనయునిఁ గౌఁగిలించుకొని తత్క్షణజాత నితాంత సమ్మదం**
**బునఁ బులకాంకితాంగుఁ డయి మున్ను నిజాంకతలస్థుఁ జేసి య**
**త్యనఘు నిజాసనార్ధమున నాదట నుంచెఁ గరంబు నెమ్మితోన్. 354**

**ప్రతిపదార్థం:** అనిమిషనాథుఁడున్ (అనిమిషులు= రెప్పపాటులేనివారు, దేవతలు)= దేవతలరాజు దేవేంద్రుడుకూడ; ప్రచలిత+అంగద, తుంగ, భుజా, యుగంబునన్= ఎక్కువగా కదలుతున్న భుజకీర్తు లనే ఆభరణాలుగల ఎత్తైన పొడవైన చేతులతో; తనయునిన్= కొడుకును; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; తద్, క్షణ, జాత, నితాంత, సమ్మదంబునన్= ఆ క్షణంలో పుట్టిన ఎడతెగని సంతోషంతో; పులక+అంకిత+అంగుఁడు+అయి= గగుర్పాటు చెందిన దేహం కలవాడు అయి; మున్ను= ముందుగా; నిజ+అంక, తలస్థున్+చేసి= తన ఒడిలో ఉంచుకొని; అతి+అనఘున్= మిక్కిలి పాపంలేని వాడిని; కరంబు= మిక్కిలి; నెమ్మితోన్= ప్రీతితో; నిజ+ఆసన+అర్ధమునన్= తన పీఠంయొక్క సగభాగంలో (అంటే అర్ధాసనంలో); ఆదటన్+ఉంచెన్= గౌరవంతో ఉంచాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు భుజకీర్తులు కదలగా పొడవుపాటిచేతులతో తన కొడుకును కౌగిలించుకొన్నాడు. అట్లా కౌగిలించుకొనటం చేత కలిగిన అమితమైన ఆనందంతో తత్క్షణమే ఆయనకు గగుర్పాటు కలిగింది. అట్లా కలిగిన రోమాంచంతో కూడిన దేహం కలవాడై, అర్జునుడిని తొలుత తన ఒడిలో ఆసీనుడిని కావించి, తదుపరి అర్ధాసన మిచ్చి మిక్కిలి ప్రేమతో సన్మానించాడు.

**విశేషం:** ప్రాచీన భారతీయ వాఙ్మయంలో రాజులు ఆప్తులకు అర్ధాసన మిచ్చి గౌరవించటం అత్యున్నతమైన మన్ననగా అభివర్ణించబడింది.

**క. లీ లైరావతకుంభా । స్ఫాలన కర్కశకరములఁ బలుమరును మరు**
**త్పాలకుఁ డంటుచు నుండె గు । ణాలంకృతుఁడైన పార్థునంగముఁ బ్రీతిన్. 355**

**ప్రతిపదార్థం:** లీలా+ఐరావత, కుంభ+ఆస్ఫాలన, కర్కశ, కరములన్= వినోదంగా ఐరావతంయొక్క కుంభస్థలాన్ని చరచటంచేత మొద్దుబారిన చేతులతో; పలుమరును= పెక్కుసారులు; మరుత్+పాలకుఁడు= దేవేంద్రుడు; గుణ+అలంకృతుఁడు+ఐన= మంచి గుణాలచేత అలంకరించబడిన; పార్థు+అంగమున్= అర్జునుడియొక్క దేహాన్ని; ప్రీతిన్= ప్రేమతో; అంటుచున్+ఉండెన్= స్పృశిస్తూ ఉండినాడు.

**తాత్పర్యం:** లీలాపూర్వకంగా ఐరావతంయొక్క కుంభస్థలాన్ని చరచటంచేత కరుకుబారిన చేతులతో పెక్కుమారులు దేవేంద్రుడు, మంచి గుణాలచేత భూషితుడైన అర్జునుడి దేహాన్ని స్పృశించాడు.

**వ. ఇట్లధిక విలాసంబుతో సురవిలాసినీ కర కలిత చారుచామీకర దండ చామర సమీరాలోల కుంతలుం డగుచు సురరాజుతో నేకాసనంబున నున్న యప్పార్థుం బాకశాసను శాసనంబున దేవ గంధర్వ సిద్ధ విద్యాధరు లతిప్రీతి నర్చించి రంత. 356**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; విలాసంబుతోన్= హొయలుతో; సురవిలాసినీ, కర, కలిత, చారు, చామీకర, దండ, చామర, సమీర+ఆలోల, కుంతలుండు+అగుచు= దేవతాస్త్రీల చేతులతో పట్టుకొనబడిన, మనోహరమైన బంగారుదండం కల చామరాల నుండి వీచే గాలిచేత కదల్చబడుతున్న ముంగురులు కలవాడై; సురరాజుతోన్= దేవేంద్రుడితో; ఏక+ఆసనంబునన్+ఉన్న= ఒకే పీఠంపై ఉన్న; ఆ+పార్థున్= పృథకొడుకైన ఆ అర్జునుడిని; పాక, శాసను, శాసనంబునన్= దేవేంద్రుడి ఆజ్ఞవలన; దేవ, గంధర్వ, సిద్ధ, విద్యాధరులు= దేవతలు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు; అతిప్రీతిన్= మిక్కిలి అనురక్తితో; అర్చించిరి= పూజించారు; అంత.

**తాత్పర్యం:** ఈ విధంగా మిక్కిలి హొయలు వారుతూ, దేవలోకంలోని సుందరాంగనలు మనోహరమైన బంగారు దండాలచేత ఒప్పారే చామరాలతో దేవేంద్రుడితో పాటు ఒకే ఆసనంలో ఉన్న అర్జునుడికి వీచారు. అప్పుడతడు ఆ గాలులతో కదలాడుతున్న ముంగురులతో మిక్కిలి శోభిల్లాడు. ఆ సురరాజుఆజ్ఞచేత అప్పుడు అర్జునుడిని దేవతలు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు మిగుల అనురక్తితో పూజించారు.

**తే. పాకశాసనుపనుపునఁ బార్థుఁ డొక్క। మణిమయంబైన మహనీయ మందిరమున**
**నెలమి గంధర్వ సంగీత హృద్యగోష్ఠి। నుండెఁ జెవులకు నుత్సవం బొందుచుండ. 357**

**ప్రతిపదార్థం:** పాక, శాసను, పనుపునన్= దేవేంద్రుడి ఆజ్ఞవలన; పార్థుఁడు= అర్జునుడు; ఒక్క; మణిమయంబు+ఐన= మణులతో నిర్మించబడిన; మహనీయ, మందిరమునన్= గొప్పభవనంలో; ఎలమిన్= ప్రీతితో; గంధర్వ, సంగీత, హృద్య, గోష్ఠిన్= గంధర్వుల యొక్క నృత్యగానాలతో మనోహరమైన గోష్ఠిలో; చెవులకున్+ఉత్సవంబు+ఒందుచుండన్= చెవుల పండుగ ఏర్పడుతుండగా; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడి ఆనతి చొప్పున అర్జునుడు ఒక మణిమయ భవనంలో వీనులకు విందైన గంధర్వ సంగీత గోష్ఠిలో కాలం గడుపుతున్నాడు.

**విశేషం:** గంధర్వులు సంగీత కోవిదులు. 'నృత్యం చ గీతం చ వాద్యం చ సంగీతమ్'- జంత్రగాత్రగాన సమన్వితమైన నృత్యం సంగీతం.

**వ. అంత సూర్యాస్తమయ సమయంబునఁ జంద్రుం డుదయించి సాంద్రచంద్రికావిలాసంబున దిగ్వనితల నలంకరించుచుండ, నిలింపపతి పంపున సొంపార నూర్వశి యర్జునసంగమకాంక్షంజేసి చంద్రికాధవళ దుకూలంబు గట్టి, మృగమద కర్పూర కుంకుమోన్మిశ్రిత సుగంధం బలఁది, వివిధ సురభి కుసుమ విసరంబులు ముడిచి, మణిమయ భూషణాలంకృతయై నిలుకడ వడసిన క్రొమ్మెఱుంగుఁ దీఁగయుంబోలె, మణిమయ**

**మంజీర ఝుళం ఝుళ నినాదంబును, గంకణ, ఝుణ ఝుణత్కారంబును, గటికలాప కింకిణీ క్రేంకారంబును, మదనాజ్ఞా వాద్యఘోషంబునుంబోలె మ్రోయుచుండ, మందగమనంబునఁ బురందరనందను మందిరంబున కరుగుదెంచిన, నప్పురుషసత్తముండు భయభక్తిసంభ్రమంబులతోఁ బ్రత్యుత్థానంబును దండ ప్రణామంబునుం జేసి, కరకమలంబులు మొగిచి యిట్లనియె. 358**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతట; సూర్య+అస్తమయ, సమయంబునన్= సూర్యుడు అస్తమించేవేళ; చంద్రుండు+ఉదయించి (నిండుపున్నమి పండువెన్నెల అని గ్రహించాలి. సూర్యుడు అస్తమించటం- చంద్రుడు ఉదయించటం ఏకకాలంలో జరిగేది పూర్ణిమ తిథిలో మాత్రమే); సాంద్రచంద్రికా, విలాసంబునన్= తరపి వెన్నెల హొయలుతో; దిశ్+వనితలన్= దిక్కులనే అంగనలను; అలంకరించుచు+ఉండన్; నిలింపపతి, పంపునన్= దేవేంద్రుడి ఆదేశాన్ని అనుసరించి; సొంపారన్= అందచందాలొలుకుతూ; ఊర్వశి= (స్వర్గంలోని అప్సరస); అర్జున, సంగమ, కాంక్షన్+చేసి= అర్జునుడి సంభోగం కోరి; చంద్రికా, ధవళ, దుకూలంబు, కట్టి= వెన్నెలవలె తెల్లనైన చీరను కట్టి; మృగమద, కర్పూర, కుంకుమ+ఉన్మిశ్రిత, సుగంధంబు +అలఁది= కస్తూరితో, కప్పురంతో, కుంకుమ పువ్వుతో బాగా కలపబడిన చందనం పూసికొని; వివిధ, సురభి, కుసుమ, విసరంబులు= పలురకాలైన సువాసనలతో కూడిన పువ్వులచెండ్లు; ముడిచి= అలంకరించుకొని; మణిమయ, భూషణ+ అలంకృత+ఐ= మణులతో పొదగబడిన ఆభరణాలచేత అలంకరించబడిందై; నిలుకడ+పడసిన, క్రొమ్మెఱుంగున్+ తీఁగయున్+పోలె= సుస్థిరమైన క్రొత్త మెఱుపుతీగ వంటిదై; మణిమయ, మంజీర, ఝుళం ఝుళ, నినాదంబును= మణులతో పొదుగబడిన అందెల ఝుళఝుళ ధ్వనులున్నూ; కంకణ, ఝుణ, ఝుణత్, కారంబును= చేతి కడియాల ఝుణ ఝుణ నిక్వాణాలున్నూ; కటికలాప= మొలనూలి యందలి; కింకిణీ= చిరుగంటల యొక్క; క్రేంకారంబును= 'క్రేం' అని వినిపించే మనోహరధ్వనులున్నూ; మదన+ఆజ్ఞా, వాద్యఘోషంబునున్+పోలె= మన్మథుడి ఆజ్ఞను వెల్లడించే మృదంగాదివాద్యాల ధ్వనులవలె; మ్రోయుచుండ; మంద, గమనంబునన్= మెల్లమెల్లని నడకతో; పురందర, నందను, మందిరంబునకున్= దేవేంద్రుడి కుమారుడైన అర్జునుడి గృహానికి; అరుగుదెంచినన్= రాగా; ఆ+పురుష, సత్తముండు= ఆ పురుషశ్రేష్ఠుడు; భయ, భక్తి, సంభ్రమంబులతోన్= భయం, భక్తి, తొట్రుపాటులతో; ప్రత్యుత్థానంబును= తాను కూర్చున్న పీఠంనుండి లేచి ఎదురేగటమున్నూ; దండ, ప్రణామంబును= సాష్టాంగ నమస్కారం చేసి; కర, కమలంబులు= హస్తపద్మాలు; మొగిచి= ముకుళించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అప్పుడు సూర్యుడు అస్తమించే వేళ చంద్రుడు ఉదయించి తరపి వెన్నెల వెల్లివిరియగా దిక్కులనే అంగనలకు అలంకారం తీర్చిదిద్దాడు. దేవేంద్రుడి ఆదేశంతో ఊర్వశి లావణ్య మొప్పారగా అర్జున సంభోగాన్ని అభిలషించి, వెన్నెల వలె తెల్లనైన చీర సింగారించుకొని మెల్లగా నడయాడుతూ బయలు వెడలింది. కస్తూరి, కర్పూరం, కుంకుమపువ్వుతో మర్దించబడిన శ్రీగంధం మైపూతగా ధరించింది. వివిధ పరిమళాలతో గుబాళించే పువ్వులచెండ్లు ముడిచింది. మణిస్థగితాలై మిరుమిట్లు కొలిపే ఆభరణాలు ధరించి స్థిరమైన మెరపుతీగవలె ప్రకాశించింది. మణులు పొదుగబడిన అందెల ఝుళంఝుళ నినాదాలు, చేతి కంకణనిక్వాణాలు, మొలత్రాటి చిరుమువ్వల క్రేంకారనాదాలు వెరసి మన్మథుని ఆజ్ఞను, చాటే వాద్యధ్వనులవలె ధ్వనించాయి. అట్లా ఆమె మందగమనంతో పురందరనందనుడి (అర్జునుడి) మందిరం చేరింది. పురుషశ్రేష్ఠుడైన అర్జునుడు భయం, భక్తి, సంభ్రమం ముప్పిరిగొనే హృదయంతో ఆమెకు ఎదురేగి సాగిలి మ్రొక్కి, హస్తపద్మాలు మొగిచి ఇట్లా పలికాడు.

**క. 'ననుఁ బుత్త్రస్నేహంబున । మనమున మన్నించి శుభసమగ్రునిఁ జేయం**
**జనుదెంచి తీవు ముదమున । జనయిత్రీ! యేఁ గృతార్థజన్ముఁడ నైతిన్.' 359**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; పుత్త్ర, స్నేహంబునన్= పుత్రుడిపై కల అనురాగంతో; మనమునన్= మనస్సులో; మన్నించి= అభిమానించి; శుభ, సమగ్రునిన్+చేయన్= మంచిని నిండుగా చేకూర్చటానికి; ముదమునన్= సంతోషంతో; ఈవు= నీవు; చనుదెంచితి= వచ్చావు; జనయిత్రీ!= అమ్మా!; ఏన్= నేను; కృత+అర్థ, జన్ముఁడన్+ఐతిన్= ధన్యమైన జన్మ కలవాడినైనాను.

**తాత్పర్యం:** 'అమ్మా! నీవు నాపై గల పుత్రప్రేమతో నన్ను మన్నించటానికి సంతోషంతో ఇక్కడికి దయచేశావా? నీ రాకవలన నా జన్మ ధన్యమైంది'.

**తే.** **అనిన నూర్వశి యిట్లను నాత్మనేత్ర । మధుపము లతని సౌందర్యమధువుఁ గ్రోలు**
**చుండఁ దమకంబు మీఱి యనూన ధర్మ । నిపుణుఁ డగు నర్జునునితోడ నెయ్య మొనర. 360**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఊర్వశి; ఆత్మ, నేత్ర, మధుపములు= తన కన్ను లనే తుమ్మెదలు; అతని= ఆ అర్జునుడి యొక్క; సౌందర్య, మధువున్= అందం అనే తేనెను; క్రోలుచుండన్= ఆస్వాదిస్తుండగా; తమకంబు, మీఱి= ఉద్వేగం ఎక్కువ కాగా; అనూన, ధర్మ, నిపుణుఁడు+అగు= గొప్ప ధర్మాన్ని తెలిసికొని ఉండటంలో నేర్పరి అయిన; అర్జునునితోడన్; నెయ్యము+ఒనరన్= ప్రణయం ఒప్పేటట్లుగా; ఇట్లు= ఈ విధంగా; అనున్= పలికింది.

**తాత్పర్యం:** అని అర్జునుడు చెప్పగా విని ఊర్వశి, తన కన్ను లనే తుమ్మెదలు అతడి సొగసు అనే తేనెను క్రోలుతుండగా, వలపుతమకంతో ధర్మాత్ముడైన అర్జునుడితో ఇట్లా పలికింది.

**విశేషం:** ఊర్వశీ నేత్ర మధుపాలు, అర్జును సౌందర్యమధువు క్రోలటం అనే చోట రూపకాలంకారం ఉన్నది.

**చ.** **'అనుపమశౌర్య! నీదు సముదగ్ర గుణంబులు నారదాది స**
**న్మునివరులెల్లఁ జెప్పఁగఁ బ్రమోదమునన్ భవదీయ సంగమం**
**బనిశముఁ గోరుచుం దగఁ బ్రియంబున వచ్చితి; నేను గోరఁగా**
**నను జనయిత్రి వంచు నొక నాయము పల్కెదు వక్రభాషలన్. 361**

**ప్రతిపదార్థం:** అనుపమ, శౌర్య!= సాటిలేని శౌర్యం కలవాడా! (అన+ఉపమ= అనుపమ= ఉపమానం (పోలిక) చెప్పటానికి వీలులేని); నీదు= నీయొక్క; సమ్+ఉదగ్ర, గుణంబులు= గొప్ప మంచి లక్షణాలు; నారద+ఆది, సత్+ముని వరులు+ఎల్లన్= నారదుడు మొదలైన మంచి ఋషిశ్రేష్ఠు లందరు; చెప్పఁగన్= (పొగడి) చెప్పగా; ప్రమోదమునన్= మిక్కుటమైన సంతోషంతో; భవదీయ, సంగమంబు= నీయొక్క పొందు; అనిశమున్, కోరుచున్= ఎల్లప్పుడు కాంక్షిస్తూ; తగన్= ఒప్పేటట్లుగా; ప్రియంబునన్= ప్రీతితో; వచ్చితిన్= వచ్చాను; నేను, కోరఁగాన్= నేను అభిలషిస్తే; ననున్= నన్ను; జనయిత్రివి= తల్లివి; అంచున్= అంటూ; వక్రభాషలన్= వంకర మాటలతో; ఒక, నాయము= ఏదో ఒక ధర్మం; పల్కెదు= మాటాడతావు.

**తాత్పర్యం:** 'సాటిలేని పరాక్రమంకల ఓ అర్జునా! నీ గొప్పగుణాలు నారదుడు మున్నగు మహర్షులు పొగడి చెప్పగా విని, సంతోషించి, నీ పొందు కోరి ప్రీతితో నీవద్దకు వచ్చాను. కాని, నీవు నన్ను తల్లిగా సంభావించి వంకరమాటలతో ఏదో ఒక న్యాయం పలుకుతున్నావు. ఇది ఎంత విడ్డూరం!

**తే.** **నీకు నేనాఁటి తల్లిని నిజము సెపుమ? । యమరలోకంబు వేశ్యలమైన మాకు**
**నిట్టి తగవులు నడవ వహీనబాహు । వీర్య! యిచ్చట వావులు వెదకఁజనదు. 362**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; ఏనాఁటి, తల్లిని= ఏ దినం (కాలం)లో అమ్మను; నిజము= సత్యం; చెపుము+అ= చెప్పుము; అమర, లోకంబు, వేశ్యలము+ఐన, మాకున్= స్వర్గలోకానికి చెందిన వేశ్యలమైన మాకు; ఇట్టి, తగవులు= ఇట్టి ధర్మాలు; అహీన, బాహు వీర్య!= గొప్ప బాహుబలం కలవాడా!; నడవవు= అన్వయించవు; ఇచ్చటన్= ఈ స్వర్గలోకంలో; వావులు= వరుసలు (పుట్టుకకు సంబంధించిన అనుబంధాలు); వెదకన్+చనదు= అన్వేషించకూడదు.

**తాత్పర్యం:** గొప్ప బాహుబలం కల ఓ అర్జునా! నీకు నేను ఏ నాడు తల్లి నయినాను? నిజం చెప్పుము. మేము దేవలోకానికి చెందిన వేశ్యలం. ఇట్టి న్యాయాలు, వావి వరుసలు ఇక్కడ వెదకరాదు.

**విశేషం:** ఊర్వశి అర్జునుడిని సంబోధించే విధం తెలుపతగింది. 'అనుపమశౌర్య', 'అహీన బాహు వీర్య, ఈ సంబోధనలలో ఊర్వశి తనవలపు కూరి పెట్టింది. భూలోకంలోని ధర్మం వేరు. స్వర్గంలోని ధర్మం వేరు. భూలోకంలోని వేశ్యలకే వావివరుసలు లేనపుడు, ఇక కేవలం భోగపరాయణమైన స్వర్గంలోని వేశ్యలకా వావివరుసలు?- అనే ప్రశ్న ఊర్వశి మాటలలో అంతర్గర్భితం.

**వ. ఈ లోకంబున వనితలుఁ బురుషులు విచ్చలవిడిఁ గ్రీడింతు; రిచ్చటి కిది యనిందితంబైన యాచారంబు; నీవును ద్రిదివంబునకు వచ్చిన యప్పుడ దివ్యపురుషుండవు గావున నా మనోరథంబు సఫలంబుగా మందార మంజుల మంజరీ మకరంద పాన మత్తు మధుకర గాన మనోహర స్థలంబులను, మేరు శైల కందరంబులను, మంద పవనంబులు గల నందనాది వనంబులయందును, నితాంత కాంత వికసిత కనకారవింద సమధిక సౌరభ సంవాసిత మహానంద కందంబులైన మందాకినీ తీర మణిమయ వేదికలయందును, జంద్రికాసుందరంబులైన సికతాతలంబులను, మఱియు నిర్జర విహార స్థానంబుల ననవరత సురత కేళీ సౌఖ్యాంబుధి నన్ను నోలలార్పు' మనిన, నిర్వికార ధైర్యధుర్యుండై యర్జునుం డిట్లనియె. 363**

**ప్రతిపదార్థం:** ఈ, లోకంబునన్= ఈ స్వర్గంలోకంలో; వనితలున్= స్త్రీలు; పురుషులు= మగవారు; విచ్చలవిడిన్= స్వతంత్రంగా, (ఇష్టానుసారంగా); క్రీడింతురు= వినోదిస్తారు; ఇచ్చటికి+ఇది= ఈలోకంలో ఇది; అనిందితంబు+ఐన= తప్పుకాని; ఆచారంబు= సంప్రదాయం; నీవును; త్రిదివంబునకున్= స్వర్గానికి; వచ్చిన+అప్పుడు+అ= వచ్చినప్పుడే; దివ్య పురుషుండవు= దేవత్వం గల పురుషుడివి; కావునన్= కాబట్టి; నా, మనోరథంబు= నా కోరిక; సఫలంబుగా= ఫలించేటట్లుగా (అంటే ఈడేరేటట్లుగా); మందార, మంజుల, మంజరీ, మకరంద, పాన, మత్త, మధుకర, గాన, మనోహర, స్థలంబులను= మందార వృక్షాలయొక్క సుకుమారమైన పువ్వుల గుత్తులలోని తేనెలను త్రాగి మదించిన తుమ్మెదల పాటలచేత మనస్సును హరించే చోటులలో; మేరు, శైల, కందరంబులను= బంగారు కొండలోని గుహలలో; మంద, పవనంబులు+కల= పిల్ల తెమ్మెరలు వీచే; నందన+ఆది, వనంబుల+అందును= నందనం మొదలుగా గల తోటలలో; నితాంత, కాంత, వికసిత, కనక+అరవింద, సమధిక, సౌరభ, సంవాసిత, మహా+ఆనంద, కందంబులు+ఐన= ఎడతెగని, వెలుగు సొగసు చిమ్ముతూ, వికసించిన బంగారు తామరపువ్వులనుండి వెలువడే ఎక్కువ సువాసనలతో నిండి గొప్ప ఆనందానికి నిలయాలైన; మందాకినీ, తీర, మణిమయ, వేదికల+అందును= స్వర్గలోకంలోని గంగానది ఒడ్డున కల మణులతో నిర్మితాలైన అరుగుల మీదను; చంద్రికా, సుందరంబులు+ఐన= వెన్నెల సొంపారిన; సికతా, తలంబులను= ఇసుక తిన్నెలపైనను; మఱియు; నిర్జర, విహార, స్థానంబులన్= దేవతలు వినోదించే చోటులలో; (నిర్జరులు= ముసలితనంలేని వారు, దేవతలు); అనవరత, సురత, కేళీ, సౌఖ్య+అంబుధి= ఎడతెగని సంభోగ క్రీడయొక్క సౌఖ్యమనే సముద్రంలో; నన్నున్; ఓలలార్పుము+అనినన్= తేలించుమని చెప్పగా; నిర్వికార ధైర్య, ధుర్యుండు+ఐ= వికారం చెందని ధైర్యం వహించినవాడై; అర్జునుండు= అర్జునుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ స్వర్గలోకంలో స్త్రీ పురుషులు విచ్చలవిడిగా శృంగార సంభోగాలు అనుభవిస్తారు. ఇది ఇక్కడ తప్పు కాదు. నీవు స్వర్గానికి వచ్చిన దివ్యపురుషుడివి. నీవుకూడ ఇచటి ఆచారాలు పాటించవలసి ఉన్నది. ఇచట శృంగార రసానుభూతికి ఉద్దీపన విభావాలు ఎన్నో ఉన్నాయి. ఇచట మందార కల్పవృక్షాల, సుకుమారాలైన పూలగుత్తులు, ఆ పూలగుత్తులలోని తేనెలను క్రోలి మత్తిల్లి ఝుంకరించే తుమ్మెదల గాన మాధుర్యాలు, బంగారు కొండ గుహలు, పిల్ల తెమ్మెరలు సయ్యాటలాడే నందనోద్యానవనం, వెలుగు వెల్లువ వెదజల్లే పొందామరలు వికసించే మిన్నేటి జాలులు, ఆ మిన్నేటి తీరంలో పొందామరల నెత్తావులు గుబాళించే మణిమయ వేదికలు, వెన్నెల సొగసులు ప్రతిఫలించే ఇసుక తిన్నెలు, ముసలితనం లేని వేలుపుజంటలు విహరించే క్రీడాస్థలాలు ఉన్నాయి. ఇక నీవు నన్ను ఎడతెగని రత కేళీ సౌఖ్యసముద్రంలో ఓలలాడించుము'- అని ఊర్వశి ప్రణయ పరవశత్వంతో పలుకగా, నిర్వికారుడై, చలించని స్థైర్యంతో అర్జునుడు ఇట్లా బదులు పలికాడు.

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం. స్వర్గలోకంలో గంగానది పేరు మందాకిని. భూలోకగంగ పేరు భాగీరథి. పాతాళ లోక గంగ పేరు భోగవతి. మందారం- కల్పవృక్షాలలో ఒకటి. వేల్పుమ్రాను, కల్పవృక్షం కోరిన కోరికలు ఇచ్చే దేవవృక్షసామాన్యం. ఇవి అయిదు. 1. మందారం 2. పారిజాతం 3. సంతానం 4. కల్పకం 5. హరిచందనం.

**క. 'ఓహో! యిమ్మెయి ధర్మ। ద్రోహోక్తులు పలుకఁ దగునె? దోసం బది గా**
**దే? హరి హరి! మనమునఁ దగ। వూహింపక నన్నుఁ బలుకు టుచితమె నీకున్? 364**

**ప్రతిపదార్థం:** ఓహో! (ఆశ్చర్యాన్ని ప్రకటించే శబ్దం); ఈ+మెయిన్= ఈ విధంగా; ధర్మద్రోహ+ఉక్తులు= ధర్మానికి ద్రోహం కలిగించే మాటలు; (ద్రోహమంటే కీడు తలచటం); పలుకన్+తగునె?= మాటాడదగునా?; దోసంబు+అది+కాదె= అది దోషం కాదా! (అది అంటే వావివరుసలు లేని స్వేచ్ఛాశృంగారం); హరి హరి= కృష్ణ కృష్ణా! (వినరాని మాటలు చెవిని పడినప్పుడు హరి హరి! అని భగవన్నామ స్మరణం చేయటం పరిపాటి); మనమునన్= మనస్సులో; తగవు= న్యాయం (వావివరుస); ఊహింపక= యోచించక; నన్నున్+పలుకుట= నాతో (ఈవిధంగా) మాట్లాడటం; నీకున్= నీకు; ఉచితమె= తగునా?

**తాత్పర్యం:** 'ఓహో! ఈ విధంగా ధర్మానికి కీడు చేసే పలుకులు పలకటం నీకు తగునా! విచ్చలవిడి శృంగారం దోషం కాదా? హరి హరి! ఎంతటి మాట వినవలసి వచ్చింది? నీ మనస్సులో ఏ మాత్రం న్యాయం (వావివరుస) ఆలోచించక ఈ విధంగా మాటాడటం నీకు తగునా?

**విశేషం:** ఊర్వశి వివరించిన ప్రణయవేదాంతం ప్రపంచవాఙ్మయంలో అచ్చటచ్చట విశిష్టతను రూపొందించుకొన్నది. అర్వాచీన పారశీక వాఙ్మయంలో ఉమరుఖయ్యాము ఊర్వశికి పొట్టితమ్ముగుఱ్ఱ. మనుచరిత్రంలోని వరూధిని ఊర్వశికి చిన్నారి చిట్టి చెల్లెలే కదా!

### ఊర్వశి యర్జును నపుంసకునిఁగా శపించుట

**వ. జగంబులు పుట్టింపను మనుపను సమయింపను గర్తలైన దేవతలకు నెట్లు నడచిన నెగ్గు లేదు; నేను గర్మభూమిని జనియించితి; సత్కర్మపరుండ నైన నాకు నిచ్చటి యాచారం బుచితంబు గాదు; మదీయ వంశకర్త యైన పురూరవునకుఁ బత్నివైన కారణంబునను, బురందరునకుఁ బరిచర్య యొనర్చుటం జేసియు**

**నాకు జనని వగుట సందియంబు లేదు; తల్లీ! నన్నుం బుత్త్రవాత్సల్యంబునం జూడు' మనిన మదనబాణపీడితయై కోపారుణిత నయనంబుల నర్జునుం జూచి యూర్వశి 'యేను గామించి వచ్చిన నా మనోరథంబు విఫలంబుఁ జేసిన వాఁడవు; నీవు మర్త్యలోకంబున మానవర్జితుండవై మానినీమధ్యంబున నపుంసకుండవై యుండు' మని శాపం బిచ్చి నిజగృహంబునకుఁ జనియె; నంతఁ బ్రభాత సమయంబునఁ దద్వృత్తాంతం బంతయు విని సురపతి కొడుకున కిట్లనియె. 365**

**ప్రతిపదార్థం:** జగంబులు= లోకాలు; పుట్టింపను= సృష్టించటానికి; మనుపను= కాపాడటానికి; సమయింపను= లయించటానికి; కర్తలు+ఐన= చేసేవారైన; దేవతలకున్= స్వర్గలోకవాసులకు; ఎట్లు= ఏ విధంగా; నడచినన్= ప్రవర్తించినప్పటికిని; ఎగ్గు= కీడు; లేదు= ఉండదు; నేను; కర్మభూమిని= కర్మ ప్రధానంగా కల భూమిలో; జనియించితి= పుట్టాను; సత్, కర్మ, పరుండను+ఐన= మంచి పనులు చేయటంలో నిష్ఠకలవాడినైన నాకున్; ఇచ్చటి= ఈ స్వర్గలోకంలోని; ఆచారంబు= సంప్రదాయం (పాటించటం); ఉచితంబు, కాదు= మంచిది కాదు; మదీయ, వంశ, కర్త+ఐన= నా వంశానికి నిర్మాత అయిన; పురూరవునకున్= పురూరవుడు అనే రాజుకు; పత్నివి+ఐన, కారణంబునను= భార్యవైన హేతువుచేతనున్నూ; పురందరునకున్= ఇంద్రుడికి; పరిచర్య= సేవలు; ఒనర్చుటన్+చేసియు= చేయటంచేతనున్నూ; నాకు; జననివి+అగుట= తల్లివి అవటం; సందియంబు, లేదు= సందేహంలేదు; తల్లీ!= ఓ జననీ!; నన్నున్= నన్ను; పుత్త్ర వాత్సల్యంబునన్+చూడుము= పుత్త్రుల పట్ల ఉండే ప్రేమతో చూడుము; అనినన్= అని అనగా; మదన, బాణ, పీడిత+ఐ= మన్మథుడియొక్క బాణాలచేత పీడించ బడిందై; కోప+అరుణిత, నయనంబులన్= ఆగ్రహంచేత ఎర్రనైన కన్నులతో; అర్జునున్+చూచి= అర్జునుడిని చూచి; ఊర్వశి; ఏను= నేను; కామించి= వలపుకొని; వచ్చినన్= అరుదెంచగా; నా, మనోరథంబు= నా కోరిక; విఫలంబున్+చేసినవాఁడవు= వ్యర్థం చేసినావు; నీవు; మర్త్య, లోకంబునన్= భూలోకంలో; మాన, వర్జితుండవు+ఐ= అభిమానం లేని వాడివై; మానినీమధ్యంబునన్= ఆడువారి మధ్య; నపుంసకుండవు+ఐ= మగతనంలేనివాడివై; ఉండుము; అని; శాపంబు+ఇచ్చి= శాపాన్ని ఇచ్చి; నిజ, గృహంబునకున్+ చనియెన్= తన ఇంటికివెళ్ళింది; అంతన్= అటుపిమ్మట; ప్రభాతసమయంబునన్= తెల్లవారటం కాగా; తద్+ వృత్తాంతంబు+ అంతయు= ఆ జరిగిన కథ అంతటిని; విని= ఆలకించి; సురపతి= దేవేంద్రుడు; కొడుకునకు= కుమారుడికి అంటే అర్జునుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** సృష్టి స్థితి లయ శక్తులు కల దేవతలు ఎట్లా ప్రవర్తించినా వారికి చెల్లుబాటు అవుతుంది. నేను 'కర్మభూమి'లో జన్మించినవాడిని. సత్కర్మనిష్ఠచేత తరింప గోరే వాడిని. నీవు మా వంశకర్త అయిన పురూరవుడికి భార్యవు. నా తండ్రి అయిన ఇంద్రుడికి పరిచారికవు. కావున నాకు జనయిత్రివి. నన్ను నీవు పుత్త్రవాత్సల్యంతో చూడుము తల్లీ!'- అని అర్జునుడు ఊర్వశితో చెప్పాడు. ఊర్వశికి కోపం వచ్చింది. మదనబాణపీడిత అయిన ఆమె 'నేను నిన్ను వలచి వస్తే నా కోరిక వమ్ము చేశావు. కాబట్టి నీవు భూలోకంలో నపుంసకుడివై, మానినీమధ్యంలో మానరహితుడివై ఉండుము' - అని శాపం ఇచ్చింది. ఆ రాత్రి జరిగిన సంగతులు తెల్లవారిన పిమ్మట దేవేంద్రుడు విని తన కుమారు డైన అర్జునుడితో ఇట్లా పలికాడు.

**విశేషం:** అర్జునుడు తాను 'కర్మభూమి'లో జన్మించినట్లు ఊర్వశితో నొక్కి వక్కాణించాడు. భారతదేశాన్ని కర్మభూమిగా పలువురు అభివర్ణించి ఉన్నారు. ఇచట 'కర్మభూమి' అంటే అంతరార్థ మేమిటి? కర్మభూమి అంటే కర్మ చేసేభూమి అని అర్థం చెప్పితే కర్మ చేయని భూమి ఎక్కడైన ఉన్నదా? అని ఎదురు ప్రశ్న వస్తుంది. దీనికి అర్జునుడు ప్రయోగించిన తదుపరి వాక్యం 'సత్కర్మపరుండైన నాకు ఇచటి ఆచారంబు ఉచితంబు గాదు' అనే దాన్ని తోడు చేసికొని యోచించవలసి ఉన్నది.

'కర్మసిద్ధాంతం' జగత్ ప్రసిద్ధమైనట్టిది. సత్కర్మ చేస్తే పుణ్యం కలుగుతుంది. దుష్కర్మ ఆచరిస్తే పాపం వస్తుంది. కర్మఫలం అవశ్యం అనుభోక్తవ్యం' - అనేవి కర్మ సిద్ధాంతం లోని మూలసూత్రాలు. కాబట్టి, కర్మ సిద్ధాంతంలో నమ్మకం గల స్థలం 'కర్మభూమి' - అని నిర్వచించవచ్చు. అర్జునుడు చెప్పినట్లు 'కర్మభూమి' లో పుట్టి, కర్మసిద్ధాంతంపై నమ్మకం ఉన్న వారికి తరణోపాయం 'సత్కర్మ పరత్వమే'.

**క. 'నీయట్టి ధైర్యవంతుని । నే యుగముల నైనఁ గాన మెన్నండును; ధ**
**ర్మాయత్తమతివి; మునులకు । నీ యింద్రియజయము గీర్తనీయము తండ్రీ! 366**

**ప్రతిపదార్థం:** తండ్రీ!= ఓ ప్రియకుమారా! (తండ్రి తన కొడుకును ప్రియమార 'తండ్రీ!' అని సంబోధించటం తెలుగులో అనుభవ ఆమ్రేడితం); నీ+అట్టి, ధైర్యవంతునిన్= నీబోటి ధీరత్వం కలవాడిని; ఏ+యుగములన్+ఐనన్= ఏకాలాల్లోనైనా (యుగం దీర్ఘకాలానికి కాలమానం); ఎన్నండును= ఎప్పుడును; కానము= చూడం; (నీవు) ధర్మ+ఆయత్తమతివి= ధర్మానికి స్వాధీనమైన బుద్ధి కలవాడివి; నీ+ఇంద్రియ, జయము= నీవు ఇంద్రియాలపై సాధించిన గెలుపు; మునులకు= మౌనంతో తపస్సు కావించే ఋషులకు; కీర్తనీయము= పొగడతగింది.

**తాత్పర్యం:** 'తండ్రీ! నీవు ధర్మాత్ముడివి. నీవంటి ధైర్యవంతుని ఏకాలంలోకూడ చూడలేదు. నీవు ఇంద్రియాలపై సాధించిన విజయం ఋషీశ్వరులు కూడ కీర్తించతగింది.

**తే. అనఘ! యూర్వశి యిచ్చిన యట్టి శాప । మనుభవింపంగ వలయు నీ కవనియందు;**
**నింక మీ పదుమూఁడవయేఁడు సత్య । సరణి నజ్ఞాతవాసంబు సలుప వలయు. 367**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ అర్జునా!; ఊర్వశి+ఇచ్చిన+అట్టి, శాపము= ఊర్వశి ఇచ్చిన శాపం; నీకు+అనుభవింపంగవలయున్= నీకు అనుభవించక తప్పదు; అవనియందున్= భూలోకంలో; ఇంక= ఇకమీద; మీ, పదుమూఁడవ, ఏఁడు= (మీరు చేసిన ప్రతిజ్ఞలోని) పదమూడవ సంవత్సరం; సత్యసరణిన్= సత్యాన్ని పాటించే పద్ధతిని బట్టి; అజ్ఞాతవాసంబు= ఇతరులకు తెలియనట్టి నివాసచర్య; సలుపవలయున్= నెరవేర్చాలి.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ అర్జునా! ఊర్వశి ఇచ్చిన శాపం భూలోకంలో నీవు అనుభవించక తప్పదు. మీరు అన్నమాట ప్రకారం పదమూడవ సంవత్సరం అజ్ఞాతవాసం చేయవలసి ఉన్నది కదా!

**వ. అక్కాలంబున నీవు షండరూపంబునఁబ్రచ్ఛన్నుండవై, రాజకన్యకలకు నృత్యంబు గఱపుచుండి, తదంత్యంబున శాపమోక్షంబు వడయు' మని యనుగ్రహించె; 'నీ యాఖ్యానంబు విన్న పుణ్యపురుషులు సకలదురిత విముక్తు లగుదు' రని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 368**

**ప్రతిపదార్థం:** ఆ+కాలంబునన్= ఆ సమయంలో; ఈవు; షండ, రూపంబునన్= నపుంసక ఆకృతితో; ప్రచ్ఛన్నుండవై= ఇతరులకు తెలియనట్టి వాడివై; రాజ కన్యకలకు= రాజుగారి పుత్రికలకు; నృత్యంబున్= నాట్యాన్ని; కఱపుచుండి= నేర్పుచుండి; తద్+అంత్యంబునన్= ఆ పదమూడవ సంవత్సరం చివర; శాపమోక్షంబు= శాపంనుండి విముక్తి; పడయుము= పొందుము; అని; అనుగ్రహించెన్= దయ చూపించాడు; ఈ, ఆఖ్యానంబు= ఈ కథ; విన్న= వినిన; పుణ్యపురుషులు= మంచివారు; సకల, దురిత, విముక్తులు+అగుదురు= అన్ని పాపాల నుండి నిష్కృతి చెందుతారు; అని= అంటూ;చెప్పి;వైశంపాయనుండు= వైశంపాయను డనే ఋషి; జనమేజయునకు= జనమే జయుడనే మహారాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో నీవు నపుంసకరూపంలో మారువేషంతో రాజకన్యలకు నాట్యం నేర్పుతూ ఉంటావు. ఆ గడువు తీరగానే శాపవిమోచనం కలుగుతుంది'- అని ఇంద్రుడు అర్జునుడిపై దయ చూపాడు. 'ఈ కథ విన్న పుణ్యపురుషులు సమస్తపాపాలనుండి విముక్తులు కాగల'రని వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు.

**విశేషం:** వైశంపాయనుడు వేదవ్యాస మహర్షి శిష్యుడు, వ్యాసుడు భారత ఇతిహాసాన్ని వ్రాసిన మహనీయుడు. అతడు పాండవులకు కౌరవులకు సమకాలీనుడు. భారత కథలో విశిష్ట భూమిక నిర్వహించినవాడు. మహాభారతయుద్ధం అయిన తర్వాత వ్యాసమహర్షి భారతకథను ఎనిమిదివేల శ్లోకాలతో రచించాడు. దానికి 'జయ' మని పేరు. తదుపరి వ్యాసశిష్యులు ఐదుగురు వైశంపాయనుడు, సుమంతుడు, పైలుడు, జైమిని, శుకుడు పంచభారతాలు వ్రాశారు. వైశంపాయన మహర్షి వ్రాసిన భారతం ఇరవైనాలుగు వేల శ్లోకాలు కలది. జనమేజయుడు చేసిన సర్పయాగంలో పఠించబడింది. ప్రధానశ్రోత జనమేజయుడు. అర్జునుడి కుమారుడు అభిమన్యుడు. అభిమన్యుడి కొడుకు పరీక్షిత్తు. పరీక్షితుడి పుత్రుడు జనమేజయుడు. జనమేజయుడు చేసిన సర్పయాగంలో వైశంపాయనమహర్షి తన భారతాన్ని వినిపించాడు. తర్వాత నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులకు ఉగ్రశ్రవసుడు అనే సూతుడు ఏకలక్షశ్లోక సంభృతమైన మహేతిహాసం మహాభారతాన్ని వినిపించాడు. నైమిశారణ్యంలో కులపతి శౌనకుడు పన్నెండేండ్ల సత్రయాగం నిర్వహించాడు. అచటి ప్రధానశ్రోతలు శౌనకాదిమహర్షులు. మహాభారత ప్రోక్తసూతుడు ఉగ్రశ్రవసుడు. అందువలనే మహాభారతంలోని ఆశ్వాసారంభాల్లో 'అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె'. 'దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె'- అనే వాక్య విశేషాలు కనిపిస్తాయి.

**సీ.** **వజ్రాస్త్ర మాదిగా వరదుఁడై వివిధ ది । వ్యాస్త్రముల్ పార్థున కమర నిచ్చి,**
**తత్ప్రయోగంబులుఁ దద్రహస్యంబులుఁ । దన్నివర్తనములుఁ దడయ కపుడ**
**దయ నుపదేశించి 'దారుణాహవములం । దవిజేయ వీర్యుండ వగుము పేర్మి'**
**నని మహాసౌహార్దుఁడై చిత్రసేనుఁడన్ । గంధర్వపతితోడ గారవమున**

**ఆ.** **వజ్రధరుఁడు గీతవాద్యనృత్యంబులు । గఱవఁ బంచెఁ బార్థుఁ గడఁగి, యిట్టు**
**లమరనాథునొద్ద నర్జునుం డుండ నే । నేఁడు లరిగె నిట మహీతలమున.** **369**

**ప్రతిపదార్థం:** వజ్రధరుఁడు= దేవేంద్రుడు; వజ్ర+అస్త్రము+ఆదిగా= వజ్ర మనే అస్త్రం మొదలుగా; వరదుఁడు+ఐ= కోరికలను ఇచ్చేవాడై; వివిధ, దివ్య+అస్త్రముల్= పెక్కుదివ్యాలైన అస్త్రాలు; పార్థునకు= అర్జునుడికి; అమరన్+ఇచ్చి= అనువయ్యేటట్లు ఇచ్చి; తద్+ప్రయోగంబులున్= వాటి అనుసంధానాలు; తద్+రహస్యంబులున్= అందలి లోగుట్లు; తద్+నివర్తనములున్= వాటి ఉపసంహారాలు; తడయక= ఆలస్యంలేకుండ; అపుడు+అ= అపుడే; దయన్= కరుణతో; ఉపదేశించి= నేర్పి; దారుణ+ ఆహవములందు= ఘోరయుద్ధాలలో; పేర్మిన్= గౌరవంతో; అవిజేయ, వీర్యుండవు+అగుము= జయింపరాని బలం కలవాడివి కమ్ము; అని= అని చెప్పి; మహా, సౌహార్దుఁడు+ఐ= గొప్ప సుహృద్భావం కలవాడై; చిత్రసేనుఁడు+అన్= చిత్రసేనుడు అనే పేరు గల; గంధర్వపతితోడన్= గంధర్వరాజుతో; గారవమునన్= గొప్పగా; గీత, వాద్య, నృత్యంబులు= పాటలు, జంత్రాలు, నృత్యాలు అంటే సంగీతశాస్త్రం ('గీతం చ వాద్యం చ నృత్యం చ సంగీతమ్'); పార్థున్= అర్జునుడిని; కడఁగి= పూని; కఱపన్+ పంచెన్= నేర్పటానికి నిర్దేశించాడు; ఇట్టులు= ఈ విధంగా; అమరనాథు+ఒద్దన్= దేవేంద్రుడి దగ్గర; అర్జునుండు+ ఉండన్= అర్జునుడు ఉండగా; ఇట= ఇక్కడ; మహీతలమునన్= భూలోకంలో; ఏను+ఏఁడులు= ఐదు సంవత్సరాలు; అరిగెన్= గడచిపోయాయి.

**తాత్పర్యం:** దేవేంద్రుడు వజ్రాస్త్రం మున్నగు దివ్యాస్త్రాలను అర్జునుడికి అనుగ్రహించాడు. ఆ అస్త్రాల ప్రయోగ విధానాలు, అందలి లోగుట్టులు, వాటి ఉపసంహార మార్గాలు అన్నిటిని దయతో వెనువెంటనే ఉపదేశించాడు.

'ఘోరసంగ్రామాలలో జయించరాని బలంతో విక్రమించుము'- అని దీవించి గొప్ప సుహృత్‌భావంతో చిత్రసేనుడనే గంధర్వరాజుదగ్గర అర్జునుడు గీతవాద్యనృత్య విద్యలు నేర్చుకొనటానికి ఏర్పాటు చేశాడు. ఈ విధంగా దేవేంద్రుడి దగ్గర అర్జునుడు ఉండగా భూలోకంలో ఐదు సంవత్సరాలు గడిచాయి.

**విశేషం:** అర్జునుడు స్వర్గలోకంలో గడిపిన కాలం భూలోకకాలమానం ప్రకారం ఐదు సంవత్సరాలు. మూలంలో ఇట్లా ఉన్నది - "గృహీతాస్త్రస్తు కౌంతేయో, భ్రాతౄన్ సస్మార పాండవః । పురందర నియోగాచ్చ పంచాబ్దమవసత్ సుఖీ॥" (సం. 3.45.5) ప్రాచీన భారతీయ వాఙ్మయం దేవమానం వేరు, భూలోకకాలమానం వేరు- అని నిర్దుష్టంగా నిర్ణయించి చెప్పింది. నేడు విజ్ఞాన శాస్త్రజ్ఞులు రోదసీయానయుగంలో భూలోక కాలమానం వేరు, రోదసీ కాలమానం వేరు- అని చెప్తున్నారు. ఇది సామాన్యుల మేధకు అందే యోచన కాదు.

**వ. అంత నొక్కనాఁడు రోమశుం డను మహాముని యింద్రునొద్దకు వచ్చి సురగణపూజితుండై సురేంద్రుతో నేకాసనంబున నున్న యర్జునుం జూచి యాశ్చర్యం బంది యింద్రున కిట్లనియె. 370**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; ఒక్కనాఁడు= ఒకానొక దినం; రోమశుండు+అను= రోమశు డనే పేరున్న; మహా, ముని= గొప్పఋషి; ఇంద్రు+ఒద్దకు, వచ్చి= ఇంద్రుడి కడకు వచ్చి; సుర, గణ, పూజితుండు+ఐ= దేవతల సముదాయంచేత అర్చించబడినవాడై; సురేంద్రుతోన్= దేవేంద్రుడితో; ఏక+ఆసనంబునన్= ఒకే పీఠంపై; ఉన్న= ఉన్నట్టి; అర్జునున్+చూచి= అర్జునుడిని చూచి; ఆశ్చర్యంబు+అంది= అచ్చెరువు పొంది; ఇంద్రునకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** తరువాత ఒకానొక రోజు రోమశుడు అనే గొప్పముని ఇంద్రునికడకు వచ్చాడు. రోమశుడిని దేవతలందరు అర్చించారు. దేవేంద్రుడితో పాటు అర్ధాసనంపై ఆసీనుడై ఉన్న అర్జునుడిని చూచి, ఆశ్చర్యం పొంది, ఇంద్రుడితో రోమశుడు ఈ విధంగా పలికాడు.

**క. 'కోరి యనేకయుగంబు ల । పారతపోయుక్తు లైనవారికిఁ బడయన్**
**దూరము నీ సభ, మఱి నీ । కారుణ్యం బంతకంటెఁ గడు ద వ్వెందున్. 371**

**ప్రతిపదార్థం:** కోరి= అభిలషించి; అనేక, యుగంబులు= పెక్కు యుగాలు; అపార, తపస్+యుక్తులు+ఐన వారికిన్= మితిలేని తపస్సుతో కూడినవారికి; నీ, సభ= నీసభ; పడయన్+దూరము= పొందటానికి దూరమైనది; మఱి= ఆపైన; నీ, కారుణ్యంబు= నీ దయ; ఎందున్= ఎచటనైనను; అంతకంటెన్= దానికంటె కూడ; కడు= మిక్కిలి; దవ్వు= దూరం.

**తాత్పర్యం:** 'పెక్కుయుగాలు కోరి దీక్ష వహించి గొప్పతపస్సు చేసినవారు కూడ నీ కొలువుకూటం చేరుకోలేరు. అది వారికికూడ సుదూరం. ఒకవేళ ఇంత సుదూరమైన నీ కొలువుకూటం చేరుకొన్నా నీదయ సంపాదించటం అంతకంటె కష్టం.

**వ. అట్టియందు నీతో నొక్కట నేకాసనం బెక్కి నీ రెండవమూర్తియుంబోలె నున్న యిమ్మనుజుం డెందులవాఁ డెవ్వఁ' డనిన నమ్మునీంద్రునకు దేవేంద్రుం డిట్లనియె. 372**

**ప్రతిపదార్థం:** అట్టియందు= అట్టిది ఆ విధంగా ఉంటే, (నీ సభ దుర్లభం, నీదయ అంతకంటె దుర్లభం)- అట్టిదానిలో; నీతోన్+ఒక్కటన్= నీతోపాటు ఒకటిగా; ఏక+ఆసనంబు= ఒకే పీఠం; ఎక్కి= అధిరోహించి; నీ, రెండవ, మూర్తియున్, పోలెన్=

నీ రెండవ స్వరూపంవలె; ఉన్న= ఉన్నటువంటి; ఈ+మనుజుండు= ఈ మానవుడు; ఎందులవాఁడు= ఎక్కడివాడు?; ఎవ్వఁడు= ఎవడు?; అనినన్= అని అడుగగా; ఆ+ముని+ఇంద్రునకున్= ఆ ఋషివరేణ్యుడికి; దేవ+ఇంద్రుండు= దేవేంద్రుడు; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అటువంటి స్థితిలో, నీతోపాటు నీ అర్ధాసనం ఎక్కి నీ రెండవ మూర్తియా? అన్నట్లు తోచే ఈ మానవుడు ఎవడు? ఎక్కడివాడు?'- అని అడుగగా, ఆ మునిశ్రేష్ఠునికి దేవేంద్రుడు ఇట్లా బదులు పలికాడు.

**క. 'నరుఁ డను మహర్షి యీతఁడు । నరలోకమునందుఁ బుట్టె నా యంశమునన్**
**గురుమతిఁ గౌంతేయుఁడు, భా । సుర తేజుఁ డుపేంద్రసఖుఁడు సువ్వె! మునీంద్రా! 373**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడమైన రోమశా!; ఈతఁడు= నా అర్ధాసనంలో ఉన్న ఈ మనుజుడు; నరుఁడు +అను, మహర్షి= నరుడు అనే పేరుకల గొప్ప ఋషి; నా, అంశమునన్= నాపాలు పంచుకొని; నర, లోకమునందున్+పుట్టెన్= నరలోకంలో జన్మించాడు; గురుమతిన్= గొప్పమేధతో; కౌంతేయుఁడు= కుంతీదేవి కుమారుడు; భాసుర, తేజుఁడు= గొప్ప తేజస్వి; ఉపేంద్ర, సఖుఁడు= విష్ణుదేవుడికి మిత్రుడు; సువ్వె!= సుమా!;

**తాత్పర్యం:** 'ఓ రోమశ మహర్షీ! ఇతడు నరుడనే మహర్షి. భూలోకంలో నా అంశతో జన్మించినవాడు. ఇతడు మేధావి. కుంతీపుత్రుడు, గొప్ప తేజస్వి, విష్ణుదేవుడి మిత్రుడు.

**తరలము.**

**శివుఁడు వీనికిఁ బ్రీతుఁడై దయ సేసెఁ బాశుపతాస్త్ర; మా**
**దివిజముఖ్యులతోడ నేనును దివ్యబాణము లిచ్చితిం;**
**దివిరి యీతఁడు మత్ప్రియంబుగ దేవకార్యము దీర్పఁగా**
**సవినయస్థితి నున్నవాఁడు నిజప్రతాపబలోన్నతిన్. 374**

**ప్రతిపదార్థం:** శివుఁడు= పరమేశ్వరుడు; వీనికిన్= ఈ అర్జునుడికి; ప్రీతుఁడు+ఐ= ప్రీతిని పొందినవాడై; పాశుపత+అస్త్రమున్= పాశుపతం అనే అస్త్రాన్ని; దయ+చేసెన్= అనుగ్రహించాడు; దివిజ, ముఖ్యులతోడన్= దేవతా నాయకులతోకలసి; ఏనును= నేనుకూడ; దివ్య, బాణములు= అస్త్రాలను; ఇచ్చితిన్= ఇచ్చాను; తివిరి= పూనికతో; ఈతఁడు= ఇతడు; (ఈ అర్జునుడు); నిజ, ప్రతాప, బల+ఉన్నతిన్= తన యొక్క పరాక్రమంతో కూడిన బలంయొక్క అతిశయంచేత; మత్+ప్రియంబుగ= నా ప్రీతికొరకు; సవినయ స్థితిన్= వినయ భావంతో; దేవకార్యము= దేవతలకు ప్రయోజనకరమైన పనిని; తీర్పఁగా= నెరవేర్చటానికి; ఉన్నవాఁడు= సంసిద్ధుడై ఉన్నాడు.

**తాత్పర్యం:** పరమేశ్వరుడు ఈ అర్జునుడిని అనుగ్రహించి పాశుపతాస్త్రాన్ని ప్రసాదించాడు. నేనును, దిక్పాలకులతోపాటు ఈతడికి దివ్యాస్త్రాలు ఒసగి ఉన్నాను. ఇప్పుడు ఈతడు తన పరాక్రమ బలోన్నతిచేత నా సంతోషంకొరకు దేవతలకు ప్రయోజనకరమైన కర్తవ్యాన్ని సవినయంగా నెరవేర్చనున్నాడు.

**విశేషం:** నన్నయ మహాకవి సాధించిన సంస్కృతాంధ్ర భాషలలోని ఛందస్సుల సమన్వయానికి తరలం గీటురాయి అని చెప్పవచ్చును. తరలంలో నాలుగు పాదాలు ఉంటాయి. ప్రతిపాదంలో న - భ - ర - స -జ -జ - గ అనే గణాలు ఉంటాయి. ప్రాస నియమం ఉన్నది. ప్రాసయతి చెల్లదు. ప్రతి పాదంలోనూ 1-12 అక్షరాలకు యతిమైత్రి చెల్లుతుంది.

ముత్యాల సరాల ఛందస్సును నవయుగ కవిచక్రవర్తిగా ఆధునికులు కీర్తిస్తున్న శ్రీ గురజాడ అప్పారావుగారు క్రొంగ్రొత్తగా ప్రచారంలోనికి తెచ్చి ఉన్నారు. 'ముత్యాలసరాలు' తొలి మూడు పాదాలలో 3 మాత్రలు+4 మాత్రలు రెండు మార్లు ఉంటాయి; నాల్గవపాదం అసంపూర్ణంగా ఉంటుంది. తరళం ప్రతిపాదం ఒక 'ముత్యాలసరం' అని అభిజ్ఞులు గుర్తించవలసి ఉంటుంది.

**వ. మఱియు వసుమతీ ఖాత గర్వితులైన సగరసుతులం దనదృష్టితీవ్ర దహనంబునం జేసి దహించిన కపిలుం డను మహాముని నారాయణుండయ్యె; నట్టి నరనారాయణు లాదిమునులు జగదుపకారులు జగతీ భారావతరణ కారణులై దైత్యదానవవధార్థంబు మర్త్యంబునం బుట్టినవారు గావున. 375**

**ప్రతిపదార్థం:** మఱియు= అదియునుగాక, వసుమతీ, ఖాత, గర్వితులు+ఐన= భూమిని త్రవ్వటం చేత మదించిన; సగర, సుతులన్= సగరుడియొక్క కొడుకులను; తన, దృష్టి, తీవ్ర, దహనంబునన్+చేసి= తనయొక్క చూపు లనే తీవ్రమైన అగ్నిచేత; దహించిన= కాల్చిన; కపిలుండు+అను, మహాముని= కపిలు డనే పేరు కల గొప్పఋషి; నారాయణుండు+అయ్యెన్= నారాయణుడనే ముని అయ్యాడు; అట్టి; నరనారాయణులు= నరుడున్నూ, నారాయణుడున్నూ; ఆది, మునులు= తొల్లిటి ఋషులు; జగత్+ఉపకారులు= లోకానికి మేలు చేకూర్చేవారు; జగతీ భార+అవతరణ, కారణులు+ఐ= లోకంయొక్క బరువును తీర్చటానికై జన్మించిన హేతువు కలవారై; దైత్య, దానవ, వధ+అర్థంబు= దైత్యులను, దానవులను సంహరించటం కొరకు; మర్త్యంబునన్= భూలోకంలో; పుట్టినవారు= జన్మించినవారు; కావునన్= కాబట్టి.

**తాత్పర్యం:** భూమిని పాతాళంవరకు తొలచటంచేత గర్వం చెందిన సగరసుతులను తన వాడి చూపుల అగ్నిచేత కాల్చివేసిన కపిలు డనే గొప్పముని నారాయణు డయ్యాడు. అట్టి నరనారాయణులు ఆదిఋషులు. వారు విశ్వశ్రేయస్సును ఒనగూర్చేవారు; దైత్యులను, దానవులను వధించి, భూభారాన్ని తీర్చటానికై అవతరించిన కారణజన్ములు.

**క. దేవతలకు నపకారము । గావించిన యన్నివాతకవచులఁ బాతా**
**ళావాసుల దానవుల మ । హావీరుఁడు వీఁ డభేద్యుఁ డై వధియించున్.' 376**

**ప్రతిపదార్థం:** దేవతలకున్+అపకారము, కావించిన= స్వర్గవాసులకు కీడు చేసిన; ఆ+నివాత, కవచులన్= ఆ నివాత కవచులు అనే వారిని; పాతాళ+ఆవాసులన్= పాతాళంలో నివసించే వారిని; దానవులన్= రాక్షసులను; మహా, వీరుఁడు= గొప్ప యోధుడు; వీఁడు= ఇతడు (ఈ అర్జునుడు); న+భేద్యుఁడు+ఐ= జయించబడనివాడై; వధియించున్= చంపుతాడు.

**తాత్పర్యం:** దేవతలకు కీడు చేసిన రాక్షసులు, పాతాళంలో నివసించేవారు అయిన ఆ నివాతకవచులను మహావీరుడైన ఈ అర్జునుడు అజేయుడై సంహరించగలడు.'

**వ. అని తత్ప్రభావంబు సెప్పి యింద్రుండు రోమశున కిట్లనియె 'మునీంద్రా! నీవు మర్త్యలోకంబునకుం బోయి ధర్మజుం గని యతనికిం దత్సహోదరులకు సంతోషంబుగా నా యొద్దం బార్థుండున్న కుశలవార్త యెఱింగించి, భీష్మ ద్రోణ కర్ణాది వీరుల నోర్చునట్టి దివ్యాస్త్రంబులు వడసె, నతండు మీ యొద్దకు వేగంబ వచ్చు, వగవకుండుం డని చెప్పి నా వచనంబున ధర్మజు నఖిలతీర్థసేవ సేయం బంపు; మట్లయిన నపేతదురితుండై యఖిల మహీరాజ్యంబు వడయు; నతండు తీర్థాభిగమనంబు సేయునపుడు నీ వాతనికి సహాయుండవు గ'మ్మని యింద్రుండు రోమశుం బనిచె; నిట ధృతరాష్ట్రుం డర్జును దివ్యాస్త్రలాభంబుఁ బారాశర్యువలన నెఱింగి పరమవ్యాకులహృదయుండై సంజయున కిట్లనియె. 377**

**ప్రతిపదార్థం:** అని; తద్+ప్రభావంబు= ఆతడి (అర్జునుడి) మహిమ; చెప్పి; ఇంద్రుండు= ఇంద్రుడు; రోమశునకు+ఇట్లు+అనియె; ముని+ఇంద్రా!= ఋషులలో శ్రేష్ఠుడవైన వాడా!; నీవు, మర్త్య, లోకంబునకున్+పోయి= భూలోకానికి వెళ్ళి; ధర్మజున్+కని= ధర్మరాజును చూచి; అతనికిన్= అతడికిన్నీ; తద్+సహోదరులకున్= ఆతడి సోదరులకున్నూ; సంతోషంబుగాన్= సంతోషం కలిగేట్లుగా, పార్థుండు= అర్జునుడు; నా, ఒద్దన్= నా దగ్గర; ఉన్న= ఉన్నట్టి; కుశలవార్త= క్షేమసమాచారం; ఎఱింగించి= తెలిపి; భీష్మ, ద్రోణ, కర్ణ+ఆది, వీరులన్= భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మున్నగు శూరులను; ఓర్చు+అట్టి= జయించే; దివ్య+అస్త్రంబులు= దివ్యమైన బాణాలు; పడసెన్= పొందాడు; అతండు= అతడు (అర్జునుడు); మీ+ఒద్దకు= మీకడకు; వేగంబు+అ, వచ్చు= శీఘ్రమే రాగలడు; వగవక+ఉండుండు= దుఃఖించ వద్దు; అని, చెప్పి= అని పలికి; నా వచనంబునన్= నా మాట చొప్పున; ధర్మజున్= ధర్మరాజును; అఖిల, తీర్థ, సేవ+చేయన్+పంపుము= సమస్తములైన పుణ్య, క్షేత్రాలు దర్శించటానికి పంపుము; అట్లు+అయినన్= ఆ విధంగా చేస్తే; అపేత, దురితుండు+ఐ= పోగొట్టుకొన్న పాపాలు కలవాడై, అంటేపాపాలు పోయినవాడై; అఖిల, మహీ, రాజ్యంబు= సమస్తభూరాజ్యం; పడయున్= పొందగలడు; అతండు= ఆ ధర్మరాజు; తీర్థ+అభిగమనంబు+చేయునపుడు= పుణ్యక్షేత్రాలకు యాత్రలు చేసేటప్పుడు; నీవు+అతనికి= నీవు ఆ ధర్మరాజుకు; సహాయుండవు కమ్ము= సాయం చేయుము; అని= అని చెప్పి; ఇంద్రుండు= ఇంద్రుడు; రోమశున్= రోమశమునిని; పనిచెన్= నియోగించాడు; ఇట= ఈ భూలోకంలో; అర్జును, దివ్య+అస్త్ర, లాభంబున్= అర్జునుడి దివ్యాలైన అస్త్రాల సంపాదన; పారాశర్యువలనన్= వ్యాసుడి వలన; ఎఱింగి= తెలిసికొని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; పరమ, వ్యాకుల హృదయుండు+ఐ= మిక్కిలి కలవరపాటు చెందిన హృదయం కలవాడై; సంజయునకు= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆవిధంగా నరనారాయణుల మహిమ వివరించి, ఇంద్రుడు రోమశునితో ఇట్లా అన్నాడు: 'మునీంద్రా! నీవు భూలోకానికి వెళ్ళి ధర్మరాజును చూచి అతడికి, అతడి తమ్ములకు సంతోషం కలిగేటట్లు నా ఒద్ద అర్జునుడు కుశలంగా ఉన్న వార్త తెలిపి- అర్జునుడు భీష్మ ద్రోణ కర్ణాది మహావీరులను జయించగల దివ్యాస్త్రాలు పొందాడు. అతడు మీ దగ్గరికి శీఘ్రంగా రాగలడు. చింతించవద్దు' అని చెప్పుము. నా మాటగా చెప్పి నీవు ధర్మరాజును తీర్థయాత్రలు చేయ నియోగించుము. అట్లా చేస్తే అతడు పాపరహితుడై తిరిగి సమస్త భూరాజ్యం పొందగలడు. అతడు తీర్థయాత్రలు చేసేటప్పుడు నీ వాతనికి సహాయుడివై ఉండుము'- అని ఇంద్రుడు రోమశుడిని ఆదేశించాడు. ఇక్కడ, భూలోకంలో ధృతరాష్ట్రుడు వ్యాసుడివలన అర్జునుడు దివ్యాస్త్రాలు సంపాదించాడని తెలిసికొని మిక్కిలి కలవరపాటు చెంది, సంజయుడితో ఇట్లా అన్నాడు.

**సీ.** **'సురసమూహంబుతో సురరాజు నోడించి । ఖాండవం బెక్కటి కాల్చియున్న**
**వీరున, కఖిలాబ్ధివృతవసుంధరఁ గల । రాజుల నోర్చి పరాక్రమమున**
**నగ్రజు రాజసూయాధ్వర మనిచిన । యధికసమర్థున, కర్జునునకుఁ,**
**బ్రబలసింహమునకుఁ బక్కెర వెట్టిన । యట్లు దేవతలు నెయ్యంబుతోడఁ**

**ఆ.** **బరముఁ దొట్టి పాశుపత మాదిగా దివ్య । శరము లిచ్చి రట్టె! శౌర్య మెసఁగ**
**నట్టి నరుఁడు యోధుఁడై యున్న పాండవ । వరులఁ జెనయు నంత వారుఁ గలరె?** **378**

**ప్రతిపదార్థం:** సుర, సమూహంబుతోన్= దేవతల సముదాయంతో; సురరాజున్= దేవేంద్రుడిని; ఓడించి; ఖాండవంబు= ఖాండవమనే పేరుకల అడవిని; ఎక్కటి= ఒంటరిగా; కాల్చి, ఉన్న= దహించి+ఉన్న; వీరునకు= శూరునకు; అఖిల+అబ్ధి, వృత, వసుంధరన్+కల= సమస్తసముద్రాలచేత చుట్టుకొనబడిన భూమిలో ఉన్న; రాజులన్+ఓర్చి= రాజులను జయించి;

పరాక్రమమునన్= శౌర్యంతో; రాజసూయ+అధ్వరము+అనిచిన= రాజసూయ యజ్ఞాన్ని నిర్వహించిన; అధిక, సమర్థునకున్= గొప్ప శక్తి కల అర్జునుడికి; ప్రబల, సింహమునకున్= గొప్ప బలం కల సింహానికి; పక్కెర, పెట్టిన+అట్లు= కవచం తొడిగినట్లు; నెయ్యంబు తోడన్= స్నేహంతో; పరమున్ తొట్టి= పరమశివుడు మొదలుగా గల దేవతలు; పాశుపతము+ఆదిగా= పాశుపతం మొదలైన; దివ్య, శరములు= దివ్యాస్త్రాలు; శౌర్యము+ఎసఁగన్= పరాక్రమం ప్రజ్వలించేటట్లుగా; ఇచ్చిరి+అట్టె= ఇచ్చారుకదా!; అట్టి, నరుఁడు= అటువంటి అర్జునుడు; యోధుఁడు+ఐ+ఉన్న= వీరుడై ఉంటే; పాండవ, వరులన్= శ్రేష్ఠులైన పాండవులను; చెనయు+అంతవారున్= ఎదిరించేవారు; కలరె= ఉన్నారా!

**తాత్పర్యం:** 'అర్జునుడు సురసేనాసమేతుడైన దేవేంద్రుడిని ఓడించి, ఖాండవవనాన్ని ఒంటరిగా దహనం చేశాడు. సముద్రాలచేత చుట్టబడిన భూమండలంలో ఉండే రాజులను అందరిని జయించి ధర్మరాజుచేత రాజసూయయాగాన్ని మిక్కిలి సామర్థ్యంతో నిర్వహింపజేశాడు. నైసర్గికంగా గొప్ప బలం కల సింహానికి కవచం తొడిగి (కవచంతో) సత్కరించినట్లు పరమశివుడితో పాటు దేవతలు అందరు పాశుపతం మున్నగు దివ్యబాణా లిచ్చి అర్జునుడిని సమ్మానించారు కదా! అట్టి శౌర్యధురంధరుడు యోధుడై ఉండగా ఇక పాండవులను మార్కొనేవారు ఎవరుంటారు?

**విశేషం:** పక్కెర పెట్టటం: మంచి గుర్రాలకు, పట్టపుటేనుగులకు రత్నాంబరాలు, ఆభరణాలతో కూడిన కంచుకం తొడిగి అలంకరించటం పరిపాటి. ఆరీతిగా ప్రభువులు గుర్రాలకు పట్టపుటేనుగులకు 'పక్కెర వెట్టినట్లు', దేవతలు అర్జునుడికి దివ్యాస్త్రాలు సమకూర్చారు. అసలే అర్జునుడు తేజస్వి. ఇక అతడికి పక్కెరను పోలిన దివ్యాస్త్రాలు సంక్రమించాయి. మఱి అతడికి పట్ట పగ్గాలుంటాయా? - అని ధృతరాష్ట్రుడి ఆవేదన.

**క. వారికి, ధర్మువు దప్పని । వారికి, దృఢవచను లైన వారికి, విమలా**
**చారుల కెద్దియుఁ బడయఁగ । దూరమె, పాండవులఁ బోలుదురె వీరు లొరుల్. 379**

**ప్రతిపదార్థం:** వారికి= ఆ పాండవులకు; ధర్మువు= ధర్మం; తప్పని వారికి; దృఢవచనులు+ఐనవారికి= గట్టి మాటలు కలవారికి అంటే సత్యసంధు లయిన వారికి; విమల+ఆచారులకు= నిర్మలమైన ప్రవర్తన కలవారికి; ఎద్దియున్= ఏదయినను; పడయఁగన్= పొందగా; దూరమె= దూరమా? అంటే ఏదయినను వారు కోరుకొన్నదానిని పొందటం అసాధ్యమా?; వీరులు= శూరులు; ఒరుల్= ఇతరులు; పాండవులన్= పాండవులను; పోలుదురె= సరిపోలుతారా!

**తాత్పర్యం:** పాండవులు ధర్మం తప్పనివారు; సత్యసంధులు; పరిశుద్ధమైన ప్రవర్తన కలవారు. కనుక వారు దేనిని కోరినా పొందగలరు. ఇతర వీరులు ఎవరైనాసరే పాండవులతో సరిపోలగలరా?

**వ. వారలతో విగ్రహించి దుర్యోధనుండు దనకుఁ దన బాంధవులకు సుహృజ్జనంబులకు హాని సేసికొనియె.380**

**ప్రతిపదార్థం:** వారలతోన్= ఆ పాండవులతో; విగ్రహించి= శత్రుత్వం వహించి; దుర్యోధనుండు= దుర్యోధనుడు; తనకున్= తనకున్నూ; తన బాంధవులకున్= తన చుట్టాలకున్నూ; సుహృత్+జనంబులకున్= మిత్రులైన జనులకున్నూ; హాని= కీడు; చేసికొనియెన్= తెచ్చిపెట్టుకొన్నాడు.

**తాత్పర్యం:** అట్టి పాండవులతో విరోధం వహించి దుర్యోధనుడు తనకున్నూ, తన బంధుమిత్రులకున్నూ చేతులార కీడు తెచ్చిపెట్టుకొన్నాడు.

**ఆ. పర్వతములు వజ్రపాతాహతిని బోక । తక్కునేని, నింద్రతనయు దివ్య**
**నిశితబాణతతుల నిశ్శేష మగుననఁ । బరుల సైన్య మెట్లు బ్రదుక నేర్చు? 381**

**ప్రతిపదార్థం:** పర్వతములు= కొండలు; వజ్ర, పాత+ఆహతిని= వజ్రాయుధంయొక్క తాకిడి దెబ్బవలన; పోక, తక్కునేనిన్= పగులకుండ నిలిచినప్పటికిని; ఇంద్ర, తనయు= అర్జునుడియొక్క; దివ్య నిశిత, బాణ, తతుల= దివ్యాలైన వాడి అయిన అమ్ముల సముదాయంచేత; నిశ్శేషము+అగున్+అనన్= మిగులనివి అవుతాయని చెప్పితే; పరుల సైన్యము= శత్రుసేన; ఎట్లు= ఏ తీరుగా; బ్రదుకనేర్చున్?= జీవించి ఉంటుంది?

**తాత్పర్యం:** పర్వతాలు వజ్రాయుధం దెబ్బకు ఒకవేళ పగిలి పోకుండా ఉన్నప్పటికిని, అర్జునుడి దివ్యబాణ సముదాయాలచేత మిగులకుండా నశించిపోతాయి- అని అనగా, ఇక శత్రువులసేన ఎట్లా బ్రతుకుతుంది?

**వ. లయకాలోదిత సహస్రకరు కిరణంబులం జరాచరంబులు దప్తంబులగునట్లు పార్థు బాణంబులం జేసి దుర్యోధనాదులు దుస్సహతాపంబుఁ బొందుదు' రని దుఃఖితుం డైన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. 382**

**ప్రతిపదార్థం:** లయకాల+ఉదిత, సహస్ర, కరు, కిరణంబులన్= ప్రళయ సమయంలో ఉదయించిన సూర్యుడియొక్క (సహస్రకరుడు= వేయిచేతులు గలవాడు) కిరణాలచేత; చర+అచరంబులు= కదిలేటివి, కదలనట్టివి; తప్తంబులు+అగునట్లు= మాడిపోయే విధంగా; పార్థు= అర్జునుడియొక్క; బాణంబులన్+చేసి= బాణాలచేత; దుర్యోధన+ఆదులు= దుర్యోధనుడు మున్నగువారు; దుస్సహ తాపంబున్= సహించలేని బాధను; పొందుదురు= అనుభవిస్తారు; అని= అని చెప్పి; దుఃఖితుండు+ఐన= శోకం పొందినట్టివాడైన; ధృతరాష్ట్రునకు; సంజయుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ప్రళయకాలంలో ఉదయించే సూర్యుడి వేడికిరణాలకు చరాచరాలన్నీ మాడిపోయేటట్లు, అర్జునుడి వాడి బాణాలకు దుర్యోధనాదులు సహించలేని బాధ పొందుతారు' - అని ధృతరాష్ట్రుడు దుఃఖించగా సంజయుడు ఇట్లా అన్నాడు.

**క. 'ఈసున దుర్యోధన దు । శ్శాసను లొగిఁ బాండవులకు సభలో నెగ్గుల్**
**సేసిన విని వారల నను । శాసింపక వగలఁ బొగులఁ జనునే నీకున్? 383**

**ప్రతిపదార్థం:** ఈసునన్= అసూయతో; దుర్యోధన, దుశ్శాసనులు+ఒగిన్= దుర్యోధనుడు, దుశ్శాసనుడు పూనికతో; పాండవులకున్= పాండురాజుకొడుకులకు; సభలోన్= కొలువుకూటంలో; ఎగ్గుల్= అపకారాలు; చేసిన; విని= ఆలకించి; వారలన్= ఆ దుర్యోధన దుశ్శాసనులను; అనుశాసింపక= శిక్షించక; నీకున్= నీకు; వగలన్= దుఃఖంతో; పొగులన్+చనునే= బాధ పడటం తగునా?

**తాత్పర్యం:** 'దుర్యోధన దుశ్శాసనుల అసూయతో పాండవులకు నిండుసభలో కీడు చేయటం విని, వాళ్ళను శిక్షించకుండ, నీ విప్పుడు దుఃఖంతో బాధపడటం తగునా?

**విశేషం:** 'శాసింపఁగ వలవ దనఁగఁ జనదే నీకున్'- ఈ పాఠాంతరం కొన్ని ప్రతుల్లో ఉన్నది.

**వ. నీయుపేక్షం జేసి దుర్యోధనుచేత దుర్ద్యూత పరాజితులై రాజ్యంబు విడిచి పాండవు లరిగి కామ్యకవనంబున నున్నఁ, గృష్ణుం డనేకరాజసమన్వితుండై వారి యొద్దకు వచ్చి నీ కొడుకులు సేసిన నికారంబునకుం గృష్ణాపరిభవంబునకు దుఃఖితుండై కడు నలిగి, మీకు నెగ్గు సేసిన దుర్యోధనాదుల దూషించి గజపురంబున ధర్మరాజు రాజ్యాభిషిక్తుం జేయుదు ననియు, రాజసూయంబు సేయు నాఁడింద్రప్రస్థంబుననైన విభూతికంటె విశేషవిభూతి గావింతు ననియు, ద్రుపద సృంజయ కేకయ ధృష్టద్యుమ్న బలదేవ సాంబ సాత్యకి ప్రభృతుల సమక్షంబునం బలికి, సత్యసమయులైన పాండవులచేత సంరంభ నివారితుండై, పార్థుసారథ్యంబునకుఁ బ్రార్థితుం డయ్యె నని వింటిమి. 384**

**ప్రతిపదార్థం:** నీ, ఉపేక్షన్+చేసి= నీ ఒప్పరికంవలన (అశ్రద్ధ వల్ల); దుర్యోధనుచేత; దుర్ద్యూత, పరాజితులు+ఐ= దుష్టమైన జూదంలో ఓడించబడిన వారై; రాజ్యంబు, విడిచి= రాజ్యాన్ని వీడి; పాండవులు= పాండురాజు కొడుకులు; అరిగి= వెళ్ళి; కామ్యక, వనంబునన్+ఉన్నన్= కామ్యక మనే పేరుకల అడవిలో ఉండగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; అనేక, రాజ, సమన్వితుండు+ఐ= పెక్కుమంది రాజులతో కూడినవాడై; వారి+ఒద్దకున్= ఆ పాండవుల దగ్గరకు; వచ్చి= అరుదెంచి; నీ, కొడుకులు+చేసిన; నికారంబునకున్= మోసానికి; కృష్ణా, పరిభవంబునకు= ద్రౌపదికి జరిగిన అవమానానికి; దుఃఖితుండు+ఐ= చింతించినవాడై; కడు+అలిగి= మిక్కిలి కోపించి; మీకున్+ఎగ్గు+చేసిన= మీకు కీడు ఒనరించిన; దుర్యోధన+ఆదుల= దుర్యోధనుడు మున్నగు వారిని; దూషించి= నిందించి; గజ, పురంబున= హస్తినాపురంలో; ధర్మరాజున్= ధర్మపుత్రుడిని; రాజ్య+అభిషిక్తున్+చేయుదును +అనియు= రాజ్యానికి పట్టాభిషిక్తుడిగా చేస్తాననీ; రాజ, సూయంబు+చేయునాఁడు= రాజసూయయాగం చేసినప్పుడు; ఇంద్ర, ప్రస్థంబునన్+ఐన= ఇంద్రప్రస్థపురంలో ఏర్పడినట్టి; విభూతికంటె= ఐశ్వర్యంకంటె; విశేష, విభూతి= గొప్ప ఐశ్వర్యం; కావింతున్+అనియు= కలిగేట్లు చేస్తాననియు; ద్రుపద, సృంజయ, కేకయ, ధృష్టద్యుమ్న, బలదేవ, సాంబ, సాత్యకి, ప్రభృతుల, సమక్షంబునన్= ద్రుపదుడు, సృంజయుడు, కేకయుడు, ధృష్టద్యుమ్నుడు, బలదేవుడు, సాంబుడు, సాత్యకి మున్నగువారి ముందు; పలికి= మాటాడి; సత్య, సమయులు+ఐన= సత్యమైన శపథం కలవారైన; పాండవులచేత; సంరంభ, నివారితుండు+ఐ= సంరంభం నుండి నివారింపబడిన వాడై; పార్థు సారథ్యంబునకున్= అర్జునుడి రథాన్ని తోలటానికి; ప్రార్థితుండు+అయ్యెన్= ప్రార్థించబడినవా డయ్యాడు; అని; వింటిమి= విన్నాం.

**తాత్పర్యం:** నీ అశ్రద్ధవలన పాండవులు దుర్యోధనుడు పన్నిన మాయజూదంలో ఓడిపోయి రాజ్యాన్ని వదలి కామ్యకవనంలో ఉన్నారు. అక్కడికి శ్రీకృష్ణుడు పెక్కుమందిరాజులతో కలసి వెళ్ళి, పాండవులను పరామర్శించి, నీ కొడుకులు చేసిన మోసానికి, ద్రౌపదికి జరిగిన అవమానానికి చింతించి, మిక్కిలి కోపించి 'మీకు కీడు చేసిన దుర్యోధనాదులను నిందించి, ధర్మరాజును హస్తినాపురంలో పట్టాభిషిక్తుడిని కావిస్తాను' అని ప్రతిజ్ఞ చేసి, 'మీకు రాజసూయయాగ సమయంలో ఇంద్రప్రస్థ పురంలో ఏర్పడిన వైభవంకంటె గొప్పవైభవం కలిగిస్తా' నని ద్రుపద, సృంజయ, కేకయ, ధృష్టద్యుమ్న, బలదేవ, సాంబ, సాత్యకి ప్రభృతులముందు పలికాడు. కాని సత్యసంధులైన పాండవులు తాము ఒడంబడిన సమయాన్ని మీరలేమని శ్రీకృష్ణుడి సంరంభాన్ని మాన్పి, అతడిని అర్జునుడికి సారథ్యం చేయటానికి అంగీకరించుమని ప్రార్థించారు - అని విన్నాము.

**క. పదుమూఁడేండ్లుం బోయినఁ । బదునాల్గగు నేఁడు ఘనులు పాండవులు జగ**
**ద్విదితముగ నుత్సహింతురు । వదలక రణమునకుఁ గేశవపురస్కృతులై. 385**

**ప్రతిపదార్థం:** పదుమూఁడు+ఏండ్లున్+పోయినన్= పదమూడు సంవత్సరాలు గడిచిన తర్వాత; పదునాల్గగు+ఏఁడు= పదునాల్గవ ఏట; ఘనులు= గొప్పవారు (అయిన); పాండవులు; కేశవపురస్+కృతులు+ఐ= శ్రీకృష్ణుడిని ముందు పెట్టుకొన్నవారై; వదలక= విడువక; రణమునకున్= యుద్ధానికి; జగత్+విదితముగన్= లోకమంతటికి తేటతెల్లంగా; ఉత్సహింతురు= పూనికతో ప్రయత్నం చేస్తారు.

**తాత్పర్యం:** గొప్పవారైన పాండవులు పదమూడేండ్లు గడచిన వెనువెంటనే పదునాల్గవ సంవత్సరంలో శ్రీకృష్ణుడిని ముందుపెట్టుకొని విడువని పూనికతో యుద్ధానికి జగద్విదితంగా ప్రయత్నిస్తారు.

**క. వరములు వేల్పులచే దు । ష్కర తపమునఁ బడయుదురు జగంబున నొరు; లీ**
**శ్వరుచే వరములు వడసెం । గరుణ ధనంజయుఁడు తనదు కార్ముకశక్తిన్. 386**

**ప్రతిపదార్థం:** జగంబునన్= లోకంలో; ఒరులు= ఇతరులు; వరములు= కోరికలను; వేల్పులచే= దేవతలచేత; దుష్కర, తపమునన్= కఠినమైన తపస్సుచేత; పడయుదురు= పొందుతారు; ధనంజయుఁడు= అర్జునుడు; తనదు, కార్ముక, శక్తిన్= తన విలువిద్యయొక్క మహిమచేత; ఈశ్వరుచేన్= పరమశివుడివలన; కరుణన్= దయతో; వరములు+వడసెన్= వరాలు పొందాడు.

**తాత్పర్యం:** లోకంలో ఎవరైనా ఘోరమైన తపస్సులు చేసి దేవతలచేత వరాలు పొందుతుంటారు కదా! అర్జునుడు తన విలువిద్యచేత పరమేశ్వరుడిని మెప్పించి ఆయన కరుణవలన వరాలు పొందాడు.

**వ. అయ్యర్జును దివ్యశర సంఘాతంబును, భీమసేను చిత్ర గదా ఘాతంబును, నీ యుపేక్షానిర్ఘాతంబును గౌరవ పరిక్షయంబునకుఁ గారణభూతంబు' లనిన సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 387**

**ప్రతిపదార్థం:** ఆ+అర్జును= ఆ అర్జునుడియొక్క; దివ్య, శర, సంఘాతంబును= దివ్యమైన బాణాల సముదాయమున్నూ; భీమసేను= భీముడియొక్క; చిత్ర, గదా+ఆఘాతంబును= అద్భుతమైన గదయొక్క తాకిడియున్నూ; నీ, ఉపేక్షా, నిర్ఘాతంబును= నీదైన అశ్రద్ధ అనే పిడుగుపాటున్నూ; కౌరవ, పరిక్షయంబునకున్= కౌరవుల నాశనానికి; కారణ, భూతంబులు= హేతువులైనవి; అనినన్= అని చెప్పగా; సంజయునకు; ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** మహావీరుడైన అర్జునుడియొక్క దివ్యాలైన మంత్రబాణాలున్నూ, భీమసేనుడి గదయొక్క దెబ్బలున్నూ, నీదైన అశ్రద్ధ అనే పిడుగుపాటున్నూ కౌరవుల వినాశానికి మూలకారణాలు'- అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు ఈ విధంగా బదులు పలికాడు.

**క. 'వృద్ధని, జాత్యంధుం డని, । బుద్ధివిహీనుఁ డని నన్నుఁ బుత్త్రుఁడు బల ద**
**ర్పోద్ధతుఁడై, మెచ్చఁ, డసం । బద్ధంబులె కాని వినఁడు పలికిన పలుకుల్. 388**

**ప్రతిపదార్థం:** వృద్ధు+అని= ముసలి వాడని; జాత్యంధుండు+అని= పుట్టుకచేత గ్రుడ్డివాడని; బుద్ధి, విహీనుఁడు+అని= బుద్ధిలేని వాడని; నన్నున్= నన్ను; పుత్త్రుఁడు= కొడుకు (దుర్యోధనుడు); బల, దర్ప+ఉద్ధతుఁడు+ఐ= బలంచేత ఏర్పడిన గర్వంచేత అతిశయించినవాడై; మెచ్చఁడు= లక్ష్యపెట్టడు; అసంబద్ధంబులె కాని= అవకతవకలనే కాని; పలుకుల్= చెప్పిన మాటలు; వినఁడు= సమ్మతించడు.

**తాత్పర్యం:** 'నేను ముసలివాడిననిన్నీ, గుడ్డివాడిననిన్నీ, బుద్ధిలేనివాడిననిన్నీ, నన్ను నా పుత్రుడైన దుర్యోధనుడు కండకావరంచేత మెచ్చడు. వాడికి అసంబద్ధ ప్రలాపాలు మాత్రమే నచ్చుతాయి. వాడు నా మాటలు వినడు.

**వ. దుర్యోధనుండు దుర్బుద్ధి యని యేమి సెప్పవలయు? భీష్మ ద్రోణ విదురాదుల నాదరింపక కర్ణశకునుల నాప్తులం జేసికొని వారి వచనంబుల నెగడు, నేనేమి సేయుదు?' నని ధృతరాష్ట్రుండు మిన్నకుండె; నిట పాండవులు పార్థు మసలుటకు దుఃఖితులై. 389**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు= దుర్యోధనుడు; దుర్బుద్ధి= చెడుబుద్ధి కలవాడు; అని= అంటూ; ఏమి+చెప్పవలయు= ఏమి చెప్పాలి?; భీష్మ, ద్రోణ, విదుర+ఆదులన్= భీష్ముడు, ద్రోణుడు, విదురుడు మున్నగు వారిని; ఆదరింపక= గౌరవించక; కర్ణ, శకునులన్= కర్ణుడిని, శకునిని; ఆప్తులన్+చేసికొని= ప్రియ మిత్రులుగా స్వీకరించి; వారి వచనంబులు+అ= వారి మాటల చొప్పున; నెగడు= పెచ్చుపెరుగుతాడు; నేను+ఏమి+చేయుదున్?= ఏమి చేయగలను?; అని= అని పలికి; ధృతరాష్ట్రుండు; మిన్నక+ఉండెన్= ఊరకున్నాడు; ఇట= ఇచట; పాండవులు; పార్థు, మసలుటకు= అర్జునుడు (తిరిగి రావటానికి) ఆలస్యం చేయటానికి; దుఃఖితులు+ఐ= పరితాపంచెందినవారై.

**తాత్పర్యం:** దుర్యోధనుడు దుర్బుద్ధికలవాడు. వాడు భీష్మద్రోణ విదురులు మున్నగువారు చెప్పిన మాటలు వినక, కర్ణుడిని శకునిని ప్రియమిత్రులుగా మన్నించి వారిమాటలచొప్పున విర్రవీగుతాడు; నే నేమి చేయగలను?'- అని ధృతరాష్ట్రుడు ఊరకున్నాడు. ఇక్కడ పాండవులు అర్జునుడు తిరిగి రావటంలో జరిగిన జాప్యానికి పరితాపం చెందుతున్నారు.

**ఉ. 'పాండవసింహ మర్జునుఁడు పాండుయశంబు వెలుంగుచుండ నా**
**ఖండలుదొట్టి నిర్జరనికాయముచేత వరంబు గాంచి యె**
**న్నం డిట వచ్చునొక్కొ? సుజనస్తుతు నాతనిఁ బ్రీతిఁ జూడ నె**
**న్నండొకొ కాంతు' మంచును మనంబునఁ గోరుచు నుండి రెంతయున్. 390**

**ప్రతిపదార్థం:** పాండవ, సింహము= పాండవులలో సింహంవంటివాడైన అర్జునుడు; పాండు, యశంబు= తెల్లని కీర్తి; వెలుంగుచుండన్= ప్రకాశిస్తుండగా; ఆఖండలు+తొట్టి= దేవేంద్రుడు మొదలుగా కల; నిర్జర, నికాయముచేత= దేవతల సముదాయంచేత; వరంబు+కాంచి= వరం పొంది; ఎన్నండు+ఇట, వచ్చున్+ఒక్కొ!= ఎప్పుడు ఇక్కడికి వస్తాడో!; సుజన స్తుతున్= మంచివారిచేత పొగడబడేవాడిని; ఆతనిన్= అతడిని; ప్రీతిన్= ప్రేమతో; చూడన్+ఎన్నండు+ఒకొ, కాంతుము+అంచును= ఎన్నడు చూడగలమో అని; ఎంతయున్= మిక్కిలి; మనంబునన్= మనస్సులో; కోరుచున్+ఉండిరి= అభిలిషిస్తూ ఉన్నారు.

**తాత్పర్యం:** 'పాండవులలో సింహంవంటివాడు మా అర్జునుడు. స్వచ్ఛమైన తెల్లనికీర్తితో వెలుగొందుతూ దేవేంద్రుడు మున్నగు దేవతలచేత వరాలు పొంది ఎన్నడు ఇక్కడికి వస్తాడా? మే మెప్పుడు ఆతడిని తిరిగి చూడగలమా?' - అని మనస్సులో అనుకొంటూ అతడిరాకకై ఎదురు చూస్తూ ఉన్నారు.

**వ. అట్టి యవసరంబున యుధిష్ఠిరునకు భీముం డిట్లనియె. 391**

**ప్రతిపదార్థం:** అట్టి+అవసరంబునన్= ఆ సమయంలో; యుధిష్ఠిరునకున్= ధర్మరాజుతో; భీముండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో ధర్మరాజుతో భీముడు ఇట్లా చెప్పాడు.

**మధ్యాక్కర.**

**'నీ నిదేశంబున నరిగి పార్థుండు నిష్ఠతోఁ దపము**
**మానుగాఁ జేయుచునున్నవాఁ డేల మసలెనో రాక?**
**వాని ధర్మస్థితుఁ బాసియున్న యివ్వర్షముల్ యుగ స**
**మానంబు లైనవి మనకు నతని సమాగమకాంక్ష. 392**

**ప్రతిపదార్థం:** నీ, నిదేశంబునన్= నీ ఆజ్ఞ చొప్పున; అరిగి= వెళ్ళి; పార్థుండు= అర్జునుడు; నిష్ఠతోన్= దీక్షతో; తపము= తపస్సు; మానుగాన్= ఒప్పేటట్లుగా; చేయుచున్+ఉన్నవాఁడు= చేస్తున్నవాడు; ఏల= ఎందుచేత; రాక= తిరిగిరాకుండా; మసలెనో= ఆలస్యం చేశాడో?; వాని, ధర్మస్థితున్= ధర్మాత్ముడైన ఆతడిని; పాసి+ఉన్న= విడిచి ఉన్న; ఈ+వర్షముల్= ఈ సంవత్సరాలు; అతని, సమాగమ, కాంక్షన్= అతడిని కలిసికొనాలనే కోరికతో; మనకున్= మనఅందరికి; యుగ, సమానంబులు+ ఐనవి= యుగాలతో సమానాలు అయ్యాయి. (యుగం= పెక్కు సంవత్సరాల సమాహారం).

**తాత్పర్యం:** 'నీ ఆజ్ఞ చొప్పుననే కదా అర్జునుడు దీక్షతో తపస్సు చేయటానికి వెళ్ళింది. మరి తిరిగి రావటంలో ఇంత జాప్య మెందుకు జరుగుతున్నదో? ధర్మవర్తనుడైన అర్జునుడిని ఎడబాసి ఉండే ఈ సంవత్సరాలే, ఆతడిని కలుసుకోవాలనే కాంక్షచేత. మనకు యుగాలతో సమానాలయ్యాయి.

**విశేషం:** ఇవి భీముడి మాటలు. భీముడికి అర్జునుడిపై గల అనురాగం సుస్పష్టం. అంతర్లీనంగా అర్జునుడు పూనింది తీవ్రతపోనిష్ఠ, ప్రోత్సహించి పంపింది ధర్మరాజు. ఆలస్యమైన మాట నిజమే. కాని, అర్జునుడు పూనిన దీక్ష మహత్తరమైనది. సంవత్సరాలు, అనురాగం చొప్పున యుగాలుగా భాసించటం అనుభవవేద్యమే కదా! వృత్తలక్షణానికి ఆర. 1.134 విశేషాంశం చూడండి.

**వ. మఱి పాండవ పాంచాల వీరుల జీవనంబు లాతనియంద నిలిచినవి; తదీయ భుజాశ్రయబలంబునం బరుల జయించి ధరణీరాజ్యంబుఁ బరిగ్రహింత మని యున్నవారము; గావునం గాలయాపనంబు సేయక యర్జునుం దోడ్కొని తేర జనార్దను రాఁ బనిచి నియోగింపుము. 393**

**ప్రతిపదార్థం:** మఱి= అదియునుకాక; పాండవ, పాంచాల, వీరుల, జీవనంబులు= పాండవవంశంలోని, పాంచాలకులంలోని శూరుల బ్రతుకులు; ఆతని+అందు+అ= అర్జునుడిపైననే; నిలిచినవి= ఆధారపడి ఉన్నాయి; తదీయ, భుజ+ఆశ్రయ, బలంబునన్= ఆతడియొక్క భుజాలను ఆశ్రయించిన శక్తివలన; పరులన్= శత్రువులను; జయించి; ధరణీ, రాజ్యంబున్= భూరాజ్యాన్ని; పరిగ్రహింతము= స్వీకరిద్దాము; అని+ఉన్నవారము= అని ఉన్నాం; కావునన్= కాబట్టి; కాల, యాపనంబు+చేయక= కాలహరణం చేయక; అర్జునున్+తోడ్కొని, తేర= అర్జునుడిని తీసికొని రావటానికి; జనార్దనున్= శ్రీకృష్ణుడిని; రాన్+పనిచి= రమ్మని ఏర్పాటు చేసి; నియోగింపుము= నిర్దేశించుము.

**తాత్పర్యం:** ఇక పాండవ పాంచాల వీరుల బ్రతుకులు అర్జునుడిపై ఆధారపడి ఉన్నాయి. మనం అతడి శౌర్యప్రతాపాలను నమ్ముకొని, ఆతడి శక్తివలన శత్రువులను జయించి భూరాజ్యాన్ని తిరిగి పొందాలని ఆలోచిస్తున్న వాళ్ళం కదా! కాబట్టి, ఇక కాలహరణం చేయకుండా అర్జునుడిని తోడ్కొని తేవటానికై శ్రీకృష్ణుడిని పిలిపించి నియోగించండి.

**మ. సమయాబ్దంబులకంటె ముందర మహోత్సాహంబునన్ బాహువి**
**క్రమ మొప్పన్ విజయుండు నేనుఁ దగ సంగ్రామంబులో నేక కా**
**లమునం దా ధృతరాష్ట్రజాధముల నెల్లం జంపి భూచక్ర రా**
**జ్యము సేకొందుము కౌరవేంద్ర! మురజిత్సఖ్యప్రసాదంబునన్. 394**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర= కౌరవకులంలో ఇంద్రుడి వంటివాడా!; సమయ+అబ్దంబులకంటె, ముందర= చేసిన ప్రతిజ్ఞలో నిర్ణయించబడిన సంవత్సరాలకు ముందు - అంటే అరణ్యవాస అజ్ఞాత వాసాలు ముగించక ముందే; మహా+ఉత్సాహంబునన్= గొప్పదైన సంతోష తన్మయత్వంతో; బాహు, విక్రమము+ఒప్పన్= భుజబల పరాక్రమం విలసిల్లేటట్లు; విజయుండు= అర్జునుడు; నేనున్= నేనును; తగన్= ఒప్పేటట్లుగా; సంగ్రామంబులోన్= యుద్ధంలో; ఏక, కాలమునందు= ఒకే సమయంలో (అంటే నేనున్నూ అర్జునుడున్నూ కలిసి ఒకేసమయంలో యుద్ధం చేస్తే); ఆ, ధృతరాష్ట్రజ+అధములన్+ఎల్లన్= నీచులైన ఆ ధృతరాష్ట్రుడి కొడుకులను అందరిని; చంపి; భూ, చక్ర, రాజ్యము= భూమండల మంతటిని కలిపిన సామ్రాజ్యాన్ని; మురజిత్, సఖ్య, ప్రసాదంబునన్= శ్రీకృష్ణుడి స్నేహం యొక్క దయవలన; చేకొందుము= పరిగ్రహిద్దాం. (మురజిత్= మురుడనే రాక్షసుడిని జయించినవాడు- కృష్ణుడు)

**తాత్పర్యం:** (ఇవి భీముడి మాటలు) పన్నెండేండ్లు వనవాసం, ఒక ఏడు అజ్ఞాతవాసం చేయవలసిన శపథాన్ని అతిక్రమించి, అంతకు ముందే పరాక్రమంతో విజృంభించి నేను, అర్జునుడు యుద్ధరంగంలో ధృతరాష్ట్రుడి కుమారుల నందరిని కడతేర్చి, భూమండల సామ్రాజ్యాన్ని అంతటిని కైవసం చేసికొనగలం. నేనూ అర్జునుడూ ఏక కాలంలో యుద్ధం చేస్తే మమ్మల్ని ఎదుర్కొనేవారు ఉండరు. శ్రీకృష్ణుడి స్నేహంవలన సులువుగా మే మీ కార్యం నెరవేర్చగలం.

**విశేషం:** ఈ పద్యంలో భీమసేనుడు ధర్మరాజును 'కౌరవేంద్ర' అని సంబోధిస్తున్నాడు. పాండవులు కూడ కౌరవ వంశీయులే. ప్రాధాన్యవివక్ష చొప్పున పాండవులని వ్యవహరించబడ్డారు.

**వ. సత్యభంగభీతుండవు గావున నీ వింద యుండి పదుమూఁడేండ్లుం జలిపి పదంపడి కరిపురంబునకు వచ్చి రాజ్యాభిషిక్తుండ వగుము; దుష్టద్యూతంబున మనరాజ్యం బపహరించిన సుయోధనుండు సుచిర ప్రతిష్ఠితుండు గాకుండ నిప్పుడ యద్దురాత్ము దూషింతుము; నికృతిపరుల నికృతిన చేసి నిర్జించినఁ బాపంబు లేదు; సర్వ ప్రకారంబులను శత్రువుల జయించి రాజ్యంబు సేకొనుట రాజులకు విధిచోదితంబైన రాజధర్మంబ' యనిన భీమసేను మహాసంరంభంబునకు సంతోషించి ధర్మనందనుండాతనిం దనపైకిం దిగిచికొని మూర్ధాఘ్రాణంబు సేసి యిట్లనియె. 395**

**ప్రతిపదార్థం:** సత్య, భంగ, భీతుండవు, కావునన్= (నీవు) సత్యాన్ని భంగం చేయటానికి వెరచేవాడివి కాబట్టి; నీవు; ఇందు+అ+ఉండి= ఈ అరణ్యంలోనే ఉండి; పదుమూఁడు+ఏండ్లున్+చలిపి= పదమూడు సంవత్సరాలు గడిపి; పదంపడి= పిదప; కరిపురంబునకు= హస్తినాపురానికి; వచ్చి= అరుదెంచి; రాజ్య+అభిషిక్తుండవు+అగుము= రాజ్యానికి పట్టాభిషేకం జరుపుకొమ్ము; దుష్ట, ద్యూతంబున= చెడుజూదంలో; మనరాజ్యంబు= మనం పరిపాలించే రాజ్యాన్ని; అపహరించిన= దొంగిలించిన; సుయోధనుండు= దుర్యోధనుడు; సు, చిర, ప్రతిష్ఠితుండు, కాకుండన్= బాగా చాలకాలం పాతుకొని పోకుండ; ఇప్పుడు+అ= ఇప్పుడే; ఆ+దురాత్మున్= ఆ దుష్టుడిని; దూషింతుము= నిందిస్తాం. నికృతిపరులన్= మోసగాండ్రను; నికృతిన చేసి= మోసాన్నే చేసి; నిర్జించినన్= జయించినప్పటికి; పాపంబు, లేదు= దోషం ఉండదు; సర్వ ప్రకారంబులను= అన్ని

రీతులలో; శత్రువులన్= విరోధులను; జయించి= గెలిచి; రాజ్యంబు, చేకొనుట= రాజ్యాన్ని పరిగ్రహించటం; రాజులకు= ప్రభువులకు; విధిచోదితంబు+ఐన= శాస్త్రాలలోని సూత్రాలచేత నిర్దేశించబడిన; రాజ, ధర్మంబు+అ= రాజులు పాటించదగిన ధర్మమే; అనిన= అని చెప్పగా; భీమసేను= భీముడియొక్క; మహాసంరంభంబునకున్= గొప్ప వేగిరపాటుకు; సంతోషించి= సంతోషాన్ని పొంది; ధర్మనందనుండు= ధర్మపుత్రుడు; ఆతనిన్= భీముడిని; తనపైకిన్+తిగిచికొని= తన పైకి లాగుకొని; మూర్ధన్+ఆఘ్రాణంబు+చేసి= వాత్సల్యంతో తలను వాసన చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** నీవు సత్యసంధుడివి. సమయ భంగం అంటే నీకు భయం. కాబట్టి నీవు ఈ అరణ్యావాసం, అజ్ఞాతవాసం వెరసి పదమూడేండ్లు ముగించుకొని పిమ్మట హస్తినాపురానికి వచ్చి రాజ్యానికి పట్టాభిషిక్తుడివి కమ్ము. చెడుజూదంలో మన రాజ్యాన్ని అపహరించిన దుర్యోధనుడు రాజ్యంలో చాలాకాలం బాగా పాతుకొనే వ్యవధి పొందకుండా వెనువెంటనే మనం అతడిని దూషించాలి. మోసగాండ్రను మోసంచేతనే జయించటం పాపం కాదు. రాజనీతి ప్రకారం శత్రువులను సర్వవిధాల జయించి రాజ్యం పరిగ్రహించ వచ్చును'- అని చెప్పగా భీముడి ఉద్రేకపూరిత వాక్యాలకు సంతోషించి, ధర్మరాజు అతడిని తనపైకి లాగుకొని వాత్సల్యంతో శిరస్సును మూర్కొని, కౌగిలించుకొన్నాడు.

**విశేషం:** ఇచట భీముడు ఒక ధర్మసూక్ష్మాన్ని ప్రతిపాదించాడు (1) మోసగాండ్రను మోసంచేతనే జయించటం పాపం కాదు. (2) రాజ్య సంపాదన ఏ ఉపాయాలను ప్రయోగించి అయినను చేయవచ్చును. ఈ వాదానికి పూర్వపక్షం నెలకొల్పేవారు ఉన్నారు. (1) వారు గాంధీమహాత్ముడివంటివారు- మోసాన్నిగూడ మంచితనంతోనే ఎదిరించాలి అని అంటారు. (2) మంచి లక్ష్యాన్ని సాధించటానికి మంచిమార్గాలనే అనుసరించాలి- అని ప్రతిపాదిస్తారు.

**తే. 'అనలునకు గాడ్పు దోడైన యట్టు లింద్ర । తనయునకు నీవు దోడైనఁ దడయ కాజిఁ**
**బోరి రిపులకు బ్రదుకంగఁ బోల; దైన । ననఘ! యిది కోపమునకు ననవసరంబు. 396**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; అనలునకున్= అగ్నిహోత్రుడికి; గాడ్పు= వాయువు; తోడు+ఐన+అట్టులు= తోడుపడిన రీతిగా; ఇంద్రతనయునకున్= అర్జునుడికి; నీవు; తోడు+ఐనన్= సాయం చేస్తే; తడయక= ఆలస్యం కాకుండ; ఆజిన్= యుద్ధంలో; పోరి= పోరుసల్పి; రిపులకున్= శత్రువులకు; బ్రదుకంగన్, పోలదు= జీవించటం జరుగదు; ఐనన్= అయినప్పటికి; ఇది= ఈ సమయం; కోపమునకున్= ఆగ్రహానికి; అనవసరంబు= సరైనది (సమయం) కాదు.

**తాత్పర్యం:** 'అగ్నిహోత్రుడికి వాయువు తోడైనట్లు అర్జునునికి నీవు తోడైతే, శత్రువులు మిమ్ము ఎదిరించి పోరులో బ్రతకలేరు. కాని, ఇది కోపానికి అదను కాదు.

**విశేషం:** ఆరణ్య పర్వంలో ప్రథమాశ్వాసంలో ద్రౌపదియు, భీమసేనుడును ధర్మరాజుతో సుదీర్ఘవాదం చేశారు. విజయానికి సకాల ప్రయత్నం అవసరమనే- భీముడి వాదనతో ధర్మరాజు ఏకీభవించకపోలేదు. కాని, ఇది సరైన కాలం కాదు - అని పూర్వపక్షం చేశాడు.

**క. పదుమూఁడేండ్లుం బోయినఁ । బదపడి పార్థుండు నీవుఁ బరనృపతుల దు**
**ర్మదుల వధియించి విజయా । స్పదబాహుల రగుఁడు ధర్మపరిరక్షకులై. 397**

**ప్రతిపదార్థం:** పదుమూఁడు+ఏండ్లన్+పోయినన్= పదమూడేండ్లు గడిచిన; పదపడి= పిమ్మట; పార్థుండు= అర్జునుడు; నీవున్= నీవును; పర, నృపతులన్= శత్రురాజులను; దుర్మదులన్= చెడుగర్వం కలవారిని; వధియించి= సంహరించి; ధర్మ, పరి, రక్షకులు+ఐ= ధర్మాన్ని లెస్సగా రక్షించే వారై; విజయ+ఆస్పద, బాహులరు+అగుఁడు= గెలుపునకు నెలవైన చేతులు కలవా రవండి.

**తాత్పర్యం:** పదమూడు సంవత్సరాలు గడచిన పిమ్మట నీవున్నూ, అర్జునుడున్నూ దుర్మదులైన శత్రురాజులను సంహరించి, ధర్మ సంరక్షకులై విజయం సాధించిన పరాక్రమశీలురు కండి.

**వ. ఏ నెట్లును సత్యభంగంబు సేయుట కొడంబడ నోప' నని ధర్మతనయుం డనుజు ననునయించె నని జనమేజయునకు వైశంపాయన కథితంబైన పుణ్యకథ యతిరమణీయంబుగాను. 398**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఎట్లును= ఏ రీతిగా నయినను; సత్యభంగంబు+చేయుటకు= సత్యానికి విఘాతం కల్పించటానికి; ఒడంబడన్+ఓపను= సమ్మతింపజాలను; అని= అని చెప్పి; ధర్మతనయుండు= ధర్మపుత్రుడు; అనుజున్= తమ్ముడిని; అనునయించెన్= ఓదార్చాడు; అని; జనమేజయునకు; వైశంపాయన, కథితంబు+ఐన= వైశంపాయనుడిచేత చెప్పబడిన; పుణ్యకథ= పుణ్యాన్ని ఇచ్చే కథ; అతి రమణీయంబుగాను= మిక్కిలి సుందరమైనదిగాను.

**తాత్పర్యం:** నేను ఎట్టి పరిస్థితులలో నైనను కౌరవులతో చేసిన ఒడంబడికకు విరుద్ధంగా ప్రవర్తింపజాలను' - అని ధర్మరాజు తన తమ్ముడైన భీముడిని ఓదార్చాడు. ఇది వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు చెప్పిన కథ. ఈ ఇతిహాసం మిక్కిలి సుందరమైనది. పుణ్యాన్ని ఇచ్చేది.

## ఆశ్వాసాంతము

**క. బిరుదాంకభీమ! భీమే । శ్వర కృత కృత్య! ప్రసాద సౌజన్య గుణా**
**భరణ! పరగండ భైరవ! । పరనృప మణి మకుట ఘటిత పద! బుధ వినుతా! 399**

**ప్రతిపదార్థం:** బిరుద+అంక, భీమ!= బిరుదానికి చిహ్నంగా 'భీమ' శబ్దం కలవాడా! అంటే సార్థకమైన భీమ బిరుదం కలవాడా!; భీమ+ఈశ్వర, కృత కృత్య!= భీమేశ్వరుడివలన కృతార్థుడవైన వాడా!; ప్రసాద, సౌజన్య, గుణ+ఆభరణ!= నిర్మలమైన స్నేహగుణమనే అలంకారం కలవాడా!; పరగండ, భైరవ!= శత్రువీరులకు భైరవుడి వంటివాడా!; పర, నృప, మణి, ఘటిత, పద!= శత్రురాజులయొక్క మణికిరీటాలచేత తాకబడిన పాదాలు కలవాడా!; బుధ, వినుతా!= మేధావులచేత పొగడబడినవాడా!

**తాత్పర్యం:** సార్థకమైన భీమబిరుదం కలవాడా! భీమేశ్వరుడిచేత కృతార్థుడ వైనవాడా! మంచితన మనే గుణం ఆభరణంగా కలవాడా! శత్రువీరులకు భైరవుడి వంటివాడా! శత్రురాజుల మణికిరీటాలచేత స్పృశించబడిన పాదాలు కలవాడా! బుధులచేత ప్రశంసించబడినవాడా! (ఓరాజరాజ నరేంద్రా!) మహాభారతాన్ని నన్నయభట్టు రాజరాజ నరేంద్రుడికి అంకితం చేశాడు. అందుచేత ఆంధ్ర మహాభారతానికి ప్రథమశ్రోత ఆ రాజరాజనరేంద్రుడే.

**విశేషం:** రాజరాజ నరేంద్రుడు శైవుడు. చాళుక్య సామ్రాజ్యంలో శివాలయాలు తామరతంపరగా వెల్లివిరిశాయి. అందులో పంచారామాలు- వాటిలో దాక్షారామం పేర్కొనదగినవి. భీమేశ్వరుడు అంటే చాళుక్యభీముడిచేత ఆరాధించబడిన ఈశ్వరుడు.

**ఉత్సాహము.**

**రాజవంశరత్న! రాజరాజదేవ! నిత్యల**
**క్ష్మీ జయాభిరామ! ధర్మమిత్త్ర! మిత్త్ర విద్వదం**
**భోజవన పయోజమిత్త్ర! భూరికీర్తికౌముదీ**
**రాజితత్రిలోక! నిఖిలరాజలోక పూజితా!** **400**

**ప్రతిపదార్థం:** రాజ, వంశ, రత్న!= రాజ వంశానికి లేదా చంద్ర వంశానికి రత్నం వంటి వాడా! (రత్నం శ్రేష్ఠవాచకం); రాజ రాజ, దేవ!= రాజరాజేశ్వర ప్రతిష్ఠ చేసిన వాడా!; నిత్య, లక్ష్మీ, జయ+అభిరామ!= ఎడతెగని సంపదతో జయంతో మనోహరుడవైన వాడా!; ధర్మమిత్త్ర!= ధర్మానికి చెలికాడా!; మిత్త్ర విద్వత్+అంభోజవన, పయోజమిత్త్ర!= హితులైన పండితులనే తామరపూలతోటకు సూర్యుడి వంటివాడా! (అంభోజ= అంభస్+జ= నీటిలోనుండి పుట్టింది - పద్మం, పయోజ, మిత్త్రుఁడు= సూర్యుడు); భూరి, కీర్తి, కౌముదీ, రాజిత, త్రిలోక= విస్తారమైన యశస్సు అనే వెన్నెలచేత వెలుగొందించబడిన మూడులోకాలు కలవాడా!; నిఖిల, రాజ, లోకపూజితా!= సమస్త రాజ సమూహాలచేత పూజించబడినవాడా!

**తాత్పర్యం:** (ఓ రాజరాజనరేంద్రా! మహాభారతాన్ని అవధరించుము. అనేది ఈ పద్య తాత్పర్యసారం. ఆశ్వాసాంత పద్యాలన్నింటిలోను సారమిదే.) చాళుక్యరాజ వంశానికి రత్నం వంటివాడా! రాజరాజేశ్వరుడిని దైవంగా కలవాడా! నిత్యలక్ష్మితో, సంతతజయంతో అలరారేవాడా! ధర్మానికి మిత్రుడవైనవాడా! హితులైన విద్వాంసులనే తామరపువ్వుల సముదాయానికి సూర్యుడివంటివాడా! మూడులోకాలలో విస్తరించిన కీర్తి అనే వెన్నెల కలవాడా! రాజులందరిచేత పూజించబడినవాడా!

**విశేషం:** (1) మిత్త్ర, విద్వదంభోజ వన పయోజ మిత్రుడు రాజరాజనరేంద్రుడు. అంటే విద్వాంసులను సంతోషింపజేసి పోషించేవాడు. 'రాజ మహేంద్ర కవీంద్ర సమాజ సురక్ష్మాజ' అనే సంబోధన ఇచట స్మరించతగింది. నన్నయ తాను రాజరాజ నరేంద్రుడికి అనురక్తుడనని అవతారికలో చెప్పుకొన్నాడు. రాజరాజనరేంద్రుడి విద్వత్పరిపోషణ అభివర్ణితం. (2) రాజ రాజ నరేంద్రుడు 108 రాజరాజేశ్వరాలయాలను కలిదిండిలో నిర్మించినట్లు శాసనం ఉన్నది. శివాలయాలను తమ పేర నిర్మించటం చాళుక్య రాజ వంశ సంప్రదాయం. ఉదాహరణకు భీమేశ్వరాలయాలు. (3) ఆశ్వాసాంత పద్యాలు, ఆశ్వాసాంత గద్యం - అట్లే కావ్యాలలో ఆశ్వాస ఆరంభపద్యం వ్రాసే సంప్రదాయం నన్నయ మహాకవియే తెలుగులో ప్రారంభించినట్లు ఎంచవచ్చును. ఈ ఒరవడినే తర్వాతి కవులందరు అనుసరించారు. (4) ఈ వృత్తం ప్రతిపాదంలోనూ ఏడు సూర్యగణాలపై ఒక గురువు ఉంటుంది. అయిదవ గణం మొదటి అక్షరం యతి. ప్రాస పాటించబడింది.

**గద్యము.**

**ఇది సకల సుకవి జన వినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతంబునం దారణ్యపర్వంబునందుఁ బాండవ వనప్రవేశంబును, గిమ్మీరవధయును, కృష్ణపాంచాలాభిగమనంబును, సౌంభకాఖ్యానంబును, నింద్రకీలాభిగమనంబును, గైరాతంబును, నర్జును తపశ్చరణంబును, నీశ్వరుతోడ యుద్ధంబును, బరమేశ్వరు చేతఁ బాశుపతాస్త్రంబు వడయుటయును, లోకపాలసందర్శనంబును, స్వర్గగమనంబును, నూర్వశి శాపంబును, దేవతలవలన దివ్యాస్త్రలాభంబును నన్నది ప్రథమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ మొదటి ఆశ్వాసం; సకల, సుకవిజన, వినుత, నన్నయ భట్ట, ప్రణీతంబు+ఐన= సకల సుకవులచేత ప్రశంసించబడిన నన్నయభట్టుచేత వ్రాయబడిన; శ్రీమహాభారతంబునందు+ఆరణ్య పర్వంబునందున్; పాండవ వన ప్రవేశంబును= పాండవులు అడవిలో ప్రవేశించటమున్నూ; కిమ్మీరవధయును= కిమ్మీరుడనే రాక్షసుడి సంహారమున్నూ; కృష్ణ, పాంచాల+ అభిగమనంబును= శ్రీకృష్ణుడు, పాంచాలురు పాండవులకడకు రావడమున్నూ, సౌంభక+ఆఖ్యానంబును= సౌంభకకథయున్నూ; ఇంద్ర, కీల+అభిగమనంబును= అర్జునుడు ఇంద్రకీలపర్వతానికి వెళ్ళటమున్నూ; కైరాతంబును= కిరాతుడి వృత్తాంతమున్నూ; అర్జును తపశ్చరణంబును= అర్జునుడు తపస్సు చేయటమున్నూ; ఈశ్వరుతోడ యుద్ధంబును= శివుడితో చేసిన యుద్ధమున్నూ; పరమేశ్వరుచేతన్= శివుడిచేత; పాశుపత+అస్త్రంబు+పడయుటయును= పాశుపత మనే అస్త్రాన్ని పొందటమున్నూ; లోకపాల సందర్శనంబును= ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు మున్నగు దిక్పాలురను సందర్శించటమున్నూ; స్వర్గ గమనంబునున్= స్వర్గయాత్రకు వెళ్ళటమున్నూ; ఊర్వశి శాపంబును= ఊర్వశి శపించటమున్నూ; దేవతలవలన= దేవతలనుండి; దివ్య+అస్త్ర, లాభంబునున్= దివ్యమైన అస్త్రాలు పొందటమున్నూ; అన్నది= అనే అంశాలు ఉన్నది; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది కవీంద్రులందరిచేత ప్రశంసించబడిన నన్నయభట్టు వ్రాసిన శ్రీమహాభారతంలోని ఆరణ్యపర్వం. ఇందులో - పాండవులు ఆరణ్యంలో ప్రవేశించటమున్నూ, భీముడు కిమ్మీరుడనే రాక్షసుడిని చంపటమున్నూ, శ్రీకృష్ణుడు, పాంచాలురు పాండవులకడకు రావటమున్నూ, సౌంభకాన్ని గురించిన కథయున్నూ, అర్జునుడు ఇంద్రకీలాద్రికి వెళ్ళటమున్నూ, కిరాతుడి గాథయున్నూ, అర్జునుడు తపస్సు చేయటమున్నూ, ఈశ్వరుడితో యుద్ధం చేయటమున్నూ, పరమశివుడివలన పాశుపతాస్త్రం పొందటమున్నూ, దిక్పాలకులను సందర్శించటమున్నూ, స్వర్గలోకయాత్రకై వెళ్ళటమున్నూ, ఊర్వశి అర్జునుడిని శపించటమున్నూ, అతడు దేవతలవలన దివ్యాస్త్రాలు సంపాదించటమున్నూ అనేవి ఈ మొదటి ఆశ్వాసంలో ఉన్నాయి.

**విశేషం:** ఆశ్వాసాంతగద్యం విషయసూచిక. పూర్వగ్రంథాలు తాటాకులలో వ్రాయబడుతూ ఉండేవి. కాబట్టి ఇటువంటి విషయ సూచికవలన ప్రక్షిప్తభాగాలు, వినష్టభాగాలు గుర్తించటానికి వీలు కలుగుతుంది. పరిశోధకులకు ఇది అత్యావశ్యకం.

**-:ఆరణ్యపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం :-**



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీరమ్య ధర్మ నిత్య । ప్రారంభవిభాసి! రాజపరమేశ్వర! ఘో**
**రారి మదకుంభికుంభవి । దారణదారుణకృపాణదక్షిణహస్తా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ, రమ్య, ధర్మ, నిత్య, ప్రారంభ, విభాసి!= శోభా సుందరమైన ధర్మంలో నిరంతర ప్రయత్నంతో వెలుగొందే వాడా! అంటే ధర్మనిర్వహణంలో ఎడతెగని పూనికతో వెలుగొందేటి సొగసైన శోభగలవాడా!; రాజ, పరమ+ఈశ్వర!= రాజ పరమేశ్వరా అనే బిరుదు గలవాడా!; ఘోర+అరి, మదకుంభి, కుంభ, విదారణ, దారుణ, కృపాణ, దక్షిణ, హస్తా!= భయంకరమైన శత్రువులనే మదపుటేనుగుల కుంభస్థలాలను చీల్చివైచే దారుణకృపాణం కలవాడా! [భయంకరమైన శత్రువులయొక్క మదపుటేనుగుల కుంభస్థలాలను చీల్చునట్టి భయానకమైన కత్తి కుడిచేతిలో కలవాడా! అని కూడా చెప్పవచ్చు]

**తాత్పర్యం:** ఓ రాజరాజ నరేంద్రా! రాజపరమేశ్వర బిరుదాంచితుడా! శోభయమానమైన ధర్మ నిర్వహణంలో ఎడతెగని పూనికతో వెలుగొందేవాడా! భయంకరులైన శత్రువులనే మదపుటేనుగుల కుంభస్థలాలను చీల్చి చెండాడే భయానక ఖడ్గాన్ని కలవాడా!

**విశేషం:** ఇది ఆరణ్యపర్వంలో ద్వితీయాశ్వాసంలోని మొదటి పద్యం. ఆశ్వాస ఆరంభ పద్యాలను సంబోధన ప్రథమా విభక్త్యంతాలుగా తీర్చిదిద్దే ఒరవడిని తెలుగులో ప్రారంభించినవాడు నన్నయభట్టు. అట్లే ఆశ్వాసాల చివరిపద్యాలు కృతిపతి అయిన రాజరాజనరేంద్రుడి సంబోధనలే. అలనాటి యుద్ధాలలో ఏనుగులు నిర్వహించిన భూమిక కూడ పేర్కొన తగినట్టిదే. పలుతావుల నన్నయభట్టు కృతిపతి అయిన రాజరాజనరేంద్రుడి పరాక్రమప్రాభవాన్ని, యుద్ధకౌశలాన్ని ఉగ్గడించి ఉన్నాడు. [ఏనుగు భూమిపై నడయాడే జంతువు లన్నింటిలో బలమైనది. అట్టి ఏనుగును గూడ ఒడుపుతో సంహరించగల వీరులు అలనాడు కొందరు ఉండేవారు. అందులో రాజరాజనరేంద్రుడు ఒకడని నన్నయ పలుతావుల గళమెత్తి అభివర్ణించాడు. కొప్పం యుద్ధంలో దడిగదేవుడనే పశ్చిమచాళుక్య సామంతుడు చోళచక్రవర్తి అధిష్ఠించిన ఏనుగుతొండాన్ని నరికి బీభత్సం సృష్టించటం, అపుడు చోళ చక్రవర్తి ఆ యుద్ధంలో మరణించటం దక్షిణభారత చరిత్రకు సుపరిచితమైన అంశం. రాజరాజనరేంద్రుడు 'మదకుంభి కుంభ విదారణ దారుణ కృపాణహస్తుడు' అనే అభివర్ణన కేవలం అతిశయోక్తి కాదేమో!]

**(సం. 3-49-29)**

**వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె; నట్లు సాంత్వనవచనంబుల భీమసేనునకుం గోపాటోపోపశమనంబు సేయుచున్న ధర్మరాజునొద్దకు బృహదశ్వుండను మహాముని వచ్చి విధిదృష్ట విధానంబునం బూజితుండయి విశ్రమించియున్న నమ్మునివరునకు ధర్మతనయుం డధర్మపరులయిన పరుల చేతం దమపడిన నికారప్రకారంబంతయు నెఱింగించి యిట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= ఆ పౌరాణికుడు; శౌనక+ఆది, మహామునులకున్+చెప్పెన్= శౌనకుడు మొదలయిన మహర్షులకు చెప్పాడు; అట్లు= ఆ విధంగా; సాంత్వన వచనంబుల= ఓదార్పు మాటలతో; భీమసేనునకున్= భీముడికి; కోప+ఆటోప+ ఉపశమనంబు= ఆగ్రహంయొక్క ఉద్వేగాన్ని అణచటం; చేయుచున్న; ధర్మరాజు+ఒద్దకున్= ధర్మరాజు కడకు; బృహదశ్వుండు+ అను, మహాముని= బృహదశ్వుడనే పేరు గల గొప్ప ఋషి: వచ్చి; విధి, దృష్ట, విధానంబునన్= (శాస్త్రసూత్ర) విధులలో కనిపించే పద్ధతిలో; పూజితుండు+ఐ= ఆరాధించబడిన వాడై; అంటే యథావిధిగా అతిథి సత్కారాన్ని పొందినవాడై; విశ్రమించి+ఉన్నన్= అలసట, తీరి ఉండగా; ఆ+ముని, వరునకు= ఆ ఋషిశ్రేష్ఠుడికి; ధర్మ తనయుండు= ధర్మపుత్రుడు; అధర్మ, పరులు+అయిన= అధర్మాన్ని ఆచరించే వారైన; పరుల చేతన్= శత్రువుల చేత; తమ, పడిన= తాము అనుభవించిన; నికార, ప్రకారంబు+అంతయున్= మోసపు విధమంతయు, అవమానాల తీరు అంతయు; ఎఱింగించి= తెలిపి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ పౌరాణికుడు సూతుడు, శౌనకుడు మున్నగు మహర్షులకు భారత కథను ఈ విధంగా చెప్పాడు: అట్లా భీముడి ఆగ్రహాతిరేకాన్ని శాంతింపజేస్తూ ఉన్న ధర్మరాజుదగ్గరికి బృహదశ్వుడు అనే గొప్పఋషి విచ్చేశాడు. ధర్మరాజు ఆ మహర్షికి యథావిధిగా అతిథిసత్కారాలు చేసి, ఆ మహాముని అలసట తీరిన పిమ్మట తాము అధర్మ పరాయణులైన శత్రువులచేత పడిన పాట్లు, జూదంలో జరిగిన మోసం సవిస్తరంగా చెప్పి ఇట్లా పలికాడు.

**విశేషం:** మహాభారత కథకుడు ఉగ్రశ్రవసుడనే సూతుడు. నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులకు పన్నెండేండ్లు జరిగిన సత్రయాగంలో మహాభారతం వినిపించాడు. సవిస్తర వివరణకు ప్రథమాశ్వాసంలోని మొదటిపద్యం వివరణను చూడండి.

**క. 'పుడమియు రాజ్యము బంధుల । విడిచి మృగావలులఁ గలసి విపినంబులలోఁ**
**గడుకొని మా య ట్లిడుమలఁ । బడిన నృపులు గలరె యొరులు పరమమునీంద్రా!' 3**

**ప్రతిపదార్థం:** పరమ, ముని+ఇంద్రా= గొప్ప ఋషి శ్రేష్ఠుడా!; పుడమియు= భూమియు (అంటే నివాసభూమిని); రాజ్యము= ఏలుకొంటున్న రాజ్యాన్ని; బంధుల= చుట్టాలను; విడిచి= వదలిపెట్టి; మృగ+ఆవలులన్+కలసి= జంతు సముదాయంతోపాటు; విపినంబులలోన్= అడవులలో; కడుకొని= పూని; మా+అట్లు= మావలె; ఇడుమలన్+పడిన= ఇక్కట్లపాలైన; నృపులు= రాజులు; ఒరులు= ఇతరులు; కలరె= ఉన్నారా?

**తాత్పర్యం:** 'నివాసస్థలాన్ని, రాజ్యాన్ని, చుట్టాలను విడిచిపెట్టి మృగాలతోపాటు అరణ్యాలలో మా వలె ఈవిధంగా ఇక్కట్ల పాలైన ఇతరరాజులు ఎవరైనా ఉన్నారా? ఓ పరమఋషిశ్రేష్ఠుడా! దయచేసి తెలుపండి'.

**వ. అనిన నయ్యుధిష్ఠిరునకు బృహదశ్వుం డిట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+యుధిష్ఠిరునకున్= ఆ ధర్మరాజుకు; బృహదశ్వుండు= బృహదశ్వుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా బదులు పలికాడు.

**తాత్పర్యం:** అని ప్రశ్నించిన ధర్మరాజుకు బృహదశ్వుడు ఈ విధంగా బదులు పలికాడు.

**క. 'దేవసములైన యనుజుల । తో విప్రులతో రథాలితో వచ్చి యరఁ**
**ణ్యావాసము సేసెదు ధర । ణీవల్లభ! నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్. 5**

**ప్రతిపదార్థం:** ధరణీ, వల్లభ!= (భూభర్తవైన) మహారాజా!; దేవ, సములు+ఐన= దేవతలతో సమానులైన; అనుజులతోన్= తమ్ములతో; విప్రులతోన్= బ్రాహ్మణులతో; రథ+ఆలితోన్= రథసమూహంతో; వచ్చి= ఏతెంచి; అరణ్య+ఆవాసము= అడవిలో నివసించటం; నీవు; ధర్మ, నిష్ఠిత, బుద్ధిన్= ధర్మంపై లగ్నమైన బుద్ధితో; చేసెదు= చేస్తున్నావు.

**తాత్పర్యం:** నీవు ఇడుమలు పడుతూ అడవిలో నివసిస్తున్న మాట నిజమే. కాని, నీకు తోడుగా దేవతలతో సమానులైన తమ్ములు ఉన్నారు. నీకు విజ్ఞానబోధ చేస్తున్న విప్రులు నీతో కలిసి జీవిస్తున్నారు. నీకు రథాలు ఉన్నాయి. పరివారవర్గం ఉన్నది. ఈ విధంగా నీవు అరణ్యనివాసం చేయటం ధర్మలగ్నమైన నీమనస్సును తెలుపుతున్నది.

**విశేషం:** మహర్షి అయిన బృహదశ్వుడి దృష్టి వేరు. యుధిష్ఠిరుడి దృష్టి వేరు. అడవిలో ఇడుమలు పడుతున్న పాండవులకు లేనివి రాజ్యసుఖాలు మాత్రమే. విజ్ఞాననిధులైన విప్రుల సాహచర్యం ఈ అడవిని ఒక విశ్వవిద్యాలయంగా మార్చిందని బృహదశ్వుడికి తెలుసు. అంతఃపురాలలో, రాజసభలలో హంసతూలికాతల్పాలపై సుఖించే రాజులు మహర్షులదృష్టిలో బంగారు పంజరాలలోని పక్షులు. ఆపదలే శీలానికి వన్నెగూర్చే సదవకాశాలు. అగ్నిలో పడి బంగారం వన్నె హెచ్చి వెలుగొందుతుంది. మట్టి అయితే మాడిపోతుంది. మహనీయులు కష్టాలను అనుభవించటంచేతనే చిరస్మరణీయమైన మహిమను ఆర్జిస్తారు. సానబట్టితేగాని వజ్రం శోభించదు. పాండవులు రాజ్యాన్ని కోలుపోయి అడవులలో ఇడుమలుపడి ఆధ్యాత్మిక విశ్వకళా పరిషత్తులో పట్టభద్రులయ్యారు. అందుచేత మహానుభావుడైన బృహదశ్వుడు అడవిలో ఉండే ధర్మరాజును అభినందించాడే కాని ఓదార్పుమాటలతో జాలి చూపలేదు. పాండవులకంటెకూడ ఎక్కువ బాధలు పడినట్టివారు లేకపోలే దని నలోపాఖ్యానాన్ని చెప్పాడు.

**క. నరనుతుఁడు దొల్లి నలుఁ డను । ధరణీశుఁడు జూద మాడి తన విభవము పు**
**ష్కరుచేత నోటువడి యొ । క్కరుఁడ కరం బిడుమఁ బడఁడె కాననసీమన్. 6**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వకాలంలో; నర, నుతుఁడు= ప్రజలచేత ప్రస్తుతించబడినవాడు; నలుఁడు+అను= నలుడనే; ధరణీ+ఈశుఁడు= రాజు (భూమికి పాలకుడు); జూదము+ఆడి; తన, విభవము= తన సంపద; పుష్కరు, చేతన్= పుష్కరుడనే రాజుచేత; ఓటువడి= ఓడిపోయి; ఒక్కరుఁడు+అ= ఒంటరిగా; కానన, సీమన్= అడవిప్రాంతంలో; కరంబు= మిక్కిలి; ఇడుమన్+పడఁడు+ఎ= కష్టాలుఅనుభవించలేదా!

**తాత్పర్యం:** పూర్వకాలంలో నలుడనే మహారాజు, ప్రజానురంజకుడై రాజ్యాన్ని ఏలినవాడు జూదమాడి పుష్కరుడిచేత తన సంపదనంతా ఓడిపోయి ఒంటరిగా అడవులలో తిరిగి మిక్కిలి కష్టాలను అనుభవించలేదా!'

**విశేషం:** ఆరణ్యపర్వం మహాభారతంలోని పదునెనిమిది పర్వాలలోని పెద్దపర్వాలలో ఒకటి. ఇందులోని కథ పెద్దది కాదు. ఆరణ్యపర్వం పెరగటానికి కారణం అందులోని పెక్కు ఉపాఖ్యానాలు. ఎందరో ఋషులు పాండవులను చూడటానికి అరణ్యానికి వచ్చేవారు. వారిని ధర్మరాజు ప్రశ్నించేవాడు. వారు తమకు తోచిన ఉపాఖ్యానాలు చెపుతూ ఉండేవారు. అందుచేత ఆరణ్యపర్వం బృహత్ గ్రంథమైనది. మహాభారతంలోని ఉపాఖ్యానాలన్నింటిలో నలోపాఖ్యానం పెద్దది. సంస్కృత భారతంలో ఎన్నో ఉపాఖ్యానాలు చోటుచేసికొన్నాయి. అవి అన్నీ ప్రాచీనాలే అయినా. కొన్ని ప్రాచీనతరాలు, మరికొన్ని ప్రాచీనతమాలు- అని విద్వాంసుల అభిప్రాయం. అందులో నలోపాఖ్యానం మిక్కిలి ప్రాచీనతమమైనదని కొందరు పరిశోధకుల అభిప్రాయం. పాశ్చాత్యుల దృష్టిలో విషాదాత్మక కృతులకు విలువ అధికం. భారతీయ వాఙ్మయంలో విషాదవృత్తాలైన రచనలు లేవని కొందరు అధిక్షేపించటం కద్దు. విషాదాత్మక రచనలవలన సహృదయులకు భావిత అంతఃకరణ ప్రవృత్తి ఏర్పడి వారి

హృదయాలు రసక్షాళితాలు అవుతాయని పాశ్చాత్య ఆలంకారికుల అభిప్రాయం. నలోపాఖ్యానం విషాదాంతగాథ కాదు కాని, విషాదాత్మక కృతి అని చెప్పవచ్చును. భావితాంతఃకరణ ప్రవృత్తి, సద్యఃపర నిర్వృతి కావ్యానికి అంతరాత్మ అయితే నలోపాఖ్యానం ప్రపంచ వాఙ్మయంలో 'నిరుపమానమైన రసవత్కావ్యం' - 'సాటిలేని విషాదాత్మక కృతి'- అని చెప్పవచ్చును. మిక్కిలి పురాతనకాలంలో మహాభారతం 'జయం' రచించబడటానికి చాలాకాలం పూర్వమే నలచక్రవర్తిగాథ భారతదేశంలో యుగ యుగాంతరాలలో బహుళవ్యాప్తిని పొందినట్లు, తదుపరి ప్రాచీనతమమైన ఇతిహాసం మహాభారతంలో లీనమైనట్లు ఊహించటం సత్యదూరం అనలేం. ఇంకొక విశేషం: భారతంలోని ధర్మరాజుకు నలోపాఖ్యానంలోని కథానాయకుడైన నలుడికి గల సామాన్యవ్యసనం జూదం. ఇక, బృహదశ్వుడు ప్రస్ఫుటంగా వచించినట్లు ధర్మరాజుకంటె కూడ విషాదాత్మక నాయకుడుగా నలుడు నిర్వహించిన భూమిక ఎక్కువ హృదయవిదారకమైనది. అందుచేత నలోపాఖ్యానం చదివిన వారికి దుఃఖభూయిష్ఠమైన కలియుగబాధనుంచి నిష్కృతి లభిస్తుందన్న పెద్దల ప్రవచనంలో అంతరార్థం ఉన్నదని అంగీకరించవచ్చును.

### ధర్మరాజునకు బృహదశ్వుండు నలోపాఖ్యానంబు సెప్పుట (సం. 3-50-1)

**వ. అనిన 'నది యె?' ట్లని ధర్మనందనుం డడిగిన బృహదశ్వుం డిట్లనియె; నిషధేశ్వరుండయిన వీరసేనుని కొడుకు నలుం డనువాఁ డనేకాక్షౌహిణీపతి యనవరతాక్షప్రియుం డజేయంబైన తన తేజంబున నెల్లరాజుల జయించి బ్రహ్మణ్యుండయి బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయుచుండ. 7**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అది+ఎట్లు+అని= అది ఏవిధంగా జరిగిందని; ధర్మనందనుండు+అడిగిన= ధర్మరాజు ప్రశ్నించగా; బృహదశ్వుండు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు; నిషధ+ఈశ్వరుండు+అయిన= నిషధదేశానికి పరిపాలకుడయిన; వీరసేనుని, కొడుకు= వీరసేన మహారాజుయొక్క పుత్రుడు; నలుండు+అనువాఁడు= నలుడనే పేరుకలవాడు; అనేక+అక్షౌహిణీ, పతి= పెక్కు అక్షౌహిణులకు అధినేత; అనవరత+అక్ష, ప్రియుండు= ఎల్లప్పుడును పాచికలపై ప్రీతికలవాడు, అంటే జూదమాడటంలో మిక్కిలి అనురక్తి కలవాడు; అజేయుంబు+ఐన= జయించటానికి వీలులేని; తన తేజంబునన్= తన పరాక్రమంచేత; ఎల్ల, రాజులన్= అందరు రాజులను; జయించి= గెలిచి; బ్రహ్మణ్యుండు+అయి= బ్రాహ్మణులకు హితం ఆచరించేవాడై; బ్రహ్మ+ఉత్తరంబుగాన్= బ్రాహ్మణులకు ఆధిక్యం పొసగేటట్లుగా; ప్రజా, పాలనంబు= ప్రజలను పాలించటం; చేయుచు+ఉండన్= చేస్తుండగా.

**తాత్పర్యం:** తొల్లి నలుడు అడవులలో ఇడుమలు పడినాడని బృహదశ్వుడు చెప్పగా, అదెట్లా? అని ధర్మరాజు ప్రశ్నించగా బృహదశ్వుడు ఇట్లా చెప్పాడు: నిషధేశ్వరుడైన వీరసేనుడి కొడుకు నలుడు. అతడు మహాతేజస్వి. ఎన్నో అక్షౌహిణులసేనలకు అధినేత. కాని, అతడు జూదంలో మిక్కిలి ప్రీతికలవాడు. అతడు తన పరాక్రమంచేత రాజులందరిని జయించి సార్వభౌముడై ప్రజానురంజకుడై రాజ్యపరిపాలన చేస్తున్నాడు. అతడు బ్రాహ్మణులకు సంప్రీతి ఘటించే పరిపాలన కొనసాగించాడు.

**విశేషం:** (1) అక్షౌహిణి= సేనాసమూహం. 21870 రథాలు, అన్నే ఏనుగులు, 65610 గుఱ్ఱాలు, 109350 కాల్బలంగల సేనకు అక్షౌహిణి అని పేరు. (2) 'బ్రహ్మోత్తరంబుగా'- అనే పదానికి అర్థం చెప్పటంలో విద్వాంసులలో బహుళచర్చ జరిగింది. ధృతరాష్ట్రపరంగా నన్నయభట్టు ఈమాటను ఇంకొకచోట ప్రయోగించాడు. ఆర్యసంఘం- బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర సంఘటితం. బ్రహ్మోత్తరంగా పరిపాలించటం అంటే బ్రాహ్మణులకు ప్రాధాన్యమిచ్చి పరిపాలించటం, బ్రాహ్మణులకు ఆధిక్యం ఇవ్వటం అనే అర్థం సందర్భశుద్ధితో అన్వయిస్తుంది. ఇచట 'బ్రహ్మణ్యుండయి' అనే ప్రయోగంకూడ పై అర్థానికి బలం

చేకూర్చేదే. ఆదిపర్వంలో నన్నయభట్టు ధృతరాష్ట్రుడు 'బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజావృద్ధియు, సస్యవృద్ధియు నగుచుండ' (ఆది. 5.5.) రాజ్యం చేసినట్లు వ్రాశాడు.

**సీ. అట విదర్భాధిపుఁడైన భీముం డను । వాఁ డనపత్యుఁడై వ్రతము లోలి**
**సలుపుచు దమనుఁ డ న్సన్మునిఁ బత్నియుఁ । దాను నుపాసించి, తద్వరమున**
**దమయంతి యను కూఁతు దమ దాంత దమను ల । న్సుతులను బడసె విశ్రుతగుణాఢ్యుఁ;**
**డందుఁ గన్యారత్న మగు దమయంతి దా । నత్యంతకాంతి రూపాభిజాత్య**

**ఆ. విమల గుణ సమృద్ధి వెలుఁగుచు సురసిద్ధ । సాధ్య కన్యలట్టి సఖులు నూర్వు**
**రొలసి తన్నుఁ గొలుచుచుండఁగ మహి నొప్పు । చుండె నధికవిభవయుక్తితోడ. 8**

**ప్రతిపదార్థం:** అట= వేరొకదేశంలో; విదర్భ+అధిపుఁడు+ఐన= విదర్భ దేశానికి రాజైన; భీముండు+అనువాఁడు= భీముడనే వాడు; న+అపత్యుఁడు+ఐ= అపత్యం-అంటే సంతానం లేనివాడై; వ్రతములు= నోములు; ఓలి= వరుసగా; సలుపుచున్= చేస్తూ; దమనుఁడు+అన్, సత్+మునిన్= దమనుడు అనే పేరుగల మంచి ఋషిని; పత్నియున్, తానున్= భార్యయు, తానున్నూ; ఉపాసించి= ఆరాధించి; తద్+వరమునన్= ఆతడు అనుగ్రహించిన వరంచేత; దమయంతి, అను, కూఁతున్= దమయంతి అనే పుత్రికను; దమ, దాంత, దమనులు+అన్, సుతులను= దముడు, దాంతుడు, దమనుడు అనే కొడుకులను; విశ్రుత, గుణ+ఆఢ్యుఁడు= పేరుకెక్కిన మంచి గుణాలతో కూడినట్టివాడు, అంటే భీముడు; పడసెన్= పొందాడు; అందున్= ఆ సంతానంలో; కన్యారత్నము+అగు= పడచులలో మిన్నఅయిన, (కన్యలలో రత్నమైన); దమయంతి; తాన్+అత్యంత, కాంతి, రూప+అభిజాత్య, విమల, గుణ సమృద్ధిన్= తాను మిక్కుటమైన లావణ్యంతో, శరీర సౌష్ఠవంతో, మంచి వంశంలో జన్మించిన గౌరవంతో, నిర్మలమైన మంచి గుణాల పొందికతో; వెలుఁగుచున్= ప్రకాశిస్తూ; సుర, సిద్ధ, సాధ్య, కన్యలు+అట్టి= దేవతలలోని, సిద్ధులలోని, సాధ్యులలోని ఆడపడుచులను పోలినట్టి; సఖులు= చెలికత్తెలు; నూర్వురు= వందమంది; ఒలసి= కలిసి; తన్నున్= తనను; కొలుచుచుండఁగ= సేవిస్తుండగా; అధిక, విభవ, యుక్తితోడన్= గొప్పవైభవంతో; మహిన్= భూమిపై; ఒప్పుచు+ఉండెన్= విలసిల్లుతున్నది.

**తాత్పర్యం:** అక్కడ విదర్భలో రాజైన భీముడు సంతానహీనుడు. అతడు, అతనిభార్య దమనుడనే గొప్పఋషిని ఆరాధించారు. వారికి దమయంతి అనే కూతురు, దముడు, దాంతుడు, దమనుడు అనే ముగ్గురు కొడుకులు పుట్టారు. కన్యకామణి అయిన దమయంతి, విశేషరూపలావణ్యవతి అయి, సద్వంశంలో పుట్టిన గౌరవం ఒప్పగా, సద్గుణాలతో విరాజిల్లుతూ ఉన్నది. నూరుగురు చెలికత్తెలు, సురసిద్ధసాధ్య కన్యకలతో సాటివచ్చేవారు ఆమెను సేవిస్తూ ఉన్నారు. దమయంతి అత్యధికవైభవంతో తులతూగుతున్నది.

**విశేషం:** సురలు, సిద్ధులు, సాధ్యులు దేవతలలోని అంతర్వర్గాలకు చెందినవారు.

**వ. అంత. 9**

**తాత్పర్యం:** అట్లా కొంతకాలం జరిగిన తరువాత.

**క. నలుగుణములు దమయంతికి । నలునకు దమయంతి గుణగణంబులు జను లి**
**మ్ములఁ బొగడుట నిరువురకును । వెలసె మనోభవ వికార విభ్రమ మెదలన్. 10**

**ప్రతిపదార్థం:** నలు, గుణములు= నలుడిలోని మంచి లక్షణాలు; దమయంతికి; దమయంతి, గుణ, గణంబులు= దమయంతిలోని మంచిగుణాల సముదాయాలు; నలునకు; జనులు= ప్రజలు; ఇమ్ములన్= ప్రీతితో; పొగడుటన్= ప్రశంసించటం చేత; ఇరువురకును= ఇద్దరికిని, అంటే నలదమయంతులు ఇద్దరికిని; ఎదలన్= హృదయాలలో; మనస్+భవ, వికార, విభ్రమము= మన్మథుడికి చెందిన మారుపాటువలన ఏర్పడిన వేగిరపాటు, అంటే శృంగార భావోదయం; వెలసెన్= విలసిల్లింది.

**తాత్పర్యం:** నలుడి సద్గుణాలను దమయంతికి, దమయంతి గుణగణాలను నలుడికి ప్రజలు అభివర్ణించి, ప్రశంసించి, చెప్పటంచేత ఇరువురిలో శృంగారభావాలు వెల్లివిరిశాయి.

**వ. ఒక్కనాఁడు నలుఁడు దమయంతీ గుణబద్ధ చేతస్కుండై మదనానలంబు సహింప నోపక ప్రమదవనంబున నుండునంత నంతరిక్షకాంతాహారావళియుంబోలె హంసావళి యవనీతలంబున కవతరించిన. 11**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు= ఒకానొకరోజున; నలుఁడు; దమయంతీ, గుణ, బద్ధ, చేతస్కుఁడు+ఐ= దమయంతియొక్క మంచిగుణాలచేత కట్టివేయబడిన మనస్సు కలవాడై; మదన+అనలంబు= మన్మథుడియొక్క(అగ్నిని) తాపాన్ని; సహింపన్+ఓపక= తాళలేక; ప్రమదవనంబునన్= ఉద్యానవనంలో; ఉండు+అంతన్= ఉన్నప్పుడు; అంతరిక్ష, కాంతా, హార+ఆవళియున్+పోలె= ఆకాశమనే వనితయొక్క (కంఠంలోని) దండలను పోలుతూ; హంస+ఆవళి= అంచలగుంపు; అవనీ, తలంబునకు= నేలపైకి; అవతరించినన్= దిగగా.

**తాత్పర్యం:** ఒకానొకనాడు, దమయంతియొక్క మంచిగుణాలచేత ఆకర్షించబడిన మనస్సు కలవాడై నలుడు మదనతాపం తాళలేక ఉద్యానవనంలో విహరిస్తూఉన్నాడు. అప్పుడు ఆకాశమనే సుందరియొక్క మెడలోని దండలను పోలిన హంసలగుంపు భూమిమీద వ్రాలింది.

**విశేషం:** అలం: ఉపమ. అంచలగుంపు ఆకాశమనే సుందరికి కంఠహారాలుగా భాసిల్లినాయనటం హృదయంగమమైన ఉపమాలంకారం.

**ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల। నడ బెడంగుఁ జూచి నగుచు వాని**
**నెగిచి యెగిచి యందు నెగయకుండఁగ నొక్క। హంసఁ బట్టుకొనియె నతిరయమున. 12**

**ప్రతిపదార్థం:** వీరసేన, సుతుఁడు= వీరసేనుడి కొడుకు- నలుడు; వీరుండు= పరాక్రమం కలవాడు; హంసల, నడ, బెడంగున్+చూచి= అంచలనడల సొగసు చూచి; నగుచున్= నవ్వుతూ; వానిన్= ఆ హంసలను; ఎగిచి+ఎగిచి= వెంబడించి వెంబడించి; అందున్= వాటిలో; ఒక్క హంసన్= ఒక అంచను; ఎగయకుండఁగన్= ఎగిరిపోకుండా; (ఎగయక+ఉండన్= ఎగిరిపోకుండా ఉండగా అనికూడా చెప్పవచ్చు;) అతిరయమునన్= మిక్కిలివేగంగా; పట్టుకొనియెన్= పట్టుకొన్నాడు.

**తాత్పర్యం:** వీరసేనుడి పుత్రుడు, పరాక్రమవంతుడు ఐన నలుడు ఆ హంసల నడకల సొగసు చూచి మురిసిపోయి లోలోపల నవ్వుకొంటూ, తాను వాటిని తరిమి తరిమి, అందులో ఒక హంసను ఎగిరిపోకుండా (ఒక హంస ఎగిరిపోకుండా ఉండగా) మిగులవేగంగా పట్టుకొనగలిగాడు.

**విశేషం:** నలుడు ఒక హంసను పట్టుకొన్నాడు. ఎట్లా పట్టుకొన్నాడు? 'ఎగయకుండఁగ' - అంటే 'ఎగురకుండ' - అని సమాధానం. అంటే ఇక్కడి ధాతువు 'ఎగయు' - అన్నమాట. అంటే పైకి పోకుండగా నలుడు హంసను పట్టుకొన్నాడు. ఇక,

ముందు ప్రయోగించబడిన 'ఎగిచి' - అనేది 'ఎగుచు' ధాతువు నుండి ఏర్పడింది. 'ఎగుచు' అనేది 'ఏగు' ధాతువు యొక్క ప్రేరణార్థకం. కనుక 'ఎగయు' 'ఎగుచు' - వేరు వేరు ధాతువులు. నలుడు హంసలను వేగంగా వెంబడించాడు (ఎగిచాడు). అలా వెంట తరమటంలో ఒక హంసను ఎగిరిపోకుండ శీఘ్రంగా పట్టుకోగలిగాడు. నలుడు హంసలను తరుముతూ ఎగురగొడుతూ ఉన్నా ఆ అంచలగుంపులోని ఒక హంస ఎగిరిపోకుండా ఉండగా నలుడు దానిని ఒడుపుగా వేగంగా పట్టుకొన్నాడని కొందరు వ్యాఖ్యాతలు చెప్పారు. ఆ హంస మిగిలిన హంసలతో పాటు ఎగిరిపోకుండా కొంత జాగు చేయటానికి కథలో ఒక పరమార్థం ఉంది. శివుడే ఆ రూపంలో వచ్చి నలదమయంతులకు వివాహం చేసే యత్నం చేశాడని, కాబట్టి ఆ హంస కారణజన్మురాలని కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణగారు వివరించారు. వివరాలకు చూడండి పీఠిక. (సంపా.) ఈ పద్యంలోని మూడవపాదంలో కొన్ని ప్రతుల్లో "నెగచి యెగచి'' - అనే పాఠభేదం కనిపిస్తున్నది.

**ఆ. దాని విడిచి పోవఁగా నోప కఱచుచు । నంతరిక్షమునను హంసలెల్లఁ**
**బిండుగట్టి తిరుగుచుండె వాతోద్ధూత । శారదాభ్ర శకల చయముఁ బోలె. 13**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ హంసను; విడిచిపోవగాన్+ఓపక= వీడి వెళ్ళిపోలేక; అఱచుచున్= అరుస్తూ; అంతరిక్షమునను= ఆకాశంలో; హంసలు+ఎల్లన్= హంసలన్నీ; పిండుకట్టి= గుమిగూడి; వాత+ఉద్ధూత, శారద+అభ్ర, శకల, చయమున్, పోలెన్= గాలిచేత చెదరగొట్టబడిన శరత్కాలంలోని మేఘాల ముక్కల సముదాయంవలె; తిరుగుచు+ఉండెన్= పరిభ్రమిస్తూ ఉన్నాయి.

**తాత్పర్యం:** నలుడికి చిక్కిన అంచ(హంస)ను విడిచిపెట్టి వెళ్లిపోజాలక తక్కిన హంసలు అరుస్తూ ఆకాశంలో తిరుగాడజొచ్చాయి. అప్పుడు ఆ హంసలు, గాలిచేత చెదరగొట్టబడిన శరత్కాలంలోని మబ్బుల తునకలసమూహంవలె ఉన్నాయి.

**విశేషం:** హంసలు తెలుపు. శరదృతువులో మేఘాలు తెల్లగా ఉంటాయి. నేలపై వ్రాలటానికి ముందు హంసలు ఆకాశసుందరి కంఠంలోని వజ్రహారాలవలె ఉన్నాయి. ఇప్పుడు అవి చెదరి ఆకాశంలో తిరుగాడుతున్నాయి. శరత్కాలంలో గాలికి చెదరిన మబ్బు తునకలవలె ఉన్నాయి. రెండు ఉపమానాలున్నూ మనోహరమైనవే. అలంకారం: ఉపమ.

**వ. అదియును దన కమ్మనుజేశ్వరుఁ డపాయంబు సేయుంగా వగచి మనుష్య వాక్యంబుల నిట్లనియె: 'నయ్యా! యేను నీకుం బ్రియంబు సేసెద; నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికిం బోయి నీ గుణంబులు దానికి వర్ణించి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయంద బద్ధానురాగ యగునట్లుగాఁ జేసెద.' 14**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ హంసయున్నూ; తనకు; ఆ+మనుజ+ఈశ్వరుఁడు= మనుజులకు పరిపాలకుడైన ఆ రాజు; అపాయంబు= కీడు; చేయుంగా, వగచి= చేస్తాడని తలచి; మనుష్య, వాక్యంబులన్= మనుజులు మాట్లాడే భాషలో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది; అయ్యా!= ఓ మహానుభావా!; ఏను= నేను; నీకున్+ప్రియంబు+చేసెదన్= నేను నీకు ఇష్టమైన మేలు చేస్తాను; నీ, హృదయ+ఈశ్వరి+ఐన= నీ హృదయానికి ఈశ్వరి అయిన, అంటే నీవు ప్రేమించిన; దమయంతి, పాలికిన్+పోయి= దమయంతి కడకు వెళ్ళి; నీ, గుణంబులు= నీలోని మంచిలక్షణాలు; దానికిన్= ఆమెకు (ఆ దమయంతికి); వర్ణించి= ఉగ్గడించి; ఆ+కన్య= ఆ అమ్మాయి; అన్యులన్= ఇతరులను; అపేక్షింపక= కోరుకొనక; నీ యందు+అ= నీ పైననే; బద్ధ+అనురాగ= బంధించబడిన అనురాగం కలది, అంటే నిన్ను వలచినట్టిది; అగునట్లుగాన్; చేసెదన్= చేయగలను.

**తాత్పర్యం:** ఆ హంస తనకు ఆ రాజు కీడు చేస్తాడని శంకించి, మనుజసంభాషణలతో ఇట్లా పలికింది. 'మహానుభావా! నేను నీకు ప్రియమైన ఉపకారం చేస్తాను. నీ హృదయేశ్వరి అయిన దమయంతి దగ్గరకు వెళ్ళి, ఆమెకు నీ మహనీయ గుణగణాలు ఉగ్గడించి చెప్పి, ఆ కన్యకామణి నీమీదే వలపు నిలిపేటట్లు చేస్తాను'.

**క. అనిన విని హంస పలుకులు । దన హృదయంబునకు నమృతధారాపాతం
బునుబోలె నైన నృపనం । దనుఁ డనురక్తుఁ డయి విడిచెఁ దడయక దానిన్. 15**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; హంస, పలుకులు= అంచమాటలు; తన, హృదయంబునకున్= తన ఎదకు; అమృత, ధారా, పాతంబును, పోలెన్+ఐన= ఎడతెగకుండ అమృతపువాన కురిసినట్లుకాగా; నృప, నందనుఁడు= రాజకుమారుడు (నలుడు); అనురక్తుఁడు+అయి= ప్రేమ కలవాడయి; తడయక= వెనువెంటనే (ఆలస్యంచేయక); దానిన్= ఆ హంసను; విడిచెన్= విడిచిపెట్టాడు.

**తాత్పర్యం:** ఆ హంస చెప్పినమాటలు నలుడి హృదయానికి కుంభవృష్టిగా అమృతం కురిసినట్లు అనిపించింది. అందుచేత ఆ రాజపుత్రుడు అనురాగంతో ఆ హంసను వెనువెంటనే విడిచిపెట్టాడు.

**వ. అంచపిండుతో నదియును విదర్భనగరంబునకుం బఱచి, యం దుపవనంబున సఖీజనపరివృతయై యున్న దమయంతి యంతికంబునకు వచ్చి విహరించుచుండె; నంత వానిం జూచి పరమకౌతుకమ్మున. 16**

**ప్రతిపదార్థం:** అంచ, పిండుతోన్= హంసలగుంపుతో; అదియును= ఆ హంసకూడా; విదర్భ, నగరంబునకున్+పఱచి= విదర్భ పట్టణానికి పారి, అంటే ఆకాశమార్గంలో ఎగిరివెళ్ళి; అందు+ఉపవనంబున= అక్కడి ఉద్యానవనంలో; సఖీ, జన, పరివృత+ఐ= చెలికత్తెలతో చుట్టుకొనబడిందై; ఉన్న= ఉన్నట్టి; దమయంతి+అంతికంబునకు, వచ్చి= దమయంతి సమీపానికి చేరి; విహరించుచు+ఉండెన్= తిరుగాడుతూ ఉండింది; అంత= అటుపిమ్మట; వానిన్+చూచి= ఆ హంసలను చూచి; పరమకౌతుకమ్మునన్= మిక్కుటమైన సంతోషంతో.

**తాత్పర్యం:** అంచపిండుతో కలిసి ఆ హంసకూడా విదర్భ రాజధానికి ఎగిరివెళ్ళి, అక్కడ ఉద్యానవనంలో చెలికత్తెలతో కలిసి విహరిస్తున్న దమయంతి సమీపానికి వచ్చి నడయాడుతూ ఉన్నది. దమయంతి ఆ హంసలను చూచి మిక్కుటమైన సంతోషాన్ని పొందింది.

**తే. ఒండొరులఁ గడవంగ నయ్యువిద లెల్లఁ । బఱచి యొక్కొక్క కలహంసఁ బట్టికొనఁగఁ
జెలువముగ నందు దమయంతిచేతఁ బట్టు । వడియె నలుచేత విడువంగఁబడిన హంస. 17**

**ప్రతిపదార్థం:** ఆ+ఉవిదలు+ఎల్లన్= ఆ అంగనలందరు; ఒండొరులన్+కడవంగన్= ఒకొరినొకరు మీరి; పఱచి= పరుగెత్తి; ఒక్కొక్క= ఒకరు ఒక; కలహంసన్= రాజహంసను; పట్టి కొనఁగన్= పట్టుకోగా; అందున్= ఆ హంసలలో; నలుచేత= నలుడిచేత; విడువంగన్+పడిన హంస= వదలి పెట్టబడిన అంచ; దమయంతిచేతన్; చెలువముగన్= అందంగా; పట్టు+పడియెన్= పట్టువడింది.

**తాత్పర్యం:** ఆ వనితలందరు ఒకరినొకరు మీరి, పరుగెత్తి ఒక్కొక్కరు ఒక్కొక్క రాజహంసను పట్టుకొన్నారు. అందులో మున్ను నలుడిచేత విడువబడిన హంస దమయంతిచేతనే అందంగా పట్టువడింది.

**క. దమయంతికి నలునకు సం । గమకారణ దూతయైన కలహంస మనో**
**జ్ఞమనుష్య వాక్యముల న । ద్దమయంతికి హర్ష మెసఁగఁ దా ని ట్లనియెన్. 18**

**ప్రతిపదార్థం:** దమయంతికి; నలునకున్; సంగమ, కారణ, దూత+ఐన= సంయోగానికి (కలయికకు విధిచే నిర్ణయించబడిన దూత అయిన; (దూత= ఉభయపక్షాలకు సంధిచేయటానికి నియుక్తుడైనవాడు); కలహంస= ఉత్తమ జాతిహంస (రాజహంస); మనోజ్ఞ, మనుష్య, వాక్యములన్= సుందరమైన మనుజ భాషలో; ఆ+దమయంతికి; హర్షము+ఎసఁగన్= సంతోషం అతిశయించగా; తాన్= ఆ హంస; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** దమయంతికి నలుడికి సంయోగం సమకూర్చటానికై విధిచే నిర్ణయించబడిన దూత అయిన ఆ రాజహంస మనోహరమైన మనుజభాషలో దమయంతికి సంతోషం అతిశయించేటట్లు ఈ విధంగా పలికింది.

**విశేషం:** ఈ పద్యంలో 'కారణదూత' అనే ప్రయోగానికి విద్వాంసులు విశేషార్థాన్ని వివరిస్తున్నారు. ఈ ప్రయోగం హంసకు విశేషణంగా వాడబడింది. 'సంగమకారణదూత'- సంయోగానికి కారణమైన దూత అని స్థూలంగా అర్థం చెప్పవచ్చు. అసలు- నలదమయంతులు విధాతచేత ఒకరికొకరు సృష్టించబడినవారు. అందు 'హంస' నిర్వహించవలసిన భూమిక విధి నిర్ణీతం. 'ఆ హంస నలదమయంతుల సమాగమం కూర్చటంకోసమే జన్మించింది'- అనే అర్థస్ఫూర్తి 'కారణదూత' ప్రయోగంలో కలదని పండితోత్తముల అభిప్రాయం. "కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై"- అనే ప్రయోగం ఇచట స్మరించతగింది. కవినికాయం మెచ్చేటట్లు కావ్యకర్త అవటానికే రచయిత జన్మించాడని ఇందులోని అంతరార్థం. నలుడిచేత విడువబడిన హంసయే దమయంతి చేతికి పట్టువడటం ఇందులోని స్వారస్యం.

**వ. 'నీ హృదయేశ్వరుండైన నలునొద్దనుండి వచ్చితి; నపార పారావార పర్యం తానంత మహీతలంబునందు నా చూడని రాజు లెవ్వరు లేరు; సర్వగుణ సౌందర్యంబుల నెవ్వరు నలుం బోలరు. 19**

**ప్రతిపదార్థం:** నీ, హృదయ+ఈశ్వరుండు+ఐన= నీ హృదయానికి నాథుడైన- అంటే నీవు వలచినటువంటి; నలు+ఒద్ద, నుండి= నలుడి దగ్గరనుండి; వచ్చితిన్= అరుదెంచాను; అపార, పారావార, పర్యంత+అనంత, మహీతలంబునందు= ఒడ్డులేని సముద్రంవరకు అంతంలేకుండ విస్తరించిన భూమండలంలో; నా, చూడని= నేను చూడనట్టి; రాజులు+ఎవ్వరు= ప్రభువులు ఎవ్వరున్నూ; లేరు; సర్వ, గుణ, సౌందర్యంబులన్= అన్ని మంచిగుణాలలోను, అందంలోను; ఎవ్వరు= ఏ రాజులున్నూ; నలున్= నలుడితో; పోలరు= సమానులు కారు.

**తాత్పర్యం:** 'నేను నీ హృదయేశ్వరుడైన నలుడిదగ్గరనుండి వచ్చాను; అంతం, దరి లేని సముద్రంవరకు విస్తరించి ఉన్న ఈ అపార భూమండలంలో రాజులెవ్వరూ సౌందర్యసౌశీల్యాలలో నలుడికి సాటిరారు.

**తే. నీవు నలునకుఁ బేర్మితో దేవివైనఁ । గాక నీ సముజ్జ్వల రూప కాంతి విభవ**
**నిత్య సౌభాగ్య భాగ్యాభిజాత్య భద్ర । లక్షణావలు లవి సఫలంబు లగునె? 20**

**ప్రతిపదార్థం:** నీవు; నలునకున్= నలుడనే వరుడికి; పేర్మితోన్= గౌరవంతో; దేవివి= దేవేరివి; ఐనన్, కాక= అయితే తప్ప; నీ, సముజ్జ్వల, రూప, కాంతి, విభవ, నిత్య, సౌభాగ్య, భాగ్య+అభిజాత్య, భద్ర, లక్షణ+ఆవలులు= మిక్కిలి వెలుగొందే నీ సౌందర్యం, నీ లావణ్య సంపద, నీ ఎడతెగని ఐశ్వర్యం, నీ అదృష్టం, గొప్పవంశంలో జననమందిన నీ గౌరవం, శుభప్రదమైన నీకు గల సద్గుణాలు; అవి= అవన్నీ; సఫలంబులు+అగునె?= ఫలప్రదాలు అవుతాయా? అంటే రాణిస్తాయా? (రాణించవని భావం).

**తాత్పర్యం:** ఓ దమయంతీ! నీవు నలుడికి దేవేరివి అయితే తప్ప నీకు గల గొప్పలక్షణాలు- సౌందర్యం, లావణ్య సంపద, ఐశ్వర్యం, నిత్య సౌభాగ్యం, అదృష్టం, వంశగౌరవం మున్నగునవి రాణించవు.

**వ. నీవు నారీరత్నంబ, వాతండు పురుషరత్నంబు; గావున మీ యిద్దఱ సమాగమం బన్యోన్యశోభాకరంబగు' ననిన విని సంప్రాప్త హృదయసమ్మదయై దమయంతి దాని కిట్లనియె. 21**

**ప్రతిపదార్థం:** నీవు, నారీ, రత్నంబవు= నీవు వధువులలో రత్నంవంటిదానివి, అంటే శ్రేష్ఠురాలివి; ఆతండు= ఆ నలుడు; పురుషరత్నంబు= పురుషులలో శ్రేష్ఠుడు; కావున; మీ+ఇద్దఱు+అ= మీ ఇరువురి; సమాగమంబు= కలయిక; అన్యోన్య, శోభా+ఆకరంబు+అగున్= ఒకరికి ఇంకొకరు కాంతి కలిగించేటట్లు అవుతుంది; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; సంప్రాప్త, హృదయ, సమ్మద+ఐ= హృదయంలో ఏర్పడిన సంతోషం కలదై; దమయంతి; దానికి= ఆ హంసకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పింది.

**తాత్పర్యం:** నీవు స్త్రీ రత్నానివి. ఆ నలుడు పురుషరత్నం. మీ ఇరువురి సంయోగం ఒకరి కొకరు శోభ చేకూర్చినట్లు ఉంటుంది'- అని హంస పలుకగా దమయంతి మిక్కుటమైన ఆనందం పొంది ఇట్లా అన్నది.

**మధ్యాక్కర.**

**'ఆ రాజుగుణములు నా కెఱింగించి నట్టులు నన్ను**
**నా రాజునకు నెఱింగించి కరుణ నాయందుఁ గావింపు**
**మారంగ' ననుడు నిషధవిషయమున కరిగి యా హంస**
**వీరసేనజునకు దాని గుణరూప విభవముల్ సెప్పె. 22**

**ప్రతిపదార్థం:** ఆ, రాజు, గుణములు= రాజైన ఆ నలుడి గొప్పగుణాలు; నాకు+ఎఱింగించినట్టులు= నాకు తెలియజేసినట్లుగా; నన్నున్= నన్నుగురించి (అంటే నాలోని గొప్పగుణాలను); ఆ, రాజునకున్= ఆ రాజైన నలుడికి; ఎఱింగించి= తెలిపి; నాయందున్= నాపట్ల; కరుణ= దయ; ఆరంగన్= సంపూర్ణంగా; కావింపుము= కల్పించేది; అనుడు= అని చెప్పగా; ఆ, హంస; నిషధ విషయమునకు= నిషధదేశానికి; అరిగి= వెళ్ళి; వీరసేనజునకున్= వీరసేనుడి కుమారుడైన నలుడితో; దాని= ఆ దమయంతి యొక్క; గుణ, రూప, విభవముల్= మంచిగుణాలు, అందం, సంపద గురించి; చెప్పెన్= వచించింది.

**తాత్పర్యం:** 'ఆ నలమహారాజుగుణాలనుగురించి నా కెట్లా చెప్పావో అట్లాగే నన్నుగురించికూడా నిండైన దయతో ఆరాజుకు తెలియజెప్పుము'- అని దమయంతి అనగానే ఆ హంస నిషధదేశానికి వెళ్ళి, నలమహారాజుకు దమయంతి గుణరూపవైభవాలను గురించి చెప్పింది.

**విశేషం:** మధ్యాక్కర వృత్తంలోని ప్రతిచరణంలోనూ వరుసగా రెండు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం, రెండు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం ఉంటాయి. అయిదవగణంయొక్క మొదటి అక్షరంతో యతిమైత్రి. ప్రాసనియమం పాటించబడుతుంది.

**వ. అంత 23**

**తాత్పర్యం:** అప్పుడు.

**చ. నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానల బాధ్యమానులై**
**సలిపిరి దీర్ఘవాసర నిశల్ విలసన్నవనందనంబులన్**
**నలినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసారపాంసులం**
**దలిరుల శయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్. 24**

**ప్రతిపదార్థం:** నల, దమయంతులు= నలుడును, దమయంతియు; ఇద్దఱు= ఇరువురునూ; మనస్+ప్రభవ+అనల, బాధ్యమానులు+ఐ= మన్మథతాపంచేత బాధించబడినవారై (మనః ప్రభవుడు= మన్మథుడు); దీర్ఘ, వాసర, నిశల్= పొడవైన పవళ్ళు, రేలు; విలసత్+నవ, నందనమ్ములన్= ప్రకాశిస్తున్న అపరనందనవనాలలో (నందనవనం స్వర్గలోకంలోని ఉద్యానవనం); నలినదళంబులన్= తామరపూల రేకులలో; మృదు మృణాళములన్= మెత్తనైన తామరతూండ్లలో; ఘనసార, పాంసులన్ =కర్పూరధూళితో; తలిరుల శయ్యలన్= చిగురుటాకుల సెజ్జలపై; సలిల ధారలన్= ఎడతెగకుండ చల్లుకొనిన నీళ్ళలో; చందన, చారు, చర్చలన్= మనోహరమైన గంధపు మైపూతలతో; సలిపిరి= గడిపారు.

**తాత్పర్యం:** నలదమయంతులు ఇరువురున్నూ (ఒకరికొకరు సుదూరంలో ఉండి) మన్మథతాపంచేత బాధించబడినవారై చెలువం చిందే నందనవనాలవంటి క్రొత్తతోటలలో, తామరపూలరేకులలో, మెత్తని తామరతూండ్లలో, కర్పూరపరాగంతో, మంచి గంధపు మైపూతలతో, చల్లనినీటి జల్లుల్లో, చిగురుటాకుల శయ్యలమీద పెక్కు పొడవయిన రేయింబవళ్ళు గడిపారు.

**విశేషం:** ఓజోగుణంతో కూడుకొన్న శిథిలబంధం ప్రసాదగుణం. దాని కీపద్యం చక్కని ఉదాహరణం. పూర్వరాగ విప్రలంభ వర్ణనకు సంబంధించిన ఈ పద్యరచన చిత్తవికాసరూపమైన రసానుభూతిని అందిస్తుంది. రసోచితమైన అక్షరరమ్యత గమనించదగింది. మన్మథవిరహాగ్ని తప్తులైన నాయికా నాయకులు శీతలోపచారాలను ఆశ్రయించటం ప్రకరణౌచిత్యం. 'దీర్ఘవాసరనిశల్' అనే సమాసం సార్థకం. విరహంవలన పవళ్ళు, రాత్రులు దీర్ఘాలుగా వారి కనిపించాయని ధ్వని. లేదా - పగళ్ళు దీర్ఘాలైన గ్రీష్మాదులూ, రాత్రిళ్ళు దీర్ఘాలైన హేమంతాదులూ ఈ సమాసంవలన సూచించబడుతున్నవనీ, నలదమయంతులు అన్ని ఋతువుల్లోనూ విరహబాధను విస్తృతంగా అనుభవించారనీ గ్రహించవచ్చును. భావిప్రబంధ శృంగారరసవర్ణనలకు ఈ పద్యం ఒక వెలుగుబాట.

**వ. ఇట్లిద్దఱు నన్యోన్యరూపగుణ శ్రవణసంజాతప్రీతులై యుండునంత నంతఃకరణ సంతత మనోజాత సంతాప వివర్ణ వదనయైన యా దమయంతిం జూచి భయసంభ్రమాక్రాంతులై సఖీజను లెల్ల నక్కోమలి వృత్తాంతం బంతయు భీమున కెఱింగించి యిట్లనిరి. 25**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఇద్దఱున్= ఇరువురు; అన్యోన్య, రూప, గుణ, శ్రవణ, సంజాత, ప్రీతులు+ఐ= ఉభయులందుగల అందం, మంచిగుణాల గురించి వినటం వలన పుట్టిన సంతోషం కలవారై; ఉండు+అంతన్= ఉన్నపిదప; అంతఃకరణ, సంతత, మనస్+జాత, సంతాప, వివర్ణ, వదన+ఐన= మనస్సులోపలి ఎడతెగని మన్మథబాధచేత వెలవెల పోయిన ముఖం కలదైన; ఆ, దమయంతిన్+చూచి= ఆ దమయంతిని చూచి; భయ, సంభ్రమ+ఆక్రాంతులు+ఐ= భయంవలన కలిగిన ఉద్వేగంతో కూడినవారై; సఖీ, జనులు+ఎల్లన్= చెలికత్తెలందరు; ఆ+కోమలి= ఆ సుకుమారియొక్క; వృత్తాంతంబు+ అంతయు= సమాచారమంతయు; భీమునకు= (విదర్భరాజైన) భీముడికి; ఎఱింగించి= తెలిపి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** నలదమయంతులు ఇద్దరు ఒకరి రూపగుణాలను గూర్చి మరొకరు వినటంవల్ల ఒకరిపై ఒకరు ప్రేమకలవారై ఉన్నారు. అప్పుడు మన్మథతాపంచేత వెలవెలపోయిన మొగంతో లోలోపల మగ్గుతున్న దమయంతిని చూచి, భయంతో కూడిన తత్తరపాటుతో చెలికత్తెలందరు ఆ సుకుమారిసమాచారాన్ని భీమరాజుకు తెలిపి ఇట్లన్నారు.

**సీ.** **కలహంస పలికిన పలుకులు గుణియించు, । వడి దాని పోయిన వలను చూచుఁ,**
**బలుకదు సఖులతో లలితాంగి, మిన్నక । యలయుచు నుండుఁ దా ననుదినంబుఁ,**
**జారువిభూషణాహార విహార శ । య్యాసన భోగంబులందు విముఖి**
**యయి, రేయుఁ బగలు నిద్రయు నెప్పు డెఱుఁగక । దమయంతి నలుఁ డను ధరణినాథు**

**ఆ.** **నంద బుద్ధి నిలిపి, కందర్ప బాధిత । యగుచు నున్నయది ధరాధినాథ!**
**ధరణిపతుల నొరుల నురుగుణాఢ్యుల విన । నొల్ల దెంత విభవయుక్తు లయిన.** **26**

**ప్రతిపదార్థం:** కలహంస= రాజహంస; పలికిన, పలుకులు= చెప్పినమాటలు; గుణియించున్= వల్లె వేస్తుంది; వడిన్= వేగంగా; దాని, పోయిన, వలను= అది (రాజహంస) వెళ్ళిన దిక్కునే; చూచున్= చూస్తుంటుంది; సఖులతో= చెలికత్తెలతో; పలుకదు= మాటాడదు; లలితాంగి= సుకుమారమైన శరీరంకలది (దమయంతి); మిన్నక= ఊరక; అలయుచున్+ఉండున్= అలసిపోతుంటుంది; తాన్= తాను; అనుదినంబున్= ప్రతిదినమును; చారు, విభూషణ+ఆహార, విహార, శయ్యా+ఆసన, భోగంబులందున్= అందమైన ఆభరణాలపట్ల, ఆహార విహారాలలోను, పడకలోను, పీఠంలోను- అంటే ఆయా సౌఖ్యాలలో; విముఖి+అయి= పెడమొగం కలదై- అంటే లెక్కచేయనిదై; రేయున్= రాత్రులు; పగలు= పగళ్ళు; నిద్రయున్= నిద్రను; ఎప్పుడు+ఎఱుఁగక= ఎప్పుడూ తెలియక, అంటే దివారాత్రాలలో ఎప్పుడూ నిద్రపోక; దమయంతి; నలుఁడు+అను= నలుడనే; ధరణి, నాథునందు+అ= రాజుమీదే; బుద్ధి, నిలిపి= మనస్సులో లగ్నంచేసి; కందర్ప, బాధిత+అగుచున్= మన్మథుడిచేత బాధించబడిందవుతూ; ఉన్న+అది= ఉన్నది; ధరా+అధి, నాథ!= ఓ మహారాజా!; ధరణి, పతులన్+ఒరులన్= ఇతర రాజులను; ఉరు, గుణ+ఆఢ్యులన్= గొప్ప గుణాలు కలవాళ్ళను; ఎంత, విభవ, యుక్తులు+అయినన్= ఎంత సంపదతో కూడుకొని ఉన్నవాళ్ళనైనను; వినన్+ఒల్లదు= ఆలకించటానికి ఇష్టపడదు.

**తాత్పర్యం:** దమయంతి ఆ రాజహంస వెళ్ళినదిక్కునే ఎప్పుడూ చూస్తూ ఉంటుంది. ఆ రాజహంస చెప్పిన మాటలనే వల్లెవేస్తూ ఉంటుంది. ఆ లలితాంగి చెలికత్తెలతో మాటాడటం మానివేసింది. ఏ పనీ చేయకుండానే ఊరక అలసిపోతుంది. ప్రతిదినం ఎట్టి సౌఖ్యాలను ఆశించదు. అందమైన ఆభరణాలపై ఆహార విహారాలపై ఆమెకు అభిలాషలేదు. శయనించటానికి మంచిపరుపు కోరదు. కూర్చొనటానికి మెత్తనిపీఠం కావాలని అడగదు. అసలు నిద్రలేకుండ ఎన్నో రాత్రులు పగళ్ళు ఆమె గడిపింది. ఎల్లప్పుడు నలుడు అనే మహారాజునే స్మరిస్తూ మన్మథతాపంతో క్రుంగి కృశిస్తున్నది. ఓ మహారాజా! ఇతర రాజులు ఎంతటి సంపద కలవారైనా, ఎంతటి గొప్పగుణాలు కలవారైనా వారి విషయం ఏమాత్రం వినటానికి ఇష్టపడదు.

**వ.** **అనిన విని భీముం 'డేమి సేయుదు? నెవ్విధంబున నమ్మహీపతి నిట రావింప నగునో!' యని చింతించుచు సంప్రాప్త యౌవనయైన కూఁతుం జూచి యప్పుడు.** **27**

**ప్రతిపదార్థం:** అనిన, విని= అని చెప్పగా విని; భీముండు= భీమరాజు; ఏమి+చేయుదున్= ఏమి చేయగలను?; ఏ+విధంబునన్= ఏరీతిగా; ఆ+మహీపతిన్= ఆ (భూభర్త) రాజును; ఇట= ఇచటికిః రావింపన్+అగునో= రప్పించటానికి వీలవునో?; అని;

చింతించుచున్= యోచిస్తూ; సంప్రాప్త, యౌవన+ఐన= ప్రాప్తించిన యౌవనంకలదైన-అంటే యుక్తవయస్సు వచ్చినట్టి కూఁతున్+చూచి= పుత్రికను చూచి; అప్పుడు.

**తాత్పర్యం:** చెలికత్తెలు అట్లా చెప్పగా విని భీమరాజు 'ఏమి చేయగలను? ఏ ఉపాయంతో ఆ నలమహారాజును ఇచటికి రప్పించగలను?' అని ఆలోచిస్తూ, యుక్తవయస్సు వచ్చిన పుత్రికను చూచి, అపుడు.

**క. ఆ వైదర్భుఁడు నిఖిల ధ । రా వలయములోనఁ గలుగు రాజన్యుల నా**
**నా విషయాధీశ్వరులను । రావించెం దత్స్వయంవర వ్యాజమునన్. 28**

**ప్రతిపదార్థం:** ఆ, వైదర్భుఁడు= ఆ విదర్భరాజు(భీముడు); నిఖిల, ధరా, వలయములోనన్+కలుగు= సమస్త భూమండలంలో ఉన్న; రాజన్యులన్= రాజులను, నానా, విషయ+అధీశ్వరులను= వివిధ దేశాలకు ప్రభువులైన వాళ్ళను; తద్+స్వయంవర, వ్యాజమునన్= ఆ దమయంతియొక్క స్వయంవరం అనే మిషతో; రావించెన్= రప్పించాడు.

**తాత్పర్యం:** ఆ విదర్భరాజు భీముడు సమస్త భూమండలంలో ఉన్న రాజులను దమయంతీ స్వయంవరమనే మిషతో రప్పించాడు.

**విశేషం:** పూర్వకాలంలో భారతదేశంలో క్షత్రియ రాజకన్యలు తమకు నచ్చిన వరుడిని ఎన్నిక చేసికొని పెండ్లి చేసికొనేవారు. ఆ బహిరంగ రాజసభకు రాజులందరినీ ఆహ్వానించటం పరిపాటి. ఆ మహోత్సవంలో ప్రధాన భూమిక నిర్వహించే కన్యక రాజపుత్రిక. కావున ఆ మహోత్సవానికి 'స్వయంవరం' అనే పేరు వచ్చింది.

**క. మనుజేశ్వరు లెల్లను బో । రన దమయంతీ స్వయంవరమునకు నొప్పం**
**జనుదెంచిరి సైన్యస్యం । దన ఘట్టన నవనితలము దల్లడపడఁగన్. 29**

**ప్రతిపదార్థం:** మనుజ+ఈశ్వరులు+ఎల్లను= రాజులందరు; బోరున= శీఘ్రంగా; దమయంతీ, స్వయంవరమునకున్= దమయంతి యొక్క స్వయంవరానికి; సైన్య, స్యందన, ఘట్టనన్= భటులయొక్క రథాలయొక్క తాకిడివలన; అవనితలము= భూమిపైభాగం; తల్లడపడఁగన్= తల్లడిల్లేటట్లు; ఒప్పన్= ఒప్పునట్లుగా (తగినట్లుగా); చనుదెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** రాజులందరు ఉత్సాహంతో దమయంతీస్వయంవరానికి విచ్చేశారు. వారి సేనలయొక్క, రథాలయొక్క రాపిడిచేత భూమిపైభాగం తల్లడిల్లింది.

**వ. ఆ సమయంబునఁ బర్వత నారదు లను పురాణమునులు భూలోకం బెల్లం గ్రుమ్మరి యింద్రలోకంబునకుం బోయిన నింద్రుండు వారిం బూజించి, భూలోకంబునం గుశలం బడిగి. 'యిది యెట్లు ధర్మపరిపాలనపరులై వీరులై రణనిహతు లైన రాజు లక్షయలోకసుఖంబు లనుభవింప నతిథులై యిందులకు నింతకాలంబయ్యు రాని కారణం బేమి?' యని యడిగిన నారదుం డిట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** ఆ, సమయంబునన్= అప్పుడు; పర్వత, నారదులు+అను= పర్వతుడు, నారదుడు అనే; పురాణమునులు= ప్రాచీనఋషులు; భూలోకంబు+ఎల్లన్= భూలోకాన్ని అంతటిని; క్రుమ్మరి= తిరిగి; ఇంద్ర, లోకంబునకున్+పోయినన్= ఇంద్రలోకానికి వెళ్ళగా; ఇంద్రుండు= ఇంద్రుడు; వారిన్= ఆ పర్వత నారదులను; పూజించి= గౌరవించి; భూలోకంబునన్,

కుశలంబు+అడిగి= భూలోకంలోని క్షేమసమాచారం అడిగి; ఇది+ఎట్లు= ఇది ఎట్లాగ?; ధర్మ, పరిపాలనపరులు+ఐ= ధర్మంతో ఏలుబడి కొనసాగిస్తున్న వారై; వీరులు+ఐ= పరాక్రమవంతులై; రణ, నిహతులు+ఐన, రాజులు= రణంలో చంపబడిన రాజులు; అక్షయ, లోక, సుఖంబులు= తరగనట్టి లోకాలలోని సౌఖ్యాలు; అనుభవింపన్= అనుభవించటానికై; అతిథులు+ఐ= మన్ననను అనుభవించే ఆగంతుకులై; ఇందులకున్= ఇచటికి; ఇంతకాలంబు+అయ్యున్= ఇంతకాలం గడచిపోయినప్పటికి; రాని, కారణంబు+ఏమి+అని= రానట్టిహేతువు ఏమి టని; అడిగినన్= అడుగగా; నారదుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో పర్వతుడు, నారదుడు అనే ప్రాచీనఋషులు భూమండలమంతా తిరిగి చూచి ఇంద్రలోకానికి వెళ్ళారు. ఇంద్రుడు వారిని పూజించి భూలోకాన్నిగురించిన కుశలప్రశ్నలు వేసి 'మునీంద్రులారా! ఇంతకుపూర్వం ధర్మపరిపాలన చేసి, యుద్ధాలలో వీరమరణం చెందిన రాజులు అక్షయలోకాల సుఖాలను అనుభవించటానికై అతిథులుగా స్వర్గలోకానికి వస్తూ ఉండేవారు. కానీ, ఇంతకాలమయినా వారు రాకపోవటానికి గల కారణమేమిటి?' అని అడుగగా నారదుడు ఇట్లా చెప్పాడు.

**విశేషం:** (1) ప్రాచీనభారతీయవాఙ్మయంలో నారదుడిపాత్ర ఒక విశిష్టసృష్టి, నారదుడు త్రిలోకసంచారి. ఆ మునికి తెలియని సమాచారం ఉండదు. ఆయన సంగీతప్రియుడు. కలహభోజనుడు, గొప్ప భగవద్భక్తుడు. (2) అతిథి:- మర్యాదగా ఆహ్వానాన్ని పురస్కరించుకొని విందుకై వచ్చే ఆగంతుకుడు అనేది నేటి వ్యవహారంలోని అర్థం. న+తిథి= తిథిని చూడకుండ (ఆహారార్థం) పయనించి వచ్చేవాడు- అని అసలు అర్థం.

**క. 'నర సిద్ధ సాధ్య విద్యా । ధర సురకన్యకలకంటె దమయంతియ సుం**
**దరి; దాని సుస్వయంవర । మరుదై వర్తిల్లుచున్నయది యిప్డు మహిన్. 31**

**ప్రతిపదార్థం:** నర, సిద్ధ, సాధ్య, విద్యాధర, సుర, కన్యకల కంటెన్= మనుజులలో, సిద్ధులలో, సాధ్యులలో, విద్యాధరులలో, దేవతలలో ఉన్న పెండ్లిగాని ఆడుపడుచులందరికంటె; దమయంతి+అ= దమయంతి ఒక్కతె మాత్రమే; సుందరి= అందకత్తె; దాని= ఆమెయొక్క; సు, స్వయంవరము= గొప్ప స్వయంవరం; ఇప్డు= ఇపుడు; మహిన్= భూలోకంలో; అరుదు+ఐ= అసాధారణమైనదై; వర్తిల్లుచున్న+అది= జరుగుతున్నది.

**తాత్పర్యం:** 'దమయంతి జగదేకసుందరి. నరులలో, సిద్ధులలో, సాధ్యులలో, విద్యాధరులలో, దేవతలలో అటువంటి సౌందర్యవతి లేదు. ఆమె స్వయంవరమహోత్సవం ఇపుడు భూలోకంలో అసాధారణ వైభవంతో జరుగుతున్నది.

**క. అందులకు ధరణిఁ గల నృప । నందను లెల్లను ముదంబునం బోయెదు వే**
**డ్కం దమలోఁ గలహంబును । గ్రందును లేకున్నవారు గడు నెయ్యమునన్.' 32**

**ప్రతిపదార్థం:** అందులకున్= ఆ దమయంతీ స్వయంవరానికి; ధరణిన్+కల= భూమిలో ఉండే; నృపనందనులు+ఎల్లను= రాజపుత్రులందరును; ముదంబునన్= సంతోషంతో; పోయెడు= వెళ్ళే; వేడ్కన్= కుతూహలంతో; కడునెయ్యమునన్= మిక్కుటమయిన స్నేహంతో; తమలోన్= ఒకరికొకరు; కలహంబును= విరోధాన్ని; క్రందును= పోరపొచ్చాన్ని; లేక+ఉన్నవారు= లేకుండ ఉన్నారు.

**తాత్పర్యం:** ఆ దమయంతీ స్వయంవరంలో పాల్గొనటానికై భూలోకంలోని రాకుమారులందరు తమలోని అన్యోన్య వైరాలు, అభిప్రాయభేదాలు ఉజ్జగించి, ఉత్సాహంతో, వేడుకతో మిక్కిలి స్నేహంతో ఉంటున్నారు.'

**విశేషం:** నారదుడికి కావలసింది అన్యోన్యకలహాలు. దమయంతీ స్వయంవర కారణాన కలహభోజనుడైన నారదుడు పాపం పస్తులుండవలసి వచ్చింది.

**వ. అనిన నింద్రుండును, లోకపాలవరులును దదాలోకన కౌతుకంబునం గనక రత్నరమ్య దివ్య విమానారూఢులయి చనువారు ముందట దమయంతీ స్వయంవరంబునకుంబోయెడువాని నాదిత్యులలోన విష్ణుండునుంబోలెఁ దేజోధికుండైన వాని ననన్యసాధారణరూపవిభవంబున రెండవ మన్మథుండు నుంబోనివాని నలుం గని యంతరిక్షంబున విమానంబులు నిలిపి భూతలంబునకు వచ్చి వాని కిట్లనిరి. 33**

**ప్రతిపదార్థం:** అనినన్= అని నారదమహర్షి చెప్పగా విని; ఇంద్రుండును= ఇంద్రుడున్నూ; లోకపాలవరులును= గొప్పవారైన దిక్పాలకులున్నూ; తద్+ఆలోకన, కౌతుకంబునన్= ఆ దమయంతీ స్వయంవరాన్ని చూడాలనే వేడుకతో; కనక, రత్న, రమ్య దివ్య, విమాన+ఆ రూఢులు+అయి= బంగారంతో, రత్నాలతో (పొదగబడటంచేత) అందమైన దివ్యవిమానాలలో కూర్చున్నవారై, చనువారు= ప్రయాణించేవారు; ముందట=(తమ కనుల) ముందు; దమయంతీ, స్వయంవరమునకున్+పోయెడువానిన్; ఆదిత్యులలోనన్= సూర్యులలో; విష్ణుండునున్+పోలెన్= విష్ణువువలె; తేజస్+అధికుండు+ఐనవానిన్= తేజస్సుచేత అధికుడైనవాడిని, అంటే మిక్కుటమైన ప్రకాశం గల నలుడిని; అనన్య, సాధారణ, రూప, విభవంబునన్= ఒరులకు సాధారణం గాని సౌందర్యం సంపద చేత; రెండవ, మన్మథుండునున్+పోనివానిన్= అపర మన్మథుడివలె ఉన్నవాడిని; నలున్+కని= నలుడిని చూచి; అంతరిక్షంబునన్= ఆకాశంలో; విమానంబులు; నిలిపి; భూతలంబునకు, వచ్చి= భూమి మీదకు చేరి; వానికి= ఆ నలుడికి; ఇట్లు+అనిరి= ఇట్లా చెప్పారు.

**తాత్పర్యం:** అని నారదమహర్షి చెప్పగా విని ఇంద్రుడున్నూ, దిక్పాలకులున్నూ, ఆ దమయంతీ స్వయంవరాన్ని చూచే వేడుకతో రత్నాలు పొదగబడిన అందమైన పసిడి విమానాలను ఎక్కి బయలుదేరారు. దారిలో భూమిపై వారి కనులముందు నలుడు కనిపించాడు. ఆ మహారాజుకూడ దమయంతీ స్వయంవరానికి వెళ్ళుతున్నాడు. అతడు సూర్యులలో విష్ణువువలె మిక్కుటమైన కాంతితో వెలుగొందుతున్నాడు; సౌందర్యంలో సాటిలేనివాడై అపరమన్మథుడివలె దీపిస్తున్నాడు. అపుడు దేవతలు ఆకాశంలో తమ విమానాలను నిలిపి భూమిపైకి వచ్చి నిలిచి, నలుడితో ఇట్లా పలికారు.

**విశేషం:** ఆదిత్యులు పన్నెండుమంది. వారిలో 'విష్ణువు' అధిక తేజస్వి. ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు - వీరు ద్వాదశాదిత్యులు. "ఆదిత్యానా మహం విష్ణుః" అనే భగవద్గీతావాక్యం ఇట స్మరించదగింది.

**సీ. 'నిత్యసత్యవ్రత! నిషధేశ! నీవు మా । కమరంగ దూతవై యభిమతంబు**
**సేయుము' నావుడుఁ జెచ్చెర 'నట్టుల । చేయుదు మఱి నాకుఁ జెపుఁడు మీర**
**లెవ్వార? లేను మీ కిష్టంబుగా దూత । నై యేమి సేయుదు?' ననిన, నతని**
**కమరేశ్వరుం డిట్టు లనియె; 'నే నింద్రుండ; । వీరు దిక్పాలురు విదితయశులు;**

**ఆ. ధరణి నొప్పుచున్న దమయంతి సుస్వయం । వరముఁ జూచు వేడ్క వచ్చియున్న**
**వార; మీవు మమ్ము వారిజాక్షికి నెఱిం । గింపు నామధేయ కీర్తనముల. 34**

**ప్రతిపదార్థం:** నిత్య, సత్య, వ్రత!= ఎల్లప్పుడు సత్యాన్ని వ్రతంగా పాటించేవాడా!; నిషధ+ఈశ!= నిషధదేశానికి పాలకుడా!; నీవు; మాకు; అమరంగన్= ఒప్పునట్లుగా; దూతవు+ఐ= హితం కోరే ప్రతినిధివై; అభిమతంబు+చేయుము= కోరిక నెరవేర్చుము; నావుడున్= అనగా; చెచ్చెరన్= వేగంగా; అట్టుల, చేయుదున్= అట్లే చేస్తాను; మఱి= ఇక; నాకున్+చెపుఁడు= నాకు చెప్పండి; మీరలు+ఏ+వారలు= మీరు ఎవరు?; ఏను= నేను; మీకు; ఇష్టంబు+కాన్= ప్రీతి కలిగేటట్లు; దూతను+ఐ= మీకు ప్రతినిధిగా; ఏమి+చేయుదున్= ఏ కర్తవ్యాన్ని నెరవేర్చవలసి ఉన్నది; అనినన్= అని పలుకగా; అతనికి= ఆ నలుడికి; అమర+ఈశ్వరుండు= దేవేంద్రుడు; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; ఏను= నేను; ఇంద్రుండ= ఇంద్రుడిని; వీరు; దిక్పాలురు= వీరు దిక్కులను పాలించేవారు; విదితయశులు= ఎల్లరకు తెలిసినట్టి కీర్తి కలవారు; ధరణిన్+ఒప్పుచున్న= భూలోకంలో విలసిల్లుతున్న; దమయంతి, సుస్వయంవరమున్= దమయంతీ శుభ స్వయంవరాన్ని; చూచు, వేడ్కన్= చూడాలనే కుతూహలంచేత; వచ్చి+ఉన్న, వారము= వచ్చినవారము; ఈవు= నీవు; మమ్మున్= మమ్మల్ని; నామధేయ, కీర్తనములన్= పేర్లు బిరుదులతోపాటు ప్రశంసించటం ద్వారా; వారిజ+అక్షికిన్= పద్మనేత్రకు, దమయంతికి; ఎఱింగింపు= తెలియజేయాలి.

**తాత్పర్యం:** 'ఎల్లప్పుడు సత్యవ్రతాన్ని దీక్షతో పాటించే ఓ నిషధమహారాజా! నీవు మాకు అనువైన దూతగా మా అభీష్టం నెరవేర్చాలని కోరుతున్నాం'- అని చెప్పగా నలుడు వెనువెంటనే మారుపలికాడు. 'అట్లే చేస్తాను. మరి నాకు మీ రెవరో, నేను మీకు ప్రియమొనరించటానికి మీ ప్రతినిధి (దూత) నయి ఏ కర్తవ్యాన్ని నెరవేర్చాలో సెలవిండు' అని చెప్పగా అతడికి దేవేంద్రుడు ఇట్లా చెప్పాడు. 'నేను దేవేంద్రుడిని. వీరు నా సహచరులైన దిక్పాలురు. సుప్రసిద్ధులు. మేము భూలోకంలో జరుగుతున్న దమయంతీ స్వయంవరాన్ని చూచేవేడుకతో విచ్చేసి ఉన్నాం. నీవు పద్మదళాయతాక్షి అయిన దమయంతికి మమ్మల్ని పేర్లతో, బిరుదాలతో ప్రశంసాపూర్వకంగా పరిచయం చేయాలి.

**వ. అట్లయిన నక్కోమలి మాయందుఁ దనవలచినవాని వరియించు 'ననిన నింద్రునకుఁ గృతాంజలియై నలుం డిట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** అట్లు+అయినన్= ఆ విధంగా నీవు దౌత్యం నెరపిన పిమ్మట; ఆ+కోమలి= ఆ సుకుమారి; మాయందున్= మాలో; తన వలచినవానిన్= తనకు ఇష్టమైనవాడిని; వరియించును= భర్తగా ఎన్నుకొంటుంది; అనినన్= అని చెప్పగా; ఇంద్రునకున్; కృతాంజలి+ఐ= నమస్కరించి; నలుండు= నలుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా నీవు దౌత్యం నెరపితే, ఆ సుకుమారి దమయంతి తన ఇచ్చవచ్చినవాడిని మాలో ఒకరిని వరుడిగా ఎన్నుకొంటుంది'- అని ఇంద్రుడు చెప్పగా విని నలుడు ఆతడికి నమస్కరించి ఇట్లా అన్నాడు.

**ఆ. 'ఎఱిఁగి యెఱిఁగి నన్ను నేకార్థసముపేతుఁ । బాడియయ్య యిట్టి పనికిఁ బనుప?'**
**ననిన 'నుత్సుకుండ వై యేల చేసెద । నంటి? చేయకుండ నగునె యింక? 36**

**ప్రతిపదార్థం:** ఎఱిఁగి, ఎఱిఁగి,= తెలిసి, తెలిసి; ఏక+అర్థ+సముపేతున్+నన్నున్= ఒకేధ్యేయం గల నన్ను, అంటే మీకూ నాకూ లక్ష్యం ఒకటే అయిన నన్ను; ఇట్టి, పనికిన్+పనుపన్= ఇటువంటి పనికి నియోగించటం; పాడి+అయ్య?= (మీకు) న్యాయమా?!; అనినన్= అని చెప్పగా; ఉత్సుకుండవు+ఐ= తమకం కలవాడివై; ఏల= ఎందుకు? చేసెదను= చేయగలను; అంటి= అన్నావు; ఇంక= ఇక; చేయకుండన్+అగునె?= చేయకుండటం నీకు వీలౌతుందా? (ఉండదని భావం).

**తాత్పర్యం:** 'మీరూ, నేనూ ఒకే ధ్యేయసిద్ధికై ప్రయత్నిస్తున్నవారలం. ఆ విషయం మీకు సంపూర్ణంగా తెలిసిందే. అటువంటప్పుడు ఈ పనికి మీరు నన్ను వినియోగించటం న్యాయమా?' అని నలుడు దేవేంద్రుడిని ప్రశ్నించాడు. దేవేంద్రుడు నలుడితో 'నీవేకదా మేము ఏ విషయాన్ని అర్థించినా చేస్తానని ఉత్సాహంతో మాట ఇచ్చావు. ఇక ఆడినమాట నీ వెట్లా తప్పటానికి వీలౌతుంది?

**ఆ. నిన్ను నిత్యసత్యనిరతుఁగా నెఱిఁగి యి । క్కార్యమునకు వలను గలుగు టెఱిఁగి**
**పనుప వలసె దూతభావ మపేక్షించి; । దేవహితము, దీనిఁ దీర్పవలయు. 37**

**ప్రతిపదార్థం:** నిన్ను; నిత్య, సత్య, నిరతున్+కాన్= ఎల్లప్పుడు సత్యం పాటించేవాడినిగా; ఎఱిఁగి= తెలిసికొని, ఈ+కార్యమునకున్= ఈ పనికి; వలను, కలుగుట+ఎఱిఁగి= వీలున్నదని తెలిసికొని; దూత భావము+అపేక్షించి= నీ దౌత్యాన్ని కోరి; పనుప వలసెన్= నియోగించవలసి వచ్చింది; దేవ, హితము= దేవతల కొరకైన మేలు; దీనిన్= దీనిని; తీర్పన్, వలయున్= నెరవేర్చాలి.

**తాత్పర్యం:** నీవు సత్యసంధుడివని తెలుసు. ఈ కార్యం నిర్వహించగలిగే శక్తిసామర్థ్యాలు నీకు కలవనీ మాకు తెలుసు. అందుచేతనే నీ దౌత్యాన్ని మేము కోరుకొన్నది. ఇది దేవతల మేలు కొరకైన కార్యం. నీవు దీనిని నెరవేర్చాలి.

**వ. ఆయుధీయ సురక్షితం బయిన రాజగృహం బెట్లు సొర నగు నని శంకింప వలవదు; దమయంతీ నివేశంబు ప్రవేశించు నపుడు ని న్నెవ్వరు వారింపనోడుదు' రనిన శక్రువచనంబుల నశంకితుం డయి నలుం డప్పుడ విదర్భా నగరంబునకుం బోయి యొక్కరుండ దమయంతీగృహంబు సొచ్చిన. 38**

**ప్రతిపదార్థం:** ఆయుధీయ+సురక్షితంబు+అయిన=ఆయుధాలు ధరించినభటులచేత బాగా కాపాడబడుతున్న; రాజగృహంబు= రాజుగారి అంతఃపురం; ఎట్లు+సొరన్+అగున్+అని= ఏ విధంగా ప్రవేశించటానికి వీలుంటుందని; శంకింప, వలవదు= సందేహించ నవసరం లేదు; దమయంతీ, నివేశంబు= దమయంతిమందిరం; ప్రవేశించునపుడు= లోనికి వెళ్ళేటప్పుడు; నిన్ను+ఎవ్వరు= నిన్ను ఎవరున్నూ; వారింపన్+ఓడుదురు= అడ్డుపెట్టజాలరు; అనినన్= అని చెప్పగా; శక్రువచనంబులన్= ఇంద్రుడి మాటలచొప్పున; అశంకితుండు+అయి= సందేహం లేనివాడై; నలుండు; అప్పుడు+అ= అప్పుడే; విదర్భానగరంబున కున్+పోయి= విదర్భరాజధానికి వెళ్ళి; ఒక్కరుండు+అ= తా నొక్కడు మాత్రమే; దమయంతీ, గృహంబు+చొచ్చినన్= దమయంతి నివసించే ఇల్లు ప్రవేశించగా.

**తాత్పర్యం:** 'ఆయుధాలు ధరించిన భటులు బాగా కాపాడుతున్న రాజుగారి అంతఃపురం ఎట్లా ప్రవేశించటానికి వీలవుతుంది? అని శంకించవద్దు. దమయంతీమందిరం ప్రవేశించేటప్పుడు నిన్ను ఎవరూ అడ్డుపెట్టజాలరు'- అని ఇంద్రుడు చెప్పగా, అతడి మాటల ప్రకారం నలుడు అప్పుడే విదర్భరాజధానికి వెళ్ళి తా నొక్కడు మాత్రమే దమయంతి ఇంట్లో ప్రవేశించాడు.

### నలుఁడు దమయంతియొద్దకు దేవదూతయై పోవుట (సం. 3-52-10)

**సీ. హంసచేఁ దన వినినంతకంటెను రూప । విభవాతిశయమున వెలయుదాని,**
**సురకన్యకలయట్టి సురుచిర శతకన్య । కాళిచేఁ బరివృతయైన దాని,**
**హృదయేశుఁడైన తన్నెప్పుడు వినుచున్కి । నలయ కాశ్వాసిత యైనదాని,**
**దమయంతిఁ జూచి కందర్పశరావిద్ధుఁ । డయ్యె నలుం; డంత నతనిఁ జూచి**

ఆ. 'యితఁ డపూర్వ మనుజుఁ డెందుండి వచ్చెనో'? యనుచు నుదరిపడి లతాంగు లెల్ల
నాసనములు డగ్గి యప్పు డభ్యుద్గత । లైరి మనములందు హర్ష మెసఁగ. **39**

**ప్రతిపదార్థం:** హంసచేన్= హంసచేత; తన, వినినంత కంటెను= తాను వినిఉన్నదాని కంటె; రూప, విభవ+అతిశయమున= సౌందర్య సంపదయొక్క ఆధిక్యంచేత; వెలయుదానిన్= విలసిల్లుతూ ఉండే దానిని; సురకన్యకల+అట్టి= దేవకన్యకల వంటి; సు, రుచిర, శత, కన్యక+ఆళిచేన్= మిక్కిలి ప్రకాశమానలైన నూర్గురు కన్యకల సమూహంచేత; పరివృత+ఐన, దాని= చుట్టుకొనబడి ఉన్నదానిని; హృదయ+ఈశుఁడు+ఐన= మనోనాథుడైన (మనసార వలచినవాడైన); తన్ను+ఎప్పుడు= తనను గురించి ఎల్లప్పుడును; వినుచు+ఉన్కిన్= వింటూ ఉండటంచేత; అలయక= అలసిపోకుండ; ఆశ్వాసిత+ఐన, దానిన్= ఊరటపొందిన దానిని; దమయంతిన్+చూచి= దమయంతిని చూచి; కందర్ప, శర+ఆవిద్ధుఁడు+అయ్యెన్= మన్మథబాణాలచేత కొట్టబడినవాడు అయ్యాడు; నలుండు= నలుడు; అంతన్= అంతట; అతనిన్+చూచి= ఆ నలుడిని చూచి; ఇతఁడు; అపూర్వ మనుజుఁడు= క్రొత్తవాడు; ఎందుండి, వచ్చెనో= ఎచటనుండి వచ్చి ఉన్నాడో; అనుచున్= అని తలపోస్తూ; ఉదరిపడి= భయపడి; లతా+అంగులు+ఎల్లన్= లతలవంటి శరీరాలుగల అంగనలందరు; ఆసనములు= కూర్చున్న పీఠాలు; డిగ్గి= దిగి; మనములందున్= మనస్సులలో; హర్షము= సంతోషం, ఎసఁగన్= ఉప్పొంగగా; అభ్యుద్గతలు+ఐరి= సగౌరవంగా లేచి నిల్చిన వారు అయ్యారు.

**తాత్పర్యం:** నలుడు అప్పు డచట దమయంతిని తొలిసారి చూచాడు. అతడికి హంస అలనాడు తనతో చెప్పినదాని కంటె ఆమె సౌందర్యసంపద ఎక్కువగా తోచింది. దేవకన్యకలతో సౌందర్యంలో తులతూగే నూరుమంది చెలికత్తెలు ఆమెను కొలుస్తూ ఉన్నారు. హృదయేశ్వరుడైన నలుడిని గూర్చి సదా వింటున్నందున, దమయంతి అలయక ఊరట పొందుతూ ఉన్నది. అట్టి దమయంతిని చూచి నలుడు మన్మథబాణ పరిపీడితుడయ్యాడు. నలుడిని చూచిన వెంటనే ఆ లలితాంగులందరు అదిరిపడి పీఠాలు దిగి 'ఈ అపూర్వ మనుజుడు ఎవ్వడు? ఎచటినుంచి ఇచటికి వచ్చాడు?' అని ఆశ్చర్యపడి, మనస్సులు సంతోషంతో ఉప్పొంగగా, సగౌరవంగా లేచి నిలబడ్డారు.

వ. అంత. **40**

**తాత్పర్యం:** అట్లా దమయంతి చెలికత్తెలందరూ లేచి నిలబడిన తర్వాత.

క. దమయంతి మనోభవనిభు । నమరేంద్రప్రతిము దినకరాభు సుధారుక్
సము వరుణసదృశు ధనదో । పము నశ్విసమాను నిషధపతిఁ జూచి నలున్. **41**

**ప్రతిపదార్థం:** దమయంతి; మనస్+భవ, నిభున్= మన్మథుడితో సమానుడిని; అమర+ఇంద్ర, ప్రతిమున్= దేవేంద్రుడితో సమానుడిని; దినకర+ఆభున్= సూర్యుడితో సమానుడిని (ఆభ శబ్దం సమాసోత్తరపదంగా ఉన్నపుడు 'సదృశం' అనే అర్థం ఇస్తుంది); సుధా, రుక్+సమున్= అమృత కిరణుడైన చంద్రుడితో సముడిని; వరుణ, సదృశున్= వరుణుడితో పోలినవాడిని; ధనద+ఉపమున్= కుబేరుడితో పోల్చదగినవాడిని; అశ్వి సమానున్= అశ్వినీదేవతలతో సమానుడిని; నలున్= నలుడిని; నిషధపతిన్= నిషధరాజును; చూచి= చూచి.

**తాత్పర్యం:** దమయంతి మన్మథుడితో సమానుడు, దేవేంద్ర సదృశుడు, సూర్యతేజస్వి, చంద్రసముడు, వరుణ నిభుడు, కుబేరతుల్యుడు, నిషధరాజు అయిన నలుడిని చూచి-

**క. వారిరుహనేత్ర మదన । ప్రేరితయై లజ్జ యుడిగి భీతిల్లక బృం**
**దారకమూర్తికి రాజకు । మారున కిట్లనియె మందమందమృదూక్తిన్. 42**

**ప్రతిపదార్థం:** వారి, రుహ, నేత్ర= పద్మాలవంటి కన్నులు కల దమయంతి; (వారి, రుహం= నీటిలో పుట్టింది పద్మం); మదనప్రేరిత+ఐ= మన్మథుడిచేత ప్రేరేపించబడింద్దై; లజ్జ+ఉడిగి= సిగ్గును వీడి; భీతిల్లక= భయపడక; బృందారక, మూర్తికిన్= దేవతల ఆకారం కలవాడికి; రాజకుమారునకు= రాజపుత్రుడికి; మంద, మంద, మృదు+ఉక్తిన్= మెలమెల్లగా మెత్తనైన మాటలతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** పద్మనయన అయిన దమయంతి మన్మథుడిచేత ప్రేరేపించబడింద్దై, సిగ్గును అవతలికి త్రోసి, జంకుగొంకులు లేకుండ దివ్యసుందర విగ్రహుడూ, రాకుమారుడూ అయిన నలుడితో మెల్లని మెత్తని పలుకులతో ఇట్లా పలికింది.

**వ. 'నీవు మహానుభావుండ వెవ్వండ? విందుల కేమి కారణంబున నేకతంబ వచ్చితి? విది యత్యుగ్రశాసనుండైన మదీయ జనకుచేత సురక్షితంబగుట నెవ్వరికిఁ జొర నశక్యంబు; దీని నెవ్వరు నెఱుంగకుండ నెవ్విధంబునం జొచ్చితివి? నాకు మనోజ వేదనా వివర్ధనుండవైన నీ తెఱం గెఱింగింపు' మనిన దానికి నలుం డిట్లనియె.43**

**ప్రతిపదార్థం:** నీవు, మహానుభావుండవు= నీవు గొప్ప మహిమ కలవాడివి; ఎవ్వండవు= ఎవరివి?; ఇందులకు= ఇచటికి; ఏమి కారణంబునన్= ఏ హేతువుచేత; ఏకతంబు+అ= ఒంటరిగా; వచ్చితివి; ఇది= ఈ అంతఃపురం; అతి+ఉగ్రశాసనుండు+ఐన= మిక్కిలి భయంకరమైన ఆజ్ఞలు అమలు జరిపేవాడైన; మదీయ, జనకుచేతన్= నా తండ్రిచేత; సురక్షితంబు+అగుటన్= బాగుగా కాపాడబడటంచేత; ఎవ్వరికిన్= ఎవరికైనను; చొరన్= ప్రవేశించటానికి; అశక్యంబు= సాధ్యంకానిది; దీనిన్= ఈ అంతఃపురాన్ని; ఎవ్వరున్+ఎఱుంగకుండన్= ఎవ్వరును తెలిసికొనకుండ; ఏ+విధంబునన్= ఏరీతిగా; చొచ్చితివి= చొరబడ్డావు; నాకు; మనోజ, వేదనా, వివర్ధనుండవు+ఐన= మన్మథతాపాన్ని పెంపొందించినవాడివయిన; నీ, తెఱంగు= నీ తీరు; ఎఱింగింపుము= తెలియజేయుము; అనినన్= అని చెప్పగా; దానికిన్= ఆ దమయంతికి; నలుండు= నలుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'నీవు మహానుభావుడివిగా కన్పిస్తున్నావు. నీవు ఎవరివి? ఎచటనుండి ఇచటికి వచ్చావు? ఏకారణంగా వచ్చావు? ఈ అంతఃపురం చండశాసనుడైన మా తండ్రిగారిచేత సురక్షితం. మరి నీవు ఎవ్వరికీ కనపడకుండ ఎట్లా ఇచటికి రాగలిగావు? ఇట్లా ఎవ్వరూ ఇచటికి రాలేరు. నాకు మన్మథతాపాన్ని హెచ్చిస్తున్న నీ తీరుతెన్నులు తెలుపుము'- అని దమయంతి అడుగగా నలుడు ఇట్లా బదులు పలికాడు.

**ఆ. 'ఏను దేవదూత నింతి! నలుం డను । వాఁడ; నింద్రదహన వరుణ యములు**
**నీ స్వయంవరంబు నెమ్మితోఁ జూడంగ । నరుగుదెంచి నన్ను నబల! మున్న. 44**

**ప్రతిపదార్థం:** ఇంతి!= ఓ (దమయంతీ) లలనా!; ఏను= నేను; దేవదూతను= దేవతలకు దూతను; నలుండు+అనువాఁడన్= నలుడు అనేవాడిని; ఇంద్ర, దహన, వరుణ, యములు= ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, యముడు; నీ, స్వయంవరంబు= నీ స్వయంవరాన్ని; నెమ్మితోన్= ప్రీతితో; చూడంగన్+అరుగుదెంచి= చూడటానికై వచ్చి; మున్ను+అ= ముందుగా; నన్నున్; అబల!= ఓ అంగనా! (అబల= బలంలేనట్టిది. స్త్రీవాచకం)

**తాత్పర్యం:** 'ఓ లలనామణీ! నేను దేవతల దూతను, నాపేరు నలుడు. ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు నీ స్వయంవరాన్ని చూడటానికై వచ్చి ముందుగా నన్ను -

**క. నీ యొద్దకుఁ బుత్తెంచిరి; । మాయం దొక్కరు నభీష్టమతి వరియింపం**
**దోయజముఖిఁ బ్రార్థింపుము; । మాయందఱకును బ్రియం బమర్పుము ప్రీతిన్.' 45**

**ప్రతిపదార్థం:** నీ+ఒద్దకున్= నీ కడకు; పుత్తెంచిరి= పంపారు; మా+అందు= మాలో; ఒక్కరున్= ఒకరిని; అభీష్టమతిన్= ఇష్టానుసారం; వరియింపన్= భర్తగా ఎన్నుకొనటానికి; తోయజ ముఖిన్= పద్మంవంటి ముఖం కలది అయిన దమయంతిని; ప్రార్థింపుము= వేడుకొనుము; మా+అందఱకును; ప్రీతిన్= సంతోషంతో; ప్రియంబు+అమర్పుము= ఇష్టం చేకూర్చుము.

**తాత్పర్యం:** ఇంద్రాగ్ని యమవరుణులు, తమలో ఒకరిని భర్తగా ఎన్నుకొనుమని నిన్ను ప్రార్థించి, మా అందరికి ప్రీతికలిగించుమని నీకడకు దూతగా పంపారు.'

**వ. అని పంచినఁ దత్ప్రసాదంబున నన్యులచేత నలక్షితుండనై వచ్చితి; నింద్రాదులకుఁ బ్రియంబు సేయు' మనిన నవనతవదనయై దమయంతి దొల్లి హంసచేత నలుని విని వానియందు బద్ధానురాగయై నవయుచున్న యది యపు డతని నలుంగా నెఱింగి తద్వచన శ్రవణ దుఃఖాయమాన మానస యగుచు నిట్లనియె. 46**

**ప్రతిపదార్థం:** అని, పంచినన్= అని నియోగించగా; తద్+ప్రసాదంబునన్= ఆ దేవతల దయవలన; అన్యుల చేతన్= ఇతరుల చేత; అలక్షితుండను+ఐ= అగోచరుడనై, అంటే అగుపించనివాడనై; వచ్చితిన్= అంతఃపురం ప్రవేశించగలిగాను; ఇంద్ర+ఆదులకున్= ఇంద్రుడు మున్నగువారికి; ప్రియంబు+చేయుము= ప్రీతి ఘటించుము; అనినన్= అని చెప్పగా; అవనత, వదన+ఐ= క్రిందికి దించినమొగం కలదై; దమయంతి; తొల్లి= పూర్వం; హంసచేత; నలుని, విని= నలుడి గురించి విని; వాని+అందు= ఆ నలుడిపై; బద్ధ+అనురాగ+ఐ= లగ్నమైన ప్రేమకలదై; నవయుచున్న+అది= క్రుంగి కృశిస్తున్నటువంటిది; అపుడు= అప్పుడు; అతని= అతడిని; నలుంగాన్+ఎఱింగి= (తాను వలచిన) నలుడిగా గుర్తించి; తద్+వచన, శ్రవణ, దుఃఖాయమాన, మానస+అగుచున్= ఆతడి మాటలు వినటంచేత శోకంతో నిండిన మనస్సు కలది అవుతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** 'దేవతల దయవలన ఇతరుల కంటబడకుండ నేను ఈ అంతఃపురాన్ని ప్రవేశించగలిగాను. నీవు ఇంద్రప్రభృతులకు ప్రియం చేయుము'- అని నలుడు దమయంతితో పలికాడు. దమయంతి తొల్లి హంస చెప్పిన నాటినుండి నలుడిపై తన వలపు నిలుపుకొని క్రుంగి కృశిస్తూ ఉన్నట్టిది, ఇప్పుడు నలుడినే కనులార చూచింది. కాని, అతడి మాటలు విని మిక్కిలి దుఃఖిస్తూ ఈ విధంగా బదులు పలికింది.

**తరువోజ.**

**'ఏ నేడ? నింద్రాదు లేడ? వారలకు । నెప్పుడు మ్రొక్కుదు; నేను నీ ధనమ**
**భూనాథ! నీ గుణంబులు హంసచేతఁ । బొలుపుగా విని మనంబున నిల్పియున్న**
**దాన; భవన్నిమిత్తమున ని ట్లఖిల । ధారుణినాథ సార్థంబు రావింపఁ**
**గా నిప్డు వలసె లోకఖ్యాతకీర్తి! । కరుణించి పతిబుద్ధిఁ గావింపు మిందు. 47**

**ప్రతిపదార్థం:** ఏను+ఏడన్= నేను ఎక్కడ?; ఇంద్ర+ఆదులు= ఇంద్రుడు మున్నగువారు; ఏడ= ఎక్కడ?; వారలకున్+ఎప్పుడు, మ్రొక్కుదున్= వారికి (ఆ దేవతలకు) ఎప్పుడూ నేను నమస్కరిస్తాను; ఏను= నేను; నీ ధనము+అ= నీ సొత్తునే; భూనాథ!= ఓ నలమహారాజా!; నీ, గుణంబులు= నీ మంచి లక్షణాలు; హంసచేతన్; పొలుపుగా విని= ఒప్పుగా విని; మనంబునన్= మనస్సులో; నిల్పి+ఉన్నదానన్= దాచుకొని ఉన్నదానిని; భవత్+నిమిత్తమునన్= నీ కారణంచేత, అంటే నీకొరకే; ఇట్లు= ఈ స్వయంవరం అనే మిష కల్పించి; అఖిల, ధారుణి, నాథ, సార్థంబు= సకల రాజుల సమూహం; ఇప్డు= ఇపుడు; రావింపగాన్, వలసె= వచ్చేటట్లు చేయవలసి వచ్చింది; లోక, ఖ్యాత, కీర్తి!= జగమంతట ప్రసిద్ధిగాంచిన యశస్సుచేత వెలుగొందేవాడా!; ఇందున్= ఇచట; కరుణించి= దయచేసి; పతిబుద్ధిన్+కావింపుము= భర్తగా ఉండటానికి అంగీకరించుము.

**తాత్పర్యం:** 'మానవమాత్రురాలనయిన నే నెక్కడ? దేవత లైన ఇంద్రాదులు ఎక్కడ? నేను వారిని సదా నమస్కరించి అర్చిస్తానుగదా! ఓ నలమహారాజా! నేను నీ సొత్తును మాత్రమే. నీ గుణాలు హంస చెప్పింది మొదలు నిన్నే సదా నా మనస్సులో ధ్యానిస్తున్నాను. నీ రాకకొరకే ఇపుడు ఈ రాజులందరిని ఆహ్వానించవలసి వచ్చింది. ప్రపంచప్రసిద్ధమైన కీర్తిగల ఓ నలమహారాజా! దయచేసి నాకు పతిగా ఉండటానికి అంగీకరించుము.

**విశేషం:** ఛందస్సును గురించిన వివరణ ఆరణ్యపర్వం, ప్రథమాశ్వాసం తరువోజ (1.132) దగ్గర చూచేది.

**వ. నీవు దీని కొడంబడనినాఁడు రజ్జు విషాగ్ని జలంబులం బ్రాణ పరిత్యాగంబు సేసికొందు' ననిన దానిం జూచి నలుం డిట్లనియె. 48**

**ప్రతిపదార్థం:** నీవు; దీనికి= నీవు నా భర్తగా ఉండటానికి; ఒడంబడని నాఁడు= సమ్మతించని రోజున; రజ్జు, విష+అగ్ని, జలంబులన్= త్రాటితో, విషంతో, అగ్నితో, నీటిచేత; ప్రాణ, పరిత్యాగంబు+చేసికొందున్= ప్రాణాలు వదలుతాను; అనినన్= అని చెప్పగా; దానిన్+చూచి= ఆ దమయంతిని చూచి; నలుండు= నలుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** నీవు నా భర్తగా ఉండటానికి సమ్మతించకపోతే నేను ఉరివేసికొని లేదా విషం త్రాగి లేదా నిప్పులో దూకి లేదా నీటిలో పడి ప్రాణాలు వదలుతాను'- అని చెప్పిన దమయంతిని చూచి నలుడు ఈ విధంగా బదులు పలికాడు.

**మత్తకోకిలము.**

**'భూరిసత్త్వులు సర్వలోకవిభుల్ విభూతిసమృద్ధు లి**
**ద్ధోరుతేజులు నిన్నుఁ గోరుచు నున్నవా రమరోత్తముల్;**
**వారి పాదరజంబుఁ బోలనివాని నన్ను మనుష్యు సం**
**సారిఁ గోరఁగఁ జన్నె? నీకుఁ బ్రసన్నులై సుర లుండఁగన్. 49**

**ప్రతిపదార్థం:** భూరి, సత్త్వులు= గొప్ప బలం కలవారు; సర్వలోక, విభుల్= సమస్తలోకాలకు అధిపతులు; విభూతి, సమృద్ధులు= గొప్ప సంపద కలవారు; ఇద్ధ+ఉరు, తేజులు= ప్రకాశమానమైన గొప్పతేజం కలవారు; నిన్నున్+కోరుచున్+ఉన్నవారు= నిన్ను వలచి ఉన్నారు; అమర+ఉత్తముల్= దేవతాశ్రేష్ఠులు; వారి, పాద, రజంబున్+పోలనివానిన్= వారి పాదాలదుమ్ముతో సరిపోలని వాడిని; మనుష్యు= మనుజమాత్రుడిని; సంసారిన్= జనన మరణ సహితమైన ఇహలోకంలోని సంసారంలో ఉన్నవాడిని; నీకు; ప్రసన్నులు+ఐ= నిన్ను చేపట్టటానికి సుముఖులై; సురలు= దేవతలు; ఉండఁగన్= ఉండగా; నన్ను; కోరఁగన్+చన్నె?= కోరవచ్చునా?

**తాత్పర్యం:** 'గొప్ప శక్తి కలవారు. సకలలోక పాలకులు, ఐశ్వర్య సమృద్ధులు, దేదీప్యమానమైన తేజస్సు కలవారు, దేవతలు నిన్ను వరిస్తుంటే, వారి పాదధూళితో కూడ సాటిరాని నన్ను- ఒక మానవమాత్రుడిని-జననమరణ రూపమైన ఇహలోక సంసారబంధంలో చిక్కుకొన్నవాడిని కోరుకొనదగునా?

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.46 విశేషాంశం చూడండి.

**క. దేవతల కప్రియంబులు । గావించు మనుష్యు లధమగతు లగుదు రిలం;**
**గావున వారి కభీష్టము । గావింపుము; నన్నుఁ బ్రీతిఁ గావుము తరుణీ!' 50**

**ప్రతిపదార్థం:** తరుణీ= ఓ యువతీ!; ఇలన్= భూమిపై; దేవతలకు; అప్రియంబులు= ఇష్టం కాని పనులను; కావించు, మనుష్యులు= చేసే మనుజులు; అధమ, గతులు+అగుదురు= హీనస్థితిని పొందేవారు అవుతారు; కావునన్= కాబట్టి; వారికి+అభీష్టము= ఆ దేవతలకు ఇష్టం; కావింపుము= చేయుము; నన్నున్= నన్ను; ప్రీతిన్= ప్రియంతో; కావుము= కాపాడుము.

**తాత్పర్యం:** ఓ దమయంతీ! భూలోకంలో దేవతలకు అప్రియాలు చేసినవారు అష్టకష్టాలపాలవుతారు. కావున, ఓ యువతీ! వారి ఇష్టాన్ని పాటించి ప్రీతితో నన్ను రక్షించుము'.

**వ. అనిన దమయంతి నయనాంతర్గళిత బాష్పధారాకలిత కపోలయుగళ యగుచుం బెద్దయుంబ్రొద్దు చింతించి 'నీయభిప్రాయంబునకు నిరపాయంబైన యుపాయంబు గంటి; నింద్రాదులు నా స్వయంవరంబునకు వచ్చెదరేని వారి సన్నిధిని నిన్నువరియించెద; నట్లయిన నీకు నిర్దోషంబగు' నినిన నలుండు లోకపాలురపాలికిం బోయి దమయంతికిం దన పలికిన విధంబును దనకు దమయంతి పలికిన విధంబును జెప్పెఁ; నంతఁ బుణ్యతిథి నక్షత్ర శుభముహూర్తంబున దమయంతీ స్వయంవరంబు ప్రవర్తిల్లిన.51**

**ప్రతిపదార్థం:** అనినన్= అని నలుడు చెప్పగా; దమయంతి; నయన+అంతర్గళిత, బాష్ప, ధారా, కలిత, కపోల, యుగళ+అగుచున్= కన్నులలోపలనుండి జారిన కన్నీటివెల్లువతో కూడిన చెక్కిళ్ళు రెండును కలది అవుతూ; పెద్దయున్+ప్రొద్దు= చాలసేపు; చింతించి= విచారించి; నీ+అభిప్రాయంబునకు= నీ ఉద్దేశానికి; నిరపాయంబు+ఐన= అపాయంలేనిదైన - అంటే కీడు కలుగని; ఉపాయంబు= వెరవు; కంటిన్= చూచాను; ఇంద్ర+ఆదులు= ఇంద్రుడు మున్నగువారు; నా, స్వయంవరంబునకు; వచ్చెదరు+ఏని= వచ్చినట్లయితే; వారి, సన్నిధిన= వారి సమక్షమందే; నిన్ను, వరియించెదన్= నిన్ను భర్తగా ఎన్నుకొంటాను; అట్లు+అయినన్= ఆ విధంగా జరిగితే; నీకు; నిర్దోషంబు+అగును= నీ పట్ల తప్పు ఉండదు; అనినన్= అని చెప్పగా; నలుండు= నలుడు; లోక, పాలుర, పాలికిన్+పోయి= దిక్పాలురపాలికి వెళ్ళి; దమయంతికిన్+తన, పలికిన, విధంబును= దమయంతితో తాను చెప్పిన మాటలతీరును; తనకు, దమయంతి, పలికిన, విధంబును= తనతో దమయంతి బదులు పలికిన తీరును; చెప్పెన్= చెప్పాడు; అంతన్= అంతట; పుణ్య, తిథి, నక్షత్ర, శుభ, ముహూర్తంబునన్= శుభప్రదమైన తిథితో, తారాబలంతో కూడిన మంచి లగ్నంలో; దమయంతీ, స్వయంవరంబు; ప్రవర్తిల్లినన్= జరుగగా.

**తాత్పర్యం:** అని నలుడు చెప్పగా దమయంతి కన్నులు చెమ్మగిల్లాయి. బాష్పాలు పెల్లుబికి ఆమె రెండు చెక్కిళ్లపై ప్రవహించాయి. ఆమె చాలాసేపు యోచించి నలుడితో ఇట్లా పలికింది. 'నీ అభిప్రాయానికి అపాయం లేని ఒక ఉపాయం తట్టింది. ఇంద్రుడు మున్నగు దిక్పాలకులు నా స్వయంవరానికి వస్తే, నేను వారి సమక్షంలోనే నిన్ను

భర్తగా ఎన్నుకొనగలను. అప్పుడు నీపై తప్పు ఏమియు ఉండదుగదా!'- అనిన పిదప, నలుడు దిక్పాలకులదగ్గరకు వెళ్ళి, తాను దమయంతితో చెప్పిన మాటల తీరును, ఆమె తనకు బదులు పలికిన తీరును వివరించి చెప్పాడు. అంతట ఒక శుభముహూర్తంలో తిథినక్షత్రబలం గల లగ్నంలో దమయంతీ స్వయంవరం జరిగింది.

**ఆ. 'నలున కాని నలినదళనేత్ర వరియింప । దట్టె చూత' మనుచు నమరవరులు**
**నలువురును గడంగి నలరూపమున వచ్చి । రా స్వయంవరమున కతిరయమున. 52**

**ప్రతిపదార్థం:** నలున్+అ= నలుడినిమాత్రమే; కాని= తప్ప; నలిన, దళ, నేత్ర= తామరరేకులవంటి కన్నులుగల దమయంతి; వరియింపదు+అట్టె= పతిగా ఎన్నుకొనదట; చూతము= చూతుముగాక; అనుచున్= అంటూ; అమర, వరులు= దేవతలలో శ్రేష్ఠులైన; నలువురును; కడంగి= పూనికతో; నల, రూపమునన్= నలుడి ఆకారం ధరించి; అతిరయమునన్= మిక్కిలి వేగంతో; వచ్చిరి= (స్వయంవర మండపానికి) వచ్చారు.

**తాత్పర్యం:** 'నలుడిని తప్ప మరెవరిని దమయంతి వరియించదా? చూద్దాం!' అని ఆ దేవతాశ్రేష్ఠులు నలువురు నలరూపం ధరించి వేగంగా స్వయంవరానికి వచ్చారు.

**వ. అంత. 53**

**తాత్పర్యం:** అంతట. (ఆ స్వయంవర మంటపంలో ఒక విచిత్ర సన్నివేశం ఏర్పడింది. ఒకేవరుసలో ఐదుగురు నలమహారాజులు కూర్చొని ఉన్నారు. ఆ సమయంలో).

**సీ. దమయంతి సితపుష్ప దామాభిశోభిత । హస్తయై చనుదెంచి యంబుజాక్షి**
**యమ్మహోత్సవ దర్శనాగత రాజన్య । నివహంబు నీక్షించి నెమ్మితోడ**
**నలువురు వేల్పులు నలుఁదొట్టి యప్పు డే । కాకారులై యున్న నందు నలుని**
**నేర్పరింపఁగ నేర 'కింద్రాదులను నలు । నెఱుఁగు నుపాయ మిం కెద్ది యొక్కొ?'**

**ఆ. యనుచు సంశయాకులాత్మయై 'సురలార! । నలు నెఱుంగువిధము నాకుఁ జేయుఁ**
**డాత్మరూపధరుల రగుఁ' డని పరిదేవ । నంబు సేసెఁ దన మనంబులోన. 54**

**ప్రతిపదార్థం:** దమయంతి; సిత, పుష్ప, దామ+అభిశోభిత, హస్త+ఐ= తెల్లని పూలదండచేత వెలుగొందిన చేతులుకలదై; చనుదెంచి= వచ్చి; అంబుజ+అక్షి= పద్మాలవంటి కన్నులుకలది (అంబుజం= నీటిలో పుట్టింది-పద్మం); ఆ+మహా+ఉత్సవ, దర్శన+ఆగత, రాజన్య, నివహంబున్= ఆ గొప్ప పండుగను చూడటానికై వచ్చిన మహారాజ సమూహాన్ని; ఈక్షించి= చూచి; నెమ్మితోడ= ప్రీతితోడ; నలువురు, వేల్పులు= నలుగురు దేవతలు; నలున్+తొట్టి= నలుడితోపాటు, నలుణ్ణి అనుసరించి; అప్పుడు; ఏక+ఆకారులు+ఐ+ఉన్నన్= ఒకేరూపం కలవారై ఉండగా; అందు= వారిలో; నలునిన్= నలుడిని; ఏర్పరింపఁగ నేరక= గుర్తింపజాలక; ఇంద్రాదులను= ఇంద్రుడు మొదలగువారిని; నలున్ ఎఱుఁగు= నలుని తెలిసికొనే; ఉపాయము= వెరవు; ఎద్ది+ఒక్కొ= ఏదైఉండవచ్చును?; అనుచు= అని తలపోస్తూ; సంశయ+ఆకుల+ఆత్మ+ఐ= సందేహంచేత కలత చెందిన మనస్సు కలదై; సురలార!= ఓ దేవతలార!; నలున్= నలుడిని; ఎఱుంగు, విధము= తెలిసికొనేతీరు; నాకున్= నాకు; చేయుఁడు= కలుగజేయండి; ఆత్మ, రూప, ధరులరు+అగుఁడు= మీమీ నిజరూపాలను ధరించిన వారుగా కండి; అని; తన, మనంబులోనన్= తన మనస్సులో; పరిదేవనంబు+చేసెన్= దుఃఖంతో పలికింది.

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు గల దమయంతి తనచేతులతో తెల్లని పూదండ పట్టుకొని వచ్చింది. ఆ స్వయంవర మహోత్సవాన్ని సందర్శించ వచ్చిన రాజన్యసమూహాన్ని వీక్షించింది. కాని, అచట నలుడితోపాటు మరి నలువురు వేల్పులు నలుడి ఆకారంతోనే కనిపించారు. వారిలో అసలు నలుడు ఎవ్వరో ఏర్పరించలేక ఆమె సంశయాకుల చిత్తయై 'ఓ దేవతలారా! నాకు నలుడిని ఎన్నుకొనే పరిజ్ఞానం కలుగజేయండి; మీ నిజస్వరూపాలు ధరించండి' అని తన మనస్సులో దుఃఖిస్తూ ప్రార్థన చేసింది.

**వ. దేవతలు దాని పరిదేవనంబు విని కరుణించి, యనిమిషలోచనంబులు నస్వేదగాత్రంబులు నొప్ప నవనీ తలంబు ముట్టక యాసన్నులై నిలిచి; రంత లోకపాలురును భూలోకంబునఁ గల రాజలోకంబు నవలోకించు చుండఁ బుణ్యశ్లోకుండయిన నలు ధర్మవిధానంబున వరియించి, దమయంతి తదీయ స్కంధంబున సుగంధి కుసుమ దామకంబు వెట్టిన. 55**

**ప్రతిపదార్థం:** దేవతలు= వేల్పులు; దాని= దమయంతియొక్క; పరిదేవనంబు= దీనాలాపాలు; విని= ఆలకించి; కరుణించి= దయకలిగి; అనిమిష, లోచనంబులున్= రెప్పపాటులేని కన్నులు; న+స్వేద, గాత్రంబులున్= చెమట లేని దేహాలు; ఒప్పన్= భాసించగా; అవనీ, తలంబు, ముట్టక= నేలపైభాగాన్ని తగులకుండ; ఆసన్నులు+ఐ, నిలిచిరి= దగ్గరగా ఉన్నవారైరి; అంత; లోకపాలురును= దిక్పాలకులున్నూ; భూ, లోకంబునన్+కల= భూలోకంలో ఉండే; రాజలోకంబున్= రాజ సమూహమున్నూ; అవలోకించుచుండన్= చూస్తుండగా; దమయంతి; పుణ్యశ్లోకుండు+అయిన= పుణ్యమైన కీర్తి కలవాడయిన (పుణ్యాత్ముడైన); నలున్= నలుడిని; ధర్మ విధానంబునన్= ధర్మమార్గాన; వరియించి= ఎన్నుకొని; తదీయ, స్కంధంబునన్= ఆతడి భుజంపై; సుగంధి, కుసుమ, దామకంబు= పరిమళించే పూలదండ; పెట్టినన్= వేయగా,

**తాత్పర్యం:** దేవతలు దమయంతి మొర విని కరుణించారు. వారు రెప్పలు మూతవడని కన్నులతో, చెమటపట్టని దేహాలతో, నేలను అంటక దగ్గరగా నిలిచారు. అంత దిక్పాలకులూ, భూలోకంలోని రాజసమూహమూ చూస్తుండగా పుణ్యశ్లోకుడైన నలుడి భుజంపై (కంఠంలో) పూలదండ వేసి దమయంతి అతడిని వరుడిగా ఎన్నుకొన్నది.

**క. దేవతల సాధువాదము । తో విప్రాశీరవంబుతో బహు తూర్యా**
**రావంబులు సెలఁగెను, బా । రావార రవంబుఁబోలె ననివార్యములై. 56**

**ప్రతిపదార్థం:** దేవతల= వేల్పుల; సాధువాదముతోన్= శుభాకాంక్షల శబ్దాలతో; విప్ర+ఆశీః+రవంబుతోన్= బ్రాహ్మణుల దీవనల ధ్వనులతో, బహుతూర్య+ఆరావంబులు= పెక్కు తూర్యధ్వనులు (తూర్యం= మంగళవాద్యం;) న+నివార్యములు+ఐ= వారించటానికి వీలులేనివై; (అంటే స్వచ్ఛందంగా, సంకులంగా); పారావార, రవంబున్+పోలెన్= సముద్రఘోషవలె; చెలఁగెను= ఉప్పొంగాయి.

**తాత్పర్యం:** వేల్పుల శుభాకాంక్షల శబ్దాలు, బ్రాహ్మణుల ఆశీర్వాద నినాదాలు, అనేకవిధాల మంగళవాద్యాల ధ్వనులు కలిసి సముద్రఘోషవలె అతిశయించాయి.

**విశేషం:** అలం: ఉపమ.

నలుండు స్వయంవరలబ్ధ యయిన దమయంతిం బెండ్లియగుట (సం. 3-54-25)

**వ. ఇ ట్లపూర్వ స్వయంవర లబ్ధయైన దమయంతి నత్యంత విలాసంబుతో వివాహంబైన యా నలునకు నింద్రుండు వానియజ్ఞంబులయందు నిజరూపంబుఁజూపను, నగ్నియు వరుణుండును వాని వలచిన చోటన యగ్ని జలంబు లుత్పాదింపను, ధర్ముండు ధర్మువునంద వానిబుద్ధి వర్తిల్లను వరంబు లిచ్చి దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని' యెందులకుం బోయెద?' వని యడిగిన నింద్రాదులకుఁ గలి యిట్లనియె. 57**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అపూర్వ, స్వయంవర, లబ్ధ+ఐన= పూర్వకాలంలో ఎన్నడు జరుగనట్టి స్వయంవరంలో లభించినట్టి; దమయంతిన్= దమయంతిని; అత్యంత, విలాసంబుతోన్= గొప్పవైభవంతో; వివాహంబు+ఐన= పెండ్లి కాగా; ఆ నలునకున్; ఇంద్రుండు; వాని, యజ్ఞంబుల+అందున్= ఆ నలుడి క్రతువులలో; నిజ, రూపంబున్+చూపనున్= నిజమైన తన ఆకృతిని చూపటానికి అంటే ప్రత్యక్షమవటానికి; అగ్నియు, వరుణుండును; వాని, వలచిన, చోటన్+అ= ఆ నలుడు కోరిన స్థలంలోనే; అగ్ని= నిప్పు; జలంబులు= నీళ్ళు; ఉత్పాదింపను= కలిగేటట్లు చేయటానికి; ధర్ముండు= యముడు; ధర్మువునందు+అ= ధర్మంపైనే; వానిబుద్ధి= నలుడిబుద్ధి; వర్తిల్లను= వెలసేటట్లును; వరంబులు+ఇచ్చి= వరాలను అనుగ్రహించి; దేవలోకంబునకు= స్వర్గానికి; అరుగువారు= వెళ్ళేవారు; ఎదురన్= ఎదురుగా; ద్వాపరంబుతోన్= ద్వాపరంతో; వచ్చు= వస్తున్న; కలిన్+కని= కలి పురుషుడిని చూచి; ఎందులకున్+పోయెదవు?= ఎక్కడికి పోతున్నావు?; అని; అడిగినన్= ప్రశ్నించగా; ఇంద్రాదులకున్= ఇంద్రుడు మున్నగువారికి; కలి= కలిపురుషుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అత్యద్భుతమైన స్వయంవరంలో లభించిన దమయంతిని నలుడు మహావైభవోపేతంగా పెండ్లాడాడు. ఇంద్రుడు తాను స్వయంగా ప్రత్యక్షమై నలుడు చేసే యజ్ఞాలలో పాల్గొంటానని వరమిచ్చాడు. అగ్ని, వరుణుడుకూడా నలుడు కోరిన చోటులలో నిప్పు, నీరు లభించేటట్లు వరాలు అనుగ్రహించారు. యమధర్మరాజు నలుడి మనస్సు ధర్మంపైనే లగ్నమయ్యేటట్లు వరం ప్రసాదించాడు. వేల్పులు అట్లా నలుడికి వరాలిచ్చి స్వర్గానికి వెళ్ళుతుండగా మార్గమధ్యంలో ద్వాపరపురుషుడితోపాటు వస్తున్న కలి కనిపించాడు. వారు కలిని 'నీవు ఎక్కడికి పోతున్నావు?' అని ప్రశ్నించారు.

**తే. 'అవనిలో దమయంతీ స్వయంవరంబు । విస్తరిల్లుట విని కడు వేడ్కతోడ**
**నేను దమయంతిచే వరియింపఁబడుదు । నని తదర్థినై యరిగెద నాసఁ జేసి.' 58**

**ప్రతిపదార్థం:** అవనిలోన్= భూలోకంలో; దమయంతీ, స్వయంవరంబు= దమయంతియొక్క స్వయంవరం; విస్తరిల్లుట విని= జరగటం విని; కడు, వేడ్కతోడన్= మిక్కిలి సంబరంతో; ఏను= నేను; దమయంతిచే= దమయంతిచేత; వరియింపన్+పడుదున్= ఎన్నుకొనబడతాను; అని; తత్+అర్థిని+ఐ= ఆ కోరిక కలవాడినై; ఆసన్+చేసి= ఆశతో; అరిగెదన్= వెళ్ళుతున్నాను.

**తాత్పర్యం:** 'భూలోకంలో దమయంతీ స్వయంవరం జరుగుతుందని వినిఉన్నాను. అందులో నేను దమయంతిచేత వరించబడతాననే సంబరంతో, ఆసతో, కోరికతో వెళ్ళుతున్నాను.'

**విశేషం:** జరిగేది దమయంతీ స్వయంవరం! ఆమె అతిలోకసౌందర్యవతి. జగదేకసుందరి. ఆమె ఇంద్రాదులనే తిరస్కరించింది. ఇక, కలిపురుషుడి ఆస ఎంతటి హాస్యాస్పదమైనది! శృంగారప్రకృతి మిక్కిలి గహనమైనది. గంభీరమైనది. తాను ఎంతటి కురూపి అయినను జగదేకసుందరిని కాంక్షించవచ్చును కదా!

వ. అనిన నందఱు నగి'నీ వందుల కేల పోయె? దది ముందర నిర్వృత్తంబయ్యెఁ; నక్కోమలి యొరుల నెవ్వరి మెచ్చక నలుం డను వాని వరియించె' ననినం గలి కరం బలిగి, 'యన్నలునకు దమయంతికి రాజ్య విభవ పరిత్యాగంబును బరస్పర వియోగంబునుం జేసెద' నని నిశ్చయించి, వాని నక్షరతుంగా నెఱింగి, యక్షంబులం జొచ్చి యుండ ద్వాపరుం బనిచి, నలు సేయుచున్న యశ్వమేధాది కానేక భూరి దక్షిణ మహాక్రతువులయు జపహోమ దానాది వివిధ పుణ్యకర్మంబులయుఁ గారణంబునం జొర నవసరంబుఁ గానక, యంతరం బన్వేషించుచుఁ బెద్దకాలం బుండి, యొక్కనాఁ డతండు కృతమూత్రుండయి జలోపస్పర్శనానంతరంబునం బాదశౌచంబు సేయమఱచి సంధ్యోపాసనంబు సేసిన, నుపలబ్ధావసరుం డయి కలి నలునందుఁ బ్రవేశించి, పుష్కరుం డను వాని పాలికిం బోయి త న్నెఱింగించి 'నీవు నలునితో జూదంబాడి వాని రాజ్యంబును సర్వస్వంబును నొడిచికొ' మ్మని చెప్పి తానును వానికి విప్రవేషంబున సహాయుండై యక్షంబులు గొని పుష్కరునితో నొక్కటం జని నలుం గాంచి 'నీవు మాతో జూదం బాడు' మనిన. 59

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; అందఱున్= అందరును; నగి= నవ్వి; నీవు, (కలి); అందులకున్= అందుకొఱకై; (అక్కడికి); ఏల, పోయెదు= ఎందుకు పోతున్నావు?; అది= ఆ దమయంతీ స్వయంవరం; ముందర= పూర్వమే; నిర్వృత్తంబు+అయ్యెన్= జరిగిపోయింది; ఆ, కోమలి= ఆ సుకుమారి; ఒరులన్+ఎవ్వరి, మెచ్చక= ఇతరులను ఎవరిని అంగీకరించక; నలుండు= నలుడు; అనువాని= అనే వరుడిని; వరియించెన్= పతిగా ఎన్నుకొన్నది; అనినన్= అనిచెప్పగా; కలి= కలిపురుషుడు; కరంబు+అలిగి= మిక్కిలి కోపించి; ఆ+నలునకు; దమయంతికి; రాజ్య, విభవ, పరిత్యాగంబును= రాజ్యసంపద తొలగిపోయేటట్లుగను; పరస్పర వియోగంబునున్= ఇరువురును ఒకరినొకరు ఎడబాసి ఉండేటట్లుగను; చేసెదన్= చేయగలను; అని; నిశ్చయించి= నిర్ణయించి; వానిన్= ఆ నలుడిని; అక్ష, రతున్+కాన్+ఎఱింగి= పాచికలలో ఇష్టంకలవాడినిగా తెలిసికొని; అక్షంబులన్+చొచ్చి+ఉండన్= పాచికలలో చొరబడి ఉండటానికి; ద్వాపరున్= ద్వాపర పురుషుడిని; పనిచి= నియోగించి; నలు+చేయుచున్న= నలుడు సలుపుతున్న; అశ్వమేధ+ఆదిక+అనేక, భూరి, దక్షిణ, మహాక్రతువులయు= అశ్వమేధం మొదలయిన గొప్ప బహుమతులతో కూడిన పెక్కుక్రతువుల యొక్క; జప, హోమ, దాన+ఆది, వివిధ, పుణ్య, కర్మంబులయున్= జపాలు, హోమాలు, దానాలు మొదలుగాగల పెక్కు పుణ్యకార్యాలయొక్కయు; కారణంబునన్= హేతువుచేత; చొరన్= చొరబడటానికి; అవసరంబున్= సమయాన్ని; కానక= అరయక; అంతరంబు= అవకాశాన్ని; అన్వేషించుచున్= వెదకుతూ; పెద్ద, కాలంబు+ఉండి= చాలకాలం వేచిఉండి; ఒక్కనాఁడు= ఒకానొక రోజున; అతండు= ఆ నలుడు; కృతమూత్రుండు+అయి= మూత్రంచేసినవాడయి; జల+ఉప స్పర్శన+అనంతరంబునన్= నీటిని ముట్టుకొనిన పిమ్మట; పాదశౌచంబు= కాళ్ళ పరిశుభ్రత (కాళ్లు కడుగుకొనటం); చేయమఱచి= చేయటం మరచి; సంధ్యా+ఉపాసనంబు= సంధ్యావందనం; చేసినన్= చేయటంచేత; ఉపలబ్ధ+అవసరుండు+అయి= లభించిన అదను కలవాడై; కలి= కలిపురుషుడు; నలున్+అందున్= నలుడిలో; ప్రవేశించి= చొరబడి; పుష్కరుండు+అను, వాని పాలికిన్+పోయి= పుష్కరుడనేవాడిదగ్గరకు పోయి; తన్ను+ఎఱింగించి= తానెవరో వివరించి చెప్పి; నీవు; నలునితో; జూదంబు+ఆడి; వాని రాజ్యంబును; సర్వస్వంబునున్= సర్వసంపదలను; ఒడిచికొమ్ము= ఓడించి తీసికొనుము; అని చెప్పి; తానును; వానికిన్= ఆ పుష్కరుడికి; విప్రవేషంబునన్= బ్రాహ్మణుడి ఆకృతితో; సహాయుండు+ఐ= తోడై; అక్షంబులు+కొని= పాచికలనుగైకొని; పుష్కరునితోన్; ఒక్కటన్+చని= కలిసి వెళ్ళి; నలున్+కాంచి= నలుడిని చూచి; నీవు= ఓ నలమహారాజా!; మాతో= పుష్కరుడితో, తనతో; జూదంబు+ఆడుము+అనినన్= జూదాన్ని ఆడుమని అడుగగా.

**తాత్పర్యం:** కలిపురుషుడి మాటలు విని అందరు నవ్వారు. 'స్వయంవరం జరిగిపోయింది. ఇక నీప్రయాణం నిరర్థకం. ఆ సుకుమారి దమయంతి ఒరులను ఎవ్వరిని మెచ్చక నలమహారాజును వరించింది' అని దేవతలు

చెప్పగా కలిపురుషుడికి నలుడిపై కోపం వచ్చింది. నలుడికి రాజ్యవైభవం పోగొట్టటానికి, నలదమయంతులకు పరస్పర వియోగాన్ని కల్పించటానికి కలిపురుషుడు నిశ్చయించాడు. నలుడు ద్యూతప్రియు డని కలికి తెలిసింది. అందుచేత పాచికలలో ప్రవేశించుమని కలి తన సహచరుడైన ద్వాపరుడిని నియోగించాడు. తాను నలుడిలో ప్రవేశించ సంకల్పించాడు కాని, అతడికి అవకాశం చాలకాలంవరకు లభించలేదు. నలుడు అనవరతం అశ్వమేధాది యజ్ఞయాగాదులు నిర్వర్తించి, బ్రాహ్మణులకు అపార దక్షిణలు పంచిపెట్టుతూ ఉండేవాడు. జపం, తపం, హోమం, దానధర్మ పుణ్యకార్యాలు అతడి దినచర్యలయ్యాయి. కాని, ఒకనాడు నలుడు మూత్రవిసర్జన అనంతరం పాదప్రక్షాళనం మరచిపోయి సంధ్యావందన మాచరించాడు. అప్పుడు ఆ అశుచిత్వాన్ని ఆధారం చేసికొని కలి నలుడిలో ప్రవేశించాడు. తదుపరి కలి పుష్కరుడనే రాజు వద్దకు వెళ్ళి, తనను తాను పరిచయం చేసికొని, "నలుడితో జూదమాడి నలుడిరాజ్యాన్ని, సర్వసంపదలనూ గెలుచుకొమ్మని'' ప్రోత్సహించాడు. పుష్కరుడు అందుకు సమ్మతించాడు. కలి బ్రాహ్మణవేషం ధరించి పాచికలు పట్టుకొని పుష్కరుడితోపాటు నలుడి ఒద్దకు పోయి, ఇద్దరూ అతడిని జూదమాడటానికి ఆహ్వానించారు.

**విశేషం:** ఈ భూలోకంలో మానవజాతి సమస్తాన్ని పట్టిపీడించే సర్వపాపాలకు సమష్టి పర్యాయపదం కలి. సమస్త దుర్గుణాలలో నీచాతినీచంగా ఎన్నదగింది అసూయ. కలి మూర్తీభవించిన మాత్సర్యం. నలదమయంతులు ఆదర్శదంపతులు. నలుడు పుణ్యమూర్తి. కలిపురుషుడు అతడికి దవుదవ్వులలో నిలువవలసినవాడు. కాని, అటువంటి నలుడిని సమీపించటానికి కలికి అవకాశం కల్పించింది. 'అశౌచం'. మూత్ర విసర్జనానంతరం పాదప్రక్షాళన విస్మరించిన పరమపుణ్యమూర్తిలో కలి అశౌచంవలన ప్రవేశించగలిగాడు. "అశౌచం- కలిపురుషుడికి ప్రవేశద్వారం'' అనే నీతి నలోపాఖ్యానంలో అంతర్గర్భితం. విశ్వసాహితీప్రపంచంలో నలోపాఖ్యానంవలె శుచిత్వానికి నిరుపమాన ప్రాధాన్యం కల్పించిన గాథ మరొకటి కనిపించదు. నిరంతరనిత్యజాగృతి, శుచిత్వ పరిరక్షణకు అత్యవసరం- అనే హెచ్చరిక నలోపాఖ్యానంలో సునిశితంగా నిక్షిప్తమైనది. వావిళ్లప్రతిలో 'నీవు మారాజుతో జూదంబాడు మనిన'- అనే పాఠాంతరం ఉన్నది.

**క. ద్యూతార్థము తత్కితవా । హూతుఁడనై జూద మాడకుండుట ధర్మా**
**పేతం బని యభిముఖుఁడై । యాతనితో నలుఁడు జూదమాడఁ గడంగెన్. 60**

**ప్రతిపదార్థం:** ద్యూత+అర్థము= జూదం ఆడటంకొరకు; తత్, కితవ+ఆహూతుఁడను+ఐ= ఆ జూదరులచేత పిలువబడినవాడినై; జూదము+ఆడకుండుట; ధర్మ+అపేతంబు+అని= అధర్మమని; అభిముఖుఁడు+ఐ= అనుకూలుడై, (ఎదురుమొగం కలవాడై- దీనికి వ్యతిరేకం విముఖుడు= పెడమొగం కలవాడు); నలుడు; ఆతనితో= ఆ పుష్కరుడితో; జూదము+ఆడన్= జూదమాడటానికి; కడంగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** 'జూదమాడటానికై ఆ జూదరులచేత పిలువబడినవాడనై జూదమాడకుండటం అధర్మ' మని తలచి నలుడు సమ్మతించి పుష్కరుడితో జూదమాడటానికి పూనుకొన్నాడు.

**విశేషం:** జూదాన్ని ప్రాచీనులు సప్తవ్యసనాలలో చేర్చారు. సప్తవ్యసనాలు: 1.మృగయ (వేట) 2. మద్యం 3. మహిళ 4. ద్యూతం 5. వాక్పారుష్యం 6. దండపారుష్యం 7. అర్థదూషణం. ధర్మమూర్తి అయిన నలుడు సప్తవ్యసనాలలో ఒకటిగా ఎన్నబడిన ద్యూతక్రీడకు ఏల అభిముఖుడయ్యాడు? అనే ప్రశ్న ఉదయించక తప్పదు. ఆ ప్రశ్నకు సమాధానం (1) అలనాటి క్షత్రియ

సంప్రదాయం. జూదమాడటంకొరకు వచ్చిన ఆహ్వానాన్ని తిరస్కరించరాదు అనేభావం. (2) నలుడు కలిగ్రస్తుడు. జూదంవలన దాపురించే అనర్థాన్ని నలోపాఖ్యానం నొక్కి వక్కాణించింది. జూదాన్ని వ్యసనంగానే అభివర్ణించింది కాని సమర్థించలేదు.

**క. కలధనము లెల్ల నొడ్డుచు । నలయక జూదమున విజితుఁడగుచుండె ని జా**
**ప్తులు వారించిన నుడుగక । నలుఁడు కలిప్రేరణంబునను హతమతియై. 61**

**ప్రతిపదార్థం:** కల, ధనములు+ఎల్లన్= ఉన్న సంపదలు అన్నియు; ఒడ్డుచున్= జూదంలో పణంగా పెట్టుతూ; అలయక= విసుగుచెందక; జూదమునన్= ద్యూతంలో; నిజ+ఆప్తులు= తనయొక్క హితులు; వారించినన్= అడ్డుపడినను; ఉడుగక= విరమించక; కలి ప్రేరణంబునను= కలియొక్క ప్రేరేపణవలన; హతమతి+ఐ= బుద్ధిహీనుడై; నలుఁడు; విజితుఁడు= ఓడిపోయినవాడు; అగుచుండెన్= అవుతుండెను.

**తాత్పర్యం:** నలుడు జూదం మొదలుపెట్టాడు. తనకున్న సంపదలనన్నింటిని పణంగాపెట్టి అలసట లేకుండా, ఆపకుండా జూదమాడసాగాడు. ఆప్తులు వారించినప్పటికీ, బుద్ధిహీనుడై జూదం మానలేదు. అది కలి ప్రేరణ. జూదంలో నలుడు వరుసగా ఓడుతూనే ఆడుతున్నాడు.

**వ. ఇ ట్లనేక మాసంబులు దుర్వ్యసనాసక్తుం డయిన యన్నలుండు వివిధ వస్తువాహన నివహంబు లొడ్డి పుష్కరున కోటువడం బోయిన నెఱింగి పౌర బ్రాహ్మణ ప్రధాన వరులు దమయంతీ పురస్కృతులయి వచ్చి వారించి, కలి సమావేశపరవశుండైన యన్నలుచేతం బ్రతిహతు లయి వలుక కుండి; రంత దమయంతి చింతాక్రాంత చిత్తయై. 62**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అనేక, మాసంబులు= పెక్కునెలలు; దుర్వ్యసన+ఆసక్తుండు+అయిన= దోషకార్యంలో అపేక్ష కలవాడయిన; ఆ+నలుండు; వివిధ, వస్తు, వాహన, నివహంబులు= పెక్కు వస్తువులు, వాహన సముదాయాలు; ఒడ్డి= జూదంలో పణంగాపెట్టి; పుష్కరునకు+ఓటు, పడన్+పోయినన్= పుష్కరుడి చేతిలో ఓడిపోవటానికి సంసిద్ధుడు కాగా; ఎఱింగి= తెలిసికొని; పౌర, బ్రాహ్మణ, ప్రధాన, వరులు= పురజనులలో, విప్రులలో, మంత్రులలో గొప్పవారు; దమయంతీ పురస్కృతులు+అయి= దమయంతిని తమముందు నిలబెట్టుకొనినవారై; వచ్చి= అరుదెంచి; వారించి= జూదం ఆడవద్దని అడ్డుచెప్పి; కలి సమావేశ పరవశుండు+ఐన= కలియొక్క కలయికచేత వివశత్వం చెందినట్టి; ఆ+నలుచేతన్= ఆ నలుడిచేత; ప్రతిహతులు+అయి= తిరస్కరించబడినవారై; పలుకకుండిరి= మౌనం వహించిరి; అంతన్= అటుపై; దమయంతి; చింతా+ఆక్రాంత, చిత్త+ఐ= దుఃఖంచేత ఆక్రమించబడిన మనస్సుకలదై.

**తాత్పర్యం:** ఈ విధంగా పెక్కునెలలు దుర్వ్యసనమైన జూదానికి లోబడి, అనేక వస్తువాహనాదులను పణంగా ఒడ్డి పుష్కరుడిచేత ఓటమి చెందటానికి సంసిద్ధుడైన నలుడి దగ్గరికి పౌరబ్రాహ్మణ మంత్రిశ్రేష్ఠులు దమయంతిని తమకు ముందుపెట్టుకొని వచ్చి అతడిని వారించారు. కాని, కలిప్రభావానికి లోబడి వివశుడై ఉన్న నలుడు వారిమాటలు వినలేదు. వారు మారుమాటాడలేక మిన్నకున్నారు. అంత దమయంతి దుఃఖంచేత ఆవరించబడిన మనస్సుకలదై.

**ఆ. 'ఎంత యోటువడిన నంతియ జూదంబు । నందుఁ దగులుఁ, జలము నతిశయిల్లు,**
**నేమి సేయు దాన ? నిది యెగ్గునకు మూల' । మని లతాంగి దుఃఖితాత్మ యగుచు. 63**

**ప్రతిపదార్థం:** ఎంత+ఓటు+పడినన్= ఎంతగా ఓడిపోయినప్పటికిని; అంతియ= అంత ఎక్కువగానే; జూదంబునందున్= ద్యూతంలో; తగులున్= తగులుకోవటం అంటే నిమగ్నతయు; చలమున్= మాత్సర్యమును (పట్టుదలయు); అతిశయిల్లున్= పెరుగుతుంది; ఏమి+చేయుదానన్= ఏమి చేయగలను? అంటే నేను కేవలం నిస్సహాయురాలిని అని అర్థం; ఇది= ఈ జూదం; ఎగ్గునకు= కీడుకు; మూలము= హేతువు; అని= అని తలపోసి; దుఃఖిత+ఆత్మ+అగుచున్= పరితపించినట్టి ఆత్మ కలది అవుతూ.

**తాత్పర్యం:** 'ఓడినకొలది జూదంలో ఆసక్తి, మాత్సర్యం (పట్టుదల) పెరుగుతాయి. ఇక నే నేమి చేయగలను? ఇది కీడుకు మూలకారణం' అని సుకుమారి అయిన దమయంతి మిక్కిలి దుఃఖించింది.

**సీ. అక్షముల్ పుష్కరునందు వశ్యంబులై । యునికియు, నలునియం దొండువిధము**
**లగుటయు నెఱిఁగి, నిజాధీశ్వరున కప । జయము కా లక్షించి, సరసిజాక్షి**
**భర్తయనుజ్ఞ మున్ బడసి వార్ష్ణేయుఁడన్ । సారథిఁ బిలిచి 'యీ స్యందనమున**
**నింద్రసేనుండను నిక్కుమారకు నింద్ర । సేన య న్కూఁతుఁ జెచ్చరను దోడు**

**ఆ. కొని విదర్భ కరిగి గుఱుకొని మద్బంధు । జనులయొద్దఁ బెట్టి చట్ట రమ్ము'**
**యంచు నెమ్మిఁ బుచ్చె నాప్తపురోహిత । మంత్రిబాంధవాభిమతము గాఁగ. 64**

**ప్రతిపదార్థం:** అక్షముల్= పాచికలు; పుష్కరునందున్= పుష్కరుడి చేతిలో; వశ్యంబులు+ఐ= స్వాధీనములై; ఉనికియు= ఉండటమున్నూ; నలుని+అందు; ఒండు, విధములు+అగుటయున్= వేరొకరీతిగా కావటమున్నూ; ఎఱిఁగి= తెలిసికొని; నిజ+అధీశ్వరునకున్= తన భర్తకు; అపజయము+అ= అపజయమే; కాన్, లక్షించి= ఓటమే అవుతుందని తలపోసి; సరసిజ+అక్షిన్= పద్మాలవంటి కన్నులుగల దమయంతి; భర్త+అనుజ్ఞ= భర్త(నలుడి) అనుమతి; మున్, పడసి= ముందు పొంది; వార్ష్ణే యుఁడు+అన్= వార్ష్ణేయుడు అనే; సారథిన్+పిలిచి= రథ చోదకుడిని పిలిచి; ఈ, స్యందనమునన్= ఈ రథంలో; ఇంద్రసేనుండు+ అను= ఇంద్రసేనుడనే; ఈ+కుమారకున్= ఈ కొడుకును; ఇంద్రసేన+అన్+కూఁతున్= ఇంద్రసేన అనేకూతురిని; చెచ్చెరను= శీఘ్రంగా; తోడుకొని= వెంటబెట్టుకొని; విదర్భకు+అరిగి= విదర్భకు పోయి; గుఱుకొని= పూనుకొని; మత్+బంధు జనుల+ఒద్దన్= నా చుట్టాల దగ్గర; పెట్టి= అప్పగించి; చట్ట, రమ్ము+అ= శీఘ్రంగా రావాలి; అంచున్= అంటూ; ఆప్త, పురోహిత, మంత్రి, బాంధవ+అభిమతము, కాఁగన్= హితులు, వైదికకర్మలు నిర్వహించే గురువులు, సచివులు, చుట్టాలయొక్క అభిప్రాయాన్ని పాటించే; నెమ్మిన్= ప్రీతితో; పుచ్చెన్= పంపింది.

**తాత్పర్యం:** పాచికలు పుష్కరుడికి అనుకూలంగా ఉండటాన్ని, నలుడికి ప్రతికూలంగా ఉండటాన్ని తెలిసికొని దమయంతి తన భర్తకు ఓటమి సిద్ధిస్తుందని తలపోసి, ముందే భర్త అనుమతిని పొంది, వార్ష్ణేయుడనే సారథిని పిలిచి 'ఈ రథంపై ఇంద్రసేనుడనే కుమారుడిని, ఇంద్రసేన అనే కూతురిని శీఘ్రంగా తీసికొని విదర్భకు వెళ్ళి అక్కడ నా బంధువుల దగ్గర దిగబెట్టి వేగంగా తిరిగిరమ్ము' అని దమయంతి నియోగించింది. ఆమె చేసిన పనిని ఆప్తులు, చుట్టాలు, వైదికకర్మలు నిర్వహించే గురువులు, మంత్రులు ఆమోదించారు.

**క. నలుఁడును ధరణీరాజ్యము । దలఁగఁగ సర్వంబు నపహృతం బైనఁ గడుం**
**దలరి దమయంతిఁ దోడ్కొని । వెలువడియె నశేషరాజ్యవిభవచ్యుతుఁడై. 65**

**ప్రతిపదార్థం:** నలుఁడును; ధరణీ, రాజ్యము= భూరాజ్యం; తలఁగఁగన్= తొలగిపోగా; సర్వంబున్= సమస్తమున్నూ; అపహృతంబు+ఐనన్= అపహరించబడింది కాగా; కడున్= మిక్కిలి; తలరి= పరితపించి; దమయంతిన్+తోడ్కొని= దమయంతిని వెంటబెట్టుకొని; అశేష, రాజ్య, విభవ, చ్యుతుఁడు+ఐ= సమస్త రాజ్యసంపద పోయినవాడై; వెలువడియెన్= (పురంనుండి) బయటికి వెళ్ళాడు.

**తాత్పర్యం:** జూదంలో భూరాజ్యం తొలగిపోయింది. సర్వస్వం అపహరించబడింది. నలుడు మిక్కిలి పరితపించి దమయంతిని వెంటపెట్టుకొని రాజ్యవైభవం, సంపద కోల్పోయి రాజధానినుండి బయటకు వెళ్ళాడు.

**తే.** **పురమువెలి మూఁ డహోరాత్రములు వసించి । యున్న నలుపాలి కెవ్వరు నోడి రరుగ**
**జనవిభుం డైన పుష్కరుశాసనమునఁ । గలికృత ద్యూతవిద్వేష కారణమున.** **66**

**ప్రతిపదార్థం:** పురమువెలి= పట్టణం బయట; మూఁడు+అహోరాత్రములు= మూడు రాత్రుళ్ళు, పగళ్ళు; వసించి= నివసించి; ఉన్న= ఉన్నట్టి; నలుపాలికి= నలుడి దగ్గరకు; జన, విభుండు+ఐన= రాజైన; పుష్కరు, శాసనమునన్= పుష్కరుడి ఆజ్ఞవలన; కలి, కృత, ద్యూత, విద్వేష, కారణమునన్= కలిచేత ఏర్పరచబడిన జూదంమీది కోపంచేత; ఎవ్వరున్= ఎవరుకూడా; అరుగన్= వెళ్ళటానికి; ఓడిరి= జంకారు.

**తాత్పర్యం:** జూదంలో రాజ్యం కోల్పోయిన నలుడు పురంవెలుపల మూడుదినాలు నివసించాడు. రాజైన పుష్కరుడికి భయపడటంచేత, కలిప్రేరణచేత జూదంపై ఏర్పడిన ద్వేషంచేత పౌరులు ఎవరుకూడా నలుడిదగ్గరికి వెళ్ళలేదు.

**వ.** **ఇట్లు సర్వజన సత్కారార్హుం డయ్యును నలుండు విధికృతంబున నెవ్వరివలనను సత్కారంబు గానక జలంబు లాహారంబుగాఁ దత్పురసమీపంబున దమయంతీ ద్వితీయుండై యుండి, బుభుక్షాపీడ సహింప నోపక, 'హిరణ్యపక్షంబులతోఁ దమముందటఁ దిరుగుచున్న పక్షులం గని యవి భక్ష్యంబు లగు నని యప్పక్షులం బట్టికొన సమకట్టి తనకట్టిన పుట్టంబు వానిపై వైచిన, నవి పుట్టంబుతోన గగనంబున కెగసి నగుచు విగతవస్త్రుండైన నలున కి ట్లనియె.** **67**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; సర్వజన, సత్కార+అర్హుండు+అయ్యును= జనులందరి చేత సమ్మానం పొందటానికి యోగ్యత కలవాడు అయినప్పటికిని; నలుండు= నలుడు; విధి, కృతంబునన్= దురదృష్టవశాన; ఎవ్వరి వలనను= ఎవరిచేతకూడా; సత్కారంబున్+కానక= సమ్మానం పొందలేక; జలంబులు= నీళ్ళు; ఆహారంబుగాన్= తిండిగా; తద్+పుర సమీపంబునన్= ఆ పట్టణానికి దగ్గరగా; దమయంతీ, ద్వితీయుండు+ఐ= దమయంతిని తోడుగాకలవాడై; ఉండి= కలసి ఉండి; బుభుక్షా, పీడ= ఆకలిబాధ; సహింపన్+ఓపక= తాళజాలక; హిరణ్యపక్షంబులతోన్= బంగారురెక్కలతో; తమ, ముందటన్= తమకు ఎదురుగా; తిరుగుచున్న= విహరిస్తున్న; పక్షులన్+కని= పిట్టలను చూచి; అవి= ఆ పక్షులు; భక్ష్యంబులు= భుజింపతగినవి; అగును+అని= అవుతాయని తలపోసి; ఆ+పక్షులన్+పట్టికొనన్= ఆ పక్షులను పట్టుకొనటానికి; సమకట్టి= పూని; తన, కట్టిన, పుట్టంబు= తాను ధరించిన వస్త్రం; వానిపై= ఆ పక్షులపై; వైచినన్= విసరగా; అవి= ఆ పక్షులు; పుట్టంబుతోనన్= వస్త్రంతోనే; గగనంబునకు= ఆకాశానికి; ఎగసి= ఎగిరి; నగుచున్= పరిహసిస్తూ; విగత, వస్త్రుండు+ఐన= పోయిన పుట్టం కలవాడైన; నలునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాయి.

**తాత్పర్యం:** సర్వజనులచేత సత్కారాన్ని పొందటానికి యోగ్యత కలవాడైనను నలుడు విధిపరిపాకంచేత, ఎవరిచేతను గౌరవించబడక నీళ్ళు మాత్రమే ఆహారంగా గైకొని దమయంతియు, తాను ఇరువురు మాత్రమే ఆ పట్టణ

సమీపంలో ఉన్నారు. అప్పుడు వారిముందు బంగారురెక్కలు గల పక్షులు విహరిస్తూ కనిపించాయి. నలుడు ఆకలిబాధ తాళలేక ఆ పక్షులు ఆహారంగా ఉపకరిస్తాయని ఆలోచించి, వాటిని పట్టుకొనటానికై తాను కట్టుకొన్న వస్త్రాన్ని తీసి వాటిపై విసిరాడు. ఆ పక్షులు నలుడు విసరిన వస్త్రంతోపాటు ఆకాశంలోకి ఎగిరిపోయి, నవ్వుతూ అతడితో ఇట్లా పలికాయి.

**విశేషం:** ఆ పక్షులు, బంగారురెక్కలు కలవి. అవి అసలు పక్షులు కావు. నలుడిని ప్రలోభపెట్టటానికి వచ్చిన పాచికలు! పాచికలపైగల వ్యామోహం బంగారురెక్కలు గల పిట్టలుగా ఉత్ప్రేక్షించబడటం మనోహరకల్పన.

**నలుండు దమయంతీసహితుండై యడవికిఁ బోవుట (సం.3-58-25)**

**తే. 'నీ ధనంబును రాజ్యంబు నికృతిఁ గొన్న । యక్షముల మేము; నీ వస్త్ర మపహరింపఁ**
**బక్షిరూపులమై వచ్చి పార్థివేంద్ర! । యపహరించితి' మని చెప్పి యరిగెఁ జదల. 68**

**ప్రతిపదార్థం:** పార్థివ+ఇంద్ర!= రాజులలో శ్రేష్ఠుడా! అంటే ఓ నలమహారాజా!; నీ ధనంబును= నీ(డబ్బు) సంపదను; రాజ్యంబున్= రాజ్యాన్ని; నికృతిన్+కొన్న= మోసంచేత గ్రహించిన; అక్షములము= పాచికలము; ఏము= మేము; నీ వస్త్రము+ అపహరింపన్= నీవు కట్టుకొన్న వస్త్రాన్ని మోసంతో తీసికొనటానికి; పక్షిరూపులము+ఐ= పిట్టల ఆకారం ధరించినవారమై; వచ్చి= అరుదెంచి; అపహరించితిమి= మోసంతో గ్రహించాం; అని, చెప్పి; చదలన్= ఆకాశంలో; అరిగెన్= వెళ్ళిపోయాయి.

**తాత్పర్యం:** 'ఓ నలమహారాజా! నీ సంపద, నీ రాజ్యం, మోసగించి పరిగ్రహించిన పాచికలం మేము. పక్షులరూపం ధరించి, నిన్ను మోసగించి నీవు కట్టిన బట్టలను గూడ అపహరించడానికి వచ్చాం, అపహరించాం' అని ఆ పక్షులు నలుడితో చెప్పి ఆకాశమార్గాన్ని బట్టి ఎగిరిపోయాయి.

**వ. నలుండును వానిం జూచి విస్మయం బంది 'యీ యక్షంబుల దోషంబునం గా కేమి? నా కిట్టి దయ్యె' ననుచు దమయంతి కట్టిన పుట్టంబుచెఱంగు గట్టికొనియె; నట్లిద్దఱు నేకవస్త్రులయి యొండొరుల మొగంబులు సూచి దుఃఖించుచో నలుండు దమయంతి కి ట్లనియె. 69**

**ప్రతిపదార్థం:** నలుండును= నలుడును; వానిన్+చూచి= ఆ పిట్టలను చూచి; విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; ఈ+అక్షంబుల, దోషంబునన్+కాక+ఏమి= ఈ పాచికలదోషంవలన కాక మరేమిటి; నాకు+ఇట్టిది+అయ్యెన్= నాకు, ఇటువంటి అవస్థ దాపురించింది; అనుచున్= అని తలపోస్తూ; దమయంతి, కట్టిన, పుట్టంబు చెఱంగు= దమయంతి ధరించినట్టి చీరకొంగు; కట్టికొనియెన్= కట్టుకొన్నాడు; అట్లు+ఇద్దఱు= ఆ విధంగా ఇరువురు; ఏక వస్త్రులు+అయి= ఒకేచీర ధరించిన వారయి; ఒండొరుల, మొగంబులు, చూచి= ఒకరిమొగం ఒకరు చూచి; దుఃఖించుచోన్= పరితపిస్తున్నప్పుడు; నలుండు; దమయంతికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** నలుడుకూడ ఆ పిట్టల పలుకులు విని ఆశ్చర్యపోయాడు. 'నాకు ఈ దుఃస్థితి దాపురించటానికి ఈ పాచికల దోషం గాక మరేమి కారణం ఉన్నది?' అని తలపోస్తూ దమయంతి కట్టిన వస్త్రంయొక్క చెరగునే తానుకూడ ధరించాడు. ఈ రీతిగా ఆ ఇద్దరు ఒకేచీర ధరించి ఒండొరుల మొగాలు చూచికొని పరితపిస్తున్నప్పుడు నలుడు దమయంతితో ఇట్లా అన్నాడు.

**క. 'ఇది దక్షిణాపథంబున, । కిదియు విదర్భాపురమున, కిది కోసల, కి**
**య్యది యుజ్జయినికిఁ దెరువులు; । మది నిన్నిటిలోన నరుగ మన కెద్ది యగున్? 70**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ బాట; దక్షిణాపథంబునకు= దక్షిణభారతభూమికి; ఇదియు= ఈ బాటేమో; విదర్భాపురమునకు= విదర్భానగరానికి; ఇది= ఈ బాట; కోసలకు= కోసలదేశానికి; ఈ+అది= ఈ బాట; ఉజ్జయినికిన్= ఉజ్జయిని పట్టణానికి; తెరువులు= మార్గాలు; మదిన్= నీ ఉద్దేశం (మనస్సు)లో; ఇన్నిటిలోనన్= ఈ దారులన్నిటిలో; మనకు+ఎద్ది= మనకు ఏది?; అరుగ+అగున్= వెళ్ళటానికి అనువైంది అవుతుంది?

**తాత్పర్యం:** 'ఇది దక్షిణాపథానికి దారి. ఇది విదర్భాపట్టణానికి పోయేబాట. ఇది కోసల దేశానికి వెళ్ళేమార్గం. ఇది ఉజ్జయినీ నగరానికి వెళ్ళేత్రోవ. ఈ తెరువులు అన్నింటిలో మనం వెళ్ళటానికి నీ ఉద్దేశంలో అనువైనది ఏది?'- అని దమయంతిని నలుడు ప్రశ్నించాడు.

**విశేషం:** దక్షిణంలో దక్షిణాపథం, ఉత్తరంలో విదర్భ, తూర్పున కోసల, పశ్చిమంలో ఉజ్జయిని పేర్కొనబడినాయి. ఈ శృంగాటకం (నాలుగుదారుల కూడలి)లో మహాభారత రచనాకాలానికే సుదూరాలకు వెళ్ళే సుప్రసిద్ధమైన దారులు భారతదేశంలో ఏర్పడి ఉన్నట్లు గ్రహించవచ్చును.

**క. అడవులలో నాతోఁ గడు । నిడుమలు వడనోప; వరుగు మిందుముఖీ! యి**
**ప్పుడు నీ బంధుజనంబుల । కడ' కనవుడుఁ దరుణి శోకగద్గద యగుచున్. 71**

**ప్రతిపదార్థం:** ఇందుముఖీ!= చంద్రుడివంటి మొగం కలదానా!; అడవులలోన్; నాతోన్= నాతో; కడు+ఇడుమలు= మిక్కిలి కష్టాలు; పడన్+ఓపవు= అనుభవించలేవు; ఇప్పుడు; నీ, బంధుజనంబుల, కడకు= నీ చుట్టాల దగ్గరికి; అరుగుము= వెళ్ళుము; అనవుడున్= అని చెప్పగా; తరుణి= యౌవనవతి అయిన దమయంతి; శోక, గద్గద+అగుచున్= దుఃఖంచేత కంపించిన కంఠస్వరం కలదై.

**తాత్పర్యం:** చంద్రబింబం వంటి ముఖం గల ఓ దమయంతీ! నాతో ఈ అడవులలో కష్టాలు పడుతూ తిరుగజాలవు. ఇపుడు మీ పుట్టినింటికి పోయి బంధుజనులతో సుఖించుము' - అని నలుడు పలుకగా, దుఃఖంచేత కంపించే కంఠస్వరం కలదై (దమయంతి).

**ఆ. అతని కిట్టు లనియె 'నవనీశ! నీవును । నేనుఁ జని విదర్భ నిష్టలీల**
**నుండుదము; మృగాకులోగ్రవనంబుల । కరుగ నేల? యిడుమ లంద నేల?' 72**

**ప్రతిపదార్థం:** అతనికి= ఆ నలుడితో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= (దమయంతి) పలికింది; అవని+ఈశ!= ఓ రాజా!; నీవును, నేనున్= నీవు మరియు నేను; చని= వెళ్ళి; విదర్భన్= విదర్భలో; ఇష్టలీలన్+ఉండుదము= ఇష్టానుసారంగా ఉందాం; మృగ+ఆకుల+ఉగ్ర, వనంబులకు= క్రూర జంతువులతో వ్యాపించి భీతిగొలిపే (భయంకరమైన) అడవులకు; అరుగన్+ఏల= వెళ్ళటమెందుకు?; ఇడుమలు+అందన్+ఏల= కష్టాలు అనుభవించట మెందుకు?

**తాత్పర్యం:** దమయంతి నలుడితో ఇట్లా చెప్పింది - 'ఓ నలమహారాజా! నీవూ, నేనూ విదర్భకు వెళ్ళి సుఖంగా ఉందాం. క్రూరమృగాలచేత భయంకరాలైన ఈ అడవులలో కష్టాలను అనుభవించటం ఎందుకు?'

**వ. అనిన విని నలుం డవనతాననుండై 'నీ చెప్పినట్ల విదర్భేశ్వరు రాజ్యంబును మన రాజ్యంబ; యేను దొల్లి యధికైశ్వర్యయుతుండనై యందులకుంబోయి బంధుజనులకు హృదయానందంబు సేసి, యిప్పు డివ్విధంబున సర్వస్వహీనుండనై యెట్లు పోవనేర్తు?' ననిన దమయంతి యిట్లనియె. 73**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని; నలుండు= నలుడు; అవనత+ఆననుండు+ఐ= వంచిన మొగం కలవాడై; నీ, చెప్పిన+అట్ల+అ= నీవు చెప్పిన రీతిగానే; విదర్భ+ఈశ్వరు= విదర్భేశ్వరుడి - అంటే విదర్భప్రభువుయొక్క; రాజ్యంబును= రాజ్యం; మనరాజ్యంబు+అ= మన రాజ్యమే; ఏను= నేను; తొల్లి= పూర్వం; అధిక+ఐశ్వర్యయుతుండను+ఐ= ఎక్కువ సంపదతో కూడినవాడినై; అందులకున్, పోయి= ఆ విదర్భకు వెళ్ళి; బంధు, జనులకున్= చుట్టాలకు; హృదయ+ఆనందంబు+చేసి= హృదయాలకు ఆనందం కల్పించి; ఇప్పుడు+ఈ+విధంబునన్= ఇప్పు డీ రీతిగా; సర్వస్వహీనుండను+ఐ= అంతయు పోగొట్టుకొన్నవాడినై; ఎట్లు= ఏ విధంగా; పోవ, నేర్తును= పోగలను; అనినన్= అని చెప్పగా; దమయంతి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** నలుడు మొగం వాల్చికొని దమయంతితో ఇట్లా చెప్పాడు. 'నీవు చెప్పినట్లు విదర్భప్రభువు రాజ్యంగూడ మనరాజ్యంగానే భావించుకొనవచ్చును. కాని, మునుపు నేను సమస్తసంపదలతో తులతూగుతూ విదర్భకు వెళ్ళి బంధువులందరికి అపరిమితానందాన్ని కలిగించినవాడినికదా! ఇప్పుడు అంతా పోగొట్టుకొని పరమ దరిద్రుడనై అక్కడికి ఎట్లా పోగలను? నాకు ఎట్లా మొగం చెల్లుతుంది?'- అని అనగా అతడితో దమయంతి ఇట్లా అన్నది.

**తే. 'అధికదుఃఖరోగార్తున కౌషధంబు । సురుచిరంబుగ భార్యయ చూవె యెందు;**
**నొనర భార్యాసమేతుఁడై యున్నవాని । కెంతలయ్యును నాపద లెఱుకపడవు. 74**

**ప్రతిపదార్థం:** అధిక, దుఃఖ, రోగ+ఆర్తునకు= తీవ్రమైన దుఃఖంఅనే, రోగంచేత పీడించబడేవాడికి; ఔషధంబు= మందు; సు, రుచిరంబుగన్= సుస్పష్టంగా (సు= మంచి; రుచిరము= వెలుగొందేది); ఎందున్= ఎచటనైనా; భార్య+అ, చూవె= పెండ్లామే సుమా!; ఒనరన్= ఒప్పేటట్లుగా; భార్యా, సమేతుఁడు+ఐ+ఉన్నవానికి= భార్యతో కలిసి ఉండేవాడికి; ఎంతలు+అయ్యునున్= ఎంతెంత తీవ్రాలైనప్పటికిని; ఆపదలు= కష్టాలు; ఎఱుక, పడవు= అనుభవిస్తున్నట్లు తెలియబడవు.

**తాత్పర్యం:** గొప్పదుఃఖ మనే రోగంతో పీడితుడైనవాడికి మంచిమందు భార్యయే సుమా! భార్యతో కూడి ఉన్నవాడికి ఎంతటి కష్టాలైనా అనుభవిస్తున్నట్లు అనిపించవు.

**క. అలసి నెడ, డస్సి నెడ, నాఁ । కలి దప్పియు నైన యెడలఁ గడుకొని ధరణీ**
**తలనాథ! పురుషునకు ని । మ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్. 75**

**ప్రతిపదార్థం:** అలసిన+ఎడన్= విసిగిఉన్న సమయంలో; డస్సిన+ఎడన్= బడలిన సమయంలో; ఆఁకలి, దప్పియున్+ఐన+ఎడలన్= తిండి తినాలని, నీరు త్రాగాలని అనిపించే సమయాలలో; కడుకొని= పూనుకొని; ధరణీ, తల, నాథ!= (భూస్థలికి భర్త అయిన వాడా) ఓ నలమహారాజా!; పురుషునకున్= మగవాడికి (భర్తకు); ఇమ్ములన్= ప్రీతితో; చిత్తమునన్= మనస్సులోని; దుఃఖంబుల్; భార్య+అ= భార్యయే; పాచున్= పోగొట్టుతుంది.

**తాత్పర్యం:** ఓ నలమహారాజా! విసిగిఉన్న సమయంలో, బడలిన సమయంలో, ఆఁకలి అయిన వేళలో, దాహం వేసినపుడు, మగవాడికి ప్రీతితో తోడ్పడి, భార్యయే అతడి మనస్సులోని దుఃఖాలను పోగొట్టుతుంది.

**వ. కావున నిది మదనుజీవిత యనియు, ననువ్రత యనియు ననుకంపనీయ యనియు, నన్ను విడువక నా యనుగమనంబున కొడంబడు' మనిన 'నట్ల చేయుదుఁ, బ్రాణసమాన వైన నిన్నేల విడుతు; నోడకుండు' మని నలుండు దనదేవి నాశ్వాసించుచు నొక్కటఁ జని విజనంబైన విపినంబున నొక్క సభం గని యందు విశ్రమించి, పరుషధూళిధూసర స్థలంబున శయనించి, మార్గశ్రమ నిమీలిత నయనుండై దుఃఖంబునఁ గన్నులు వొందకున్న లేచి, తనపాదంబుల యంతికంబున నతిక్లేశపరవశయై నిద్రవోయెడు దమయంతిం జూచి. 76**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఇది=ఈమె (దమయంతి); మత్+అను జీవిత= నాపై ఆధారపడి బ్రతికేది; అనియున్; అనువ్రత= తనను అన్నిట అనుసరించేది; అనియున్; అనుకంపనీయ+అనియున్= దయచూపతగిందనిన్నీ; నన్ను, విడువక= నన్ను విడిచిపెట్టక; నా, అనుగమనంబునకున్= నేను వెంట రావటానికి; ఒడంబడుము= సమ్మతించుము; అనినన్= అని పలుకగా; అట్లు+అ+చేయుదున్= అట్లే చేస్తాను; ప్రాణసమానవు+ఐన= ప్రాణంతో సమానమైనదానవైన; నిన్ను+ఏలన్= నిన్నెందుకు?; విడుతున్= విడిచిపెట్టుతాను; ఓడకుండుము= భయపడకుండా ఉండుము; అని= అని చెప్పి; నలుండు= నలుడు; తన, దేవిన్= తనరాణి అయిన దమయంతిని; ఆశ్వాసించుచున్= ఓదార్చుచు; ఒక్కటన్+చని= ఏకాంతంగా వెళ్ళి; వి, జనంబు+ఐన= జనులు లేని; విపినంబునన్= అడవిలో; ఒక్క, సభన్+కని= ఒక గృహాన్ని చూచి (ఒక ఎత్తైన మంటపాన్ని చూచి); అందు= ఆ ఇంటిలో (ఆ స్థలంలో); విశ్రమించి= అలసట తీర్చికొని; పరుష, ధూళి, ధూసర, స్థలంబునన్= మొరటుదుమ్ముతో బూడిదరంగుగా ఉండే నేలపై - కఠినమైన దుమ్ముకొట్టుకొని ఉన్ననేలపై; శయనించి= పండుకొని; మార్గ, శ్రమ, నిమీలిత, నయనుండు+ఐ= దారిలో నడచిన బడలికచేత మూయబడిన కన్నులు కలవాడై; దుఃఖంబునన్= పరితాపంచేత; కన్నులు+పొందకున్నన్= నిదుర (కనుకూర్కు) రాకపోగా; లేచి= మేలుకొని; తన పాదంబుల+అంతికంబునన్= తన అడుగుల దగ్గర; అతి, క్లేశ, పరవశ+ఐ= మిక్కుటమైన బాధకు లోనై; నిద్ర+పోయెడు= నిదురిస్తున్న; దమయంతిన్+చూచి= దమయంతిని చూచి.

**తాత్పర్యం:** కాబట్టి, ఈమె నాపై ఆధారపడి బ్రతికేదనీ, నన్ను అన్నిట అనుసరించేదనీ, దయ చూపతగినదనీ నన్ను విడువక నేను నీతో రావటానికి సమ్మతించుము'- అని దమయంతి నలుడిని ప్రార్థించింది. నలుడు 'అట్లాగే చేస్తాను. నీవు నాకు నా ప్రాణాలతో సమానురాలవు; నిన్నెందుకు విడిచిపెట్టుతాను? భయపడకుము'- అని దమయంతిని ఓదార్చాడు. అంత వారు అడవిలో ఏకాంతంగా పయనించి ఒక్కచోట ఒక గృహాన్ని (మంటపాన్ని) చూచారు. నిర్మానుష్యమైన ఆ అడవిలోని ఆ ఇంటిలో (ఆ స్థలంలో) మొరటుదుమ్ముతో బూడిదరంగుగా ఉన్న (కఠినమైన దుమ్ము కొట్టుకొని ఉన్న) నేలపై పడుకొన్నారు. నలుడు మార్గాయాసం తొలగించుకొనటానికై కనులు మూసికొన్నాడు. కాని, అతడికి నిదుర రాలేదు. లేచి చూచేసరికి దమయంతి అతడి పాదాలసమీపంలో, దారిలో పడిన శ్రమకు బాగా అలసిపోయి గాఢంగా నిద్రపోతున్నది. అట్టి దమయంతిని చూచి నలుడు.

**సీ. 'ధరణిరాజ్యంబుతో ధనమెల్లఁ బరులచే । నపహృతం బగుటయు, నాప్తమిత్త్ర**
**బంధుజనంబులుఁ బ్రకృతిజనంబులు । విడుచుటయును, మహావిపినభూమిఁ**
**బత్నితోఁ దన పరిభ్రమియించుటయు నప్పు । దలఁచి శోకించి, యిత్తరుణి దొల్లి**
**మృదుశయనంబున మెలఁతలు మెలపుతో । నడుగు లొత్తఁగ నిద్ర యనుభవించు**

**ఆ. కోమలాంగి యిపుడు గుఱుకొని పాంసుల । స్థలమునందు నిద్ర దగిలినదియుఁ**
**బంకజాక్షి నాకు భార్యయై యింత దుః । ఖంబు వొందె దైవఘటనఁ జేసి. 77**

**ప్రతిపదార్థం:** ధరణి, రాజ్యంబుతోన్= భూరాజ్యంతోపాటు; ధనము+ఎల్లన్= సంపద అంతయు; పరులచేన్= శత్రువులచేత; అపహృతంబు+అగుటయున్= అపహరించబడటమున్నూ; ఆప్త, మిత్ర, బంధు జనంబులున్= హితులు, చెలికాండ్రు, చుట్టాలు; ప్రకృతి జనంబులు= సాధారణ ప్రజలు; విడుచుటయును= వీడటమున్నూ; మహా, విపిన, భూమిన్= గొప్ప అడవి ప్రదేశంలో; పత్నితోన్= భార్యతో; తన, పరిభ్రమియించుటయున్= తాను తిరుగాడుతుండటమున్నూ; అప్డు= అపుడు; తలఁచి= తలపోసి; శోకించి= దుఃఖించి; ఈ+తరుణి= ఈ యౌవనవతి అయిన దమయంతి; తొల్లి=మునుపు; మృదు, శయనంబునన్= మెత్తని పరుపుపై; మెలఁతలు= చెలికత్తెలు; మెలపుతోన్= శ్రద్ధతో; అడుగులు+ఒత్తఁగన్= పాదాలు ఒత్తుతుండగా; నిద్ర+అనుభవించు= నిదురపోయే; కోమల+అంగి= సుకుమారి; ఇపుడు= ఇప్పుడు; గుఱుకొని= పూనికతో; పాంసుల, స్థలమునందు= దుమ్ముతో నిండినచోట; నిద్ర+తగిలినదియున్= నిద్రపోతున్నట్టిదియు; పంకజ+అక్షి= (బురదలో పుట్టింది పంకజం= పద్మం) పద్మంవంటి కన్నులుకలది; దైవ, ఘటనన్+చేసి= దైవంయొక్క కూర్పువలన; నాకు; భార్య+ఐ; ఇంత, దుఃఖంబు+పొందెన్= ఇంత పరితాపం పొందింది.

**తాత్పర్యం:** భూరాజ్యంతోపాటు సమస్తసంపద శత్రువులచేత అపహరించబడటమున్నూ; హితులు, బంధువులు, మిత్రులు, సాధారణ పౌరులు తనను విడనాడటమున్నూ; పెద్ద అడవిలో తాను తిరగటాన్ని నలుడు తలపోసి మిక్కిలి పరితపించాడు. 'ఈ దమయంతి తొల్లి మెత్తనైన పరుపులపై జాగరూకతతో చెలికత్తెలు పాదాలు ఒత్తుతుంటే శయనిస్తుండేది. నేడు ఈ దుమ్మునేలపై నిదురపోతున్నది. విధిపరిపాకంచేత ఇట్టి కష్టాలు ఈమె నాకు భార్య అవటంచేత పొందుతున్నది కదా!'- అని మిక్కిలి దుఃఖించాడు.

**వ. ఏను దీని దుఃఖంబుఁ జూడ నోప; నెట యేనియుం బోయెద; నిది నన్నుం గానక తన బంధువుల యొద్దకుం బోయి దుఃఖంబులం బొరయకుండు' నని విచారించి, పోవ సమకట్టి యక్కోమలి మేలుకొనకుండ మెల్లన దాని వస్త్రంబు నర్ధంబు సించి తనకుం బరిధానంబు సేసికొని వెలువడి కొండొకనేలయరిగి, దమయంతి యందు ఘనంబైన తన నెయ్యం బను తీఁగం ద్రెంపనేరక క్రమ్మఱి వచ్చి. 78**

**ప్రతిపదార్థం:** ఏను=నేను; దీని= ఈ దమయంతి; దుఃఖంబున్= దుఃఖాన్ని; చూడన్+ఓపను= చూడజాలను; ఎట+ఏనియున్= ఇంకెక్కడికైనా; పోయెదను= వెళ్ళుతాను; ఇది= ఈ దమయంతి; నన్నున్+కానక= నేను కనిపించక (నన్ను చూడక); తన, బంధువుల+ఒద్దకున్+పోయి= తన చుట్టాల దగ్గరకు పోయి; దుఃఖంబులన్= బాధలను; పొరయక+ఉండున్= పొందక ఉంటుంది; అని; విచారించి= యోచించి; పోవ, సమకట్టి= వెళ్ళటానికి ఉద్యమించి; ఆ+కోమలి= ఆ సుకుమారి అయిన దమయంతి; మేలుకొనకుండన్= నిద్రనుండి లేవకుండ; మెల్లన= మెల్లగా; దాని= ఆ దమయంతియొక్క; వస్త్రంబున్= చీరను; అర్ధంబు= సగం; చించి=త్రెంపి; తనకున్, పరిధానంబు+చేసికొని= తనకు కట్టు వస్త్రంగా చేసికొని; వెలువడి= బయటకు వెళ్ళి; కొండొక, నేల+అరిగి= కొంత ప్రదేశం వెళ్ళి (అంటే కొన్ని అడుగులు వేసి); దమయంతి+అందు; ఘనంబు+ఐన= మిక్కుటమైన; తన నెయ్యంబు+అను= తన స్నేహమనే; తీఁగన్+త్రెంపనేరక= లతను త్రుంచజాలక; క్రమ్మఱి= తిరిగి; వచ్చి= చేరి.

**తాత్పర్యం:** నేను దమయంతి పరితాపం ఓర్వలేను. కాబట్టి ఎక్కడికైనా వెళ్ళుతాను. నేను వెళ్ళిపోతే ఈమె నన్ను కానక, చేసేది లేక తన బంధువుల దగ్గరకు వెళ్ళిపోతుంది. ఆ విధంగా ఆవిడకు నాతో అడవిలో పడవలసిన బాధలు

తగ్గుతాయి'- అని నలుడు విచారించి, తాను పోవటానికి ఉద్యుక్తుడయి, ఆమె చీరలో కొంతమేర చించి తనకు కట్టు పుట్టంగా చేసికొన్నాడు. నలుడు కొన్ని అడుగులు ముందుకు నడిచాడు కాని, అతడి కాళ్ళు కదలలేదు. దమయంతిపై తనకు గల స్నేహమనే లతను త్రెంచుకోలేక తిరిగి వచ్చాడు.

**చ. కలి దమయంతిఁ బాప సమకట్టుఁ, బొరింబొరి వాయనోపఁ డా**
**లలన నుదీర్ణసౌహృదబలంబున; నిట్టులు రెంటఁ జేసి య**
**న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారి యైన యు**
**య్యెలయును బోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై. 79**

**ప్రతిపదార్థం:** కలి= కలిపురుషుడు; దమయంతిన్= దమయంతిని; పాపన్= ఎడం చేయటానికి; సమకట్టున్= పూనుకొంటాడు; ఉదీర్ణ, సౌహృద, బలంబునన్= గొప్పదైన స్నేహంయొక్క బలంతో; ఆ, లలనన్= అంగన అయిన ఆ దమయంతిని; పొరిన్+పొరి= మాటి మాటికి; పాయన్+ఓపఁడు= ఎడబాయజాలడు; ఇట్టులు= ఈ విధంగా; రెంటన్+చేసి= (అటు కలిప్రభావం, ఇటు భార్యమీది స్నేహం) రెండింటివలన; ఆ+నలుఁడు; విమోహరజ్జులన్+పెనంగి= మిక్కుటమైన వలపు అనే త్రాళ్ళతో పెనవేసికొనబడిన వాడై; గత+ఆగత కారి+ఐన= ముందుకు పోయి మరల వెనుకకు వచ్చేటట్లు చేసేదైన; ఉయ్యెలయును+పోలెన్= ఊయలవలె; ఎంతయున్+ప్రొద్దు= చాలసేపు; ఊఱడక= ఊరట చెందక, వి, నిశ్చిత+ఆత్ముఁడు+ఐ= ఒక నిర్ణయానికి రాలేని ఆత్మకలవాడై;

**తాత్పర్యం:** కలిప్రభావంవలన నలుడు దమయంతిని ఎడంచేయటానికి ఉద్యమించేవాడు; గొప్పదైన స్నేహాను బంధంవలన దమయంతిని వీడజాలక ఉండేవాడు. ఇటు అనురాగబంధం, అటు కలి ప్రభావం. ఈ రెంటివలన నలుడు, అతిశయమైన అనురాగబంధమనే త్రాళ్లు పెనవేసికొని ముందుకు వెనుకకు ఊయలవలె ఊరట చెందలేక, ఒక స్థిరనిశ్చయానికి రాలేక చాలసేపు ఊగిసలాడాడు.

**విశేషం:** అలంకారం- 'విమోహరజ్జులు' అనేచోట రూపకం. 'నలుడు--- ఉయ్యెలయును బోలె' అనేచోట ఉపమ.

**తే. 'బాల నొక్కర్తు నిక్కానపాలు సేసి । నిష్ఠురుండనై యే నెట్లు నేర్తుఁ బోవ'**
**ననక కలిచేత నాకృష్టుఁడైన నలుఁడు । విగతకరుణుఁడై దమయంతి విడిచి చనియె. 80**

**ప్రతిపదార్థం:** బాలన్= బాలప్రాయంలో ఉన్నదానిని (చిన్నదైన దమయంతిని); ఒక్కర్తున్= ఒకతెను; ఈ+కాన, పాలు+చేసి= ఈ అరణ్యంపాలుచేసి; నిష్ఠురుండను+ఐ= కఠినాత్ముడినై; ఏన్+ఎట్లు= నేను ఏరీతిగా; పోవన్+నేర్తున్= పోగలను; అనక= అని తలపోయక; కలిచేతన్= కలిపురుషుడిచేత; ఆకృష్టుఁడు+ఐన= లాగబడినవాడైన; నలుఁడు= నలమహారాజు; విగత, కరుణుఁడు+ఐ= పోయిన దయ కలవాడై; దమయంతిన్= దమయంతిని; విడిచి= వీడి; చనియెన్= వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** 'చిన్నవయస్సులో ఉన్న దమయంతిని ఈ అడవి పాలుచేసి కఠినాత్ముడినై నేను ఎట్లా పోగలను?'- అని తలపోయక, కలిపురుషుడిచేత ఆకర్షించబడినవాడై నలుడు దయలేని హృదయంతో ఆమెను విడిచి వెళ్ళిపోయాడు.

**వ. అంత దమయంతి మేలుకని పతిం గానక, తన వస్త్రార్థ నిక్కృంతనంబును జూచి లేచి, నలుగడం బరికించి, భయశోకవ్యాకులచిత్త యయి. 81**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; దమయంతి; మేలుకని= నిద్రనుండి లేచి; పతిన్+కానక= భర్త కనిపించకపోగా; తన, వస్త్ర+అర్ధ, నికృంతనంబును+చూచి= తన చీరలో సగభాగం చించబడి ఉండటాన్ని చూచి; నలుగడన్+పరికించి= నాలుగువైపుల చూచి; భయ, శోక, వ్యాకుల, చిత్త+అయి= భయంతో, దుఃఖంతో కలతచెందిన మనస్సు కలదయి.

**తాత్పర్యం:** అటు పిమ్మట దమయంతి నిద్రనుండి మేల్కొన్నది. కాని, భర్త అచట కనిపించలేదు. తన చీర సగం చించబడి ఉండింది. ఆమె నాలుగువైపుల తేరిపార చూచింది. భయంతో, దుఃఖంతో కలత చెందినదయి- (తర్వాతి పద్యంతో అన్వయం).

**సీ. 'హా! మహారాజ! మహామహీ రక్షణ । దక్ష దక్షిణబాహుదండ! దండి**
**తారాతి! నిషధరాజాగ్రణి! న న్నిట్లు । వీతదయుండవై విడిచి చనఁగఁ**
**దగునె? నీ వెన్నఁడు ధర్మువు దప్పని । వాఁడవు, సూనృతవ్రతరతుండ;**
**వోడకు మని నన్ను నూఱడఁ బలికిన । పలు కిట్లు మఱవంగఁ బాడి యగునె?**

**ఆ. పొదలలోన డాఁగి పొడసూప కిట్లేల । యున్నవాఁడ? విట్టి యుగ్రభావ**
**మేల నీకు వలసె? నెట వోదు? నిం కెట్లు । గాంతు నిన్ను నుగ్రకాననమున? 82**

**ప్రతిపదార్థం:** హా!= అయ్యో!; మహారాజ= గొప్పరాజా!; మహా, మహీ, రక్షణ, దక్ష, దక్షిణ, బాహుదండ= సువిశాలమైన భూమిని సంరక్షించటానికి సమర్థమైన కుడిభుజం (దండం వంటి కుడిచేయి) కలవాడా!; దండిత+అరాతి!= శిక్షించబడిన శత్రువులు కలవాడా!; నిషధ, రాజ+అగ్రణి!= నిషధదేశాన్ని ఏలే రాజులలో శ్రేష్ఠుడా!; నన్ను+ఇట్లు= నన్ను ఈ రీతిగా; వీతదయుండవు+ఐ= పోయిన దయ కలవాడివై; విడిచి, చనఁగన్+తగునె?= విడిచి వెళ్ళటం తగునా?; నీవు+ఎన్నఁడు= నీవు ఎల్లప్పుడు; ధర్మువు= ధర్మం; తప్పనివాఁడవు= మీరనివాడివి; సూనృత, వ్రత రతుండవు= సత్యమనే వ్రతాన్ని పాటించటంలో ఇష్టం కలవాడివి; ఓడకుము+అని= భయపడకుమనిచెప్పి; నన్నున్; ఊఱడన్+పలికిన, పలుకు= ఓదార్చినట్టి మాటలు; ఇట్లు= ఈ రీతిగా; మఱవంగన్+పాడి+అగునె?= మరచిపోవటం న్యాయమవునా?; పొదలలోనన్= చెట్ల గుబురులలోన; డాఁగి= కనిపించకుండ ఉండి; పొడ+చూపక= అగుపించక; ఇట్లు= ఈ విధంగా; ఏల= ఎందుకు; ఉన్నవాఁడవు= ఉన్నావు; ఇట్టి= ఈ విధమైన; ఉగ్రభావము= కఠినత్వం; ఏల?= ఎందుకు?; నీకు, వలసెన్= నీవు పూనవలసివచ్చింది; ఎట+పోదున్?= ఎక్కడికి పోగలను?; నిన్ను; ఉగ్ర, కాననమునన్= భయంకరమైన అడవిలో; ఇంక+ఎట్లు= ఇంక ఏవిధంగా; కాంతున్= చూడగలను?

**తాత్పర్యం:** 'ఓ నలమహారాజా! సువిశాలమైన భూమండలాన్ని సంరక్షించటానికి సామర్థ్యం గల దక్షిణబాహువు గలవాడా! శత్రువులను ఓడించినవాడా! ఓ నిషధదేశ ప్రభూ! దయలేకుండ న న్నిట్లా వదలిపెట్టి వెళ్ళటం నీకు తగునా? నీవు ఎన్నడు ధర్మం తప్పనివాడివి. సత్యసంధుడివి. భయపడకు మని నన్ను ఓదారుస్తూ చెప్పినమాటలు నీవు మరవటం న్యాయమా? పొదలలో దాగి ఉన్నావా? ఎందుకు నాకు కనిపించవు. ఎందుకు నీ కీ కఠినత్వం? నే నెచటికి పోగలను? ఈ భయంకరమైన అడవిలో నిన్ను ఇంక నేను ఎట్లా చూడగలను?

**విశేషం:** దమయంతి ఆక్రందనం హృదయవిదారకం. వేల్పులను కాదని నలుడిని వలచి స్వయంవరంలో ఆతడిని వివాహమాడిన దమయంతి కారడవిలో చేసిన దీనాలాపం విశ్వసాహితీజగత్తులో నిరుపమానమైనది. అరణ్యరోదనానికి ఇంతకంటె చక్కని ఉదాహరణం ఇంకేముంది?

క. **వగవఁగ సాంగోపాంగము । లగు నాలుగు వేదములయు నధ్యయనము పా**
**ల్పుగ నొక సత్యముతో నెన । యగునే? యెవ్వియును బోల వటె సత్యంబున్. 83**

**ప్రతిపదార్థం:** వగవఁగన్= ఆలోచించగా; స+అంగ+ఉప+అంగములు+అగు= అంగాలతో, ఉపాంగాలతో కూడినవైన; నాలుగు, వేదములయు; అధ్యయనము= పఠనం, అనుశీలనం; పొల్పుగన్= ఒప్పేటట్లుగా; ఒక సత్యముతోన్; ఎన+అగునే= సాటి అవుతుందా?; సత్యంబున్= సత్యమును; ఎవ్వియును= ఏవైననుకూడా; పోలవు+అటె= పోలవుకదా!

**తాత్పర్యం:** యోచనచేసి చూస్తే నాలుగువేదాలు, వేదాంగాలు, వేదోపాంగాలు చదివినప్పటికిన్నీ ఆ వైదిక వాఙ్మయ పరిజ్ఞానం అంతయూ ఒక్క సత్యంతో సరితూగదని పెద్దలు చెప్పుతారు. సత్యానికి ఏవియు సరిపోలవు.

**విశేషం:** నాలుగువేదాలు:- 1. ఋగ్వేదం 2. యజుర్వేదం 3. సామవేదం 4. అథర్వవేదం. వేదాంగాలు (షడంగాలు):- 1. శిక్ష 2. వ్యాకరణం 3. ఛందస్సు 4. నిరుక్తం 5. జ్యోతిషం 6. కల్పం. ఉపాంగాలు:- 1. మీమాంస 2. న్యాయశాస్త్రం 3. పురాణం 4. ధర్మశాస్త్రం. ఉపవేదాలు:- ఋగ్వేదానికి ఆయుర్వేదం, యజుర్వేదానికి ధనుర్వేదం, సామవేదానికి గాంధర్వవేదం, అథర్వవేదానికి స్థాపత్య శస్త్రవేదాలు ఉపవేదాలు. ఇది రుచిరార్థసూక్తి.

వ. **ప్రాణ సమానవయిన ని న్నవశ్యంబును విడువనని పలికితి; సత్యప్రతిపాలనంబు సేయు' మని ప్రలాపించుచుం దన యేకాకిత్వంబునకు నబలాభావంబునకుఁ బ్రతిపదన్యాస జాయమాన కంటక మృగ పన్నగభయంబునకు వగవక, నిజనాథు నసహాయత్వంబునకు దుస్సహక్షుత్పిపాసాశ్రమాకులత్వంబునకు వగచుచు. 84**

**ప్రతిపదార్థం:** ప్రాణ, సమానవు+అయిన= ప్రాణాలతో సమానురాలవైన; నిన్ను; అవశ్యంబును= ఎన్నడును; విడువను+అని= విడిచిపెట్టనని; పలికితి= అన్నావు; సత్య, ప్రతిపాలనంబు+చేయుము= ఆడినమాటను తప్పకుండ ఆచరించుము; అని= అంటూ; ప్రలాపించుచున్= గట్టిగా మొరపెట్టుతూ; తన+ఏకాకిత్వంబునకున్= తనయొక్క ఒంటరితనానికి; అబలా, భావంబునకున్= బలంలేని ఆడుతనానికి; ప్రతిపద, న్యాస, జాయమాన, కంటక, మృగ, పన్నగ, భయంబునకున్= ప్రతి అడుగు మోపినప్పుడు పుట్టే- ముండ్లు, క్రూరమృగాలు, పాములవలన కలిగే భయానికి; వగవక= దుఃఖించకుండా; నిజనాథు= తనభర్తయొక్క; అసహాయత్వంబునకున్= తోడులేని స్థితికి; దుస్సహ, క్షుత్, పిపాసా, శ్రమ+ఆకులత్వంబునకున్= భరించరాని ఆకలి, దప్పిక, అలసటవలన కలిగే క్షోభకు; వగచుచు= విచారిస్తూ.

**తాత్పర్యం:** ఓ నలమహారాజా! 'ప్రాణసమానవైన నిన్ను, ఎన్నడును విడువ'నని నాతో చెప్పావుకదా! నీవు ఆడినమాట నిలుపుకో'- అని దమయంతి బిగ్గరగా మొరపెట్టుకొంటూ అడవిలో తిరిగింది. ఆమె తన ఒంటరితనానికి, అబలగా తన బలహీనతకు, అడుగులు మోపితే ముండ్లవలన, క్రూర జంతువులవలన, పాములవలన దాపురించే భయానికి చింతించలేదు కాని, తన ప్రాణనాథుడైన నలుడికి ఎటువంటి తోడులేనందుకు, భరించరాని ఆకలిదప్పులు శ్రమ మూలంగా ఆయనకు కలిగే వేదనకు దుఃఖించింది.

క. **అలయుచుఁ, బులుఁగుల యెలుఁగుల । కులుకుచు, నుగ్రాతపమున కోపక వృక్షం**
**బులనీడల నిలుచుచు, నెలుఁ । గులఁ బులులం జూచి భయముగొని వగ వగచున్. 85**

**ప్రతిపదార్థం:** అలయుచున్= బడలిపోతూ; పులుగుల+ఎలుఁగులకు+ఉలుకుచున్= పక్షుల అరుపులకు భయపడుతూ; ఉగ్ర+ఆతపమునకు+ఓపక= తీక్ష్ణమైన ఎండకు తాళజాలక; వృక్షంబుల, నీడలన్= చెట్లనీడలలో; నిలుచుచున్= నిలబడుతూ;

ఎలుఁగులన్= ఎలుగుబంట్లను; పులులన్= పెద్దపులులను; చూచి= చూచి; భయము+కొని= భయపడి; వగన్= బాధతో; వగచున్= పరితపిస్తున్నది.

**తాత్పర్యం:** ఆ అడవిలో దమయంతి అలసట చెందుతున్నది. పక్షుల అరుపులకు భయపడుతున్నది. తీవ్రమైన ఎండ వేడిమిని భరించజాలక చెట్ల నీడలలో నిలుస్తున్నది. ఎలుగుబంట్లను, పెద్దపులులను చూచి భయపడి పరిపరి విధాల పరితపిస్తున్నది.

**క. ఏచిన పొదలఁ బొరల్పడఁ । ద్రోచుచు, ముండ్లకును నల్లఁ దొలఁగుచు, దిక్కుల్**
**సూచుచుఁ, దొడరుచుఁ ద్రెళ్ళుచు । లేచుచు లలితాంగి సంచలించుచు నరిగెన్. 86**

**ప్రతిపదార్థం:** ఏచిన= ఏపుగా ఎదిగిన; పొదలన్= గుబురుచెట్లను; పొరల్పడన్+త్రోచుచు= వెనుకకు పడేటట్లు త్రోస్తూ; ముండ్లకున్= కంటకాలకు; అల్లన్= మెల్లగా; తొలఁగుచున్= తప్పుకొని నడుస్తూ; దిక్కుల్+చూచుచున్= దిక్కులు చూస్తూ (అంటే దారి తెలియక తిరుగాడుతూ); తొడరుచున్+త్రెళ్ళుచున్= తొట్రుపడుతూ, క్రిందపడుతూ; లేచుచున్= లేచినిలబడుతూ; లలిత+అంగి= సుకుమారమైన దేహంగల దమయంతి; సంచలించుచున్= కంపిస్తూ; అరిగెన్= నడిచింది.

**తాత్పర్యం:** దట్టంగా ఎదిగిన పొదలను ప్రక్కకు నెట్టుతూ, ముండ్లకు మెల్లగా దూరంగా తొలగి నడుస్తూ, దిక్కులు చూస్తూ, తొట్రుపడుతూ, క్రిందపడుతూ, లేస్తూ సుకుమారి అయిన దమయంతి వణుకుతూ అడవిలో తిరుగాడుతున్నది.

**వ. ఇ ట్లరుగుచున్న దమయంతి నంతిక న్యస్త చరణయైన దాని నాహారార్థియయి యొక్క యజగరంబు పట్టికొనిన నక్కోమలి మెదల నేరక. 87**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; అరుగుచున్న= నడుస్తున్న; దమయంతిన్= దమయంతిని; అంతిక, న్యస్త, చరణ+ఐన దానిన్= సమీపంలో ఉంచబడిన పాదం కలదానిని; ఆహార+అర్థి+అయి= తిండిని కోరినదై; ఒక్క, అజగరంబు= ఒక కొండచిలువ; పట్టికొనినన్; ఆ+కోమలి= ఆ సుకుమారి అయిన దమయంతి; మెదలనేరక= కొంచెమైనా కదలజాలక.

**తాత్పర్యం:** ఈ విధంగా నడుస్తూ సమీపించిన దయమంతిని ఆకలిగొన్న ఒక కొండచిలువ పట్టుకోగా, దమయంతి కదలలేకపోయింది.

**ఆ. 'ఇంక నైన నన్ను నేల యాలింపవు? నాకు శరణ మగుము నాథ!' యనుచు**
**నఱచుచున్న దాని యాక్రందనధ్వని । వినుచు నొక్క యెఱుకు వేగ వచ్చి. 88**

**ప్రతిపదార్థం:** ఇంకన్+ఐన= ఇకనైనను; (అంటే ఇంతవరకు నన్ను వదలిపెట్టినప్పటికిని ఆపదలో చిక్కుకొన్నప్పుడైనా); నన్నున్+ఏల+ఆలింపవు= నా మొర ఎందుకు వినిపించుకోవు; నాకు+శరణము+అగుము= నాకు సంరక్షణ చేకూర్చేవాడివి కమ్ము; నాథ!= (నా) భర్త అయిన ఓ నలమహారాజా!; అనుచున్= అని మొరపెట్టుతూ; అఱచుచున్నదాని= కేకలు పెట్టుతున్నదానియొక్క; ఆక్రందన ధ్వని= ఏడుపు సవ్వడి; వినుచున్= ఆలకిస్తూ; ఒక్క+ఎఱుకు= ఒక కిరాతుడు; వేగ= శీఘ్రంగా; వచ్చి= అరుదెంచి.

**తాత్పర్యం:** 'భర్త వయిన ఓ నలమహారాజా! ఇంతదాక నన్ను ఉపేక్షించావు కాని, ఇప్పుడు ఈ ఆపదలో చిక్కిన మీదటనైన నన్ను సంరక్షించేవాడివి కమ్ము' అని మొఱపెట్టుతున్న దమయంతి ఏడుపుకేకలు విని, ఒక కిరాతుడు వేగంగా వచ్చి.

**వ.** **తన పట్టిన సురియ నప్పెనుఁబాము వదనంబుద్రయ్యం దఱిగిన రాహుముఖవిముక్తయైన చంద్రరేఖయుంబోలె నజగరముఖంబువలన వెలువడిన యా దమయంతి నాశ్వాసించి, తత్సమీప సరోవరస్నాతను వన్యస్వాదు ఫలాహారనుంగాఁ జేసి విగతశ్రమం గావించి, 'నీ వెవ్వరిదాన విట్లేల యేకతంబ యివ్వనంబునకు వచ్చి?' తని యడిగి మధురభాషిణి యైన యమ్మగువవలన నంతవృత్తాంతంబు నెఱింగి.89**

**ప్రతిపదార్థం:** తన, పట్టిన= తాను పట్టుకొన్న; సురియన్= చురకత్తితో; ఆ+పెనున్+పాము= ఆ పెద్దపాముయొక్క; వదనంబు= ముఖం; ద్రయ్యన్+తఱిగినన్= ముక్కలుగా చీల్చగా; రాహు, ముఖ, విముక్త+ఐన= రాహువుమొగంనుండి విడివడి బయటపడిన; చంద్రరేఖయున్+పోలెన్= చంద్రవంకవలె; అజగర, ముఖంబువలనన్= కొండచిలువ ముఖంనుండి; వెలువడిన= బయటకు వచ్చిన; ఆ దమయంతిన్= ఆ దమయంతిని; ఆశ్వాసించి= ఊరడించి; తద్+సమీప, సరోవర, స్నాతను= అచోటికి సమీపంలో ఉన్న సరస్సులో స్నానం చేసిన దానిని; (దమయంతిని); వన్య, స్వాదు, ఫల+ఆహారనున్+కాన్+చేసి= అడవిలో లభించే రుచిగల పండ్లు ఆహారంగా స్వీకరించిన దానినిగా చేసి; విగతశ్రమన్+కావించి= పోయిన అలసట కలదానినిగా చేసి; నీవు; ఎవ్వరిదానవు= నీవు ఎవరికి సంబంధించినదానివి; ఇట్లు+ఏల= ఈ విధంగా ఎందుకు?; ఏకతంబు+అ= ఒంటరిగా; ఈ+వనంబునకున్= ఈ అడవికి; వచ్చితి= వచ్చావు; అని+అడిగి= అని ప్రశ్నించి; మధుర, భాషిణి+ఐన= తియ్యని (ఇంపైన) మంచిమాటలు మాటాడేటటువంటి; ఆ+మగువవలనన్= ఆ అంగనవలన; అంత, వృత్తాంతంబున్= సమస్త సమాచారం; ఎఱింగి= తెలిసికొని.

**తాత్పర్యం:** తాను పట్టిన చురకత్తితో ఆ కిరాతుడు ఆ కొండచిలువముఖాన్ని ముక్కలుగా తరిగాడు. అంత రాహు ముఖంనుండి వెలువడిన చంద్రరేఖవలె, ఆ పెనుబాముముఖంనుండి దమయంతి బయటపడింది. ఆ కిరాతుడు ఆమెను ఓదార్చి, దగ్గర ఉండే కొలనులో ఆమె స్నానంచేసి బడలిక తీర్చుకొన్న పిదప, ఆమెను ఆ అడవిలో దొరికే మంచి పండ్లు ఆరగింపజేసి 'నీవు ఎవరిదానవు? నీ విట్లా ఎందుకు ఒంటరిగా ఈ అడవికి వచ్చావు?' అని అడిగి, తియ్యగా మాటలు మాట్లాడే ఆమెచేత సమాచారమంతా తెలిసికొని.

**కవిరాజ విరాజితము.**

**రజనికరాననఁ బీనపయోధర । రాజితరాజసుతన్ విలస**
**ద్గజపతిగామినిఁ జందనగంధిఁ బ్ర । కాశితకాంతిసమన్వితఁ బం**
**కజదళలోచనఁ జూచి కిరాతుఁడు । కామనిశాతశరాహతుఁడై**
**నిజహృదయం బెఱిఁగించె లతాంగి క । నింద్యచరిత్రకు వేడుకతోన్. 90**

**ప్రతిపదార్థం:** రజనికర+ఆననన్= చంద్రుడి వంటి ముఖం గల దానిని (రజనికరుడు= రాత్రిని చేసేవాడు చంద్రుడు); పీన, పయోధరన్= బలిసినపాలిండ్లు కలదానిని; రాజిత, రాజసుతన్= ప్రకాశించే రాజకుమారిని; విలసత్+గజపతి, గామినిన్= గజరాజునడకవలె విలసిల్లే మెల్లని నడక గలదానిని; చందనగంధిన్= చందన పరిమళం వెదజల్లే దేహం గలదానిని; ప్రకాశిత, కాంతి, సమన్వితన్= దేదీప్యమానమైన వర్చస్సు కలదానిని; పంకజ, దళ, లోచనన్= పద్మపత్రాలవంటి కన్నులు కలదానిని;

చూచి= చూచి; కిరాతుఁడు; కామ, నిశాత, శర+ఆహతుఁడు+ఐ= మన్మథుడియొక్క వాడిబాణాలచేత కొట్టబడినవాడై; లతా+అంగికి= తీగవలె సుకుమారమైన మేను గలదానికి; అనింద్య చరిత్రకు= నిందించదగిన శీలంగల దమయంతికి; వేడుకతోన్= సంబరంతో; నిజ, హృదయంబు= తన హృదయాన్ని, అంటే వలపును; ఎఱిఁగించెన్= తెలిపాడు.

**తాత్పర్యం:** చంద్రబింబంవంటి మొగం కలది, పెద్దవైన స్తనాలు కలది, లావణ్యవతి అయిన రాజకుమారి, సుందర గజరాజగమన, చందన పరిమళం వెదజల్లే మేనితావి కలది, దేదీప్యమానమైన వర్చస్సు కలది, పద్మదళాల వంటి విశాలమైన కన్నులు కలది అయిన దమయంతిని చూచి, ఆ కిరాతుడు పదునైన మన్మథబాణాలచేత కొట్టబడిన వాడయ్యాడు (కామభావప్రేరితుడయ్యాడు). వెంటనే, అతడు మచ్చలేని చరిత్రగల ఆ లతాంగికి తన మనస్సులోని కోర్కెను వేడుకతో వెల్లడించాడు.

**విశేషం:** ఈ వృత్తంలోని ప్రతిపాదంలోనూ న,జ,జ,జ,జ,జ,జ,లగ అనే గణాలు వరుసగా ఉంటాయి. 8, 14, 20 అక్షరాలతో యతిమైత్రి.

**ఆ. అగ్నిశిఖయుఁ బోలె నంటను డాయను । జూడ రానియట్టి శుభచరిత్ర**
**నెఱుక లేని కఱకుటెఱు కపేక్షించెఁ గా । దనక తనకు నాయు వల్పమైన. 91**

**ప్రతిపదార్థం:** అగ్ని, శిఖయున్+పోలెన్= అగ్నిజ్వాలవలె; అంటను= ముట్టుకొనటానికి; డాయను= సమీపించటానికి; చూడ, రానియట్టి= చూడటానికి వీలులేనట్టి; శుభచరిత్రన్= మంచి ప్రవర్తన కల దమయంతిని; ఎఱుక లేని= జ్ఞానంలేని; కఱకు+ఎఱుక= మొరటుమానిసి అయిన కిరాతుడు; కాదు+అనక= అది తనకు తగదని ఎంచక; తనకు; ఆయువు= ఆయుస్సు; అల్పము+ఐన= తక్కువ అవటంచేత; అపేక్షించెన్= కామించి కోరుకొన్నాడు.

**తాత్పర్యం:** దమయంతి పరమ పవిత్రచరిత్ర. అగ్నిజ్వాల వంటిది. ముట్టుకొనటానికి గాని, సమీపించటానికిగాని వీలు కానట్టిది. తేరిపార చూడ వీలులేనిది. అటువంటి అనింద్యచరిత్రను ఆ మొరటు కిరాతుడు తగదని తలచక- తనకు ఆయుర్దాయం తక్కువ కావటంచేత- కామించి కోరుకొన్నాడు.

### దమయంతి శాపంబునం గిరాతుండు చచ్చుట. (సం. 3-61-34)

**వ. దమయంతి వాని నలిగి చూచి 'యేను పతివత్ర నైతినేని యిద్దురాత్ముండైన కిరాతుం డిప్పుడ మృతుం డయ్యెడు' మని శాపం బిచ్చిన, వాఁ డప్పుడ యగ్నిదగ్ధం బైన వృక్షంబునుంబోలె విగతజీవుండై పడియె; నట్లు పరమపతివ్రతాగుణప్రభావంబున. 92**

**ప్రతిపదార్థం:** దమయంతి; వానిన్+అలిగి, చూచి= ఆ కిరాతుడిని కోపించి చూచి; ఏను= నేను; పతివ్రతను+ఐతిన్+ఏని= నేనే కనుక పతివ్రతను అయితే; (పతివ్రత= భర్తపట్ల అనన్య అనురాగం గలిగి ఆరాధించే భార్య); ఈ, దురాత్ముండు+ఐన= ఈ దుష్టుడైన; కిరాతుండు= ఎఱుకు; ఇప్పుడు+అ= ఇప్పుడే; మృతుండు+అయ్యెడున్+అని= మరణిస్తాడుగాక అని; శాపంబు+ఇచ్చినన్= శాపాన్ని ఇవ్వగా; (శాపమంటే జరిగితీరే తిట్టు); వాఁడు= ఆ కిరాతుడు; అప్పుడు+అ= అప్పుడే; అగ్నిదగ్ధంబు+ఐన= నిప్పుచేత మండిపోయిన; వృక్షంబునున్+పోలెన్= చెట్టువలె; విగతజీవుండు+ఐ= పోయిన ప్రాణం కలవాడై; పడియెన్= నేలపై పడ్డాడు; అట్లు= ఆ విధంగా; పరమ, పతివ్రతా, గుణ, ప్రభావంబునన్= గొప్ప పతివ్రతయొక్క గుణమహిమచేత.

**తాత్పర్యం:** దమయంతి ఆ కిరాతుడిపై కోపించి చూచి 'నేను పతివ్రతనే అయితే దుష్టుడైన ఈ కిరాతుడు ఇప్పుడే ఇచట చనిపోవునుగాక' - అని శపించింది. అంత కిరాతుడు నిప్పుచేత దహించబడిన చెట్టువలె నేలపై కూలి మరణించాడు. అంత తన పాతివ్రత్యమాహాత్మ్యంతో.

**విశేషం:** ప్రాచీన భారతీయ వాఙ్మయంలో పాతివ్రత్యం మిక్కిలి మహిమ కలిగినట్టిదిగా వర్ణించబడింది. భర్తపట్ల త్రికరణశుద్ధితోడి ప్రేమ కల భార్య పతివ్రత.

**క. బాల హృదయమున నృపశా । ర్దూలు నిజాధీశు నిలిపి దుష్టోరగ శా**
**ర్దూ లాభీల మృగావలి । కోలిన భయ మంద కరిగె నుగ్రాటవిలోన్. 93**

**ప్రతిపదార్థం:** బాల= చిన్నదయిన దమయంతి; హృదయమునన్= తన మనస్సులో; నృపశార్దూలున్= రాజులలో పెద్దపులి వలె శ్రేష్ఠుడైన; నిజ+అధీశున్= తన భర్త అయిన నలమహారాజును; నిలిపి= నెలకొలిపి; దుష్ట+ఉరగ, శార్దూల+ఆభీల, మృగ+ఆవలికిన్= క్రూరాలైన పాముల, పెద్దపులుల, భయంకరమైన మృగాల సముదాయానికి; భయము+అందక= భయపడక; ఉగ్ర+అటవిలోన్= భయంకరమైన అడవిలో; ఓలిన= వరుసగా; అరిగెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** దమయంతి తన హృదయంలో రాజులలో శ్రేష్ఠుడైన తన భర్త నలమహారాజును ధ్యానిస్తూ, పతివ్రతామాహాత్మ్యంవలన భయంకరారణ్యంలోని క్రూరసర్పాలకు, పెద్దపులులకు, క్రూరమృగాలకు భీతిచెందక వరుసగా పయనం సాగించింది.

**వ. మఱియును. 94**

**తాత్పర్యం:** ఇంకా,

**సీ. 'సహకార! మత్ప్రియసహకారుఁ, బున్నాగ! । పున్నాగుఁ, దిలక! భూభువనతిలకుఁ,**
**జందన! బుధహరిచందనుఁ బుష్పితా । శోక! సుహృజ్జనశోకదమను,**
**వకుళ! కులైకదీపకు, విభీతక! భయో । పేతార్తిహరు నలుఁ బ్రీతితోడఁ**
**గానరే కానలలోన లోకోత్తరు?' నని మ్రాని మ్రానికి నరిగి యరిగి**

**ఆ. యడుగు, నడుగు లెండఁ బొడ వొడఁ బొక్కిన । నిర్ఝ రాంతరముల నిలుచుఁ బిలుచు,**
**గిరుల దరుల యెడల నురుగుహాగృహములఁ । దొంగి తొంగి చూచుఁ దోయజాక్షి. 95**

**ప్రతిపదార్థం:** సహకార!= ఓ సహకార వృక్షమా! (సహకారం= తియ్యమామిడి); మత్+ప్రియ, సహకారున్= నాకు ప్రీతి కలిగించే సాయంచేసే వాడిని; పున్నాగ!= ఓ పున్నాగవృక్షమా! (సురపొన్న చెట్టు); పున్నాగున్= పురుష శ్రేష్ఠుడిని; తిలక!= ఓ తిలకవృక్షమా! (తిలకం= బొట్టుగుచెట్టు); భూ, భువన, తిలకున్= భూలోకంలోని మనుజులలో శ్రేష్ఠుడిని (తిలకం శ్రేష్ఠవాచకం); చందన!= ఓ చందనవృక్షమా!; బుధ, హరిచందనున్= బుద్ధిమంతులకు హరిచందనం వంటివాడిని (హరిచందనం కల్పవృక్షాలలో ఒకటి- అంటే పండితులకు కోరిన కోరికలు ఈడేర్చేవాడిని); పుష్పిత+అశోక!= పుష్పించిన అశోకవృక్షమా!; సుహృద్+జన, శోక, దమనున్= మిత్రుల దుఃఖాన్ని హరింపచేసేవాడిని (మిత్రులకు అశోకుడిని); వకుళ!= ఓ వకుళవృక్షమా! (వకుళం= పొగడ చెట్టు); కుల+ఏక, దీపకున్= వంశమంతటికి ముఖ్యమైన జ్యోతివంటివాడిని; విభీతక!= ఓ విభీతకవృక్షమా! (విభీతకం= తాండ్ర

చెట్టు); భయ+ఉపేత+ఆర్తిహరున్= భయంతో కూడిన వారియొక్క ఆరాటాన్ని తొలగించేవాడిని; లోక+ఉత్తరున్= లోకమంతటిలో శ్రేష్ఠుడిని; నలున్= నలమహారాజును; ప్రీతితోడన్= ప్రేమతోడ; కానలలోనన్= అడవులలో; కానరే= చూడరే; అని= అని విలపిస్తూ; తోయజ+అక్షి= పద్మాలవంటి కన్నులుగల దమయంతి; మ్రాని మ్రానికిన్= చెట్టు చెట్టుకు; అరిగి+అరిగి= వెళ్ళి, వెళ్ళి; అడుగున్= అడుగుతున్నది; అడుగులు= పాదాలు; ఎండన్= ఎండలో; పొడ+పొడన్+పొక్కిన= పొరలు రాలేటట్లు బొబ్బలెక్కగా; నిర్ఝర+అంతరములన్= సెలయేళ్ళ మధ్య; నిలుచున్= నిలబడుతుంది; పిలుచున్= పిలుస్తుంది; గిరుల, దరుల+ఎడలన్= కొండగట్టుల చేరువలో; ఉరు= పెద్ద; గుహా, గృహములన్= గుహల ఉనికిపట్టులలో; తొంగి, తొంగి, చూచున్= మాటిమాటికి లోపలికి దృష్టిని సారిస్తుంది.

**తాత్పర్యం:** ఈ పద్యంలో దమయంతి ఆర్తితో నలునికై వెదకటం వర్ణించబడింది. తోయజాక్షి అయిన దమయంతి కారడవిలో నలుడిని వెదికింది. చెట్టు చెట్టును అడిగింది. 'ఓ సహకారవృక్షమా! నాకు ప్రీతిని చేకూర్చి నాతో సహకరించే నాభర్త నలమహారాజును చూచావా? ఓ పున్నాగవృక్షమా! పురుషులలో పున్నాగుడైన నలుడిని చూచావా? ఓ తిలకవృక్షమా! భూలోకంలో తిలకుడైన (శ్రేష్ఠుడైన) నలుడిని చూచావా? ఓ చందనవృక్షమా! బుధులలో హరిచందన ప్రాయుడైన నలుడిని చూచావా? పూచిన అశోకవృక్షమా! ఉత్తములగు మిత్రుల శోకాన్ని నివారించే నల చక్రవర్తిని చూచావా? ఓ వకుళవృక్షమా! కులదీపకుడైన నలమహారాజును చూచావా? ఓ విభీతకవృక్షమా! (విభీతకమనగా తాండ్రచెట్టు. ఇది భయమును పుట్టించుటచే దీనికీపేరువచ్చింది) భయోపేతులకు విభీతకుడైన (భయాన్నిపోగొట్టే) నలుడిని చూచావా? నలుడు లోకోత్తరుడు. నలుడిని చూడలేదా?' అని ఆమె ఎండలో అడవిలో అడుగులు బొబ్బలెక్కేటట్లు తిరుగుతూ చెట్టు చెట్టునూ పలకరిస్తూ తిరిగింది. వేడినేలపై నడువలేక సెలయేళ్ళలో నిలబడి పిలిచింది. కొండ చరియల దాపుల్లో వెదకింది. కొండ గుహలలో తొంగితొంగి చూచింది.

**విశేషం:** ఈ పద్యంలో శ్లేషానుప్రాణితమైన అనుప్రాసం ఉన్నది. సహకారం అంటే తియ్యమామిడి చెట్టు, తోడ్పాటు అని అర్థాలు. అట్లే తక్కిన చెట్లపేర్లకు రెండర్థాలు ఉన్నాయి. అర్థాంతర స్ఫూర్తి శ్లేష, ఏకశబ్ద పునరావృత్తి అనుప్రాసం. దమయంతి దృష్టికి ఆ అడవి అంతయు నలుడి గుణశీల లక్షణమయంగా కనిపించింది. సహకార వృక్షంలో నలుడి సహకారత్వం, పున్నాగ వృక్షంలో నలుడి పున్నాగత్వం, చందనవృక్షంలో హరిచందనత్వం, అశోకవృక్షంలో నలుడి అశోకత్వం, వకుళంలో నలుడి కులదీపకత్వం, విభీతకంలో నలుడి ధైర్యాన్ని, విభీతకత్వాన్ని దమయంతి దర్శించింది. దమయంతికి ఆ అడవి నలుడి విశ్వరూప ప్రదర్శనం అనిపించింది. నలుడిపై ఆమె వలపు అటువంటిది.

**వ. ఇట్లు దమయంతి నిజనాథు నన్వేషించుచు భీషణారణ్యంబునం ద్రిమ్మరునది ముందట. 96**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; దమయంతి; నిజ, నాథున్= తన భర్తను; అన్వేషించుచున్= వెదకుతూ; భీషణ+అరణ్యంబునన్= భయంకరమైన అడవిలో; త్రిమ్మరునది= దిక్కుతోచక తిరుగుతున్నట్టిది; ముందట= ఎదురుగా.

**తాత్పర్యం:** ఈ విధంగా దమయంతి తన భర్తకొరకు వెదకుతూ భయంకరమైన అడవిలో దిక్కుతోచక తిరుగుతూ తన ఎదుట (తర్వాతి పద్యంతో అన్వయం).

**మత్తకోకిలము.**

**వారిభక్షులు పర్ణభక్షులు వాయుభక్షులు శాకనీ**
**వారభక్షులు వృక్షమూల నివాసయుక్తులునై తపం**

**బారఁజేయు మహామునీంద్రుల యాశ్రమం బెడఁ గాంచె నం**
**భోరుహాక్షి పురాసమార్జితపుణ్యకర్మఫలంబునన్. 97**

**ప్రతిపదార్థం:** వారి, భక్షులు= నీటిని ఆహారంగా స్వీకరించి బ్రతికేవారు; పర్ణ, భక్షులు= ఆకులు ఆహారంగా తిని బ్రతికేవారు; వాయు, భక్షులు= గాలిని ఆహారంగా తీసికొని బ్రతికేవారు; శాక, నీవార, భక్షులు= ఆకుకూరలు, నివ్వరిగింజలు ఆహారంగా తిని బ్రతికేవారు; వృక్ష, మూల, నివాస, యుక్తులును+ఐ= చెట్ల మొదళ్ళలో (నివాసాలు గల) నివసిస్తూ ఉన్న వారున్నూ అయి; తపంబు+ఆరన్+చేయు= దీక్షతో తపస్సుచేసే; మహా, ముని+ఇంద్రుల= గొప్ప ఋషివర్యులయొక్క; ఆశ్రమంబు= ఆశ్రమాన్ని; అంభస్+రుహ+అక్షి= పద్మాలవంటి కన్నులు గల దమయంతి; పురా, సమార్జిత, పుణ్య, కర్మ, ఫలంబునన్= పూర్వంలో సంపాదించబడిన పుణ్యకార్యాల ఫలితంగా; ఎడన్= అల్లంతదూరంలో; కాంచెన్= చూచింది.

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు గల దమయంతి తన పూర్వపుణ్యఫలంవలన ఆ అడవిలో అల్లంతదూరాన ఒక ఋష్యాశ్రమ స్థలాన్ని చూచింది. ఆ ఆశ్రమంలో నీరు మాత్రమే ఆహారంగా గొని తపస్సు చేసేవారు, ఆకులు మాత్రమే తిని తపస్సు చేసేవారు, గాలి మాత్రమే క్రోలేవారు, ఆకుకూరలు, నివ్వరిగింజలు తిని తపస్సు చేసేవారు, చెట్ల క్రింద నివసిస్తున్నవారు అయిన మునిశ్రేష్ఠులను చూచింది.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.46 విశేషాంశం చూడండి.

**వ. ఇట్లు మృగవ్యాళ తస్కర కిరాత నిరంతరం బయిన కాంతారంబునం బుణ్యనదీతీరంబున నొక్కముని పల్లియం గని యందు వసిష్ఠ వామదేవ వాలఖిల్య భృగు నారద సదృశులైన మహామునులం గని నమస్కరించియున్న నమ్మునులు దమయంతిం జూచి యచ్చెరువడి 'యవ్వా! నీ వెవ్వరిదాన? వివ్వనదేవతవో! దేవభామినివో! దివ్యంబైన తేజంబుతో నేకతంబ యేల క్రుమ్మరియెద?' వనిన వారలకు దమయంతి యిట్లనియె. 98**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; మృగ, వ్యాళ, తస్కర, కిరాత, నిరంతరంబు+అయిన= జంతువులతో, పాములతో, దొంగలతో, ఎఱుకులతో ఎల్లప్పుడును కూడి ఉన్న; కాంతారంబునన్= అడవిలో; పుణ్య, నదీ, తీరంబునన్= పవిత్రమైన నదిఒడ్డున; ఒక్క, ముని, పల్లియన్+కని= ఒక ఋష్యాశ్రమాన్ని చూచి; అందున్= ఆ మునిపల్లెలో; వసిష్ఠ, వామదేవ, వాలఖిల్య, భృగు, నారద సదృశులు+ఐన= వసిష్ఠుడు, వామదేవుడు, వాలఖిల్యులు, భృగువు, నారదుడు-అనే మునులతో సమానులైన; మహా, మునులన్+కని= గొప్ప ఋషివరేణ్యులను చూచి; నమస్కరించి+ఉన్న= వందనాలు అర్పించి ఉండగా; ఆ+మునులు= ఆ ఋషులు; దమయంతిన్+చూచి= దమయంతినికాంచి; అచ్చెరువడి= ఆశ్చర్యం పొంది; అవ్వా= అమ్మా!; నీవు+ఎవ్వరిదానవు= నీవు ఎవరికి సంబంధించినదానివి; ఈ+వన, దేవతవో= ఈ వనానికి సంబంధించిన దేవతవా?; దేవ, భామినివో;= అప్సరసవో (దేవతవో)!; దివ్యంబు+ఐన= దేవతలకు అనువైన; తేజంబుతోన్= వర్చస్సుతో; ఏకతంబు+అ= ఒంటరిగా; ఏల, క్రుమ్మరియెదవు?= ఎందుకు తిరుగుతున్నావు?; అనినన్= అని అడుగగా; వారలకున్= ఆ మునులకు; దమయంతి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** క్రూరమృగాలు, పాములు, దొంగలు, కిరాతులు ఎల్లప్పుడు తిరుగాడే అడవిలో దమయంతి ఒక పవిత్రమైన నదిఒడ్డున ఒక మునిపల్లెను చూచింది. ఆ ఋష్యాశ్రమంలోని మహర్షులు వసిష్ఠ, వామదేవ, వాలఖిల్య, భృగు, నారదుల వంటివారు. దమయంతి ఆ ఋషీశ్వరులకు నమస్కరించింది. ఆ మునులు దమయంతి అతిలోక సౌందర్యానికి, వర్చస్సుకు ఆశ్చర్యపరవశులై 'అమ్మా! నీవు వనదేవతవా? దేవతాస్త్రీవా? ఎవరవు నీవు? ఈ అడవిలో

ఎందుకు ఈ రీతిగా ఒంటరిగా తిరుగాడుతున్నావు?' అని ప్రశ్నించారు. వారికి దమయంతి ఇట్లా బదులు పలికింది.

**క. 'వినుఁ డేఁ బుణ్యశ్లోకుం। డనఁగ సదా యజ్ఞనిరతుఁ డనఁగ ధరిత్రిం**
**దనరిన నలు భార్యను, స। జ్జననుత దమయంతి యన నెసంగినదానన్. 99**

**ప్రతిపదార్థం:** వినుఁడు; ఏన్= నేను, పుణ్యశ్లోకుండు+అనఁగన్= పవిత్రమైన చరిత్ర కలవాడుగా కీర్తి పొందినవాడు అనగా; సదా= ఎల్లప్పుడు; యజ్ఞనిరతుఁడు+అనఁగన్= యజ్ఞాలు చేయటంలో మిక్కిలి ప్రీతి కలవాడు అనగా; ధరిత్రిన్+తనరిన= భూమిపై విలసిల్లిన; నలు, భార్యను= నలుడి భార్యను; సజ్జన, నుత, దమయంతి+అనన్= మంచివారిచేత కొనియాడబడే దమయంతి అని (అనే పేరుతో); ఎసంగినదానన్= ఒప్పినట్టిదానిని.

**తాత్పర్యం:** దయచేసి నా వృత్తాంతం అవధరించండి. 'పుణ్యచరిత్రుడుగా కీర్తిని ఆర్జించినవాడున్నూ, ఎల్లప్పుడు యజ్ఞాలు చేయటంలో మిక్కిలి ప్రీతి కలవాడున్నూ అయి భూమండలంపై విలసిల్లిన నలుడి భార్యను నేను. పెద్దలచేత మన్ననలు పొందిన నాపేరు దమయంతి.

**వ. విధివశంబున నన్నుం బాసి నా హృదయేశ్వరుం డెట యేనియుం బోయినఁ దదన్వేషణాసక్తచిత్తనై విపిన పరిభ్రమణంబు సేసెద; మీతపోవనంబునకు వచ్చి నలుండు భవత్పాదాభివందన కృతార్థుండై యెక్కడికింబోయె? నతని పోయిన వల నెఱుంగుదురేని నానతిండు; కొన్ని దినంబులలోనఁ దద్దర్శనంబు సంభవిల్లనినాఁడు దేహంబు విడుతు' నని యేడ్చుచున్న దానిం జూచి కరుణించి మును లిట్లనిరి. 100**

**ప్రతిపదార్థం:** విధి, వశంబునన్= దురదృష్టం చొప్పున; నన్నున్+పాసి= నన్ను వదలిపెట్టి; నా, హృదయ+ఈశ్వరుండు= నా భర్త; ఎట+ఏనియున్+పోయి= ఎచటికో తెలియని చోటికి వెళ్లగా; తద్+అన్వేషణ+ఆసక్త, చిత్తను+ఐ= ఆతడిని వెదకటంలో లగ్నమైన మనస్సు కలదానినై; విపిన, పరిభ్రమణంబు= అడవిలో చుట్టూ తిరుగాడటం; చేసెద= సలుపుతున్నాను; మీ, తపన్+వనంబునకున్, వచ్చి= మీ తపోవనానికి వచ్చి; నలుండు; భవత్, పాద+అభివందన, కృత+అర్థుండు+ఐ= మీ అడుగులకు నమస్కరించటంచేత ధన్యుడై; ఎక్కడికిన్+పోయెన్? ఎచటికి వెళ్ళాడు?; అతని, పోయిన, వలను= అతడు వెళ్ళిన దిక్కు; ఎఱుంగుదురు+ఏనిన్= మీకు తెలిసినట్లయితే; ఆనతి+ఇండు= దయచేసి తెల్పండి; కొన్ని దినంబులలోనన్= ఇంక కొన్ని రోజుల లోపల; తద్+దర్శనంబు= ఆతడిని చూడటం; సంభవిల్లనినాఁడు= జరుగనివేళ; దేహంబు, విడుతున్= ఆత్మహత్యకు పాల్పడగలను; అని= అంటూ; ఏడ్చుచున్నదానిన్= శోకిస్తున్న దమయంతిని; చూచి; కరుణించి= దయకలిగి; మునులు+ఇట్లు+ అనిరి= మునులు ఈ రీతిగా అన్నారు.

**తాత్పర్యం:** విధివిపరిపాకంచేత నన్ను విడిచి నా ప్రాణేశ్వరుడు నలుడు ఎచటికో వెళ్ళిపోయాడు. నేను నా భర్తను వెదకుతూ ఈ అడవిలో తిరుగాడుతున్నాను. మీ తపోవనానికి వచ్చి నలుడు మీ పాదాలకు నమస్కరించి ధన్యుడై ఎటైనా వెళ్ళిపోయాడా? ఆతడు పోయిన వైపు మీకు తెలిసి ఉంటే దయచేసి తెలుపండి. ఇక కొన్ని దినాలలో నేను నా భర్తను చూడలేకపోతే ప్రాణాలు విడిచిపెట్టుతాను'- అని ఏడుస్తున్న దమయంతికి ఆ ఋషివరేణ్యులు ఇట్లా చెప్పారు.

**క. 'వనజాయతాక్షి! కతిపయ। దినములఁ జూడంగఁ గాంతు తివిరి నలుని భూ**
**జననుతు నెప్పటియట్టుల। తన పురమున రాజ్యలీలఁ దనరెడివానిన్. 101**

**ప్రతిపదార్థం:** వనజ+ఆయత+అక్షి!= పద్మాలవలె విశాలమైన కన్నులు గల దమయంతీ!; కతిపయ, దినములన్= కొన్నాళ్ళలో; ఎప్పటి+అట్టులు+అ= యథాప్రకారంగానే; తన పురమునన్= తన రాజధానిపట్టణంలో; రాజ్యలీలన్= దొరతనంచేస్తూ; తనరెడివానిన్= విలసిల్లేవాడిని; భూ, జన, నుతున్= భూమిలోని ప్రజలచేత కీర్తించబడినవాడిని; నలుని; తివిరి= పూనికతో; చూడంగన్+కాంతు= చూడగలవు.

**తాత్పర్యం:** 'తామరరేకులవంటి విశాలమైన కన్నులు కల ఓ దమయంతీ! కొన్నినాళ్ళలో నీవు నీ భర్త అయిన నలుడిని- పూర్వంవలెనే తన రాజధానీనగరంలో రాజ్యవైభవంతో విలసిల్లేవాడినిగా, ప్రజానురంజకుడైన ప్రభువుగా చూడగలవు.

**వ. ఏము తపోదృష్టిం జూచితిమి, దుఃఖింపకుండు' మని తాపసులు దమ యగ్నిహోత్రంబులయు నపారఫల పుష్పతరు నదీ రమ్య తపోవనంబులయుఁదోడ నదృశ్యులైనం జూచి దమయంతి 'యిది కలయో నిక్కువంబో' యని విస్మయం బందుచుం జని, ముందట నొక్క చనుపం గని దానిం జొచ్చునపు డందలి జనంబులు.102**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; తపస్+దృష్టిన్+చూచితిమి= తపస్సుయొక్క మహిమచేత లభించిన చూపుతో చూచాము; దుఃఖింపకుండుము+అని= శోకించకుము అని చెప్పి; తాపసులు= ఋషులు; తమ అగ్నిహోత్రంబులయున్= తమ నిప్పుకుండాలతో; అపార, ఫల, పుష్ప, తరు, నదీ, రమ్య, తపస్+వనంబులయున్+తోడన్= మితిలేని పండ్లు పువ్వులు గల చెట్లతో కూడిన నదీతీరాల్లో విలసిల్లే ఏటిప్రక్కన ఉండటంచేత అందమైన తపస్సు చేసుకొనే తోటలతోడ; అదృశ్యులు+ఐనన్= అంతర్ధానం కాగా; చూచి; దమయంతి; ఇది కలయో= ఇది స్వప్నమో; నిక్కువంబో= నిజమో; అని= అని తలపోసి; విస్మయంబు= అబ్బురపాటు; అందుచున్= పొందుతూ; చని= వెళ్ళి; ముందటన్= ఎదుట; ఒక్క, చనుపన్+కని= ఒక సార్థం చూచి, (సార్థం అంటే వర్తకజన సమూహం, దేశదేశాలకు వాణిజ్యానికై పయనించేది); దానిన్+చొచ్చునపుడు= ఆ గుంపులో ప్రవేశించేటప్పుడు; అందలి, జనంబులు= ఆ సార్థంలోని జనులు.

**తాత్పర్యం:** మేము తపోదృష్టితో చూచి నీకు ఈ విషయాలు తెలిపాము. శోకించవద్దు' - అని చెప్పి ఆ తాపసులు వారి అగ్నిహోత్రాలతో, పూలు, పండ్లు గల చెట్లతో కూడిన రమ్యమైన ఆ నదీ తీరంలోని ఋష్యాశ్రమాలతో మాయమయ్యారు. దమయంతి అది స్వప్నమా! నిజమా! అని ఆశ్చర్యపడి అడవిలో వెళ్లుతుండగా ఆమె యెదుట ఒక వర్తకుల గుంపు కనిపించింది. దమయంతి ఆ గుంపును చేరటంతో అందున్న వ్యాపారులు (ఆమెను చూచారు)

**సీ. పాంసుజాలములు పైఁబ్రాఁకినఁ గరము రూ। క్షములగు నూర్ధ్వాలకముల దాని**
**నతిమలినంబైన యర్ధవస్త్రంబుచే। నావృతం బగు దేహయష్టి దాని,**
**నాఁకలి తృష నిద్ర యను వీని నెఱుఁగక। యున్మాదినియుఁ బోలె నున్న దాని,**
**దమయంతిఁ జూచి కొందఱు పిశాచం బని। పఱచిరి, కొందఱు భయము వొంది.**

**ఆ. రందుఁ గొంద ఱధిక హాస్యంబు సేసిరి,। 'యడవి నేమి రోసె' దనిరి కొంద,**
**'అవ్వ! నీవు వేల్పవగు' దని కొందఱు। మొగిన కేలు మొగిచి మ్రొక్కి రంత. 103**

**ప్రతిపదార్థం:** పాంసు, జాలములు= ధూళికణాల సముదాయం; పైన్+ప్రాఁకినన్= పైకి విస్తరించి వ్యాపించగా; కరము= మిక్కిలి; రూక్షములు+అగు= ఎర్రబారిన; ఊర్ధ్వ+అలకములదానిన్= పై ముంగురులు కలదానిని; అతి, మలినంబు+ఐన=

మిక్కిలిమాసినట్టి; అర్ధ వస్త్రంబుచేన్= సగంచీరచేత; ఆవృతంబు+అగు= కప్పబడిన; దేహ, యష్టిదానిన్= దేహమనే కర్ర కలదానిని; అంటే మిక్కిలి చిక్కిన శరీరం కల దానిని; ఆఁకలి= తిండికైన తహతహ; తృష= దాహం; నిద్ర= నిదుర; అను= అనే; వీనిన్= వీటిని; ఎఱుఁగక= తెలియక; ఉన్మాదినియున్+పోలెన్= పిచ్చిదానివలె; ఉన్నదాని= కనిపిస్తున్న దానిని; దమయంతిన్= దమయంతిని; చూచి; కొందఱు= కొంతమంది; పిశాచంబు+అని= దయ్యమని; పఱచిరి= పారిపోయారు; కొందఱు, భయము+పొందిరి= భయపడ్డారు; అందున్= ఆ సార్థంలో; కొందఱు= కొంతమంది; అధిక, హాస్యంబు+చేసిరి= మిక్కుటంగా ఎగతాళి చేశారు; కొందఱు= కొంతమంది; అడవిన్+ఏమి, రోసెదు+అనిరి= ఈ అడవిలో ఏమి వెదకుతున్నావు? అని అడిగారు; కొందఱు= కొంతమంది; అవ్వ!= అమ్మా!; నీవు; వేల్పవు+అగుదు= దేవతవు అవుతావు; అని; మొగిన= పూనికతో; కేలు, మొగిచి= చేతులు జోడించి; అంతన్= అంతట; మ్రొక్కిరి= నమస్కరించారు.

**తాత్పర్యం:** ఆ వర్తకసమూహం దమయంతిని చూచి పలుతెరగుల తలపోశారు. రేగినదుమ్ము నెత్తిపై పడటంచేత ఎర్రబారిన ముంగురులు కలదానిని, మిక్కుటంగా మాసిపోయిన సగంచీరచేత కప్పబడి బెత్తంవలె కనిపించే శరీరం కల దానిని; ఆకలి, దప్పిక, నిదుర అనే వాటికి దూరమై పిచ్చిదానివలె తిరుగుతున్నదానిని ఆ దమయంతిని చూచి కొందరు ఆమెను దయ్యం అనుకొని భీతితో పారిపోయారు. కొందరు ఆమెను అపహాస్యం చేశారు. కొందరు 'అవ్వా! ఈ అడవిలో నీవు దేనికొరకు వెదకుతున్నావు'? అని ప్రశ్నించారు. కొందరు 'దేవీ! నీవు సాక్షాత్తు భువికి దిగి వచ్చిన దేవతవే' అని కేలు మోడ్చి మ్రొక్కారు.

**వ. దమయంతియు సార్థవాహుంజూచి' యిమ్మహాగహనంబున నిట్టి జనసంకులం బైన సార్థంబు గానంబడియెడు నెట్టి పుణ్యంబో' యని పల్కి, మఱియు నిట్లనియె. 104**

**ప్రతిపదార్థం:** దమయంతియు= దమయంతి సయితం; సార్థవాహున్+చూచి= వర్తక ప్రముఖుడిని చూచి; ఈ+మహా, గహనంబునన్= ఈ గొప్ప అడవిలో; ఇట్టి, జన, సంకులంబు+ఐన= ఈ విధంగా జనులచేత క్రిక్కిరిసిన; సార్థంబు= వర్తకుల గుంపు; కానంబడియెడున్= కనిపిస్తున్నది; ఎట్టి; పుణ్యంబో= ఎటువంటి మంచి కర్మకు ఫలితమో?; అని పల్కి= అని వచించి; మఱియున్= వెండియు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** దమయంతి వర్తకుడిని చూచి ఇట్లా పలికింది - 'ఈ ఘోరారణ్యంలో ఈ వర్తక జనులు కనిపించటం ఎంతటి పుణ్యం!' అని, ఆమె మళ్ళీ ఇట్లా అన్నది.

**క. 'ఏను నలు భార్యఁ బుణ్యవి । హీనతఁ బతిఁ బాసి నవసి యేకాంతము యీ**
**కానలఁ బరిభ్రమించెదఁ । గానరె ? మీ రమృతసదృశుఁ గరుణాత్ము నలున్?' 105**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నలుభార్యన్= నలుడిభార్యను; పుణ్య, విహీనతన్= పుణ్యం కొరవడటంచేత, అంటే కేవలం దురదృష్టవశాన; పతిన్+పాసి= భర్తను ఎడబాసి; నవసి= మిక్కిలి గాసిచెంది; ఏకాంతము+అ= ఒంటరిగా; ఈ కానలన్= ఈ అడవులలో; పరిభ్రమించెదన్= చుట్టూ తిరుగుతున్నాను; అమృత, సదృశున్= అమృతంతో సరిపోలేవాడిని; కరుణాత్మున్= దయామయుడిని; నలున్= నలుడిని; మీరు; కానరె= చూడలేదా?

**తాత్పర్యం:** 'నేను నలుడిభార్యను, దురదృష్టవశాన నేను నా భర్తను ఎడబాసి, ఒంటరిగా ఈ అడవులలో కష్టాలపాలై తిరుగాడుతున్నాను. అమృత సమానుడు, దయామయుడు అయిన నలుడిని మీరు ఎచటనైనా చూడలేదా?'

**విశేషం:** ఆనంద ముద్రణాలయం వారి ప్రతిలో "గానరె? మీ రమరసదృశుఁ" అనే పాఠాంతరం ఉన్నది. దీనిని బట్టి "నలుడు దేవతలతో సమానుడు"- అనే విశేషార్థం వెల్లడౌతున్నది.

**వ. అనిన దానికి సార్థవాహుండు శుచి యను వాఁ డిట్లనియె. 106**

**ప్రతిపదార్థం:** అనినన్= అని దమయంతి చెప్పగా; దానికిన్= ఆ దమయంతికి; సార్థవాహుండు= సార్థంలోని వర్తకుడు; శుచి+అనువాఁడు= శుచి అనే పేరు గల వణిక్ప్రముఖుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని దమయంతి చెప్పగా శుచి అనే పేరుగల వర్తకప్రముఖుడు దమయంతితో ఇట్లా బదులు పలికాడు.

**క. 'నలుఁ గాన మివ్వనంబునఁ। గల వెప్పుడుఁ గాంతు ముగ్రకరులను సింహం**
**బుల బుక్షంబుల; నిది మ। ర్త్యుల కవిషయ; మాతపంబు దూఱదు దీనన్.' 107**

**ప్రతిపదార్థం:** ఈ+వనంబునన్= ఈ అడవిలో; నలున్+కానము= నలుడిని చూడలేదు; ఉగ్ర, కరులను= భయంకరాలైన ఏనుగులను; సింహంబులన్= సింగాలను; బుక్షంబులన్= ఎలుగుబంట్లను; ఎప్పుడున్= సతతం; కాంతుము= చూస్తూ ఉంటాము; కలవు= ఉన్నాయి; ఇది= ఈ అరణ్యం, మర్త్యులకు= మానవులకు; న+విషయము= చేరగూడని ప్రదేశం; దీనన్= ఈ అడవిలో; ఆతపంబు= ఎండ; దూఱదు= చొరబడదు.

**తాత్పర్యం:** 'ఈ అడవిలో మేము నలుడిని చూడలేదు కాని, ఇక్కడ ఉండే భయంకరాలైన సింహాలను, ఏనుగులను, ఎలుగుబంట్లను మాత్రం చూస్తూ ఉంటాము. ఈ అడవి మనుజులు ప్రవేశించదగిన ప్రదేశం కాదు. ఇందులోకి సూర్యరశ్మికూడా ప్రవేశించలేదు'.

**వ. అనిన 'నిచ్చనుప యెట వోయెడు?' నని యడిగినఁ 'జేదిపతియైన సుబాహుపురంబునకుం బోయెడు' నని చెప్పిన 'నట్లేని మీతోడ వచ్చెద' నని యప్పరమపతివ్రత పతిదర్శన లాలసయై మునుల పలుకులు తలఁచుచు సార్థంబుతో నరిగిన. 108**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఈ+చనుప= ఈ వర్తకులగుంపు; ఎట+పోయెడున్= ఎక్కడికి పోతుంది; అని+అడిగినన్= అని దమయంతి అడుగగా; (శుచి బదులు పలుకుతూ), చేది, పతి+ఐన= చేదిదేశప్రభువు అయిన; సుబాహు పురంబునకున్+పోయెడున్= సుబాహువుయొక్క రాజధానీనగరానికి పోతుంది; అని, చెప్పినన్= అని చెప్పగా; అట్లు+ఏని= అట్లయితే; మీ తోడ, వచ్చెదన్= మీతోపాటు వస్తాను; అని; ఆ+పరమ పతివ్రత= ఆ గొప్ప పతివ్రత; పతిదర్శన లాలస+ఐ= భర్తను చూడాలనే కోరికకలదై; మునుల, పలుకులు= మునుల మాటలు; తలఁచుచు= స్మరిస్తూ; సార్థంబుతోన్= చనుపతో; అరిగినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** అని శుచి అనే వర్తకప్రముఖుడు చెప్పగా, దమయంతి 'ఈ వర్తకులందరు ఎక్కడికి వెళ్తారు?'- అని ప్రశ్నించింది. 'ఈ వర్తకులందరు చేదిప్రభువు సుబాహువుయొక్క రాజధాని నగరానికి వెళ్తారు'. - అని శుచి బదులు పలికాడు. 'అట్లయితే నేను మీతో వస్తాను'- అని దమయంతి భర్తను చూడాలనే తహతహతో, ఋషివరేణ్యుల మాటలు స్మరిస్తూ, వారితో కలసి వెళ్ళింది.

**క. కడునెండ యెక్కు నంతకు । నుడుగక యచ్చనుప నడచి యుగ్రాటవిలో**
**విడిసె బహుశీతజలముల । బెడఁ గగు నొక చెఱువునొద్దఁ బెద్దయు డప్పిన్. 109**

**ప్రతిపదార్థం:** కడున్+ఎండ= మిక్కుటంగా ఎండ; ఎక్కునంతకున్= (మింటి పైకి) ఎగబ్రాకే వరకు; ఉడుగక= విరమించక; ఆ+చనుప= ఆ సార్థం; నడచి= పయనించి; ఉగ్ర+అటవిలోన్= భయంకరమైన అడవిలో; బహు, శీత, జలములన్= మిక్కిలి చల్లని నీళ్లచేత; బెడఁగు+అగు= మంచిదైన; ఒక, చెఱువు+ఒద్దన్= ఒక తటాకం దగ్గర; పెద్దయు, డప్పిన్= పెను దాహంచేత; విడిసెన్= విడిది చేసింది.

**తాత్పర్యం:** మిక్కిలిగా పొద్దు ఎక్కేవరకు ఆ వర్తకులు పయనించి, చల్లని నీళ్ళచేత ఆహ్లాదకరంగా కనిపించే చెరువు దగ్గర దాహం తీర్చుకొని విశ్రమించటానికి విడిది చేసారు.

**వ. అంత. 110**

**తాత్పర్యం:** అప్పుడు.

**సీ. అర్ధరాత్రమునప్పు డందుల కేతెంచె । గజయూథములు జలకాంక్షఁ జేసి**
**యంబుధి విమలతోయంబు లాస్వాదింపఁ । జనుదెంచు జలధరసమితియట్ల**
**యచ్చన్నలోన నిద్రాసక్తులైన వా । రున్నత ద్విపముల యుగ్ర పాద**
**హతిఁ జేసి మర్దితు లైరి కొందఱు, దంత । హతిఁ జేసి భిన్నాంగు లైరి కొంద,**

**ఆ. ఱఱచి ప్రాణభీతిఁ బఱచి మహీజంబు । లెక్కి రందుఁ గొంద ఱుక్కడంగి;**
**చనుప యిట్టిపాటఁ బెనుపఱి యవినీతు । సిరియుఁబోలె నడఁగి విరిసి చనియె. 111**

**ప్రతిపదార్థం:** అర్ధ రాత్రము+అప్పుడు= నడిరేయి వేళ; అందులకు= అచటికి; జల, కాంక్షన్+చేసి= నీటిని త్రాగటంకొరకు; గజ, యూథములు= ఏనుగుల గుంపులు; అంబుధి, విమల, తోయంబులు= సముద్రంలోని నిర్మల జలాలు; ఆస్వాదింపన్= క్రోలటానికి; చనుదెంచు= వచ్చే; జలధర, సమితి+అట్లు+అ= మేఘాల సమూహాల వలె; ఏతెంచెన్= వచ్చాయి; ఆ+చన్నలోనన్= ఆ సార్థంలో; కొందఱు= కొంతమంది; నిద్రా+ఆసక్తులు+ఐనవారు= నిద్రలో తగుల్కొన్నవారు; ఉన్నత, ద్విపముల= పెద్ద ఏనుగులు; ఉగ్ర, పాద, హతిన్+చేసి= భయంకరమైన పాదాలయొక్క తాకిడిచేత; మర్దితులు+ఐరి= మర్దించబడ్డారు, అంటే నలగగొట్టబడి మరణించారు; కొందఱు= కొంతమంది; దంతహతిన్+చేసి= దంతాల తాకిడిచేత; భిన్న+అంగులు+ఐరి= ముక్కలైన శరీరాలు కలవారైనారు (ఎముకలు, అంగాలు విరిగినవారైనారు); అందున్+కొందఱు= వారిలో కొంతమంది; ఉక్కు+అడంగి= స్థైర్యం కోల్పోయి; అఱచి= పెనుకేకలు పెట్టి; ప్రాణభీతిన్= ప్రాణభయంచేత; పఱచి= పరుగెత్తి; మహీజంబులు= చెట్లను; ఎక్కిరి= అధిరోహించారు; చనుప= సార్థం; ఇట్టి, పాటన్= ఇట్టి పరిస్థితి వలన; పెనుపు+అఱి= సమృద్ధిని కోలుపోయి (అంటే సంఖ్యాబలాన్ని కోల్పోయి, క్షీణించి); అవినీతు, సిరియున్+పోలెన్= నీతిబాహ్యుడి ఐశ్వర్యంవలె; విరిసి, చనియెన్= పగిలి (చెదరి) పోయింది.

**తాత్పర్యం:** నడిరేయి నీరు త్రాగటానికై అడవి యేనుగుల గుంపులు ఆ చెరువు దగ్గరకు వచ్చాయి. ఆ యేనుగులు, సముద్ర జలాలను త్రాగటానికై సముద్రాన్ని చేరిన మేఘాల సమూహాలవలె ఉన్నాయి. ఆ సార్థంలో నిద్రలో నిమగ్నులై ఉండే కొంతమంది ఏనుగుల పాదతాడనంచేత మరణించారు. కొంతమంది ఏనుగుల దంతాలచేత

శరీరాలు చీలి చనిపోయారు. కొంతమంది స్థైర్యం కోల్పోయి అరుస్తూ ప్రాణభీతితో పరుగెత్తి చెట్లు ఎక్కారు. ఈ విధంగా ఆ సార్థం నీతిబాహ్యుడి సంపదవలె క్షీణించి చెదిరిపోయింది.

**వ. అట్టి సంక్షోభంబున మరణంబునకుఁ దప్పి దమయంతి యాత్మగతంబున. 112**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; సంక్షోభంబునన్= అలజడిలో; మరణంబునకున్+తప్పి= చావకుండ తప్పించుకొని; దమయంతి; ఆత్మగతంబునన్= తనలో తాను ఇట్లా తలచింది.

**తాత్పర్యం:** అటువంటి అలజడిలో దమయంతి దైవికంగా చావును తప్పించుకొని తన మనస్సులో ఇట్లా తలపోసింది.

**ఆ. 'జీవితార్థు లైన జీవుల సుఖసుప్తు । లైన వారిఁ జంపె నఱవ నఱవ;**
**మరణకాంక్ష నున్న మగువఁ జంపక నను । మఱచె; విధి కరంబు మందబుద్ధి. 113**

**ప్రతిపదార్థం:** జీవిత+అర్థులు= బ్రతకాలనే కోరిక ఉన్నవారు; ఐన; జీవులన్= ప్రాణులను; సుఖ, సుప్తులు+ఐన వారిన్= సుఖంగా నిద్రిస్తున్నవారిని; అఱవన్+అఱవన్= కేకలు పెట్టుతుండగా; చంపెన్= చంపాడు; మరణ కాంక్షన్+ఉన్న, మగువను= చనిపోవాలనే కోరికతో ఉన్న ఆడుదానిని; ననున్= నన్ను; చంపక= చంపకుండ; మఱచె= విస్మరించాడు; విధి= దైవం; కరంబు= మిక్కిలి; మందబుద్ధి= బుద్ధిహీనుడు.

**తాత్పర్యం:** 'బ్రతికి ఉండాలనే కోరికతో మైమరచి నిద్రిస్తున్నవారిని, ప్రాణభయంతో కేకలు పెట్టుతూవుండగా చంపివేశాడు. కాని, చావాలనే కోరికతో ఉన్నదానిని నన్ను చంపకుండ మరచిపోయాడు । ఆ విధి మిక్కిలి బుద్ధిహీనుడు కదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. మానవజీవితంలో హృదయవిదారకాలైన విచిత్రవిరోధాభాసాలలో ఇదొకటి!

**సీ. ఇచ్చన్నతోఁ జని యివ్వనక్లేశంబు । దలుఁగుదు నని బుద్ధిఁ దలఁచి యున్న**
**నురుతర సార్థ పయోరాశి హస్తియూ । థాగస్త్యుచేఁ బీత మయ్యెఁ; నదియుఁ**
**దొలుమేనఁ జేసిన దుష్కృత శక్తియో, । వగవక నా స్వయంవరమునాఁడు**
**సురవరు లర్థులై చూచుచు నుండఁగ । నలు వరియించిన నాఁటి యెగ్గు**

**ఆ. దలఁచి యిట్టి యాపదలు సేసిరో వేల్పు. । లమరకోపమునన యయ్యెఁ నాకు**
**నివ్వియోగదుఃఖ; మింకేమి సేయుదు?' । ననుచు వగచుచుండె నంబుజాక్షి. 114**

**ప్రతిపదార్థం:** ఈ+చన్నతోన్= ఈ సార్థంతో కలిసి; చని= వెళ్ళి; ఈ+వనవాస క్లేశంబు= ఈ అడవిలో పడే బాధ; తలుఁగుదును+అని= తొలగించుకొంటానని; బుద్ధిన్+తలఁచి+ఉన్నన్= మదిలో భావించి ఉండగా; ఉరుతర, సార్థ, పయస్+రాశి= గొప్పదైన సార్థం అనే సముద్రం; హస్తియూథ+అగస్త్యుచేన్= ఏనుగుల గుంపు అనే అగస్త్యుడి చేత; పీతము+అయ్యెన్= త్రాగబడింది అయింది; అదియున్= అదికూడా; తొలుమేనన్= మొదటి శరీరంలో అంటే పూర్వజన్మలో; చేసిన; దుష్కృత, శక్తియో= చెడుకర్మ మహిమ ఏమో?; వగవక= ఆలోచించక; నా, స్వయంవరము, నాఁడు= నా స్వయంవర సమయంలో; సుర, వరులు= దేవతలలో శ్రేష్ఠులు; అర్థులు+ఐ= కోరినవారై; చూచుచున్+ఉండఁగ= చూస్తున్నప్పుడు; నలున్= నలుడిని; వరియించిన,

నాఁటి+ఎగ్గు, తలఁచి= వరించిన సమయంలోని అపకారాన్ని మనసులో పెట్టుకొని; వేల్పులు= దేవతలు; ఇట్టి= ఈ విధమైన; ఆపదలు, చేసిరో= ఇక్కట్టులు తెచ్చిపెట్టారో; ఈ+వియోగ దుఃఖము= ఈ ఎడబాటువలన పరితాపం; అమర కోపమునన్+అ= దేవతల కోపంచేతనే; నాకు+అయ్యెన్= నాకు ఏర్పడింది; ఇంక+ఏమి+చేయుదున్?= ఇక ఏమి చేయగలను?; అనుచున్= అని తలపోస్తూ; అంబుజ+అక్షి= పద్మాలవంటి కన్నులుకల దమయంతి; (అంబుజం= నీటినుండి పుట్టింది, పద్మం); వగచుచుండెన్= దుఃఖిస్తూ ఉండింది.

**తాత్పర్యం:** ఈ సార్థంతో వెళ్ళి ఈ అడవిలో పడేబాధలు తొలగించుకొందాము'- అని తలచి ఉన్నాను. కాని, ఏనుగుల గుంపు అనే అగస్త్యుడిచేత ఈ సార్థం అనే సముద్రం పీల్చివేయబడింది. ఇది పూర్వజన్మ కర్మఫలమో! లేక నా స్వయంవరంనాడు ఆలోచించక నన్నుకోరి వచ్చిన దేవతాశ్రేష్ఠులు చూస్తుండగా నేను నలుని వరించటం అపకారంగా తలచి ఇటువంటి కష్టాలు నాకు తెచ్చి పెట్టుతున్నారో! నా భర్తతో నాకు ఇటువంటి ఎడబాటు దుఃఖం దేవతల కోపంవలననే కలిగింది. ఇంకేమి చేయగలను?' అని దమయంతి వాపోయింది.

**విశేషం:** (1) ఆకస్మికంగా ఈ సార్థం ఏనుగులగుంపుచేత ప్రమాదానికి గురికా నేల? ఇది పూర్వజన్మ కర్మఫలితమా? భారతీయ సంస్కృతిలో మిక్కిలి ప్రాధాన్యం వహించిన కర్మ సిద్ధాంతం ఇట ప్రస్తావించబడింది. ఏల నిద్రలో మునిగిఉండే నిర్దోషులు వధించబడ్డారు? అది పూర్వజన్మ కర్మ అవుతుందా? అట్లే అరణ్యక్లేశం తప్పుతుందని దమయంతి చనుపలో చేరింది. తానొకటి తలచితే దైవ మింకొకటి తలచింది కదా! అంతటికిని పూర్వజన్మ కృతమైన కర్మయే కారణం- అని ఆమె వగచింది. (2) అగస్త్యమహర్షి సముద్రజలాన్ని పీల్చిన సుప్రసిద్ధ పురాణగాథ ఇచట ప్రస్తావించబడింది. (3) అలంకారం: రూపకం.

## దమయంతి సుబాహుపురంబు ప్రవేశించుట (సం. 3-62-28)

**వ. ఇట్లు దుఃఖించుచు దమయంతి ప్రభాతంబ హతశేషులైన యచ్చనుపలోని బ్రాహ్మణవరులతో ననవరత ప్రయాణంబులం జేదిపతి పురంబు సొచ్చి, జనసంకులంబైన రాజమార్గంబు దఱియ వచ్చుచున్న దాని దినకర ప్రభాపటల ధూసరిత ప్రభాతచంద్రరేఖయుంబోలె దీప్తివిహీనయై డస్సియు రమ్యాకృతియైన దాని దమయంతిం బ్రాసాదగతయైన రాజమాత దవ్వులం గని తన దాది కిట్లనియె. 115**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దుఃఖించుచున్= పరితపిస్తూ; దమయంతి; ప్రభాతంబు+అ= తెల్లవారినపుడు; హతశేషులు+ఐన= చావగా మిగిలిన; ఆ+చనుపలోని= ఆ వర్తకులగుంపులోని; బ్రాహ్మణ, వరులతోన్= బ్రాహ్మణశ్రేష్ఠులతో; అనవరత, ప్రయాణంబులన్= ఆగని ప్రయాణాలు చేసి (అంటే మార్గమధ్యంలో ఎక్కువగా విడిదిచేయక శీఘ్రప్రయాణాలు చేసి); చేదిపతి, పురంబు= చేదిప్రభువు రాజధానిని; చొచ్చి= ప్రవేశించి; జన సంకులంబు+ఐన= ప్రజలచేత క్రిక్కిరిసినట్టి; రాజమార్గంబు= ప్రధానమైన దారిని, (రాజు పయనించే మార్గం రాజమార్గం); తఱియ, వచ్చుచున్న దానిన్= చేరవస్తున్న దానిని; దినకర, ప్రభా, పటల, ధూసరిత, ప్రభాత చంద్రరేఖయున్+పోలె= సూర్యుడి కాంతికిరణ సమూహాలచేత బూడిద రంగు కలదిగా చేయబడిన (వెలవెలపోయిన) ప్రాతఃకాలమందలి చంద్రవంకవలె; దీప్తి, విహీన+ఐ= కాంతి తరిగినట్టిదై; డస్సియు= బడలినప్పటికిని; రమ్య+ఆకృతి+ఐన, దానిన్= అందమైన ఆకారం కలదానిని; దమయంతిన్= దమయంతిని; ప్రాసాదగత+ఐన= మేడపై ఉన్న; రాజమాత= రాజుగారి తల్లి; దవ్వులన్+కని= దూరంనుండి చూచి; తనదాదికి= తనసేవకురాలితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** ఈ విధంగా పరితపిస్తూ దమయంతి, తెల్లవారగానే చావగా మిగిలిన ఆ చనుపలోని (వర్తకులగుంపు) బ్రాహ్మణశ్రేష్ఠులతో కలిసి శీఘ్రంగా పయనించి కొన్నాళ్లకు చేదిదేశ రాజధానికి చేరి జనసమ్మర్దం గల రాజమార్గాన్ని సమీపిస్తూ ఉండగా సూర్యకిరణసమూహంచేత బూడిదరంగు కలదిగా చేయబడి వెలవెలపోయిన ప్రాతఃకాల చంద్రరేఖవలె కాంతి కోల్పోయి, అలసిపోయికూడ అందమైన ఆకృతి కలిగిన ఆ దమయంతిని మేడపైనుండి రాజమాత అల్లంతదూరాన చూచి, తన దాదితో ఇట్లా పలికింది.

**విశేషం:** అలం: ఉపమ. మహాభారతంలోని మనోజ్ఞమైన ఉపమాలంకారాలలో ఇది ఒకటి. ఇచట 'డస్సియు రమ్యాకృతి' గల దమయంతి ఉపమేయం. ప్రభాతవేళలో సూర్యకిరణసమూహాలచేత ధూసరితమైన చంద్రవంక ఉపమానం. సూర్యకిరణ ధూసరితమైనది చంద్రవంక, ధూళి ధూసరితమైనది దమయంతి. కృశత్వం, దీప్తి తరగటం చంద్రవంకకు దమయంతికి సమానధర్మాలే. చంద్రవంక కృశించినా, దీప్తిహీనమైనా మనోహరమైనదే. అట్లే దమయంతికూడ.

**తే.** **'జీర్ణమై కడు మాసిన చీరగట్టి। ధూళి ధూసరాలకములు దూలుచుండ**
**నబల యున్మత్తవేషిణి యైన లచ్చి। కరణి నిట వచ్చుచున్నది కంటె దాని. 116**

**ప్రతిపదార్థం:** జీర్ణము+ఐ= చినిగినట్టిదై; కడు= మిక్కిలి; మాసిన= మలినమైన; చీర= వస్త్రం; కట్టి= ధరించి; ధూళి, ధూసర+అలకములు= దుమ్ముచేత బూడిదవన్నెగల ముంగురులు; తూలుచుండన్= ఇటు అటు కదలుతూ ఉండగా; అబల= మగువ; ఉన్మత్త, వేషిణి+ఐన= పిచ్చిదాని వేషం వేసికొన్న; లచ్చి, కరణిన్= లక్ష్మీదేవివలె; ఇట= ఇచటకు; వచ్చుచున్నది= వస్తున్నది; దానిన్= ఆమెను; కంటె= చూచావుకదా!.

**తాత్పర్యం:** 'చినిగిపోయి మిక్కిలి మాసినచీర కట్టుకొని, దుమ్ముచేత, ఎర్రవారిన ముంగురులు ఇటూఅటూ కదలుతుండగా, పిచ్చిదానివేషం వేసికొన్న లక్ష్మీదేవివలె ఇటు వస్తున్న ఆమెను చూచావుకదా!.

**విశేషం:** అలం: ఉపమ. 115-116 పద్యాలు తీర్చిన ఒరవడిలో నన్నయ మహాకవి 'ప్రసన్నకథాకలితార్థయుక్తి' ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. ఆమె ఎవరో రాజమాతకు తెలియదుకదా! అయినను రాజమాత దమయంతిని ఉన్మత్తవేషిణి అయిన లక్ష్మీదేవి వలె, ప్రభాతవేళలో సూర్యరశ్మి తాకిడికి దీప్తి కోల్పోయిన చంద్రవంకవలె ఉపమించటం హృద్యం.

**వ.** **అక్కోమలియందు నా కతిస్నేహంబై యున్నయది; దానిం దోడ్కొని ర'మ్మనిన నదియు దమయంతిం దోడ్కొని రాజమాత యొద్దకుం జనిన, నా రాజమాతయు దానిం జూచి 'నీవెవ్వరి దాన? వి ట్లేల దుఃఖావేశవివశవై యున్నదానవు చెప్పు' మనిన దమయంతి యిట్లనియె. 117**

**ప్రతిపదార్థం:** ఆ+కోమలియందు= సుకుమారి అయిన ఆ అంగనపట్ల; నాకు+అతిస్నేహంబు+ఐ+ఉన్న+అది= నాకు మిక్కుటమైన ప్రేమ ఏర్పడింది; దానిన్= ఆమెను; తోడ్కొనిరమ్ము+అనినన్= తీసికొనిరమ్ము అని అనగా; అదియు= ఆ దాదియు; దమయంతిన్+తోడ్కొని= దమయంతిని వెంటపెట్టుకొని; రాజమాత+ఒద్దకున్+చనినన్= రాజుగారి తల్లి దగ్గరగా వెళ్ళగా; ఆ, రాజ, మాతయు; దానిన్+చూచి= ఆమెను (దమయంతిని) చూచి; నీవు+ఎవ్వరి దానవు= నీవు ఎవరికి సంబంధించినదానివి; ఇట్లు= ఈ విధంగా; ఏల= ఎందుకు; దుఃఖ+ఆవేశ, వివశవు+ఐ+ఉన్న= దానవు= శోకంవలన ఏర్పడిన ఉద్వేగంతో వశం తప్పిఉన్నదానివి; చెప్పుము; అనినన్= అని అడుగగా; దమయంతి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** నాకు ఆ కోమలాంగిపై అత్యంతమైన ప్రీతి ఏర్పడింది. నీవు పోయి ఆమెను ఇచటికి తోడ్కొని రమ్ము' అని, రాజమాత తన దాదిని నియోగించింది. ఆ దాది వెళ్ళి దమయంతిని వెంటబెట్టుకొని రాజమాత సన్నిధికి వచ్చింది. రాజమాత దమయంతితో 'నీవు ఎవరిదానివి? ఇట్లా ఎందుకు పరమశోకమూర్తివై కనిపిస్తున్నావు?' అని ప్రశ్నించింది. అప్పుడు దమయంతి ఇట్లా బదులు చెప్పింది.

**మధ్యాక్కర.**

**'జితవైరి మత్పతి జూదమాడి నిర్జితుఁడయి చనినఁ**
**బతితోడ నీడయుఁ బోలె నేనును బాయక యరిగి**
**యతిబుభుక్షాతురుండైన పతిచేత నవ్వ! దైవాను**
**మతిఁజేసి వంచితనైతి నొక్కచో మఱచి నిద్రించి. 118**

**ప్రతిపదార్థం:** మత్+పతి= నాభర్త; జిత, వైరి= పరాక్రమంచేత జయింపబడిన శత్రువులు కలవాడు; జూదము+ఆడి; నిర్జితుఁడు+ఐ= ఓడించబడినవాడై; చనినన్= వెళ్ళగా; పతితోడన్= భర్తతో; నీడయున్+పోలెన్= నీడవలె; ఏనును= నేనుకూడ; పాయక= ఆతడిని విడిచిపెట్టక; అరిగి= వెళ్లి; అతి, బుభుక్షా+ఆతురుండు+ఐన= మిక్కిలి ఆకలిచేత పీడితుడైన; పతిచేతన్= భర్తచేత; అవ్వ!= అమ్మా!; దైవ+అనుమతిన్+చేసి= దురదృష్టవశాన; ఒక్కచోన్= ఒకానొకచోట; మఱచి, నిద్రించి= మైమరచి నిద్రపోయి; వంచితన్+ఐతి= మోసగించబడినదానినయ్యాను.

**తాత్పర్యం:** 'అమ్మా! నా పతి పరాక్రమోపేతుడైన వీరుడు. శత్రువులను జయించినవాడు. కాని, ఆయన జూదమాడి, ఓడిపోయి రాజ్యాన్ని వదలివెళ్ళగా, నేను కూడ నీడవలె వెన్నంటి వెళ్ళి, ఒకచోట మైమరచి నిద్రించి, విధివశాన అతిగా ఆకలిచే బాధితుడైన భర్తచేత మోసగించబడ్డాను.

**విశేషం:** వృత్తలక్షణానికి ఈ ఆశ్వాసంలోని 22వ పద్యం విశేషవ్యాఖ్య చూడండి.

**వ. అంతనుండియు నమ్మహానుభావు నేకవస్త్రు ననికేతను నన్వేషించుచు, సైరంధ్రీవృత్తంబు సేకొని, వియోగానలంబునం గంది, కందమూల ఫలంబుల యాహారంబుగాఁ, బ్రొద్దు వడినచోట నివాసంబుగా, మృగంబుల సహాయంబుగా, వనంబులం పరిభ్రమించితి' నని, బాష్పజలంబులం బయోధరస్థలపరాగంబు పంకంబు సేయుచుఁ బలుకనేరకున్న యా దమయంతికి రాజమాత యిట్లనియె. 119**

**ప్రతిపదార్థం:** అంతనుండియున్= అప్పటినుండి; ఆ+మహా+అనుభావున్= ఆ మహాత్ముడిని; ఏక, వస్త్రున్= ఒకే పుట్టం కట్టుకొన్నవాడిని; అనికేతనున్= ఇల్లు లేనివాడిని; అన్వేషించుచున్= వెదకుతూ; సైరంధ్రీ, వృత్తంబు+చేకొని= సైరంధ్రి యొక్క నడవడిని పాటించి; వియోగ+అనలంబునన్+కంది= భర్తయొక్క ఎడబాటు అనే అగ్నివలన తపించి; కంద, మూల, ఫలంబులు+అ= దుంపలు, వేళ్ళు, పండ్లు మాత్రమే; ఆహారంబు+కాన్= తిండిగా; ప్రొద్దు+పడిన, చోటు+అ= ప్రయాణంలో ఏచోట సూర్యుడు అస్తమిస్తాడో ఆ స్థలమే; నివాసంబు+కాన్= నివసించేచోటుగా; మృగంబులు+అ, సహాయంబు+కాన్= జంతువులే సాయంగా; వనంబులన్= అడవులలో; పరిభ్రమించితిన్= తిరుగాడాను; అని= అనిచెప్పి; బాష్ప, జలంబులన్= కన్నీటితో; పయోధర, స్థల, పరాగంబు, పంకంబు, చేయుచున్= పాలిండ్లపై ఉన్న దుమ్మును బురదగా చేస్తూ; పలుకనేరకున్న= మాటాడజాలనట్టి; ఆ, దమయంతికి; రాజమాత; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అని చెప్పింది.

**తాత్పర్యం:** అప్పటినుండియు ఏకవస్త్రం మాత్రమే కట్టుకొన్నవాడిని, నిలువ నీడ లేనివాడిని, వెదకుతూ సైరంధ్రి వృత్తిని చేపట్టి భర్త ఎడబాటువలన తపించి దుంపలు, వేళ్ళు, పండ్లు ఆహారంగా, మృగాలే సహాయంగా, ప్రొద్దుకుంకిన వేళ నే నెక్కడ ఉంటే అదే అప్పటికి నివాసంగా అడవుల్లో తిరుగాడాను'- అని చెప్పి దమయంతి విలపించింది. ఆమె కన్నులనుండి కారిన బాష్పధారలచేత ఆమె స్తనాలపై గల దుమ్ము బురదగా మారింది. ఆమె మాటాడలేక మూగవోయిన పిమ్మట, దమయంతితో రాజమాత ఇట్లా చెప్పింది.

**విశేషం:** (1) సైరంధ్రీవృత్తిని గురించి తర్వాతి పద్యంలో వివరణ ఉన్నది. సైరంధ్రి అంటే సౌశీల్యవతి అయిన పరిచారిక అని సంగ్రహంగా చెప్పవచ్చును. (2) దమయంతి తాను పతిచేత వంచితనని చెప్పింది. కాని తన భర్తపై అది దోషారోపణ కాకుండటానికై ఆయన మహావీరుడు, మహాత్ముడు అని నొక్కి వక్కాణించింది. ఇది గమనించదగిన అంశం. (3) అడవులలో పరిభ్రమిస్తూ దమయంతి పడినపాట్లు వర్ణనాతీతాలు. ఆమెకు అరణ్యంలో ఆవాసస్థల మేది? అది ప్రొద్దు క్రుంకినపుడు ఆమె ఉన్నచోటే, పగలెల్ల అడవులలో తిరగటం, పొద్దుక్రుంకినపుడు తా నెచట ఉంటే ఆచోటనే తాత్కాలికంగా నివసించటం. దమయంతి పడినపాట్లు ఎంతటి కఠిన హృదయాన్నైనా కరిగించగలవు. ఇక, ఆర్ద్రహృదయ అయిన రాజమాతనుగురించి వేరుగా చెప్పవలెనా?

**క. 'నీ వుండుము నాకడ నిం । దీవరదళనేత్ర! నీ పతిని రోయఁగ భూ**
**దేవోత్తములం బంచెద' । నావుడు ని ట్లనియె భీమనందన నెమ్మిన్. 120**

**ప్రతిపదార్థం:** నా కడన్= నా దగ్గర; నీవు+ఉండుము= నీవు ఉండుము; ఇందీవర, దళ, నేత్ర!= నల్లకలువరేకులవంటి కన్నులు కలదానా!; నీపతిని= నీ భర్తను; రోయఁగన్= వెదకటానికై; భూ, దేవ+ఉత్తములన్= బ్రాహ్మణోత్తములను; పంచెదన్= నియోగిస్తాను; నావుడున్= అని చెప్పగా; భీమ, నందన= భీముడి పుత్రిక అయిన దమయంతి; నెమ్మిన్= ప్రీతితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** 'నల్లకలువరేకులవంటి కన్నులు కలదానా! నీవు నాదగ్గర ఉండుము. నీ భర్తను వెదకటానికై బ్రాహ్మణోత్తములను పంపగలను'- అని రాజమాత పలుకగా, సంతోషించి దమయంతి ఇట్లా చెప్పింది.

**వ. 'ఏను సైరంధ్రి నయి యుండియు నుచ్ఛిష్టంబు ముట్టను; బదధావనంబు సేయను; బరపురుషులతోఁ బలుక నోపఁ; బతి నన్వేషించు పొంటె నరిగెడు బ్రాహ్మణులతోఁ బలుకుదు; నట్లయిన నీయొద్ద నుండుదు; నొండు విధంబైన నుండనేర' ననిన 'నీకిష్టం బైన విధంబున నాయొద్దన యుండు' మని దాని నతిగౌరవంబునం జేకొని యుండఁ దనకూఁతు సునంద యనుదాని సమర్పించిన. 121**

**ప్రతిపదార్థం:** ఏను=నేను; సైరంధ్రిన్+అయి+ఉండియున్= నేను పరిచారిక నయి ఉన్నప్పటికిన్నీ; ఉచ్ఛిష్టంబు= ఎంగిలి; ముట్టను= తాకను; పద, ధావనంబు, చేయను= కాళ్ళు పిసుకను (కడగను); పరపురుషులతోన్= ఇతరులైన మగవారితో; పలుకన్+ఓపన్= మాటాడజాలను; పతిన్= భర్తను; అన్వేషించుపొంటెన్= వెతకటం కొరకు; అరిగెడు= వెళ్ళే; బ్రాహ్మణులతోన్= విప్రులతో; పలుకుదున్= మాటాడతాను; అట్లు+అయినన్= ఆ రీతిగా అయితే; నీ+ఒద్దన్= నీ దగ్గర; ఉండుదున్= ఉంటాను; ఒండు, విధంబు+ఐనన్= ఇంకొక పద్ధతి అయితే; ఉండనేరను= ఉండజాలను; అనిన్= అని చెప్పగా; నీకు+ఇష్టంబు+ఐన, విధంబునన్= నీకు సమ్మతమైన రీతిగానే; నా+ఒద్దన= నా కడనే; ఉండుము; అని= అని చెప్పి; దానిన్= ఆమెను (దమయంతిని); అతి, గౌరవంబునన్= మిక్కుటమైన మన్ననతో; చేకొని+ఉండన్= చేర్చుకొని ఉండేటట్లుగా; తన, కూఁతు=

తన పుత్రిక అయిన; సునంద+అను, దానిన్= సునంద అనే పేరుకలదానిని; సమర్పించినన్= ఇవ్వగా (అంటే సునందను దమయంతిని గూర్చిన రక్షణలో ఉండేటట్లు నియమించగా.)

**తాత్పర్యం:** 'నేను సైరంధ్రివృత్తిలో ఉన్నప్పటికీ ఎంగిలి తినను. కాళ్ళు పిసకటం వంటి పనులు చేయను. నాభర్తను అన్వేషించటానికి వెళ్ళే బ్రాహ్మణులతో తప్ప ఇతర పురుషులతో మాటాడను. ఆవిధంగా నీ వంగీకరిస్తేనే నీ దగ్గర ఉండగలను' అని దమయంతి చెప్పగా 'నీ ఇష్టం వచ్చిన తీరున ఉండవచ్చు' నని రాజమాత అంగీకరించి, ఆమెను తన కూతురు సునందకు అప్పగించింది.

**విశేషం:** సైరంధ్రి అంటే -- 'సీరాణాం సమూహం-సైరమ్-తత్ ధరతీతి సైరంధ్రీ'- అనే అర్థం ప్రసిద్ధం. తెర చీరల గుంపును ధరించేది సైరంధ్రి అని భావం. ఆమె లక్షణాలనుగురించిన శ్లోకం - "చతుష్షష్టి కలాభిజ్ఞా, శీలరూపాది సేవినీ। ప్రసాధనోపచారజ్ఞా, సైరంధ్రీ పరికీర్తితా॥". అరవైనాలుగు కళలలో పండితురాలు, శీలం రూపం కలది, వస్త్రాది అలంకరణలు చేసే ఉపచారాలలో బాగా నిపుణురాలు. అటువంటి స్త్రీని సైరంధ్రి అంటారు. విరాటపర్వంలో ద్రౌపది విరటుడి రాణియైన సుదేష్ణవద్ద సైరంధ్రిగా చేరిన సన్నివేశం ఇట సంవదించేది. ద్రౌపదికి ఒరవడి పెట్టినది దమయంతియే. ద్రౌపది ధర్మరాజుతోపాటు బృహదశ్వమహర్షి చెప్పిన నలచరిత్ర విని ఉండింది కదా!

**క. అలయక పుణ్యవ్రతములు। సలుపుచుఁ జేదీశుపురిని సైరంధ్రి యనన్**
**నలుదేవి యుండె నెదఁ బతిఁ। దలఁచుచు దుస్సహవియోగతాపార్దితయై. 122**

**ప్రతిపదార్థం:** అలయక= అలసటచెందక; పుణ్యవ్రతములు= పుణ్యాన్నిఒసగే నోములు; చలుపుచున్= చేస్తూ; చేది+ఈశు, పురిని= చేది దేశపు రాజధాని నగరంలో; ఎదన్= మనస్సులో; పతిన్= భర్తను; తలఁచుచున్= స్మరిస్తూ; దుస్సహ, వియోగ, తాప+అర్దిత+ఐ= భరించరాని (భర్త) ఎడబాటువలన ఏర్పడిన దుఃఖంచేత పీడించబడినదై; నలుదేవి= నలుడి పట్టపురాణి; ఉండెన్= ఉండింది.

**తాత్పర్యం:** నలుడి పట్టపురాణియైన దమయంతి అలయకుండా పుణ్యప్రదమైన నోములు నోస్తూ, భర్తనే హృదయంలో ధ్యానిస్తూ, భరించరాని వియోగదుఃఖంతో బాధపడుతూ సైరంధ్రిగా చేదిభూపతిపురంలో ఉండింది.

**వ. అట నలుండు దమయంతిం బాసి దారుణారణ్యంబులో నరుగువాఁడు ముందట. 123**

**ప్రతిపదార్థం:** అటన్= అచట; నలుండు; దమయంతిన్+పాసి= దమయంతిని ఎడబాసి; దారుణ+అరణ్యంబులోన్= భయంకరమైన అడవిలో; అరుగువాఁడు= వెళ్ళేవాడు; ముందట= తనముందు.

**తాత్పర్యం:** అచట నలుడు దమయంతిని విడిచిపెట్టి అడవిలో వెళ్ళుతున్నాడు. అంతట అతడు తనముందట.

**చ. అవిరళ విస్ఫులింగ నివహంబుల నభ్రపథంబు నంటుచున్**
**దవదహనం బుదగ్రతరుదాహము సేయుచు నున్నఁ జూచి మా**
**నవపతి దాని యంతరమునన్ వినియెన్ 'నరనాథ! నన్ను గా**
**రవమునఁ గావ వేగ యిట ర' మ్మను నార్తమహానినాదమున్. 124**

**ప్రతిపదార్థం:** అవిరళ, విస్ఫులింగ, నివహంబులన్= ఎడతెగని నిప్పురవ్వల సమూహాలతో; అభ్ర, పథంబున్= ఆకాశమార్గాన్ని; అంటుచున్= తాకుతూ; దవ దహనంబు= దావాగ్ని; ఉదగ్ర, తరు, దాహము, చేయుచున్+ఉన్నన్+చూచి= పెద్దపెద్ద చెట్లను దహించి వేస్తుండటం చూచి; మానవ, పతి= రాజు (నలుడు); దాని+అంతరమునన్= ఆ అగ్నిమధ్యంలో; నరనాథ!= ఓ మహారాజా!; నన్ను, గారవమునన్+కావన్= నన్ను మన్ననతో కాపాడటానికై; వేగ= వేగంగా; ఇటన్= ఇచటకు; రమ్ము= రావలసింది; అను= అనేటి; ఆర్త, మహా, నినాదమున్= దుఃఖపూరితమైన గొప్పకేకను; వినియెన్= విన్నాడు.

**తాత్పర్యం:** ఎడతెగని నిప్పురవ్వల దొంతరలు ఆకాశమార్గాన్ని అంటుతూ పెద్దపెద్ద చెట్లను సైతం దహించివేస్తున్న దావాగ్నిని చూచి, ఆ దావాగ్ని మధ్యంలోనుండి 'ఓ మహారాజా! నన్ను మన్ననతో రక్షించటానికి ఇచటకు వేవేగ రమ్ము' అనే ఆర్తనాదం విన్నాడు.

**క. విని శంకింపక చెచ్చెర । ననఘుం డత్యుగ్రతర దవానలమధ్యం**
**బున కుఱికి కనియె దీనా । ననుఁ గుండలితాంగు నొక్క నాగకుమారున్. 125**

**ప్రతిపదార్థం:** విని= ఆ ఆర్తనాదం విని; శంకింపక= సందేహించక; చెచ్చెరన్= వేగంగా; అనఘుండు= పాపరహితుడు; అతి+ఉగ్రతర, దవ+అనల మధ్యంబునకు= మిక్కిలి తీక్ష్ణమైన దావాగ్ని మధ్యంలోకి; ఉఱికి= దూకి; దీన+ఆననున్= భీతిచెందిన మొగం కలవాడిని; కుండలిత+అంగున్= చుట్టుకొనబడిన దేహం కలవాడిని; ఒక్క, నాగకుమారున్= ఒక పాముకొడుకును; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడైన నలుడు ఆ దీనధ్వని విని, సందేహించక వేగంగా ఆ దావాగ్ని మధ్యంలోకి ఉరికాడు. ఆ అగ్నిమధ్యంలో నిరాశతో క్రుంగిన మొగంకలవాడు, చుట్టలు చుట్టలుగా శరీరాన్ని ముడుచుకొని భయపడుతున్న వాడైన ఒక నాగకుమారుడిని చూచాడు.

**వ. అన్నాగకుమారుండును నలునకుం గృతాంజలియై 'యేను గర్కోటకుం డనువాఁడఁ; గర్మవశంబున నొక్క బ్రహ్మఋషి నుపాలంభించి తచ్ఛాపంబున నెక్కడం గదలనేరకున్నవాఁడ; నియ్యెరగలి చిచ్చు సర్వజీవులకు సంహారకారణంబై పేర్చి నలుదెసలం గలయం బర్వి చనుదెంచుచున్నయది; యీ యపాయంబు దలఁగు నట్లుగా నుద్ధరింపవలయు; నీవు కరుణాత్మకుండవు గావున నిన్ను వేడెద. 126**

**ప్రతిపదార్థం:** ఆ+నాగ, కుమారుండును= ఆ పాప బుడుతడును; నలునకున్; కృత+అంజలి+ఐ= చేసిన నమస్కృతి కలవాడై; ఏను= నేను; కర్కోటకుండు+అనువాఁడన్= కర్కోటకుడు అనే పేరుగలవాడను; కర్మ, వశంబునన్= చేసిన కర్మవలన; ఒక్క, బ్రహ్మ+ఋషిన్= బ్రహ్మజ్ఞాని అయిన ఒక మునిని; ఉపాలంభించి= నిందించి; తద్+శాపంబునన్= అతడి శాపంచేత; ఎక్కడన్= ఎచటికి; కదలనేరక+ఉన్నవాఁడన్= సంచరించలేక ఉన్నవాడిని; ఈ+ఎరగలి, చిచ్చు= ఈ కార్చిచ్చు (దావాగ్ని); సర్వజీవులకున్= సకల ప్రాణులకు; సంహార, కారణంబు+ఐ= మరణ కారకమై; పేర్చి= అతిశయించి; నలుదెసలన్+ కలయన్+పర్వి= నాలుగుదిక్కులు కలిసేటట్లు వ్యాపించి; చనుదెంచుచున్న+అది= వస్తున్నది; ఈ+అపాయంబు= ఈ కీడు; తలఁగునట్లుగాన్= తొలగిపోయేటట్లుగా; ఉద్ధరింపవలయున్= నన్ను కాపాడాలి; ఈవు= నీవు; కరుణా+ఆత్మకుండవు= దయకలవాడివి; కావున= కాబట్టి; నిన్ను; వేడెదన్= ప్రార్థిస్తాను.

**తాత్పర్యం:** ఆ నాగకుమారుడు నలుడికి నమస్కరించి, 'నాపేరు కర్కోటకుడు. కర్మవశాన ఒక బ్రహ్మర్షిని నిందించి ఆతడి శాపంవలన కదలనేరక పడిఉన్నాను. ఈ దావాగ్ని సకలప్రాణికోటికి మృత్యుకారణమై అన్నివైపుల

విజృంభిస్తున్నది. ఈ కీడునుండి నీవు నన్ను కాపాడ వేడుకొంటున్నాను. నీవు దయామయుడివి. దయచేసి నన్ను రక్షించుము' అన్నాడు.

**క. నాలుగుదిశలను దావ । జ్వాలావలి గవిసె; గ్రుంది చానోప; మహీ**
**పాలక! న న్నొక సరసీ । కూలముఁ జేరంగ నెత్తికొని పొమ్ము దయన్. 127**

**ప్రతిపదార్థం:** నాలుగు, దిశలను= నాలుగుదెసల; దావ, జ్వాలా+ఆవలి= కార్చిచ్చు మంటల వరుసలు; కవిసెన్= సమీపించాయి (వ్యాపించాయి); గ్రుంది= కాలి (నొచ్చి); చాన్+ఓపన్= చనిపోజాలను; మహీపాలక!= ఓ మహారాజా!; నన్ను, ఒక, సరసీ, కూలమున్= నన్నొక సరస్సుయొక్క ఒడ్డుకు; చేరంగన్= చేరేట్లు; దయన్= దయతో ఎత్తికొని; పొమ్ము= మోసికొని తీసుకొని వెళ్ళుము.

**తాత్పర్యం:** 'ఓ మహారాజా! ఈ కారు చిచ్చుమంటలు నాలుగుదిక్కులా క్రమ్ముకొని సమీపించాయి. ఈ మంటలలో కాలి చనిపోజాలను. కావున, దయతో నన్ను ఎత్తుకొని ఒక చల్లని సరోవరతీరం చేర్చుము.

నలుఁడు కర్కోటకునిచేత దష్టుం డగుట (సం. 3-63-7)

**వ. నన్ను రక్షించిన నీకుం బ్రియంబు సేయ నోపుదు' ననిన వాని నెత్తికొని పోవం జులుక నై యంగుష్ఠ ప్రమాణ దేహుండైయున్న నెత్తికొని, నలుం డతిత్వరితగతి నరిగి తాపవర్జితంబైన యొక్క సరోవర సమీపంబున విడువం బోయిన 'నింకను బదియడుగు లరుగుము నీకు శ్రేయఃప్రాప్తిఁ జేసెద ననిన నడుగు లెన్నికొనుచు నరిగి పదియగు నడుగునప్పు డప్పాముచేత దష్టుండై తనరూపంబు విడిచి వికృతరూపంబుతో నున్న నన్నలునకుం గర్కోటకుం డాత్మరూపంబు సూపి యిట్లనియె 'నయ్యా! నీవు నా చేత విషపీడితుండ నైతి నని దుఃఖింపవలదు; ని న్నొరు లెఱింగిన నెగ్గగుం గావున వికృతశరీరుం జేసితి; నెంతకాలంబు నీ శరీరంబున నా విషం బుండు నంతకాలంబును నీకు విషోరగ రాక్షస పిశాచ శత్రునివహంబువలని భయంబు లేదు; సర్వ సంగ్రామజయంబును భార్యాసంగమంబును నెప్పటిరాజ్యవిభవంబును నగు; నీ కెప్పుడేని నిజరూపంబు సేకొన నిష్టం బయ్యె నప్పుడ నన్నుం దలంపు; మీ వస్త్రంబు నీయొద్దకు వచ్చు; దీని ధరియించుడు నిజరూప ప్రాప్తి యగు' నని వరం బిచ్చి వెండియు నిట్లనియె. 128**

**ప్రతిపదార్థం:** నన్ను; రక్షించినన్= కాపాడితే; నీకున్= నీకు; ప్రియంబు= మేలు; చేయనోపుదున్= చేయగలను; అనినన్= అని చెప్పగా; వానిన్= ఆ కర్కోటకుడిని; ఎత్తికొని పోవన్= మోసికొనిపోవటానికి; చులుకనై+అంగుష్ఠ, ప్రమాణ, దేహుండై= తేలికఅయి బొటనవ్రేలంత కొలత గల శరీరం కలవాడై; ఉన్నన్= ఉండగా; ఎత్తికొని= లేవదీసి తన మూపుపై పెట్టుకొని; అతి, త్వరిత, గతిన్= మిక్కిలి వేగం గల నడకతో; అరిగి= వెళ్ళి; తాప వర్జితంబు+ఐన= వేడి లేనిదైన; ఒక్క, సరోవర, సమీపంబునన్= ఒక సరస్సు దగ్గరగా; విడువన్+పోయినన్= విడిచిపెట్టటానికి సిద్ధం కాగా; ఇంకను= ఇంకా అదనంగా; పది, అడుగులు+అరుగుము= పదిఅడుగులు వెళ్ళుము; నీకు, శ్రేయస్+ప్రాప్తిన్+చేసెదన్= నీకు మేలుకలిగేట్లు చేస్తాను; అనినన్= అనిచెప్పగా; అడుగులు+ఎన్నుకొనుచున్= అడుగులు లెక్కపెట్టుకొంటూ; అరిగి= వెళ్ళి; పది+అగు+అడుగు+అప్పుడు= పదవ అడుగు వేసేటప్పుడు; ఆ+పాముచేత; దష్టుండు+ఐ= కరువబడినవాడై; తన రూపంబు= తన ఆకారం; విడిచి= వీడి; వికృత రూపంబుతోన్= వికారమైన ఆకారంతో; ఉన్నన్; ఆ+నలునకున్; కర్కోటకుండు; ఆత్మ, రూపంబు+చూపి= తన

నిజస్వరూపం ప్రదర్శించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అయ్యా!= ఆర్యా!; నీవు, నా, చేత; విష. పీడితుండను+ఐతిని+అని= విషంచేత బాధించబడినవాడిని అయ్యానని; దుఃఖింపవలదు= పరితపించవద్దు; నిన్ను+ఒరులు= నిన్ను ఇతరులు; ఎఱింగినన్= తెలిసికొంటే; ఎగ్గు+అగున్+కావునన్= కీడు కలుగుతుంది కనుక; వికృత శరీరున్+చేసితిన్= వికారమైన దేహం కలవాడినిగా చేశాను; ఎంతకాలంబు= ఎంతకాలం; నీ, శరీరంబునన్= నీ శరీరంలో; నా, విషంబు+ఉండున్= నా విషం ఉంటుందో; అంత, కాలంబును= అన్నినాళ్ళును; నీకు; విష+ఉరగ, రాక్షస, పిశాచ, శత్రు, నివహంబు, వలని= విషసర్పాలనుండి, రాక్షసులనుండి, దయ్యాలనుండి, విరోధుల సముదాయంనుండి; భయంబు లేదు; సర్వ, సంగ్రామ, జయంబును= అన్ని యుద్ధాలలో గెలుపున్నూ; భార్యా, సంగమంబునున్= భార్యతో కలయికయున్నూ; ఎప్పటి, రాజ్య, విభవంబునున్= మునుపటి రాజ్యంయొక్క వైభవం(సంపద) లభించటమున్నూ; అగున్= కలుగుతాయి; నీకు+ఎప్పుడు+ఏని= నీకు ఏ సమయంలోనైనా; నిజరూపంబు= అసలైన ఆకారం; చేకొనన్+ఇష్టంబు+అయ్యెన్= స్వీకరించ కోరిక కలిగితే; అప్పుడు+అ= ఆ క్షణంలోనే; నన్నున్+తలంపుము= నన్ను స్మరించుము; ఈ, వస్త్రంబు= ఈ ఉత్తరీయం; నీ+ఒద్దకున్= నీ దగ్గరకు; వచ్చున్= చేరుతుంది; దీని; ధరియించుడు= ఈ వస్త్రాన్ని ధరించగానే; నిజ, రూప, ప్రాప్తి+అగున్= అసలు ఆకారం ఏర్పడుతుంది; అని; వరంబు+ఇచ్చి= వరాన్ని అనుగ్రహించి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'నన్ను రక్షించుము. నీకు మేలు చేస్తాను' అని కర్కోటకుడు కోరగా, నలుడు వాడిని ఎత్తుకొన్నాడు. కర్కోటకుడు అప్పుడు బొటనవ్రేలి కొలతకు సరిపోయే దేహం కలవాడై ఎత్తుకొనటానికి సులువుగా మారాడు. నలుడు ఆ కర్కోటకుడిని ఎత్తుకొని, త్వరగా వెళ్ళి చల్లని ఒక సరోవరం సమీపంలో విడవటానికి ప్రయత్నించగా, అతడు మరి పదిఅడుగులు వేయుమనిన్నీ, తాను నలుడికి శ్రేయస్సును చేకూర్చుతా నని న్నీ చెప్పాడు. అంతట నలుడు లెక్కపెట్టుకొంటూ అడుగులు వేస్తున్నపుడు పదవఅడుగు వేసేటప్పటికి కర్కోటకుడు అతడిని కాటు వేశాడు. సర్పదష్టుడైన (కరవబడిన) నలుడు వికృతరూపుడు అయినాడు. కాని, కర్కోటకుడు నలుడికి తన నిజరూపాన్ని చూపి ఇట్లా చెప్పాడు: 'ఆర్యా! నీవు నాచేత కరవబడినందుకు విచారించకుము. ఇప్పుడు నీవు వికృతరూపుడ వవటమే నీకు మేలు. నిన్ను ఎవరైనా గుర్తిస్తే నీకే కీడు. నా విషం నీ శరీరంలో ఉన్నంతకాలం నీకు విషసర్పాలభయం గాని, పిశాచ రాక్షస భీతిగాని, శత్రుభయం గాని ఉండదు. నీకు అన్ని యుద్ధాలలో విజయం కలుగుతుంది. భార్యాసంగమం కలుగుతుంది. పూర్వపు రాజ్యసంపద తిరిగి లభిస్తుంది. నీకు ఎప్పుడు అసలు ఆకృతి కావాలని అనిపిస్తుందో ఆ క్షణం నీ తొల్లిటి ఆకృతి నీకు లభించగలదు. అప్పుడు నన్ను స్మరిస్తే చాలు. నీ దగ్గరకు ఈ వస్త్రం వస్తుంది. ఈ వస్త్రాన్ని కప్పుకొనగానే నీకు అసలు రూపం సంప్రాప్తం అవుతుంది' - అని వరమిచ్చి ఇంకా ఇట్లా పలికాడు.

**విశేషం:** ఇందులో ప్రస్తావించబడిన అంశాలు: 1. సర్పవిషంచేత వికృతరూపం సంప్రాప్తించటం 2. ఆ విషం విరిగిన పిమ్మట తిరిగి తొల్లిటి రూపం సంప్రాప్తించటం, ఇది కేవలం కవితాకల్పన కాదని అనేవారున్నారు. ఇది భావిపరిశోధనవలన తేలవలసిన అంశం. 3. కర్కోటకపాత్రకు భారతదేశంలో వచ్చిన ప్రాముఖ్యం నిరుపమానం. మేలు చేసిన వాడికి వెనువెంటనే కీడుచేసేవాడికి కర్కోటక శబ్దం పర్యాయపదమైంది. కాని, ఇక్కడ నలుడికి కర్కోటకుడు 'కీడు' రూపంలో 'మేలు' చేశాడు.

**మధ్యాక్కర.**

**'ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁ డనెడు మహీశుఁ డిక్ష్వాకు**
**కులజుండు నీకు సేవ్యుం డగు; నతనిఁ గొలిచి యుం దుండు;**

**నెలకొని యతనికి నశ్వహృదయ మనెడి విద్య యిచ్చి,**
**వెలయ నతనిచేత నక్షహృదయ మ న్విద్యఁ జేకొనుము. 129**

**ప్రతిపదార్థం:** ఇలన్= భూమిలో; ప్రసిద్ధుఁడు= పేరుకెక్కినవాడు; ఋతుపర్ణుఁడు+అనెడు= ఋతుపర్ణుడనే; మహీ+ ఈశుఁడు= భూభర్త(మహారాజు); ఇక్ష్వాకు, కులజుండు= ఇక్ష్వాకువంశంలో పుట్టినవాడు; నీకు, సేవ్యుండు+అగున్= నీకు సేవింపదగినవాడు అవుతాడు; అతనిన్+కొలిచి= అతడిని సేవించి; అందు+ఉండు= అచట ఉండుము; నెలకొని= అచట ఉండి; అతనికిన్; అశ్వ, హృదయము+అనెడి, విద్య= అశ్వహృదయం, అంటే గుర్రాల స్వభావం తెలిసికొనే విద్య; ఇచ్చి= అతనికి నేర్పి; వెలయన్= ఒప్పేటట్లుగా; అతనిచేతన్= అతడినుండి; అక్ష, హృదయము, అన్, విద్యన్= అక్షహృదయం (అంకగణిత రహస్యం తెలిసికొనటం) అనే విద్యను; చేకొనుము= స్వీకరించుము.

**తాత్పర్యం:** 'ఋతుపర్ణుడనే మహారాజు భూమండలంలో సుప్రసిద్ధుడు, ఇక్ష్వాకువంశంలో పుట్టినవాడు. అతడు నీచేత కొలువదగినవాడు. కాబట్టి, నీవు అతడిని సేవిస్తూ ఉండవలసింది. అతడికి నీ అశ్వహృదయవిద్యను ఉపదేశించి, నీవు అతడినుంచి అక్షహృదయవిద్యను స్వీకరించుము.

**విశేషం:** ఈ పద్యం పెక్కు వ్రాతప్రతులలో పెక్కురీతుల కన్పిస్తున్నది. వృత్తలక్షణానికి ఈ ఆశ్వాసంలోని 22వ పద్యం విశేషవ్యాఖ్య చూడండి.

**వ. మఱియు బాహుకుం డను నామంబుతో సూతవృత్తి నుండు' మని హితోపదేశంబు సేసి కర్కోటకుం డదృశ్యుం డైనఁ, దద్వచనంబున నలుం డయోధ్యాపురంబునకుం జని ఋతుపర్ణుం గని 'యేను బాహుకుం డనువాఁడ నశ్వశిక్షయందుఁగుశలుండ; నన్నసంస్కారంబులు శిల్పంబులుఁబెక్కువిధంబులరచియింప నేర్తు; భవత్సేవార్థినై వచ్చితి' ననిన ఋతుపర్ణుం డిట్లనియె. 130**

**ప్రతిపదార్థం:** మఱియు= అంతేకాక; బాహుకుండు+అను, నామంబుతోన్= బాహుకుడనే పేరుతో; సూత, వృత్తిన్+ఉండుము= రథచోదకుడివిగా ఉండుము; అని; హిత+ఉపదేశంబు= హితవు చెప్పటం; చేసి; కర్కోటకుండు; అదృశ్యుండు+ఐనన్= అంతర్ధానం చెందగా; తద్+వచనంబునన్= అతడిమాట చొప్పున, అంటే కర్కోటకుడి వాక్యానుసారం; నలుండు; అయోధ్యా, పురంబునకున్+చని= అయోధ్యాపట్టణానికి వెళ్ళి; ఋతుపర్ణున్+కని= ఋతుపర్ణుడిని చూచి; ఏను= నేను; బాహుకుండు+అనువాఁడన్= బాహుకుడనేవాడిని; అశ్వ, శిక్ష+అందున్= గుర్రాలపెంపకంలో; కుశలుండన్= నేర్పరిని; అన్న, సంస్కారంబులు= వంటలుచేయటం; శిల్పంబులున్= విగ్రహాలను రూపొందించటం; పెక్కువిధంబులన్= ఎన్నోరీతులలో; రచియింపనేర్తున్= కూర్చగలను; భవత్+సేవా+అర్థిని+ఐ= నీ దగ్గర కొలువుచేయటానికై; వచ్చితిన్= అరుదెంచాను; అనినన్= అని చెప్పగా; ఋతుపర్ణుండు+ ఇట్లు+అనియెన్= ఋతుపర్ణుడు ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** మరియు బాహుకుడు అనే పేరు పెట్టుకొని రథసారథివిగా ఉండు'- మని హితవు చెప్పి కర్కోటకుడు మాయమయ్యాడు. ఆ కర్కోటకుడి వచనానుసారం నలుడు అయోధ్యాపురికి వెళ్ళి ఋతుపర్ణుడిని సందర్శించి, 'నేను బాహుకుడనే వాడిని. అశ్వశిక్షలో నేర్పరిని. పాకకళలో నిపుణుడిని. శిల్పవిద్యా నిష్ణాతుడిని; నీ దగ్గర సేవ చేయటానికి వచ్చాను' - అని చెప్పగా ఆతడితో ఋతుపర్ణుడు ఈ విధంగా అన్నాడు.

**క. 'నాయొద్ద నుండుదేని మ । దీయ రథాశ్వములకును ద్రుతిని శీఘ్రముగాఁ**
**జేయుము' నావుడు 'నట్టుల । చేయుదు' నని నలుఁడు వాని సేవించెఁ దగన్. 131**

**ప్రతిపదార్థం:** నా+ఒద్దన్= నా కడ; ఉండుదు+ఏని= ఉన్నట్లయితే; మదీయ, రథ+అశ్వములకును= నా రథానికి పూన్చే గుఱ్ఱాలకు; ద్రుతిని= నడకను; శీఘ్రముగాన్= వేగమయ్యేటట్లు; చేయుము; నావుడున్= అనగా విని; అట్టుల= ఆ విధంగానే; చేయుదును+అని= చేస్తానని; నలుఁడు; వాని= అతడిని (ఋతుపర్ణుడిని); తగన్= ఒప్పునట్లుగా; సేవించెన్= కొలిచాడు.

**తాత్పర్యం:** 'నీవు నా ఒద్ద ఉన్నట్లయితే నా రథాశ్వాల గమనాన్ని వేగంచేసి తీర్చిదిద్దుము' అని ఋతుపర్ణుడు చెప్పగా 'అట్లాగే చేస్తాను' అని నలుడు ఆతడి కొలువులో చేరాడు.

**వ. ఇట్లు ఋతుపర్ణునొద్దనశ్వాధ్యక్షుండయి దుష్టాశ్వంబుల వశంబుఁజేయుచు, నశ్వారోహకుల నారోహణంబుల శిక్షించుచు, రసవంతంబుగ నన్నసంస్కారంబు సేయుచు, ఋతుపర్ణుచేత నియుక్తు లయిన వార్ష్ణేయ జీవలులు దనకు సహాయులుగాఁ బ్రచ్ఛన్నుండై యుండి యొక్కనాఁడు. 132**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ఋతుపర్ణ+ఒద్దన్= ఋతుపర్ణుడి దగ్గర; అశ్వ+అధ్యక్షుండు+అయి= గుఱ్ఱాలకు అధినేత అయి; దుష్ట+అశ్వంబులన్= చెడ్డగుఱ్ఱాలను; వశంబున్+చేయుచున్= లొంగదీస్తూ; అశ్వ+ఆరోహకులన్= రౌతులను; ఆరోహణంబులన్= గుఱ్ఱాలపై స్వారీలు చేయటంలో; శిక్షించుచున్= నేర్పుతూ; రసవంతంబుగన్= రుచికరంగా; అన్న, సంస్కారంబు+చేయుచున్= ఆహార పదార్థాలను వండుతూ; ఋతుపర్ణు, చేత= ఋతుపర్ణుడిచేత; నియుక్తులు+అయిన= నియమించబడిన వారయిన; వార్ష్ణేయ, జీవలులు= వార్ష్ణేయుడు, జీవలుడు; తనకు, సహాయులు+కాన్= తనకు తోడ్పడేవారు కాగా; ప్రచ్ఛన్నుండు+ఐ= ఇతరులకు తెలియనట్టివాడై; ఉండి; ఒక్కనాఁడు= ఒకానొక రోజున.

**తాత్పర్యం:** ఈ విధంగా నలుడు ఋతుపర్ణుడి దగ్గర గుఱ్ఱాలకు అధినేత అయ్యాడు. అతడు చెడుగుఱ్ఱాలను లొంగదీసేవాడు. రౌతులకు స్వారి చేయటం నేర్పేవాడు. అంతేకాక, రుచికరాలైన ఆహారపదార్థాలు వండి వడ్డించేవాడు. ఋతుపర్ణుడిచేత నియోగించబడిన వార్ష్ణేయ జీవలులు నలుడికి తోడ్పడేవారు. ఈ విధంగా నలుడు అజ్ఞాతవాసం చేశాడు. ఒకనాడు.

**సీ. 'ఇభరాజగమన! నీ వెందుల కరిగి? త । త్యురుకుచభార! యెందున్నదాన?**
**వబల! యెవ్వరిచేత నడవులలోఁ బట్టు । వడి? తశనాపేక్షఁ బఱచుచున్న**
**యుగ్రమృగంబుల యుదరంబులో నున్న । దానవే? నీ తల్లిదండ్రులొద్ద**
**ధృతి నున్న దానవే? దేశాంతరంబుల । నున్న దానవె?' యంచు నుదితమదన**

**ఆ. హతి విమోహితాత్ముఁడై హృదయేశ్వరిఁ । దలఁచి రాత్రు లెల్లఁ దాపమునను**
**నిద్రలేక వంది నిట్టూర్పు లూర్చుచు । నుండె నలుఁడు శోక ముత్కటముగ. 133**

**ప్రతిపదార్థం:** ఇభరాజ, గమన!= (ఓ దమయంతీ!) (ఇభ= ఏనుగు, ఇభరాజము= మదపుటేనుగు, ఇభరాజగమన= మదపుటేనుగునడకవంటి నడక గలది); నీవు; ఎందులకు+అరిగితి= ఎక్కడికి వెళ్ళావు?; అతి+ఉరు, కుచ, భార= మిక్కిలి పెద్దవైన స్తనాలయొక్క భారంగలదానా!; ఎందు+ఉన్నదానవు= ఎచట ఉన్నావు?; అబల= బలంలేని మగువా! (అబల-సాధారణ స్త్రీ వాచకంగా గ్రహించాలి); ఎవ్వరిచేతన్= ఎవరిచేత; అడవులలోన్= అరణ్యాలలో; పట్టు+పడితి= పట్టుబడి ఉన్నావు, అంటే

నిన్ను అరణ్యాలలో ఎవరు పట్టుకొన్నారు?; అశన+అపేక్షన్= ఆహారం కొరకై; పఱచుచున్న= వడిగా తిరుగాడుతున్న; ఉగ్ర మృగంబుల= క్రూరజంతువుల; ఉదరంబులోన్= పొట్టలో; ఉన్నదానవే?; నీ తల్లిదండ్రుల+ఒద్ద= నీ జననీజనకుల కడ; ధృతిన్= ధైర్యంతో; ఉన్నదానవే?; దేశాంతరంబులన్= ఇతరప్రదేశాలలో; ఉన్నదానవె? = నివసిస్తున్నావా!; అంచున్= అంటూ; ఉదిత, మదన, హతిన్= ఉదయించిన మన్మథ తాపంచేత; విమోహిత+ఆత్ముఁడు+ఐ= మిక్కుటమైన మోహంచేత ఆవరించబడిన ఆత్మకలవాడై; హృదయ+ఈశ్వరిన్+తలఁచి= ప్రేయసి అయిన దమయంతినిగురించి తలపోసి; రాత్రులు+ఎల్లన్= రేలు అన్నింటిలో; నిద్రలేక; తాపమునను= బాధచేత; వంది= దుఃఖించి; నిడు+ఊర్పులు+ఊర్చుచున్= దీర్ఘనిశ్వాసాలు వెలికి విడుస్తూ; శోకము+ఉత్కటముగన్= పరితాపం అతిశయించగా; నలుఁడు= ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** 'మత్తేభంనడక వంటి నడక గలదానా! (దమయంతీ!), నీవు ఎక్కడికి వెళ్ళావోకదా! మిక్కిలి పెద్దవైన స్తనాల బరువు గలదానా ఎక్కడ ఉన్నావో? ఓ అబలా! అడవులలో నీవు ఎవరిచేత పట్టుపడ్డావో? ఆహారంకొరకు వడిగా తిరుగుతున్న క్రూర జంతువుల పొట్టలలో ఉన్నావా? నీ తల్లిదండ్రుల ఒద్ద దిటవుగా ఉన్నావా? లేక వేరే ప్రదేశాలలో ఉన్నావా?' అంటూ మదనతాపంతో రాత్రులలో నిదురలేక పలవిస్తూ నిట్టూర్పులు విడుస్తూ మిక్కిలి పరితపిస్తూ నలుడు ఉన్నాడు.

**వ. అతని ప్రలాపంబు విని యొక్కనాఁడు జీవలుం డాత్మగతంబున. 134**

**ప్రతిపదార్థం:** అతని= ఆతడి, అంటే బాహుకుడి; ప్రలాపంబు= పలవింత; విని= ఆలకించి; ఒక్కనాఁడు= ఒకానొకరోజున; జీవలుండు= జీవలుడు; ఆత్మగతంబునన్= తనలోతాను.

**తాత్పర్యం:** ఆ బాహుకుడి పలవింతలు విని ఒకనాడు జీవలుడు తనలో తాను.

**క. 'అఱపొఱడు కుఱుచ చేతులు, । నొఱవ శరీరంబుఁ గలిగి యొరులకుఁ జూడం**
**గొఱగా కుండియు, మన్మథు । నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రియుఁడై. 135**

**ప్రతిపదార్థం:** అఱ, పొఱడు, కుఱుచ, చేతులున్= సగం గూనితో పొట్టిచేతులున్నూ; ఒఱవ శరీరంబున్= వికారమైన దేహమున్నూ; కలిగి; ఒరులకున్= ఇతరులకు; చూడన్= చూడటానికి; కొఱగాక+ఉండియు= ప్రియం గాకుండ ఉండికూడా, అంటే చూడటానికి అసహ్యంగా ఉండికూడా; ఇతండు= ఇతడు (ఈ బాహుకుడు); యువతీప్రియుఁడు+ఐ= జవరాలిని ప్రేమించినవాడై; మన్మథు+ఒఱపులన్= మన్మథతాపంలో; పడియెడున్= పడుతున్నాడు (బాధపడుతున్నాడు).

**తాత్పర్యం:** 'ఈ బాహుకుడి చేతులా పొట్టివి. ఈ గూనివాడి దేహమా వంకరటింకర అయినట్టిది. ఇతరులకు చూడటానికి కూడ కొఱగానట్టిది. ఈ కురూపి ఒక జవరాలిని ప్రేమించటమా? ప్రేమించి మన్మథతాపంతో బాధపడటమా? ఎంత విడ్డూరం?

**వ. వీనిచేతఁదలంపంబడియెడు వనిత వీనికంటె లెస్స కాకున్నె!' యనుచు బాహుకునొద్దకు వచ్చి 'నీ తలంచుచున్న భార్యకు, నీకు నేల వియోగం బయ్యె?' నని యడిగిన వానికి బాహుకుం డిట్లనియె. 136**

**ప్రతిపదార్థం:** వీనిచేతన్= ఈ బాహుకుడిచేత; తలంపన్+పడియెడు= స్మరించబడేటి; వనిత= మగువ; వీనికంటెన్= ఈ కురూపి అయిన బాహుకుడి కంటె; లెస్స= గొప్పది; కాక+ఉన్నె= కాకుండునా?; అనుచున్= అని ఆలోచిస్తూ; బాహుకు+ఒద్దకు=

బాహుకుడి దగ్గరకు; వచ్చి= అరుదెంచి; నీ తలంచుచున్న= నీవు స్మరిస్తున్న; భార్యకున్= పెండ్లానికి; నీకున్= నీకు; ఏల= ఎందుకు; వియోగంబు+అయ్యెన్= ఎడబాటు కలిగింది; అని= అంటూ; అడిగినన్= ప్రశ్నించగా; వానికిన్= ఆతడికి (ఆ జీవలుడికి); బాహుకుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆహా! వీడిచేత ప్రేమించబడిన వనిత వీడికంటె గొప్పది కాకుండా ఉంటుందా? ఈతడే ఇంత కురూపి అయితే ఇక ఆమె ఎంతటి కురూపిణి కావాలి?'- అంటూ జీవలుడు తలపోసి, బాహుకుడికడకు వచ్చి 'నీవు స్మరిస్తున్న నీ భార్యకూ నీకూ అసలు ఎడబాటు ఎందుకు కలిగింది?' అని ప్రశ్నించాడు. వాడికి బాహుకుడు ఇట్లా బదులు చెప్పాడు.

**విశేషం:** (1) బాహుకుడు ఒకనాడు జగదేకవీరుడు. భువనైక మోహనుడు. ఈనాడు ఒరులు చూడటానికి కొరగాని కురూపి. ఎంతటి మార్పు? ఎంతటి విధిపరిపాకం? సేవకవృత్తిలో ఉండే జీవలుడికి గూడ బాహుకుడిని చూస్తే జాలి కలుగలేదు సరిగదా అతడు ఈతడిని అపహాస్యం చేశాడుకూడా! (2) ఇక జీవలుడికి బాహుకుడి ప్రేయసినిగురించి ఏమి తెలియును? కాని, ఇట్టి కురూపి భార్య ఎంతటి కురూపిణి కావాలి?'- అనేదే అతడి ఆలోచన. కాని, నిజానికి బాహుకుడిభార్య జగదేకసుందరి. దేవతలు సయితం ఆమెను వలచి ఆమె పొందుకై ఉవ్విళ్ళు ఊరారు. అది విషయాంతరం. జీవలుడు కలలోకూడ ఇట్టి పరిణామం ఊహించుకోలేడు. నలదమయంతుల చరిత్రలో ఏర్పడిన 'మలుపు' చదువరుల గుండెలు కరిగింపచేసేటటువంటిది. కథాశిల్ప సౌష్ఠవంలో విశ్వసాహితీ జగత్తులో నలోపాఖ్యానానికి గల విశిష్టత నిరుపమానమైనది.

**ఆ. 'నన్నుఁ జూచి నగరె? నలినాక్షి నా కేల? విప్రయోగ మేల? వినవె తొల్లి**
**యేలయో యెఱుంగ నేను, మందప్రజ్ఞుఁ । డను భటుండు దన లతాంగిఁ బాసి. 137**

**ప్రతిపదార్థం:** నన్నున్+చూచి, నగరె?= నన్ను చూచి జనులు నవ్వరా?; నలిన+అక్షి= పద్మాలవంటికన్నులు కలది (ప్రేయసి); నాకు+ఏల?= నాకెందుకు?; అంటే నాబోటి కురూపికి ఒక ప్రేయసి కావాలా? (కావాలంటే నన్ను చూచి ప్రజలు నవ్వరా?); (ఇక) విప్రయోగము+ఏల= విరహం ఎందుకు?; ఏలయో, ఎఱుంగన్+ఏను= ఎందుకో నాకేమి తెలుసు; తొల్లి= పూర్వం; వినవె= వినవా? మందప్రజ్ఞుఁడు+అను, భటుండు= మందప్రజ్ఞుడనే సైనికుడు; తన, లతా+అంగిన్+పాసి= తన లతవంటి దేహం కలిగిన ప్రేయసిని ఎడబాసి.

**తాత్పర్యం:** 'నన్ను చూచి నవ్వరా? నాకు ఒకప్రేయసి కూడానా? అసలు ప్రేయసే లేనప్పుడు ఇక వియోగం అనేమాట ఎందుకుంటుంది? నీవు వినలేదా? పూర్వకాలంలో ఏకారణంచేత జరిగిందో నాకు తెలియదు కాని, మందప్రజ్ఞుడు అనే సైనికుడు తనప్రేయసిని ఎడబాసి.

**విశేషం:** ఈ మాటలనుబట్టి బాహుకుడికి తనకు సంక్రమించిన వైరూప్యం తెలిసినట్లే అనిన్నీ, తనవైరూప్యాన్ని గురించి చుట్టూ ఉన్నవారికి సుస్పష్టంగా తెలిసి ఉన్నట్లుకూడ తాను గ్రహించినట్లున్నూ తేలుతున్నది. అయితే, ప్రత్యక్షంగా తన విరహవేదనను జీవలుడు గుర్తించాడుకదా! ఇక తా నెట్లా తప్పుకొనగలడు? నలుడు పోగొట్టుకొన్నది బాహ్యరూపమేకాని ఆంతరంగికమైన తెలివితేటలు మాత్రం కావుకదా! అందుచేత నలుడు సద్యఃస్ఫూర్తితో తన ప్రలాపం తనది కాదనీ, భార్యావియుక్తుడైన మందప్రజ్ఞుడి అభిభాషణాన్ని తాను కాలక్షేపంకొరకై అనుసరించా నని సమ్యక్సమాధానం చెప్పి తప్పించుకొన్నాడు.

**వ. దాని నన్వేషించి యెందునుం గానక దుఃఖితుండై ప్రలాపించినం దత్ప్రలాపం బేను ననుకరించితి' నని చెప్పి యి ట్లయోధ్యాపురంబునఁ బ్రచ్ఛన్నుండై బాహుక నామంబుతో నలుం డుండె; నంత నిట విదర్భేశ్వరుండు నలురాజ్యభ్రంశంబు విని కూఁతురు నల్లుండు నెట వోయిరో? యెందున్నవారో? యని శోకించి. 138**

**ప్రతిపదార్థం:** దానిన్= దానిని (తనభార్యను); అన్వేషించి= వెదకి; ఎందునున్+కానక= ఎచటను చూడక; దుఃఖితుండు+ఐ= పరితాపం చెందినవాడై; ప్రలాపించినన్= పెద్దగా విలపించగా; తద్+ప్రలాపంబున్= ఆతడి పలవరాన్ని; ఏనున్= నేను; అనుకరించితిన్= నటించాను; అనిచెప్పి; ఇట్లు= ఈ విధంగా; అయోధ్యాపురంబునన్= అయోధ్య అనే నగరంలో; ప్రచ్ఛన్నుండు+ఐ= ఇతరులకు తెలియబడనట్టివాడై; బాహుక నామంబుతోన్= బాహుకుడు అనే పేరుతో; నలుండు+ఉండెన్= నలుడు ఉండినాడు; అంతన్= అటుపిమ్మట; ఇట= ఇచట; విదర్భ+ఈశ్వరుండు= విదర్భరాజు; నలు= నలుడియొక్క; రాజ్యభ్రంశంబు= రాజ్యం తప్పిపోవటం; విని= ఆలకించి; కూఁతురు= కుమార్తె; అల్లుండున్= అల్లుడున్నూ; ఎట= ఎచటకు; పోయిరో= వెళ్ళారో; ఎందు+ఉన్నవారో= ఎచట ఉన్నారో; అని; శోకించి= దుఃఖించి (చింతించి).

**తాత్పర్యం:** తన భార్యకొరకు వెదకి వెదకి, ఆమె కన్పించకపోవటంచేత మిక్కిలి పరితపించినవాడై కలవరించాడు. నేను ఆతడి ప్రలాపాలను అనుకరించాను, అంతే. అవి మందప్రజ్ఞుడి మాటలు'- అని చెప్పి నలుడు తప్పించుకొన్నాడు. అట్లా ఆ అయోధ్య అనే పట్టణంలో మారువేషంతో బాహుకుడు అనే మారుపేరుతో నలుడు బ్రతుకు గడుపుతున్నాడు. అంత, ఇట, విదర్భలో భీమరాజు- నలుడు తనరాజ్యం పోగొట్టుకొన్నాడని విని, కూతురు, అల్లుడు ఎక్కడికి వెళ్ళారో, ఎచట ఉన్నారో?- అని చింతిస్తూ ఆందోళనపడుతున్నాడు.

**క. వారల రోయఁగఁ బంచె న । పారబలుం డిష్టులైన బ్రాహ్మణుల సదా**
**చారుల విద్వాంసుల స । త్కారంబులఁ దనిపి వారిఁ గడు నెయ్యమునన్. 139**

**ప్రతిపదార్థం:** అపారబలుండు= గొప్పబలం కలవాడు (విదర్భరాజు); ఇష్టులు+ఐన= తనకు అనురక్తులైన; బ్రాహ్మణుల= విప్రుల; సత్+ఆచారుల= మంచి ప్రవర్తన కలవారిని; విద్వాంసులన్= బాగుగా చదువుకొన్నవారిని; సత్, కారంబులన్= బహుమానాలతో; తనిపి= సంతృప్తిపరచి; వారిన్= ఆ బ్రాహ్మణులను; కడు, నెయ్యమునన్= మిక్కుటమైన స్నేహంతో; వారలన్= వారిని, అంటే నలదమయంతులను; రోయఁగన్= వెదకటానికై; పంచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** మితిలేని బలంకలవాడైన విదర్భరాజు భీముడు, తనకు అనురక్తులు, మంచి నడవడి కలవారు, పెద్ద చదువులు చదువుకొన్నవారు అయిన బ్రాహ్మణులను బహుమానాలతో సంతృప్తులను కావించి, మిక్కుటమైన స్నేహంతో నలదమయంతులను వెదకటానికై నియోగించాడు.

**వ. మఱియు నలదమయంతు లున్నచో టెఱింగి వచ్చిన వారికి వెయ్యేసి గద్యాణంబు లిత్తు ననియు, వారలం దోడ్కొని వచ్చినవారికి గోసహస్రంబులు నగ్రహారంబులు నిత్తు ననియుఁ బలికి పంచిన. 140**

**ప్రతిపదార్థం:** మఱియు= అంతేకాక; నల, దమయంతులు+ఉన్నచోటు+ఎఱింగి= నలదమయంతులు ఉన్నచోటు తెలుసుకొని; వచ్చినవారికి; వేయి+ఏసి= (ఒక్కొక్కరికి) వెయ్యేసంతున; గద్యాణంబులు+ఇత్తున్+అనియు= వరహాలు ఇస్తాననీ; వారలన్+తోడ్కొని= ఆ నలదమయంతులను వెంటపెట్టుకొని; వచ్చినవారికి; గోసహస్రంబులున్= వేలకొలది ఆవులును; అగ్రహారంబులున్+ఇత్తును+అనియున్= అగ్రహారాలు ఇస్తాననీ; పలికి= చెప్పి; పంచినన్= పంపగా.

**తాత్పర్యం:** విదర్భరాజు బ్రాహ్మణులకు చెప్పినమాటలు: (1) నలదమయంతులు ఉన్నచోటు తెలిసికొని వచ్చిన వారికి ఒక్కొక్కరికి వేయి గద్యాణాలు పారితోషికంగా ఇవ్వబడతాయి. (2) నలదమయంతులను తమతోపాటు వెంటబెట్టుకొని వచ్చినవారికి వేలకొలది గోవులు, అగ్రహారాలు, బహుమానాలుగా ఇవ్వబడతాయి.

**విశేషం:** (1) గద్యాణం తెలుగుదేశంలో అంటే వేంగివిషయంలో చాళుక్యకాలంలో చలామణిలో ఉన్న బంగారునాణెం. గద్యాణప్రసక్తి సంస్కృత మూలభారతంలో లేదు. నన్నయభట్టు సమకాలీనమైన నాణెమును పేర్కొనటం సహజమే. కాని, గద్యాణాలు వ్యాసుడికాలంలోగాని, నలదమయంతుల కాలంలోగాని ఉన్నట్టివికావు. సారస్వతానికి సమకాలీన సమాజానికి గల బింబప్రతిబింబ భావానికి ఇది ఒక ఉదాహరణంగా గ్రహించవచ్చును. (2) అగ్రహారాలు:- అగ్రహారం అనే శబ్దం చాళుక్యులకాలంలో విశేష ప్రాచుర్యం అందింది. అగ్రహారం అంటే వేదవేదాంగపారంగతులైన బ్రాహ్మణులకు రాజుగారు సమర్పించే బహుమానగ్రామం. చాళుక్యులు బ్రాహ్మణులకు అగ్రహారాలను సర్వకర పరిహారంగా అంటే పన్నులు అన్నియు తీసివేసి దానంచేసేవారు. ఆంధ్రమహాభారత రచనంలో నన్నయభట్టుకు తోడ్పడిన నారాయణభట్టుకు నందంపూడి గ్రామాన్ని అగ్రహారంగా చేసి, సూర్యగ్రహణంనాడు 4-11-1054 తేదీన రాజరాజనరేంద్రుడు దానంచేశాడు. అగ్రహార ప్రసక్తి మూల సంస్కృత భారతంలో లేదని వేరుగా చెప్పనక్కరలేదు.

### చేదిపురంబున సుదేవుఁడను బ్రాహ్మణుఁడు దమయంతి నెఱుంగుట (సం. 3-65-5)

**క. జగతీచక్రమునం గల । నగర మహాగ్రామ పట్టణంబులు కలయన్**
**జగతీదేవోత్తము లి । మ్ముగ రోసిరి నిఖిల దేశముల కరిగి వడిన్. 141**

**ప్రతిపదార్థం:** జగతీ, దేవ+ఉత్తములు= బ్రాహ్మణశ్రేష్ఠులు; వడిన్= వేగంగా; నిఖిల, దేశములకు= అన్నిదేశాలకు; అరిగి= వెళ్ళి; జగతీ, చక్రమునన్+కల= భూమండలంలో ఉండే; నగర, మహాగ్రామ, పట్టణంబులు= రాజధానులవంటి నగరాలు, పెద్దపల్లెలు, పట్టణాలు; కలయన్= అంతటను; ఇమ్ముగన్= సంపూర్ణంగా; (బాగుగా); రోసిరి= వెదికారు.

**తాత్పర్యం:** బ్రాహ్మణోత్తములు వేగంగా నానాదేశాలకు వెళ్ళి, భూచక్రంలో ఉండే నగరాలు, పెద్దపల్లెలు, పట్టణాలు అంతటను సంపూర్ణంగా (నలదమయంతులకొరకు) వెదికారు.

**వ. అందు సుదేవుం డను బ్రాహ్మణుండు చేదిపతియైన సుబాహుపురంబునకుం జని పుణ్యాహంబు సేయింపం బోవు బ్రాహ్మణులతో రాజగృహంబు సొచ్చి; యంతఃపురంబున సునందా సహితయై యున్నదాని ధూమజాల నిబద్ధం బైన యగ్నిప్రభయునుం బోలె నీలాభ్రసంవృతం బైన చంద్రరేఖయుంబోలె బహుపంకనిమగ్నం బైన మృణాళియుంబోలె నేర్పడ కున్ననుం దదీయ భ్రూయుగ మధ్యగతంబైన సూక్ష్మలక్షణం బిమ్ముగా నిరీక్షించి, దాని దమయంతిఁగా నెఱింగి, యాత్మగతంబున 'నిది పతి విముక్తయై శుష్కప్రవాహ యైన నదియునుంబోలె శూన్యకమలయైన నళినియుం బోలె నపేతచూతంబైన వనభూమియుం బోలె నొప్పకుండియుఁ దన పతివ్రతాగుణంబునం జేసి యొప్పుచున్నయది. 142**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ బ్రాహ్మణులలో; సుదేవుండు+అను, బ్రాహ్మణుండు= సుదేవుడు అనే పేరుకల బ్రాహ్మణుడు; చేదిపతి+ఐన= చేదిదేశానికి రాజైన; సుబాహు పురంబునకున్= సుబాహుని రాజధానికి; చని= వెళ్ళి; పుణ్య+అహంబు= పుణ్యమైనదినం- అనే పేరిటి మంగళకరమైన శుభకార్యాన్ని; చేయింపన్+పోవు= చేయించటానికై వెళ్ళే; బ్రాహ్మణులతోన్=

విప్రులతో; రాజ గృహంబు+చొచ్చి= రాజుగారి మందిరం ప్రవేశించి; అంతఃపురంబునన్= రాణివాసంలో; సునందా, సహిత+ఐ= సునంద అనే రాజకుమారితో కలిసి; ఉన్నదాని; ధూమ, జాల, నిబద్ధంబు+ఐన= పొగదొంతరలతో ఉన్నదైన; అగ్ని ప్రభయునున్+పోలె= అగ్నిదీప్తివలె; నీల+అభ్ర, సంవృతంబు+ఐన= నల్లని మేఘాలతో చుట్టుకొనబడిందైన; చంద్రరేఖయున్+పోలెన్= చంద్రవంకవలె; బహు, పంక, నిమగ్నంబు+ఐన= గొప్ప బురదలో మునిగి ఉన్న; మృణాళియున్+పోలెన్= తామరతూడు (తామరకాడలోని దారం) వలె; ఏర్పడక+ఉన్ననున్= స్పష్టంగా తెలియకపోయినను; తదీయ, భ్రూ, యుగ, మధ్యగతంబు+ఐన= ఆమెయొక్క కనుబొమలు రెండింటికి మధ్య ఏర్పడి ఉన్న; సూక్ష్మ, లక్షణంబు= సన్నని గుర్తు; ఇమ్ముగా= చక్కగా; నిరీక్షించి= పరిశీలించి; చూచి; దానిన్= ఆమెను; దమయంతిన్+కాన్+ఎఱింగి= దమయంతి అని తెలిసికొని; ఆత్మ, గతంబునన్= తనలోతాను; ఇది= ఈమె (దమయంతి); పతి విముక్త+ఐ= భర్త నుండి విడివడిందై; శుష్క, ప్రవాహ+ఐన= ఎండిపోయిన నీటిపారుదల కల; నదియునున్+పోలెన్= ఏరువలె; శూన్య, కమల+ఐన= పద్మాలు లేనట్టి; నళినియున్+పోలెన్= తామర తీగవలె; అపేత, చూతంబు+ఐన= మామిడిచెట్టు లేని; వనభూమియున్+పోలెన్= అరణ్యసీమవలె; ఒప్పకుండియున్= శోభించకుండా ఉండి కూడా; తన, పతివ్రతా, గుణంబునన్+చేసి= తన పాతివ్రత్యమహిమచేత; ఒప్పుచున్న+అది= శోభిల్లుతున్నది.

**తాత్పర్యం:** ఆ విధంగా నానాదేశాలకు వెళ్ళిన బ్రాహ్మణులలోనివాడు సుదేవుడు చేదిరాజు సుబాహుడి రాజధానికి చేరి, పుణ్యాహం నిర్వర్తించే బ్రాహ్మణులతో కలసి రాజమందిరంలోకి వెళ్ళి, అచట అంతఃపురంలో సునందతో కలిసిఉండే దమయంతిని చూచాడు. అప్పుడు దమయంతి పొగదొంతరలతో మిళితమైన అగ్నిదీప్తివలె, నల్లని మబ్బులచేత ఆవరించబడిన చంద్రవంకవలె, పెనుబురదలో మునిగిఉన్న తామరతూడువలె అణగి ఉండి గుర్తించటానికి వీలుగాక ఉండింది. కాని, ఆమె కనుబొమల మధ్య ఉండే పుట్టుమచ్చను బట్టి ఆమెను దమయంతిగా ఆ సుదేవుడు గుర్తించాడు. అతడు తనలో తాను ఇట్లా భావించాడు: 'ఈ దమయంతి భర్తనుండి విడివడి నీటిపారుదల ఎండిపోయిన ఏరువలె, పద్మాలు లేని తామరతీగవలె, మామిడిచెట్టు లేని వనసీమ వలె శోభించకుండ ఉండికూడా తన పాతివ్రత్యమహిమచేత ప్రకాశిస్తూ ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **అనపహార్యంబు తేజోమయంబు సర్వ । గుణములకు నలంకారంబు గురుతరంబు**
**భామలకుఁ బతిభక్తియ పరమ మైన । భూషణం; బిట్టివే పెఱ భూషణములు?** **143**

**ప్రతిపదార్థం:** న+అపహార్యంబు= అపహరించటానికి వీలులేనట్టిది; తేజస్+మయంబు= ప్రకాశమానమైనది; సర్వగుణములకున్= సమస్తగుణాలకు; అలంకారంబు= భూషణం వంటిది; గురుతరంబు= గొప్పది; భామలకున్= స్త్రీలకు; పతిభక్తి+అ= భర్తపట్ల కల భక్తియే; పరమము+ఐన= అన్నిటికంటె గొప్పదైన; భూషణంబు= అలంకారం; ఇట్టివి+ఏ= ఇట్టివా?; పెఱ, భూషణములు= ఇతరాలైన అలంకారాలు.

**తాత్పర్యం:** ఆడువారికి పతిభక్తియే గొప్పభూషణాలలో గొప్పభూషణం. పాతివ్రత్యానికి సరిపోలు ఆభరణం ఆడువారికి వేరొకటి లేదు కదా! పతిభక్తియే వారినుండి అపహరించటానికి వీలులేనిది, ప్రకాశమానమైనది, మిక్కిలి గొప్పదైనది, సమస్త సద్గుణాలలోనికెల్ల ఎన్నదగినది అయిన అలంకారవిశేషం.

**వ. రోహిణికిఁ జంద్రసమాగమంబునుంబోలె దీనికి భర్తృసమాగమం బెన్నం డయ్యెడునో? తుల్యశీల వయోరూపాభిజాత్యులైన నలదమయంతు లొక్కట నుండం జూచి విదర్భేశ్వరుం డెన్నఁడు కృతార్థుం డయ్యెడునో?' యంచు నల్లనల్లన డాయవచ్చి దమయంతి కిట్లనియె. 144**

**ప్రతిపదార్థం:** రోహిణికిన్= రోహిణీ నక్షత్రానికి; చంద్ర, సమాగమంబునున్+పోలెన్= చంద్రుడితో సంయోగంవలె; దీనికిన్= ఈ దమయంతికి; భర్తృ, సమాగమంబు= భర్తతో సంయోగం; ఎన్నండు+అయ్యెడునో= ఎప్పుడు జరుగుతుందో; తుల్య, శీల, వయస్+రూప= ఆభిజాత్యులు+ఐన= సమానమైన స్వభావం, ఈడు, అందంలో జోడు, వంశగౌరవం కలవారైన; నలదమయంతులు; ఒక్కటన్+ఉండన్+చూచి= ఒకచోట కలిసి ఉండటం చూచి; విదర్భేశ్వరుండు= విదర్భరాజు; ఎన్నఁడు= ఎప్పుడు; కృత+అర్థుండు= ధన్యుడు; అయ్యెడున్+ఓ= అవుతాడో; అంచున్= అంటూ; అల్లన+అల్లనన్= మెల్లమెల్లగా; డాయవచ్చి= దగ్గరకు చేరి; దమయంతికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** రోహిణీ నక్షత్రానికి చంద్రుడికి జరిగే సంయోగంవలె ఈ దమయంతికి ఎప్పుడు భర్తతో కలయిక జరుగుతుందో? శీలంలో, అందంలో, వంశగౌరవంలో ఈడుజోడు కుదిరిన నలదమయంతులు ఒకచోట కలిసి కాపురం చేయటం చూచి విదర్భరాజు భీముడు ఎప్పుడు ధన్యుడవుతాడో?'- అని తలపోస్తూ, మెల్లగా దగ్గరకు వచ్చి ఆ బ్రాహ్మణుడు దమయంతితో ఇట్లా చెప్పాడు.

**విశేషం:** ఆకసంలో రాత్రివేళ రోహిణీ నక్షత్రం చంద్రుడు కలిసి ఉన్నప్పుడు చూపరులకు అది ఒక మనోహరదృశ్యం. భారతీయుల ఖగోళవిజ్ఞానం మిక్కిలి ప్రాచీనమైనది.

**తే. 'అవ్వ! నీ తల్లిదండ్రుల కాత్మజులకు । బంధుజనులకుఁ గుశలంబు; భామ! నీదు**
**కుశల మెఱుఁగునంతకు వంతగూరి వగుచు । చున్నవారు; వారికి వంత యుడుగు నింక. 145**

**ప్రతిపదార్థం:** అవ్వ= అమ్మా!; నీ, తల్లి దండ్రులకు= నీ తల్లికి, తండ్రికి; ఆత్మజులకున్= నీ కొడుకుకు, కూతురుకు; బంధు జనులకున్= చుట్టాలకు; కుశలంబు= క్షేమం; భామ!= ఓ దమయంతీ!; నీదు, కుశలము= నీక్షేమం; ఎఱుఁగు+అంతకు= తెలిసేవరకు; వంత+కూరి= దుఃఖంతో నిండి; వగచుచున్నవారు= పరితపిస్తున్నారు; ఇంక= ఇకమీదట; వారికి= వారలకు; వంత= దుఃఖం; ఉడుగున్= పోతుంది.

**తాత్పర్యం:** 'అమ్మా! దమయంతీ! నీ తల్లిదండ్రులు, నీ సంతానం, నీ బంధువులు అందరు క్షేమంగా ఉన్నారు. నీ క్షేమం తెలిసేంతవరకు దుఃఖంతో పరితపిస్తున్నారు. ఇకమీద నీ కుశలవార్త విని సంతసిస్తారు.

**వ. దేవీ! యేను భవద్భ్రాతృసఖుండ; సుదేవుండను బ్రాహ్మణుండ; విదర్భేశ్వరుండు నీ యున్నచో టెఱుంగం బెక్కండ్రు బ్రాహ్మణులం బుచ్చిన నిందులకు వచ్చి నా పుణ్యంబున నిన్నుం గంటి' ననిన దమయంతి వాని నెఱింగి తన పుత్త్రులఁ దల్లిదండ్రుల బాంధవులం బ్రత్యేకంబ యడిగి, యశ్రుజలంబు లురల నేడ్చుచున్నం జూచి 'యేలకో యిప్పడు సైరంధ్రి యేడ్చుచున్నయది' యని సునంద తన జననికిం జెప్పి పుచ్చిన. 146**

**ప్రతిపదార్థం:** దేవీ= మహారాణీ!; ఏను= నేను; భవత్+భ్రాతృ, సఖుండ= నీయొక్క సోదరుడి మిత్రుడిని; సుదేవుండు+అను= సుదేవుడనే పేరున్న; బ్రాహ్మణుండ= బ్రాహ్మణుడిని; విదర్భ+ఈశ్వరుండు= విదర్భరాజు; నీ+ఉన్నచోటు+ఎఱుంగన్= నీవు

ఉండే స్థలాన్ని తెలిసికొనటానికై; పెక్కండ్రు, బ్రాహ్మణులన్= చాలమంది బ్రాహ్మణులను; పుచ్చినన్= నియోగించగా; ఇందులకున్= ఇచటికి; వచ్చి= అరుదెంచి; నా, పుణ్యంబునన్= నా సుకృతంవలన; నిన్నున్+కంటిన్= నిన్ను చూచాను; అనినన్= అని చెప్పగా; దమయంతి; వానిన్= ఆ బ్రాహ్మణుడిని; ఎఱింగి= తెలిసికొని; తన, పుత్రులన్= తన పిల్లలను; తల్లిదండ్రుల; బంధువులన్= చుట్టాలను; ప్రత్యేకంబు+అ= వేర్వేరుగా; అడిగి= (కుశలం) అడిగి; అశ్రు, జలంబులు= కన్నీళ్లు; ఉరలన్= క్రిందకి కారగా; ఏడ్చుచున్నన్+చూచి= విలపిస్తుండగా చూచి; ఏలకో= ఎందుచేతనో; ఇప్పుడు= ఇపుడు; సైరంధ్రి = దమయంతి; ఏడ్చుచున్న+అది= రోదిస్తున్నది; అని= అంటూ; సునంద; తన, జననికిన్= తన తల్లికి; చెప్పిపుచ్చినన్= చెప్పిపంపగా.

**తాత్పర్యం:** దమయంతీదేవీ! నేను నీ సోదరుడికి మిత్రుడిని. నాపేరు సుదేవుడు. నేను బ్రాహ్మణుడిని. విదర్భప్రభువు నీవు ఉండేచోటు వెదకటానికై పలువురు బ్రాహ్మణోత్తములను పెక్కుదేశాలకు పంపించాడు. నేను ఇచటికి వచ్చి నా సుకృతవిశేషంవలన నిన్ను చూడగలిగాను' - అని చెప్పగా దమయంతి తల్లిదండ్రులగురించి, తన పిల్లల గురించి, చుట్టాలను గురించి కుశలం అడిగి, ఆమె విలపిస్తూ ఉండటం చూచి సునంద ఆ వార్తను తల్లికి నివేదింపజేసింది.

**క. చనుదెంచె నంతిపురమున । వనితానివహంబుతోడ వారిజదళలో**
**చన రాజమాత నృపనం । దన యగు దమయంతికడకుఁ దద్దయు వేడ్కన్. 147**

**ప్రతిపదార్థం:** వారిజ, దళ, లోచన= నీటినుండి పుట్టిన పద్మం (వారిజం) యొక్క రేకులవంటి కన్నులుకలది అయిన; రాజమాత= రాజుగారి తల్లి; నృప, నందన+అగు= రాజపుత్రి అయిన; దమయంతి కడకున్; అంతిపురమున= రాణివాసంలోని; వనితా నివహంబుతోడన్= స్త్రీల సమూహంతో; తద్దయు= మిక్కిలి; వేడ్కన్= కుతూహలంతో; చనుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** పద్మదళాలవంటి కన్నులు గల రాజమాత అంతఃపురంలోని అంగనలను వెంటబెట్టుకొని రాజకుమారి దమయంతి దగ్గరకు మిక్కుటమైన కుతూహలంతో వచ్చింది.

**వ. ఇట్లు వచ్చి తమలో మాటలాడుచున్న బ్రాహ్మణుని దమయంతిం జూచి రాజమాత బ్రాహ్మణున కిట్లనియె; 'నయ్యా! ఇది యెవ్వని కూఁతు? రెవ్వని భార్య? యేమి కారణంబునం దనభర్తను బాంధవులనుం బాసి పుణ్యవ్రతంబులు సలుపుచున్నయది? నీ వె ట్లెఱింగి? తికోమలి నామం బేమి?' యని యడిగిన సుదేవుం డిట్లనియె. 148**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; వచ్చి= అరుదెంచి; తమలో మాటలాడుచున్న= పరస్పరం సంభాషణ చేస్తున్న; బ్రాహ్మణుని; దమయంతిన్; చూచి; రాజమాత; బ్రాహ్మణునకు; ఇట్లు+అనియె= ఈ విధంగా పలికింది; అయ్యా!= ఆర్యా!; ఇది= ఈమె; ఎవ్వని, కూఁతురు= ఎవరి పుత్రిక?; ఎవ్వని భార్య?= ఎవరి పెండ్లాము?; ఏమి కారణంబునన్= ఏ కారణంచేత; తన భర్తను= తన పెనిమిటిని; బాంధవులనున్+పాసి= చుట్టాలను విడిచి; పుణ్యవ్రతంబులు= పవిత్రమైననోములు; సలుపుచున్న+అది= చేస్తున్నది; నీవు+ఎట్లు+ఎఱింగితి(వి)= నీవు ఏవిధంగా తెలిసికొన్నావు?; ఈ+కోమలి= ఈ సుకుమారి; నామంబు+ఏమి= పేరేమిటి?; అని; అడిగిన; సుదేవుండు; ఇట్లు+అనియె.

**తాత్పర్యం:** ఈ విధంగా దమయంతి, బ్రాహ్మణుడు పరస్పరం మాటాడుతుండగా రాజమాత వచ్చి ఆ బ్రాహ్మణుడితో 'అయ్యా! ఈమె ఎవరికూతురు? ఎవరిభార్య? ఏకారణంవలన భర్తను, బంధువులను, ఎడబాసి పుణ్యప్రదమైన నోములు నోస్తున్నది? అసలు ఈమెసంగతి నీ కెట్లా తెలిసింది? ఈమె పేరేమిటి?' అని అడుగగా సుదేవుడు ఇట్లా బదులు పలికాడు.

**మధ్యాక్కర.**

> **'నలినాక్షి! యిది విదర్భేశుతనయ, పుణ్యశ్లోకుఁ డైన**
> **నలుదేవి దమయంతి సుమ్ము; విధి కారణమ్మున రాజ్య**
> **చలితుఁడై నిజనాథుఁ డరిగినం దోన చనియె; నవ్వార్త**
> **వెలయంగ విని వీరి రోయఁబంచె భూవిభుఁడు బ్రాహ్మణుల.** **149**

**ప్రతిపదార్థం:** నలిన+అక్షి!= పద్మాలవంటి కన్నులు కలదానా! (ఓ రాజమాతా!); ఇది= ఈమె; విదర్భ+ఈశు తనయ= విదర్భరాజు కూతురు; పుణ్య శ్లోకుఁడు+ఐన= పవిత్రమైన చరిత్ర కలవాడైన; నలుదేవి= నలుడియొక్క రాణి; దమయంతి, సుమ్ము; విధి, కారణమ్మునన్= దురదృష్టహేతువుచేత; రాజ్య చలితుఁడు+ఐ= రాజ్యభ్రష్టుఁడై; నిజ, నాథుఁడు= తనభర్త; అరిగినన్= వెళ్ళిపోగా; తోన= ఆతని వెనువెంటనే; చనియెన్= వెళ్ళింది; ఆ+వార్త= ఆ సమాచారం; వెలయంగ, విని= వ్యాపించగా విని; భూవిభుఁడు= రాజు; బ్రాహ్మణులన్= విప్రులను; వీరి= నలదమయంతులను; రోయన్+పంచెన్= వెదకటానికై పుత్తెంచాడు.

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులుగల ఓ రాజమాతా! ఈమె విదర్భరాజు పుత్రిక. నలమహారాజుదేవేరి. ఈమెయే దమయంతి సుమా! విధిపరిపాకంవలన నలుడు రాజ్యం పోగొట్టుకొని వెళ్ళిపోయేటప్పుడు, ఈమె భర్తను అనుసరించింది. ఈ వార్త విని విదర్భప్రభువు వీరిని (నలదమయంతులను) వెదకటానికై బ్రాహ్మణులను పంపించాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి ఈ ఆశ్వాసంలోని 22వ పద్యం విశేషవ్యాఖ్య చూడండి.

**వ.** **ఏ నిందులకు వచ్చి, మీచేత సురక్షితయై యున్న యిక్కోమలిం జూచి, దీని భ్రూమధ్యంబునం బద్మప్రభంబై విభూత్యర్థంబుగా విధాతృనిర్మితం బైన పుణ్యలక్ష్మంబు పాంసుపటలచ్ఛన్నం బై యున్న నుపలక్షించి మారాజు పుత్త్రింగా నెఱింగితి' ననిన సునంద శుద్ధోదకంబుల దాని భ్రూమధ్యంబు గడిగిన నది విస్పష్టంబగుడు నందఱు నాశ్చర్యం బంది; రంత.** **150**

**ప్రతిపదార్థం:** ఏను+ఇందులకు, వచ్చి= నేను ఇచటికి వచ్చి; మీచేత; సురక్షిత+ఐ, ఉన్న= బాగుగా రక్షించబడిఉన్న; ఈ+కోమలిన్= ఈ సుకుమారిని; చూచి; దీని= ఈమెయొక్క; భ్రూమధ్యంబునన్= కనుబొమల మధ్య; పద్మ, ప్రభంబు+ఐ= పద్మంయొక్క దీప్తికలదియై; విభూతి+అర్థంబుగా= సంపదకు సూచికగా; విధాతృ, నిర్మితంబు+అయిన= బ్రహ్మదేవుడిచేత సృష్టించబడిన; పుణ్యలక్ష్మంబు= సుకృతవిశేషమైన పుట్టుమచ్చ; పాంసు, పటల, ఛన్నంబు+ఐ+ఉన్నన్= దుమ్ము కణాలచేత కప్పబడి ఉండగా; ఉపలక్షించి= అరసి, చూచి; మా, రాజపుత్త్రిన్+కాన్= మారాజు కుమారిగా; ఎఱింగితిన్= తెలిసికొన్నాను; అనినన్= అని చెప్పగా; సునంద; శుద్ధ+ఉదకంబులన్= మంచినీళ్ళతో; దాని= ఆమెయొక్క; భ్రూమధ్యంబు= కనుబొమల మధ్య ప్రదేశాన్ని; కడిగినన్= పరిశుభ్రం చేయగా; అది= ఆ పుట్టుమచ్చ; విస్పష్టంబు+అగుడు= సుస్పష్టంగా కనిపించగా; అందఱున్; ఆశ్చర్యంబు+అందిరి= అచ్చెరువు పొందారు; అంత= అంతట.

**తాత్పర్యం:** నేను ఇచటికి వచ్చి మీచేత కాపాడబడుతున్న ఈ కోమలి దమయంతిని చూచి ఈమె కనుబొమల మధ్య, ఐశ్వర్యప్రదమైన చిహ్నంగా బ్రహ్మదేవుడు సృష్టించిన పుట్టుమచ్చ, దుమ్ముచేత కప్పబడి ఉండటం పరిశీలించి చూచి మా రాకుమారిగా గుర్తించగలిగాను'- అని సుదేవుడు చెప్పాడు. అంతట సునంద మంచినీళ్ళను తెప్పించి

దమయంతి ముఖం కడుగగా, ఆమె నొసటిపై పద్మకాంతి గల పుట్టమచ్చ స్ఫుటంగా కనిపించింది. అందరు అప్పుడు ఆశ్చర్యం పొందారు. అంత.

**సీ. ఆనందభరితాత్మయై రాజమాత య । క్కమలాక్షిఁ బ్రీతితోఁ గౌఁగిలించి**
**కొని, 'తల్లి! నీవు నా కూతుర; వేను నీ । జననియుఁ బేర్మి దశార్ణరాజ**
**తనయల; మదియు విదర్భేశు సతి యయ్యె; । నే వీరబాహున కింతి నైతి'**
**ననిన నయ్యవ్వకు నతివినయంబుతో । నలుదేవి మ్రొక్కి, సునంద నెత్తి**

**ఆ. కొని, కరంబు నెమ్మిఁ గొన్నిదినంబు లం । దుండి యిట్టు లనియె నొక్కనాఁడు**
**'దేవి! యిదియు నదియు ధృతి నాకుఁ బుట్టిన । యిండ్లు; కడుసుఖంబ యిందు నందు. 151**

**ప్రతిపదార్థం:** ఆనంద, భరిత+ఆత్మ+ఐ= ఆనందంతో నిండిన ఆత్మకలదై; రాజమాత; ఆ+కమల+అక్షిన్= కమలాల వంటి కన్నులు కలదానిని, దమయంతిని; ప్రీతితోన్= ప్రేమతో; కౌఁగిలించికొని= ఆలింగనం చేసికొని; తల్లి!= అమ్మా! (దమయంతీ!); నీవు; నా కూతురవు= నా కూతురివే సుమా!; ఏను, నీ, జననియున్= నేనూ నీ తల్లియు; పేర్మి= గౌరవంగల; దశార్ణ, రాజ, తనయలము= దశార్ణ రాజపుత్రికలం; అదియు= నీ తల్లియు; విదర్భేశు, సతి+అయ్యెన్= విదర్భరాజు భార్య అయింది; ఏన్= నేను; వీరబాహునకు+ఇంతిన్+ఐతిన్= వీరబాహుడి భార్యను అయ్యాను; అనినన్= అని చెప్పగా, ఆ+అవ్వకున్= ఆ సతికి; అతి, వినయంబుతోన్= మిక్కిలి అణకువతో; నలుదేవి= నలుడియొక్క భార్య (దమయంతి); మ్రొక్కి= నమస్కరించి; సునందన్+ఎత్తికొని= సునందను లేవదీసి; కరంబు, నెమ్మిన్= మిక్కిలి ప్రీతితో; కొన్ని, దినంబులు= కొన్నినాళ్ళు; అందు+ఉండి= అచట ఉండి; ఒక్కనాఁడు= ఒక దినం; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికింది; దేవి!= రాజమాతా!; ఇదియున్= ఈ వీరబాహుపురం; అదియు= విదర్భయు; ధృతిన్= స్థిరంగా; నాకున్+పుట్టిన+ఇండ్లు= నాకు పుట్టిండ్లే; ఇందున్+అందు= ఇచట, అచట; కడు, సుఖంబు+అ= మిక్కిలి సుఖమే.

**తాత్పర్యం:** రాజమాత ఆనందంతో నిండిన హృదయంతో దమయంతిని కౌగిలించుకొన్నది. పిమ్మట రాజమాత 'తల్లీ! నీవూ నా కూతురవే సుమా! నేనూ, నీ తల్లీ దశార్ణరాజు పుత్రికలం. నీ తల్లి విదర్భరాజు దేవేరి అయింది. నేను వీరబాహుడి సతిని అయ్యాను'- అని చెప్పగా దమయంతి ఆమె పాదాలకు నమస్కరించింది. తనకు నమస్కరించిన సునందను లేవనెత్తికొని లాలించింది. ఆ విధంగా నలుడిదేవి అయిన దమయంతి అక్కడ కొన్ని దినా లుండి, ఒకానొకనాడు రాజమాతతో 'దేవీ! ఈ పురమూ, విదర్భా నాకు పుట్టిండ్లే. ఇచట, అచట కూడా నాకు సమాన సౌఖ్యమే.

**వ. అయినను దల్లిదండ్రుల ననుజుల నాత్మజులం జూడ వేడుక యైనది; విదర్భకుం బోయెద; నానతి' మ్మని కృతాంజలి యైన దమయంతి నతిస్నేహంబున సుబాహుజనని సుతప్రేషితబలంబుతో సువర్ణమణిమయ విమానోపమానయానంబున ననిచి పుచ్చిన. 152**

**ప్రతిపదార్థం:** అయినను= అయినప్పటికిని; తల్లి దండ్రులన్= తల్లిని, తండ్రిని; అనుజులన్= సోదరులను; ఆత్మజులన్= కన్నబిడ్డలను; చూడ, వేడుక+ఐనది= చూడటానికి కుతూహలమైనది; విదర్భకున్+పోయెదన్= విదర్భకు వెళ్ళుతాను; ఆనతి+ఇమ్ము= అనుజ్ఞ దయచేయుము; అని; కృత+అంజలి+ఐన= నమస్కృతి చేసినదైన; దమయంతిన్; అతి, స్నేహంబునన్= మిక్కిలి ప్రీతితో; సుబాహు, జనని= సుబాహుడి యొక్క తల్లి; సుత, ప్రేషిత, బలంబుతోన్= కొడుకు సమకూర్చిన భటులను

తోడిచ్చి; సువర్ణ, మణిమయ, విమాన+ఉపమాన, యానంబునన్= బంగారం మణులు పొదగబడిన విమానంతో సరిపోవు వాహనంలో; ఉనిచి పుచ్చినన్= ఎక్కించి పంపగా.

**తాత్పర్యం:** అయినప్పటికి తల్లిదండ్రులను, సోదరులను, కన్నబిడ్డలను చూడాలని నాకు అనిపిస్తున్నది. విదర్భకు వెళ్ళుతాను. అనుజ్ఞ దయసేయుము' - అని నమస్కరించిన దమయంతిని మిక్కిలి ప్రీతితో ఆదరించి, రాజమాత తన కొడుకు సమకూర్చిన భటులతో, బంగారుమయమై నిండుగ మణులు పొదిగిన విమానంవంటి రథంపై పంపగా.

### దమయంతి నలు నెడఁబాసి విదర్భాపురంబు సేరుట (సం. 3-66-22)

**ఉ. భామ విదర్భ కేఁగి తన బంధుజనంబులయొద్ద నుండియుం**
**గోమలి దేహసౌఖ్యములకున్ వెలియై మలినార్ధవస్త్రమున్**
**భూమిరజంబు నంగమునఁ బొల్పగుచుండఁగ నుండె జీవిత**
**స్వామి నిజేశుఁ జూచు దివసంబులఁ గోరుచు సువ్రతంబుతోన్. 153**

**ప్రతిపదార్థం:** భామ=వనిత (దమయంతి); విదర్భకు+ఏఁగి= విదర్భకు వెళ్ళి; తన, బంధు, జనంబుల+ఒద్దన్+ఉండియున్= తన చుట్టాల కడ ఉన్నప్పటికిని; కోమలి= సుకుమారి; దేహసౌఖ్యములకున్= శరీర సుఖాలకు; వెలి+ఐ= దూరంగా ఉండి; మలిన+అర్ధ, వస్త్రమున్= మాసిన సగం చీరను; భూమి, రజంబున్= పుడమియొక్క దుమ్ము; అంగమునన్= దేహంపై; పొల్పు+అగుచుండఁగన్= ఒప్పుతుండగా; జీవిత, స్వామి, నిజ+ఈశున్= జీవితానికి అధినేత అయిన తన భర్తను; చూచు, దివసంబులన్= చూచే రోజులనే; కోరుచున్= కాంక్షిస్తూ; సువ్రతంబుతోన్= గొప్ప దీక్షతో; ఉండెన్= నివసించింది.

**తాత్పర్యం:** దమయంతి విదర్భకు వెళ్ళి, బంధువుల ఒద్ద ఉన్నప్పటికిని శరీరసౌఖ్యాలు త్యజించి, మాసిన సగం చీరనే ధరించి, దుమ్ము పేరుకొని పోయినా ఒప్పుతున్న శరీరంతో తన జీవితానికి అధినేత అయిన భర్తను చూచే రోజులకొరకు ఎదురుచూస్తూ దృఢదీక్షతో బ్రతికింది.

**వ. ఇట్లు భర్తృవియోగాతురయై దమయంతి ప్రాణంబు భరియింపనోపక యొక్కనాఁ డేకాంతంబునఁ దన జనని కిట్లనియె. 154**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; భర్తృ, వియోగ+ఆతుర+ఐ= భర్తయొక్క ఎడబాటుచేత ఏర్పడిన ఉద్వేగం కలదై; దమయంతి; ప్రాణంబు, భరియింపన్+ఓపక= అసువులు భరించలేక; ఒక్కనాఁడు= ఒకానొక దినం; తన, జననికి= తన తల్లికి; ఏకాంతంబునన్= రహస్యంగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** ఈ విధంగా భర్తయొక్క ఎడబాటువలన కలిగిన ఉద్వేగంతో దమయంతి అసువులు భరించలేక ఒకానొకదినం రహస్యంగా తల్లితో ఇట్లా చెప్పింది.

**క. 'శోకాపనోదిఁ బుణ్య । శ్లోకుని నలు రోయఁ బనుపు శుభచరితుఁ దదా**
**లోకనవిహీననై పర । లోకకృతావాస నగుదు లోకం బెఱుఁగన్'. 155**

**ప్రతిపదార్థం:** శోక+అపనోదిన్= దుఃఖం పోకార్చేవాడిని; పుణ్యశ్లోకుని= పవిత్రమైన చరిత్ర కలవాడిని; శుభ చరితున్= మంగళకరమైన స్వభావం కలవాడిని; నలున్= నలుడిని; రోయన్+పనుపు= వెదకటానికి పంపుము; తద్+ఆలోకన, విహీనను+ఐ= ఆతడిని చూడటానికి నోచనిదానినై; లోకంబు+ఎఱుఁగన్= జనులందరికి తెలిసేటట్లుగా; పర, లోక, కృత+ఆవాసన్+అగుదున్= పరలోకంలో చేయబడిన నివాసం కలదానిని అవుతాను.

**తాత్పర్యం:** 'నా దుఃఖాన్ని పోగొట్టగల పుణ్యచరిత్రుడైన నలుడిని వెదకటానికై పంపుము. ఆతడిని చూడకుంటే నేను బహిరంగంగా ఈ లోకాన్ని వదలి పరలోకానికి వెళ్ళుతాను.'

**వ. అనిన నదియును గూఁతు నభిప్రాయంబు భీమున కెఱింగించిన, నాతండు నలుమార్గణంబున ఋజుమార్గులయిన బ్రాహ్మణుల నియోగించినం, దన పతి నన్వేషింప నరుగు బ్రాహ్మణులకు దమయంతి యిట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆదియును= ఆమెయు; కూఁతున్+అభిప్రాయంబు= పుత్రికయొక్క ఉద్దేశం; భీమునకు= విదర్భరాజయిన భీముడికి; ఎఱింగించినన్= తెలుపగా; ఆతండు= ఆ భీముడు; నలు, మార్గణంబునన్= నలుడిని వెదకటంలో; ఋజు మార్గులు+అయిన= తిన్నని నడవడి కల; బ్రాహ్మణులన్= విప్రులను; నియోగించినన్= పుత్తెంచగా; తన, పతిన్= తన భర్తను; అన్వేషింపన్+అరుగు= వెదకటానికి వెళ్ళే; బ్రాహ్మణులకున్= విప్రులకు; దమయంతి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** అని చెప్పగా, ఆమె తన కూతురి ఉద్దేశాన్ని భీమరాజుకు తెలిపింది. ఆతడు నలుడిని అన్వేషించటానికై సత్ప్రవర్తన గల బ్రాహ్మణులను నియోగించాడు. తన పతిని వెదకటానికై వెళ్ళే బ్రాహ్మణులతో దమయంతి ఇట్లా చెప్పింది.

**ఆ. 'నైషధేశ్వరుండు నలుఁ డిప్పు డసమర్థుఁ । డగుటఁ జేసి తన్ను నన్యు లెఱుఁగ**
**కుండ నుండుఁ; గాన నురుసభాంతరముల । కరిగి యరిగి యిట్టు లనుడు మీరు. 157**

**ప్రతిపదార్థం:** నైషధ+ఈశ్వరుండు= నిషధ దేశ ప్రజలకు ప్రభువు; నలుఁడు; ఇప్పుడు; అసమర్థుఁడు+అగుటన్+చేసి= సమర్థుడు కాకపోవటంచేత- అంటే తన పదవిని కోలుపోయి నిషధప్రభువుగా లేకుండటంచేత; తన్నున్= తనను; అన్యులు= ఇతరులు; ఎఱుఁగక+ఉండన్= తెలియకుండ; ఉండున్+కానన్= ఉంటాడు కాబట్టి; ఉరు, సభా+అంతరములకున్= గొప్ప కొలువుకూటాలకు; అరిగి+అరిగి= వెళ్ళి, వెళ్ళి; ఇట్టులు+అనుడు= ఇట్లా మీరు చెప్పండి.

**తాత్పర్యం:** 'నిషధప్రజలకు రాజైన నలుడు ప్రస్తుతం అసమర్థుడు. పదవిని కోలుపోయాడు. కాబట్టి ఇతరులు తనను గుర్తించకుండ అజ్ఞాతవాసం చేస్తూ ఉంటాడు. మీరు పలుదేశాలకు వెళ్ళినపుడు అచటి సభలలో ఈవిధంగా పలకండి.

**విశేషం:** 'అరిగి యరిగి' అనే ప్రయోగం వలన నలుడిని అన్వేషించటానికి బ్రాహ్మణులు పలు తావులకు వెళ్ళవలసి ఉంటుందన్న సూచన సుస్పష్టం.

సీ. 'నిత్యసత్యుండవు; నీ సతి వంచించి । దాని వస్త్రార్ధంబు దఱిగి నీకుఁ
బరిధానముగఁ జేసి పాడియే పోవంగ? భార్య భర్తవ్యనాఁ బరఁగు ధర్మ
మది మిథ్య యయ్యెఁ నీయందు; నీ కిట్టి ని । ర్దయబుద్ధిఁ జేకొనఁ దగునె? యట్టి
సాధ్వికిఁ గరుణఁ బ్రసన్నుండ వగు' మని । యెల్లచోఁ బలికిన నెవ్వఁడేనిఁ

ఆ. బలుకు వడఁగ నోడి ప్రతివచనం బిచ్చు । నతఁడు నలుఁడుగాఁ బ్రియంబుతోడ
నెఱిఁగి నన్ను నతని కెఱిఁగించి తోడ్కొని । రండు; రానినాఁడు రం డెఱింగి.' 158

**ప్రతిపదార్థం:** నిత్యసత్యుండవు= ఎల్లప్పుడు సత్యసంధుడివైన వాడివి; నీ, సతిన్= నీభార్యను; వంచించి= మోసంచేసి; దాని వస్త్ర+అర్ధంబు= ఆమె సగం చీరను; తఱిగి= చించి; నీకున్, పరిధానముగన్+చేసి= నీకు కట్టుపుట్టంగా చేసికొని; పాడియే పోవంగన్= పోవటం ధర్మమా?; భార్య= పెండ్లాం; భర్తవ్య= భరించబడేది; నాన్+పరఁగు= అనబడేటటువంటి; ధర్మము+అది= ఆ ధర్మం; నీయందు= నీ పట్ల; మిథ్య+అయ్యెన్= అసత్యమయింది; నీకు+ఇట్టి, నిర్దయ, బుద్ధిన్= నీకు ఇటువంటి దయలేని కఠినవైఖరిని; చేకొనన్+తగునె= స్వీకరించతగునా?; అట్టి, సాధ్వికిన్= అటువంటి ఉత్తమురాలికి; కరుణన్= దయతో; ప్రసన్నుఁడవు+అగుము= అనుగ్రహం కలవాడివి కమ్ము; అని= అంటూ; ఎల్లచోన్= అన్నిచోట్లలో; పలికినన్= ప్రకటించగా; ఎవ్వడు+ఏనిన్= ఎవ్వడైనా; పలుకు+పడఁగన్+ఓడి= మాట పడటానికి ఇష్టపడక; ప్రతివచనంబు+ఇచ్చున్= ఎదురు సమాధానం చెపుతాడో!; అతఁడు= ఎదురు చెప్పినవాడు; ప్రియంబుతోడన్= ప్రీతితో; నలుండు+కాన్+ఎఱిఁగి= నలుడని గుర్తించి; నన్నున్+అతనికి+ఎఱిఁగించి= నా విషయం అతడికి తెలిపి; తోడ్కొని రండు= అతడిని ఇచటికి తీసికొనిరండు; రాని, నాఁడు= అతడు ఇచటికి రాకున్నట్లయితే; ఎఱింగి= తెలిసికొని; రండు= తిరిగిరండు.

**తాత్పర్యం:** 'నీవు నిత్యసత్యవ్రతుడివి. నీ భార్యను మోసంచేసి ఆమెచీరను సగం చింపి నీవు కట్టుబట్టగా చేసికొని పోవటం న్యాయమా? భరించబడేది భార్య అని కదా ధర్మం. ఆ ధర్మం నీపట్ల అసత్యమైనదిగదా! నీవు ఇటువంటి దయలేని కఠినమైన బుద్ధిని అవలంబించ తగునా? అటువంటి పతివ్రతాశిరోమణి పట్ల అనుగ్రహం చూపుము' - అని అన్ని చోట్ల పలుకండి. ఎవరు ఆ మాటలు విని రోషం చెంది ఎదురు సమాధానం చెపుతాడో అటువంటివాడిని ప్రియమార నలుడిగా గుర్తించి, అతడికి నా విషయం తెలిపి, ఇచటికి తోడ్కొని రండి. ఒకవేళ అతడు ఇచటికి రాకుంటే అతడిని గుర్తుపెట్టుకొని మీరు తిరిగి రండి'.

వ. అని పంచినం, బనిపూని బ్రాహ్మణులు దమయంతి కఱపిన పలుకు లెల్ల సభలం బలికి యెందునుం గానక వచ్చి; రందుఁ బర్ణాదుం డను బ్రాహ్మణుండు దమయంతి కిట్లనియె; 'నే నయోధ్య కరిగి నీ కఱపిన పలుకు లెల్ల ఋతుపర్ణుసభం బలికిన నొక్క పురుషుండు కుఱుచ చేతులవాఁడు ఋతుపర్ణునొద్ద నూఱుగద్యాణంబుల జీవితంబువాఁడు శీఘ్రయానకుశలుండు సూదక్రియానిపుణుండు విరూపాంగుండు బాహుకుం డను నశ్వ శిక్షకుండు విని, నన్ను నేకతంబ కనుంగొని వెలవెల నగుచు దీర్ఘనిశ్వాసపురస్సరుండై యిట్లనియె.159

**ప్రతిపదార్థం:** అని= అంటూ; పంచినన్= నియోగించగా, పనిపూని= కార్యభారం వహించి; బ్రాహ్మణులు= విప్రులు; దమయంతి, కఱపిన= దమయంతి చెప్పిన; పలుకులు= మాటలు; ఎల్ల, సభలన్, పలికి= అన్ని సభలలో భాషించి; ఎందునున్, కానక, వచ్చిరి= (నలుడిని) ఎచ్చటను చూడలేక తిరిగి వచ్చారు; అందున్= ఆ బ్రాహ్మణులలో; పర్ణాదుండు+అను+బ్రాహ్మణుండు= పర్ణాదుడనే విప్రుడు; దమయంతికి; ఇట్లు+అనియె= ఈవిధంగా చెప్పాడు; ఏను= నేను; అయోధ్యకు; అరిగి= వెళ్ళి; నీ,

కఱపిన, పలుకులు+ఎల్ల= నీవు నేర్పిన మాటలన్నియు; ఋతుపర్ణు, సభన్= ఋతుపర్ణుడి కొలువుకూటంలో; పలికినన్= మాటాడగా; ఒక్క పురుషుండు= ఒక మగవాడు; కుఱుచ చేతులవాఁడు= పొట్టి చేతులు కలవాడు; ఋతు, పర్ణు+ఒద్ద= ఋతుపర్ణుడి దగ్గర; నూఱు గద్యాణంబుల, జీవితంబు, వాఁడు= వందగద్యాణాలను జీతంగా పొందేవాడు; (జీవితంబు అనే పదానికి జీతంబు అనే పాఠాంతరం కొన్ని ప్రతులలో కానవస్తున్నది. జీవితం యొక్క రూపాంతరమే జీతం); శీఘ్రయాన కుశలుండు= వేగంగా ప్రయాణం చేయటంలో నేర్పరి; సూదక్రియా నిపుణుండు= వంటలు చేయటంలో నేర్పు కలవాడు; విరూప+అంగుండు= వికృతమైన ఆకృతి కలవాడు; బాహుకుండు+అను= బాహుకుడనే పేరుకలవాడు; అశ్వశిక్షకుండు= గుఱ్ఱాలకు శిక్షణ ఇచ్చేవాడు; విని= ఆలకించి; నన్నున్+ఏకతంబు+అ, కనుంగొని= నన్ను రహస్యంగా కలిసికొని; వెలువెలన్+అగుచు= తెల్లబోతూ; దీర్ఘనిశ్వాస పురస్సరుండు+ఐ= నిట్టూర్పులు ముందుగా ప్రసరింపచేస్తున్నవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని నియోగించగా, కర్తవ్యభారాన్ని పూని బ్రాహ్మణులు దమయంతి చెప్పిన మాటలు సకల సభలలో పలికి ఎచ్చటనూ నలుడిని కానక తిరిగి వచ్చారు. కాని, వారిలో పర్ణాదుడు అనే విప్రుడు దమయంతికి ఈ విధంగా చెప్పాడు: నేను అయోధ్యకు వెళ్ళి అచట ఋతుపర్ణుడి సభలో నీవు నేర్పిన మాటలు పలికాను. ఒకడు కురూపి, కురుచ చేతులవాడు, ఋతుపర్ణుడి దగ్గర వంద గద్యాణాల వేతనంతో పనిచేసే సేవకుడు, వంటలు చేయటంలో నేర్పు కలవాడు, వేగంగా ప్రయాణం చేయటంలో నేర్పు కలవాడు, బాహుకుడు అనే గుఱ్ఱాల శిక్షకుడు నా మాటలు విని, నన్ను రహస్యంగా కలిసికొని వేడినిట్టూర్పులు వెదజల్లుతూ ఈ విధంగా పలికాడు.

**ఆ. 'పురుషునందు దోషపుంజంబు గలిగిన । నెఱిఁగి యెద సహించునేని భార్య**
**పురుషునం దభీష్టభోగంబు, దేహాంత । రంబునందు ధర్మరతియుఁ బడయు.' 160**

**ప్రతిపదార్థం:** పురుషునందు= మగనిలో; దోషపుంజంబు= తప్పులు పెక్కు; కలిగినన్= ఉన్నప్పటికీ; ఎఱిఁగి= తెలిసికూడ; ఎదన్= హృదయంలో; సహించును+ఏని= ఓర్చుకొన్నట్లయితే; భార్య= ఆపెండ్లం; పురుషునందు= మగడియందు; అభీష్టభోగంబు= తాను కోరుకొన్న సౌఖ్యం; దేహ+అంతరంబు+అందున్= వేరొక జన్మలో; ధర్మరతియున్= ధర్మంపై ప్రీతిని; పడయున్= పొందగలదు.

**తాత్పర్యం:** మగడియందు తప్పు లుంటే తెలిసి ఉండికూడ సైరించే భార్య ఎప్పటికైనా ఇహలోకంలో భర్త నుండి తాను కోరిన సౌఖ్యం పొందుతుంది. అట్లాగే ఆ పుణ్యంవలన మరుజన్మలో ధర్మంపట్ల ప్రీతిని పొందగలదు.'

**వ. అని యొండెద్దియుం బలుకక తన నివాసంబునకుం బోయె' నని చెప్పిన విని, దమయంతి పెద్దయుం బ్రొద్దు చింతించి 'నలుండు గానివాఁడు ప్రతివచనం బేల యిచ్చు? నింకను వలను గల వారలం బంచి యాతని నిమ్ముగా నెఱుంగవలయు' నని నిజజనని యనుమతంబున సుదేవు రావించి వాని కిట్లనియె. 161**

**ప్రతిపదార్థం:** అని; ఒండు+ఎద్దియున్+పలుకక= వేరే ఏదియు మాట్లాడక; తన నివాసంబునకున్+పోయెన్= తాను నివసించే చోటికి వెళ్ళాడు; అని; చెప్పిన; విని; దమయంతి; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; చింతించి= ఆలోచించి; నలుండు, కాని, వాఁడు= నలుడు కాక వేరొకడు; ప్రతివచనంబు= సమాధానం; ఏల+ఇచ్చున్?= ఎందుకు ఇస్తాడు?; ఇంకను; వలను+ కలవారలన్+పంచి= వీలైన వారిని పుత్తెంచి; ఆతనిన్= ఆ ప్రత్యుత్తరం ఇచ్చిన వాడిని; ఇమ్ముగాన్= పరిపూర్ణంగా; ఎఱుంగవలయున్= తెలిసికొనాలి; అని; నిజ, జనని= తన తల్లి; అనుమతంబున= అంగీకృతితో; సుదేవు, రావించి= సుదేవుడిని రప్పించి; వానికి= ఆతడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** అని మాత్రమే చెప్పి, తదుపరి మౌనం వహించి అతడు తన నివాసానికి వెళ్ళాడు' - అని చెప్పగా విని దమయంతి చాలసేపు ఆలోచించి 'అతడు నలుడు కాని పక్షంలో ఎందుకు ఎదురు సమాధానం చెప్తుతాడు? ఇంకను వీలైనవాళ్ళను పంపించి ఆతడి సంగతిని సంపూర్ణంగా తెలిసికొనవలసి ఉన్నది' అని తల్లి అనుమతితో సుదేవుడిని రావించి అతడితో ఇట్లా చెప్పింది.

**క. 'న న్నెఱిఁగి తెచ్చినట్లు జ । గన్నుతు నలు నెఱిఁగి తెమ్ము కౌశలమున వి**
**ద్వన్నుత! సర్వసుగుణసం । పన్నుండవు నీవ బుద్ధిఁ బరికింపంగన్. 162**

**ప్రతిపదార్థం:** నన్ను+ఎఱిఁగి, తెచ్చినట్లు= నన్ను గుర్తించి తెచ్చినట్లుగానే; జగత్+నుతున్= జగత్తుచేత స్తుతించబడిన; నలున్= నలుడిని; కౌశలమునన్= సామర్థ్యంతో; ఎఱిఁగి తెమ్ము= గుర్తించి తీసికొని రమ్ము; విద్వత్+నుత!= పండితులచేత కీర్తించబడినవాడా!; బుద్ధిన్+పరికింపంగన్= మెదడుతో ఆలోచించి చూస్తే; నీవు+అ=నీవే; సర్వసుగుణసంపన్నుండవు= సకల సద్గుణాల సంపద కలవాడివి.

**తాత్పర్యం:** 'విద్వాంసులచేత కీర్తించబడిన ఓ సుదేవా! బుద్ధితో ఆలోచిస్తే నీవే సకల సద్గుణాల సంపద కలవాడివి. నీవు నన్ను గుర్తించి తెచ్చావు కదా! అట్లే లోకులచేత ప్రశంసించబడే నలమహారాజును కూడ వెదకి నేర్పుగ గుర్తించి తీసికొనిరమ్ము.

**క. అరుగు మయోధ్యకు దేశాం । తర విప్రుఁడవై; రవిప్రతాపోన్నతు ను**
**త్తరకోసలేంద్రు నుర్వీ । శ్వరుఁ గనఁ జను మనఘు నమరసము ఋతుపర్ణున్. 163**

**ప్రతిపదార్థం:** దేశ+అంతర, విప్రుఁడవు+ఐ= మరొకదేశానికి చెందిన బ్రాహ్మణుడివిగా; అయోధ్యకున్= అయోధ్యాపురికి; అరుగుము= వెళ్ళుము; ఉత్తర కోసల+ఇంద్రున్= ఉత్తర కోసల దేశానికి రాజును; ఉర్వీ+ఈశ్వరున్= భూపతిని; రవి, ప్రతాప+ఉన్నతున్= సూర్యుడి వంటి ప్రతాపంచేత గొప్పవాడిని; అనఘున్= పాపరహితుడిని; అమరసమున్= దేవతలవంటివాడిని; ఋతుపర్ణున్= ఋతుపర్ణుడిని; కనన్= చూడటానికి; చను= వెళ్ళుము.

**తాత్పర్యం:** ఓ సుదేవా! నీవు అయోధ్యకు విదేశవిప్రుడివలె వెళ్ళుము. వెళ్ళి ఉత్తరకోసలపతి, సూర్యుడి వంటి ప్రతాపంచేత ఉన్నతుడు, పుణ్యాత్ముడు, దేవతలతో సమానుడు అయిన ఋతుపర్ణుడిని దర్శించుము.

**విశేషం:** ఉస్మానియా విశ్వవిద్యాలయ సంశోధిత ముద్రిత ప్రతిలో - పై పద్యం ఉత్తరార్ధంలో 'ఉత్తరకోసలేశు భాంగాసరినింగను మనఘు నమరసము' అనే పాఠం ఉన్నది. అందులోని 'భాంగాసరి' - అనే పదానికి 'భాంగస్వరి', 'భాంగాసురి'- అనే పాఠభేదాలు కూడ కనబడుతున్నాయి. కాని, ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రతిలో పాఠాంతరంగా ఇవ్వబడిన ప్రస్తుత పాఠం అర్థప్రసన్నతకు తోడ్పడేదైనందున ఇందులో ప్రధానపాఠంగా స్వీకరించటం జరిగింది.

**వ. 'మఱి విదర్భావిభుం డగు భీముండు నలు రోయం బంచి, యెందునుం గానక యింకను దమయంతికిఁ బునఃస్వయంవరంబు రచియింపంబోయిన, నందులకు భూవలయంబునం గల రాజులెల్లను బోయెద'రని యతిత్వరితంబుగా ఋతుపర్ణునకుం జెప్పు' మని పంచిన సుదేవుం డయోధ్యానగరంబునకుం బోయి ఋతుపర్ణుం గాంచి 'విదర్భాపురంబున దమయంతీ ద్వితీయ స్వయంవరం బెల్లియె యయ్యెడు' నని చెప్పిన**

**విని ఋతుపర్ణుండు బాహుకుం జూచి 'నాకు దమయంతీ స్వయంవరంబుఁ జూడ నొక్క నాఁటన విదర్భకుం బోవలయు నీ యశ్వశిక్షానైపుణ్యంబుఁ బ్రకాశింపు' మనవుడు 'నట్ల చేయుదు' నని నలుండు దన మనంబున దుఃఖించి. 164**

**ప్రతిపదార్థం:** మఱి= అదియునుగాక; విదర్భా, విభుండు+అగు= విదర్భ రాజైన; భీముండు= భీముడు; నలున్=నలుడిని; రోయన్+పంచి= వెదకటానికి పుత్తెంచి; ఎందునున్+కానక= ఎచటను అతడు కనిపించక పోవటంచేత; ఇంకను= తదుపరి; దమయంతికిన్= దమయంతి కొరకు; పునః స్వయంవరంబు= తిరిగి స్వయంవరం; రచియింపన్+పోయినన్= ఏర్పాటు చేయటానికి పూనగా; అందులకు= ఆ దమయంతీ ద్వితీయ స్వయంవరానికి; భూవలయంబునన్+కల= భూమండలంలో గల; రాజులు+ఎల్లను= రాజులందరును; పోయెదరు= వెళ్ళుతారు; అని= అని చెప్పి; అతి, త్వరితంబుగాన్= మిక్కిలి వేగంగా; ఋతుపర్ణునకున్= ఋతుపర్ణుడికి; చెప్పుము= చెప్పేది; అని= అంటూ; పంచిన= నియోగించగా; సుదేవుండు= సుదేవుడు; అయోధ్యానగరంబునకున్+పోయి= అయోధ్యాపురికి వెళ్ళి; ఋతుపర్ణున్+కాంచి= ఋతుపర్ణుడిని చూచి; విదర్భాపురంబునన్= విదర్భానగరంలో; దమయంతీ, ద్వితీయ, స్వయంవరంబు= దమయంతియొక్క రెండవ స్వయంవరం; ఎల్లియె(ఎల్లి+ఎ)= రేపే; అయ్యెడున్= జరుగుతుంది; అని, చెప్పిన; విని; ఋతుపర్ణుండు; బాహుకున్+చూచి= బాహుకుడిని చూచి; నాకు; దమయంతీ, స్వయంవరంబున్= దమయంతీ స్వయంవరాన్ని; చూడన్= చూడటానికి; ఒక్కనాఁటను+అ= ఒక్క దినంలోపలే; విదర్భకున్+పోవలయున్= విదర్భకు వెళ్ళాలి; నీ, అశ్వ, శిక్షా, నైపుణ్యంబున్= గుఱ్ఱాలను నడిపే నీ నేర్పరితనాన్ని; ప్రకాశింపుము= వెలుగొందజేయుము; అనవుడున్= అని చెప్పగా; అట్ల+చేయుదును+అని= అట్లే చేస్తానని చెప్పి; నలుండు= నలుడు; తన, మనంబునన్= తనమనస్సులో; దుఃఖించి= పరితపించి.

**తాత్పర్యం:** అంతేగాక, విదర్భప్రభువు భీముడు నలుడిని అన్వేషించటానికై పలువురిని పుత్తెంచి, ఎక్కడా ఆతడి జాడను తెలియజాలక, దమయంతికి ద్వితీయ స్వయంవరాన్ని ఏర్పాటు చేశాడనిన్నీ, అందుకు భూమండలంలోని రాజులందరూ వస్తున్నారనిన్నీ మిక్కిలి శీఘ్రంగా ఋతుపర్ణుడికి చెప్పుము'- అని దమయంతి చెప్పి పంపించింది. సుదేవుడు అంతట అయోధ్యాపురి చేరి ఋతుపర్ణుడిని సందర్శించి విదర్భానగరాన దమయంతీ ద్వితీయస్వయంవరం మరునాడు జరుగుతుందని చెప్పాడు. ఋతుపర్ణుడు అంతట బాహుకుడిని పిలిచి 'నాకు దమయంతీ స్వయంవరం చూడాలని ఉన్నది. అయితే, ఒక దినంలో మనం విదర్భ చేరవలసి ఉన్నది. నీ అశ్వశిక్షా చాతుర్యం వెలుగొందచేయుము' అని చెప్పగా బాహుకుడు అట్లాగే చేస్తానని చెప్పి, తన మనస్సులో మిక్కిలి పరితపించాడు.

**ఆ. 'అడవిఁ దన్నుఁ బాసి యరిగిన నలిగి కా । కున్నె యిట్లు సేయ నువిద గడఁగె;**
**నెట్లయేనిఁ గూర్తు రింతులు మా కని । విశ్వసించువారు వెడఁగు లెందు. 165**

**ప్రతిపదార్థం:** అడవిన్= అడవిలో; తన్నున్+పాసి+అరిగినన్= తనను ఎడబాసి వెళ్ళటంచేత; అలిగి, కాకున్నె= కోపగించుకొనటం వల్లనే కదా!; ఉవిద= ఇంతి (దమయంతి); ఇట్లు= ఈ విధంగా; (అంటే రెండవ స్వయంవరానికి పాల్పడటం); చేయన్= చేయటానికి; కడఁగెన్= పూనింది; ఎట్లు+అ+ఏనిన్= ఏవిధంగానైనను; ఇంతులు= ఆడువారు; మాకు= మమ్ము; కూర్తురు= ప్రేమిస్తూ ఉంటారు; అని; విశ్వసించువారు= నమ్మేవారు; ఎందున్= ఎచటనైనను; వెడఁగులు= వెఱ్రివారు (వివేకం లేనివారు).

**తాత్పర్యం:** 'ఆనాడు అడవిలో ఎడబాసి వెళ్ళాను- అనే కదా ఆమె నాపై కోపం పూనింది. లేకుంటే ఈ విధంగా మళ్ళీ రెండవస్వయంవరానికి పూనుకొంటుందా? తా మేమి చేసినా తమనే వనితలు ప్రేమిస్తూ ఉంటారని నమ్మే పురుషులు అవివేకులు'.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ఇది దమయంతిని గురించిన నలుడి అనుభూతి. దాన్ని నలుడు పురుషలోకానికి స్త్రీ జాతికి అన్వయించాడు. దమయంతి ఇంగితజ్ఞానం అద్భుతమైనది. ఆత్మాభిమానధురంధరుడైన నలుడి హృదయాన్ని కదలించగల శక్తి ద్వితీయ స్వయంవరవార్తకు మాత్రమే కలదని గుర్తించిన ఇంగితజ్ఞురాలు దమయంతి.

**ఆ. సాధ్వి నాకుఁ గూర్చు సంతతి గలయది । చెలువ యిట్టు లేల చేయు? నైన**
**నెఱుఁగవలయు దీని నే ఋతుపర్ణుతోఁ । బోదు' నని నలుండు బుద్ధిఁ దలఁచి. 166**

**ప్రతిపదార్థం:** సాధ్వి= సతీమణి అయిన దమయంతి; నాకున్+కూర్చు, సంతతి, కల+అది= నాపై అనురాగం గల బిడ్డలు కలది; చెలువ= మగువ (దమయంతి); ఇట్టులు+ఏల, చేయున్= ఈ విధంగా ఎందుకు చేస్తుంది? (అంటే ఎందుకు రెండవ స్వయంవరానికి పాల్పడుతుంది?); ఐనన్= అయినప్పటికిని; దీనిన్= ఈ విషయాన్ని; ఎఱుఁగవలయున్= అరసి తెలిసికోవలసి ఉన్నది; ఏన్= నేను; ఋతుపర్ణుతోన్+పోదున్= ఋతుపర్ణుడితో వెళ్ళుతాను; అని= అంటూ; నలుండు= నలుడు; బుద్ధిన్= మనస్సులో; తలఁచి= ఆలోచించి.

**తాత్పర్యం:** నలుడు తనలో తాను ఇట్లా తర్కించుకొన్నాడు- 'దమయంతి పతివ్రతాతిలకం. నాపట్ల అనురాగం గల బిడ్డలు ఉన్నారు ఆమెకు! ఆమె ఈ విధంగా రెండవ స్వయంవరానికి పాల్పడుతుందా? ఇది పరిశీలించవలసిన అంశం. కాబట్టి, నేను ఋతుపర్ణుడితో విదర్భకు వెళ్ళి సర్వం తెలుసుకొని వస్తాను.

**వ. తొల్లి వార్ష్ణేయుండు దెచ్చిన తన రథంబునందు నిజహయంబుల నాలక్ష్యమాణ శుభలక్షణంబులు మనోవాయు వేగంబులు నైన వానిం బూన్చికొని వచ్చిన, ఋతుపర్ణుం డా రథంబెక్కునప్పుడు హయంబులు మ్రొగ్గినం జూచి 'యప్పేదగుఱ్ఱంబు లతిదూరం బెట్లు పోవనోపు? నొండు గుఱ్ఱంబులం బూన్పు' మనిన బాహుకుం డిట్లనియె. 167**

**ప్రతిపదార్థం:** తొల్లి= మునుపు; వార్ష్ణేయుండు= వార్ష్ణేయుడు (నలుడి సారథిగా పని చేసినవాడు, ప్రస్తుతం ఋతుపర్ణుడి కొలువులో కుదురుకొన్నవాడు); తెచ్చిన= తీసికొని వచ్చిన; తన రథంబునందు= తనతేరుకు; ఆలక్ష్యమాణ, శుభలక్షణంబులు= మంచి లక్షణాలు కలిగి ఒప్పుతున్నట్టివి; మనస్+వాయు, వేగంబులు= మనోవేగం, వాయువేగం కలిగినట్టివి; ఐనవానిన్= అయినవాటిని; నిజ హయంబులన్= తన గుర్రాలను; పూన్చికొని వచ్చిన= రథానికి కట్టుకొని రాగా; ఋతుపర్ణుండు; ఆ, రథంబు+ఎక్కునప్పుడు= ఆ తేరును అధిరోహించేటప్పుడు; హయంబులు= గుర్రాలు; మ్రొగ్గినన్+చూచి= కొంచెం వంగటం గమనించి; ఆ+పేద, గుఱ్ఱంబులు= ఆ బడుగు గుర్రాలు; అతి దూరంబు= ఎక్కువ దూరం; ఎట్లు, పోవన్+ఓపున్?= ఏవిధంగా పోజాలుతాయి?; ఒండు, గుఱ్ఱంబులన్+పూన్పుము= వేరు గుర్రాలు తెచ్చి రథానికి కట్టుము; అనినన్= అని అనగా బాహుకుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా బదులు పలికాడు.

**తాత్పర్యం:** బాహుకుడు (నలుడు) ఇదివరలో వార్ష్ణేయుడు అయోధ్యకు తెచ్చి ఉంచిన తన రథానికి, మనోవేగం, వాయువేగం, సమస్త శుభలక్షణాలు గల తన గుర్రాలను కట్టి రథాన్నితెచ్చాడు. ఋతుపర్ణుడు ఆ రథాన్ని ఎక్కుతుండగా ఆ గుర్రాలు కొంచెం క్రిందికి మొగ్గాయి. ఋతుపర్ణుడు అది చూచి బాహుకుడితో 'ఈ బడుగు గుర్రాలు అంతదూరం ఎట్లా పోగలుగుతాయి? వేరే గుర్రాలను పూన్చుము' అని అదేశించాడు. అప్పుడు బాహుకుడు ఇట్లా బదులు పలికాడు.

**క. 'అవనీశ! యీ హయంబులు । పవనగతిం బఱచుఁ బ్రొద్దువడకుండఁగ నేఁ**
**డ విదర్భకు' ననవుడు విని । కువలయపతి మెచ్చి బాహుకున కి ట్లనియెన్. 168**

**ప్రతిపదార్థం:** అవనీ+ఈశ!= భూమికి ఈశ్వరుడివంటివాడా, అంటే-ఓ మహారాజా!; ఈ హయంబులు= ఈ గుర్రాలు; నేఁడు+అ= ఈ దినాననే; విదర్భకున్= విదర్భా పట్టణానికి; ప్రొద్దు+పడకుండఁగన్= సూర్యాస్తమయం కాకుండానే; పవనగతిన్= వాయువేగంతో; పఱచున్= పరుగెత్తుతాయి; అనవుడు= అని చెప్పగా; విని= ఆలకించి; కువలయపతి= భూభర్త అయిన మహారాజు; మెచ్చి= అభినందించి; బాహుకునకున్= బాహుకుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఈ గుర్రాలు వాయువేగంతో పరుగెత్తుతాయి. ప్రొద్దు క్రుంకే లోపలే విదర్భకు చేరేటట్లు చేస్తాయి'- అని బాహుకుడు అన్నాడు. అతడి మాటలకు మెచ్చుకొని ఋతుపర్ణుడు ఇట్లా పలికాడు.

**వ. 'అట్లయిన నీ హయతత్త్వకౌశలం బెఱింగి నీకు నభిమతం బొనరింతు' నని రథం బెక్కి బాహుక వార్ష్ణేయ సహితుం డయి యరుగువాఁడు. 169**

**తాత్పర్యం:** 'ఆ విధంగా నేడే ప్రొద్దుక్రుంకే లోపల విదర్భ చేరగలిగితే నీకు గుర్రాల స్వభావం తెలిసికోవటంలో, వాటికి శిక్షనివ్వటంలో ఉండే నైపుణ్యాన్ని గుర్తించి నీవుకోరింది ఇస్తాను' అని చెప్పి బాహుకుడితో వార్ష్ణేయుడితో కలిసి ఋతుపర్ణుడు పయనించాడు.

**మధ్యాక్కర.**

**ఎదురను దవ్వులఁ జూచిన పొడవు లెల్లఁ దత్క్షణమ**
**కదియఁగా, నవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ బిఱుఁద**
**'నిది దినేశ్వరు రథమో! యనూరుఁడో! యితఁ' డంచు నపుడు**
**హృదయమునను గడు విస్మయం బందె నిక్ష్వాకుకులుఁడు. 170**

**ప్రతిపదార్థం:** ఎదురను= ఎదురుగా; దవ్వులన్= దూరంగా; చూచిన= కనిపించిన; పొడవులు+ఎల్లన్= రూపాలన్నీ; (తద్,) క్షణము+అ= ఆ క్షణంలోనే; కదియఁగాన్= సమీపించగా; అవ్వి= అవి; ఎంతయును; దవ్వు+అయి= దూరమై; పిఱుఁదన్= వెనుకగా; కనన్+పడన్= కనిపించగా; ఇది= ఈ తేరు; దిన+ఈశ్వరు= సూర్యుడియొక్క; రథమో= తేరో?; ఇతఁడు= ఈ బాహుకుడు; అనూరుఁడో= సూర్యుడి రథసారథి అయిన అనూరుడో?; అంచున్= అంటూ; అపుడు; హృదయమునను= మనస్సులో; ఇక్ష్వాకు, కులుఁడు= ఇక్ష్వాకుకులంలో పుట్టిన ఋతుపర్ణుడు; కడు= మిక్కిలి; విస్మయంబు+అందెన్= ఆశ్చర్యం పొందాడు.

**తాత్పర్యం:** ఎదురుగా సుదూరంలో కనిపించిన రూపాలు ఆ క్షణంలోనే దగ్గరగా కనిపించి, వెనువెంటనే వెనుకగా మిక్కిలి దూరంలో కనిపించేవి. ఋతుపర్ణుడు 'ఇది సూర్యుడి రథమా? ఈ రథసారథి బాహుకుడా, అనూరుడా?' అని తన మనస్సులో మిక్కిలి ఆశ్చర్యం పొందాడు.

**విశేషం:** ఇది రథవేగవర్ణనం. దీనిని కాళిదాసమహాకవి వ్రాసిన అభిజ్ఞానశాకుంతలంలోని రథవేగవర్ణనతో సరిపోల్చి చూడండి. వృత్తలక్షణానికి ఈ ఆశ్వాసంలోని 22వ పద్యం విశేషవ్యాఖ్య చూడండి.

**వ. వార్ష్ణేయుండును బాహుకురథంబు గడపునేర్పున కచ్చెరువడి యాత్మగతంబున. 171**

**తాత్పర్యం:** వార్ష్ణేయుడు కూడా బాహుకుడు రథాన్ని నడిపే నైపుణ్యానికి ఆశ్చర్యపడి, మనస్సులో (ఇట్లా అనుకొన్నాడు)

**క. 'ఈతండు శాలిహోత్రుఁడొ! । మాతలియో! నలుఁడొ యొరులు మానవులు జవో**
**పేతముగ నిట్లు రథహయ । నీతి యెఱుంగుదురె? ధారుణీవలయమునన్. 172**

**ప్రతిపదార్థం:** ఈతండు= ఈ బాహుకుడు; శాలిహోత్రుఁడొ= అశ్వశాస్త్ర రచయితయైన శాలిహోత్ర మహర్షియో; మాతలియో!= దేవేంద్రుడి రథసారథి అయిన మాతలియో!; నలుఁడొ!; మానవులు, ఒరులు= మానవులు ఇంకెవ్వరు; ఇట్లు= ఈ విధంగా; జవ+ఉపేతముగన్= వేగంతో కూడినట్లు; రథ, హయనీతి= తేరులయొక్క, గుఱ్ఱాలయొక్క స్వభావపాటవ పద్ధతులు; ధారుణీ; వలయమునన్= భూమండలంలో; ఎఱుంగుదురె?= తెలిసి ఉన్నారా?

**తాత్పర్యం:** 'ఈ బాహుకుడు అశ్వశాస్త్రకర్తయైన శాలిహోత్ర మునీంద్రుడా? దేవేంద్రుడి రథసారథి అయిన మాతలియా? లేక నలుడా? తదితర మానవులు ఇంత శక్తిమంతంగా ఈ భూలోకంలో రథాలను గురించిన, గుఱ్ఱాలను గురించిన దర్శనజ్ఞానం కలవారు ఉన్నారా?

**వ. వయోవిద్యావైభవంబుల నితండు నలుంబోలియు వికృతరూపధరుం డయిన కారణం బేమియొ? మహాపురుషులు దైవనియుక్తులై ప్రచ్ఛన్నవృత్తి నుండుదురు; వారి నెఱుంగంబోలునె?' యనుచుఁ జనునప్పుడు ఋతుపర్ణుండు దన యుత్తరీయంబు జారి భూతలంబుపయిం బడిన మలంగి చూచి 'బాహుకా! వార్ష్ణేయుండు వోయి యుత్తరీయంబు దెచ్చునంతకు రథగమనం బించుక మందంబు సేయు' మనిన బాహుకుండును 'నయ్యా! నీ యుత్తరీయంబు వడినయెడ యిచ్చోటికి నొక్క యోజనంబు గలదు; దాని వార్ష్ణేయుం డెట్లు దే నేర్చు?' నని రథగమనవేగమాహాత్మ్యంబు సెప్పుచు ననేకదేశంబులు గడచి చని యొక్క యెడ నగణ్యపర్ణఫలశాఖాలంకృతంబైన విభీతకవృక్షంబు గని; రంత ఋతుపర్ణుండు బాహుకున కిట్లనియె. 173**

**ప్రతిపదార్థం:** వయో, విద్యా వైభవంబులన్= వయస్సుకు, జ్ఞాన నైపుణ్యానికి సంబంధించిన గొప్పతనంలో; ఇతండు= ఈ బాహుకుడు; నలున్+పోలియు= నలుడిని పోలి ఉన్నప్పటికిని; వికృత, రూప, ధరుండు+ఐన= వికారరూపాన్ని ధరించినవాడు కావటానికి; కారణంబు+ఏమియొ= హేతువు ఏమై ఉండవచ్చునో?; మహాపురుషులు= గొప్పవారు; దైవ, నియుక్తులు+ఐ= దైవంచేత నియమించబడినవారై; ప్రచ్ఛన్నవృత్తిన్= అజ్ఞాతవర్తనంతో; ఉండుదురు= ఉంటారు; వారిన్= అటువంటివారిని (అంటే అజ్ఞాతరూపంలో ఉన్నవారిని); ఎఱుంగన్+పోలునె= తెలిసికొనటానికి వీలవుతుందా?; అనుచున్= అని తలస్తూ; చనునప్పుడు= వెళ్ళేటప్పుడు; ఋతుపర్ణుండు; తన+ఉత్తరీయంబు= తన పైవలువ; జారి= క్రిందకి ఒరిగి; భూతలంబు, పయిన్+పడిన= భూమిపై పడగా; మలంగి= వెనుకకు తిరిగి; చూచి= అరసి; బాహుకా= ఓ బాహుకా!; వార్ష్ణేయుండు+పోయి= వార్ష్ణేయుడు వెళ్ళి; ఉత్తరీయంబు= పై వస్త్రం; తెచ్చునంతకు= తీసుకొని వచ్చేవరకు; రథగమనంబు= రథం వెళ్ళటం; ఇంచుక= కొంచెం; మందంబు+చేయుము= తగ్గించుము; అనిన= అని చెప్పగా; బాహుకుండును= బాహుకుడును; అయ్యా!= ఆర్యా!; నీ+ఉత్తరీయంబు= నీ పైపుట్టం; పడిన+ఎడ= పడినచోటు; ఈ+చోటికిన్= ఇచటికి; ఒక్క యోజనంబు= ఒక ఆమడదూరం; కలదు; దాని= ఆ ఉత్తరీయాన్ని; వార్ష్ణేయుండు; ఎట్లు= ఏ విధంగా; తేనేర్చును= తీసికొని రాగలడు?; అని=

అని చెప్పి; రథ, గమన, వేగ, మాహాత్మ్యంబు+చెప్పుచున్= రథం వెళ్ళే వేగంయొక్క గొప్పతనాన్ని గురించి చెప్పుతూ; అనేక, దేశంబులు= పెక్కుదేశాలు; కడచి= దాటి; చని= వెళ్ళి; ఒక్క+ఎడన్= ఒకచోట; అగణ్య, పర్ణ, ఫల, శాఖా+అలంకృతంబు+అయిన= లెక్కకు మిక్కిలి అయిన ఆకులతో, పండ్లతో, కొమ్మలతో అలంకరించబడిన; విభీతక, వృక్షంబున్+కనిరి= విభీతకమనే చెట్టును చూశారు (విభీతకవృక్షము= తాండ్రచెట్టు); అంతన్= అంతట; ఋతుపర్ణుండు; బాహుకునకు= బాహుకుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ బాహుకుడు వయస్సుకు, చదువుకు సంబంధించిన గొప్పతనంలో నలుడికి సమానుడే! అయితే ఆకారంలో పోలిక లేదుగదా! రూపం మారటానికి వేరే కారణం ఏదైనా ఉన్నదా? మహాపురుషులు కారణాంతరాల చేత మారురూపంలో ఇతరులకు తెలియ రాకుండ ఉండటం కద్దు. వారిని గుర్తుపట్టటం కష్టం కదా!'- అని వార్ష్ణేయుడు తన మనస్సులో తర్కించుకొంటుండగా, ఋతుపర్ణుడి ఉత్తరీయం జారి నేలపై పడింది. అంతట ఋతుపర్ణుడు 'బాహుకా! రథం ఇంచుక ఆపు! వార్ష్ణేయుడు దిగి నేలపై పడ్డ నా ఉత్తరీయం తెస్తాడు'- అని అన్నాడు. అంతట బాహుకుడు 'మహారాజా! నీ ఉత్తరీయం పడిపోయిన చోటు ఇచటికి ఇప్పుడు ఒక ఆమడ దూరంలో ఉన్నది. (అంటే రథం కొన్ని నిమేషాలలో మిక్కిలి వేగంగా యోజనదూరం పయనించింది). ఇక వార్ష్ణేయుడు అంతదూరం పాదచారి అయి వెళ్ళి ఎట్లా ఆ వస్త్రాన్ని తేగలడు?'- అని బదులు పలికి రథం పోతున్న వేగంయొక్క మహిమను నిరూపించి చెప్పాడు. అటువంటి వేగంతో రథం పయనించి పెక్కు దేశాలను దాటి వెళ్ళింది. ఒకచోట దారిలో ఒక పెద్ద విభీతకవృక్షం (తాండ్రచెట్టు) దట్టమైన ఆకులతో, లెక్కింప నలవికాని రెమ్మలతో, కొమ్మలతో పండ్లతో కన్పించింది. అప్పుడు ఋతుపర్ణుడు బాహుకుడితో ఇట్లా పలికాడు.

**ఆ. 'ఎల్లవారు నెఱుఁగ రెల్లవానిని; భిన్న। విషయు లెల్లవారు విద్యలందుఁ;**
**దొలఁగ కే నెఱుంగుదును దృష్టిమాత్రన। సకల మైన వస్తుచయముసంఖ్య. 174**

**ప్రతిపదార్థం:** ఎల్లవారున్= అందరు; ఎల్లవానిని= సమస్తమైన అంశాలను; ఎఱుఁగరు= తెలియజాలరు; విద్యలందున్= జ్ఞాననైపుణ్యాలలో; ఎల్లవారు= అందరు; భిన్న విషయులు= వేరువేరు విషయాలలో నేర్పరులు; తొలఁగక= తప్పకుండ; దృష్టి మాత్రన= చూపుతో మాత్రమే; సకలము+ఐన= సమస్తమైన; వస్తు, చయము, సంఖ్య= వస్తు సమూహాల లెక్క; ఏను= నేను; ఎఱుంగుదును= తెలిసికొనగలను.

**తాత్పర్యం:** 'అందరికి అన్ని విషయాలు తెలియవు కదా! జ్ఞాన నైపుణ్యాలలో అందరు వేరు వేరు విషయాలలో గొప్పవారు. నేను చూచినంత మాత్రంతోనే అన్ని వస్తుసమూహాలకు సంబంధించిన సంఖ్యను తప్పిపోకుండా లెక్కకట్టి చెప్పగలను.

**విశేషం:** సంస్కృతంలోని - "ముఖే ముఖే సరస్వతీ" అనే లోకోక్తిని పై పద్యంలోని ప్రథమ ఖండానికి సారసంగ్రహంగా ఎన్నవచ్చును. ఒక్కొక్కరికి ఒక్కొక్క ప్రజ్ఞ ఉంటుంది. ఎవరున్నూ సర్వజ్ఞులు కారు. ఈ సందర్భంలో సంస్కృతభారతంలో ఈ శ్లోకం ఉంది: "సర్వః సర్వం న జానాతి సర్వజ్ఞో నాస్తి కశ్చన। నైకత్ర పరినిష్ఠాస్తి జ్ఞానస్య పురుషే క్వచిత్॥" నలోపాఖ్యానం 'ఇతివృత్తం'గా ఎన్నితే అది నిరుపమానమైన కథ. అందులో కథాశిల్పం మాత్రమే కాక ఎన్నో అంతరార్థాలు హృదయంగమంగా నిక్షిప్తాలు. నలుడు రథసారథ్యంలో నిపుణుడు. ఋతుపర్ణుడు గణితశాస్త్రప్రవీణుడు.

**వ. ఇవ్విభీతకంబున ఫల పర్ణ సముదాయ సంఖ్యc జెప్పెద విను; మీ రెండు శాఖలం గల పర్ణ ఫలంబులు పదివేలు నొక్కండు; దక్కిన శాఖలం గల యవి రెండువేలుం దొంబదే; ననిన బాహుకుండు విని 'వీని నెన్నికాని నిశ్చయింప నేర' నని తన రథంబు నిలిపి యా వృక్షం బాక్షణంబ యురలం ద్రోచి యయ్యై శాఖలం గల యాకులు పండులు నెన్నిన ఋతుపర్ణుండు సెప్పినయన్ని యయిన నచ్చెరువడి, 'యివ్విద్య నాకు నుపదేశింపవలయు' నని యడిగిన ఋతుపర్ణుం డిట్లనియె. 175**

**ప్రతిపదార్థం:** ఈ+విభీతకంబునన్= ఈ తాండ్రచెట్టులో; ఫల, పర్ణ, సముదాయ సంఖ్యన్= పండ్లు, ఆకులు వెరసి మొత్తం సంఖ్యను; చెప్పెదన్= చెపుతాను; విను= వినుము; ఈ రెండు శాఖలన్+కల= ఈ రెండు కొమ్మలలో ఉండే; పర్ణఫలంబులు= ఆకులు, పండ్లు; పదివేలున్+ఒక్కండు= పదివేల ఒకటి; తక్కిన, శాఖలన్+కల+అవి= మిగిలిన కొమ్మలలో కలవి; రెండు వేలున్+తొంబది+ఏను+అనినన్= రెండువేల తొంబయిఅయిదు అని చెప్పగా; బాహుకుండు= బాహుకుడు; విని= ఆలకించి; వీనిన్+ఎన్నికాని= వీటిని లెక్కపెట్టికాని; నిశ్చయింపనేరను+అని= నిర్ణయించజాలనని పల్కి; తన రథంబు, నిలిపి= తన తేరు ఆపి; ఆ వృక్షంబు= ఆ చెట్టును; ఆ క్షణంబు+అ= వెంటనే; ఉరలన్+త్రోచి= క్రింద పడేట్లు త్రోసి; అయ్యై, శాఖలన్+కల= ఆయా కొమ్మలలో ఉండే; ఆకులు, పండులున్; ఎన్నినన్= లెక్కపెట్టగా; ఋతుపర్ణుండు; చెప్పిన+ అన్ని+ అయినన్= చెప్పినట్లే అన్నియేఉండగా; అచ్చెరువు+పడి= ఆశ్చర్యంపొంది; ఈ+విద్య; నాకున్= నాకు కూడ; ఉపదేశింప వలయును+అని; అడిగినన్= అర్థించగా; ఋతుపర్ణుండు= ఋతుపర్ణుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విభీతకవృక్షంలో ఉండే పండ్లు, ఆకులు మొత్తం లెక్కచెప్పుతాను వినండి. ఈ రెండు కొమ్మలలోను గల ఆకులు, పండ్లు కలిసి పదివేల ఒకటి. తక్కిన కొమ్మలలో కలవి రెండువేల తొంబయిఅయిదు'. అప్పుడు బాహుకుడు వీటిని లెక్కపెట్టితే కాని నిజమని నిశ్చయించజాలనని పలికి, తన రథాన్ని ఆపి, అ క్షణమే ఆ వృక్షాన్ని క్రింద పడద్రోసి ఆయా కొమ్మలలో ఉండే ఆకులు, పండ్లు లెక్కపెట్టగా, ఋతుపర్ణుడు చెప్పిన సంఖ్యలతో సరిపోయాయి. బాహుకుడు ఋతుపర్ణుడి ప్రజ్ఞకు ఆశ్చర్యపోయి ఆ విద్యను తనకు ఉపదేశించుమని ప్రార్థించాడు. అంత అతడికి ఋతుపర్ణుడు ఈ విధంగా చెప్పాడు.

**క. 'ఇది యక్షహృదయ మనcగా । విదితం బగు విద్య; దీని విధ్యుక్తముగా**
**మది నెఱుcగు నరుcడు సంఖ్యా । విదుc డగు దుష్కృతకళంకవిషముక్తుc డగున్. 176**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ ప్రజ్ఞ; అక్ష హృదయము; అనన్+కాన్= అని చెప్పబడుతూ; విదితంబు+అగు, విద్య= తెలియబడినదైన జ్ఞాననైపుణ్యం; దీనిన్= ఈ విద్యను; విధి+ఉక్తముగా= విధులందు చెప్పబడినట్లుగా (అంటే శాస్త్రసూత్రవిధులలో నిర్దేశించబడినట్లుగా); మదిన్= మనస్సులో; ఎఱుcగు నరుcడు= తెలిసే మనుజుడు; సంఖ్యావిదుcడు+అగు= సంఖ్యల ఆంతర్యం తెలిసినవాడు అవుతాడు; దుష్కృత, కళంక, విషముక్తుcడు+అగున్= పాపాలనుండి, చెడుగుణాలనుండి, విషాలనుండి తొలగినవాడు అవుతాడు.

**తాత్పర్యం:** 'ఇది అక్షహృదయం అని ప్రసిద్ధికెక్కిన విద్య. దీన్ని శాస్త్రీయంగా అభ్యసించిన మనుజుడు సంఖ్యావేత్త అవుతాడు. అతడు పాపాలనుండి, దుర్గుణాలనుండి, విషంనుండి విముక్తి పొందుతాడు.

**చ. సకలగుణప్రసిద్ధుఁ డగు సర్వహితుం డగుఁ జూవె!' యంచు బా**
**హుకునకుఁ బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశ మిచ్చె న**
**త్యకుటిలబుద్ధి నక్షహృదయంబుఁ గరంబు రయంబుతో విద**
**ర్భకుఁ జను వేడ్కఁజేసి ఋతుపర్ణుఁడు పూర్ణమనఃప్రసన్నుఁడై. 177**

**ప్రతిపదార్థం:** సకల, గుణ, ప్రసిద్ధుఁడు+అగు= అన్ని మంచి లక్షణాలు కలవాడయి; సర్వహితుండు+అగున్+చూవె, అంచున్= అందరికిని మేలు చేకూర్చేవాడు అవుతాడు సుమా అంటూ; అతి+అకుటిల, బుద్ధిన్= మిక్కిలి వంకరకాని మనస్సుతో అంటే సరళమైన బుద్ధితో; కరంబు= మిక్కిలి; రయంబుతోన్= త్వరగా; విదర్భకున్+చను= విదర్భకు పోయే; వేడ్కన్+చేసి= కుతూహలం చేత; ఋతుపర్ణుఁడు; పూర్ణ, మనస్+ప్రసన్నుఁడు+ఐ= నిండు మనస్సుతో అనుకూలుడై; అక్షహృదయంబున్= అక్షహృదయం అనే గణితవిద్యను; ప్రీతితోడన్= సంతోషంతో; బాహుకునకున్; విధియుక్తముగాన్= శాస్త్రీయంగా; ఉపదేశము+ఇచ్చెన్= ప్రబోధం చేశాడు.

**తాత్పర్యం:** 'ఈ విద్యను పొందిన వ్యక్తి సకల గుణప్రసిద్ధుడై, విశ్వశ్రేయస్సును ఒనగూర్చేవాడు కాగలడు సుమా!' అని అంటూ ఋతుపర్ణమహారాజు మిక్కిలి ప్రసన్నుడై, నిండు హృదయంతో, త్వరితంగా విదర్భకు వెళ్ళవలెననే కుతూహలంతో, సంప్రీతితో బాహుకుడికి అక్షహృదయం అనే గణితవిద్యను శాస్త్రీయంగా ఉపదేశించాడు.

**విశేషం:** ఇందులో విద్యయొక్క పరమార్థం వివరించబడింది. విశ్వశ్రేయం, సర్వగుణ పరిపూర్ణమైన యశస్సు- విద్యాదర్శాలు. విద్య శాస్త్రీయంగా ఉపదేశించబడాలి. గురువుకు ఉండవలసిన లక్షణాలు: కౌటిల్యం ఏ మాత్రం లేని సరళబుద్ధి, శిష్యుడిపై వాత్సల్యం.

**వ. ఇట్లు నలుండు ఋతుపర్ణువలన నక్షహృదయంబు వడసి సంతుష్టుండై 'నీకు నశ్వహృదయం బిచ్చెదఁ బరిగ్రహింపు' మనిన ఋతుపర్ణుం 'డట్ల చేయుదు, నది యంతకు నీయంద యుండనిమ్ము; నా వలసినప్పుడు గొందు' ననియె; నంత నయ్యక్షహృదయ సామర్థ్యంబున నప్పుడు. 178**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; నలుండు; ఋతుపర్ణువలనన్= ఋతుపర్ణుడినుండి; అక్షహృదయంబు= అక్షహృదయం అనే విద్య; పడసి= పొంది; సంతుష్టుండు+ఐ= తనివిచెందినవాడై; నీకున్; అశ్వహృదయంబు= అశ్వహృదయమనే విద్యను; ఇచ్చెదన్= ఉపదేశిస్తాను; పరిగ్రహింపుము= పుచ్చుకొనుము; అనినన్= అని చెప్పగా; ఋతుపర్ణుండు; అట్ల, చేయుదున్= ఆ రీతిగానే చేయగలను; అది= ఆ విద్య; అంతకున్= అంతవరకు, అంటే నేను పరిగ్రహించేవరకు; నీయందు+అ= నీ ఒద్దనే; ఉండనిమ్ము= ఉంచుము; నా వలసినప్పుడు= నాకు కావలసినప్పుడు; కొందున్= గ్రహించగలను; అనియెన్= అని చెప్పాడు; అంతన్= అటుపిమ్మట; ఆ+అక్షహృదయ, సామర్థ్యంబునన్= ఆ అక్షహృదయవిద్యయొక్క శక్తివలన; అప్పుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా నలుడు ఋతుపర్ణుడివలన అక్షహృదయవిద్య సంపాదించి మిక్కిలి సంతృప్తి చెందాడు. అంత బాహుకుడు ఋతుపర్ణుడితో 'నీకు అశ్వహృదయాన్ని ఉపదేశిస్తాను; పరిగ్రహించు' మని చెప్పగా ఋతుపర్ణుడు 'అట్లే పరిగ్రహిస్తాను. ఆ విద్య అంతవరకు నీ దగ్గరే ఉండనిమ్ము. నాకు అవసరమైనపుడు స్వీకరిస్తాను' - అని బదులు పలికాడు. పిదప ఆ అక్షహృదయమనే విద్యామహిమవలన అప్పుడు.

### నలుండు గలిచేత విముక్తుం డయి విదర్భకుఁ బోవుట (సం. 3-72-7)

**క. నలుఁ దొల్లి యాక్రమించిన । కలి గర్కోటకవిషంబు గ్రక్కుచు నొడలన్**
**వెలువడి, నలునకు విహితాం । జలియై త న్నెఱుఁగఁ జెప్పెఁ జంచలుఁ డగుచున్. 179**

**ప్రతిపదార్థం:** నలున్= నలుడిని; తొల్లి= మునుపు; ఆక్రమించిన= ఆవహించిన; కలి= కలిపురుషుడు; ఒడలన్= శరీరం నుండి; కర్కోటక, విషంబు, గ్రక్కుచు; వెలువడి= బయటకు వచ్చి; నలునకు, విహిత+అంజలి+ఐ= నలుడికి నమస్కరించినవాడై; చంచలుఁడు+అగుచున్= వణుకుతూ; తన్ను+ఎఱుఁగన్+చెప్పెన్= తనను తెలియజేసికొంటూ మాట్లాడాడు.

**తాత్పర్యం:** మునుపు నలుడిని ఆవహించిన కలిపురుషుడు కర్కోటకుడి విషాన్ని క్రక్కుతూ, నలుడిశరీరంనుండి బయటకు వచ్చి, అతడికి నమస్కరించి, గజగజ వణికిపోతూ తనను తెలియజేసికొన్నాడు.

**ఆ. వానిఁ జూచి నలుఁడు దా నల్గి శాప మీ । నున్నఁ, గలి యెఱింగి 'నిన్నుఁ బొంది**
**యహివిషంబుచేత ననిశంబు దగ్ధుండ । నైతి; నింక నాకు నలుగ వలదు.' 180**

**ప్రతిపదార్థం:** వానిన్= ఆ కలిని; చూచి= కాంచి; నలుఁడు= నలుడు; తాను+అల్గి= తాను కోపించి; శాపము+ఈన్+ఉన్నన్= శాపం ఇవ్వటానికి సిద్ధంగా ఉండటాన్ని; కలి= కలిపురుషుడు; ఎఱింగి= తెలిసికొని; నిన్నున్+పొంది= నిన్ను ఆవహించి; అహి, విషంబుచేతన్= పాముయొక్క విషంచేత; అనిశంబు= ఎల్లప్పుడు; దగ్ధుండన్+ఐతిన్= తగులబడిపోయాను; ఇంక= ఇక; నాకున్+అలుగ, వలదు= నామీద ఆగ్రహించవలదు.

**తాత్పర్యం:** ఆ కలిపురుషుడిని చూచి నలుడు కోపించి, అతడిని శపించటానికి సంసిద్ధుడయ్యాడు. ఆ సంగతి తెలిసికొని కలి 'నిన్ను ఆవహించటంచేత ఎల్లప్పుడు కర్కోటకవిషంచేత తగులబడిపోయాను. ఇంక వేరే దండన ఎందుకు? దయచేసి నాపై ఆగ్రహం విడువుము'.

**వ. 'నిన్నును నీ చెలువను గీర్తించిన జనంబులు నావలని భయంబు బొరయరు; నాకుం గరుణింపు' మనిన నలుండు గోపం బుడిగెఁ; గలియు నవ్విభీతకవృక్షంబు నాశ్రయించె; నది మొదలుగా విభీతకం బప్రశస్తం బయ్యెఁ; నట్లు నలుండు వికృత రూప మాత్రంబు దక్కఁ దక్కిన దుష్కృతంబులవలన విముక్తుండై రథం బెక్కి యతివేగంబున ఋతుపర్ణ వార్ష్ణేయ సహితుండై విదర్భకుం జనియె; నంత సాయాహ్నంబున. 181**

**ప్రతిపదార్థం:** నిన్నును, నీ చెలువను= నిన్నును మరియు నీ భార్య అయిన దమయంతిని; కీర్తించిన జనంబులు= కొనియాడిన ప్రజలు; నావలని భయంబు= నా మూలంగా ఏర్పడే భయాన్ని; పొరయరు= పొందరు (అంటే నలదమయంతులను కీర్తించిన వారు కలిదోషవిముక్తులు అవుతారు); నాకున్+కరుణింపుము+అనినన్= నాపట్ల దయ చూపుము అని అడుగగా; నలుండు, కోపంబు+ఉడిగెన్= నలుడు ఆగ్రహాన్ని వీడాడు; కలియున్= ఆ కలిపురుషుడున్నూ; ఆ+విభీతకవృక్షంబున్= ఆ విభీతకమనే చెట్టును; ఆశ్రయించెన్= ఆవహించాడు; అది, మొదలుగా= అప్పటినుండి; విభీతకంబు= విభీతకవృక్షం; అప్రశస్తంబు+అయ్యెన్= దుష్టమైనదిగా ఎన్నబడింది; అట్లు= ఆ విధంగా; నలుండు= నలుడు; వికృత, రూప, మాత్రంబున్+తక్క= వికారమైన ఆకృతిమాత్రం తప్ప; తక్కిన= మిగిలిన; దుష్కృతంబులవలన= పాపాలనుండి; విముక్తుండు+ఐ= ముక్తిచెందిన వాడై; రథంబు+ఎక్కి= తేరెక్కి; అతి వేగంబునన్= మిక్కుటమైన రయంతో; ఋతుపర్ణ, వార్ష్ణేయ, సహితుండు+ఐ= ఋతుపర్ణుడితో, వార్ష్ణేయుడితో కూడినవాడై; విదర్భకున్+చనియెన్= విదర్భకు వెళ్ళాడు; అంతన్= అటుపిమ్మట; సాయ+అహ్నంబున= ప్రొద్దు క్రుంకేవేళ.

**తాత్పర్యం:** 'నిన్నూ, నీ భార్య అయిన దమయంతినీ ధ్యానించినవారు నావలన భీతిని పొందరు (అంటే కలిదోషవిముక్తులు అవుతారు). దయచేసి నన్ను క్షమించి నామీద కోపం విడువుము'- అని కలిపురుషుడు ప్రార్థించగా నలుడు ఆగ్రహం విడిచాడు. కలి అంతట విభీతకవృక్షాన్ని ఆవహించాడు. ఆనాటినుండి విభీతకవృక్షం మంచిది కాదనే భావం విస్తరించింది. అట్లా నలుడు వికృతమైన ఆకృతి వినా తదితర పాపాలనుండి విముక్తుడై రథాన్నెక్కి మిగులవేగంతో ఋతుపర్ణ వార్ష్ణేయులతో కలిసి విదర్భకు వెళ్ళాడు. అంత ప్రొద్దుక్రుంకేవేళ.

**క. మానుగ ఋతుపర్ణుఁడు భీ । మానుజ్ఞాతుఁడయి చొచ్చె నా ప్రోలు రథ**
**ధ్వానంబు మ్రోయుచుండఁగ । నానాదిఙ్ముఖములను ఘనధ్వనివోలెన్. 182**

**ప్రతిపదార్థం:** మానుగన్= ఒప్పునట్లుగా, అంటే వైభవోపేతంగా; ఋతుపర్ణుఁడు= ఋతుపర్ణమహారాజు; భీమ+అను జ్ఞాతుఁడు+అయి= భీముడిచే అనుమతించబడినవాడై; రథధ్వానంబు= తేరుయొక్క చప్పుడు; నానాదిక్+ముఖములను= దిగ్దిగంతరాలలో; ఘనధ్వని+పోలెన్= మేఘగర్జనలవలె; మ్రోయుచుండఁగ= నినదిస్తుండగా; ఆ, ప్రోలు= ఆ నగరాన్ని; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** ఋతుపర్ణుడు, భీమరాజు అనుమతితో వైభవోపేతంగా విదర్భాపురిలో ప్రవేశించాడు. ఆతడు పురప్రవేశం చేస్తుంటే ఆతడి రథఘోష దిగ్దిగంతరాలలో మేఘగర్జనవలె ప్రతిధ్వనించింది.

**సీ. దమయంతి యా రథధ్వని విని, యిది నలు । రథఘోష మని యనురాగ మొంది,**
**'నలు నిషధేశుఁ బుణ్యశ్లోకు లోకోప । కారకుఁ జూడంగఁ గాంతు నేఁడు;**
**ఘనభుజుఁ జూడంగఁ గానని నాఁడుఁ ద । ద్భుజ పరిరంభణోద్భూత సుఖముఁ**
**బడయని నాఁడును బ్రాణముల్ విడుతు నే' । నని తలంచుచుఁ గమలాయతాక్షి**

**ఆ. యా రథాధిరూఢుఁడై వచ్చు ఋతుపర్ణుఁ । జూచి యప్పు డధికశోకతప్త**
**యగుచు నుండె; నంత నా ఋతుపర్ణుండు । భీముఁ గాన వచ్చెఁ బ్రియముతోడ. 183**

**ప్రతిపదార్థం:** దమయంతి; ఆ, రథ, ధ్వని, విని= ఆ తేరు మ్రోత ఆలకించి; ఇది; నలు, రథ, ఘోషము+అని= నలుడి రథధ్వనియే అని; అనురాగము+ఒంది= ప్రేమ ఏర్పడి; నలున్= నలుడిని; నిషధ+ఈశున్= నిషధరాజును; పుణ్యశ్లోకున్= పవిత్రమైన చరిత్ర కలవాడిని; లోక+ఉపకారకున్= లోకానికి శ్రేయస్సును ఒనగూర్చేవాడిని; నేఁడు= ఈ దినం; చూడంగన్+కాంతున్= దర్శించగలను; ఘనభుజున్= గొప్ప భుజాలు కలవాడిని- అంటే పరాక్రమవంతుడిని; చూడంగన్+కానని, నాఁడు= చూడలేకపోయిన దినాన; తద్+భుజ, పరిరంభణ+ఉద్భూత, సుఖమున్+పడయని నాఁడును= ఆతడియొక్క భుజాలవలన ఏర్పడిన కౌగిలినుండి కలిగిన సౌఖ్యం పొందనివేళ; ప్రాణముల్, విడుతును+ఏను+అని= ప్రాణాలను విడిచి పెట్టుతానని తలస్తూ; కమల+ఆయత+అక్షి= పద్మాలను పోలిన సోగకన్నులు కల దమయంతి; ఆ, రథ+ఆరూఢుఁడు+ఐ= ఆ తేరును ఎక్కి; వచ్చు= వస్తున్న; ఋతుపర్ణున్+చూచి= ఋతుపర్ణుడిని చూచి; అప్పుడు; అధిక, శోక, తప్త= మిక్కుటమైన శోకంతో ఉడికినట్టిది; అగుచున్+ఉండెన్= అవుతున్నది; అంతన్= అంతట; ఆ, ఋతుపర్ణుండు; ప్రియముతోడన్= ప్రీతితో; భీమున్= భీమరాజును; కానవచ్చెన్= చూడవచ్చాడు.

**తాత్పర్యం:** దమయంతి ఆ రథఘోష వినగానే అది నలుడి రథమని గుర్తుపట్టి అనురక్తి చెందింది. నిషధేశుడు, విశ్వజనీనచరితుడు, పుణ్యశ్లోకుడు, లోకోపకారి, పరాక్రమోపేతుడు అయిన నలుడిని నేడు చూడగలుగుతానని

మిక్కిలి సంతోషించింది. ఆతడిని చూడనినాడు, ఆతడి కౌగిలిలో తిరిగి సుఖం అనుభవించనినాడు ప్రాణాలను విడిచిపెట్టుతానని తలపోసి, పద్మాలవంటి సోగకన్నులతో రథంరాకకై నిరీక్షించింది. ఆ రథంపై ఆసీనుడై కనిపించింది ఋతుపర్ణుడు. అతడిని చూచి దమయంతి మిక్కుటమైన శోకవేదనలో మునిగింది. ఋతుపర్ణుడు ప్రీతితో భీమరాజును సందర్శించటానికి వచ్చాడు.

**వ. భీముండును వానిం బూజించి యొక్క రమ్యహర్మ్యంబున విడియించిన, ఋతుపర్ణుం డప్పురంబున స్వయంవరం బను శబ్దంబు మొదలుగా వినం గానక యాత్మగతంబున. 184**

**ప్రతిపదార్థం:** భీముండును= భీమరాజును; వానిన్= ఆతడిని, ఆ ఋతుపర్ణ మహారాజును; పూజించి= అర్చించి, ఒక్క=ఒక; రమ్యహర్మ్యంబునన్= అందమైన మేడలో; విడియించినన్= విడిది ఏర్పాటుచేయించగా; ఋతుపర్ణుండు; ఆ+పురంబునన్= ఆ పట్టణంలో; స్వయంవరంబు= స్వయంవరం; అను, శబ్దంబు= అనే మాట; మొదలుగా, వినన్+కానక= మొదలైన శబ్దాలు వినిపించనందువలన; ఆత్మగతంబునన్= తనలో తాను.

**తాత్పర్యం:** ఆ ఋతుపర్ణుడికి అతిథిసత్కారాలు చేసి భీమరాజు రమణీయమైన ఒక పెద్దమేడలో అతడికి విడిది ఏర్పాటు చేశాడు. కాని ఆ పురంలో స్వయంవరం అనే శబ్దంగాని, స్వయంవరానికి సంబంధించిన సందడిగాని వినరాక ఋతుపర్ణుడు తనలో తాను (ఇట్లా తలపోశాడు).

**క. 'ధరణిఁ గల రాజు లిట యె। వ్వరు వచ్చినవారు లేరు; వైదర్భి యొరున్**
**వరియించు నంత ధర్మే। తరచరితయె?' యనుచు నుండెఁ దద్దయు లజ్జన్. 185**

**ప్రతిపదార్థం:** ధరణిన్+కల, రాజులు= భూమిపై కల ప్రభువులు; ఇట= ఇటు; ఎవ్వరు, వచ్చినవారు, లేరు= వచ్చినవారు ఎవరున్నూ లేరు; వైదర్భి= విదర్భరాజపుత్రిక అయిన దమయంతి; ఒరున్= ఇంకొకరిని; వరియించు+అంత= భర్తగా ఎన్నుకొనేంతటి; ధర్మ+ఇతర, చరితయె= ధర్మ బాహ్యమైన నడవడి కలదా?; అనుచున్= అని తలపోస్తూ; తద్దయు= మిక్కిలి; లజ్జన్= సిగ్గుతో; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** 'భూమండలంలోని రాజులు ఎవరున్నూ ఇక్కడికి రాలేదు. విదర్భరాజపుత్రిక అయిన దమయంతి ఇంకొక మగని వరించేటంత అధర్మప్రవర్తన కలదా?'- అని తలపోస్తూ ఋతుపర్ణుడు మిక్కుటమయిన సిగ్గుతో ఉండిపోయాడు.

**వ. బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథసమీపంబున విశ్రమించియుండె; నంత దమయంతి బాహుక వార్ష్ణేయులతోడ వచ్చిన ఋతుపర్ణుం జూచి విఫలమనోరథయై, యుండనోపక, కేశిని యను దానిం బిలిచి' 'ఋతుపర్ణు నయోధ్యాపతింగా వార్ష్ణేయు సూతపుత్త్రుంగా నెఱింగితి; బాహుకుం డను వాఁ డెవ్వండో? వానియందు నా హృదయంబు ముదితం బగుచున్నయది; మన పర్ణాదునకుఁ బ్రతివచనం బిచ్చినవాఁడు వాఁడ కావలయు; వానికడకుం బోయి యెఱింగి ర' మ్మని పంచిన, నదియును బోయి బాహుకుం, గని 'దమయంతి నీ కుశలం బడుగఁ బుత్తెంచె; నిందుల కేమి కారణంబున వచ్చి?' తనిన దానికి బాహుకుం డిట్లనియె. 186**

**ప్రతిపదార్థం:** బాహుకుండును= బాహుకుడును; రథశాల= రథాల చావడిలో; రథ+అశ్వంబుల= రథాలకు పూన్చిన గుర్రాలను; బంధించి= కట్టి; రథ సమీపంబున= రథానికి దగ్గరగా; విశ్రమించి+ఉండెన్= సేదదీరుతూ ఉండినాడు; అంతన్= అంతట; దమయంతి; బాహుక, వార్ష్ణేయులతోడ, వచ్చిన= బాహుకుడితో వార్ష్ణేయుడితోపాటు వచ్చిన; ఋతుపర్ణున్+చూచి= ఋతుపర్ణుడిని చూచి; విఫలమనోరథ+ఐ= ఫలించని కోరిక కలదై; ఉండన్+ఓపక= ఉండజాలక; కేశిని+అనుదానిన్+పిలిచి= కేశిని అనే దాసిని పిలిచి; ఋతుపర్ణున్= ఋతుపర్ణుడిని; అయోధ్యాపతిన్+కా= అయోధ్యకు రాజుగా; వార్ష్ణేయు= వార్ష్ణేయుడిని; సూతపుత్త్రుంగాన్= సూతుడి కొడుకైన రథసారథిగా; ఎఱింగితి= తెలిసికొంటిని; బాహుకుండు+అనువాఁడు= బాహుకుడనేవాడు; ఎవ్వండో= ఎవడై ఉంటాడో; వానియందు= ఆ బాహుకుడిపట్ల; నా, హృదయంబు= నా డెందం; ముదితంబు+అగుచున్న+అది= సంతోషాన్ని పొందుతున్నది; మన, పర్ణాదునకు= మనం అయోధ్యకు పంపిన పర్ణాదుడనే బ్రాహ్మణుడికి; ప్రతివచనంబు+ఇచ్చినవాఁడు= ఎదురు సమాధానం చెప్పినవాడు; వాఁడు+అ= కావలయు= ఆతడే కావచ్చును; వాని, కడకున్+పోయి= అతడివద్దకు వెళ్ళి; ఎఱింగి రమ్ము+అని= తెలిసికొని రమ్మని; పంచినన్= నియోగించగా; అదియును= ఆ కేశినియు; పోయి= వెళ్ళి; బాహుకున్+కని= బాహుకుడిని చూచి; దమయంతి; నీ కుశలంబు= నీ క్షేమం; అడుగన్+పుత్తెంచెన్= తెలిసికొమ్మని పంపింది; ఇందులకు= ఇచటికి; ఏమి, కారణంబునన్= ఏ హేతువుచేత; వచ్చితి= అరుగుదెంచావు; అనినన్= అని అడుగగా; దానికి= ఆమెకు; బాహుకుండు= బాహుకుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** బాహుకుడు రథశాలలో తన గుర్రాలను కట్టి, తాను తన రథసమీపంలో సేదతీర్చుకొంటూ ఉన్నాడు. అంత దమయంతి, బాహుకుడితో వార్ష్ణేయుడితో వచ్చిన ఋతుపర్ణుడిని చూచి ఆశాభంగం పొంది, ఊరక ఉండక, కేశిని అనే దాసిని పిలిచి 'ఋతుపర్ణుడు అయోధ్యకు రాజు. వార్ష్ణేయుడిని సూతపుత్రుడిగా నేను గుర్తు పట్టాను. మఱి బాహుకుడు ఎవడై ఉండవచ్చును? అతడిపట్ల నాహృదయం సంతోషం పొందుతున్నది. మనం అయోధ్యకు పంపిన పర్ణాదుడికి ప్రత్యుత్తరమిచ్చినవాడు అతడే అయి ఉండవచ్చును! అతడి దగ్గరకు వెళ్ళి అతడి సంగతి సమాచారాలు తెలిసికొని రమ్ము' - అని నియోగించింది. కేశిని బాహుకుడి దగ్గరకు వచ్చి 'అయ్యా! దమయంతి నీ యోగక్షేమాలను అరసి రమ్మని నన్ను పుత్తెంచింది. ఇచటికి మీరు ఎందుకు వచ్చారు?' - అని అడుగగా ఆమెకు బాహుకుడు ఇట్లా బదులు పలికాడు.

**క. 'ప్రియమున దమయంతి పున । స్స్వయంవరము సేయఁ గడఁగి సకలక్షత్త్రా**
**న్వయవీరుల రావించిన । నయనిధి ఋతుపర్ణుఁ డొక్కనాఁటన వేడ్కన్. 187**

**ప్రతిపదార్థం:** ప్రియమునన్= ప్రీతితో; దమయంతి= దమయంతికి; పునః+స్వయంవరము, చేయన్+కడఁగి= తిరిగి స్వయంవరం చేయటానికి పూని; సకల, క్షత్త్ర+అన్వయ, వీరులన్, రావించిన= సమస్త క్షత్రియ వంశాలలోని వీరులను ఆహ్వానించగా; నయనిధి= నీతికి నిధివంటివాడు, అంటే రాజనీతిపరిజ్ఞానం ఎక్కువగా కలవాడు; ఋతుపర్ణుఁడు; వేడ్కన్= కుతూహలంతో; ఒక్కనాఁటన= ఒక్కదినంలోపలే.

**తాత్పర్యం:** 'ప్రీతితో దమయంతికి తిరిగి స్వయంవరం సంకల్పించారు కదా! అందుకు అందరు క్షత్రియవీరులను ఆహ్వానించి రప్పించారుకదా! ఆ హేతువుచేత రాజనీతినిధి అయిన మహారాజు ఋతుపర్ణుడు వేడుకతో ఒక్కదినంలోనే.

**విశేషం:** ఈ పద్యానికి గరిమనాభి 'ఒక్కనాఁటన'= 'ఒక్క దినమందే' అనే పదగుంఫనం. కేశిని బాహుకుడి రాకకు అమాయకురాలివలె కారణం అడిగింది. బాహుకుడుకూడా తనకేమీ తెలియనట్లు ప్రత్యుత్తరం ఇచ్చాడు. అతని మాటలలో గల ఎత్తిపొడుపు గమనించదగినట్టిది.

**క. వినవె శతయోజనంబులు । సనుదెంచె నయోధ్యనుండి సరి నిందుల; కా**
**తని రథసారథినై యే । నును వచ్చితి నతనితో మనోవేగమునన్.' 188**

**ప్రతిపదార్థం:** అయోధ్యనుండి; ఇందులకు= ఇక్కడికి; సరిన్= సరిగ్గా; శతయోజనంబులు= నూరామడలు; చనుదెంచెన్= వచ్చాడు; వినవె= వినలేదా? నీవు- అంటే ఋతుపర్ణ మహారాజు ఒక్కదినంలో వంద ఆమడల దూరంలో ఉన్న అయోధ్యనుండి ఇచటికి వచ్చినట్లు నీవు వినలేదా?- అని అర్థం; ఆతని= ఆ ఋతుపర్ణుడి; రథసారథిన్+ఐ= తేరు నడిపే సూతుడినై; అతనితోన్= ఆ ఋతుపర్ణునితో; మనస్+వేగమునన్= మనస్సుతో సరితూగే వేగంతో; ఏనును= నేనుకూడ; వచ్చితిన్= అరుదెంచాను.

**తాత్పర్యం:** ఋతుపర్ణమహారాజు అయోధ్యనుండి నేరుగా ఇచటికి నూరు ఆమడల మేర ఒక దినంలో వచ్చి చేరిన సంగతి నీవు వినలేదా? ఆతడి రథసారథిని నేను. నేనుగూడ ఆతడితోపాటు మనోవేగంతో వచ్చాను.

**విశేషం:** ఈ పద్యంలో వాచ్యమైన విషయం- బాహుకుడు ఎవరనే ప్రశ్నకు సమాధానం ఋతుపర్ణుడి సారథి అని; కాని ఇందు ధ్వనించిన అంతరార్థం బాహుకుడు తాను నలుడనని సూచించటం. యావత్ప్రపంచంలో ఒక్కదినంలో నూరు ఆమడల దూరానికి రథాన్ని నడపగలవాడు ఎవడు? నలుడు మాత్రమే. ఆ విషయం దమయంతికి అవగతపూర్వమైన భూతార్థం.

**వ. అనిన 'మూఁడవవాఁ డెవ్వఁ?' డని యడిగిన, నక్కేశినికి బాహుకుం డిట్లనియె. 189**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; (కేశిని) మూఁడవవాఁడు= మూడవవ్యక్తి; ఎవ్వఁడు+అనినన్= ఎవడని అడుగగా; ఆ+కేశినికి= కేశిని అనే దానికి; బాహుకుండు= బాహుకుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని, కేశిని 'మూడవవ్యక్తి ఎవరు?' అని అడిగింది. ఆ కేశినికి బాహుకుడు ఇట్లా సమాధానం చెప్పాడు.

**క. 'నలు రథచోదకుఁ; డతఁ డ । త్యలఘుఁడు వార్ష్ణేయ నాముఁ' డనవుడు వాఁ డ**
**న్నలభూపాలకు పోయిన । వల నెఱుఁగండొక్కొ!' యనిన వాఁ డిట్లనియెన్. 190**

**ప్రతిపదార్థం:** అతఁడు, నలు, రథచోదకుఁడు= నలుడి రథసారథి; అతి+అలఘుఁడు= మిక్కిలి తేలికగానివాడు- అంటే ఎక్కువ గౌరవించతగినవాడు; వార్ష్ణేయ, నాముఁడు= వార్ష్ణేయుడనే పేరు కలవాడు; అనవుడు= అని చెప్పగా; వాఁడు= అతడు; (ఆ వార్ష్ణేయుడు); ఆ+నల, భూపాలకు, పోయిన వలను= నలమహారాజు వెళ్ళినచోటును; ఎఱుఁగండు+ఒక్కొ= తెలియజాలడా ఏమి?; అనినన్= అని అడుగగా; వాఁడు= ఆ బాహుకుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'అతడు (ఆ మూడవవ్యక్తి) ఒకానొకనాడు నలుడి రథసారథి. ఆతడి పేరు వార్ష్ణేయుడు. గౌరవించదగిన వ్యక్తిత్వం కలవాడు' అని బాహుకుడు చెప్పగా విని కేశిని 'అయితే ఆ వార్ష్ణేయుడికి నలుడిజాడ తెలయకుంటుందా?' అని ఎదురుప్రశ్న వేసింది. అప్పుడు బాహుకుడు ఇట్లా పలికాడు.

**వ. 'వార్ష్ణేయుండును నలుపుత్త్రుల విదర్భేశ్వరునొద్దఁ బెట్టిపోయి, నడుమ నలురాజ్యభ్రంశంబు విని ఋతుపర్ణుం గొలిచి యుండె; నాతండును నలు నెఱుంగఁడు. 191**

**ప్రతిపదార్థం:** వార్ష్ణేయుండును; నలుపుత్త్రులన్= నలుడి బిడ్డలను; విదర్భేశ్వరు+ఒద్దన్+పెట్టిపోయి= విదర్భరాజుకడపెట్టి వెనుతిరిగి వెళ్ళేటప్పుడు; నడుమన్= మార్గమధ్యంలో; నలు, రాజ్య, భ్రంశంబు= నలుడి రాజ్యం పోవటం; విని= తెలిసికొని, (ఆకర్షించి); ఋతుపర్ణున్+కొలిచి+ఉండెన్= ఋతుపర్ణుడి కొలువులో కుదురుకొన్నాడు; ఆతండును= ఆ వార్ష్ణేయుడును; నలున్+ఎఱుంగఁడు= నలుడిని ఎఱుగడు, అంటే నలుడి జాడలు, ఉనికిపట్టులు అతడికి కూడ తెలియవు అన్నమాట.

**తాత్పర్యం:** 'వార్ష్ణేయుడు నిషధనుండి నలుడి బిడ్డలను విదర్భకు తీసికొనిపోయి అచట విదర్భరాజుదగ్గర వదలిపెట్టి, తాను వెనుదిరిగిపోతూ, మార్గమధ్యంలో నలుడు రాజ్యాన్ని జూదంలో కోల్పోయిన వార్త తెలిసికొని ఋతుపర్ణుడి కొలువులో చేరాడు. అందువలన వార్ష్ణేయుడికి కూడ నలుడి ఉనికిపట్టులు తెలియవు.

**క. నలుతో నొక్కట నరిగిన । నలినాయతనేత్ర భీమనందన యొండెన్**
**నలుఁ డొండె నెఱుఁగుఁగా; క । న్నలు నొరులకు నెఱుఁగఁ గారణము గలదె మహిన్.' 192**

**ప్రతిపదార్థం:** నలుతోన్= నలుడితో; ఒక్కటన్+అరిగిన= కలిసి వెళ్ళిన; నలిన+ఆయత, నేత్ర= పద్మాలవలె విశాలమైన కన్నులు కలది; భీమనందన= భీమరాజుగారి కూతురు దమయంతి; ఒండెన్= కాని; నలుఁడు+ఒండెన్= నలమహారాజు కాని; ఎఱుఁగున్, కాక= తెలిసికొని ఉంటారు కాని; ఒరులకున్= తదితరులకు; ఆ+నలున్+ఎఱుఁగన్= నలుడి ఉనికిపట్టులు తెలియటానికి; మహిన్= ఈ భూమిలో; కారణము కలదే= హేతువు ఉన్నదా?

**తాత్పర్యం:** నలుడి ఉనికిపట్టులు నలుడితోపాటు అడవికి వెళ్ళిన పద్మాలవంటి విశాలనేత్రాలు కలిగిన భీమనందన దమయంతికి తెలియాలి, లేదా ఆ నలుడికే తెలియాలి అంతే కాని, ఇతరులకు తెలియటానికి ఎటువంటి అవకాశాలు లేవుకదా!'

**వ. అనిన విని కేశిని యిట్లనియె. 193**

**తాత్పర్యం:** అని చెప్పగా విని, కేశిని ఇట్లా పలికింది.

**సీ. 'అడవిలో వస్త్రార్ధహారియై దయలేక । ప్రాణేశ్వరుఁడు దనుఁ బాసి చనిన**
**నాఁటి వస్త్రార్ధంబు నలినాక్షి యిప్పుడుఁ । బరిధానముగఁ బాంసుపటల మలిన**
**మగుచున్న తనువుతో ననయంబు జడగొన్న । యలకావలులతోడ నవనితలము**
**శయనంబుగా ధర్మచారిణి దమయంతి । యనఘవ్రతం బిట్టు లాచరించు**

**ఆ. చున్న' దనిన నవిరళోద్గత బాష్పపూ । ర్ణంబు లైన లోచనంబు లెఱుక**
**వడకయుండ వదనపద్మంబు వాంచి తా । నొండువలను సూచుచుండె నలుఁడు. 194**

**ప్రతిపదార్థం:** అడవిలోన్= వనంలో; వస్త్ర+అర్ధ, హారి+ఐ= సగం చీర హరించినవాడై; దయ, లేక= కనికరం లేక; ప్రాణ+ఈశ్వరుఁడు= భర్త; తనున్+పాసి= తనను విడిచిపెట్టి; చనిన, నాఁటి, వస్త్రార్ధంబు= వెళ్ళిపోయిన నాటి సగం వస్త్రం; ఇప్పుడున్= నేఁడుకూడా; నలిన+అక్షి= పద్మాలవంటి కన్నులుకల దమయంతి; పరిధానముగన్= కట్టుపుట్టంగా; పాంసు, పటల, మలినము+అగుచున్న, తనువుతోన్= దుమ్ము దూగర చేత మాసిపోతున్న శరీరంతో; అనయంబు= ఎల్లప్పుడు; జడ+కొన్న= చిక్కుముడులు పడిన; అలక+ఆవళులతోడన్= ముంగురుల గుంపుతో; అవనితలము= భూమిపైభాగం;

శయనంబుగాన్= పడుకొనేచోటుగా; ధర్మచారిణి= పతివ్రతాధర్మమున నడిచే దమయంతి; అనఘవ్రతంబు= పాపరహితమైన నోము; ఇట్టులు= ఈ విధంగా, ఆచరించుచున్నది= నెరపుతున్నది; అనినన్= అనిచెప్పగా; అవిరళ+ఉద్గత, బాష్ప, పూర్ణంబులు+ఐన= ఎడతెగకుండ వెల్లువలుగా పైకి ఉబికివస్తున్న కన్నీటిధారలతో నిండినవైన; లోచనంబులు= నేత్రాలు; ఎఱుక, పడక+ఉండన్= తెలియబడకుండ ఉండేటట్లుగా; వదనపద్మంబు= ముఖపద్మం; (పద్మాన్ని పోలిన ముఖం); వాంచి= క్రిందకు వాల్చి; తాను; ఒండు, వలను= వేరొకవైపుకు (దృష్టి మరల్చి); నలుఁడు; చూచుచుండెన్= చూస్తూ ఉండిపోయాడు.

**తాత్పర్యం:** 'అడవిలో అలనాడు అర్ధాంగి సగంచీరను హరించి కనికరం లేకుండ తనమీదనే ప్రాణాలు పెట్టుకొని తనతోపాటు అడవికి వచ్చిన ఆమెను వీడి, నలుడు వెళ్ళిపోయాడు కదా! నలినాక్షి దమయంతి ఆనాటి సగం చీరనే నేటికీ తనకు కట్టుపుట్టంగా ధరించి ఉన్నది. ఆమెశరీరం దుమ్ముదూగరతో మలినమై ఉన్నది. ఆమె ముంగురులు జడలుగా అల్లుకొనిపోయాయి! భూమిపై పడుకొని ఆమె నిద్రిస్తున్నది. పరమపతివ్రత అయిన దమయంతి ఇంత కఠోరమైన పవిత్రవ్రతం ఆచరిస్తున్నది' అని కేశిని నిందిస్తుంటే నలుడి కన్నులనుండి ఎడతెగని కన్నీటివెల్లువ పెల్లుబికి వచ్చింది. అతడు తన కన్నులు కేశినికి కనిపించకుండ తన వదనపద్మం వంచి వేరొకవైపున చూడసాగాడు.

**వ.** **కేశినియును బాహుకు పలుకులు నాకారంబును దమయంతి కెఱింగించిన, నది యాతని నలుంగా శంకించి 'యింకను వాని కడ కేఁగుము; వాఁడు ఋతుపర్ణు వంటలవాఁడఁటె; పచనసమయంబున వాని చరితం బిమ్ముగా నెఱింగి ర'మ్మని పంచిన నప్పుడ చని కేశినియు బాహుకునందుల దైవమానుష నిమిత్తాద్భుత క్రియలు సూచి వచ్చి దమయంతి కిట్లనియె.** **195**

**ప్రతిపదార్థం:** కేశినియును= కేశిని కూడ; బాహుకు, పలుకులున్= బాహుకుడి మాటలు; ఆకారంబును= రూపాన్ని; దమయంతికి; ఎఱింగించినన్= తెలుపగా; అది= ఆమె (దమయంతి); ఆతని= ఆ బాహుకుడిని; నలుంగా= నలుడిగా; శంకించి= సందేహించి; ఇంకను= మఱియు; వాని కడకు+ఏఁగుము= ఆతనిఒద్దకు వెళ్ళుము; వాఁడు= అతడు (ఆ బాహుకుడు); ఋతుపర్ణువంటలవాఁడు+అఁటె= ఋతుపర్ణుడి దగ్గర వంటలు చేసేవాడు అని చెపుతారు; పచన సమయంబునన్= వంట చేసేటప్పుడు; వాని, చరితంబు= అతడి ప్రవర్తన; ఇమ్ముగాన్= సంపూర్ణంగా; ఎఱింగి రమ్ము= తెలిసికొని రమ్ము; అని= అని చెప్పి; పంచినన్= నియోగించగా; అప్పుడు+అ= వెనువెంటనే; చని= వెళ్ళి; కేశినియు; బాహుకు+అందుల= బాహుకుడిలోని; దైవ, మానుష, నిమిత్త+అద్భుత, క్రియలు= లోకాతీతమైన, దివ్యాలైన, మనుజ సహజాలైన కారణ విశేషాలు గల ఆశ్చర్యకరాలైన కార్యాలు; చూచివచ్చి= కనుగొని, విచ్చేసి; దమయంతికి= దమయంతికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** కేశిని బాహుకుడి మాటలు, రూపం దమయంతికి తెలిపింది. దమయంతి బాహుకుడే నలుడు కావచ్చునని సందేహించి 'ఇంకను ఆతడిని పరీక్షించుము. అతడు ఋతుపర్ణుడి వంటలవాడని చెపుతారు. వంట చేసేటప్పుడు అతడి ప్రవర్తనను సంపూర్ణంగా పరిశీలించి రమ్ము' అని కేశినిని ఆదేశించింది. కేశిని వెంటనే వెళ్ళి తిరిగి వచ్చి బాహుకుడిలో తాను చూచిన లోకాతీతాలు, మనుజసహజాలు అయిన కారణవిశేషాలు గల అద్భుత విషయాలను దమయంతితో ఇట్లా చెప్పింది.

### కేశిని యను దూతి దమయంతితో నలుని గుణంబులు సెప్పుట (సం. 3-73-8)

**క.** **'అతని చరితంబు సెప్పఁగ । నతిమానుష మపగతప్రయాస మదృష్ట**
**శ్రుతపూర్వము; పరమార్థమ । యతనిని వే ల్పనఁగవలయు నంబుజనేత్రా!** **196**

**ప్రతిపదార్థం:** అంబుజ, నేత్రా!= పద్మాలవంటి కన్నులు కలదానా!; అతని, చరితంబు= అతడి ప్రవర్తన (ఆ బాహుకుడి చర్య); చెప్పఁగన్= వర్ణించగా; అతి మానుషము= మనుజ ప్రకృతికి అతీతం, అంటే మానవుల శక్తికి అసాధ్యమైనది; అపగత ప్రయాసము= పోయిన శ్రమకలది (అనాయాసమైనది) సులువుగా అర్థం కానట్టిది; అదృష్టము= పూర్వం చూడబడనిది; అశ్రుత పూర్వము= లోగడ వినబడనిది; పరమ+అర్థము+అ= సత్యమే; అతనిని= ఆ బాహుకుడిని; వేల్పు+ అనఁగవలయున్= దేవతాపురుషుడు అని చెప్పక తప్పదు.

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులు కలదానా! ఆ బాహుకుడి చర్య వర్ణనాతీతం; అతడి శక్తి లోకోత్తరం, మానవాతీతం, ప్రయాస లేనిది; పూర్వం ఇటువంటిది జరిగినట్లుగా ఎవరు చూడలేదు; పూర్వం ఇటువంటిది జరిగినట్లు చెప్పగా ఎవరు వినలేదు; అయినప్పటికీ పరమసత్యమైనది; అతడిని వేల్పు అని చెప్పక తప్పదు.

**సీ.** **వినవమ్మ! తృణముష్టిఁ గొని వాఁడు వీచుడు । నం దగ్ని యుదయించి యతని వంట**
**లమరునంతకు నింధనము లపేక్షింపక । యుడుగక మండుచునుండు; మఱియుఁ**
**గడఁకతో నంజుళ్ళు గడుగంగ సమకట్టి । జల మపేక్షించుడు సంభవిల్లి**
**కుంభముల్ నిండి దివ్యాంభఃప్రవాహ మ । క్షయ మగుచుండుఁ దత్క్షణమ చూడ;**

**ఆ.** **నతని కరతలద్వయావమర్దితములై । కందియును మహాసుగంధకుసుమ**
**తతులు దొంటియట్ల తమకంపు విడువక । యుండు; నతని తేజ మున్నతంబు.'** **197**

**ప్రతిపదార్థం:** వినవమ్మ= అమ్మా దమయంతీ! వినుము; తృణముష్టిన్+కొని= గడ్డితో కూడిన పిడికిలి పూని; వాఁడు= ఆ బాహుకుడు; వీచుడున్= వీచటంతోనే; అందు= అచట; అగ్ని= నిప్పు; ఉదయించి= ఉద్భవించి; అతని, వంటలు+ అమరునంతకున్= అతడి వంటలు పూర్తి అయ్యేవరకు; ఇంధనములు= కట్టెలు; అపేక్షింపక= కోరక; ఉడుగక= మానక; మండుచున్+ఉండున్= ప్రజ్వలిస్తూ ఉంటుంది; మఱియున్= ఇంకా; కడఁకతోన్= పూనికతో; నంజుళ్ళు= మాంసాలు; కడుగంగ, సమకట్టి= కడగటానికి పూనుకొని; జలము+అపేక్షించుడు= నీరు కావాలని అనుకొనగానే; సంభవిల్లి= పుట్టి; కుంభముల్, నిండి= కడవలు నిండి; దివ్య+అంభస్+ప్రవాహము= దివ్యమైన నీటివెల్లువ; తత్+క్షణము+అ, చూడ= చూస్తే ఆ క్షణంలోనే; అక్షయము+అగుచుండున్= తరుగకుండ ఉంటుంది; అతని= అతడియొక్క; కరతల, ద్వయ, అవమర్దితములు+ఐ= రెండు చేతులతో పిసుకబడినట్టివై; కందియును= నలిగి నలుపెక్కినవి అయ్యునూ; మహా, సుగంధ, కుసుమ, తతులు= గొప్ప పరిమళం గల పూలగుత్తులు; తొంటియట్ల= మునుపటివలెనే; తమ; కంపు, విడువక= తమ పరిమళాన్ని కోల్పోవక; ఉండున్= ఉంటాయి; అతని, తేజము= అతడి ప్రకాశం; ఉన్నతంబు= గొప్పది.

**తాత్పర్యం:** అమ్మా దమయంతీ! ఆ బాహుకుడి అద్భుతచర్యలు వర్ణనాతీతం. వినవమ్మా విను! వివరించి చెపుతాను. అతడు గడ్డితో కూడిన పిడికిలిని వీచితే అచట నిప్పు ఉద్భవించి అతడి వంట పూర్తి అయ్యేవరకు కట్టెలతో నిమిత్తం లేకుండా ఆరిపోకుండా అట్లే మండుతూ ఉంటుంది. అంతేకాక, మాంసాలు కడగాలని అతడు తలపోసిన వెంటనే నీరు ఉద్భవించి కడవలు నిండిపోయి దివ్యమైన నీటివెల్లువ నిండుగా పెల్లుబుకుతూనే ఉంటుంది. అతడి చేతుల రాపిడికి నలిగిపోయిన పువ్వులగుత్తులు కందిపోయినప్పటికీ మునుపటి పరిమళాలను వెదజల్లుతూనే ఉంటాయి. అతడి తేజస్సు చాలా గొప్పది.'

**విశేషం:** 'కంపు'- అనే శబ్దం నన్నయనాటినుండి ఈనాటివరకు అర్థవిపరిణామానికి లోనయింది. నేడు 'కంపు' అంటే దుర్వాసన అనే వ్యవహారమే ఉన్నది. నన్నయనాడు 'కంపు' అంటే పరిమళం (సువాసన) అని అర్థం. నన్నయనాడు అది, దాని- అనేవి స్త్రీ వాచక సర్వనామాలు. ఆమె, ఆమెయొక్క- అనే అర్థాలలో ప్రయుక్తాలు. నేటి నీచార్థం ఆ శబ్దాలకు ఆనాడు లేదు. ఇంధన నిరపేక్షంగా అగ్ని మండటం, సంకల్పమాత్రంచేతనే నీరు ఏర్పడి కడవలు నిండటం, అక్షయ ధారావాహినిగా నీరు ప్రవహించటం - అవి ఆనాడు వ్యాసమహర్షి ఎట్లా ఊహించి వ్రాశాడో? 170వ పద్య వ్యాఖ్యానం పరికించ వేడికోలు.

**వ. అనిన విని దమయంతి వెండియుఁ గేశినిం బంచి బాహుకు వండిన నంజుళ్ళు తెప్పించి యాస్వాదించి, బాహుకునందు నలు లక్షణంబులు గలుగు టెఱింగియు, నూఱడనోపక వానిపాలికిం గొడుకునుం గూఁతునుం గేశినితోడం బుచ్చిన నక్కుమారులం జూచి. 198**

**ప్రతిపదార్థం:** అనిన, విని= అని కేశిని చెప్పగా; ఆలకించి= విని; దమయంతి= దమయంతి; వెండియున్= మరల; కేశినిన్+పంచి= కేశినిని పుత్తెంచి; బాహుకు వండిన= బాహుకుడు వండిన; నంజుళ్ళు= మాంసాలు; తెప్పించి; ఆస్వాదించి= కొద్దిగా రుచిచూచి; బాహుకునందు= బాహుకుడిలో; నలు, లక్షణంబులు= నలుడి గుణాలు; కలుగుట+ఎఱింగియు= ఉండటం తెలిసికొనియు; ఊఱడన్+ఓపక= తృప్తి చెందక; వానిపాలికిన్= బాహుకుడి దగ్గరకు; కొడుకునున్+కూఁతునున్= కొడుకును కూతురిని; కేశిని తోడన్+పుచ్చినన్= కేశినితో పంపగా; ఆ+కుమారులన్+చూచి= ఆ బిడ్డలను చూచి. [ఇక్కడ కుమారుని, కుమార్తెను (కుమారుని) అని రెండు అర్థాలు 'కుమారుల' అనుశబ్దంలో అన్వయింపబడ్డాయి.]

**తాత్పర్యం:** బాహుకుడి అద్భుత చర్యలను కేశిని దమయంతికి వివరించి చెప్పగా విని, దమయంతి మరల కేశినిని పంపి, బాహుకుడు వండిన మాంసాలు తెప్పించి రుచిచూచి, బాహుకుడిలో నలుడి లక్షణాలు ఉండటం గమనించింది. అంతటితో తృప్తి చెందక, ఆతడి దగ్గరకు కేశినిని తోడిచ్చి తన కొడుకును కూతురును పంపించింది. ఆ బిడ్డల్ని చూచి-

**ఆ. వశము గాక బాష్పవారి యొల్కుచు నుండఁ। గొడుకుఁ గూఁతు నెత్తికొని నలుండు**
**హర్షపులకితంబు లయిన నిజాంకంబు। లందు వారి నునిచి యాదరమున. 199**

**ప్రతిపదార్థం:** నలుండు; వశము+కాక= తన వశం తప్పి; బాష్పవారి= కన్నీరు; ఒల్కుచున్+ఉండన్= కారుతుంటే; కొడుకున్+కూఁతున్+ఎత్తికొని= కుమారుడిని, కుమార్తెను గారాబంతో ఎత్తుకొని; హర్షపులకితంబులు+అయిన= సంతోషంతో గగుర్పాటు చెందినవైన; నిజ+అంకంబులందున్= తన ఒడులలో; వారిన్= ఆ బిడ్డలను; ఉనిచి= పెట్టుకొని; ఆదరమునన్= ప్రీతితో.

**తాత్పర్యం:** తన వశం తప్పి కన్నీరు కారుతుండగా నలుడు, కొడుకును కూతురిని వాత్సల్యంతో ఎత్తుకొన్నాడు; సంతోషంతో గగురుపాటు పొందిన తన ఒడులలో వారిని ఉంచుకొని ఆదరించాడు.

**వ. అక్కేశినిం జూచి 'యిక్కుమారు లిద్దఱు నా కొడుకునుం గూఁతునుం బోలిన వీరి నెత్తికొని దుఃఖించితి' నని తన్నేర్పడకుండం బలికి దాని కిట్లనియె. 200**

**ప్రతిపదార్థం:** ఆ+కేశినిన్+చూచి= ఆ కేశినిని చూచి; ఈ+కుమారులు+ఇద్దఱు= ఈ బిడ్డలు ఇరువురు; నా కొడుకునున్= నా పుత్రుడిని; కూఁతునున్+పోలిన= కూతురిని పోలి ఉండగా; వీరిని= ఈ బిడ్డలను; ఎత్తికొని= కౌగిలించుకొని; దుః ఖించితిన్= పరితపించాను; అని= అనిచెప్పి; తన్ను+ఏర్పడకుండన్+పలికి= తనను గుర్తించకుండ మాటాడి; దానికిన్= ఆ కేశినికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ కేశినిని చూచి 'ఈ బిడ్డలు నా బిడ్డలను పోలిఉండటంచేత నేను నా బిడ్డలను స్మరించి పరితపించాను. వీరిని ఎత్తుకొని లాలించినందుకు వేరుగా తలపవద్దు'- అని తనను గుర్తించటానికి వీలు కాకుండేటట్లుగా మాటాడి మరియు ఇట్లా చెప్పాడు.

**క. 'నీ విట పలుమఱు వచ్చుచుఁ। బోవుచు నున్కిఁ గని చిత్తముల నొండుగ నన్**
**భావింతు రితరజనములు। గావున రావలవ దింకఁ గార్యార్థినివై. 201**

**ప్రతిపదార్థం:** నీవు+ఇట= నీవు ఇక్కడకు; పలుమఱు= చాలా సారులు; వచ్చుచున్+పోవుచున్+ఉన్కిన్= వస్తూ, తిరిగిపోతూ, ఉండటం; కని= అరసి; ఇతర, జనములు= ఇతర ప్రజలు; చిత్తములన్= మనస్సులలో; ఒండుగన్= వేరేవిధంగా; నన్= నన్ను; భావింతురు= తలపోస్తారు; కావున= కాబట్టి; కార్య+అర్థినివి+ఐ= నీ పనిని నెరవేర్చుకొనటానికై; ఇంకన్= ఇక; రావలవదు= (నాకడకు) రావద్దు.

**తాత్పర్యం:** 'కేశినీ! ఇక నీవు ఏ పనిమీదనైనా నా దగ్గరకు రావద్దు. నీవు ఇచటికి పలుమారులు వస్తూ, పోతూ ఉంటే, చూచేవారు వారి మనస్సులలో నన్ను వేరేవిధంగా భావించవచ్చును సుమా!

**వ. ఏము దేశాంతరంబున నుండివచ్చిన అతిథులము; నీకు మాతోడి దేమి?' యనినఁ గేశిని గ్రమ్మఱి వచ్చి, బాహుకు మార్గంబంతయు దమయంతికిం జెప్పిన, నది సంతసించి నిజజనని కిట్లనియె. 202**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; దేశాంతరంబుననుండి= వేరొక దేశంనుండి; వచ్చిన, అతిథులము= వచ్చిన ఆగంతుకులం; నీకు; మాతోడిది+ఏమి= మాతో ఉండే పనేమి?; అనినన్= అని చెప్పగా; క్రమ్మఱి వచ్చి= తిరిగివచ్చి; కేశిని; బాహుకు, మార్గంబు+అంతయున్= బాహుకుడి వైఖరినంతటిని; దమయంతికిన్+చెప్పిన; అది= ఆమె (దమయంతి); సంతసించి= ప్రీతిచెంది; నిజ, జననికిన్= తన తల్లికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** మేము వేరొకదేశంనుండి వచ్చిన అతిథులం. నీకు మాతో ఏమి పని? పొమ్మ'- అని బాహుకుడు కసరుకొనగా, కేశిని తిరిగివచ్చి దమయంతికి జరిగిన సంగతి వివరించి చెప్పింది. దమయంతి సంతోషించి తన తల్లికడ కేగి ఇట్లా చెప్పింది.

**ఉ. 'సందియ మేల? సర్వగుణసంపదఁ జూడఁగ బాహుకుండు భూ**
**వందితుఁడైన నైషధుఁ డవశ్యముఁ దా నగు; నా మనంబు నా**
**నందముఁ బొందుచున్నది ఘనంబుగ; వాఁ డిట వచ్చువాఁడొ? యే**
**నందుల కేఁగుదాననొ? రయంబున నాపని నిశ్చయింపుమా!' 203**

**ప్రతిపదార్థం:** సందియము+ఏల= సందేహం ఎందుకు?; సర్వ, గుణ, సంపదన్= సకల లక్షణాల పెంపులో; చూడఁగన్= అరయగా; బాహుకుండు= బాహుకుడు; తాను; అవశ్యమున్= తప్పకుండ; భూవందితుఁడు+ఐన= భూలోక ప్రజలచేత నమస్కరించబడినవాడైన; నైషధుఁడు= నిషధరాజు; అగున్= అవును; నా మనంబు= నా మనస్సు; ఘనంబుగన్= గొప్పగా; ఆనందమున్= సంతోషాన్ని; పొందుచున్నది; వాఁడు+ఇట= ఆతడు ఇచటికి; వచ్చువాఁడొ= వచ్చువాడవునో?; ఏన్= నేను; అందులకు= అచటికి; ఏగుదాననొ= వెళ్ళేదానినో?; రయంబునన్= వేగంగా; ఆ పని= ఆ కర్తవ్యం; నిశ్చయింపుమా!= నిర్ణయించాలి సుమా!

**తాత్పర్యం:** 'ఇక సందేహించవలసిన అగత్యమే లేదు. సమస్త సద్గుణసంపదలో పరిశీలించిచూస్తే బాహుకుడు తప్పనిసరిగా భూజనులచేత నమస్కారాలు అందుకొనే నిషధేశ్వరుడైన నలుడే. నా మనస్సు మిగుల ఆనంద తన్మయమైనది. ఆతడు ఇక్కడికి రావటమా? నేను అతడి దగ్గరకు వెళ్ళటమా? సత్వరం ఈ కర్తవ్యాన్ని నిర్ణయించాలి సుమా!'

**విశేషం:** బాహుకుడు నలుడే అనే నిర్ణయం సులభ సాధ్యమైనదికాదు. దమయంతి పాత్రచిత్రణం మిక్కిలి హృదయంగమమైనది. (1) దమయంతి అతిలోకసౌందర్యవతి (2) సౌందర్యంతోపాటు దమయంతిలో సౌశీల్యం పెనగొనిఉన్నది. (3) సౌందర్య సౌశీల్యాలేకాక దమయంతికి గల తెలివితేటలు నిరుపమానాలు. ఆమె ముందుగానే మగడి ఓటమిని ఊహించి తనబిడ్డలను విదర్భకు పంపింది. పౌరులను వెంటబెట్టుకొని నలుడిని జూదంనుండి మరల్చటానికి యత్నించింది. తదుపరి నలుడితో వనవాసానికి పోవటం, అరణ్యంలో ఆమె పడినపాట్లు ఆమె పాతివ్రత్యాన్ని చాటునట్టివి. (4) ఆమె ఇంగితజ్ఞానం అనన్యసామాన్యమైనట్టిది. నలుడిని కనుగొనటానికి ఆమె పన్నిన పన్నుగడ అళీక ద్వితీయ స్వయంవర కల్పనం. నలుడి హృదయాన్ని కరిగించి అతడిని ఉద్విగ్నుడిని చేయటానికై బ్రాహ్మణులచేత అనిపించిన ఎత్తిపొడుపుమాటలు. (5) బాహుకవేషధారి అయిన నలుడిని ఆమె గుర్తించిన విధానం ఆమె తెలివితేటలకు, జాగరూకతకు నిదర్శనాలు. బాహుకుడు సుస్పష్టంగా నలుడు కాడు. వార్ష్ణేయుడు ఆతడిని గుర్తించలేకపోయాడు. అతడికి ఒక్కసారి బాహుక సారథ్యాన్ని చూచినపుడు కొంచెం సందేహం కలిగింది. ఆతడు ఊగిసలాడాడే కాని స్థిరనిర్ణయానికి రాలేకపోయాడు. జీవలుడు బాహుకుడిని ద్విపాదజంతువుగానే పరిగణించాడు. ఇక దమయంతి అద్వితీయమేధ బాహుకుడి మాటున అణగిమణగిన నలుడి వ్యక్తిత్వాన్ని గుర్తించగలిగింది. మానవమాత్రుల చర్మచక్షువులు చేయలేని పరిశోధనలో దమయంతి మనోనేత్రం విజయం సాధించింది. (6) దమయంతి పరిశోధన సాంగోపాంగంగా ప్రస్తరించదగ్గది. 1. నలుడి మనస్సుకు వాడిబాణాలవలె నాటే మాటలు విని, పర్ణాదుడికి ఏకాంతంగా బాహుకుడు సమాధానం చెప్పక తప్పిందికాదు. 2. నూరు ఆమడలు ఒక దినంలో రథం నడపగల నేర్పు నలుడికి మాత్రమే ఉన్నది. సుదేవుడు పెట్టిన గడువులో నూరు ఆమడల దూరం రథాన్ని నడిపే బాహుకుడు అయోధ్యనుండి విదర్భ చేరాడుగదా!. 3. నలుడి రథనేమిఘోష దమయంతికి చిరపరిచితం, విదర్భాపురి ఋతుపర్ణుడి రథం చేరగానే దమయంతి నలుడిరథాన్ని గుర్తించగల్గింది. 4. నలపాకం సుప్రసిద్ధం. సంకల్పమాత్రంచేత నిప్పు, నీరు కల్పించగల శక్తి నలుడికి తప్ప మానవమాత్రులు మరెవ్వరికిని ఉండజాలదు. (ఆ శక్తులు అగ్నివరుణాదులవరాలవలన నలుడికి లభించాయి.) ఆ విషయాన్ని కేశినిచేత దమయంతి రూఢి చేసికొన్నది. 5. నలుడు వండిన నంజుళ్ళ రుచి దమయంతికి అనుభవ ఆమ్రేడితం. 6. పుత్రైషణ జీవకోటికి సహజం. కేశినితోపాటు బిడ్డలను బాహుకుడి దగ్గరకు పుత్తెంచింది. బాహుకుడు వారిని కౌగలించుకొని ఆనందబాష్పతన్మయుడు అయ్యాడు. ఇన్ని పరీక్షలు చేసిన పిమ్మట కురూపి అయిన బాహుకుడే ఒకనాటి అతిలోకసౌందర్యనిధి అయిన నలుడని దమయంతి నిశ్చయించింది. 7. చిట్టచివరకు బాహుకుడే స్వస్వరూపంతో దమయంతికి ప్రసన్నుడయ్యాడు. ఇక కథ కంచికి పోయింది.

**వ. అనిన నది యప్పుడ భీము ననుమతంబున దమయంతియొద్దకు బాహుకు రావించిన. 204**

**ప్రతిపదార్థం:** అనినన్= అని దమయంతి చెప్పగా; అది= దమయంతి తల్లి; అప్పుడు+అ; భీము+అనుమతంబునన్= భీముడియొక్క సమ్మతిచొప్పున; దమయంతి+ఒద్దకు= దమయంతి దగ్గరకు; బాహుకున్= బాహుకుడిని; రావించిన= రప్పించగా.

**తాత్పర్యం:** అని దమయంతి చెప్పగా విని ఆమెతల్లి భీముడి అనుమతిపొంది దమయంతి దగ్గరకే బాహుకుడిని రప్పించింది.

**క. చనుదెంచి యందు దీనా । నన నవిరళపంకమలిననతగాత్రఁ దప**
**స్విని నతికృశ దమయంతిం । గనియె నలుం డుదితబాష్పకణకలితముఖిన్. 205**

**ప్రతిపదార్థం:** చనుదెంచి= వచ్చి; అందు= అచట; దీన+ఆననన్= పరితాపం కల ముఖం కలదానిని; అవిరళ, పంక, మలిన, నత, గాత్రన్= ఎల్లప్పుడు తడిసిన దుమ్ముతో మాసి వంగిన దేహం కలదానిని; తపస్వినిన్= నియమాచరణం కలదానిని; అతి కృశన్= మిక్కిలి కృశించినదానిని; ఉదిత బాష్ప, కణ, కలిత, ముఖిన్= ఉద్భవించిన కన్నీటి బొట్టులతో కూడిన మొగం కలదానిని; దమయంతిన్= దమయంతిని; నలుండు= నలుడు; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** నలుడు అచటికి చేరి దైన్యం ఉట్టిపడే ముఖం కలదీ, ఎల్లప్పుడు దుమ్ముతో మాసి క్రుంగినదేహం కలదీ, చూపరులకు జాలిగొలిపేదీ, చిక్కి కృశించినదీ, జారే కన్నీటిబొట్టులతో కూడిన మొగం కలదీ- ఐన దమయంతిని చూచాడు.

**క. దమయంతి నలుని వికృతాం । గముఁ జూచియు నతని నన్యుఁగా వగవక నె**
**య్యమునను లజ్జను నతిసం । భ్రమమున వివశాత్మ యగుచుఁ బతి కిట్లనియెన్. 206**

**ప్రతిపదార్థం:** దమయంతి; నలుని, వికృత+అంగమున్+చూచియున్= నలుడియొక్క వికారమైన దేహాన్ని చూచికూడా; అతనిన్= అతడిని; అన్యున్+కాన్= పరుడిగా; వగవక= చింతించక; నెయ్యమునను= స్నేహంతోనూ; లజ్జనున్= సిగ్గుతోనూ; అతి, సంభ్రమమునన్= మిక్కిలి తత్తరపాటుతో; వివశ+ఆత్మ+అగుచున్= వశం తప్పిన ఆత్మ కలది అవుతూ; పతికి= భర్తకు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పింది.

**తాత్పర్యం:** నలుడిదేహం వికారంగా కనిపించినప్పటికిని అతడిని పరుడిగా ఎంచక, స్నేహంతోనూ, సిగ్గుతోనూ, మిక్కుటమైన తత్తరపాటుతోనూ తనను తాను అదుపులో పెట్టుకొనలేకుండా భర్తతో ఇట్లా చెప్పింది.

**వ. 'విజనంబైన విపినంబునందు నలసి నిద్రవోయినదాని నబల నతిసాధ్వి ననువ్రత నగ్నిసన్నిధిఁ బాణిగ్రహణవిధి లబ్ధ యైన దానిం బాసి నలునట్లు నిర్దయులై యరిగినవా రొరు లెవ్వరు లేరు. 207**

**ప్రతిపదార్థం:** విజనంబు+ఐన= జనులు లేనట్టి; విపినంబునందున్= అడవిలో; అలసి, నిద్ర+పోయినదానిన్= బడలి నిద్రించిన దానిని; అబలన్= బలంలేని ఆడుదానిని; అతి సాధ్విన్= మిక్కిలి మంచినడవడి కలదానిని; అనువ్రతన్= సహధర్మచారిణిని; అగ్ని సన్నిధిన్= అగ్నిదేవుడి సమక్షంలో; పాణి, గ్రహణ, విధి, లబ్ధ+ఐన, దానిన్= శాస్త్రీయమైన వివాహపద్ధతిలో పొందబడినదానిని; నలు+అట్లు= నలుడివలె; పాసి= విడిచిపెట్టి; నిర్దయులు+ఐ= దయలేనివారై; అరిగినవారలు= వెళ్ళినవారు; ఒరులు= ఇతరులు; ఎవ్వరు, లేరు= ఎవరూ లేరు.

**తాత్పర్యం:** 'జనులు లేని అడవిలో అలసి నిదురపోయినదానిని, బలహీనురాలైన ఆడుదానిని, సహధర్మచారిణి అయి తనవెంట అడవికి వచ్చినదానిని, సౌమ్యమైన సత్ప్రవర్తన కలదానిని, అగ్నిసాక్షిగా శాస్త్రీయమైన పద్ధతిలో పెండ్లిచేసికొని చేపట్టినదానిని నలుడివలె కఠినాత్ములై విడిచిపెట్టి వెళ్ళినవారు ఇతరులు మరెవ్వరూ లేరు.

**క. సురవరులఁ దొఱఁగి తన్నున్ । వరియించితి; నన్నుఁ బుత్త్రవతి నేలొకొ చె**
**చ్చెర విడిచె? నాతనికి ని । ష్కరుణున కే నేమి యెగ్గు గావించితినో? 208**

**ప్రతిపదార్థం:** సురవరులన్= దేవతాశ్రేష్ఠులను; తొఱఁగి= విడిచి; తన్నున్= తననే; వరియించితి= భర్తగా ఎన్నుకొన్నాను; నన్నున్= నన్ను; పుత్రవతిన్= సంతానవతిని; ఏల+ఒకొ= ఎందుకో?; చెచ్చెర= శీఘ్రంగా; విడిచెన్= విడిచిపెట్టాడు; ఆతనికిన్= ఆ నలుడికి; నిష్కరుణునకున్= దయలేనివాడికి; ఏను= నేను; ఏమి+ఎగ్గు+కావించితినో= ఎటువంటి అపచారం చేశానో?

**తాత్పర్యం:** దేవతాశ్రేష్ఠులను విడిచిపెట్టి తననే భర్తగా ఎన్నుకొన్నానుకదా! అటువంటి నన్ను సంతానవతినైన దానిని, శీఘ్రంగా ఎందుకు విడిచిపెట్టినట్లు? నాపట్ల కనికరం లేకపోవటానికి ఆతడికి నేను ఎటువంటి అపచారం చేశానో?

**విశేషం:** అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యను విడువరాదు. పైగా సంతానవతి అయినభార్యను విడువరాదని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. తాను సంతానవతి. ఒకవేళ తనపై ప్రేమ లేకున్నా బిడ్డలపై ప్రేమ ఉండాలికదా! కరుణ ఏమాత్రం లేనట్టి కఠినాత్ముడుగా ఉండటానికి నలుడికి తాను ఎటువంటి అపచారం చేయలేదే? ధర్మశాస్త్రాన్నిబట్టిగాని, మానవ సహజమైన పుత్రప్రేమనుబట్టిగాని కేవలం నిర్దోషిని అయిన తన్ను విడవటం నలుడికి భావ్యం కాదని దమయంతి విన్నవించింది. ఇంతవరకు దమయంతి బాహుకుడితో మధ్యమపురుషలో కాక నలుడినిగురించి ప్రథమపురుషలోనే మాటాడింది. అంతవరకు బాహుకుడే నలుడని దమయంతికి నిశ్చితాభిప్రాయం ఏర్పడినను, ప్రత్యక్షంగా తాను బాహుకుడిని చూచింది ఇప్పుడే. కావుననే ప్రథమపురుషలో భాషించి అతడి హావభావాలు పసికట్టి, అతడే నలుడని మళ్ళీ నిశ్చయించుకొనటానికి అట్లా మాటాడింది. ఇక తానే నలుడ నని ప్రకటించుకొనవలసిన వంతు బాహుకుడిదే. ఇచట దమయంతి బాహుకుడితో ఎదురుబొదురుగా నిలిచి మాటాడుతున్నా నలుడిగురించి ప్రథమపురుషలో ప్రస్తావించటం గమనించదగిన అంశం.

**వ. 'నిన్ను విడువ నోడకుండు' మని పలికిన యప్పలుకు లేల మఱచెనో?' యని శోకతప్తంబైన తన హృదయంబు దడుపుచున్నయదియునుంబోలె బాష్పధారలం గుచమండలంబు దడుపుచునున్న దమయంతిం జూచి శోకాకులుండై నలుం డిట్లనియె. 209**

**ప్రతిపదార్థం:** నిన్నున్= నిన్ను; విడువను= విడిచిపెట్టను; ఓడకుండుము= భయపడకుము; అని= అంటూ; పలికిన= చెప్పిన; ఆ+పలుకులు= ఆ మాటలు; ఏల= ఎందుకు; మఱచెనో= విస్మరించాడో; అని; శోక, తప్తంబు+ఐన= దుఃఖంచేత తపించబడిందైన; తన హృదయంబు= తన గుండెను; తడుపుచున్న+అదియున్+పోలె= చల్లార్చుతున్నదా అనేటట్లుగా బాష్పధారలన్= కన్నీటి ప్రవాహములతో; కుచమండలంబు= స్తనములున్న ప్రదేశమును- ఎదను; తడుపుచున్+ఉన్న= తడపుతున్న; దమయంతిన్+చూచి; శోక+ఆకులుండు+ఐ= దుఃఖంచేత పరితపించినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'నిన్ను నేను ఎన్నటికిని విడిచిపెట్టజాలను, భయపడకుము' అని నాతో పలుమారులు చెప్పాడుకదా! ఆ మాటలు ఎట్లా మరిచిపోయాడో?' - అని ఆమె కన్నీరు కారుస్తూ విలపించింది. ఆమె కార్చిన కన్నీరు స్తనాలపై స్రవించటం చూస్తే, దుఃఖంతో కాగిన హృదయాన్ని ఆమె కన్నీటితో తడుపుతున్నట్లు ఉండింది. ఆ దృశ్యాన్ని చూచి నలుడు దమయంతితో ఇట్లా అన్నాడు.

**తే. 'కలిసమావిష్టమతి నయి కష్టవృత్తి। నట్టి యిడుమలఁ బడితి నే; నవి మదీయ**
**తపము బలమున, నీ దుఃఖదాహమునను। నష్టమై పోయెఁ; గలి యిప్డు నన్ను విడిచె. 210**

**ప్రతిపదార్థం:** కలి, సమావిష్ట, మతిన్+అయి= కలిపురుషుడిచేత ఆవహించబడిన బుద్ధి కలవాడినయి; కష్టవృత్తిన్= కష్టాలు అనుభవించి (కఠినప్రవర్తనతో); అట్టి+ ఇడుమలన్= అట్టి కష్టాలను; ఏను= నేను; పడితిన్= అనుభవించాను; అవి=

అవన్నియు (అంటే ఆ అగచాట్లు అన్నీ); మదీయ, తపము, బలమునన్= నా తపస్సుయొక్క మహిమవలన; నీ, దుఃఖదాహమునను= నీ పరితాపమనే నిప్పువలనను; నష్టము+ఐ, పోయెన్= నశించిపోయాయి; కలి= కలిపురుషుడు; ఇప్డు= ఇపుడు; నన్నున్; విడిచెన్= నన్ను విడిచిపోయాడు.

**తాత్పర్యం:** 'నన్ను కలి ఆవహించటంచేత ఆ విధంగా బుద్ధి చెడి అన్ని కష్టాలపాలు కావలసివచ్చింది. ఆ అగచాట్లు అన్నీ నా తపశ్శక్తిచేత, నీ పరితాపమనే నిప్పువలన తొలగిపోయాయి. ఇపుడు నన్ను కలి విడిచిపోయాడు.

**విశేషం:** (1) దమయంతి ప్రథమపురుషలో భాషించినను బాహుకుడు ఉత్తమపురుషలో మాటాడటం గమనించదగిన అంశం. బాహుకుడికి తాను నలుడనని తనకు తెలిసినట్టి అంశమే కదా! ఆతడికి ఎట్టి సంశయం లేదు. (2) నలోపాఖ్యానంలోని కథా శిల్పంలోని ముఖ్యాంశాలు రెండు. 1. నలుడు కలి సమావిష్టుడై చెందిన చిత్త విభ్రమం, పడినపాట్లు. 2. దమయంతి పరితాపం- సారాంశాలుగా ఇక్కడ ప్రస్తావించబడ్డాయి.

**వ. ఏ నిందులకు నీ తదర్థంబ వచ్చితి; నది యట్లుండె; నన్ను ననురక్తు ననువ్రతుఁ దలంపక యన్యాపేక్షంబున స్స్వయంవరంబు రచియించుట యిది కులస్త్రీధర్మంబు గాదు; రాజుల నెల్ల నీ స్వయంవరంబునకు రావించుటం జేసి కాదే ఋతుపర్ణుండు వచ్చె' ననిన వెఱచి కృతాంజలియై దమయంతి యిట్లనియె. 211**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఇందులకు= ఇచటికి; నీ, తద్+అర్థంబు+అ= నీ సంగతి అరయటం కోసమే (నీకోసమే); వచ్చితిన్= అరుదెంచాను; అది+అట్లుండె= ఆ విషయం అట్లా ఉండుగాక!; నన్నున్= నన్ను; అనురక్తున్= నీపట్ల ప్రేమకలవాడిని; అనువ్రతున్= సహధర్మచారిని; తలంపక= స్మరించక; అన్య+అపేక్షన్= ఇతరుడిపై కోరికచేత; పునః+స్వయంవరంబు= తిరిగి స్వయంవరం; రచియించుట= కూర్చటం; ఇది= ఈ కార్యం; కులస్త్రీ, ధర్మంబు+కాదు= కులపాలికకు సరైన న్యాయం కాదు; రాజులన్+ఎల్లన్= రాజులను అందరిని; నీ స్వయంవరంబునకున్; రావించుటన్+చేసి, కాదె= నీ యొక్క స్వయంవరానికి రప్పించటంచేతనే కదా!; ఋతుపర్ణుండు= ఋతుపర్ణుడు; వచ్చెన్; అనినన్= వచ్చినారు అని చెప్పగా; వెఱచి= భయపడి; కృత+అంజలి+ఐ= ఘటించిన నమస్కృతి కలదై (అంటే నమస్కరించినదై); దమయంతి; ఇట్లు+అనియెన్= దమయంతి ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** నేను ఇచటికి వచ్చింది నీ విషయం తెలిసికొనటంకొరకే. అది అట్లా ఉండనీ! నేను నీమీద ప్రేమకలవాడిని. సహధర్మచారిని. నన్ను విస్మరించి పరపురుషవాంఛతో తిరిగి స్వయంవరం ఏర్పరచటం కులస్త్రీకి ధర్మం కాదు. రాజులందరిని ఆహ్వానించటంచేతనే కదా ఋతుపర్ణమహారాజు ఇప్పుడు విదర్భకు విచ్చేసింది' - అని నలుడు అధిక్షేపించగా, భయపడి దమయంతి నలుడికి నమస్కరించి ఇట్లా పలికింది.

**తే. 'నిన్ను రోయంగ విప్రులు నెమ్మి నరిగి । పలికి రెల్లచో నాచేతఁ బనుపఁబడియు;**
**యందుఁ బర్ణాదుఁ డను విప్రుఁ డయ్యయోధ్య । కేఁగి ప్రతివచనంబుల నెఱిఁగె నిన్ను. 212**

**ప్రతిపదార్థం:** నిన్ను, రోయంగన్= నిన్ను వెదకటానికై; నాచేతన్= నాచేత; పనుపన్+పడి+అ= పంపబడియే; విప్రులు= బ్రాహ్మణులు; నెమ్మిన్+ అరిగి= ప్రీతితో వెళ్ళి; ఎల్లచోన్= అన్నిచోట్ల; పలికిరి= మాటాడినారు; అందున్= వారిలో; పర్ణాదుఁడు+అను విప్రుఁడు= పర్ణాదుడనే బ్రాహ్మణుడు; ఆ+అయోధ్యకు= ఆ అయోధ్యానగరానికి; ఏఁగి= వెళ్ళి; ప్రతివచనంబులన్= ఎదురుమాటలవలన; నిన్నున్+ఎఱిఁగెన్= నిన్ను తెలిసికొనగలిగాడు.

**తాత్పర్యం:** 'నిన్ను వెదకటానికై ప్రీతితో నేను పంపగా పలుతావులకు వెళ్ళి పలికిన విప్రులలో, అయోధ్యకు వెళ్ళిన పర్ణాదుడనే బ్రాహ్మణుడు నీ ప్రత్యుత్తరంవలన నిన్ను గుర్తించాడు.

**వ. ఆ పర్ణాదువలన ని న్నెఱింగినదానినై ని న్నిట రావించునుపాయంబు దలంచి, యెల్లి దమయంతీ ద్వితీయ స్వయంవరం బగు నని ఋతుపర్ణునందుఁ బ్రకాశింప సుదేవుం డను బ్రాహ్మణుం బుత్తెంచితి. 213**

**ప్రతిపదార్థం:** ఆ, పర్ణాదువలనన్= ఆ పర్ణాదుడనే బ్రాహ్మణుడి వలన; నిన్ను+ఎఱింగిన, దానను+ఐ= నిన్ను తెలిసికొన్న దాననై; నిన్ను+ఇట, రావించు= నిన్ను ఇచటికి రప్పించే; ఉపాయంబు+తలంచి= వెరవును ఆలోచించి; ఎల్లి= రేపు; దమయంతీ ద్వితీయ, స్వయంవరంబు+అగును+అని= దమయంతికి రెండవ స్వయంవరం జరుగుతుందని; ఋతు పర్ణునందున్= ఒక్క ఋతుపర్ణుడికి మాత్రమే; ప్రకాశింపన్= తెలియజేయటానికై; సుదేవుండు+అను, బ్రాహ్మణున్= సుదేవు డనే విప్రుడిని; పుత్తెంచితిన్= నియోగించాను.

**తాత్పర్యం:** ఆ పర్ణాదుడివలన నీ ఉనికిపట్టులు తెలిసికొన్నదాననై నిన్ను ఇచటికి రప్పించే ఉపాయం ఆలోచించి, రేపే దమయంతి రెండవ స్వయంవరం అని ఒక్క ఋతుపర్ణుడికి మాత్రమే వార్తను తెలియజేయటానికి సుదేవుడనే బ్రాహ్మణుడిని నియోగించాను.

**క. నరవరుఁడు నలుఁడు గా కె। వ్వరు శతయోజనము లొక్కవాసరమున వ**
**త్తురు నరు లొరు? లని దీనిం। బరికింపఁగఁ గడఁగి యిట్ల వంచితి నధిపా! 214**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ మహారాజా!; నరవరుఁడు= నరులలో శ్రేష్ఠుడైన; నలుఁడు+కాక= నలుడు తప్ప; ఎవ్వరు; నరులు+ఒరులు= ఇతరమనుజులు; ఎవ్వరు; శతయోజనములు= నూరు ఆమడలు; ఒక్క వాసరమునన్= ఒక్కదినంలో; వత్తురు?= రాగలరు?; అని= అని తలపోసి; దీనిన్+పరికింపఁగన్= ఈ విషయాన్ని చూడాలని; కడఁగి= పూని; ఇట్లు+అ= ఈ విధంగా; పంచితిన్= ఏర్పాటు చేశాను. (పంపినాను)

**తాత్పర్యం:** ఓ నలమహారాజా! నరులలో శ్రేష్ఠుడైన నలమహారాజు తప్ప మానవమాత్రులలో మరెవ్వరు ఒక్కదినంలో నూరుఆమడలమేర దూరంనుండి రాగలరు? అని ఆలోచించి ఈ విధమైన ఏర్పాటు చేశాను.

**ఉ. ఏ నతిపాపభావమును నెగ్గుఁ దలంపక యుండునట్లుగా**
**నానతవైరి! నీ యడుగు లంటఁగ నోపుదు; నట్టిదైన న**
**న్నీ నలినాప్తుఁ డీ యనలుఁ డీ మృగలాంఛనుఁ డీ సురోత్తముల్**
**జాను సెడంగ నీ క్షణమ చంపరె! కోపపరీతచిత్తులై.' 215**

**ప్రతిపదార్థం:** ఆనతవైరి!= మిక్కిలి నమస్కరించిన శత్రువులు కలవాడా!; (శత్రువులను జయించినవాడా!;) ఏను= నేను; అతి, పాప, భావమును= మిక్కిలి చెడు ఆలోచనను; ఎగ్గున్= అపచారాన్ని; తలంపక+ఉండునట్లుగాన్= ఆలోచించకుండ ఉండేటట్లుగా; నీ అడుగులు= నీ పాదాలు; అంటఁగన్+ ఓపుదున్= ముట్టగలను- అంటే పాదాలంటి ప్రమాణం చేయగలను; అట్టిది+ఐన= అటువంటిదే అయితే- అంటే నీ పట్ల పాపభావాన్ని అపచారాన్ని తలపోసి ఉన్నట్లయితే; నన్ను; ఈ+నలిన+ ఆప్తుఁడు= ఈ సూర్యుడు; ఈ+అనలుఁడు= ఈ అగ్నిదేవుడు; ఈ; మృగలాంఛనుఁడు= జింకను గుర్తుగాగల ఈ చంద్రుడు; ఈ, సుర+ఉత్తముల్= ఈ దిక్పాలకులు; కోప, పరీత, చిత్తులు+ఐ= ఆగ్రహంతో నిండిన మనస్సులు కలవారై; జాను+చెడంగన్= శోభ అంతరించేటట్లు; ఈ క్షణము+అ= ఈ క్షణంలోనే; చంపరె!= చంపివేయరా!

**తాత్పర్యం:** శత్రువులను జయించిన మహావీరుడవైన ఓ నలమహారాజా! నేను ఎటువంటి పాపపు తలంపునుగాని, అపచారాన్నిగాని నీపట్ల తలపోయలేదని నీ పాదాల సాక్షిగా ప్రమాణం చేయగలను. నాలో అటువంటి చెడుతలంపే ఉన్నట్లయితే- ఈ సూర్యుడు, ఈ అగ్నిహోత్రుడు, ఈ చంద్రుడు, ఈ దిక్పాలకులు ఆగ్రహించి, నన్ను ఈ క్షణంలోనే శోభావిహీనగాచేసి చంపివేయరా?'

**విశేషం:** నలిన+ఆప్తుడు= పద్మాలకు మిత్రుడు, సూర్యుడు. ఇది కవిసమయం. మృగలాంఛనుడు= లేడిని చిహ్నంగా కలవాడు, చంద్రుడు. చంద్రుడిలో గల కళంకం పెక్కు ఉత్ప్రేక్షలకు దారితీసింది. దీన్నికూడ కవిసమయంగా ఎన్నవచ్చును. 'జాను' శబ్దానికి సరైన అర్థం ఇంకను తరచవలసి ఉన్నది. శబ్దరత్నాకరంలో జాను= అందము, సౌందర్యము అనే అర్థాలు ఉన్నాయి. సూర్యరాయాంధ్ర నిఘంటువులో పెక్కు అర్థాలు ఉన్నాయి. 1. సొగసు, సౌందర్యము 2. శోభ 3. విధము 4. విణ.మంజులము, స్పష్టము, అధికము మున్నగు అర్థాలు ఉన్నాయి. నా అభిప్రాయంలో జాను- అంటే పుట్టుకతో వచ్చే తీరుతీయాలు, సహజ సారళ్యమనే అర్థం చెప్పవచ్చు.

**వ. అనుచున్న యవసరంబున నఖిలభూతాంతర్గతుం డయిన వాయుభట్టారకుం డెల్లవారలు విన నాకాశంబున నుండి నలున కిట్లనియె. 216**

**ప్రతిపదార్థం:** అనుచున్న+ అవసరంబునన్= అని చెప్తుతున్న సమయంలో; అఖిల, భూత+అంతర్గతుండు+అయిన= సమస్తమైన భూతాలలో లోపల ఉండే వాడయిన; వాయుభట్టారకుండు= పవిత్రుడైన వాయుదేవుడు; ఎల్లవారలు= అందరు; వినన్= ఆలకిస్తుండగా; ఆకాశంబుననుండి= గగనంనుండి; నలునకు; ఇట్లు+అనియెన్= నలుడికి ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని అంటున్న సమయంలో సమస్తభూతాలలోపల ఉండే వాయుభట్టారకుడు అందరూ వినేటట్లు ఆకాశంనుండి నలుడికి ఇట్లా చాటి చెప్పాడు.

**విశేషం:** ఈ సృష్టిలోని సమస్త వస్తువులు భూతములే. చేతనాచేతన వస్తువులు సజీవ నిర్జీవ పదార్థాలకు సమష్టి వ్యపదేశం భూతశబ్దం. భట్టారక శబ్దం పూజ్యవాచకం. వాయుభట్టారకుడు అంటే పూజ్యుడైన వాయుదేవుడు అని అర్థం.

**చ. 'అమలచరిత్ర నిట్లు దమయంతిఁ బతివ్రతఁ బల్కుదే? నృపో**
**త్తమ! విను దీనియందు విదితంబగు శీలవిధిన్ సుధాంశుఁడున్**
**గమలహితుండు నేను నయి కాచితి మొక్కట మూఁడువర్షముల్;**
**గొమరుగ దీనిఁ జేకొనుము కోమలి నీ కనురక్త' నావుడున్. 217**

**ప్రతిపదార్థం:** నృప+ఉత్తమ!= రాజులలో శ్రేష్ఠుడవైన ఓ నలమహారాజా!; అమల, చరిత్రన్= స్వచ్ఛమైన నడవడి కలిగినదానిని; దమయంతిన్= దమయంతిని; పతివ్రతన్= భర్తయెడ భక్తి కలిగినదానిని; ఇట్లు= ఈ రీతిగా; పల్కుదే= ఆక్షేపిస్తావా?; విను= ఆకర్ణించుము; దీని+అందున్= ఈమెపట్ల; విదితంబు+అగు= తెలియవచ్చిన; శీలవిధిన్= మంచినడవడి తీరుతీయాలవలన; సుధాంశుఁడున్= అమృత కిరణుడైన చంద్రుడున్నూ; కమలహితుండు= పద్మమిత్రుడైన సూర్యుడున్నూ; ఏనున్+అయి= నేనున్నూకలిసి; ఒక్కటన్= కలిసికట్టుగా; మూఁడు, వర్షముల్= మూడు సంవత్సరాలు; కాచితిమి= కాపాడాము; కొమరుగన్= ఒప్పుగ; దీనిన్= ఈమెను (దమయంతిని); చేకొనుము= పరిగ్రహించుము; కోమలి= ఈ సుకుమారి; నీకు+అనురక్త= నీ పట్ల అనురాగం కలిగినట్టిది; నావుడున్= అని పలుకగా.

**తాత్పర్యం:** 'రాజులలో ఉత్తముడివైన ఓ నలమహారాజా! ఈ దమయంతి నిర్మలమైన ప్రవర్తన కలది. పతివ్రతాశిరోమణి. ఈమెపట్ల అభివ్యక్తమైన సౌశీల్యంచొప్పున సూర్యుడు, చంద్రుడు, నేను కలిసికట్టుగా ఈమెను మూడు సంవత్సరాలు కాపాడాము. ఈమెను నీవు మనసార పరిగ్రహించుము. ఈ కోమలి నీపట్ల అనురాగం కలిగి ఉన్నది'- అని వాయుదేవుడు చాటిచెప్పగా.

**క. కురిసె మరుద్వచనానం । తరమున సురపుష్పవృష్టి; దడయక మ్రోసెన్**
**సురదుందుభి నాదంబులు; । గరము ప్రసన్నుఁడయి వీచె గంధవహుండున్. 218**

**ప్రతిపదార్థం:** మరుత్+వచన+అనంతరమునన్= వాయుదేవుడి మాటల పిమ్మట; సురపుష్పవృష్టి= దేవతల పూలవాన; కురిసెన్= కురిసింది; సురదుందుభి నాదంబులు= దేవదుందుభుల నాదాలు; తడయక= వెనువెంటనే; మ్రోసెన్= మ్రోగాయి; గంధవహుండున్= వాయువుకూడా; కరము= మిక్కిలి; ప్రసన్నుఁడు+అయి= సంప్రీతుడై; వీచెన్= వీచాడు.

**తాత్పర్యం:** వాయుదేవుడి ప్రకటన పిమ్మట దేవతలు పూలవాన కురిపించారు. వెనువెంటనే దేవదుందుభులు మ్రోగాయి. ప్రసన్నుడై వాయుదేవుడు దివ్యసౌరభం వెదజల్లుతూ వీచాడు.

**విశేషం:** పురాణేతిహాసాలలో దేవతల పుష్పవృష్టి కురియటం, దేవదుందుభులు మ్రోగటం, ఆధునికులు కొందరు నిరర్థకాలైన అతిశయోక్తులుగా నిరసించవచ్చును. వీటిని వాచ్యార్థంలో స్వీకరించే కువిమర్శకులమాట లకేమిగాని, సహృదయులు వీటి ఆంతర్యం ఎరిగి స్వారస్యం ఆస్వాదించగలరు. నలదమయంతుల పునస్సమాగమాన్ని వర్ణించటానికి, పరిమితమైన అర్థాలు గల పదాలకు శక్తిచాలదు. దేవదుందుభుల మ్రోతలు, దేవతల పుష్పవృష్టులు, సుప్రసన్నుడై వాయుదేవుడు వెదజల్లే దివ్యపరిమళాలు సహృదయులకు అనుభవైకవేద్యాలు. అల మతివిస్తరేణ. అలంకారోక్తి కవీంద్రుల మాతృభాష.

**వ. ఇ ట్లెల్ల వారికి నాశ్చర్యంబుగా వాయుదేవుండు దన్నెఱింగించి, దమయంతి పతివ్రతాగుణంబులును బతియందుల యకృత్రిమానురాగంబునుం జెప్పిన విని నలుండు పరమ ప్రమోద పరిపూర్ణ హృదయుండై తత్క్షణంబ కర్కోటకుం దలంచి వాని యిచ్చిన పుట్టంబు పైఁబెట్టుకొని నిజరూపంబు దాల్చిన. 219**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఎల్లవారికిన్= అందరికి; ఆశ్చర్యంబుగాన్= అచ్చెరువు కొలుపేటట్లుగా; వాయుదేవుండు; తన్ను+ఎఱింగించి= తనను తెలిపి; దమయంతి, పతివ్రతాగుణంబులును= దమయంతియొక్క పతివ్రతా లక్షణాలను; పతి+అందుల= భర్తపట్లగల; అకృత్రిమ+అనురాగంబునున్= సహజమైన, (స్వచ్ఛమైన) ప్రేమను; చెప్పిన; విని= తెలుపగా, ఆకర్ణించి; నలుండు= నలుడు; పరమ, ప్రమోద, పరిపూర్ణ, హృదయుండు+ఐ= మిక్కుటమైన సంతోషంతో నిండిన హృదయం కలవాడై; తద్, క్షణంబు+అ= ఆ క్షణంలోనే; కర్కోటకున్+తలంచి= కర్కోటకుడిని స్మరించి; వాని+ఇచ్చిన, పుట్టంబు= ఆతడు ఇచ్చిన వస్త్రం; పైన్+పెట్టుకొని= పైన ధరించి; నిజ, రూపంబు= అసలు ఆకారాన్ని; తాల్చినన్= ధరించగా.

**తాత్పర్యం:** ఇట్లా ఎల్లవారికి అచ్చెరువు కలిగేటట్లుగా వాయుదేవుడు తనను తెలియజేసికొని, దమయంతి పతివ్రతా లక్షణాలను, ఆమెకు భర్తపట్ల కల స్వచ్ఛమైన అనురాగాన్ని చెప్పగా విని, నలుడు మిక్కుటమైన సంతోషంతో నిండిన మనస్సుకలవాడై, ఆ క్షణంలోనే కర్కోటకుడిని స్మరించి, ఆతడు ఇచ్చిన వస్త్రాన్ని మీద ధరించగా, నలుడికి తన తొల్లిటి ఆకారం ఏర్పడింది.

**విశేషం:** కథానిర్వహణం అద్భుతంగా ఉండాలని నాటకలక్షణం. నలదమయంతి కథలో సహజమైన నాటకీయత రాణిస్తూ ఉంటే నన్నయ దానిని పోషించాడు. 'ఎల్లవారికి నాశ్చర్యంబుగా'- అని నన్నయ ధ్వనింపజేసి ప్రసన్న కథాకలితార్థయుక్తిని ప్రదర్శించాడు.

## నలుండు నిజరూపంబుతో దమయంతిం గూడుట (సం. 3-75-27)

**ఉ. ఆయతబాహుఁ దప్తకనకాంచితవర్ణు మనోజరూపు నిం**
**ద్రాయితు సూర్యతేజు నిషధప్రభు నన్నలుఁ జూచి పద్మప**
**త్రాయతనేత్ర యప్డు దమయంతి గరంబు ముదంబు నొంది ల**
**క్ష్మీయుత యయ్యెఁ బంధులకు మిత్త్రులకున్ హృదయప్రియంబుగన్. 220**

**ప్రతిపదార్థం:** ఆయత బాహున్= పొడుగుపాటి చేతులు కలవాడిని, అంటే ఆజానుబాహుడైన వాడిని; తప్త, కనక+అంచిత, వర్ణున్= అగ్నిలో శుద్ధి చేయబడిన మేలిమిబంగారాన్ని పోలిన రంగు కలవాడిని; మనోజ రూపున్ (మనస్+జ+రూపున్)= మన్మథుడివంటి ఆకృతి కలవాడిని; ఇంద్రాయితున్= ఇంద్రుడితో సమానమైనవాడిని; సూర్యతేజున్= సూర్యుడివంటి తేజస్సు కలవాడిని; నిషధప్రభున్= నిషధరాజైన; ఆ+నలున్= ఆ నలుడిని; చూచి= దర్శించి; పద్మ, పత్ర, ఆయత, నేత్ర= తామరపువ్వురేకులవలె విశాలమైన కన్నులు కలదైన; దమయంతి; అప్డు= అపుడు; కరంబు= మిక్కిలి; ముదంబున్+ఒంది= సంతోషాన్ని పొంది; బంధులకున్= చుట్టాలకు; మిత్త్రులకున్= నెచ్చెలులకు; హృదయప్రియంబుగన్= మనస్సుకు ఆనందం కలిగేటట్లు; లక్ష్మీయుత+అయ్యెన్= శోభతో కూడినట్టిదయింది.

**తాత్పర్యం:** ఆజానుబాహుడు, మేలిమి బంగారు మేనిచాయకలవాడు, మన్మథరూపుడు, ఇంద్రసమానుడు, సూర్యుడి తేజంవంటి తేజం కలవాడు, నిషధప్రభువు అయిన నలుడు సహజస్వరూపంతో కనిపించగా చూచి, తామరపువ్వురేకుల వంటి విశాలమైన కన్నులు కల దమయంతి సంతోషం పొంగిపొరలి శోభిల్లింది. ఆమె చుట్టాలు, మిత్రులు సంతోషించారు.

**వ. ఇట్లు సంగతులైన యయ్యిరువురకు విరహ పరితాపంబు తోడన శరీరమలినత్వంబు వాసెఁ, బర స్పరానురాగంబు తోడన విభూషణశ్రీవిశేష విలేపన యోగంబులు విస్తరిల్లె; నంత నంతయు విని భీముండు జాతసస్య యైన వసుధ తోయసంప్రాప్తి నాప్యాయిత యైన ట్లజ్ఞాతచర్యం డైన తన పతిం బడసి పరమసంతుష్టహృదయయై చంద్రుతోఁగూడిన రోహిణియుంబోలెఁబతిం గూడి యొప్పుచున్న దమయంతిం జూచి సంతసిల్లి, తన పురంబునం దష్టశోభనంబులు దేవగృహంబులయందు విశేషపూజలు సేయించె; నట్టి మహోత్సవం బెఱింగి ఋతుపర్ణుండు నలునొద్దకు వచ్చి 'నీవు నిఖిలలోక పూజ్యుండ వయ్యును నాయొద్ద బాహుకుం డనంగాఁ బ్రచ్ఛన్న వృత్తి నున్న నిన్ను నెఱుంగక నీచకర్మంబులయందు నియోగించితి; దీని క్షమియించునది' యని నలుచేత సత్కృతుండై యశ్వహృదయోపదేశంబు గొని యయోధ్యకుం జనియె; నిట నలుండును విదర్భాపురంబున నొక్కమాసంబు నివాసంబు సేసి, విదర్భేశ్వరు వీడ్కొని దమయంతి నంద పెట్టి, యొక్క రథంబును బదియా ఱేనుంగులును, నేఁబది గుఱ్ఱంబులు, నాఱునూఱు కాల్బలంబులుఁ దనకుఁ దోడుగా నిషధపురంబున కరిగి, పుష్కరుం గని యిట్లనియె. 221**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సంగతులు+ఐన= కలిసిన; ఆ+ఇరువురకున్= ఆ ఇద్దరికి; విరహతాపంబుతోడన్+అ= వియోగబాధతోపాటుగానే; శరీర, మలినత్వంబు= దేహంలోని మురికి; పాసెన్= విడిచింది; పరస్పర+అనురాగంబు తోడన్+అ=

ఇరువురిమధ్య ఏర్పడిన ప్రేమతో పాటుగా; విభూషణ, శ్రీ, విశేష, విలేపన, యోగంబులు= ఆభరణ శోభ, అసాధారణమైన మైపూతల చేరిక; విస్తరిల్లెన్= ఒనకూడాయి; అంతన్= అంతట; అంతయు విని= సర్వం తెలిసికొని; భీముండు= భీమరాజు; జాత, సస్య+ఐన= అంకురించిన పంటమొక్కలు కలదైన; వసుధ= భూమి; తోయ, సంప్రాప్తిన్= వర్షపాతంవలన; ఆప్యాయిత+ఐనట్లు= తనివి చెందినదైనట్లు; అజ్ఞాత చర్యుండు+ఐన= తెలియబడనట్టి ప్రవర్తనకలవాడయిన, అంటే అజ్ఞాతవాసంలోఉన్న; తన, పతిన్+పడసి= తన భర్తను పొంది; పరమ, సంతుష్ట, హృదయ+ఐ= మిక్కుటమైన తృప్తిని పొందిన హృదయం కలదై; చంద్రుతోన్+కూడిన, రోహిణియున్+పోలెన్= చంద్రుడితో సంయోగం చెందిన రోహిణీనక్షత్రం వలె; పతిన్+కూడి= భర్తతో కలిసి; ఒప్పుచున్న= శోభిస్తున్న; దమయంతిన్+చూచి= దమయంతిని చూచి; సంతసిల్లి= సంతోషించి; తన పురంబునందు= తన నగరంలో; అష్టశోభనంబులు= ఎనిమిది విధాలయిన అలంకారాలు; దేవ, గృహంబుల+ అందున్= కోవెలలలో; విశేషపూజలు= ప్రత్యేకమైన అర్చనలు; చేయించెన్= జరిపించాడు; అట్టి= ఆ విధమైన; మహా+ఉత్సవంబు+ఎఱింగి= గొప్ప పండుగ జరగటం తెలిసికొని; ఋతుపర్ణుండు; నలు+ఒద్దకు= నలుడి దగ్గరకు; వచ్చి= ఏతెంచి; నీవు; నిఖిలలోక, పూజ్యుండవు+అయ్యును= నీవు అన్ని లోకాలచేత అర్చించదగినట్టివాడివే అయినప్పటికి; నా+ఒద్ద= నా దగ్గర; బాహుకుండు+అనంగాన్= బాహుకుడు అనే పేరుమీద; ప్రచ్ఛన్న వృత్తిన్+ఉన్న= తెలియబడనిరీతిలో ఉండటంచేత; నిన్నున్+ఎఱుంగక= నీవు ఎవరో తెలియక; నీచకర్మంబుల+అందున్= అల్పకార్యాలలో; నియోగించితి= నియుక్తుడిగా చేశాను; దీని= నేను చేసినపనిని; క్షమియించునది= మన్నించేది; అని= అనిచెప్పి; నలుచేత; సత్, కృతుండు+ఐ= నలుడిచే గౌరవించబడినవాడై; అశ్వ, హృదయ+ ఉపదేశంబు+కొని= అశ్వహృదయం అనే విద్యను ఉపదేశం పొంది; అయోధ్యకున్+చనియెన్= అయోధ్యాపురికి వెళ్ళాడు; ఇట= ఇచట; నలుండును; విదర్భాపురంబునన్= విదర్భరాజధానిలో; ఒక్కమాసంబు= ఒకనెల; నివాసంబు+చేసి; విదర్భ+ఈశ్వరు= విదర్భప్రభువైన భీమరాజును; భీముడను పేరుగల ప్రభువును, వీడ్కొని= వెళ్ళటానికి అనుమతిని గైకొని; దమయంతిన్= దమయంతిని; అందు+అ= అచటనే; పెట్టి= ఉంచి; ఒక్క రథంబును= ఒకతేరును; పదియాఱు+ఏనుంగులును= పదారు ఏనుగులును; ఏఁబది గుఱ్ఱంబులును= ఏబయి అశ్వాలును; ఆఱునూఱు కాల్బలంబులున్= ఆరువందలమంది భటులును; తనకున్+తోడుగాన్= తనకు సాయంగా; నిషధ, పురంబునకు+అరిగి= నిషధదేశం రాజధానికి వెళ్ళి; పుష్కరున్+కని= పుష్కరుడిని చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా నలదమయంతులకు తిరిగి సమాగమం జరిగింది. ఇరువురికి విరహతాపం పోయింది. అట్లే ఇరువురికి శరీరమాలిన్యం తొలగింది. ఇరువురికి పరస్పరానురాగం ఏర్పడింది. అట్లే ఆభరణశోభ, చందనాదులతో మైపూతలు ఇరువురికి సంక్రమించాయి. పంటమొక్కలు మొలిచిన భూమి వానకురిసినప్పుడు సంతృప్తి చెందినట్లు, అజ్ఞాతవాసంలో ఉన్న భర్తను పొంది, పరమానందభరితురాలై చంద్రునితో కూడినరోహిణివలె పతితో కలిసి శోభిల్లుతున్న దమయంతిని చూచి, తండ్రి భీమరాజు తన నగరాన అష్టశోభనాలు, దేవళాలలో ప్రత్యేకపూజలు జరిపించాడు. అటువంటి పండుగ వేడుక తెలిసికొని ఋతుపర్ణమహారాజు నలుడి దగ్గరకు వచ్చి 'నీవు జగత్పరిపూజ్యుడివి. కాని, నాదగ్గర బాహుకుడనే పేరుతో అజ్ఞాతవాసంలో ఉన్నావు కావున, నీవు ఎవరో తెలియక నిన్ను అల్పకార్యాలకు నియోగించాను. నన్ను క్షమించుము' - అని ప్రార్థించాడు. తదుపరి ఋతుపర్ణుడు నలుడిచేత సత్కరించబడినవాడై, అతడి దగ్గరనుండి అశ్వహృదయం అనే విద్యను పొంది అయోధ్యకు వెళ్ళాడు. నలుడు విదర్భరాజధానిలో ఒకనెల నివసించి దమయంతిని అచటనే ఉంచి, తాను ఒక రథం, పదారు ఏనుగులు, ఏబదిగుర్రాలు, ఆరువందలమంది కాలిభటులు తోడుగా నిషధదేశరాజధానికి వెళ్ళి పుష్కరుడిని కలిసికొని ఇట్లా చెప్పాడు.

**విశేషం:** (1) అష్టశోభనములు= ఎనిమిది విధాలైన అలంకారాలు. 1. నీళ్ళు చల్లటం 2. పందిళ్ళు వేయించటం 3. తోరణాలు కట్టించటం 4. చిత్రాలు వ్రాయించటం 5. జెండాలు నెలకొల్పటం 6. పూర్ణకుంభాలు ప్రతిష్ఠించటం 7. ధూపదీపారాధనలు

ఏర్పరచటం 8. నృత్యగీతవాద్యాలు ఏర్పరచటం. (2) ఇరువురికి విరహతాపంతోపాటు శరీర మలినత్వం తొలగింది- అనటం, పరస్పరాభరణాదిక ప్రాప్తి అనురాగంతోపాటూ ఏర్పడటం- అనేచోట సహోక్తి అలంకారం. చంద్రుడితోకూడిన రోహిణి ఉపమానం. నలునితో గూడిన దమయంతి ఉపమేయం. అలంకారం: ఉపమ. జాతసస్య అయిన వసుధ ఉపమానం, నలుడిని పొందిన దమయంతి ఉపమేయం. అలంకారం: ఉపమ.

**క. 'దమయంతి రోయిగా జూ । దము నీతో నాడఁ గడఁగెదను, ధరణీరా**
**జ్యము నీవు నాకు రోయిడు, । మమరఁగ జూదంబు నీకు నభిమతమేనిన్. 222**

**ప్రతిపదార్థం:** జూదంబు, నీకున్+అభిమతము+ఏనిన్= జూదం నీకు ఇష్టమైతే; దమయంతి, రోయిగా= దమయంతిని ధనంగా (పణంగా); జూదము; నీతోన్= నీతోడ; ఆడన్+కడఁగెదను= ఆడటానికి పూనుతాను; ధరణీ, రాజ్యమున్= భూరాజ్యాన్ని; ఈవు= నీవు; నాకు; రోయి+ఇడు= ధనం (పణం) గా ఒడ్డుము.

**తాత్పర్యం:** 'ఓ పుష్కర మహారాజా! నీకు జూదమాడటం ఇష్టమైతే నేను దమయంతిని పణంగా పెట్టి నీతో జూద మాడటానికి సిద్ధంగా ఉన్నాను. నీవు భూరాజ్యాన్ని పణంగా ఒడ్డి నాతో జూదమాడటానికి సంసిద్ధుడవు కమ్ము.

**మత్తకోకిల.**

**వీరభోజ్యము సుమ్ము రాజ్యము వింటె? నీవును నేను దు**
**ర్వారవృత్తి రథంబు లెక్కి యవంధ్యవిక్రమ మేర్పడన్**
**భూరివీరరణం బొనర్తము; పోర నోర్చినవాఁడ యి**
**ద్ధారుణీతలరాజ్యసంపదఁ దాల్చు వీరగుణోన్నతిన్. 223**

**ప్రతిపదార్థం:** రాజ్యము= ప్రభుత్వానికి లోబడినదేశం; వీర, భోజ్యము, సుమ్ము= వీరులచేత అనుభవించదగింది కదా!; వింటె= (అని) వినిఉంటివే!; నీవును, నేను; దుర్వారవృత్తిన్= నీవూ, నేనూ అప్రతిహతశౌర్యంతో; రథంబులు+ఎక్కి= తేరులపై నిల్చి; అవంధ్య, విక్రమము+ఏర్పడన్= వ్యర్థం కానట్టి పరాక్రమం విలసిల్లగా; భూరి, వీర, రణంబు+ఒనర్తము= గొప్పదైన వీరయుద్ధం చేద్దాము; పోరన్+ఓర్చినవాఁడు+అ= యుద్ధంలో గెలిచినవాడే; వీర, గుణ+ఉన్నతిన్= శౌర్యంయొక్క పెంపుచేత (అంటే పరాక్రమాతిశయంచేత); ఈ+ధారుణీ, తల, రాజ్య, సంపదన్= ఈ భూస్థలిపైగల ప్రభుత్వమనే ఐశ్వర్యాన్ని; తాల్చున్= ధరిస్తాడు.

**తాత్పర్యం:** రాజ్యాన్ని అనుభవించవలసింది వీరులే సుమా! అనే సుభాషితం విన్నావుకదా! కాబట్టి నీవూ నేనూ రథాలను అధివసించి వ్యర్థంగాని పరాక్రమంతో గొప్ప వీరయుద్ధం సల్పుదాం; రమ్ము; యుద్ధంలో గెలిచినవాడే ఈ సమస్త భూరాజ్యాన్ని వీరపురుషుడుగా ఏలుకొంటాడు!

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.46 విశేషాంశం చూడండి.

**వ. ఈ రెంటిలో నీ కెయ్యది యిష్టంబు దానిన కడంగు' మనినం, బుష్కరుండు రణంబునందుఁ బరాజితుండు గావున నలుం దొల్లియు జూదంబున నోడిచిన వాఁడై, యింకను నోడిచి దమయంతిం జేకొని కృతార్థుండ నగుదు నని సంతసిల్లి, 'యేనోటు వడితినేని నఖిలమహీరాజ్యంబు నీయది; నీ వోటువడితేని దమయంతి నాయది' యని పలికి యొడ్డి నలుతో జూద మాడి యోటువడిన. 224**

**ప్రతిపదార్థం:** ఈ రెంటిలోన్= ఈ రెండింటిలో (అంటే జూదమాడటంలో, యుద్ధం చేయటంలో); నీకు+ఎయ్యది, ఇష్టంబు= నీకు ఏది సమ్మతమో; దానిన్+అ, కడంగుము= దానికే పూనుకొనుము; అనినన్= అని అడుగగా; పుష్కరుండు; రణంబునందున్= యుద్ధంలో; పరాజితుండు= ఓడిపోయినవాడు; కావున= కాబట్టి; తొల్లియు= మునుపు; జూదంబునన్= జూదంలో; నలున్= నలుడిని; ఒడిచినవాఁడు+ఐ= గెలిచినవాడై; ఇంకను= మరియు; ఒడిచి= గెలిచి; దమయంతిన్= దమయంతిని; చేకొని= పరిగ్రహించి; కృత+అర్థుండను= చరితార్థుడిని; అగుదును+అని= కాగలనని; సంతసిల్లి= సంతోషించి; ఏను= నేను; ఓటువడితిన్+ఏనిన్= ఓడిపోయినట్లయితే; అఖిల, మహీరాజ్యంబు= సమస్తభూమి ప్రభుత్వం; నీ+అది= నీది; నీవు+ఓటువడితి+ఏని= నీవు ఓడిపోయినట్లయితే; దమయంతి; నా+అది= దమయంతి నాకు దక్కుతుంది; అని, పలికి= అని చెప్పి; ఒడ్డి= పణం నిర్ణయించి; నలుడితో= నలుడితో; జూదము+ఆడి; ఓటువడినన్= ఓడిపోగా.

**తాత్పర్యం:** 'జూదమాడటం, యుద్ధంచేయటం ఈ రెంటిలో నీకు ఏది ఇష్టమో దానికే నీవు పూనుకొనుము' అని నలుడు పుష్కరుడిని అడిగాడు. లోగడ పుష్కరుడు నలుడిచేతిలో యుద్ధంలో ఓడినవాడు; జూదంలో నలుడిని ఓడించినవాడు. అందుచేత పుష్కరుడికి నలుడితో జూదమాడి దమయంతిని గెలుచుకొనాలనే ఆశ అంకురించింది. అంత, పుష్కరుడు నలుడితో 'మనం తిరిగి జూదమాడుదాము; నీవు గెలిస్తే ఈ సమస్త భూరాజ్యం నీదే; నేను నెగ్గితే దమయంతి నాది'- అని పణం నిర్ణయించుకొని ఇరువురూ జూదమాడారు. అందులో పుష్కరుడు ఓడిపోయాడు.

**క. ఘనముగ జంబూద్వీపం । బునఁ గలవా రెల్ల నెఱుఁగఁ బుష్కరుచేతం**
**గొనియెఁ బునర్ద్యూతంబున । ననఘుఁడు నలుఁ డఖిలరాజ్య మత్యున్నతితోన్. 225**

**ప్రతిపదార్థం:** జంబూ, ద్వీపంబునన్, కలవారు+ఎల్లన్= జంబూద్వీపంలో ఉండే జనులందరు; ఘనముగన్= గొప్పగా; ఎఱుఁగన్= తెలిసికొనేటట్లు; అనఘుఁడు= పాపరహితుడైన; నలుఁడు; పునర్+ద్యూతంబునన్= తిరిగి ఆడిన జూదంలో; పుష్కరుచేతన్= పుష్కరుడి నుండి; అఖిల రాజ్యము= సర్వరాజ్యాన్ని; అతి+ఉన్నతితోన్= మిక్కిలి ఔన్నత్యంతో; కొనియెన్= పరిగ్రహించాడు.

**తాత్పర్యం:** జంబూద్వీపంలోని ప్రజలందరికి తెలిసేటట్లుగా పుణ్యశీలుడైన నలుడు పుష్కరుడితో రెండవసారి జూదమాడి గెలిచి, సమస్తరాజ్యాన్ని మిక్కిలి గొప్పగా పరిగ్రహించాడు.

**వ. ఇట్లు జూదంబునఁ బుష్కరు నోడించి సకల మహీరాజ్యంబును జేకొని నలుండు వాని కిట్లనియె. 226**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; జూదంబునన్= జూదంలో; పుష్కరున్+ఓడించి; సకల, మహీరాజ్యంబును= సమస్తభూమండల ప్రభుత్వాన్ని; చేకొని= పరిగ్రహించి; నలుండు; వానికిన్= పుష్కరుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా జూదంలో పుష్కరుడిని గెలిచి, సమస్త భూరాజ్యాన్ని పరిగ్రహించిన నలుడు అతడితో ఇట్లా అన్నాడు.

**క. 'కలిసంప్రాప్తుఁడనై కడు । బలమఱి నీ చేతఁ దొల్లి బలవద్ద్యూత**
**చ్ఛలజితుఁడ నైతి; నది నీ । బల మని గర్వింప వలదు బలవంతుఁడవై. 227**

**ప్రతిపదార్థం:** కలి, సంప్రాప్తుఁడను+ఐ= కలి పురుషుడిచేత ఆవహించబడినవాడినై; కడు= మిక్కిలి; బలము+అఱి= శక్తి నశించి; నీ చేతన్= నీచేత; తొల్లి= మునుపు; బలవత్+ద్యూత+ఛల, జితుఁడను+ఐతిన్= బలవంతంగా ఆడవలసివచ్చిన

జూదంలో మోసంచేత జయించబడ్డాను; అది= అటువంటి నాఓటమి; నీ, బలము+అని= నీ శక్తి అని; బలవంతుఁడవు+ఐ= బలం కలవాడివయి; గర్వింపవలదు= విఱ్ఱవీగవద్దు.

**తాత్పర్యం:** 'మునుపు నేను కలిచేత ఆవహించబడినవాడినై, బలం నశించి, నీచేత బలవంతపు జూదంలో ఓడిపోయాను. అటువంటి నా ఓటమి నీ బలంవలన లభించిన విజయంగా భావించవద్దు; అది నీ బలమనుకొని గర్వంతో విఱ్ఱవీగవద్దు.

**వ. నీవు నా పితృవ్యపుత్త్రుండవు; ని న్నెద్దియుం జేయనోపఁ బో' మ్మని పుష్కరుని విడిచిపుచ్చి పుష్కలంబయిన రాజ్యంబుతో నలుం డున్నంత. 228**

**ప్రతిపదార్థం:** నీవు; నా పితృవ్యపుత్త్రుండవు= నా పినతండ్రి కుమారుడవు; నిన్ను+ఎద్దియున్+చేయన్+ఓపన్= నిన్నేమీ చేయలేను; పొమ్ము= వెళ్ళుము; అని= అని చెప్పి; పుష్కరున్= పుష్కరుడిని; విడిచిపుచ్చి= వదలిపెట్టి; పుష్కలంబు+అయిన= సమృద్ధమైన; రాజ్యంబుతో; నలుండు= నలుడు; ఉన్నంతన్= ఉండగా.

**తాత్పర్యం:** నీవు నా పినతండ్రి కుమారుడవు. కావున నీకు ఎటువంటి కీడును నేను చేయలేను. పొమ్ము'- అని నలుడు పుష్కరుడిని విడిచిపెట్టి సర్వసమృద్ధమైన రాజ్యాన్ని ఏలుతుండగా.

**క. భీమ ప్రస్థాపిత యయి । కోమలి దమయంతి పుత్త్రకులుఁ దానును ల**
**క్ష్మీ మహిమ వెలుఁగుచుండఁగఁ । దామరసదళాక్షి వచ్చెఁ దనపతికడకున్. 229**

**ప్రతిపదార్థం:** భీమ, ప్రస్థాపిత+అయి= భీముడిచే బాగుగా ప్రయాణము చేయించబడినదై (పంపబడినదై); కోమలి, దమయంతి= సుకుమారి అయిన దమయంతి; పుత్త్రకులున్= బిడ్డలు; తానును; లక్ష్మీమహిమ= ఐశ్వర్య ప్రభావం; వెలుఁగుచు+ఉండఁగన్= శోభిల్లుతుండగా; తనపతి కడకున్= తన భర్త అయిన నలుడి దగ్గరకు; తామరస, దళ+అక్షి= పద్మంయొక్క రేకులవలె విశాలాలైన కన్నులు కల దమయంతి; వచ్చెన్= వచ్చింది.

**తాత్పర్యం:** తండ్రి అయిన భీమమహారాజుచేత పంపబడి, తామరపువ్వు రేకులవంటి కన్నులు కల దమయంతి బిడ్డలు తాను కలిసి, ఐశ్వర్య మహిమతో శోభిల్లుతూ భర్త అయిన నలుడి దగ్గరకు వచ్చింది.

**వ. అట్లు తన మనోవల్లభయైన దమయంతింగూడి నలుండు విధివిహితానేకాచరితమఖుండైశతమఖు విలాసంబుతో సకలరత్నయుతంబైన రత్నగర్భాధిరాజ్యంబు సేసెఁ; గావున నక్షజితుండు నైతి నని వగవవలదు; నీవును దైవమానుషసంపన్నుండ వయి శత్రువుల జయించి సకలమహీసామ్రాజ్యంబు వడయుదు' వని బృహదశ్వుండు ధర్మరాజునకు నక్షహృదయం బుపదేశించి. 230**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; తన, మనోవల్లభ+ఐన= తన హృదయేశ్వరి అయిన; దమయంతిన్+కూడి= దమయంతితో కలిసి; నలుండు; విధి, విహిత+అనేక+ఆచరిత, మఖుండు+ఐ= శాస్త్రవిధులలో నిర్దేశించబడిన విధంగా ఆచరించబడిన పెక్కుయజ్ఞాలు కలవాడై (అంటే శాస్త్రీయపద్ధతులలో పెక్కుయాగాలు చేసి); శతమఖు, విలాసంబుతోన్= దేవేంద్రుడి వైభవంతో; సకల, రత్నయుతంబు+ఐన= సమస్త రత్నాలతో కూడి ఉన్న; రత్నగర్భా+అధిరాజ్యంబు+చేసెన్= భూమండలాన్ని గొప్పగా పరిపాలించాడు: కావునన్; అక్ష, జితుండను+ఐతిని+అని= పాచికలచేత (జూదంలో) ఓడిపోయాను అని; వగవ,

వలదు= శోకించకుము; నీవును= నీవుకూడ; దైవ, మానుష. సంపన్నుఁడవు+అయి= దైవసాహాయ్యం, మానుషప్రయత్నంతో కూడిన సంపద కలవాడివయి; శత్రువులన్= విరోధుల; జయించి; సకల, మహీ, సామ్రాజ్యంబు= సమస్త భూసామ్రాజ్యం; పడయుదువు= పొందగలవు; అని= అని చెప్పి; బృహదశ్వుండు= బృహదశ్వ మహాముని; ధర్మరాజునకున్; అక్షహృదయంబు= అక్షహృదయం అనే విద్య; ఉపదేశించి= ప్రబోధించి.

**తాత్పర్యం:** ఆ విధంగా నలుడు తన హృదయేశ్వరి దమయంతిని కూడి శాస్త్రాలలో నిర్దేశించబడినట్లు పెక్కు యాగాలు చేశాడు. దేవేంద్రవైభవంతో సకల రత్నయుతమైన భూమండలాన్ని గొప్పగా పరిపాలించాడు. కాబట్టి, పాచికలలో ఓడిపోయానని దుఃఖించవద్దు. నీవును దైవసాహాయ్యం, పురుషప్రయత్నం మేళవించిన అభ్యుదయంతో విరోధులను జయించి, సకలభూమండల సామ్రాజ్యాన్ని ఏలగలవు- అని బృహదశ్వుడు ధర్మరాజుకు అక్షహృదయం అనే విద్యను ఉపదేశించాడు.

**సీ.** **ఇన్నలోపాఖ్యాన మెప్పుడు దత్తావ । ధానులై వినువారుఁ దవిలి సభలఁ**
**జదివెడువారును జగతీశ! కలిదోష । నిర్ముక్తు లగుదురు; నిఖిలపుణ్య**
**ఫలభాగు లగుదురు; బహుపుత్త్రపౌత్త్రాయు । రారోగ్యధనయుక్తు లగుదు; రెల్ల**
**విషములకును దుష్టవిషయమ్ములకు దూరు । లగుదురు; ధర్మాత్ము లగుదు; రుర్వి**

**ఆ.** **గడుఁ బ్రసిద్ధ మిదియుఁ; గర్కోటకుని, దమ । యంతిఁ, బుణ్యమూర్తియైన నలుని**
**ఋజుచరిత్రుఁ డైన ఋతుపర్ణుఁ గీర్తింపఁ । గలిభయంబు లెల్లఁ గ్రాఁగు నధిప!** **231**

**ప్రతిపదార్థం:** ఈ+నల+ఉప+ఆఖ్యానము= ఈ నలుడిని గురించిన ఉపకథ; ఎప్పుడు; దత్త+అవధానులు+ఐ= ఇవ్వబడిన అవధానం కలవారయి, అంటే శ్రద్ధతో; వినువారున్= ఆలకించేవారు; సభలన్= సమావేశాలలో; తవిలి= పూనికతో; చదివెడువారును= పఠించేవారును; జగతీ+ఈశ= ఓ మహారాజా (ధర్మరాజా!); కలిదోష, నిర్ముక్తులు= కలిదోషంనుండి విముక్తులు; అగుదురు= కాగలరు- అంటే కలిప్రభావంవలన ఏర్పడే భ్రమప్రమాదాలకు, కష్టనష్టాలకు లోనుకారు; నిఖిల, పుణ్య, ఫల, భాగులు+అగుదురు= సమస్త పుణ్యాలు చేయటంవలన లభించే ఫలితాలను భాగంగా పొందేవారు కాగలరు; బహు, పుత్త్ర, పౌత్త్ర+ఆయుస్+ఆరోగ్య, ధన, యుక్తులు+అగుదురు= పెక్కుమంది పుత్రులతో, మనుమలతో, ఆయువుతో, ఆరోగ్యంతో, ధనంతో కూడినవారు కాగలరు; ఎల్లవిషములకును= అన్ని విషాలకు; దుష్ట విషయమ్ములకు= చెడుఅంశాలకు; దూరులు+అగుదురు= తొలగి ఉంటారు; ధర్మ+ఆత్ములు+అగుదురు= ధర్మంతో నిండిన ఆత్మలు కలవారవుతారు; ఉర్విన్= భూమిలో; ఇదియున్= ఈ ఉపాఖ్యానం; కడు= మిక్కిలి; ప్రసిద్ధము= ఎల్లరకు తెలిసినది; కర్కోటకుని; దమయంతిన్; (కర్కోటక, దమయంతులను) పుణ్యమూర్తి+ఐన= పుణ్యం ఆకృతిగాకల; నలుని; ఋజుచరిత్రుఁడు+ఐన= సత్యప్రవర్తనుడైన; ఋతుపర్ణున్; కీర్తింపన్= ప్రశంసించగా; అధిప!= ఓ మహారాజా!; కలి, భయంబులు+ఎల్లన్= కలివలన ఏర్పడే భయాలన్నియు; క్రాఁగున్= మాడిపోతాయి.

**తాత్పర్యం:** ఓ మహారాజా! ఈ నలుడిగాథ శ్రద్ధతో వినేవారు, సమావేశాలలో చదివి వినిపించేవారు, కలివలన సంభవించే దోషాలనుండి విముక్తి చెందగలరు. సర్వపుణ్యకార్యాలు చేసినప్పుడు లభించే పుణ్యఫలితాలు నలోపాఖ్యానం విన్నవారికి, వినిపించినవారికికూడ లభిస్తాయి. అటువంటివారికి బహుపుత్త్రలాభం, పౌత్త్రవృద్ధి, ఆయురారోగ్య ధనసంపత్తులు కలుగుతాయి. అన్నివిషాలకు, చెడువిషయాలకు వారు దూరమౌతారు. ధర్మాత్ములౌతారు. ఈ కథ భూలోకంలో ప్రాచీనమైనది; మిగుల ప్రసిద్ధమైనది. కర్కోటకుడిని, దమయంతిని, పుణ్యశ్లోకుడైన నలుడిని, ఋజుచరిత్రుడైన ఋతుపర్ణుడిని ధ్యానించి కీర్తించిన కలిభయాలు తొలగిపోగలవు.

**విశేషం:** ఇది ఫలశ్రుతి. ఏ కథనైనను వినినవారికి, వినిపించినవారికి కలిగే అభ్యుదయ పరంపరాభివృద్ధి కథచివర వివరించటం ప్రాచీన సాహితీ సంప్రదాయం. ప్రత్యేక ఫలశ్రుతి చెప్పబడటంచేత నలోపాఖ్యానం భారతకథ కంటె ప్రాచీనతరమని, ఆ కథ సుప్రసిద్ధమైనది కావుననే దానిని బృహదశ్వమహాముని ధర్మరాజుకు చెప్పాడని విమర్శకులు పలువురి అభిప్రాయం. ఇందలి పాత్రలు చిరస్మరణీయాలు. కథలోని జిగిబిగి, ఇతివృత్తంలో మలుపులు, గుండెలకు హత్తుకొనేవి. ఫలశ్రుతి స్థూలదృష్టికి అతిశయోక్తి భాజనంగా కనిపించినా సూక్ష్మదృష్టికి నలోపాఖ్యానం సహృదయులకు అతిలోకమైన భావితాంతఃకరణప్రవృత్తిని కల్పిస్తుందని తోచక తప్పదు. భారతదేశంలో యుగయుగాంతరాలనుండి నలోపాఖ్యానం విని, చదివి అలనాడు ధర్మరాజు ప్రభృతులు పొందిన సద్యఃపరనిర్వృతి, చిత్తశాంతి, రసానంద తన్మయత్వం అనుభవించిన సహృదయులు ఎందరెందరో ఉన్నారు.

## ధర్మరాజునొద్దకు నారదమహాముని వచ్చుట (సం. 3-80-1)

**వ. అని చెప్పి బృహదశ్వుం డరిగినం; బాండవులు గాండీవిరాకయ కోరుచుఁ దదాలోకనప్రీతి నుండునంత నంతరిక్షం బెల్లఁ దనతేజంబున వెలుంగుచుండ నారదుండు వచ్చి యనుజసహితుండైన ధర్మరాజుచేతం బూజితుండై యిట్లనియె. 232**

**ప్రతిపదార్థం:** అని, చెప్పి= అట్లు వచించి; బృహదశ్వుండు= బృహదశ్వమహాముని; అరిగినన్= వెళ్ళగా; పాండవులు= పాండురాజ కుమారులు; గాండీవి= గాండీవధారిఅయిన అర్జునుడియొక్క; రాకయ= రాకనే; కోరుచున్= ఆకాంక్షిస్తూ; తద్+ఆలోకన, ప్రీతిన్= ఆతడిని చూడాలనే ఆసక్తితో; ఉండు+అంతన్= ఉన్నంత; అంతరిక్షంబు+ఎల్లన్= ఆకాశమంతయు; తన, తేజంబునన్= తన ప్రకాశంతో; వెలుంగుచుండన్= శోభిల్లుతుండగా; నారదుండు= నారదమహర్షి; వచ్చి= విచ్చేసి; అనుజ, సహితుండు+ఐన= తమ్ములతో కూడిఉన్నట్టి; ధర్మరాజుచేతన్= ధర్మరాజుచేత; పూజితుండు+ఐ= అర్చించబడినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, బృహదశ్వమహర్షి ధర్మరాజును వీడ్కొని వెళ్ళినతరువాత, పాండవులు అర్జునుడి రాకనే కోరుతూ, ఆతడిని చూడాలనే ఆకాంక్షతో నిరీక్షిస్తుండగా, ఆకాశమంతటిని తన కాంతిచేత శోభిల్లజేస్తూ నారదమహర్షి వచ్చి, తమ్ములతో కూడిఉన్న ధర్మరాజుచేత అతిథిసత్కారాలు పొంది ఇట్లా అన్నాడు.

**ఆ. 'ధర్మపుత్త్ర! నీ యుదారచరిత్రకు । ధర్మమతికిఁ దృప్తతముఁడ నైతి;**
**నడుగు మిష్ట మెద్ది?' యనినఁ గృతాంజలి । యై మహీశుఁ డిట్టు లనియె భక్తి. 233**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్త్ర!= ఓ ధర్మతనయా!; నీ+ఉదార, చరిత్రకున్= నీయొక్క మంచి నడవడికి; ధర్మమతికిన్= ధర్మంతో కూడిన బుద్ధికి; తృప్తతముఁడన్+ఐతిన్= మిక్కిలి తృప్తి చెందినవాడిని అయ్యాను; (తృప్తుడు, తృప్తతరుడు, తృప్తతముడు అనేవి తర-తమ విశిష్టాలు); అడుగుము+ఇష్టము+ఎద్ది= నీకు ఏది ఇష్టమో కోరుకొనుము; అనినన్= అని అడుగగా; కృత+అంజలి+ఐ= ఘటించిన అంజలి కలవాడై- అంటే నమస్కరించి; మహీ+ఈశుఁడు= రాజు (ధర్మరాజు); భక్తిన్= పూజ్యభావంతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! నీ గొప్పనడవడికి, నీ ధర్మబుద్ధికి నేను సంపూర్ణ సంతృప్తి చెందాను. నీకు ఇష్టమైనది కోరుకొనుము' - అని నారదమహర్షి చెప్పగా ధర్మరాజు ఇట్లా పలికాడు.

**వ. 'మునీంద్రా! నీవు తృప్తుండవైనం ద్రిజగంబులకుం దృప్తియగు; నిన్నుం జూచి కృతార్థుండ నైతి; నా కెప్పుడు నొక్క ధర్మసందేహంబు గలదు; దాని నిర్ణయించి యానతీయవలయు. 234**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= మునులలో ఇంద్రుడి వంటివాడా!; నీవు, తృప్తుండవు+ఐనన్= నీవు సంతృప్తి చెందిన వాడివైతే; త్రిజగంబులకున్= మూడులోకాలకు; తృప్తి+అగున్= తనివి ఏర్పడుతుంది; నిన్నున్+చూచి= నిన్ను సందర్శించి; కృత+అర్థుండను+ఐతి= చరితార్థుడిని అయ్యాను; నాకు+ఎప్పుడున్= నాకు ఎల్లప్పుడు; ఒక్క= ఒక; ధర్మ, సందేహంబు= ధర్మాన్ని గురించిన అనుమానము; ఉన్నది; దానిన్= ఆ ధర్మసందేహాన్ని; నిర్ణయించి= తేల్చి; ఆనతి+ఈయవలయున్= దయచేసి చెప్పాలి.

**తాత్పర్యం:** 'మునులలో శ్రేష్ఠుడవైనవాడా! నీవు సంతృప్తి చెందితే మూడులోకాలు సంతృప్తి చెందినట్లే. నిన్ను సందర్శించటంచేత నా జన్మ ధన్యమైంది. ఒక ధర్మసందేహం చిరకాలంనుండి నన్ను వేధిస్తున్నది. ఆ ధర్మసందేహాన్ని దయచేసి తీర్చి, నన్ను ఉద్ధరించాలని ప్రార్థిస్తున్నాను.

**విశేషం:** (1) మహానుభావుడైన నారదమహర్షి ఒక్కడు తృప్తిచెందితే చాలు. ముల్లోకాలు సంతృప్తి చెందినట్లే. (2) మహాత్ముల సందర్శనం చాలు. జన్మ ధన్యమవుతుంది. ఈ రెండుభావాలు ధర్మరాజుశీలానికి మెరుగు పెట్టుతున్నాయి.

**చ. ధరణిఁ బ్రదక్షిణంబుగ ముదంబునఁ గ్రుమ్మఱి తీర్థసేవనా**
**పరు లగుచున్న ధన్యులు శుభస్థితి నెట్టి ఫలంబు నొందఁ గాం**
**తురు బహుతీర్థకీర్తనముతో నెఱిఁగింపుము దీని' నావుడున్**
**నరవరుఁ డైన పార్థునకు నారదుఁ డిట్లని చెప్పెఁ బ్రీతితోన్. 235**

**ప్రతిపదార్థం:** ధరణిన్= భూమిలో; ప్రదక్షిణంబుగన్= కుడివైపుగా పయనిస్తూ; ముదంబునన్= ప్రీతితో; క్రుమ్మఱి= తిరిగి; తీర్థ, సేవనా, పరులు+అగుచున్న ధన్యులు= పుణ్యక్షేత్రాలను సందర్శించే వారవటంచేత కృతార్థులు అయినవారు; శుభస్థితిన్= శుభకరమైన ఉనికిలో; ఎట్టి, ఫలంబు= ఎటువంటి పుణ్యఫలితాన్ని; ఒందన్+కాంతురు= పొందజాలుదురో; బహు, తీర్థ, కీర్తనముతోన్= పెక్కు పుణ్యక్షేత్రాల అభివర్ణనంతో; దీనిన్= దీనిని; ఎఱిఁగింపుము= తెలుపుము; నావుడున్= అని పలుకగా; నర, వరుఁడు+ఐన= మనుజులలో శ్రేష్ఠుడైన; పార్థునకున్= పృథాపుత్రుడైన ధర్మరాజుకు; నారదుఁడు; ప్రీతితోన్= సంతోషంతో; ఇట్లు+అని, చెప్పెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** భూలోకంలో ప్రదక్షిణంచేస్తూ పుణ్యక్షేత్రాలు సందర్శించి ధన్యులైన మహానుభావులు పొందే పుణ్యఫలం ఎటువంటిదో అనేక దివ్యక్షేత్రాల వర్ణనతోపాటు నాకు తెలుపప్రార్థన' - అని అడిగిన ధర్మరాజుతో నారదుడు ఇట్లా చెప్పాడు.

**విశేషం:** (1) ప్రదక్షిణం అంటే చుట్టూ తిరగటం. ఎడమనుండి కుడివైపునకు తిరుగుతూ పయనించటం అనేది అసలు అర్థం. (2) తీర్థం అంటే నీరు అని అర్థం. తీర్థమంటే పుణ్యక్షేత్రం అనే అర్థం రూఢికెక్కింది. సాధారణంగా పుణ్యక్షేత్రాలు, పవిత్రనదీతీరాలలో ఉండటం, లేదా అచట పవిత్రంగా భావించబడే జలాలుండటంచేత తీర్థం అంటే ఔపచారికంగా పుణ్యక్షేత్రం అనే అర్థం ఏర్పడింది. (3) పార్థుడు అంటే పృథ (కుంతి) యొక్క కొడుకు. ఈ శబ్దం అర్జునుడికే తరుచుగా వాడబడింది. ధర్మజ భీమార్జునులు ముప్పురును పార్థులే కదా! ఇచట పార్థుడు అంటే ధర్మరాజుకు అన్వయిస్తుంది. అనేక

తీర్థయాత్రలు చేసేవారు తాము ఉన్న ప్రదేశంనుండి ప్రదక్షిణంగా పయనిస్తూ పుణ్యక్షేత్రాలను సందర్శించాలి - అనే సంప్రదాయం ఇందువలన వెల్లడౌతున్నది.

**క. ధీరుఁడు భీష్ముఁడు గంగా । ద్వారమునం దొల్లి పితృహితమ్ముగ శుభక**
**ర్మారంభుఁ డగుచు నుండె ను । దారుం డధ్యయన సంతతవ్రతపరుఁడై. 236**

**ప్రతిపదార్థం:** ధీరుఁడు= ధైర్యంకలవాడు; ఉదారుండు= గంభీరుడు; భీష్ముఁడు; తొల్లి= మునుపు; గంగా, ద్వారమునన్= గంగానదీముఖంలో; అధ్యయన, సంతత, వ్రతుఁడు+ఐ= ఎల్లప్పుడు వేదాలను అభ్యసించే దీక్ష కలవాడై; పితృహితమ్ముగన్= తండ్రికి ప్రీతిగా; శుభ, కర్మ+ఆరంభుఁడు+అగుచున్= సత్క్రియలను చేయటానికి ఉద్యుక్తుడై; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** ధైర్యంకలవాడు, గంభీరుడు, ఐన భీష్ముడు పూర్వం గంగాద్వారంలో నిరంతర వేదాధ్యయన దీక్షను పూనినవాడై తండ్రికి సంప్రీతి ఘటించే సత్క్రియలు చేస్తూ ఉండినాడు.

**వ. అతని పితృదేవతాభక్తికిఁ బరమధర్మచరితంబునకు మెచ్చి తద్దర్శనాపేక్షం బులస్త్యుండను మహాముని వచ్చిన నతిభక్తుండయి యా భీష్ముం డమ్మునిఁ గుశపీఠంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యతని యడుగులు తల నిడుకొని దక్షిణజానుస్పృష్ట మహీతలుండయి' యేను భీష్ముండ భవద్దాసుండ' నని ముకుళిత హస్తుం డయి యున్న వానికిఁ బులస్త్యుం డిట్లనియె. 237**

**ప్రతిపదార్థం:** అతని= భీష్ముడియొక్క; పితృదేవతా భక్తికిన్= పితృదేవతలపట్ల గల పూజ్యభావానికి; పరమ, ధర్మ, చరితంబునకున్= ధర్మపూరితమైన గొప్ప నడవడికి; మెచ్చి= సంతసించి; తద్+దర్శన+అపేక్షన్= అతడిని చూడాలనే కోరికతో; పులస్త్యుండు+అను, మహాముని= పులస్త్యుడు అనే పేరుకల గొప్పఋషి; వచ్చినన్= రాగా; అతి, భక్తుండు+అయి= మిక్కిలి భక్తికలవాడయి; ఆ, భీష్ముండు; ఆ+మునిన్; కుశ, పీఠంబునన్+ఉనిచి= దర్భల ఆసనంపై కూర్చుండబెట్టి; అర్ఘ్య, పాద్య+ఆది, విధులన్= స్వాగతపూర్వకమైన ఉదకాన్ని, పాదాలు కడుగుకొనే నీళ్లు మొదలైనవాటిని శాస్త్రవిధులలో చెప్పబడిఉన్నట్లుగా సమర్పించి; పూజించి= అర్చించి; అతని, అడుగులు= అతని పాదాలు; తలన్= తన శిరస్సుపై; ఇడుకొని= పెట్టుకొని; దక్షిణ, జాను, స్పృష్ట, మహీతలుండు+అయి= కుడి మోకాలుచేత ముట్టబడిన భూభాగం కలవాడై (కుడి మోకాలిని ముడిచి మోకరిల్లినవాడై); ఏను= నేను; భీష్ముండు= భీష్ముడను; భవత్+దాసుండన్= మీ సేవకుడిని; అని= అని చెప్పి; ముకుళిత హస్తుండు+అయి= ముడిచిన చేతులు కలవాడై, అంటే నమస్కరించి; ఉన్నన్= ఉండగా; వానికిన్= ఆ భీష్ముడికి; పులస్త్యుండు= పులస్త్య మహాముని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** భీష్ముడి పితృదేవతాభక్తికి, అతడియొక్క అత్యంత ధర్మశీలానికి మెచ్చి, ఆతడిని చూడాలనే కోరికతో అతడి దగ్గరకు పులస్త్యుడనే గొప్ప ఋషి వచ్చాడు. భీష్ముడు ఆ ఋషీశ్వరుడిని మిక్కిలి భక్తితో పూజించి, దర్భలఆసనంపై కూర్చుండబెట్టి అర్ఘ్యం, పాద్యం మొదలైన స్వాగతసత్కారాలు సమర్పించి అతడి పాదాలను తన శిరస్సుపై చేర్చుకొని, తన కుడిమోకాలు భూమిపై చేర్చి మ్రొక్కి 'నేను భీష్ముడిని, మీ సేవకుడిని' అని పలికి నమస్కరించి ఉండగా, అతడితో పులస్త్యుడు ఇట్లా పలికాడు.

**విశేషం:** (1) దర్భల ఆసనం సమర్పించటం, అర్ఘ్యం, పాద్యం ఇచ్చి గౌరవించటం అలనాటి అతిథిసత్కార విశేషాలు. (2) దక్షిణజానువు భూతలం అందేటట్లుగా ఉండి అతిథి పాదాలు తన శిరస్సు సోకేటట్లు నమస్కరించటం గౌరవభక్తి

ప్రపత్తులకు సూచకం. నమస్కరించేటప్పుడు తనపేరు చెప్పుకొనటం సంప్రదాయం. భీష్ముడియందు పితృభక్తి, దేవభక్తి, ధర్మానురక్తి అనే మూడు గుణాలున్నాయి. అవి ఋషుల చేతకూడ గౌరవింపబడేవి. అందువలన పులస్త్యుడు భీష్ముడిని దర్శించ వచ్చాడు. భీష్ముడు కర్మఠుడు. అందువలన తీర్థయాత్రలనుగురించి అడిగాడు. ధర్మజుడు కూడ భీష్ముడివలె కర్మఠుడు. అందువలన మనుమడికి తాతవిన్నకథను నారదుడు వినిపించాడు. ఇది ఇతిహాస మర్యాదకూడా.

**క. 'పితృదేవభక్తిఁ బుణ్య । వ్రతచర్యను నీవ యెల్లవారికి నత్యు**
**న్నతుఁడవు గావున నీచే । ధృతిఁ గానఁగఁబడితి నేఁ బ్రతీపకులేశా! 238**

**ప్రతిపదార్థం:** ప్రతీప, కుల+ఈశా!= ప్రతీపుడి వంశంలో శ్రేష్ఠుడవైనవాడా!; పితృదేవ భక్తిన్= పితృదేవతలపై గల పూజ్యభావంలోను; పుణ్యవ్రతచర్యను= పుణ్యం కలిగించే పనులను తదేకదీక్షతో చేయటంలోనూ; నీవు+అ= నీవే; ఎల్లవారికిన్= అందరికంటె; అతి+ఉన్నతుఁడవు= మిక్కిలి ఎత్తైనవాడివి - అంటే గొప్పవాడివి; కావున; నీచే; ధృతిన్= నిష్ఠతో; ఏన్= నేను; కానఁగన్+పడితిన్= సందర్శించబడ్డాను.

**తాత్పర్యం:** 'ప్రతీపమహారాజు వంశంలో శ్రేష్ఠుడివైనవాడా! ఓ భీష్ముడా! పితృదేవతారాధనలోను, పుణ్యకార్యాలను తదేకదీక్షతో ఆచరించటంలోను నీవే అందరికంటె గొప్పవాడివి. కావుననే నన్ను నీవు ఇంత నిష్ఠతో ఆరాధించావు.

**వ. నీ యిష్టంబు సెప్పు; మే నమోఘదర్శనుండ' ననిన భీష్ముండు ముదితహృదయుండై 'మునీంద్రా! నాయందు నీకుఁ బ్రసాదబుద్ధి గలదేనిఁ జెప్పు' మని. 239**

**ప్రతిపదార్థం:** నీ, ఇష్టంబు+చెప్పుము= నీవు ఏది కోరుకొంటావో తెలుపుము; ఏను+అమోఘ, దర్శనుండను= నేను వ్యర్థం కాని దర్శనం కలవాడిని, అంటే నన్ను చూడటంవలన మేలు కలిగితీరుతుంది; అనినన్= అని చెప్పగా; భీష్ముండు; ముదిత, హృదయుండు+ఐ= సంతోషించిన హృదయం కలవాడై; ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడవైనవాడా!; నాయందున్= నాపై; నీకున్= నీకు; ప్రసాద, బుద్ధి= అనుగ్రహం; కలదేని= ఉంటే; చెప్పుము+అని.

**తాత్పర్యం:** నీ ఇష్టం తెలుపు. మేలు చేకూర్చకుండ నా సందర్శనం ఎన్నడూ వ్యర్థం కాజాలదు' - అని పులస్త్యమహర్షి పలుకగా భీష్ముడు సంతోషించి 'మునీంద్రా! నీకు నాపట్ల దయకలదేని చెప్పుము' అనగా.

**విశేషం:** భీష్ముడు పులస్త్యమహర్షిని చెప్పుమని అడిగింది ఏమిటి? ధర్మరాజు నారదుడికి వేసినట్టి ప్రశ్ననే భీష్ముడు అంతకుముందు పులస్త్యమహర్షిని అడిగిఉన్నాడు. ఆ సంగతినే ప్రస్తావించి నారదుడు ధర్మరాజుకు చెప్పాడు. అంటే ఇట నారదుడు చెపుతున్న సమాధానం అలనాడు పులస్త్యుడు భీష్ముడికి చెప్పినటువంటిదే.

**క. 'మనుజేంద్ర! నన్ను నీ యడి । గిన యట్ల పులస్త్యుఁ బుణ్యకీర్తను గంగా**
**తనయుం డడిగిన నతనికి । ననఘచరిత్రునకు నిట్టు లని ముని సెప్పెన్. 240**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్ర!= ఓ మహారాజా! (ధర్మరాజా); నన్నున్= నన్ను; నీ+అడిగిన+అట్లు+అ= నీవు అడిగిన విధంగానే; పులస్త్యున్= పులస్త్యమహర్షిని; పుణ్యకీర్తనున్= పుణ్యమైన కీర్తనం (చరిత్రం) కలవాడిని; గంగాతనయుండు= భీష్ముడు; అడిగినన్= ప్రశ్నించగా; అతనికిన్= భీష్ముడికి; అనఘ చరిత్రునకున్= పాపరహితమైన ప్రవర్తన కలవాడికి; ఇట్టులు+అని= ఈ విధంగా అని; ముని+చెప్పెన్= పులస్త్యమహర్షి చెప్పాడు.

**తాత్పర్యం:** మనుజులకు అధిపతివైన ఓ ధర్మరాజా! నన్ను నీవు అడిగిన విధంగానే పుణ్యమైన చరిత్రగల పులస్త్య మహర్షిని భీష్ముడు అడుగగా, ఆ పవిత్రచరిత్రుడైన భీష్ముడికి పులస్త్యముని చెప్పాడు. దానినే ఇపుడు నీకు చెప్పగలను.

**సీ. కడఁగి బుద్ధీంద్రియ కర్మేంద్రియంబుల । యందు సంయతచిత్తు లైనవారు**
**ధృతి నహంకారప్రతిగ్రహాపేక్షల । యందు నివృత్తాత్ము లైనవారు**
**నల్పభోజనులు ననారంభకులు నయ్యు । నత్యంతసంతోషు లైనవారు**
**సత్యవ్రతులు శుభాచారు లక్రోధను । లగుచు ధర్మాన్వితు లైనవారు**

**ఆ. నఖిలతీర్థశతము లాడిన ఫలములు । నఖిలయజ్ఞవిధుల నైన ఫలముఁ**
**బడయుదురు విహీనభాగ్యదుష్కృతులకుఁ । బరమతీర్థసేవఁ బడయ నగునె? 241**

**ప్రతిపదార్థం:** కడఁగి= పూని; బుద్ధి+ఇంద్రియ, కర్మ+ఇంద్రియంబుల+అందు= బుద్ధికి సంబంధించిన ఇంద్రియాలలో మరియు కర్మకు సంబంధించిన ఇంద్రియాలలో; సంయత, చిత్తులు+ఐనవారలు= నిగ్రహంతో కూడిన మనస్సు కలవారు; ధృతిన్= నిష్ఠతో; అహంకార, ప్రతిగ్రహ+అపేక్షల+అందున్= గర్వం, పరులనుండి స్వీకరించటం- అనే కోరికలలో (కోరికల నుండి); నివృత్త+ఆత్ములు+ఐనవారు= మరలిన మనస్సులు గలవారు (వైరాగ్యం కలవారు); అల్ప, భోజనులును= తక్కువ తిండి తినేవారున్నూ; అనారంభకులును= పురుషకారం చేయక ఉదాసీనులై ఉండేవారున్నూ; అయ్యున్= అయినప్పటికిని; అత్యంత, సంతోషులు+ఐనవారు= మిక్కిలి సంతోషంతో ఉండేవారు; సత్య, వ్రతులు= సత్యాన్ని దీక్షతో పాటించేవారు; శుభ+ఆచారులు= మంచి నడవడి కలవారు (విశ్వజనీన ప్రవర్తనులు); అక్రోధనులు= కోపం లేకుండ శాంతచిత్తులైనవారు; అగుచున్; ధర్మ+అన్వితులు+ఐనవారున్= ధర్మంతో కూడినవారు; అఖిల, తీర్థ, శతములు+ఆడిన, ఫలములు= సమస్తపుణ్యక్షేత్రాలు నూరింటిలో స్నానంచేసిన ఫలాలు; అఖిల, యజ్ఞ, విధులను+ఐన, ఫలమున్= పెక్కు యజ్ఞాలను శాస్త్రీయంగా జరిపిన ఫలం; పడయుదురు= పొందగలరు; విహీన, భాగ్య, దుష్కృతులకున్= అదృష్టం లేని పాపాత్ములకు; పరమ, తీర్థ, సేవన్= గొప్ప పుణ్యక్షేత్రాలను సందర్శించే పుణ్యం; పడయన్+అగునె= పొందటం సాధ్యమా!

**తాత్పర్యం:** బుద్ధీంద్రియ, కర్మేంద్రియాలలో నిగ్రహం కల మనస్సు కలవారు, అహంభావం నుండి మనస్సును మరల్చిన దృఢచిత్తులు, ఇతరులనుండి ఎటువంటి ప్రయోజనాన్ని అపేక్షించక, అపరిగ్రహవ్రతాన్ని వైరాగ్యంతో ఆచరించేవారు, అల్పభోజనంతో సంతృప్తిచెంది, ఎటువంటి ప్రయత్నాలు చేయకుండా ఉండి మిక్కిలి సంతోషంతో ఉండేవారు, సత్యసంధులు, సదాచారులు, శాంతస్వభావులు, ధర్మాత్ములు అయినవారు అఖిలతీర్థాలలో క్రుంకులిడిన పుణ్యఫలం, సమస్తయజ్ఞాలు చేసిన ఫలితం పొందగలరు. కాని, దురదృష్టవంతులైన పాపాత్ములు గొప్ప తీర్థయాత్రలు చేసినా అట్టి పుణ్యఫలం పొందగలరా? [పొందలేరని భావం]

**విశేషం:** (1) బుద్ధీంద్రియాలు అయిదు. 1. చర్మం 2. చక్షువు 3. శ్రోత్రం 4. జిహ్వ 5. ఘ్రాణం (2) కర్మేంద్రియాలు అయిదు. 1. వాక్కు 2. పాణి 3. పాదం 4. పాయువు 5. ఉపస్థ - ఈ పది మనస్సుతో చేరితే ఏకాదశేంద్రియాలు అవుతాయి. (3) ఈ ప్రకరణంలో తీర్థయాత్రలు సేవించటంవలన కలిగే పుణ్యం, ఆయా క్షేత్రాల మాహాత్మ్యం వివరించటానికి నారదమహర్షి పూనుకొన్నాడు. ఇందులో అఖిలయజ్ఞాలు చేసినవారు, సమస్తతీర్థయాత్రలు సేవించేవారు పొందే పుణ్యాన్ని ఇంద్రియవిజేతలు వైరాగ్య సంపన్నులు, అనాసక్తయోగులు, సత్యసంధులు, శుభాచారులు, శాంతచిత్తులు అయిన ధర్మాత్ములు పొందగలుగుతారు- అని ఉపోద్ఘాతప్రాయంగా నారదమహర్షి చాటిచెప్పి, తదుపరి తీర్థయాత్ర మహిమను ఉగ్గడిస్తాడు.

**క. తిల గో సువర్ణ దానం । బులు నుపవాసములుఁ దీర్థముల సేవయు ని**
**మ్ములఁ జేయనివారు దరి । ద్రులు రోగులు నగుదు రాత్మదోషము పేర్మిన్. 242**

**ప్రతిపదార్థం:** తిల, గో, సువర్ణ, దానంబులున్= నువ్వులు, ఆవులు, బంగారాల దానాలున్నూ; ఉపవాసములున్= ఆహార విరమణలున్నూ; తీర్థముల సేవయున్= తీర్థయాత్రల సేవయున్నూ; ఇమ్ములన్= ప్రీతితో; చేయనివారు; ఆత్మ,దోషము, పేర్మిన్= స్వయంకృతాపరాధంయొక్క అతిశయంవలన; దరిద్రులు= నిరుపేదలు; రోగులున్= వ్యాధిగ్రస్తులు; అగుదురు= కాగలరు.

**తాత్పర్యం:** తిలలు, ఆవులు, బంగారం దానాలు చేయనివారు, ఉపవాసాలు చేయనివారు, పుణ్యతీర్థాలు సేవించనివారు, స్వయంకృతాపరాధంవలన నిరుపేదలు, రోగపీడితులు అవుతారు.

**విశేషం:** తీర్థయాత్రలతో వివిధదానాలు ముడిపెట్టబడటం గమనించదగింది.

**క. క్రతుఫలములు వడయఁగ దు । ర్గతులకు దొరకొనదు తీర్థగమనంబునఁ ద**
**త్క్రతుఫలము లందుదురు దు । ర్గతులును నిది మునులమతము కౌరవవృషభా! 243**

**ప్రతిపదార్థం:** క్రతు, ఫలములు+పడయఁగ= యజ్ఞాలు చేస్తే సంక్రమించే ఫలాలు సంపాదించటానికి; దుర్గతులకు= పాపాత్ములకు; దొరకొనదు= వీలుకాదు; తీర్థగమనంబునన్= తీర్థయాత్రలవలన; దుర్గతులును= పాపాత్ములు సయితం; తద్, క్రతు, ఫలములు= ఆయా యజ్ఞాలు చేస్తే వచ్చే ఫలాలను; అందుదురు= పొందుతారు; కౌరవ వృషభా!= కౌరవులలో శ్రేష్ఠుడా!; ఇది; మునులమతము= ఋషుల అభిప్రాయం.

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠుడా! పాపాత్ములకు యజ్ఞయాగాదుల ఫలాలు లభించవు. అయినా, అటువంటి పాపాత్ములు తీర్థయాత్రలు చేస్తే యజ్ఞయాగాదులు చేసిన ఫలాలు పొందగలరు. ఇది ఋషివరేణ్యుల అభిప్రాయం.

**విశేషం:** వృషభ శబ్దం శ్రేష్ఠవాచకం. 'కవి వృషభులు మహాకావ్యమనియు'- నన్నయ ప్రయోగం. వృషభం అంటే వాచ్యార్థం ఎద్దు లేక ఆఁబోతు.

**వ. తీర్థగమనఫలం బెల్లపుణ్యంబులకు విశేషంబు; దీని వినుము. 244**

**ప్రతిపదార్థం:** తీర్థగమన, ఫలంబు= తీర్థయాత్రలవలన లభించే ఫలం; ఎల్ల పుణ్యంబులకు= సమస్త పుణ్యాలలో; విశేషంబు= గొప్పది; దీని, వినుము= ఈ అంశాన్ని ఆలకించుము.

**తాత్పర్యం:** తీర్థయాత్రలవలన లభించే ఫలం అన్ని పుణ్యాలకంటె గొప్పది. ఈ అంశాన్ని ఆలకించుము.

**చ. నమితవిరోధి! పుష్కర మనంగ జగద్విదితంబు పుణ్య తీ**
**ర్థము మునిసిద్ధసేవ్యము; ముదంబున నందుఁ బయోజసంభవుం**
**డమరులతోడ సన్నిహితుఁడై వసియించుఁ; ద్రిపుష్కరంబులున్**
**సమములు; వాని నెప్పుడును సంస్మృతి సేసినఁ బాయుఁ బాపముల్. 245**

**ప్రతిపదార్థం:** నమిత, విరోధి!= లొంగిన శత్రువులు కలవాడా! లేదా శత్రువులచేత నమస్కారాలు పొందినవాడా!; పుష్కరము+అనంగన్, పుణ్యతీర్థము= పుష్కరమని పేరుకెక్కిన పుణ్యక్షేత్రం; జగత్+విదితంబు= ప్రపంచ ప్రఖ్యాతి కన్నట్టిది; ముని, సిద్ధ, సేవ్యము= మునులచేత, సిద్ధులచేత సేవించబడేది (సిద్ధులు= పరిపక్వత చెందిన యోగీశ్వరులు); ముదంబునన్= ప్రీతితో; అందున్= ఆ పుష్కరతీర్థంలో; పయోజసంభవుండు= పద్మంలో పుట్టినవాడు బ్రహ్మదేవుడు; అమరులతోడన్= దేవతలతో; సన్నిహితుఁడు+ఐ= కలిసిమెలసి ఉండేవాడై; వసియించున్= నివసిస్తాడు. త్రిపుష్కరంబులున్= మూడు పుష్కరాలున్నూ; సమములు= సమానాలు; వానిన్= ఆ పుష్కరాలను; సంస్మృతి+చేసినన్= సంస్మరిస్తే; పాపముల్= దురితాలు; పాయున్= తొలగిపోతాయి.

**తాత్పర్యం:** శత్రువులను నిగ్రహించినవాడా! (నమస్కరించిన శత్రువులు కలవాడా!) పుష్కరమనే పుణ్యతీర్థం ప్రపంచప్రఖ్యాతిని ఆర్జించినట్టిది. అది మునులు సిద్ధులు సేవించేటటువంటిది. అందులో బ్రహ్మదేవుడు దేవతలతో కలిసి నివసిస్తాడు. అచ్చటి మూడుపుష్కరాలున్నూ సమానాలే. ఆ పుష్కరాలను సంస్మరిస్తేనే చాలు సమస్తపాపాలు తొలగిపోతాయి.

**విశేషం:** 'నమిత విరోధి!'- అంటే- (పరాక్రమం చేత) అణచబడిన శత్రువులు కలవాడా!- అనే అర్థంకూడ ఉన్నది. ఈ సందర్భమున ఈ విశేషణం కూడ సార్థకమే.

**క. పదివేలకోట్లతీర్థము । లుదితములై పుష్కరముల నుండు మునీంద్ర**
**త్రిదశవరు లందుఁ జేసిరి । మదిఁ గృతకృత్యు లయి తపము మఖములుఁ బ్రీతిన్. 246**

**ప్రతిపదార్థం:** పదివేలకోట్ల, తీర్థములు= పదివేలకోట్ల పవిత్రక్షేత్రాలు; ఉదితములు+ఐ= ఆవిర్భవించి; పుష్కరములన్= పుష్కరాలలో; ఉండున్= ఉంటాయి; ముని+ఇంద్ర, త్రిదశవరులు= ఋషిశ్రేష్ఠులు, దేవతాశ్రేష్ఠులు; అందున్= ఆ పుష్కరాలలో; మదిన్= మనస్సులో; కృత కృత్యులు+అయి= ధన్యులై; తపము= తపస్సును; మఖములున్= యజ్ఞాలును; ప్రీతిన్= సంతోషంతో; చేసిరి= నిర్వహించారు.

**తాత్పర్యం:** ఆ పుష్కరాలలో పదివేలకోట్ల పవిత్రక్షేత్రాలు ఉద్భవించాయి. ఋషివరేణ్యులు, దేవతాశ్రేష్ఠులు అందులో తపస్సు చేశారు. యజ్ఞాలు చేశారు. మనస్సులో సంప్రీతి చెంది చరితార్థులు అయ్యారు.

**వ. అందుఁ గృతస్నానులై దేవర్షిపితృతర్పణంబులు సేసినవారు దశాశ్వమేధఫలంబులు వడయుదురు; కార్తిక మాసంబున నొక్కదివసంబు పుష్కరసేవ సేయుటయు నొకయేఁ డగ్నిహోత్రంబు వేల్చుటయు సమంబు.247**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ పుష్కరాలలో; కృతస్నానులు+ఐ= చేయబడినస్నానం కలవారై, అంటే స్నానంచేసినవారై; దేవ, ఋషి, పితృ, తర్పణంబులు= దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు శ్రాద్ధక్రియలు; చేసినవారు= నిర్వహించినవారు; దశ+అశ్వమేధ, ఫలంబులు= పది అశ్వమేధయాగాలు చేసిన పుణ్యాలు; పడయుదురు= పొందుతారు; కార్తికమాసంబునన్= కార్తికం నెలలో; ఒక్క, దివసంబు= ఒక దినం; పుష్కర, సేవ, చేయుటయున్= పుష్కరతీర్థాన్ని ఉపాసించటమున్నూ; ఒక, ఏఁడు= ఒక సంవత్సరం; అగ్నిహోత్రంబు, వేల్చుటయు= అగ్నికుండాన్ని ప్రజ్వలింపచేయటమున్నూ; సమంబు= సమానం.

**తాత్పర్యం:** ఆ పుష్కరాలలో స్నానంచేసి, దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తర్పణాలు విడిచినవారు పది అశ్వమేధయాగాలు చేసిన పుణ్యఫలాన్ని పొందగలరు. కార్తికమాసంలో ఒకదినం పుష్కరతీర్థాన్ని సేవించటం ఒకసంవత్సరం అగ్నిహోత్రం వేల్చితే లభించే పుణ్యంతో సమానం.

**క. అమరవరులందుఁ బురుషో । త్తముఁ డెట్లు విశేషుఁ డట్లు ధరణిం గల తీ**
**ర్థములందుఁ బుష్కరత్రిత । యము గరము విశేష మభిమతార్థప్రదమై. 248**

**ప్రతిపదార్థం:** అమర వరుల+అందున్= దేవతాశ్రేష్ఠులలో; పురుష+ఉత్తముఁడు= పురుషులలో శ్రేష్ఠుడైన విష్ణువు; ఎట్లు= ఏ విధంగా; విశేషుఁడు= గొప్పవాడో; అట్లు= ఆ విధంగా; ధరణిన్+కల= పుడమిలోఉన్న; తీర్థములందున్= పుణ్యతీర్థాల్లో; పుష్కరత్రితయము= మూడు పుష్కరాలు; అభిమత+అర్థ, ప్రదము+ఐ= కోరిన కోరికలను ఇచ్చేవై; కరము= మిక్కిలి; విశేషము= గొప్పవి.

**తాత్పర్యం:** దేవతలలో విష్ణుదేవుడు ఏవిధంగా గొప్పవాడో, ఆ విధంగానే కోరినకోర్కెలు తీర్చేవిగా మూడుపుష్కరాలు ఈ భూమిమీది పుణ్యతీర్థాలన్నింటిలో గొప్పవి.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. పుష్కరంబునఁ బదియేండ్లు వసియించినవారికి సర్వక్రతుఫలంబును బ్రహ్మలోకప్రాప్తియు నగు; మఱియు జంబూమార్గంబు దండులికాశ్రమంబున నగస్త్యవటంబను తీర్థంబు లాడి యశ్వమేధఫలంబు వడయుదురు; కణ్వాశ్రమంబును ధర్మారణ్యంబును యయాతి పతనంబునుం జూచిన సర్వపాపక్షయంబగు; మహాకాళంబును గోటితీర్థంబును నశ్వమేధ ఫలప్రదంబులు; భద్రవటంబను రుద్రస్థానంబున రుద్రుం బూజసేసి గణపతిత్వంబు వడయుదురు; నర్మదాస్నానంబున దక్షిణసింధుస్నానంబునఁ జర్మణ్వతీ తీర్థ స్నానంబున నగ్నిష్టోమ ఫలంబు లగు. 249**

**ప్రతిపదార్థం:** పుష్కరంబునన్= పుష్కరక్షేత్రంలో; పది+ఏండ్లు= పదిసంవత్సరాలు; వసియించినవారికిన్= నివసించినవారికి; సర్వక్రతు, ఫలంబును= సమస్తయజ్ఞాలు చేసిన పుణ్యమున్నూ; బ్రహ్మలోక ప్రాప్తియున్= సత్యలోకం ప్రాప్తించటమున్నూ (అంటే మరణించిన తర్వాత సత్యలోకంలో నివసించబోవటం); అగున్= కలుగును; మఱియు= మరియు; జంబూమార్గంబు= జంబూమార్గం; తండులిక+ఆశ్రమంబునన్= తండులిక ఆశ్రమంలోని; అగస్త్యవటంబు= అగస్త్యమహర్షి నాటిన మఱ్ఱిచెట్టు ఉండే క్షేత్రమున్నూ; అను, తీర్థంబులు+ఆడి= అనే క్షేత్రాలలోని పుణ్యతీర్థాలలో స్నానంచేసి; అశ్వమేధ, ఫలంబు= అశ్వమేధయాగం చేస్తే లభించే పుణ్యాన్ని; పడయుదురు= పొందగలరు; కణ్వ+ఆశ్రమంబును= కణ్వమహర్షి స్థాపించిన ఆశ్రమమున్నూ; ధర్మ+అరణ్యంబును= ధర్మారణ్యం అనే పేరు కల పుణ్యక్షేత్రమున్నూ; యయాతి పతనంబునున్= యయాతి భూమికి దిగిన ప్రదేశమున్నూ; చూచిన= దర్శిస్తే; సర్వ, పాప, క్షయంబు+అగున్= సమస్తపాపాలున్నూ నశించిపోతాయి; మహాకాళంబును= మహాకాళం అనే పుణ్యక్షేత్రమున్నూ; కోటితీర్థంబునున్; అశ్వమేధఫలప్రదంబులు= అశ్వమేధయాగంయొక్క పుణ్యాన్ని ఇచ్చేవి; భద్రవటంబు+అను= భద్రవటమనే పేరుగల; రుద్రస్థానంబునన్= రుద్ర ప్రతిష్ఠ కలచోట; రుద్రున్+పూజ+చేసి= శివుడిని అర్చించి; గణపతిత్వంబు= గణాధిపత్యాన్ని; పడయుదురు= పొందుతారు; నర్మదాస్నానంబునన్= నర్మదానదిలో స్నానం చేయటంవలన; దక్షిణ సింధుస్నానంబునన్= దక్షిణసింధువులో స్నానం చేయటంవలన; చర్మణ్వతీ, తీర్థస్నానంబునన్= చర్మణ్వతీ నదీతీర్థ జలాలలో క్రుంకులు ఇడటంవలన; అగ్నిష్టోమ, ఫలంబులు+అగున్= అగ్నిష్టోమయాగం చేయటంవలన సంక్రమించే పుణ్యం లభిస్తుంది.

**తాత్పర్యం:** పుష్కరక్షేత్రంలో పదిసంవత్సరాలు నివసించేవారికి సర్వయజ్ఞాలు చేసినపుణ్యం మరియు బ్రహ్మలోకప్రాప్తి కలుగుతాయి. జంబూమార్గంలో, తండులికాశ్రమంలోని అగస్త్యవటంలో క్రుంకులిడినవారికి అశ్వమేధఫలం

దక్కుతుంది. కణ్వాశ్రమం, ధర్మారణ్యం, యయాతిపతనం అనే పుణ్యక్షేత్రాలను సందర్శిస్తే సర్వపాపాలు నశిస్తాయి. మహాకాళం, కోటితీర్థం సందర్శిస్తే అశ్వమేధఫలం లభిస్తుంది. భద్రవటమనే రుద్రస్థానంలో రుద్రుడిని అర్చిస్తే గణాధిపత్యం లభిస్తుంది. నర్మదాస్నానంవలన, దక్షిణ సింధువులో క్రుంకులిడటంవలన, చర్మణ్వతీ నదీ తీర్థ జలాలలో స్నానంచేయటం వలన అగ్నిష్టోమయాగఫలం దక్కుతుంది.

**క. అనవద్య వసిష్ఠాశ్రమ । మున నొక దివసంబు శాకమూలాశనులై**
**జను లుండి పడయుదురు బహు । ధనసంపద గోసహస్రదాన ఫలంబుల్. 250**

**ప్రతిపదార్థం:** అనవద్య, వసిష్ఠ+ఆశ్రమమునన్= పవిత్రమైన వసిష్ఠాశ్రమంలో; ఒక దివసంబు= ఒక దినం; శాక, మూల+అశనులు+ఐ= కూరలు, వేళ్ళు తింటున్నవారై; జనులు+ఉండి= ప్రజలు ఉండి; బహు, ధన, సంపద= గొప్పధనం, ఐశ్వర్యం; గో, సహస్ర, దాన, ఫలంబుల్= వేయి ఆవులను దానం చేసిన పుణ్యాలను; పడయుదురు= పొందగలరు.

**తాత్పర్యం:** పరమపావనమైన వసిష్ఠాశ్రమంలో జనులు ఒకదినం శాకాహారంతో కూరలు దుంపలు తిని ఉంటే గొప్పధనం, ఐశ్వర్యం, వేయిగోవులను దానం చేసిన పుణ్యాన్నీ పొందగలరు.

**వ. మఱి పింగం బను తీర్థంబు సేవించి శతకపిలగోదానఫలంబు వడయుదు; రెందేని నగ్నిదేవుండు ప్రత్యక్షంబై యుండునట్టి ప్రభాసతీర్థం బాడి యగ్నిష్టోమాతిరాత్రఫలంబు వడయుదురు; దుర్వాసునకు విష్ణుదేవుండు వరం బిచ్చుటంజేసి వరదానం బనంబరఁగిన తీర్థం బాడియు, సరస్వతీసాగరసంగమం బాడియు గోసహస్రదాన ఫలంబు వడయుదురు. 251**

**ప్రతిపదార్థం:** మఱి= ఇక; పింగంబు+అను= పింగము అనే; తీర్థంబు, సేవించి= పుణ్యక్షేత్రాన్ని దర్శించి; శత, కపిల, గోదాన, ఫలంబు= నూరు కపిలగోవులను దానంచేసిన పుణ్యాన్ని; పడయుదురు= పొందగలరు; ఎందు+ఏనిన్= ఎచటనైనను; అగ్నిదేవుండు= అగ్నిహోత్రుడు; ప్రత్యక్షంబు+ఐ= సాక్షాత్కరించి; ఉండు+అట్టి= కనిపించేటి; ప్రభాస, తీర్థంబు+ఆడి= ప్రభాసతీర్థంలో క్రుంకులిడి; అగ్నిష్టోమ+అతిరాత్ర, ఫలంబు= అగ్నిష్టోమం, అతిరాత్రం చేసినపుణ్యం; పడయుదురు= పొందుతారు; దుర్వాసునకు= దుర్వాసుడనే మునికి; విష్ణుదేవుండు= విష్ణుదేవుడు; వరంబు+ఇచ్చుటన్+చేసి= వరం ఇవ్వటంవలన; వరదానంబు+ అనన్+పరఁగిన= వరదానమనే పేరుతో విలసిల్లిన; తీర్థంబు+ఆడియు= తీర్థంలో స్నానం చేయు; సరస్వతీ, సాగర సంగమంబు+ఆడియు= సరస్వతీనది సాగరాన్ని చేరేచోటులో స్నానంచేసియు; గో, సహస్ర, దాన, ఫలంబు= వేయి ఆవులను దానంచేసిన పుణ్యాన్ని; పడయుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** పింగం అనేతీర్థాన్ని సేవిస్తే నూరుకపిలగోవులను దానంచేసిన పుణ్యం కలుగుతుంది. అగ్నిహోత్రుడు సాక్షాత్కరించి ఉన్న ప్రభాసతీర్థంలో స్నానమాడితే అగ్నిష్టోమం, అతిరాత్రం అనేయజ్ఞాలు చేసినపుణ్యం సంక్రమిస్తుంది. విష్ణుదేవుడు దుర్వాసుడికి వరమివ్వటంవల్ల 'వరదాన' మని పేరొందిన వరదానతీర్థంలో స్నానమాడితే, మరియు సరస్వతీనది సముద్రంలో కలిసేచోటులో స్నానంచేస్తే వేయిగోవులు దానం చేస్తే వచ్చేపుణ్యం సంప్రాప్తిస్తుంది.

**క. ద్వారవతీపురమునఁ బిం । డారక మను తీర్థమును బెడంగై ముద్రా**
**కారంబులై త్రిశూలా । కారములై పంకజములు గానంగఁబడున్. 252**

**ప్రతిపదార్థం:** ద్వారవతీ, పురమునన్= ద్వారవతీపట్టణంలో; పిండారకము+అను, తీర్థమున; బెడంగు+ఐ= శోభిల్లేవై; ముద్రా+ఆకారంబులు+ఐ= ఉంగరంవంటి ఆకృతి కలవై; త్రిశూల+ఆకారములు+ఐ= త్రిశూలంవంటి రూపాలుకలవై; పంకజములు= పద్మాలు; (పంక, జ, ములు= బురదనుండి పుట్టినవి, పద్మాలు); కానంగన్+పడున్= కనిపిస్తాయి.

**తాత్పర్యం:** ద్వారవతీపురంలో పిండారకమనే తీర్థంలో ఉంగరాల ఆకృతిలో, త్రిశూలాలరూపంలో శోభిల్లే పద్మాలు కనిపిస్తాయి.

**వ. అందుఁ బరమేశ్వరుం బూజించి పాపవిముక్తు లగుదురు; సాగర సింధు సంగమ స్నాతులైనవారు వరుణలోక గతు లగుదురు; శంకుకర్ణేశ్వరంబున నీశ్వరుం బూజించి దశాశ్వమేధ ఫలప్రాప్తు లగుదురు; వసుధారయును వసుసరంబు నను తీర్థంబు లాడి వసుప్రాప్తు లగుదురు; సింధూత్తమస్నానంబున బహుసువర్ణదానఫలం బగు; బ్రహ్మతుంగసేవనంబున బ్రహ్మలోకప్రాప్తి యగు; శక్రకుమారీ విలోకనంబున శక్రలోకగతి యగు; శ్రీ కుండంబునఁ బితామహునకు నమస్కరించియు, సౌవర్ణరాజితంబులైన మత్స్యంబులు గల విమలం బను తీర్థంబాడియు వాసవసాయుజ్యంబు వడయుదురు; బడబ యను తీర్థంబున నగ్నిదేవునకు నైవేద్యం బిచ్చిన నది యక్షయంబై పితృదేవతలకుఁ దృప్తిఁ జేయు, గోసహస్ర దానంబునకు నశ్వమేధ సహస్రంబునకు విశేషంబు. 253**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ పిండారక తీర్థంలో; పరమ+ఈశ్వరున్= పరమశివుడిని; పూజించి= అర్చించి; పాప, విముక్తులు+ అగుదురు= పాపంనుండి విముక్తులు అవుతారు; సాగర, సింధు, సంగమ, స్నాతులు+ఐనవారు= సింధునది సముద్రంలో కలిసేచోట స్నానం చేసినవారు; వరుణ, లోక, గతులు+అగుదురు= వరుణలోకానికి వెళ్ళుతారు; శంకు, కర్ణ+ఈశ్వరంబునన్= శంకుకర్ణేశ్వరక్షేత్రంలో; ఈశ్వరున్= ఈశ్వరుడిని; పూజించి= అర్చించి; దశ+అశ్వమేధ, ఫల, ప్రాప్తులు= పది అశ్వమేధాలు చేసిన పుణ్యాన్ని పొందినవారు; అగుదురు= అవుతారు; వసుధారయును= వసుధార అనే తీర్థంలో; వసుసరంబున్= వసుసరం; అను= అనబడే; తీర్థంబులు+ఆడి= ఈ తీర్థాలలో స్నానంచేసి; వసుప్రాప్తులు= ధనం సంపాదించేవారు; అగుదురు= అవుతారు; సింధు+ఉత్తమ, స్నానంబునన్= సింధూత్తమ తీర్థంలో స్నానంచేస్తే; బహు, సువర్ణ, దాన, ఫలంబు+అగు= పెక్కు బంగారునాణేలు దానంచేసిన పుణ్యం లభిస్తుంది; బ్రహ్మతుంగ, సేవనంబునన్= బ్రహ్మతుంగయాత్ర చేస్తే; బ్రహ్మలోక, ప్రాప్తి+అగున్= బ్రహ్మలోకం ప్రాప్తిస్తుంది; శక్రకుమారీ, విలోకనంబునన్= శక్రకుమారిని సందర్శించటంవలన; శక్రలోక, గతి+అగున్= స్వర్గలోకం చేరగలుగుతారు; శ్రీకుండంబునన్= శ్రీకుండ క్షేత్రంలో; పితామహునకు= బ్రహ్మదేవుడికి; నమస్కరించియు= వందనమాచరిస్తే; సౌవర్ణ, రాజితంబులు+ఐన= బంగారువన్నెతో శోభిల్లే; మత్స్యంబులు+కల= చేపలు గల; విమలంబు+అను= విమలం అనే; తీర్థంబు+ఆడియు= తీర్థస్నానం చేసినా; వాసవ, సాయుజ్యంబు= దేవేంద్రుడిలో లీనమవటం; పడయుదురు= పొందుతారు; బడబ+అను, తీర్థంబునన్; అగ్నిదేవునకు= అగ్నిహోత్రుడికి; నైవేద్యంబు+ఇచ్చినన్= నివేదన సలిపితే; అది= ఆ పుణ్యం; అక్షయంబు+ఐ= తరుగనట్టిదై; పితృదేవతలకున్= పితరులకు; తృప్తిన్+చేయున్= తనివి కలిగిస్తుంది; (అది); గో, సహస్ర, దానంబునకున్= వేయి ఆవులను దానంచేయటంకంటె; అశ్వమేధ సహస్రంబునకున్= వేయి అశ్వమేధయాగాలకంటె; విశేషంబు= గొప్పది.

**తాత్పర్యం:** ఆ పిండారకతీర్థంలో పరమశివుడిని పూజించి పాపంనుండి తొలగుతారు. సింధునది సముద్రంలో కలిసేచోట స్నానంచేస్తే వరుణలోకాన్ని సంపాదిస్తారు. శంకుకర్ణేశ్వరంలో శివుడిని అర్చిస్తే పది అశ్వమేధయాగాలు

చేసిన పుణ్యం లభిస్తుంది. వసుధార, వసుసరం అనే పుణ్యతీర్థాలలో స్నానమాడితే ధనలాభం కలుగుతుంది. సింధూత్తమతీర్థంలో స్నానంచేస్తే బహుసువర్ణదానఫలం లభిస్తుంది. బ్రహ్మతుంగ తీర్థసేవలవలన సత్యలోకం సిద్ధిస్తుంది. శక్రకుమారీ క్షేత్రయాత్రవలన స్వర్గం లభిస్తుంది. శ్రీకుండంలో బ్రహ్మదేవుడికి నమస్కరిస్తే, బంగారుచేపలు గల విమలతీర్థంలో స్నానంచేస్తే, దేవేంద్రుడితో కలయిక లభిస్తుంది. బడబ అనే తీర్థంలో అగ్నిదేవుడికి నివేదన చేస్తే ఆ పుణ్యం తరుగనిదై పితరులకు సంతృప్తి కలిగిస్తుంది. అది వేయి ఆవులను దానంచేస్తే వచ్చే పుణ్యంకంటె, వేయి అశ్వమేధయాగాలు సల్పిన పుణ్యంకంటె గొప్పది.

**క. దేవిక యను తీర్థంబున । దేవసమూహంబుతోడఁ ద్రినయనుఁ డుండున్;**
**సేవితమై జనులకు నది । గావించు ననూనధర్మకామార్థంబుల్. 254**

**ప్రతిపదార్థం:** దేవిక, అను, తీర్థంబునన్= దేవిక అనే పుణ్యనదీ తీర్థంలో; దేవ సమూహంబుతోడన్= దేవతలందరితో కలిసి; త్రినయనుఁడు= ముక్కంటి (శివుడు); ఉండున్= నివసిస్తాడు; అది= ఆ దేవికాతీర్థం; జనులకున్= ప్రజలకు; సేవితము+ఐ= సేవించబడిందై; అనూన, ధర్మ, కామ+అర్థంబుల్= గొప్పవైన ధర్మపురుషార్థాన్ని, కామపురుషార్థాన్ని, అర్థపురుషార్థాన్ని; కావించున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** దేవిక అనే పుణ్యక్షేత్రంలో ముక్కంటి దేవగణాలతోపాటు నివసిస్తాడు. ఆ క్షేత్ర సందర్శనంవలన ప్రజలకు సాటిలేని ధర్మపురుషార్థం, కామపురుషార్థం, అర్థ పురుషార్థం సంప్రాప్తిస్తాయి.

**వ. అర్ధయోజన విస్తృతంబై పంచయోజనాయామంబైన యద్దేవికానదియును, గామాఖ్యంబును, రుద్రతీర్థంబును, యజన యాజన బ్రహ్మ వాలుకంబులును, బ్రహ్మాది దేవతల దీర్ఘ సత్రస్థానంబైన దీర్ఘసత్రంబును సేవించినవారికి నిష్టసిద్ధి యగు; వినశనంబను తీర్థంబున నదృశ్యంబై మేరువునకుం బోవు నెడ నాగోద్భేద, శివోద్భేద, చమసోద్భేదంబుల నెందేని సరస్వతి గానం బడియె నట్టి సరస్వతియందు నభిషిక్తులైనవారు నాగలోకంబు వడయుదురు; శశరూప పుష్కరంబులు గల శశయానం బను తీర్థంబున స్నానంబును గోసహస్రదానంబును సమంబు. 255**

**ప్రతిపదార్థం:** అర్ధయోజన, విస్తృతంబు+ఐ= సగం ఆమడమేర విస్తరించి; పంచ, యోజన+ఆయామంబు+ఐన= అయిదు ఆమడల నిడివిగల; ఆ+దేవికానదియును; కామ+ఆఖ్యంబును= కామం అనే పేరుగల తీర్థంబును; రుద్రతీర్థంబును; యజన, యాజన, బ్రహ్మ, వాలుకంబులును= యజ్ఞాలు చేయటం, యజ్ఞాలు చేయించటం సదా జరుగుతుండే బ్రహ్మవాలుక తీర్థాలును; బ్రహ్మ+ఆది, దేవతల= బ్రహ్మమున్నగు దేవతలకు; దీర్ఘ సత్రస్థానంబు+ఐన= దీర్ఘ సత్రయాగం చేయటానికి స్థానమైన; దీర్ఘ సత్రంబును= దీర్ఘ సత్రమనేతీర్థాన్ని; సేవించినవారికిన్= దర్శించిన వారికి; ఇష్టసిద్ధి+అగు= కోరిన కోరికలు నెరవేరుతాయి; వినశనంబు+అను= వినశనం అనే; తీర్థంబునన్= పుణ్యక్షేత్రంలో; అదృశ్యంబు+ఐ= కనిపించనట్టిదై; మేరువునకున్+పోవు+ఎడన్= మేరుపర్వతానికి పోయేదారిలో గల; నాగోద్భేద, శివోద్భేద, చమసోద్భేదంబులన్= నాగోద్భేదం, శివోద్భేదం, చమసోద్భేదం అనే తీర్థాలలో; ఎందు+ఏని= ఎందులోనైతే; సరస్వతి కానంబడియెన్= సరస్వతి కనబడినదో; అట్టి సరస్వతి+అందున్= ఆ సరస్వతీనదిలో; అభిషిక్తులు+ఐనవారు= స్నానంచేసినవారు; నాగ, లోకంబు= నాగలోకాన్ని; పడయుదురు= పొందుతారు; శశరూప, పుష్కరంబులు+కల= కుందేలు ఆకారంగల పద్మాలు ఉండే; శశయానంబు+అను తీర్థంబున= శశయానమనే పుణ్యక్షేత్రంలో; స్నానంబును= స్నానంచేయటమున్నూ; గో సహస్రదానంబును= వేయి ఆవులను దానం చేయటమున్నూ; సమంబు= సమానం.

**తాత్పర్యం:** ఆమడలో సగం విస్తరించి, అయిదు ఆమడల నిడివి కల ఆ దేవికానదిని, మఱియు కామం అనే పేరున్న పుణ్యక్షేత్రాన్ని, రుద్రతీర్థాన్ని, యజ్ఞాలు చేయటానికి, చేయించటానికి అనువైన బ్రహ్మావాలుకాన్ని, బ్రహ్మాది దేవతలు దీర్ఘసత్రమనే యజ్ఞం చేసినచోటయిన దీర్ఘసత్రాన్ని సేవించినవారికి కోరినకోరికలు ఈడేరుతాయి. వినశనం అనే తీర్థంలో కనిపించకుండ పోయిన సరస్వతీనది, మేరువుకు వెళ్ళేమార్గంలో ఉండే నాగోద్భేదం, శివోద్భేదం. చమసోద్భేదం అనే పుణ్యతీర్థాలలో ఎక్కడ కనబడుతుందో అటువంటి సరస్వతీనదిలో స్నానం చేసినవారు నాగలోకానికి వెళ్లుతారు. కుందేటి ఆకారంకల పద్మాలుండే శశయానం అనేతీర్థంలో చేసే స్నానం వేయిగోవులను దానంచేయటంతో సమానం.

**మధ్యాక్కర.**

> **ఏ మేమ మున్ను పూజింపుదుము రుద్రు నిం దని వేడ్క**
> **తో మునికోటి దారున్న, నీశుఁ డందొఱకును బ్రీతి**
> **గా మతిలోఁ గోటిరుద్రరూపముల్ గావించె నదియు**
> **భూమిఁ బ్రసిద్ధమై రుద్రకోటి నాఁ బొలిచి వెలింగె. 256**

**ప్రతిపదార్థం:** ఏము+ఏము+అ= మేము మేమే; ఇందు= ఇచట; మున్ను= ముందుగా; రుద్రున్= శివుడిని; పూజింపుదుము= అర్చిస్తాం; అని= అంటూ; వేడ్కన్= కుతూహలంతో; మునికోటి= ఋషుల సముదాయం; తారు+ఉన్న= తామందరును ఉంటే; ఈశుఁడు= శివుడు; అందొఱకును= అందరికిని; ప్రీతిగా= సంతోషం కలిగేటట్లుగా; మతిలోన్= సంకల్పంలో; కోటిరుద్ర, రూపముల్ కావించెన్= నూరులక్షల శివాకృతులను ఏర్పరచాడు; అదియు= ఆ చోటు; భూమిన్= భూమిలో; ప్రసిద్ధము+ఐ= ప్రఖ్యాతిని ఆర్జించి; రుద్రకోటి, నాన్= రుద్రకోటి అనబడుతూ; పొలిచి, వెలింగెన్= సొగసుగా శోభిల్లింది.

**తాత్పర్యం:** 'ఇక్కడ మేమే ముందు శివుడిని అర్చిస్తాం; కాదు, మేమే ముందు శివుడిని పూజిస్తాం'- అని పెక్కుమంది మహర్షులు కుతూహలంతో ఉండగా, శివుడు అందరికీ సంతోషం కలిగించటానికై కోటి రుద్రరూపాలలో ఆవిర్భవించాడు. ఆ దివ్యక్షేత్రం భూమిపై 'రుద్రకోటి' అనే పేరుతో ప్రసిద్ధికెక్కి ప్రకాశించింది.

**విశేషం:** వృత్తలక్షణానికి ఈ ఆశ్వాసంలోని 22వ పద్యం విశేషవ్యాఖ్య చూడండి.

**వ. అందు రుద్రుఁ బూజసేసి రుద్రలోకప్రాప్తు లగుదురు. 257**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ రుద్రకోటితీర్థంలో; రుద్రున్= శివుడిని; పూజచేసి= అర్చించి; రుద్రలోక, ప్రాప్తులు+అగుదురు= శివుడిలోకమైన కైలాసాన్ని పొందుతారు.

**తాత్పర్యం:** అక్కడ రుద్రుడిని అర్చించినవారు శివలోకమైన కైలాసాన్ని పొందుతారు.

**క. నరనుత! నైమిశమునఁ బు । ష్కరముల మూఁటను జగత్ప్రకాశితమై యి**
**ద్ధరణిఁ గురుక్షేత్రము దు । స్తరదురితౌఘముల కెల్ల దవ్వగుచుండున్. 258**

**ప్రతిపదార్థం:** నర, నుత!= నరులచేత పొగడబడినవాడా!; ఈ+ధరణిన్= ఈ భూలోకంలో; కురుక్షేత్రము= కురుక్షేత్రమనే ప్రదేశం; నైమిశమునన్= నైమిశమనే పుణతీర్థం చేత; పుష్కరముల, మూఁటను= పుష్కరత్రయ తీర్థాలచేత; జగత్+ప్రకాశితము+ఐ=

ప్రపంచంలో మిక్కిలి ప్రసిద్ధమై; దుస్తర, దురిత+ఓఘములకు+ఎల్ల= దాట శక్యంకాని పాపాల సమూహాలకు అన్నిటికీ; దవ్వు= దూరం; అగుచుండున్= అవుతుంటుంది.

**తాత్పర్యం:** నరనుతుడవైనవాడా! ఈ లోకంలో కురుక్షేత్రం- నైమిశతీర్థం, పుష్కరత్రయం - అనే పుణ్యక్షేత్రాల చేత ప్రపంచప్రసిద్ధమై దాటరాని పాపసంఘాలన్నింటికి సుదూరంగా విలసిల్లుతూ ఉంటుంది.

**విశేషం:** కురుక్షేత్రం అనేక పుణ్యతీర్థాలకు ఉనికిపట్టైన 'పుణ్యభూమి' - అని ఇందువలన వెల్లడౌతున్నది.

**తే.** **అమరలోకనివాసుల యండ్రు విబుధు । లా కురుక్షేత్రవాసుల; నదియు వినఁగ**
**నుత్తమంబు దృషద్వతి యుత్తరమునఁ । దపనతేజ! సరస్వతి దక్షిణమున. 259**

**ప్రతిపదార్థం:** తపనతేజ!= సూర్యతేజస్సు వంటి తేజస్సు కలవాడా!; విబుధులు= జ్ఞానులు; ఆ, కురుక్షేత్ర నివాసులన్= ఆ కురుక్షేత్రప్రజలను; అమరలోక, నివాసులు+అ+అండ్రు= స్వర్గలోకంలో నివసించేవారే అని అంటారు; అదియు= ఆ కురుక్షేత్రమును; దృషద్వతి+ఉత్తరమునన్= దృషద్వతి అనే నదికి ఉత్తరదిక్కున; సరస్వతీ= సరస్వతీనదికి; దక్షిణమునన్= దక్షిణదిక్కులో; వినఁగన్= వినటానికి; ఉత్తమంబు= శ్రేష్ఠమైనది.

**తాత్పర్యం:** సూర్యతేజంవంటి తేజం కలవాడా! ఆ కురుక్షేత్రంలో నివసించే ప్రజలు స్వర్గలోకనివాసులే అని జ్ఞానుల మాట. సరస్వతీనదికి దక్షిణదిశలోను దృషద్వతీనదికి ఉత్తరదిక్కునను ఉత్తమంగా విలసిల్లుతూఉన్న ఆ కురుక్షేత్రంయొక్క మహిమ వీనులకు విందు చేస్తుంటుంది.

**వ.** **అక్కురుక్షేత్రశమంత పంచకంబుల నడుమ రామహ్రదంబు నడుమఁ బితామహు నుత్తరవేది యనంబడునట్టి కురుక్షేత్రంబు ముట్టిన వారికిఁ, గురుక్షేత్రంబునకుం బోయెద మనిన వారికిఁ, గురుక్షేత్రంబున వసియించెదమని తలంచినవారికి సర్వపాపక్షయం బగుఁ; దదనంతరంబున విష్ణుస్థానంబున విష్ణువు నర్చించిన నశ్వమేధ ఫలం బగుఁ; బారిప్లవం బను తీర్థమాడి యగ్నిష్టోమఫలంబు వడయుదురు; పృథివీతీర్థం బాడిన గోసహస్ర దానఫలం బగు; శాలూకిని యను తీర్థం బాడిన దశాశ్వమేధ ఫలం బగు; సర్పతీర్థం బాడి యందుఁ దరండకుం డను ద్వారపాలకునిం జూచినవారి కిష్టసిద్ధి యగు; నెందేని విష్ణుం డాదివరాహం బయ్యె నట్టి వరాహతీర్థం బాడినవారికి నగ్నిష్టోమ ఫలంబగు; నశ్వినీతీర్థం బాడిన రూపవంతు లగుదురు; జయంతి యందు సోమతీర్థ స్నానంబును, గృతశౌచతీర్థస్నానంబును రాజసూయ పౌండరీక సమంబు; లగ్నివటంబున, ముంజవటంబున నీశ్వరుం బూజించి గాణపత్యంబు వడయుదురు; యక్షిణీతీర్థమాడి యిష్టఫలంబులు వడయుదురు; కురుక్షేత్ర ద్వారంబుఁ బ్రదక్షిణంబు సేసినం బాపక్షయం బగు. 260**

**ప్రతిపదార్థం:** ఆ+కురుక్షేత్ర, శమంత పంచకంబుల నడుమన్= ఆ కురుక్షేత్రంలో ఉండే శమంత పంచకాలు అనే సరస్సులకు నడుమగల; రామహ్రదంబు నడుమన్= రామహ్రదం అనే సరస్సుకు మధ్య; పితామహు+ఉత్తరవేది+అనంబడు+అట్టి= బ్రహ్మదేవుడియొక్క ఉత్తరవేది అనబడే; కురుక్షేత్రంబు= కురుక్షేత్రాన్ని; ముట్టినవారికిన్= స్పృశించినవారికి; కురుక్షేత్రంబున కున్+పోయెదము+అనిన వారికిన్= కురుక్షేత్రానికి పోతామనే వారికిన్నీ; కురుక్షేత్రంబునన్= కురుక్షేత్రంలో; వసియించెదము+అని= నివసిస్తామని; తలంచినవారికి= భావించినవారికి; సర్వపాపక్షయంబు+అగున్= సమస్తపాపాలు నశిస్తాయి; తద్+అనంతరంబునన్=

అటుపిమ్మట; విష్ణుస్థానంబునన్= విష్ణువు ఉండేచోటున; విష్ణువును+అర్చించినన్= విష్ణుదేవుడిని ఆరాధిస్తే; అశ్వమేధ, ఫలంబు+అగున్= అశ్వమేధం చేసిన పుణ్యం లభిస్తుంది; పారిప్లవంబు+అను, తీర్థము+ఆడి= పారిప్లవం అనే తీర్థంలో స్నానంచేస్తే; అగ్నిష్టోమ, ఫలంబు= అగ్నిష్టోమం అనేయజ్ఞం చేసినపుణ్యం; పడయుదురు= పొందుతారు; పృథివీ, తీర్థంబు+ఆడినన్= పృథివీతీర్థంలో స్నానంచేస్తే; గో, సహస్ర, దాన, ఫలంబు+అగున్= వేయిఆవులను దానంచేసిన పుణ్యం దక్కుతుంది; శాలూకిని+అను, తీర్థంబు+ఆడినన్= శాలూకిని అనేతీర్థంలో స్నానంచేస్తే; దశ+అశ్వమేధ, ఫలంబు+అగు= పది అశ్వమేధయాగాలు చేసిన పుణ్యం వస్తుంది; సర్పతీర్థంబు+ఆడి= సర్పతీర్థంలో స్నానంచేసి; అందున్= అచట ఉండే; తరండకుండు+అను= తరండకుడు అనే; ద్వారపాలకునిన్+చూచిన వారికి= ద్వారబంధాన్ని కావలా కాస్తున్న భటుడి విగ్రహాన్ని సందర్శించిన వారికి; ఇష్ట, సిద్ధి+అగున్= కోరినకోరికలు నెరవేరుతాయి; ఎందు+ఏనిన్= ఏ స్థలంలోనైతే; విష్ణుండు= విష్ణుదేవుడు; ఆది, వరాహంబు+అయ్యెన్= మొదటి వరాహఅవతారం ఎత్తాడో; అట్టి= అటువంటి; వరాహతీర్థంబు+ఆడిన వారికిన్= ఆ వరాహతీర్థంలో స్నానంచేసినవారికి; అగ్నిష్టోమ, ఫలంబు+అగున్= అగ్నిష్టోమయాగం చేసిన పుణ్యం లభిస్తుంది; అశ్వినీ తీర్థంబు+అడిన= అశ్వినీతీర్థంలో స్నానంచేస్తే; రూపవంతులు+అగుదురు= అందంగల ఆకృతి కలవారు అవుతారు; జయంతి+అందు= జయంతి అనే ప్రదేశంలో ఉండే; సోమతీర్థస్నానంబును= సోమతీర్థంలో స్నానంచేయటమున్నూ; కృతశౌచతీర్థస్నానంబును= కృతశౌచమనే తీర్థంలో స్నానం చేయటమున్నూ; రాజసూయ, పౌండరీక సమంబులు= రాజసూయయాగంతో, పౌండరీక యాగంతో సమానాలు; అగ్నివటంబునన్= అగ్నివటతీర్థంలో; ముంజవటంబునన్= ముంజవటమనే తీర్థంలో; ఈశ్వరున్+ పూజించి= శివుడిని అర్చించి; గాణపత్యంబు= గణాలపై ఆధిపత్యాన్ని; పడయుదురు= పొందగలరు; యక్షిణీతీర్థము+ ఆడి= యక్షిణీతీర్థంలో స్నానం చేసి; ఇష్టఫలంబులు+పడయుదురు= కోరిన కోరికలు పొందుతారు; కురుక్షేత్రద్వారంబున్= కురుక్షేత్రాన్ని ప్రవేశించే స్థలంలో కల ద్వారాన్ని; ప్రదక్షిణంబు+చేసినన్= ఎడమనుండి కుడివైపునకు భక్తిభావంతో చుట్టుతిరిగితే; పాప, క్షయంబు+అగు= పాపాలు నశిస్తాయి.

**తాత్పర్యం:** ఆ కురుక్షేత్రంలో ఉండే శమంతపంచకాల నడుమగల, రామహ్రదం అనే సరస్సు మధ్య బ్రహ్మదేవుడి ఉత్తరవేది ఉన్నది. అటువంటి కురుక్షేత్రాన్ని స్పృశించినవారికిన్నీ, కురుక్షేత్రానికి పోవాలని తలపోసినవారికిన్నీ, కురుక్షేత్రంలో నివసిస్తామని ఆలోచించినవారికిన్నీ సర్వపాపాలు నశిస్తాయి. అటుపిమ్మట విష్ణుస్థానంలో విష్ణుమూర్తిని అర్చిస్తే అశ్వమేధం చేసిన పుణ్యం లభిస్తుంది. పారిప్లవ తీర్థంలో స్నానంచేసినవారు అగ్నిష్టోమయాగం చేసిన పుణ్యం పొందుతారు. పృథివీతీర్థంలో స్నానంచేస్తే వేయిఆవులను దానంచేసిన పుణ్యం లభిస్తుంది. శాలూకిని అనే పుణ్యతీర్థంలో స్నానమాడితే పది అశ్వమేధయాగాల పుణ్యం లభిస్తుంది. సర్పతీర్థంలో స్నానంచేసి అక్కడ ఉండే తరండకుడు అనే ద్వారపాలకుడిని దర్శించిన వారికి కోరినకోరికలు ఈడేరుతాయి. ఎచట విష్ణుదేవుడు ఆదివరాహంగా అవతరించాడో అటువంటి వరాహతీర్థంలో స్నానం చేసినవారికి అగ్నిష్టోమయాగం చేసిన పుణ్యం లభిస్తుంది. అశ్వినీతీర్థంలో స్నానంచేసినవారికి అందమైన రూపాలు ఏర్పడుతాయి. జయంతిలో ఉండే సోమతీర్థంలో స్నానం చేస్తే రాజసూయ యాగం చేసినట్లే; కృతశౌచతీర్థంలో స్నానం చేస్తే పౌండరీకయజ్ఞం చేసినట్లే. అగ్నివటక్షేత్రంలో, ముంజవటక్షేత్రంలో శివుడిని ఆరాధిస్తే గణాలపై ఆధిపత్యం లభిస్తుంది. యక్షిణీతీర్థంలో స్నానంచేస్తే కోరినకోరికలు ఈడేరగలవు. కురుక్షేత్రంలో ఉండే ప్రవేశద్వారానికి ప్రదక్షిణం చేస్తే పాపాలు నశిస్తాయి.

**క. వీరుండు క్షత్త్రియులఁ దన । దారుణ పరశువున జామదగ్న్యుఁడు రౌద్రా**
**కారుఁడు వధియించి తదీ । యారుణమున నేనుమడువు లాపాదించెన్. 261**

**ప్రతిపదార్థం:** వీరుండు= పరాక్రమం కలవాడు: రౌద్ర+ఆకారుఁడు= కోపంతో కూడిన భయంకరమైన ఆకృతి కలవాడు; జామదగ్న్యుఁడు= జమదగ్ని మహాముని కొడుకైన పరశురాముడు; క్షత్త్రియులన్= రాచకొలంవారిని; తన, దారుణ, పరశువునన్=

భయానకమైన తన గండ్రగొడ్డలిచేత; వధియించి= చంపి; తదీయ+అరుణమునన్= తత్ సంబంధితమైన నెత్తురుచేత; ఏను మడువులు= ఐదు (కొలనులు) సరస్సులు; ఆపాదించెన్= కల్పించాడు.

**తాత్పర్యం:** జమదగ్నిమహాముని పుత్రుడైన పరశురాముడు వీరుడు, భయంకరాకారుడు అయి, గండ్రగొడ్డలి ధరించి రాచకొలంవారినందరిని సంహరించి వారిరక్తంతో ఐదు మడుగులు కల్పించాడు.

**వ. అందుఁ బితృతర్పణంబు సేసినం బితృదేవత లాతనికిం బ్రత్యక్షంబయి 'నీ కిష్టంబైన వరంబు వేఁడు' మనినఁ బరశురాముండు వారల కిట్లనియె. 262**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ శమంతపంచకంలో; పితృ తర్పణంబు+చేసినన్= పితృదేవతలకు శ్రాద్ధకర్మలలో విడిచే నివాపాంజలి విడిస్తే; పితృదేవతలు= పితరులు; ఆతనికిన్= ఆ పరశురాముడికి; ప్రత్యక్షంబు+అయి= సాక్షాత్కరించి; నీకు+ఇష్టంబు+ఐన= నీకు ఇష్టమైన; వరంబు= కోరిక; వేడుము+అనినన్= కోరుకొమ్ము- అని అడుగగా; పరశురాముండు= పరశురాముడు; వారలకు= ఆ పితరులతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ శమంతపంచకమనే సరస్సులలో పితరులకు తర్పణాలు విడువగా పితృదేవతలు పరశురామునికి ప్రత్యక్షమై, నీకు ఇష్టమైన వరం కోరుకొనుమని అడుగగా, అతడు ఈ విధంగా అన్నాడు.

**తే. 'క్షత్రవధనైన పాపంబు గ్రాఁగవలయుఁ; । గడఁగి సద్గతియును నాకుఁ బడయవలయు;**
**నివియుఁ బుణ్యతీర్థంబులై యుద్ధరిత్రిఁ । బరఁగుచుండంగవలయు మీ కరుణఁ జేసి.' 263**

**ప్రతిపదార్థం:** మీ కరుణన్+చేసి= మీ దయవలన; క్షత్రవధన్+ఐన, పాపంబు= రాచకొలంవారిని సంహరించటంచేత సంక్రమించిన పాపం; క్రాఁగవలయున్= నశించాలి; కడఁగి= పూని; నాకున్= నాకు; సత్+గతియును= మంచిస్థానాన్ని- అంటే పుణ్యంవలన లభించే స్థానం; పడయవలయున్= లభించాలి; ఇవియున్= ఈ శమంతపంచకం అనే మడుగులు; పుణ్య, తీర్థంబులు+ఐ= పుణ్యం ఇచ్చేతీర్థాలై; ఈ ధరిత్రిన్= ఈ భూమిపై; పరఁగుచుండంగవలయున్= శోభిల్లుతూ ఉండాలి.

**తాత్పర్యం:** 'రాచకొలంవారిని సంహరించటంచేత నాకు సంక్రమించిన పాపం నశించాలి. నాకు పుణ్యలోకప్రాప్తి కలగాలి. ఈ శమంతపంచకాలనే సరస్సులు, ఈ భూలోకంలో పరమ పవిత్రతీర్థాలుగా శోభిల్లాలి. మీరు దయచేసి నాకు ఈ వరం ప్రసాదించ ప్రార్థన.'

**వ. అని పితృదేవతల వరంబునం బుణ్యతీర్థంబులఁ జేసె; నట్టి రామహ్రదంబు లాడినవారికి నశ్వమేధ ఫలంబగుఁ; గాయశోధనం బను తీర్థం బాడి కాయశుద్ధు లగుదు; రెందేని విష్ణుదేవుండు లోకంబుల నుద్ధరించె నట్టి లోకోద్ధారం బను తీర్థమాడి కులం బుద్ధరింతురు; శ్రీతీర్థం బాడి శ్రీమంతు లగుదురు; కపిలతీర్థం బాడి కపిల గో సహస్ర దాన ఫలంబుఁ బడయుదురు; సూర్యతీర్థం బాడి యం దుపవసించిన సూర్యలోక ప్రాప్తులగుదురు; గో భవనంబను తీర్థంబాడి గోసహస్రసమృద్ధు లగుదురు; శంఖినీ తీర్థంబాడి యుత్తమరూపంబు వడయుదురు; యక్షేంద్ర తీర్థం బాడి తరండకుం డను ద్వారపాలకుం జూచినవారు సరస్వతీ స్నాతులైనవారు నగ్నిష్టోమఫలంబు వడయుదురు; మాతృతీర్థ దర్శనంబునం బ్రజావృద్ధి యగు; బ్రహ్మావర్తంబును, శరవణంబునుం జూచిన, సర్వవ్యాధి విముక్తు లగుదురు; శ్వావిల్లోమాపహం బను**

**తీర్థంబునం దేకాదశతీర్థంబులు గల; వందుఁ బ్రాణాయామంబు సేసిన విప్రులకు స్వలోమాపనయనం బగు; నెఱుకుచేత నేయంబడి కృష్ణమృగంబు లెందేని నొక్కతీర్థంబు సొచ్చి మానుషత్వంబు వడసె నట్టి మానుష తీర్థం బాడి సర్వదురిత విముక్తులై దేవత్వంబు వడయుదురు; దాని తూర్పున నొక్కయిరవున నాపగ యను మహానదిం బితృతర్పణంబు సేసి పితృదేవోద్దేశంబున నొక్కబ్రాహ్మణునకుం గుడువం బెట్టినఁ గోటిబ్రాహ్మణులు గుడిచిన ఫలంబగుఁ, బితృదేవతలు దృప్తియు నొందుదురు; బ్రహ్మోదుంబరంబు సప్తర్షి కుండంబుఁ గేదారంబును జూచి బ్రహ్మలోకంబు వడయుదురు; కపిల కేదారంబుఁ జూచి పాపవిముక్తులై యదృశ్యు లగుదురు; సరకం బను తీర్థంబాడి కృష్ణచతుర్దశి నాఁ డీశ్వరుం బూజించి యెల్ల కోర్కులం బడయుదురు; మూఁడుకోట్ల కూపప్రాదంబులు గల యిలాస్పదం బను తీర్థంబాడి పితృతర్పణంబులు సేసినవారికి వాజపేయఫలం బగుఁ; గిందాన కింజప్యంబు లను తీర్థంబులందుఁ జేసిన దాన జపంబు లక్షయంబు లగు; నారదతీర్థం బైన యంబాజన్మంబునందుఁ బ్రాణత్యాగంబు సేసినవారు సర్వలోకంబులం బడయుదురు; శుక్లదశమిం బుండరీకం బను తీర్థంబాడి పౌండరీక ఫలంబు వడయుదు; రందు వైతరణీస్నాతులై రుద్రునకు నమస్కరించి సర్వపాపవిముక్తు లగుదు; రెందేని దేవత లనేకసహస్రవర్షంబులు దపంబు సేసి రట్టి ఫలకీవనం బను తీర్థంబాడి యగ్నిష్టోమాతిరాత్రఫలంబులు వడయుదురు; ద్వైపాయనుం డనేకతీర్థంబులు మిశ్రీకరించుటం జేసి మిశ్రకం బనఁబరఁగిన తీర్థం బాడినవారికి సర్వతీర్థస్నానఫలం బగు; వ్యాస వనంబును మనోజవంబును మధువటియు నను తీర్థంబుల నాడిన గో సహస్రదాన ఫలంబు వడయుదురు; కౌశికీ దృషద్వతీ సంగమంబున స్నాతులై సర్వపాప విముక్తు లగుదురు; కిందత్తంబునఁ దిలప్రస్థదానంబు సేసి పితరుల ఋణంబు నీఁ గుదు; రహస్సుదిన తీర్థంబుల నాడి సూర్యలోకప్రాప్తు లగుదురు; మృగధూమంబున గంగాస్నాతులై మహాదేవు నర్చించిన మహాత్ము లశ్వమేధ ఫలంబు వడయుదురు; వామనం బను తీర్థంబాడి వామను నర్చించినవారు విష్ణులోకప్రాప్తు లగుదురు; పావనంబను తీర్థంబాడి కులంబు పవిత్రంబు సేయుదురు; శ్రీకుంజంబున సరస్వతీ స్నాతులై యగ్నిష్టోమ ఫలంబు వడయుదురు; ఋషు లెందే నుండి యాత్రాపరులై కురుక్షేత్రంబునకుం బోదు రట్టి నైమిశకుంజం బాడి ఋషితృప్తి సేయుదురు; బ్రహ్మతీర్థం బాడి వర్ణాంతరులు బ్రాహ్మణు లగుదురు; బ్రాహ్మణులు బ్రహ్మలోక ప్రాప్తు లగుదురు. 264**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా చెప్పి; పితృదేవతల వరంబునన్= పితరులు అనుగ్రహించిన వరంచొప్పున (ఆ శమంత పంచకాలను); పుణ్యతీర్థంబులన్+చేసెన్= పుణ్యక్షేత్రాలుగా చేశాడు; అట్టి= అటువంటి; రామహ్రదంబులు+ఆడిన వారికిన్= పరశురాముడు నిర్మించిన సరస్సులలో స్నానమాడినవారికి; అశ్వమేధఫలంబు+అగున్= అశ్వమేధయాగం చేసినపుణ్యం లభిస్తుంది; కాయశోధనంబు+అను, తీర్థంబు+ఆడి= కాయశోధనం అనే పుణ్యక్షేత్రంలో స్నానంచేసి; కాయశుద్ధులు+అగుదురు= శరీర శౌచాన్ని సంపాదించినవారవుతారు; ఎందు+ఏని= ఏ స్థలమందైతే; విష్ణుదేవుండు= శ్రీమన్మహావిష్ణువు; లోకంబులన్= ప్రపంచాలను; ఉద్ధరించెన్= సంరక్షించాడో; అట్టి= అట్టిచోట ఉండే; లోకోద్ధారంబు+అను= లోకోద్ధారం అనేతీర్థంలో; తీర్థము+ఆడి= స్నానంచేసి; కులంబు+ఉద్ధరింతురు= కులానికి అభ్యున్నతి కలుగజేస్తారు; శ్రీ తీర్థంబు+ఆడి= శ్రీ తీర్థంలో స్నానంచేసి; శ్రీమంతులు+అగుదురు= సంపన్నులవుతారు; కపిలతీర్థంబు+ఆడి= కపిలతీర్థంలో స్నానంచేసి; కపిల, గో, సహస్ర, దాన, ఫలంబున్= కపిలవర్ణంకల వేయి ఆవులను దానంచేసిన పుణ్యం; పడయుదురు= పొందుతారు; సూర్యతీర్థంబు+ ఆడి= సూర్యతీర్థంలో స్నానంచేసి; అందు+ఉపవసించిన= అందులో ఉపవాసం చేస్తే; సూర్యలోక ప్రాప్తులు+అగుదురు= సూర్యలోకాన్ని

పొందుతారు; గోభవనంబు+అనుతీర్థంబు+ఆడి= గోభవనం అనే తీర్థంలో స్నానమాడితే; గో, సహస్ర, సమృద్ధులు+అగుదురు= వేయి ఆవుల సంపద కలవారు అవుతారు; శంఖినీ తీర్థంబు+ఆడి= శంఖినీతీర్థంలో స్నానంచేసి; ఉత్తమరూపంబు+పడయుదురు= మంచి ఆకృతిని పొందుతారు; యక్షేంద్ర తీర్థంబు+ఆడి= యక్షేంద్రతీర్థంలో స్నానంచేసి; తరండకుండు+అను; ద్వారపాలకున్+ చూచినవారు= ద్వారపాలకుడిని సందర్శించినవారు; సరస్వతీ, స్నాతులు+ఐనవారున్= సరస్వతీనదిలో స్నానం చేసినవారు; అగ్నిష్టోమ ఫలంబు= అగ్నిష్టోమ యాగంవలన లభించే పుణ్యం; పడయుదురు= పొందుతారు; మాతృతీర్థ, దర్శనంబునన్= మాతృతీర్థాన్ని చూడటంవలన; ప్రజావృద్ధి+అగు= సంతానలాభం కలుగుతుంది; బ్రహ్మావర్తంబును= బ్రహ్మావర్తతీర్థాన్ని; శరవణంబును= శరవణతీర్థాన్ని; చూచిన= దర్శించగా; సర్వవ్యాధి విముక్తులు+అగుదురు= సర్వరోగాలనుండి విముక్తులు అవుతారు; శ్వావిల్లోమాపహంబు+అనుతీర్థంబునందు; ఏకాదశ తీర్థంబులు= పదకొండు తీర్థాలు; కలవు; అందున్= అచట; ప్రాణాయామంబు+చేసిన, విప్రులకు= ప్రాణాయామ యోగాభ్యాసం చేసిన బ్రాహ్మణులకు; స్వలోమ+ అపనయనంబు+ అగు= తమ వెంట్రుకలు తొలగిపోతాయి- అనగా పాపాలు నశిస్తాయి; ఎఱుకుచేతన్= కిరాతకుడిచేత; ఏయంబడి= బాణంతో కొట్టబడి; కృష్ణమృగంబులు= నల్ల జింకలు; ఎందు+ఏనిన్= ఎచట; ఒక్కతీర్థంబు+చొచ్చి= ఒక పుణ్యక్షేత్రంలో ప్రవేశించి; మానుషత్వంబు= మానుష్యరూపం; పడసెన్= పొందాయో; అట్టి; మానుషతీర్థంబు+ఆడి= మానుషమనే తీర్థంలో క్రుంకులిడి; సర్వదురిత, విముక్తులు+ఐ= సమస్తమైన పాపాలనుండి తొలగినట్టివారై; దేవత్వంబు+ పడయుదురు= అటువంటి దేవత్వం పొందుతారు; దాని తూర్పునన్= ఆ మానుషతీర్థానికి తూర్పున; ఒక్క+ఇరవునన్= యుక్తమైన స్థలంలో; ఆపగ+అను, మహానదిన్= ఆపగ అనే మహానదిలో; పితృతర్పణంబు+చేసి= పితరులకు శ్రాద్ధక్రియలు చేసి; పితృదేవ+ఉద్దేశంబునన్= పితృదేవతలను ఉద్దేశించి; ఒక్క, బ్రాహ్మణునకున్= ఒక్క విప్రునకు; కుడువన్+పెట్టిన= భోజనం తినిపిస్తే; కోటిబ్రాహ్మణులు= కోటిమంది బ్రాహ్మణులు; కుడిచిన= భోజనంచేసిన; ఫలంబు+అగున్= పుణ్యం కలుగుతుంది; పితృదేవతలు= పితరులు; తృప్తియున్+ఒందుదురు= తనివి చెందుతారు; బ్రహ్మోదుంబరంబు= బ్రహ్మోదుంబరం అనేతీర్థాన్ని; సప్తర్షికుండంబున్= ఏడుగురు ఋషులగుండం (తీర్థం); కేదారంబును= కేదారాన్ని; చూచి= దర్శించి; బ్రహ్మలోకంబు+ పడయుదురు= సత్యలోకం పొందుతారు; కపిల కేదారంబున్+చూచి= కపిల కేదారమనే పుణ్యక్షేత్రాన్ని సందర్శించి; పాపవిముక్తులై= పాపంనుండి తొలగినవారై; అదృశ్యులు+అగుదురు= కనిపించనివారు కాగలరు; సరకంబు+అను, తీర్థంబు+ఆడి= సరకమనే తీర్థంలో స్నానంచేసి; కృష్ణచతుర్దశినాఁడు= కృష్ణపక్షంలోని చతుర్దశినాడు; ఈశ్వరున్+పూజించి= శివుడిని ఆరాధించి; ఎల్ల కోర్కులన్= అన్ని కోరికలను; పడయుదురు= పొందుతారు; మూఁడు, కోట్ల, కూప, హ్రదంబులు+కల= మూడుకోట్ల నూతులు కల; ఇలాస్పదంబు+అను, తీర్థంబు+ఆడి= ఇలాస్పదం అనే తీర్థంలో స్నానంచేసి; పితృ, తర్పణంబులు+ చేసినవారికి= పితరులకు శ్రాద్ధకర్మలు నిర్వర్తించినవారికి; వాజపేయ, ఫలంబు+అగున్= వాజపేయయాగం చేసిన పుణ్యం దక్కుతుంది; కిందాన, కింజప్యంబులు+అను, తీర్థంబులందున్= కిందానం, కింజప్యం అనేతీర్థాలలో; చేసిన, దాన, జపంబులు= చేసిన దానాల వలన, జపాలవలన లభించే పుణ్యాలు; అక్షయ్యంబులు+అగు= తరుగనట్టివి కాగలవు; నారద, తీర్థంబు+ఐన= నారద మహర్షి ప్రతిష్ఠించిన; అంబా జన్మంబునందున్= అంబాజన్మం అనేతీర్థంలో; ప్రాణత్యాగంబు+చేసినవారు= అసువులు వీడినవారు; సర్వలోకంబులన్+పడయుదురు= సమస్తలోకాలను పొందగలరు; శుక్లదశమిన్= శుక్లపక్షంలోని దశమినాడు; పుండరీకంబు+అను, తీర్థంబు+ఆడి= పుండరీకం అనేతీర్థంలో స్నానంచేసి; పౌండరీక ఫలంబు= పౌండరీకయజ్ఞం చేసినపుణ్యాన్ని; పడయుదురు= పొందుతారు; అందున్= అచట; వైతరణీ, స్నాతులు+ఐ= వైతరణీ నదిలో స్నానంచేసినవారై; రుద్రునకు= శివుడికి; నమస్కరించి= వందనమాచరించి; సర్వ, పాప, విముక్తులు+అగుదురు= సమస్త పాపాలనుండి తొలగుతారు; ఎందేని= ఏ స్థలంలో; దేవతలు= అమరులు; అనేక, సహస్ర, వర్షంబులు= పెక్కువేల ఏండ్లు; తపంబు చేసిరి= తపస్సు చేశారో; అట్టి= ఆ స్థలమైన; ఫలకీవనంబు+అను తీర్థంబు+ఆడి= ఫలకీవనమనే తీర్థంలో స్నానంచేసి; అగ్నిష్టోమ+అతిరాత్ర, ఫలంబులు= అగ్నిష్టోమం, అతిరాత్రం అనే యజ్ఞాలు చేసిన పుణ్యాలు; పడయుదురు= పొందుతారు; ద్వైపాయనుండు= వేదవ్యాసమహర్షి; అనేక, తీర్థంబులు= పెక్కు పుణ్యతీర్థాలను; మిశ్రీకరించుటన్+చేసి= కలపటంచేత; మిశ్రకంబు+అనన్+పరఁగిన= మిశ్రకం అని పిలువబడిన; తీర్థంబు+ఆడినవారికి= తీర్థంలో స్నానంచేసిన వారికి; సర్వ, తీర్థ, స్నాన, ఫలంబు+అగున్=

సమస్త తీర్థాలలో స్నానంచేసిన పుణ్యాలు దక్కుతాయి; వ్యాసవనంబును= వ్యాసవనమనే తీర్థమును; మనోజవంబును= మనోజవం అనే తీర్థమును; మధువటియును= మధువటిఅనే తీర్థమును; అను తీర్థంబులన్+ఆడిన= అనేతీర్థాలలో స్నానంచేస్తే; గో, సహస్ర, దాన, ఫలంబు= వేయి ఆవులను దానం చేసినపుణ్యాన్ని; పడయుదురు= పొందుతారు; కౌశికీ, దృషద్వతీ, సంగమంబునన్= కౌశికీ దృషద్వతులు కలిసినచోట; స్నాతులు+ఐ= స్నానం చేసినవారై; సర్వ పాప విముక్తులు+అగుదురు= అన్ని పాపాలనుండి తొలగినవారగుదురు; కిందత్తంబునన్= కిందత్తం అనే తీర్థంలో; తిల ప్రస్థ దానంబు+చేసి= ఒకప్రస్థం తిలలు (నువ్వులు) దానంచేసి; పితరుల, ఋణంబున్= పితృదేవతల ఋణాన్ని; ఈఁగుదురు= తీర్చుకొంటారు; అహస్+సుదిన తీర్థంబులన్+ఆడి= అహస్సు, సుదినం అనే తీర్థాలలో స్నానంచేసి; సూర్యలోక ప్రాప్తులు+అగుదురు= సూర్యలోకం పొందుతారు; మృగధూమంబునన్= మృగధూమక్షేత్రంలో; గంగాస్నాతులు+ఐ= గంగలో స్నానంచేసినవారై; మహాదేవున్= శివుడిని; అర్చించిన= ఆరాధించిన; మహాత్ములు= మహానుభావులు; అశ్వమేధ ఫలంబు= అశ్వమేధయాగం చేసినపుణ్యం; పడయుదురు= పొందుతారు; వామనంబు+అను తీర్థంబు+ఆడి= వామనమనే తీర్థంలో స్నానంచేసి; వామనున్+అర్చించినవారు= వామనదేవుని ఆరాధించిన వారు; విష్ణులోకప్రాప్తులు+అగుదురు= విష్ణులోకాన్ని పొందుతారు; పావనంబు+అను తీర్థంబు+ఆడి= పావనమనే తీర్థంలో స్నానంచేసి; కులంబు= వంశాన్ని; పవిత్రంబు+చేయుదురు; శ్రీకుంజంబునన్= శ్రీకుంజతీర్థంలో; సరస్వతీ స్నాతులు+ఐ= సరస్వతీనదిలో స్నానంచేసి; అగ్నిష్టోమఫలంబు= అగ్నిష్టోమం అనే యజ్ఞం చేసిన ఫలితం; పడయుదురు= పొందుతారు; ఋషులు+ఎందేని+ఉండి= మునులు ఎచటినుండి; యాత్రాపరులు+ఐ= పయనం మొదలుపెట్టి; కురుక్షేత్రంబునకున్= కురుక్షేత్రానికి; పోదురు= వెళ్ళుతారో; అట్టి= ఆ; నైమిశకుంజంబు+ఆడి= నైమిశకుంజతీర్థంలో స్నానంచేసి; ఋషితృప్తి= మునులకు సంతృప్తి; చేయుదురు= చేస్తారు; బ్రహ్మతీర్థంబు+ఆడి= బ్రహ్మతీర్థంలో స్నానంచేసి; వర్ణాంతరులు= ఇతర వర్ణస్థులు; బ్రాహ్మణులు+అగుదురు= బ్రాహ్మణులుగా అవుతారు; బ్రాహ్మణులు; బ్రహ్మలోక, ప్రాప్తులు= సత్యలోకాన్ని పొందినవారు; అగుదురు= అవుతారు.

**తాత్పర్యం:** అని పితృదేవతలను ప్రార్థించి వారి వరంవలన శమంతపంచక సరస్సులను పుణ్యతీర్థాలుగా చేశాడు. అటువంటి పరశురాముడి మడుగులలో స్నానంచేసినవారికి అశ్వమేధయాగం చేసిన పుణ్యఫలం లభిస్తుంది. కాయశోధనం అనేతీర్థంలో స్నానంచేస్తే దేహశౌచం సిద్ధిస్తుంది. ఏచోట విష్ణుదేవుడు లోకాలను ఉద్ధరించాడో ఆ స్థలానికి లోకోద్ధారం అనేప్రఖ్యాతి ఏర్పడింది. అచట స్నానం చేసినవారు తమ వంశాన్ని ఉద్ధరిస్తారు. శ్రీతీర్థంలో స్నానంచేస్తే సంపద కలుగుతుంది. కపిలతీర్థంలో స్నానంచేస్తే ఇంచుక ఎరుపు ఇంచుక నలుపు గల ఆవులు వేయింటిని దానంచేసిన పుణ్యం లభిస్తుంది. సూర్యతీర్థంలో స్నానంచేసి ఉపవాసం చేస్తే సూర్యలోకం ప్రాప్తిస్తుంది. గోభవనం అనేతీర్థంలో స్నానంచేస్తే వేలకొలది ఆవులు కలవారవుతారు. శంఖినీతీర్థంలో స్నానమాడితే అందమైన ఆకృతి లభిస్తుంది. యక్షేంద్రతీర్థంలో స్నానంచేసి తరండకుడు అనే ద్వారపాలకుడిని సందర్శించినవారు, సరస్వతీనదిలో స్నానం చేసినవారు అగ్నిష్టోమయాగం చేసినపుణ్యం పొందుతారు. మాతృతీర్థాన్ని సందర్శించినవారికి సంతానవృద్ధి అవుతుంది. బ్రహ్మావర్తం, శరవణం అనే తీర్థాలు సందర్శించినవారు సమస్త రోగాలనుండి విముక్తి చెందుతారు. శ్వావిల్లోమాపహం అనే తీర్థంలో పదకొండు తీర్థాలు ఉన్నాయి. అందులో ప్రాణాయామం చేసి యోగాభ్యాసం చేసిన బ్రాహ్మణులకు (పాపాలు నశించినందుకు సూచకంగా) తమ తమ కేశాలు తొలగిపోతాయి. కిరాతుడిబాణంచేత కొట్టబడి ఎచట లేళ్ళు (కృష్ణజింకలు) మనుజరూపం పొందాయో ఆ స్థలంలో మానుషతీర్థం వెలిసింది. ఆ తీర్థంలో స్నానంచేసినవారు సర్వపాపాలు తొలగి దేవత్వం పొందుతారు. ఆ మానుషతీర్థానికి తూరుపుదిక్కున నిర్ణీతస్థలంలో 'ఆపగ' అనే నదిలో పితృదేవతలకు శ్రాద్ధకర్మలు నిర్వహించి, పితరులను ఉద్దేశించి ఒక బ్రాహ్మణుడికి భోజనం పెట్టితే, కోటి మంది బ్రాహ్మణులకు అన్నదానం చేసిన పుణ్యం లభిస్తుంది. పితృదేవతలు తనివి చెందుతారు. బ్రహ్మోదుంబరం,

సప్తర్షికుండం, కేదారం అనే తీర్థాలను సందర్శిస్తే బ్రహ్మలోకప్రాప్తి అవుతుంది. కపిల కేదారం అనే తీర్థాన్ని చూచినవారు పాపాలు తొలగి అదృశ్యులౌతారు. సరకం అనే తీర్థంలో స్నానం చేసి కృష్ణపక్షంలోని చతుర్దశినాడు శివుడిని అర్చిస్తే కోరిన కోరికలు అన్నీ సిద్ధిస్తాయి. మూడుకోట్ల నూతులు కల ఇలాస్పదం అనేతీర్థంలో స్నానంచేసి పితరులకు తర్పణాలు విడిస్తే వారికి వాజపేయయాగం చేసిన పుణ్యం లభిస్తుంది. కిందానం, కింజప్యం అనేతీర్థాలలో చేసిన దానాల, జపాల పుణ్యాలు ఎన్నటికీ తరుగవు. నారదమహర్షి నిర్మించిన అంబాజన్మం అనేతీర్థంలో అసువులు వదిలితే సమస్త పుణ్యలోకాలను పొందగలరు. శుక్లపక్షదశమినాడు పుండరీకం అనేతీర్థంలో స్నానం చేస్తే పుండరీకయజ్ఞం చేసినపుణ్యం లభిస్తుంది. అందులోని వైతరణీనదిలో స్నానంచేసి శివుడికి వందనమాచరిస్తే సర్వపాపాలు తొలగిపోతాయి. ఎచట దేవతలు వేలకొలది సంవత్సరాలు తపస్సు చేశారో అటువంటి ఫలకీవనం అనే తీర్థంలో స్నానం చేస్తే అగ్నిష్టోమం, అతిరాత్రం అనే యజ్ఞాలు చేసినపుణ్యం లభిస్తుంది. వేదవ్యాసమహర్షి పెక్కుతీర్థాలను కలయబోసి మిశ్రకం అనేతీర్థాన్ని నిర్మించాడు. అచట స్నానం చేసినవారికి సర్వతీర్థాలలో స్నానమాడినపుణ్యం చేకూరుతుంది. వ్యాసవనం, మనోజవం, మధువటి అనేతీర్థాలలో స్నానంచేస్తే వేయిఆవులను దానం చేసిన పుణ్యం లభిస్తుంది. కౌశికీనది, దృషద్వతీనది కలిసేచోట స్నానం చేసినవారు సమస్తపాపాలనుండి విముక్తులవుతారు. కిందత్తతీర్థంలో ఒక ప్రస్థం కొలతగల తిలల (నువ్వుల) ను దానంచేస్తే పితరుల ఋణాన్ని తీర్చుకొంటారు. అహస్సు, సుదినం అనేతీర్థాలలో స్నానంచేస్తే సూర్యలోకం ప్రాప్తిస్తుంది. మృగధూమం అనే క్షేత్రంలో గంగాస్నానంచేసి శివుడిని ఆరాధించిన మహాత్ములకు అశ్వమేధఫలం లభిస్తుంది. వామనం అనేతీర్థంలో స్నానంచేసి వామనవిష్ణువును ఆరాధించినవారు విష్ణులోకానికి వెళ్ళుతారు. పావనం అనే తీర్థంలో స్నానంచేసినవారు వంశాన్ని పవిత్రం చేస్తారు. శ్రీకుంజం అనే తీర్థాన్ని దర్శించి సరస్వతీనదిలో స్నానంచేసేవారు అగ్నిష్టోమయాగం చేసినపుణ్యం పొందుతారు. ఋషులు ఎచటనుండి కురుక్షేత్ర తీర్థయాత్రను మొదలుపెట్టుతారో అట్టి నైమిశకుంజం అనేతీర్థంలో స్నానంచేస్తే ఋషులకు సంతృప్తి కలుగుతుంది. బ్రహ్మతీర్థంలో స్నానమాడితే తదితర వర్ణాలవారు బ్రాహ్మణులు అవుతారు. బ్రాహ్మణులు అచట స్నానం చేస్తే వారికి బ్రహ్మలోకం సిద్ధిస్తుంది.

**విశేషం:** ఆయా తీర్థాలలో క్రుంకులిడితే లభించే ఆయా పుణ్యఫలితాలు ఇందులో వివరించబడ్డాయి. ఆయా తీర్థాలు సార్థకాలు. అయితే శ్వావిల్లోమాపహం అనేతీర్థానికి అర్థం అనుశీలించదగింది. శ్వావిత్ అంటే ఏదుపంది; శ్వావిల్లోమం అంటే ఏదుపందిలోమం. లోమం= రోమం. ఉపనయనంలో ఏదుపంది రోమస్పర్శ శాస్త్రవిహితం. ఏతద్దోష నివారకమైన పుణ్యక్షేత్రం శ్వావిల్లోమాపహం. అందులో ప్రాణాయామం చేసిన విప్రులకు స్వకీయ రోమాలు (స్వలోమాలు) తొలగిపోతాయి. అంటే, వారి పాపాలు నశిస్తాయి అని భావం. "రోమా ణ్యాశ్రిత్య పాపాని" పాపాలు రోమాలను ఆశ్రయించి ఉంటాయి అనటం ప్రాచీన సంప్రదాయం.

**సీ.** **అనఘుఁడు మంకణుం డను నొక్క బ్రహ్మర్షి । తన చేయి వ్రయ్యంగ దర్భఁ గొనిన**
**సాంద్రమై శాకరసం బందు నిర్గతం । బగుడును హర్షించి యాడుచున్నఁ**
**జూచి సహింపక సురలును మునులును । హరుపాలి కరిగి 'దేవాదిదేవ!**
**మునినృత్త మే విధంబున నివృత్తం బగు । నట్లుగాఁ జేయవే' యనిన హరుఁడు**

**ఆ.** **దపసిరూప మపుడు ధరియించి యమ్ముని । కడకు వచ్చి, 'యేమి కారణమున**
**నాడె? దేమి విస్మయం బిందుఁ జూచితి? । చెప్ప నుచిత మేనిఁ జెప్పు' మనిన. 265**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= పాపరహితుడు (మహాత్ముడు); మంకణుండు+అను+ఒక్క, బ్రహ్మ+ఋషి= మంకణుడు అనే పేరుకల ఒక బ్రహ్మజ్ఞానం ఆర్జించిన ముని (బ్రహ్మ+ఋషి= బ్రహ్మర్షి); తనచేయి చీలేటట్లు; దర్భన్+కొనినన్= దర్భను పట్టుకోగా- అంటే దర్భను పట్టుకొన్నపుడు అతడి చేయి చీలగా; సాంద్రము+ఐ= దట్టమై; అందు= ఆ తెగిన చేతినుండి; శాకరసంబు= ఆకుకూరల ద్రవం; నిర్గతంబు+అగుడును= కారుతుంటే; హర్షించి= సంతోషించి; ఆడుచున్నన్= నృత్యం చేస్తుండగా; చూచి= అరసి; సహింపక= ఓర్చుకొనలేక; సురలును= దేవతలును; మునులును= ఋషులును; హరుపాలికిన్= శివుడి దగ్గరకు; అరిగి= వెళ్ళి; దేవ+ఆదిదేవ!= దేవుళ్లలో మొదటి దేవుడివైనవాడా!; మునినృత్తము= ఋషియొక్క నాట్యం; ఏ+విధంబునన్= ఏ రీతిగా; నివృత్తంబు+అగున్= ఆపివేయబడునో; అట్లుగాన్= ఆ విధంగా; చేయవే+అనినన్= చేయుమని ప్రార్థించగా; హరుఁడు= శివుడు; తపసి రూపము+అపుడు, ధరియించి= తపస్వి ఆకారం అపుడు ధరించి; ఆ+మునికడకున్= ఆ ఋషి దగ్గరికి; వచ్చి= అరుదెంచి; ఏమి, కారణమునన్= ఏ హేతువు చొప్పున; ఆడెదు= నృత్యం చేస్తున్నవాడివి; ఇందున్= దీనిలో; ఏమి, విస్మయంబు+చూచితి= ఏ ఆశ్చర్యకరమైన విషయాన్ని చూచావు?; చెప్పన్+ఉచితము+ఏనిన్= చెప్పటం భావ్యమైతే; చెప్పుము+అనిన= వచింపుము అనగా.

**తాత్పర్యం:** పాపరహితుడైన మంకణుడు అనే బ్రహ్మర్షి దర్భ పట్టుకొన్నపుడు అతడి చేయి తెగి అందులోనుండి ఆకుకూరద్రవం కారసాగింది. అంత సంతోషించి ఆ ముని నృత్యం చేయ నారంభించాడు. ఆ మంకణమహాముని అవిరళనృత్యాన్ని చూడలేక దేవతలూ, మునులూ శివుడిపాలికి వెళ్ళి 'ఓ దేవాదిదేవా! మంకణమహాముని నృత్యం మానేటట్లు చేయుము' అని ప్రార్థించారు. అంత శివుడు ఒక తపసి ఆకృతి ధరించి వచ్చి 'మంకణమహామునీ! నీవు ఎందుకు ఇట్లా నృత్యం చేస్తున్నావు? ఇందులో నీవు చూచిన వింత ఏమిటి? చెప్పటం ఉచితమని నీకు తోస్తే దయచేసి చెప్పప్రార్థన' అని అడిగాడు.

వ. **'నా కరంబున శాకరసంబు వెలువడిన విస్మితుండ నయి హర్షించి యాడెద' ననిన 'నిది యేమి విస్మయంబు; దీనిం జూడు' మని హరుండు తన యంగుష్ఠంబున యంగుళి తాడనంబు చేసిన నందు హిమసన్నిభం బయిన భస్మంబు వెలువడినం జూచి, లజ్జితుం డయి 'నీవు పరమేశ్వరుండ' వని నమస్కరించి, వేదమంత్రంబుల స్తుతియించి. 'దేవా! నీ ప్రసాదంబున నాకుఁ దపోవర్ధనంబు గావలయు' ననిన, నమ్మునివరునకు నీశ్వరుండు గరుణించి 'నీకుఁ దపోవర్ధన మగు; నేను నీ యాశ్రమంబున నుండుదు' ననియె; నట్టి సప్తసారస్వతతీర్థంబు లాడినవారికి సారస్వతసిద్ధి యగు; బ్రహ్మాదిదేవతలచే నధిష్ఠితంబు లయిన యౌశనసతీర్థంబును గపాలమోచనంబు, విశ్వామిత్రంబుఁ గార్తికేయంబు ననియెడు తీర్థంబుల నాడి పాపవిముక్తు లయి బ్రహ్మలోకంబు వడయుదురు. 266**

**ప్రతిపదార్థం:** నా, కరంబునన్= నా చేతిలో; శాక, రసంబు= ఆకుకూరలనుండి వెలువడేటటువంటి ద్రవం; వెలువడినన్= కారిన; విస్మితుండను+అయి= అచ్చెరువు చెందినవాడినై; హర్షించి= సంతోషించి; ఆడెదన్= నృత్యం చేస్తున్నాను; అనినన్= అని చెప్పగా; హరుండు= శివుడు; ఇది+ఏమి, విస్మయంబు= ఇదేమి వింత?; దీనిన్+చూడుము+అని; తన, అంగుష్ఠంబునన్= తనచేతి బొటనవ్రేలిపై; అంగుళి, తాడనంబు, చేసినన్= వ్రేలితో కొట్టగా; అందు= అచటినుంచి; హిమ, సన్నిభంబు+అయిన= మంచుతో సమానమైన (తెల్లనైన); భస్మంబు= బూడిద; వెలువడినన్= బయటికి రాగా; చూచి= అరసి; (మంకణుడు); లజ్జితుండు+అయి= సిగ్గుచెందినవాడయి; నీవు, పరమేశ్వరుండవు+అని= నీవు పరమశివుడివని; నమస్కరించి= వందనంచేసి; వేదమంత్రంబుల, స్తుతియించి= వేద మంత్రాలతో ప్రస్తుతించి; దేవా!= ఈశ్వరా!; నీ, ప్రసాదంబు= నీ అనుగ్రహంవలన; నాకున్; తపస్+వర్ధనంబు= తపస్సుయొక్క అభివృద్ధి; కావలయున్= జరగాలి; అనినన్= అని పలుకగా; ఆ+మునివరునకున్=

ఆ ఋషిశ్రేష్ఠుడికి; ఈశ్వరుండు= శివుడు; కరుణించి= దయగలిగి; నీకున్+తపోవర్ధనము+అగున్= నీకు తపస్సుయొక్క అభివృద్ధి అవుతుంది; నేను, నీ+ఆశ్రమంబునన్+ఉండుదున్= నేను నీ ఆశ్రమంలో ఉంటాను; అనియెన్= అని అన్నాడు; అట్టి= అటువంటి (మహిమగల); సప్త సారస్వత తీర్థంబులు= సప్త (ఏడు) సారస్వతతీర్థాలు అనబడే వాటిలో; ఆడిన వారికిన్= స్నానంచేసినవారికి; సారస్వతసిద్ధి+అగు= సరస్వతికి సంబంధించిన (సంగీత, సాహిత్యశాస్త్ర) జ్ఞానం లభిస్తుంది, అభినివేశం ఏర్పడుతుంది; బ్రహ్మ+ఆది దేవతలచేన్= బ్రహ్మ మొదలయిన దేవతలచేత; అధిష్ఠితంబులు+అయిన= అధిష్ఠించబడినవైన; ఔశనస తీర్థంబును= ఔశనసం అనే తీర్థమున్నూ; కపాల మోచనంబు= కపాలమోచనమున్నూ; విశ్వామిత్రంబున్= విశ్వామిత్రమున్నూ; కార్తికేయంబున్= కార్తికేయమున్నూ; అనియెడు తీర్థంబులన్+ఆడి= అనబడే తీర్థాలలో స్నానంచేసి; పాపవిముక్తులు+అయి= పాపాలనుంచి తొలగినట్టివారయి; బ్రహ్మలోకంబు+పడయుదురు= సత్యలోకాన్ని పొందుదురు.

**తాత్పర్యం:** 'నా చేతినుండి శాకద్రవం వెలువడితే అచ్చెరువు చెంది ఆనంద తన్మయత్వంతో నృత్యం చేస్తున్నాను' అని మంకణమహర్షి పలికాడు. అంత తపసిరూపంలో ఉన్న శివుడు 'ఇదేమి వింత? నాచేతిని చూడుము' అని బొటనవ్రేలిని వ్రేలితో కొట్టాడు. అందుండి మంచువలె తెల్లనైన బూడిద వెలువడటం చూచి మంకణమహాముని సిగ్గుపడి 'నీవు పరమేశ్వరుడివి' అని నమస్కరించి వేదమంత్రాలతో ప్రస్తుతించి, 'దేవా! నీ అనుగ్రహంవలన నాకు తపోవృద్ధి కావా' లని అనగా, ఆ మహర్షిని ఈశ్వరుడు కరుణించి 'నీకు తపోవృద్ధి అవుతుంది, నేను నీ ఆశ్రమంలో ఉంటాను' అని చెప్పాడు. అటువంటి సప్త సారస్వతాలు అనే తీర్థాలలో స్నానంచేసినవారికి సారస్వతంలో సమగ్రప్రాప్తి ఏర్పడుతుంది. బ్రహ్మాదిదేవతలచేత అధివసించబడినవైన ఔశనసం, కపాలమోచనం, విశ్వామిత్రం, కార్తికేయం అనే తీర్థాలలో స్నానంచేస్తే పాపాలనుండి విముక్తులై సత్యలోకాన్ని పొందుతారు.

**క. వేదములయందు వినఁగఁ బృ। థూదకతీర్థంబ యుత్తమోత్తమము సురేం**
**ద్రాది సురవరులకును వ్యా। సాది మహాయోగివరుల కాస్పద మగుటన్. 267**

**ప్రతిపదార్థం:** వేదముల+అందున్= వేదాలలో; వినఁగన్= వినగా; పృథూదక, తీర్థంబు+అ= పృథూదకం అనే పుణ్యక్షేత్రమే; సురేంద్ర+ఆది, సురవరులకును= దేవేంద్రుడు మున్నగు దేవతాశ్రేష్ఠులకును; వ్యాస+ఆది, మహాయోగి, వరులకు= వ్యాసుడు మున్నగు గొప్ప యోగిశ్రేష్ఠులకు; ఆస్పదము+అగుటన్= నెలవు అవటంచేత; ఉత్తమ+ఉత్తమము= మేలితీర్థాలలోకెల్ల మేల్తరమైనది.

**తాత్పర్యం:** వేదాలలో ప్రస్తావించబడిన పుణ్యతీర్థం పృథూదకతీర్థం దేవేంద్రుడు మున్నగు దేవతలకున్నూ, వ్యాసుడు మున్నగు యోగివరేణ్యులకున్నూ నెలవు కావటంచేత అది ఉత్తమోత్తమం.

**వ. అందు శరీరత్యాగంబు చేసినవార లపారపాపవిముక్తులై ముక్తు లగుదురు; సురకన్యా సరస్వతీ సంగమ స్నాతులైనవారు బ్రహ్మహత్యాది పాతకంబులవలనఁ బాయుదురు; దర్భినిర్మితంబైన యర్థకీల తీర్థం బాడిన శూద్రులు బ్రాహ్మణు లగుదురు, బ్రాహ్మణులు పరమసిద్ధు లగుదురు; శతంబును సహస్రంబును నను తీర్థంబు లందుఁ జేసిన జపదానోపవాసంబులు శతసహస్రగుణంబులగు; వేల్పు లెల్లం గుమారు సేనాపతింగా నెందే నభిషేకించి రట్టితైజసం బను తీర్థంబును దాని తూర్పున నుండు కురుతీర్థంబును స్వర్గద్వారం బను తీర్థంబును జూచినవారికి స్వర్గద్వారంబు వివృతం బగు; రుద్రపత్ని యను తీర్థంబున శంకరనారాయణుల నర్చించి సర్వదుఃఖ విముక్తు లగుదురు; స్వస్తిపురంబుఁ బ్రదక్షిణంబు సేసి గో సహస్ర దాన ఫలంబు**

**వడయుదురు; గంగమడువున నొక్క కూపంబున మూఁడుకోట్ల తీర్థంబుల సన్నిహితంబులై యుండు; నందుఁ గృతస్నాను లయినవారికి సర్వతీర్థస్నానఫలం బగు; బదరీవనంబునందు వసిష్ఠాశ్రమంబునం ద్రిరాత్రంబులు బదరీఫల భక్షణంబు సేసి పాపవిముక్తు లగుదు; రేకరాత్రం బను తీర్థంబున నేకరాత్రోపవాసంబు సేసి బ్రహ్మలోకంబు వడయుదు; రాదిత్యాశ్రమం బను వనంబున నాదిత్యుం బూజించి యాదిత్యలోకగతు లగుదురు; దధీచి తీర్థంబునం గన్యాశ్రమంబునందుఁ ద్రిరాత్రంబు వసియించినవారికి స్వర్గఫలం బగు.268**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ పృథూదకక్షేత్రంలో; శరీర, త్యాగంబు, చేసిన వారలు= దేహాన్ని వదలిపెట్టినవారు; అపార, పాప, విముక్తులు+ఐ= మితిలేని పాపాలనుండి తొలగినవారై; ముక్తులు= మోక్షం పొందినవారు; అగుదురు= అవుతారు; సురకన్యా, సరస్వతీ, సంగమ స్నాతులు+ఐనవారు= గంగాసరస్వతీ సంగమంలో స్నానంచేసినవారు; బ్రహ్మ, హత్యా+ఆది, పాతకంబులవలనన్+ పాయుదురు= బ్రాహ్మణులను చంపటం మున్నగువాటిచేత సంక్రమించే పాపాలనుండి విముక్తులౌతారు; దర్భి, నిర్మితంబు+ఐన= దర్భిచేత నిర్మించబడిన; అర్ధకీల, తీర్థంబు+ఆడిన= అర్ధకీలతీర్థంలో స్నానంచేసిన; శూద్రులు; బ్రాహ్మణులు+అగుదురు= విప్రులు కాగలరు; బ్రాహ్మణులు= విప్రులు; పరమ, సిద్ధులు+అగుదురు= గొప్ప శక్తులు సిద్ధించిన, పరిణతి చెందిన యోగులు కాగలరు; శతంబును, సహస్రంబునున్+అను, తీర్థంబులన్= శతం, సహస్రం అనే పుణ్యక్షేత్రాలలో; చేసిన= సల్పిన; జప, దాన+ఉపవాసంబులు= జపాలు, దానాలు, ఉపవాసదీక్షలు; శత సహస్ర గుణంబులు+అగు= లక్షరెట్లు అవుతాయి, అంటే వందవేయి మడుంగులు ఎక్కువ పుణ్యాలను ఇస్తాయి; వేల్పులు+ఎల్లన్= దేవతలందరు; ఎందేన్= ఎచట; కుమారున్= కుమారస్వామిని; సేనాపతింగాన్= సైన్యాధిపతిగా; అభిషేకించిరి= పవిత్రస్నానం చేయించారో అంటే పట్టం కట్టారో; అట్టి= అటువంటి స్థలమైన; తైజసంబు+అను, తీర్థంబును= తైజసమనే పేరుగల తీర్థాన్ని; దానికి, తూర్పునన్+ఉండు= దానికి తూర్పుదిక్కులో ఉండే; కురు, తీర్థంబును= కురుతీర్థాన్నీ; స్వర్గద్వారంబు+అను తీర్థంబును= స్వర్గద్వారమనే తీర్థాన్నీ; చూచినవారికిన్= సందర్శించినవారికి; స్వర్గ ద్వారంబు= స్వర్గలోకంలోని ప్రవేశ కవాటం; వివృతంబు+అగున్= తెరువబడి నట్టిది అవుతుంది; రుద్ర, పత్ని+అను, తీర్థంబునన్= రుద్రపత్ని అనేతీర్థంలో; శంకర నారాయణులను= శివకేశవులను; అర్చించి= పూజించి; సర్వ, దుఃఖ, విముక్తులు+అగుదురు= సమస్త పరితాపాలనుండి తొలగినట్టివారు అవుతారు; స్వస్తిపురంబున్+ ప్రదక్షిణంబు+చేసి= స్వస్తిపురం అనే తీర్థంచుట్టూ తిరిగితే; గో, సహస్ర, దాన, ఫలంబు= వేయి ఆవులను దానంచేసిన పుణ్యం; పడయుదురు= ఆర్జిస్తారు; గంగమడువునన్= గంగకొలనులో; ఒక్క, కూపంబునన్= ఒక నూతిలో; మూఁడు, కోట్ల, తీర్థంబులు= ముక్కోటి తీర్థాలు; సన్నిహితంబులు+ఐ= చేరికూడినట్టివై; ఉండున్= ఉంటాయి; అందున్= అచట; కృత స్నానులు+ఐనవారికిన్= స్నానంచేసినవారికి; సర్వ, తీర్థ, స్నాన, ఫలంబు+అగున్= తీర్థాలన్నింటిలో స్నానంచేసిన పుణ్యం లభిస్తుంది; బదరీ వనంబునందున్= బదరీవనంలో; వసిష్ఠ+ఆశ్రమంబునన్= వసిష్ఠాశ్రమంలో; త్రిరాత్రంబులు= మూడు రాత్రులు; బదరీ, ఫల, భక్షణంబు, చేసి= రేగుపండ్లు తిని; పాపముక్తులు= పాపాలనుండి వైదొలగినవారు; అగుదురు= అవుతారు; ఏక రాత్రంబు+అను= ఏకరాత్రం అనేపేరున్న; తీర్థంబునన్= పుణ్యక్షేత్రంలో; ఏక, రాత్ర+ఉపవాసంబు+చేసి= ఒక రాత్రి ఆహారం తీసికొనక ఉంటే; బ్రహ్మలోకంబు= సత్యలోకాన్ని; పడయుదురు= పొందుతారు; ఆదిత్య+ఆశ్రమంబు+అను, వనంబున్= ఆదిత్యుడి పేరుమీద విలసిల్లిన ఆశ్రమంలో; ఆదిత్యున్= సూర్యుడిని; పూజించి= ఆరాధించి; ఆదిత్య, లోక, గతులు+అగుదురు= సూర్యలోకానికి వెళ్ళేవారు ఔతారు; దధీచి, తీర్థంబునన్= దధీచి పేరుపై వెలసిన తీర్థంలో; కన్యా+ఆశ్రమంబునందున్= కన్యాశ్రమంలోను; త్రిరాత్రంబు= మూడురాత్రులు; వసియించినవారికిన్= నివసించినవారికి; స్వర్గఫలంబు= స్వర్గలోకం ప్రాప్తించేపుణ్యం; అగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** పృథూదకతీర్థంలో దేహం విడిచినవారికి మితిలేని పాపాలనుండి విముక్తి కలుగుతుంది. గంగానది, సరస్వతి కలిసేచోట స్నానం చేసినవారికి బ్రహ్మహత్య మున్నగు పాపాలనుండి నిష్కృతి లభిస్తుంది. దర్భి నిర్మించిన అర్ధకీల తీర్థంలో స్నానంచేస్తే శూద్రులు బ్రాహ్మణులౌతారు; బ్రాహ్మణులు సంపూర్ణయోగులు అవుతారు. శతం,

సహస్రం అనేతీర్థాలలో చేసిన జపాలు, దానాలు, ఉపవాసాలు లక్షరెట్లు పుణ్యాలను ఒసంగుతాయి. తైజసమనే తీర్థంలో దేవతలందరు కలిసి శ్రీ కుమారస్వామిని సేనాపతిగా పట్టంగట్టారు. దానిని, దానికి తూర్పున ఉన్న కురుతీర్థాన్ని, స్వర్గద్వారమనే తీర్థాన్ని చూచినవారికి స్వర్గలోకద్వారం తెరుచుకొంటుంది. రుద్రపత్ని అనేతీర్థంలో శివకేశవులను అర్చిస్తే సర్వదుఃఖాలనుండి విముక్తి కలుగుతుంది. స్వస్తిపురం అనేతీర్థం చుట్టూ ప్రదక్షిణం చేస్తే వేయి ఆవులను దానంచేస్తే వచ్చేపుణ్యం దక్కుతుంది. గంగమడువు అనేతీర్థంలో ఒక నూతిలో మూడుకోట్ల తీర్థాలు చేరి కూడినాయి. అందులో స్నానంచేసినవారికి తీర్థాలన్నింటిలో స్నానం చేసిన పుణ్యం లభిస్తుంది. బదరీవనం అనే తీర్థంలో వసిష్ఠాశ్రమం అనేతీర్థంలో మూడురాత్రులు రేగుపండ్లను తింటే పాపాలు పోతాయి. ఏకరాత్రం అనేతీర్థంలో ఒకరాత్రి ఉపవాసం చేస్తే సత్యలోకం సిద్ధిస్తుంది. ఆదిత్యాశ్రమం అనే అరణ్యంలో సూర్యుడిని ఆరాధిస్తే సూర్యలోక ప్రాప్తి అవుతుంది. దధీచితీర్థంలో కన్యాశ్రమంలో మూడురాత్రులు వసించినవారికి స్వర్గలోకం ప్రాప్తించేపుణ్యం లభిస్తుంది.

**క. జలరుహసంభవుఁ డాదిగఁ । గల వేల్పులు ఋషులు సిద్ధ గరుడోరగులున్**
**నెలనెల సేవింతురు భూ । తలమున సన్నిహిత యనఁగఁ దగు తీర్థంబున్. 269**

**ప్రతిపదార్థం:** జలరుహ, సంభవుఁడు+ఆదిగన్+కల= నీటిలో పుట్టే పద్మంలో పుట్టిన బ్రహ్మదేవుడు మొదలుగా గల; వేల్పులు= దేవతలు; ఋషులు= మునులు; సిద్ధ గరుడ+ఉరగులున్= సిద్ధులు, గరుడులు, పాములు; నెలనెల= ప్రతిమాసమున్నూ; భూతలమునన్= భూమిపై; సన్నిహిత; అనఁగన్+తగు= అనే పేరున్న; తీర్థంబున్= తీర్థాన్ని; సేవింతురు= దర్శిస్తారు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు మున్నగు దేవతలున్నూ, మునులున్నూ, సిద్ధులు, గరుడులు, పాములు అనే జాతులకు చెందిన దేవతలున్నూ, భూమిపై 'సన్నిహిత' అనేపేరుతో విలసిల్లే తీర్థాన్ని ప్రతిమాసంలోనూ దర్శిస్తారు.

**వ. సూర్యగ్రహణంబున దాని నాడినవారు శతాశ్వమేధ ఫలంబు వడయుదురు; ధర్ముఁడు తపంబు సేసిన ధర్మతీర్థం బాడి ధర్మశీలు రగుదురు; జ్ఞానపావనంబును సౌగంధికంబును నను తీర్థంబుల నాడినం జూచిన సర్వపాప విముక్తు లగుదురు; దేవశ్రవ యను సరస్వతీహ్రదంబునందు వల్మీకంబున వెలువడు జలధార లాడి పితృతర్పణంబు సేసిన వా రశ్వమేధ ఫలంబు వడయుదురు; సుగంధయు, శతకుంభయుఁ, బంచయక్షయుఁ, త్రిశూల ఖాతయు నను తీర్థంబు లాడి దుర్గతులవలనం బాయుదురు; తొల్లి పార్వతి యెందేని శాకాహారిణియై దివ్యసహస్రవర్షంబులు తపంబు సేసె నట్టి శాకంభరీతీర్థం బాడి యొక్కదివసంబు శాకాహారులైనవారు పండ్రెండేండ్లు శాకాహార తపంబు సలిపినవారి ఫలంబు వడయుదురు; సువర్ణాఖ్యం బను తీర్థంబున రుద్రుం బూజించి రుద్రలోక గతు లగుదురు; ధూమావతి యను తీర్థంబును రథావర్తం బను తీర్థంబును ధార యను తీర్థంబు నాడి శోకవిముక్తు లగుదురు. 270**

**ప్రతిపదార్థం:** సూర్య గ్రహణంబునన్= సూర్యగ్రహణకాలంలో; దానిన్+ఆడినవారు= సన్నిహిత అనే తీర్థంలో స్నానం చేసినవారు; శత+అశ్వమేధ, ఫలంబు+పడయుదురు= నూరు అశ్వమేధయాగాలు చేసిన పుణ్యం ఆర్జిస్తారు; ధర్ముఁడు= యమధర్మరాజు; తపంబు+చేసిన= తపస్సు చేసిన; ధర్మ, తీర్థంబు+ఆడి= ధర్మతీర్థస్నానం చేస్తే; ధర్మశీలురు+అగుదురు= ధర్మమైన నడవడిక కలిగినవారవుతారు; జ్ఞాన పావనంబును= జ్ఞానపావనమనే తీర్థాన్నీ; సౌగంధికంబునున్; అను, తీర్థంబులన్=

అనే తీర్థాలలో; ఆడినన్= స్నానంచేస్తే; చూచినన్= దర్శిస్తే; సర్వ, పాప, విముక్తులు= పాపాలు అన్నిటినుండి తొలగినవారు; అగుదురు= అవుతారు; దేవశ్రవ+అను= దేవశ్రవ అనే; సరస్వతీ హ్రదంబునందు= సరస్వతీనదివలన ఏర్పడిన మడుగులోని; వల్మీకంబున= పుట్టనుండి; వెలువడు= పైకి ఉబికివచ్చే, జలధారలు+ఆడి= నీటి ప్రవాహంలో స్నానంచేసి; పితృ, తర్పణములు+చేసినవారు= పితరులకు శ్రాద్ధకర్మలు నిర్వహించినవారు; అశ్వమేధ, ఫలంబు+ పడయుదురు= అశ్వమేధయాగాన్ని చేసినపుణ్యాన్ని పొందుతారు; సుగంధయు, శతకుంభయున్+పంచయక్షయున్+త్రిశూలఖాతయున్+అను తీర్థంబులు+ఆడి= సుగంధ, శతకుంభ, పంచయక్ష, త్రిశూలఖాత అనే తీర్థాలలో స్నానంచేసి; దుర్గతుల వలనన్+పాయుదురు= పాపాలనుండి తొలగుతారు; తొల్లి= పూర్వం; పార్వతి; ఎందేని= ఎచ్చోట; శాకాహారిణి+ఐ= కాయగూరలు మాత్రమే ఆహారంగా కలదై; దివ్య, సహస్ర, వర్షంబులు= దేవతాకాలమానంప్రకారం వేయిఏండ్లు; తపంబు+చేసెన్= తపస్సు చేసిందో; అట్టి= ఆ; శాకంభరీ, తీర్థంబు+ఆడి= శాకంభరి తీర్థంలో స్నానంచేసి; ఒక్క దివసంబు= ఒకనాడు; శాక+ఆహారులు+ఐనవారు= కాయగూరలు ఆహారంగా స్వీకరించినవారు; పండ్రెండు+ఏండ్లు= పండ్రెండు సంవత్సరాలు; శాకాహార తపంబు= శాకాహారం మాత్రమే స్వీకరిస్తూ చేసేటటువంటి తపస్సు; సలిపినవారి, ఫలంబు= చేసినవారు పొందేపుణ్యం; పడయుదురు= పొందుతారు; సువర్ణ+ఆఖ్యంబు+అను= సువర్ణమనే పేరున్న; తీర్థంబునన్= పుణ్యక్షేత్రంలో; రుద్రున్+పూజించి= శివుడిని ఆరాధించి; రుద్రలోక గతులు+అగుదురు= కైలాసాన్ని చేరినట్టినవారు అవుతారు; ధూమావతి+అను, తీర్థంబును= ధూమావతి అనే తీర్థాన్ని; రథ+ఆవర్తంబు+అను తీర్థంబును= రథావర్తం అనే తీర్థాన్ని; ధారా+అను తీర్థంబును= ధార అనేతీర్థంలోను; ఆడి= స్నానంచేసి; శోక, విముక్తులు+అగుదురు= దుఃఖంనుండి విముక్తి పొందినవారు అవుతారు.

**తాత్పర్యం:** సూర్యగ్రహణకాలంలో ఆ సన్నిహితతీర్థంలో స్నానం చేసినవారు నూరు అశ్వమేధయాగాలు చేసిన పుణ్యం పొందుతారు. యమధర్మరాజు తపస్సుచేసిన ధర్మతీర్థంలో స్నానంచేసిన ధర్మస్వభావం కలవారు అవుతారు. జ్ఞానపావనం, సౌగంధికం అనేతీర్థాలలో స్నానంచేసినా, ఆ తీర్థాలను సందర్శించినా సర్వపాపాలనుండి విముక్తులు కాగలరు. దేవశ్రవ అనే సరస్వతీహ్రదంలోని పుట్టనుండి వెలువడే జలప్రవాహంలో స్నానంచేసి పితరులకు శ్రాద్ధకర్మలు నిర్వహించినవారు అశ్వమేధయాగం చేసినపుణ్యాన్ని ఆర్జిస్తారు. సుగంధ, శతకుంభ, పంచయక్ష, త్రిశూలఖాత అనేతీర్థాలలో స్నానంచేసినవారు నరకాలనుండి తప్పించుకొంటారు. పూర్వం పార్వతీదేవి శాకాహారం స్వీకరించి దేవమానం ప్రకారం వేయి సంవత్సరాలు శాకంభరి అనే తీర్థంలో తపస్సు చేసింది. ఆ తీర్థంలో ఒకరోజు శాకాహార వ్రతం నిర్వహించినవారు పండ్రెండు సంవత్సరాలు శాకాహార తపస్సు చేసినపుణ్యం పొందుతారు. సువర్ణం అనే తీర్థంలో శివుడిని ఆరాధించినవారికి కైలాసం సిద్ధిస్తుంది. ధూమావతి అనేతీర్థంలో, రథావర్తం అనే తీర్థంలో, ధార అనేతీర్థంలో స్నానం చేసినవారు దుఃఖంనుండి విముక్తి పొందుతారు.

**క. ధారుణిలోపల స్వర్గ । ద్వారం బయి ఋషినిషేవితం బగు గంగా**
**ద్వారం బాడిన ధన్యులఁ । జేరును శతకోటితీర్థసేవాఫలముల్. 271**

**ప్రతిపదార్థం:** ధారుణిలోపలన్= భూమండలంలో; స్వర్గ, ద్వారంబు+అయి= స్వర్గలోకానికి వాకిలి వంటిదిఅయి; ఋషి, నిషేవితంబు+అగు= మునులచేత సేవించబడినదైన; గంగా ద్వారంబు+ఆడిన= గంగాద్వారం అనే పుణ్యక్షేత్రంలో స్నానంచేసిన; ధన్యులన్= తమ జన్మలు సార్థకాలైన మహాత్ములను; శత, కోటి, తీర్థసేవా, ఫలముల్= నూరుకోట్ల తీర్థాలను సందర్శించిన పుణ్యాలు; చేరును= చేరతాయి.

**తాత్పర్యం:** భూమండలంలో స్వర్గానికి ప్రవేశమార్గమయినది, మునులచేత సేవించబడినది అయిన గంగాద్వారంఅనే పుణ్యక్షేత్రంలో స్నానంచేసిన ధన్యులకు నూరుకోట్ల తీర్థాలను సేవిస్తే లభించేటటువంటి పుణ్యం దక్కుతుంది.

**వ. మఱియు సప్తగంగా సంగమంబును ద్రిగంగా సంగమంబును శక్రావర్తంబును గనస్వలంబును గంగా సరస్వతీ సంగమంబు నాదిగాఁ గల పుణ్యతీర్థంబుల నాడి పుణ్యలోకంబులు వడయుదురు; భద్రకర్ణేశ్వరంబున రుద్ర పూజయు నరుంధతీవటంబును సింధుప్రభవంబును యమునాప్రభవంబు నను పుణ్యతీర్థంబుల సేవయు సర్వసిద్ధికరంబులు; వేదిక యను తీర్థంబును ఋషికుల్య యను తీర్థంబును గృత్తికా మఘ తీర్థంబులును విద్యాతీర్థంబును వేతసిక యను తీర్థంబునుం జూచి దురితంబులవలనం దొలంగుదురు; బ్రహ్మతీర్థం బాడి పద్మవర్ణయానంబుల బ్రహ్మలోకగతు లగుదురు. 272**

**ప్రతిపదార్థం:** మఱియు= ఇంకను; సప్త గంగా సంగమంబును= ఏడు గంగలు కలిసినచోటు; త్రి గంగా సంగమంబును= మూడు గంగలు కలిసినచోటు; శక్ర+ఆవర్తంబును= శక్రావర్తం అనే తీర్థమున్నూ; కనస్వలంబును= కనస్వలం అనే తీర్థమున్నూ; గంగాసరస్వతీ సంగమంబున్= గంగ, సరస్వతి నదులు కలిసిన చోటు; ఆదిగాన్+కల= మొదలైన; పుణ్య, తీర్థంబులన్+ఆడి= పుణ్యతీర్థాలలో స్నానంచేసి; పుణ్యలోకంబులు+పడయుదురు= పుణ్యలోకాలను పొందుతారు; భద్రకర్ణేశ్వరంబునన్= భద్రకర్ణేశ్వరం అనేతీర్థంలో; రుద్ర, పూజయున్= శివుడి ఆరాధనయు; అరుంధతీవటంబును= అరుంధతి ప్రతిష్ఠించిన మర్రిచెట్టుగల చోటు; సింధు ప్రభవంబును= సింధునది పుట్టినచోటు; యమునా ప్రభవంబును= యమున పుట్టినచోటు; అను పుణ్యతీర్థంబుల సేవయు= అనే పుణ్యతీర్థాల సందర్శనం; సర్వసిద్ధి కరంబులు= అన్ని ఫలాలను ఒనగూర్చేవి; వేదిక+అను, తీర్థంబును; ఋషికుల్య+అను, తీర్థంబును; కృత్తికా, మఘ, తీర్థంబులును= కృత్తిక, మఘ అనే తీర్థాలున్నూ; విద్యాతీర్థంబును= విద్య అనేతీర్థాన్నీ; వేతసిక+అను, తీర్థంబును= వేతసిక అనే తీర్థాన్నీ; చూచి; దురితంబుల వలనన్+తొలగుదురు= పాపాలనుండి విముక్తులు అవుతారు; బ్రహ్మ, తీర్థంబు+ఆడి= బ్రహ్మతీర్థంలో స్నానంచేసి; పద్మ, వర్ణ, యానంబుల= పద్మంవంటి రంగు గల విమానాలలో; బ్రహ్మలోక గతులు+అగుదురు= సత్యలోకాన్ని చేరినవారు అవుతారు.

**తాత్పర్యం:** మరియు సప్తగంగాసంగమం, త్రిగంగాసంగమం, శక్రావర్తం, కనస్వలం, గంగా సరస్వతీ సంగమం మొదలైన పుణ్యతీర్థాలలో స్నానంచేస్తే పుణ్యలోకాలు లభిస్తాయి. భద్రకర్ణేశ్వరంలో రుద్రపూజ, అరుంధతి నాటిన మర్రిచెట్టు గలస్థలం అరుంధతీవటం, సింధునది పుట్టినచోటు, యమున పుట్టినచోటు- ఆ పుణ్యస్థలాలు సేవించటం వలన సర్వసిద్ధులు కలుగుతాయి. వేదిక, ఋషికుల్య, కృత్తిక, మఘ, విద్య, వేతసిక అనే తీర్థాలను సేవిస్తే పాపాలు తొలగుతాయి. బ్రహ్మతీర్థంలో స్నానం చేస్తే పద్మవర్ణం కల విమానంలో సత్యలోకానికి చేరుతారు.

**చ. సురుచిరకీర్తి! నైమిశముఁ జూచిన మాత్రన పాయుఁ బాప మ**
**చ్చెరువుగ; నందు మాసము వసించి యనంతఫలంబు లొందఁ గాం**
**తురు; బహుతీర్థసేవనముతోడ సమానము నైమిశంబునం**
**దరుదుగ నొక్కనాఁడు శుచియై యుపవాసము సేయఁ గాంచినన్. 273**

**ప్రతిపదార్థం:** సురుచిర కీర్తి!= మిగుల ప్రకాశవంతమైన యశస్సు కలవాడా!, ఓ ధర్మరాజా!; నైమిశమున్= నైమిశం అనే అరణ్యతీర్థాన్ని; చూచినమాత్రన= చూచినంత మాత్రాననే; పాపము= దురితం; అచ్చెరువుగన్= అద్భుతంగా; పాయున్= తొలగుతుంది; అందున్= ఆ నైమిశంలో; మాసము వసించి= ఒక నెల నివసించి; అనంత, ఫలంబులు= మితిలేని పుణ్యాలు; ఒందన్+కాంతురు= పొందుతారు; నైమిశంబు+అందు= నైమిశంలో; అరుదుగన్; ఒక్కనాఁడు= ఒకే ఒకదినంలో; శుచి+ఐ= నిర్మలంగా; ఉపవాసము, చేయన్+కాంచినన్= ఆహారం తీసికోకుండా వస్తుంటే; బహు, తీర్థ, సేవనముతోడన్= పెక్కు తీర్థాలను సేవించటంతో; సమానము= తుల్యం.

**తాత్పర్యం:** దేదీప్యమానమైన కీర్తిగల ఓ ధర్మరాజా! నైమిశాన్ని చూస్తే చాలు ఆశ్చర్యకరంగా పాపాలన్నీ పటాపంచలు కాగలవు. అందులో ఒకనెల నివసిస్తే మితిలేని పుణ్యాలు లభిస్తాయి. అచ్చట ఒకే ఒకనాడు శుచిగా ఉపవాసం చేస్తే పెక్కుతీర్థాలను సేవించటంతో సమానమైన గొప్పపుణ్యం చేకూరుతుంది.

**విశేషం:** నైమిశంలో మహాభారత పురాణ ప్రవచనం పండ్రెండేండ్లు జరిగిన సత్రయాగసందర్భంగా కొనసాగింది. అట్లే భారతీయ వాఙ్మయంలో సుప్రసిద్ధమైన క్షేత్రమాహాత్మ్య ప్రవచనాలు, వ్రతాచరణల విశిష్ట ప్రబోధాలు మున్నగునవి జరిగాయి. ఈ విధంగా భారతీయసాహిత్యంలో నైమిశానికి నిరుపమానమైన ప్రశస్తి నెలకొని ఉన్నది.

**వ. మఱియు గంగోద్భేద తీర్థంబు నిందీవర తీర్థంబు గంగాద్వారంబు దిశాపతి తీర్థంబు లనియెడు తీర్థంబుల నాడి వాజపేయఫలంబుఁ బడయుదురు; బాహుద యను తీర్థం బాడిన ననేకసత్త్రయాగఫలం బగు; నెందేని రాముండు స్వర్గగతుం డయ్యె నట్టి సరయూప్రదేశంబున గోప్రదానం బాడియు, దేవతలకు ఋషులకు యజ్ఞ భూమియయిన తీరంబులు గల గోమతి నాడియు నశ్వమేధ ఫలంబు వడయుదురు; కోటితీర్థంబునం గుమారు నర్చించియు, వారణాసియందు రుద్రు నర్చించియుఁ, గపిలాహ్రదం బాడియు రాజసూయ ఫలప్రాప్తు లగుదురు; మార్కండేయ తీర్థం బయిన గంగాగోమతీ సంగమం బాడియు బ్రహ్మకల్పితం బయిన యూపంబుఁ బ్రదక్షిణంబు సేసియు వాజపేయఫలంబు వడయుదురు. 274**

**ప్రతిపదార్థం:** మఱియు= పిమ్మట; గంగోద్భేద తీర్థంబున్= గంగోద్భేదమనే తీర్థం; (గంగా+ఉద్భేదం= గంగ ఊటగా బయటికి వచ్చినచోటు, అంటే గంగానది జన్మస్థలం); ఇందీవర తీర్థంబు= ఇందీవరం అనే పేరుకల తీర్థం (ఇందీవరం= నల్లకలువ, నల్లకలువలు కల తీర్థం); గంగాద్వారంబు= గంగాద్వారం అనేతీర్థం (గంగ భూమికి అవతరించిన ప్రదేశం, హరిద్వారం); దిశాపతి తీర్థంబులు= దిశాపతులనే తీర్థాలు (దిశాపతి= దిక్పాలకుడు); అనియెడు= తీర్థంబులన్+ఆడి= అనే తీర్థాలలో స్నానంచేసి; వాజపేయ, ఫలంబున్= వాజపేయయాగాన్ని చేసినపుణ్యాన్ని; పడయుదురు= పొందుతారు; బాహుద+అను, తీర్థంబు+ఆడినన్= బాహుద అనే తీర్థంలో స్నానం చేస్తే; అనేక, సత్త్రయాగ, ఫలంబు+అగున్= పెక్కు సత్త్రయాగాలు చేసిన పుణ్యం సంక్రమిస్తుంది; ఎందేని= ఏచోటనైతే; రాముండు= శ్రీరాముడు; స్వర్గ+గతుండు+అయ్యెన్= స్వర్గలోకానికి వెళ్ళాడో; అట్టి= ఆ; సరయూ ప్రదేశంబునన్= సరయూ నది గల స్థలంలో అంటే అయోధ్యలో; గో ప్రదానంబు+ఆడియు= గోప్రదానం అనే తీర్థంలో స్నానం చేసి; దేవతలకు, ఋషులకున్= సురలకు, మునులకు; యజ్ఞభూమి+అయిన= యజ్ఞాలుచేసే చోటులైన; తీరంబులు+కల= గట్లు గల; గోమతిన్+ఆడియున్= గోమతీనదిలో స్నానంచేసి; అశ్వమేధఫలంబు+పడయుదురు= అశ్వమేధయాగం చేసిన పుణ్యం పొందగలరు; కోటి తీర్థంబునన్= కోటితీర్థంలో; కుమారున్= కుమారస్వామిని; అర్చించియు= ఆరాధించియు; వారణాసి+అందు= కాశిలో; రుద్రున్= శివుడిని; అర్చించియున్= పూజించియు; కపిలా, హ్రదంబు+ఆడియు= కపిలాహ్రదంలో స్నానంచేసియు; రాజసూయ, ఫల, ప్రాప్తులు= రాజసూయయాగాన్ని చేసినపుణ్యం పొందినవారు; అగుదురు= అవుతారు; మార్కండేయ, తీర్థంబు+అయిన= మార్కండేయమహర్షిచేత ప్రతిష్ఠించబడిన పుణ్యక్షేత్రమైన; గంగా, గోమతీ, సంగమంబు+ఆడియు= గంగ, గోమతి కలిసేచోట స్నానంచేసియు; బ్రహ్మ, కల్పితంబు+అయిన= బ్రహ్మచేత నిర్మించబడిన; యూపంబున్= యజ్ఞస్తంభాన్ని; ప్రదక్షిణంబు+చేసియు= చుట్టును తిరిగియు; వాజపేయ, ఫలంబు= వాజపేయయాగం చేసిన పుణ్యాన్ని; పడయుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** గంగానది ఉద్భవించిన స్థలం గంగోద్భేదం అనే తీర్థం, ఇందీవరతీర్థం, గంగానది భూమికి దిగిన గంగాద్వారం అనే హరిద్వారతీర్థం, దిశాపతితీర్థాలు- వీటిలో స్నానంచేస్తే వాజపేయయాగం చేసిన పుణ్యం లభిస్తుంది.

బాహుద అనే తీర్థంలో స్నానం చేస్తే పెక్కు సత్త్రయాగాలు చేసినపుణ్యం లభిస్తుంది. శ్రీరాముడు స్వర్గాన్ని చేరిన సరయూనదీ ప్రదేశంలోని గోప్రదానమనే పేరు గల పుణ్యతీర్థంలో స్నానం చేస్తే, దేవతలయొక్క మునులయొక్క యజ్ఞకార్యాలకు ఉనికిపట్టులయిన తీరాలు గల గోమతిలో స్నానం చేస్తే అశ్వమేధయాగం చేసినపుణ్యాన్ని ఆర్జిస్తారు. కోటితీర్థంలో శ్రీకుమారస్వామిని ఆరాధించినా, కాశిలో శివుడిని పూజించినా, కపిలాహ్రదంలో స్నానంచేసినా, రాజసూయయాగం చేసిన పుణ్యం లభిస్తుంది. మార్కండేయమహర్షి నిర్మించిన గంగాగోమతి సంగమం అనే క్షేత్రంలో స్నానంచేసినా, బ్రహ్మ నిర్మించిన యూపస్తంభానికి ప్రదక్షిణం చేసినా వాజపేయయజ్ఞం చేసిన పుణ్యం ఆర్జిస్తారు.

**సీ. పలువురఁ గొడుకులఁ బడయంగ వలయు; నం । దొక్కరుం డయినను నోపి గయకు**
**నరుగునో యనియును, నశ్వమేధం బొప్పఁ । జేయునో యనియును, శ్వేత మైన**
**యాఁబోతు విడుచునో యనియును గోరుదు । రనవద్యు లైన గృహస్థు లట్టి**
**గయ కేఁగి యుభయ పక్షములు వసించిఁ । గడుఁ బుణ్యు లుభయపక్షములవారి**

**ఆ. నుద్ధరింతు; రంద యొగిఁ బిండ మిడిన వా । రనఘ! పితృదయను గృతార్థు లగుదు;**
**రందు ఫల్గుతీర్థ మాడినవారికిఁ । బరమసిద్ధితో శుభంబు పెరుఁగు. 275**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ ధర్మరాజా!; పలువురన్, కొడుకులన్+పడయంగ వలయున్= పెక్కుమంది పుత్రులను కనాలి; అందు= ఆ కుమారులలో; ఒక్కరుండు+అయిననున్= ఒక్కడైనను; ఓపి= పూనికతో; గయకున్= గయాక్షేత్రానికి; అరుగునో= వెళ్ళుతాడో; అనియునున్= అని తలపోస్తూ; అశ్వమేధంబు= అశ్వమేధయాగాన్ని; ఒప్పన్= శోభిల్లేటట్లు; చేయునో+అనియును= చేస్తాడేమో అనియున్నూ; శ్వేతము+ఐన= తెల్లనైన; ఆఁబోతు= పెద్దఎద్దును; విడుచునో+అనియును= విడిచిపెట్టునో అనియున్నూ; అంటే గోసంతతి ఉత్పత్తికై ఆంబోతును అందరి మేలుకొరకు దానంచేస్తాడా అనియున్నూ; అనవద్యులు+ఐన= నింద్యులు కాని అంటే పవిత్ర చరిత్రులయిన; గృహస్థులు= గృహస్థాశ్రమంలో ఉండే సంసారులు; కోరుదురు= కాంక్షిస్తారు; అట్టి= అటువంటి; గయకు+ఏఁగి= గయకు వెళ్ళి; ఉభయ పక్షములు, వసించినన్= రెండుపక్షాలు (శుక్ల, కృష్ణ) అంటే ఒకమాసం నివసిస్తే అలా నివసించినటువంటి; కడు+పుణ్యులు= మిక్కిలి పుణ్యులు; ఉభయ పక్షముల వారిన్= ఇటు తండ్రిపక్షంవారిని, అటు తల్లిపక్షంవారిని; ఉద్ధరింతురు= కాపాడతారు; అందు+అ= అచట; అంటే ఆ గయాతీర్థంలో; ఒగిన్= ఒప్పిదంగా; పిండము+ఇడినవారు= పితరులకు పిండప్రదానం చేసినవారు; పితృదయను= పితరుల అనుగ్రహంచేత; కృత+అర్థులు+అగుదురు= చరితార్థులు (ధన్యులు) అవుతారు; అందు= అందలి; ఫల్గు తీర్థము+ఆడినవారికిన్= ఫల్గుతీర్థంలో స్నానంచేసినవారికి; పరమసిద్ధితో= గొప్ప పుణ్యఫలంతో; శుభంబు= మేలు; పెరుఁగున్= వృద్ధి అవుతుంది.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ ధర్మరాజా! పెక్కుమంది కొడుకులు కలగాలనిన్నీ, అందులో ఏ ఒక్కడయినా పూనుకొని గయకు వెళ్ళుతాడా అనిన్నీ, అశ్వమేధయాగం చేస్తాడా అనిన్నీ, తెల్లని ఆఁబోతును దానంగా విడిచిపెట్టుతాడా అనిన్నీ, నిర్మలమైన హృదయంగల గృహస్థులు కోరుకొంటూ ఉంటారు కదా! అట్టి గయకు వెళ్ళి శుక్ల కృష్ణపక్షాలు (ఒకనెల) నివసిస్తే అటువంటి పుణ్యాత్ములు తండ్రివైపువారిని, తల్లివైపువారిని (ఉభయపక్షాలవారిని) ఉద్ధరించిన వారు అవుతారు. అచట పిండప్రదానం చేస్తే పితృదేవతల దయవలన చరితార్థులు అవుతారు. అందులోని ఫల్గుతీర్థంలో స్నానమాడినవారికి గొప్ప పుణ్యఫలంతో పాటు అభ్యున్నతి కూడా కలుగుతుంది.

వ. మఱి యక్షిణీతీర్థంబునందు జలపానంబు సేసి బ్రహ్మహత్యాది దోష విముక్తు లగుదురు; మణినాగం బను తీర్థం బాడినవారికి నాశీవిషవిషంబు లొందవు; గౌతమవనంబునం దహల్యాహ్రదం బాడి యుదపానం బను తీర్థం బాడియు నశ్వమేధ ఫలంబుఁ బడయుదురు; రాజర్షి జనక కూపం బాడి విష్ణులోకప్రాప్తు లగుదురు; కంపనయు మహానదియు నను తీర్థంబుల నాడినవారు పౌండరీక ఫలంబు నొందుదురు; దేవపుష్కరిణిని మహేశ్వరధారను మహేశ్వరపదంబున నాడిన నశ్వమేధఫలంబు వడయుదురు; తొల్లి కూర్మరూపుం డయిన యసురచేతం గోటితీర్థంబు లపహృతంబు లయిన వానిఁ దెచ్చి, విష్ణుఁ డెందేని నిలిపె నట్టి మహేశ్వరపథం బను తీర్థంబాడియు, విష్ణుస్థానం బయిన సాలగ్రామం బను తీర్థంబాడి విష్ణు నర్చించియు, నందు సన్నిహిత చతుస్సముద్రం బయిన కూపంబు నాడియు విష్ణులోకగతు లగుదురు; భరతాశ్రమంబునఁ, జంపకారణ్యంబున దేవీసహితు నీశ్వరుం బూజించి మిత్రావరుణలోకంబు వడయుదురు; కన్యాసంవేద్యం బను తీర్థంబునఁ గన్యాదానంబు చేసి యక్షయఫలప్రాప్తు లగుదురు; దేవకూటం బను తీర్థంబాడి బ్రహ్మలోకం బుఁబడయుదు; రెందేని విశ్వామిత్రుండు సిద్ధింబొందె నట్టి కౌశికహ్రదం బాడియుఁ, గుమారవీరాశ్రమంబున నొక్కమాసంబు వసించియు నశ్వమేధ ఫలంబు వడయుదు; రగ్నిధారయుఁ బితామహ సరంబునం బుట్టిన కుమార ధారయు నాడి, త్రిరాత్రోపవాసంబు సేసినవారు బ్రహ్మహత్యాది దోషవిముక్తు లగుదురు; గౌరీశిఖరకుండం బాడిన నందినీకూపం బాడిన నశ్వమేధఫలం బగుఁ; గాళికా కౌశికా సంగమంబునందుఁ ద్రిరాత్రోపవాసంబు సేసినవారు సర్వపాప విముక్తులగుదు; రూర్వశీతీర్థం బాడిన సర్వపూజార్హు లగుదురు; గోకర్ణంబను తీర్థంబాడి జాతిస్మరణంబు వడయుదురు; సరస్వతీ తీర్థస్నాతులయి వృషభ ద్వీపంబునం గుమారుఁ బూజించి దేవవిమానగతు లగుదురు; నందయు, నౌలకమును, గరతోయంబును, గంగాసాగరసంగమంబు నను తీర్థంబు లాడి శతాశ్వమేధ ఫలంబు వడయుదురు; శోణా నర్మదాప్రభవంబును, బదరీతీర్థంబును నాడి యాయుష్మంతు లగుదురు; మహేంద్రంబును రామతీర్థంబును, మతంగ కేదారమ్మును, వంశగుల్మంబు నను తీర్థంబుల నాడి యశ్వమేధఫలంబు వడయుదురు. 276

**ప్రతిపదార్థం:** మఱి= అదియునుగాక; యక్షిణీ తీర్థంబునందు= యక్షిణి అనేతీర్థంలో; జలపానంబు+చేసి= నీటిని త్రాగి; బ్రహ్మ, హత్యా+ఆది, దోష విముక్తులు+అగుదురు= బ్రాహ్మణులను చంపటం మున్నగు వాటిచేత వచ్చిన పాపాలనుండి తొలగినవారు అవుతారు; మణి, నాగంబు+అను, తీర్థంబు+ఆడిన వారికిన్= మణినాగం అనేతీర్థంలో స్నానంచేసినవారికి; ఆశీవిష విషంబులు= ఆశీవిషములు అంటే పాములు (కోరలందు విషం కలవి), వాటియొక్క విషములు; ఒందవు= పొందవు; దరిజేరవు; గౌతమ, వనంబునందున్= గౌతమఋషి వసించిన అడవిలో; అహల్యా, హ్రదంబు+ఆడి= అహల్య అనే మడువులో స్నానంచేసి; ఉదపానంబు+అను, తీర్థంబు+ఆడియు= ఉదపానం అనే తీర్థంలో స్నానంచేసియు; అశ్వమేధఫలంబున్+పడయుదురు= అశ్వమేధయాగం చేసినపుణ్యం పొందుతారు; రాజర్షి, జనక కూపంబు= రాజర్షి అయిన జనకుడి పేర విలసిల్లే నూతి నీటిలో; ఆడి= స్నానం చేసి; విష్ణులోక ప్రాప్తులు+అగుదురు= వైకుంఠం ప్రాప్తించినవారు అవుతారు; కంపనయు= కంపన అనునటువంటిదియు; మహానదియున్; అను, తీర్థంబులన్+ఆడినవారు= అనబడే తీర్థాలలో స్నానంచేసినవారు; పౌండరీక ఫలంబున్= పౌండరీకయజ్ఞం చేసినపుణ్యం; ఒందుదురు= పొందుతారు; దేవ పుష్కరిణిని= దేవ పుష్కరిణిలో; మహేశ్వరధారను= మహేశ్వరధార అనేతీర్థంలోను; మహేశ్వర పదంబునన్= మహేశ్వరపదమనే తీర్థంలో; ఆడినన్= స్నానంచేస్తే; అశ్వమేధ ఫలంబు= అశ్వమేధయాగం చేస్తే వచ్చేపుణ్యం; పడయుదురు= పొందుతారు; తొల్లి= పూర్వకాలంలో; కూర్మ,

రూపుండు+అయిన= తాబేలు ఆకృతి ధరించిన; అసురచేతన్= రాక్షసుడిచేత; కోటి, తీర్థంబులు= కోటి తీర్థాలు; అపహృతంబులు+అయిన= బలాత్కారంగా అపహరించబడగా; వానిన్+తెచ్చి= ఆ కోటితీర్థాలను తెచ్చి; విష్ణుఁడు= విష్ణుదేవుడు; ఎందేని= ఏ చోట; నిలిపెన్= ప్రతిష్ఠించాడో; అట్టి= ఆ; మహేశ్వర పథంబు+అను, తీర్థంబు+ఆడియు= మహేశ్వరపథం అనే తీర్థంలో స్నానంచేసియు; విష్ణుస్థానంబు+అయిన= విష్ణువుకు నెలవయిన; సాలగ్రామంబు= సాలగ్రామం; అను, తీర్థంబు+ఆడి= అనే తీర్థంలో స్నానంచేసి; విష్ణున్+అర్చించియున్= శ్రీ మహావిష్ణువును పూజించియు; అందున్= ఆ సాలగ్రామమనే తీర్థంలో; సన్నిహిత, చతుర్+సముద్రంబు+అయిన= ఒక్కచోటికి దగ్గరగా తేబడిన నాలుగు సముద్రాల జలం కలిగినది అయిన; కూపంబున్+ఆడియు= నూతిలో స్నానంచేసియు; విష్ణులోక గతులు= వైకుంఠానికి వెళ్ళినవారు; అగుదురు= అవుతారు; భరత+ఆశ్రమంబునన్= భరతుడి పేరుమీద వెలసిన ఆశ్రమంలో; చంపక+అరణ్యంబునన్= చంపకం అనే అడవిలో; దేవీ సహితున్= దేవితో కూడిన; ఈశ్వరున్= శివుడిని; పూజించి; మిత్రావరుణలోకంబు= మిత్రావరుణులు ఉండే లోకాన్ని; పడయుదురు= పొందుతారు; కన్యా, సంవేద్యంబు+అను తీర్థంబునన్= కన్యా సంవేద్యం (సంవరణం) అనేతీర్థంలో; కన్యా దానంబు+చేసి= కన్యను తగిన వరుడికి ఇచ్చి పెండ్లిచేసి; అక్షయ, ఫల, ప్రాప్తులు= తరగని పుణ్యం లభించినట్టివారు; అగుదురు= అవుతారు; దేవ, కూటంబు+అను, తీర్థంబు+ఆడి= దేవకూటం అనేతీర్థంలో స్నానంచేసి; బ్రహ్మలోకంబున్= సత్యలోకాన్ని; పడయుదురు= పొందుతారు; ఎందేని= ఏచోట; విశ్వామిత్రుండు; సిద్ధిన్+పొందెన్= తపస్సుయొక్క సంపూర్ణఫలితాన్ని (బ్రహ్మర్షిపదవిని) పొందాడో; అట్టి= ఆ; కౌశికహ్రదంబు+ఆడియున్= కౌశికహ్రదం అనే తీర్థంలో స్నానంచేసియు; కుమార వీర+ఆశ్రమంబునన్= కుమారవీరుడి ఆశ్రమంలో; ఒక్క మాసంబు= ఒక నెల; వసించియున్= ఉండియు; అశ్వమేధ, ఫలంబు+పడయుదురు= అశ్వమేధ పుణ్యం పొందుతారు; అగ్నిధారయున్= అగ్నిధార అనే తీర్థంలోను; పితామహ, సరంబునన్= బ్రహ్మ సరోవరంలో; పుట్టిన; కుమారధారయున్= కుమారధార అనే తీర్థంలోను; ఆడి= స్నానంచేసి; త్రి, రాత్ర+ ఉపవాసంబు+చేసినవారు= మూడురాత్రులు ఉపవాసండున్నవారు; బ్రహ్మ, హత్యా+ఆది, దోష విముక్తులు+అగుదురు= బ్రహ్మహత్య మున్నగు పాపాలనుండి విముక్తి చెందినవారు అవుతారు; గౌరీశిఖర, కుండంబు= గౌరీశిఖరకుండం అనే తీర్థంలో; ఆడినన్= స్నానం చేయగా; నందినీ కూపంబు+ఆడినన్= నందినీకూపంలో స్నానంచేయగా; అశ్వమేధ ఫలంబు+అగున్= అశ్వమేధయాగ పుణ్యం లభిస్తుంది; కాళికా, కౌశికా, సంగమంబునందున్= కాళికానది, కౌశికానది కలిసిన తీర్థంలో; త్రిరాత్ర+ ఉపవాసంబు+చేసినవారు= మూడురాత్రులు అన్నం తినకుండా ఉపవసించినవారు; సర్వపాప విముక్తులు= పాపాలన్నింటినుండి తొలగినవారు; అగుదురు= అవుతారు; ఊర్వశీ తీర్థంబు+ఆడిన= ఊర్వశీతీర్థంలో స్నానం చేసినట్లయితే; సర్వ, పూజా+అర్హులు+అగుదురు= సమస్తపూజలు పొందటానికి యోగ్యత కలవారు అవుతారు; గోకర్ణంబు+అను, తీర్థంబు+ఆడి= గోకర్ణమనే తీర్థంలో స్నానంచేసి; జాతి స్మరణంబు= పూర్వజన్మస్మృతిని, లేదా, తాను ఏజాతికి చెందితే ఆ జాతిని స్మరించటాన్ని; పడయుదురు= పొందుతారు; సరస్వతీ, తీర్థ, స్నాతులు+అయి= సరస్వతీతీర్థంలో స్నానంచేసి; వృషభ ద్వీపంబునన్= వృషభం అనే పేరున్న దీవిలో; కుమారున్= కుమారస్వామిని; పూజించి= ఆరాధించి; దేవ, విమాన, గతులు= దేవతల విమానాలపై పయనించేవారు; అగుదురు= అవుతారు; నందయున్+ఔలకమును, కరతోయంబును, గంగా సాగర సంగమంబున్+అను, తీర్థంబులు+ఆడి= నంద, ఔలకం, కరతోయం, గంగాసాగరసంగమం అనేతీర్థాలలో స్నానంచేసి; శత+అశ్వమేధ, ఫలంబు= నూరు అశ్వమేధయాగాలు చేసినపుణ్యం; పడయుదురు= పొందుతారు; శోణా, నర్మదా, ప్రభవంబును= శోణానది, నర్మదానది పుట్టినచోటులోను; బదరీతీర్థంబును= బదరీ పుణ్యక్షేత్రంలోను; ఆడి= స్నానంచేసి; ఆయుష్మంతులు+ అగుదురు= ఆయుర్దాయం కలవారు అవుతారు; మహేంద్రంబును; రామతీర్థంబును; మతంగ కేదారమ్మును; వంశగుల్మంబును; అను తీర్థంబులన్+ఆడి= అని పిలువబడే తీర్థాలలో స్నానంచేసి; అశ్వమేధఫలంబు+ పడయుదురు= అశ్వమేధయాగం చేస్తే వచ్చే పుణ్యాన్ని పొందుతారు.

**తాత్పర్యం:** యక్షిణీతీర్థంలో నీటిని త్రాగితే బ్రహ్మహత్య మున్నగు పాతకాలనుండి తొలగుతారు. మణినాగం అనేతీర్థంలో స్నానంచేసినవారిని సర్పాల విషాలు ప్రవేశించవు (వారికి ఏ హానీ చేయజాలవు). గౌతమవనంలోని

అహల్యాహ్రదంలో స్నానంచేస్తే, ఉదపానం అనే తీర్థంలో క్రుంకులిడితే అశ్వమేధం చేసినపుణ్యం లభిస్తుంది. రాజర్షి అయిన జనకుడి పేర వెలసిన జనకకూపంలో స్నానంచేస్తే వైకుంఠప్రాప్తి కలుగుతుంది. కంపన, మహానది, అనేతీర్థాలలో స్నానంచేసినవారు పౌండరీకయాగం చేసిన ఫలితాన్ని పొందుతారు. దేవపుష్కరిణి, మహేశ్వరధార, మహేశ్వర పదం- వీటిలో స్నానంచేసినవారికి అశ్వమేధయాగం చేసిన పుణ్యం లభిస్తుంది. పూర్వకాలంలో ఒకరాక్షసుడు తాబేలురూపంలో కోటితీర్థాలను అపహరించాడు. అప్పుడు విష్ణుదేవుడు ఆ కోటితీర్థాలను తెచ్చి మహేశ్వరపథంలో నిలిపాడు. ఆ తీర్థంలో స్నానం చేస్తే, విష్ణుస్థానమైన సాలగ్రామం అనేతీర్థంలో స్నానంచేసి విష్ణువును పూజిస్తే, అందులో నాలుగు సముద్రాలు చేరిన నూతిలో స్నానంచేస్తే వైకుంఠానికి వెళ్ళుతారు. భరతాశ్రమంలో చంపకారణ్యంలో దేవీసమేతుడైన శివుడిని పూజిస్తే మిత్రావరుణలోకం సిద్ధిస్తుంది. కన్యాసంవేద్యం అనే తీర్థంలో కన్యాదానం చేస్తే అక్షయపుణ్యం లభిస్తుంది. దేవకూటం అనేతీర్థంలో స్నానంచేస్తే సత్యలోకం సిద్ధిస్తుంది. ఎచట విశ్వామిత్రుడు తపస్సిద్ధిని (బ్రహ్మర్షి పదాన్ని) పొందాడో అట్టి కౌశికహ్రదంలో స్నానంచేస్తే, కుమార వీరాశ్రమంలో ఒకనెల నివసిస్తే అశ్వమేధయాగం చేస్తే వచ్చే పుణ్యం లభిస్తుంది. అగ్నిధార అనేతీర్థంలోను, బ్రహ్మసరస్సునుండి పుట్టిన కుమారధార అనే తీర్థంలో స్నానం చేసి, మూడురాత్రులు ఉపవాసం చేసినవారు బ్రహ్మహత్య మున్నగు పాపాలనుండి విముక్తులు అవుతారు. గౌరీ శిఖరకుండంలోను, నందినీకూపంలోను స్నానంచేస్తే అశ్వమేధయాగం చేసినఫలం పొందుతారు; కాళిక, కౌశిక అనే తీర్థాలు కలసిన చోట మూడురాత్రులు ఉపవాసం చేసినవారు పాపాలన్నింటినుండి విముక్తులు కాగలరు. ఊర్వశీతీర్థంలో స్నానంచేసినవారు సమస్తపూజలకు యోగ్యులు అవుతారు. గోకర్ణతీర్థంలో స్నానంచేసిన వారికి జాతిస్మరణం లభిస్తుంది. సరస్వతీతీర్థంలో స్నానంచేసినవారు వృషభద్వీపంలో కుమారస్వామిని అర్చించినవారు దేవతల విమానాలను అధిరోహిస్తారు. నంద, ఔలకం, కరతోయం, గంగాసాగరసంగమం అనే తీర్థాలలో స్నానంచేసినవారు నూరు అశ్వమేధయాగాలు చేసిన పుణ్యాన్ని ఆర్జిస్తారు. శోణానది, నర్మదానది పుట్టినచోట్లో, బదరీతీర్థంలో స్నానం చేసినవారికి ఆయుర్దాయం పెరుగుతుంది. మహేంద్ర, రామతీర్థ, మతంగ కేదార, వంశ గుల్మాలు అనేతీర్థాలలో స్నానంచేసినవారు అశ్వమేధయాగం చేసిన పుణ్యం ఆర్జిస్తారు (సంపాదిస్తారు).

**తే.** **పరమమైన తీర్థంబు శ్రీపర్వతంబు । నందు దేవహ్రదం బాడి యాదిదేవు**
**నీశు నర్చించి పడయుదు రిష్టఫలము । నశ్వమేధఫలంబును నవనిజనులు.** **277**

**ప్రతిపదార్థం:** పరమము+ఐన, తీర్థంబు= మిక్కిలి గొప్పది అయిన పుణ్యక్షేత్రం; శ్రీపర్వతంబు= శ్రీశైలం; అందు= ఆ శ్రీశైలంలో; దేవహ్రదంబు+ఆడి= దేవతల మడువులో స్నానంచేసి; ఆదిదేవున్= మొదటిదేవుడిని; ఈశున్= శివుడిని; అర్చించి= పూజించి; అవనిజనులు= భూలోకప్రజలు; ఇష్ట, ఫలమున్= కోరిన కోరికలు; అశ్వమేధ ఫలంబునున్= అశ్వమేధయాగం చేసిన పుణ్యాన్ని; పడయుదురు= పొందుతారు.

**తాత్పర్యం:** పుణ్యక్షేత్రాలలో గొప్పక్షేత్రం శ్రీశైలం. అందు దేవహ్రదం అనేమడుగులో స్నానంచేసి, భూలోకవాసులు ఆదిదేవుడైన శివుడిని పూజించి అభీష్టాలను, అశ్వమేధయాగం చేసినపుణ్యాన్ని ఆర్జిస్తారు.

**వ.** **తొల్లి శతక్రతుండు నూఱుక్రతువులు సేయుటంజేసి పవిత్రంబయిన కృష్ణవేణియందు దేవహ్రదం బాడిన సర్వపాపవినాశనం బగుఁ; బాండ్యపర్వతంబునం గావేరీతీర్థంబును, దుంగభద్రయు, సముద్రతీర్థంబును, గన్యాతీర్థంబును నాడి యశ్వమేధఫలంబు వడయుదురు; గాయత్రీస్థానంబునం ద్రిరాత్రంబు గాయత్రీజపంబు**

**చేసినవారికి జన్మ దుఃఖంబులు లేవు; పెన్న యను మహానది నాడిన మయూరహంస విమానగతు లగుదురు; గోదావరీ స్నానంబు సేసిన దశాశ్వమేధ ఫలంబు వడయుదురు; పయోష్ణియు, దండకారణ్యంబును, శరభంగాశ్రమంబును, శుక్రాశ్రమంబును, జమదగ్నిసేవితంబయిన శూర్పారకంబును, సప్తగోదావరీ తీర్థంబును నాడిన పుణ్యులు పుణ్యలోకప్రాప్తు లగుదురు. 278**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వకాలంలో; శతక్రతుండు= దేవేంద్రుడు; నూఱుక్రతువులు= వందయజ్ఞాలు; చేయుటన్+చేసి= చేయటంచేత; పవిత్రంబు+అయిన= పరిశుద్ధమైన; కృష్ణవేణి+అందు= కృష్ణవేణిలో ఉండే; దేవహ్రదంబు+ఆడిన= దేవహ్రదంఅనే తీర్థంలో స్నానం చేస్తే; సర్వ, పాప, వినాశనంబు+అగున్= సమస్తదురితాలు నశిస్తాయి; పాండ్య, పర్వతంబునన్= పాండ్యపర్వతంలోని; కావేరీతీర్థంబునున్= కావేరీతీర్థంలోను; తుంగభద్రయు= తుంగభద్రానదిలో; సముద్రతీర్థంబును= సముద్రతీర్థంలోను; కన్యాతీర్థంబును= కన్యాతీర్థంలోను (కన్యాకుమారిదగ్గరిది); ఆడి= స్నానంచేసి; అశ్వమేధ, ఫలంబు= అశ్వమేధయాగం చేసిన పుణ్యం; పడయుదురు= పొందుతారు; గాయత్రీ స్థానంబునన్= గాయత్రీస్థానం అనే తీర్థంలో; త్రిరాత్రంబు= మూడురాత్రులు; గాయత్రీ, జపంబు, చేసినవారికి= గాయత్రీమంత్రాన్ని జపించినవారికి; జన్మ, దుఃఖంబులు= జనన మరణావృత్తులనే దుఃఖాలు; లేవు; పెన్న+అను= పెన్నఅనే; మహానదిన్+ఆడిన= మహానదిలో స్నానంచేస్తే; మయూర, హంస, విమాన, గతులు+అగుదురు= నెమలిఆకారంతో, హంసరూపంతో ఉండే విమానాలపై విహరించేవారు అవుతారు; గోదావరీ స్నానంబు+చేసిన= గోదావరీ మహానదిలో స్నానంచేస్తే; దశ+అశ్వమేధ, ఫలంబు= పది అశ్వమేధయాగాలు చేసిన పుణ్యం; పడయుదురు= పొందుతారు; పయోష్ణియు= పయోష్ణితీర్థంలోను; దండకారణ్యంబును= దండకారణ్యం అనే పేరున్నతీర్థంలోను; శరభంగ+ఆశ్రమంబునున్= శరభంగ మహాముని స్థాపించిన ఆశ్రమంలోను; శుక్ర+ఆశ్రమంబును= శుక్రుడు స్థాపించిన ఆశ్రమంలోను; జమదగ్ని, సేవితంబు+అయిన= జమదగ్ని మహామునిచేత సేవించబడినదైన; శూర్పారకంబును= శూర్పారక క్షేత్రంలోను; సప్తగోదావరీ తీర్థంబునున్= సప్తగోదావరి (దక్షారామ భీమేశ్వరం) తీర్థంలోను; ఆడిన= స్నానంచేసిన; పుణ్యులు= పుణ్యాత్ములు; పుణ్య, లోక, ప్రాప్తులు+అగుదురు= పుణ్యలోకాలు సిద్ధించినవారు అవుతారు.

**తాత్పర్యం:** పూర్వకాలంలో దేవహ్రదతీర్థంలో దేవేంద్రుడు నూరుయాగాలు చేశాడు కాబట్టి మిగుల పవిత్రమైన కృష్ణవేణిలోని దేవహ్రదంతీర్థంలో స్నానంచేస్తే సమస్తపాపాలు పోతాయి. పాండ్యపర్వతంలోని కావేరీతీర్థంలో, తుంగభద్రలో, సముద్రతీర్థంలోను, ఆ సమీపంలోని కన్యాకుమారీతీర్థంలోను స్నానమాడితే అశ్వమేధయాగం చేసిన పుణ్యం లభిస్తుంది. గాయత్రీస్థానంలో మూడురాత్రులు గాయత్రీమంత్రజపం చేస్తే జన్మరాహిత్యం కలుగుతుంది. పెన్న అనే మహానదిలో స్నానంచేసినవారు నెమలిఆకృతిలో, హంసఆకృతిలో ఉండే విమానాలపై విహరిస్తారు. గోదావరీస్నానం చేస్తే పదిఅశ్వమేధాలు చేసినపుణ్యం దక్కుతుంది. పయోష్ణియు, దండకారణ్యం, శరభంగాశ్రమం, శుక్రాశ్రమం, జమదగ్ని మహాముని సేవించిన శూర్పారకం, దక్షారామ క్షేత్రంలోని సప్త గోదావరీ తీర్థంలోను స్నానం చేసిన పుణ్యాత్ములకు పుణ్యలోకాలు సిద్ధిస్తాయి.

**సీ. అసురుల భయమున నడఁగిన వేదంబు । లోంకారపూర్వమై యుండ నాంగి**
**రసుఁ డుద్ధరించి సారస్వత ప్రముఖులఁ । జదివించె నెందేని శాశ్వతముగ**
**నమరనియుక్తుఁడై యజియించె నెందేని । భృగుఁ డెల్లవారికిఁ బేర్మి నట్టి**
**రమణీయతుంగకారణ్యంబు సూచిన । మాత్రన దురితకర్మంబు లెల్లఁ**

**ఆ. బాయుచుఁ; గాలంజరం బను పర్వతంబు । నందు దేవహ్రదం బాడి యభిమతములు**
**వడయుదురు; మేధికంబునాఁ బరఁగు తీర్థ । మాడి మేధాసమన్వితు లగుదు రెందు. 279**

**ప్రతిపదార్థం:** అసురుల, భయమునన్= రాక్షసుల భయంచేత; అడఁగిన= అణగిఉండిన; వేదంబులు= వేదాలు; ఓంకార పూర్వము+ఐ, ఉండన్= ఓంకారం మొదలుగా కలవై ఉండగా; ఆంగిరసుఁడు+ఉద్ధరించి= ఆంగిరసుడనే మహాముని కాపాడి; సారస్వత ప్రముఖులన్= సారస్వతుడు మొదలయిన ప్రసిద్ధులచేత; శాశ్వతముగన్= ఎల్లప్పుడు నిలిచేటట్లు; ఎందేని= ఏచోట; చదివించెన్= పఠింపచేశాడో; భృగుఁడు= భృగుమహర్షి; ఎందేని= ఏచోట; అమర, నియుక్తుఁడు+ఐ= దేవతలచేత నియోగించబడిన వాడై; యజియించెన్= యజ్ఞంచేశాడో; పేర్మిన్= గౌరవంతో; అట్టి= అటువంటి చోటైన; రమణీయ తుంగక+అరణ్యంబు= సుందరమైన తుంగకారణ్యం; చూచిన మాత్రన= సందర్శించినంతమాత్రాననే; ఎల్లవారికిన్= అందరికి; దురిత, కర్మంబులు+ ఎల్లన్= పాపపరిపాకాలన్నీ; పాయున్= తొలగుతాయి; కాలంజరంబు+అను, పర్వతంబునందు= కాలంజరం అనే కొండలో; దేవహ్రదంబు+ఆడి= దేవహ్రదంఅనే తీర్థంలో స్నానంచేసి; అభిమతములు= కోరికలు; పడయుదురు= పొందుతారు; మేధికంబునాన్+పరఁగు= మేధికం అనబరగే; తీర్థము+ఆడి= తీర్థంలో స్నానంచేసి; ఎందున్= ఎప్పుడైనను; మేధాసమన్వితులు+ అగుదురు= మేధావులు అవుతారు.

**తాత్పర్యం:** రాక్షసులవలని భయంచేత అణగిమణగి ఓంకారం మొదలుగా ఉండే వేదాలను ఉద్ధరించి, ఆంగిరసుడు ఎక్కడ సారస్వతుడు మొదలుగా గల ముఖ్యులచేత చదివించాడో, భృగుమహర్షి దేవతలచేత నియోగించబడినవాడై, ఎక్కడయితే యజ్ఞంచేశాడో అట్టి సుందర తుంగకారణ్యాన్ని గౌరవపురస్సరంగా చూచినంతమాత్రాననే పాపపరిపాకాలన్నీ పటాపంచలవుతాయి. కాలంజరమనే పర్వతంలో ఉండే దేవహ్రదంలో స్నానంచేస్తే కోరినకోరికలు ఈడేరుతాయి. మేధికం అనే తీర్థంలో స్నానంచేస్తే మేధావులవుతారు.

**వ. మఱి చిత్రకూటంబున మందాకిని సేవించి, పితృస్థానంబునం గుమారులం బూజించి, జ్యేష్ఠస్థానంబున రుద్రు నర్చించి రామనివాసం బైన శృంగిబేరపురంబున గంగాస్నాతు లయి గంగాధరు నర్చించియు సర్వపాప విముక్తు లగుదురు. 280**

**ప్రతిపదార్థం:** మఱి= అదియునుగాక; చిత్రకూటంబునన్= చిత్రకూటంలో; మందాకినిన్= గంగను; సేవించి= దర్శించి; పితృస్థానంబునన్= పితృదేవతలస్థానంలో; కుమారున్= కుమారస్వామిని; పూజించి= అర్చించి; జ్యేష్ఠస్థానంబునన్= అగ్రస్థానంలో; రుద్రున్+అర్చించి= శివుడిని పూజించి; రామ, నివాసంబు+ఐన= శ్రీరామచంద్రుడు నివసించిన; శృంగిబేరపురంబునన్= శృంగిబేరమనే పట్టణంలో; గంగా, స్నాతులు+అయి= గంగలో స్నానంచేసినవారై; గంగాధరున్= శివుడిని; అర్చించియు= పూజించియు; సర్వ, పాప, విముక్తులు+అగుదురు= సకలదురితాలనుండి విముక్తిని పొందినవారు అవుతారు.

**తాత్పర్యం:** ఇక, చిత్రకూటంలో మందాకినిని సేవించి, పితృస్థానంలో కుమారస్వామిని పూజించి, అగ్రస్థానంలో శివుడిని అర్చించి, శ్రీరామచంద్రుడు ఒకనాడు నివసించిన శృంగిబేరపురంలోని గంగలో స్నానంచేసి శివుడిని అర్చించినవారు పాపాలన్నింటినుండి తొలగుతారు.

**క. యాగశతంబులకంటెఁ బ్ర । యాగ నివాసము విశేష మని మునులు మహా**
**యోగులు సిద్ధులు సాధ్యులు । నాగులు నందుండుదురు మనఃప్రియ మెసఁగన్. 281**

**ప్రతిపదార్థం:** యాగశతంబులకంటెన్= నూరు యజ్ఞాలకంటె; ప్రయాగనివాసము= ప్రయాగలో నివసించటం; విశేషము+అని= గొప్పది అని; మునులు; మహాయోగులు; సిద్ధులు; సాధ్యులు; నాగులున్; మనస్+ప్రియము+ఎసఁగన్= మనస్సులో సంతోషం అతిశయించగా; అందు+ఉండుదురు= ఆ ప్రయాగలో ఉంటారు.

**తాత్పర్యం:** యాగాలు నూరు చేయటంకంటె ప్రయాగలో నివసించటమే మేల్తరమని భావించి ఋషులు, యోగీశ్వరులు, సిద్ధులు, సాధ్యులు, నాగులు మదినిండారిన సంతోషంతో అచట ఉంటారు.

**వ. అది ప్రజాపతి యజ్ఞవేది గావున నందు మూఁడగ్ని కుండంబు లెప్పుడుఁగానంబడు; మఱి వేదంబులు యజ్ఞంబులు మూర్తిమంతంబులై యఱువదికోట్లపదివేలు తీర్థంబులు సన్నిహితంబులై గంగా యమునా సంగమంబు సేవించియుండు; నందుఁ గృతస్నాను లైనవారు రాజసూయాశ్వమేధులయు సత్యవాదులయుఁ జతుర్వేదాధ్యయనులయుఁ బుణ్యలోకంబులు వడయుదురు; భోగవతియు వాసుకియు హంసవ్రతంబు నను తీర్థంబుల నాడి దశాశ్వమేధఫలంబులు వడయుదురు. 282**

**ప్రతిపదార్థం:** అది= ఆ ప్రయాగ; ప్రజాపతి, యజ్ఞ, వేది= బ్రహ్మదేవుడియొక్క యజ్ఞవేదిక, యజ్ఞం చేసినచోటు; కావునన్= కాబట్టి; అందున్= ఆ ప్రయాగలో; మూఁడు+అగ్ని కుండంబులు= నిప్పురాజుకొనే గుండాలు మూడు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; కానంబడున్= కనిపిస్తాయి; మఱి= అంతేకాక; వేదంబులు= వేదాలు; యజ్ఞంబులు= క్రతువులు; మూర్తి మంతంబులు+ఐ= ఆకారాన్ని దాల్చినట్టివై; అఱువదికోట్ల, పదివేలు తీర్థంబులు= అరవైకోట్ల పదివేల తీర్థాలు; సన్నిహితంబులు+ఐ= కూడిచేరినట్టివై; గంగా, యమునా, సంగమంబు, సేవించి+ఉండున్= గంగాయమునలు కలిసేచోటును ఆరాధిస్తూ ఉంటాయి; అందున్= అచట; కృతస్నానులు+ఐనవారు= స్నానంచేసినవారు; రాజసూయ+అశ్వమేధులయు= రాజసూయయాగం, అశ్వమేధయాగం చేసినవారియొక్క; సత్యవాదులయున్= సత్యాన్ని వ్రతంగా పాటించేవారియొక్క; చతుర్వేద+అధ్యయనులయున్= నాలుగు వేదాలను పఠించేవారియొక్క; పుణ్య, లోకంబులు= పుణ్యంవలన చేకూరే భువనాలు; పడయుదురు= పొందగలరు; భోగవతియు; వాసుకియు; హంసవ్రతంబున్; అను, తీర్థంబులన్+ఆడి= అనే పేర్లు ఉన్న తీర్థాలలో స్నానంచేసి; దశ+అశ్వమేధ, ఫలంబులు= పది అశ్వమేధయాగాలు చేసిన పుణ్యం; పడయుదురు= పొందగలరు.

**తాత్పర్యం:** ప్రయాగ బ్రహ్మదేవుడి యజ్ఞవేదిక. కాబట్టి అందులో నిరంతరం మూడు అగ్నికుండాలలో త్రేతాగ్నులు వెలుగుతూ కన్పిస్తాయి. అంతేకాక వేదాలు, యజ్ఞాలు సాకారాలై అరవయికోట్ల పదివేల తీర్థాలు కలసి, చేరి, గంగాయమునా సంగమంలో ఆ పవిత్ర తీర్థాన్ని సేవిస్తూ ఉంటాయి. అచట స్నానంచేసినవారు, రాజసూయ అశ్వమేధ యాగాలు చేసినవారికి, సత్యవ్రతాన్ని ఆచరించేవారికి, చతుర్వేదాలను అధ్యయనం చేసేవారికి లభించే పుణ్యలోకాలను పొందగలరు.

**క. విదితముగఁ దీర్థకీర్తనఁ । జదివిన ధన్యులకు వినిన సజ్జనులకు న**
**భ్యుదయ మగు సర్వతీర్థస । ముదయ స్నాన బహుయాగముల ఫలము లగున్. 283**

**ప్రతిపదార్థం:** విదితముగన్= తేటతెల్లంగా; తీర్థకీర్తనన్= తీర్థాలను గురించిన వర్ణనను; చదివిన= పఠించిన; ధన్యులకు= జన్మతరించిన చరితార్థులకు; వినిన= ఆలకించిన; సజ్జనులకున్= మంచివారికి; అభ్యుదయము+అగున్= మేలుకలుగుతుంది; సర్వ, తీర్థ, సముదయ, స్నాన, బహుయాగముల ఫలములు+అగున్= సమస్త తీర్థాల సముదాయంలో స్నానం చేస్తే వచ్చేపుణ్యం, పెక్కు క్రతువులు చేస్తే వచ్చేపుణ్యం లభిస్తాయి.

**తాత్పర్యం:** తేటతెల్లంగా తీర్థాలను గురించిన వర్ణన చదివినవారూ, ఆలకించినవారూ అయిన ధన్యాత్ములైన సజ్జనులకు మేలు కలుగుతుంది. సమస్తతీర్థాలలో స్నానం చేస్తే వచ్చేపుణ్యం, పెక్కుక్రతువులు చేస్తే వచ్చే పుణ్యం సిద్ధిస్తాయి.

**విశేషం:** కొన్ని ప్రతులలో ఇక్కడ ఈ క్రింది రెండు పద్యాలు కూడా చోటుచేసికొన్నాయి.

క. **ఇది నిక్కువ మని మనములఁ । బదిలంబుగఁ దీర్థసేవ భక్తిఁ దలఁచినన్**
**విదితముగ దురితహర మగు । సదమల సుజ్ఞాను లగుట సత్యము ధరణిన్.** 283 (అ)

క. **సకలదురితముల వాయుదు । రకలంకమనస్కు లగుదు రార్యోత్తమవ**
**ర్తకు లగుదురు సజ్జనగుణ । నికరంబుల వెలయుదురు సునిశ్చితమతులై.** 283 (ఆ)

చ. **వ్రతములు లేనివారు, నుపవాస పరాఙ్ముఖు లైనవారు, దు**
**ర్మతులు, విహీనశౌచులుఁ గ్రమంబునఁ దీర్థము లాడనోప; రా**
**తతగుణశాలి వీ వఖిలధర్మవిదుండవు గావునన్ శుభ**
**స్థితిఁ జని తీర్థసేవనము సేయుము నీకు నభీష్టసిద్ధిగన్.** 284

**ప్రతిపదార్థం:** వ్రతములు, లేనివారున్= నోములు దీక్షతో నోచనివారున్నూ; ఉపవాస, పరాక్+ముఖులు+ఐనవారు= ఉపవాసాలకు విముఖులైనవారు (ఉపవాసాలు చేయనివారు); దుర్మతులు= చెడుబుద్ధి కలవారు; విహీన శౌచులున్= శుచిత్వం లేనివారు; క్రమంబునన్= శాస్త్రాలలో విధించబడిన పద్ధతిలో; తీర్థములు+ఆడనోపరు= తీర్థాలలో స్నానం చేయజాలరు; ఈవు= నీవు; ఆతత, గుణ, శాలివి= ప్రకాశించే (విస్తారమైన) మంచి గుణాలు కలవాడివి; అఖిల ధర్మవిదుండవు= సమస్తధర్మాలు తెలిసినవాడివి; కావునన్= కాబట్టి; శుభస్థితిన్= మేలు కలిగేటట్లుగా; చని= వెళ్ళి; నీకున్= నీకు; అభీష్ట సిద్ధిగన్= కోరికలు నెరవేరేటట్లుగా; తీర్థసేవనము= పుణ్యతీర్థాలను దర్శించటం; చేయుము= చేసేది.

**తాత్పర్యం:** వ్రతాలు చేయనివారు; ఉపవాసాలకు విముఖులైనవారు; చెడ్డవారు, శుచిత్వం లేనివారు, తీర్థయాత్రలు చేయలేరు. నీవు లెక్కకు మిక్కిలిగా మంచిగుణాలు కలవాడివి. సర్వధర్మాలను ఎరిగినవాడివి. కాబట్టి తీర్థాలను సేవించటానికై శుభప్రదంగా వెళ్ళిరమ్ము. నీ కోరికలు ఈడేరును గాక!

వ. **అని సకల తీర్థ కథనంబు సెప్పిన, పులస్త్యువచనంబున భీష్ముండు దొల్లి యెల్ల తీర్థంబులు సేవించి కృతార్థుం డయ్యెఁ; గావున నీవును దీర్థసేవ చేసి.** 285

**ప్రతిపదార్థం:** అని= అనిచెప్పి; సకల, తీర్థ, కథనంబు+చెప్పిన= అన్ని తీర్థాలను గురించిన సమాచారం వివరించినటువంటి; పులస్త్యువచనంబునన్= పులస్త్య మహాముని మాటచొప్పున; భీష్ముండు= భీష్ముడు; తొల్లి= మునుపు; ఎల్ల, తీర్థంబులు= అన్ని పుణ్యక్షేత్రాలు; సేవించి= దర్శించి; కృత+అర్థుండు+అయ్యెన్= ధన్యుడయ్యాడు; కావున= కాబట్టి; నీవును= ఓ ధర్మరాజా! నీవుకూడా; తీర్థసేవ చేసి= పుణ్యక్షేత్రాలు దర్శించి.

**తాత్పర్యం:** ఆ విధంగా సర్వపుణ్యతీర్థాల వృత్తాంతం చెప్పిన పులస్త్యమహర్షిమాటచొప్పున భీష్ముడు ఇదివరలో సకలపుణ్యతీర్థాలు సేవించి ధన్యుడయ్యాడు. కాబట్టి నీవుకూడ తీర్థయాత్రలు చేసి.

**క. పూరు పురూరవు లట్లు భ। గీరథ రఘుపతుల యట్లు కృతకృత్యుఁడ వై**
**ధారుణి రక్షింపుము వి। స్తారగుణాధార। ధీర। ధర్మతనూజా! 286**

**ప్రతిపదార్థం:** పూరు, పురూరవులు+అట్లు= పూరుడివలె, పురూరవుడివలె; భగీరథ, రఘుపతుల+అట్లు= భగీరథుడివలెను; రఘురాముడివలెను; కృతకృత్యుఁడవు+ఐ= చేయవలసిన కార్యములను నిర్వర్తించినవాడివై (ధన్యుడివై); విస్తార, గుణ+ఆధార!= విస్తరించిన పెక్కుమంచి గుణాలకు ఆధారమైనవాడా!; ధీర!= ధైర్యవంతుడా!; ధర్మ, తనూజా!= ధర్మపుత్రుడా!; ధారుణిన్= భూమిని; రక్షింపుము= కాపాడుము.

**తాత్పర్యం:** లెక్కకు మిక్కిలి అయిన సద్గుణాలకు ఆశ్రయమైనవాడా! ధైర్యవంతుడా! ఓ ధర్మరాజా! పూరుడి వలె, పురూరవుడి వలె, భగీరథుడివలె, శ్రీరాముడివలె కర్తవ్యాలను నెరవేర్చినవాడవై ఈ భూమిని కాపాడుము.

**విశేషం:** పూరువు, పురూరవుడు భరతవంశంలో సుప్రసిద్ధులైన చక్రవర్తులు. భగీరథుడు ప్రగాఢ ప్రయత్నంచేసి గంగను దివినుండి భువికి దింపాడు. శ్రీరామచంద్రుడు రామాయణకథానాయకుడు, సుప్రసిద్ధవీరుడు.

**వ. రోమశుం డను దేవర్షి దేవలోకంబుననుండి నీకడకు వచ్చుఁ; దదుపదేశంబున ధౌమ్యానుమతుండ వయి తీర్థసేవనఁ జేయు' మని చెప్పి నారదుం డరిగిన, నజాతశత్రుండు ధౌమ్యుం జూచి యిట్లనియె. 287**

**ప్రతిపదార్థం:** రోమశుండు+అను, దేవర్షి= రోమశుడు అనే దేవలోకానికి చెందిన ఋషి; దేవలోకంబున నుండి= దేవలోకంనుండి; నీకడకున్= నీ దగ్గరికి; వచ్చున్+వస్తాడు; తద్+ఉపదేశంబునన్= ఆతడి ప్రబోధం చొప్పున; ధౌమ్య+అనుమతుండవు+అయి= ధౌమ్యుడిచేత అనుమతి పొందినవాడివయి; తీర్థ, సేవనన్= తీర్థాలను సేవించటం; చేయుము= చేసేది; అని= అంటూ; చెప్పి= వచించి; నారదుండు= నారదమహర్షి; అరిగినన్= వెళ్ళగా; అజాత, శత్రుండు= పుట్టనటువంటి శత్రువులు కలవాడు (ఎవరిపట్లను ద్వేషభావం లేనివాడు, ధర్మరాజు); ధౌమ్యున్+చూచి= తమ పురోహితుడైన ధౌమ్యుడిని చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** రోమశుడు అనే దేవఋషి నీదగ్గరకు వస్తాడు. ఆ మహర్షి ప్రబోధం చొప్పున మీ పురోహితుడైన ధౌమ్యుడి అనుమతిచొప్పున నీవు తీర్థసేవ చేయుము' అని చెప్పి నారదమహర్షి నిష్క్రమించగా అజాతశత్రువైన ధర్మరాజు ధౌమ్యుడిని చూచి ఇట్లా పలికాడు.

**చ. 'అలయక మాకు నందఱ కహర్నిశముం బ్రియకారి యైన య**
**త్యలఘుపరాక్రమాన్వితు మహాభుజు నర్జును దివ్యసాయకం**
**బులు వడయంగ నొక్కరున పుచ్చితిఁ దద్దయు వేడ్క నెద్దియుం**
**దలఁపక; యిప్డు దద్విరహితమ్మగు కామ్యక మొప్ప దయ్యెడిన్. 288**

**ప్రతిపదార్థం:** అలయక= విసుగుకొనక; మాకున్+అందఱకు= మాకందరికి; అహర్నిశమున్= పగలు రాత్రియు; ప్రియకారి+ఐన= ప్రీతిని ఘటించేటి; అతి+అలఘు, పరాక్రమ+అన్వితున్= మిక్కిలి తేలికకాని అంటే గొప్పదైన శౌర్యంతో కూడినవాడిని; మహా, భుజున్= గొప్ప భుజాలు కలవాడిని; అర్జునున్= అర్జునుడిని; ఒక్కరున్+అ= ఒక్కడినే; దివ్య, సాయకంబులు= దివ్యమైన బాణాలు; పడయుంగన్= పొందటానికి; తద్దయు= మిక్కిలి; వేడ్కన్= కుతూహలంతో; ఎద్దియున్+తలఁపక= ఏదియు

ఆలోచించక; పుచ్చితిన్= పంపాను; ఇప్డు= ఇపుడు; తద్+విరహితమ్ము+అగు= ఆతడు లేనట్టి; కామ్యకము= ఈ కామ్యకం అనే అరణ్యం; ఒప్పదు+అయ్యెడిన్= (మాకు) ఇష్టంగా లేదు.

**తాత్పర్యం:** 'మా అందరికి విసుగు విరామం లేకుండ పగలనక రాత్రనక నిరంతరం ప్రీతి ఘటించే మహాపరాక్రమశాలి అయిన అర్జునుడిని దివ్యాస్త్రాలు సంపాదించటానికై గొప్పవేడుకతో ఒంటరిగా పంపించాను. ఇప్పుడు అతడు లేని ఈ కామ్యకవనం మాకు సమ్మతంగా లేదు.

**వ. అంబుదాగమనం బపేక్షించు చాతకంబు లట్లు మన మందఱ మర్జునాగమనంబు ప్రతీక్షించుచున్నవారము; వాఁడును దన పూనిన కార్యంబు నిర్వహించి కాని నివృత్తుండు గాఁ; డవశ్యంబును దివ్యాస్త్రంబులు వడసి యాతని వచ్చునంతకుఁ దీర్థసేవ చేయుద' మనినఁ, 'గరంబు లగ్గగు, నట్ల చేయుద' మని. 289**

**ప్రతిపదార్థం:** అంబుద+ఆగమనంబు= మేఘాల రాకను; అపేక్షించు= కోరే; చాతకంబులు+అట్లు= వానకోయిలలవలె; మనము+అందఱము; అర్జున+ఆగమనంబు= అర్జునుడి రాకను; ప్రతీక్షించుచు+ఉన్న వారము= ఎదురు చూస్తున్నవారం; వాఁడును= ఆ అర్జునుడుకూడ; తన, పూనిన, కార్యంబు= తాను పూనినపనిని; నిర్వహించి కాని= నెరవేర్చికాని; నివృత్తుండు+ కాఁడు= వెనుకకు మరలేవాడు కాడు; అవశ్యంబును= తప్పకుండ; దివ్య+అస్త్రంబులు= దేవతా సంబంధమైన మంత్ర బాణాలు; పడసి= సంపాదించి; ఆతని వచ్చునంతకున్= ఆతడు తిరిగి వచ్చేవరకు; తీర్థసేవ= పుణ్యక్షేత్రాల సందర్శనం; చేయుదము+అనిన= చేస్తాముగాక అని చెప్పగా; కరంబు= మిక్కిలి; లగ్గు+అగు= మేలు కలుగుతుంది; అట్లు+అ= ఆ విధంగానే; చేయుదము= చేద్దాము గాక; అని= అని చెప్పి.

**తాత్పర్యం:** మేఘాల రాకకై ఎదురుచూచే చాతకపక్షులవలె మనమందరం అర్జునుడి రాకకై నిరీక్షిస్తున్నాం. అర్జునుడు తాను చేపట్టిన కార్యాన్ని నిర్వహించక వెనుకకు మరలేవాడు కాడు. అర్జునుడు నిస్సందేహంగా దేవతా సంబంధమైన అస్త్రాలను సంపాదించి వస్తాడు. అంతవరకు మనం తీర్థయాత్రలు చేద్దాం'- అని ధర్మరాజు పలుకగా, ధౌమ్యుడు 'నిజమే, మిక్కిలి మేలు కలుగుతుంది. మనమట్లాగే పుణ్యక్షేత్రాలను సందర్శిద్దాం'- అని అన్నాడు.

**విశేషం:** (1) ప్రాచీన భారతీయ సంస్కృతిలో తీర్థయాత్రలకు కల్పించబడిన ప్రాముఖ్యం నిరుపమానం. తీర్థయాత్రలవలన అశ్వమేధ, రాజసూయయాగఫలం కంఠోక్తిగా చాటి చెప్పబడింది. ప్రయాణ సౌకర్యాలు లేనినాడు యుగయుగాంతరాలనుండి కాశ్మీరంనుండి కన్యాకుమారివరకు నదీనదాలు, పర్వతపంక్తులు, సరోవరాలు, గుహలు, గుట్టలు, పుట్టలు పరమ పవిత్ర హృదయాలతో వెదకుకొంటూ భారతీయులు తీర్థయాత్రలు సలిపారు. దేశాటనమే నిరుపమాన విద్యాభ్యాసం. భారతీయులలో ఐకమత్యం, ఆధ్యాత్మికభావం పెంపొందించటానికి తీర్థాటనం నిర్వహించిన భూమిక చరిత్రాత్మకమైనది. వివిధ ప్రదేశాల ప్రజలు, జిజ్ఞాసువులై తరచు పుణ్యతీర్థాలలో ఆశ్రమాలలో కలియటంచేత అన్యోన్య సాంస్కృతిక సంపర్కంచేత భారతీయ సంస్కృతి విశ్వజనీనమై వెల్లివిరిసింది. (2) చాతకపక్షులు మేఘాలు వర్షించే చినుకులు మాత్రమే త్రాగునట్టివి అని కవిసమయం.

## రోమశమహాముని ధర్మరాజునొద్దకు వచ్చుట (సం. 3-89-1)

**ఉ. నాలుగుదిక్కులందును వినన్ విదితంబగుచున్న పుణ్యతీ**
**ర్థాలి తెఱం గెఱుంగఁగ మహాత్ముఁడు ధౌమ్యుఁ డజాతవైరి కం**

**దోలిన చెప్పుచున్న తఱి నొప్పుగ రోమశుఁ డేఁగుదెంచెఁ దే**
**జోలలితుండు నిర్మలయశుం డగు ధర్మతనూజుపాలికిన్.** **290**

**ప్రతిపదార్థం:** నాలుగు దిక్కులందును= నాలుగు దిశలలోను; వినన్= వినబడుతూ; విదితంబు+అగుచున్న= తెల్లమవుతున్న; పుణ్య, తీర్థ+ఆలి= పుణ్యక్షేత్రాల సముదాయంయొక్క; తెఱంగు= తీరుతీయాలు; ఎఱుంగఁగ= తెలిసేటట్లుగా; మహా+ ఆత్ముఁడు= మహానుభావుడు; ధౌమ్యుఁడు= పాండవుల పురోహితుడు; అజాత వైరికిన్= అజాతశత్రువైన ధర్మరాజుకు; అందు= అచట; ఓలిన= వరుసగా; ఒప్పునట్లుగా; చెప్పుచున్న, తఱిన్= వచించే సమయంలో; నిర్మల యశుండు= స్వచ్ఛమైన కీర్తి కలవాడు; అగు= అయిన; ధర్మ, తనూజు, పాలికిన్= ధర్మపుత్రుడి దగ్గరకు; తేజస్+లలితుండు= తేజో లలితుండు= సుకుమారమైన వర్చస్సు కలవాడైన; రోమశుఁడు= రోమశుడనే ముని; ఒప్పుగన్= శోభిల్లేటట్లు; ఏఁగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** మహాత్ముడైన ధౌమ్యుడు నేల నాలుగు చెరగులలో గల తీర్థాలను గురించి క్రమంగా తేటతెల్లంగా అజాతశత్రువైన ధర్మరాజుకు చెపుతూ ఉన్న సమయంలో స్వచ్ఛమైన కీర్తిగల ఆ ధర్మరాజు దగ్గరకు సుకుమారమైన తేజస్సుతో ప్రకాశిస్తున్న రోమశమహర్షి వచ్చాడు.

**విశేషం:** ధర్మజుడి తీర్థయాత్రలకు ముగ్గురు మహర్షులు తోడు పడటం విశేషం. నారదుడు తీర్థమహిమలను చెప్పి సంకల్పాన్ని కలిగించాడు. ధౌమ్యుడు ధర్మజుడిని ప్రోత్సహించాడు. రోమశుడు వెంటనడిచి తీర్థసేవ చేయించాడు.

**వ. ఇట్లు వచ్చిన మహాముని నతిభక్తి ననుజ బ్రాహ్మణ సహితుండై ధర్మజుండు పూజించి 'మునీంద్రా! యెందుండి వచ్చితి?' రని యడిగిన నాతనికి రోమశుం డిట్లనియె.** **291**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వచ్చిన= విచ్చేసిన; మహామునిన్= గొప్పఋషిని; ధర్మజుండు; అతి భక్తిన్= మిక్కిలి భక్తితో; అనుజ, బ్రాహ్మణ, సహితుండు+ఐ= తమ్ములతోడను, విప్రులతోడను కూడినవాడై; పూజించి= అర్చించి; ముని+ఇంద్రా!= మునులలో ఇంద్రుడివంటివాడా!; ఎందు+ఉండి= ఎచటనుండి; వచ్చితిరి?= విచ్చేశారు?; అని= అంటూ; అడిగినన్= ప్రశ్నించగా; ఆతనికిన్= ఆ ధర్మరాజుకు; రోమశుండు= రోమశ మహాముని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తన వద్దకు వేంచేసిన మునిని ధర్మరాజు తానును, తన తమ్ములును, బ్రాహ్మణులును కలిసి మిక్కిలి భక్తితో, అర్చించి 'మునీంద్రా! ఎచటనుండి తాము ఇచటికి దయచేశారు?' అని ప్రశ్నించగా, ధర్మరాజుతో రోమశమహర్షి ఇట్లా చెప్పాడు.

**తే. 'ఎల్లలోకంబులును జూచి యింద్రలోక । లోకనార్థినై యే నింద్రలోకమునకుఁ**
**బోయి సురరాజుచేఁ బ్రీతిఁ బూజితుండ । నై, మహీనాథ! యందు నీ యనుజు ననఘు.** **292**

**ప్రతిపదార్థం:** ఎల్ల, లోకంబులును+చూచి= సమస్త భువనాలను సందర్శించి; ఇంద్రలోక, లోకన+అర్థిన్+ఐ= ఇంద్రలోకాన్ని చూడవలెననే కోరిక కలవాడనై; ఏను= నేను; ఇంద్రలోకమునకున్+పోయి= ఇంద్రలోకానికి వెళ్ళి; సురరాజుచేన్= దేవేంద్రుడిచేత; ప్రీతిన్= సంతోషంతో; పూజితుండను+ఐ= అర్చించబడినవాడినై; మహీ, నాథ!= ఓ రాజా!; అందున్= అచట- ఆ స్వర్గంలో; అనఘున్= పాపరహితుడైన; నీ+అనుజున్= నీ తమ్ముడిని (అర్జునుడిని).

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! సమస్తలోకాలను సందర్శించి నేను, ఇంద్రలోకాన్ని చూడాలన్నకోరికకలిగి అక్కడికి వెళ్ళాను. అక్కడ దేవేంద్రుడి పూజలు అందుకొని స్వర్గలోకంలో ఉండే నీ తమ్ముడైన అర్జునుడిని (చూచాను).

**ఉ. ఈసున నీశుఁ దొట్టి సురలెల్ల నభీష్టవరంబు లిచ్చుటం**
**జేసి కృతార్థుఁ డైన కురుసింహము నూర్జితశౌర్యు నర్జునున్**
**భాసురతేజు విశ్వపరిపాలకుఁ డైన మహేంద్రుతోడ నే**
**కాసన మెక్కియున్న మహిమాస్పదు నింద్రతనూజుఁ జూచితిన్. 293**

**ప్రతిపదార్థం:** ఈసునన్= స్పర్ధతో; ఈశున్+తొట్టి= శివుడు మొదలుకొని; సురలు+ఎల్లన్= దేవతలందరును; అభీష్ట, వరంబులు+ఇచ్చుటన్+చేసి= కోరిన వరాలు అనుగ్రహించటంచేత; కృతార్థుడు+ఐన= చరితార్థుడైన; కురు సింహమున్= కురువంశంలో సింహంవంటివాడిని (శ్రేష్ఠుడిని); ఊర్జిత, శౌర్యున్= దృఢమైన, అధికమైన పరాక్రమం కలవాడిని; భాసురతేజున్= శోభిల్లుతున్న తేజస్సు కలవాడిని; విశ్వపరిపాలకుఁడు+ఐన= జగత్తునంతటిని ఏలుతున్న; మహా+ఇంద్రు తోడన్= దేవేంద్రుడితోడ; ఏక+ఆసనము= ఒకే గద్దెను; ఎక్కి+ఉన్న= అధిష్ఠించి ఉన్న; మహిమ+ఆస్పదున్= గొప్పతనానికి నెలవైనవాడిని; ఇంద్రతనూజున్= ఇంద్రుడికొడుకైన; అర్జునున్= అర్జునుడిని; చూచితిన్= చూచాను.

**తాత్పర్యం:** శివుడు మున్నగు దేవతలందరు స్పర్ధతో, తమలో తాము పోటీపడి అర్జునుడికి కోరిన వరాలు అనుగ్రహించారు. ఆవిధంగా కృతార్థుడైన కురువంశసింహుడు, దేదీప్యమానమైన పరాక్రమంతో వెలుగొందుతూ దేవేంద్రుడి అర్ధాసనం అధివసించి ఉన్న ఇంద్రవరసుతుడూ ఐన అర్జునుడిని స్వర్గంలో సందర్శించాను.

**క. బలవంతు లైన భీష్మా । దుల నర్జునుఁ డోర్చు నూర్జితుండై; మఱి పో**
**రులఁ గర్ణుండు పదారవ । కళకు సమానుండు గాఁడు కవ్వడితోడన్. 294**

**ప్రతిపదార్థం:** బలవంతులు+ఐన= శక్తి సంపన్నులైన; భీష్మ+ఆదులన్= భీష్ముడు మున్నగువారిని; ఊర్జితుండు+ఐ= అధికమైన పరాక్రమం కలవాడై; అర్జునుఁడు; ఓర్చున్= ఓడిస్తాడు; మఱి= ఇక; పోరులన్= యుద్ధాలలో; కర్ణుండు= కర్ణుడు; కవ్వడితోడన్= (కవ+వడి= కవ్వడి= సవ్యసాచి= రెండు వడులు కలవాడు అంటే రెండు చేతులతో బాణాలను ప్రయోగించగల నేర్పుకలవాడు) అర్జునుడితో; పదారవకళకు= పదారవ అంశకు అంటే పదారుపాళ్ళలో ఒకపాలుకు; సమానుండు+కాఁడు= సరికాడు.

**తాత్పర్యం:** బలవంతులైన భీష్మాదులను పరాక్రమవంతుడైన అర్జునుడు యుద్ధంలో అవలీలగా జయించగలడు. ఇంక యుద్ధాలలో కర్ణుడు అర్జునుడితో పదారవపాలుకు కూడ సరితూగ జాలడు.

**వ. అతని యున్న విలాసంబు సూచి విస్మితుండ నయిన నాకు నింద్రుండు తత్ప్రభావంబు సెప్పి 'వీఁ డమృత సంభవం బయిన పాశుపతం బను దివ్యాస్త్రంబుఁ బరమేశ్వరుచేతను, నాచేతను యమ వరుణ కుబేరాదుల చేతను దివ్యాయుధంబులఁ బడసె; నితండు మనుష్యుండు గాఁడు; దివ్యపురుషుం; డన్యుల కశక్యం బయిన దేవకార్యంబు దీర్చి మసలక వచ్చు నని మర్త్యలోకంబునకుం బోయి భ్రాతృసహితుం డయిన ధర్మరాజునకుం జెప్పు' మనిన వచ్చితి' నని వెండియు నిట్లనియె. 295**

**ప్రతిపదార్థం:** అతని+ఉన్న, విలాసంబు+చూచి= ఆ అర్జునుడియొక్క మిరుమిట్లు కొలుపుతున్న హొయలు చూచి; విస్మితుండను+అయిన, నాకున్= అచ్చెరువు పొందిన నాకు; ఇంద్రుండు= ఇంద్రుడు; తద్+ప్రభావంబు= ఆతడియొక్క

గొప్పతనం; చెప్పి; వీఁడు= ఈతడు (ఈ అర్జునుడు); అమృత సంభవంబు+అయిన= అమృతంనుండి పుట్టిన; పాశుపతంబు= పాశుపతం; అను= అనే; దివ్య+అస్త్రంబున్= దివ్యబాణాన్ని; పరమ+ఈశ్వరు చేతను= పరమశివుడిచేతను; నాచేతను; యమ, వరుణ, కుబేర+ఆదులచేతను= యముడు, వరుణుడు, కుబేరుడు, మున్నగువారిచేతను; దివ్య+ఆయుధంబులన్+ పడసెన్= దేవతాసంబంధాలైన మహిమకల ఆయుధాలను (అస్త్రాలను) పొందాడు; ఇతండు= ఇతడు (ఈ అర్జునుడు), మనుష్యుండు= మనుష్యుడు; కాఁడు; దివ్య పురుషుండు= దేవతలకు సంబంధించినవాడు; అన్యులకు= ఇతరులకు; అశక్యంబు+అయిన= సాధ్యం కానట్టి; దేవకార్యంబు+తీర్చి= దేవతల పనులను నెరవేర్చి; మసలక, వచ్చున్= తడయక తిరిగి వస్తాడు; అని= అని చెప్పి; మర్త్యలోకంబునకున్+పోయి= మనుజులుండే భూలోకానికి పోయి; భ్రాతృ సహితుండు+అయిన= తమ్ములతో కూడిన; ధర్మరాజునకున్= ధర్మపుత్రుడికి; చెప్పుము= చెప్పేది; అనినన్= అని చెప్పగా; వచ్చితిన్= వచ్చాను; అని= ఆ విధంగా చెప్పి; వెండియున్= మఱల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** స్వర్గలోకంలో మిరుమిట్లు గొలిపే హొయలుతో దేదీప్యమానంగా వెలుగుతున్న అర్జునుడిని చూచి నేను అచ్చెరువు పొందాను. ఇంద్రుడు అర్జునుడి గొప్పతనాన్ని నాకు వివరిస్తూ 'ఇతడు పరమశివుడి వలన అమృతంనుండి ఉద్భవించిన 'పాశుపతం' అనే దివ్యాస్త్రాన్నీ, నానుండి, యమ వరుణ కుబేరాదులనుండి పెక్కుదివ్యాస్త్రాలనూ సంపాదించాడు. ఇతడు కేవలం మనుష్యమాత్రుడు కాడు, దివ్యపురుషుడు. ఇతరులకు శక్యం కానట్టి దేవతల పనులను నెరవేర్చి, తడయక తిరిగి భూలోకానికి వస్తాడు. నీవు భూలోకానికి వెళ్ళి, తమ్ములతో కూడి ఉన్న ధర్మరాజుకు ఈ విషయం ఎఱిగించుము' అని నన్ను ఆదేశించాడు'- అని రోమశుడు ధర్మరాజుకు చెప్పి మరల ఇట్లా పలికాడు.

**క. 'నిరతముగఁ దీర్థసేవా । పరులగు శాంతాత్ములకుఁ దపస్వులకును దు**
**ష్కర మెద్దియు లే దని చె । చ్చెర ధర్మజుఁ దీర్థసేవ సేయింపు మొగిన్. 296**

**ప్రతిపదార్థం:** నిరతముగన్= ఎల్లప్పుడును; తీర్థసేవాపరులు+అగు= తీర్థయాత్రలు దీక్షతో చేసేవారు అయిన; శాంత+ఆత్ములకున్= శాంతమైన ప్రవృత్తి కలవారికిన్నీ; తపస్వులకును= తపస్సు చేసే వారికిన్నీ; దుష్కరము= చేయలేనిది; ఎద్దియు= ఏదికూడా; లేదు= ఉండదు; అని= అని చెప్పి; చెచ్చెరన్= శీఘ్రంగా; ధర్మజున్= ధర్మరాజును; తీర్థసేవ= తీర్థయాత్రల సందర్శనం; ఒగిన్= ఒప్పునట్లుగా; చేయింపుము= చేయింపుము.

**తాత్పర్యం:** (ఈ మాటలు దేవేంద్రుడు రోమశుడితో చెప్పినవి)' దీక్షతో ఎల్లప్పుడు తీర్థయాత్రలు సేవించటంలో నిమగ్నులైన శాంతచిత్తప్రవృత్తి కలవారికి, తపస్సు చేసేవారికి చేయలేనిదంటూ ఏదీ ఉండదు- అని చెప్పి ధర్మరాజును శీఘ్రంగా తీర్థసేవ చేయించుము.

**క. అని పనిచిన నమరేశ్వరు । పనిఁ దత్పార్శ్వమున నుండి పన్నుగ నిట యేఁ**
**జనుదెంచితి నీ కార్యము । ధనంజయున కభిమతంబు ధరణీనాథా! 297**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; పనిచినన్= (ఇంద్రుడు) నియోగించగా; అమర+ఈశ్వరు, పనిన్= దేవేంద్రుడి పనిమూలంగా; తద్, పార్శ్వమునన్+ఉండి= ఆతడి ప్రక్కనే ఉండి; పన్నుగన్= పూనికతో; ఇట= ఇచటకు; ఏన్= నేను; చనుదెంచితిన్= వచ్చాను; ధరణీనాథా!= భూమికి అధినేతవైన ఓ ధర్మరాజా!; ఈ, కార్యము= ఈ పని (నేను ఇచటికి వచ్చి మిమ్మల్ని తీర్థయాత్రలు చేయించే పని); ధనంజయునకు= అర్జునుడికి; అభిమతంబు= ఇష్టం.

**తాత్పర్యం:** అని చెప్పి, నన్ను నియోగించగా, నేను ఇంద్రుడి ఆదేశం చొప్పున ఆతడి దగ్గరనుండి పూనికతో ఇచటికి వచ్చాను. భూమికి అధిపతివైన ఓ ధర్మరాజా! ఈ పని అర్జునుడికి సమ్మతమైనదే సుమా!

**క. అనవద్య తీర్థసేవన । మును గపిలా స్వర్ణ దానములు నుగ్రతపం**
**బును జేయనివానికిఁ బో । లునె పడయఁగఁ బేర్మి నుభయలోకసుఖంబుల్. 298**

**ప్రతిపదార్థం:** అనవద్య, తీర్థ, సేవనమును= నింద్యం కానట్టి పుణ్యక్షేత్రాలను సందర్శించటం; కపిలా, స్వర్ణ దానములును= కపిలవర్ణంకల గోవులనూ, బంగారాన్నీ దానం చేయటం; ఉగ్రతపంబును= తీవ్రమైన తపస్సును; చేయని వానికిన్= (ఈ కార్యాలను) చేయని మనుజుడికి; పేర్మిన్= గౌరవంతో; ఉభయలోక, సుఖంబుల్= ఇహ పరలోకాలలోని సుఖాలను; పడయఁగన్= పొందటానికి; పోలునె= వీలు అవుతుందా?

**తాత్పర్యం:** పరమపావనమైన తీర్థసేవనం, కపిల గోవులను, బంగారాన్ని దానంచేయటం, తీవ్రమైన తపస్సు - ఈ ఉత్తమ కార్యాలు చేయనివాడికి ఇహపర సౌఖ్యాలు పొందటానికి వీలుకలుగుతుందా?

**వ. ఏను దొల్లి భూమిం గల తీర్థంబు లెల్ల నినుమాఱు సూచితి; నిప్పు డింద్రు నియోగంబున నీతోడన వచ్చి యఖిల తీర్థసేవ సేసెద' ననిన ధర్మజుం డతని కిట్లనియె. 299**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; తొల్లి= పూర్వం; భూమిన్+కల, తీర్థంబులు+ఎల్లన్= భూమిపై ఉండే పుణ్యక్షేత్రాల తీర్థాల నన్నింటిని; ఇనుమాఱు= రెండుసార్లు; చూచితిన్= సందర్శించాను; ఇప్పుడు= ఈ సమయంలో; ఇంద్రు, నియోగంబునన్= ఇంద్రుడి ఆదేశం చొప్పున; నీతోడన వచ్చి= నీతోడనే అరుదెంచి; అఖిల, తీర్థ, సేవ+చేసెదన్= అన్ని పుణ్యక్షేత్రాలను సందర్శిస్తాను; అనినన్= అని చెప్పగా; ధర్మజుండు= ధర్మతనయుడు; అతనికిన్= ఆ రోమశుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇంతకు మునుపే నేను రెండు పర్యాయాలు భూమండలంలో ఉండే పుణ్యక్షేత్రాలను అన్నిటిని సందర్శించి ఉన్నాను. ఇప్పుడు ఇంద్రుడి ఆదేశానుసారంగా నీతోపాటు సకలపుణ్యతీర్థాలను మరొకసారి సందర్శించగలను'- అని రోమశుడు ధర్మరాజుతో చెప్పగా, అతడు రోమశుడితో ఇట్లా వచించాడు.

**ఉ. 'నన్నుఁ దలంచి తీర్థగమనం బొనరింపఁగఁ బంచె నట్టె వి**
**ద్వన్నుత! దేవవల్లభుఁడు; దానఁ గృతార్థుఁడ నైతి; దానిపై**
**నిన్ను సహాయుఁగాఁ బడసి నెమ్మి నశేషవిశేషతీర్థముల్**
**పన్నుగఁ జూడఁ గాంచి కడుభవ్యుఁడ నైతి మునీంద్ర! నీదయన్. 300**

**ప్రతిపదార్థం:** విద్వన్+నుత!= విద్వాంసులచేత పొగడబడినవాడా! ఓ రోమశమహర్షీ!; దేవ, వల్లభుఁడు= దేవేంద్రుడు; నన్నున్+తలంచి= నన్ను గురించి ఆలోచించి; తీర్థ, గమనంబు+ఒనరింపఁగన్= తీర్థయాత్రలు చేయటానికై; పంచెన్+అట్టె= నియోగించాడంటే?; దానన్= దానిచే; కృత+అర్థుఁడన్+ఐతి= చరితార్థుడిని అయ్యాను; దానిపైన్= మఱియును; ముని+ఇంద్ర!= మునులలో ఇంద్రుడివంటివాడా!; నిన్ను= నీవంటి (మహానుభావుడిని); సహాయున్+కాన్= తోడ్పడేవాడినిగా; పడసి= పొంది; నెమ్మిన్= ప్రీతితో; అశేష, విశేష. తీర్థముల్= అన్ని గొప్ప పుణ్యక్షేత్రాలను; పన్నుగన్= ఒప్పేటట్లుగా; చూడన్+కాంచి= సందర్శించగలిగి; నీ దయన్= నీ అనుగ్రహంవలన; కడున్= మిక్కిలి; భవ్యుఁడన్= పవిత్రుడిని; ఐతిన్= కాగలిగాను.

**తాత్పర్యం:** 'విద్వాంసులచేత పొగడబడిన ఓ రోమశమహర్షీ! మునులలో శ్రేష్ఠుడవైనవాడా! దేవేంద్రుడంతటివాడు. నన్నుగురించి ఆలోచించి నేను తీర్థయాత్రలు చేయాలని ఆదేశించటంచేత నా జన్మ ధన్యమైనదిగా భావిస్తున్నాను. మరి నీవంటి మహానుభావుడు సహయాత్రికుడై నాకు తోడుపడటం పేర్కొనతగిన పెద్ద విశేషంకదా! ఇక సమస్త పుణ్యక్షేత్రాలు పూనికతో సందర్శించి నీ దయవలన పవిత్రుడిని కాగలను.

**ఆ. విజయుకుశలవార్త వేడుక నీచేత । వినినయంతకంటె విస్తరిల్లె;**
**హృదయసంప్రమోద మీ రెంట నా' కంచుఁ । దద్ద సంతసిల్లె ధర్మసుతుఁడు. 301**

**ప్రతిపదార్థం:** నాకు; నీచేత; విజయు= విజయుడి (అర్జునుడి); కుశలవార్త= క్షేమ సమాచారం; వేడుక= ఆసక్తితో; వినిన+అంతకంటె= విన్నదానికి మించి; ఈ రెంటన్= ఈ రెండింటివలన (అర్జునుడి కుశలవార్త, తీర్థయాత్రలు చేయవలసినదనెడి ఇంద్రుడి ఆదేశం - అనే ఈ రెండింటిచేత); హృదయ సంప్రమోదము= ఎదలో ఆనందం; విస్తరిల్లెన్= అతిశయించినది; అంచున్= అనుచు; ధర్మసుతుఁడు= ధర్మరాజు; తద్ద= ఎంతయు, సంతసిల్లెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** మీ ద్వారా అర్జునుడి కుశలవార్త వినినందువలన కలిగిన ఆనందం తీర్థయాత్రలు చేయవలసినదనెడి దేవేంద్రుడి ఆదేశంవలన అతిశయించిం'దని- ధర్మరాజు తన సంతోషాతిరేకాన్ని రోమశమహర్షికి వెల్లడించాడు.

**వ. 'మునీంద్రా! యేను దొల్లియు నారద ధౌమ్యుల వచనంబులం దీర్థగమనోన్ముఖుండనై యున్నవాఁడ; నిప్పుడు భవన్నిదేశంబునం దీర్థసేవ సేసి కృతార్థుండ నగుదు' నని కృతనిశ్చయుండై భిక్షాభుజు లయిన బ్రాహ్మణులను యతులను రోమశువచనంబున నివర్తించి, ధౌమ్యపురస్కృత కతిపయ బ్రాహ్మణులతో ననుజులుం దానును గృష్ణాసహితుం డయి కామ్యకవనంబున మూఁడుదినంబులు వసియించి మార్గశీర్ష మాసావసానంబునం దీర్థసేవార్థంబు గృతప్రస్థానుం డయిన యుధిష్ఠిరునకు బ్రాహ్మణు లిట్లనిరి. 302**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= మునులలో ఇంద్రుడివంటివాడా! ఓ రోమశమహర్షీ!; ఏను= నేను; తొల్లియు= ఇంతకు మునుపు కూడ; నారద, ధౌమ్యుల, వచనంబులన్= నారదుడు ధౌమ్యుడు చెప్పిన మాటలవలన; తీర్థ, గమన+ఉన్ముఖుండను+ఐ= పుణ్యక్షేత్రాలకు వెళ్ళవలెననే ఉత్సాహంతో; ఉన్నవాఁడన్= ఉన్నాను; ఇప్పుడు= ఈ సమయంలో; భవత్+నిదేశంబునన్= నీ ఆదేశంవలన; తీర్థ, సేవ+చేసి= తీర్థాలను సందర్శించి; కృత+అర్థుండను+అగుదున్= ధన్యుడను కాగలను; అని= అని చెప్పి; కృత నిశ్చయుండు+ఐ= చేయబడిన నిర్ణయం కలవాడై; భిక్షా, భుజులు+అయిన= భిక్షాటనంవలన లభించే ఆహారం తినేవారయిన; బ్రాహ్మణులను; యతులను= సన్న్యాసులను; రోమశు వచనంబునన్= రోమశుడి మాట చొప్పున; నివర్తించి= వెనుకకు వెళ్ళేటట్లు చెప్పి (నిలువుండని పలికి); ధౌమ్య, పురస్కృత, కతిపయ, బ్రాహ్మణులతోన్= ధౌమ్యుడు మున్నగు కొంతమంది బ్రాహ్మణులతో; అనుజులున్+తానును= తమ్ములును, తానును; కృష్ణా, సహితుండు+అయి= ద్రౌపదీ సమేతుడై; కామ్యక, వనంబునన్= కామ్యకమనే అరణ్యంలో; మూఁడు దినంబులు= మూడునాళ్ళు; వసియించి= ఉండి; మార్గ, శీర్ష, మాస+అవసానంబునన్= మార్గశీర్షం అనే నెల చివరి సమయంలో; తీర్థసేవా+అర్థంబు= పుణ్యక్షేత్రాలను సేవించటంకొరకు; కృత, ప్రస్థానుండు+అయిన= చేసిన ప్రయాణం కలవాడైన, అంటే పయనానికి బయలుదేరిన వాడయిన; యుధిష్ఠిరునకున్; బ్రాహ్మణులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** 'మునిశ్రేష్ఠుడవైన ఓ రోమశా! నేను ఇంతకుమునుపే నారదుడు ధౌమ్యుడు చెప్పినమాటలవలన తీర్థయాత్రలు చేయటానికై ఉవ్విళ్ళూరాను. ఇంతలో ఇప్పుడు నీ ప్రోత్సాహం లభించింది. ఇక పుణ్యక్షేత్రాలు

దర్శించి ధన్యుడనవుతాను' అని నిశ్చయించి, భిక్షాటనం చేసి ఆహారం స్వీకరించే విప్రులను, సన్న్యాసులను రోమశుడి ఆదేశం చొప్పున వెనుకకు మరలించి, ధౌమ్యుడు మున్నగు కొద్దిమంది బ్రాహ్మణులతోపాటు, ద్రౌపదితో, తమ్ములతో పుణ్యతీర్థసేవలకై కామ్యకవనంలో మూడుదినాలు ఉండి, మార్గశీర్షమాసంచివర తీర్థయాత్రలకు బయలుదేరిన ధర్మరాజుతో బ్రాహ్మణులు ఈ విధంగా పలికారు.

**ఉ. 'నీ యనుజుల్ ధనుర్ధరు లనింద్యచరిత్రులు దీర్ఘతీక్ష్ణకౌ**
**క్షేయకపాణు లత్యమలకీర్తులు గావఁగ రోమశుండు తే**
**జోయుతుఁ డెల్లతీర్థములుఁ జూపఁగఁ దీర్థము లాడువేడ్క ల**
**క్ష్మీయుత! యిప్డు ని న్ననుగమింపఁగఁ గంటిమి పుణ్యసంపదన్. 303**

**ప్రతిపదార్థం:** లక్ష్మీయుత!= సంపదతో కూడుకొన్నవాడా!; నీ+అనుజుల్= నీ తమ్ములు; ధనుస్+ధరులు= విల్లు ధరించేవారు (అంటే ఆయుధధారులైన వీరులు అనిఅర్థం); అనింద్య, చరిత్రులు= పవిత్రమైన ప్రవర్తన కలవారు; దీర్ఘ, తీక్ష్ణ కౌక్షేయక, పాణులు= నిడివి, వాడి కల కత్తులు తాల్చినవారు; (కౌక్షేయకము= కుక్షి అంటే పొట్టకు ఉంచుకొనే కత్తి); అతి+అమల, కీర్తులు= మిక్కిలి నిర్మలమైన కీర్తి కలవారు; కావఁగన్= కాపాడుతుండగా; తేజోయుతుఁడు= వర్చస్సుతో కూడినవాడు; రోమశుండు= రోమశమహర్షి; ఎల్ల, తీర్థములున్+చూపఁగన్= తీర్థాలన్నింటిని దర్శింప చేస్తూఉండగా; పుణ్యసంపదన్= మా పుణ్య పరిపాకం చేత; ఇప్డు= ఇప్పుడు; తీర్థములు+ఆడు, వేడ్కన్= ఆయా పుణ్యతీర్థాలలో స్నానం చేసే కుతూహలం చేత; నిన్ను; అనుగమింపఁగన్+కంటిమి= అనుసరించగల్గితిమి (నీ వెంట తీర్థయాత్రలకు రాగలుగుతున్నాం.)

**తాత్పర్యం:** 'నీ తమ్ములు ధనుర్విద్యలో ఆరితేరినవీరులు. పవిత్రమైన ప్రవర్తన కలవారు. నిడివి, వాడిమి కల కత్తులు ధరించేవారు. నిర్మలమైన కీర్తి కలవారు. అటు వారు రక్షిస్తూ ఉండగా, తేజస్వి అయిన రోమశుడు మార్గదర్శకుడయి సకల పుణ్యక్షేత్రాలను దర్శింపచేస్తూ ఉండగా నీవెంట రావటం పుణ్యసంపదవలన మాకు సమకూడిన అదృష్టం.

**వ. రాక్షసపిశాచశ్వాపదంబుల కారణంబున నడవులలో నేకతంబ యరిగి తీర్థసేవ చేయ మాయట్టివారికి నశక్యంబు గావున మీతోడ వచ్చెద' మని బ్రాహ్మణులు ధర్మరాజుచేత ననుజ్ఞాతు లై రంత. 304**

**ప్రతిపదార్థం:** రాక్షస, పిశాచ, శ్వాపదంబుల, కారణంబునన్= రాక్షసులు, పిశాచాలు, క్రూరజంతువులు తిరుగుతుండే కారణంగా; అడవులలోన్= అరణ్యాలలో; ఏకతంబు+అ= ఒంటరిగా; అరిగి= వెళ్ళి; తీర్థ, సేవ, చేయన్= పుణ్యక్షేత్రాలను సందర్శించటం; మా+అట్టి వారికిన్= మాబోటివారికి; అశక్యంబు= సాధ్యం కాదు; కావున= కాబట్టి; మీతోడ, వచ్చెదము+అని= మీతోపాటుగా మేమూ వస్తామని; బ్రాహ్మణులు; ధర్మరాజుచేతన్; అనుజ్ఞాతులు+ఐరి= అనుమతిని పొందారు; అంతన్= అటుపిమ్మట.

**తాత్పర్యం:** రాక్షసులు, పిశాచాలు, క్రూరజంతువులు సంచరిస్తూ ఉంటాయి కాబట్టి అడవులలో మావంటివారు ఒంటరిగా తీర్థయాత్రలు చేయటం సాధ్యం కాదు. కాబట్టి మేము మీతోపాటు వస్తాం'- అని విప్రులు అర్థించగా ధర్మరాజు సమ్మతించాడు. అప్పుడు.

**క. పారాశర్యుఁడు బర్వత । నారదులును బాండురాజనందనుల గుణో**
**దారుల ననఘులఁ దీర్థ । ప్రారంభులఁ గానవచ్చి పరమప్రీతిన్. 305**

**ప్రతిపదార్థం:** పారాశర్యుఁడున్= పరాశరుడి కుమారుడైన వ్యాసుడున్నూ; పర్వత, నారదులును; గుణ+ఉదారులన్= మంచిగుణాలచేత గాంభీర్యం పెంచుకొన్నవారిని; అనఘులన్= పాప రహితులైన పవిత్రులను; తీర్థ, ప్రారంభులన్= తీర్థయాత్రలకు ఉపక్రమించినవారిని; పాండురాజ, నందనులన్= పాండవులను; పరమప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; కానవచ్చి= చూడటానికి వచ్చి.

**తాత్పర్యం:** పరాశరమహర్షిపుత్రుడైన వేదవ్యాసుడు, పర్వత నారదులు మంచిగుణాలచేత గొప్పవారుగా పేరుకెక్కిన వారు, పవిత్రులు, తీర్థయాత్రలకు వెళ్ళటం ప్రారంభించినవారు అయిన పాండవులను మిక్కిలి సంతోషంతో చూడవచ్చి.

**క.** **వారలచేఁ బూజితులై । భూరి తపోధనులు లోకపూజ్యులు ధర్మ**
**ప్రారంభనిత్యమతులకు । వారల కిట్లనిరి సత్యవచనులు గరుణన్.** **306**

**ప్రతిపదార్థం:** వారలచేన్= ఆ పాండవులచేత; పూజితులు+ఐ= అర్చించబడినవారై; భూరి, తపస్+ధనులు= విస్తారమైన తపస్సు ధనంగా కలవారు; లోక పూజ్యులు= లోకాలచేత పూజించబడేవారు; సత్య వచనులు= నిజం మాటాడేవారు; కరుణన్= దయతో; ధర్మ, ప్రారంభ, నిత్య, మతులకున్= ధర్మంతోకూడిన యత్నాన్నే నిత్యం ఆలోచించేవారికి; వారలకున్= ఆ పాండవులకు; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** విస్తారమైన తపస్సే ధనంగా కలవారు, లోకాలచేత పూజించబడేవారు, సత్యసంధులు అయిన ఆ మహర్షులు, ధర్మం ఆచరించటంలోనే నిత్యమగు ఆలోచన కలవారైన ఆ పాండవులచేత అర్చించబడినవారై దయతో వారలకు ఈ విధంగా చెప్పారు.

**వ.** **'శారీరనియమంబులు మానుష వ్రతంబు లనంబడు; మనోబుద్ధి శౌచంబులు దేవవ్రతంబు లనంబడు; నట్టి సౌమ్యవ్రత విశేషంబులు సలుపుచు ఋజుమార్గులరై తీర్థంబులు సేవించునది; తీర్థాభిగమనంబున మహాభిష నాభాగ భరత భగీరథ ముచుకుంద మాంధాతృ సగర సార్వభౌమాష్టక రోమపాదుల యట్ల శత్రుజయంబును సర్వలోకసుఖంబులు వడయుదు' రని చెప్పి మునివరులు మువ్వు రరిగి; రంత నజాతశత్రుండు రోమశున కిట్లనియె.** **307**

**ప్రతిపదార్థం:** శారీర, నియమంబులు= దేహానికి సంబంధించిన కట్టుబాట్లు (విధి నిషేధాలు); మానుష, వ్రతంబులు= మనుజులకు సంబంధించిన నోములు; అనంబడున్= అని చెప్పబడతాయి; మనస్+బుద్ధి, శౌచంబులు= మనస్సుకు బుద్ధికి సంబంధించిన నిర్మలత్వం; దేవవ్రతంబులు= దివ్యత్వానికి సంబంధించిన నోములు; అనంబడున్= అని చెప్పబడతాయి; అట్టి= అటువంటి; సౌమ్య, వ్రత, విశేషంబులు= మంచి నోములను ఎన్నుకొని; సలుపుచు= జరుపుతూ; ఋజు, మార్గులరు+ఐ= ఏ లోపం లేని పవిత్రమైన దారిలో ప్రవర్తిస్తూ ఉన్నవారై; తీర్థంబులు= పుణ్యక్షేత్రాలు; సేవించునది= దర్శించేది; తీర్థ+ అభిగమనంబునన్= పుణ్యక్షేత్రాలకు యాత్రచేయటంవల్ల వెళ్ళి; మహాభిష, నాభాగ, భరత, భగీరథ, ముచుకుంద, మాంధాతృ, సగర, సార్వభౌమ+అష్టక, రోమ పాదుల+అట్ల= మహాభిషుడు, నాభాగుడు, భరతుడు, భగీరథుడు, ముచుకుందుడు, మాంధాత, సగరుడు, సార్వభౌముడు, అష్టకుడు, రోమపాదుడు అనే పదిమంది సార్వభౌములవలె; శత్రు, జయంబును= విరోధులపై విజయాన్ని; (అరిషడ్వర్గాలను జయించటమున్నూ); సర్వలోక, సుఖంబులు= సమస్తలోకాలలోని సుఖాలను; పడయుదురు= పొందగలరు; అని= అంటూ; చెప్పి= పలికి; మునివరులు= మునిశ్రేష్ఠులు; మువ్వురు= ముగ్గురు (పర్వత, నారద, వ్యాసులు); అరిగిరి= వెళ్ళారు; అంతన్= అటుపిమ్మట; అజాతశత్రుండు= ధర్మరాజు; రోమశునకు= రోమశమహర్షికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'దేహానికి సంబంధించిన నియమాలు మానుషవ్రతాలు. మనస్సును, బుద్ధిని శుచిగా ఉంచేవి దేవవ్రతాలు. అటువంటి మృదుత్వం గలిగిన నోములను (వ్రతాలను) మాత్రమే ఆచరిస్తూ, తిన్నని నడవడి కలవారై తీర్థయాత్రలు చేయండి. పుణ్యక్షేత్రాలను సందర్శించటంలో ప్రసిద్ధికెక్కిన పదిమంది సార్వభౌములు- మహాభిషుడు, నాభాగుడు, భరతుడు, భగీరథుడు, ముచుకుందుడు, మాంధాత, సగరుడు, సార్వభౌముడు, అష్టకుడు, రోమపాదుడు అనే పూర్వచక్రవర్తులవలె సమస్త లోకాలలోని సుఖాలు పొందండి' అని చెప్పి మునివరేణ్యులు ముగ్గురు- నారద, పర్వత వ్యాసమహర్షులు- వెళ్ళారు. అప్పుడు ధర్మరాజు రోమశుడితో ఇట్లా పలికాడు.

**క. 'ధరణి నధార్మికులగు కా । పురుషుల కభివర్ధనంబుఁ బుణ్యచరిత్రం**
**బరఁగెడు ధార్మికులకు దు । ర్ధర మగు నవివర్ధనంబుఁ దగునె మునీంద్రా! 308**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= ఋషులలో ఇంద్రుడివంటివాడా!; ధరణిన్= భూలోకంలో; అధార్మికులు+అగు= ధర్మంలేనివారైన; కాపురుషులకు= చెడ్డ మనుజులకు; అభివర్ధనంబున్= అభివృద్ధియు; పుణ్యచరిత్రన్+పరఁగెడు= పవిత్రమైన ప్రవర్తనతో జీవితం గడిపే; ధార్మికులకు= ధర్మాత్ములకు, దుర్ధరము+అగు= భరించరాని; అవివర్ధనంబున్= పతనమును (అభివృద్ధి లేకపోవటం); తగునె= న్యాయమా?

**తాత్పర్యం:** 'ఓ రోమశమహర్షీ! భూలోకంలో అధర్మపరులైన దుర్జనులకు అభివృద్ధి కలుగుతున్నది. అంతేకాక, పవిత్రచరిత్రులు ధర్మాత్ములు అయిన మంచివారికి భరించరాని కష్టాలు దాపురిస్తున్నవి. ఇది ఏమి న్యాయం?

**విశేషం:** సముద్రగంభీరుడైన ధర్మరాజు హృదయంలో బడబాగ్నివలె ఎల్లప్పుడు దహించే ప్రశ్న ఇది. ఇది పఠితల మనసులలో కూడ వెలుగొందే ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానమే ధర్మరాజు ధర్మచరిత్రలోని రహస్యం.

**వ. మఱియు నచేతనంబు లయ్యును గిరిసరిత్ సరోవరంబులు పుణ్యతీర్థంబులై జగత్పావనంబులై జనులకు దురితాపహరణంబు లైన కారణం బేమి?' యని యడిగిన నతనికి రోమశుం డిట్లనియె. 309**

**ప్రతిపదార్థం:** మఱియున్= అంతేకాక; అచేతనంబులు+అయ్యును= ప్రాణం లేనట్టివి అయినప్పటికిన్నీ; గిరి, సరిత్, సరోవరంబులు= కొండలు, నదులు, సరస్సులు; పుణ్యతీర్థంబులు+ఐ= పుణ్యాన్ని ఒసగే క్షేత్రాలై; జగత్, పావనంబులు+ఐ= లోకంలోని ప్రజలను పవిత్రులను చేసేవై; జనులకు= మనుష్యులకు; దురిత+అపహరణంబులు+ఐన= పాపాలను తొలగించేవైన; కారణంబు+ఏమి= హేతువేమి?; అని= అంటూ; అడిగినన్= ప్రశ్నవేయగా; అతనికిన్= అ ధర్మరాజుకు; రోమశుండు= రోమశ మహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంతేకాక, ప్రాణాలు లేనట్టివి అయినప్పటికిని కొండలు, నదులు, సరస్సులు పుణ్యతీర్థాలై ఏకారణంచేత పాపాలను తొలగించి, మనుష్యులను పవిత్రులనుగా చేయగలుగుతున్నాయి?' - అని ధర్మరాజు రోమశమహర్షిని ప్రశ్నించాడు.

### రోమశుండు ధర్మరాజునకు ధర్మవిశేషంబులు సెప్పుట (సం. 3-92-1)

**చ. 'వసుధ నధర్మవర్తు లగు వారల వర్ధన మెన్నడున్ సమం**
**జసమయి నిల్వనేరదు; భృశంబుగ నాశము వొందు; దుర్మద**

**వ్యసను లధర్మవర్తనఁ బ్రవర్ధితు లయ్యును నేము చూడ రా**
**క్షసులును దైత్యదానవులుఁ గ్రాఁగరె తొల్లి సహస్రసంఖ్యలన్.** **310**

**ప్రతిపదార్థం:** వసుధన్= భూమిలో; అధర్మ, వర్తులు+అగు= అధర్మ ప్రవర్తన కలవారయిన; వారల= వారియొక్క; వర్ధనము= అభివృద్ధి; ఎన్నడున్= ఎప్పటికిని; సమంజసము+అయి= తగినదై (మంచిదై); నిల్వనేరదు= స్థిరంగా ఉండదు; భృశంబుగ= తప్పకుండగా; నాశము+పొందు= నశిస్తుంది; దుర్మదవ్యసనులు= చెడుగర్వంతో చెడుపనులు చేసేవారు; అధర్మవర్తనన్= అధర్మంగా నడవటంచేత; ప్రవర్ధితులు+అయ్యునున్= అభివృద్ధి చెందినప్పటికిని; ఏము, చూడన్= మేం చూస్తుండగానే; రాక్షసులును, దైత్య, దానవులున్= పలు తెగలకు చెందినరాక్షసులును; తొల్లి= పూర్వం; సహస్ర సంఖ్యలన్= వేలకొలదిగా; క్రాఁగరె= నశించలేదా.

**తాత్పర్యం:** 'భూమిపై అధర్మప్రవర్తన కలవారి అభివృద్ధి స్థిరంగా ఎంతోకాలం నిలువనేరదు. తప్పకుండా నాశనమై పోతుంది. ఇక, మా కన్నులముందే ఎందరో రాక్షసులు చెడుగర్వంతో చెలరేగి దుర్మార్గులై ప్రవర్తించి అభివృద్ధి చెందినవారు వేలకువేలు నశించిపోలేదా?

క. **దేవతలు ధర్మవర్తులు । గావున నభివృద్ధిఁ బొంది ఘన మగు నిత్య**
**శ్రీవిభవాన్వితు లయి ధర । ణీవల్లభ! యున్నవారు నిరుపమశక్తిన్.** **311**

**ప్రతిపదార్థం:** ధరణీ, వల్లభ!= భూమికి పతి అయిన ఓ ధర్మరాజా!; దేవతలు= స్వర్గలోకవాసులు; ధర్మవర్తులు= ధర్మాన్ని పాటించే ప్రవర్తన కలవారు; కావునన్= కాబట్టి; అభివృద్ధిన్= అభ్యుదయాన్ని; పొంది= సంపాదించి; ఘనము+అగు= గొప్పదైన; నిత్య, శ్రీ, విభవ+అన్వితులు+అయి= నిత్యకల్యాణశోభతో కూడినవారయి; నిరుపమ, శక్తిన్= సాటిలేని బలంతో; ఉన్నవారు= ఉన్నారు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! దేవతలు ధర్మప్రవర్తన కలవారు కావున అభివృద్ధి పొంది నిత్యకల్యాణశోభతో, సాటిలేని బలంతో విలసిల్లుతున్నారు.

క. **ధర్మసుత! ధార్తరాష్ట్రుల । ధార్మికులై పెటిఁగి రేనిఁ దడయక విధి చే**
**నిర్మూలితు లగుదురు దు । ష్కర్మంబున నసురు లట్ల కడు నస్థిరులై.** **312**

**ప్రతిపదార్థం:** ధర్మసుత!= ఓ ధర్మపుత్రా!; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుడి కుమారులు; అధార్మికులు+ఐ= అధర్మ ప్రవర్తన కలవారై; పెఱిఁగిరి+ఏనిన్= అభివృద్ధి చెందినప్పటికిని; దుష్కర్మంబునన్= చెడుపనులవలన; అసురులు+అట్ల= రాక్షసులవలె; కడున్= మిక్కిలి; అస్థిరులు+ఐ= నిలకడ లేనివారై; విధిచే= బ్రహ్మదేవుడిచేత; తడయక= ఆలస్యం కాకుండ; నిర్మూలితులు+ అగుదురు= నాశనం చేయబడినవారు అవుతారు.

**తాత్పర్యం:** ఓ ధర్మపుత్రా! ధృతరాష్ట్రుడి కొడుకులు అధర్మప్రవర్తనచేత నేడు పెంపు పొందినప్పటికీ, వారు చేసే చెడ్డ పనుల ఫలితంగా రాక్షసులవలె అనతికాలంలో విధిచే నాశనం కావించబడతారు సుమా!

వ. **అది యెట్లనిన నధర్మవర్తులయందు దర్పంబు పుట్టు; దర్పంబువలన మానంబు పుట్టు; మానంబువలనఁ గ్రోధంబు పుట్టుఁ; గ్రోధంబు వలనంజేసి లజ్జయు వృత్తంబునుం జెడు; నష్టలజ్జావృత్తులయినవారి నుపశమంబును లక్ష్మియు విడుచు.** **313**

**ప్రతిపదార్థం:** అది= అది, అంటే అధర్మపరులపతనం; ఎట్లు+అనినన్= ఏ విధంగా జరుగుతుంది అనే ప్రశ్న వేస్తే; అధర్మవర్తుల+అందున్= అధర్మంగా నడిచేవారిలో; దర్పంబు+పుట్టున్= గర్వం ఉదయిస్తుంది; దర్పంబు వలనన్= గర్వంవలన; మానంబు= మమకారం, స్వాభిమానం; పుట్టున్= ఏర్పడుతుంది; మానంబువలనన్= స్వాభిమానంవలన; క్రోధంబు+పుట్టున్= కోపం ఏర్పడుతుంది; క్రోధంబు వలనన్+చేసి= కోపంచేత; లజ్జయు= సిగ్గును; వృత్తంబున్= ప్రవర్తనమున్నూ; చెడున్= చెడిపోతాయి; నష్ట, లజ్జా, వృత్తులు+అయినవారిన్= పోయిన సిగ్గు, నడవడిక కలవారయినవారిని; ఉపశమంబును= నిగ్రహమున్నూ; లక్ష్మియు= శోభయు (సంపదయు)న్నూ; విడుచున్= విడిచిపెట్టుతాయి.

**తాత్పర్యం:** అధర్మపరులపతనం ఏవిధంగా దాపురిస్తుంది? అని ప్రశ్నవేస్తే సమాధానం ఇది: అధర్మ ప్రవర్తన కలవారిలో గర్వం ఉద్భవిస్తుంది. గర్వంవలన స్వాభిమానం ఏర్పడుతుంది. స్వాభిమానంవలన కోపం ఉదయిస్తుంది. కోపంవలన సిగ్గుపోతుంది, నడవడిక చెడుతుంది. సిగ్గున్నూ, సత్ప్రవర్తనమున్నూ లేనివారిని నిగ్రహం, శోభ (సంపద) విడిచిపెడతాయి.

**క. మీ రమరసదృశులరు ధ। ర్మారంభవిశిష్టమతుల రగుటను సుచిర**
**శ్రీరమ్యు లగుదు రాజి; జి। తారాతుల రగుదు రుద్ధతాహవములలోన్. 314**

**ప్రతిపదార్థం:** మీరు+అమర, సదృశులరు= మీరు దేవతలతో సమానులు; ధర్మ+ఆరంభ, విశిష్ట, మతులరు= ధర్మమార్గంలో పురుషకారం నెరపటానికి ప్రత్యేకమైన ఆలోచన కలవారు; అగుటను= అవటంచేత; ఆజిన్= యుద్ధంలో; సు, చిర, శ్రీ, రమ్యులు+అగుదురు= మిక్కిలి ప్రకాశమానమైన శోభచేత అందగించేవారు అవుతారు; ఉద్ధత+ఆహవములలోన్= ఘోరయుద్ధాలలో; జిత+అరాతులరు= జయించబడిన శత్రువులు కలవారు అంటే శత్రువులను జయించినవారు; అగుదురు= అవుతారు.

**తాత్పర్యం:** మీరు దేవతలతో సమానులు. ధర్మం కల పనులలో మాత్రమే పురుషకారం నెరపటానికి ఇష్టపడేవారు. అందువల్ల యుద్ధంలో దేదీప్యమానమైన శోభతో విలసిల్లుతారు. ఘోరయుద్ధంలో శత్రువులను జయిస్తారు.

**వ. ధర్మవర్తులైన దేవతలు ఋషులు నాశ్రయించుటం జేసి తీర్థంబులు పవిత్రంబులై సర్వకామప్రదంబులై వర్తిల్లు చుండుఁ; దీర్థసేవను గ్రతువులను దానంబులను బ్రాహ్మణుల దీవనలను జనులు సర్వదుఃఖవిముక్తులయి శ్రేయఃప్రాప్తు లగుదు' రని చెప్పిన నమ్మునివరునివలన నొండు ధర్మస్థితులు వించుఁబాండవు లరిగి నైమిశంబు, నశ్వతీర్థంబును, గంగాఘోషంబును, గన్యాతీర్థంబును, గోమతియును, బాహుదయును, మహానదియును, దేవ యజనం బయిన ప్రయాగయు, గంగా యమునా సంగమంబును నాడి, యందు బ్రాహ్మణులకు గో హిరణ్య దానంబులుసేసి, ప్రయాగం గొన్ని దినంబు లుండి, వేద విదులయిన బ్రాహ్మణులవలన వేదార్థంబు లెఱుంగుచుఁ జని, యనేక పుణ్యనదీసముద్భవం బయిన గయపర్వతంబును, రామసరంబును, బ్రహ్మసరంబును, వైవస్వత తీర్థంబునుం జూచి, గయయందు నక్షయవటంబున నార్షేయం బైన విధానంబునం జాతుర్మాస్యక్రతువులు సేసి, ఋషులవలనం బుణ్యకథలు వినుచున్న యవసరంబున శమఠుండను మహాముని ధర్మరాజున కిట్లనియె. 315**

**ప్రతిపదార్థం:** ధర్మవర్తు లైన, దేవతలు, ఋషులున్+ఆశ్రయించుటన్+చేసి= ధర్మంతో ప్రవర్తించే దేవతలున్నూ మునులున్నూ ఆరాధించటం (ఆశ్రయించటం) చేత; తీర్థంబులు= పుణ్యక్షేత్రాలు, తీర్థాలు; పవిత్రంబులు+ఐ= పావనాలై; సర్వ, కామ,

ప్రదంబులు+ఐ= కోరికలు అన్నింటిని ఒనగూర్చేవై; వర్తిల్లుచుండున్= విలసిల్లుతుంటాయి; తీర్థసేవను= పుణ్యక్షేత్రాలను, తీర్థాలను సేవించటంచేత; క్రతువులను= యజ్ఞాలను చేయటంచేత; దానంబులను= దానాలు చేయటంచేత; బ్రాహ్మణుల దీవనలను= విప్రుల ఆశీస్సులచేత; జనులు= ప్రజలు; సర్వ, దుఃఖ, విముక్తులు+ఐ= సకల పరితాపాలనుండి తొలగించబడినవారై; శ్రేయస్+ప్రాప్తులు= మేలును పొందేవారు; అగుదురు+అని, చెప్పినన్= అవుతారని చెప్పగా; ఆ+ముని, వరుని, వలనన్= ఆ మునిశ్రేష్ఠుడివలన; ఒండు= వేరు; ధర్మస్థితులు= ధర్మం గురించిన విషయాలు, వించున్= వింటూ; పాండవులు= పాండురాజు కొడుకులు; అరిగి= వెళ్ళి; నైమిశంబున్= నైమిశంలోను; అశ్వ తీర్థంబున్= అశ్వతీర్థంలోను; గంగా ఘోషంబును= గంగా ఘోషం అనే క్షేత్రంలోను; కన్యాతీర్థంబును= కన్యాతీర్థంలోను; గోమతియును= గోమతీనదిలోను; బాహుదయును= బాహుదా నదిలోను; మహానదియును= మహానదిలోను; దేవ, యజనంబు+అయిన= దేవతలు యజ్ఞంచేసిన చోటు అయిన; ప్రయాగయు= ప్రయాగలోను; గంగా, యమునా, సంగమంబును= గంగయు, యమునయు కలిసే స్థలంలోను; ఆడి= స్నానాలు చేసి; అందున్= అచట; బ్రాహ్మణులకున్= విప్రులకు; గో, హిరణ్య, దానంబులు+చేసి= ఆవులను, బంగారాన్ని దానంచేసి; ప్రయాగన్= ప్రయాగలో; కొన్ని, దినంబులు+ఉండి= కొన్నాళ్ళు నివసించి; వేద, విదులు+అయిన= వేదాలను తెలిసినట్టి; బ్రాహ్మణుల వలనన్= విప్రులనుండి; వేద+అర్థంబులు= వేదాల భావాలను; ఎఱుంగుచున్= తెలిసికొంటూ; చని= వెళ్ళి; అనేక, పుణ్య, నదీ, సముద్భవంబు+అయిన= పెక్కు పుణ్యనదులు పుట్టిన చోటైన; గయ పర్వతంబును= గయుడి పేరుమీద వెలసిన కొండను; రామసరంబును= రామసరస్సును; బ్రహ్మ, సరంబును= బ్రహ్మసరస్సును; వైవస్వత, తీర్థంబును= వైవస్వతుడిపేరుపై వెలసిన తీర్థాన్ని; చూచి= సందర్శించి; గయ+అందున్= గయలో; అక్షయ, వటంబునన్= నశించని మఱ్ఱిచెట్టు దగ్గర; ఆర్షేయంబు+ఐన, విధానంబునన్= ఋషులు నిర్దేశించిన పద్ధతిలో; చాతుర్మాస్య, క్రతువులు+చేసి= నాలుగు మాసాలు జరిగే యజ్ఞాలు చేసి; ఋషుల వలనన్= మునులనుండి; పుణ్యకథలు= పుణ్యాన్ని ఇచ్చే ఆఖ్యానాలు; వినుచున్న+అవసరంబునన్= వింటున్న సమయంలో; శమఠుండు= శమఠుడు; అను, మహాముని= అనే గొప్పఋషి; ధర్మరాజునకు= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ధర్మాత్ములైన దేవతలూ, ఋషులూ ఆశ్రయించటంవలన పుణ్యక్షేత్రాలు పవిత్రాలై అన్ని కోరికలను ఈడేర్చే మహిమ కలవై ఉన్నాయి. తీర్థయాత్రలవలన, యజ్ఞాలవలన, విప్రుల ఆశీస్సులవలన, జనులు పరితాపాలు నశించి మేలు పొందుతారు' - అని రోమశుడు ధర్మరాజుతో చెప్పాడు. పాండవులు ఆ మునివలన వేరు వేరు ధర్మ సూక్ష్మాలు తెలిసికొంటూ, పయనించి నైమిశం, అశ్వతీర్థం, గంగాఘోషం, కన్యాతీర్థం, గోమతి, బాహుద, మహానది, దేవతలు యజ్ఞం చేసిన ప్రయాగ, గంగాయమునాసంగమం- అనే తీర్థాలలో స్నానంచేసి, ప్రయాగలో కొన్నాళ్లు నివసించి, వేదవేత్తలయిన విప్రులవలన వేదాలలోని పరమార్థాలను తెలిసికొని, ప్రయాణాలు చేసి, పెక్కు పుణ్యనదుల పుట్టినచోటైన గయపర్వతాన్ని, రామసరస్సునూ, బ్రహ్మసరస్సునూ, వైవస్వతతీర్థాన్ని, చూచి గయలో అక్షయవటంలో ఋషులు నిర్ణయించిన పద్ధతిలో నాలుగు నెలలు పట్టే యజ్ఞాలుచేసి, ఋషులవలన పుణ్యం ఇచ్చే కథలు వింటున్న సమయంలో శమఠుడనే ఋషి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**సీ.** **'సరవి నాధూతరజః ప్రియపుత్త్రుండు । గయుఁ డను రాజర్షి క్రతువు లిందు**
**బ్రహ్మసరంబునఁ బరఁగంగ ముసు చేసె; । నాతని యజ్ఞంబులందు సకల**
**జనభుక్తశేషాన్నశైలంబు లిరువది । యేనగు సంఖ్య దా నెఱుఁగ నయ్యెఁ;**
**దత్కృతక్రతుబహుదక్షిణాసంఖ్యయు । నుడు సికతా సంఖ్యయును నెఱుంగఁ**

**ఆ. గాదు జనుల; కట్టి గయునామమున గయ । యనఁగఁ బుణ్యతీర్థ మయ్యె నిదియుఁ;**
**బితృహితార్థ మిందుఁ బిండప్రదానంబు । సేయఁ గనిన నిష్టసిద్ధి గలుగు'. 316**

**ప్రతిపదార్థం:** సరవిన్= వరుసగా; ఆధూతరజః+ప్రియ, పుత్త్రుండు= ఆధూతరజుడనే వాడియొక్క అనుగు కొడుకు; గయుఁడు+అను, రాజ+ఋషి= గయుడనే రాజర్షి (రాజున్నూ ఋషియున్నూ ఐనవాడు); క్రతువులు= యజ్ఞాలు; ఇందు= ఇక్కడ; బ్రహ్మసరంబునన్= బ్రహ్మ సరస్సులో; పరఁగంగన్= ఒప్పునట్లుగా; మును= పూర్వం; చేసెన్= సలిపాడు; ఆతనిన్= గయుడి; యజ్ఞంబులందు= యజ్ఞాలలో; సకల, జన, భుక్త, శేష+అన్న, శైలంబులు= సర్వప్రజలచేత తినగా మిగిలిన అన్నమనే కొండలు; ఇరువది+ఏను+అగు, సంఖ్య= ఇరవైఅయిదు సంఖ్య; తాన్+ఎఱుఁగన్+అయ్యెన్= తనకు తెలిసినట్టిదయినవి; తద్+కృత, క్రతు, బహుదక్షిణా సంఖ్యయున్= ఆతడు చేసిన యజ్ఞాలలో ఇయ్యబడిన పెక్కు దక్షిణల మొత్తం; ఉడు, సికతా, సంఖ్యయును= నక్షత్రాలయొక్క, ఇసుక రేణువులయొక్క మొత్తమును; జనులకు= ప్రజలకు; ఎఱుఁగన్+కాదు= తెలియటం శక్యంకాదు; అట్టి= అటువంటి; గయు, నామమునన్= గయుడి పేరుమీద; గయ+అనఁగన్= గయ అనబడేటట్లుగా; పుణ్య, తీర్థము+అయ్యెన్= పుణ్యతీర్థం అయింది; ఇదియున్= ఈ గయాక్షేత్రం; పితృ, హిత+అర్థము= పితృదేవతల ప్రీతికొరకు; ఇందున్= ఇచట; పిండప్రదానంబు= పిండాలను దానంచేయటం; చేయన్+కనినన్= చేయగలిగితే; ఇష్ట, సిద్ధి+కలుగున్= కోరిన కోరికలు నెరవేరుతాయి.

**తాత్పర్యం:** 'ఆధూతరజుడి అనుగుకొడుకు గయుడనే రాజర్షి ఇచట బ్రహ్మసరస్సులో పూర్వం చేసిన యజ్ఞాలలో ప్రజలు తినగా శేషించిన (మిగిలిన) అన్నం ఇరువదిఅయిదు కొండలుగా గుట్టపడింది. ఆ యజ్ఞాలలో గయుడు ఇచ్చిన దక్షిణలసంఖ్యను, నక్షత్రాలసంఖ్యను, ఇసుకరేణువులసంఖ్యను జనులెవ్వరూ తెలిసికొనజాలరు. ఆ గయుడి పేరుమీద విలసిల్లింది ఈ గయాక్షేత్రం. గయాక్షేత్రం పితృదేవతలకు మిక్కిలి ప్రీతిపాత్రమయింది. ఇచట పిండప్రదానం చేసినవారికి కోరినకోరికలు ఈడేరుతాయి.'

**విశేషం:** 'సరవి నాధూతరజఃప్రియపుత్త్రుండు'' అనేదానికి సంస్కృతమూలం "శమఠోఽకథయ ద్రాజ న్నాధూర్తరజసం'' (భండార్కరుప్రతి). దీనికి పెక్కు పాఠాంతరాలు ఉన్నాయి. "శమఠోఽకథయ ద్రాజ న్నామూర్తరయసం గయం'' (3-93-16). తెలుగులో "అనఘుం డమూర్తరయఃప్రియ పుత్త్రుండు'' అనే పాఠాంతరం ఉన్నది. ఇక్కడ 'ఆధూత రజఃప్రియపుత్త్రుండు' అనే పాఠం గ్రహించబడింది. ఆమూర్త రజన్+ప్రియ, పుత్త్రుండు అనేటప్పుడు గయుడి తండ్రిపేరు ఆ మూర్తర జుఁడు=రజోగుణం మూర్తీభవించినవాడు అనేఅర్థం సుసంగతం.

**వ. అని చెప్పిన శమఠువలన గయామాహాత్మ్యంబు విని యగస్త్యాశ్రమంబున కరిగి; రంత ధర్మరాజు రోమశున కిట్లనియె. 317**

**ప్రతిపదార్థం:** అని, చెప్పిన= అంటూ చెప్పగా; శమఠువలన= శమఠుడు అనే మునినుండి; గయా, మాహాత్మ్యంబు= గయాక్షేత్రంయొక్క మహిమ; విని= ఆలకించి; అగస్త్య+ఆశ్రమంబునకు= అగస్త్య మహాముని ఆశ్రమానికి; అరిగిరి= వెళ్ళారు; అంత= అంతట; ధర్మరాజు= ధర్మపుత్త్రుడు; రోమశునకు= రోమశుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** శమఠుడనే మహర్షి గయామాహాత్మ్యాన్ని ధర్మరాజుకు వినిపించాడు. పిమ్మట వారందరు అగస్త్యాశ్రమానికి వెళ్ళారు. అచట ధర్మరాజు రోమశుడితో ఇట్లా అన్నాడు.

**మధ్యాక్కర.**

**'వాతాపి యనువాని నెట్లు సంపె సద్వంద్యుఁ డగస్త్యుఁ?**
**డాతతతేజో౽ధికుండు నా విందు నమ్మునినాథుఁ;**
**బ్రీతిని దచ్చరితంబు వినఁగ నభీష్ట మిం' దనిన**
**నాతని కిట్లని చెప్పె రోమశుం డన్ముని పేర్మి. 318**

**ప్రతిపదార్థం:** వాతాపి+అనువానిన్= వాతాపి అనే వాడిని; సత్+వంద్యుఁడు= మంచివారిచేత నమస్కరించ దగినవాడు, అగస్త్యుఁడు; ఎట్లు+చంపెన్= ఏవిధంగా సంహరించాడు; ఆ+ముని, నాథున్= మునులకు అధిపతి అయిన ఆ అగస్త్యుడిని గురించి; ఆతత, తేజస్+అధికుండు, నాన్= విస్తారమైన వర్చస్సుచేత గొప్పవాడు అనగా; విందున్= వింటూ ఉంటాను; ఇందున్= ఇచట; ప్రీతిని= అనురాగంతో; తత్+చరితంబు= ఆతని చరిత్ర; వినఁగన్= వినాలనే; అభీష్టము= కోరిక; అనినన్= అని అనగా; ఆతనికి (ధర్మరాజుకు); రోమశుండు= రోమశుడు; అన్+ముని= అనే ఋషి; పేర్మిన్= గౌరవంతో; ఇట్లు+అని, చెప్పెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'అగస్త్యమహర్షి వాతాపిని ఏ విధంగా చంపాడు? అగస్త్యమహర్షి సజ్జనులచేత నమస్కరించతగినవాడనిన్నీ, విస్తారమైన తేజస్సుతో వెలుగొందే మహానుభావుడనిన్నీ విని ఉన్నాను. ప్రీతితో ఆ మునీంద్రుడి చరిత్ర ఇచట వినాలని ఉన్నది'- అని అన్న ధర్మరాజుతో రోమశమహర్షి గౌరవపురస్సరంగా ఇట్లా పలికాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి ఈ ఆశ్వాసంలోని 22వ పద్యం విశేషవ్యాఖ్య చూడండి.

**క.** **'వీతభయుఁ డిల్వలుండును । వాతాపియు ననఁగఁ బరఁగు వరదైత్యులు వి**
**ఖ్యాతబలులు వసియింతు ర । రాతిహరుల్ మణిమతీపురంబున నొప్పన్. 319**

**ప్రతిపదార్థం:** వీతభయుఁడు= పోయిన భయం కలవాడు - అంటే నిర్భయుడు, భయంలేనివాడు; ఇల్వలుండును= ఇల్వలుడనే వాడును; వాతాపియున్; అనఁగన్+పరఁగు= అనే పేరులతో పిలువబడే; వరదైత్యులు= గొప్ప రాక్షసులు (వరాలు పొందిన రాక్షసులు); విఖ్యాత, బలులు= సుప్రసిద్ధమైన బలవంతులు; అరాతి హరుల్= శత్రువులను చంపేవారు; మణిమతీ పురంబునన్= మణిమతి అనే పట్టణంలో; ఒప్పన్= శోభాయమానంగా; వసియింతురు= నివసిస్తారు.

**తాత్పర్యం:** 'సుప్రసిద్ధ బలవంతులు, శత్రుసంహారులు, నిర్భయులు అయిన ఇల్వలుడు, వాతాపి అనే రాక్షసులు మణిమతీపురంలో వైభవోపేతంగా నివసిస్తూ ఉన్నారు.

**వ.** **అం దగ్రజుం డయిన యిల్వలుం డొక్కబ్రాహ్మణు నతిభక్తి నర్చించి, 'నాకు సకలకామసిద్ధికరం బగు మంత్రం బుపదేశించు' మని ప్రార్థించి విఫలప్రార్థనుండై యరిగి తన తమ్ముఁ గామరూపధరు వాతాపి నపుడు మేష రూపంబు సేసి వధియించి వాని మాంసం బిమ్ముగా వండించి దాని నా విప్రునకుఁ గుడువం బెట్టించి. 320**

**ప్రతిపదార్థం:** అందు= (ఇల్వల వాతాపులలో); అగ్రజుండు+అయిన= మొదట పుట్టిన అన్నగారయిన; ఇల్వలుండు= ఇల్వలుడు; ఒక్క బ్రాహ్మణున్= ఒకానొక విప్రుడిని; అతి భక్తిన్= మిక్కిలి పూజ్యభావంతో; అర్చించి= ఆరాధించి; నాకున్; సకల, కామసిద్ధికరంబు+అగు= సమస్తమైన కోరికలు ఫలించేటట్లు చేసే మంత్రంబు; ఉపదేశించుము= చెప్పుము; అని=

అంటూ; ప్రార్థించి= వేడి; విఫల ప్రార్థనుండు+ఐ= నెరవేరని కోరిక కలవాడై; అరిగి= వెళ్ళి; తన, తమ్మున్= తన తమ్ముడిని; కామరూప ధరున్= ఇష్టమైన ఆకారం ధరించే మహిమ కలవాడిని; వాతాపిన్= వాతాపిని; అపుడు; మేషరూపంబు+చేసి= మేక ఆకారం కలవాడినిగా చేసి; వధియించి= చంపి; వాని, మాంసంబు= ఆతడి మాంసాన్ని; ఇమ్ముగాన్= బాగుగా; వండించి= పచనం చేయించి; దానిన్= ఆ వండిన మాంసాన్ని; ఆ+విప్రునకున్= ఆ బ్రాహ్మణుడికి; కుడువన్+పెట్టించి= తినటానికి పెట్టించి.

**తాత్పర్యం:** వారిలో అన్నగారు ఇల్వలుడు. అతడు ఒకనాడు ఒక విప్రుడిని భక్తితో పూజించి 'నాకు సమస్తమైన కోరికలు ఈడేరేటటువంటి మంత్రాన్ని ఉపదేశించండి' అని ప్రార్థించాడు. కాని ఆ విప్రుడు అటువంటి మంత్రోపదేశం చేయకపోవటంచేత మరలిపోయి, కామరూపుడైన తన తమ్ముడు వాతాపిని మేకగా మార్చి, ఆ మేక మాంసం వండించి ఆ బ్రాహ్మణుడికి విందుచేశాడు.

**తే. విప్రుకడుపులో నున్న యవ్వీరు ననుజుఁ। బిలిచె 'వాతాపి! ర' మ్మని ప్రియముతోడ;**
**జీవితుం డయి వాఁడు చెచ్చెరను విప్రు। కడుపు వ్రచ్చుచు వెలువడి క్రాఁచె విప్రు. 321**

**ప్రతిపదార్థం:** విప్రు, కడుపు లోన్+ఉన్న= బ్రాహ్మణుడి పొట్టలో ఉన్న; ఆ+వీరున్+ఆ వీరుడిని; అనుజున్= తమ్ముడిని; వాతాపి= ఓ వాతాపీ!; రమ్ము+అని= రావలసిందని; ప్రియముతోడన్= ప్రీతితోడ; పిలిచెన్= పిలిచాడు; వాఁడు= అతడు (ఆ వాతాపి); జీవితుండు+అయి= బ్రతికినట్టివాడయి; చెచ్చెరను= శీఘ్రంగా; విప్రు కడుపు= బ్రాహ్మణుడి పొట్టను; వ్రచ్చుచున్= చీలుస్తూ; వెలువడి= బయటకువచ్చి; విప్రున్= బ్రాహ్మణుడిని; క్రాఁచెన్= చంపాడు.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణుడి పొట్టలో ఉండే ఆ వీరుడిని 'ఓ వాతాపీ! రమ్ము' అని ఇల్వలుడు ప్రీతితో పిలిచాడు. ఆ వాతాపి బ్రతికి శీఘ్రంగా ఆ బ్రాహ్మణుడి పొట్ట చీలుస్తూ బయటికి వచ్చి, ఆ బ్రాహ్మణుని చంపాడు.

**వ. అది మొదలుగా నిల్వలుండు దనకడకు నతిథులై వచ్చు విప్రుల నప్పాట నంతకుపురంబున కతిథులం జేయు చున్నంత; నట నగస్త్యుండు బ్రహ్మచర్యాశ్రమంబునం బెద్దకాలం బుగ్రతపంబు సేయుచు వనంబునఁ బరిభ్రమించు వాఁ డొక్క సల్లకీపల్లవంబున నధోముఖులై వ్రేలుచున్న తన పితరులం జూచి' యివ్విధంబున మీ రున్న కారణం బేమి?' యని యడిగినఁ బితరు లిట్లనిరి. 322**

**ప్రతిపదార్థం:** అది, మొదలుగాన్= బ్రాహ్మణుడి హత్య చేయటం మొదలుగా; ఇల్వలుండు; తన, కడకున్= తన దగ్గరికి; అతిథులు+ఐ, వచ్చు= అతిథులుగా వచ్చే; (తిథి చూచికొనకుండ ప్రయాణం చేసి భోజనంకొరకు పరగృహం చేరెడివాడు న+తిథి= తిథిలేనివాడు); విప్రులన్= బ్రాహ్మణులను; ఆ+పాటన్= ఆ రీతిగా; అంతకు, పురంబునకున్= యముడి నగరానికి; అతిథులన్+చేయుచున్నంతన్= అతిథులుగా పంపిస్తూఉండగా; అటన్= అక్కడ; అగస్త్యుండు= అగస్త్య మహాముని; బ్రహ్మచర్య+ఆశ్రమంబునన్= వివాహం చేసికొనకుండ (స్త్రీ సంపర్కం లేకుండ) జ్ఞాన సముపార్జనకై తపోనిష్ఠలో ఉండి; పెద్దకాలంబు= చాలాకాలం; ఉగ్ర, తపంబు+చేయుచున్= కఠినమైన తపస్సు సలుపుతూ; వనంబునన్= అడవిలో; పరిభ్రమించు వాఁడు= తిరుగాడేవాడు; ఒక్క= ఒక; సల్లకీ పల్లవంబునన్= అందుగుచెట్టుచిగురుకు; అధో, ముఖులు+ఐ= తలక్రిందుగా; వ్రేలుచున్న= వ్రేలాడుతున్న; తన, పితరులన్+చూచి= తన పితృదేవతలను చూచి; ఈ+విధంబునన్= ఈ రీతిగా; మీరు+ఉన్న, కారణంబు+ఏమి= మీరు ఉండటానికి కల హేతువు ఏమిటి?; అని= అంటూ; అడిగినన్= ప్రశ్నించగా; పితరులు= పితృదేవతలు; ఇట్లు+అనిరి= ఇట్లా చెప్పారు.

**తాత్పర్యం:** అప్పటినుండి ఇల్వలుడు తనకడకు అతిథులుగా వచ్చే విప్రులను అదేవిధంగా యముడి పురానికి అతిథులుగా పంపుతుండేవాడు. అప్పుడు అచట బ్రహ్మచర్యదీక్షతో కఠోరతపస్సు చేస్తూ అడవిలో తిరుగుతుండే అగస్త్యమహాముని ఒకనాడు అందుగుచెట్టు చిగురుటాకుకు ఆధారంగా చేసికొని తలక్రిందులుగా వ్రేలాడుతున్న తన పితృదేవతలను చూచి 'ఈ విధంగా మీరు ఉండటానికి కారణం ఏమి?' టని వారిని ప్రశ్నించాడు. అంత పితరులు ఈ విధంగా సమాధానం చెప్పారు.

**తే.** **'అయ్య! యేము నీ పితరుల; మధికనిష్ఠ। బ్రహ్మచారివై నీవు తపంబు సేయు**
**చున్నవాఁడవు సంతతి నొల్ల; కదియ। కారణంబుగ మా కూర్ధ్వగతియు లేదు.** **323**

**ప్రతిపదార్థం:** అయ్య!= నాయనా!; ఏము= మేము; నీ, పితరులము= నీ పితృదేవతలం; నీవు; సంతతిన్+ఒల్లక= సంతానాన్ని ఇచ్ఛగించక; బ్రహ్మచారివి+ఐ= వివాహం చేసికొనక ఉన్న జిజ్ఞాసువువై; అధికనిష్ఠన్= ఎక్కువదీక్షతో; తపంబు= తపస్సు; చేయుచున్న వాఁడవు= చేస్తున్నవాడివి; అదియ= అదియే; కారణంబుగన్= హేతువుగా; మాకు+ఊర్ధ్వగతియు; లేదు= మాకు ఉత్తమలోకాల ప్రాప్తి లేదు.

**తాత్పర్యం:** 'నాయనా! మేము నీ పితృదేవతలం. నీవు సంతానాన్ని ఒల్లక గొప్ప నిష్ఠతో బ్రహ్మచర్యం పాటిస్తూ తపస్సు చేస్తున్నావు కదా! అదే కారణంచేత నీ పితరులమైన మాకు ఉత్తమగతులు లేకపోయాయి.

**వ.** **ఇంకనైనను నీవు వివాహంబై సంతానంబు వడసిన మాకుఁ బుణ్యగతి వడయ నగు' ననిన 'నట్ల చేయుదు' నని యగస్త్యుండు తన తపశ్శక్తింజేసి పుత్త్రకాముండైన విదర్భరాజున కొక్కకూఁతుం బుట్టించిన నది లోపాముద్ర యను నామంబుతో జలంబులయందు నలినియుంబోలె వినీతునందు లక్ష్మియుంబోలె నుద్యుక్తునందు విద్యయుం బోలెఁ బెరిఁగి యౌవనంబు దాల్చి రూపవతియై వయోరూపంబుల ననురూప లయిన కన్యకా శతంబుతో నొప్పుచున్నంత.** **324**

**ప్రతిపదార్థం:** ఇంకను+ఐనను= ఇకపైనైనా; నీవు; వివాహంబు+ఐ= పెండ్లి చేసికొని; సంతానంబు+పడసిన= సంతతిని కంటే; మాకున్= నీ పితరులమైన మాకు; పుణ్యగతి= పుణ్యలోకం; పడయన్+అగున్+అనినన్= పొందటానికి వీలవుతుందని అనగా; అట్లు+అ= ఆ విధంగానే; చేయుదును+అని= చేస్తానని; అగస్త్యుండు= అగస్త్యుడు; తన, తపస్+శక్తిన్= తన తపస్సుయొక్క మహిమచేత; పుత్త్ర కాముండు+ఐన= పుత్ర సంతానం కోరుకొంటున్న; విదర్భ, రాజునకున్= విదర్భదేశాన్ని ఏలుతున్న ప్రభువుకు; ఒక్క, కూఁతున్+పుట్టించినన్= ఒక కూతురు పుట్టేటట్లు చేయగా; అది= ఆమె; లోపాముద్ర+అను, నామంబుతో= లోపాముద్ర అనేపేరుతో; జలంబుల+అందు= నీటిలో; నళినియున్+పోలె= తామరపుష్పం వలె; వినీతు+అందు= మంచి శీలం కలవాడిపట్ల; లక్ష్మియున్+పోలెన్= ఐశ్వర్యం వలె; ఉద్యుక్తు+అందున్= ప్రయత్నం చేయటానికి ఉత్సహించే వాడిపట్ల; విద్యయున్+పోలె= చదువు వలె; పెరిఁగి= అభ్యున్నతి చెంది; యౌవనంబు+తాల్చి= పడుచుదనంపేర్మి కలిగి; రూపవతి+ఐ= అందగత్తె అయి; వయస్+రూపంబులన్= వయస్సులోను, రూపంలోను; అనురూపలు+అయిన= ఈడు జోడు కుదిరిన; కన్యకాశతంబుతోన్= నూర్గురు పడుచు పిల్లలతో; ఒప్పుచు+ఉన్నంతన్= విలసిల్లుతుండగా.

**తాత్పర్యం:** ఇకనైన నీవు పెండ్లి చేసికొని సంతానాన్ని కంటే మాకు పుణ్యగతి లభిస్తుంది' - అని పితరులు చెప్పగా, అగస్త్యుడు అట్లాగే చేస్తానని చెప్పాడు. అటుపై సంతానాన్ని కోరుతున్న విదర్భరాజుకు అగస్త్యుడు తన తపస్సుయొక్క మహిమచేత ఒక కూతురును పుట్టించాడు. ఆమెపేరు లోపాముద్ర. ఆ రాజపుత్రిక నీటిలో పద్మంవలె, వినీతుడి

పట్ల లక్ష్మివలె, పరిశ్రమ చేసేవాడిపట్ల విద్యవలె, దినదినాభివృద్ధి చెందింది. ఆమె యౌవనవతి అయి, ఈడు జోడు కుదిరిన నూర్గురుకన్యలు చెలికత్తెలుగా కొలుస్తుంటే మిక్కిలి శోభిల్లుతూ ఉండింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. తరుణి నగస్త్యుభయంబున । వరియింపఁగ నోడి రాజవరులు మనోజా**
**తురు లగుచుండిరి; తగియెడు । వరు రోయుచునుండె సుతకు వైదర్భుండున్. 325**

**ప్రతిపదార్థం:** తరుణిన్= యౌవనవతి అయిన లోపాముద్రను; అగస్త్యు భయంబునన్= అగస్త్యుడి పట్ల భీతితో; రాజవరులు= రాజశ్రేష్ఠులు అయిన పెండ్లి కొడుకులు; వరియింపఁగన్+ఓడి= పెండ్లాడటానికి ముందుకు రాలేక; మనస్+జ+ఆతురులు= మన్మథుడిచేత పీడించబడినవారు; అగుచుండిరి; వైదర్భుండున్= విదర్భరాజుకూడ; సుతకున్= కూతురికి; తగియెడు వరున్= సరిపోయే పెండ్లికొడుకును; రోయుచున్+ఉండెన్= వెదకుతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** యౌవనవతి అయిన ఆ లోపాముద్రను అగస్త్యుడి వలని భీతిచేత పెండ్లాడటానికి ముందుకు రాలేక రాకుమారులు మన్మథతాపంతో వెత చెందుతూ ఉండిపోయారు. విదర్భరాజు కూడ తన పుత్రికకు తగిన వరుడికై అన్వేషిస్తూ ఉన్నాడు.

**వ. అంత నగస్త్యుండు విదర్భరాజుపాలికి వచ్చి 'నాకు లోపాముద్ర నిచ్చునది' యనిన, విదర్భేశ్వరుండు తన తనూజ నమ్మునికి నీ నోపక మనంబున ననుతాపించి యక్కన్యకం జూచి యాత్మగతంబున. 326**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; అగస్త్యుండు= అగస్త్యుడు; విదర్భరాజు పాలికిన్= విదర్భ నేలే ప్రభువు కడకు; వచ్చి; నాకు; లోపాముద్రను; ఇచ్చునది= ఇచ్చిపెండ్లి చేసేది; అనినన్= అని అడుగగా; విదర్భా+ఈశ్వరుండు= విదర్భదేశరాజు; తన, తనూజన్= తన కూతురిని; ఆ+మునికి= ఆ ఋషికి; ఈన్+ఓపక= ఇవ్వజాలక; మనంబునన్= మనస్సులో; అనుతాపించి= మిక్కిలి వ్యథచెంది; ఆ+కన్యకన్+చూచి; ఆత్మగతంబున= తనలో తాను.

**తాత్పర్యం:** పిమ్మట అగస్త్యుడు విదర్భరాజుదగ్గరకు వచ్చి లోపాముద్రను తనకిచ్చి పెండ్లి చేయుమని అడిగాడు. విదర్భేశ్వరుడు తనకూతురిని ఆ ఋషికి ఇచ్చి పెండ్లి చేయటానికి ఇష్టంలేక తన మనస్సులో మిక్కిలి పరితపించి తనలో తాను ఇట్లా అనుకొన్నాడు.

**ఉ. 'నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో**
**భారమునం గృశుం డయిన బ్రాహ్మణుఁ డీ లలితాంగిఁ బెండ్లియై**
**నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో**
**భారము దాల్చియుండు మని పంపక మిన్నక యుండ నేర్చునే? 327**

**ప్రతిపదార్థం:** నారలు+కట్టి= నారతో చేసిన బట్టలు కట్టి; కూరలు+అశనంబుగన్= ఆకులు అలములు తిండిగా చేసికొని; ఉగ్రవనంబులోన్= భయంకరమైన అడవిలో; తపస్+భారమునన్= తపస్సు చేయటం అనే బరువు వలన; కృశుండు+అయిన= చిక్కిపోయిన; బ్రాహ్మణుఁడు; ఈ, లలితాంగిన్= ఈ సుకుమారిని; పెండ్లి+ఐ= వివాహమై; ఉగ్ర వనంబులోన్= ఘోరమైన అడవిలో; నారలు+కట్టి= నారచీరలు ధరించి; కూరలు+అశనంబుగన్= ఆకులు అలములు తిని; తపస్+భారము= తపస్సు

చేసే బరువును; తాల్చి+ఉండుము+అని= ధరించి ఉండుము అని; పంపక= నియోగించక; మిన్నక= ఊరక; ఉండనేర్చునే?= ఉండగలడా?

**తాత్పర్యం:** నారబట్టలు కట్టుకొని, ఆకులు అలములు ఆహారంగా భయంకరమైన అడవిలో కఠోర తపస్సు చేయటంవలన బక్కచిక్కిన బడుగుదేహంతో ఉన్న ఈ నిరుపేదబాపడు- ఈ సుకుమార సుందరాంగి అయిన రాకుమారిని పెండ్లాడి ఆమెను కూడ కారడవులలో నారబట్టలు కట్టుకొని, ఆకులు అలములు తిని తనతోపాటు తపోభారాన్ని మోయుమని నియోగించకుండా ఉంటాడా?

**ఆ. ఎఱిఁగి యెఱిఁగి దీని నె ట్లీఁగ నగు భోగ । యోగ్యయైన యది పయోజనేత్ర;**
**యీనినాఁడు శాప మిచ్చుఁ గా; కిమ్ముని । యేల సైఁచు? నింక నెట్టులొక్కొ!' 328**

**ప్రతిపదార్థం:** భోగ, యోగ్య+ఐన+అది= సుఖాలు అనుభవించటానికి తగినట్టిది; పయోజ నేత్ర= నీటినుంచి పుట్టిన పద్మాలవంటి కన్నులుకలది; దీనిన్= ఈమెను; ఎఱిఁగి+ఎఱిఁగి= తెలిసి తెలిసి; ఎట్లు+ఈఁగన్+అగు= ఎట్లా ఇవ్వటానికి వీలు పడుతుంది?; ఈని, నాఁడు= ఇవ్వని వేళ; ఈ+ముని= ఈ ఋషి; శాపము+ఇచ్చున్+కాక= శాపాన్ని ఇస్తాడు కాని; ఏల సైఁచున్= ఎందుకు సహించి ఊరకుంటాడు?; ఇంకన్= మరి; ఎట్టులు+ఒక్కొ!= ఏ విధంగా చేయనవుతుంది?

**తాత్పర్యం:** ఈ బ్రాహ్మణుడు ఘోరమైన అరణ్యాలలో తిరుగాడుతూ నారవస్త్రాలు కట్టుకొని తపస్సు చేయటంవలన బక్కచిక్కినదేహంతో ఆకులలములు తిని పొట్ట నింపుకొనే నిరుపేద- అని తెలిసి తెలిసి నా కూతురిని ఎట్లా ఇవ్వాలి? భోగభాగ్యాలతో తులతూగదగిన, పద్మాలవంటి నేత్రాలు గలిగిన ఈమెను అగస్త్యుడికి ఇవ్వ కుంటే శాపమిస్తాడు కాని, ఊరక ఎందుకుంటాడు? ఎందుకు ఓర్చుకుంటాడు? ఇంక ఎట్లా చేయాలి?'

**వ. అని వైదర్భుండు దానునుం బత్నియు వగచుచున్న వారిపాలికి వచ్చి లోపాముద్ర యిట్లనియె. 329**

**ప్రతిపదార్థం:** అని= అని తలపోసి; వైదర్భుండు= విదర్భరాజు; తానునున్= తానును; పత్నియు= భార్యయు; వగచుచున్న= విచారిస్తుండగా; లోపాముద్ర; వారి, పాలికి, వచ్చి= వారి దగ్గరకు చేరి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** అని ఆలోచించి విదర్భరాజు తానూ తనభార్య విచారిస్తున్న సమయంలో రాకుమారి లోపాముద్ర తన తలిదండ్రుల వద్దకు వచ్చి ఇట్లా పలికింది.

**క. 'ఇమ్మునివరునకు నన్నుఁ బ్రి । యమ్మున నిచ్చునది; మీకు నతిచింతాభా**
**ర మ్మేల?' యనిన నిరువురు । నమ్ముదితకు సంతసిల్లి యధికవిభూతిన్. 330**

**ప్రతిపదార్థం:** ఈ+ముని వరునకున్= ఈ ఋషి శ్రేష్ఠుడికి; నన్నున్= నన్ను; ప్రియమ్మునన్= ప్రీతితో; ఇచ్చునది= పెండ్లి చేసేది; మీకున్; అతి, చింతా, భారమ్ము+ఏల= మిక్కిలి పరితాపం చెందే బరువు ఎందుకు?; అనినన్= అని చెప్పగా; ఇరువురును= ఆ ఇద్దరును (భార్యాభర్తలు); ఆ+ముదితకున్= ఆ కుమారికి, అంటే ఆ కుమారి చెప్పినమాటలకు; సంతసిల్లి= సంతోషించి; అధిక, విభూతిన్= మిక్కిలి వైభవంతో.

**తాత్పర్యం:** 'ఈ ఋషిశ్రేష్ఠుడికి నన్ను ప్రీతితో ఇచ్చి పెండ్లి చేయండి. మీరు మిక్కిలి పరితాపం పొంది క్రుంగట మెందుకు?' అని లోపాముద్ర పలుకగా ఆ దంపతులిరువురు మిక్కిలి సంతోషించి, మహావైభవోపేతంగా.

**విశేషం:** వియ్యానికి, కయ్యానికి సరిసమానులుండాలని తెలుగు సామెత. మహాభారతంలోని ఉపాఖ్యానాలలో మానవ జీవితంలోని వెలుగు నీడలు పడుగుపేకగా అల్లబడి ఎన్నో రహస్యాలు పొందుపరచబడినాయి. రాకుమారి లోపాముద్ర తాను స్వయంగా అగస్త్యుడిని వరించటంలో ఆమె మనస్తత్వంలోని రహస్యం ఏమిటి? అది తల్లిదండ్రులకై ఆమె చేసిన త్యాగమా? మహర్షిపై ఆమెకు అంతరాంతరాలలో ఏర్పడిన గౌరవాభిమానమా? లేక ఆమె చిత్తవృత్తిలో రెండూ కలిసినవా? ఎన్నో ప్రశ్నలు ఉదయించవచ్చును. మానవుల మనస్సు మిక్కిలి గహనమైనది. చిత్ర విచిత్రమైనది. అగస్త్యుడు ఒక అసాధారణ వ్యక్తి. ఆతడిని వరించిన రాకుమారి లోపాముద్ర చిత్తప్రవృత్తికూడా మిక్కిలి లోతైనది. అగస్త్య లోపాముద్రల వైవాహికజీవితం, తదుపరి వారి జీవితచరిత్ర అనుశీలించదగినట్టివి. అందుండి అధ్యయనం చేయదగిన అంశాలు పెక్కు ఉన్నాయి. లోపాముద్ర మహాపతివ్రతాశిరోమణిఅయి అగస్త్యుడిని అనుసరించి ఆయన మన్ననకు పాత్రురాలైనట్టిది. అగస్త్యుడు ఆమెను లాలించి వరం కోరుకొమ్మన్నప్పుడు ఆమె మనఃకుహరాంతరాలలో ఎచ్చటనో దాగుకొని ఉండే భోగలాలసత్వం పైకి ఉబికింది. అప్పుడు మహామహిమోపేతుడైన ఆ మహర్షి ఆమెను అనుగ్రహించగలిగాడు.

### అగస్త్యుఁడు లోపాముద్రను వివాహం బగుట (సం. 3-95-9)

**వ.** **విధ్యుక్తంబుగా నక్కోమలి నగస్త్యునకు వివాహంబుఁ జేసిన, నగస్త్యుండు లోపాముద్రం బరిగ్రహించి, దాని దివ్యాంబరాభరణంబు లపనయించి వల్కలాజినధారిణిం జేసి, ధర్మచారిణిం దోడ్కొని చని గంగా ద్వారంబునం దపంబు సేయుచు నొక్కనాఁడు.** **331**

**ప్రతిపదార్థం:** విధి+ఉక్తంబుగా= నిర్దేశ సూత్రాలలో చెప్పబడినట్లుగా, అంటే శాస్త్రీయమైన పద్ధతిలో; ఆ+కోమలిన్= ఆ సుకుమారమైన దేహం కల లోపాముద్రను; అగస్త్యునకున్= అగస్త్యుడికి ఇచ్చి; వివాహంబున్+చేసినన్= పెండ్లి చేయగా; అగస్త్యుండు; లోపాముద్రన్= లోపాముద్రను; పరిగ్రహించి= స్వీకరించి; దాని= ఆమెయొక్క; దివ్య+అంబర+ఆభరణంబులు= మేల్తరాలయిన వస్త్రాలు, నగలు; అపనయించి= తీసివేయించి; వల్కల+అజిన, ధారిణిన్+చేసి= నారచీరలు జింకచర్మం కట్టుకొనే దానినిగా చేసి అంటే- నారచీరలు కట్టించి జింకచర్మంతో చేయబడిన అలంకారాలు పెట్టించి; ధర్మ చారిణిన్= ధర్మంలో తనకు సహవ్రతురాలిని; తోడ్కొని= వెంట పెట్టుకొని; చని= వెళ్ళి; గంగా, ద్వారంబునన్= గంగ భూమిని ప్రవేశించే చోట అంటే హరిద్వారంలో; తపంబు+చేయుచున్= తపస్సు చేసికొంటూ; ఒక్కనాఁడు= ఒకానొకరోజు.

**తాత్పర్యం:** శాస్త్రాలలోని సూత్రాలలో నిర్దేశించబడిన పద్ధతిలో విదర్భరాజు తన కూతురు లోపాముద్రను అగస్త్యుడికి ఇచ్చి పెండ్లిచేశాడు. అంత, అగస్త్యుడు లోపాముద్రను ధర్మపత్నిగా స్వీకరించి, ఆమె ధరించిన గొప్ప ఆభరణాలు, వస్త్రాలు తీసివేయించి, ఆమెచేత నారచీరలు, జింకచర్మం ధరింపజేసి తనవెంట తీసికొని వెళ్ళి గంగాద్వారంలో తపస్సు చేసికొంటూ ఉండగా ఒకానొకదినం.

**విశేషం:** లోపాముద్ర లోతైన స్వభావం కలిగినది. వివాహం కాగానే భర్త తన మేనిమీది ఆభరణాలన్నింటిని తొలగింపచేశాడు. నారచీరలు కట్టబెట్టాడు. ఆమె కిమ్మనకుండ మగడిమాట పాటించింది. కాని, భర్త తనంతట తాను తనను కోరివచ్చినప్పుడు ఆభరణాలతో తనను అలంకరించి, తానూ అలంకరించుకొని భోగించుమని కోరింది. అప్పు డగస్త్యుడు ఆమె కోర్కెను మన్నించాడు.

**క.** **నీచతరనాభిఁ జపలవి । లోచనఁ బృథుజఘనచక్ర లోపాముద్రం**
**జూచి మునీంద్రుఁడు మన్మథ । గోచరుఁడై దానిఁ బ్రీతిఁ గూడఁగఁ దివిరెన్.** **332**

**ప్రతిపదార్థం:** నీచతర, నాభిన్= మిక్కిలి లోతైన బొడ్డు కలదానిని; చపల విలోచనన్= చలించే కన్నులు కలదానిని; పృథు, జఘన, చక్రన్= విస్తరించిన గుండ్రని మొలకట్టు కలదానిని; లోపాముద్రన్+చూచి; ముని+ఇంద్రుఁడు= మునులలో ఇంద్రుడి వంటి వాడైన; అగస్త్యుఁడు; మన్మథ గోచరుఁడు+ఐ= శృంగార భావానికి లోనైనవాడై; దానిన్= ఆమెను; ప్రీతిన్= ప్రియమార; కూడఁగన్+తివిరెన్= సంభోగించటానికి పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** మునీంద్రుడైన అగస్త్యుడు లోతైన బొడ్డు గలదీ, చలించే కన్నులు గలదీ, విస్తరించిన గుండ్రని మొలకట్టు గలదీ అయిన లోపాముద్రను చూచి, శృంగారభావానికి లోనై ఆమెను సంభోగించటానికి తలపెట్టాడు.

**వ. అదియును మునివరు నభిప్రాయం బెఱింగి లజ్జించి ముకుళితకరాంబుజయై యిట్లనియె. 333**

**ప్రతిపదార్థం:** అదియును= ఆమెయు (ఆ లోపాముద్రయు); ముని, వరు+అభిప్రాయంబు= మునిశ్రేష్ఠుడి తలంపును; ఎఱింగి= తెలిసికొని; లజ్జించి= సిగ్గుపడి; ముకుళిత, కర+అంబుజ+ఐ= ముడిచిన చేతులు అనే పద్మాలు కలదై, అంటే నమస్కరించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** ఆ లోపాముద్రకూడా అగస్త్యుడి అభిప్రాయాన్ని గుర్తించి సిగ్గుపడి ఆతడికి భక్తితో నమస్కరించి ఇట్లా పలికింది.

**క. 'పతి పత్నిఁ బ్రజార్థముగా । ధృతిఁ బడయుట యెందుఁ గల యదియ యైనను న**
**న్నతి రుచిరాంబర భూషా । న్వితఁ జేసి మనఃప్రియంబు నిర్మింపు దయన్. 334**

**ప్రతిపదార్థం:** పతి= భర్త; పత్నిన్= భార్యను; ధృతిన్= నిష్ఠతో; ప్రజా+అర్థముగా= సంతానం కొరకై; పడయుట= పొందటం; ఎందున్= ఎక్కడైనా; కల+అదియ+ఐనను= ఉన్నదే అయినప్పటికిని; నన్ను; అతి, రుచిర+అంబర, భూషా+అన్వితన్+చేసి= మిక్కిలి కాంతి గల వస్త్రాలతో, ఆభరణాలతో కూడిన దానిని చేసి; దయన్= కరుణతో; మనఃప్రియంబు (మనస్+ప్రియంబు)= మనస్సుకు ప్రీతిని; నిర్మింపు= కలగజేయుము.

**తాత్పర్యం:** 'భర్త భార్యను సంతానార్థమై పొందటం ఎక్కడైనా ప్రకృతి సహజమే. అయినను నన్ను శోభాయమానమైన ఆభరణాలతో, వస్త్రాలతో అలంకరించి కరుణతో నా మనస్సుకు ప్రీతిని చేకూర్చుము.

**క. మునినాథ! నీవు ననులే । పనమాల్య విభూషణ ప్రసన్నుఁడవై నా**
**కొనరింపు మపత్యోత్పా । దన మీ ఋతువాసరములు దప్పక యుండన్'. 335**

**ప్రతిపదార్థం:** మునినాథ!= ఋషులలో అధినేతవైనవాడా!; నీవున్= నీవును; అనులేపన, మాల్య, విభూషణ, ప్రసన్నుఁడవు+ఐ= మైపూతలతో, పూలమాలలతో, ఆభరణాలతో అలంకృతుడవై దయచేసి; నాకు; ఈ, ఋతు వాసరములు= సంభోగం ఫలించే దినాలు; తప్పక+ఉండన్= గడిచిపోకుండ ఉండేటట్లు; అపత్య+ఉత్పాదనము= సంతానం కలిగించటం; ఒనరింపుము= చేయుము.

**తాత్పర్యం:** ఋషులలో నాయకుడివైనవాడా! నీవుకూడ పరిమళంతో కూడిన మైపూతలతో, పూలదండలతో శోభాయమానాలైన ఆభరణాలతో అలంకృతుడవై, నాపట్ల దయ కలిగినవాడివై సంభోగం ఫలించే ఈ దినాలు గడచిపోకుండ నాకు గర్భాధానం చేయుము.'

**వ. అనిన 'నాకుఁ దపోధనంబ కాని యొండుధనంబు లేదు; నీ కోరినవిధం బెట్లు సేయనేర్తుఁ? దపంబునం జేసి సర్వంబునుం బడయ నగు నంటేని నేను తపోవ్యయంబు సేయ నోప' నని యగస్త్యుండు వసుభిక్షార్థియై శ్రుతర్వుం డను రాజుపాలికిం బోయి వానిచేతం బూజితుం డయి 'యేను ధనార్థినై వచ్చితి నీ పోష్యజన పోషణంబునకు విఘాతంబు గాకుండ మిగులుధనంబు గలదేని నా కి' మ్మని యడిగిన నతం డాయ వ్యయంబులు సమంబు లగుటం జేసి మిగులు లేమి యెఱింగించిన, వాఁడును దానును బ్రధ్నశ్వుండను రాజు పాలికిం బోయిన నతండును నయ్యిరువురం బరమభక్తిం బూజించి తదాగమన ప్రయోజనం బెఱింగి తన యందుల నాయవ్యయంబులు సమంబు లగుట యెఱింగించిన. 336**

**ప్రతిపదార్థం:** అనినన్= అని లోపాముద్ర చెప్పగా; నాకున్= నాకు; తపస్+ధనంబు+అ, కాని= తపస్సు అనే ధనం తప్ప; ఒండు, ధనంబు, లేదు= వేరే డబ్బు లేదు; నీ, కోరిన, విధంబు+ఎట్లు+చేయనేర్తున్= నీవు అడిగినట్లు ఏ విధంగా చేయగలను?; తపంబునన్+చేసి= తపస్సుచేత; సర్వంబునున్= సమస్తాన్ని; పడయన్+అగున్= పొందవచ్చును; అంటేని= అని అంటే; నేను= నేను; తపస్+వ్యయంబు= తపస్సును వ్యయించటం (ఖర్చు చేయటం); చేయన్+ఓపన్+అని= చేయజాలనని చెప్పి; అగస్త్యుండు; వసు, భిక్షా+అర్థి+ఐ= ధనాన్ని యాచించేవాడై; శ్రుతర్వుండు+అను= శ్రుతర్వుడనే పేరున్న; రాజు పాలికిన్= రాజు దగ్గరకు; పోయి= వెళ్ళి; వానిచేతన్= ఆతడిచేత; పూజితుండు+అయి= అర్చించబడినవాడై; ఏను= నేను; ధన+అర్థిని+ఐ= ధనాన్ని కోరుకొన్నవాడినై; వచ్చితిన్= అరుదెంచాను; నీ, పోష్య, జన, పోషణంబునకున్= నీవు పోషించవలసిన వారిని ప్రోచటానికి; విఘాతంబు, కాకుండన్= దెబ్బ తగులకుండ; మిగులు, ధనంబు= శేషద్రవ్యం; కలదేని= ఉంటే; నాకు+ఇమ్ము= నాకు ఇచ్చేది; అని=అంటూ; అడిగినన్= వేడగా; అతండు= అతడు; ఆయ, వ్యయంబులు= రాబడి, ఖర్చులు; సమంబులు= సమానాలు; అగుటన్+చేసి= అవటంచేత; మిగులు, లేమి=శేషించింది లేకుండటం; ఎఱింగించినన్= తెలుపగా; వాఁడును, తానును= ఆ శ్రుతర్వుడున్నూ, అగస్త్యుడున్నూ; బ్రధ్నశ్వుండు+అను= బ్రధ్నశ్వుడనే పేరుకల; రాజు పాలికిన్= రాజు దగ్గరికి; పోయినన్= వెళ్ళగా; అతండునున్= ఆ రాజుకూడ; ఆ+ఇరువురన్= ఆ ఇద్దరిని; పరమ భక్తిన్= మిక్కిలి భక్తితో; పూజించి= అర్చించి; తద్+ఆగమన, ప్రయోజనంబు= వారు రావటానికి గల కారణం; ఎఱింగి= తెలిసికొని; తనయందులన్= తనయొద్ద; ఆయ, వ్యయంబులు= రాబడి, ఖర్చులు; సమంబులు= సమానాలు; అగుట= అవటం; ఎఱింగించినన్= తెలుపగా.

**తాత్పర్యం:** అని లోపాముద్ర చెప్పగా 'తపస్సు మాత్రమే నా దగ్గర ఉన్న ధనం. వేరే ధనం లేదుకదా! మరి నీవు కోరినవిధంగా నే నెట్లా చేయగలను? తపస్సువలన సమస్తాలు సమకూరుతాయి కదా! అని నీవు అనవచ్చును, కాని నాకు నీ తపశ్శక్తిని వ్యయం చేయటం ఇష్టం లేదు' అని చెప్పి అగస్త్యుడు ధనసంపాదనకొరకై శ్రుతర్వుడు అనే రాజు దగ్గరకు వెళ్ళాడు. శ్రుతర్వుడు అగస్త్యుడిని పూజించాడు. అగస్త్యుడు ఆ రాజును 'నీవు పోషించవలసినవారి పోషణకు భంగం కలగకుండ నాకు ధనం ఇమ్ము. నేను ధనార్థినై నీ దగ్గరకు వచ్చాను' అని చెప్పాడు. శ్రుతర్వుడు తన ఆయవ్యయాలు సమానాలనీ, తన వద్ద మిగులు ధనం లేదనీ బదులు చెప్పాడు. అంత శ్రుతర్వుడున్నూ, అగస్త్యుడున్నూ కలిసి బ్రధ్నశ్వుడు అనే మహారాజు దగ్గరికి వెళ్ళారు. ఆ రాజు కూడ వారిని మిక్కిలి భక్తితో పూజించి తన ఆదాయవ్యయాలు సమానాలని విన్నవించాడు.

**విశేషం:** అగస్త్యుడు ధనం నిమిత్తం వెళ్ళిన రాజు పేరు కొన్ని ప్రతుల్లో "శ్రుతపర్వుడు"- అని ఉన్నది.

**క. ఇరువురఁ దోడ్కొని తానును । నరిగెం ద్రసదస్యుఁ డను జనాధిపుకడకుం**
**గర మర్థితోడ నందఱఁ । బురుకుత్సతనూజుఁ డతఁడు పూజించి తగన్. 337**

**ప్రతిపదార్థం:** ఇరువురన్= ఇద్దరిని (అంటే శ్రుతర్వుడిని, బ్రధ్నశ్వుడిని); తోడ్కొని= వెంటపెట్టుకొని; తానును= అగస్త్యుడు కూడ; త్రసదస్యుఁడు+అను= త్రసదస్యుడు అనే పేరున్న; జన+అధిపు, కడకున్= ప్రజలకు అధిపతి అయిన రాజు దగ్గరకు; అరిగెన్= వెళ్ళాడు; కరము= మిక్కిలి; అర్థితోడన్= ఇష్టంతో; అందఱన్= అందరినీ; అతడు= త్రసదస్యుడు; పురుకుత్స తనూజుఁడు= పురుకుత్సుడి కొడుకు; తగన్= సముచితంగా; పూజించి= అర్చించి.

**తాత్పర్యం:** అంత, అగస్త్యమహాముని శ్రుతర్వుడిని, బ్రధ్నశ్వుడిని తన వెంటబెట్టుకొని పురుకుత్సుడి కుమారుడైన త్రసదస్యుడు అనే రాజుదగ్గరకు పెళ్ళాడు. త్రసదస్యుడు ఆ ముగ్గురిని పూజించి.

**వ. వారల చెప్పినట్ల తన నిర్వాహంబు సెప్పి త్రసదస్యుం డగస్త్యున కిట్లనియె. 338**

**తాత్పర్యం:** ముందువారు చెప్పినట్లే తన ఆదాయవ్యయాలు కూడా సమానమని త్రసదస్యుడు చెప్పి అగస్త్యుడితో ఇట్లా అన్నాడు.

**క. 'ఇమ్మణిమతీపురంబునఁ । దమ్ముండును దాను నతిముదంబున నుండున్**
**నెమ్మిని నిల్వలుఁ డను వాఁ; । డిమ్మహి ధనవంతుఁ డతఁడ యెవ్వరికంటెన్. 339**

**ప్రతిపదార్థం:** ఈ+మణిమతీ, పురంబునన్= మణిమతి అనే పేరుకల ఈ పట్టణంలో; ఇల్వలుఁడు+అనువాఁడు= ఇల్వలుడనే పేరుకలవాడు; నెమ్మినిన్= ఏ కొదువ లేకుండా; తమ్ముండును, తానున్= తమ్ముడు తానూ కలిసి; అతి, ముదంబునన్= మిక్కిలి సంతోషంతో; ఉండున్= ఉంటాడు; ఈ+మహిన్= ఈ భూమిలో; అతఁడు+అ= అతడే; ఎవ్వరి కంటెను= ఎవరికంటే కూడ- అంటే అందరికంటే; ధనవంతుఁడు= సంపన్నుడు.

**తాత్పర్యం:** 'ఈ మణిమతీ పట్టణంలో ఇల్వలుడనేవాడు తన తమ్ముడితో కలిసి ఉంటాడు. ఈ పురంలోనే కాక ఈ భూమండలంలో అందరికంటె ధనవంతుడు అతడే.

**వ. అతండు మన యభిమతంబు దీర్ప నోపు' నని రాజర్షులు ముప్పురు మహర్షిం దోడ్కొని యిల్వలు పాలికిం జనిన నయ్యిల్వలుండును వారి నాతిథ్యవిధానంబుల నర్చించి, వాతాపి నెప్పటియట్ల సంస్కరించి యగస్త్యునకు భోజనంబుగా సమర్పించిన. 340**

**ప్రతిపదార్థం:** అతండు= ఇల్వలుడు; మన+అభిమతంబు= మనకోరిక; తీర్పన్+ఓపును+అని= ఈడేర్చగలడని; రాజర్షులు= రాజులైన ఋషులు; ముప్పురు= ముగ్గురును; మహర్షిన్+తోడ్కొని= గొప్ప ఋషి అయిన అగస్త్యుడిని వెంటపెట్టుకొని; ఇల్వలు, పాలికిన్= ఇల్వలుడి దగ్గరకు; చనినన్= వెళ్ళగా; ఆ+ఇల్వలుండును; వారిన్= వారిని (అగస్త్యుడిని, ముగ్గురు రాజులను); ఆతిథ్య విధానంబులన్= అతిథిసేవ చేసేపద్ధతిలో; పూజించి= అర్చించి; వాతాపిన్= వాతాపిని; ఎప్పటి+అట్లు+అ= లోగడ చేసినట్లే; సంస్కరించి= వంటచేసి (అంటే అతని మాంసాన్ని పచనంచేసి); అగస్త్యునకు; భోజనంబుగా= ఆహారంగా; సమర్పించినన్= వడ్డించగా.

**తాత్పర్యం:** ఆ ఇల్వలుడు మన కోరిక ఈడేర్చగలడు- అని రాజఋషులు ముప్పురున్నూ ఇల్వలుడి దగ్గరకు వెళ్ళారు. ఆ ఇల్వలుడు వారి నందరిని అతిథిసత్కారాలతో అర్చించి, వాతాపిమాంసాన్ని ఎప్పటిమాదిరిగా పచనం చేయించి, అగస్త్యుడికి ఆహారంగా సమర్పించగా.

**తే. దాని నెఱిఁగి యమ్మువ్వురు ధరణిపతులు । మునివరేణ్యున కప్పుడు మ్రొక్కి యనిరి**
**'విప్రవరులకు భక్ష్యమై వీని తమ్ముఁ । డుదరములనుండి విప్రుల నొగిన చంపు. 341**

**ప్రతిపదార్థం:** దానిన్+ఎఱిఁగి= ఆ విషయాన్ని తెలిసికొని; ఆ+ముప్పురు= ఆ ముగ్గురు; ధరణిపతులు= రాజులు; మునివరేణ్యునకు= ఋషులలో శ్రేష్ఠుడైన అగస్త్యుడికి; అప్పుడు; మ్రొక్కి= నమస్కరించి; అనిరి= చెప్పారు; విప్రవరులకున్= బ్రాహ్మణోత్తములకు; భక్ష్యము+ఐ= ఆహారమై; వీని తమ్ముఁడు= ఇల్వలుడి తమ్ముడు, వాతాపి; విప్రులన్= బ్రాహ్మణులను; ఉదరములన్+ఉండి= పొట్టలలో ఉండి; ఒగిన్+అ= ఒడుపుగా; చంపున్= చంపుతాడు.

**తాత్పర్యం:** ఆ విషయం తెలిసిన ముగ్గురురాజులు అగస్త్యమహర్షికి నమస్కరించి ఇట్లా అన్నారుః ' ఈ ఇల్వలుడి తమ్ముడు వాతాపి బ్రాహ్మణులకు తాను ఆహారమై తదుపరి వారి పొట్టలను చీల్చి వారిని చంపుతాడు సుమా!

**చ. వలవదు వీని యింటఁ గుడువన్; మనకున్ ధన మిచ్చు నేని యి**
**మ్ములఁ గొనిపోద మిప్పు' డని మున్నెఱిఁగించిన నమ్మునీంద్రుఁ డ**
**త్యలఘుఁడు వారి మాటకు భయంపడ కెంతయుఁ బ్రీతితోడ న**
**గ్గలముగఁ జేసె భోజనము గంఠముదాక నకుంఠవీర్యుఁడై. 342**

**ప్రతిపదార్థం:** మనకున్= మనకు; వీని+ఇంటన్= వీడి గృహంలో; కుడువన్+వలవదు= భుజించరాదు; ధనమున్= ధనాన్ని; ఇచ్చున్+ఏని= ఇస్తే; ఇమ్ములన్= ప్రీతితో; కొని పోదము= తీసికొని వెళ్ళుదాము; ఇప్పుడు= ఈ సమయంలో; అని= అంటూ; మున్న= ముందుగా; ఎఱిఁగించినన్= తెలుపగా; ఆ+ముని+ఇంద్రుఁడు= మునులలో ఇంద్రుడివంటివాడయిన అగస్త్యుడు; అతి+అలఘుఁడు= గొప్పవాడు (మిక్కిలి తేలిక కానివాడు); వారి, మాటకున్= ఆ రాజులమాటకు; భయంపడక= భీతితో వెనుకాడక; ఎంతయున్= మిక్కిలి; ప్రీతితోడన్= ప్రియంతో; భోజనము= ఆహారాన్ని; కంఠము దాక= పీకెవరకు; అకుంఠ వీర్యుఁడు+ఐ= మొక్కవోని బలం కలవాడై; అగ్గలముగన్= ఎక్కువగా; చేసెన్= చేశాడు (భోజనం చేశాడు).

**తాత్పర్యం:** మనం ఈ ఇల్వలుడి గృహంలో తిండి తినరాదు. ఇప్పుడు ధనమిస్తే ప్రీతితో పరిగ్రహించి వెళ్ళుదాము' - అని ముగ్గురు రాజులు అగస్త్యుడికి తెలిపారు. మిక్కిలి గొప్పవాడయిన ఆ మహర్షి వారి మాటలకు భీతి చెందలేదు, సరిగదా! మిక్కిలిప్రీతితో పీకెవరకు ఆ భోజనం తిని మొక్కవోని బలంతో శోభిల్లాడు.

**ఆ. ఇల్వలుండు ననుజు నెప్పటి క్రియఁ బిల్వ । నెఱిఁగి దాని నమ్మునీశ్వరుండు**
**గడుపుఁ దడవికొనుచుఁ గఱ్ఱనఁ ద్రేఁచిన । నసుర జీర్ణమయ్యె నాక్షణంబ. 343**

**ప్రతిపదార్థం:** ఇల్వలుండు= ఇల్వలుడు; అనుజున్= తమ్ముడిని (వాతాపిని); ఎప్పటిక్రియన్= ఎప్పటియట్ల; పిల్వన్= పిలువగా; దానిన్+ఎఱిఁగి= ఆ విషయాన్ని తెలిసికొని; ఆ+ముని+ఈశ్వరుండు= ఋషులలో ఈశ్వరుడివంటివాడైన ఆ అగస్త్యుడు; కడుపున్= పొట్టను; తడవికొనుచున్= నిమురుకొంటూ; గఱ్ఱు+అనన్+త్రేఁచినన్= గర్రు అనేశబ్దం కలిగేటట్లు త్రేనుపు తెప్పించుకొనగా; అసుర= రాక్షసుడు; ఆ, క్షణంబు+అ= ఆ క్షణంలోనే; జీర్ణము+అయ్యెన్= అరిగిపోయాడు.

**తాత్పర్యం:** ఇల్వలుడు ఎప్పటివలె తన తమ్ముడిని పిలిచాడు. ఆ సంగతి గుర్తించిన అగస్త్యమునీశ్వరుడు పొట్ట నిమురుకొంటూ గ(ౌ)రున త్రేన్చాడు. ఆ క్షణంలోనే అగస్త్యమహర్షిపొట్టలో ఆ వాతాపిరాక్షసుడు జీర్ణమైపోయాడు.

**విశేషం:** ఒక రాక్షసుణ్ణి తిని, అలా పొట్ట నిమురుకొని, పూర్తిగా జీర్ణించుకొని, గ(ౌ)రున త్రేన్చిన అగస్త్యమహర్షి జీర్ణశక్తి అనుపమానం. అంతజీర్ణశక్తి తన బిడ్డకు ఉండాలని కాబోలు ఆంధ్రదేశంలో ప్రతితల్లి తన బిడ్డకు పాలు త్రాపి, గోరుముద్దలు తినిపించి, పొట్ట నిమురుతూ 'జీర్ణం-జీర్ణం-వాతాపిజీర్ణం' అని అంటుంది.

**ఇ. ఇల్వలుండును మునివరుశక్తికి భయంపడి విషణ్ణుం డయ్యును బ్రసన్నుండ పోలెఁదన వంచన యేర్పడకుండం గృతప్రణాముండై దదాగమనప్రయోజనం బడిగిన వానికి నగస్త్యుం డిట్లనియె. 344**

**ప్రతిపదార్థం:** ఇల్వలుండును= ఇల్వలుడును; మునివరుశక్తికిన్= ఋషులలో శ్రేష్ఠుడైన అగస్త్యుడి మహిమకు; భయంపడి= వెరపుగొని; విషణ్ణుండు+అయ్యును= దుఃఖించిన వాడయినప్పటికి; ప్రసన్నుండు+అ+పోలెన్= సంతసిస్తున్నవాడివలె; తనవంచన= తాను చేసినమోసం; ఏర్పడకుండన్= తెలియనట్లుగా; కృత, ప్రణాముండు+ఐ= నమస్కరించినవాడై; తద్+ఆగమన, ప్రయోజనంబు= ఆతడి రాకకు గల ప్రయోజనాన్ని గురించి; అడిగినన్= ప్రశ్నించగా; వానికిన్= ఆ ఇల్వలుడికి; అగస్త్యుండు= అగస్త్యుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇల్వలుడు అగస్త్యమునివరేణ్యుడిమహిమకు భయపడి, విషాదంచెంది తాను ఖిన్నుడు అయినప్పటికీ, తన మోసం బయటపడకుండా, పైకి సంతోష తన్మయుడైనట్లు నటిస్తూ ఆ ఋషికి నమస్కరించి, ఆయన రాకకు గల కారణాన్ని తెల్పుమని వేడగా, అతడికి అగస్త్యమహర్షి ఈ విధంగా బదులు పలికాడు.

**సీ. 'ఈ రాజవరులతో నేను ధనార్థినై । వచ్చితి నీకు ద్రవ్యంబు గలుగు**
**టెఱిఁగి' నావుడు 'నటులేని మీ కభిమత । మెంత యంతియ ధనమిత్తు' ననినఁ**
**'బదివేలు మొదవులు బదివేల గద్దియల్ । పసిఁడియు నిమ్మహీపతుల కిమ్మ**
**యొక్కొక్కనికి మఱి యొక్కని కిచ్చిన । దానికి రెట్టి గోధనము నొక్క**

**ఆ. హేమమయరథంబు నిమ్ము నా' కనిన ని । ల్వలుఁడు దత్క్షణంబ తలఁచి యిచ్చె**
**నయ్యగస్త్యుచెప్పినంత ధనంబు ము । వ్వురు మహీపతులకుఁ గరము నెమ్మి. 345**

**ప్రతిపదార్థం:** ఈ రాజ, వరులతోన్= రాజులలో శ్రేష్ఠులైన వీరితో; ఏను= నేను; ధన+అర్థిన్+ఐ= ధనాన్ని కోరేవాడినై; వచ్చితిన్= అరుదెంచాను; నీకు; ద్రవ్యంబు= ధనం; కలుగుట+ఎఱిఁగి= ఉండటం తెలిసి; నావుడున్= అని చెప్పగా; అటులు+ఏని= అట్లయితే; మీకు; అభిమతము= కోరిక; ఎంత= ఎంతయో; అంతియ, ధనము= అంతమేర ధనం; ఇత్తున్= ఇవ్వగలను; అనినన్= అని చెప్పగా; పదివేలు, మొదవులు= పదివేల ఆవులు; పదివేల, గద్దియల్, పసిఁడియున్= పదివేల బంగారునాణాల (గద్యాణాల)బంగారం; ఈ+మహీపతులకు= ఈ రాజులకు; ఇమ్ము+అ= ఇచ్చేది; ఒక్కొక్కనికిన్= ఒక్కొక్కరికి; మఱి= అదనంగా; ఒక్కనికి+ఇచ్చిన దానికి; రెట్టి= రెండింతలు; గోధనమున్= గోవులనే ధనాన్ని; ఒక్క= ఒక; హేమ, మయ రథంబున్= బంగారు తేరును; నాకు; ఇమ్ము; అనినన్= అని చెప్పగా; ఇల్వలుఁడు; తద్, క్షణంబు+అ= ఆ క్షణంలోనే; తలఁచి= సంకల్పించి; ఆ+అగస్త్య, చెప్పినంత, ధనంబు= ఆ అగస్త్యమహర్షి చెప్పినమేరకు ద్రవ్యాన్ని; మువ్వురు= ముగ్గురు; మహీపతులకున్= భూభర్తలైన రాజులకు; కరము= మిక్కిలి; నెమ్మిన్= ప్రీతితో; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** 'ఈ రాజన్యులతో నేను ధనార్థినై వచ్చాను. నీవు ధనాఢ్యుడి వని విన్నాను' అని అగస్త్యమహర్షి చెప్పగా, 'మీరు ఎంతకోరుకొంటారో అంత ధనం ఇస్తాను' అని ఇల్వలుడు బదులు పలికాడు. అంత అగస్త్యుడు 'పదివేల ఆవులు, పదివేల గద్యాణాల బంగారం ఈ రాజులకు ఒక్కొక్కరికి ఇమ్ము. వారిలో ఒక్కొక్కరికి ఇచ్చిన మొత్తానికి రెండింతలు గోధనాన్ని, ఒక బంగారు తేరును నాకు ఇమ్ము' అని అడుగగా తత్క్షణమే ఇల్వలుడు ఆ ముప్పురురాజులకు ఆ యా ధనాలు ప్రీతితో ఇచ్చాడు.

**వ. మఱియు విరావ సురావములను నశ్వంబులంబూన్చిన సౌవర్ణరథంబును నిరువదివేల మొదవులు నిరువదివేల గద్దెల పసిండియు మునివరున కిచ్చినం దద్రథంబున. 346**

**ప్రతిపదార్థం:** మఱియు= ఇంకను; విరావ, సురావములు+అను= విరావం, సురావం అనే; అశ్వంబులన్= గుర్రాలను; పూన్చిన= కట్టిన; సౌవర్ణ రథంబును= బంగరు తేరును; ఇరువదివేల మొదవులున్= ఇరవైవేల ఆవులు; ఇరువదివేల, గద్దెల, పసిండియు= ఇరవైవేల గద్యాణాల బంగారాన్ని; మునివరునకున్= ఋషిశ్రేష్ఠుడైన అగస్త్యుడికి; ఇచ్చినన్= ఇవ్వగా; తద్+రథంబునన్= ఆ రథంలో.

**తాత్పర్యం:** అంతే కాక, విరావం సురావం అనే గుర్రాలను కట్టిన బంగరుతేరును, ఇరవైవేల ఆవులను, ఇరవైవేల బంగారుగద్యాణాల బంగారాన్ని మునిశ్రేష్ఠుడికి ఇచ్చాడు. ఆ రథంలో.

**క. మునివరనృపతులఁ దద్గో । ధనకాంచనతతులఁ దత్పతాకినులను నో**
**లిన తాల్చి యగస్త్యాశ్రమ । మునకుం దత్క్షణమ రథ్యములు వడిఁ బఱచెన్. 347**

**ప్రతిపదార్థం:** మునివర నృపతులన్= మునులలో శ్రేష్ఠుడైన అగస్త్యుడిని, రాజులను; తద్, గోధన, కాంచన, తతులన్= ఆ ఆవులనే ధనాన్ని, బంగారు నాణేల సముదాయాలను; తద్+పతాకినులను= వారి సేనలను; ఓలిన; తాల్చి= వరుసగా వహించి; అగస్త్య+ఆశ్రమమునకున్; తద్క్షణము+అ= ఆ క్షణంలోనే; రథ్యములు= గుర్రాలు; వడిన్= వేగంగా; పఱచెన్= పరుగెత్తాయి.

**తాత్పర్యం:** మునివరుడైన అగస్త్యుడిని, ఆ రాజన్యులను, వారి వారి ఆవులను, బంగారు నాణేలను, వారిసేనలను వరుసగా వహించి, వెనువెంటనే గుర్రాలు అగస్త్యాశ్రమానికి వేగంగా పరుగెత్తాయి.

**వ. రాజర్షులు నగస్త్యు వీడ్కొని చని; రంత నగస్త్యుండు లోపాముద్ర కభిమతం బొనరించి. 348**

**ప్రతిపదార్థం:** రాజర్షులున్= రాజులలో ఋషులు; అగస్త్యున్= అగస్త్య మహామునికడ; వీడ్కొని= సెలవు తీసికొని; చనిరి= వెళ్ళారు; అంతన్= అటుపైన; అగస్త్యుండు; లోపాముద్రకు; అభిమతంబు+ఒనరించి= కోరిక తీర్చి.

**తాత్పర్యం:** రాజర్షులు అగస్త్యుడి దగ్గర సెలవు తీసికొని నిష్క్రమించారు. అగస్త్యుడు లోపాముద్రకోరిక నెరవేర్చాడు.

**మధ్యాక్కర.**

**'పదుగురఁ బోలెడు సుతుల నూర్వురఁ బడయంగ వలతొ?**
**పదుగుర నూర్వుర కెనయగు సుతులఁ బడయంగ వలతొ?**

**వదలక వేవురు సుతులఁ బడయఁగ వలతొ? వేవురకుఁ**
**గదియంగ నుత్తము నొక్కరు వలతొ కమలాయతాక్షి!' 349**

**ప్రతిపదార్థం:** కమల+ఆయత+అక్షి!= పద్మాలవలె విశాలమైన కన్నులు కలదానా!; పదుగురన్= పదిమందిని; పోలెడు= సరిపోలునటువంటి (సమానమైన); సుతులన్+కొడుకులను; నూర్వురన్= వందమందిని; పడయంగ= పొందటానికి; వలతొ?= కోరుతావో?; నూర్వురకు= వందమందికి; ఎనయగు= సాటి అయిన; సుతులన్= కొడుకులను; పదుగురన్= పదిమందిని; పడయంగ= పొందటానికి; వలతొ?= కోరుతావో?; వదలక= విడువక; వేవురు= వేయిమంది; సుతులన్= కొడుకులను; పడయఁగ= పొందటానికి; వలతొ?= కోరుతావో?; వేవురకు= వేయిమందికి; కదియంగన్= సరిపోయే; ఉత్తమున్= మంచివాడిని; ఒక్కరున్= ఒక్కడిని; (కొడుకుగా); వలతొ= కోరుతావో?.

**తాత్పర్యం:** 'అగస్త్యుడు లోపాముద్రకు వేసిన ప్రశ్నలు. 'నీకు పదిమందితో సమానులయిన వందమంది కొడుకులు కావాలా? నూరుమందితో సమానులయిన పదిమంది కొడుకులు కావాలా? వేయిమంది కొడుకులు కావాలా? వేయిమందికి సాటి అయిన ఉత్తముడైన కొడుకు ఒకడు కావాలా? కమలాలవంటి కన్నులు కలదానా! చెప్పుము'.

**విశేషం:** వృత్తలక్షణానికి ఈ ఆశ్వాసంలోని 22వ పద్యం విశేషవ్యాఖ్య చూడండి.

**వ. అనిన ముదితహృదయయై లోపాముద్ర మునీంద్రున కిట్లనియె. 350**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (అగస్త్యుడు) అడుగగా; ముదిత, హృదయ+ఐ= సంతోషించిన హృదయం కలదై; లోపాముద్ర; ముని+ఇంద్రునకు= మునులలో ఇంద్రుడివంటివాడైన అగస్త్యుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** అని అడుగగా సంతోషించి లోపాముద్ర అగస్త్యమునీంద్రుడికి ఇట్లా బదులు పలికింది.

**క. 'వేవురఁ బోలెడువాని మ । హావీర్యగుణాఢ్యు నొక్కయాత్మజుఁ బడయం**
**గా వలతు; నపేతగుణుల్ । వేవురు సుతులయ్యు నెందు విఫలమ కాదే.' 351**

**ప్రతిపదార్థం:** వేవురన్+పోలెడు వాని= వేయిమందికి సాటి అయిన; మహా, వీర్య గుణ+ఆఢ్యున్= గొప్పబలం, గుణాలు కలవాడిని; ఒక్క= ఒక; ఆత్మజున్+పడయంగా= కొడుకును పొందటానికి; వలతున్= కోరుకొంటున్నాను; అపేత గుణుల్= గుణవంతులు కానివారు; వేవురు= వేయిమంది; సుతులు+అయ్యున్= కొడుకులు ఉన్నను; ఎందున్= ఎచటనైనను; విఫలము+అ, కాదే= ఫలితం లేనిదే అవుతుంది కదా!

**తాత్పర్యం:** 'వేయిమందితో సమానుడు, మహాబలశాలి, బుద్ధిమంతుడు అయిన ఒక కొడుకు కావాలి నాకు. బుద్ధిహీనులు వేయిమంది కొడుకులు ఉన్నా లాభమేమి?'

**వ. అనిన 'నీ కోరినట్ల గుణవంతుం డయిన కొడుకు నీకు జన్మించు' నని దానికి గర్భాధానంబు సేసి యగస్త్యుండు దపోవనంబున కరిగె; నిట లోపాముద్రయు నేడేండ్లు గర్భంబు దాల్చె; నంత నక్కోమలికి. 352**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (లోపాముద్ర) బదులు పలుకగా; నీ, కోరిన+అట్లు+అ= నీవు కోరినవిధంగానే; గుణ వంతుఁడు+అయిన= మంచిగుణాలు కల; కొడుకు= పుత్రుడు; నీకు, జన్మించును= నీకు పుట్టుతాడు; అని= అని చెప్పి;

దానికిన్= లోపాముద్రకు; గర్భ+ఆధానంబు+చేసి= గర్భాన్ని ఉంచి, అంటే పుత్రోత్పత్తి అగునట్లు తన తేజస్సును నిక్షేపించి; అగస్త్యుండు; తపోవనంబునకు= తపస్సు చేసికొనే అరణ్యానికి; అరిగెన్= వెళ్ళాడు, ఇట= ఇచట; లోపాముద్రయున్; ఏడు+ఏండ్లు= ఏడు సంవత్సరాలు; గర్భంబున్+తాల్చెన్= కడుపుతో ఉండింది; అంతన్= అటుపిమ్మట; ఆ+కోమలికి= ఆ సుకుమారి అయిన లోపాముద్రకు.

**తాత్పర్యం:** అని లోపాముద్ర బదులు పలుకగా, అగస్త్యమహర్షి 'నీవు కోరినమేరకు నీకు గుణవంతుడైన కొడుకు పుట్టుతాడు' అని చెప్పి ఆమెకు గర్భాధానం చేసి, ఆ ముని తపస్సు చేసికొనటానికై అరణ్యానికి వెళ్ళాడు. ఇట లోపాముద్ర ఏడు సంవత్సరాలు కడుపుతో ఉండింది. అంత సుకుమారి అయిన లోపాముద్రకు.

**క. తనయుఁడు దృఢస్యుఁ డనఁగా । ననవద్యుఁడు వేదములు రహస్యంబులతో**
**నొనరఁగ జపంబు సేయుచు । నినతేజుఁడు పుట్టె భువనమెల్ల వెలుంగన్. 353**

**ప్రతిపదార్థం:** తనయుఁడు= కొడుకు; దృఢస్యుఁడు+అనఁగాన్= దృఢస్యుడు అనే పేరు కలవాడై; అనవద్యుఁడు= ఎటువంటి లోపం లేనివాడు; ఇనతేజుఁడు= సూర్యుడివంటి తేజస్సు కలవాడు; వేదములు; రహస్యంబులతోన్= అంతరార్థాలతో; ఒనరఁగన్= ఒప్పునట్లుగా; జపంబు+చేయుచున్= వల్లె వేస్తూ; భువనము+ఎల్ల= ప్రపంచమంతయు; వెలుంగన్= ప్రకాశించేటట్లుగా; పుట్టెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** ఆ లోపాముద్రకు ప్రపంచమంతా వెలుగొందేటట్లు సూర్యతేజస్వి, నిష్కళంకుడు అయినకొడుకు దృఢస్యుడు అనే పేరు కలవాడు, వేదాలను అంతరార్థాలతో వల్లెవేస్తూ జన్మించాడు.

**వ. వానికిం దేజస్వి యను ఋషి పుట్టి యపారంబయిన యిధ్మభారంబు వహించుటంజేసి యిధ్మవాహుం డనం బరఁగె; ని ట్లగస్త్యుండు పుత్త్ర పౌత్త్రవంతుం డయి తన పితరులం బుణ్యలోకగతులం జేసె' నని వైశంపాయన కథితకథాక్రమం బతిరమ్యంబుగాను. 354**

**ప్రతిపదార్థం:** వానికిన్= ఆ దృఢస్యుడికి; తేజస్వి+అను= తేజస్వి అనే పేరు కల; ఋషిపుట్టి= ముని జన్మించి; అపారంబు+ఐన= మితిలేని; ఇధ్మ భారంబు= వంటకట్టెల బరువు; వహించుటన్+చేసి= మోయటంవలన; 'ఇధ్మ వాహుండు'= ఇధ్మవాహుడు; అనన్+పరఁగెన్= అని పిలువబడ్డాడు; ఇట్లు= ఈ విధంగా; అగస్త్యుండు= అగస్త్యుడు; పుత్త్ర, పౌత్త్ర వంతుండు+అయి= కొడుకు, మనుమడు కలవాడై; తన పితరులన్= తన పితృదేవతలను; పుణ్య, లోక, గతులన్+చేసెన్= పుణ్యలోకాలకు వెళ్ళే వారినిగా చేశాడు; అని= అంటూ; వైశంపాయన, కథిత, కథాక్రమంబు= వైశంపాయన మహర్షిచేత చెప్పబడిన కథయొక్క విధానం; అతి, రమ్యంబుగాను= మిక్కిలి మనోహరంగా.

**తాత్పర్యం:** ఆ దృఢస్యుడికి తేజస్వి అనే పేరుకల ఋషి పుట్టాడు. అతడు మితి లేని వంటకట్టెల బరువు సులువుగా మోయగలగటంచేత అతడికి ఇధ్మవాహుడు అనే నామాంతరం ఏర్పడింది. ఈ విధంగా అగస్త్యుడు పుత్త్ర పౌత్రవంతుడు అవటంచేత అతడి పితృదేవతలకు పుణ్యగతులు ఏర్పడ్డాయి. ఇది వైశంపాయన మహర్షిచేత చెప్పబడిన కథావిధానం; మిక్కిలి మనోహరమైనది.

### ఆశ్వాసాంతము

**క. కలికాలభరతలక్ష్మీ । లలనాస్పద! వీర గుణ విలాస! విరోధి**
**ప్రళయాంతక! నిఖిలమహీ । వలయోద్వహబాహు! విష్ణువర్ధనమూర్తీ! 355**

**ప్రతిపదార్థం:** కలి, కాల, భరత, లక్ష్మీ, లలనాస్పద!= కలియుగంలో భరతచక్రవర్తికి సంబంధించిన లక్ష్మీదేవికి నెలవైనవాడా!; వీర, గుణ, విలాస!= శౌర్య లక్షణాలతో హొయలు మీరినవాడా!; విరోధి, ప్రళయ+అంతక!= శత్రువులపట్ల ప్రళయకాలంలోని యముడివంటివాడా!; నిఖిల, మహీ, వలయ+ఉద్వహ, బాహు!= సమస్త భూమండలాన్ని గొప్పగా భరించిన చేతులు కలవాడా!; విష్ణు వర్ధన మూర్తీ!= విష్ణువర్ధనబిరుదును సార్థకం చేసే స్వరూపం కలవాడా!

**తాత్పర్యం:** ఈ కలియుగంలో అలనాటి సుప్రసిద్ధ భరత సార్వభౌముడు ఏలిన రాజ్యలక్ష్మీదేవికి నేడు నెలవైనవాడా! వీరలక్షణాలతో హొయలు మీరినవాడా! శత్రువులపట్ల ప్రళయసమయంలోని యముడివంటివాడా! సమస్త భూమండలాన్ని చక్కగా భరించే బాహుబలం కలవాడా! విష్ణువర్ధన బిరుదాన్ని సార్థకం చేసే స్వరూపం కలవాడా! ఓ రాజరాజనరేంద్రా!

**విశేషం:** (1) భరతలక్ష్మీలలనాస్పద:- ఆసేతు హిమాచలం విస్తరించిన భూభాగానికి భరతఖండం అనేపేరు చరిత్ర ప్రసిద్ధం. భరతవర్షంలోనిది భరతఖండం. అందులోని భాగం వేంగి. భరతుడనే మహారాజు పరిపాలించటంచేత ఈ దేశానికి ఆ పేరువచ్చింది. అట్టి భరతుడు ఒకనాడు ఏలిన రాజ్యలక్ష్మిని ఏలుతున్న ప్రభువు శ్రీ రాజరాజనరేంద్రుడు. పైపద్యం మొదటి పాదానికి - కలికాల భరత! (కలియుగంలో భరతుడివంటివాడా!); లక్ష్మీలలనాస్పద! (రాజ్యలక్ష్మి అనే లలనకు ఆశ్రయమైన (నెలవైన) వాడా!)- అని కూడ అర్థ సమన్వయం చేయవీలున్నది. (2) రాజరాజనరేంద్రుడు నన్నయభట్టప్రణీతంబైన శ్రీ మహాభారత కృతిపతి. ప్రథమ ప్రధాన శ్రోత. అందుచేత ఆశ్వాసాంత పద్యాలు. ఆశ్వాసారంభ పద్యాలు అతడి సంబోధనలతో కూడి ఉంటాయి.

**పృథ్వీవృత్తము.**

**సమస్త భువనాశ్రయా! వినయసత్యనిత్యోదయా!**
**సమీహితగుణ క్రియా! స్థిరవిశాలకీర్తిప్రియా!**
**నమ న్నృప కిరీట చుంబి చరణద్వయా! సంతత**
**క్షమాభరణ! రాజరాజ! పరగండభేరుండకా! 356**

**ప్రతిపదార్థం:** సమస్త, భువన+ఆశ్రయా!= సర్వ భువనానికి ఆధారమైనవాడా!; వినయ, సత్య, నిత్య+ఉదయా!= వినయం, సత్యం అనే గుణాలు ఎల్లప్పుడు వికసించేటట్లు ఉండేవాడా!; సమీహిత, గుణ, క్రియా!= గుణాలకు, క్రియలకు పొందిక కలవాడా! అంటే అనుష్ఠానవేదాంతీ!; స్థిర, విశాల, కీర్తి, ప్రియా!= శాశ్వతం, విస్తారం అయిన యశస్సును ఆర్జించటంలో ఇష్టం కలవాడా!; నమత్+నృప, కిరీట, చుంబి, చరణ, ద్వయా!= నమస్కారం చేసే రాజుల కిరీటాలను ముద్దుపెట్టుకొనే రెండు పాదాలు కలవాడా! (అంటే సార్వభౌముడయినవాడా!); సంతత, క్షమా+ఆభరణ= ఎల్లప్పుడు ఓర్పును ఆభరణంగా కలవాడా!; రాజరాజ!= రాజరాజనరేంద్రా!; పర, గండ, భేరుండకా!= శత్రువీరులపట్ల గండభేరుండకంవంటివాడా!

**తాత్పర్యం:** సకలభువనాలకు ఆధారమైనవాడా! వినయం, సత్యం అనే గుణాలకు నిత్యవికాసం కల్పించేవాడా! త్రికరణశుద్ధి కలిగిన అనుష్ఠాన వేదాంతీ! శాశ్వతమైన, సువిశాలమైన కీర్తిని ఆర్జించటంలో ఇష్టం కలవాడా! సార్వభౌమా! ఎల్లప్పుడు సహనం అనే ఆభరణాన్ని ధరించేవాడా! ఓ రాజరాజనరేంద్రా! శత్రువులపట్ల గండభేరుండపక్షివంటివాడా!

**విశేషం:** (1) 'భువనాశ్రయ' బిరుదాంకితులు చాళుక్య సమ్రాట్టులు. (2) రాజరాజనరేంద్రుడి శాశ్వత సువిశాలకీర్తి ప్రియత్వంలో ఆంధ్రమహాభారతకృతిపతిత్వం ధ్వనిస్తున్నది. (3) గండభేరుండం: రెండు తలలు మూడుకన్నులు గల పెద్దపక్షి. ఆకారంలో మిక్కిలి పెద్దది. సంస్కృత నిఘంటువులలో 'భేరుండ' శబ్దమే కనిపిస్తున్నది. తెలుగులో 'గండ భేరుండ' మనే ప్రయోగం సుప్రసిద్ధం. (4) ఈ వృత్తపాదంలో వరుసగా జ,స,జ,స,య,లగ గణాలు ఉంటాయి. 12 వ అక్షరం యతి.

**గద్యము.**

**ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతంబునం దారణ్య పర్వంబున బృహదశ్వు దర్శనంబును, నలోపాఖ్యానంబును, నారదాగమనంబును, సకలతీర్థకీర్తనంబును, రోమశుం డర్జున కుశలవార్తఁ జెప్పుటయు, రోమశమహాముని యుపదేశంబున ధర్మజు తీర్థాభిగమనంబును, నగస్త్యుండు లోపాముద్రం బరిగ్రహించుటయు వాతాపిభక్షణంబును నన్నది ద్వితీయాశ్వాసము. 357**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ రచన; సకల, సుకవి, జన వినుత= అందరు గొప్ప కవుల బృందంచేత ప్రస్తుతించబడిన; నన్నయ భట్ట, ప్రణీతంబు+అయిన= నన్నయభట్టుచేత వ్రాయబడిన; శ్రీ మహాభారతంబునందు= శ్రీ మహాభారతంలో; ఆరణ్యపర్వంబునన్= ఆరణ్యపర్వంలో; బృహదశ్వ, దర్శనంబును= బృహదశ్వుడి సందర్శనమున్నూ; నల+ఉపాఖ్యానంబును= నలుడి గురించిన ఉపకథయున్నూ; నారద+ఆగమనంబును= నారదుడి రాకయున్నూ; సకల, తీర్థ, కీర్తనంబును= సమస్త పుణ్యక్షేత్రాల ప్రశంసయున్నూ; రోమశుండు; అర్జున కుశలవార్తన్= అర్జునుడి క్షేమ సమాచారాన్ని; చెప్పుటయు= ధర్మరాజుకు చెప్పటమున్నూ; రోమశ, మహాముని+ఉపదేశంబునన్= రోమశమహర్షి ప్రబోధంవలన; ధర్మజు తీర్థ+అభిగమనంబునున్= ధర్మరాజు పుణ్యక్షేత్రాల సందర్శనార్థం వెళ్ళటమున్నూ; అగస్త్యుండు; లోపాముద్రన్; పరిగ్రహించుటయు= పెండ్లాడటమున్నూ; వాతాపి, భక్షణంబునున్= వాతాపిని తిని అరిగించుకొనటమున్నూ; అన్నది= అనేటువంటిది; ద్వితీయ+ఆశ్వాసము= రెండవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది- సమస్త సుకవుల బృందంచేత ప్రస్తుతించబడిన నన్నయభట్టు రచించిన శ్రీ మహాభారతంలో పదునెనిమిది పర్వాలలో మూడవది అయిన ఆరణ్యపర్వంలో బృహదశ్వుడి దర్శనమున్నూ, నలోపాఖ్యానమున్నూ, నారదుడి రాకయున్నూ, సకలపుణ్యక్షేత్ర వర్ణనమున్నూ, రోమశుడు వచ్చి అర్జునుడి క్షేమవార్త చెప్పటమున్నూ, రోమశమహాముని ఉపదేశించిన విధంగా పాండవులు తీర్థయాత్రలకు వెళ్ళటమున్నూ, అగస్త్యుడి కథయున్నూ, లోపాముద్ర వివాహమున్నూ, వాతాపిభక్షణమున్నూ- అనే అంశాలు కలది రెండవ ఆశ్వాసం.

**-:ఆరణ్యపర్వంలో ద్వితీయాశ్వాసం సమాప్తం:-**



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - తృతీయాశ్వాసము

**శ్రీ మందిర! బుధజన చిం । తామణి! కోదండపార్థ! ధర్మవిచారో**
**ద్దామ! నల నృగ భగీరథ । రామ చరిత్రాభిరామ! రాజనరేంద్రా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ, మందిర!= లక్ష్మీ దేవికి నిలయమైనవాడా!; బుధ, జన, చింతామణి!= పండితులైన వారి కోరికలను ఈడేర్చే దేవమణి వంటివాడా!; కోదండ, పార్థ!= విలువిద్యలో అర్జునుడి వంటివాడా!; ధర్మ, విచార+ఉద్దామ!= ధర్మాన్ని అనుశీలించటంలో అధికుడివైనవాడా!; నల, నృగ, భగీరథ, రామ, చరిత్ర+అభిరామ!= నల, నృగ, భగీరథ, రాముల వంటి శీలాన్ని కలిగిఉండటంచేత అందగించినవాడా!; రాజనరేంద్రా!= ఓ రాజరాజనరేంద్రా!

**తాత్పర్యం:** ఓ రాజరాజనరేంద్రా! లక్ష్మికి ఆస్పదమైనవాడా!, విద్వాంసులు కోరిన కోరికలు తీర్చటంలో దేవమణి అయిన చింతామణి వంటివాడా!, విలువిద్యలో పార్థుడివంటివాడా!, ధర్మాన్నిగురించిన అనుశీలనలో ఆరితేరినవాడా!, నలుడివంటి, నృగుడివంటి, భగీరథుడివంటి, శ్రీరామచంద్రుడివంటి చరిత్రతో శోభిల్లేవాడా!

**విశేషం:** ఆశ్వాసంలోని మొదటిపద్యం కృతిపతిసంబోధనగా నన్నయభట్టు ఏర్పరచిన సంప్రదాయం తరువాతి కవులకు ఒజ్జ బంతి అయింది. ప్రథమాశ్వాసంలోని మొదటిపద్యవివరణం కూడా అనుశీలించదగింది.

### అగస్త్య చరిత్రము (సం. 3-98-1)

**వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పెఁ; నట్లు ధర్మతనయుం డగస్త్య మాహాత్మ్యంబు విని వెండియుఁ దచ్చరిత్రంబు రోమశు నడిగిన, నమ్ముని యిట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** అక్కథకుండు= ఆ+కథకుండు= (ఉగ్రశ్రవసుడు అనే సూతుడు); శౌనక+ఆది, మహత్+మునులకున్= శౌనకుడు మొదలైన గొప్ప ఋషులకు; చెప్పెన్= చెప్పాడు; అట్లు= ఆ విధంగా; ధర్మ తనయుండు= ధర్మరాజు; అగస్త్య, మాహాత్మ్యంబు= అగస్త్యుడియొక్క మహిమ; విని= ఆలకించి; వెండియున్= మళ్ళీ; తద్+చరిత్రంబు= అతడి వృత్తాంతం; రోమశున్= రోమశుడిని; అడిగినన్= ప్రశ్నించగా; ఆ+ముని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ కథకుడైన ఉగ్రశ్రవసుడు, శౌనకుడు మొదలుగా గల మునులకు భారతకథ చెప్పాడు, అట్లా (ఆ విధంగా) ధర్మరాజు అగస్త్యుడి మహిమను ఆలకించి, మళ్ళీ (తిరిగి) విశేషంగా ఆ మహర్షిచరిత్ర సవిస్తరంగా వినాలనే కుతూహలంతో రోమశుడిని అడుగగా, ఆ ముని ఈవిధంగా చెప్పసాగాడు.

**సీ. 'కృతయుగంబునఁ గాలకేయగణంబుతో । వృత్రుఁ డన్నసుర గర్వించి యమర**
**పతిఁ దొట్టి వేల్పుల బాధించుచున్నఁ ద । ద్భయమున నమరులు బ్రహ్మకడకుఁ**

**జని 'పోరిలో వృత్రుఁ జంప నుపాయ మె । య్యదియొ మా కానతి' మ్మన నజుండు**
**'దివిరి సరస్వతీ తీరంబునందు ని । శ్చింతుఁడై తప మొప్పఁ జేయుచున్న**

**ఆ. యా దధీచికడకు నరిగి వేఁడుండు, ని । జాస్థు లిచ్చు మీకు నమ్మహాత్ముఁ;**
**దవి జయించు వజ్ర మాదిగా నిఖిలది । వ్యాయుధంబులై సురారివరుల. 3**

**ప్రతిపదార్థం:** కృత, యుగంబునన్= కృతయుగంలో; కాలకేయ గణంబుతో= కాలకేయులు అనే రాక్షస సమూహాలతో; వృత్రుఁడు+అన్+అసుర= వృత్రుడు అనే పేరు కలిగిన రాక్షసుడు; గర్వించి= గర్వం కలవాడై; అమరపతిన్= ఇంద్రుడిని; తొట్టి= మొదలుకొని; వేల్పులన్= దేవతలను; బాధించుచు+ఉన్నన్= కష్టాల పాలుచేస్తుండగా; తద్+భయమునన్= అతడివలని భీతిచేత; అమరులు= దేవతలు; బ్రహ్మకడకున్+చని= బ్రహ్మదేవుడి ఒద్దకు చేరి; పోరిలోన్= యుద్ధంలో; వృత్రున్= వృత్రుడు అనే రాక్షసుడిని; చంపన్= సంహరించేందుకు; ఉపాయము= ఉపాయం (వెఱువు); ఏ+అదియొ= ఏదో; మాకు+ఆనతి+ఇమ్ము= మాకు దయచేసి చెప్పవలసింది; అనన్= అని అడుగగా; అజుండు= పుట్టుక లేనివాడైన బ్రహ్మదేవుడు; తివిరి= పూనికతో; సరస్వతీ తీరంబు నందు= సరస్వతీ నది తీరాన; నిశ్చింతుఁడు+ఐ= ఎటువంటి విచారములు లేని వాడై; తపము= తపస్సు; ఒప్పన్= ఒప్పునట్లుగా; చేయుచున్న= చేస్తున్న; ఆ+దధీచి కడకున్= ఆ దధీచి అనే ముని దగ్గరికి; అరిగి= వెళ్ళి; వేఁడుండు= ప్రార్థించండి; ఆ+మహా+ఆత్ముఁడు= ఆ మహానుభావుడైన దధీచిమహర్షి; నిజ+అస్థులు= తనఎముకలు; మీకున్= మీకు; ఇచ్చున్= ఈయగలడు; అవి= ఆ ఎముకలు; వజ్రము+ఆదిగా= వజ్రం మొదలైన; నిఖిల, దివ్య+ఆయుధంబులు+ఐ= దివ్యమైన సకలాయుధాలుగా రూపొంది; సుర+అరి, వరులన్= వేల్పుల విరోధులలో శ్రేష్ఠులు అయిన వారందరిని; జయించున్= గెలువగలవు.

**తాత్పర్యం:** 'కృతయుగంలో కాలకేయులనే రాక్షసుల సమూహాలతో కలిసి వృత్రుడనే రాక్షసుడు గర్వంతో దేవేంద్రుడు మొదలైన దేవతలను బాధిస్తున్నాడు. దేవతలు వృత్రుడిబాధలు పడలేక భీతిల్లి బ్రహ్మదేవుడి దగ్గరకు వెళ్లి 'వృత్రుడిని యుద్ధంలో ఎట్లా చంపటానికి వీలవుతుందో అటువంటి ఉపాయాన్ని చెప్పు' మని అడిగారు. అపుడు బ్రహ్మదేవుడు సరస్వతీ నదీ తీరాన నిష్ఠతో తపస్సు చేస్తున్న దధీచిమహర్షిదగ్గరకి వెళ్ళి మీరు ప్రార్థిస్తే అతడు తన ఎముకలను దానం చేయగలడు అనిన్నీ, ఆ ఎముకలు వజ్రం మొదలైన దివ్యాయుధాలుగా మారుతా యనిన్నీ, అవి దేవతల శత్రువులను జయించగలవనిన్నీ- చెప్పాడు.

**విశేషం:** ప్రాచీన భారతీయ కాలమానం ప్రకారం యుగాలు నాలుగు. 1. కృతయుగం: 17,28,000 సంవత్సరాలు; 2. త్రేతాయుగం: 12,96,000 సంవత్సరాలు: 3. ద్వాపరయుగం: 8,64,000 సంవత్సరాలు: 4. కలియుగం: 4,32,000 సంవత్సరాలు.

**వ. అందు వజ్రంబున నింద్రుండు వృత్రు వధియించు' ననిన నమరు లెల్లం గమలాసను శాసనంబున దధీచి పాలికిం జని కృతప్రణాము లై యిట్లనిరి. 4**

**ప్రతిపదార్థం:** అందున్= అట్లా దివ్యాయుధాలైన అస్థికలలోని; వజ్రంబునన్= వజ్రాయుధంతో; ఇంద్రుండు= ఇంద్రుడు; వృత్రున్= వృత్రుడిని; వధియించున్= చంపుతాడు; అనినన్= అని బ్రహ్మదేవుడు చెప్పగా; అమరులు+ఎల్లన్= దేవతలందరు; కమల+ఆసను= కమలం (పద్మం) ఆసనంగా కల బ్రహ్మదేవుడియొక్క; శాసనంబునన్= ఆజ్ఞవలన; దధీచి, పాలికిన్+చని= దధీచి మహర్షి ఒద్దకు వెళ్ళి; కృత, ప్రణాములు+ఐ= నమస్కరించినవారై, (చేసిన ప్రణామం కలవారై); ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** ఆ దధీచిమహర్షి ఎముకలవలన ఏర్పడిన ఆయుధాలలోని వజ్రంవలన ఇంద్రుడు వృత్రుడిని సంహరిస్తాడు'- అని బ్రహ్మదేవుడు చెప్పగా, అతడి ఆజ్ఞవలన దేవతలందరూ దధీచిమహామునివద్దకు వెళ్ళి నమస్కరించి ఇట్లా పలికారు.

**క.** **'భువనజనస్తుత! నిజగౌ । రవ మెసఁగఁగ నమరపతి పురస్కృతు లగు ని**
**ద్దివిజుల కెల్ల హితంబుగ । భవదస్థిచయంబు లిమ్ము పరమమునీంద్రా!'** **5**

**ప్రతిపదార్థం:** భువన జన స్తుత!= లోకంలోని ప్రజలందరిచేత పొగడబడినవాడా!; పరమ, ముని+ఇంద్రా!= గొప్పఋషులలో శ్రేష్ఠుడివైన వాడా!; అమరపతి, పురస్కృతులు+అగు= దేవేంద్రుడిని ముందు పెట్టుకొని వచ్చిన; ఈ దివిజులకు+ఎల్లన్= ఈ దేవతలందరికి; హితంబుగన్= మేలయ్యేటట్లు; భవత్+అస్థి+చయంబులు= నీయొక్క ఎముకల సముదాయాలు; నిజగౌరవము+ఎసఁగఁగన్= తమయొక్క గొప్పతనం శోభిల్లేటట్లుగా; ఇమ్ము= ఇవ్వవలసింది.

**తాత్పర్యం:** 'ఋషులలో కెల్ల గొప్ప ఋషివైన ఓ దధీచి! నీ గొప్పతనం శోభించేటట్లుగా, దేవేంద్రుడిని ముందు పెట్టుకుని నిన్ను అర్థిస్తున్న ఈ దేవతలందరికీ మేలు కలిగేటట్లు నీ ఎముకలను దానం చేయవలసింది.'

**వ.** **అనిన విని దధీచి సంతసిల్లి 'కృతార్థుండ నైతి' నని దేవహితార్థంబుగా నిజప్రాణంబుల విడిచె; నమరులెల్ల నమ్మహాముని యస్థు లాయుధంబులుగాఁ బరిగ్రహించి; రందు.** **6**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వేల్పులు ప్రార్థించగా; విని; దధీచి= దధీచిమహర్షి; సంతసిల్లి= సంతోషించి; కృత+అర్థుండను= చరితార్థుడిని (ధన్యుడిని); ఐతిన్+అని= అయ్యానని; దేవహిత+అర్థంబుగాన్= దేవతల మేలుకొరకు; నిజప్రాణంబులన్= తన అసువులను; విడిచెన్= విడిచాడు; అమరులు+ఎల్లన్= దేవతలందరూ; ఆ+మహాముని, అస్థులు= ఆ మహాముని ఎముకలను; ఆయుధంబులుగాన్= శస్త్రాలుగా; పరిగ్రహించిరి= తీసికొన్నారు; అందున్= అందు.

**తాత్పర్యం:** ఆ విధంగా దేవతలు తనను ప్రార్థించగా, దధీచిమహర్షి తన జన్మ ధన్యమైనదని సంతోషించి, దేవతల మేలు కోరి తన ప్రాణాలను విడిచాడు. దేవతలందరూ ఆ మహాముని ఎముకలను ఆయుధాలుగా స్వీకరించారు; అందు.

**విశేషం:** 'పరోపకారార్థ మిదం శరీరమ్'- అన్న ఆదర్శాన్ని ఆచరించి చూపించిన అనుష్ఠాన వేదాంతిగా దధీచి పౌరాణిక వాఙ్మయంలో సుప్రసిద్ధుడు.

**ఆ.** **త్వష్ట యంత నూఱుధారల రమ్యమై । యనలకణ కరాళ మైన వజ్ర**
**మొనరఁ జేసి 'దీన నోర్వుము దైత్యుల' । ననుచు నిచ్చె దాని నమరపతికి.** **7**

**ప్రతిపదార్థం:** అంతన్= అనంతరం; త్వష్ట= త్వష్ట అనే ప్రజాపతి; నూఱు, ధారలన్= వంద అంచులతో; రమ్యము+ఐ= అందంగా ఉన్నట్టి; అనల, కణ, కరాళము+ఐన= అగ్గిరవ్వలచేత భయంకరమైన; వజ్రము+ఒనరన్+చేసి= వజ్రం అనే ఆయుధాన్ని ఒప్పేటట్లుగా చేసి; దీనన్= దీనితో (ఈ ఆయుధంతో); దైత్యులన్= రాక్షసులను; ఓర్వుము= జయించవలసింది; అనుచున్= అని చెప్తుతూ; దానిన్= దానిని; అమరపతికిన్= దేవేంద్రుడికి; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** త్వష్ట అనే ప్రజాపతి నూరు మొనలుతేలి నిప్పురవ్వలతో భయంకరంగా ఉండే వజ్రం అనే ఆయుధాన్ని నిర్మించి 'దీనితో రాక్షసులను జయించు' మని దేవేంద్రుడికి ఇచ్చాడు.

**వ. అవ్వజ్రంబున నింద్రుండు వృత్రు వధియించె నంత. 8**

**ప్రతిపదార్థం:** ఆ+వజ్రంబునన్= ఆ వజ్రాయుధంతో; ఇంద్రుండు= ఇంద్రుడు; వృత్రున్= వృత్రుడిని; వధియించెన్= సంహరించాడు; అంతన్= అటుపిమ్మట.

**తాత్పర్యం:** ఆ వజ్రాయుధాన్ని ప్రయోగించి దేవేంద్రుడు వృత్రుడిని సంహరించాడు. ఆ తరువాత.

**చ. అనుపమదివ్యశస్త్రధరులైన యమర్త్యుల కాహవంబులో**
**మొనయక కాలకేయులు సముద్రముఁ జొచ్చి దివంబు లెల్ల న**
**వ్వనధి నడంగి యుండి బలవంతులు వెల్వడి రాత్రులెల్ల భూ**
**జనులకు బాధసేయుచు భృశంబుగ నుండిరి క్రూరచిత్తులై. 9**

**ప్రతిపదార్థం:** అనుపమ, దివ్య, శస్త్ర, ధరులు+ఐన= సాటి లేని గొప్ప ఆయుధాలు ధరించిన వారైన; అమర్త్యులకు= దేవతలకు (మృత్యువు లేనివారికి); ఆహవంబులోన్= యుద్ధంలో; మొనయక= లొంగక; కాలకేయులు= కాలకేయు లనే రాక్షసులు; సముద్రమున్+చొచ్చి= కడలిలో దూరి; దివంబులు+ఎల్లన్= పగళ్ళు అన్నీ (అన్నియున్నూ); ఆ+వనధిన్= ఆ సముద్రంలో; అడంగి, ఉండి= దాగిఉండి; బలవంతులు= బలంగల ఆ రాక్షసులు; రాత్రులు+ఎల్ల= రాత్రి సమయాలన్నింటిలో; వెల్వడి= బయటికి వచ్చి; భృశంబుగన్= మిక్కిలిగా; భూ, జనులకున్= భూప్రజలకు; బాధ+చేయుచున్= పరితాపం కలిగిస్తూ; క్రూర, చిత్తులు+ఐ= దయలేని మనస్సు కలవారై; ఉండిరి= ఉన్నారు.

**తాత్పర్యం:** సాటిలేని ఆయుధాలు ధరించినవారైన దేవతలకు లొంగక కాలకేయులు అనే రాక్షసులు, పగలంతా సముద్రంలో దాగిఉండి, రాత్రులు బలవంతులై బయటికి వచ్చి, భూప్రజలకు అధికంగా ఉపద్రవాలను కలిగిస్తూ క్రూరులై ఉన్నారు.

**వ. మఱియు 'విద్యాతపోయుక్తులై ధర్మచరితులైన వారి కారణంబున జగంబు లపాయంబు నొందక సుఖంబున్న యవి; గావున నట్టి వారిన రోసి వధియించి జగంబుల కపాయంబు సేయుద' మని యసురులు వసిష్ఠాశ్రమంబున నూటతొంబదియేడ్వురను, జ్యవనాశ్రమంబున నూర్వురను, భరద్వాజాశ్రమంబున నిరువదుండ్రనుంగాఁ బలువురు బ్రాహ్మణుల బ్రహ్మమయుల వధియించి, భక్షించి, యిప్పాట ననవరతంబు నఖిల మునిగణాశ్రమంబుల కుపద్రవంబు సేయుచున్న. 10**

**ప్రతిపదార్థం:** మఱియు= అదియున్నూ కాక; విద్యా, తపస్+యుక్తులు+ఐ= విద్యతో, తపంతో కూడుకొన్న వారై; ధర్మచరితులు+ఐన= ధర్మమైన ప్రవర్తన కలవారైన; వారి కారణంబునన్= వారి మూలాన్నే; జగంబులు= భువనాలు; అపాయంబున్+ఒందక= కీడు చెందక; సుఖంబు+ఉన్నయవి, కావున= సుఖంగా ఉన్నాయి కాబట్టి; అట్టి వారిన్+అ= అటువంటివారినే; రోసి= వెదకి; వధియించి= చంపి; జగంబులకు= లోకాలకు; అపాయంబు+చేయుదము+అని= కీడు కలిగిద్దాము- అని ఆలోచించి; అసురులు= రాక్షసులు; వసిష్ఠ+ఆశ్రమంబునన్= వసిష్ఠుడి ఆశ్రమంలో; నూట తొంబది+ఏడ్వురను= నూట తొంభైఏడు మందిని; చ్యవన+ఆశ్రమంబునన్= చ్యవన మహర్షి ఆశ్రమంలో; నూర్వురను= వందమందిని;

భరద్వాజ+ఆశ్రమంబునన్= భరద్వాజ మహర్షి ఆశ్రమంలో; ఇరువదుండ్రనున్+కాన్= ఇరవైమంది అగునట్లు; పలువురు బ్రాహ్మణులన్= అనేకమందివిప్రులను; బ్రహ్మమయుల= జ్ఞానమూర్తులను; వధియించి= సంహరించి; భక్షించి= తిని; ఈ+పాటన్= ఈ విధంగా; అనవరతంబున్= ఎల్లప్పుడూ; అఖిల మునిగణ+ఆశ్రమంబులకున్= అందరు ఋషుల ఆశ్రమాలకున్నూ; ఉపద్రవంబు= కీడును; చేయుచున్నన్= కలిగిస్తుండగా.

**తాత్పర్యం:** ఇంకనూ ఆ కాలకేయులు చాలారకాల ఆగడాలకు పాల్పడ్డారు. 'విద్య, తపస్సులచేత కూడినవారై ధార్మికప్రవర్తన కలిగిన మహానుభావుల మూలాన్నే లోకాలు ప్రమాదానికి లోనుకాకుండా నిలిచి ఉన్నాయి కాబట్టి, అటువంటి పుణ్యాత్ములనే వెదకి వెదకి సంహరించి, లేదా ఈ జగానికి కీడు మూడేటట్లు చేద్దాం గాక'- అని ఆ రాక్షసులు ఆలోచించి వసిష్ఠుడిఆశ్రమంలో నూటతొంభైయేడు మందిని, చ్యవనుడి ఆశ్రమంలో వందమందిని, భరద్వాజుడి ఆశ్రమంలో ఇరవైమందిని- ఈ రీతిగా అనేకులైన బ్రాహ్మణులను, జ్ఞానమూర్తులైనవారిని సంహరించి వారిని భక్షించారు. ఈ విధంగా ఆ కాలకేయులు ఎల్లప్పుడూ ఋషుల ఆశ్రమాలకు ఉపద్రవాలు కల్పించసాగారు.

### దేవతలు వైకుంఠమునకుఁ బోయి విష్ణుని స్తుతియించుట (సం. 3-99-11)

**క. యాగాది పుణ్యకర్మ । త్యాగము మర్త్యమున నైనఁ దా రధికభయో**
**ద్వేగంబునఁ బురుహూతపు । రోగములై యగ్నియమవరుణధనదాదుల్. 11**

**ప్రతిపదార్థం:** యాగ+ఆది, పుణ్య, కర్మత్యాగము= యజ్ఞాలు మొదలైన పుణ్యకార్యాలు విడువబడటం; మర్త్యమునన్+ఐనన్= మానవలోకంలో సంభవించటం చేత; తారు= తాము (దేవతలు); అధిక+భయ+ఉద్వేగంబునన్= ఎక్కువ వెఱపుతో కూడుకొన్న ఆవేశంతో; పురుహూత+పురస్+గములు+ఐ= ఇంద్రుడిని ముందు పెట్టుకొని వెళ్ళినవారై; అగ్ని, యమ, వరుణ, ధనద+ఆదుల్= అగ్నిదేవుడు, యమధర్మరాజు, వరుణుడు, కుబేరుడు మొదలైనవారు.

**తాత్పర్యం:** భూలోకంలో యజ్ఞాలు మొదలైన పుణ్యకార్యాలు జరగకపోవటంచేత మిక్కిలి భీతిని, ఉద్వేగాన్ని చెంది, అగ్నిదేవుడు, యమధర్మరాజు, వరుణుడు, కుబేరుడు మొదలైనవారు దేవేంద్రుడిని తమకు నాయకుడిగా ముందుపెట్టుకొని.

**క. చని వైకుంఠంబునఁ ద్రిభు । వనపతి వైకుంఠు గరుడవాహను విష్ణున్**
**దనుజవిభంజనుఁ గని యి । ట్లని రెంతయు భక్తితోఁ గృతాంజలు లగుచున్. 12**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; వైకుంఠంబునన్= విష్ణుదేవుడి లోకమైన వైకుంఠంలో; త్రి+భువన+పతి= మూడు లోకాలకు అధినేత అయిన; వైకుంఠున్= వికుంఠ నగరాధిపతిఅయిన విష్ణుదేవుడిని; గరుడవాహనున్= గరుడుడిని వాహనంగా కల వాడిని; దనుజవిభంజనున్= రాక్షసులను సంహరించేవాడిని; విష్ణున్= విష్ణుదేవుడిని; కని= సందర్శించి; కృత+అంజలులు= కూర్చిన అంజలి కలవారు (నమస్కరించినవారు); అగుచున్= అవుతూ; ఎంతయున్= మిక్కిలి; భక్తితోన్= గౌరవంతో కూడిన పూజ్యభావంతో; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** వారు వైకుంఠానికి వెళ్ళి మూడులోకాలకు అధినేత, గరుడవాహనుడు, వైకుంఠానికి అధిపతి, రాక్షసులను సంహరించేవాడు అయిన విష్ణుదేవుడిని సందర్శించి మిక్కిలి భక్తితో నమస్కరించి ఇట్లా విన్నవించారు.

**వ. 'దేవా! నీవు వరాహరూపధరుండవై మహీతలం బెత్తి, నరసింహరూపంబు దాల్చి యాదిదైత్యు హిరణ్యకశిపు వధించి, వామనుండవై బలిం గట్టి, యజ్ఞమూర్తి వై యజ్ఞవిఘ్నకరుండైన జంభుండను దానవుం జంపి, యండజ జరాయుజస్వేదజోద్భిజ్జంబు లనం బరఁగిన చతుర్విధ ప్రజల రక్షించుచున్న జగద్రక్షకుండవు గావున నీకు విన్నపంబు సేసెద; మిప్పుడు జగంబులకైన యుపద్రవంబు చిత్తగింపుము. 13**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ పరమాత్మా!; నీవు= నీవు; వరాహ, రూప, ధరుండవు+ఐ= వరాహ ఆకారం ధరించిన వాడివై; మహీ, తలంబు+ఎత్తి= భూస్థలిని పైకెత్తి; నరసింహ, రూపంబు+తాల్చి= సగం మనిషి సగం సింహం ఆకారం ధరించి; ఆది, దైత్యున్= మొదటి రాక్షసుడిని; హిరణ్యకశిపున్= హిరణ్య కశిపుడు అనబడేవాడిని; వధించి= సంహరించి; వామనుండవు+ఐ= మరుగుజ్జవై; బలిన్+కట్టి= బలిని బంధించి; యజ్ఞ మూర్తివి+ఐ= యజ్ఞాన్ని ఆకృతిగా ధరించిన వాడివై; యజ్ఞ, విఘ్నకరుండు+ఐన= క్రతువులకు అంతరాయాన్ని కలిగించేవాడైన; జంభుండు+అను= జంభుడు అనే పేరు కల; దానవున్+చంపి= రాక్షసుడిని సంహరించి; అండజ= గ్రుడ్డునుండి పుట్టేటటువంటి; జరాయుజ= మావి వలన అంటే గర్భాశయంనుండి పుట్టేటటువంటి; స్వేదజ= చెమటనుండి పుట్టేటటువంటివి; ఉద్భిజ్జంబులు= భూమిని భేదించుకొని వెలువడేటటువంటివి; అనన్+పరఁగిన= అనబడిన; చతుర్+విధ ప్రజల= నాలుగురకాలైన సంతతులను (ప్రాణుల); రక్షించుచున్న= కాపాడుతున్న; జగత్+రక్షకుండవు= జగత్తును కాపాడేవాడివి; కావున= కాబట్టి; నీకు, విన్నపంబు+చేసెదము= నీకు విన్నవించుకొంటున్నాం; ఇప్పుడు= ఇప్పుడు; జగంబులకు+ఐన, ఉపద్రవంబు= ప్రపంచాలకు ఏర్పడినకీడు; చిత్తగింపుము= దయచేసి ఆలకించుము.

**తాత్పర్యం:** 'ఓ పరమాత్మా! నీవు వరాహంగా అవతరించి భూమిని పైకెత్తావు; నరసింహరూపం ధరించి హిరణ్యకశిపుడనే మొదటి రాక్షసుడిని సంహరించావు; మరుగుజ్జురూపం ధరించి బలిచక్రవర్తిని బంధించావు; యజ్ఞమూర్తివై యజ్ఞాలకు అంతరాయాలు కల్పించిన జంభుడనే రాక్షసుడిని సంహరించావు. ఈ ప్రపంచంలోని ప్రాణులను అన్నింటిని- గ్రుడ్డునుండి పుట్టేవాటిని (కోళ్ళు, బాతులు, పాములు ఇత్యాదులను), గర్భాశయాలనుండి ఉదయించేవాటిని (మేకలు, మానవులు మొదలగువారిని), చెమటనుండి పుట్టే వాటిని (పేలు మొదలైనవాటిని), తమంతకు తాము భూమినుండి పైకివచ్చేవాటిని (చెట్లు మొ॥ వాటిని) కాపాడుతున్న లోక రక్షకుడవు నీవే. అందుకే నీతో మొర పెట్టుకొనేందుకు వచ్చాం. ఇప్పుడు లోకాలకు ఏర్పడిన విపత్తును దయచేసి ఆలకించుము.

**సీ. కాలకేయులు మహాకాయులు పగలెల్ల । జలదుర్గ బలమున జలధినుండి**
**రే లెల్లఁ జని నలి రేఁగి మునీశ్వరా । శ్రమముల సద్ధర్మచారు లైన**
**బ్రాహ్మణప్రవరులఁ బాయక వధియింతు । రెట్టి పాపాత్ములు నెయ్యుగముల**
**బ్రాహ్మణహింస యాపాదింతురే యది । వీరలవలనన వినఁగఁబడియెఁ;**

**ఆ. బరమసాధు లైన బ్రాహ్మణులకు బాధ । యగుడు మహికి బాధ యగు; ధరిత్రి**
**కైనబాధఁ జేసి యఖిలలోకంబులుఁ । గరము బాధ నొందుఁ గమలనాభ! 14**

**ప్రతిపదార్థం:** కమల, నాభ!= పద్మం నాభియందు కలవాడా!; మహా+కాయులు= పెద్ద పెద్ద దేహాలు కలవారు; కాలకేయులు= కాలకేయులు అనబడే రాక్షసులు; పగలు+ఎల్లన్= పగటిసమయాలలో, (పగలంతా); జల దుర్గ బలమునన్= జలదుర్గం యొక్క బలంవలన; జలధిన్+ఉండి= సముద్రంలో (నే) ఉండి; రేలు+ఎల్లన్= రాత్రులం దెల్లప్పుడు; చని= వెడలి; నలి, రేఁగి= బాగా విజృంభించి; ముని+ఈశ్వర+ఆశ్రమముల= ఋషిశ్రేష్ఠులు నివసించే ఆశ్రమాలలో; సత్+ధర్మ చారులు+ఐన=

మంచి ధర్మాన్ని ఆచరించేటటువంటి వారైన; బ్రాహ్మణ ప్రవరులన్= విప్రశ్రేష్ఠులను- బ్రాహ్మణ ఉత్తములను; పాయక= విడువక; వధియింతురు= చంపుతారు; ఎట్టి, పాప+ఆత్ములున్= ఎటువంటి దుర్జనులైనా; ఏ+యుగముల= ఏ కాలాలలోనూ; బ్రాహ్మణహింస= విప్రులను బాధించటం; ఆపాదింతురు+ఏ= చేస్తారా!; అది= అటువంటి బ్రాహ్మణ హింస; వీరలవలనన= ఈ కాలకేయుల వలననే; వినఁగన్+పడియెన్= వినబడ్డది; పరమ సాధులు+ఐన= మిక్కిలి సౌమ్యులైన; బ్రాహ్మణులకు= విప్రులకు; బాధ+అగుడు= పరితాపం కలిగితే; మహికిన్= భూమికి; బాధ+అగున్= బాధ కలుగుతుంది; ధరిత్రికి+ఐన, బాధన్+చేసి= భూమికి కలిగిన బాధ వలన; అఖిల లోకంబులున్= సమస్త భువనాలున్నూ; కరము= మిక్కిలి; బాధన్+ఒందున్= వ్యథను చెందుతాయి.

**తాత్పర్యం:** ఓ పద్మనాభ! కాలకేయులు అనే రాక్షసులు పెద్ద పెద్ద శరీరాలు కలవారు. వారు సముద్రాన్ని జలదుర్గంగా చేసికొని పగలంతా అందులోనే ఉండి రాత్రులలో బయటకు వచ్చి, విజృంభించి ఋషుల ఆశ్రమాలలోని ధర్మాత్ములైన బ్రాహ్మణోత్తములను వదలకుండా సంహరిస్తుంటారు. అటువంటి పాపాత్ములు, ఆవిధంగా బ్రాహ్మణహింస చేసినవారు, అంతకుముందు ఏయుగంలో నైనా ఉన్నారా? అట్లాంటి వాళ్లలో కాలకేయులే ప్రథములని చెప్పవలసి ఉంటుంది. మిక్కిలి సౌమ్యప్రవర్తన కల బ్రాహ్మణులకు కీడు కలిగితే అందువల్ల భూమండలానికంతటికీ బాధ ఏర్పడుతుంది. ఆవిధంగా భూమికి బాధ ఏర్పడితే సమస్త లోకాలూ మిగుల పరితపిస్తాయి.

**విశేషం:** దుర్గము= పోవటానికి కష్టమైనది. దుర్గాలు ఆరు. 1. ధన్వ దుర్గం= నాలుగు ప్రక్కలా అయిదామడలమేర మరుభూమి గల కోట. 2. మహీదుర్గం= చుట్టూ మట్టిప్రాకారం గల కోట. 3. వార్క్ష దుర్గం= చుట్టూ చెట్టు చేమలు గల కోట. 4. జలదుర్గం= చుట్టూ నీరు గల కోట. 5. నరదుర్గం= చుట్టూ చతురంగబలాలు గల కోట. 6. గిరిదుర్గం= చుట్టూ కొండలు గల కోట. సముద్రం కాలకేయులకు సహజ 'జలదుర్గం' అయింది.

**వ. ఎట్లనిన వేదంబులు ధరియించి విప్రులు వేదచోదితంబులైన పుణ్యకర్మంబులు విధియించుటం జేసి హవ్య కవ్యంబుల దేవతలుం బితరులుఁ దృప్తులైన వారివలన నెల్లలోకంబులకు సుఖం బగుం గావున బ్రాహ్మణోపద్రవంబు పరిహరించి లోకంబులు రక్షింపు' మనిన దేవతలకు విష్ణుదేవుం డిట్లనియె. 15**

**ప్రతిపదార్థం:** ఎట్లు+అనినన్= అది ఎట్లా అని అడిగితే; వేదంబులు= వేదాలు; ధరియించి= వహించి; విప్రులు= బ్రాహ్మణులు; వేద చోదితంబులు+అయిన= వేదాలచేత విధించబడిన; పుణ్య కర్మంబులు= పుణ్యాన్ని ఇచ్చే పనులు; విధియించుటన్+చేసి= నిర్వహించటంచేత; హవ్య, కవ్యంబులు= దేవతలకు, పితృదేవతలకు అర్పించే హోమద్రవ్యాలచేత; దేవతలున్= దేవతలున్నూ; పితరులున్= పితృదేవతలున్నూ; తృప్తులు+ఐన= తనివి (తృప్తి) చెందినట్లయితే; వారివలనన్= ఆ దేవతలవలన, పితృదేవతల వలన; ఎల్ల లోకంబులకున్= సర్వప్రపంచాలకు; సుఖంబు+అగున్= సుఖం కలుగుతుంది; కావునన్= కాబట్టి; బ్రాహ్మణ+ఉపద్రవంబు= బ్రాహ్మణులకు జరిగే కీడు; పరిహరించి= తొలగించి; లోకంబులు= ప్రపంచాలను; రక్షింపుము= కాపాడుము; అనినన్= అని చెప్పగా; దేవతలకు= వేల్పులకు; విష్ణుదేవుండు= విష్ణుదేవుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అది ఎట్లా అనగా, బ్రాహ్మణులు వేదాలను చదివి, వేదవిహితాలైన పుణ్యకర్మలు చేయటం వలన వారు వేల్చెడి హవ్యకవ్యాలచేత దేవతలున్నూ, పితృదేవతలున్నూ తృప్తి చెందగలరు. తృప్తులైన దేవతలవలన, పితృదేవతలవలన సమస్తలోకాలకు సుఖం కలుగుతుంది. కాబట్టి బ్రాహ్మణులకు దాపురించిన కీడును తప్పించు'- మని ప్రార్థించగా దేవతలతో విష్ణుదేవు డిట్లా పలికాడు.

**మత్తకోకిలము.**

**'కాలకల్పుల నుగ్రతేజులఁ గాలకేయుల భూరిర**
**త్నాలయస్థుల వీర్యవంతుల నర్ణవంబు సమస్తస**
**త్త్వాలి దోఁపఁగ వట్టినన్ విషయం బగున్ వధియింపఁగాఁ**
**బోల దొండువిధంబునం బరిపూర్ణవార్ధిజలోన్నతిన్. 16**

**ప్రతిపదార్థం:** కాలకల్పులన్= యముడితో సమానమైనవారిని; ఉగ్రతేజులన్= భయంకరమైన ప్రతాపం కలవారిని; కాలకేయులన్= కాలకేయులు అనే రాక్షసులను; భూరి రత్న+ఆలయస్థులన్= విస్తారమైన సముద్రంలో ఉన్నవారిని, (రత్న+ఆలయము= రత్నాలకు నిలయమైనది సముద్రం); వీర్యవంతులన్= పరాక్రమం కలవారిని; అర్ణవంబు= సముద్రాన్ని; సమస్త సత్త్వ+ఆలి తోఁపఁగన్= సమస్త జంతుసమూహాలు కనపడేటట్లుగా; వట్టినన్= నీరు లేకుండా చేయగా; వధియింపఁగాన్= సంహరించేందుకు; విషయంబు+అగున్= వీలగును(వీలవుతుంది); ఒండు విధంబునన్= వేరొకరీతిగా (విధంగా); పరిపూర్ణ వార్ధి జల+ఉన్నతిన్= నిండుగా సముద్రపునీరు అతిశయించి ఉండటంచేత; పోలదు= వీలు కాదు.

**తాత్పర్యం:** 'కాలకేయులు భయంకరమైన ప్రతాపం కలవారు, యముడితో సమానులు. అటువంటి పరాక్రమ వంతులను సముద్రాన్నంతా ఇంకించి (ఇంకజేసి) అందుండే సమస్త ప్రాణకోటి బయల్పడేటట్లు చేస్తేకాని, వధించటానికి సాధ్యం కాదు. నిండుగా నీరుగల సముద్రంలో ఉన్న వారిని వేరొకవిధంగా సంహరించటం వీలు పడదు.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.46 విశేషాంశం చూడండి.

**క. వరుణజలంబుల మిత్రా । వరుణ తనూజుండు వీర్యవంతుండై చె**
**చ్చెరఁ ద్రావ నోపు; నిందఱు । నరుగుఁడు; ప్రార్థింపుఁ డమ్మహాత్ము నగస్త్యున్.' 17**

**ప్రతిపదార్థం:** వరుణ జలంబుల= వరుణదేవుడివైన నీళ్ళను; మిత్రావరుణ తనూజుండు= మిత్రావరుణులకొడుకు; [అగస్త్యుడు] వీర్య వంతుండు+ఐ= బలం కలవాడై; చెచ్చెరన్= శీఘ్రంగా; త్రావన్+ఓపున్= త్రాగగలడు; ఇందఱున్= ఇంతమంది; అరుగుఁడు= వెళ్లండి; ఆ+మహాత్మున్= ఆ మహానుభావుడిని; అగస్త్యున్= అగస్త్యమహామునిని; ప్రార్థింపుఁడు= వేడికొనండి.

**తాత్పర్యం:** నీళ్ళు వరుణదేవుడికి సంబంధించినవి. మిత్రావరుణుల కుమారుడైన అగస్త్యుడు ఆ నీళ్ళను తన ప్రభావంతో శీఘ్రంగా త్రాగగలడు. మీరందరూ మహాత్ముడూ, ఋషిశ్రేష్ఠుడూ ఐన ఆ అగస్త్యుడివద్దకు వెళ్ళి అతడిని వేడుకొనండి'.

**వ. అనిన నమరు లెల్ల నగస్త్యుపాలికిం జని యమ్మునివరు స్తుతియించి యిట్లనిరి. 18**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అమరులు+ఎల్లన్= దేవతలంతా; అగస్త్యుపాలికిన్+చని= అగస్త్యుడి ఒద్దకు వెళ్లి; ఆ+మునివరున్= ఆఋషిశ్రేష్ఠుడిని; స్తుతియించి= పొగడి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** అని విష్ణుదేవుడు చెప్పగా, దేవత లంతా అగస్త్యమహామునివద్దకు వెళ్ళి ఇట్లా పలికారు.

**క. 'అమరహితంబుగ జగదహి । తము దలఁగుము పేర్మితో బుధస్తుతగుణ! విం**
**ధ్యము దొల్లి పెరిఁగి జగదహి । తము సేసిన నీవ కావె తలఁగితి దానిన్.' 19**

**ప్రతిపదార్థం:** అమర+హితంబుగ= దేవతలకు మేలు కలిగేటట్లుగా; జగత్+అహితము= ప్రపంచానికి ఏర్పడిన కీడు; పేర్మితోన్= గొప్పతనంతో; తలఁగుము= తొలగించుము; బుధ స్తుత గుణ!= బుధులచేత పొగడబడిన మంచిగుణాలు కలవాడా!; వింధ్యము= వింధ్య పర్వతం; తొల్లి= పూర్వకాలంలో; పెరిఁగి= అతిశయించి; జగత్+అహితము= లోకానికి కీడు; చేసినన్= చేయగా; దానిన్= ఆ కీడును; నీవు+అ+కావె= నీవే కదా; తలఁగితి(వి)= తొలగించావు.

**తాత్పర్యం:** 'దేవతలకు మేలు కలిగేటట్లుగా, జగత్తుకు ఏర్పడిన విపత్తును నీ గొప్పతనంచేత తొలగించవలసింది. బుధులచేత ప్రశంసించబడిన సద్గుణాలు కలిగిన మహానుభావా! పూర్వం వింధ్యపర్వతం పెరిగి ప్రపంచానికి కీడు చేయగా, ఆ ఉపద్రవాన్ని తొలగించింది నీవే కదా!'

**వ. అని దేవత లెల్ల నగస్త్యుఁ గీర్తించి' రనిన విని ధర్మంజుం' డిది యెట్లు? వింధ్యం బేల పెరిగె? దానిం బెరుఁగకుండ నగస్త్యుం డెవ్విధంబున వారించె?' నని యడిగిన, నాతనికి రోమశుం డిట్లనియె. 20**

**ప్రతిపదార్థం:** అని= అని; దేవతలు+ఎల్లన్= దేవతలు అందరున్నూ; అగస్త్యున్= అగస్త్యమహామునిని; కీర్తించిరి= పొగిడారు; అనిన= అని చెప్పగా; విని= విని (ఆలకించి); ధర్మజుండు= ధర్మరాజు, (ధర్మతనయుడు); ఇది+ఎట్లు?= ఇది ఏవిధంగా జరిగింది?; వింధ్యంబు+ఏల పెరిగెన్? వింధ్యపర్వతం ఎందుకు పెరిగింది?; దానిన్= దానిని; పెరుఁగకుండన్= ఎదుగకుండా; అగస్త్యుండు= అగస్త్యుడు; ఏ+విధంబునన్= ఏవిధంగా; వారించెన్?= ఆపాడు?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; ఆతనికిన్= ఆ ధర్మరాజుకు; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా దేవతలందరూ అగస్త్యమహామునిని పొగిడారు'- అని రోమశుడు చెప్పగా ధర్మరాజు విని, 'అది ఏ విధంగా జరిగింది? వింధ్యపర్వతం ఎందుకు పెరిగింది? దానిని పెరుగకుండా అగస్త్యు డేవిధంగా ఆపాడు?' - అని ప్రశ్నించాడు. ఆ ధర్మరాజుప్రశ్నకు రోమశమహర్షి ఈ విధంగా బదులు పలికాడు.

### అగస్త్యుఁడు వింధ్యంబు పెరుఁగకుండ వారించుట (సం. 3-101-2)

**ఉ. 'నెమ్మి నినుండు మేరుధరణీధరనాథుఁ బ్రదక్షిణంబుగాఁ**
**ద్రిమ్మరుచున్నఁ జూచి పటుదీధితికిం గర మల్గి వింధ్యశై**
**ల మ్మనియెన్ 'దినేంద్ర! యచలప్రభు నన్నుఁ బ్రదక్షిణంబు ని**
**త్యమ్మును జేయ కేల మతి దప్పితి? మేరువుఁ గొల్వ నేటికిన్?' 21**

**ప్రతిపదార్థం:** నెమ్మిన్= ప్రీతితో; ఇనుండు= సూర్యుడు; మేరు ధరణీధరనాథున్= మేరు పర్వతపతిని (ధరణీధరము= పర్వతం); ప్రదక్షిణంబుగాన్= ఎడమనుండి కుడివైపుకు; త్రిమ్మరుచున్నన్+చూచి= తిరుగుతుండగా చూచి; పటు దీధితికిన్= చండికిరణుడైన సూర్యుడి మీద; కరము= మిక్కిలి; అల్గి= కోపించి; వింధ్య శైలము+అనియెన్= వింధ్య పర్వతం చెప్పింది; దిన+ఇంద్ర!= ఓ సూర్యుడా (దినానికి ప్రభువా)!; అచల+ప్రభున్= కొండలకు రాజును; నన్నున్= నన్ను; ప్రదక్షిణంబు= చుట్టు తిరగటం; నిత్యమ్మును= దిన దినమూ; చేయక= చేయకుండా; ఏల= ఎందుకు; మతి+తప్పితి?= బుద్ధిహీనుడవైనావు?; మేరువున్= మేరుపర్వతాన్ని; కొల్వన్+ఏటికిన్= ఆరాధించటం ఎందుకు?

**తాత్పర్యం:** 'ప్రీతితో సూర్యుడు మేరుపర్వతానికి ప్రదక్షిణం చేయటం చూచిన వింధ్యపర్వతానికి చండకిరణుడైన సూర్యుడిపై ఆగ్రహం కలిగింది. 'ఓ దినపతీ! కొండలకు రాజు నైన నాకు ప్రదక్షిణం చేయకుండా నీవు నిత్యం బుద్ధిహీనుడివై ఎందుకు మేరువును ఆరాధిస్తున్నావు'

**వ. అని గర్వించి పలికిన నప్పర్వతంబునకు భానుం డిట్లనియె. 22**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; గర్వించి= మదంతో; పలికినన్= మాట్లాడగా; ఆ+పర్వతంబునకు= ఆ కొండతో; భానుండు= సూర్యుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు;

**తాత్పర్యం:** అని గర్వించి పలికిన ఆ కొండతో సూర్యుడు ఇట్లా చెప్పాడు.

**క. 'అనవరతము విధియోగం । బున నేఁ ద్రిమ్మరుదు నమరభూధరముఁ బ్రియం**
**బున నాత్మేచ్ఛ యొనర్పఁగఁ । జన' దనవుడు నలిగి వింధ్యశైలం బంతన్. 23**

**ప్రతిపదార్థం:** అనవరతము= ఎల్లప్పుడూ; విధి యోగంబునన్= బ్రహ్మదేవుడి ఆదేశాన; అమర భూధరమున్= వేల్పుకొండ అయిన మేరుగిరి చుట్టూ; ఏన్= నేను; త్రిమ్మరుదున్= తిరుగుతాను; ప్రియంబునన్= ప్రీతితో; ఆత్మ+ఇచ్ఛ= నా ఇష్టం వచ్చినట్లు; ఒనర్పఁగన్+చనదు= చేయటానికి వీలులేదు; అనవుడు= అని చెప్పగా; అలిగి= కోపగించి; వింధ్య శైలంబు= వింధ్యపర్వతం; అంతన్= అంతట.

**తాత్పర్యం:** 'బ్రహ్మదేవుడి ఆదేశం ప్రకారం, ఎల్లప్పుడూ నేను మేరువుకు ప్రదక్షిణంగా తిరుగుతున్నాను. నా ఇష్టానుసారం చేసేందుకు వీలులేదు'- అని సూర్యుడు బదులు పలుకగా వింధ్యపర్వతానికి ఆగ్రహం కలిగింది. ఆ తరువాత.

**క. ఇన శశి తారాదులకుం । జన రాకుండంగఁ బెరిఁగి జలధరపథ మె**
**ల్లను గప్పియుండె వింధ్యం । బనుపమ ముత్తుంగమై సురాద్రిస్పర్ధన్. 24**

**ప్రతిపదార్థం:** వింధ్యంబు= వింధ్యపర్వతం; సుర+అద్రి స్పర్ధన్= వేలుపుకొండతో గల మాత్సర్యంతో; అనుపమము= సాటి లేనిదై; ఉత్తుంగము+ఐ= ఎత్తు గలదై; ఇన, శశి, తారా+ఆదులకున్= సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు మొదలైనవాటికి; చన రాకుండంగన్= వెళ్ళేందుకు వీలులేకుండా; పెరిఁగి= ఎదిగి; జలధర, పథము+ఎల్లను= మేఘమార్గం అంతటినీ; కప్పియుండెన్= కప్పివేసింది.

**తాత్పర్యం:** వింధ్యపర్వతం మేరుపర్వతంతో మాత్సర్యం వహించి, సాటిలేని ఎత్తుకు ఎదిగి, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు మొదలైనవి వెళ్ళేందుకు వీలులేకుండా ఆకాశమార్గాన్ని కప్పివేసింది.

**క. రవిశశిగతు లుడుగుడు నిది । దివ మిది రాత్రి యని వసుమతీజనులకు న**
**ద్దివిజమునివరుల కెఱుఁగఁగ । నవగాఢం బయ్యెఁ; నంధ మయ్యెఁ జగంబుల్. 25**

**ప్రతిపదార్థం:** రవి శశి గతులు= సూర్యుడియొక్క, చంద్రుడియొక్క గమనాలు; ఉడుగుడున్= ఆగిపోవటంచేత; ఇది, దివము= ఇది పగలు; ఇది, రాత్రి= ఇది రేయి; అని= అని; వసుమతీ జనులకున్= భూమియందలి ప్రజలకు; ఆ+దివిజ

ముని వరులకు= ఆ స్వర్గలోకంలోని దేవతలకు, మునిశ్రేష్ఠులకు; ఎఱుఁగఁగన్= తెలియటానికి; అవగాఢంబు+అయ్యెన్= దట్టమైనది (కష్టమైనది); జగంబుల్= లోకాలు; అంధము+అయ్యెన్= చీకటితో నిండినవి.

**తాత్పర్యం:** సూర్యచంద్రుల గమనాలు ఆగిపోవటంచేత ఇది పగలు, ఇది రాత్రి- అని భూమిమీది ప్రజలు; స్వర్గమందలి దేవతలు, మునివరులు తెలిసికొనలేకపోయారు. ఆ విధంగా దట్టమైన చీకటి లోకాలను అన్నింటినీ కప్పివేసింది.

**వ. ఇట్లు పెరిఁగిన వింధ్యంబునొద్దకు వచ్చి వేల్పు లెల్ల దాని వర్ధనంబు వారింపనోపక యగస్త్యుపాలికిం జని వింధ్యంబుపెక్కువ యెఱింగించి యి ట్లనిరి. 26**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పెరిఁగిన= వృద్ధిచెందిన; వింధ్యంబు+ఒద్దకు= వింధ్యపర్వతం సమీపానికి; వచ్చి= వచ్చి; వేల్పులు+ఎల్ల= దేవతలంతా; దాని వర్ధనంబు= ఆ పర్వతంయొక్క పెరుగుదలను; వారింపన్+ఓపక= ఆపలేక; అగస్త్యుపాలికిన్+ చని= అగస్త్యుడి ఒద్దకు వెళ్ళి; వింధ్యంబు పెక్కువ= వింధ్యపర్వతంయొక్క పెరుగుదల; ఎఱింగించి= తెలిపి; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** ఈ విధంగా పెరిగిన వింధ్యపర్వతందగ్గరకు దేవతలు వచ్చారు కాని, ఆ పర్వతం పెరుగుదలను నివారించలేకపోయారు. ఆ తరువాత దేవతలంతా అగస్త్యుడి వద్దకు వెళ్ళి వింధ్యపర్వతం పెరుగుదలను గురించి చెప్పి ఇట్లా అన్నారు.

**క. 'భువనవ్యవహారమునకు । వ్యవధానం బయ్యె వింధ్యవర్ధనమున; న**
**ద్దివసకర రజనికర గతు । లవిహిత మగునట్లు సేయు మమరమునీంద్రా!' 27**

**ప్రతిపదార్థం:** అమర ముని+ఇంద్రా!= దేవర్షులలో శ్రేష్ఠుడివైన ఓ అగస్త్యుడా!; వింధ్య+వర్ధనమునన్= వింధ్య పర్వతం యొక్క పెరుగుదల వలన; భువన వ్యవహారమునకున్= లోకపు పోకడకు; వ్యవధానంబు+అయ్యెన్= అంతరాయం కలిగింది; ఆ+దివసకర+ రజనికర+గతులు= ఆ సూర్యుడి చంద్రుడి గమనాలు; అవిహతము+అగునట్లు= యథాప్రకారం జరిగేటట్లు; చేయుము= చేయవలసింది.

**తాత్పర్యం:** 'దేవర్షి వైన అగస్త్యా!, వింధ్యపర్వతం పెరిగిపోవటంవలన లోకవ్యవహారం స్తంభించింది. తిరిగి సూర్యచంద్రగతులు యథాప్రకారం జరిగేటట్లు చూడవలసింది.'

**వ. అని దేవతలు ప్రార్థించిన నగస్త్యుండు లోపాముద్రా సహితుండై వింధ్యంబు సమీపంబునకు వచ్చి, దానిచేతం బూజితుం డై యి ట్లనియె. 28**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; దేవతలు= దేవతలు; ప్రార్థించినన్= వేడగా; అగస్త్యుండు= అగస్త్యుడు; లోపాముద్రా సహితుండు+ఐ= లోపాముద్రతో కూడి; వింధ్యంబు సమీపంబునకున్= వింధ్యపర్వతం దగ్గరకు; వచ్చి= వచ్చి; దానిచేతన్= ఆ వింధ్యపర్వతంచేత; పూజితుండు+ఐ= ఆరాధించబడినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని దేవతలు ప్రార్థించగా, అగస్త్యమహర్షి తన భార్య అయిన లోపాముద్రతో కలిసి వింధ్యపర్వతం దగ్గరకు వచ్చి, ఆ పర్వతంచేత ఆరాధించబడినవాడై ఇట్లు పలికాడు.

**క. 'చనియెద దక్షిణదిశ కే; । నొనరఁగఁ దెరు విమ్ము నాకు నుర్వీధర! నీ'**
**వనవుడు 'నట్టుల చేయుదు' । నని పెరుఁగుట యుడిగి వింధ్య మతివినయముతోన్. 29**

**ప్రతిపదార్థం:** ఉర్వీధర= ఓ పర్వతమా!; ఏన్= నేను; దక్షిణ+దిశకు= దక్షిణ దిక్కునకు; చనియెదన్= వెళ్ళుతాను; నాకున్= నాకు; ఒనరంగన్= ఒప్పునట్లుగా; నీవు; తెరువు+ఇమ్ము= మార్గాన్ని (దారిని) ఇమ్ము; అనవుడున్= అనిచెప్పగా; అట్టులు+అ= ఆ విధంగానే; చేయుదున్= చేస్తాను; అని= అని చెప్పి; పెరుఁగుట+ఉడిగి= ఎదగటం మాని; వింధ్యము= వింధ్యపర్వతం; అతి వినయముతోన్= మిక్కిలి వినయంతో.

**తాత్పర్యం:** 'ఓ పర్వతమా! నేను దక్షిణదిక్కుకు వెళుతున్నాను. నీవు నాకు మార్గాన్ని ఇవ్వవలసింది'- అని అగస్త్య మహర్షి అడుగగా వింధ్యపర్వతం పెరగటం మాని, వినయంతో 'అట్లాగే చేస్తాను స్వామీ!'- అని బదులు పలికింది.

**వ. 'భట్టారా! విజయం చేయుం' డని భూమి సమానమై యున్న దాని కగస్త్యుం డిట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** భట్టారా!= పూజ్యుడా!; విజయం చేయుండు+అని= దయ చేయండి, అని పలికి; భూమి సమానము+ఐ+ఉన్నదానికి= భూమియొక్క ఉపరితలంతో సమానంగా క్రిందకు కుంచించుకొని ఉన్న పర్వతంతో; అగస్త్యుండు= అగస్త్య మహాముని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు;

**తాత్పర్యం:** 'పూజ్యుడివైన ఆ అగస్త్యమునీ! మీరు దయ చేయుడు'- అని పలికి, వింధ్యపర్వతం భక్తితో ఒదిగి భూతలానికి సమానంగా దిగువకు కుంచించుకొని నిలిచింది. ఆ పర్వతంతో అగస్త్యుడు ఈ విధంగా పలికాడు.

**విశేషం:** వావిళ్ళ ప్రతిలో 'భట్టారకా!' అనే పాఠాంతరం ఉన్నది.

**క. 'నా మగుడి వచ్చునంతకు । భూమీధర! యీప్రకారమున నుండుము; నా**
**తో మైత్రిఁ జేయు' మని లో । పాముద్రాధీశ్వరుండు వలికి ముదమునన్. 31**

**ప్రతిపదార్థం:** భూమీధర!= ఓ పర్వతమా!; నా, మగుడి, వచ్చునంతకు= నేను తిరిగి వచ్చేవరకు; ఈ, ప్రకారమునన్+ఉండుము= ఈ రీతిగానే ఉండుము; నాతో మైత్రిన్+చేయుము= నాతో స్నేహం చేయవలసింది; అని= అని; ముదమునన్= సంతోషంతో; లోపాముద్రా+అధీశ్వరుండు= లోపాముద్రభర్త; [అగస్త్యుడు] పలికి= చెప్పి.

**తాత్పర్యం:** 'ఓ పర్వతమా! నేను తిరిగి వచ్చేవరకు నీవు ఈవిధంగానే ఉండుము. నాతో స్నేహం చేయుము' అని పలికి, సంతోషంతో లోపాముద్రాహృదయేశ్వరుడైన అగస్త్యుడు.

**వ. దాని నొడంబఱిచి దక్షిణదిశకుం జని లోకంబులకు హితంబుగా నంద యుండె; వింధ్యంబు నగస్త్యుండు మగుడి వచ్చునంతకుఁ బెరుఁగ నోడి యున్న' దని యగస్త్యు మాహాత్మ్యంబు ధర్మజునకుం జెప్పి, వెండియు రోమశుం డిట్లనియె. 32**

**ప్రతిపదార్థం:** దానిన్+ఒడంబఱిచి= ఆ పర్వతాన్ని అంగీకరింపచేసి; దక్షిణ దిశకున్+చని= దక్షిణ దిక్కుకు వెళ్ళి; లోకంబులకు, హితంబుగాన్= విశ్వ శ్రేయస్సుకై; అందు+అ= ఆ దక్షిణ దిక్కునందే; ఉండెన్= ఉండిపోయాడు; వింధ్యంబున్= వింధ్య పర్వతం కూడా; అగస్త్యుండు= అగస్త్యుడు; మగుడి వచ్చునంతకున్= తిరిగి వచ్చేవరకు; పెరుఁగన్+ఓడి+ఉన్నది= ఎదుగుటకు

జంకి ఉన్నది; అని= అని; అగస్త్య మాహాత్మ్యంబు= అగస్త్యుడియొక్క మహిమను; ధర్మజునకున్+చెప్పి= ధర్మరాజుకు చెప్పి; వెండియు= మరల; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** వింధ్యపర్వతాన్ని సమ్మతింపచేసి అగస్త్యుడు దక్షిణదిక్కుకు వెళ్ళి విశ్వకల్యాణంకొరకై అక్కడే ఉండిపోయాడు. ఇక వింధ్యపర్వతం అగస్త్యుడి పునరాగమనాన్ని నిరీక్షిస్తూ పెరగటానికి జంకి అట్లాగే ఉండిపోయింది'- అని ధర్మరాజుకు అగస్త్యుడి మహిమను తెలియచేసి, మరల రోమశుడు ఈ విధంగా వచించాడు.

**ఆ. అమరు లెల్లఁ దన్ను నట్లు కీర్తించుచు । నున్నఁ జూచి మునిగణోత్తముండు**
**వారి నడిగె 'నేమి వచ్చితి? రెఱిఁగింపుఁ' । డని దయాళుఁడై ప్రియంబుతోడ. 33**

**ప్రతిపదార్థం:** అమరులు+ఎల్లన్= దేవతలందరున్నూ; తన్నున్= తనను (అగస్త్యుడిని); అట్లు= ఆ రీతిగా; కీర్తించుచున్+ ఉన్నన్+చూచి= పొగడుచుండటం గమనించి; ముని గణ+ఉత్తముండు= ఋషుల సమూహంలో శ్రేష్ఠుడైన అగస్త్యమహర్షి; దయాళుఁడు+ఐ= దయకలవాడై; వారిన్= వారిని అనగా వేల్పులను; ఏమి+వచ్చితిరి?= ఎందుకొరకు వచ్చారు?; ఎఱిఁగింపుఁడు= తెలియపరచండి; అని= అని; ప్రియంబుతోడన్= ప్రీతితో; అడిగెన్= అడిగాడు.

**తాత్పర్యం:** దేవతలంతా ఆ రీతిగా తనను ప్రశంసిస్తుండగా, అగస్త్యమహాముని దయకలవాడై 'మీ రెందుకు వచ్చారు? తెలియచేయండి'- అని ప్రీతితో వారిని అడిగాడు.

**వ. అనిన. 34**

**తాత్పర్యం:** అట్లా అడుగగా.

**చ. అమరులు గాలకేయకృత మైన జగద్భయ మెల్లఁ జెప్పి 'యు**
**త్తమమునినాథ! తత్ప్రతివిధానము సేసి జగంబుఁ గావఁ జి**
**త్తము గలదేని విభ్రమమదభ్రతరంగ మహార్ణవంబుఁ బా**
**నము దగఁ జేసి చేయుము ఘనంబుగ మాకు మనఃప్రమోదమున్. 35**

**ప్రతిపదార్థం:** అమరులు= దేవతలు; కాలకేయ కృతము+ఐన= కాలకేయులు అనే రాక్షసులచేత చేయ బడిన; జగత్+భయము+ ఎల్లన్= జగత్తుకు ఏర్పడిన వెఱపు సమస్తం; చెప్పి= వచించి; ఉత్తమమునినాథ!= మంచి ఋషులకు అధినేతవైన ఓ అగస్త్యమహర్షీ!; తద్+ప్రతివిధానము+చేసి= దానికి విరుగుడు కల్పించి; జగంబున్= లోకాన్ని; కావన్= కాపాడేందుకు; చిత్తము కలదు+ఏని= మనస్సు కలిగితే; విభ్రమమత్+అభ్ర తరంగ మహా+అర్ణవంబున్= తిరుగుడుపాటు కలవై ఆకసాన్ని అంటే కెరటాలతో కూడిన గొప్ప సముద్రాన్ని; పానము తగన్+చేసి= త్రాగటం తగినవిధంగా చేసి- అంటే బాగా త్రాగి; మాకున్= మా అందరికి; ఘనంబుగన్= ఎక్కువగా; మనస్+ప్రమోదమున్= మనసులకు సంతోషాన్ని; చేయుము= చేయవలసింది.

**తాత్పర్యం:** దేవతలు, కాలకేయులవలన ప్రపంచానికి ఏర్పడిన భయాన్ని గురించి అగస్త్యమహర్షితో చెప్పి, 'మునిశ్రేష్ఠా! ఆ భీతికి విరుగుడు కల్పించి జగత్తును కాపాడతలచినట్లయితే, ఆకాశాన్ని అంటుతూ తిరుగుడు పడే కెరటాలు కల సముద్రాన్ని పానం చేసి, మాకు మిగుల సంతోషాన్ని కలిగించండి.

**క. ఆ తోయధి నీచేతం । బీతం బగుడుం, గడంగి భీమాసుర సం**
**ఘాతంబుఁ దత్క్షణంబ ని । పాతింతుము దివ్యశస్త్రపటుఘాతములన్.' 36**

**ప్రతిపదార్థం:** ఆ తోయధి= ఆ సముద్రం (తోయ+ధి= జలధి= నీటికి స్థావరం); నీచేతన్+పీతంబు+అగుడున్= నీ చేత త్రాగబడిన వెంటనే; కడంగి= పూని; భీమ+అసుర, సంఘాతంబున్= భయంకరమైన రాక్షసుల బృందాన్ని; తద్+క్షణంబు+అ= ఆ క్షణమందే; దివ్య శస్త్ర పటు ఘాతములన్= దేవతామహిమ కల ఆయుధాలయొక్క బలమైన దెబ్బలచేత; నిపాతింతుము= పడగొట్టగలం.

**తాత్పర్యం:** ఆ సముద్రజలం నీచేత పానం చేయబడిన వెన్వెంటనే, ఆ క్షణమందే, మేము ఆ భయంకరులైన రాక్షసుల సముదాయాన్ని దివ్యమహిమ కల ఆయుధాలను ప్రయోగించి పడగొట్టగలం.'

### అగస్త్యుండు సముద్రోదకంబు పానంబు సేయుట (సం. 3-103-1)

**వ. అనిన నగస్త్యుం 'డట్ల చేయుదు' నని యమరవరుల కెల్ల సంతోషంబుగా నప్పుడు. 37**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అగస్త్యుండు= అగస్త్యుడు; అట్లు+అ, చేయుదును+అని= ఆ రీతిగానే చేస్తాను అని; అమరవరులకు+ఎల్ల= దేవతాశ్రేష్ఠులకు అందరకు; సంతోషంబుగాన్= సంతోషం కలిగేటట్లు; అప్పుడు= ఆ సమయాన.

**తాత్పర్యం:** అని దేవతలు ప్రార్థించగా అగస్త్యుడు 'అట్లాగే చేస్తాను' అని దేవతల కందరికీ సంతోషం కలిగేటట్లుగా అప్పుడు.

**సీ. రంగదుత్తుంగ తరంగ హస్తంబుల । నాడెడునది వోలె, నతుల వేగ**
**వాతావధూతమై వఱలెడునది వోలెఁ, । బర్వత కందరోపాంత తతులఁ**
**దొడరెడునదివోలె, ధ్రువఫేనవితతుల । నగియెడునది వోలె, నాగనక్ర**
**మకరకుల క్షుభ్యమాణమై తద్బాధ । కోపనియది వోలె, నుచ్చ భీమ**

**ఆ. నినద మగుచు నున్న నీరధి యొద్దకు । నమరగణముతో మహామునీంద్ర**
**గరుడ ఖచర సిద్ధ గంధర్వ పన్నగ । యక్షగణముతోడ నరుగుదెంచి. 38**

**ప్రతిపదార్థం:** రంగత్+ఉత్తుంగ తరంగ హస్తంబులన్= ప్రకాశిస్తున్న ఎత్తైన కెరటాల చేతులతో; ఆడెడు+అది+పోలెన్= నాట్యం చేసేదానివలె; అతుల వేగ వాత+అవధూతము+ఐ= సాటిలేని వేగంతో వీచే గాలిచేత త్రోసివేయబడింద్తె; వఱలెడు+అది+ పోలెన్= ఒప్పుతున్నదానివలె; పర్వత కందర+ఉపాంతతతులన్= కొండ గుహల సమీపాల్లో; తొడరెడు+అది+పోలె= తొట్రుపాటు పడెటటువంటి; దానివలె; ధ్రువ, ఫేన వితతులన్= ఎడతెగని లేదా స్థిరంగా ఉన్న నురుగుల సముదాయాల వలన; నగియెడు+అది+పోలె= నవ్వే దానివలె; నాగ, నక్ర, మకర, కుల క్షుభ్యమాణము+ఐ= పాములు, జలచరాలు, మొసళ్ళు మొదలైన వాటిచేత కల్లోలపరచబడినదై; తద్+బాధకు= ఆవిధంగా కుదుపటం వలన ఏర్పడిన నొప్పికి; ఓపని+అది+పోలెన్= ఓర్చుకొనలేనిదానివలె; ఉచ్చ భీమ నినదము= హెచ్చుగాను, భయంకరంగాను, ధ్వనిస్తున్న; నీరధియొద్దకున్= సముద్రం దరికి; అమర గణముతో= దేవతల సమూహంతో; మహత్+ముని+ఇంద్ర గరుడ, ఖచర, సిద్ధ గంధర్వ, పన్నగ, యక్షగణము తోడన్= గొప్ప మహర్షులు, గరుడులు, ఆకాశసంచారులు, సిద్ధులు, గంధర్వులు, ఉరగులు, యక్షుల సమూహాలతో; అరుగుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** ప్రకాశించే ఎత్తైన కెరటాల చేతులతో నాట్యంచేసేదానివలె, మిక్కిలి వేగమైన ఝుంఝూమారుతంచేత తోయబడిన దానివలె, పర్వత గుహల మధ్య ఉరికే దానివలె, స్థిరంగాఉన్న నురుగుల సముదాయంతో నవ్వుతున్న దానివలె, పాములు, జలచరాలు, మొసళ్ళు మొదలైన వాటిచేత కదిపి కుదపబడుతున్నదై, ఆ బాధకు తాళలేనిదానివలె హెచ్చుగా భయంకరంగా ధ్వనిచేస్తున్న సముద్రం దగ్గరికి అగస్త్య మహర్షి గరుడులు, ఆకాశచారులు, సిద్ధులు, ఉరగులు, గంధర్వులు, యక్షులు మొదలైన దేవతాజాతులతో కలిసి వచ్చాడు.

**విశేషం:** అలం: రూపకానుప్రాణితమైన ఉపమ. కెరటాలు= ఉపమేయం, హస్తాలు= ఉపమానం. నురుగు తెలుపు. నవ్వు తెలుపు. నాగనక్ర మకరకులక్షుభ్యమాణము - ఆ బాధను ఓర్చుకొనలేనట్లున్నది అనటంవలన కాని దానిని కారణంగా వర్ణించటమైంది. ఇక్కడ హేతూత్ప్రేక్ష అలంకారం.

**ఉ. అందఱుఁ జూచుచుండఁగ మహాబ్ధిజలంబులఁ ద్రావె విష్టపా**
**నందకరుం డగస్త్యుఁ డఘనాశనుఁ; డట్లు పయోధి రిక్త మై**
**నం దిమి కూర్మ కర్కటక నక్ర భుజంగచయంబుతో భయం**
**బందుచుఁ గాలకేయులు బయల్పడి తోఁచిరి దానిలోపలన్. 39**

**ప్రతిపదార్థం:** విష్టప+ఆనందకరుండు= లోకాలకు ఆనందం కలుగ చేసేవాడు; అఘ నాశనుఁడు= పాపాలను పోగొట్టేవాడు; అగస్త్యుఁడు; అందఱున్= దేవతలందరున్నూ; చూచుచు+ఉండఁగన్= చూస్తుండగా; మహా+అబ్ధి జలంబులన్= గొప్ప సముద్రంలోని నీళ్లను (అప్+ధి= జలధి); త్రావెన్= త్రాగాడు; అట్లు= ఆ రీతిగా; పయోధి= పయస్+ధి= జలధి (సముద్రం); రిక్తము+ఐనన్= వట్టిపోగా; తిమి, కూర్మ, కర్కటక, నక్ర, భుజంగ, చయంబుతోత్= పెద్ద పెద్ద చేపలు, తాబేళ్లు, ఎండ్రకాయలు; మొసళ్ళు, పాములు మొదలైన వాటితో పాటు; కాలకేయులు= కాలకేయులు అనే ఆ రాక్షసులు; భయంబు+అందుచున్= భయపడుతూ; దాని లోపలన్= ఆ సముద్రంలోపల; బయల్పడి= బయటపడి; తోఁచిరి= కన్పించారు.

**తాత్పర్యం:** జగత్తులకు సంతోషాన్ని కలిగించేవాడున్నూ, పాపాలను నాశనం చేసేవాడున్నూ అయిన అగస్త్యమహర్షి అక్కడ చేరిన దేవతలంతా చూస్తుండగానే ఆ మహాసముద్రజలాలను త్రాగాడు. అంతట తిమింగలాలు, ఎండ్రకాయలు, మొసళ్ళు, తాబేళ్లు, పాములు మొదలైన వాటితోపాటు కాలకేయులు అనబడే రాక్షసులు భయపడుతూ బయటపడి కన్పించారు.

**విశేషం:** రిక్తమైనన్+తిమి= రిక్తమైనందిమి. ఇది ద్రుత సంధి. నన్నయభట్టు దీనిని ఈ పద్యంలో ప్రాస ఘటితంగా ప్రయోగించాడు.

**వ. అంత. 40**

**తాత్పర్యం:** అటు పిమ్మట.

**క. గీర్వాణప్రభుఁ డాదిగ । గీర్వాణగణంబు గాలకేయులతోడన్**
**గర్వించి రణము సేసి ర । ఖర్వపరాక్రములు గడిమిఁ గడు నుద్ధతులై. 41**

**ప్రతిపదార్థం:** గీర్వాణ, ప్రభుఁడు+ఆదిగన్= దేవేంద్రుడు మొదలైన; గీర్వాణ గణంబు= వేల్పుల సమూహం; కాలకేయుల తోడన్= కాలకేయులు అనబడే రక్కసులతో; అఖర్వ, పరాక్రములు= మొక్కవోని శౌర్యం కలవారు; కడిమిన్= ఆధిక్యంతో; కడు+ఉద్ధతులు+ఐ= మిక్కిలి విజృంభించినవారై; గర్వించి= గర్వం కలిగి; రణము+చేసిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు మొదలైన దేవతలు కాలకేయులతో మొక్కవోని పరాక్రమంతో విజృంభించి గర్వంతో యుద్ధాన్ని చేశారు.

**క. అనిమిషదివ్యాయుధహతి । ననిఁ గొందఱు పడిరి, గొంద ఱధికవిభీతిం**
**జని పాతాళముఁ జొచ్చిరి । దనుజులు దైత్యులును వీర్యదర్పచ్యుతులై. 42**

**ప్రతిపదార్థం:** దనుజులు, దైత్యులును= వివిధ రాక్షసులు; కొందఱు= కొంతమంది; అనిమిష దివ్య+ఆయుధ హతిన్= దేవతలయొక్క దివ్యమైన శస్త్రాల, అస్త్రాల తాకిడిచేత; అనిన్= యుద్ధంలో; పడిరి= కూలిపోయారు; కొందఱు= కొంతమంది; అధిక+విభీతిన్= మిక్కిలి భయంతో; వీర్య దర్ప చ్యుతులు+ఐ= బలాన్ని, అహంకారాన్ని వీడినవారై; పాతాళమున్= పాతాళలోకంలో; చొచ్చిరి= ప్రవేశించారు.

**తాత్పర్యం:** దేవతల అస్త్ర శస్త్రాల తాకిడికి కొందరు రాక్షసులు యుద్ధంలో కూలారు. కొందరు భయభ్రాంతులై పాతాళానికి పారిపోయారు.

**వ. ఇట్లు కాలకేయులందొట్టి యసురుల నెల్ల నిశ్శేషంబుఁజేసి జగంబుల యుపద్రవం బుడిపిన, దేవత లగస్త్యునిం గీర్తించి యిట్లనిరి. 43**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కాలకేయులన్+తొట్టి= కాలకేయులతో మొదలు పెట్టి; అసురులన్+ఎల్ల= రాక్షసులను అందరినీ; నిశ్శేషంబున్+చేసి= శేషం లేకుండగా చేసి, అనగా నిర్మూలించి; జగంబుల= లోకాల యొక్క; ఉపద్రవంబు+ఉడిపినన్= కీడును మాపగా; దేవతలు= దేవతలు; అగస్త్యునిన్= అగస్త్యుడిని; కీర్తించి= పొగడి; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** ఈ విధంగా కాలకేయులతో మొదలుపెట్టి రాక్షసులందరినీ చంపి, లోకాలకు కలిగిన కీడును పోగొట్టగా దేవతలు అగస్త్యుడిని ప్రశంసించి, ఇట్లా అన్నారు.

**క. 'మునినాథ! నీ యనుగ్రహ । మున నుడిగెను బాధ నిఖిలభువనంబుల కి**
**వ్వనధిఁ బయఃపూర్ణముఁగా । నొనరింపుము; నీవ కాని యొరు లోప రిలన్. 44**

**ప్రతిపదార్థం:** మునినాథ!= ఋషులకు అధినేతవైనవాడా!; నీ+అనుగ్రహమునన్= నీ దయచేత; నిఖిల భువనంబులకు= సమస్త లోకాలకు; బాధ= పరితాపం; ఉడిగెను= తొలగింది; ఈ+వనధిన్= ఈ సముద్రాన్ని; పయస్+పూర్ణమున్+కాన్= నీటితో నిండినట్టిదిగా; ఒనరింపుము= చేయవలసింది; నీవు+అ కాని= నీవేతప్ప; ఇలన్= భూమిపై; ఒరులు= ఇతరులు; ఓపరు= ఈ పనిని చేయలేరు;

**తాత్పర్యం:** 'ఋషులకు అధినేతవైన అగస్త్యుడా! నీ దయచేత సమస్తలోకాలకు బాధ తొలగిపోయింది. ఇక ఈ సముద్రాన్ని తిరిగి నీటితో నింపవలసింది. ఈ పనిని పృథివిలో నీవు తప్ప మరి ఎవ్వరూ చేయలేరు.

**వ. ఇది యనేక సత్త్వాశ్రయంబు గావున రిక్తంబై యుండఁ దగ' దనిన నగస్త్యుం డిట్లనియె. 45**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ సముద్రం; అనేక+సత్త్వ+ఆశ్రయంబు= పెక్కు జంతువులకు నెలవైనది; కావున= కాబట్టి; రిక్తంబు+ఐ= శూన్యమైనదై; ఉండన్+తగదు= ఉండరాదు; అనినన్= అని చెప్పగా; అగస్త్యుండు= అగస్త్యుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ సముద్రం అనేక జీవరాసులకు నిలయం కాబట్టి నీరు లేకుండా శూన్యంగా ఉండరాదు'- అని దేవతలు అర్థించగా, వారితో అగస్త్యుడు ఈ విధంగా బదులు పలికాడు.

**సీ. 'మున్న జీర్ణం బయ్యె మున్నీటి నీరు నా । కడుపున; నే నింకఁ బడయనేర**
**జలరాశి నిండంగ జల మొండు' నావుడు । నమరులు మునులును గమలగర్భుఁ**
**గానంగఁ జని 'దేవ! మీనాకరం బేమి । తెఱఁగున నిండు? మా కెఱుఁగఁ జెపుమ!'**
**యని విన్నపంబు సేసినఁ, బెద్దప్రొద్దు చిం । తించి వారలకు విరించి యనియె**

**ఆ. 'వనధిఁ బెద్దకాలమున భగీరథుఁ డను । వాఁడు నించుఁ గాని వసుధ నొరులు**
**పూని దీని నింపఁగా నోప' రనవుడు । నమరవరులు మునులు నరిగి రనిన. 46**

**ప్రతిపదార్థం:** మున్ను+అ= మునుపే; నా కడుపునన్= నా పొట్టలో; మున్నీటి నీరు= సముద్రజలం; జీర్ణంబు+అయ్యె= అరిగిపోయింది; జలరాశి, నిండంగన్, జలము+ఒండు= సముద్రాన్ని నింపేందుకు వేరు నీరు; ఏను+ఇంకన్+పడయనేరన్= నేనింక పొందలేను; నావుడు= అని చెప్పగా; అమరులు= దేవతలు; మునులును= ఋషులు; కమలగర్భున్= బ్రహ్మదేవుడిని; కానంగన్+చని= చూచేందుకై వెళ్లి; దేవ!= భగవంతుడా!; మీన+ఆకరంబు= చేపలకు ఉనికి పట్టయినది- సముద్రం; ఏ+ తెఱఁ గున= ఏ రీతిగా; నిండు?= నీటితో పూర్ణమౌతుంది?; మాకు+ఎఱుఁగన్+చెపుము+అ= మాకు తెలియ చేయుమా; అని= అని; విన్నపంబు+చేసినన్= ప్రార్థించగా; పెద్ద+ప్రొద్దు= చాలసేపు; చింతించి= యోచించి; విరించి= బ్రహ్మదేవుడు; వారలకున్= వారికి- అనగా ఆ దేవతలకు; అనియె= చెప్పాడు; వనధిన్= సముద్రాన్ని; పెద్ద+కాలమునన్= చాలాకాలం పిదప; భగీరథుఁడు+అనువాఁడు= భగీరథుడు అనే పేరు కలవాడు; నించున్= నింపుతాడు; కాని= కాని; వసుధన్= భూమియందు; ఒరులు= ఇతరులు; పూని= కడగి; దీనిన్= ఈ సముద్రాన్ని; నింపఁగాన్+ఓపరు= నింపలేరు; అనవుడున్= అని చెప్పగా; అమర+వరులు= దేవతల నాయకులు; మునులు= ఋషులు; అరిగిరి= వెళ్ళారు; అనినన్= అని చెప్పగా.

**తాత్పర్యం:** 'నా పొట్టలో సముద్రజలం మునుపే అరిగిపోయింది. తిరిగి సముద్రాన్ని నింపేంత నీరు నేను పొందలేను' అని అగస్త్యమహర్షి చెప్పాడు. అంత దేవతలు, మునులు బ్రహ్మదేవుడి దగ్గరకు వెళ్ళి 'దేవా! సముద్రాన్ని నీటితో నింపే మార్గ మేమిటో మాకు తెలియజేయ ప్రార్థన' అని వేడుకోగా, అతడు చాలాసేపు ఆలోచించి, 'చాలాకాలం గడిచిన పిమ్మట భగీరథు డనేవాడు సముద్రాన్ని నీటితో నింపగలడు. ఇతరులు మరి ఎవ్వరూ ఆ పనిని చేయలేరు' అని చెప్పాడు. అంత దేవతలు, మునులు, బ్రహ్మదేవుడిని వీడ్కొని వెళ్లిపోయారు- అని చెప్పగా.

**క. 'వనరాశి యేమి కారణ । మున నెట్లు భగీరథుండు భూరిజలౌఘం**
**బున నించె? దీనిఁ జెప్పుమ' । యని యడిగిన ధర్మజునకు నమ్ముని సెప్పెన్. 47**

**ప్రతిపదార్థం:** వనరాశి= సముద్రం; ఏమి, కారణమునన్= ఏ కారణాన; ఎట్లు= ఏ విధంగా; భగీరథుండు= భగీరథుడు; భూరి జల+ఓఘంబునన్= విస్తారమైన నీటి సమూహంచేత; నించెన్= నింపాడు; దీనిన్+చెప్పుము+అ= దీనిని గురించి చెప్పవలసింది; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; ధర్మజునకున్= ధర్మరాజుకు; ఆ+ముని= ఆ ముని; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'సముద్రాన్ని ఏ కారణాన, ఏ విధంగా భగీరథుడు పెనునీటివెల్లువచే నింపగలిగాడు? ఈ విషయాన్ని విస్తరించి చెప్పవలసింది'- అని అడుగగా ధర్మరాజుకు ఆ మునివరేణ్యుడైన రోమశుడు ఇట్లా చెప్పాడు.

### భగీరథుండు జలముచే సముద్రము నించుట (సం. 3-104-6)

**వ.** **తొల్లి యిక్ష్వాకు వంశంబున సగరుం డనురాజు హైహయుల నిర్జించి నిఖిల మహీరాజ్యంబు సేయుచు నపుత్త్రకుండై వైదర్భియు శైబ్యయు నను నిద్దఱు భార్యలతోడం గైలాసంబున కరిగి, యందు.** **48**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వకాలంలో; ఇక్ష్వాకు వంశంబునన్= ఇక్ష్వాకు రాజుల వంశంలో; సగరుండు+అను రాజు= సగరుడు అనే ప్రభువు; హైహయులన్= హైహయులు అనే రాజులను; నిర్జించి= జయించి; నిఖిల మహీ రాజ్యంబు+చేయుచున్= సమస్తమైన భూమిని ఏలుకొంటూ; అపుత్రకుండు+ఐ= కొడుకులు లేనివాడై; వైదర్భియు, శైబ్యయున్= వైదర్భి మరియు శైబ్య; అను+ఇద్దరు భార్యల తోడన్= అనే ఇద్దరు భార్యలతో; కైలాసంబునకు+అరిగి= కైలాసానికి వెళ్లి; అందు= అక్కడ.

**తాత్పర్యం:** పూర్వకాలంలో ఇక్ష్వాకురాజుల వంశంలోనివాడైన సగరుడనే రాజు హైహయులను జయించి సమస్త భూమండలాన్ని పరిపాలిస్తూ ఉండేవాడు. అతడికి కొడుకులు లేరు. అందుచేత సగరుడు తన భార్యలైన వైదర్భితో, శైబ్యతో కైలాసానికి వెళ్లి అక్కడ.

**విశేషం:** ప్రథమపత్ని విదర్భరాజపుత్రిక- అమె పేరు 'కేశిని' అనీ; ద్వితీయపత్ని అరిష్టనేమి పుత్రిక- ఆమె పేరు 'సుమతి' అనీ రామాయణం బాలకాండలో వస్తుంది.

**క.** **దక్షమఖక్షయకరు నిట । లాక్షజహుత భక్ష్యభక్షితానంగు విరూ**
**పాక్షు మహోక్షధ్వజుఁ బ్ర । త్యక్షము గావించె నుగ్రతపమున పేర్మిన్.** **49**

**ప్రతిపదార్థం:** దక్ష, మఖ, క్షయ, కరున్= దక్షుడియొక్క యజ్ఞాన్ని విధ్వంసం చేసిన వాడిని; నిటల+అక్ష, జ, హుత, భక్ష్య, భక్షిత+అనంగున్= నుదుటి కంటిమంటలో వేల్చబడ్డ వంటకంగా భక్షించబడిన అనంగుడు కలవాడిని (నుదుటికంటిమంటచేత మన్మథుడిని దగ్ధం చేసిన శివుడిని- అని భావం); విరూప+అక్షున్= ముక్కంటిని; మహా+ఉక్ష, ధ్వజున్= గొప్ప వృషభాన్ని పతాకచిహ్నంగా కల శివుడిని; ఉగ్రతపమున పేర్మిన్= ఘోరమైన తపస్సుయొక్క ఆధిక్యంచేత; ప్రత్యక్షము+కావించెన్= సాక్షాత్కరించేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** సగరుడు మిక్కిలి నిష్ఠతో తపస్సుచేసి దక్షుడి యజ్ఞాన్ని ధ్వంసం చేసినవాడున్నూ, మన్మథుడిని తన మూడవకంటిమంటచేత దహించినవాడున్నూ, మూడుకన్నులు కలవాడున్నూ, మహా వృషభాన్ని ధ్వజచిహ్నంగా కలవాడున్నూ అయిన పరమశివుడిని ప్రసన్నుడిని కావించి సాక్షాత్కరింపచేసికొన్నాడు.

**తే.** **హరుఁడు వానికిఁ బ్రత్యక్షమయి వరంబు । వేఁడు మనవుడుఁ 'ద్రైలోక్యవిభుఁడ! నాకు**
**దయ యొనర్పుము సంతానదాన' మనుచు । వేఁడెఁ బుత్త్రార్థియై కడువేడ్కతోడ.** **50**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు; వానికిన్= అతడికి (సగరుడికి); ప్రత్యక్షము+అయి= సాక్షాత్కరించి; వరంబు= వరాన్ని; వేఁడుము+అనవుడున్= కోరుకొనుము అని చెప్పగా; త్రైలోక్య విభుఁడ!= మూడు లోకాలకు అధిపతివైనవాడా!; నాకు; దయన్= దయతో; సంతానదానము+ఒనర్పుము= సంతతిని అనుగ్రహించుము; అనుచున్= అంటూ; పుత్త్ర+అర్థి+ఐ= కొడుకులను కోరుకొంటున్నవాడై; కడు= మిక్కిలి; వేడ్కతోడన్= కుతూహలంతో; వేఁడెన్= అర్థించాడు.

**తాత్పర్యం:** పరమశివుడు సగరుడికి సాక్షాత్కరించి వరాన్ని కోరుకొనుమని అడిగాడు. సగరుడు 'మూడులోకాలకు అధిపతి వైనవాడా! దయతో నాకు సంతానదానాన్ని అనుగ్రహించు'- అని పుత్రార్థియై శివుడిని వేడుకొన్నాడు.

**విశేషం:** 'పుత్త్ర' శబ్దాన్ని ద్విత్వతకారంతో వ్రాయడం నన్నయకాలంలో ఉండేది. నేడు 'పుత్రుడు' అని వ్రాస్తున్నాం. (దీనిని భాషాశాస్త్రవేత్తలు 'ధ్వనిపరిణామం' అంటారు.)

**వ. ఈశ్వరుండు వానికి వైదర్భియం దఱువదివేవురు గొడుకులును, శైబ్యయం దొక్క కొడుకుంగా వరం బిచ్చి, యయ్యఱువదివేవురు నతిదర్పితులై యేకకాలంబునఁ గాలగోచరు లగుదు రనియు, నయ్యొక్క కొడుకు వంశకర్త యగుననియుం జెప్పి యదృశ్యుం డైన. 51**

**ప్రతిపదార్థం:** ఈశ్వరుండు= శివుడు; వానికిన్= అతడికి, ఆ సగరుడికి; వైదర్భి+అందు= విదర్భరాజు పుత్రికఅయిన రాణియందు; అరువది వేవురు= అరవయి వేలమంది కొడుకులును; శైబ్య+అందు= శైబ్య అనే రాణియందు; ఒక్క, కొడుకున్+కాన్= ఒక పుత్రుడు కలిగేటట్లు; వరంబు+ఇచ్చి= వరాన్ని ఇచ్చి; ఆ+అఱువది వేవురున్= ఆ అరవై వేలమంది కొడుకులు; అతి దర్పితులు+ఐ= మిక్కిలి గర్వించిన వారై; ఏక కాలంబునన్= ఒకే సమయాన; కాల గోచరులు+అగుదురు+ అనియున్= మరణిస్తారు అనిన్నీ; ఆ+ఒక్క కొడుకు= ఆ ఒక పుత్రుడు; వంశ కర్త= వంశాన్ని పెంపొందించేవాడు; అగున్+అనియున్= కాగలడనిన్నీ; చెప్పి= చెప్పి; అదృశ్యుండు+ఐనన్= కనిపించనివాడు కాగా- అంటే మాయమై పోగా.

**తాత్పర్యం:** ఈశ్వరుడు సగరుడికి వైదర్భియందు అరవై వేలమంది కొడుకులున్నూ, శైబ్యయందు ఒకకొడుకున్నూ కలిగేటట్లు వరమిచ్చాడు. ఆ అరవైవేలమంది కుమారులు మిగుల గర్వించి ఒకే సమయంలో మరణిస్తా రనిన్నీ, మిగిలిన ఆ ఒక్క పుత్రుడు వంశోద్ధారకుడు కాగలడనిన్నీ పరమశివుడు వచించి అంతర్ధానం చెందాడు.

**క. కొడుకులఁ బలువురఁ బడసియుఁ । బడయనియట్టి దయి ధర్మపత్నులుఁ దానుం**
**గడు సంతసపడ కరిగెను । దడయక సగరుండు మగుడి తన పురమునకున్. 52**

**ప్రతిపదార్థం:** కొడుకులన్= పుత్రులను; పలువురన్= పెక్కుమందిని; పడసియున్= పొందికూడా; పడయని+అట్టిది+అయి= పొందని రీతిగానే అయి; సగరుండు= సగరుడు; ధర్మపత్నులున్= సహధర్మ చారిణులైన భార్యలూ; తానున్= తానున్నూ; కడు= మిక్కిలి; సంతసపడక= సంతోషించక; తడయక= ఆలస్యం చేయక; మగుడి= తిరిగి; తన+పురమునకున్= తన పట్టణానికి; అరిగెను= వెళ్ళాడు.

**తాత్పర్యం:** సగరుడు పెక్కుమంది కొడుకులను (పరమేశ్వరుడి వరంవల్ల) పొందినా, పొందనివాడివలె తాను, తన ధర్మపత్నులు సంతోషపడక వెంటనే. తన పురానికి మరలిపోయాడు.

**వ. అంతఁ గొంతకాలంబునకు నయ్యిద్దరు గర్భిణులైన నందు వైదర్భికి నొక్కి యలాబూ ఫలంబును, శైబ్యకు నసమంజసుండను కొడుకునుం బుట్టిన. 53**

**ప్రతిపదార్థం:** అంతన్= అటు పిమ్మట; కొంత కాలంబునకున్= కొంత సమయం గడిచిన పిమ్మట; ఆ+ఇద్దరు= ఆ ఇరువురు అనగా వైదర్భియు, శైబ్యయు; గర్భిణులు+ఐనన్= కడుపుతో ఉండగా; అందు= వారిలో; వైదర్భికిన్= విదర్భ రాజతనయకు; ఒక్క= ఒక; అలాబూ ఫలంబును= సొరకాయయున్నూ; శైబ్యకున్= శైబ్య అనే రాణికి; అసమంజసుండు+అను= అసమంజసుడు అనే పేరు కల; కొడుకునున్= పుత్రుడున్నూ; పుట్టినన్= కలిగిన.

**తాత్పర్యం:** అటు పిమ్మట కొంతకాలం గడిచిన తర్వాత ఆ ఇద్దరు రాణులు గర్భాలు ధరించారు. వైదర్భికి ఒక సొరకాయ, శైబ్యకు అసమంజసుడు అనే ఒక కొడుకు ఉద్భవించగా.

**ఆ. 'వరదుఁడైన యీశువరమున నిది యొక్క। వదరు పుట్టె; నెట్టివరమొ!' యనుచు**
**దానిఁ బాఱవైవఁ దా రున్న నాకాశ। వాణి యిట్టు లనియె వసుమతీశ! 54**

**ప్రతిపదార్థం:** వరదుఁడు+ఐన= వరాలను ఇచ్చేటటువంటి వాడైన; ఈశు+వరమునన్= ఈశ్వరుడియొక్క వరంవలన; ఇది= ఇది; ఒక్క= ఒక; వదరు= సొరకాయ; పుట్టెన్= పుట్టింది; ఎట్టి వరమొ+అనుచు= ఎటువంటి వరమో అంటూ; దానిన్= ఆ సొరకాయను; పాఱవైవన్= పారవేసేందుకు; తారు+ఉన్నన్= తాము ఆలోచిస్తుండగా; ఆకాశవాణి= ఆకాశంనుండి వినిపించే పలుకు; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా తెలిపింది; వసుమతీ+ఈశ!= ఓ ధరణీపతీ (ఓ రాజా)! (ఈ సంబోధన తరువాతిపద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** 'శివుడు కోరిన కోరికలు ఈడేర్చునటువంటి వరదుడు. కాని, అట్టి పరమేశ్వరుడు ఇచ్చిన వరాన ఇదేమి చిత్రమో!; ఒక సొరకాయ పుట్టింది'- అని అనుకొంటూ వారు దానిని అవతల పారవేసేందుకు ఉద్యుక్తులు కాగా, ఆకాశవాణి వారితో ఇట్లా పలికింది.

**తే. సాహసం బిట్టు సేయంగఁ జనునె? దీని। బీజములు ఘృతఘటములఁ బెట్టి రక్ష**
**సేయు; మఱువదివేవు రూర్జితులు సుతు లు। మేశు వరమునఁ బుట్టుదు రిందు నీకు.' 55**

**ప్రతిపదార్థం:** సాహసంబు+ఇట్టు= సాహసం ఈవిధంగా; చేయంగన్+చనునె= చేయటం తగునా?; దీని బీజములు= ఈ (సొరకాయ) విత్తనాలు; ఘృత ఘటములన్+పెట్టి= నేతికుండలలో ఉంచి; రక్ష+చేయుము= రక్షించవలసింది (కాపాడుము); అఱువది వేవురు= అరవై వేలమంది; ఊర్జితులు= దృఢకాయులు, బలవంతులు; సుతులు= కొడుకులు; ఉమా+ఈశు, వరమునన్= పార్వతీపతి అయిన శివుడివరంవలన; ఇందు= ఈ సొరకాయనుండి, నీకు పుట్టెదరు= నీకు ఉద్భవిస్తారు.

**తాత్పర్యం:** ఓ మహారాజా! తొందరపడి ఈ సొరకాయను అవతల పారవేసే తెగువకు పూనుకోవద్దు. దీని విత్తనాలను నేతి కుండలలో పెట్టి కాపాడుము. దీనినుండి అరవైవేలమంది బలవంతులైన కుమారులు పార్వతీపతి అనుగ్రహంవలన నీకు జన్మిస్తారు.

**వ. అనినం దద్వచనానురూపంబు సేసి రక్షించుచున్న రెన్నెలలకు. 56**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; తద్+వచన+అనురూపంబు+చేసి= ఆ (ఆకాశవాణి) చెప్పిన మాటల ప్రకారంగానే; రక్షించుచు+ఉన్నన్= కాపాడుతుండగా; రెన్నెలలకు= రెండునెలలకు.

**తాత్పర్యం:** అని ఆకాశవాణి చెప్పగా, అట్లే చేసిన రెండునెలల తరువాత.

**క. సుతషష్టి సహస్రక ము । ద్గతమై వర్ధిల్లి గగనగతిఁ బఱచి శత**
**క్రతులోకముఁ దొట్టి మదో । ద్ధతిఁ జేసె సమస్తలోకతతులకు బాధల్. 57**

**ప్రతిపదార్థం:** సుత, షష్టి, సహస్రకము= అరవై వేలమంది కొడుకుల సమూహం; ఉద్గతము+ఐ= పుట్టి; వర్ధిల్లి= పెంపొంది; గగనగతిన్+పఱచి= ఆకాశ మార్గంలో విహరించి; శతక్రతు లోకమున్+తొట్టి= (నూరు యజ్ఞాలు చేసిన) దేవేంద్రుడిలోకం మొదలుకొని; సమస్త లోకతతులకున్= అన్ని భువనాలకు; బాధల్= కష్టాలు; మద+ఉద్ధతిన్+చేసెన్= గర్వాతిరేకంచేత కలిగించింది.

**తాత్పర్యం:** అరవై వేలమంది కొడుకులు పుట్టి పెరిగారు. వారు ఆకాశంలో విహరిస్తూ దేవేంద్రుడిలోకంతో పాటు అన్నిలోకాలకు గర్వంతో పెక్కు బాధలు కలిగించ సాగారు.

**క. సగరసుతు లట్లు జగముల । కొగి బాధలు సేయుచున్న నోడి మరుత్ప**
**న్నగవరు లరిగిరి నాలుగు । మొగములు గల వేల్పుకడకు మునిసంఘముతోన్. 58**

**ప్రతిపదార్థం:** సగరసుతులు= సగరుడికొడుకులు; అట్లు= ఆవిధంగా; జగములకు= లోకాలకు; ఒగి=వరుసగా; బాధలు+ చేయుచున్నన్= కష్టాలు పెడుతుండగా; ఓడి= భీతినొంది; మరుత్+పన్నగవరులు= దేవతలలో, పన్నగులలో శ్రేష్ఠులు; నాలుగు, మొగములు+కల, వేల్పు కడకున్= బ్రహ్మదేవుడి దగ్గరకు; ముని+సంఘముతోన్= ఋషుల సముదాయంతోపాటు; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** సగరుడి కుమారులు ఆ విధంగా సమస్తలోకాలకు కీడు కల్పించటంచేత, దేవతలలో, పన్నగులలో శ్రేష్ఠులైన నాయకులు ఋషీశ్వరులతోపాటు బ్రహ్మదేవుడివద్దకు వెళ్ళారు.

**ఆ. వారిజాసనుండు వారల వచ్చిన । విధ మెఱింగి 'మీకు వెఱవ నేల?**
**సగరసుతులు దగ్ధు లగుదురు; దర్పితు । లైనవారి పేర్మి యధ్రువంబు.' 59**

**ప్రతిపదార్థం:** వారిజ+ఆసనుండు= పద్మం ఆసనంగా కలవాడైన బ్రహ్మదేవుడు; వారల వచ్చిన విధము= వారి రాకకు గల కారణం; ఎఱింగి= తెలిసికొని; మీకు వెఱవన్+ఏల= మీరు భయపడటం ఎందుకు?; సగర సుతులు= సగరుడి పుత్రులు; దగ్ధులు= తగులబడునట్టివారు; అగుదురు= అవుతారు; దర్పితులు+ఐన= వారి పేర్మి= గర్వం చెందినవారి గొప్పతనం; న+ధ్రువంబు= ధ్రువమైనది కాదు (అశాశ్వతమైనది).

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడు వారి రాకకు గల కారణం తెలిసికొని 'మీరు భయపడే అవసరం లేదు. సగరుడి కొడుకులు తగులబడి పోగలరు. గర్వం చెందినవారి ఆధిక్యం ఎంతో కాలం నిలవదు'.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ. అని కమలసంభవుం డానతిచ్చిన నరిగి యమరవరు లాదిగా నఖిలలోకనివాసు లెల్ల సగరుసుత పరిక్షయం బపేక్షించి యుండునంత. 60**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; కమలసంభవుండు= పద్మమందు పుట్టిన బ్రహ్మదేవుడు; ఆనతి+ఇచ్చినన్= ఆధికారికంగా చెప్పగా; అరిగి= వెళ్ళి; అమర వరులు+ఆదిగాన్= దేవతల నాయకులు మొదలైనవారితోపాటు; అఖిల లోక నివాసులు+ఎల్ల=

అన్ని భువనాలలో నివసించేవారు అందరూ; సగర సుత పరిక్షయంబు= సగరుడియొక్క కొడుకుల వినాశనం; అపేక్షించి= కోరి; ఉండునంతన్= ఉండగా.

**తాత్పర్యం:** అని బ్రహ్మదేవుడు దయతో వచించాడు. అంత దేవతల నాయకులు, వివిధలోకవాసులు మరలిపోయారు. వాళ్ళందరు తమలో తాము సగరుడి కొడుకుల వినాశనం కోరుకొంటూ ఉన్నారు.

**సీ. అశ్వమేధంబు సేయంగ దీక్షితుఁ డయ్యె । సగరుండు; వాని యశ్వంబు సగర**
**తనయులచే రక్షితంబై వసుంధర । యెల్లఁ గ్రుమ్మరి తోయహీన మైన**
**జలధిలోపల నదృశ్యం బైనఁ గానక । సగరున కెఱిఁగించి, సగరసుతులు**
**జనకు శాసనమునఁ జని భూతలమునందుఁ । దడయక రోసి పాతాళతలము**

**ఆ. నందు రోయఁ గడఁగి యఱువదివేవురు । నొక్క మొగిన గ్రొచ్చి రుదధిలోన**
**జలధిపంకమగ్న సత్త్వముల్ నిశితకు । ద్దాలహతి విదారితములు గాఁగ. 61**

**ప్రతిపదార్థం:** అశ్వమేధంబు+చేయంగన్= అశ్వమేధ యాగాన్ని చేసేందుకై; సగరుండు= సగరుడు; దీక్షితుఁడు+అయ్యెన్= నిష్ఠపూనిన వాడైనాడు; వాని+అశ్వంబు= ఆ సగరుడి గుర్రం - యాగాశ్వం; సగర, తనయులచేన్= సగరుడి కుమారులచేత; రక్షితంబు+ఐ= కాపాడబడినదై; వసుంధర+ఎల్లన్= భూమి అంతటినీ; క్రుమ్మరి= తిరిగి, తిరిగి; తోయ హీనము+ఐన= నీరు లేనటువంటిదైన; జలధి లోపలన్= సముద్రంలో; అదృశ్యంబు+ఐనన్= కనిపించకుండ పోవటంచేత; కానక= చూడక; సగరునకు+ఎఱిఁగించి= సగరుడికి తెలిపి; సగర సుతులు= సగరుడి కొడుకులు; జనకు శాసనమునన్= తండ్రియొక్క ఆజ్ఞవలన; తడయక= ఆలస్యం చేయక; చని= వెళ్ళి; భూతలమునందున్= భూమి పై భాగమందు; రోసి= వెదకి; పాతాళ తలము నందున్= పాతాళ లోకంలో (భూమికి అడుగు భాగాన పాతాళం కలదని ప్రాచీనమతం); రోయన్+కడఁగి= వెదికేందుకు పూనుకొని; అఱువది వేవురున్= అర్వై వేలమంది; ఒక్క మొగిన= ఒకేసారి; ఉదధిలోనన్= సముద్రంలో; జలధి, పంక మగ్న సత్త్వముల్= సముద్రమందలి బురదలో నిమగ్నమైన జంతువులు; నిశిత కుద్దాల హతిన్= వాడియైన గడ్డపారల తాకిడిచేత; విదారితములు కాఁగన్= చీల్చబడి ముక్కలు అగునట్లుగా; గ్రొచ్చిరి= త్రవ్వారు.

**తాత్పర్యం:** సగరుడు అశ్వమేధయాగం చేసేందుకు దీక్ష వహించాడు. యాగాశ్వాన్ని సంరక్షించే బాధ్యతను సగరుడి కొడుకులు పూనారు. సగరుడి గుర్రం భూమండలమంతా తిరిగి, నీళ్ళు లేని కడలిలో అంతర్ధానమయింది. ఆ విషయాన్ని సగరుడి కొడుకులు తండ్రికి తెలిపి, తండ్రి ఆజ్ఞమేరకు భూమినంతా వెదకి, అందరూ కలిసి ఒకేసారి పాతాళాన్ని త్రవ్వసాగారు. వారు వాడిన వాడియైన గడ్డపారలచేత సముద్రపుబురదలోని జంతువుల దేహాలు తెగి ముక్కలు ముక్కలైనాయి.

**వ. ఇట్లు గ్రొచ్చి గ్రొచ్చి సగరసుతులు సముద్రపూర్వోత్తరదేశంబునం గపిలుం డను మహాముని యాశ్రమ సమీపంబునందుఁ దమగుఱ్ఱంబుఁ గని సంతోసిల్లి. 62**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; గ్రొచ్చి గ్రొచ్చి= తవ్వి తవ్వి; సగర సుతులు= సగరుడి కొడుకులు; సముద్ర పూర్వ+ఉత్తర దేశంబునన్= సముద్ర ప్రదేశంలో తూర్పు దిక్కుకు ఉత్తరదిశకు మధ్యగా అంటే ఈశాన్యంగా; కపిలుండు+అను= కపిలుడు అనబడే; మహాముని+ఆశ్రమ, సమీపంబునందున్= మహర్షియొక్క ఆశ్రమానికి దగ్గరగా; తమ గుఱ్ఱంబున్+కని= తమ గుర్రాన్ని చూచి; సంతోసిల్లి= సంతోషించి.

**తాత్పర్యం:** ఈ విధంగా తవ్వి తవ్వి సముద్ర ప్రదేశంలోని ఈశాన్య దిశలో కపిలు డనే మహర్షి ఆశ్రమ సమీపాన తమ గుర్రాన్ని చూచి సంతోషించారు.

**ఆ. అశ్వమేధమునకు నర్చితంబైన యీ । యశ్వరాజు నిట్టు లపహరించి**
**ముచ్చు గొఱక యీ సముద్రదేశంబున । నోట మెడఁద లేక యున్నవాఁడు. 63**

**ప్రతిపదార్థం:** అశ్వమేధమునకున్= అశ్వమేధం అనే యజ్ఞానికి; అర్చితంబు+ఐన= ఆరాధించబడిన; ఈ+అశ్వరాజున్= ఈ గొప్ప గుర్రాన్ని; ఇట్టులు= ఈ రీతిగా; అపహరించి= దొంగిలించి; ముచ్చు, గొఱక= దొంగదున్నపోతు (దొంగముని అనే అర్థంలో నిందావాచకం); ఈ సముద్ర, దేశంబునన్= ఈ కడలి ప్రాంతంలో; ఓటమి+ఎడద లేక= జంకు హృదయంలో లేకుండా; ఉన్నవాఁడు= ఉన్నాడు.

**తాత్పర్యం:** అశ్వమేధయాగంకొరకై అర్చించబడిన ఈ గుర్రాన్ని అపహరించి దున్నపోతు వంటి ఈ దొంగముని కడలిసీమలో హృదయంలో ఎటువంటి జంకుగొంకులు లేకుండా ఉన్నాడు.

**విశేషం:** 'ముచ్చుగొఱక'- అనే పదం తెలుగు జాతీయంగా వాడబడింది. పదాల అర్థాలను బట్టిచూస్తే దొంగ అడవిదున్నపోతు అని తాత్పర్యం. దీన్ని లక్ష్యార్థంలో గ్రహించాలి. తెలుగులో దున్నపోతు, కారుపోతు, అడవిదున్న- అనే పదాలు నిందావాచకాలు. శిష్టవ్యావహారికంలో ఈ తిట్లు బాగా ప్రచారంలో ఉన్నాయి. నన్నయ వీటికి అనువుగా ఇక్కడ వాడాడు. సగరపుత్రులు కపిలమహర్షిపై కోపంతో ఆయనను మాటలతో అవమానించారు. దానికి ఆ మహర్షి కోపించి కంటిమంటతో ఆ రాకుమారులను బూడిదబుగ్గి చేశాడు. కపిల మహర్షి కోపాగ్నికి కారణమైన ఆ బలమైన నిందార్థక పదబంధాన్ని తెలుగు జాతీయంగా ప్రయోగించాడు- నన్నయ. లక్ష్యార్థంలో అడవిదున్న స్వభావం వ్యంగ్యం. ఇక్కడ మునిస్వభావాన్ని పేర్కొంటూ- 'ఓట మెడఁద లేక ఉన్నవాఁడు' - అని అన్నారు. 'ఓట మింత లేక యున్నవాఁడు' - అనే పాఠాంతరం కూడా ఉన్నది. తాను చేసిన పనికి ఎటువంటి ప్రతిఫలం వస్తుందో తెలియక మదాంధబుద్ధి కలవాడిని ఉద్దేశించి తెలుగువారు 'దున్నపోతా!' అని తిడతారు. ఇక్కడ కపిలుడు చేసింది దొంగతనమని సగరపుత్రు లనుకొంటున్నారు. దొంగిలించి కూడా, దొంగతనంగా తీసికొని కూడా, సగరపుత్రులు గుర్రాన్ని కనుగొన్న తరువాత కూడా అతడు ఉలుకుపలుకు లేకుండా నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నాడు. అట్లా కూర్చోవడం రాకుమారులకు మరీ కోపం తెప్పించింది. దొంగతనం చేసి బయటపడ్డానన్న భయం లేకుండా నిబ్బరంగా కూర్చుంటే ఎవణ్ణైనా తెలుగువాడు 'దొంగ దున్నపోతు' అనే నిందార్థకంతో తిట్టటం సహజం. కపిలమహర్షి నిర్దోషి అని పఠితలకు తెలుసు. అందుకే సగరపుత్రులు కపిలుని కోపాగ్నికి ఆహుతులు కావటం వారికి సమంజసమనిపిస్తుంది. ఇది కళాన్యాయం. ఆ కార్యానికి తగిన కారణంగా ఈ నిందా ప్రయోగాన్ని నన్నయ వాడాడు. కొందరు పండితులు ఈ నిందార్థక పద ప్రయోగం ఔచిత్యవంతంగా లేదని భావిస్తారు. ఉ.వి. ఆం.మ.భా. సంశోధిత ముద్రణప్రతిలో "ముచ్చుగొఱక" - అనే పాఠానికి 'ముచ్చుగొఱగ', 'ముచ్చుగోలు', 'ముచ్చుదొంగ', ముచ్చుగాగ' - అనే పాఠాంతరాలున్నాయి. ఇవన్నీ నిందార్థకాలే. సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'ముచ్చుగోర' - అనే పాఠంతో ఈ పద్యం ఉదాహృతమైనది. 'ముచ్చు+కోర'= అంటే పెద్దదొంగ అని అర్థం. అదీ నిందార్థకమే. ముచ్చు - అంటే దొంగగా కనపడని దొంగ అని అర్థం. పెద్ద దొంగల ముఠా నాయకుడుగా జంకుగొంకులు లేకుండా ముచ్చువలె కూర్చున్నాడే- అని భావం. దొంగముని- లేదా ముచ్చుముని- అని సగరపుత్రులనలేదు. కాని, లక్ష్యార్థ తాత్పర్యం అదే. అందువలన దొంగదున్నపోతులాగా ఉన్న ఈ దొంగ ముని అని సగర కుమారులు నిందించారని తాత్పర్యం ఏర్పడుతుంది. ఇది కపిలుడు వారిని బూడిద చేయటానికి తగిన తెలుగు తిట్టుపదంగా నన్నయ్య వాడాడు. (సంపా.)

## సగరసుతులు గపిలమహామునికోపాగ్నిచే భస్మమగుట (సం. 3-106-3)

**వ. అని పలికి కపిలుం బరిభవించిన నమ్మునివరుఁ డలిగి యనలశిఖలు దూల నతిఘోరదృష్టిం జూచిన నప్పుడు సగరసుతులందఱు భస్మంబైన. 64**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని వచించి; కపిలున్+పరిభవించినన్= కపిల మహర్షిని అవమానించగా; ఆ+మునివరుఁడు= ఆ ఋషిశ్రేష్ఠుడు; అలిగి= కోపించి; అనల శిఖలు= అగ్నిజ్వాలలు; తూలన్= చెలరేగగా; అతిఘోర దృష్టిన్+చూచినన్= మిక్కిలి భయంకరమైన చూపులతో చూడగా; అప్పుడు= ఆక్షణంలో; సగర సుతులు+అందఱు= సగరుడి కొడుకులు అందరూ; భస్మంబు+ఐనన్= మండి బూడిద కాగా.

**తాత్పర్యం:** అని కపిలమహర్షిని అవమానించగా, ఆ ఋషివరేణ్యుడు ఆగ్రహించి అగ్నిజ్వాలలు చెలరేగేటట్లు భయానకమైన చూపు ప్రసరించాడు. అప్పుడు సగరుడి కొడుకులు అందరూ మండి మాడి బూడిద అయిపోయారు.

**క. వీరులగు సగరతనయుల । దారుణ దాహంబుఁ జూచి తడయక చని యం**
**భోరుహగర్భతనూజుఁడు । నారదుఁ డంతయును సగరునకు నెఱిఁగించెన్. 65**

**ప్రతిపదార్థం:** వీరులు+అగు= పరాక్రమం కలవారైన; సగర తనయుల= సగరుడి కొడుకులయొక్క; దారుణ, దాహంబున్= భయానకమైన దహనాన్ని; చూచి= చూచి; తడయక= ఆలస్యం చేయక; చని= వెళ్లి; అంభస్+రుహ గర్భ తనూజుఁడు= పద్మగర్భంనుండి పుట్టిన వాడి పుత్రుడు, అనగా బ్రహ్మకొడుకైన వాడు; నారదుఁడు= నారదుడనే ముని; అంతయును= సర్వమున్నూ; సగరునకున్+ఎఱిఁగించెన్= సగరుడికి తెలిపాడు.

**తాత్పర్యం:** పరాక్రమోపేతులైన సగరసుతులు కపిలుడి కోపాగ్నికి ఆహుతి అయిన సంగతి ఆలసించకుండా పోయి బ్రహ్మపుత్రుడైన నారదమహర్షి సగరుడికి తెలిపాడు.

**క. దాని విని సగరుఁ డురు శో । కానలదందహ్యమానుఁ డయ్యును నయ్యీ**
**శానువచనంబు దలఁచి ధ । రానాథుఁడు శోకభరపరావృత్తుండై. 66**

**ప్రతిపదార్థం:** దానిన్, విని= దానిని అనగా పుత్రమరణవార్తను ఆలకించి; సగరుఁడు; ఉరుశోక+అనల, దందహ్యమానుఁడు+అయ్యునున్= మిక్కుటమైన దుఃఖమనే అగ్నిచేత మండించబడిన వాడు అయినప్పటికిన్నీ; ఆ+ఈశాను, వచనంబు= ఆ శివుడి మాట; తలఁచి= సంస్మరించి; ధరా నాథుఁడు= భూ భర్త అయినసగరుడు; శోక భర పర+ఆవృత్తుండు+ఐ= దుఃఖభారాన్నుండి వెనుదిరిగినవాడై.

**తాత్పర్యం:** పుత్రమరణవార్తను విని, సగరుడు మిక్కుటమైన శోకంచేత దహించబడినవాడైనా కూడా, అలనాటి పరమేశ్వరుడి వచనాలను జ్ఞప్తికి తెచ్చుకొని దుఃఖభారంనుండి వెనుదిరిగినవాడై.

**వ. అసమంజసపుత్త్రు నంశుమంతుం దనమనుమనిం జూచి, 'యయ్యా! నీయయ్య లఱువదివేవురు నొక్కటఁ గపిలకోపానలకబళితశరీరు లయిరి; భవజ్జనకుం డతిక్రూరహృదయుఁడై పౌరబాలకుల నకారణంబ వధియించి మహానదిలో వైచుచున్న నెఱిఁగి పౌరజనాక్రోశంబునం దనుక్రోశపరుండనై వాని విడిచితి. 67**

**ప్రతిపదార్థం:** అసమంజస పుత్త్రున్= అసమంజసుడి కొడుకును; అంశుమంతున్= అంశుమంతుడిని; తన మనుమనిన్+చూచి= తన మనుమడిని చూచి; అయ్యా!= నాయనా!; నీ+అయ్యలు= నీ తండ్రులు; అరువది వేవురు= అరవై వేలమంది; ఒక్కటన్= ఒక్కమారుగా; కపిల కోప+అనల కబళిత శరీరులు+అయిరి= కపిలుడియొక్క ఆగ్రహ మనే అగ్నిచేత మ్రింగబడిన శరీరాలు కలవారు అయినారు; భవత్+జనకుండు= నీ తండ్రి; అతి క్రూర హృదయుండు+ఐ= మిక్కిలి దయలేని మనస్సు కలవాడై; పౌర బాలకులన్= పురమందలి పసిబిడ్డలను; అకారణంబ= ఏ కారణమూ లేకుండగానే; వధియించి= చంపి; మహానదిలో= మహానదిలో; వైచుచున్నన్+ఎఱిఁగి= విసరి వేయటం తెలిసికొని; పౌర జన+ఆక్రోశంబునందు= పురజనులు పెట్టే మొరయందు; అనుక్రోశ పరుండను+ఐ= సానుభూతి కలవాడినై; వానిన్= అతడిని; విడిచితిన్= వదలిపెట్టాను.

**తాత్పర్యం:** అసమంజసుడి కొడుకు అంశుమంతుడు. సగరుడు తన మనుమడైన అంశుమంతుడిని చూచి 'నాయనా! నీ తండ్రులు అరవైవేలమంది ఒక్కసారి కపిలమహర్షికోపానికి ఆహుతి అయిపోయారు. నీ తండ్రి అసమంజసుఁడు పౌరబాలకులను సంహరించి కఠోరహృదయుడై నదిలో విసరివేస్తూ ఉండేవాడు. అందువలన పౌరుల ఆక్రోశాన్ని విని జాలిపడి నీ తండ్రిని విడిచివేశాను.

**క.** **కొడుకులకు వగవ; మును నా । కడఁగిన హయమేధమఖము గడచనమికి నేఁ**
**గడు దుఃఖితుండ నయ్యెదఁ; । దడయక నీ విపుడు దీనిఁ దలఁగుము కడఁకన్.' 68**

**ప్రతిపదార్థం:** కొడుకులకు= పుత్రులకొరకు; వగవన్= దుఃఖించను; నా, కడఁగిన= నేను పూనిన; హయమేధ మఖము= అశ్వమేధయాగం; కడచనమికిన్= పూర్తికాకుండ ఉండినందుకు; ఏన్= నేను; కడు= మిక్కిలి; దుఃఖితుండన్+అయ్యెదన్= పరితాపం చెందిన వాడిని అవుతున్నాను; తడయక= ఆలస్యం చేయక; నీవు+ఇపుడు= నీవు ఇప్పుడు; దీనిన్= ఈ దుఃఖాన్ని; కడఁకన్= పూనికతో; తలఁగుము= తొలగించుము.

**తాత్పర్యం:** నా కొడుకులు మరణించినందుకు నేను అంతగా దుఃఖించను, కాని నేను పూనికతో ఆరంభించిన అశ్వమేధయాగం పూర్తికాలేదని మిక్కిలి వెతచెందుతున్నాను. ఇప్పుడు నీవు నా దుఃఖాన్ని తొలగించేందుకు వెంటనే పూనుకొనుము.'

**వ.** **అనిన నంశుమంతుం డాక్షణంబ చని సగరసుతఖాత ద్వారంబున సముద్రంబు సొచ్చి, యందు సూర్య సహస్రద్యుతియై వెలుంగుచున్న కపిలమహామునికి నమస్కరించి, నిజాగమనప్రయోజనం బెఱింగించినఁ గపిలుండును వానికిం గరుణించి యాజ్ఞీయంబైన యశ్వంబు నిచ్చి యిట్లనియె. 69**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అంశుమంతుండు= అంశుమంతుడు; ఆ క్షణంబు+అ, చని= అప్పటికప్పుడే బయలుదేరి వెళ్లి; సగర సుత ఖాత ద్వారంబున= సగరుడి కొడుకుల చేత త్రవ్వబడిన మార్గాన; సముద్రంబు+చొచ్చి= సముద్రాన్ని ప్రవేశించి; అందు= అచట; సూర్య సహస్ర ద్యుతి+ఐ= వేయి సూర్యుల కాంతి కలిగినవాడై; వెలుంగుచున్న= ప్రకాశిస్తున్న; కపిల మహామునికిన్= కపిలమహర్షికి; నమస్కరించి= వందనం చేసి; నిజ+ఆగమన ప్రయోజనంబు= తనరాకకు కల లక్ష్యం; ఎఱింగించినన్= తెలుపగా; కపిలుండును= కపిలమునియున్నూ; వానికిన్+కరుణించి= అతనియెడ దయ కలిగి; యాజ్ఞీయంబు+ఐన= యజ్ఞంకొరకు ఉద్దేశించబడిన; అశ్వంబున్+ఇచ్చి= గుర్రాన్ని ఇచ్చి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని తాతగారు చెప్పగా, అంశుమంతుడు వెన్వెంటనే బయలుదేరి సగరుడి కొడుకులు త్రవ్విన మార్గాన సముద్రాన్ని చేరి, అక్కడ వేయిసూర్యుల కాంతితో ప్రకాశిస్తున్న కపిలమహర్షికి వందనంచేసి, తనరాకకు గల ఉద్దేశాన్ని తెలిపాడు. కపిల మహర్షి అంశుమంతుడియెడ దయ కలిగి యజ్ఞంకొరకు ఉద్దేశించబడిన గుర్రాన్ని ఇచ్చి ఈ విధంగా చెప్పాడు.

**క. 'ఘనభుజ! నీ కారణమునఁ । జనఁ గాంతురు పుణ్యగతికి సాగరులు; ముదం**
**బున సగరునకును దొరకును । నొనరఁగ సుతవంతులైన యుత్తముల గతుల్. 70**

**ప్రతిపదార్థం:** ఘనభుజ!= గొప్ప భుజాలు కలవాడా, అనగా పరాక్రమవంతుడా!; నీ, కారణమునన్= నీ హేతువుచేత అనగా నీ వలన; సాగరులు= సగరుడి పుత్రులు; పుణ్య గతికిన్= పుణ్యం వలన లభించే మార్గానికి; చనన్+కాంతురు= వెళ్ళగలరు; సుతవంతులు+ఐన= కొడుకులు ఉన్న; ఉత్తముల గతుల్= మంచివారు పొందే లోకాలు; ముదంబునన్= సంతోషంతో; సగరునకును= సగరుడికి కూడ; ఒనరఁగ= శోభిల్లేటట్లు; దొరకును= లభిస్తాయి.

**తాత్పర్యం:** 'పరాక్రమం గల ఓ అంశుమంతుడా! నీ మూలాన సగరుడి కొడుకులకు సద్గతులు లభిస్తాయి. సగరుడికి సుత సంతానవంతులకు లభించే పుణ్యలోకాలు సంతోషంతో సమకూరుతాయి.

**వ. మఱియు నీచేతనుపనీతంబైన యీ యశ్వంబున నశ్వమేధంబు సేసి సగరుండు కృతార్థుండగు; నీ పౌత్త్రుండైన భగీరథుచేతఁ దేరం బడియెడు గంగాజలౌఘంబులంజేసి సంసిక్తులై సగరసుతులు స్వర్గగతు లగుదురు; సముద్రంబు సంపూర్ణంబగు' ననిన నంశుమంతుండు సంతుష్టుండై కపిలప్రసాదంబున నశ్వంబుఁ దెచ్చి సగరున కిచ్చి కపిలువచనంబు నెఱింగించిన, సగరుండును బుత్త్రశోకంబుడిగి యశ్వమేధంబు సేసి, సముద్రుం దనకుఁబుత్త్రుగాఁ గల్పించిన నది మొదలు సముద్రంబు సాగరంబు నాఁ బరఁగె; నిట్లు సగరుండు పెద్దకాలంబు రాజ్యంబు సేసి, నిజరాజ్యభారం బంశుమంతునందు సమర్పించి చనిన. 71**

**ప్రతిపదార్థం:** మఱియు= అంతేకాక; నీచేతన్+ ఉపనీతంబు+ఐన= నీచేత తేబడిన; ఈ+అశ్వంబునన్= ఈ గుర్రంతో; అశ్వమేధంబు+చేసి= అశ్వమేధం అనే యాగాన్ని చేసి; సగరుండు= సగరుడు; కృత+అర్థుండు+అగున్= ధన్యుడు కాగలడు; నీ, పౌత్త్రుండు+అగు= నీ మనుమడగు; భగీరథుచేతన్= భగీరథుడి చేత; తేరం బడియెడు= తేబడే; గంగా జల+ఓఘంబులన్+ చేసి= గంగా నది యొక్క నీటి వెల్లువల చేత; సంసిక్తులు+ఐ= తడుపబడిన వారై; సగరసుతులు= సగరుడి కొడుకులు; స్వర్గగతులు+అగుదురు= స్వర్గలోకానికి వెళ్లేవారవుతారు; సముద్రంబు= సముద్రం; సంపూర్ణంబు+అగున్= నీటితో నిండినట్టిది కాగలదు; అనినన్= అని చెప్పగా; అంశుమంతుండు= అంశుమంతుడు; సంతుష్టుండు+ఐ= సంతోషించినవాడై; కపిల ప్రసాదంబునన్= కపిల మహర్షి అనుగ్రహం వలన; అశ్వంబున్+తెచ్చి= గుర్రాన్ని తోడ్కొని తెచ్చి; సగరునకు+ఇచ్చి= సగరుడికి సమర్పించి; కపిలు, వచనంబున్+ఎఱింగించిన= కపిలుడి మాటలను తెలుపగా; సగరుండును= సగరుడున్నూ; పుత్త్ర శోకంబు+ఉడిగి= కొడుకుల మరణంవలన ఏర్పడిన దుఃఖాన్ని విడిచి; అశ్వమేధంబు+చేసి= అశ్వమేధయాగాన్ని చేసి; సముద్రున్= సముద్రుడిని; తనకున్= తనకు; పుత్త్రున్+కాన్= కొడుకుగా; కల్పించినన్= ఏర్పరచుకొనగా; అది మొదలు= అప్పటినుండి; సముద్రంబు= సముద్రం; సాగరంబు+నాన్+పరఁగెన్= 'సాగరం' అని పిలువబడింది; ఇట్లు= ఈ విధంగా; సగరుండు= సగరుడు; పెద్దకాలంబు= చాలా కాలం; రాజ్యంబు+చేసి= ప్రభుత్వం నెరపి; నిజ రాజ్య భారంబు= తనదైన రాజ్యాన్ని పరిపాలించే బరువును; అంశుమంతునందు= అంశుమంతుడిపై; సమర్పించి= మోపి; చనినన్= వెళ్ళగా (వానప్రస్థాశ్రమానికై అడవికి పోగా).

**తాత్పర్యం:** అంతమాత్రమే కాదు. నీచేత తేబడిన గుర్రంతో సగరుడు అశ్వమేధయాగం చేసి ధన్యుడు కాగలడు. నీ మనుమడు భగీరథుడు తెచ్చే గంగనీటివెల్లువచేత తడిసినవారై సగరుడి కొడుకులు స్వర్గలోకానికి పోగలరు. సముద్రం నీటితో మళ్ళీ నిండగలదు'- అని చెప్పగా, అంశుమంతుడు సంతోషించి, కపిలమహర్షి దయవలన లభించిన యాగాశ్వాన్ని సగరుడికి సమర్పించి, కపిలుడు చెప్పిన మాటలు నివేదించాడు. సగరుడుకూడ కొడుకుల మరణంచేత ఏర్పడిన దుఃఖాన్ని మరచి, అశ్వమేధయాగం చేసి, సముద్రుడిని తన పుత్రుడిగా స్వీకరించాడు. నాటినుండి సముద్రం 'సాగరం' అని పిలువబడసాగింది. ఈ విధంగా సగరుడు చాలకాలం ప్రజాపరిపాలన కొనసాగించి, చివరకు రాజ్య భారాన్ని అంశుమంతుడిపై మోపి, తాను వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి అడవికి వెళ్ళిపోయాడు.

**తే. తన పితామహునట్టుల ధరణి యేలి । యంశుమంతుండు నిజపుత్త్రు డగు దిలీపు**
**నందు రాజ్యభారముఁ బూన్చి యఖిల లోక । పూజితుండు దపోవనంబునకుఁ జనియె. 72**

**ప్రతిపదార్థం:** తన పితామహున్+అట్టుల= తన తాతగారి వలె; అంశుమంతుండు= అంశుమంతుడు; ధరణి+ఏలి= భూమిని పరిపాలించి; నిజ పుత్త్రుఁడు+అగు= తన కొడుకైన; దిలీపునందు= దిలీపుడిపై; రాజ్య భారమున్= ప్రభుత్వం యొక్క బరువును; పూన్చి= మోపి; అఖిల, లోక, పూజితుండు= సమస్తలోకాలచేత ఆరాధించబడిన వాడు, (ఆ అంశుమంతుడు); తపో వనంబునకున్= (తపస్+వనంబునకున్)= తపస్సు చేసికొనే అడవికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అంశుమంతుడు కూడ, తన తాతగారి వలెనే ప్రజానురంజకంగా రాజ్యాన్ని పరిపాలించి, తన కొడుకైన దిలీపుడిపై ప్రభుత్వ భారాన్ని మోపి, సమస్త లోకాలచేత ఆరాధించబడిన తాను వానప్రస్థాశ్రమం స్వీకరించి, తపస్సు చేసికొనేందుకు అడవికి వెళ్ళాడు.

**వ. దిలీపుండును దన పితామహులైన సాగరు లధోగతులు గాకుండ గంగావతరణంబునందు యత్నంబుసేసి యశక్తుండై. 73**

**ప్రతిపదార్థం:** దిలీపుండును= దిలీపు డనే మహారాజు సైతం; తన పితామహులు+ఐన= తన తాతలైన; సాగరులు= సగరుడి కొడుకులు; అధస్+గతులు= అధోగతులు= అధో లోకాలకు పోయేవారు; కాకుండ; గంగా+అవతరణంబునందున్= గంగ క్రిందికి దిగేటట్లు చేయటంలో, (గంగ భూమిపై అవతరించటంలో); యత్నంబు+చేసి= కృషి చేసి; అశక్తుండు+ఐ= శక్తి చాలనివాడై.

**తాత్పర్యం:** దిలీపమహారాజు తన తాతగారైన సగరుడి కొడుకులు అధమలోకాలకు పోకుండ గంగను భూలోకానికి అవతరింపజేయటానికై కృషి చేశాడు. కాని, అతడి శక్తి అందుకు చాలలేదు.

**చ. ప్రథితయశున్ సుతుం బడసె భారసహిష్ణు మహారథున్ భగీ**
**రథుఁడను చక్రవర్తి నపరాజితతేజు నిజాన్వవాయదు**
**ష్పథవినివర్తకున్ సకలపార్థివజైత్రు మదోద్ధతాసుహృ**
**న్మథను సురాపగానయసమర్థ తపోగుణయుక్తు నుత్తమున్. 74**

**ప్రతిపదార్థం:** ప్రథిత యశున్= ప్రసిద్ధమైన కీర్తి కలవాడిని; భార సహిష్ణున్= బరువును సహించేందుకు ఇష్టపడేవాడిని; మహారథున్= గొప్ప తేరుపై ఎక్కి పదకొండు వేలమంది విలుకాండ్రతో పరాక్రమంతో యుద్ధం చేయగల వీరుడిని; భగీరథుఁడు+అను చక్రవర్తిన్= భగీరథుడు అనే పేరుగల రారాజును; నిజ+అన్వవాయ దుష్పథ వినివర్తకున్= తనయొక్క వంశాన్ని దుర్గతినుండి వెనక్కు మరలించ గలిగిన వాడిని; సకల పార్థివ జైత్రున్= అందరురాజులను జయించే వాడిని; మద+ఉద్ధత+అసుహృత్+మథనున్= గర్వంచేత విజృంభించిన శత్రువులను నిర్జించేవాడిని; సుర+ఆపగా+అనయ సమర్థ తపస్+గుణ యుక్తున్= దేవలోకంలోని నదిని తీసికొని రావటానికి తగిన సామర్థ్యం గల తపస్సు అనెడి లక్షణంతో కూడిన వాడిని; ఉత్తమున్= మంచివాడిని; సుతున్= కొడుకును; అపరాజిత తేజు= అపజయ మెరుగని తేజస్సు కల వాడిని; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** ఆ దిలీపమహారాజు భగీరథు డనే కుమారుడిని పొందాడు. భగీరథుడు గొప్ప యశస్సును ఆర్జించినవాడు. ఎన్ని కష్టాలనైనా భరించేందుకు వెనకాడని చిత్తప్రవృత్తి కలవాడు. రథంపై అధివసించి పరాక్రమంతో వేలకొలది వీరులను ఎదిరించ గలిగిన మహావీరుడు, ఎందరో రాజులను సామంతులుగా చేసి రాజ్యం చేసిన చక్రవర్తి, అపజయ మెరుగని తేజస్వి, తన వంశాన్ని దుర్గతినుండి కాపాడగల సమర్థుడు, సకల రాజులను జయించినవాడు, గర్వంతో విజృంభించే శత్రువుల ఉక్కడగించేటటువంటివాడు, దేవనదియైన గంగను భూమిపైకి తీసికొనిరాగల సామర్థ్యంతో కూడిన తపోమహిమ కలవాడు. ఉత్తముడు.

**వ. ఆ భగీరథు నపారభూభారధురంధరుం జేసి దిలీపుండు తపోవనంబున కరిగిన. 75**

**ప్రతిపదార్థం:** ఆ భగీరథున్= ఆ భగీరథుడిని; అపార భూ భార ధురంధరున్+చేసి= హద్దులేని అనగా అంతులేని భూరాజ్యం యొక్క బరువు మోయగలవాడినిగా - అనగా పరిపాలించేవాడినిగా చేసి; దిలీపుండు= దిలీపుడు; తపస్+వనంబునకు= తపోవనంబునకు= తపస్సు చేసికొనేందుకు అనువైన అడవికి; అరిగినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** ఆ భగీరథుడిని సువిశాల రాజ్యభారాన్ని భరించే వాడినిగా చేసి, దిలీపుడు తపస్సు చేసికొనేందుకై వాన ప్రస్థాన్ని స్వీకరించి అడవికి వెళ్లిపోయాడు.

**తే. కపిలుకోపాగ్నిఁ జేసి సాగరులు గ్రాఁగి। రనియు గతిఁ గానకున్నవా రనియు నెఱిఁగి,**
**వారలకు హిత మొనరింప వగచి గంగఁ। దేరఁ గడఁగె వీరుండు భగీరథుండు. 76**

**ప్రతిపదార్థం:** కపిలు, కోప+అగ్నిన్+చేసి= కపిల మహర్షి యొక్క కోపం అనే అగ్నిచేత; సాగరులు= సగరుడి కొడుకులు; క్రాఁగిరి= మండిపోయారు; అనియు= అనిన్నీ; గతిన్= ఉత్తమలోకాన్ని చేరేదారి; కానక+ఉన్నవారు= తెలియని స్థితిలో ఉన్నారు; అనియున్= అనిన్నీ; ఎఱిఁగి= తెలిసికొని; వారలకు= ఆ సాగరులకు; హితము= మేలు; ఒనరింప= చేసేందుకు, చేయటానికి; వగచి= ఆలోచించి; వీరుండు= పరాక్రమం కలవాడు; భగీరథుండు= భగీరథుడు; గంగన్= గంగను; తేరన్= తెచ్చేందుకు, (తేవటానికి); కడఁగెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** కపిలమహర్షి ఆగ్రహ మనే అగ్నికి సగరుడి కొడుకులు ఆహుతిఅయి, ఉత్తమ లోకాలకు పోలేకుండా ఉన్నట్లు తెలిసికొని, వారికి మేలు చేసేందుకు ఆలోచించి, భూలోకానికి గంగను దింపటానికై మహావీరుడైన భగీరథుడు పూనుకొన్నాడు.

**వ. ఇట్లు భగీరథుండు గంగావతరణంబునందుఁ గృతనిశ్చయుండై యరిగి బహువిధాకార ధాతుమంతంబులైన యుత్తుంగశృంగంబులను, జలభర వినమ్ర ప్రబల బలాహక వ్యూహ సంఛాదిత శ్యామాయమానంబులైన తుహినస్థలంబులను, సిద్ధ విద్యాధరగంధర్వ గీర్వాణ మిథునసంసేవ్యమానంబులైన నానారత్న కందరంబులను, శుకపిక పారావత శుక్లాపాంగ సారంగ శతపత్ర పుత్ర ప్రియ దాత్యూహ వ్యూహ శబ్ద శబ్దాయమానంబులైన తరువనరేఖలను, సింహ శరభ శార్దూల శుండాల గోలాంగూల కోలాహలాన్వితంబులైన గుహా గహ్వరంబులనుం జేసి రమణీయ భయానకంబైన హిమవత్పర్వతంబున.77**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; భగీరథుండు= భగీరథుడు; గంగా+అవతరణంబునందున్= గంగను భూమిపై అవతరింప చేయటంలో; కృత, నిశ్చయుండు+ఐ= చేయబడిన నిశ్చయం కలవాడై, (స్థిర నిర్ణయాన్ని గైకొన్నవాడై); అరిగి= వెళ్లి; బహు విధ+ఆకార ధాతుమంతంబులు+ఐన= పెక్కు రకాలైన ఆకృతులుగల, మణి (శిల) గైరికాది శైల పదార్థాలు కలవియున్నూ అయిన; ఉత్తుంగ శృంగంబులను= మిక్కిలి ఎత్తైన కొండకోనలను; జలభర, వినమ్ర, ప్రబల, బలాహక, వ్యూహ, సంఛాదిత, శ్యామాయమానంబులు+ఐన= నీటియొక్క బరువుచేత వంగిన పెద్దపెద్ద మబ్బులగుంపులచేత కప్పబడి నల్లనైన; తుహిన, స్థలంబులను= మంచు ప్రదేశాలను; సిద్ధ, విద్యాధర, గీర్వాణ, మిథున, సంసేవ్యమానంబులు+ఐన= సిద్ధులు విద్యాధరులు, గంధర్వులు, గీర్వాణులు అయిన దేవతా జాతులలోని స్త్రీ పురుషుల జంటలచేత సందర్శించబడునట్టివైన; నానా, రత్న, కందరంబులను= పెక్కు రత్నాలు గల గుహలను; శుక, పిక, పారావత, శుక్లాపాంగ సారంగ, శతపత్ర పుత్ర, ప్రియ, దాత్యూహ, వ్యూహ, శబ్ద, శబ్దాయ మానంబులు+ఐన= చిలుకలు, కోయిలలు, పావురాలు, తెల్లని క్రీగంటి చూపులు గలలేళ్ళు, కొదమ నెమళ్ళకు ప్రియమైన వానకోయిలల సముదాయాలయొక్క ధ్వనులచేత ప్రతిధ్వనించబడుతున్న; తరు, వన, రేఖలను= చెట్ల గుంపుల వరుసలను; సింహ, శరభ, శార్దూల, శుండాల, గోలాంగూల, కోలాహల+అన్వితంబులు+ఐన= సింహాలచేత, శరభాలచేత (మీగండ్ల మెకాలచేత), పెద్దపులులచేత, ఏనుగులచేత, కొండముచ్చులచేత చేయబడే కలకల ధ్వనులతో కూడిన; గుహా, గహ్వరంబులనున్= పర్వత బిలాలను; చేసి= కలిగి ఉండటం వలన; రమణీయ భయానకంబు+ఐన= అందంతో పాటు భయాన్ని కలిగించేటటువంటి; హిమవత్+పర్వతంబునన్= మంచుమలయందు, హిమాలయ పర్వతంలో.

**తాత్పర్యం:** ఈవిధంగా భగీరథుడు గంగానదిని దివినుండి భువికి దింపటానికి స్థిరమైన సంకల్పాన్ని ఏర్పరచుకొన్నవాడై హిమాలయ పర్వతానికి వెళ్ళాడు. ఆ మంచుకొండ, అనేక విధాలైన శైలద్రవ్యాలు గల ఎత్తైన శిఖరాలతో, నీటి బరువుతో వంగిన పెనుమబ్బు దొంతరలతో ఆవరించబడటంచేత నల్లనైన మంచు ప్రదేశాలలో సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, గంధర్వులు, గీర్వాణులు అనే తెగలకు చెందిన స్త్రీ పురుషుల జంటలు విహరించేటటువంటి రత్నమయాలైన గుహలతో, చిలుకలు, కోకిలలు, పావురాలు, తెల్లనైన వాల్గంటి చూపులు గల లేళ్ళు, కొదమ నెమిళ్లు, వాటికి ప్రీతిని కలిగించే వానకోకిలల గుంపులు చేసే ధ్వనులతో ప్రతిధ్వనించే చెట్ల వరుసలతో, సింహాలు, శరభాలు, పెద్దపులులు, ఏనుగులు, కొండముచ్చులు చేసే కోలాహల ధ్వనులతో అందంతో పాటు భయాన్ని రేకెత్తించేటటు వంటిదిగా విలసిల్లుతూ ఉంది.

**చ. సతతకృతోపవాసముల శాకఫలోదకమూలపారణ**
**వ్రతముల దేవపూజల నపారజపంబులఁజేసి నిష్ఠతో**
**నతులతపంబు సేసె నమరాపగ నుర్వికిఁ దెచ్చు వేడ్కతో**
**ధృతియుతుఁడై దిలీపకులదీపుఁడు దివ్యసహస్రవర్షముల్. 78**

**ప్రతిపదార్థం:** దిలీప కుల దీపుఁడు= దిలీపుడి వంశాన్ని వెలిగించేటటువంటివాడు అనగా భగీరథుడు; ధృతి యుతుఁడు+ఐ= పూనికతో కూడినవాడై; అమర+ఆపగన్= దేవగంగను; ఉర్వికిన్= భూమికిన్; తెచ్చు= తీసుకొని వచ్చే; వేడ్కతోన్= అభిలాషతో; దివ్య, సహస్ర వర్షముల్= దేవమానంలో వేయి ఏళ్ళు; సతత కృత+ఉపవాసముల= ఎల్లప్పుడు ఆచరించే ఉపవాస దీక్షలతో; శాక, ఫల+ఉదక, మూల, పారణ, వ్రతములన్= ఉపవాసం చేసిన మరునాడు ఆకుకూరలు, పళ్ళు, నీళ్ళు, వేళ్ళు మాత్రమే తినేటటువంటి నియమాలతో; దేవ పూజలన్= దేవతలను ఆరాధించటంలో; అపార, జపంబులన్+చేసి= మితిలేని మంత్రావృత్తులు చేయటంలో; నిష్ఠతో= మిక్కిలి దీక్షతో; అతుల తపంబు+చేసెన్= సాటిలేని తపస్సు చేశాడు.

**తాత్పర్యం:** దిలీపవంశానికి దీపం వంటి వాడైన భగీరథుడు, గొప్ప పూనిక కలవాడై, ఆ హిమవత్పర్వతంలో దేవమానంలో వేయేళ్ళు దీక్షతో గంగానదిని దివినుండి భువికి దింపటానికై కటిక ఉపవాసాలు చేస్తూ, ఉపవాసం ముగిసిన మర్నాడు ఆకుకూరలు, పళ్ళు, నీళ్ళు, వేళ్ళు మాత్రమే భుజించి దేవతలను అర్చిస్తూ, మంత్రాలను ఆవృత్తి చేస్తూ సాటిలేని తపస్సు చేశాడు.

**వ. ఆ భగీరథు తపంబునకు మెచ్చి గంగాదేవి ప్రత్యక్షంబై 'నీ యిష్టంబు సెప్పు' మనినం గృతాంజలియై యిట్లనియె.79**

**ప్రతిపదార్థం:** ఆ భగీరథు తపంబునకు= ఆ భగీరథుడు చేసిన తపస్సుకు; మెచ్చి= ప్రీతిచెంది; గంగాదేవి= గంగాదేవి; ప్రత్యక్షంబు+ఐ= సాక్షాత్కరించి; నీ ఇష్టంబు= నీ కోరిక; చెప్పుము+అనినన్= చెప్పుమని అడుగగా; కృత+అంజలి+ఐ= కూర్చబడిన దోయిలి కలవాడై, అనగా దోసిలి ఒగ్గి నమస్కరించినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ భగీరథుడు చేసిన కఠోరతపస్సుకు ప్రీతి చెంది గంగాదేవి సాక్షాత్కరించి, నీకు ఇష్టమైన కోరిక కోరుకొమ్మని అడుగగా, అతడు అంజలి ఘటించి నమస్కరించి ఇట్లా పలికాడు.

**సీ. 'తపనతేజుండైన కపిలుకోపంబున । గతజీవులై పుణ్యగతులయందు**
**నిహతులై మత్పితామహు లున్నవారు; నీ । దగు పుణ్యజలముల సగరసుతులు**
**సిక్తులై స్వర్గానుభుక్తిఁ బ్రాపింతురు । గావున దేవి! యిద్దేవపథము**
**నందుండి వసుమతి కొందంగఁ జనుదేర । వలయు' నావుడు 'మహీవలయమునకు**

**ఆ. నేను వచ్చునపుడు నా నిరంతర జలౌ । ఘంబు దాల్ప నీలకంఠుఁ డోపుఁ**
**గాని యొరులు దాల్పఁగా నోప; రయ్యుమా । నాథుకరుణఁ బడయు నన్నుఁ దాల్ప.' 80**

**ప్రతిపదార్థం:** తపనతేజుండు+ఐన= సూర్యుడి యొక్క తేజస్సు కలవాడైన; కపిలు, కోపంబున= కపిల మహర్షి ఆగ్రహం చొప్పున; గతజీవులు+ఐ= పోయిన ప్రాణాలు కలవారై; పుణ్యగతుల+అందు= పుణ్యామార్గాలలో; నిహతులు+ఐ= దెబ్బతిన్నవారై; మత్+పితామహులు= నా తాతలు; ఉన్నవారు= ఉన్నారు; నీదు+అగు= నీదైన; పుణ్యజలములన్= పుణ్యం చేకూర్చే జలాల చేత; సగరసుతులు= సగరుడి కొడుకులు; సిక్తులు+ఐ= తడుపబడినవారై; స్వర్గ+అనుభుక్తిన్= స్వర్గాన్ని అనుభవించే స్థితిని; ప్రాపింతురు= పొందుతారు; కావున= కాబట్టి; దేవి!= ఓ గంగా దేవీ!; ఈ+దేవ పథమునందుండి= ఈ దేవతల మార్గం నుండి; వసుమతికి= భూమికి; ఒందంగన్= ఒప్పునట్లు; చనుదేర వలయు= రావలసింది; నావుడు= అని చెప్పగా; మహీవలయమునకున్= భూమండలానికి; నేను, వచ్చునపుడు= నేను దిగి వచ్చేటప్పుడు; నా నిరంతర జల+ఓఘంబు+తాల్పన్= ఎడతెగని నా నీటి సమూహాన్ని (వెల్లువను) ధరించేందుకు; నీలకంఠుఁడు+ఓపున్= నల్లనికంఠం కల శివుడు తాళగలడు; కాని= కాని; ఒరులు= (ఆ శివుడు తప్ప) ఇతరులు; తాల్పఁగాన్+ఓపరు= ధరించ శక్తులు కారు; ఆ+ఉమా నాథు= ఆ పార్వతీపతి యొక్క; కరుణన్= దయను; నన్నున్+తాల్ప= నన్ను ధరించేందుకు; పడయు= పొందుము.

**తాత్పర్యం:** 'సూర్యుడి వంటి తేజస్సు కల కపిల మహామునిఆగ్రహానికి గురియై మరణించి పుణ్యగతుల చెందకుండా నా తాతలు అల్లాడి పోతున్నారు. నీ పుణ్యజలాల మహిమచేత సగరపుత్రులు స్వర్గలోకాన్ని పొందగలరు. కావున ఓ గంగాదేవీ! నీవు ఈ దేవమార్గంనందుండి భూమండలానికి దిగి రావాలని నా ప్రార్థన' అని భగీరథుడు గంగను ప్రార్థించాడు. అంత ఆ గంగాదేవి 'నేను దివినుండి భువికి దిగి వచ్చేటప్పుడు ఎడతెగని నా నీటి వెల్లువను భరించజాలువాడు ఆ పరమేశ్వరు డొక్కడే. శివుడికి తప్ప ఇతరులు ఎవరికీ అది సాధ్యం కాదు. కావున నీవు ముందు ఆ పార్వతీపతిదయ చూరగొని నన్ను భరించటానికి అతడిని ప్రసన్నుడిని చేసికొనుము'.

**వ. అనిన గంగాదేవివచనంబునఁ గైలాసంబున కరిగి, భగీరథుండు భగవంతు నంతకాంతకు నీశ్వరుగుఱించి పెద్దకాలంబు తపంబు సేసిన, నీశ్వరుండు వానికి సన్నిహితుండయి 'నీవు భూలోకంబునకు గంగావతరణంబు సేయు; మేను గంగ ధరియించెద' ననిన భగీరథుండు వెండియు గంగ నారాధించిన నాతనికిం గరుణించి.81**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; గంగాదేవి వచనంబునన్= గంగాదేవి మాట ప్రకారం; భగీరథుండు= భగీరథుడు; కైలాసంబునకు+అరిగి= శివుడి నివాసమైన కైలాసానికి వెళ్ళి; భగవంతున్= దేవుడైనవాడిని; అంతక+అంతకున్= అంతకుడిని (యముడిని) అంతమొందించిన వాడిని; ఈశ్వరు= శివుడిని; గుఱించి= కూర్చి; పెద్ద కాలంబు= చాలాకాలం; తపంబు+చేసినన్= తపస్సు చేయగా; ఈశ్వరుండు= శివుడు; వానికి= అతడికి- ఆ భగీరథుడికి; సన్నిహితుండు+ఐ= దగ్గరకు వచ్చినవాడై; నీవు; భూలోకంబునకున్= భూమిపైకి; గంగా+అవతరణంబు+చేయుము= గంగ దిగేటట్లు చేయుము; ఏను= నేను; గంగ= గంగను; ధరియించెదన్= ధరిస్తాను; అనినన్= అని చెప్పగా; భగీరథుండు= భగీరథుడు; వెండియు= మళ్ళీ; గంగన్+ఆరాధించినన్= గంగను అర్చించగా; ఆతనికిన్= ఆ భగీరథుడిపై; కరుణించి= దయచూపి.

**తాత్పర్యం:** అని చెప్పగా, గంగాదేవి మాటచొప్పున భగీరథుడు కైలాసానికి వెళ్ళి, భగవంతుడైన ఈశ్వరుడినిగురించి చాలాకాలం కఠోరతపస్సు చేశాడు. ఈశ్వరుడు భగీరథుడి తపస్సుకు మెచ్చి అతడికి ప్రత్యక్షమై, 'నీవు గంగాదేవిని దివినుండి భువికి అవతరింపజేయుము; నేను గంగను ధరించగలను' అని ఆనతిచ్చాడు. భగీరథుడు మళ్ళీ గంగను అర్చించాడు. అంతట గంగాదేవి భగీరథుడిని కరుణించింది.

**మ. ఇలకున్ గంగ తరంగసంగతులతో నేతెంచె నాశాంతరం**
**బులు నాకాశముఁ గప్పుచుం దగ మహాభూత ప్రపంచంబుతోఁ**
**జెలువై యుండఁగ దాని నీశ్వరుఁడు దాల్చెన్ సంగతోత్తుంగ పిం**
**గళజూటాగ్రమునందుఁ బద్మదళసంకాశంబుగా లీలతోన్. 82**

**ప్రతిపదార్థం:** ఇలకున్= భువికి; గంగ= గంగానది; తరంగ, సంగతులతోన్= అలల కలయికలతో; ఆశా+అంతరంబులున్= దిక్కుల మధ్యభాగాలు; ఆకాశమున్= ఆకాశాన్ని; కప్పుచున్= క్రమ్ముతూ; మహాభూత ప్రపంచంబుతోన్= గొప్ప ప్రాణికోటుల సముదాయంతో; చెలువు+ఐ+ఉండఁగన్= విలసిల్లుతుండగా; తగన్= ఒప్పునట్లుగా; ఏతెంచెన్= వచ్చింది; దానిన్= ఆ గంగను; ఈశ్వరుఁడు= శివుడు; సంగత+ఉత్తుంగ, పింగళ, జూట+అగ్రమునందున్= చక్కగా పొసగి ఉన్నదీ; ఎత్తైనదీ, గోరోజనం రంగు కలదీ అయిన జడముడి చివరి భాగంలో; పద్మ, దళ, సంకాశంబుగాన్= తామరపువ్వురేకుతో సరిపోలేటట్లుగా; లీలతోన్= వినోదంగా; తాల్చెన్= ధరించాడు.

**తాత్పర్యం:** గంగానది, అలల కలయికలతో ఆకాసాన్నీ, దిగంతరాలనూ కప్పుతూ భూమిపైకి వచ్చింది. గొప్ప ప్రాణికోటుల సమూహాలతో శోభిల్లేటటువంటి ఆ గంగను శివుడు తన ఎత్తైన గోరోజనం రంగు కల జటాజూటం పైభాగాన తామరపూరేకు పోలికగా విలాసంగా ధరించాడు.

**విశేషం:** ఈ పద్యం గంగావతరణ వర్ణన. నన్నయ ఈ పద్యానికి ముందు వచనాలనూ సీసపద్యాన్నీ వ్రాశాడు. గంగావతరణ వర్ణనకై ఛందస్సు మార్చి మత్తేభపద్యాన్ని కూర్చాడు. సందర్భానికి అనువుగా ఛందస్సు మార్చి వాడే పద్ధతి తెలుగులో నన్నయనాటి నుండి నేటివరకూ కొనసాగుతున్నది. ఇటువంటి ఛందోవైవిధ్యం సంస్కృతవాఙ్మయంలోకాని, ప్రపంచంలో పెక్కు సారస్వతాలలో కాని కనిపించదు. ఛందో వైవిధ్య ప్రయోగం తెలుగుకవితకు గల విశిష్టత. ఈ పద్యంలో బిందు పూర్వక గకార ప్రయోగ పౌనఃపున్యం దీర్ఘ సంస్కృత సమాస పునరావృత్తి అనిర్వచనీయమైన దివ్యానుభూతిని అందిస్తున్నది. ఇది సహృదయ హృదయైక వేద్యం. నన్నయకవితాశిల్పానికి అంతర్భాగమైన అక్షరరమ్యతకూ, ప్రసన్నకథాకవితార్థయుక్తికీ ఈ పద్యం ఉదాహరణప్రాయం.

**సీ.** **సుర ముని సిద్ధ ఖేచరవరుల్ వచ్చి య । చ్చెరువంది చూడంగ హరుశిరంబు**
**నందుండి భువనైకవందిత సురనది। ధరణీతలంబున కరుగుదెంచి**
**కలహంసగతియు నిర్మలఫేనహాసంబు । నాకీర్ణ మీనవిలోకనములు**
**నాలోల పవన వాచాలిత కల్లోల । లసితమృదూక్తులు నెసఁగుచుండఁ**

**తే.** **బ్రీతితో భగీరథుఁ డను దూతచేత । నీతయై మహామునిపరిపీత రిక్త**
**మగు సరిత్పతిఁ గూడి, యాసగరజులకు । హితముగా దాని నించె నాతతజలముల.** **83**

**ప్రతిపదార్థం:** సుర, ముని, సిద్ధ, ఖేచర వరుల్= దేవతలు, మునులు, సిద్ధులు ఆకాశంలో సంచరించే వారిలో శ్రేష్ఠులు; వచ్చి= వచ్చి; అచ్చెరువు+అంది= ఆశ్చర్యం చెంది; చూడంగన్= దర్శించగా; హరు శిరంబు నందుండి= శివుడి తలపై నుండి; భువన+ఏక వందిత= జగత్తులోని ప్రజలందరిచేత ముఖ్యంగా ఆరాధించబడిన; సుర నది= వేలుపుటేరు, గంగానది; ధరణీ తలంబునకున్= భూమిపైభాగానికి; అరుగుదెంచి= వచ్చి; కలహంస, గతియు= రాజహంస నడకయున్నూ; నిర్మల ఫేన హాసంబున్= స్వచ్ఛమైన నురుగు అనే నవ్వు; ఆకీర్ణ, మీన, విలోకనములు= చెదరిన చేపలు అనే చూపులు; ఆలోల, పవన, వాచాలిత, కల్లోల, లసిత, మృదు+ఉక్తులున్= కదిలేటి గాలులచేత మిగుల చప్పుడౌతున్న పెద్ద కెరటాల యొక్క శబ్దాలనెడి శోభిల్లే మెత్తని మాటలు; ఎసఁగుచుండన్= శోభిల్లుతుండగా; ప్రీతితో= సంతోషంతో; భగీరథుఁడు+అను= భగీరథుడు అనే; దూతచేత= సంధానకర్తచేత; నీత+ఐ= వెంటగొనిపోబడేటటువంటిదై; మహా, ముని, పరిపీత, రిక్తము+అగు= గొప్ప ఋషి (అగస్త్యుడి) చేత త్రాగబడి శూన్యమైన; సరిత్+పతిన్+కూడి= సముద్రుడిని చేరి (సరిత్+పతి= నదులకు భర్త= సముద్రుడు); ఆ+సగరజులకున్= ఆ సగరుడి కొడుకులకు; హితముగా= మేలు కలిగేటట్లుగా; దాని= ఆ సముద్రాన్ని; ఆతత+జలములన్= విస్తారమైన నీటితో; నించెన్= నింపింది.

**తాత్పర్యం:** దేవతలు, ఋషులు, సిద్ధులు మున్నగు శ్రేష్ఠులైన ఆకాశసంచారులు వచ్చి ఆశ్చర్యంతో గంగావతరణాన్ని దర్శించారు. శివుడి జటాజూటంనుండి, ప్రజలందరిచేత ఆరాధించబడే దేవనది గంగ దివినుంచి భువికి దిగింది. కలహంస నడక, స్వచ్ఛమైన నురుగు అనే చిరునవ్వు, కదిలే చేపలు అనే చూపులు, వీస్తున్న గాలిచేత ధ్వనించే కెరటాల సవ్వడులు అనే నర్మభాషణాలు కలదై, సంతోషంతో భగీరథుడు అనే దూత వెంట పెట్టుకుని తీసికొని

పోతూఉండగా, అగస్త్యమహర్షిచేత త్రాగబడి శూన్యమై ఉన్న సముద్రుడివద్దకు ఆ సగరసుతులకు మేలుచేయటంకొరకు పయనమై వెళ్ళి, ఆ సముద్రుడిని విస్తారమైన నీటితో నింపింది.

**విశేషం:** అలం: రూపకం. ఇక్కడ గంగానది నాయిక. సరిత్పతియైన సముద్రుడు నాయకుడు. భగీరథుడు సంధానకర్తయైన దూత. శృంగార నాయికా లక్షణాలు కలహంసగతి, ఫేనహాసం, మీనవిలోకనాలు, ఆలోల పవన వాచాలిత కల్లోల లసిత మృదూక్తులు. రక్తుడైన నాయకుడిని కూడటానికి వెళ్ళే గంగ ఉత్తమనాయిక. సాగరుల సముద్ధరణ ఆమె ధ్యేయం.

**క. సాగరులకు సద్గతిగా । సాగరమున కట్లు సలిలసంపూర్ణముగా**
**భూగతయై భాగీరథి । భాగీరథకీర్తి భువనపంక్తుల నించెన్. 84**

**ప్రతిపదార్థం:** సాగరులకు= సగరుడి పుత్రులకు; సత్+గతిగాన్= మంచి గతి కలిగేటట్లుగా; సాగరమునకు= సముద్రానికి; అట్లు= ఆ విధంగా; సలిల సంపూర్ణముగా= నీరు నిండేటట్లుగా; భాగీరథి= గంగానది; భూగత+ఐ= భువికి దిగినట్టిదై; భాగీరథకీర్తి= భగీరథుడియొక్క యశస్సు; భువనపంక్తులన్= పెక్కు లోకాలలో; నించెన్= నింపింది.

**తాత్పర్యం:** సగరుడి కొడుకులకు పుణ్యగతి కలిగేటట్లుగా, సముద్రానికి నిండా నీరు నిండేటట్లుగా, గంగానది భూలోకానికి దిగివచ్చి భగీరథుడి యశస్సును సమస్తలోకాలలో వ్యాపింప చేసింది.

**విశేషం:** గంగానది విశ్వజనీన చరితయై దివినుండి భువికి అవతరించింది. గంగకు భాగీరథి అనే పర్యాయపదం ఏర్పడటానికి ఉపపత్తిని ఈ పద్యం వెల్లడిస్తున్నది. అందుచేతనే గంగానదిని ప్రజలు పరమపవిత్రభావంతో చూస్తున్నారు.

**వ. అని యిట్లు గంగావతరణంబును, భగీరథు మాహాత్మ్యంబును రోమశుండు సెప్పిన విని ధర్మజుం డనుజ సహితుండై యరిగి నందయు నపరనందయును నను మహానదులయందుఁగృతస్నానుండై హేమ కూటంబున నుపలంబులవలన వెలువడు దహనంబున నాహూతంబులై వచ్చు మేఘంబులను జూచి విస్మయంబంది దాని విధం బడిగిన వానికి రోమశుం డిట్లనియె; 'ఋషభకూటంబున ఋషభుండను ముని యతికోపనుండై యెవ్వరు వలికిన నపుడె యుగ్రానలాకారుండై యుపలంబులవలన వెలువడు మేఘంబులం బిలిచి వారల వారించు; దానంజేసి తపోదాన ధర్మ శమదమరహితులైన జనుల కది దురారోహంబు; దేవతలు దేవదర్శనులైన ఋషులు నమ్మునిం జూడ వత్తు; రిందు దేవఋషులు యజ్ఞంబు సేసిన యజ్ఞభూములందుఁ గుశాకారంబులయిన దూర్వాంకురంబులు యూపాకారంబులైన వృక్షంబులుఁ గానంబడు' ననిన నా పుణ్యతీర్థంబున స్నానంబు సేసి యరుగుచున్న ధర్మరాజునకు రోమశుం డిట్లనియె. 85**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; ఇట్లు= ఈ విధంగా; గంగా+అవతరణంబును= గంగ అవతరించటమున్నూ; భగీరథు, మాహాత్మ్యంబును= భగీరథుడి గొప్పతనాన్ని; రోమశుండు= రోమశ మహర్షి; చెప్పిన విని= చెప్పగా ఆలకించి; ధర్మజుండు= ధర్మరాజు; అనుజ సహితుండు+ఐ= తమ్ముళ్ళతో కూడినవాడై; అరిగి= వెళ్ళి; నందయున్= నంద అనే పేరుకల; అపర నందయునున్= అపరనంద అనే పేరుకల; మహానదుల+అందున్= గొప్ప నదులలో; కృత+స్నానుండు+ఐ= చేయబడిన స్నానం కలవాడై, అనగా ఆ నదులలో స్నానం చేసి; హేమకూటంబునన్= హేమకూటం అనే పేరుకల పర్వతశిఖరమందు; ఉపలంబుల వలనన్= రాళ్ళనుంచి; వెలువడు= ఉద్భవించే; దహనంబునన్= మంటచేత; ఆహూతంబులు+ఐ= పిలువబడినట్టివై;

వచ్చు; మేఘంబులన్= మబ్బులను; చూచి= దర్శించి; విస్మయంబు+అంది= అచ్చెరువు నొంది, ఆశ్చర్యపడి; దాని విధంబు+అడిగినన్= దాని రీతిని గురించి ప్రశ్నించగా; వానికిన్= అతడికి అనగా ఆ ధర్మరాజుకు; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; ఋషభకూటంబున= ఋషభకూటం అనే పర్వత శిఖరంమీద; ఋషభుండు+అను= ఋషభుడు అని పిలువబడే; ముని= ఋషి; అతికోపనుండు+ఐ= మిక్కిలి కోపం కలవాడై; ఎవ్వరు+పలికినన్= ఎవరు మాట్లాడినా; అపుడె= ఆ క్షణమందే; ఉగ్ర+అనల+ఆకారుండు+ఐ= భయంకరమైన అగ్ని వంటి రూపం కలవాడై; ఉపలంబుల వలనన్= రాళ్ళనుండి; వెలువడు= బయటికి వచ్చే; మేఘంబులన్+పిలిచి= మబ్బులను ఆహ్వానించి; వారలన్= వారిని; వారించు= అడ్డగిస్తాడు; దానన్+చేసి= అందువలన; తపస్+దాన, ధర్మ, శమ, దమ, రహితులు+ఐన= తపం, దానం, ధర్మం, అంతరింద్రియ నిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం లేనివారు అయిన; జనులకు= ప్రజలకు; అది= ఆ ఋషభకూటం; దుస్+ఆరోహంబు= ఎక్కేందుకు సాధ్యం కానిది; దేవతలు= వేల్పులు; దేవ దర్శనులు+అయిన, ఋషులున్= దేవతల సాక్షాత్కారం పొందే మునులు; ఆ+మునిన్= ఆ ఋషిని; చూడవత్తురు= దర్శించేందుకు వస్తారు; ఇందు= ఇక్కడ, ఇచ్చట; దేవ+ఋషులు= దేవ మునులు; యజ్ఞంబు+చేసిన= యజ్ఞం చేసిన; యజ్ఞ భూములందున్= యజ్ఞవాటికలలో; కుశ+ఆకారంబులు+అయిన= దర్భల వంటి ఆకారంలో ఉన్న; దూర్వా+అంకురంబులు= గరిక మొలకలును; యూప+ఆకారంబులు+ఐన= యజ్ఞంలో నాటబడే స్తంభాల వంటి రూపాలు కల; వృక్షంబులున్= చెట్లున్నూ; కానంబడును+అనినన్= కనిపిస్తాయి అని చెప్పగా; ఆ+పుణ్య తీర్థంబునన్= పుణ్యాన్ని ఇచ్చే ఆ దివ్య క్షేత్రాన; స్నానంబు+చేసి= మునకలు వేసి స్నానాలు చేసి (క్రుంకులిడి); అరుగుచున్న= వెళుతున్న; ధర్మరాజునకు= ధర్మరాజుకు; రోమశుండు+ఇట్లు+అనియెన్= రోమశుడు ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంటూ ఈ విధంగా గంగ భూమికి దిగిన కథను, భగీరథుడియొక్క మహిమను రోమశుడు చెప్పగా విని, ధర్మరాజు తన తమ్ముళ్ళతోపాటు ప్రయాణం చేసి నంద, అపరనంద అనే నదులలో స్నానం చేశాడు. హేమకూట పర్వతంలోని రాళ్ళనుండి పుట్టే అగ్నివలన ఆకర్షించబడి వచ్చే మబ్బులను చూచి పాండవులు ఆశ్చర్యం చెందారు. ఆ వింతనుగురించి చెప్పుమని పాండవులు రోమశమహర్షిని ప్రశ్నించగా అతడు ఈ విధంగా చెప్పాడు: 'ఋషభకూటంలో ఋషభుడు అనేటటువంటి ముని మిక్కిలి కోపస్వభావం కలవాడు. ఎవరు ఏమి మాట్లాడినా అతడికి కోపం వచ్చి మండిపడి రాళ్ళనుండి వెలువడే మబ్బులను పిలిచి వారిని వారిస్తాడు. అందుచేత తపోదాన ధర్మాలు, శమదమాలు లేని వారికి ఆ స్థలం ప్రవేశించ రానిది. దేవతలు, దేవతలను చూచే ఋషులు మాత్రమే ఆ మునిని సందర్శించటానికి వస్తారు. ఇక్కడ దేవతలు యజ్ఞాలు చేశారు. ఆ యజ్ఞ స్థలాలలో గరికపోచలు దర్భల రూపంలో మొలుస్తుంటాయి. అక్కడి చెట్లు యజ్ఞశాలలలోని యూపస్తంభాల వలె ఉంటాయి.' ఆమాటలు విని, ఆ పుణ్యక్షేత్రంలో స్నానంచేసి వెళుతున్న ధర్మరాజుతో రోమశుడు మళ్ళీ ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** ఆధ్యాత్మిక పురోగమనంలో ప్రాచీన భారతీయ సంస్కృతి తపం, దానం, ధర్మం, శమదమాలకు ఒనగూర్చిన ప్రాముఖ్యానికి ఈ గద్యం పునరుద్ఘాటనం. పై శబ్దాల విశేషార్థాలు లోగడ వివరించబడ్డాయి.

**క. 'ఇది విశ్వామిత్రుని యా । స్పద; మిది కౌశికి యనంగఁ బరఁగినయది; య**
**ల్లది ఋశ్యశృంగుఁ డను ముని । హ్రద' మనవుడు ధర్మతనయుఁ డమ్మునిఁ గనియెన్. 86**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ ప్రదేశం; విశ్వామిత్రుని+ఆస్పదము= విశ్వామిత్రుడి నెలవైన ఆశ్రమం; ఇది; కౌశికి+అనంగన్= కౌశికి అనే పేరుతో; పరఁగిన+అది= శోభిల్లింది; అల్లది= అదుగో అది; ఋశ్య శృంగుఁడు+అను= ఋశ్యశృంగుడు అనే పేరు కల; ముని హ్రదము= ఋషియొక్క సరస్సు; అనవుడు= అని చెప్పగా; ధర్మతనయుఁడు= ధర్మరాజు; ఆ+మునికి= ఆ ఋషియైన రోమశుడితో; అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఇది విశ్వామిత్రుడు ఉన్న ఆశ్రమం. ఈ నదికి కౌశికి అని పేరు. అదుగో అక్కడ కనిపిస్తున్న సరోవరం ఋశ్యశృంగుడు అనే ఋషిది'- అని రోమశుడు చెప్పగా ధర్మరాజు అతడితో ఇట్లా అన్నాడు.

**రోమశుఁడు ధర్మజునకు ఋశ్యశృంగుచరిత్రము సెప్పుట (సం. 3-110-6)**

**వ. 'ఋశ్యశృంగుం డను ముని జన్మంబును దచ్చరితంబును వినవలయు; నది యె?' ట్లని యడిగిన రోమశుం డిట్లనియెఁ 'దొల్లి కశ్యపపుత్త్రుండగు విభాండకుండను మునివరుం డఖండితబ్రహ్మచర్యంబునం దపంబు సేయుచు నొక్కనాఁ డొక్క మడువున నీళ్లాడుచున్న యవసరంబున. 87**

**ప్రతిపదార్థం:** ఋశ్యశృంగుండు+అను= ఋశ్యశృంగుడు అనెడి; ముని జన్మంబును= ఋషి పుట్టుకయు; తద్+చరితంబును= అతడి వృత్తాంతమును; వినవలయును= ఆలకించవలెను; అది+ఎట్లు+అని+అడిగిన= అది ఎట్లా అని అడుగగా; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; తొల్లి= పూర్వం; కశ్యప పుత్త్రుండు+అగు= కశ్యపుడి కొడుకైన; విభాండకుండు+అను= విభాండకుడు అనే పేరు కలిగిన; ముని వరుండు= ఋషి శ్రేష్ఠుడు; అఖండిత బ్రహ్మచర్యంబునన్= మొక్కవోని బ్రహ్మచర్యంతో; తపంబు+చేయుచున్= తపస్సు చేస్తూ; ఒక్కనాఁడు= ఒకరోజు; ఒక్క మడువున= ఒక చెరువులో; నీళ్ళు+ఆడుచున్న= స్నానం చేస్తున్న; అవసరంబునన్= సమయాన.

**తాత్పర్యం:** ధర్మరాజు ఋశ్యశృంగుడి జన్మవృత్తాంతాన్ని, అతని చరిత్రను, వినాలని ఉన్నదని రోమశుడిని అడుగగా, ఆ మహర్షి ధర్మరాజుకు ఇట్లా చెప్పాడు: పూర్వకాలంలో కశ్యపుడి కొడుకు విభాండకుడు అనే మహర్షి మొక్కవోని బ్రహ్మచర్యదీక్షతో తపస్సు చేస్తున్నాడు. అతడు ఒకరోజు ఒక చెరువులో స్నానం చేసే సమయాన.

**విశేషం:** ఋశ్యశృంగరూపానికి ఋష్యశృంగుడు అని రూపాంతరమున్నది. అమరకోశాది నిఘంటవుల్లోను పెక్కు రామాయణ భారతప్రతుల్లోను రెండు తీరులుగా ప్రయోగించబడింది.

**క. సురుచిరసురూపగుణసుం । దరి యూర్వశి యను లతాంగి తద్దర్శనగో**
**చర యగుడు నపుడ రేత । స్ఖలనం బమ్మునికి నయ్యెఁ గామకృతమునన్. 88**

**ప్రతిపదార్థం:** సురచిర, సురూప, గుణ, సుందరి= మిక్కిలి ప్రకాశమానమైన గొప్ప సౌందర్య లక్షణాలు కల అందగత్తె; ఊర్వశి+అను= ఊర్వశి అనే పేరు కల; లతా+అంగి= తీగవంటి శరీరం కలది; తద్+దర్శన గోచర+అగుడున్= అతడి కంటికి కన్పించగా; అపుడు+అ= అప్పుడే; ఆ+మునికిన్= ఆ మునికి; కామకృతమునన్= మన్మథుడి వలన; రేతస్+స్ఖలనంబు= వీర్యపాతం; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** అతిలోక లావణ్యవతి, నిరతిశయ సౌందర్యరాశి అయిన ఊర్వశి అనే సుకుమారి ఆ ఋషికి కనిపించింది. వెంటనే ఆ మహర్షి మన్మథవికారానికి లోనయ్యాడు. అతడి వీర్యం జారిపడింది.

**వ. అయ్యమోఘవీర్యంబుతో మిశ్రం బయిన జలంబు నొక్కదుప్పిపెంటి ద్రావి గర్భంబుఁదాల్చిన నందు ఋశ్యశృంగుం డను కుమారుండు జన్మించి, తండ్రినిం, దదాశ్రమంబునుంగాని యొండెఱుంగక ఘోరతపంబు సేయుచున్నంత. 89**

**ప్రతిపదార్థం:** ఆ+అమోఘ, వీర్యంబుతోన్= ఆ మొక్కవోని రేతస్సుతో; మిశ్రంబు+అయిన= కలిసిపోయిన; జలంబున్= నీటిని; ఒక్క, దుప్పి, పెంటి= ఒక ఆడుదుప్పి; త్రావి= త్రాగి; గర్భంబున్+తాల్చినన్= గర్భంధరించగా; అందు= ఆ దుప్పి యందు; ఋశ్యశృంగుండు+అను= ఋశ్యశృంగుడు అనేటటువంటి; కుమారుండు= కొడుకు; జన్మించి= పుట్టి; తండ్రినిన్= తండ్రిని; తద్+ఆశ్రమంబునున్= ఆ ఆశ్రమాన్ని; కాని= తప్ప; ఒండు+ఎఱుంగక= వేరొకటి తెలియకుండ; ఘోరతపంబు, చేయుచు+ఉన్నంతన్= కఠోరమైన తపస్సు చేస్తున్నంతలో.

**తాత్పర్యం:** విభాండకుడి రేతస్సుతో కలిసిన నీటిని ఒక ఆడుదుప్పి త్రాగి గర్భం ధరించింది. ఆ దుప్పికి ఋశ్య శృంగుడు అనే పుత్రుడు జన్మించాడు. ఆ ఋశ్యశృంగుడు తండ్రిని, అతడి ఆశ్రమాన్ని తప్ప వేరొకటి తెలియక మిక్కిలి అమాయకుడుగా కఠోరతపస్సు చేస్తున్నాడు.

**తే. బలియుఁ డంగాధిపతి రోమపాదుఁ డనఁగ । ధరణిఁ బరఁగిన వీరుండు దన పురోహి**
**తాపరాధకృతమున బ్రాహ్మణులచేత । విడువఁబడినఁ దన్మహి కనావృష్టి యయ్యె. 90**

**ప్రతిపదార్థం:** బలియుఁడు= బలవంతుడు; అంగ+అధిపతి= అంగదేశానికి రాజు; రోమపాదుఁడు+అనఁగ= రోమపాదుడు అనే పేరుతో; ధరణిన్= భూమిపై; పరఁగిన= విలసిల్లిన; వీరుండు= శూరుడు; తన, పురోహిత+అపరాధ, కృతమునన్= తాను పురోహితునకు చేసిన అపరాధంవలన; బ్రాహ్మణులచేత= విప్రులచేత; విడువన్+పడినన్= విడిచిపెట్టబడటంచేత; తద్+మహికి= ఆ భూమికి; అనావృష్టి+అయ్యెన్= వానలు కురవకపోవటం సంభవించింది.

**తాత్పర్యం:** బలవంతుడైన రోమపాదుడు అంగదేశానికి రాజు. ఆ మహావీరుడు పురోహితునకు తాను చేసిన తప్పువలన ఆ రాజ్యంలోని విప్రులు ఆ రాజును విడనాడారు. అందుచేత అంగదేశంలో వానలు కురవటం మానివేశాయి.

**వ. దానికి వెఱచి యాతండు బ్రాహ్మణులఁ బరమభక్తి నుపాసించి 'యీ యనావృష్టి దోషం బేమి కారణంబున నయ్యె? దీనికిం దగిన ప్రతీకారం బెద్ది?' యని యడిగిన, వానికిం బ్రసన్నులై బ్రాహ్మణు లిట్లనిరి. 91**

**ప్రతిపదార్థం:** దానికి= ఆ అనావృష్టికి; వెఱచి= భయపడి; ఆతండు= అతడు- రోమపాదుడు; బ్రాహ్మణులన్= విప్రులను; పరమభక్తిన్= మిక్కిలి భక్తితో; ఉపాసించి= పూజించి; ఈ+అనావృష్టి దోషంబు= ఈ వానలేమి అనే దోషం; ఏమి కారణంబునన్= ఏ కారణంచేత; అయ్యెన్= కలిగింది; దీనికిన్= దీనికి; తగిన ప్రతీకారంబు+ఎద్ది= సరిఅయిన విరుగుడు ఏది; అని+అడిగిన= అని ప్రశ్నించగా; వానికిన్= అతడికి- ఆ రోమపాదుడికి; ప్రసన్నులు+ఐ= సుముఖులై; బ్రాహ్మణులు= విప్రులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** అనావృష్టికి వెరచి అంగదేశపురాజైన రోమపాదుడు బ్రాహ్మణులను ఆరాధించి, ఏకారణాన దేశంలో వానలు కురవటం లేదు? అని అడిగి, దానికి విరుగుడు చెప్పం డని వేడగా బ్రాహ్మణులు ప్రసన్నులై రాజుతో ఇట్లా చెప్పారు.

**క. 'కడు దర్పితుఁడని నిన్నున్ । విడిచిరి బ్రాహ్మణులు; వారు విడుచుడు నమరుల్**
**విడిచిరి; దానన వర్షము । దడసె భవద్దేశమునకు ధరణీనాథా! 92**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= ఓ రాజా!; కడు= మిక్కిలి; దర్పితుఁడు+అని= గర్వం కలవాడు అని; నిన్నున్= నిన్ను; బ్రాహ్మణులు= విప్రులు; విడిచిరి= వదలివేశారు; వారు, విడుచుడున్= బ్రాహ్మణులు నిన్ను విడిచిపోవటంచేత; అమరుల్= దేవతలు; విడిచిరి= (నిన్ను) వదలిపోయారు; భవత్+దేశమునకు= నీ దేశానికి; దానన= అందుచేత; వర్షము= వాన; తడసెన్= ఆలసించింది.

**తాత్పర్యం:** 'భూమికి భర్తవైన ఓ రాజా! నీవు చాలా గర్వం కలవాడవని బ్రాహ్మణులు నిన్ను విడిచివేశారు. వారు విడవటంచేత దేవతలు కూడా విడిచివేశారు. అందుచేత నీ దేశంలో వానలు కురవటం లేదు.

**ఉ. శాంతుఁడు ఋశ్యశృంగుఁడను సన్ముని యున్నయెడన్ ధరిత్రికిన్**
**సంతతవర్షణం బగు భృశంబుగ; నట్టివరంబు దొల్లి వృ**
**త్రాంతకుచే దయం బడసె నమ్ముని; గావున ఋశ్యశృంగు వే**
**దాంతసువేది రాఁబనుపు మంగమహీశ్వర! నీదు నేర్పునన్.' 93**

**ప్రతిపదార్థం:** శాంతుఁడు= కామక్రోధాదులను జయించి శమ ప్రవృత్తితో ఉండేయోగి; ఋశ్యశృంగుఁడు+అను= ఋశ్యశృంగుడు అనే పేరుకల; సత్+ముని= మంచిఋషి; ఉన్న+ఎడన్= ఉన్న చోటులో; ధరిత్రికిన్= భూమికి; భృశంబుగన్= అధికంగా; సంతత వర్షణంబు+అగున్= ఎప్పుడూ వానలు కురవటం సంభవిస్తుంది; అట్టి= అటువంటి; వరంబు= వరం; తొల్లి= మునుపు; ఆ+ముని= ఆ ఋషి; వృత్ర+అంతకుచేన్= దేవేంద్రుడివలన; దయన్= కరుణతో; పడసెన్= పొందాడు; కావున= కాబట్టి; అంగ మహీ+ఈశ్వర!= అంగదేశానికిరాజా!; వేదాంత, సు, వేదిన్= వేదాంతాన్ని బాగా తెలిసినటువంటి వాడిని; ఋశ్యశృంగు= ఋశ్యశృంగుడిని; నీదు నేర్పునన్= నీ సామర్థ్యంవలన; రాన్+పనుపుము= వచ్చేటట్లుగా చేయవలసింది.

**తాత్పర్యం:** ఓ అంగరాజా! శాంతప్రవృత్తి కల యోగి ఋశ్యశృంగుడనే మహాముని ఉన్నచోట ఎల్లప్పుడూ వానలు మిక్కుటంగా కురుస్తుంటాయి. ఆ మహర్షి అటువంటి వరాన్ని దేవేంద్రుడి దయవలన సంపాదించాడు. కాబట్టి నీ సామర్థ్యంతో ఆ మహామునిని, వేదాంతవేత్తను, అంగదేశానికి రప్పించుము.

**వ. అనిన విని రోమపాదుండు దన చేసిన బ్రాహ్మణావమానంబునకుం దగిన ప్రాయశ్చిత్తంబుఁ జేసి, బ్రాహ్మణ వచనంబున నపుడ బుద్ధిమంతులతో విచారించి విదగ్ధవేశ్యాంగనలం బిలువంబంచి 'మీనేర్చువిధంబుల ఋశ్యశృంగుం బ్రబోధించి యిటఁ దోడ్కొనిరం' డని పంచిన. 94**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; విని= విని; రోమపాదుండు; తన చేసిన= తాను చేసిన; బ్రాహ్మణ+అవమానంబునకున్= బ్రాహ్మణులకు జరిగిన భంగపాటుకు; తగిన= సరిపోయే; ప్రాయశ్చిత్తంబున్+చేసి= దోషనివారణకు నిష్కృతి చేసి; బ్రాహ్మణ వచనంబునన్= బ్రాహ్మణుల మాట చొప్పున (మాట ప్రకారం); అపుడు+అ= ఆ క్షణమందే; బుద్ధిమంతులతోన్= తెలివికల వారితో; విచారించి= యోచించి; విదగ్ధ, వేశ్యా+అంగనలన్= చతురలైన వేశ్యకాంతలను; పిలువన్+పంచి= పిలిపించి; మీ నేర్చు విధంబుల= మీనేర్పును ప్రయోగించి ఏ విధంగానైనా; ఋశ్యశృంగున్= ఋశ్యశృంగుడిని; ప్రబోధించి= ప్రేరేపించి; ఇటన్, తోడ్కొని, రండు= ఇక్కడికి తీసికొని రండి; అని+పంచినన్= అని నియోగించగా.

**తాత్పర్యం:** రోమపాదుడు తాను బ్రాహ్మణులకు చేసిన అవజ్ఞకు తగిన ప్రాయశ్చిత్తం చేసి, వారు చెప్పినట్లు తెలివి గలవారితో కర్తవ్యాన్నిగురించి ఆలోచించి, వేశ్యలలో చతురలు అయిన సుందరీమణులను పిలిపించి 'మీమీ చాకచక్యం ఉపయోగించి, ఏ రీతిగా అయినా ఋశ్యశృంగుడి మనసు రంజింపచేసి యిక్కడకు తోడ్కొనిరండి' అని నియోగించాడు.

**క. ఆ వేశ్యాజను లధిక ర । సావహభక్ష్యములు విలసదనులేపన మా**
**ల్యావళులుఁ గొనుచు నరిగిరి । నావాశ్రమమునను నమరనారులలీలన్. 95**

**ప్రతిపదార్థం:** ఆ వేశ్యా జనులు= ఆ వేశ్యలసముదాయాలు; అధిక, రస+ ఆవహ, భక్ష్యములు= ఎక్కువ రుచికరాలైన ఆహారపదార్థాలు; విలసత్+అనులేపన, మాల్య+ఆవళులున్= శోభిల్లుతున్నటువంటి, పరిమళిస్తున్నటువంటి మైపూతలు, పువ్వుల సముదాయాలు; కొనుచున్= పుచ్చుకొని; నావ+ఆశ్రమమునను= నావపై నిర్మించిన ఆశ్రమంలో; అమర నారులలీలన్= దేవతా సుందరీమణుల వలె (అప్సరసలవలె); అరిగిరి= పయనించి వెళ్ళారు.

**తాత్పర్యం:** ఆ వేశ్యాంగనలు తమతో మిగుల రుచికరాలయిన ఆహారపదార్థాలను, పరిమళిస్తున్న వివిధ పుష్పాలను, అనులేపనాలను, తీసికొని నావపై నిర్మించిన ఆశ్రమంలో అప్సరసవలె పయనించి వెళ్ళారు.

**విశేషం:** నవాశ్రమం అంటే క్రొత్తగా నిర్మించిన ఆశ్రమమని బ్రౌణ్య నిఘంటువు చెప్పింది. అయితే నావపై నిర్మించిన ఆశ్రమమనే అర్థంలో సంస్కృత మహాభారతం ఆ ప్రయోగాన్ని ప్రయోగించింది. మూలంతో - 'సాతు నవ్యాశ్రమం చక్రే రాజకార్యార్థ సిద్ధయే। సందేశాచ్చైవ నృపతేః స్వబుద్ధ్యా చైవ భారత' 3.111.1. ఈ శ్లోక తాత్పర్యాని కనుగుణంగా 'నావాశ్రమమునను నమరనారులలీలన్' అనే పాఠాన్ని స్వీకరించటమైనది. సంశోధిత ప్రతిలోని 'నావాశ్రమమునకు నమరనారులలీలన్' అనే పాఠంకంటె ఇది సందర్భానికి అనువుగా ఉన్నది. 'పావనునాశ్రమమునకును బణఁతులు లీలన్', 'పావన మగువాని నిజతపోవనమునకున్' (ఇందులో యతిభంగం ఉన్నది)- అనే పాఠంతరాలు కూడా ఉన్నాయి.

**వ. అట విభాండకుండును యథాకాలం బగ్నిహోత్రంబు వేల్వం దన పుత్త్రు ఋశ్యశృంగు సమర్పించి, వన్యఫలాహరణార్థంబు వనంబున కరిగిన యవసరంబున నందొక్క జరద్వేశ్య దనకూతు నభినవ యౌవన విలాస విభాసిని నమ్మునిపుత్త్రుపాలికిం బుచ్చిన, దానిం జూచి ఋశ్యశృంగుండు సంభ్రమంబున. 96**

**ప్రతిపదార్థం:** అట= అక్కడ, ఆ ఆశ్రమంలో; విభాండకుండును= విభాండకమునియున్నూ; యథా కాలంబు= తగిన సమయంలో; అగ్నిహోత్రంబు, వేల్వన్= అగ్నిని ప్రజ్వలింప చేసేందుకు; తన పుత్త్రున్= తనకుమారుడిని; ఋశ్యశృంగున్= ఋశ్యశృంగుడిని; సమర్పించి= ఏర్పాటుచేసి, నియోగించి; వన్యఫల+ఆహరణ+అర్థంబు= అడవిలో పళ్ళు తీసికొని వచ్చుటకై; వనంబునకు= అడవికి; అరిగిన= వెళ్ళిన; అవసరంబునన్= సమయంలో; అందు= అక్కడ; ఒక్క; జరత్+వేశ్య= ముసలి బోగంది; తన కూఁతున్= తన పుత్రికను; అభినవ, యౌవన, విలాస, విభాసినిన్= కొత్త యౌవనంయొక్క హొయలుతో కులుకుతున్న దానిని; ఆ+ముని, పుత్త్రు పాలికిన్= ఆ ఋషి కుమారుడైన ఋశ్యశృంగుడి వద్దకు; పుచ్చినన్= పంపగా; దానిన్+చూచి= ఆ వేశ్యాపుత్రికను చూచి, ఋశ్యశృంగుండు= ఋశ్యశృంగుడు; సంభ్రమంబునన్= ఆదరంతో కూడిన తొట్రుపాటుతో.

**తాత్పర్యం:** ఆ ఆశ్రమంలో విభాండకమహాముని తగినవేళలో అగ్నిహోత్రాన్ని రాజుకొనేటట్లు చేయటానికి తన కుమారుడైన ఋశ్యశృంగుడిని నియోగించి తాను అడవిలో దొరికే పళ్ళు మొదలైనవాటిని తెచ్చేందుకు అడవిలోకి వెళ్ళాడు. ఆ అదను కనిపెట్టి ఒక ముసలివేశ్య కొంగ్రొత్త యౌవనపు మిసిమిహొయలుతో కులుకుతున్న పడుచుపిల్ల అయిన తన పుత్రికను ఋషికుమారుడైన ఋశ్యశృంగుడికడకు పంపింది. ఋశ్యశృంగుడు తన దగ్గరకు వచ్చిన ఆ లేజవరాలిని చూచి ఆదరంతో కూడిన తత్తరపాటుతో (ఆమెకు స్వాగతసత్కారాలు చేసేందుకై ఎదురువెళ్ళి.)

### ఋశ్యశృంగుఁడు వేశ్యను మునికుమారునిఁగా భావించుట (సం. 3-111-9)

**మధ్యాక్కర.**

**'ఎందుండి వచ్చితి ఋషికుమార! యే నెన్నఁడు నిట్టి**
**సుందరాకారు మునిసుతు నేఁ దొల్లి చూచి యెఱుంగ**
**నిందుండు మీ' వని కృష్ణమృగచర్మకృతకుశాసనము**
**నం దుండఁగాఁ బనిచె ఋషి యను బుద్ధి నత్తన్విఁ బ్రీతి. 97**

**ప్రతిపదార్థం:** ఋషికుమార!= ఓ మునిపుత్రా!; ఎందుండి వచ్చితి= ఎక్కడినుంచి వచ్చావు; ఏన్= నేను; ఎన్నఁడున్= ఎప్పుడున్నూ; ఇట్టి= ఇటువంటి; సుందర+ఆకారున్= అందమైన రూపం కలవాడిని; మునిసుతున్= ఋషి కుమారుడిని; తొల్లి= మునుపు; ఏన్= నేను; చూచి+ఎఱుంగన్= చూచి ఉండలేదు; ఈవు= నీవు; ఇందు+ఉండుము= ఇక్కడ మా ఆశ్రమంలో ఉండుము; అని= అని చెప్పి; ఋషి+అను, బుద్ధిన్= ఋషి అని అనుకొన్న బుద్ధితో; ఆ+తన్విన్= ఆ సుకుమారిని; కృష్ణ, మృగ, చర్మ, కృత, కుశ+ఆసనము నందు= నల్లజింకతోలుతో చేయబడిన దర్భల చాపయందు; ఉండగాన్= కూర్చొనుమని; ప్రీతిన్= ఆసక్తితో; పనిచెన్= నియోగించాడు.

**తాత్పర్యం:** 'ఓ మునికుమారా! నీవు ఏ ఆశ్రమంనుండి ఇక్కడకు వచ్చావు? నేను ఇంతకు ముందు ఎప్పుడూ నీ వంటి అందమైన రూపం గల ఋషిపుత్రుడిని చూచి ఉండలేదు (చూడలేదు). నీవు ఇక్కడే ఉండవలసింది' అని ఋశ్యశృంగుడు ఆ వేశ్యాకుమారిని చూచి, ఋషికుమారకుడు అనే భ్రాంతిలో పడి, ఆమె కూర్చునేందుకు నల్లజింకతోలుతో చేసిన దర్భాసనాన్ని పరిచాడు.

**విశేషం:** మహాభారతంలోని ఉపాఖ్యానాలలో ఋశ్యశృంగుడిగాథకు ప్రత్యేకత ఉన్నది. ఋశ్యశృంగుడికి నాగరజగత్తుతో బొత్తిగా పరిచయం లేదు. విభాండకుడు పుట్టుకనుండి తన కొడుకును తన ఆశ్రమంలోనే పెంచాడు. ఋశ్యశృంగుడు అమాయిక కోమలమైన చిత్తప్రవృత్తితో పెరిగినవాడు. తన దగ్గరకు వచ్చిన వేశ్యాంగనను, ఋశ్యశృంగుడు మరొక ఋషికుమారుకుడే అనుకొన్నాడు. స్త్రీ పురుష లింగ విచక్షణ నెరుగలేని అంతటి అమాయిక కోమలచిత్త ప్రవృత్తి అతడిది. ప్రకృతిలో స్త్రీ పురుష భిన్నధ్రువాలకు కల సహజ లలితమైన ఆకర్షణ ఈ కథలో హృదయంగమంగా వివరించబడింది. వృత్తలక్షణానికి ఆర. 2.22 విశేషాంశం చూడండి.

**వ. మఱియు నర్ఘ్యపాద్యాదివిధులను వన్యస్వాదుఫలదానంబులం దాని కతిథిపూజ సేయ నున్న నది యమ్ముని వరున కిట్లనియె. 98**

**ప్రతిపదార్థం:** మఱియున్= అదీకాక; అర్ఘ్య, పాద్య+ఆది, విధులను= స్వాగత సత్కారానికి అతిథికి అందించే నీరు, కాళ్ళు కడుక్కొనేందుకు ఇచ్చే నీరు మొదలైన శాస్త్రీయసూత్రాలకు అనుగుణంగా; వన్య, స్వాదు, ఫలదానంబులన్= అడవిలో దొరికే రుచికరమైన ఫలాలను అందించటాలతో; దానికి= ఆ వేశ్యాకుమారికి; అతిథి, పూజ= అతిథికి చేసే స్వాగతసత్కారాలు; చేయన్+ఉన్నన్= చేయటానికి పూనుకోగా; అది= ఆ వేశ్య; ఆ+మునివరునకు= ఆ ఋషిశ్రేష్ఠుడైన ఋశ్యశృంగుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** అదీకాక, ఆ ఋశ్యశృంగుడు ఆ వేశ్యాకుమారికి అర్ఘ్యం, పాద్యం సమర్పించి అడవిలో దొరికే రుచికరాలైన పళ్ళు సమర్పించి స్వాగతసత్కారం చేసేందుకు పూనుకోగా ఆమె యిట్లా చెప్పింది.

**క. 'మా యాశ్రమ మిందులకున్ । న్యాయనిధీ! మూఁడుయోజనంబులు గల దేఁ**
**బోయెద; నీవును విజయం । చేయుమ యందులకుఁ; జెలిమి సేయుము నాతోన్. 99**

**ప్రతిపదార్థం:** న్యాయనిధీ!= న్యాయానికి నిధియైనవాడా, అనగా ధర్మమూర్తీ!; మా+ఆశ్రమము= మా ఆశ్రమం; ఇందులకున్= ఈ మీ ఆశ్రమానికి; మూఁడు; యోజనమ్ములు+కలదు= మూడు ఆమడల దూరాన ఉన్నది; ఏన్= నేను; పోయెదన్= వెళ్ళుతాను; ఈవును= నీవుకూడ; అందులకున్= అక్కడికి, అంటే మా ఆశ్రమానికి; విజయం చేయుము+అ= దయచేసి రావలసింది; నాతోన్= నాతోటి; చెలిమి= స్నేహం; చేయుము= చేయవలసింది.

**తాత్పర్యం:** 'ఓ న్యాయనిధీ! మా ఆశ్రమం ఇక్కడికి మూడు ఆమడల దూరాన ఉన్నది. నీవు కూడ దయచేసి అక్కడికి వేంచేయుము. నాతో స్నేహం చేయుము.

**వ. అట్లేని నీచేత సత్కారంబుఁగొందు' ననిన ఋశ్యశృంగుం 'డట్లు సేయుదు' నని దాని నాతిథ్య విధానంబునం బూజించి తనకు దాని యిచ్చిన దివ్యగంధమాల్యంబులును సరసభక్ష్యపానంబులును, విచిత్రవస్త్రంబులుం బరిగ్రహించిన నదియును. 100**

**ప్రతిపదార్థం:** అట్లు+ఏని= నీ వట్లా సమ్మతిస్తే; నీచేత; సత్కారంబున్+కొందున్+అనిన= సమ్మానాన్ని గైకొంటాను అనగా; ఋశ్యశృంగుండు; అట్లు= ఆ విధంగా; చేయుదును+అని= చేస్తానని చెప్పి; దానిన్= ఆమెను- ఆ వేశ్యాపుత్రికను; ఆతిథ్య, విధానంబునన్+పూజించి= అతిథి మర్యాదలతో శాస్త్రోక్తంగా పూజించి; తనకు; దాని+ఇచ్చిన= ఆమె ఇచ్చిన; దివ్య, గంధ, మాల్యంబులును= గొప్ప పరిమళాలను వెదజల్లే మైపూత ద్రవ్యాలను, పువ్వులను; సరస భక్ష్య, పానంబులును= రుచికరాలైన తిను బండారాలను, పానకాలను; విచిత్ర, వస్త్రంబులును= అద్భుతమైన వస్త్రాలను; పరిగ్రహించినన్= పుచ్చుకోగా; అదియును= ఆమె కూడా.

**తాత్పర్యం:** నీవు మా ఆశ్రమానికి వచ్చేందుకు అంగీకరించినట్లైతే నేను నీ అతిథి సత్కారాలను గైకొంటాను'- అని వేశ్యాపుత్రిక ఋశ్యశృంగుడితో చెప్పగా, అత డందుకు సమ్మతించి, ఆమెను ఆతిథ్య స్వాగతసత్కారాలతో అర్చించి, ఆమె తనకు బహూకరించిన సుగంధపుష్పాలను, అద్భుతాలైన బట్టలను, తినుబండారాలను, పానీయాలను పరిగ్రహించాడు. ఆమెయున్నూ.

**క. మునిముందటఁ గందుకన । ర్తన మృదుగీతములయందుఁ దనకౌశల మె**
**ల్లను జూపి విరచితాలిం । గనయై మునిపతికి ముదము గావించె మదిన్. 101**

**ప్రతిపదార్థం:** ముని ముందటన్= ఋషి ఎదుట-ఆ ఋశ్యశృంగుడి సమక్షంలో; కందుక, నర్తన, మృదు, గీతముల+అందున్= బంతి ఆటలో, నాట్యంలో, మనోహరమైన పాటలలో; తన, కౌశలము+ఎల్లను= తన చాతుర్యాన్ని అంతా; చూపి= ప్రదర్శించి; విరచిత+ఆలింగన+ఐ= ఘటించిన కౌగిలి కలదై- ఋశ్యశృంగుడిని తన బిగికౌగిలిలో అదిమిపట్టి; ముని పతికిన్= ఋషి శ్రేష్ఠుడైన ఋష్యశృంగుడికి; మదిన్= మనస్సులో; ముదము= సంతోషం; కావించెన్= కలిగించింది.

**తాత్పర్యం:** ఆ వేశ్యాపుత్రిక ఋశ్యశృంగుడి ఎదుట బంతి ఆటలో, నాట్యకళలో, మనోహరమైన పాటలు పాడటంలో తనకు కల చాతుర్యాన్నంతా ప్రదర్శించి, అతడిని తన బిగికౌగిలిలో చేర్చుకొని ఆ ఋషివరుడికి మిక్కిలి సంతోషం కలుగజేసింది.

**వ. ఇట్లు ఋశ్యశృంగుం బ్రబోధించి వేశ్యాపుత్త్రి యరిగిన, దాని పోయినవలను సూచుచు ఋశ్యశృంగుఁ డగ్నిహోత్రంబు వేల్వమఱచి విపరీతబుద్ధియై యున్ననంత నడవినుండి వన్యఫలంబులు గొనివచ్చివిభాండకుండు గొడుకుం జూచి 'యి ట్లేల చింతాపరుండవై యగ్నిహోత్రంబు వేల్వక కాలాతిక్రమంబు సేసి?' తనినఁ దండ్రికి ఋశ్యశృంగుం డిట్లనియె. 102**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఋశ్యశృంగున్= ఋశ్యశృంగుడిని; ప్రబోధించి= బాగా ప్రేరేపించి; వేశ్యా పుత్త్రి= వేశ్యాకుమారి; అరిగిన= వెళ్ళగా; ఋశ్యశృంగుండు; దాని, పోయిన, వలను= ఆమె వెళ్ళిన వైపే; చూచుచు= చూస్తూ; అగ్నిహోత్రంబు, వేల్వ, మఱచి= అగ్నిని ప్రజ్వలింపచేయటం- సమిధలు మొదలైన వాటిని అందులో వేయటం విస్మరించి; విపరీత బుద్ధి+ఐ+ఉన్నన్= తారుమారైన మనసుతో ఉండగా; అంత= అంతట; అడవినుండి; వన్య ఫలంబులు= అడవిపళ్ళు; కొనివచ్చి= తీసికొనివచ్చి; విభాండకుండు; కొడుకున్+చూచి; ఇట్లు+ఏల= ఈ విధంగా ఎందుకు; చింతా పరుండవు+ఐ= విచారగ్రస్తుడివై; అగ్నిహోత్రంబు వేల్వక= అగ్నిని రగుల్కొల్పకుండా; కాల+అతిక్రమంబు+చేసితి= కాలాన్ని అతిక్రమించావు; అనినన్= అని అడుగగా; తండ్రికిన్; ఋశ్యశృంగుండు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఋశ్యశృంగుడికి దేహేంద్రియస్పృహను చక్కగా వికసింపచేసి వేశ్యాకుమారి వెళ్ళిపోయింది. ఋశ్యశృంగుడు ఆ వేశ్యాపుత్రిక వెళ్ళినవైపే తన దృష్టిని నిలిపి అగ్నిహోత్రాలను వేల్చక పరాకుతో తారుమారైన బుద్ధితో అట్లాగే ఉన్నాడు. అంతలో అడవినుంచి పళ్ళుమొదలైనవాటిని సేకరించి ఆశ్రమానికి వచ్చి విభాండకుడు తనకొడుకును చూచి ఈ రోజు ఇట్లా ఎందుకు అగ్నిహోత్రాన్ని వేల్చకుండా చింతాక్రాంతుడివై ఉన్నావు? కాలాన్ని అతిక్రమించా వెందుకు?' అని అడుగగా అతడికి ఋశ్యశృంగుడు ఇట్లా బదులు పలికాడు.

**విశేషం:** వేశ్యాపుత్రిక ఋశ్యశృంగుడిని 'ప్రబోధించి' వెళ్ళిపోయిందట. 'ప్రబోధించు' అన్న ప్రయోగం ఇక్కడ చాలా అర్థవంతమైనది. తెలియని వాడికి తెలియ చెప్పటం. 'బోధించటం' ఇక ప్రబోధం అంటే ఏమిటి? మానవ మనస్సు (మస్తిష్కం) లో ఎన్నో అరలు, పొరలు, ఎన్నో దొంతరలు ఉంటాయి. శృంగార లాలసత్వం వాసనారూపాన నిద్రాణమై సమస్తజీవకోటిలో అంతరాంతరాలలో అణగి ఉంటుంది. ఆ శృంగారప్రవృత్తిని జాగృతంచేసి ఋశ్యశృంగుడి మనసులో మేలుకొల్పింది వేశ్యాకుమారి. నిద్రాణమై ఉన్న ఆంతరంగిక ప్రజ్ఞలను మేలుకొల్పుటమే ప్రబోధం అని చెప్పవచ్చును. పై వచనం మూడవ పంక్తిలో వావిళ్లప్రతిలో 'కాలాతిక్రమణంబు సేసి'- అనే పాఠం ఉన్నది.

**సీ. 'కాంచనవర్ణుండు గడు రూపవంతుండు । గమ్మని జడలతో ఘనము లగుచు**
**ననయంబు వట్రువలగు రెండు పిండంబు । లురమున విలసిల్లుచుండ, నఱుత**
**వెలుఁగుచు జపమాల వ్రేలంగ, నన్నువ । నడుమును వడఁకంగ, నడచునపుడు**
**కలహంసకూజితకలనాద మెసఁగ నా । పాలికి నేఁ డొక్క బ్రహ్మచారి**

**ఆ. వచ్చిపోయె; వానివదనంబువలన వె । ల్వడు సుగంధిమధురభాషితంబు**
**పొలుచు వినఁగ సమదపుంస్కోకిలాలాప । చారు వగుచు హృదయ సమ్మదముగ. 103**

**ప్రతిపదార్థం:** కాంచన వర్ణుండు= బంగారు రంగు కలవాడు; కడు= మిక్కిలి; రూపవంతుండు= అందగాడు; కమ్మని జడలతోన్= సొగసైన జడలతో; ఘనములు+అగుచున్= పెద్దవిగా ఉన్నటువంటి; అనయంబు= ఎల్లప్పుడు; వట్రువలు+అగు= గుండ్రంగా ఉన్నటువంటి; రెండు+పిండంబులు= రెండు ఉండలు; ఉరమునన్= వక్షస్థలమందు; విలసిల్లుచుండన్=

శోభిల్లుతుండగా; అఱుతన్= కంఠమందు; వెలుఁగుచు= ప్రకాశమానమై; జపమాల= జపం చేసుకునేందుకు అనువైన దండ; వ్రేలంగన్= వేలాడగా; అన్నువ= అలతి అయిన; నడుమును= కౌను; వడఁకంగ= అల్లాడగా; నడచునపుడు= నడుస్తున్నప్పుడు= కలహంస, కూజిత, కలనాదము= రాజహంసక్రేంకారం వలె అవ్యక్త మధుర నినాదం; ఎసఁగ= అతిశయించగా; నేఁడు= ఈ రోజు; నా, పాలికి= నా దగ్గరకు; ఒక్క= ఒక; బ్రహ్మచారి= ఋషి కుమారుడు; వచ్చిపోయె= వచ్చి వెళ్ళిపోయాడు; వాని, వదనంబు వలన= అతడి ముఖంనుండి; వెల్వడు= బయటికి వచ్చే; సుగంధి, మధుర, భాషితంబు= మంచి పరిమళంతోకూడిన తియ్యనైనపలుకు; సమద, పుంస్కోకిల+ఆలాప, చారువు+అగుచు= మదించిన గండుకోయిలయొక్క కూజితంవలె సొంపారుతూ; హృదయ, సమ్మదముగన్= డెందానికి ఆనందంగా; వినఁగన్= వినటానికి; పొలుచున్= ఒప్పినది.

**తాత్పర్యం:** 'నేడు నాదగ్గరకు ఒక బ్రహ్మచారి వచ్చివెళ్ళాడు. అతగాడు మిగుల రూపవంతుడు; బంగారురంగు కలిగి మిక్కిలి అందమైన జడలు కలవాడు. అతడి వక్షస్థ్సలాన గుండ్రనివై, ఘనములై విలసిల్లే రెండు మాంసపు ముద్దలు ఉన్నాయి.  అతడి కంఠంలో ఒక చక్కటి జపమాల వెలుగుతున్నది (ప్రకాశిస్తున్నది). అతడి సన్నటి నడుము వణుకుతున్నది. అతడు నడిచేటప్పుడు (ఆతని పాదాలనుండి) కలహంస కూజితంవలె అవ్యక్త మధురమైన ధ్వని వెలువడుతున్నది. అతడి ముఖంనుండి వెలువడే మాటలు తీయనివై, సుగంధాన్ని వెదజల్లేటటువంటివై వినటానికి మదించిన గండుకోయిలల ఆలాపాలవలె మనస్సుకు ఆనందం కొలుపుతున్నాయి.

**విశేషం:** ఈ సీసపద్యంలోని అర్థాంతరస్ఫూర్తి హృదయంగమమైంది. ఋశ్యశృంగుడు 'బ్రహ్మచారి' అనుకొని అభివర్ణించింది నిజానికి వేశ్యాపుత్రికను. కాంచన వర్ణం, కమ్మని జడలు, ఘనములు, వట్రువలు అయిన రెండు మాంసపిండాలు ఆ బ్రహ్మచారి వక్షస్థలాన ఉన్నాయి. అవి వేశ్యాపుత్రిక వక్షోజాలు. కంఠమందు జపమాలగా ఋశ్యశృంగుడు భావించింది ఆమె ధరించిన వజ్రహారం. సన్నటి (అన్నువ) నడుముతో ఆమె నడయాడేటప్పుడు వెలువడే కలహంస కూజిత కలనాదం ఆమె చరణమంజీర క్వణదణుకింకిణీరవం. ఆమె నోటినుంచి వెలువడే గీతాలు గండుకోయిలల ఆలాపాలవలె డెందాన్ని అలరిస్తున్నాయి. పుంస్కోకిలాలాపం: పాడేటటువంటిది మగకోకిలేకాని ఆడకోకిల కాదు. నన్నయ లోకజ్ఞుడు. ప్రతిభాశాలి. అతడు పుంస్కోకిలాలాపాన్నే ప్రస్తావించాడు. పలువురు కవులు కోకిలవధూకలకాకలీధ్వనులను వర్ణించటం వేరు. నన్నయ పరిజ్ఞానం వేరు. పైపద్యం రెండవ పంక్తిలో కొన్ని ప్రతుల్లో 'వట్రువలగు రెండు శృంగంబు లురమున' - అనే పాఠాంతరం ఉన్నది.

**క. ఆ ఋషికుమారు కట్టిన । చీరలు నతిమృదులములు విచిత్రములు; మనో**
**హారము వాని బృహత్కటి । భారము; నం దొక్క కనకపట్టము వెలుఁగున్. 104**

**ప్రతిపదార్థం:** ఆ ఋషికుమారుకట్టిన చీరలున్= ఆ మునికుమారుడు కట్టుకొన్న వస్త్రాలు; అతిమృదులములు= మిక్కిలి మెత్తటివి; విచిత్రములు= అత్యద్భుతాలైనవి; వాని బృహత్+కటిభారమునందు= అతడి బరువైన పెనుమొలయందు అంటే విశాలమైన జఘనభాగమందు; మనస్+హారము= మనోహారము-మనసును హరించేటటువంటిది; ఒక్క, కనక, పట్టము= ఒక బంగారు పట్టీ (ఒడ్డాణం); వెలుఁగున్= ప్రకాశిస్తున్నది.

**తాత్పర్యం:** ఆ ఋషిపుత్రుడు కట్టిన వస్త్రాలు ఆహా! ఎంత సుకుమారాలైనవి! ఎంత అద్భుతమైనవి! వాడి విశాల జఘనప్రదేశమందు మనసును హరించే ఒక బంగారు ఒడ్డాణం శోభిల్లుతున్నది.

**విశేషం:** ఋశ్యశృంగుడు ఎంత అమాయిక కోమలమనస్కుడైనా వేశ్యాపుత్రిక వేషభాషలు అతడిని ఆకర్షించాయి. ఈ ఆకర్షణలో లౌకికకాలుష్యం లేదు, కాని, నైసర్గికమైన, ప్రకృతిసిద్ధమైన, వర్ణనాతీతమైన ఒకానొక అనుభూతి తొణికిసలాడుతున్నది. ఆ ఋషి కుమారుడు ధరించిన వస్త్రాలు అరణ్యాలలో ఋషికుమారులు ధరించే నారబట్టలు కావు గదా. అవి అతి మృదులములైన పీతాంబరాలు. వాడి విశాల జఘనభారమందు శోభిల్లే కాంచనపట్టం, కాంచన కాంచీదామం. సాధారణ బ్రహ్మచారులకు, వనవాసాన శుష్కించిన బ్రహ్మచారులకు బృహత్కటిభారం ఉండదు. ఈ బ్రహ్మచారికి గల బృహత్కటిభారం ఋశ్యశృంగుడిని ఆకర్షించింది!

**క. పవనసమీరిత మధుసం । భవ వివిధప్రసవసౌరభముఁ బోలి ముని**
**ప్రవరుని తనువునయం దు । ద్భవమై రమ్యమయి సౌరభము విలసిల్లున్. 105**

**ప్రతిపదార్థం:** పవన, సమీరిత, మధు, సంభవ, వివిధ, ప్రసవ, సౌరభమున్+పోలి= గాలిచేత వ్యాపింప చేయబడిన వసంతమందు పుట్టిన పెక్కు పువ్వుల నెత్తావులను పోలి; ముని, ప్రవరుని, తనువున+అందు= ఋషిశ్రేష్ఠుడి శరీరమందు; ఉద్భవము+ఐ= పుట్టినదై; రమ్యము+అయి= సొంపైనదై; సౌరభము= సువాసన; విలసిల్లున్= శోభిల్లుతుంది.

**తాత్పర్యం:** ఆ మునిశ్రేష్ఠుడి తనువునుండి వెలువడిన సొగసైన నెత్తావి, ఆమనిలో వికసించే వేర్వేఱు పూలపైనుండి వీతెంచే గాలియందలి సౌరభంవలె రమ్యంగా విలసిల్లుతున్నది.

**విశేషం:** ఆ బ్రహ్మచారిశరీరంనుండి వెలువడే సుగంధం వసంతఋతువులో వికసించే నానాపుష్పసౌరభాలను పోలి శోభిల్లుతుంది- అనటంచేత ఆ వేశ్య పూసికొన్న అత్తరుల నెత్తావి ద్యోతకమవుతున్నది.

**వ. మఱియు నక్కుమారుం డొక్క యెఱ్ఱనిఫలంబు దన దక్షిణపాణితలంబున నందంద చఱచుచు నది నేలంబడి యెగయం బోయిన వలనికి వ్రాలుచు వాతావధూతంబైన బాలవృక్షంబునుం బోలె నొప్పుచున్న నమ్మునిపుత్త్రు నందు నా హృదయంబు దద్దయుం దగిలినయది. 106**

**ప్రతిపదార్థం:** మఱియున్= వెండియు; ఆ+కుమారుండు= ఆ బ్రహ్మచారి; ఒక్క+ఎఱ్ఱని, ఫలంబు= ఒక ఎఱ్ఱని పండు; తన, దక్షిణ, పాణి, తలంబునన్= తనకుడిచేతి పైభాగాన; అందు+అందు+అ= అక్కడక్కడా; చఱచుచున్= కొట్టూ, కొడుతూ, చరుస్తూ, అది= ఆ పండు; నేలన్+పడి= భూమిపై పడి; ఎగయన్= ఎగురగా; పోయిన, వలనికి, వ్రాలుచు= పోయిన చోటికి వంగుతూ; వాత+అవధూతంబు+ఐన= గాలిచేత అటూ ఇటూ ఊపబడిన; బాలవృక్షంబునున్+పోలెన్= చిన్నచెట్టువలె; ఒప్పుచున్నన్= విలసిల్లుతుండగా; ఆ+ముని, పుత్త్రు+అందు= ఆ ముని కుమారుని యందు; నాహృదయంబు= నా హృదయం; తద్దయున్= మిక్కుటంగా; తగిలినయది= తగుల్కొన్నది.

**తాత్పర్యం:** మరియున్నూ, ఆబ్రహ్మచారి ఒక ఎర్రని పండును తన కుడి అరచేతితో మోదుతూ, అది నేలమీదపడి మళ్ళీ మీదికి ఎగిసేటప్పుడు దానియెడకు వాలుతూ గాలిచేత విసరబడిన చిన్నచెట్టువలె తూగాడినాడు. ఆ ఋషి కుమారుడిపట్ల నా హృదయం మిక్కుటంగా ఆకర్షితమైనది.

**విశేషం:** (1) ఇది కందుకక్రీడాభివర్ణన అన్నది తేటతెల్లం. (2) ఉపమాలంకారం: వాతావధూతమైన బాలవృక్షం ఉపమానం. కందుకక్రీడా నిపుణ అయిన వేశ్యాంగన ఉపమేయం. చెట్టు మొదలు కదలదు. గాలిచేత కొమ్మలు, రెమ్మలు కదులుతాయి. అట్లాగే వేశ్యాంగన పాదాలు కదలకుండా చేతులను మాత్రమే ఆడించింది. ఇది సమానధర్మం.

**ఉ. నన్నను గౌఁగిలించుకొని నా వదనంబునకున్ నిజాస్య మా**
**సన్నముఁ జేసి యొక్క మృదుశబ్దము సేసె మనోహరంబుగా;**
**నెన్నఁడు నట్టి శబ్దము మునీశ్వర! మున్ విని యే నెఱుంగ; న**
**య్యన్నువ బ్రహ్మచారిముఖ మంబురుహంబు సమంబు సూడఁగన్. 107**

**ప్రతిపదార్థం:** నన్నును= నన్ను; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; నా వదనంబునకున్= నాముఖానికి; నిజ+ఆస్యము= తనముఖం; ఆసన్నమున్+చేసి= దగ్గరికి కలిసేటట్లు చేసి; ఒక్క= ఒక; మృదు, శబ్దము= మెత్తటిసవ్వడి; మనస్+హరంబుగాన్= మనసును హరించేటట్లుగా; చేసె= వెలువడ చేశాడు; ముని+ఈశ్వర!= మునులలో ఈశ్వరుడి వంటివాడా! ఋషిశ్రేష్ఠుడా!; ఎన్నఁడున్= ఎప్పుడు; అట్టి, శబ్దము= అటువంటి (వీనులకు విందైన) ధ్వని; మున్= మునుపు; ఏన్= నేను; విని= విని; ఎఱుంగను= ఎఱుగను; ఆ+అన్నువ, బ్రహ్మచారి, ముఖము= ఆ లేత ఋషికుమారుడి ముఖం; చూడఁగన్= చూడగా; అంబురుహంబు సమంబు= పద్మంతో సమానం.

**తాత్పర్యం:** ఓ ఋషిశ్రేష్ఠుడా! ఆ బ్రహ్మచారి నన్ను ఆలింగనం చేసికొని, నా ముఖానికి దగ్గరగా తన ముఖం చేర్చి మనోహరమైన ఒక మృదునాదం వెలువడచేశాడు. వీనులకు విందైన అటువంటి మధుర ధ్వని మునుపెన్నడూ నేను వినలేదు. అరసిచూడగా ఆ లేత బ్రహ్మచారి ముఖం తామరపువ్వుతో సరిపోలుతుంది.

**విశేషం:** 'ఆ బ్రహ్మచారి' తనను కౌగిలించుకొన్న తరువాత ముద్దుపెట్టుకొన్నట్లు ఋశ్యశృంగుడు తండ్రికి వర్ణించి చెప్పవలసి ఉన్నది. అయితే ముద్దు ఋశ్యశృంగుడికి అనుభవామ్రేడితమైనట్టిదికాదు కదా. అనుభవైక వేద్యమైన విషయాన్ని వర్ణించేందుకు మాటలు చాలవు. మాటలలో చెప్పలేని అనుభూతిని మాటలలో చెప్పటమే కవితాకళలోని విచిత్ర విరోధాభాసం. ముద్దును ఏమాత్రం వాచ్యం చేయకుండా ఋశ్యశృంగుడు చేసిన అభివర్ణన చదివితే సహృదయులు తలలూపక తప్పదు కదా. ఇక భారతీయ సాహిత్యంలో కవులు ఎందరెందరో యుగయుగాంతరాలలో నాయికముఖాన్ని పద్మంతో పోల్చారు. అంత పాత పడిన ఉపమానం వేరొకటి లేదేమో. అయినా ఋశ్యశృంగుడు 'అయ్యన్నువ బ్రహ్మచారి ముఖ మంబురుహంబు సమంబు' అనగా ఆ తామరపువ్వులో సృష్టి ప్రారంభ సమయంలోని తొలి ఉషస్సు సొారు తొణికిసలాడుతున్నది. ఋశ్యశృంగుడు క్రాంతదర్శియై ఆ బ్రహ్మచారి ముఖంలో అంబురుహ శోభ సందర్శించాడు. అలం: ఉపమాలంకారం.

**వ. నా యిచ్చిన వన్యస్వాదుఫలంబు లాదరించి యారగింప కమ్మునికుమారుం డమృతోపమానంబు లైన ఫలంబులు నతిమధురంబులైన పానీయంబులు నాకు నిచ్చిన నుపయోగించితి. 108**

**ప్రతిపదార్థం:** నా+ఇచ్చిన= నేను ఇచ్చిన; వన్య, స్వాదు, ఫలంబులు= అడవిలోని రుచికరాలైన పళ్ళు; ఆదరించి= మన్నించి; ఆరగింపక= తినక; ఆ+ముని, కుమారుండు= ఆ ఋషి పుత్రుడు; అమృత+ఉపమానంబులు+ఐన= అమృతంతో సరిపోల్చతగిన; ఫలంబులును= పళ్ళున్నూ; అతి, మధురంబులు+ఐన= మిక్కిలి తీయనైన; పానీయంబులు= పానకాలు; నాకున్+ఇచ్చినన్= నాకు సమర్పించగా; ఉపయోగించితిన్= స్వీకరించాను.

**తాత్పర్యం:** నేను ఇచ్చిన అడవిలోని మంచిపళ్ళను ఆదరించి తినకుండా, ఆ ఋషికుమారుడు అమృతంతో సరిపోలేటటువంటి పళ్ళను, మిక్కిలి తియ్యనైన పానీయాలను నాకు ఈయగా నేను ఉపయోగించాను.

**క. తన చేతి పుష్పములఁ జ । ల్లిన నంతటఁ జెదరి యవి యళిప్రకరనిషే**
**వన మొప్ప నున్నయవి; యి । వ్వనకుసుమము లట్లు గావు వరగంధంబుల్. 109**

**ప్రతిపదార్థం:** తన చేతి పుష్పములన్= తన చేతిలోని పువ్వులను; చల్లినన్= విసరగా; అవి= ఆ పువ్వులు; అంతటన్= అన్ని వైపుల; చెదరి= అటూ ఇటూ పడి; అళిప్రకర నిషేవనము+ఒప్పన్= తుమ్మెదల గుంపులచేత చక్కగా ఆస్వాదించబడుతూ; ఉన్న+అవి= ఉన్నాయి; ఈ+వనకుసుమముల+అట్లు= ఈ అడవిలోని పూవుల వలె; కావు= కావు; వరగంధంబుల్= (అవి) శ్రేష్ఠమైన పరిమళం కలవి.

**తాత్పర్యం:** ఆ బ్రహ్మచారి తనచేతిలోని పువ్వులను వెదచల్లగా, అవి అంతటా చెదరిపడి తుమ్మెదలచేత చక్కగా సేవించబడుతూ శోభిల్లాయి. అవి ఈ అడవిపూల వంటివి కావు. (అనగా ఈ అడవి పూలు అంతగా వాసన లేనివని భావం.) ఆ పువ్వులు శ్రేష్ఠమైన పరిమళం కలవి.

**వ. నాకు నమ్మునిపుత్త్రునాశ్రమంబునందు వానితో నొక్కటఁ దపంబు సేయుచుండు నిష్టం' బనినఁ గొడుకు పలుకులు విని విభాండకుండు విస్మితుండై 'తపస్వుల తపంబులకు విఘ్నంబులు సేయ ననేక రూపులయి రాక్షసులు వనంబునం గ్రుమ్మరుచుండుదురు; తజ్జనదత్తంబు లయిన పానీయంబు లపేయంబు; లతి సుగంధులయిన కుసుమంబులు మునులకు వర్జనీయంబు' లని కొడుకుం బ్రబోధించి, యెప్పటియట్ల వన్యఫలంబులు దేర నరిగిన. 110**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; ఆ+ముని, పుత్త్రు= ఆ ఋషి కుమారుడియొక్క; ఆశ్రమంబునందు, వానితోన్, ఒక్కటన్= ఏకాంతంగా వాడితో కలిసి ఆశ్రమంలో; తపంబు+చేయుచుండన్= తపస్సు చేస్తూ ఉండటం; ఇష్టంబు+అనినన్= కోరిక అయినది అనగా; కొడుకు, పలుకులు= కుమారుడి మాటలు; విని= ఆలకించి; విభాండకుండు= విభాండక ముని; విస్మితుండు+ఐ= అచ్చెరువందినవాడై; తపస్వుల, తపంబులకు= మునుల తపస్సులకు; విఘ్నంబులు+చేయన్= ఆటంకాలు కల్పించేందుకు; అనేక, రూపులు+ఐ= పెక్కు ఆకారాలు (రూపాలు) ధరించినవారై; రాక్షసులు; వనంబునన్= అడవిలో; క్రుమ్మరుచు+ఉండుదురు= తిరుగుతూ ఉంటారు; తద్+జన దత్తంబులు+అయిన= ఆ జనాలచేత ఇవ్వబడిన; పానీయంబులు= పానీయాలు; అపేయంబులు= త్రాగకూడనివి; అతి, సుగంధులు+ఐన= మిక్కుటమైన పరిమళం కల; కుసుమంబులు= పువ్వులు; మునులకు= ఋషులకు; వర్జనీయంబులు= వదలిపెట్టతగినవి; అని= అని చెప్పి; కొడుకున్= కుమారుడికి; ప్రబోధించి= హెచ్చరించి; ఎప్పటి+అట్ల= యథాప్రకారం; వన్యఫలంబులు= అడవిలో దొరికేటటువంటి పండ్లు; తేరన్+అరిగిన= తెచ్చేందుకు వెళ్ళగా.

**తాత్పర్యం:** ఆ ఋషికుమారుడితో కలిసి మెలిసి ఆతని ఆశ్రమంలో ఏకాంతంగా తపస్సు చేయాలని నాకోరిక- అని ఋశ్యశృంగుడు తండ్రికి చెప్పగా, కుమారుడి మాటలు విన్న విభాండకుడు ఆశ్చర్యం పొందాడు. 'ఋషుల తపస్సులకు అంతరాయాలు కల్పించేందుకై రక్కసులు అడవులలో అనేకరూపాలతో తిరుగాడుతూ ఉంటారు. అటువంటివారు ఇచ్చే పానీయాలు స్వీకరించతగనివి. మిక్కుటమైన సువాసనగల పువ్వులను మునులు ఉపయోగించకూడదు' అని విభాండకుడు కొడుకుకు జాగ్రత్తలు వచించి, ఎప్పటివలె అడవిలో దొరికే పండ్లు తెచ్చేందుకై అరణ్యంలోకి వెళ్ళాడు.

**క. చనుదెంచి తరుణి మునినం । దను చిత్తంబునకు వైకృతముఁ జేసె; విలా**
**సినుల సహాలాప సహా । సన సహయానములు బంధసమములు గావె! 111**

**ప్రతిపదార్థం:** తరుణి= లేజవరాలు (వేశ్యపుత్రిక), చనుదెంచి= వచ్చి; ముని, నందను, చిత్తంబునకు= ముని కుమారుడి యొక్క మనస్సుకు; వైకృతమున్+చేసె= వికారభావాన్ని పొందేటట్లు చేసింది- అంటే మనసులో మార్పు కలిగించింది; విలాసినుల= విలాసవతులయొక్క; సహ+ఆలాప, సహ+ఆసన, సహ, యానములు= కలిసిమెలిసి మాట్లాడటం, కూర్చొనటం, ప్రయాణం చేయటం; బంధ సమములు+కావే!= కట్టువడుటతో సమానాలైనవి కావా!

**తాత్పర్యం:** వేశ్యాపుత్రిక అయిన లేజవరాలు వచ్చి ఋషికుమారుడైన ఋశ్యశృంగుడి మనస్సులో వికారాన్ని కల్గించింది. అందచందాలతో హొయలొలికే మిటారికత్తెలతో కలిసిమెలసి మాట్లాడటం, దగ్గరగా ఒకచోట కూర్చోవటం, తిరుగాడటం కట్టువడుటతో సమానాలు కదా!

**విశేషం:** (1) అలం: అర్థాంతరన్యాసం. (2) నన్నయ కవితాశిల్పానికి విశిష్టత చేకూర్చిన నానారుచిరార్థసూక్తి నిధిత్వానికి ఈ పద్యం ఉదాహరణప్రాయం.

**వ. ఇట్లు ఋశ్యశృంగుండు విలాసినీమోహితుండయి, తండ్రి కెఱింగింపక సుచరిత్రంబయిన తన యాశ్రమంబు విడిచి, మనుష్యయోగంబునం దగిలి యక్కోమలి పిఱుందన చని, యంగదేశంబు సొచ్చి, యందు రోమపాదు నాదేశంబున రాజాశ్రయం బను వనంబున నుండునంత. 112**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఋశ్యశృంగుండు; విలాసినీ, మోహితుండు+అయి= వేశ్యచేత మిగుల ఆకర్షించబడినవాడై; తండ్రికి+ఎఱింగింపక= తండ్రికి తెలియజేయకుండా; సుచరిత్రంబు+అయిన= మంచిప్రవర్తనతో కూడిన; తన+ఆశ్రమంబు, విడిచి= తన ఆశ్రమాన్ని విడిచిపెట్టి; మనుష్య, యోగంబునన్+తగిలి= మనుష్యులకు సాధారణమైన నడవడి కూర్పులో చిక్కుకొని; ఆ+కోమలి= ఆ సుకుమారి యొక్క; పిఱుందన= వెనువెంటనే; చని= వెళ్ళి; అంగ, దేశంబు+చొచ్చి= అంగరాజ్యంలో ప్రవేశించి; అందు= ఆ అంగదేశంలో; రోమపాదు+ఆదేశంబునన్= రోమపాదుడియొక్క ఆజ్ఞప్రకారం; రాజ+ఆశ్రయంబు= రాజాశ్రయంబు+అను= వనంబునన్= రాజాశ్రయం అనే తోటలో; ఉండు+అంత= ఉన్నప్పుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఋశ్యశృంగుండు లేజవరాలైన వారకాంతచేత ఆకర్షితుడై, ఆమె వలపులో చిక్కుకొని తండ్రికి తెలియకుండా మంచిప్రవర్తనకు నెలవైన తన ఆశ్రమాన్ని విడిచిపెట్టి, మానవులకు సాధారణమైన నడవడికలో చిక్కుకొని, ఆ సుందరాంగి వెనువెంట వెళ్ళి అంగదేశం చేరి, అక్కడ రోమపాదుడిఆజ్ఞప్రకారం 'రాజాశ్రయం' అనే తోటలో ఉండగా.

**విశేషం:** ఇక్కడ 'మనుష్యయోగంబునం దగిలి' అన్న పదగుంఫనం ప్రత్యేకించి అనుశీలించ తగింది. 'యోగ' శబ్దాన్ని గురించిన విపులవ్యాఖ్యానం ప్రకరణాంతరంలో (ప్రథమాశ్వాసం) వ్రాయబడింది. వలపు - విలాసినీ వ్యామోహం మానవ సహజమైన యోగం. ఇంద్రియలౌల్యం మానుషయోగమైతే. ఇంద్రియ నిగ్రహం, తపస్సు అధిమానవయోగం. యోగ శబ్దానికి 'పొందిక', 'కూడిక' అన్న అర్థం బహుళవ్యాప్తం. సామరస్య సంధానం యోగానికి అంతరాత్మ, ఐహికం గాని, ఆముష్మికంగానీ లలిత కళాత్మకమైన సామరస్యసంధానంతో మేళవిస్తే అది యోగమౌతుంది. ఇక్కడ ఋశ్యశృంగుడు దివ్యయోగం నుండి జారి మనుష్యయోగంలో చిక్కుకొన్నాడు. ఈవచనంలో పెక్కు భారతప్రతుల్లో 'రాజాశ్రమంబను' - అనే పాఠాంతరం కనిపిస్తుంది. వావిళ్లప్రతిలో 'రాజశ్రయంబను భవనంబున' - అనే పాఠభేదం ఉన్నది.

**మత్తకోకిలము.**

**అమ్మునీశునివాసశక్తిఁ దదంగదేశమునందు మే**
**ఘమ్ము లెల్ల వలంకులం గడుఁ గ్రమ్మి సర్వజనప్రమో**
**దమ్ముగాఁ బ్రభవద్బృహజ్జలధార లొప్పఁగ వృష్టిఁ జే**
**సె మ్మహానదులున్ మహాసరసీవరంబులు నిండఁగన్. 113**

**ప్రతిపదార్థం:** ఆ+ముని+ఈశు= ఆ ఋషిశ్రేష్ఠుడి యొక్క; నివాస శక్తిన్= నివసించటంయొక్క మహిమచేత; తత్+అంగ దేశమునందు= ఆ అంగరాజ్యంలో; మేఘమ్ములు+ఎల్ల= మబ్బులన్నీ; వలంకులన్= దిక్కులన్నిటినీ; కడున్+క్రమ్మి= మిక్కుటంగా కప్పి; సర్వ, జన, ప్రమోదమ్ముగాన్= అందరు ప్రజలకూ సంతోషాన్ని కలిగించేటట్లుగా; ప్రభవత్, బృహత్+జల, ధారలు+ ఒప్పఁగ= పుట్టుతున్న గొప్పనీటి ధారలు విలసిల్లగా; మహాసరసీవరంబులు= గొప్ప సరస్సులు; మహా నదులున్= గొప్ప నదులును; నిండఁగన్= నిండేటట్లుగా; వృష్టిన్+చేసెన్= వాన కురిపించాయి.

**తాత్పర్యం:** ఆ ఋశ్యశృంగ మహాముని నివసించటంవలన ఏర్పడిన మహిమచేత ఆ అంగదేశం మబ్బులు దిక్కులన్నిటా వ్యాపించి ప్రజలందరికీ ఆనందం కలిగేటట్లుగా కారుతున్న పెనునీటి ధారలతో పెద్ద సరస్సులు, గొప్పనదులు పొంగి పొరలేటట్లు వాన కురిపించాయి.

**విశేషం:** వలంకులు= దిక్కులు; వలకు వలను రూపాంతరం; 'కెలంకులు' అనే పాఠాంతరం అనేక ప్రతులలో కనబడుతున్నది. కెలను అంటే దిక్కు. రూపాంతరం కెలఁకు. వృత్తలక్షణానికి ఆర. 1.46 విశేషాంశం చూడండి.

ఆనందాశ్రమ గ్రంథమాలప్రతిలో 'మహానది దీర్ఘికా సరసీనదంబులు నిండఁగాన్' - అనే పాఠాంతరం ఉన్నది.

**వ. ఇట్లు ఋశ్యశృంగు నాగతంబున నంగవిషయంబున నవగ్రహదోషంబు నిరస్తంబైన సంతసిల్లి రోమపాదుండు తన కూఁతు శాంత యనుదాని నత్యంతకాంతిమతి నమ్మునివరునకు వివాహంబు సేసి. 114**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఋశ్యశృంగు+ఆగతంబునన్= ఋశ్యశృంగుడి రాకవలన; అంగవిషయంబునన్= అంగదేశంలో; అవగ్రహ, దోషంబు= అనావృష్టి అనే బాధ; నిరస్తంబు+ఐనన్= తొలగిపోగా; రోమపాదుండు; సంతసిల్లి= సంతోషించి; తన, కూతు= తన పుత్రిక; శాంత+అనుదానిన్= శాంత అనేపేరు కల ఆమెను; అత్యంతకాంతిమతిన్= మిక్కిలి లావణ్యం కలదానిని; ఆ+మునివరునకు= ఆ ఋషిశ్రేష్ఠుడికి; వివాహంబు+చేసి= పెళ్లిచేసి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఋశ్యశృంగుడి రాకవలన అంగదేశంలో వర్షం లేకపోవడమనే దోషం తొలిగిపోవటంచేత రోమపాదుడు సంతోషించి అతడికి లావణ్యరాశి అయిన తనకూతురు శాంత నిచ్చి పెళ్ళిచేశాడు.

**క. అనుభోగయోగ్యములుగా । ధనరాసులు భూషణములు దాసీనివహం**
**బును గాంచనమయ శయ్యా । సనములు ముని కిచ్చె హృదయసంతోషముగాన్. 115**

**ప్రతిపదార్థం:** అనుభోగ యోగ్యములుగా= అనుభవించేందుకు అర్హత కలవిగా; ధనరాసులు= డబ్బుల కుప్పలు; భూషణములు= ఆభరణాలు; దాసీ, నివహంబును= దాసీస్త్రీల సముదాయమున్నూ; కాంచన, మయ, శయ్యా+ఆసనములు= బంగారంతో

చేయబడిన మంచాలు, కూర్చొనే పీఠాలు (కుర్చీలు); హృదయ సంతోషముగాన్= డెందానికి ఆనందం కొలిపేటట్లు; మునికి+ఇచ్చెన్= ఋషికి కట్నంగా సమర్పించాడు.

**తాత్పర్యం:** అనుభవించేందుకు తగినటువంటి ధననిధులు, ఆభరణాలు, దాసీసమూహాలు, బంగారు శయ్యలు, ఆసనాలు మొదలైనవి హృదయం ఉప్పొంగేటట్లుగా ఋశ్యశృంగుడికి కట్నంగా రోమపాద మహారాజు సమర్పించాడు.

విభాండకుఁడు ఋశ్యశృంగుని వెదకుచు వచ్చుట (సం. 3-113-11)

**వ. మఱియు గోసహస్రంబు లనేకంబు లిచ్చి గోకులసంకులంబుగా ఘోషంబులు దేశంబుల నెల్ల నిలిపి నిత్య సత్కారంబుల ఋశ్యశృంగునకుఁ బ్రియంబుసేయుచుండె; నంత నట విభాండకుండు దన యాశ్రమంబునఁ గొడుకుం గానక యెల్లదేశంబులు రోయుచు నంగదేశంబునకు వచ్చి గోగణసంకీర్ణబైన యొక్కఘోషంబు నందు గోపసత్కృతుండై యొక్క దివసంబు వసియించి 'యిది యెవరి ఘోషం?' బని గోపాలకుల నడిగిన వార లి ట్లనిరి. 116**

**ప్రతిపదార్థం:** మఱియు= అదనంగా; గోసహస్రంబులు= వేలకొద్ది ఆవులు; అనేకంబులు+ఇచ్చి= పెక్కు ఇచ్చి; గో, కుల, సంకులంబుగా= ఆవులమందల గుంపులతో కూడిన; ఘోషంబులు= గొల్లపల్లెలు; దేశంబులన్+ఎల్ల= వివిధ ప్రదేశాలలో; నిలిపి= ఏర్పాటుచేసి; నిత్యసత్కారంబుల= దినం దినం చేసే మర్యాదలతో; ఋశ్యశృంగునకున్; ప్రియంబు= ప్రీతిని; చేయుచుండెన్= చేస్తున్నాడు; అంతన్= అటుమీద; అట= అక్కడ, ఋశ్యశృంగుడి ఆశ్రమంలో; విభాండకుండును= విభాండకమునియున్నూ; తన+ఆశ్రమంబునన్= తన ఆశ్రమంలో; కొడుకున్= పుత్రుడిని; కానక= చూడక; ఎల్ల, దేశంబులు= రాజ్యాలన్నీ; రోయుచున్= వెదకుతూ; అంగదేశంబునకు= అంగదేశానికి; వచ్చి= వచ్చి; గో, గణ, సంకీర్ణంబు+ఐన= ఆవుల మందలచేత క్రిక్కిరిసిఉన్న; ఒక్కఘోషంబునందు= ఒక గొల్లపల్లెలో; గోప, సత్కృతుండు+ఐ= గొల్లలచేత పూజించబడినవాడై; ఒక్కదివసంబు వసియించి= ఒక్క రోజు ఉండి; ఇది= ఇది; ఎవరి, ఘోషంబు?= ఎవరికి చెందిన ఆవులమంద?; అని= అంటూ; గోపాలకులన్= గొల్లలను; అడిగిన= ప్రశ్నించగా; వారు= వారు (ఆ గోపాలకులు) ఇట్లు+అనిరి= ఈ రీతిగా పలికారు.

**తాత్పర్యం:** అదనంగా వేలకొద్దీ ఆవులను ఇచ్చి, ఆవులతో క్రిక్కిరిసిన గొల్లపల్లెలను వివిధప్రదేశాలలో నెలకొల్పి ప్రతిదినం సత్కారాలు చేస్తూ రోమపాదుడు ఋశ్యశృంగుడికి ప్రీతి కలిగిస్తున్నాడు. అంత అక్కడ ఋషివాటికలో విభాండకుడికి కొడుకు కనిపించకపోవటంచేత అతడిని వెదకుతూ దేశదేశాలు పయనించి, విభాండకుడు చివరకు అంగదేశాన్ని చేరి, ఆవులతో నిండిన ఒక గొల్లపల్లెలో గోపాలకులచేత సత్కారాలను పొంది, 'ఇది ఎవరి ఆవులమంద?' అని అడిగాడు. అప్పుడు ఆ గోపాలురు ఇట్లా బదులు పలికారు.

**క. 'యతినాథ! వినవె యిది నీ । సుతుఘోషం; బిదియ కాదు చూడ ననేకా
యుతఘోషంబులు గల వు । న్నతగుణునకు ఋశ్యశృంగునకు నిద్ధరణిన్. 117**

**ప్రతిపదార్థం:** యతినాథ!= ఋషులకు అధినేతవైన ఓ విభాండకమహర్షీ!; వినవు+ఎ= వినలేదా (వినండి!); ఇది= ఇది; నీ సుతుఘోషంబు= నీ కొడుకుయొక్క ఆలమందల గొల్లపల్లె; ఇది+అ, కాదు= ఇది మాత్రమే కాదు; చూడన్= పరిశీలించగా; ఈ ధరణిన్= ఈ పుడమిపై; అనేక+అయుత, ఘోషంబులు= పెక్కు పెద్ద ఆవులమందలు; ఉన్నతగుణునకు= గొప్ప మంచిగుణాలు కలవాడైన; ఋశ్యశృంగునకున్= ఋశ్యశృంగుడికి; కలవు= ఉన్నాయి.

**తాత్పర్యం:** 'ఋషులకు అధినేతవైన ఓ విభాండకమహర్షీ! ఇది నీ కుమారుడియొక్క ఆలమంద, ఈ ఒక్క ఆలమంద మాత్రమే కాదుకదా! ఎన్నో పెద్ద పెద్ద ఆవులమందల ఈ పుడమిలో (ఈరాజ్యంలో) ఎన్నోచోట్ల గొప్పగుణాలు కలవాడైన ఋశ్యశృంగుడికి ఉన్నాయి.'

**వ. అనిన విని విభాండకుండు సంతసిల్లి ఋశ్యశృంగు తొఱ్ఱుపట్ల విశ్రమించుచు రోమపాదుపురంబునకు వచ్చి యందు శాంతా సహితుండైన ఋశ్యశృంగుం జూచి సంతుష్ట హృదయుండై, తన కొడుకుం గోడలిం దోడ్కొని నిజాశ్రమంబున కరిగె; నందు వసిష్ఠున కరుంధతియు, నగస్త్యునకు లోపాముద్రయు, ముద్గలునకు నాలాయనియైన యింద్రసేనయుంబోలెఁ దనకుఁ బరమభక్తియుక్తియై శాంత పరిచర్య సేయుచుండ ఋశ్యశృంగుండు సుఖంబుండె' నని చెప్పిన నా కౌశికప్రదంబున నందఱు నభిషిక్తులై యేనూఱు మహానదుల సమాగమస్థానంబైన గంగాసాగర సంగమంబుఁ జూచుచు సముద్రతీరంబునం జని కళింగదేశంబున వైతరణి యను మహానదిం గని; రంత రోమశుండు ధర్మరాజున కిట్లనియె. 118**

**ప్రతిపదార్థం:** అనిన= అని పలికిన; విని= విని; విభాండకుండు= విభాండక మహర్షి; సంతసిల్లి= సంతోషించి; ఋశ్యశృంగు= ఋశ్యశృంగుడియొక్క; తొఱ్ఱుపట్ల= ఆలమంద లుండే చోట్ల; విశ్రమించుచున్= విశ్రాంతి తీసికొంటూ; రోమపాదు పురంబునకు వచ్చి= రోమపాదుడి రాజధానీనగరం చేరి; అందు= అక్కడ; శాంతా, సహితుండు+ఐన= శాంతతో కూడుకొనిఉన్న; ఋశ్య శృంగున్+చూచి= ఋశ్యశృంగుడిని చూచి; సంతుష్ట, హృదయుండు+ఐ= తనివి చెందిన హృదయం కలవాడై; తన, కొడుకున్+కోడలిన్= తన కొడుకును, కోడలిని; తోడ్కొని= తన వెంటబెట్టుకొని; నిజ+ఆశ్రమంబునకు= తన ఋషివాటికకు; అరిగెన్= వెళ్ళాడు; అందున్= ఆ ఆశ్రమంలో; వసిష్ఠునకు= వసిష్ఠమహర్షికి; అరుంధతియు; అగస్త్యునకు; లోపాముద్రయు; ముద్గలునకు= ముద్గలమునికి; నాలాయని+ఐన= నాలాయని (కాశిరాజు) కూతురైన; ఇంద్రసేనయున్; పోలెన్= పోలునట్లుగా; తనకున్= తనకు (ఋశ్య శృంగుడికి); పరమ, భక్తి, యుక్త+ఐ= మిక్కిలి భక్తితో కూడినటువంటిదై; శాంత= శాంతాదేవి; పరిచర్య, చేయుచుండ= సేవ చేస్తుండగా; ఋశ్యశృంగుండు; సుఖంబు+ఉండెన్= సుఖంగా ఉండినాడు; అని= అంటూ; చెప్పినన్= చెప్పగా; ఆ కౌశిక, హ్రదంబునన్= ఆ కౌశికుడి పేరు మీదుగా వెలసిన మడుగులో; అందఱున్= ధర్మరాజు ప్రభృతులు; అభిషిక్తులు+ఐ= స్నానం చేసినవారై; ఏనూఱు, మహా, నదుల= ఐదువందల గొప్ప ఏరుల; సమాగమ, స్థానంబు+ఐన= కలిసేటటువంటి చోటు అయిన; గంగా, సాగర, సంగమంబున్= గంగానది సముద్రంలో కలిసేచోటును; చూచుచు= దర్శిస్తూ; సముద్ర తీరంబునన్= సముద్ర తీరరేఖను అనుసరించి; చని= వెళ్ళి; కళింగ, దేశంబునన్= కళింగదేశాన; వైతరణి+అను= వైతరణి అనేపేరు కలిగిన; మహానదిన్+కనిరి= గొప్పనదిని చూచారు; అంత= అటుతరువాత (పిమ్మట); రోమశుండు= రోమశుడు; ధర్మరాజునకు= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని గోపాలకులు చెప్పగా విభాండకమహాముని మిక్కిలి సంతసించాడు. అక్కడనుండి విభాండక మహర్షి పయనించి, మార్గమధ్యంలో ఋశ్యశృంగుడి ఆవులమందలు ఉన్న తావులలో విశ్రమిస్తూ, చివరకు రోమపాదుడి రాజధానిని చేరి అక్కడ శాంతాదేవితోపాటు ఉన్న ఋశ్యశృంగుడిని చూచి సంతృప్తి చెందిన హృదయం కలవాడైనాడు. తదుపరి విభాండకుడు తన కొడుకును కోడలిని వెంటబెట్టుకొని తన ఆశ్రమానికి వెళ్ళాడు. అంత శాంతాదేవియున్నూ ఋశ్యశృంగుడికి- అరుంధతి వసిష్ఠుడికీ, ఇంద్రసేన ముద్గలుడికీ, లోపాముద్ర అగస్త్యుడికీ వలె పరమభక్తితో సేవచేస్తుండగా, ఋశ్యశృంగుడు సుఖంగా జీవితం గడిపాడు'- అని రోమశుడు ధర్మరాజుకు చెప్పాడు. పిమ్మట అందరు ఆ కౌశిక సరోవరంలో స్నానంచేశారు. ఐదునూర్ల మహానదులకు సంగమస్థానమైన గంగాసాగర సంగమాన్ని

సందర్శిస్తూ, తీరరేఖను బట్టి పయనించి కళింగదేశం చేరి అక్కడ వైతరణి అనే మహానదిని సందర్శించారు. అప్పుడు రోమశుడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**క. 'మునిదేవవరులు యజ్ఞము । లొనరించిరి తొల్లి దీని యుత్తరతీరం**
**బున; నిది పుణ్యాస్పదమై । తనరును యజ్ఞావభృథశతస్నానములన్. 119**

**ప్రతిపదార్థం:** మునిదేవవరులు= మునులలో, దేవతలలో శ్రేష్ఠులు; దీని ఉత్తరతీరంబునన్= ఈ వైతరణీనది ఉత్తరపు గట్టున; తొల్లి= పూర్వకాలంలో; యజ్ఞములు= యజ్ఞాలు; ఒనరించిరి= చేశారు; యజ్ఞ+అవభృథశత, స్నానములన్= యజ్ఞం పరిసమాప్తమైనప్పుడు నూరుసార్లు చేసిన స్నానాలచేత; ఇది= ఈ వైతరణీనది; పుణ్య+ఆస్పదము+ఐ= పుణ్యానికి నెలవై; తనరును= ఒప్పుతున్నది.

**తాత్పర్యం:** 'పూర్వకాలంలో ఈ వైతరణీ మహానది ఉత్తరతీరంలో ఋషీశ్వరులు, దేవతాశ్రేష్ఠులు ఎన్నో యజ్ఞాలు చేశారు. యజ్ఞ పరిసమాప్తి సమయాన శతాధికంగా చేసిన అవభృథస్నానాలవలన ఈ మహానది పుణ్యానికి నెలవైనది.

**వ. మఱియు సకలయజ్ఞంబుల యందును బ్రశస్తంబయిన పశుభాగంబు పశుపతికి దేవతలును ఋషులును నిందుఁ గల్పించి; రీ తీర్థం బాడినవారు దేవయానగతు లగుదు' రనినం గృష్ణాసహితుండై ధర్మతనయుండు దమ్ములుం దానును వైతరణీస్నానంబు సేసి, రోమశుం జూచి 'మునీంద్రా! నాకు భవత్ప్రసాదంబున నఖిలలోకంబులుం గానయ్యె, వైఖానసుల వేదాధ్యయన శబ్దంబులు వినయ్యె 'ననిన విస్మితుండై రోమశుండు 'వైఖానస నివాసం బిందులకు ముప్పదివేల యోజనంబులు గలదు; వారల యధ్యయన శబ్దంబులు వింటివి గావున నీవు దివ్యుండ' వంచు నరిగి యనవరత ఫలాలంకృతంబైన యొక్క వనంబుఁ గని 'యిందుఁ దొల్లి స్వాయంభువుండైన విశ్వకర్మ యజ్ఞంబు సేసి. 120**

**ప్రతిపదార్థం:** మఱియు= విశేషించి; సకల యజ్ఞంబుల+అందును= అన్ని యజ్ఞాలలోను; ప్రశస్తంబు+ఐన= గొప్పదిగా ఎన్నదగిన; పశుభాగంబు= పశుభాగం అనే నివేదన; పశుపతికిన్= శివుడికి; దేవతలును, ఋషులును= దేవతలు, మునులు కలిసి; ఇందున్= ఈచోట; కల్పించిరి= ఏర్పాటు చేశారు; ఈ తీర్థంబు+ఆడినవారు= ఈ తీర్థంలో స్నానంచేసినవారు; దేవయానగతులు+అగుదురు= దేవతలు పయనించే మార్గాన వెళ్లేవారు కాగలరు; అనినన్= అని చెప్పగా; ధర్మతనయుండు= ధర్మపుత్రుడు; తమ్ములున్+తానును= తాను, తనసోదరులు; కృష్ణాసహితుండు+ఐ= ద్రౌపదితో పాటు; వైతరణీ స్నానంబు+చేసి= వైతరణీ నదిలో స్నానాలు చేసి, రోమశున్+చూచి= రోమశుడిని చూచి; ముని+ఇంద్రా!= ముని శ్రేష్ఠుడా!; నాకు= నాకు; భవత్+ప్రసాదంబునన్= నీయొక్క దయవలన; అఖిలలోకంబులున్= సమస్త జగత్తులు; కానన్+అయ్యెన్= కన్పించాయి; వైఖానసుల, వేద+అధ్యయన, శబ్దంబులు= వైఖానసులయొక్క వేదాలు చదువుతున్న నాదాలు; వినన్+అయ్యెన్= వినిపించాయి; అనిన= అని చెప్పగా; విస్మితుండు+ఐ= ఆశ్చర్యం పొందినవాడై; రోమశుండు; వైఖానసనివాసంబు= వైఖానసులు నివసించేచోటు; ఇందులకు= ఈ చోటికి; ముప్పదివేలయోజనంబులు= ముప్పదివేల ఆమడలదూరాన; కలదు= ఉన్నది; వారల+ అధ్యయనశబ్దంబులు= వారు వేదాలను చదివే ధ్వనులు; వింటివి= విన్నావు; కావున= కాబట్టి; నీవు, దివ్యుండవు= నీవు మనుష్యశక్తికి అతీతమైన దివ్యశక్తి కలవాడివి; (దివ్య పురుషుడవు); అంచున్= అనిచెపుతూ; అరిగి= వెళ్ళి; అనవరతఫల+ అలంకృతంబు+ఐన= ఎల్లప్పుడూ పండ్లతో కళకళలాడుతూ ఉండే; ఒకవనంబున్+కని= ఒక తోటను చూచి; ఇందున్= ఇక్కడ; తొల్లి= పూర్వం; స్వాయంభువుండు+ఐన= స్వాయంభువ మనువుకు సంబంధించిన; విశ్వకర్మ= విశ్వకర్మ అనే మహనీయుడు; యజ్ఞంబు+చేసి= యజ్ఞాన్ని చేసి,

**తాత్పర్యం:** ఇక్కడ విశేషించి పేర్కొన తగిన అంశం ఏమిటంటే- సకలక్రతువులలో గొప్పదిగా ఎన్నదగిన పశుభాగాన్ని దేవతలు, ఋషిశ్రేణ్యులు కలిసి ఇక్కడ పశుపతికి ఏర్పాటు చేశారు. ఈ తీర్థంలో స్నానంచేసినవారు దేవతలు వెళ్లేటటువంటి మార్గాన పోగలరు'- అని చెప్పగా ధర్మరాజు తానున్నూ, తమ్ములున్నూ, ద్రౌపదితోపాటు వైతరణీనదిలో స్నానంచేసి, రోమశుడితో, 'మునివరేణ్యా! నాకు నీ దయవలన సమస్తలోకాలు కనిపిస్తున్నాయి. వైఖానసులు చేస్తున్న వేదపారాయణం నాకు వినపడుతున్నది' అని చెప్పగా రోమశుడు ఆశ్చర్యపోయి' వైఖానసులు నివసించే చోటు ఇక్కడికి ముప్పైవేల ఆమడల దూరంలో ఉన్నది. వారు చేస్తున్న వేదపారాయణం నీకు వినపడటంచేత నీకు మానవమాత్రులకు లేనటువంటి దివ్యశక్తి ఉన్నది; నీవు దివ్య పురుషుడవు' అని చెపుతూ ప్రయాణం చేసి, ఎల్లప్పుడూ పండ్లతో ఉండే ఒక తోటను చూచి, 'ఇక్కడ పూర్వకాలాన స్వాయంభువమనువుకు చెందిన విశ్వకర్మ యజ్ఞం చేసి.

**క. దక్షుఁ డయి యజ్ఞదక్షిణ । దక్షిణభూభాగ మెల్లఁ దా నిచ్చె నశే**
**ష క్షితిధర వనములతో । నక్షయమతిఁ గశ్యపునకు నార్త్విజ్యమునన్. 121**

**ప్రతిపదార్థం:** తాన్= తాను (విశ్వకర్మ); దక్షుఁడు+అయి= సమర్థుడై; యజ్ఞదక్షిణ= యజ్ఞం చేయించినందుకు ఇచ్చే సంభావనగా, అక్షయమతిన్= తరుగని బుద్ధితో; అశేష, క్షితిధర, వనములతోన్= సమస్తమైన కొండలు, అరణ్యాలతోపాటు; దక్షిణ, భూ, భాగము+ఎల్లన్= దక్షిణ దిక్కున ఉండే భూమిభాగాన్ని అంతటినీ; కశ్యపునకున్= కశ్యప మహామునికి; ఆర్త్విజ్యమునన్= ఋత్విజునకు ఇచ్చే సంభావనగా; ఇచ్చెన్= సమర్పించాడు.

**తాత్పర్యం:** విశ్వకర్మ సమర్థుడై దక్షిణదిక్కున గల భూభాగమంతటినీ, కొండలు, అరణ్యాలతోపాటు కశ్యపమహర్షికి నిండుమనస్సుతో యజ్ఞం జరిపించి ఋత్విజుడికి ఇచ్చే సంభావనగా సమర్పించాడు.

**విశేషం:** యజ్ఞాన్ని చేయించే పురోహితులు ఋత్విజులు. యజ్ఞం జరిపించినందుకు వారి కిచ్చే ధనానికి యజ్ఞదక్షిణ అనిపేరు. యజ్ఞకర్త నుండి ధనం పుచ్చుకొని యజ్ఞం చేయించే ఋత్విజులు పదహారుమంది. 1. బ్రహ్మ 2. ఉద్గాత 3. హోత 4. అధ్వర్యుడు 5. బ్రాహ్మణాచ్ఛంసి 6. ప్రస్తోత 7. మైత్రావరుణుడు 8. ప్రతిప్రస్తోత 9. పోత 10. ప్రతిహర్త 11. అచ్ఛావాకుఁడు 12. నేష్ట 13. ఆగ్నీధ్రుడు 14. సుబ్రహ్మణ్యుఁడు 15. గ్రావస్తుతుఁడు 16. ఉన్నేత.

**వ. దాని కలిగి భూదేవి గశ్యపునకుం బట్టీక రసాతలంబునకుం బోయినఁ దత్ప్రసాదార్థియై కశ్యపుం డుగ్రతపంబు సేసినం బ్రసన్నయై భూదేవి నీరిలోనుండి వెలువడి వేదిరూపంబునం గశ్యపునకు నిజరూపంబు సూపె; నవ్వేది యిది సుమ్ము! దీని నెక్కినవారు వీర్యవంతు లగుదు; రీమంత్రంబున దీని నెక్కుండు; పెఱనాఁ డిది దా వీక సముద్రంబు సొచ్చు' నని, 'యగ్నిర్మిత్రో యోని' యనునివి యాదిగాఁ గల మంత్రంబు లుపదేశించిన.122**

**ప్రతిపదార్థం:** దానికి+అలిగి= అందుకు కోపించి; భూదేవి= భూదేవత; కశ్యపునకున్= కశ్యపమునికి; పట్టు+ఈక= పట్టుబడక; రసాతలంబునకున్= పాతాళానికి; పోయినన్= వెళ్ళగా; తత్+ప్రసాద+అర్థి+ఐ= ఆమెయొక్క దయను అభిలషించినవాడై; కశ్యపుండు= కశ్యపమహర్షి; ఉగ్ర, తపంబు+చేసినన్= కఠోరమైన తపస్సు చేయగా; భూదేవి; ప్రసన్న+ఐ= సుముఖత కలది అయి; నీరిలోనుండి= నీటిలో నుండి; వెలువడి= బయటికి వచ్చి; వేది, రూపంబునన్= తిన్నె ఆకృతిలో; కశ్యపునకు= కశ్యపుడికి; నిజరూపంబు= తన ఆకారాన్ని; చూపెన్= కనిపింపచేసింది; ఆ+వేది= ఆ అరుగు; ఇది= ఇదే; సుమ్మ!= సుమా!; దీనిన్= దీనిని- ఈ వేదిని; ఎక్కినవారు= అధిరోహించినవారు; వీర్యవంతులు= పరాక్రమం కలవారు; అగుదురు= కాగలరు (అవుతారు); ఈ మంత్రంబున= ఈ మంత్రాన్ని ఉచ్చరిస్తూ; దీనిన్= ఈ వేదిని; ఎక్కుండు= అధిరోహించండి; పెఱ

నాఁడు= కానివేళ; ఇది= ఈ వేది; తావు+ఈక= చోటీయక; సముద్రంబు+చొచ్చు= సముద్రంలో ప్రవేశిస్తుంది; అని= అని చెప్పి; "అగ్నిర్మిత్రోయోనిః" = అగ్నిర్మిత్రోయోనిః; అనునివి= అనే ఈ పదాలు; ఆదిగాన్+కల= మొదటగల (ఆ పదాలతో మొదలయ్యే); మంత్రంబులు= మంత్రాలు; ఉపదేశించినన్= ఉపదేశించగా.

**తాత్పర్యం:** అందుకు భూదేవికి కోపంవచ్చింది. ఆమె కశ్యపుడికి పట్టుపడక పాతాళానికి వెళ్ళిపోయింది. కశ్యప మహర్షి భూదేవి అనుగ్రహాన్ని సంపాదించేందుకు కఠోరతపస్సు చేశాడు. అంత భూదేవి ప్రసన్నురాలై నీటిలోనుండి వెలువడి వేదిరూపంలో కశ్యపుడికి సాక్షాత్కరించింది. ఆ వేదియే ఇది. ఈ వేదిని అధిరోహించినవారు మిగుల పరాక్రమంతో తేజరిల్లుదురు. ఈ మంత్రాన్ని ఉచ్చరిస్తూ మాత్రమే ఈ వేదిని ఎక్కాలి. లేకపోతే ఇది సముద్రంలోకి పోగలదు. అని రోమశుడు చెప్పి 'అగ్నిర్మిత్రోయోనిః' అనే పదాలతో ప్రారంభమయ్యే మంత్రాలను ఉపదేశించాడు.

**విశేషం:** మంత్రము= నిర్ణీతాలైన అక్షర సమామ్నాయాన్ని పునరావృత్తిగ వల్లెవేసే విధానం. (బీజాక్షరసంపుటి).

**క. అనుజులు దానును ముని శా। సనమున నవ్వేది యెక్కి సమధికవీర్యం**
**బున నొప్పె బ్రాహ్మణులదీ। వన లెసఁగఁగ ధర్మసుతుఁడు వాసవలీలన్. 123**

**ప్రతిపదార్థం:** ధర్మసుతుఁడు= ధర్మపుత్రుడు; అనుజులు= తమ్ములు; తానును= తానున్నూ (ధర్మజుడున్నూ); ముని శాసనమునన్= ఋషి ఆజ్ఞ చొప్పున; ఆ+వేది= ఆ అరుగు; ఎక్కి= అధిరోహించి; సమధిక వీర్యంబునన్= మిగుల అతిశయించిన పరాక్రమ తేజస్సు చేత; బ్రాహ్మణుల= విప్రుల; దీవనలు+ఎసఁగఁగన్= ఆశీస్సులు విలసిల్లగా; వాసవలీలన్= ఇంద్రుడి వలె; ఒప్పెన్= శోభించాడు.

**తాత్పర్యం:** ఆముని నిర్దేశించిన ప్రకారం ధర్మరాజు తమ్ములతో సహా ఆ వేదిక మీదికి ఎక్కాడు. దానివలన అతడికి అమితమైన బలం ఏర్పడింది. బ్రాహ్మణుల ఆశీస్సులతో ధర్మజుడు ఇంద్రుడివలె ప్రకాశించాడు.

**క. ధరణీసురవర మునిగణ। పరివృతులై యరిగి కనిరి పాండవులు వియ**
**చ్చర నిర్జర సేవిత సుం। దర కందర మగు మహేంద్రధరణీధరమున్. 124**

**ప్రతిపదార్థం:** పాండవులు= పాండునందనులు; ధరణీసుర, వర, మునిగణ, పరివృతులు+ఐ= బ్రాహ్మణశ్రేష్ఠులచేత, మునిబృందంచేత చుట్టుకొనబడినవారై; అరిగి= ప్రయాణించి; వియత్+చర, నిర్జర, సేవిత, సుందర, కందరము+అగు= ఆకాశగమనంకలవారిచేత, దేవతలచేత సేవించబడి, అందమైన గుహలు కలిగిఉన్న; మహేంద్ర ధరణీ ధరమున్= మహేంద్రపర్వతాన్ని; కనిరి= చూచారు.

**తాత్పర్యం:** బ్రాహ్మణప్రవరులు మునులబృందం తమ చుట్టూ రాగా, పాండవులు ఆకాశగమనం కలవారైన దేవతల చేత సేవించబడుతూ అందమైన గుహా ప్రదేశాలు గలిగిన మహేంద్రపర్వతాన్ని చూచారు.

**వ. అందుల మహాతపోధనులకు నమస్కార సత్కారంబుల మనఃప్రియంబు సేసి ధర్మరా జిట్లనియె. 125**

**ప్రతిపదార్థం:** అందుల= అందున్న; మహాతపస్+ధనులకు= గొప్ప తపస్సు అనే సంపద కలవారికి; నమస్కార, సత్కారంబులన్= వందనాలతో, గౌరవమర్యాదలతో; మనస్+ప్రియంబు= మనస్సులకు సంతోషాన్ని; చేసి= కలిగించి; ధర్మరాజు= ధర్మజుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** తపస్సే సంపదగా కలిగి అందున్న మహర్షులకు నమస్కరించి, సత్కారాలు చేసి వారి మనసులు రంజింపజేసి ధర్మరాజు ఈ విధంగా చెప్పాడు.

**తే. 'పరమమునులార! యిగ్గిరిఁ బరశురాము । శుభచరిత్రుని మీ రెప్డు సూతు రట్టె!**
**యమ్మహాభాగు మీచూచు నవసరంబు । నందు మాకును జూడంగ నమరునొక్కొ?' 126**

**ప్రతిపదార్థం:** పరమ మునులార!= గొప్పఋషులార!; ఈ+గిరిన్= ఈ కొండమీద; పరశురామున్= పరశువు ఆయుధంగా కల రాముడిని; శుభ చరిత్రుని= మంచిచరిత్ర కలవాడిని; మీరు+ఎప్డు= మీరు ఎల్లప్పుడూ; చూతురు+అట్టె= చూస్తూ ఉంటారట; ఆ+మహాభాగున్= ఆ మహనీయుడిని; మీ, చూచు+అవసరంబునందున్= మీరు దర్శించే సమయాన; మాకును+ చూడంగన్+అమరును+ఒక్కొ?= మాకు కూడ చూచేందుకు వీలు కలుగుతుందా?

**తాత్పర్యం:** 'గొప్పమునులార! ఈ కొండపై మీరు ఎల్లప్పుడు శుభచరిత్ర కల మహానుభావుడు పరశురాముడిని చూస్తూ ఉంటారటకదా! మేముకూడ ఆ మహానుభావుడిని మీరు చూచేటప్పుడు దర్శించటానికి వీలుకలుగుతుందా?'

**వ. అనిన నమ్మునిసంఘంబులోన రామానుచరుండైన యకృతవ్రణుం డను ముని ధర్మరాజున కిట్లనియె. 127**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; ఆ+ముని, సంఘంబులోనన్= ఆ ఋషుల సమూహంలో; రామ+అనుచరుండు+ఐన= పరశురాముడిని అనుసరించే శిష్యుడైన; అకృతవ్రణుండు+అను, ముని= అకృతవ్రణుడు అనేఋషి; ధర్మరాజునకు= ధర్మపుత్రుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా ఆ ఋషులబృందంలో పరశురాముడి శిష్యుడైన అకృతవ్రణుడు అనే ఋషి ధర్మరాజుతో ఈ విధంగా బదులు పలికాడు.

**తే. 'ధర్మతనయ! మీరాక ముందఱ యెఱుంగు । జామదగ్న్యుండు నిర్మలజ్ఞానదృష్టి**
**ననఘ! యెల్లి చతుర్దశి నమ్మహాత్ముఁ । జూతు రిమ్మును; లీవును జూడు మిచట.' 128**

**ప్రతిపదార్థం:** ధర్మతనయ!= ఓ ధర్మరాజా!; జామదగ్న్యుండు= జమదగ్ని కుమారుడైన పరశురాముడు; నిర్మలజ్ఞానదృష్టిన్= స్వచ్ఛమైన జ్ఞానమనెడి చూపులతో; మీరాక= మీరు ఇక్కడికి రావటం; ముందఱ= ముందే; ఎఱుంగున్= ఎరిగిఉన్నాడు; అనఘ!= పాపరహితుడైన ధర్మరాజా!; ఎల్లి= రేపు; చతుర్దశిన్= చతుర్దశి తిథిని; ఆ+మహాత్మున్= ఆ గొప్ప ఆత్మకలవాడిని-పరశురాముడిని; ఈ+మునులు= ఈ ఋషులు; చూతురు= చూస్తారు; ఇచటన్= ఇక్కడ; ఈవును= నీవున్నూ; చూడుము= సందర్శించవలసింది.

**తాత్పర్యం:** 'పాపరహితుడవైన ఓ ధర్మరాజా! రేపు చతుర్దశినాడు మహాత్ముడైన పరశురాముడిని ఈ ఋషులు దర్శించగలరు. నీవున్నూ వారితోపాటు పరశురాముడిని దర్శనం చేసికొనవచ్చును.'

**వ. అనిన ధర్మతనయుండు మహేంద్రంబున నా రాత్రి వసియించి యకృతవ్రణు నిట్లని యడిగె. 129**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; ధర్మతనయుండు= ధర్మరాజు; మహేంద్రంబునన్= మహేంద్ర పర్వతమందు; ఆ రాత్రి; వసియించి= ఉండి; అకృతవ్రణున్= అకృతవ్రణుడిని, ఇట్లు+అని= ఈ విధంగా; అడిగెన్= ప్రశ్నించాడు.

**తాత్పర్యం:** అని అకృతవ్రణుడు చెప్పగా ధర్మరాజు ఆ రాత్రి మహేంద్రపర్వతమందు వసించి అతడిని ఈ విధంగా ప్రశ్నించాడు.

**క. 'భువన జన స్తుతుఁ డగు భా । ర్గవు చరితము వినఁగ నాకుఁ గడుఁ గౌతుకగౌ**
**రవ మైనది; దాని ముని । ప్రవర! యెఱింగింపు కర్ణపథరమ్యముగన్. 130**

**ప్రతిపదార్థం:** భువనజనస్తుతుఁడు+అగు= అన్ని లోకాలలోని జనులందరిచేత పొగడబడినవాడైన; భార్గవుచరితము= భృగుమహర్షి వంశంలో జన్మించిన పరశురాముడి వృత్తాంతం; వినఁగ= వినటానికి; నాకున్= నాకు; కడున్= మిక్కిలి; కౌతుక, గౌరవము+ఐనది= కుతూహలంతో కూడిన పూజ్యభావం ఏర్పడింది; ముని, ప్రవర!= ఋషులలో శ్రేష్ఠుడివైన ఓ అకృతవ్రణా!; దాని= దానిని, (ఆ పరశురాముడి గాథను); కర్ణ, పథ, రమ్యముగన్= చెవుల మార్గానికి అందంగా- వీనులవిందుగా; ఎఱింగింపు= తెలియజేయవలసింది.

**తాత్పర్యం:** 'మునిశ్రేష్ఠుడివైన అకృతవ్రణ మహర్షీ! సమస్తలోకాల యందలి జనులచేత పొగడబడినటువంటి పరశురాముడి చరిత్ర వినటానికి నా మనస్సు కుతూహలంతో ఉవ్విళ్ళూరుతున్నది. ఆ భార్గవవంశీయుడైన మహనీయుడి వృత్తాంతం నాకు వీనులవిందుగా వినిపించ వేడికోలు.'

**విశేషం:** ధర్మరాజు తీర్థయాత్రలను పురస్కరించుకుని ఆయాస్థలాలకు సంబంధించిన గాథలను గురించి రోమశమహర్షిని, వివిధ మహర్షులను, గుచ్చిగుచ్చి ప్రశ్నిస్తున్నాడు. ఆయా ఋషులు ఆయాగాథలను వివరిస్తున్నారు. స్వయంసంపూర్ణాలైన ఈ పౌరాణిక గాథలకు ఐక్యసంధానం గావించింది ధర్మరాజు జిజ్ఞాస. ఈ విధంగా ఆరణ్యపర్వం భారతంలో బృహత్పర్వంగా రూపొందింది.

### అకృతవ్రణుఁడు ధర్మరాజునకుఁ బరశురాముని మహిమ సెప్పుట (సం. 3-115-9)

**వ. అని యడిగిన ధర్మరాజునకు నకృతవ్రణుం డిట్లని చెప్పెఁ దొల్లి కన్యాకుబ్జంబున గాధియను రాజు కూఁతు సత్యవతి యనుదాని భృగుపుత్త్రుండగు ఋచీకుండను మహాముని వివాహార్థియై గాధి నడిగిన నమ్మునివరునకు వాఁ డిట్లనియె. 131**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; అడిగినన్= ప్రశ్నించగా; ధర్మరాజునకున్= ధర్మపుత్రుడికి; అకృతవ్రణుండు= అకృతవ్రణుడు; ఇట్లు+అని= ఈ విధంగా; చెప్పెన్= చెప్పాడు; తొల్లి= పూర్వకాలంలో; కన్యాకుబ్జంబునన్= కన్యాకుబ్జం అనే పేరుకల పట్టణంలో; గాధి+అను, రాజు, కూఁతు= గాధి అనేపేరు గల ప్రభువుయొక్క పుత్రిక; సత్యవతి, అను, దానిన్= సత్యవతి అనే పేరుకల అమ్మాయిని; భృగుపుత్త్రుండు+అగు= భృగుపుత్త్రుండు+అగు= భృగు మహర్షి కొడుకైన; ఋచీకుండు+అను, మహాముని= ఋచికుడు అనే మహర్షి; వివాహ+అర్థి+ఐ= పెళ్ళాడేందుకు; గాధిని= గాధిరాజును; అడిగినన్= అర్థించగా; ఆ+మునివరునకున్= ఆ ఋషిశ్రేష్ఠుడికి; వాఁడు= అతడు-ఆ గాధిరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని ప్రశ్నించగా ధర్మరాజుకు అకృతవ్రణుడు ఇట్లా చెప్పాడు: పూర్వకాలంలో కన్యాకుబ్జం అనే పట్టణంలో గాధి అనే రాజుకు కూతురైన సత్యవతి అనే కన్యకను భృగుమహర్షి కుమారుడైన ఋచీకమహాముని పెళ్ళాడకోరి గాధిని అర్థించాడు. ఆ మహారాజు గాధి, ఆ మహర్షి ఋచీకుడికి ఇట్లా చెప్పాడు.

**సీ.** **'ఒక్క కర్ణంబు నీలోత్పలశ్యామమై । తను వెల్ల శశిహంసధవళ మైన**
**యిట్టి గుఱ్ఱములు వే యిక్కన్య కుంకు వి । ట్లీ నోపుదేని మునీంద్ర! దీని**
**నమరంగఁ బెండిలి యగు; మిది మాకుల । ధర్మంబు' నావుడుఁ దరుణిఁ బెండ్లి**
**యగువేడ్క భార్గవుఁ డప్పుడ వరుణేంద్రు । పాలికిఁ జని వానిఁ బడసి తెచ్చె;**

**ఆ.** **నవనినాథ! గంగయందుఁ గన్యాకుబ్జ । పురవరంబునందుఁ బుట్టె నట్టి**
**హయసహస్ర మమలమై; నాఁటఁగోలెను । నశ్వతీర్థ మనఁగ నయ్యె నదియు.** **132**

**ప్రతిపదార్థం:** ఒక్కకర్ణంబు= ఒకచెవి; నీల+ఉత్పలశ్యామము+ఐ= నల్లకలువవలె నల్లగా; తనువు+ఎల్ల= శరీరమంతా; శశి, హంస, ధవళము+ఐన= చంద్రుడివలె హంసవలె తెల్లనైన; ఇట్టి, గుఱ్ఱములు= ఇటువంటి అశ్వాలు; వేయి= వేయి; ఈ+కన్యకు= ఈ ఆడపడుచుకు; ఉంకువ= శుల్కం; ఇట్లు= ఈ విధంగా; ఈన్+ఓపుదు+ఏని= ఇవ్వగలిగిన వాడవయితే; ముని+ఇంద్ర!= మునీంద్ర!= మునులలో శ్రేష్ఠుడా!; దీనిన్= దీనిని ఈ కన్యకను; అమరంగన్= ఒప్పిదంగా; పెండిలి+అగుము= వివాహం చేసికొనుము; ఇది= ఈ ఏర్పాటు; మా కులధర్మంబు= మా వంశంలోని ఆచారం; నావుడున్= అని చెప్పగా; తరుణిన్= జవ్వనిఅయిన ఆ కన్యకను; పెండ్లి+అగు= వివాహమాడే; వేడ్కన్= కుతూహలంతో; భార్గవుఁడు= భృగుమహర్షి పుత్రుడు; అప్పుడు+అ= ఆ సమయంలోనే; వరుణ+ఇంద్రుపాలికిన్= వరుణ ప్రభువు దగ్గరకు; చని= వెళ్ళి, వానిన్= ఆ గుర్రాలను; పడసి= సంపాదించి; తెచ్చెన్= తీసికొనివచ్చాడు; అవనినాథ!= భూ భర్తయైన ఓ మహారాజా, ధర్మరాజా!; కన్యాకుబ్జపురవరంబు నందున్= కన్యాకుబ్జం అనే నగరరాజంలోని; గంగయందున్= గంగానదిలో నుండి; అమలము+ఐ= స్వచ్ఛమై; అట్టి= అటువంటి; హయసహస్రము= వేయిగుర్రాలు; పుట్టెన్= జన్మించాయి; నాఁటన్+కోలెను= ఆ దినం నుండి; అదియు= ఆ కన్యాకుబ్జంలోని గంగానది; అశ్వతీర్థము+అనఁగన్= అశ్వతీర్థం అనే పేరుతో; అయ్యెన్= విలసిల్లింది.

**తాత్పర్యం:** 'ఓ మహర్షీ! ఒక చెవి నల్లకలువవలె నల్లగా, మిగిలిన దేహమంతా చంద్రునివలె, హంసవలె తెల్లగా ఉండాలి, ఇటువంటి వెయ్యి గుర్రాలను కన్యాశుల్కంగా నీవు తెచ్చిఇచ్చినట్లైతే నీవు నా కూతురు సత్యవతిని వివాహం చేసికొనగలవు. ఇది మావంశ సంప్రదాయం' అని గాధిప్రభువు చెప్పాడు. అంత భృగుమహర్షి యొక్క పుత్రుడైన ఆ ఋచీకుడు వరుణప్రభువు దగ్గరకు పోయి అటువంటి గుర్రాలను సంపాదించి తెచ్చాడు. ఓ ధర్మరాజా! ఆవిధంగా అటువంటి వేయిగుర్రాలు కన్యాకుబ్జనగర మందలి గంగానది నుండి అవతరించాయి. అందువలన ఆనాటినుండి కన్యాకుబ్జంలోని గంగానదికి అశ్వతీర్థం అనే పేరు ఏర్పడింది.

**విశేషం:** ఋచీకుడు కోరిన వేయి గుఱ్ఱాలను వరుణుడు కన్యాకుబ్జ సమీపంలోని గంగానది నుండి అందజేసినాడు. అందువలన అచ్చటి గంగానదికి అశ్వతీర్థమనే పేరు ఏర్పడింది. వరుణుడు ఇచ్చిన ఆ తెల్లని గుర్రాలకు ఒక చెవి మాత్రం నల్లగా ఉంటుంది. ఆ నలుపు నల్లకలువ వంటి నలుపు. అది కూడ చెవిపైభాగంలో మాత్రమే; చెవిలోపలి భాగం మాత్రం ఎఱ్ఱగా ఉంటుంది.

**వ.** **ఋచీకుండును గాధికి నిచ్చాసమంబులైన హయంబుల నిచ్చి వానికూఁతు సత్యవతిం బాణిగ్రహణవిధిం బరిగ్రహించి సుఖంబున్నఁ, గన్యాకుబ్జంబునకు భృగుండు వచ్చి వారలచేతం బూజితుండై కొడుకునుం గోడలినిం జూచి సంతసిల్లి యొక్కనాఁడు కోడలి కిట్లనియె.** **133**

**ప్రతిపదార్థం:** ఋచీకుండును= ఋచీకుడున్నూ; గాధికిన్= గాధిప్రభువుకు; ఇచ్ఛాసమంబులు+ఐన= కోరినకోరికకు అనురూపాలైన; హయంబులన్+ఇచ్చి= గుర్రాలను ఇచ్చి; వాని, కూఁతు= వానియొక్క పుత్రిక; సత్యవతిన్= సత్యవతిని; పాణిగ్రహణ విధిన్= శాస్త్రీయమైన వైవాహికపద్ధతిలో; పరిగ్రహించి= స్వీకరించి (పెళ్ళాడి); సుఖంబు+ఉన్నన్= సుఖంగా నివసిస్తుండగా; భృగుండు= భృగుమహర్షి; కన్యాకుబ్జంబునకు; వచ్చి= వచ్చి; వారల చేతన్= వారిచేత అనగా ఋచీకుడిచేత, సత్యవతిచేత; పూజితుండు+ఐ= అర్చించబడినవాడై; కొడుకునున్ కోడలినిన్, చూచి; సంతసిల్లి= సంతోషించి; ఒక్కనాఁడు= ఒకానొకరోజు; కోడలికిన్= కోడలితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఋచీకుడు, గాధిమహారాజు కోరిన కన్యాశుల్కాన్ని సమర్పించి అతడి పుత్రిక సత్యవతిని శాస్త్రోక్త విధానంగా పెళ్ళాడి సుఖంగా కాలం గడుపుతున్నాడు. అంత కన్యాకుబ్జానికి భృగుమహర్షి విచ్చేసి, వారిచేత పూజించబడినవాడై, కొడుకును కోడలిని చూచి సంతోషించి ఒకరోజు కోడలికి ఇట్లా చెప్పాడు.

**క. 'లలితాంగి! యేను నీ గుణ। ముల కతిహృష్టుండ నైతి ముద మొనరఁగ ని**
**మ్ముల నిచ్చెద వేడుము నీ। వలచు వరం' బనిన సత్యవతి యి ట్లనియెన్. 134**

**ప్రతిపదార్థం:** లలిత+అంగి!= సుకుమారమైన దేహం కలదానా!; ఏను= నేను; నీ గుణమ్ములకు= నీ మంచి లక్షణాలకు; అతి, హృష్టుండును+ఐతి= మిక్కిలి సంతోషం పొందినవాడిని అయినాను; ముదము+ఒనరఁగన్= సంతోషం కలిగేటట్లుగా; నీ, వలచు, వరంబు= నీకు ఇష్టమైన వరాన్ని; వేడుము= కోరుకొనుము; ఇమ్ములన్= సంప్రీతితో; ఇచ్చెద= అనుగ్రహిస్తాను; అనిన= అని పలుకగా; సత్యవతి= సత్యవతి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** 'సుకుమారివైన ఓ సత్యవతీ! నీలోని మంచిగుణాలకు నేను మిక్కిలి సంతృప్తి చెందాను. సంతోషం కలిగేట్టు సంప్రీతితో నీవు కోరిన వరాన్ని అనుగ్రహిస్తాను. నీకు ఇష్టమైన వరాన్ని కోరుకొనుము' అని భృగుమహర్షి చెప్పగా, కోడలు సత్యవతి ఇట్లా బదులు పలికింది.

**వ. 'దేవా! నీప్రసాదంబున నాకొక్క కొడుకును, మజ్జనని కొక్క కొడుకు నుదయింపవలయు' నని మ్రొక్కినం గరుణించి భృగుండు 'నీకోరిన యట్లయగు; శుచిస్నాతలయి నీవు మేడిమ్రానిం గౌఁగిలింపుము; నీజనని నశ్వత్థంబుఁగౌఁగిలింపు మను' మనిన నయ్యిద్దఱుఁ దదాలింగన విపర్యాసంబు సేసిన నెఱింగి భృగుండు గోడలి కిట్లనియె. 135**

**ప్రతిపదార్థం:** దేవా!= మహానుభావా!; నీ ప్రసాదంబునన్= నీ దయవలన; నాకు+ఒక్క, కొడుకును= నాకు ఒక పుత్రుడును; మత్+జననికి= నాతల్లికి; ఒక్క కొడుకును; ఉదయింప= వలయును+అనిన= పుట్టవలెను అని; మ్రొక్కినన్= నమస్కరించగా; కరుణించి= దయతలచి; భృగుండు= భృగుమహర్షి; నీ, కోరిన+అట్లు+అ+అగు= నీవు కోరిన విధంగానే జరుగుగాక; శుచిస్నాతలు+అయి= పరిశుభ్రంగా స్నానాలు చేసినవారై; నీవు=నీవు; మేడి, మ్రానిన్= మేడిచెట్టును; కౌఁగిలింపుము= ఆలింగనం చేసికొనవలసింది; నీ, జననిన్= నీతల్లిని; అశ్వత్థంబున్= రావిచెట్టును; కౌఁగిలింపుము+అనుము= ఆలింగనం చేయుమని చెప్పుము; అనినన్= అని చెప్పగా; ఆ+ఇద్దఱున్= ఆ ఇరువురున్నూ; తద్+ఆలింగన, విపర్యాసంబు, చేసినన్= కౌగిలించుకొనటంలో తారుమారు చేయగా; ఎఱింగి= తెలిసికొని; భృగుండు= భృగుమహర్షి; కోడలికి= కోడలితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'దేవా! నీ అనుగ్రహంవలన నాకు ఒక కొడుకు, నా తల్లికి ఒక కొడుకు కలుగుగాక' అని సత్యవతి భృగుడిని ప్రార్థించి నమస్కరించగా, ఆయన కరుణించి 'నీవు కోరినట్లే జరుగునుగాక! మీరు పరిశుభ్రంగా స్నానంచేసి, నీవు మేడిచెట్టును కౌగిలించుకో; నీ తల్లి అశ్వత్థాన్ని ఆలింగనం చేసికొనుగాక' అని ఆనతిచ్చాడు. కాని, సత్యవతి అశ్వత్థవృక్షాన్ని, ఆమెతల్లి మేడిచెట్టును కౌగిలించుకొన్నారు. ఆ విషయాన్ని భృగుడు తెలిసికొని కోడలితో ఇట్లా పలికాడు.

**విశేషం:** 'శుచిస్నాతలు' - అనగా 'ఋతుస్నాతలు' అని అర్థం. ఋతుమతులు నాల్గవదినము శుద్ధికొరకు చేసే స్నానం ఋతుస్నానం. అదే శుచిస్నానం. శుచిస్నానం చేసినవారు శుచిస్నాతలు. చూడు: సంస్కృత భారతం, భండార్కరు ప్రచురణ, III - 115 - 23 శ్లో.

**ఉ. 'పుత్త్రుఁడు నీకు బ్రహ్మకులపూజ్యుఁడు పుట్టియు వాఁడు దారుణ**
**క్షత్త్రచరిత్రుఁడై పరఁగు గర్వమునన్; మఱి నీ సవిత్రికిన్**
**క్షత్త్రియుఁ డుద్భవిల్లియు నఘక్షయకారణుఁడున్ మహాతపః**
**పాత్త్రుఁడు నై ధృతిం బడయు బ్రాహ్మణభావము భూరితేజమున్.' 136**

**ప్రతిపదార్థం:** నీకు= నీకు; బ్రహ్మకులపూజ్యుఁడు= బ్రాహ్మణ సంఘాలచేత పూజించబడేవాడు; పుత్త్రుఁడు= కొడుకు; పుట్టియు= ఉద్భవించికూడ; వాఁడు= ఆకొడుకు; దారుణక్షత్త్రచరిత్రుఁడు+ఐ= మహాభయంకరమైన క్షత్రియ ప్రవర్తన కలవాడై; గర్వమునన్= మదంతో; పరఁగు= ఒప్పుతాడు; మఱి= ఇక; నీ సవిత్రికిన్= నీ తల్లికి; క్షత్త్రియుఁడు= క్షాత్రం కలవాడు; ఉద్భవిల్లియున్= పుట్టియు; అఘక్షయకారణుఁడున్= పాపాలు నశించేందుకు హేతువైనవాడున్నూ; మహా తపస్+పాత్రుఁ డును+ఐ= గొప్పతపస్సుకు అర్హత కలిగిన వాడున్నూ అయి; బ్రాహ్మణ, భావము= బ్రహ్మజ్ఞానాన్ని; భూరి, తేజమున్= గొప్ప తేజస్సును; ధృతిన్= నిష్ఠతో; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణులందరికీ పూజ్యుడైన కొడుకు నీకు పుడతాడు; కాని, అతడు దారుణమైన క్షత్రియ ప్రవృత్తి కలవాడై గర్వంతో ప్రవర్తిస్తాడు. మరి నీతల్లికి క్షత్రియుడుగా పుట్టినప్పటికీ ఆ పుత్రుడు గొప్ప తపస్వి అయి, పాపనివారకుడై బ్రాహ్మణభావం, విజ్ఞానం, గొప్పతేజస్సులను నిష్ఠతో పొందగలడు'.

**వ. అనిన సత్యవతి గృతాంజలియై క్షత్రియభావంబు తన పుత్త్రునకుంగాక పౌత్త్రున కగునట్లుగా శ్వశురువలన వరంబు వడసి కతిపయకాలంబునకు గర్భిణియై. 137**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; సత్యవతి= సత్యవతి; కృత+అంజలి+ఐ= భక్తితో దోసలి ఘటించినదై, నమస్కరించినదై; క్షత్రియభావంబు= క్షత్రియులకు అనువైన భావం; తనపుత్త్రునకున్+కాక= తనకొడుకుకు గాక; పౌత్త్రునకు+అగునట్లుగా= మనుమడికి కలిగేటట్లుగా; శ్వశురు వలన= మామవలన; వరంబు+పడసి= వరాన్ని పొంది; కతిపయకాలంబునకున్= కొంతకాలానికి; గర్భిణి+ఐ= గర్భవతి అయి.

**తాత్పర్యం:** అని భృగుడు చెప్పగా, సత్యవతి ఆ మహర్షికి నమస్కరించి క్షత్రియభావం తన కొడుకుకు కాక, మనుమడికి కలిగేటట్లు మామగారివలన వరాన్ని పొంది, కొంతకాలానికి గర్భవతి అయి.

**క. ఆదిమునిచరితుఁ బడసెఁ బ్ర। సాదసమన్వితు సుపుత్త్రు జమదగ్నిఁ జతు**
**ర్వేదంబులయందు ధను। ర్వేదమునందును నతిప్రవీణు మహాత్మున్. 138**

**ప్రతిపదార్థం:** (ఆ సత్యవతి) ఆదిమునిచరితున్= తొల్లిటి ఋషుల శీలం కలవాడిని; ప్రసాద సమన్వితు= నిర్మలత్వం కలవాడిని; సుపుత్త్రున్= మంచి కొడుకును; చతుర్+వేదంబుల+అందు= నాలుగు వేదాలలో; ధనుర్+వేదమునందును= విలువిద్యలోను; అతిప్రవీణున్= మిక్కిలి నైపుణ్యం కలవాడిని; మహాత్మున్= మహానుభావుడిని; జమదగ్నిన్= జమదగ్ని అనే పేరు కలవాడిని; పడసెన్= పొందింది.

**తాత్పర్యం:** ఆ సత్యవతి ప్రసన్నగుణం కలవాడున్నూ, నాలుగు వేదాలలోనూ, విలువిద్యలోనూ మిక్కిలి నేర్పు కలవాడున్నూ, తొల్లిటి ఋషులను పోలిన మహాత్ముడున్నూ అయిన సుపుత్రుడిని జమదగ్ని అనేవాడిని కన్నది.

**వ. ఆ జమదగ్ని ప్రసేనజితుండను రాజుకూఁతు రేణుక యనుదాని వివాహంబయి దానియందు రుమణ్వత్సుషేణ వసు విశ్వావసు రాములను వారినైదుగురు కొడుకులం బడసి, వనంబున నుగ్రతపంబు సేయుచు, నొక్కనాఁడు వన్యఫలంబులు దేరం గొడుకులు వోయిన రేణుక వారి పిఱుందన పోయి యొక్క సరోవరంబునందు సభార్యుండయి జలక్రీడలాడు చున్నవాని మార్తికావత పతియగు చిత్ర రథుండను రాజుం జూచి కామమోహితయై వ్యభిచరించిన, దాని దుశ్చరితం బెఱింగి జమదగ్ని కోపోన్మాదపరవశుండై. 139**

**ప్రతిపదార్థం:** ఆ జమదగ్ని; ప్రసేనజితుండు+అను; రాజు; కూఁతు; రేణుక+అను దానిన్= రేణుక అనే దానిని (వధువును); వివాహంబు+అయి= పెండ్లాడి; దాని+అందు= ఆమెవలన; రుమణ్వత్; సుషేణ, వసు, విశ్వాసను, రాములు+అను వారిన్= రుమణ్వంతుడు, సుషేణుడు, వసుడు, విశ్వావసుడు, రాముడు అనేవారిని; ఐదుగురుకొడుకులన్+పడసి= ఐదుగురు పుత్రులను పొంది; వనంబునన్= అరణ్యంలో; ఉగ్ర తపంబు+చేయుచున్= కఠోరమైన తపస్సు చేస్తూ; ఒక్కనాఁడు= ఒక్కరోజు; వన్యఫలంబులు= వన్యఫలాలను; తేరన్= తెచ్చేందుకై; కొడుకులు+పోయిన= కొడుకులు వెళ్ళగా; రేణుక= రేణుక; వారి పిఱుందనపోయి= వారి వెనువెంటనే వెళ్ళి; ఒక్క సరోవరంబునందు= ఒక సరస్సులో; సభార్యుండు+అయి= భార్యలతో కూడినవాడై; జలక్రీడలు+ఆడుచున్నవాని= నీటిలో ఆటలు ఆడుతున్నవాడిని; మార్తికావతిపతి+అగు= మార్తికావతం అనే దేశానికి రాజయిన; చిత్రరథుండు= చిత్రరథుడు; అను, రాజున్+చూచి= అనే ప్రభువును చూచి; కామ, మోహిత+ఐ= వలపుచేత తబ్బిబ్బై; వ్యభిచరించినన్= మనస్సు చలించగా; దాని, దుస్+చరితంబు= ఆమె చెడునడవడిని; ఎఱింగి= తెలిసికొని; జమదగ్ని= జమదగ్ని; కోప+ఉన్మాద పరవశుండు+ఐ= ఆగ్రహంచేత ఏర్పడిన వెర్రిచేత వశం తప్పినవాడై.

**తాత్పర్యం:** జమదగ్నిమహాముని ప్రసేనజితుడు అనేరాజుకూతురు రేణుకను వివాహమాడి, ఆమెయందు రుమణ్వంతుడు, సుషేణుడు, వసుడు, విశ్వావసుడు, రాముడు అనే అయిదుగురు కొడుకులను పొందాడు, జమదగ్ని ఒకరోజు అరణ్యంలో తీవ్రమైన తపస్సులో నిమగ్నుడై ఉన్నాడు. పుత్రులు అడవిలో దొరికే పండ్లు తెచ్చేందుకై వెళ్ళారు. వారివెంట రేణుక కూడా అడవికి వెళ్ళి, అక్కడ ఒక సరోవరంలో భార్యలతో కలసి జలక్రీడలాడుతున్న మార్తికావత దేశాధీశుడైన చిత్రరథు డనేరాజును చూచింది. ఆమె మనస్సు చలించింది. మానసికమైన ఆమె చెడు నడవడిని తెలిసికొని భర్త అయిన జమదగ్ని ఆగ్రహావేశపరవశుడై.

**విశేషం:** క్రీడంతం సలిలే దృష్ట్వా సభార్యం పద్మమాలినమ్ ।
బుద్ధిమంతం తతస్తస్య స్పృహయామాస రేణుకా ॥ 7॥
వ్యభిచారాత్తు సా తస్మాత్ క్లిన్నాంభసి విచేతనా ।
ప్రవివేశాశ్రమం త్రస్తా తాం వై భర్తాన్వబుధ్యత ॥ 8 ॥ - III - 116 అధ్యా.
సంస్కృత భారతంలో రేణుక చిత్రరథుడిని చూచి మానసిక చాంచల్యానికి (మానసిక వ్యభిచారానికి) లోనైనట్లు చెప్పబడింది,

**క. తనయుల నలువురఁ గ్రమమునఁ । బనిచెన్ జమదగ్ని దనదు భార్య వధింపన్;**
**జననీఘాతము పాతక । మని వారలు పలుకకుండి రవ్యవసితులై. 140**

**ప్రతిపదార్థం:** తనయుల= కొడుకులను; నలువురన్= నలుగురినీ; క్రమమునన్= వరుసగా; జమదగ్ని= జమదగ్ని మహర్షి; తనదు భార్య వధింపన్= తనభార్యను చంపుమని; పనిచెన్= నియోగించాడు; వారలు= ఆ నలుగురు కొడుకులు; జననీఘాతము= తల్లిని చంపటం; పాతకము+అని= పాపమని; అవ్యవసితులు+ఐ= స్థిర నిశ్చయానికి రాలేనివారై; పలుకక+ఉండిరి= మాట్లాడకుండా ఉన్నారు.

**తాత్పర్యం:** జమదగ్నిమహర్షి తన కొడుకులు నలుగురినీ తన భార్యను చంపేందుకు వరుసగా నియోగించాడు. కాని, వారు తల్లిని చంపటం పాపమని అట్టి ప్రయత్నానికి పూనుకొనక మారుపలుకలేదు.

**క. కడు నలిగి యమ్మునీంద్రుఁడు । గొడుకులకును శాప మిచ్చె 'ఘోరాటవిలో**
**జడమతి మృగపక్షుల య । ట్లుడుగక యజ్ఞానవృత్తి నుండుం' డనుచున్. 141**

**ప్రతిపదార్థం:** కడున్= మిక్కిలి; అలిగి= కోపించి; ఆ+ముని+ఇంద్రుఁడు= ఆ ఋషివరేణ్యుడు; ఘోర+అటవిలో= భయంకరమైన అడవిలో; జడమతిన్= మందబుద్ధితో; మృగపక్షుల+అట్లు= జంతువులవలె, పక్షులవలె; అజ్ఞాన వృత్తిన్= జ్ఞానరహితమైన స్థితిలో; ఉడుగక= మానక, ఉండుండు+అనుచున్= ఉండండి అంటూ; కొడుకులకును= కొడుకులకు; శాపము+ఇచ్చెన్= శపించాడు.

**తాత్పర్యం:** ఆ ఋషివరేణ్యుడైన జమదగ్ని కోపించి 'భయంకరమైన అడవిలో బుద్ధిలేకుండ, జ్ఞానశూన్యులై జంతువులవలె, పక్షులవలె ఉండండి'- అని కొడుకులను శపించాడు.

**వ. మఱియు నిశిత పరశుహస్తు రాముం జూచి 'దీని వధియింపు' మని జమదగ్ని పంచిన, వాఁడు గురువచనంబునం దల్లిం దత్క్షణంబ వధియించిన. 142**

**ప్రతిపదార్థం:** మఱియు= అంతేకాక; నిశిత, పరశు, హస్తు= వాడియైన గండ్రగొడ్డలి హస్తంలో గలవాడిని; రామున్+చూచి= రాముడిని చూచి; దీని= ఈ రేణుకను; వధియింపుము+అని= సంహరించుము; అని= అంటూ; జమదగ్ని= జమదగ్ని; పంచిన= ఆజ్ఞాపించగా; వాఁడు= ఆ పరశురాముడు; గురు వచనంబునన్= తండ్రియొక్క మాట ప్రకారం; తల్లిన్= అమ్మను; తద్+క్షణంబు+అ= ఆ క్షణంలోనే; వధియించినన్= చంపగా.

**తాత్పర్యం:** మరియున్నూ, వాడి అయిన గండ్రగొడ్డలి చేతిలో గల రాముడిని చూచి 'ఈ రేణుకను సంహరించు' మని జమదగ్నిమహర్షి ఆదేశించాడు. పరశురాముడు తత్క్షణమే తండ్రిమాటప్రకారం తల్లిని సంహరించాడు.

**క. శమితనిజక్రోధుండై । జమదగ్ని తనూజు సాహసమునకుఁ దనవా**
**క్యము లంఘింపమికిఁ బ్రస । న్నమనస్కుండై తనూజునకు నిట్లనియెన్. 143**

**ప్రతిపదార్థం:** శమిత, నిజ, క్రోధుండు+ఐ= శమించిన తన కోపం కలవాడై అనగా కోపం తగ్గినవాడై; జమదగ్ని= జమదగ్ని మహర్షి; తనూజు, సాహసమునకున్= కుమారుడి తెగువకు; తన, వాక్యము, లంఘింపమికిన్= తనమాట దాటకుండా ఉన్నందుకు; ప్రసన్న, మనస్కుండు+ఐ= ప్రీతిచెందిన మనస్సు కలవాడై; తనూజునకు= పుత్రుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** కోపం తగ్గినవాడై జమదగ్ని తన కొడుకైన పరశురాముడు చూపిన తెగువకు, తనమాట దాటకపోవటానికి మిక్కిలి సంతోషించిన మనస్సు కలవాడై తన కుమారుడితో ఇట్లా పలికాడు.

**వ. 'నా వచనంబున నతిదుష్కరంబైన కార్యంబు సేసితి; నీ కిష్టంబైన వానినెల్లను వేఁడు మిచ్చెద' ననిన రాముండు సంతుష్టహృదయుండై 'మదీయజనని జీవించియుండను, దద్వధదోషనిష్కృతియు, సహోదరులు శాపవిముక్తులయి యెప్పటియట్ల యుండను, సమరంబుల నా కప్రతిహతశక్తియు, దీర్ఘాయువుంగాఁ బ్రసాదింపుం' డని తండ్రివలనం దన యభిమతంబులు వడసి యుండునంతఁ గొండొక కాలంబున.144**

**ప్రతిపదార్థం:** నా, వచనంబునన్= నా మాట చొప్పున; అతిదుష్కరంబు+ఐన= చేయటానికి మిక్కిలి కష్టమైన; కార్యంబు= పనిని; చేసితి= చేశావు; నీకు+ఇష్టంబు+ఐన, వానిన్+ఎల్లను= నీకు ఇష్టమైన వరాలను అన్నింటినీ; వేఁడుము= అర్థించుము; ఇచ్చెదను= ఇవ్వగలను (ఇస్తాను); అనిన= అని పలుకగా; రాముండు= పరశురాముడు; సంతుష్ట, హృదయుండు+ఐ= సంతోషించిన హృదయం కలవాడై; మదియ, జనని= నా తల్లి; జీవించి+ఉండను= జీవించి ఉండేటట్లు; తద్+వధదోషనిష్కృతియు= ఆమెను చంపటం వలన వచ్చిన పాపం పోయేటట్లు; సహోదరులు= తోడపుట్టినవారు; శాప, విముక్తులు+అయి= శాపంనుండి నిష్కృతి పొందినవారై; ఎప్పటి+అట్ల= యథాప్రకారం; ఉండను= ఉండేటట్లు; సమరంబులన్= యుద్ధాలలో; నాకు= నాకు; అప్రతిహతశక్తియు= ఎదురు లేనట్టి బలాన్ని; దీర్ఘ+ఆయువున్+కాన్= చిరకాలం బ్రతికేటటువంటి వాడయ్యేటట్లు; ప్రసాదింపుండు= అనుగ్రహించండి; అని= అంటూ; తండ్రివలనన్= తండ్రివలన; తన+అభిమతంబులు= తన కోరికలు; పడసి= పొంది; ఉండునంతన్= ఉన్నంత; కొండొక, కాలంబునన్= కొంతకాలానికి.

**తాత్పర్యం:** 'నామాటమేరకు నీవు మిక్కిలి కష్టతరమైన పనిని చేశావు. నీవు ఇష్టమైన వరాలను అన్నిటినీ కోరుకొనుము; ఇస్తాను' అని జమదగ్ని పరశురాముడితో అన్నాడు. అనగా పరశురాముడు సంతోషించిన హృదయం కలవాడై 'నా తల్లి తిరిగి బ్రతకాలి. ఆమెను సంహరించినపాపంనుండి నాకు విముక్తి కలగాలి. నా సహోదరులకు శాపవిమోచన మేర్పడివారు యథాపూర్వం ఉండాలి. యుద్ధాలలో నాకు ఎదురులేని బలం కలగాలి. నేను చిరకాలం జీవించేవాడిని కావాలి' అని అర్థించి తండ్రిఅయిన జమదగ్నిమహర్షివలన ఆ వరాల నన్నింటినీ పొందాడు. అంత కొంతకాలానికి.

**చ. అమితబలుండు హైహయుఁ డహర్పతితేజుఁ డజేయబాహువి**
**క్రముఁడు సహస్రబాహుఁ డనఁగా విదితుం డగువాఁడు తద్వనాం**
**తమున మృగవ్యఖిన్నుఁ డయి తా జమదగ్ని మహామునీంద్రు నా**
**శ్రమమున కేఁగుదెంచె బహుసైన్యముతో నధికశ్రమార్తుఁడై. 145**

**ప్రతిపదార్థం:** అమితబలుండు= అంతులేని బలం కలవాడు; హైహయుఁడు= హైహయు వంశానికి చెందినవాడు-కార్తవీర్యుడు; అహస్+పతి, తేజుఁడు= అహర్పతితేజుడు- సూర్యుడి వంటి తేజస్సు కలవాడు; అ, జేయ, బాహు, విక్రముఁడు= జయించటానికి వీలుకాని చేతుల పరాక్రమం కలవాడు; సహస్రబాహుఁడు+అనఁగా, విదితుండు+అగువాఁడు= సహస్రబాహుడు (వేయి చేతులు కలవాడు) అని ప్రశస్తి పొందినవాడు; తద్+వన+అంతమునన్= ఆ అరణ్యం లోపల; మృగవ్యఖిన్నుఁడు+అయి= వేటలో అలసిపోయి; తాన్= తాను; జమదగ్ని, మహాముని+ఇంద్రు= జమదగ్ని మహాముని శ్రేష్ఠుడి; ఆశ్రమమునకు= ఋషివాటికకు; బహు, సైన్యముతోన్= అధికసంఖ్య కల సేనతో; అధిక, శ్రమ+ఆర్తుఁడు+ఐ= ఎక్కువ అలసటచేత బడలిన శరీరం కలవాడై; ఏఁగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** అపారమైనబలం కలవాడు, హైహయవంశంలో పుట్టినకార్తవీర్యుడు అనేవాడు, సూర్యుడి వంటి వర్చస్సు కలవాడు, జయించరాని బాహుశౌర్యం కలవాడు, సహస్రబాహుడనే పేరుతో ప్రసిద్ధుడైనవాడు ఆ అరణ్యంలో వేటాడుతూ బడలినవాడై, జమదగ్ని మహర్షి ఆశ్రమానికి గొప్ప సైన్యంతో శ్రమచేత మిక్కిలి నొచ్చినవాడై ప్రవేశించాడు.

**వ. అందు మునివరుచేతం బూజితుం డయ్యును వాఁడు దనరాజ్యమదంబున మెచ్చక యయ్యాశ్రమవాసుల కవమానంబు సేసి, యందలి వృక్షంబు లెల్ల విఱిచి, జమదగ్ని హోమధేనువును దరుణవత్సంబుతోఁ గట్టికొని పోయిన, నప్పు డవ్వనంబుననుండి సమిత్కుశఫలంబులు గొని వచ్చిన రామునకు జమదగ్ని యిట్లనియె.146**

**ప్రతిపదార్థం:** అందు= ఆ ఆశ్రమంలో; ముని, వరుచేతన్= మునులలో శ్రేష్ఠుడైన జమదగ్నిచేత; పూజితుండు+అయ్యును= సత్కరించబడిన వాడైననూ; వాఁడు= ఆ హైహయుడైన కార్తవీర్యుడు; తన, రాజ్య, మదంబున= తనకు గల ప్రభుత్వగర్వంచేత; మెచ్చక= లక్ష్యపెట్టక; ఆ+ఆశ్రమవాసులకు= ఆ ఆశ్రమంలో నివసించే వారికి; అవమానంబు+చేసి= అగౌరవం చేసి; అందలి= అక్కడి; వృక్షంబులు+ఎల్లన్= చెట్లను అన్నిటినీ; విఱిచి= ముక్కలుచేసి; జమదగ్ని, హోమ, ధేనువును= జమదగ్ని హోమంకొరకు ఉపకరించేటటువంటి ఆవును; తరుణ, వత్సంబుతోన్= లేగదూడతో; కట్టి, కొనిపోయినన్= కట్టి, తీసికొనిపోగా; అప్పుడు= అపుడు; ఆ+వనంబున నుండి= ఆ అడవినుండి; సమిత్+కుశ, ఫలంబులు= మోదుగు పుడకలు, దర్భలు, పండ్లు; కొనివచ్చిన= తీసికొని వచ్చినట్టి రామునకున్= పరశురాముడికి; జమదగ్ని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ ఆశ్రమంలో జమదగ్నిచేత పూజించబడినవాడైకూడా, కార్తవీర్యుడు రాజ్యమదంతో ఆ ఋషిని లక్ష్యపెట్టక, ఆశ్రమంలో నివసించే వారిని అవమానించాడు. ఆ ఆశ్రమంలోని చెట్లను విరిచివేశాడు. హోమధేనువును దాని లేగదూడతోసహా బంధించి తీసికొనిపోయాడు. అది జరిగిన కొద్దిసేపటికి రాముడు దర్భలు మొదలైన యజ్ఞపరికరాలను తీసికొని అడవినుండి తిరిగివచ్చాడు. అప్పుడు జమదగ్ని రాముడితో ఇట్లా అన్నాడు.

**క. 'వినవయ్య! కార్తవీర్యుఁడు । మన ధేనువుఁ బట్టుకొని సమర్థుం డయి పె**
**ల్చన పోయె; నేమి సేయుద?' మనవుడు రాముండు విని మహాక్రోధమునన్. 147**

**ప్రతిపదార్థం:** వినవయ్య!= ఆలకించవయ్యా!; కార్తవీర్య మహారాజు; మన, ధేనువున్= మన ఆవును; పట్టుకొని= లాగుకొని; సమర్థుండు+అయి= శక్తికలవాడై; పెల్చన= పటాటోపంతో; పోయెన్= వెళ్ళిపోయాడు; ఏమి+చేయుదము?= ఏమి (ప్రతీకారం) చేయగలం?; అనవుడు= అని చెప్పగా; రాముండు= పరశురాముడు; విని= విని; మహాక్రోధమునన్= మిక్కిలి కోపంతో.

**తాత్పర్యం:** 'వినవయ్యా! మన ఆవును కార్తవీర్యుడు బలవంతంగా సగర్వంగా పటాటోపంతో పట్టుకొని పోయాడు. వాడు సామర్థ్యం కలవాడు. మనం ఏం చేయగలం?' అని జమదగ్ని చెప్పగా విని పరశురాముడు కోపోద్రిక్తుడై.

**క. గురువచనబోధితుండై । సరభసగతి వాని పిఱుఁదఁ జని, తద్బలమున్**
**శరవృష్టి ముంచి చంపె న । పరిమిత లయకాలమేఘపటలమపోలెన్. 148**

**ప్రతిపదార్థం:** గురు, వచన, బోధితుండు+ఐ= తండ్రియొక్క మాటలచేత ప్రేరేపించబడినవాడై; సరభసగతి= వేగం గల గమనంతో; వాని, పిఱుఁదన్+చని= అతడి (కార్తవీర్యుడి) వెనుకనే వెళ్లి; అపరిమిత, లయ, కాల, మేఘ, పటలము+అ+పోలెన్= పరిమితి లేని ప్రళయకాలంలోని మబ్బుల దొంతరవలె; తద్+బలమున్= అతడి సైన్యాన్ని; శర, వృష్టిన్, ముంచి= బాణాలవానచేత మునిగేటట్లు చేసి; చంపెన్= సంహరించాడు; మఱియును= ఇంకను,

**తాత్పర్యం:** తండ్రిమాటలచేత ప్రేరేపించబడినవాడై పరశురాముడు వేగంగా కార్తవీర్యుడిని వెంటాడి వెళ్ళి, ప్రళయకాలంలోని మేఘసమూహంవలె అతడి సైన్యాన్ని శరవృష్టిచేత ముంచి, చంపాడు.

**విశేషం:** అలం: శ్లేషానుప్రాణితమైన ఉపమ. శరము= బాణము, జలము. పరశురాముడు- ప్రళయమేఘం, శరములు కురవటం శ్లేష.

**వ. మఱియును. 149**

**తాత్పర్యం:** ఇంకనూ.

### పరశురాముఁడు కార్తవీర్యునిఁ జంపుట (సం. 3-116-24)

**చ. బలిమి నశేషలోకపరిభావిమహాద్భుతశౌర్యసంపదం**
**బొలుచు సహస్రబాహుకరముల్ గులిశాతినిశాతబాణధా**
**రల నతివీరుఁడై తునిమి రాముఁ డరాతులకున్ భయంబుగాఁ**
**గలహములోన వాని నతిగర్వితుఁ జంపెఁ బరాక్రమోన్నతిన్. 150**

**ప్రతిపదార్థం:** బలిమిన్= బలంతో; అ, శేష, లోక, పరిభావి, మహా+అద్భుత, శౌర్య, సంపదన్+పొలుచు= సమస్తమైన జగత్తును జయించి అవమానించగల గొప్ప అచ్చెరువు కొలిపే పరాక్రమ సంపదచేత విలసిల్లే; సహస్ర, బాహు, కరముల్= వేయిభుజాలు చేతులు; కులిశ+అతి, నిశాత, బాణ, ధారలన్= వజ్రం వలె మిక్కిలి వాడిఅయిన అమ్ముల వరుసలచేత; అతి, వీరుఁడు+ఐ= వీరాధివీరుడై; రాముఁడు= పరశురాముడు; తునిమి= నరికి; అరాతులకున్= శత్రువులకు; భయంబు+కాన్= వెరపు కొలిపేటట్లుగా; కలహములోనన్= యుద్ధంలో; పరాక్రమ+ఉన్నతిన్= శౌర్యంయొక్క పెంపుచేత; వానిన్= అతడిని- ఆ కార్తవీర్యుడిని; అతి గర్వితున్= మిక్కిలి మదించిన వాడిని; చంపెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** పరశురాముడు వీరాధివీరుడై వజ్రాయుధంవంటి మిక్కిలి వాడియైన అమ్ములవరుసలు ప్రయోగించి, బలంచేత సమస్తలోకాలను జయించి అవమానించగల అచ్చెరువు కొలిపే గొప్ప పరాక్రమ ప్రాభవంతో విలసిల్లే కార్తవీర్యుడి యొక్క వేయిభుజాలను, చేతులను నరికి, మిక్కిలి మదించిన కార్తవీర్యుడిని శౌర్యంయొక్క పెంపుచేత యుద్ధంలో సంహరించాడు.

**వ. అంతం గార్తవీర్యుని పుత్త్రులు బద్ధవైరులై రామరహితం బయిన జమదగ్న్యాశ్రమంబునకు వచ్చి, యందు.151**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; కార్తవీర్యుని పుత్త్రులు= కార్తవీర్యుడి కొడుకులు; బద్ధ, వైరులు+ఐ= గాఢంగా ఏర్పడిన శత్రుత్వం కలవారై; రామ, రహితంబు+అయిన= పరశురాముడు లేనట్టి; జమదగ్ని+ఆశ్రమంబునకు= జమదగ్నియొక్క ఋషివాటికకు; వచ్చి; అందున్= అక్కడ,

**తాత్పర్యం:** తరువాత కార్తవీర్యుడి కొడుకులు పగబట్టి పరశురాముడు లేనప్పుడు జమదగ్ని ఆశ్రమానికి వచ్చి, అక్కడ.

**మ.** **మునులం దిట్టుచుఁ బుష్పవృక్షతతు లున్మూలించుచుం గ్రూరులై**
**యనవద్యున్ జమదగ్నిఁ బట్టి బలిమిన్ 'హా రామ! హా రామ!' యం**
**చును నాక్రోశము సేయుచుండఁగ మునుల్ శోకింప ధర్మాత్ము న**
**మ్మునిముఖ్యున్ వధియించి రాగ్రహమహామోహాంధులై హైహయుల్.** **152**

**ప్రతిపదార్థం:** హైహయుల్= హైహయ వంశంలో జన్మించిన కార్తవీర్యుడి కొడుకులు; మునులన్+తిట్టుచున్= ఋషులను తిడుతూ; పుష్ప, వృక్ష, తతులు= పువ్వులతో కూడినచెట్లను; ఉన్మూలించుచున్= వేళ్ళతోపాటు పెకలిస్తూ; క్రూరులు+ఐ= కఠినాత్ములై; అనవద్యున్= గొప్పవాడిని (అనింద్యుడిని); జమదగ్నిన్= జమదగ్నిని; బలిమిన్= బలిమితో; పట్టి= బంధించి; హా రామ! హా రామ!= ఓ రామా! ఓ రామా!; అంచునున్= అంటూ; ఆక్రోశము+చేయుచుండఁగ= గట్టిగా విలపిస్తుండగా; మునుల్= ఋషులు; శోకింప= దుఃఖించగా; ధర్మ+ఆత్మున్= ధర్మమందు నిష్ఠకలవాడిని; ఆ+మునిముఖ్యున్= మునులలో గొప్పవాడిని, ఆగ్రహ, మహా, మోహ+అంధులు+ఐ= కోపంచేత ఏర్పడిన గొప్ప అజ్ఞానంతో కూడిన ఆవేశంచేత గ్రుడ్డివారై; వధియించిరి= చంపారు.

**తాత్పర్యం:** హైహయవంశంలో జన్మించిన కార్తవీర్యుడి పుత్రులు కఠినాత్ములై ఋషులను తిట్టారు. ఆశ్రమంలో పువ్వులతో కలకలలాడుతున్న చెట్లను కూకటివేళ్ళతోపాటు పెకలించి వేశారు. గొప్పవాడైన జమదగ్ని మహర్షిని బలవంతంగా పట్టుకొని బంధించారు. అతడు 'ఓ రామా! ఓ రామా!' అని బిగ్గరగా విలపిస్తుండగా, ఋషులు శోకిస్తుండగా ఆ ధర్మాత్ముడైన ఋషిశ్రేష్ఠుడిని, కోపంతో, అజ్ఞానంతో కూడిన ఆవేశంతో సంహరించారు.

**చ.** **వఱలఁగ రాముఁ డంత ననవద్యుఁడు వచ్చి బహుప్రలాపి యై**
**యఱచుచునున్న తల్లిని గృతాంతవశస్థితుఁ డైన తండ్రి ను**
**క్కఱఁ గని తీవ్రశోకపరిఘాతహతుం డయి తత్ప్రకార మం**
**దెఱిఁగి ముహూర్తమేనియు సహింపఁగ నోపక కోపదీప్తుఁడై.** **153**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; న+అవద్యుఁడు= గొప్పవాడు; రాముఁడు= పరశురాముడు; వఱలఁగ= విలసిల్లేటట్లుగా; వచ్చి= అరుదెంచి; బహు, ప్రలాపి+ఐ= ఎక్కువగా ఏడుస్తూ; అఱచుచున్+ఉన్న= బిగ్గరగా బొబ్బలు పెడుతున్న; తల్లిని= జనయిత్రిని; కృతాంత, వశ, స్థితుఁడు+ఐన= యముడి అధీనంలోకి పోయిన- మరణించిన; తండ్రిన్= తండ్రిని; ఉక్కు+అఱన్+కని= స్థైర్యం చెదరిపోవగా చూచి; తీవ్ర, శోక, పరిఘాత, హతుండు+అయి= గాఢమైన దుఃఖం అన్న పెద్ద దెబ్బచేత కొట్టబడినవాడై; తత్+ప్రకారము= ఆ జరిగిన సంగతి; అందు= అక్కడ; ఎఱిఁగి= తెలిసికొని; ముహూర్తము+ఏనియున్= క్షణకాలమైనా; సహింపఁగన్+ఓపక= తాళలేక; కోపదీప్తుఁడు+ఐ= ఆగ్రహంచేత ప్రజ్వలించబడినవాడై.

**తాత్పర్యం:** అటుపిమ్మట గొప్పవాడైన పరశురాముడు ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. అక్కడ తల్లి బిగ్గరగా ఏడుస్తూ అరుస్తున్నది. మరణించిన తండ్రిశవం పడి ఉన్నది. దానినిచూచి, అక్కడ జరిగినదంతా తెలిసికొని, మిక్కిలి గాఢమైన దుఃఖం అనే దెబ్బచేత కొట్టబడినవాడై పరశురాముడు ఒక్కక్షణమైనా తాళలేక ఆగ్రహంతో ప్రజ్వలించినవాడై.

**చ. 'అనఘుని వీతరాగుఁ గరుణాత్ముఁ బ్రశాంతుని దాంతు నిమ్మహా**
**మునివరుఁ జూచి చూచి యధముల్ వధియించిరి; దీనఁ జేసి దు**
**ర్జను లగుచున్న క్షత్రియులఁ జంపుదు' నంచుఁ బ్రతిజ్ఞ సేసె భూ**
**వినుతుఁడు జామదగ్న్యుఁ డతివీరుఁడు లోకభయంకరాకృతిన్. 154**

**ప్రతిపదార్థం:** అధముల్= నీచులు; అనఘుని= పాపం లేనివాడిని, పరమపుణ్యాత్ముడైన వాడిని; వీత, రాగున్= రాగం వీడిన వాడిని; ప్రశాంతుని, దాంతున్= శాంతి, దాంతి కలవాడిని; కరుణా+ఆత్మున్= దయతో నిండిన ఆత్మకలవాడిని; ఈ+మహామునివరున్= ఈ గొప్ప ఋషులలో గొప్పవాడిని-జమదగ్నిని; చూచిచూచి= అరసి అరసి (అంటే అనాలోచితంగా కాక, ఆలోచించి బుద్ధిపూర్వకంగా చేయాలి అని చేసిన నేరం అది అన్నమాట); వధియించిరి= సంహరించారు; దీనన్+చేసి= దీనిచేత; దుర్జనులు= చెడ్డవారు; అగుచున్న, క్షత్రియులన్= అవుతున్న క్షత్రియులను; చంపుదున్= సంహరిస్తాను; అంచున్= అంటూ; భూ వినుతుఁడు= భూమండల మంతటి చేత పొగడబడినవాడు; అతివీరుఁడు= గొప్ప శూరుడు (వీరులకంటె అధికుడైన వీరుడు); జామదగ్న్యుఁడు= జమదగ్నికుమారుడైన పరశురాముడు; లోక భయంకర+ఆకృతిన్= జగత్తుకు భయం కలిగించే ఆకారంతో; ప్రతిజ్ఞ+చేసెన్= శపథం చేశాడు.

**తాత్పర్యం:** 'నీచులైన హైహయులు పుణ్యాత్ముడున్నూ రాగరహితుడున్నూ, దయార్ద్ర హృదయుడున్నూ, ఇంద్రియాలను జయించిన మహాత్ముడున్నూ, ప్రశాంతుడున్నూ, దాంతుడున్నూ అయినటువంటి జమదగ్ని మహర్షిని బుద్ధిపూర్వకంగా చంపారు. ఇది తెలియక చేసిన నేరం కాదు. ఇటువంటి ఘోరకృత్యాలను చేయటానికి వెనుతీయని క్షత్రియజాతిని అంతటినీ సంహరించగల'నని లోకవినుతుడు, వీరాధివీరుడు, జమదగ్నికుమారుడైన పరశురాముడు జగత్తుకు భయంగొలిపే ఆకారం వహించి శపథం చేశాడు.

**విశేషం:** ప్రశాంతుడు, దాంతుడు అనగా ఇంద్రియాలను, అరిషడ్వర్గాలను, కామక్రోధాదులను జయించినవాడు.

**వ. ఇట్లు కృతప్రతిజ్ఞుండై క్షత్రియులనెల్ల వధియించి, దిగ్దంతిదంతార్గళాఘూట మహీచక్రంబు సాధించి, విధివిహిత విధానాధ్వరుండై కశ్యపునకు నార్త్విజ్య దక్షిణగా నఖిలభూవలయంబు నిచ్చి, నిస్సంగుండై మహేంద్ర పర్వతంబునం దపోనిత్యుండై యున్నవాఁ డని పరశురాము చరితంబు సెప్పిన విని, ధర్మజుం డనుజబ్రాహ్మణసహితుండై మునిగణోపదేశంబునం జతుర్దశినాఁడు పరశురాముం జూచి, పరమభక్తిం బూజించి తత్ప్రతిపూజితుండై దక్షిణదిక్కునకుం జని. 155**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; కృత, ప్రతిజ్ఞుండు+ఐ= చేయబడిన శపథం కలవాడై; క్షత్రియులను+ఎల్లన్= క్షత్రియులనందరినీ; వధియించి= సంహరించి; దిక్+దంతి, దంత+అర్గళ+ఆఘూట, మహీచక్రంబు= దిక్కులందలి ఏనుగుల దంతాలనేటువంటి గడియమ్రానులు ఎల్లలుగా గల భూమండలాన్ని; సాధించి= జయించి; విధి, విహిత, విధాన+అధ్వరుండు+ఐ= శాస్త్రాలలోని సూత్రాలచేత నిర్దేశించబడిన పద్ధతిలో యజ్ఞాన్ని నిర్వహించినవాడై; కశ్యపునకున్= కశ్యప మహర్షికి; ఆర్త్విజ్య దక్షిణగాన్=

ఋత్విజుడికి ఇచ్చే సంభావన ద్రవ్యంగా; అఖిల, భూ, వలయంబున్= సమస్తమైన భూ మండలాన్ని; ఇచ్చి= దానంగా సమర్పించి; నిః+సంగుండు+ఐ= ఎటువంటి అనుబంధాలు లేనివాడై; మహేంద్ర, పర్వతంబునన్= మహేంద్రం అనేపేరు గల పర్వతంపై; తపస్+నిత్యుండు+ఐ= తపస్సునందు ఎల్లప్పుడూ నిష్ఠ కలవాడై; ఉన్నవాఁడు+అని= ఉన్నవాడని; పరశురాము చరితంబు+చెప్పిన= పరశురాముడియొక్క ఉదంతాన్ని వినిపించగా; విని; ధర్మజుండు= ధర్మతనయుడు; అనుజ, బ్రాహ్మణ, సహితుండు+ఐ= సోదరులతో బ్రాహ్మణులతో కూడుకొన్నవాడై; ముని, గణ+ఉపదేశంబునన్= ఋషులబృందంయొక్క హితబోధచేత; చతుర్దశి, నాఁడు= చతుర్దశి తిథి దినాన; పరశురామున్+చూచి= పరశురాముడిని సందర్శించి; పరమభక్తిన్= మిక్కిలి భక్తితో; పూజించి= అర్చించి; తద్+ప్రతి, పూజితుండు+ఐ= అతడిచేత తిరిగి పూజించబడినవాడై; దక్షిణ, దిక్కునకున్+చని= దక్షిణ దిశకు వెళ్ళి.

**తాత్పర్యం:** ఈ విధమైన శపథం చేసి, క్షత్రియుల నందరినీ సంహరించి, దిగ్గజాల దంతాలనే గడియప్రానులు ఎల్లలుగా గలిగిన (దిగ్గజాల దంతాలచేత మోయబడుతున్న) భూమండలాన్ని అంతటినీ జయించి, శాస్త్రోక్తంగా యజ్ఞాన్ని చేసి, ఋత్విజుడికి సమర్పించేటటువంటి సంభావనద్రవ్యంగా సమస్త భూమండలాన్ని కశ్యపుడికి దానంచేసి, ఎటువంటి బంధాలులేని వైరాగ్యంతో కూడినవాడై మహేంద్రగిరి అనేకొండ మీద నిరంతరతపోనిష్ఠతో పరశురాముడు ఉన్నాడు'- అని చెప్పగా ఆలకించి ధర్మరాజు తన తమ్ములతో, బ్రాహ్మణులతో కలిసి చతుర్దశి తిథినాడు పరశురాముడిని సందర్శించి అతడిని అర్చించి అతడిచేత తిరిగి అర్చించబడినవాడై దక్షిణదిశకు తరలివెళ్ళాడు.

**విశేషం:** భూమిని అష్టదిగ్గజాలు మోస్తున్నట్లు ప్రాచీన భారతీయ సంప్రదాయం అష్టదిగ్గజాలు: 1. ఐరావతం 2. పుండరీకం 3.వామనం 4. కుముదం 5. అంజనం 6. పుష్పదంతం 7. సార్వభౌమం 8. సుప్రతీకం.

**క. భూవినుతంబై త్రిభువన । పావనమై త్ర్యంబకప్రభవమైన జలౌ**
**ఘావళిఁ బవిత్ర మగు గో । దావరిఁ బుణ్యనదిఁ గనియె దక్షిణగంగన్. 156**

**ప్రతిపదార్థం:** భూ, వినుతంబు+ఐ= భూమియందు కొనియాడబడినదై; త్రిభువనపావనము+ఐ= మూడు లోకాల్లోనూ పవిత్రమైనదై; త్ర్యంబక, ప్రభవము+ఐన= త్ర్యంబకం అనేస్థలంలో పుట్టిన; జల+ఓఘ+ఆవళిన్= నీటిప్రవాహాల సముదాయంచేత; పవిత్రము+అగు= పావనమైన; గోదావరిన్= గోదావరిని; పుణ్యనదిన్= పుణ్యం ఇచ్చే ఏరును; దక్షిణగంగన్= దక్షిణదిశలో ఉన్న గంగానదిని; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** భూమండలంలో సుప్రసిద్ధమై మూడులోకాలను పవిత్రం చేసేటటువంటిదై త్ర్యంబకమనేచోట పుట్టిన నీటివెల్లువచేత పావనమైన పుణ్యనది దక్షిణగంగ అయిన గోదావరిని దర్శించాడు.

**శా. గో దేవ క్షితిదేవ భక్తిపరుఁడై గోదావరీస్నాతుఁడై**
**గోదానంబులు హేమదానములుఁ బెక్కుల్ రత్నదానంబులన్**
**భూదేవోత్తమపూజ సేయుచు జగత్పూజ్యుండు ధర్మాత్మజుం**
**డాదిత్యాభుఁ డనేకతీర్థశతసేవాసక్తపుణ్యాత్ముఁడై. 157**

**ప్రతిపదార్థం:** గో, దేవ, క్షితిదేవ, భక్తి పరుఁడు+ఐ= గోవులయందు, భూదేవులైన బ్రాహ్మణులయందు భక్తి కలవాడై; గో, దానంబులు= ఆవులను దానం ఇవ్వటం; హేమ, దానములున్= బంగారాన్ని దానంచేయుటలు; పెక్కుల్= ఎన్నో,

రత్నదానంబులన్= రత్నాలను దానాలు చేయటం చేతను; భూ, దేవ+ఉత్తమ, పూజ+చేయుచు= బ్రాహ్మణోత్తములను అర్చిస్తూ; జగత్+పూజ్యుండు= లోకం అంతటిచేత అర్చించతగినవాడు; ధర్మ+ఆత్మజుండు= ధర్మసుతుడు; ఆదిత్య+ ఆభుఁడు= సూర్యుడితో సమానమైనవాడు; అనేక, తీర్థ, శత, సేవా, సక్త, పుణ్య+ఆత్ముఁడు+ఐ= అనేక పుణ్యక్షేత్రాలను వందలకొద్దీ సేవించటంలో లగ్నమైన పుణ్యమైన ఆత్మ కలవాడై.

**తాత్పర్యం:** గోవులందు, దేవతలందు, భూదేవులైన బ్రాహ్మణులందు భక్తికలవాడై గోదావరీనదిలో స్నానం చేసి, ఆవులను దానంచేయుటంతో, బంగారాన్ని, పెక్కురత్నాలను దానం చేయటంతో బ్రాహ్మణులను సత్కరిస్తూ జగత్తుచేత పూజించదగిన ధర్మపుత్రుడు సూర్యుడితో సమానమైనవాడు పెక్కుపుణ్యక్షేత్రాలను వందలకొద్దీ సందర్శించాలనే కోరిక గల పుణ్యాత్ముడై.

**వ. ద్రవిడదేశంబున నగస్త్యతీర్థంబాడి, యందుఁ దొల్లి యర్జును చేసిన గోసహస్రదానాది వివిధ దానంబులు విని, వానిం బ్రశంసించుచుం జని శూర్పారకంబను తీర్థంబునం బర్వతోత్సేధంబైన పరశురాము వేదిం గని, సముద్రతీరంబునకుం జని ప్రభాసతీర్థంబునం బండ్రెండుదినంబులు పవనాంబుభక్షుండై పంచాగ్ని మధ్యంబున ధర్మజుండు తపంబు సేసిన. 158**

**ప్రతిపదార్థం:** ద్రవిడ, దేశంబునన్= తమిళదేశాన; అగస్త్య, తీర్థంబు+ఆడి= అగస్త్యుడిపేర వెలసిన పుణ్యక్షేత్రంలో స్నానంచేసి; అందున్= అక్కడ, తొల్లి= పూర్వం; అర్జును, చేసిన= అర్జునుడు చేసినట్టి; గో, సహస్ర, దాన+ఆది, వివిధ, దానంబులు= వేయిగోవులదానం మొదలైన పలుదానాలనుగురించి; విని; వానిన్= ఆ అర్జునుడిని; ప్రశంసించుచున్= పొగడుతూ; చని= వెళ్ళి; శూర్పారకంబు+అను= శూర్పారకం అనేటటువంటి; తీర్థంబునన్= పుణ్యక్షేత్రంలో; పర్వత+ఉత్సేధంబు+ఐన= కొండవలె పొడుగ్గా విస్తరించి ఉన్న; పరశు, రాము, వేదిన్+కని= పరశురాముడి అరుగును చూచి; సముద్ర, తీరంబునకున్+చని= సముద్రంయొక్క గట్టును చేరి; ప్రభాస తీర్థంబునన్= ప్రభాస మనే పుణ్యక్షేత్రంలో; పండ్రెండు, దినంబులు= పన్నెండు రోజులు; పవన+అంబు, భక్షుండు+ఐ= గాలిని, నీళ్ళను మాత్రమే ఆహారంగా గైకొన్నవాడై; పంచ+అగ్ని, మధ్యంబున= అయిదు అగ్నుల మధ్య; ధర్మజుండు= ధర్మరాజు; తపంబు= తపస్సు; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** ద్రవిడదేశంలోని అగస్త్యతీర్థంలో స్నానంచేసి, అక్కడ పూర్వం అర్జునుడు చేసిన వేయి ఆవులదానం, మున్నగు దానాల పొగడ్తలు విని సంతోషించి, అర్జునుడిని అభినందిస్తూ వెళ్ళి శూర్పారకమనే తీర్థాన్ని చేరి, అక్కడ కొండవలె పొడవుగా వ్యాపించి ఉన్న పరశురాముడి వేదికను చూచి, అక్కడినుండి సముద్రతీరానికి వెళ్ళి ప్రభాసతీర్థాన పన్నెండురోజులు గాలినీరుమాత్రమే ఆహారంగా గైకొని ధర్మరాజు పంచాగ్నిమధ్యంలో తపస్సుచేశాడు.

**విశేషం:** పంచాగ్నులు: 1. పూర్వాగ్ని 2. దక్షిణాగ్ని 3. పశ్చిమాగ్ని 4. ఉత్తరాగ్ని 5. సూర్యుడు. ఇవి కాయక్లేశయుతమైన తపస్సుకు చెందినవి.

**ఆ. దాని నెఱిఁగి రామదామోదరులు వృష్టి। వరులతోడఁ బ్రీతి నరుగుదెంచి**
**కనిరి సకలతీర్థగమనపరిక్లేశ। కృశులఁ బాండుసుతుల విశదయశుల. 159**

**ప్రతిపదార్థం:** దానిన్+ఎఱిఁగి= పాండవులరాకనుగురించి తెలిసికొని; రామ, దామోదరులు= బలరాముడు, శ్రీకృష్ణుడున్నూ; వృష్ణి, వరులతోడన్= యాదవులలో ఒకతెగ అయిన వృష్ణివంశంలోని నాయకులతో కలిసి; ప్రీతిన్= ప్రేమతో; అరుగుదెంచి=

వచ్చి; సకల, తీర్థ, గమన, పరిక్లేశ, కృశులన్= అన్ని పుణ్యక్షేత్రాలకు వెళ్ళటం చేత ఏర్పడిన శ్రమ వలన కృశించిన వారిని; విశద, యశులన్= అందరికీ తేటతెల్లమైన కీర్తికలవారిని; పాండు, సుతులన్= పాండవులను; కనిరి= సందర్శించారు.

**తాత్పర్యం:** ప్రభాసతీర్థానికి పాండవులు వచ్చినట్లు తెలిసికొని, బలరాముడు, శ్రీకృష్ణుడున్నూ వృష్ణిజాతికి చెందిన నాయకులతో కలిసి అక్కడికి వచ్చి, ఎన్నో పుణ్యక్షేత్రాలను సందర్శించటంచేత డస్సి, కృశించినవారున్నూ, స్వచ్ఛమైన కీర్తి గలవారున్నూ అయిన పాండవులను సందర్శించారు.

**విశేషం:** ప్రభాసతీర్థం యాదవరాజ్యంలోనిది. పశ్చిమ సముద్రతీరంలో ఉన్నది.

**క.** **చీరాజినధారుల నవి। కారతపోయుతులఁ జూచి కడు దుఃఖితులై**
**వారిజదళాక్షి ద్రౌపది। నూరార్చి రుదార హిత మృదూక్తుల నొప్పన్.** **160**

**ప్రతిపదార్థం:** చీర+అజిన, ధారులన్= నారబట్టలు, జింకచర్మము ధరించిన వారిని; అ వికార, తపస్+యుతులన్= చలించని నిష్ఠగల తపస్సుతో కూడినవారిని; చూచి= సందర్శించి; కడు= మిక్కిలి; దుఃఖితులు+ఐ= వెతచెందినవారై; వారి, జ, దళ+అక్షి= (నీటినుండి పుట్టిన) పద్మంలోని రేకులవంటి కన్నులు కలది అయిన; ద్రౌపదిన్= ద్రౌపదిని; ఉదార, హిత, మృదు+ఉక్తులన్= ఔదార్యంతో కూడినవై మేలును కోరే మెత్తటి మాటలతో; ఒప్పన్= ఒప్పునట్లుగా; ఊరార్చిరి= ఓదార్చారు.

**తాత్పర్యం:** నారబట్టలు, జింకచర్మాలు ధరించిన వారిని, చలించని తపోనిష్ఠతో గూడిన పాండవులను చూచి వారు మిక్కిలి వెత చెందారు. పద్మదళాక్షి అయిన ద్రౌపదిని ఔదార్యంతో కూడి మేలును కోరే మెత్తటిపలుకులతో ఊరడించారు.

**వ.** **వారికి ధర్మతనయుండు తమ వనవాసతీర్థగమనాయాసంబును, నర్జును దివ్యాస్త్రలాభంబును, నింద్రునొద్ద నాతని యునికియుం జెప్పిన విని రాముండు గృష్ణాదులైన వృష్ణివరుల కిట్లనియె.** **161**

**ప్రతిపదార్థం:** వారికి= రామకృష్ణాదులకు; ధర్మతనయుండు= ధర్మరాజు; తమ, వనవాస, తీర్థ, గమన+ఆయాసంబునున్= తాము అనుభవించిన అరణ్యవాస ఖేదాన్ని, పుణ్యక్షేత్రసందర్శనానికి పడిన ప్రయాసనున్నూ; అర్జును, దివ్య+అస్త్ర, లాభంబును= అర్జునుడియొక్క దివ్యమైన మంత్రబాణాల సంపాదనమున్నూ; ఇంద్రు+ఒద్దన్= దేవేంద్రుడి దగ్గర; ఆతని= అర్జునుడియొక్క; ఉనికియున్= ఉనికిని; చెప్పిన= చెప్పగా; విని= ఆలకించి; రాముండు= బలరాముడు; కృష్ణ+ఆదులు+ఐన= శ్రీకృష్ణుడు మొదలుగాగల; వృష్టి, వరులకు= వృష్ణి వంశానికి సంబంధించిన నాయకులకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** బలరామ శ్రీకృష్ణాదులకు ధర్మరాజు తాము అరణ్యంలో పడిన బాధలను, తీర్థయాత్రలు సేవించటంలో అనుభవించిన కష్టాలను, అర్జునుడు దివ్యాస్త్రాలను సంపాదించటాన్ని, దేవేంద్రుడివద్ద ఉండటాన్ని వివరించగా విని, శ్రీకృష్ణుడు మొదలైన వృష్ణినాయకులతో బలరాముడు ఇట్లా పలికాడు.

**సీ.** **'మతిహీనుఁడై తన సుతునిపల్కులు విని। ధృతరాష్ట్రుఁ డీ పాండుసుతులఁ బాప**
**భీరుల నపగతధారుణీరాజ్యులఁ। జేసి యుగ్రారణ్యవాసగతులఁ**
**గావించె; నిది ధర్మువే? విచారవిహీనుఁ। డయ్యెఁ; భీష్మాదులు నెయ్యమున ని**
**వారింపఁగా దీని నేరర; దృఢసత్య। రతులకు దేవనిర్మితుల కహిత**

**ఆ. మాచరించుచున్న నీచదుర్యోధనా । దులకు వర్ధనమును నలఘు లైన**
**పాండునందనులకు దండితారుల కవ । ర్ధనము నిట్లు సేయఁ జనునె విధికి. 162**

**ప్రతిపదార్థం:** మతి, హీనుఁడు+ఐ= బుద్ధిలేనివాడై; తన, సుతుని, పల్కులు= తన కుమారుడి మాటలు; విని= ఆలకించి; ధృతరాష్ట్రుఁడు; ఈ పాండుసుతులన్= ఈ పాండవులను; పాప, భీరులన్= పాపమంటే భయపడే వారిని; అపగత, ధారుణీ, రాజ్యులన్+చేసి= పోగొట్టబడిన భూమిరాజ్యం కలవారినిగా చేసి; ఉగ్ర+అరణ్యవాసగతులన్+కావించెన్= ఘోరమైన అడవిలో నివసించేటటువంటి వారినిగా చేశాడు; ఇది= ఇట్లా చేయటం; ధర్మువే?= ధర్మమా?; విచార, విహీనుఁడు+అయ్యె= ఆలోచన లేనివాడైనాడుకదా; భీష్మ+ఆదులు= భీష్ముడు మొదలైనవారు; నెయ్యమున= మైత్రితో; దీని= ఈ దుష్కృత్యాన్ని; నివారింపఁగా, నేరరు+అ= నివారింపజాలరా; దృఢ, సత్య, రతులకు= సత్యమునందు గట్టి ఇష్టం కలవారికి; దేవ, నిర్మితులకు= దైవాంశసంభవులకు; అహితము= కీడు; ఆచరించుచున్న= చేస్తున్న; నీచ, దుర్యోధన+ఆదులకు= దుష్టులైన దుర్యోధనుడు మొదలైనవారికి; వర్ధనమునన్= అభివృద్ధియున్నూ; అలఘులు+ఐన= గొప్పవారైన; పాండు, నందనులకు= పాండవులకు; దండిత+అరులకు= దండించబడిన శత్రువులు కలవారికి, అనగా శత్రువులను జయించిన మహావీరులకు; అవర్ధనమున్= కష్టనష్టాలను కలిగించటం (పెంపులేకపోవటం); ఇట్లు= ఈ విధంగా; విధికిన్= బ్రహ్మదేవుడికి; చేయన్+చనునె= చేయటం తగునా?

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్రుడు బుద్ధిలేనివాడై తన కుమారులు చెప్పినమాటలు విని ఈ పాండవులను, పాపానికి జంకేటటువంటివారిని, రాజ్యంనుండి వెళ్ళగొట్టి, ఘోరమైన అడవులలో నివసించేటట్లు చేశాడు. ఇది ధర్మమా? ధృతరాష్ట్రుడు ఆలోచనలేనివాడయ్యాడు. భీష్మాదులు అయినా స్నేహంతో ఈ దుష్కృత్యాన్ని నివారించలేదే! సత్యనిష్ఠ దృఢంగా పాటించేవారికి, దైవాంశసంభూతులకు, శత్రువులను జయించిన మహావీరులకు, పాండవులకు అన్యాయాన్ని చేస్తున్న దుష్టదుర్యోధనాదులకు అభ్యుదయాన్ని, గొప్పవారైన పాండవులకు కష్టనష్టాలను కలిగించటం బ్రహ్మదేవుడికి న్యాయమా?

**క. ధరణీతలంబు నిర్ధా । ర్త రాష్ట్రముగఁ జేసి యనఘు ధర్మైకధురం**
**ధరు ధర్మతనూజు వసుం । ధర కధిపతిఁ జేయకుండఁ దగునే మనకున్?' 163**

**ప్రతిపదార్థం:** ధరణీ, తలంబు= భూమి పైభాగాన్ని; నిర్+ధార్త రాష్ట్రముగన్+చేసి= ధృతరాష్ట్రుడి కొడుకులు లేకుండగా చేసి; అనఘు= పాపరహితుడిని; ధర్మ+ఏక+ధురంధరున్= ధర్మాన్ని సాటిలేని విధంగా తానొక్కడే ధరించేవాడిని; ధర్మతనూజున్= ధర్మపుత్రుడిని; వసుంధరకు= భూమికి; అధిపతిన్+చేయకుండన్= రాజును చేయకపోవటం; మనకున్+తగునే= మనకు తగునా?

**తాత్పర్యం:** భూమిపై ధార్తరాష్ట్రులు లేకుండా చేసి, పాపరహితుడున్నూ, ధర్మాన్ని అద్వితీయంగా ధరించే వాడున్నూ అయిన ధర్మరాజును భూమికి ప్రభువుగా చేయకుండటం మనకు తగునా?'

**వ. అనిన బలదేవునకు సాత్యకి యిట్లనియె. 164**

**తాత్పర్యం:** అని పలుకగా బలరాముడితో సాత్యకి ఇట్లా అన్నాడు.

**చ. 'అనుపమశౌర్యవంతుల రనంతబలాఢ్యుల రీవు నీ జనా**
**ర్దనుఁడును సాంబసారణులు దర్పకవీరుఁడు నుండఁ బాండునం**

**దనులు సుయోధనాదుల కృతంబున నిట్టు లనాథులట్ల యి**

**వ్వనమున నుండఁగాఁ దగునె వన్యఫలాశనహీనవృత్తితోన్.** **165**

**ప్రతిపదార్థం:** అనుపమ, శౌర్యవంతులరు= సాటిలేని పరాక్రమం కలవారు; అనంత, బల+ఆఢ్యులరు= అంతం లేని బలంకలవారు; ఈవును= నీవున్నూ; ఈ జనార్దనుఁడును= ఈ శ్రీకృష్ణుడున్నూ; సాంబ, సారణులు= సాంబుడున్నూ, సారణుడున్నూ; దర్పక, వీరుఁడున్= వీరుడైన మన్మథుడున్నూ, అంటే వీరుడైన ప్రద్యుమ్నుడున్నూ (ప్రద్యుమ్నుడు పూర్వజన్మలో మన్మథుడు కాబట్టి అతడిని మన్మథుడని పిలవటం పరిపాటిగా ఉండేది); ఉండన్= ఉండగా; పాండునందనులు= పాండవులు; సుయోధన+ఆదుల, కృతంబునన్= దుర్యోధనుడు మొదలైనవారి చేతలవలన; ఇట్టులు= ఈ విధంగా; అనాథలు+అట్ల= దిక్కులేనివారివలె (రక్షకులు లేని వారివలె); ఈ+వనమునన్= ఈ అరణ్యంలో; వన్య, ఫల+అశన, హీన, వృత్తితోన్= అడవిపండ్లు ఆహారంగా తినే తక్కువస్థితిలో; ఉండఁగాన్+తగునె?= ఉండటం యోగ్యమా?

**తాత్పర్యం:** 'సాటిలేని పరాక్రమం కలవారు, అంతు లేని బలం కలవారు నీవూ, శ్రీకృష్ణుడూ, సాంబుడూ, సారణుడూ, ప్రద్యుమ్నుడూ ఇంతమంది మహావీరులు మీరు అండగా ఉండగా, పాండవులు దిక్కుమాలిన అనాథులవలె అరణ్యంలో అడవిపండ్లు ఆహారంగా తింటూ తిరుగాడటం సమంజసమా?

**తరలము.**

**అహితచిత్తవిదారణక్రియలందుఁ బ్రౌఢములై జగ**

**త్కుహరమంతయు మ్రోయుచుండఁగ ఘోరయాదవసైన్య స**

**న్నహనదుందుభినాదముల్ గగనంబు దిక్కులు నిండ దు**

**స్సహము లయ్యెడు ధార్తరాష్ట్రుల సైన్యవీరభటాలికిన్.** **166**

**ప్రతిపదార్థం:** ఘోర, యాదవ, సైన్య, సన్నహన, దుందుభి, నాదముల్= భయంకరమైన యాదవులయొక్క సేనల యుద్ధ ప్రయత్నాన్ని సూచించే భేరీధ్వనులు; అహిత, చిత్త, విదారణ, క్రియలందున్= శత్రువుల మనస్సులను చీల్చే పనులలో; ప్రౌఢములు+ఐ= గొప్పసామర్థ్యం కలవై; జగత్, కుహరము+అంతయు= ప్రపంచం అనే గుహ అంతటా; మ్రోయుచుండఁగన్= ధ్వనిస్తుండగా; గగనంబు= ఆకాశం; దిక్కులు= దిక్కులు; నిండన్= పూర్తిగా వ్యాపించగా; ధార్తరాష్ట్రుల= ధృతరాష్ట్రుడి కొడుకుల; సైన్య, వీర, భట+ఆలికిన్= సేనలోని శూరులైన సైనికుల సముదాయానికి; దుస్సహములు+అయ్యెడున్= భరించ శక్యం కానివి అవుతాయి.

**తాత్పర్యం:** భయంకరమైన యాదవసేనలయొక్క యుద్ధసన్నాహాలను సూచించే భేరీనినాదాలు, శత్రువుల మనసులను చీల్చటంలో గొప్పసామర్థ్యం కలవై ప్రపంచమంతా మారుమ్రోగి ఆకాశం, దిక్కులూ నిండిపోతుంటే ధృతరాష్ట్రుడి కొడుకుల సైన్యంలోని భటులకు భరించ శక్యం కానివి కాగలవు.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.374 విశేషాంశం చూడండి

**మ.** **ఘనమై నీ పృథుబాహులాంగలముఖాఘాతంబుతోడన్ జనా**

**ర్దన శార్ఙ్గచ్యుతసాయకావలియుఁ గందర్పేషుజాలంబు నీ**

**యనిరుద్ధోగ్ర శిలీముఖాలియు మదీయాస్త్రౌఘమున్ ధార్తరా**
**ష్ట్రనికాయోత్తమకాయఖండనపటిష్ఠం బయ్యెడుం బోరిలోన్.** **167**

**ప్రతిపదార్థం:** ఘనము+ఐ= గొప్పదై; నీ, పృథు, బాహు, లాంగల, ముఖ+ఆఘాతంబుతోడన్= నీదైన పెద్దదగు బాహువునందలి నాగలిమొన దెబ్బచేతను; జనార్దను= శ్రీకృష్ణుడియొక్క; శార్‌ఙ్గ, చ్యుత, సాయక+ఆవళియున్= శార్‌ఙ్గం అనేపేరుగల ధనుస్సునుండి వెలువడే బాణాల వరుసలును; కందర్ప+ఇషు, జాలంబున్= మన్మథుడి (ప్రద్యుమ్నుడి) అమ్ములును; ఈ+అనిరుద్ధ+ఉగ్ర, శిలీముఖ+ఆలియు= ఈ అనిరుద్ధుడియొక్క వాడిబాణాల సమూహాలున్నూ; మదీయ+అస్త్ర+ఓఘమున్= నాదైన మంత్రబాణాల వెల్లువయున్నూ; పోరిలోన్= యుద్ధంలో; ధార్తరాష్ట్ర, నికాయ+ఉత్తమకాయ, ఖండన, పటిష్ఠంబు+అయ్యెడున్= ధృతరాష్ట్రుడి కుమారుల గుంపుయొక్క శిరస్సులను నరకటానికి సామర్థ్యం కలిగినట్టివి అవుతాయి.

**తాత్పర్యం:** గొప్పదైన నీ నాగలిమొనదెబ్బతో కూడిన, శ్రీకృష్ణుడి శార్‌ఙ్గమనే ధనుస్సునుండి వెలువడిన బాణాలు, ప్రద్యుమ్నుడి అమ్ములు, ఈ అనిరుద్ధుడి వాడిబాణాల వరుసలు, నా మంత్రబాణాలున్నూ, ధృతరాష్ట్రుడి కుమారుల శిరస్సులను యుద్ధంలో ఖండించటానికి సామర్థ్యం కలవి కాగలవు.

**విశేషం:** బలరాముడి ఆయుధం నాగలి. శ్రీకృష్ణుడివిల్లుపేరు శార్‌ఙ్గం. మన్మథావతారమైన ప్రద్యుమ్నుడు రుక్మిణీ, శ్రీకృష్ణుల కొడుకు. అనిరుద్ధుడు ప్రద్యుమ్నుడి కొడుకు.

**వ. కేకయసృంజయ పాంచాల వృష్ణిభోజాంధకవీరులుం గృష్ణానుమతులయి యుద్ధంబున ధృతరాష్ట్ర పుత్త్రులను భీష్మ ద్రోణ కర్ణాదులను వధియింతురు; ధర్మరాజుతమ్ములుం దానును సమయాబ్దంబులు సలిపి రాజ్యాభిషిక్తుండగు నంతకు నతిరథు నభిమన్యు నఖిలరాజ్య రక్షకుంజేసి యుండుద' మనిన సాత్యకి పలుకుల కనుకూలుండయి వాసుదేవుండు ధర్మరాజున కిట్లనియె.** **168**

**ప్రతిపదార్థం:** కేకయ, సృంజయ, పాంచాల, వృష్ణి, భోజ+అంధక వీరులున్= కేకయులు, సృంజయులు, పాంచాలులు, వృష్ణులు, భోజులు, అంధకులు అయినట్టి శూరులందరూ; కృష్ణ+అనుమతులు+అయి= శ్రీకృష్ణుడియొక్క అనుమతిపొందినవారై; యుద్ధంబున= యుద్ధంలో; ధృతరాష్ట్ర పుత్త్రులను= దుర్యోధనుడు మొదలైన ధార్తరాష్ట్రులను; భీష్మ, ద్రోణ, కర్ణ+ఆదులను= భీష్ముడిని, ద్రోణుడిని, కర్ణుడు మొదలైనవారిని; వధియింతురు= సంహరిస్తారు; ధర్మరాజు, తమ్ములున్+తానును= ధర్మరాజు సోదరులును, తానున్నూ; సమయ+అబ్దంబులు= ప్రతిజ్ఞకు అనుగుణమైన సంవత్సరాలు (అంటే పన్నెండేళ్ళ అరణ్యవాసం, ఒక సంవత్సరం అజ్ఞాతవాసం); సలిపి= పాటించి; రాజ్య+అభిషిక్తుండు+అగు+అంతకున్= పట్టాభిషేకస్నానం (అభిషేకం అంటే స్నానం. సింహాసనాన్ని అధిష్ఠించేందుకు ముందు సలిపేస్నానం); అయ్యే ఆ సమయంవరకు; అతిరథున్= గొప్పవీరుడైన (అతిరథుఁడు అనగా ఆనాడు రథికులలో ఉన్నతశ్రేణికి చెందినవాడు); అభిమన్యున్= అభిమన్యుడిని (అర్జునుడికి, సుభద్రకు ఉదయించిన పుత్రుడు, శ్రీకృష్ణుడి మేనల్లుడు); అఖిల, రాజ్య, రక్షకున్+చేసి= సమస్తరాజ్యాన్ని కాపాడేవాడినిగా నియమించి; ఉండుదము+అనిన= ఉండగలవారం అనిచెప్పగా; సాత్యకి పలుకులకు= సాత్యకి చెప్పిన మాటలకు; అనుకూలుండు+అయి= సమ్మతించినవాడై; వాసుదేవుండు= వసుదేవుడి కొడుకైన శ్రీకృష్ణుడు; ధర్మరాజునకు= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** కేకయులు, సృంజయులు, పాంచాలులు, వృష్ణులు, భోజకులు అంధకులలో గల వీరులు శ్రీకృష్ణుడి అనుమతితో పోరిలో ధృతరాష్ట్రుడి కొడుకులను, భీష్మ, ద్రోణ, కర్ణాదివీరులను సంహరించగలరు, ధర్మరాజు తన

తమ్ముళ్ళతోపాటు తాము చేసిన ప్రతిజ్ఞను అనుసరించి పదమూడేళ్ళు గడిపి పిదప రాజ్యాభిషిక్తుడు కావచ్చును. అంతవరకు అభిమన్యుడు రాజప్రతినిధిగా ఉండగలడు' అని సాత్యకి పలుకగా శ్రీకృష్ణుడు అతడి మాటలకు అంగీకారం తెలిపి ధర్మరాజుతో ఈ విధంగా చెప్పాడు.

**ఉ. 'ఈతని పల్కినట్ల ధరణీశ్వర! నీరిపులన్ మహాబలో**
**పేతులఁ బోరఁ జంపుదు రభేద్యులు వీరలు; మీకు భూతధా**
**త్రీతలరాజ్య మెల్ల నగుఁ దెల్లము' నావుడు ధర్మనందనుం**
**డాతతకీర్తి యిట్లనియె నమ్మురవైరికి సీరపాణికిన్. 169**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= భూమికి ఈశ్వరుడివైన ఓ ధర్మరాజా!; ఈతని, పల్కినట్లు+అ= ఇతడు అనగా ఈ సాత్యకి చెప్పినట్లుగానే; న+భేద్యులు= జయించ శక్యంకానివారు; వీరలు= ఈ యాదవులు; మహాబల+ఉపేతులన్= గొప్పబలంతో కూడినవారిని; నీ, రిపులన్= నీ శత్రువులను; పోరన్= యుద్ధంలో; చంపుదురు= సంహరించగలరు; భూత, ధాత్రీ, తల, రాజ్యము+ఎల్లన్= సమస్త ప్రాణకోటితో నిండిన భూరాజ్యమంతయున్నూ; మీకున్+అగున్= మీకు దక్కుతుంది; తెల్లము= సుస్పష్టం; నావుడు= అని చెప్పగా; ఆతత, కీర్తి= గొప్ప యశస్సు కలవాడైన; ధర్మ, నందనుండు= ధర్మపుత్రుడు; ఆ+మురవైరికిన్= మురుడనే రాక్షసుడికి శత్రువైన శ్రీకృష్ణుడికి; సీరపాణికిన్= నాగలి చేతియందు కలవాడికి- అనగా హలాయుధుడైన బలరాముడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఇతడు చెప్పినట్లుగా మహాబలవంతులైన నీ శత్రువులను అసాధ్యులైన వీరు యుద్ధంలో చంపుతారు. మీకు భూతలరాజ్యమంతా దక్కుతుంది' అని అనగా శ్రీకృష్ణుడితో ధర్మరాజు ఈ విధంగా పలికాడు.

**ఉ. 'మీ దయ మాకుఁ గల్గఁగ నమిత్రుల నోర్చుట యేమి పెద్ద? ధ**
**ర్మోదయనిత్యబుద్ధులను నుత్తమకీర్తుల నొప్పు ద్రోణభీ**
**ష్మాదుల సన్నిధానమున నమ్మెయిఁ బల్కిన పల్కు దప్పఁగాఁ**
**గా' దని ధర్మనందనుఁడు గ్రమ్మఱిచెన్ యదువీరకోపముల్. 170**

**ప్రతిపదార్థం:** మీ, దయ= మీయొక్క కరుణ; మాకున్+కల్గఁగన్= మాయందు ఉండగా; అమిత్రులన్+ఓర్చుట= శత్రువులను జయించటం; ఏమి, పెద్ద?= ఏమంత గొప్ప పని?; ధర్మ+ఉదయనిత్య, బుద్ధులనున్= ఎల్లప్పుడూ ధర్మం వికసించి ఉండే బుద్ధుల చేతను; ఉత్తమ, కీర్తులన్+ఒప్పు= మంచి పేరుతోను విలసిల్లేటటువంటి; ద్రోణ, భీష్మ+ఆదుల= ద్రోణుడు, భీష్ముడు మొదలైనవారి; సన్నిధానమునన్= సమక్షంలో; ఆ+మెయిన్= ఆ విధంగా; పల్కిన పల్కు= ఆడినమాట; తప్పన్+కాన్+కాదు+అని= మీరరాదుకదా అని; యదు, వీర, కోపములన్= యదువీరుల ఆగ్రహాలను; ధర్మనందునుఁడు= ధర్మరాజు; క్రమ్మఱిచెన్= మరలించాడు.

**తాత్పర్యం:** 'మీ దయ మాయెడ ఉండగా, శత్రువులను జయించటం ఏమంత గొప్పకార్యం? ఎల్లప్పుడూ ధర్మం వికసించి ఉండే ఉత్తమ బుద్ధుల చేతను, శ్రేష్ఠమైన యశస్సు చేతను విలసిల్లుతున్న భీష్ముడు, ద్రోణుడు మొదలైన మహానుభావుల ఎదుట ఆనాడు ఆ విధంగా ప్రతిజ్ఞ చేసి, ఆడినమాట తప్పటం భావ్యం కాదు కదా!' అని చెప్పి ధర్మరాజు యదువీరుల ఆగ్రహాన్ని మరలింపచేశాడు.

**విశేషం:** బలరాముడు ఇప్పుడు ఇంతగా పాండవులను పొగడి, దుర్యోధనాదులను తెగడి, పాండవపక్షపాతిగా కనిపిస్తున్నాడు. కాని, కాలాంతరాన బలరాముడు దుర్యోధన పక్షపాతియా అన్నట్లుగా మాట్లాడతాడు. మానవజీవితంలో అవస్థాభేదాన్ని బట్టి మనుష్యుల మనసులలో ఏర్పడే పరిణామాన్ని మహాభారతం అత్యద్భుతంగా చిత్రించింది. ఆదర్శప్రేరితుడు బలరాముడు. శ్రీకృష్ణుడు అనుష్ఠాన వేదాంతి. ఇద్దరి శీలాలలో గల తారతమ్యం సూక్ష్మానుశీలనయోగ్యం. యాదవవీరు లందరూ కలిసి ధర్మరాజుతో తమ సానుభూతిని తెలుపటానికి వారు పలికిన మాటలు ఇవి. వారికి ధర్మరాజు సత్యసంధత తెలిసిందే. పాండవులు తమ రాజ్యభాగంలోని ప్రభాస తీర్థానికి విచ్చేశారు. ఈ మాటలలోని ఆంతర్యం గ్రహించతగింది. ఇప్పటికే పాండవుల అరణ్యవాసం సగం మేర పూర్తి అయింది. ఇప్పు డిక కౌరవులపై యుద్ధ ప్రతిపాదనకు అంతరార్థం యాదవులకు పాండవులయెడ గల ప్రగాఢసానుభూతిని వెల్లడించటమే.

**వ. యాదవులు పాండవుల వీడ్కొని పోయి; రిట పాండవులు సోమమిశ్రితతోయ యైన పయోష్ణియందుఁ గృతస్నానులయి యున్న నందు ధర్మరాజునకు రోమశుం డిట్లనియె. 171**

**ప్రతిపదార్థం:** యాదవులు= యదువంశజులైనవారు; పాండవులన్= పాండురాజు కొడుకులనుండి; వీడ్కొని= సెలవుగైకొని; పోయిరి= వెళ్ళారు; ఇట= ఇక్కడ; పాండవులు= పాండురాజు పుత్రులు; సోమ, మిశ్రిత, తోయ+ఐన= సోమరసంతో కలిసినట్టి నీరుకల; పయోష్ణి+అందు= పయోష్ణి అనే నదిలో; కృత, స్నానులు+అయి= స్నానం చేసినవారై; ఉన్నన్= ఉండగా; అందు= అక్కడ; ధర్మరాజునకు; రోమశుండు= రోమశుడనే మహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** యాదవవీరులు పాండవులను వీడ్కొని వెళ్ళారు. ఇక్కడ పాండవులు సోమరసంతో కలిసిన నీరుగల 'పయోష్ణి' నదిలో స్నానం చేసి ఉండగా, రోమశుడు ధర్మరాజుతో ఈవిధంగా చెప్పాడు.

**క. 'మనుజేంద్ర! దీని తీరం । బున నృగుఁ డను రాజు యజ్ఞములఁ జేసిన నం**
**దనిమిషపతి తృప్తుండై । దనుజుల నోర్చె నటె ఘోరతరశస్త్రములన్. 172**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్ర!= మనుష్యులకు ఇంద్రుడివైన ఓ ధర్మరాజా!; దీని, తీరంబున= ఈ పయోష్ణి ఒడ్డున; నృగుఁడు+అను, రాజు= నృగుడు అనే పేరుకల ప్రభువు; యజ్ఞములన్= యజ్ఞాలు; చేసినన్= చేయగా; అందు= అక్కడ; అనిమిషపతి= దేవతలకు రాజైన ఇంద్రుడు; తృప్తుండు+ఐ= తృప్తి చెందినవాడై; ఘోర, తర, శస్త్రములన్= మిక్కిలి భయంకరాలైన ఆయుధాలతో; దనుజులను= రాక్షసులను; ఓర్చెన్+అటె= జయించాడు కదా.

**తాత్పర్యం:** 'ఓ మహారాజా! ఈ పయోష్ణి ఒడ్డున నృగుడు అనే ప్రభువు యజ్ఞాలు చేశాడు. దేవతలకు ప్రభువైన దేవేంద్రుడు ఆ యజ్ఞాలవలన తనివి చెందినవాడై మిక్కిలి భయంకరాలైన ఆయుధాలతో రాక్షసులను సంహరించాడు.

**వ. మఱియు నింద తొల్లి యాధూర్తరజసుండైన గయుండు హిరణ్మయంబులయిన చషాలస్థాలీ యూప చమస పాత్రీస్రుక్స్రువంబులును దేవస్థాపితంబులయిన యూపంబులు నొప్ప నేడశ్వమేధంబులు సేసి, యసంఖ్యాతంబు లయిన ధనంబుల ఋత్విజులను సదస్యులనుం బూజించి సువర్ణమయగోదానంబు లనేకంబులు బ్రాహ్మణుల కిచ్చి యక్షయంబులయిన యింద్రలోకసుఖంబుల బడసెఁ; బయోష్ణియందుఁ గృతస్నానులైనవారు దేవసాయుజ్యంబుఁ బడయుదు' రని చెప్పుచుం జని నర్మదాస్నానంబుఁ జేసి, వైడూర్యపర్వతంబుఁ గని రోమశుండు ధర్మరాజున కిట్లనియె; 'నిది త్రేతా ద్వాపర సంధి. యీ సరోవరతీరంబు**

**శర్యాతి యజ్ఞప్రదేశంబు; మఱియు నిందు భృగుపుత్త్రుం డయిన చ్యవనుండు శర్యాతి యను రాజుకూఁతు సుకన్య యను దాని వివాహంబయి, వాని యజ్ఞంబున నింద్రు నాదరింపక యాశ్వినుల సోమపీథులం జేసె' ననిన నది యెట్లని యడిగిన ధర్మరాజునకు సౌకన్యాఖ్యానంబు సవిస్తరంబుగా రోమశుం డిట్లని చెప్పె. 173**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; ఇందు+అ= ఇక్కడే; తొల్లి= పూర్వం; ఆధూర్తరజసుండు+ఐన= అధూర్తరజసుడు అనే తండ్రికి కుమారుడైన; గయుండు= గయుడు; హిరణ్మయంబులు+అయిన= బంగారంతో చేయబడినటువంటివైన; చషాల, స్థాలీ, యూప, చమస పాత్రీ, స్రుక్, స్రువంబులును= యజ్ఞోపకరణాలతో (చషాలము= యూపస్తంభం చివర ఉండే కడియం, స్థాలి= వంటపాత్ర, యూపము= యజ్ఞపశువుకు కట్టే స్తంభం, చమసపాత్ర= చతురస్రమైన యజ్ఞపాత్ర, స్రుక్+స్రువములు= చిన్నగరిటె, పెద్దగరిటెవంటివి); దేవ, స్థాపితంబులు+అయిన= దేవతలచేత ప్రతిష్ఠించబడినవైన; యూపంబులున్= యజ్ఞపశువులను కట్టేకొయ్యలు; ఒప్పన్= విలసిల్లగా; ఏడు+అశ్వమేధంబులు= ఏడు అశ్వమేధ యాగాలు; చేసి=చేసి; అసంఖ్యాతంబులు+అయిన= లెక్కకు మీరిన; ధనంబులు= ధనాలతో; ఋత్విజులను= యజ్ఞం చేయించే పురోహితులను; సదస్యులనున్= యజ్ఞంలో లోటుపాట్లులేకుండ గమనించే పండితులను; పూజించి= అర్చించి; సువర్ణమయ, గోదానంబులు= బంగారుమయమైన గోదానాలను; (బంగారుసొమ్ములతో అలంకరించబడిన గోవుల యొక్క దానాలను); అనేకంబులు= పెక్కు; బ్రాహ్మణులకు+ఇచ్చి= విప్రులకు దానమిచ్చి; అక్షయంబులు+అయిన= తరుగనటువంటి; ఇంద్రలోక, సుఖంబులన్+పడసెన్= స్వర్గలోక భోగాలను అనుభవించాడు; పయోష్ణియందున్= పయోష్ణి అనబడే నదిలో; కృతస్నానులు+ఐనవారు= స్నానంచేసినవారు; దేవసాయుజ్యంబు= దేవతలతో ఐక్యమవటాన్ని; పడయుదురు= పొందగలరు; అని చెప్పుచున్= అని చెప్తుతూ; చని= వెళ్ళి; నర్మదా, స్నానంబున్+చేసి= నర్మదానదిలో స్నానంచేసి; వైడూర్య, పర్వతంబున్+కని= వైడూర్యాలు గల కొండను చూచి; రోమశుండు= రోమశుడు; ధర్మరాజునకు= ధర్మరాజుకు; ఇట్లు+అనియె= ఈవిధంగా చెప్పాడు; ఇది, త్రేతా, ద్వాపర, సంధి= ఇది త్రేతాయుగం చివర ద్వాపరయుగం ప్రారంభమయేందుకు కొంచెం ముందు ఉన్న నడిమికాలం; ఈ, సరోవర, తీరంబు= ఈ సరస్సుతీరం; శర్యాతి, యజ్ఞ, ప్రదేశంబు= శర్యాతి అనే మహారాజు యజ్ఞం చేసిన స్థలం; మఱియున్= ఇంకనూ; ఇందు= ఇక్కడ; భృగు, పుత్త్రుండు+ఐన= భృగుమహర్షి కొడుకైన; చ్యవనుండు= చ్యవన మహర్షి; శర్యాతి+అను, రాజు, కూఁతు= శర్యాతి అనేప్రభువు పుత్రిక; సుకన్య+అనుదానిన్= సుకన్య అన్నపేరు కలదానిని; వివాహంబు+అయి= పెళ్లిచేసికొని; వాని, యజ్ఞంబునన్= శర్యాతి చేసిన యాగంలో; ఇంద్రున్= ఇంద్రుడిని; ఆదరింపక= లక్ష్యపెట్టక; అశ్వినులన్= అశ్వినీదేవత లిద్దరిని; సోమపీథులన్+చేసెన్= సోమరసాన్ని త్రాగినవారినిగా చేశాడు; అనినన్= అని చెప్పగా; అది= ఆకథ; ఎట్లు+అని= ఎట్టిది అని; అడిగిన= ప్రశ్నించిన; ధర్మరాజునకు= ధర్మరాజుకు; సౌకన్య+ఆఖ్యానంబు= సుకన్యకు సంబంధించిన కథ; సవిస్తరంబుగా= మిక్కిలి విస్తారంగా; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అని, చెప్పెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇంకను ఇక్కడ పూర్వకాలాన ఆ ధూర్తరజసుడి కొడుకైన గయుడు గొప్ప యజ్ఞాన్ని చేశాడు. ఆ యజ్ఞంలో వాడబడిన ఉపకరణాలన్నీ - యూపస్తంభాల చివర తొడిగే కడియాలు, వంటపాత్రలు, చిన్నవి, పెద్దవి గరిటెలు - అన్నీ బంగారంతో చేయబడినవే!. యూపాలు దేవతలచేత స్థాపించబడినవి. గయుడు యజ్ఞాలను నిర్వహించిన ఋత్విజులను, యజ్ఞాలను సక్రమంగా నడిపించిన పరీక్షాధికారులను లెక్కకు మించిన బంగారునాణాలతో అర్చించి బంగారు తొడుగులతో కూడిన ఆవులను బ్రాహ్మణులకు దానంచేసి, ఇచ్చి తరగని స్వర్గలోక భోగాలను పొందాడు. అటువంటి ఆ పయోష్ణి నదిలో స్నానంచేసినవారు దేవతలతో ఐక్యం కాగలరు' - అని చెపుతూ పయనించి నర్మదానదిలో స్నానంచేసి అనంతరం అచటి వైడూర్య పర్వతాన్ని చూచి, ధర్మరాజుతో రోమశుడు ఇట్లా అన్నాడు. 'త్రేతాయుగం చివర ద్వాపరయుగం ప్రవేశించటానికి కొంచెం పూర్వం శర్యాతి మహారాజు

యజ్ఞం చేసినచోటు ఇది. ఇక్కడ భృగుమహర్షి కొడుకైన చ్యవనమహర్షి శర్యాతిరాజుకూతురు సుకన్య అనే దానిని పెళ్ళాడాడు. పిదప శర్యాతి చేసిన యజ్ఞంలో ఇంద్రుడిని లక్ష్యపెట్టక అశ్వినీదేవతలను సోమరసాన్ని త్రాగేవారిగా చేశాడు' అని చెప్పగా ధర్మరాజు 'అది ఎట్లు? ఆ కథ చెప్పవలసింది' అని అడిగాడు. రోమశమహర్షి ధర్మరాజుకు సౌకన్యోపాఖ్యానాన్ని సవిస్తరంగా చెప్పాడు.

**విశేషం:** వేదకాలంలో సోమపానం మిక్కిలి ప్రాచుర్యంలో ఉన్న అలవాటు. సోమలతనుండి సోమరసాన్ని తీసి పానీయంగా రూపొందించి త్రాగేవారు. ఈ విషయంపై నవీనులు గొప్ప పరిశోధనలు చేశారు కాని సోమలతలను గుర్తించటంలో వృక్ష శాస్త్రజ్ఞులు కూడ విజయాన్ని సాధించ లేకపోయారు. యజ్ఞాలలో సోమపానం ఉగ్గడించబడింది. అలనాటివారు ఆ సోమరసాన్ని ఎట్లా పానీయంగా తయారుచేసేవారో నేటివారికి తెలియదు. వేదకాలపు ఆర్యులు విడిపోయి పలుదేశాలకు వెళ్ళారు. వాటిలో ఇరానుదేశం ఒకటి. అక్కడ సోమలతగా చెప్పబడే లతలు ఉన్నాయని చెప్పుతున్నారు. ఇది భావిపరిశోధనలవలన తేలవలసిన అంశం.

### రోమశుఁడు ధర్మరాజునకు సౌకన్యాఖ్యానంబు సెప్పుట (సం. 3-122-1)

**క. 'ఇక్కొలని సమీపంబునఁ । బెక్కగు వేలేండ్లు తపము భృగుసుతుఁడు గరం**
**బక్కజముగ నొనరించెను । వెక్కస నియమమున నిరతవీరాసనుఁడై. 174**

**ప్రతిపదార్థం:** ఈ+కొలని, సమీపంబునన్= ఈ సరస్సుకు దగ్గరగా; పెక్కు+అగు, వేల+ఏండ్లు= ఎన్నోవేల సంవత్సరాలు; భృగుసుతుఁడు= భృగుమహర్షికొడుకు; తపము= తపస్సును; వెక్కస, నియమమునన్= మిక్కుటమైన నిష్ఠతో; నిరత, వీర+ ఆసనుఁడు+ఐ= ఎల్లప్పుడూ వీరాసనం'తో ఉండి; కరంబు= మిక్కిలి; అక్కజముగన్= ఆశ్చర్యంగా; ఒనరించెను= చేశాడు.

**తాత్పర్యం:** 'ఈ సరస్సుకు దగ్గరగా భృగుమహర్షి కుమారుడైన చ్యవనమహాముని ఎన్నో వేల సంవత్సరాలు ఎడతెగని వీరాసనంతో ఉండి ఆశ్చర్యకరమైన నిష్ఠతో గొప్పతపస్సు చేశాడు.

**విశేషం:** వీరాసనం- యోగాసనాలలో ఒకటి. వీరాసనానికి స్థైర్యం, నిశ్చలత్వం ప్రధానాంశాలు. ఎక్కువసేపు వీరాసనంలో కూర్చోవటం కష్టం. కాని, చ్యవనమహర్షి ఎన్నో వేలసంవత్సరాలు వీరాసనస్థితుడై తపస్సు చేశాడని మహాభారతం ఉగ్గడిస్తున్నది.

**క. అమ్మునిదేహము వల్మీ । కమ్మునఁ గప్పంగఁబడి నికటవల్లీ గు**
**ల్మమ్ములు పైఁ బ్రాఁకిన నన । యమ్మును నేర్పడక యుండె నవ్వనభూమిన్. 175**

**ప్రతిపదార్థం:** ఆ+ముని, దేహము= ఆ ఋషిశరీరం; వల్మీకమ్మునన్= పుట్టచేత; కప్పంగన్+పడి= కప్పబడి; నికట, వల్లీ, గుల్మమ్ములు= సమీపంలోని తీగలు, పొదలు; పైన్+ప్రాఁకినన్= ఆ పుట్టమీద ప్రాకగా; ఆ+వన, భూమిన్= ఆ అరణ్యసీమలో; అనయమ్మునన్= ఎల్లప్పుడూ; ఏర్పడక+ఉండెన్= కనిపించకుండా ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ మునిశరీరం పుట్టచేత కప్పబడింది. సమీపంలోని తీగలు, పొదలు ఆ పుట్టను అలముకొన్నాయి. అందుచేత ఆ మునిదేహం ఆ అరణ్యసీమలో కనిపించకుండా మాటుపడి ఉన్నది.

**విశేషం:** రామాయణ కావ్యకర్త అయిన 'వాల్మీకి' మహర్షినిగురించి ఇటువంటి కథే లోకంలో సుప్రసిద్ధం.

**వ. అంతం బెద్దకాలంబునకు శర్యాతి యనురాజు దన చతుస్సహస్ర దేవీనివహంబుతోడఁ దత్సరోవరంబున విహరింప నరిగిన నాతని కూఁతురు సుకన్య యనునది యిష్టసఖులతోఁ గ్రుమ్మరుచున్న నవ్వల్మీకంబునందు.176**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుతర్వాత; పెద్ద, కాలంబునకు= చాలాకాలానికి; శర్యాతి+అను, రాజు= శర్యాతి అనేపేరు కలిగిన ప్రభువు; తన, చతుర్+సహస్ర, దేవీ, నివహంబు తోడన్= తన నాలుగువేల రాణుల సముదాయంతో; తద్+సరోవరంబునన్= ఆ కొలనులో; విహరింపన్+అరిగినన్= వినోదించటానికి వెళ్ళగా; ఆతని, కూఁతురు= ఆ శర్యాతి ప్రభువుయొక్క కుమార్తె; సుకన్య+అనునది= సుకన్య అనే పేరు కలది; ఇష్టసఖులతోన్= (తనకు) ఇష్టమైన చెలికత్తెలతో; క్రుమ్మరుచున్నన్= విహరిస్తుండగా; ఆ+వల్మీకంబునందు= ఆ పుట్టలో.

**తాత్పర్యం:** అటుతర్వాత చాలాకాలం గడిచిన పిమ్మట, శర్యాతి అనేమహారాజు తన నాలుగువేల రాణుల సమూహంతో ఆ కొలనులో విహరించటానికి వచ్చాడు. ఆ మహారాజుకూతురు తన అనుంగు నెచ్చెలులతో ఆ అడవిలో తిరుగుతుండగా ఆపుట్టలో.

**క. విద్యుల్లతాంగి భార్గవు । నుద్యన్నయనములు మెఱచుచున్నను విలసత్**
**ఖద్యోతద్యుతులొకొ యని । సద్యస్సంజాతబుద్ధి సంభ్రమ యగుచున్. 177**

**ప్రతిపదార్థం:** విద్యుత్+లతాంగి= మెరుపుతీగవంటి దేహం కలది; భార్గవు+ఉద్యత్+నయనములు= చ్యవనుడియొక్క ప్రకాశమానాలైన కన్నులు; మెఱచుచున్నను= వెలుగుతుండగా; విలసత్+ఖద్యోత, ద్యుతులు+ఒకొ= శోభిల్లేటటువంటి మిణుగురు పురుగుల వెలుగులు కాబోలు; అని= అని తలపోసి; సద్యస్+సంజాత+బుద్ధి= అప్పటికప్పుడు పుట్టిన; సంభ్రమ+అగుచున్= బుద్ధియందలి సంభ్రమం కలది ఔతూ.

**తాత్పర్యం:** మెరుపు తీగవంటి శరీరంకల ఆ సుకన్య మెరుస్తూ వెలుగొందుతున్న చ్యవనమహర్షికన్నులను చూచి, అవి మిణుగురు పురుగుల వెలుగులు కావచ్చునని అప్పటికప్పుడు పుట్టిన ఊహతో వేగిరపాటు కలదై.

**వ. అప్పు డప్పుట్ట గ్రొప్పించిన నలిగి నిమీలితనయనుండై చ్యవనుండు శర్యాతిసైన్యంబుల కెల్ల మూత్రపురీష నిరోధంబుఁ జేసిన, నది దనసైన్యాపరాధంబున నయ్యెఁగా వగచి, వాఁ డెల్లవారి నడిగి తత్కారణం బెఱుంగ నేరక చింతాపరుండై యున్నఁ, దండ్రికడకు వచ్చి సుకన్య యిట్లనియె. 178**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయాన; ఆ+పుట్ట; గ్రొప్పించినన్= త్రవ్వించగా, (పల్లం చేయించగా); అలిగి= కోపించి; నిమీలిత, నయనుండు+ఐ= కళ్ళు మూసికొన్నవాడై; చ్యవనుండు= చ్యవన మహర్షి - భార్గవుడి కొడుకు; శర్యాతి, సైన్యంబులకు+ఎల్ల= శర్యాతి మహారాజుగారి సేనలలోని భటులందరికీ; మూత్ర, పురీష, నిరోధంబున్+చేసినన్= మూత్రం, పురీషం రాకుండా ఆపగా; అది= అది; తన, సైన్య+అపరాధంబునన్= తనసైన్యంలోని భటులు చేసిన తప్పువలన; అయ్యెన్+కాన్+వగచి= అయినట్లు చింతించి; వాఁడు= అతడు- ఆ శర్యాతి; ఎల్లవారిన్+అడిగి= అందరినీ ప్రశ్నించి; తత్+కారణంబు= ఆ హేతువు; ఎఱుంగనేరక= తెలియజాలక, తెలిసికోలేక; చింతాపరుండు+ఐ+ఉన్నన్= విచారిస్తూ ఉండగా; తండ్రికడకు= తండ్రి దగ్గరకు; వచ్చి= వచ్చి; సుకన్య= సుకన్య; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** అప్పుడు ఆ పుట్టను త్రవ్వించింది. అందుకు చ్యవనమహర్షికి కోపం వచ్చి అతడు కన్నులు మూసికొని శర్యాతిసైన్యంలోని భటులకు మూత్రపురీషాలు [మలమూత్రాలు] బంధించేటట్లు చేశాడు. శర్యాతి తనసైనికులు

చేసిన తప్పిదం వలన అట్లా అయిందని భావించి అందరిని ప్రశ్నించి అసలు కారణం ఎరుగలేక విచారిస్తుండగా, తండ్రివద్దకు వచ్చి ఇట్లా చెప్పింది.

**తే. 'మిన్న మిడుఁగుఋ లట్టులై మెఱసి రెండు । మెఱుఁగు లొక పుట్టలో నున్న నెఱుఁగ కేను**
**బుట్ట గ్రొప్పించి యారెంటి పొడవుఁ గాన । కుడిగి వచ్చితి విస్మయపడి మనమున. 179**

**ప్రతిపదార్థం:** మిన్న, మిడుఁగుఋలు+అట్టులు+ఐ= శ్రేష్ఠమైన మిణుగురు పురుగువలె; మెఱసి= ప్రకాశించి; రెండు మెఱుఁగులు= రెండు వెలుగులు; ఒక, పుట్టలోన్+ఉన్నన్= ఒక పుట్టలో ఉండగా; ఏను= నేను; ఎఱుఁగక= తెలియక; పుట్ట= పుట్టను; గ్రొప్పించి= పల్లంగా త్రవ్వించి; ఆ రెంటి, పొడవున్= ఆ రెండు మెఱుగుల రూపు (పొడ); కానక= చూడక; ఉడిగి= విరమించి, పుట్టను త్రవ్వించటం మాని; మనమున= మనస్సులో; విస్మయపడి= ఆశ్చర్యపడి; వచ్చితిన్= తిరిగివచ్చాను.

**తాత్పర్యం:** రెండు వెలుగులు ఒకపుట్టలో కనిపించాయి. అవి శ్రేష్ఠమైన మిణుగురు పురుగులుగా భావించి నేను తెలియక పుట్టను త్రవ్వించాను. కాని, ఆ రెండింటి వెలుగుల పొడగాన లేక మనస్సులో ఆశ్చర్యపడుతూ ఆప్రయత్నాన్ని విరమించాను.

**వ. ఈ సైన్య నిరోధంబున కిది నిమిత్తంబగునో?' యనిన, శర్యాతి యప్పు డా పుట్టయొద్దకు వచ్చి, యందుఁ దపః క్లేశంబునఁ గృశత్వగస్థిభూతశరీరు నతివృద్ధు భార్గవుం గని నమస్కరించి యిట్లనియె. 180**

**ప్రతిపదార్థం:** ఈ, సైన్య, నిరోధంబునకు= ఈ సేనకు కలిగిన అవరోధానికి; ఇది= ఇది - అంటే నేను పుట్టను త్రవ్వించటం; నిమిత్తంబు+అగునో+అనిన= కారణం కాబోలునేమో అని చెప్పగా; శర్యాతి= శర్యాతి; అప్పుడు= ఆ సమయాన; ఆ+పుట్ట+ఒద్దకు= ఆ పుట్టదగ్గరకు; వచ్చి= వచ్చి; అందున్= ఆ పుట్టలో; తపస్+క్లేశంబునన్= తపస్సు చేయటంచేత ఏర్పడినకష్టంవలన; కృశ, త్వక్+అస్థీభూత, శరీరున్= సన్నగిల్లి తోలు ఎముకలుగా మారిన దేహం కలవాడిని; అతివృద్ధున్= మిక్కిలి ముసలివాడిని; భార్గవున్+కని= భృగు నందనుడైన చ్యవనుడిని చూచి; నమస్కరించి= వందనం చేసి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ సేనకు ఏర్పడిన అవరోధానికి నేను చేసినపని-పుట్టను తవ్వించటం-కారణం కావచ్చేమో'- అని చెప్పగా, శర్యాతి వెంటనే ఆ పుట్టదగ్గరకు వెళ్ళి అందులో చిరకాలం తపస్సు చేయటంచేత మిక్కిలి శుష్కించి కేవలం తోలు, ఎముకలు మాత్రమే మిగిలిన దేహం కలవాడైన ముసలివాడిని, భృగుమహర్షి కొడుకైన చ్యవనమహామునిని చూచి వందనం చేసి యిట్లా పలికాడు.

**క. 'అమితంబగు మీ తపము మ । హిమ యెఱుఁగక యిట్లు చేసె నిది; దీని సహిం**
**పుము; దయ మత్సైన్యనిరో । ధము వాపుమ; యెఱుక గలరె తరుణులు ధరణిన్.' 181**

**ప్రతిపదార్థం:** అమితంబు+అగు= మితిలేనటువంటి; మీ, తపము, మహిమ= మీ తపస్సుయొక్క గొప్పశక్తి; ఎఱుఁగక= తెలియక; ఇది= ఈ సుకన్య; ఇట్లు= ఈ విధంగా; చేసెన్= చేసింది; దీనిన్= ఈ అపచారాన్ని; సహింపుము= సహించవలసింది (క్షమించవలసింది); దయన్= దయతో; మత్+సైన్య, నిరోధము= నా సేనకు ఏర్పడిన చేటు; పాపుము+అ= తొలగించుమా; ధరణిన్= భూలోకాన; తరుణుల్= వయస్సులో ఉన్న ఆడపిల్లలు; ఎఱుక+కలరె= వివేకం కలవారా? (కాదుకదా)

**తాత్పర్యం:** 'ఓ ఋషీశ్వరా! మీ తపస్సుయొక్క మాహాత్మ్యం తెలియక, మా అమ్మాయి సుకన్య ఈ విధంగా చేసింది. ఆమె అపరాధాన్ని క్షమించ ప్రార్థన. దయతో నా సైన్యానికి ఏర్పడిన ఆపద తొలగించవలసింది. భూమిపై లేజవరాళ్ళు అయిన ఆడపిల్లలకు వివేకం ఉంటుందా!'

**వ. అనిన భార్గవుండు కరుణించి 'యతిశయ రూపయౌవన గర్వితయైన యాకన్యకం బరిగ్రహించి కాని సహింప' ననిన శర్యాతి తన కూఁతు నమ్మునివరున కిచ్చి నిజసైన్యనిరోధంబుఁ బాచిగొని చనిన. 182**

**ప్రతిపదార్థం:** అనిన= అని ప్రార్థించగా; భార్గవుండు= భృగు నందనుడైన చ్యవనుడు; కరుణించి= శర్యాతిపై దయ తలచి; అతిశయ, రూప, యౌవన, గర్విత+ఐన= మిక్కుటమైన అందం, పడుచుదనంతో పొగరెక్కిన; ఆ+కన్యకన్= ఆ సుకన్యను; పరిగ్రహించి కాని= స్వీకరించి కాని (పెండ్లాడికాని); సహింపను+అనిన= క్షమించను అని చెప్పగా; శర్యాతి= శర్యాతి మహారాజు; తన కూఁతున్= తన పుత్రిక అయిన సుకన్యను; ఆ+మునివరునకు= ఋషిశ్రేష్ఠు డయిన ఆ చ్యవనుడికి; ఇచ్చి= వివాహం చేసి; నిజ, సైన్య, నిరోధంబున్= తనసేనకు ఏర్పడిన చేటు; పాచికొని= తొలగించుకొని; చనినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** అని శర్యాతి మహారాజు ప్రార్థించాడు. భృగునందనుడైన చ్యవనమహర్షికి శర్యాతిపై దయ కలిగింది. కాని, మిక్కుటమైన అందం, పడుచుదనంతో పొగరెక్కిన రాజపుత్రిక సుకన్యను తాను పెండ్లాడికాని క్షమించను అని చెప్పాడు. అప్పుడు శర్యాతి తనపుత్రిక అయిన సుకన్యను చ్యవనుడికి ఇచ్చి పెళ్ళిచేసి, తనసేనకు కలిగిన చేటు తొలగించుకొని వెళ్ళాడు.

**ఆ. పతికిఁ బరమభక్తిఁ బరిచర్య సేయుచు । నొనరఁగా సుకన్య యుండునంత**
**నా లతాంగికడకు నాశ్వను లేతెంచి । త మ్మెఱుంగఁ జెప్పి దాని కనిరి. 183**

**ప్రతిపదార్థం:** పతికిన్= భర్తకు; పరమభక్తిన్= మిక్కిలి భక్తితో; పరిచర్య+చేయుచున్= సేవచేస్తూ; ఒనరఁగా= ఒప్పునట్లుగా; సుకన్య= సుకన్య; ఉండునంతన్= ఉండిఉండగా; ఆ, లతా+అంగి, కడకున్= సుకుమారమైన తీగవంటి శరీరం కల ఆ సుకన్య దగ్గరకు; ఆశ్వినులు= అశ్వినీ దేవతలు; ఏతెంచి= అరుదెంచి, వచ్చి; తమ్ము+ఎఱుంగన్+చెప్పి= తా మెవరో ఆమెకు తెలియజేసి; దానికి= ఆమెతో; అనిరి= ఇట్లా చెప్పారు.

**తాత్పర్యం:** ఆ సుకన్య తనభర్త అయిన చ్యవనుడికి మిక్కిలి భక్తితో సేవలు చేస్తున్నది. సుకుమారమైన తీగవంటి శరీరంకల ఆ సుకన్య దగ్గరకు (సౌందర్యమూర్తులు, నిత్యయౌవనులు అయిన) అశ్వినీదేవతలు వచ్చి, తాము ఎవరో ఆమెకు తెలియజెప్పి ఇట్లా పలికారు.

**విశేషం:** అశ్వినీదేవతలు కవలలు. స్వర్గలోకంలోని జంటవైద్యులు. పురుషసౌందర్యానికి అశ్వినీదేవతలను ఆదర్శప్రాయంగా అభివర్ణించటం పౌరాణికవాఙ్మయంలో కనిపిస్తుంది.

**వ. 'అవ్వా! నీ వెవ్వని కూఁతుర? వెవ్వని భార్య?' వని యడిగిన 'నేను శర్యాతికూఁతుర; భార్గవుం డయిన చ్యవనుని భార్య'నని చెప్పిన విని వారలు నగి 'యక్కటా! యిట్టి రూపవిభవంబులు వడసి కామభోగబాహ్యుఁ డయిన వృద్ధు భార్గవుని వరియించి నీ జవ్వనం బెల్ల వృథచేసి; తింకనైనను నీవయోరూపంబులకుం దగిన వరు వరియింపు; మేము వానిఁ దెచ్చెద' మనిన నప్పలుకులు సహింపక సుకన్య యాశ్వినుల కిట్లనియె. 184**

**ప్రతిపదార్థం:** అవ్వా!= అమ్మా!; నీవు+ఎవ్వని, కూఁతురవు= నీవు ఎవరి కూతురివి?; ఎవ్వని (ఏ+వాని) భార్యవు= ఎవరి భార్యవు?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; ఏన్= నేను; శర్యాతి, కూఁతుర= శర్యాతి మహారాజు కూతురిని; భార్గవుండు+ అయిన= భృగుమహర్షి కొడుకైన; చ్యవనుని భార్యను= చ్యవన మహర్షి భార్యను; అని, చెప్పిన= అని బదులు చెప్పగా; విని= ఆలకించి; వారలు= ఆ అశ్వినీ దేవతలు; నగి= నవ్వి; అక్కటా!= అయ్యో!; ఇట్టి= ఇటువంటి; రూప, విభవంబులు= రూపసంపదలు; పడసి= పొంది; కామ, భోగ, బాహ్యుఁడు+అయిన= శృంగారానికి, ఐశ్వర్య సౌఖ్యానికి వెలిఅయిన వాడైన; వృద్ధున్= ముసలివాడిని; భార్గవుని= భృగుడి కుమారుడైన చ్యవనుడిని; వరియించి= పెళ్ళాడి; నీ, జవ్వనంబు+ఎల్లన్= నీ యౌవనం అంతటినీ; వృథ, చేసితి(వి)= వ్యర్థం చేశావు; ఇంకన్+ఐనను= ఇకమీదైనా; నీ, వయస్+రూపంబులకున్= నీ యౌవనానికి, అందానికీ; తగిన, వరు= తగిన వరుడిని; వరియింపుము= కోరుకొని పెండ్లాడుము; ఏము= మేము; వానిన్= నీవు కోరినవాడిని; తెచ్చెదము= తీసికొని రాగలం; అనినన్= అని వచించగా; ఆ+పలుకులు= ఆ మాటలు; సహింపక= అంగీకరించక; సుకన్య= సుకన్య; అశ్వినులకు= అశ్వినీ దేవతలకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** 'అవ్వా! నీవు ఎవరి కూతురివి? ఎవరి భార్యవు?' అని అశ్వినీదేవతలు సుకన్యను అడిగారు. 'నేను శర్యాతిపుత్రికను, భార్గవనందనుడైన చ్యవనుడి భార్యను' అని ఆమె సమాధానం చెప్పగా, ఆశ్వినులు పకపక నవ్వి 'నీ అందం ఎటువంటిది? ఆభిజాత్య సంపదలు ఎటువంటివి? శృంగారకేళికికాని, ఐశ్వర్య భోగాలకు కాని కొరగాని ఈముసలి చ్యవనుడిని పెళ్ళాడి నీవు నీసౌందర్యాన్ని యౌవనాన్ని వ్యర్థం చేసికొన్నావు. ఇకనైనా నీకు తగిన వరుడిని కోరుకొనుము. మేము అతడిని నీకు సమకూర్చగలం' అని వచించగా సుకన్య వారి మాటలను ఆదరించక ఈ విధంగా బదులు పలికింది.

**ఆ. 'చ్యవనునందు నాకు సంతతప్రీతియై । యుండ నిట్లు పలుకు టుచిత మగునె?'**
**యని నిజేశ్వరునకు నప్పుడ వారల । పలుకు లెఱుఁగఁ జెప్పెఁ బంకజాక్షి. 185**

**ప్రతిపదార్థం:** చ్యవను+అందు= చ్యవన మహర్షి యందు; నాకు= నాకు; సంతతప్రీతి+ఐ+ఉండన్= ఎడతెగని ప్రేమ ఉండగా; ఇట్లు= ఈ విధంగా; పలుకుట= మాట్లాడటం; ఉచితము+అగునె?= భావ్యమగునా?; అని= అని చెప్పి; పంకజ+అక్షి= పద్మాలవంటి కన్నులు గల సుకన్య; నిజ+ఈశ్వరునకున్= తన భర్తకు, అనగా చ్యవనుడికి; అప్పుడు+అ= ఆ క్షణమందే; వారల, పలుకులు= వారు చెప్పినమాటలు; ఎఱుఁగన్+చెప్పెన్= తెలియచెప్పింది.

**తాత్పర్యం:** 'నా భర్త అయిన చ్యవనమహర్షియందు నాకు ఎడతెగనిప్రేమ ఉండగా మీరు ఈవిధంగా మాట్లాడటం భావ్యమా?' అని ఆమె ఆశ్వినులకు సమాధానం చెప్పి, వారు తనకు చెప్పిన పలుకులన్నీ పద్మాక్షి అయిన ఆ సుకన్య తనభర్తకు తెలిపింది.

**వ. చ్యవనుండు దాని పతివ్రతాత్వంబునకు సంతోసిల్లి 'వారల పలుకుల కొడంబడు' మని పంచిన నది పతి చేత ననుజ్ఞాతయై చని' నాకు నవయౌవనవరుం గావింపుం' డనిన నాశ్విను లప్పుడక్కొలను సొచ్చిరి; భార్గవుండును వారితోడ సరఃప్రవేశంబు సేసె; నిట్లమ్ముువ్వురు నవయౌవను లయి సుకన్యకడకు వచ్చి నిలిచి 'మాయందు నీ వలచువానిని వరియింపు' మనిన నది తనపతియైన భార్గవుని వరియించె; నంత నయ్యాశ్వినుల కతిప్రీతుండై చ్యవనుం డిట్లనియె. 186**

**ప్రతిపదార్థం:** చ్యవనుండు= చ్యవనమహర్షి; దాని= ఆమెయొక్క, ఆ సుకన్యయొక్క; పతివ్రతాత్వంబునకు= భర్తయందుకల ఏకైక భక్తిభావానికి; సంతోసిల్లి= సంతసించి; వారల, పలుకులకు= వారు చెప్పిన మాటలకు; ఒడంబడుము= అంగీకరించుము; అని, పంచినన్= అని ఆజ్ఞాపించగా; అది= ఆ సుకన్య; పతిచేతన్= భర్తచేత; అనుజ్ఞాత+ఐ= అంగీకారం పొందినటువంటిదై; చని= వెళ్ళి; నాకు= నాకు; నవ, యౌవన, వరున్= కొత్తపడుచుదనంగల పెళ్ళికొడుకును; కావింపుండు= సమకూర్చండి; అనినన్= అని చెప్పగా; ఆశ్వినులు= అశ్వినీదేవతలు; అప్పుడు+అ= అప్పుడే; ఆ+కొలను= ఆ కొలనులోకి; చొచ్చిరి= ప్రవేశించారు; భార్గవుండును= భృగుడి కొడుకు చ్యవనుడున్నూ; వారితోడ= ఆ ఆశ్వినులవెంబడే; సరస్+ప్రవేశంబు+ చేసెన్= కొలనులో ప్రవేశించాడు; ఇట్లు= ఈ విధంగా; ఆ+మువ్వురు= ఆముగ్గురున్నూ; నవ, యౌవనులు+అయి= కొత్త పడుచుదనం కలవారై; సుకన్య, కడకు= సుకన్య దగ్గరకు; వచ్చి= వచ్చి; నిలిచి= నిలబడి; మా+అందు= మా ముగ్గురిలో; నీ వలచువానిని= నీకు ఇష్టమైన వాడిని; వరియింపుము+అనినన్= ఎన్నుకొనుము అని చెప్పగా; అది= ఆ సుకన్య; తనపతి+ఐన= తన భర్త అయిన; భార్గవుని= చ్యవనుడిని; వరియించెన్= ఎన్నుకొన్నది; అంతన్= అటుపిమ్మట; ఆ+ఆశ్వినులకు= ఆ అశ్వినీ దేవతలయెడ; చ్యవనుండు= చ్యవనుడు; అతిప్రీతుండు+ఐ= మిక్కిలి అభిమానం కలవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** చ్యవనుడు సుకన్యయొక్క పతిభక్తికి మిక్కిలి సంతోషించి 'అశ్వినీదేవతలు చెప్పిన ప్రకారం చేయు' మని నియోగించాడు. సుకన్య తనభర్త ఆజ్ఞాపించిన విధాన ఆశ్వినులతో 'నాకు క్రొత్త పడుచుదనం గల పెళ్ళికొడుకును సమకూర్చండి' అని అడిగింది. వారు ఆ కొలనులో ప్రవేశించారు. చ్యవనమహర్షి కూడా ఆ అశ్వినీ దేవతలవెంట ఆ కొలనులో ప్రవేశించాడు. అట్లా ఆ ముగ్గురూ ఆ సరస్సునుండి నవయౌవనులై తిరిగి బయటకు వచ్చి, సుకన్యను చేరి 'మా ముగ్గురిలో నీకు నచ్చినవాడిని ఎన్నుకొనుము' అని అన్నారు. అంత సుకన్య తన భర్త అయిన చ్యవనుడినే వరించింది. చ్యవనుడు అశ్వినీదేవతలయెడ మిక్కిలి ప్రీతి కలవాడై ఇట్లా పలికాడు.

**విశేషం:** ఈ ఘట్టంలో సంస్కృత భారతంలో కొలనిలో మునిగి లేచిన ముప్వురు - అశ్వినీ దేవతలు, చ్యవనుడు - సమానమైన రూపాన్ని - అంటే నవయౌవనంలో ఉన్న చ్యవనుడి ఆకృతిని ధరించినట్లు స్పష్టీకరించబడింది. చూ.III 123-20 శ్లో. (నీలకంఠీయము).

## చ్యవనుఁ డాశ్వినుల సోమపీథులఁ జేయుట (సం. 3-124-21)

**తే.** **'ఏను మీ కారణంబున నిపుడు లబ్ధ । యౌవనుండనై ధన్యుండ నైతి; మిమ్ము**
**సోమపీథులఁ జేసెద సురలరాజు । సూచుచుండఁగ శర్యాతిసుక్రతువున.'** **187**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మీ కారణంబునన్= మీ మూలాన; ఇపుడు= ఇప్పుడు; లబ్ధ యౌవనుండను+ఐ= పొందబడిన పడుచుదనం కలవాడినై; ధన్యుండన్+ఐతి= కృతార్థుడిని కాగలిగాను; మిమ్ము= మిమ్మల్ని; శర్యాతి, సు, క్రతువున= శర్యాతి చేసే మంచి యజ్ఞంలో; సురల, రాజు= దేవేంద్రుడు; చూచుచుండఁగన్= చూస్తుండగా; సోమ, పీథులన్+చేసెదన్= (పవిత్రమైన) సోమరసాన్ని తాగేవారినిగా చేస్తాను.

**తాత్పర్యం:** 'నేను మీ మూలాన నేడు తిరిగి నవయౌవనాన్ని సంతరించుకోగలిగాను, కృతార్థుడి నైనాను. శర్యాతి మహారాజు చేసే యజ్ఞంలో దేవేంద్రుడు చూస్తూ ఉండగా మీచేత సోమరసాన్ని త్రాగిస్తాను.'

**వ. అని చెప్పిన నాశ్వినులు సంతసిల్లి యరిగి; రిట శర్యాతి భార్గవు జరాభార పరిత్యాగంబు విని విస్మితుండై యల్లునిం గూఁతుం జూడవచ్చిన, నాతని సత్కృతుం జేసి భార్గవుం డిట్లనియె. 188**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= అంటూ చ్యవనుడు చెప్పగా; ఆశ్వినులు= అశ్వినీదేవతలు; సంతసిల్లి= సంతోషించి; అరిగిరి= వెళ్ళారు; ఇట= ఇక్కడ; శర్యాతి= శర్యాతి మహారాజు; భార్గవు, జరా, భార, పరిత్యాగంబు= చ్యవనుడియొక్క ముసలితనపు బరువు వీడిపోవటం; విని= ఆలకించి; విస్మితుండు+ఐ= ఆశ్చర్యం పొందినవాడై; అల్లునిన్= జామాతను; కూఁతున్= పుత్రికను; చూడవచ్చినన్= చూడటానికి రాగా; ఆతనిన్= ఆ శర్యాతిని; సత్కృతున్+చేసి= సమ్మానించి; భార్గవుండు= చ్యవనుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చ్యవనుడు చెప్పగా, ఆశ్వినులు సంతోషించి వెళ్ళారు. ఇక్కడ శర్యాతి మహారాజు తన అల్లుడు తిరిగి పడుచుదానాన్ని పొందాడని విని ఆశ్చర్యపడి, అల్లుడినీ, కూతురినీ చూడటానికి వచ్చాడు. చ్యవనుడు మామగారైన శర్యాతిని మర్యాదలతో మన్నించి యిట్లా చెప్పాడు.

**క. 'విదితముగ నిన్నుఁ జేయిం । చెదఁ గ్రతువు ధరాధినాథ! చేయుము నీ క**
**భ్యుదయం బగు సంభారస । ముదయము సమకట్టు' మనిన మునివచనమునన్. 189**

**ప్రతిపదార్థం:** ధరా+అధినాథ!= భూమికి అధినాథుడివైన ఓ మహారాజా!; విదితముగ= అందరికీ తెలిసేటట్లుగా, అనగా నీకు కీర్తి లభించేటట్లుగా; క్రతువు= యజ్ఞం; నిన్నున్+చేయించెదన్= నీచేత చేయించగలను; చేయుము= యజ్ఞాన్ని చేయుము; నీకు+అభ్యుదయంబు+అగు= నీకు మేలు కలుగుతుంది; సంభార సముదయము= వస్తు సామగ్రిని అంతటినీ; సమకట్టుము= సమకూర్చుము; అనిన, ముని, వచనమునన్= అని చెప్పిన మునియొక్క మాటలప్రకారం.

**తాత్పర్యం:** 'ఓ మహారాజా! నీకు గొప్పకీర్తి కలిగేటట్లుగా నీచేత యజ్ఞాన్ని చేయించగలను; నీకు మేలు కలుగుతుంది. యజ్ఞానికి కావలసిన వస్తుసామగ్రిని సర్వాన్ని సమకూర్చుము!' అని చెప్పిన, మునివరుడి మాటలను అనుసరించి.

**క. అనఘుఁడు శర్యాతి మఖం । బొనరించె విధిప్రయోగయుతముగ; నం దా**
**శ్వినులకు సోమం బీఁ బో । యిన భృగుపుత్త్రునకు నలిగి యింద్రుం డనియెన్. 190**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= పాపం లేనివాడు; శర్యాతి= శర్యాతిమహారాజు; మఖంబు= యజ్ఞాన్ని; విధి, ప్రయోగ, యుతముగన్= శాస్త్రంలోని సూత్రాలు నిర్దేశించిన విధానం ప్రకారం; ఒనరించెన్= చేశాడు; అందు= ఆ యజ్ఞంలో; ఆశ్వినులకున్= అశ్వినీదేవతలకు; సోమంబు= సోమరసాన్ని; ఈన్+పోయిన= ఇవ్వటానికి (ఇచ్చేందుకు) ఉద్యుక్తుడైన; భృగు, పుత్త్రునకున్= చ్యవనుడిపై; అలిగి= ఆగ్రహించి; ఇంద్రుండు= దేవేంద్రుడు; అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడైన శర్యాతి మహారాజు శాస్త్రాలలో చెప్పబడినట్లు యజ్ఞాన్ని యథావిధిగా నిర్వహించాడు. ఆ యజ్ఞంలో అశ్వినీదేవతలకు సోమరసం ఇవ్వటానికి సంసిద్ధుడైన చ్యవనుడిపై కోపించి ఇంద్రుడు ఇట్లా పలికాడు.

**క. వీరిద్దఱు సోమార్హులు । గా; రమరుల వెజ్జు; లిది యకర్తవ్యము; బృం**
**దారకులు గానివారికి । వారింపక సోమ మిచ్చువారుం గలరే? 191**

**ప్రతిపదార్థం:** వీరు+ఇద్దఱు= ఈ అశ్వినీదేవతలు ఇద్దరు; సోమ+అర్హులు, కారు= సోమాన్ని స్వీకరించేందుకు యోగ్యత కలవారు కారు; అమరుల, వెజ్జులు= (వీరు) దేవతలకు వైద్యం చేసేవారు; ఇది= ఈ విధంగా సోమరసాన్ని వీరికి ఇవ్వటం; న+కర్తవ్యము= చేయకూడని పని; బృందారకులు+కానివారికి= దేవతలు కానివారికి; వారింపక= అడ్డులేకుండగా; సోమము+ఇచ్చు, వారున్= సోమరసాన్ని ఇచ్చేవారుకూడా; కలరే?= ఉన్నారా? (ఉంటారా?)

**తాత్పర్యం:** ఈ అశ్వినీదేవతలు ఇద్దరు దేవతలకు వైద్యం చేసేవారు. వీరు సోమరసానికి అర్హులు కారు. ఇది చేయకూడని పని. అడ్డులేకుండ వీరికి సోమం ఇచ్చేవారు ఉంటారా?

**విశేషం:** యజ్ఞంలో సోమరస పానానికి సంప్రదాయ సిద్ధమైన యోగ్యత కలవాడు ఇంద్రుడు. ఇంద్రుడు దేవతలపక్షాన సోమరసాన్ని పరిగ్రహించి త్రాగుతాడు. అశ్వినీ దేవతలకు అట్టి అర్హత అంతవరకు లేదు. ఇంద్రుడి దృష్టిలో ఆశ్వినులు దేవతలకు వైద్యసేవ చేసే భృత్యులు. వారికి తదితర బృందారకులతో సమాన ప్రతిపత్తి ఇవ్వటం దేవతలకు ప్రభువైన ఇంద్రుడికి ఇష్టం లేదు. సోమపానాన పంక్తిబాహ్యులుగా పరిగణించబడుతున్న అశ్వినీదేవతలకు సమానప్రతిపత్తి కల్పించి రసాన్ని ఇవ్వటం చ్యవనమహర్షి క్రొత్తగా ప్రవేశపెట్టిన మర్యాద.

**వ. అనిన నింద్రువచనం బాదరింపక చ్యవనుం డాశ్వినుల సోమపీథులం జేసిన, దాని సహింపక యింద్రుం డలిగి. 192**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఇంద్రు వచనంబు= ఇంద్రుడిమాట; ఆదరింపక= లక్ష్యపెట్టక; చ్యవనుండు= చ్యవనుడు; ఆశ్వినుల= ఆశ్వినీ దేవతలను; సోమపీథులన్+చేసిన= సోమరసాన్ని త్రాగినవారినిగా చేయగా; దానిన్= చ్యవనుడి ఆ చర్యను; సహింపక= ఓర్వక; ఇంద్రుండు= ఇంద్రుడు; అలిగి= కోపించి

**తాత్పర్యం:** అని ఇంద్రుడు పలుకగా, చ్యవనమహర్షి అతడి పలుకులు సరకుకొనక (లెక్కచేయక) ఆశ్వినులకు సోమరసాన్ని ఇచ్చి త్రాగించాడు. అందుకు ఇంద్రుడు ఆగ్రహించి,

**క. జృంభించి వజ్ర మెత్తిన । జంభాంతకు వజ్రయుత భుజాస్తంభము సం**
**స్తంభించి యతనిఁ బటుసం । రంభంబునఁ జంపఁ గడఁగి రౌద్రాకృతితోన్. 193**

**ప్రతిపదార్థం:** జృంభించి= అతిశయించి; వజ్రము+ఎత్తినన్= వజ్రాయుధాన్ని ప్రయోగించటానికి ఉద్యుక్తుడు కాగా; జంభాంతకున్= జంభుడు అనే రాక్షసుడిని వధించినట్టి ఇంద్రుడియొక్క; వజ్ర, యుత, భుజా, స్తంభము= వజ్రంతో కూడిన స్తంభంవంటి భుజస్కంధం; సంస్తంభించి= కదలకుండేటట్లుగా చేసి; అతనిన్= ఆ ఇంద్రుడిని; పటు, సంరంభంబునన్= గొప్ప వేగిరిపాటుతో కూడిన యత్నంతో; చంపన్+కడఁగి= సంహరించదలచి; రౌద్ర+ఆకృతితోన్= భయంకరమైన రూపంతో.

**తాత్పర్యం:** చ్యవనుడిమీద ప్రయోగించేందుకు ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని ఎత్తాడు. అంతట చ్యవనుడు వేగిరపాటుతో కూడిన గొప్ప యత్నంతో రౌద్రాకారుడై ఇంద్రుడు ఎత్తినచేతిని వజ్రాయుధంతో పాటు స్తంభింపచేసి అతణ్ణి చంపుటకు ప్రయత్నించి-

**క. చ్యవనుఁడు వేల్చిన నం దు । ద్భవ మయ్యె నపారఘోరబలయుతుఁడు మహా**
**జవుఁడు మదుం డను రాక్షసుఁ । డవనిచర ద్యుచర భీకరాకారుండై. 194**

**ప్రతిపదార్థం:** చ్యవనుఁడు= చ్యవనమహర్షి; వేల్చినన్= అగ్నిలో హోమం చేయగా; అందు= అందులోనుండి; న+పార, ఘోర, బల, యుతుఁడు= మితి లేని భయంకరమైన పటుత్వం కలవాడు; మహాజవుఁడు= గొప్ప వేగంకలవాడు; మదుండు= మదుడు; అను= అనేటటువంటి; రాక్షసుఁడు= రాక్షసుడు; అవనిచర, ద్యుచర, భీకర+ఆకారుండు+ఐ= భూమిమీద సంచరించే మనుష్యులకు, ఆకాశంలో విహరించే దేవతలకు భయాన్ని కలిగించే రూపం కలవాడై; ఉద్భవము+అయ్యెన్= ఉద్భవించాడు.

**తాత్పర్యం:** చ్యవనమహర్షి హోమం చేయగా, అందులోనుండి మితిలేని భయంకరమైన శక్తి కలవాడున్నూ, గొప్పవేగం కలవాడున్నూ అయిన రాక్షసుడు మదుడు అనేపేరు కలవాడు- భూమిమీద సంచరించే వారికి, ఆకాశంలో సంచరించేవారికి భీతిని కొలిపే గొప్పరూపం కలవాడై ఆవిర్భవించాడు.

**క.** **ఇ ట్లుద్భవించి, దశ సహస్ర యోజనాయామంబులైన బాహుదండంబులయు, శత యోజనాయామంబులైన చతుర్దంష్ట్రలయు, దశ యోజనాయామంబులైన దశనంబులయు, శశిరవిమండల సదృశంబులైన నయనంబులయుఁ, గాలాగ్ని సన్నిభంబైన వక్త్రంబును, దిగ్భూనభోభాగసంకటంబైన శరీరంబునుందోడ భూమి నొక్కహనువును దివంబును నొక్కహనువుగా వదనగహ్వరంబు దెఱచి, జగజ్జనసంత్రాసనవ్యగ్ర సంచలనంబైన దీర్ఘ జిహ్వా నధరోష్ఠ పుటంబు నాకుచు నత్యుగ్రనాదంబున దిక్కులు వ్రచ్చుచు వచ్చు మహారాక్షసుం జూచి సురేంద్రుండు వెఱచి, భార్గవస్తంభితభుజుండు గావున వాని నెద్దియుం జేయనేరక చ్యవను నొద్దకు వచ్చి కృతాంజలియై 'మునీంద్రా! నీ తపోవీర్య మహారంభంబు మిథ్య యగునే? యాశ్వినులు నేడు మొదలుగా సోమార్హు లగుదురు; నీవు నాకుఁ బ్రసన్నుండవై క్షమింపు' మనిన. 195**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ఉద్భవించి= పుట్టి; దశ, సహస్ర, యోజన+ఆయామంబులు+ఐన= పదివేల ఆమడల పొడుగుకల; బాహుదండంబులయు= లావుపాటి కర్రలవంటి భుజాలతోను; శతయోజన+ఆయామంబులు+ఐన= నూరు ఆమడల పొడవుకల; చతుర్+దంష్ట్రలయు= నాలుగు కోరలతోను; దశ, యోజన+ఆయామంబులు+ఐన= పది ఆమడల పొడుగున్న; దశనంబులయు= దంతాలతోను; శశి, రవి, మండల, సదృశంబులు+ఐన= చంద్రుడియొక్క సూర్యుడియొక్క బింబాలతో సమానమైన; నయనంబులయున్= కన్నులతోను; కాల+అగ్నిసన్నిభంబు+ఐన= ప్రళయకాలంలోని అగ్నితో సమానమైన; వక్త్రంబును= నోరును; దిక్+భూ, నభస్+భాగ, సంకటంబు+ఐన= దిక్కులూ, భూమీ, ఆకసమూ వీటి మధ్యభాగంలో నిండిపోయిన; శరీరంబునున్= దేహమున్నూ; తోడ= కూడి; భూమిన్= పుడమిని; ఒక్క హనువును= ఒక దవడగా; దివంబునున్= ఆకసాన్ని; ఒక్క= ఒక; హనువుగాన్= దవడగా; వదన, గహ్వరంబు+తెఱచి= నోరు అనెడి గుహను విప్పి; జగత్+జన, సంత్రాసన, వ్యగ్ర, సంచలనంబు+ఐన= జగత్తులోని ప్రజలకు భీతిని తత్తరపాటును గొలుపుతూ మిగుల త్వరగా కదలుతున్న; దీర్ఘజిహ్వన్= పొడుగాటినాలుకతో; అధర+ఓష్ఠ, పుటంబు= క్రిందిపెదవి భాగాన్ని; నాకుచున్= నాలికతో; తడుపుతూ; అతి+ఉగ్ర, నాదంబున= మిక్కిలి భయంకరమైన ధ్వనితో; దిక్కులు వ్రచ్చుచు= దిక్కులను భేదిల్లజేస్తూ; వచ్చు= వచ్చు; మహా+రాక్షసున్+చూచి= అతికాయుడైన రాక్షసుడిని చూచి; సుర+ఇంద్రుండు= దేవేంద్రుడు; వెఱచి= భయపడి; భార్గవ, స్తంభిత, భుజుండు= భృగు పుత్రుడైన చ్యవనుడిచేత స్తంభింపచేయబడిన భుజం కలవాడు; కావున= కాబట్టి; వానిన్= అతడిని, ఆ రాక్షసుడిని; ఎద్దియున్= ఏమీ; చేయనేరక= చేయలేక; చ్యవను+ఒద్దకు, వచ్చి= చ్యవనుడి వద్దకు వచ్చి; కృత+అంజలి+ఐ= నమస్కరించినవాడై; ముని+ఇంద్రా!= ఋషులలో శ్రేష్ఠుడివైనవాడా!; నీ, తపస్+వీర్య, మహా+ఆరంభంబు= నీదైన తపస్సుకు సంబంధించిన విశేషశక్తితో కూడిన గొప్పయత్నం; మిథ్య+అగునే?= వ్యర్థం అవుతుందా?; ఆశ్వినులు= అశ్వినీదేవతలు; నేడు, మొదలుగాన్= ఈనాటినుండి; సోమ+అర్హులు= సోమరసపానానికి తగినవారు; అగుదురు= కాగలరు; నీవు, నాకున్; ప్రసన్నుండవు+ఐ= నా యెడల దయగల వాడివై; క్షమింపుము= నేను చేసిన తప్పును మన్నించుము; అనినన్= అని పలుకగా

**తాత్పర్యం:** ఈవిధంగా ఆ రాక్షసుడు ఉద్భవించాడు. ఆ రాక్షసుడి చేతుల పొడుగు పదివేల ఆమడలు! అతడి నాలుగు కోరల పొడుగు నూరామడలు! అతడి దంతాల నిడివి పది ఆమడలు! అతడి కన్నులు సూర్యచంద్రబింబాలతో సమానాలు. అతడి నోరు ప్రళయకాలంలోని అగ్నిగోళంవంటిది!. అతడి శరీరం దివికి భువికి వ్యాపించి దిగ్దిగంతరాలకు ఒరపిడి పెట్టేటువంటిది. ఆ రాక్షసుడు నోరు విప్పినపుడు ఒక దవడ భూమికీ, ఒక దవడ ఆకాశానికీ వ్యాపించింది. అతడి నోటిలోని నాలుక లోకంలోని ప్రజలందరికీ భీతిని కల్పించేటటువంటిదై వేగంగా చలిస్తూ క్రిందిపెదవిని నాకుతున్నది. మిక్కిలి భయంకరమైన ధ్వనిచేస్తూ మీదికి ఉరుకుతూ వస్తున్న అతికాయుడైన ఆ రక్కసుడిని చూచి దేవేంద్రుడు భీతిల్లి, భృగునందనుడిచేత కదలకుండా స్తంభించబడిన భుజం కలవాడవటంచేత అతడిని ఏమీ చేయలేక చ్యవనుడి వద్దకు వచ్చి నమస్కరించి 'ఓ ఋషిసత్తమా! నీ తపశ్శక్తివలన చేసిన ప్రయత్నం వ్యర్థమౌతుందా? ఆశ్వినులు నేటినుండి సోమరసాన్ని యజ్ఞాలలో గైకొనటానికి అర్హులు కాగలరు. నీవు నాయందు దయ కలిగి, నేను చేసిన తప్పు మన్నించి, నన్ను కాపాడవలసింది' అని ప్రార్థించగా.

**క. మునినాథు నలుకతోడన । యనిమిషపతి వజ్రయుత మహాభుజ సంస్తం**
**భన ముడిగె; నంత భృగునం । దను వీడ్కొని యింద్రుఁ డరిగెఁ దన పురమునకున్. 196**

**ప్రతిపదార్థం:** ముని, నాథు+అలుక, తోడన= ఋషిశ్రేష్ఠుడైన చ్యవనుడి కోపంతోపాటు; అనిమిష, పతి, వజ్ర, యుత, మహా, భుజ, సంస్తంభనము= దేవేంద్రుడియొక్క వజ్రాయుధంతో కూడిన గొప్ప బాహువు కదలకపోవటం; ఉడిగెన్= మానింది; అంతన్= అటుపిమ్మట; భృగు, నందనున్= భృగుపుత్రుడైన చ్యవనుడిని; వీడ్కొని= సెలవు తీసికొని; ఇంద్రుఁడు= దేవేంద్రుఁడు; తన పురమునకున్= తన నగరమైన అమరావతికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** మునిశ్రేష్ఠుడైన చ్యవనుడికోపం తీరిపోవటంతోనే దేవేంద్రుడి భుజం స్తంభించటంకూడ తొలగిపోయింది. అనంతరం దేవతలప్రభువైన ఇంద్రుడు, చ్యవనుడి దగ్గర సవినయంగా సెలవు తీసికొని తన పట్టణానికి వెళ్ళాడు.

**విశేషం:** అలంకారం: సహోక్తి, అటు చ్యవనుడి ఆగ్రహంతోపాటు ఇటు దేవేంద్రుడి భుజస్తంభనం పోవటం ఒక దానితోపాటు ఇంకొకటి జరుగటం అభివర్ణితం కాబట్టి ఇది సహోక్తి అలంకారం.

**వ. అమ్మద రాక్షసుండు నాక్షణంబ చ్యవను నుపదేశంబున మద్య స్త్రీ మృగయాక్షంబుల నాశ్రయించె; నాశ్వినులు సోమపీథులై దివంబున కరిగి; రిట భార్గవుండైన చ్యవనుండు దన దపోమహత్త్వంబునందుఁ బ్రకాశింపఁ జేయుటంజేసి నాటంగోలె నది యార్చీకపర్వతంబు నాఁ బరఁగె' నని రోమశుండు సెప్పిన నందులఁ బుణ్య సరోవరంబునం గృతస్నానులై పాండవు లరిగి, యంత శంతను శునక నరనారాయణ విధాతృ తపోవన స్థానంబై దేవర్షినివాసంబైన సైంధవారణ్యంబునం జంద్రసరోవరంబునందు రోమశనియుక్తులై చరువులుసేసి యతిథులం బూజించి చని యమునానదిం గని; రంత వారలకు రోమశుం డిట్లనియె. 197**

**ప్రతిపదార్థం:** ఆ+మదరాక్షసుండున్= ఆ మదుడు అనే పేరు కలరాక్షసుడు; ఆ+క్షణంబు+అ= ఆ త్రుటిలోనే; చ్యవను+ఉపదేశంబున= చ్యవనుడి ప్రబోధంవలన; మద్య, స్త్రీ, మృగయా+అక్షంబులన్= కల్లును, స్త్రీలను, వేటను, పాచికలను; ఆశ్రయించెన్= ఆధారంచేసికొన్నాడు; ఆశ్వినులు= అశ్వినీదేవతలు; సోమపీథులు+ఐ= యజ్ఞాలలో సోమరసాన్ని త్రాగటానికి అర్హత పొందినవారై; దివంబునకు= స్వర్గానికి; అరిగిరి= వెళ్ళారు; ఇట= ఇక్కడ; భార్గవుండు+ఐన= చ్యవనుండు= భృగుమహర్షి

కొడుకైన చ్యవనుడు; తన, తపస్+మహత్త్వంబున్= తన తపస్సు యొక్క మహిమను; అందున్= అక్కడ; ప్రకాశింపన్+చేయుటన్+చేసి= వెలుగొందజేయటం చేత; నాటన్+కోలెన్= ఆనాటినుండి; అది= ఆ పర్వతస్థలం; ఆర్చీక, పర్వతంబు= ఆర్చీక పర్వతం; నాన్+పరఁగెన్= అనే పేరు పొందింది; అని= అని; రోమశుండు= రోమశుడు; చెప్పినన్= చెప్పగా; అందులన్= అక్కడున్న; పుణ్య, సరోవరంబునన్= పవిత్రమైన కొలనులో; పాండవులు= పాండు నందనులు; కృత, స్నానులు+ఐ= స్నానం చేసినవారై; అరిగి= వెళ్ళి; అంత= అటుపిమ్మట; శంతను, శునక, నర, నారాయణ, విధాతృ, తపస్+వన, స్థానంబు+ఐన= శంతనుడికి, శునకుడికి, నరనారాయణులకు, బ్రహ్మకు తపస్సుచేసికొన్న అరణ్యం అయినట్టిదియున్నూ; దేవ+ఋషి, నివాసంబు+ఐన= దేవలోకానికి చెందిన ఋషులు నివసించేటటువంటిదియున్నూ అయిన; సైంధవ+అరణ్యంబునన్= సైంధవమనే పేరుగల అరణ్యంలో; చంద్ర, సరోవరంబునందు= చంద్రుడిపేరుమీద వెలసిన కొలనులో; రోమశనియుక్తులు+ఐ= రోమశమహర్షి చెప్పిన తీరుగా (పాండవులు); చరువులు= హోమంలో వేల్చేటటువంటి అన్నాలు; చేసి= వండి, అక్కడ సన్నిహితులై ఉండే దేవతలకు, పితరులకు, ఋషులకు ప్రీతికరంగా హోమం చేసి; అతిథులన్+పూజించి= ఆగంతకులను అర్చించి; చని= ప్రయాణించి; యమునా, నదిన్= యమున అనేపేరుకల నదిని; కనిరి= చూశారు; అంతన్= అటుపిమ్మట; వారలకు= ఆ పాండవులకు; రోమశుండు= రోమశమహర్షి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** మదుడు అనే ఆ రాక్షసుడు చ్యవనమహర్షి ఆదేశంప్రకారం కల్లులోనూ, స్త్రీలలోనూ, వేటలోనూ, పాచికలలోనూ ప్రవేశించాడు. అశ్వినీదేవతలు యజ్ఞాలలో సోమరసాన్ని పడసి త్రాగే అర్హతను సంపాదించుకొని స్వర్గానికి వెళ్ళారు. భార్గవనందనుడైన చ్యవనమహర్షి తన తపస్సుయొక్క మహిమను అక్కడ వెలుగొందజేయటంచేత ఆకొండకు ఆర్చీకపర్వతం అనేపేరు కలిగింది- అని రోమశమహర్షి చెప్పగా, అక్కడి పుణ్యసరస్సులో పాండవులు స్నానంచేసి వెళ్ళారు. అంత శంతనుడు, శునకుడు, నరుడు, నారాయణుడు బ్రహ్మదేవుడు తపస్సు చేసిన స్థలమూ, దేవమునులు నివాస స్థానమూ అయిన సైంధవారణ్యంలో ఉన్న చంద్రసరస్సులో రోమశుడి ఆదేశంప్రకారం హోమాన్నాలతో హోమాలు చేసి, అతిథిపూజ కావించి, ప్రయాణించి పాండవులు యమునానదిని చేరారు. అపుడు పాండవులతో రోమశుడు ఇట్లా చెప్పాడు.

**విశేషం:** మహాభారతంలో అర్థవాదరూపాలైన కల్పనలు పెక్కు ఉన్నవి. ఈ కథలో చ్యవనమహర్షి ఇంద్రుడిని సంహరించటానికి రౌద్రాకృతితో ఉద్భవింపచేసిన రాక్షసుడు- జగత్తునంతటినీ ఆవరించిన అతికాయుడు, భీకరాకారుడు - ఇంద్రుడు చ్యవనుడిని శరణువేడగా, నిరర్థకుడై నిలువవలసి వచ్చింది. కాని, జగత్కంటక మహిమకల ఆ రాక్షసుడిని చ్యవనమహర్షి మద్యంలో, మహిళలలో, మృగయలో, పాచికలలో ప్రవేశపెట్టాడట. అనగా మకారత్రయం, (మద్యం, మహిళ, మృగయ), జూదం అనేవి జగత్కంటకమైన మహారాక్షసప్రవృత్తికి ఆకరాలు అని చాటిచెప్పటమే కదా!

## మాంధాతృ చరిత్రము (సం. 3-125-22)

క. **'ఇది యమున యను మహానది । త్రిదశనదీనిభము; దీని తీరమున జగ**
**ద్విదితుఁడు మాంధాతృఁడు సం । పదఁ గ్రతువులఁ జేసెఁ దొల్లి బహువత్సరముల్.'** **198**

**ప్రతిపదార్థం:** ఇది= ఇది (ఈనది); యమున+అనుమహానది= యమున అనేపేరుగల గొప్పనది; త్రిదశ, నదీ, నిభము= దేవతలనదితో సమానం- అంటే గంగానదితో సమానమైనది; దీని, తీరమున= ఈ యమునానది గట్టున; జగత్+విదితుఁడు= లోకంలోని జనులకు అందరికీ తెలిసినవాడు; మాంధాతృఁడు= మాంధాతృడు; తొల్లి= పూర్వకాలంలో; బహు, వత్సరముల్= ఎన్నో ఏళ్ళు; సంపదన్= ఐశ్వర్యంతో; క్రతువులన్= యజ్ఞాలను; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** 'ఇది యమునానది. దేవతలనది అయిన గంగానదితో సమానమైనది. ఈ యమునానదీ తీరాన పూర్వకాలాన ఎన్నోఏళ్ళు ఎంతోసంపద వెచ్చించి జగత్ప్రసిద్ధుడైన మాంధాతృడు పెక్కు యాగాలను చేశాడు.'

**వ. అనిన 'మాంధాతృ జన్మంబును వాని చరితంబును వినవలతుం జెప్పు 'మని యడిగిన ధర్మరాజునకు రోమశుం డిట్లనియె. 199**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; మాంధాతృ, జన్మంబును= మాంధాత పుట్టుకను; వాని, చరితంబును= ఆ మాంధాత జీవితకథను; విన, వలతున్= వినటానికి ఇష్టపడతాను (ఇచ్ఛగిస్తాను); చెప్పుము= చెప్పవలసింది; అని= అంటూ; అడిగిన= కోరగా; ధర్మరాజునకు= ధర్మపుత్రుడికి; రోమశుండు= రోమశమహర్షి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** రోమశుడు అట్లా యమునను గురించి చెప్పగా, ధర్మరాజు మాంధాత పుట్టుకను, అతడి జీవిత వృత్తాంతాన్ని గూర్చి ఆలకించటానికి కుతూహలం కలిగి ఆ కథ వినిపించుమని కోరాడు. అంత ధర్మరాజుకు రోమశుడు ఇట్లా చెప్పాడు.

**ఉ. 'వీకున నశ్వమేధములు వే యొనరించిన ధర్మశీలుఁ, డి**
**క్ష్వాకుకులోద్భవుండు, బలవంతుఁ, డనంతయశుం, డవార్యవీ**
**ర్యాకరుఁ, డుత్తముండు యువనాశ్వుఁ డపత్యము లేమిఁ జేసి దుః**
**ఖాకులుఁడై ప్రధానవరులందు సమర్పిత రాజ్యభారుఁడై. 200**

**ప్రతిపదార్థం:** వీకునన్= పూనికతో; అశ్వమేధములు= అశ్వమేధయాగాలు; వేయి+ఒనరించిన= వేయిచేసిన; ధర్మ, శీలుఁడు= ధర్మస్వభావం కలవాడు; ఇక్ష్వాకు, కులంలో పుట్టినవాడు; బలవంతుఁడు= బలంకలవాడు; అనంత, యశుండు= మితిలేని కీర్తికలవాడు; అవార్య, వీర్య+ఆకరుఁడు= వారించటానికి వీలులేని పరాక్రమానికి నెలవైనవాడు; ఉత్తముండు= మంచివాడు; యువనాశ్వుఁడు= యువనాశ్వుడు అనే పేరు కల రాజు; అపత్యము= సంతానం; లేమిన్+చేసి= లేకుండటంచేత; దుఃఖ+ఆకులుఁడు+ఐ= శోకంచేత పరితపించినవాడై; ప్రధాన, వరులందు= మంత్రులపై; సమర్పిత, రాజ్య, భారుడు+ఐ= మోపబడిన ప్రజాపరిపాలనయొక్క బరువు కలవాడై.

**తాత్పర్యం:** 'పూనికతో వేయి అశ్వమేధయాగాలు చేసిన ధర్మచరిత్రుడు, ఇక్ష్వాకువంశంలో పుట్టినవాడు, గొప్ప బలం కలవాడు, మితిలేని కీర్తికలవాడు, వారించటానికి వీలులేని శౌర్యం కలవాడు, మంచివాడు, ఐన యువనాశ్వుడు అనేరాజు సంతానం లేకపోవటంచేత మిక్కిలి పరితపించి మంత్రులపై రాజ్యపరిపాలనభారం మోపి.

**వ. భృగునాశ్రమంబునకుం జని పుత్త్రకాముండై పెద్దకాలం బమ్మునిఁ నుపాసించిన నయ్యువనాశ్వునకుం గరుణించి భృగుండు పుత్త్రకామేష్టిఁ జేసి యందు మంత్రపూతజలపూరితంబై పుత్త్రోదయకారణంబైన కలశంబు వడసి దాని రక్షించియుండ ఋత్విజులం బంచిన. 201**

**ప్రతిపదార్థం:** భృగు+ఆశ్రమంబునకున్+చని= భృగుమహర్షి ఆశ్రమానికి వెళ్ళి; పుత్త్ర కాముండు+ఐ= కొడుకును కోరుకొనేవాడై; పెద్ద, కాలంబు= చాలాకాలం; ఆ+మునిన్= ఆఋషిని; ఉపాసించినన్= భక్తితో సేవించగా; ఆ+యువనాశ్వునకున్= ఆ యువనాశ్వుని యెడల; కరుణించి= దయకలిగి; భృగుండు= భృగుడు; పుత్త్రకామ+ఇష్టిన్+చేసి= పుత్రుడికొరకు కావించే

యజ్ఞాన్ని చేసి; అందున్= ఆ యజ్ఞంలో; మంత్ర, పూత, జల, పూరితంబు+ఐ= మంత్రాలచేత పవిత్రమైన నీళ్ళచేత నిండినట్టిదై; పుత్ర+ఉదయ, కారణంబు+ఐన= కొడుకు పుట్టటానికి హేతువైన; కలశంబు= పాత్రను; పడసి= పొంది; దానిన్= ఆ పవిత్ర కలశాన్ని; రక్షించి+ఉండన్= కాపాడటానికి; ఋత్విజులన్+పంచినన్= ఋత్విజులను నియోగించగా.

**తాత్పర్యం:** భృగుమహర్షి ఆశ్రమానికి వెళ్ళి పుత్రసంతానాన్ని కోరి చాలాకాలం ఆ మహర్షిని ఆరాధించాడు. భృగుమహర్షి యువనాశ్వుడిపై దయకలిగి పుత్రకామేష్టిని జరిపి, అందులో మంత్రాలచేత పవిత్రమైన నీటితో నిండిన పాత్రను, పుత్రుడు పుట్టటానికి హేతువైన దానిని పొంది, దానిని కాపాడటానికి ఋత్విజులను నియమించాడు.

**ఆ. రాత్రి జాగరణభరశ్రాంతులై వారు । నిద్రఁ బొంది; రంత నీరు వట్టి**
**ధారుణీశ్వరుండు తన్మంత్రకలశోద । కంబు లెల్లఁ ద్రావెఁ గడుపునిండ. 202**

**ప్రతిపదార్థం:** రాత్రి= రేయి; జాగరణ, భర, శ్రాంతులు+ఐ= మేలుకొనటంచేత ఏర్పడిన భారంచేత బడలిపోయినవారై; వారు= ఆ ఋత్విజులు; నిద్రన్, పొందిరి= నిద్రపోయారు; అంత= అప్పుడు; నీరు+వట్టి= దాహం బాగా వేసిన ధారుణీ+ఈశ్వరుండు= ధారుణీశ్వరుండు- రాజు (యువనాశ్వుడు); తద్, మంత్ర, కలశ+ఉదకంబులు+ఎల్లన్= ఆ కలశంలో ఉన్న మంత్రంచేత పవిత్రాలైన నీళ్ళను అన్నిటినీ; కడుపు, నిండన్= పొట్ట నిండేటట్లుగా; త్రావెన్= త్రాగాడు.

**తాత్పర్యం:** యజ్ఞం ముగిసిన ఆ రాత్రి ఋత్విజులు అందరు అలసిపోయి నిద్రపోయారు. రాజైన యువనాశ్వుడు దాహంవేసి కలశంలోని మంత్రపూతమైన యజ్ఞోదకాన్ని పొరపాటున మొత్తం త్రాగాడు.

**వ. దాని నెఱింగి భృగుండు యువనాశ్వుం జూచి 'నీకుఁ బుత్త్రార్థంబుగా మదీయ తపోవీర్యలబ్ధంబైన యిమ్మంత్ర జలంబు నీ భార్య కీనున్నచో నీవధిక పిపాసాపరుండవయి యుపయోగించి యకర్తవ్యంబుఁజేసితి; దైవకృతం బెవ్వరికిఁ దప్పింప నశక్యంబు; దీనంజేసి నీకు గర్భంబై యింద్రసదృశుండైన పుత్త్రుం డుద్భవించు' ననిన విని యువనాశ్వుండు దనపురంబునకుం జని యున్నంత నూఱేండ్లకు యువనాశ్వువామభాగంబు భేదించుకొని బాలార్క తేజుండైన బాలకుండు వెలువడిన, నక్కొడుకుం జూడ నింద్రుండు వచ్చి, వాని వదనంబున నిజప్రదేశినిఁ బెట్టి 'యమృతమయంబగు దీనిం ద్రావు' మనిన, నింద్రు వచనంబున నమరులెల్ల నక్కుమారునకు మాంధాతృం డను నామంబుఁ జేసి; రట్లు సురేంద్ర సంవర్ధితుండై. 203**

**ప్రతిపదార్థం:** దానిన్+ఎఱింగి= ఆ విషయాన్ని తెలిసికొని అనగా యువనాశ్వుడు యజ్ఞకలశంలోని మంత్ర పూరిపూతమైన నీళ్ళు త్రాగటాన్ని తెలిసికొని; భృగుండు= భృగుమహర్షి; యువనాశ్వున్+చూచి= యువనాశ్వుడిని చూచి; నీకున్= నీకు; పుత్ర+అర్థంబుగా= కొడుకు పుట్టటంకొరకై; మదీయ, తపస్+వీర్య, లబ్ధంబు+ఐన= నా తపస్సు యొక్క బలంచేత పొందబడినటువంటిదై; ఈ+మంత్రజలంబు= మంత్రాలచేత పవిత్రమైన ఈ నీరు; నీ, భార్యకు= నీ భార్యకు; ఈన్+ఉన్నచోన్= ఇవ్వాలని, ఉండగా; ఈవు= నీవు; అధిక, పిపాసా, పరుండవు+అయి= చాలా (మిక్కిలి) దాహంతో కూడినవాడివై; ఉపయోగించి= వాడి అనగా త్రాగి; అకర్తవ్యంబున్= చేయరానిపని; చేసితి(వి)= చేశావు; దైవకృతంబు= దైవంచేత ఏర్పరచబడినటువంటిది; ఎవ్వరికిన్= ఎవ్వరికైననూ; తప్పింపన్= తప్పించటానికి; అశక్యంబు= సాధ్యం కానిది; దీనన్+చేసి= దీనివలన; నీకు, గర్భంబు+ఐ= నీకు గర్భం వచ్చి; ఇంద్ర, సదృశుండు+ఐన= ఇంద్రుడితో సమానుడైన; పుత్త్రుండు= కొడుకు; ఉద్భవించున్= పుట్టుతాడు; అనిన విని= అని చెప్పగా విని; యువనాశ్వుండు= యువనాశ్వ మహారాజు; తన, పురంబునకున్+చని= తన రాజధానికి వెళ్ళి; ఉన్నంత= ఉండగా; నూఱు+ఏండ్లకు= వంద సంవత్సరాలకు; యువనాశ్వువామభాగంబు= యువనాశ్వుడి ఎడమభాగాన్ని;

భేదించుకొని= చీల్చుకొని; బాల+అర్క, తేజుండు+ఐన= ఉదయభానుడి వెలుగుతో సమానమైన కాంతిగల; బాలకుండు= శిశువు (బాలుడు); వెలువడినన్= బయటకు రాగా; ఆ+కొడుకున్+చూడన్= ఆ కొడుకును చూడటానికై; ఇంద్రుండు= ఇంద్రుడు; వచ్చి= వచ్చి; వాని, వదనంబున= ఆ శిశువునోటిలో; నిజ, ప్రదేశినిన్+పెట్టి= తన చూపుడు వ్రేలిని పెట్టి; అమృత, మయంబు+అగు= అమృతంతో నిండిన; దీనిన్= దీనిని; త్రావుము+అనినన్= త్రాగుము అనిచెప్పగా; ఇంద్రు, వచనంబునన్= ఇంద్రుడిమాటప్రకారం; అమరులు+ఎల్లన్= దేవతలందరూ; ఆ+కుమారునకున్= ఆ కుమారుడికి; మాంధాతృండు+అను= మాంధాతృడు అనే; నామంబున్+చేసిరి= పేరుపెట్టారు; అట్లు= ఆ విధంగా; సుర+ఇంద్ర, సంవర్ధితుండు+ఐ= దేవతలరాజైన, ఇంద్రుడిచేత పెంచబడినవాడై.

**తాత్పర్యం:** ఆ విషయాన్ని తెలిసికొని, భృగుమహర్షి యువనాశ్వుడిని చూచి 'నీకు కొడుకు పుట్టాలని నా తపోమహిమవలన పొందబడిన మంత్రపూతాలైన ఈ నీళ్ళను నీభార్యకే ఇవ్వాలని ఉంచాను. కాని, నీవు చాలా దప్పికగొన్నవాడవై వాటిని త్రాగావు. దైవఘటనను ఎవ్వరూ తప్పించలేరుకదా! దీనివలన నీవు కడుపుతో ఉండగలవు, నీకు ఇంద్రుడితో సమానుడైన కొడుకు పుట్టగలడు'- అనిచెప్పగా యువనాశ్వుడు తన రాజధానికి తరలిపోయాడు. నూరుసంవత్సరాల తర్వాత యువనాశ్వుడి ఎడమప్రక్కను చీల్చుకొని కుమారుడు పుట్టాడు. ఆ బాలకుడు ఉదయభానుడికాంతితో తేజరిల్లాడు. ఆ శిశువును దర్శించటానికి దేవేంద్రుడు వచ్చి, ఆ శిశువు నోట్లో తన చూపుడు వ్రేలుంచి 'ఇది అమృతమయం; దీనిని చీకుము' అని చెప్పగా, దేవేంద్రుడి ఆమాట ప్రకారం దేవతలు ఆ బాలకుడికి మాంధాతృడు అని పేరు పెట్టారు. ఆ విధంగా మాంధాతృడు దేవేంద్రుడిచేత పోషించబడిన వా డయ్యాడు.

**విశేషం:** ఇంద్రుడు ఆ శిశువు నోటిలో తన చూపుడు వ్రేలిని ఉంచి అమృతాన్ని త్రావిస్తూ "అయం (ఇతడు) మాం(నన్ను) ధాస్యతి (పానము చేయును)" - అని పలికాడు. అందువలన దేవతలెల్ల - మాం ధాస్యతి ఇతి మాంధాతా - అనే వ్యుత్పత్తి ప్రకారం ఆ బాలకునకు "మాంధాతా" - అని సార్థకంగా నామకరణం కావించారు.

**తే.** **ధ్యానమాత్రన చేసి వేదములు సర్వ। శాస్త్రములు ధనుర్వేదము సకల దివ్య**
**సాయక ప్రయోగంబులుఁ జట్ట వచ్చి। పొందె మాంధాతృఁ ద్రిభువనపూజ్యు నొప్ప. 204**

**ప్రతిపదార్థం:** ధ్యాన, మాత్రన, చేసి= ఏకాగ్రతతో మనస్సున యోచించినంత మాత్రాననే; వేదములు= వేదాలు; సర్వ, శాస్త్రములు= అన్ని శాస్త్రాలు; ధనుస్+వేదము= విలువిద్య; సకల, దివ్య, సాయక, ప్రయోగంబులున్= దివ్యాలైన అమ్ముల వాడకాలు అన్నియున్నూ; చట్ట, వచ్చి= త్వరగా వచ్చి; త్రి, భువన, పూజ్యున్= మూడులోకాలచేత అర్చించ తగినవాడిని; మాంధాతృన్= మాంధాతను; ఒప్పన్= ఒప్పునట్లుగా; పొందెన్= చెందాయి.

**తాత్పర్యం:** ధ్యానం చేయటంచేత మాత్రమే ఆ మాంధాతను నాలుగు వేదాలున్నూ, వివిధ శాస్త్రాలున్నూ, విలువిద్య, దివ్యాలైన అమ్ములను ప్రయోగించే విధానాలున్నూ శీఘ్రమే వచ్చి చేరాయి. అతడు మూడులోకాలలో గౌరవించదగిన గొప్పతనాన్ని పొందాడు.

**వ.** **మఱియు నమ్మాంధాతృండు మహేంద్రుచేత మహామహీరాజ్యంబున కభిషిక్తుండై చక్రవర్తియై శక్రు నర్ధాసనం బెక్కి యాజగవం బను ధనువును దివ్యాస్త్రంబులు నభేద్యకవచంబును ధరియించి నిఖిల లోక జైత్రుండై**

**సంపూర్ణదక్షిణక్రతువు లనేకంబులు చేసి పద్మసంఖ్యలు గోదానంబుల బ్రాహ్మణులం దనిపి నిజశాసనంబునం బ్రజల నెల్ల నిలిపి. 205**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; ఆ+మాంధాతృండు= ఆ మాంధాత; మహా+ఇంద్రుచేతన్= దేవేంద్రుడిచేత; మహా మహీరాజ్యంబునకు= గొప్పవిస్తారం కల భూమండల ప్రభుత్వానికి; అభిషిక్తుండు+ఐ= ప్రభువుగా మంత్రజలంతో అభిషేకించబడినవాడై; చక్రవర్తి+ఐ= రాజరాజై; శక్రు+అర్ధ+ఆసనంబు+ఎక్కి= దేవేంద్రుడియొక్క సగం గద్దెపై ఎక్కి, అనగా ఇంద్రుడితో సమానంగా ఇంద్రుడి సింహాసనం మీద కూర్చుండి - అని భావం; ఆజగవంబు+అను, ధనువును= ఆజగవం అనేపేరుకల వింటిని; దివ్య+అస్త్రంబులు= దివ్యాలైన మంత్రబాణాలు; న+భేద్య, కవచంబును= భేదించటానికి వీలులేని కవచాన్ని, (తనుత్రాణాన్ని); ధరియించి= ధరించి; నిఖిల, లోక, జైత్రుండు+ఐ= సమస్తలోకాలను జయించినవాడై; సంపూర్ణ, దక్షిణ, క్రతువులు+అనేకంబులు, చేసి= పూర్తి దక్షిణలిచ్చి చేసే అనేకయజ్ఞాలు నెరవేర్చి; పద్మసంఖ్యలు= కోటానుకోట్లు; గోదానంబుల= ఆవులను దానంగా ఇవ్వటంవలన; బ్రాహ్మణులన్+తనిపి= విప్రులను సంతృప్తిపరచి; నిజ, శాసనంబునన్= తన ఆజ్ఞ ప్రకారం; ప్రజలన్+ఎల్లన్= జనులందరినీ; నిలిపి= శాసించి.

**తాత్పర్యం:** ఇంకనూ, ఆ మాంధాత సమస్త భూమండలానికి రాజరాజుగా దేవేంద్రుడిచేత పట్టాభిషిక్తుడై, దేవేంద్రుడి సింహాసనం మీద ఆ ఇంద్రుడితో పాటు అధివసించి, 'ఆజగవం' అనే విల్లును చేపట్టి, పెక్కుమంత్రబాణాలను, భేదించటానికి వీలులేని కవచాన్ని ధరించి, అన్నిలోకాలను జయించిన జగదేకవీరుడై, సంపూర్ణమైన దక్షిణలు ఇచ్చి పెక్కుయాగాలు చేసి, కోటానుకోట్ల సంఖ్యలో విప్రులకు ఆవులను దానంచేసి వారిని సంతృప్తులను చేసి, ప్రజలను తన ఆజ్ఞకు లోబడి నడుచుకొనేవారినిగా చేసి.

**మధ్యాక్కర.**

**భూమి కనావృష్టి యైనఁ గడు నల్గి పురుహూతుతోడ**
**భీమసంగ్రామంబుఁ జేసెఁ, దన దివ్యపృథు సాయకముల**
**సామజావలి నేయునట్లు మేఘసంచయముల నేసి**
**భూమికిఁ గురియించె వర్షములు సస్యముల్ వృద్ధిఁ బొంద. 206**

**ప్రతిపదార్థం:** భూమికి= పుడమికి; అనావృష్టి+ఐనన్= వానలు కురవకపోవటం జరుగగా; కడు= మిక్కిలి; అల్గి= కోపించి; పురుహూతుతోడన్= దేవేంద్రుడితో; భీమ, సంగ్రామంబున్= భయంకరమైన యుద్ధాన్ని; చేసెన్= చేశాడు; తన, దివ్య, పృథు, సాయకముల= తనయొక్క దివ్యమైనవి, విస్తారమైనవి అయిన అమ్ములచేత; సామజ+ఆవలిన్= ఏనుగుల గుంపులను; ఏయునట్లు= కొట్టేటట్లు; మేఘ, సంచయములన్= మేఘాల సమూహాలపై; ఏసి= బాణాలను ప్రయోగించి; సస్యముల్= పంటలు; వృద్ధిన్+పొందన్= పెంపుచెందేటట్లు; భూమికిన్= భూమికి; వర్షముల్= వానలు; కురియించెన్= కురిపించాడు (కురిసేటట్లుచేశాడు).

**తాత్పర్యం:** పుడమిలో వానలు కురవకపోవటంచేత మాంధాత మిక్కిలి ఆగ్రహించెంది, దేవేంద్రుడితో భయంకరమైన యుద్ధాన్ని చేశాడు. ఏనుగులను కొట్టేవిధంగా తన మంత్రబాణాలను మేఘాలపై విరివిగా ప్రయోగించి పంటలు వృద్ధి చెందేటట్లుగా భూమిపై వానలు కురిపించాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 2.22 విశేషాంశం చూడండి.

**వ. ఇది యమ్మాంధాతృ దేవయజనస్థానంబు; మఱి యిక్కురుక్షేత్రంబునందు సరస్వతీతీరంబున సోమకుండను వాఁడు యజ్ఞంబు సేసి పుత్త్రశతంబుఁ బడసె' ననిన 'నది యె'ట్లని ధర్మజుం డడిగిన రోమశుం డిట్లనియె.207**

**ప్రతిపదార్థం:** ఇది= ఈస్థలం; ఆ+మాంధాతృ దేవయజనస్థానంబు= ఆ మాంధాత దేవయజ్ఞం చేసినచోటు; మఱి= ఇక; ఈ+కురు, క్షేత్రంబునందున్= ఈ కురుక్షేత్రంలో; సరస్వతీ, తీరంబున= సరస్వతీనది తీరంలో; సోమకుండు+అనువాఁడు= సోమకుడు అనే పేరు కలవాడు; యజ్ఞంబు+చేసి= యజ్ఞంచేసి; పుత్త్ర, శతంబున్= నూరుగురు కొడుకులను; పడసెన్= పొందాడు; అనినన్= అని చెప్పగా; అది= ఆ వృత్తాంతం; ఎట్లు= ఏరీతిగా జరిగింది; అని= అని; ధర్మజుండు= ధర్మరాజు; అడిగినన్= ప్రశ్నించగా; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇది ఆ మాంధాత యజ్ఞంచేసినచోటు. ఇక ఈ కురుక్షేత్రంలో సరస్వతీనది తీరాన సోమకుడనే రాజు యజ్ఞంచేసి నూరుగురు కొడుకులను పొందాడు'- అని చెప్పగా ధర్మరాజు ఆ కథను వివరించి చెప్పుమని కోరాడు. అంత రోమశుడు ఇట్లా చెప్పాడు.

## సోమకుండను రాజర్షి చరిత్రము (సం. 3-127-2)

**క. 'సోమకుఁడను రాజర్షి మ । హా మఖ మొనరించి జంతుఁ డను నొక్క సుతున్**
**భూమీశ! పడసె; నాతని । భామలు నూర్వురును గొడుకుఁ బరమప్రీతిన్. 208**

**ప్రతిపదార్థం:** భూమి+ఈశ!= ఏ రాజా!; సోమకుఁడు+అను, రాజ+ఋషి= సోమకుడు అనేపేరుకల రాజ ఋషి; మహామఖము= గొప్పయజ్ఞం; ఒనరించి= చేసి; జంతుఁడు+అను+ఒక్క, సుతున్= జంతుడు అనేపేరు కల ఒక్క కొడుకును,; పడసెన్= పొందాడు; ఆతని, భామలు= ఆరాజు భార్యలు; నూర్వురును= వందమంది; పరమ, ప్రీతిన్= గొప్పప్రేమతో; కొడుకున్= కుమారుడిని (తరువాత పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** 'ఓరాజా! సోమకుడు అనేరాజర్షి గొప్ప యజ్ఞంచేసి, జంతుడు అనేపేరుకల కొడుకును పొందాడు. ఆ రాజు రాణులు నూరుమందీ ఆ కుమారుడిని మిక్కిలి ప్రేమతో.

**క. తమ తమ పుత్త్రుఁడ కాఁ జి । త్తములం జేకొని దయం బృథగ్భావము లే**
**క ముదంబునఁ బెంచిరి లో । కమున జనుల్ చోద్యమందఁగాఁ గడువేడ్కన్. 209**

**ప్రతిపదార్థం:** తమ, తమ, పుత్త్రుఁడు+అ కాన్= తమ తమ సొంత కొడుకుగానే; చిత్తములన్= మనస్సులలో; చేకొని= పాటించి; దయన్= కరుణతో; పృథక్+భావము, లేక= వేరు అనే తలపు లేకుండా; ముదంబునన్= సంతోషంతో; లోకమున, జనుల్= లోకంలోని ప్రజలు; చోద్యము+అందఁగాన్= ఆశ్చర్యం చెందగా; కడు, వేడ్కన్= మిక్కిలి ప్రేమతో; పెంచిరి= లాలించారు.

**తాత్పర్యం:** ఆ రాజుకు గల నూరుగురు భార్యలు ఏకైక పుత్రుడైన జంతుడిని తమ తమ సొంత బిడ్డగానే భావించి, వేరుభావం లేకుండా సంతోషంతో లోకంలోని ప్రజలు ఆశ్చర్యపడేటట్లుగా లాలించి పెంచారు.

**వ. ఒక్కనాఁ డబ్బాలకు కుఱువు చీమ గుట్టినఁ దద్వేదన సహింప నోపక యేడ్చుచున్నవాని కడకుఁ దల్లులందఱుఁ బఱతెంచి యేడ్చిన నయ్యాక్రందన ధ్వని విని సంభ్రమించి సోమకుం డంతఃపురంబునకుం జని కొడుకు నూరార్చి సభాస్థితుండై మంత్రులకు ఋత్విజులకు నిట్లనియె. 210**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు= ఒకరోజు; ఆబాలకు, కుఱువు= ఆ బాలకుడితొడను; చీమ, కుట్టినన్= చీమ కుట్టగా; తద్+వేదన= ఆ నొప్పి; సహింపన్+ఓపక= తాళలేక; ఏడ్చుచున్న, వాని కడకున్= ఏడుస్తూ ఉన్నవాని దగ్గరకు; తల్లులు+అందరున్= తల్లులందరూ; పఱతెంచి= అరుదెంచి; ఏడ్చినన్= ఏడ్వగా; ఆ, ఆక్రందన, ధ్వని= ఆ రోదన ధ్వని; విని= విని; సంభ్రమించి= తత్తరపాటుతో బాధను పొంది; సోమకుండు= సోమకుడు; అంతఃపురంబునకున్+చని= రాణివాసానికి వెళ్ళి; కొడుకున్+ఊరార్చి= పుత్రుడిని బుజ్జగించి; సభా, స్థితుండు+ఐ= కొలువు తీర్చినవాడై; మంత్రులకు= సచివులకు; ఋత్విజులకున్= యజ్ఞంచేయించే పురోహితులకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా (ఇట్లా) చెప్పాడు.

**తాత్పర్యం:** ఒకరోజున ఆ బాలుడి తొడకు గండుచీమ కుట్టింది. వాడు ఆ బాధకు తట్టుకోలేక పెద్దగా ఏడ్వసాగాడు. అతడి ఏడ్పు విని తల్లులందరూ పరుగెత్తుకొని వచ్చారు. అతడి బాధను చూచి వారుకూడా. గొల్లున ఏడ్చారు.ఆ రోదన ధ్వనిని సోమకుడు విన్నాడు, వెంటనే అంతఃపురానికి వెళ్ళాడు. కొడుకును ఓదార్చాడు. ఆపైన సభకు తిరిగి వచ్చి మంత్రులతో, ఋత్విజులతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'కురువు' శబ్దానికి 'కుఱువు' అనే రూపంకూడా కనపడుతున్నది.

**ఆ. 'కోరి యొక్క కొడుకుఁ గొడుకుగా నే నెట్లు । నమ్మియుండనేర్తు? నాకు సతులు**
**శతము గలిగియుండ సంతాన మల్పమై । యునికి మీకుఁ జూడ నుచిత మగునె?' 211**

**ప్రతిపదార్థం:** కోరి= కావాలని తలపోసి; ఒక్క, కొడుకున్= ఒక్క కొడుకును; కొడుకుగాన్= కొడుకుగా; ఏన్= నేను; ఎట్లు= ఏరీతిగా (ఎట్లా); నమ్మి+ఉండ, నేర్తు= విశ్వసించి= ఉండగలను; నాకున్= నాకు; సతులు= భార్యలు; శతము= నూరుమంది; కలిగి+ఉండ= కలిగిఉండగా; సంతానము= బిడ్డలు; అల్పము+ఐ= తక్కువగా; ఉనికి= ఉండటం; చూడన్= ఆలోచింపగా, మీకున్= నా మేలు కోరే మీకందరికీ; ఉచితము+అగునె= తగినదిగా కన్పిస్తున్నదా?

**తాత్పర్యం:** 'నాకు నూరుమంది భార్యలున్నారు కాని కుమారుడు ఒక్కడే ఉన్నాడు. భార్యలు హెచ్చుమంది. సంతానం లొచ్చు. ఏకైక పుత్రుడు పుత్రుడు అని నమ్మవచ్చునా? మీ కందరికీ ఇది సముచితంగా కనిపిస్తూ ఉందా?'

**వ. అనిన వానికి ఋత్విజు లిట్లనిరి. 212**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; వానికి= ఆ రాజుకు; ఋత్విజులు= యజ్ఞం చేయించే పురోహితులు; ఇట్లు+అనిరి= ఈవిధంగా చెప్పారు.

**తాత్పర్యం:** అని అడుగగా సోమకమహారాజుకు యజ్ఞం చేయించే పురోహితులు ఈవిధంగా బదులు పలికారు.

**తే. 'ధరణినాథ! నీ భార్యాశతంబునందుఁ । బరఁగ నూర్వురుపుత్త్రులఁ బడయ నీకు**
**నభిమతం బేనిఁ దగుఁ దగదనక నీవు । కడఁగి మా చేయఁబంచిన క్రతువు సేయు. 213**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= పుడమికి భర్తవైన ఓ(సోమక) మహారాజా!; నీ, భార్యా, శతంబునందున్= నీ నూరుగురు పత్నుల వలన; పరఁగ= ఒప్పుగా; నూర్వురు, పుత్త్రులన్= వందమంది కొడుకులను; పడయ= పొందడానికి; నీకు= నీకు; అభిమతంబు+ఏనిన్= కోరిక ఉంటే; తగున్+తగదు+అనక= ఇది మంచిది, ఇది చెడ్డది అని చెప్పక; నీవు= నీవు; కడఁగి= పూనికతో; మా, చేయన్+పంచిన= మేము చేయుమని చెప్పిన; క్రతువు= యజ్ఞం; చేయు(ము)= చేయవలసింది.

**తాత్పర్యం:** 'ఓ సోమకమహారాజా! నీ నూరుమంది రాణులవలన నీకు నూరుగురు కొడుకులు పుట్టాలని కోరిక ఉంటే, మేము ఆదేశించిన యజ్ఞం చేయుము, ఇది తగింది. ఇది తగదు, అని ఎదురు చెప్పకుము.

**వ. ఈ జంతుం బశువుగా వధించి తద్వపాహవ్యంబుల హవ్యవహుం దనిపిన, దాన నీ నూర్వురు భార్యలకు నూర్వురు కొడుకులు పుట్టుదు; రందగ్రజుండైన జంతుండు సౌవర్ణ లక్షణ లక్షిత సవ్యపార్శ్వుండై యుదయించు' నని చెప్పి ఋత్విజులచేత సోమకుండు ననుజ్ఞాతుండై. 214**

**ప్రతిపదార్థం:** ఈ జంతున్= జంతుడు అనేపేరుకల ఈ రాజపుత్రుడిని; పశువుగాన్= యజ్ఞంలో బలి ఇచ్చే పశువుగా; వధించి= చంపి; తద్+వపా, హవ్యంబుల= అతడియొక్క నాభిక్రింది పలుచని మాంసపు (క్రొవ్వు) పొరతో కూడిన, ఆహుతితో; హవ్యవహున్= అగ్నిహోత్రుడిని; తనిపిన= తృప్తి చెందించినచో; దాన= దానివలన; నీ, నూర్వురు, భార్యలకు= నీ నూరుగురు భార్యలకు; నూర్వురు, కొడుకులు= వందమంది కొడుకులు; పుట్టుదురు= జన్మిస్తారు; అందు= వారిలో; అగ్రజుండు+ఐన= మొదట జన్మించే వాడైన; జంతుండు= జంతుడు; సౌవర్ణ, లక్షణ, లక్షిత, సవ్య, పార్శ్వుండు+ఐ= బంగారు లక్షణాలతో శోభిల్లే కుడిపార్శ్వం కలవాడై; ఉదయించున్= పుట్టుతాడు; అనిచెప్పి= అని చెప్పి; ఋత్విజులచేతన్= యజ్ఞాన్ని చేయించే పురోహితులచేత; సోమకుండున్= సోమకుడు; అనుజ్ఞాతుండు+ఐ= అనుమతి పొందినవాడై.

**తాత్పర్యం:** ఓ సోమక మహారాజా! నీ ఏకైకపుత్రుడైన జంతుడిని యజ్ఞపశువు చేసి సంహరించి, ఆతడి కడుపులోని వపను హవ్యంగా చేసి, అగ్నిహోత్రుడిని తృప్తిచెందిస్తే నీ నూరుగురు భార్యలకు నూరుమంది కొడుకులు పుట్టగలరు. వారిలో ముందుపుట్టిన జంతుడు తన కుడి ప్రక్క దేహభాగం బంగారులక్షణాలతో శోభిల్లేవా డవుతాడు'- అని ఋత్విజులు చెప్పారు. సోమకుడు ఋత్విజుల అనుమతి పొంది.

**విశేషం:** వపాశబ్దానికి అర్థం నిర్వచించటంలో పండితులలో ఏకవాక్యత లేదు. కొందరు మెదడు అనిన్నీ, మరికొంతమంది కడుపులో బొడ్డుక్రింద ఉల్లిపొరవలె ఉండే మాంసపు (క్రొవ్వు) పొర- అనిన్నీ అర్థం చెపుతున్నారు.

**క. తనయుఁ బశువటిచి తద్వపఁ । గొని వేల్చినఁ జూచి యార్తకురరీనాదం**
**బున నేడ్చిరి కడు నడలుగఁ । దనుమధ్యలు నూర్వురును సుతస్నేహమునన్. 215**

**ప్రతిపదార్థం:** తనయున్= కొడుకును; పశువు+పటిచి= యజ్ఞంలో బలిపశువుగా చేసి; తద్+వపన్= అతని నాభి క్రింది పలుచని మాంసపు (క్రొవ్వు) పొరను; వేల్చినన్= హోమంచేయగా; చూచి= అరసి; తనుమధ్యలు= స్త్రీలు, సన్నటి నడుము కలవారు; నూర్వురును= వందమంది; సుత స్నేహమునన్= పుత్రుడిమీద గల అనురాగంచేత; కడున్+అడలుగన్= మిక్కిలి దుఃఖంతో; ఆర్త, కురరీ, నాదంబునన్= బాధతో దుఃఖిస్తున్న భయపడిన ఆడుగొర్రెలు చేసే ధ్వనివంటి ధ్వనితో; ఏడ్చిరి= ఆక్రందనలు చేశారు.

**తాత్పర్యం:** కొడుకును యజ్ఞంలో బలిపశువుగా చేసి అతడి వపను హోమంగా వేల్చటం చూచి నూరుగురు తల్లులు మిక్కిలి అడలుతూ కుమారుడిమీద గల ప్రేమతో ఆడుగొర్రెలు బాధతో అరచినట్లు పెద్దపెట్టున ఏడ్చారు.

**క. ఇమ్ముగఁ దద్ధూమాఘ్రా । ణమ్మున గర్భములు దాల్చి నాతులు నవమా**
**సమ్ములు నిండుడుఁ గనిరి ము । దమ్మున జంతుప్రముఖసుతప్రకరమ్మున్. 216**

**ప్రతిపదార్థం:** ఇమ్ముగన్= సంపూర్ణంగా; తద్+ధూమ+ఆఘ్రాణమ్మున= ఆ వపాహోమంయొక్క పొగను పీల్చటంవలన; నాతులు= స్త్రీలు (సోమకుడి భార్యలు); గర్భమ్ములు+తాల్చి= కడుపుతో ఉండి; నవ, మాసమ్ములు= తొమ్మిదినెలలు; నిండుడున్= నిండగానే, పూర్తికాగానే; ముదమ్మునన్= సంతోషంతో; జంతు, ప్రముఖ, సుతప్రకరమ్మున్= జంతుడు మొదలైన కొడుకులసమూహాన్ని; కనిరి= ప్రసవించారు.

**తాత్పర్యం:** ఆ వపాహోమంయొక్క పొగను బాగా పీల్చటంవలన సోమకుడి భార్యలు నూరుగురు గర్భవతులై, తొమ్మిది నెలలు నిండినపిదప సంతోషంతో జంతుడు మొదలుగా గల నూరుగురు కొడుకులను ప్రసవించారు.

**వ. అందు జంతునకు నందఱు నెప్పటియట్ల తల్లులు సమస్నేహలై యుండం బుత్త్రులు నూర్వురుం బెరిఁగి సమర్థులైయున్నఁ బెద్ద కాలంబునకు ఋత్విజుండు పరలోకగతుండై ఘోరనరకానలంబున నెరియుచు నుండె; నంత సోమకుండును దేహత్యాగంబు సేసి, యమరలోకంబున కరుగువాఁడు ముందట నరకానల పచ్యమానుండయ్యెడు ఋత్విజుం జూచి' యి ట్లేల తీవ్ర దుఃఖోపహతుండవైతి?' వని యడిగిన వాఁ డిట్లనియె. 217**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ బిడ్డలలో; జంతునకున్= జంతుడిపట్ల; అందఱున్, తల్లులు= అందరు తల్లులు; ఎప్పటి+అట్ల= లోగడవలెనే; సమ, స్నేహలు+ఐ+ఉండన్= సమమైన ప్రేమతో ఉండగా; పుత్త్రులు= కొడుకులు; నూర్వురున్= నూరుగురు; పెరిగి= ఎదిగి; సమర్థులు+ఐ+ఉన్నన్= శక్తి కలవారై ఉండగా; పెద్ద, కాలంబునకు= చాలాకాలం గడిచిన పిదప; ఋత్విజుండు= యజ్ఞంచేయించిన పురోహితుడు; పరలోకగతుండు+ఐ= పరలోకానికి వెళ్ళినవాడై (అంటే మరణించినవాడై); ఘోర, నరక+ అనలంబునన్= భయంకరమైన నరకలోకంలోని అగ్నిలో అనగా నరకంలోని భయంకరమైన అగ్నిలో; ఎరియుచున్+ఉండెన్= కాగుతున్నాడు; అంత= అటుపిదప; సోమకుండును= సోమక మహారాజున్నూ; దేహ, త్యాగంబు+చేసి= మరణించి; అమర, లోకంబునకు= స్వర్గలోకానికి; అరుగువాఁడు= వెళ్ళుతూ; ముందట= ముందుగా (దారిలో); నరక+అనల, పచ్యమానుండు+ అయ్యెడు= నరకంలోని అగ్నిలో వేపబడుతున్న; ఋత్విజున్+చూచి= యజ్ఞం చేయించిన పురోహితుడిని చూచి; ఇట్లు+ఏల= ఈ రీతిగా ఎందుకు; తీవ్ర, దుఃఖ+ఉపహతుండవు+ఐతివి?= గాఢమైన పరితాపంచేత కొట్టబడినవాడిని అయినావు?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; వాఁడు= ఆ ఋత్విజుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అట్లా పుట్టిన పుత్రులయెడ అందరు తల్లులు జంతుడియెడ లోగడ చూపిన ప్రేమనే సమానంగా చూపసాగారు. ఆ నూరుగురు కొడుకులు పెరిగి పెద్దవారై సమర్థులు అనేపేరు తెచ్చుకొన్నారు. చాలాకాలం గడచినపిదప, ఆ యజ్ఞాన్ని చేయించిన ఋత్విజుడు మరణించి నరకలోకంలో భయంకరమైన అగ్నిలో మలమల మాడుతున్నాడు. అంత సోమక మహారాజు కూడ మరణించి, స్వర్గలోకానికిపోతూ ముందుగా దారిలో నరకలోకంలోని అగ్నిలో వేగుతున్న ఋత్విజుడిని చూచి, 'నీవు ఈవిధంగా ఎందుకు తీవ్ర దుఃఖానికి లోనైనావు?' అని అడుగగా అతడు ఇట్లా బదులు పలికాడు.

ఆ. 'అవనినాథ! నీకు నార్త్విజ్య మొనరించి । చూవె యిట్టి నరకపావకమునఁ
బడినవాఁడ; నీకు బహుపుణ్య లోకముల్ । గలవు; నన్నుఁ గావవలయుఁ గరుణ.' **218**

**ప్రతిపదార్థం:** అవని, నాథ!= పుడమికి భర్తవైన ఓ సోమక మహారాజా!; నీకున్+ఆర్త్విజ్యము+ఒనరించి= నీకు యజ్ఞంలో ఋత్విజుడిగా పనిచేయటం వలన; ఇట్టి= ఇటువంటి; నరక, పావకమునన్= నరకంలోని అగ్నిలో; పడినవాఁడన్= పతనమైనవాడిని; చూవె= సుమా; నీకున్= నీకు; బహు, పుణ్య, లోకముల్, కలవు= నీకు ఎన్నో పుణ్యగతు లున్నాయి; కరుణన్= దయతో; నన్నున్= నన్ను; కావవలయున్= కాపాడాలి.

**తాత్పర్యం:** ఓ సోమక మహారాజా! నీ యజ్ఞంలో ఋత్విజుడిగా పనిచేయటం చేతనే సుమా! నాకు ఈ నరకాగ్నిలో పడటం సంభవించింది. నీకేం? నీకు ఎన్నో పుణ్యగతులు లభించిఉన్నాయి. దయతో నువ్వే నన్ను కాపాడాలి.

వ. అనిన సోమకుండు ధర్మరాజు పాలికిం జని తచ్ఛాసనంబునం బుణ్యలోకంబులకుం బోవుచుండి యిట్లనియె. **219**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; సోమకుండు= సోమకుడు; ధర్మరాజు, పాలికిన్+చని= యముడి వద్దకు వెళ్ళి; తత్+శాసనంబునన్= అతడి ఆజ్ఞమేరకు; పుణ్యలోకంబులకున్= పుణ్యగతులకు; పోవుచుండి= వెళ్ళుతూ; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని ఆ ఋత్విజుడు పలుకగా, సోమకుడు యముడి దగ్గరకు వెళ్ళి, అతడి శాసనాన పుణ్యలోకాలకు పోతూ, ఇట్లా చెప్పాడు.

క. 'నా కారణమున ఋత్విజుఁ । డేకాంతమ నరకగతికి నేఁగెను వానిం
దోకొని పోయెద' నని శుభ । లోకంబున కరిగెఁ ద్రిదశలోకస్తుతుఁడై. **220**

**ప్రతిపదార్థం:** నా, కారణమున= నా మూలాన; ఋత్విజుఁడు= యజ్ఞాన్ని చేయించిన ఈ పురోహితుడు; ఏకాంతమ= ఒంటరిగా; నరక, గతికిన్= నరకలోకానికి; ఏఁగెను= వెళ్ళాడు; వానిన్= అతనిని (ఆ ఋత్విజుడిని); తోకొనిపోయెదను= నాతోపాటు తీసికొని వెళ్తాను; అని= అని చెప్పి; త్రిదశ, లోక, స్తుతుఁడు+ఐ= స్వర్గలోకంచేత స్తుతించబడినవాడై; శుభ, లోకంబునకు= పుణ్యలోకానికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'ఈ ఋత్విజుడు నామూలాన కదా ఈ నరకలోకంలో పడి మ్రగ్గవలసి వచ్చింది. అతడిని నాతోపాటు స్వర్గలోకానికి తీసికొనివెళ్ళగలను'- అని చెప్పి అతడిని తనవెంట పుణ్యగతికి తీసికొని వెళ్ళాడు. ఆ సోమక మహారాజును స్వర్గలోకం ప్రస్తుతించింది.

**విశేషం:** ఈ కథలోని ముఖ్యాంశాలు(1) నరమేధం జరిగింది. (2) నరమేధం చేసిన రాజుకు స్వర్గమున్నూ, చేయించిన ఋత్విజుడికి నరకమున్నూ ప్రాప్తించాయి. (3) ఆరాజు తాను స్వర్గానికి వెళ్ళుతూ కూడా స్వార్థాన్ని వీడి తనమూలాన నరకంలో మ్రగ్గుతున్న ఋత్విజుడిని ఉద్ధరించటం.

వ. ఇట్లు యజ్ఞపుత్త్రుం డైన సోమకుండు తన తపోయజ్ఞఫలంబున ఋత్విజు నరకవిముక్తుంజేసి పుణ్యలోక గతుండయ్యె ; నిందుఁ దొల్లి ప్రజాపతి సహస్ర వార్షికంబైన యిష్టాకృతంబను సత్త్రయాగంబుఁ జేసె;

**నాభాగుండైన యంబరీషుం డిందు యజ్ఞంబులం జేసి పరమసిద్ధికిం జనియె; నిది నహుషు యజ్ఞదేశం; బిందు దశపద్మ సంఖ్య ధనంబుల నాతండు సదస్యులం బూజించె; నిది సార్వభౌమ యజ్ఞస్థానం; బిది యయాతి యజ్ఞాయతనంబు; వాని సవనంబున కింద్రుండు వచ్చె; నిది రామహ్రదం, బిది నరనారాయణాశ్రమం, బిది ప్లక్షావతరణంబను యమునాతీర్థం; బిందు దేవతలును ఋషులును సారస్వత యాగంబుఁ జేసి; రిది దేవర్షియైన సంవర్తుచేత రక్షితం; బిందు భరతుం డనేక యాగంబులు సేసి సర్వలోకంబులుం జూచె; నీవు నిందుఁ గృతస్నానుండవై సర్వలోకంబులుం జూడు' మనిన ననుజసహితుండై ధర్మతనయుం డత్తీర్థంబున స్నానంబుఁ జేసి రోమశున కిట్లనియె. 221**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; యజ్ఞ పుత్త్రుండు+ఐన= యజ్ఞంవలన కొడుకును పొందినట్టి వాడైన; సోమకుండు= సోమకమహారాజు; తన, తపస్+యజ్ఞ, ఫలంబున= తనయొక్క తపస్సు అనేటటువంటి యజ్ఞానికి సంక్రమించే ఫలితంగా; ఋత్విజున్= యజ్ఞం చేయించిన పురోహితుడిని; నరక, విముక్తున్+చేసి= నరకంనుండి తప్పించి; పుణ్య, లోక, గతుండు+ అయ్యెన్= పుణ్యలోకానికి వెళ్ళినవా డయ్యాడు; ఇందున్= ఇక్కడ; తొల్లి= పూర్వకాలంలో; ప్రజాపతి= బ్రహ్మదేవుడు; సహస్ర, వార్షికంబు+ఐన= వేయి సంవత్సరాలు పట్టిన; ఇష్టాకృతంబు+అను= ఇష్టాకృతం అనే పేరు కల; సత్రయాగంబున్+చేసెన్= సత్రయాగాన్ని సలిపాడు; నాభాగుండు+ఐన= నాభాగవంశీయుడు అయిన; అంబరీషుండు= అంబరీషుడు; ఇందు= ఇక్కడ; యజ్ఞంబులన్+చేసి= యజ్ఞాలు చేసి; పరమ, సిద్ధికిన్+చనియెన్= మిక్కిలి ఉత్కృష్టమైన గతిని పొందాడు; ఇది= ఈచోటు; నహుష, యజ్ఞ, దేశంబు= నహుషుడు యజ్ఞం చేసినచోటు; ఇందున్= ఇక్కడ; దశ, పద్మ, సంఖ్య= పదిపద్మాల లెక్కగల; ధనంబులన్= నిధులతో; ఆతండు= ఆ నహుషుడు; సదస్యులన్= యజ్ఞంలో లోటుపాట్లు రాకుండా గమనించే పండితులను; పూజించెన్= పూజించాడు. అర్చించాడు; ఇది= ఈచోటు; సార్వభౌమ, యజ్ఞస్థానంబు= సార్వభౌముడి యజ్ఞస్థలం; ఇది= ఈచోటు; యయాతి,యజ్ఞ+ఆయతనంబు= యయాతి యజ్ఞం చేసిన స్థలం; వాని, సవనంబునకు= అతడి యజ్ఞానికి; ఇంద్రుండు= ఇంద్రుడు; వచ్చెన్= వచ్చాడు; ఇది= ఈ చోటు; రామహ్రదంబు= రామహ్రదం; ఇది= ఈ చోటు; నర, నారాయణ+ఆశ్రమంబు= నరుడు, నారాయణుడు తపమొనర్చిన ఆశ్రమస్థానం; ఇది= ఈ చోటు; ప్లక్షావతరణంబు= ప్లక్షద్వీపం నుండి నదివెలువడ్డచోటు; అను= అనేటటువంటి; యమునా, తీర్థంబు= యమునానదికి చెందిన పుణ్యస్థలం; ఇందు= ఇక్కడ; దేవతలును, ఋషులును= దేవతలు, మునులు కలిసి; సారస్వతయాగంబున్+చేసిరి= సరస్వతికి సంబంధించిన యజ్ఞాన్ని చేశారు; ఇది= ఈచోటు; దేవ, ఋషి+ఐన= దేవతలకు చెందిన ముని అయిన; సంవర్తుచేత= సంవర్తుడిచేత; రక్షితంబు= కాపాడబడునట్టిది; ఇందు= ఇక్కడ; భరతుండు= భరతుడు అనేరాజు; అనేక, యాగంబులు+చేసి= అనేకయాగాలు చేసి; సర్వలోకంబులున్= లోకాలనన్నింటినీ; చూచెన్= దర్శించాడు; ఈవును= నీవుకూడా; ఇందున్= ఇక్కడ; కృత, స్నానుండవు+ఐ= స్నానంచేసి; సర్వలోకంబులున్ + చూడుము= అన్నిలోకాలనూ దర్శించవలసింది; అనినన్= అని చెప్పగా; అనుజ, సహితుండు+ఐ= తమ్ముళ్ళతోపాటు; ధర్మ తనయుండు= ధర్మరాజు; ఆ+తీర్థంబున= ఆనీటిలో; స్నానంబున్+చేసి= స్నానంచేసి; రోమశునకు= రోమశ మహర్షికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా తెలిపారు.

**తాత్పర్యం:** ఈ విధంగా యజ్ఞంవలన కొడుకులను పొందిన సోమకమహారాజు తన తపస్సు అనేయజ్ఞం యొక్కఫలంగా తన ఋత్విజుడిని నరకంనుండి వెలువడచేసి పుణ్యగతిని పొందాడు. ఇక్కడ పూర్వకాలాన బ్రహ్మదేవుడు వేయి ఏళ్ళ గడువు కల సత్రయాగం 'ఇష్టాకృతం' అనేదానిని చేశాడు. ఇక్కడ నాభాగుడి వంశంలో పుట్టిన అంబరీషుడు యజ్ఞాలు చేసి మిక్కిలి ఉత్తమగతికి వెళ్ళాడు. ఇది నహుషుడు యజ్ఞం చేసినచోటు. ఇక్కడ అతడు నూరు అర్బుదాల ధనాన్ని యజ్ఞంలో లోటుపాట్లులేకుండా గమనించే పండితులకు దక్షిణగా ఇచ్చాడు. ఇది

సార్వభౌముడి యజ్ఞవాటిక. ఇది యయాతి యజ్ఞం చేసినస్థలం. అతడి యజ్ఞానికి దేవేంద్రుడు వచ్చాడు. ఇది రామహ్రదం. ఇది ప్లక్షావతరణం అనేతీర్థం. ఈ యమునా తీర్థాన దేవతలున్నూ, మునులున్నూ సరస్వతికి సంబంధించిన యజ్ఞాన్ని చేశారు. ఇది దేవఋషియైన సంవర్తుడిచేత కాపాడబడేటటువంటిది. ఇక్కడ భరతుడు చాలా యజ్ఞాలు చేసి సర్వలోకాలను దివ్యదృష్టితో చూడగలిగాడు. నీవుకూడా ఇక్కడ స్నానంచేసి ఆ లోకాలను అన్నిటినీ ఒకసారి దర్శించవలసింది'- అని చెప్పగా ధర్మరాజు తనతమ్ముళ్ళతోపాటు ఆ తీర్థంలో స్నానంచేసి రోమశుడితో ఈవిధంగా చెప్పాడు.

**విశేషం:** 'పద్మ' సంఖ్య అంటే పది అర్బుదాలు. అర్బుదం అంటే పదికోట్లు, కోటి అంటే నూరులక్షలు.

**శా. 'దేవర్షిద్యుచరాహిలోకములు నాదిత్యాశ్వినీలోకముల్**
**దేవాధీశ్వరుఁ జూచితిన్; మఱియు నద్దేవేంద్రునొద్దన్ సగాం**
**డీవోద్దామమహాభుజార్గళుఁ గిరీటిన్ సవ్యసాచిన్ జయ**
**శ్రీవిభ్రాజితుఁ బార్థుఁ జూచితి జగత్సేవ్యా! మునీంద్రోత్తమా!' 222**

**ప్రతిపదార్థం:** జగత్+సేవ్యా!= లోకంచేత సేవించతగినవాడా!; ముని+ఇంద్ర+ఉత్తమా!= ఋషులలో శ్రేష్ఠులైన వారిలో మంచివాడా! దేవ+ఋషి, ద్యు, చర+అహి, లోకములున్= దేవర్షులు ఉండే లోకమున్నూ, ఆకాశంలో చరించేవారు ఉండే లోకమున్నూ, సర్పాలు నివసించే పాతాళలోకమున్నూ; ఆదిత్య+అశ్వినీ, లోకముల్= సూర్యుడిలోకం, అశ్వినులలోకమున్నూ; దేవ+అధీశ్వరున్= దేవేంద్రుడిని; చూచితిన్= దర్శించాను; మఱియు= ఇంకను; ఆ+దేవేంద్రు+ఒద్దన్= ఆ దేవేంద్రుడి దగ్గర; స, గాండీవ+ఉద్దామ, మహా, భుజ+అర్గళున్= గాండీవమనే వింటితో గూడిన గడియమ్రానుల వంటి గొప్ప భుజములు గలిగి గంభీరుడైఉన్న వాడిని; కిరీటిన్= కిరీటం గల అర్జునుడిని; సవ్యసాచిన్= కవ్వడిని; జయశ్రీ, విభ్రాజితున్= జయలక్ష్మితో శోభిల్లేవాడిని; పార్థున్= అర్జునుడిని; చూచితిన్= దర్శించాను;

**తాత్పర్యం:** 'జగత్తు అంతటిచేత ఆరాధించదగినట్టివాడా!. మునులలో శ్రేష్ఠులైన వారిలో శ్రేష్ఠుడా! ఓ రోమశమహర్షీ! నేను దేవర్షుల లోకాన్ని చూచాను; ఆకాశగమనం కల ఖేచరుల లోకాన్ని చూడకలిగాను. సర్పలోకాన్ని దర్శించాను. ఇంకా దేవేంద్రుడిని చూడగలిగాను, అక్కడ దేవేంద్రుడి దగ్గర గడియమ్రానుల వలె పొడవైన గాండీవమనే ధనువును ధరించి మిగుల గంభీరంగా తేజరిల్లుతున్న కిరీటిని, జయలక్ష్మితో శోభిల్లుతున్న పార్థుడిని, కవ్వడిని చూచాను'.

**వ. అనిన రోమశుండు వెండియు ధర్మరాజున కిట్లనియె. 223**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; రోమశుండు= రోమశుడు; వెండియు= మరల; ధర్మరాజునకు= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈవిధంగా ధర్మరాజు చెప్పగా మరల రోమశుడు ధర్మరాజుతో ఇట్లా చెప్పాడు.

**క. 'ఇది దక్షుమఖస్థానం; । బిదియు సరస్వతి యనంగ నిలఁ బరఁగు మహా**
**నది; యిందుఁ ద్రిదశతతితోఁ । ద్రిదశజ్యేష్ఠుండు సేసెఁ దివిరి మఖంబుల్. 224**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చోటు; దక్షు= దక్షుడియొక్క; మఖస్థానంబు= యజ్ఞంచేసినచోటు; ఇది= ఇది; సరస్వతి+అనంగన్= సరస్వతి అనేపేరుమీద; ఇలన్+పరఁగు= పుడమిపై ఒప్పేటటువంటి; మహానది= గొప్పనది; ఇందున్= ఈ సరస్వతి నదియొక్క గట్టుమీద; త్రిదశ, తతితోన్= దేవతల సమూహంతో; త్రిదశ, జ్యేష్ఠుండు= దేవతలకు అగ్రజుడైనవాడు- బ్రహ్మదేవుడు; తివిరి= పూనికతో; మఖంబుల్= యజ్ఞాలు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఇది దక్షుడు యజ్ఞం చేసిన స్థలం. ఇది భూలోకంలో సరస్వతి అనేపేరు కల గొప్పనది. ఈ సరస్వతీ నదీతీరాన వేల్పులలో మొదటపుట్టిన బ్రహ్మదేవుడు యజ్ఞాలు చేశాడు.

**వ. ఇది పంచయోజన ప్రమాణంబైన ప్రజాపతియజ్ఞవేది; ఇందు దేహత్యాగంబు సేసి మర్త్యు లమర్త్యత్వంబుం బొందుదురు; తొల్లి సరస్వతి నిషధదేశంబున భూమి సొచ్చి యిచ్చమసోద్భేదంబునందుఁ గానంబడియె; నిది సింధుతీర్థం; బిందు లోపాముద్ర నగస్త్యుండు ప్రతిగ్రహించె. 225**

**ప్రతిపదార్థం:** ఇది= ఈచోటు; పంచ, యోజన, ప్రమాణంబు+ఐన= అయిదు ఆమడల నిడివి కల; ప్రజాపతి, యజ్ఞ, వేది= బ్రహ్మదేవుడు యజ్ఞం చేసిన అరుగు; ఇందు= ఇక్కడ; దేహ, త్యాగంబు+చేసి= శరీరాన్ని విడిచి; మర్త్యులు= మానవులు- మరణశీలురైనవారు; న+మర్త్యత్వంబున్= చావులేని దైవభావాన్ని; పొందుదురు= సంపాదిస్తారు; తొల్లి= పూర్వకాలాన; సరస్వతి= సరస్వతీనది; నిషధ, దేశంబున= నిషధదేశంలో; భూమి+చొచ్చి= భూమిలోకి చొరబడి; ఈ+చమసోద్భేదంబునందున్= ఈ చమసోద్భేదం అనే తీర్థంలో; కానంబడియె= కనిపించింది; ఇది= ఈ స్థలం; సింధు, తీర్థంబు= సింధుతీర్థం అనేపేరు కలిగింది; ఇందు= ఇక్కడ; అగస్త్యుండు= అగస్త్య మహాముని; లోపాముద్రన్= లోపాముద్ర అనే తన ధర్మపత్నిని; ప్రతిగ్రహించెన్= పాణిగ్రహణం చేశాడు.

**తాత్పర్యం:** ఇది అయిదు ఆమడల మేర నిడివి కలిగిన వేదిక. దీనిపై పూర్వం బ్రహ్మదేవుడు యజ్ఞాన్ని చేశాడు. ఇక్కడ శరీరాన్ని విడిచిన మనుష్యులు దేవతాభావాన్ని పొందగలరు. పూర్వకాలాన సరస్వతీనది నిషధదేశంలో భూమిలోపలికి అంతర్ధానమై మళ్ళీ ఈ 'చమసోద్భేదం' అనేతీర్థంలో బయటపడింది. ఇది సింధుతీర్థం. ఇక్కడే అగస్త్యమహర్షి లోపాముద్రను తన ధర్మపత్నిగా స్వీకరించాడు.

**విశేషం:** 'చమసం' - అంటే మోదుగువంటి కర్రతో చతురస్రాకారంగా చేయబడిన యజ్ఞపు ఉపకరణం. బ్రహ్మదేవుడు యజ్ఞం చేసిన చోటగల విశాలమైన అటువంటి యజ్ఞపాత్రను భేదించుకొని సరస్వతీ నది వెలువడింది. అందువలన అచ్చటి పుణ్యతీర్థానికి 'చమసోద్భేద' మనే పేరు ఏర్పడింది.

**తే. ఇదియు విష్ణుపదంబు; దా నిది విపాశ; । యిదియుఁ గాశ్మీరమండలం; బిది వితస్త;**
**మిదియు మానసద్వార; మిం దిందువంశ! । పరశురాముండు మును హంసపథముఁ జేసె. 226**

**ప్రతిపదార్థం:** ఇదియు= ఈచోటు; విష్ణుపదంబు= విష్ణుపదం అనే పుణ్యతీర్థం; తాన్+ఇది, విపాశ= తాను ఇది విపాశ అనే పుణ్య నది; ఇదియున్= ఈక్షేత్రం; కాశ్మీర, మండలంబు= కాశ్మీరదేశం; ఇది=ఇది; వితస్తము= వితస్తం అనే పవిత్ర నది; ఇదియు= ఇదియున్నూ; మానస, ద్వారము= మానస సరస్సు యొక్క ద్వారం; ఇందు= ఇక్కడ; ఇందువంశ!= చంద్రవంశానికి చెందినవాడా, ఓధర్మరాజా!; పరశురాముండు= పరశురాముడు; మును= తొల్లి; హంసపథమున్= హంసపథం అనే క్షేత్రాన్ని; చేసెన్= నిర్మించాడు.

**తాత్పర్యం:** చంద్రవంశానికి చెందినటువంటి ధర్మరాజా! ఈ పుణ్యతీర్థానికి విష్ణుపదం అని పేరు. ఈ పుణ్యనదికి విపాశ అని పేరు. ఇది కాశ్మీర మండలం. ఈ నదికి వితస్తం అని పేరు. ఈక్షేత్రానికి మానసద్వారం అనిపేరు. దీనిని పూర్వం పరశురాముడు హంసపథంగా నిర్మించాడు.

**విశేషం:** ప్రతిపుణ్యక్షేత్రానికి, తీర్థానికి ఏదోఒక విశిష్టత చెప్పబడింది. వాటిలో ఒకటి విష్ణుపదం. భారతంలో అభివర్ణితాలైన పుణ్యక్షేత్రాలను; తీర్థాలను అన్నిటినీ నేడు గుర్తించటం కష్టం. ఆరణ్యపర్వంలోని రెండో ఆశ్వాసంలో కొన్ని పుణ్యక్షేత్రాల, తీర్థాల వర్ణన ఉన్నది. మూడో ఆశ్వాసంలోకూడా అటువంటి వర్ణన ఉన్నది. అక్కడక్కడా పునరుక్తి లేకపోలేదు. రెండో ఆశ్వాసంలో నారదమహర్షి ధర్మరాజుకు చెప్పిన పుణ్యక్షేత్రాల, తీర్థాల అభివర్ణన ఉన్నది. మూడో ఆశ్వాసంలో ధర్మరాజాదులు దర్శించిన పుణ్యక్షేత్రాల, తీర్థాలవర్ణనం ఉన్నది. విష్ణుపదం అంటే బహుశా విముక్తి కల్పించే తీర్థంగా ఏర్పడిఉంటుంది. మానససరోవరం యొక్క ద్వారం మానసద్వారం. ఇక్కడి కొండలోనే పరశు రాముడు ఈ ఆశ్రమాన్ని నిర్మించాడు. ఆ ఆశ్రమం పేరు 'హంసపథం'.

### శిబి యను రాజర్షిచరిత్రంబు రోమశుఁడు ధర్మరాజునకుఁ జెప్పుట (సం. 3-130-15)

**వ. ఇక్కొలనం జైత్రమాసంబునందు మహామునులచేతం బూజితుండై యుమాసహితుం డీశ్వరుండు వారికిం బ్రత్యక్షంబగుటయు నరుంధతీ సహితుండై వసిష్ఠుం డిందుల వసియించె; నిది భృగుతుంగం బను పర్వతం; బిందు నుశీనరపతి శిబియను వాఁడు దొల్లి యజ్ఞంబు సేయుచున్న నింద్రాగ్నులు వాని మహాగుణంబు లెఱుంగవేఁడి యింద్రుండు శ్యేనం బైన, నగ్ని కపోతంబై శ్యేనభయంబునఁ బఱతెంచి శిబిమఱువు సొచ్చిన దాని నెగిచికొని వచ్చి శ్యేనంబు శిబి కిట్లనియె. 227**

**ప్రతిపదార్థం:** ఈ+కొలనన్= మానసమనే ఈసరస్సులో; చైత్ర, మాసంబునందు= చైత్రమాసంలో; మహామునులచేతన్= గొప్పఋషులచేత; పూజితుండు+ఐ= ఆరాధించబడ్డవాడై; ఉమాసహితుండు+ఈశ్వరుండు= పార్వతీదేవితో కూడిన పరమశివుడు; వారికిన్= ఈ ఋషులకు; ప్రత్యక్షంబు+అగుటయున్= కన్పించటమున్నూ; అరుంధతీ, సహితుండు+ఐ= తన ధర్మపత్ని అయిన అరుంధతితోపాటు; వసిష్ఠుండు= వసిష్ఠమహర్షి; ఇందుల= ఇక్కడ; వసియించెన్= నివసించాడు; ఇది= ఈక్షేత్రం; భృగుతుంగంబు+అను పర్వతంబు= భృగుతుంగ మనే పేరు కల కొండ; ఇందున్= ఇక్కడ; ఉశీనరపతి= ఉశీనర దేశమునకు రాజు అయిన; శిబి+అనువాఁడు= శిబి అనేవాడు; తొల్లి= పూర్వకాలాన; యజ్ఞంబు+చేయుచున్నన్= యజ్ఞం చేస్తుండగా; ఇంద్ర+అగ్నులు= ఇంద్రుడు, అగ్నియున్నూ; వాని= అతడియొక్క; మహాగుణంబులు= గొప్పలక్షణాలు; ఎఱుంగ, వేఁడి= తెలిసికొనటానికి సంకల్పించిన వారై; ఇంద్రుండు= ఇంద్రుడు; శ్యేనంబు+ఐన= డేగ కాగా; అగ్ని= అగ్నిహోత్రుడు; కపోతంబు+ఐ= పావురంగా మారి; శ్యేన, భయంబునన్= డేగవలని భీతిచేత; పఱతెంచి= పారిపోయి వచ్చి; శిబి= శిబియొక్క; మఱువు+చొచ్చినన్= శరణును ఆశ్రయించగా; దానిన్= ఆపావురాన్ని; ఎగిచికొని, వచ్చి= వెంబడించి వచ్చి; శ్యేనంబు= డేగ; శిబికి= శిబితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఈ మానస సరోవరమందు చైత్రమాసంలో మహర్షులచేత ఆరాధించబడి, పార్వతీదేవితో కూడి పరమేశ్వరుడు వారికి దర్శనాన్ని అనుగ్రహించాడు. అందువలన ఇక్కడ అరుంధతీదేవితోపాటు వసిష్ఠమహర్షి నివసించాడు. ఇది భృగుతుంగ పర్వత శిఖరం. ఇక్కడ ఉశీనరపతి శిబిచక్రవర్తి పూర్వకాలంలో యజ్ఞం చేశాడు. అప్పుడు ఆ మహానుభావుడి గుణగణాలు పరీక్షించతలచారు ఇంద్రాగ్నులు. ఇంద్రుడు డేగరూపం ధరించాడు. అగ్ని

పావురంగా మారాడు.డేగవలని భీతితో పావురం పరుగెత్తుకొనివచ్చి శిబిచక్రవర్తిని శరణు వేడింది. డేగ పావురాన్ని వెంటాడుతూ వచ్చి శిబితో ఇట్లా పలికింది.

**ఆ. 'నిన్ను సత్యధర్మనిర్మలుఁగా విందు; । నట్టి నీకుఁ బాడియయ్య యిప్పు**
**డతిబుభుక్షితుండనై యున్న నాకు నా । హారవిఘ్న మిట్టు లాచరింప? 228**

**ప్రతిపదార్థం:** నిన్నుఁ= ఓ శిబిచక్రవర్తీ, నిన్ను; సత్య, ధర్మ, నిర్మలున్+కాన్= సత్యాన్ని, ధర్మాన్ని అనుష్ఠించడం వలన కళంకం లేనటువంటి వాడినిగా; విందున్= వింటుంటాను; అట్టి, నీకున్= అటువంటి కీర్తికల నీకు; ఇప్పుడు= ఇప్పుడు; అతి బుభుక్షితుండను+ఐ+ఉన్న= మిక్కిలి ఆకలితో అల్లాడుతున్న; నాకున్= నాకు; ఆహార, విఘ్నము= తిండికి ఆటంకం; ఇట్టులు= ఈ విధంగా; ఆచరింప= ఆచరించటం, (వర్తిల్లచేయటం); పాడి+అయ్య?= న్యాయమా?

**తాత్పర్యం:** 'అయ్యా! శిబిచక్రవర్తీ! నీవు సత్యాన్ని, ధర్మాన్ని ఆచరించటం చేత నిష్కళంకమైన వాడివని వినిఉన్నాను. ఇప్పుడు నేను మిక్కిలి ఆకలితో ఉండగా నాకు ఆహారవిఘ్నం చేయటం నీకు న్యాయమా?

**వ. సర్వభూతంబులు నాహారంబున జీవించి వర్ధిల్లు; నిది నాకు భక్ష్యంబు గానినాఁడు బుభుక్షావేదనం జేసి ప్రాణ వియోగం బగు; నట్లయిన నా పుత్త్రులు భార్యయు జీవింపనేర; రొక్కకపోతంబు రక్షించి పెక్కు జీవులకు హింస సేయుట ధర్మవిరోధంబు. 229**

**ప్రతిపదార్థం:** సర్వభూతంబులున్= అన్ని ప్రాణులున్నూ; ఆహారంబునన్= తిండివలన; జీవించి= బ్రతికి; వర్ధిల్లున్= వృద్ధిచెందుతాయి; ఇది= ఈ పావురం; నాకున్= నాకు; భక్ష్యంబు+కానినాఁడు= ఆహారం కాకపోయినట్లైతే; బుభుక్షా, వేదనన్+చేసి= ఆకలిబాధచేత; ప్రాణ, వియోగంబు+అగున్= ప్రాణాలు పోగలవు; అట్లు+అయిన= ఆవిధంగా జరిగితే; నా, పుత్త్రులు= నా బిడ్డలు; భార్యయు= భార్యయున్నూ; జీవింపనేరరు= జీవించలేరు; ఒక్క, కపోతంబు= ఒక పావురాన్ని; రక్షించి= కాపాడి; పెక్కు, జీవులకున్= అనేక ప్రాణులను; హింస+చేయుట= హింసించటం, (బాధ కలిగించటం); ధర్మవిరోధంబు= ధర్మానికి వ్యతిరేకం.

**తాత్పర్యం:** సకలప్రాణులు ఆహారం మూలంగానే బ్రతికి పెంపొందుతాయి. ఈ పావురం నాకు ఆహారం కానినాడు నాప్రాణాలు నిలువవు. అట్లా జరిగితే నా సంతానం, నాభార్య బ్రతుకలేరు. ఒక్క పావురాన్ని నీవు కాపాడి ఇన్ని ప్రాణులను హింసించటం ధర్మానికి వ్యతిరేకం కదా!

**క. ధర్మజ్ఞు లైన పురుషులు । ధర్మువునకు బాధ సేయు ధర్మువునైనన్**
**ధర్మముగా మదిఁ దలఁపరు; । ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్. 230**

**ప్రతిపదార్థం:** ధర్మజ్ఞులు+ఐన పురుషులు= ధర్మాన్ని తెలిసినటువంటివారు; ధర్మువునకు= ధర్మానికి; బాధ+చేయు= ఉపహతి కల్పించే- అంటే హాని కలిగించే; ధర్మువును+ఐనన్= ధర్మాన్నిసైతం; ధర్మముగా= ధర్మమైనదిగా; మదిన్= మనస్సులో; తలఁపరు= ఎంచరు; ధర్మువు= ధర్మం అనేది; సర్వంబునకు= సమస్తమైన వాటికీ; హితంబుగ= మేలు చేకూర్చేదిగా; వలయున్= ఉండాలి.

**తాత్పర్యం:** ధర్మస్వరూపాన్ని ఎరిగిన జ్ఞానులు ధర్మానికి కీడు కలిగించే ధర్మాన్నైనా, ధర్మంగా మనస్సులో భావించరు. అచ్చమైన ధర్మం, జగత్తు కంతటికీ మేలు చేకూర్చాలి.

**విశేషం:** మహాభారతం పంచమవేదం. మహాభారతంలో చాలాచోట్ల ధర్మంపై చర్చలు కొనసాగాయి. ధర్మస్వరూప నిరూపణకు, ధర్మసూక్ష్మ వివరణకు మహాభారతంలో పేర్కొనదగినవి, ముఖ్యమైనవి రెండు ఉపాఖ్యానాలు ఉన్నాయి. (1) ధర్మవ్యాధోపాఖ్యానం (2) శిబి గాథ. 'అహింసా పరమో ధర్మః' అన్న అహింసా నిర్వచనంలో ధర్మసూక్ష్మాన్ని అరయవలసి ఉన్నది. బౌద్ధమతానికి 'అహింసా పరమో ధర్మః' అన్నది జీవనాడి. పరోపకారార్థం తమ శరీరాలను అర్పించి 'పరోపకారార్థ మిదం శరీరమ్' అన్న వాక్యానికి జీవదుదాహరణాలు బౌద్ధవాఙ్మయం ప్రపంచించిన బోధిసత్త్వులు, శిబి, జీమూత వాహనుడు మొదలైన మహనీయులు. ఈ పద్యం ధర్మసూక్ష్మానికి జీవనాడి విశ్వశ్రేయం అని ప్రతిపాదిస్తున్నది. ఏది ధర్మం? రెండు ధర్మాలు విప్రతిపన్నాలైనవి ఉన్నట్లైతే పరమధర్మ మేది? ఇక్కడ డేగ ఈప్రశ్ననే శిబికి వేసింది. పావురాన్ని కాపాడటం ధర్మంగా నీవు భావిస్తే, నా ఆహారం మాట ఏమవుతుంది? అని శిబిని డేగ సూటిగా అడిగింది. 'ఒక ధర్మానికి హాని కలిగించే మరొక ధర్మం విశ్వజనీనం కాలేదు. అది ఆభాస ధర్మమే కాని పరమధర్మం కాదు' అని ఈపద్యంలో డేగ ప్రతిపాదించింది. అంతేకాక - ఈ పద్యంతోపాటు తరువాతి గద్యాన్నికూడ అనుసంధించాల్సిఉంది ఈ ధర్మసూక్ష్మచర్చలో.

**వ. ఇక్కపోతంబు నాకు వేదవిహితంబైన యాహారంబు; 'శ్యేనాః కపోతాన్ ఖాదయన్తి' యను వేదవచనంబు గలదు గావున దీని నాకు నాహారంబుగా ని' మ్మనిన దానికి శిబి యిట్లనియె. 231**

**ప్రతిపదార్థం:** ఈ+కపోతంబు= ఈ పావురం; నాకున్= నాకు; వేద, విహితంబు+ఐన+ఆహారంబు= వేదాలచేత నిర్దేశించబడిన ఆహారం; శ్యేనాః= డేగలు; కపోతాన్= పావురాలను; ఖాదయన్తి= తింటాయి; అను= అనే; వేద వచనంబు= వేదవాక్యం; కలదు= ఉన్నది; కావున= కాబట్టి; దీని= ఈ పావురాన్ని; నాకున్= నాకు; ఆహారంబుగాన్= ఆహారంగా; ఇమ్ము= ఇవ్వవలసింది; అనిన= అని చెప్పగా; దానికి= ఆ డేగకు; శిబి= శిబి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా తెలిపాడు.

**తాత్పర్యం:** ఈపావురం నాకు వేదాలచేత విధించబడిన ఆహారం. డేగలు పావురాలను భక్షిస్తాయి- అనే వేదవాక్యం ఉన్నదికదా! కాబట్టి ఈ పావురాన్ని నాకు ఆహారంగా నీవు వదలాలి'- అని డేగ పలుకగా దానికి శిబి ఈవిధంగా బదులు పలికాడు.

**విశేషం:** డేగలకు పావురాలు ప్రకృతిసిద్ధాలైన ఆహారంకదా. ఇక 'అహింసా పరమో ధర్మః' అన్నది ఎట్లా చెల్లుతుంది? ఇంద్రుడు, అగ్ని గొప్ప పరీక్షనే తెచ్చిపెట్టారు. పంచమవేదం ఈ పరీక్షకు ఎటువంటి పరిష్కారం చూపించింది?

**తే. 'ప్రాణభయమున వచ్చి యిప్పక్షి నన్ను । నాశ్రయించె; నాశ్రితు నెట్టి యధముఁ డయిన
విడువఁ డనినను నే నెట్లు విడుతు దీని? । నాశ్రితత్యాగ మిది ధర్మ వగునె? చెపుమ. 232**

**ప్రతిపదార్థం:** ప్రాణభయమున= ప్రాణాలవలని (ప్రాణాలు పోతాయి) అనే భయంచేత; వచ్చి= వచ్చి; ఈ+పక్షి= ఈపులుగు; నన్నున్= నన్ను; ఆశ్రయించెన్= రక్షించే ఆధారంగా గైకొన్నది; ఆశ్రితున్= తన రక్షణను వేడి ఉన్నవాడిని; ఎట్టి+ అధముఁడు+అయినన్= ఎంతటి నీచుడయినా; విడువడు= విడువడు; అనినను= అన్నాకూడ, అన్ననూ, ఏను= నేను; ఎట్లు= ఎట్లా, ఏవిధంగా; దీనిన్= ఈపక్షిని; విడుతు= విడవగలను; ఆశ్రిత, త్యాగము= ఆశ్రయించినవారిని విడిచిపెట్టటం; ఇది= ఇది; ధర్మువు+అగునె?= ధర్మం కాగలదా? చెపుము+అ= చెప్పవలసింది.

**తాత్పర్యం:** 'ఈపావురం ప్రాణభయంతో వచ్చి నన్ను ఆశ్రయించింది. ఆశ్రయించినవారిని ఎటువంటి నీచుడైనా విడువలేడు కదా! ఇక నేను ఎట్లా నన్ను ఆశ్రయించిన పావురాన్ని విడిచిపెట్టగలను? ఆశ్రితులను విడవటం ధర్మం కాగలదా? నీవే చెప్పుము.

**వ. నీవు పక్షివయ్యును ధర్మ మెఱింగినట్లు పలికితి; శరణాగత పరిత్యాగంబుకంటె మిక్కిలి యధర్మం బొం డెద్ది? నీయాఁకలి దీననకాని యొంట నుపశమింపదే? నీయత్నం బాహారార్థంబేని యిప్డు డివ్వనంబున మృగ మహిషవరాహఖగ మాంసంబులు దీనికంటె మిక్కిలిగాఁ బెట్టెద; నిక్కపోతంబువలని యాగ్రహం బుడుగుము; దీని నే నెట్లును విడువ' ననిన శ్యేనం బిట్లనియె. 233**

**ప్రతిపదార్థం:** నీవు=నీవు (ఓ డేగా); పక్షివి+అయ్యును= పక్షివి అయినప్పటికిన్నీ; ధర్మము+ఎఱింగినట్లు= ధర్మం తెలిసినట్లుగా; పలికితి(వి)= మాట్లాడావు; శరణ+ఆగత, పరిత్యాగంబుకంటె= శరణానికై - అంటే కాపాడుమని అర్థిస్తూ - వచ్చినవారిని విడనాడటం కంటె; మిక్కిలి+అధర్మంబు= అధికమైన అధర్మం; ఒండు+ఎద్ది= వేరొకటి= ఏది ఉన్నది?; నీ+ఆఁకలి= నీ బుభుక్ష; దీననకాని= ఈ పావురాన్ని భక్షించటంవలనకాని; ఒంటన్= వేరొక మార్గాన; ఉపశమింపదే?= ఉడుగదా?; నీ యత్నంబు= నీపూనిక; ఆహార+అర్థంబు+ఏని= తిండికోసమే అయినట్లైతే; ఇప్డు= ఇపుడు; ఈ+వనంబునన్= ఈ వనంలో; మృగ, మహిష, వరాహ, ఖగ, మాంసంబులు= లేళ్ళయొక్క, దున్నలయొక్క, పందులయొక్క మాంసాలు; దీనికంటె= ఈ పావురంకంటె; మిక్కిలిగాన్= అధికంగా; పెట్టెదన్= సమకూరుస్తాను; ఈ+కపోతంబు వలని+ఆగ్రహంబు= ఈ పావురంమీద నీకు గల కోపాన్ని; ఉడుగుము= మానుకొమ్ము; దీనిన్= ఈ పావురాన్ని; ఏను+ఎట్లును, విడువను= నేను ఏరీతిగానైనా విడువలేను; అనినన్= అని చెప్పగా; శ్యేనంబు= డేగ; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పింది.

**తాత్పర్యం:** నీవు పక్షివి అయినాకూడా ధర్మం తెలిసినట్లుగా మాట్లాడుతున్నావు. ఆశ్రయం కోరి వచ్చిన వారిని విడువటం కన్నా అధికమైన అధర్మం ఉన్నదా? నీ ఆకలి ఈ పావురాన్ని తింటేకాని తీరదా? నీ ప్రయత్నం కేవలం నీ పొట్టపోసుకొని ఆకలి తీర్చుకొనటానికే అయితే ఇప్పుడు ఈ అడవిలో ఎన్ని జంతువులు లేవు? లేళ్ళు, దున్నలు, పందులు, పక్షులు, వీటి మాంసాలను ఈ పక్షికంటె అధికంగా నీకు సమకూర్చగలను. ఈ పావురంమీద ఆగ్రహాన్ని విడిచిపెట్టుము. నేను ఎట్లా అయినా కూడా, ఈ పక్షిని విడవను సుమా!'- అని శిబి పలుకగా, డేగ అతడితో ఇట్లా బదులు పలికింది.

**ఆ. 'నాకు విహితభక్షణం బిది; యిప్పక్షిఁ । బూని కావ నీకు బుద్ధియేని**
**యవనినాథ! దీనియంత నీ మాంసంబు । దూఁచి నాకుఁ బెట్టు తొలఁగ కిపుడ.' 234**

**ప్రతిపదార్థం:** ఇది, నాకు, విహిత, భక్షణంబు= ఈ పక్షి నాకు ప్రకృతిచేత నిర్ణీతమైన ఆహారం; ఈ+పక్షిన్= ఈ పిట్టను; పూని కడగి; కావ= రక్షించాలని; నీకు, బుద్ధి+ఏని= నీకు ఆలోచన కలిగినట్లైతే; అవనినాథ!= పుడమికి భర్తవైన ఓరాజా!; దీని+అంత= దీనితో సరితూగే; నీ మాంసంబు= నీ శరీరంలోని మాంసం; తూఁచి= సరితూచి; నాకున్= నాకు; తొలఁగక= మానక; ఇపుడు+అ= ఇప్పుడే; పెట్టు= సమకూర్చుము.

**తాత్పర్యం:** 'ఓ మహారాజా! ఈ పావురం నాకు ప్రకృతి సహజంగా ఏర్పడిన ఆహారం. ఈ పక్షిని రక్షించాలనే అభిప్రాయం నీకు కలిగినట్లైతే దీని బరువుతో సరిసమానమైన తూకం కల నీ శరీరమాంసం ఇపుడు వెనుదీయక నాకు ఇమ్ము.'

**చ. అనిన 'ననుగ్రహించితి మహావిహగోత్తమ!' యంచు సంతసం**
**బున శిబి తత్క్షణంబ యసిపుత్త్రిక నాత్మశరీరకర్తనం**

**బనఘుఁడు సేసిచేసి తన యంగమునం గల మాంసమెల్లఁ బె**
**ట్టినను గపోతభాగమ కడిందిగ డిందుచు నుండె నత్తులన్. 235**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అనుగ్రహించితి= దయచూపినావు; మహత్+విహగ+ఉత్తమ!= గొప్పపక్షులలో శ్రేష్ఠమైనదానా! ఓ డేగా!; అంచు= అని అంటూ; అనఘుఁడు= పాప రహితుడు; శిబి= శిబి చక్రవర్తి; సంతసంబున= సంతోషంతో; తద్+క్షణంబు+అ= ఆ క్షణమే; అసి పుత్రికన్= చిరుకత్తితో; ఆత్మ, శరీర, కర్తనంబు, చేసి, చేసి= తన శరీరాన్ని కోసి కోసి; తన+అంగమునన్= తన దేహంలో; కల= ఉన్న; మాంసము+ఎల్లన్= మాంసమంతటినీ; పెట్టినను= సమర్పించిననూ; ఆ+తులన్= ఆ త్రాసులో; కపోత భాగము+అ= పావురం ఉన్న పక్షమే; కడిందిగ= మిక్కిలిగా; డిందుచున్+ఉండెన్= దిగిపోతూ ఉన్నది.

**తాత్పర్యం:** అని డేగ పలుకగా సంతోషించి శిబిచక్రవర్తి 'పక్షులలో కెల్ల నీవు ఉత్తమపక్షివి. నీవు నా పై దయచూపావు' అని చెప్పి తత్క్షణమే చిరుకత్తితో తన శరీరంలోని మాంసాన్ని కోసి తరాజుతో తూకం వేయసాగాడు. కాని, అతడి దేహంలోని మాంసం అంతా సమర్పించినాకూడా, ఆ తులాభారంలో పావురం ఉన్నభాగమే క్రిందికి దిగుతున్నది.

**క. దానికి నచ్చెరువడి ధర । ణీనాథుఁడు తనువునందు నెత్తురు దొరుఁగం**
**దాన తుల యెక్కెఁ నంతన్ । వాని గుణోన్నతికి మెచ్చి వాసవదహనుల్. 236**

**ప్రతిపదార్థం:** దానికిన్= తనశరీరంలోని మాంసాన్ని ఎంత కోసివేసినా ఆపావురం బరువుతో సరితూగకపోవటానికి; ధరణీ నాథుఁడు= భూభర్త అయిన శిబి; అచ్చెరువు+పడి= ఆశ్చర్యపడి; తనువునందు= దేహమందు; నెత్తురు+తొరుఁగన్= రక్తం కారగా; తాను+అ= తానే; తుల+ఎక్కెన్= త్రాసులోకి ఎక్కాడు; అంతన్= అంతట; వాసవ, దహనుల్= ఇంద్రుడున్నూ, అగ్నియున్నూ; వాని, గుణ+ఉన్నతికి= ఆ శిబిచక్రవర్తి గొప్పగుణాలకు; మెచ్చి;

**తాత్పర్యం:** తన శరీరంలోని మాంసం ఎంతకోసి తులలో వేసినప్పటికీ, ఆ పావురంబరువుకు సరితూగక పోవటంచేత ఆశ్చర్యపడి శిబిచక్రవర్తి తానే తక్కెడలో ఎక్కాడు. అతడి ఆత్మార్పణపూర్వకమైన త్యాగానికి, గొప్పగుణానికి ఇంద్రుడు, అగ్నిహోత్రుడు అభినందించి.

**వ. శ్యేనకపోత రూపంబులు విడిచి నిజరూపంబులఁ జూపి 'నీ ధైర్య శౌర్యాది గుణంబు లనన్యసాధారణంబులు గావున నీకీర్తి నిత్యంబై శబ్ద బ్రహ్మంబు గలయంత కాలంబును వర్తిల్లుచు నుండెడు' మని శిబికి వరం బిచ్చి యింద్రాగ్నులు చని; రిది యమ్మహాపురుషు పుణ్యస్థానంబు; మఱియు ననవరత ఫలవృక్షంబులు గల యిది యౌద్దాలకియైన శ్వేతకేతు తపోవనం; బిందు సరస్వతి మనుష్య స్త్రీరూపధారిణియై శ్వేతకేతుని సేవించె; మాతుల భాగినేయులైన యష్టావక్రశ్వేతకేతు లిందు యుగ్రతపంబుఁజేసి' రనిన 'నం దష్టావక్రు మాహాత్మ్యంబు విన వలతు' నని యడిగిన, యుధిష్ఠిరునకు రోమశుం డిట్లనియెఁ; 'దొల్లి యేకపాదుం డనుమునివరుండు తనవిద్యావిభవంబున సుజాత యను దాని వివాహంబై వనంబున ఘోరతపంబు చేయుచు ననవరతంబును శిష్యుల వేదంబులు చదివించుచున్నఁ బెద్దకాలంబునకు సుజాత గర్భిణియైనఁ దద్గర్భంబున నున్న యర్భకుం డొక్కనాఁడు తండ్రి కిట్లనియె. 237**

**ప్రతిపదార్థం:** శ్యేన, కపోత, రూపంబులు= డేగ, పావురాలయొక్క ఆకారాలు; విడిచి= వదలి; నిజ, రూపంబులన్+చూపి= తమ అసలు ఆకారాలను ప్రదర్శించి; నీ ధైర్య, శౌర్య+ఆదిగుణంబులు= నీయొక్క తెగువ, పరాక్రమం మొదలైన గొప్పలక్షణాలు; అనన్య సాధారణంబులు= ఇతరులలో ఉన్నట్టివి కావు; కావునన్= కాబట్టి; నీ, కీర్తి= నీకీర్తి; శబ్ద, బ్రహ్మంబు, కల+అంతకాలంబును= శబ్దబ్రహ్మం ఉండేటంతకాలమున్నూ; వర్తిల్లుచున్+ఉండెడు+అని= వ్యాపించి ఉంటుంది అని; వరంబు+ఇచ్చి= వరాన్ని అనుగ్రహించి; ఇంద్ర+అగ్నులు= ఇంద్రుడున్నూ, అగ్నియున్నూ; చనిరి= వెళ్ళారు; ఇది= ఈ స్థలం; ఆ+మహాపురుషు= ఆ మహానుభావుడియొక్క; పుణ్య, స్థానంబు= పుణ్యక్షేత్రం; మఱియు= ఇంకనూ; అనవరత, ఫల, వృక్షంబులు కల= ఎల్లప్పుడు కాస్తున్న పండ్ల చెట్లున్న; ఇది= ఈ స్థలం; ఔద్దాలకి+ఐన= ఉద్దాలక సుతుడైన; శ్వేతకేతు, తపస్+వనంబు= శ్వేతకేతుడు తపస్సు చేసిన వనం; ఇందు= ఇక్కడ; సరస్వతి= సరస్వతి; మనుష్య, స్త్రీ రూపధారిణి+ఐ= మానవస్త్రీ రూపం ధరించి; శ్వేతకేతుని, సేవించె= శ్వేతకేతు మహర్షికి పరిచర్య చేసింది; మాతుల భాగినేయులు+ఐన= మేనమామ చెల్లెలి కొడుకులు అయిన, (మేనమామ, మేనల్లుండ్రయిన); అష్టావక్ర శ్వేతకేతులు= అష్టావక్రుడున్నూ, శ్వేతకేతుడున్నూ; ఇందు+అ= ఇక్కడే; ఉగ్ర, తపంబున్+చేసిరి= ఘోరమైన తపస్సును చేశారు; అనినన్= అని చెప్పగా; అందు= అందులో; అష్టావక్రు మాహాత్మ్యంబు= అష్టావక్రుడి మహిమను; విన వలతున్= ఆలకించ గోరుతున్నాను; అని= అంటూ; అడిగిన= కోరగా; యుధిష్ఠిరునకున్= ధర్మరాజుకు; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు; తొల్లి= పూర్వకాలాన; ఏకపాదుండు= ఏకపాదుడు అనే పేరు కలిగిన; మునివరుండు= ఋషిశ్రేష్ఠుడు; తన, విద్యా, విభవంబున= తన చదువుయొక్క గొప్పతనంచేత; సుజాత+అనుదాని= సుజాత అనేపేరు కల వధువును; వివాహంబు+ఐ= పెళ్ళాడి; వనంబున= అడవిలో; ఘోర, తపంబు చేయుచున్= కఠోరమైన తపస్సుచేస్తూ; అనవరతంబును= ఎల్లప్పుడున్నూ; శిష్యులన్= తనదగ్గర చదువుకొనే విద్యార్థులచేత; వేదంబులు, చదివించుచున్నన్= వేదాలను వల్లెవేయిస్తుండగా; పెద్దకాలంబునకున్= చాలాకాలానికి; సుజాత= సుజాత; గర్భిణి+ఐనన్= కడుపుతో ఉండగా; తద్+గర్భంబునన్= ఆమె కడుపులో; ఉన్న= ఉన్నటువంటి; అర్భకుండు= శిశువు; ఒక్కనాఁడు= ఒక్కరోజు; తండ్రికి= తండ్రికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** డేగ, పావురం తమరూపాలు వదలివేశాయి. అప్పుడు ఇంద్రుడు అగ్నిహోత్రుడు నిజరూపాలతో ప్రత్యక్షమై శిబిచక్రవర్తితో 'మహానుభావా! నీత్యాగం, ధైర్యం, శౌర్యం మొదలైన గుణాలు మరి ఎవ్వరిలో కనిపించవు. నీకీర్తి మానవులు శబ్దబ్రహ్మన్ని ఉపాసిస్తుండేంతవరకు విలసిల్లుతుంటుంది' అని అతడిని అభినందించి, వరమిచ్చి అతడిని వీడుకొలిపి వెళ్ళిపోయారు. ఇది ఆ మహాపురుషుడి క్షేత్రం. ఎప్పుడూ పండ్లతో శోభిల్లే ఈతోట ఉద్దాలకుడి కుమారుడైన శ్వేతకేతు తపోవనం. ఇక్కడ సరస్వతి మానవస్వరూపం ధరించి శ్వేతకేతుడికి సేవచేసింది. శ్వేతకేతుడున్నూ అష్టావక్రుడున్నూ మేనమామ, మేనల్లుళ్ళు. వారిరువురు ఇక్కడ ఉగ్రతపస్సు చేశారు.- అని రోమశుడు చెప్పగా ధర్మరాజు 'అష్టావక్రుడి మాహాత్మ్యం వినగోరుతున్నా'నన్నాడు. అందుకు రోమశుడు ఇట్లా వివరించాడు: 'ఏకపాదుడనే మునివరుడు మహావిద్వాంసుడు. అతడు సుజాత అనే ఆమెను పెళ్ళాడాడు. శిష్యులచేత నిరంతరం వేదాధ్యయనం, విద్యాభ్యాసం చేయిస్తూ ఉండగా భార్య అయిన సుజాత గర్భవతి అయింది. ఒకనాడు గర్భంలో ఉన్న శిశువు తండ్రితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** శిబి చక్రవర్తి కీర్తి శబ్దబ్రహ్మం ఉండేంతకాలం విస్తరిస్తుందని ఇంద్రాగ్నుల ప్రవచనం. శబ్దం అక్షర సమామ్నాయంగా రూపొంది, సారస్వత ప్రతిపత్తిని ఆర్జించి, చిరకాలం మనగలగటం అందరికీ తెలిసిన విషయమే. శబ్దము = అక్షరము = నశించనిది. అంతేకాక, శిబిత్యాగం లోకోత్తరమైనది. శిబి కథ సనాతన వైదిక సారస్వతంలో మాత్రమే గాక, బౌద్ధ, జైన

గాథలలో కూడ సుప్రసిద్ధమైనది. ఇతివృత్త గౌరవం గల శిబి చక్రవర్తి గాథ శబ్ద బ్రహ్మోపాసకులు- సాహితీవేత్తలు విడువలేనట్టిది. ఆ మాటనే ఇంద్రాగ్నులు వరంగా ప్రసాదించినట్లు మహాభారతకథనం.

### రోమశుఁడు ధర్మరాజునకు నష్టావక్రు చరితంబు సెప్పుట (సం. 3-132-8)

**క. 'ఎడఁబడక యహోరాత్రులు । వడిఁగొని చదివింప నిట్లు వలయునె శిష్యుల్**
**గడు నిద్రలేమి నెంతయు । జడమతులై చదువు దప్పఁ జదువుచు నుండన్.' 238**

**ప్రతిపదార్థం:** శిష్యుల్= విద్యార్థులు; కడు, నిద్ర, లేమిన్= బొత్తిగా నిద్రలేకపోవటంచేత; ఎంతయున్= ఎంతో, చాలా; జడ, మతులు+ఐ= మందబుద్ధులై; చదువున్= విద్యను, తప్పన్+చదువుచున్+ఉండన్= తప్పులుగా చదువుతుండగా; ఎడఁబడక= తీరిక లేకుండా నిరంతరం; అహస్+రాత్రులు= అహోరాత్రులు-పగళ్ళున్నూ రాత్రులున్నూ; వడిన్+కొని= వేగంగా; ఇట్లు= ఈ రీతిగా; చదివింపన్, వలయునె= చదువులోనే నిమగ్నులై ఉండేటట్లు చేయటమెందుకు.

**తాత్పర్యం:** నీ శిష్యులు పగలనక, రేయనక ఎడతెరపిలేకుండా విద్యాభ్యాసం చేయటంచేత వారు మందబుద్ధులవుతూ నిద్ర లేకపోవటంచేత వేదపాఠాలను తప్పుగా చదువుతున్నారు. ఈవిధంగా తప్పులు చదివించటం ఎందుకు?'

**వ. అని యుపాలంభించి పలికిన నలిగి యేకపాదుండు 'నీ వధ్యయనంబునకు వక్రంబుగాఁ బలికితివి గావున నెనిమిదివంకలు గల శరీరంబుతో జన్మింపు' మని కొడుకునకు శాపం బిచ్చిన. 239**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; ఉపాలంభించి= తెగడుతూ; పలికినన్= మాట్లాడగా; అలిగి= ఆగ్రహించి; ఏకపాదుండు= ఏకపాదుడు; నీవు; అధ్యయనంబునకు= వేద పఠనమునకు; వక్రంబుగాన్= వంకరగా; పలికితివి= మాట్లాడావు; కావునన్= కాబట్టి; ఎనిమిది, వంకలు+కల= ఎనిమిది వంకరలు కల; శరీరంబుతో= దేహంతో; జన్మింపుము= పుట్టుము; అని= అని; కొడుకునకు; శాపంబు+ఇచ్చినన్= శాపం ఇవ్వగా.

**తాత్పర్యం:** అని నిందించిన గర్భస్థశిశువుమీద ఆగ్రహించి తండ్రి అయిన ఏకపాదుడు 'నీవు వేదాధ్యయనాన్ని వక్రంగా విమర్శించావు కాబట్టి అష్టావక్రుడివై పుట్టుము' అని శపించాడు.

**ఆ. అగ్నికల్పుఁడై మహాత్ముఁడు కడుపునఁ । బెరుఁగుచుండె; నంత సరసిజాక్షి**
**ప్రసవకాల మైనఁ బతి కొక్కనాఁ డిట్టు । లనియెఁ బ్రసవభారమునకు వెఱచి. 240**

**ప్రతిపదార్థం:** అగ్ని కల్పుఁడు+ఐ= నిప్పుతో సమానుడై; మహాత్ముడు= మహానుభావుడు; కడుపునన్= గర్భంలో; పెరుఁగు చుండెన్= వృద్ధి చెందుతున్నాడు; అంత= అంతట; సరసిజ+అక్షి= పద్మాలవంటి కన్నులు కలది- సుజాత; ప్రసవ, కాలము+ఐనన్= పురుడు వచ్చేసమయం సమీపించగానే; ప్రసవ, భారమునకు= పురిటిబరువుకు; వెఱచి= భయపడి; పతికి= భర్తకు; ఒక్క నాఁడు= ఒకరోజు, ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** సుజాత కడుపులో నిప్పుతో సమానుడైన మహానుభావుడు పెరుగుతున్నాడు. అంత, పద్మాలవంటి కన్నులుగల ఆ సుజాత ప్రసవసమయం సమీపించటం గమనించి, ప్రసవభారాన్ని తలచుకొని భయపడి, భర్తతో ఒకరోజు ఈవిధంగా అన్నది.

**క. 'ధరణిఁ గడుఁ బేదవారును । బురిటికి ఘృత తైల ధాన్యములఁ జెచ్చెర ముం**
**దర సంగ్రహింతు; రవి మన । కరయఁగ నతిదుర్లభంబు లర్థము లేమిన్. 241**

**ప్రతిపదార్థం:** ధరణిన్= భూమిపై; కడున్= మిక్కిలి; పేదవారును= దరిద్రులు కూడ; పురిటికి= ప్రసవానికి; ఘృత, తైల, ధాన్యములన్= నేయి, నూనె, తిండిగింజలను; చెచ్చెర= త్వరగా; ముందర= ముందుగానే; సంగ్రహింతురు= తెచ్చిపెట్టుకొంటారు; అవి= అవి, ఆ ఘృతతైల ధాన్యాదులు; అరయఁగన్= ఆలోచించి చూస్తే; మనకు= మనకు; అర్థము, లేమిన్= ధనం లేకపోవటంచేత; అతి, దుర్లభములు= సాధించటానికి మిక్కిలి కష్టమైనవి.

**తాత్పర్యం:** 'భూమిమీద మిక్కిలి నిరుపేదలు కూడ పురిటిసమయానికి ముందే వేగంగా నేయి, నూనె, తిండిగింజలు తెచ్చిపెట్టుకుంటారు. మనం ధనం లేనివారం కాబట్టి మనకు అవి సులభంగా దొరికేవి కావు.

**వ. ఏమి 'సేయుదు? నెవ్విధంబున నీప్రసవక్లేశంబువలనఁ బాయుదు?' ననిన నేకపాదుండు ధనార్థియయి జనకరాజుపాలికిం జని వాని యజ్ఞంబునందు వరుణపుత్త్రుండైన వందితో వివాదంబు సేసి యోటువడి జలమగ్నుండై యున్న, నిట సుజాత ప్రసూతియై యష్టావక్రుం గనియెఁ; దత్కాలంబున నుద్దాలకుభార్య శ్వేతకేతుం గనియె; నిట్లు మాతులభాగినేయు లిద్దఱు సవయస్కులై పెరిఁగి పండ్రెండేండ్లొక్కట నుద్దాలకుతోఁ జదివి యధ్యయనశూరులై రందు. 242**

**ప్రతిపదార్థం:** ఏమి+చేయుదున్?= ఏమి చేయగలను?; ఏ+విధంబునన్= ఏరీతిగా; ఈప్రసవ, క్లేశంబు వలనన్= ఈ పురిటి బాధలు; పాయుదున్?= తొలగించుకుంటాను?; అనినన్= అని చెప్పగా; ఏకపాదుండు= ఏకపాదుడు; ధన+అర్థి+అయి= ధనాన్ని ఆశించినవాడై; జనక, రాజు, పాలికిన్+చని= జనకప్రభువు దగ్గరకు వెళ్ళి; వాని, యజ్ఞంబునందు= ఆ జనకుడు చేస్తున్న యాగంలో; వరుణ, పుత్త్రుండు+ఐన= వరుణుడి కొడుకైన; వందితో= వంది అనేవాడితో; వివాదంబు+చేసి= చర్చించి; ఓటు+పడి= పరాజయమంది; జల, మగ్నుండు+ఐ= జలంలో మునిగి దాగినవాడై; ఉన్నన్= ఉండగా; ఇట= ఇక్కడ; సుజాత= సుజాత; ప్రసూతి+ఐ= పురిటి ఇల్లాలై; అష్టావక్రున్= అష్టావక్రుడిని; కనియెన్= ప్రసవించింది; తద్+కాలంబునన్= ఆ సమయంలో; ఉద్దాలకు, భార్య= ఉద్దాలకుడి పత్ని; శ్వేతకేతున్= శ్వేతకేతుడిని; కనియెన్= ప్రసవించింది; ఇట్లు= ఇట్లా; మాతుల భాగినేయులు+ఇరువురు= మేనమామ మేనల్లుండ్లిరివురూ; సవయస్కులు+ఐ= ఒకే వయస్సు కలవారై; పెరిఁగి= పెరిగి; పండ్రెండు+ఏండ్లు= పన్నెండేళ్ల కాలం; ఒక్కఁటన్= ఒకచోట; కలసిమెలసి; ఉద్దాలకుతోన్ చదివి= ఉద్దాలకుడి దగ్గర దీక్షతో విద్యలను అభ్యసించి; అధ్యయనశూరులు+ఐరి= చదువులో శౌర్యం కలవారు అయినారు; అందు= అందులో.

**తాత్పర్యం:** ఏం చేయగలను? ఏవిధంగా ఈ ప్రసవబాధనుండి విముక్తి పొందగలను? - అని సుజాత పలుకగా ఏకపాదుడు ధనసంపాదనకొరకై జనకమహారాజు ఆస్థానానికి వెళ్ళాడు. అక్కడ వరుణకుమారుడైన వందితో వాదించి, పరాజయాన్ని పొంది, నీటిలో మునిగియుండగా, ఇక్కడ సుజాత ప్రసవించి అష్టావక్రుడిని కన్నది. అదే సమయాన ఉద్దాలకుడి భార్య శ్వేతకేతుడిని ప్రసవించింది. ఇట్లా మేనమామ. మేనల్లుండ్లిరువురు సమవయస్కులై కలసిమెలసి పెరిగి, ఉద్దాలకుడి సన్నిధిలో పన్నెండేళ్ళు దీక్షతో వేద విద్యాభ్యాసం చేసి చదువుల్లో మేటిశూరు లైనారు. అందు.

**తే. తండ్రి యనుచు నుద్దాలకుఁ దనకుఁ, గరము । ప్రీతితో శ్వేతకేతుని భ్రాత యనుచు**
**ననఘచరితుఁ డష్టావక్రుఁ డనుదినంబు । నొం డెఱుంగక సుఖలీల నుండు నంత. 243**

**ప్రతిపదార్థం:** అనఘచరితుఁడు= పాపంలేని శీలం కలవాడు; అష్టావక్రుఁడు= అష్టావక్రుడు; ఉద్దాలకున్= ఉద్దాలకుడిని; తనకున్+తండ్రి+అనుచున్= తనకు తండ్రి అని తలపోస్తూ; కరము= మిక్కిలి; ప్రీతితో= అభిమానంతో; శ్వేతకేతుని= శ్వేతకేతుడిని; భ్రాత= సోదరుడు; అనుచున్= అని తలపోస్తూ; అనుదినంబున్= నిత్యమూ; ఒండు+ఎఱుంగక= ఇతర మేదీ తెలియక; సుఖలీలన్= సుఖంగా; ఉండునంతన్= ఉండగా.

**తాత్పర్యం:** అష్టావక్రుడు తనకు ఉద్దాలకుడే తండ్రి అనీ, శ్వేతకేతుడు సహోదరుడు అనీ భావిస్తూ మరి వేరు తలపులు లేకుండా సుఖంగా బ్రతుకుతున్నాడు. అంత.

**వ. ఒక్కనాఁ డుద్దాలకు కుఱు వెక్కియున్న యష్టావక్రుం జూచి శ్వేతకేతుండు సహింపక 'నీ వేల మాయయ్య కుఱువెక్కి యుండెదు? వీవు వోయి మీయయ్య కుఱు వెక్కు' మని చేయిపట్టి యీడ్చిన, నేడ్చుచుం దల్లికడకుం జని యష్టావక్రుం డిట్లనియె. 244**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు= ఒకరోజు; ఉద్దాలకు, కుఱువు= ఉద్దాలకుడి తొడపై; ఎక్కి+ఉన్న= ఎక్కి కూర్చొనిఉన్న; అష్టావక్రున్+చూచి= అష్టావక్రుడిని చూచి; శ్వేతకేతుండు= శ్వేతకేతుడు; సహింపక= ఓర్వక, ఓర్చలేక; నీవు+ఏల= నీవు ఎందుకు; మా+అయ్య= మాతండ్రియొక్క; కుఱువు= తొడ; ఎక్కి+ఉండెదు= ఎక్కిఉన్నావు; ఈవు= నీవు; పోయి= వెళ్ళి; మీ+అయ్య= మీనాన్నయొక్క; కుఱువు+ఎక్కుము= తొడపై ఎక్కుము; అని= అంటూ; పట్టి+ఈడ్చినన్= చేతిని పట్టుకొని ఈవలకు లాగగా; ఏడ్చుచున్= దుఃఖిస్తూ; తల్లి కడకున్+చని= తల్లి దగ్గరకు వెళ్ళి; అష్టావక్రుడు; ఇట్లు+అనియె= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఒకనాడు అష్టావక్రుడు ఉద్దాలకుడి తొడపై ఎక్కి ఆడుకొంటున్నాడు. ఆ దృశ్యాన్ని చూచి శ్వేతకేతుడు ఓర్వలేక అష్టావక్రుడి చేతిని పట్టుకొని ఈవలికి లాగి, 'నీవు ఎందుకు మానాన్న తొడపై ఎక్కావు? వెళ్ళి నీవు మీనాన్నతొడపై ఎక్కుము'- అని నిష్ఠురా లాడగా, అష్టావక్రుడు ఏడుస్తూ తల్లిదగ్గరకు వెళ్ళి ఇట్లా పలికాడు.

**క. 'మా యయ్య యెవ్వ? రెక్కడఁ । బోయిరి? సెప్పు' మని తెల్లముగ నడిగి తప**
**శ్శ్రీయుతుఁడు తండ్రికడకుం । బోయెం దన మామ నెయ్యమునఁ దోడ్కొనుచున్. 245**

**ప్రతిపదార్థం:** మా+అయ్య+ఎవ్వరు?= నా తండ్రి ఎవరు?; ఎక్కడన్+పోయిరి?= ఎక్కడికి వెళ్ళారు?; చెప్పుము= తెలియచెప్పుము; అని= అని; తెల్లముగన్= సుస్పష్టంగా; అడిగి= ప్రశ్నించి; తపస్+శ్రీ, యుతుఁడు= తపస్సు అనే సంపదతో కూడినవాడు; తన, మామన్= తన మేనమామను; నెయ్యమునన్= ప్రీతితో; తోడ్కొనుచున్= వెంటబెట్టుకొని; తన, తండ్రి, కడకున్= తన తండ్రి దగ్గరకు; పోయెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'మాతండ్రి ఎవరు? ఎక్కడికి వెళ్ళారు? చెప్పుము' అని సుస్పష్టంగా తల్లిని అడిగి తెలిసికొని మేనమామను ప్రియమార వెంటబెట్టుకొని అష్టావక్రుడు తన తండ్రివద్దకు వెళ్ళాడు.

**వ. ఇ ట్లష్టావక్రుండు దానును శ్వేతకేతుండును జనకరాజు యజ్ఞంబునకుం జని యందు దౌవారిక నివారితులై 'మూకాంధ బధిర పంగు స్త్రీ బ్రాహ్మణ సుప్రవేశం బగుచున్న యీ రాజద్వారంబున మమ్ము విద్వాంసుల బ్రాహ్మణుల నేల వారించెద?' రనిన దౌవారికుం డిట్లనియె. 246**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అష్టావక్రుండు= అష్టావక్రుడు; తానును= తానున్నూ; శ్వేతకేతుండును= శ్వేతకేతుడున్నూ; జనకరాజు= జనకప్రభువుయొక్క; యజ్ఞంబునకున్+చని= యజ్ఞానికి వెళ్ళి; అందు= అక్కడ; దౌవారిక, నివారితులు+ఐ= ద్వారపాలకులచేత అడ్డగించబడినవారై; మూక+అంధ, బధిర, పంగు, స్త్రీ, బ్రాహ్మణ, సుప్రవేశంబు+అగుచు+ఉన్న= మూగవాళ్ళు, గుడ్డివాళ్ళు, చెవిటివాళ్ళు, కుంటివాళ్ళు, ఆడవాళ్ళు, బ్రాహ్మణులు అందరకూ అడ్డులేకుండా సులువుగ ప్రవేశించుటకు వీలైన; ఈ రాజ, ద్వారంబున= ఈ పెద్దవాకిలి ద్వారాన; మమ్మున్= మమ్మల్ని; విద్వాంసులన్= పండితులను; బ్రాహ్మణులన్= బ్రాహ్మణులను; ఏల= ఎందుకు; వారించెదరు= వారిస్తారు; అనిన= అని ప్రశ్నించగా; దౌవారికుండు= ద్వారపాలకుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈరీతిగా అష్టావక్రుడు, శ్వేతకేతుడు జనకమహారాజు చేస్తున్న యజ్ఞానికి వెళ్ళారు. కాని, ద్వారపాలకుడు అక్కడవారిని లోపలికి పోనీయక అడ్డగించాడు. అంత వారు 'ఈ వాకిలిగుండా మూగవాళ్ళు, గుడ్డివాళ్ళు, చెవిటివాళ్ళు, స్త్రీలు, బ్రాహ్మణులు పలువురు లోపలికి సులువుగా ప్రవేశిస్తున్నారు కదా! మేము బ్రాహ్మణులం, పండితులం. మమ్మల్ని ఎందుకు అడ్డగిస్తావయ్యా? తెలుపుము' - అని ప్రశ్నించగా వారికి ఆ ద్వారపాలకుడు ఇట్లా బదులు పలికాడు.

**క.** **'అలఘులగు వృద్ధవిద్వాం । సులకు మహాయాజ్ఞికులకుఁ జొర నర్హంబై**
**విలసిల్లు యజ్ఞసభ సొర । వలవదు చనుఁడీరు చిఱుతవారల' రనినన్.** **247**

**ప్రతిపదార్థం:** అలఘులు+అగు= గొప్పవారైనటువంటి (తేలికైనవారు కానివారైన); వృద్ధ, విద్వాంసులకు= ముదుసలి పండితులకు; మహాయాజ్ఞికులకున్= గొప్ప ఋత్విజులకు; చొరన్= చొరబడటానికి; అర్హంబు+ఐ= తగినట్టిదై; విలసిల్లు= శోభించే; యజ్ఞసభ= యజ్ఞానికి సంబంధించిన సభ; చొర, వలవదు= ప్రవేశించ వీలవదు; చనుఁడు= వెళ్ళిపొండి; ఈరు, చిఱుతవారలరు= మీరు బాలురు; అనినన్= అని చెప్పగా.

**తాత్పర్యం:** 'మహానుభావులైన వృద్ధ విద్వాంసులు, అనుభవజ్ఞులైన ఋత్విజులు మాత్రమే ఈ యజ్ఞవాటికలో ప్రవేశించటానికి అర్హులు, మీరు చిన్నవారు. ఈ యజ్ఞసభలో ప్రవేశించే అర్హత మీకు లేదు'- అని చెప్పగా.

**క.** **'అలయక యేండ్లు గడుం బె । క్కులు జీవించుట నర గలుగుటయుం దగు వృ**
**ద్ధుల లక్షణమే? జ్ఞానము । గలఁ డేనిన్ బాలుఁ డయినఁ గడు వృద్ధు మహిన్.** **248**

**ప్రతిపదార్థం:** అలయక= అలసిపోకుండా; ఏండ్లు= సంవత్సరాలు; కడున్+పెక్కులు= మిగుల అనేకాలు; [చాలాకాలం] జీవించుట= బ్రతకటం; నర, కలుగుటయున్= వెంట్రుకలు తెల్లనగుట; తగు= తగినట్లు; వృద్ధుల, లక్షణమే?= ముసలివారికి చిహ్నాలా?; జ్ఞానము+కలఁడు+ఏనిన్= జ్ఞానం కలిగినవాడైతే; మహిన్= భూమిమీద; బాలుఁడు+అయినన్= వయసులో చిన్నవాడే అయినా; కడు= మిక్కిలి, చాలా; వృద్ధు= పెద్దవాడే.

**తాత్పర్యం:** 'చాలా సంవత్సరాలు ఓర్పుతో బ్రతకటం, వెంట్రుకలు తెల్లబడటం ముసలివారికి చిహ్నాలా? జ్ఞానం కలవాడైతే బాలుడైనా భూమిమీద వృద్ధుడే.

**వ.** **కృతాధ్యయనశీలుండై యాచారపరుండైన వాఁడు బాలుండయ్యును సర్వజన సంభావనీయుండగు; బాలురని మమ్ము నవమానింప వలవ; దేము జనకరాజ సదనంబున దర్పితులైన వేదవాదులతో వాదంబు**

**సేయ సమకట్టి వచ్చినవార' మనిన దౌవారికుండు వారి నప్పుడు రాజానుమతుండై లబ్ధప్రవేశులం జేసె; నంత. 249**

**ప్రతిపదార్థం:** కృత+అధ్యయన, శీలుండు+ఐ= చేయబడిన అధ్యయనం శీలంగా కలవాడై, అంటే లెస్సగా వేదం చదువుకొని సదా ఆ చదువుపైనే దృష్టికల వాడైన; ఆచార, పరుండు+ఐనవాఁడు= అనుష్ఠాన వేదాంతిగా మంచి సంప్రదాయాలను ఆచరించేటటువంటివాడు; బాలుండు+అయ్యును= వయస్సులో చిన్నవాడే అయినప్పటికిని; సర్వ, జన, సంభావనీయుండు+అగు= జనులందరిచేత మన్నించ దగినట్టివా డౌతాడు; బాలురు= వయసులో చిన్నవారు; అని= అని తలపోస్తూ; మమ్ము= మమ్మల్ని; అవమానింప వలవదు= అవమానించవద్దు, తక్కువ చేయవద్దు; ఏము= మేము; జనక, రాజ, సదనంబున= జనక ప్రభువు యొక్క కొలువులో; దర్పితులు+ఐన= గర్వించిన; వేదవాదులతో= వేదాలనుగురించి వాదాలను చేసేవారితో; వాదంబు= చర్చ; చేయన్= చేయటానికి; సమకట్టి= పూని, పూనుకొని; వచ్చినవారము= వచ్చినవారం; అనినన్= అని చెప్పగా; దౌవారికుండు= ద్వారపాలకుడు; వారిన్= ఆ బాలకులను అంటే అష్టావక్రుడిని, శ్వేతకేతుడిని; రాజ+అనుమతుండు+ఐ= రాజుచేత అనుమతించబడినవాడై; లబ్ధప్రవేశులన్+చేసెన్= పొందబడినప్రవేశం కలవారిగా చేశాడు.

**తాత్పర్యం:** చక్కగా చదువు చదువుకొని ఆ చదువు తన నిత్యజీవితంలో ప్రతిఫలించేటట్లు తన ప్రవర్తనను తీర్చిదిద్దుకొనేవాడు, వయస్సులో చిన్నవాడే అయినప్పటికీ ప్రజలందరిచేత మన్నించదగిన వాడు కాగలడు. మమ్మల్ని వయస్సులో చిన్నవారమని అవమానించవద్దు. మేము జనకమహారాజుగారి సభలో గర్వంతో విర్రవీగుతున్న వేదవాదులతో సిద్ధాంత రాద్ధాంతాలు చేసి చర్చించటానికి వచ్చాము'- అని చెప్పగా, ద్వారపాలకుడు, రాజుగారి అనుమతి పొంది ఆ బాలకులైన అష్టావక్ర శ్వేతకేతులను లోపలికి ప్రవేశపెట్టాడు.

**సీ. జనకభూపాలుని సంప్రశ్నముల కెల్ల । నేర్పడ నుత్తరం బిచ్చి వాని**
**సభయందు భూసురసంఘమధ్యంబున । వరుణపుత్త్రుం డైన వందితోడ**
**వాదంబు చేసి, గర్వంబున నాతని । నొడిచి, తద్విజితులై యొదిఁగియున్న**
**ధరణీసురులఁ దన తండ్రితో నిగ్రహ । ముక్తులఁ జేసి సన్మునికుమారుఁ**

**తే. డధికతేజుఁ డష్టావక్రుఁ డఖిలలోక । పూజితుం డైన జనకుచేఁ బూజ లంది**
**యేకపాదుఁ దోడ్కొని పేర్మి నేఁగుదెంచె । బుధనుతుండు నిజాశ్రమంబునకు నొప్ప.' 250**

**ప్రతిపదార్థం:** జనక, భూపాలుని= జనక మహారాజుయొక్క; సంప్రశ్నములకు+ఎల్లన్= గొప్పప్రశ్నలు అన్నింటికి; ఏర్పడన్= సరిపోయేటట్లుగా; ఉత్తరంబు= సమాధానాలు; ఇచ్చి= చెప్పి; వాని సభయందు= ఆ జనక మహారాజు కొలువుకూటంలో; భూసుర, సంఘ, మధ్యంబునన్= బ్రాహ్మణుల సమూహం మధ్య; వరుణ, పుత్త్రుండు+ఐన= వరుణుడి కొడుకైన; వందితోడ= వంది అనే పండితుడితో; వాదంబు, చేసి= వాదించి, తర్కించి; గర్వంబునన్= దర్పంతో; ఆతనిన్= ఆ వందిని; ఒడిచి= ఓడించి; తత్ [తద్]+విజితులు+ఐ= అతడిచేత, (ఆ వందిచేత) పరాజయం పొంది; ఒదిఁగి+ఉన్న= అణగిఉన్న; ధరణీ, సురులన్= బ్రాహ్మణులను; తన తండ్రితోన్= తన తండ్రితోపాటుగా; నిగ్రహ, ముక్తులన్+చేసి= బంధ విముక్తులుగా చేసి; సత్+ముని కుమారుఁడు= మంచివాడైన ఋషిపుత్రుడు; అధిక, తేజుఁడు= అధికమైన వర్చస్సు కలవాడు; అష్టావక్రుఁడు= అష్టావక్రుడు; అఖిల, లోక, పూజితుండు+ఐన= సమస్తలోకాలచేత పూజించబడిన; జనకుచేన్+పూజలు+అంది= జనకమహారాజుచేత సన్మానించబడినవాడై; ఏకపాదున్= ఏకపాదుడిని; తోడ్కొని= తనవెంట తీసికొని, ఉంచుకొని;

బుధ+నుతుండు= పండితులచేత ప్రశంసించబడినవాడు, అష్టావక్రుడు, పేర్మిన్= గౌరవంతో; నిజ+ఆశ్రమంబునకున్= తన ఆశ్రమానికి; ఒప్పన్= శోభాయమానంగా; ఏఁగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** జనకమహారాజు అడిగిన చిక్కుప్రశ్నలకు అన్నింటికీ సరిపడే సమాధానాలు చెప్పి, అతడి కొలువుకూటంలో బ్రాహ్మణసమూహాలమధ్యనున్న వరుణసుతుడైన వందితో వాదించి, అతడిని ఓడించి, మునుపు అతడితో వాదించి పరాజితులై అణగి ఉన్న బ్రాహ్మణులను తన తండ్రితోపాటుగా బంధవిముక్తులుగా చేసి, మిక్కుటమైన తేజస్సుకల ఆ మునికుమారుడైన అష్టావక్రుడు, సర్వలోకాలచేత పూజించబడిన జనకమహారాజుచేత సన్మానితుడై, పండితులచేత ప్రశంసించబడినవాడై, ఏకపాదుడిని తనవెంట పెట్టుకుని శోభయమానంగా తన ఆశ్రమానికి చేరుకొన్నాడు.

**విశేషం:** ఈ పద్యం మూడవ పంక్తిలో "తద్విజితులై యుదధినున్న"- అనే పాఠాంతరం కొన్ని ప్రతుల్లో ఉన్నది.

**వ.** **అని చెప్పుచు నరిగి, 'యిది సమంగ యను పుణ్యనది; యిందు భరతుండు రాజ్యాభిషిక్తుఁడయ్యెఁ; దొల్లి యింద్రుండు లక్ష్మీప్రాప్తుండై దీని జలోపస్పర్శనంబునఁ బాపవిముక్తుండయ్యెఁ; నిది మైనాకకుక్షి; యిం దదితి పుత్త్రార్థినియై తపంబు సేసె; నిది ఋషిదైవతంబైన కనఖల నగం; బిది గంగానది; యిందు సనత్కుమారుండు సిద్ధింబొందె; నిది యుష్ణగంగ; యిందుఁ గృతస్నానులైనం గృతార్థు లగుదు; రిది రైభ్యాశ్రమం; బిది భరద్వాజాశ్రమం; బిందు భరద్వాజసుతుండు యవక్రీతుండు తపోవిద్యాగర్వంబున నపగతజీవుం డయ్యెఁ; ననిన 'నది యె?' ట్లని ధర్మతనయుం డడిగిన రోమశుం డిట్లనియె.** **251**

**ప్రతిపదార్థం:** అని చెప్పుచున్+అరిగి= అని ఆయాతీర్థ మాహాత్మ్యాలు ప్రవచిస్తూ ప్రయాణించి; ఇది= ఈ స్థలం; సమంగ+అను= సమంగ అనే పేరు కల; పుణ్యనది= పవిత్రమైననది; ఇందు= ఇక్కడ; భరతుండు= భరతుడు; రాజ్య+అభిషిక్తుఁడు+అయ్యెన్= రాజ్యానికి అభిషేకించబడ్డాడు; (సింహాసనం అధివసించటానికి ముందు చేసేస్నానం అభిషేకం); తొల్లి= పూర్వం ఇంద్రుడు; లక్ష్మీ, ప్రాప్తుండు+ఐ= సంపదను పొందినవాడై; దీని, జల+ఉప, స్పర్శనంబునన్= ఈ నదీజలాలను పైన చల్లుకోవటం వలన; పాప, విముక్తుండు+అయ్యెన్= పాపాలనుండి తొలగినవాడు అయ్యాడు; ఇది= ఈచోటు; మైనాకకుక్షి= మైనాకకుక్షి అనే పుణ్యక్షేత్రం; ఇందు= ఇక్కడ; అదితి= కశ్యపుడి భార్య, దక్షప్రజాపతి కూతురు; పుత్త్ర+అర్థిని+ఐ= కొడుకులను కోరినదై; తపంబు+చేసెన్= తపస్సు చేసింది; ఇది= ఈ చోటు; ఋషిదైవతంబు+ఐన= ఋషులను దైవతాలుగా గల; కనఖల,నగంబు= కనఖల అనే పర్వతం; ఇది= ఇది; గంగా నది= గంగ అనేనది; ఇందు= దీనిలో; సనత్కుమారుండు= సనత్కుమార మహర్షి; సిద్ధిన్+పొందెన్= సిద్ధి పొందాడు; ఇది= ఇది; ఉష్ణగంగ= ఉష్ణగంగ అనేతీర్థం; (ఉష్ణగంగ= వేడినీటి ఊట కలది); ఇందున్= ఈ ఉష్ణగంగలో; కృత, స్నాతులు+ఐనన్= చేయబడిన స్నానం కలవారు-అంటే-స్నానం చేసిన వారు; ఐనన్= ఐనన్=ఐనచో; కృత+అర్థులు+అగుదురు= కోరిన కోరికలు ఈడేరినవారు అవుతారు; ఇది, రైభ్య+ఆశ్రమంబు= ఇది రైభ్యుడి ఆశ్రమం; ఇది, భరద్వాజ+ఆశ్రమంబు= ఇది భరద్వాజుడి ఆశ్రమం; ఇందున్= ఈ ఆశ్రమంలో; భరద్వాజ, సుతుండు= భరద్వాజుడి కొడుకైన; యవక్రీతుండు= యవక్రీతుడు; తపస్+విద్యా గర్వంబునన్= తపస్సు వలన లభించిన పాండిత్యంయొక్క దర్పంచేత; అపగత, జీవుండు+అయ్యెన్= పోగొట్టుకొనబడిన ప్రాణాలు కలవాడైనాడు; అనినన్= అని చెప్పగా; అది= ఆ వృత్తాంతం; ఎట్లు= ఏవిధమైనట్టిది; అని= అంటూ; ధర్మతనయుండు= ధర్మసుతుడు; అడిగినన్= ప్రశ్నించగా; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్తుతూ ప్రయాణించి అనేకతీర్థయాత్రలు చేస్తూ రోమశుడు ధర్మరాజుకు ఆ యా పుణ్యక్షేత్రాలను గురించి వివరించి చెప్పాడు. 'ఇది సమంగ అనే పుణ్యనది. ఇందులో భరతుడు రాజ్యాభిషిక్తుడైనాడు. పూర్వం

ఇంద్రుడు సంపదను పొంది, దీనిజాలాన్ని పైన చల్లుకొనటంచేత పాపాలనుండి విముక్తి పొందాడు. ఇది 'మైనాకకుక్షి' అనే పుణ్యక్షేత్రం. ఇక్కడ అదితి కొడుకులను కోరి తపస్సు చేసింది. ఇది కనఖల పర్వతం. ఇది ఋషిదైవతం. ఇది గంగానది. ఇందులో సనత్కుమారుడు సిద్ధి పొందాడు. ఇది 'ఉష్ణగంగ'. ఇక్కడ స్నానం చేసినవారి కోరికలు ఈడేరుతాయి. ఇది రైభ్యాశ్రమం. ఇది భరద్వాజాశ్రమం; ఇందులో భరద్వాజ మహర్షి పుత్రుడైన యవక్రీతుడు తనతపస్సు వలన, పాండిత్యం వలన ఏర్పడిన గర్వంచేత అసువులు కోల్పోయాడు' అని రోమశుడు చెప్పగా, ఆ వృత్తాంతం సవిస్తరంగా చెప్పు మని ధర్మరాజు అడిగాడు. రోమశుడు ఇట్లా బదులు పలికాడు.

**విశేషం:** (1) ఈ గద్యం మొదట 'అని చెప్పుచు నరిగి' అన్న పదగుంఫనం మిక్కిలి అర్థవంతమైనది. రోమశమహర్షి పాండవులచేత వివిధతీర్థాలు సేవింపచేస్తూ ఆయా స్థలాలలో ఆయా సమయాలలో చెప్పినమాటలు ఇవి అని గ్రహించవచ్చును.

(2) ఈ ఆరణ్యపర్వం ద్వితీయాశ్వాసంలో పుణ్యక్షేత్రాభివర్ణన ఉన్నది. మళ్ళీ తృతీయాశ్వాసంలో కూడ పుణ్యక్షేత్రాభివర్ణన ఉన్నది. మొదటిది నారదప్రోక్తం. రెండవది రోమశప్రోక్తం. కొంతమంది ఆధునిక విమర్శకులు ద్వితీయాశ్వాసంలోని వర్ణన వైశంపాయన కథితం అనిన్నీ, ఆనాడు భారతదేశంలో ఉన్న తీర్థాలసంఖ్య, సూతుని కాలాన అంటే శౌనకుడి సత్రయాగ సమయాన పెరిగింది కాబట్టి మళ్ళీ తీర్థయాత్రలను అభివర్ణించటం జరిగిందనీ భావిస్తున్నారు.

### రోమశుఁడు ధర్మరాజునకు యవక్రీతుచరిత్రంబు సెప్పుట (సం. 3-135-12)

**క. 'అలఘులు రైభ్య భరద్వా। జులు తమలో సుహృదులై విశుద్ధ తపోని**
**శ్చలితమతు లివ్వనంబున। నొలసి తపం బొప్పఁ జేయుచుండిరి నెమ్మిన్. 252**

**ప్రతిపదార్థం:** అలఘులు= గొప్పవారు; రైభ్య, భరద్వాజులు= రైభ్యుడున్నూ, భరద్వాజుడున్నూ; తమలో, సుహృదులు+ఐ= తాము ఒకరికొకరు స్నేహితులై; విశుద్ధ, తపస్+నిశ్చలిత, మతులు= నిర్మలమైన తపంచేత సుస్థిరమైన బుద్ధికలవారు అంటే చిత్తవృత్తులను నిరోధించినయోగులు; ఈ+వనంబునన్= ఈ అరణ్యంలో; ఒలసి= పూని; నెమ్మిన్= ప్రీతితో; తపంబు= తపస్సు; ఒప్పన్= ఒప్పేటట్లుగా; చేయుచు+ఉండిరి= ఆచరిస్తూ ఉండినారు.

**తాత్పర్యం:** మహానుభావులైన రైభ్యుడు, భరద్వాజుడు తమలో తాము మిత్రులై, చిత్తవృత్తులను నిగ్రహించే యోగీశ్వరులై ఈ అరణ్యంలో ప్రీతితో తపస్సు చేస్తూ ఉండేవారు.

**వ. అందు రైభ్యుండు కృతాధ్యయన శూరులైన యర్థావసు పరావసులను తన యిద్దఱు పుత్త్రులతో విద్వత్పూజితుండై యున్నవానిం జూచి సహింపనోపక భరద్వాజసుతుఁడు యవక్రీతుండు తపోబలంబున నఖిల వేదశాస్త్రాగమంబులు పడయుదు నని సమిద్ధంబైన యగ్నియందు సంధార్యంబు సంధించుచు నుగ్రతపంబు సేయుచున్న, దాని సహింపనోపక యింద్రుండు వానియొద్దకు వచ్చి 'నీ వేమి యుద్దేశించి యుగ్రతపంబు చేసెద?' వనిన శక్రునకు యవక్రీతుం డిట్లనియె. 253**

**ప్రతిపదార్థం:** అందు= వారిలో; రైభ్యుండు= రైభ్యుడు; కృత+అధ్యయన, శూరులు+ఐన= అధ్యయనం చేయటంలో శూరులైన అనగా, వేదాన్ని అభ్యసించటంలో బాగా ఆరితేరినవారైన; అర్థావసు, పరావసులు+అను= అర్థావసుడు, పరావసుడు అనేపేర్లు గల; తన+ఇద్దరు పుత్త్రులతోన్= తన ఇద్దరు కొడుకులతో; విద్వత్+పూజితుండు+ఐ+ఉన్నవానిన్= విద్వాంసులచేత

అర్చించబడుతూ ఉన్నవాడిని; చూచి= అరసి; సహింపన్+ఓపక= ఓర్వలేక; భరద్వాజసుతుఁడు= భరద్వాజముని కుమారుడైన; యవక్రీతుండు= యవక్రీతుడనే పేరుగలవాడు; తపస్+బలంబునన్= తపస్సుయొక్క శక్తివలన; అఖిల, వేద, శాస్త్ర+ ఆగమంబులు= సమస్తమైన వేదాలు, శాస్త్రాలు, దేవ పూజా విధానాలు; పడయుదును= పొందుతాను; అని= అని తలపోసి; సమిద్ధంబు+ఐన= రగుల్చబడిన; అగ్నియందు= నిప్పులో; సంధార్యంబు= హోమద్రవ్యం; సంధించుచున్= వేలుస్తూ; ఉగ్ర, తపంబు+చేయుచున్నన్= తీవ్రమైన తపస్సు చేస్తుండగా; దాని= ఆ తీవ్రతపస్సును; సహింపన్+ఓపక= తాళలేక; ఇంద్రుండు= ఇంద్రుడు; వాని+ఒద్దకు, వచ్చి= ఆ యవక్రీతుడి వద్దకు వచ్చి; నీవు= నీవు; ఏమి+ఉద్దేశించి= దేనిని లక్ష్యంగా పెట్టుకొని; ఉగ్ర, తపంబు+చేసెదవు= తీవ్రమైన తపస్సు చేస్తావు; అనినన్= అని అడుగగా; శక్రునకున్= ఇంద్రుడికి; యవక్రీతుండు= యవక్రీతుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** వారిలో రైభ్యుడి కొడుకులు అర్వావసుడు, పరావసుడు అనేవారు ఇద్దరూ వేదశాస్త్రాలను చక్కగా అధ్యయనం చేసి గొప్ప పాండిత్యాన్ని ఆర్జించారు. రైభ్యుడు కొడుకులతో కలసి విద్వాంసులచేత పూజించబడిన వాడవటంచేత భరద్వాజుడి కుమారుడైన యవక్రీతుడికి మాత్సర్యం ఏర్పడింది. అందుచేత తాను కష్టపడి, ఎంతోకాలం వెచ్చించి వేదాలు, శాస్త్రాలు, భగవత్పూజా విధానాలను అభ్యసించటంకంటె తపస్సుచేసి ఆ జ్ఞానాన్ని సంపాదించాలని తలపోశాడు. అంతట యవక్రీతుడు రగుల్చబడిన నిప్పులో హోమద్రవ్యాలు వ్రేల్చి హోమం చేస్తూ తీవ్రమైన తపస్సు చేస్తుండగా, అతడి ఉగ్రతపస్సుకు తాళలేక ఇంద్రుడు అతడి దగ్గరకు వచ్చి 'నీవు ఏమి కోరి ఇంతటి గాఢతపం చేస్తున్నావు?' అని అడిగాడు. ఇంద్రుడికి యవక్రీతుడు ఇట్లా బదులు పలికాడు.

**ఆ. 'చదువకయును నాకు సర్వవేదంబులు । సర్వశాస్త్రములును సంభవిల్ల**
**వలయు నని తలంచి వదలక నిష్ఠతో । నుగ్రతపముఁ జేయుచున్నవాఁడ.' 254**

**ప్రతిపదార్థం:** చదువకయును= విద్యాభ్యాసాన్ని ఏ గురువుదగ్గర చేయకుండా; నాకు= నాకు; సర్వ, వేదంబులు= సకల వేదాలు; సర్వ, శాస్త్రములును= సమస్త శాస్త్రాలు; సంభవిల్లవలయున్= సంప్రాప్తించాలి; అని, తలంచి= అని తలపోసి; వదలక= విడువక; నిష్ఠతోన్= దీక్షతో; ఉగ్ర, తపమున్= తీవ్రమైన తపస్సును; చేయుచున్నవాఁడన్= చేస్తున్నాను.

**తాత్పర్యం:** 'ఏ గురువు దగ్గర విద్యాభ్యాసం చేయకుండానే సర్వవేదాలు, సకలశాస్త్రాలు అవగతం కావాలి- అని నిష్ఠతో తీవ్రమైన తపస్సు చేస్తున్నాను.'

**వ. అనిన వాని కింద్రుం డిట్లనియె. 255**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; వానికి= ఆ యవక్రీతుడికి; ఇంద్రుండు= ఇంద్రుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని యవక్రీతుడు చెప్పగా అతడితో ఇంద్రుడు ఇట్లా అన్నాడు.

**క. 'గురుముఖమునఁ బడయక దు । ష్కరతపమునఁ జేసి పడయఁగాఁబడు విద్యల్**
**పరమార్థము మదమును మ । త్సరమును గావించు నెట్టిసాధుల కైనన్. 256**

**ప్రతిపదార్థం:** గురు ముఖమునన్= గురుప్రబోధంవలన; పడయక= పొందక; దుష్కర, తపమునన్+చేసి= తీవ్రమైన తపస్సుచేత; పడయఁగాన్+పడు= పొందబడేటటువంటి; విద్యల్= విద్యలు; ఎట్టి= ఎటువంటి; సాధులకు+ఐనన్= మంచివారికైనాకూడ;

పరమ+అర్థము= పరమమైన ప్రయోజనం విషయంలో (ఉత్కృష్టమైన ఫలితాన్ని ప్రసాదించడంలో); మదమును= గర్వాన్ని; మత్సరమును= అసహనాన్ని (అసూయను); కావించున్= కల్పిస్తుంది.

**తాత్పర్యం:** 'అధ్యాపకుడి ద్వారా జరిగే ప్రబోధాన్ని పొందక తీవ్రమైన తపస్సువలన పొందేటటువంటి విద్యలు పరమార్థంలో ఎటువంటి మంచివారికైనా కూడా గర్వాన్ని, అసూయను రేకెత్తిస్తాయి.

**వ. 'ఇది విద్యోపార్జనంబున కుపాయంబు గా' దని వారించి వాసవుఁ డరిగిన, నుడుగక యవక్రీతుం డెప్పటియట్ల తపంబుఁ జేయుచున్నఁ దదీయ తపస్తప్తమానసుండై వృద్ధశ్రవుండు వృద్ధవిప్రరూపంబు ధరించి యశక్తుండై శోషించిన శరీరంబుతోడ సికతాముష్టి పరంపర నపారగంభీరగంగాప్రవాహంబునందు సేతుబంధంబు చేయుచున్న నవ్విప్రుం జూచి యవక్రీతుండు నగుచు నిట్లనియె. 257**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ తీవ్రతపం; విద్యా+ఉపార్జనంబునకు= విద్యను సంపాదించటానికి; ఉపాయంబు= మార్గం; కాదు+అని= కాదని; వారించి= అడ్డుచెప్పి; వాసవుఁడు= ఇంద్రుడు; అరిగినన్= వెళ్ళగా; ఉడుగక= తపస్సు విరమించక; యవక్రీతుండు= యవక్రీతుడు; ఎప్పటి+అట్ల= లోగడ మాదిరిగానే; తపంబున్= తపస్సును; చేయుచున్నన్= చేస్తూఉండటంచేత; తదీయ, తపస్+తప్త, మానసుండు+ఐ= అతడియొక్క తపస్సుచేత కాల్చబడిన మనస్సుకలవాడై; వృద్ధశ్రవుండు= ఇంద్రుడు; వృద్ధ, విప్ర, రూపంబు= ముసలి బ్రాహ్మణుడిరూపం; ధరించి= ధరించి; న+శక్తుండు+ఐ= బలంలేనివాడై; శోషించిన= ఎండిన; శరీరంబుతోడ= దేహంతో; సికతా, ముష్టి, పరంపరన్= ఇసుకతో కూడిన పిడికిళ్ళ వరుసతో; అపార, గంభీర, గంగా, ప్రవాహంబునందున్= మితిలేనటువంటి, మిక్కిలి లోతైనటువంటిది అయిన గంగనీటివెల్లువయందు; సేతు, బంధంబు చేయుచున్నన్= ఆనకట్ట కడుతున్న; ఆ+విప్రున్+చూచి= ఆ బ్రాహ్మణుడిని చూచి; యవక్రీతుండు= యవక్రీతుడు; నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇది విద్యను సంపాదించటానికి తగిన పద్ధతి కాదు'- అని చెప్పి ఇంద్రుడు వెళ్ళిపోయాడు. కాని, యవక్రీతుడు ఎప్పటిమాదిరిగానే తపస్సు చేయ నారంభించాడు. అంతట అతడి తీవ్ర తపస్సుచేత తపింపజేయబడిన మనస్సుకలవాడై ఇంద్రుడు కృశించిపోయిన దేహం గల ముసలి బ్రాహ్మణుడి ఆకారం ధరించి, బలం లేకున్నా పిడికిళ్ళతో ఇసుకను పోస్తూ మితిలేనటువంటి లోతుగల గంగ నీటివెల్లువకు అడ్డంగా ఆనకట్ట కట్టే యత్నం చేస్తూ ఉండినాడు. ఆ బ్రాహ్మణుడి యత్నం చూచి యవక్రీతుడు పరిహసిస్తూ ఇట్లా పలికాడు.

**క. 'శతవర్షవృద్ధుఁడవు నీ। వతికృశుఁడ వశక్యమైన యర్థమునం దా**
**స్థత యేల సేసి కడు దు। ర్మతి వై? తిం కెన్నఁ డిది సమాప్తిం బొందున్?' 258**

**ప్రతిపదార్థం:** శత, వర్ష, వృద్ధుఁడవు= నూరేళ్ళు నిండిన ముసలివాడివి; నీవు= నీవు; అతి కృశుఁడవు= మిక్కిలి కృశించినవాడివి; న+శక్యము+ఐన= సాధ్యం కాని; అర్థమునందు= లక్ష్యమందు; ఆస్థత= ఆసక్తి; ఏల+చేసి= ఎందుకు చేసి; కడు= మిక్కిలి; దుర్మతివి+ఐతి?(వి)= చెడ్డబుద్ధి కలవాడివి అయినావు?; ఇంక= ఇకమీద; ఎన్నఁడు= ఎప్పటికి; ఇది= ఈ సేతువు; సమాప్తిన్+పొందున్?= పూర్తి అవుతుంది?

**తాత్పర్యం:** 'నీవు నూరేళ్ళు నిండిన ముసలివాడివి కదా! మిక్కిలి కృశించి ఉన్నావు. ఎందుకు అసాధ్యమైన లక్ష్యమందు ఆసక్తిచూపి మందబుద్ధివైనావు! ఇంక ఏనాటికి ఈ ఆనకట్ట పూర్తి కాగలదయ్యా?'

**వ. అనిన నింద్రుండు వానిం జూచి 'యేను నీయట్ల యఘటమానంబైన యర్థంబునందు యత్నంబుఁ జేసెద' నని నిజరూపంబుఁ జూపి 'యిట్లు నిరర్థకప్రయాసం బేల చేసె? దుడుగు 'మనిన 'నే నెట్లు నుడుగ; నాయభిమతంబు సఫలంబు సేయవలయు' నన యవక్రీతుండు శక్రువలనం దనయభిమతంబు వడసి, తత్ప్రకారంబుఁ దండ్రికిం జెప్పిన విని భరద్వాజుఁడు కొడుకుగర్వంబు సహింపక దేవగీతలైన గాథల యర్థంబు వానికి నిట్లని చెప్పె. 259**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఇంద్రుండు= ఇంద్రుడు; వానిన్+చూచి= ఆ యవక్రీతుడిని చూచి; ఏను= నేను; నీ+అట్ల= నీవలెనే; న+ఘటమానంబు+ఐన= అసాధ్యమైన; అర్థంబునందు= లక్ష్యమందు; యత్నంబున్+చేసెదన్= ప్రయత్నం చేస్తాను, పాటుబడుతున్నాను; అని= అని చెప్పి; నిజ, రూపంబున్= తన అసలు ఆకారాన్ని; చూపి= ప్రదర్శించి; ఇట్లు= ఈవిధంగా; నిరర్థక ప్రయాసంబు= నిర్+అర్థక, ప్రయాసంబు= అసంగతమైన శ్రమ; ఏల చేసెదు?= ఎందుకు చేస్తున్నావు?; ఉడుగుము= విరమించుము; అనినన్= అని చెప్పగా; ఏను= నేను; ఎట్లున్+ఉడుగన్= ఏవిధంగాకూడ మానను; నా+అభిమతంబు= నా కోరిక సఫలంబు+చేయవలయున్= నెరవేరేటట్లు చేయతగును; అనన్= అని చెప్పగా; యవక్రీతుండు= యవక్రీతుడు; శక్రువలనన్= ఇంద్రుడివలన; తన+అభిమతంబు= తనకోరిక; పడసి= పొంది; తత్+ప్రకారంబున్= ఆ సంగతిని; తండ్రికిన్+ చెప్పినన్= తన తండ్రికి వినిపించగా; విని= ఆలకించి; భరద్వాజుఁడు= భరద్వాజుడు; కొడుకుగర్వంబు= పుత్రుడియొక్క గర్వం; సహింపక= ఓర్వలేక; దేవగీతలు+ఐన= దేవతలచేత ఉదాహరించబడి, 'దేవగీతలు' అనే పేర ప్రసిద్ధికెక్కిన; గాథల+అర్థంబు= గానం చేయటానికి అనువైన పద్యరచనల భావాన్ని; వానికిన్= అతనికి - ఆ యవక్రీతుడికి; ఇట్లు+అని= ఈవిధంగా; చెప్పెన్= వచించాడు.

**తాత్పర్యం:** అనిన తరువాత ఇంద్రుడు యవక్రీతుడిని చూచి ఇట్లా పలికాడు; 'నేను నీవలెనే అసాధ్యమైన లక్ష్యమందు కృషిచేస్తున్నాను' అని తన అసలు ఆకారాన్ని ప్రదర్శించి 'ఈవిధంగా ప్రయోజనం లేని వృథాప్రయాస పడటం మానుము' అని చెప్పగా, యవక్రీతుడు 'నేను ఏవిధంగాకూడ లక్ష్యం సిద్ధించేవరకు నా తీవ్ర తపం విరమించలేను; నాకోరిక ఈడేర్చుము' అని చెప్పి, ఇంద్రుడివలన తనకోరిక నెరవేరేటట్లు వరం సంపాదించాడు. తరువాత యవక్రీతుడు తాను సాధించిన విజయాన్నిగురించి తండ్రికి తెలిపాడు. దానిని విని, భరద్వాజుడు కొడుకుగర్వాన్ని సహించక దేవగీతలుగా సుప్రసిద్ధాలైన పద్యగాథల భావాన్ని యవక్రీతుడికి ఈవిధంగా తెలిపాడు.

**సీ. 'బాలధి యను మునిప్రవరుండు పుత్త్రశో । కాపన్నుఁడై ఘోరమగు తపంబుఁ**
**జేసి వేల్పులదయఁ జిరజీవిగాఁ బుత్త్రుఁ । బడసె మేధావి నాఁ బరఁగువాని**
**వాఁడు నాయుష్యగర్వమున మునీంద్రుల । నెవ్వరి మెచ్చక యేఁగి యొక్క**
**ధనుషాక్షుఁ డను తపోధనునొద్ద గర్వించి । పలికిన నలిగి తపస్వి వాని**

**ఆ. నంత కాంతికమున కరుగంగఁ జేసె; గ । ర్వంబు చెట్ట; యెట్టివారి నైనఁ**
**గ్రాఁచుఁ దత్‌క్షణంబు గర్వంబు; గర్వంబు । నొడిచియున్నవాఁడ యుత్తముండు. 260**

**ప్రతిపదార్థం:** బాలధి+అను= బాలధి అనే పేరు కల; ముని ప్రవరుండు= ఋషిశ్రేష్ఠుడు; పుత్త్ర, శోక+ఆపన్నుఁడు+ఐ= కొడుకుయొక్క మరణంచేత తపించినవాడై; ఘోరము+అగు= భయంకరమైన; తపంబున్+చేసి= తపస్సు చేసి; వేల్పుల దయన్= దేవతల కరుణవలన; చిరజీవిగాన్= చిరకాలం బ్రతికేటటువంటి వాడుగా; పుత్త్రున్= కొడుకును; మేధావి నాన్=

మేధావి అనేపేరుతో; పరఁగువానిన్= ఒప్పేవాడిని; పడసె= పొందాడు; వాఁడున్= ఆ మేధావి; ఆయుష్య, గర్వమునన్= తనకు ఆయుస్సు కలదనే ధైర్యంతో; ముని+ఇంద్రులన్= ఋషివరేణ్యులను; ఎవ్వరిమెచ్చక= ఎవ్వరిని సరకుదేయక; ఏఁగి= వెళ్ళి; ఒక్క, ధనుషాక్షుఁడు+అను= ధనుషాక్షుడు అనేపేరు కల ఒక; తపస్+ధను+ఒద్ద= తపస్సు ధనంగా కలవాడిదగ్గర; గర్వించి= గర్వించి; పలికిన= మాట్లాడగా; తపస్వి= ఋషి; అలిగి= ఆగ్రహించి; వానిన్= అతడిని- ఆ మేధావిని; అంతక+అంతికమునకు= యముడి దగ్గరకు; అరుగంగన్+చేసె= వెళ్ళేటట్లు చేశాడు; గర్వంబు= గర్వం; చెట్ట= చెడ్డది; ఎట్టివారిన్+ఐనన్= ఎటువంటి వారినైనా; గర్వంబు= గర్వం; తద్+క్షణంబు= ఆ క్షణమందే; క్రాఁచున్= తగులబెడుతుంది; గర్వంబున్= గర్వాన్ని; ఒడిచి+ఉన్న వాఁడు+అ= వీడి ఉన్నవాడే; ఉత్తముండు= మంచివాడు.

**తాత్పర్యం:** 'బాలధి అనబడే మునివరేణ్యుడు, పుత్రుడి మరణంవలన పరితపించి, ఉగ్రమైన తపస్సుచేసి దేవతలను మెప్పించి, చిరంజీవిఅయిన పుత్రుడిని పొందాడు. అతడిపేరు మేధావి. అతడు తాను ఆయుస్సు కలవాడినన్న గర్వంతో మునివరేణ్యులను లక్ష్యపెట్టక విచ్చలవిడిగా తిరుగసాగాడు. ఒకనాడు ధనుషాక్షుడు అనే తపోధనుడిని లక్ష్యంచేయక పొగరుబోతుగా మాట్లాడగా ఆ తపస్వి ఆగ్రహించి మేధావిని యముడిసన్నిధికి పోయేటట్లు చేశాడు. ఎంతటివారికైనా గర్వం చెడ్డది. గర్వం ఎవ్వరినైనా క్షణంలో కాల్చివేస్తుంది. గర్వం వీడినవాడే మంచి మనుష్యుడు.

**వ. కావున నీవు గర్వంబు విడిచి యకోపనుండవై పరమశాంతు లైన రైభ్యకొడుకులతోడ నిర్మత్సరుండవయి యుండు' మనిన 'నట్లసేయుదు; నాకు రైభ్యండు భవత్సమానుండ' యని యవక్రీతుండు తన విద్యావిభవంబు మునిసభల విస్తరించుచు నొక్కనాఁడు రైభ్యాశ్రమంబునకుం జని, యందు. 261**

**ప్రతిపదార్థం:** కావున= కాబట్టి; నీవు= నీవు; గర్వంబు, విడిచి= గర్వం విడిచి; న+కోపనుండవు+ఐ= కోపం లేని వాడివై; పరమ, శాంతులు+అయిన= మిక్కిలి శాంతస్వభావం కల; రైభ్య, కొడుకులతోడ= రైభ్యుడి కొడుకులతో; నిర్మత్సరుండవు+అయి= అసూయ లేనివాడివై; ఉండుము= ఉండుము; అనినన్= అనిచెప్పగా; అట్లు+అ+చేయుదున్= ఆ రీతిగానే చేయగలను; నాకు= నాకు; రైభ్యండు= రైభ్యుడు; భవత్+సమానుండు+అ= నీతో సమానమైనవాడు; అని= అని చెప్పి; యవక్రీతుండు= యవక్రీతుడు; తన, విద్యా, విభవంబు= తనపాండిత్యంయొక్క ప్రకర్ష; ముని, సభల= ఋషుల సభలలో; విస్తరించుచున్= వెల్లడిస్తూ; ఒక్కనాఁడు= ఒకానొకరోజు; రైభ్య+ఆశ్రమంబునకున్+చని= రైభ్యుడియొక్క ఆశ్రమానికి వెళ్ళి; అందు= ఆ ఆశ్రమంలో.

**తాత్పర్యం:** కాబట్టి, నీవు అహంకారాన్ని విడిచి, కోపం లేనివాడివై, మిక్కిలి శాంతస్వభావం కలవారైన రైభ్యుడి కొడుకుల యెడల అసూయ లేనివాడివై ఉండుము'- అని భరద్వాజుడు యవక్రీతుడితో చెప్పాడు. యవక్రీతుడు 'అట్లాగే చేస్తాను; నాకు రైభ్యుడు నీతో సమానుడు' అని సమాధానం చెప్పాడు కాని, ఋషుల సభలలో తన పాండిత్య ప్రకర్ష ప్రదర్శించసాగాడు. ఒకనాడు యవక్రీతుడు రైభ్యుడి ఆశ్రమానికి వెళ్ళి అక్కడ.

**ఉ. కోమల కీర షట్చరణ కోకిలనాద మనోహరంబు ను**
**ద్దామ వసంత పుష్ప భరిత క్షితిజ ప్రకరంబు నైన యా**
**రామమునందుఁ జూచె మునిరాజకుమారుఁడు రైభ్యకోడలిం**
**దామరసాక్షిఁ గృష్ణ యనుదానిఁ బరావసుభార్యఁ బ్రీతితోన్. 262**

**ప్రతిపదార్థం:** ముని, రాజ, కుమారుఁడు= ఋషులలో శ్రేష్ఠుడైన భరద్వాజుడి కొడుకు- యవక్రీతుడు; కోమల= సుకుమారమైన; కీర= చిలుకలయొక్క; షట్+చరణ= తుమ్మెదలయొక్క; కోకిల= కోయిలలయొక్క; నాద= శబ్దాలచేత; మనస్+హరంబున్= మనస్సులను హరించేటటువంటిది; ఉద్దామ, వసంత, పుష్ప, భరిత, క్షితిజ, ప్రకరంబును+ఐన= గొప్పదైన ఆమనిపూలతో నిండినచెట్ల సమూహాలు కలదైన; ఆరామమునందున్= తోటలో; తామరస+అక్షిన్= పద్మాలవంటి కన్నులు కలదానిని; రైభ్యుకోడలిన్= రైభ్యుడి కోడలిని (కుమారుడి భార్యను); కృష్ణ+అనుదానిన్= కృష్ణ అనే పేరు కలదానిని; పరావసు, భార్యన్= పరావసుడి భార్యను; ప్రీతితోన్= అనురాగంతో; చూచెన్= చూచాడు.

**తాత్పర్యం:** చిలుకల, కోయిలల, తుమ్మెదలయొక్క సుకుమారమైన నాదాలచేత మనోహరమై, ఆమునిపువ్వులతో నిండిన గొప్పచెట్ల సమూహాలతో కూడిన పూలతోటలో, మునిశ్రేష్ఠుడి పుత్రుడైన యవక్రీతుడు పద్మాలవంటి కన్నులు కలది, రైభ్యుడి కోడలు, పరావసుడి భార్య అయిన కృష్ణ అనే పేరుగల సుందరిని అనురాగలాలసుడై చూచాడు.

**విశేషం:** ఇది ఉత్పలమాలావృత్తం. దీనిలోని మకారప్రాసం ఉ- 'ద్దామ - ఆ-రామము - కోమల - తామరసాక్షి' పదఘటితం. ఉద్దామ - ఆరామ అనే పదాలను పూర్వపాదంనుండి తదుపరి పాదానికి మకారప్రాసంగా మలచటం తెలుగు ఛందానికి కల ప్రత్యేకత, నన్నయ మహాకవి తరువాతి కవులకు పెట్టిన ఒరవడి, సంస్కృతాన వృత్తాలలో ఏ పాదానికి ఆ పాదం ఛందస్సులో విరిగి, స్వయం సమృద్ధంగా ఉంటుంది. అక్కడ ప్రాసనియతి, కన్నడంలో యతినియతి లేదు. కోమల.... కోకిల, ద్దామ.... భరిత క్షితిజ, రామము ..... మునిరాజ, తామర .... దాని- ఇవి యతులు. తెలుగు పద్యగానంలో యతిప్రాసలు మృదంగనినాదం సమకూరుస్తాయి. నన్నయ కవితకు విశిష్టత చేకూర్చిన అక్షరరమ్యత ఈ పద్యంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది, వినిపిస్తుంది.

**ఆ. దానిఁ జూచి మదనతప్తుఁడై తన యభి । ప్రాయ మెఱుఁగఁ జెప్పెఁ బంకజాక్షి;**
**కదియు శాపభీతి నప్పటి కొడఁబడి । నట్లు పలికి పెలుచ నరుగుదెంచి. 263**

**ప్రతిపదార్థం:** దానిన్+చూచి= ఆమెను చూచి (రైభ్యుడి కోడలైన కృష్ణను చూచి); మదన, తప్తుఁడు+ఐ= మన్మథ తాపానికి గురిఅయి; తన+అభిప్రాయము= తన మనసులోని భావం; పంకజ+అక్షికి= పద్మాలవంటి కన్నులుగల ఆకృష్ణకు; ఎఱుఁగన్+చెప్పెన్= తెలియచేశాడు; అదియు= ఆమెయు; శాపభీతిన్= శాపం వలని భయంచేత అనగా యవక్రీతుడు శపిస్తాడనే భయంచేత; అప్పటికి= ఆ సమయానికి; ఒడఁబడినట్లు= అంగీకరించినట్లు; పలికి= మాట్లాడి; పెలుచన్= శీఘ్రంగా; అరుగుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** ఆమెను చూచి, మన్మథతాపానికి గురియై, యవక్రీతుడు ఆమెకు తన మనస్సులోని కోరికను తెలిపాడు. పద్మాలవంటి కన్నులుకల ఆ కృష్ణ, ముని శాపమిస్తాడనే భయంతో అప్పటికి సమ్మతించినట్లు నటించి, వేగంగా వచ్చి.

**క. తమ మామకుఁ దద్వృత్తాం । తము నంతను దెలియఁ జెప్పి తరుణి విలోలా**
**క్షములందు బాష్పసలిలో । ద్గమముగఁ దల వాంచి యుండెఁ గడుఁగోపమునన్. 264**

**ప్రతిపదార్థం:** తరుణి= యువతి; తమ మామకున్= తమ మామగారికి; తద్+వృత్తాంతమున్= ఆ సంగతిని; అంతను= సర్వమున్నూ; తెలియన్+చెప్పి= తెల్లంగా విశదీకరించి; విలోల+అక్షములందు= మిక్కిలి చలించే కన్నులలో; బాష్ప, సలిల+ఉద్గమముగన్= కన్నీరు కారుతుండగా; కడున్= మిక్కిలి; కోపమునన్= ఆగ్రహంతో; తల= శిరస్సు; వాంచి+ఉండెన్= వాల్చి ఉన్నది.

**తాత్పర్యం:** యౌవనంలో ఉన్న కృష్ణ తన మామగారికి చలించునట్టి కన్నులనుండి నీరు ఉప్పొంగి ప్రవిస్తుండగా, జరిగిన సంగతి తెలియచెప్పి, మిక్కుటమైన కోపంతో తలవాల్చి నిలిచి ఉన్నది.

**వ. రైభ్యుండు నయ్యవక్రీతున కలిగి నిజకోపానల శిఖాయమానైక జటావలంబనకరుండై హుతాశనునందు వేల్చి, యయ్యగ్నికుండంబునందు. 265**

**ప్రతిపదార్థం:** రైభ్యుండు= రైభ్యుడు; ఆ+యవక్రీతునకు= ఆ యవక్రీతుడిపై; అలిగి= కోపించి; నిజ, కోప+అనల, శిఖాయమాన+ఏక, జటా+అవలంబన, కరుండు+ఐ= తనయొక్క ఆగ్రహం అనేటటువంటి అగ్నియొక్క జ్వాలగా రూపొందిన ఒక జడను గ్రహించిన చేయి కలవాడై; హుతాశనునందు= అగ్నిహోత్రంలో; వేల్చి= హోమంచేసి; ఆ+అగ్ని, కుండంబునందున్= ఆ అగ్నికుండంలో.

**తాత్పర్యం:** రైభ్యుడికి యవక్రీతుడిపై పట్టరాని కోపం వచ్చింది. రైభ్యుడు తనకోపం అనే అగ్ని యొక్క జ్వాలతో సమానమైన ఒక జడను శిఖనుండి లాగి చేతితో పుచ్చుకొని అగ్నిహోత్రంలో వేల్చాడు. ఆ అగ్నికుండంలో.

**క. లలితాంగిఁ బడసెఁ దనకో । డలిరూపముకంటెఁ గడు బెడంగగు రూపో
జ్జ్వలకాంతి గలుగుదానిం । బొలఁతుక నొక్కర్తు నతితపోవీర్యమునన్. 266**

**ప్రతిపదార్థం:** లలిత+అంగిన్= సుకుమారమైన దేహం కలదానిని; తన, కోడలి, రూపముకంటెన్= తనకోడలి ఆకారం కంటె; కడు= మిక్కిలి; బెడంగు+అగు= మనోహరమైన; రూప+ఉజ్జ్వల, కాంతి, కలుగు దానిన్= అందమయిన ఆకృతి కలిగి ప్రకాశించే లావణ్యం కలదానిని; పొలఁతుకన్= సుందరిని; ఒక్కర్తున్= ఒక్కదానిని; అతి+తపస్+వీర్యమునన్= గొప్పతపస్సుయొక్క బలంచేత; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** తన కోడలికంటె మిక్కుటమైన సౌందర్యం, లావణ్యం కలిగిన ఒక సుందరాంగిని తన గొప్ప తపోమహిమచేత పొందాడు.

**వ. మఱియు నొక్కజట యవలంబించి వేల్చిన నందు వికృత దంష్ట్రాకరాళంబైన ముఖంబుతో శూలహస్తుండైన యొక్కరాక్షసుండు పుట్టె; నయ్యిద్దఱు ముకుళితహస్తులై 'మాకుం బని యేమి?' యని యడిగిన 'నవినీతుండైన యవక్రీతు వధియింపుం' దని పంచిన. 267**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; ఒక్క, జట+అవలంబించి= (తన శిఖయందలి) ఒక్క జడ పుచ్చుకొని; వేల్చినన్= హోమం చేయగా; అందున్= ఆ అగ్నికుండంలో; వికృత, దంష్ట్రా, కరాళంబు+ఐన= వంకర కోరలతో భయంకరమైన ముఖంతో; శూల, హస్తుండు+ఐన= బల్లెంతో కూడిన చేయికలవాడైన (చేత బల్లెం ధరించిన); ఒక్క, రాక్షసుండు, పుట్టెన్= ఒక రాక్షసుడు పుట్టాడు; ఆ+ఇద్దరు= ఆ ఇద్దరు; ముకుళిత, హస్తులు+ఐ= మోడ్చిన చేతులు కలవారై; మాకున్+పని+ఏమి?= మేము చేయవలసిన పని ఏమిటి?; అని= అంటూ; అడిగినన్= ప్రశ్నించగా; అవినీతుండు+ఐన= సత్ప్రవర్తన లేనటువంటి; యవక్రీతున్= యవక్రీతుడిని; వధియింపుండు= సంహరించండి; అని= అని చెప్పి; పంచినన్= నియోగించగా.

**తాత్పర్యం:** రైభ్యుడు ఇంకనూ, ఒకజడను పరిగ్రహించి హోమం చేశాడు. ఆ హోమకుండంనుండి వంకరకోరలతో భయాన్ని కొలిపే ఒక రాక్షసుడు జన్మించాడు. ఆ రాక్షసుడి చేతిలో బల్లెం ఉన్నది. ఆ ఇద్దరూ చేతులు జోడించి

నమస్కరించి, 'మేము చేయవలసిన కర్తవ్యాన్ని శాసించండి' అని అడుగగా 'దుష్టస్వభావం కల యవక్రీతుడిని సంహరించండి' అని రైభ్యుడు వారిని ఆదేశించాడు.

**క. ఆ తరుణి మున్న చని మద । నాతురుఁడై వికృతచిత్తుఁడై యున్న యవ**
**క్రీతు కరకమండలువుం । బ్రీతిఁ బ్రబోధించి కొనియె బెడఁగుగ నంతన్. 268**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతట; ఆ తరుణి= ఆ జవరాలు; మున్ను+అ= ముందుగా; చని= వెళ్ళి; మదన+ఆతురుఁడు+ఐ= మన్మథుడి ఉద్రేకానికి లోబడినవాడై; వికృత, చిత్తుఁడు+ఐ= మనస్సులో స్వస్థత కోల్పోయినవాడై; ఉన్న= ఉన్నట్టి; యవక్రీతు, కర, కమండలువున్= యవక్రీతుడి చేతిలో ఉన్న కమండలాన్ని (కమండలువు= ఋషులు చేతితో పట్టుకొని ఉండే జలపాత్రిక); ప్రీతిన్+ప్రబోధించి= అనురాగం అంకురింపచేసి; బెడఁగుగన్= విలాసంగా; కొనియెన్= సంగ్రహించింది.

**తాత్పర్యం:** ఆ జవ్వని ముందుగా వెళ్ళి మదనోద్వేగంతో వికారమైన మనస్సుతో ఉన్న ఆయవక్రీతుడిదగ్గరకు చేరి, అనురాగాన్ని మేలుకొలిపి, విలాసంగా అతడిచేతిలో ఉన్న కమండలాన్ని సంగ్రహించింది.

**విశేషం:** (1) నన్నయభట్టు- 'ప్రబోధించు' అన్న పదాన్ని ప్రయోగించిన స్థలాలు ప్రత్యేకంగా అనుశీలించతగినవి. తాను సంకల్పించిన భావాన్ని ఎదుటివారి మనస్సులను ఆకర్షించేటట్లు చేసి సుస్థిర ప్రభావాన్ని వహించటం అనే అర్థంలో 'ప్రబోధించు' అనే పదం ప్రయుక్తం. (2) అతడు మదనాతురుడు. వికృతచిత్తుడు. అందుచేత ప్రబోధ ప్రభావం సులువుగా ప్రసరించింది.

**క. అపహృత కమండలుండై । యపవిత్రుం డగుటఁ జేసి యధికతపోవీ**
**ర్య పరిక్షయ మగుడును నా । తపస్విసుతు రాక్షసుండు దడయక తాఁకెన్. 269**

**ప్రతిపదార్థం:** అపహృత, కమండలుండు+ఐ= అపహరించబడిన కమండలం కలవాడై; న+పవిత్రుండు+అగుటన్+చేసి= పావనత్వాన్ని కోల్పోయినవాడు అవటంచేత; అధిక, తపస్+వీర్య, పరిక్షయము+అగుడును= మిక్కుటమైన తపస్సుయొక్క శక్తి నశించిపోవటం వలన; ఆ తపస్వి, సుతున్= ఆ ఋషికుమారుడిని; రాక్షసుండు= రాక్షసుడు; తడయక= ఆలస్యంచేయక; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** తన కమండలం ఆ లేజవరాలిచేత అపహరించబడింది. అందుచేత యవక్రీతుడు అపవిత్రుడైనాడు. అతని గొప్ప తపశ్శక్తి నశించిపోయింది. అందుచేత రాక్షసుడు ఆలస్యం చేయక ఆ ఋషికుమారుడైన యవక్రీతుడిని ఎదుర్కొన్నాడు.

**వ. వానికి వెఱచి పఱచి యవక్రీతుండు మహానదులు గొలంకులు సొచ్చిన నవి శుష్కంబులైనఁ దన జనకు నగ్నిహోత్రంబుఁ జొచ్చునంత. 270**

**ప్రతిపదార్థం:** వానికి= అతడికి- ఆ రాక్షసుడికి; వెఱచి= భయపడి; పఱచి= పారిపోయి; యవక్రీతుండు= యవక్రీతుడు; మహానదులు= గొప్పయేరులలో; కొలంకులు= సరస్సులలో; చొచ్చినన్= ప్రవేశించగా; అవి= ఆ నదులున్నూ, కొలనులున్నూ; శుష్కంబులు+ఐనన్= ఇంకిపోగా; తన, జనకు+అగ్నిహోత్రంబున్= తన తండ్రి అగ్నిశాలను; చొచ్చునంత= ప్రవేశించినంత;

**తాత్పర్యం:** ఆ రాక్షసుడికి భయపడి యవక్రీతుడు పారిపోయి గొప్పనదులలో, సరస్సులలో ప్రవేశించాడు. కాని, అవి ఎండిపోయినవి. అంత అతడు తనతండ్రియొక్క అగ్నిహోత్రశాలలో ప్రవేశించి దాక్కొన్నాడు.

**ఆ. మునికుమారు నెగిచికొని వచ్చి నిశితశూ। లాయుధమునఁ బొడిచి యాసురమున**
**రక్కసుండు చంపి, యక్కాంతయును దాను। నరిగె రైభ్యుకడకు నాక్షణంబ. 271**

**ప్రతిపదార్థం:** రక్కసుండు= రాక్షసుడు; మునికుమారున్= ఋషిపుత్రుడిని; ఎగిచికొని వచ్చి= వెంబడించి చేరి; నిశిత, శూలాయుధమునన్= వాడిఅయిన బల్లెముతో; పొడిచి= గుచ్చి; ఆసురమునన్= రాక్షసత్వంతో; చంపి= వధించి; ఆ+కాంతయును+ తానున్= ఆ వనితయు, తానున్నూ; ఆ క్షణంబు+అ= ఆక్షణమే; రైభ్య కడకున్= రైభ్యుడి దగ్గరకు; అరిగె= వెళ్ళారు.

**తాత్పర్యం:** ఆ రాక్షసుడు ఋషిపుత్రుడైన యవక్రీతుడిని వెంటాడి, వాడియైన ఈటెపోటుతో అతడిని క్రూరంగా పొడిచి చంపాడు. పిమ్మట ఆ రాక్షసుడున్నూ, ఆజవ్వనియున్నూ రైభ్యుడిదగ్గరకు వెళ్ళారు.

**విశేషం:** ఇక్కడ సంస్కృత భారతంలో యవక్రీతుడు తన తండ్రియొక్క అగ్నిహోత్రశాలను ప్రవేశింపబోతున్నంతలో గృహపాలకుడైన సేవకుడు ద్వారంలో అతడిని అడ్డగించినట్లు, వెంట తరుముకొని వస్తున్న ఆ రక్కసుడు అపుడు యవక్రీతుడిని శూలంతో పొడిచి వైచినట్లు ఉంది. తన జనకుని అగ్నిహోత్రగృహాన్ని ప్రవేశిస్తే రాక్షసుని వలన భయం ఉండదని యవక్రీతుని అభిప్రాయం. యవక్రీతుడు అశుచియై ఉన్నందున కాబోలు గృహపాలకుడు అతడిని అగ్నిహోత్రశాలలోనికి ప్రవేశించనీయక అడ్డగించాడు. చూ. భండార్కరు సంస్థ ప్రతి III-137 అధ్యా., 17&18 శ్లో.; III-138 అధ్యా,, 7&8 శ్లో.

**వ. రైభ్యుండును వానికి భార్యగాఁ గృత్తి నిచ్చె; నంత నిట భరద్వాజుండు వనంబుననుండి వచ్చి తన కెప్పుడుం బ్రత్యుత్థానంబు జేయునగ్ను లప్పు డడంగియున్న నచ్చెరువడి గృహపాలకుండైన శూద్రువలన నంత వృత్తాంతం బెఱింగి, నిహతుం డైన పుత్త్రుం జూచి దుఃఖితుండై. 272**

**ప్రతిపదార్థం:** రైభ్యుండును= రైభ్యుడుకూడ; వానికి= ఆ రాక్షసుడికి; భార్యగాన్= భార్యగా; కృత్తిన్= కృత్తిని (హోమకుండంలో ఉద్భవించిన లేజవరాలిని); ఇచ్చెన్= ఇచ్చాడు; అంతన్= అటుపిమ్మట; ఇట= ఇక్కడ; భరద్వాజుండు= భరద్వాజ మహర్షి; వనంబుననుండి= అరణ్యంలోనుండి; వచ్చి= వచ్చి; తనకు+ఎప్పుడున్= తనకు ఎల్లప్పుడు; ప్రత్యుత్థానంబు+చేయు= లేచి నిల్చొను; అగ్నులు= నిప్పులు; అప్పుడు= ఆ సమయాన; అడంగి+ఉన్నన్= అణగిపోయి, నివురుగప్పి ఉండగా; అచ్చెరువడి= ఆశ్చర్యమంది; గృహ, పాలకుండు+ఐన= ఇంటిని కాపాడేటటువంటి; శూద్రువలనన్= సేవకుడి వలన; అంత, వృత్తాంతంబు= జరిగినదంతయు; ఎఱింగి= తెలిసికొని; నిహతుండు+ఐన= మరణించినటువంటి; పుత్త్రున్+చూచి= కొడుకును చూచి; దుఃఖితుండు+ఐ= శోకించినటువంటివాడై.

**తాత్పర్యం:** రైభ్యుడు ఆ రాక్షసుడికి భార్యగా కృత్తిని ఇచ్చాడు. అంత, ఇక్కడ భరద్వాజుడు అడవినుండి ఆశ్రమానికి వచ్చాడు. నిత్యం అతడికి లేచి స్వాగతం ఆచరించే అగ్నులు ఆనాడు అణగి నివురుగప్పి ఉన్నాయి. భరద్వాజుడికి ఆశ్చర్యం కలిగింది. అంత గృహపాలకుడైన సేవకుడివలన జరిగిన సంగతి తెలిసికొని కుమారుడి మరణానికి మిక్కిలి దుఃఖించాడు.

**ఆ. 'రైభ్యుఁ డధికకోపరతుఁ డంటి, నమ్ముని। యాశ్రమంబుదెసకు నరుగ వలవ**
**దంటి; వినఁగ నొల్లవైతి నా పలుకులు;। గర్వితునకు బుద్ధి గాన నగునె?' 273**

**ప్రతిపదార్థం:** రైభ్యుఁడు= రైభ్యమహాముని; అధిక, కోపరతుఁడు+అంటిన్= మిక్కుటమైన ఆగ్రహ స్వభావం కలవాడు అని చెప్పిఉన్నాను; ఆ+ముని+ఆశ్రమంబు, దెసకున్= ఆ ఋషియొక్క ఆశ్రమం దిక్కుకు; అరుగ, వలవదు+అంటి= వెళ్ళ వద్దు

అని చెప్పి ఉన్నాను; నా పలుకులు= నా మాటలు; వినఁగన్= వినటానికి; ఒల్లవు+ఐతి(వి)= ఇష్టపడలేదు; గర్వితునకు= గర్వంలో ఉన్నవాడికి; బుద్ధి= మంచి అభిప్రాయం; కానన్+అగునె?= కనిపిస్తుందా?

**తాత్పర్యం:** 'రైభ్యుడు మిక్కిలి కోపంకలవాడని నీకు నేను ముందుగానే చెప్పిఉన్నాను కదా! ఆ మునిఆశ్రమంప్రాంతానికి వెళ్ళవద్దని కూడా హెచ్చరించి ఉన్నాను. నీవు నామాట వినలేదు. గర్వం కలవాడికి మంచిబుద్ధి కలుగుతుందా!'

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ.** **అని ప్రలాపించుచు భరద్వాజుండు వాని దహించి, పుత్త్రశోక దహనంబు సహింపనోపక తద్దహనంబున దేహ త్యాగంబుఁ జేసె; నంత బృహద్ద్యుమ్నుండను రాజు సత్త్రయాగంబు చేయుచుండి, రైభ్య పుత్త్రుల నర్థావసుపరావసులం దనకు ఋత్విజులంగా వరియించిన నయ్యిరువురుఁదండ్రిచే ననుజ్ఞాతులై వానియజ్ఞంబు నడుపుచుండి, యొక్కనాఁడు పరావసుండు నిజాశ్రమంబునకు వచ్చువాఁడు వేగుఁబోక చీఁకటి నడవిలో నేకతంబ తనకు నెదురుగా వచ్చు రైభ్యు నెఱుంగక మృగంబకా వగచి నిజప్రాణ భయంబున వధియించి పదంపడి యెఱింగి పరమదుఃఖితుండై ప్రేతకార్యంబులు దీర్చి, బృహద్ద్యుమ్ను సత్త్రంబునకు వచ్చి తన చేసిన పితృఘాతం బగ్రజునకుం జెప్పి యిట్లనియె.** **274**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; ప్రలాపించుచు= ఏడుస్తూ; భరద్వాజుండు; వానిన్= (ఆ యవక్రీతుడి శరీరాన్ని) అతనిని; దహించి= అగ్ని సంస్కారంచేసి; పుత్త్ర, శోక, దహనంబు= కుమారుడిమరణం వలన ఏర్పడిన దుఃఖ మనే అగ్నిని; సహింపన్+ఓపక= తాళలేక; తద్+దహనంబునన్= ఆమటంలో పడి; దేహ, త్యాగంబున్+చేసెన్= శరీరాన్ని వీడాడు; అంతన్= అటుపిమ్మట; బృహద్ద్యుమ్నుండు+అను, రాజు= బృహద్ద్యుమ్నుడు అనేపేరు కల ప్రభువు; సత్త్రయాగంబున్= సత్త్రయాగాన్ని; చేయుచు+ఉండి= చేయటానికి ఉపక్రమించి ఉండి; రైభ్యపుత్త్రులన్= రైభ్యుడి కొడుకులను; అర్థావసు, పరావసులన్= అర్థావసుడు, పరావసుడు అనేవారిని; తనకు= తనకు; ఋత్విజులంగా= యాజ్ఞికులుగా; వరియించినన్= ఎన్నుకొనగా; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరున్నూ; తండ్రిచేన్= తండ్రిచేత; అనుజ్ఞాతులు+ఐ= అనుమతి పొందినవారై; వాని యజ్ఞంబు= అతడి యజ్ఞం, ఆ బృహద్యుమ్నుడి సత్రయాగం; నడుపుచుండి= నిర్వహిస్తూ; ఒక్కనాఁడు= ఒకానొకరోజు; పరావసుండు= పరావసుడు; నిజ+ఆశ్రమమునకు= తన ఋషివాటికకు; వచ్చువాఁడు= వచ్చేటప్పుడు; వేగుఁబోక= తెల్లవారుజామున, చీఁకటిన్= అంధకారంలో; అడవిలోన్= అరణ్యంలో; ఏకతంబు+అ= ఒంటరిగా; తనకున్+ఎదురుగా వచ్చు= తనకు ఎదురుగా వచ్చే; రైభ్యున్= రైభ్యుడిని; ఎఱుంగక= తెలియక; మృగంబు+అ+కా వగచి= జంతువు అని తలపోసి; నిజ, ప్రాణ, భయంబున= తన అసువులపై భీతిచొప్పున; వధియించి= సంహరించి; పదంపడి= అటు పిమ్మట; ఎఱింగి= తెలిసికొని; పరమ, దుఃఖితుండు+ఐ= మిక్కిలి శోకించినవాడై; ప్రేత, కార్యంబులు= శవానికి చేయవలసిన అగ్నిసంస్కారాదులు నెరవేర్చి; బృహద్ద్యుమ్ను, సత్త్రంబునకున్= బృహద్ద్యుమ్న మహారాజుయొక్క సత్రయాగశాలకు; వచ్చి= అరుదెంచి; తన, చేసిన, పితృ, ఘాతంబు= తాను చేసిన పితృవధ; అగ్రజునకున్+చెప్పి= అన్నగారికి నివేదించి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని ఏడుస్తూ భరద్వాజుడు, యవక్రీతుడి శరీరానికి అగ్నిసంస్కారం చేసి, పుత్రశోకమనే అగ్నికి తాళలేక తానున్నూ ఆ చితిలో పడి దేహాన్ని త్యజించాడు. అంతట బృహద్ద్యుమ్నుడు అనే రాజు సత్రయాగం చేయ సంకల్పించి, రైభ్యుడి కొడుకులైన అర్థావసు పరావసులను ఋత్విజులుగా ఎన్నుకొన్నాడు. వారున్నూ, తమ తండ్రి రైభ్యుడి అనుమతిని పొంది బృహద్ద్యుమ్నుడి యజ్ఞాన్ని నడుపుతున్నారు. ఒకానొకరోజు పరావసుడు వేకువచీకటిలో

తన ఆశ్రమానికి మరలి వస్తున్నాడు. ఎదురుగా రైభ్యుడు వచ్చాడు. ఆ అడవిలో పరావసుడు ఒంటరిగా వస్తున్న రైభ్యుడిని క్రూరమృగంగా భ్రమించి తనప్రాణాలు కాపాడుకొనదలచి, అతడిని సంహరించాడు. తదుపరి తాను చంపింది తన తండ్రినే అని పరావసుడు తెలిసికొని మిక్కిలి దుఃఖించి, తండ్రి శవానికి అగ్నిసంస్కారాదులు నిర్వర్తించి బృహద్యుమ్నుని సత్రయాగశాలకు వచ్చి తాను చేసిన పితృహత్యను అన్నగారికి నివేదించి ఇట్లా పలికాడు.

**తే.** **'నీవు దీని నొక్కరుఁడవు నిర్వహింప । నోప; వే నొక్కరుండ నయ్యును గడంగి**
**నడప నోపుదుఁ గావున నాతదర్థ । మాచరింపుము బ్రహ్మహత్యావ్రతంబు.'** **275**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; దీనిన్= ఈ సత్రయాగాన్ని; ఒక్కరుఁడవు= ఒక్కడివై, ఒంటరిగా; నిర్వహింపన్+ఓపవు= నెరవేర్చజాలవు; ఏను= నేను; ఒక్కరుండన్+అయ్యును= నేను ఒంటివాడినైనప్పటికీ; కడంగి= పూని; నడపన్+ఓపుదున్= నిర్వహించగలను; కావున= కాబట్టి; నాతదర్థము= నాకు బదులుగా; బ్రహ్మహత్యా, వ్రతంబు= బ్రాహ్మణుడిని చంపినపాపం పోగొట్టే నోము; ఆచరింపుము= చేయుము.

**తాత్పర్యం:** 'ఓ అర్థావసూ! ఈ సత్రయాగాన్ని నీవు ఒక్కడివై నిర్వహించలేవు. నేను ఒక్కడినే అయినా నిర్వహించగలను. కాబట్టి నీవు నాకు బదులుగా బ్రహ్మహత్యను పోగొట్టే వ్రతాన్ని చేయుము'.

**వ.** **అనిన నర్థావసుం'డట్లు సేయుదు' నని బ్రహ్మహత్యావ్రతంబులు సలుపుచుండెఁ; బరావసుండును నొక్కరుండ సత్త్రయాగంబు జరుపుచుండె; నంత నర్థావసుండు బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తంబులఁ జేసి యా సత్త్రయాగంబునకు వచ్చిన, వానిం జూచి పరావసుండు బృహద్యుమ్నున కిట్లనియె.** **276**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అర్థావసుండు= అర్థావసుడు; అట్లు+చేయుదున్= ఆ విధంగా చేస్తాను; అని= అనిచెప్పి; బ్రహ్మహత్యావ్రతంబులు= బ్రాహ్మణుడిని చంపినందుకు సంక్రమించిన పాపాలను పోగొట్టే నోములను; సలుపుచుండెన్= చేస్తున్నాడు; పరావసుండును= పరావసుడు సయితం; ఒక్కరుండు= తాను ఒక్కడే; సత్త్రయాగంబు= సత్రయాగాన్ని; జరుపుచుండెన్= నిర్వహిస్తున్నాడు; అంతన్= అటుపిమ్మట; అర్థావసుండు= అర్థావసుడు; బ్రహ్మ, హత్యా, ప్రాయశ్చిత్తంబులన్+ చేసి= బ్రాహ్మణుడిని చంపినందువలన కలిగిన పాపానికి పరిహారాలు చేసి; ఆ సత్త్రయాగంబునకు= ఆ సత్రయాగం నిర్వహించటంకొరకై; వచ్చిన= రాగా; వానిన్+చూచి= అతడిని (ఆ అర్థావసుడిని) చూచి; పరావసుండు= పరావసుడు; బృహద్యుమ్నునకు= బృహద్యుమ్న మహారాజుతో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా తెలిపాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా అర్థావసుడు అంగీకరించి తాను బ్రహ్మహత్యాపాతకానికి నిష్కృతి కలిగించే వ్రతాలు చేయసాగాడు. పరావసుడు తాను ఒక్కడే సత్రయాగాన్ని నిర్వహిస్తున్నాడు. అంతట, అర్థావసుడు బ్రహ్మహత్య వలన ఏర్పడిన పాపం తొలగటానికి పరిహారవ్రతాలు నిర్వర్తించి తిరిగి సత్రయాగాన్ని నిర్వహించటానికి రాగా, అతడిని చూచి పరావసుడు బృహద్యుమ్నమహారాజుతో ఇట్లా అన్నాడు.

**క.** **'ఇమ్ముని నీ యజ్ఞాయత । నమ్ముఁ బ్రవేశింపఁదగఁడు నరనాయక! యు**
**గ్రమ్ముగ సలిపెడు శుభకా । ర్యమ్ములకుం బాసి బ్రహ్మహత్యావ్రతముల్.'** **277**

**ప్రతిపదార్థం:** ఈ+ముని= అర్థావసుడు; నీ యజ్ఞ+ఆయతనమ్మున్= నీ యాగశాలలో; ప్రవేశింపన్+తగఁడు= ప్రవేశించటానికి అర్హుడు కాడు; నర నాయక!= ఓ మహారాజా!; శుభకార్యములకున్+పాసి= మంచివిగా జరిగే క్రియలను; వీడి; ఉగ్రమ్ముగన్=

తీవ్రంగా; బ్రహ్మ, హత్యా, వ్రతముల్= బ్రాహ్మణుడిని చంపటంచేత ఏర్పడే పాపం పరిహరించటానికై నోములు; సలిపెడున్= చేస్తున్నాడు.

**తాత్పర్యం:** 'ఓ బృహద్ద్యుమ్న మహారాజా! ఈ ఋషి నీ యాగశాల ప్రవేశించటానికి యోగ్యుడు కాడు. ఇతడు శుభకార్యాలను విడిచి, తీవ్రమైన బ్రహ్మహత్యాపాతకాన్ని పరిహరించే వ్రతాలు చేస్తున్నాడు.'

**వ. అనవుడు, బృహద్ద్యుమ్నప్రేరితులైన జనులచేత నుత్సార్యమాణుం డయి యర్థావసుం డనియెఁ 'బరావసుండు గాని యేను బ్రహ్మఘాతకుండఁ గాను; వానికై వ్రతంబు సలిపి తత్పాతకవిముక్తుఁ జేసితి' నని చెప్పిన యర్థావసు యథార్థకథనంబునకు మెచ్చి యగ్నిపురోగములైన దేవతలు వాని కిట్లనిరి. 278**

**ప్రతిపదార్థం:** అనవుడు= అని చెప్పగా; బృహద్ద్యుమ్న ప్రేరితులు+ఐన= బృహద్యుమ్నుడిచేత ఆదేశించబడి (ఆజ్ఞాపించబడిన); జనులచేతన్= మనుష్యులచేత; ఉత్సార్యమాణుండు+అయి= తొలగించబడినవాడై; అర్థావసుండు; అనియెన్= చెప్పాడు; పరావసుండు+కాని= పరావసుడే కాని; ఏను= నేను; బ్రహ్మ, ఘాతకుండన్+కాను= బ్రాహ్మణుడిని చంపినవాడిని కాను; వానికై= అతడి కొరకు; వ్రతంబు, సలిపి= నోములు నోచి; తత్+పాతక, విముక్తున్+చేసితి= అతడిని పాపంనుండి తొలగించాను; అని చెప్పిన= అని చెప్పినటువంటి; అర్థావసు యథార్థ కథనంబునకు= అర్థావసుడు చెప్పిన నిజమైన మాటలకు; మెచ్చి= మన్నించి; అగ్ని, పురస్+గములు+ఐన= అగ్నిని ముందు పెట్టుకొన్నవారైన; దేవతలు= వేల్పులు; వానికి= అతడికి; ఇట్లు+అనిరి= ఈవిధంగా చెప్పారు.

**తాత్పర్యం:** అని చెప్పగా, బృహద్ద్యుమ్న మహారాజుయొక్క అనుచరులు యజ్ఞశాలలోనికి ప్రవేశించనీయక తనను వారించటం చేత అర్థావసుడు ఇట్లా చెప్పాడు: 'బ్రహ్మహత్య చేసింది పరావసుడే కాని నేను కాదు. అతడి పాపాలు తొలగటంకొరకై నోములు నోచిన వాడిని నేను.' ఆమాటలు విని వేల్పులు అతడు చెప్పిన సత్యానికి అతడిని అభినందిస్తూ ఇట్లా పలికారు.

## దేవత లర్థావసునకు మెచ్చి కోరిన వరంబు లెల్ల నిచ్చుట (సం. 3-139-18)

**తే. 'తమ్ముచేసిన దురితముల్ తలఁగఁ బూని । ధర్మబుద్ధివై వ్రతములు పేర్మిఁ జలిపి**
**తనఘ! నీకు నభీష్టంబు లైన వరము । లడుగు మిచ్చెద; మీ మెచ్చు గడవ నగునె!' 279**

**ప్రతిపదార్థం:** తమ్ము, చేసిన= తమ్ముడుచేసిన; దురితముల్= పాపాలు; తలఁగన్+పూని= తొలగించటానికి ప్రయత్నించి; ధర్మబుద్ధివి+ఐ= ధర్మమందు మనస్సు కలవాడివై; వ్రతములు= నోములు; పేర్మిన్= గౌరవంతో; చలిపితి= నెరవేర్చావు; అనఘ!= పాపరహితుడివైన ఓ పవిత్రుడా!; నీకున్= నీకు; అభీష్టంబులు+ఐన= మిక్కిలి ఇష్టాలైన; వరములు= కోరికలు; అడుగుము= వేడుకొమ్ము; ఇచ్చెదము= ఇస్తాము; ఈ మెచ్చు, కడవన్+అగునె= ఈ నీ గొప్పతనం ఊరకే తొలగిపోవదగింది కాదు.

**తాత్పర్యం:** 'పాపరహితుడివైన ఓ పవిత్ర చరిత్రుడా! అర్థావసు మహర్షీ! నీ తమ్ముడు చేసినపాపాలను తొలగించటానికి పూనిన ధర్మాత్ముడివి నీవు. నీవు చేసిన వ్రతాలు గొప్పవి. నీకు మిక్కిలి ఇష్టాలైన వరాలు కోరుకొనుము ఇస్తాం. నీ గొప్పతనం బహూకృతికి అర్హమైనది.'

**వ. అనినఁ దన తండ్రియు భరద్వాజుండును యవక్రీతుండు నెప్పటియట్ల జీవించియుండను, నిజజనకుండు పరావసుచేత నిహతుం డగుట నిస్తరింపను వలయు నని ప్రార్థించి, దేవతల వరంబున నర్థావసుండు రైభ్య భరద్వాజ యవక్రీతుల సంజీవితులం జేసిన నద్దేవతలకు యవక్రీతుం డిట్లనియె. 280**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన (చెప్పగా); తన తండ్రియు= తనతండ్రియు; భరద్వాజుండును= భరద్వాజుడున్నూ; యవక్రీతుండును= యవక్రీతుడున్నూ; ఎప్పటి+అట్లు+అ= లోగడమాదిరిగానే; జీవించి+ఉండను= బ్రతికి ఉండేటట్లు (జీవించాలి); నిజ జనకుండు= తనతండ్రి; పరావసుచేత= పరావసుడిచేత; నిహతుండు+అగుట= చంపబడటం; నిస్తరింపను= (చంపటం వలన ఏర్పడిన) పాపం పరిహరింపను- పాపం పరిహరించబడటం; వలయున్+అని= కావాలని; ప్రార్థించి= వేడుకొని; దేవతల= వేల్పుల; వరంబునన్= అనుగ్రహంవలన; అర్థావసుండు= అర్థావసుడు; రైభ్య, భరద్వాజ, యవక్రీతుల= రైభ్యుడిని, భరద్వాజుడిని, యవక్రీతుడిని; సంజీవితులన్+చేసినన్= తిరిగి బ్రతికించగా; ఆ+దేవతలకు= ఆ వేల్పులకు; యవక్రీతుండు= యవక్రీతుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా, తనతండ్రియును, భరద్వాజుడున్నూ యవక్రీతుడున్నూ యథాపూర్వంగా బ్రతికి ఉండాలనీ, పరావసుచేత తండ్రి చంపబడిన దోషం పరిహరించబడాలనీ వరాలు అనుగ్రహించండని వేల్పులను అర్థావసుడు ప్రార్థించాడు. దేవతల దయవలన, అర్థావసుడు రైభ్య భరద్వాజ యవక్రీతులను తిరిగి బ్రతికించాడు. అప్పుడు యవక్రీతుడు దేవతలతో ఇట్లా పలికాడు.

**విశేషం:** ఈ వచనం రెండవ పంక్తిలో "పరావసుచేత నిహతుండగుట వాని విస్మరింపను వలయునని"- అనే పాఠాంతరం కొన్ని ప్రతుల్లో ఉంది. దీనిని బట్టి పరావసునిచేత నిహతుడైన విషయం తండ్రియగు రైభ్యునకు తెలియకూడదని అర్థావసుడు దేవతలను కోరినట్లు వెల్లడౌతున్నది.

**తే. 'ఏను బహువేదశాస్త్రమ్ము లెఱిఁగి, వ్రతము । లెల్లఁ జేయుచు రైభ్యుచే నిట్లు హతుఁడ**
**నైతి; నాకంటె రైభ్యున కధికశక్తి । యైన తెఱఁ గెట్టు?' లనిన నిట్లనిరి సురలు. 281**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; బహు, వేద, శాస్త్రమ్ములు= వివిధవేదాలు, శాస్త్రాలు; ఎఱిఁగి= తెలిసికొని; వ్రతములు+ఎల్లన్= నోములన్నింటినీ; చేయుచున్= అనుష్ఠిస్తూ; రైభ్యుచేన్= రైభ్యుడిచేత; ఇట్లు= ఈ రీతిగా; హతుఁడను+ఐతిన్= చంపివేయబడ్డాను; నాకంటెన్= నాకంటె; రైభ్యునకు= రైభ్యుడికి; అధికశక్తి= ఎక్కువ మహిమ; ఐన+తెఱుఁగు= ఏర్పడినమార్గం; ఎట్టులు?= ఎట్లా సంభవించింది?' అనినన్= అని అడుగగా; సురలు= వేల్పులు; ఇట్లు+అనిరి= ఈవిధంగా తెలిపారు.

**తాత్పర్యం:** 'నేను వివిధశాస్త్రాలను, వేదాలను ఎరిగినవాడిని, సమస్తవ్రతాలు దీక్షతో ఆచరించినవాడిని. కాని, ఈ విధంగా రైభ్యుడిచేత ఏల సంహరించబడినాను? నాకంటె రైభ్యుడికి హెచ్చుశక్తి ఏరీతిగా లభించింది?' అని ప్రశ్నించగా, యవక్రీతుడికి దేవతలు ఈవిధంగా సమాధానం చెప్పారు.

**క. 'గురుశుశ్రూష యొనర్చుచుఁ । బరమక్లేశమునఁ జేసి పడసిన విద్యల్**
**స్ఫురియించుఁగాక; గురుముఖ । విరహితముగఁ బడసినవియు వెలయునె యెందున్? 282**

**ప్రతిపదార్థం:** గురు, శుశ్రూష= గురువుగారికి పరిచర్య; ఒనర్చుచున్= చేస్తూ; పరమ, క్లేశమునన్+చేసి= మిక్కిలి కష్టపడటంచేత; పడసిన, విద్యల్= పొందిన చదువులు; స్ఫురియించున్+కాక= శోభిల్ల గలవుకాని; గురు, ముఖ, విరహితముగన్= అధ్యాపకుడి

ముఖతః; (నోటిద్వారా) ఉపదేశపూర్వకంగా అభ్యసించకుండా; పడసినవియు= పొందినట్టివి; ఎందున్= ఎక్కడైనా; వెలయునె= శోభిల్లుతాయా!.

**తాత్పర్యం:** 'గురువుగారికి పరిచర్యచేస్తూ, మిక్కుటమైన ప్రయాసను ఓర్చుకొని అభ్యసించిన చదువులు శోభిస్తాయి కాని, అధ్యాపకుడి ద్వారా (గురు ముఖత); అభ్యసించకుండా ఆర్జించిన విద్యలు ఎక్కడైనా శోభిస్తాయా!

**వ. నీవు గురుముఖంబునం బడయక యొండు విధంబునం బడయుటం జేసి నీయధ్యయనశ్రుతంబులు నిర్వీర్యంబు లయ్యె; గురుసంతోషకరుండై రైభ్యుండు బ్రహ్మజ్ఞానం బుపార్జించెం గావున నాతం డిట్టి శక్తివడసె నని దేవతలు దివంబున కరిగి; రిది యవక్రీతు నివాసం; బిందు వసియించినవారు దురిత విముక్తులగుదు; రిది కాలశైలం; బిది సప్తవిధం బైన గంగ; యిది మనుష్యుల కగోచరం; బింద యుండి సమాధి శౌచపరులై చూడుం; డిది మందరనగం; బిందు నానాప్రహరణపాణులై యష్టాశీతిసహస్రగంధర్వులు కిన్నరకింపురుష సుపర్వులు సురేంద్రుం గొలిచి పోయెద; రిందుల కాఱునూఱుయోజనంబులు గలదు కైలాసపర్వతం; బందు గుబేరుం డుండు' నని రోమశుండు సెప్పినం బాండవులు కృతసమాధిశీలురై వాని నెల్లం జూచి; రంత నంతక సుతుండు భీమున కిట్లనియె. 283**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; గురు, ముఖంబునన్= గురువు నోటినుంచి; పడయక= పొందక; ఒండు, విధంబునన్= వేరొక విధంగా; పడయుటన్+చేసి= సంపాదించటంచేత; నీ అధ్యయన, శ్రుతంబులు= నీ చదువులు, వేదాలు; నిర్+వీర్యంబులు+ అయ్యె= పటుత్వం లేనివి అయినాయి; గురు, సంతోష, కరుండు+ఐ= అధ్యాపకుడికి సంతోషం కలిగించినవాడై; రైభ్యుండు= రైభ్యుడు; బ్రహ్మజ్ఞానంబు= వేదాలను గూర్చిన జ్ఞానాన్ని; ఉపార్జించెన్= సంపాదించాడు; కావునన్= కాబట్టి; ఆతండు= ఆ రైభ్యుండు; ఇట్టి, శక్తి= ఈ విధమైన మహిమ; పడసెన్= పొందాడు; అని= అని చెప్పి; దేవతలు= వేల్పులు; దివంబునకు+అరిగిరి= స్వర్గానికి వెళ్ళారు; ఇది= ఈ చోటు; యవక్రీతు నివాసంబు= యవక్రీతుడు నివసించిన స్థలం; ఇందు= ఇక్కడ; వసియించినవారు= ఉన్నవారు; దురిత, విముక్తులు+అగుదురు= పాపంనుండి విడివడిన వారౌతారు. ఇది= ఈ క్షేత్రం; కాలశైలంబు= కాలపర్వతం; ఇది= ఇది; సప్త, విధంబు+ఐన= ఏడు పాయలు అయిన; గంగ= గంగానది; ఇది= ఇది; మనుష్యులకు= మానవులకు; న+గోచరంబు= కనిపించనటువంటిది; ఇందు+అ+ఉండి= ఇక్కడే నిలిచి; సమాధి, శౌచ, పరులు+ఐ= సమాధి యోగానికి చెందిన నిర్మలత్వాన్ని అలవరచుకొన్నవారై; చూడుండు= చూడండి; ఇది; మందరనగంబు= మందరమనే పేరుకల పర్వతం; ఇందు= ఈ పర్వతంలో; నానా, ప్రహరణ, పాణులు+ఐ= పెక్కువిధాలైన ఆయుధాలను ధరించిన చేతులు కలవారై; అష్ట+అశీతి సహస్ర గంధర్వులు= 88వేల మంది గంధర్వులు; కిన్నర, కింపురుష, సుపర్వులు= కిన్నరులు, కింపురుషులు, దేవతలు; సుర+ఇంద్రున్= దేవేంద్రుడిని; కొలిచి, పోయెదరు= సేవించి వెళ్ళుతారు; ఇందులకు= ఇక్కడికి; అఱు, నూఱు, యోజనంబులు= ఆరువందల ఆమడలు (ఆమడల దూరాన); కైలాస పర్వతంబు= కైలాసం అనేకొండ; కలదు= ఉన్నది; అందున్= ఆ కైలాస పర్వతమందు; కుబేరుండు+ఉండున్= కుబేరుడు (అనే దిక్పాలకుడు, ధనాధీశుడు) ఉంటాడు; అని= అంటూ; రోమశుండు+చెప్పినన్= రోమశమహర్షి చెప్పగా; పాండవులు= పాండుసుతులు; కృత, సమాధి, శీలురు+ఐ= చేయబడిన సమాధి అనే యోగం యొక్క స్వభావం కలవారై అనగా సమాధి శీలాన్ని పొందినవారై; వానిన్+ఎల్లన్+చూచిరి= ఆ క్షేత్రాలను అన్నింటినీ దర్శించారు; అంతన్= అటుపిమ్మట; అంతక, సుతుండు= ధర్మపుత్రుడు; భీమునకు= భీమసేనుడితో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** నీవు గురుముఖతః వేదాది విద్యలు పొందలేదు. వేరువిధంగా విద్యలను ఆర్జించటంచేత, అవి శక్తి విహీనాలు అయినాయి. గురువు సంతసిల్లేటట్లు రైభ్యుడు వేదశాస్త్రాదుల జ్ఞానం ఆర్జించటంచేత అతడికి ఇటువంటి

మహిమ ఏర్పడింది- అని చెప్పి వేల్పులు స్వర్గానికి వెళ్ళిపోయారు. ఇది యవక్రీతుడు వసించిన చోటు. ఇక్కడ నివసించిన వారి(కి) పాపాలు నశిస్తాయి. ఇది కాలపర్వతం. ఇది ఏడుపాయల గంగానది. ఇది మనుష్యులకు కనిపించదు. ఇక్కడనే ఉండి, సమాధియోగానికి సంబంధించిన శుచిత్వాన్ని సాధించి దర్శించండి. ఇది మందరగిరి. ఇందు పెక్కు ఆయుధాలు ధరించి ఎనభైఎనిమిదివేలమందిగంధర్వులు, కింపురుషులు, కిన్నరులు, వేల్పులు దేవేంద్రుడిని కొలిచి వెళ్ళుతారు. ఇక్కడికి ఆరువందల ఆమడల దూరంలో కైలాసపర్వతం ఉన్నది. అక్కడ కుబేరుడు ఉంటాడు' - అని రోమశుడు చెప్పాడు. అపుడు పాండవులు సమాధియోగాన్ని సాధించినవారై ఆ యా పుణ్యక్షేత్రాలను దర్శించారు. అంతట ధర్మరాజు భీమసేనుడికి ఈ విధంగా చెప్పాడు.

**సీ. 'దుర్గమం బైన యీ దుర్గమార్గంబున । నడవంగ నేర; మున్నతరథముల**
**నింద్రసేనాదుల నీ ధౌమ్యవిప్రుల । ద్రుపదతనూజను దోడికొనుచు**
**సహదేవుఁడును నీవు చట్టనఁ గ్రమ్మఱుఁ; । దేనును నకులుండు నేఁగి రోమ**
**శాదేశమునఁ జేసి యఖిలతీర్థంబులు । నాడి వచ్చెదము; మా యరుగుదెంచు**

**ఆ. నంత కెంతయును బ్రయత్నంబుతోఁ గృష్ణఁ । గాచి యుండుఁ' డనిన ఘనుఁడు భీముఁ**
**డనియె 'నిట్టి రాక్షసాకీర్ణవనములో । నిన్నుఁ బాయనగునె నిమిషమేని. 284**

**ప్రతిపదార్థం:** దుర్గమంబు+ఐన= నడవటానికి వీలులేని; ఈ, దుర్గ, మార్గంబున= పోగూడనిదారిలో; నడవంగనేరము= నడవలేము; ఉన్నత, రథములన్= పెద్ద తేరులను; ఇంద్రసేన+ఆదులన్= ఇంద్రసేనుడు మొదలైన వారిని; ఈ, ధౌమ్య, విప్రుల= ఈ ధౌమ్యుడిని, బ్రాహ్మణులను; ద్రుపదతనూజను= ద్రౌపదిని; తోడికొనుచున్= వెంటపెట్టుకొని; సహదేవుడును, నీవు= సహదేవుడున్నూ, నీవున్నూ; చట్టనన్+క్రమ్మఱుఁడు= శీఘ్రంగా మరలండి; ఏనును, నకులుండున్= నేనూ, నకులుడున్నూ; రోమశ+ఆదేశమునన్+చేసి= రోమశుడి ఆజ్ఞను అనుసరించి; ఏఁగి= వెళ్ళి; అఖిల, తీర్థంబులున్= అన్ని తీర్థాలలో; ఆడి, వచ్చెదము= స్నానంచేసి రాగలం (వస్తాం); మా+అరుగుదెంచునంతకు= మేం వచ్చేవరకు; ఎంతయును= మిక్కిలి; ప్రయత్నంబుతోన్= పూనికతో; కృష్ణన్= ద్రౌపదిని; కాచి+ఉండుఁడు= రక్షించండి; అనినన్= అని చెప్పగా; ఘనుఁడు= గొప్పవాడు; భీముఁడు+అనియెన్= భీముడు చెప్పాడు; ఇట్టి= ఈవిధమైన; రాక్షస+ఆకీర్ణ, వనములో= రక్కసులతో నిండిన అడవిలో; నిన్నున్= నిన్ను; నిమిషము+ఏని= నిమిషమైనా; పాయన్+అగునె?= విడిచి ఉండవచ్చునా?

**తాత్పర్యం:** 'ఈ మార్గం నడవటానికి కష్టమైనది. ఈ దారిలో నడచి వెళ్ళలేం. పెద్దతేరులను, ఇంద్రసేనుడు మొదలైన ముఖ్యభటులను, ఈ ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులను, ద్రౌపదిని వెంటబెట్టుకొని నీవూ, సహదేవుడూ శీఘ్రంగా మరలిపొండి. నేనున్నూ, నకులుడున్నూ కలిసి వెళ్ళి రోమశమహర్షి ఆజ్ఞానుసారం అన్ని తీర్థాలలో స్నానంచేసి రాగలం. మేము తిరిగి వచ్చేవరకూ జాగ్రత్తగా ద్రౌపదిని కాపాడండి'- అని ధర్మరాజు పలుకగా గొప్పవాడైన భీముడు ఇట్లా అన్నాడు: రాక్షసులతో నిండినటువంటి ఇట్టి అడవిలో నిన్ను ఒక్క నిమిషమైనా ఎడబాసి ఉండటం నాకు తగునా?

**చ. అనఘచరిత్రు నర్జును మహాభుజు నొక్కనిఁ బాసి వంతఁ బొం**
**దిన యెడ నిట్టిచోట సహదేవుఁడు నేనును గృష్ణయున్ జగ**

**జ్జనసుత! నిన్నుఁ బాసిన నసహ్యతరం బగు తీవ్రతాపవే**
**దన యగు; నీకు మాకు నుచితంబె పరస్పరభేద మెన్నఁడున్. 285**

**ప్రతిపదార్థం:** జగత్+జననుత!= లోకంలోని జనులచేత పొగడబడినవాడా!; అనఘ చరిత్రున్= పాపరహితమైన పవిత్ర ప్రవర్తన కలవాడిని; అర్జునున్= అర్జునుడిని; మహాభుజున్= గొప్పపరాక్రమం కలవాడిని; ఒక్కనిన్+పాసి= ఒక్కడిని విడిచి; వంతన్= బాధను; పొందిన+ఎడన్= అనుభవిస్తున్నాం కదా; ఇట్టి, చోటు+అ= ఇటువంటి స్థలంలో; సహదేవుడు; ఏనును+కృష్ణయున్= నేనున్నూ ద్రౌపదియున్నూ; నిన్నున్+పాసినన్= నిన్ను ఎడబాసినచో; అసహ్యతరంబు+అగు= ఓర్చటానికి మరింత కష్టమైన; తీవ్రతాపవేదన+అగున్= మిక్కుటమైన బాధవలన దుఃఖం కలుగుతుంది; నీకు, మాకున్= నీకు, మాకు మధ్య; ఎన్నఁడున్= ఎప్పుడైనా; పరస్పర, భేదము= ఒండొరులు వేఱుపడటం; ఉచితంబె?= సరియైనటువంటిదా?

**తాత్పర్యం:** జగత్తులోని ప్రజలు అందరిచేత ప్రస్తుతించబడిన ఓ ధర్మరాజా! పరమపవిత్రమైన ప్రవర్తన కల అర్జునుడు ఒకడిని మాత్రమే ఎడబాసి ఇంత వేదన పొందుతుండగా, నేను సహదేవుడు ద్రౌపది ఇప్పుడు నిన్ను కూడ ఎడబాసినట్లైతే మరింత భరించరాని బాధ, దుఃఖం మాకు కలుగుతాయి. నీకూ, మాకూ మధ్య పరస్పరం వేఱుపడటం ఎన్నడైనా భావ్యమా? (కాదని అభిప్రాయం).

**క. కడు డస్సి నడవనోపని । యెడ నీ కమలాయతాక్షి నీ కవలను నేఁ**
**దడయక నఱకట నిడికొని । కడఁకం గొనివత్తు విషమగహనాంతములన్. 286**

**ప్రతిపదార్థం:** కడు= చాలా, మిక్కిలి; డస్సి= బడలి; నడవన్+ఓపని+ఎడన్= నడవలేని అప్పుడు; ఈ, కమల+ఆయత+అక్షిన్= కమలాలవలె విశాలమైన కన్నులు కల దానిని, ద్రౌపదిని; ఈ కవలను= ఈ జంట బిడ్డలను- ఈ నకుల సహదేవులను; ఏన్= నేను; తడయకన్= వెంటనే, ఆలస్యం చేయక; అఱకటన్+ఇడికొని= భుజాలపై పెట్టుకొని, (అఱక+కడ= అఱకడ); విషమ, గహన+అంతములన్= ఎత్తు పల్లాలతో నిండిన అడవుల లోపల; కడకన్= పూనికతో; కొనివత్తున్= మోసికొని వస్తాను (రాగలను).

**తాత్పర్యం:** చాలా అలసిపోయి నడవలేకపోయినప్పుడు, కమలాలవంటి కన్నులు కల ఈ ద్రౌపదిని, కవలలు అయిన నకుల సహదేవులను నేను నా వీపుపైకి ఎక్కించుకొని పూనికతో మిట్టపల్లాలతో నిండిన అడవులు, కొండలు దాటేవరకు మోసి తీసికొని రాగలను.

**విశేషం:** 'దడయక యఱకడ నిడికొని' - అని పాఠాంతరం

**వ. ఈ రథంబులతోఁ బోవ నిమ్ము గాదేని వీని నింద్రసేనాదుల నెందేనిం బెట్టి పోద' మనిన రోమశుం డిట్లనియె. 287**

**ప్రతిపదార్థం:** ఈ రథంబులతోన్= ఈ తేరులతో; పోవన్= ప్రయాణించటం; ఇమ్ము+కాదు+ఏని= అనుకూలం కాకపోతే; వీనిన్= ఈ రథాలు మున్నగు వాటిని; ఇంద్రసేన+ఆదులను= ఇంద్రసేనుడు మొదలైనవారిని; ఎందు+ఏనిన్= ఎక్కడైనా; పెట్టి= ఉంచి; పోదము= ప్రయాణిద్దాం; అనిన= అనగా; రోమశుండు= రోమశుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ రథాలతో పోవటం అనుకూలం కాకపోతే వీటిని, ఇంద్రసేనుడు మొదలైన వారిని, ఎక్కడైనా ఉంచి మనం ప్రయాణిద్దాం'- అని చెప్పగా రోమశుడు ఇట్లా పలికాడు.

**క. 'అతులతపోవీర్యబలో । న్నతిఁ బోదము గంధమాదనంబునకు; సమా**
**గతు నందుఁ గాంతు మర్జును । నతివీరు నుదారు సురగణార్చితుఁ బార్థున్.' 288**

**ప్రతిపదార్థం:** అతుల, తపస్+వీర్య, బల+ఉన్నతిన్= సాటిలేని తపస్సు యొక్క పరాక్రమం యొక్క శక్తియొక్క ఉన్నతిచేత-అతిశయంచేత; గంధమాదనంబునకు= గంధమాదన పర్వతానికి; పోదము= వెళ్ళుదాం; అందున్= ఆ కొండ మీద; సమాగతున్= (స్వర్గంనుండి) వచ్చేటటువంటి; అర్జునున్= అర్జునుడిని; అతి వీరున్= గొప్ప శూరుడిని; ఉదారున్= త్యాగ గుణం కలవాడిని; సురగణ+అర్చితున్= దేవతల సమూహాలచేత పూజించబడిన వాడిని; పార్థున్= పృథయొక్క కొడుకును; కాంతుము= చూడగలం.

**తాత్పర్యం:** మనం సాటిలేని తపో వీర్యబల మహిమాతిశయంచేత గంధమాదనపర్వతానికి వెళ్ళుదాం. అక్కడ మనం ఇంద్రలోకం నుండి రాగల ఆ మహావీరుడు, త్యాగస్వభావం కలవాడు, దేవతలచేత పూజించబడినవాడు ఐన అర్జునుడిని చూడగలం.

**విశేషం:** గంధమాదన పర్వతం, పురాణాలలో భూలోకానికి, స్వర్గలోకానికి పొలిమేరగా వర్ణించబడింది.

**వ. అనిన నందఱు సంతసిల్లి యరుగువారు ముందర ననేకప హయరథసనాథంబై యపారకిరాతబల సంకులంబైన దానిఁ బుళిందాధిపతి యైన సుబాహుపురంబుఁ గని, యందు వానిచేతం బూజితులై తమ రథసూతహయనివహంబుల నింద్రసేనాదిభృత్యులను సుబాహునొద్దం బెట్టి, పాదచారులై పాంచాలిని బ్రాహ్మణులను రక్షించికొని గంధమాదనంబున కభిముఖులై యరిగి; రంత ధర్మతనయుండు భీమున కిట్లనియె. 289**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; అందఱు= అంత మంది; సంతసిల్లి= సంతోషించి; అరుగువారు= వెళ్ళుతున్నవారు; ముందర= తమ యెదుట; అనేకప, హయ, రథ, సనాథంబు+ఐ= ఏనుగులు, గుర్రాలు, తేరులతో కూడినటువంటిదై; అపార, కిరాత, బల, సంకులంబు+ఐనదానిన్= మితి లేని ఆటవికభటులతో క్రిక్కిరిసినదానిని; పుళింద+అధిపతి+ఐన= పుళిందులు అనబడే ఆటవికులకు ప్రభువైన; సుబాహు, పురంబున్+కని= సుబాహుడి రాజధానిని చూచి; అందు= ఆ పురంలో; వానిచేతన్= ఆ సుబాహుడిచేత; పూజితులు+ఐ= అర్చించబడిన వారై; తమ, రథ, హయ, సూత, నివహంబులన్= తమ తేరులు, గుర్రాలు, రథ సారథుల సముదాయాలను; ఇంద్రసేన+ఆది, భృత్యులన్= ఇంద్రసేనుడు మొదలైన సేవకులను; సుబాహు+ఒద్దన్= సుబాహుడి దగ్గర; పెట్టి= ఉంచి; పాద, చారులు+ఐ= కాలినడకతో పయనించేవారై; పాంచాలిని= ద్రౌపదిని; బ్రాహ్మణులను= విప్రులను; రక్షించికొని= కాపాడుకొని; గంధమాధనంబునకు= గంధమాదన పర్వతానికి; అభిముఖులు+ఐ= ఎదురైన ముఖాలు కలవారై; అరిగిరి= వెళ్ళారు; అంత= అటుతర్వాత; ధర్మతనయుండు= ధర్మరాజు; భీమునకు= భీమసేనుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా అందరూ సంతోషించారు. ఇక పాండవులు సపరివారంగా ముందుకు పయనించి ఆటవికులకు ప్రభువైన సుబాహుడి రాజధాని చేరారు. ఆ సుబాహుడి నగరం ఏనుగులతో, గుర్రాలతో, రథాలతో సమ్మర్దమైనది. మితిలేని ఆటవిక భటులతో క్రిక్కిరిసినటువంటిది. పాండవులు ఆ సుబాహు డందించిన అతిథిమర్యాదలను పొంది అతడిదగ్గర తమ రథాలను, సారథులను, గుర్రాలను, ఇంద్రసేనుడు మొదలైన సేవకులను

ఉంచి, తాము పాదచారులై గంధమాదనపర్వతం ఉన్న దిక్కుకు పయనించారు. అంతట ధర్మరాజు భీముడితో ఇట్లా పలికాడు.

**సీ. 'అలిగి వజ్రాయుధునైనను బోరిలో । నోర్వంగ నోపు నత్యుగ్రవీరు.**
**జవమునఁ బవనుఁ దేజంబున నాదిత్యుఁ । బోలినవాని, నంభోజనేత్రు,**
**నాయతబాహుఁ, గృతాస్త్రు, సింహస్కంధు । సర్వధనుర్ధరాచార్యు, విజయు,**
**నిత్యక్షమాన్వితు, నీ తమ్ము నర్జును । శుభగుణసుందరుఁ జూచునంత**

**ఆ. కధికతాపతప్త మైనది నా చిత్త; । మొనర నతనితోడ నొక్కటునికి**
**యెన్నఁ డొక్కొ మనకు! నిందఱ కగునాతఁ । డేల మసలెనొక్కొ యిన్ని యేండ్లు!' 290**

**ప్రతిపదార్థం:** అలిగి= కోపించి; వజ్ర+ఆయుధున్+ఐనను= వజ్రాన్ని ఆయుధంగా కలిగిన దేవేంద్రుడిని సైతం; పోరిలోన్= యుద్ధంలో; ఓర్వంగన్+ఓపు= జయించగల; అతి+ఉగ్రవీరు= మిక్కిలి భయంకరమైన శూరుడిని; జవమునన్= వేగంలో; పవనున్= వాయుదేవుడిని; తేజంబునన్= ప్రకాశంలో; ఆదిత్యున్= సూర్యుడిని; పోలిన వానిన్= పోలినవాడిని; అంభోజనేత్రున్= పద్మాలవంటి కన్నులు కలవాడిని; ఆయతబాహున్= నిడివి అయిన చేతులు కలవాడిని; కృత+అస్త్రు= అస్త్రాల ప్రయోగంలో ఆరితేరినవాడిని; సింహస్కంధు= సింహంమూపు వంటి మూపు కలవాడిని; సర్వ, ధనుస్+ధర+ఆచార్యు= అందరు విలుకాండ్రకు గురువు అయినవాడిని; విజయు= విజయాన్నందుకొనేవాడిని; నిత్య, క్షమా+అన్వితు= ఎల్లప్పుడూ ఓర్పుతో కూడి ఉండేవాడిని; నీ తమ్మున్= నీ తమ్ముడైన; అర్జునున్= అర్జునుడిని; శుభ, గుణ, సుందరున్= మంచి గుణాలచేత అందమైన వాడిని; చూచునంతకున్= దర్శించేటంతవరకూ; నా, చిత్తము= నా మనస్సు; అధిక, తాప, తప్తము+అయినది= మిక్కలి బాధచే కాగినటువంటిది అయింది; ఒనరన్= ఒప్పునట్లుగా; అతనితోడన్= ఆ అర్జునుడితో; ఒక్కట+ఉనికి= ఒకేచోట చేరి ఉండటం; మనకు; ఎన్నడు+ఒక్కొ= ఎన్నడో కదా!; ఇందరకు+అగు= ఇంతమందికి ఇంతగా ప్రీతిపాత్రుడయ్యే; ఆతడు= ఆ అర్జునుడు; ఇన్ని+ఏండ్లు= ఇన్ని సంవత్సరాలు; ఏల= ఎందుచేత, మసలెన్+ఒక్కొ= ఆలస్యం చేశాడోకదా.

**తాత్పర్యం:** 'కోపం వస్తే యుద్ధంలో వజ్రాయుధం అస్త్రంగా కల దేవేంద్రుడిని సైతం ఓడించ గల మిక్కిలి భయంకరమైన శౌర్యం కలవాడు, వేగంలో వాయుదేవుడికి, వర్చస్సులో సూర్యుడికి సాటివచ్చేవాడు, పద్మాలవంటి కన్నులు కలవాడు, ఆజానుబాహుడు, విలువిద్యలో ఆరితేరినవాడు, సింహపుమూపులవంటి భుజాలు గలవాడు, విలుకాండ్ర కందరికీ గురువు. ఎల్లప్పుడూ గెలుపునందే వీరుడు. సదా ఓర్పుతో కూడి ఉండేవాడు, నీ తమ్ముడు అర్జునుడు. అటువంటి మంచిగుణాలచేత సుందరుడైన వాడిని చూచేంతవరకు నా మనసు మిక్కిలి పరితాపంచేత కాగుతున్నది. తిరిగి అతడితో కలిసిఉండటం మనకు ఎప్పటికి చేకూరుతుందో కదా! మన అందరి మనసులను ఇంతగా ఆకట్టుకొన్న అర్జునుడు ఇన్ని ఏండ్లు ఎందుకు ఆలస్యం చేశాడో!'.

**విశేషం:** మహాభారతంలోను, ప్రాచీన భారతీయ సాహిత్యంలోను పలుతావుల స్త్రీ పురుషులను వర్ణించే సందర్భంలో ఆంగికాభివర్ణన కనిపిస్తుంది. ఇది సాముద్రిక శాస్త్రంలోని విశేషాలను వర్ణించటం కాదు. అర్జునుడు అంభోజనేత్రుడు. 'అంభోరుహనేత్ర స్త్రీ పాత్రలకు పలుచోట్ల పర్యాయపదం. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం'. ఇంద్రియాలన్నింటిలో కన్నులకు కల ప్రాధాన్యాన్ని ప్రాచీనులు గుర్తించారు. అట్లాగే చేతులు, మూపు, నుదురు మొదలైన అవయవాలు వీరుని రూపవైభవచిహ్నాలు.

**మ. అనుచుం బార్థవిలోకనంబు మదిలో నర్థింపఁగా ధర్మజుం**
**డనవద్యుల్ గడువేడ్కతో నరిగి తా రప్పాండవుల్ గంధమా**
**దనశైలేంద్రముఁ గాంచి రున్నతబృహద్ధాతుస్థలీసంహతిన్**
**ఘనసంధ్యాగమశంక సన్మునులకుం గావించు దానిన్ మహిన్. 291**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని తలపోస్తూ; పార్థ, విలోకనంబు= అర్జునుడిని చూడటం; మదిలోన్= మనస్సులో; అర్థింపఁగా= కోరుకోగా; ధర్మజుండు= ధర్మరాజు; అనవద్యుల్= దోషం లేని పవిత్ర చరిత్రులు; తారు= తాము; ఆ+పాండవుల్= ఆ పాండవులు; కడు= మిక్కిలి; వేడ్కతోన్= సంతోషంతో; అరిగి= పయనించి; మహిన్= భూమిపై; ఉన్నత, బృహత్+ధాతు, స్థలీ, సంహతిన్= ఎత్తైన పెద్దవైన, ధాతువులుండే స్థలాల సమూహాలతో; ఘన, సంధ్యా+ఆగమ, శంక= గొప్పదైన సంజకెంజాయలు క్రమ్ముతున్నాయనే భ్రాంతిని; సత్+మునులకున్= గొప్ప ఋషులకు; కావించుదానిన్= ఏర్పరచే దానిని; గంధమాదన, శైల+ఇంద్రమున్= పర్వతాలలో శ్రేష్ఠమైన గంధమాదనాన్ని; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** అని తలపోస్తూ అర్జునుడిని చూడాలి అనే కోరిక మనస్సులో ఏర్పడగా, పవిత్రచరిత్రులైన పాండవులు ధర్మరాజుతో పాటు మిక్కిలి వేడుకతో ప్రయాణం చేసి, గొప్ప గైరికాదిధాతువులు పలుచోట్ల ఉండటంచేత సంజకెంజాయలు క్రమ్ముతున్నాయనే భ్రాంతిని భూలోకంలోని మహర్షులకు కలిగించే గంధమాదనపర్వతరాజాన్ని సందర్శించారు.

**విశేషం:** అలం: భ్రాంతిమంతం.

**క. నానావర్ణ శిలావిహ । గానేక మృగాభిరామమై భూనారీ**
**నానాభరణవిభూషిత । పీనోన్నతకుచముఁ బోలె వెలిఁగెడు దానిన్. 292**

**ప్రతిపదార్థం:** నానా, వర్ణ, శిలా, విహగ+అనేక, మృగ+అభిరామము+ఐ= పెక్కు రంగులు కల రాళ్ళతోను, పక్షులతోను, పలుజంతువులతోను అందంగా ఉన్నదిన్నీ; భూ, నారీ, నానా, ఆభరణ, విభూషిత, పీన+ఉన్నత, కుచమున్+పోలెన్= భూదేవియొక్క పెక్కు అలంకారాలచేత అలంకరించబడిన దట్టమైన ఎత్తైన చన్నువలె; వెలింగెడుదానిన్= శోభిల్లేదానిని అనగా ఆ గంధమాదనాన్ని.

**తాత్పర్యం:** పెక్కు రంగులు గల రాళ్ళతో, పక్షులతో, పలుజంతువులతో సుందరమై, పలు ఆభరణాలచేత అలంకరించబడిన భూదేవియొక్క స్తనంవలె వెలుగొందుతున్న గంధమాదనాన్ని (చూచారు).

**విశేషం:** అలం: ఉపమ. పైపద్యం నాలుగవ పాదంలో కొన్ని ప్రతులలో "కుచముఁబోలె బెడఁగగుదానిన్"- అనే పాఠాంతరం ఉన్నది.

### పాండవులు గంధమాదనపర్వతంబునకుం బోవుట (సం. 3-143-1)

**క. లలితాచ్ఛ స్ఫటిక శిలా । తలములపైఁ బాఱు విమలతర నిర్ఝరిణీ**
**జలపూరములను తారో । ల్లల దురుహారాలి నుజ్జ్వలం బగు దానిన్. 293**

**ప్రతిపదార్థం:** లలిత+అచ్ఛ, స్ఫటిక, శిలా, తలములపైన్= మనోహరమైనవి; నిర్మలమైనవి, అయిన స్ఫటికశిలలు కల ప్రదేశాలపై; పాఱు= ప్రవహించే; విమల, తర, నిర్ఝరిణీ, జల, పూరములను= మిక్కిలి స్వచ్ఛమైన సెలయేళ్ళయొక్క నీటి వెల్లువలనెడి; తార+ఉల్లలత్+ఉరు, హార+ఆలిన్= ముత్యాలతో చలించే గొప్పదండల సముదాయంతో; ఉజ్జ్వలంబు+అగు= ప్రకాశించే; దానిన్= దానిని.

**తాత్పర్యం:** సొగసైనవి, నిర్మలమైనవి అయిన స్ఫటికపు రాళ్ళుకల ప్రదేశాలపై ప్రవహించే మిక్కిలి స్వచ్ఛమైన సెలయేటి నీటివెల్లువలనెడి, చలించే ముత్యాల హారాలతో ప్రకాశించే గంధమాదనాన్ని చూచారు.

**విశేషం:** ఇక్కడ గంధమాదనంపై ప్రవహించే సెలయేళ్ళు ముత్యాలహారాలవలె ఉన్నవి అని భావం. గంధమాదనపర్వతం భూదేవి స్తనం వలె ఉన్నది. అందున్న సెలయేళ్ళు స్తనాన్ని ఆవరించిన ముత్యాలహారాలవలె ఉన్నాయి. వెనుకటి పద్యానికి ఇది అనుబంధం.

**ఉ. వారలు గంధమాదన మవార్యబలాఢ్యులు సొచ్చుచో మహా**
**మారుత మప్డు వీచె నహిమద్యుతిమార్గము దిఙ్ముఖంబులన్**
**భూరుహపత్రమిశ్ర మయి భూరిపరాగము గప్పఁగా ధరి**
**త్రీరుహశాఖలున్ విఱిగి త్రెళ్ళఁగ గుల్మలతాలి సాల్పడన్. 294**

**ప్రతిపదార్థం:** వారలు= పాండవులు; న+వార్య, బల+ఆఢ్యులు= అడ్డగించటానికి వీలులేని బలం కలవారు; గంధమాదనము+చొచ్చుచోన్= గంధమాదనం చేరేటప్పటికి; అప్డు= ఆ సమయంలో; మహా మారుతము= పెనుగాలి; అ, హిమ, ద్యుతి, మార్గము= సూర్యుడి దారిని (న+హిమ= మంచు కాని, ద్యుతి= వెలుగు అనగా వేడివెలుగు కలవాడు సూర్యుడు); దిక్+ముఖంబులన్= దిక్కుల మొగాలను; భూ, రుహ, పత్ర, మిశ్రము+అయి= చెట్లయొక్క ఆకులతో కలిసి; భూరి, పరాగము= ఎక్కువైన దుమ్ము; కప్పఁగాన్= చుట్టుముట్టుగా; ధరిత్రీ రుహశాఖలున్= చెట్లకొమ్మలు; విఱిగి= ముక్కలై; త్రెళ్ళఁగన్= పడిపోగా; గుల్మ, లతా+ఆలి= పొదలు, తీగలు మొదలైనవి; సాల్పడన్= వరుసగా క్రింద పడిపోయేటట్లు; వీచెన్= ప్రసరించింది.

**తాత్పర్యం:** మహాపరాక్రమవంతులైన పాండవులు గంధమాదన పర్వతాన్ని చేరుకోగానే, పెనుగాలి వీచింది. సూర్యుడిదారి (ఆకాశం), దిగ్దిగంతాలు చెట్ల ఆకులతో కలిసిన దుమ్ముచేత ఆవరించబడ్డాయి. చెట్లకొమ్మలు విరిగి పడ్డాయి. పొదలు లతలు నేలమట్టా లైనాయి.

**చ. కడువడిగాడ్పుచే విఱుగఁగాఁ బడి త్రెళ్ళు మహీరుహాళి చ**
**ప్పుడు విని యందఱుం జెదరి భూమిపయిన్ గగనం బుదగ్రతం**
**బడియెనొ శైలశృంగములు భగ్నము లయ్యెనొ యంచు ధూళి నె**
**క్కడఁ జననేర కొండొరులఁ గానక యుండిరి సంచలాత్ములై. 295**

**ప్రతిపదార్థం:** కడు= మిక్కిలి; వడిగాడ్పుచే= వేగంగల గాలిచేత (ఝంఝామారుతంచేత); విఱుగఁగాన్+పడి= ముక్కలు చేయబడి; త్రెళ్ళు= క్రిందకూలు; మహీరుహ+ఆళి, చప్పుడు= చెట్ల సమూహంవలన కలిగే శబ్దం; విని= ఆలకించి; అందఱున్+చెదరి= పాండవులందరూ ఇటూ అటూ చెదిరిపోయి; భూమిపయిన్= నేలమీద; గగనంబు= నింగి; ఉదగ్రతన్= భయంకరంగా; పడియెనొ= పతనం అయిందో; శైల, శృంగములు= కొండల కొమ్ములు; భగ్నములు+అయ్యెనొ= పగిలిపోయినవో;

అంచు= అని తలపోస్తూ; ధూళిన్= దుమ్ముచేత; ఎక్కడన్= ఎక్కడికీ; చననేరక= వెళ్ళలేక; సంచల+ఆత్ములు+ఐ= మిక్కిలి కదలిన హృదయాలు కలవారై; ఒండొరులన్= ఒకరిని ఒకరు; కానక= చూడజాలక; ఉండిరి= ఉన్నారు.

**తాత్పర్యం:** ఝంఝామారుతంచేత విరుగగొట్టబడి క్రింది పడే చెట్ల సమూహాల చప్పుడు విని, అందరు ఇటూ అటూ కదలిపోయి, నింగి విరిగి భయంకరంగా నేలపై పడిందా, కొండ శిఖరాలు పగిలిపోయినాయా అని తలపోస్తూ మిక్కిలి కంపించిన హృదయాలు కలవారై, దుమ్ము దట్టంగా వ్యాపించటంచేత ఒకరిని ఒకరు చూడలేక పోయారు.

**వ. ఇట్లు మహారేణుపటలం బంధకారంబునుంబోలె నీరంధ్రంబై కప్పినఁ బతిత తరు విటప లతా గుల్మంబులు కరతలంబులం బాయం ద్రోచుచు విశాలదృఢతరుమూలంబు లాశ్రయించి యగ్నిహోత్రంబులతో ధౌమ్య ధర్మజ సహదేవు లొక్కచోట, నుద్యద్గదా కార్ముకుండైన భీమసేనుండును ద్రౌపదియు నొక్కచోట, రోమశుండును నకులుండును బ్రాహ్మణులు నొక్కచోటనుగా నందఱు వేఱు వేఱ యుండి రంత. 296**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మహారేణుపటలంబు= గొప్పదుమ్ముకణాల సమూహం; అంధకారంబునున్+పోలె= చీకటివలె; నీరంధ్రంబు+ఐ= దట్టంగా; కప్పినన్= మూయగా (అంతట ఆవరించగా); పతిత తరు విటప లతా గుల్మంబులు= పడిపోయిన చెట్లయొక్క కొమ్మలు, తీగలు, పొదలు; కరతలంబులన్= అరచేతులతో; పాయన్+త్రోచుచు= ప్రక్కకు నెట్టుతూ; విశాల, దృఢ, తరు, మూలంబులు= పెద్దవి, చెక్కు చెదరనటువంటివి అయిన చెట్ల మొదళ్లను; ఆశ్రయించి= చేరి; అగ్నిహోత్రంబులతో= ఆరాధనకు ఉపకరించే నిప్పుతో; ధౌమ్య, ధర్మజ, సహదేవులు+ఒక్కచోటన్= ధౌమ్యుడు, ధర్మరాజు, సహదేవుడున్నూ ఒకచోట; ఉద్యత్+గదా, కార్ముకుండు+ఐన= ప్రకాశిస్తున్న గద, విల్లు పట్టుకొనిఉన్న; భీమసేనుండును= భీముడును; ద్రౌపదియున్= ద్రౌపదియును; ఒక్కచోటన్= ఒక స్థలంలో; రోమశుండును, నకులుండును, బ్రాహ్మణులును= రోమశుడు, నకులుడు, విప్రులును; ఒక్క చోటను+కాన్= ఒక్క స్థలంలో ఉండేటట్లుగా; అందఱు= అందరు; వేఱు, వేఱ= వేరు వేరు స్థలాలలో; ఉండరి= నిలిచి ఉన్నారు; అంతన్= అటు పిమ్మట.

**తాత్పర్యం:** ఈ విధంగా గొప్ప దుమ్ము దూమారం రేగి చీకటివలె దట్టంగా వ్యాపించింది. పడిపోయిన చెట్ల కొమ్మలను, తీగలను పొదలను అరచేతులతో అవతలకు త్రోస్తూ, పెద్దపెద్ద చెట్ల మొదళ్ళను చేరి నిలిచి పాండవబృందం మూడు భాగాలుగా వీడిపోయింది. ధౌమ్యుడు ధర్మరాజు సహదేవుడు ఒకచోట, గద, విల్లు పట్టుకొని భీముడు ద్రౌపది ఒకచోట, రోమశుడు నకులుడు విప్రులు ఒకచోట వేరు వేరై చేరి నిలిచారు.

**చ. కురిసెఁ బ్రచండవృష్టి ఘనఘోషము లెల్ల కెలంకులన్ భయం**
**కరములుగాఁ గరాళకరకాతతు లొప్పఁ దటిల్లతాళి వి**
**స్ఫురితముగాఁ బ్రపూర్ణ జలపూరముల న్గిరికుంజభూరిని**
**ర్ఝరతటినీతటీనికట సాలచయంబు విమూలితంబుగన్. 297**

**ప్రతిపదార్థం:** ప్రచండ, వృష్టి= గొప్పవాన; ఘన, ఘోషములు= మేఘ గర్జనలు; ఎల్ల కెలంకులన్= అన్ని దిక్కులలో; భయంకరములు, కాన్= భయం కలిగించేవి కాగా; కరాళకరకా+తతులు= భయానకమైన వడగళ్ళు; ఒప్పన్= విలసిల్లగా; తటిత్+లతా+ఆళి= తటిల్లతాళి= మెరుపు తీగల సమూహం; విస్ఫురితముగాన్= మిరుమిట్లు కొలుపగా; ప్ర, పూర్ణ, జల, పూరములన్= మిక్కిలి నిండిన నీటి వెల్లువలచేత; గిరి, కుంజ, భూరి, నిర్ఝరతటినీ, తటీ, నికట, సాలచయంబు= కొండలదరి

నున్న పొదలు, పెద్ద సెలయేళ్ళు గట్ల దరి నున్న మద్దిచెట్ల సమూహం; విమూలితంబుగన్= వేళ్ళతోపాటు పెకలి పడిపోయేటట్లుగా; కురిసెన్= కురిసింది.

**తాత్పర్యం:** గొప్పవాన కురిసింది. చుట్టుప్రక్కల మేఘగర్జనలు భయాన్ని సృష్టించాయి. పెద్దపెద్ద వడగళ్ళు పడ్డాయి. మెరుపు తీగలు మిరుమిట్లు కొలిపాయి. నీరు అంతటా ఆవరించి ప్రవహించసాగింది. కొండల దరి నున్న పొదలు, పెద్ద పెద్ద సెలయేళ్ళు గట్ల దాపున ఉన్న (పెద్ద) మద్ది చెట్లు వేళ్ళతోపాటు పెకలించబడి కూలాయి.

**వ. అట్లు గాడ్పుతోడి వాన పెద్దయుంబ్రొద్దు కురిసి యుడిగిన నందఱు నొక్కచోటికి వచ్చి యెప్పటియట్ల యరుగు నెడ, నతివిషమ శిలాసంకటపథంబున నడవనేరక ద్రౌపది తొడరిపడి మూర్ఛిత యైనం బవనతనయుం డక్కోమలి నెత్తికొని యజనాస్తరణంబుపయిం బెట్టి కదళీదళంబుల వీచుచున్నం గవలు దాని పల్లవతామ్ర పాదతలంబు లాయుధాభ్యాసవశంబునం గిణీభూతంబులయిన తమ కరతలంబులంజేసి మెత్తన యొత్తుచుండి; రట్టి యవసరంబున ద్రౌపదిం జూచి దుఃఖితుం డయి ధర్మతయుం డిట్లనియె. 298**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; గాడ్పుతోడివాన= గాలితో కూడిన వర్షం; పెద్దయున్+ప్రొద్దు= చాలా సేపు; కురిసి= వర్షించి; ఉడిగినన్= వెలసిపోగా, వెలిశాక; అందఱున్= పాండవులంతా; ఒక్క, చోటికి, వచ్చి= ఒకే స్థలానికి చేరి; ఎప్పటి+అట్ల= అంతకుమునుపు వలె; అరుగు+ఎడన్= వెళ్లుతూ ఉండగా; అతి, విషమ, శిలా, సంకట, పథంబున= మిక్కిలి ఎగుడుదిగుడైన రాళ్లచేత బాధకల్గించే దారిలో; నడవనేరక= నడవలేక; ద్రౌపది= పాంచాలి; తొడరిపడి= తొట్రుపడి; మూర్ఛిత+ఐనన్= తెలివి కోల్పోవగా; పవన, తనయుండు= వాయుపుత్రుడైన భీముడు; ఆ+కోమలిన్= అక్కోమలిన్= సుకుమారి అయిన ఆ ద్రౌపదిని; ఎత్తికొని= మోసితెచ్చి; అజిన+ఆస్తరణంబుపయిన్+పెట్టి= జింకతోలు చాపమీద పడుకొనబెట్టి; కదళీదళంబులన్= అరటి ఆకులతో; వీచుచున్నన్= వీచుచుండగా; దాని= ఆమె యొక్క; పల్లవ, తామ్ర, పాద, తలంబులు= చిగురుటాకుల వలె ఎఱ్ఱనైన అరికాళ్ళను; ఆయుధ+అభ్యాసవశంబునన్= అస్త్రాలను చాలాసార్లు ప్రయోగించి ఉన్న అలవాటు చేత; కిణీ భూతంబులు+అయిన= కాయలు కాసిన; తమ, కరతలంబులన్+చేసి= తమ అరచేతులతో; కవలు= నకుల సహదేవులు; మెత్తన+ఒత్తు చుండిరి= మెత్తగా పిసుకుతున్నారు (ఒత్తుతున్నారు). అట్టి అవసరంబున= ఆ సమయంలో; ద్రౌపదిన్+చూచి= పాంచాలిని చూచి; దుఃఖితుండు+అయి= పరితప్తుడై; ధర్మతనయుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా పెనుగాలితో చాలాసేపు పెద్దవాన కురిసి వెలిసింది. పాండవబృందంలోనివా రందరున్నూ ఒకేచోటికి చేరి మళ్ళీ ప్రయాణం కొనసాగించారు. దారి అంతా ఎత్తుపల్లాలతో రాళ్ళతో, కూడి బాధకలిగించేదిగా ఉండటం చేత ద్రౌపది నడవలేక మూర్ఛిల్లింది. భీముడు ఆమెను ఎత్తుకొని జింకతోలుచాపమీద పడుకొనబెట్టి, అరటి ఆకులతో వీవసాగాడు. నకులసహదేవులు ఆయుధాల ఒరిపిడిచేత కాయలు కాసిన తమ అరచేతులతో చిగురుటాకుల వలె ఎఱ్ఱనైన ఆమె పాదాలను ఒత్తుతున్నారు. ఆ సమయంలో ధర్మరాజు ద్రౌపది అవస్థను చూచి మిక్కిలి పరితపించి ఇట్లా పలికాడు.

**అక్కర. 'అరుణ సరోరుహ రమ్య మృదులంబులైన యీ తన్వి**
**చరణతలంబులు గొడిగరాలపైఁ జనుచున్కిఁ జేసి**

**పరుసంబులై కడు నెఱ్ఱనైనవి పద్మాయతాక్షి**
**పరఁగ నా కారణంబునను నీ దుఃఖభారంబు దాల్చె. 299**

**ప్రతిపదార్థం:** అరుణ, సరోరుహ, దళ, రమ్య, మృదులంబులు+ఐన= ఎఱ్ఱతామర పువ్వు రేకుల వలె అందమైన మెత్తనైన (సరస్+రుహ= సరోరుహ- తామర పువ్వు); ఈ+తన్వి, చరణ, తలంబులు= ఈ సుకుమారి యొక్క పాదాలు; గొడిగ, రాలపైన్= గులకరాళ్ళపై; చనుచున్కిన్+చేసి= నడవటంచేత; పరుసంబులు+ఐ= కఠినాలై; కడున్= మిక్కిలి; ఎఱ్ఱనైనవి= నెత్తురు చింది ఎరుపురంగుగా మారాయి; పద్మ+ఆయత+అక్షి= పద్మాలవలె అనగా పద్మపత్రాలవలె నిడువైన కన్నులు కలది- ద్రౌపది; పరఁగ= ప్రవర్తిల్లి; నా, కారణంబునను= నా మూలాన్నే; ఈ, దుఃఖ, భారంబున్+తాల్చెన్= ఈ దుఃఖ మనే బరువును మోసింది.

**తాత్పర్యం:** 'ఎఱ్ఱతామరపువ్వులరేకులవలె మెత్తనైన యీ సుకుమారిపాదాలు ఈ గులకరాళ్ళపై ప్రయాణించటం చేత నొచ్చి నెత్తురు చింది ఎఱ్ఱబడ్డాయి. పద్మపత్రాల వలె విశాలనేత్రాలు కల ఈ ద్రౌపది నా మూలాన్నే కదా ఇటువంటి పడరానిపాట్లు పడుతున్నది.

**విశేషం:** ఉ.వి. ఆంధ్రమహాభారత సంశోధిత ముద్రణ ప్రతిలో ఈ పద్యంలోని మొదటి చరణం ఇలా ఉన్నది - " అరుణ సరోరుహదళ మృదువులైన యీతన్వి రమ్య''. ఇందులో యతిమైత్రి లేదు. "అరుణసరోరుహదళ మృదులంబులైన యిత్తరుణి'' అనే పాఠాంతరం సూచించబడింది. అందులో ఛందోభంగం ఉన్నది. ఈ రెండింటిని కలిపి ఆలోచించి ఛందోభంగం, యతిభంగం లేని పైపాదాన్ని- "అరుణసరోరుహ రమ్య మృదులంబులైన యీతన్వి''- తి.తి.దేవస్థానం కంట్రోలర్ ఆఫ్ పబ్లికేషన్స్ శ్రీ కరణం జువ్వలకంటి కృష్ణమూర్తి గారు సూచించారు. దానిని కృతజ్ఞతలతో స్వీకరించటమైనది. (సంపా.)

**సీ. సముచితంబగు మృదుశయన తలంబున । శయనించు నిత్తన్వి సదమలాంగి**
**పరుసంపు ఱాలపైఁ బడి తీవ్రవేదనఁ । బొందినయది; మహాపురుషు లైన**
**పాండవులకుఁ బ్రియభార్యయై నాపుత్త్రి । సుఖ ముండు నని మది సోమకుండు**
**పాయక సంతోషపడి యుండుఁ గాకున్నె' యని విలాపించు నయ్యమతనూజు**

**ఆ. నుచితవచనరచన నూరార్చి రప్పుడు । ధౌమ్యుఁదొట్టి సకలధరణిసురులు;**
**మూర్ఛ దేఱె నంత ముదిత ద్రౌపది శీత । మందపవనసేవ్యమాన యగుచు. 300**

**ప్రతిపదార్థం:** సముచితంబు+అగు= తనకు తగినటువంటి; మృదు, శయన, తలంబున= మెత్తనైన పరుపులపై; శయనించు= పడుకొనేటటువంటి; ఈ+తన్వి= ఈ సుకుమారి; సదమల+అంగి= లావణ్యవతి; పరుసంపు, ఱాలపైన్= కఠినాలైన శిలలపై; పడి= ఒత్తుకొని; తీవ్రవేదనన్= తీవ్రమైన బాధను; పొందిన+అది= అనుభవించింది; మహాపురుషులు+ఐన= గొప్ప వీరులైన; పాండవులకున్= పాండురాజుకొడుకులకు; ప్రియభార్య+ఐ= ప్రియపత్ని అయి; నా, పుత్త్రి= నా కూతురు; సుఖము+ ఉండును+అని= సౌఖ్యాన్ని అనుభవిస్తుంది అని తలపోసి; మదిన్= మనస్సులో; సోమకుండు= ద్రుపదుడు; పాయక, సంతోషపడి+ఉండున్= ఎడతెగని సంతోషాన్ని అనుభవించి ఉంటాడు; కాక+ఉన్నె= కాబోలు; అని= అంటూ; విలాపించు= దుఃఖించు; ఆ+యమతనూజున్= యముడి పుత్రుడైన ఆ ధర్మరాజును; అప్పుడు= ఆ సమయంలో; ధౌమ్యున్+తొట్టి= ధౌమ్యుడు మొదలైన; సకల, ధరణి, సురులు= బ్రాహ్మణులందరూ; ఉచిత, వచన, రచనన్= తగిన మంచిమాటల కూర్పుచేత;

ఊరార్చిరి= ఊరడించారు; అంతన్= అంతట; ముదిత, ద్రౌపది= సంతోషించిన పాంచాలి; శీత, మంద, పవన, సేవ్యమాన+ అగుచు= చల్లని పిల్లగాలులచేత సేవించబడినది అవుతూ; మూర్ఛ+తేఱెన్= మూర్ఛనుండి తెలివి పొందింది.

**తాత్పర్యం:** తగిన మెత్తని పరుపులపై పవళించే ఈ సుకుమారి సుందరాంగి కఠినశిలలపై నడచి మిక్కిలి తీవ్రమైన వ్యథను పొందింది. మహావీరులైన పాండుసుతులకు భార్య అయి తన కూతురు సుఖపడుతుందని మనస్సులో భావించి ద్రుపదుడు ఎంతో సంతోషించి ఉంటాడు!' అని దుఃఖిస్తున్న ధర్మరాజును ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులందరూ సమయోచితాలైన వాక్యాలతో ఊరడించారు. అంత ద్రౌపది చల్లని పిల్లతెమ్మెరలు సోకటంచేత మూర్ఛనుండి తేరుకొన్నది.

**వ. దాని నాశ్వాసించి ధర్మరాజు భీమున కిట్లనియె. 301**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆమెను, పాంచాలిని; ఆశ్వాసించి= ఓదార్చి; ధర్మరాజు= ధర్మరాజు; భీమునకు= భీముడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** పాంచాలిని ఓదార్చి, ధర్మరాజు భీముడితో ఇట్లా చెప్పాడు.

**క. 'ఈ రాజపుత్త్రిఁ దోడ్కొని । దారుణ పాషాణ దుష్పథంబులఁ జనఁగా**
**నేర; మిది నడువ నోపదు । భూరిభుజా!' యనిన ననిలపుత్త్రుం డంతన్. 302**

**ప్రతిపదార్థం:** భూరి, భుజా!= గొప్ప, బుజాలు కలవాడా!; ఈ రాజపుత్రిన్= రాకుమార్తె అయిన ఈ ద్రౌపదిని; తోడ్కొని= వెంటపెట్టుకొని; పాషాణ, దుష్పథంబులన్= భయంకరమైన రాళ్ళతో నిండిన కఠినమార్గాలలో; చనఁగానేరము= వెళ్ళలేము; ఇది= ఈమె, ఈ ద్రౌపది; నడువన్+ఓపదు= నడవలేదు; అనినన్= అని చెప్పగా; అనిల పుత్త్రుండు= వాయుసుతుడు- భీముడు; అంతన్= అటు పిమ్మట.

**తాత్పర్యం:** 'మనం ఈ రాకుమారియైన ఈ పాంచాలిని తోడ్కొని భయంకరమైన శిలలతో నిండిన కఠినమార్గాలలో పయనించలేం. ఈమె నడువ జాలక ఉన్నది. పరాక్రమోపేతుడివైన భీమసేనా! యోచించుము' అని చెప్పగా భీముడు అప్పుడు.

**క. అగ్రజుననుమతమున న । త్యుగ్రనిశాచరసమేతు నుడుమార్గగు వీ**
**రాగ్రణి ఘటోత్కచుం దన । యగ్రసుతుం దలఁచె ధీరు హైడింబు వెసన్. 303**

**ప్రతిపదార్థం:** అగ్రజు+అనుమతమునన్= అన్నగారి అనుమతి ప్రకారం; అతి+ఉగ్ర, నిశాచర, సమేతున్= మిక్కిలి భయంకరులైన రక్కసులతో కూడినవాడిని; ఉడు, మార్గగున్= నక్షత్రపథాన సంచరించేవాడిని; వీర+అగ్రణిన్= వీరులలో గొప్పవాడిని; తన+ అగ్రసుతున్= తన పెద్ద కుమారుని; ధీరున్= ధైర్యం కల వాడిని; హైడింబున్= హిడింబ కొడుకును; ఘటోత్కచున్= ఘటోత్కచుడిని; వెసన్= వేగంగా; తలఁచెన్= స్మరించాడు.

**తాత్పర్యం:** భీమసేనుడు అన్నగారి అనుమతి ప్రకారం, మిక్కిలి భయంకరులైన రాక్షసులతో కూడిఉన్నవాడు, ఆకాశమార్గాన సంచరించే వాడు. వీరులలో మొదట పేర్కొనతగినవాడు, ధైర్యవంతుడు హిడింబకొడుకు, తన జ్యేష్ఠ కుమారుడు ఐన ఘటోత్కచుడిని స్మరించాడు.

**క. అతఁడును రాక్షససైన్యా । న్వితుఁడై తత్క్షణమ వచ్చి నిర్జరవరస**
**మ్మితులకుఁ బ్రణమిల్లెం దన । పితృవరులకు బ్రాహ్మణులకుఁ బెద్దయు భక్తిన్. 304**

**ప్రతిపదార్థం:** అతఁడును= వాడున్నూ, ఆ ఘటోత్కచుడున్నూ; రాక్షస, సైన్య+అన్వితుఁడు+ఐ= రాక్షస సేనలతో కూడినవాడై; తత్+క్షణము+అ= ఆ క్షణమందే; వచ్చి= వచ్చి; నిర్జర, వర, సమ్మితులకున్= శ్రేష్ఠులైనవేల్పులతో సమానులైన వారికి; తన, పితృవరులకున్= శ్రేష్ఠులైన తన తండ్రులకు; బ్రాహ్మణులకున్= విప్రులకు; పెద్దయు, భక్తిన్= గొప్ప గౌరవంతో కూడిన ప్రేమతో; ప్రణమిల్లెన్= నమస్కరించాడు.

**తాత్పర్యం:** ఆ ఘటోత్కచుడును తన రాక్షసబలంతో ఆ త్రుటిలో అరుదెంచి దేవతాశ్రేష్ఠులతో సమానులైన తన తండ్రులకు, విప్రులకు మిక్కిలి భక్తితో నమస్కరించాడు.

**వ. ఇట్లు మ్రొక్కి పని యే మని ముకుళితహస్తుం డయి తన ముందర నున్న కొడుకుం గౌఁగిలించుకొని భీముండు వాని కిట్లనియె. 305**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; మ్రొక్కి= వందనం చేసి; పని+ఏమి+అని= చేయవలసిన పని చెప్పండి అని; ముకుళిత, హస్తుండు+ఐ= జోడించిన చేతులు కలవాడై; తనముందరన్+ఉన్న= తన ఎదుట ఉన్న; కొడుకున్= కొడుకును; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; భీముండు= భీమసేనుడు; వానికిన్= ఆ ఘటోత్కచుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా వందనం చేసి, చేయవలసిన పనిని ఆదేశించండి- అని చేతులు జోడించి నిలిచిన కొడుకును ఆలింగనం చేసికొని భీముడు ఇట్లా చెప్పాడు.

**తే. 'అబల యిది, భవన్మాత, నిత్యాధ్వగమన । ఖిన్న యైనది గజరాజఖేలగమన;**
**దీని నీ వెత్తికొని చనుదెమ్ము మాస । మీపమున' నని సుతు నియమించె నపుడు. 306**

**ప్రతిపదార్థం:** భవత్+మాత= భవన్మాత= నీ తల్లి; ఇది= ఈమె; అబల= బలంలేనటువంటిది; నిత్య, అధ్వగమన, ఖిన్న+ఐనది= అనుదినం చేసిన పయనంచేత (నడచినందువలన) దారిబడలిక చెందింది; గజరాజఖేలగమనన్= మత్తేభం వలె వినోదంగా నడిచేటటువంటిది; దీనిన్= ఈమెను; ఈవు= నీవు; ఎత్తికొని= మోసికొంటూ; మా, సమీపమునన్= మాకు దగ్గరగా; చనుదెమ్ము= వస్తూండుము; అని= అని; అపుడు= ఆసమయంలో; సుతున్= కొడుకును; నియమించెన్= ఆదేశించాడు.

**తాత్పర్యం:** 'నీ తల్లి అయిన ఈమె బలం లేనటువంటిది. అనుదినం ప్రయాణం చేసి దారిబడలిక చెందింది. మదపుటేనుగువలె లీలగా నడిచేటటువంటిది ఈమె. నీవు ఈమెను మోసికొంటూ మాకు దగ్గరగా నడిచిరా' అని భీముడు తన కొడుకును ఆదేశించాడు.

**వ. వాఁడును బితృవచన చోదితుండై 'యిమ్మార్గం బతిపరుష శిలావిషమంబు; పాదచారుల కగమ్యంబు గావున మిమ్ముందఱ నెత్తికొని యశ్రమంబున నరిగెద' నని ధౌమ్య పాండవ ద్రౌపదులం దా నెత్తుకొని, బ్రాహ్మణుల నెత్తికొనం దన రాక్షసబలంబులం బంచె; రోమశుండు సిద్ధగతి నరిగె; నిట్లందఱు గగనమార్గంబునం జని గంగాతీరంబున నరనారాయణాశ్రమంబైన బదరీవనంబుఁ గని, రాక్షసస్కంధావతీర్ణులై యందు. 307**

**ప్రతిపదార్థం:** వాఁడును= అతడున్నూ- ఆ ఘటోత్కచుడున్నూ; పితృ, వచన, చోదితుండు+ఐ= తండ్రియొక్క మాటలచేత ప్రేరేపించబడిన వాడై; ఈ+మార్గంబు= ఈ దారి; అతి, పరుష, శిలా, విషమంబు= మిక్కుటమైన కఠినమైన రాళ్ళచేత మిట్ట పల్లాలు కలది; పాదచారులకు= కాలినడకన పోయేవారికి; న+గమ్యంబు= చేరరానిది; కావున= కాబట్టి; మిమ్ము+అందఱను= మిమ్మల్ని అంతమందిని; ఎత్తికొని= మోసికొని; అశ్రమంబునన్= శ్రమలేకుండా, సులభంగా; అరిగెదన్= వెళ్ళగలను; అని= అనిచెప్పి; ధౌమ్య, పాండవ, ద్రౌపదులన్= ధౌమ్యుడిని, పాండవులను, పాంచాలిని; తాన్+ఎత్తుకొని= తాను మోసికొని; బ్రాహ్మణులన్= విప్రులను; ఎత్తికొనన్= మోసి తెచ్చేందుకు; తన, రాక్షస, బలంబులన్= తన రాక్షసి మూకలను; పంచెన్= నియోగించాడు; రోమశుండు= రోమశమహర్షి; సిద్ధ, గతిన్= సిద్ధులు వెళ్ళే ఆకాశ మార్గాన; అరిగెన్= వెళ్ళాడు; ఇట్లు= ఈ రీతిగా; అందఱు= అంతమంది; గగన, మార్గంబునన్= ఆకాశ వీథిలో; చని= వెళ్ళి; గంగా, తీరంబున= గంగానదితీరాన; నర, నారాయణ+ఆశ్రమంబు+ఐన= నరుడు నారాయణుడు అనే ఋషులు పూర్వం తపస్సు చేసినటువంటి పుణ్యక్షేత్రమైన; బదరీ, వనంబున్= బదరి అనే పేరుకల అడవిని; కని= చూచి; రాక్షసస్కంధ+అవతీర్ణులు+ఐరి= రక్కసుల మూపులనుండి క్రిందికి దిగినవా రైనారు; అందు= అక్కడ.

**తాత్పర్యం:** ఆ ఘటోత్కచుడున్నూ తండ్రిమాటచేత ప్రేరేపించబడినవాడై. 'ఈ దారి కఠిన శిలలతో కూడిన మిట్ట పల్లాలతో పాదచారులకు పయనించి శక్యం కానటువంటిది. కాబట్టి, మిమ్మల్ని అందరినీ ఎత్తుకొని సులువుగా నేను తీసికొని వెళ్లగలను' అని చెప్పి ద్రౌపదిని, పాండవులను, ధౌమ్యుడిని తన మూపుపై ఉంచుకొని, విప్రులను మోసికొని తెచ్చేందుకు తన రాక్షసులమూకలను నియోగించాడు. రోమశమహర్షి సిద్ధులు వెళ్ళే ఆకాశమార్గాన వెళ్ళాడు. ఇట్లా పాండవబృందంలోని వారందరూ, ఆకాశవీథిలో పయనించి గంగ ఒడ్డున గల బదరీవనంలో పూర్వం నరుడు. నారాయణుడు అనే ఋషులు తపస్సు చేసిన ఆశ్రమం దగ్గర రాక్షసుల మూపులపైనుండి క్రిందకు దిగారు. ఆ బదరీవనంలో.

**క. లలితమధుస్రవఫలములు । విలసిత మృదుపత్రతతులు వృత్తస్కంధం**
**బులు నవిచలితచ్ఛాయలు । గల బదరీతరులఁ జూచి కడు విస్మితులై. 308**

**ప్రతిపదార్థం:** లలిత, మధు, స్రవ, ఫలములు= మనోహరాలైన తేనె స్రవించే పండ్లు; విలసిత, మృదు, పత్ర, తతులు= శోభిల్లేటటువంటి మెత్తనైన ఆకుల సమూహాలు; వృత్త, స్కంధంబులు= గుండ్రంగా ఉన్న బోదెలు; న+విచలిత+ఛాయలు= కదలని నీడలు; కల= ఉన్న; బదరీతరులన్= రేగు చెట్లను; చూచి= చూచి; కడు= మిక్కిలి; విస్మితులు+ఐ= ఆశ్చర్యం చెందిన వారై.

**తాత్పర్యం:** మనోహరాలై తేనెలు స్రవించేటటువంటి పళ్ళు, మెత్తనై మనోజ్ఞాలైన ఆకులు, గుండ్రటి బోదెలు, కదలక (మార్పులేక) స్థిరంగా ఉండే నీడలు గల రేగుచెట్లను చూచి వారు ఆశ్చర్యం చెందారు.

**వ. సురసిద్ధముని సేవితంబైన భాగీరథిం జూచి, యందుఁ గృతస్నాను లయి నియమవ్రతంబులు సలుపుచు సమాధియోగంబున మైనాకశైలంబును హిరణ్యశృంగంబును బిందుసరంబునుం జూచి, బదరీవనంబునం దాఱుదివసంబులు నివాసంబు సేసి యుండునంత; నొక్కనాఁడు. 309**

**ప్రతిపదార్థం:** సుర, సిద్ధ, ముని, సేవితంబు+ఐన= వేల్పులచేత, సిద్ధులచేత, ఋషులచేత, సేవించబడిన; భాగీరథిన్+చూచి= గంగానదిని దర్శించి; అందున్= ఆ గంగలో; కృతస్నానులు+ఐ= స్నానం చేసిన వారై; నియమ, వ్రతంబులుసలుపుచున్=

నిష్ఠతో నోములు చేస్తూ; సమాధి, యోగంబునన్= సమాధి అనే యోగవిద్యవలన; మైనాక, శైలంబును= మైనాక పర్వతాన్ని; హిరణ్య శృంగంబును= హిరణ్య శిఖరాన్ని; బిందుసరంబునున్= బిందుసరం అనే పేరు కల సరోవరాన్ని చూచి; బదరీ, వనంబునందున్= బదరికాశ్రమంలో; ఆఱు, దివసంబులు= ఆరు దినాలు; నివాసంబు+చేసి= నివసించి; ఉండు+అంతన్= ఉండగా; ఒక్కనాఁడు= ఒకానొక రోజున.

**తాత్పర్యం:** దేవతలచేత, సిద్ధులచేత, ఋషులచేత సేవించబడిన గంగానదిని చూచి అందులో స్నానం చేసిన వారై, నియమంతో కూడిన నోములు నోస్తూ, సమాధియోగంచేత మైనాకశైలం, హిరణ్యశృంగం, బిందుసరం అనే పుణ్యక్షేత్రాలను చూచి, బదరికాశ్రమంలో ఆరుదినాలు నివసించారు. అంత ఒకరోజు.

**విశేషం:** (1) భాగీరథి అనేపేరు గంగకు రావటానికి కారణం భగీరథుడు గొప్ప తపస్సు చేసి నింగి నుండి నేలకు అవతరింపజేయుటం చేతనే. ఆరణ్యపర్వంలో ఈ కథ పూర్వోక్తం. (2) ఇక్కడ నియమవ్రతం, సమాధియోగం- అనే ప్రయోగాలు మిక్కిలి అర్థవంతమైనవి. ఈ ఆరణ్యపర్వం- ప్రథమాశ్వాసంలో అష్టాంగయోగంలోని నియమంగురించి సమాధినిగురించి, యోగంగురించి విపులంగా వివరించబడింది. నియమం : అష్టాంగ యోగంలో రెండవది. ఇది బాహ్యాంభ్యంతర శౌచం, సంతోషం, తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం అని 5. విధాలు. అష్టాంగ యోగాలు : 1. యమం 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధారణ 7. ధ్యానం 8. సమాధి. బదరీవనంనుండి పాండవులు మైనాక శైలాన్ని, హిరణ్యశృంగాన్ని, బిందుసరం అనే పుణ్యతీర్థాలను సమాధియోగంలో దర్శించినట్లుగా చెప్పబడింది. సమాధియోగసిద్ధులకు దూరదర్శనం మొదలైన సిద్ధులు అలవడతాయని చెప్పబడింది.

**చ. అలఘులు గంధమాదన మహాధరణీధరసానురత్నవే**
**దులఁ బవమాననందనుఁడు ద్రోవదియున్ విహరించుచున్నచో**
**లలితసహస్రపత్రకమలంబు సమీరవిధూతమై మహీ**
**తలముపయిన్ వడిం బడియెఁ దద్దయుఁ బొల్పుగ వారిముందటన్. 310**

**ప్రతిపదార్థం:** న+లఘులు= తేలిక కానివారు, అనగా గొప్పవారు; ద్రోవదియున్, పవమాననందనుఁడు= ద్రౌపదియు, వాయుపుత్రుడైన భీమసేనుడు; గంధమాదన, మహాధరణీధరసానురత్నవేదులన్= గంధమాదనమనే గొప్ప కొండచరియలలో ఉన్న రత్నాలతో కూడిన అరుగులపై; విహరించుచున్నచో= వినోదంగా సంచరించే చోట; సమీర, విధూతము+ఐ= గాలిచేత త్రోసివేయబడి; లలిత, సహస్ర, పత్ర, కమలంబు= మనోహరమైన వేయి రేకులు కల తామర పువ్వు; మహీ, తలము, పయిన్= భూభాగంపై; వడిన్= వేగంగా; తద్దయున్+పొల్పుగ= మిక్కిలి శోభిల్లేటట్లుగా; వారిముందటన్= వారి ఎదుట; పడియెన్= పడింది.

**తాత్పర్యం:** గొప్పవారైన వాయుసుతుడగు భీమసేనుడూ, ద్రౌపదీ గంధమాదనమనే పర్వతపు చరియలలోని రత్నాల అరుగుల మీద వినోదంగా సంచరిస్తూ ఉండగా, మనోహరమైన వేయిరేకులు గల తామర పువ్వొకటి మిగుల సొంపులీనుతూ గాలివాటున వారి యెదుటి ప్రదేశంలో వచ్చి పడింది.

**వ. ఆ సౌగంధిక కమలంబుఁ జూచి దాని యపూర్వరమణీయత్వంబునకు ననన్యకుసుమసాధారణంబయిన సౌరభ్యంబునకు నోటువడి ద్రుపదరాజపుత్త్రి ముదితచిత్తయై 'యక్కటా! యిది యొక్క పువ్వ యయ్యు నపూర్వంబై మనోనయనానందకరం బైనది; యిట్టి కుసుమంబులు కడుం బెక్కులు గావలవదె!' యని 'కురంగటం గలవేని తెచ్చి యిచ్చి నాకు మనఃప్రియంబుఁ జేయు' మని యప్పుడ యప్పువ్వు ధర్మరాజుకడకుం**

**గొనిపోయె; నిట భీముండు దాని యభిమతంబుఁజేయం గడంగి, రుక్మపృష్ఠంబైన ధనుశ్శ్రేష్ఠంబును నాశీవిషోపమానంబులైన బాణంబులు ధరియించి, యక్కమలంబు దెచ్చిన గాడ్పున కభిముఖుండై గంధమాదనంబున వివిధరత్న బంధుర కందర కదళీ షండ దర్శనంబులను, మందార మందిర సుగంధ గంధవహస్పర్శనంబులను, నలికుల కోకిలాలాప శ్రవణంబులను, సర్వర్తు కుసుమ సురుచిర గంధాఘ్రాణంబులను, నతిమధుర ఫలాస్వాదనంబులను, బద్ధప్రమోదహృదయుం డగుచుఁ దన కెదిరి వచ్చు మృగంబులం దాఁకి గజంబు నెత్తి గజంబుపై వైచుచు సింహంబు నెత్తి సింహంబుపై వైచుచు నల్పమృగంబులం గరతలప్రహారంబులం బ్రహరించుచు. 311**

**ప్రతిపదార్థం:** ఆ సౌంగధిక, కమలంబున్+చూచి= నెత్తావితో గుబాళిస్తున్న ఆ తామర పువ్వును చూచి; దాని= ఆ పువ్వు యొక్క; అ, పూర్వ, రమణీయత్వంబునకున్= ఇంతకు ముందు తా నెన్నెడు ఎక్కడా చూడనటువంటి అందచందాలకు; న+అన్య= అనన్య, కుసుమ, సాధారణంబు+అయిన= మరి ఏ యితరమైన పువ్వులలో ఉండనట్టి; సౌరభ్యంబునకున్= సుగంధానికి- నెత్తావికి; ఓటువడి= లొంగిపోయి- ఆకర్షించబడి; ద్రుపద, రాజ, పుత్రి= ద్రౌపది; ముదిత, చిత్త+ఐ= సంతోషించిన మనస్సు కలది అయి; అక్కటా!= ఆహా!; ఇది+ఒక్క, పువ్వు+అ+అయ్యున్= ఇది పువ్వు మాత్రమే అయినప్పటికిని; మనస్+నయన+ఆనందకరంబు+ఐనది= మనసుకు, నేత్రాలకు సంతోషాన్ని సమకూర్చే టటువంటిది అయింది; ఇట్టి= ఇటువంటి; కుసుమంబులు= పువ్వులు; కడున్= మిక్కిలి; పెక్కులు= అనేకాలు; కావలవదె!= కావాలని కోరదగింది కదా!; అని= అని తలపోసి; కురంగటన్= సమీపంలో; కలవు+ఏని= ఉన్నట్లయితే; తెచ్చి+ఇచ్చి= తీసికొని వచ్చి ఇచ్చి; నాకు, మనస్+ప్రియంబున్= నా మనసుకు ప్రీతిని; చేయుము+అని= ఘటించుమని, చెప్పి; అప్పుడు+అ= ఆ సమయమందే, వెంటనే; ఆ+పువ్వు= ఆ పువ్వు= ఆ పువ్వును; ధర్మరాజు కడకున్= ధర్మరాజు దగ్గరకు; కొనిపోయెన్= తీసికొని వెళ్ళింది; ఇట= ఇక్కడ; భీముండు= భీముడు; దాని+అభిమతంబున్= ఆమె కోరికను; చేయన్+కడంగి= తీర్చటానికి పూనుకొని; రుక్మపృష్ఠంబు+ఐన= వెనుకభాగాన బంగారం కల; ధనుస్+శ్రేష్ఠంబునున్= గొప్ప వింటిని; ఆశీవిష+ఉపమానంబులు+ఐన= పాములతో పోల్చతగినట్టివి అయిన; బాణంబులు= అమ్ములు; ధరియించి= తాల్చి; ఆ+కమలంబున్= ఆ తామరపువ్వును; తెచ్చిన= తీసికొని వచ్చిన; గాడ్పునకు= గాలికి; అభిముఖుండు+ఐ= ఎదురైన ముఖం కలవాడై; గంధమాదనంబున= గంధమాదనమనే కొండపై; వివిధ, రత్న, బంధుర, కందర, కదళీ, షండ, దర్శనంబులను= అనేక విధములైన రత్నాలతో కూడిన పెక్కు గుహలను, ఆ గుహల సమీపాన అరటి చెట్ల సమూహాలను తిలకించటంవలన; మందార, మందిర, సుగంధి, గంధవహ, స్పర్శనంబులను= మందార పుష్పాలనే మందిరాలందు ప్రసరించటం చేత నెత్తావి గలిగిన గాలుల తాకిడి వలనను; అలి, కుల, కోకిలా+ఆలాప, శ్రవణంబులను= తుమ్మెదల బారుల యొక్కయు, కోకిలల యొక్కయు నాదాలను వినటం చేతను; సర్వ+ఋతు, కుసుమ, సురచిర, గంధ+ఆఘ్రాణంబులనున్= అన్ని ఋతువులలో పూసేటటువంటి పువ్వులయొక్క మిగుల మనోహరమైన పరిమళాలను పీల్చటం చేతను; అతి, మధుర, ఫల+ఆస్వాదనంబులను= మిక్కిలి తియ్యనైన పళ్ళను ఆరగించటంచేతను; బద్ధ, ప్రమోద, హృదయుండు+అగుచున్= సంతోషంతో నిండిన గుండె కల వాడవుతూ; తనకు+ఎదిరి, వచ్చు= తనకు ఎదురుగా వచ్చే; మృగంబులన్= జంతువులను; తాఁకి= ఎదుర్కొని; గజంబున్+ఎత్తి= ఏనుగును ఎత్తి; గజంబుపైన్= ఏనుగు మీద; వైచుచు= వేస్తూ; సింహంబున్+ఎత్తి= సింహాన్ని ఎత్తి; సింహంబుపైన్= మరొక సింహంపై; వైచుచున్= పడవేస్తూ; అల్ప మృగంబులన్= చిన్నజంతువులను; కర, తల, ప్రహారంబులన్= అరచేతి చరుపులతో; ప్రహరించుచున్= కొట్టుతూ.

**తాత్పర్యం:** ఆ సౌగంధికకమలాన్ని చూచి; ద్రౌపది తాను అంతకు ముందెప్పుడూ అటువంటి అందమైన పువ్వును చూడలేదని ఆ పువ్వులోని నెత్తావి మరి వేరేపూలలో కనిపించదని, ఆ పువ్వు సొగసుకు ఎంతో సంతోషించి, 'ఆహా!

ఇది ఒక్క పువ్వు మాత్రమే అయినా, ఇంతవరకు ఎప్పుడూ ఎక్కడా ఇంతగా మనసుకు విందు, కళ్ళకు పండుగ కల్పించిన పువ్వు కనిపించ లేదు కదా!' అని మిక్కిలి సంతోషించి, 'ఇటువంటి పువ్వులు మరికొన్ని లభిస్తే ఎంత బాగుంటుంది! సమీపాన ఉంటే తెచ్చి ఇచ్చి నా మనసుకు ఆహ్లాదం కల్పించుము' అని ఆమె భీముడిని కోరి ఆ పుష్పాన్ని ధర్మరాజుకు చూపటానికై వెళ్ళింది. ఇక్కడ భీమసేనుడు ద్రౌపదికోరిక ఈడేర్చటానికి బయలుదేరాడు. వెనుకవైపు బంగారపు తొడుగు కల వింటివి, పాములతో సమానాలైన అమ్ములను ధరించి, ఆ తామరపువ్వును తెచ్చిన గాలికి అభిముఖుడై భీముడు వెళ్ళుతున్నాడు. ఆ గంధమాదనపర్వతాన భీముడు రత్నాలతో కూడిన పెక్కు గుహలు, అరటితోటలు చూస్తూ, మందార పుష్పాల సుగంధాన్ని ప్రసరించే వాయువులను పీలుస్తూ, తుమ్మెద ఝుంకారాలను, కోకిలల ఆలాపాలను ఆలకిస్తూ, అన్ని ఋతువులలో పూచే పువ్వుల పరిమళాలను ఆఘ్రాణిస్తూ, మిక్కిలి తియ్యనైన పళ్ళను ఆరగిస్తూ ఆనందిస్తూ ముందుకు వెళ్లాడు. ఎదురైన జంతువులను ఎదుర్కొంటూ, ఒక ఏనుగును ఎత్తి మరొక ఏనుగుమీదకు, ఒక సింహాన్ని ఎత్తి మరొక సింహంపైకి విసురుతూ, చిన్న జంతువులను అరచేతులతో కొట్టుతూ భీముడు విహరించాడు.

### భీముఁడు సౌగంధికహరణార్థంబు పోవుట (సం. 3-146-292)

**సీ.** **గమనవేగంబున ద్రుమలతాజాల సం । చాలన సేయుచు శైలగుహల**
**నడఁగి యదృశ్యలై కడువేడ్కతోఁ దన్నుఁ । జూచు ఖేచర సిద్ధ సుర భుజంగ**
**గరుడ గంధర్వ కిన్నర కామినులచేత । మానుగా నభివీక్ష్యమాణుఁ డగుచు**
**భ్రూఁకులు విఱుచుచు వీఁకతోఁ దీఁగలు । పెఱుకుచుఁ బదహతిఁ బృథునగేంద్ర**

**ఆ.** **మద్రువ నున్నతంబు లయి నెడ లెక్కుచు । మదగజంబువోలె మధ్యముండు**
**పవన వైనతేయ పటుజవయుక్తుఁడై । యరిగె గంధమాదనాంతరమున.** **312**

**ప్రతిపదార్థం:** గమన, వేగంబునన్= నడకవేగం ధాటికి ద్రుమ, లతా, జాలసంచాలన+చేయుచు= చెట్లయొక్క తీగలయొక్క సముదాయాన్ని బాగుగా చలింపజేస్తూ; శైల, గుహలన్= కొండ గుహలలో; అడఁగి= దాగికొని; అదృశ్యలు+ఐ= కనిపించకుండా; కడు= మిక్కిలి; వేడ్కతోన్= ప్రీతితో; తన్నున్+చూచు= తనను తిలకించే; ఖేచర, సిద్ధ, సుర, భుజంగ, గరుడ, గంధర్వ, కిన్నర, కామినుల చేతన్= ఖేచరులైన, సిద్ధులకు, వేల్పులకు, పాములకు, గరుడులకు, గంధర్వులకు, కిన్నరులకు సంబంధించిన (వివిధ దేవతా జాతులలోని) కాంతలచేత; మానుగాన్= ప్రీతితో; అభివీక్ష్య మాణుఁడు+అగుచున్= లెస్సగా చూడబడినవాడవుతూ; భ్రూఁకులు, విఱుచుచు= చెట్లను విరుస్తూ; వీఁకతోన్= ఉత్సాహంతో; తీఁగలు= లతలు; పెఱుకుచున్= నిర్మూలిస్తూ; పద, హతిన్= పద ఘట్టనంవలన- కాళ్ళ తాకిడివలన; పృథు, నగ+ఇంద్రము= పెద్ద పర్వత రాజం; అద్రువన్= అదరగా; ఉన్నతంబులు+అయిన= ఎత్తుగా ఉన్న; ఎడలు+ఎక్కుచు= స్థలాలు అధిరోహిస్తూ; మద, గజంబు+పోలె= మదించిన ఏనుగువలె; మధ్యముండు= భీముడు, (కుంతీపుత్రులలో మధ్య పుట్టినవాడు); పవన, వైనతేయ, పటు, జవ, యుక్తుఁడు+ఐ= వాయువు వంటి, వినత కొడుకైన గరుత్మంతుడి వంటి వేగంతో కూడినటువంటి వాడై; గంధమాదన+అంతరమునన్= గంధమాదనమనే ఆ కొండ మధ్య భాగాన; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** భీమసేనుడు గంధమాదనపర్వతమధ్యభాగంలో విహరిస్తూ వెళ్లాడు. అతడి నడకతాకిడికి చెట్లు, తీగలు మొదలైనవి మిగుల కదలిపోయాయి. ఆకాశసంచారులైన సిద్ధులు, దేవతలు, నాగులు, గరుడులు, గంధర్వులు,

కిన్నరులు మున్నుగాగల వివిధ జాతులకు చెందిన దివ్య కామినులు ఆ కొండ గుహలలో దాగి తాము అతడికి కనిపించకుండా, భీముడిని మిక్కిలి ప్రీతితో చూడసాగారు. పెద్ద పెద్ద మ్రాకులను విరుస్తూ, ఉత్సాహం పెల్లుబుకగా తీగలు పెరుకుతూ ముందుకు సాగాడు. అతడి పాదాల తాకిడికి గంధమాదన పర్వతరాజం అదరసాగింది. ఆ విధంగా భీముడు ఎత్తయిన శిఖరాలను అధిరోహిస్తూ, వాయువును, గరుత్మంతుడిని పోలిన వేగంతో మత్తేభంవలె తిరుగాడాడు.

**విశేషం:** (1) 'ఇన గణత్రయంబు నింద్ర ద్వయంబును హగణ పంచకంబు నాటవెలది'. ఆటవెలది పద్యంలో 1, 3 పాదాలలో 3 సూర్య గణాలు 2 ఇంద్ర గణాలు, 2, 4 పాదాలలో 5 సూర్యగణాలు ఉంటాయి. గురువు+లఘువు, మూడు లఘువులు= సూర్యగణాలు. ఈ పద్యంలో ఎత్తుగీతిలో మొదట 'అద్రువ' అన్న పదం ఉన్నది. అద్రువలో 3 లఘువులే. 'ద్రు' 2 సంయుక్తాక్షరం అనీ, అందుచేత అది గురువు కావాలనీ స్థూలదృష్టికి గోచరిస్తుంది. కాని అద్రువ అన్నప్పుడు 'అ' గురువు కాదు. తేల్చి పలికాలి. దీనికి ఛందస్సులో శిథిలద్విత్వం అని పేరు. (2) భీముడి విశృంఖల వీర వినోదాన్ని గంధమాదనంలో అదృశ్యలై వివిధ దేవతాంగనలు చూచారు. 'కామిని' శబ్దం స్త్రీ వాచకమైన పర్యాయపదమే అయినా ఇక్కడ సార్థకం. (3) మ్రాను= ఏకవచనం. మ్రాఁకులు= బహువచనం.

**వ. ఇట్లరుగువాఁడు నిజసింహనాదశ్రవణపరిత్రస్తంబులై యెగసి పఱచు పక్షుల యార్ద్రపక్షంబులు చూచి ముందట నాసన్నంబునం గొలను కలుగవలయు నని యుపలక్షించి యతిత్వరితగతిం జని, పవనవశ సంచలిత తట మహావన తమాలతాల హింతాల విశాల కదళీదళ వీజ్యమానశీతలజలపరిపూర్ణంబైన యొక్కసరోవరంబుఁ గని, యందుఁ గృతావగాహుండై నవనళినదళమృణాలవలయాలంకృతుండగుచు దాని వెలువడి యనేకయోజనవిస్తారాయామ రమణీయంబైన కదళీషండంబుఁ జొచ్చి, యందు శంఖధ్వానంబుఁ జేసిన. 313**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అరుగు వాఁడు= వెళ్ళేటటువంటివాడు (భీముడు); నిజ, సింహ నాద, శ్రవణ, పరిత్రస్తంబులు+ఐ= తనయొక్క సింహనాదాన్ని వినటంచేత భయపడి (వీరులు ఉత్సాహపూరితంగా చేసేటటువంటి సింహగర్జనను పోలే నాదానికి 'సింహనాదం' అని పేరు వచ్చింది.); ఎగసి= పైకి ఎగిరి; పఱచు= పారిపోయే; పక్షుల= పులుగుల; ఆర్ద్ర, పక్షంబులు= నీటిచేత తడిసిన రెక్కలు; చూచి= చూచి; ముందటన్= ఎదురుగా; ఆసన్నంబునన్= దగ్గరలో; కొలను= చెరువు; కలుగవలయును+అని= ఉండాలి అని; ఉపలక్షించి= తలపోసి; అతి, త్వరితగతిన్= మిక్కిలి వేగమైన నడకతో; చని= వెళ్ళి; పవన, వశ, సంచలిత, తట, మహావన, తమాల, తాల, హింతాల, విశాల, కదళీ, దళ, వీజ్యమాన, శీతలజల, పరిపూర్ణంబు+ఐన= గాలి వీచటంచేత కదల్చబడిన ఒడ్డులందు గల గొప్ప అడవిలో ఉన్న చీకటిచెట్లు, తాడిచెట్లు, గిరక తాడిచెట్లు, నిడివి గల అరటి చెట్ల ఆకులు- 'వీటన్నిటి చేత వీచబడి చల్లనైన నీటిచే నిండిన; ఒక్క= ఒక; సరోవరంబున్+కని= సరస్సును చూచి; అందున్= ఆ సరోవరంలో; కృత+అవగాహుండు+ఐ= స్నానం చేసిన వాడై; నవ, నళినదళ, మృణాల, వలయ+ అలంకృతుండు+అగుచున్= క్రొత్తగా వికసించిన తామర పూవుల రేకులతో, తామర తూడులతో గుండ్రని హారాలుగా చేసి అలంకరించుకొన్న వాడు అవుతూ; దాని, వెలువడి= ఆ సరస్సునుండి బయటికి వచ్చి; అనేక, యోజన, విస్తార, ఆరామ, రమణీయంబు+ఐన= పెక్కు ఆమడల మేర గలదై మిగుల అందంగా కనిపిస్తున్న; కదళీషండంబున్= అరటి చెట్ల సముదాయాన్ని; చొచ్చి= ప్రవేశించి; అందున్= అక్కడ; శంఖ, ధ్వానంబున్+చేసినన్= శంఖాన్ని పూరించి పెద్ద ధ్వని చేయగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా వెళ్ళుతున్న భీముడు, తన సింహనాదంచేత భయపడి పైకి ఎగిరిపోయే పక్షుల రెక్కలు తడిసి ఉండటం చూచి, ముందర సమీపంలో కొలను ఉన్నట్లు భావించి మిక్కిలి వేగంగా వెళ్ళాడు. ఆ కొలను

గట్టున గొప్ప అరణ్య మున్నది. ఆ వనంలో చీకటిచెట్లు; తాడిచెట్లు, గిరకతాడిచెట్లు. విశాలమైన ఆకులు కల అరటి చెట్లు ఉన్నాయి. ఆ చెట్ల ఆకులు గాలిచేత కదిలించబడి వీవటంచేత ఆ కొలనులోని జలం ఎల్లప్పుడూ చల్లగా ఉన్నది. భీముడు ఆ సరోవరాన్ని చేరి అందులో మునిగి స్నానం చేసినవాడై క్రొత్త తామర పూలరేకులతో, తామర తూళ్ళతో గుండ్రని దండలు చేసి ధరించినవాడై వెలువడి, పెక్కు ఆమడలమేర విస్తరించి అందంగా శోభిల్లుతున్న అరటితోపులో ప్రవేశించి అందులో శంఖం పూరించి గొప్పధ్వనిని చేశాడు.

**క. ఆ శంఖరవంబు మహేం । ద్రాశనినిర్ఘోషభీమమై దిక్కులు నా**
**కాశంబు నిండె; నంత గు । హాశయుఁడై యున్న హనుమ యను కపి పెలుచన్. 314**

**ప్రతిపదార్థం:** ఆ శంఖ, రవంబు= ఆ శంఖంనుండి వెలువడిన ధ్వని; మహా+ఇంద్ర+అశని, నిర్ఘోష, భీమము+ఐ= దేవేంద్రుడి పిడుగుయొక్క పెద్దధ్వనివలె భయానకమై; దిక్కులున్= దిక్కులు; ఆకాశంబు= గగనం; నిండెన్= నిండింది; అంత= అటు పిమ్మట; గుహాశయుఁడు+ఐ+ఉన్న= కొండగుహలో శయనించి ఉన్న; హనుమ+అను= హనుమంతుడు అనే; కపి= వానరుడు; పెలుచన్= వేగంగా.

**తాత్పర్యం:** భీముడు చేసిన ఆ శంఖధ్వని దేవేంద్రుడి పిడుగుయొక్క ధ్వనివలె భయానకమై దిగ్దిగంతరాలు, ఆకాశం క్రమ్మింది. అంతట ఆ పర్వతంలోని ఒక గుహలో శయనించి ఉన్న హనుమంతుడు అనే కోతి వేగంగా.

**క. దాని విని బెదరి లేచి 'మ । హానాదం బిది మనఃప్రియం బయ్యెఁ; మదీ**
**యానుజు శంఖధ్వానము । దా నగు' నని యెఱిఁగి హృష్టతనురుహుఁ డగుచున్. 315**

**ప్రతిపదార్థం:** దాని, విని= ఆ భీముడి శంఖ ధ్వని విని; బెదరి= తల్లడిల్లి, ఉలిక్కిపడి; లేచి= మేల్కొని; మహానాదంబు+ఇది= ఇది గొప్ప శబ్దం; మనస్+ప్రియంబు+అయ్యెన్= మనసుకు ప్రీతి కొలిపింది; మదీయ+అనుజు, శంఖధ్వానము, తాన్+అగు= అది నా తమ్ముడియొక్క శంఖధ్వనియే; అని+ఎఱిఁగి= అని తెలిసికొని; హృష్ట, తనురుహుఁడు+అగుచున్= సంతోషంచేత నిక్కపొడిచిన వెంట్రుకలు కలవా డవుతూ.

**తాత్పర్యం:** ఆ శంఖనాదం విని హనుమంతుడు ఉలిక్కిపడి మేల్కొన్నాడు. 'ఇది గొప్పనాదం. మనస్సుకు ప్రీతిని కలిగిస్తున్నది. ఇది నా సోదరుడి శంఖారావమే' అని సంతోషంతో హనుమ రోమాంచ పులకిత దేహుడైనాడు.

**క. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షంబు లురలం ద్రోచి యేకాయనపథంబున కడ్డంబుగా శయనించి లాంగూలలీలాచాలనంబుఁ జేసిన. 316**

**ప్రతిపదార్థం:** భీమునకు= భీముడికి; మార్గ నిరోధంబుగా= దారికి అడ్డుగా; మహావృక్షంబులు= పెద్ద పెద్ద చెట్లు; ఉరలన్+త్రోచి= అడ్డుపడేటట్లు వేసి; ఏక+అయన, పథంబునకు= ఒకరు మాత్రమే నడవటానికి వీలైె ఉన్న (ఇరుకైన) కాలిబాటకు; అడ్డంబుగాన్= అవరోధంగా; శయనించి= పడుకొని; లాంగూల, లీలా, చాలనంబున్+చేసిన= తోకను వినోదంగా అటూ ఇటూ త్రిప్పుతూ కదిలిస్తూ ఉండగా.

**తాత్పర్యం:** అంత, భీముడు ముందుకు సాగిపోవటానికి వీలు లేకుండా, హనుమంతుడు- దారికి అటూ ఇటూ అడ్డంగా గొప్ప గొప్ప చెట్లను పెల్లగించి పడవేశాడు. ఇరుకైన ఒక్కరు మాత్రమే నడవటానికి వీలైె ఉన్న కాలిబాటకు అడ్డంగా తాను శయనించి తన తోకను వినోదంగా ఇటూ అటూ కదిలిస్తూ ఉండి.

**క. గోలాంగూలోత్తము లాం । గూల స్ఫోటనరవంబు ఘోరంబై వా**
**చాలతఁ జేసె నశేషమృ । గాలి భయం బంద గిరిగుహాంతర మురలన్. 317**

**ప్రతిపదార్థం:** గోలాంగూల+ఉత్తము= కోతులలో శ్రేష్ఠుడైన వానియొక్క; లాంగూల, స్ఫోటన, రవంబు= తోకను అటునిటు వేగంగా కదిపేటటువంటి ధ్వని; ఘోరంబు+ఐ= భయానకమై; అశేషమృగ+ఆలి= సమస్త జంతువులును; భయంబు+అంద= భయపడగా; గిరి, గుహా+అంతరము+ఉరలన్= కొండగుహల మధ్యభాగాలు సంచలించగా; వాచాలతన్+చేసెన్= అంతటా ప్రతిధ్వనించింది.

**తాత్పర్యం:** కోతులలో శ్రేష్ఠుడైన హనుమ తోకను కదిలించే ధ్వని భయానకమై ఆప్రదేశమంతా ప్రతిధ్వనించింది. కొండ గుహల మధ్యభాగాలు సంచలించాయి. సమస్తజంతువులు భయపడ్డాయి.

**వ. అయ్యపూర్వధ్వని విని భీముండు విస్మితుండై చని కదళీషండమధ్యంబున నొక్క విశాలశిలాతలంబుపయి శయనించినవాని. 318**

**ప్రతిపదార్థం:** ఆ+అపూర్వ, ధ్వని= అంతకు ముందు ఎప్పుడూ వినిపించనట్టి ఆ నాదం; విని= ఆలకించి; భీముండు= భీముడు; విస్మితుండు+ఐ= ఆశ్చర్యపడి; చని= వెళ్ళి; కదళీ, షండ, మధ్యంబునన్= అరటి తోపు మధ్య; ఒక్క, విశాల, శిలా, తలంబు, పయి= ఒక నిడివి అయిన పెద్ద రాతి మీద; శయనించిన వాని= పవ్వళించి ఉన్న వాడిని.

**తాత్పర్యం:** ముందెన్నడూ వినని ఆ ధ్వనిని విని భీముడు ఆశ్చర్యం చెందాడు. అతడు అరటితోపు మధ్య ఒక నిడుపైన బండమీద పవళించినవాడిని (హనుమను సమీపించాడు)

**సీ. హ్రస్వపీనగ్రీవు, నచలితాయతహను, । నతిచపలస్వభావాభిరాముఁ,**
**దనుమధ్య కటిచక్రు, దహనకణాకార । తామ్రోష్ఠు, నతికృశదశనకరజుఁ,**
**బృథులవిద్యుత్పుంజపింగాక్షు, నుత్తుంగ । దృఢవక్షు, నాజానుదీర్ఘబాహు,**
**నూర్ధ్వలాంగూల మత్యున్నతధ్వజలీలఁ । గ్రాలుచు నుండ నేకాంతయోగ**

**ఆ. నిద్ర నున్న ధర్మనిర్మలు హనుమంతుఁ । జూచి పాండురాజసుతుఁడు వాని**
**నిద్రఁ జెఱుపఁ గడఁగి నిజసత్త్వ మేర్పడ । సింహనాద మొప్పఁ జేసె డాసి. 319**

**ప్రతిపదార్థం:** హ్రస్వ పీన గ్రీవున్= పొట్టిది, బలిసినది అయిన కంఠభాగం కలవాడిని; అచలిత+ఆయత, హనున్= కదలని పొడుగాటి మీదిదవడ కలవాడిని; అతి, చపల, స్వభావ+అభిరామున్= మిక్కిలి చంచలమైన స్వభావంచేత అందగించిన వాడిని; తనుమధ్యకటిచక్రు= సన్నటి నడుముతో కూడిన గుండ్రని మొల కలవాడిని; దహన, కణ+ఆకార, తామ్ర+ఓష్ఠున్= అగ్గిరవ్వ వలె ఎర్రనైన పెదవులు కలవాడిని; అతి, కృశ, దశన, కరజున్= మిక్కిలి సన్ననైన దంతాలు, గోళ్ళు కలవాడిని; పృథుల, విద్యుత్+పుంజ, పింగ+అక్షున్= మెరుపు తీగల సముదాయంవంటి గోరోజనవర్ణం కల కన్నులు కలవాడిని; ఉత్తుంగ, దృఢ, వక్షున్= ఎత్తయినటువంటి బలిష్ఠమైన రొమ్ము కలవాడిని; ఆజాను, దీర్ఘ, బాహున్= మోకాళ్ళ వరకు వ్యాపించిన నిడివైన చేతులు కల వాడిని; ఊర్ధ్వ, లాంగూలము= ఎత్తుగా నిక్కబొడిచిన తోక; అతి+ఉన్నత, ధ్వజ, లీలన్= మిక్కిలి ఎత్తుగా ఉన్న జెండావలె; క్రాలుచున్+ఉండన్= ప్రకాశిస్తుండగా; ఏకాంత యోగ నిద్రన్+ఉన్న= తదేక ధ్యానయోగమనే గాఢమైన నిద్రలో ఉన్న; ధర్మ, నిర్మలున్= ధర్మం చేత స్వచ్ఛమైన వాడిని; హనుమంతున్= ఆంజనేయుడిని; చూచి= దర్శించి; పాండు, రాజ,

సుతుఁడు= పాండురాజుయొక్క పుత్త్రుడైన భీముడు; వాని, నిద్రన్= అతడి నిద్రను; చెఱుపన్+కడఁగి= పోగొట్టటానికి పూని; డాసి= సమీపించి; నిజ, సత్త్వము+ఏర్పడన్= తన బలం తెలిసేటట్లుగా; సింహనాదము= సింహగర్జన వంటి పెద్ద ధ్వని; ఒప్పన్= ఒప్పేటట్లు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** పొట్టిగా బలిష్ఠంగా ఉన్న కంఠభాగం కలవాడిని, కదలనటువంటి పొడుగైన దవడ కలవాడిని, బొత్తిగా నిలుకడ లేని స్వభావం కలిగి ఉండటంచేత ముచ్చట గొలిపేవాడిని, సన్నటి నడుముతోడి గుండ్రని మొల కలవాడిని, నిప్పు కణం వలె ఎర్రనైన పెదవులు కలవాడిని, మిక్కిలి కృశించిన దంతాలు గోళ్ళు కలవాడిని, నిడివిఅయి, మెరుపు తీగల దొంతర వలె గోరోజనవర్ణంతో భాసించే కన్నులు కలవాడిని, గాఢమైన ధ్యాన యోగ నిద్రలో ఉన్నవాడిని, ధర్మంచేత నిర్మలమైన వ్యక్తిత్వం కలవాడిని, హనుమంతుడిని పాండురాజపుత్రుడైన భీముడు చూచి, అతడి నిద్రను చెడగొట్టటానికి పూనుకొని, దగ్గరకు చేరి తన బలం వ్యక్తమయ్యేటట్లు గొప్పగా సింహనాదం చేశాడు.

**వ. హనుమంతుఁడును మెల్లమెల్లన మేల్కని జృంభ సంభృత జలార్ద్రసంచల విలోచనుం డగుచు ననాదరంబున నాతనిం జూచి యిట్లనియె. 320**

**ప్రతిపదార్థం:** హనుమంతుఁడును= ఆంజనేయుడును; మెల్ల, మెల్లన= మెల్లమెల్లగా; మేల్కని= నిద్ర లేచి; జృంభ, సంభృత, జల+ఆర్ద్ర, సంచల, విలోచనుండు+అగుచున్= ఆవులింతలచేత ఏర్పడిన నీటిచేత తడిసి కదిలేటటువంటి కన్నులు కలవాడు ఔతూ; న+ఆదరంబునన్= నిరాదరంతో లెక్క చేయక; ఆతనిన్+చూచి= వాడిని చూచి- ఆ భీముడిని చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** (ఆ సింహనాదాన్ని విని) ఆంజనేయుడు మెల్ల మెల్లగా నిద్ర వీడి మేలుకొన్నాడు. ఆవులింతలవలన ఏర్పడిన నీటిచేత తడిసి కదిలే కన్నులు కలవాడై, భీముడిని నిర్లక్ష్యంగా చూచి ఈ విధంగా పలికాడు.

**విశేషం:** నిద్రనుండి మేల్కొనేటప్పుడు ఆవులింతలు ఏర్పడటం, కన్నుల నీరు క్రమ్మటం, కోతి కాబట్టి కదిలే కన్నులు కలిగి ఉండటం సహజం. ఈ వర్ణన 'స్వభావోక్తి' అలంకారం.

**తే. 'అతిజరారోగభరమున నలసి యొలసి । యొదిఁగి సుఖనిద్రమై నిట్టులున్న వానిఁ**
**గడుమదంబున నేమియుఁ గరుణ లేక । యేల బోధించి తయ్య! నీ వెఱిఁగి యెఱిఁగి. 321**

**ప్రతిపదార్థం:** అతి, జరా, రోగ, భరమునన్= మిక్కుటమైన ముసలితనంయొక్కయు, వ్యాధులయొక్కయు భారంచేత; అలసి+ఒలసి= డస్సి, క్షీణించి; ఒదిఁగి= అణగి; సుఖ, నిద్రమైన్= గాఢ నిద్రలో; ఇట్టులు+ఉన్న వానిన్= ఈ విధంగా ఉన్న వాడిని; కడు, మదంబునన్= మిక్కుటమైన గర్వంతో; ఏమియున్+కరుణ, లేక= ఏ మాత్రమూ జాలి లేకుండా; నీవు= నీవు; ఎఱిఁగి+ఎఱిఁగి= పూర్తిగా తెలిసినవాడివై; ఏల= ఎందుకు; బోధించితి+అయ్య?= నిద్ర మేల్కొల్పినావయ్యా?

**తాత్పర్యం:** 'మిక్కుటమైన ముసలితనం యొక్క, వ్యాధుల యొక్క భారం వలన బడలి, అలసట చెంది అణగి ఒక మూల ఒదిగి నిద్రిస్తున్నాను కదా. ఇంచుకైనా జాలి లేకుండా నీవు మిక్కిలి గర్వంతో, తెలిసి తెలిసి ఎందుకు నా నిద్ర పాడుచేసి మేలుకొలిపావయ్యా?

**వ. తిర్యగ్జాతులు ధర్మ వెఱుంగవు గాక; సర్వభూతదయాస్వరూపంబైన ధర్మ వెఱింగెడువారు మనుష్యుల కారె! యిట్టి మనుష్యజన్మంబు వడసి వృద్ధోపసేవ సేయవు గాకేమి ధర్మ వెఱుంగక నిర్దయుండవై మాబోఁటి పేద మృగంబులకు భయంబుగ గర్జిలితి; వీ వెవ్వండవు? మనుష్య గోచరంబు గాని యివ్వనంబున కేల వచ్చితి? సిద్ధగతి లేనివారి కిట వోవ నశక్యం; బమృతకల్పంబులైన యీ ఫలమూలంబు లుపయోగించి క్రమ్మఱుము; నీయందు బద్ధస్నేహుండఁ గాన బుద్ధి సెప్పితి; నా పలుకులు చేకొను' మనిన భీముం డిట్లనియె. 322**

**ప్రతిపదార్థం:** తిర్యక్+జాతులు= జంతువుల తెగలు; ధర్మువు+ఎఱుంగవు= ధర్మాన్ని తెలియజాలవు; కాక= కాని; సర్వ, భూత, దయా, స్వరూపంబు+అయిన= అఖిల ప్రాణులయందు కరుణతో కూడిన; ధర్మువు+ఎఱింగెడు వారు= ధర్మాన్ని తెలిసిన వారు; మనుష్యులు+అ+కారె= మనుషులే కదా; ఇట్టి= ఇటువంటి; మనుష్య, జన్మంబు+పడసి= మనుష్యుడి పుట్టుకనొంది; వృద్ధ+ఉపసేవ, చేయవు+కాక+ఏమి= నీవు పెద్దల శుశ్రూష చేయలేదా యేమి?; ధర్మువు+ఎఱుంగక= ఎటువంటి ధర్మాన్ని తెలియక; నిర్+దయుండవు+ఐ= దయలేని వాడివై; మాబోఁటి= మా వంటి; పేద, మృగంబులకు= అల్ప జంతువులకు; భయంబుగ, గర్జిలితివి= భీతి కలిగేటట్లు పెద్ద కేక పెట్టావు; ఈవు+ఎవ్వండవు?= నీవు ఎవ్వరివి?; మనుష్య, గోచరంబు+కాని= మనుషులకు కనిపించనటువంటి; ఈ+వనంబునకున్= ఈ అడవిలోకి; ఏల, వచ్చితి?= ఎందుకు అరుదెంచావు; సిద్ధ, గతి, లేనివారికి= అతిలోకశక్తుల వలన కలిగిన నడక లేనివారికి; ఇట+పోవన్= ఇక్కడ చరించటానికి; న+శక్యంబు= సాధ్యం కాదు; అమృత, కల్పంబులు+ఐన= అమృతంతో సమానాలయిన; ఈ, ఫల, మూలంబులు= ఈ పళ్ళు, వేళ్ళు; ఉపయోగించి= ఆరగించి; క్రమ్మఱుము= మరలిపొమ్ము; నీ+అందు= నీ యెడ; బద్ధ, స్నేహుండన్+కాన= అనుసంధించబడిన నెయ్యం కలవాడిని కాబట్టి; బుద్ధి+చెప్పితి= హితవును ఉపదేశించాను; నా పలుకులు= నా మాటలు; చేకొనుము= స్వీకరించుము- అనగా నేను చెప్పిన ప్రకారం చేయుము; అనిన= అని పలుకగా; భీముండు= భీముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** జంతువులకు ధర్మం తెలియదు కాని, సకలజీవులయెడ దయ కలిగి ఉండటం అనే ధర్మం తెలిసిన వారు మనుష్యులు మాత్రమే కదా! అటువంటి మనుష్యజన్మ లభించిన నీవు పెద్దలను ఉపాసించి మంచీ చెడూ తెలిసికోలేదా ఏమి? ధర్మం తెలిసికొనక జాలి లేని వాడివై మాబోటి అల్పజంతువులు దద్దరిల్లేటట్లు ఎందుకు గర్జించావు? నీవు ఎవరివి? మనుష్యులు మసలని ఈ అడవికి ఎందుకు వచ్చావు? అతిలోకమైన శక్తులు గల మనుష్యులు తప్ప ఈ అడవిలో మరి ఎవ్వరు తిరుగలేరు. అమృతంతో సమానమైనవి ఈ పండ్లు, వేళ్ళు, వీటిని ఆరగించి మరలిపొమ్ము. నీయందు నాకు మిక్కుటమైన నెయ్యం ఏర్పడింది కాబట్టి నీకు ఈ హితవు చెప్పుతున్నాను. నేను చెప్పిన మాటల ప్రకారం చేయుము'- అని చెప్పగా, భీముడు ఈ విధంగా మారుపలికాడు.

**తే. 'క్షత్రియప్రవరుండ విఖ్యాతబలుఁడఁ । బాండుతనయుండ గొంతిగర్భంబునందు**
**వాయువరమునఁ బుట్టినవాఁడ; నన్ను । భీముఁ డండ్రు భూజనులు కపిప్రభుండ! 323**

**ప్రతిపదార్థం:** కపి, ప్రభుండ!= కోతులలో నేత అయిన వాడా!; క్షత్రియ ప్రవరుండన్= క్షత్రియులలో శ్రేష్ఠుడిని; విఖ్యాత, బలుఁడన్= బలం కలవాడిగా సుప్రసిద్ధుడిని; పాండు, తనయుండన్= పాండురాజు కొడుకును; గొంతి, గర్భంబునందు= కుంతీ దేవి కడుపున; వాయు, వరమునన్= వాయు దేవుని వరాన; పుట్టినవాఁడన్= జన్మించినవాడిని; భూజనులు= భూలోకంలోని ప్రజలు; నన్ను= నన్ను; భీముఁడు+అండ్రు= భీముడు అనే పేరుతో పిలుస్తారు.

**తాత్పర్యం:** 'కోతులకు నేత అయినవాడా! నేను క్షత్రియులలో శ్రేష్ఠుడిని, మహావీరుడిగా సుప్రసిద్ధుడిని. పాండురాజు పుత్రుడిని. గాలిదేవరదయవలన కుంతికి జన్మించిన వాడిని. భూప్రజలు నన్ను భీముడు అనే పేరుతో పిలుస్తారు.

**వ. ఏ నిక్కడఁ గార్యార్థినై పోయెద; నాకుఁ దెరు వి; మ్మీనినాఁడు దొల్లి శతయోజన విస్తారంబయిన సముద్రంబు లంఘించి లంకకుం బోయిన హనుమంతు నట్ల నిన్ను నీ పర్వతంబు లంఘించి పోదు' ననిన హనుమంతుం 'డతం డేమి కారణంబున సముద్రలంఘనంబుఁ జేసె? నెఱుంగు దేని జెప్పు' మనిన వానికి భీముం డిట్లనియె. 324**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఇక్కడన్+ఇప్పుడు; కార్య+అర్థిని+ఐ= ఒకానొక ప్రయోజనాన్ని ఉద్దేశించిన వాడనై; పోయెద= వెళ్తున్నాను; నాకున్+తెరువు+ఇమ్ము= నాకు దారి ఇమ్ము; ఈని, నాఁడు= ఇవ్వనివేళ; తొల్లి= పూర్వం; శత, యోజన, విస్తారంబు+అయిన= నూరామడల మేర వైశాల్యం కలిగిన; సముద్రంబు= సముద్రాన్ని; లంఘించి= దాటి; లంకకు+పోయిన= లంకకు వెళ్ళిన; హనుమంతు+అట్ల= ఆంజనేయుడివలె; నిన్నున్= నిన్ను; ఈ పర్వతంబు= ఈ కొండను; లంఘించి= దూకి, దాటి; పోదున్= వెళ్ళగలను; అనిన= అని చెప్పగా; హనుమంతుండు అతండు= ఆ హనుమంతుడు; ఏమి, కారణంబునన్= ఏ హేతువు చేత; సముద్ర, లంఘనంబున్= సముద్రాన్ని దూకి దాటటం; చేసెన్?= చేశాడు?; ఎఱుంగుదు+ఏని= తెలిసినట్లయితే; చెప్పుము= చెప్పవలసింది; అనినన్= అని చెప్పగా; వానికి= ఆ హనుమకు; భీముండు= భీముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** నేను ఇపు డొక పనిమీద వెళ్ళుతున్నాను. నాకు దారి విడువుము; నీవు నాకు దారి విడువక పోతే, అలనాడు నూరామడలమేర విస్తారమైన కడలిని దూకి దాటి, లంకకు వెళ్ళిన ఆంజనేయుడివలె నేను నిన్ను, ఈ కొండను అవలీలగా దూకి దాటి పోగలను'- అని చెప్పగా భీముడితో 'ఏకారణాన హనుమంతుడు సముద్రాన్ని దాటి లంకకు వెళ్ళాడో నీకు తెలిస్తే తెలియజేయుము' అనగా భీముడు ఈవిధంగా చెప్పాడు.

**క. 'అలఘుం డిక్ష్వాకుమహా । కుల వీరుఁడు రాఘవుండు గురువచనంబున్**
**సలుప వనవాసియై తన । లలనం గోల్పడియె నట్టె లంకేశ్వరుచేన్. 325**

**ప్రతిపదార్థం:** అలఘుండు= గొప్పవాడు, తేలికకానివాడు; ఇక్ష్వాకు, మహా, కుల, వీరుఁడు= ఇక్ష్వాకు మహారాజుయొక్క గొప్ప వంశం లోని శూరుడు; రాఘవుండు= రఘువంశంలో జన్మించిన శ్రీరాముడు; గురు వచనంబున్= తండ్రి మాటను; సలుప= ఆచరించటానికి; వన, వాసి+ఐ= అరణ్యంలో నివసించిన వాడై; తన, లలనన్= తన కాంతను- తన భార్యను; లంకా+ఈశ్వరుచేన్= లంకకు ప్రభువైన రావణుడిచేత; కోల్పడియెన్+అట్టె= పోగొట్టుకొన్నాడు కదా.

**తాత్పర్యం:** 'గొప్ప ఇక్ష్వాకువంశంలో జన్మించిన మహాపురుషుడున్నూ, రఘుమహారాజువంశానికి చెందిన వాడున్నూ అయిన శ్రీరాముడి, పితృవాక్యపరిపాలనకై అరణ్యంలో నివసించి తన భార్యఅయిన సీతాదేవిని లంకకు అధిపతి అయిన రావణుడిచేత పోగొట్టుకొన్నాడు కదా!

**క. సీతాన్వేషణపరులై । నీతిఁ గపిప్రవరు లరిగి నిరతంబుగ సం**
**పాతి యను పక్షిచేత మ । హీతనయ సువార్త లెల్ల నెఱిఁగి కడంకన్. 326**

**ప్రతిపదార్థం:** సీతా+అన్వేషణ, పరులు+ఐ= సీతను వెదకు నట్టివారలై; నీతిన్= మంచి ప్రవర్తనతో; కపి, ప్రవరులు= కోతుల నాయకులు; అరిగి= వెళ్ళి; నిరతంబుగన్= స్థిరంగా; సంపాతి+అను+పక్షిచేతన్= సంపాతి అనే పేరు కల పక్షి వలన; మహీ, తనయ= భూపుత్రి అయిన సీతయొక్క; సువార్తలు= క్షేమసమాచారాలు; ఎల్లన్= అన్నియు; ఎఱిఁగి= తెలిసి; కడంకన్= పూనికతో.

**తాత్పర్యం:** సీతను వెదకే ప్రయత్నంలో నీతిగల వానరనాయకులు ఆసక్తితో సాగిపోతూ, సంపాతి అనే పక్షి సీతయోగక్షేమాలను గురించి చెప్పగా తెలిసికొని, పట్టుదలతో.

**క. వారలు వారిధి గడవఁగ । నేరక తా రున్న యెడ ననిలసత్త్వమునన్**
**వారిధి లంఘించె మహా । వీరుఁడు హనుమంతుఁ డనఁగ విందుఁ గపీంద్రా! 327**

**ప్రతిపదార్థం:** కపి+ఇంద్రా!= వానరులలో శ్రేష్ఠుడివైన వాడా!; వారలు= వారు- ఆ కపి ప్రవరులు; వారిధి= సముద్రాన్ని; కడ వఁగ నేరక= దాటలేక; తారు+ఉన్న+ఎడ= తాము ఉన్నప్పుడు; అనిల, సత్త్వమునన్= వాయువు యొక్క శక్తితో; మహా వీరుఁడు= గొప్ప వీరుడు; హనుమంతుఁడు= ఆంజనేయుడు; వారిధి= సముద్రాన్ని; లంఘించెన్= దాటాడు; అనఁగ= అని చెప్పగా; విందున్= వింటుంటాను.

**తాత్పర్యం:** కోతులలో శ్రేష్ఠుడివైనవాడా! ఆ కోతులనేతలు సముద్రాన్ని దాట లేక వారందరూ నిర్వేదంతో నిలిచిపోయినప్పుడు, హనుమంతుడు వాయుదేవుడిశక్తివంటి శక్తితో సముద్రాన్ని లంఘించాడని విన్నాను.

**వ. ఏను హనుమంతునంతియ బలపరాక్రమంబులు గలవాఁడ; నా పౌరుషంబుఁ జూపుదునే?' యనిన నవ్యక్త హాసముఖుం డగుచు 'నన్నా! యేను ముదిసినవాఁడ లేవ నోపం; బోయెదవేని నాతోకం బాయంద్రోచి పొ' మ్మనిన మెచ్చక తన వామకరంబున నెత్తం బోయి వశంబుగాక. 328**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; హనుమంతు+అంతియ= ఆంజనేయుడి అంత; బల, పరాక్రమంబులు+కలవాఁడన్= శక్తి శౌర్యాలు కలవాడిని; నా, పౌరుషంబున్= నా పరాక్రమాన్ని; చూపుదునే?= చూపాలా?; అనినన్= అని చెప్పగా; అవ్యక్త, హాస, ముఖుండు+అగుచున్= పైకి కనిపించని నవ్వు ముఖంలో కలవా డౌతూ; అన్నా!= సోదరా!; ఏను= నేను; ముదిసినవాఁడన్= ముసలివాడిని; లేవన్+ఓపన్= లేవలేను; పోయెదవు+ఏని= వెళ్ళదల్చుకుంటే; నా, తోఁకన్= నా తోకను; పాయన్+త్రోచి= అవతలికి (ప్రక్కకు) నెట్టి; పొమ్ము= వెళ్ళుము; అనిన= అని చెప్పగా; మెచ్చక= లెక్కచేయక; తన, వామ, కరంబునన్= తన యెడమ చేత్తో; ఎత్తన్+పోయి= ఎత్తటానికి ప్రయత్నించి; వశంబు+కాక= శక్యం కాక.

**తాత్పర్యం:** నేను హనుమంతుడితో సమానమయిన శక్తిశౌర్యాలు కలవాడిని. నా పరాక్రమాన్ని ప్రదర్శించమంటావా?' అని భీముడు పలుకగా హనుమంతుడు చిరునవ్వును తన ముఖంలో పైకి కనిపించకుండా అణచుకొని, 'అన్నా! నేను ముసలివాడిని కదా! లేవలేను; నీవు ముందుకే పోదలిస్తే దయచేసి నా తోకను కొద్దిగా అవతలికి నెట్టి వెళ్ళుము' అని చెప్పగా భీముడు లెక్క చేయకుండా నిర్లక్ష్యంగా తన ఎడమచేతితో తోకను నెట్టబోయి, శక్యం కాక.

**ఉ. ఏపున రెండుచేతులను నిమ్ముగఁ బట్టి యమర్చి యెత్తఁగా**
**నోపక మొగ్గతిల్లఁబడి యుద్గతఘర్మజలార్ద్రదేహుఁ డై**
**కాపురుషుండుఁ బోలె నిజగర్వము దక్కి యడంగి యుండెఁ జిం**
**తాపరుఁడై వృకోదరుఁడు దద్దయు లజ్జ నధోముఖంబుతోన్. 329**

**ప్రతిపదార్థం:** ఏపునన్= ఉత్సాహంతో; రెండు, చేతులను= రెండు చేతులతో; ఇమ్ముగన్+పట్టి= బాగుగా పట్టుకొని; అమర్చి= అనుసంధించి; ఎత్తఁగాన్+ఓపక= ఎత్తలేక; మొగ్గతిల్లన్+పడి= మొగ్గవాలినట్లు వెల్లకిలపడి; ఉద్గత, ఘర్మ, జల+ఆర్ద్రదేహుఁడు

+ఐ= వెలువడిన చెమటనీటితో తడిసిన శరీరం కలవాడై; కాపురుషుండున్+పోలె= అల్పమానవుడి వలె; నిజ, గర్వము+తక్కి= తన మదాన్ని వీడి; వృక+ఉదరుఁడు= (తోడేలు పొట్టవంటి కడుపు కలవాడు) భీముడు; చింతాపరుఁడు+ఐ= దుఃఖించిన వాడై; తద్దయు= మిక్కుటమైన; లజ్జన్= సిగ్గుతో; అధస్+ముఖంబుతోన్= క్రిందకు వాల్చిన ముఖంతో; అడంగి= అడకువతో; ఉండెన్= ఉండినాడు.

**తాత్పర్యం:** (భీముడు ఎడమ చేతితో ఆంజనేయుడి తోకను కదుపలేక పోయి, అటు తర్వాత), ఉత్సాహంతో తన బలాన్నంతా ఉపయోగించి రెండుచేతులు అమర్చి తోకను కదిలించ జూచాడు కాని, ఆ తోకను కదల్చ లేక పోయాడు. అతడి దేహమంతా చెమటనీటితో తడిసి పోయింది. అప్పుడతడు అల్పమానవుడివలె గర్వం వీడి, విచారిస్తూ సిగ్గుతో తలవంచుకొని నిలిచాడు.

**వ. ఇట్లు కపివరు లాంగూలంబుఁ గదల్ప నోపక భీముండు కృతప్రణాముం డయి 'ని న్నెఱుంగక నా పలికిన దురుక్తంబులు సహింపవలయు; నీవు కపిరూప ధరుండవైన సిద్ధుండవో, గంధర్వుండవో; దేవవరుండవో నా కెఱింగింపు' మనిన హనుమంతుండు భీముం జూచి నగుచు 'నేను గేసరిక్షేత్రంబున వాయుభట్టారకునకుం బుట్టిన వాఁడ; నీ చెప్పిన హనుమంతుండ; నీవు నా యనుజుండవు; దొల్లి రఘుకులేశ్వరుం డయిన రామ దేవుండు రావణుం డను రాక్షసుచేత నపహృతభార్యుండై సుగ్రీవాది వానరుల నసంఖ్యాతసంఖ్యలవారిం దనకు సహాయులం జేసికొని సేతుబంధనంబున సముద్రంబు లంఘించి సమరంబున రావణు వధియించి యందు నా కెలసంబునకు మెచ్చి. 330**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఆ+కపివరు= కోతులలో శ్రేష్ఠుడయిన అతని; లాంగూలంబున్= తోకను; కదల్పన్+ఓపక= కదల్చలేక; భీముండు= భీముడు; కృత, ప్రణాముండు+అయి= నమస్కరించి నటువంటి వాడై; నిన్ను+ఎఱుంగక= నిన్ను గురించి తెలియక; నా, పలికిన= నేను మాట్లాడిన; దుర్+ఉక్తంబులు= చెడ్డ మాటలు; సహింపవలయు= ఓర్చుకోవాలి; నీవు= నీవు; కపి, రూప, ధరుండవు+ఐన= కోతి ఆకారాన్ని ధరించిన; సిద్ధుండవో= సిద్ధులకు చెందిన వేల్పువో; గంధర్వుండవో= గంధర్వుడివైన వేల్పువో; దేవ, వరుండవో= దేవతలలో శ్రేష్ఠుడివో; నాకు+ఎఱింగింపుము= నాకు తెలియజెప్పుము; అనిన= అని అడుగగా; హనుమంతుండు= హనుమంతుడు; భీమున్+చూచి= భీముడిని చూచి; నగుచున్= నవ్వుతూ; ఏను= నేను; కేసరిక్షేత్రంబున= కేసరి అనే వాడి భార్య అయిన అంజనాదేవికి (క్షేత్రము= ఆడది భార్య); వాయుభట్టారకునకున్= పూజ్యుడైన గాలి దేవరకును; పుట్టిన వాఁడ= జన్మించిన వాడిని; నీ, చెప్పిన= నీవు చెప్పినట్టి; హనుమంతుండన్= హనుమంతుడిని; ఈవు= నీవు; నా+అనుజుండవు= నాకు తమ్ముడివి; తొల్లి= పూర్వకాలాన; రఘు, కుల+ఈశ్వరుండు+అయిన= రఘువంశానికి ప్రభువైన; రామ, దేవుండు= దేవుడైన శ్రీరాముడు; రావణుండు+అను, రాక్షసుచేతన్= రావణుడు అనే పేరు గల రాక్షసుడి చేత; అపహృత, భార్యుండు+ఐ= అపహరించబడిన భార్యకలవాడై; సుగ్రీవ+ఆది, వానరులన్= సుగ్రీవుడు మొదలైన కోతులను; న+సంఖ్యాత, సంఖ్యల, వారిన్= లెక్క పెట్టలేనంతమంది వానరులను; తనకు= తనకు; సహాయులన్+చేసికొని= తోడుపడే వారినిగా చేసికొని; సేతుబంధనంబున= వారిధి కట్టటం చేత; సముద్రంబు= కడలిని; లంఘించి= దాటి; సమరంబునన్= యుద్ధమందు; రావణు= రావణుడిని; వధియించి= సంహరించి; అందు= ఆ యుద్ధంలో; నా కెలసంబునకు= నా సేవకు; మెచ్చి= సగౌరవంగా పొగడి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ కపివరుడి తోకను కదల్చలేక, భీముడు అతడికి నమస్కరించి 'నిన్ను తెలియలేక నేను మాట్లాడిన చెడ్డ పలుకులు క్షమించ ప్రార్థన. నీవు కోతి ఆకృతి తాల్చిన సిద్ధుడివో! గంధర్వుడివో! దేవశ్రేష్ఠుడివో!

దయచేసి నాకు తెలుపుము.' అనగా- హనుమంతుడు భీముడిని చూచి నవ్వుతూ, 'నేను కేసరిభార్య అయిన అంజనా దేవికి, పూజ్యుడైన వాయు దేవుడివరంవలన జన్మించిన వాడిని. ఇంతకుముందు నీవు పేర్కొనిన హనుమంతుడిని నేనే! నీవు నా తమ్ముడివే. పూర్వకాలాన రఘువంశంలో జన్మించిన ప్రభువు శ్రీరామదేవుడు రావణుడు అనే రాక్షసుడు తన భార్యను అపహరించగా, సుగ్రీవుడు మొదలైన లెక్కకు మించిన సంఖ్యగల వానరుల తోడ్పాటుతో వారధి కట్టి, సముద్రాన్ని దాటి, యుద్ధంలో రావణుడిని సంహరించి, అందు నా సేవకు మెచ్చి.

**మధ్యాక్కర.**

**'నరసురస్తుత్యమై యెంతకాలంబు నా కీర్తి నిలుచు**
**నిరతంబుగా నంత కాలమున్ నీవు నిత్యుండ వగుచుఁ**
**బరఁగు' మని వరముఁ దగ దయంజేసి ప్రభుఁ డుర్వి యెల్ల**
**సరిఁ బదునొక్కండు వేలయేం డ్లేలి చనియెఁ దా దివికి.'** **331**

**ప్రతిపదార్థం:** నర, సుర, స్తుత్యము+ఐ= మనుష్యుల చేతను, దేవతల చేతను, పొగడబడినటువంటిదై; ఎంత, కాలంబు= ఎంత సమయం; నా, కీర్తి; నిలుచు= నిలచి ఉంటుందో; అంత, కాలమున్= అంత సమయం; నీవు= నీవు; నిరతంబుగాన్= ఎడతెగకుండా; నిత్యుండవు+అగుచున్= చిరంజీవివి అవుతూ; పరఁగుము= శోభిల్లుము; అని= అని చెప్పి; వరమున్= అనుగ్రహాన్ని; తగన్= ఒప్పునట్లుగా; దయన్+చేసి= దయతో ఇచ్చి; ప్రభుఁడు= శ్రీరామచంద్ర ప్రభువు; ఉర్విన్+ఎల్ల= భూమిని అంతటినీ; సరిన్, పదునొక్కండు, వేల, ఏండ్లు= సమంగా పదకొండు వేల సంవత్సరాలు; ఏలి= పరిపాలించి; తాన్= తాను; దివికి= స్వర్గానికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'నరులచేత, దేవతలచేత నా కీర్తి ఎంతకాలం శ్లాఘించబడుతుందో అంతకాలం నీవు చిరంజీవి వై భూమిమీద వర్ధిల్లు' మని శ్రీరామచంద్రప్రభువు నాకు వరాన్ని అనుగ్రహించి, తాను పదకొండు వేలయేళ్ళు భూమిని పరిపాలించి స్వర్గాన్ని అలంకరించాడు.'

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 2.22 విశేషాంశం చూడండి.

**వ. అనిన విని భీముండు వాని నప్పుడు హనుమంతుం గానెఱింగి సంతసిల్లి వెండియు నమస్కరించి 'భవద్దర్శనంబునం గృతార్థుండ నయితి' నని యిట్లనియె.** **332**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; విని= ఆలకించి; భీముండు= భీముడు; వానిన్= ఆ వానరుడిని; అప్పుడు= అపుడు; హనుమంతున్+కాన్+ఎఱింగి= హనుమంతుడిగా తెలిసికొని; సంతసిల్లి= సంతోషాన్ని పొంది; వెండియు= మళ్ళీ; నమస్కరించి= వందనం చేసి; భవత్+దర్శనంబునన్= నిన్ను సందర్శించటం వలన; కృత+అర్థుండను= ధన్యుడిని; అయితిని= అయినాను; అని= అని పలికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా ఆలకించి, భీముడు ఆ వానరమే హనుమంతుడు అని తెలిసికొని, సంతోషాన్ని చెంది, అతడికి మళ్ళీ వందనం ఆచరించి, 'నిన్ను చూడటంచేత ధన్యుడిని అయినాను' అని చెప్పి ఇట్లా పలికాడు.

ఆ. 'బలిముఖుండ! దయయుఁ గలవేని దొల్లి య । ర్ణవము గడచి చనిననాఁటి నీదు
రూపుఁ జూడ వలతుఁ, జూపు నా' కనవుడు । వాని కిట్టు లనియె వానరుండు. 333

**ప్రతిపదార్థం:** బలిముఖుండ!= వానరుడివైన ఓ ఆంజనేయా!; దయయున్+కలవు+ఏని= నీవు నామీద దయ ఉన్న వాడివి అయితే; తొల్లి= పూర్వం; అర్ణవము= కడలిని; కడచి= దాటి; చనిన= వెళ్ళిన; నాఁటి= ఆనాటి; నీదు= రూపున్= నీ ఆకృతిని; చూడ వలతున్= చూడకోరుతాను; నాకున్+చూపు= నాకు చూపించవలసింది; అనవుడు= అని పలుకుగా; వానరుండు= హనుమంతుడు; వానికి= భీముడికి; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'వానరుడుగా కనిపిస్తున్న ఓ ఆంజనేయా! నామీద నీకు దయ ఉన్నట్లయితే, దయచేసి అలనాడు నీవు సముద్రాన్ని దాటిన ఆకారాన్ని నేడు నాకు చూపించుము' అని అడుగగా, ఆ వానరుడు భీముడికి ఇట్లా బదులు పలికాడు.

క. 'అక్కాలంబున రూపం । బిక్కాలమునందుఁ జూప నెట్లగుఁ? గాలం
బొక్క విధంబున నుండక । పెక్కు ప్రకారముల నుండు భిన్నావస్థన్. 334

**ప్రతిపదార్థం:** ఆ+కాలంబునన్, రూపంబు= ఆ సమయంలోని ఆకారం; ఈ+కాలమునందున్= ఈ సమయంలో; చూపన్= ప్రదర్శించటం; ఎట్లు+అగున్?= ఏ రీతిగా వీలవుతుంది?; కాలంబు= కాలం; ఒక్క, విధంబునన్= ఒకే రీతిగా; ఉండక= ఉండక, అంటే మారుతూ; పెక్కు ప్రకారంబులన్= పలు రీతులుగా; భిన్న+అవస్థన్= వేరు వేరు స్థితిగతులలో; ఉండున్= ఉంటుంది.

**తాత్పర్యం:** 'సముద్రాన్ని దాటే సమయంలోని ఆ ఆకారం ఈ సమయంలో ప్రదర్శించటం ఏవిధంగా వీలవుతుంది? కాలం ఒకే రీతిగా ఉండదు. పలువిధాలుగా మార్పు చెందుతూ వేరు వేరు స్థితిగతులలో ఉంటుంది.

వ. దానం జేసి కృత త్రేతా ద్వాపర కలియుగంబుల సంఖ్యలు వేఱు వేఱయై, యందుల చరాచర భూతంబులు భిన్నప్రకారంబులై వర్తిల్లు' ననిన 'నయ్యై యుగంబుల యాచార ప్రవర్తనంబులు నా కేర్పడం జెప్పు' మనిన భీమునకు హనుమంతుం డిట్లనియె. 335

**ప్రతిపదార్థం:** దానన్+చేసి= ఆకారణం చేత; కృత, త్రేతా, ద్వాపర, కలియుగంబుల, సంఖ్యలు= కృత యుగంయొక్క, త్రేతాయుగం యొక్క, ద్వాపరయుగం యొక్క, కలియుగం యొక్క పరిమాణ సంఖ్యలు; వేఱు వేఱు+ఐ= భిన్న భిన్నాలుగా; అందుల= ఆయా యుగాలలోని; చర+అచర, భూతంబులు= కదలని, కదిలేటి అనగా చేతనాచేతన పదార్థాలన్నీ; భిన్న, ప్రకారంబులు+ఐ= వేరు వేరు పద్ధతులు కలివియై; వర్తిల్లున్= కొనసాగుతాయి; అనినన్= అని చెప్పగా; అయ్యై= ఆయా; యుగంబుల= యుగాలలోని; ఆచార, ప్రవర్తనంబులు= అనుష్ఠానాలు, నడవడుల సంప్రదాయాలు; నాకు= నాకు; ఏర్పడన్+చెప్పుము= విశదంగా తెలియ చేయవలసింది; అనిన= అని అడుగగా; హనుమంతుండు= ఆంజనేయుడు; భీమునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా తెలిపాడు.

**తాత్పర్యం:** ఆ కారణంచేత కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం- వీటి పరిమితుల సంఖ్యలు భిన్నమైనవి. అట్లే ఆయా యుగాలలోని చేతనాచేతనాలు వేరు వేరు రీతులు గలిగి ప్రవర్తిల్లుతాయి'- అని ఆంజనేయుడు

బదులు పలుకగా భీముడు 'ఆయా యుగాలలోని నడవడికల సంప్రదాయాలు, అనుష్ఠానాలు నాకు వివరించి చెప్పవలసింది' అని ప్రార్థించాడు. అంత హనుమంతుడు భీముడికి ఇట్లా చెప్పాడు.

**భీమునకు హనుమంతుఁడు చతుర్యుగాచార వర్తనంబులను దెలుపుట (సం. 3-148-10)**

**తే. 'కృతమ కాని కర్తవ్యంబు గృతయుగంబు । నందు లేదు; చతుష్పాద మగుచు ధర్మ**
**మనఘ! వర్తిల్లు; నచ్యుతుం డయ్యుగమున । శుక్లవర్ణుఁడై ప్రజలఁ గాచుచు వెలుంగు. 336**

**ప్రతిపదార్థం:** కృతము+అ, కాని= చేయబడినదే కాని; కర్తవ్యంబు= చేయవలసినది; కృతయుగంబునందు= కృతయుగంలో; లేదు= లేదు; అనఘ!= ఓ పాపరహితుడివైనవాడా!; ధర్మము= ధర్మువు; చతుః+పాదము+అగుచు= చతుష్పాదమగుచు= నాలుగు పాదాలు కలిగినటువంటిది అవుతూ; వర్తిల్లున్= జరుగుతుంది; ఆ+యుగమున= ఆ యుగంలో; అచ్యుతుండు= విష్ణు దేవుడు; శుక్లవర్ణుఁడు+ఐ= తెల్లటి రంగు కలవాడై; ప్రజలన్= ప్రజలను; కాచుచు= సంరక్షిస్తూ; వెలుంగున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** 'పాపరహితుడివై ఓ భీమసేనా! కృతయుగంలో చేయటమే గాని చేయవలసినటువంటిది లేదు. ధర్మం నాలుగు పాదాలలో వర్తిస్తుంది. విష్ణుదేవుడు ఆయుగంలో తెల్లటిరంగు కలవాడై ప్రజలను కాపాడుతూ వెలుగొందుతుంటాడు.

**విశేషం:** కృతయుగంలో నిర్వహించవలసిన కర్తవ్యాలను నూటికి నూరుపాళ్ళు అందరూ నిర్వహిస్తారు. కాబట్టి చేయబడనటువంటి కర్తవ్యమే ఆ యుగాన ఉండదని చెప్పబడింది. అందుచేత ధర్మం నాలుగుపాదాలతో వర్తిల్లుతుంది. నాల్గుపాదాలు అంటే నూటికి నూరుపాళ్ళు. పాదం అంటే ఒకటిలో నాల్గవ వంతు. నేటి పరిభాషలో 1/4=25 శాతం.

**వ. అది సనాతనధర్మసనాథం; బందుల బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రు లేకవేదక్రియాయోగ్యులై యకామ ఫలసంయోగంబునఁ బుణ్యలోకంబులు వడయుదు; రందు నసూయాభిచార దర్పపైశున విగ్రహ క్రోధమదమత్సర భయ సంతాప వ్యాధి ప్రజాక్షయేంద్రియక్షయంబులు లేవు; మఱియుఁ ద్రేతాయుగంబునందుఁ ద్రిపాదంబై ధర్మువు వర్తిల్లు; నందు జనులు నిత్యసత్యవ్రతశీలురై యజ్ఞతపో దానాది క్రియల వర్తింతు; రందు రక్తవర్ణుండయి విష్ణుభట్టారకుండు ప్రజారక్షణంబుఁ జేయు. 337**

**ప్రతిపదార్థం:** అది= ఆ కృతయుగం; సనాతన, ధర్మ, సనాథంబు= శాశ్వతమైన ధర్మంతో కూడి ఉండి నటువంటిది; అందులన్= ఆ యుగంలో; బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులు= బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు; ఏక, వేద, క్రియా, యోగ్యులు+ఐ= ఒకే విధమైన వేదం నిర్దేశించిన కార్యాలను చేయటానికి తగిన అర్హత కలవారై; న+కామ, ఫల, సంయోగంబునన్= కోరుకోకుండా సంక్రమించే ఫలాలచేత కూడుకొనే వారు అవటంచేత; పుణ్య, లోకంబులు= ఉత్తమగతులు; పడయుదురు= పొందగలరు; అందున్= ఆ కృతయుగంలో; అసూయా+అభిచార, దర్ప, పైశున, విగ్రహ, క్రోధ, మద, మత్సర, భయ, సంతాప, వ్యాధి, ప్రజాక్షయ+ఇంద్రియ క్షయంబులు, లేవు= మంచి గుణాలలో దోషాలను ఆరోపించటం, శత్రువులపై ద్వేషంతో చేసే మంత్ర కర్మలు, డాంబికత్వం, లోభం, కలహం, కోపం, గర్వం, ఓర్వలేమితనం, వెరపు, దుఃఖం, రోగం, జననాశనం, ఇంద్రియాల శక్తుల వినాశనాలు, ఉండవు. మఱియున్= ఇంకను; త్రేతాయుగంబునందున్= త్రేతా యుగాన; ధర్మువు= ధర్మం; త్రి, పాదంబు+ఐ= మూడు పాదాలు కలదై; వర్తిల్లున్= మనగలదు, వర్తిల్లుతుంది; అందు= ఆత్రేతాయుగంలో; జనులు= ప్రజలు; నిత్య, సత్య, వ్రత, శీలురు+ఐ= ఎల్లప్పుడూ నిజం చెప్పటంలో నిష్ఠ కల వారై; యజ్ఞ+తపస్+దాన+ఆది,

క్రియల= యజ్ఞాలు, తపస్సు, దానాలు చేయటం మొదలైన కార్యాలలో; వర్తింతురు= ప్రవర్తిస్తూ ఉంటారు; అందున్= ఆ త్రేతాయుగంలో; రక్త, వర్ణుండు+అయి= ఎఱ్ఱటి రంగు కలవాడై; విష్ణు, భట్టారకుండు= పూజ్యుడైన విష్ణుదేవుడు; ప్రజా, రక్షణంబున్+చేయు= జనులను కాపాడుతాడు.

**తాత్పర్యం:** ఆ కృతయుగంలో శాశ్వత స్వరూపమైన ధర్మంతో కూడి ఉంటుంది. అందు బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు ఒకే విధమయిన వేదం ఆదేశించే కార్యాలను ఆచరించే యోగ్యత కలవారై ఉంటారు. వారికి కోరికలు లేకుండగానే సంక్రమించే ఫలాలవలన ఉత్తమగతులు సంప్రాప్తిస్తాయి. ఆ యుగంలో దుర్గుణవిజృంభణ ఉండదు. మంచి గుణాలకు చెడుఉద్దేశాలు ఆరోపించబడవు. శత్రువులపై పగ తీర్చుకొనటానికి మంత్ర తంత్ర కర్మలు జరగవు. డాబు, పిసినిగొట్టుతనం, కలహస్వభావం, కోపం, గర్వం, ఓర్వలేనితనం, వెఱపు, దుఃఖం, రోగం, ప్రజానాశనం, ఇంద్రియ పటుత్వంతగ్గటం ఉండవు. ఇంక త్రేతాయుగంలో ధర్మం మూడుపాదాలతో ప్రవర్తిల్లుతుంది. అందులో జనులు ఎల్లప్పుడూ నిజం చెప్పటం అనే నిష్ఠతో ఉంటారు. యజ్ఞాలు, తపస్సు, దానం మొదలైన పుణ్యకార్యాలను చేయటంలో ప్రజలు ఆసక్తి కలవారౌతారు. ఆ త్రేతాయుగంలో పూజనీయుడైన విష్ణుదేవుడు ఎఱ్ఱటిరంగు కలవాడై ప్రజలను కాపాడుతాడు.

**తే. ద్వాపరంబున రెండుపాదములఁ జేసి । నడుచు ధర్మువు వేదముల్ నాల్గుదెఱఁగు**
**లై ప్రవర్తిల్లు వేదశాస్త్రార్థ చోది । తంబులై ధర్మకామముల్ ధరణిఁ బరఁగు. 338**

**ప్రతిపదార్థం:** ద్వాపరంబున= ద్వాపరయుగంలో; ధర్మువు= ధర్మం; రెండు, పాదములన్+చేసి= రెండు పాదాలతో; నడచున్= వర్తిల్లుతుంది; వేదముల్= వేదాలు; నాల్గు, తెఱఁగులు+ఐ= నాలుగు తీరులై; ప్రవర్తిల్లున్= నడుస్తాయి; వేద, శాస్త్ర+అర్థ, చోదితంబులు+ఐ= వేదాలయొక్క, శాస్త్రాలయొక్క పరమార్థం చేత నడుపబడినవై; ధర్మ, కామముల్= ధర్మము, కామము; ధరణిన్= భూమిపై; పరఁగున్= విలసిల్లుతాయి.

**తాత్పర్యం:** ద్వాపరయుగంలో ధర్మం రెండు పాదాల నడుస్తుంది. వేదాలు నాలుగు తెరగులుగా ప్రవర్తిల్లుతాయి. వేదాలలోను, శాస్త్రాలలోను ప్రతిపాదించబడిన భావాలచేత నడుపబడి ధర్మకామాలు విలసిల్లుతాయి.

**తే. సత్యశమహీను లగుదురు జనులు గామ । కాములై చేయుదురు బహుక్రతువు లోలి;**
**నందుఁ ద్రైలోక్యవందితుం డచ్యుతుండు । కృష్ణవర్ణుఁడై జగము రక్షించు మఱియు. 339**

**ప్రతిపదార్థం:** జనులు= ప్రజలు; సత్య, శమ, హీనులు+అగుదురు= నిజం పలకటమున్నూ, మనస్సు మొదలగు అంతరింద్రియాల నిగ్రహమున్నూ లేని వారవుతారు; కామ, కాములు+ఐ= కోరికలను కోరేవారై; బహు, క్రతువులు= పెక్కు యాగాలు; చేయుదురు= చేస్తారు; అందున్= ఆ ద్వాపర యుగంలో; త్రైలోక్య, వందితుండు= మూడు లోకాలచేత నమస్కరించబడేవాడు; అచ్యుతుండు= విష్ణువు (శ్రీకృష్ణుడు); కృష్ణ, వర్ణుఁడు+ఐ= నల్లటిరంగు కలవాడై (నీలవర్ణం కలవాడై); జగము= లోకాన్ని; రక్షించున్= కాపాడుతాడు; మఱియు= ఇంకను.

**తాత్పర్యం:** ద్వాపరయుగంలో ప్రజలు నిజం మాట్లాడరు. అంతరింద్రియ నిగ్రహాన్ని కోల్పోతారు. కోరికలయెడ ఆసక్తి కలవారై పెక్కు యజ్ఞాలు నిర్వహిస్తారు. ముల్లోకాల చేత నమస్కరింపబడే విష్ణుదేవుడు నీలవర్ణుడై జగత్తును కాపాడుతాడు.

**క. కలియుగమునందు ధర్మము । బలమఱి వర్తిల్లు నేకపాదంబున; నం**
**దలఘుఁడు కృష్ణుఁడు జగతీ । వలయము రక్షించుఁ బీతవర్ణుం డగుచున్. 340**

**ప్రతిపదార్థం:** కలియుగమునందున్= కలియుగంలో; ధర్మము= ధర్మువు; బలము+అఱి= శక్తి నశించి; ఏక పాదంబునన్= ఒకే చరణంతో; వర్తిల్లున్= నడుస్తుంది; అందున్= ఆ కలియుగంలో; న+లఘుఁడు= తేలిక కానివాఁడు అనగా గొప్పవాడు; కృష్ణుఁడు= విష్ణు దేవుడు; పీత, వర్ణుండు+అగుచున్= పసుపురంగు కలవాడై; జగతీ, వలయము= సృష్టి మండలాన్ని; రక్షించున్= కాపాడుతాడు.

**తాత్పర్యం:** కలియుగంలో ధర్మం, శక్తి తగ్గి ఒకే పాదాన నడుస్తుంది. అప్పుడు విష్ణుదేవుడు పసుపురంగు కల వాడై ప్రపంచాన్ని కాపాడుతాడు.

**వ. అందుల జనులు తమోగుణ యుక్తులై కామక్రోధాది దోషవశంబునం దమ్మెఱుంగక యధర్మవర్తు లగుదు; రందుఁ జేసిన తపోదానాది కర్మంబులు స్వల్పంబులయ్యును బహుఫలంబు లగు' నని యుగవర్తన ప్రకారంబులఁ జెప్పి, 'నీ కిష్టావాప్తి యయ్యెడు, నరుగు' మనిన భీముం డిట్లనియె. 341**

**ప్రతిపదార్థం:** అందుల జనులు= ఆ కలియుగంలోని ప్రజలు; తమస్+గుణ, యుక్తులు+ఐ= తమోగుణం కలవారై; కామ, క్రోధ+ఆది, దోష, వశంబునన్= కోరికలు, కోపం హెచ్చు అవటం మొదలగు ఆరు విధాలైన తప్పుల మూలాన (అరిషడ్వర్గాలనే దోషాలకు వశులై ఉండటం వలన); తమ్ము+ఎఱుంగక= తమను తాము తెలిసికొనక; న+ధర్మ, వర్తులు= అధర్మానికి లోబడినవారు; అగుదురు= అవుతారు. అందున్= కలియుగంలో; చేసిన= ఆచరించిన; తపస్+దాన+ఆది, కర్మంబులు= తపస్సు, త్యాగ బుద్ధితో ఇతరులకు దానం చేయటం మొదలైన పనులు; స్వల్పంబులు+అయ్యును= తక్కువవే అయినప్పటికీ; బహు, ఫలంబులు= హెచ్చు ఫలితాలను ఇచ్చేటటువంటిది; అగున్= కాగలవు; అని= ఈ ప్రకారంగా; యుగ, వర్తన, ప్రకారంబులన్= యుగాలు నడిచే రీతులను; చెప్పి= చెప్పి; నీకు+ఇష్ట+అవాప్తి= నీకు అభిమతం చేకూరటం; అయ్యెడున్= అవుతుంది; అరుగుము= వెళ్ళుము; అనినన్= అని చెప్పగా; భీముండు= భీముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ కలియుగంలోని జనులు కోరికలు, కోపం మొదలైన ఆరు దుర్గుణాలను (అరిషడ్వర్గాలను) పెంచుకొని, తమను తాము తెలిసికొనలేని ఆవేశం కలిగి అధర్మమార్గంలో నడుస్తారు. కాని, ఆ కలియుగంలో చేసిన తపం, దానం మొదలైన సత్కార్యాలు స్వల్పమైనవైనా హెచ్చు ఫలాలను ఇస్తాయి' అని హనుమంతుడు ఆయా యుగాలు ప్రవర్తించే తీరు తెన్నులు తెలియజెప్పి 'నీ అభీష్టం నెరవేరుతుంది వెళ్ళు' మని పలుకగా భీముడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇందులో తమోగుణ ప్రస్తావన ఉన్నది. సత్త్వము-రజస్సు-తమము అని మూడు గుణాలు. ఈ జగత్తు త్రిగుణ సమ్మేళనంగా అభివర్ణితం. వీటికి శక్తులు అని కూడా నామాంతరం ఉంది. భగవద్గీతలో సత్త్వ రజస్తమోగుణాలను గురించిన సవిస్తరమైన వివరణ ఉన్నది. స్థూలంగా సత్త్వం అంటే మంచితనం. అహింసాదాన ధర్మదయా నిగ్రహప్రవృత్తి. రాజసం అంటే తీవ్రత, ఆటోపం, బలం మొదలైన గుణాల ఉత్కర్ష. తామసం అంటే దుర్జనత్వం. హింసా క్రౌర్య అజ్ఞానాల విజృంభణం అని చెప్పవచ్చును.

**హనుమంతుఁడు భీమునకుఁ దనపూర్వరూపంబుఁ జూపుట (సం. 3-149-1)**

**క. 'నీ నాఁటి తనువుఁ జూచియ । కాని యవశ్యంబు పోవఁ; గావునఁ గపినా**
**థా! నాకుఁ జూపు' మనవుడు । వానికిఁ దనరూపుఁ జూపె వానరుఁ డంతన్. 342**

**ప్రతిపదార్థం:** నీ, నాఁటి, తనువున్= నీ యొక్క అలనాటి దేహాన్ని అంటే- నీవు అలనాడు సముద్రాన్ని లంఘించినప్పటి నీదేహాన్ని; చూచియ, కాని= దర్శించిన తరువాతే కాని; అవశ్యంబు, పోవన్= నిశ్చయంగా వెళ్ళను; కావునన్= కాబట్టి; కపినాథా!= ఓ వానర శ్రేష్ఠుడా!; నాకున్+చూపుము= నాకు (అలనాటి నీ నిజ స్వరూపం) ప్రదర్శించుము; అనవుడు= అని చెప్పగా; వానరుఁడు= హనుమంతుఁడు; అంతన్= అంతట; వానికిన్= ఆ భీముడికి; తన, రూపున్= తన ఆకారాన్ని; చూపెన్= చూపించాడు.

**తాత్పర్యం:** 'ఓ వానరశ్రేష్ఠుడా! నీలు పూర్వకాలాన ఆనాడు సముద్రాన్ని లంఘించిన నాటి నీ నిజ స్వరూపాన్ని చూడనిదే నేను నిశ్చయంగా ఇక్కడినుండి కదిలి వెళ్ళను. కాబట్టి నీవు దయచేసి నాకు నీ నిజస్వరూపాన్ని చూపించ వలసింది' అని భీముడు ప్రార్థించాడు. అంత హనుమంతుడు భీముడికి తన నిజరూపాన్ని ప్రదర్శించాడు.

**చ. అతులితమై ద్వితీయ కనకాద్రి యొకో యిది నా నిజాంగ మూ**
**ర్జితముగఁ బెంచి పుచ్ఛమునఁ జేసి దిగంతము లందుచున్న యు**
**న్నతుఁ గపినాథుఁ జూచి కురునందనుఁ డప్డు నిమీలితాక్షుఁ డై**
**మతి నతివిస్మితుం డగుచు మారుతి కిట్లనియెన్ భయంబునన్. 343**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ స్వరూపం; అతులితము+ఐ= సాటిలేనటువంటిదై; ద్వితీయ, కనక+అద్రి+ఒకో!= ఓహో! రెండవ బంగరు కొండ అగునా! (రెండవ మేరు పర్వతమా!); నాన్= ఇది అన్నట్లుగా; నిజ+అంగము= తన శరీరం; ఊర్జితముగన్= ఎక్కువగా; పెంచి= పెరిగేటట్లుగా చేసి; పుచ్ఛమునన్+చేసి= తోకతో; దిక్+అంతములు= దిక్కుల చివరి కొసలు; అందుచున్న= తాకుతున్న; ఉన్నతున్= ఎత్తయిన వాడిని; కపి, నాథున్= వానరులలో శ్రేష్ఠుడైన వాడిని; చూచి= చూచి; కురునందనుఁడు= కురువంశంలో పుట్టిన భీముడు; అప్డు= అపుడు; నిమీలిత+అక్షుఁడు+ఐ= మూతలు పడిన కన్నులు కలవాడై; మతిన్= మనస్సులో; అతి, విస్మితుండు+అగుచున్= మిక్కిలి ఆశ్చర్యం చెందిన వాడై; భయంబునన్= భయంతో; మారుతికి= హనుమంతుడితో; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** సాటి లేనటువంటి ఈ రూపం రెండవ మేరుపర్వతమా! అనిపించేటట్లుగా తన శరీరాన్ని పెద్దగా పెంచి, తోకతో దెసల కొసలు తాకుతున్న హనుమంతుడి ఎత్తయిన నిజస్వరూపాన్ని చూచి, కురువంశ కుమారుడైన భీముడు కన్నులు మూసికొని, మనస్సులో మిగుల ఆశ్చర్యపడుతూ భయంతో మారుతికి ఇట్లా విన్నివించుకొన్నాడు.

**క. 'అతిభీషణ మిది యత్య । ద్భుత మోహో! చాలు; భూనభోమధ్యవ్యా**
**పిత మయ్యె భవద్దేహా । యతత్వ ముపసంహరింపు' మనవుడుఁ గపియున్. 344**

**ప్రతిపదార్థం:** అతి, భీషణము+ఇది= ఇది మిక్కిలి భయం (వెఱపు) కొలిపేటటువంటిది; అతి+అద్భుతము= మిక్కిలి ఆశ్చర్యం గొలిపేటటువంటిది; ఓహో!= ఎంత ఆశ్చర్యకరం!; చాలు= ఇక అవసరం లేదు; భూ, నభన్+మధ్య,

వ్యాపితము+అయ్యెన్= భూమికి, ఆకాశానికి మధ్యస్థలంలో అంతా విస్తరించింది; భవత్+దేహ+ఆయతత్వము= నీ శరీరం యొక్క నిడివిని; ఉపసంహరింపుము= ఇక విరమించుము; అనవుడున్= అని చెప్పగా; కపియున్= ఆంజనేయుడున్నూ.

**తాత్పర్యం:** 'ఓహో! ఎంత భయంకరమైనది నీ ఆకారం! ఎంత ఆశ్చర్యకరంగా ఉన్నది! నీ శరీరం యొక్క నిడివి భూమ్యాకాశాల మధ్యన గల రోదసి నంతటినీ ఆక్రమించిందే!! ఈ నీ నిజస్వరూపాన్ని దయచేసి ఉపసంహరించ వలసింది' అని భీముడు కోరాడు. అంతట హనుమంతుడు.

**క. తన యెప్పటి రూపముఁ జే। కొని 'దీనికి నినుమడుం గగుం బ్రతిబలముం**
**గనినప్పుడు నా రూపం। బనుపమముగ' ననిన హనుమ కనిలజుఁ డనియెన్. 345**

**ప్రతిపదార్థం:** తన+ఎప్పటి రూపమున్= తనకు ఎప్పుడూ ఉండే ఆకృతిని; చేకొని= స్వీకరించి; దీనికిన్= నీవు ఇప్పుడు చూచినటువంటి నా ఆకారానికి; నా రూపంబు= నా ఆకారం; ప్రతి బలమున్= శత్రుసేనలను; కనినప్పుడు= చూచినప్పుడు; అనుపమముగన్= పోలికలేనట్లుగా; ఇనుమడుంగు+అగున్= రెండు రెట్లు హెచ్చు కాగలదు; అనినన్= అని చెప్పగా; హనుమకు= ఆంజనేయుడితో; అనిలజుఁడు= వాయుపుత్రుడైన భీముడు; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** హనుమంతుడు తాను ఎప్పుడూ ధరించే ఆకారాన్ని తిరిగి పొందాడు. 'శత్రుబలాన్ని చూచినపుడు నా ఆకారం నీవు చూచిన దానికి రెండింతలు పెరుగుతుంది. ఆ ఆకారానికి పోలికే లేదు సుమా!' అని చెప్పాడు. అంత భీముడు ఆంజనేయుడికి ఇట్లా బదులు పలికాడు.

**ఉ. 'ఉన్నతిఁ బూని నీవు బలియుం డగు రావణు నశ్రమంబునం**
**బన్నుగఁ జంపనోపు పటుబాహుబలాఢ్యుఁడ విట్టియున్నతున్**
**నిన్ను సహాయుఁగా బడసి నిర్మలనీతిపరుండు రాఘవుం**
**డన్నరభోజనాన్వయుల నాజి వధించుట యేమి చోద్యమే?' 346**

**ప్రతిపదార్థం:** ఉన్నతిన్+పూని= గొప్పతనం వహించి; నీవు= నీవు; బలియుండు+అగు= బలం కలిగినట్టి వాడైన; రావణున్= రావణుడిని; న+శ్రమంబునన్= శ్రమ లేకుండా- తేలికగా; పన్నుగన్= యుద్ధంలో తగినట్లు; చంపన్+ఓపు= సంహరించగల; పటు, బాహు, బల+ఆఢ్యుఁడవు= సమర్థవంతమైన భుజపరాక్రమం కలవాడివి; ఇట్టి+ఉన్నతున్= ఇటువంటి గొప్పవాడిని; నిన్ను= నిన్ను; సహాయున్+కాన్= తోడుపడే వాడినిగా; పడసి= పొంది,; నిర్మల, నీతి, పరుండు= స్వచ్ఛమైన నీతికలవాడు; రాఘవుండు= శ్రీరాముడు; ఆ+నర, భోజన+అన్వయులన్= మనుష్యులను ఆహారంగా తినేటటువంటి రాక్షస వంశీయులను; ఆజిన్= యుద్ధంలో; వధించుట= చంపటం; ఏమి, చోద్యమే?= ఏమి వింత?

**తాత్పర్యం:** 'నీవు గొప్పవాడివి, నీవు పూనుకొని అంతటి బలవంతుడైన ఆ రావణుడిని సైతం సులువుగా యుద్ధంలో సంహరించ కలిగినవాడివి. అట్టి గొప్ప పరాక్రమం కల నిన్ను సహాయుడిగా గొని, రఘువంశంలో జన్మించిన శ్రీ రామచంద్రుడు నరమాంసభక్షకులైన రాక్షసులను యుద్ధంలో చంపటం ఏమంత వింత కాదు.'

**వ. అనిన వాని కతిప్రీతిమంతుండై హనుమంతు డిట్లనియె 'నయ్యా! నీవు సౌగంధిక సరోవరంబునకుం బోయెద వే నందు సాహసంబు సేయవలవ; దది యక్షరాక్షసరక్షితంబై దేవతోపభోగయోగ్యంబై యుండు; దేవతలు**

**బలిహోమ నమస్కారంబులఁజేసి భక్తిసాధ్యులు గాని సాహసక్రియాసాధ్యులు గారు; నీవు నిజధర్మ నిష్ఠితుండవై పరమధర్మంబు లెఱుంగునది; యెందేని హీనబుద్ధులు విమోహింతు రట్టి ధర్మాధర్మవిభాగంబు లెఱుంగు విద్వాంసుల నుపాసించి శుభాచారుండవు గావలయు; నాచారంబున ధర్మంబు వుట్టు; ధర్మంబువలన వేద ప్రతిష్ఠ యగు; వేదంబులం జేసి యజ్ఞంబులు ప్రవర్తిల్లు; నట్టి యజ్ఞంబువలన దేవతలు తృప్తు లగుదురు.347**

**ప్రతిపదార్థం:** అనిన= అని చెప్పగా; వానికి= అతడికి అనగా భీముడి పట్ల; అతి, ప్రీతిమంతుండు+ఐ= మిక్కిలి ప్రేమ కలవాడై; హనుమంతుండు= ఆంజనేయుడు; ఇట్లు= ఈ విధంగా, ఇట్లా; అనియెన్= చెప్పాడు; అయ్యా!= నాయనా!; నీవు= నీవు; సౌగంధిక, సరోవరంబునకున్= సౌగంధికములు అనేటటువంటి తామర పువ్వులు పూచే సరస్సుకు; పోయెదవు+ఏని= వెళ్ళినట్లయితే; అందు= అక్కడ; సాహసంబు+చేయ, వలవదు= తొందర పడి పరాక్రమాన్ని ప్రదర్శించవద్దు; అది= ఆ సరస్సు; యక్ష, రాక్షస, రక్షితంబు+ఐ= యక్షులచేతను, రాక్షసులచేతను కాపాడబడునటువంటిదై; దేవతా+ఉపభోగయోగ్యంబు+ఐ= వేల్పుల చేత అనుభవించతగినది అయి; ఉండు= ఉంటుంది; దేవతలు= వేల్పులు; బలి, హోమ, నమస్కారంబులన్+చేసి= నైవేద్యాలచేత, అగ్నిలో వేల్చటం చేత, వందనాలు చేయటం ద్వారా; భక్తి, సాధ్యులు, కాని= ఆరాధన భావంతో వశమయ్యేటటువంటి వారే కాని; సాహసక్రియా, సాధ్యులు, కారు= తొందరపాటుతో కూడిన పనులచేత వశమయ్యేవారు కారు; నీవు= నీవు; నిజ, ధర్మ, నిష్ఠితుండవు+ఐ= నీవు ఆచరించవలసిన ధర్మమందు దీక్ష కలవాడివై; పరమ ధర్మంబులు= ధర్మాలలో కెల్ల ఉత్తమములైన ధర్మాలను; ఎఱుంగునది= తెలిసికొనేది; ఎందేని= అటువంటి ఉత్తమములైన ధర్మాలను తెలిసికొనటంలో; హీన, బుద్ధులు= అల్పబుద్ధులు, సరియైన తెలివి తేటలు లేనివారు; విమోహింతురు= భ్రమకు లోను అవుతారో; అట్టి= అటువంటి; ధర్మ+అధర్మ, విభాగంబులు= ధర్మాధర్మ విచక్షణలను; ఎఱుంగు= తెలిసినట్టి; విద్వాంసులను= పండితులను; ఉపాసించి= ఆరాధించి; శుభ+ఆచారుండవు+కావలయున్= మంచి ప్రవర్తన కలవాడివి కావాలి; ఆచారంబున= ప్రవర్తనవలన అనగా మహానుభావులు పలువురు ఆచరించేటటువంటి తీరు తెన్నులలో వర్తించటం వలన; ధర్మంబు= ధర్మం; పుట్టు= ఉద్భవిస్తుంది; ధర్మంబు వలన= ధర్మం వలన; వేద, ప్రతిష్ఠ+అగు= వేదాల యొక్క స్థిరమైన ఉనికి ఏర్పడుతుంది; వేదంబులన్+చేసి= వేదాలచేత; యజ్ఞంబులు= క్రతువులు; ప్రవర్తిల్లున్= జరుగుతాయి; అట్టి= అటువంటి; యజ్ఞంబువలన= వేదాలచేత ప్రతిపాదించబడిన క్రతువులు జరగటంవలన; దేవతలు= వేల్పులు; తృప్తులు= తృప్తి చెందినవారు; అగుదురు= అవుతారు.

**తాత్పర్యం:** అని భీముడు పలుకగా అతడి యెడ మిక్కిలి ప్రేమతో హనుమంతుడు ఇట్లా చెప్పాడు: 'నాయనా! నీవు సౌగంధికాలు అనే పేరు కల నూరురేకుల బంగారు తామరపువ్వులు గల కొలనుకు పోయినట్లయితే, అక్కడ తొందరపడి నీ శౌర్యం ప్రదర్శించటానికి పూనుకొనవద్దు. ఆ సరోవరాన్ని యక్షులు, రాక్షసులు కాపాడుతుంటారు. అది దేవతలు అనుభవించేటటువంటిది. దేవతలు ఆరాధనకు లొంగుతారు. బలులు, హోమాలు, నమస్కారాల వలన సంతృప్తి చెందుతారు. వారు భక్తిభావం చేత ప్రసన్నులౌతారు గాని, శౌర్యపరాక్రమాలచేత సాధించతగినవారు కారు. నీవు నీ ధర్మాన్ని ఆచరించటంలో దీక్ష పూనుము. పరమధర్మాన్ని తెలిసికొనుము. సరిఅయిన తెలివితేటలు లేనివారు ఎక్కడ పొరపడతారో అట్టి ధర్మాధర్మవిచక్షణను పండితులను ఆశ్రయించి తెలిసికొనుము. ఆవిధంగా నీవు సరి అయిన ప్రవర్తన అలవరచుకొనుము. మహాత్ములయొక్క ప్రవర్తన పలువురిచేత అనుసరించబడినదై.

ఉత్తమమగు ఆచారం అవుతుంది. అటువంటి ఆచారం నుండి ధర్మం జన్మిస్తుంది. ధర్మం వలన వేదం పొదుకొంటుంది. వేదాలవలన యజ్ఞాలు జరుగుతాయి. అటువంటి యజ్ఞాలు జరగటంచేత దేవతలు తృప్తి చెందుతారు.

**ఆ. కార్యసిద్ధిపొంటెఁ గాలంబు దేశంబు । నెఱిఁగి బుద్ధిమంతు లెల్లప్రొద్దు**
**సాహసంబు విడిచి సామాద్యుపాయప్ర । యుక్తి చేయుదురు యథోచితముగ. 348**

**ప్రతిపదార్థం:** బుద్ధిమంతులు= తెలివి కలవారు; ఎల్లప్రొద్దు= ఎల్లప్పుడూ; కార్య, సిద్ధి, పొంటెన్= కార్యం జయప్రదమవటానికి; కాలంబు= తగిన కాలాన్ని; దేశంబున్= తగిన స్థలాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; సాహసంబు విడిచి= తొందరపాటును విడిచిపెట్టి; సామ+ఆది+ఉపాయ, ప్రయుక్తి= సామం మొదలైన ఉపాయాలను ఉపయోగించి; యథా+ఉచితముగన్= ఆయాసమయాలకు ఆయా స్థలాలకు; తగినట్లుగా; చేయుదురు= ఆచరిస్తారు.

**తాత్పర్యం:** ఏ కర్తవ్యాన్ని నెరవేర్చటంలోనైనా బుద్ధిమంతులు తగిన సమయాన్ని తగిన స్థలాన్ని తెలిసికొని సాహసాన్ని వదలి సామదాన భేద దండోపాయాలను ఏవిధంగా ప్రయోగించతగునో అట్లాగే ప్రయోగించి విజయాన్ని సాధిస్తారు.

**విశేషం:** విజయ సాధనకు ప్రాచీనులు పేర్కొన్న నాలుగు ఉపాయాలు (1) సామం= మంచితనం ఉపయోగించటం, (2) దానం= ధనం ఇవ్వటం (3) భేదం= శత్రువులలో చీలికలు ఏర్పరచటం (4) దండం= పరాక్రమం చూపి శత్రువులను శిక్షించటం. చతుర్విధోపాయాలను ప్రయోగించటంలో మొదటిది సామం. చిట్ట చివరిది దండం అని మరువకూడదు.

**వ. మఱియు సర్వకార్యంబులు మంత్రమూలంబులు గావున విద్వాంసులై ప్రబుద్ధులైనవారలతో మంత్రంబుఁ జేయునది; బాలకులయు నధికశ్రీదర్పితులయు లుబ్ధులయు లఘుజనంబులయుఁ దోడ మంత్రంబు సేయవలదు. 349**

**ప్రతిపదార్థం:** మఱియు= ఇంకను; సర్వ, కార్యంబులు= అన్ని పనులు; మంత్ర, మూలంబులు= ఆలోచనే ఆధారంగా కలవి; కావున= కాబట్టి; విద్వాంసులు+ఐ= పండితులై; ప్రబుద్ధులు= ఐనవారలతో= గొప్పతెలివితేటలు కలవారితో; మంత్రంబున్+ చేయునది= ఆలోచించాలి; బాలకులయున్= చిన్నపిల్లలతో; అధిక శ్రీదర్పితులయు= అమితమైన ధనంచేత గర్వించే వారలతో; లుబ్ధులయు= పిసినిగొట్టులతో; లఘు జనంబులయున్+తోడన్= నీచులు అయిన వారితో; మంత్రంబు+చేయవలదు= ఆలోచించటం కూడదు.

**తాత్పర్యం:** ఇంకనూ అన్ని పనులు నెరవేరటానికి ఆలోచన అవసరం. కాబట్టి పండితులై గొప్ప తెలివి తేటలు కలవారితో ఆలోచన చేయాలి. బాలకులతో, ఎక్కువ సంపదతో విర్రవీగే వారితో, పిసినిగొట్టులతో, నీచులతో ఆలోచన చేయకూడదు.

**తే. జనులు నిగ్రహానుగ్రహశక్తుఁ డైన । రాజు శాసనమునఁ జేసి రమణతోడ**
**నోలిఁ దమ తమ మర్యాద లొక్కనాఁడుఁ । దప్ప నోడుదు రిమ్మహీతలమునందు. 350**

**ప్రతిపదార్థం:** జనులు= ప్రజలు; నిగ్రహ+అనుగ్రహ, శక్తుఁడు+ఐన= దండించటానికి, దయ చూపటానికి సామర్థ్యం కల; రాజు, శాసనమునన్+చేసి= ప్రభువు యొక్క ఆజ్ఞచేత; రమణతోడన్= సంతోషంతో; ఓలిన్= వరుసగా; ఒక్కనాఁడున్=

ఒకరోజు కూడా; ఈ, మహీ, తలము, నందు= ఈ భూలోకంలో; తమ, తమ, మర్యాదలు= తమ తమ విధులు; తప్పన్= అతిక్రమించటానికి, ఓడుదురు= భీతిల్లుతారు.

**తాత్పర్యం:** దండించటానికి, దయ చూపటానికి శక్తికల రాజు యొక్క శాసనం వలన ప్రజలు నిరంతరం సంతోషిస్తూ, భూతలం మీద ఒకనాడు కూడా తమ తమ విధులను తప్పటానికి వెనుకాడుతారు.

**వ. నీవు నిగ్రహానుగ్రహసమర్థుండవు గావున నీ కెల్లవారును వశ్యు లగుదురు; నిన్నుఁ జూచుటంజేసి నా నయనంబులు సఫలంబయ్యెఁ; నీకెద్ది యిష్టంబు దానిం జేసెద. 351**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; నిగ్రహ+అనుగ్రహ, సమర్థుండవు= దండించటానికికాని, దయ చూపటానికి కాని శక్తి కల వాడివి; కావున= కాబట్టి; నీకు= నీకు; ఎల్లవారును= అందరున్నూ; వశ్యులు+అగుదురు= లోబడిన వారు అవుతారు; నిన్నున్+ చూచుటన్+చేసి= నిన్ను చూడటం చేత; నా నయనంబులు= నా కళ్ళు; సఫలంబు+అయ్యెన్= ఫలంతో కూడినవి అయినాయి, ధన్యమైనాయి; నీకున్+ఎద్ది= నీకు ఏది; ఇష్టంబు= ప్రీతి కలిగించేదో; దానిన్= దానిని; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** నీవు దయ చూపగలవు, దండించ గలవు. ఈ రెండు శక్తులు నీకు ఉన్నాయి. అందుచేత అందరూ నీకు లోబడి ఉంటారు. నిన్ను చూడటంచేత నా కన్నులు సార్థకాలైనాయి. నీకు ఏది ఇష్టమో చెప్పుము. నేను దానినే చేస్తాను.

**మత్తకోకిలము.**

**మీకు నెగ్గొనరించి యున్న యమిత్రులన్ హతబుద్ధులం**
**జీకురాజు తనూజులం గురుసింహ! నీకుఁ బ్రియంబుగా**
**నేకమాత్రన పోరిలో వధియించి నాగపురంబు నా**
**నాకులాద్రి శిలావలీ గహనంబు సేయుదు' నావుడున్. 352**

**ప్రతిపదార్థం:** మీకున్= మీకు; ఎగ్గు= అపకారం; ఒనరించి, ఉన్న= చేసిఉన్న; అమిత్రులన్= శత్రువులను; హతబుద్ధులన్= చెడిన తెలివితేటలు కలవారిని; చీకురాజు తనూజులన్= గ్రుడ్డి ప్రభువు అయిన ధృతరాష్ట్రుడి కొడుకులను; కురుసింహ!= కురు వంశ మందలివారిలో సింహంవంటివాడా!; నీకున్= నీకు; ప్రియంబుగాన్= సంతోషంగా; ఏక మాత్రన= ఒంటరిగా; పోరిలోన్= యుద్ధంలో; వధియించి= సంహరించి; నాగపురంబు= హస్తినాపురిని; నానా, కులాద్రి, శిలా+ ఆవలీగహనంబు+ చేయుదున్= పెక్కుకుల పర్వతాలయొక్క రాళ్ళ సముదాయంతో నింపి, ప్రవేశించ వీలుకాని దానినిగా చేయగలను; నావుడున్= అని చెప్పగా.

**తాత్పర్యం:** కురువంశంలో సింహంవంటివాడివైన ఓ భీమా! మీకు కీడు చేసిన శత్రువులను చెడిపోయిన తెలివి తేటలు కలవారిని, గుడ్డి ప్రభువు కొడుకులను నీకు సంతోషం కలిగేటట్లుగా నేను ఒక్కడినే యుద్ధంలో సంహరించి హస్తినాపురాన్ని పెక్కు కుల పర్వతాలలోని రాళ్ళు రప్పలతో కప్పి, చొరరాని అడవిగా మార్చి వేయగలను'- అని ఆంజనేయుడు చెప్పగా భీముడు (ఇట్లా చెప్పాడు).

**మత్తకోకిలము.**

> **'ఇంతయుం గపినాథ! నీ కిది యేమి పెద్ద? మహాహవా**
> **భ్యంతరంబున నుద్ధతప్రతిపక్షవీరుల నేమ ని**
> **ర్జింతు; మెవ్వరు మాకు మీ దయఁజేసి మార్కొను నంత య**
> **త్యంతవీరులు లేరు భూవిదితప్రతాపబలోన్నతిన్.'** **353**

**ప్రతిపదార్థం:** కపి, నాథ!= వానరులలో శ్రేష్ఠుడ వైనవాడా!; ఇంతయున్= ఇది అంతా- అంటే అసహాయశూరుడవై ఒంటిగా మా శత్రువులను అందరినీ యుద్ధంలో సంహరించటం; నీకు= నీకు; ఇది+ఏమి, పెద్ద?= ఇది ఏమంత ఘనకార్యం?; మహా+ఆహవ+అభ్యంతరంబునన్= గొప్పదైన పోరుమధ్యలో; ఉద్ధత, ప్రతిపక్ష, వీరులన్= గర్వించిన శత్రుశూరులను; ఏము+అ= మేమే; నిర్జింతుము= జయించగలం; మీ దయన్+చేసి= మీ దయవలన; భూవిదిత ప్రతాప, బల+ఉన్నతిన్= భూమండలమంతటికీ తేటతెల్లమైన పరాక్రమంతో కూడిన గొప్పతనంతో; మార్కొను+అంత= (మమ్ము) ఎదిరించ గలిగేటంతటి; అత్యంత వీరులు= మిగుల గొప్పవారైన శత్రువీరులు; మాకున్= పాండవులమైన మాకు; ఎవ్వరు= ఎవ్వరూ; లేరు= లేరు. (మీ దలయవలన మా పరాక్రమ, శక్తులను మించిన ప్రతివీరులెవ్వరూ ఈ భూమండలంలో లేరని భావం).

**తాత్పర్యం:** 'వానరులలో శ్రేష్ఠుడివైనవాడా! నీవు ఒక్కడివే అసహాయుడివై మా శత్రువులను అందరినీ యుద్ధంలో సంహరించగలవు. ఇది నీకు ఒక ఘనకార్యమా! గర్వించిన శత్రువీరులను మేమే యుద్ధంలో జయించగలం. మీ దయవలన ఈ భూలోకంలో తేటతెల్లమైన పరాక్రమం గల మేము జయించలేని గొప్ప వీరులు ఎవ్వరూ లేరు.'

**విశేషం:** మత్తకోకిల వృత్తలక్షణానికి ఆర. 1.46 విశేషాంశం చూడండి.

**వ. అనిన విని భీమసేనునకు హనుమంతుం డిట్లనియె 'నన్ను రణాంతరంబునం దలంచునది; నీ యందు సౌహృదంబున నాహవంబులో నతిరథుండైన యర్జును రథధ్వజంబునం దుండి మీ బలపరాక్రమంబులం జూతు' నని భీముం గౌఁగిలించుకొని, వానికి సౌగంధిక సరోవర మార్గంబుఁజూపి, హనుమంతుం డంతర్హితుం డైనఁ, దదాలింగన విగతశ్రముండును విపులజవశక్తియుక్తుండును నై భీమసేనుండు. 354**

**ప్రతిపదార్థం:** అనిన విని= అని చెప్పగా ఆలకించి; భీమసేనునకు= భీముడికి; హనుమంతుండు= ఆంజనేయుడు; ఇట్లు+ అనియె= ఈ విధంగా చెప్పాడు; నన్ను= నన్ను; రణ+అంతరంబునన్= యుద్ధం మధ్యలో; తలంచునది= స్మరించవలసింది; నీ+అందు సౌహృదంబునన్= నీ యందలి నెయ్యం చొప్పున; ఆహవంబులోన్= యుద్ధంలో; అతిరథుండు+ఐన= రథికులలో శ్రేష్ఠుడు అయిన; అర్జును రథధ్వజంబు నందు+ఉండి= అర్జునుడియొక్క తేరిజెండాపై ఉండి; మీ, బల, పరాక్రమంబులన్+ చూతును= మీ బల, పౌరుషాలను చూస్తాను; అని= అని చెప్పి; భీమున్= భీముడిని; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; వానికిన్= అతడికి- ఆ భీముడికి; సౌగంధిక, సరోవర, మార్గంబున్+చూపి= సౌగంధికాలు అనే వేయి రేకుల బంగారు తామర పువ్వులు పూచేటటువంటి కొలనుకు దారిని చూపి; హనుమంతుండు= ఆంజనేయుడు; అంతర్హితుండు+ఐనన్= కనిపించకుండా మాయం కాగా; తత్+ఆలింగన విగత శ్రముండును= అతడి-అనగా ఆంజనేయుడియొక్క కౌగిలింతచేత పోగొట్టబడిన శ్రమకలవాడున్నూ; విపుల, జవ, శక్తి, యుక్తుండునున్+ఐ= ఎక్కువ వేగం, బలం కలవాడున్నూ అయి; భీమసేనుండు= భీముడు.

**తాత్పర్యం:** అని చెప్పిన ఆలకించి భీముడికి హనుమంతుడు యిట్లా చెప్పాడు: 'నన్ను యుద్ధంలో సంస్మరించుము; నీ మీది నెయ్యంతో నేను మహావీరుడైన అర్జునుడి రథంపై ఉండే జెండాపై ఉండి, యుద్ధంలో మీ బలాన్ని, మీ శౌర్యాలను తిలకిస్తాను' అని భీముడిని కౌగిలించుకొని, అతడికి సౌగంధికాలు అనే వేయిరేకుల బంగారు తామర పువ్వులు పూచేటటువంటి కొలనుకు దారిచూపి హనుమంతుడు మాయమయ్యాడు. అంతట భీముడు హనుమంతుడు కౌగిలించుకోవటం వలన, పోయిన శ్రమ కలవాడై నూతనోత్సాహంతో కొంగ్రొత్త జవసత్వాలతో ఒప్పారాడు.

**సీ. వారిధారల ననివారిత నిర్గళ । ద్దానధారలఁ దటిద్ధామములను**
**దశనధామంబుల నశనిఘోషంబుల । ఘోరబృంహిత బృహద్ఘోషణముల**
**నివి ఘనబృందంబు లివి గజయూథంబు । లని విచారింపంగ నక్కజంబు**
**లై లలితోత్తుంగ శైలశృంగంబులఁ । ద్రిమ్మరు జలధరద్విరదతతుల**

**ఆ. విస్మయంబుతోడ వీక్షించుచుం జని । రజతగిరిసమీపరమ్యభూమి**
**నక్కుబేరవనమునందు సౌగంధిక । కమలవనముఁ గనియె ఘనభుజుండు. 355**

**ప్రతిపదార్థం:** వారి ధారలన్= నీటి జాలులచేత; న+నివారిత, నిర్గళత్+దాన, ధారలన్= ఎడతెగకుండా స్రవించే మదజలం యొక్క ధారలచేత; తటిత్+ధామములను= విద్యుల్లతల యొక్క వెలుగుల చేత; దశన ధామములను= దంతాలయొక్క కాంతుల చేత; అశని, ఘోషంబులన్= పిడుగుల చప్పుళ్ళ చేత; ఘోర, బృంహిత, బృహత్+ఘోషణములన్= భయంకరాలైన బృంహితాలనే గొప్పధ్వనులచేత (ఏనుగు ఘీంకారానికి బృంహితం అనిపేరు); ఇవి= ఇవి; ఘన, బృందంబులు= మేఘాల సమూహాలు; ఇవి= ఇవి; గజయూథంబులు= ఏనుగుల గుంపులు; అని, విచారింపంగన్= అని వేరువేరుగా ఆలోచించి తెలిసికొనటానికి; అక్కజంబులు+ఐ= వీలుకానంతగా అచ్చెరువు కొలిపేటటువంటివై; లలిత+ఉత్తుంగ, శైల, శృంగంబులన్= మనోహరాలైన ఎత్తయిన కొండలయొక్క శిఖరాలపై; త్రిమ్మరు= సంచరించే; జలధర, ద్విరద, తతుల= మబ్బుల గుంపులను, ఏనుగుల గుంపులను; విస్మయంబుతోడ= ఆశ్చర్యంతో; వీక్షించుచున్= చూస్తూ; చని= వెళ్ళి; రజత, గిరి, సమీప, రమ్య, భూమిన్= వెండికొండకు చేరువలో ఉన్న సొగసైన ప్రదేశమందలి; ఆ+కుబేరువనము నందున్= ఆ కుబేరుడి తోటలో; ఘన, భుజుండు= గొప్ప భుజాలు కలవాడు- పరాక్రమం కల భీముడు; సౌగంధిక కమలవనమున్= సౌగంధికములనే పేరుగల తామరపువ్వులుగల తోటను; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** గొప్ప భుజాలు కల భీముడు, ఆ కుబేరుడి తోటలో సౌగంధిక కమలాలు ఉన్న సరోవరాన్ని చూచాడు. అతడు మార్గమధ్యాన వెండికొండకు చేరువలో ఉన్న సొగసైన ప్రదేశమందు కల కొండశిఖరాలను ఆశ్చర్యంగా చూచాడు. ఆ కొండలపై ఎత్తైన శిఖరాలమీద సంచరించే మేఘాల సమూహాలను, ఏనుగుల గుంపులను చూచాడు. ఏవి ఏనుగులో, ఏవి మేఘాలో వేరుపరచటం వీలు కానట్లుగా, ఆ మేఘాలు, ఏనుగులు అక్కడ ఉన్నాయి. మేఘాలకు నీటిధారలు ఉన్నాయి. ఏనుగులకు దానజలధారలు (మదించిన ఏనుగులకు గండస్థలాలనుండి దాన జలం కారుతుందని సుప్రసిద్ధం) ఉన్నాయి. మేఘాలలో విద్యుల్లతలు వెలుగులీనుతున్నాయి. ఏనుగులలో దంతాలు ప్రకాశిస్తున్నాయి. మేఘాలకు పిడుగుల ధ్వనులు ఉన్నాయి. ఏనుగులకు ఘీంకార రవాలు ఉన్నాయి. అందుచేత ఇవి ఏనుగులు- ఇవి మేఘాలు అని వేరు పరచటం వీలుకాకపోయింది.

**విశేషం:** అలం: రూపకాలంకారం : ఉపమానుప్రాణితం.

**క. అందుల హేమాంబుజ మక । రంద రసామోద మృదుతరశ్వసనుం డా**
**నందంబుఁ జేసెఁ దన ప్రియ । నందనునకు భీమసేనునకు నభిముఖుండై. 356**

**ప్రతిపదార్థం:** అందుల= అక్కడి; హేమ+అంబుజ, మకరంద, రస+ఆమోద, మృదుతర, శ్వసనుండు= బంగారు తామరపూలలోని తేనెద్రవంతో కూడి సుదూరం వ్యాపించే నెత్తావిలో మిగుల మెత్తనైన వాయుదేవుడు; తన, ప్రియనందనునకున్= తన ప్రేమకు పాత్రుడైన కొడుకుకు; భీమసేనునకున్= భీముడికి; అభిముఖుఁడు+ఐ= ఎదుర్రైనవాడై; ఆనందంబున్+చేసెన్= సంతోషాన్ని కల్పించాడు.

**తాత్పర్యం:** ఆ సరోవరంలో గల బంగారు తామరపూలలో ఉన్న తేనెల ద్రావకాలతో తడిసి సుదూరం వ్యాపించే నెత్తావితో మెత్తనై వాయుదేవుడు, తన ప్రియసుతు డైన భీమసేనుడికి ఎదురు వచ్చి మిక్కిలి సంతోషం కలిగించాడు.

**విశేషం:** ఆమోద శబ్దానికి రెండు అర్థాలు ఉన్నాయి. 1) సంతోషంతో అంగీకారం తెలపటం 2) దూర దూరాలకు వ్యాపించేటటువంటి నెత్తావి. ఇక్కడ భీముడికి వాయుదేవుడు స్వాగత పూర్వకమైన ఆమోదాన్ని ప్రసరింపజేశాడు. రెండర్థాలూ ఇక్కడ పొసగుతాయి. అలంకారం - శ్లేష.

**వ. అంత. 357**

**తాత్పర్యం:** అప్పుడు.

**క. వీరుండై సౌగంధిక । వారిజములు గొనఁగ నిట్లు వచ్చినవానిన్**
**భూరిపరాక్రము భీము ను । దారగదాహస్తుఁ జూచి తా రుద్ధతులై. 358**

**ప్రతిపదార్థం:** వీరుండు+ఐ= పరాక్రమం కలవాడై; సౌగంధిక, వారిజములు= సుగంధంతో కూడిన పద్మాలు; కొనఁగన్= సంగ్రహించటానికై; ఇట్లు= ఈ విధంగా; ఇట్లా; వచ్చిన వానిన్= వచ్చిన వాడిని; భూరి, పరాక్రము= గొప్ప శౌర్యం కలవాడిని; ఉదార, గదా, హస్తున్= పెద్దగద చేతిలో కలవాడిని; భీమున్= భీముడిని; చూచి= దర్శించి; తారు= తాము; ఉద్ధతులు+ఐ= గర్వించినవారై.

**తాత్పర్యం:** పరాక్రమం కలవాడై సౌగంధిక కమలాలను తీసికొని పోవటానికి ఈ రీతిగా అరుదెంచిన భీముడిని గొప్ప శౌర్యం కలవాడిని, పెద్దగద చేతిలో ధరించినవాడిని చూచి, తాముకూడా గర్వించినవారై.

**వ. దాని రక్షించి యున్న పదివేవురు రాక్షసు లాక్షణంబ విచిత్రాయుధ పరిచ్ఛదులై పఱతెంచి 'వీఁ డొక్క దివ్య పురుషుం డాయుధంబులు ధరియించినవాఁ, డజినంబులు గట్టిన వాఁ, డధికతేజస్వి, తపస్వి వేషధరుం డిందులకు వచ్చినవాఁ' డని యచ్చెరువందుచు భీమసేనుం డాయవచ్చి యి ట్లనిరి. 359**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ సరోవరాన్ని; రక్షించి, ఉన్న= కాపాడుతున్న; పదివేవురు, రాక్షసులు= పదివేల మంది రాక్షసులు; ఆ క్షణంబు+అ= ఆ క్షణమందే; విచిత్ర+ఆయుధ, పరిచ్ఛదులు+ఐ= ఆశ్చర్యం కొలిపే వింత వింత శస్త్రాలనే ఉపకరణాలతో కూడినవారై; పఱతెంచి= పరుగున వచ్చి; వీఁడు= ఇతడు; ఒక్క, దివ్య, పురుషుండు= ఒక అతిలోకశక్తి గల అంటే దేవతాశక్తి

గల మనుష్యుడు; ఆయుధంబులు= శస్త్రాలు; ధరియించినవాఁడు= పూనినవాడు; అజినంబులు= లేడితోళ్ళు; కట్టినవాఁడు= ధరించినవాడు; అధిక, తేజస్వి= గొప్ప ప్రకాశం కలవాడు; తపస్వి, వేష, ధరుండు= మునులు ధరించే ఆహార్యాన్ని ధరించినవాడు; ఇందులకు= ఇక్కడికి; వచ్చినవాఁడు= వచ్చాడు; అని= అని తలపోస్తూ; అచ్చెరువు+అందుచు= ఆశ్చర్యాన్ని పొందుతూ; భీమసేనున్= భీముడిని; డాయ వచ్చి= సమీపించి; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** ఆ సరోవరాన్ని సంరక్షిస్తున్న పదివేలమంది రాక్షసులు ఆ క్షణంలోనే వింత వింత ఆయుధాలు ధరించి వేగంగా వచ్చి భీముడిని చూచి, 'ఇతడు ఎవ్వడో దివ్య పురుషుడై ఉండాలి; గొప్ప తేజస్సు కలవాడై ఉన్నాడు. ఆయుధాలు ధరించి ఉన్నాడు. ఇతడు వీరుడు మాత్రమే కాదు; ఋషివలె గొప్ప తేజస్సుతో విలసిల్లుతున్నాడు. లేడి చర్మాలు వస్త్రాలుగా ధరించి ఉన్నాడు'- అని ఆశ్చర్యపడుతూ ఆతడిని సమీపించి ఇట్లా పలికారు.

**తరలము.**

> **'ఇది కుబేరువనంబు; దీనికి నెవ్వరుం జనుదేర నో**
> **డుదురు; నీ విట వచ్చి యేల కడుం బ్రమాదముఁ జేసి? తిం**
> **దుదితతేజుఁడు గ్రీడ లాడుచు నుండు నింతులుఁ దాను స**
> **మ్మదముతోడఁ గుబేరుఁ డీ రుచిమత్సరోజవనంబునన్. 360**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ ఉద్యానవనం; కుబేరు, వనంబు= కుబేరుడి తోట; దీనికిన్= ఈ తోటలోనికి; ఎవ్వరున్= ఎవ్వరున్నూ; చనుదేరన్+ఓడుదురు= వచ్చేందుకు వెనుకాడుతారు; నీవు+ఇట, వచ్చి= నీవు ఇక్కడికి వచ్చి; ఏల= ఎందుకు; కడున్= మిక్కిలి; ప్రమాదమున్+చేసితి= ముప్పు తెచ్చు కొన్నావు; ఇందున్= ఇక్కడ- ఈ తోటలోని కొలనులో; ఉదిత తేజుఁడు= ఉదయించిన తేజస్సు కలవాడు- దేదీప్యమానంగా వెలిగే వర్చస్సు కలవాడు; కుబేరుఁడు= దిక్పాలకుడు అయిన కుబేరుడు; ఇంతులున్+తాను= తన భార్యలు, తాను; సమ్మదముతోడన్= సంతోషంతో; ఈ రుచిమత్+సరస్+జ వనంబునన్= శోభాయమానంగా ప్రకాశించే ఈ తామర కొలనులో; క్రీడలు= ఆటలు; ఆడుచున్+ఉండున్= వినోదిస్తుంటాడు.

**తాత్పర్యం:** 'ఇది దిక్పాలకుడైన కుబేరుని తోట, ఈ తోటదరికి ఎవ్వరైన చేరటానికి వెనుకాడుతారు. నీవు ఇక్కడికి ఎందుకు వచ్చావు? ఎందుకు ప్రమాదాన్ని తెచ్చుకొంటున్నావు? ఈతోటలోని తామర కొలనులో దేదీప్యమానమైన వర్చస్సు కల కుబేరుడు తన భార్యలతో జలక్రీడలు ఆడుతుంటాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.374 విశేషాంశం చూడండి

**వ.** **దీని తీరంబున దేవర్షిగణంబులు దేవతార్చనంబులఁజేయుదు; రిందుల జలంబు లమృతోపమానంబులు; మఱి వైడూర్యనాళంబులై యపూర్వసౌరభంబులైన కనకకమలంబులు గలుగుటం జేసి యక్షరాక్షసాక్షౌహిణీ రక్షితం బగు దీని మహిమం బెఱుంగక యింతదూరంబు వచ్చిన వీరుం డెవ్వండ? వేమి కారణంబున వచ్చి?' తనిన వారికి భీముం డిట్లనియె. 361**

**ప్రతిపదార్థం:** దీని తీరంబునన్= ఈ కొలను గట్టున; దేవ+ఋషి, గణంబులు= దేవతల, మునుల సమూహాలు; దేవతా+అర్చనంబులన్= దేవతలకు పూజలను; చేయుదురు= చేస్తారు; ఇందుల జలంబులు= ఈ సరోవరంలోని నీళ్ళు;

అమృత+ఉపమానంబులు= అమృతంతో సరిపోలేటటువంటివి; మఱి= ఇంకను; వైడూర్య, నాళంబులు+ఐ= వైడూర్యాలు అనేమణుల వంటి కాడలు కలిగి; అపూర్వ, సౌరభంబులు+ఐన= మునుపు ఎన్నడూ లేనటువంటి నెత్తావి కలిగిన; కనక, కమలంబులు= బంగారు పద్మాలు; కలుగుటన్+చేసి= ఉండటంచేత; యక్ష, రాక్షస+అక్షౌహిణీ, రక్షితంబు+అగు= యక్షులతో, రాక్షసులతో కూడిన అక్షౌహిణిసైన్యంచేత కాపాడబడేటటువంటి; దీని, మహిమంబు= ఈ సరోవరం యొక్క గొప్పతనం; ఎఱుంగక= తెలియక; ఇంత, దూరంబు= ఇంత దూరం; వచ్చిన= వచ్చిన; వీరుండు+ఎవ్వండవు= వీరుడివి నీవు ఎవరివి?; ఏమి కారణంబునన్= ఎందుచేత; వచ్చితి(వి)= అరుదెంచావు; అనిన= అని ప్రశ్నించగా; వారికి= ఆ కుబేరభటులకు; భీముండు= భీముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ కొలను గట్టున దేవతలు, ఋషులు దైవపూజలు చేస్తారు. ఈ సరోవరంలోని నీళ్ళు అమృత తుల్యాలు. ఈ కొలనులోని సౌగంధికకమలాలు బంగారురేకులతో వైడూర్యమణినాళాలతో వే రెక్కడా ఇంతకు ముందు ఎన్నడూ లేని పరిమళంతో ఒప్పారేటటువంటివి. యక్షరాక్షసభటులు గల అక్షౌహిణీ సైన్యం ఈ కొలనుగొప్పతనం తెలియక వచ్చిన నీవు ఎవడవు? ఇక్కడికి ఎందుకై వచ్చావు'- అని ప్రశ్నించగా భీముడు వారికి ఇట్లా బదులు పలికాడు.

**విశేషం:** వైడూర్యం- విడూరదేశంలో పుట్టిన రత్నం. తెలుగులో పిల్లికన్నురత్నం అంటారు.

**మత్తకోకిలము.**

> **'ఏను పాండుసుతుండ భీముఁడ నిద్ధతేజుఁడ ధర్మరా**
> **జానుజన్ముడ; ద్రౌపదీహృదయప్రియం బొనరింపఁగాఁ**
> **బూని యిక్కమలాకరంబునఁ బుష్పముల్ గొన వచ్చితిన్;**
> **వీనిఁ గొందు నవశ్యమున్ సురవీరు లడ్డము వచ్చినన్.' 362**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; పాండుసుతుండు+అ= పాండురాజు కొడుకును; భీముఁడన్= భీముడు అనే పేరు కల వాడిని; ఇద్ధ, తేజుఁడన్= అడ్డులేని పరాక్రమం కలవాడిని; ధర్మరాజ+అనుజన్ముఁడన్= ధర్మరాజు తమ్ముడిని; ద్రౌపదీ, హృదయ, ప్రియంబు= ద్రౌపది హృదయానికి సంతోషం; ఒనరింపఁగాన్= కలిగించటానికై; పూని= దీక్ష వహించి, ఈ+కమల+ఆకరంబునన్= ఈ కొలనులోని; పుష్పముల్= పువ్వులు; కొనవచ్చితిన్= తీసికొని పోవటానికై, వచ్చాను; సురవీరులు= దేవతలలోని శూరులు; అడ్డము, వచ్చినన్= అడ్డు తగిలి అవరోధం కల్పించినప్పటికినీ; వీనిన్= ఈ పువ్వులను; అవశ్యమున్= తప్పకుండా; కొందున్= తీసికొని వెళ్ళగలను.

**తాత్పర్యం:** 'నేను పాండురాజుకొడుకును. నా పేరు భీముడు. నేను ధర్మరాజు తమ్ముడిని. ద్రౌపదిదేవికి సంతోషం కలిగించటానికై ఈ కొలనులోని సౌగంధిక కమలాలను తీసికొని పోవ వచ్చాను. అప్రతిహతమైన పరాక్రమం కలవాడినైన నేను, దేవతలు అడ్డగించినా లెక్కపెట్టక ఈ పువ్వులను తప్పక తీసికొని వెళ్ళుతాను.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.46 విశేషాంశం చూడండి.

**వ.** **అనిన వార లిట్లని 'రయ్యా! నీవు దివ్యపురుషుండ; వీ సౌగంధిక కమలంబులు గొనియెదేని కుబేరున కెఱింగించి తదాదేశంబునం గొనుము; నీవు ధర్మజానుజుండవు గావున నీకు ధర్మపథంబు తప్పం జన' దనిన రాక్షసులఁ గటాక్షదృష్టిం జూచి భీమసేనుం డిట్లనియె. 363**

**ప్రతిపదార్థం:** అనిన= అని భీముడు పలుకగా; వారలు= కుబేరుడి భటులు; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు; అయ్యా!= ఆర్యా!; నీవు= నీవు; దివ్య పురుషుండవు= అతిలోకశక్తి కలవాడివి; ఈ, సౌగంధిక, కమలంబులు= సౌగంధికాలు అనే పేరు కల ఈ తామర పువ్వులు; కొనియెదు+ఏని= తీసికొని వెళ్ళదలిస్తే; కుబేరునకు+ఎఱింగించి= కుబేరుడికి తెలిపి; తత్+ఆదేశంబునన్= అతని ఆజ్ఞ ప్రకారం; కొనుము= తీసికొని వెళ్లవలసింది; నీవు= నీవు; ధర్మజ+అనుజుండవు= ధర్మరాజుయొక్క తమ్ముడివి; కావున= కాబట్టి; నీకు= నీకు; ధర్మపథంబు= ధర్మమార్గం; తప్పన్+చనదు= అతిక్రమించటానికి వీలు లేదు; అనిన= అని చెప్పగా; రాక్షసులన్= రాక్షసులను; కటాక్ష, దృష్టిన్+చూచి= కడకంటి చూపులతో చూచి; భీమసేనుండు= భీముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని భీమసేనుడు చెప్పాడు. అంత కుబేరుడి భటులు ఈ విధంగా బదులు పలికారు: 'ఆర్యా! నీవు సామాన్య మానవుడివి కావు; లోకాతీత మైన శక్తి కలవాడివి; నీకు ఈ సౌగంధిక కమలాలను తీసికొని పోవాలనే అభిప్రాయం ఉన్నట్లయితే, దయచేసి ఆ విషయం మాద్వార కుబేరుడికి తెలిపి, ఆయన ఆనతితో తీసుకొని వెళ్ళుము. నీవు ధర్మరాజు యొక్క తమ్ముడవు కాబట్టి నీవు ధర్మమార్గం తప్పకూడదుకదా!' అనగా, వారిని కడకంటితో చూస్తూ, భీముడు ఈ విధంగా అన్నాడు.

**క. 'గిరినిర్ఝ రములఁ బుట్టిన । సరోవరం బిదియు సర్వసామాన్యముగా**
**కరుదుగ నొక్కని యదియే? పరఁగఁ గుబేరుండు దీనిఁ బడసెనె మొదలన్? 364**

**ప్రతిపదార్థం:** గిరినిర్ఝ రములన్= కొండలలోని సెలయేళ్ళవలన; పుట్టిన= పుట్టిన; సరోవరంబు= కొలను; ఇదియు= ఈ కొలను; సర్వసామాన్యము+కాక= అందరికీ సమానంగా చెందేటటువంటిది కాక; అరుదుగన్= అపూర్వంగా; ఒక్కని+అదియే?= ఒక్కడికి చెందిందా?; పరఁగన్= ఒప్పునట్లుగా; దీనిన్= ఈ కొలనును; మొదలన్= మొదట; కుబేరుండు= కుబేరుడు; పడసెనె?= పొందాడా?

**తాత్పర్యం:** 'ఈ కొలను కొండలలో ప్రవహించే సెలయేళ్ళవలన ఏర్పడినటువంటిది. ఇది అందరికి చెందినది కాక ఏ ఒక్కరి సొత్తు కాజాలదు. దీనిని మొదట కేవలం కుబేరుడే సంపాదించాడా?

**తే. ఉత్తమక్షత్త్రియుం డేల యొరుల నడిగి । వేఁడువాఁ డగుఁ? దన భుజవిక్రమమున**
**నన్యధనము లుపార్జించి యర్థిజనుల । కిచ్చి కీర్తి దిక్కుల వెలయించుఁ గాక. 365**

**ప్రతిపదార్థం:** ఉత్తమక్షత్రియుండు= శ్రేష్ఠుడైన క్షత్రియుడు; ఏల= ఎందుకు; ఒరులన్= ఇతరులను; అడిగి; వేఁడు వాఁడు+అగున్= యాచించేవాడు అవుతాడు; తన, భుజ, విక్రమమునన్= సొంతశౌర్యం వలన; అన్య ధనములు= ఇతరుల సొత్తులు; ఉపార్జించి= సంపాదించి; అర్థి, జనులకు+ఇచ్చి= ప్రార్థించే ప్రజలకు దానంచేసి; దిక్కులన్= దెసలలో; కీర్తి= యశం; వెలయించున్+ కాక= ప్రకాశింపచేస్తాడు కాని.

**తాత్పర్యం:** ఉత్తముడైన క్షత్రియుడు ఇతరులను ప్రార్థించడు. ఎవరినీ దానం చేయుమని వేడుకొనడు. తన శౌర్య సాహసాలవలన ఇతరులను జయించి, వారి ధనాలు కైవసం చేసికొని, తనను ప్రార్థించేవారికి దానం చేసి తన యశస్సు దెసలలో వెల్లివిరిసేటట్లు చేస్తాడుకదా!

భీముఁడు యక్షరాక్షసులతో యుద్ధంబు సేయుట (సం. 3-152-12)

**వ. నాకు మిమ్మును మీ కుబేరుం బ్రార్థించి కాని యిక్కొలని పువ్వులు గొనంగాదొకో?' యని భీముండు రాక్షసుల నాదరింపక సౌగంధికవనంబు సొచ్చి కనకకమలంబులుం గొని యుత్తమవీర్యవంతంబు లైన తత్సలిలంబు లుపయోగించి యనంతబలసంపన్నుండై యున్న; నాతనిం జూచి రాక్షసు లలిగి యుద్యతాయుధహస్తులై తాఁకిన భీముండును భీకరాకారుండై. 366**

**ప్రతిపదార్థం:** నాకు= నాకు; మిమ్మును= మీ అందరినీ; మీ, కుబేరున్= మీ దొరగారైన కుబేరుడిని; ప్రార్థించి కాని= వేడుకొనికాని; ఈ, కొలని, పువ్వులు= ఈ సరోవరంలోని పుష్పాలు; కొనన్+కాదు+ఒకో?= తీసికొని వెళ్ళటానికి కుదురదా?; అని= అని పలికి; భీముండు= భీముడు; రాక్షసులన్= రాక్షసులను; ఆదరింపక= లెక్కచేయక, సరకు చేయక; సౌగంధిక, వనంబు+చొచ్చి= సౌగంధిక కమలాల సముదాయం కల కొలను ప్రవేశించి; కనక, కమలంబులున్+కొని= బంగారు తామర పూలను తీసికొని; ఉత్తమ, వీర్యవంతంబులు+ఐన= గొప్ప శక్తి (మహిమ) కలిగినవైన; తత్+సలిలంబులు= ఆ కొలనులోని నీళ్లు; ఉపయోగించి= వాడి, త్రాగి; అనంత, బల, సంపన్నుండు+ఐ= మితిలేని శక్తి కలవాడై; ఉన్నన్= ఉండగా; ఆతనిన్+చూచి= ఆ భీముడిని చూచి; రాక్షసులు= రాక్షసులు; అలిగి= కోపించి; ఉద్యత+ఆయుధ, హస్తులు+ఐ= ఎత్తబడిన శస్త్రాలు హస్తాలలో కలవారై; తాఁకినన్= ఎదిరించగా; భీముండును= భీముడుకూడ; భీకర+ఆకారుండు+ఐ= భయంకరమైన రూపం కలవాడై.

**తాత్పర్యం:** నాకు మీ అందరి అనుజ్ఞ అనవసరం. నేను మీ దొరగారైన కుబేరుడిని అంతకంటే వేడుకొనను. నా అంతట నేను ఈ సరోవరంలోని బంగారు తామరపూలను ఎందుకు తీసికొనలేనో చూస్తాను కాక!'- అని భీముడు ఆ రాక్షసులను లెక్కచేయక, కొలనులోనికి ప్రవేశించి సౌగంధికకమలాలను కోసి, ఆ కొలనులోని గొప్ప శక్తి గల నీళ్ళను త్రాగి, మితిలేని శక్తిని పుంజుకొని ఉండగా, అతనిని చూచి రాక్షసులు ఆగ్రహించి ఆయుధ సన్నద్ధులై భీముడితో పోరాటానికి దిగారు.

**చ. తన గదఁ జేసి రాక్షసుల దారుణశస్త్రచయంబు నశ్రమం**
**బున నతివీరుఁడై విరిచి పోర నిశాచరులన్ బడల్పడన్**
**ఘనభుజదండ చండహతిఁ గ్రాఁచిన నుక్కఱి రక్కసుల్ కుబే**
**రున కెఱిఁగింపఁ బాఱిరి సరోషవృకోదరభీమకర్మముల్. 367**

**ప్రతిపదార్థం:** తన, గదన్+చేసి= తనగదతో; రాక్షసుల= రాక్షసులయొక్క; దారుణ, శస్త్ర చయంబు= భయంకరమైన ఆయుధాలసమూహాన్ని; న+శ్రమంబునన్= సులువుగా; అతి, వీరుఁడు+ఐ= గొప్పశౌర్యం కలిగినవాడై; విరిచి= విరుగకొట్టి; పోర= యుద్ధంలో; నిశాచరులన్= రాక్షసులను, (రాత్రి సంచరించేటటువంటి వారిని); బడల్+పడన్= బడలికనొందేటట్లుగా; ఘన, భుజ, దండ, చండ, హతిన్= గొప్పదైన తన భుజం అనే కంబం యొక్క తీవ్రమైన తాకిడిచేత; క్రాఁచినన్= తపింపచేయగా; రక్కసుల్= రాక్షసులు; ఉక్కు+అఱి= బలం తగ్గి; స, రోష, వృకోదర, భీమ, కర్మముల్= ఆగ్రహంతో కూడిన భీముడియొక్క భయంకరచర్యలు; కుబేరునకు+ఎఱిఁగింపన్= కుబేరుడికి తెలియజెప్పటానికి; పాఱిరి= పరుగెత్తారు.

**తాత్పర్యం:** భీముడు తన గదతో సులువుగా మహావీరుడై రాక్షసులభయంకరాయుధాల నన్నిటినీ వమ్ముచేసి, యుద్ధంలో ఆ రాక్షసులందరు అలసిపోయేటట్లు చేశాడు. తన బాహుదండంతో కొట్టి బాధ నొందేటట్లు చేశాడు.

ఆ రాక్షసులు బలం తరిగిన వారై, ఆగ్రహించిన భీముడి భీకరచర్యలను గురించి కుబేరుడికి తెలపటానికి పరుగెత్తారు.

**వ. కుబేరుండును బాంచాలీ ప్రియకరంబైన పవనతనయు పరాక్రమారంభంబు విని మెచ్చి దాని నుపేక్షించె; నట్లు భీమసేనుండు రాక్షససేన నోడించి సౌగంధిక కమలంబులు గొని తత్తీరకుసుమితలతాపాదపవనంబున విహరించుచున్నంత నట. 368**

**ప్రతిపదార్థం:** కుబేరుండును= కుబేరుడు కూడ; పాంచాలీ ప్రియకరంబు+ఐన= ద్రౌపదికి సంతోషాన్ని చేకూర్చేటటువంటి; పవనతనయు= భీముడియొక్క; పరాక్రమ+ఆరంభంబు= శౌర్యసంరంభం; విని= ఆలకించి, మెచ్చి= ప్రశంసించి; ఉపేక్షించెన్= ప్రతిక్రియచేయటాన్ని గురించి పట్టించుకోలేదు; అట్లు= అట్లా, ఆ రీతిగా; భీమసేనుండు= భీముడు; రాక్షస, సేనన్= రాక్షసుల సైన్యాన్ని; ఓడించి= జయించి; సౌగంధిక, కమలంబులు= సౌగంధికకమలాలను (మిక్కుటమైన నెత్తావిని వెదజల్లే తామర పువ్వులు); కొని= తీసికొని; తత్+తీర, కుసుమిత, లతా, పాదప, వనంబునన్= ఆ కొలనుగట్టునందు పుష్పించిన తీవలు, చెట్లు గలిగిన తోటలో; విహరించుచున్నంతన్= వినోదంగా తిరుగుతుండగా; అట= అక్కడ.

**తాత్పర్యం:** కుబేరుడున్నూ, ద్రౌపదిని సంతోషపెట్టటంకొరకు భీముడు ప్రదర్శించిన శౌర్య విజృంభణాన్ని అభినందించి, ప్రతిక్రియ చేయటం మానాడు. ఆ విధంగా భీముడు రాక్షసవీరులను గెలిచి, సౌగంధికపుష్పాలను సంగ్రహించి, ఆసరోవరంగట్టున లతలతో, చెట్లతో, పూలతో కళకళ లాడుతున్న తోటలో విహరిస్తూ ఉండినాడు. అక్కడ.

**క. వడిఁ బడియెఁ బిడుగు లుడుగక, । వడఁకె మహీతలము, పాంసువర్షము గురిసెం**
**గడు నెఱ్ఱ నయ్యె దిశ, లే । ర్పడకుండె నినుండు తిమిరపటలావృతుఁడై. 369**

**ప్రతిపదార్థం:** పిడుగులు= పిడుగులు, (అశనులు); ఉడుగక= మానక; వడిన్= వేగంగా; పడియెన్= పడ్డాయి; మహీ, తలము= భూమిపైభాగం; వడఁకె= వణికింది; పాంసు, వర్షము= దుమ్మువాన; కురిసెన్= వర్షించింది; దిశలు= దిక్కులు; కడున్= మిక్కిలి; ఎఱ్ఱన్+అయ్యె= ఎర్రగా మారాయి; తిమిర, పటల+ఆవృతుఁడు+ఐ= చీకట్ల సమూహాలచేత ఆవరించబడి; ఇనుండు= సూర్యుడు; ఏర్పడక+ఉండెన్= కనిపించకున్నాడు.

**తాత్పర్యం:** వేగంగా, ఎడతెగకుండా పిడుగులు పడ్డాయి. భూమి కంపించింది. దుమ్మువాన కురిసింది. దిక్కులన్నీ ఎరుపురంగుధూళితో కప్పబడ్డాయి. సూర్యుడు చీకట్ల దొంతరలతో కప్పబడి కనిపించకున్నాడు.

**వ. ఇట్టి మహోత్పాతంబు లుపలక్షించి విస్మితుండై ధర్మతనయుం 'డివి భీమాహవ పిశునంబులై కానంబడియె నేమఱకుండ వలయు' నని నాలుగుదిక్కులుం జూచి భీమసేనుం గానక తన సమీపంబున నున్న పాంచాలి కిట్లనియె. 370**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఇటువంటి- ఈ విధాలైన; మహా+ఉత్పాతంబులు= గొప్ప అపశకునాలు; ఉపలక్షించి= చూచి; విస్మితుండు+ఐ= అచ్చెరువందినవాడై; ధర్మతనయుండు= ధర్మరాజు; ఇవి= ఈ ఉత్పాతాలు; భీమ+ఆహవ, పిశునంబులు+ఐ= భయంకరమైన యుద్ధానికి చెందిన కలహసూచనలై; కానంబడియెన్= కనిపించాయి; ఏమఱకుండవలయున్= ఉపేక్షించటం తగదు; అని= అని తలపోసి; నాలుగుదిక్కులున్+చూచి= నాలుగు దిక్కులూ పరికించి; భీమసేనున్+కానక; భీముడిని చూడక; తన, సమీపంబునన్+ఉన్న= తన దగ్గర ఉన్న; పాంచాలికి= ద్రౌపదితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధాలైన అపశకునాలను చూచి ధర్మరాజు ఆశ్చర్యపడి, 'ఇవి భయంకరమైన యుద్ధాన్ని సూచించే కలహసూచనలు, జాగ్రత్తగా ఉండాలి'- అని తలపోసి, నాలుగు దిక్కులూ పరికించాడు. అక్కడ భీముడు కనిపించలేదు. అంతట ధర్మరాజు తనకు చేరువగా ఉన్న ద్రౌపదితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. భీమ+ఆహవ, పిశునంబులు అనే సమాసానికి రెండర్థాలు చెప్పవచ్చును. 1. భీమ- అంటే భయంకరమైన- అనే అర్థాన్ని అనుసరించి 'భయంకరమైన యుద్ధాన్ని సూచించేవి'- అని. 2. భీముడి యొక్క యుద్ధప్రీతికి కలహానికి సూచకములైనవి. ఇక్కడ రెండు అర్థాలు ఉపపన్నాలే. 2. ఉత్పాతములు= అపశకునాలు, అసాధారణ దృశ్యాలు, విచిత్ర సంఘటనలు. ఇవి 3 రకాలు 1. దివ్యం అపూర్వగ్రహనక్షత్ర దర్శనం. 2. అంతరిక్షం- సూర్యచంద్రులచుట్టూ గుడులు ఏర్పడటం 3. భీమం - జాడ్యాలు మొదలైనవి.

**క. 'ప్రియసాహసుండు భీముఁడు । భయవిరహితుఁ డెందుఁ బోయె బహురాక్షససం**
**శ్రయ మిగ్గిరి గంధర్వా । న్వయ సేవ్యం బేకచరుఁడు వాఁ డెయ్యెడలన్. 371**

**ప్రతిపదార్థం:** ప్రియ, సాహసుండు= సాహసకృత్యాలలో ప్రీతికలవాడు; భీముఁడు= భీముడు; భయ, విరహితుఁడు= బొత్తిగా భయం లేనటువంటివాడు; ఎందున్+పోయె= ఎక్కడికి వెళ్ళాడు; బహు, రాక్షస, సంశ్రయము= అనేకమంది రాక్షసులచేత కూడి ఉండేది; ఈ+గిరి= ఈ కొండ; గంధర్వ+అన్వయ, సేవ్యంబు= గంధర్వుల కులంచేత ఆరాధించబడేటటువంటిది; వాడు= ఆ భీముడు; ఏ+ఎడలన్= ఏ స్థలమందైనా; ఏక చరుఁడు= ఒంటరిగా తిరుగాడేవాడు.

**తాత్పర్యం:** 'ఏడీ భీముడు? ఎక్కడికి వెళ్ళాడు? అతడికి సాహసకృత్యాలు అంటే చాలాప్రీతి. బొత్తిగా భయంలేనివాడు! ఈ కొండపై రాక్షసులు, గంధర్వులు తిరుగాడుతుంటారు. ఆ భీముడు ఎక్కడికైనా ఒంటరిగా పోయే స్వభావం కలవాడు.

**ఆ. భూరిభుజుఁడు దానె పోయెనో? నీ వెట । యేని పుచ్చితో నిజేచ్ఛ నతని?'**
**నని యజాతశత్రుఁ డడిగినఁ బతికిఁ బాం । చాలి యిట్టు లనియె సంభ్రమమున. 372**

**ప్రతిపదార్థం:** భూరి భుజుఁడు= గొప్పభుజాలు కలవాడు అనగా మహావీరుడు; తానె= తనంతట తానుగానే; పోయెనో?= వెళ్ళాడా?; నీవు= నీవు; ఎట+ఏని= ఎక్కడికైనా కూడా; అతనిన్= భీముడిని; నిజ+ఇచ్ఛన్= (తన) నీదైన కోరికచేత; పుచ్చితో?= పంపించావా?; అని= అంటూ; న+జాత, శత్రుఁడు= పుట్టుకచేత శత్రువులు లేనటువంటివాడు- ధర్మరాజు; అడిగినన్= ప్రశ్నించగా; పాంచాలి= ద్రౌపది; పతికిన్= భర్తకు; సంభ్రమమునన్= తొట్రుపాటుతో; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** గొప్ప పరాక్రమం కల భీముడు తనంతట తానే వెళ్ళాడా? లేక ఏదైనా కోరి నీవు అతడిని ఎక్కడికైనా పంపావా?'- అని అజాతశత్రుడైన ధర్మరాజు అడిగాడు. అంతట ద్రౌపది తొట్రుపాటుతో ఈవిధంగా పలికింది.

**మధ్యాక్కర.**

**'ధరణీశ! నీకు నాయిచ్చిన పసిఁడి తామరపువ్వు**
**గురువాయువశమున వచ్చినను దానిఁ గొని యిట్టిపువ్వు**

**లరుదు గాన కుఱంగటం గలిగెనేని యర్థిఁ దె మ్మనిన**
**నరిగె నీశానుదిక్కునకు నీ తమ్ముఁ డతివేగమునను.' 373**

**ప్రతిపదార్థం:** ధరణి+ఈశ!= ఓరాజా! భూమికి ప్రభువు అయినవాడా!; నీకు= నీకు; నా+ఇచ్చిన= నేను ఇచ్చిన; పసిఁడి, తామర, పువ్వు= బంగారపు కమలం; గురు, వాయు, వశమున= పెద్దగాలిచేత విసరబడి; వచ్చినను= రాగా; దానిన్= ఆ పువ్వును; కొని= గ్రహించి; ఇట్టి, పువ్వులు= ఈ మాదిరి పుష్పాలు; అరుదు= అసాధారణం; కాన= కాబట్టి; కుఱంగటన్= సమీపాన; కలిగెనేని= ఉన్నట్లయితే; అర్థిన్= ప్రీతితో; తెమ్ము= తెచ్చిపెట్టుము; అనినన్= అని కోరగా; నీ తమ్ముఁడు; అతి వేగమునను= అతివేగంగా; ఈశానుదిక్కునకున్= ఈశాన్యదిశకు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'ఓ రాజా! నీకు నేను ఇచ్చిన బంగారు తామర పువ్వు పెద్దగాలిచేత విసరగొట్టబడి నాదగ్గర పడింది. అటువంటి పువ్వులు దరిదాపున ఉన్నట్లయితే నాకు తెచ్చిపెట్టుమని కోరగా, నీ తమ్ముడైన భీముడు మిక్కిలి వేగంగా ఈశాన్యదిక్కుకు వెళ్ళాడు'

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 2.22 విశేషాంశం చూడండి

**వ. అనిన 'నట్లేని యందఱము వాని పోయిన వలనం బోవుద' మని యెప్పటియట్ల రాక్షసస్కంధారూఢులై గగనగతి నరిగి సౌగంధిక తీరంబున. 374**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అట్లు+ఏని= ఆ విధంగా జరిగినట్లయితే; అందఱము= మనమంతా కలిసి; వాని, పోయిన, వలనన్= అతడు వెళ్ళినదిక్కుకే; పోవుదము= వెళ్ళుదాము; అని= అని పలికి; ఎప్పటి+అట్లు+అ= ఎప్పటి మాదిరిగానే; రాక్షస, స్కంధ+ఆరూఢులు+ఐ= రాక్షసులయొక్క భుజాలమీద కూర్చున్నవారై; గగన గతిన్= ఆకాశమార్గాన; అరిగి= వెళ్ళి; సౌగంధిక, తీరంబున= నెత్తావిచిమ్మే బంగారు తామరపూలు గల కొలను గట్టున.

**తాత్పర్యం:** అని ద్రౌపది చెప్పగా ధర్మరాజు 'సరే అట్లా అయితే మనమందరం భీముడు వెళ్ళినదిక్కుకే వెళ్ళుదాంగాక!' అని ఎప్పటివలెనే రాక్షసులమూపులపై ఎక్కి ఆకాశమార్గాన పయనించి, సౌగంధికపుష్పాలు గల కొలనుగట్టుకు చేరారు.

**చ. అతులబలాఢ్యు నుద్యతగదాయుధహస్తుఁ బటుప్రతాపవ**
**ర్ధితయశుఁ బాండునందనుఁ దదీయమహోగ్రగదావిఘాత దా**
**రిత పృథుయక్ష రాక్షస శరీరచయంబులుఁ జూచి విస్మయ**
**స్మితముఖు లైరి బ్రాహ్మణసమేతులు ధర్మసుతాదు లచ్చటన్. 375**

**ప్రతిపదార్థం:** న+తుల, బల+ఆఢ్యున్= సాటిలేని బలంతో కూడినవాడిని; ఉద్యత, గదా+ఆయుధ, హస్తున్= వెలుగొందుతున్న గద అనే ఆయుధాన్ని చేతితో పైకెత్తి పట్టుకొని ఉన్న వాడిని; పటు, ప్రతాప, వర్ధిత, యశున్= గొప్పశౌర్యంచేత వృద్ధిపొందిన కీర్తి కలవాడిని; పాండు, నందనున్= పాండురాజు యొక్క కొడుకైన భీముడిని; తదీయ, మహా+ఉగ్ర, గదా, విఘాత, దారిత, పృథు, యక్ష, రాక్షస, శరీర, చయంబులున్= అతడి యొక్క మిక్కిలి భయంకరమైన గదయొక్క దెబ్బలచేత చీల్చబడిన యక్షులయొక్క రాక్షసులయొక్క గొప్ప దేహాల సముదాయాలను; చూచి= చూచి; బ్రాహ్మణ, సమేతులు= బ్రాహ్మణులతో

కూడుకొన్నవారు; ధర్మసుత+ఆదులు= ధర్మరాజు మొదలైనవారు; అచ్చటన్= అక్కడ; విస్మయ స్మిత, ముఖులు+ఐరి= ఆశ్చర్యంతో కూడిన చిరునవ్వుముఖాలు కలవారైవారు.

**తాత్పర్యం:** సాటిలేనిబలం కలవాడు, పైకెత్తిన గదాయుధాన్ని చేతకలవాడు, పటిష్ఠమైన పరాక్రమంచేత వృద్ధి పొందిన కీర్తి కలవాడు అయిన పాండు పుత్రుడు భీమసేనుడినీ, అతడి భయంకరగదా ఘాతాలచేత చీల్చబడిన యక్షరాక్షసుల పెద్ద శరీరాల సమూహాలనూ, బ్రాహ్మణులతో కలసి ధర్మరాజు మొదలైనవారు ఆ కొలను గట్టున చూచి ఆశ్చర్యంతో కూడిన చిరునవ్వుముఖాలు కలవారయ్యారు.

**వ. భీమసేనుండును ధౌమ్య ధర్మజ రోమశులకు మ్రొక్కి, తనకు మ్రొక్కిన కవలఁ గౌఁగిలించుకొని, వైడూర్యనాళంబులైన కనకకమలంబులు ద్రౌపది కిచ్చి యున్నంత నాతనికి ధర్మరా జిట్లనియె. 376**

**ప్రతిపదార్థం:** భీమసేనుండును= భీముడున్నూ; ధౌమ్య ధర్మజరోమశులకున్= ధౌమ్యుడికి, ధర్మరాజుకు, రోమశుడికి; మ్రొక్కి= నమస్కరించి; తనకు, మ్రొక్కిన= తనకు నమస్కరించిన; కవలన్= నకులసహదేవులను; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; వైడూర్య, నాళంబులు+ఐన= పిల్లికన్ను రత్నాలవంటి కాడలుగల కనక, కమలంబులు= సౌగంధికపద్మాలు; ద్రౌపదికి+ ఇచ్చి+ఉన్నంతన్= ద్రౌపదికి బహూకరించి ఉండగా; ఆతనికి= ఆ భీముడికి; ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** భీముడు- ధౌమ్యుడికి, రోమశుడికి, ధర్మరాజుకు నమస్కరించాడు. భీముడికి నకుల సహదేవులు నమస్కరించారు. వారిని భీముడు కౌగిలించు కొన్నాడు. తరువాత వైడూర్యాలవంటి కాడలు కలిగిన బంగారు తామర పూలను భీముడు ద్రౌపదికి బహూకరించాడు. అంతట ధర్మరాజు భీముడితో ఇట్లా పలికాడు.

**ఆ. 'చనునె నీకు నిట్టి సాహసక్రియఁ జేయ? । నెల్లవారికంటె నెఱుక గలవు**
**గురుభుజుండ! నాకుఁ గూర్తేని చేయకు । మయ్య! యిట్టి చెయ్వు లనఘ! యింక'. 377**

**ప్రతిపదార్థం:** గురు భుజుండ!= గొప్ప భుజాలు కలవాడా! అనగా మహావీరుడా!; ఎల్లవారికంటెన్= అందరికంటె; ఎఱుక+కలవు= జ్ఞానం కలిగినటువంటి వాడివి నీవు; ఇట్టి= ఇటువంటి; సాహస, క్రియన్= తెగువతో కూడిన చర్య; చేయన్= చేయటం; చనునె?= తగునా? (కూడునా); అనఘ!= పాపరహితుడివైనవాడా!; నాకున్+కూర్తు+ఏని= నాయందు నీకు ప్రేమ ఉన్నట్లయితే; ఇంక= ఇకమీద; ఇట్టి, చెయ్వులు= ఇటువంటి పనులు; చేయకుము+అయ్య!= చేయవద్దన్నా!.

**తాత్పర్యం:** 'పరాక్రమం కలిగిన ఓ భీమసేనా! అందరికన్నా ఎక్కువ జ్ఞానం కలవాడివి నీవు. ఇటువంటి సాహసకృత్యాలు ఆచరించటం నీవంటి జ్ఞానికి తగునా? పాపరహితుడి వైన ఓ భీమసేనా! నీకు నాయందు ప్రేమ ఉంటే నీవు ఇకమీద ఇటువంటి పనులు చేయకూడదుసుమా!'

**వ. అని కఱపి యి ట్లందఱుం గుబేరోద్యానవనంబున విహరించుచున్నంతఁ దద్రక్షకులైన యక్షులు వచ్చి.378**

**ప్రతిపదార్థం:** అని= అనిచెప్పి; కఱపి= ప్రబోధించి, (నచ్చచెప్పి); ఇట్లు= ఈ విధంగా; అందఱున్= అందరూ; కుబేర+ఉద్యాన, వనంబునన్= కుబేరుడితోటలో; విహరించుచున్నంతన్= వినోదంగా తిరుగుతుండగా; తద్+రక్షకులు+ఐన= ఆ వనాన్ని కాపాడుతుండేవారైన; యక్షులు, వచ్చి= యక్షులు వచ్చి;

**తాత్పర్యం:** అని ధర్మరాజు భీముడికి నచ్చేటట్లుగా హితోపదేశం చేశాడు. ఇట్లా అందరూ కుబేరుడితోటలో వినోదంగా తిరుగుతుండగా, ఆ తోటలను కాపాడేవారైన యక్షులు వచ్చి;

**క. దేవర్షియైన రోమశు। దేవేంద్ర సమాను నయ్యుధిష్ఠిరు ధరణీ**
**దేవోత్తములం గని విన। యావనతులు భక్తి నిట్టు లని రందఱకున్. 379**

**ప్రతిపదార్థం:** దేవ+ఋషి+ఐన= దేవతలకు చెందిన ముని అయిన; రోమశున్= రోమశుడిని; దేవేంద్ర, సమానున్= దేవేంద్రుడితో సమానుడైన; ఆ+యుధిష్ఠిరు= ఆధర్మరాజును; ధరణీ, దేవ+ఉత్తములన్= బ్రాహ్మణశ్రేష్ఠులను; కని= చూచి; వినయ+అవనతులు= పూజ్యభావంతో వంగినటువంటివారై; అందఱకున్= ధర్మరాజు బృందంలోని వారందరికీ; ఇట్టులు+అనిరి= ఈవిధంగా చెప్పారు.

**తాత్పర్యం:** దేవర్షి అయిన రోమశుడిని, దేవేంద్రుడితో దీటైన ధర్మరాజును, శ్రేష్ఠులైన విప్రులను చూచి భక్తితో వంగి నమస్కరించి ఈవిధంగా పలికారు.

**వ. 'మీ రిందు మసలవల; దిది యక్ష రాక్షస ప్రచారఘోరం' బనిన నందుండ నొల్లక పాండవులు తత్సమీపంబున నివాసంబుఁ జేసికొని రాక్షస బలంబుతో ఘటోత్కచుఁ బోవంబనిచి యుండు నంత, జటాసురుం డను రాక్షసుండు బ్రాహ్మణరూపధరుండై' యేను వేదవిదుండ, ధనుర్వేదవిదుండైన పరశురాము శిష్యుండ' ననుచుం బాండవుల సేవించుచున్నంత నొక్కనాఁడు. 380**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు; ఇందు= ఇక్కడ; మసలవలదు= తిరుగవద్దు; ఇది= ఈ తోట; యక్ష, రాక్షస, ప్రచార, ఘోరంబు= యక్షులు, రాక్షసులు తిరగటంచేత భయంకరమైనది; అనినన్= అని చెప్పగా; పాండవులు= పాండురాజుకొడుకులు; అందు= ఆ తోటలో; ఉండన్+ఒల్లక= ఉండటానికి ఇష్టపడక; తద్+సమీపంబున= ఆ తోటకు దగ్గరగా; నివాసంబున్+చేసికొని= వసతిని ఏర్పరచుకొని; రాక్షస బలంబుతో= రాక్షస సైన్యంతో; ఘటోత్కచున్= ఘటోత్కచుడిని; పోవన్+పనిచి+ఉండునంత= వెళ్ళిపొమ్మని ఆనతిచ్చి ఉండగా; జటాసురుండు+అను, రాక్షసుండు= జటాసురుడు అనే పేరు కల రాక్షసుడు; బ్రాహ్మణరూప, ధరుండు+ఐ= బాపడి ఆకారం ధరించినవాడై; ఏను= నేను; వేద విదుండన్= వేదాలను తెలిసినవాడిని; ధనుస్+వేద, విదుండు+ఐన= విలువిద్యలో ఆరితేరినవాడైన; పరశురాము, శిష్యుండన్= పరశురాముడి శిష్యుడిని; అనుచున్= అని చెప్తుతూ; పాండవులన్= పాండుపుత్రులను; సేవించుచున్నంతన్= పరిచర్యలు చేస్తుండగా; ఒక్కనాఁడు= ఒకరోజు.

**తాత్పర్యం:** 'మీరు ఇక్కడ విహరించవద్దు. ఈ తోటలో యక్షులు, రాక్షసులు సంచరించటంచేత ఇది భయంకరమైనటువంటిది' అని చెప్పారు. అంత పాండవులు ఆ తోటకు దగ్గరగా వసతి ఏర్పరచుకొని, రాక్షసులతోపాటు ఘటోత్కచుడిని వెళ్ళుమని ఆనతిచ్చి అక్కడే ఉన్నారు. అపుడు జటాసురుడు అనే పేరుగల రాక్షసుడు బ్రాహ్మణవేషం ధరించి, 'నేను వేదాలను చదివినవాడిని. విలువిద్యలో ఆరితేరిన పరశురాముడి శిష్యుడిని' అని చెప్పి చేరి పాండవులను సేవిస్తున్నాడు. అపుడు ఒకరోజు.

**ఆ. మృగవిరోధిబలుఁడు మృగయావినోదార్థ। మడవి కనిలతనయుఁ డరిగినట్టి**
**యవసరమున నజ్జటాసురుఁ డాసురా। కారవికృతరూపకంబుఁ దాల్చి. 381**

**ప్రతిపదార్థం:** మృగ, విరోధి, బలుఁడు= సింహం వంటి బలం కలవాడు; అనిలతనయుఁడు= వాయుపుత్రుడైన భీముడు; మృగయా, వినోద+అర్థము= వేటచేత వినోదించటం కొరకు; అడవికి= అడవికి; అరిగినట్టి+అవసరమునన్= వెళ్లినవేళ; ఆ+జటాసురుఁడు= ఆ జటాసురుడు; ఆసుర+ఆకార, వికృత, రూపకంబున్= రాక్షసుడి ఆకారానికి సంబంధించిన వికార స్వరూపాన్ని; తాల్చి= ధరించి.

**తాత్పర్యం:** సింహం వంటి బలం కలవాడు, వాయుపుత్రుడు అయిన భీముడు వినోదం కొరకు వేటకు వెళ్ళిన సమయాన, ఆ జటాసురుడు నిజరాక్షసరూపాన్ని ధరించి భయంకరమైన ఆకారంతో.

**క. చనుదెంచి ద్రౌపదిని యమ । తనూజు నకులుం దదాయుధంబులతోఁ బె**
**ల్చన యెత్తికొని మహాజవ । మునఁ బఱచె మహీసురోత్తములు భయమందన్. 382**

**ప్రతిపదార్థం:** చనుదెంచి= వచ్చి; ద్రౌపదిని= పాంచాలిని; యమ, తనూజు= ధర్మపుత్రుడిని; నకులున్= నకులుడిని; తత్+ఆయుధంబులతోన్= వారియొక్క శస్త్రాలతోసహా; పెల్చన= బలాత్కారంగా; ఎత్తికొని= తన మూపున ధరించి; మహీసుర+ఉత్తములు= బ్రాహ్మణోత్తములు; భయము+అందన్= భయపడేటట్లుగా; మహాజవమునన్= మిక్కిలివేగంగా; పఱచెన్= పరుగెత్తాడు.

**తాత్పర్యం:** (ఆ జటాసురుడు) వచ్చి, ద్రౌపదిని, ధర్మరాజును, నకులుడిని బలవంతంగా ఎత్తుకొని, వారి ఆయుధాలతో పాటు తన మూపున ధరించి గొప్పవేగంతో పరుగెత్తాడు. వాడిని చూచి విప్రశ్రేష్ఠులు భీతిచెందారు.

**వ. అంత సహదేవుండు భీముం బిలుచుచు వనంబున కరిగె; నిట ధర్మతనయుం డధర్మవర్తి యైన యసుర కిట్లనియె. 383**

**ప్రతిపదార్థం:** అంత= అప్పుడు; సహదేవుండు= సహదేవుడు; భీమున్+పిలుచుచున్= భీముడిని రమ్మని కేకలువేస్తూ; వనంబునకు= అరణ్యానికి; అరిగెన్= వెళ్ళాడు; ఇట= ఇక్కడ; ధర్మతనయుండు= ధర్మరాజు; న+ధర్మవర్తి+ఐన= ధర్మంకాని పద్ధతిలో నడిచేవాడైన; అసురకు= రాక్షసుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంత సహదేవుడు భీముడిని పిలుస్తూ అరణ్యంలోనికి వెళ్ళాడు. అప్పుడు ధర్మరాజు అధర్మపరుడైన ఆ రాక్షసుడితో ఇట్లా అన్నాడు :

**క. 'దేవాసురాదు లిం దుప । జీవింతురు మనుజులకు విశేషసుఖంబుల్**
**గావించుచు నమ్మనుజులఁ । గావంగలవార మేము గౌరవయుక్తిన్. 384**

**ప్రతిపదార్థం:** దేవ+అసుర+ఆదులు= దేవతలు రాక్షసులు మొదలైనవారు; ఇందు= ఈ భూలోకంలో; మనుజులకు= నరులకు; విశేష, సుఖంబుల్= గొప్పసౌఖ్యాలను; కావించుచున్= చేస్తూ; ఉపజీవింతురు= ఆశ్రయించి బ్రతుకుతుంటారు; ఆ+మనుజులన్= ఆ మనుష్యులను, ఆ నరులను; గౌరవ, యుక్తిన్= మన్ననతో కూడిన భావంతో; కావన్+కలవారము= రక్షించే శీలం కలవారం; ఏము= మేము.

**తాత్పర్యం:** 'దేవతలు, రాక్షసులు మొదలగువారు ఈ లోకాన్ని ఆశ్రయించుకొని ఉంటూ, ఇందలి మానవులకు విశేషమైన సౌఖ్యాలను ప్రసాదిస్తూ ఉంటారు. ఆ మానవులను మన్ననతో కాపాడుతూ ఉండేవాళ్ళం కదా మేము!

**వ. ఇట్టి మా కపకారంబు సేయుట లగ్గు గాదు; నీవు ధర్ము వెఱుంగవు; విశ్వసించినవారికిం గుడువంబెట్టినవారికి నెగ్గుచేయుట కడుంబాపంబు గావున. 385**

**ప్రతిపదార్థం:** ఇట్టి, మాకు= ఈ విధంగా పరోపకార పారీణులమైన మాకు; అపకారంబు చేయుట= కీడుచేయటం; లగ్గు+కాదు= మంచిది కాదు; నీవు= నీవు; ధర్మువు= ధర్మం; ఎఱుంగవు= తెలియనట్టివాడివి; విశ్వసించినవారికిన్= నమ్మినవారికిన్నీ; కుడువన్+పెట్టినవారికిన్= తిండిపెట్టిన వారికిన్నీ; ఎగ్గు చేయుట= కీడు చేయటం; కడున్+పాపంబు= మిక్కిలి చెడ్డపని; కావున= కాబట్టి.

**తాత్పర్యం:** ఈ విధంగా పరోపకార పారీణులమైన మాకు నీవు కీడు తలపోయటం భావ్యం కాదు. నీకు ధర్మం తెలియదు. నమ్మినవారికి, తిండి పెట్టినవారికి కీడు చేయటం గొప్పపాపం కాబట్టి.

**మధ్యాక్కర.**

**మాయావి! మా యాయుధములు మా కిచ్చి మాతో రణమ్ము**
**సేయు; మివ్విధమునఁ బోవఁ దగ' దంచుఁ జిక్కనై యసుర**
**నాయతబాహుఁడు గరము భరముగా నదిమె ధర్మజుఁడు**
**మాయావి యగు వానిగమనవేగంబు మందమై యుండ. 386**

**ప్రతిపదార్థం:** మాయావి!= ఓమాయలు నేర్చినవాడా!; మా+ఆయుధములు= మా శస్త్రాలు; మాకు+ఇచ్చి= మాకు తిరిగి ఇచ్చివేసి; మాతో, రణమ్ము, చేయుము= మాతో యుద్ధం చేయుము; ఈ+విధమునన్= ఈ విధంగా; పోవన్= పోవటం; తగదు+అంచున్= భావ్యం కాదంటూ; ఆయతబాహుఁడు= పొడుగైన చేతులు కలవాడు; ధర్మజుఁడు= ధర్మరాజు; అసురన్= రాక్షసుడిని, చిక్కన+ఐ= గాఢంగా; మాయావి+అగు, వాని= మాయలు నేర్చినటువంటివాడి యొక్క; గమనవేగంబు= నడక తీవ్రత; మందము+ఐ+ఉండ= తగ్గేటట్లుగా; కరము భరముగాన్= మిక్కిలి బరువు అనిపించేటట్లుగా; అదిమెన్= నొక్కాడు.

**తాత్పర్యం:** మాయలు నేర్చిన ఓరాక్షసుడా! మా ఆయుధాలు మా కిచ్చి మాతో యుద్ధం చేయుము. నీవు ఈ విధంగా పరుగెత్తి పోవటం భావ్యం కాదు'- అని పలుకుతూ ధర్మరాజు తన పొడుగైన చేతులతో గట్టిగా పట్టి అదిమి ఆ మాయావి అయిన రాక్షసుడి గమనవేగం తగ్గించాడు.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 2.22 విశేషాంశం చూడండి.

**వ. ఇట్లు ధర్మజు నిబిడపీడన వేదనాభరంబున విగతవేగుండై యరుగు జటాసురున కడ్డంబు వచ్చి సహదేవుం డిట్లనియె. 387**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ధర్మజు, నిబిడ, పీడన, వేదనా, భరంబున= ధర్మరాజుచేత చేయబడిన దట్టమైన పీడనం వలన కలిగిన బాధయొక్క బరువువలన- ధర్మరాజు తనను గట్టిగా నొక్కటంచేత కలిగిన బాధవలన; విగత, వేగుండు+ఐ= పోయిన వేగం కలవాడై; అరుగు= వెళ్లుచున్న; జటాసురునకు= జటాసురుడు అనే రాక్షసుడికి; అడ్డంబు, వచ్చి= అడ్డుగా చేరి నిలబడి; సహదేవుండు= సహదేవుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు తనను గట్టిగా అదిమి పట్టడంచేత కలిగిన బాధచేత గమనవేగం తగ్గినవాడై రాక్షసుడు మెల్లమెల్లగా వెళ్ళసాగాడు. సహదేవుడు ఆ రాక్షసుడికి అడ్డువచ్చి ఈ విధంగా పలికాడు.

**క. 'న న్నెఱుఁగవె? పాండవుఁడఁ, బ్ర । సన్నయశోవీర్యయుతుఁడ సహదేవుఁడ; న**
**త్యున్నతి యేర్పడ నిప్పుడ । ని న్నోర్చెదఁ జక్క నెదిరి నిలువుము పోరన్.' 388**

**ప్రతిపదార్థం:** నన్నున్+ఎఱుఁగవె?= నన్ను తెలియవా?; పాండవుఁడన్= నేను పాండురాజు కొడుకును; ప్రసన్న, యశస్+వీర్య, యుతుఁడ= నిర్మలమైన కీర్తితో, పరాక్రమంతో కూడినవాడిని; సహదేవుఁడన్= సహదేవుడనే పేరు కలవాడిని; అతి+ ఉన్నతి+ ఏర్పడన్= మిక్కిలి గొప్పతనం కలిగేటట్లుగా; ఇప్పుడు+అ= ఇప్పుడే; నిన్ను+ఓర్చెదన్= నిన్ను జయిస్తాను; పోరన్= యుద్ధంలో; చక్కన్+ఎదిరి, నిలువుము= సూటిగా ఎదిరించి నిలువుము.

**తాత్పర్యం:** 'ఓ రాక్షసుడా! నీవు నన్ను ఎరుగవా? నేను పాండురాజు కొడుకును. సహదేవుడిని. నిర్మలమైన కీర్తి, విక్రమం కలవాడిని. నా గొప్పతనం తేటతెల్లమయ్యేటట్లు ఇప్పుడే నిన్ను ఓడించగలను. తిన్నగా నిలిచి నాతో యుద్ధం చేయుము.'

### భీముఁడు జటాసురునితో యుద్ధము సేయుట (సం. 3-154-28)

**వ. అనుచున్న యవసరంబున ననిలసుతుం డనిలవేగంబున నరుదెంచి జటాసురుచేత నిగృహీతులై గగనగతిం జను ధర్మజ నకుల ద్రౌపదులను, మహీతలగతుం డైన సహదేవుం జూచి యయ్యసుర కిట్లనియె. 389**

**ప్రతిపదార్థం:** అనుచున్న+అవసరంబునన్= అని చెప్పుతున్న సమయంలో; అనిలసుతుండు= వాయుపుత్రుడైన భీమసేనుడు; అనిల, వేగంబునన్= గాలివంటి శీఘ్రగమనంతో; అరుదెంచి= వచ్చి; జటాసురుచేతన్= జటాసురుడిచేత; నిగృహీతులు+ఐ= చెరపెట్టబడినవారై; గగన, గతిన్+చను= ఆకాశమార్గాన వెళ్ళే; ధర్మజ, నకుల, ద్రౌపదులను= ధర్మరాజును, నకులుడిని, ద్రౌపదిని; మహీతల, గతుండు+ఐన= భూభాగాన నిలిచిఉన్న; సహదేవున్+చూచి= సహదేవుడిని చూచి; ఆ+అసురకు= ఆ రాక్షసుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని అంటున్న సమయంలో వాయుదేవుడి సుతుడైన భీమసేనుడు వాయువేగాన అక్కడికి వచ్చాడు. అతడికి, జటాసురుడిచేత కొనిపోబడుతున్న ధర్మరాజు, నకులుడు, ద్రౌపది ఆకాసంలోనూ, క్రింది భూమిపై నిలిచిన సహదేవుడున్నూ కనిపించారు. అంత భీముడు ఆ రాక్షసుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'అతిథివై వచ్చి నీవు మాయందుఁ గుడిచి । యసురవై యిట్లు యెగ్గు సేయంగ నగునె?**
**యెందుఁ గుడిచినచోటికి నెగ్గు సేయ । రెట్టి దుర్జను లైనను నెఱుక విడిచి. 390**

**ప్రతిపదార్థం:** అతిథివి+ఐ= ఆగంతుకుడివై; వచ్చి= వచ్చి; నీవు; మా+అందున్+కుడిచి= మాతోపాటు తిండి తిని; అసురవు+ఐ= రాక్షసుడివై; ఇట్లు= ఈ రీతిగా, అనగా తిండిపెట్టి ఆదరించినవారిని అపహరించుకొని పోవటంగా; ఎగ్గు+చేయంగన్+అగును+ఎ= కీడు చేయటం భావ్యమా?; ఎందున్= ఎక్కడైననూ; ఎట్టి, దుర్జనులు+ఐనను= ఎంతటి చెడ్డవారు అయినప్పటికీ; ఎఱుక విడిచి= జ్ఞానం వీడి; కుడిచిన, చోటికిన్= తిండిపెట్టినవారికి; ఎగ్గు+చేయరు= కీడు చేయరు.

**తాత్పర్యం:** 'నీవు మాదగ్గరకు అతిథివిగా వచ్చి మాతోపాటు తిండి తిని, రాక్షసుడివై ఉపకారం చేసినవారికి అపకారం చేయటం నీకు తగునా?; ఎంతటి చెడ్డవారైనప్పటికీ, తిండి పెట్టినవారికి బుద్ధి లేకుండా కీడు చేయరు.

**వ. నీవు బుద్ధిగలవేని వీరిని విడిచి నీ ప్రాణంబులు రక్షించుకొను; మట్లు గానినాఁడు బక హిడింబ కిమ్మీరులం జంపిన ట్లశ్రమంబునం జంపుదు' ననిన విని జటాసురుండు వారల విడిచి భీమసేనున కభిముఖుండై.391**

**ప్రతిపదార్థం:** నీవు బుద్ధి+కలవు+ఏని= నీకు తెలివి తేటలు ఉన్నట్లయితే; వీరిని= ధర్మరాజాదులను; విడిచి= వదలి; నీ, ప్రాణంబులు= నీ ప్రాణాలు (అసువులు); రక్షించుకొనుము= కాపాడుకొమ్ము; అట్లు కాని నాఁడు= ఆ విధంగా జరుగని రోజు; బక, హిడింబ, కిమ్మీరులన్= బకుడిని, హిడింబుడిని, కిమ్మీరుడిని; చంపినట్లు= చంపినవిధంగా; న+శ్రమంబునన్= సులువుగా, శ్రమలేకుండగా; చంపుదును= వధిస్తాను; అనిన= అని చెప్పగా; విని= విని; జటాసురుండు= జటాసురుడు; వారల, విడిచి= ధర్మరాజాదులను విడిచి; భీమసేనునకు= భీముడికి; అభిముఖుండు+ఐ= ఎదురైన ముఖం కలవాడై.

**తాత్పర్యం:** నీవు బుద్ధిగలవాడవైతే ధర్మరాజాదులను విడిచి నీ ప్రాణాలు దక్కించుకొమ్ము. ఆవిధంగా చేయకపోతే బకుడిని, హిడింబుడిని, కిమ్మీరుడిని, సంహరించినట్లుగానే నిన్ను అవలీలగా చంపుతాను'- అని చెప్పగా జటాసురుడు ధర్మరాజాదులను విడిచి భీముడివైపు తిరిగి ఇట్లా పలికాడు.

**క. 'రయమున నీచేత నిహతు । లయిన సురారాతులకు రణాంతరమున నీ**
**దయిన రుధిరమున నుదక । క్రియఁ జేసెద బక హిడింబ కిమ్మీరులకున్'. 392**

**ప్రతిపదార్థం:** రణ+అంతరమున= యుద్ధంలో; నీచేత, నిహతులు+అయిన= నీచేత సంహరించబడినవారైన; సుర+అరాతులకు= దేవతలకు శత్రువులైన రాక్షసులకు; బక హిడింబ కిమ్మీరులకున్= బకుడికీ, హిడింబుడికీ, కిమ్మీరుడికీ; రయమున= శీఘ్రంగా; నీదు+అయిన= నీయొక్క; రుధిరమునన్= నెత్తురుతో; ఉదక క్రియన్= శ్రాద్ధక్రియ (నీటితో తర్పణం విడిచేపని); చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** 'నాడు నీచేత యుద్ధంలో సంహరించబడిన బకుడికీ, హిడింబుడికీ, కిమ్మీరుడికీ, వేగంగా నేడు నీ నెత్తుటితో తర్పణక్రియలు నిర్వహిస్తాను.'

**క. అనుచుఁ గడు నలిగి మారుత । తనయు మహాబాహు నసుర దాఁకె; మరున్నం**
**దనున కెడ సొచ్చి మాద్రీ । తనయులు తత్క్షణమ వానిఁ దాఁకిరి వీఁకన్. 393**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని పలుకుతూ; కడున్+అలిగి= మిక్కిలి కోపించి; మారుత, తనయు= వాయుపుత్రుడైన భీముడిని; మహాబాహున్= గొప్ప చేతులు కలవాడిని- మహావీరుడిని; అసుర= రాక్షసుడు; తాఁకె= ఎదుర్కొన్నాడు; మరుత్+నందనునకు= వాయుపుత్రుడైన భీముడికి; ఎడ+చొచ్చి= సాయంగా ప్రక్కకు చేరి; మాద్రీ, తనయులు= మాద్రి కొడుకులు అయిన నకుల సహదేవులు; తద్+క్షణము+అ= ఆ త్రుటిలో; వీఁకన్= ఉత్సాహంతో; వానిన్= ఆరాక్షసుడిని- ఆ జటాసురుడిని; తాఁకిరి= మార్కొన్నారు.

**తాత్పర్యం:** అని చెప్పుతూ, మిక్కిలి ఆగ్రహించి, ఆ జటాసురుడు వాయుపుత్రుడైన భీముడిని మార్కొన్నాడు. తత్క్షణమే, వాయుసుతుడికి తోడుగా మాద్రీతనయులైన నకుల సహదేవులు ఆ రాక్షసుడిని ఎదుర్కొన్నారు.

**సీ. వారల నిద్దఱ వారించి భీముండు । దాఁకె జటాసురు వీఁకతోడ;**
**భీమాసురులకు సంగ్రామంబు గడుఘోర । మయ్యెఁ; నిర్మూలంబు లయ్యె వారి**
**యూరుఘట్టనముల ధారుణీరుహములు; । పదఘట్టనములఁ గ్రక్కదలె ధరణి;**
**భూరుహపాణులై పోరి యాసన్న భూ । రుహములు వొలిసిన బృహదుదగ్ర**

**ఆ. శిలలఁ గొంతసేపు చెలఁగి పోరాడి రొం । డొరులు పెనఁగి పట్టి పరుషభంగి**
**నుగ్రు లైన వాలిసుగ్రీవులట్టుల । యుద్ధ మొప్పఁ జేసి రిద్ధబలులు. 394**

**ప్రతిపదార్థం:** వారలన్+ఇద్దఱ= వారిని ఇద్దరినీ అనగా నకుల సహదేవులు ఇద్దరినీ; వారించి= ఆపి; భీముండు= భీముడు; జటాసురు= జటాసురుడిని; వీఁకతోడ= పరాక్రమంతో; తాఁకె= మార్కొన్నాడు; భీమ+అసురులకు= భీముడికిన్నీ, రాక్షసుడికిన్నీ; సంగ్రామంబు= యుద్ధం; కడు, ఘోరము+అయ్యె= మిక్కిలి భయంకరంగా జరిగింది; ధారుణీరుహములు= చెట్లు; వారి+ఊరు, ఘట్టనములన్= వారి తొడలయొక్క తాకిడిచేత; నిర్మూలంబులు+అయ్యె= నాశనమైనవి; పద, ఘట్టనములన్= అడుగుల తాకిడికి ధరణి= భూమి; కదలె+కదలె= క్రక్కదలె= బాగుగా కంపించింది; భూరుహపాణులు+ఐ= చెట్లు చేతులందు కలవారై; పోరి= యుద్ధంచేసి; ఆసన్న, భూరుహములు= దగ్గరగా ఉన్న చెట్లు; పొలిసిన= నశించగా; బృహద్+ఉగ్ర+శిలలన్= పెద్ద భయంకరమైన రాళ్ళతో; కొంతసేపు= కొంత కాలం; చెలఁగి=విజృంభించి; పోరాడిరి= యుద్ధంచేశారు; ఒండొరులు= ఒకరిని ఒకరు; పెనఁగి పట్టి= పెనవేసికొంటూ కుస్తీపట్లు పట్టి; పరుష, భంగిన్= కఠినమైన రీతిలో; ఉగ్రులు+ఐన= భయంకరులైన; వాలి, సుగ్రీవుల+అట్లు= వాలి, సుగ్రీవులవలె; ఇద్ధ, బలులు= దేదీప్యమానమైన బలం కలవారు (భీముడు మరియు జటాసురుడున్నూ); యుద్ధం= పోరాటం, ఒప్పన్+చేసిరి= ఒప్పేటట్లుగా చేశారు.

**తాత్పర్యం:** నకుల సహదేవులను ఇద్దరినీ వారించి, భీముడు విజృంభించి జటాసురుడితో తలపడ్డాడు. భీముడికీ, జటాసురుడికీ ఘోరయుద్ధం జరిగింది. వారి తొడల తాకిడిచేత చెట్లు నశించాయి. వారి పాదాల తాకిడి చేత భూమి కంపించింది. వారు ఇద్దరూ పోరు సలిపేటప్పుడు దగ్గరగా ఉన్న చెట్లు నశించటంచేత భయంకరమైన గండ శిలలతో యుద్ధం కొనసాగించారు. అట్లా దేదీప్యమానమైన బలం కల ఆ ఉభయులు వాలిసుగ్రీవులవలె యుద్ధం చేశారు.

**విశేషం:** 1. రామాయణ గాథలోని సుప్రసిద్ధపాత్రలు వాలిసుగ్రీవులు 2. రామాయణకథ భారతం కంటె ప్రాచీనం.

**క. భీమాసుర వీరుల ము । ష్టాముష్టి రణచ్ఛటచ్ఛటాశబ్దం బు**
**ద్దామం బై తద్విపిన మ । హామృగపక్షులకు నతిభయావహ మయ్యెన్. 395**

**ప్రతిపదార్థం:** భీమ+అసుర వీరుల= భీముడియొక్క, అసురవీరుడైన జటాసురుడియొక్క; ముష్టాముష్టి రణ+ఛటత్+ఛటా శబ్దంబు= పిడికిలి పిడికిలితో కలిసేటట్లు చేసే యుద్ధంలోని ఛట ఛట అనే శబ్దం; ఉద్దామంబు+ఐ= భయంకరమై; తత్+విపిన, మహామృగ పక్షులకున్= ఆ అరణ్యంలోని గొప్ప జంతువులకున్నూ; పిట్టలకున్నూ; అతి, భయ+ఆవహము= మిక్కిలి భయం కలిగించేది అయింది.

**తాత్పర్యం:** భీముడున్నూ, జటాసురుడున్నూ చేసే పిడికిలి పోట్ల పోరులోపుట్టే ఛటచ్ఛటలచప్పుడులు భయంకరంగా వ్యాపించి, ఆ అడవిలోని గొప్ప జంతువులకూ, పక్షులకూ మిక్కిలి భయాన్ని కలిగించాయి.

**ఆ. అంత భీమసేనుఁ డంతకాకారుఁడై। వాని బలవిహీనుఁగా నెఱింగి**
**తడయ కపుడు వాని మెడ గ్రుంగఁ బిడికిటఁ। బొడిచె; నసుర ముడిఁగి పడియెఁ బుడమి. 396**

**ప్రతిపదార్థం:** అంత= అంతట; భీమసేనుఁడు= భీముడు; అంతక+ఆకారుఁడు+ఐ= యముడివంటి రూపం కలవాడై; వానిన్= ఆ జటాసురుడిని; బల విహీనున్+కాన్= బలం లేనివాడినిగా; ఎఱింగి= తెలిసికొని; తడయక= ఆలసించక; అపుడు= అప్పుడు; వాని మెడ= వాడి మెడను; క్రుంగన్= దిగబడిపోయేటట్లుగా; పిడికిటన్= ముష్టితో; పొడిచెన్= గట్టిగా గ్రుచ్చాడు; అసుర= రక్కసుడు; ముడిఁగి= ముడుచుకొనిపోయి; పుడమిన్= భూమిపై; పడియెన్= పడ్డాడు.

**తాత్పర్యం:** అంతట భీమసేనుడు యముడి వంటి ఆకారం కలవాడై విజృంభించి, ఆరాక్షసుడిని బలం లేనివాడినిగా గుర్తించి, ఆలస్యం చేయకుండా వాని మెడ క్రుంగి వాలిపోయేటట్లు తన పిడికిలితో గట్టిగా కొట్టాడు. అంత ఆరాక్షసుడు దేహం ముడుచుకొనిపోయి పుడమిపై పడ్డాడు.

**వ. ఇట్లు నిర్ఘాత నిపాత భిన్నోన్నత నీలగిరి శృంగంబునుంబోలె నేలఁబడిన జటాసురుశరీరం బెత్తి యొక్క విశాల పరుషపాషాణంబుపై జర్జరితంబుగా వైచి, వానిం గాలగోచరుంగాఁ జేసిన వాయుపుత్త్రుపరాక్రమంబు ధౌమ్యరోమశాది మహీసురవరులు వర్ణించి రని వైశంపాయన కథితంబైన కథ రమ్యంబుగ. 397**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; నిర్ఘాత, నిపాత, భిన్న+ఉన్నత, నీల, గిరి, శృంగంబునున్+పోలె= పిడుగు పడటంచేత ప్రక్కలైన ఎత్తయిన నల్లటి కొండ శిఖరంవలె; నేలన్+పడిన= భూమి మీద పడిన; జటాసురు, శరీరంబు= జటాసురుడియొక్క దేహాన్ని; ఎత్తి= పైకెత్తి; ఒక్క= ఒక్క; విశాల, పరుష, పాషాణంబుపై= పెద్దదైన కఠినమైన రాతిబండపై; జర్జరితంబుగా, వైచి= ముక్కలు ముక్కలు అయ్యేటట్లుగా విసరివేసి; వానిన్= ఆ రాక్షసుడిని; కాల, గోచరున్+కాన్+చేసిన= సంహరించగా; వాయుపుత్త్రు= గాలిపట్టి అయిన భీముడి యొక్క; పరాక్రమంబు= శౌర్యాన్ని; ధౌమ్య, రోమశ+ఆది, మహీసుర, వరులు= ధౌమ్యుడు, రోమశుడు మొదలైన విప్రశ్రేష్ఠులు; వర్ణించిరి= వర్ణించారు (విస్తరించి చెప్పారు); అని= అంటూ; వైశంపాయన కథితంబు+ఐన= వైశంపాయనుడిచేత చెప్పబడిన కథ; రమ్యంబుగ= సొగసుగా.

**తాత్పర్యం:** ఈ విధంగా జటాసురుడి దేహం పిడుగుపడి బ్రద్దలైన నీలగిరిశిఖరంవలె నేలపై పడగా, భీమసేనుడు ఆ రాక్షసదేహాన్ని ఎత్తి ముక్కలు ప్రక్కలు అయ్యేటట్లు ఒక పెద్ద బండరాతిమీద విసరివైచాడు. ఆ విధంగా ఆ రాక్షసుడు మృతిచెందాడు. అప్పుడు ధౌమ్యుడు, రోమశుడు మొదలైన బ్రాహ్మణశ్రేష్ఠులు వాయుసుతుడైన భీముడి శౌర్యాన్ని గొప్పగా శ్లాఘించారు- అని వైశంపాయనుడు కథను కడుంగడు సొగసుగా వినిపించాడు.

## అశ్వాసాంతము

**క. భూపకులతిలక! నృపవి। ద్యాపారగ! నిత్యసత్యధనధాన్యదయా**
**లాపచతురాస్య! ధర్మ। వ్యాపారవిచార! విష్ణువర్ధన నృపతీ! 398**

**ప్రతిపదార్థం:** భూప, కుల, తిలక!= రాజుల వంశానికి తిలకంవంటివాడా, రాజశ్రేష్ఠుడా!; నృప, విద్యా, పారగ!= రాజ నీతి పరిజ్ఞానంలో అవతలి ఒడ్డును చేరినవాడా! అనగా రాజనీతిలో క్షుణ్ణమైన పరిజ్ఞానం కలవాడా!; నిత్యసత్య, ధన, ధాన్య, దయా+ఆలాపచతురాస్య!= నిత్యసత్యవ్రతంలో, ధనంలో, పంటగింజలలో, కరుణలో, నిండైన మాటలు పలకటంలో

బ్రహ్మదేవుడివంటివాడా!; ధర్మ, వ్యాపార, విచార= ధర్మం ఎట్లా ఆచరించాలో చర్చించేవాడా! అనగా ధర్మాధర్మాల సూక్ష్మాలను బాగా చర్చించేవాడా!; విష్ణువర్ధన నృపతీ!= విష్ణువర్ధన బిరుదాంకితుడివైన ఓ రాజా!- అనగా విష్ణువర్ధన బిరుదాన్ని ఆర్జించిన మహారాజవంశంలో పుట్టినవాడా!

**తాత్పర్యం:** రాజులలో శ్రేష్ఠుడివైన ఓ రాజరాజనరేంద్రా! రాజనీతిలో క్షుణ్ణమైన పరిజ్ఞానాన్ని ఆర్జించినవాడా! నిత్యసత్యం, ధనం, ధాన్యం, దయ, అనే నాలుగు అంశాలలో నిండైన మాటలు పలికే చతురాస్యుడా! ధర్మసూక్ష్మాలను చర్చించి తెలిసికొనేవాడా! ఓ విష్ణువర్ధనబిరుదాంకితుడివైన రాజరాజనరేంద్రా!

**విశేషం:** 1. ఆశ్వాసాంత పద్యాల గురించిన వివరణ 2. వైశంపాయన కథిత భారత గాథను గురించి 3. శౌనకాది మహర్షులకు రోమశుడు చెప్పిన మహాభారతాన్ని గురించి విశేష వివరణలు పూర్వోక్తాలు. ఆరణ్యపర్వం ఒకటవ రెండవ ఆశ్వాసాల చివర విశేష వివరణలను అరయవచ్చు. 4. నిత్యసత్య ధనధాన్యదయా+ఆలాపచతురాస్య అనే పదగుంఫనంలో చతురాస్యుడు అనగా నాలుగు ముఖాలు కల బ్రహ్మ, ఇక్కడ నాలుగంశాలకు నాలుగుముఖాలు ఉన్నాయి. ఇది ఇందులోని స్వారస్యం.

**వసంత తిలకము.**

> **శ్రీరమ్య! రాజకులశేఖర! రాజరాజా! । భూరిప్రతాప! పరిభూతవిరోధివర్గా!**
> **హారామృతాబ్జహర హాస తుషార కుంద । స్ఫారద్యశః ప్రసర పాండుకృత త్రిలోకా! 399**

**ప్రతిపదార్థం:** శ్రీ రమ్య!= శ్రీచేత సొగసైనవాడా! (శ్రీ అనేపదానికి సంపద - కాంతి - శోభ - ఇట్లా ఎన్నో అర్థాలు ఉన్నాయి. అందుచే శ్రీరమ్య అనగా లోకాతీతమైన శోభచేత వర్ధిల్లునటువంటివాడా! అని విశాలమైన అర్థం చెప్పవచ్చు.) రాజ, కుల, శేఖర!= రాజులసమూహాలలో శ్రేష్ఠుడివైనవాడా లేదా, రాజవంశానికంతటికీ శ్రేష్ఠుడైనవాడా! ఉత్తమోత్తముడవైన మహారాజా!; రాజరాజా!= సార్వభౌమా! (రాజరాజనరేంద్రుడా); భూరిప్రతాప!= గొప్పపరాక్రమంకలవాడా!; పరిభూత, విరోధి, వర్గా!= జయించబడిన శత్రువుల సముదాయం కలవాడా! శత్రుపరంపరలపై విజయం సాధించినవాడా!; హార+అమృత+అబ్జ, హర, హాస, తుషార, కుంద, స్ఫారత్+యశస్+ప్రసర, పాండుకృత, త్రిలోకా!= ముత్యాలదండవలె, అమృతంవలె, తెల్ల తామరపువ్వువలె, శివుడివలె, నవ్వువలె, మంచువలె, మొల్లపువ్వువలె వెలుగొందే కీర్తి వ్యాపించటంచేత తెలుపుగా చేయబడిన మూడులోకాలు కలవాడా!

**తాత్పర్యం:** ఓ రాజ రాజనరేంద్రా, శ్రీరమ్యుడా, రాజులలో శ్రేష్ఠుడివైన వాడా, గొప్పశౌర్యం కలవాడా, శత్రువులను జయించి వారిని పరాభవానికి లోనైనవారిగా చేసినటువంటివాడా, ముత్యాలహారంవలె, అమృతంవలె, శ్వేతపద్మంవలె, శివుడివలె, నవ్వువలె, మంచువలె, మొల్లపువ్వువలె వెలుగొందే కీర్తి వ్యాపించటంచేత తెలుపుగా చేయబడిన మూడులోకాలు కలవాడా!

**విశేషం:** 1. హారం అంటే నూరు పేటలు కల ముత్యాలదండ 2. ముత్యములు, అమృతం, శివుడు, నవ్వు, మంచు, మొల్లపువ్వు, కీర్తి, తెల్లగా ఉంటాయని కవిసమయం. 3. ఈ వృత్తంలో ప్రతిచరణానికీ త,భ,జ,జ,గగ - అనే గణాలుంటాయి. 8వ అక్షరం యతిమైత్రి. ప్రాస పాటించబడింది.

**గద్యము:**

> **ఇది సకల సుకవి జన వినుత, నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్య పర్వంబున దధీచికథయును, నగస్త్యు మాహాత్మ్యంబును, భగీరథు ప్రయత్నంబునుం, గంగావతరణంబును,**

**ఋశ్యశృంగు చరితంబును, బరశురాము చరితంబును, గార్తవీర్యు వధయును, రామకృష్ణాదుల యాగమనంబును, సౌకన్యాఖ్యానంబును, జ్యవనుండు సంయాతియజ్ఞంబున నశ్వినుల సోమపీథులం జేసి వారిచేత జవ్వనంబు వడయుటయు, మాంధాతృ జన్మంబును, సోమకుండు యజ్ఞంబుఁ జేసి పుత్త్రశతంబు వడయుటయు, జంతూపాఖ్యానంబును, శ్యేన కపోతంబులై యింద్రాగ్నులు శిబిమాంసంబు గొనుటయు, నష్టావక్రు మాహాత్మ్యంబును, రైభ్యయవక్రీతుల సంవాదంబును, భీముండు సౌగంధిక హరణార్థం బరుగుటయు, హనుమద్దర్శనంబును, రామాయణకథయును, భీముండు గంధమాదనంబునం దుండు కొలనికిం బోయి యక్ష రాక్షసుల వధియించుటయు, గంధమాదనంబున నందఱుం గూడుటయు, జటాసురవధయు నన్నది తృతీయాశ్వాసము. 400**

**ప్రతిపదార్థం:** ఇది= ఈరచన; సకల, సుకవి, జన, వినుత, నన్నయభట్ట, ప్రణీతంబు+ఐన= సర్వ సత్కవుల బృందంచేత ప్రశంసించబడిన నన్నయభట్టుచేత వ్రాయబడిన; శ్రీమహాభారతంబునందు= శ్రీ మహాభారతం అనే గ్రంథమందు; ఆరణ్య పర్వంబున= వనపర్వమందు; దధీచికథయునున్= దధీచిని గురించిన వృత్తాంతము; అగస్త్యు, మాహాత్మ్యంబును= అగస్త్యముని యొక్కమహిమ; భగీరథు ప్రయత్నంబునున్= భగీరథుడి యొక్క కృషియున్నూ; గంగా+అవతరణంబును= గంగ క్రిందికి (భూమి మీదకు) దిగటమున్నూ; ఋశ్యశృంగు చరితంబును= ఋశ్యశృంగుడి వృత్తాంతమున్నూ; పరశురాము చరితంబును= పరశురాముడి కథయున్నూ; కార్తవీర్యు వధయును= కార్తవీర్యుడి సంహారమున్నూ; రామకృష్ణ+ఆదుల+ఆగమనంబును= బలరాముడు శ్రీకృష్ణుడు మొదలైన వారి రాకయున్నూ; సౌకన్యా+ఆఖ్యానంబును= సుకన్యవృత్తాంతమున్నూ; చ్యవనుండు= చ్యవనుడు; సంయాతియజ్ఞంబునన్= సంయాతి అనే రాజు జరిపిన క్రతువులో; అశ్వినుల= అశ్వినీదేవతలను; సోమపీథులన్+చేసి= సోమరసాన్ని త్రాగేవారినిగా చేసి; వారిచేత= ఆ అశ్వినులచేత; జవ్వనంబు= యౌవనం; పడయుటయు= పొందటమున్నూ; మాంధాతృ జన్మంబును= మాంధాత పుట్టుకయున్నూ; సోమకుండు= సోమకుడు; యజ్ఞంబున్+చేసి= క్రతువును చేసి; పుత్త్ర శతంబు= నూరుమంది కొడుకులను, పడయుటయు= పొందటమున్నూ; జంతు+ఉపాఖ్యానంబును= జంతునియొక్క చిరుకథయు; శ్యేనకపోతంబులు+ఐ= డేగపావురాలై; ఇంద్ర+అగ్నులు= ఇంద్రుడు, అగ్నియు; శిబిమాంసంబు= శిబియొక్క మాంసం; కొనుటయున్= తీసికొనటమున్నూ; అష్టావక్రు, మాహాత్మ్యంబును= అష్టావక్రుడి మహిమయున్నూ; రైభ్య, యవక్రీతుల సంవాదంబును= రైభ్యుడికీ యవక్రీతుడికీ మధ్య జరిగిన సంభాషణమున్నూ; భీముండు= భీముడు; సౌగంధిక, హరణ+ అర్థంబు+అరుగుటయు= సౌగంధికాలనే పొందామర పూలను తేవటానికై వెళ్ళటమున్నూ; హనుమత్+దర్శనంబును= హనుమంతుని చూడటమున్నూ; రామాయణ, కథయును= రామాయణగాథయున్నూ; భీముండు= భీముడు; గంధమాదనంబునందు+ఉండు= గంధమాదనమనే పేరుకల కొండపై ఉండే; కొలనికిన్+పోయి= సరోవరానికి వెళ్ళి; యక్ష, రాక్షసుల= యక్షులను, రాక్షసులను; వధించుటయు= సంహరించటమున్నూ; గంధమాదనంబునన్= గంధమాదనపర్వతాన; అందఱున్= పాండవ బృందంలోని వారందరూ; కూడుటయు= కలిసిచేరటమున్నూ; జటాసురవధయున్= జటాసురుడి సంహారమున్నూ; అన్నది= అనే వృత్తాంతాలతో కూడినది; తృతీయ+ఆశ్వాసము= మూడవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఈ రచన శ్రీ మహాభారతమందలి ఆరణ్యపర్వంలోని మూడవ ఆశ్వాసం. దీనిని రచించింది సమస్త సత్కవిబృందాలచేత పొగడబడిన నన్నయభట్టు. ఇందున్న అంశాలు- దధీచి తన వెన్నెముకను దేవతలకు దానమీయటం. అగస్త్యమహర్షియొక్క మహిమలు. భగీరథుడు చిరస్మరణీయమైన కృషి చేసి గంగను భూమికి దింపటం, ఋశ్యశృంగుడి వృత్తాంతం. పరశురాముడి చరిత్ర. కార్తవీర్యుడి వృత్తాంతం, అతడి మరణం. బలరాముడు శ్రీ కృష్ణుడు మున్నగువారు

పాండవులను సందర్శించటం, సుకన్య చరిత్ర. చ్యవనమహర్షి సంయాతి మహారాజు చేసిన క్రతువులో అశ్వినీ దేవతలను సోమపీథులను చేసి వారివలన యౌవనాన్ని పొందటం, మాంధాత మహారాజు జన్మవృత్తాంతం, సోమకుడు అనే రాజర్షి వృత్తాంతం, జంతుడనే రాకుమారుడి గాథ, శిబిచక్రవర్తి చరిత్ర- ఇంద్రుడు, అగ్ని, డేగ పావురాలుగా వచ్చి శిబిమాంసం తీసుకోవటం, అష్టావక్రమహర్షి మాహాత్మ్యం, రైభ్య, యవక్రీతుల సంవాదం, భీముడు సౌగంధిక కమలాలను తేవటానికి వెళ్ళటం, హనుమంతుడిని సందర్శించటం, రామాయణ సంక్షిప్తగాథ. భీముడు గంధమాదనాన ఉన్న సరోవరానికి వెళ్ళటం, యక్షరాక్షసవధ, గంధమాదనాన పాండవ సమావేశం, జటాసురవధ.

**-: ఆరణ్యపర్వంలో తృతీయాశ్వాసం సమాప్తం :-**



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - చతుర్థాశ్వాసము

**శ్రీ రాజరాజ! కులని । స్తార! సుధాహార హీర సన్నిభ కీర్తీ!**
**శ్రీరమణ! ధనుర్విద్యా । పారగ! కోదండపార్థ! పార్థివ తిలకా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ రాజరాజ!= శ్రీ రాజరాజనరేంద్రా!; కులనిస్తార!= కులానికి అనగా క్షత్రియ జాతికి (వంశానికి) తరించేమార్గం కల్పించే వాడా!; సుధా, హార, హీర, సన్నిభ, కీర్తీ!= అమృతంతో, ముత్యాల పేరుతో, వజ్రంతో సమానమైన యశస్సు కలవాడా!; శ్రీరమణ= లక్ష్మీదేవిని సంతసింప చేసేవాడా!; ధనుస్+విద్యా, పారగ!= విలువిద్యయందు చివరితీరానికి చేరినవాడా!; కోదండ, పార్థ!= వింటియందు అర్జునుడివంటివాడా!; పార్థివతిలకా!= రాజశ్రేష్ఠుడా!.

**తాత్పర్యం:** ఓ రాజరాజ నరేంద్రా! వంశోద్ధారకుడా! అమృతంతో, ముత్యాల హారంతో, వజ్రంతో సమానమైన యశస్సు కలవాడా! లక్ష్మీదేవికి సంతోషాన్ని కలిగించేవాడా! విలువిద్యలో చివరిదరికి చేరినవాడా! విలుకాండ్రలో అర్జునుడివంటివాడా! రాజులలో శ్రేష్ఠుడా!

**విశేషం:** (1) ఇది ఆశ్వాసారంభ పద్యం. ఆశ్వాసంలోని తొలి పద్యమున్నూ, ఆశ్వాసంలోని తుదిపద్యాలున్నూ సంబోధన ప్రథమావిభక్తిలో రచించి కృతిభర్తను ప్రశంసించే సంప్రదాయాన్ని తెలుగువాఙ్మయంలో నెలకొల్పిన మహాకవి నన్నయభట్టు. (2) అట్లే ఆశ్వాసారంభపద్యం శ్రీకారంతో ఆరంభించటం సాహితీసంప్రదాయ మైనది. (3) అమృతం, ముత్యాలు, వజ్రం తెల్లగా ఉండేవి. కీర్తి తెల్లగా ఉండటం కవిసమయం. (4) తిలకం అనగా బొట్టు. తిలకం శ్రేష్ఠవాచకంగా సుప్రసిద్ధం.

**వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె; నట్లు పాండవులు నరనారాయణ స్థానంబునఁ గొన్ని దినంబు లుండి యొక్కనాఁడు ధర్మతనయుండు దమ్ముల కిట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= ఆ కథను చెప్పునట్టి సూతుడు; శౌనక+ఆది, మహామునులకున్+చెప్పెన్= శౌనకుడు మొదలైన గొప్ప ఋషులకు చెప్పాడు; అట్లు= ఆ రీతిగా; పాండవులు= పాండురాజు కొడుకులు; నర, నారాయణ, స్థానంబునన్= నరుడు నారాయణుడు తపస్సు చేసిన చోట- అనగా బదరికాశ్రమంలో; కొన్ని, దినంబులు+ఉండి= కొన్ని నాళ్లు నివసించి; ఒక్క, నాఁడు= ఒకానొక రోజున; ధర్మతనయుండు= ధర్మసుతుడు; తమ్ములకున్= సోదరులకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** మహాభారతకథను సూతుడు, శౌనకుడు మొదలైన ఋషులకు చెప్పాడు. ఆ విధంగా పాండవులు నరుడూ నారాయణుడూ తొల్లి తపస్సు చేసిన బదరికావనంలో కొన్ని నాళ్ళు నివసించారు. అంతట, ఒకనాడు ధర్మరాజు తన తమ్ములతో ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** సూతుడు శౌనకాది మహర్షులకు మహాభారతాన్ని నైమిశారణ్యంలో పండ్రెండేండ్ల జరిగిన సత్రయాగంలో వినిపించాడు. ఆ వివరాలన్నింటిని మొదటి ఆశ్వాసంలో విశేషాంశాలుగా సవిస్తరంగా చెప్పటం జరిగింది.

**మధ్యాక్కర.**

> **'ఏనేఁడు లగుదెంచె నర్జునుఁ డేఁగి, యింత కేతెంచుఁ**
> **బూని దివ్యాస్త్రముల్ వడసి, యమ్మహాభుజు భూరిసత్త్వు**
> **నానతరిపువర్గుఁ జూడఁ గాంతు మిం' దంచు బ్రాహ్మణుల**
> **తో నేఁగె నుత్తరమించి ధర్మనిత్యుఁడు ధర్మజుండు. 3**

**ప్రతిపదార్థం:** అర్జునుండు+ఏఁగి= అర్జునుడు వెళ్లి; ఏను+ఏఁడులు+అగుదెంచెన్= ఐదేండ్లు అయినవి; దివ్య+అస్త్రముల్= దేవతలకు సంబంధించిన ఆయుధాలు; పూని= ప్రయత్నించి; పడసి= పొంది (సంపాదించి); ఇంతకున్= ఇప్పటికి; ఏతెంచున్= వస్తాడు; ఆ+మహాభుజున్= గొప్ప పరాక్రమం గల ఆ వీరుడిని; భూరి, సత్త్వున్= గొప్ప బలం కలవాడిని; ఆనత, రిపు, వర్గున్= లొంగదీయబడిన శత్రువుల కూటం కలవాడిని; ఇందున్= ఇచట; చూడన్+కాంతుము= చూడగలం; అంచున్= అని పలుకుతూ; ధర్మనిత్యుఁడు= ధర్మాన్నే ఎప్పుడు పాటించేవాడు; ధర్మజుండు= ధర్మసుతుడు; ఉత్తరమించి= ఉత్తర దిక్కుకొంతదాటి; బ్రాహ్మణులతోన్= విప్రులతో; ఏఁగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'అర్జనుడు వెళ్లి ఐదేండ్లు గడిచినవి; దివ్యమైన అస్త్రాలు సంపాదించి ఇప్పుడు రాగలడు; ఆ మహాపరాక్రమోపేతుడిని, ఆ బలశాలిని, శత్రువుల సమూహాలను జయించిన వాడిని ఇక్కడ చూడగలం' అని పలుకుతూ, ధర్మరాజు బ్రాహ్మణులతో కలిసి ఉత్తరదిక్కుకొంతదాటి పయనించాడు.

**విశేషం:** మహాభుజు, భూరిసత్త్వు, ఆనతరిపువర్గు- అనే విశేషణాలు అర్జునుడికి ఒకే పద్యంలో వాడటంలో ధర్మజుడికి తమ్ముడిని చూడాలన్న ఆసక్తి వ్యంగ్యంగా స్ఫురిస్తున్నది. దివ్యాస్త్రాలను ధరించిన అర్జునుడికి భుజబలం, పరాక్రమం, శత్రుమర్దన సామర్థ్యం క్రమంగా పెంపొందుతా యని ధ్వని. వృత్తలక్షణానికి ఆర. 2.22 పద్యవిశేషాంశం చూడండి.

**వ.** **ఇట్లు గంధమాదన పుణ్యతీర్థావలోకనపరు లయి పాండవు లరిగి పదియేడగు దివసంబున వృషపర్వుండను రాజర్షియాశ్రమంబుఁ గని, యం దతిప్రీతి నాతనిచేతఁ బూజితు లయి యేడుదివసంబులు వసియించి బ్రాహ్మణుల నెల్ల నందు నిలువం బనిచి, వృషపర్వోపదిష్ట మార్గంబున ధౌమ్యరోమశప్రభృతి కతిపయ బ్రాహ్మణ వరులతోఁ జని యష్టమదివసంబున. 4**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవులు; గంధమాదన, పుణ్య, తీర్థ+అవలోకన, పరులు+అయి= గంధమాదన పర్వతంలో ఉన్న పుణ్యక్షేత్రాలను దర్శించటంలో ఆసక్తికల వారై; అరిగి= ఉత్తర దిక్కుకొంతదాటి వెళ్లి; పది+ఏడు+అగు, దివసంబునన్= పదునేడవ రోజున; వృషపర్వుండు+అను, రాజర్షి+ఆశ్రమంబున్= వృషపర్వుడు అనే పేరుకల రాజు అయిన ఋషియొక్క ఆశ్రమాన్ని; కని= చూచి; అందు= ఆ ఆశ్రమంలో; అతి ప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; ఆతనిచేతన్= ఆ వృషపర్వుడు అనే రాజర్షిచేత; పూజితులు+అయి= అర్చించబడిన వారై; ఏడు, దివసంబులు= ఏడునాళ్ళు; వసియించి= ఉండి; బ్రాహ్మణులన్+ఎల్లన్= అందరు విప్రులను; అందున్= ఆ ఆశ్రమంలో; నిలువన్+పనిచి= ఉండుడని చెప్పి; వృషపర్వ+ఉపదిష్ట, మార్గంబునన్= వృషపర్వుడు నిరూపించి చెప్పిన దారిని బట్టి; ధౌమ్య, రోమశ, ప్రభృతి, కతిపయ, బ్రాహ్మణవరులతోన్= ధౌమ్యుడు రోమశుడు మున్నగు కొద్దిమంది విప్రశ్రేష్ఠులతో; చని= వెళ్ళి; అష్టమ, దివసంబునన్= ఎనిమిదవ నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా గంధమాదనంలోని పుణ్యక్షేత్రాలను సందర్శించి ఉత్తరదిశకొంతదాటి పయనించి పాండవులు పదునేడవనాడు వృషపర్వుడు అనే రాజర్షి ఆశ్రమం చేరారు. ఆ వృషపర్వ మహారాజు పాండవ బృందానికి అతిథి సత్కారాలు చేసి గౌరవించాడు. అక్కడ వాళ్లు ఏడు రోజులు ఉన్నారు. ఆ తరువాత విప్రబృందాన్ని ఆ రాజర్షి ఆశ్రమంలో నిలిపి, రోమశుడు ధౌమ్యుడు మున్నగు కొద్దిమందివిప్రులతో కలిసి వృషపర్వుడు సూచించిన దారిన పయనించి వెళ్ళారు.

**క. విమల స్ఫాటిక హాటక । రమణీయ దరీ నిరంతర శ్వేతనగేం**
**ద్రము మాల్యవంతమును ను । త్తమచరితులు సూచు చరిగి తద్విపినమునన్. 5**

**ప్రతిపదార్థం:** విమల, స్ఫాటిక, హాటక, రమణీయ, దరీ నిరంతర, శ్వేత, నగ+ఇంద్రము= నిర్మలమైన పటికపు రాళ్లచేత, బంగారంచేత, సొగ సైన గుహలతో ఎల్లప్పుడు తెల్లగా ఉండే పర్వతశ్రేష్ఠమైన; మాల్యవంతమును= మాల్యవంతం అనే పేరు కల పర్వతాన్ని; ఉత్తమ, చరితులు= మంచి శీలం కల వారైన ఆ పాండవులు; చూచుచున్= సందర్శిస్తూ; అరిగి= పయనించి; తద్+విపినమునన్= ఆ అరణ్యంలో.

**తాత్పర్యం:** ఉత్తమ చరిత్రులైన ఆ పాండవులు 'మాల్యవంతం' అనే పేరుకల గొప్ప కొండను చూచారు. ఆ పర్వతం నిర్మల మైన పటికరాళ్ళతోనూ బంగారంతోనూ కూడిన అందమైన గుహలు కలిగి ఎల్లప్పుడూ తెల్లగా ఉంది. ఆ అరణ్యంలో.

**క. చలదళి పుంస్కోకిల కుల । కల రవముఖరిత లతాంత కమ్ర ఫలాళీ**
**లలిత మహీరుహ మాలా । మిళితోద్దేశముల విశ్రమించుచు లీలన్. 6**

**ప్రతిపదార్థం:** చలత్+అళి, పుంస్కోకిల, కుల, కల, రవ, ముఖరిత, లతా+అంత, కమ్ర, ఫల+ఆళీ, లలిత, మహీరుహ, మాలా, మిళిత+ఉద్దేశములన్= చలిస్తున్న (ఎగురుతున్న) తుమ్మెదలయొక్క, గండుకోకిలల సమూహాల యొక్క అవ్యక్తమధురమైన నాదంచేత మ్రోగుతూ పువ్వులు, సొగసైన పండ్ల సముదాయాలు కలిగిన మృదువైన చెట్ల గుంపులతో కూడిన ఎత్తయిన ప్రదేశాలలో; విశ్రమించుచున్= సేదతీర్చుకొంటూ; లీలన్= వినోదంగా.

**తాత్పర్యం:** (పాండవులు) వినోదంగా ఆ అరణ్యంలో విహరించారు. అందులోని ఎత్తయిన ప్రదేశాలలో విశ్రమించారు. అక్కడ చెట్ల వరుసలు మిక్కిలి సొగసుగా పువ్వులతో పండ్లతో నిండి ఉన్నవి. సంచరించే తుమ్మెదల ఝుంకారాలతో గండుకోకిలల అవ్యక్తమధురనినాదాలతో ఆ వనం మారుమ్రోగుతూ ఉన్నది.

**వ. అందు విహరించుచున్న నొక్కనాఁడు శ్వేతకి యను పుణ్యనదివలన మారుతానీతంబు లై తమ ముందటం బడిన పంచవర్ణ సురభి కుసుమంబులం జూచి యందఱు విస్మయం బంది; రంత నేకతంబున నొక్క శశికాంత శిలాతలంబుపయి నున్న భీమసేనునకు ద్రుపదరాజపుత్త్రి యి ట్లనియె. 7**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ అరణ్యంలో; విహరించుచు+ఉన్నన్= వినోదంగా తిరుగాడుతుండగా; ఒక్క, నాఁడు= ఒక రోజున; శ్వేతకి+అను పుణ్యనది వలనన్= శ్వేతకి అనే పేరుకల పుణ్యనదినుండి; మారుత+ఆనీతంబులు+ఐ= గాలిచేత (వేగంగా) తీసికొని రాబడినవై; తమ, ముందటన్+పడిన= తమ ఎదుట వచ్చిపడిన; పంచ, వర్ణ, సురభి, కుసుమంబులన్+చూచి=

ఐదురంగులు కలిగి పరిమళించే పూవులను చూచి; అందఱు= పాండవ బృందంలోని వారు అందరు; విస్మయంబు+అందిరి= ఆశ్చర్యం చెందారు; అంతన్= అటు పిమ్మట; ఏకతంబునన్= ఒంటరిగా; ఒక్క= ఒక; శశి, కాంత, శిలా, తలంబు, పయిన్= చంద్రకాంతశిల పైన; ఉన్న= కూరుచొని ఉన్న; భీమసేనునకున్= భీముడితో; ద్రుపదరాజపుత్రి= ద్రౌపది; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఆ వనంలో వినోదార్థం తిరుగాడుతూ ఉండగా, ఒకనాడు శ్వేతకి అనే నదినుండి గాలిచేత విసరివేయబడి పాండవబృందంముందు అయిదురంగులు కలిగి నెత్తావులు విరజిమ్ముతున్న పువ్వులు వచ్చి పడ్డాయి. ఆ పువ్వులను చూచి అందరూ ఆశ్చర్యపోయారు. అంతట ఏకాంతంగా ఒక చంద్రకాంత శిలావేదికమీద, కూర్చొని ఉన్న భీమసేనుడితో ద్రౌపది ఈ విధంగా అన్నది.

**క. 'ప్రకటముగఁ దొంటి సౌగం । ధిక కనకాబ్జములకంటె దివ్యసుగంధా**
**ధిక కుసుమము లివి దద్దయు । సుకుమారము; లిట్టివానిఁ జూచి యెఱుంగన్. 8**

**ప్రతిపదార్థం:** ఇవి= ఈ పువ్వులు; ప్రకటముగన్= తేట తెల్లంగా; తొంటి= మునుపటి; సౌగంధిక, కనక+అబ్జముల కంటెన్= సౌగంధికాలనే బంగారు తామరపువ్వుల కంటె; సుగంధ+అధిక, కుసుమములు= (ఈ పువ్వులు) దివ్యమైన పరిమళంచేత గొప్పవి; తద్దయు= మిక్కిలి; సుకుమారములు= కోమలమైనవి; ఇట్టి వానిన్= ఇటువంటి పువ్వులను; చూచి+ఎఱుంగన్= ఇంతకు ముందు చూడలేదు.

**తాత్పర్యం:** 'ఈ పువ్వులు మునుపు మనం చూచిన సౌగంధికాలనే పసిడితామరపువ్వులకంటెకూడ గొప్ప పరిమళాలు కలవి. ఇవి సౌకుమార్యంలో ఆ సౌగంధిక కమలాలను మించినవి. ఇటువంటి పువ్వులను నేను ఇంతకు ముందు ఎన్నడూ చూడలేదు.

**వ. ఇప్పువ్వులు నాకుఁ దెచ్చి యిచ్చి మనఃప్రియంబు సేయు' మనిన, భీముండు తత్క్షణంబ చని చక్రవాళ నగ సమున్నతం బయిన గిరిశృంగం బెక్కియందు వివిధరత్నరచిత రమ్య ప్రాకార పరివృతం బయిన వైశ్రవణు నివాసంబు గని శంఖధ్వానంబు సేసిన. 9**

**ప్రతిపదార్థం:** ఈ+పువ్వులు= ఈ పువ్వులు; నాకున్+తెచ్చి+ఇచ్చి= నాకు తీసికొని వచ్చి ఇచ్చి; మనస్+ప్రియంబు= మనస్సుకు తృప్తిని; చేయుము= కల్గించుము; అనినన్= అని చెప్పగా; భీముండు= భీముడు; తద్+క్షణంబు+అ= ఆత్రుటిలోనే-అనగా వెనువెంటనే; చని= వెళ్ళి; చక్రవాళ, నగ, సమున్నతంబు+అయిన= చక్రవాళ పర్వతంవలె మిక్కిలి ఎత్తుగా ఉన్న; గిరి, శృంగంబు+ఎక్కి= కొండ కొనకు ఎక్కి; అందున్= అచట; వివిధ, రత్న, రచిత, రమ్య, ప్రాకార, పరివృతంబు+అయిన= పెక్కు విధములైన మణులచేత నిర్మించబడి అందమైన చుట్టుగోడచేత చుట్టుకొనబడిఉన్న; వైశ్రవణు, నివాసంబున్= కుబేరుడి యొక్క భవనాన్ని; కని= చూచి; శంఖధ్వానంబు+చేసినన్= శంఖాన్ని ఒత్తి పెద్దధ్వని చేయగా.

**తాత్పర్యం:** ఈ పువ్వులు నాకు తెచ్చి ఇచ్చి నా మనస్సుకు సంతోషాన్ని కలిగించుము'- అని భీముడితో ద్రౌపది పలికింది. భీమసేనుడు వెనువెంటనే బయలుదేరి చక్రవాళపర్వతంవలె మిక్కిలి ఎత్తయిన ఆ కొండకొనకు ఎక్కి, అక్కడ పలు తెరగుల మణులతో నిర్మించిన ప్రాకారంతో ఆవరించబడి ఉన్న కుబేరుడి నివాస భవనాన్ని చూచాడు; శంఖనాదం చేశాడు.

**క. దాని విని యక్షరాక్షస । సేనలు పఱతెంచి భీమసేను మహాసే**
**నానీసన్నిభుఁ దాఁకిరి । నానాయుధధరులు దారుణధ్వను లెసఁగన్. 10**

**ప్రతిపదార్థం:** దాని, విని= ఆ శంఖధ్వనిని ఆలకించి; నానా+ఆయుధ ధరులు= అనేక శస్త్రాలను తాల్చినవారు; యక్ష, రాక్షస, సేనలు= యక్షులు, రాక్షసులు అయిన భటులతో కూడిన సైన్యాలు; దారుణ ధ్వనులు= భయంకరమైన నినాదాలు; ఎసఁగన్= విస్తరించగా; పఱతెంచి= పరుగున వచ్చి; మహా సేనానీ, సన్నిభున్= గొప్ప సేనాధిపతి- (కుమారస్వామితో) సమానుడైనవాడిని; భీమసేనున్= భీముడిని; తాఁకిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** ఆ శంఖనాదాన్ని విని యక్షరాక్షసభటులు గల సైన్యాలు పెక్కుఆయుధాలను ధరించి సింహనాదాలు చేస్తూ పరువెత్తి వచ్చి కుమారస్వామితో సమానుడైన భీమసేనుడితో తలపడ్డారు.

**క. వాయుసుత ప్రేరిత శిత । సాయకముఖ దళిత రాక్షస ప్రకర బృహ**
**త్కాయాభ్ర గళిత శోణిత । తోయంబుల నవనిధరనదులు గడు నిండెన్. 11**

**ప్రతిపదార్థం:** వాయు, సుత, ప్రేరిత, శిత, సాయక, ముఖ, దళిత, రాక్షస, ప్రకర, బృహత్+కాయ+అభ్ర, గళిత, శోణిత, తోయంబులన్= వాయుదేవునికుమారుడు అయిన భీముడిచేత ప్రయోగించబడిన వాడిబాణాలకొనలచేత చీల్చబడిన రాక్షసుల సమూహాలయొక్క పెనుదేహాలు అనే మబ్బులనుండి జారిన నెత్తురు అనే నీటిచేత; అవనిధర, నదులు= కొండవాగులు; కడు= మిక్కిలి; నిండెన్= నిండాయి.

**తాత్పర్యం:** వాయుసుతుడైన భీముడిచేత విడువబడిన వాడిబాణాలకొనలచేత చీల్చబడిన రాక్షసుల పెద్ద దేహాలు అనే మేఘాలనుండి కారిన నెత్తురు అనెడి నీటిచేత కొండవాగులు నిండి ప్రవహించాయి.

**విశేషం:** అలం: రూపకం.

**ఉ. ఉక్కఱి యిట్లు మధ్యముమహోగ్రశరంబుల కోర్వనోప కా**
**రక్కసు లెల్ల నాహవపరాఙ్ముఖు లైనఁ గడంగి భీముఁ దా**
**నెక్కటి దాఁకె దిక్కరి సహింపక సింహముఁ దాఁకు నట్టులం**
**దక్కజుఁ డుద్యతాయతగదాయుధుఁడై మణిమంతుఁ డల్కతోన్. 12**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మధ్యము= భీముడి యొక్క (కుంతీకుమారులలో - ధర్మజభీమఅర్జునులలో - భీముడు మధ్యముడు); మహా+ఉగ్ర, శరంబులకు= మిక్కిలి భయంకరమైన బాణాలకు; ఓర్వన్+ఓపక= సహించజాలక; ఆ+రక్కసులు+ఎల్లన్= ఆ రాక్షసులు అందరున్నూ; ఉక్కు+అఱి= బలం నశించి; ఆహవ+పరాక్+ముఖులు+ఐనన్= యుద్ధంలో పెడమొగాలు పెట్టినవారు కాగా; అందు= ఆ సైన్యంలో; అక్కజుఁడు= అధికుడు; మణిమంతుఁడు= మణిమంతుడు (అనే వీరుడు); తాన్= తాను; అల్కతోన్= కోపంతో; ఉద్యత+ఆయత, గదా+ఆయుధుఁడు+ఐ= గొప్పదైన గదాయుధాన్ని పైకెత్తి పట్టుకొనినవాడై; దిక్+కరి= దిగ్గజం; సింహమున్= సింహాన్ని; సహింపక= లెక్కచేయక; తాఁకునట్టులు= తలపడే టట్లుగా; కడంగి= పూని; భీమున్= భీమసేనుడిని; ఎక్కటి, తాఁకెన్= ఒంటరిగా ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముడియొక్క మిక్కిలి భయంకరమైన బాణాలకు ఓర్వజాలక ఆ రాక్షసులు అందరు శక్తి హీనులై యుద్ధంనుండి వెనుదిరిగి పారిపోయారు. అంత, మణిమంతుడు అనే సేనాని, పొడవైన గదాయుధాన్ని పైకెత్తి పట్టుకొని ఆగ్రహోదగ్రుడై దిగ్గజం సింహాన్ని ఎదిరించినట్లుగా, భీముడిపై విజృంభించాడు.

**విశేషం:** (1)అలం: ఉపమ. (2) ఎనిమిది దిక్కులందు భూమిని భరించేవి అష్టదిగ్గజాలు అని ప్రాచీన సంప్రదాయ సిద్ధమైన అభిప్రాయం. 1. ఐరావతం, 2. పుండరీకం, 3. వామనం, 4. కుముదం, 5. అంజనం, 6. పుష్పదంతం, 7. సార్వభౌమం, 8. సుప్రతీకం - ఇవి అష్టదిగ్గజాలు.

**క. ఆ రాక్షసు నతివీరుఁ గు । బేరసఖుం బవనసుతుఁ డభేద్యుఁడు నిజదు**
**ర్వారతరశాతసాయక । ధారావర్షమునఁ గప్పె దారుణభంగిన్. 13**

**ప్రతిపదార్థం:** అభేద్యుఁడు= భేదించరానివాడు- అంటే జయించటానికి సాధ్యం కానివాడు; పవన, సుతుఁడు= వాయుపుత్రుడైన భీముడు; అతివీరున్= గొప్ప శూరుడిని; కుబేర, సఖున్= కుబేరుడి యొక్క మిత్రుడిని; ఆ రాక్షసున్= ఆ రక్కసుడిని- అనగా మణిమంతుడిని; నిజ, దుర్వార, తర, శాత, సాయక, ధారా వర్షమునన్= వారించటానికి మిక్కిలి వీలులేని తనదైన వాడిఅయిన బాణాల పరంపర అనే వానచేత; దారుణభంగిన్= భయంకరమైన విధంగా; కప్పెన్= కప్పివేశాడు.

**తాత్పర్యం:** అజేయుడైన భీమసేనుడు మహావీరుడున్నూ, కుబేరుడి మిత్రుడున్నూ అయిన మణిమంతుడనే ఆ రాక్షసుడిపై మిగుల వాడియైన బాణాలపరంపరను ప్రయోగించి ఆ బాణాలవర్షంతో ఆతడిని భయంకరంగా కప్పివేశాడు.

**క. గద ద్రిప్పి భీముమీఁదను । వదలక మణిమంతుఁ డలిగి వైచిన నది వి**
**ద్యుదుదితప్రభానిభం బై । పదిదిశలు వెలుంగ భీముపైఁ బఱతెంచెన్. 14**

**ప్రతిపదార్థం:** వదలక= విడువక; మణిమంతుఁడు= మణిమంతుడు; అలిగి= కోపించి; గద, త్రిప్పి= గదను త్రిప్పి; భీము మీఁదను= భీమసేనుడిపై; వైచినన్= ప్రయోగించగా; అది= ఆ గద; విద్యుత్+ఉదిత, ప్రభా, నిభంబు+ఐ= మెరుపుతీగనుండి వెలువడిన కాంతితో సమానమైనదై; పది, దిశలు= పది దిక్కులు; వెలుంగన్= ప్రకాశించగా; భీముపైన్= భీమసేనుడిపై; పఱతెంచెన్= దాడిచేయటానికి వచ్చింది.

**తాత్పర్యం:** మణిమంతుడు కోపించి, తన చేతిగద త్రిప్పి, గురిపెట్టి భీమసేనుడిపైకి విసిరాడు. ఆ గద మెరపు తీగవంటి కాంతితో మిరుమిట్లు గొల్పుతూ పది దిక్కులను ప్రకాశింపజేస్తూ భీమసేనుడిపైకి వేగంగా వచ్చింది.

**విశేషం:** ఈ పద్యం మూడవ పాదంలో "వి-ద్యుదిన ప్రభానిభంబై"- అనే పాఠాంతరం కొన్ని ప్రతుల్లో ఉంది. కాని 'న' కు బదులు 'త' అనునదియే సరియైన పాఠం-

**క. దానిఁ దన నిశితబాణవి । తానంబున జర్జరీకృతముఁ జేసి మరు**
**త్సూనుఁడు గుహ్యక రాక్షస । సేనల కెల్లను భయంబు సేయుచు నలుకన్. 15**

**ప్రతిపదార్థం:** మరుత్+సూనుఁడు= వాయుపుత్రుడు - భీముడు; గుహ్యక, రాక్షస, సేనలకు+ఎల్లను= గుహ్యకులూ రాక్షసులూ అయిన సేనలలోని భటులందరికీ; భయంబు+చేయుచున్= భయం కలిగిస్తూ; అలుకన్= కోపంతో; దానిన్= అ గదను; తన,

నిశిత, బాణ, వితానంబునన్= తనయొక్క వాడియైన అమ్ముల సముదాయంచేత; జర్జరీ, కృతమున్+చేసెన్= ముక్కలు ముక్కలుగా కొట్టాడు;

**తాత్పర్యం:** వాయుపుత్రుడైన భీముడు ఆ గదను తన వాడిబాణాలచేత తుత్తునియలు చేశాడు. ఆతడి ఆగ్రహానికి గుహ్యకభటులు రాక్షసభటులు మిక్కిలి భయం పొందారు.

**క. ఘనుఁ డమ్మణిమంతుఁడు కాం । చనదండోద్భాసి యైన శక్తి మరున్నం**
**దనుమీఁద వైచె; నది యా । తని భుజపార్శ్వమ్ము దాఁకి ధారుణిఁ బడియెన్. 16**

**ప్రతిపదార్థం:** ఘనుఁడు= గొప్పవాడు; ఆ+మణిమంతుఁడు= ఆ మణిమంతుడు; కాంచన, దండ+ఉద్భాసి+ఐన= బంగారు పిడితో వెలుగొందునట్టిదైన; శక్తి= శక్తి అనే ఆయుధాన్ని (బాకు వంటిది); మరుత్+నందను మీఁద= వాయుపుత్రుడైన భీమసేనుడి మీద; వైచెన్= విసరాడు; అది= ఆ శక్తి; ఆతని, భుజ, పార్శ్వమ్ము = ఆ భీముడి భుజముయొక్క ప్రక్కను; తాఁకి= ఆని; ధారుణిన్= భూమిపై; పడియెన్= పడింది.

**తాత్పర్యం:** గొప్పవాడయిన ఆ మణిమంతుడు బంగారుపిడితో వెలుగొందే ఆయుధమైన శక్తిని భీముడిపై విసిరాడు. ఆ శక్తి భీముడి భుజపార్శ్వాన్ని తాకి నేలపై పడింది.

**చ. గదఁ గొని భీముఁ డంత లయకాలకృతాంతుఁడపోలె నేల గ్ర**
**క్కదల నదల్చి నిల్చిన, నకంపితుఁడై మణిమంతుఁ డాజి దు**
**ర్మదుఁడు త్రిశూల మెత్తికొని మధ్యముపై ననలస్ఫులింగముల్**
**సెదరఁగ వైచె; దానిఁ జెఱిచెన్ ఘనుఁ డగ్గదచేత భీముఁడున్. 17**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీమసేనుడు; అంతన్= అంతట; గదన్+కొని= గదను పట్టుకొని; లయ, కాల, కృతాంతుఁడు+అ+పోలె= ప్రళయ సమయంలోని యముడి వలె; నేల= భూమి; క్రక్కదలన్= మిక్కుటంగా కదలగా; అదల్చి, నిల్చినన్= ధట్టించి నిల్వగా; ఆజిన్= యుద్ధంలో; దుర్మదుఁడు= చెడు గర్వం కలవాడు; మణిమంతుఁడు= మణిమంతుడు; అకంపితుఁడు+ఐ= కంపం చెందని వాడై; త్రిశూలము= మూడు మొనలు గల బల్లెమును; ఎత్తికొని= చేత పుచ్చుకొని; అనల, స్ఫులింగముల్= నిప్పురవ్వలు; చెదరఁగ= ఇటునటు వ్యాపించగా; మధ్యముపైన్= భీముడిపై; వైచెన్= విసిరాడు; దానిన్= ఆ త్రిశూలాన్ని; ఘనుఁడు= గొప్పవాడు; భీముఁడున్= భీమసేనుడున్నూ; ఆ+గద చేతన్= ఆ గద చేత; చెఱిచెన్= వమ్ము చేశాడు.

**తాత్పర్యం:** భీముడు తనచేత గదాయుధాన్ని ధరించి, ప్రళయకాలయముడివలె నేల కంపించేటట్లుగా ధట్టించి నిల్చాడు. మణిమంతుడు ఏ మాత్రం జంకకుండా యుద్ధంలో చెడ్డగర్వం కలవాడై త్రిశూలం చేతబట్టి నిప్పురవ్వలు చెదరేటట్లుగా భీముడిపై విసరి వైచాడు. భీముడు తన గదచేత ఆ త్రిశూలాన్ని విఫలం కావించాడు.

**వ. ఇట్లు తనశక్తిశూలంబు లశక్తి నిహతంబైనఁ బరిత్యక్త మదుండై మణిమంతుం డంతరిక్షంబున కెగసిన.18**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తన, శక్తి, శూలంబులు= తన శక్తి, త్రిశూలం- అనే ఆయుధాలు; అ శక్తి= శక్తిలేక- లేదా - శక్తికానట్టి అనగా గదాయుధంచేత; నిహతంబు+ఐనన్= నాశనం చేయబడటంచేత; పరిత్యక్త, మదుండు+ఐ= పూర్తిగా త్యజించిన గర్వం కలవాడై; మణిమంతుండు= మణిమంతుడు; అంతరిక్షంబునకున్= ఆకసానికి; ఎగసినన్= ఎగురగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా, తాను ప్రయోగించిన గొప్ప ఆయుధాలైన 'శక్తి' 'త్రిశూలం' శక్తిచాలక, భీముడి ఆయుధాలచేత వమ్ము కావటంచేత, గర్వం ఉడిగి మణిమంతుడు ఆకసానికి ఎగిరాడు.

**క. 'పోవకు పోవకు' మనుచు మ । హావీరుఁడు గద యమర్చి యమ్మణిమంతున్**
**లా వఱఁగ వైచె నగ్గద । తో వాఁడును బడియెఁ బ్రతిహతుం డై నేలన్. 19**

**ప్రతిపదార్థం:** పోవకు= పోవద్దు; పోవకుము= వెళ్లిపోవద్దు; అనుచు= అని అంటూ; మహావీరుఁడు= (భీముడు) గొప్పవీరుడు; గద+అమర్చి= గదను పట్టుగా పట్టి; ఆ+మణిమంతున్= ఆ మణిమంతుడిని; లావు+అఱఁగన్= బలము క్రుంగేటట్లుగా; ఆ+గదతో= ఆ గదతో; వైచెన్= కొట్టాడు; వాఁడును= ఆ మణిమంతుడును; ప్రతిహతుండు+ఐ= ఆ విధంగా గదతో కొట్టబడినవాడై; నేలన్= పుడమిమీద; పడియెన్= పడ్డాడు.

**తాత్పర్యం:** భీముడు ఆకసానికి ఎగసి తప్పించుకొన జూచే ఆ మణిమంతుడితో. 'పోవకు, పారిపోకు, అని అంటూ తనగదను త్రిప్పి ఆతనిపై విసరాడు. ఆ గదాఘాతంతో మణిమంతుడు నేలపై కూలి మరణించాడు.

**క. పోర మణిమంతుఁ డిట్లు స । మీరణసుతుచేతఁ బ్రాప్తమృతుఁ డై పడినన్**
**వారక పఱచిరి భయమున । నా రాక్షసు లార్తనాదు లై తూర్పునకున్. 20**

**ప్రతిపదార్థం:** పోరన్= యుద్ధంలో; మణిమంతుఁడు= మణిమంతుడు; ఇట్లు= ఈ రీతిగా; సమీరణ, సుతుచేతన్= వాయుపుత్రుడైన భీముడిచేత; ప్రాప్త, మృతుఁడు+ఐ= ప్రాప్తించిన మృత్యువు కల వాడై అనగా మరణించి; పడినన్= పుడమిపై పడిపోగా; ఆ, రాక్షసులు= ఆ రక్కసులు; ఆర్త, నాదులు+ఐ= దుఃఖంతో దీనమైన స్వరాలను చేసేవారై అనగా ఏడుస్తూ; తూర్పునకున్= తూరుపు దిక్కుకు; భయమునన్= భీతితో; పఱచిరి= పారిపోయారు.

**తాత్పర్యం:** యుద్ధంలో మణిమంతుడు ఈ రీతిగా భీముడిచేత మరణించటం చూచి, మిగిలిన రక్కసులు రోదిస్తూ తూర్పుదెసగా భయంతో పారిపోయారు.

**వ. అట ధర్మరాజు, భీముండు పోయిన వలను ద్రౌపదిచే నెఱింగి యార్ష్టిషేణుం డను మునివరు నాశ్రమంబున ధౌమ్యద్రౌపదీప్రభృతులంబెట్టి, రోమశనకుల సహదేవయుతుండై తద్గిరిశృంగం బెక్కికుబేరసదన సమీపంబున నిజగదాఘాతపాతిత మణిమదాది రాక్షస దారుణ రణమధ్యంబున నున్న మధ్యమునొద్దకుం జనియె; నంత.21**

**ప్రతిపదార్థం:** అటన్= అక్కడ; ధర్మరాజు; భీముండు; పోయిన వలను= వెళ్లిన దిక్కును; ద్రౌపదిచేన్= ద్రౌపదివలన; ఎఱింగి= తెలిసికొని; ఆర్ష్టిషేణుండు+అను= ఆర్ష్టిషేణుడు అనునట్టి; మునివరు+ఆశ్రమంబునన్= ఋషిశ్రేష్ఠుడియొక్క ఆశ్రమంలో; ధౌమ్య, ద్రౌపదీ, ప్రభృతులన్+పెట్టి= ధౌమ్యుడు ద్రౌపది మున్నగు వారలను ఉంచి; రోమశ, నకుల, సహదేవ, యుతుండు+ఐ= రోమశుడితో నకులుడితో సహదేవుడితో కూడిన వాడై; తద్+గిరి, శృంగంబు+ఎక్కి- ఆ కొండకొనభాగాన్ని అధిరోహించి; కుబేర, సదన, సమీపంబునన్= కుబేరుడియొక్క ఇంటికి చేరువగా; నిజ, గదా+ఆఘాత, పాతిత, మణిమత్+ఆది, రాక్షస, దారుణ, రణ, మధ్యంబునన్= తన గదయొక్క దెబ్బలచేత క్రిందపడి పోయిన మణిమంతుడు మొదలైన రక్కసులతో కూడిన భయంకరమైన యుద్ధరంగ మధ్యభాగంలో; ఉన్న= నిలిచి ఉన్న; మధ్యము+ఒద్దకున్= భీముడి దగ్గరకు; చనియెన్= వెళ్ళాడు; అంతన్= ఆ తరువాత.

**తాత్పర్యం:** అక్కడ, ధర్మరాజు భీముడు వెళ్లిన దిక్కును ద్రౌపదివలన తెలిసికొన్నాడు. ఆర్ష్టిషేణుడు అనే ఋషివరేణ్యుడి ఆశ్రమంలో ద్రౌపదిని ధౌమ్యుడిని మున్నగువారిని ఉంచి, ధర్మరాజు రోమశ నకుల సహదేవులతోపాటు ఆ కొండ శిఖరాన్ని అధిరోహించి, కుబేరుడి భవనానికి చేరువగా, తన గద తాకిడికి చచ్చి పడి ఉన్న మణిమంతుడు మొదలైన రాక్షసులతోకూడిన ఆ భయంకర రణరంగంమధ్య నున్న భీముడిని చూచి, అతడి దగ్గరకు వెళ్ళాడు. ఆ తరువాత.

**క. హతశేషు లైన రాక్షసు। లతిరయమునఁ బాఱి చెప్పి రప్పుడ యలకా**
**పతికి సవిస్తరముగ నిజ। మతిఁ బవనజువిక్రమంబు మణిమద్వధయున్. 22**

**ప్రతిపదార్థం:** హత శేషులు+ఐన= చావగా మిగిలి ఉన్న వారైన; రాక్షసులు= రక్కసులు; అతి, రయమునన్= మిక్కిలి వేగంగా; పాఱి= పరుగెత్తి; అప్పుడు+అ= వెంటనే; అలకాపతికిన్= అలక అనే పట్టణానికి అధిపతి అయిన కుబేరుడికి; నిజ, మతిన్= తమ బుద్ధికి అనువైన రీతిగా; పవనజు, విక్రమంబు= వాయుపుత్రుడైన భీముడి పరాక్రమాన్ని గురించి; మణిమత్+వధయున్= మణిమంతుడియొక్క సంహారాన్నిగురించి; సవిస్తరముగన్= వివరాలతో సహా; చెప్పిరి= చెప్పారు.

**తాత్పర్యం:** చావగా మిగిలిన రక్కసులు మిక్కిలి వేగంగా పరుగెత్తి, ఆ అలకాపురానికి అధిపతి అయిన కుబేరుడికి తమ బుద్ధికి అందినంతమేరకు వాయుపుత్రుడైన భీముడి పరాక్రమాన్నిగురించి, మణిమంతుడి సంహారాన్నిగురించి వివరాలన్నిటితో విన్నవించారు.

**వ. దాని విని కుబేరుండు విస్మితుండై యాత్మగతంబున. 23**

**ప్రతిపదార్థం:** దాని, విని= (చావగా మిగిలినవారు) చెప్పినదానిని విని; కుబేరుడు; విస్మితుండు+ఐ= ఆశ్చర్యపడిన వాడై; ఆత్మగతంబునన్= తనలో.

**తాత్పర్యం:** భీముడి పరాక్రమప్రాభవాన్నిగురించి విని కుబేరుడు అచ్చెరువంది తనలో ఈ విధంగా తలపోశాడు.

**క. 'తలఁకక మును సౌగంధిక। ములు గొని, యిప్పుడును దర్పమున నిందుల పు**
**వ్వులు గొని మణిమత్ప్రభృతులఁ। బలువుర వధియించె నెట్టి బలియుఁడొ!' యనుచున్. 24**

**ప్రతిపదార్థం:** తలఁకక= జంకక; మును= ఇంతకుముందు; సౌగంధికములు+కొని= పసిడి నెత్తావితామరపువ్వులు సంగ్రహించి; ఇప్పుడును= మరల నేడు; దర్పమునన్= గర్వంతో; ఇందుల, పువ్వులు= ఇచటి పూలను; కొని= గ్రహించి; మణిమత్+ప్రభృతులన్= మణిమంతుడు మున్నగు వారిని; పలువురన్= పెక్కు మందిని; వధియించెన్= సంహరించాడు; ఎట్టి= ఎటువంటి; బలియుఁడొ= బలవంతుడో; అనుచున్= అని తలపోస్తూ.

**తాత్పర్యం:** 'ఇంతకుముందు ఈ భీముడు జంకుగొంకులు లేకుండా పసిడి తామరపువ్వులు కొనిపోయాడు. ఇప్పుడు ఈ పూలను సగర్వంగా సంగ్రహించి, మణిమంతుడు మొదలైన మహావీరులను సంహరించాడు. ఈతడు ఎంతటి బలవంతుడో కదా!' అని తలపోస్తూ.

**వ. సురగరుడగంధర్వయక్షరాక్షససహితుం డయి యక్షప్రభుం డరుగుదెంచి పాండవులం గని, వారిలోన గదాకృపాణ బాణబాణాసనధరుం డయి రణకాంక్ష నున్న మహావీరు మారుతాత్మజుం జూచి పరమప్రీతచిత్తుం డయిన.25**

**ప్రతిపదార్థం:** సుర, గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస, సహితుండు+అయి= దేవతలు, గరుడులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులతో కూడిన వాడయి; యక్షప్రభుండు= కుబేరుడు; అరుగుదెంచి= వచ్చి; పాండవులన్+కని= పాండవులను చూచి; వారిలోనన్= ఆ పాండవులలో; గదా, కృపాణ, బాణ, బాణాసన, ధరుండు+అయి= గద, కత్తి, అమ్ములు, విల్లు ధరించినవాడై; రణ, కాంక్షన్= యుద్ధంచేయాలని కోరిక గలవాడై; ఉన్న= ఉన్నటువంటి; మహావీరున్= గొప్పశూరుడిని; మారుత+ఆత్మజున్= వాయుపుత్రుడైన భీముడిని; చూచి= కాంచి; పరమ, ప్రీత, చిత్తుండు+అయిన= మిక్కిలి సంతోషంతో కూడిన మనస్సు కలవాడైన.

**తాత్పర్యం:** అంత, కుబేరుడు సపరివారంగా, దేవతలు, గరుడులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు తనను కొలువగా వచ్చి, పాండవులను చూచాడు. వారిలో భీముడు గద, కత్తి, అమ్ములు ధనువు ధరించి యుద్ధపు కోరిక గలవాడై నిలిచి ఉన్నాడు. ఆ మహావీరు డైన వాయుసుతుడిని చూచి కుబేరుడు మిక్కిలి సంతసించిన మనస్సు కలవాడైనాడు.

**ఆ. అక్కుబేరునకు మహామతుల్ పాండవుల్ । మ్రొక్కి; రంత ధర్మమూర్తి యైన**
**ధర్మతనయుఁ జూచి తద్దయు దయతోడ । నిట్టు లనియెఁ గిన్నరేశ్వరుండు. 26**

**ప్రతిపదార్థం:** ఆ+కుబేరునకున్= ఆ కుబేరుడికి; మహామతుల్= గొప్ప బుద్ధికలవారు; పాండవుల్= పాండురాజుసుతులు; మ్రొక్కిరి= నమస్కరించారు; అంతన్= అంతట; ధర్మమూర్తి+ఐన= రూపుగొనిన ధర్మం అయిన; ధర్మతనయున్+చూచి= ధర్మరాజును చూచి; కిన్నర+ఈశ్వరుండు= కిన్నరులకు ప్రభువు అయిన కుబేరుడు; తద్దయు= మిక్కుటమైన; దయతోడన్= కరుణతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ కుబేరుడికి బుద్ధిమంతులైన పాండవులు నమస్కరించారు. అంతట, ఆకారం ధరించిన ధర్మమైన ధర్మరాజును చూచి, కిన్నరులకు ప్రభువు అయిన కుబేరుడు మిగుల దయతో ఇట్లా పలికాడు.

**విశేషం:** పాండవులు విశిష్ట వ్యక్తులు. ఎదుటివారు అవినయాన్ని ప్రకటించినా కయ్యానికి కాలు దువ్వినా యుద్ధానికి సిద్ధం. పెద్దలు ఎదురైతే వినయంతో నమస్కరించటం వారి సంస్కారం. ధర్మజుడు పెద్దలకు ముందుగా నమస్కరిస్తాడు, అందరి నమస్కారాలను తిరిగి పొందుతాడు. తమ్ములు అతడిని అనుసరిస్తారు.

**వ. 'అయ్యా! నీయనుజుండు మత్ప్రియసఖుండైన మణిమంతు వధియించి నా కపకారంబు సేసె నని లజ్జింపవలవ; దది యగస్త్యశాపనిమిత్తంబున నయ్యె' నని భీమసేను డాయంబిలిచి 'నీ చేసినసాహసంబు నా కుపకారంబు గావున నిన్ను మెచ్చితి' ననిన నక్కుబేరునకుం గృతాంజలి యయి ధర్మతనయుం డి ట్లనియె.27**

**ప్రతిపదార్థం:** అయ్యా!= ఆర్యా!; నీ+అనుజుండు= నీ తమ్ముడు; మత్+ప్రియ, సఖుండు+ఐన= నాకు ఇష్టుడైన మిత్రు డైన; మణిమంతున్, వధియించి= మణిమంతుడిని సంహరించి; నాకు+అపకారంబు= నాకు కీడు; చేసెను+అని; లజ్జింప వలవదు= సిగ్గు చెంద వద్దు; అది= ఆ సంఘటన; అగస్త్య, శాప, నిమిత్తంబునన్+అయ్యెన్= అగస్త్యుడియొక్క శాపం కారణంగా జరిగింది; అని= అని చెప్పి; భీమసేనున్= భీముడిని; డాయన్+పిలిచి= దగ్గరకు (చేరేటట్లు) ఆహ్వానించి; నీ, చేసిన, సాహసంబు= నీవు ఒనరించిన తెగువ; నాకు+ఉపకారంబు= నాకు మేలు; కావున= కాబట్టి; నిన్ను, మెచ్చితిన్= నిన్ను గౌరవించాను; అనినన్= అని చెప్పగా; ఆ+కుబేరునకున్; కృత+అంజలి+అయి= చేయబడిన నమస్కారం కలవాడై; ధర్మతనయుండు= ధర్మసుతుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'అయ్యా! నీ తమ్ముడు నా ప్రియమిత్రుడిని సంహరించి నాకు కీడు చేశాడని సిగ్గు చెందవద్దు; అది అగస్త్యముని ఇచ్చిన శాపం కారణంగా జరిగింది' అని చెప్పి భీముడిని తనదగ్గరికి ఆహ్వానించి, 'నీవు చేసిన సాహసం వలన, నాకు జరిగింది ఉపకారమే కాబట్టి నేను నిన్ను మెచ్చాను' అని చెప్పాడు. ధర్మరాజు కుబేరుడికి నమస్కరించి ఈ విధంగా అన్నాడు.

**ఆ. 'ఇట్టి శాప మమ్మునీంద్రుండు దా నేల । యిచ్చె? దాని నాకు నెఱుఁగఁ జెప్పు'**
**మనిన విస్తరించి యమరాజసుతునకు । నక్కుబేరుఁ డిట్టు లనుచుఁ జెప్పె. 28**

**ప్రతిపదార్థం:** ఇట్టి శాపము= ఇటువంటిశాపం; ఆ+ముని+ఇంద్రుండు= ఆ ఋషిశ్రేష్ఠుడు; తాన్+ఏల+ఇచ్చె?= తాను ఎందుకు ఇచ్చాడు?; దానిన్= ఆ ఆకథను; నాకు+ఎఱుఁగన్+చెప్పుము= నాకు విశదంగా చెప్పుము; అనినన్= అని అడుగగా; విస్తరించి= వివరించి; యమరాజ సుతునకున్= యమధర్మరాజు కుమారుడైన ధర్మరాజుకు; ఆ+కుబేరుఁడు; ఇట్టులు+ అనుచున్+చెప్పెన్= ఈ క్రింది విధంగా వివరించి చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఈ విధమైన శాపాన్ని మునిశ్రేష్ఠ డైన అగస్త్యుడు ఎందుకు ఇచ్చాడు? ఆవిషయాన్ని నాకు సవిస్తరంగా చెప్పుము' అని అడుగగా యమధర్మరాజుసుతుడైన ధర్మరాజుకు కుబేరుడు ఈ విధంగా తెలిపాడు.

**వ. 'తొల్లికుశావతి యను పుణ్యనదీతీరంబున నమరులెల్ల సత్త్రయాగంబు సేయుచుండి నన్ను రావించిన నేనును బుష్పకవిమానారూఢుండ నై త్రిశతమహాపద్మసంఖ్యల యక్షరాక్షసబలంబుతో గగనగతి నందులకుఁ బోవునెడ నూర్ధ్వబాహుండై యమునా తీరంబున నుగ్రతపంబు సేయుచున్న యగస్త్యమహామునిమీఁద నా ప్రియసఖుం డైన మణిమంతుం డెఱుంగక నిష్ఠీవనంబు సేసిన నలిగి యమ్మునివరుండు నా కిట్లనియె. 29**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; కుశావతి+అను= కుశావతి అనే పేరుకల; పుణ్య, నదీ, తీరంబునన్= పుణ్యాన్ని ఇచ్చే ఏటిగట్టుదరిని; అమరులు+ఎల్లన్= వేల్పులు అందరు; సత్త్రయాగంబు+చేయుచుండి= సత్రయాగం అనే యజ్ఞాన్ని చేస్తూ; నన్ను, రావించినన్= నన్ను ఆహ్వానించి రప్పించగా; ఏనును= నేనున్నూ; పుష్పక, విమాన+ఆరూఢుండను+ఐ= పుష్పకమనే పేరుకల విమానాన్ని అధిరోహించినవాడి నై; త్రి, శత, మహాపద్మ, సంఖ్యల= మూడువందల మహాపద్మ సంఖ్యలు కల; యక్ష, రాక్షస, బలంబుతోన్= యక్షులు రాక్షసులు ఐన భటులతో; గగన గతిన్= ఆకాశమార్గాన; అందులకున్= ఆ సత్త్రయాగానికి; పోవు+ఎడన్= వెళ్ళేటప్పుడు; ఊర్ధ్వ+బాహుండు+ఐ= ఎత్తిన చేతులు కలవా డై; యమునా, తీరంబునన్= యమునానదిగట్టున; ఉగ్ర, తపంబు= కఠిన మైన తపస్సు; చేయుచున్న+అగస్త్యమహాముని మీఁదన్= చేస్తున్నటువంటి అగస్త్యమహర్షి పైన; నా ప్రియసఖుండు+ఐన= నాకు అనుగునెచ్చెలి అయిన; మణిమంతుండు= మణిమంతుడు; ఎఱుంగక= తెలియక; నిష్ఠీవనంబు+ చేసినన్= ఉమ్మివేయగా; అలిగి= ఆగ్రహించి; ఆ+ముని, వరుండు= ఆ ఋషిశ్రేష్ఠుడు; నాకు+ఇట్లు+అనియెన్= నాతో ఈ రీతిగా పలికాడు.

**తాత్పర్యం:** 'పూర్వకాలంలో కుశావతి అనే పుణ్యనదీతీరాన వేల్పులు అందరు సత్త్రయాగాన్ని చేస్తూ నన్ను ఆహ్వానించారు. నేను పుష్పకవిమానం అధిరోహించి మూడువందల మహాపద్మసంఖ్యలు గల యక్షరాక్షసపరివారంతో బయలుదేరాను. మేము గగనమార్గాన పయనిస్తూ ఉండగా భూమిపై యమునాతీరంలో ఆగస్త్యమహర్షి చేతులు పైకెత్తికొని, కఠోర మైన తపస్సును చేస్తూ ఉన్నాడు. అప్పుడు నా అనుగుచెలికాడు మణిమంతుడు తెలియక ఉమ్మివేశాడు. అది అగస్త్యమహర్షిపైన పడింది. అందుకు ఆగ్రహించి నాతో ఆ మహర్షి ఇట్లా పలికాడు.

**ఆ. 'నీవు సూచుచుండ నీ యిష్టుఁ డిమ్మణి । మంతుఁ డిపుడు దనదు మదముపేర్మి**
**నన్ను నరయ కుమిసె నామీఁద కష్టదు । ర్మదుఁడు పొలియు నొక్క మనుజుచేత. 30**

**ప్రతిపదార్థం:** నీవు+చూచుచు+ఉండన్= నీవు చూస్తూ ఉండగనే; నీ+ఇష్టుఁడు= నీ అనుగునెచ్చెలి; ఈ+మణిమంతుఁడు= ఈ మణిమంతుడు; ఇపుడు= ఇప్పుడు; తనదు, మదము, పేర్మిన్= తన గర్వంయొక్క అతిశయంచేత; నన్నున్= నన్ను; అరయక= చూడకుండగా; నామీఁద= నాపై; ఉమిసెన్= ఉమ్మివేశాడు; కష్ట, దుర్మదుఁడు= ఇతరులకు నొప్పి కలిగించే చెడ్డ గర్వంకలవాడు (మణిమంతుడు); ఒక్క, మనుజుచేతన్= ఒక మనుష్యుడిచేత; పొలియున్= చచ్చిపోతాడు.

**తాత్పర్యం:** నీ సమక్షంలోనే నీవు చూస్తూ ఉండగనే నీ అనుగుమిత్రుడు ఈ మణిమంతుడు మదాతిశయంతో నన్ను చూడకుండ నామీద ఉమ్మివేశాడు. ఇతరులకు నొప్పి గలిగించే చెడ్డమదంగల ఆ మణిమంతుడు ఒక మనుష్యుడిచేతిలో చచ్చుగాక!

**వ. మఱియు నీ యక్ష రాక్షస బలంబులు వానిచేత నిహతు లగుదు; రిద్దురితంబు దద్దర్శనంబునం బాయు ననియెం గావున నిట్టి శాపఫలంబునకు నీ యనుజుండు నిమిత్తం బయ్యె' నని చెప్పి, వెండియు ని ట్లనియె 'ధృతియును దాక్ష్యంబును దేశకాలంబులును బరాక్రమంబును మంత్రవిధానంబు నను పంచవిధాంగంబు నెఱింగిన క్షత్రియుండు ధర్మవిదుండై ధరణీచక్రంబు నిర్వక్రమంబుగా రక్షించి పుణ్యలోకంబు పడయుఁ; గర్మవిశేషంబు లెఱుంగక వృథారంభుం డై సాహసంబున వర్తిల్లువానికిం బాతకం బగుట నిశ్చయంబు.31**

**ప్రతిపదార్థం:** మఱియు= ఇంకను; నీ, యక్ష, రాక్షస, బలంబులు= నీయొక్క యక్షులు రక్కసులు అయిన భటులు; వానిచేతన్= ఆ మనుజుడిచేత; నిహతులు+అగుదురు= సంహరించబడతారు; ఈ+దురితంబు= ఈ పాపం; తద్+ దర్శనంబునన్= ఆతడిని చూడటం వలన; పాయును= పోతుంది; అనియెన్= అని చెప్పాడు; కావునన్= కాబట్టి; ఇట్టి, శాప, ఫలంబునకున్= ఈ విధమైన శాపంయొక్క ఫలితానికి; నీ+అనుజుండు= నీ తమ్ముడు; నిమిత్తంబు+అయ్యెన్= కారణం అయినాడు; అని= అంటూ; చెప్పి= పలికి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; ధృతియును= ధైర్యమున్నూ; దాక్ష్యంబును= సమర్థతయున్నూ; దేశ, కాలంబులు= స్థలమున్నూ సమయమున్నూ; పరాక్రమంబును= శౌర్యమున్నూ; మంత్ర విధానంబును= రహస్యాలోచన; అను= అనెడి; పంచవిధ+అంగంబున్= అయిదు తీరులు కల విధానాన్ని; ఎఱింగిన= తెలిసిన; క్షత్రియుండు= ప్రభువు; ధర్మ, విదుండు+ఐ= ధర్మాన్ని ఎరిగినవాడై; ధరణీ చక్రంబు= భూమండలాన్ని; నిర్వక్రంబుగాన్= వంకరలేకుండ ఋజుమార్గంలో; రక్షించి= కాపాడి; పుణ్య, లోకంబు+పడయున్= పుణ్యం ఆర్జించేవారు పోయేగతులు పొందుతాడు; కర్మ, విశేషంబులు+ఎఱుంగక= చేసేపనులందలి ఆంతర్యం తెలియక; వృథా+ ఆరంభుండు+ఐ= వ్యర్థ ప్రయత్నాలు కలవాడై; సాహసంబునన్= తెగువతో; వర్తిల్లువానికిన్= నడచునట్టి వాడికి; పాతకంబు+ అగుట= పాపం దాపురించటం; నిశ్చయంబు= తప్పదు.

**తాత్పర్యం:** ఇంకను, నీ యక్ష రాక్షసభటులు ఆ మనుజుడిచేత సంహరించబడతారు! ఆ పాపం ఆతడిని చూడటంచేత తీరిపోతుంది! అని చెప్పాడు. కాబట్టి నీ తమ్ముడు, మణిమంతుడిచావుకూ, నా యక్షరాక్షస బలాలు చనిపోవటానికీ నిమిత్తమాత్రుడే. అది ఆ శాపఫలం'- అని చెప్పి మరల ఇట్లా వచించాడు. '1.ధైర్యం 2. సామర్థ్యం 3. దేశకాలాలు 4. శౌర్యం 5. రహస్యమంత్రాంగం అనే పంచవిధమైన రాజనీతి అంగాలను తెలిసిన ప్రభువు భూచక్రాన్ని సవ్యంగా పరిపాలించి పుణ్యగతులను పొందుతాడు. చేసేకర్మలలోని ఆంతర్యాన్ని తెలిసికొనక తెగువతో వ్యర్థమైన ప్రయత్నాన్ని చేసేవాడికి పాపం సంక్రమించటం తప్పదు.

**విశేషం:** పరిపాలన=ధైర్యం+దక్షత+దేశకాలపరిగణనం+పరాక్రమం+రహస్యమంత్రాంగం- ఇది కుబేర రాజనీతి. కేవల పరాక్రమప్రదర్శన రాజనీతి కాదు - అనే హెచ్చరిక మరువరానిది.

**క. కావున నిరతమ్ము మరు । ద్దేవాత్మజు సాహసైకధృతి గాకుండన్**
**భూవల్లభ! శిక్షింపుము । నీ విమలజ్ఞానధర్మనిష్ఠితబుద్ధిన్. 32**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; భూవల్లభ!= భూమికి భర్త వయిన రాజా!; మరుత్+దేవ+ఆత్మజున్= వాయుదేవుడి పుత్రుడైన భీముడిని; నిరతమ్ము= ఎల్లప్పుడును; సాహస+ఏక ధృతి= తెగువను మాత్రమే ప్రదర్శించే ధైర్యశాలి; కాకుండన్= కాకుండగా; నీ, విమల, జ్ఞాన, ధర్మ, నిష్ఠిత, బుద్ధిన్= నీదైన నిర్మలమైన జ్ఞానంతో ధర్మంతో కూడిన ఆలోచనతో; శిక్షింపుము= ప్రబోధించుము.

**తాత్పర్యం:** భూమికి ప్రభువైన ఓ ధర్మరాజా! నీవు నిర్మలమైన జ్ఞానంతో ధర్మంతో కూడిన బుద్ధిమంతుడవు, పరాక్రమాన్ని ప్రదర్శించటానికి వీలుచాలులు ఎరుగ వలయును. కావున, నీ తమ్ముడైన వాయుదేవుడిపుత్రుడిని కేవలం తెగువనుమాత్రమే ప్రదర్శించే ధైర్యశాలి కాకుండగా ప్రబోధించుము.

**వ. నిన్నును నీ తమ్ములను ధర్మానిల శక్రాశ్వినులు రక్షించునట్ల యే నెప్పుడు రక్షింతు; నా నియోగంబున మత్పరిచారకులు మీకు నిత్యంబును నన్న పానాదులు దెచ్చియిచ్చుచుండ నార్‌ష్టిషే ణాశ్రమంబున నొక్కపక్షంబు వసియించునది. 33**

**ప్రతిపదార్థం:** నిన్నును= నిన్నును; నీ తమ్ములను= నీ సహోదరులను; ధర్మ+అనిల, శక్ర+ఆశ్వినులు= యముడు, వాయువు, ఇంద్రుడు, అశ్వినీదేవతలు; రక్షించునట్లు+అ= కాపాడేటట్లుగనే; ఏనును= నేనున్నూ; రక్షింతున్= కాపాడతాను; నా నియోగంబునన్= నా పనువువలన; మత్+పరిచారకులు= నా సేవకులు; మీకున్= మీకు; నిత్యంబును= ప్రతిదినమూ; అన్న, పాన+ఆదులు= అన్నం నీరు మున్నగునవి; తెచ్చి+ఇచ్చుచు+ఉండన్= తీసికొనివచ్చి మీకు ఇస్తూఉండగా; ఆర్‌ష్టిషేణ+ ఆశ్రమంబునన్= ఆర్‌ష్టిషేణ మునియొక్క ఆశ్రమంలో; ఒక్కపక్షంబు= పదునైదు రోజులు; వసియించునది= నివసించండి.

**తాత్పర్యం:** నిన్నును, నీ తమ్ములను యమధర్మరాజు, వాయుదేవుడు, ఇంద్రుడు ఆశ్వినులు కాపాడేటట్లుగానే నేను కూడా మిమ్మల్ని రక్షించగలను, నా ఆజ్ఞచొప్పున నా సేవకులు మీకు ప్రతిదినం అన్నం నీళ్ళు మొదలైనవి సమకూర్చగలరు. మీరు పదునైదుదినాలు ఆర్‌ష్టిషేణ మహర్షి ఆశ్రమంలో నివసించండి.

**సీ. 'మానితయశుఁడు భీమానుజుం డర్జునుం । డమరులచేత దివ్యాస్త్రతతులు**
**వడసి దేవేశ్వరుకడ నున్నవాఁ; డతం । డుపకారి యయ్యె దేవోత్తమునకు;**
**సప్తమేధాధ్వరప్రాప్తపుణ్యుఁడు ధర్మ । మతి భవత్పితృపితామహుఁడు ఘనుఁడు**
**శంతనుఁ డతనిచే సంతర్పితుం డయ్యెఁ । గుఱుకొని మీదైన కుశల మడిగె;**

**ఆ. నరుగుదెంచు నింత కయ్యర్జునుండు మీ । కభిమతార్థసిద్ధి యగును సిద్ధ'**
**మని యెఱుంగఁ జెప్పి యలకాధినాథుండు । యక్షగణముతోడ నరిగె నంత. 34**

**ప్రతిపదార్థం:** మానితయశుఁడు= మన్నించబడిన కీర్తికలవాడు; భీమ+అనుజుండు= భీముడికి తమ్ముడు- అనగా, అర్జునుడు; అమరులచేతన్= వేల్పులచేత; దివ్య+అస్త్ర, తతులు= దివ్యాలైన ఆయుధాల సముదాయాలు; పడసి= పొంది; దేవ+ఈశ్వరుకడన్=

దేవేంద్రుడి దగ్గర; ఉన్నవాఁడు= ఉన్నాడు; దేవ+ఉత్తమునకున్= దేవేంద్రుడికి; అతండు= అతడు; ఉపకారి+అయ్యెన్= మేలుచేకూర్చినవాడు అయినాడు; సప్త, మేధ+అధ్వర, ప్రాప్త, పుణ్యుఁడు= ఏడు అశ్వమేధ యాగాలు చేయటంచేత లభించిన పుణ్యం కలవాడు; ధర్మమతి= ధర్మంతో కూడిన బుద్ధికలవాడు; భవత్+పితృ పితామహుఁడు= మీ తండ్రికి తాతఐనవాడు; ఘనుఁడు= గొప్పవాడు; శంతనుఁడు= శంతనుడు అనే ప్రభువు; అతనిచేన్= ఆ అర్జునుడి చేత; సంతర్పితుండు+అయ్యెన్= సంతృప్తిచెందింపబడిన వాడైనాడు; గుఱుకొని= పూని; మీదైన= మీయొక్క; కుశలము= క్షేమాన్ని గురించి; అడిగెన్= అడిగాడు; ఆ+అర్జునుండు= ఆ అర్జునుడు; ఇంతకు= ఇప్పుడు; అరుగుదెంచున్= వస్తాడు; మీకు+అభిమత+అర్థసిద్ధి+అగును= మీరు కాంక్షించే కోరిక మీకు ఈడేరుతుంది; సిద్ధము+అని= జరిగినట్లే అని; అలకా+అధినాథుండు= అలకాపట్టణానికి ప్రభువు అయిన కుబేరుడు; ఎఱుంగన్+చెప్పి= తెలిసేటట్లు చెప్పి; యక్ష, గణముతోడన్= యక్షుల సముదాయంతో; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= అంతట.

**తాత్పర్యం:** గౌరవించబడిన కీర్తిగల అర్జునుడు వేల్పులచేత దివ్యాస్త్రాలను పొందాడు. ఇప్పు డతడు దేవేంద్రుడి కడ ఉన్నాడు; అతడు దేవేంద్రుడికి మేలు చేసినవా డైనాడు; అంతేగాక, మీ తండ్రిగారికి తాతగారైనట్టి వాడున్నూ, ఏడు అశ్వమేధయాగాలు చేసి పుణ్యాన్ని ఆర్జించినవాడున్నూ అయిన శంతనునిచేత మన్నించబడినాడు. ఆయన మీ అందరి కుశలమడిగినాడు. మీ సోదరుడైన ఆ అర్జునుడు ఇప్పుడు మీదగ్గరకు రావటానికి సిద్ధంగా ఉన్నాడు. మీ కోరికలు ఈడేరగలవు. అన్నియు మీకొరకు సంసిద్ధం'- అని పాండవులను అభినందించి కుబేరుడు యక్షగణాలతోపాటు నిష్క్రమించాడు; అంతట.

**వ. ఇట్లు ధర్మరాజు కుబేరునాదేశంబున నార్ష్టిషేణాశ్రమంబున నున్న నాతనికి నొక్కనాఁడు ధౌమ్యుండు నిజాంగుళి నుత్తరదిగ్భాగంబు సూపుచు ని ట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; ధర్మరాజు, కుబేరు+ఆదేశంబునన్= కుబేరుడి యొక్క ఆనతిచొప్పున; ఆర్ష్టిషేణ+ఆశ్రమంబునన్+ఉన్నన్= ఆర్ష్టిషేణుడియొక్క ఆశ్రమంలో ఉండగా; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఒక్క, నాఁడు= ఒక రోజున; ధౌమ్యుండు= ధౌమ్యమహర్షి; నిజ+అంగుళిన్= తన చూపుడు వ్రేలితో; ఉత్తరదిక్+భాగంబు= ఉత్తర దిక్కువైపు; చూపుచున్= చూపిస్తూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు కుబేరుడి ఆనతిచొప్పున ఆర్ష్టిషేణుడి ఆశ్రమంలో నివసిస్తూ ఉన్నాడు. అంత, ఒకనాడు ధౌమ్యమహర్షి తన చూపుడువ్రేలితో అతడికి ఉత్తరదిక్కును చూపిస్తూ ఇట్లా అన్నాడు.

**క. 'అది మందరనగ మక్కడ । నది మేరుగిరీంద్ర మమ్మహాశైలము నె**
**న్మిదిదిక్కుల వసియింతురు । త్రిదశేశ్వరు దొట్టి యష్టదిక్పాలవరుల్. 36**

**ప్రతిపదార్థం:** అది= అదిగో అది; అక్కడన్= అచట ఉన్నది; మందర, నగము= మందరం అనే పేరుకల కొండ; అది= అది; మేరుగిరి+ఇంద్రము= మేరువు అనే పేరుకల గొప్పకొండ; ఆ+మహాశైలము= ఆ గొప్ప కొండయొక్క; ఎన్మిది దిక్కులన్= ఎనిమిది దిక్కులలోను; త్రిదశ+ఈశ్వరున్+తొట్టి= దేవేంద్రుడు మొదలుగా కల; అష్ట+దిక్+పాలవరుల్= ఎనిమిది దిక్కులను పాలించే అధిపతులు; ఎన్మిది దిక్కులన్= ఎనిమిది దిక్కులలోను; వసియింతురు= నివసిస్తూ ఉంటారు.

**తాత్పర్యం:** 'అదిగో! చూడుము. అది మందరపర్వతం, అల్లదిగో! అదియే మేరుపర్వతం, ఈ గొప్పకొండకు ఎనిమిదివైపుల దేవేంద్రుడు మున్నగు అష్టదిక్పాలకులు వసిస్తారు.

**చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కరతారకాగణం**
**బనవరతంబుఁ ద్రిమ్మరు మహామునిసప్తకమండలంబుతో**
**ననఘ! తదీయతుంగశిఖరాగ్రమునందుఁ బయోరుహాసన**
**త్రినయన విష్ణు లుండుదురు దేవగణంబులు గొల్చుచుండఁగన్.' 37**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ ధర్మరాజా!; శశి, భాస్కర, తారకా, గణంబు= చంద్రుడు, సూర్యుడు నక్షత్రసముదాయాలు; మహాముని, సప్తక, మండలమ్ముతోన్= గొప్పఋషులు ఏడుగురు కల వలయంతో; కనకగిరిన్= పసిడికొండను- మేరుపర్వతాన్ని; అనవరతంబున్= ఎల్లప్పుడును; ప్రదక్షిణముగాన్= ఎడమనుండి కుడివైపునకు; త్రిమ్మరు= తిరుగుతూ ఉంటారు; తదీయ, తుంగ, శిఖర+అగ్రమునందున్= ఆ మేరువుయొక్క ఎత్తయిన శిఖరంయొక్క పైభాగంలో; పయోరుహాసన, త్రినయన, విష్ణులు= పద్మం ఆసనంగా కల బ్రహ్మదేవుడున్నూ, మూడుకన్నులు కల శివుడున్నూ, విష్ణువున్నూ; దేవగణంబులు= వేల్పుల గుంపులు; కొల్చుచుండఁగన్= ఆరాధిస్తూ ఉండగా; ఉండుదురు= ఉంటారు.

**తాత్పర్యం:** ఓ పాపరహితుడా! మేరుపర్వతంచుట్టూ ఎల్లప్పుడు చంద్రుడు, సూర్యుడు, నక్షత్రసముదాయం, సప్తర్షి మండలంతో పాటు ప్రదక్షిణాలు చేస్తూ ఉంటారు. ఆ పసిడికొండకొనపై పద్మం ఆసనంగా కలబ్రహ్మదేవుడు, మూడుకన్నులు కల పరమశివుడు, విష్ణుదేవుడు, వేల్పులసమూహాలు సేవిస్తూ ఉండగా కొలువుదీరి ఉంటారు.'

**విశేషం:** మేరుపర్వతం ఉత్తరాన కలదని ప్రాచీనవేదవాఙ్మయనిర్దేశం. ఉత్తరధ్రువానికి సూర్యచంద్రులు, నక్షత్రసముదాయం సప్తర్షిమండలం ప్రదక్షిణం చేస్తున్నట్లు తిరగటం నవీనభూగోళవేత్తలు నిర్దేశించినట్టిదేకదా! ప్రాచీనుల ఖగోళశాస్త్రపరిజ్ఞానానికి ఈ వర్ణన ఒక ఉదాహరణం.

**వ. అని చెప్పుచుండఁ బాండవు లం దొక్కమాసంబు నివాసంబు సేసి; రంత. 38**

**ప్రతిపదార్థం:** అని= అంటూ (ఆవిధంగా); చెప్పుచుండన్= వర్ణిస్తూ ఉండగా; పాండవులు= పాండురాజుకుమారులు; అందున్= ఆ ఆశ్రమంలో; ఒక్కమాసంబు= ఒకనెల; నివాసంబు+చేసిరి= నివసించారు; అంత= ఆమీద.

**తాత్పర్యం:** అని చెప్పుతూ ఉండగా పాండవులు ఆ ఆశ్రమంలో ఒకనెల నివసించారు.

**ఉ. అంబర మాత్మదీప్తినివహంబున నొప్పఁగ మాతలిప్రయు**
**క్తం బగు దివ్యకాంచనరథంబు లసచ్చపలాంశుపుంజ ర**
**మ్యం బగు దాని నెక్కి ధృతిమందరుఁ డింద్రసుతుండు నాకలో**
**కంబుననుండి వచ్చెఁ బ్రవికాశితతేజుఁ డినప్రకాశుఁ డై. 39**

**ప్రతిపదార్థం:** ధృతి, మందరుఁడు= ధైర్యంలో మందరపర్వతం వంటివాడు; ప్రవికాశిత తేజుఁడు= మిరుమిట్లుకొల్పెడి వర్చస్సు కలవాడు; ఇంద్ర, సుతుండు= ఇంద్రుడి కుమారు డైన అర్జునుడు; అంబరము= ఆకాశం; ఆత్మదీప్తినివహంబునన్= తన దైన వెలుగుల సముదాయం చేత; ఒప్పఁగన్= శోభిల్లగా; లసత్+చపలా+అంశు, పుంజ, రమ్యంబు+అగుదానిన్= దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న మెఱుపుల యొక్క కాంతుల సమూహాలను పోలి సొగసై ఉన్న దానిని; మాతలి, ప్రయుక్తంబు+అగు= మాతలి (దేవేంద్రుడి రథసారథి) చేత నడుపబడిన; దివ్య, కాంచన, రథంబు= దేవలోకానికి సంబంధించిన బంగారుతేరు; ఎక్కి= అధిరోహించి; ఇనప్రకాశుఁడు+ఐ= సూర్యుడివంటి ప్రకాశం కలవాడై; నాక లోకంబున నుండి= స్వర్గలోకంనుండి; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ధైర్యంలో మందరపర్వతంతో పోల్చతగినవాడు, లెస్సగా ప్రకాశించే తేజస్సు కలవాడు, దేవేంద్రుడి కుమారుడు అయిన అర్జునుడు- మిరుమిట్లుగొలిపే మెరుపులవంటి కాంతి సమూహాలతో సుందరమై, మాతలి నడుపుతున్న దివ్యకాంచన రథాన్ని అధిరోహించి, సూర్యుడివలె వెలుగుతూ స్వర్గలోకంనుండి వచ్చాడు.

**వ. ఇట్లు చనుదెంచి ధనంజయుండు రోమశధౌమ్యధర్మజభీమసేనులపాదంబులకుం బరమభక్తి మ్రొక్కి వినయావనతులయిన కవల నెత్తి కౌఁగిలించుకొని, ద్రౌపదీహృదయనయనాంబుజంబుల కానందంబు సేయుచున్నంత, నందఱు సంతసిల్లి మాతలి నతిప్రీతిఁ బూజించిన, నతండును దివ్యరథంబు గొని దివంబున కరిగె; నట్టి యవసరంబున. 40**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఈ విధంగా; చనుదెంచి= వచ్చి; ధనంజయుండు= అర్జునుడు; రోమశ, ధౌమ్య, ధర్మజ, భీమసేనుల, పాదంబులకున్= రోమశుడి, ధౌమ్యుడి, ధర్మజుని, భీమసేనుడి పాదాలకు; పరమ, భక్తిన్= మిక్కిలి భక్తితో; మ్రొక్కి= నమస్కరించి; వినయ+అవనతులు+అయిన= వినయంతో వంగి నమస్కరించినవారలైన; కవలన్= (నకులసహదేవులను) జంటను; ఎత్తి= పైకి లేవనెత్తి; కౌఁగిలించుకొని= ఆలింగనం సల్పి; ద్రౌపదీ, హృదయ, నయన+అంబుజంబులకున్= ద్రౌపదియొక్క మనస్సు, కన్నులు అనే పద్మాలకు; ఆనందంబు+చేయుచున్నంతన్= గొప్ప సంతోషాన్ని కలిగిస్తూ ఉండగా; అందఱు= పాండవ బృందంలోని వారందరును; సంతసిల్లి= సంతోషించి; మాతలిన్= దేవేంద్రుడి రథసారథిని; అతి ప్రీతిన్= మిక్కలి ప్రేమతో; పూజించినన్= అర్చించగా; అతండును= ఆ మాతలియు; దివ్యరథంబు+కొని= దేవతారథాన్ని తీసికొని; దివంబునకున్= స్వర్గానికి; అరిగెన్= వెళ్ళాడు; అట్టి+అవసరంబునన్= అటువంటి సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు స్వర్గలోకంనుండి భూలోకానికి వచ్చాడు. అతడు రోమశుడికి, ధౌమ్యుడికి, ధర్మజుడికి, భీమసేనుడికి, పాదనమస్కారాలు చేసి, తనకు వినయంతో వంగి పాదనమస్కారం చేసిన నకులసహదేవులను ఎత్తి కౌగిలించుకొన్నాడు. ఆ దృశ్యం ద్రౌపదిహృదయానికీ, కన్నులకూ మిక్కిలి ఆనందాన్ని కలిగించింది. అందరూ సంతసిల్లారు. పాండవ బృందంలోని వారందరూ మాతలిని సత్కరించి మన్నించారు. మాతలి దివ్యరథాన్ని తీసికొని స్వర్గలోకానికి తిరిగి వెళ్ళాడు. ఆ సమయంలో.

**క. దిననాథుఁ డస్తగిరిఁ బొం। దినఁ జీఁకటిఁ బాచి యాత్మతేజమున దిగం**
**గనల విభూషించుచు రజ। నినాథకలహంస గగననిమ్నగ నొప్పెన్. 41**

**ప్రతిపదార్థం:** దిన నాథుఁడు= సూర్యుడు; అస్తగిరిన్= పడమటికొండను, సహ్యాద్రిని; పొందినన్= చేరగా; చీఁకటిన్= అంధకారాన్ని; పాచి= త్రోసి; ఆత్మ, తేజమునన్= తనదైన వెలుగుచేత (వెన్నెలచేత); దిక్+అంగనల= దిక్కులు అనే వనితలను; విభూషించుచున్= అలంకరిస్తూ; రజనినాథ, కలహంస= చంద్రుడు అనే రాజహంస; గగన నిమ్నగన్= ఆకాశంఅనేనదిలో; ఒప్పెన్= శోభిల్లాడు.

**తాత్పర్యం:** సూర్యుడు అస్తమించాడు. అప్పుడు చీకటిని తొలిగిస్తూ, తన వెన్నెలచేత దిక్కులు అనే వనితలను అలంకరిస్తూ, చంద్రుడు అనెడి కలహంస ఆకాశమనే నదిలో శోభిల్లాడు.

**విశేషం:** అలం: రూపకం.

**ఉ. ఆరాత్రి యర్జునుం డనుజులనందఱ నొద్దఁబెట్టుకొని యిష్టపూర్వకథలు సెప్పుచు శయనించె; నంతఁబ్రభాతం బగుడు సిద్ధమునిగణంబులయు రోమశధౌమ్యులయుఁ దమ్ములయుఁదోడ ధర్మతనయుండు సుఖోపవిష్టుం డై యున్నంత. 42**

**ప్రతిపదార్థం:** ఆ రాత్రి= ఆ రేయి; అర్జునుండు; అనుజులన్+అందఱన్= సోదరులను అందరిని; ఒద్దన్+పెట్టుకొని= దగ్గరగా ఉంచుకొని; ఇష్ట+పూర్వ+కథలు= తమకు ప్రీతికరమైన, లోగడ జరిగిన గాథలను; చెప్పుచు; శయనించెన్= పరుండినాడు; అంతన్= అటుపిమ్మట; ప్రభాతంబు+అగుడున్= తెల్లవారటంచేత; సిద్ధ, ముని, గణంబులయు= తపస్సు పూర్తి అయి పరిణతి చెందిన ఋషుల సమూహాలతో; రోమశ ధౌమ్యులయున్= రోమశుడితో ధౌమ్యుడితో; తమ్ములయున్+తోడన్= సోదరులతోడ; ధర్మ తనయుండు= ధర్మరాజు; సుఖ+ఉపవిష్టుండు+ఐ= సుఖంగా కూర్చొని; ఉన్నంతన్= ఉండగా.

**తాత్పర్యం:** ఆ రేయి అర్జునుడు సోదరు లందరితో కలిసి శయనించి, వారికి నచ్చిన పూర్వకథలు చెప్పి వారిని అలరించాడు. అంతట తెల్లవారిన పిమ్మట ధర్మరాజు, తపస్సులో పరిపూర్ణత చెందిన మహర్షులతో, ధౌమ్యుడితో రోమశుడితో, సహోదరులతో కూడి సుఖంగా కూర్చొని ఉండగా.

### ఇంద్రుఁడు పాండవులయొద్దకు వచ్చుట (సం. 3-162-5)

**సీ. బోరన సురదుందుభుల నినాదంబులు । గిన్నరగంధర్వగీతరవము
లెసఁగ సహస్రసూర్యేందుమండలములు । వోలె విమానముల్ పొలిచి వెలుఁగఁ
బాండవాలోకనపరుఁడై సహస్రాక్షుఁ । డమరగణంబుతో నమ్మహాద్రి
కేతెంచెఁ; బ్రీతి నయ్యింద్రున కందఱు । నంత నభ్యుద్గతు లైరి; పాండ**

**ఆ. వాగ్రజుండు దాను ననుజులు నింద్రుపా । దాంబుజముల కెరఁగి యధికభక్తి
శాస్త్రదృష్టవివిధసత్కారవిధులఁ బూ । జించె నమరఖచరసిద్ధపూజ్యు. 43**

**ప్రతిపదార్థం:** బోరనన్= పెద్దగా; సుర, దుందుభుల, నినాదంబులు= వేల్పుల నగారాల మ్రోతలు; కిన్నర, గంధర్వ, గీత, రవములు = కిన్నరుల గంధర్వుల పాటల సవ్వడులు; ఎసఁగన్= విలసిల్లగా; సహస్ర, సూర్య+ఇందు, మండలములు+పోలెన్= వేయి సూర్యుల చంద్రుల బింబాల వలె; విమానముల్= ఆకసాన సంచరించే తేరులు; పొలిచి= శోభిల్లి; వెలుఁగన్= ప్రకాశించగా; పాండవ+ఆలోకన పరుఁడు+ఐ= పాండురాజు కొడుకులను చూడవలె ననే కోరిక కలవాడైన; సహస్ర+అక్షుఁడు= వేయికన్నులదేవర అయిన ఇంద్రుడు; అమర, గణంబుతోన్= వేల్పులసమూహాలతో; ఆ+మహా+అద్రికిన్= ఆ గొప్పకొండకు; ఏతెంచెన్= వచ్చాడు; ప్రీతిన్= ప్రేమతో; అందఱున్= ఆ పాండవబృందంలోని వారు అందరున్నూ; ఆ+ఇంద్రునకున్= ఆ దేవేంద్రుడికి; అంతన్= అంతట; అభ్యుద్గతులు+ఐరి= లేచి ఎదురేగి, నమస్కరించారు; పాండవ+అగ్రజుండు= పాండవులలో మొదట పుట్టినవాడైన-అనగా పెద్దవాడైన ధర్మరాజు; తానున్= తాను; అనుజులున్= తమ్ములు; ఇంద్రు పాద+అంబుజములకున్= ఇంద్రుడి పాదాలనెడి పద్మాలకు; ఎరఁగి= నమస్కరించి; అధిక, భక్తిన్= మిక్కిలి భక్తితో; శాస్త్ర, దృష్టి, వివిధ, సత్కార, విధులన్= శాస్త్రాలలో కన్పించే ఆయా ఆతిథ్యమర్యాదల ననుసరించి; అమర, ఖచర, సిద్ధ, పూజ్యున్= వేల్పులచేత, ఆకాశగమనం కల వారిచేత, సిద్ధులచేత ఆరాధించబడేవాడిని; పూజించెన్= యథావిధిగా అర్చించాడు.

**తాత్పర్యం:** గొప్పగా దేవదుందుభులు మ్రోగాయి. కిన్నరుల పాటలు, గంధర్వుల గానాలు విన్పించాయి. ఆకసాన విమానాలు మిరుమిట్లు గొల్పాయి. దేవేంద్రుడు పాండవులను చూచే కోరికతో అచటికి వచ్చాడు. అంతట పాండవులు

అందరు మిక్కిలి ప్రేమతో దేవేంద్రుడికి ఎదురేగి శాస్త్రాలలో విధించబడిన అతిథిసత్కారాలు సలిపి, అతడి పాదపద్మాలకు నమస్కరించారు.

**వ. ఇంద్రుండును వారల నందఱ నతిమధురవచనంబుల నభినందించుచుఁ దదంతికస్థితు నధికతపోయుక్తు ధనంజయుం జూపి ధర్మజున కి ట్లనియె. 44**

**ప్రతిపదార్థం:** ఇంద్రుండును= దేవేంద్రుడు కూడ; వారలన్+అందఱన్= ఆ పాండవ బృందములోని వారిని అందరిని; అతి, మధుర, వచనంబులన్= మిక్కిలి తియ్యని మాటలచేత; అభినందించుచున్= సంతోషింప జేసే మన్నన తెలుపుతూ; తద్+అంతికస్థితున్= వారి ప్రక్కన కూర్చొనిఉన్న; అధిక, తపస్+యుక్తున్= గొప్పతపస్సుచేత కూడినవాడిని; ధనంజయున్+చూపి= అర్జునుడిని చూపించి; ధర్మజునకున్= ధర్మపుత్రుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడుకూడ పాండవబృందంలోనివారిని అందరినీ మిక్కిలి తియ్యనైన పలుకులతో మన్నించి సంతోషింపజేశాడు. పిమ్మట, వారలకు దగ్గరగా కూర్చొని ఉన్న అర్జునుడిని, గొప్ప తపస్సుతో కూడినవాడిని చూపించి, ధర్మరాజుతో ఈ విధంగా చెప్పాడు.

**క. 'ఘనుఁ డీపార్థుఁడు నా వల । నన దివ్యాస్త్రప్రయోగ నయనిపుణుం డై**
**దనుజుల నివాతకవచుల । ననిఁ జంపి సురావలికిఁ బ్రియం బొనరించెన్. 45**

**ప్రతిపదార్థం:** ఘనుఁడు= గొప్పవాడు; ఈ పార్థుఁడు= కుంతీకుమారు డైన ఈ అర్జునుఁడు; నావలననన్= నామూలాననే; దివ్య+అస్త్ర, ప్రయోగ, నయ, నిపుణుండు+ఐ= దివ్యాలైన ఆయుధాలను వాడటంలో ప్రశస్తమైన నేర్పును సాధించినవాడై; దనుజుల= రక్కసుల; నివాతకవచులన్= నివాతకవచులు అనెడి వారిని; అనిన్= యుద్ధంలో; చంపి= సంహరించి; సుర+ఆవలికిన్= వేల్పులసముదాయానికి; ప్రియంబు= ప్రీతిని; ఒనరించెన్= కలిగించాడు.

**తాత్పర్యం:** కుంతీకుమారుడైన ఈ అర్జునుడు గొప్పవాడు. నావలననే ఇతడు దివ్యాలైన ఆయుధాలు సంపాదించి, వాటిని ప్రయోగించటంలో తగు సామర్థ్యాన్ని ఆర్జించినవాడై నివాతకవచులు అనే రక్కసులను సంహరించి వేల్పుల సమూహానికి మిక్కిలి ప్రీతిని కలిగించాడు.

**క. ఈతఁడు పరాక్రమమున న । రాతుల వధియించి యిద్ధరారాజ్యము వి**
**ఖ్యాతముగ నిచ్చు నీకు మ । హాతేజుఁ డజేయవీర్యుఁ డని నెవ్వరికిన్. 46**

**ప్రతిపదార్థం:** ఈతఁడు= ఈ అర్జునుడు; పరాక్రమమునన్= శౌర్యంతో; ఆరాతుల= శత్రువులను; వధియించి= చంపి; ఈ+ధరా, రాజ్యము= ఈ భూరాజ్యాన్ని; నీకున్= నీకు; విఖ్యాతముగన్= మంచిపేరు ప్రతిష్ఠలతో; ఇచ్చున్= ఇస్తాడు; (ఇతడు) మహాతేజుఁడు= గొప్ప తేజస్సుకలవాడు; ఎవ్వరికిన్= ఎవరికైనను; అనిన్= యుద్ధంలో; అజేయ, వీర్యుఁడు= జయించ నలవికాని శౌర్యం కలవాడు,

**తాత్పర్యం:** ఈ అర్జునుడు శౌర్యంలో శత్రువులను సంహరించి, ఈ భూరాజ్యాన్ని నీకు ఇవ్వగలడు. ఇతడు మహాతేజస్వి. ఈతడిని యుద్ధంలో గెలవడం ఎవ్వరికీ శక్యం కాదు.

**క. అని చెప్పి యనిమిషప్రభుఁ । డనిమిషనివహంబుతోడ నమరావతికిం**
**జనియె నిజాలోకనమున । కనఘులు పాండవులు హర్షమందుచు నుండన్. 47**

**ప్రతిపదార్థం:** అని= అనుచు; చెప్పి= పలికి; అనిమిష, ప్రభుఁడు= రెప్పలు వాల్చని వేల్పులకు దొర అయిన దేవేంద్రుడు; అనిమిష, నివహంబుతోడన్= వేల్పుల సమూహంతో; అమరావతికిన్= ముఖ్యపట్టణ మైన అమరావతికి; నిజ+ఆలోకనమునకున్= తన చూపులచేత, వారిని చూడటంవలన; అనఘులు= పాపరహితులు; పాండవులు= పాండురాజు కొడుకులు; హర్షము+ అందుచున్+ఉండన్= సంతసిల్లుతూ ఉండగా; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అని వచించి, దేవేంద్రుడు దేవతాపరివారంతోపాటుగా వేల్పుల రాజధాని అయిన అమరావతికి వెళ్ళాడు. దేవేంద్రుడు తమను ఆదరంతో చూచినందుకు పుణ్యాత్ములైన పాండవులు మిక్కిలి సంతోషం పొందారు.

**మధ్యాక్కర.**

**ఘనముగ ధనదేంద్రపాండుసుతసమాగమ మొక్కయేఁడు**
**దనరంగ బ్రహ్మచర్యవ్రతస్థు లై తగిలి నిత్యంబు**
**వినిన పుణ్యాత్ములును జదివినవారు విభుత నూఱేండ్లు**
**నొనర జీవింతు రత్యంత మగు కాంతియుక్తు లై ధరణి. 48**

**ప్రతిపదార్థం:** ఘనముగన్= గొప్పగా; ధనద+ఇంద్ర, పాండుసుత, సమాగమము= కుబేరుడి యొక్కయు ఇంద్రుడి యొక్కయు పాండవుల యొక్కయు కలయిక (గూర్చిన ఈ కథ); ఒక్క+ఏఁడు= ఒక సంవత్సరం; తనరంగన్= ఒప్పుగ పూనికతో; బ్రహ్మచర్య, వ్రతస్థులు+ఐ= బ్రహ్మచర్య దీక్షను పాటించిన వారై అనగా స్త్రీ సంగమాన్ని పరిహరించినవారై; తగిలి= నిష్ఠతో; నిత్యంబు= ప్రతిదినమూ; వినిన= విన్న; పుణ్య+ఆత్ములును= పుణ్యం కలిగినవారున్నూ; చదివినవారు= పఠించిన వారున్నూ; ధరణి= భూమిపై; అత్యంతమగు, కాంతి, యుక్తులు+ఐ= గొప్ప వెలుగుతో కూడినవారై; విభుతన్= గొప్పతనంతో; నూఱు+ఏండ్లన్= వందసంవత్సరాలు; ఒనరన్= ఒప్పేటట్లుగా; జీవింతురు= బ్రదుకుతారు.

**తాత్పర్యం:** కుబేరుడూ, ఇంద్రుడూ, పాండవులూ కలిసిన ఈ కథను బ్రహ్మచర్యవ్రతాన్ని పాటిస్తూ ఒక సంవత్సరకాలం పూనికతో నిత్యమూ ఎవరు చదువుతారో, వింటారో అట్టివారు మిక్కిలి తేజస్సు కలవారై, మహావైభవంతో భూమిపై నూరేండ్లు బ్రదుకగలరు.

**విశేషం:** మహాభారతం తొలిరూపం జయం. పిదప పంచభారతాలు. చిట్టచివరకు నైమిశారణ్యంలో సూతుడు శౌనకాది మహర్షులకు పన్నెండేండ్ల సత్రయాగంలో వినిపించింది 'మహాభారతం'. ఆ పంద్రెండేండ్ల సత్రయాగంలో సూతుడు మహాభారతాన్నే గాక, మఱికొన్నింటిని- ఆయా పురాణ గాథలు మొదలైన వాటిని- విన్పించాడని సంప్రదాయ కథనం. ఇందులో సమకాలీన సమాజంలోని సుప్రసిద్ధాలైన కథలు అన్నీ చేరి మహాభారతం ప్రాచీనవిజ్ఞానసర్వస్వకల్పకంగా పరిణమించిందని పెక్కుమంది ఆధునికవిద్వాంసుల అభిప్రాయం. ఈ పద్యంలో చెప్పబడిన 'ఫలశ్రుతి' వలన ఈ కథకు గల స్వయంప్రతిపత్తి వెల్లడి అవుతున్నది. వృత్తలక్షణానికి ఆర. 2.22 విశేషాంశం చూడండి.

**వ. ఇట్లు సురేంద్రుం డరిగిన ధర్మతనయుం డర్జునుం జూచి పరమానందభరితహృదయుం డై యిట్లనియె.49**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సుర+ఇంద్రుండు= దేవేంద్రుడు; అరిగినన్= వెళ్ళగా; ధర్మతనయుండు; అర్జునున్+చూచి; పరమ+ఆనంద, భరిత, హృదయుండు+ఐ= గొప్పఆనందంతో నిండిన మనస్సు కలవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా దేవేంద్రుడు స్వర్గలోకానికి వెడలగా, ధర్మరాజు అర్జునుడిని చూచి గొప్పఆనందంతో నిండిన హృదయం కలవాడై ఇట్లా పలికాడు.

**సీ॥ 'హరుఁ డాదిగాఁ గల యమరగణంబుచేఁ । బడసి దివ్యాస్త్రముల్ పరమ మైన**
**యుపకార మమరుల కొనరించె నీపార్థుఁ । డని నాకుఁ జెప్పె వృత్రాంతకుండు;**
**దివ్యాస్త్రలాభమ్ము దేవేంద్రునకుఁ బ్రీతి । గా వేల్పులకు నుపకారి వైన**
**విధమును మా కిప్డు విన వేడ్క యైనది' । యని తన్ను నడిగిన నగ్రజునకు**

**ఆ. నగ్రజన్మపూజ్యు లగు ధౌమ్య రోమశ । భ్రాతృవరులయొద్దఁ బాండవేయుఁ**
**డసదృశప్రభావుఁ డతివీరుఁ డర్జునుఁ । డాత్మచరిత మిట్టు లనుచుఁ జెప్పె. 50**

**ప్రతిపదార్థం:** హరుఁడు+ఆదిగాన్+కల= శివుడు మున్నగువారైన; అమర గణంబుచేన్= వేల్పుల సముదాయంచేత; దివ్య+అస్త్రముల్= దివ్యాలైన గొప్ప మంత్రబాణాలు; పడసి= సంపాదించి; పరమము+ఐన= మిక్కిలి గొప్ప దైన; ఉపకారము= మేలు; అమరులకున్= దేవతలకు; ఒనరించెన్= చేశాడు; ఈ, పార్థుఁడు+అని= ఈ అర్జునుడు, అని అంటూ; వృత్ర+అంతకుండు= వృత్రుడిని సంహరించిన దేవేంద్రుడు; నాకున్= నాకు; చెప్పె= చెప్పాడు; దివ్య+అస్త్ర, లాభమ్ము= దివ్యాలైన మంత్రబాణాలు సంపాదించిన విధాన్ని; దేవేంద్రునకున్+ప్రీతిగా= దేవేంద్రుడికి ఇష్టమైనవిధంగా; వేల్పులకున్= దేవతలకు; ఉపకారివి+ఐన, విధమును= మేలుచేకూర్చినవాడ వైన రీతిని; మాకు+ఇప్డు, వినన్, వేడ్క+ఐనది= ఇపుడు మాకు వినవలెననే కుతూహలం ఏర్పడింది; అని; తన్నున్= తనను (అర్జునుడిని); అడిగినన్= ప్రశ్నించగా; అగ్రజునకున్= అన్నకు అనగా ధర్మరాజుకు; అగ్ర, జన్మ, పూజ్యులు+అగు= గొప్ప పుట్టుకవలననూ తనకంటె ముందు పుట్టటంవలననూ, అర్చించతగినవారు అయిన; ధౌమ్య, రోమశ, భ్రాతృవరుల+ఒద్దన్= ప్రముఖులైన ధౌమ్యుడి యొద్ద, రోమశుడి యొద్ద, సోదరులయొద్ద; పాండవేయుఁడు= పాండురాజు కుమారు డైన అర్జునుడు; న+సదృశ, ప్రభావుఁడు= సాటిలేని మహిమ కలిగినవాడు; అతివీరుఁడు= గొప్పవీరుడు; అర్జునుఁడు= అర్జునుడు; ఆత్మచరితము= తనదైన కథ; ఇట్టులు+అనుచున్+చెప్పెన్= ఈ విధంగా జరిగిందని వివరించి చెప్పాడు.

**తాత్పర్యం:** 'శివుడు మున్నగు దేవతలచేత నీవు దివ్యా లైన అస్త్రాలను సంపాదించి వేల్పులకు గొప్ప ఉపకారం చేశా వని దేవేంద్రుడు నిన్నుగూర్చి గొప్పగా పలికాడుకదా! నీవు ఏయే దివ్యాస్త్రాలను ఏవిధంగా ఆర్జించగలిగినావు? వృత్రుడిని సంహరించిన దేవేంద్రుడు సంతసించేటట్లుగా వేల్పులకు ఎటువంటి మేలు చేకూర్చగలిగినావు? ఆయా వృత్తాంతాలను మాకు వీనుల విందుగా సవిస్తరంగా విన్నవించుము. మాకు విన కుతూహలంగా ఉన్నది' అని అడుగగా, అన్న అయిన ధర్మరాజుకును, గొప్పపుట్టుకచేత పూజ్యులైన ధౌమ్యరోమశులకు, అన్నదమ్ములకు సాటిలేని ప్రభావం గల అర్జునుడు తన కథను ఈవిధంగా చెప్పాడు.

**వ. 'ఏను భవదాదిష్టవిద్యాప్రకారంబున తపోనియుక్తుండ నై హిమవంతంబునకుం జని, యందు నా ముందట వృద్ధబ్రాహ్మణుం డై యున్న వృద్ధశ్రవుం గని, తదుపదేశంబున నీశ్వరుగుఱించి యుగ్రతపంబు సేసిన,**

**నీశ్వరుండు గిరాతరూపధరుండై నాతోడ నతిఘోరయుద్ధంబుసేసి, నాకుఁబ్రసన్నుఁడై నిజరూపంబుఁ జూపి, పాశుపతాస్త్రంబుఁ బ్రసాదించె; ననంతరంబ నింద్రాది దేవతలవలన నైంద్రాగ్నేయయామ్యరాక్షసవారుణ వాయవ్యకౌబేరగాంధర్వ పైశాచబ్రాహ్మ్యంబు లనంబరఁగు దివ్యాస్త్రంబులు వడసి, మహేంద్రానుగృహీతుండ నై మాతలి ప్రయుక్తం బైన దివ్యరథం బెక్కి యీ శరీరంబుతోడన యమరావతి కరిగి, యం దమరేంద్రునాచార్యుఁగా వరించి తత్ప్రసాదంబున దివ్యాస్త్రంబులు వడసి తత్ప్రయోగంబులును నుపసంహారంబులును నివర్తనంబులును బ్రాయశ్చిత్తంబులును బ్రతిఘాతంబులును నేర్చిన నాకు సంతసిల్లి సురేంద్రుం డిట్లనియె. 51**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; భవత్+ఆదిష్ట, విద్యా, ప్రకారంబునన్= నీచేత ఆదేశించబడిన విద్యను అనుసరించటం చొప్పున; తపస్+నియుక్తుండను+ఐ= తపస్సునందు నిష్ఠ కలవాడనై; హిమవంతంబునకున్= హిమాలయపర్వతానికి; చని=వెళ్లి; అందున్= అచట; నా ముందటన్= నా యెదుట; వృద్ధ, బ్రాహ్మణుండు+ఐ+ఉన్న= ముసలివిప్రుడి వేషంలో ఉన్న; వృద్ధశ్రవున్+కని= దేవేంద్రుడిని; చూచి; తద్+ఉపదేశంబునన్= ఆతడి హితవచనం చొప్పున; ఈశ్వరు గుఱించి= శివుడిని ఉద్దేశించి; ఉగ్ర, తపంబు+చేసినన్= కఠిన తపస్సు చేయగా; ఈశ్వరుండు= శివుడు; కిరాతరూపధరుండు+ఐ= చెంచు ఆకృతి ధరించినవాడై; నాతోడన్= నాతో; అతి ఘోరయుద్ధంబు+చేసి= మిక్కిలిభయంకరమైన పోరు సలిపి; నాకున్+ప్రసన్నుఁడు+ఐ= నాయెడ అనుగ్రహం కలవాడై; నిజరూపంబున్+చూపి= తన అసలు ఆకారమును చూపించి (ఆకృతి ప్రదర్శించి); పాశుపత+అస్త్రంబున్= పాశుపతం అనే మంత్రబాణాన్ని; ప్రసాదించెన్= దయతో ఇచ్చాడు (అనుగ్రహించాడు); అనంతరంబు+అ= అటుపిమ్మట; ఇంద్ర+ఆది+దేవతల వలనన్= ఇంద్రుడు మున్నగు వేల్పుల వలన; ఐంద్ర+ఆగ్నేయ, యామ్య, రాక్షస, వారుణ, వాయవ్య, కౌబేర, గాంధర్వ, పైశాచ, బ్రాహ్మ్యంబులు+అనన్+పరఁగు= ఇంద్రుడికి, అగ్నికి, యముడికి, రాక్షసులకు, వరుణుడికి, వాయువుకు, కుబేరుడికి, గంధర్వులకు, పిశాచులకు, బ్రహ్మకు సంబంధించినవి అని చెప్పబడే; దివ్య+అస్త్రంబులు= దివ్యాలైన (మహిమాన్వితాలైన) మంత్రబాణాలు; పడసి= పొంది; మహా+ఇంద్ర+అనుగృహీతుండను+ఐ= దేవేంద్రుడిచేత అనుమతి పొందినవాడ నై; మాతలి, ప్రయుక్తంబు+అయిన= మాతలిచేత తోలబడునట్టి; దివ్యరథంబు+ఎక్కి= దేవలోకానికి సంబంధించిన తేరును ఎక్కి; ఈ+శరీరంబుతోడన్+అ= ఈ దేహంతోనే; అమరావతికి+అరిగి= స్వర్గలోకంలోని రాజధాని అయిన అమరావతికి వెళ్ళి; అందున్= అచట; అమర+ఇంద్రున్= దేవేంద్రుడిని; ఆచార్యుఁగాన్= గురువుగా; వరించి= ఎన్నుకొని; తద్+ప్రసాదంబునన్= ఆతడి దయవలన; దివ్య+అస్త్రంబులు= దివ్యాలైన మంత్రబాణాలు; పడసి= పొంది; తద్+ప్రయోగంబులును= ఆయా అస్త్రాలు వాడే విధానాలను; ఉపసంహారంబులును= ప్రయోగించిన వాటిని వెనుకకు మళ్ళించే విధానాలను; నివర్తనంబులును= ఇంకొకవైపునకు మరల్చే పద్ధతులను; ప్రాయశ్చిత్తంబులును= దొరలిన దోషాలకు చేసే నిష్కృతులను; ప్రతిఘాతంబులును= ఎదుటి వారు ప్రయోగించే వాటిని వమ్ముచేసే రీతులను; నేర్చినన్= అభ్యసించగా; నాకు, సంతసిల్లి= నాయెడ సంతోషం ప్రకటించి; సుర+ఇంద్రుండు= దేవేంద్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** నేను, నీ ఆదేశంప్రకారం మంత్రవిద్యోపాసన చేసి తపస్సులో నిష్ఠకలవాడనై హిమాలయపర్వతాలకు వెళ్ళాను. అక్కడ దేవేంద్రుడు ముసలివిప్రుడివేషం ధరించి నాకు కన్పించి, నన్ను ఈశ్వరుడినిగూర్చి తపస్సు చేయుమని ప్రబోధించాడు. నేను ఈశ్వరుడిని గూర్చి ఘోరతపస్సు చేశాను. పరమశివుడు కిరాతరూపంతో నాతో భయంకరయుద్ధం చేసి, నన్ను మెచ్చి, నాకు తన నిజస్వరూపం చూపి, నాయందు అనుగ్రహం కలవాడై నాకు పాశుపతాస్త్రాన్ని ప్రసాదించాడు. పిమ్మట ఇంద్రుడు మున్నగు వేల్పులవలన, నాకు ఐంద్రం, ఆగ్నేయం, యామ్యం, రాక్షసం, వారుణం, వాయవ్యం, కౌబేరం, గాంధర్వం, పైశాచం, బ్రాహ్మ్యం అనే అస్త్రాలు లభించాయి. దేవేంద్రుడి

అనుమతి చొప్పున, మాతలి నడిపే దివ్యరథాన్ని అధిరోహించి నేను ఈ దేహంతోనే స్వర్గలోకపురాజధాని అయిన అమరావతికి వెళ్ళాను. స్వర్గంలో దేవేంద్రుడిని గురువుగా ఎన్నుకొని నేను ఆతడిదయవలన వివిధ దివ్యాస్త్రాలను సాంగోపాంగంగా అభ్యసించాను. ఆయా అస్త్రాలను వాడటాన్నీ, వాటిని తిరిగి వెనుకకు మరలించే విధానాలను, మరోవైపునకు మరల్చే పద్ధతులను, దొరలిన దోషాలను పరిహరించే పద్ధతులను, ఎదుటివారు ప్రయోగించే వాటిని వమ్ముచేసే రీతులను నేర్చాను. దేవేంద్రుడు సంతసిల్లి ఈ విధంగా పలికాడు.

**క. 'నీ వఖిలాస్త్రవిదుండవు । గావున నిన్నాజి నోర్వఁగా నోప రొరుల్;**
**దేవతలకు బ్రాహ్మణులకుఁ । గావింపు హితంబు; దీనఁ గడు సిద్ధి యగున్. 52**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; అఖిల+అస్త్ర, విదుండవు= సమస్తమైన మంత్రబాణాలను తెలిసినవాడవు; కావునన్= కాబట్టి; నిన్ను+ఆజిన్+ఓర్వగాన్= నిన్ను యుద్ధంలో జయించటానికి; ఒరుల్= ఇతరులు; ఓపరు= సమర్థులు కారు; దేవతలకున్= వేల్పులకు; బ్రాహ్మణులకున్= విప్రులకు; హితంబు= మేలు; కావింపు= చేయుము; దీనన్= దీనివలన; కడు= మిక్కిలి; సిద్ధి+అగున్=కోరికలు ఈడేరుతాయి (జన్మసఫలమౌతుంది).

**తాత్పర్యం:** 'నీవు సమస్తమైన అస్త్రాలను తెలిసినవాడవు. కాబట్టి ఇతరులు ఎవ్వరూ నిన్ను యుద్ధంలో జయించజాలరు; నీవు వేల్పులకు, విప్రులకు మేలు చేకూర్చుము, నీకు దీనివలన జన్మసాఫల్యం ఏర్పడుతుంది.

**క. నాకు గురుదక్షిణార్థము । నాకహితార్థంబుగా జనస్తుతబుద్ధిం**
**జేకొని నా పనిచినపనిఁ । బ్రాకటముగఁ జేయు మహితభంజనశక్తిన్. 53**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; గురుదక్షిణ+అర్థము= అధ్యాపకుడికి సమర్పించే బహుమతిగా; నాక, హిత+అర్థంబుగాన్= స్వర్గానికి మేలు కలుగజేసేటట్లుగా; జనస్తుతబుద్ధిన్= ప్రజలచేత ప్రశంసించబడే బుద్ధిని; చేకొని= స్వీకరించి; నా+పనిచిన, పనిన్= నేను నియోగించిన కార్యాన్ని; అహితభంజనశక్తిన్= శత్రువులను నిర్మూలించే సామర్థ్యంతో; ప్రాకటముగన్= అందరికి తెలిసేటట్లుగా; చేయుము= నెరవేర్చుము.

**తాత్పర్యం:** నాదగ్గర నీవు అస్త్రవిద్య నేర్చుకొన్నావు. కాబట్టి నీవు నాకు సమర్పించవలసిన గురుదక్షిణ ప్రజలు ప్రశంసించేటట్లుగా వేల్పులకు మేలు చేయటమే. నేను నియోగించిన కర్తవ్యాన్ని శత్రువులను నిర్మూలించే సామర్థ్యంతో లోకవిదితంగా నీవు నెరవేర్చాలి.

**విశేషం:** 'గురుదక్షిణ'- ప్రాచీన భారతీయ సంస్కృతిలో ఒక విశిష్ట సంప్రదాయం. జిజ్ఞాసువు, యోగ్యుడు అయిన శిష్యుడికి విద్య నేర్పటం గురువుకు విధి. విద్యాభ్యాసం ముగిసిన పిమ్మట గురువుగారి కోరిక ఈడేర్చి 'గురుదక్షిణ' చెల్లించటం శిష్యుడి విధి.

**తే. జలధికుక్షిలోనుండి వీరులు నివాత । కవచు లను మూఁడుకోట్ల దానవులు బలిమిఁ**
**ద్రిదశులకు బాధసేయుచుండుదురు; వారు । నిహతు లగుదురు నీచేత మహితకీర్తి!' 54**

**ప్రతిపదార్థం:** మహితకీర్తి!= గొప్పయశస్సుకల ఓ అర్జునా!; జలధి, కుక్షిలోన్+ఉండి= సముద్రగర్భంలో ఉండి; వీరులు= పరాక్రమం కల శూరులు; నివాతకవచులు+అను= నివాతకవచులు అనే పేరు కల; మూఁడు, కోట్ల, దానవులు= మూడు

కోట్ల రక్కసులు; బలిమిన్= బలంతో; త్రిదశులకున్= వేల్పులకు; బాధ+చేయుచుండుదురు= కష్టాలను కల్పిస్తూ ఉంటారు; వారు= ఆ నివాతకవచులు; నీచేతన్= నీమూలాన; నిహతులు+అగుదురు= చావగలరు.'

**తాత్పర్యం:** గొప్ప యశస్సు నార్జించిన ఓ అర్జునా! కడలికడుపులో దాగి పరాక్రమవంతులైన వీరులు 'నివాతకవచులు' అని పిలువబడే మూడుకోట్ల రాక్షసులు బలగర్వంతో వేల్పులకు బాధలు కల్పిస్తున్నారు. వారు నీచేత యుద్ధంలో చావగలరు.

**వ.** **అని తన తొడిగిన దివ్యభూషణంబుల మణికిరీటంబున నన్ను విభూషితుం జేసి, స్పర్శరూపం బైన యభేద్య కవచంబు నిచ్చి, యజగరసన్నిభం బయిన యిగ్గొనయంబు గాండీవంబునం దాన యోజించి, పదివేల హంసమయూరవర్ణమాననీయహయంబులం బూనిన రథంబు మాతలిప్రయుక్తం బైన దాని నెక్కం బనిచి 'నివాతకవచవధార్థం బరుగు' మని నియోగించిన, నింద్రు వీడ్కొని చనుచున్న నాకు దేవత లి ట్లనిరి.55**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; తన, తొడిగిన= తాను ధరించిన; దివ్యభూషణంబులన్= దివ్యాలైన అలంకారాలతో; మణికిరీటంబునన్= మణులతో పొదగబడిన కిరీటంతో; నన్ను; విభూషితున్+చేసి= అలంకరించబడిన వాడినిగా చేసి, అలంకరించి; స్పర్శ రూపంబు+ఐన= చేతితో తాకుటచేత మాత్రమే తెలియబడెడు; అభేద్య, కవచంబున్= భేదించటానికి వీలులేని కవచాన్ని; ఇచ్చి= అనుగ్రహించి; అజగర, సన్నిభంబు+అయిన= కొండచిలువతో సమాన మైన; ఈ+గొనయంబు= ఈ అల్లెత్రాటిని; గాండీవంబునన్= గాండీవం (వింటి)లో; తాను+అ= తానే; యోజించి= సజ్యంచేసి= కూర్చి; పది, వేల, హంస, మయూర, వర్ణ, మాననీయ, హయంబులన్= పదివేల హంసలయొక్కయు నెమిళ్లయొక్కయు రంగులతో శోభిల్లే గుర్రాలతో; పూనిన= కట్టబడిన; రథంబు= తేరు; మాతలి, ప్రయుక్తంబు+ఐన దానిన్= మాతలిచేత నడుపబడే దానిని; ఎక్కన్+పనిచి= అధిరోహించ నియోగించి; నివాతకవచవధ+అర్థంబు= నివాతకవచులను చంపటంకొరకు; అరుగుము+అని= వెళ్లుము అని; నియోగించినన్= ఆజ్ఞాపించగా; ఇంద్రున్= ఇంద్రుడిని; వీడ్కొని= సెలవు గైకొని; చనుచున్న= వెళ్ళుతున్న; నాకున్= నాతో; దేవతలు= వేల్పులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** అని పలికి దేవేంద్రుడు తాను ధరించిన భూషణాలను నాకు తొడిగాడు, మరియు మణులతో పొదగబడిన కిరీటాన్ని నాకు అలంకరించాడు. చేతితో తాకితేనే తెలియదగిన కవచాన్ని నాకు ఇచ్చాడు. కొండచిలువతో సమాన మైన ఈ అల్లెత్రాటిని నా గాండీవానికి తానే సంధించి కూర్చి ఎక్కుపెట్టే విధానం నేర్పించాడు. పదివేల హంసల నెమిళ్ల రంగులతో శోభిల్లే గుర్రాలు కలదీ, మాతలి సారథ్యం చేసేదీ అయిన తేరును అధిరోహింపచేశాడు. నన్ను నివాతకవచులను సంహరించటానికి వెళ్ళుమని నియోగించాడు. దేవేంద్రుడికడ సెలవుగైకొని, వెళ్ళుతున్న సమయంలో వేల్పులు నాతో ఇట్లా పలికారు.

**చ.** **'ఈ రథ మెక్కి తొల్లి యమరేంద్రుఁ డనేకసహస్రసంఖ్య దే**
**వారుల వృత్రశంబరబలాదుల నుద్ధతులన్ జయించె; వీ**
**రారివిభేది! నీవును బలాఢ్యుఁడవై వధియింపు ముగ్రమా**
**యారతులన్ నివాతకవచాసురులన్ సమరాంతరంబునన్'. 56**

**ప్రతిపదార్థం:** ఈ రథము+ఎక్కి= ఈ తేరును అధిరోహించి; తొల్లి= పూర్వకాలంలో; అమర+ఇంద్రుఁడు= దేవేంద్రుడు; అనేక, సహస్ర, సంఖ్య= పెక్కువేలసంఖ్యకల; దేవ+అరులన్= దేవతల శత్రువులను; వృత్ర, శంబర, బల+ఆదులన్=

వృత్రుడు, శంబరుడు, బలుడు మున్నగు వారిని; ఉద్ధతులన్= గర్వించిన వారలను; జయించెన్= గెల్చాడు; వీర+అరి, విభేది!= శూరు లైన శత్రువులను జయించు ఓఅర్జునా!; నీవును= నీవు కూడ; బల+ఆఢ్యుఁడవు+ఐ= బలం కలిగిన వాడవై; ఉగ్రమాయారతులన్= భయంకర మైన మాయలతో వినోదించేవారిని; నివాతకవచ+అసురులన్= 'నివాతకవచులు' అనబడే రక్కసులను; సమర+అంతరంబునన్= యుద్ధం జరిగేటప్పుడు; వధియింపుము= సంహరించుము.

**తాత్పర్యం:** 'వీరులైన శత్రువులను జయించే ఓ అర్జునా! పూర్వకాలంలో ఈ రథాన్ని అధిరోహించి దేవేంద్రుడు పెక్కువేలమంది రాక్షసులను, దేవతల శత్రువులగు వృత్రుడు, శంబరుడు, బలుడు మున్నగువారిని, మిక్కుట మైన మదంకలవారిని జయించాడు. నీవుకూడ, బలంకలవాడ వై పెక్కుమాయలతో వినోదించే 'నివాతకవచులు' అనే రక్కసులను యుద్ధంలో సంహరించుము.'

**వ. అని నాకు దేవదత్తం బను శంఖం బిచ్చిన, నేనును మాతలిసహితంబుగా రథం బెక్కి యతిత్వరితగతి నరిగి.57**

**ప్రతిపదార్థం:** అని=అని చెప్పి; నాకు; దేవదత్తంబు= (దేవతలచే ఇవ్వబడింది); దేవదత్తం; అను శంఖంబు= అనే శంఖాన్ని; ఇచ్చినన్= అనుగ్రహించగా; నేనును= నేనుకూడ; మాతలి, సహితంబుగాన్= మాతలితోపాటుగా; రథంబు+ఎక్కి= తేరును అధిరోహించి; అతి, త్వరిత, గతిన్= మిక్కిలివేగంగా; అరిగి= వెళ్ళి.

**తాత్పర్యం:** అని చెప్పి దేవతలు నాకు 'దేవదత్తం' అనే పేరుగల శంఖాన్ని బహూకరించారు. ఆపైన నేను మాతలితోపాటు రథంఎక్కి మిక్కిలివేగంగా పయనించి.

**విశేషం:** పాండవులలో అర్జునుడికి 'కిరీటి' అనేపేరు ఏర్పడటానికి కారణం ఆతడు దేవేంద్రదత్త మైన దివ్యకిరీటాన్ని ధరించటమే. అర్జునుడికి దేవతలు బహూకరించిన శంఖానికి 'దేవదత్తం' అనే సార్థకనామం ఏర్పడింది.

### అర్జునుఁడు నివాతకవచు లను రాక్షసుల జయించిన కథ (సం. 3-166-1)

**క. ఫేనవదూర్మిచయంబుల । నానావిధ మీన కూర్మ నక్రంబుల శై**
**లానుకృతి నొప్పుచున్న మ । హానీరధిఁ గంటి నేను నమ్మాతలియున్. 58**

**ప్రతిపదార్థం:** ఫేనవత్+ఊర్మి, చయంబుల= నురుగుతో కూడిన కెరటాల సముదాయంతో; నానా, విధ, మీన, కూర్మ, నక్రంబులన్= పెక్కు రకాలైన చేపలు తాబేళ్ళు మొసళ్ళతో; శైల+అనుకృతిన్= కొండలతో పోల్చదగిన; మహానీరధిన్= గొప్ప సముద్రాన్ని; ఏనున్+ఆ+మాతలియున్= నేను కూడా ఆ మాతలితో కలిసి; కంటిన్= చూచాను.

**తాత్పర్యం:** నేనును ఆ మాతలితోపాటు, ఆ మహాసముద్రాన్ని సందర్శించాను. ఆ సముద్రం నురుగుతో కూడిన కెరటాలదొంతరలతో చేపలు తాబేళ్లు మొసళ్లు గలిగి పర్వతాలతో పోల్చదగినట్లు కన్పించింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఆ సముద్రోదరంబున విశాలాట్టాలక ప్రతోళికాలంకృతం బైన పురంబుఁ గని తద్ద్వారంబున శంఖధ్వానంబు సేసిన, నది సకలదిఙ్మహీధరగుహాకుహరంబులయందుఁ బ్రతిశబ్దజనకం బైన, దాని విని యలిగి దానవులు నానావిధాయుధసన్నద్ధు లయి నిజకాయకాళిమతమోభూతభువను లగుచు వచ్చి నారథంబుఁ బరివేష్టించి.59**

**ప్రతిపదార్థం:** ఆ+సముద్ర+ఉదరంబునన్= ఆ కడలి మధ్యభాగంలో విశాల+అట్టాలక, ప్రతోళికా+అలంకృతంబు+ఐన= పెద్దపెద్ద బురుజులతో వీథులతో అలంకరించబడిన దైన; పురంబున్= నగరాన్ని; కని= చూచి; తద్+ద్వారంబునన్= ఆ పట్టణం యొక్క వాకిట్లో; శంఖ ధ్వానంబు= శంఖంయొక్క చప్పుడు; చేసినన్= సల్పగా; అది= ఆ ధ్వని; సకలదిక్+మహీధర, గుహా, కుహరంబుల అందున్= అన్ని దిక్కులలో గల కొండలందలి గుహల మధ్యభాగాలయందు; ప్రతిశబ్దజనకంబు+ఐన= మారుమ్రోగగా; దానిన్= ఆ ధ్వనిని; విని= ఆలకించి; అలిగి= కోపగించి; దానవులు= రక్కసులు; నానా, విధ+ఆయుధన్, సన్నద్ధులు+అయి= పెక్కురకాలైన శస్త్రాలతో కూడినవారు అయి; నిజ, కాయ, కాళిమ, తమస్+భూత, భువనులు+అగుచున్= తన శరీరాలనలుపుచేత చీకట్లు క్రమ్మబడిన లోకాలు కలవారు ఔతూ; వచ్చి; నా రథంబున్= నాయొక్కతేరును; పరివేష్టించి= చుట్టుముట్టి.

**తాత్పర్యం:** ఆ కడలిలోపల పెద్దపెద్ద బురుజులతో పెద్దపెద్ద వీథులతో అలంకరించబడిన నగరాన్ని చూచి ఆ పురముఖద్వారం వద్ద నిలిచి శంఖాన్ని పూరించాను. ఆ శంఖధ్వని సమస్తదిక్కులలోని కొండగుహలలో మారుమ్రోగింది. దానిని విని రాక్షసులు కోపించి పెక్కు విధాలైన ఆయుధాలు సమకూర్చుకొనినవారై నా రథాన్ని చుట్టుముట్టారు. వారి నల్లని శరీరాలనుండి వెలువడే నలుపుదనంచీకట్లు లోకాన్ని ముసురుకొన్న ట్లనిపించింది.

**క. ఉరుశస్త్రవృష్టి నాపైఁ। గురిసినఁ దత్క్షణమె యొక్కొకొనిపయి నేనున్**
**వరుసం బదేసిబాణము। లరుదుగ నేసితి మహాభయంకరభంగిన్. 60**

**ప్రతిపదార్థం:** ఉరు, శస్త్ర, వృష్టి= గొప్ప దైన బాణాలవాన (ఆయుధవర్షం); నాపైన్= నాపయిన; కురిసినన్= వర్షించగా; తద్+క్షణము+ఎ= వెనువెంటనే; నేనున్= నేను సయితం; ఒక్కొకొనిపయి= ఒక్కొక్కరి మీద; వరుసన్= క్రమంగా; పది+ఏసి, బాణములు= పదిచొప్పున అమ్ములు; అరుదుగన్= అసాధారణపద్ధతిలో; మహా, భయంకర, భంగిన్= మిక్కిలి వెరపు కలిగించే తీరులో; ఏసితిన్= ప్రయోగించాను.

**తాత్పర్యం:** ఆ రాక్షసులు నా మీద గొప్ప ఆయుధాలను వర్షించారు. వెనువెంటనే నేను కూడ, ఒక్కొకరిపై పదేసి అమ్ములు భయంకరంగా అసాధారణమైన పద్ధతిలో ప్రయోగించాను.

**క. దనుజులు మదీయరథమా। ర్గనిరోధముగాఁ బ్రచండకాండప్రకరం**
**బునఁ గప్పిరి రోదోంతర। మనిమిషులును బుషులుఁ జూచి యద్భుతమందన్. 61**

**ప్రతిపదార్థం:** దనుజులు= రాక్షసులు; మదీయ, రథ, మార్గ, నిరోధముగాన్= నాయొక్కతేరు పోవుదారిని అడ్డగించేటట్లుగా; ప్రచండ, కాండ, ప్రకరంబునన్= తీవ్రా లైన అమ్ములదొంతరలతో; రోదస్+అంతరము= భూమిఆకాశాల మధ్యభాగాన్ని; అనిమిషులును= దేవతలును; బుషులున్= మునులు; చూచి= కాంచి; అద్భుతము+అందన్= అచ్చెరువందేటట్లుగా; కప్పిరి= మూసివేశారు.

**తాత్పర్యం:** రాక్షసులు నా తేరు పోయే దారికి అడ్డంగా, భూమికీ ఆకసానికీ ఉన్న మధ్యప్రదేశాన్ని తీవ్రమైన అమ్ములదొంతరలతో కప్పివేసి, దేవతలును మునులును అచ్చెరువందేటట్లుగా చేశారు.

**క. కడుభయమున మాతలి చే। ష్టడి రథచోదనమునం దపాటవుఁ డైనన్**
**వడి నేన రథము గడుపుచుఁ। దడయక యేసితిఁ గడంగి దానవులపయిన్. 62**

**ప్రతిపదార్థం:** కడు, భయమునన్= మిక్కిలి వెరపుతో; మాతలి= దేవేంద్రుడి రథసారథి; చేడ్పడి= మూర్ఛిల్లి; బాధపడి, చలించి; రథచోదనమునందు= తేరు నడపటంలో; అపాటవుఁడు+ఐనన్= సామర్థ్యం లేనివాడుకాగా; వడిన్= శీఘ్రంగా; ఏను+అ= నేనే; రథము+కడపుచున్= తేరును నడుపుతూ; తడయక= ఆలస్యం లేకుండగా; కడంగి= పూని; దానవులపయిన్= రక్కసులమీద; ఏసితిన్= అమ్ములను ప్రయోగించాను.

**తాత్పర్యం:** మిక్కుట మైన భీతిచేత దేవేంద్రుడి రథసారథి అయిన మాతలి అప్పుడు రథం నడిపే సామర్థ్యాన్ని కోలుపోయి స్పృహ తప్పిపడిపోయాడు. ఇక, నేనే తేరును శీఘ్రంగా నడపుకొంటూ ఆలస్యం చేయకుండా రక్కసులమీద అమ్ములు ప్రయోగించాను.

**వ. మాతలి నన్నుం జూచి సంతసిల్లె నంత. 63**

**ప్రతిపదార్థం:** మాతలి= దేవేంద్రుడి రథసారథి; నన్నున్+చూచి= నాసామర్థ్యాన్ని చూచి; సంతసిల్లెన్= సంతోషించాడు; అంతన్= అంతట.

**తాత్పర్యం:** నా సామర్థ్యాన్ని కాంచి, మాతలి మిక్కిలి సంతోషించాడు. అంతట.

**చ. అతుల రణాంతరంబున నిరంతర మ త్పటు బాణ దారితో**
**చ్ఛ్రిత దనుజాంగ నిర్గళ దసృగ్జల ధారలు సూడ నొప్పె నా**
**తత గిరి శృంగ సంగ దళిత ప్రచల జ్జల వాహ జాల సం**
**తత గళ దంబుధారల విధంబున నంబర మెల్లఁ గప్పుచున్. 64**

**ప్రతిపదార్థం:** అతుల, రణ+అంతరంబునన్= సాటిలేని యుద్ధమధ్యంలో; నిరంతర, మత్, పటు, బాణ, దారిత+ఉత్+శ్రిత, దనుజ+అంగ, నిర్గళత్+అస్రుక్+జల, ధారలు= ఎడతెగకుండ ప్రవర్తిల్లే నా తీవ్రమైన అమ్ములచేత ముక్కలుచేయబడిన, చీల్చబడి, పైకెగరగొట్టబడిన రాక్షసులదేహాలనుండి స్రవించెడి నెత్తుటి నీటిజాలులు; ఆతత, గిరి, శృంగ, సంగ, దళిత, ప్రచలత్+జలవాహ, జాల, సంతత, గళత్+అంబు, ధారల విధంబునన్= విరివి అయిన కొండకొనలను తగులుకొని కత్తిరించబడి మిక్కిలి చలిస్తూ ఉండే మబ్బుల సముదాయంనుండి ఎడతెగకుండ జారెడు నీటిజాలుల రీతిగా; అంబరము+ఎల్లన్+కప్పుచున్= ఆకసాన్ని అంతటిని ఆవరించి; చూడన్+ఒప్పెన్= చూడటానికి సొగసుగా ఉండింది.

**తాత్పర్యం:** అది సాటిలేనియుద్ధం. నా తీవ్రమైన అమ్ములచేత ఖండించబడి పైకెగసిన రాక్షసులదేహాలనుండి కారిన నెత్తురులనే నీటిధారలు, విరివిఅయిన కొండకొనలకు తగిలి ముక్క లై చెల్లాచెదరైన మేఘాల సముదాయంనుండి ఎడతెగక స్రవించే నీటిధారలవలె ఆకసాన్ని అంతటిని ఆవరించి చూడ ఇంపుగా ఉండింది.

**విశేషం:** అలం: ఉపమ

**వ. అంత నయ్యసురులు మాయాయుద్ధంబు సేయ సమకట్టి నామీఁద వర్షాస్త్రంబు లేసిన. 65**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతట; ఆ+అసురులు= ఆ రాక్షసులు; మాయా, యుద్ధంబు= లేనిది ఉన్నట్లు భ్రమింపజేసే నైపుణ్యంతో కూడిన పోరాటం; చేయన్+సమకట్టి= చేయటానికి పూని; నామీఁదన్= నాపయి; వర్ష+అస్త్రంబులు= వాన కురిసే మంత్రబాణాలు; ఏసినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** అంతట, ఆ రాక్షసులు నాతో మాయాయుద్ధానికి పూనుకొని, నామీద వర్షం కురిసే మంత్రబాణాలను ప్రయోగించారు.

**విశేషం:** కొన్ని ప్రతుల్లో, 'వరుణాస్త్రంబు లేసిన'- అనే పాఠాంతరం ఉంది.

**క. బలరిపుఁడు నాకు నిచ్చిన । యలఘునిశాతముఖశోషణాస్త్రంబున ని**
**ర్గళదవిరళజలధారా । వలి నెల్లను దత్క్షణంబు వట్టఁగఁ జేసెన్. 66**

**ప్రతిపదార్థం:** బలరిపుఁడు= బలుడు అనే రాక్షసుడికి శత్రు వైన దేవేంద్రుడు; నాకున్= నాకు; ఇచ్చిన= బహూకరించిన; అలఘు, నిశాత, ముఖ, శోషణ+అస్త్రంబునన్= గొప్ప దైన, వాడి అయిన, కొన గలిగి, ఎండింపజేసెడి మంత్రబాణం; నిర్గళత్+అవిరళ, జల, ధారా+ఆవలిన్+ఎల్లను= ఎడతెగకుండా కారెడి నీటివెల్లువ నంతటిని; తద్+క్షణంబు+అ= ఆత్రుటిలోనే; వట్టఁగన్+చేసెన్= ఎండిపోయేటట్లు చేసింది.

**తాత్పర్యం:** నేనుకూడ, దేవేంద్రుడు నాకు బహూకరించిన శోషణాస్త్రాన్ని ప్రయోగించాను. అది ఎడతెగకుండ కురుస్తున్న వాననీటివెల్లువను తత్క్షణమే ఇంకి ఎండిపోయేటట్లు చేసింది.

**సీ. అద్దానవులు దారుణాశ్మవర్షంబులుఁ । గురిసిన నవి నన్నుఁ దెరలఁ గప్పెఁ;**
**నేనును గులిశాస్త్ర మేసి పాషాణముల్ । నుఱుము గావించితి; నుఱక వెండి**
**యసురులు నామీఁద ననలాస్త్రజాలంబు । లేసిన గాడ్పుతో మ్రోసి యగ్ని**
**కణములు నాపయిం గవిసిన నేనును । సలిలాస్త్రముల వాని బల మడంచి**

**ఆ. యున్నఁ, దిమిరబాణ ముగ్రంబుగా వార । లేసి; రంత దిక్కు లెల్లఁ గప్పెఁ;**
**నంధకారమగ్నుఁ డై చలియించి మా । తలి ప్రతోద మెడలి ధరణిఁ బడియె. 67**

**ప్రతిపదార్థం:** ఆ+దానవులు= ఆ రాక్షసులు; దారుణ+అశ్మ, వర్షంబులున్= భయంకర మైన రాళ్ళవానలు; కురిసినన్= వర్షించగా; అవి= ఆ రాళ్లవానలు; నన్నున్+తెరలన్+కప్పెన్= నన్ను కన్పించకుండ మూసినవి; ఏనును= నేను; కులిశ+అస్త్రము+ఏసి= వజ్రాస్త్రాన్ని ప్రయోగించి; పాషాణముల్= రాళ్లు; నుఱుము+కావించితిన్= పొడిపొడి చేశాను; ఉఱక= లెక్కసేయక; వెండి= తిరిగి; అసురులు= రాక్షసులు; నామీఁద= నాపై; అనల+అస్త్ర, జాలంబులు= అగ్ని మయములగు మంత్రబాణాల సముదాయాలు; ఏసినన్= ప్రయోగించగా; గాడ్పుతో, మ్రోసి= గాలితో నినదించి; అగ్ని, కణములు= నిప్పురవ్వలు; నా పయిన్+కవిసినన్= నా మీద వచ్చిపడగా; ఏనును= నేనుకూడ; సలిల+అస్త్రములన్= నీరు కురిసే మంత్రబాణాలచేత; వాని= ఆ అగ్నిబాణాలయొక్క; బలము+అడంచి= శక్తిని నాశనం చేసి; ఉన్నన్= ఉండగా; తిమిరబాణము= చీకట్లు కల్పించే అస్త్రం; ఉగ్రంబుగాన్= భయంకరంగా; వారలు= ఆ రాక్షసులు; ఏసిరి= ప్రయోగించారు; అంత= అంతట; దిక్కులు+ఎల్లన్+కప్పెన్= చీకట్లు దిశలన్నిటినీ ఆవరించాయి; అంధకార, మగ్నుఁడు+ఐ= చీకటిలో మునిగిపోయి; చలియించి= కంపించి; మాతలి= దేవేంద్రుడి సారథి; ప్రతోదము+ఎడలి= చేతిలోని కొరడా వదలిపెట్టి; ధరణిన్= భూమిపై; పడియెన్= పడ్డాడు.

**తాత్పర్యం:** ఆ రాక్షసులు భయంకర మైన రాళ్ళవానలు కురిపించి నన్ను కప్పివేశారు. నేనుకూడ వజ్రాస్త్రాన్ని ప్రయోగించి ఆ రాళ్లు నుగ్గునుగ్గు అయ్యేటట్లు చేశాను. ఆ రాక్షసులు నా మీద అగ్నేయాస్త్రాన్ని ప్రయోగించగా

వారుణాస్త్రంతో దానిని వమ్ముచేశాను. ఆపైన దానవులు చీకట్లు క్రమ్మే అస్త్రాన్ని ప్రయోగించారు. దానివల్ల చీకట్లు దిగ్దిగంతరాలలో క్రమ్ముకొన్నవి. ఆ చీకట్లలో మాతలి కంపించి, తన చేతిలోని కొరడాను జారవిడిచి భూమిపై పడిపోయాడు.

**క. తురగములు పఱవ నేరక । వరరథవహనంబునందు వంధ్యము లయ్యెన్;**
**సురసారథి ననుఁ గానక । 'హరినందన! యెందుఁ బోయి' తనెఁ గడు భీతిన్. 68**

**ప్రతిపదార్థం:** తురగములు= గుర్రాలు; పఱవనేరక= పరుగెత్తలేక; వర, రథ, వహనంబునందు= గొప్పరథాన్ని మోయటంలో; వంధ్యములు+అయ్యెన్= అసమర్థాలు అయినవి; సుర సారథి= దేవతలసారథి మాతలి; ననున్= నన్ను; కానక= చూడలేక; హరినందన!= దేవేంద్రుడి పుత్రుడ వైన ఓఅర్జునా!; ఎందున్+పోయితి= ఎచటికి వెళ్ళినా వయా అని; కడు, భీతిన్= గొప్ప భయంతో; అనెన్= అని అన్నాడు.

**తాత్పర్యం:** గుర్రాలు పరుగిడలేక పోయాయి. ఆ గొప్పరథాన్ని ఈడ్వలేకపోయాయి; దేవతలసారథి అయిన మాతలి, 'దేవేంద్రుడి, పుత్రుడ వైన ఓ అర్జునా! నీవు ఎక్కడ ఉంటివయా?' అని భయంతో అరచాడు.

**క. 'అమృతనిమిత్తంబున ము । న్నమరాసురయుద్ధ మయ్యెఁ; నది యింతభయ**
**భ్రమజనకము గా; దిది యు । గ్రము దనుజు లవార్యవీర్యగర్వితు లగుటన్. 69**

**ప్రతిపదార్థం:** అమృత, నిమిత్తంబునన్= అమృతం కారణంగా; మున్ను= తొల్లి; అమర+అసుర, యుద్ధము+అయ్యెన్= వేల్పులకు రక్కసులకు పోరాటం జరిగింది; అది= ఆ యుద్ధం; ఇంత= ఇంతటి; భయ, భ్రమ, జనకము= భయాన్ని ఆందోళనను కలిగించేది; కాదు= కాలేదు; ఇది= ఇప్పుడు జరుగుతున్న పోరాటం; దనుజులు= రాక్షసులు; న+వార్య, వీర్య, గర్వితులు+అగుటన్= వారించటానికి వీలులేని పరాక్రమం కలిగిన వారు కావటంచేత; ఉగ్రము= భయంకర మైనది.

**తాత్పర్యం:** 'తొల్లి రాక్షసులకూ దేవతలకూ అమృతంకొరకు గొప్పయుద్ధం జరిగింది కాని, అది ఇప్పటి యుద్ధమంతటి భయంకర మైనది కాదు. ఇప్పటి ఈ పోరాటంలో రాక్షసులు వారించటానికి వీలులేని పరాక్రమం కలవారైనందున ఈ యుద్ధం మిక్కిలి భయంకరమైనది.

**తే. బ్రహ్మచేత నిర్మింపఁగఁబడిన భువన । సంప్లవం బిది' నావుడు 'సంగరమున**
**సంచలింపక నాభుజశక్తిఁ జూచు । చుండు' మనవుడు మాతలి చోద్య మందె. 70**

**ప్రతిపదార్థం:** బ్రహ్మచేతన్= సృష్టికర్తచేత; నిర్మింపఁగన్+పడిన= ఏర్పాటుచేయబడిన; భువన, సంప్లవంబు+ఇది= ప్రపంచ విధ్వంసం ఇది; నావుడున్= అని చెప్పగా; సంగరమునన్= యుద్ధంలో; సంచలింపక= కంపించక; నా భుజశక్తిన్= నా పరాక్రమం; చూచుచుండుము= చూస్తూ ఉండుము; అనవుడున్= అని చెప్పగా; మాతలి= దేవేంద్రుడి సారథి; చోద్యము+అందెన్= ఆశ్చర్యం చెందాడు.

**తాత్పర్యం:** ఇది బ్రహ్మదేవుడు నిర్ణయించిన ప్రపంచ ప్రళయం'- అని చెప్పగా, 'ఈయుద్ధంలో నీవు నా పరాక్రమాన్ని చూచెదవుగాక' అని అన్నాను. అనగా దేవేంద్రుడి సారథి అయిన మాతలి ఆశ్చర్యపడ్డాడు.

**ఉ. వాసరనాయకుం దలఁచి వజ్రివరంబున సూర్యబాణ మే**
**నేసితి నింద్రుఁ దొట్టి సుర లెంతయు సంతస మందఁగా జగ**

**త్రాసి తమిస్రరాశి నిహతంబుగ దిక్కులు ద్రెళ్ళఁగా మహో**
**గ్రాసురు లాహవంబున భయంపడ మాతలి మెచ్చి యార్వఁగన్. 71**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; వాసర, నాయకున్+తలఁచి= దిననాయకు డైన సూర్యుడిని స్మరించి; వజ్రి+వరంబునన్= దేవేంద్రుడి అనుగ్రహం చొప్పున; సూర్యబాణము= సూర్యాస్త్రాన్ని; ఏసితిన్= ప్రయోగించాను; ఇంద్రున్+తొట్టి= ఇంద్రుడు మొదలుగా కల; సురలు= వేల్పులు; ఎంతయు, సంతసము+అందఁగా= మిక్కిలి సంతోషించగా; జగత్+త్రాసి, తమిస్ర, రాశి= ప్రపంచానికి భయం కల్పించే చీకటిప్రోవు; నిహతంబుగన్= అంతరించగా; దిక్కులు+త్రెళ్ళఁగా= దిక్కులు తేటపడగా; మహా+ఉగ్ర+అసురులు= మిక్కిలి భయంకరులు అయిన రక్కసులు; ఆహవంబునన్= యుద్ధంలో; భయంపడ= భీతి చెందగా; మాతలి= దేవేంద్రుడిసారథి; మెచ్చి= అభినందించి; ఆర్వఁగన్= పెనుకేక వేయగా.

**తాత్పర్యం:** సూర్యుడిని స్మరించి, దేవేంద్రుడి అనుగ్రహంతో నాకు లభించిన సూర్యాస్త్రాన్ని ప్రయోగించాను. దేవేంద్రుడు మున్నగు దేవతలు అందరు సంతసించారు, ప్రపంచానికి భయం కలిగించే చీకట్లు పటాపంచలైనవి. దిక్కులు తేటతెల్లమై కన్పించినవి. మిక్కిలి భయంకరులైన రాక్షసులు యుద్ధంలో భీతిల్లారు. దేవేంద్రుడి రథసారథి మాతలి నన్ను అభినందిస్తూ ఆనందంతో పెద్దకేక వేశాడు.

**క. గాండీవముక్తదారుణ । కాండవిఖండీకృతాపఘను లై దనుజుల్**
**భండనముఖమునఁ జేడ్పడి । గొండలు వడినట్టు వడిరి కుతలం బద్రువన్. 72**

**ప్రతిపదార్థం:** గాండీవ, ముక్త, దారుణ, కాండ, విఖండీకృత+అపఘనులు+ఐ= గాండీవం (వింటి) నుండి విడివడిన భయంకర మైన బాణాలచేత ఖండించబడిన శరీరములు కలవారై; దనుజుల్= రాక్షసులు; భండనముఖమునన్= యుద్ధం యొక్క ముంగల; చేడ్పడి= దెబ్బతిని; కొండలు+పడినట్టు= పర్వతాలు కూలినట్లు; కు తలంబు= భూభాగం; అద్రువన్= అదరగా; పడిరి= కూలారు.

**తాత్పర్యం:** నా గాండీవంనుండి వెలువడిన భయంకరమైన బాణాలచేత ఖండించబడిన శరీరములు కలవారై, రాక్షసులు యుద్ధంలో కొండలు కూలినట్లు, భూభాగం కంపించగా కూలిపోయారు.

**విశేషం:** అద్రువన్=IIU ఇచట. ద్రు అను సంయుక్తాక్షరానికి ముందున్న 'అ' గురువు కాదు. దీనికి ఛందస్సులో 'శిథిలద్విత్వం' అని పేరు. చదివేటప్పుడు కుతలం.... బద్రువన్ అని 'బ' తేల్చి పలుకవలెను.

**వ. ఇట్లు నివాతకవచులు మదీయదివ్యాస్త్రనిహతులై మహీతలంబునం బడిన; నట యసురకాంతలయాక్రందన ధ్వను లాకసం బద్రువ నొక్కటఁ బురంబున నెగసె; నంత నద్దానవపురంబుఁ బురందరుపురంబుకంటె నతిసుందరం బైన దానిం జూచి మాతలి కి ట్లంటి. 73**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; నివాతకవచులు= నివాతకవచులు అనే రక్కసులు; మదీయ, దివ్య+అస్త్ర నిహతులు+ఐ= నాయొక్క దివ్యమైన మంత్రబాణాలచేత మరణించిన వారై; మహీతలంబునన్+పడినన్= భూమిపైభాగాన కూలిపడగా; అట= అచట; అసురకాంతలు= రాక్షసులస్త్రీలు; ఆక్రందన ధ్వనులు= బిగ్గరగా ఏడ్చే శబ్దాలు; ఆకసంబు+అద్రువన్= ఆకాశం దద్దరిల్లగా; ఒక్కటన్= ఒకేసారిగా; పురంబునన్= పట్టణంలో; ఎగసెన్= వ్యాపించాయి; అంతన్= అటు పిమ్మట; ఆ+దానవ,

పురంబున్= ఆ రాక్షసుల పట్టణాన్ని; పురందరు పురంబుకంటెన్= దేవేంద్రుడినగర మైన అమరావతికంటె; అతి, సుందరంబు+ఐనదానిన్= మిక్కిలిసొగసైనదానిని; చూచి=కని; మాతలికి= దేవేంద్రుడి సారథికి; ఇట్లు+అంటిన్= ఈవిధంగా అన్నాను.

**తాత్పర్యం:** ఈ విధంగా నివాతకవచులు దివ్యాలైన నా మంత్రబాణాలచేత మరణించి భూమిపైభాగాన కూలిపడ్డారు. అచట రాక్షసస్త్రీలఏడుపులు పెనుబొబ్బలు ఆకసాన్ని దద్దరిల్ల చేశాయి. అంతట, దేవేంద్రుడిముఖ్యపట్టణమైన అమరావతికంటె ఎంతయో అందంగా ఉన్న ఆ రాక్షసులపట్టణాన్ని చూచి నేను మాతలితో ఇట్లా అన్నాను.

**క. 'నిరుపమరత్ననిరంతర । వరగృహముల నొప్పి సుఖనివాసం బగు ని**
**ప్పురి నుండ నొల్ల కొండొక । పురి నుండఁగ నేల వలసెఁ బురుహూతునకున్.' 74**

**ప్రతిపదార్థం:** నిరుపమ, రత్న, నిరంతర, వర, గృహములన్= సాటిలేని మణులతో ఎడతెగకుండ కట్టబడిన గొప్పఇండ్లతో; ఒప్పి= శోభిల్లి; సుఖ, నివాసంబు+అగు= నివసించడానికి సుఖంగా ఉండే; ఈ+పురిన్= ఈపట్టణంలో; ఉండన్+ఒల్లక= నివసించటానికి ఇష్టపడక; పురుహూతునకున్= ఇంద్రుడికి; ఒండు+ఒక+పురిన్= మరొక పట్టణంలో; ఉండఁగన్+ఏల, వలసెన్= ఎందుకు నివసించవలసివచ్చింది.

**తాత్పర్యం:** 'సాటిలేని రత్నాలతో దట్టంగా పొదుగబడిన ఇండ్లతో శోభిల్లే ఈ నగరంలో సుఖనివాసం చేయక వేరొక పట్టణాన ఇంద్రు డేల నివసించవలసి వచ్చింది?'

**వ. అనిన మాతలి యి ట్లనియె. 75**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; మాతలి= ఇంద్రుడిసారథి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని నేను ప్రశ్నించగా మాతలి ఈవిధంగా ప్రత్యుత్తరం ఇచ్చాడు.

**సీ. 'అసురులవలన భయం బైన యపుడు వే । ల్పులకు సేమంబుగా బలవిరోధి**
**యీప్రోలు జలధిలో నిమ్ముగ నిర్మించె; । దనుజులు పదపడి వనజగర్భు**
**వలనఁ దపోవీర్యవంతు లై యిందుండ, నమరులచేతఁ గయ్యమున నజితు**
**లై యుండఁ బడసిన, నమరేంద్రుఁ డెఱిఁగి త । ద్విజయార్థముగఁ బంచె విజయ! నిన్ను;**

**ఆ. నమరులకు నసాధ్యు లైనట్టి వీరల । నీవ యోర్చి' తనుచు నెమ్మితోడ**
**నన్ను సంస్తుతించి నరనాథ! మాతలి । గడఁగి యపుడు రథముఁ గ్రమ్మఱించె. 76**

**ప్రతిపదార్థం:** విజయ!= ఓఅర్జునా!; అసురులవలనన్= రాక్షసులవలన; భయంబు+ఐన+అపుడు= వెఱపు కలిగినప్పుడు; వేల్పులకు= దేవతలకు; సేమంబుగా= క్షేమంగా; బలవిరోధి= దేవేంద్రుడు; ఈ+ప్రోలు= ఈ నగరాన్ని; జలధిలోన్= సముద్రంలో; ఇమ్ముగన్= సంప్రీతితో; నిర్మించెన్= కట్టించాడు; దనుజులు= రాక్షసులు; పదపడి= పిమ్మట; వనజ, గర్భువలనన్= బ్రహ్మదేవుడివలన; తపస్+వీర్యవంతులు+ఐ= తపస్సు అనే బలం కలవారై; ఇందు+ఉండన్= ఇందు ఉండుటకొరకై; అమరులచేతన్= వేల్పులచేత; కయ్యమునన్= యుద్ధంలో; అజితులు+ఐ+ఉండన్= ఓడిపోకుండ ఉండటానికై; పడసినన్= వరాన్ని సంపాదించగా; అమరేంద్రుఁడు= దేవేంద్రుడు; ఎఱిఁగి= తెలిసికొని; తద్+విజయ+అర్థముగన్= వారిని జయించటంకొరకై;

నిన్ను; పంచెన్= నియోగించాడు; అమరులకున్= వేల్పులకు; న+సాధ్యులు+ఐనట్టి= జయించటానికి అలవికానట్టి; వీరలన్= ఈ నివాతకవచులను; ఈవు+అ= నీవే; ఓర్చితి= జయించావు; అనుచున్= అని చెప్పుతూ; నెమ్మితోడన్= ప్రీతితో; నన్నున్; సంస్తుతించి= పొగడి; నరనాథ!= రాజైన ఓ ధర్మరాజా!; మాతలి= దేవేంద్రుడిసారథి; కడఁగి= పూని; అపుడు= అప్పుడు; రథమున్= తేరును; క్రమ్మఱించెన్= మరల్చాడు.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! రాక్షసులవలన భీతి ఏర్పడిన సమయంలో, దేవతలయోగక్షేమాలను కాపాడగోరి దేవేంద్రుడు ఈ పట్టణాన్ని సముద్రంలో నిర్మించాడు. తరువాత రాక్షసులు తపస్సుచేసి తాము తపోబల సంపన్నులై ఈపట్టణంలో ఉండటానికీ, దేవతలచేత యుద్ధంలో జయించబడక ఉండటానికీ బ్రహ్మదేవుడి వలన వరం పొంది, ఈ పురాన్ని ఆక్రమించారు. వారిని జయించటానికే దేవేంద్రుడు నిన్ను నియోగించాడు. దేవతలకు జయింప శక్యంగాని వీరులను నివాతకవచులను నీవు గెల్చావు- అని ప్రశంసించి, మాతలి రథాన్ని మరలించాడు' అని అర్జునుడు ధర్మరాజుతో చెప్పాడు.

**వ. ఇట్లు నివాతకవచులం జంపి క్రమ్మఱి వచ్చునెడ నాముందట నొక్క తపోవనంబును నతివిచిత్రం బైన పురంబునుం గని 'యిది యెవ్వరిపురం?' బని యడిగిన నాకు మాతలి యి ట్లనియె. 77**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నివాతకవచులన్= నివాతకవచులు అనబడే రక్కసులను; చంపి= సంహరించి; క్రమ్మఱివచ్చు+ఎడ= తిరిగి వచ్చేటపుడు; నా, ముందటన్= నాయెదుట; ఒక్కతపస్+వనంబునన్= తపస్సు చేయటానికి అనువైన ఒక అరణ్యమున్నూ; అతి విచిత్రంబు+ఐన= మిక్కిలి వింతైన; పురంబునున్+కని= ఒక పట్టణాన్నీ, చూచి; ఇది= ఈ పట్టణం; ఎవ్వరిపురంబు= ఎవరినగరం; అని= అంటూ, అడిగినన్= ప్రశ్నించగా; నాకున్= నాతో; మాతలి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా నివాతకవచులను సంహరించి తిరిగి వస్తున్నప్పుడు నాయెదుట ఒక తపోవనమున్నూ, మిక్కిలి అచ్చెరువు కలిగించే ఒక నగరమున్నూ కన్పించాయి. 'ఇది ఎవ్వరిపురం?' అని నేను ప్రశ్నించగా, మాతలి ఇట్లా సమాధానం చెప్పాడు.

**క. 'వినవె పులోమయుఁ గాలక । యును ననఁగా నిరువు రసురయువతులు గమలా**
**సను నారాధించిరి తప । మున దివ్యసహస్రవర్షములు గడునిష్ఠన్. 78**

**ప్రతిపదార్థం:** వినవె= ఆలకించలేదా, (శ్రద్ధగా వినుము అనిన్నీ, ఇంతకుముందు వినలేదా అనిన్నీ భావం); పులోమయున్= పులోమ (అనేస్త్రీ); కాలకయునున్= కాలక (అనేస్త్రీ); అనఁగాన్= అనే పేరు కల; ఇరువురు+అసుర, యువతులు= ఇద్దరు రాక్షస వనితలు; తపమునన్= తపస్సుచేసి; దివ్య, సహస్ర, వర్షములు= దేవమానం ప్రకారం వేయిఏండ్లు; కడు+నిష్ఠన్= మిక్కుటమైన దీక్షతో; కమల+ఆసనున్= బ్రహ్మదేవుడిని (కమలం ఆసనంగా కలవాడిని); ఆరాధించిరి= అర్చించారు.

**తాత్పర్యం:** 'పులోమ, కాలక అనబడే ఇద్దరు రాక్షస యువతులు దేవమానం ప్రకారం వేయి సంవత్సరాలు మిక్కిలి నిష్ఠతో తీవ్రమైన తపస్సు చేసి బ్రహ్మదేవుడిని ఆరాధించారు. ఆ విషయం నీవు వినలేదా?

**క. కనకమయ మైన యీప్రో । లునఁ దమసుతు లాహవంబులో నమరులచే**
**తను వధ్యులు గాకుండను । వనజజుచేఁ బడసి రసురవనితలు వరముల్. 79**

**ప్రతిపదార్థం:** అసురవనితలు= రాక్షస స్త్రీలు; కనక, మయము+ఐన= బంగారంతో కూడిన; ఈ ప్రోలునన్= ఈ పట్టణంలో; తమ, సుతులు= తమ కొడుకులు; ఆహవంబులోన్= యుద్ధంలో; అమరులచేతను= దేవతలచేత; వధ్యులు+కాకుండను= చంపబడేవారు కాకుండగా; వనజజుచేన్= బ్రహ్మదేవుడిచేత (పద్మంలో పుట్టినవాడిచేత); వరముల్+పడసిరి= వరాలను పొందారు.

**తాత్పర్యం:** బంగారంతో నిర్మించబడిన ఈ నగరంలో నివసించే తమకొడుకులు యుద్ధంలో దేవతలచేతిలో మరణించకుండేటట్లుగా రాక్షసవనితలు బ్రహ్మదేవుడిచేత వరాలను పొందారు.

**వ. ఇది హిరణ్యపురం; బిందుఁ బౌలోమకాలకేయు లను నసురు లరువది వేలుండుదురు వా రమరులచేత నవధ్యు' లనిన 'నట్లేని దానిపయిం బోదము; రథంబు వఱపు' మని యేను మాతలిం బంచిన. 80**

**ప్రతిపదార్థం:** ఇది= (ఈనగరం)ఇది; హిరణ్యపురంబు= హిరణ్యపురం (పసిడిప్రోలు); ఇందున్= ఈ పురంలో; పౌలోమ, కాలకేయులు+అను= పులోమకొడుకులు, కాలకకొడుకులు, అనబడే; అసురులు= రక్కసులు; అరువది, వేలు+ఉండుదురు= అరువదివేలమంది ఉంటారు; వారు= ఆ పౌలోములు కాలకేయులు; అమరులచేతన్= దేవతలచేత; అవధ్యులు= చావులేనివారు; అనినన్= అని చెప్పగా; అట్లు+ఏని= అట్లా అయితే; దానిపయిన్+పోదము= ఆనగరంమీద దండెత్తివెళ్ళుదాము; రథంబు+పఱపుము= తేరు నడుపుము; అని= అని చెప్పి; ఏను= నేను; మాతలిన్= మాతలిని; పంచినన్= నియోగించగా.

**తాత్పర్యం:** ఇది హిరణ్యపురం; ఈ నగరంలో పులోమకొడుకులు, కాలకకొడుకులు పౌలోములు, కాలకేయులు అనబడే రక్కసులు అరువదివేలమంది ఉన్నారు. వీరు దేవతలచేత చావులేనివారు'- అని మాతలి చెప్పాడు. అంతట నేను 'అట్లయితే ఆ నగరంమీద దండయాత్రకు రథాన్ని పోనిమ్ము' అని, మాతలిని ఆదేశించాను.

**చ. అతఁడును సప్తమారుతరయంబున దివ్యరథంబుఁ దత్సురా**
**హితపురి భూరి వప్రముపయిం బఱపెన్ సురవైరు లంత ను**
**ద్ధతు లయి ప్రోలు వెల్వడి రథంబులు షష్టిసహస్రకంబుతో**
**శతమఖబుద్ధిఁ జేసి కడు సైఁపక తాఁకిరి నన్ను నల్కతోన్. 81**

**ప్రతిపదార్థం:** అతఁడును= ఆ మాతలియు; సప్త, మారుత, రయంబునన్= ఏడువాయువులవేగంతో; దివ్య రథంబున్= దేవతాసంబంధమైన రథాన్ని; తద్+సుర+అహిత పురి= ఆ దేవతల శత్రువుల నగరంయొక్క; వప్రము పయిన్= ప్రాకారశిఖరంపై; పఱపెన్= పోనిచ్చాడు; సుర వైరులు= రాక్షసులు; అంతన్= అంతట; ఉద్ధతులు+అయి= విజృంభించినవారు అయి; ప్రోలు వెల్వడి= నగరంనుండి బయటకు వచ్చి; రథంబులు, షష్టి, సహస్రకంబుతోన్= అరువదివేలతేరులతోన్; నన్ను; శతమఖ, బుద్ధిన్+చేసి= దేవేంద్రుడు అని తలపోసి; కడు, సైఁపక= మిక్కిలి ఓర్వక; అల్కతోన్= కోపంతో; తాఁకిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** ఆ మాతలి ఏడువాయువుల వేగంతో దేవతారథాన్ని, ఆ దేవతల శత్రువుల నగరంలోని కోటకొమ్మలపైకి నడిపించాడు. అంతట అందలి రాక్షసులు విజృంభించి, నగరంనుండి బయటికి వచ్చి, నన్ను దేవేంద్రుడు అని భావించి, ఆగ్రహించి, అరువదివేల తేరులతో చుట్టుముట్టారు.

**వ. ఏనును వారల యఱువదివేలరథంబులకు గతినిరోధంబుగా వితతవృక్షవికటశిలాప్రభవంబు లయిన దివ్యబాణంబు లేసిన, నసురులు మాయాయుద్ధనిబద్ధబుద్ధులై తమపురంబుతోడన దివంబున కెగసి మదీయమార్గణార్గళనిరుద్ధమార్గు లై నేలంబడిన, వీరల నొండువిధంబున నోర్వరా దని తలంచి. 82**

**ప్రతిపదార్థం:** ఏనును= నేనును; వారల+అరువది వేల రథంబులకు= ఆ రాక్షసులయొక్క అరువది వేల తేరులకు; గతి, నిరోధంబుగా= దారికి అడ్డుగా; వితత, వృక్ష, వికట, శిలా, ప్రభవంబులు+అయిన= విస్తరించబడిన చెట్లను, వికృతా లైన రాళ్లను పుట్టించేవి అయిన; దివ్య, బాణంబులు+ఏసినన్= అతిలోకా లైన అమ్ములు ప్రయోగించగా; అసురులు= రక్కసులు; మాయా, యుద్ధ, నిబద్ధ, బుద్ధులు+ఐ= మాయాయుద్ధాన్ని కొనసాగించటంలో లగ్నమైన మనస్సులు కలవారై; తమ పురంబుతోడన= తమ నగరంతోపాటు; దివంబునకున్= ఆకసానికి; ఎగసి= ఎగిరి; మదీయ, మార్గణ+అర్గళ, నిరుద్ధ, మార్గులు+ఐ= నాయొక్క బాణా లనే గొప్ప గడియమానుల చేత అడ్డగించబడినదారి కలవారై; నేలన్+పడినన్= భూమిమీద పడగా, వీరలన్= ఈ రక్కసులను; ఒండు విధంబునన్= వేరురీతిగా; ఓర్వరాదు+అని= గెలువరాదు అని; తలంచి= తలపోసి.

**తాత్పర్యం:** నేనును, ఆరాక్షసులయొక్క అరువదివేలతేరులు కదలటానికి వీలులేనట్లుగా పెక్కుచెట్లను, బండరాళ్లను కల్పించే దివ్యబాణాలను దారికి అడ్డంగా ఏర్పడేటట్లు ప్రయోగించాను. ఆ రక్కసులు కపట యుద్ధాన్ని చేయటానికి సంకల్పించినవారై తమ నగరంతోపాటు ఆకసానికి ఎగిరారు. కాని, నా బాణా లనెడి పెద్ద గడియలచేత అడ్డగించబడి భూమిపై పడ్డారు. ఇక, వీరిని వేరుతీరుగా గెలవటానికి వీలులే దని తలపోసి.

**చ. ఉరగఫణాగ్రరత్నకిరణోల్లసదుగ్రభుజున్ వృషాంకు శం**
**కరు శశిఖండమండితశిఖండు శివున్ హృదయాంబుజంబునం**
**దిరముగ నిల్పి పాశుపతదివ్యశరం బరివోసి యేసితిన్**
**సురరిపుకోటిమీఁద సురసూతుఁడు మాతలి చూచి మెచ్చఁగన్. 83**

**ప్రతిపదార్థం:** ఉరగ, ఫణా+అగ్ర, రత్న, కిరణ+ఉల్లసత్+ఉగ్రభుజున్= పాముల పడగల చివర కల మణుల వెలుగులచేత ప్రకాశించే భయంకర మైన భుజాలు కలవాడిని; వృష+అంకున్= ఎద్దుగుర్తు కలవాడిని; శంకరు= శివుడిని; శశిఖండ మండిత శిఖండున్= చంద్రవంకచేత అలంకరించబడిన సిగ కలవాడిని; శివున్= శివుడిని; హృదయ+అంబుజంబునన్= డెందం అనే తామరపువ్వులో; తిరముగన్= దిటవుగ; నిల్పి= పాదుకొల్పి; పాశుపత, దివ్య, శరంబు= పాశుపతం అనెడి దివ్య మైన మంత్రబాణాన్ని; అరివోసి= అనుసంధించి; సుర, రిపు, కోటిమీఁదన్= దేవతలకు శత్రువు లైన ఆ రాక్షసులగుంపులపై; సురసూతుఁడు= దేవతల సారథి; మాతలి; చూచి= కనుగొని; మెచ్చఁగన్= అభినందిచేటట్లుగా; ఏసితిన్= ప్రయోగించాను.

**తాత్పర్యం:** పాముల పడగలపై గల రత్నాల కాంతులచేత వెలుగొందే భయంకర మైన భుజాలు కలవాడిని, వృషభాన్ని జెండా పై గుర్తుగా కలవాడిని, చంద్రవంకను సిగలో భూషణంగా ధరించినవాడిని, నా డెందము అనెడి తామరపూవులో పాదుకొల్పి, పాశుపత మనే అస్త్రాన్ని మాతలి చూచి అభినందించేటట్లుగా ప్రయోగించాను.

**విశేషం:** 1) హరిసూతుఁడు మాతలి - అనే పాఠాంతరం కొన్ని ప్రతుల్లో ఉన్నది. 2) మెచ్చి చూడఁగన్, మెచ్చి యార్వఁగన్- ఈ పాఠాంతరాలు కొన్ని ప్రతుల్లో కనిపిస్తున్నాయి.

**వ. ఆ దివ్యాస్త్రప్రభావంబున సింహశరభశార్దూలశుండాలమహిషమహోక్షయక్షరాక్షసపిశాచపన్నగ గంధర్వరూపంబు లుద్భవిల్లి యసురుల నెల్ల విగతాసులం జేసిన. 84**

**ప్రతిపదార్థం:** ఆ+దివ్య+అస్త్ర, ప్రభావంబునన్= ఆ అతిలోకశక్తి కల మంత్రబాణంయొక్క మహిమవలన; సింహ, శరభ, శార్దూల, శుండాల, మహిష, మహోక్ష, యక్ష, రాక్షస, పిశాచ, పన్నగ, గంధర్వ, రూపంబులు= సింగములు, శరభములు పెద్దపులులు, ఏనుగులు, దున్నలు, ఎద్దులు, యక్షులు, రాక్షసులు, పిశాచులు, పాములు, గంధర్వులయొక్క ఆకృతులు; ఉద్భవిల్లి= పుట్టి; అసురులన్= రాక్షసులను; ఎల్లన్= అందరిని; విగత+అసులన్+చేసినన్= పోయిన ప్రాణాలు కలవారిగా చేయగా.

**తాత్పర్యం:** దివ్యమైన ఆ పాశుపతాస్త్ర మహిమవలన సింహాలు, శరభాలు, పెద్దపులులు, ఏనుగులు, దున్నలు, ఎద్దులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు, పిశాచులు, గంధర్వులు పుట్టి రాక్షసులను అందరిని సంహరించగా.

**క. వంచనయును మాయయు మా। యించి పరాక్రాంతి నయ్యుమేశాస్త్రమునం**
**గ్రంచఱ నంతకపురి కేఁ। గించితిఁ బౌలోమకాలకేయాసురులన్. 85**

**ప్రతిపదార్థం:** వంచనయును= మోసాన్ని; మాయయు= కపటత్వాన్నీ; మాయించి= తొలగించి; పర+ఆక్రాంతిన్= మిక్కిలి గొప్పదైన పరాక్రమంతో; ఆ+ఉమేశ+అస్త్రమునన్= ఆ పాశుపతం అనే మంత్రబాణంతో; క్రంచఱన్= శీఘ్రంగా; పౌలోమ, కాలకేయ+అసురులన్= పౌలోములు కాలకేయులు అనబడే రాక్షసులను; అంతక పురికి= యమధర్మరాజు పట్టణానికి; ఏఁగించితిన్= పంపించాను (చంపానని భావం).

**తాత్పర్యం:** మోసాన్ని, దుర్భ్రమను తొలగింపజేసి, మిక్కుటమైన పరాక్రమంతో విజృంభించి, పాశుపతాస్త్రాన్ని ప్రయోగించి, పౌలోములు, కాలకేయులు అనబడే ఆ రాక్షసులనుసంహరించి యమపురికి వెడలేటట్లుగా చేశాను.

**వ. ఇట్లు హిరణ్యపురనివాసులం గృతాంతపురనివాసులం జేసి వచ్చి వాసవునకు మ్రొక్కిన, వాసవుండును నివాతకవచపౌలోమకాలకేయుల వధప్రకారం బంతయు మాతలివలన విని సంతసిల్లి నా కి ట్లనియె.86**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; హిరణ్యాపుర, నివాసులన్= హిరణ్యాపురంలో నివసించే వారలను - పౌలోమ కాలకేయులను; కృతాంత, పుర, నివాసులన్+చేసి= యముడినగరంలో నివసించేవారినిగా చేసి; వచ్చి= ఏతెంచి; వాసవునకున్= దేవేంద్రుడికి; మ్రొక్కినన్= నమస్కరించగా; వాసవుండును= దేవేంద్రుడును; నివాతకవచ, పౌలోమ, కాలకేయుల, వధ+ప్రకారంబు= నివాతకవచుల యొక్కయు పౌలోములయొక్కయు కాలకేయులయొక్కయు, సంహారంతీరు; అంతయున్= సమస్తమున్నూ; మాతలివలనన్= దేవేంద్రుడి సారథివలన; విని= ఆలకించి; సంతసిల్లి= సంతోషించి; నాకు+ఇట్లు+అనియెన్= నాతో ఈ రీతిగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా నేను ఆ హిరణ్యాపురవాస్తవ్యులను యమపురివాస్తవ్యులుగా చేసి మరలివచ్చి దేవేంద్రుడికి నమస్కరించాను. దేవేంద్రుడు, మాతలివలన నివాతకవచుల, పౌలోముల, కాలకేయుల సంహారాన్నిగూర్చి విని, సంతోషించి నాతో ఈ విధంగా పలికాడు.

**చ. 'సురలకుఁ బ్రీతి సేసితి; వసుంధర కేఁగుము; నిన్ను నీ సహో**
**దరులు నిరంతరంబును ముదంబునఁ జూడఁగఁ గోరుచున్నవా;**
**రరిమదభేది! నీకు విషమాజిముఖంబుల మార్కొనంగ నో**
**పరు నరు లెవ్వరున్; హరి కిభంబులు మార్కొనునయ్య యెయ్యెడన్? 87**

**ప్రతిపదార్థం:** సురలకున్= దేవతలకు; ప్రీతి+చేసితి= సంతసం చేకూర్చావు; వసుంధరకు+ఏఁగుము= భూలోకానికి వెళ్ళుము; నిన్నున్= నిన్ను; నీ సహోదరులు= నీ అన్నదమ్ములు; ముదంబునన్= సంప్రీతితో; చూడఁగన్+కోరుచున్నవారు= చూడవలె నని ఆకాంక్షిస్తున్నారు; అరి మదభేది!= శత్రువుల గర్వాన్ని బ్రద్దలుకొట్టే ఓ అర్జునా!; నీకు; విషమ+ఆజిముఖంబుల= ఘోరమైన యుద్ధాలలో; మార్కొనంగన్= ఎదిరించగా; నరులు; ఎవ్వరున్= ఎవ్వరున్నూ; ఓపరు= సమర్థులు కారు; హరికిన్= సింహాన్ని; ఇభంబులు= ఏనుగులు; ఎయ్యెడన్= ఎక్కడనైనా; మార్కొనున్+అయ్య= ఎదుర్కొనగలవయ్యా? (ఎదుర్కొనలేవని భావం).

**తాత్పర్యం:** శత్రువులగర్వాన్ని అణచేవాడవైన ఓ అర్జునా! నీవు దేవతలకు సంప్రీతి సంఘటించావు; నీ అన్నదమ్ములు నిన్ను చూడవలె నని తహతహలాడుతున్నారు. యుద్ధాలలో నిన్ను మానవు లెవ్వరూ ఎదుర్కొనలేరు; సింహాన్ని ఏనుగులు ఎదుర్కొనగలవా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క.** **ద్రోణద్రోణజ కృపగీ । ర్వాణనదీజాంగపతు లవశ్యమును భవ**
**ద్బాణహతిఁ జేసి సమర । క్షోణిఁ బరిక్షీణబలు లగుదు రవజితులై.' 88**

**ప్రతిపదార్థం:** ద్రోణ, ద్రోణజ, కృప, గీర్వాణనదీజ+అంగపతులు= ద్రోణుడు, ద్రోణునికొడుకు అయిన అశ్వత్థామ, కృపుడు, దేవనది అయిన గంగానదికి జన్మించిన భీష్ముడు, కర్ణుడును; అవశ్యమును= తప్పని సరిగా; భవత్+బాణ, హతిన్+చేసి= నీయొక్క అమ్ములదెబ్బలచేత; సమరక్షోణిన్= యుద్ధరంగంలో; అవజితులు+ఐ= ఓడించబడినవారై; పరిక్షీణబలులు= మిగుల తరిగినబలం కలవారు; అగుదురు= ఔతారు.

**తాత్పర్యం:** ద్రోణుడు, ద్రోణుడిపుత్రు డైన అశ్వత్థామ, కృపాచార్యుడు, దేవనదీసూను డైన భీష్ముడు, అంగదేశ ప్రభు వైన కర్ణుడు నీ అమ్ములదెబ్బలచేత ఓడించబడినవారై రణరంగంలో పూర్తిగా బలాన్ని కోల్పోతారు.

**క.** **అనిన నమరేంద్రు వీడ్కొని । చనుదెంచితి' నని కిరీటి శతమఖలోకం**
**బునఁ దన చేసినవిధ మ । త్యనఘుం డేర్పడఁగఁ జెప్పె నందఱు వినఁగన్. 89**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అమర+ఇంద్రున్= దేవేంద్రుడిని; వీడ్కొని= సెలవుగైకొని; చనుదెంచితిన్= వచ్చాను; అని= అనిచెప్పి; కిరీటి= అర్జునుడు; శతమఖలోకంబునన్= దేవేంద్రుడిలోకంలో; తన, చేసిన, విధము= తాను చేసిన పనులతీరు; అందఱు వినఁగన్= అందరును ఆలకించేటట్లుగా; అతి+అనఘుండు= పాపాలు లేని మిక్కిలిగొప్పవాడు-అర్జునుడు; ఏర్పడఁగన్+చెప్పెన్= తేటతెల్లంగా వివరించి చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా, నేను దేవేంద్రుడికడ సెలవు తీసికొని ఇక్కడికి వచ్చాను'- అని అర్జునుడు తాను స్వర్గలోకంలో చేసిన పనుల నన్నింటిని అందరూ ఆలకించేటట్లుగా తేటతెల్లంగా చెప్పాడు.

**వ.** **ధర్మరాజును దమ్ముఁడు సేసిన మహాపరాక్రమంబునకుఁ జతురంభోధిపర్యంతమహీరాజ్యం బప్పుడు తనకు సంప్రాప్తం బైనంతియ సంతసిల్లి. 90**

**ప్రతిపదార్థం:** ధర్మరాజును= ధర్మపుత్రుడుసయితం; తమ్ముఁడు+చేసిన= తన సోదరుడు చేసిన; మహాపరాక్రమంబునకున్= గొప్ప శౌర్యానికి; చతుర్+అంభోధి, పర్యంత, మహీ, రాజ్యంబు= నాలుగు సముద్రాలవరకు విస్తరించిన భూరాజ్యం; అప్పుడు= అప్పుడే; తనకు= తనకు; సంప్రాప్తంబు+ఐనంతియ= సంక్రమించినట్లుగానే; సంతసిల్లి= సంతసించి.

**తాత్పర్యం:** తన తమ్ముడైన అర్జునుడు ప్రదర్శించిన శౌర్యసాహసాలు ఆలకించి, ధర్మరాజు- తనకు అప్పుడే నాలుగుసముద్రాలచేత పరివేష్టించబడిన సమస్తభూమండలసామ్రాజ్యం సంక్రమించినట్లుగనే మిక్కిలి సంతోషించాడు.

**ఆ. 'దివ్యబాణములు తదీయప్రయోగముల్ । మాకుఁ జూపు' మనిన మఘవసుతుఁడు**
**వేఱువేఱ చూపె వేలుపు లిచ్చిన । యస్త్రశస్త్రములు నిజాగ్రజునకు. 91**

**ప్రతిపదార్థం:** దివ్య బాణములు= గొప్పఅస్త్రాలు; తదీయ ప్రయోగముల్= వాటిని ఉపయోగించే విధానాలు; మాకున్+చూపుము= మాకు ప్రదర్శించి చూపుము; అనినన్= అని అడుగగా; మఘవసుతుఁడు= దేవేంద్రుడికొడుకైన అర్జునుడు; వేలుపులు+ఇచ్చిన= దేవతలు బహూకరించిన; అస్త్ర, శస్త్రములు= మంత్రబాణాలు, ఆయుధవిశేషాలు; నిజ+అగ్రజునకున్= తన అన్నగారికి; వేఱు వేఱ= విడివిడిగా; చూపెన్= ప్రదర్శించాడు.

**తాత్పర్యం:** 'దేవతలు బహూకరించిన అస్త్రాలు, అవి ఉపయోగించే తీరుతెన్నులు మాకు చూపుము' అని ధర్మరాజు అర్జునుడిని అడిగాడు. అర్జునుడు దేవతలు తనకు ఇచ్చిన మంత్రబాణాలు, ఆయుధవిశేషాలు తన అన్నగారైన ధర్మరాజుకు విడివిడిగా ప్రదర్శించి చూపాడు.

**వ. మఱియును. 92**

**తాత్పర్యం:** ఇంకను.

**చ. సురవిశిఖ ప్రయోగములు సూపఁ దొడంగిన నేల దిర్దిరం**
**దిరిగెఁ, బయోనిధుల్ గలఁగె, దిగ్గజముల్ మదమేది కుందె, భా**
**స్కరరుచి మాసెఁ, బావకశిఖాతతి తోన యడంగె గాడ్పు, లం**
**బరమున నిల్చి రీశ్వరుఁడు బ్రహ్మయు నాదిగ వేల్పులందఱున్. 93**

**ప్రతిపదార్థం:** సుర, విశిఖ, ప్రయోగములు= దివ్య మైన అస్త్రాలను ప్రయోగించటాలు; చూపన్+తొడంగినన్= ప్రదర్శించడానికి ఉపక్రమించగా; నేల= భూమి; దిర్దిరన్+తిరిగెన్= వేగంగా తిరుగాడింది; పయస్+నిధుల్= సముద్రాలు; కలఁగెన్= కలతచెందాయి; దిక్+గజముల్= దిక్కులం దుండే ఏనుగులు; మదము+ఏది= గర్వం ఉడిగి; కుందెన్= క్రుంగిపోయాయి; భాస్కరరుచి= సూర్యుడి ప్రకాశం; మాసెన్= తగ్గిపోయింది; పావక, శిఖా, తతి= అగ్నిహోత్రుడి జ్వాలల సముదాయం; తోన= వెనువెంటనే; గాడ్పులు= వాయువులు; అడంగెన్= అణగారి పోయాయి; ఈశ్వరుఁడు= శివుడు; బ్రహ్మయున్= బ్రహ్మదేవుడు; ఆదిగ, వేల్పులు= మొదలైన దేవతలు; అందఱున్= అందరును; అంబరమునన్= ఆకసంలో; నిల్చిరి= నిల్చున్నారు.

**తాత్పర్యం:** అర్జునుడు తాను సంపాదించిన దివ్యాస్త్రాలప్రయోగాలను అన్నగా రైన ధర్మరాజుకు చూపేటప్పుడు భూమి దిర్దిర తిరిగింది. సముద్రాలు ఘూర్ణిల్లాయి, దిగ్గజాలు గర్వం వీడి క్రుంగిపోయాయి. సూర్యుడికాంతి

మాసిపోయింది, వాయువులు అగ్నిజ్వాలలతోపాటే అణగారిపోయాయి. శివుడు, బ్రహ్మదేవుడు మున్నగుదేవతలందరు ఆకసంలో గుమిగూడి నిల్చారు.

**వ. అంత సురగణచోదితుం డైన నారదుం డర్జునుపాలికి వచ్చి యి ట్లనియె. 94**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతట; సుర, గణ, చోదితుండు+ఐన= దేవతలసమూహంచేత పంపించబడిన; నారదుండు= నారదుడు; అర్జును, పాలికిన్= అర్జునుడికడకు; వచ్చి= ఏగుదెంచి; ఇట్లు+అనియెన్= ఆవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంతట దేవతలచేత పంపబడిన నారదమహర్షి అర్జునుడి దగ్గరకువచ్చి ఇట్లా పలికాడు.

**తే. 'ఎదురు లేక దివ్యాస్త్రంబు లిట్లు నీకుఁ । బాడియే ప్రయోగింపంగఁ బాండుపుత్త్ర!**
**సిద్ధ మివి యధిష్ఠానవర్జితము లయ్యె । నేని మూఁడులోకములు దహించు నొగిని.' 95**

**ప్రతిపదార్థం:** ఎదురు లేక= శత్రువులు ఎదుట లేకుండగా; దివ్య+అస్త్రంబులు= దేవతామహిమ కల మంత్రబాణాలను; ఇట్లు= ఈ రీతిగా; ప్రయోగింపంగన్= విడుచుట; నీకున్+పాడియే= నీకు న్యాయమా; పాండు పుత్త్ర!= పాండురాజుకు కొడుకు వైన ఓ అర్జునా!; ఇవి= ఈ అస్త్రాలు; అధిష్ఠాన, వర్జితములు+అయ్యెనేని= ఆశ్రయించతగిన లక్ష్యాలు లేకపోతే; ఒగిని= వరుసగా; మూఁడులోకములు= మూడులోకాలను; దహించున్= తగులపెట్టగలవు; సిద్ధము= ఇది జరిగితీరేది.

**తాత్పర్యం:** 'పాండుసుతుడ వైన ఓ అర్జునా! ఎదురుగా భేదించలసిన లక్ష్యం లేకుండా ఈ దివ్యాస్త్రాలను ప్రయోగిస్తే, అవి మూడులోకాలను దహించ కలవు సుమా!'

**వ. అని యర్జును వారించి నారదుం డరిగిన, నమరులు నిజస్థానంబుల కరిగి; రిట్లు పాండవు లందుఁ బదిమాసంబు లుండునంత; నొక్కనాఁ డమరకన్యకలు వచ్చి యర్జునున కి ట్లనిరి. 96**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; అర్జును వారించి= అర్జునుడిని ఆపి; నారదుండు= నారదుడు; అరిగినన్= వెళ్లగా; అమరులు= దేవతలు; నిజ స్థానంబులకున్= తమనివాసాలకు; అరిగిరి= వెళ్ళారు; ఇట్లు= ఈ రీతిగా; పాండవులు= పాండురాజుకొడుకులు; అందున్= ఆ ఆశ్రమంలో; పది, మాసంబులు+ఉండునంతన్= పదినెలలు నివసించిన పిదప; ఒక్క, నాఁడు= ఒక దినమున; అమర కన్యకలు= వేల్పుల ఆడపడుచులు; వచ్చి= అరుదెంచి; అర్జుననకున్= అర్జునుడితో; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** అని పలికి, అర్జునుడిని అస్త్రప్రదర్శనం నుండి విరమింపజేసి నారదుడు వెళ్ళాడు. దేవతలుకూడ తమతమ నివాసస్థానాలకు వెళ్ళారు. అంత పాండవులు ఆ ఆశ్రమంలో పదినెలలు ఉన్నారు. అప్పుడు వేల్పులఆడపడుచులు అర్జునుడికడకు వచ్చి ఇట్లా పలికారు.

**తే. 'వనమునందును బండ్రెండువత్సరములు । నలయ కజ్ఞాతవాస మేకాబ్దకంబు**
**పూని నిర్విఘ్నవృత్తిఁ జల్పుదురు మీరు । పగఱ నిర్జింతు రాహవాభ్యంతరమున. 97**

**ప్రతిపదార్థం:** మీరు; వనమునందును= అరణ్యంలో; పండ్రెండు, వత్సరములున్= పండ్రెండుఏండ్లు; అలయక= శ్రాంతిచెందక; అజ్ఞాత వాసము= ఇతరులకు తెలియకుండ నివసించటం; ఏక+అబ్దకంబు= ఒక్కఏడు; పూని= దీక్షతో; నిర్విఘ్న, వృత్తిన్=

ఆటంకాలు లేనట్లుగా; చల్పుదురు= నిర్వహించగలరు; ఆహవ+అభ్యంతరమునన్= యుద్ధంలో; పగఱ= శత్రువులను; నిర్జింతురు= జయిస్తారు.

**తాత్పర్యం:** అడవిలో పన్నెండేండ్లున్నూ, ఇతరులకు తెలియరాకుండ అజ్ఞాతవాసంలో ఒక యేడున్నూ మీరు ఎట్టి అడ్డంకులు లేకుండ నిర్వహించగలుగుతారు. అటుపిమ్మట యుద్ధంలో శత్రువులను జయించగలరు.

**తే. నీ పరాక్రమబలమున నిఖిలధరణి । రాజ్యభారంబు నీ ధర్మరాజు పూను;**
**రఘుకులాధీశ్వరుం డైన రాముకీర్తి । యట్ల నీ కీర్తి త్రిజగంబులందుఁ బరఁగు.' 98**

**ప్రతిపదార్థం:** నీ, పరాక్రమ, బలమున= నీ శౌర్యవిశేషంచేత; నిఖిల, ధరణి= సమస్త పృథివియొక్క; రాజ్యభారంబున్= పరిపాలించే కార్యపు బరువును; ఈ ధర్మరాజు= ఈ ధర్మసుతుడు; పూనున్= వహిస్తాడు; రఘుకుల+అధీశ్వరుండు+ఐన= రఘుమహారాజుయొక్క వంశంలో ప్రభువైన; రాము కీర్తి+అట్లు+అ= శ్రీరామచంద్రుడి యశస్సువలె; నీ, కీర్తి= నీయశస్సు; త్రిజగంబులందున్= మూడులోకాలలో; పరఁగున్= శోభిల్లుతుంది, వ్యాపిస్తుంది.

**తాత్పర్యం:** నీ శౌర్యవిశేషంవలన ఈ ధర్మరాజు సమస్తభూసామ్రాజ్యాన్ని పరిపాలించే భారాన్ని వహిస్తాడు; రఘువంశంలో జన్మించిన ప్రభువగు ఆ రామచంద్రుడి కీర్తివలె నీ కీర్తి ముల్లోకాలలో వెలుగొందుతుంది.

**వ. అని యాదేశించి దేవకన్యకలు వోయిన, నిట దేవర్షి యైన రోమశుండు ధర్మరాజునకు ధర్మానుశాసనంబు సేసి దివంబున కరిగె; నంతఁ బాండవు లెప్పటియట్ల ఘటోత్కచసేనానీతు లై క్రమ్మఱి వృషపర్వునివాసంబు సూచుచు బదరీవనంబున నొక్కరాత్రి వసియించి, సుబాహుపురంబునకు వచ్చి యందుఁ దమ పరిచారకు లైన యింద్రసేనాదులం గూడి నిజరథారూఢు లై ఘటోత్కచుం బోవం బనిచి హిమవత్పర్వతంబునందు దేవర్షి బ్రహ్మర్షులయజ్ఞప్రదేశంబుల ననేకవిధయూపంబులు సూచుచు నొక్కవర్షం బుండి; రంత నొక్కనాఁడు.99**

**ప్రతిపదార్థం:** అని+ఆదేశించి= అని తమ అభిమతాన్ని తెలిపి; దేవకన్యకలు= వేల్పుపడుచులు; పోయినన్= వెడలిపోగా; ఇట= ఇచట; దేవ+ఋషి+ఐన= దేవతలముని అయిన; రోమశుండు= రోమశుడు; ధర్మరాజునకున్= ధర్మపుత్రుడికి; ధర్మ+అను శాసనంబు+చేసి= ధర్మాన్ని గూర్చిన విషయాలను ఆదేశించి; దివంబునకు= స్వర్గలోకానికి; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= అంతట; పాండవులు= పాండురాజుసుతులు; ఎప్పటి+అట్లు+అ= యథాప్రకారంగా; ఘటోత్కచ, సేనా+ఆనీతులు+ఐ= ఘటోత్కచుడి యొక్క సేనచేత మోసికొని రాబడిన వారై; క్రమ్మఱి= వెనుకకు మరలి పయనించి; వృషపర్వు, నివాసంబు+ చూచుచు= వృషపర్వుడి ఆశ్రమాన్ని దర్శిస్తూ; బదరీవనంబునన్= బదరికాశ్రమంలో; ఒక్క, రాత్రి= ఒకరేయి; వసియించి= ఉండి; సుబాహుపురంబునకున్= సుబాహుడి రాజధానికి; వచ్చి= విచ్చేసి; అందున్= అచట; తమ, పరిచారకులు+ఐన= తమసేవకులు అయిన; ఇంద్రసేన+ఆదులన్+కూడి= ఇంద్రసేనుడు మున్నగువారలను చేరి; నిజరథ+ఆరూఢులు+ఐ= తమ తేరులను ఎక్కినవా రై; ఘటోత్కచున్+పోవన్+పనిచి= ఘటోత్కచుడిని పొమ్మని ఆదేశించి; హిమవత్+పర్వతంబునందు= హిమాలయపర్వతంలో; దేవ+ఋషి, బ్రహ్మ+ఋషుల= దేవతల ఋషులయొక్కయు, బ్రహ్మజ్ఞానులయిన మునులయొక్కయు; యజ్ఞప్రదేశంబులన్= యజ్ఞాలు చేసిన చోట్లలో; అనేకవిధ యూపంబులు= పెక్కు విధాలైన బలి కంబాలు; చూచుచున్= దర్శిస్తూ; ఒక్క, వర్షంబు= ఒక యేడు; ఉండిరి= నివసించారు; అంత= అంతట; ఒక్కనాఁడు= ఒక రోజున.

**తాత్పర్యం:** అని తమఅభిప్రాయాలు వెలిబుచ్చి వేల్పుపడుచులు వెళ్ళారు. ఇచట దేవఋషి అయిన రోమశుడు ధర్మరాజుకు ధర్మప్రబోధం చేసి స్వర్గలోకానికి చేరాడు. అంతట పాండవులు యథాప్రకారం ఘటోత్కచుడిసేనలతో

పాటు తిరుగుపయనం చేసి వృషపర్వుడి ఆశ్రమాన్ని సందర్శించి, బదరికాశ్రమంలో ఒకరేయి వసించి, సుబాహుపురానికి వచ్చి, అచట తమసేవకు లైన ఇంద్రసేనాదులను కలిసి, తమ రథాలను ఎక్కి, ఘటోత్కచుడిని వీడ్కొల్పారు. తదుపరి, హిమాలయపర్వతంలోని, దేవర్షులు బ్రహ్మర్షులు యజ్ఞాలు చేసిన పెక్కుచోట్లలో గల యూపస్తంభాలను చూస్తూ ఒకసంవత్సరం గడిపారు. అంతట ఒకరోజున.

## అజగరోపాఖ్యానము (సం. 3-176-5)

**క. మృగయార్థ మరిగి హిమవ । న్నగ భూములయందుఁ బవననందనుఁ డొక ప**
**న్నగుచేతఁ బట్టువడి యి । మ్ముగ ధర్మతనూజుచేత మోక్షితుఁ డయ్యెన్. 100**

**ప్రతిపదార్థం:** మృగయా+అర్థము+అరిగి= వేటకొరకు వెళ్ళి; హిమవత్+నగ, భూములయందున్= హిమాలయపర్వతప్రదేశాలలో; పవన నందనుఁడు= వాయుపుత్రుడు-భీముడు; ఒక=ఒక; పన్నగుచేతన్= పాముచేత; పట్టు+పడి= పట్టుకొనబడి; ఇమ్ముగన్= ప్రీతిగా; ధర్మతనూజుచేతన్= ధర్మపుత్రుడిచేత; మోక్షితుఁడు+అయ్యెన్= విడిపించబడినవాడు అయినాడు.

**తాత్పర్యం:** వాయుసుతు డైన భీముడు వేటకొరకు వెళ్ళి హిమాలయపర్వత ప్రదేశాలలో ఒక పాముచేత పట్టువడి ధర్మరాజుచేత విడిపించబడినాడు.

**వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 101**

**తాత్పర్యం:** అని చెప్పగా విని జనమేజయుడు వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు.

**మధ్యాక్కర.**

**'పదివేల గజముల బలము గలవాఁడు పౌలస్త్యుతోడఁ**
**గదనంబు సేసి యనేక యక్షరాక్షసుల నిర్జించి**
**యుదితశౌర్యోన్నతుం డైనవాఁడు వృకోదరుఁ డేల**
**పదపడి నిగృహీతుఁ డయ్యెఁ దా నొక్కపన్నగుచేత?' 102**

**ప్రతిపదార్థం:** పదివేల గజముల బలము+కలవాఁడు= పదివేల ఏనుగుల శక్తి కలవాడు; పౌలస్త్యుతోడన్= కుబేరుడితో; కదనంబు+చేసి= యుద్ధం చేసి; అనేక, యక్ష, రాక్షసులన్= పెక్కుమంది యక్షులను రాక్షసులను; నిర్జించి= జయించి; ఉదిత, శౌర్య+ఉన్నతుండు+ఐనవాఁడు= ప్రకటించబడిన పరాక్రమంయొక్క అతిశయంకలవాడు; వృకోదరుఁడు= భీముడు; ఏల= ఎందులకు; పదపడి= మఱియును; తాను; ఒక్కపన్నగుచేతన్= ఒక పాముచేత; నిగృహీతుఁడు+అయ్యెన్= పట్టుపడ్డాడు?

**తాత్పర్యం:** 'భీముడు పదివేలఏనుగుల బలం కలవాడుకదా! కుబేరుడితో యుద్ధం చేసి పెక్కుమంది యక్షులను రాక్షసులను జయించి, తన పరాక్రమాన్ని తేటతెల్లం చేసినవాడు చివరకు ఒకపాముచేత ఏ రీతిగా పట్టుబడ్డాడు?'

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 2.22 విశేషాంశం చూడండి.

**వ. అనిన విని వైశంపాయనుం డి ట్లనియె; భీముం డొక్కండ హిమవదుత్తుంగశృంగోపాంతకాంతారంబుల మృగయాభ్రాంతిఁ బరిభ్రమించుచుండి యతిశ్రాంతుం డయి తత్ప్రదేశంబున. 103**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= జనమేజయుడి ప్రశ్నను విని; వైశంపాయనుండు= వైశంపాయనమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు; భీముండు= భీముడు; ఒక్కండు+అ= ఒంటరిగా; హిమవత్+ఉత్తుంగ, శృంగ+ఉపాంత కాంతారంబులన్= హిమాలయపర్వతాలలోని మిక్కిలి ఎత్తయిన శిఖరాల దాపున కల అడవులలో; మృగయా భ్రాంతిన్= వేటతమకంతో; పరిభ్రమించుచు+ఉండి= తిరుగాడుతూ ఉండి; అతి, శ్రాంతుండు+అయి= మిక్కిలి డస్సినవాడై; తద్+ ప్రదేశంబునన్= ఆ చోటున.

**తాత్పర్యం:** అని జనమేజయుడు ప్రశ్నించాడు. అతడికి వైశంపాయనుడు ఈ రీతిగా సమాధానం చెప్పాడు. భీముడు ఒంటరిగా హిమాలయ పర్వత శిఖరాల దాపున గల అడవులలో వేటతమకంతో ఇటునటు తిరుగాడుతూ మిక్కిలి డస్సి, ఒకచోట.

**మ.** **అశనాశావివృతాస్యగహ్వరుఁ, గృతాంతాకారు, నిశ్వాస ధూ**
**మశిఖాధూసరితోగ్రదుర్గతరుగుల్మవ్రాతు, హారిద్ర వ**
**ర్ణశరీరున్, భృశరూక్షదర్శను, మహానాగప్రభుం గాంచె న**
**ర్ధశశాంకద్యుతి హారిదారుణ చతుర్దంష్ట్రున్ జగత్త్రాసకున్.** **104**

**ప్రతిపదార్థం:** అశన+ఆశా+వివృత+ఆస్యగహ్వరున్= ఆహారంకొరకై కోరికచేత తెరువబడిన నోరు అనెడిగుహ కలవాడిని; కృతాంత+ఆకారున్= యముడివంటి ఆకృతి కలవాడిని; నిశ్వాస, ధూమ, శిఖా, ధూసరిత+ఉగ్ర, దుర్గ, తరు, గుల్మ, వ్రాతున్= నిట్టూర్పులనెడి పొగలసెగలచేత బూడిదరంగుగా చేయబడిన భయంకరమై దట్టమై చొరసాధ్యంకానివి అయిన చెట్లు, పొదలు కలవాడిని; హారిద్రవర్ణ శరీరున్= పసుపురంగుదేహం కలవాడిని; భృశ, రూక్ష, దర్శనున్= మిక్కిలికరకైన చూపులు కలవాడిని; అర్ధ, శశాంక, ద్యుతి, హారి, దారుణ, చతుర్+దంష్ట్రున్= చంద్రవంక వెలుగును హరించే భయంకరమైన నాలుగుకోరలు కలవాడిని; జగత్+త్రాసకున్= ప్రపంచానికి భీతి కొలిపేవాడిని; మహానాగప్రభున్= గొప్పపాపరేనిని; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** భీముడు ప్రపంచానికి భీతికొలిపే కొండచిలువను చూచాడు. ఆ అజగరం ఆహారంకొరకైన కోరికతో నోరు తెరిచిఉన్నది. ఆనోరు గుహవలె ఉన్నది. ఆ పాముఆకృతి యముడివలె ఉన్నది. ఆ పాము తన నిట్టూర్పులనుండి వదలిన పొగలచేత ఆ అడవిలోని దట్టమైన చెట్లను, పొదలను భయంకరమైన బూడిదరంగుగలవానినిగా మార్చివేసింది. ఆ పాము శరీరచ్ఛాయ పసుపురంగుగా ఉంది, ఆ పాము చూపులు మిగుల కరకుగా, భీకరంగా ఉన్నాయి. ఆ పాపరేనికి చంద్రవంక కాంతులను మించిన నాలుగువంకర కోరలు ఉన్నాయి.

**వ.** **అమ్మహాజగరం బామిషార్థి యై భీముం బట్టికొని వాని భుజయుగంబుఁ దనముఖంబున నంగంబు నిజాంగంబునఁ జిక్కం బంధించిన నాగాయుతబలుం డయ్యును తదంగసంగంబున దుర్బలుండై మెలంగనేరక భీముం డప్పాము బలవీర్యంబులకు విస్మితుం డయి 'యిది ప్రకృతిసర్పంబుగా; దెయ్యదియేనియు నొక్కయద్భుతరూపం' బని విచారించుచు దాని కిట్లనియె.** **105**

**ప్రతిపదార్థం:** ఆ+మహా+అజగరంబు= ఆగొప్ప కొండ చిలువ; ఆమిష+అర్థి+ఐ= మాంసాన్ని (ఆహారంకొరకై) కోరెడిదై; భీమున్= భీముడిని; పట్టికొని= బంధించి; వాని, భుజ, యుగంబున్= ఆతడి రెండు భుజాలను; తన, ముఖంబునన్= తన నోటితో; అంగంబున్= (అతని) శరీరాన్ని; నిజ+అంగంబునన్= తన దేహంతో; చిక్కన్+బంధించినన్= గట్టిగా చుట్టిపట్టగా;

నాగ+ఆయుత, బలుండు+అయ్యును= పదివేల ఏనుగులతో సమానమైన బలం కలవాడు అయినప్పటికిని; తద్+అంగ, సంగంబునన్= ఆ పాము శరీరంయొక్క కలయికచేత; దుర్బలుండు+ఐ= బలంపోయినవాడై; మెలంగనేరక= కదలజాలక; భీముండు; ఆ+పాము, బల, వీర్యంబులకున్= ఆ పాముయొక్క బలానికీ, శౌర్యానికీ; విస్మితుండు+ఐ= అచ్చెరువు పొందినవాడై; ఇది= ఇది (ఈపాము); ప్రకృతి, సర్పంబు+కాదు= సహజమైన పాము కాదు; ఎయ్యది+ఏనియున్= ఏదియో; ఒక్క+ అద్భుతరూపంబు+అని= ఒక వింత ఆకృతి అని; విచారించుచున్= తలపోస్తూ; దానికిన్= ఆ పాముకు, ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ గొప్ప పెనుబాము మాంసాన్ని తనకు ఆహారంగా కోరి భీముడిని పట్టుకొని అతడి రెండు భుజాలు తన ముఖంతోను, అతడి శరీరాన్ని తన శరీరంతోను బంధించింది. భీముడు పదివేల యేనుగుల బలంగలవాడే అయినా, ఆ పాముచేత చుట్టుకొనబడిన శరీరం గలవాడై, కదలజాలక, దాని బలానికీ శౌర్యానికీ అచ్చెరువుపడి, అది సహజమైన సర్పం కాదనీ, ఏదో ఒక అద్భుతమైన ఆకృతి కావచ్చుననీ తలపోసి, ఆ పాముతో ఇట్లా పలికాడు.

**మత్తకోకిలము.**

**'ఏను భీముఁడఁ బాండవేయుఁడ నిద్ధతేజుఁడ ధర్మరా**
**జానుజుండఁ బిశాచపన్నగయక్షరాక్షసవీరులం**
**బూని పోరుల నోర్వనోపెడు భూరివీరుఁడ నాగపం**
**చాననాదులఁ బట్టి వ్రచ్చు ననంతబాహుబలాఢ్యుఁడన్. 106**

**ప్రతిపదార్థం:** ఏను=నేను; భీముఁడన్= భీముడను; పాండవేయుఁడన్= పాండురాజు కొడుకును; ఇద్ధ తేజుఁడన్= పరిశుద్ధమైన ప్రకాశం [పరాక్రమం] కలవాడను; ధర్మరాజు+అనుజుండన్= ధర్మరాజు తమ్ముడను; పిశాచ, పన్నగ, యక్ష, రాక్షస, వీరులన్= పిశాచు లైన పాములైన, యక్షులైన, రక్కసులు అయిన శూరులను; పూని= దీక్షతో; పోరులన్= యుద్ధాలలో; ఓర్వన్+ఓపెడు= జయించగల; భూరి+వీరుఁడన్= గొప్పశూరుడను; నాగ+పంచానన+ఆదులన్= ఏనుగులు, సింహాలు మొదలైనవాటిని; పట్టి= బంధించి, వ్రచ్చు= చీల్చి చంపెడి; అనంత, బాహు, బల+ఆఢ్యుఁడన్= అంతు లేని పరాక్రమశక్తి కలవాడను.

**తాత్పర్యం:** 'నేను భీముడిని, పాండురాజుకొడుకును, పరిశుద్ధ మైన తేజస్సు కలవాడను, ధర్మరాజుతమ్ముడను, పిశాచపన్నగయక్షరాక్షసవీరులను యుద్ధాలలో జయించజాలిన గొప్పశూరుడను, ఏనుగులు సింహాలు మున్నగు వాటిని పట్టి ముక్కలు చేయగల మితిలేని బాహుబలం కలవాడను.

**విశేషం:** వృత్తలక్షణానికి ఆర. 1.46 విశేషాంశం చూడండి.

**ఆ. ఇట్టి నన్నుఁ బట్టి యిప్పాట బంధించు। నట్టి శక్తి యెట్టు లయ్యె నీకు?**
**నిది నిసర్గశక్తియే? వరదానసం। సిద్ధి యైన యదియె? చెప్పు' మనిన. 107**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఇటువంటి; నన్నున్= నన్ను; పట్టి= పట్టుకొని; ఈ+పాట= ఈరీతిగా; బంధించు+అట్టి శక్తి= కదలకుండ నిగ్రహించే బలం; నీకు; ఎట్టులు+అయ్యెన్= ఏవిధంగా ఏర్పడింది?; ఇది= ఇది; నిసర్గ, శక్తియే= సహజమైనబలమా?; వర, దాన, సంసిద్ధి+ఐన+అదియె= వరాన్ని ఇవ్వటంవలన ఏర్పడినట్టిదా?; చెప్పుము+అనిన= వచించుము- అని అనగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా నావంటిబలవంతుడిని పట్టి బంధించేశక్తి నీకు ఏ విధంగా లభించింది? ఇది నీకు పుట్టుకతో ఏర్పడిన బలమా? లేక, ఏ దివ్యుడి వరంవలననో పొందిన సిద్ధియా, నాకు తెలియ చెప్పుము'- అని ప్రశ్నించాడు.

**వ. అదియును దిర్యగ్జాతి యయ్యును దనపూర్వస్మృతి సెడకుండ వరంబుఁ గాంచుటంజేసి వాని కి ట్లనియె.108**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ పామును; తిర్యక్+జాతి+అయ్యును= పశుపక్ష్యాదిజాతికి చెందిందే అయినప్పటికిన్నీ; తన, పూర్వ, స్మృతి= తనకు గల పూర్వజన్మజ్ఞానం; చెడకుండన్= చెడక ఉండేటట్లు; వరంబున్+కాంచుటన్+చేసి= వరాన్ని పొందటంచేత; వానికిన్= అతడికి- ఆ భీముడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నది.

**తాత్పర్యం:** పశుపక్ష్యాదులకోవకు చెందిందే అయినా ఆ పాము తనకు పూర్వజన్మపరిజ్ఞానం ఉండటంచేత, భీముడితో ఇట్లా పలికింది.

**క. 'ఇది నా వరలాభంబున । నుదయించినశక్తి; యెట్టియున్నతబలసం**
**పదు లైన జీవులును నా । కెదిరిచి బలహీను లగుదు రివ్విపినమునన్. 109**

**ప్రతిపదార్థం:** ఇది= నాకు గల ఈ అసాధారణశక్తి; నా, వర, లాభంబునన్= నేను పొందిన వరం వలననే; ఉదయించిన శక్తి= ఏర్పడిన బలం; ఎట్టి= ఎటువంటి; ఉన్నత, బల, సంపదులు+ఐన= గొప్ప శక్తిసంపదలు కల; జీవులును= ప్రాణులుకూడ; ఈ+విపినమునన్= ఈ అడవిలో; నాకు+ఎదిరిచి= నన్ను ఎదిరించి; బలహీనులు= బలంకోలుపోయినవారు; అగుదురు= ఔతారు.

**తాత్పర్యం:** ఈ అసాధారణ మైన బలం నాకు దివ్యవరంవలననే చేకూరింది; ఎంతటి బలసంపదలు కల ప్రాణులైనా ఈ అరణ్యంలో నన్ను ఎదిరిస్తే బలాన్ని కోలుపోతారు.

**ఆ. ఎదురఁ బడినవాని వదలక శార్దూల । శరభసామజాదిసత్త్వతతులఁ**
**బట్టి తినుచు నున్న యట్టి నా కిప్పుడు । భక్ష్య మైతి వీవు పాండుపుత్త్ర! 110**

**ప్రతిపదార్థం:** ఎదురన్+పడినవానిన్= ఎదురుగా వచ్చినవాటిని; వదలక= విడువక; శార్దూల, శరభ, సామజ+ఆది, సత్త్వ, తతులన్= పెద్దపులులు, శరభాలు (ఎనిమిదికాళ్ళు కల పెద్దమెకాలు), ఏనుగులు మున్నగు జంతువులసముదాయాలను; పట్టి= నిగ్రహించి; తినుచున్+ఉన్న+అట్టి= ఆహారంగా పట్టుకొని తింటున్న; నాకు+ఇప్పుడు= నాకు ఈనాడు; పాండు పుత్త్ర!= పాండురాజు కుమారుడైన ఓ భీమా!; ఈవు= నీవు; భక్ష్యము+ఐతివి= ఆహారంగా దొరికావు.

**తాత్పర్యం:** పాండురాజు కొమరుడవైన ఓ భీమసేనా! నాకు ఎదురుపడిన జంతువులను అన్నింటిని- పెద్దపులులుకాని శరభాలుకాని ఏనుగులుకాని పట్టి తింటున్న నాకు, ఇప్పుడు నీవు ఆహారంగా దొరికావు.

**ఆ. శక్రపదవిఁ బొంది సద్బ్రాహ్మణుల కవ । మాన మేనుఁ జేసి మదము పేర్మి**
**ననఘ! యిట్టు లైతి నం దొక్క మునివరు । శాపశక్తిఁ దొంటిశక్తి దఱిఁగి.' 111**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓభీమసేనా!; ఏనున్= నేను కూడ; శక్ర పదవిన్= దేవేంద్ర పదవిని; పొంది= ఆర్జించి; మదము, పేర్మిన్= గర్వాతిరేకంచేత; సత్+బ్రాహ్మణులకు= మంచి విప్రులకు; అవమానము= అగౌరవాన్ని; చేసి= కల్పించి; అందున్= అచట- ఆ స్వర్గంలో; ఒక్క, ముని, వరు, శాపశక్తిన్= ఒక ఋషిశ్రేష్ఠుడి శాపం యొక్క ప్రభావం వలన; తొంటి శక్తి= వెనుకటిమహిమ; తఱఁగి= తగ్గి; ఇట్టులు+ఐతిన్= ఈ విధంగా అయినాను.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ భీమసేనా! నేను ఒకనాడు దేవేంద్రపదవిని అధిష్ఠించినవాడను సుమా! అప్పుడు గర్వాతిరేకంతో ఒక విప్రోత్తముడికి అవమానం చేసి, ఆతడి శాప ప్రభావం వలన మునుపటిమహిమ తొలగి ఇప్పుడు ఈ రీతిగా సర్పాన్ని అయినాను.

**వ. అని దుఃఖించిన యజగరంబునకు భీముం డి ట్లనియె. 112**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; దుఃఖించిన= శోకించినట్టి; అజగరంబునకున్= పెనుబాముతో; భీముండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని అంటూ శోకిస్తున్న పెనుబాముతో భీము డిట్లా అన్నాడు.

**క. 'కడుకొని కడుదుఃఖములై । నెడ నుచితమె? యాత్మనింద యెయ్యెడల మనం**
**బెడలక యేకాకృతి నె । ప్పుడు నుండుట సూవె పురుషు పురుషార్థ మిలన్. 113**

**ప్రతిపదార్థం:** కడుకొని= పూని; కడు దుఃఖములు+ఐన= మిక్కిలిబాధలు కలిగిన; ఎడన్= పట్టున; ఆత్మనింద= తన్ను తాను దూషించుకొనటం; ఉచితమె?= భావ్యమా?; ఇలన్= భూమియందు; ఏ+ఎడల= ఏ పట్టుల నైనా; మనంబు+ఎడలక= మనస్సు విడివడక; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; ఏక+ఆకృతిన్= ఒకే రీతిగా; ఉండుట= ఉండటమే; పురుషు= మనుజుడియొక్క; పురుషార్థము= పురుషుడికి లక్ష్యమైన ప్రయోజనం; చూవె= సుమా!

**తాత్పర్యం:** 'దుఃఖం సంప్రాప్తమైనప్పుడు తన్ను తాను నిందించుకొనటం భావ్యమా? భూలోకంలో కష్టసుఖాలు దాపురించినప్పుడు మనస్సును ఒకే రీతిగా అదుపులో పెట్టుకొనటమే మనుజులకు పురుషార్థం సుమా!

## ధర్మరాజు భీమసేనుని వెదకఁబోవుట (సం. 3-176-40)

**వ. పురుషకారంబునంజేసి దైవంబు నివర్తింప నెవ్వ రోపుదు? రేను మహాబలుండ నయ్యును భవద్గృహీతుండ నై యిట్టియవస్థం బొందితి; నాత్మత్యాగంబునకు వగవ; నపహృతరాజ్యానుభోగులై మద్భ్రాతృవరులు దుర్గమంబైన యిప్పర్వతకందరంబునం గ్రుమ్మరుచున్నవారు నన్నుఁ గానక యెంత దుఃఖింతురో యని వగచెద' ననుచున్నంత; నిట ధర్మతనయుండు దీప్తం బైన శివారుతంబు విని యతిశంకితచిత్తుండయి యనంతరంబ తన దక్షిణభుజాస్పందనం బుపలక్షించి మీఁద లగ్గగు నంచు ననుజమధ్యంబున ననిలజుం గానక యర్జునుం గవలను గృష్ణారక్షణార్థంబు నియోగించి ధౌమ్యపురోగమభూసురవరులతో భీము రోయుచుం దదీయపాదతల లలిత హలకులిశ కలశజలజాది లక్షణాలంకృతం బైన పాంసుపథంబునం జని ముందట. 114**

**ప్రతిపదార్థం:** పురుషకారంబునన్+చేసి= మనుషులు చేసే ప్రయత్నంవలన; దైవంబు= విధిని; నివర్తింపన్= మరల్చటానికి; ఎవ్వరు+ఓపుదురు?= ఎవరు సమర్థులు?; ఏను=నేను; మహాబలుండను+అయ్యును= నేను గొప్పబలం కలవాడను అయినప్పటికిని; భవత్+గృహీతుండను+ఐ= నీచేత పట్టుబడినవాడనై; ఇట్టి= ఇటువంటి; అవస్థన్+పొందితిన్= స్థితిని పొందాను; ఆత్మత్యాగంబునకున్= నా వినాశానికి; వగవను= దుఃఖించను; అపహృత, రాజ్య+అనుభోగులు+ఐ= అపహరించబడిన రాజ్యసౌఖ్యాలు కలవారై; మత్+భ్రాతృవరులు= నా సహోదరులు; దుర్గమంబు+ఐన= నడవటానికి వీలుకాని; ఈ+పర్వత, కందరంబునన్= ఈ కొండచరియలో; క్రుమ్మరుచున్నవారు= తిరుగాడుతున్నవారు; నన్నున్+కానక= నేను కన్పించకపోవటంచేత; ఎంత దుఃఖింతురో= ఎంతగా శోకిస్తారో; అని; వగచెదను= దుఃఖిస్తాను; అనుచున్నంతన్= అని చెప్తుతుండగా; ఇట=ఇచట; ధర్మ తనయుండు= ధర్మసుతుఁడు; దీప్తంబు+ఐన= తీవ్ర మైన; శివా రుతంబు= నక్కకూత; విని= ఆలకించి; అతి, శంకిత, చిత్తుండు+అయి= మిక్కిలిసందేహంతో (అశుభశంకతో) కూడిన మనస్సుకలవా డై; అనంతరంబు+అ= అటుపిమ్మట; తన, దక్షిణ, భుజా, స్పందనంబు= తనయొక్క కుడిభుజం అదరటం; ఉపలక్షించి= గమనించి; మీఁదన్= అటుపిమ్మట; లగ్గు+అగున్= శుభం కలుగుతుంది; అంచున్= అంటూ; అనుజ మధ్యంబునన్= తమ్ములమధ్యలో; అనిలజున్+కానక= వాయుపుత్రు డైన భీముడిని కాంచక; అర్జునున్= అర్జునుడిని; కవలను= నకుల సహదేవులను; కృష్ణా, రక్షణ+అర్థంబు= ద్రౌపదిని కాపాడటం కొరకై; నియోగించి= నియమించి; ధౌమ్య, పురోగమ, భూసురవరులతో= ధౌమ్యుడు ముందుగా గల బ్రాహ్మణశ్రేష్ఠులతో; భీము రోయుచున్=భీముడిని వెదకుతూ; తదీయ, పాదతల, లలిత, హల, కులిశ, కలశ, జలజ+ఆది, లక్షణ+అలంకృతంబు+ఐన= ఆతడియొక్క పాదతల మందలి మనోజ్ఞమైన నాగలి, వజ్రాయుధం, కలశం, పద్మం, మున్నగు గుర్తులచేత అలంకరించబడిన; పాంసు పథంబునన్= దుమ్ముకలదారిలో; చని= వెళ్ళి; ముందట= తన ఎదురుగా.

**తాత్పర్యం:** మానుషయత్నంవలన విధివిలాసాన్ని ఎవరు తప్పించగలరు? నేను గొప్పబలం కలవాడను అయినా నీచేత పట్టుబడితినికదా! ఇట్టి దురవస్థ నాకు ప్రాప్తించినందుకు నేను దుఃఖించను. నేను మరణించటానికి వగవను కాని, రాజ్యాన్ని పోగొట్టుకొని, సుకరంగా నడువ వీలుకాని ఈ కొండ చరియలో తిరుగాడుతున్న నా సోదరులు నన్ను కానక ఎంతగా దుఃఖిస్తూ ఉన్నారో - అని చింతిస్తున్నాను' - అని భీముడు చెప్తుతూ ఉండగా, ఇట ధర్మరాజు తీవ్ర మైన నక్కకూత విని అశుభాన్ని శంకించి బాధపడ్డాడు. కాని అంతలో అతడి దక్షిణభుజం అదిరింది. ముందు కీడు సూచించబడినను, తదుపరి శుభం కలుగగల దని భావించాడు. అపుడు చూడగా తమ్ముల మధ్య భీముడు కన్పించలేదు. అనంతరం ధర్మరాజు ద్రౌపదిని కాపాడటానికై అర్జునుడిని, నకులసహదేవులను నియమించి, తాను ధౌమ్యుడు మున్నగు బ్రాహ్మణులతోపాటు భీముడిని వెదకుతూ బయలుదేరి, భీముడి పాదతలంలో ఉన్న మనోజ్ఞమైన నాగలి, వజ్రాయుధం, పూర్ణకలశం, పద్మం మున్నగు శుభలక్షణాలచేత అలంకరించబడిన దుమ్ముగల దారివెంట వెళ్ళి, తనముందట.

**విశేషం:** శివారుతం అపశకునంగా, కుడిభుజం అదరటం శుభసూచనగా మహాభారతరచనాకాలంనుండి వస్తున్న విశ్వాసాలు. పాదాలయందు ఉండే హలం, కులిశం, కలశం, పద్మం మున్నగు చిహ్నాలు మహాపురుషలక్షణాలుగా భారతీయ సాముద్రిక శాస్త్రప్రవచనం.

**క.** **గిరిశిఖరాభోగబృహ । త్తరభుజగశరీరవేష్టితశరీరుం డై**
**భరమునఁ గదలఁగ నేరక । పరమశ్రమ మడర నున్న పవనజుఁ గనియెన్.** **115**

**ప్రతిపదార్థం:** గిరి, శిఖర+ఆభోగ, బృహత్తర, భుజగ, శరీర, వేష్టిత, శరీరుఁడు+ఐ= కొండ శిఖరం వలె పరిపూర్ణమై మిగుల పెద్దదైన ఆ పెనుబాము యొక్క శరీరం చేత చుట్టుకొనబడిన దేహం కలవాడై; భరమునన్= బడలికచేత; కదలఁగ నేరక= కదలజాలక; పరమ, శ్రమము+అడరన్, ఉన్న= మిగుల అతిశయించిన శ్రమతో కూడిఉన్న; పవనజున్= వాయుపుత్రుడైన భీముడిని; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** కొండ శిఖరం వంటి ఆ పెనుబాముయొక్క శరీరంచేత పెనవేయబడిన దేహం కలవాడై మిక్కిలి డస్సిపోయి కదలజాలక ఉన్న భీముడిని ధర్మరాజు చూచాడు.

**క.** **కని యాత్మగతంబున 'ని । య్యనిలజుఁ డొకపాముచేత నవిచేష్టితుఁడై**
**తన లావు దఱిఁగి ప్రాకృత । జనుక్రియ నిట్లున్నవాఁ డసామర్థ్యమునన్.** **116**

**ప్రతిపదార్థం:** కని= చూచి; ఆత్మగతంబునన్= తనలో తాను; ఈ+అనిలజుఁడు= వాయుసుతుఁ డైన ఈ భీముడు; ఒక, పాముచేతన్= ఒక సర్పంచేత; అవిచేష్టితుఁ డు+ఐ= కదలికలేని దేహం కలవాడై; తన, లావు, తఱిఁగి= తన బలం కోలుపోయి; ప్రాకృత, జను, క్రియన్= పామరుడివలె; అసామర్థ్యమునన్= శక్తిలేకుండగా; ఇట్లు+ఉన్నవాఁడు= ఈరీతిగా ఉన్నాడు.

**తాత్పర్యం:** భీముడిని చూచి ధర్మరాజు తనలో తాను తలపోశాడు: 'ఈ వాయుపుత్రుడు అకటా! ఒక పాముకు చిక్కి కదలికలేనివా డై శక్తిసామర్థ్యాలు కోలుపోయి ఒక సామాన్యమానవుడివలె ఉన్నాడుకదా!

**వ.** **ఇది యేమి యాశ్చర్యంబొ!' యనుచు ననిలజుం జూచి దుఃఖితుం డై ధర్మజుం డయ్యజగరంబున కి ట్లనియె; 'నయ్యా! నీవు సర్వరూపంబుఁ దాల్చిన దైత్యుండవో దేవతవో చెప్పు; మేను యుధిష్ఠిరుండ; ని న్నడిగెద; నిమ్మహాభుజు నాయనుజు నామిషార్థివై పట్టితేని నీకు బుభుక్షానివృత్తి యగునట్లుగాఁ జాలినంత మృగమాంసంబుఁ బెట్టెద; వీని విడువు' మనిన ధర్మరాజునకు నయ్యజగరం బిట్లనియె.** **117**

**ప్రతిపదార్థం:** ఇది+ఏమి+ఆశ్చర్యంబొ+అనుచున్= ఇది- అనగా అంతటిబలవంతు డైన భీముడు ఒక పాముకు చిక్కి చేష్టలుదక్కి ఉండటం ఎంతటి వింతయో అని తలపోస్తూ; అనిలజున్+చూచి= వాయుపుత్రు డైన భీముడిని చూచి; దుఃఖితుండు+ఐ= పరితపించినవాడై; ధర్మజుండు= ధర్మతనయుడు; ఆ+అజగరంబునకున్= ఆ పెనుబాముతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అయ్యా!= ఆర్యా!; నీవు=నీవు; సర్వ రూపంబున్+తాల్చిన= పాము ఆకృతిని గైకొన్న; దైత్యుండవో= రాక్షసుడవో; దేవతవో= వేల్పువో; చెప్పుము; ఏను=నేను; యుధిష్ఠిరుండన్= యుధిష్ఠిరుడను; నిన్ను+అడిగెదన్= నిన్ను అర్థిస్తున్నాను; ఈ+మహా, భుజున్= గొప్పపరాక్రమం కల ఈతడిని; నా+అనుజున్= నా తమ్ముడిని; ఆమిష+అర్థివి+ఐ= మాంసాన్ని కోరెడివాడ వై; పట్టితివి+ఏని= నిగ్రహించినట్లయితే; నీకున్=నీకు; బుభుక్షా, నివృత్తి+అగునట్లుగాన్= ఆకలి తీరేటట్లుగా; చాలినంత= సరిపోయినంత; మృగ మాంసంబున్= జంతువులమాంసాన్ని; పెట్టెదన్= సమకూరుస్తాను; వీనిన్= ఇతడిని; విడువుము+అనినన్= విడిచిపెట్టుము అని అడుగగా; ధర్మరాజునకున్= ధర్మతనయుడికి; ఆ+అజగరంబు= ఆ పెనుబాము; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పింది.

**తాత్పర్యం:** ఇది ఎంతటివింత!' అని తలపోస్తూ ధర్మరాజు వాయుపుత్రుడిని చూచి మిక్కిలి పరితపించి, ఆ పెనుబాముతో ఇట్లా అన్నాడు: 'ఆర్యా! నీవు పాము ఆకృతిలో ఉన్న రక్కసుడవో, దేవతవో చెప్పుము. నేను యుధిష్ఠిరుడను; నిన్ను అర్థిస్తున్నాను, మహాపరాక్రమోపేతు డైన నా తమ్ముడిని నీవు మాంసంకొరకే పట్టుకొంటే, వీడిని విడిచిపుచ్చుము. నీ ఆకలి తీరేటంత మృగమాంసాన్ని నీకు సమకూర్చగలను' అని చెప్పాడు.

**సీ. 'వినవయ్య! నహుషుఁడన్ జనపతి నేను మీ । పూర్వజులకు నట పూర్వజుండ;**
**ననఘ! సుత్రామున కెనయగువాఁడ; నై । శ్వర్యగర్వంబున నార్యవృత్తి**
**విడిచి వివేకంబు సెడి సహస్రోత్తమ । బ్రాహ్మణధృత మైన బ్రహ్మరథము**
**నెక్కి బ్రాహ్మణులకు నక్కజం బగు నవ । మానంబు సేసినదాన నాకుఁ**

**ఆ. గలశభవుఁ డగస్త్యుఁ డలిగి యత్యుగ్రాహి । వగు మటంచు శాప మప్పు డిచ్చె;**
**మునివరేణ్యుశాపమునఁ జేసి యిప్పాట । నవయుచున్నవాఁడ నాఁటఁగోలె. 118**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ ధర్మరాజా!; వినవయ్యా= ఆలకించుము; ఏను= నేను; నహుషుఁడు+అన్= నహుషుఁడు అనబడే; జనపతిన్= రాజును; మీ పూర్వజులకున్= మీ పితామహప్రపితామహులకు, (మీవంశంలో మీకంటె ముందుపుట్టినవారికి); పూర్వజుండన్= ముందుపుట్టినవాడను; సుత్రామునకున్= దేవేంద్రుడికి; ఎన+అగువాఁడన్= సమానుడను; ఐశ్వర్య గర్వంబునన్= (రాజసప్రవృత్తివలన ఏర్పడిన) ఐశ్వర్య మదంచేతన్; ఆర్య, వృత్తి, విడిచి= పూజ్యులైన వారి ఉత్తమ మార్గాన్ని వీడి; వివేకంబు+చెడి= విచక్షణజ్ఞానం నశించి; సహస్ర+ఉత్తమ, బ్రాహ్మణ, ధృతము+ఐన= వేయిమంది గొప్ప విప్రులచేత పూన్పబడిన; బ్రహ్మరథమున్= జ్ఞానులు మోసే తేరు; ఎక్కి= అధిరోహించి; బ్రాహ్మణులకున్= జ్ఞానులకు; అక్కజంబు+అగు= అచ్చెరువు కొలుపే; అవమానంబు+చేసిన= అగౌరవం చేయగా; దానన్= దానివలన; నాకున్=నాకు; కలశ, భవుఁడు= అగస్త్యుడు- కలశంలో జన్మించిన అగస్త్య మహర్షి; అలిగి= కోపించి; అతి+ఉగ్ర+అహివి+అగుము+అటంచున్= మిక్కిలి భయంకర మైన పాముపు కమ్ము అంటూ; శాపము+అప్పుడు+ఇచ్చెన్= అప్పుడు శాపాన్ని ఇచ్చాడు; ముని, వరేణ్య, శాపమునన్+చేసి= ఋషులలో శ్రేష్ఠుడు అయిన అగస్త్యుడిశాపంచేత; ఈ+పాట= ఈ రీతిగా; నాఁటన్+కోలెన్= ఆ దినంనుండి; నవయుచున్నవాఁడన్= కష్టపడుతూ ఉన్నాను.

**తాత్పర్యం:** పాపరహితుడ వైన ఓ ధర్మరాజా! నా వృత్తాంతాన్ని ఆలకింపుము. నేను మీ వంశంలో మీకంటె ముందు పుట్టినవారికంటె ముందు పుట్టినవాడను. నహుషుడనే రాజును; దేవేంద్రుడితో సమానుడను; ఐశ్వర్యమదంచేత మంచితనాన్ని కోలుపోయి విచక్షణజ్ఞానం లేకుండ వేయిమంది బ్రాహ్మణులు మోస్తున్న రథాన్ని అధిరోహించి నేను బ్రాహ్మణులను అవమానించాను. కలశంలో జన్మించిన మహానుభావుడగు అగస్త్యమహర్షి కోపించి నన్ను 'మిక్కిలిభయంకర మైన పాముపు కమ్ము' అని శపించాడు. నాటినుండి నేను ఈ దురవస్థ ననుభవిస్తున్నాను.

**విశేషం:** బ్రహ్మరథం అనగా బ్రహ్మజ్ఞానులు అయిన బ్రాహ్మణోత్తములు సబహుమానంగా మోసేటటువంటి (వహించే) తేరు. ఇట్టి అసాధారణ గౌరవం మహాపురుషులకు మాత్రమే దక్కుతుంది.

**వ. విధివిలసితంబు పేర్మి నీ కే మని చెప్పుదు? 119**

**ప్రతిపదార్థం:** విధి, విలసితంబు, పేర్మి= దైవవిలాసంయొక్క అతిశయం; నీకు+ఏమని, చెప్పుదున్?= నీకు నేను ఏ విధంగా వివరించి చెప్పగలను?

**తాత్పర్యం:** విధివిలాసమహిమను నీకు నేను ఏ విధంగా వర్ణించి చెప్పగలను ?

**చ. చదివితి నెల్లవేదములు, సత్క్రియఁ జేసితి నూఱుయజ్ఞముల్,**
**విదితముగా సురేంద్రపదవీస్థితిఁ బొందితి, దుర్మదంబునం**
**దుదిఁ బెనుబాము నై యధికదుఃఖుఁడ నైతి సుఖంబు దుఃఖమున్**
**వదలక చేయుచోట బలవద్విధి కేమి భరంబు సెప్పుమా! 120**

**ప్రతిపదార్థం:** ఎల్ల, వేదములు= సమస్తవేదాలను; చదివితిన్= అభ్యసించాను; నూఱు యజ్ఞముల్= నూరు జన్నాలను; సత్+క్రియన్+చేసితి= బాగా నిర్వహించాను; విదితముగాన్= అందరకు తెలిసేటట్లుగా; సుర+ఇంద్ర, పదవీస్థితిన్+పొందితిన్= దేవేంద్రుడిపదవిని అధిష్ఠించాను; దుర్మదంబునన్= చెడుగర్వంచేత; తుదిన్= చివరకు; పెను+పామును+ఐ= పెద్దసర్పంగా మారి; అధిక, దుఃఖుఁడన్+ఐతిన్= మిక్కుటమైన దుఃఖంకలవాడిని అయ్యాను; సుఖంబు, దుఃఖమున్= సుఖాన్నిగాని పరితాపాన్నిగాని; వదలక చేయుచోటన్= విడువక కల్పించేచోట; బలవత్+విధికి= బలమైన దైవానికి; ఏమి భరంబు= ఏమి బరువు; చెప్పుమా!= వచించుమా!

**తాత్పర్యం:** నేను సమస్తవేదాలను చదివినవాడనే. ఎన్నోపుణ్యకార్యాలు చేసి నూరుయజ్ఞాలు నిర్వహించి, దేవేంద్రపదవిని అధిష్ఠించినవాడనే. కాని, చెడు గర్వంవలన తుదకు ఈ పాముగా మారి నేను ఈ దురవస్థకు లోనుగావలసి వచ్చింది కదా! సుఖదుఃఖాలను యథేచ్ఛగా కల్పించగల బలం దైవానికి ఉన్నది. దైవం చేయలేని పని ఏమి ఉన్నది? చెప్పుము.

**వ.** **అయ్యగస్త్యుచేత నిట్లు శాపగ్రస్తుండనై శక్రాసనంబువలనం బాసి యిట వచ్చుచునుండి 'మునీంద్రా! నాకుఁ బూర్వస్మృతి సెడకుండను, బలవంతంబు లైన సత్త్వంబులు నన్ను ముట్టునప్పుడ బలహీనంబు లై భక్ష్యంబులు గాను, శాపవిమోక్షంబున కుపాయంబును బ్రసాదింపు' మని కృతాంజలి నై యున్న నాకుం గరుణించి మునివరుండు నా వేడిన వరంబు లిచ్చి వెండియు ని ట్లనియె.** **121**

**ప్రతిపదార్థం:** ఆ+అగస్త్యుచేతన్= అగస్త్యమునిచేత; ఇట్లు= ఈరీతిగా; శాప గ్రస్తుండను+ఐ= శాపానికి లోనయినవాడనై; శక్ర+ఆసనంబువలనన్+పాసి= దేవేంద్రుడిగద్దె వీడి; ఇట= ఇక్కడకు; వచ్చుచున్+ఉండి= వస్తూఉండగా; ముని+ఇంద్రా!= ఋషులలో గొప్పవాడా!; నాకున్= నాకు; పూర్వ, స్మృతి= పూర్వజన్మజ్ఞానం; చెడక+ఉండను= నశించిపోకుండా ఉండటానికి; బలవంతంబులు+ఐన, సత్త్వంబులు= బలంకలిగిన జంతువులు; నన్నున్= నన్ను; ముట్టునప్పుడు+అ= సమీపించేటప్పుడు; బలహీనంబులు+ఐ= బలంపోయినట్టివై; భక్ష్యంబులుగాను= తినదగినవిగాను; శాప, విమోక్షంబునకున్= శాపానికి విరుగుడు కలగటానికి; ఉపాయంబును= వెరవును; ప్రసాదింపుము+అని= అనుగ్రహించుము అని; కృత+అంజలినై+ఉన్న, నాకున్=దోసిలి యొగ్గి, ఉన్ననాపై; కరుణించి= దయచూపి; మునివరుండు= ఋషులలో శ్రేష్ఠుడు; [అగస్త్యుడు] నా వేడిన= నేను కోరిన; వరంబులు+ఇచ్చి= వరాలు అనుగ్రహించి; వెండియు= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అగస్త్యుడిచేత నేను శపించబడినవాడనై, దేవేంద్రపదవికి దూరమై ఇక్కడకు వచ్చేటప్పుడు నేను ఆ మహర్షిని ప్రార్థించాను. 'ఓమునిశ్రేష్ఠుడా! నేను సర్పజన్మాన్ని ఎత్తిన పిదపకూడ నాకు పూర్వజన్మపరిజ్ఞానం ఉండేటట్లున్నూ, బలం కల జంతువులు నా దరి చేరిన వెంటనే బలం కోలుపోయి నాకు ఆహారంగా అయ్యేటట్లున్నూ, నా శాపం తీరే మార్గాన్నీ అనుగ్రహించుము' అని అంజలి ఘటించాను. ఆ మునీశ్వరుడు నాయందు దయకలిగి నేను వేడిన వరాలు అనుగ్రహించి, మరల ఇట్లా అన్నాడు.

**క.** **'క్రమమున నీ చేసిన ప్ర। శ్నములకుఁ బ్రత్యుత్తరములు సన్మతి నత్యు**
**త్తముఁ డెవ్వఁ డిచ్చు నతనిక। తముననను శాపాంత మగు బుధస్తుత! నీకున్.** **122**

**ప్రతిపదార్థం:** బుధస్తుత!= బుధులచేత పొగడబడినవాడా!; క్రమమున= వరుసగా; నీ, చేసిన, ప్రశ్నములకున్= నీవు అడిగిన ప్రశ్నలకు; సత్+మతిన్= మంచిబుద్ధితో; ప్రతి+ఉత్తరములు= సమాధానాలు; అతి+ఉత్తముఁడు= మిగుల శ్రేష్ఠుడగు; ఎవ్వడు+ఇచ్చున్= ఎవడు చెప్పుతాడో; అతని కతముననను= అతడి కారణంగా; నీకున్= నీకు; శాప+అంతము+అగున్= శాపం తీరిపోతుంది.

**తాత్పర్యం:** బుద్ధిమంతులచేత పొగడిబడినవాడా! నీవు అడిగిన ప్రశ్నలకు గొప్పబుద్ధితో ఎవ్వడు సరిఅయిన సమాధానాలు చెప్పుతాడో, వాడికారణంగా నీకు శాపం తీరిపోతుంది.

**వ. అది దీర్ఘకాలంబునంగాని కా' దనియె; నేనును దద్వచనం బవలంబించి పెద్దకాలం బియ్యడవి నున్నవాఁడ; నేఁడు నీ తమ్ముఁడు నాకు నష్టప్రాప్తం బైన భక్ష్యం బయ్యె; నోపుదేని నా ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చి వీని విడిపించుకొ' మ్మనిన ధర్మజుం డి ట్లనియె. 123**

**ప్రతిపదార్థం:** అది= నీ శాప విమోచనం; దీర్ఘకాలంబునన్+కాని= చాలకాలం గడిచినపిమ్మట కాని; కాదు+అనియెన్= జరుగదు అని చెప్పాడు; ఏనును= నేను కూడ; తద్+వచనంబు+అవలంబించి= ఆతడి మాటలను అనుసరించి; పెద్ద కాలంబు= చాలనాళ్ళు; ఈ+అడవిన్= ఈ అడవిలో; ఉన్నవాఁడ= ఉన్నాను; నేఁడు= ఈరోజు; నీ తమ్ముండు= నీ సోదరుడు; నాకు= నాకు; నష్ట ప్రాప్తంబు+ఐన= పోయినది తిరిగి లభించినట్టిదిగా; భక్ష్యంబు+అయ్యెన్= ఆహారం అయినాడు; ఓపుదు(వు)+ఏని= శక్తి ఉంటే, సమర్థుడవైతే; నా ప్రశ్నములకున్= నేను అడిగే ప్రశ్నలకు; ప్రతి+ఉత్తరంబులు= సమాధానాలు; ఇచ్చి=ఒసగి, చెప్పి; వీనిన్= ఈ భీముడిని; విడిపించుకొమ్ము= నానుండి విడుదల చేసికొనుము; అనినన్= అని చెప్పగా; ధర్మజుండు= ధర్మతనయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** నీ శాపవిమోచనం ఎంతోకాలం గడిస్తేకాని జరుగదు'- అని చెప్పాడు. నేను ఆమునీశ్వరుడి మాటలను అనుసరించి, ఈ అడవిలో చిరకాలంనుండి ఉన్నాను. నేడు నీ తమ్ముడు నాకు పోయినవస్తువు లభించినట్లుగా ఆహారంగా లభించాడు. నీకు శక్తి ఉంటే నేను అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పి, నీ తమ్ముడిని విడిపించుకొనుము' అని అనగా, ధర్మరాజు ఇట్లా బదులు పలికాడు.

**విశేషం:** నీ తమ్ముడు దుష్టకాల ప్రాప్తుండై నాకు, నీ తమ్ముడు నాకు లబ్ధకాల ప్రాప్తుండై- అనే పాఠాంతరాలు కొన్ని ప్రతులలో గోచరిస్తున్నాయి.

**క. 'నీ యడిగిన యర్థాభి । ప్రాయములకు నుత్తరంబు పరువడిఁ జెప్పన్**
**ధీయుత! బ్రాహ్మణులకుఁ గా । కాయతమతు లయ్యు నొరుల కవి విషయములే? 124**

**ప్రతిపదార్థం:** ధీయుత!= బుద్ధిమంతుడవైనవాడా!; నీ+అడిగిన= నీవు ప్రశ్నించెడి; అర్థ+అభిప్రాయములకున్= భావవిశదీకరణలకు; ఉత్తరంబు= సమాధానాలు; పరువడిన్+చెప్పన్= తగురీతిగా చెప్పటానికి; బ్రాహ్మణులకున్+కాక= విప్రులకు కాక; ఆయతమతులు+ అయ్యున్= విస్తారమైన బుద్ధికలవారు అయినప్పటికిని; ఒరులకున్= ఇతరులకు; అవి= ఆ ప్రశ్నలకు సమాధానాలు; విషయములే= (తెలిసిన) అంశాలా?

**తాత్పర్యం:** బుద్ధిమంతుడా! నీవు అడిగేప్రశ్నలకు జ్ఞానసంపన్ను లైన బ్రాహ్మణోత్తములు మాత్రమే సరిఅయిన సమాధానాలు చెప్పగలరు. కాని, ఎంతటి తెలివితేటలు ఉన్నవారైనా తదితరులకు అవి తెలిసినఅంశాలు కాగలవా?

**విశేషం:** మహాభారతంలో 1) నహుషప్రశ్నలు 2) యక్షప్రశ్నలు బహుళప్రచారం పొందినట్టివి. సంక్లిష్టా లైన ప్రశ్నలకు ధర్మరాజు సదుత్తరాలు చెప్పగలిగాడు. అరణ్యావాసంలో ధర్మరాజు గొప్పగొప్పఋషులకడ, విద్వాంసులకడ ఎన్నో వేదాంతవిషయాలను జిజ్ఞాసువు అయి నేర్చుకొన్నాడు. ఒకవిధంగా, ధర్మరాజు పంద్రెండేండ్లు విద్యార్థిగా నిరంతరవిద్యార్జన చేసినట్లు చెప్పవచ్చును. ధర్మరాజు అరణ్యాన్ని వేదాంతవిశ్వవిద్యాలయంగా మార్చుకొన్నాడు. ఈపద్యంలో నన్నయ నిపుణంగా కాకువును నిబంధించి ఆ ప్రశ్నలకు ధర్మజుడు సమాధానాలు చెప్పగలడని భావికథార్థాలను ధ్వనింపచేశాడు.

### ధర్మరాజు నహుషప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట (సం. 3-177-13)

**వ. అయినను నా నేర్చు విధంబునం జెప్పెద నడుగు' మనిన నజగరం బి ట్లనియె. 125**

**ప్రతిపదార్థం:** అయినను= అయినప్పటికి; నా నేర్చువిధంబునన్= నాకు తెలిసినంతవరకు; చెప్పెదన్; అడుగుము; అనినన్= అని అనగా; అజగరంబు= ఆ కొండచిలువ; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నది.

**తాత్పర్యం:** అయినప్పటికిని, నాకు తెలిసిన మేరకు నీ ప్రశ్నలకు సమాధానాలు చెప్పగలను అడుగుము, అని అనగా, ఆ కొండచిలువ ఈవిధంగా అడిగింది.

**ఆ. 'ఘనుఁడ! యే గుణములు గలవాఁడు బ్రాహ్మణుం? । డతని కెఱుఁగఁదగినయట్టి వస్తు**
**వెద్ది? దీని నాకు నెఱిఁగింపు' మనిన ని । ట్లనుచుఁ జెప్పెఁ బాండవాగ్రజుండు. 126**

**ప్రతిపదార్థం:** ఘనుఁడ!= ఓ గొప్పవాడా!; ఏ గుణములు+కలవాఁడు= ఎట్టి లక్షణాలు ఉన్నవాడు; బ్రాహ్మణుండు= విప్రుడు; అతనికిన్+ఎఱుఁగన్+తగిన+అట్టి, వస్తువు+ఎద్ది?= అతడికి తెలియతగిన పదార్థం ఏది?; దీనిన్= దీనిన్; నాకున్= నాకు; ఎఱిఁగింపుము= తెలుపుము; అనినన్= అని అడుగగా; ఇట్లు+అనుచున్= ఈ విధంగా; పాండవ+అగ్రజుండు= పాండవులలో మొదట పుట్టినవాడు అనగా ధర్మరాజు; ఇట్లు+అనుచున్= ఈ విధంగా; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఓ గొప్పవాడా! ఏ గుణాలున్నవాడు బ్రాహ్మణుడని అనబడుతాడు? అతనికి తెలియదగిన పరమార్థమేది? ఈ విషయాన్ని సవిస్తరంగా నాకు తెలుపునది' అని కొండచిలువ ప్రశ్నించగా, పాండవులలో అగ్రజుడైన ధర్మరాజు ఈ విధంగా బదులు పలికాడు.

**సీ. 'సత్య క్షమా దమ శౌచ దయా తపో । దాన శీలంబు లెందేనిఁ గాన**
**నగు నట్టి వాఁడు బ్రాహ్మణుఁడు; సుఖంబు దుః । ఖంబు నై నెడ విమోహంబు నొంద**
**కునికియ వానికి నుత్తమం బగు విద్య' । యనిన 'నీ చెప్పిన గుణము లివియు**
**క్రియ శూద్రునందుఁ గల్గిన నతం డుత్తమ । ద్విజుఁడు గానేర్చునే? నిజము విడిచి**

**ఆ. నట్టు లయిన బ్రాహ్మణాదివర్ణవిభాగ । మెట్లు గలుగునయ్య? హీను లధికు**
**లను వివేక మది యపార్థకం బగుఁగాదె!' యనిన ననియె నంతకాత్మజుండు. 127**

**ప్రతిపదార్థం:** సత్య, క్షమా, దమ, శౌచ, దయా, తపస్+దాన, శీలంబులు= నిజంపలకటం, ఓర్పు, ఇంద్రియ నిగ్రహం, నిర్మలత్వం, కరుణ, తపస్సు, త్యాగం, ఉత్తమ స్వభావం తమ నడవడిలో; ఎందు+ఏని= ఎవనియందు; కానన్+అగున్+అట్టి వాఁడు= కన్పించునో అటువంటివాడు; బ్రాహ్మణుఁడు= విప్రుడు (జ్ఞానంకలవాడు, ఆధ్మాత్మికమైన విజ్ఞత కలవాడు); సుఖంబు దుఃఖంబును+ఐన+ఎడ= సుఖంకాని శోకంకాని ఏర్పడినప్పుడు; విమోహంబున్+ఒందకునికియ= విభ్రాంతిని పొందకుండ ఉండటం; వానికిన్= అట్టివాడికి- అనగా అట్టిజ్ఞాని అయిన ఋజువర్తనం కలిగిన బ్రాహ్మణుడికి; ఉత్తమంబు+అగు, విద్య= గొప్పదైన చదువు; అనినన్= అని అనగా; (ధర్మరాజు చెప్పగా); నీ, చెప్పిన గుణములు= నీవు వచించిన లక్షణాలు; ఇవియున్= ఇవి అన్నియున్నూ; క్రియన్= ఆచరణలో శూద్రునందున్= శూద్రుడియందున అనగా శూద్రకులంతో పుట్టినవాడికి; కల్గినన్= ఉంటే; అతండు= అట్టిశూద్రుడు; ఉత్తమ ద్విజుఁడు+కానేర్చునే= శ్రేష్ఠుడగు బ్రాహ్మణుడు కాగలడా?; నిజము, విడిచినట్టులు+ అయిన= అసలు పుట్టుకకు సంబంధించిన యాథార్థ్యాన్ని వదలి పెట్టితే; బ్రాహ్మణ+ఆది, వర్ణ, విభాగము= విప్రులు మున్నగు కులాల విచక్షణ; ఎట్లు, కలుగున్+అయ్య?= ఏ విధంగా నిర్ణయించటానికి వీలు కలుగుతుంది?; హీనులు= తక్కువవారు; అధికులు= గొప్పవారు; అను= అనెడి; వివేకము= విచక్షణ అది=అది; అపార్థకంబు+అగున్+కాదె= అర్థరహితం కాదా?;

అనినన్= అని (నహుషుడు) అడుగగా; అంతక+ఆత్మజుండు= యముడికొడుకు, ధర్మరాజు; అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'సత్యం, సహనం, ఇంద్రియ నిగ్రహం, శుచిత్వం, కరుణ, తపస్సు, త్యాగం, సత్‌స్వభావం అనే గుణాలు ఎవడి ప్రవర్తనలో ప్రస్ఫుటంగా కన్పిస్తాయో అట్టివాడే బ్రాహ్మణుడు. సుఖం దుఃఖం ఏర్పడే పట్టులలో తాను మోహం పొందక సమబుద్ధితో ఉండగలగటమే బ్రాహ్మణుడు ఆర్జింపతగిన గొప్పచదువు'- అని ధర్మరాజు పలికాడు. అంతట, నహుషుడు 'ఓధర్మరాజా! నీవు బ్రాహ్మణత్వం సత్ప్రవర్తనవలన సద్గుణాలవలన మాత్రమే సంప్రాప్తిస్తుందని పలుకుతున్నావు. అట్లయితే, నీవు పేర్కొనిన ఆ సద్గుణాలు, ఆ సత్ప్రవర్తన శూద్రకులంలో పుట్టినవాడిలో కన్పిస్తే ఆతడిని బ్రాహ్మణుడు అని చెప్పగలవా? అపార్థం కలుగకుండ వివరించవలసింది'- అని ఎదురు ప్రశ్న వేయగా ధర్మరాజు ఇట్లా తెలిపాడు.

**విశేషం:** ప్రాచీనభారతీయసాహిత్యంలో సంఘంలో బ్రాహ్మణుడికి విశేషప్రతిపత్తి ఉండేది. బ్రాహ్మణుడు అనగా బ్రహ్మజ్ఞానాన్ని ఆర్జించేవాడు. ఎవడు బ్రాహ్మణుడు? మహాభారతంలో రెండుతావుల గ్రుచ్చి గ్రుచ్చి వేయబడింది ఈ ప్రశ్న. (ఈ ప్రశ్నే యక్షప్రశ్నలలోకూడ ఉన్నది). బౌద్ధవాఙ్మయంలో బుద్ధుడి ప్రబోధంగా పేరొందిన ధమ్మపదంలో ఒక అధ్యాయం ఈ ప్రశ్నకు సమాధానంగా ప్రత్యేకించబడింది. బ్రాహ్మణత్వం జన్మచేతమాత్రమే లభించదు- అనే విషయాన్ని 'ద్విజ' శబ్దం నొక్కి చెప్పుతున్నది. ద్విజుడు- అనగా రెండుపుట్టుకలు కలవాడు. ఒక పుట్టువు ప్రాకృతజన్మం; జ్ఞానసముపార్జనపిమ్మట లభించేది రెండవజన్మం. (యక్షప్రశ్నలనుకూడ పరికించండి).

**వ. 'ప్రమాదంబున వర్ణసంకరం బయినప్పుడు వర్ణ పరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేఱువేఱ స్వాయంభువుం డైన మనువు సెప్పె; సత్యాదిగుణంబులు శూద్రునందుఁగలిగెనేని వాఁడు సచ్ఛూద్రుండుఁగాక బ్రాహ్మణుండు గానేర్చునే? యవి బ్రాహ్మణునందు లేనినాఁడు శూద్రుం డనంబడుఁ గావున వృత్తంబ యుత్తమంబు. 128**

**ప్రతిపదార్థం:** ప్రమాదంబునన్= ఆకస్మికమైన వైపరీత్యాలు ఏర్పడినప్పుడు; వర్ణ, సంకరంబు+అయినప్పుడు= కులాలు కలిసిపోయిన సమయంలో; వర్ణపరీక్షా+అర్థంబుగాన్= కులాలను పరీక్షించి నిర్ణయించటం కొరకై; బ్రాహ్మణ+ఆదులకున్= విప్రులు మున్నగువారలకు; వృత్తంబు= శీలం; వేఱు వేఱ= వివిధరీతులలో; స్వాయంభువుండు+ఐన, మనుపు= స్వాయంభువ మనువు; చెప్పెన్= నిర్ణయించాడు; సత్య+ఆది, గుణంబులు= సత్యం మున్నగు లక్షణాలు; శూద్రునందున్= శూద్రకులాలలో జన్మించినవాడియందు; కలిగెన్+ఏని= ఉన్నట్లయితే; వాఁడు= అట్టి శూద్రుడు; సత్+శూద్రుండున్+కాక= మంచిశూద్రుడు అని చెప్పదగునుకాని; బ్రాహ్మణుండు+కానేర్చునే= బ్రాహ్మణుడు కాగలడా?; అవి= ఆ సత్యాది సద్గుణాలు; బ్రాహ్మణునందున్= విప్రుడియందు; లేనినాఁడు= ఉండని సందర్భంలో; (అతడు) శూద్రుండు+అనంబడున్= శూద్రుడే అనబడతాడు; కావునన్= కాబట్టి; వృత్తంబు+అ= ప్రవర్తనమే; ఉత్తమంబు= గొప్పది.

**తాత్పర్యం:** ప్రమాదాలు సంభవించి వర్ణసాంకర్యం ఏర్పడినప్పుడు కులాలను నిర్ణయించటానికై వేరువేరు ప్రవర్తనలను, గుణాలను స్వాయంభువమనువు నిర్ణయించి చెప్పాడు. సత్యం మున్నగు మంచి లక్షణాలు శూద్రకులంలో జన్మించినవాడిలో ఉన్నప్పుడు అతడు మంచిశూద్రుడు కాగలడుకాని బ్రాహ్మణుడు కాగలడా? అట్టి సద్గుణాలతో కూడిన సత్ప్రవర్తన బ్రాహ్మణకులంలో పుట్టినవాడిలో లేనియెడల, అట్టివాడు శూద్రుడు అని చెప్పక తప్పదు. కాబట్టి సత్‌ప్రవర్తనే గొప్పది.

# సంకేతాక్షర సూచి

| | | |
|---|---|---|
| ఆది. | - | ఆదిపర్వం |
| సభా. | - | సభాపర్వం |
| ఆర . | - | ఆరణ్యపర్వం |
| విరా. | - | విరాటపర్వం |
| ఉద్యో. | - | ఉద్యోగపర్వం |
| భీష్మ. | - | భీష్మపర్వం |
| ద్రోణ. | - | ద్రోణపర్వం |
| కర్ణ. | - | కర్ణపర్వం |
| శల్య. | - | శల్యపర్వం |
| సౌప్తి. | - | సౌప్తికపర్వం |
| స్త్రీ. | - | స్త్రీ పర్వం |
| శాంతి. | - | శాంతిపర్వం |
| ఆను. | - | ఆనుశాసనికపర్వం |
| అశ్వ. | - | అశ్వమేధపర్వం |
| ఆశ్ర. | - | ఆశ్రమవాసపర్వం |
| మౌస. | - | మౌసలపర్వం |
| మహా. | - | మహాప్రస్థానికపర్వం |
| స్వర్గా. | - | స్వర్గారోహణపర్వం |
| సం. | - | భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి |
| సం.మ.భా. | - | సంస్కృత మహాభారతము |
| అను. | - | పై ప్రతిలోని అనుబంధాలు |
| సంపా. | - | ప్రధాన సంపాదకుడు |

| | | |
|---|---|---|
| క. | - | కందపద్యం |
| వ. | - | వచనం |
| ఆ. | - | ఆటవెలది |
| తే. | - | తేటగీతి |
| సీ. | - | సీసం |
| ఉ. | - | ఉత్పలమాల |
| చ. | - | చంపకమాల |
| మ. | - | మత్తేభ విక్రీడితం |
| శా. | - | శార్దూల విక్రీడితం |
| ఆశ్వా. | - | ఆశ్వాసం |
| క్రీ.శ. | - | క్రీస్తుశకం |
| య. | - | యగణం |
| మ. | - | మగణం |
| త. | - | తగణం |
| ర. | - | రగణం |
| జ. | - | జగణం |
| భ. | - | భగణం |
| న. | - | నగణం |
| స. | - | సగణం |
| ల. | - | లఘువు |
| గ. | - | గురువు |
| అలం. | - | అలంకారం |
| సం. | - | సంవత్సరం |
| మొ. | - | మొదలైన |

# పీఠిక

[ పీఠిక విషయసూచిక-1. కవిత్రయ కీర్తన సంప్రదాయం-పు. 2; 2. ప్రబంధపరమేశ్వర బిరుదం : ఆరణ్యపర్వశేషం-పు2; 3. ప్రబంధపరమేశ్వరుడు : త్రిముఖాత్మకత-పు.4; 4. ప్రాచీన మహాకవులవలె కవిత్వం చెప్పటం; ప్రబంధ పరమేశ్వరత్వం-పు.5; 5. విశిష్ట ప్రక్రియా నిర్మాణ దక్షత : ప్రబంధ పరమేశ్వరత్వం-పు.5; 6. ఆరణ్యపర్వశేష వస్తు వైశిష్ట్యం: ప్రబంధ పరమేశ్వరత్వం-పు.6; (1) పురాణవస్తువు-పు.7; (2) పురాణ వస్తువిశేషాలు-పు.9; (3) ఇతిహాస శ్రవణం : ఇతరాంశాలు-పు.13; (4) ఇతిహాస శ్రవణఫలం-పు.13; (5) యక్ష ప్రశ్నలు : ధర్మజపరిజ్ఞానం-పు. 16; 7. ఆరణ్యపర్వశేష నిర్వహణ నైపుణ్యం : ప్రబంధ పరమేశ్వరత్వం-పు. 18; (1) ఆరణ్యపర్వశేషం: ప్రబంధపరమేశ్వరుని ప్రయోగపర్వం-పు 19; (2) నన్నయ ప్రసాదకవి: ఎఱ్ఱయ మధురకవి-పు.20; (3) విడమరచి, విస్తరించి, మధురంగా, మనోహరంగా చెప్పటం-పు.21; (4) ఎఱ్ఱన కవిత: ఆర్ద్రమైన ఆత్మీయత, మాధుర్యం-పు.22; (5) ధర్మవ్యాధోపాఖ్యానం: విడమరచి చెప్పే విద్య-పు.24; (6) కుమారస్వామి కథ : విస్తరించి చెప్పే విద్య-పు.22; (7) పరిక్షితుని కథ: మధురంగా చెప్పే విద్య-పు.29; 8. ఆరణ్యపర్వశేష కవితా వ్యక్తిత్వం : ప్రబంధ పరమేశ్వరత్వం-పు.32; (1) 'కావ్యశయ్యఁ గీలించిన కీర్తి'-పు.34; (2) కవిత్రయ కవితాశయ్యలు-పు.35; (3) ఎఱ్ఱన కావ్యశయ్య : భారతీవృత్తి-పు.35; (4) ఎఱ్ఱన రచన : మాధురీగుణం, పాంచాలీ రీతి-పు.38; (5) ఎఱ్ఱనకవిత మంజుల వాగమృత ప్రవాహం-పు.38; 9. ప్రబంధపరమేశ్వరుడు : చతురోక్తి పథాలు-పు.39; (1) చతురోక్తి : సూక్తివైచిత్రి-పు.40; (2) చతురోక్తి : మధురోక్తి-పు.43; (3) చతురోక్తి : అలంకృతోక్తి : అలంకారధ్వని-పు.43; (4) చిత్రకవిత: శబ్దవైచిత్రి-పు.44; (5) ఎఱ్ఱన వాగ్విలాసం; అతి గాంభీర్య విభూతి-పు.46; (6) శరత్కాలవర్ణనం: వస్తు-అలంకార ధ్వనులు-పు.47; (7) మూడు పద్యాల ముడులు: మూడు గుణాల సందడులు-పు.51; (3) మూడు రసాభాసాలు-పు.58; (4) మూడు ఉక్తివైచిత్రులు- పు.60; (5) మూడు వీరరసభేదాలు-పు.61; (6) ముగ్గులు పతివ్రతల కథలు-పు.63; (7) మూడు ఎఱ్ఱ(న) గుర్తులు-పు.64; (8) మూడు రుచుల ముప్పన్నె సొబగు-పు.66; 11. రామాయణ కథ మధుర మనోహరం-పు.67; 12. సావిత్రి కథ మధురమహోజ్జ్వలం- పు.70; 13.ఆరణ్యపర్వం : అంతరార్థం-పు.75; 14. కవిత్రయ మహాభారతం : వ్యాఖ్యానం-పు.76;] [(ఆరణ్యపర్వకథాసారం (రెండవభాగం) : అనుబంధం-పు. 78.]

ఉ. ''భారత కావ్యహార మొక భాగము నన్నయభట్టు గూర్చె ము
క్తారమణీయ వాక్యములఁ దక్కిన భాగము సోమయాజి పెం
పార నొనర్చె, రెంటిఁ గలయన్ శివదాసుఁడు మధ్యనాయక
శ్రీ రచియించె శారద ధరింపఁ, గవిత్రయకీర్తి మించఁగన్''.

చింతలపూడి ఎల్లనార్యుడు (తారకబ్రహ్మరాజీయము)

శ్రీమదాంధ్ర మహాభారతం శారద మక్కువతో ధరించే ముక్తారమణీయ కావ్యహారం. అందులో కొంతభాగం నన్నయభట్టు కూర్చాడు. తక్కిన భాగం తిక్కన సోమయాజి సమకూర్చాడు. శంభుదాసుడైన ఎఱ్ఱాప్రెగ్గడ ఆ దండకు మధ్యనాయక మణిశ్రీని సంధానించాడు. దానితో కవిత్రయ కీర్తి మిన్నంటింది. ఆంధ్ర భారతి ధరించే భారత కావ్యహార నాయకమణి శ్రీ- ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయ పేర వెలయించిన ఈ ఆరణ్యపర్వశేషం.

**1. కవిత్రయ కీర్తన సంప్రదాయం**

నన్నయ తిక్కనలు తమ తమ భాగాలను ముక్తా రమణీయ వాక్యాలతో రచించినట్లు ఆ విశేషణాన్ని ఇద్దరికీ అన్వయించేటట్లు పద్యంలో నాయకమణిగా అనుసంధించాడు చింతలపూడి ఎల్లనార్యుడు. నన్నయ తిక్కనల మీద ఎఱ్ఱాప్రెగ్గడకున్న సమగౌరవ భావం పై పద్యంలో ధ్వని. ఆ యిద్దరి కవితలు ఎంత అందంగా ఉన్నా, ఆ రెండు భాగాలను పరమరమణీయంగా అనుసంధానం చేసిన ప్రబంధపరమేశ్వరత్వం శంభుదాసుడైన ఎఱ్ఱనదే. ప్రబంధం అంటే పూర్వాపర సంగతి అనీ, రెండింటిని కలిపి వేసే గట్టిముడి అనీ అర్థాలున్నాయి. ఆ రెండువిధాలా ఎఱ్ఱన కృతి సార్థకమే. కాబట్టి తెలుగులో కవిత్రయ భావనకు ప్రారంభాన్నీ, పరిపూర్ణతనూ ఇచ్చిందీ, తెలుగు కవుల కా ముగ్గురిని కలిపి కీర్తించే ఒక సాహితీ సంప్రదాయాన్ని కల్పించిందీ ఎఱ్ఱాప్రెగ్గడే. కవిత్రయ కీర్తనం భావి కావ్యావతారికలకు కాంతి తోరణంగా ప్రకాశించింది. జక్కన కవి ఆ కవిత్రయ భావనకు మొదటిసారి కట్టిన ముక్తా తోరణం మచ్చుకు గమనిద్దాం.

ఉ. ‘‘వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు సత్ప్రబంధముల్
పాయక చెప్పి రిట్లు రసబంధుర వాగ్విభవాభిరామ ధౌ
రేయులు శబ్దశాసన వరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కిరే
యేయెడ నన్నపార్యుగతి నిద్ధర? నట్టి మహాత్ముఁ గొల్చెదన్.

చ. పరువడి భారతాఖ్య గల పంచమవేదము నాంధ్రభాష సు
స్థిరత రచించుచోఁ గృతిపతిత్వముఁ గోరి ప్రసన్నుఁడైన యా
హరిహరనాథుచేఁ బడసె నవ్యయసౌఖ్యపదంబు నెవ్వఁ డా
పురుషవరేణ్యుఁ దిక్కకవిఁ బూని నుతింతుఁ గృతాధ్వరోత్సవున్.

ఉ. ఈ త్రయిఁ దాఁ బ్రబంధ పరమేశ్వరుఁడై విరచించె శబ్ద వై
చిత్రి నరణ్యపర్వమున శేషము శ్రీ నరసింహ రామ చా
రిత్రములన్ బుధవ్రతగరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁ డా
చిత్రకవిత్వ వాగ్విభవ జృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్. (విక్కమార్కచరిత్రము : 1.12-14)

లోకంలో త్రిమూర్తి భావనం త్రివేణీ భావనం వలెనే కవిత్రయ భావనం ఆంధ్ర సాహిత్య జగత్తులో సుప్రతిష్ఠితం. జక్కన వారిని బిరుదనామాలతో గుర్తించి పై పద్యాలలో ఒక వైశిష్ట్యాన్ని ప్రతిపాదించాడు. నన్నయ ‘శబ్దశాసనుడు’, తిక్కన ‘సోమయాజి’, ఎఱ్ఱన ‘ప్రబంధ పరమేశ్వరుడు’. బిరుదనామాల ప్రశస్తి తెలుగులో ఎఱ్ఱన కాలంలోనే అరుణోదయ స్ఫూర్తిని పొందింది.

**2. ప్రబంధ పరమేశ్వర బిరుదం : ఆరణ్య పర్వశేషం**

సీ. ‘భవ్యచరిత్రుఁ డాపస్తంబ సూత్రుండు । శ్రీ వత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యాన సంసక్త చిత్తుఁడు సూర । నార్యునకును బోతమాంబికకును
నందనుఁ డిలఁ బాకనాటిలో నీలకం । ఠేశ్వరస్థానమై యొసక మెసఁగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు । ధన్యుండు ధర్మైకతత్పరాత్ముఁ

తే. డెఱ్ఱనార్యుండు సకల లోకైక విదితుఁ । డయిన నన్నయభట్ట మహాకవీంద్రు
సరససారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ । జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి.

క. ధీరవిచారుఁడు తత్కవి । తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయ కా
నారణ్య పర్వశేషము । పూరించెఁ గవీంద్ర కర్ణపుట పేయముగాన్'. (అర. 7.469-470)

ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషాన్ని పూరించాడని తెలియటానికి ఆ కవియే తెరచిన వాఙ్మయ కవాటం ఈ పద్యద్వయం. మొదటి సీసపద్యం చదువగానే, ఆదిపర్వావతారికలో నన్నయభట్టు తనను గురించి చెప్పిన 'తనకులబ్రాహ్మణు ననురక్తు....' అనే సీస పద్యం తెలుగు వారి మనసులలో తళుక్కుమంటుంది. నన్నయ లౌకిక వ్యక్తిత్వాన్నీ, సాహితీ వ్యక్తిత్వాన్నీ ఆ పద్యం ఎట్లా రేఖాచిత్రంగా గీచి చెప్పిందో, ఎఱ్ఱయను గురించి పై సీస పద్యం కూడా ఒక చిత్రపటాన్ని అట్లా చిత్రించి మన కందించింది.

**ఎఱ్ఱయ లౌకిక వివరాలు** - పాకనాటిలో నీలకంఠేశ్వరస్వామి దేవస్థానంవలన క్షేత్రగౌరవాన్ని పొందిన గుడ్లూరు జన్మస్థానంగా పుట్టి, పుట్టిన ఊరికే పుట్టెడు గౌరవం తెచ్చిన పుణ్యాత్ముడు. ఆపస్తంబసూత్రుడు, శ్రీవత్సగోత్రుడు, శివపదారాధనతత్పరుడు, పోతమాంబా సూరనార్యులనే పుణ్యదంపతుల పుత్రుడు. అతడు భవ్యచరిత్రుడు. ధర్మైక తత్పరుడు.

**ఎఱ్ఱయ కవితా వ్యక్తిత్వ వివరాలు**- సకల లోకానికీ తెలిసిన నన్నయభట్టు అనే మహాకవీంద్రుడి సరస సారస్వతాంశ ఎఱ్ఱయకు అబ్బింది - అనే ప్రశస్తి లోకంలో బాగా ఉన్నవాడు. చాల మంది సహృదయులు 'మీకు నన్నయ కవితారీతి కొంత అబ్బింది కదా! మీరు కూడా నన్నయవలె ఎందుకు కావ్య రచన చేయకూడదు? చేస్తే, మాకు అంతకంటె ఆనందం మరేముంటుంది?' అని ఎఱ్ఱయతో అంటూ ఉంటే- వారిని ఎట్లాగైనా సంతోషపెట్టాలనే అభిలాష పడినవాడు. అంతేకాదు - వారికి హర్షసిద్ధి కలిగే ఉపాయాన్ని గాఢంగా ఆలోచించిన ధీరవిచారుడు. ఆలోచించగా ఆలోచించగా అతడికి ఒక అద్భుతమార్గం తోచింది. నన్నయ కొంతమేరకు రచించగా మిగిలిన ఆరణ్యపర్వభాగం - ఆరణ్యపర్వశేషం - ఎవరైనా అర్హులు పూరించవలసి ఉన్నది. దాదాపు రెండున్నర శతాబ్దాల తరువాత నన్నయ కవితారీతి కొంత స్ఫురించి, నన్నయయే ఇన్నాళ్ళకు తన కవిత్వం తిరిగి చెప్తున్నాడా అన్నట్లు రచిస్తున్న తాను ఆ ఆరణ్య పర్వ శేషాన్ని నన్నయ రచనగానే వ్రాస్తే ఎంత బాగుంటుంది? అని అపూర్వంగా ఆలోచించినవాడు. ఆ విధంగా చేస్తే కవీంద్రులు (మహాకవులు) చెవులదొప్పలతో తన కవితను ఆస్వాదిస్తారని భావించినవాడు. నన్నయవలె తనను గురించి ప్రథమ పురుషలోనే చెప్పుకొనే నిరహంకార ప్రవృత్తి కలవాడు - ఎఱ్ఱాప్రెగ్గడ.

ఆరణ్యపర్వశేషం నన్నయపేర రచించినప్పుడు ఎఱ్ఱనకు ప్రత్యేకంగా బిరుదులున్నట్లు లేవు. 'శివపదాబ్జ సంతత ధ్యాన సంసక్త చిత్తు'డైనా శంభుదాసుడనే అభిజ్ఞనామం ఇంకా కుదురుకొన్నట్లు లేదు. కాగా, ఆరణ్యపర్వశేష రచనం వలన ఆయనకు ప్రబంధ పరమేశ్వరుడనే బిరుదనామం లోకంలో వ్యాపించిందని తన తాతగారైన ఎఱపోతసూరి ప్రశంసగా ఎఱ్ఱన చెప్పిన పద్యం సూచిస్తున్నది.

ఉ. "ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబులఁ గావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంద్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్ట తిక్కకవినాథుల కెక్కిన భక్తి పెంపునన్". (నృసింహపురాణము 1.17)

ఎఱ్ఱన కృతులు నాలుగు. 1. రామాయణం, 2. ఆరణ్యపర్వ శేషం, 3. హరివంశం, 4. నృసింహపురాణం. (ఈ రచనలు ఏ వరుసలో వ్రాశాడన్న దానిపై భిన్నాభిప్రాయా లున్నాయి). వీటిలో ఆరణ్యపర్వశేషం నిర్వహించటంలో- నన్నయ సారస్వతాంశను కవితారీతిని ఆవహింపజేసికొనటంతోనూ, తిక్కన పలుకుబడిని రంగరించుకొనటంతోనూ, నన్నయ తిక్కనల ప్రక్కన ఎఱ్ఱన కవిత్రయంలో ఒకడుగా మాన్యత గడించుకొన్నాడు.

ఎఱ్ఱన స్వభావరీత్యా కావ్యకర్త. 'లోకోత్తర వర్ణనానిపుణ కవికర్మ కావ్యమ్'- అనే లక్షణం చేత సహజంగా వర్ణనా నిపుణుడైన కవి ఎఱ్ఱన. ఇది సామాన్య లక్షణం. అతడికి 'ప్రబంధ పరమేశ్వరుడు' అనే కీర్తి వచ్చింది. ఇది విశిష్టార్థ బోధక వాచకం. ప్రకృష్టమైన బంధం ప్రబంధం. ఒక కవి తన రచనా శైలిచేత స్వీయ ముద్ర గల కవితారీతిచేత ఒక రచనను ప్రజల హృదయాలలో కలకాలం నిలపగలిగితే దానిని ప్రబంధం అనాలి. ఎఱ్ఱయ తనకు ముందు విశిష్ట రచనా శైలులు గల మహాకవులు తెలుగులో ఇద్దరే అన్నట్లు - నన్నయ తిక్కనలను పేర్కొన్నాడు. వారిద్దరిలో నన్నయ సరససారస్వతాంశ తనకు కొంత చెందిందని లోకంలో ప్రసిద్ధికెక్కాడు. దీనినిబట్టి ప్రబంధపరమేశ్వరత్వం అంటే- పూర్వకవుల రచనా రీతిలో రచన చేయగల ప్రజ్ఞాప్రావీణ్యం కలిగి ఉండటమే. నన్నయ తరువాత నన్నయవలె పద్యం చెప్పగల ఎఱ్ఱాప్రెగ్గడ తెలుగులో మొదటి 'ప్రబంధపరమేశ్వరు' డయ్యాడు. దానికి అక్షరసాక్ష్యం ఆరణ్యపర్వశేషం.

### 3. ప్రబంధపరమేశ్వరుడు : త్రిముఖాత్మకత

బిరుదాలకు అర్థం చెప్పటం కష్టం. 'కవిబ్రహ్మ' 'ప్రబంధపరమేశ్వరుడు' - ఈ రెండూ (ఎఱ్ఱన పేర్కొన్నవే) సమానార్థకాలని కొందరు విమర్శకు లన్నారు. అది స్థూలమైన పరిగణనం. సూక్ష్మ పరిశీలన చేస్తే 'బ్రహ్మ' శబ్దం సృజనాత్మక శక్తినీ, 'పరమేశ్వర' శబ్దం సర్వశక్తిమత్త్వాన్నీ (ప్రభుత్వాన్నీ) ధ్వనింపజేస్తాయి. ప్రబంధం కావ్యవాచియే అయినా దాని రచనా బంధం అందులోని ప్రధాన లక్షణం. ఒక్కొక్క ప్రబంధానికి ఒక్కొక్క రచనా బంధం (సంఘటన) సహజంగా రాణిస్తుంది. ప్రక్రియకు అనువైన రచనాబంధం ప్రసిద్ధంగా రాణించేటట్లు ప్రపంచించటం కూడా ప్రబంధపరమేశ్వరత్వమే. ఎఱ్ఱన నన్నయ శైలిని కూర్చగలడు, పురాణ శైలి వ్రాయగలడు, కావ్యశైలి నిర్మించగలడు, ప్రబంధ శైలి ప్రదర్శించగలడు. తిక్కన పద్ధతి వేరు. ప్రక్రియలు వేరైనా అతడి శైలి ఒక్కటే - కావ్యరూపక మిశ్రశైలి. కాని, ఎఱ్ఱన బహురూపశైలిని ప్రక్రియానుగుణంగా ప్రకటించగలిగాడు. అప్పటి కది గొప్ప వైచిత్రి, అపూర్వ ఫణితి. అందువలననే ఆతడి కా బిరుదం వచ్చింది.

ఎఱ్ఱన చేసిన ప్రతిప్రయోగం యౌగికంగా ఒక ప్రబంధం. ప్రబంధ శబ్దాన్ని ప్రక్రియాపరంగా, రచనా పరంగా అన్వయించుకొనాలి. రెండు గాని, అంతకంటె ఎక్కువ గాని ప్రక్రియల యొక్క లక్షణాలకూ, గుణాలకూ, స్వభావాలకూ ఏర్పడే గాఢమైన అనుబంధాన్నీ, సంఘటననూ, అంటుకట్టునూ ప్రక్రియాపరమైన ప్రబంధంగా గుర్తిస్తాం. దానికి తగినట్లు రచనలో సాగించే శబ్దార్థ రూపమైన శైలి కూడా ప్రబంధమే. అంటే - ప్రక్రియోచితమైన శైలిని ప్రదర్శించగల ఉక్తివైచిత్రి కూడా ప్రబంధపరమేశ్వరత్వంగా పరిగణించబడుతుందన్న మాట!

ఎఱ్ఱన ప్రయోగాలలోని ప్రబంధ స్వభావాలను ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చును.

1. ఆరణ్య పర్వశేషము - కావ్యకవితాశైలి+ఇతిహాస వస్తువు+ కథా కథనాత్మక వర్ణనాత్మక మిశ్ర పద్ధతి.
2. హరివంశము - పురాణకవితాశైలి + ఇతిహాస వస్తువు + కథాకథన పద్ధతి.
3. నృసింహపురాణము - ప్రబంధకవితాశైలి + పురాణవస్తువు + వర్ణనాత్మక పద్ధతి.

వీటిలో నన్నయ తిక్కనలకు అనువుగా ఎఱ్ఱన మలచుకొన్నది మొదటి రకం ప్రబంధ శైలి. దానిని అతడు అన్ని ప్రక్రియలలోనూ పాటించలేదు. ఆయా ప్రక్రియలకు అనుగుణమైన శైలులను ఆయన వేరువేరుగా నిర్మించుకొన్నాడు. హరివంశంలో వస్తువు ఇతిహాసమైనా ఎఱ్ఱన పలికింది. పురాణ శైలి. నృసింహపురాణం వస్తుతః పురాణమైనా అందులో ఎఱ్ఱయ నిబంధించింది వర్ణనాత్మక ప్రబంధశైలి. అందుకే ఎఱ్ఱన కవిత పై మూడు ప్రయోగాలలో మూడు రకాలుగా ముచ్చట గొలుపుతుంది. అందువలననే ఆయన ప్రబంధ పరమేశ్వరత్వం కూడా మూడు రకాలుగా సార్థకమౌతుంది. 1. పూర్వమహాకవుల కవిత్వాంశలతో కవిత్వం చెప్పటం మొదటిరకం ప్రబంధ పరమేశ్వరత్వం. 2. వివిధ సాహిత్య ప్రక్రియల లక్షణాలను జోడించి ఒక వినూత్న

మిశ్ర ప్రక్రియను రూపొందించటం మరొక రకమైన ప్రబంధ పరమేశ్వరత్వం. 3. ప్రక్రియకు తగిన కవితా శైలిని కల్పించటంతో పాటు దాని వ్యక్తిత్వానికి ప్రాణప్రదమైన ఉక్తిచమత్కృతి నొకదానిని పొందుపరచటం మూడో రకమైన ప్రబంధపరమేశ్వరత్వం. ఈ మూడు రకాల ప్రబంధ పరమేశ్వరత్వ గుణాలను వరుసగా ఆరణ్యపర్వశేష రచనతో, హరివంశ నృసింహ పురాణ రచనలతో సాధించిన మహాకవి ఎఱ్ఱాప్రెగ్గడ. ప్రబంధ పరమేశ్వరత్వానికి త్రిముఖాత్మక మహత్త్వాన్ని ప్రసాదించిన తొలి తెలుగు కవి ఎఱ్ఱన. అందుకే ఆయన అన్ని విధాలా అర్హుడైన ప్రబంధపరమేశ్వరుడు.

## 4. ప్రాచీన మహాకవులవలె కవిత్వం చెప్పటం ; ప్రబంధ పరమేశ్వరత్వం

తాను చూపిన ప్రబంధ మార్గాన్ని అనుసరించే కవులను భావికాలంలో కలిగి ఉండటం కూడా ప్రబంధ పరమేశ్వరత్వమే. నన్నయాది కవులు పూర్వకవిస్తుతిని చేశారు. అందులో వారి వారి అభీష్ట కవులను, వారి కవితాగుణాలను యథావకాశంగా ప్రస్తుతించారు. కాని, ఆయాకవుల కవితావైలక్షణ్యాలను తమ కవితలలో ప్రతిఫలింప చేసికొన్నట్లు గాని, వారి వారి కవిత్వాంశాలు తమకు సంక్రమించినట్లుగాని చెప్పిన జాడలు కానరావు. తెలుగులో మొదటిసారి ఎఱ్ఱన తనకవితలో నన్నయ సరససారస్వతాంశ ప్రతిఫలించిందనీ, నన్నయ కవితా రీతి కొంత కనపడుతుందనీ చెప్పుకొన్నాడు. ఇది పూర్వకవి స్తుతి కాదు. ప్రభావ ప్రసార ప్రశస్తి సంస్కృత వాఙ్మయంలో ఈ సంప్రదాయం సుప్రతిష్ఠితంగా ఉండేది. అటువంటి దానిని తెలుగులో వెలుగులోకి తెచ్చిన తొలికవి ఎఱ్ఱన. ఎఱ్ఱన తరువాత ఆ సంప్రదాయాన్ని ఒక ఘంటాపథంగా మార్చినవాడు శ్రీనాథుడు.

సీ. "వచియింతు వేములవాడ భీమన భంగి। నుద్దండలీల నొక్కొక్కమాటు;
భాషింతు నన్నయభట్టు మార్గంబున। నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు;
వాక్రుత్తుఁ దిక్కయజ్వ ప్రకారము రసా। భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు;
పరిఢవింతుఁ బ్రబంధపరమేశ్వరుని తేవ। సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు...." (కాశీఖండము. 1.13)

కవిసార్వభౌముడు తన కవితపై పూర్వాంధ్ర మహాకవుల కవితారీతుల ప్రభావాలున్నాయని పేర్కొనటం ఆయన అనుకరణశీలాన్ని తెలిపే అవగుణం కాదు. అవిచ్ఛిన్న సంప్రదాయ పోషకుడైన కవి తనకు ముందున్న కవితారీతులలో తన ప్రజ్ఞాప్రాభవాన్ని ప్రకటిస్తూనే స్వతంత్ర కవితారీతిని భావికవుల కందించే సాహితీ సంప్రదాయాన్ని సంపన్నం చేస్తాడని పై సీస పద్యం చెప్పక చెప్పుతున్నది. ఈ మార్గం ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱన చూపిందే. అయితే ఈ ప్రస్థానాన్ని ప్రబంధపరమేశ్వరుల వంటి అరుదైన ప్రజ్ఞావంతులే చేయగలరు. అసమర్థులు ఆ మార్గాన్ని అనుసరిస్తే అనుకర్తలుగా మిగిలిపోతారు. ఎఱ్ఱన వలె యుగకర్తలు కాలేరు. ప్రాచీన కవుల కవితలలో తాను మెచ్చుకొన్న గుణాలు చెప్పటం వేరు. వారి కవితల నుండి తాను తెచ్చుకొన్న గుణాలు చెప్పటం వేరు. మొదటి పద్ధతి నన్నయాదులు నేర్పింది. రెండో పద్ధతి ఎఱ్ఱన ఆరంభించింది. ఆ పద్ధతిలో మార్గదర్శకుడైన ఎఱ్ఱాప్రెగ్గడ ప్రథమ ప్రబంధ పరమేశ్వరుడు.

## 5. విశిష్టప్రక్రియా నిర్మాణ దక్షత : ప్రబంధపరమేశ్వరత్వం

కావ్యేతిహాసం నన్నయ తిక్కనలు అపూర్వంగా దిద్దితీర్చిన ప్రక్రియ. దానిని మించి మరొక రచన చేయటం, ఎఱ్ఱనకు కూడా అసాధ్యమే. మహాభారతంమీది భక్తి చొప్పున, నన్నయ తిక్కనల కవితా మహత్త్వం మీద మక్కువ చొప్పున భారత ఖిలభాగమైన హరివంశాన్ని తెలుగుచేసి ఎఱ్ఱన మేలు చేశాడు. హరివంశాన్ని పురాణేతిహాసంగా ఎఱ్ఱన సంభావించాడు. కావ్యేతిహాసంకంటె విలక్షణమైనది 'పురాణేతిహాసం'. దానికి ఒక ప్రక్రియా గౌరవాన్ని కలిగించి తెలుగులో హరివంశాన్ని నిర్మించాడు. సంస్కృత హరివంశ ప్రక్రియ కంటె ఇది భిన్నమైనది. నన్నయ తిక్కనల బాటలో నడిచి ఎఱ్ఱన గూడ మహాభారత ఖిలభాగానికి

విలక్షణ ప్రక్రియా గౌరవాన్ని కలిగించి తెలుగు రచనను పునస్సృష్టిగా నిర్వహించాడు. దానికి సమకాలీనాంధ్ర సాహిత్య ప్రక్రియలు కూడా దోహదం చేసి ఉంటాయి. తిక్కన యుగంలో మార్కండేయ మహాపురాణం వెలసింది. మారన దానిని ఒక విలక్షణ కవితాశైలిలో రచించాడు. ఎఱ్ఱన అతడికంటె ఒక ప్రత్యేకతను ప్రదర్శించాడు. హరివంశ వస్తువును ఇతిహాసగతిలో సాగించి, కవితను పురాణశైలిలో నిబంధించాడు. ఆకృతికి ఇతిహాసంగా, అనుభూతికి పురాణంగా ఎఱ్ఱన చేతిలో హరివంశం రూపొందింది. నన్నయ తిక్కనల కంటె భిన్నమైన కవితాశైలి కావటం చేత, కావ్యేతిహాసంకంటె విలక్షణమైన మిశ్ర ప్రవృత్తి గల ప్రక్రియ కావటం చేత ఎఱ్ఱన హరివంశానికి ప్రత్యేక గౌరవం ఏర్పడింది. కొందరు హరివంశ రచన వలననే ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరు డయ్యాడన్నారు. అది కూడా కాదన లేని సత్యం!

నృసింహపురాణమని పిలువబడే ఎఱ్ఱన రచనను 'నరసింహావతారం బను పురాణ కథ' అని కవియే గద్యలో చెప్పుకొన్నాడు. అంటే దశావతారాలలో ఒకటైన నృసింహావతారపు ఆవిర్భావ కథను పురాణ కథగా ఎఱ్ఱన రూపొందించదలచు కొన్నాడన్నమాట! అదే కథా నిర్మాణ ధ్యేయమైతే నృసింహావతారానికి కారణాలైన కథార్థాలను సంవిధానం చేయటమే కావ్య నిర్మాణమర్మమౌతుంది. కాని, ఎఱ్ఱన దానికి క్షేత్ర మాహాత్మ్య లక్షణాన్ని కూడా జోడించాడు. అందువలన మొదటా, చివరా అహోబిలక్షేత్ర ప్రశస్తి అమర్చటం జరిగింది. క్షేత్ర మాహాత్మ్యంలో దైవ, క్షేత్ర, తీర్థ, పర్వ, భక్తచరిత్రలు, మహిమలు, వర్ణనలు యథావకాశంగా చోటు చేసికొంటాయి. ఎఱ్ఱన అంతటితో ఆగలేదు. కావ్య సహజమైన అష్టాదశవర్ణనలు కూడా యథావకాశంగా అందులో పొందుపరచాడు. ఆ వర్ణనలలో అలంకృతిశైలిని ప్రవేశపెట్టి రచనలో రీతికి, శయ్యకు ప్రాధాన్యమిచ్చి ప్రబంధ స్పృహను పోషించాడు. ఇట్లా తయారైన ఆ రచన- నాలుగు ప్రక్రియల నాణెమైన మిశ్రమం. పురాణకథ+క్షేత్ర మాహాత్మ్యం+కావ్యవర్ణనలు+ప్రబంధశైలి. ఇటువంటి సంశ్లిష్ట మిశ్ర ప్రయోగం అంతకు ముందు ఎవ్వరూ చేయలేదు. అందువలన నృసింహపురాణం అపూర్వ ప్రక్రియా ప్రయోగంగా ఆ కాలంలో ప్రకాశించింది. దానినే 'ప్రబంధపురాణం' అనే ప్రక్రియగా నేడు పిలుస్తున్నాం ప్రబంధ పురాణం ప్రబంధపరమేశ్వరత్వానికి ప్రకృష్టమైన తార్కాణం.

## 6. ఆరణ్యపర్వ శేష వస్తు వైశిష్ట్యం : ప్రబంధపరమేశ్వరత్వం

ఆంధ్ర మహాభారతంలో నన్నయ రచించిన ఆరణ్యపర్వ భాగానికీ, ఎఱ్ఱన పూరించిన ఆరణ్యపర్వశేషానికీ వస్తు స్వభావాన్ని బట్టి స్పష్టమైన భేదం కనపడుతుంది. నన్నయ భాగంలో మైత్రేయ బృహదశ్వులు, నారద వ్యాసమునీంద్రులు చెప్పిన కథాంశాలు పాండవుల అరణ్యవాస జీవితంతో పెనవేసికొని విస్తృతంగా వినిపిస్తాయి. వాటిలో ధర్మజాదుల తీర్థయాత్రా విశేషాలే సగానికి సగం వ్యాపించి ఉండటం గమనిస్తాం. కాగా, ఎఱ్ఱన పూరించిన భాగంలో మార్కండేయమహర్షి చెప్పిన కథాంశాలే ప్రముఖ పాత్ర వహిస్తాయి. పాండవవనవాస జీవిత కథా ఘట్టాలు పరిమితంగా ఉంటాయి. స్థూలంగా ఈ స్వభావాన్ని సమీక్షిస్తే నన్నయ భాగంలో ఇతిహాస స్వభావం ఎక్కువ. ఎఱ్ఱన భాగంలో పురాణ స్వభావం ఎక్కువ.

ఎఱ్ఱన (క్రీ.శ. 1280-1364) ప్రబంధపురాణకావ్యయుగ నాయకుడు. హరివంశంలో పురాణ కవితను, నృసింహపురాణంలో ప్రబంధ కవితను వెలార్చిన ఎఱ్ఱన వస్తుతః పురాణ ప్రబంధ కవిత్వాలకు ఒక వారధిగా ఆ కాలంలో నిలిచాడు. పురాణ మార్గంలో పోతనాదులకు, ప్రబంధ మార్గంలో శ్రీనాథ పెద్దనాదులకు మార్గదర్శకుడైనాడు. మఱి ఆరణ్యపర్వ శేష రచనలో ఎఱ్ఱన నిర్వహించిన పాత్ర ఎటువంటిది? అనే ప్రశ్న అత్యంత ప్రాధాన్యాన్ని వహిస్తుంది. విమర్శకు లీయంశంపై భిన్నాభిప్రాయాలను వెలిబుచ్చారు.

ఏమైనా, ఎఱ్ఱనకు నన్నయ కవిత్వాంశ కొంత ఉన్నది. నన్నయ వలె పద్యం నడపగలడు. ఒక్కొకసారి ఆయనను బాగా అనుకరించగలడు, అనుసరించగలడు, కొన్నిసార్లు నన్నయ పద్యానికి దీటుగా అనుసృజనం చేయగలడు. కాని, ఎఱ్ఱన బాణీలో నన్నయ కంటె విశిష్టమైన పౌరాణిక, ప్రాబంధిక వాక్పాకం మిలమిలలాడుతూ ఉంటుంది. ఆ కవిత్వ స్వభావాన్ని ప్రక్రియా స్వభావానికి అనుగుణంగా సంవదించగలిగే అవకాశం ఆరణ్యపర్వశేషంలో ఎఱ్ఱయకు లభించింది.

భారతేతిహాసంలో పురాణలక్షణ విశిష్టమైన వస్తువును ఇతిహాసోచితంగా నిర్వహించే ఘట్టాలు ఎఱ్ఱయ పూరణ చేసిన భాగంలో ఉండటం విశేషం. అవి కల్పాంతంలో కూడా చిరంజీవిగా ఉండే మార్కండేయుడు చెప్పటం మరీ విశేషం. అటువంటి పురాణ విశేషాలు ఇతిహాస వస్తువులో ఉండటం సహజం. క్రీ.పూ. 4వ శతాబ్ది ప్రాంతం వాడైన కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో ఇతిహాస స్వరూపం గురించి చెప్పాడు. రాజు పూర్వాహర్భాగంలో హస్త్యశ్వప్రహరణ విద్యాభ్యాసాలు చేయాలనీ, పశ్చిమాహర్భాగంలో ఇతిహాసశ్రవణం చేయాలనీ పేర్కొన్నాడు. ధర్మరాజు అరణ్య వాసంలో కూడా అట్లాగే విస్తృతమైన ఇతిహాస శ్రవణం చేశాడు. దానికి అరణ్యపర్వంలో మునీంద్రులు చెప్పిన కథలే సాక్ష్యాలు. ఇతిహాసమంటే- ''పురాణ మితివృత్త మాఖ్యాయికోదాహరణం ధర్మశాస్త్రమర్థశాస్త్రం చేతిహాసం'' (అర్థశాస్త్రమ్. 1.5) అని కౌటిల్యుడు చెప్పాడు. అంటే- ఇతిహాసంలో కొంత పురాణం ప్రవర్తిల్లుతుందనీ, కార్యకారణ సంబద్ధమైన ప్రఖ్యాతవృత్తం నిబంధించబడుతుందనీ, నాయకనాయకేతరుల చేత చెప్పబడే కొన్ని ఆఖ్యాయికలూ, దృష్టాంతరూపాలైన కొన్ని గాథలూ, ధర్మార్థ శాస్త్ర విషయ చర్చలూ సంతరించబడి ఉంటాయనీ స్పష్టమౌతున్నది. ఈ లక్షణాలన్నీ ఆరణ్యపర్వశేషంలో అమరి ఉండటం గమనార్హం.

### (1) పురాణ వస్తువు

''ఇదంవా అగ్రే నైవ కించి దాసీత్ - ఇత్యాదికం జగతః ప్రాగవస్థా ముపక్రమ్య సర్గ ప్రతిపాదకం వాక్యజాతమ్ పురాణమ్'' అని విద్యారణ్యులు ఐతరేయబ్రాహ్మణ భాష్యోపోద్ఘాతంలో పేర్కొన్నారు. ఈ విషయాన్ని గురించి తెలిసికొనే జిజ్ఞాస ధర్మరాజుకు సహజంగా ఉండటం అతిడి ఉత్తమ క్షత్రియ సంస్కారం. ఎవరి వద్ద నుండి ఎటువంటి విజ్ఞానాన్ని ఎట్లా రాబట్టుకొనాలో ధర్మరాజుకు తెలిసినంతగా మరొకరికి తెలియదు. మార్కండేయు డొక్కడే సర్గాన్ని గురించి స్వీయానుభవంతో వాస్తవంగా చెప్పగల మహర్షి. అందువలన 'సకల చరాచరోత్పత్తి స్థితి విలయ ప్రకారంబులు నీకుం బెక్కుమాఱులు ప్రత్యక్షంబులయి కానంబడి యుండుఁ గావున ని న్నడిగెద- లోకంబులు విలయకాలంబున నెట్టిభంగి యగు నెఱింగింపుము' (ఆర. 4.239) అని అన్నాడు. మహా ప్రళయ సమయంలో సముద్రాలన్నీ పొంగి ఏకార్ణవమై నప్పుడు వటవృక్షపత్ర శయనం మీద పరుండి ఉన్న పరమసుందర బాలకరూప పరమాత్మను దర్శించి, ఆయన గర్భకుహరంలో సంగుప్తమై ఉన్న సృష్టినంతా సందర్శించి, వెలువడి, బ్రహ్మ చేసే ప్రతిసర్గాన్ని పరికించిన కథను మార్కండేయ మహర్షి చెప్పటం ఇతిహాసంలోని పురాణాంశం. ఆ దృశ్యాన్ని స్వయంగా దర్శించి ఇది ఇట్లా జరిగింది అని వాస్తవ కథనంగా మార్కండేయుడు చెప్పటంలో పురాణం ఇతిహాస స్ఫూర్తిని పొందింది. నిత్యుడైన ఆ పరమాత్ముడే మానుష రూపధారియైన శ్రీకృష్ణుడని పేర్కొనటం వలన సర్గకథనానికి కూడా సాక్షీభూతుడు దొరికాడు. సృష్టి, స్థితిలయకారకుడైన పరమాత్ముడు భూతలంపై అవతరించి వాటిని తన జీవిత కాలంలో చరిత్రలో ప్రవర్తింపజేస్తాడని ఇతిహాస స్పృహతో ధ్వనింపజేసినట్లైనది. రాజు తెలియదగిన పురాణాంశంలో సర్గం మొదటిది. సర్గాన్ని దర్శించినవారు మరికొందరున్నారు. వారిలో ముఖ్యులు వైవస్వత మనువు, సప్తర్షులు. ప్రళయకాలంలో ఏకార్ణవ గర్భాన భద్రమైన ఓడలో ఉండి మహామత్స్యరూపుడైన నారాయణుడి మహిమను, కరుణను, స్వయంగా తెలిసికొనిన ఆ అద్భుత అనుభూతిని తెలిపే కథ వైవస్వత మనువృత్తాంతం. అనేక మన్వంతరాలను చూచిన మార్కండేయుడే ఈ అంశాన్ని కూడా తెలియచెప్పగలడు. కాబట్టి పురాణ సర్గ విశేషానికి సంబంధించిన కథను మార్కండేయుడి నడిగి ధర్మజుడు చెప్పించుకొని విన్నాడు. సృష్టి ప్రాగవస్థను గురించి చెప్పిన ఈ ఘట్టాలలో సైతం ఎఱ్ఱన కావ్య పురాణ ప్రబంధ రచనా ధోరణులను యథావకాశంగా ప్రవేశపెట్టి రచించటం విశేషం. సామాన్యంగా సర్గాది విషయాలు విజ్ఞానాత్మకంగా, గంభీరంగా, సమాధి భాషలో, ప్రతీకాత్మకంగా ఉంటాయి. కాని,ఎఱ్ఱయ కవితలో అవి సరసవర్ణనా మధురాలుగా మారాయి.

(అ) పరమాత్ముడి గర్భంలో ప్రవేశించి మార్కండేయుడు దర్శించిన లోక సముదాయాన్ని వర్ణించిన ఈ పద్యం పురాణ కథన రూపమైన కవితకు నిదర్శనం.

సీ. 'గంగాదినదులతోఁ గనకశైలాదిభూ । ధరములతో సముద్రములతోడ
వివిధ పట్టణ నవద్వీప వర్షములతో । బహుకర్మరతులైన ప్రజలతోడఁ
బక్షిమృగవ్యాళ పశుసంఘములతోడఁ । దద్దయు నొప్పారు ధాత్రిఁ గంటి
సూర్యేందుతారకా జ్యోతిరుజ్జ్వలమైన । గగనంబుఁ బవనమార్గములుఁ గంటి

తే. శక్రయమవరుణాది నిర్జరసమేత । మైన నాకంబు గంటి మహోహియక్ష
రాక్షసాసుర విద్యాధర ప్రముఖులఁ । గంటి, వేయేల సకలలోకములుఁ గంటి.' (ఆర. 4. 256)

చూచిన వస్తువుల పట్టీని చెప్పే పద్యం ఇది. అయితే, ఉదరంలో బ్రహ్మాండాన్ని చూచిన అద్భుతరసావేశంతో మార్కండేయుడు చెప్పిన పద్యంగా ఎఱ్ఱన నిర్మించాడు. 'కంటి' అనే క్రియను ప్రతివాక్యం చివర కూర్చటం వలన అద్భుతం వ్యక్తమైంది. భూమిపై ఉన్న నదీనద సముద్ర పర్వతాదులను 'తో' అనే తృతీయా విభక్తి ప్రత్యయంతో (కరణ కారకంతో) వేర్పరచి చెప్పటం అద్భుత భావోద్దీపకంగా ఉన్నది. క్రియా, కారక ప్రత్యయాల పునరావృత్తితో, సమాసఘటనలో వర్ణ పునరావృత్తితో పద్యాన్ని అక్షర వైచిత్రిమయం చేశాడు ఎఱ్ఱన. ఇది పురాణ కవితా రీతి. నన్నయ వలె అక్షరరమ్యతను ప్రదర్శిస్తూనే క్రియకారక ప్రయోగ వైచిత్రిని చేర్చి ఎఱ్ఱయ తన సూక్తివైచిత్రిని వెలార్చా డిందులో.

(ఆ) ఆలంకృత వర్ణనా వైచిత్రితో కావ్యశైలిని ప్రదర్శించాడు ఎఱ్ఱన - ఏకార్ణవ వర్ణనంలో.

సీ. 'గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన । యొత్తుచు నెడముల నుత్తరించి
వేడుకఁ జేతులు విచ్చి యాడెడునట్లు । లోలోర్మిపంక్తులఁ గ్రాలి క్రాలి
ప్రచురహాసస్ఫూర్తి పచరించుచాడ్పున । నురుఫేనరోచులఁ దెరలు గవిసి
యురువడి వర్ధిల్లుచున్న జలంబుచేఁ । బొంగారి దెసలెల్ల మ్రింగికొనుచుఁ

ఆ. ప్రబల విలయకాల పటురయ బహుళస । మీరణౌఘ దుర్నివార మగుచు
నుగ్రభంగిగాఁ బయోనిధు లొక్కటఁ । బెల్లు రేఁగి జగము లెల్ల ముంచె'. (ఆర. 4.227)

పయోధులు ఉగ్రభంగితో విచ్చలవిడిగా విజృంభించి లోకాలను ముంచివేశాయి. విలయ నాట్యం చేసే పయోధులను వర్ణిస్తూ పయోధులనే ప్రచండ యోధులనో, వీరులనో, భూతాలనో, సావయవ రూపకంగా చేసి వర్ణించవచ్చును. కాని ఆరోపితమైన ఉపమానాన్ని చెప్పకుండా ఊహించుకొనేటట్లు చేసి, చెప్పని లోపాన్ని స్ఫురింపచేయకుండా ఉండేటట్లు చేసే అలంకృతోక్తి వైచిత్రి ఎఱ్ఱయకు ఉగ్గుతో వచ్చిన విద్య. ఒక ప్రాంతాన్ని ఆక్రమించటానికి దండుగా, దండిగా క్రమ్ముకొని వస్తున్న ప్రచండవీరుల ఉగ్ర పరాక్రమ విస్ఫూర్తిని, విభావానుభావ స్ఫూర్తితో వర్ణించడం పై పద్యంలోని వర్ణనాత్మక శిల్పం. సీమలు దాటి ముందుకుసాగి, మెల్లమెల్లగా త్రోసికొంటూ క్రమ్ముకొని, దూరాలను అతిక్రమించటం (సముద్రాలనే) వీరుల విజృంభణ చర్య. విజయాలను సాధించినప్పుడూ, పగరను దాడికి పిలిచేటప్పుడూ (ఎత్తైన అలలనే) చేతులెత్తి ఆడించి తమ పరాక్రమాన్ని ప్రకాశింప చేయటం ఆంగిక చేష్టా విశేషం. ప్రచురహాసాలంటే వికటాట్టహాసాలు. వీరుల విజృంభణంలో తిరుగులేని పురోగమనం సాగుతున్నప్పుడు విజయగర్వద్యోతకమైన (ఫేనరోచులనే) అట్టహాసం చేయటం సాత్త్వికభావ విశేషం. వేగంగా పొంగుతున్న జలంతో (ఇక్కడే చలంతో అనే చమత్కార స్ఫూర్తి గమ్యం) దిక్కులన్నీ ఆక్రమించటం రౌద్ర భావ వ్యంజకమైన ఆంగికాభినయ విశేషం. ప్రళయకాల వాయుతరంగాలవలె అడ్డగించటానికి అసాధ్యమైన ప్రచండవేగంతో ముందుకు చొచ్చుకొని వచ్చే వేగాభినయ విశేషం ఉగ్రభంగిమ. ఇట్లా పయోనిధులనే ప్రచండవీరులు ఒకే సమయంలో గుమికూడి పెచ్చు పెరిగి భూమినంత ఆక్రమించిన ఒక పెద్ద దాడిని వర్ణించిన స్ఫూర్తి ఈ పద్యంలో ఎఱ్ఱన కల్పించాడు. నిరవయవ రూపకంతో వస్తు ధ్వనిని సాధించే శిల్పం ఎఱ్ఱయలో ఎక్కువ.

సావయవరూపకంతో వస్తుధ్వనిని సాధించే శిల్పం నన్నయలో ఎక్కువ. నన్నయ రీతిలో పద్యాన్ని ఎత్తుకొన్నా ఎఱ్ఱన ఫణితిలో దాన్ని నిర్వహించడం ఇందులో గమనార్హం. ఇటువంటి పద్యాలు ఎన్నో ఎఱ్ఱయ రచనలో ఆణిముత్యాలవలె అందగిస్తూ ఉంటాయి. కావ్యశైలికి అవి కమనీయ కరదీపికలు.

(ఇ) వర్ణనలకు అవకాశం ఉంటే అదనెరిగి విస్తరించటం, లేనిచోట పదనెరిగి కల్పించుకొనటం, ఆయా సందర్భాలలో రీతి శయ్యాగుణ విశిష్టమైన ప్రబంధోచిత పద్యరచనా విన్యాసాలను వెలార్చటం - అనే మెలకువలు సర్గాది వర్ణన ఘట్టాలలో కూడా ఎఱ్ఱన అవలీలగా ప్రదర్శించగలడు. ఉదాహరణకు- నూరు సంవత్సరాల అనావృష్టి తరువాత, ప్రచండ సూర్య సప్తకం విజృంభించి జలాన్ని హరించి లోకాలను దగ్ధం చేసిన తరువాత, కొన్నేళ్ళు సంవర్తవలాహక మేఘాలు క్రమ్మి పుష్కలంగా వర్షిస్తాయి. ఆ ఘట్టంలో ఎఱ్ఱన మూడు వృత్తాలను ఎన్నుకొని, మబ్బులు క్రమ్మటం,ఉరుములు ఉరమటం, ధారాపాతంగా వర్షించటం అనే అవస్థాత్రయాన్ని వర్ణనారమణీయంగా పఠితల మనస్సులలో ప్రత్యక్షీకరింప చేయటం ప్రబంధ రచనా రీతి. గమనించండి.

మ. 'సితపీతారుణనీల పింగరుచులై స్నిగ్ధంబులై యుద్యతా
యతవిద్యుల్లలితంబులై ఘనగిరీంద్రాకార ఘోరంబులై
తతనిర్ఘాత నిపాత భీమభిదురధ్వానంబులై సంతతో
ద్ధత సంవర్తవలాహకంబులు వెసం దోఁతెంచు దిగ్భిత్తులన్.

ఉ. పెల్లునఁ గూలుతజ్జలము పెక్కువ నొక్కట నమ్మహానలం
బెల్లను నాఱిపోవుఁ బృథివీశ్వర! యేఱులు నబ్ధులున్ వెసం
దొల్లిటియట్ల నిండుఁ; బటుతోయద సంఘము లంతఁ బోక గ
ర్జిల్లుచు వెండియుం గురియుఁ జిత్రము గాఁగ ననేక కాలముల్.

శా. ధారాపాత నితాంతవేగమున నిద్ధాత్రీతలం బాహతం
బై రూపేది మునుంగుఁ దోయములలో; నత్యంత గంభీరవాః
పూరంబంతయు ముంచి మించుటయు దిగ్భూమీ నభోభాగముల్
వే రూపింపఁగ రాకయుండఁ దమముల్ వేష్టించుఁద్రైలోక్యమున్'. (అర. 4.245 - 247)

రచనా రామణీయకంతో విభావావస్థాత్మికమైన దృశ్యపరికల్పనం ఎఱ్ఱన ప్రబంధశైలిలో ఉన్నవైచిత్రి. ఇది తరువాతి ప్రబంధ కవులకు శిల్పభిక్ష పెట్టింది. సర్గ ప్రతిసర్గాది పురాణ వస్తువును సైతం ప్రబంధ రచనా సుందరంగా ఆవిష్కరించే ఎఱ్ఱన ప్రతిభ ప్రబంధ పరమేశ్వరత్వాన్ని ప్రకటించింది.

### (2) పురాణవస్తు విశేషాలు

కుమారిలభట్టు తన తంత్రవార్తికంలో పురాణాలు పురషార్థసాధనకు ఉపయోగపడతాయని అన్వయించి చెప్పాడు. ''తేన సర్వస్మృతీనాం ప్రయోజనవతీ ప్రామాణ్యసిద్ధిః । తత్ర యావద్ధర్మమోక్ష సంబన్ధి తద్వేద ప్రభవమ్ । యత్త్వర్థ సుఖ విషయం తల్లోక వ్యవహారపూర్వక మితి వివేక్తవ్యమ్ । ఏషైవేతిహాసపురాణ యో ర ప్యుపదేశ వాక్యానాం గతిః । ఉపాఖ్యానాని త్వర్థవాదేషు వ్యాఖ్యాతాని । యత్తు పృథివీవ్యాపార కథనం తద్ధర్మాధర్మ స్మరణమూలం । దేశకాల పరిమాణ మపి లోక జ్యోతిశ్శాస్త్ర వ్యవహార సిద్ధ్యర్థం దర్శన గణిత సంప్రదాయానుమానపూర్వకమ్ । భావికథన మపి త్వనాదికాల ప్రవృత్తయుగ స్వభావ ధర్మాధర్మానుష్ఠాన ఫల విపాక వైచిత్ర్య జ్ఞాన ద్వారేణ వేదమూలమ్.... '' (తంత్ర వార్తికమ్. జై. 1.3.1) (స్మృతులకు

ప్రామాణికత్వం పురాణాల వలన ప్రతిష్ఠాపిత మౌతుంది. అందలి ధర్మమోక్ష సంబంధమైన వస్తు జాలమంతా వేదప్రభవమే. అర్థ సుఖ విషయజాలమంతా లోకవ్యవహార పూర్వకమే. ఈ విధంగా స్మృతులలో ఉండే అంశాలను వివేచించి తెలిసికొనాలి. అదే విధంగా పురాణేతిహాసాలలోని ఉపదేశ వాక్యాలను కూడా వివేచించాలి. వాటిల్లోని ఉపాఖ్యానాలను అర్థవాదాలుగా వ్యాఖ్యానించవచ్చును. కించిద్దర్శన పూర్వకం, కించిద్వేద మూలం అయిన పృథివీ విభాగాది కథనం తద్ధర్మాధర్మసాధన ఫలోపభోగ ప్రదేశ వివేకార్థం ఉపయోగ పడుతుంది. దర్శన గణిత సంప్రదాయానుపూర్వక మైన దేశకాల పరిగణన కథనం అనాది కాల ప్రవృత్త యుగ స్వభావ ధర్మాధర్మానుష్ఠాన ఫల విపాకవైచిత్ర్య జ్ఞానార్థం పురాణాలలో అభివర్ణితాలై ఉంటాయి. ఈ సమన్వయాన్ని బట్టి లోకవేద ప్రభవాలైన ధర్మాదులను అభివర్ణించటం చేత పురాణాలు లోకానికి పురుషార్థ సాధన పరిజ్ఞానాన్ని అందించటానికి ఏర్పడినవని స్పష్టమౌతున్నది.

పాశ్చాత్యులు పురాణవాఙ్మయాన్ని మైథాలజీ (Mythology) అని పిలుస్తారు. దానిలో దైవలీలలే కాక, సర్గ ప్రతిసర్గాదులవంటి అంశాలూ, ఖగోళ రహస్యాలూ, స్వర్గ నరకాది పరలోక విషయాలూ, పుణ్యపాపఫలానుభవ విశేషాలూ, నరులు చేసే ఆముష్మిక పుణ్యకర్మలకు దేవతలు తృప్తులై లోకానికి వారు చేసే ప్రత్యక్షప్రత్యుపకారాదులు, అట్లే దేవతల ఆగ్రహచర్యలు వర్ణించబడతాయని పేర్కొన్నారు. అతి ప్రాచీన విషయాల యొక్క ఉత్పత్తి వికాసాల నెరిగించే కథలలో కొన్ని స్థానిక చరిత్రలే పురాణ గాథలుగా పరివర్తనం చెందటం కూడా కనపడుతుంది. పురాణ వాఙ్మయం సూర్యుడి చుట్టూ తిరుగుతున్నదని చెప్పినా ఆశ్చర్యం లేదని విమర్శకులు భావిస్తున్నారు. (చూడు: The Outlines of Mythology by Lewis Spencer. p.25)

పురాణ వాఙ్మయంలో కానవచ్చే కథాంశాలను గురించి పైన పేర్కొనబడిన లక్షణాలను స్థూలంగా గమనిస్తే ఆరణ్యపర్వశేషం పురాణ కథార్థ బీజ సంపుటిగా ప్రత్యక్షమౌతుంది. మచ్చుకు కొన్ని ఉదాహరణలు.

**(అ) దర్శన గణిత సంప్రదాయానికి సంబంధించిన దేశకాల పరిగణన కథనం, అనాది కాల ప్రవృత్త యుగ స్వభావ విశేష కథనం-** ఆరణ్యపర్వ చతుర్థాశ్వాసంలో ధర్మరాజు 'కలియుగంలో సకల ధర్మలోపం జరుగుతుందని అంటారు. దాని తీరును వివరించండి'- అని అడిగాడు. మార్కండేయ మహర్షి చతుర్యుగ స్వభావాలను చెప్పి, కలియుగ లక్షణాలు వివరించి, విష్ణువు కల్కిగా అవతరించి ధర్మాన్ని సముద్ధరించి కృతయుగారంభానికి నాంది నాలపిస్తాడని చెప్పటం పురాణ కథాంశమే.

**(ఆ) ఖగోళ రహస్యాలు** - ఇందులో జ్యోతిషాది విజ్ఞాన విశేషాలు కూడా పరిగణించబడతాయి. ఆరణ్యపర్వశేషంలో ఇంద్రుడు దేవసేనకు కాబోయే భర్తను గురించి నిర్ణయించటానికి తత్కాల ముహూర్త స్వభావాన్ని ప్రమాణంగా తీసికొని గుణించటం గమనార్హం. ఆమె ప్రశ్న అడిగిన కాలం రౌద్ర ముహూర్తం. అమావాస్యనాడు చంద్ర సూర్యుల సంగమ కారణంగా ఆ ముహూర్తం సిద్ధిస్తుంది. ఆ సమయంలో పూర్వ సంధ్యారుణ కాంతులు సముద్రంలో ప్రతిఫలించి రక్తారుణమైన యుద్ధభూమిని స్ఫురింపచేస్తున్నాయి. కాబట్టి ఆ సముద్ర తీరంలో సురాసురుల నడుమ మహా యుద్ధం జరుగుతుందని నిర్ణయించాడు. భృగువు, అంగిరసుడు మొదలైన ఋషులు అగ్నిలో వేల్చే హవ్యాలను మోసికొని అగ్నిదేవుడు సోమాగ్నులతో సమావేశమయ్యాడు. కాబట్టి అటువంటి ముహూర్తం దేవసేనకు కాబోయే భర్త (దేవసేనకు నాయకుడు) సూర్యుడు, చంద్రుడు, అగ్ని, రుద్రుడు అనే దేవతల అంశాలతో కూడి ఉండటం తథ్యమని ఇంద్రుడు నిర్ణయించాడు. ఇది ఖగోళ విజ్ఞాన సంబంధి కథాంశం.

కుమారస్వామి కథ చాల వరకు ఖగోళ రహస్యాలతో కూడుకొన్నదే. ముఖ్యంగా ఆరుగురు ఋషుల భార్యలు రోహిణీ నక్షత్రం ప్రక్కన అభిజిత్తు నక్షత్ర స్థానంలో కృత్తికలుగా అగ్నిదైవత్యమనే నక్షత్రంగా ఆకాశంలో ప్రకాశించేటట్లు ఇంద్రుడు నిర్దేశించిన కథ ఖగోళ శాస్త్ర సంబంధికావటం సుస్పష్టం. కుమారస్వామి కథ ఖగోళ శాస్త్ర సంబంధి కాగా, ఆతడి చుట్టూ ఉన్న ఉపగ్రహాల కథలన్నీ మంత్రతంత్ర శాస్త్రాలకు సంబంధించినవి. ఎఱ్ఱయ నాటి సమాజ పరిస్థితులకు, విశ్వాసాలకు ఇవి సముచితంగా అమరి ఉండి ఉండవచ్చును కూడా.

**(ఇ) స్వర్గనరకాది పరలోక విషయాలు**

(i) **ఇంద్రద్యుమ్నుడి కథ -** స్వర్గలోక భోగాలకు సంబంధించింది. నరుడు తాను చేసిన పుణ్యకార్యాల వలన కలిగే కీర్తి ఎంతకాలం భూలోకంలో ఉంటుందో అంతకాలం అతడికి స్వర్గలోక నివాసం ఉంటుందని చెప్పే ఆ కథను మార్కండేయ మహర్షి (చతుర్థాశ్వాసంలో) ధర్మజుడికి చెప్పాడు.

(ii) **వ్రీహిద్రోణోపాఖ్యానం:-** వ్యాసుడు ధర్మరాజుకు వ్రీహి ద్రోణాఖ్యానం చెప్పాడు. అందులో ముద్గలుడికి దేవదూత పుణ్యలోకాల స్వరూప స్వభావాలను గురించి వివరించి చెప్పాడు. స్వర్లోకం, బ్రహ్మలోకం - ఈ రెండులోకాల అనుభవాలలో ఉండే తారతమ్యాన్ని విన్న తరువాత, ముద్గలుడు పుణ్యఫల భోగానంతరం భూతలంపై జన్మించే అవకాశమున్న స్వర్గం కంటె శాశ్వతమోక్షప్రదమైన బ్రహ్మలోకమే ఉత్తమమని భావించి, దానవ్రతం వలన కలిగిన స్వర్గాన్ని త్యజించి తపస్సు చేత సిద్ధించిన బ్రహ్మలోకాన్ని పొందిన కథ- స్వర్గం కంటె మోక్షం మానవులు పొందదగిన గమ్యమని ఉపదేశిస్తున్నది.

**(ఈ) ధర్మాధర్మానుష్ఠాన ఫలవిపాక వైచిత్రి:-** ఈ శాఖకు సంబంధించిన కథలు ఆరణ్య పర్వశేషంలో విశేష ఖ్యాతిని పొంది ఉన్నాయి.

(i) పతివ్రతామాహాత్మ్యం ధర్మవ్యాధోపాఖ్యానం, కౌశికుడి కథ మొదలైనవి పేర్కొనదగినవి, ఉత్తమ గార్హస్థ్య ధర్మానికీ, పుత్ర ధర్మానికీ, అహింసా ధర్మానికీ ధర్మవ్యాధోపాఖ్యానం బోధనా కల్పతరువు. ఎఱ్ఱన పురాణ వస్తు నిర్వహణ ప్రజ్ఞకు చక్కని తెరువు.

(ii) బ్రాహ్మణ ధర్మ నిర్వహణంతో మృత్యువును జయించవచ్చునని చెప్పే కథ తార్‌క్ష్యుడి ఆశ్రమ ధర్మవృత్తాంతం: ఆ ఆశ్రమ వాసుల ధర్మనుష్ఠాన గీతి ఈ పద్యం.

శా. 'ఆలస్యం బొక యింత లేదు; శుచి యాహారంబు; నిత్యక్రియా
జాలం బేమఱ; మర్చనీయు లతిథుల్; సత్యంబ పల్కంబడున్;
మే లై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు; మిట్లౌట నె
క్కాలంబుం బటురోగమృత్యుభయశంకం బొంద మే మెన్నడున్.' (ఆర. 4.190)

ధుంధుమారుడి చేత పొరపాటున చంపబడిన బ్రాహ్మణ బాలుడు పునర్జీవితుడు కావటం తార్‌క్ష్యాశ్రమవాసుల ధర్మానుష్ఠాన ఫలమే. పై పద్యం నన్నయవలె ఎఱ్ఱన తీర్చిదిద్దిన రుచిరార్థ సూక్తి. సర్వమానవులకు వర్తించే సాధారణ ధర్మ సంహిత ఈ సూక్తి.

(iii) బ్రాహ్మణులు క్షత్రియులు నిజ వర్ణాశ్రమ ధర్మ నిర్వహణంలో పాటించదగిన బాధ్యతలను చెప్పటంలో ప్రసిద్ధిచెందిన కథ అత్రిగౌతమ సంవాదం. గృహస్థుడైన బ్రాహ్మణుడు సంతానాన్ని పొంది, వారి సుఖ జీవితానికి వలసిన ద్రవ్యాన్ని ఆర్జించి వారి కిచ్చి, తాను వానప్రస్థాశ్రమానికి వెళ్ళాలి. వెళ్ళేటప్పుడు భార్య తనతో వస్తానంటే తీసికొనిపోవాలి. లేదా పుత్రుల రక్షణలో ఉంచి వెళ్ళాలి. ఒకవేళ స్వయంగా ధనాన్ని ఆర్జించే అవకాశం లేకపోతే రాజు నర్థించి అర్థ సంపాదనం చేయవచ్చును. ఏమైనా అర్థం స్వీయభోగానికి కాదు, ఆశ్రమ ధర్మ నిర్వహణం కొరకే - అనే తాత్పర్యం అత్రి అనే బ్రాహ్మణుడి కథ చెప్పింది.

అత్రి గౌతములు క్షత్రియ ధర్మ విధులను గురించి తమకున్న భిన్నమైన అభిప్రాయాలను ప్రకటించారు. వారిరువురి వాదాలను సనత్కుమారుడు విని తీర్పు చెప్పాడు. రాజే ధర్మ నిర్వహణంలో బ్రహ్మ, ఇంద్రుడు, ఈశ్వరుడు, సన్మునీంద్ర ప్రశంసాపాత్రుడు ఔతాడని అత్రివాదం. రాజున కా అర్హతలు లేవని గౌతముడి వాదం. సనత్కమారుడు అత్రినే సమర్థించి ఇట్లా ప్రకటించాడు.

ఉ. 'అత్రి నిజంబ పల్కెఁ; దగ నాతని వాక్యము ధర్మయుక్త; మీ
ధాత్రి సమస్తమున్ బృహదుదగ్రభుజాగ్రమునందుఁ దాల్చు సత్
క్షత్రియుఁ డెల్లవారలను గావను బ్రోవఁ బ్రభుండు గావునన్
శత్రునిషూదనుం డతఁడు శక్రుఁడు నీశ్వరుఁడున్ విధాతయున్'. (అర.4.202)

అత్రి బ్రాహ్మణ ధర్మాన్ని ఆచరించి పురుషార్థ సాధకుడయ్యాడు. క్షత్రియ ధర్మాన్ని లోకంలో చాటి ధర్మప్రభువుల జీవన ధర్మాన్ని ప్రబోధించాడు. ఎఱ్ఱన ఈ పురాణార్థాన్ని సారరసార్ద్రసుందరంగా ఆవిష్కరించాడు.

(iv) ఈ వరుసలో అత్యుత్తమమైనది సరస్వతీ గీత. దీనివలన విశిష్ట ధర్మాలు తెలుస్తాయి. తార్క్ష్యుడు భారతి నారాధించి ఆమె నుండి భౌతిక సౌఖ్యాలు వరంగా కోరలేదు. 'మానవుడికి ఉత్తమ ధర్మ మేది? ఏ ధర్మాన్ని ఆచరిస్తే పరమపుణ్యాత్ముడై శాశ్వతమైన పుణ్యలోకాలను పొందుతాడు? బోధించు' మని అడిగాడు. అంటే తార్క్ష్యుడు భారతిని బ్రాహ్మణు డాచరించవలసిన పరమ ధర్మ జ్ఞానాన్ని భిక్షగా అడిగాడు. ఆమె సూత్రప్రాయంగా ఇట్లా చెప్పింది.

మ. 'ధృతి వేదంబులు నాలుగుం జదివి భూదేవుండు నానాధ్వర
వ్రతుఁడై యుండెడు నట్టి పుణ్యుఁ డమరావాసంబునం దుండు ను
న్నత వృత్తస్తనభార మంథర మరున్నారీ పరీరంభసం
భృత రోమాంచ సమంచితాంగుఁ డగుచుం బెక్కేండ్లు సంప్రీతితోన్.' (అర. 4.210)

పురాణ కవితా శైలిలో చెప్పిన ఈ పద్యానికి వివరణంగా ఎఱ్ఱన నాలుగైదు పద్యాలు రచించాడు. ఇవన్నీ కర్మకాండకు సంబంధించినవే. శ్రుతి తత్త్వాన్ని చెప్పుతుంది. స్మృతి దానిని పురుషార్థసాధనోచితంగా ఆచరించే జీవన విధానంలోని విధులను వివేచిస్తుంది. వేదార్థ బృంహితమైన స్మృతి లక్షణాలను కవితామయం చేసి చెప్పేది ఇతిహాసం. పారమార్థిక విషయాలను సైతం ప్రబంధ కవితాబంధురంగా చెప్పటం ఎఱ్ఱన ఇతిహాసానికి నేర్పిన హితం. పై పద్యంలో తాత్పర్యమంతా ఒక యెత్తు. 'ఉన్నత వృత్తస్తన భారమంథర మరున్నారీ పరీరంభ సంభృత రోమాంచ సమంచితాంగు' ఁడనే సమాస మొక్కటీ ఒక్క యెత్తు. పురాణ కథనంలో ప్రబంధ సూక్తి వైచిత్రి ఇది. "కుంభినీధరసుతా కుచకుంభ పరిరంభ మహాలోలుపాయో న్నమశ్శివాయ" అని పరమేశ్వర స్తవంలో కూడా ప్రబంధ పరమేశ్వరుడు ప్రసాదించిన సూక్తి వైచిత్రిని పుక్కిటపట్టి పులకించిపోయాడు కవిసార్వభౌముడైన శ్రీనాథుడు.

**(ఉ) పుణ్యపాప ఫలానుభవ విశేషాలు**

(i) వలచిన పురుషులను వంచించే పాపకార్యాన్ని ఆచరించటం వలన సుశోభన తండ్రిశాపానికి గురియై కపట వర్తనులైన పుత్రులను పాపఫలంగా పొందింది.

(ii) ఆమె మొదటి కొడుకు శలుడు వామదేవుడి నుండి వామ్యాశ్వాలను తెచ్చి, ఇచ్చిన మాట ప్రకారం వాటిని తిరిగి ఇవ్వకపోగా, అహంకరించి వామదేవుడిని అవమానించి, సంహరించేందుకు ప్రయత్నం చేయటంతో బ్రాహ్మణాగ్రహానికి గురియై చనిపోయాడు. పరులధనాన్ని పాపబుద్ధితో హరిస్తే ప్రాణాపాయం తప్పదని శలుడి కథ చాటి చెప్పింది.

(iii) శలుడి తమ్ముడు నలుడు. అన్నను మించిన అహంకారి. వామదేవుడికి వామ్యహయాల నివ్వకపోగా అతడిని విషబాణంతో చంపాలని యత్నం చేశాడు. ఆ బాణం అతడి పుత్రుడిని బలిగొన్నది. అయినా మరల అహంకరించి బాణాన్ని ప్రయోగించబోయాడు. వామదేవుడి తపశ్శక్తివలన నిశ్చేష్టుడయ్యాడు. చివరకు చేసేది లేక అతడిని శరణువేడి ప్రాణాలతో బైటపడ్డాడు. అధర్మాన్ని ఆచరించి, దాని ఫలాన్ని అనుభవించి, పశ్చాత్తాపపడి మరల ధర్మాచరణ ఫలాన్ని పొందిన కథ ఇది. పాపం చేసిన ఫలం పశ్చాత్తాపంతో సగం పోతుంది. మరల చేయనని నిశ్చయించటంతో పూర్తిగా పోతుంది- అని నిరూపించింది ఈ కథ.

**(3) ఇతిహాసశ్రవణం : ఇతరాంశాలు**

కౌటిల్యుడి అర్థశాస్త్రంలో రాజు వినే ఇతిహాసాంశాలుగా చెప్పబడిన వాటిలో పురాణ కథల తరువాత- ప్రఖ్యాత వస్తువులైన కథలు, ఆఖ్యాయికలు, దృష్టాంతరూపాలైన కథలు, ధర్మార్థ విషయ చర్చలూ ఉన్నాయి. ఆరణ్యపర్వశేషంలో ఇవన్నీ కూడా ఉండటం గమనార్హం.

**1. ప్రఖ్యాత కథలు:** ధర్మరాజు మార్కండేయ మహర్షిని కొన్ని ప్రఖ్యాత కథలను గురించి ప్రశ్నించాడు. అతడి వలన వాటిని ప్రామాణికంగా వివరంగా విని తెలిసికొనాలని భావించాడు. లోకంలో ఇదివరకే ప్రసిద్ధమై ధర్మజుడి దృష్టి కవి వచ్చాయి. అందువలన ప్రసిద్ధవృత్తాలే. అటువంటివి- వైవస్వతుడి చరిత్రం, కువలాశ్వచరిత్రం, లేదా ధుంధుమారుడి కథ, మధుకైటభ వృత్తాంతం, అంగిరసుడనే అగ్ని చరిత్రం మొదలైనవి.

**2. ఆఖ్యాయికలు** - బ్రాహ్మణ ప్రభావం, కర్ణుడి జన్మవృత్తాంతం చెప్పే కథలు, మున్నగునవి.

**3. దృష్టాంతరూప కథలు** - రామాయణ కథలు - రామాయణ కథ, సావిత్ర్యుపాఖ్యానం, వ్రీహిద్రోణాఖ్యానం.

**4. ధర్మార్థ విషయ చర్చ** - ధర్మవ్యాధకౌశిక సంభాషణం, అత్రి గౌతముల సంవాదం, సత్యాద్రౌపదీసంవాదం, యక్షప్రశ్నలు ధర్మజుడి సమాధానాలు ఇత్యాదులు.

**(4) ఇతిహాస శ్రవణఫలం**

ఆరణ్యపర్వశేషంలోని ఇతిహాసాంశాలను వినిన ధర్మజుడు ధర్ముడు పెట్టిన యక్షప్రశ్నల పరీక్షలో నెగ్గాడు. ఈ సంవిధానం ఇతిహాసకథార్థాలలో గల అంతరార్థం.

ఆరణ్యపర్వంలో ధర్మజుడు చేసింది శ్రవణ, మనన, నిదిధ్యాసనలు. శ్రవణం ద్వారా విని, మననం ద్వారా మథించి, తెలిసికొన్న తత్త్వాన్ని అనుభవంలోకి తెచ్చుకొనటంలో చేసే తీవ్రమైన ప్రయత్నమే నిదిధ్యాసనం. శంకరులు 'వివేక చూడామణి' లో శ్రవణ మనన నిదిధ్యాసనల తారతమ్యాన్ని చెప్పారు.

> "శ్రుతేః శతగుణం విద్యా న్మననం మననా దపి,
> నిదిధ్యాసం లక్షగుణ మనంతం నిర్వికల్పకమ్."

శ్రవణం కంటె మననం వందరెట్లు గొప్పది. మననం కంటె నిదిధ్యాసనం లక్షరెట్లు శక్తిమంతమైనది. నిర్వికల్ప సమాధి వీటన్నిటికంటె లెక్కలేనన్ని రెట్లు గొప్పది. బ్రహ్మానందాన్ని పొందటానికి శ్రవణాదులు మూడూ మూడు మెట్లు. ప్రతిసాధకుడూ సాధించవలసిన సాధనత్రయం. ధర్మజుడు నిరంతర శ్రవణ మనన నిదిధ్యాసనల వలన సాధనత్రయాన్ని సాధించి సిద్ధిపొందాడు. శంకరులు ఆత్మబోధలో -

> "శ్రవణాదిభి రుద్దీప్తో జ్ఞానాగ్ని పరితాపితః,
> జీవః సర్వమలా న్ముక్తః స్వర్ణవత్ ద్యోతతే స్వయమ్."

అని అన్నారు. శ్రవణ మనన నిదిధ్యాసనల వలన ప్రదీప్తుడై, జ్ఞానాగ్నివలన తేజోవంతుడై, సర్వపాపాల నుండి విముక్తుడై, జీవుడు బంగారం వలె ప్రకాశిస్తాడు. యక్షపరీక్షలో ఉత్తీర్ణుడైన ధర్మజుడు పుటం పెట్టిన బంగారంవంటివాడు.

ధర్మరాజు ధర్మవీరుడు. అతడిలోనిది ధర్మజ్ఞానాగ్ని, ధర్మాన్ని గురించిన సమగ్ర విజ్ఞానాన్ని శ్రవణ మననాల ద్వారా నిదిధ్యాసనలో నిలపటం ఆరణ్యపర్వంలోని ఇతిహాస శ్రవణ ఫలం. "వేదోక్తో హి ద్వివిధో ధర్మః ప్రవృత్తి లక్షణో నివృత్తి లక్షణశ్చ" అని శంకర గీతా భాష్యం. ప్రవృత్తి ధర్మం నివృత్తితో సమన్వయం పొంది శీలంగా మారటమే ఉత్తమ సంస్కారం. అది

సత్సంగాదులవలననే సాధ్యం. "విద్వద్భి స్సేవిత స్సద్భిః నిత్య మద్వేష రాగిభిః । హృదయేనా భ్యనుజ్ఞాతో ధర్మః" అని మనుస్మృతి. ద్వేషరాగ రహితులైన విద్వాంసులు నిత్య మాచరించేది ధర్మం.

"అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియనిగ్రహః,
దానం దమో దయా క్షాంతిః సర్వేషాం ధర్మసాధనమ్".

అని యాజ్ఞవల్క్యస్మృతి చెప్పుతున్నది. అహింస, సత్యం, అస్తేయం, శౌచం, ఇంద్రియ నిగ్రహం, దానం, దయ, క్షాంతి మొదలైన వాటి ద్వారా ధర్మసాధనం చేయవచ్చును.

"ధృతి క్షమా దయాఽ స్తేయం శాంత మింద్రియనిగ్రహః,
హ్రీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్".

అని మహాభారతం చెప్పుతున్నది. ధృతి, క్షమ, దయ, అస్తేయం, శౌచం, ఇంద్రియ నిగ్రహం, లజ్జ, విద్య, సత్యం, అక్రోధం అనే పది లక్షణాలు కలది ధర్మం. ఈ ధర్మాన్ని తెలిసికొని, ఆయా జీవిత పరిస్థితులలో మననం చేసికొని, అనుమానాలను పెద్దల నడిగి తీర్చికొని, దానిని అనుభవంలోనికి తెచ్చుకొనటం ధర్మస్వరూపాన్ని పరిపూర్ణంగా పొందటం.

యక్ష ప్రశ్నల చివర ధర్ముడు తన రూపాలు పది అని పేర్కొన్నాడు.

"యశః సత్యం దమః శౌచ మార్జవం హ్రీ రచాపలమ్,
దానం తపో బ్రహ్మచర్య మిత్యేతా స్తనవో మమ". (సం.3.298.7)

యశస్సు, సత్యం, శౌచం, ఋజుభావం, లజ్జ, స్థిరత (అచాపలత్వం), దానం, తపస్సు, బ్రహ్మచర్యం - అనేవి పది - ధర్మ శరీరాలు. ధర్ముడిని చేరటానికి ఆరు మార్గాలు ఆయనే చెప్పాడు.

"అహింసా సమతా శాంతి స్తపః శౌచ మమత్సరః,
ద్వారా ణ్యేతాని మే విద్ధి ప్రియోహ్యసి సదా మమ". (సం. 3.298.8)

అహింస, సమత్వం, శాంతి, తపస్సు, శౌచం, మాత్సర్య రాహిత్యం అనేవి ధర్మ దర్శనానికి ఆరు ద్వారాలు. ధర్మరాజుకు వీటన్నిటి మీద అనురాగ మున్నదనీ, అధికార మున్నదనీ ధర్ముడు ప్రశంసించాడు. వీటిని ధర్మజుడు సాధించిన విధం ఆరణ్యపర్వ ప్రబంధ ధ్వని. దాని సిద్ధికి పరీక్ష యక్షప్రశ్నల ఘట్టం. తెలుగులో 'యక్షప్రశ్న' లంటే గడ్డుప్రశ్నలనే భావం ఏర్పడటానికి వాటిల్లో ఉండే గాఢతయే కారణం. ధర్మవ్యాధుడు కౌశికుడికి అహింసా స్వరూపాన్ని వివరించి చెప్పాడు.

తే. 'హింస సేయనివాఁడు లేఁ డిజ్జగమున । నొక్కఁడైనను దమతమ యోపినట్లు
హింసతెరువున కెడగల్గి యేఁగవలయు । నదియ చూవె యహింసనా నతిశయిల్లు'. (ఆర. 5.60)

దానిని ధర్మరాజు తెలిసికొని అనుష్ఠాన వేదాంతి అయ్యాడు. కౌశికుడు ధర్మవ్యాధుడిని ప్రశంసిస్తూ చెప్పిన ఈ క్రింది పలుకులు సమతా గుణాన్ని ధర్మజుడి మనసున కెక్కించాయి. తుల్యమనస్కత సమత.

చ. 'నిజగుణదోష కర్మముల నెట్టన మేలును గీడు వచ్చుఁ; ద
త్ప్రజనిత సౌఖ్య దుఃఖములఁ బ్రాజ్ఞులు దుల్యమనస్కులై మనో
రుజలును దేహజంబులగు రోగములున్ హిత ధర్మకర్మ భే
షజములఁ జేసి పాపుదురు సర్వము సాత్త్వికదృష్టిఁ జూచుచున్.' (ఆర. 5. 139)

ఈ మాటలు ధర్మరాజును తుల్యమనస్కుడైన ప్రాజ్ఞుడిగా మార్చాయి.

చ. 'అనఘుఁడు సాత్త్వికుండగు మహాత్ముఁడు బోధనిరూఢి సర్వముం
గనికొని లోకవృత్తములు గా వని రోసి సమస్తసంగ భం
గనిరతుఁడై తొఱంగు మమకారవికార మహంక్రియాచ్యుతిం
బనుపడి సంయమప్రకట భావన నుత్తమశాంతి గైకొనున్'. (అర. 5.98)

అనే ధర్మవ్యాధుడి ప్రబోధం ధర్మరాజును శాంతివలన సాత్త్వికుడైన మహాత్ము డయ్యేటట్లు చేసింది.

క. 'మనమున నింద్రియముల వ । ర్తనమును సరిగా నొనర్చు ధర్మంబు దపం
బని చెప్పుదు; రిట్టితపం । బనఘా! నీయంద కలిగె నభినవ భంగిన్'. (అర. 6.124)

అని దుర్వాసోముని ముద్గలుడిని కీర్తించిన పద్యం విని, అది తనకే వర్తించేటట్లు జీవితాన్ని తపస్సుతో మలచుకొన్నాడు ధర్మరాజు.

ఆ. 'పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును । నిజము శూద్రుకంటె నీచతముఁడు;
సత్యశౌచధర్మశాలి శూద్రుండయ్యు । నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు'. (అర. 5.137)

అనిన కౌశికుడి బోధలు ధర్మరాజును నిత్యశౌచిగా మార్చాయి.

చ. అరయఁగ జీవితంబు గడు నస్థిర; మింత యెఱింగి యాత్మ నె
వ్వరిదెసఁ గీడు రోయక ధ్రువంబగు మైత్రి భజించి సత్కృపా
నిరతుఁడు నిష్పరిగ్రహుఁడు నిత్యతపస్వియు నిత్యతృప్తుఁడుం
బరమశమాన్వితుండు నగు బ్రాహ్మణుఁడొందు సనాతనస్థితిన్'. (అర. 5.111)

ఎవ్వరిపట్ల కీడు తలపెట్టకుండా దృఢమైన మైత్రి భజించటం అమత్సరభావం. దానిని పొంది బ్రహ్మగుణ స్థితుడైనాడు ధర్మరాజు.

ఈ విధంగా ఆరణ్య పర్వశేషంలో ధర్మబోధ విశేషాలు తెలిసికొని ధర్మరాజు ఆ ఆరు మార్గాల ద్వారా ప్రస్థానం చేసి పరిపూర్ణ ధర్మదర్శనం చేయగలిగాడు.

ఎఱ్ఱాప్రెగ్గడ పై మార్గషట్కాన్ని తెలుగులో చెప్పలేదు. ధర్మదేవత రూపాలను పదిగా కాక ఎనిమిదిగా పేర్కొన్నాడు. శంభుదాసుడు పరమేశ్వరుడి అష్టమూర్తులను ధర్ముడిలో దర్శించినట్లున్నాడు. ప్రసన్నుడైన ధర్ముడి ప్రసంగ మిది-

మత్తకోకిలము

'ఏను ధర్ముఁడఁ జువ్వె రాజకులేంద్ర! సత్యము శౌచమున్
దానముం దపమున్ శమంబును దాంతియున్ యశముం బరి
జ్ఞానయుక్తియు నాదుమూర్తులు; సమ్మదంబున నిష్ఠ మ
త్సూను నుత్తమధార్మికున్ నినుఁ జూచువేడుక వచ్చితిన్.' (అర.7.462)

ధర్ముడు అష్టవిధ ధర్మస్వరూపుడు, శుద్ధ జ్ఞానమూర్తి, అతడి పుత్రుడు ధర్మరాజు. అతడు ఆ ధర్మాలను ఆచరించి చూపించేవాడు. తండ్రి సిద్ధుడు. కొడుకు సాధకుడు. సాధన సమగ్రంగా సంపన్నం కావటంచేత ఉత్తమ ధార్మికు డయ్యాడు.

అతడిని అనుగ్రహించటానికి వచ్చాడు వాత్సల్యరసమూర్తి, పరిపూర్ణ ధర్మదీప్తి - యమధర్మరాజు. ఇది ఎఱ్ఱన చిత్రించిన నిర్వహణ ఘట్టం.

ధర్మరాజు సత్యాన్ని పాటించి అరణ్యాజ్ఞాతవాసవ్రతాన్ని నిర్వహిస్తున్నాడు. శ్రీకృష్ణాదులు ధర్మజుడి కొరకు యుద్ధం చేసి రాజ్యాన్ని సంపాదించి ఇస్తామని చెప్పినా పెద్దలముందు చేసిన ప్రతిజ్ఞకే అతడు బద్ధుడైనాడు. ధర్మరాజు ఆచరణ శీలుడైన సత్యవ్రతుడు. సత్యశీలం వలన అతడికి అంతర్బహిశ్శౌచాలు అలవడ్డాయి. అతడు ఆలోచనలో ఆచరణలో సత్యశౌచ ధర్మశాలి. సత్యం వలన శౌచం, దాని వలన ధర్మం ఉత్తముడికి సాధ్యమౌతాయి. శౌచంవలన సత్యశీలుడు స్వార్థపరిత్యాగంతో కూడిన పరార్థ, పరమార్థ వర్తనాన్ని పొందుతాడు. అతడిలో దానగుణం దానివలన ఏర్పడుతుంది. ఆరణ్యవాసంలో కూడా నిరతాన్నదానం, శరణాగతరక్షాదానం ధర్మజుడి శీలానికి బంగారానికి తావి వలె అబ్బాయి. దుర్యోధన సైంధవుల పట్ల ఆయన చూపిన ఔదార్యం దానగుణం వలన ఏర్పడిన సాత్త్విక గుణ సంపత్తి. వ్యాసభట్టారకుడు ధర్మజుడికి చేసిన బోధలో ఒకటైన వ్రీహి ద్రోణాఖ్యానం దాన తపస్సుల తులనాత్మక వివేకాన్ని కలిగించింది. అన్యాయార్జితమైన విత్తంతో చేసేదానం కంటె యుక్తన్యాయార్జిత విత్తంతో చేసే దానం అల్పమైనా మాన్యమౌతుందని వేదవ్యాస వచనం. అన్యాయార్జిత విత్తంతో దుర్యోధనుడు వైష్ణవ యజ్ఞం చేసి భూరి దానా లిచ్చాడు. వాటి కంటె అరణ్యంలో న్యాయార్జిత విత్తంతో చేసే ధర్మజుడి దానం విశేష ఫలప్రదమని తాత్పర్యం. వ్యాసుడు ధర్మరాజును తపస్సు చేయుమని హితబోధ చేశాడు. దానివలన అతడికి క్షమ, అహింస, సత్యం, సమత, ఇంద్రియ జయం, శమం, పరిత్యాగం- అనే గుణ సప్తకం అలవడుతుందని చెప్పాడు. (ఆర. 6.108) మూలంలో చెప్పబడిన ధర్మద్వారాలన్నీ తపస్సువలన తెరుచుకొంటాయని తెలుగులో స్పష్టమౌతున్నది. తపస్సువలన కలిగే సిద్ధి అంతరింద్రియ నిగ్రహమైన శమం. ఆ రెండింటి వలన పురుషుడు స్థితప్రజ్ఞుడౌతాడు. అతడి జీవితం ఆదర్శవంతమౌతుంది. దానివలన అతడికి యశస్సు లభిస్తుంది. ఆ యశస్సును నిష్కళంకంగా నిలుపుకొనటానికి జీవన ధర్మంలో నిత్య జాగృతుడై ఉండాలి. అది పరిజ్ఞానయుక్తి. దానిని పరీక్షించేదే యక్ష ప్రశ్నల పరీక్ష.

## (5) యక్షప్రశ్నలు : ధర్మజ పరిజ్ఞానం

పరిజ్ఞానం అంటే ఉపరిజ్ఞానం కాదు. లోకవర్తనాన్ని పరమార్థతత్త్వంతో వివేచించే గాఢమైన విజ్ఞానం. అప్పుడే అది అనుభవజ్ఞానంగా మారిన శాస్త్రజ్ఞానమై పరిజ్ఞానం అనబడుతుంది. తెలుగులో 'వాడి కామాత్రం పరిజ్ఞానం లేకపోయె' అనే వాడుక ఉంది. జ్ఞానమంటే శాస్త్ర జ్ఞానం, బ్రహ్మజ్ఞానం. పరిజ్ఞానమంటే దానిని ఆచరణలో నిలిపిన అనుభవ జ్ఞానం. యక్షప్రశ్నలు శాస్త్ర జ్ఞానం అనుభవ జ్ఞానంగా మారిన పరిజ్ఞానాన్ని పరీక్షించేవి.

యక్షప్రశ్నలలో మొదటి నాలుగూ సూర్యుడికి సంబంధించినవి. అవి సూర్యుడిని గురించిన భౌతిక శాస్త్రజ్ఞానానికి గాని, పౌరాణిక ఐతిహాసిక విజ్ఞానానికి కాని సంబంధించినవి కావు. జ్ఞాన ప్రతీక అయిన సూర్యతత్త్వానికీ ధర్మానికీ ఉన్న సంబంధ పరమార్థానికి సంబంధించినవి. అందుకే మొదటి ప్రశ్న-సూర్యుడిని నడిపే శక్తి ఏది? అని మొదలౌతుంది. ధర్మజుడు బ్రహ్మమని సమాధానం చెప్పాడు. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అని బ్రహ్మసూత్రాలు మొదలైనట్లు యక్షప్రశ్నలు ఆరంభ మయ్యాయి. సూర్యుడిని సేవిస్తూ తిరిగేవారు సురకోటి అనీ, సూర్యు డస్తమించటానికి కారణం ధర్మమనీ, సూర్యుడికి ఆధారం సత్యమనీ చెప్పే నాలుగు ప్రశ్నలు సమాధానాలు జ్ఞాన దీపికలు. అనశ్వరమైన బ్రహ్మం జ్ఞానశక్తి. దానిని సేవించేవారు దేవతలు. అందువలననే బ్రహ్మజ్ఞాన విదులు భూసురు లనబడతారు. బ్రహ్మజ్ఞానులు కూడా కర్మను వదలరాదు. సంగరహితులై తామరాకుపై నీటి బిందువువలె వర్తిస్తూ ధర్మాన్ని సక్రమంగా నిర్వహించాలి. అందుకు సూర్యోదయాస్తమయాలు సాక్ష్యం. ఉదయానికి ధర్మ మెంత మూలమో అస్తమించటానికి కూడా ధర్మ మంతే మూలమని తెలియటం ధర్మసూక్ష్మం. ఎఱ్ఱన మాటలలో అది పరిజ్ఞానం. సూర్యుడికి ఆధారం సత్యం. అంటే సర్వజ్ఞానానికి ఆధారం సత్యమని భావం. ఈవిధంగా మొదటి నాలుగు ప్రశ్నలు జ్ఞానవిషయకమైన పరిజ్ఞానాన్ని పరీక్షించేవి.

తరువాత యక్షు డడిగిన తొమ్మిది ప్రశ్నలు శ్రోత్రియులైన బ్రాహ్మణుల మాహాత్మ్య పరిజ్ఞానానికి సంబంధించినవి. ఆరణ్యపర్వశేషంలో బ్రహ్మక్షత్రియ మాహాత్మ్యాలను గురించి, వారిద్దరి కుండే అవినాభావసంబంధాన్ని గురించి ధర్మరాజు మార్కండేయ మహర్షిని గ్రుచ్చిగ్రుచ్చి అడిగితెలిసికొన్నాడు. 'తొల్లి యధర్మంబునకు వెఱచి బ్రాహ్మణులు నిజతేజోబలంబులు క్షత్రియులందు నిక్షేపించిరి; నాఁటంగోలె బ్రాహ్మ్యంబువలన క్షత్త్రంబు ప్రవర్తిల్లుచుండు; బ్రహ్మక్షత్త్రంబులు పరస్పర సంశ్రయంబులు; వెలిగా వర్తింపనేరవు. క్షత్త్రియుండు బ్రాహ్మణ సంసేవనంబునం దేజోనిరూఢుండయి యాదిత్యుండు చీఁకటి నడంచునట్లు దురితంబుల నడంచును.' (ఆర. 4.204) అని తెలిసికొన్నాడు. ఆ పరిజ్ఞానంతో ధర్మజుడు ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగాడు.

ఆరణ్యపర్వశేషంలో ధర్మవ్యాధోపాఖ్యానం మాతృపితృసేవాధర్మ ప్రభావ ప్రబోధకం. అది వినిన తరువాత భూమికంటె గొప్పదైనది తల్లి అనీ, ఆకాశం కంటె పొడవైనవాడు తండ్రి అనీ చెప్పగలిగిన పరిజ్ఞానం కరతలామలకం కావటంలో ఆశ్చర్యం లేదు. ఆ రెండు ప్రశ్నలూ సర్వవర్ణాశ్రమ సామాన్యధర్మ పరిజ్ఞానసారం.

తరువాతి పది ప్రశ్నలు లోక పరిజ్ఞానానికి సంబంధించినవి. మృతుడికి మిత్రు డెవ్వడు? అనే ప్రశ్నతో ఇహపరసంబంధ పరిజ్ఞాన పరీక్ష మొదలౌతుంది. ఆ మిత్రుడు ధర్మమని చెప్పిన ధర్మరాజు ధర్మ పరిజ్ఞాని, ఇహపరకర్మ భోగాల వివరణం వినిన వివేకచూడామణి.

ధర్మువునకు కుదురు దాక్షిణ్యమని చెప్పిన అంశంనుండి లోకానికి దిక్కు సజ్జనులే అని తేల్చి చెప్పిన అంశం వరకూ వ్యాపించియున్న ప్రశ్నలన్నీ ధర్మ స్వరూప స్వభావాలను గురించి ధర్మజుడికున్న పరిజ్ఞానాన్ని పరీక్షించేవే. అందులో ఉత్తమ ధర్మం అహింసగా పేర్కొనటం గమనార్హం. ధర్మవ్యాధోపాఖ్యానంలో అహింసా స్వరూపం వివేచించబడింది. అది యక్షప్రశ్నల ఘట్టంలో పరిజ్ఞానంగా ప్రసన్నమైంది.

'దేనివలన జలం, అన్నం, సంభవిస్తాయి? విషం వంటి దేది? శ్రాద్ధ విధికి సమయ మేది?'- మొదలైన ప్రశ్నలు వేదవిహిత కర్మానుష్ఠానానికి సంబంధించినవి. చివరి మూడు ప్రశ్నలూ మానవుడి ఉత్తమ శీలానికి ఉండే లక్షణాలకు సంబంధించినవి. ధర్మవిజ్ఞానం ఒక ధర్మ సాధకుడిని తయారు చేయాలి. జ్ఞానం ఆచరణంలో బ్రతకాలి. శీలం ధర్మఫలం, 'విత్తరక్షకుఁ గడు మేలు వృత్తరక్ష' (ఆర. 4.129) అన్న ధర్మజుడి ఆశయం ఇతిహాస శ్రవణం వలన కలిగే పార్యంతిక ఫలం.

**ధర్ముడు:** మనుజుడు వేటిని పరిత్యజిస్తే జనప్రియుడు, నిశ్శోకుడు, అర్థవంతుడు, సుఖి ఔతాడు?

**ధర్మరాజు:** మానవుడు గర్వం వదలి సర్వజన సమ్మతు డౌతాడు. క్రోధాన్ని అణచుకొని శోకానికి దూరమౌతాడు. లోభాన్ని విడిచి అర్థాఢ్యుడౌతాడు. తృష్ణను త్యజించి సుఖుడౌతాడు.

**ధర్ముడు:** ఎటువంటివాడు పురుష శబ్దవాచ్యుడు?

**ధర్మరాజు:** భూమ్యాకాశాలు నిండిన కీర్తిసంపద ఎవరికుంటుందో అతడే పురుషుడు.

**ధర్ముడు:** సర్వధని అయినవా డెవ్వరు?

**ధర్మరాజు:** ప్రియాప్రియాలు, సుఖదుఃఖాలు, భూతభవిష్యద్వర్తమానాలు ఎవరికి సమంగా కనిపిస్తాయో అతడు సర్వధని-అంటే సర్వార్థసిద్ధుడు.

ఈ మూడు ప్రశ్నలు ధర్మజుడు తన శీలాన్నే అనుశీలించుకొని వినయంతో ఆవిష్కరించాడా? అన్నట్లుంటాయి. ఆ తరువాత ధర్ముడు కూడా మరే ప్రశ్న వేయలేకపోయాడు. ధర్మ పరిజ్ఞానం శిఖరం చివరి ప్రశ్న. దానిని అధిరోహించిన ధర్మరాజు సర్వార్థసిద్ధుడే!

యక్షప్రశ్నల ఘట్టంలో ప్రబంధపరమేశ్వరుడు తెలుగువారి కిచ్చిన తియ్యని మాకందం- ఇతిహాసశ్రవణ పరిజ్ఞానానికే ఒక అందం.

క. 'శ్రుతమువలన శ్రోత్రియుఁ డగు। నతుల తపోయుక్తిఁ గడు మహత్త్వము వడయున్
ధృతిచే సహాయయుతుఁ డగు। నతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్'. (అర.7.428)

ఆరణ్యపర్వమంతా ధర్మజుడి బుధజనసేవతో నిండిపోయింది. దానితో ఆయన బుద్ధిమంతు డయ్యాడు. తరతరాలుగా మనలను బుద్ధిమంతులను చేస్తున్నాడు. ఇతిహాస ఫలాన్ని విశ్వజనీనంగా పొందండని మనల కందరికీ మిత్రసమ్మితంగా ప్రబోధిస్తున్నాడు.

## 7. ఆరణ్యపర్వశేష నిర్వహణ నైపుణ్యం : ప్రబంధపరమేశ్వరత్వం

ఆరణ్యపర్వం సహజంగానే రెండు భాగాలుగా విభక్తమై ఉన్నది. స్థూలంగా - మొదటి భాగం నహుషప్రశ్నలతో, రెండవ భాగం యక్షప్రశ్నలతో ముగుస్తాయి. తెలుగులో దాదాపుగా నన్నయ, ఎఱ్ఱయలు ఈ రెండు భాగాలనూ వరుసగా నిర్వహించటం కాలపురుషుడి క్రియావైచిత్రి. ఈ రెండు భాగాలలో ఉన్న సామ్యభేదాలను గురించి ఆరణ్యపర్వ ప్రథమ భాగపీఠికలో కొంత సమీక్షించటం జరిగింది. మరికొన్ని విశేషాలు ఇక్కడ ముచ్చటించటం సమంజసం.

ఎఱ్ఱాప్రెగ్గడ 'నన్నయభట్ట తిక్క కవినాథుల కెక్కిన భక్తిపెంపునన్' ఆరణ్యపర్వశేషాన్ని ఆంధ్ర భాషలో 'సుజనోత్సవ' మొప్పగా నిర్వహించాడు. కాబట్టి ఎఱ్ఱన రచన నన్నయ తిక్కన రచనలవలె అనువాదం కాదు అనుసృజనం. అనుసృజనంలో మూలంలోని తాత్పర్యం చెడకుండా ఉంటుంది. కాని, వస్తు నిర్వహణం మాత్రం ఎఱ్ఱన ప్రతిభాశక్తితో ఉన్మీలితమౌతుంది. దీనిని అనుశీలించటానికి గణాంకం కంటె గుణాంకనం ఎక్కువగా ఉపకరిస్తుంది. అయినా, గణాంకం గుణ మూల్యాంకనానికి కొంత తోడ్పడవచ్చును.

సంస్కృత మహాభారతంలో వనపర్వం 13,664 శ్లోకాలలో, 16 ఉపపర్వాలతో కూడి ఉన్నది. తెలుగులో అది ఏడాశ్వాసాలలో 2894 గద్య పద్యాలలో అవతరించింది. అందులో నన్నయ 6981 శ్లోకాలు గల భాగాన్ని 1299 గద్యపద్యాలలోనూ, ఎఱ్ఱయ 6683 శ్లోకాలు గల భాగాన్ని 1595 గద్యపద్యాలలోనూ నిర్మించారు. ఈ గణాంకాలను పరిగణనంలోకి తీసికొని, డాక్టర్ పాటిబండ మాధవశర్మగా రిట్లా నిర్ణయించారు - ''నన్నయ మూలముకంటె ఎఱ్ఱయ మూలము మూడువందల శ్లోకములు తక్కువ. నన్నయ మూలముకంటె ఎఱ్ఱనయనువాదము మూడువందల గద్యపద్యములు ఎక్కువ. మూలమునకు ఎక్కువ సన్నిహితమగుటయు, ఎడనెడ రసభావానుగుణములైన వివరణలు వర్ణనలు ఎక్కువగా చేరుటయు కారణములుగా ఎఱ్ఱయ యనువాదము నన్నయ యనువాదముకంటె కొంత భిన్నమై, తిక్కన మార్గము ననుసరించుచు, శ్రీనాథాదులకు త్రోవచూపుచున్నట్లున్నది. (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారి ఆంధ్ర మహాభారతము - ఆరణ్యపర్వ పీఠిక. పుట. 53). కవిత్రయంవారిది కథానువాదమనే ఆలోచనధారలో అనుశీలించిన శర్మగారి మాటలలో ఎఱ్ఱన స్వతంత్రవైఖరిని గుర్తించటమే ప్రస్తుతాంశం.

ఎఱ్ఱన నన్నయ పేరనే ఆరణ్యపర్వశేషం రచించటం చేత తవ కవితలో కానబడే సాపేక్ష లక్షణాలను ప్రత్యేకంగా చెప్పలేదు. నన్నయ కవితారీతి కొంత తన కవితారీతిలో ఉంటుందని మాత్రం చెప్పి ఊరుకొన్నాడు. కాగా- ఆ లక్షణాలను - హరివంశం, నృసింహపురాణావతారికలనూ వివిధ కవులు ఎఱ్ఱనను గురించి చేసిన ప్రశంసలనూ ఆధారంగా చేసికొని సూత్రీకరించుకొనవలసి వస్తున్నది. దీనికి తోడు ఆరణ్యపర్వశేషం ఎప్పుడు రచించాడు? ఆయన రచనలలో ఇది ఎన్నోది? అప్పటి ఆయన కవితా దృక్పథం, కావ్యశైలీ పరిపాకం ఎటువంటిది? అనే ప్రశ్న లెన్నో ఎదుట నిలుస్తాయి. వాటికి చెప్పుకొనే సమాధానాలే ఆరణ్యపర్వశేష కవితానుశీలనానికి ప్రాతిపదికలు కాగలుగుతాయి.

## (1) ఆరణ్యపర్వశేషం : ప్రబంధపరమేశ్వరుని ప్రయోగపర్వం

సాహిత్య చరిత్రకారులు ఎఱ్ఱన కృతులను రెండు జంటలుగా భావించి పౌర్వాపర్య నిర్ణయానికి పూనుకొన్నారు. రామాయణ హరివంశాలు (ఇవి ప్రోలయ వేమారెడ్డికి అంకితమైనవి) ఒక జంట, ఆరణ్యపర్వశేషం, శ్రీలక్ష్మీ నరసింహావతారమనే నృసింహపురాణం మరొక జంట. (వీటిలో నృసింహపురాణం అహోబల నృసింహస్వామి కంకితం). ఆరణ్యపర్వ రచనంవలన ప్రబంధ పరమేశ్వర ప్రశస్తి ఎఱ్ఱనకు వచ్చినట్లు నృసింహపురాణంలో చెప్పబడి ఉంది కాబట్టి, ఈ రెంటిని కలిపి చెప్పటం విమర్శకులకు పరిపాటి అయింది. కావ్యశైలీ పరిణామ దృష్టితో చూస్తే ఆరణ్యపర్వశేషం హరివంశ నృసింహపురాణాల కంటె ముందే ఉండాలని చాలమంది భావించారు. కొందరు హరివంశాన్ని చివరి రచనగా పేర్కొన్నారు. కవిశైలి మొదట ప్రాథమికంగా అప్రౌఢంగా ఉంటుందనీ, తరువాత సలక్షణంగా, ప్రౌఢతరమౌతుందనీ, క్రమంగా అది పరిపక్వమై, ప్రసన్నతనూ, సారళ్యాన్నీ పొందుతుందనీ భావించే వర్గం వారికి హరివంశమే చివరి కావ్యం. అనుకర్త నుండి యుగకర్తగా ఎఱ్ఱన ఎదిగాడని భావించే వారికి అతడి రచనలో ప్రౌఢ ప్రబంధ కవితా పరీపాకమే తరువాతి కవులకు మార్గదర్శకమైనది. కాబట్టి నృసింహపురాణమే చివరి రచన. ఇదే సత్యానికి సన్నిహితమైన సమాలోచన. అయితే సమస్య ఏమంటే - ఎఱ్ఱన తరువాత అతడి హరివంశాన్ని అనుసరించేవారు కొందరూ, నృసింహపురాణాన్ని అనుసరించేవారు కొందరూ కనబడతారు. ఏ వర్గం వారికి ఆ రచన గొప్పదిగా అనిపించటం సహజం. వివిధ వాదాల కదే మూలం కూడా.

ఎఱ్ఱన మొదట రామాయణం రచించాడని చాల మంది అంగీకరిస్తున్నా, ఆ కావ్యం ఉపలభ్యం కావటం లేదు. దాదాపు 46 పద్యాలు మాత్రం దొరుకుతున్నాయి. దానికి కారణం అది ప్రాథమికమైనదీ, సంగ్రహమైనదీ, అప్రౌఢమైనదీ అయిన రచన అయి ఉండవచ్చును. లేదా ఆరణ్యపర్వంలో ఎఱ్ఱన చెప్పిన రామాయణ కథను చదివిన తరువాత ఆ కావ్యం విస్మృతిలో పడిపోయి ఉండవచ్చును. ఎఱ్ఱనకు ఆప్తమిత్రుడు, ప్రోలయవేమారెడ్డి తమ్ముడు, మహాసేనాని అయిన మల్లారెడ్డి చదలవాడలో రామలక్ష్మణుల విగ్రహాలను ప్రతిష్ఠించినప్పుడు ఎఱ్ఱయచేత రామాయణం వ్రాయించి ఉండవచ్చును. మల్లారెడ్డి ప్రోత్సాహంతో ప్రోలయ వేమారెడ్డికే ఎఱ్ఱయ కృతినిచ్చి ఉంటాడు. ప్రోలయ వేమారెడ్డి "చేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ ఖ్యాతిం బొందితి, నింక నేను దనియన్ గావ్యామృతాస్వాదనన్" అని హరివంశం కూడా చెప్పించుకొన్నాడు. అటువంటి రామాయణం కూడా కాలగర్భంలో కలసిపోయింది. భారత పరాంశమైన 'హరివంశం' మాత్రం చిరంజీవిగా నిలిచింది. కారణం తెలియదు.

ఎఱ్ఱన రామాయణాన్ని 'వల్మీకభవు వచోవైఖరి' ననుసరించి చెప్పాడని చదలవాడ మల్లన పేర్కొన్న దానిని బట్టి, వాల్మీకి రామాయణాన్ని యథామూలంగా తెలుగులోకి అనువదించి ఉండవచ్చును. తెలుగులో యథావాల్మీకంగా రచించిన రామాయణాలకు అంత ప్రాచుర్యం లేదు. ప్రాచీనులు (ఎంతటి గొప్పవారైనా) వ్రాసిన అటువంటి రామాయణాలు కాలగర్భంలో కలిసిపోయాయి. ఎఱ్ఱన రామాయణానికి కూడా అటువంటి స్థితియే ఏర్పడి ఉండవచ్చును. తెలుగు ప్రజలు అవాల్మీకకల్పనలున్న రామాయణాలనే ఆదరిస్తారు.

ప్రాచీన కాలంలో ఒక పరిపాటి ఉండేది. ఎవరైనా భారతం వ్రాయదలచుకుంటే ముందుగా రామాయణాన్ని రచించేవారట! దానిని అనుసరించి నన్నయ భారతానికి ముందు రాఘవాభ్యుదయాన్ని వ్రాశాడనే ఒక వదంతి ఉన్నది. తిక్కన నిర్వచనోత్తర రామాయణ రచన చేయటం ప్రసిద్ధం. ఆ బాటలో నడచిన ఎఱ్ఱన ఆరణ్యపర్వశేష హరివంశ రచనలకు ముందే రామాయణం రచించి ఉండవచ్చును. ఇది ఊహమాత్రమే.

రామాయణం తరువాత ఆరణ్యపర్వశేషమే ఎఱ్ఱన రచించి ఉంటాడు. దీని దొక ప్రత్యేకమైన చరిత్ర. ఎఱ్ఱయకు చిన్ననాటి నుండే కావ్యరచన చేసే ఆసక్తి ఉండేది. అందులోనూ నన్నయ తిక్కనలవలె తానూ ఒక మహాకవి కావాలని ఆయన కలలు కన్నాడు. దేవుడి కంకితమైన నృసింహపురాణం అవతారికలో తన ఆత్మ సంవేదన వినిపించాడు.

ఉ. "మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగుభంగిఁ బ్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్యఁ గీ
లించిన కీర్తిసంగసుఖలీలకు నేనును గాంక్షఁ జేసితిన్". (నృ.పు.1.13)

ఆ ఆశను ఆశయంగా మార్చుకొన్నాడు. నన్నయ కవితారీతిని సాధించాడు. నన్నయకు వారసు డనిపించుకొన్నాడు. ఎఱ్ఱనది ఏకలవ్యభక్తివలె కనపడుతుంది. నన్నయ పేరనే తన కవితను వ్రాయ నారంభించాడు. ఎఱ్ఱన గుప్తభక్తి పండించిన గొప్ప కవిత ఆరణ్యపర్వశేషం. అయితే, హరివంశంలో, నృసింహపురాణంలో పరిణతి చెందిన కవిత్వ మహత్త్వశక్తులు ఇందులో అంకురావస్థ నుండి పుష్పావస్థకు పెరుగుతున్నాయి. అందువల్లనే ఆరణ్యపర్వశేషం ఎఱ్ఱాప్రెగ్గడ సర్వకావ్యకళాజగత్తుకు బీజ సంపుటి. వటపత్రశాయి గర్భ కుహరంలో గుప్తంగా దాగి ఉండి, మార్కండేయ మహర్షికి బీజప్రాయంగా సర్వజగత్ సృష్టి దర్శనమిచ్చినట్లు ఆరణ్యపర్వశేషంలో ఎఱ్ఱన కవితాకళా వైభవం బీజప్రాయంగా ప్రత్యక్షమౌతుంది. ఈ రచన కూడా నరాంకితమే. నన్నయ్యలో పరకాయ ప్రవేశం చేసిన ఎఱ్ఱయ్యకు రాజరాజ నరేంద్రుడు తప్ప మరొక రాజేంద్రుడు కనపడడు. అందువలననే కాబోలు ముగిసిన ఆరణ్యపర్వం ముచ్చట ఎత్తకుండానే ప్రోలయ వేమారెడ్డి భారత పరాంశమైన హరివంశ ప్రసక్తి తెచ్చాడు. తానూ, తన తాత ఎఱపోత సూరీ తప్ప సమకాలీనులలో మరెవ్వరూ ఆరణ్యపర్వశేష పూరణ ప్రసక్తిని వాచ్యం చేసినట్లు ప్రస్తావించకపోవటం ఎఱ్ఱన పాటించిన పరమౌచిత్యం! ఆరణ్యపర్వశేషం ప్రబంధ పరమేశ్వరుడి ప్రయోగభూమి.

## (2) నన్నయ ప్రసాదకవి : ఎఱ్ఱయ మధుర కవి

నన్నయ ప్రతి ఆశ్వాసం చివర తాను ఆభాగంలో ప్రదర్శించిన కవితా కళాంశాన్ని సూచించాడు. ఎఱ్ఱయ దానిని పాటించాడు.

**ఆరణ్యపర్వం**

| | | | | |
|---|---|---|---|---|
| 1. ప్రథమాశ్వాసం | - | పుణ్యకథ యతిరమణీయంబుగాను'..... | (1.398) | నన్నయ |
| 2. ద్వితీయాశ్వాసం | - | 'కథాక్రమం బతిరమ్యంబుగాను'... | (2.354) | నన్నయ |
| 3. తృతీయాశ్వాసం | - | 'కథ రమ్యంబుగ.... | (3.397) | నన్నయ |
| 4. చతుర్థాశ్వాసం | - | 'ఎఱింగించిన తెఱంగు...' | (4.414) | ఎఱ్ఱయ |
| 5. పంచమాశ్వాసం | - | 'కథావిశేషంబు సవిస్తరంబుగా...' | (5.435) | ఎఱ్ఱయ |
| 6. షష్ఠాశ్వాసం | - | 'ఆఖ్యానంబు విఖ్యాత మాధుర్యమనోహరంబుగా' | (6.409) | ఎఱ్ఱయ |
| 7. సప్తమాశ్వాసం | - | 'సవిస్తర మధురంబుగా నుపన్యసించి...' | (7.467) | ఎఱ్ఱయ |

నన్నయ ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తితో కవిత చెప్పి కథాకవితకు మార్గదర్శి అయినవాడు. ఆరణ్యపర్వంలో ఆఖ్యానం పరిమితం. ఆఖ్యానకాలు, ఉపాఖ్యానాలు విశేషం. కథను ఏకవాక్యతతో అందంగా చెప్పే గుణాన్ని రమణీయమన్నాడు నన్నయ. కథా సంవిధాన శిల్పాన్ని రమ్యత అన్నాడు. కథా నిర్మాణాన్ని కవితామయంగా ఆస్వాదయోగ్యంగా చెప్పటం రమణీయమనీ, రమ్యమనీ నన్నయ నిర్దేశం. (ఈ అంశాలను గురించి ఆరణ్యపర్వం పీఠిక మొదటి భాగంలో పరిశీలించాం)

ఎఱ్ఱయ కూడా నన్నయవలె కథాకథనం మీదనే శ్రద్ధ వహించి దానిని వర్ణనామయం చేసి, రచనలో తాను పాటించిన నాలుగంశాలను చెప్పాడు. అవి ఆయా ఆశ్వాసాల కథలను తీర్చిదిద్దిన పద్ధతులలో కానవచ్చే శిల్ప విశేషాలు. ఆరణ్యపర్వ

శేషంలోని చతుర్థాశ్వాసంలో మార్కండేయ మహర్షి చెప్పిన పురాణవస్తు విశేషాలు విస్తారంగా ఉన్నాయి. వాటిని తాను తెలిపిన పద్ధతిని గమనించుమన్నాడు ఎఱ్ఱన. పంచమాశ్వాసంలో ధార్మికాంశాలు, రసవత్కథాంశాలు కలిసి ఉన్నాయి. వాటిల్లో కథా విశేషాలను విస్తరించి రచించే పద్ధతిని ఎఱ్ఱన ప్రదర్శించాడు. ఆరవ ఆశ్వాసంలోని ప్రధాన కథను చెప్పే పద్ధతిలో స్పష్టంగా అందరికీ తెలిసేటట్లు ప్రసిద్ధ మాధుర్యగుణ ప్రధానమైన రచననూ, మనోహరమైన వర్ణనలనూ చేసి రక్తి కట్టించి ఆస్వాదయోగ్యతను ఎఱ్ఱన పెంచాడు. సప్తమాశ్వాసం విస్తరించి చెప్పటం చేత మనసుకు తియ్యదనం కలిగేటట్లు ఎఱ్ఱయ ప్రపంచించాడు. ఈ లక్షణాలు ఆయా ఆశ్వాసాలకే కాక ఎఱ్ఱయ ఆరణ్యపర్వశేషానికంతా వర్తిస్తాయని కూడా సంభావించవచ్చును.

నన్నయ రమ్య, రమణీయ శబ్దాలను వాడితే, ఎఱ్ఱయ మధుర, మాధుర్య, మనోహర శబ్దాలను వాడాడు. కవిత్వంలో చిత్తాన్ని రమింపజేసే గుణం రమ్యత; చిత్తరమణం ప్రసాదగుణ సహజ స్వభావం; చిత్తాన్ని ద్రవింపచేసే గుణం మాధుర్యం. నన్నయ ప్రసాదగుణానికీ, ఎఱ్ఱన మాధుర్య గుణానికీ కవితలో ప్రాధాన్యాన్ని కల్పించారని ఆ పదజాలం చెప్పుతున్నది. కవిత్వం వలన సహృదయుల హృదయాలు పొందిన ద్రవస్థితిని 'మధురం' అంటారు. అట్టి ద్రవస్థితిని కలిగించే రచనా గుణాన్ని 'మాధుర్య' మంటారు. దానిని కథా సన్నివేశాల్లో, వర్ణనాదులలో ప్రదర్శించినప్పుడు కలిగే అభివ్యక్తి శక్తిని 'మనోహరత్వ' మంటారు. ఇట్లా తన కవిత్వాన్ని అనుశీలించటానికి అనువైన సూచనలను ధ్వనిమయంగా చేయటం నన్నయబాటయే. నన్నయ ప్రసాద కవి, ఎఱ్ఱయ మధుర కవి.

మాధుర్యం వస్తువునూ, రచననూ, రసాన్నీ ఆశ్రయించి ప్రసరిస్తుంది. స్త్రీలకు సంబంధించిన కథార్థాలు అధికంగా ఉన్నప్పుడుకాని, పరమాత్మభావనంతో ఆత్మరసమైన ఆనందాన్ని అభివ్యక్తం చేసే కథార్థాలను ఆర్ద్రంగా చెప్పినప్పుడుగానీ, కరుణాది రసాలు ప్రవర్తిల్లిన ఘట్టాలను చిత్రించినప్పుడుగాని వస్తుపరమైన మాధుర్యం వ్యక్తమౌతుంది. రచనలో మాధుర్యం శబ్దార్థాలను ఆశ్రయించి అభివ్యక్తమౌతుంది. పృథక్పదత్వంలో శబ్దాన్నాశ్రయించిన మాధుర్యం మనస్సును ఆకర్షిస్తుంది. ఉక్తివైచిత్ర్యంలో అర్థగుణమైన మాధుర్యం ఉన్మీలిస్తుంది. తద్భావనం హృదయాన్ని ఆర్ద్రం చేస్తుంది. నన్నయ రచనలో శబ్దగుణమైన మాధుర్యానికి ఉక్తివైచిత్రి ఉపబలకం. ఎఱ్ఱయ రచనలో అర్థగుణమైన ఉక్తివైచిత్రికి శబ్దగుణం ఊతం ఇస్తుంది. తిక్కన గారిది అర్థగుణ ప్రధాన రచన. ఆయన రచనలలో ఉక్తివైచిత్రికి శబ్దగుణ మాధుర్యం ఊడిగం చేస్తుంది. ఈ తారతమ్యాన్ని గమనిస్తే ఎఱ్ఱయ నన్నయ రీతికి సన్నిహితుడు. నన్నయ కవిత రమింపచేస్తుంది. తిక్కన కవిత మనసును వికసింప చేస్తుంది. వీరిద్దరికీ నడుమ ఎఱ్ఱయ కవిత హృదయాలను ద్రవింపచేస్తుంది. ఈ మూడో గుణం కవిత్రయంవారి ఆంధ్ర భారత కవిత్వానికి ఒక పరిపూర్ణతను కలిగించింది. అందుకే ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుడు.

### (3) విడమరచి, విస్తరించి, మధురంగా, మనోహరంగా చెప్పటం

ఆరణ్యపర్వశేషంలో భారత కథ 35 శాతం, మార్కండేయుడు చెప్పిన సర్గాది పురాణ ధర్మకథార్థాలు 35 శాతం, రామకథ, సావిత్రికథల వంటి ఉపాఖ్యానాలు 30 శాతం మేరకు వ్యాపించి ఉన్నాయి. అంటే ఆఖ్యానంకంటే ఉపాఖ్యానాల భాగమే ఎక్కువ. దాదాపు మూడింట రెండు వంతులు. ఉపాఖ్యానాలన్నీ ధర్మజుడి ప్రశ్నలకు సమాధానాలే. ఆ ప్రశ్నలు కూడా మూడు రకాల ఆసక్తుల నుండి పుట్టాయి.

మొదటిది- పురాణ జిజ్ఞాస. రెండవది - బ్రహ్మక్షత్రియ, పుత్ర, పతివ్రతాదుల మాహాత్మ్య శ్రవణాసక్తి. మూడవది: తనవలె తన భార్యవలె అవమానాలు, అగచాట్లు పడినవారి వృత్తాంతాలు వినాలనే అభిలాష. ఈ మూడు రకాల కథలను నిర్వహించటంలో ఎఱ్ఱన - విడమరచి చెప్పటం, విస్తరించి చెప్పటం, మధురంగా చెప్పటం అనే మూడు పద్ధతులను ఎన్నుకొన్నాడు. ఇక మిగిలింది ప్రధాన కథ. దానిని ఈ లక్షణాలతోపాటు మనోహరంగా కూడా చెప్పాడు ఎఱ్ఱన. కాబట్టి ఎఱ్ఱయ కథాకథన శిల్పానికి నాలుగు ముఖాలు. అవి - విడమరచి, విస్తరించి, మధురంగా, మనోహరంగా చెప్పే విద్యలు.

### (4) ఎఱ్ఱన కవిత : ఆర్ద్రమైన ఆత్మీయత, మాధుర్యం

శంభుదాసుడు సహజంగా శివకేశవ భక్తి రసార్ద్రచిత్తుడు. అందువలన అతడి వాక్కు ప్రసాదమధురం, స్వీయవాగ్విలాసాన్ని కథాగత పాత్రలకు కూడా అంటగట్టే స్వభావం ఆయనకు లేకపోలేదు. కొన్ని పాత్రలు ఎఱ్ఱన కవితలో భక్తులయ్యాయి. మచ్చుకు ఉదంకుడిని ముందుగా చెప్పవచ్చును.

ఉ. 'శంకరసన్నిభుండు జనశంకరుఁడున్ గరుణాకరుం డనా
తంకుఁ డుదంకుఁ డన్ముని వ్రతస్థితుఁడై మరుభూమియందు ని
శ్శంకమతిన్ వసించి యనిశంబును నవ్యయు నచ్యుతున్ మనః
పంకజవేదిపై నిడి తపం బొనరించె ననేకవర్షముల్'. (అర. 4.373)

ఈ పద్యం ఎఱ్ఱన ఆత్మీయత నుండి ఆవిర్భవించింది. స్వయంగా శంకర సన్నిభుడైన శంభుదాసుడు అచ్యుతుడిని స్వీయమనః పంకజవేదికపై ఉంచి అనేక సంవత్సరాలు కవితా తపస్సు చేసి చతుర్విధ పురుషార్థ సాధన రూపాలైన నాలుగు కావ్యాలు రచించాడు. ఉదంకుడు ప్రచ్ఛన్న శంభుదాసుడు.

మార్కండేయ మహర్షి పాత్రలో ఎఱ్ఱన పరకాయప్రవేశం చేశాడు. మూలంలో లేని 'మంజుల వాగమృత ప్రవాహం' (4.164) ఆయన వాక్కులో ప్రసాదమధురంగా పొంగించాడు. మార్కండేయుడు ప్రబంధ పరమేశ్వరుడి కవితాభివ్యక్తికి కమనీయ వాహిక. తన కిష్టమైన పురాణ కావ్య ప్రబంధ వాగ్విలాసాల నన్నింటినీ ఆయన కథాకథన శిల్పంతో విడమరచి, వివరించి, మధురంగా చెప్పటంలో నిక్షేపించాడు. అందుకే మూల భారతంలో మార్కండేయ కథనం విషయ విజ్ఞాన భాండార ప్రదర్శనం, ఎఱ్ఱయ కవితలో మధుర వాగ్విలాస మధుధార. కవి ఏమి చెప్పాడన్నది మూలంలో ముఖ్యం, ఎట్లా చెప్పాడన్నది ఎఱ్ఱయ రచనలో ముఖ్యం.

ప్రసాద మాధుర్యాలు భక్తికవితకు శ్వాసకోశాలు. మార్కండేయుడు ఎంతటి దార్శనికుడో అంతటి ఆర్ద్రచిత్తుడు. దార్శనికుడికి ఉండే ప్రసాదవాగ్వృత్తి, ఆర్ద్రుడికుండే రసార్ద్రచిత్తవృత్తి ఆయన వాక్కులలో మిలమిలలాడుతూ ఉంటాయి. పరమసుందర బాలాకారుడైన వటపత్రశాయి పాదపద్మాలకు మ్రొక్కి, జిజ్ఞాసతో అడిగిన మాటలు మనసును ద్రవింపచేస్తాయి.

శా. 'ఈ యేకార్ణవ మీ వటక్షితిరుహం బీ పర్ణపర్యంక మి
ట్లై యొప్పారుచు నుండఁగా నుదరభాగైక ప్రదేశంబునం
దీ యారేడు జగంబులున్ మెలఁగఁగా నిట్లున్న బాలత్వమే
నేయందంబున నిశ్చయించి సుఖినై యేపారుదుం జెప్పవే'. (అర. 4.261)

త్రికంలోని ఈకారం ప్లుతంగా ఉచ్చరించబడే కాకువు అద్భుతం నుండి పుట్టిన భక్తిమాధుర్యాన్ని పరమ చమత్కారంగా ఆవిష్కరించింది. ఆర్ద్రత ఈ పద్య హృద్యోక్తిలోని భక్తి మాధుర్యం.

వటపత్రశాయి అయిన మధురబాలుడిని పాండవ ప్రాణ బంధువైన ప్రౌఢ గోపాలుడిగా గుర్తించి పారవశ్యంతో చెప్పే పద్యం భక్తి పరిపక్వతకు పరమోదాహరణం.

శా. 'నా కమ్మెఁ బొడసూపెఁ దాను గృపతో నా కందు, నేఁ డియ్యెడన్
నీకున్ గాదిలిచుట్టమై సచివుఁడై నెయ్యంబుమై నున్న పు

ణ్యాకారుం గమలాయతాక్షుఁ గరుణైకాయత్తు నత్యుత్తమ
శ్లోకుం గృష్ణునిఁ గంటి నా సుకృతముల్ శోభిల్లెఁ బక్వంబులై.' (అర. 4.281)

మొదటి పద్యంలో అద్భుతం నుండి పుట్టిన మాధుర్యం, రెండవ పద్యంలో భక్తిరసార్ద్రచిత్తం నుండి పుట్టిన మాధుర్యం. ఈ మధురోక్తి ఎఱ్ఱయ వాక్కుకు పూచిన భక్తిసుమం. పోతన భాగవత భక్తి కవితకు ఈ రచన ప్రథమావతారం.

మాధుర్యగుణంతో కవిత్వాన్ని మనోహరంగా మార్చటం ఎఱ్ఱన వాగ్విలాసం. దీనినే సూక్తివైచిత్రిగా తరువాతి వారు చెప్పుకొన్నారు. మార్కండేయమహర్షి యుగధర్మాలను చెప్పే సందర్భంలో కుప్పగా పడి ఉన్న విశేషాలను ఎన్నిక చేసి, వర్గీకరించి, విడమరచి, విశ్లేషించి, వాటిని తగిన వృత్తాలలో, తగిన పాకాలలో రీతులలో గుణోత్కృష్టంగా చెప్పటం ఎఱ్ఱయ పాటించిన విధానం.

(1) విడమరచి చెప్పే పద్ధతికి ఏ చరణానికి ఆచరణం విరిగే సీసపద్యం ఛందోమయ సాక్ష్యం. మచ్చుకు చూడండి- కలియుగ ధర్మకథనంలో -

సీ. 'సత్యంబు నరులకు సంక్షిప్తమగు; సత్య । హాని నాయువు గడు నఱిగి పోవు;
నాయువు దఱిఁగిన నల్పంబులగు విద్య; । లల్పవిద్యలను మోహంబు మిగులు;
మోహంబువలనఁ బై ముసురు లోభంబు; లో । భావేశమునఁ గామ మగ్గలించుఁ;
గామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు; క్రో । ధంబున వైర మెంతయును బెరుఁగు;

ఆ. వైరమున నశేషవర్ణులు నన్యోన్య । పీడ సేయుచును విభిన్నబుద్ధి
నొక్కఁ డొకని మేర నుండక వర్ణసం । కరము సేయఁగలరు కలియుగమున'. (అర.4.287)

కలియుగ ధర్మాలలో అనేక రకాలు కలగూరగంపగా చెప్పబడి ఉన్నాయి. వాటిలో సర్వజన సామాన్యమైన ప్రవర్తన విశేషాలను గుదికూర్చి, ఒక పద్యంలో విస్పష్టంగా విడమరచి చెప్పటం పురాణ కవితలోని వైశిష్ట్యం. ఎఱ్ఱయ ఆ పద్ధతిలో నిష్ణాతుడు. వస్తు విస్తృతిని బట్టి వృత్తాన్ని ఎన్నుకొనటం, విడమరచి చెప్పే పద్ధతిని బట్టి పాదగతిని సాగించటం వస్తువును మధురతరం చేసే కథన శిల్పం.

కలియుగంలో జనపదాల స్థితిగతులను తెలిపే చోట ఎఱ్ఱన ఆవేదనపడి చెప్పినట్లున్నది. దానికి కారణం లేకపోలేదు. కాకతీయ సామ్రాజ్యం పడిపోయిన తరువాత తురుష్కుల దాడుల వలన తెలుగునాట హైందవ సంస్కృతితో పాటు, జానపద జీవనం కూడా కలుషితం, కష్టతరం, దుఃఖమయంగా మారింది. ఆ దుర్భరస్థితి నుండి దేశాన్ని సముద్ధరించాలని కంకణం కట్టుకొన్న రాచకొండ, దేవరకొండ, నాయక రాజులు, అద్దంకి రెడ్డి ప్రభువులు, విద్యారణ్య శిక్షణలో విజృంభించిన అనెగొంది ప్రభువులు ఆ కాలంలో సాగించిన సమష్టి దేశభక్తి ఉద్యమంలో పాల్గొన్న మహాకవి ఎఱ్ఱన - కలియుగ లక్షణాలంటే వేరే ఎక్కడా లేవనీ ఆనాటి సంక్షోభ సమాజంలోనే ఉన్నాయనీ భావించి సమకాలీన సామాజిక స్పృహకు స్పందించిన ఆత్మీయతతో ఈ ఘట్టాన్ని ఆర్ద్రంగా రచించాడు. ఆయన నగరాలలో కంటె జనపదాలలో ఎక్కువగా నివసించాడు. అ సంవేదన ఈ పద్యంలో ప్రతిధ్వనిస్తుంది.

మ. 'వివిధ వ్యాఘ్రమృగోరగాకులము లై, విస్తీర్ణశూన్యాటవీ
నివహాభీలములై, యరాజకములై, నిర్మూలధర్మంబులై
ద్రవిళాభీర తురుష్కబర్బరపుళింద వ్యాప్తి దుష్టంబు లై
భువిలో నెల్లెడఁ బాడగున్ జనపదంబుల్ దస్యుగాంతంబునన్'. (అర. 4.289)

పాడుబడ్డ గ్రామాల దుర్భరస్థితి ఇందులో కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు ఎఱ్ఱన. క్రూరమృగాల విహారంతో భయాందోళన చెందటం, వ్యవసాయ భూములు తగ్గి అడవులు పెరగటంతో రక్షణకు దూరం కావటం, అరాజకాలు కావటంతో గ్రామాలలో న్యాయం లేకపోవటం, ధర్మస్థితి భగ్నం కావటంతో జీవన విధానం చిల్లులుపడటం కలియుగ ధర్మాలుగా ఎఱ్ఱయ చెప్పాడు. మూలంలో ఉన్నవన్నీ ఆయన చెప్పాడా లేదా అన్నదికా దిక్కడ ప్రశ్న. వీటికి కారణం 'ద్రవిళాభీర తురుష్కబర్బర పుళింద వ్యాప్తి'తో గ్రామాలు దుష్టములైపోవటమే అని ఎఱ్ఱన భావం. ఎందుకంటే మూలంలో తురుష్కుల ఆగడాలు ఉండటానికే వీలు లేదు. ఎఱ్ఱయ రచనలో అవి ముఖ్యపాత్ర వహించాయి. అంటే- ఆంధ్ర భారతంలోని జనపదాలు ఎఱ్ఱయ కాలంలోనివే అని స్పష్టం. స్వంతంగా చూచిన కష్టాలను అందరికీ తెలిసేటట్లు ప్రత్యేకంగా ఒక వృత్తంలో తనకు నచ్చిన ప్రబంధశయ్యలో ఎఱ్ఱన ఆవిష్కరించాడు. అంతే కాదు. కలియుగ ధర్మాల ఘట్టాన్ని స్వీయానుభవామ్రేడితంగా చెప్పటంతో ఎఱ్ఱయ రచన ఆత్మీయతతో కూడుకొన్న ఒక సంవేదనగా మారింది. అది రచనలో రవళిస్తూ పఠితల హృదయాన్ని ద్రవింప చేస్తుంది. ఎఱ్ఱయ యుగధర్మకథనం ఒకరకమైన ఆత్మాశ్రయ కరుణ రస ఖండ కావ్యం!

దాని ముగింపులో ఎఱ్ఱయ చెప్పిన ఆ కృతయుగం ఆయన చూచిందో, లేక ఆశించిందో ఏమైనా ఈ పద్యం సామాజిక జీవన మధుర సంగీతం!

శా. 'ఆరామవ్రజ చైత్యసద్మవన దేవాగార సౌమ్యంబు లై
భూరి బ్రహ్మతపస్వి సంకులములై పుణ్యాధ్వరారంభసం
భారోదారములై నితాంత ఫలిత భ్రాజిష్ణు సస్యంబులై
యారూఢస్థితి నెల్లదేశములు నొప్పారుం బ్రకాశంబులై'. (ఆర. 4.312)

హిందూ ధర్మోద్ధరణం కొరకు కృష్ణకు దక్షిణాన వెలసిన నాయక, రెడ్డిరాజ్యాల సమూహాన్ని ఉద్దేశించి ఈ పద్యం పుట్టి ఉండవచ్చును. 'ఎల్లదేశములు' అవే అయి ఉండవచ్చును. ఏమైనా ఎఱ్ఱన భారతీవృత్తికి ఇది మధురఫలం.

## (5) ధర్మవ్యాధోపాఖ్యానం : విడమరచి చెప్పే విద్య

వర్ణాశ్రమాల కతీతంగా గార్హస్థ్య ధర్మనిర్వహణం ఎంతటి విశ్వజనీనమయిందో చెప్పుతూ వైదిక ధర్మాచరణ వైదుష్యాన్ని వెన్నలా పంచిపెట్టే మధురగాథలు పతివ్రత కథ, ధర్మవ్యాధోపాఖ్యానం.

కథా జీవితానికి ఒక బలమైన బీజం ఉంటుంది. దానిని పఠితల దృష్టికి తెచ్చేటట్లు, వారి మనసులలో పదిలంగా నిలిచేట్లు చెప్పే పద్ధతి విడమరచి చెప్పే కవితా విధానంలో పాటించే మొదటి విలువ.

పతివ్రతకు పతిసేవ ముఖ్యమా? అతిథి సత్కారం ముఖ్యమా? ఆ రెండింటికీ పోటీ వస్తే ఏది ముందు? ఏది వెనుక? అని పతివ్రత కథలోని ప్రధానమైన ప్రశ్న. కౌశికుడు అతిథి ధర్మం గొప్పదనేవాడు. పతివ్రత పతిసేవా ధర్మం ఉత్తమమనేది. అయితే వీరిద్దరికీ వాదు వస్తే ఎఱ్ఱన రచించిన రెండు పద్యాలు మనకు రెండు మధురావిష్కృతులుగా దొరుకుతాయి.

కౌశికుడు అతిథి నిరాదరణకు ఆగ్రహించి పతివ్రతతో అన్న మాటలు.

ఉ. 'నీమగఁ డంత యెక్కుఁడె? మనీషులు భూసురు లింత తక్కువే?
కోమలి! యేల యిట్లు గడుఁగ్రొవ్వునఁ గానవు లోకవంద్యులన్?
భూమిసురేంద్రులన్; దివిజపుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చుచో
నేమిట నొక్కొ! వారు గడునెల్లిద మై రిటు నీకు నిచ్చటన్'. (ఆర. 5.16)

సతీధర్మాన్ని ధిక్కరిస్తూ పలికిన ఈ పద్యం కథా పరమార్థాన్ని ప్రశ్నిస్తున్న ప్రతిపక్షం. ఇది ఎంత తీవ్రంగా వెలువడిందో అంతకంటె తీవ్రంగా పతివ్రత సమాధానం వెలువడింది.

సీ. 'దేవతాసములు భూదేవతావరు లౌట। యేను దన్మాహాత్మ్య మెఱుఁగనయ్య?
యొక విప్రుఁ డలిగి పయోనిధి జలము ల। పేయముల్ గాఁగ శపింపఁ డెట్లు?
దండక విషయంబు దగ్ధంబు సేయండె। యలుకమై నొక్కమహాద్విజుండు?
వాతాపి యను దైత్యవరు మ్రింగి యఱిగించు। కొనఁడె భూదేవుఁ డొక్కరుఁడు గినిసి?

తే. ధరణి మఱియును బెక్కువిధంబులందు। బ్రహ్మవిదులైన బ్రాహ్మణ ప్రభుల మహిమ
వినమె? యెఱిఁగి యెఱింగి సద్వినుతచరిత! కొఱవి గొని వెళ్లినే తలఁ గోఁకికొనఁగ?' (ఆర. 5.19)

రెండూ అధిక్షేపాత్మక అభివ్యక్తులే. కౌశికుడి పద్యం పూర్వార్ధంలోని రెండు చరణాలూ ప్రశ్నలుగా పలికితే, సీసపద్యంలో నాలుగు చరణాలను ప్రశ్నలుగా మారుపలికింది పతివ్రత. ఆమెది రెట్టింపు అధిక్షేపం. అతడిది ఆచరించని శాస్త్ర జ్ఞానం. ఆర్ద్రత లేని అహంకారం, సత్సంగం లేని సంస్కారం, నిగ్రహంలేని ఆగ్రహం, ప్రమాదంలో పడ్డ బ్రాహ్మణ భావం. ఇన్ని అవగుణాలు ఆ కౌశికుడిలో గూడుకట్టుకొని ఒక్కటిగా అతడి మాటలలో మారుమ్రోగుతున్నాయి. వాటన్నిటినీ విడమరచి అతడికి అర్థమయ్యేటట్లు పతివ్రత సీసపద్య మెత్తుకొని ఒక్కొక్కపాదంలో ఒక్కొక్క మహాబ్రాహ్మణుడు నిర్వహించిన ఘనకార్యాన్ని ఉటంకించి ఎత్తిపొడిచింది. వారందరూ 'బ్రాహ్మణప్రభువు' లని వెటకారంగా వెక్కిరించింది. అట్టివారట బ్రహ్మవిదులట! అని అవహేళనంగా నవ్వింది. అంతమందిని అంతవ్యంగ్యంగా అధిక్షేపించి 'సద్వినుత చరిత!' అని కౌశికుడిని సంబోధించి విపరీత వ్యంగ్య ధోరణిని ప్రదర్శించింది. అంతటితో ఆగకుండా తాను కొఱవితో తలగోకుకొనే తెలివితక్కువ దానిని కానని హెచ్చరించింది. ఆ మాట మనీషినని విర్రవీగే కౌశికుడికి కశాఘాతంవలె తగిలింది. పతివ్రత పతిసేవలో ఎంత నిపుణురాలో, హితబోధలో కూడ అంత చతురురాలు. పతివ్రత పలుకులు ఎఱ్ఱయ చతురోక్తులు.

'చతురవచోనిధి' గా పేరుగాంచిన అల్లసాని పెద్దన ఎఱ్ఱన చతురోక్తులను అక్కడక్కడ కొల్లగొట్టాడు. "ఏమిటనొక్కొ వారు గడునెల్లిదమై రిటు నీకు నిచ్చలున్' అన్న కౌశికుడి చతురోక్తి పెద్దన్నగారి వరూథిని నోట మధురోక్తిగా మారింది. "నీకింత భయంబులేకడుగ నెల్లిదమైతిమె మాట లేటికిన్" (మను.2.41). పురుషుడు పలికిన చతురోక్తిని స్త్రీ నోట మధురోక్తిగా మార్చాడు పెద్దన. ఎఱ్ఱన పతివ్రత చేత పలికించిన సీసం - ప్రబంధ నాయికలకు సూక్తివైచిత్రిగా మారిపోయింది. "వెలివెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి। దాశకన్యాకేళిఁ దప్పుఁజేసి" (మను. 2.73) వంటి పద్యాలు ఎఱ్ఱయ అభివ్యక్తులకు అనుసృజన శిల్పాలే.

గహనమైన తాత్త్విక వేదాంత విషయాలను సుగమమైన రుచిరార్థసూక్తులవలె పలికించటం ఎఱ్ఱయకు నన్నయవలె అబ్బిన సూక్తివైచిత్రి.

(i) సత్పురుషులు ధర్మాచరణం వలన పొందే లాభాలు:

చ. 'చిరముగ ధర్మముల్ నడపఁ జిత్తము దేఱుఁ; బ్రసన్నచిత్తుఁడై
పరువడి నింద్రియార్థముల భంగులు రిత్తలుగా నెఱింగి చె
చ్చెర నవి యంతవట్టు నిరసించి తపో దమ సత్యశీలతం
బరిణతి నొందుఁ; బొందుఁ బిదపం బరమార్థపద ప్రభావమున్'. (ఆర. 5.77)

(ii) ఇంద్రియాలను జయించిన ఉదారుడి స్వభావాన్ని చెప్పే ఆలంకారికోక్తి:

చ. 'అరదము దేహ; మింద్రియము లశ్వము; లాత్ముఁడు సూతుఁ; డమ్మహా
తురగచయంబు ధైర్యమను తోరపుఁబగ్గములన్ దృఢంబుగా
నురవడిఁ బోక యుండ వెరవొప్పఁగఁ బట్టినవాఁడు సేమపుం
దెరువున నేఁగు; నప్పరమ ధీరుఁడు సువ్వె యుదారుఁ డయ్యెడన్'. (ఆర. 5.92)

ధర్మ విషయాలను సూక్తులుగా వెలయించటం వెలలేని విలువ. ధారణలో నిలిచే పద్యాలను ఆణిముత్యాలవలె ఆవిష్కరించే ప్రతిభ ఎఱ్ఱన సూక్తివైచిత్రిలో ఒక కళ.

### (6) కుమారస్వామి కథ : విస్తరించి చెప్పే విద్య

పంచమాశ్వాసాన్ని 'కథావిశేషంబు సవిస్తరంబుగా' చెప్పానని ఎఱ్ఱన పేర్కొన్నాడు. కుమారస్వామి కథ మూలంలో తొమ్మిది అధ్యాయాలలో (213-221) 354 శ్లోకాలలో ఉండగా,ఎఱ్ఱన తెలుగులో 115 గద్యపద్యాలలో చెప్పాడు. ఈ అంకెలు సవిస్తరంగా చెప్పే పద్ధతిని భౌతికంగా సూచించవు. అయితే, ఎఱ్ఱయ కథ అనీ, కథా విశేషమని రెండంశాలు చెప్పాడు. కథా విశేషమంటే వర్ణనమే. ఆయన ప్రబంధ పరమేశ్వరత్వ సూచకమైన లక్షణం వర్ణనం. "ఇతివృత్తమును వర్ణనలచే అలంకరించెడి నూత్న పద్ధతికి సూత్రధారు డగుటచే నాతని కాబిరుదము కలిగియుండును"- అన్న ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి మాటలు ఇక్కడ స్మరణీయాలు (ఆంధ్ర సాహిత్య చరిత్ర. పు.275). విస్తరణమంటే ఎఱ్ఱయ దృష్టిలో ఇతివృత్తాన్ని వర్ణనలతో విస్తరించటమే. దీనికి అనుబంధంగా కథా భాగాన్ని అనువుగా సంగ్రహించటమని కూడా ఆయన చెప్పినట్లు గ్రహించాలి.

మూలంలో కుమారస్వామి కథ సాఫీగా, సరళంగా పురాణ పద్ధతిలో నాతిసంగ్రహంగా సాగుతుంది. ఎఱ్ఱన కథను కుదించి సారవంతం చేశాడు. యథావకాశంగా వర్ణనలను నిర్వహించి తనదైన ప్రబంధశయ్యను చతురోక్తి విలాసాలతో ప్రదర్శించాడు. మచ్చుకు ఒకటి, రెండు ఉదాహరణలు.

(i) సప్తర్షులు అమావాస్యాహోమం చేయసమకట్టారు. దేవతలందరూ హవిర్భాగాలు తీసికొనటానికి విచ్చేశారు. అగ్ని ఆహవనీయాగ్నిలో ఆవేశించి ఆహుతుల నందుకొని దేవతల కందిస్తూ సప్తర్షి భార్యలను చూచి మోహించాడు. ఈ భాగంలో మూలం.

శ్లో: "నిష్క్రామంశ్చాప్య పశ్య త్స పత్నీ స్తేషాం మహాత్మనామ్ ।
స్వేష్వాశ్రమేషూపవిష్టాః స్నాయంతీ శ్చ యథా సుఖమ్॥
రుక్మవేదినిభా స్తాస్తు చంద్రలేఖా ఇవామలాః।
హుతాశనార్చిప్రతిమాః సర్వా స్తారా ఇవాద్భుతాః॥
స తద్గతేన మనసా బభూవ క్షుభితేంద్రియః।
పత్నీర్దృష్ట్వా ద్విజేంద్రాణాం వహ్నిః కామవశం యయౌ॥
సభూయ శ్చింతయామాస న న్యాయ్యం క్షుభితో ఽ స్మియత్।
సాధ్వీః పత్నీ ర్ద్విజేంద్రాణా మకామాః కామయామ్యహమ్॥
నైతాః శక్యా మాయాద్రష్టుం స్ప్రష్టుం వా ప్యనిమిత్తతః।
గార్హపత్యం సమావిశ్య తస్మా త్పశ్యా మ్యభీక్ష్ణశః ॥
సంస్పృశన్నివ సర్వా స్తాః శిఖాభిః కాంచన ప్రభాః।
పశ్యమానశ్చ ముముదే గార్హపత్యం సమాశ్రితః ॥" (సం. 3.213. 42-47)

ఆరు శ్లోకాల మూలం మూడు పద్యాల తెలుగు భాగంగా అవతరించింది. అది అనువాదం కాదు. అనుసృజనం, మూలతాత్పర్యానికి మధురమైన విస్తరణం.

సీ. 'ఆ సమయంబున నమ్మునీంద్రుల భార్య । లందఱు సుస్నాన మొందఁజేసి,
రమణీయ మాల్యాంబర విభూషణాద్యలం । కారంబు లొనరించి గారవమునఁ
జనుదెంచి పతులకు సన్మతిం బరిచర్య । సేయుచు మెలఁగంగ వాయుసఖుఁడు
మెలఁతల వాలిక మెఱుఁగు గన్నుల యొప్పుఁ । దెలినవ్వుమొగముల విలసనంబు

సీ. నడబెడంగులు నన్నువ నడుములందు । వెలయు వళులభావంబులు వలుదచన్నుఁ
గవలనిక్కును నేర్పడఁ గని కరంగి । మదనమార్గణ విదళితహృదయుఁ డయ్యె'.

వ. 'ఇట్లు వికలేంద్రియుండై వైశ్వానరుం డమ్మునిపత్నులయందుఁ దగిలిన డెందంబు మగిడింప నేరక వారలం గదియ నప్పళించి గార్హపత్యకుండంబున నావేశించి'

చ. 'అతివలు దన్నుఁ జేరుటకు నాసపడుం; బొరిఁ జేరుచోట నా
యతవిలసచ్ఛిఖాగ్రముల నల్లన వారల నంటుఁ; గౌతుకం
బతిశయమై తదంగలత లాదటఁ గౌఁగిటఁ జేర్పఁగోరుఁ; గం
పితధృతియై కలంగుఁ గడుఁ బెల్లగు రాగరసంబు ముంపఁగన్'. (ఆర. 5.195-197)

ఎఱ్ఱయ తన కథావిశేష విస్తరణ బీజాలను రెండు చోట్ల నాటాడు. అవి- 'మదనమార్గణ విదళిత హృదయుఁడయ్యె' అని ఒకచోట, 'కలంగుఁ గడుఁ బెల్లగు రాగరసంబు ముంపఁగన్' అని మరొక చోట. సుందరాంగులైన అన్యకాంతలయందు వలపు పెంచుకొని మోహపారవశ్యంలో, రతిభావదీప్తితో శృంగారహావభావాలను లీలలను దశావిస్ఫూర్తితో వెలారిస్తే అది నిజానికి శృంగారరసాభాసం. దానిని 'రాగసాగరంగా' మార్చి రమణీయంగా రక్తికట్టించిన తిక్కన నాటకీయరచనాపద్ధతి ఎఱ్ఱనకు స్ఫూర్తినిచ్చింది. సప్తర్షుల భార్యలను చూచి విరాళి ననుభవించే అగ్నిభట్టారకుడు విరాటపర్వంలోని కీచకతుల్యుడుగా భాసించటం సహజం. ఆ పాత్ర చిత్రణంలో తిక్కనపెట్టిన బాణి ఎఱ్ఱయకు విస్తృతి వివేకంగా తోచింది. కీచకుడు 'మనోజవికారమగ్నుఁడై' (విరా. 2.31) 'వలరాజుబారికి నగ్గమయ్యె' (విరా. 2.86) 'రాగసాగరపూర నిర్మగ్నుఁడయ్యె' (విరా.2.33) అని తిక్కన చేసిన వర్ణనలు ఎఱ్ఱనకు ఒజ్జబంతులయ్యాయి. అభినయ స్ఫోరకమైన కీచక విరహాన్ని విభావ విస్ఫూర్తిని ఈ చిన్ని సన్నివేశంలో కొండను అద్దంలో చూపినట్లు ఎఱ్ఱయ ప్రదర్శించాడు. కీచకఘట్టంతో పోలిస్తే ఇది ఒక వెలుగురవ్వ. ఈ కథలో ఇది రసభావ విస్తర శిల్పం.

మూలంలో ఋషిపత్నులు బంగారువన్నెవారు, చంద్రరేఖలవలె నిర్మలులు, అగ్ని శిఖలకు ప్రతిరూపాలు. నక్షత్రాలవలె వెలిగేవారు, చూచేవారికి అబ్బురపాటు కలిగించేవారు. వ్యాసుడిది స్థిరచిత్రవైఖరి. ఎఱ్ఱన వారిని చలచిత్రాలుగా మార్చి ప్రాణంపోశాడు. మేనికాంతులను వదలివేసి మేనితళుకుబెళుకులను ప్రదర్శింపజేశాడు. మూలంలోని ఋషిపత్నుల మేనికాంతులు చూస్తే ఎదుటివారికి ఆశ్చర్యంతోపాటు ఆరాధన భావం కూడా కలుగుతుంది. అయినా వారిపై వలపు పెంచుకొని హుతాశనుడు కాముకుడయ్యాడు. వ్యాస హృదయం మూలంలో అదే. ఎఱ్ఱయది ప్రబంధ కవి హృదయం. అందువలన ఋషిపత్నులకు రమణీయ మాల్యాంబర విభూషణాద్యలంకారాలు తొడిగించాడు. వారు పరిచర్యలు చేస్తుంటే భక్తిప్రపత్తులకు బదులు 'వాలికమెఱుంగుఁ గన్నులయొప్పు, తెలినవ్వు మొగముల విలసనంబు, నడబెడఁగులు, నన్నువ నడుములందు వెలయు వళుల భావంబులు, వలుద చన్నుఁగవల నిక్కులు' స్పష్టంగా అగ్నికి కనపడేటట్లు ప్రదర్శింప జేశాడు. ఎఱ్ఱన సృష్టిలో ఆ ఋషిపత్నులు శాంత రసమూర్తులు కారు. శృంగార రసదీప్తులు. వారిని "ఏర్పడ' చూస్తే ఏమౌతుంది? ఎంతటివాడైనా ముందు నిలువునా కరగిపోతాడు. ఆ తరువాత మన్మథుడి బాణాల బారిన పడి వివశహృదయు డౌతాడు. అగ్నిపని అదే అయింది. ఎఱ్ఱయ కైశికీవృత్తిని మధురంగా పోషించి రసికుల హృదయాలను ద్రవింపచేశాడు. అది ఆయన ప్రబంధ పరమేశ్వర బిరుద మహిమ.

ఎఱ్ఱన వర్ణనం మూలవిరుద్ధంగా ఉన్నది. అది వివేచకులకు అనౌచిత్య మనిపించవచ్చును. ఎఱ్ఱన ఇక్కడ సూక్తి వైచిత్రిని ప్రదర్శించి సన్నివేశ మాధుర్యాన్ని సంరక్షించాడు. అగ్నివంటి వాడిని ఆకర్షించగలిగిన అందం అపూర్వశృంగార విభావాల వలననే ఆవిష్కృతం కావాలి. అగ్నికి కామభావం కలుగకపోతే కథ లేదు. మూలంలో ఋషిపత్నుల రూపాలు రతిభావోద్దీపకాలు కావు. అందువలన ఎఱ్ఱన వారిని రసానుకూల రమణీయ విలాస వీచికలుగా మార్చాడు. అగ్ని వారిని పొందాలని ఆశపడ్డాడు. మూలంలో అగ్ని పతివ్రతల తేజస్సులను చూచి, మహర్షుల మహిమలను తలచి వారిని కామించటానికి మొదట భయపడ్డాడు. కాని, కామాన్ని అణచుకొనలేక వారి సామీప్యస్పర్శాది సుఖాలను కోరి గార్హపత్యాగ్నిలో ఆవేశించి నిత్యసాంగత్య సౌఖ్యం కొరకు ప్రాకులాడాడు. అగ్ని ఋషులవలనిభయంతో వితర్కించిన వైనాన్ని ఎఱ్ఱన వదలివేశాడు. శృంగార పరంగా ఇది పెద్దమార్పు కామాతురులకు లజ్జాభయాలు ఉండవని తెలుగులో అగ్నిదేవుడు తేల్చిచెప్పాడు. అందువలననే శృంగారనాయకుడి వలె రాగరసంలో మగ్నుడు కాగలిగాడు. రాగరసం నాట్యరసం. దానిని కావ్యరసంగా సాగరమంతచేసి తిక్కన తెలుగు కవితలో తీర్చిదిద్దాడు. దానిని ఎఱ్ఱన ఒక పద్యంలో చిత్రించి సరోవరంగా చూపించాడు.

సన్నివేశం చిత్రమైనది. అగ్ని ఉన్నచోటి నుండి కదలలేడు. కాని కాళ్ళులేని వాడు కాడు. అగ్నికుండం అతడి అవధి. దానిని దాటలేడు. మనసును ఆపుకొనలేడు. ఋషిపత్నులే ఆయన వద్దకు రావాలి. వారికి అగ్నిమీద భక్తి ఉన్నది కాని, రక్తి లేదు. అందువలన అర్చనా విధుల సమయంలోనే అగ్నిసేవలు చేసికొంటారు. కాగా. అతడు పడే విరహం దయనీయం. ఆ వనితలు తన దగ్గరికి రావాలని ఆశపడతాడు. వచ్చేదాకా అఱ్ఱులు చాస్తాడు. వచ్చిన క్షణాలను వృథా చేసికొనకుండ బాగా చాచిన శిఖాగ్రాలతో (చేతికొనవేళ్ళతో తాకినట్లు) తాకుతాడు; దర్శన, స్పర్శనాలు వారి పొందుకోరే ఆసక్తిని పెంచేవి. లతలవంటి వారి శరీరాలను బిగికౌగిట చేర్చాలని ఉబలాటపడేవాడు. కాని, అది తీరని కోర్కెగా మిగిలిపోయేది. తన కా అదృష్టం జీవితంలో కలిగే అవకాశం లేదేమోనని నిరాశచెంది, ధైర్యాన్ని కోల్పోయేవాడు. అప్పుడు మనసులో ఎంతో బాధపడేవాడు. కాని, ఆ విరహం అతడి రతిభావాన్ని పెంచి ఒక మధురవేదనగా పొంగి, చివరకు ఆతడినే ఆ రాగరసంలో ముంచివేసింది. ఈ పరిణామ సుందరమైన రసభావవివృతి మూలంలో లేదు.

'కడు పెల్లగు రాగరసంబు' అనే మాట వాడిన ఎఱ్ఱన రెండు ప్రయోజనాలు సాధించాడు. ఒకటి: ఇక్కడ తిక్కన బాటను అనుసరించానని వ్యంగ్యంగా చెప్పటం. రెండవది - తిక్కన 'రాగసాగర' శబ్దాన్ని వాడినప్పుడు చేసిన వ్యాఖ్యను మనకు జ్ఞాపకం చేసి, తన సూక్తి వైచిత్రిని, చతురవాక్య విలాసాన్నీ ప్రదర్శించటం. తిక్కన పద్యం ఇక్కడ స్మరణీయం -

తే. 'ఉన్న పాంచాలిఁ గనుఁగొని యన్నరాధ ! ముఁడు వివేకవిహీనుఁడై ముదితుఁ డగుచు
మదన వికృతియకాఁ దనమదిఁ దలంచి । రాగసాగరపూర నిర్మగ్నుఁ డయ్యె". (విరా. 2.33)

సహజ శరీర విలాససుందరి అయిన పాంచాలి స్వేదాది సాత్త్విక భావాలను భయంవలన ప్రదర్శిస్తే- వాటిని శృంగార సాత్త్వికభావాలుగా భావించి కీచకుడు వలపు తలపును పెంచుకొన్నాడు. ఇక్కడ ఋషుల భార్యలూ అంతే. సహజ శరీర విలాసభాసినులు. వారు తన పొందు కంగీకరిస్తారని భావించటం అగ్ని అవివేకం. అయినా మదన వికారానికి లోనుకావటం అనౌచిత్యం. కీచకుడు దీనిని తెలియక రాగరసమనే సముద్రంలో మునిగిపోయాడు. అత డింక తేలటం కష్టం- అని తిక్కన తెలిపాడు. ఎఱ్ఱన 'కడుపెల్లగు' రాగరసాన్ని చెప్పాడే కాని అది సాగరమని సావయవ రూపకం చేయలేదు. అది ఆయన చతురోక్తి. అగ్నిని కీచకుడివలె రాగరసంలో ముంచి, తిక్కన తీర్పును మన భావనకు వదలి అలంకార ధ్వనిని అపూర్వంగా నిర్వహించిన ఎఱ్ఱన ప్రతిభ అల్పాక్షరాలలో అనల్పార్థ విస్తృతిని ప్రదర్శించ గలిగిన ప్రబంధ పరమేశ్వర విభూతి.

( ii) కుమారస్వామి కథ రౌద్రరసభావోన్నిద్రం. నానారసాభ్యుదయోల్లాసం. కథ వేగంగా సాగుతూ ఉంటుంది. మధ్యమధ్య రసోచిత వర్ణనలు వికసిత కమలవనాల వలె రాణిస్తాయి. భిన్నరసాల ముద్రలు గల ప్రబంధశయ్యల సూక్తి వైచిత్రులు లాస్యం చేస్తాయి. మచ్చుకు రెండుమూడు:

**1) భయానక రసోక్తి వైచిత్రి:**

మ. 'కులశైలంబులు గ్రక్కునం గదలె, దిక్కుల్ వ్రయ్యలయ్యెన్, మహీ
వలయంబంతయు దిర్దిరం దిరిగె, దేవవ్రాతముల్ సాధ్వసా
కులతం బొందెఁ, బయోధు లన్నియును సంక్షోభించె, సప్తాశ్వస
ప్తులు బిట్టుల్కి రథంబు నల్దెసలకుం బోనీడ్చె సంభ్రాంతమై.' (అర. 5.208)

**2) శివసాక్షాత్కార మధురోక్తి వైచిత్రి:**

శా. 'నానాసిద్ధగణంబు గొల్వఁ బరమానందంబునం జంద్రరే
ఖా నవ్యాంచితమౌళి భూరి భుజగాకల్పోజ్జ్వలాకారుఁ డీ
శానుం డానత శంకరుండు గిరిజాసంయుక్తుఁడై వచ్చెఁ ద
త్సేనానిం బ్రియసూను షణ్ముఖుని వీక్షింపం గడుం బ్రేమతోన్.' (అర. 5.233)

**3) యుద్ధవీర రసోన్నిద్ర అలంకృతోక్తి వైచిత్రి:**

శా. 'గీర్వాణ ప్రవిముక్త బాణ పటల క్రీడా విలూనంబులై
గర్వోన్మత్త సురారి శీర్షములు వీఁకం డొల్లెఁ గల్పచ్ఛిదా
నిర్విద్ధాంబుద మండలోద్గత మహానిర్ఘాత పాతావధూ
తోర్వీభృద్ఘన గండశైలములతో నూహింపఁ దుల్యంబులై'. (అర. 5.276)

ఉ. 'లోహిత రత్నభూషణుఁడు లోహిత మాల్యధరుండు విస్ఫుర
ల్లోహిత లోచనుండు నవలోహిత వస్త్రుఁడు లోహితాస్యుఁడై
యాహవకేళికిం గడఁగునప్పుడు సూడఁగ నొప్పె లోక ని
ర్దాహ సమిద్ధ నూతన పతంగుఁడ పోలె రథాధిరూఢుఁడై'. (అర. 5.282)

ఈ పద్యాలలో కొన్నింట నన్నయ తిక్కనల పద్యాల ఎత్తుగడలు కనపడవచ్చును. కాని, నిర్వహణ, సమాస సంఘటన, అభివ్యక్తి వైచిత్రి ఎఱ్ఱయ వాగ్విలాసమే. విశేషమేమంటే నన్నయ తిక్కనలలో కంటె ఎఱ్ఱన పదబంధంలో అకుంఠితమైన ఆర్ద్రత భారతీవృత్తి నాశ్రయించి ప్రసాదమధురంగా ప్రవహిస్తుంది. అందువలన ఎఱ్ఱయ కథావిశేష విస్తృతి ఆయన రచనా సంస్కృతి!

**(7) పరిక్షితుని కథ : మధురంగా చెప్పేవిద్య**

మార్కండేయమహర్షి బ్రాహ్మణప్రభావాన్ని తెలిపే వామదేవ వృత్తాంతాన్ని చెప్పటానికి పూనుకొని ఆ కథకు పూర్వరంగమైన సుశోభనా పరిక్షితుల వృత్తాంతాన్ని చెప్పాడు. వారిరువురిది చిత్రమైన శృంగారగాథ. సుశోభన కప్పలరాజు కూతురు. మనోహర మానవాకృతితో మనుజపతులను ఆకర్షించి అగచాట్ల పాలుచేసేది. పరిక్షితుడు ఆమెను వనంలో ఒంటరిగా ఉండగా చూచాడు. వారిరువురి మధ్య ఈ విధంగా సంభాషణ సాగింది.

ఉ. 'ఎవ్వరిదాన వంబుజదళేక్షణ! యేకత మిట్టు లేల నీ
వివ్వనభూమియందుఁ జరియించెదు?; నావుడుఁ దండ్రి పంపునం

దివ్వనభూమియందుఁ జరియించెద సద్వరుఁ గోరి; కన్య; నే
నెవ్వరి దానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా!' (ఆర. 4.323)

ఈ ఎఱ్ఱన పద్యం ఎంత అదృష్టం చేసికొన్నదో! ఒకపద్యంలోని పూర్వాపరార్థాలలో ఉక్తి చాతుర్యంతో కూడుకొన్న సంభాషణలు నిబంధించాడు ఎఱ్ఱాప్రెగ్గడ. ఈ పద్యం 'ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ! యొంటి చరించె దోటలే కివ్వన భూమి?'.... (మను.2.39) అనే మనుచరిత్ర పద్యానికి త్రోవ చూపిందని చాలమంది విమర్శకులు గుర్తించారు. అందులో అనుమానం లేదు. అయితే ఆ పద్య నిర్మాణ చాతుర్యం వేరు. ఈ పద్య నిర్మాణ చాకచక్యం వేరు. అది ఒకపాత్ర మాట్లాడే మహనీయ వాక్యసంపుటి. ఇది నాయికానాయకుల మనసులు గుబాళించే మధుర వాక్య విలాసమంజరి. ఎఱ్ఱన శృంగార రసమధుర రమణీయోక్తి వైచిత్రికి ఈ పద్యం రత్నరాజం.

ఈ పద్యంలోని చమత్కారమంతా 'ఎవ్వరిదానవు?' అని అతడు అడగటంలోనూ, 'ఎవ్వరి దానఁ గావలయు'నని ఆమె తిరిగి ప్రశ్నించటం లోనూ ఉంది. 'ఎవ్వతె వీవు?' అన్న పద్యంలో పెద్దన ఈ చమత్కారాన్ని చేయలేక పోయాడు. ఆయన చతురోక్తి అంతా 'భీతహరిణేక్షణ!' అనే సంబుద్ధిలో నిబంధించాడు. చాలామంది విమర్శకులు దీనిని పట్టించుకోకుండా పెద్దన ఎఱ్ఱన ననుసరించాడని చెప్పుతారు. పద్యాల ఎత్తుగడలను చూచి ప్రభావ పరిశీలనం చేసేవారు చేసే పొరపాట్లలో ఇది ఒకటి. అది అలా ఉంచుదాం.

ఈ పద్యంలో ప్రతిపదం చతురోక్తి పథంలో నడిచిందే. పరిక్షితుడు - 'ఎవ్వరిదానవు?' అన్నాడే కాని 'ఎవ్వతెవు?' అని అనలేదు. పెండ్లి కాని పిల్ల అయితే తండ్రిపేరు చెప్పుతుంది. వివాహిత అయితే భర్త పేరు చెపుతుంది. ఆ రెండిట్లో ఏదో ఒకటి ముందుగా తెలిసికొనాలని నాయకుడి ఆసక్తి. ఆ తరువాత 'అంబుజదళేక్షణ!' అని సంబుద్ధి. అది ఆమె కన్నుల అందాన్ని కీర్తించేదే కాదు, కన్నార్పకుండా చూస్తున్న ఆమె ఆసక్తిని గూడా చెప్పకచెప్పే విశేషణం. ఆ చూపు ఆమె వివాహిత కాదని అతడు ఊహించటానికి ఆస్కారం కలిగించింది. వెంటనే అతడు మాటల గాలాలను వేశాడు మనసును పట్టుకొందామని. పైవాక్యంలో పదా లెంత ముఖ్యమో, వాటి కూర్పు కూడా అంత సార్థకం. 'ఒంటరిగా- ఈ విధంగా - ఎందుకు - ఈ వనభూమిలో - చరిస్తున్నావు?' అని అతడి ప్రశ్న. ఇది అమాయకపు ప్రశ్న కావచ్చును. చతురుడైన రసికు డడిగే ప్రశ్న కావచ్చును. ఆమె ఒంటరిగానే ఉన్నదేమో తెలిసికొందామన్న కుతూహలం, ఆమె విలాసంగానే ఉన్నది కాని విషాదంగా లేదు - దానికి కారణం తెలిసికొందామనే ఆసక్తి. ఆమె ఏ ప్రయోజనం కొరకు ఇల్లు వెడలి అడవిలోకి వచ్చిందో తెలిసికొందామనే ఆకాంక్ష ముప్పిరికొన్న ప్రశ్న అది. కథకు కావలసిం దంతవరకే. పెద్దన ప్రవరుడి చేత 'ఒంటి చరించె దోటలే కివ్వనభూమి?' అని ప్రశ్న నడిగించటంలో ఎఱ్ఱన చాతుర్యాన్ని వాడుకొన్నాడు.

పరిక్షితుడికి దీటైన సమాధానం చెప్పింది సుశోభన. అతడి ప్రశ్నలోని వరుసను ఆ వైపునుండి ఈ వైపుకు నరుక్కొంటూ రావటం సూక్తి చాతుర్యం. ఈ శిల్పాన్ని కొల్లగొట్టి ''ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర!'' (మను.2.41) అనే పద్యంలో పెద్దన వాడుకొన్నాడు. పెద్దనది పెద్ద వ్యూహం. ఎఱ్ఱనది జిలుగు శిల్పం. 'ఇవ్వనభూమియందుఁ జరియించెద' అనే మాటలు ప్రశ్నలోనివే ఎన్నుకొని పునరుక్తిగా పలికింది సుశోభన. అయితే ముందు 'తండ్రిపంపున' వెనుక- 'సద్వరుఁగోరి' అని కలిపి చెప్పింది. తండ్రి తన కూతురిని మంచి వరుడిని వెదుక్కొనుమని అడవులకు పంపాడట! ఆశ్చర్యకరమైన సమాధానం. ఆ చర్యవెనుక ఏదో దేవరహస్యం ఉండే ఉండాలి. ఆమె వరుడు ఆ అడవికి వచ్చినవాడే కావాలి. అంతవరకెవ్వరూ రాలేదు. అప్పుడు పరిక్షితుడు వచ్చాడు. ఆమె నాతడు చూచిన సంఘటన స్వయంవర ఘట్టంగా మారుతుందా? ఆమె మొదటి వాక్యం ఎంతటి ఉత్కంఠను అతడిలో లేపింది! ఆమె ఒక్కమాటలో 'కన్యను' అని ప్రకటించింది. ఆమె కింకా వరుడు దొరకలేదని తేలింది. అయితే, అతడి హృదయంలో ఒక అనుమానం మిగిలి ఉంది. ఆమె వివాహం ఆమె నిర్ణయం మీద ఆధారపడి ఉందా? కాబోయే వరుడి కోరిక మీద ఆధారపడి ఉందా? - అని. దానిని పసిగట్టిన సుశోభన చతురోక్తిని వ్యంగ్యవైభవంతో విసిరింది. 'ఏ నెవ్వరి దానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా!' అని. ఆమె సమాధానంలో ఎవ్వరిదానవంటే - పేరు

బైటపెట్టని ఒక తండ్రి కూతురనని చెప్పింది. ఆమె క్షత్రియ వివాహయోగ్య అవునా కదా? అన్న ప్రశ్న ఊగిసలాడుతూనే ఉంది. దానికి 'రాజనందనా!' అనే సంబుద్ధి సమాధానం. 'నీవెట్లాగూ క్షత్రియుడవే కాబట్టి, యువకుడవు కాబట్టి నే నెవ్వరి భార్యను కావాలో తేటపడేటట్లు నీవే చెప్పుము' అని అడిగింది. అంతవరకూ వారి మాటలలో ఏదో అభిలాష అంతర్వాహినిగా సాగుతూ గూఢార్థ గుంఫనంగా సంభాషణ సాగింది. ఇద్దరిలో ఎవరికి ఎవరూ తీసిపోరని నిరూపించుకొన్నారు. ఇక ఆ నర్మోక్తులు, గూఢోక్తులు, వ్యంగ్యోక్తులు మాని మనసును వాచ్యం చేయుమని కోరింది సుశోభన. ఆమె రూపంకంటె ఆమె మాటలు అతడి కెంతో నచ్చాయి. ఆ మాట ఎఱ్ఱన 'దాని ప్రగల్భ వచనంబులకు నధిక విలోలుండై' తన మనసులోని మాటను ఆమెకు తెలియపరిచాడని బైటపెట్టాడు.

ఆమె ఆ తరువాత 'జలక్రీడలకు తనను పిలువకుండా ఉంటే ఆతడిని పెండ్లాడతా' నని ఒక కట్టడి చేసింది. ఆమె మాటల అబ్బురపాటులో మునిగిపోయిన ఆతడు మారుమాటాడకుండా ఒప్పుకొన్నాడు. విశేషమేమంటే సుశోభనా పరిక్షితుల వివాహం మాటకట్టడి మీద ఆధారపడి ఉన్నది. ఆ ఆయువుపట్టును గ్రహించి ఎఱ్ఱన ఆ చిన్నికథకు ఉక్తివైచిత్రిని ఊపిరిగా నిలిపాడు. ఆ ఉక్తి వైచిత్రికి ఉజ్జ్వలనీలమణి ఈ పద్యం.

సుశోభనా పరీక్షితుల వృత్తాంతం మూలంలో 43 శ్లోకాల నిడివి కలది (3. 190.1 నుండి 43 వరకు). దీనిని ఎఱ్ఱయ 17 గద్యపద్యాలలో రచించాడు. అంత చిన్నకథలో నాలుగైదు రత్నాలవంటి పద్యాలను నిర్మించాడు. వాటిలో మరొక ఉదాహరణం.

చ. 'అతులిత పుష్పపల్లవ ఫలాన్విత భూరుహభూరి వల్లరీ
వితతముఁ జారుకైరవ నవీన సరోరుహషండ మండలా
యత సరసీమనోహరము నైన పురోపవనంబునన్ సము
న్నత విభవుండు వాసభవనంబు లొనర్పఁగఁ బంచి యిమ్ములన్.' (అర. 4.325)

ఈ పద్యం నన్నయ అక్షర రమ్యతకు అపరావతార మనుకొనవచ్చును. కాని, నన్నయ ప్రసాద గుణం కంటె ఓజోమాధుర్యం పాలు ఎక్కువ. నిజానికి ఈ పద్యం నృసింహపురాణ రచనకు పురివిప్పుకొంటున్న ఎఱ్ఱయ ప్రబంధశయ్యలోని మధురాభివ్యక్తి. భారతీవృత్తి ప్రదర్శించే మరొక విలాసం.

ప్రకృతి వర్ణనం ఎఱ్ఱనలోని ప్రబంధ పరమేశ్వర విభూతిని రెచ్చగొడుతుంది. ఆయన నృసింహావతార ధోరణిలో విజృంభిస్తాడు. మచ్చు కొకటి రెండు.

వర్షర్తు వర్ణనం

మ. 'ఉరు ఘర్మౌఘ విఘాత సంవిహిత విశ్వోల్లాసమై సంచల
త్పరసాంభోద నినాద తూర్యరవమై చంచద్బలాకాగరు
ద్భరలీలా నవచామర స్ఫురణమై పర్జన్య సామ్రాజ్య మొ
ప్పె రమామందిరమై యుదగ్రశిఖినీ పింఛాతపత్రంబులన్.' (అర.6.388)

పర్జన్య సామ్రాజ్యంతో వర్షాకాలాన్ని రూపకం చేసి వర్ణించిన ఈ పద్యం ఎఱ్ఱన ప్రబంధశయ్యలోని అలంకృతోక్తి. వర్షర్తు చిహ్నాలను రాజ లాంఛనాలుగా రూపించిన పద్ధతి ఇందులోని ఉక్తి వైచిత్రి.

సముద్ర వర్ణనం:

స్రగ్ధర: 'లీలం గల్లోలమాలోల్లిఖిత గగనమై లీన నానాకుళీర
వ్యాళోగ్ర గ్రాహమీనావళుల నెసఁగి దుర్వార వారోఘ గంభీ

రాలంఘ్యు ప్రౌఢవేగం బగుచు బహుతరాయామ విస్తారమై బి
ట్టాలోకింపంగ నుగ్రంబగు జలనిధి నంతంతటం గంటి మంతన్'. (ఆర. 7.16)

భీకర రమణీయమైన సముద్ర స్వరూప స్వభావాలను ఓజోమధురంగా వర్ణించిన ఈ పద్యం ఎఱ్ఱన ప్రబంధోక్తియే.

ఎఱ్ఱయ కవిత ఆరణ్యపర్వశేషంలో నన్నయ తిక్కన కవితల కొకవారధి వంటిదని భావించటం ప్రసిద్ధంగా ఉన్నది. కాని, పరిశీలించి చూస్తే నన్నయ తిక్కనల బాటలలో చతురోక్తి పథాలను కల్పించి ప్రబంధయుగానికి దారులు చూపిన మార్గదర్శిగా, మహర్షిగా ఎఱ్ఱన దర్శనమిస్తాడు.

## 8. ఆరణ్యపర్వశేష కవితా వ్యక్తిత్వం : ప్రబంధ పరమేశ్వరత్వం

కావ్యకళారహస్య కోవిదులు కవిత్వంలో - వస్తుకళ, భావకళ, రచనాకళ ఉంటాయని గుర్తించారు. ఇతిహాసాదులలో వస్తుకళ రాణిస్తుంది. కావ్యకవితలో అది ఒక్కటి చాలదు. 'నహి కవే రితివృత్తమాత్ర నిర్వాహేణ ఆత్మపదలాభః ఇతిహాసాదేవ తత్సిద్ధేః'- అని ధ్వన్యాలోకకర్త నిర్దేశించటం ప్రసిద్ధమే. కావ్యంలో భావకళకు పట్టం కట్టాలి. నన్నయ తిక్కన్నలు ఆంధ్రమహాభారతాన్ని కావ్యేతిహాసంగా తీర్చిదిద్దుతూ అందులో వస్తుకళతోపాటు భావకళకు ప్రాణం పోశారు. నన్నయ కవితలో వస్తుకళకు భావకళ పోషకం. తిక్కన కవితలో భావకళకు వస్తుకళ సాధకం.

ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయరీతికి రచనాకళను ఉపరంజకంగా అనుసంధించాడు. ఆ తరువాత శ్రీనాథుడు వస్తుభావ రచనాకళలను ముప్పేటగా పేనాడు. వారిద్దరి మధ్య నాచనసోముడు రచనాకళకు కవితలో రాజ్యం కట్టి మిగిలిన వాటితో ఆ కళకు దాస్యం చేయించాడు. ఆంధ్ర కవితాపరిణామ దశలో ఎఱ్ఱన కవిత ఒక మలుపు. రచనాకళను గౌరవించినా వస్తు భావకళలకు ఉపపోషకంగా నిలిపి మన్నించిన గౌరవం ఎఱ్ఱాప్రెగ్గడకు దక్కింది. కవిత్రయ కవిత్వానికీ తరువాతి కావ్య ప్రబంధకవిత్వానికీ ఆయన కవిత ఒక మధుర పరిణామ దశ. నన్నయ తిక్కనల కంటె రచనాకళలో ఎఱ్ఱయ ఒక అడుగు ముందుకు వేశాడు. దానిని ఆయన ఏ పేరుతోనూ పిలవ లేదు. కాని, తరువాతి వారు దానికి తమకు నచ్చిన పేర్లుపెట్టి పిలిచారు. ఎందువల్లనంటే - తెలుగు కవులు కవితాకళలో చేసే విన్నూత ప్రయోగాల కన్నిటికీ సంస్కృత లక్షణ గ్రంథాలలో పేర్లూ, నిర్వచనాలూ దొరకవు. తెలుగు కవుల కవితాకళలో క్రొత్త క్రొత్త పారిభాషిక పదాల సృష్టి జరిగింది. ఎఱ్ఱయ కవితా లక్షణాలని చెప్పేవన్నీ అటువంటి సాపేక్ష దేశీ సంప్రదాయ సంజనితాలే. అయితే, వాటికి ప్రాతిపదికలు సంస్కృత, ప్రాకృత, దేశి సంప్రదాయ భూమికల నాశ్రయించే ఉంటాయి.

ఎఱ్ఱాప్రెగ్గడ 'ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబులఁ గావ్యకర్త'యై ఆరణ్యపర్వశేషాన్ని రచించి ప్రబంధపరమేశ్వరు డయ్యాడని ఎఱపోతసూరి చెప్పాడు. ఉక్తి అంటే సుందరమైన కవితాభివ్యక్తి. చతురమైన ఉక్తి అంటే నిపుణమైన లేదా ప్రౌఢమైన కవితాభివ్యక్తి. 'చతతే కాంక్షతే ప్రయోజన మితి చతురః' అని గురుబాల ప్రబోధిక. అంటే - ఉద్దిష్టమైన ఒక ప్రయోజనానికి సాధనభూతుడైన వాడు చతురుడు. అటువంటి లక్షణం కలిగింది చతురోక్తి. దాని వలన కవి సాధించేది రసం. 'సాధ్యోహి రసోయథా తథం కవిభిః' అని ఆర్యోక్తి. రససిద్ధిని కాంక్షించి తత్సాధకంగా శబ్దార్థాలను ప్రయోగించటం చాతుర్యం. అటువంటి చాతుర్యాన్ని ప్రదర్శించి రసాన్ని సాధించటంలో ఉత్తమ ప్రస్థానాలు సంస్కృతాది సాహిత్యాలలో జరిగి ఉన్నాయి. ఆ పరిజ్ఞానం బాగా ఉన్నవాడు, వాటిని ఏ యే ప్రక్రియలలో ఏవిధంగా ప్రయోగించాలో తెలిసిన ప్రయోక్త - ప్రబంధ పరమేశ్వరుడు.

ఉక్తి, సూక్తి పదాలు అందమైన కవితాభివ్యక్తిని కలిగించే శబ్దార్థ ప్రయోగ వైచిత్రిని తెలిపే పారిభాషిక సంకేతాలు. తెలుగులో సూక్తుల ప్రసక్తి నన్నయ నన్నెచోడాదులు తెచ్చారు. నన్నయ 'నానా రుచిరార్థసూక్తి నిధి'. అక్కడ సూక్తి అంటే రుచికరమై చమత్కారయుక్తమైన కూర్పు అని అర్థం చెప్పారు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారు. ఆ చమత్కారం ఒక్కొక్క పదంలోనూ, పదబంధంలోనూ, సమాసంలోనూ, కారకంలోనూ, వాక్యంలోనూ బహుభంగుల చూడవచ్చునని వారు పేర్కొన్నారు. సూక్తులంటే ఒక కవివాగ్వృత్తిని ముద్రించుకొన్న అందమైన కవితాభివ్యక్తులనీ, ప్రియమైన మాటలనీ, శ్రేష్ఠములైనమాటలనీ,

మృదుమధురమైన మాటలనీ, సుభాషితాలు, నీతులు, జాతీయాలు, లోకోక్తులు, నానుడులు మొదలైనవనీ విమర్శకులు వివేచిస్తున్నారు.రుచిరార్థమంటే రమణీయార్థ ప్రతిపాదకమనీ, కావ్యసందర్భంలో ఒప్పిదాలై భాసించే వాచ్యలక్ష్య వ్యంగ్యార్థాలనీ కొందరు వ్యాఖ్యానించారు. సూక్తిని అలంకార పర్యాయవాచిగా కొందరు భావిస్తున్నారు. నన్నయ కవిత్వంలో వాటినన్నింటినీ ఆయా దృక్పథాలతో వివేచిస్తున్నారు.

నన్నెచోడుడు తన కుమారసంభవ కావ్యంలో సూక్తులు (1.35, 36) సదుక్తులు (1.39) చతురోక్తులు (1.39) అని ప్రయోగించాడు. సూక్తులు అంటే అందంగా చెప్పిన మాటలు లేదా, సుభాషితాలు. సదుక్తులంటే నిర్దుష్టమైన సాధుశబ్దాలు, చతురోక్తులంటే ప్రౌఢోక్తులు అని విమర్శకులు భావిస్తున్నారు. కావ్యానికి సూక్తులకంటె చతురోక్తులే సౌభాగ్య హేతువులని నమ్మినవాడు నన్నెచోడుడు.

క. "చతురోక్తుల నుతపదబహు । గతుల నలంకార భావకాంతి రసార్థో,
న్నతిఁ గృతి నతిరసికులు వర । సతిగతి నెఱిఁగింపవలదె సౌభాగ్యమునన్". (కుమా. 1.39)

అని అనటమే అందుకు తార్కాణం. చతురోక్తిమయ కవిత్వంలో నుతపద బహుగతులు, అలంకార భావకాంతులు, రసార్థోన్నతి ఉంటాయని నన్నెచోడుని నిర్దేశం. ఎఱపోత సూరి చెప్పిన 'చతురోక్తి పథంబు' లకూ దీనికీ ఏమైనా సంబంధం ఉన్నదా అని ఆలోచించాలి. నుతపద బహుగతులు- విశిష్ట పదరచనా రూపాలైన రీతిప్రస్థానాలనూ, అలంకార భావకాంతులు- అలంకార గుణప్రస్థానాలనూ, రసార్థాలు- రసధ్వని ప్రస్థానాలనూ సూచిస్తున్నాయి. వీటన్నింటిలో చతురోక్తులుండటం సర్వసాధారణం. రీతి, గుణాలంకార, రసధ్వని ప్రస్థానాలలో ఆయా కావ్యాత్మ ప్రయోజనాలను సాధించే ప్రౌఢోక్తుల ప్రయోగ విధానాలు- చతురోక్తి పథాలుగా ఎఱ్ఱయనాటికి చెప్పబడుతూ ఉండవచ్చును.

వాఙ్మయాన్నంతా ఉక్తివిశేషంగానూ, ఉక్తి సముదాయంగానూ భావించే భోజుడు - సరస్వతీ కంఠాభరణంలో-

"వక్రోక్తి శ్చ రసోక్తి శ్చ । స్వభావోక్తి శ్చ వాఙ్మయమ్,
సర్వాసు గ్రాహిణీం తా సు । రసోక్తిం ప్రతిజానతే". (5.8)

అని అన్నాడు. అతడి దృష్టిలో సాహిత్యం వక్రోక్తి. రసోక్తి, స్వభావోక్తిమయం. ఆ మూడింటిలో రసోక్తులే శ్రేష్ఠమని పేర్కొన్నాడు. ఉక్తులకూ సాహిత్య ప్రస్థానాలకూ అవినాభావ సంబంధం ఉన్నదని భోజుడి మాటలు చెప్పక చెప్పుతున్నాయి.

ఎఱ్ఱాప్రెగ్గడ కూడా చతురోక్తులు (నృ.పు.అవ.17), మధురోక్తులు (నృ.పు.అవ.21), హృద్యోక్తులు (హరి.పూ.1.51) అని మూడు రకాలు పేర్కొన్నాడు. కాని, ఆయన చెప్పిన సందర్భాలను బట్టి మధురోక్తులు, హృద్యోక్తులు ఒకటే కావచ్చును. లేదా మనసును కరగించేవి మధురోక్తులు, మనసును ఆకర్షించేవి హృద్యోక్తులు కావచ్చును. ఏమైనా ఆరణ్యపర్వశేషం చతుర, మధుర, హృద్యోక్తుల మయమని స్పష్టం. ఎఱ్ఱన కవిత్వంలో చతుర వచోవైభవంతోపాటు మధురవచో వైదగ్ధ్యం కూడా కవితకు హృద్యత నేర్పరచింది.

కీ.శే. నోరి నరసింహశాస్త్రిగారు ఎఱ్ఱాప్రెగ్గడ కవితాపాకాన్ని గురించి అంతర్గత సాక్ష్య మాధారంగా ఈవిధంగా వివేచించారు-

మ. "క్రమపాకంబునఁ గెంపుతోడి నలుపెక్కన్ మిక్కుటం బైన గం
ధము దిక్కుల్ సురభీకరింప రసమంతర్గామియయ్యున్ వెలిం
గమియం గాఱుచు నున్న చాడ్పున విలోక ప్రీతిఁ గావింప హృ
ద్యములై యున్నవి చూచితే ఫలము లీ తాళద్రుమ శ్రేణులన్".(హరివంశము. పూర్వభాగము.7.77)

''ఈవిధముగా ధేనుకాసురుని తాళవనములోని ఫలములను బలరామునికి శ్రీకృష్ణుడు చూపుచు పలికినాడు. ముట్టినంతనే స్రవించిపోవు ద్రాక్షఫలముల రసము కాదు. అతికష్టసాధ్యమగు నారికేళరసమును గాదు ఎఱ్ఱయ కభిమానమైనది! అంతర్గామియై చిక్కని రసముండుటే కాక అది వెలిం గమియం గారుచున్నట్లుండి నేత్రపర్వము చేయుచు ఉచితమగు పాకముచే దట్టమగు సుగంధము దిక్కులు నిండిపోవునట్లు చేయగల తాళఫల రసపాక మతని కభిమానపాత్ర మైనది.

''అతడు తనకావ్యములలో స్తోత్రము చేసినది సంస్కృత కవులలో వ్యాస వాల్మీకులను, తెలుగువారిలో నన్నయ తిక్కనలను మాత్రమే. ఎఱ్ఱయకు సూక్ష్మ విషయములలో గూడ ఔచిత్యవిచార మెక్కువ. ఏ కావ్యములో ఎవరిని ముందు స్మరించవలెనో కూడ అతడు విచారించియే చేసెను. ఈ నలువురి స్మరణచే అతని కెట్టి కవిత్వమభిమానమో కూడ సూచించినాడు. ఆంధ్రమహాకవులను మహర్షులగు వ్యాసవాల్మీకులతో పోల్చుట సాహసము కాని, కవితామార్గములలో నన్నయకు వాల్మీకి ఫక్కియు, తిక్కనకు వ్యాసఫక్కియు నిష్టములనుటకు అభ్యంతరముండదు. అంతర్గామి రస మొకరికిని, వెలింగమియంగారు రస మొకరికిని కావ్యరచనలో అభిమతములు. ఈ రెండు మార్గముల రసయోగము సాధించుట ఎఱ్ఱయ ఆదర్శమా?' (ఎఱ్ఱయ కవిత - వ్యాసం). ఔననియే శాస్త్రిగారి అభిప్రాయం. వస్తుకళలో అంతర్గామి అయిన రసమున్నూ, భావకళలో వెలింగమియంగారు రసమున్నూ ఒప్పారటం సహజం. ఈ రెంటికీ సంగమక్షేత్రం ఎఱ్ఱయ కవిత. అంటే - వస్తుకళకు భావకళతో వన్నెబెట్టే కవిత ఎఱ్ఱయది.

### (1). 'కావ్యశయ్యఁ గీలించిన కీర్తి'

ఎఱ్ఱాప్రెగ్గడ 'ప్రౌఢాంచిత శబ్దసారులు, మహాకవులు, అయిన నన్నయ తిక్కనల 'కావ్యశయ్యఁ గీలించిన కీర్తి సంగ సుఖలీలను' పొందాలని భావించాడు. ఇందులో వాడిన 'కావ్యశయ్య' కవితాశైలికి సంబంధించింది. దీని నాధారంగా చేసికొని కీ.శే. శిరోమణి వేదాల తిరువేంగళాచార్యులవారు ఎఱ్ఱన కవితా వివేచనం చేశారు.

''శయ్యా పాకములు సముచితముగా నాదరింపఁబడి యందఱి మనసులకును నవగాహనమై యానందదాయకమగు హితరచన....తెనుఁగు మహాభారతమున మన కవిత్రయము స్వరసముగాఁ గూర్చినది. అయితే కేవలము వైదర్భీశయ్య యగుచో నది కథాకలితార్థయుక్తి కనువుగాదు. గౌడీశయ్య యగుచో జగద్ధితము కాదు. పాంచాలీశయ్య యగుచోఁ బై రెండింటికిని మధ్యస్థమై పై రెండు గుణములను సమకూర్చగలదు. ''అశ్లిష్టశ్లథభావాంతు పురాణచ్ఛాయ యాన్వితాం, మధురాం సుకుమారాంచ పాంచాలీం కవయో విదుః'' అని కదా వామనాచార్యు డన్నది. కాని, యిది సాంస్కృతికుల మతము. అయితే, మన యాదికవి సకలాంధ్రభువనోపజీవ్యుడు నన్నయభట్టారకుఁడు సర్వేసర్వత్ర సరసోదాత్తమగు వైదర్భీ శయ్యయే చాల జాగ్రత్తగా ఉపయోగించి, ద్రాక్షాపాకముతో మేళవించి, కథాగమనమున కడ్డుతగులకుండ రసమయమగు రచన యొనరించెను. ఆ మార్గమే కవిబ్రహ్మయగు తిక్కనయు నించుమించుగా నమలోదాత్తమగు శయ్యాపాకముతోనే తన భావమంజుల కవితను సాగించెను. మన యెఱ్ఱన మహాకవి వారిరువురియందును హరిహరులందువలె గాఢభక్తి తత్పరత గలవాఁ డగుటవలన నిరువురి రచనలను ననుసరింపఁ బూని, తన శక్తి కొలఁదిఁ బాంచాలీశయ్యలో విశ్రాంతుడయ్యెను. కనుకనే నన్నయ రచనలో నెచ్చటను వర్ణనల వలనఁ గథాగమన మడ్డుపడక రసమంజులముగాఁ గథాప్రవాహ మత్యంతోదాత్తముగా శ్రవణాంజలిపుట పేయమగు నక్షరరమ్యతతోఁ గవిత యెసలారును. కవిబ్రహ్మ తిక్కన రచనా విన్యాసము కూడా నించుమించుగా నాత్రోవలోనే యనుభావ బహుళమగు భావముతో నుజ్జ్వలమై వర్ణన లెడనెడఁ గొంచెము వ్యవధానము కల్గించినను, దానినిఁ దోపనీయని స్ఫూర్తితో సాగిపోవును. మన యెఱ్ఱన మహాకవి రచనయుఁబై యిరువురి త్రోవలఁ దప్పిపోవక యటనట వర్ణనలు కథాభావములందు పర్యవసింపఁగా సరళముగా, శిథిలమధురమగు నడకతో మాఘమాసపు సరస్వతీ ప్రసన్నతతో మృదువుగాఁ జదువరులఁ దనవంక నాకర్షించును.'' (ఆంధ్ర మహాభారతోపన్యాసములు- శ్రీ ఎఱ్ఱన మహాకవి ఆరణ్యపర్వశేషము (వ్యాసం) ఆంధ్ర సారస్వత పరిషత్తు: చతుర్థముద్రణం, 1966-పుట, 38,39.)

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారు కవిత్రయ శైలీ స్వరూపాన్ని కావ్యశాస్త్ర దృష్టితో విశ్లేషించి ఇచ్చిన తీర్పు ఇది:

**నన్నయశైలి-** ''మూలగతములగు భావములను వివక్షితములగు విశిష్ట భావాంతరములచే వ్యంగ్యసరళిని బోషించి రసపరిణతములుగా నాస్వాదింపఁ జేయునట్టి మహోజ్జ్వలమగు ననువాదమున రసైకప్రవణమైన దృష్టియు, లోకులవాడుక యందలి సంస్కృతమున నెక్కుడాదరమును, దెనుఁగున స్వభావాదరణ గల తీరును, సహజమగు కైశికీవృత్తియు, సుందరమగు వైదర్భీరీతియు, ద్రాక్షాపాకమును, లోకహితైక నిరతమగు దృష్టియు నన్నయ భట్టారకునిది.''

**తిక్కనశైలి-** ''అనువాదమున ననుభావ విశేషములచే (మూల వివక్షితములైనను గాకున్నను గూడ) మూలగత భావముల నుజ్జ్వలముగాఁ బ్రదర్శించుటయు ద్రాక్షాపాకమును, దెనుఁగు జాతీయమగు నుడికారము సొగసున నత్యధికమగు దృష్టియు, సంస్కృతము విషయమున సామాన్యమగు దృష్టియుఁ, గొలఁది ప్రబంధ బీజధోరణియు, నర్ధకైశికీవృత్తియు, సామాన్యముగా వైదర్భీ రీతియు, జనానంద సంధానమునఁ జూపును దిక్కనది.''

**ఎఱ్ఱనశైలి-** ''అనువాదమున సామాన్య దృష్టియుఁ, గదళీపాకము, స్వతంత్రమగు సూక్తివైచిత్రియుఁ, దెనుఁగు సంస్కృతముల సమాదరణమును, బాంచాలీ రీతియు, జనులనుఁ దృప్తిపరచుటలో శ్రద్ధయు, నెఱ్ఱన కున్నవి''. (పై గ్రంథమే, పుట.85)

### (2). కవిత్రయ కవితాశయ్యలు

నన్నయశైలి - ధ్వని ప్రస్థానం, వస్తుధ్వని - రసదృష్టి - కైశికీవృత్తి - వైదర్భీరీతి - ద్రాక్షాపాకం - ప్రసాదగుణం.

తిక్కనశైలి - ధ్వని ప్రస్థానం, రసధ్వని - అభినయ దృష్టి - సాత్త్వతి, అర్ధకైశికీవృత్తి - వైదర్భీరీతి - ద్రాక్షాపాకం - ప్రసాదగుణం.

ఎఱ్ఱన శైలి- ధ్వని ప్రస్థానం, అలంకార ధ్వని - చతురోక్తి - భారతీవృత్తి - పాంచాలీరీతి - కదళీపాకం - మాధుర్య గుణం.

### (3). ఎఱ్ఱన కావ్యశయ్య : భారతీవృత్తి

ఆధునికుల శైలీ విచారం వంటిదే ప్రాచీనుల శయ్యావివేచనం. శయ్య అంటే పదమైత్రి. ''మాలాకారో రచయతి యథాసాధు విజ్ఞాయ మాలాం, యోజ్యం కావ్యే ష్వవహితధియా తద్వదేవాభిధానః'' అని భామహుడు. మాలాకారుడు ఏ పూవు తరువాత ఏ పూవును ఏ విధంగా కూర్చి అల్లితే అందంగా ఉంటుందో తెలిసికొని తెలిసి దండను మనోహరంగా ఎట్లా తయారు చేస్తాడో కవి కూడా అట్లాగే శబ్దమైత్రితో రచనా సౌందర్యాన్ని సృష్టిస్తాడు. (దీనినే ఇంగ్లీషులో ' The choice of best words in best place' అని అంటారు.) దీనిని 'పరివృత్త్యసహిష్ణుత' అంటారు. అంటే కవి రచనలో ప్రయోగించిన పదాల పొందికనుండి ఏ పదాన్ని అయినా మార్చి మరొక పద్ధతిలో చెప్పటానికి వీలులేని కూర్పరితనం అన్నమాట! దీనివలన కవిశైలి రూపుకట్టుతుంది. 'Style is the man' అని అన్నట్లు కావ్యశయ్యయే కవిశైలి. శైలియే కవి వ్యక్తిత్వం.

శయ్యా (శైలి) స్వభావాన్ని నిర్దేశించేవి- వృత్తులు, రీతులు, గుణాలు, పాకాలు. అర్థగంభీరిమ పాకం అని అంటాడు విద్యానాథుడు. వృత్తి, రీతి, గుణాల కలయికవలన పుట్టిన ఆస్వాదం పాకం. దీనినే ఆధునికులు రుచి (Taste) అంటారు. వాడే పదార్థాలు ఒకటే అయినా వండే పిండివంటల రుచులు ఏ విధంగా మారుతుంటాయో ఆ విధంగానే శబ్దమైత్రి రూపమైన శయ్యలకు, అర్థవైవిధ్యంతో కలిగించే రుచి స్వభావ భేదాలనుబట్టి పాకం మారుతుంది.

ప్రధాన రుచి స్వభావాలను బట్టి పాకం నవవిధాలని కొందరూ, మూడు విధాలని చాలమంది భావించారు. అవి- ద్రాక్షాపాకం, కదళీపాకం, నారికేళపాకం. శబ్దమైత్రివలన ఏర్పడే రచనలోని రుచి అందులోని అర్థగంభీరిమను ఆస్వాదింపజేసే పద్ధతిగా గుర్తించబడింది. పాకమంటే అర్థాస్వాదన భేదమన్నమాట. ప్రచుర పదాలకై కూర్పుతో అర్థాన్ని ఆపాతంగా ఆస్వాదించటానికి అనువైన అర్థాస్వాదనరుచి ద్రాక్షాపాకం. గూఢమైన అర్థాస్వాదన రుచి నారికేళపాకం. ఎక్కువ ప్రయత్నం లేకుండా మక్కువతో

కలిగే అర్థాస్వాదన రుచి కదళీపాకం. రుచిలో ఉండే ఆస్వాద స్వాదుత్వాన్ని మధురమని పిలుస్తారు. ద్రాక్షాపాకాన్ని సర్వాకార మధురమనీ, కదళీపాకాన్ని ప్రచురమైన మధురమనీ, నారికేళపాకాన్ని అల్పమధురమనీ వివేచిస్తారు. ఈ సంప్రదాయం తెలిస్తే - ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషాన్ని 'విఖ్యాత మాధుర్యమనోహరంబుగా', 'సవిస్తర మధురంబుగా' రచించినట్లు చెప్పటంలోని ఆంతర్యం అవగత మౌతుంది. నన్నయ తిక్కనల శయ్యలలోని రుచి ప్రధానంగా సర్వాకారమధురమైన ద్రాక్షాపాకం కాగా, ప్రబంధ పరమేశ్వరుడి శయ్య ప్రచురమైన- లేదా - ప్రఖ్యాతమైన - లేదా - సర్వాంగంగా కాక ఎక్కువ భాగం మధురమని పిలువబడే కదళీపాకంగా అమరిందని స్పష్టం. రాయల ఆముక్తమాల్యదవంటి ప్రబంధంలోని రుచి నారికేళపాకం కాబట్టి అది అల్పమధురం. తాత్పర్యమేమంటే- ఎఱ్ఱయ పాకం నన్నయపాకంవలె సర్వాకారమధురం కాక, ఎక్కువ భాగం మధురం కాబట్టే ''తత్కవితారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా నారణ్యపర్వశేషము పూరించె'' నని పేర్కొన్నాడు.

అలంకారవాదులవలె గాక ధ్వనిరసవాదులవలె వృత్తి. రీతి, గుణాదులు రసధర్మాలని నమ్మే నన్నయ తిక్కనల మార్గంలో నడిచినవాడే ఎఱ్ఱాప్రెగ్గడ. వృత్తులు నాట్యాశ్రయాలు కావటం చేత సాక్షాత్ రసోపస్కారకాలు. రీతులు రచనాశ్రయాలు. గుణ విశిష్ట పదరచనలే రీతులు. గుణాలవలన రీతులు, రీతులవలన వృత్తులూ రూపుకట్టుతాయి. గుణాలు ఎన్నైనా ముఖ్యమైనవి మూడు. అవి: ప్రసాదం, ఓజస్సు, మాధుర్యం. మిగిలినవి ఈ మూడింటిలో అంతర్భవిస్తాయి. అట్లాగే శబ్దార్థ గుణాల పరిగణనం ఆచారంలో ఉన్నా శబ్దగుణాలలో అర్థగుణాలను కూడా దర్శించటం ధ్వని రస సంప్రదాయం. వృత్తులు నాలుగు. అవి: కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి. రసాభివ్యక్తికి ఇవి రమణీయోపకరణాలు. నాట్య సంప్రదాయం నుండి తెచ్చుకొన్న వృత్తులను శ్రవ్యకావ్యరీతుల కనుగుణంగా అన్వయించటం సాహితీసంప్రదాయం. కైశికీవృత్తి శృంగారకరుణాది సుకుమార రసార్థాలలో, ఆరభటీ వృత్తి రౌద్ర బీభత్సాది ఉద్ధతరసార్థాలలో, భారతీవృత్తి హాస్య శాంతాద్భుతాది ఈషన్మృదు రసార్థాలలో, సాత్త్వతీవృత్తి, వీరభయానకాదులైన ఈ షత్ప్రౌఢరసార్థాలలో ప్రవర్తిల్లుతాయి.

ఆరణ్యపర్వ శేష కథార్థాలలో మూడు రకాల కథార్థాలున్నాయి. మార్కండేయ మహర్షి చెప్పే పురాణ ధర్మ ప్రబోధ కథార్థాలు శాంతాద్భుత రస ప్రధానాలై భారతీవృత్తికి అనుకూలాలుగా ఉన్నాయి. ఘోషయాత్ర, సైంధవ వృత్తాంతం, కర్ణదానవీరవృత్తాంతం, మొదలైన ప్రధాన కథలలోని ఘట్టాలు వీరరౌద్ర రసోల్లాసాలుగా ప్రకాశిస్తున్నా, ఒకవైపు ధర్మజుడి శాంత ప్రవృత్తి,, మరొకవైపు కర్ణుడి త్యాగప్రవృత్తి, చివరకు యక్షప్రశ్నలలో ధర్మరాజు శమదమప్రవృత్తి వీరరౌద్రాదులను శాంతాద్భుతాలలో అంతర్భవింపచేస్తున్నాయి.

ఇవి కాక- రామాయణకథ, సావిత్ర్యుపాఖ్యానం ధర్మజుడి చిత్తశాంతికై చెప్పబడ్డాయి. రామాయణ కథలో వీరరౌద్రాలు, సావిత్రి కథలో శాంతాద్భుతాలు పఠితకు అనుభూయమానాలౌతున్నాయి. మొత్తం మీద పరిశీలిస్తే ఆరణ్యపర్వశేషంలోని కథార్థాలకు భారతీవృత్తి పరమ రమణీయంగా అమరి ఉంటుంది. కైశికి దానికి ఉపబలకంగా ఉంటుంది. అందుకే కాబోలు తెలుగు సాహిత్యంలో వెలసిన భారతీస్తుతులలో పరమోదాత్తమైన పద్య శిరోమణి ఎఱ్ఱయ గళంలో వినిపించింది. భక్తిరసావతారమైన పోతన్నను కూడా ప్రలోభపెట్టిన పద్యరాజ మిది-

ఉ. 'అంబ, నవాంబుజోజ్జ్వల కరాంబుజ; శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి, ప్రకటస్ఫుటభూషణ రత్నరోచిరా
చుంబిత దిగ్విభాగ, శ్రుతిసూక్త వివిక్తనిజప్రభావ, భా
వాంబరవీథి విశ్రుత విహారి ననుం గృపఁ జూడు భారతీ!' (ఆర: 4.215)

ఎఱ్ఱయకు పూర్వం భారతీవృత్తిని చేపట్టి ఇంత పరమోదాత్తంగా నిర్వహించిన కవి కానరాడు. ఎఱ్ఱయ ఎన్నుకొన్న కావ్య వస్తువులన్నీ భారతీవృత్తికి అనుకూలాలే. అందువలన భారతీవృత్తి పరిపోషణలో ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరు డయ్యాడు.

సాత్త్వతి అంటే సత్త్వప్రకాశమైన మనస్సు. మనః ప్రభవాలైన హర్షశౌర్య త్యాగాదులను సాత్త్వతాలని పిలుస్తారు. వాటిని ప్రధానంగా కలది సాత్త్వతీవృత్తి అని శార్ఙ్గదేవుడు తెలిపాడు. కోమలప్రౌఢార్థ సందర్భం కలది సాత్త్వతి అని భోజుడు భావించాడు. ఈషత్ప్రౌఢార్థం కలది సాత్త్వతి అని విద్యానాథు డన్నాడు. ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషంలోని కొన్ని ఘట్టాలలో సాత్త్వతిని సందర్భసుందరంగా హృదయరంజకంగా పోషించాడు. ముఖ్యంగా రామాయణ కథలో, సావిత్ర్యుపాఖ్యానంలో, కర్ణుడి కథలో.

ఆరణ్యపర్వంలోని నన్నయ భాగంలో సాత్త్వతీవృత్తికి అనుకూలంగా ఉన్న కథార్థాలు ఎక్కువ. భీమార్జునుల వీరవిహార గాథలు వీరరౌద్ర భయానకరస ఘట్టాలు. అందువలన నన్నయలో భారతీవృత్తి తక్కువ. అయితే ఆయన సాత్త్వతీవృత్తి కంటె కైశికీవృత్తిని ఎక్కువగా పాటించాడు. గుణాలనన్నింటినీ ప్రసాదగుణంలో పొదిగే నన్నయ వృత్తులనన్నింటినీ కైశికితో కరగ్రహణం చేయించి తన ప్రయోగ నైపుణ్యం ప్రకటించాడు. తిక్కన కైశికిని సాత్త్వతికి పోషకంగా నిలపటంలో దిట్ట. విమర్శకులు నన్నయ తిక్కన లిద్దరి రచనలనూ కైశికీవృత్తి ప్రధానాలుగా పరగణిస్తారు. ఆపైన తారతమ్యాలను గుర్తిస్తారు. ఎఱ్ఱన రచనలో కూడా కైశికీవృత్తి కనుకూలమైన కథార్థాలున్నాయి.

నన్నయ భాగంలోవలె ఎఱ్ఱయ భాగంలో స్త్రీలను గురించిన కథార్థాలు విస్తారంగా ఉండటం విశేషం. నన్నయ భాగంలో ద్రౌపది మనోవేదన, సౌగంధికాది పుష్పాలపై చూపిన వలపు వర్ణించబడ్డాయి. ఆనాటి కౌరవ సభలో తనకేశాలు పట్టి లాగి పరిభవించిన కౌరవుల దుశ్చర్యలను తలచి శ్రీకృష్ణుడితో మొరపెట్టుకొన్నది ద్రౌపది. ధర్మరాజుతో వాదించి అతడి మనసు మార్చి రణం చేయించి అరణ్యవాసం నుండి విముక్తం కావాలని యత్నించింది. అర్జునుడి వలని విప్రలంభాన్ని సున్నితంగా అనుభవించింది, సమస్యల మధ్య సతమతమౌతున్నా సౌగంధికాది పుష్పాల వలన కలిగే సుఖం కొరకు తాపత్రయపడి భీమాదులను చిక్కులలో పడవేసింది. ఆ భాగంలో స్త్రైణమైన ద్రౌపది కథలో తీవ్రవేదన అధికం; సుఖప్రదమైన రక్తి తక్కువ. అంటే కరుణాది రసాలకున్న ప్రాధాన్యం శృంగారాదులకు లేదు. అయినా ప్రసన్నమైన నన్నయ రచనలో కైశికీవృత్తి ప్రధాన భూమిక నిర్వహించింది.

అయితే ఉపాఖ్యానాలలో నలదమయంతుల చరిత్ర నన్నయ కొకవరం. దమయంతీ పరంగా శృంగారాన్నీ, విప్రలంభాన్నీ విస్తారంగా పోషించే అవకాశం ఆయనకు దొరికింది. కైశికీవృత్తి అందులో పురివిప్పుకొన్నది. మిగిలిన ఉపాఖ్యానాలలో కూడ అగస్త్యలోపాముద్ర చరిత్రం, ఋశ్యశృంగ వృత్తాంతం, సౌకన్యాఖ్యానం మొదలైన కథార్థాలను చిత్రించేటప్పుడు పోషించిన శృంగారంలో కైశికీవృత్తిని నన్నయ కుశలంగా పోషించాడు.

ఎఱ్ఱన భాగంలో కూడా స్త్రీ గాథలు విస్తారంగానే ఉన్నాయి. మార్కండేయుడు చెప్పిన కథలలో పతివ్రత కథ, స్వాహాదేవి కథ, సత్యాద్రౌపదుల సంవాదం, సైంధవుడు ద్రౌపదిని మోహించి ఆమె పట్ల రతిభావస్ఫోరకంగా పలికిన ఘట్టం, సీతాసావిత్రుల పాతివ్రత్యమహిమల కథలు శృంగారకరుణ రసానుకూలంగా ఉన్నాయి. అయితే నన్నయ భాగంలోని స్త్రీ ప్రవృత్తుల కంటె ఎఱ్ఱయ భాగంలోని స్త్రీ పాత్రల ప్రవృత్తులు ఈషత్ప్రౌఢాలని చెప్పకతప్పదు. వీరిలో కరుణం కంటె ధార్మిక వీరచైతన్యమే ఎక్కువగా భాసిస్తుంది.

ద్రౌపదికి కురుసభలో జరిగిన అవమానంతో పోల్చుకుంటే సైంధవుడి వలన కలిగిన పరాభవం గొప్పది కాదు. మొదటి దానికి ప్రతీకారం జరుగలేదు; రెండోదానికి ఆమె కళ్ళ ఎదుటనే ప్రతీకారం జరిగింది. సీతలో కరుణం ధర్మవీరానికి అంగమైపోయింది. సావిత్రిలోని శృంగారం మృత్యుంజయ వ్రతనిష్ఠలో శమించిపోయింది. పతివ్రత భర్తృసేవలో నిమగ్నురాలైనా శృంగారమూర్తి కాదు; ధర్మజ్ఞాన చైతన్యమూర్తి. మొత్తంమీద ఎఱ్ఱన చిత్రించిన స్త్రీ పాత్రలు ధర్మమూర్తులే. అందుకే ఎఱ్ఱయకు కైశికీవృత్తి అనువు కాలేదు. సాత్త్వతి సబబు కాలేదు. భారతీవృత్తిని చేపట్టవలసి వచ్చింది. మిగిలిన మూడు వృత్తులనూ భారతితో ముడివేసి ప్రబంధ పరమేశ్వరు డయ్యాడు.

### (4) ఎఱ్ఱన రచన : మాధురీగుణం, పాంచాలీ రీతి

రచనలో కవి వాడే వర్ణాలు గుణాలను వ్యంజింపచేస్తాయి. గుణాల వలన రీతు లేర్పడతాయి. గుణాలవలెనే రీతులూ రసధర్మాలే. మాధుర్యగుణ విశిష్టమైన పదరచన వలన వైదర్భీరీతి, ఓజోగుణ విశిష్ట పదరచన వలన గౌడీ రీతి, ప్రసాద గుణ పదరచనవలన పాంచాలీరీతి ఏర్పడతాయి - అని సామాన్యంగా లక్షణకారులు చెప్పారు. కాని ప్రతిభావంతులైన కవులు వక్తృవాచ్య ప్రబంధాల యొక్క ఔచిత్యాన్ని బట్టి ఈ సంఘటనలు మార్చవచ్చును. (పాక, వృత్తి, గుణ, రీతుల, సంవిధానం సంఘటన).

పైగుణరీత్యాదులను గురించి ఆలంకారికులలో ఏకాభిప్రాయం లేదు. నిరంకుశులైన కవులు తమ ప్రస్థానాన్ని ఎన్నుకొని ఆయా కావ్యాంశాలను గురించి తదనుగుణమైన అభిప్రాయా లేర్పరచుకొనవచ్చును. దానికి ఉదాహరణంగా నన్నయ తిక్కనల కవిత్వంలో ప్రసాద గుణం, వైదర్భీరీతి ఉన్నాయనీ, ఆ రెంటినీ వారు తెలుగులో సంఘటించారనీ ఆంధ్రధ్వన్యాలోక కర్త శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు భావించి నిరూపించటం దానికి తార్కాణం. ఆయనే ఎఱ్ఱన రచనలో మాధురీగుణం, పాంచాలీ రీతి ఉన్నాయని వివేచించారు. ఇటువంటి సమన్వయం పండితరాయాదులు ఇదివరలో అంగీకరించిందే. సామాన్య విశేష దోషాలు లేకుండా మధుర సుందర పద వర్ణ విన్యాసం కలిగి, నిర్మాత యొక్క వ్యుత్పత్తిని వెల్లడి చేసే ప్రసాద గుణములు కలదానిని వైదర్భి అని పండితరాయల అభిమతం. సమాసయుక్తమై అత్యద్భుత పదజాలంతో కూడి ఓజఃకాంతి గుణసహితమై ఉన్న ఆడంబర బంధం గౌడీరీతి అనీ, సమాసయుక్తమైన అయిదారు పదాలు కలిగి ఓజఃకాంతి వర్జితమై మధుర సుకుమారమైనది పాంచాలీ రీతి అనీ భోజుడి లక్షణం. వైదర్భీ గౌడీ రీతుల మేలికలయిక పాంచాలి అని విశ్వనాథుడి అభిప్రాయం. ఇటువంటి లక్షణాల ననుసరించి నన్నయ తిక్కనలది వైదర్భీ రీతి అని, ఎఱ్ఱనది పాంచాలి రీతి అని నిశ్చయించవచ్చును. వీటికి సమాంతరంగా ఇంగ్లీషులో The plain and elegent style', The elevated and forcible style', అని పేర్కొనవచ్చును.

### (5) ఎఱ్ఱన కవిత మంజుల వాగమృత ప్రవాహం

రీతిని మార్గమని కొందరు పిలిచారు. 'రియంతే పరంపరయా గచ్ఛంతి అనయా కరణసాధనోయం రీతి శబ్దః మార్గపర్యాయః'. రసపదవిని పొందటానికి తోడ్పడే మార్గంగా రీతిని సంభావించడం గమనార్హం. గుణాలు దానిలో నడుస్తాయి కాబట్టీ, వాఙ్మధుధార అందులో ప్రవిస్తుంది కాబట్టి రీతి అనే పేరు కుదిరిందట! ''రిణంతి గచ్ఛంతి అస్యాం గుణాః ఇతి, రీయతే క్షరతి అస్యాం వాఙ్మధుధారా ఇతివా రీతిః అధికరణేక్తిః'' (కామధేనువ్యాఖ్య). ఎఱ్ఱన ఈ ప్రస్థానానికి చెందినవాడు కాబట్టి రీతిని గుణ ప్రసారమార్గంగా, వాఙ్మధుధారగా ఎఱ్ఱన భావించాడు.

ఆరణ్యపర్వశేషంలో మూడింట రెండు వంతులు మార్కండేయ మహర్షి కథనం. ఆయన రీతి (శైలి) మంజులవాగమృత ప్రవాహమట!

ఉ. 'ఏనును బాండునందనులు నిమ్మునిముఖ్యులు నిష్ట లోక స
మ్మానితవాక్య! నీ దయిన మంజుల వాగమృత ప్రవాహమున్
వీనులదోయి నించుచును వేడుకఁ గ్రోలికొనంగ నాత్మలం
బూనెద; మస్మదీప్సితము పూర్ణము సేయఁగ నర్హ మెమ్మెయిన్''. (ఆర. 4,164)

శ్రీకృష్ణాదులు శ్రోతలు. వారు శ్రవణానందంగా మార్కండేయ కథాకథన విధానాన్ని ఆస్వాదించాలని కోరుకొంటున్నారు. ఆ మహర్షి మాటలు 'మంజులవాగమృత ప్రవాహమట' - దానిలోని కవితామధువును వీనులనే దోసిళ్ళతో ఎత్తుకొని త్రాగి ఆత్మానందాన్ని పొందాలట. మహర్షి మాటలకు ఎఱ్ఱన వేసిన విశేషణం అమూలకం! అంటే - ఆ మహర్షినోట పలికే ఎఱ్ఱయ మాటలలో మాధుర్యగుణమనే మధుధార ప్రవహించి పాంచాలీ రీతిగా రూపొందుతుందన్న మాట!

ఆరణ్యపర్వాంతంలో యక్షరూపుడైన ధర్ముడు ధర్మజుడి పట్ల ప్రసన్నుడై 'ప్రసాదమధురంబైన ఆలోకనంబు' ప్రసరించాడట! ఇది ఎఱ్ఱయ రీతి ముద్ర. ఆయన కవిత్వాన్ని ఆలోకించేవారు (అనుశీలించేవారు) కూడా ప్రసాదమధురమైన గుణవద్రచనను పరిశీలించాలని హెచ్చరిక! మంజుల వాగమృత ప్రవాహమంటే కోమలమైన ప్రసాదగుణంచేత సహజంగా భాసించే ఎఱ్ఱన మహాకవి వాక్కు వస్తు (ప్రబంధ) స్వభావాన్ని అనుసరించి మాధురీ మహిమను ప్రదర్శించిందని సూచన! ప్రసాదమాధుర్యం ఎఱ్ఱన వాగ్వైభవం!

## (9) ప్రబంధ పరమేశ్వరుడు : చతురోక్తి పథాలు

ప్రబంధపరమేశ్వరు డంటే ఎఱ్ఱాప్రెగ్గడయే - అని ఆయన జీవిత కాలంలోనే ప్రసిద్ధికెక్కాడు. తరువాతి కవులు ఆయన పేరుకంటె బిరుదానికే పెద్దపీట వేశారు. ఆయన కవితను వడబోశారు. తమ కవితా ప్రస్థానాలకు ఎఱ్ఱయ కవిత ఏ విధంగా దారులు చూపిందో సమీక్షించుకొంటూ ఆయన కవితాగుణాలను కీర్తించారు. అట్లా కీర్తించిన వారిలో మొదట పేర్కొనదగినవారు శ్రీనాథ, జక్కనలు. వీరు కవిత్రయాన్నీ, వారి కవితా వైలక్షణ్యాలనూ విశేషించి పేర్కొన్నారు. అయితే, వారు ఎఱ్ఱనను వారి చూపులతో అంచనావేసి ప్రశంసించారన్న సత్యాన్ని మరువరాదు.

ఆంధ్ర కవితా పరిణామంలో శ్రీనాథ యుగం ఒక పెద్ద మలుపు. దానికి తోడ్పడిన సమీప ప్రేరక శక్తులలో ముఖ్యుడు ఎఱ్ఱాప్రెగ్గడ. శ్రీనాథ యుగారంభంనాటికి అంటే క్రీ॥శ॥ 1400 సంవత్సరం నాటికి తెలుగులో చతుర్విధ కవితా ప్రక్రియలకు ప్రాచుర్యం రావటం ప్రారంభమైంది. 15,16 శతాబ్దాలలో ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలూ, 17, 18 శతాబ్దాలలో ఆశు, బంధ, గర్భ, చిత్ర కవితలూ తెలుగు కవితా రంగంపై తమ ప్రభావాన్ని ప్రదర్శించాయి. శ్రీనాథ యుగం నుండి వెలసిన మహాకవులందరూ చతుర్విధ కవితలలో చతురులై ఉంటారు. ఏదో ఒక శాఖలో ప్రౌఢులై ఉంటారు. ఆ మారే కాలానికి మొదట మార్గం చూపినవారు ఎఱ్ఱాప్రెగ్గడ, నాచన సోముడు. వీరిద్దరూ విస్తరకవితలే వ్రాశారు. కాని, వాటిలో తమ వాగ్విలాసాలను ప్రదర్శించి ఆశు, మధుర, చిత్ర కవితా సౌగంధ్యాలను గుబాళింప చేశారు. వారిరువురిలో కవిత్రయంలో స్థానాన్ని పొందినవాడూ, ధ్వని సంప్రదాయంలో సాగినవాడూ అయిన ఎఱ్ఱన శ్రీనాథాదులకు మహర్షివలె కనిపించాడు. చమత్కార ప్రస్థానంలో సాగిన నాచనసోముడు ఒంటివాడై కొంతకాలం నిలిచిపోయాడు. శ్రీనాథాదులు ఎఱ్ఱయపట్ల చేసిన ప్రశంసలను ఈ భూమికతో సమీక్షించాలి.

> "పరిఢవింతుఁబ్రబంధ పరమేశ్వరుని తేవ
> సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు" (కాశీఖండము. 1.13)

అని శ్రీనాథుడి ప్రశంస. 'సూక్తి వైచిత్రి' అనేది సంస్కృత లక్షణ గ్రంథాలలో రూఢికెక్కిన పారిభాషిక పదం కాదు. ఆ మాటకు వస్తే ఆ సీసపద్యంలో వాడిన వేములవాడ భీమకవి 'ఉద్దండలీల', నన్నయభట్టు 'వాక్ప్రౌఢి', తిక్కయజ్వ 'రసాభ్యుచితబంధం' కూడా అటువంటివే. అంతే కాదు - అవి శ్రీనాథుడి కవితా ప్రస్థానానికి తోడ్పడిన పూర్వ కవుల కవితారీతులు. రీతులు రసధర్మాలని నమ్ముతూనే రసాన్ని పొందటానికి గుణాలకంటె రీతులే మధురమైన మార్గాలని నమ్మిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు. ఆయనకు ముందున్న ప్రబంధపరమేశ్వరుడు కూడా రీతులను రసధర్మాలని నమ్మినవాడే కాని, ధ్వని సంప్రదాయాన్ని అనుసరించి రీతి గుణాలలోనే పర్యవసిస్తుంది అనే మతాన్ని ('రీతిర్హిగుణేష్వేవ పర్యవసితా' - ధ్వన్యాలోకం, లోచనవ్యాఖ్య. తృ.ఉ.44) అనుసరించి ఆరణ్యపర్వశేషాన్ని రచించి నన్నయ తిక్కనల త్రోవన నడిచాడు. అక్కడి నుండి హరివంశ నృసింహపురాణాలలో శ్రీనాథుడికి బాటలువేస్తూ సాగాడు. ఎఱ్ఱన పరిణామకవి. అందువలననే శ్రీనాథాదులు కవిత్రయంలో ఒకడైన ఎఱ్ఱయను మహర్షిగా భావించి నమస్కరిస్తారు; హరివంశ నృసింహ పురాణ రచయితగా ఆతడిని మార్గదర్శిగా పురస్కరిస్తారు.

**(1) చతురోక్తి : సూక్తివైచిత్రి**

శ్రీనాథుడు ఉక్తివైచిత్రినే సూక్తివైచిత్రిగా చెప్పాడేమో అని అనుమానించటానికి వీలుంది. ఎందువల్లనంటే- ఆ కాశీఖండంలోనే ఎఱ్ఱయను 'సత్ప్రబంధపరమేశ్వరు' డని ఉపసర్గతో కలిపి విశేషంగా పేర్కొన్నాడు. అది ఆయన సూక్తి వైచిత్రి. ఉక్తివైచిత్రి అంటే అందమైన కవితాభివ్యక్తిని ఆవిష్కరించటంలో ప్రదర్శించే ఆకర్షణీయమైన విలాసవైవిధ్యం. ఇది సర్వ కవిసామాన్య ధర్మం. సూక్తివైచిత్రి అంటే - అది ఆ కవే చేయగలడు అని చెప్పుకోతగినట్లు విశిష్టంగా కొట్టవచ్చినట్లు అందమైన కవితాభివ్యక్తిని ఆవిష్కరిస్తూనే అందులో ప్రదర్శించే ఆకర్షణీయమైన విలాసవైవిధ్యం. ఇది శబ్దార్థాల సంఘటనలకు సంబంధించినదే కాదు; దానికి పరివేషంగా వెలిగే సౌందర్యాభివ్యక్తి శక్తికి సంబంధించినది. సూక్తి - సౌందర్యాభివ్యక్తి సంబంధి. వైచిత్రి - దాని ప్రయోగ వైవిధ్య ప్రౌఢికి సంబంధించినది. ఇది కవి ప్రతిభాజన్యమై ఎప్పటికప్పుడు అపూర్వంగా భాసించేది కాబట్టి లక్షించదగిందే కాని లక్షణం చెప్పలేనిది. మచ్చుకు ఒకటి రెండు ఉదాహరణలు:

బ్రాహ్మణ వేషంలో ఇంద్రుడు కర్ణుడివద్దకు వచ్చాడు. అతడు ఇంద్రుడని తెలియకే కర్ణుడు సహజదానగుణ ప్రేరితుఁడై బంగారు నగలున్న ప్రమదలు కావాలా? గోగణాలతో నిండిన గ్రామాలు కావాలా? కోరుకొమ్మన్నాడు.

"హిరణ్యకంఠీః ప్రమదా । గ్రామాన్వా బహుగోకులాన్
కిం దదానీతి తం విప్ర । మువాచాధిరథి స్తతః." (సం. 3.294.2)

ఎఱ్ఱన ఈ భావాన్ని ఒక కందంలో చెప్పితే సరిపోయేది. కాని, ఒక వృత్తం ఎత్తుకొన్నాడు.

చ. 'అలసవిలాసలాలస రసాన్వితలైన నితంబినీజనుల్
వలసిన, భూరివిస్ఫురితవస్తుసమగ్రము లైన గ్రామముల్
వలసిన, నుల్లసన్మణిసువర్ణ విభూషణగోధనావళుల్
వలసినఁ గోరు మిచ్చెద ధ్రువంబుగ నావుడు నాతఁ డిట్లనున్.' (ఆర.7.359)

ఈ పద్యంలో చెప్పిన భావం చిన్నది. చెప్పిన తీరు పెద్దది. శబ్దార్థాల సంఘటనతో ఒక అభివ్యక్తిని ఎఱ్ఱన కల్పించాడు. అడిగేవాడిని ఆకర్షించేవి వస్తువులే అని వ్యాసుడి హృదయం. అందుకే నగలున్న ప్రమదలంటే చాలనుకొన్నాడు. ఎఱ్ఱయ పెట్టు నగలు తీసి పుట్టునగలు పెట్టాడు. నగలవలన ప్రమదలైనారు మూలంలో. అలసవిలాసలాలస రసాన్వితలు కావటం చేత నితంబినులైనారు తెలుగులో. "హిరణ్యకంఠీః" అనే విశేషణంలో కోమలత్వం కొరవడింది. ఎఱ్ఱయ మసృణత్వ మనే శబ్దగుణం గల శ్లేషను అనుప్రాసతో కూడిన సౌందర్యంతో కలిపి ఒక పాదాన్ని సృష్టించాడు. అది ఆయన పోకడగానే అనిపించింది. మూలంలో గ్రామాలు బహుగోకులాలు. వ్యాసుడి కాలంలో గోవులే ధనాలు గ్రామాలకు. ఎఱ్ఱయకాలంనాటికి అగ్రహారాలు, నల్లిళ్ళు ప్రసిద్ధం. అందువలననే భూరివిస్ఫురిత వస్తు సమగ్రాలైన గ్రామాలుగా అవి మారాయి. వస్తు సమగ్రతకు భూరి విస్ఫురత్వం ప్రదర్శించటం ఎఱ్ఱయ అభివ్యక్తి శిల్పం. దీనినే సాహిత్యపరంగా అన్వయిస్తే ఆయన అభివ్యక్తి లక్షణం. కావ్య వస్తువు (వర్ణ్య వస్తువు) నిండుగా ఉండాలంటే దానిని దండిగా అందంగా ఆకర్షణీయంగా చెప్పాలని భావం. ఈ పద్యంలో ప్రతి చరణం అందుకు నిదర్శనం. మూలంలోని బంగారు నగలను, గోకులాలను మణిధనావళులతో కలిపి మూడోచరణాన్ని సంపన్నం చేశాడు ఎఱ్ఱయ. 'ఉల్లసన్మణి సువర్ణ విభూషణ గోధనావళుల్'- అభివ్యక్తిలో మూలంలో లేని మాధుర్యం ఏర్పడింది. 'వలసిన' అనే క్రియతో మూడు చరణాల మొదళ్ళు విరగటంతో దాత యొక్క దానోత్సాహం వ్యక్తమౌతుంది. మూలంలో ఏదో ఒకటి తీసికొమ్మని కర్ణు డడిగాడు. కవచకుండలాలు రెండూ కోరుకొనేవాడికి ఆమాట తరువాత ఇబ్బంది పెట్టవచ్చును. అందుకని ఎఱ్ఱన 'లేదా' అనే మాటను లేకుండా చేశాడు. అన్నీ కావాలన్నా అడుగు, అభ్యంతరం లేదన్నాడు. భూరిదాన

విస్ఫురత్వం కర్ణుడు భవిష్యత్తులో చేయబోయే భూరిదాన మహత్త్వానికి మహనీయ భూమికగా ఎఱ్ఱయ సిద్ధం చేశాడు. పద్యం మొత్తం మీద వక్త, వస్తువు, ప్రబంధ సందర్భాలను ధ్వనింపచేసే భావాన్ని అభివ్యక్తి సౌందర్యంతో ఆవిష్కరించినట్లుంటుంది. ఇటువంటి కవితా స్వభావం నన్నయ తిక్కనలలో కూడా ఉన్నది. ఎఱ్ఱయలో అది భూరి విస్ఫురత్వాన్ని సంతరించుకొన్నది. శ్రీనాథుడు దీనిని తన కవితలో భూరికవితావైభవంగా ప్రదర్శించాడు. దీనికి ఆ కవిసార్వభౌముడు సంకేతించిన పదం - 'సూక్తివైచిత్రి'. శ్రీనాథుడి కవితలో దాని పరిపూర్ణావతారం ఇట్లా ఉంటుంది-

శా. "కాలాంతఃపురకామినీకుచతటీ కస్తూరికా సౌరభ
శ్రీలుంటాకము చందనాచలతట శ్రీఖండసంవేష్టిత
వ్యాలస్ఫారఫణాకఠోరవిషనిశ్వాసాగ్ని పాణింధమం
బేలా నాపయి దక్షిణానిలము పక్షీ! సేయు దాక్షిణ్యమున్." (శృం.నై. 2.32)

శ్రీనాథుడి సమగ్రసూక్తి వైచిత్రికి ఎఱ్ఱయది బీజప్రాయమే. ఆరణ్యపర్వశేషంలో కనపడే 'సూక్తివైచిత్రి' అంకురావస్థలోనిదే. అదే నృసింహపురాణంలో పుష్పావస్థకు చేరింది. మచ్చుకీ పద్యం చూడండి.

ఉ. "శ్రీస్తనకుంకుమద్రవ నిషిక్తభుజాంతర భాగవిస్ఫుర
త్కౌస్తుభరత్న నూత్నరుచి గర్వితనాభిసరోజ సౌరభ
ప్రస్తుత మత్తభృంగరవరాగరసోల్బణ భోగి భోగత
ల్పాస్తరణుం దలంచు సుకృతాత్ము లపాస్తసమస్త కల్మషుల్". (నృ.పు. 2.37)

ఈ పరిణామ దశను గమనిస్తే ఎఱ్ఱన చతురోక్తి పథాలలో సాధించిన ఒక నేర్పు సూక్తివైచిత్రి.

అభివ్యక్తి సమాసాడంబరానికి సంబంధించింది కాదు. చెప్పే విధంలో కొట్టవచ్చినట్లు కనపడే సంఘటనకు సంబంధించింది. ఎఱ్ఱన పైపద్యం మాధురీ శబ్దగుణ సమన్వితం. ఈ క్రింది పద్యం అర్థగుణమైన మాధురికి మధురాభివ్యక్తి.

సత్యవంతుడు పునర్జీవితుడై సావిత్రితో కూడి నెమ్మదిగా ఆశ్రమానికి బయలుదేరాడు. ఆ సందర్భంలో యముడి వరంవలన కన్నులు వచ్చిన ద్యుమత్సేనుడు శైబ్యతో కలిసి పుత్రుడు కానరాలేదని, ఆశ్రమాలన్నీ చుట్టివచ్చి, కానంతా తిరిగి, కాళ్ళకూ చేతులకూ గాయాలైనా లెక్క చేయక, ఉన్మత్తుడివలె రోదించాడని మూలం.

"ఏతస్మిన్నేవకాలేతు । ద్యుమత్సేనో మహావనే
లబ్ధచక్షుః ప్రసన్నాత్మా । దృష్ట్యా సర్వం దదర్శ హ ॥
స సర్వానాశ్రమాన్ గత్వా । శైబ్యయా సహ భార్యయా
పుత్రహేతోః పరామార్తిం । జగామ మనుజర్షభ ॥
తావాశ్రమా న్నదీ శ్చైవ । వనాని చ సరాంసి చ
తాం స్తాన్దేశాన్విచిన్వన్తౌ । దంపతీ పరిజగ్మతుః ॥
శ్రుత్వా శబ్దంతు యత్కించి । దున్ముఖౌ సుతశంకయా
సావిత్రీ సహితో ఒ భ్యేతి । సత్యవా నిత్యధావతామ్ ॥
భిన్నైశ్చ పరుషైః పాదైః । సవ్రణైః శోణితోక్షితైః
కుశకంటకవిద్ధాంగా । వున్మత్తా వివ ధావతః ॥" (సం. 3.282.1-5)

ఈ సన్నివేశాన్ని ఎఱ్ఱన తెలుగులో నిర్మించిన తీరు ప్రబంధపరమేశ్వరత్వాన్ని చాటుతుంది.

ఉ. "కన్నులు వచ్చి యెల్లెడలుఁ గన్గొని వృద్ధనరేంద్రుఁ డాత్మకుం
గన్నులుఁ బోలె నైన తన గాదిలిపుత్త్రుఁ డు గాననంబులో
నెన్నఁడు లేని యింత తడవేటికిఁ జిక్కెనొ యంచు నార్తితోఁ
గన్నులు లేనియ ట్లతఁడుఁ గానక యేడ్చె సతీసమేతుఁడై'.

తరలము:

'కొడుకు నిందును నందు రోయుచుఁ గోరి ప్రేమభరంబునం
గొడుకు సద్గుణకోటి యెల్లను గోటిభంగుల నోలి ను
గ్గడన సేయుచు సత్యవంతునిఁ గానరే మునులార! యే
యడవిలోపల నంచు 'హా సుత' యంచు ధైర్యము డించుచున్.' (ఆర. 7.269,270).

మూలానికీ తెలుగుకూ పోలిక లేదు - రెండింటికీ అభివ్యక్తి భిత్తికలు వేరుకాబట్టి. మూలంలో శైబ్యాద్యుమత్సేనులు కన్నులు వచ్చినా కొడుకును కానక, కానలలో తిరుగుతూ ఉన్మత్తులవలె రోదించారు. కుశకంటకాలు గ్రుచ్చుకొని వారి శరీరాంగాలు పాదాలు గాయపడి నెత్తురులు కారాయి. కన్నులు వచ్చాయి కాబట్టి తిరిగారు. కన్నులున్నా కాళ్ళకు గాయాలు తప్పలేదు. దానికి కారణం వారు ఉన్మత్తులవలె అయిపోవడమే అని మూలం. మూలవర్ణనం సహజసుందరంగా ఉన్నది. అందులో వైచిత్రి లేదు. చమత్కారం లేదు. ఉన్మత్తులవలె శైబ్యాద్యుమత్సేనులను సహజంగా చిత్రించటం దాని తాత్పర్యం.

ఎఱ్ఱన సృష్టికి భిత్తిక వేరు. ద్యుమత్సేనుడు ఉదాత్తుడు, ధీరుడు. కొడుకంటే అతడికి ఆరవప్రాణం. అతడికి కన్నులు వచ్చాయి. నాలుగుదిక్కులా పరికించి చూచాడు. తనకు దిక్కైన గాదిలి కొడుకు కనపడలేదు. కన్నులు లేనప్పుడు కన్నకొడుకు ఆత్మకు కన్నులుగా ఉండేవాడు. కన్నులు వచ్చి లోకాన్ని చూపించాయి కాని తన కన్నకొడుకును చూపించలేకపోయాయి. లోచూపు లేని పైచూపు ఆయనకు ఆవేదన కలిగించింది. ఒక్కగా నొక్కడైన తన గారాబు కొడుకు అడవిలో ఎందుకు అంతగా ఆలస్యం చేశాడో? అని వితర్కించాడు. ఎఱ్ఱన ఇక్కడ పద్యాన్ని ధ్వనిమయంగా గొప్పగా నిర్వహించాడు. కన్నులు లేని విధంగా, దేనినీ చూడలేని శూన్యదృక్కులతో భార్యాసహితుడై ఆర్తితో దుఃఖించాడట ద్యుమత్సేనుడు. వితర్కానంతరం ఆర్తిని పొందాడట! అట్లా చిత్రించటం సూక్తివైచిత్రి. పుత్రుడు చనిపోయి ఉంటాడేమో అన్న శంక ఆర్తికి కారణమైనదని ధ్వని. అందుకే అంతటి దుఃఖం. ఒకవేళ కొడుకు పోతే? ఏడవటం సహజం. ఇక్కడ ఏడ్పులో ఒక అర్థవైచిత్రి ఉంది. కొడుకు ఆత్మకు కన్నులవంటివాడు. లోచూపు పోతుంది. వచ్చిన వెలిచూపుతో చూడదగింది నాలుగుదిక్కుల లోకం కాదు. తనకు దిక్కైన కన్నకొడుకును కన్నులతో చూడలేని దుఃస్థితియే ఏర్పడితే అంతా శూన్యమే. మరేగతీ లేదు. కళ్ళున్న కబోది కొడుకులేని తండ్రి. ఆ భావం రాగానే తల్లిదండ్రులను కడతేర్చే కొడుకులేని ఒక అభాగ్యస్థితి రాజుకు తోచింది. దాన్ని సగభాగంగా పంచుకొనే ఇల్లాలిని దగ్గరికి తీసికొన్నాడు ద్యుమత్సేనుడు. ఒక్క కొడుకు ఇద్దరిని గ్రుడ్డివారిని చేశాడు. ఈ పద్యం శబ్దవైచిత్రివలె పైకి కనపడుతుంది. కాని అర్థం విచిత్రమైన పాత్ర నిర్వహిస్తుంది. అందులోనూ తెలుగుపదాలు. 'కన్నులు వచ్చి కన్గొనటం. ఆత్మకు కన్నులవంటి గాదిలి పుత్త్రుఁడు కనపడకపోవటం, కన్నులు లేని యట్లతఁడు గానక' - అనే వాక్యాలలో పదాలకంటె జాతీయాలవలె అవి ఇచ్చే అర్థాలే పద్యానికి ప్రాణాలు. మరికొంత లోతుగా ఆలోచిస్తే ఆ పదాలను ఆ వరుసలో ఆ విధంగా కూర్చటంలో కవితాశయ్య ఏర్పడింది. పద్యం తీర్చిదిద్దిన కవితా సౌందర్యాభివ్యక్తిగా ప్రత్యక్షమైంది. ఇది ఎఱ్ఱయ నాటికి చతురోక్తి. శ్రీనాథుడి నాటికి సూక్తివైచిత్రి.

**(2) చతురోక్తి : మధురోక్తి**

'కన్నులు వచ్చి.... ' అనే పద్యంలో భావతీవ్రతను భాషావైచిత్రితో చిత్రించగా, 'కొడుకునిందును.....' అనే పద్యంలో అభినయరమ్యతతో ప్రదర్శించాడు. మొదటి పద్యం చతురోక్తిమయం. రెండో పద్యం మధురోక్తిమయం. ప్రేమగౌరవంతో తల్లిదండ్రులు కొడుకును అక్కడా ఇక్కడా వెదకారు. కొడుకు సద్గుణకోటిని కోటి విధాలుగా మక్కువతో కీర్తించారు. అడవిలో ఎక్కడైనా చూచారా? అని కనపడిన మునులందరినీ పదేపదే పేరు పేరునా అడిగారు. ఎక్కడా కొడుకు జాడ తెలియలేదు. చివరకు మనోధైర్యం జారిపోయింది. గుండె పగిలిపోయింది. 'హా కుమారా!' అని ఎలుగెత్తి ఆకాశంవైపు చూచి అరిచారు. నాటకీయంగా సాగిన ఈ వర్ణనలో ద్యుమత్సేన దంపతులు ఉన్మత్తులు కారు. ఉదాత్తులే. ఆర్తితో కొడుకు గుణాలను కోటి విధాలుగా కీర్తించటం, మక్కువతో ఎదురైన వారినల్లా అడిగి తెలిసికొనటం వారి ప్రేమ హృదయాల దుఃఖ భారానికి వాచికాభినయం. వచ్చిన కన్నులలో వత్తులు వేసికొని వెదకటం వారి ఆంగికాభినయం. చివరకు అధైర్యంతో 'హా కుమారా!' అని పిలవటం సాత్త్వికాభినయం. మనసున్న కన్నవారు మమకారం కొద్దీ వేదన వేయి విధాలుగా వ్యక్తం చేసిన అభివ్యక్తి అభినయం కాని, మూలంలో వలె ఉన్మత్త వర్తనం కాదు, ఔచిత్యం చెడని ఉదాత్తవర్తనం. ఎఱ్ఱన దీనిని మధురోక్తి అంటాడు. భోజుడు రసోక్తి అంటాడు. ఛందోమర్మజ్ఞులు దీనిని తరలోక్తి అన్నా అనవచ్చును.

**(3) చతురోక్తి : అలంకృతోక్తి : అలంకారధ్వని**

ఉక్తి అంటే అందమైన వాక్కనీ, సూక్తి అంటే అలంకృతమైన వాక్కనీ కొందరంటారు. ఒకటి శబ్దానికి చెందిందీ, మరొకటి అర్థానికి సంబంధించిందీ అనేవారున్నారు. చతురోక్తి పథంలో అలంకృతోక్తి ఒక అందమైన అభివ్యక్తి. అయితే ఎఱ్ఱన సూక్తివైచిత్రి అలంకార సంప్రదాయానికి గాని, వక్రోక్తి సంప్రదాయానికి గాని చెందింది కాదు. ధ్వని సంప్రదాయ సంబంధి. ప్రత్యేకించి చెప్పవలసివస్తే అది అలంకార ధ్వని ప్రస్థానం. అందులో నన్నయ వస్తు ధ్వనినీ, తిక్కన రస ధ్వనినీ, ఎఱ్ఱన అలంకార ధ్వనినీ అభిమానించి పోషించి ధ్వనిత్రయ సమగ్రదర్శనాన్ని మహాభారతాని కందించారు. అలంకార ధ్వని అలంకారాన్నీ, వస్తువునూ, పరంపరగా రసాన్నీ కూడా ధ్వనింపజేయవచ్చునని ఆలంకారికులు అభిప్రాయపడ్డారు. ఈ వివరాలు ఆదిసభా పర్వపీఠికలలో వివరించడమైనది.

ఎఱ్ఱన అలంకారధ్వనిని అనంతముఖాలుగా నిర్వహించాడు. ఆరణ్యపర్వంలో ఎన్నో పద్యా లున్నాయి. మచ్చుకు ఒకటి. రామాయణ కథలో రామలక్ష్మణులు పంపాసరోవరాన్ని సమీపించారు. ఎఱ్ఱన వారి కనులముందు ఆ సరోవర రసస్వాదుమూర్తిని ధ్వనిమయంగా ఆవిష్కరించాడు.

సీ. 'కమనీయకమలినీ కహ్లారదళకేస । రాన్విత జలముల నర్ఘ్యవిధియుఁ
దరళతరంగహస్తములఁ బాద్యంబు ను । న్మదచక్ర సారస మధుప హంస
రుతులఁ బ్రియోక్తులు రుచిరవానీరని । వేశనచ్ఛాయల విశ్రమంబు
మందసంచారిత మారుతంబుల నురు । తాపనోదనమును దగిలి యెపుడు

ఆ. నాచరించుచును సమంచితాతిథి జన । సేవనమునఁ దనరు జీవనంబు
ఫలము నొంద నొప్పు పంపాసరోవరం । బెదురఁ గాంచి రన్నరేంద్రసుతులు'. (ఆర. 6.364)

మరొక కవి అయితే ఈ పద్యంలో సమస్త వస్తు విషయసావయవ రూపకాన్నే వాడేవాడు. ఎఱ్ఱన దానిని ఏకదేశ వివర్తిరూపకం చేయటమే ఇక్కడ వైచిత్రి. పంపాసరోవరమునందు అతిథిసేవానురక్త అయిన వనితాస్వభావాన్ని ఆరోపించటం

అలంకారధ్వని. పఠితకు దాని వలన చమత్కారం కలగటమే కాకుండా అట్టి సీతాస్వరూపాన్ని రాముడి భావవీథిలో తోపింపచేసి పూర్వకథార్థ భావనం కలిగించటం వస్తు ధ్వని. సీతాస్మరణంవలన రాముడు శోకమూర్తిగా మారుతాడు. అలంకార వ్యంగ్యోక్తి రసానుభూతి వరకు పరంపరానుభూతిని కలిగించటం అలంకారధ్వని. దీనిని చతురోక్తి అని అంటారు కొందరు; సూక్తి వైచిత్రి అంటారు కొందరు. కవితలోని ఆలంకారికోక్తి వైచిత్రి చర్వణం వలన సజాతీయ భావనిష్ఠమైన సహృదయుడి చిత్తవృత్తి నాయక చిత్తవృత్తితో సహానుభూతిని పొందటానికి సౌముఖ్యం ఏర్పడుతుంది. చతురవాక్కు సాధించే పరమప్రయోజనం కూడా అదే.

శబ్దవైచిత్రి అంటే అక్షరరమ్యత అనీ, సూక్తివైచిత్రి అంటే అర్థగతమైన ప్రౌఢత అనీ డా॥ పాటిబండ మాధవ శర్మగారు అభిప్రాయపడ్డారు. (చూడు: ఆరణ్యపర్వ పీఠిక- సాహిత్య అకాడమి ప్రచురణ) అలంకార సందర్భాలు, రసభావాది వ్యంజకాలు అయిన ఎఱ్ఱన వర్ణనలలో ఆ రెండు లక్షణాలనూ వారు వివేచించారు. ఎఱ్ఱనకు శబ్దాలంకారాల కంటె అర్థాలంకారాల మీదనే ఎక్కువ మక్కువన్నారు. ఎఱ్ఱన ఉపమాలంకార ప్రయోగ ప్రౌఢతను సమీక్షిస్తూ, అర్థశ్రౌతీభేదాలతో ఒప్పారే పూర్ణోపమలలో ఎఱ్ఱన అర్థోపమలను వాడి చమత్కారాన్ని సాధిస్తాడని చెప్పుతూ ఈ క్రింది పద్యాన్ని ఉదాహరించారు.

తే. 'అని తలంచుచు నల్లన యక్కుమారుఁ। జేరఁ బోయిన నాతఁడు సితసరోజ
రేఖ దలకొనఁగా నలరించెఁ గన్ను। లవధరించెను నను లోచనాంచలముల'. (ఆర. 4.254)

నేత్రవికాసం సరోజవికాసంవలె ఉన్నదని చెప్పే ఉక్తివైచిత్రి ఇది. ఇది నేత్రోన్మీలనానుభవ వర్ణనాన్ని చమత్కరిస్తున్నది. దీనివలన ఎఱ్ఱన శబ్దాలంకారాలలో అర్థాలంకారాలలో, అందులోనూ ప్రౌఢోక్తి శిల్పాలలోను ప్రసిద్ధుడని వారు వివేచించారు.

### (4) చిత్రకవిత : శబ్దవైచిత్రి

శ్రీనాథయుగంలోనివాడే అయిన జక్కన తన విక్రమార్క చరిత్రలో ఎఱ్ఱయ కవిత్వాన్ని ప్రస్తుతించాడు. ఎఱ్ఱన శబ్దవైచిత్రితో ఆరణ్యపర్వశేషాన్ని రచించాడనీ, శ్రీనృసింహపురాణ రామాయణాదులలో పాండిత్య ప్రకర్షను ప్రదర్శించి చిత్ర కవిత్వ వాగ్విభవజృంభితుడైనాడనీ పేర్కొన్నాడు. జక్కన తాత పెద్దయామాత్యుడు నెల్లూరు తిక్కభూపతి ఆస్థానంలో చతుర్విధ కవితాకోవిదుడై ప్రశంసలందుకొన్నవాడట. తండ్రి అన్నయ 'జనవినుత రసప్రసంగ సంగత కవిరాజుల' ప్రశంసల నందుకొన్నవాడట. కృతిపతి అయిన జన్నయసిద్ధమంత్రి విక్రమార్క చరిత్రాన్ని 'ప్రబంధశయ్యగా' చెప్పుమని అడిగాడు. "స్వాభావిక నవకవితా। ప్రాభవముల నుభయ భాషఁ బ్రౌఢిమఁ జెప్పన్। భూభువనంబున సరిలే। రా భారతి నీవుఁ దక్క నన్నయ జక్కా!" (1.24) అని ప్రశంసించాడు. జక్కన కవితాశయాలలో ప్రతిపద్య వైచిత్రి ప్రధానమని తోస్తున్నది.

క. "ప్రతిపద్యముఁ జోద్యముగాఁ। గృతి జెప్పిన నొప్పుఁగాక కృతి నొక పద్యం
బతిమూఢుఁడైనఁ జిత్రతఁ। బ్రతిపాదింపఁడె ఘుణాక్షర న్యాయమునన్" (1.17)

అని ఆయన పేర్కొన్నాడు. ఈ వివరాలను బట్టి చూస్తే జక్కన కాలంలో చతుర్విధ కవితా సమర్థులైన కవులకు, వారివంశాలలో పుట్టిన కవులకు రాజాస్థానాలలో గౌరవం ఉన్నట్లు స్పష్టమౌతుంది. అయితే ఆశు, మధుర, చిత్ర, విస్తర కవిత్వాలలో కవితా కళ గల మేటి ప్రక్రియగా విస్తరకవితనే భావించేవారు. కాగా, ఆ కాలంలో 'స్వాభావిక నవకవితా ప్రాభవాలు' నవకవులకు ఉపాదేయాలుగా ఉండేవి. అవి 'ప్రబంధశయ్య'లో కవిత్వం చెప్పటం. అందులో చిత్ర కవిత్వ స్వభావం సంఘటించటం అప్పటి నవ్యత్వం. అయితే చతుర్విధ కవితా ప్రస్థానాలలో రెండు శాఖ లున్నట్లున్నాయి. 1. చతుర్విధ కవితా శాఖలలో చిత్ర కవిత్వ మొకటి అని భావించే శాఖ. అందులో ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితా ప్రక్రియలు సమంగా పరిగణించబడతాయి. కవితా స్వభావాన్ని బట్టి చేసే వివేచన అది. 2. ఇక రెండవ శాఖ విస్తరకవిత్వ శాఖకే సంబంధించింది. అందులో నాలుగురకాల కవిత్వా లుంటాయి. అవి ఆశు, బంధ, గర్భ, చిత్రకవితలు. నన్నెచోడుడు ఈ శాఖకు చెందినవాడు.

ఎఱ్ఱన ఈ పద్ధతివాడు కాడు. అందులోనూ ఎఱ్ఱన జక్కనల కాలంలో (వారిద్దరూ దాదాపు సమకాలీనులే) కావ్యంలో కథాకథన ధోరణికంటె ప్రతిపద్యం చోద్యంగా చెప్పే ఒక నవ్యధోరణి 'ప్రబంధశయ్య'గా ప్రాచుర్యం పొందుతున్నది. కాబట్టి జక్కన దృష్టిలో కథాకథనంలో ప్రతిపద్య వైచిత్రికి కృషి చేయటం నవీన ప్రబంధ ధోరణి. అదే ఆనాటి చిత్రకవిత్వ వాగ్విభవజృంభణం. దానికి ఆచార్యుడు ప్రబంధ పరమేశ్వరుడని జక్కన కీర్తించాడు. అయితే అందులో ఆరణ్యపర్వశేష రచనలో ప్రతి పద్య శబ్దవైచిత్రి స్పృహ మాత్రమే కనపడుతుందనీ మిగిలిన వాటిల్లో అది విస్తరించిందనీ ఆయన గుర్తించాడు. మొత్తం మీద ఎఱ్ఱయలో జక్కన చూచిన క్రొత్తదనం చిత్రకవిత్వ వాగ్విభవజృంభణం. దాని ఆదిదశ ఆరణ్యపర్వశేషంలో శబ్దవైచిత్రిగా సాక్షాత్కరిస్తుంది.

ఆరణ్యపర్వశేషం మీద పరిశోధన చేసిన డా॥ ఓగేటి అచ్యుతరామ శాస్త్రిగారు ఎఱ్ఱన కవితలో చిత్రకవిత్వం లేదని చెప్పి, ఆతడి అలంకార ప్రయోగవైచిత్రియే చిత్రకవిత్వ వాగ్విభవంగా వ్యాఖ్యానించారు. ఎఱ్ఱన రాజరాజును 'విచిత్రా లంకారోజ్జ్వల కవితాలాప కలాప సంతతానందమతీ! (ఆర. 6.1) అనీ, 'మహాకావ్య రస ప్రయోజనారూఢమతీ!' (ఆర. 7.1) అనీ సంబోధించాడు. ఆ రెండు సంబుద్ధులూ ఎఱ్ఱయ కవితా లక్షణాలకు ప్రతిరూపాలని వారు భావించారు. అంతేకాక, చిత్రముద్రిత పద్య సప్తకాన్ని గుర్తించి వ్యాఖ్యానించారు. వారు ఉదాహరించిన పద్యా లివి-

1. ఉ. 'పెల్లునఁగూలు తజ్జలము... వెండియుం గురియుఁ జిత్రముగాఁగ ననేకకాలముల్' (ఆర. 4.246)
2. వ. 'అత్యంతవిచిత్రంబైన యీ వృత్తాంతంబు నాకు ననుభవగోచరంబైనయది' (ఆర. 4.280)
3. క. 'ఆ దివ్యాస్త్రజ్వలనము... నొనరించెఁ జిత్రముగ నొకమాత్రన్' (ఆర. 4.411)
4. ఉ. 'పాపవినిశ్చయుండు... చిత్రముగ భూమితలంబునఁ ద్రెళ్ళె....' (ఆర. 6.190)
5. ఉ. 'వీరుఁడు చిత్రయోధి దృఢవేధి.....సహదేవుఁడు దేవనిభుండు పెంపునన్' (ఆర. 6.214)
6. మ. 'కృతహస్తుండు.... నొప్పారిరి చిత్రవారిధర పంక్తిచ్ఛన్న శైలాకృతిన్' (ఆర. 7.82)
7. ఉ. 'జైత్రులు గోత్రభూమిధరసారులు.... ఉల్లసచ్చిత్ర ధనుఃకళావిదు లజేయులు.... చిత్తవృత్తులై.' (ఆర.7.118)

వీటిపై డాక్టర్ అచ్యుతరామ శాస్త్రిగారి వ్యాఖ్య గమనార్హం - "ఎఱ్ఱనార్యుడు ఈ చిత్రవిచిత్ర శబ్దములను ముద్రించి రచించిన పద్యములు ఆరణ్యపర్వశేషమున ఈ యేడుమాత్రమే కాన్పించుచున్నవి. వీనిలో మొదటి పద్యమున ప్రలయ ప్రకారము 'చిత్రముగ' తోచిన విధము వర్ణింపబడినది. రెండవ వచనమున సృష్టి ప్రకారము 'విచిత్రంబై' అనుభవగోచరమైన విధము సూచించబడినది. మూడవ పద్యమునందలి చిత్ర శబ్దమువెనుక యోగవిద్యా ప్రభావము గుప్తమొనర్పబడిన విధము గ్రహించబడినది. నాల్గవ పద్యమునందలి చిత్రశబ్దము అదృశ్యశక్తి ప్రభావమును గర్భీకరించుకొన్న విధ మూహింపబడినది. అయిదవ పద్యమందలి చిత్ర శబ్దమునకు, దేవ శబ్దమునకు అంతస్సూత్రత గోచరించు విధ మూహింపబడినది. ఆరవ పద్యము నందలి చిత్రశబ్దము ద్వారా ప్రకృతిగత చిత్రత్వము, దేహధారుల తత్కాలస్థితియందు పోల్చబడిన విధము గుర్తింపబడినది. ఏడవ పద్యమందలి విచిత్రశబ్దము దివ్య ద్వారా ప్రకృతిగత చిత్రత్వము, దేహధారుల తత్కాలస్థితియందు పోల్చబడిన విధము గుర్తింపబడినది. ఏడవ పద్యమందలి విచిత్రశబ్దము శాంబరీ శక్తిని, దివ్య శక్తిని గర్భీకరించుకొన్నవైనము గమనింపబడినది. దీనిని బట్టి యెఱ్ఱన ఈ చిత్ర విచిత్ర శబ్దములను ఏదియో ఒకానొక అద్భుత తత్త్వమును ప్రతిపాదించుటకు ప్రయోగించినట్లు చెప్పవచ్చును. అంతేకాదు - ఒక విషయమును ఇంతకంటె మించి చెప్పుటకు సాధ్యము కాదు అని తోచినప్పుడు ఈ శబ్దములను ప్రయోగించి, ఆపైని మనయూహాకే వదలివేయుచున్నాడనియు ననిపించును. అతని యితర ప్రబంధములలో గూడ, ఈ ప్రయోగము లున్నట్లున్నవి. వానిని గూడ గుర్తించి యీతని 'యలౌకిక' చిత్రకవిత్వతత్త్వము 'లోనారయుట' ఆవశ్యకము." (ఎఱ్ఱన ఆరణ్యపర్వశేషము (1989) పు. 124-125)

ఎఱ్ఱన కవితలోని శబ్దవైచిత్రికి ఒక ఉదాహరణము:

చ. 'పతివిరహంబు దుస్సహము: భర్తృవినాకృత యైన కాంత దూ
షిత యగు సర్వమంగళ విశేషములందును; గాన మత్ప్రియుం
డతులితకీర్తిశాలి, సుగుణాఢ్యుఁడు, సాళ్వసుతుండు లబ్ధజీ
వితుఁడుగ నిమ్ము ధర్మపదవీ పరిరక్షణ! పుణ్యవీక్షణా!' (ఆర.7.249)

సావిత్రి యముడిని భర్తప్రాణాలను కోరే నాల్గవ వరాన్ని కోరుతూ తన కోరికకు తగిన హేతువును నిబంధిస్తూ కార్యకారణబద్ధంగా పలికిన వాక్యాలివి. ఇందులోని కావ్యలింగాలంకారం సావిత్రి ఉక్తులకు వైచిత్రిని కల్పించింది. అది సార్థక శబ్ద సమాస ప్రయోగాల వలన సిద్ధించింది. దీనిలోని సమాస ప్రయోగవైచిత్రిని గురించి డా॥ అచ్యుతరాయ శాస్త్రిగారి వ్యాఖ్య ఇది - "ఇందు రెండవ పాదమున 'కాన', నాల్గవ పాదమున 'ఇమ్ము' అన్న తెలుగు శబ్దములు రెండును విరామచిహ్నములుగ పని చేసి పద్యమంతటిని మూడంశములుగ విరియజేయుట గమనింపగలము. ఈ రెండును దక్క తక్కిన పద్యమంతయు సంస్కృత పదపరీమళభరితమే. ఇచట 'భర్తృవినాకృతయైన' అన్నది ముఖ్యము. భర్తలేకుండా చేయబడినది అని యర్థము. భర్త లేనిది యనుటకు బదులు ఇట్లు చెప్పుట శబ్ద వైచిత్రికి ఉదాహరణము. సత్యవంతుని కిది కాలమృత్యువు కాదు; అకాలమృత్యువు. ఇది జరిగినట్లున్నను ఇప్పటికైనను జరుగనట్లు చేసికొనుటకు వీలున్నది. ఈ సర్వార్థమును సూచించు ప్రయోగ మిది. ఇది మూలమున మూడుసార్లు ప్రయోగింపబడినది:

"న కామయే భర్తృవినాకృతా సుఖం । న కామయే భర్తృవినాకృతా దివమ్,
న కామయే భర్తృవినాకృతా శ్రియం । న భర్తృహీనా వ్యవసామి జీవితుమ్". (సం. 3.281.52)

దీనిని ఎఱ్ఱన ఒక్కమాఱు మాత్రమే ప్రయోగించి తక్కిన భావమునంతయు 'సర్వమంగళ విశేషములందు' అన్న వాక్యమున నిమిడ్చినాడు. మూలమున భర్తృ శబ్దము నాలుగుమారులు ప్రయోగించబడినది. రెండు, మూడు, నాల్గు పాదములందలి భర్తృ శబ్దమును ఎఱ్ఱన తన పద్యమునందలి మూడవపాదములో మూడు విశేషణములుగా అన్యథాకరించినాడు. 'భర్తృ వినాకృతయైన కాంత' - అని ఒక్కమారు ప్రయోగించుటవలన, అది ప్రయోగించిన తీరును బట్టి 'వైచిత్రిని' ని సంతరించుకొన్నది. ఎఱ్ఱనార్యుని యిట్టి ప్రయోగములను చూచియే కావలయును శ్రీనాథుడు శృంగార నైషధమున 'గమికర్మీకృతనైకనీవృతా' వంటి మూల ప్రయోగాలను తెలుగునకు దించుకొనినాడు." (ఎఱ్ఱన అరణ్యపర్వశేషము - పుట 145-146)

క. 'తల్లడపడి యరదము డిగి । విల్లును నమ్ములును విడిచి వెల్లనగుచు మే
నెల్లఁ జెమర్పఁగ నూర్పులు । పెల్లుగ నమ్మనుజపశువు పెలుచం బఱచెన్'. (ఆర. 6.244)

ఈ పద్యంలో 'మనుజపశువు' అనే సమాసాన్ని కల్పించివాడటంలో శబ్దవైచిత్రి ఉంది. పద్యమంతా ఆచ్ఛిక తద్భవపదాలే కాని ఈ సమాసం సంస్కృత పద విశిష్టం. ఇందులో రూపకాలంకారాన్ని కవి ప్రౌఢంగా నిబంధించాడు. కందంలోని పూర్వార్థంలో మనుజ చేష్టలు చెప్పబడ్డాయి. తల్లడిల్లటం, రథం దిగటం, ధనుర్బాణాలను వదలివేయటం, మొగం వెలవెలలాడేటట్లు సిగ్గుపడటం ఇవి మానవచేష్టలు. మేనెల్లచెమర్చటం, ఊర్పులు పెల్లుగా విడవటం - అనేవి పశు లక్షణాలు. వివేక హీనుడైన సైంధవుడు పశుతుల్యుడు. వావివరుసలు లేని పశుప్రవృత్తిని ప్రదర్శించిన సైంధవుడి శీలాన్ని ఒక్కమాటలో ధ్వనింపచేసిన ఎఱ్ఱన శబ్దవైచిత్రి ఇది.

### (5) ఎఱ్ఱన వాగ్విలాసం : అతిగాంభీర్య విభూతి

శ్రీనాథయుగంలోనివారైన నందిమల్లయ ఘంట సింగయలు 'కీర్తితంబులయిన శంభుదాసుని వాగ్విలాసాలను నెమ్మనంబున నిలిపా'మని చెప్పారు. (వరాహపురాణము.1.18). దక్షిణాంధ్రయుగంలో ఉన్న గణపవరపు వేంకటకవి శ్రీప్రబంధ

రాజ వేంకటేశ్వర విజయవిలాసంలో సూక్తిప్రౌఢికి ప్రబంధ పరమేశుడైన ఎఱ్ఱాప్రెగడను తలుస్తానని పేర్కొన్నాడు. మరెందరో కవులు ఈ బాటలో చెప్పి ఉండవచ్చును. సూక్తివైచిత్రి. ఉక్తివైచిత్రి, వాగ్విలాసం, సూక్తిప్రౌఢి - ఇటువంటి వన్నీ తరతమ భేదాలతో చతురోక్తుల కవితాభివ్యక్తులలోని సంఘటనా వైవిధ్యాన్ని సూచిస్తున్నాయి.

మ. 'అతిగాంభీర్యవిభూతి నేకచుళుకాహంకారనిశ్శేషశో
షితపాథోధిపయస్కుఁడైన ముని దోఁచెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీథిఁ బ్రకటక్రీడాకళాగర్వగ
ర్జిత మండూకకళంకితాంబుశుచితాసిద్ధి ప్రదాచార్యుఁడై.' (అర.4. 145)

అగస్త్య నక్షత్రోదయం వర్షర్తువులోని బురదనీటిని తేర్చి శరదాగమనాన్ని సూచిస్తుంది. ఎఱ్ఱన రచించిన ఈ పద్యం అమూలకం. ఆరణ్యపర్వశేషంలోని గొప్ప పద్యాలలో ఇది ఒకటి. కారణం ఇందులోని ప్రబంధశయ్య, భారతీవృత్తి, మాధురీ గుణం, పాంచాలీ రీతి. వీటన్నింటిని మించి సూక్తిప్రౌఢి, వాగ్విలాసం, ఉక్తివైచిత్రి. ఇన్ని కలిసి పండిన పంట ఈ పద్యం.

తోచింది ఎవరు? అగస్త్యుడనే నక్షత్రం. కాని, నక్షత్రమని చెప్పకుండా పేరుకూడా చెప్పకుండా, నిండుగర్వంతో దోసిలెత్తి సముద్రజలాలనన్నింటినీ త్రాగిన ముని అని సూచించాడు. ఈ పద్యంలో కర్తపేరు గూఢంగా ఉన్నది. వృత్తిమాత్రం వాచ్యమైంది. వృత్తిచేత వక్త పేరు వ్యంగ్యంగా ధ్వనించబడింది. ఒక దీర్ఘ సమాసం చేత, ఒక లోకహిత చర్యావర్ణనం చేత కర్త ఊహించబడుతున్నాడు. ఆ ముని 'అతి గాంభీర్యవిభూతి' కలవాడట. ఈ చెప్పే తీరంతా 'అతి గాంభీర్యవిభూతి'గా పఠితకు తోస్తున్నది. నిజానికి వ్యంగ్య గౌరవంతో సాగుతున్న ఈ పద్యంలోని శబ్దాలు అర్థవైచిత్రితో ఎన్నో విశేషాలను ప్రతీయమానం చేస్తున్నాయి. మూలంలో లేని ఈ ముని ఎందుకు వచ్చాడు? ఎఱ్ఱయ ఎందుకు తెచ్చాడు? ఆయనయే ఎఱ్ఱయ ఏమో! అయితే ఆయన సూక్తిప్రౌఢి-లేదా-ఉక్తివైచిత్రి- 'అతి గాంభీర్యవిభూతి'ని ప్రదర్శిస్తుందన్నమాట! అది ఆయన వాగ్విలాసవైఖరి. ఎఱ్ఱన ఆ ముని వలెనే పుణ్యతేజోమయాకృతి. ఆయన ఆచార్యుడైన యుగకర్త. శబ్దాడంబరమనే కప్పలరొద నుండి కవితా జీవనాన్ని తేర్చి ప్రసాదమాధుర్య బంధురం చేయటానికి అవతరించిన ప్రబంధాచార్యుడు ఎఱ్ఱన. ఈ భావన ఆ ప్రబంధశయ్య -సూక్తివైచిత్రి-వలన ఏర్పడిందే. ఆ ఆచార్యుడైన ముని ఎఱ్ఱన గురువు కూడా కావచ్చును. ఆ భావన కూడా ధ్వనిమయమై మరొక మధురానుభవానికి తోడ్పడుతుంది. పద్యంలోని శబ్దార్థాభివ్యక్తి యొక్క వ్యంగ్యశక్తి వలన భారతారణ్యశేష పూరణకర్త భారతాంబరవీథిలో అవతరించిన పుణ్యసంఘటన ప్రసాదమధురంగా స్ఫురిస్తుంది. ఇట్టి అర్థవ్యక్తి నందించే అభివ్యక్తిని ఎఱ్ఱయభాషలో - 'అతిగాంభీర్యవిభూతి' అనవచ్చును.

## (6) శరత్కాల వర్ణనం : వస్తు-అలంకార ధ్వనులు

ఆరణ్యపర్వశేషరచన 'స్ఫురదరుణాంశురాగరుచి'తో పొంపిరివోయినట్లు ప్రారంభమౌతుంది. నన్నయ కవిత్వం శరత్కాల పూర్ణిమానిశలో ఆగుతుంది. ఎఱ్ఱయ కవిత్వం ఉదయారుణ కాంతులతో తెల్లవారినట్లు వెలుగులు చిమ్ముతుంది. నన్నయ శరత్కాల వర్ణన ఒక భరతవాక్యంవలె, ఎఱ్ఱయ శరత్కాల వర్ణనం ఎత్తుగడ ఒక నాందీ వాక్యంవలె భాసిస్తాయి. ఆ ఘట్టంలోని ప్రతి వర్ణనాంశం ధ్వనిమయం.

శరత్కాలవర్ణనలో నన్నయ రెండు పద్యాలు వ్రాసి విశ్రాంతి పొందితే, ఎఱ్ఱయ దానిని అయిదు పద్యాలతో ఎందుకు సాగించి ముగించాడు? - అనే ప్రశ్న మొదట ఉత్పన్నమౌతుంది. ఆరణ్యపర్వం ఏడాశ్వాల ప్రబంధం. ఒక్కొక్క ఆశ్వాసానికి ఒక్కొక వైశిష్ట్యం ఉంది. అట్లాగే ఆ ఏడు పద్యాలలో కూడా. ప్రతి పద్యం చోద్యంగా చెప్పిందే. నన్నయ పద్యాలు వస్తు ధ్వనికి శరత్పూర్ణిమ. ఎఱ్ఱయ పద్యాలు అలంకార ధ్వనికి అరుణోదయం.

ఉ. 'భూసతికిం దివంబునకుఁ బొల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకల ప్రమోదకరమై విలసిల్లె మహర్షి మండలో
పాసిత రాజహంసగతిభాతి ప్రసన్న సరస్వతీక మ
బ్జాసన శోభితం బగుచు నబ్జజుయానముతో సమానమై'. (ఆర. 4.140)

ఇది నన్నయ పద్యం. శరత్కాలం వచ్చింది. భూమికీ స్వర్గానికీ సంబంధం కలిపింది. అందరికీ ఆనందాన్ని తెచ్చింది - ఇది ఒక భాగం. ఇందులో పాశుపతాస్త్ర వృత్తాంతం ధ్వని. రాబోయే యుద్ధంలో భీష్మాదులను వధించే ఉపాయాన్ని ఆలోచిస్తున్న ధర్మజుడి వ్యూహంలో ఆరణ్యవాసం యుద్ధ విజయ సన్నాహమే. అందులో వ్యాసుడి దయవలన ప్రతిస్మృతి విద్య లభించటం, దానిని అర్జునుడికి ధర్మజు డివ్వటం, అతడు దానిచేత పరమేశ్వరుడిని మెప్పించి పాశుపతాస్త్రాన్ని పొందటం, ఆపైన దేవేంద్రుడి ఆహ్వానంపై ఇంద్రలోకానికి వెళ్ళటం, దేవతల దయవలన మహాస్త్రాలను సంపాదించటం, జగదేకవీరుడిగా ప్రశంసలంది ఇంద్ర సింహాసనంలో సగ భాగం మీద ఆసీనుడు కావటం- అనే కథార్థాలు 'భూసతికిం దివంబునకుఁ బొల్పెసఁగంగ శరత్సమాగమం బాసకల ప్రమోదకరమై విలసిల్లె' నన్న వాక్యంలో నన్నయ ధ్వనింపజేశాడు.

ఆ శరత్కాలం ఎట్లా సాగిందంటే - బ్రహ్మదేవుడి యానంతో సమానంగా సాగిందట. పద్మజుడు పద్మనాభుడిభక్తుడు, ఆరణ్యపర్వశేషంలో ధర్మజుడు శ్రీకృష్ణుని శరణువేడిన విజ్ఞుడు. బ్రాహ్మణుల మధ్య, ఋషుల మధ్య నివసిస్తూ యజ్ఞతపోవిధుల నాచరిస్తూ మహర్షుల వలన వేదపురాణేతిహాస సకల శాస్త్ర రహస్య విశేషాలను అడిగి తెలిసికొంటూ వింటూ, ద్రౌపది భీమాదులు వాదించినా, ధర్మ విశేషాలనూ, నీతి రహస్యాలనూ వివరిస్తూ ఉచితానుచిత వివేక విశారదుడైన రాజహంస ధర్మజుడే. రాజహంస బ్రహ్మవాహనం. అది మహర్షి మండలోపాసితం, ప్రసన్న సరస్వతీకం, బ్రహ్మ తనపై అధివసించటం చేత ప్రకాశమానం. ఈ లక్షణాలన్నీ ధర్మజుడికి వర్తిస్తాయి. ధర్మజుడు శ్రీకృష్ణాశ్రితుడు, నిరంతరం మహర్షుల సత్సాంగత్యంలో ఉండి ప్రసన్నమైన సరస్వతిని (వాక్కు) కలవాడు. శ్రీకృష్ణుని అండ ఉండటం చేత సర్వార్థాలనూ సాధించగల జీవన ప్రస్థానాన్ని అరణ్యంలో కూడా వివేకంతో ముందుకు సాగిస్తున్నాడు. హంసమీద ఎక్కి ప్రయాణం చేసే బ్రహ్మగమనంగా శరత్కాలగమనం భాసించిందనే ఈ వర్ణనలో ఆరణ్యపర్వంలోని ప్రథమాశ్వాస కథార్థాలు ధ్వనింపబడుతున్నాయి. 'లోనారసి' చూచేవారికి ఇది 'మేలు' అనిపిస్తుంది. 'ప్రసన్న సరస్వతి-' నన్నయ భారతి.

ఉ. 'శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవ కైరవ గంధబంధురో
దార సమీర సౌరభము తాల్చి సుధాంశు వికీర్యమాణక
ర్పూరపరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై.' (ఆర. 4.141)

ఇది నన్నయ రెండవ పద్యం. ఇందులో వర్ణించబడినవి శారదరాత్రులు. అవి ఉజ్జ్వల లసత్తర తారకహార పంక్తులతో అందంగా భాసించాయి. క్రొత్తగా వికసిస్తున్న కలువపూల సువాసనలను తెచ్చే ఉదారమందపవనాలతో ఆ రాత్రులు పరిమళభరితాలుగా రాణించాయి. కర్పూర కళికల పొడివలె అచ్చమైన తెల్లనికాంతుల చంద్రుడి వెన్నెలలతో నిండిపోయాయి - అని పైపద్య భావం.

ఆరణ్యవాసంలో అర్జునుడు తపస్సుకు వెళ్ళిన తరువాత అతడు మరల తిరిగి వచ్చేంతవరకు ధర్మజుడు చింతా క్రాంతుడై ఉన్నాడు. విజయసూచకమైన శరత్కాలంలో అది రాత్రికాలం. అయితే అందులో చీకటి లేదు, చంద్రకాంతి ఉంది. బృహదశ్వ, నారద, ధౌమ్య, రోమశాది మహర్షులు ధర్మజుడి చిత్తోపశాంతికై ఎన్నో కథలు గాథలు చెప్పారు.

అందులో బృహదశ్వుడు చెప్పిన నలోపాఖ్యానం కళాపూర్ణోదయం వంటిది. దాని వెన్నెల ప్రకాశం ధర్మజుడి చిత్తం మీద బాగా ప్రభావం చూపింది. ఆ పైన రోమశుడు చెప్పిన అర్జున మహాస్త్ర లాభ వృత్తాంతం ధర్మజుడికి మనోల్లాసాన్ని కలిగించింది. శరత్కాలరాత్రులలో ధర్మజుడి మనస్తాపం తగ్గి విజయాశలు క్రమంగా వెలుగొందటం తారకహారపంక్తుల కాంతితోరణం. విరిసే కలువ పూవులు విరజిమ్మే వాసనలు ఋషులు చెప్పే కథలలోని ప్రసన్నకథాకలితార్థయుక్తులైన కవితా పరిమళాలు. అర్జునుడు ఇంద్రలోకంలో పొందిన గౌరవం పాండుతనయుల సుధాంశు ధవళకీర్తి లోకమంతా నిండిన సుఖాన్ని కలిగించింది. ఈ పద్యంలో ఆరణ్యపర్వ ద్వితీయాశ్వాసంలోని కథార్థాల కాంతులు ధ్వనిమయాలై చారుతరాలౌతున్నాయి.

చ. 'స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవ జృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్'. (ఆర. 4.142)

ఇది ఎఱ్ఱయ మొదటి పద్యం. అరుణాంశురాగరుచి ఎఱ్ఱన కవిత్వారంభ స్ఫోరకమైన ధ్వనిగా పలువురు గుర్తించారు. అదొక విశేషం. ఇక వస్తువుకు సంబంధించి ఈ పద్యం తృతీయాశ్వాస కథార్థాలను ధ్వనింపజేస్తున్నది. అందుకే ఇది ఎఱ్ఱయ ముద్ర గల పద్యం. నన్నయ బాటకు కొనసాగింపు.

అర్జునుడి వార్త తెలియటం చేత ధర్మరాజు మనసులో విజయావకాశాల అరుణాంశురాగ కాంతులు ఆశాకిరణాలవలె అంకురించాయి. భీష్మాదివీరులవలన కలిగే ముప్పుల వలని భయాలమబ్బులు క్రమంగా తొలగిపోయాయి. అర్జునుడి దర్శనమయ్యేదాకా తీర్థయాత్రలు సాగించాడు ధర్మరాజు. తీర్థాలను సేవించాడు. రోమశుడు చెప్పిన తీర్థ మాహాత్మ్యాలను విన్నాడు. ధర్మ కర్మ జ్ఞానోదయం కలిగింది. శారద వాసరముఖంవలె ధర్మరాజు మొగం తేజోవంతమయింది. ఆ తీర్థగాథలో అగస్త్య భగీరథ ఋశ్యశృంగ పరశురామ కార్తవీర్య మాంధాతృ సోమక శిబి సుకన్యాదుల చరిత్రలు 'ఉద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనాల' వంటివని ధ్వని. సౌగంధిక పుష్పాపహరణ గాథలోని భీముడి విజృంభణం 'దళత్కమలవైభవ విజృంభణం'లో సూచితం. శబ్దం వలన, అర్థం వలన, వస్తు సూచనం చేసే ఉక్తివైచిత్రి ఇందులో స్పష్టం.

శా. 'దానాంభః పటలంబునం బృథుపయోధారావళిం దాల్చి గ
ర్జా నిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గె నాఁ
గా నొప్పారె మదోత్కట ద్విరద సంఘంబుల్ వనాంతంబునన్'. (ఆర. 4.143)

ఎఱ్ఱయగారి ఈ పద్యం సూక్తి ప్రౌఢికి, ప్రబంధశయ్యకు, అలంకార ధ్వనికి పరమోదాహరణం. కొంత మంది విమర్శకులు ఇందులో ధ్వనితమైన కథార్థాలను వివేచించే యత్నం చేశారు. పద్యంలోని ద్విరదాలు పాండవ సూచకాలని, ప్రచ్ఛాదించటం అజ్ఞాతవాస సూచనమని కొందరు భావించారు. ఘోషయాత్రా సూచకమని కొందరన్నారు. నన్నయను మదద్విరదంగా పూర్వకవి స్తుతిలో ఎఱ్ఱయ భావించాడు కాబట్టి, ఆ ద్విరదమే కాలాంతరంలో నిగూఢాకారతతో వనపర్వమధ్యంలో దిగి విహరించిందనీ, దానిని ఎఱ్ఱాప్రెగ్గడగా కొందరు ఊహించారు. ఇన్ని ఊహలకు అవకాశమున్న అలంకార ధ్వన్యాత్మకమైన పద్య మిది! కాగా చతుర్థాశ్వాస వస్తువును ధ్వనింపజేసిన పద్ధతిని వివేచించటం ప్రస్తుతం.

ఈ పద్యంలోని అలంకారం ఉత్ప్రేక్ష. ఉపమానముయొక్క తాదాత్మ్యాన్ని ఉపమేయమునందు సంభావించటం దాని లక్షణం. ఇక్కడ ఉపమేయం మదోత్కట ద్విరద సంఘాలు (మదించి ఏనుగుల గుంపులు). శరత్కాల భయంచేత

వర్షాకాల మేఘాల రహస్యరూపాలతో అడవులలో తిరుగుతున్నాయా అన్నట్లున్నాయి అవి. అట్లా ఊహించటానికి కారణం అవి మేఘాల నీటిధారలవలె మదజల ధారలను కలిగి ఉన్నాయి. మేఘాల గర్జలవలె ఘీంకారాలను చేస్తున్నాయి. చూడగా మేఘాలే తమ రూపాలను కప్పిపుచ్చుకొని గూఢరూపాలతో తిరుగుతున్నాయా అన్నట్లు ఊహించటానికి అనువుగా ఉన్నాయి.

ఈ అలంకారం ఆరణ్యపర్వ చతుర్థాశ్వాసంలోని ప్రధాన కథార్థాలను భావించటానికి అనువుగా ఉన్నది. మేఘాల గుంపుల వంటివారు దేవగణాలు. భీముడు సువర్ణమయ పంచవర్ణసురభికుసుమాలను తెచ్చే సందర్భంలో కుబేరసేన నోడించాడు. ఆ సందర్భంలో సురగరుడ గంధర్వ యక్షరాక్షస సహితుడైన కుబేరుడు భూతలానికి దిగి ధర్మజాదుల నాశీర్వదించి, వారి కిదివరకే ఉన్న ధర్మానిలశక్రాశ్వినుల రక్షలతోపాటు తన రక్షను కూడా అనుగ్రహించాడు. ఆ తరువాత ఇంద్రుడు సమస్త దేవగణాలతో ధర్మజుడికి దర్శనమిచ్చి పార్థుడి జగదేకవీర పరాక్రమాన్ని ప్రశంసించి, అతడివలన యుద్ధంలో విజయం, తరువాత రాజ్యప్రాప్తి కలుగుతుందని సూచించాడు. ఆరణ్యపర్వంలో ఇదొక అద్భుత సన్నివేశం. స్వర్గంలోని దేవతలు భూమిపైకి దిగుతారు. భూమిమీది అర్జునుడు దేవలోకంలో విహరించి విజయయాత్రలు చేస్తాడు. దేవతలు వార్షుక మేఘాలవలె పార్థుడిపై అస్త్ర శస్త్రాలనే వరాలను వర్షిస్తారు. దేవతలు గెల్వలేని రాక్షసులను నరుడు జయిస్తాడు. దివంలో నివసించే దేవతలు భువిమీద పాండవుల సహాయం కోరుతారు. వారిని దైవాంశసంభూతులుగా కీర్తిస్తారు. శ్రీకృష్ణార్జునులు నరనారాయణావతారులు. ధర్మజాదులు ధర్మానిల శక్రాశ్వినుల అంశావతారాలు. నిజానికి వీరందరూ దేవలోకంలో ఉండదగినవారే. కాని, భావి మహాభారత యుద్ధంలో రాక్షసాంశ సంభూతులను వధించి ధర్మస్థాపన చేయటానికై భూతలం మీద అవతరించారనీ, దైవలక్షణాలను దాచుకొని మానవ వీరులుగా అడవులలో సంచరిస్తున్నారనే భావం ఆరణ్యపర్వ చతుర్థాశ్వాసం కలిగిస్తుంది. పాండవులు ప్రచ్ఛన్న రూపాలతో తిరుగుతున్న దేవతలే అనే అంశాన్ని అందంగా ధ్వనింపజేసి చెప్పిన ఆలంకారిక అభివ్యక్తి ఈ పద్యం.

క. 'కలనీలకంఠకోలా । హలలీలలు సెలఁగె, రాజహంసకులంబుల్
విలసించె, సప్తపర్ణా । వలి విగళిత కుసుమ కుటజవాటిక లడరెన్'. (ఆర.4.144)

ఈ పద్యంలోని 'నీలకంఠ కోలాహల లీలలు' అనే సమాసంలోని అర్థవైచిత్రిచేత రౌద్రాంశ సంభూతుడైన కుమారస్వామి పరాక్రమ లీలావిశేషాలు, మహిషాసుర సంహారం మొదలైన కథలు సూచించబడ్డాయి. 'రాజహంస కులంబు' లనే సమాసంలోని అర్థ వైచిత్రి వలన మార్కండేయ మహర్షి, ధర్మవ్యాధుడు, ధర్మరాజు ధ్వనించబడుతున్నారు. పురాణ వివేకజ్ఞుడు మార్కండేయ మహర్షి, ధర్మసూక్ష్మతత్త్వజ్ఞుడు ధర్మవ్యాధుడు, చిత్రసేనుడి చెర నుండి దుర్యోధనుడిని సబాంధవంగా విడిపించి శరణాగత ధర్మవివేకాన్ని ప్రదర్శించినవాడు ధర్మజుడు. వీరందరు స్వభావం చేత రాజహంసలే. వీరందరికథలూ పంచమాశ్వాసంలో విలసిల్లాయి. ఏడాశ్వాసాల ఆరణ్యపర్వంలో నేర్వదగిన ధర్మసారమంతా ఈ ఆశ్వాసంలోనే ఉన్నది. పంచమాశ్వాసం ఆరణ్యపర్వ ధర్మనికుంజం. పై పద్యంలో చెప్పబడిన సప్తవర్ణి ఆరణ్యపర్వమే. దాని నుండి రాలిన పూలు అందులోని ధర్మవిశేషాలే. ఈ వస్త్వలంకార ధ్వనులను అక్షరరమ్యంగా చెప్పింది ఈ కందం.

మ. 'అతిగాంభీర్యవిభూతి.... శుచితాసిద్ధి ప్రదాచార్యుఁడై' - (ఆర. 4.145)

ఈ పద్యంలో కానవచ్చే ధ్వనిని గురించి ముందే కొంత చర్చించాం. ఇప్పు డిది ఆరణ్యపర్వ షష్ఠాశ్వాస వస్తు తత్త్వాన్ని ధ్వనింపచేసే విధాన్ని సమీక్షిద్దాం. ఈ పద్యంలో తోచేది పుణ్యతేజోమయాకృతుడైన ముని. ఆరవ ఆశ్వాసంలో ఆమూలాగ్రం తోచేది మహాప్రళయాలను దర్శించిన మహాపుణ్యాత్ముడు మార్కండేయ మహాముని. ఆయన చేసిన పని ఏమిటి? ప్రకట, క్రీడా, కళా, గర్వ, గర్జిత, మండూక, కళంకిత, అంబువులకు నిర్మలత్వాన్ని కలిగించాడు. ఈ శబ్దాల కూర్పువలన ఏర్పడే అర్థవైచిత్రి ఇక్కడ వ్యంగ్యం. ఈ ఆశ్వాసంలో బురదనీరువలె కలతబారింది ధర్మజుడి మనస్సు. ఈ ఆశ్వాసంలో క్రీడాకళాగర్వ

గర్జితులు కర్ణ దుర్యోధన సైంధవులు. దుర్యోధనుడి మెప్పుకొరకు అర్జునుడిని ఆహవంలో హతమొనరించేంతవరకు కాళ్ళకు గోళ్ళు తీసికొనననని కర్ణుడు ప్రతిజ్ఞ చేసి ధర్మజుడికి రాత్రిళ్ళు నిద్రలేకుండా చేశాడు. వైష్ణవ యజ్ఞాన్ని చేసి తృప్తిపడక పాండవులను వధించి రాజసూయం చేయాలని దుర్యోధనుడు సంకల్పించాడు. వావివరుసలు కూడా చూడక ద్రౌపదిని పరాభవించటానికి ప్రయత్నించిన మానవపశువు సైంధవుడు పాండవులకు మానని మనోవేదన కలిగించాడు. ద్రౌపది పడిన పాట్లను తలచుకొని భర్తలు బడబాగ్నులవలె మండిపోతున్నారు. కర్ణ దుర్యోధన సైంధవులు పలికిన ప్రగల్భాలు వాననీటిలోని కప్పల బెకబెకలు, ఈ ఆశ్వాసమంతా ఆ నిష్ఫల ప్రగల్భాలతో మారుమ్రోగిపోయింది. పాండవులు కార్యశూరులై కష్టాల నెదుర్కొన్నా, మనసులోని కలతమాత్రం బురదనీరువలె కల్మషాన్ని కలిగించింది. దానిని తన దివ్య కథామృతశక్తితో తేర్చి ధర్మజాదుల మనసులను ప్రసన్నం చేస్తున్న కథ షష్ఠాశ్వాసం. అగస్త్యనక్షత్రోదయ ప్రశంస వస్తుధ్వనికి విలువైన ఉదాహరణం.

ఈ పద్యంలో కూడా ఉత్ప్రేక్షాలంకారం ఉన్నది. ఉపమేయం 'నిర్మలకమలాకరములు'. ఇవి రెల్లుగడ్డి పొదలతో చుట్టబడి ఉన్నాయి. ఊహించే వారికి అవి శరత్కాల మేఘాలతో చుట్టబడి అందంగా ఉండే అవకాశానికి ప్రతిబింబాలో అన్నట్లు ఉన్నాయట! సప్తమాశ్వాసాన్ని గురించిన చక్కని ముగింపు ఈ అలంకార ధ్వని. ఇందులో వర్ణ్య వస్తువు నిర్మలజల సరోవరాలు. ఆరణ్యపర్వం చివరి ఘట్టంలో నాలుగుసార్లు సరోవరాల ప్రసక్తి వచ్చింది. రామాయణ కథలో పంపాసరోవరం, సావిత్రి కథలో ఆమె భర్తతో కలిసి చూచిన సరోవరాలు, కర్ణుడి కథలో ఆతడు సూర్యుడికి అర్ఘ్యమిచ్చి దానాలు చేసే సరోవరం, యక్షప్రశ్నల ఘట్టంలో ధర్మజుడు తమ్ములను బ్రతికించుకొన్న భవ్యసరోవరం, ఇవి భౌతిక సరోవరాలు. నిర్మల సరోవరాలు రసానుభూతి పొందే సహృదయుల చిత్తాలను ధ్వనింపజేస్తున్నాయి. గగనం బ్రహ్మానందం. అతి ప్రతిబింబించిన సరోవరం బ్రహ్మానంద సహోదరమైన రసానుభవం. రామాయణంలోని సరోవరం యుద్ధ వీరం, సావిత్ర్యుపాఖ్యానంలోని సరోవరం తపోవీరం, కర్ణుని కథలోనిది దానవీరం, యక్షసరోవరం ధర్మవీరం. చతుర్విధ వీర రసానంద సూచకం నిర్మల కమలాకర ప్రశంస. రామాదుల వృత్తాంతాలు శరత్కాలమేఘాలు. ధర్మరాజు పొందిన చిత్తశాంతి రెల్లుపొదలు. శరత్కాలం ధర్మజుని ధర్మవీర రసవ్యంజకం. ఈ విధంగా ముగింపులో రస విషయాన్ని ధ్వనింపజేసి ఎఱ్ఱన అలంకార వస్తు రసధ్వనుల నిర్వహణంలో ప్రబంధపరమేశ్వరు డనిపించుకొన్నాడు.

ఉక్తివైచిత్రి అంటే - సంభాషణలో మాటల నేర్పరితనం అని ఒక అర్థం చెప్పవచ్చును. వాటిని ఎన్నో రకాలుగా ప్రకటించవచ్చును. మచ్చుకు రెండు మూడు విశేషాలు.

ఒక భావ వ్యక్తీకరణలో పాత్ర యొక్క భావావస్థ ప్రకటితమయ్యేటట్లు మూడు పద్యాలను వరుసగా చెప్పే ఒక ఉక్తివైచిత్రిని ఎఱ్ఱన కొన్ని చోట్ల పాటించాడు. ఉదా:

(1) లోకంలో ఇహలోక సుఖాలను పొందేవారినీ, పరలోక సుఖాలను పొందేవారినీ, ఉభయలోక సుఖాలను పొందేవారినీ చెప్పటానికి మూడు వృత్తాలు ఎత్తుకొని ముచ్చటగా విడమరచి వరుసగా చెప్పటం - (4.175, 176, 177)

(2) మహాప్రళయకాలంలో ఏకార్ణవం ఏర్పడటం - (4,245, 246, 247)

(3) ఉదంకుడి విష్ణు స్తుతి - (4,375,376,377)

(4) పాంచాలి సత్యభామతో తన పతిసేవా పద్ధతి చెప్పటం- (5,296,297,298)

(5) అసురవరులు దుర్యోధనుడి జన్మ కారణం చెప్పటం- (6,43,44,45)

(6) సైంధవుడు ద్రౌపదిపై అంకురించిన మోహాన్ని వ్యక్తీకరించటం- (6,147,148,149)

(1) ధర్మవిశేషాలు తెలిపేటప్పుడు ఎఱ్ఱన నన్నయ మార్గంలో ప్రసాదగుణాన్ని పోషించాడు. అయితే అందుట్లో శబ్దార్థ గుణలక్షణాలను రెండింటినీ కలిపి నిర్వహించాడు. మార్కండేయ ప్రోక్తంగా ఇహ, పర, ఉభయలోకాలు పొందేవారి వర్ణనం చేసే మూడు పద్యాలు శబ్దార్థగుణాలైన ప్రసాదలక్షణాలు కలవి. వాటికితోడు అర్థవ్యక్తిని పోషకంగా నిలిపాడు. విడమరచి చెప్పే పద్ధతిలో ప్రసాదగుణాన్ని నిపుణంగా వాడతాడు ఎఱ్ఱన. ఆ పద్యత్రయంలో మొదటిది రుచిరార్థ సూక్తి కూడా.

చ. 'ధనములు సాల గల్గి సతతంబును నింద్రియవాంఛ సల్పుచున్
మనమున నెన్నఁడున్ సుకృతమార్గము పొంతకుఁ బోక లోభమో
హనిహతబుద్ధులై తిరుగునట్టి జనుల్ పరలోక సౌఖ్యముల్
గనుటకు నేర; రిప్పటి సుఖంబులు మేలయి తోఁచు వారికిన్.' (అర.4.175)

(2) మహాప్రళయ కాలంలోని ఏకార్ణవ వర్ణనంలోని వస్తు స్వభావాన్ని బట్టి ఎఱ్ఱన ప్రసాదంలో ఓజస్సును మిశ్రమం చేశాడు. దీన్ని పూర్వమే కొంత పరిశీలించాం.

(3) విష్ణుస్తుతి భక్తిభావ ప్రపూర్ణం కాబట్టి మాధుర్యగుణంలో రచన చేశాడు ఎఱ్ఱన. శబ్దగుణమైన మాధుర్యానికి పృథక్పదత్వం, అర్థగుణ ప్రధానమైన మాధుర్యానికి ఉక్తివైచిత్ర్యం లక్షణాలు. భక్తిపోషకంగా మొదటి పద్యంలో నామకీర్తనం, రెండవ పద్యంలో భావ మాధుర్యం పోషించి మూడవ పద్యంతో ఉభయాత్మక పద్ధతిని పాటించి పదవైచిత్రిని ప్రదర్శించాడు. మొదటి రెండు పద్యాలూ నన్నయ బాణీవే. మూడవది ఎఱ్ఱయ శబ్దవైచిత్రి. మూడింట రెండు మత్తకోకిలలు కావటంతో మాధుర్యాన్ని సౌకుమార్యంతో మహనీయం చేయటం జరిగింది. ఇది ఛందౌచిత్యం. ఛందోవైచిత్రి కాదు.

**మత్తకోకిలము**

'విక్రమత్రయలీల నోలిన విష్టప త్రితయంబుఁ బె
ల్లాక్రమించితి క్రూరులైన సురారివీరులఁ బ్రస్ఫుర
చ్చక్ర విక్రమకేళిఁ ద్రుంచితి సర్వయజ్ఞఫలావహ
ప్రక్రియాత్ముఁడ వీవు నిశ్చలభావభవ్య జనార్దనా!' (4.377)

ఇది నన్నయశైలి కంటె భిన్నమైనది. ప్రబంధశయ్యకు దగ్గరైనది.

(4) సత్యభామ పలుకులు స్వభావం చేత మధురాలు, చెప్పటంలో ప్రసాద మధురాలు. నాటకీయంగా పాత్రోచితాలు. ఇందులో వాక్యవైచిత్రి విశేష లక్షణం. ఆమె పలికిన మొదటి పద్యం తెలుగునాట బాగా ప్రచారం చెందింది కూడా!

చ. 'అలయక మంత్రతంత్ర వివిధౌషధ భంగులఁ జేసి యెంతయున్
వలతురు నాథు లంట మగువా! కడు బేలతనంబు; దాన మున్
గలిగిన ప్రేమయుం బొలియుఁ గాని యొకండును సిద్ధిఁ బొంద; ద
ప్పొలఁతుకతోడి మన్కి యహిపొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్'. (5.296)

వాక్యాలలో వ్యావహారికత కనపడుతుంది. అంటే - లోకంలో మాట్లాడేటప్పుడు సామాన్యంగా వాక్యవిన్యాసాలలో ఏయే పదక్రమాలను పాటిస్తామో వాటిని పద్యంలో రూపొందించటం. సత్యభామ నోట ఆ లక్షణం తేటగా ప్రసరించింది. అది ఎఱ్ఱయ సూక్తివైచిత్రి.

(5) సత్యభామ మాటలను ప్రసాదమాధుర్యంలో పలికించి, అసురవరుల పలుకులను మాధుర్యౌదార్య మిశ్రమంగా సాగించటం ఎఱ్ఱన నన్నయ దగ్గర నేర్చిన శిల్పం. కాని, దానికి ఎఱ్ఱన శబ్దవైచిత్రిని జోడించి ప్రబంధశయ్యను కల్పిస్తాడు. మూడూ ఉత్పలమాలలు కావటం సమతాగుణ పోషకం. సమత మాధుర్య పోషకం.

ఉ. 'ఏము తపంబు సేసి పరమేశ్వరు నీశ్వరుఁ బార్వతీమనః
కాముకుఁ గామవైరి నవికారుఁ బురాంతకుఁ బ్రీతుఁ జేసినం
గామితదాయి యైన శితికంఠుఁడు నిన్ను సృజించి యిచ్చె ను
ద్దామదయావిధేయుఁడు ముదంబున మాకు నధీశ్వరుండుగన్'. (6.43)

ఈ పద్యం రాక్షసులు రాజసంతో పలికింది. కాని, భక్తితో విశ్వాసంతో చెప్పింది. వినేవాడు నమ్మేటట్లు చెప్పాలని పరమేశ్వరుడిని అనేక నామాలతో పేర్కొన్నారు. అందులో ఆడంబరం ఉంది. ఆతురత ఉంది. కావలసిన దానికంటె ఎక్కువ చెప్పటం ఉంది. కాబట్టి వికటత్వం భాసిస్తుంది. దాన్ని ఉదారత అనే గుణంగా చెప్పాలి. పరమేశ్వరుడు పరమదయాళువు అనే భావాన్ని 'ఉద్దామదయావిధేయుఁడు' అని చెప్పి, ఆసుర స్వభావముద్రితమైన వికటత్వాన్ని ప్రదర్శిస్తారు. అందుకే ఇక్కడ గుణం మాధుర్యౌదార్యాల మధుర మిశ్రమం.

(6) విరాటపర్వంలోని కీచకుడివంటివాడు ఆరణ్యపర్వంలోని సైంధవుడు. ద్రౌపదిని మోహించి, కామించి రత్యావేశంతో శృంగారోక్తులు పలికిన ధీరోద్ధతుడు. తెలుగు భారతంలో ముందు కీచకుడు పుట్టి తరువాత సైంధవుడు పుట్టినట్లుంటుంది. తిక్కన తీర్చిదిద్దిన కీచకుడి నీడలు సైంధవుడి మీద పడక తప్పదు. కాని, ఈ పాత్రను పోషించినవాడు ప్రబంధపరమేశ్వరుడు - ఉత్పలమాలాత్రయంలో ఉజ్జ్వలంగా పలికించాడు. ద్రౌపదిని ఆశ్రమంద్వారం వద్ద చూచి ఆమె అందానికి విలాసానికి ఆశ్చర్యపోయి, మన్మథాయత్తమైన చిత్తంతో సఖుడైన కోటికాస్యుడితో ఈ విధంగా అన్నాడు సైంధవుడు.

ఉ. 'ఇన్నలినాక్షి యెవ్వతియొ? యివ్విపినంబున నేకతంబ యి
ట్లున్న నిమిత్త మేమియొ? సురోత్తమ కన్యయొ? యక్షకాంతయో?
పన్నగ భామయో? మనుజభామిని గామి నిజంబ; యిట్టి చె
ల్వున్నదియే మహీతలము నుగ్మలు లెవ్వరియందు నారయన్.'

ఉ. 'లీల యెలర్పఁగా నబల లేఁజిగురాకును బోలె నొప్పు కెం
గేలు కదంబశాఖతుదిఁ గీల్కొనఁ జేసి వసంత విభ్రమో
న్మీలితబాలవల్లిక్రియ మేలగు చూడ్కుల మించి పావక
జ్వాలయపోలెఁ జిత్తము నిజం బెరియింపఁ దొడంగెఁ జూచితే?'

ఉ. 'ఈ కమలాక్షి నాకు హృదయేశ్వరి యైనఁ ద్రిలోకరాజ్యముం
జేకుఱ నేలినట్లు విలసిల్లనె? దర్పకవీరు బంటుఁగాఁ
గైకొని సర్వభోగములుఁ గాంతు; నొడంబడఁ బల్కి దీనికిన్
నాకును బొందొనర్చి కరుణం జరితార్థునిఁ జేయవే ననున్'. (అర. 6.147 - 149)

మూలంలో కంటె ఈ మాటలు ముగ్ధమోహనంగా ఉన్నాయి. మూలంలో రతిభావ వ్యక్తీకరణమే ఉన్నది. ఎఱ్ఱయ దానిని శిల్పీకరించాడు. మూలంకంటె ముచ్చటైన సన్నివేశచారుత్వాన్ని, ఉక్తివైచిత్ర్యాన్ని జోడించాడు. పునస్సృష్టి చేశాడు. మూలంలోని మాట లివి-

శ్లో. "కస్య త్వేషానవద్యాఙ్గీ యది వాసి న మానుషీ ॥
వివాహార్థో న మే కశ్చి దిమాం దృష్ట్వాతిసుందరీమ్
ఏతా మేవాహ మాదాయ గమిష్యామి స్వమాలయమ్ ॥
గచ్ఛ జానీహి సౌమ్యైనాం కస్య కాచ కుతోఽ పి వా
కిమర్థ మాగతా సుభ్రూ రిదం కంటకితం వనమ్ ॥
అపి నామ వరారోహా మా మేషా లోకసున్దరీ
భజే దద్యాయతాపాఙ్గీ సుదతీ తనుమధ్యమా ॥
అప్యహం కృతకామః స్యా మిమాం ప్రాప్య వరస్త్రియమ్
గచ్ఛ జానీహి కో న్వస్యా న్వథ ఇత్యేవ కోటిక ॥ (సం. 3.248. 12-16)

మరొక వివాహానికి తరలిపోతున్న దక్షిణ నాయకుడు సైంధవుడు. ద్రౌపదిని చూచి ఎవరి భార్యయో, మనుష్యస్త్రీ అగునో కాదో, ఆమె ఒంటరిగా ఆ కీకారణ్యానికి ఎందుకు వచ్చిందో తెలిసికొని రమ్మంటాడు కోటికాస్యుడిని. ఆమె వివాహానికి అంగీకరిస్తే మరెవరినీ వివాహమాడకుండా ఆమెను చేపట్టి ఇంటికి తిరిగిపోతానంటాడు. మూలంలోని సైంధవుడు రసికుడూ కాడు. మాట నేర్పరీ కాడు. వట్టి మదించిన కాముకుడు. వెనుక ముందు ఆలోచించలేని ఆవేశపరుడు. ఎఱ్ఱయ అతడిని సంస్కరించాడు. అందాన్ని చూచి ఆశ్చర్యపడి, ఆర్ద్రతను ప్రకటించే భావుకతను, కాల్పనిక చిత్తవృత్తిని అతడిలో నారుపోశాడు. పై వాటిలోని మొదటి పద్యంలో అతడు వ్యక్తం చేసిన భావాలు మూలంలో అతడివి కావు. అతడి వెంట వస్తున్న వీరులవి. మెరుపుతో మెరుస్తున్న మేఘంవలె వనానికే వెలుగుతెస్తున్న ద్రౌపదిని చూచి వారంతా ఆమె అప్సరసో, దేవకన్యో, లేక దేవతలు కల్పించిన మాయో! అని ఆశ్చర్యపోయారు. ప్రథమ వీక్షణంలో కలిగే ఆ అద్భుతం మూలంలో ఇతరులకు దక్కింది. వితర్కం మాత్రం సైంధవుడికి మిగిలింది. ద్రౌపదిని చూచి మనుజభామో కాదో అని అనుమానం వచ్చినా, దాన్ని నిశ్చయించుకొనే తెలివి అతడికి ఉన్నట్లు లేదు. ఆమెనే అడిగి తెలిసికొనాలనుకొంటాడు. ఎఱ్ఱన అతడికి ఈ రెండు దుస్థితుల నుండి తప్పించి మొదటి పద్యాన్ని నిర్మించాడు. రతి భావాంకురం క్రమదశాభివృద్ధి చెందటం ఆ పద్యంలోని శిల్పం.

చూడగానే ఆమె కన్నులు అతడిని ఆకర్షించాయి. అందుకే 'ఇన్నలినాక్షి' అని అన్నాడు. త్రికసంధిని ఆశ్చర్య వ్యంజకంగా వాడటం ఉక్తివైచిత్రి. ఇన్నలినాక్షి, ఎవ్వతియొ, ఇవ్విపినంబున- అని ముమ్మారు వరుసగా ప్రయోగించి ప్రథమ వీక్షణంలో కలిగిన రాగగాఢతను ఎఱ్ఱన రచనలో వ్యక్తం చేశాడు. ఎవ్వతియొ అని అనటం ఆమె రూపవైభవానికి కలిగిన అబ్బురపాటు వలన. అడవిలో ఏకాంతంగా ఉండటానికి ఏదో కారణ ముంటుందనే ఆసక్తి, తన కొరకే నేమో అన్న మోహం కలగటం సహజం. ఎవరు? అన్న ప్రశ్నకు తన వివేకాన్ని ఉపయోగించి ఉల్లేఖంగా ఊహించటం భావుకుడైన రసికుడి లక్షణం. ఆమె మనుజవనిత కావటానికి వీల్లేదు. అది నిజం అని నిశ్చయించటం - అద్భుతం నుండి రాగోదయమైన చిహ్నం. భూతలంమీద ఇంత అందగత్తె లేదని ప్రశంసించటం రాగం పల్లవించిన దానికి గుర్తు. ఎఱ్ఱయ యతి కోసం వాడాడనుకొన్నా 'ఉగ్మలి' శబ్దాన్ని ప్రయోగించి అపూర్వతను ప్రదర్శించే ఉక్తివైచిత్రి ప్రదర్శించాడు. పద్యంలోని మాటలు, వాక్యాలు పాత్ర మనసును క్రమంగా ఆవిష్కరించాయి. ఎఱ్ఱయ భావ క్రమోన్మీలన చిత్ర కళాకోవిదుడు.

రెండవ పద్యం ఎఱ్ఱన అపూర్వ సృష్టి. ద్రౌపది కొక రమణీయ భంగిమ నేర్పి ఛాయాచిత్రం తీసి చూపించాడు ఎఱ్ఱన. స్థిరచిత్రం నన్నయ శిల్పం. చలచిత్రం తిక్కన శిల్పం. ఇందులో నన్నయ బాట కనపడుతుంది. ఆశ్రమ ప్రాంగణంలో విరగబూచిన కడిమి చెట్టు, చెట్టుకొమ్మల చివర చిగురాకులున్నాయి. ద్రౌపది చిగురాకుల వంటి వేళ్ళున్న తన చేతిని ఒక కొమ్మ చివర చేర్చింది. ఆ చెట్టుకే మారుచిగురాకు తొడిగినట్లుంది. అదొక ఆశ్చర్యం. అందం కూడా. ఆమె అట్లా నిలబడితే చెట్టుకు తీగ అల్లుకొన్నట్లున్నది. వసంతకాల ప్రభావ విజృంభణం వలన బాగా పూలు వికసించిన లేత తీవెగా ఉన్నది. ఆమె కన్నులు పద్మాలని వేరే చెప్పనవసరం లేదు. ఆమె చూపులు ఇంపుగొలుపుతున్నాయి. ఆమె శరీర భంగిమలో ఒక లీల కొట్టవచ్చినట్లు కనపడుతున్నది. లీల శృంగార విలాస చేష్ట, సామాన్యంగా ఆ భంగిమలో నిలువబడిన శృంగారనాయిక ప్రియ సమాగమాకాంక్షతో విరహాన్ని వ్యక్తం చేస్తూ తన్మయత్వాన్ని ప్రదర్శిస్తూ ఉంటుంది. ఆ విషయం తెలిసిన రసికుడు, నాట్య శాస్త్రకోవిదుడు సైంధవుడు. ఎఱ్ఱని కడిమి చెట్టు, దానినిండా ఎఱ్ఱని పూలు, ఆమె అనురాగమూర్తి, ఆమె కన్నులు ఎఱ్ఱని పద్మాలు, ఆమె చేతులు ఎఱ్ఱని చిగురాకులు, ఆమె భంగిమ రాగభావాభివ్యక్తి- ఆ దృశ్యాన్ని చూచిన సైంధవుడి హృదయం రాగజ్వాలగా మారింది. బయటి దృశ్యమే లోని భావదృశ్యమై ప్రజ్వలించింది. మొదటి పద్యం రాగోదయాన్ని, రెండవ పద్యం రాగ విజృంభణాన్నీ తెలుపుతున్నాయి. 'వసంత విభ్రమోన్మీలిత బాలవల్లి క్రియ' అన్న ఉపమాలంకారంలో వాడిన విభ్రమ, ఉన్మీలిత శబ్దాలు రసభావ వ్యంజకాలై ఉక్తివైచిత్రిని వెలారుస్తున్నాయి.

మూడవ పద్యం రాగహృదయం కలలుకంటున్న దృశ్యం చిత్రించిన ఊహాచిత్రం. 'ఇన్నలినాక్షి' 'ఈ కమలాక్షి' అయింది. ఆశ్చర్యం నుండి ఆవిర్భవించిన ఊహాప్రవృత్తి దీర్ఘాక్షరంలో ధ్వనించబడింది. ఆమె కమలాలవంటి కన్నులు ఇంకా అతడిని తాడిస్తూనే ఉన్నాయి. ఆమె హృదయేశ్వరి అయితే త్రిలోక సామ్రాజ్యం లభించినట్లు పొంగిపోతాడట! మన్మథుడిని బంటుగా జేసికొని అన్ని భోగాలనూ పొందుతాడట! ఈ మాటలు ఉత్తమ సంస్కారి అయిన రసికవల్లభు డనే రమణీయోక్తులు. ఎఱ్ఱన సైంధవుడు తిక్కన కీచకుడి తమ్ముడు. అయితే అతడి మాటలు, చూపులు, ఊహలు నన్నయ బాటలో సాగిన ఎఱ్ఱయ ప్రబంధశయ్యలు. నన్నయే ఈ ఘట్టం రచిస్తే మొదటి రెండు పద్యాలు వ్రాసి ఊరుకుండేవాడేమో! ఎఱ్ఱయ మూడో అడుగు ముందుకు వేసి ప్రబంధ పరమేశ్వరుడయ్యాడు.

పరిశీలిస్తే ప్రబంధ పరమేశ్వరుడి రచనలో ఇటువంటి సంభాషణా సూక్తివైచిత్రులు కుప్పలు తెప్పలు.

ఉ. "నన్నయభట్టుఁ గావ్యరచనా నిధిఁ, దిక్కన సోమయాజి న
ఛ్ఛిన్న మహత్త్వ సంవిహితశేముషి, నెఱ్ఱయప్రెగ్గడన్ సము
త్పన్న నవ ప్రబంధరస భావన నింపునఁ బ్రార్థనాంజలుల్
మున్నుగ నాత్మలోఁ దలఁతు ముమ్వర; ముమ్వరఁ బోలు పుణ్యులన్."

ఈ పద్యం నిశ్శంక కొమ్మయ కవి రచించిన వీరమాహేశ్వరంలోనిదని కీ.శే.వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించారు. అతడి కాలం ఏదైనా కవిత్రయాన్ని వారి వారి ప్రత్యేక కవితా వ్యక్తిత్వాలతో స్మరించి కవితాసిద్ధిని పొందాలని భక్తితో భావించే ఒక అవిచ్ఛిన్న సంప్రదాయానికి ఈ పద్యం మరొక ఉదాహరణం. ఈ విధంగా ఎన్నో పద్యాలను పేర్కొనవచ్చును. అది ఒక ప్రత్యేక ప్రయత్నమే ఔతుంది.

నిశ్శంక కొమ్మయ నన్నయలో కావ్యరచనా నిధిని, తిక్కనలో నిరంతరమైన మహాకవిత్వ దీక్షతో కూడిన ప్రజ్ఞాప్రాభవాన్నీ, ఎఱ్ఱనలో ఎప్పుడూ క్రొత్తక్రొత్తగా ప్రబంధరచనలో, రసభావనలో ప్రయోగాలు చేసే ఆసక్తినీ దర్శించాడు. ఆధునికులలో కవి

సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు; ''ఋషివంటి నన్నయ రెండవవాల్మీకి, తిక్కన్న శిల్పపుఁదెనుఁగుతోఁట; ఎఱ్ఱన్న సర్వమార్గేచ్ఛావిధాతృండు'' అని ప్రశంసించారు. పురాణమార్గం, ఇతిహాస మార్గం, కావ్యమార్గం, ప్రబంధమార్గం మొదలైన వాటిల్లో ఇచ్ఛవచ్చినట్లు సంచరించ గల సృజనాత్మక శక్తి సంపన్నుడు ఎఱ్ఱన అని వారి అభిప్రాయం. 'ప్రబంధపరమేశ్వర' బిరుదానికి వారిచ్చిన అరుదైన వ్యాఖ్య!

## 10. ఆరణ్యపర్వశేషం : ఆఖ్యానవైచిత్రి

ఆరణ్యపర్వశేషంలోని అఖ్యానం (ప్రధానకథ) వైశాల్యంలో చిన్నదైనా వైచిత్రిలో గొప్పది. శంభుదేవుని ఆకృతికి అష్టవిధ విభూతులవలె శంభుదాసుడి రచనకు అష్టవిధ వైచిత్రులున్నాయి. కవిత్రయంలో మూడవ వాడైన ప్రబంధపరమేశ్వరుడు ఈ భాగాన్ని రచించాడు కాబట్టి ఆ వైచిత్రులన్నీ మువ్వన్నెలతో, ముప్పేటగా ముచ్చట గొలుపుతూ ఉంటాయి.

### (1) మూడు మలుపులు

మహాభారత కథా జీవితాన్నే మార్చివేయగలిగిన పెద్ద మలుపులు మూడు ఆరణ్యపర్వశేషంలో ఉన్నాయి. అవి: 1.ఘోషయాత్ర ఘట్టం, 2. సైంధవోదంతం, 3. కర్ణుడు కవచకుండలాలు దానం చేయటం. వనవాస క్లేశ దుఃఖితులైన పాండవులను, విశేషించి పాండవ పట్టమహిషి అయిన ద్రౌపదిని, తమ అనంత సంపదల విలాసాల ప్రదర్శనంతో వెక్కిరించి వారు మనసులో కుమిలిపోయేటట్లు చేసి తాము సంతోషించే దుష్టవ్యూహం పన్నింది దుష్టచతుష్టయం. పాపం నలుగురిది అయినా ఫలభోక్త అయినవాడు దుర్యోధనుడే. దుర్యోధనుడు గంధర్వపతిచేత బంధితుడై ఇంద్రుడిచేత చంపబడితే కథ మరొక విధంగా ఉండేది. నిజాని కది ఊహించలేనిది. హస్తినాపురం ధృతరాష్ట్రపాలనలోనే ఉండేది. దుర్యోధనుడు చనిపోయినా ధర్మజుడు అరణ్యాజ్ఞాతవాసాలు పూర్తి చేయకుండా తిరిగి రాజధానికి వెళ్ళేవాడు కాడు. అది అట్లా ఉండగా- కాదగిన కార్యాన్ని గంధర్వులే తీరిస్తే పాండవులకు మిగిలే కార్యమేముంది? వారి ప్రతిజ్ఞ లేమౌతాయి?. పాశుపతాస్త్రం ఏమౌతుంది? దుర్యోధనుడు బందీ అయినా కర్ణుడు కాలేదు. అతడు యుద్ధం చేసి దుర్యోధనుడిని విడిపించేనా? ఒకసారి ఓడిన ఆ వీరుడు అందుకు సాహసించేవాడో లేదో?- అన్నీ ఊహలే. కథ చెల్లాచెదరైపోయింది. చెదరిన ఆ కథా సూత్రాలనన్నింటిని ధర్మరాజు సప్రయత్నంగా తమ్ములసాయంతో ఒకచోటికి తెచ్చి ముడివేసి భారత కథకు ప్రాణంపోశాడు.

క. 'శరణంబని వచ్చిన భీ। కరశత్రువు నయినఁ బ్రీతిఁ గావఁగవలయుం;
గరుణాపరుల తెఱం గిది; । యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్. (ఆర. 5.413)

శరణాగతత్రాణరూపమైన దయ యమతనయుడి అష్టవిభూతులలో ఒకటి. అది కథను చావనీయకుండ ప్రాణం పోసింది. ఇది మొదటి మలుపు.

అర్జునుడు పాశుపతాస్త్రాన్ని సంపాదించినా, భీష్మకర్ణాదులను చంపగలిగిన అస్త్రశక్తి అతనికి ఉన్నదని దేవేంద్రుడు ప్రకటించినా, స్వేచ్ఛామరణవరబలం గల భీష్ముడినీ, సహజకవచకుండలరక్ష గల కర్ణుడినీ వధించే ఉపాయ ద్వారాలు కథలో ఇంకా తెరువబడలేదు. అందువలన పాండవ విజయం అనుమానాస్పదంగా ఊగిసలాడుతున్నది. కర్ణుడి కవచకుండలాలను హరించటానికి ఇంద్రుడు పాండవపక్షపాతియై మాయోపాయాన్ని పన్నాడు. బ్రాహ్మణరూపంలో వాటిని దానంగా అడిగితే కర్ణుడు ఇవ్వటం తథ్యం. ఒకవేళ అదే జరిగితే కథలో పట్టుతగ్గుతుంది. అర్జునుడి ప్రతివీరుడి ప్రతాపం నిర్వీర్యమౌతుంది. అర్జునుడి ప్రతిజ్ఞకు అర్థం లేకుండాపోతుంది. అందుకని సూర్యుడు కర్ణుడిచేత ఇంద్రుడి శక్తిని ప్రత్యుపకారంగా అడిగింప జేస్తాడు. శక్తి

అవక్రవిక్రముడైన ఒక వీరుడిని చంపగలుగుతుంది. దానిని కర్ణుడు ప్రాణాపాయ సమయంలో ప్రయోగించాలి. ఆ నియమం మహాభారత కథలో ఒక అపూర్వమైన ఆసక్తిని పోషిస్తుంది. మహాభారత యుద్ధంలో ఘటోత్కచ వధదాకా సాగే ఉత్కంఠకు ఈ మలుపు బీజం.

ఉజ్జ్వలాకారులైన పాండవులూ ద్రౌపదీ అజ్ఞాతవాసంలో ఇతరులచేత తెలియబడకుండా ఉండటం నిజానికి అసాధ్యం. ఆ సమస్య పాండవుల హృదయాలలో బడబాగ్నివలె రగులుతూనే ఉన్నది. భీమాదులు ధర్మజుడి యెదుట ఎన్నోసార్లు అన్నారు. కూడా! కాని, ధర్మాన్ని నమ్మిన ధర్మరాజు మౌనంగా ఉండిపోయాడు. కథలో అది ఒక యక్షప్రశ్నగా మిగిలిపోయింది. యక్షప్రశ్నల తరువాత ధర్ముడు పాండవులకు అజ్ఞాతవాసంలో కోరుకొన్న రూపాలు కలిగేటట్లు, ఇతరులు వారిని గుర్తించకుండా ఉండేటట్లు వరమిచ్చాడు. దానితో భావికథ శుభపరిణామాలతో సాగుతుందని ధైర్యమేర్పడింది.

ఈ విధంగా ఆఖ్యానంలోని మూడు మలుపులు కథాగతికి క్రమంగా ప్రాణం పోసి, ఉత్కంఠను పెంచి, శుభపరిణామాలకు దారితెరిచాయి. ఎఱ్ఱన భాగంలో ఇవి ఆసక్తిదాయకంగా పోషించబడ్డాయి.

**(2) మూడు రహస్యాలు**

చిత్రసేనుడి బారినుండి దుర్యోధనుడు ధర్మరాజు దయవలన విముక్తుడై ఆ అవమానభారానికి తట్టుకోలేక ప్రాయోపవేశానికి పూనుకొన్నాడు. కర్ణ దుశ్శాసనశకును లెంత చెప్పినా తన నిశ్చయాన్ని మార్చుకొనకుండ ఆమరణనిరాహారదీక్ష పూనాడు. ఆ రాత్రి అసురులు అతడిని కృత్యసహాయంతో పాతాళలోకానికి పిలిపించుకొని, అతడికి హితబోధ చేశారు. అసురులందరూ పరమేశ్వరుడిని గూర్చి తపస్సు చేసి, వజ్రకాయుడైన దుర్యోధనుడిని వరప్రసాదంగా పొందారని చెప్పారు. అతడు వారికి నాయకుడనీ, ఆశాదీపమనీ పొగిడారు. కర్ణ సహాయంతో పాండవులను చంపగలడని ధైర్యం చెప్పారు. అడ్డులేకుండా రాజ్యాన్ని దుర్యోధనుడే పాలిస్తాడని ప్రకటించారు. దుర్యోధనుడు వారి మాటలు నమ్మి భవిష్యత్తుపై ఆశొపెంచుకొని మరునా డుదయమే ప్రాయోపవేశాన్ని మాని హస్తినాపురానికి బయలుదేరాడు. కాని, ఆ రాత్రి జరిగిన ఆ రహస్యాన్ని ఎవరికీ బయటపెట్టలేదు. ఆరణ్యపర్వశేషంలోని ఈ కీలకమైన రహస్యం భావి దుర్యోధన జీవన విధానంమీదా, కర్ణుడిపై పెంచుకొనే ఆశలమీదా, యుద్ధంలో విజయం తథ్యమనే నమ్మకం మీదా బలంగా ప్రభావం వేసింది. నిజానికి - ప్రాయోపవేశంలో ప్రాణాలు పోయే దుర్యోధనుడికి ప్రాణదానం చేసిన రహస్యం భావికథకు జీవనదానం చేసింది.

ధర్మరాజుచేత విముక్తుడైన సైంధవుడు గంగాద్వారంలో పరమేశ్వరుని గూర్చి తపస్సు చేసి అర్జునుడిని తప్ప, మిగిలిన పాండవులను ఒకనాటి యుద్ధంలో జయించగలిగేటట్లు వరాన్ని పొందాడు.

చ. 'విజయుఁ డొకండు దక్క నతివీరులఁ బార్థుల నున్న నల్వురన్
నిజ మొకనాఁటికయ్యమున నీవు జయింపుము; ఫల్గునుండు స
ర్వజగదజయ్యు విక్రముఁడు; వాని నెదుర్కొని నాకు నైనఁ బో
ర జితునిఁ జేయు టెంతయు భరంబగు; నిక్కము వల్కితిం జుమీ'. (ఆర. 6.257)

ఈ నిక్కాన్ని బయటికి పొక్కకుండా సైంధవుడు హృదయంలో దాచాడు. అది రాబోయే మహాభారత యుద్ధంలో అభిమన్యుడి మరణానికి కారణమౌతుందని తెలిసికొనే పఠిత ఆర్ద్రుడైపోతాడు.

మూడవ రహస్యం కర్ణుడి జన్మరహస్యం. ఆరణ్యపర్వశేషంలో సూర్యుడు కర్ణుడి క్షేమంగోరి ఇంద్రుడికి కవచకుండలాలను దానం చేయవద్దని హితవు చెప్పాడు. ఆ విధంగా తనంతట తాను కర్ణుడి మేలుకోరి పలకటానికి ఒక దేవరహస్యం ఉన్నదనీ,

అది కాలాంతరంలో కాని బయటపడదనీ చెప్పి ఊరుకొన్నాడు. ఆ దేవరహస్యమే కర్ణుడికి శాపమై కాటందింది. కర్ణుడి జన్మరహస్యాన్ని మొదట దాచింది తల్లికుంతి, ఆమె కట్టడితో ఆపై సూర్యుడు. దేవరహస్యాలు తెలిసికొనగలిగిన దివ్యాదివ్యులెవ్వరో ఒకరిద్దరికి తప్ప - కృష్ణవ్యాసభీష్మాదులకు తప్ప - మిగిలిన వారికి కూడ వారికివలె చూచాయగానైనా తెలియదు. తెలిసినవారు కూడా దేవరహస్యాన్ని భద్రంగా హృదయపేటికలలో పెట్టి తాళం వేశారు. కర్ణ జన్మరహస్యం బయటపడితే పాండవకౌరవ వైరం లేదు; దుర్యోధనుడికి బలం లేదు; చివరకు భారత కథే లేదు. ఈవిధంగా మూడు రహస్యాలు ఎఱ్ఱయ భాగంలో ముప్పిరిగొని భావికథను ముందుకు లాగాయి. రహస్యాల ఫలాలు బయటపడటమే తప్ప రహస్యాలు బయటపడటమనేది కథలో ఉండదు. అదే కథా రహస్యం కూడా.

### (3) మూడు రసాభాసాలు

ఆరణ్యపర్వశేషంలో దుర్యోధన కర్ణ సైంధవులు మూడు రకాల రసాభాసాలకు విభావాలుగా నిలిచారు. దుర్యోధనుడు ధీరోద్ధతుడు, సచివాయత్తసిద్ధుడు. అతడికి స్వయంప్రతిభ తక్కువ. కాని, ఆడంబరం, అహంకారం, కుటిలవర్తనం ఎక్కువ. అతడి ఘోషయాత్ర వీరయాత్ర కాదు; కపటదండయాత్ర. అతడు చిత్రసేనుడితో చేసింది వీరయుద్ధమే అయినా తాను చేసిన ప్రతాపోక్తులను ప్రగల్భాలుగా నిరూపించుకొన్న అప్రగల్భుడు. ఓడి, ధర్మజుడి చేత విడువబడి, ప్రాయోపవేశం కూడా చేసి, కారణాంతరం వలన మాని, ఆటోపంగా హస్తినాపురానికి చేరి, లజ్జారహితుడై భీష్మాదులముందు అవినయాన్ని ప్రదర్శించిన దుర్యోధనుడు చేసిన ప్రతిపనీ ఆభాసానికి అమూల్యోదాహరణమే. అసురులతో జరిగిన పాతాళ సమావేశం తరువాత దుర్యోధనుడు ససైన్యుడై బయలుదేరిన ఘట్టం ఎఱ్ఱయ ప్రబంధశయ్యలో రచించాడు. నన్నయ ప్రసిద్ధ పద్యపు ఎత్తుగడతో సగందాకా పద్యాన్ని సాగించాడు.

చ. 'రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్రసం
చయములఁ జంచలచ్చటుల సైనిక మత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుఁ బొంగెఁ బ్రస్ఫుర
ద్భయద మనోహర ప్రకట భంగులఁ దద్బలవార్ధి యుద్ధతిన్'. (ఆర. 6.58)

రూపకసమాస సుందరమైన ఈ పద్యంలో కురురాజచంద్రుడు కర్త. ఆయన ఉదయమంటే పుట్టుక కా దిక్కడ. అసురవీరుల ప్రబోధంచేత ప్రేరితుడై భవిష్యత్తులో పాండవులను చంపి కురురాజ్యాన్ని నిష్కంటకంగా పాలించగలననే మనోధైర్యంతో, వెనుకటి దైన్యాన్ని వీడి, నూతనోత్సాహంతో హస్తినవైపు ప్రయాణభేరి మ్రోగించిన ఉత్సాహమూర్తి యొక్క అవతారం అని అర్థం. ఈ పద్యం ఒక విజయాన్ని సాధించి మరొక విజయం కొరకు పోయే రాజు యొక్క సైన్య వర్ణనమైతే వీరరౌద్ర రసపోషకంగా ఉండేది. ఓడినరాజు ఉద్ధతితో తిరిగిపోతుంటే అది రసాభాసమే అవుతుంది. అసందర్భమైన ఆలంకారిక రచన ఆభాసానికి దారితీస్తుంది. అయితే అసందర్భంగా అనిపించే ప్రబంధశయ్య దుర్యోధనుడి అవివేకాన్ని, ఆడంబర ప్రవృత్తినీ, లజ్జారాహిత్యాన్నీ వ్యంజింపజేయటానికి, అతడివెంట నడుస్తున్న ఆ సముద్రంవంటి సైన్యవాహిని సజీవసాక్షిగా మలచి హాస్యం పుట్టించటానికి కవి ప్రౌఢంగా ఇటువంటి రచనను ప్రవేశపెట్టవచ్చును. ఎఱ్ఱయ చేసిన పని అదే.

ఈ పద్యంలోని పూర్వభాగమంతా నన్నయదే. ఆయన సభాపర్వంలో శిశుపాలసైన్య విజృంభణాన్ని ఇదే విధంగా వీర రసాభాస శిల్ప ఖండికగా రచించాడు. దానిని గుర్తెరిగి, నన్నయరీతిలో తానూ ఆపని చేశానని ఎఱ్ఱయ వ్యంగ్యంగా సూచించాడు. పై పద్యం ఎత్తుగడను అనుకరణ మంటాం. కాని ఒక విధమైన రసాభాస శిల్పానికి నన్నయ పెట్టిన ఒరవడిని తాను మన్నించి తరువాతి తరాలవారికి అందిస్తున్నానన్న స్పృహతో రచించిన ఎఱ్ఱయ పద్యం ప్రయోగ ప్రతిభకు ప్రమాణం.

అంతటి ఆర్భాటంతో హస్తినాపురికి పోయిన దుర్యోధనుడిని భీష్ముడు ఇట్లా అధిక్షేపించాడు.

మ. 'హితులై పెద్దలు బుద్ధి సెప్పఁగఁ గ్రియాహీనుండవై త్రోచి పో
యితి దుష్టాత్ములఁ గూడి; దానికి ఫలం బెట్లయ్యెనో చూచితే?
గతవిద్వేషుఁడు ధర్మనందనుఁడు గల్గంబట్టి యప్పాట దు
ర్గతికిం దప్పితి గాక; చిక్కితిగదా గంధర్వుచే నాజిలోన్.' (ఆర. 6.61)

ఈ పద్యంలోని సూక్తివైచిత్రి దుర్యోధనాలంబితమైన రసాభాసాన్ని ధర్మజుడి ధర్మవీరానికి అంగంగా, పోషకంగా నిబంధించే పద్ధతిని వ్యంగ్యంగా నిర్దేశించింది.

దుర్యోధనుడు రాజసూయం చేయాలని ఉబలాటపడటం మరొక రసాభాసం. దానిని కర్ణుడు బలపరచటం, పురోహితుడు అభ్యంతరం చెప్పటం, రాజసూయంబదులు వైష్ణవ యజ్ఞం చేయవచ్చునన్న పురోహితుడి సూచన ననుసరించి ఆ యజ్ఞానికి పూనుకొనటం మరింత రసాభాసం. యజ్ఞం అయిపోయిన తరువాత దుర్యోధనుడు భవిష్యత్తులో పాండవులను సంహరించి తప్పక రాజసూయం చేస్తాననటం, అతడిచేత కర్ణుడు చేయిస్తానని ప్రతిజ్ఞ చేయటం ఆసక్తిని కలిగిస్తూనే నవ్వు పుట్టించే రసాభాసం. యుద్ధం చేసి నవ్వులపాలైన దుర్యోధనుడు యజ్ఞం చేసి ఎగతాళి పాలైనాడు పఠితల ఎదుట.

దుర్యోధనుడు చేసిన యజ్ఞం ముగిసిన తరువాత దక్షిణలు పుచ్చుకొన్న వారు, సన్మానా లందుకొన్నవారు దుర్యోధనుడి ఎదుట యజ్ఞవైభవాన్ని అద్భుతంగా కీర్తించారు.

శా. 'సారోదారవిభూతిమై మును హరిశ్చంద్రుం డొనర్చెం గ్రియా
పారీణుండయి రాజసూయ మది సెప్పన్ వింటి; మయ్యజ్ఞముం
గౌరవ్యోత్తముఁడైన ధర్మసుతుఁడుం గావింపఁగాఁ గంటి మే;
మా రెండున్ సరిగావు నీ మఖముతో నత్యున్నతిన్ భూవరా!' (ఆర. 6.88)

ఇవి ముఖస్తుతులు. అసలు మాటలు అంతరంగంలోనివి. ఎక్కడో మనసు విప్పి చెప్పుకొంటారు. ఎఱ్ఱన ఆ సంగతి కూడా చెప్పి బండారాన్ని బయటపడవేశాడు. '....కొంద! ఱయ్యుధిష్ఠిరు రాజసూయంబు చిదుర । పాలుఁ బోల దీ మఖము వైభవ సమృద్ధి! నని తలంచిరి నిజహృదయంబులందు' (ఆర. 6.90). ఇది ఆ ప్రశంసకు విరుగుడు. దీనివలన దుర్యోధనుడి యజ్ఞకార్యోత్సాహం ఆభాసగా పఠితల హృదయాలలో మారిపోతుంది. ఇది మొదటి ఆభాసం.

అగ్నికి వాయువు తోడైనట్లు దుర్యోధనుడి యత్నానికి కర్ణుడి ప్రోత్సాహం దోహదంగా నిలిచింది. కర్ణుడిపాత్ర చిత్రమైనది. అతడు స్వయంగా ధీరోదాత్తుడు. ధీరోద్ధతుడైన దుర్యోధనుడిని మెప్పించటానికి ఉద్ధతుడివలె వ్యవహరిస్తాడు. అందువలననే దానాదులలో అతడు ధీరోదాత్తుడు. అతని స్వంత జీవితం వేరు; దుర్యోధనుడియొద్ద సేవా జీవితం వేరు. ఒకరు రసాభాసం పాలైతే మరొకరు వారితోపాటు కావలసిందే. చిత్రసేనుడితో జరిగిన యుద్ధంలో ఒంటరిపోరు చేయలేక పారిపోయిన కర్ణుడు మహాభారత యుద్ధంలో అర్జునుడిని సంహరిస్తాననీ, అందాకా కాళ్ళగోళ్ళు తీయించుకోననీ భీకర ప్రతిజ్ఞ చేశాడు. దుర్యోధనుడు మహానందంతో అతడిని కౌగిలించుకొంటాడు. ధర్మరాజు కర్ణప్రతిజ్ఞను విని విషణ్ణుడౌతాడు. మరి పఠిత?

పాండవు లొకసారి ప్రతిజ్ఞ చేస్తే దానిని సాధించి తీరుతారన్న విశ్వాసం పఠితలకు వారేర్పరిచారు. కర్ణాదులు ప్రతిజ్ఞ చేస్తారు. కాని, అది తీరటం దైవాధీనం. ఈ సత్యం తెలిసిన సహృదయులు కర్ణుడి ప్రతిజ్ఞను విని కన్నులలో నవ్వుకొంటారు. అంతటి వీరం ఆభాసమైపోతుంది.

సైంధవఘట్టంలో శృంగారరసాభాసం ఒక చిత్రమైన విచికిత్స. సైంధవుడు అటు ఉద్ధతుడు కాడు. ఇటు లలితుడు కాడు. రెంటికి చెడ్డ రేవడి. అతడు వట్టి ఇంద్రియలోలుడు. ద్రౌపది నొంటరిగా చూచి మదనశర పీడితుడై కోటికాస్యుడితో

వలపుమాటలు పలికినప్పుడు రసికుడివలె కనపడతాడు. కాని, ద్రౌపదితో మాట్లాడినప్పుడు కాని, ఆమెను బలవంతంగా రథంమీద ఎక్కించుకొని తరలిపోయేటప్పుడు కాని, అతడు ధర్మదృష్టి నేమాత్రమూ ప్రదర్శించలేదు. పాండవ పరాక్రమాన్ని తక్కువ అంచనా కట్టి ప్రమాదం తెచ్చుకొన్న అపరిణతుడు. యుద్ధభూమి నుండి పారిపోతున్న సైంధవుడిని చూచి భీముడు' ఇట్టి కడిమి నమ్మియే ప్రల్లదంబులు 'సేయఁ దొడఁగితి'వా? అని అవహేళనం చేశాడు. అతడితో కలిసి సహృదయులు కూడా పరిహసిస్తారు.

వరుసకు చెల్లెలైన ద్రౌపదిని పరిభవించాలని భావించిన సైంధవుడు 'మానవపశువు'. అతడి చేష్టలు అనౌచిత్యాలు. అందువలన అవి రసభంగహేతువులు. ఈ ఘట్టంలో రసచర్చ కడు సున్నితం. స్త్రీ పురుష లిద్దరిలో ఒకరికి మాత్రమే కోరిక ఉండి రెండవ వారికి లేకపోతే ఆభాసం. అయితే, కోరకూడని వనితను కోరినా, పురుషుడిని కోరినా అది రసభంగం. శృంగార రస రీత్యా సైంధవుడు ద్రౌపదిని వాంఛించటం ఆభాసంకంటె రసభంగమే కావాలి. ద్రౌపది అనౌచిత్యాన్ని ఎత్తి చూపింది. అతడు పట్టించుకొనలేదు. అప్పుడు ఆమె పాండవ వీర ప్రశంస చేసింది. వారితో వైరం ప్రాణహానికి దారితీస్తుందని భయపెట్టింది. సైంధవుడు దానిని లెక్కచేయలేదు. ఆమెను బలవంతంగా ఎత్తుకొని పోయాడు. చివరకు అటు శృంగారంలోనూ, ఇటు పౌరుషంలోనూ అల్పుడని నిరూపించుకొన్నాడు. అయినా, అతడి సాహసం పాండవుల మనసులపై ఒకగాయం మిగిల్చింది. అందువలన అసమర్థుడి సాహసం శృంగారవీర రసాభాసంగా ఈ ఘట్టంలో పఠితలకు స్ఫురిస్తుంది. రసపరంగా ఇది ఒక సంశ్లిష్ట ప్రయోగం. ఎఱ్ఱన ఈ ఘట్టాన్ని నిపుణంగా నిర్వహించి ప్రబంధ గౌరవాన్ని కాపాడాడు, మరొక ఊరట ఏమిటంటే, సైంధవోదంతం ఆరణ్యపర్వ శేషంలో రామాయణం, సావిత్రి చరిత్రంవంటి కథలను వినటానికి హేతువయింది. అది కీడులో మేలు.

### (4) మూడు ఉక్తివైచిత్రులు

కాకువువలన ఉక్తివైచిత్రి కలుగుతుందని అంటారు. అపకారం చేసి చేజిక్కిన శత్రువును వెటకారం చేస్తూ పలికే మాటలకు భారతంలో మొదట చెప్పుకొనేవి నన్నయ ద్రోణుడితో అనిపించినవి.

క. 'వీరెవ్వరయ్య? ద్రుపదమ । హారాజులె? యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె? యహహ! మ । హారాజ్యమదాంధకార మది వాసెనొకో!' (ఆది. 6.90)

ఇటువంటి సూక్తివైచిత్రులను వెలార్చే అవకాశాలు మూడు దొరికాయి ఎఱ్ఱనకు. అందులో రెండు ధర్మరాజు పాత్ర చేత, ఒకటి ద్రౌపది పాత్రచేత పలికించాడు.

ఘోషయాత్ర ఘట్టంలో దుర్యోధనుడి బంధవిముక్తుడిని చేసి ధర్మరా జన్న పద్యం-

ఉ. 'ఎన్నఁడు నిట్టి సాహసము లింక నొనర్పకు మయ్య; దుర్జనుం
డన్నున సాహసక్రియలయందుఁ గడంగి నశించుఁ; గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్;
సన్నుత! దీని కొండొక విషాదముఁ బొందకుమీ మనంబునన్'. (అర. 5.434)

సైంధవుడిని మందలిస్తూ ధర్మజుడన్న మాటలు-

ఆ. 'ఎట్టికష్టుఁడైన నిట్టిపాపము సేయ । నెత్తికొనునె? ధరణి నీవు దక్క;
నరుగు మింక నేమి యందుము నిన్ను నిం । ద్రియవిలోలు నల్పు ధృతివిహీను.' (అర. 6.252)

ద్రౌపది సత్యభామను సున్నితంగా మందలిస్తూ నవ్వులాటగా చేసిన ఎత్తిపొడుపు-

క. 'నను నిట్లు దుష్టవనితా। జనము నటులుగాఁ దలంపఁ జనునే నీకున్?
మన సొప్పదు పురుషోత్తము। వనితవుగాఁ దగవు నీవు వనరుహనయనా!' (ఆర. 5.294)

ద్రోణుడు బ్రాహ్మణుడు, ద్రౌపదీ ధర్మజులు క్షత్రియులు. నన్నయ అన్నట్లు- ''నిండుమనంబు నవ్యనవనీత సమానము, పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము జగన్నుతవిప్రులయందు; నిక్కమీ రెండును రాజులందు విపరీతము'' (ఆది.1.100). ద్రోణుడి వాక్కులు పరుషాలు, తీవ్రాలు, ధర్మజుడి వాక్కులు చతురాలు, నిశితాలు. ద్రౌపదివాక్కులు వ్యంగ్యాలు, వెటకారాలు, అధిక్షేపించబడే వారి అధికారాలను బట్టి కూడ వక్తలు సూక్తివైచిత్రులను మలచుకొంటారు. ద్రుపదుడు తామసికుడు; సైంధవుడు అల్పుడు, నీచుడు, దుర్యోధనుడు రాజసికుడు, సత్యభామ అహంకారి. అందువలన ద్రోణుడు బాణాలవలె మాటలను ప్రయోగించాడు. ధర్మజుడు దుర్యోధనుడికి చెంపపెట్టుగాను, సైంధవుడికి పాదతాడనంగానూ దెబ్బకొట్టినట్లు చెప్పాడు. ద్రౌపది సత్యభామకు కూరలో తిరుగబోత వేసినట్లు చెప్పింది. పాత్రోచిత కాకువైచిత్రి నిర్వహణంలో నన్నయతో దీటైనవాడు ఎఱ్ఱాప్రెగ్గడ. అందుకే తెలుగువారికి కాకువులంటే ఈ నాలుగు పద్యాలు 'శ్లోకచతుష్టయం' వలె నెమరుకు వస్తాయి.

## (5) మూడు వీరరస భేదాలు

వీరరస పరిణామ వికాస దశలను పరిశీలిస్తే ఎఱ్ఱన కాలంనాటికి వీరరసం మూడు రకాలు- అనేవాదం సమసిపోయి నాలుగురకాలనే వాదం ప్రాచుర్యంలోకి వచ్చింది. విద్యానాథాదులు దాన, ధర్మ, దయా, యుద్ధ, వీరాలను పేర్కొన్నారు. ఆరణ్యపర్వశేషంలో చతుర్విధ వీరరస వైచిత్రి పోషించబడింది. ఈ భాగంలో నాయకపక్షంలో ధర్మరాజు, ప్రతినాయకపక్షంలో కర్ణుడు రసస్థితిని ప్రదర్శించిన ప్రధానపాత్రలు.

నాయకుడైన ధర్మరాజు ధర్మవీరరసానికి ఉదాత్త విభావం. నిజానికి ధర్మవీరమే మూలవీరం. 'ధర్మవీర ఏవ రసానాం రసః' అనే వాదం ఆంధ్ర భారత రసపోషణకు ఆయుస్సూత్రం. (చూడు. రసోల్లాసం-(1980) జి.వి. సుబ్రహ్మణ్యం). అయితే ధర్మసాధకుడైన ధర్మరాజు ఆయా సన్నివేశాలలో ఆయాప్రయోజనాలను బట్టి దాన, దయా, యుద్ధాది వీరాలను ప్రదర్శిస్తూ ఉంటాడు. కాని, అన్నిభేదాలూ ధర్మవీరపోషకాలే. అందులోని భాగాలే. ఘోషయాత్రలో శరణాగత ధర్మరక్షకై గంధర్వులతో యుద్ధం చేసి దుర్యోధనాదులను విడిపించుమని భీమాదులను ఆదేశించాడు ధర్మరాజు. యుద్ధం చేసేది అనునాయకులైన భీమాదులు. వారి యుద్ధవీరం ధర్మజుని ధర్మవీరానికి అంగమయింది. ఆ సందర్భంలో ధర్మజుడు దయాభావపూర్ణుడై. దుర్యోధనుడిని వదలిపెట్టాడు. అందువలన సన్నివేశగతంగా ధర్మవీరంలో పార్శ్వమైన దయావీరం ప్రాధాన్యాన్ని పొందుతుంది. ఎఱ్ఱన ఈ మర్మం తేటపడేటట్లు ఆ ఘట్టాన్ని చిత్రించాడు.

అమాత్యులు వచ్చి ధర్మరాజును శరణువేడుతూ - ''నీయనుజవ్రాతముఁ గావవే కరుణ నిండారంగ రాజోత్తమా!' (5.402) అని ప్రార్థించారు. భీముడు దుష్టుడైన దుర్యోధనుడి పట్ల 'కృపసేయవలదు' (5.407) అని ధర్మరాజును హెచ్చరించాడు. ధర్మరాజు భీముడిని అనునయిస్తూ 'శరణుజొచ్చిన వారి పట్ల కరుణ చూపటం నీకు మాత్రం ధర్మం కాదా!' (5.408) అని అంటాడు. భీముడు ధర్మరాజును 'మనుజనాథ! కేవలంపుఁగరుణపూని యుండు దరయ నెప్పుడు' (5.410) అని విసుక్కుంటాడు. 'శరణుకోరినవారిని రక్షించటం కరుణాపరుల పద్ధతి; ఆ దయకు ఏ ధర్మాలూ సరికావు' అని ధర్మజుడు తేల్చి చెప్పాడు (5-413). ఇట్టి చోట్ల ఆ సందర్భంలో దయావీరమే ప్రధానంగా పేర్కొన్న ఎఱ్ఱన దుర్యోధనుడిని వదలిపెట్టిన ఘట్టంలో ధౌమ్యాది మునులందరూ 'ధర్మతనయు ధార్మికత్వాన్ని' కీర్తించారని చెప్పటం గమనార్హం. ఇది రసపోషణ విధానం తెలిసిన కవి చేసే రచన. తాత్పర్య మేమంటే- ఈ ఘట్టంలో ప్రధానమైనది దయావీరం, దానికి పోషకం యుద్ధవీరం. దయావీరం ధర్మవీరంలో అంతర్భాగం. మహాభారత ప్రధానరసమైన ధర్మవీరానికి ఇక్కడి దయావీరం అంగం.

సైంధవ పరాభవ ఘట్టంలో ప్రధాన రసం రౌద్రం. శత్రుకృతాపరాధానికి క్రుద్ధులై పాండవులందరు యుద్ధానికి సిద్ధమై మహాయుద్ధంలో శత్రు సంహారాన్ని నిర్దాక్షిణ్యంగా చేయ నారంభించారు. యుద్ధం రౌద్రరసోన్నిద్రం. సైంధవుడు బంధువు. గాంధారికి అల్లుడు, అనుచితం చేసినా, మరణదండనార్హుడైనా, గాంధారికి కలిగే దుఃఖాన్ని తలచి ధర్మజుడు అతడిని చంపవద్దని తమ్ముల నాదేశించాడు. భీముడు సైంధవుడిని 'ఒడలెల్లఁ బిండికూడుగఁ । బొడిచి', రాజవేషాన్ని వికల్పించి 'పాండవదాసుడ' నని పలికించి ధర్మజుడి వద్దకు తెచ్చాడు. 'పాండవదాస' బిరుదం సైంధవుడికి ప్రాణదానం చేయించింది. ఇందులోని రససమన్వయం సున్నితం.

కామదూషితుడైన సైంధవుడి వలన పాండవపత్నికి దుఃఖం కలిగింది. ఆమెను ఎత్తుకొనిపోవటం పాండవుల పట్ల అతడు చేసిన అపరాధం. దానివలన పాండవులలో క్రోధం ప్రజ్వలించింది. అవమానం వలన ఆగ్రహం రౌద్రరూపం తాల్చింది. ఈ కథలో ద్రౌపది చేత పాండవుల వీరరౌద్రప్రతాపతేజోవైభవాలను కీర్తింపజేసే పద్యాలను పుంఖానుపుంఖంగా ప్రబంధశయ్యలో రచించి ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వర గౌరవానికి పాత్రుడయ్యాడు. విరాటపర్వంలో తిక్కనకు ఇటువంటి అవకాశం దొరికింది. ఎఱ్ఱయకు ఇక్కడ దొరికింది. పోటీపడి పద్యాలు వ్రాశారా అన్నట్లు ఉంటాయి. అయితే అజ్ఞాతవాసంలో అంతటివారు ఆ విధంగా దీనంగా ఉన్నారని చెప్పే పద్యాలు తిక్కనవి. ఇక్కడ పాండవ పరాక్రమమూర్తులను వర్ణించి సైంధవుడిని భయపెట్టి ఆపదనుండి తనను రక్షించుకొనేయత్నంగా ద్రౌపది చేత పలికించినవి. ఓజోగుణభూయిష్ఠమైన ఎఱ్ఱయ రచన నన్నయ తిక్కనల రీతికంటె విలక్షణమైనది. భారతీవృత్తి, పాంచాలీ రీతి, ప్రబంధశయ్య వీటి శైలీ విలాసాలు.

ద్రౌపది పాండవులను రెండు ఘట్టాలలో కీర్తించిన పద్యాలను రెండు తెగలుగా చెప్పవచ్చును. 1. బెదరింపు పద్యాలు 2. అదలింపు పద్యాలు. మొదటి తెగవి - ఆశ్రమంలో పాండవ పరోక్షంలో చెప్పినవి. రెండవ తెగవి రణరంగంలో వారిని చూపిస్తూ ప్రత్యక్షంగా చెప్పినవి. మొదటి తెగలో అలంకార ప్రౌఢోక్తులు, రెండవ తెగలో ఉదాత్తమధురోక్తులు. మొదటి తెగలో పాత్రల రీతి వర్ణనం ప్రధానం; అందువలన పాంచాలీరీతి ప్రధాన రచనగా గోచరిస్తుంది. రెండవ తెగలో పాత్రల రూపగుణ వర్ణనం ప్రధానం కాబట్టి, మాధుర్యగుణ ప్రధానంగా రచన సాగింది. అది ఎఱ్ఱన ఔచిత్యదృష్టి. మొదటిసారి వర్ణించిన పద్యాలలో కొన్ని

| | | | |
|---|---|---|---|
| 1. | హిమవత్పాదవనాంత కేళిరతిమై- | (ధర్మరాజు) | 6.175 |
| 2. | శాతనఖాగ్ర ఖండిత లసన్మదకుంజర- | (భీముడు) | 6.176 |
| 3. | చలజిహ్వాగ్రవిలీఢ విస్ఫురితదంష్ట్రాభీషణంబైన- | (అర్జునుడు) | 6.177 |
| 4. | ఘోరవిస్ఫులింగములు వాడ్మఁగ- | (నకులసహదేవులు) | 6.178 |

హిమవత్పర్వతగుహాంతరంలో కోపారుణనేత్రాలతో ఉన్న మదించిన ఏనుగును సమీపించి సిళ్ళు చూపటం వంటిదే ధర్మజుడికి ఎదురుగా కనిపించటం. మదించిన ఏనుగుల కుంభస్థలాలను వాడిగోళ్ళతో పగులగొట్టగా రాలిన ముత్యాలతో నిండిన గుహాంతర ప్రాంతంలో నిద్రిస్తున్న సింహాన్ని జూలుపట్టి లాగటమే భీముడిని ఉసికొల్పటం. వాడికోరలతో కూడుకొన్న నాల్కతో భీషణంగా లంఘించే బెబ్బులిని కర్రతో కొట్టి రెచ్చగొట్టి దానినుండి తప్పించుకొనవచ్చునేమో కాని అర్జునుడి వాడి బాణాల తాకిడికి చావని వారుండరు. విస్ఫులింగాలు రాలగా ఘోరవిషాన్ని వెళ్ళగ్రక్కే పాముల జంటను సమీపించి పాదాలతో త్రొక్కి రెచ్చగొట్టినట్లు కవలను ధిక్కరించి పాతాళంలో దాగినా మృత్యువు తప్పదు. పాండవ స్వభావాలను అలంకృతోక్తి వైచిత్రితో వెలార్చిన పాండవరౌద్రం సైన్యసంహారంతో చల్లారుతుంది. ధర్మరాజులోని ధర్మవీరం జాగృతమై దయావీరంగా జాలువారుతుంది. సైంధవుడి ప్రాణం నిలుస్తుంది. బంధుభావం దయాభావానికి ప్రేరకం. రౌద్రాన్ని నిగ్రహించుకొనే శక్తి ధర్మజుడికి జన్మసిద్ధం. భీమాదులకు ఆతడి శిక్షణలో సాధ్యం. దానిని నిపుణంగా నిర్వహించి చూపించాడు కథలో ఎఱ్ఱన.

కర్ణుడి దానవీరగాథ అపూర్వం. దానం కూడా ధర్మస్వరూపమే. కర్ణుడి జన్మవ్రతం దానం. అయితే అతడు దానాన్ని కీర్తికాంక్షతో చేస్తాడు కాని, మోక్షకాంక్షతో చేయడు. ఆతడి ప్రవృత్తిని బట్టి ఒక్కొకసారి దానవీరం యశోవీరానికి అంగంకూడా కావచ్చును. నా 'వీరరస' గ్రంథంలో యశోవీరమనే భేదాన్ని క్రొత్తగా చెప్పటం జరిగింది. దానికి కీర్తి పొందాలన్న ఉత్కటోత్సాహమే స్థాయి. కర్ణునినోట వెలువడిన ఈ పద్యత్రయం యశోవీర త్రివర్ణ పతాక!

మ. 'మతిఁ గుంతీసుతపక్షపాతి యగుచున్ మాయాస్వరూపంబుతో
జితదైత్యుండు శతక్రతుండు నను భిక్షింపంగ నేతెంచు న
ట్టి తెఱంగైనఁ దదీయకీర్తియ చుమీ డిందుం; ద్రిలోకీసము
న్నతమై యొప్పు మదీయకీర్తి; యిది సూ నాపుణ్య మెబ్భంగులన్'.

ఆ. 'కీర్తి విడువఁజాలఁ; గీర్తితో మెలఁగంగఁ । జావు వచ్చెనేనిఁ జత్తుఁ గాని
జగములోన నెల్ల సడికంటెఁ జావు మే । లనఁగఁ బరఁగుమాట యనఘ! వినవె?'

మ. 'కీర్తియ యిచ్చుఁ బుణ్యగతిఁ, గీర్తియ తల్లియుఁబోలెఁ బ్రోచు, స
త్కీర్తియ యాయువున్ సిరియు; గీర్తి విహీనుఁడ చూ శవంబు; దు
ష్కీర్తను నెల్ల చేటులును గిట్టి హరించు ననండె తొల్లి భ
క్తార్తిహరుండు నాఁ బరఁగు నంబుజసూతి జగద్ధితంబుగన్'. (అర. 7.292-294)

మహాభారతంలో యశోవీరానికి ఏకైక నాయకపాత్ర కర్ణుడు. అది స్థాయి కందుకొన్న ఘట్టం ప్రబంధపరమేశ్వరుని సూక్తివైచిత్రిలో ప్రకాశించింది.

### (6) ముగ్గురు పతివ్రతల కథలు

ఆరణ్యపర్వంలో దమయంతి, సీత, సావిత్రి, ద్రౌపది - అనే పతివ్రతా చతుష్టయం ప్రత్యక్షమౌతుంది. అందులో దమయంతి పాత్ర నన్నయ కవితలో అమృతాభిషేకం చేసికొన్నది. ఎఱ్ఱయ ప్రబంధశయ్యపై మిగిలిన ముగ్గురూ స్వర్ణాభిషేకం చేయించుకొన్నారు.

ద్రౌపది తన వర్తనమే తన జీవిత సందేశమని చాటే ఉపన్యాసం సత్యభామకు చెప్పింది. తన జీవితానుభవాలలో నుండి ఏరిన రత్నాలతో పతివ్రతా లక్షణహారాన్ని కూర్చి ఉపదేశోపహారంగా లోకానికి అందించింది. మహాభారతంలో తనను గురించి తానే ఎక్కువగా చెప్పుకొన్న పాత్ర ద్రౌపది. అందులోనూ తన పతివ్రతా స్వభావాన్ని గురించి తానే చెప్పుకొన్నది ఎఱ్ఱయ కవితలోనే. అది విశేషం.

సైంధవ దుర్నయోదంతం ధర్మజ ద్రౌపదుల మనస్సులను కలత పెట్టింది. ఆమెవలె మహారాణి అయి పరపురుషుడిచేత అపహృతయై దుఃఖపడిన వనితకథను వినాలనీ, ఆమె విరహంతో బాధపడిన పురుషుని కథ వినాలనీ ధర్మజుడు మనసుపడ్డాడు. మార్కండేయమహర్షి రామాయణ కథ చెప్పాడు. సీతారాములు రావణాది రాక్షస వీరులచేత పడిన యాతనలు వినిన తరువాత ధర్మజుడు కొంత కుదుట పడ్డాడు. ఆ తరువాత పతిభక్తి తాత్పర్యంతో అఖిలదుఃఖాల కోర్చి శుభాలు పొందిన పతివ్రత కథను చెప్పుమన్నాడు. మార్కండేయుడు అల్పాయుష్కుడైన భర్తను తన వ్రతనిష్ఠామహిమతో పునర్జీవితుడిని చేయటమే కాక, అతడికి పూర్ణాయువును, శతపుత్ర సంతతి కలిగేటట్లు, అతడి తండ్రికి కంటిచూపు, రాజ్యవైభవం మరల కలిగేటట్లు, ఆమె తండ్రికి శత పుత్ర సంతానం కలిగేటట్లు యముడివలన వరాలు పొంది తననూ, తనవారినీ ఉద్ధరించిన ఉత్తమ పతివ్రత చరిత్ర- సావిత్రి కథను వినిపించాడు.

దమయంతి స్వయంవరంలో దేవతలను, కలిని కాదని నలుడిని వివాహమాడినందుకు ఫలితంగా భర్తకు దూరమైనది. అయినా, ధైర్యంతో తననూ, తన బిడ్డలనూ, రక్షించుకొని దీక్షతో కష్టాల కోర్చి భర్తను విపత్తు నుండి తప్పించుకొనే ప్రజ్ఞను ప్రదర్శించింది. భార్యచేత ప్రేమించబడినవాడు, ఉద్ధరించబడినవాడూ నలుడు. నలుడి జీవితాన్ని ఉద్ధరించిన ప్రేమశక్తి దమయంతి.

సీత శివధనుర్భంగవీరుడైన రాముడిని స్వయంవరంలో వివాహమాడింది. మనసా వాచా కర్మణా భర్త ననుసరించింది. రాక్షసమాయకు లోనై భర్తకు దూరమై రావణుడి వద్ద కొంతకాలం ఉన్నది. కాముకుడైన రావణుడి అంతఃపురంలోని అశోకవనంలో ఉన్నా సర్వకాల సర్వావస్థలలో రాముడినే స్మరిస్తూ తన పవిత్ర మానసికవ్రతాన్ని పాటించింది. స్త్రీకి పతిని త్రికరణశుద్ధిగా ప్రేమించి సేవించి తరించడమే జీవితలక్ష్య మని సీతకథ చెప్పిన సందేశం. రాముడు సీతామనోరాముడు. ఆమె కొరకు వానరుల స్నేహం చేసి వారిధిని దాటి, రావణుని వధించి అపూర్వ పరాక్రమాన్ని ప్రదర్శించాడు. పరపురుషు నింట ఉండి కూడా నిష్కళంక చరిత్రగా ఉండగలిగిన స్త్రీ వృత్తాంతం విని, సైంధవ వృత్తాంతం జరిగిన తరువాత కలిగిన మనస్తాపాన్ని చల్లార్చుకొని ఉంటాడు ధర్మజుడు. సీతను రావణు డెత్తుకొనిపోయిన కథకూ, సైంధవుడు ద్రౌపది నెత్తుకొనిపోయిన కథకూ హస్తిమశకాంతరం ఉన్నది. సీత పడ్డ కష్టాలతో, రాముడు చేసిన యుద్ధంతో పోలిస్తే పాండవులకు కలిగిన కష్టం విస్మరించదగిందని స్పష్టమౌతుంది.

సావిత్రి కథ అన్నిటా భిన్నమైనది. యమదర్శనం చేసికొని ఆయనతో మాటలాడి, పతిప్రాణాలతో కలిసి నడిచిపోయి, సతీపతులప్రాణ చైతన్యాలకు అద్వైతస్థితి ఉంటుందని నిరూపించిన నిరుపమాన తపోనిధి సావిత్రి. ఆమె వంటిదే ద్రౌపది అన్నారు ఋషులు - వంశాన్ని, కులాన్ని, భర్తలను ఉద్ధరించటంలో చిత్రమేమంటే ఆరణ్యపర్వశేషంలో యముడిని చూచి, అతడితో మాట్లాడి, మాటలతో మెప్పించి, వరాలు పొంది, మృతులను సైతం బ్రతికించుకొనగలిగిన శక్తిగల వ్యక్తులు ఇద్దరే కనపడతారు. కథగా మిగిలిన సావిత్రి, కథను సృష్టించిన ధర్మరాజు. ఆ రెండు పాత్రలు ఆరణ్యపర్వశేషానికే కొసమెరుపులు.

ద్రౌపది అచ్చమైన ఇల్లాలు. ఆమె దమయంతివలె భర్తల చేత వదలబడలేదు. సీతవలె భర్తకు దూరం కాలేదు. సావిత్రివలె మృతులైన భర్తలను బ్రతికించుకొనలేదు. అయితే ఆయా పతివ్రతలు ఆయా పతివ్రతా ప్రవృత్తుల వలన ఏయే ఫలాలను సాధించారో వాటిని భారతకాలంలో కులసతిగా సాగించింది. ఆరణ్యపర్వంలో చెప్పబడిన పతివ్రతల మహిమలన్నీ ఒక యెత్తు. ద్రౌపది పాటించే కులసతి ధర్మం ఒక్కటీ ఒకయెత్తు.

చ. 'పతిఁ గడవంగ దైవతము భామల కెందును లేదు; ప్రీతుఁడై
పతి గరుణించెనేనిఁ గలభాషిణి భాసురభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము విశ్రుత సంతతియున్ యశంబు స
ద్గతియును గల్గు; నొండు మెయిఁ గల్గునె? యెన్ని తెఱంగు లారయన్.' (అర. 5.314)

ఎన్ని తెరగుల పతివ్రతలచరిత్రలైనా చెప్పే పరమార్థ మిదే!

### (7). మూడు ఎఱ్ఱ(న) గుర్తులు

ఆరణ్యపర్వశేష పూరణం ఎఱ్ఱయ చేశాడని నిర్ణయించటానికి ముఖ్యంగా మూడు గుర్తులు చెప్పుకొనవచ్చును. 1.ఛందో విశేషాలు. 2. కర్ణుడి జన్మవృత్తాంతం. 3. మూలంలోని శిబిదుర్వాసాదుల వృత్తాంతాలను వదలిపెట్టటం.

ఈక్రింది ఛందోవిశేషాలు ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయకంటె విలక్షణంగా పాటించినవి. వాటి వివరాలను డా॥ పాటిబండ మాధవశర్మగారి మాటలలో-

"అరణ్యపర్వశేషమున ఎఱ్ఱయ రచించిన గద్యపద్యములు మొత్తము 1595. వాని వివరణములు - గద్యము - 496, కందము-413, సీసము-102, తేటగీతి-109, ఆటవెలది-91, చంపకమాల-135, ఉత్పలమాల-126, శార్దూలము-18, మత్తేభము-69, మత్తకోకిల-13, తరలము-8, తరువోజ 2, ఉత్సాహము-2, స్రగ్ధర-2, మహాస్రగ్ధర-2, మాలిని-1, వనమయూరము-1, లయగ్రాహి-1, మధ్యాక్కర-1, మధురాక్కర-2, స్రగ్విణి-1. గద్యములతో కలిపి మొత్తము 21 భేదములు. నన్నయ రీతి కొంత తోచునట్లు చేయుటలో ఎఱ్ఱయ ఛందముల విషయముననను గొంతయత్నము చేసెను. ఇతరులు వాడని, తాను ఇతరగ్రంథములలో వాడని మధ్యాక్కరను, మధురాక్కరను నన్నయ వాడెను గనుక తానును వాడెను. (కాని యతిస్థాన విషయమున నన్నయతో భేదించెను. నన్నయ మధ్యాక్కరలో అయిదవ గణము మొదట యతిని పాటించగా ఎఱ్ఱన నాల్గవ గుణము మొదట యతిని నిలిపెను. (4.309); నన్నయ మధురాక్కరను ఒక్కటే వాడినాడు (4.49) ఎఱ్ఱన రెండు రచించెను. (6,352, 7.309). కాని, వాని లక్షణాలలో భేదము లేదు). సీసములందు, ఆటవెలదులందు నన్నయ పాటించిన యతి, ప్రాసయతి నియమములు తానును ఈ పర్వమున పాటించెను. నన్నయ వ్రాసిన 13 సీసభేదములలో 7 భేధములు మాత్రమే వాడెను. కాని, నన్నయ వాడిన సర్వప్రాసయతి సీసమున నొక విశేషనియమును పాటించుచు రెండు సీసములు వ్రాసెను. (6.369, 7.350). సీసపాదములందు ఉభయఖండములందును ఒకే ప్రాసాక్షరము పాటించుట యందలి విశేషము. (పై పద్యములలోని రెండవ దానిలో) ఎత్తుగీతియందలి సర్వపాదములందును ప్రాసాక్షరము పాటింపబడినది. నన్నయ రచనలో నిట్టివి లేవు. లాక్షణికులు చెప్పిన సీసభేదములలో ఇవి యిముడవు."

"నన్నయ రచించిన 251 సీసములలో 225 సీసములకు ఎత్తుగీతులు ఆటవెలదులు. ఎఱ్ఱయ రుచి దీనికి భిన్నము. ఆయన వ్రాసిన 102 సీసములలో 62 సీసములకే ఆటవెలదులు గలవు. తేటగీతి, ఆటవెలది విషయమున గూడ నన్నయ నియమములను ఎఱ్ఱయ పాటించెను. వీనిలో మూడింట రెండువంతులు కేవల యతిమైత్రి గలవి. భిన్నవృత్తములు స్వీకరించుటలో నన్నయకు, ఎఱ్ఱనకు ఎంతో రుచిభేదము కనపడుచున్నది. నన్నయకంటె ఎఱ్ఱన పద్యములందును, విశేషించి వృత్తములందును ఎక్కువ ఆసక్తి ప్రదర్శించినట్లు స్పష్టము. వారు రచించిన భాగము లందలి వస్తు స్వభావము దీనికి కారణమైనను, ప్రధాన కారణము వారి అభిరుచి భేదమే." (ఆరణ్యపర్వపీఠిక-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ-పు.61-62)

కర్ణుడి జన్మవృత్తాంతం ఆదిపర్వంలో నన్నయ రచించాడు. అందులో కర్ణుడు సద్యోగర్భ సంజాతుడు. ఎఱ్ఱన భాగంలో కూడా కర్ణుడి జన్మవృత్తాంతం చెప్పబడింది. కాని, అందులో కుంతి నవమాసాలు రహస్యంగా మోసి కన్నబిడ్డ. ఈ భేదం మూలంలోనే ఉన్నది. నన్నయే ఈ భాగం రచించి ఉంటే ఏమి చేసేవాడో తెలియదు. ఎఱ్ఱయ మూలానికి న్యాయం చేశాడు. ఆ కథను రసవత్తర వర్ణనా మాధుర్యంతో నింపివేశాడు. నన్నయ కర్ణుడి రూపాన్ని ఎఱ్ఱయ కంటె మనోహరంగా చెప్పాడు. (ఆది. 5.26) బిడ్డను గంగలో వదలిపెట్టేటప్పుడు వాత్సల్యానికీ అపవాద భీతికీ నడుమ ఏర్పడిన సంఘర్షణను నన్నయ రమణీయంగా విశేష వృత్తాలలో వ్యక్తం చేశాడు (ఆది. 5.28,29). నన్నయ విస్తరించిన చోట ఎఱ్ఱయ తలవంచి నడిచి, కుంతి మనస్సులో పరిపరివిధాల మథనపడిన వేదనను వివరించకుండా నన్నయ సూచించి విడిచిన చోట ఎఱ్ఱయ తన ప్రబంధ పరమేశ్వరత్వాన్ని ప్రదర్శించాడు. (ఆర. 7.342-348) ఆ పద్య సప్తకం చక్కని వత్సల రసఖండకావ్యం. ఆ పద్యాలలో తక్కిన అన్నీ ఒక యెత్తు; అంతటి అందగాడైన బాలుడు మునుముందు యువకుడై ఎందరి యువతుల మనసులు దోచుకుంటాడో ఎందరి వీరులను భయపెడతాడో అని భావించిన పద్యమొక్కటీ ఒక యెత్తు. అది ఎఱ్ఱన ముద్ర. అక్షరరమ్యత నందగించుకొన్న ప్రసన్నమధుర చతురరచన.

ఉ. 'లాలితయౌవనోజ్జ్వల విలాసములం దిలకించు సుందరా
భీలవిచేష్టితం బమర భీమమనోభవసింహరేఖమై
వ్రాలవె యింక నీ వెలమి వామవిలోచన లంగజన్మలీ
లాలసలై విపక్షులు భయాలసులై ధృతి యేది చూడఁగన్.' (ఆర. 7.345)

నన్నయ కుంతి పసికందును పసికందుగానే భావించి దుఃఖించింది. ఎఱ్ఱయ కుంతి పసిగ్రుడ్డులో భావి జీవితాన్నంతా కలలుగని కన్నీరుపెట్టింది. ఆమె కంటె ఈమె అధికురాలు.

కొన్ని సంస్కృత ప్రతులలో కానవచ్చే కొన్నికథలు ఎఱ్ఱయ ఆరణ్యపర్వశేషంలో చోటుచేసికొనలేదు. అవి ఎఱ్ఱయ అనుసరించిన మూలప్రతులలో లేకపోవచ్చును. లేదా ఆయనే ఔచిత్య దృష్టితో వదలి ఉండవచ్చును. దక్షిణాది ప్రతులలో సామాన్యంగా కానవచ్చే కథలు ఎఱ్ఱయ భాగంలో లేకపోవటం చేత వాటిని అతడు కావాలనే వదలినట్లు భావించటానికి వీలున్నది. అట్టి వాటిలో మార్కండేయుడు చెప్పిన ఇంద్ర బక సంవాదం, యయాతి చరిత్ర, సేదుక వృషాదర్భుల వృత్తాంతం, ఇంద్రాగ్నులు శిబిని పరీక్షించటం, శిబి మహిమాభివర్ణనం, దుర్వాసుడు దుర్యోధన ప్రేరితుడై వేలాది శిష్యులతో ధర్మజుడి ఆశ్రమానికి వచ్చి, భోజనాలయిన తరువాత ద్రౌపది విశ్రాంతి తీసికొంటున్న సందర్భంలో - వారందరికి మృష్టాన్న భోజనాలు పెట్టుమని అడగటం, చివరకు శ్రీకృష్ణ ప్రభావంతో కుక్షులు నిండి, పాండవులకు శ్రీకృష్ణుడి అండ ఉన్నదని తెలిసి తిరిగిపోయిన కథ మొదలైనవి. పరిశీలించి చూస్తే వీటిని వదలటంలోనే ఔచిత్యం ఉన్నది.

మార్కండేయుడి కన్న వృద్ధతము డెవరో తెలిసికొనగోరిన ధర్మజుడి ప్రశ్నకు సమాధానంగా ఇంద్రద్యుమ్నాదుల చరిత్ర చెప్పబడింది. దీర్ఘాయువుకు తోడ్పడే జీవన విధానాలను వివరించే ఇంద్ర బక సంవాదం వంటివి వదలటం సమంజసమే. క్షత్రియమాహాత్మ్యాన్ని చెప్పే శిబిచక్రవర్తి కథ ఆరణ్యపర్వంలోని నన్నయ భాగంలో చెప్పబడి ఉన్నది. కావున పునరుక్తిని పరిత్యజించటం న్యాయమే. దుర్వాసుడి కథ వ్యాస భారతంలో చేరిన ప్రక్షిప్త కథ కావచ్చును. అటువంటి కథలు తమిళ భారతంలోనూ, తెలుగులోని స్త్రీల పాటలలోనూ కనపడుతున్నాయి. దుర్వాసుడి కథ కృష్ణమహిమను, ద్రౌపదిభక్తిని చెప్పేది. పై కథలు లేకపోయినా ప్రధాన కథకు ఎటువంటి ప్రమాదం లేదు. ఆరణ్యపర్వంలోని వస్తుగాఢతకు అవి అంతగా తోడ్పడవు కూడా.

ఆరణ్యపర్వశేషంలోని ఈ మూడు గుర్తులూ ఎఱ్ఱన కర్తృత్వాన్ని బలపరచే ప్రమాణాలు.

### (8) మూడు రుచుల మువ్వన్నె సొబగు

కవిత్రయ కవిత ఆంధ్ర మహాభారతంలో త్రివేణీ సంగమంవలె కలిసింది. వస్తుధ్వని, కథాకథనరీతి గల నన్నయ కవిత గంగవలె సాగింది. రసధ్వని, నాటకీయ ఫణితి గల తిక్కన కవిత యమునవలె పొంగింది. అలంకారధ్వని, వర్ణనాత్మక ఫణితి గల ఎఱ్ఱన కవిత సరస్వతి వలె భాసించింది. ఎఱ్ఱనలో నన్నయ తిక్కనలు ప్రవహించారు. ఎఱ్ఱయ భారతీవృత్తిగా నిలిచాడు.

మూల భారతంలోని కథ వ్యాసుడిదైనా, తెలుగులో పండిన పద్యాలూ, అందులోని గుణాలూ కవిత్రయ ప్రతిభాజన్యాలే. అందులో శబ్దాన్ని శిల్పీకరించి గుణవృద్ధిని సాధించే తారకమంత్రం నన్నయ తెలుగు కవితకు ఉపదేశిస్తే, తిక్కన అర్థాన్ని ఆవిష్కరించే అనల్పగుణసిద్ధిని బ్రహ్మసూత్రంగా తెలుగు కవితకు ప్రబోధించాడు. ఎఱ్ఱన చతుర శబ్దార్థ గుణాలతో శోభాతిశయత్వాన్ని అలవరించే ఆర్జవం కవితకు ఆగమసూత్రంవలె నేర్పాడు. నన్నయ శబ్దగుణ మార్గం రథాలు నడిచే రాజమార్గంవలె తెలుగు కవితలో సాగింది. తిక్కన గారి అర్థగుణ మార్గం ఓడలు సాగే జలమార్గంగా మిగిలిపోయింది. రాజమార్గం నలుగురూ నడవటానికి, వింతలూ, వినోదాలూ, సాములూ, గరడీలు ప్రదర్శించటానికి వీలైన త్రోవ. అందువలననే ఎఱ్ఱన నన్నయ మార్గాన్ని అలంకరించి ఉత్సవయాత్ర సాగించాడు. తిక్కన మార్గం 'తన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదునాన్' సాగిందని పేర్కొన్నాడు. రసమార్గంలో విహరించ నేర్చినవారికి మాత్రం జలమార్గం నిపుణంగా పయనించటానికి వీలైన త్రోవ. పాదయాత్రతో బాటను తరించవచ్చును. యానపాత్ర ముంటేనే జలమార్గాన్ని తరించగలిగేది. శబ్దగుణం రచనకు యానపాత్ర. శబ్దగుణ ప్రస్థానానికి మహారథి నన్నయ. అర్థగుణ ప్రస్థానానికి కర్ణధారి అయిన అతిరథుడు తిక్కన. ఉభయగుణాలను ఉజ్జ్వలంగా పండించుకొని అలంకారకవచాన్ని తొడుక్కొన్న సమరథి ఎఱ్ఱన. సమరథి సామర్థ్యంలో అతిరథ మహారథుల జాడలు తోచినా నూత్నరుచితో వెలిగే ఒక మువ్వన్నె కాంతి ప్రకాశిస్తూ ఉంటుంది. ప్రబంధపరమేశ్వరుడి ఆరణ్యపర్వశేషం ఆ మువ్వన్నె వెలుగు!

డా॥ పాటిబండ మాధవ శర్మగారు ఆ ముప్పన్నె ముచ్చటను ఒక పద్యంలో త్రివేణీసంగమంవలె దర్శించారు-

శా. 'ప్రీతుండై చనుదెంచె నాశ్రిత జనాభీష్ట క్రియాశీలుఁ డు
దీతామ్నాయుఁడు, నిర్విధూత దురితక్లేశుండు, యోగామృత
స్ఫీతస్వాంతుఁ డనంత సంతత సమావిర్భూత కారుణ్యధా
రాతోయస్నపనైక శీలుఁ డగు పారాశర్యుఁ డచ్చోటికిన్'. (అర. 6.103)

"ఈ పద్యమునందలి ధార నన్నయది, విఱుపులు తిక్కనవి, పదము లిరువురివి, కూర్పు ఎఱ్ఱనది. ఈ పద్యమున కవిత్రయ మున్నది. కవిత్రయమున కాశ్రయమైన వేదవ్యాసు డున్నాడు." ఇది మూడు రుచుల ముప్పన్నెసొబగు.

## 11. రామాయణ కథ మధురమనోహరం

ఆరణ్యపర్వశేషంలో రామాయణ కథ పెద్ద ఉపాఖ్యానం. ఎఱ్ఱన దానిని షష్ఠాశ్వాసంలో కొంత భాగం, సప్తమాశ్వాసంలో కొంత భాగం చెప్పాడు. మూలంలో 19 అధ్యాయాలలో (సం. 3. 258-276) 727 శ్లోకాలలో వ్యాపించి ఉన్న రామకథను ఎఱ్ఱన 315 గద్యపద్యాలలో రచించాడు. అంటే - తెలుగులో వివరంగా వ్రాసినట్లే. ఎఱ్ఱన షష్ఠాశ్వాసంలోని ఆఖ్యానాన్ని విఖ్యాతమాధుర్య మనోహరంగానూ, సప్తమాశ్వాసంలోని ఆఖ్యానాన్ని సవిస్తరమధురంగానూ, ఉపన్యసించానని పేర్కొన్నాడు. ఉభయాశ్వాసాలలో వ్యాపించి ఉన్న రామాయణకథ ఉభయస్వభావాలనూ కలిగి ఉంటుంది. అయితే బాలకాండ నుండి కిష్కంధ కాండవరకు ఉన్న కథ ఒక భాగంగా, సుందర యుద్ధకాండలు మరొక భాగంలో ఎఱ్ఱన ఎన్నుకొన్నాడు. మొదటి భాగాన్ని 147 గద్యపద్యాలలో, రెండో భాగాన్ని 168 గద్యపద్యాలలో చెప్పాడు. పూర్వార్థం కంటె ఉత్తరార్ధమే విస్తరించింది.

రామాయణ కథను ఎందుకు చెప్పాడు? ఎట్లా చెప్పాడు? అనే ప్రశ్నలు ప్రస్తుతాలు. శ్రోత అడిగినట్లు ఈ కథను మార్కండేయుడు చెప్పాడు. మూలంలో ధర్మరాజు నాలుగు ప్రశ్నలు సూటిగా వేశాడు- "కస్మి న్నామ కులే జాతః? కిం వీర్యః కిం పరాక్రమః? రావణః కస్యవా పుత్రః? కిం వైరం తస్య తేనహి?" (3.258.4). ఈ ప్రశ్నలు తెలుగులో మారు రూపం తాల్చాయి. 'రాముం డెవ్వని వంశంబునవాఁడు? రావణుఁడెవ్వని తనయుండు? ఏమి నిమిత్తంబున సీతాపహరణంబు సేసె? రామరావణులకు సంగ్రామం బెట్లు ప్రవర్తిల్లె?" - అని ఎఱ్ఱన వేయించిన ప్రశ్నలు.

పాండవసైంధవ సంబంధాలు బావమరదుల సంబంధాలు. ఇరుతెగలవారు ఉత్తమ వంశజాతులే. అయినా సైంధవు డనౌచిత్యానికి పాల్పడ్డాడు. ఈ భూమికతో ధర్మరాజు రామరావణుల వంశప్రసక్తిని ముందుగా తెచ్చి ఉంటాడు. సైంధవుడి కథలో ఉభయ వర్గాల పరాక్రమాలను తులనాత్మకంగా చెప్పుకొన్న వైఖరి కనపడుతుంది. ద్రౌపది పాండవుల పరాక్రమాన్నీ, కోటికాస్య సైంధవులు సైంధవ పరాక్రమాన్నీ కీర్తించటం స్పష్టం. ఆ భూమికతో రామరావణ పరాక్రమాలను గురించి ధర్మజుడు మూలంలో అడిగాడు. తెలుగులో ఆ ప్రశ్న లేదు. మూలంలో రామరావణ వైరమెందుకు గలిగిందని ప్రశ్న. దానికి కారణం శూర్పణఖకు జరిగిన అవమానం, ఖరదూషణాది రాక్షస సంహారం. సీతాపహరణం ప్రతీకార వ్యూహంలో భాగం. అందువలన అది డొంక తిరుగుడు ప్రశ్న. ఎఱ్ఱన దానికి బదులు సీతాపహరణం ఎందుకు చేశాడని అడిగించాడు. శ్రోత- సైంధవుడు ద్రౌపదిని హరించటానికీ, రావణుడు సీతను హరించటానికీ ఉన్న భేదాన్ని తెలిసికొనదలిచాడు. ఆ తరువాత యుద్ధం జరిగింది. సైంధవ ఘట్టంలో కూడా విపుల యుద్ధం సాగింది. రామరావణ యుద్ధం కూడా అట్లాగే సాగి ఉండాలని భావించి ఆ వివరాలు ఎఱ్ఱనగారి ధర్మరాజు అడిగాడు. మూలంలోని ప్రశ్నలకంటె తెలుగులోని ప్రశ్నలు శ్రోతృహృదయంలో ఉన్న ఆకాంక్షను క్రమబద్ధం చేసి ఆవిష్కరించినవి. కథా జీవితానికి బాట వేసినవి.

ఆరణ్యపర్వశేషంలో రామాయణ కథ - కథ కొఱకు చెప్పింది కాదు, కళ కొరకు చెప్పింది. మూలంలో రూపుకట్టని ఎన్నో రూపచిత్రాలు తెలుగులో మధురంగా మనోహరంగా సజీవంగా కళ్ళ ఎదుట నిలుస్తాయి. దానికి కారణం ఎఱ్ఱయ ప్రబంధశయ్య. భరతుడు చిత్రకూటంలో శ్రీరామదర్శనం చేసికొనటం రామాయణంలో ఒక ప్రసిద్ధ ఘట్టం. ఆ సందర్భంలో శ్రీరామ రూపవర్ణనం మధురంగా ఉండాలి. కాని, మూలంలో- ''దదర్శ చిత్రకూటస్థం, స రామం సహలక్ష్మణమ్, తాపసానా మలంకారం ధారయంతం ధనుర్ధరమ్'' (సం. 3.261.37) అని చెప్పబడి ఉన్నది. వేషానికి తపస్విగా ఉన్నా ధనుర్ధారియై లక్ష్మణ సహితుడై ఉన్న రాముడిని చిత్రకూటంలో చూచాడని మాత్రం చెప్పి ఊరుకొన్నాడు మూలకర్త. ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడై రామమూర్తిని దర్శింపజేశాడు-

మ. 'కనియెం గోమలనీల మేఘ సుభగాకారున్ జటావల్కలా
జినధారున్ సితభూతి భూషితుని రాజీవాక్షుఁ గల్యాణకీ
ర్తనుఁ గాకుత్స్థ కులప్రదీపకుని సీతాలక్ష్మణోపేతు స
న్మని లోకార్చితు సత్కృపాభరణు రామున్ రాజచూడామణిన్.' (ఆర. 6.309)

ఎఱ్ఱయ్య మాధుర్య గుణంలో మనోహరంగా చిత్రించిన రామరూపచిత్ర మిది. కథలో ఆయువుపట్టులైన వ్యక్తుల దర్శనాలను 'కనియెన్' అనే క్రియతో ప్రారంభించటం ఎఱ్ఱయ తీరు. రామాయణంలో రాముడు, సావిత్రి కథలో యముడు ఒక ప్రబంధశయ్యలో భిన్న రసాలకు ప్రాణచిత్రాలుగా నిలిచారు.

మ. 'కనియెం గోమలి నీలమేఘ విలసత్కాలాంజనాకారు ఘో
రనిశాతోత్కట దంష్ట్రు నుజ్జ్వలచలద్రక్తాక్షుఁ బ్రత్యగ్రకాం
చనవర్ణాంబరు నంత్యకాల దహనజ్వాలా ప్రచండున్ జగ
జ్జన సంత్రాసను నొక్కదివ్యుఁ బటుపాశప్రౌఢ హస్తోద్ధతున్'. (ఆర. 7.217)

నన్నయ స్థిరచిత్రాల ప్రసన్న శిల్పి. ఎఱ్ఱయ మధురశిల్పి.

ఒక చిన్న ఉపాఖ్యానంలో రామాయణంలోని ప్రధాన పాత్రల అక్షర రూపశిల్పాలను నిలిపి ఒక ఆర్ట్‌గ్యాలరీ సృష్టించాడు ప్రబంధ పరమేశ్వరుడు. విభీషణుఁడు (6.278), ఋక్షవానరవీరులు (6.292), త్రిదండి వేషంలో రావణుడు (6.336), జటాయువు చేసిన గాయాలతో నిలిచిన రావణుడు (6.348), వాలిసుగ్రీవుల ఉగ్రరూపాలు (6.380), త్రిజటాస్వప్నంలో కనపడిన విభీషణ రాఘవ మూర్తులు (6.398, 399) అశోకవనంలో విషణ్ణమూర్తి సీత (7.28), సుషేణుడు (7.37); వానరవీరులు (7.64); కుంభకర్ణుడు (7.97), ఇంద్రరథం (7.146), కృశాంగి అయిన సీత (7.156). ఈ చిత్రాలు ఉపాఖ్యానాన్ని ఒక ప్రబంధంగా మార్చి వేశాయి. ఇంత తక్కువ కథలో ఇన్ని ఎక్కువ చిత్రాలు ఒక్కచోట కొలువు తీరటం అపూర్వం.

ఎఱ్ఱయగారి స్థిరరూప చిత్రాలు మధురంగా ఉంటే, చలచిత్రాలు మనోహరంగా ఉంటాయి. రామాయణంలో బంగారు లేడిని వర్ణించలేకపోతే అతడు కవే కాడని తెలుగువారు అనుకొంటారు. మూలంలో లేడికంటె వేగంగా కథ పరుగెత్తటంతో వర్ణనలకు తావే లేకపోయింది. భయంతో పరుగెత్తుతున్న బంగారు లేడిని ఎఱ్ఱన స్వభావోక్తి సుందరంగా మనకు చూపించి కన్నుల పండువు చేశాడు.

మ. 'పఱచున్ దవ్వుగఁ జేయలంతి నిలుచుం బట్టీక యాసాసలం
బిఱువోవుం బొదలందు డిందుఁ బొడమున్ బిట్టుల్కి వేదాఁటుఁ గ్ర
మ్మఱి చూచుం జెవి దార్చి నిల్చు మలయున్ మట్టాడుఁ గోరాడు నే
మఱినట్లుండుఁ దృణంబు మేయు నెలయున్ మాయామృగం బిమ్ములన్'. (ఆర. 6.327)

హరిణవర్ణనంలో తెలుగు సాహిత్యంలో మొదటి వరుసలో నిలిచే మోహన సృష్టి ఇది. మనోహరత్వానికి మారు పే రీ రచన. ఇటువంటివే మరి రెండున్నాయి. దేని కదే.

మధువనంలో విజయోత్సాహంతో విహరించే వానరవీరుల విచిత్ర సహజచేష్టల మనోహర వర్ణనం.

ఉ. 'తేనెలు గ్రోలి క్రోలి, కడుఁ దియ్యని కమ్మని పండు లింపు సొం
పానఁగ నాని యాని, పరపందిన నీడలు మెచ్చి మెచ్చి, మం
దానిలశైత్యసౌరభ సమగ్రతకుం గడుఁ జొక్కి చొక్కి, యు
ద్యానమునందు మారుతసుత ప్రముఖుల్ విహరించి తృప్తులై'. (7.11)

లాటానుప్రాస శబ్దవైచిత్రి వానరచేష్టలలోని మాధుర్యాన్ని మనోహరంగా మలచి ఆస్వాదనీయతను పెంచిందీ రచనలో. ఎఱ్ఱయ చలచ్చిత్రాలలో ఉత్తమమైనది - సీతాదేవి శోకానుభావ చిత్రం. తిక్కన ప్రక్కన ఎఱ్ఱనను నిలిపే సాత్త్విక భావచిత్రం.

సీ. 'కన్నీరు జడిగొని క్రమ్మఁ బ్రాఁ కెక్కిన । కమ్రకపోల భాగములు గలిగి
యవశమై యొఱఁగిన యంగవల్లిక పొంత । నున్న భూమీరుహం బూత గాఁగ
వెడలు నిట్టూర్పుల వేఁడిమిఁ బగిలిన । యధరపల్లవము గారాకుఁ బోలఁ
దలఁపుల సందడి దందడించిన తాల్మి । గదిరి శిరఃకంపగతుల బెరయ

ఆ. నున్న పుణ్యమూర్తి నుత్తమ సౌందర్య । నవనతాస్య నార్త యైనదానిఁ
గని విదేహతనయఁ గా నెఱింగితి నేను । హా రఘుప్రవీర యనుచు నడల'. (ఆర. 7.28)

తిక్కన అభినయ శిల్పాన్ని, అచ్చ తెలుగు పదాల పొందికను, రసాభ్యుచిత బంధాన్ని పుక్కిటపట్టిన ఎఱ్ఱయ రచన ఈ పద్యం - మాధుర్య మనోహరత్వాలకు మచ్చుతునక.

ఎఱ్ఱన తిక్కన యుద్ధ వర్ణనలలోని మేలిమి శిల్పాన్ని తెచ్చి తన రణ చైతన్య చిత్రాలు మలచి రామాయణ కథను రక్తికట్టించాడు. యుద్ధాలలో ద్వంద్వ యుద్ధాల కొక ప్రత్యేకస్థానం ఉన్నది. వాలిసుగ్రీవులు, రామరావణులు, లక్ష్మణమేఘనాదులు మొదలైన వీరుల జంట యుద్ధాలు మూలంలో మాటమాత్రంగా ఉన్నా, ఎఱ్ఱన వీర రౌద్రరసతరంగాలుగా మలచాడు. యుద్ధ ఘట్టాలలో వీరోచిత ప్రసంగాలకు కూడా ప్రాముఖ్యం ఉంటుంది. ఆంగికాభినయానికి అవి వాచికాభినయ గౌరవాన్ని కలిగిస్తాయి. వీటికి తోడు కవి స్వీయ ప్రతిభతో వీరవిభావాలను వర్ణించి ప్రత్యేకతను ప్రదర్శిస్తాడు. వీటికన్నిటికి ఎఱ్ఱయ రామాయణ కథలో ఎన్నదగిన ఉదాహరణ లున్నాయి. సంభాషణలకు- 6వ ఆశ్వాసంలోని 269, 318, 320, 338, 341, 405, 406, యుద్ధ చైతన్య చిత్రాలకు-6. 346, 347, 380-384, 7. 64,66, 82-84, 118, 127, 142 మొదలైనవి. పుష్పకారూఢులై అయోధ్యకు బయలుదేరిన సీతారామచంద్రుల దర్శనం ప్రబంధ పరమేశ్వరుడు మధుర మనోహరంగా చేయించాడు.

మ. 'అవిరోధంబుగ జానకీసహితుఁడై యాబద్ధరత్నప్రభా
నవపుష్పం బగు పుష్పకం బను విమానం బెక్కి యర్కాన్వయ
ప్రవరుం డిమ్ముల నేఁగె సమ్మదభరప్రాగ్భాగవారాకర
ప్లవమానుం డగుచుం బురంబునకుఁ బ్రాప్తశ్రీవిశేషోన్నతిన్.' (ఆర. 7.166)

ఆరణ్యపర్వశేషంలోని రామాయణం కథ యథావాల్మీకం కాదు. ''రామోపాఖ్యానమునందలి విశేషాంశములను స్వర్గీయ పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు విపులముగా చర్చించినారు. వాల్మీకి రామాయణములో లేని నూతనాంశములెన్నియో దీనియందు గలవు. అందులో కొన్ని- రావణకుంభకర్ణాదుల పూర్వజన్మ వృత్తాంతము, వాలిసుగ్రీవులు యుద్ధము చేయుచుండగా హనుమంతుడు సుగ్రీవుని హారాలంకృతుని చేయుట, త్రిజటాకథా సందర్భమున అవింధ్యుడను వృద్ధరాక్షసుని వృత్తాంతము మున్నగునవి. సీత యగ్ని ప్రవేశము చేసినట్లు ఎఱ్ఱన వ్రాయలేదు. రామాయణ సన్నివేశములను గూర్చి విభిన్న కథనములు ప్రాచీనము నుండియు వాడుకలో నుండునట్లు తోచును'' అని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగా రన్నారు. (ఆరణ్య పర్వపీఠిక- 'ఎఱ్ఱాప్రెగడ'- ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణం పు. 77).

ఎఱ్ఱన రామాయణం దొరకలేదన్న దిగులు ఈ కథ చదువుకొన్న తెలుగువారికి తీరిపోతుంది.

### 12. సావిత్రి కథ మధురమహోజ్జ్వలం

భారతీయ సాహిత్యంలో సావిత్రికి పతివ్రతామణులలో అగ్రతాంబూలం అందుతుంది. 'పతిభక్తి తాత్పర్యంబున నఖిల దుఃఖంబుల కోర్చి శుభంబులొందిన పుణ్యసతి చరిత్రం' (ఆర. 7.169)గా సావిత్రి కథ ఆరణ్యపర్వశేషంలో చెప్పబడింది. ఈ కథంతా చెప్పి మార్కండేయు డిట్లా అన్నాడు.

క. 'తనమగని, నత్తమామల । జననీ జనకులను దన్ను సకలంబును దా
ఘనముగ సముద్ధరించెను । జనవర! సావిత్రి ధర్మ చరితము కంటే!'

తే. 'ఆ పతివ్రతయట్ల యీ యాజ్ఞసేని । పరమకల్యాణ కర్మసంభావనీయ
యధిప! మిమ్ము్మను మీ యఖిలాన్వయంబు। నుద్ధరించు మహాభాగ్యయుక్తిఁ జేసి'. (ఆర.7.279,280)

'సావిత్రి ధర్మచరితము కంటే!' - అన్నాడు ఋషి. 'వింటే!' అనలేదు. అంటే - సావిత్రి ఆచరించిన ధర్మాన్ని దర్శించావా? అని భావం. చూచేది, వినేది భౌతిక దృష్టికి కనపడే ప్రవృత్తి ధర్మం. బుద్ధితో దర్శించేది నివృత్తి ధర్మం. సావిత్రి జీవితంలో నైష్ఠికురాలైన వ్రతశీలి. ఆ వ్రతం పతివ్రతమే. దానివలన లౌకిక, అలౌకిక, భౌతిక ఆధ్యాత్మిక ఫలాల నామె సాధించింది. దానిని దర్శించి తెలిసికొనాలి. అంటే - సావిత్రి కథ దర్శనమూల మని తాత్పర్యం. ఆధ్యాత్మిక అంతరార్థ దర్శనం కథాఫలమని ఫలితాంశం. సావిత్రి కథ లౌకికకథ కాదు; ఆధ్యాత్మిక ప్రతీకాత్మక అభివ్యక్తి.

సావిత్రిది ధర్మ చరితము - ధర్మాన్ని శీలంగా మార్చుకొన్న ప్రవృత్తి చరితము. చరితమంటే కథ అనే అర్థం లౌకికం. శీలం అనే అర్థం పారమార్థికం. ఆమె తమవారినందరినీ ఉద్ధరించింది. తమను తాము ఉద్ధరించుకొని ఇతరులను ఉద్ధరించేవారే ఉత్తములు. సావిత్రి అటువంటి ఉత్తమురాలు.

ఆమె తనపతిని ఉద్ధరించింది. ఎట్లా? ముందు ప్రేమించి, ఆ తరువాత వివాహమాడి, పతివ్రతగా ఆయన ననుసరించి, ఆపై మృత్యువు నుండి విముక్తుడిని చేసి ఉద్ధరించింది. వివాహమాడిన సంవత్సరానికి విగతజీవు డౌతాడని తెలిసి తెలిసి పెండ్లాడి, మృత్యుభయం లేకుండ పతివ్రతాన్ని చేపట్టి అమృతత్వాన్ని సాధించిన సావిత్రిశీలం పతివ్రతా దర్శనానికే ఒక ప్రతీక. సావిత్రి కథను వ్యాఖ్యానించాలంటే సావిత్రి ధర్మశీలాన్ని దర్శించి వివేచించాలి. ఎందరో మహానుభావులు వేదకాలం నుండి సావిత్రి కథాతత్త్వాన్ని వ్యాఖ్యానిస్తూనే ఉన్నారు. అది యుగయుగాల కథ.

సావిత్రికథలో కొన్ని గ్రంథగ్రంథులున్నాయి. సవితృసంబంధమైన శక్తి- అంటే పరిశుద్ధజ్ఞానం సావిత్రి. ఆమెను ఉపాసించాడు మద్రేశుడు పదునెనిమిదేండ్లు. 18 బ్రహ్మసంఖ్య. దానిసిద్ధి సావిత్రి దర్శనం. అతడు కొడుకును కోరాడు. ఆమె కూతురు నిచ్చింది. మద్రేశుడు తన వంశాన్ని ఉద్ధరించే కొడుకును కోరాడు. సావిత్రి ఉభయవంశాలను ఉద్ధరించగల పుత్రిక నిచ్చింది. మద్రేశుడికి ఆధ్యాత్మికంగా పుత్రిక విలువ తెలియదు. అందువలన తన కోర్కె సఫలం కాలేదని బాధపడి దేవితో మొరపెట్టుకొన్నాడు. ఆ మొర నాలకించిన సావిత్రి 'యోగమూర్తి, గాఢకారుణ్య వికచహృత్కమల'. ఈ మాటలు ఎఱ్ఱన ఎందుకు వాడినట్లు?

ఆత్మను పరమాత్మతో యోగం చేయగలశక్తి యోగశక్తి. ఆమె స్త్రైణమైన చైతన్యమూర్తిగా నిలిచి ఉన్నది. యోగవిద్య స్త్రీ శక్తి యొక్క చిత్కళయే. వివాహమంటే స్త్రీ-పురుషునితో యోగించటమే. జీవాత్మ పరమాత్మతో అద్వైత సిద్ధి పొందినట్లు. ఈ రహస్యాన్ని దానిశక్తిని, తత్ఫలాన్నీ స్త్రీ గార్హస్థ్య ధర్మనిర్వహణం ద్వారా జీవితానుభవంగా మారుస్తుంది. స్త్రీ పురుషునితో సంసారం చేయటం ఆధ్యాత్మికంగా వారిరువురు అమృతమూర్తులని, పరమాత్మ స్వరూపులనీ, ద్వైతం లేదనీ, ఉన్నా అది లౌకికమనీ నిరూపించటమే. ఆ తత్త్వమంతా చెపితే తెలిసికొనే వివేకం మద్రేశుడికి లేదు. అందువలన పుత్రుడి నివ్వటానికి బ్రహ్మ ఆజ్ఞ లేదని చెప్పింది సావిత్రి. అంటే అతడి కింకా బ్రహ్మజ్ఞానస్థాయిలో తత్త్వదర్శనం చేసే శక్తి రాలేదనీ, అది కుమార్తె వలననే కలుగుతుందని చెప్పింది. పుత్రిక కారణంగా కాలాంతరంలో నూరుగురు కొడుకులు కలుగుతారని తెలిపింది. అతడు కోరింది ఒక కొడుకునైతే, సావిత్రీదేవి ఇచ్చింది పుత్రశతాన్ని. దైవయోగం వలన కలిగించగలిగిన శక్తిమంతురాలైన పుత్రికను, ఒక పుత్రిక నూర్గురు పుత్రులతో సమానమన్నట్లు సూచించింది. నిజానికి - ఇవన్నీ దేవరహస్యంగా దాచవలసినవే. మద్రేశుడి దైన్యాన్ని చూచి తల్లివలె కరిగిపోయింది సావిత్రి. గాఢమైన దయతో వికసించిన హృదయంతో ఆ సంగతులన్నీ చెప్పింది. శక్తి రూపిణి అయిన స్త్రీ కరుణిస్తే మాతృవాత్సల్యం అమృతమై వర్షిస్తుంది.

సావిత్రీదేవి ప్రసాదంతో మద్రపతికి పుత్రిక పుట్టింది. ఆమె కూడా సావిత్రియే. పరాశక్తి వనితగా జన్మించి పతివ్రతం నిర్వహించి కులాన్ని ఉద్ధరిస్తుంది. అది ఒక యోగప్రస్థానం. వనితకు కన్యాత్వం, పురుషుడికి బ్రహ్మచర్యం పుట్టుకతో వచ్చే దివ్యలక్షణాలు. స్త్రీ తన కన్యాత్వాన్ని బ్రహ్మచర్యంతో యోగింప చేస్తుంది. అది ధర్మం, యోగం. బ్రహ్మలో చరించే పురుషతత్త్వంతో యోగమైన స్త్రీ- బ్రహ్మంలోనే చరిస్తుంది. అప్పుడు పురుషుని కంటె స్త్రీ తత్త్వతః భిన్నం కాదు. దీనిని సాధించటానికే ఉపవాసవ్రతం. దేవుడితో కలిసి వసించటం ఉపవాసం. పరమాత్మ చైతన్యమైన భర్తతో కలిసి పరమాత్మ చైతన్యంగా జీవించే జీవాత్మ యోగసాధనమే ఉపవాస వ్రతం. సావిత్రి త్రిరాత్రోపవాసం చేస్తుంది. దీని తాత్పర్యం యోగపరంగా చెప్పుకొనాలి. శరీరాలుగా రెండుగా బ్రతికే భార్యాభర్తలలో భార్య ఉపవసించటం వలన మొదటి రాత్రి దేహభావం తొలగిపోతుంది. రెండవ రాత్రి ఆత్మభావంలో అభేదస్థితి కలుగుతుంది. మూడవ రాత్రి అద్వైతసిద్ధి ఏర్పడుతుంది. ఈ సాధన సావిత్రీదేవీ దత్తమైన ఆత్మజ్ఞానం వలన పుట్టుకతోనే తెలిసికొనిన స్థితప్రజ్ఞురాలు మద్రేశుడి కూతురు సావిత్రి.

సావిత్రి యుక్తవయస్కురాలుకావటం గార్హస్థ్య ధర్మాన్ని ఆశ్రయించి పతివ్రతాన్ని ప్రారంభించే సమయ మాసన్నం కావటం. ఆమె తనంతట తాను ఎన్నుకొన్న వరుడు సత్యవంతుడు. నిత్యసత్యస్వరూప జ్ఞానానంద చైతన్యం సత్యవంతుడనే భర్త. అతడల్పాయుష్కుడని, సంవత్సరంలో చనిపోతాడని నారదుడి హెచ్చరిక. అప్పుడు సావిత్రి అన్నమాట లివి -

క. 'వినుము మనోవాక్కాయము। లను మూఁడుదెఱంగు లందు నంతఃకరణం
బనఘ! ప్రధానము గావున। మనసునఁ గైకొన్న భర్త మానుటఁ దగునే?'. (ఆర. 7.183)

భర్తృభావన శరీరస్పృహతో, వాక్స్పృహతో, అంతరంగ స్పృహతో మూడంచెలలో ఉంటుందనీ, అందులో చివరిదే భర్తృ భావనకు ముఖ్యమనీ సావిత్రి చెప్పింది. ఆ భావన యోగులైన వారికే ఏర్పడుతుంది. నారదుడు దానిని గుర్తించి, వెంటనే

ఆమెకు సత్యవంతుడితో వివాహం చేయుమని అనుమతించాడు. 'కమలానన చేసిన పుణ్యగౌరవంబున నయినం బ్రియుండు పరిపూర్ణచిరాయు రుపేతుఁడయ్యెడున్' - అని ఆశీర్వదించాడు నారదుడు.

అనుకొన్న ప్రకారం వివాహమైపోయింది. సావిత్రి వనవాసయోగ్యమైన నారచీరలు కట్టి, దీక్షావ్రతంతో పతిసేవ చేస్తున్నది. త్రిరాత్రోపవాసవ్రతం చేసింది. ఆ తరువాత భర్తతో కలిసి అడవికి పోయింది. పెద్దలు ఆమెకు 'సౌభాగ్య భాగ్యవర్ధనం' కావాలని ఆశీర్వదించారు. పతియొక్క పరిపూర్ణానురాగం సౌభాగ్యం. దానిని పూర్తిగా పొందటం భాగ్యం. అంటే పతివ్రత తనకును భర్తకును యోగసిద్ధిలో ఎటువంటి భేదం లేదని అనుభవంలోకి తెచ్చుకొనటం. దీనినే భార్యాభర్తల అద్వైతసిద్ధి అంటారు.

సత్యవంతుడు మృతి చెంది దేహాన్ని వదలుతాడు. సావిత్రి దేహంతో బ్రతికి ఉంటుంది. అద్వైతసిద్ధి పొందిన తరువాత, శరీరావరణ భావం పోయి ఆధ్యాత్మిక స్థితియే ఆమెలో జాగృతమై ఉంటుంది. అందువలన మృత్యువు అటువంటి దంపతులను విడదీయలేడు. అందుకే దూతలను పంపక తానే వచ్చాడు. తన రాక గమనించి దర్శించగలిగిన సావిత్రి ఆత్మజ్ఞానానికి ఆశ్చర్యపోయాడు యముడు. సత్యవంతుడి ప్రాణాలను బంధించి యముడు తనవెంట తీసికొనిపోతున్నా, సావిత్రి ఆయన వెంటనే ఎటువంటి అవరోధాలు లేకుండా పోగలిగింది. ఎట్లా? ఆ ప్రశ్నయే సావిత్రి కథలో యక్షప్రశ్న.

" By her power of austerity, it appears that her life and her husband's life is inseparable and hence God of Death had to surrender and give her the boon of restoring her husband to life". (The light of Ramayana P.325) అని జస్టిస్ పమిడిఘంటం కోదండ రామయ్యగారు మంచి తీర్పు చెప్పారు. యమపాశబద్ధుడైన సత్యవంతుడి జీవుడు సావిత్రి జీవుడి కంటె భిన్నుడు కాడని సావిత్రి తన త్రిరాత్రోపవాసయోగసిద్ధి వలన యముడి కర్థమయ్యేటట్లు చేసింది. అందువలననే భర్తవెంట యోగయానం చేయగలిగింది. సావిత్రి యముడివెంట పోవటం లేదు. యముడే సత్యవంతుడితోపాటు సావిత్రిని కూడా తత్త్వతః తీసికొనిపోతున్నాడు. కాగా, సావిత్రి జీవుడికంటె సత్యవంతుడి జీవుడు కూడా భిన్నుడు కాడు. ఆ సత్యం సత్యవంతుడి అనుభవంలో లేదు. అందువలన అతడు పేరుకు సత్యవంతుడు. అర్హతకు సత్పురుషుడు, సత్యసాధకుడు. దాని ఫలమే యమపాశబద్ధత. సావిత్రి అమృత జీవి. ఆమెతో అభిన్నుడైన సత్యవంతుడు మృతస్థితిని పొందటానికి వీలులేదు. సత్యవంతుడి మృతి ఆపాదితమే కాని సహజం కాదు. ఆ స్థితి సావిత్రి పతివ్రతాయోగసిద్ధివలన అతడికి కలిగింది. యముడు సందిగ్ధంలో పడ్డాడు-' 'సత్యవంతుడి ప్రాణాలు తీయబోయి సావిత్రి ప్రాణాలు కూడా తీశానా?' అని. పరీక్షించి చూచాడు. సావిత్రి పతివ్రత యోగప్రస్థాన సిద్ధులను క్రమంగా ఆవిష్కరిస్తూ వస్తున్నది. గమనించాడు.

క. 'పతు లెందుఁ జనిన నచటికి । సతులుం జనవలదె? నీ ప్రసాదమునను మ
త్పతిభక్తి కతమునను సం । స్తుతగుణ! నా కరుగరాని చోటుం గలదే?' (అర. 7.222)

పై పద్యంలోని వాక్యాలు ఎఱ్ఱన చతురోక్తులు. కాకువులు వాటి ప్రాణాలు. చనవలదె? అరుగరాని చోటుం గలదే? అనే మాటలు రెండర్థాల నిచ్చేవి. భర్త ఎక్కడికి వెళ్ళితే అక్కడికి భార్య వెళ్ళకూడదా? ఇది ఒక లౌకికార్థం. తప్పకుండా వెళ్ళాలి అనో, వెళ్ళకుండా ఆపవచ్చునా? అనో (చనన్+వలదె?) ఏర్పడే అర్థవిశేషం ధర్మపరమైన అర్థం. వెళ్ళకూడని చోటున్నదా అని లౌకికార్థం. ధర్మప్రసాదం చేత, పతిభక్తి ప్రభావం చేత (పురుషకారదైవానుకూల్యాల అనుసంధానం వలన) వెళ్ళలేని చోటు ఉన్నదా? అని ధర్మపరమైన అర్థం. లౌకికార్థం తెలిసినవారు లౌకికులు. అందులోని ధర్మతత్త్వం తెలిసినవారు ధర్మదేవతలు. వారు లోకంలో సజ్జనులవలె దర్శనమిస్తారు. వారిదర్శనం పాపనాశనం చేస్తుంది. ఏదోవిధంగా ఫలాన్నిస్తుంది. ఇది ధర్మవర్తనం వలన కలిగే యోగం. దానిని చతురోక్తి పథంలో పలికింది సావిత్రి. యము డాశ్చర్యపోయాడు-ఆమె చతుర (ప్రగల్భ) వచనాలకు. ఆమె ఉదారవాగ్భంగికి మెచ్చి పతిప్రాణాలు తప్ప ఏదైనా వరమిస్తానన్నాడు. సాళ్వభూపతికి కనుచూపు వచ్చేటట్లు వరం కోరింది సావిత్రి. యముడు దానిని ప్రసాదించాడు. కథలో ధర్మసూక్తి సావిత్రిది. చతురోక్తి ఎఱ్ఱయది.

వరమిస్తే భర్తనుండి వేరుపడుతుం దనుకొన్నాడు యముడు. ఆమె మరల యోగయానం సాగించింది. మొదటివరం పతివ్రతాధర్మంలోని సహగమన ధర్మానికి అందినఫలం. ఆపైన సావిత్రి ఆర్యధర్మాన్ని గురించి ప్రస్తావించింది. యముడు ఆర్యుడు కావటంతో ఆశ్రితుల కోర్కెలు తుదముట్టతీర్చటం ఆయన కర్తవ్యం. అతడు ధర్మదేవత. ధార్మికు లాచరిస్తున్న ధర్మానికి అనుగుణమైన ఫలాన్ని అందించాలి. అతడు జీవులకు కర్మఫలాలను సమంగా సమకూరుస్తాడు కాబట్టి సమవర్తి. భూతాలను నియమిస్తాడు కాబట్టి యముడు, పాపాలను శమింపచేస్తాడు కాబట్టి శమనుడు. ఈ మాటలతో సావిత్రి యముడిని ప్రశంసించింది. ఇది పైకి ప్రశంసే కాని, లోనారసి చూస్తే పతివ్రత స్వీయధర్మంతో సాధించే యోగశక్తుల ఫలాన్ని ప్రకటించటం. అంటే పతివ్రతా ధర్మయోగంవలన సర్వార్థసిద్ధి, సర్వధర్మ సమభావం, సత్కర్మాచరణశీలం, శమదమాది తపస్సిద్ధులు కలుగు తాయని సావిత్రి చెప్పింది. అవి ఆమె సాధించిన సిద్ధులు. వాటికి తగిన ఫలాన్ని గుర్తించి ఇవ్వటం ధర్మదేవత ధర్మం- అని పలికింది. ఇవి చమత్కార వాక్కులు కావు. మధురోక్తులు.

ఆ మాటలు విని, దప్పికవేసినవాడు చల్లని నీరు త్రాగి ఎంత సంతోషపడతాడో అంత ఆనందం పొందా డా ధర్మదేవుడు. ఆమె మాటల చమత్కారాన్ని చూచి కాదు, ఆమె పొగడ్తలకు ఉబ్బిపోయి కాదు. సావిత్రి ధర్మాన్ని వాఙ్మనః క్రియలలో సమంగా సాధించి ఆచరిస్తున్నందుకు. అందుకే ఆర్ద్రుడై పతిప్రాణాలు తప్ప ఏ వరమైనా కోరుకొనుమన్నాడు. ద్యుమత్సేనుడు కోల్పోయిన రాజ్యం తిరిగి అతడికి లభించేటట్లు కోరింది. యము డావరాన్ని ప్రసాదించాడు. పతిభక్తికి తగిన ఫలాన్ని పొందావు, ఇక తిరిగి పొమ్మని సావిత్రిని కోరాడు.

ఆమె తాను తిరిగిపోవటం తన ధర్మం కాదని ప్రతిపాదించింది. 'ధర్మాత్ములు తాము చేసే ధర్మాన్ని ఏ పరిస్థితులలోనూ వదలకూడదనీ, ఆ దీక్షలో మోహతాపాలకు తావుండరాదనీ ధర్మం తెలిసినవారు చెప్పుతారు. ప్రథమ ధర్మాధ్యక్షుడైన యమధర్మరాజే ఆ ధర్మస్థితిని రక్షించకపోతే ఇక మరెవరు దిక్కు?' అని ప్రశ్నించింది.

క. 'కావునఁ బతియనుగమనం । బేవిధమున విడువఁ దగునె? యెట్లయినను మో
హావేశముఁ బొందక ధ । ర్మావస్థితి సలుపవలదె? యవహితబుద్ధిన్.' (ఆర. 7.238)

ఈ పద్యంలో పతి అనుగమనం చేయకుండా విడవటం ధర్మమేనా? మోహావేశాలకు లోనుకాకుండా ధర్మాన్ని నిలపటం ధార్మికుల కర్తవ్యం కాదా?- అని తన ధర్మాచరణస్థితి యొక్క నిత్యత్వాన్ని స్థిరపరిచింది. 'పతి అనుగమన' మంటే మృతియా? యమపాశబద్ధతయా? పతి ఎక్కడికి పోతున్నాడని సతి ఆయన వెంటపోవాలి? ఈ ప్రశ్నలన్నీ తలయెత్తుతాయి. సావిత్రికి పతిస్థితియే సతిస్థితి. ఆతడు మృతుడైతే సతి మృతిపొందటమే ధర్మం. యము డామె ప్రాణాలను కూడా తీసికొనిపోవాలి కాని, రాకూడదని అడ్డుపెట్టకూడదు- అని ఆమె తాత్పర్యం.

సతీపతుల మధ్య సావిత్రి సాధించిన అభేదభావస్థితిని యముడు గమనించాడు. ఆమెను 'ప్రకటధర్మవిశేష తత్పరు' రాలని అభినందించి, పతిప్రాణం తప్ప మరొకదాన్ని కోరుకొనుమన్నాడు. మద్రేశ్వరుడికి పుత్రశతం కలగాలని కోరింది. ఆ వరాన్ని ధర్ముడిచ్చాడు. మూలంలో సావిత్రి అయిదు వరాలు కోరింది. మద్రేశ్వరుడికి శతపుత్రలాభం వరంగా ప్రసాదించిన తరువాత సావిత్రి తనకు కూడా శతపుత్రలాభాన్ని వరంగా కోరుతుంది. యముడు దానినీ ఇస్తాడు. ఆ తరువాత భర్త లేకుండ పుత్రు లెట్లా కలుగుతారు? అది ధర్మవిరుద్ధం కాదా? అని ప్రశ్నించి యముడిని ఉచ్చులో పడవేస్తుంది. చివరకు తప్పనిసరియై సత్యవంతుడి ప్రాణాలను తిరిగి ఇచ్చాడు. ఎఱ్ఱన ఈ భాగం వదిలాడు. ఆ ప్రశ్న అడిగిన సావిత్రి అచ్చమైన లౌకిక ప్రజ్ఞ ప్రదర్శించింది. ఉదాత్తత కోల్పోయింది. అందువలన ఎఱ్ఱన వదలిఉంటాడు.

సతీసహగమనానికి ధర్మయోగపరమైన వ్యాఖ్యానం చేసింది సావిత్రి. యమధర్మరాజు ఉక్కిరిబిక్కిరయ్యాడు. కాలంతీరిన సత్యవంతుడిని తీసికొనివెళ్ళే హక్కు ఉంది కాని, కాలం తీరనిది మరణంలో సతిని పతితో అనుగమనం చేయించే హక్కు యముడికి లేదు. యముడు అప్పుడొక చమత్కారం చేశాడు. 'సావిత్రీ! నీవు నీపతి వెంట చాల దూరం నడిచివచ్చావు. నీ అనుగమన ధర్మంలో చాల అలసిపోయావు. ఇక తిరిగి పొ'మ్మన్నాడు. ఆమె వెంటనే స్పందించింది. భర్త నాశ్రయించిన ఆమెకు అలసట లేదనీ, 'సతులకు నన్యమెట్టిదియును ధర్మమె భర్తృ సంశ్రయము కాక' అనీ తేల్చిచెప్పింది.

సావిత్రి పతివ్రతాధర్మ ప్రస్థానంలో సాధించింది అద్వైతయోగసిద్ధి. దానివలన ఆమెకు అమృతసిద్ధి కలిగింది. ఆమెవలన కలిగిన యోగంతో సత్యవంతుడు మృతుడు కాలేడు. దానిని ధర్ముడు గుర్తించి పరిష్కారం కొరకు యోచించాడు. సావిత్రి ఆత్మధర్మనిరతులైన పుణ్యాత్ముల వర్తనాన్నీ, సాప్తపదీన న్యాయాన్నీ ఉపన్యసించింది. 'పతివినాకృత' (పతిలేకుండా చేయబడిన వనిత) లోకంలో ఎట్లా దూషిత ఔతుందో, సర్వమంగళ విశేషాలకు దూరమౌతుందో చెప్పింది. ధర్మాచరణానికీ, తత్ఫలసిద్ధికీ జీవితంలో ఇహపర సంబంధం ఉంటుందని విడమరచి చెప్పింది. భార్యాభర్తలు కలిసి ఇహంలో ఉంటేనే, పరంలో అనుభవించదగిన అద్వైతయోగసిద్ధి కలుగుతుందని వివరించింది. ఆమెలో పతివ్రతా ధర్మం అమృతయోగంగా నిలిచింది. అది లౌకికంగా ఫలించాలి. అదే సిద్ధులు సాధకుల కివ్వగలిగిన వరం. ధర్ముడు ప్రసన్నుడైనాడు. పూర్ణఫలాన్ని అందించాడు.

చ. 'కొను మిదె నీ మనఃప్రియునిఁ గోమలి, వీఁడు చతుశ్శతాబ్దముల్
మను నిటమీఁదఁ; బుత్రులఁ గ్రమంబున నూర్వురఁ గాంచుఁ; గీర్తివ
ర్ధనుఁ డగు, సంతతాధ్వర వితానములం బరితుష్టిసేయు న
య్యనిమిషకోటి కెల్లను, నిజాన్వయమౌళివిభూషణంబగున్'. (ఆర. 7.251)

ఈ పద్యం తరువాత జరిగిన కథ అంతా సావిత్రి సాధించిన వరాల ఫలానుభవమే. ఆ వరుసనంతా మధురంగా చెప్పి ఎఱ్ఱన సావిత్రి కథను సర్వాంగసుందరం చేశాడు.

ఎఱ్ఱన సావిత్రి కథలోని తాత్త్వికార్థాన్ని ధ్వనిమయం చేయగల చతురోక్తులను రచనలో మణులవలె నిబంధించాడు. ఆ కాంతులలో కథలోని బోధ వెలుగులోకి వచ్చింది.

సావిత్రి కథను ఎన్నుకొని అరవిందయోగి ఒక మహాకావ్యాన్ని ఆంగ్లంలో రచించారు. ప్రపంచసాహిత్యంలో సమున్నతాధ్యాత్మికేతిహాసంగా అది ప్రసిద్ధికెక్కింది. ఆయన భావంలో సావిత్రికథ అమృతత్వసాధన యోగం. పరాశక్తి ప్రాపంచికక్లేశ విమోచనార్థం మానవరూపంలో సావిత్రిగా అవతరించింది. మూర్తీభవించిన సత్యమే సత్యవంతుడు. మానవలోకంలో సత్యాన్ని స్థాపించటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్న మానవప్రవృత్తికి ప్రతినిధి సత్యవంతుడు. అతడు విధివశాత్తు మరణిస్తాడు. అయితే ఆ మానవయత్నం విషాదాంతం కారాదు. అందువలన మూర్తీభవించిన దివ్యానుగ్రహమైన సావిత్రి అసత్యసూత్రధారి అయిన యముడితో పోరి, తన తేజస్తత్త్వంతో మృత్యుదేవతా స్వరూపాన్ని లయం చేసి, మానవుడికొరకు, మానవ జగత్తు కొరకు అమృతత్వాన్ని సంపాదించింది.

సావిత్రి మగడిని ఉద్ధరించటమంటే ఈ విధంగా నిశ్చయించగలిగితే మిగిలినవారిని ఉద్ధరించిన కథకు భాష్యం చెప్పటం సులభం. దైవానుగ్రహం లేని సత్యసాధకుడు సత్యవంతుడు. ఆ కొడుకును నమ్ముకొన్న తల్లిదండ్రులకు రెండు కళ్ళూ పోయాయి. అంటే వారికి ఇహపరాలూ గ్రుడ్డివైపోయాయి. ఇహసుఖాలు దూరమయ్యాయి కాని, వారు తపస్సుకూ, జ్ఞానార్జనకూ అనువైన అడవిలో ఉండటంవలన సత్సంగభాగ్యం లభించింది. దానికి ఫలంగా దివ్యానుగ్రహరూపురాలైన సావిత్రి సత్యవంతుడిని చేరింది. ఆమెను ప్రేమతో ఆరాధించాడు సత్యవంతుడు. ఆమె 'యోగమూర్తి', 'గాఢకారుణ్యవికచహృత్కమల'

అయింది. సత్యవంతుడితో యోగించి తన అమృతత్వయోగసిద్ధిని పంచింది. తాను మృత్యువును మెప్పించింది. సత్యవంతుడికి అమృతత్వసిద్ధిని పొందించే యోగాన్ని ప్రసన్నబుద్ధితో అందించింది. అతడు తల్లిదండ్రులకు ఆత్మచక్షువుల వంటివాడు. అతడి వలన ద్యుమత్సేన దంపతులు లౌకిక ఆధ్యాత్మిక దృష్టులను పొంది సావిత్రీ సత్యవంతుల ధర్మయోగాన్ని ఆరాధించారు. వారికి రాజ్యసుఖాలు అందాయి. సావిత్రి అత్తమామలు ఇహపరసుఖాలు పొందారు. మద్రపతి పుత్రశతాన్ని పొందాడు. అతడికి కోరిక అదే. సావిత్రి స్వయంగా గార్హస్థ్యధర్మాచరణంలో సతి పతివ్రతాయోగం ద్వారా సాధించగలిగిన పూర్ణఫలం సాధించింది. దానికి సుమంగళీత్వమని పేరు పెట్టింది. లోకంలోని సాధ్వుల కందరికీ అది ఒక సాత్త్విక యోగమనీ, దానివలన జగత్కల్యాణం కలుగుతుందనీ, తన జీవితమే ఒక సందేశంగా చెప్పింది. ద్రౌపది కూడా పతివ్రతా ధర్మమార్గానుశీల. ఆమె పతులను భక్తితో సేవించి క్రమంగా ధర్మానురక్తినీ, కర్మాభిరతినీ, భక్తిప్రవృత్తినీ, జ్ఞానరతినీ, ఋజుమతినీ సాధించి, తననూ తన వంశాన్నీ ఉద్ధరించగలుగుతుందని మార్కండేయుడు చెప్పాడు. ఇది ఉపాఖ్యాన తత్త్వం. కథ మధురం. బోధ మహోజ్జ్వలం. ఎఱ్ఱన తీర్చిదిద్దిన విధం మధురమహోజ్జ్వలం.

### 13. ఆరణ్యపర్వం : అంతరార్థం

క. 'ఆరణ్యపర్వ మనఁగా । నారణ్యప్రముఖ షోడశాంతః పర్వా
ధారమయి సకలసూరి స । భారమ్యం బగు తృతీయపర్వము వెలయన్.' (ఆది. 1.40)

అని నన్నయభట్టు పర్వసంగ్రహంలో చెప్పినట్లు ఆరణ్యపర్వం సకలసూరిసభారమ్యం. పండితసభలలో రమ్యత కవితావిలాసాలను వివేచించటంలోనే కాక, తత్త్వవివేచన చేయటంలో కూడ దర్శనమిస్తుంది. అందువలన భారత, రామాయణ, భాగవతాది పవిత్రగ్రంథాలలో నిబంధించబడే ఆధ్యాత్మికమైన అంతరార్థాలను మథించి వెలికితీసి ఆత్మానంద నవనీతాన్ని అందించటం సూరిసభల సంస్కృతి. మహాభారతంలోని అంతరార్థాన్ని గురించి అనేక విశేషాలను వ్యాఖ్యానించి చెప్పిన పండితులు దేశంలో ఎందరో ఉన్నారు. వారిలో డా॥ వేదుల సూర్యనారాయణ శర్మగారొకరు. వారు 'అంతరార్థ మహాభారతము' (ముక్తి సాధనామార్గము) అనే గ్రంథాన్ని క్రీ.శ. 1985లో రచించారు. అందులో భారతంలోని ప్రసిద్ధ కథాంశాలకన్నిటికి ఆధ్యాత్మికమైన అంతరార్థాలను చెప్పారు. వాటిలో ఆరణ్యపర్వ కథార్థాలకు వా రిచ్చిన అంతరార్థ విశేష సూచిక-

| | ఆరణ్యపర్వకథాంశం | ఆధ్యాత్మిక సాధన రూప అంతరార్థం |
|---|---|---|
| 1. | సూర్యోపాసన | - జ్ఞానధ్యాన సాధన |
| 2. | పాశుపతాస్త్రప్రాప్తి | - ఇంద్రియ వశీకరణ సాధన |
| 3. | నలోపాఖ్యానం | - అసంగతత్త్వ సాధన |
| 4. | తీర్థయాత్రా ఫలం | - ఆత్మగుణలాభసాధన |
| 5. | అగస్త్యుని మాహాత్మ్యం | - నిశ్చలతత్త్వంతో మాయానాశన సాధన |
| 6. | వింధ్యగర్వాపహరణం | - తార్కికహేతువాద ఖండనా సాధన |
| 7. | అగస్త్యుడు సముద్ర జలపానం చేయటం | - నిశ్చలతత్త్వసాధనలో భగవంతుని ఆవరించిన మాయను నాశనం చేసే సాధన |
| 8. | పరశురామోపాఖ్యానం | - పరమానందానుసంధాన సాధన |
| 9. | సుకన్యోపాఖ్యానం | - అద్వైతసిద్ధి సాధన |

| | | |
|---|---|---|
| 10. | సోమకోపాఖ్యానం | - ప్రకృతి ప్రలోభనంతో సాధనాభ్రష్టతను నివారించుకొనే సాధన |
| 11. | సౌగంధిక పద్మాపహరణం | - వ్యష్టిగతానందంలో సమష్టిగత నిర్విషయ బ్రహ్మానంద సంధాన సాధన |
| 12. | జటాసురవధ | - త్రిపుటీగత మాయావినాశన సాధన |
| 13. | నివాతకవచ కాలకేయుల వధ | - కుంభకయోగగతి తామసికవృత్తివినాశసాధన |
| 14. | మత్స్యోపాఖ్యానం | - అహంకార మమకార విచారణ సాధన |
| 15. | భర్తృవశీకరణం గూర్చి సత్యభామా ద్రౌపదుల సంభాషణ | - పరమాత్మవశీకరణ సాధన |
| 16. | ఘోషయాత్ర | - తామసిక దుష్కార్యనివారణ సాధన |
| 17. | సీతారాముల చరిత్ర | - ప్రకృతి పురుషైక్య సాధన |
| 18. | సావిత్ర్యుపాఖ్యానం | - పరమాత్మను చేర్చే నిస్స్వార్థసాధన |
| 19. | ఇంద్రునిచే కర్ణుని కవచకుండలాల అపహరణం | - ముక్తిని కోరే మనస్సు ద్వారా కుంభక యోగ గత దోషనివారణ సాధన |

మహాభారతం ప్రతిపర్వరసోదయం. ప్రతిపర్వం అంతరార్థ మహోదయం.

## 14. కవిత్రయ మహాభారతం : వ్యాఖ్యానం

ఆంధ్రుల ఆదికావ్యమైన ఆంధ్ర మహాభారతానికి సమగ్రవ్యాఖ్య వెలువడటం ఆంధ్ర సాహిత్య చరిత్రలో అరుదైన ఘట్టం. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యానుగ్రహ పూర్ణఫలంగా ఇది తెలుగువారికి అందటం అదృష్టవిశేషం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు సాగించే బృహత్తర ధర్మప్రచారయజ్ఞంలో ఈ అక్షర సమారాధనం ఆంధ్రావళికి మోదాన్ని కలిగించే అమృతసంభావనం. ఈ పవిత్ర మహత్తర పుణ్యకార్యంలో స్వామిపక్షాన కార్యకర్తలై ఈ భారతభారతిని సేవిస్తున్న మాన్యులు, మహనీయులు- టి.టి.డి. బోర్డ్‌ఛైర్మన్, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, సంపాదకవర్గ సభ్యులూ, సలహామండలి సభ్యులూ, అంతేకాక ఎన్నో విధాల ఈ కార్యక్రమ విజయానికి నిరంతరం కృషి చేస్తున్న అధికార, అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాంజలులు.

ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి ఆమోదించి, ప్రోత్సహించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకులకూ, కంట్రోలర్ ఆఫ్ పబ్లికేషన్స్‌కూ నా ధన్యవాదాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటిగా- రెండు భాగాలలో - వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. ఆరణ్యపర్వం మూడవ సంపుటిగా సిద్ధమయింది. అందులో నన్నయ రచించిన ఆరణ్యపర్వభాగం మొదటి భాగంగాను, నన్నయ పేర ఎఱ్ఱయ పూరించిన ఆరణ్యపర్వశేషం ఈ రెండవ భాగంగానూ వెలువడుతున్నాయి. ఈ విధంగా ఆరణ్యపర్వం రెండు భాగాలుగా రావటం కూడా ఇదే ప్రథమం. ఒక క్రొత్త ఒరవడి కూడా. ఆరణ్యపర్వశేషాన్ని రచించి ప్రబంధపరమేశ్వరుడుగా ప్రసిద్ధి పొందిన ఎఱ్ఱాప్రెగ్గడ కవితా వ్యక్తిత్వాన్ని విస్తృతంగా, సమన్వయాత్మకంగా, సాధ్యమైనంత విషయ సమగ్రంగా చిత్రించే పీఠికతో వెలువడటం ఇందులో విశేషం. సహృదయులు ఈ ప్రయత్నానికి సంతోషిస్తారని ఆశిస్తున్నాను.

విద్వత్కవులు, పండితులు, రాష్ట్ర అధికార భాషా సంఘం మాజీ అధ్యక్షులు అయిన డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యుల వారు ఆరణ్యపర్వానికి రమణీయ వ్యాఖ్య రచించారు. వారు మొదట సరళగ్రాంథిక భాషలో వ్రాయగా, దానిని శిష్ట

వ్యావహారికంలోకి మార్చటం జరిగింది. దానికి వారు దయతో అంగీకరించారు. దీనిని శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురించటం ముదావహం. వారికి నా కృతజ్ఞతలు.

ఆరణ్యపర్వశేషం ప్రూఫులు సరిచూడటంలో తోడ్పడిన విద్వన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారికి, డాక్టర్ వి. సీతాకల్యాణి గారికి, డాక్టర్ జె. రామ సుబ్బలక్ష్మి గారికి, శ్రీమతి జి. సుశీల, శ్రీమతి లక్ష్మీవిద్యానాథ్‌గారలకు నా ధన్యవాదాలు. భారతం మీద వచ్చిన లఘువ్యాఖ్యలను సేకరించటంలో తోడ్పడిన డాక్టర్ దంటు హేమలత గారికి ముద్రణ కనువైన అక్షరాకృతి నిచ్చిన శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ అధినేత్రి డాక్టర్ జి.యస్. లక్ష్మిగారికి నా శుభాకాంక్షలు.

భక్తజన కల్పద్రుమమైన భద్రమూర్తి పద్మావతీ సహిత శ్రీ వేంకటేశ్వరస్వామి ధర్మకల్పద్రుమమైన ఈ భారత వ్యాఖ్యకు ప్రభువు. సత్యశివసుందరమైన ఆ స్వామి దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యా సంపుటిని వాఙ్మయారాధనలోని భాగంగా పుణ్యపూజాకుసుమ మంజరిగా భక్తితో సమర్పించుకొంటున్నాను.

**జి.వి. సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు
కవిత్రయ మహాభారత ప్రాజెక్టు
తిరుమల తిరుపతి దేవస్థానం.

హైదరాబాదు
వృష ఉగాది
25-3-2001

# ఆరణ్యపర్వశేషం - కథాసారం

ఎర్రనైన కిరణాల రాగరుచితో శరత్కాల సూర్యోదయ సమయాలు ప్రకాశించాయి. ఆకాశం మబ్బులు వీడి తేటపడింది. పద్మాలు వికసించాయి. రాజహంసలు, బెగ్గురు పిట్టలు, తుమ్మెదలు చేసే మధుర నాదాలు వ్యాపించాయి. నెమళ్ళు నాట్యం చేస్తూ క్రేంకార నాదాలు చేశాయి. వర్షాకాల మేఘాలు శరత్కాలానికి భయపడి నేలకు దిగి వచ్చినట్లుగా ఏనుగుల గుంపులు మదజలాలు వర్షిస్తూ ఘీంకరిస్తూ వనాలలో తిరిగాయి. దక్షిణాన ఆకసంలో అగస్త్య నక్షత్రం కనిపించింది. తెల్లని మబ్బులు క్రమ్ముకొన్న ఆకాశంవలె రెల్లుపూలు చుట్టూ కాసిన సరస్సులు బింబ ప్రతిబింబ భావంతో రాణించాయి. అటువంటి రమణీయ శరత్కాలంలో పాండవులు సరస్వతీ నదిని సేవించి కామ్యకవనం చేరారు.

శ్రీకృష్ణు డా సంగతి తెలిసికొని పాండవులను చూచి యోగక్షేమాలు తెలిసికొనటానికి సత్యభామా సమేతుడై కామ్యకవనానికి వచ్చాడు. అదే సమయంలో మార్కండేయ మహర్షి కూడా పాండవుల ఆశ్రమానికి వచ్చాడు. పాండవులు వారందరికీ అతిథి సత్కారాలు చేశారు.

శ్రీకృష్ణుడు ధర్మజుడి ధర్మనిష్ఠను ప్రశంసించాడు. అర్జునుడు పరమేశ్వరుడిని మెప్పించి పాశుపతాస్త్రాన్ని పొందినందుకు అభినందించాడు. శమదమాది గుణాలను సహజసంపదగా పొంది ఉన్న ధర్మరాజు సార్థక నామధేయుడని ప్రశంసించాడు. దుర్యోధనాదులు నిండుసభలో దుర్నీతివర్తనులై, చేసిన పాపకృత్యాలను సహించిన ధర్మజుని క్షమాశీలాన్ని మెచ్చుకొన్నాడు. కౌరవసభలో ధర్మజుడు కొంచెం కోపగించుకొన్నా భీమాదులు శత్రువర్గాన్ని నాశనం చేసి ఉండేవారనీ, తమ్ములనే సముద్రాలకు ధర్మజుడి సత్యసంయమనం చెలియలి కట్టవలె నిలిచిందని వ్యాఖ్యానించాడు. అంధక వృష్ణి భోజ కుకురాది వంశాలకు చెందిన యాదవ ప్రభువులందరూ ధర్మరాజుపట్ల బంధుప్రేమతో ఉన్నారనీ, ధర్మరాజు కొరకు కౌరవులతో యుద్ధం చేసి వారిని జయించి విజయాన్ని సాధించగలరనీ, దానికి ధర్మజుడు సంకల్పిస్తే చాలు. మరుక్షణంలో నాలుగు సముద్రాల చేత ఆవరించబడిన అఖిలభూమండలానికీ అతడే సార్వభౌముడౌతాడనీ ఉత్తేజపరిచాడు.

శ్రీకృష్ణుడి సాదర వచనాలకు ధర్మజుడు వినమ్రుడైనాడు. మిగిలి ఉన్న వనవాసాన్నీ, ఆపైన అజ్ఞాతవాసాన్నీ ముగించి మాటనిలబెట్టుకొని, ఆ తరువాత పరాక్రమంతో రాజ్యాన్ని జయిస్తే, నిందలు రావని సవినయంగా శ్రీకృష్ణుడికి నివేదించాడు. 'మేమందరం నీ శరణుకోరి ఉన్నాం. మా కార్యభారాన్నంతా నీవే నిర్వహించాలి. మాకు పరమశుభాలు ప్రసాదించాలి' అని వేడుకొన్నాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజును పరమప్రీతితో సంభావించాడు.

శ్రీకృష్ణుడు ద్రౌపదిని సాదరంగా పలుకరించాడు. ఉపపాండవులందరూ యాదవరాజకుమారులతో కలిసి వివిధ రాజవిద్యలను అభ్యసిస్తూ సంతోషంతో కాలం గడుపుతున్నారనీ, ప్రద్యుమ్నుడు వారందరికీ దివ్యాస్త్ర ప్రయోగంలో శిక్షణ ఇచ్చాడనీ, సుభద్ర అభిమన్యుడి మీది కంటె ఉపపాండవుల మీద అనురాగాన్ని అధికంగా చూపుతున్నదనీ చెప్పి ఆమెను ఊరటపరిచాడు. త్వరలో వారందరూ ఉజ్జ్వలమైన శుభాలను పొందుతారని చెప్పి ఆమెను అనునయించాడు.

అంతలో మార్కండేయ మహర్షి పాండవుల ఆశ్రమానికి వచ్చాడు. అందరూ ఆ మహర్షికి ఆహ్వానం పలికారు. అతిథిసత్కారాలన్నీ అయిన తరువాత శ్రీకృష్ణుడు ఆ మహర్షి యొక్క మంజుల వాగమృత ప్రవాహాన్ని చెవులారా క్రోలి ఆనందాన్ని పొందే అవకాశాన్ని కలిగించుమని కోరాడు. దేవతలకు, రాజులకు, బ్రాహ్మణులకు, పతివ్రతలకు సంబంధించిన పుణ్యకథలను వినిపించుమని అడిగాడు.

అదే సమయానికి నారద మహాముని అక్కడకు వచ్చాడు. అందరూ ఆయనను పూజించారు. నారదుడు కూడా మార్కండేయ మహర్షిని ప్రోత్సహించాడు. శ్రీకృష్ణుడికీ, పాండవులకూ ప్రియాన్నీ హితాన్నీ కలిగించే పుణ్యకథలు వినిపించుమని చెప్పి వెళ్ళాడు. అప్పుడు ధర్మరాజు మార్కండేయమహర్షితో ఇట్లా అన్నాడు.

**ధర్మరాజు:** మే మెప్పుడూ ధర్మాన్ని తప్పకుండా నడుచుకుంటాం. అయినా, నా కెప్పుడూ తీరని కష్టాలే. అటు - కౌరవులు ఎప్పుడూ పాపాలు చేస్తుంటారు. కాని, వారు సౌఖ్యాలనూ, అభ్యుదయాలనూ పొందుతున్నారు. ఈ విపరీత స్థితి ఏమిటి? అని నే నెప్పుడూ విచారిస్తుంటాను. నరుడు ఇప్పుడు చేసే కర్మలకు ఫలాన్ని ఇహంలో పొందుతాడా? పరంలో అనుభవిస్తాడా? ఇహపరాలలో రెండింటా పొందుతాడా? దేవుడిని నమ్మని వాడికి కర్మఫలం ఉండదా? ఈ శరీరంతోనే కర్మఫలం కూడా తొలగిపోతుందా? ఈ అనుమానాలను నీవే తీర్చగలవు. నాకు వాటిని గురించి వివరంగా చెప్పుము.

**మార్కండేయుడు:** పూర్వం బ్రహ్మదేవుడు ప్రథమసృష్టి చేసినప్పుడు పవిత్రులు, ధర్మనిరతులు, సత్యసంపన్నులు, సత్యవాదులు, సత్య సంకల్పులు, బ్రహ్మజ్ఞానులు, స్వచ్ఛందజీవులు అయిన మానవులను కల్పించాడు. వారు దేవమార్గాలలో విహరిస్తూ చేసిన కర్మకు సులభంగా అధికఫలాన్ని పొందేవారు. సర్వధర్మాలను తెలిసి, మాత్సర్యం లేనివారై, వేలసంఖ్యలలో సంతానాన్ని పొందుతూ, అనేక వేల సంవత్సరాలు దీర్ఘాయుష్కులై నివసిస్తూ ఉండేవారు. కొంతకాలం గడిచేసరికి ఆ మానవులు కామక్రోధాది గుణాలకు లోనయ్యారు. మాయా ప్రవర్తనులయ్యారు. దేవతలకు దూరమయ్యారు. అల్పాయువులు, అల్పబల శరీర సత్త్వులు, దరిద్రులు, నిష్ఫలారంభులు, బహురోగ పీడితులు, నాస్తికులు అయ్యారు. ఒకరిమీద మరొకరు అసూయలు పెంచుకొని, పాపకార్యాలు చేస్తూ, పశుపక్ష్యాదులుగా పుట్టుతూ, నరకయాతనలు అనుభవిస్తూ, పుట్టుచావుల చక్రభ్రమణంలో చిక్కి చిక్కుల పాలౌతున్నారు. వారు చేసిన పుణ్యపాపాలు వారివెంటనే నీడలాగా సాగిపోతూ వాటి ఫలాలను అనుభవింపజేస్తూ మరల మరల వారికి జన్మలను కలిగిస్తున్నాయి. ధర్మరాజా! ఎంతవారికైనా పాపపుణ్యాల ఫలాలు అనుభవించక తప్పదు. శరీరం నశించి పోతుంది కాని,చేసిన కర్మమాత్రం చెడిపోదు. దాని ఫలం అనుభవించక తప్పదు.

సంపదలతో తులతూగుతూ, ఇంద్రియలోలురై, పాపచింతలతో జీవించేవారు పరలోకసౌఖ్యాలు పొందలేరు. వారికి ఇహలోక సుఖాలే మేలుగా అనిపిస్తాయి. నియమనిష్ఠాపరులై, తీర్థయాత్రలు చేస్తూ, వేదాధ్యయన పరాయణులై జీవించేవారు ఇహంలో కష్టాలనుభవించినా, పరంలో కలిగే సుఖమే తృప్తిని కలిగిస్తుంది. ధర్మమార్గంలో జీవితాన్ని సాగిస్తూ, గృహస్థాశ్రమ విధులు నిర్వహిస్తూ, యజ్ఞయాగాలు చేసేవారు ఇహంలోనూ, పరంలోనూ సౌఖ్యాలను అనుభవిస్తారు. సత్యం, శమం శౌచం లేనివారై, నాస్తికులై, చేయరాని పనులు చేస్తూ జీవించేవారు ఇహపరాలకు రెంటికీ చెడ్డ రేవడులై దుఃఖాల ననుభవిస్తారు. మానవుల కర్మగతి పద్ధతి ఇది.

ధర్మరాజా! మీరు దివ్యులు. దేవతలకు హితం చేయటానికి ఈ భూతలం మీద మీరు అవతరించారు. మీరు శత్రువులనందరినీ సంహరిస్తారు. పరాక్రమ ప్రభావంతో భూమిని పాలిస్తారు. చివరికి మీ దేవభావాన్ని పొందుతారు.

ఈ మాటలు విని ధర్మరాజు బ్రాహ్మణప్రభావాన్ని గురించి చెప్పుమని మార్కండేయమహర్షిని కోరాడు. ఆ మునీంద్రుడు ఈ విధంగా చెప్పాడు-

పూర్వం హైహయవంశంలో ధుంధుమారుడు అనే రాకుమారుడు ఉండేవాడు. అతడు వేటకు వెళ్ళి, పొదలమాటున జింకచర్మాన్ని ఉత్తరీయంగా ధరించి ఉన్న ఒక బ్రాహ్మణ యువకుడిని జింకగా భ్రమించి బాణంతో కొట్టాడు. ఆ వేటుకు ఆ యువకుడు మరణించాడు. ధుంధుమారుడు ఆ బ్రాహ్మణ మృతకళేబరాన్ని చూచి, మిక్కిలి విచారించి, రాజధానికి తిరిగివెళ్ళి, జరిగిన సంగతి పెద్దలకు చెప్పి, వారిని వెంటబెట్టుకొని అడవికి వచ్చి ఆ శవాన్ని చూపించాడు.

ఆ సమీపంలోనే తార్క్ష్యుడు అనే మహర్షి ఆశ్రమం ఉన్నది. వారందరూ కలిసి అక్కడికి వెళ్ళారు. జరిగిన సంగతి చెప్పారు. ఆ బ్రాహ్మణ యువకుడిని చంపిన మహాపాపాన్ని తొలగించుకొనే ఉపాయం చెప్పుమని ప్రార్థించారు. అప్పుడు తార్క్ష్యుడు వారితో ఇట్లా పలికాడు - 'మా ఆశ్రమంలోని వారికి భయం, రోగం, చావు మొదలైన వాటిచేత కలిగే బాధలు

ఉండవు. మూడు లోకాల వారికీ ఈ సంగతి తెలుసు'- అని చెప్పి, చనిపోయాడని భావించే ఆ యువకుడిని సజీవుడిగా వారి ముందు చూపించాడు. చనిపోయినవాడు ఆ విధంగా మరల బ్రతికిన మహిమకు కారణమేమిటని వారు అడిగారు. తార్క్ష్యుడు ఇట్లా చెప్పాడు - 'మా ఆశ్రమవాసులమందరం మాంద్యం లేని వారం, శుచి అయిన ఆహారం తినేవారం, నిత్యం ఆచరించే విధులను తప్పక నిర్వహించే వారం. అతిథులను అర్చిస్తాం. నిజమే పలుకుతాం, బ్రహ్మచర్యాన్నీ, శాంతచిత్తవృత్తినీ కలిగి ఉంటాం. అందువలన మేమెన్నడూ రోగమృత్యుభయం లేనివారమై ఉంటాం. ఇది మా మహిమ. కాబట్టి మీకు బ్రహ్మహత్యాదోషం లేదు.' ధర్మరాజా! 'బ్రాహ్మణ ప్రభావం ఇటువంటిది. అంతేకాక, బ్రాహ్మణ క్షత్రియ మహిమను తెలిపే ఒక ఇతిహాసాన్ని చెప్పుతాను వినుము' అని మార్కండేయమహర్షి ఈ విధంగా చెప్పాడు.

పూర్వం అత్రి అనే బ్రాహ్మణశ్రేష్ఠుడున్నాడు. ఆయన తపస్సు చేయాలని అడవికి పోదలచాడు. భార్యను 'నాతో తపోవనానికి వస్తావా? లేదా కొడుకుల దగ్గర ఉంటావా?' అని అడిగాడు. 'గృహస్థాశ్రమంలో ఉన్న యజమాని కుటుంబ భారాన్ని మోయటానికి తగిన వసతులను పుత్రులకు కల్పించి వానప్రస్థాశ్రమాన్ని తీసికొనటం ధర్మం' అని చెప్పి, 'వైన్యభూపతి అర్థులకు విరివిగా దానం చేస్తున్నాడు. ఆయనను అడిగి ద్రవ్యాన్ని సంపాదించి కొడుకులకు ఇచ్చి తపోవనానికి వెళ్ళు' మని అత్రి భార్య తన భర్తకు హితవు చెప్పింది. భార్య హితవు అత్రికి ధర్మయుక్తంగా తోచింది. అతడు వైన్యుడి వద్దకు వెళ్ళాడు. ఆ రాజు అశ్వమేధయాగం చేస్తూ విప్రులకు అపార ధనాలను దానం చేస్తున్నాడు. అత్రి అతడిని దర్శించి ఆశీర్వదించి ఇట్లా ప్రశంసించాడు -

'ఓ రాజా! నీవే బ్రహ్మవు, నీవే సమస్త జనసార్వభౌముడవు. నీవే సమస్త ధర్మ విశారదుడవు, నిన్ను పోలిన రాజులు ఈ భూమండలంలో మరెవ్వరూ లేరు. ఋషులందరూ నిన్నే ప్రశంసావాక్యాలతో కీర్తిస్తూ ఉంటారు.'

ఆ మాటలు విని సభలో ఉన్న గౌతమ మహాముని మండిపడ్డాడు. 'అత్రీ! ఈ రాజే బ్రహ్మ అనీ, ఇంద్రుడనీ, ఈశ్వరుడనీ నోరరిగేటట్లు ఎందుకు అట్లా కీర్తిస్తావు? డబ్బు కాశపడి ఒక సామాన్య మానవుడిని అసామాన్యుడిగా కీర్తించటం దేనికి?' - అని అధిక్షేపించాడు. అతడికి అత్రి ఇట్లా బదులు చెప్పాడు - 'గౌతమా! నీకు ఉచితానుచితాలు తెలిసినట్లు లేదు. లోకాలను నిర్మలమైన నీతితో, పరాక్రమంతో పరిపాలించే ప్రభువు ధర్మాలకన్నింటికి కుదురు. అటువంటి రాజును కీర్తించటంలో తప్పేమున్నది?' అని ప్రశ్నించాడు. గౌతముడు వెటకారంగా- 'తల నరిసినంత మాత్రాన జ్ఞానివి కావు. జ్ఞానవృద్ధుల మాటలే ప్రమాణాలు' అని అన్నాడు. క్రమంగా వారిద్దరి మధ్యా మాటా మాటా పెరిగి వాదం తీవ్రరూపం తాల్చింది. ఆ సభలో కాశ్యపుడనే ముని సనత్కుమారుడిని మధ్యవర్తిగా ఉంచితే బాగుంటుందని సూచించాడు. సదస్యులందరూ దాని కంగీకరించి సనత్కుమారుడి దగ్గరకు వెళ్ళి వాదసారాంశాన్ని చెప్పారు. అంతా విని సనత్కుమారుడు అత్రి వాదాన్ని సమర్థించాడు. 'అత్రి మాట నిజం. అతని వాదం ధర్మయుక్తం. రాజ్యాన్ని తన భుజబలంతో వహించి, ప్రజలను రక్షిస్తాడు కాబట్టి అతడు ప్రభువు. శత్రువులను సంహరించి అతడే ఇంద్రుడు, ఈశ్వరుడు, బ్రహ్మ అనబడతాడు. రాజు ప్రజలందరికీ పూజించదగినవాడు. అతడి శాసనం వలన మంచివారు, మునులు మంచిమార్గంలో నడుస్తుంటారు. కాబట్టి ఆతడి ఆజ్ఞను ఎవ్వరూ జవదాట రాదు. క్షత్రియ మాహాత్మ్యం ప్రశంసనీయం. వేదాలు రాజును - విరాట్టు, సమ్రాట్టు, విధిజితుడు, సత్యమన్యుడు, యథాజీవుడు, ధర్ముడు- అనే పేర్లతో ప్రశంసించాయి. పూర్వం బ్రాహ్మణులు అధర్మానికి భయపడి తమ తేజస్సులను, బలాలను క్షత్రియులలో నిక్షేపించారు. అప్పటినుండి బ్రాహ్మణ మాహాత్మ్యం వలన క్షత్రియ పరాక్రమం ప్రవర్ధిల్లుతూ ఉన్నది. బ్రాహ్మణ మహిమ, క్షత్రియ మహిమ ఒక దానిని ఒకటి ఆశ్రయించుకొని ఉంటాయి. విడివిడిగా ఉండలేవు. క్షత్రియుడు బ్రాహ్మణ సేవవలన తేజస్వియై సూర్యుడు చీకట్లను చీల్చినట్లుగా పాపాలను పటాపంచలు చేస్తాడు. అందువలన క్షత్రియుడే అందరికంటె అధికుడవటం నిశ్చయం' - అని తీర్పు చెప్పాడు సనత్కుమారుడు. ఋషు లా తీర్పును వైన్యుడికి నివేదించారు. వైన్యుడు సంతోషించి అత్రికి కోటి ధనాలను కానుకలుగా ఇచ్చాడు. వాటిని అత్రి తనపుత్రుల కిచ్చి తాను తపస్సుకై అడవికి పోయాడు.

## సరస్వతీ గీత

పూర్వకాలంలో తార్క్ష్యుడు అనే మునీంద్రుడు భారతిని గురించి తపస్సు చేశాడు. ఆ దేవి ప్రత్యక్షమైంది. ఆ ముని భారతిని ఇట్లా అడిగాడు. 'తల్లీ! మానవుడికి ధర్మం ఏది? పురుషుడు దేనివలన పుణ్యాత్ముడై ఉత్తమ గతులు పొందగలడు? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పి ధన్యుడిని చేయుము', భారతి ఇట్లా చెప్పింది - 'నాలుగు వేదాలు చదివి, వివిధ యజ్ఞాలు చేసిన బ్రాహ్మణుడు స్వర్గానికి పోయి అప్సరసలతో కలిసి పెక్కేండ్లు సుఖిస్తాడు. దూడతో కూడిన పాడి ఆవును యోగ్యుడైన బ్రాహ్మణుడికి దానం ఇస్తే ఆ ఆవు మేనిమీద ఎన్ని రోమాలుంటాయో అన్నివేల సంవత్సరాలు స్వర్గంలో ఉంటాడు. ఒక ఆబోతును దానం చేస్తే స్వర్గలోకాన్ని పొందుతాడు. ఏడేండ్లు దీక్షతో అగ్నిని నేతితో వేల్చి సేవిస్తే ఏడు తరాల పితృదేవతలతో సహా స్వర్గానికి పోతాడు. ఎల్లప్పుడు దేవతలను అగ్నిహోత్రం ద్వారా తృప్తిపరచినవాడు గోలోకభోగాలను అనుభవిస్తాడు. అగ్నిహోత్రం నా ఆత్మ. యజ్ఞద్రవ్యాలన్నీ నావే. నేను అగ్నిముఖం నుండి పుట్టుతాను. జ్ఞానుల సంశయాలను తీరుస్తాను. స్వాధ్యాయ దానవ్రత పరాయణులు శోకరహితులౌతారు. మధుక్షీరాది ద్రవ్యాలతో ఇంద్రాగ్ని ప్రముఖులైన దేవతలను తృప్తిపరిచే యజ్ఞశీలురు నాలోకాన్ని పొందుతారు' అని చెప్పిన భారతిని తార్క్ష్యుడు భక్తితో స్తుతించి తరించాడు- అని మార్కండేయ మహర్షి ధర్మరాజుకు చెప్పాడు.

## వైవస్వత మనువృత్తాంతం

వైవస్వత మనువు ఏవిధంగా మహిమాన్వితుడయ్యాడు? అని ధర్మరాజు అడుగగా మార్కండేయు డిట్లా వివరించాడు-

చాక్షుష మన్వంతరంలో వైవస్వతుడు పదివేలేండ్లు నిరాహార దీక్షతో తపస్సు చేశాడు. ఒకనాడు ఒక సరోవరంలో స్నానంచేసి ఒడ్డున నిలిచి ఉండగా ఒక చిన్నచేప వచ్చి తనను ఆ కొలనిలో పెద్దచేపల బారినుండి రక్షించి, ఒక భద్రమైన చోటికి చేర్చుమని వేడింది. అందుకు ప్రత్యుపకారం చేస్తానని మాట ఇచ్చింది. అతడు ఆశ్చర్యపడి ఆ చిరుచేపను ఒక నూతిలో వదిలాడు. రోజూ దాని యోగక్షేమాలు విచారించేవాడు. అది క్రమంగా పెరిగి పెద్దదై తిరగటానికి చోటు చాలక పోవటంతో మరొక మేలైన చోటికి చేర్చుమని వైవస్వతుడిని కోరింది. అప్పుడు దానిని తీసికొని వెళ్లి ఒక బావిలో వదిలాడు. కొన్నాళ్ళకు ఆ చేప బలిసి బావిలో ఉండలేక పోయింది. అతడు దానిని గంగలో విడిచాడు. కాలక్రమంగా అది పెరిగి పెద్దదయింది. గంగమడుగు చాలకపోతే వైవస్వతుడు దానిని సముద్రంలో వదిలాడు.

అప్పుడు చేప వైవస్వతుడితో ఇట్లా అన్నది- 'నీవు నాకు మేలు చేశావు. నీకు నేనొక మేలు చేస్తాను. కొద్ది కాలంలో మహాప్రళయం జరుగబోతున్నది. మహాసముద్రాలన్నీ పొంగి ఏకం కాబోతున్నాయి. దాన్ని మన్వంతర సంధి అంటారు. కాబట్టి నీవు ఒక పెద్ద ఓడను బలమైన తాళ్లతో కట్టి అందులో అన్నిరకాల ధాన్యాలు, బియ్యాలు భద్రపరుచుము. సప్తర్షులతో కలిసి ఆ ఓడనెక్కి సముద్రతీరానికి చేరి నన్ను స్మరించుము. నే నొక పెద్ద కొమ్ముగల రూపంతో కనబడి మీకు మేలు చేస్తాను' - అని చెప్పి వెళ్ళింది. ఆ చేప చెప్పినట్లు వైవస్వతుడు ఒక నౌకను నిర్మించి, సప్తర్షులతో కలిసి సముద్రతీరం చేరి, ఆ చేపను స్మరించాడు. ఆ చేప ఎత్తైన ఆకారంతో పొడుగైన కొమ్ముతో కనపడింది. ఆ చేప కొమ్ముకు ఓడ తాడును తగిల్చి కట్టాడు. అపరిమితమైన వేగంతో ఆ చేప ఆ నావను సముద్ర మధ్యానికి లాగికొని తీసికొనిపోయింది. క్రమంగా సముద్రాలన్నీ పొంగి ఏకమయ్యాయి. లోకాలన్నీ నీటిలో మునిగిపోయాయి. లోకమంతా ఏకార్ణవమైపోయింది. ఆ నీటి నడుమ పెక్కువేలేండ్లు ఆ చేప ఆ ఓడను త్రిప్పుతూనే ఉంది. క్రమంగా వెల్లువ తగ్గింది. ఓడను హిమవత్పర్వతశిఖరం దగ్గరకు చేర్చి, ఆ చేప ఆ శిఖరానికి ఓడను కట్టివేయుమని వైవస్వతుడితో చెప్పింది. అత డట్లాగే చేశాడు. ఆనాటి నుండి ఆ కొండ కొమ్ముకు 'నౌకాబంధం' అనే పేరు వచ్చింది.

వారితో ఆ మహామత్స్యం ఈ విధంగా చెప్పింది - 'ఓ వైవస్వతమనూ! సప్తర్షులారా! మహాప్రళయకాలంలో ప్రమాదం రాకుండ మిమ్మల్ని నేను కాపాడాను. నేను ఈ అనంత విశ్వానికి కర్తనైన ఈశ్వరుడిని. మీమీది దయతో ఈ చేప రూపంతో మిమ్మల్ని ఇన్నివిధాల కాపాడాను. మీరు నిర్భయులై ఉండండి. ఈ మనువు- దేవతలు, అసురులు, మానవులు మొదలైన

వారితో కూడుకొనే జగత్తును సృష్టిస్తాడు. నాదయ వలన అతడికి పరమజ్ఞానోదయం ఔతుంది' అని కరుణించి మహామత్స్యం అంతర్ధానమయింది. వైవస్వతుడు ఘోరతపస్సు చేసి సకలచరాచర భూతకోటిని సృష్టించాడు.

**ఫలశ్రుతి :** ఉత్తమమైన ఈ వైవస్వతుడి చరిత్రం భక్తితో విన్నవారికీ చదివిన వారికీ మహాపాపాలన్నీ మాయమైపోతాయి. ఇహపరసుఖాలు సిద్ధిస్తాయి.

**ధర్మరాజు :** ఓ మార్కండేయ మహర్షీ! నీవు బ్రహ్మదేవుడివంటి వాడివి. నీ మాహాత్మ్యం అద్భుతమైనది. మహాప్రళయకాలంలో కూడా నీవు సాక్షీభూతుడవై ఉంటావు. సృష్టి సమస్తం నీటిలో మునిగినప్పుడు పద్మపీఠం మీద ప్రకాశించే బ్రహ్మదేవుడిని ఆరాధించగలిగే పుణ్యాత్ముడవు. ఆ ప్రభావాన్ని ఆ పరమాత్మయే నీకు అనుగ్రహించాడు. యముడి శిరస్సును ఎడమకాలితో తన్నిన మృత్యుంజయుడవు నీవు. ఈ సకల చరాచర సృష్టి లయ ప్రకారాలను ఎన్నోసార్లు నీవు చూచి ఉంటావు. కాబట్టి ఎన్నో అద్భుత విశేషాలు నీవలన తెలిసికొనగలను. కాబట్టి - ప్రళయ కాలంలో లోకాలు ఏవిధంగా ఉంటాయో తెలుపుము.

**మార్కండేయుడు :** ధర్మజా! నీకు ఇష్టసఖుడుగా, మంత్రిగా, నీకు హితుడై ఉన్న ఈ పుణ్యాత్ముడు శ్రీకృష్ణుడే శాశ్వతుడు, అఖిల భూతాలకు పరమేశ్వరుడు, ఆదిదేవుడు, జగదాది జన్ముడు, ఆదిమధ్యాంతరహితుడు, కారణజన్ముడు, అజరుడు అయిన పరమాత్మ, ఆ విశాలనేత్రుడు, ఆ కనకాంబరధారి, పద్మనాభుడు, ఇంద్రాది వంద్యుడు అయిన మహావిష్ణువు. ఆ మహాత్ముడిని వినయంతో స్మరించి, అతని అనుమతితో వివరిస్తాను వినుము.

యుగాలు నాలుగు. కృత, త్రేతా, ద్వాపర, కలి యుగాలు. అవి మొత్తం కలిస్తే పన్నెండువేల దివ్య సంవత్సరాల కాలం అవుతుంది. దాన్ని మహాయుగం అంటారు. వేయి మహాయుగాల కాలం బ్రహ్మకు ఒక పగలు (బ్రహ్మదివసం). దాని చివర నూరేళ్ళపాటు అనావృష్టి కలుగుతుంది. ఆ సమయంలో సూర్యుడు ఏడు రూపాలు ధరించి నదీనదాల్లోని, సముద్రాల్లోని నీటినంతా ఆవిరిచేసి లోకాలను మండింపజేస్తాడు. ఆ మంటతోపాటు పెద్దగాలి వీస్తుంది. దానితో మూడు లోకాలూ బూడిదై పోతాయి. ఆ తరువాత పర్వతాకారాలతో ప్రళయమేఘాలు క్రమ్మి, దిక్కులు పిక్కటిల్లేటట్లు ఉరుముతూ ధారాపాతంగా చాలాకాలం వర్షించి ఆ మంటలనన్నిటినీ ఆర్పుతాయి. భూగోళమంతా లోతైన నీటిలో మునిగిపోతుంది. చీకట్లు వ్యాపిస్తాయి. దిక్కులు తెలియవు. అప్పుడు బ్రహ్మదేవుడి ఆజ్ఞతో ఒక పెనుగాలి చెలరేగి వీస్తుంది. దాని వేగానికి ఆ మేఘాలన్నీ చెల్లాచెదరౌతాయి. ఆ గాలిని పీల్చి బ్రహ్మదేవుడు నీటి నడుమ పద్మంమీద నిద్రిస్తాడు. దాన్ని కల్పాంతం అంటారు. అటువంటి కల్పాంతాలు ఎన్నో గడిచాయి. మరెన్నో గడవనున్నాయి.

కల్పాంతంలో నేను పెను చీకటిలో ఒంటరిగా ఎంతోకాలం తిరుగవలసి వచ్చేది. ఒకసారి ఆ ప్రళయజల మధ్యంలో నాకు ఒక పెద్ద మర్రిచెట్టు కనపడింది. ఆ చెట్టు ఆకుల శయనం మీద నీలమేఘశ్యాముడు, చంద్రవదనుడు అయి ఉదయిస్తున్న సూర్యుడివలె ప్రకాశిస్తూ నిద్రిస్తూ కుసుమకోమలుడైన ఒక బాలుడిని చూచి ఆశ్చర్యపోయాను. అతను ఎవరో అని తలపోస్తూ సమీపించాను. ఆ బాలుడు కనుదమ్ములు విచ్చి నావైపు ఓరగా చూచి మధురస్వరంతో పలకరించాడు. 'అయ్యా! నీవు బాగా అలసినట్లున్నావు. విశ్రాంతి తీసుకో, అవకాశమిస్తాను, ఇదిగో నా శరీరంలో ప్రవేశించి శయనించుము' అని నోరు తెరిచాడు. నేను బలవంతంగా ఆ నోట్లోకి లాగబడ్డాను. ఆ బాలుడి కడుపులోనికి ప్రవేశించాను. అందులో సమస్త లోకాలనూ, సమస్త సృష్టి విశేషాలనూ కన్నారా చూచాను. వాటినన్నిటినీ దర్శిస్తూ నూరేండ్లు అందులో తిరిగాను. మనసులో భయం వేసింది. ఆ మాయాబాలుడి దివ్యపాదాలను భక్తితో ధ్యానించాను. ఆ బాలుడి శ్వాసవేగంతో అతడి ముఖం నుండి బయటపడ్డాను. ఆ వటపత్రశాయిని దర్శించాను. అతడు నా యోగక్షేమాలను అడిగి తెలిసికొన్నాడు. అతడి పాదాలను నా తలమీద పెట్టుకొని 'నీదయ వలన సకల చరాచర ప్రపంచాన్ని నీలో దర్శించాను. కాని, నీ మాయాప్రభావం నాకు అర్థం కాలేదు. నీ మహిమను నీవే వివరించి నాకు చెప్పాలి' అని ప్రార్థించాను. విష్ణుదేవుడు ఇట్లా చెప్పాడు-

'మహర్షీ! నా మహిమను దేవతలు మునులు కూడా తెలియలేరు. నీవు పుణ్యాత్ముడవు పితృభక్తుడవు కావటం చేత నీకు చెప్పుతాను వినుము. నేను నారాయణుడను. నారములంటే నీళ్ళు. నారములే స్థానంగా కలవాడను కాబట్టి నారాయణు

డనబడుతున్నాను. నేను శాశ్వతుడను, లోకాలను సృష్టించేవాడిని, పాలించేవాడిని, లయించేవాడిని, చిదానందమూర్తిని, బ్రహ్మ, ఇంద్రుడు, ఈశ్వరుడు, యముడు, కుబేరుడు, వరుణుడు మొదలైన దేవతలు నామూర్తులే. భూమియే నా పాదద్వయి. అగ్నియే నా ముఖం. సూర్యచంద్రులు నా కన్నులు, ఆకాశం నా శిరస్సు. ఇటువంటి నారూపం అద్భుతమైనది. నేను మహాదక్షిణలతో కూడుకొన్న ఎన్నో యజ్ఞాలు చేశాను. అటువంటి యజ్ఞాలు చేస్తూ భువిలో రాజులూ, వైశ్యులూ నన్ను సేవిస్తూ ఉంటారు. ప్రళయకాలంలో సముద్రంలో మునిగిన భూమిని ఉద్ధరించే ఆదివరాహాన్ని నేనే. వేయి పడగలతో భూభారాన్ని మోసే ఆదిశేషుడను నేనే. సప్తసముద్రాలు నీటిని దహించే బడబాగ్నిని నేనే. ప్రళయకాలంలో ఆ నీటిని త్రాగేదీ నేనే, మరల వదిలేదీ నేనే. సృష్ట్యారంభకాలంలో నానోటి నుండి, భుజాల నుండి, తొడలనుండి, పాదాల నుండి క్రమంగా నాలుగు వర్ణాలవారిని సృష్టిస్తాను. నా ముఖం నుండి నాలుగు వేదాలు ఉదయిస్తాయి. చివరకు అవి నాలోనే లయమౌతాయి. నిరహంకారులు, క్రోధరహితులు, నిస్సంగులు, అధ్యాత్మవిదులు, సత్యనిష్ఠులు, మహామునులు నన్ను మోక్షాపేక్షతో సేవిస్తూ ఉంటారు. నక్షత్రాలు, తారాగణం, గ్రహాలు, ఆకాశం, వాయువులు, దశదిశలు - అన్నీ నారూపాలే. సముద్రాలన్నీ శయనంగా నేను నిత్యానందమూర్తినై పవళించి ఉంటాను. దానం, సత్యం, తపస్సు, జ్ఞానం, అహింస - అనబడే సాత్త్వికగుణాలూ, కామం, క్రోధం, అజ్ఞానం వంటి తామసగుణాలూ అన్నీ నాలోనివే. ఈ జగత్తులో వ్యక్తమై కనపడేదంతా నేను. అవ్యక్తంగా ఉండేదీ నేనే. ఇందులో సందేహం వద్దు. లోకంలో ధర్మానికి హాని ఎప్పుడు కలుగుతుందో, అధర్మం ఎప్పుడు విజృంభిస్తుందో, దైత్యులు క్రూరులై ఎప్పుడు గర్వంతో అతిశయిస్తారో, దేవత లెప్పుడు దైన్యస్థితిని పొందుతారో, అప్పుడు నేను మంచి కుటుంబంలో పుట్టి, నా ప్రభావంతో దేవతలను, దేవేంద్రుడిని ఉత్తమ ధర్మపదవిలో నిలుపుతాను. నేను కృతయుగంలో తెల్లగాను, త్రేతాయుగంలో ఎర్రగాను, ద్వాపరయుగంలో నల్లగానూ, కలియుగంలో పసుపుపచ్చగానూ ఉండే దేహాలతో ప్రకాశిస్తూ నాలుగు యుగాలలోనూ ధర్మస్థాపనం చేస్తాను. నా వృత్తాంతాన్నంతా నీకు చెప్పాను. సృష్టికర్త అయిన బ్రహ్మ నాలో సగపాలు.

నారాయణనామంతో, బాలకరూపంతో, శంఖచక్రధారినై, ఏకార్ణవంలో వేయి మహాయుగాలు యోగనిద్రలో ఉంటాను. అటువంటి భయంకర కల్పాంతాన్ని చూచి నీవు భయపడటం తెలిసికొని, నీమీది దయతో నాలో గుప్తంగా ఉన్న సకలలోకాలను నీకు చూపించాను. నీ వింక యథేచ్ఛగా విహరించుము. బ్రహ్మ చేసే సృష్టిని కన్నారా దర్శించుము - అని ఆదేశించి ఆ బాలుడు అదృశ్యమయ్యాడు. అద్భుతమైన ఆ అనుభవం నేను ప్రత్యక్షంగా పొందాను.

ఓ ధర్మరాజా! నా కప్పుడు ఆవిధంగా దర్శనమిచ్చిన బాలదేవుడే, ఈ నాడు నీకు గాదిలిచుట్టంగా, మంత్రిగా, మిత్రుడుగా ఉన్న శ్రీకృష్ణుడు. పుణ్యాకారుడు, కమలాక్షుడు, కరుణామయుడు, ఉత్తమశ్లోకుడు అయిన శ్రీకృష్ణుడిని నా పుణ్యాలపంటగా దర్శించగలిగాను. ఈ దేవదేవుడి దర్శనం వలననే నాకీ పూర్వ సంఘటనలన్నీ జ్ఞాపకానికి వచ్చాయి. శ్రీకృష్ణుడు పరమాత్మ, మహావిష్ణువు. ఆయనను శరణుపొందుము? అని మార్కండేయ మహర్షి బోధించాడు.

ధర్మరాజాదులు శ్రీకృష్ణుడిని పరమాత్మగా భావించి కీర్తించారు.

**కలికాల ప్రభావం**

**ధర్మరాజు** : మహర్షీ! కలియుగంలో కలిగే ధర్మలోపం గురించి చెప్పండి.

**మార్కండేయుడు:** కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతో పరిపూర్ణంగా నడుస్తుంది. త్రేతాయుగంలో మూడు పాదాలతో,ద్వాపరంలో రెండు పాదాలతో, కలియుగంలో ఒకపాదంతో మాత్రమే ప్రవర్తిల్లుతుంది.

కలియుగంలో మానవులలో సత్యవర్తనం క్షీణిస్తుంది. దాని వలన ఆయుఃప్రమాణం తగ్గుతుంది. దాని వలన విద్య స్వల్పమౌతుంది. అల్పవిద్యల వలన మోహం పెరుగుతుంది. మోహం వలన లోభం, దాని వలన కామం, దాని వలన క్రోధం, దాని వలన వైరం, దాని వలన మానవుల మధ్య పరస్పర పీడనం పెరుగుతుంది. దానివలన తమ తమ మేరలు మీరి వర్ణ సంకరానికి పాల్పడతారు. బ్రాహ్మణులు జపనియమ స్వాధ్యాయ విధులను వదలిపెట్టుతారు. శూద్రులు విస్తారంగా తపస్సులు చేస్తారు.

కలియుగాంతంలో జనపదాలు పాడైపోతాయి. అవి క్రూరమృగాలకు నెలవులౌతాయి. అడవులు విస్తరిల్లుతాయి. ధర్మం నశిస్తుంది. ద్రవిళాభీరతురుష్క బర్బర పుళిందాదులు విజృంభిస్తారు. క్షత్రియజాతులు శౌర్యం, సంపద, తేజస్సు, మైత్రి కోల్పోయి శూద్రులవలె తిరుగాడుతారు. సుగంధద్రవ్యాలు, ద్రావణాలు సారవిహీనాలౌతాయి. పంటల దిగుబడి తగ్గిపోతుంది. ఆవుల పాడి తరిగిపోతుంది. చెట్లకు పూలు ఫలాలు పూయటం, కాయటం తగ్గుతుంది. రాజులు పన్నులు విరివిగా వసూలు చేయటానికి ప్రజలను పీడిస్తారు. బ్రాహ్మణులు వర్తక వ్యాపారాది వృత్తులు చేస్తారు.

కలియుగంలో వర్ణాశ్రమ ధర్మాలు నాస్తిక వేదాంతంతో నిండుతాయి. ప్రజలు పుణ్య పాప చింత లేకుండా దేహరక్షణే ముఖ్యమనుకొంటారు. వానలు సకాలంలో కురవవు. విత్తనాలు సారం కోల్పోయి పొల్లుగా మారతాయి. క్రయవిక్రయాలలో మోసం పెరుగుతుంది. కుదువబెట్టిన డబ్బును కూడా కాజేస్తారు. మంచివారు అష్టకష్టాలు పడతారు, రోగాలతో బాధపడుతూ అల్పాయుష్కులౌతారు. పాపులు సిరిసంపదలతో తులతూగుతూ చాలాకాలం బ్రతుకుతారు. వ్యవసాయంలో తిండిగింజల పంటలకంటే వ్యాపారపు పంటలు ఎక్కువౌతాయి. గొర్రెల పాడి పెరుగుతుంది. మగవారికి ఆడువారితో వివాహేతర సంబంధాలు ఎక్కువౌతాయి. చాలామంది మాంసాహారు లౌతారు. పితృదేవకార్యాలు దేశకాలపాత్రాల కనుగుణంగా జరుగవు. బ్రాహ్మణులలో హేతువాదం ప్రబలుతుంది. వారు వేదాలను నిందిస్తారు. సదాచారాలను యజ్ఞయాగాలను విడనాడుతారు. ఆడువారివి, బలహీనులవి, దీనులవి, బంధువులవి అయిన సర్వద్రవ్యాలను అపహరించే దుష్టులు; తల్లిదండ్రులను, కన్నబిడ్డలను, మిత్రులను చంపేవారు, యథేచ్ఛావిహారులు- లోకంలో గౌరవించబడతారు. బ్రాహ్మణులు ఆ దుర్మార్గులను ఆశ్రయించి, వా రిచ్చిన ద్రవ్యాలను గ్రహిస్తూ, అవమానాల పాలౌతారు. రాజులు ప్రజలను రక్షించేబదులు బహిరంగంగా దోపిడీ చేసే దొంగల్లాగా వారిని దోచుకొంటారు. సాధువుల సొత్తులను, స్త్రీధనక్షేత్రాలను హరిస్తారు. రాజులమధ్య వైరం పెరిగి పరస్పర యుద్ధాలు చేసికొంటారు. ప్రజానష్టం బాగా జరుగుతుంది.

కలికాలంలో కొడుకు తండ్రిని, భార్య భర్తను అవమానిస్తారు. భార్యాభర్తలు ఒకరి నొకరు తిరస్కరించుకొంటూ స్వేచ్ఛగా చరిస్తూ ఉంటారు. దేవతారాధనలు, పితృదేవతార్చనలు, వేదవేదాంగాధ్యయనాలు తగ్గిపోతాయి. అజ్ఞానాంధకారం అలముకొంటుంది. లోకం దుష్టులతో నిండిపోతుంది.

కలియుగంలో ప్రజల ఆయుఃప్రమాణం పదహారేండ్లకు పడిపోతుంది. ఏడెనిమిదేళ్ళ వయస్సులోనే ఆడపిల్లలు సంతానవతులౌతారు. దాతలు కరువై బీదలు దొంగతనాలకు పాల్పడతారు. ఎంత తెలిసిన వారైనా క్రూరులై పాపానికి ఒడిగడతారు. బ్రాహ్మణులు అన్నాన్నీ, వేదాన్నీ విక్రయిస్తారు. స్త్రీలు డబ్బుకొరకు మానాన్ని అమ్ముకొంటారు. శూద్రులు కోపోద్రేకాలకు లోనై చాలామందిని నిర్దాక్షిణ్యంగా చంపుతారు. దొంగలముఠాలవారు చెలరేగి ద్రవ్యాన్ని అపహరించటమే కాక ప్రాణాలు కూడా తీస్తారు. బ్రాహ్మణులు తమకు దిక్కెవ్వరూ లేక దీనులై నాలుగు దిక్కులా పరుగెత్తుతారు. జనులు బాధలు పడలేక కాకులవలె అడవులలో తలదాచుకొంటారు. శూద్రులు వేదార్థాలను వివరిస్తూంటే బ్రాహ్మణులలో పెక్కుమంది వింటారు. వారికి దాసులై మిక్కిలి నిందించదగిన పనులు చేస్తారు. కలికాలంలో దేవాలయాలు, బ్రాహ్మణాగ్రహారాలు, పవిత్ర ఆశ్రమాలు పాడైపోతాయి. చెడిన ఆడువారికి, మద్యపానానికి గిరాకీ పెరుగుతుంది. ఈ కాలంలో శిష్యులు గురువులను నిందిస్తారు. గురువులు శిష్యులను మోసగిస్తారు. జనుల మధ్య మంచి సంబంధాలు ఉండవు. కరవులు తరుచుగా ఏర్పడుతాయి. ప్రజలు ఎప్పుడూ భయాందోళనలకు గురి ఔతూ ఉంటారు. ఈ విధంగా కలికాలంలో ధర్మాలన్నీ తలక్రిందులౌతాయి. దేశాలు పట్టణాలు నాశనమౌతాయి. ప్రజలు శాంతిభద్రతలను కోల్పోయి కొండల్లో గుట్టల్లో నదీ తీరాల్లో తలదాచుకొంటారు.

కలియుగాంతంలో శంబళగ్రామంలో కల్కి అవతార పురుషుడు - విష్ణుయశుడు అనే పేరుగల బ్రాహ్మణుడు - పుట్టుతాడు. అతడు స్మరణమాత్రంతోనే సర్వశాస్త్రాలనూ, సమస్త అస్త్రశస్త్రాలనూ సులువుగా సంపాదించి సార్వభౌముడౌతాడు. అతడు పూనికతో మ్లేచ్ఛులను సంహరించి ధర్మాన్ని తిరిగి స్థాపిస్తాడు. అశ్వమేధయాగం చేస్తాడు. అతడు భూమిని బ్రాహ్మణధనంగా

భావించి, వారికి పంచిపెట్టి, తాను తపోవనానికి పోతాడు. అతడు నెలకొల్పిన ధర్మపద్ధతిలో, చాతుర్వర్ణ్య వ్యవస్థలో ప్రజలు తమ తమ విధులు నిర్వహిస్తూ ఉంటారు. దానివలన అటుపైన కృతయుగం ప్రవర్తిల్లుతుంది.

కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుంది. అన్ని దేశాలూ ఆదర్శప్రాయంగా ఒప్పారుతాయి. జనులు ఆయురారోగ్యాలతో ధర్మనిష్ఠమైన బుద్ధితో కలకాలం జీవిస్తూ సుఖిస్తారు. కృత, త్రేతాయుగ, ద్వాపర యుగాలు క్రమంగా వర్తిల్లుతాయి. ధర్మరాజా! ఇప్పుడు ఒక హితవు చెప్పుతున్నాను వినుము. 'నీవు బ్రాహ్మణులకు హితమైన కార్యాలను ఆచరించుము. విప్రులు సంతృప్తి చెందితే నీకు అనంతపుణ్యఫలం కలుగుతుంది. అంతేకాక, నీవు సమస్త ప్రాణులను దయతో చూడుము. ప్రజలను బిడ్డలవలె పాలించుము. లోగడ పెద్దలు చేసిన నిర్ణయాలను పరిశీలించుము. అజ్ఞానాన్ని తొలగించుము. అహంకారాన్ని త్యజించుము. సత్యాన్ని ప్రేమించుము. కాలగతులను తెలిసికొని జ్ఞానాన్ని నిరంతరం పెంచుకొమ్ము. భరతవంశజుడవు కాబట్టి నీవు సహజంగా నిర్మలుడవు, ప్రాజ్ఞుడవు'.

ధర్మరాజు ఆ మాటలు విని మునీంద్రుడికి నమస్కరించాడు. తాను ముని చెప్పినట్లు పూర్వం నుండి ఆచరిస్తున్నట్లు విన్నవించుకొన్నాడు. లోభ మాత్సర్యాది గుణాలను త్యజించి, ధర్మశాసనం సమగ్రంగా చెల్లేటట్లు చేస్తానని వాగ్దానం చేశాడు. అంతేకాక బ్రాహ్మణప్రభావాన్ని మరింత వివరించుమని కోరాడు. మార్కండేయమహర్షి మరొక ఇతిహాసాన్ని ధర్మరాజుకు చెప్పాడు.

## వామదేవుడి వృత్తాంతం

పూర్వకాలంలో పరిక్షితుడు అనే రాజు అయోధ్యను పాలిస్తూ ఉండేవాడు. సూర్యవంశజుడైన ఆ రాజు సూర్యుడివలె తేజస్సుతో వెలుగుతూ ఉండేవాడు. అతడు ఒకనాడు గుర్రమెక్కి అడవికి వేటకు వెళ్ళాడు. అనేక మృగాలను వేటాడాడు. ఒకచోట ఆ మహారాజు ఒక అందగత్తెను చూచి, మదనభావానికి వశుడై ఆమెను సమీపించాడు. ఆమెకూడా ఆతడిని నర్మగర్భంగా చూచి వలపును ప్రకటించింది. ఆమె తండ్రి యాజ్ఞ చొప్పున తగిన వరుడి కొరకు అన్వేషిస్తూ ఆ అడవిలో నడయాడుతున్నదని తెలిసికొని ఆమెపైగల తన వలపును తెలియపరిచాడు. ఆమె అతడిని వివాహమాడటానికి అంగీకరించింది. కాని, ఆమెను ఎప్పుడూ జలవిహారానికి నియోగించకూడదని కట్టడి చేసింది. అతడు ఆ నియమానికి కట్టుబడి ఆమెను రాజధానికి తనతో తీసికొనిపోయాడు. అక్కడ క్రీడాభవనాలలో, ఉద్యానవనాలలో ఆమెతో రమిస్తూ విహరించాడు. ఒకనాడు విలాసభవనం నుండి వెలువడిన పరిక్షితుడి శరీరం చెమటతో తడిసింది. అందువలన సమీప సరోవరంలో స్నానం చేయాలని అనుకొన్నాడు. తన ప్రియురాలిని కూడా రమ్మని, సరోవరంలో దిగి జలకాలాడుమని పిలిచాడు. ఆమె చిరునవ్వు నవ్వుతూ ఆ కొలనులో దిగి వెంటనే అదృశ్యమైపోయింది.

రాజు అందుకు ఆశ్చర్యపడిపోయాడు, ఆ కొలనంతా ప్రియురాలి కొరకు గాలించాడు. నీరంతటినీ తోడి బైట పోయించాడు. అయినా ఆమె కనపడలేదు. కాని, అడుగున ఎన్నో కప్పలు ఉండటం గమనించాడు. అవే తన ప్రియురాలిని మ్రింగి ఉంటాయని భావించి, ఆగ్రహించి, తన రాజ్యంలో ఉన్న కప్పలనన్నింటిని వెదకి వెదకి చంపటానికి భటులను ఆజ్ఞాపించాడు. వారు నీటిపట్టులనన్నింటినీ గాలించి కప్పలను చంపి కుప్పలుగా పోయ నారంభించారు.

దానిని గమనించి కప్పలరేడు ఒక మహర్షి రూపం ధరించి పరిక్షితుడు వద్దకు వచ్చి అతడి కప్పలమీది ద్వేషానికి కారణమడిగాడు. తన ప్రేయసికి చేసిన అపకారానికి ప్రతిగా కప్పలను చంపుతున్నాని ఆ రాజు చెప్పాడు. ఆ మాటలు విని మునివేషం వదలి కప్పలనాయకుడైన ఆయువు నిజరూపంతో కనపడి, పరిక్షితుని ప్రేమించిన కన్య తన కూతురనీ, ఆమె పేరు సుశోభన అనీ ప్రకటించాడు. ఆమె తన వలపుతో అంతకుముందే ఎందరినో మోసగించిందని చెప్పాడు. రాజు కోరికపై ఆమెను నిజరూపంతో అతడికి అప్పగించాడు. ఆమె రాజులను చులకనగా భావించి మోసగించింది కాబట్టి ఆమెకు పుట్టే కొడుకులు మోసగాండ్రు ఔతారని శపించాడు. ఆయువు కూతురుకు హితవు చెప్పి వెళ్ళిపోయాడు. పరిక్షితుడు సుశోభనయందు శలుడు, నలుడు, వలుడు అనే ముగ్గురు కొడుకులను పడశాడు. వారిలో పెద్దవాడైన శలుడికి పట్టం కట్టి తపోవనానికి పోయాడు.

ఒకనాడు శలుడు బంగారు తేరు మీద అడవికి వేటకు వెళ్ళాడు. ఎన్నో మృగాలను సంహరించాడు. ఒక మృగాన్ని వాడియైన బాణంతో కొట్టాడు. గ్రుచ్చుకొన్న బాణంతో ఆ లేడి తప్పించుకొని పారిపోసాగింది. దాని వెంట రథాన్ని పరుగెత్తించాడు. కాని, ఆ రథాశ్వాలు అంతవేగంగా రథాన్ని లాగలేకపోయాయి. రథసారథి వామ్యజాతి గుర్రాలైతే రథాన్ని అద్భుత వేగంతో లాగగలవని రాజుకు విన్నవించుకొన్నాడు. వామ్యహయాలు వామదేవుడనే మహర్షి వద్ద ఉంటాయని తెలియచెప్పాడు. శలుడు వామదేవాశ్రమానికి వెళ్ళి, ఆ వామ్యాశ్వాలను అర్థించాడు. ఆ ముని కరుణించి, పని తీరిన తరువాత వెంటనే ఆ గుర్రాలను తిరిగి తన కిచ్చే కట్టడితో ఆ రాజుకు వామ్యాశ్వాలను ఇచ్చాడు. శలుడు ఆ కట్టడి కంగీకరించి, వామ్యాశ్వాలను రథానికి పూన్చుకొని, మృగాన్ని వెంటాడి దానిని చంపి, తన పట్టుదల సాధించి సంతృప్తి చెందాడు. కాని, ఆ వామ్యాశ్వాలను వామదేవుడికి తిరిగి ఇవ్వకుండానే తన రాజధానికి వెళ్ళాడు. 'ఆ మేటి గుర్రాలు రాజుల వద్ద ఉండదగినవి కాని, పేదబాపడి కెందు'కని భావించి అహంకరించి ఆ గుర్రాలను తన అంతఃపురంలో ఉంచుకొన్నాడు.

నెల రోజులు గడిచాయి. వామదేవుడు శలుడి దురహంకారాన్ని పసికట్టాడు. అశ్వాలను అడిగి తెమ్మని తన శిష్యుడైన ఆత్రేయుడిని పంపాడు. ఆత్రేయుడు రాజును దర్శించి వామదేవుడి సందేశాన్ని వినిపించాడు. శలుడు దురహంకారంతో దుర్భాషలాడి గుర్రాలనిచ్చేది లేదని, తిరిగి పొమ్మని, తిరస్కరించాడు. ఆత్రేయుడు తిరిగి వెళ్ళి గురువు కా సంగతి చెప్పాడు. వామదేవు డాగ్రహించాడు. శలుడి దగ్గరకు స్వయంగా వెళ్ళాడు. పరద్రవ్యాపహరణం పాపహేతువని హెచ్చరించి తన గుర్రాలను తిరిగి ఇచ్చి మాట నిలబెట్టుకొనుమని కోరాడు. శలుడు అతడి మాటలు పట్టించుకొనలేదు. బ్రాహ్మణులకు గుర్రాలు నిరుపయోగాలనీ, గుర్రాలకు బదులు ఎద్దులను గాని, అధికసంఖ్యలో కంచరగాడిదలను గాని ఇస్తానని చెప్పాడు. అంతటితో ఆగక వామ్యజాతి గుర్రాలను ముని కోరటం అనుచితమని నిందించి, తిరిగిపొమ్మని పరుషంగా పలికాడు. అతడి మాటలను వామదేవుడు సహించలేకపోయాడు. 'విప్రుల ధనాన్ని అపహరించటమే ఒక పాపం. దానికి బదులు మరేదో ఇస్తాననటం హాస్యాస్పదం. అది అన్యాయం'- అని అన్నాడు. ఆ మాటలకు శలుడు మండిపడ్డాడు. వామదేవుడిని పట్టి బంధించి శూలాలతో చంపండని భటుల నాజ్ఞాపించాడు. వామదేవుడి ముఖం కోపంతో ఎర్రబారింది. అందులో నుండి ఆ క్షణంలో అనేకమంది రాక్షసులు పుట్టి, శలుడిపై లంఘించి శూలాలతో పొడిచి అతడిని చంపివేశారు. మునీంద్రుడు తిరిగి వెళ్ళాడు.

శలుడి తరువాత అతడి తమ్ముడు నలుడు రాజయ్యాడు. కొంతకాలం గడిచింది. వామదేవుడు మరల రాజాస్థానానికి వచ్చి, తన గుర్రాలను తిరిగి ఇచ్చి ధర్మాన్ని కాపాడుమని నలుడిని అడిగాడు. నలుడు మండిపడ్డాడు. వామదేవుడికి యుక్తాయుక్త విచక్షణ లేదని నిందించాడు. విషబాణంతో వామదేవుడి వక్షాన్ని చీల్చిచంపుతానని సారథిని- విల్లును సిద్ధం చేయుమన్నాడు. ఆ మాటలు వామదేవుడికి ఈటెలుగా చెవులకు తాకాయి. 'ఓ రాజా! నీవు ప్రయోగించే బాణం అంతఃపురంలో ఉన్న పసివాడైన నీ కొడుకును సంహరిస్తుంది చూడు' మని హెచ్చరించాడు. వామదేవు డన్నంత పని అయింది. అంతఃపురంలో బాలుడు చనిపోయాడని స్త్రీలు రోదించనారంభించారు. నలుడు కోపోద్రిక్తుడయ్యాడు. బాణంతో బ్రాహ్మణుడిని చంపటానికి వింటినారి సారించాడు. కాని, వామదేవుడి మహిమతో నలుడి చేతులు అమ్ముతో పాటు స్తంభించిపోయాయి. నలుడు ఆశ్చర్యపడి, చేసేది లేక తలవంచుకొన్నాడు. కొంత తడవు విచారించి అందరూ వినేటట్లు ఈవిధంగా ప్రకటించాడు. 'నేను అనేక దుర్భాషలాడాను, అవన్నీ వమ్మయిపోయాయి. బాణం వేసే శక్తి నాకు పోయింది. బ్రాహ్మణమాహాత్మ్యం నిజంగా గొప్పది. నేను వామదేవుడి ముందు ఓడిపోయాను. ప్రజలారా! మీ ముందు ఈ మహామునిని శరణు వేడుతున్నాను'- అని పేర్కొన్నాడు. అందరూ అతడితోపాటు మునీంద్రుడిని శరణు వేడారు. వామదేవుడు ప్రసన్నుడై స్తంభన స్థితి నుండి రాజును విముక్తుడిని చేశాడు. మృతబాలుడిని తిరిగి బ్రతికించాడు. నలుడు తన అంతఃపురం నుండి వామ్యాశ్వాలను తెప్పించి వామదేవుడికి వినయంతో సమర్పించాడు. వామదేవుడు వామ్యాశ్వాలను తీసికొని తన ఆశ్రమానికి వెళ్ళాడు. బ్రాహ్మణప్రభావం - అంటే ఇటువంటిది- అని మార్కండేయ మహర్షి ధర్మరాజుకు వివరించి చెప్పాడు.

### ఇంద్రద్యుమ్నుడి కథ

**ధర్మరాజు :** మార్కండేయ మహర్షీ! మీ కంటె వృద్ధుడైన పురుషుడు ఈ లోకంలో ఎవరైనా ఉన్నాడా? ఉంటే తెలపండి.

**మార్కండేయుడు:** ఇంద్రద్యుమ్ను డనే రాజు స్వర్గలోకంలో ఎంతోకాలం ఉన్నాడు. క్రమంగా అతడి కీర్తి తగ్గింది. అందువలన అతడిని స్వర్గం నుండి భూమికి పంపారు. అతడు నావద్దకు వచ్చాడు. 'నన్ను గుర్తించగలవా?' అని

నన్నడిగాడు. 'నేను గుర్తించలేను కాని, హిమవత్పర్వత శిఖరం మీద ఉండే ప్రావారకర్ణుడనే గుడ్లగూబ నాకన్న వయసులో పెద్దది. అది నిన్ను గుర్తించవచ్చు' నని నేనన్నాను. ఇంద్రద్యుమ్నుడు తనతో నన్ను కూడా రమ్మన్నాడు. 'రసఘుటికసేవించి ఉన్నాను. కనుక రాజాలను' అని అనినప్పటికీ అతడు గుర్రంగా మారి తన వీపుమీద నన్నెక్కించుకొని ఆ గుడ్లగూబ వద్దకు తీసికొనిపోయాడు. ప్రావారకర్ణుడు కూడా అతడిని గుర్తించలేకపోయాడు. ఇంద్రద్యుమ్నమనే సరోవరంలో నాళీకజంఘుడనే పేరుగల బకవల్లభుడు తనకంటె పెద్దవాడున్నాడని ప్రావారకర్ణుడు పేర్కొన్నాడు. అతడిని కూడా తన వీపుమీద కూర్చుండబెట్టుకొని నాళీకజంఘుడి వద్దకు వెళ్ళాడు. ఆ కొంగల రేడు కూడా ఇంద్రద్యుమ్న్యుడిని గుర్తించలేకపోయాడు. కాని, అతడికంటె వృద్ధుడైన అకూపారుడనే తాబేటిరేడు ఆ కొలనులోనే ఉన్నాడని పేర్కొన్నాడు. అతడిని పిలిచి ఇంద్రద్యుమ్నుడిని గుర్తించగలవా? అని అడిగారు. అతడు కొంచెం సేపు జ్ఞాపకం తెచ్చుకొని కన్నుల నుండి ఆనందబాష్పాలు రాలుతూ ఉండగా గద్గదస్వరంతో ఇట్లా అన్నాడు.

'అయ్యో! ఎంతమాట! ఇంద్రద్యుమ్న మహారాజును నేను ఎట్లా మరచిపోగలను? ఆయన మహాత్ముడు. నన్ను ఎన్నో ఆపదలనుండి కాపాడాడు. ఎన్నో యజ్ఞాలు చేశాడు. ఆ యజ్ఞాలలో దక్షిణలుగా లెక్కకు మించి గోవులకదంబాలను బ్రాహ్మణులకు అర్పిస్తుండేవాడు. ఆ ఆవుల గిట్టల తాకిడికి పల్లపు గొయ్యిగా ఏర్పడినదే ఈ సరోవరం. ఇది లోక ప్రసిద్ధం.'

ఆ మాటలు వినగానే దేవదూతలు వచ్చి విమానం తెచ్చి ఇంద్రద్యుమ్నుడిని స్వర్గానికి రమ్మని ఆహ్వానించారు. అతడి కీర్తి లోకంలో శాశ్వతంగా నిలిచి ఉండేది కాబట్టి స్వర్గలోక సౌఖ్యాలు శాశ్వతంగా అనుభవించవచ్చు నన్నారు. అంటే - ఈ లోకంలో ఎవరి కీర్తి ఎంతకాలం నిలిచి ఉంటుందో వారు అంతకాలం వరకు స్వర్గలోక సౌఖ్యాలను అనుభవిస్తా రన్నమాట!

ఇంద్రద్యుమ్నుడు మార్కండేయ మహర్షిని, ప్రావారకర్ణుడిని, నాళీకజంఘుడిని వారి వారి చోట్లలో దింపి, తాను దివ్యరథమెక్కి స్వర్గలోకం చేరుకొన్నాడు. మార్కండేయుడు చెప్పిన ఈ కథను ధర్మజుడు విని సంతోషించాడు. మార్కండేయుడి కంటె కూడా వృద్ధు డున్నాడని తెలిసి ఆశ్చర్యపడ్డాడు.

**ధర్మరాజు :** మార్కండేయ మహర్షీ! ఇక్ష్వాకు వంశంలో పుట్టిన కువలాశ్వుడికి ధుంధుమారుడనే పేరు ఎట్లా ఏర్పడిందో చెప్పండి.

**మార్కండేయుడు:** ఉదంకుడనే ముని అనేక సంవత్సరాలు విష్ణువును గూర్చి తపస్సు చేశాడు. అతడి తపస్సుకు మెచ్చి విష్ణువు ప్రత్యక్ష మయ్యాడు. ఉదంకు డా దేవదేవుడిని అనేక విధాలుగా స్తుతించాడు. విష్ణువు ఉదంకుడిని వరం కోరుకొనుమన్నాడు. విష్ణు దర్శనం కంటె కోరదగిందేముంటుందని అంటూనే తన మనస్సు ఎల్లప్పుడూ సత్యధర్మశమభావాలతో సుస్థిరంగా ఉండి విష్ణువుపై దృఢభక్తి కలిగి ఉండాలని కోరుకొన్నాడు. ఆ వరాన్ని విష్ణుదేవుడు ప్రసాదించి, అతడి వలన త్రిలోకహితం కలిగే ఒక పని సాధించబడుతుందని పేర్కొన్నాడు. ''ధుంధుడనే రాక్షసుడు లోకాలకు ఉపద్రవాలను కలిగిస్తాడు. అతడిని వధించటానికై బృహదశ్వుని కుమారుడైన కువలాశ్వుడిని నీవు ప్రేరేపించాలి. ఆ రాజు నా దయవలన కలిగే యోగబలంతో, నీ యాజ్ఞ చొప్పున ఆ రాక్షసుడిని సంహరిస్తాడు. నీ వలన కలిగే ఆ సత్కార్యానికి లోకాలన్నీ సంతోషిస్తాయి' అని వివరించి విష్ణువు అంతర్ధానమయ్యాడు. ఉదంకుడు మరల తపస్సులో మునిగాడు.

ఇక్ష్వాకు వంశంలో బృహదశ్వుడికి కువలాశ్వుడు పుత్రుడై పుట్టాడు. అతడికి ఇరవై ఒక్కవేల మంది కొడుకులు పుట్టి అస్త్రశస్త్రవిద్యలలో ఆరితేరారు. బృహదశ్వుడు కువలాశ్వుడికి పట్టం కట్టి, తపోవనానికి పోవాలని నిశ్చయించాడు. ఆ సంగతి తెలిసి ఉదంకుడు అయోధ్యకు వచ్చాడు. ధుంధుడు చేసే దుండగాలను అతడితో చెప్పాడు. మధుకైటభుల కొడుకైన ధుంధుడు బ్రహ్మవలన పొందిన వరబలంతో దేవగంధర్వాదులను ముప్పతిప్పలు పెట్టాడు. ఆ తరువాత ఉదంకాశ్రమ సమీపంలో గల సముద్రతీరంలోని ఇసుక తిన్నెలలో ఒక పెద్ద సొరంగం త్రవ్వుకొని అందులో హాయిగా పవళించి నిద్రిస్తున్నాడు. అతడు పీల్చిన

గాలి వదలేటప్పుడు అది పెనుగాలిగా మారి అగ్నిజ్వాలలతో పొగలతో నిండి భయంకరంగా వ్యాపించి కొండలను, అడవులను, ఇసుక రేణువులతో మాటు పడేటట్లు చేస్తుంది. 'సంవత్సరాని కొకసారి ఏడురోజులపాటు ఆ సంకటం మా ఆశ్రమవాసుల కేర్పడుతుంది. కాబట్టి నీవా రాక్షసుడిని చంపి మాకూ లోకానికీ శాంతిని కూర్చి తపోవనానికి వెళ్ళు' మని కోరాడు. 'ఆ రాక్షసుడిని చంపటానికి పూనుకొనే వీరుడికి విష్ణువు తన యొక్క శక్తిసామర్థ్యాలు ప్రసాదిస్తాడ'ని పేర్కొన్నాడు.

బృహదశ్వుడు తపోవనానికి పోవ సంకల్పించి అస్త్ర సన్యాసం చేయటం వలన తన కుమారుడైన కువలాశ్వుడికి ఆ బాధ్యత నప్పగించాడు. కువలాశ్వుడు తన పుత్రులందరూ వెంటరాగా, అపార చతురంగ సైన్యంతో ధుంధుడి మీదికి దండయాత్రకు బయలుదేరాడు. విష్ణువు తన శక్తిని కువలాశ్వుడికి దత్తం చేశాడు. దేవతలు అతడిని ఆశీర్వదించారు. కువలాశ్వుడి కొడుకులు వివిధాయుధాలతో ఇసుక తిన్నెలను వారం రోజులపాటు త్రవ్వారు. నిద్రిస్తున్న ధుంధుడు సొరంగంలో కనపడ్డాడు. అతడి ముక్కులలో నుండి వేడి నిట్టూర్పు గాలులు అగ్ని జ్వాలలతో కలిసి వెలువడుతున్నాయి. కువలాశ్వుడి కుమారులు వివిధాయుధాలను ప్రయోగించి ధుంధుడిని నిద్రలేపారు. ఆ రాక్షసుడు నిద్రలేచి నోరు తెరిచి ఆవులించాడు. ఆ నోటిలో నుండి వెలువడ్డ మంటలకు కువలాశ్వుడి కుమారులలో ముగ్గురు తప్ప అందరూ- కపిలమహర్షి కోపాగ్నికి ఆహుతి అయిన సగరపుత్రులవలె- దగ్ధులయ్యారు.

కువలాశ్వుడు కోపోద్రిక్తుడై ధుంధుడిని ముట్టడించాడు. అతడు లేచాడు. అతడి దేహం నుండి అగ్నిజ్వాలలు భయంకరంగా వెలువడుతున్నాయి. మండుతున్న భల్లాన్ని అతడు ప్రయోగించాడు. కువలాశ్వుడు విష్ణుయోగ శక్తి వలన అతడి దేహం మీది మంటల నార్పి, బ్రహ్మాస్త్ర ప్రయోగంతో అతడిని వధించాడు. అతడి పరాక్రమానికి మెచ్చి దేవతలూ, ఋషులూ అతడికి 'ధుంధుమారు' డనే బిరుదనామాన్ని ప్రసాదించారు. ఉదంకుడు, ఇంద్రుడు ప్రసన్నులై కువలాశ్వుడిని వరం కోరుకొనుమన్నారు. అతడు బ్రాహ్మణభక్తినీ, నిరంతర దాన శీలాన్ని, విష్ణువుతోటి చెలిమినీ, వరాలుగా కోరుకొన్నాడు. వా రా వరా లిచ్చి వెడలిపోయారు. కువలాశ్వుడు అయోధ్యకు తిరిగి వచ్చి సముజ్జ్వల సామ్రాజ్య సౌఖ్యాల ననుభవించాడు.

### మధుకైటభుల వృత్తాంతం

**ధర్మరాజు :** మునీంద్రా! ధుంధుడు మధుకైటభుల పుత్రుడని చెప్పారుకదా! వారు ఏకాలం వారు? వారు చివర కేమైనారు?

**మార్కండేయుడు:** పూర్వం ప్రళయకాలంలో మూడు లోకాలూ ఏకార్ణవంగా ఏర్పడిన నీటిలో మునిగి ఉండగా, విష్ణువు శేషశయనం మీద పవ్వళించి యోగనిద్రలో ఉండగా చాలాకాలం గడచింది. పిదప మధుకైటభులు బలగర్వితులై విష్ణుదేవుడి నాభీ కమలంలో ఉన్న బ్రహ్మదేవుడిని పట్టి మోదారు. ఆ దెబ్బలకు బ్రహ్మదేవుడు 'ఆదిపురుషా! నన్ను రక్షించు' అంటూ ఆక్రందన చేశాడు. విష్ణువు యోగనిద్ర నుండి మేల్కొని భయంకర పరాక్రములైన మధుకైటభులను చూచి, 'వరాలు కోరుకొనండి ఇస్తాను' అని ప్రకటించాడు.

మధుకైటభులు గర్వంతో అట్టహాసం చేశారు. 'వరాలు నీ విచ్చేదేమి? మేమే నీ కిస్తాం కోరుకొ'మ్మన్నారు. అదే సమయమని మహావిష్ణువు తన చేతిలో వారు మరణించాలని వరం వేడుకొన్నాడు. మధుకైటభులు తమ వాగ్దానాన్ని పాటించి, జగమంతా జలమయమని భావించి, ఉపాయాన్ని ఊహించి, నీరులేని చోట విష్ణువు తమను సంహరించటానికి అంగీకరించారు. విష్ణువు తన తొడలనే వేదికగా చేసి, సుదర్శన చక్రంతో మధుకైటభుల తలలను నరికాడు. ఆ మధుకైటభులకు పుట్టిన వాడు ధుంధుడు.

### తల్లిదండ్రులు-పుత్రులు

**ధర్మరాజు :** పుత్రుల కొరకు పడే ఆయాసంలో తల్లిదండ్రు లిద్దరిలో ఎవరిపాలు ఎక్కువ?

**మార్కండేయుడు:** సంతానాన్ని ఉదరంలో నవమాసాలు కష్టపడి మోసి ప్రాణసంశయ స్థితిని పొంది కడుపార కనేది తల్లి. సంతానం కోరి తపస్సులు, యజ్ఞాలు, దానాలు, వ్రతాలు, తీర్థయాత్రలు చేసి పాటుపడి ప్రయత్నం చేసేవాడు తండ్రి. ఈ విధంగా పుత్రుడి (సంతానం) కొరకు తల్లిదండ్రు లిద్దరూ పడేపాట్లు సమానమే.

**ధర్మరాజు :** తల్లిదండ్రుల పట్ల పుత్రుడు ఏవిధంగా మసలుకొనాలి?

**మార్కండేయుడు:** తనయుడు తమకు భక్తుడై ఉంటాడనీ, ధర్మానురక్తుడై వర్తిస్తాడనీ తల్లిదండ్రులు ఆశపడుతూ ఉంటారు. వారి ఆశలకు, ఆశయాలకూ ఫలసిద్ధి కలిగించేవాడే పుత్రుడు. ఎవడి ప్రవర్తనంవలన తల్లిదండ్రులు సంతోషపడతారో ఆ తనయుడు ధర్మాన్నీ, కీర్తినీ సమానంగా పొందుతాడు. చివరకు అక్షయపదాలను అందుకొంటాడు.

## పతివ్రతామాహాత్మ్యం

**ధర్మరాజు :** ఇంద్రియాలను నిగ్రహించి, మనస్సును నియమించి, అహంకారాన్ని అణచుకొని, సద్భక్తి పెంపుతో ఎల్లప్పుడూ భర్తృశుశ్రూషలో నిమగ్నలైన పతివ్రతలు లోకోత్తరలు. వారి చరిత్రలు ధర్మసూక్ష్మాలతో కూడి ఉంటాయి. వాటిని తెలిసికొనటం కష్టం. కాబట్టి, పతివ్రతా మాహాత్మ్యాన్ని వివరించండి.

**మార్కండేయుడు:** భర్తృశుశ్రూషలో నిత్యాసక్తురాలైన పతివ్రతకు యజ్ఞదాన తపస్సులు చేసిన ఫలాలు సులభంగా లభిస్తాయి. ఈ తాత్పర్యాన్ని బోధించే ఒక ఇతిహాసం చెప్పుతాను వినుము. అందులో నీవడిగిన అంశాలన్నీ తేటపడతాయి.

పూర్వం కౌశికుడనే బ్రాహ్మణుడు నిరంతరం వేదాధ్యయనం చేస్తూ ఒక గ్రామంలో ఉన్నాడు. ఒకనాడు ఆయన గ్రామసమీపంలోని ఒక చెట్టు క్రింద కూర్చుండి వేదాలు వల్లెవేస్తున్నాడు. ఆ చెట్టుమీది ఒక కొంగ అతడి మీద రెట్టవేసింది. అతడు కోపంతో తీక్ష్ణంగా ఆ కొంగవైపు చూచాడు. అది చచ్చి క్రింద పడింది. ఆ దృశ్యాన్ని చూచి కౌశికుడు బాధపడ్డాడు. తన హృదయ కాఠిన్యాన్ని నిందించుకొన్నాడు. నిష్కారణంగా ఒక జీవిని హింసించినందుకు మనశ్శాంతిని కోల్పోయాడు. చాలాసేపు చింతించాడు. మధ్యాహ్న మయింది. గ్రామంలోకి పోయి బ్రాహ్మణవీథిలో ఒక గృహం ముందు నిలిచి, 'భిక్షాం దేహి' అని అన్నాడు. ఆ ఇంటి ఇల్లాలు భిక్ష నివ్వటానికి పాత్రను సిద్ధపరచుకునే లోపలే ఆమె భర్త ఆకలితో సోలుతూ తూలుతూ వచ్చాడు. ఆ ఇల్లాలు ఆయనకు స్నానం చేయించి, భక్తితో భోజనం పెట్టి, సెజ్జపై అతడు పరుండగా తాంబూల మిచ్చి, పాదాలొత్తి, ఆతడు నిద్రించిన తరువాత ముంగిట్లో ఉన్న బ్రాహ్మణుడికి భిక్షపెట్టటానికి వెళ్లింది.

కౌశికుడు ఆమెను చూచి కసరుకొన్నాడు. కన్నెర్ర చేసి, భిక్షను ఆలస్యంగా పెట్టి తనను అవమానించినట్లు నిష్ఠురాలాడాడు. ఆ పతివ్రత తన భర్త రాకను, తాను ఆతడికి చేసిన శుశ్రూషను పేర్కొని, తాను తప్పేమీ చేయలేదనీ, దానిని సహించాలనీ పేర్కొన్నది. మగువలకు మగని కంటె అతిథులు ముఖ్యమనీ, లోకవంద్యులైన బ్రాహ్మణులను ఇంద్రాదులే భక్తితో పూజిస్తుంటే ఆమె అవమానం చేసిందని కౌశికుడు నిష్ఠురమాడాడు. అవమానితులైన బ్రాహ్మణులు కోపగిస్తే వారి క్రోధాగ్నిశిఖలు భూమినంతా దగ్ధం చేస్తాయన్న సంగతి తెలియదా? అని గద్దించాడు. ఆమెకూడా తనకు బ్రాహ్మణమాహాత్మ్యం తెలుసుననీ, వారిని అవమానించటం కొరవితో తల గోక్కొనటమేననీ చెప్పింది. అయినా, తన పాలిటి దైవం పతియే అనీ, త్రికరణశుద్ధిగా ఆయనను సేవించటం కంటె మరొక ధర్మం లేదనీ పేర్కొన్నది. కౌశికుడు కోపాగ్నితో కొంగను చంపిన విషయం పేర్కొని దానిని తన పాతివ్రత్య మహిమ వలన తెలిసికొన్నానని హెచ్చరించింది. బ్రాహ్మణులు క్రోధమోహాలనే అంతశ్శత్రువులను ముందుగా జయించాలని హితవు చెప్పింది. సత్యం పలికేవాడు, అహింసావ్రతుడు, గురుజనహితం కోరేవాడు, ఇంద్రియాలను జయించి సర్వభూతాలను తనవలె భావించేవాడు, కామరహితుడు, షట్కర్మనిరతుడు, పుణ్యాత్ముడు అయినవాడే బ్రాహ్మణుడని ఆర్యులు పేర్కొంటారనీ శమదమాదులు విప్రుల ధర్మసాధనలనీ, వేదవిహిత విధులు ముఖ్యంగా ఆచరణీయాలనీ పేర్కొన్నది. ధర్మం అనేక మార్గాలలో అన్వయించుకొనవలసిన అతిసూక్ష్మమైన విద్య అనీ, స్వాధ్యాయపరుడైన కౌశికుడు

ధర్మసూక్ష్మాన్ని తెలియలేదనీ చెప్పింది. జితేంద్రియుడు, సత్యవాది, మాతాపితృ భక్తియుక్తుడైన ధర్మవ్యాధుడనే కిరాతుడు మిథిలానగరంలో ఉంటాడనీ, అతడిని దర్శించి ధర్మాలన్నింటినీ తెలిసికొమ్మని హితవు చెప్పింది. వనితలు ఎట్టి అపరాధాలు చేసినా క్షమార్హులు కాబట్టి తనపై కోపగించవద్దని కోరింది. కౌశికుడు ఆమె మాటలకు చిత్తశాంతి పొంది, ఆమెను ఆశీర్వదించి, ధర్మవ్యాధుడిని దర్శించటానికి వెంటనే బయలుదేరాడు.

మిథిలానగరంలో మాంస విక్రయవృత్తిలో నిమగ్నుడై ఉన్న ధర్మవ్యాధుడిని చూచాడు. మాంస విక్రయశాలకు కొంతదూరంగా తొలగిపోయి నిలిచాడు. ధర్మవ్యాధుడు కౌశికుడిని గుర్తించి సమీపించి కుశల మడిగాడు. పతివ్రత పంపగా వచ్చిన సంగతి తనకు తెలుసునని చెప్పి, కౌశికుడిని తన యింటికి అతిథిగా తీసికొని వెళ్ళాడు. పతివ్రత ప్రదర్శించిన జ్ఞానానికే ఆశ్చర్యపడిన కౌశికుడు ధర్మవ్యాధుడి జ్ఞానానికి మరీ ఆశ్చర్యపోయాడు. కౌశిక ధర్మవ్యాధుల మధ్య సంభాషణ ఈ విధంగా సాగింది-

**కౌశికుడు :** ధర్మవ్యాధా! నీవు ధర్మం తెలిసినవాడవు. ఈ విధంగా జీవహింస చేయటం ఉత్తమ పద్ధతియా? నా మనస్సు దీనికి విచారిస్తున్నది.

**ధర్మవ్యాధుడు:** బ్రాహ్మణులకు తపస్సు, స్వాధ్యాయం, సత్యం, శౌచం, బ్రహ్మచర్యం పరమధర్మాలు. అట్లాగే రాజులకు దండనీతి, వైశ్యులకు వ్యవసాయం, పశుపాలనం, వాణిజ్యం, శూద్రులకు శుశ్రూష, మాకు మృగమాంసవిక్రయంతో జీవించటం వృత్తిధర్మం. వంశపరంపరగా వచ్చే ఆచారం దాటరానిది. మా రాజైన జనకుడు వర్ణ ధర్మ రక్షకుడు. ఆ ధర్మాన్ని ఉల్లంఘిస్తే తన కొడుకునైనా మా రాజు దండిస్తాడు. కాబట్టి నేను నా వృత్తి ధర్మాన్ని పరిత్యజించలేను. నేను స్వయంగా జీవహింస చేయను. మాంసాన్ని క్రయం చేసి, ముక్కలు చేసి విక్రయిస్తాను. ఇది నా బ్రతుకు తెరువు. ఇందులో నాకు మనశ్శాంతి కలుగుతుంది.

వృత్తిధర్మంతోపాటు నేను పెద్దల సేవ చేస్తాను. విప్రులను దేవతలను ఆరాధిస్తాను. సత్యశౌచాలను పాటిస్తాను. పనివారిని దయతో చూచుకొంటాను. ఓర్పుతో, అసూయకు లోనుగాక, ఆశకు పోక, పరదూషణం చేయక ఏకపత్నీవ్రతంతో, వ్రతనిష్ఠలతో, సమచిత్తంతో జీవిస్తాను. కాబట్టి తక్కువ కులంలో పుట్టినా పవిత్రుడనే. ప్రసంగవశంగా ఈ మాటలు నన్ను గురించి చెప్పాను గాని, ఇక నీకు ధర్మ విశేషాలు వివరిస్తాను వినుము - అని అన్నాడు.

## ధర్మవ్యాధుడి ధర్మబోధలు

**ధర్మరాజు :** మార్కండేయ మహర్షీ! తక్కువ కులంలో పుట్టినవాడు కూడా ఎటువంటి నడవడిక కలవాడైతే ఉత్తమ ధార్మికలోకాలను పొందగలడు?

**మార్కండేయుడు:** ధర్మరాజా! నీ వడిగిన అంశాల కన్నిటికీ ధర్మవ్యాధోపాఖ్యానంలో సమాధానాలు దొరుకుతాయి వినుము. ధర్మవ్యాధుడు కౌశికుడికి ఈ విధంగా ధర్మబోధ చేశాడు-

**ధర్మవ్యాధుడు:** ప్రతివాడూ తన కుల ధర్మాన్ని పరమధర్మంగా పాటించాలి. మనసులో దయ కలిగి ఉండాలి. అందరి భావాలనూ విని సహించి, విషయవాంఛలు వదలుకోవాలి. త్యాగశీలుడికి అసాధ్యమనేది ఉండదు. సత్యహితవచనం, సుజనుల పట్ల గౌరవభావం, కామక్రోధ విద్వేషాలతో మనసు కలుషితమైనా ధర్మం తప్పకుండా ఉండటం, ద్వంద్వాతీత ప్రవృత్తి కలిగి ఉండటం, విశ్వశ్రేయోభావనం, కీడు చేసిన వారికి కూడా మేలు చేయటం- అనే గుణాలు ఉత్తముల లక్షణాలు. ఇతరులకు కీడు తలపెట్టితే ఆ పాపమే వాడికి కీడు చేస్తుంది. నాస్తికుల మాటలు విని ధార్మికులు తమ ధర్మాలపట్ల ఆసక్తిని కోల్పోరాదు. పాపం తెలియక చేసినా దానికి విచారిస్తే సగం పోతుంది. ఇకముందు అటువంటి పాపం చేయనని సంకల్పిస్తే పాపమంతా పోతుంది. క్రోధలోభాలు మహాపాపాలు; వాటిని జయించినవాడు ఉత్తముడు. గడ్డితో కప్పబడిన బావులవలె కపట ధర్మాలు కొన్ని మార్గంలో తగలవచ్చు. వాటికి దూరంగా ఉండి శిష్టాచారాలను పాటించటం ధర్మం.

**కౌశికుడు :** శిష్టాచారాలని వేటిని అంటారు? వాటిని తెలపండి.

**ధర్మవ్యాధుడు:** దానం, సత్యం, తపస్సు, యజ్ఞం, ఆర్జవం, కామలోభరాహిత్యం, గురుజన శుశ్రూష, కోపం లేకపోవటం, దమం, సంతోషం, నిరంతరాధ్యయనం, దాంభికత్వ రాహిత్యం, దైన్యరాహిత్యం, అసూయా రాహిత్యం, అహంకార రాహిత్యం, ధర్మానురక్తి, నాస్తిక గోష్ఠికి దూరంగా ఉండటం, శీలాన్ని రక్షించుకొనటం, పుణ్య తీర్థాలను సేవించటం, శౌచం, భూతదయ, మితహితోక్తి, సంశ్రితమిత్ర గుప్తి - అనేవి శిష్టాచారాలు. శిష్టాచారాలపథంలో ప్రవేశించిన తరువాత మరొక మార్గాన్ని అవలంబించటం దుర్లభం.

శిష్టాచారంలో ధర్మానికి ప్రాముఖ్యం ఉంటుంది. సత్యం, అహింస దానికి తోడుగా ఉంటాయి. అహింస ధర్మాలన్నిటిలో మిన్న. అది సత్యంతో కూడి ఉండటంచేత శిష్టాచారాలలో సత్యానికే అధిక ప్రాధాన్య ముంటుందని పండితులు పేర్కొన్నారు. ధర్మాలు మూడు రకాలు. 1. వేదవిహితాలు 2. శాస్త్రవిహితాలు 3. శిష్టాచారాలు అని. ఈ మూడూ ఉత్తమ గతులు కలిగిస్తాయి.

కౌశికా! నీవు నా వృత్తి హింసాబహుళమని పేర్కొన్నావు. అయితే ఇది హింస, ఇది అహింస అని విభజించటం ఎవరికీ సాధ్యం కాదు. ప్రాణులు తమ కర్మకు ఫలరూపంగానే చనిపోతాయి. చంపేవాడు నిమిత్తమాత్రుడే. అంతేకాక పశువులకు చెట్లు చేమలు పండ్లు ఆకులు ఆహారంగా బ్రహ్మ సృజించాడు. శిబిచక్రవర్తి తన శరీరాన్ని హింసించి ఇంద్రాగ్నులకు ఆమెతగా అందించలేదా? అయినా అతడికి ఉత్తమగతి వచ్చింది. పూర్వం రంతిదేవుడు ప్రతిరోజూ రెండు వేల గోవుల చొప్పున వేయి సంవత్సరాలు వధించలేదా? బ్రాహ్మణులు యజ్ఞాలలో పశువులను వధిస్తారు కదా! వారందరికి ఉత్తమగతులు కలగలేదా? అగ్ని కార్యాలలో, పితృదేవ కార్యాలలో మాంసాన్ని వినియోగించటం, శేషాన్ని భుజించటం ఆచారమే కదా! రైతు పొలం దున్నేటప్పుడు నాగలి కొన తగిలి ఎన్ని జీవులు నశించవు? అది హింస ఔతుందా? మానవుల అడుగుల క్రిందపడి ఎన్ని సూక్ష్మజీవులు నశించటం లేదు? నీరు, భూమి, ఆకాశం, అన్నీ జంతుమయాలే. అన్నిటా అనుక్షణం హింస జరుగుతూనే ఉంది. దీనిని గమనించకుండా కొందరు 'మేము హింసచేయము' అని అంటూ ఉంటారు. అహింసావ్రతాన్ని పాటిస్తారు. కూరలు, పండ్లూ కోయటం, తినటం హింస కాదా? ఈ లోకంలో హింస చేయనివాడు లేడు. అయితే వీలైనంతవరకు హింసకు దూరంగా ఉండటమే అహింస.

ధర్మం బహువిధాలుగా ఉంటుంది. దానికి శ్రుతి ఎంత ప్రమాణమో, పెద్దల ఆచారం కూడా అంతే ప్రమాణం! జీవుల మేలు కొరకు పలికే అబద్ధం సత్యవాక్య ఫలాన్ని ఇస్తుంది. జీవులకు భయం కలిగించే అచ్ఛమైన సత్యం కూడా అసత్యమౌతుంది. ప్రాణరక్షణలో, పెండ్లిలో అబద్ధమాడినా సత్యం కంటె మించిన ఫలాన్నిస్తుంది. ఇటువంటివి ధర్మసూక్ష్మాలు.

మానవుడు తన కర్మఫలానికి తానే కర్త. ఆపద కలిగినప్పుడు మూఢులు దేవుడిని నిందిస్తారు. అది తప్పు. మంచివారు చేసే పనులు కొన్ని విఫలమౌతాయి. దుర్మార్గు లాచరించే కొన్ని కర్మలు విశేషంగా ఫలిస్తాయి. అటువంటి వన్నీ కర్మఫలాలని తెలిసికొమ్ము.

**జీవలక్షణం**

**కౌశికుడు :** ధర్మవ్యాధుడా! జీవు డెటువంటి వాడు?

**ధర్మవ్యాధుడు :** జీవుడు సనాతనుడు, పాపరహితుడు. కర్మవశాన అనిత్యమైన దేహంలో ప్రవేశిస్తాడు. దేహం నశించినా జీవుడు చెడడు. ఒక దేహాన్ని వదలి మరొకదాన్ని చెంది సుఖదుఃఖాలను పొందుతాడు. కర్మవశాన మరల మరల అనేక దేహాలను ధరిస్తూ ఉంటాడు.

పుణ్యకర్మలవలన దేవజన్మ వస్తుంది. పుణ్యపాప సాంకర్యం వలన మానవ జన్మ ఏర్పడుతుంది. పాపాలు చేస్తే క్రిమికీటకాది జన్మలు ఏర్పడతాయి. ఈ విధంగా జీవుడు మోహసముద్రంలో మునిగి తేలుతూ ఉంటాడు. ఎన్నడూ తీరం చేరడు. పండితు లీసంగతి తెలిసికొని పాపమార్గాన్ని వీడి ధర్మమార్గాన్ని ఆశ్రయిస్తారు. సత్కర్మలు చేస్తారు. ధర్మాచరణ వలన

మనస్సు తేటపడుతుంది. దానివలన క్రమంగా ఇంద్రియాలను జయించి తపస్సు, దమం, సత్యశీలతను సాధిస్తారు. చివరకు మోక్షాన్ని పొందుతారు.

**కౌశికుడు :** ఇంద్రియాలంటే ఏవి? వాటిని నిగ్రహించకపోతే ఎటువంటి పాపా లేర్పడతాయి? నిగ్రహించగలిగితే ఎటువంటి సత్ఫలితాలు కలుగుతాయి?

**ధర్మవ్యాధుడు:** ఇంద్రియ జ్ఞానానికి మనసు మూలం. మనస్సు కామక్రోధాలకు వశమై ఇంద్రియ సుఖాలను కోరుతూ ఉంటుంది. మొదట రాగం, దానివలన లోభం అలవడుతుంది. లోభికి దయ ఉండదు. గర్వం పెరుగుతుంది. అతడు పాపాలకు పాల్పడతాడు. న్యాయమైన మాటలు వినడు: చెడ్డవారితో చెలిమి చేస్తాడు. త్రికరణశుద్ధిని కోల్పోతాడు. ఇహపరాలకు దూరమౌతాడు. కాబట్టి మంచివారితో స్నేహం చేసి ఇంద్రియాలను జయించి ఉత్తమగతి పొందటం మేలు.

ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి- అనేవి పంచభూతాలు. వాటి గుణాలు క్రమంగా శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం - అనేవి. పంచభూతాలు ఆకసం మొదలుకొని వరుసగా అనులోమ పద్ధతిలో పుట్టుతాయి. ప్రతిలోమగతిలో లయిస్తాయి. ఆరవ ఇంద్రియం మనస్సు, ఏడవ, ఎనిమిదవ ఇంద్రియాలు బుద్ధి, అహంకారాలు. సత్త్వరజస్తమస్సులు మూడు గుణాలు. ఇవన్నీ అవ్యక్తంలో నుండి పుట్టి అవ్యక్తంలోనే అంతర్భవిస్తాయి.

ఇంద్రియాలు శబ్దాది విషయాలలో ఎప్పుడూ రమిస్తూ ఉంటాయి. ధీరుడు ఆ సంగతిని గ్రహించి ఇంద్రియాలను జయిస్తాడు. సర్వభూతాలలో వ్యాపించిఉన్న పరమాత్మగా తనను తాను తెలిసికొంటాడు. విషయ విముఖమైన బుద్ధివైభవమే యోగం. యోగి తపస్సులో స్థిరపడతాడు. స్వర్గ నరకాలనేవి వేరే ఎక్కడా లేవు. ఇంద్రియాలను నిరోధించటమే స్వర్గం. ఇంద్రియాలను నిరోధించలేని బలహీనతే నరకం. దేహం రథం, ఇంద్రియాలు గుర్రాలు. ఆత్మ రథసారథి. ధైర్యమనే బలమైన పగ్గాలతో సారథి రథాన్ని తోలుతాడు. ఆ రథాన్ని ఎక్కి పోయేవాడు ధీరుడు. ఇంద్రియాలు లాగేవైపుకే మనస్సు పరుగెత్తుతూ ఉంటుంది. దాని వేగాన్ని నిగ్రహించక పోతే సముద్రంలో పెను తుపానుకు గురి అయిన ఓడవలె బుద్ధి చెడిపోతుంది. ఇంద్రియాలనూ మనస్సునూ వశం చేసికొన్న మానవుడు ధ్యానసమాధిసమగ్రు డౌతాడు. అతడిని దేవతలూ, మునులూ కీర్తిస్తారు.

**కౌశికుడు :** సత్త్వరజస్తమో గుణాల స్వభావాలు తేటపడేటట్లు వివరించుము.

**ధర్మవ్యాధుడు :** తమోగుణం మోహమయం, గర్హణీయం. సత్త్వగుణం నిత్యప్రకాశవంతం. రజోగుణం ఆ రెండు గుణాల మిశ్రరూపం. ఏడుపుగొట్టుతనం, నిద్ర, దైన్యం, మోహం, ఓర్పులేనితనం- తమోగుణ లక్షణాలు. రాగం, లోభం, జడత, అభిమానం- రాజస గుణ లక్షణాలు. ధైర్యం, శాంతి, సంతోషం, విద్య మొదలైనవి సాత్త్విక గుణ లక్షణాలు. సాత్త్విక గుణ సంపన్నుడు జ్ఞానియై నిరహంకార చిత్తవృత్తితో తాపస ప్రవృత్తిని పొంది శాంతిని అనుభవిస్తాడు. శూద్రుడు సత్త్వగుణుడైతే వచ్చే జన్మలలో క్రమంగా వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణ భావాన్ని పొంది ముక్తుడౌతాడు.

**కౌశికుడు:** దేహంలోని ధాతువుల నాశ్రయించి అగ్ని ఎట్లా ఉంటాడు? శరీర వాయువు లుండే తావు లేవి? తెలియచెప్పుము.

**ధర్మవ్యాధుడు:** ఆత్మాగ్ని మూర్ధప్రదేశం వరకు వ్యాపించి ఉంటుంది. నాభి దానికి ఆశ్రయం. ప్రాణం మరొక అగ్ని రూపంలో శిరస్సు నాశ్రయించి ఉంటుంది. ఆ అగ్ని జీవాత్మ. ప్రాణాపాన వాయువులు రెండూ ఆ అగ్నిని ప్రకాశింపజేస్తాయి. అపానవాయువు గుదస్థానంలోని అగ్నితో కూడి ఉంటుంది. మలమూత్ర విసర్జనలో తోడ్పడుతుంది. ఉదానవాయువు కంఠతలంలో ఉంటుంది. కర్మఫలయత్నకారిగా శరీరంలోని కీళ్ళలో సంచరిస్తుంది. ప్రాణాపాన వాయువులు, సమానుడనే అగ్ని అన్నరసాన్ని జీర్ణం చేస్తూ, నాభిస్థానంలో ఉండి

శరీర ధాతువులను పోషిస్తూ ఉంటాయి. ఈ అంశాలను యోగదర్శనం ద్వారా తెలిసికొనవచ్చును. ప్రాణాయామం చేసే యోగి అభ్యాసంతో ఆత్మను సహస్రారంలో నిలుపగలడు. దేహమంతా ప్రాణాపాన సమాన సహితుడై చరించే అగ్ని జీవాత్ముడుగా తెలిసికొంటాడు. సరోవరంలోని నీటి మీది తామరాకు ఎట్లా అసంగంగా ఉంటుందో అట్లాగే జీవాత్మ దేహంలో అంటీ అంటక నిలుస్తాడు. ఆ జీవాత్మే పరమాత్మ, సకల భూతాలలో వెలుగొందే పరమాత్మను, అవ్యయుడిని, జ్యోతిర్మయుడిని అద్వైత బుద్ధితో దర్శించి జ్ఞానులు ఆనందిస్తారు. దానిని బ్రహ్మవిద్య అంటారు.

బ్రహ్మజ్ఞాని శుభాశుభ కర్మలలో మగ్నుడు కాడు. సుఖదుఃఖాలవంటి ద్వంద్వాలలో సమబుద్ధిని కలిగి ఉంటాడు. అతడి దినచర్య విశిష్టం. ఆహారాన్ని నియమంగా స్వీకరిస్తాడు. జితేంద్రియు డౌతాడు. పూర్వాపర రాత్రి సమయాలలో యోగధారణ చేస్తాడు. జ్ఞానోదయమై ఆత్మానుసంధానం చేసికొంటూ గాలికి కదలాడని దీపం వలె ప్రకాశిస్తూ అమృతత్వాన్ని పొందుతాడు. యోగి ఏమరుపాటు లేకుండా ఎప్పుడూ కామక్రోధాలను జయించాలి. నిత్యం కర్మ చేస్తున్నా, ఫలాన్ని కోరకుండా ఉండాలి. మనశ్చాంచల్యాన్ని మట్టుపెట్టాలి. అటువంటి వాడు ఎవడైనా బ్రాహ్మణుడే.

జీవితం అస్థిరమని తెలిసికొని, ఎవరికీ కీడు తలపెట్టకుండా, అందరితో మంచి స్నేహభావంతో కలసిమెలసి తిరుగుతూ దయార్ద్ర హృదయుడై, ప్రతిఫలాన్ని ఆశించకుండా, నిత్యతపస్విగా, నిత్యతృప్తుడుగా, శమగుణాన్వితుడుగా ఉండేవాడు బ్రాహ్మణుడు. అతడు బ్రహ్మస్థితిని పొందుతాడు.

ఈవిధంగా ధర్మవ్యాధుడు కౌశికు డడిగిన ధర్మాంశాల నన్నింటినీ వివరించి చెప్పాడు. ధర్మవ్యాధుడిని సర్వజ్ఞుడిగా కౌశికుడు కీర్తించాడు. జ్ఞానబోధ చేసినందుకు కృతజ్ఞతలు తెలిపాడు.

## జ్ఞానానికి మూలమైన ధర్మం

ఉత్తమ జ్ఞానాన్ని పొందటానికి మూలమైన ధర్మ విశేషాన్ని ధర్మవ్యాధుడు కౌశికుడికి ప్రత్యక్షంగా చూపించాలని తలచాడు. కౌశికుడిని ఇంటిలోపలిభాగంలోకి తీసికొనిపోయాడు. అందమైన చతుశ్శాల. అందులో సుగంధాలు విరజిమ్మే మేడ. అందులోని గదిలో గొప్పవైన ఆసనాల మీద కూర్చుండి ఉన్న తన తల్లిదండ్రులను దర్శింపచేశాడు. వారికి నమస్కరించి యోగక్షేమాలు అడిగి తెలిసికొన్నాడు. అతడి తల్లిదండ్రులు ఈ విధంగా అన్నారు - 'కుమారా! నీవంటి కొడు కుండగా మాకేమి లోటు? నీవు చేసే ధర్మమే నీకు రక్ష. అదే నీకు ఆయువును, అర్థసంపత్తిని కలుగజేస్తుంది. నీ శీలం వలన మనవంశం పవిత్రమైంది. నీవు మానవరూపంలో ఉన్న దేవతవేమో అనిపిస్తుంది. త్రికరణశుద్ధిగా తల్లిదండ్రులను పూజించే నిన్ను ముందుగా పేర్కొని, తరువాతే పరశురాముడిని చెప్పాలి. పితృభక్తిలో మరెవ్వరూ నీకు సాటి రారు.' ఆ మాటలు విని ధర్మవ్యాధుడు కౌశికుడిని వారికి పరిచయం చేశాడు. అతిథి మర్యాదలు నడిపాడు. ఆపైన ఇట్లా అన్నాడు.

'వీరు నా తల్లిదండ్రులు. వీరికి శుశ్రూష చేయటం వలననే నేనీ జ్ఞానాన్ని పొందాను. అందరూ దేవతలను ఆరాధిస్తారు. నా పాలిటి దేవతలు నా కన్న తల్లిదండ్రులే. సుగంధద్రవ్యాలతో, మనోహర భక్ష్యభోజ్యాలతో వారిని తృప్తి పొందించి, భార్యాపుత్రసహితుడనై నేనే వీరిని స్వయంగా సేవిస్తాను. వీరి సేవయే నాకు వేదాధ్యయనం, యజ్ఞవ్రత పుణ్యకార్యాచరణం. తల్లి, తండ్రి, గురువు, అగ్ని, ఆత్మ- అనే అయిదుగురినీ ఎవడు సుగతిని కోరి పూజిస్తాడో వాడే ధర్మాత్ముడు.

పతివ్రత పంపితే నీవు ధర్మజ్ఞానం తెలిసికొనటానికి నావద్దకు వచ్చావు. ఆమె అనుగ్రహం వలన నీ కన్నీ నేను చెప్పాను. కానీ, నీ పట్ల నాకంత ఆదరం లేదు. దానికి కారణం- నీవు చేసిన ఒక అకార్యమే. అదేమంటే నీ తల్లిదండ్రులకు నీవొక్కడవే కుమారుడవు. వారు వృద్ధులయ్యారు. నీవే వారిని సేవించి కడతేరుస్తావని ఆశతో బ్రతుకుతున్నారు. అటువంటి వారిని నీవు కాదని వేదాధ్యయన నిమిత్తం నిశ్చింతగా ఇల్లు వెడలి ఒంటరిగా వచ్చేశావు. నీ పోకకు మీ తల్లిదండ్రుల అనుమతి తీసికొనలేదు. నీవు వారిని వీడి వచ్చిన తరువాత వారు గుండె పగిలేటట్లు చాలాకాలం దుఃఖించారు. ఆ శోక తీవ్రత వలన వారి కళ్ళు పోయాయి. నీవు తప్ప వారి శోకాన్ని ఎవరు ఆర్పగలరు? వారిని సేవించలేని నీ వేదాధ్యయనం నిష్ఫలం. కాబట్టి తిరిగి ఇంటికి వెళ్ళుము. నీ తల్లిదండ్రులను శ్రద్ధతో సేవించుము. నా మాట వినుము. నీకు మేలు జరుగుతుంది.'

ధర్మవ్యాధుడి హితవును శిరసావహించి, తల్లిదండ్రుల సేవకై పోవ నిశ్చయించి కౌశికుడు ధర్మవ్యాధుడితో ఈ విధంగా పలికాడు. 'నా అదృష్టంవలన నీతోటి స్నేహం దొరికింది. నాకు ఆనందం కలిగింది. నేను శుభాలు పొందటానికి అర్హుడనయ్యాను. నా పాపాన్ని ప్రబోధంతో ప్రక్షాళనం చేసి, నా పాలిటి దేవుడ వనిపించుకొన్నావు. లోకంలో ధర్మమార్గం అందరికీ అందదు. ఏ పదివేల మందికో ఒకడు ధర్మపరాయణుడు ఉంటే ఉండవచ్చును. కాని, సనాతనధర్మ విజ్ఞానాన్ని ఆశ్రయించి నీవలె జీవితాన్ని సాగిస్తున్న పండితులు ఉండటం అరుదు. నీవు నిజంగా శూద్రుడవని నే ననుకొనటం లేదు. నీ చరిత్ర గమినిస్తే నాకు అద్భుతమనిపిస్తుంది. నీవు ఏకారణంతో ఇటువంటి జన్మ నెత్తావో నాకు తెలియచెప్పుము. త్రికాలాలూ నీకు తెలిసే ఉంటాయి.' అతడి మాటలు విని ధర్మవ్యాధుడు తన పూర్వజన్మ వృత్తాంతం ఇట్లా చెప్పాడు.

## ధర్మవ్యాధుడి పూర్వజన్మ వృత్తాంతం

ధర్మవ్యాధుడు పూర్వజన్మలో బ్రాహ్మణుడు. వేదవేదాంగ విదుడు. అతడికి ఒక క్షత్రియ కుమారుడు మిత్రుడు. అతడితో కలిసి ధనుర్వేదాన్ని కూడా అభ్యసించాడు. ఒకనాడు మిత్రులిద్దరూ కలిసి వేటకు వెళ్ళారు. బ్రాహ్మణుడు పొరపాటున పొదలచాటున తపస్సు చేసికొంటున్న మునిని మృగమని భ్రమించి బాణంతో కొట్టాడు. ఆ ముని బాణఘాతానికి బాధపడుతూ అరిచాడు. జరిగిన పొరపాటు తెలిసికొని బ్రాహ్మణుడు ఆ మునిని సమీపించి ఊరడింపు మాటలు పలికాడు. ఆ ముని కోపించి కులవృత్తి కాని వేట నెన్నుకొని జీవహింస చేసినందుకు రాబోయే జన్మలో బోయవాడిగా పుట్టుమని శపించాడు. తెలియక చేసిన అపరాధానికి హీనజన్ముడిగా పుట్టే శాపం ఇవ్వవద్దని ఆ బ్రాహ్మణుడు మునిని వేడుకొన్నాడు. ఆ తపస్వి దయార్ద్రుడై బోయవాడైనా అతడు సర్వధర్మవేత్తగా ఉంటాడనీ, తల్లిదండ్రులను భక్తితో పూజించి గురుశుశ్రూషాఫలంగా సర్వశుభాలను పొందుతాడనీ, పూర్వజన్మ జ్ఞానం కూడా అతడికి స్మృతిలో ఉంటుందనీ, మరుజన్మలో బ్రాహ్మణుడౌతాడనీ అనుగ్రహించాడు. బ్రాహ్మణుడు ముని శరీరంలో నాటిన బాణాన్ని నిపుణంగా బైటికి తీసి, ఉపచారాలు చేసి, అతడిని ఆశ్రమానికి చేర్చాడు. అతడి సేవల వలన ఆ మునికి ప్రాణాపాయం తప్పింది. ఆ బ్రాహ్మణుడే ధర్మవ్యాధుడు.

కౌశికుడు ధర్మవ్యాధుని మహత్త్వాన్ని కీర్తించాడు. శాపఫలంగా అనుభవిస్తున్న బోయ జీవితానికి విచారించవద్దనీ స్నేహభక్తిపూర్వక వచనాలు పలికి తన తల్లిదండ్రుల వద్దకు వెళ్ళి, వారిని భక్తితో సేవించి కృతార్థుడయ్యాడు.

## అంగిరసుడు అగ్ని అయిన కథ

**ధర్మరాజు :** మార్కండేయ మునీంద్రా! అగ్నిదేవుడు మహా తపస్సు ఎందుకు చేశాడు? అంగిరసుడు ఏకారణం వలన అగ్ని అయ్యాడు? అగ్నులు ఎన్నివిధాలుగా అతిశయిల్లుతూ ఉంటాయి?

**మార్కండేయుడు:** పూర్వం ఒకసారి అగ్నికి దేవతలమీద కోపం వచ్చింది. వారి హవ్యాలను మోయకుండా అలిగి అరణ్యానికి పోయి అగ్నిదేవుడు ఘోర తపస్సు చేయనారంభించాడు. చాలాకాలం గడిచింది. ఒకనాడు అగ్ని తనలో ఈ విధంగా తలపోశాడు. 'నేను అడవులకు వచ్చి నారూపాన్ని ఉపసంహరించుకొని వెలుగకుండా ఉంటే లోకజీవితమే స్తంభించిపోతుంది. బ్రహ్మదేవుడు వెంటనే మరొకరిని అగ్నిపదంలో నియోగిస్తాడు. నేను రెంటికి చెడ్డ రేవడినౌతాను కాబట్టి, ఇక్కడ ఉండక, తిరిగి వెళ్ళుతాను' అని నిశ్చయించుకొని తన స్థానాన్ని సమీపించాడు. అప్పటికే బ్రహ్మనియోగంతో అంగిరసుడు త్రిలోకాగ్నిగా ప్రజ్వరిల్లుతున్నాడు. అతడిని చూచి అగ్ని భయపడి తిరుగుమొగం పెట్టాడు. కాని, అంగిరసుడు వినయంతో అగ్నివద్దకు వచ్చి అతడి ప్రథమాగ్ని పదాన్ని స్వీకరించుమని వేడాడు వినయంతో. అగ్ని ప్రథమాగ్ని పదవిని తిరిగి అంగీకరించలేదు. చివరకు అంగిరసుడు వేడుకోగా అగ్ని ప్రథమాగ్నిగా, అంగిరసుడు ద్వితీయాగ్నిగా అగ్నికి ప్రథమపుత్రుడిగా ఉండేటట్లు అంగీకరించాడు. నాటి నుండి అంగిరసుడు అగ్ని పుత్రుడుగా అపరాగ్నివలె రాణించాడు. అతడికి శివ అనే కన్యతో వివాహమైంది. వారికి బృహత్కీర్తి, బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మనసుడు, బృహన్మంత్రుడు, బృహద్భానుడు, బృహస్పతి అనే ఏడుగురుకొడుకులూ, భానుమతి, రాగ, సినీవాలి, కుహువు, అర్చిష్మతి,

మహిష్మతి, మహామతి అనే ఏడుగురు కూతుళ్ళూ జన్మించారు. వారందరికీ వివాహాలై పుత్రపౌత్ర పరంపరాభివృద్ధిగా అగ్నివంశం విస్తరిల్లింది. ఇట్లా ఏర్పడిన అనేక వహ్నులు సకల ధర్మక్రియా సాధకులై ప్రకాశించారు. (వివరాలకు చూడు: ఆరణ్య. 5.153-174). అగ్ను లెందరైనా వారి ఆత్మ అయిన తేజస్సు ఒక్కటే.

## కుమారస్వామి వృత్తాంతం

**ధర్మరాజు :** మార్కండేయ మహర్షీ! మహాసేనుడైన కుమారస్వామి అగ్నికి, కృత్తికలకు, శివుడికీ కుమారుడైన కారణ మేమిటి? వినవలెనని ఉన్నది. విస్తరించి చెప్పండి.

**మార్కండేయుడు:** పూర్వం ఒకసారి ఇంద్రుడు దైత్యులతో యుద్ధం చేసి ఓడిపోయి దేవతలతో కలిసి మానసమనే పర్వతానికి పారిపోయి తలదాచుకొన్నాడు. రాక్షసులను జయించగలిగిన సేనాపతి ఎప్పుడు లభిస్తాడో అని విచారిస్తూ ఏకాంతంలో ఉండిపోయాడు.

కేశి అనే రాక్షసుడు దేవసేన అనే కన్యను బలవంతాన చెరపట్టి తీసికొని పోతుండగా ఆమె సహాయార్థం ఎలుగెత్తి మొరపెట్టుకొన్నది. ఇంద్రుడు వజ్రాయుధంతో రంగంలోకి దిగి కేశిని పారద్రోలి దేవసేనను రక్షించాడు. ఆమె అరిష్టనేమి అనే ప్రజాపతి కూతురు. ఆమె తన అక్క దైత్యసేనతో కలిసి, తండ్రి అనుమతి పొంది, మానసపర్వత ప్రాంతంలో విహరిస్తూ ఉండగా కేశి వారిని అనేక పర్యాయాలు సమీపించి వింత వింత మదన వికార చేష్టలను ప్రదర్శించి వారిని ఆకర్షించ ప్రయత్నించాడు. అతడి చేష్టలు దైత్యసేనకు సమ్మతమయ్యాయి కాని, దేవసేనకు ప్రీతి కలిగించలేదు. కేశి దైత్యసేనను ఆకట్టుకొని ఆమెను వశంచేసికొని తీసికొనిపోయాడు. ఆ తరువాత దేవసేనను కూడా బలవంతంగా వశం చేసికొనటానికి ప్రయత్నం చేశాడు. ఇంద్రుడు రంగంలోకి దూకి ఆమెను రక్షించాడు. దేవసేన చరిత్రను తెలిసికొన్న ఇంద్రుడు ఆమెను ఒక వరాన్ని కోరుకొమ్మని అడిగాడు. దేవసేన తండ్రి అరిష్టనేమి తన కూతురుకు ప్రసిద్ధ పౌరుషవంతుడైన పురుషుడు భర్త కాగలడని చెప్పి ఉన్నారు. దేవసేన ఆ సంగతి ఇంద్రుడికి తెలిపి, తన కటువంటి భర్తను చేకూర్చి పెట్టుమని వేడుకొన్నది. తన భర్త దేవదానవులకు అజేయుడై ఉండాలనీ, భయంకర శత్రువులను తునుమాడగలిగి ఉండాలనీ, మూడు లోకాలనూ రక్షించగలగాలనీ, ఇంద్రుడికి మిత్రుడై ఉండాలనీ, ఉత్తమగుణశోభితుడై ఉండాలనీ దేవసేన కోరుకొన్నది. అటువంటి భర్తను తనకు కూర్చుమని వేడుకొన్నది.

ఆమె భర్త ఎవ్వరై ఉంటాడా? అని ఇంద్రుడు కొంత సేపు ఆలోచించాడు. అప్పటి కాలగ్రహస్థితులను గమనించాడు. అది రౌద్రముహూర్తం. సూర్యచంద్రులు కలిసి ఉండే అమావాస్యాతిథి ఆరంభం. ఉదయసంధ్యా రాగంలో ఎర్రబారిన సముద్ర జలం ఆ సమీపాన జరుగబోయే దేవదానవ యుద్ధ సూచకం. సూర్యోదయ సమయంలో భృగువు, అంగిరసుడు మొదలైన మునులు అందించే హవ్యాలను గ్రహించి అగ్నిదేవుడు సూర్యమండలంలో ప్రవేశిస్తున్న ముహూర్త మది. సూర్యసోమాగ్ని సమాగమం గల రౌద్రమూహూర్తం అది. కాబట్టి దేవసేన భర్త కూడా సూర్యసోమాగ్ని తేజంతో పుట్టేవాడై ఉండాలని ఇంద్రుడు భావించాడు. ఆమెను బ్రహ్మవద్దకు తీసికొనిపోయాడు. ఆమెకు కానున్న భర్త ఎవరో తెలుపుమని కోరాడు. ఆమె భర్త పరాక్రమవంతుడూ, త్రిలోకరక్షకుడూ యశస్వీ ఔతాడనీ, అతడు దేవసేనాపతి భావాన్ని పొంది దేవతలను రక్షిస్తాడనీ, ఆ సంఘటన త్వరలో జరుగుతుందనీ బ్రహ్మదేవుడు చెప్పాడు. ఇంద్రుడు సంతోషించాడు.

కొంత సేపటికి సప్తర్షులు అమావాస్యాహోమం చేయబూనారు. మొదట అగ్నిని ఆహ్వానించారు. అతడి ద్వారా హవ్యాలను అఖిల దేవతలకు అందించారు. ఆ యజ్ఞ సమయంలో సుందరులైన సప్తర్షి భార్యలు శుచులై తనూవిలాసాలు విలసిల్లగా తమ తమ భర్తలకు యజ్ఞకార్యంలో సహకరించారు. ఆయా సందర్భాలలో వారి అందచందాలను చూచిన అగ్నిదేవుడు వారిపై మరులుగొన్నాడు. గార్హపత్యాగ్నిలో ప్రవేశించి తన జ్వాలలతో మునిపత్నులను స్పృశించాలనీ, కౌగిట చేర్చాలనీ ఉల్లాసపడ్డాడు. అంతలో ఆ యజ్ఞం ముగిసింది. కాని, అగ్నిదేవుడి విరహం పెరిగింది. సప్తర్షుల భార్యల పొందు దుర్లభంగా భావించి అగ్నిదేవు

డొక అరణ్యానికి పోయి ఏకాంతస్థలంలో శరీరత్యాగం చేయాలని తలపెట్టాడు. ఆ సంగతి అగ్నిదేవుడి భార్యయైన స్వాహాదేవి గమనించింది. భర్తకు ప్రియం చేయాలని భావించి సప్తర్షులలో ఒకడైన అంగిరసుడి భార్య శివ అనే ఆమె రూపం ధరించి అగ్నిదేవుడిని సమీపించింది. సప్తర్షుల భార్యలందరూ మనోహర విలాసంతో కూడిన అగ్నిదేవుడి సౌందర్యానికి ఆకర్షితులై అతడి పొందుకోరి విరహంతో అక్కడికి వచ్చారనీ, ముందుగా పొందుగోరి శివ వచ్చినట్లుగా చెప్పింది. అగ్నిదేవుడు ఆమెను కాదంటే విరహంతో ప్రాణాలు వదలుతానని పలికి, అతడి వలపును కోరింది. అగ్ని అనుకూలించాడు. శివరూపంలో ఉన్న స్వాహాదేవి అగ్నిదేవుడు కోరిన కోర్కెలు తీర్చి అతడిని సంతోషపెట్టింది. అనంతరం అతడి తేజోధాతువును ధరించి ఆడ గరుడపక్షి రూపంలో ఆకసానికి ఎగసి, అత్యంతవేగంగా శ్వేతపర్వతానికి పోయి, అక్కడ ఒకచోట రెల్లుగడ్డితో కప్పబడిన ఒక బంగారు కుండలో అగ్నిదేవుడి శుక్లాన్ని భద్రపరచింది. ఆ విధంగా ఒక్క అరుంధతి రూపం తప్ప మిగిలిన ఆరుగురు మహర్షి భార్యల రూపాలను వరుసగా ధరించి, అగ్నిదేవుడితో క్రీడించి, అతడి శుక్లాన్ని క్రమంగా ఆ బంగారు పాత్రలో భద్రపరచింది. అందులోనుండి సూర్యతేజంతో, పన్నెండు చేతులతో, ఆరు మొగాలతో, దశదిశలు వెలిగే ప్రకాశంతో, తేజోవంతుడైన కుమారస్వామి ఉద్భవించాడు.

కుమారోత్పత్తి క్రమం ఈ విధంగా సాగింది. శుక్లపక్షపాడ్యమినాడు అగ్ని వీర్యం నిక్షేపించబడింది. విదియనాడు గర్భం వ్యక్తమైంది. తదియనాడు కుమారుడి శరీరం ఆవిర్భవించింది. చతుర్థినాడు అది సకలావయవ సంపూర్ణమైంది. పంచమినాడు కుమారస్వామి నిండురూపంతో లేచి, ఆ కొండలో దాచబడి ఉన్న శివధనుస్సును (త్రిపుర సంహారంలో శివుడుపయోగించిన విల్లును) పైకెత్తి, అల్లెత్రాటిని మ్రోగించాడు. ఆ భయంకర ధ్వనికి ఐరావత సుప్రతీకాలనే దిగ్గజాలు కోపించి కుమారస్వామిపై దాడిచేయగా ఆ రెంటిని పట్టి రెండు చేతులతో నిలిపాడు. మరొక చేతిలో సహజసిద్ధమైన శక్తిని, ఇంకొక చేతిలో విలాసంగా ధరించే కోడిని, రెండు చేతులతో పూరిస్తున్న శంఖాన్నీ ధరించాడు. ఆరుముఖాలలో ఆరు చేతుల బొటనవ్రేళ్ళను ఉంచుకొని బాల్యక్రీడగా చీకుతూ, వాడియైన బాణంతో క్రౌంచపర్వతాన్ని భేదించాడు. శక్తిపాతంతో శ్వేతగిరి శిఖరాన్ని కూల్చాడు. ఆరుముఖాలతో పెద్దపెట్టున ఘోషించాడు. ఆ శబ్దానికి కులపర్వతాలు కంపించాయి. దిక్కులు బ్రద్దలయ్యాయి. నేల గిర గిర తిరిగింది. సముద్రాలు సంక్షోభించాయి. సూర్యరథాశ్వాలు నలుదిక్కులకూ లాగాయి. ఆ మహోత్పాతాలకు భయపడి మునులు శాంతిక్రియలు చేశారు.

ఆ సమయాన చైత్రరథ నివాసులైన జనులు కుమారస్వామి అగ్నిదేవుడికి అంగిరఃప్రముఖ మునీంద్రుల సతుల వలన పుట్టిన బాలుడనీ, అతడి వలన ఆ అనర్థం కలిగిందనీ ఆక్రోశించారు. ఆ అపవాదులు విని సప్తర్షులలో వసిష్ఠుడు తప్ప మిగిలినవారు తమ భార్యలను వదలిపెట్టారు. కొంతమంది జనులు ముని భార్యలు నిర్దోషులనీ, వారి వేషాలతో పతిని కూడింది అగ్ని భార్య స్వాహాదేవియే అనీ అన్నారు. ఈ వాదోపవాదాలను విని స్వాహాదేవి స్వయంగా సప్తర్షుల వద్దకు వెళ్ళి తనవలన జరిగిన విశేషమంతా చెప్పి, ఋషిపత్నులు నిర్దోషులని విన్నవించింది. ఆమె ఎంత చెప్పినా ఋషు లామెమాటలు పట్టించుకొనలేదు. తమ భార్యల నేలుకొనలేదు.

కుమారస్వామికి విశ్వామిత్రుడు జాతకర్మాది విధులు నిర్వహించాడు. దేవతలందరు ఇంద్రుడి వద్దకు వెళ్ళి కుమారస్వామి పరాక్రమాన్ని వినిపించి, అతడి వలన ఇంద్రపదవికి చేటురాకుండ అతడిని వధించుమని హితవు చెప్పారు. ఇంద్రుడు కుమారస్వామిని చంపటానికి సప్తమాతృకలను నియోగించాడు. వారు కుమారస్వామి యొక్క మహాతేజస్సును చూచి భయపడి, వారు లోకమాతలు కాబట్టి అతడు కూడా వారిని మాతృభావంతో గౌరవించవలసిందిగా కోరారు. కుమారస్వామి వారిని మాతలుగా స్వీకరించాడు. అగ్నికూడ తన కొడుకు వద్దకు వచ్చి అతడి రక్షణలో నిలిచాడు. సప్తమాతృకల కోపం నుండి పుట్టిన లోహితాస్య- కుమారుడికి దాదిగా కుదిరి అతడిని లాలించింది. సకలభూత గణాలు వచ్చి కుమారస్వామిని పరివేష్టించి నిలిచాయి.

అది తెలిసి ఇంద్రుడు తన అపారసైన్యాన్ని కుమారుడిపై పంపాడు. కుమారస్వామి ముఖం నుంచి వెలువడిన మంటలు వారిని కాల్చివేయ నారంభించాయి. వారు భయపడి కుమారస్వామిని శరణువేడారు. ఆ సంగతి తెలిసి ఇంద్రుడు క్రుద్ధుడై అతడి మీద వజ్రాయుధం ప్రయోగించాడు. అది కుమారుడి కుడి పార్శ్వాన్ని తాకింది. ఆ భాగంలోనుండి విశాఖుడనే శక్తిధరుడు మేకమొగంతో పుట్టాడు. అతడివెంట కన్యాకుమార గణాలు అసంఖ్యాకంగా పుట్టాయి. ఆ సంరంభం చూచి ఇంద్రుడు భయపడి కుమారస్వామిని శరణువేడాడు. వా రిరువురి చుట్టూ చేరి దేవతలు హర్షనాదాలు చేశారు.

అగ్నికుమారుడు, అజానుబాహుడు, కవచధారి, తేజస్వి, కుండల మండితుడు, కనకకిరీటధారి, యువకుడు, సర్వలక్షణయుక్తుడు అయిన కుమారస్వామిని చూచి, వరించి లక్ష్మీదేవి అతడిని పొందింది. ఆరవరోజు మహామునులందరు కుమారస్వామిని సమీపించి విశేషంగా ప్రస్తుతించి, ఇంద్రపదవిని స్వీకరించుమని అతడిని కోరారు. ఇంద్రుడు కూడా వారి అభిమతాన్ని బలపరిచాడు. కాని, కుమారస్వామి ఇంద్రపదవిని కోరక, ఇంద్రుడికి హితుడుగా ఉండి దేవకార్యాన్ని తీర్చటానికి దేవతల సైన్యాధిపత్యానికి అంగీకరించాడు. దేవవిరోధులను సంహరించటానికి ప్రతిజ్ఞ చేశాడు. ఇంద్రుడు సంతోషించి కుమారస్వామిని దేవసేనానిగా అభిషేకించాడు. దేవగణాల సంతోషం మిన్నుముట్టింది.

అప్పుడు పరమేశ్వరుడు గిరిజాసమేతంగా కుమారస్వామి వద్దకు వచ్చాడు. కుమారుడిని కౌగిలించుకొన్నాడు. విశ్వకర్మ నిర్మితమైన బంగారపు పూలమాలను బహూకరించాడు. పరమేశ్వరుడికి కుమారస్వామి కొమరుడౌతాడు. ఎట్లాగంటే - పూర్వం రుద్రుడు తన వీర్యాన్ని అగ్నియందు సంగ్రహించాడు. ఆ తేజో విశేషం చేత అగ్నిదేవుడు కుమారుడిని ఉత్పాదింపచేశాడు.అంతేకాక అగ్నియే రుద్రుడని వేదాలు తెలిసిన విప్రులంటారు. కాబట్టి అగ్నిపుత్రుడు రుద్రపుత్రుడని కూడా చెప్పవచ్చును. స్వాహాదేవి కృత్తికలు అనే పేర ప్రసిద్ధిచెందిన ఆరుగురు ఋషిపత్నుల రూపాలను గైకొని ప్రియుని పొంది శ్వేతపర్వతంలో రేతస్కందం చేయటం వలన పుట్టాడు కాబట్టి కుమారస్వామి కార్తికేయుడనీ, స్కందుడనీ ప్రసిద్ధికెక్కాడు. ఇంద్రుడు బ్రహ్మవద్ద భద్రంగా ఉంచిన దేవసేన అనే కన్యను తెచ్చి కుమారస్వామి కిచ్చి వివాహం చేశాడు. అప్పు డతడు రెండర్థాలలో దేవసేనాపతి- (దేవతలసేనకు నాయకుడు, దేవసేనకు భర్త) అయ్యాడు. కుమారస్వామిని లక్ష్మీదేవి పంచమినాడు, దేవసేన షష్ఠినాడు పొందటం చేత ఆ రెండు తిథులు శుభ తిథులయ్యాయి.

అదే సమయంలో మునుల చేత పరిత్యక్తలైన మునిభార్య లారుగురు కుమారస్వామిని సమీపించి, తమ గోడు వినిపించి, పుణ్యలోకాలను కోల్పోయి దుఃఖిస్తున్న తమకు పుణ్యగతులను కల్పింప వేడారు. వారికి పుత్రుడిగా అనుగ్రహించి తమ దుఃఖాన్ని తీర్చుమని కోరారు. కుమారస్వామి వారి ప్రార్థన మన్నించి, ఇంద్రుని సంప్రదించి రోహిణీ నక్షత్ర సమీపంలో ఖాళీగా ఉన్న అభిజిన్నక్షత్ర స్థానంలో కృత్తికలుగా ఆరుగురికి అగ్నిదైవత్యమనే పేర ఆకాశంలో స్థానం కల్పించాడు. ఆ తరువాత స్వాహాదేవి వచ్చి 'నేను నీ తల్లిని, నీ వద్దనే ఉంటా' నని కోరింది. కుమారు డంగీకరించాడు.

ఆ పిమ్మట కుమార మాతృకలు ఏడుగురు వచ్చి తమను జగన్మాతలుగా చేయుమని కోరారు. కుమారుడు వారిని వేరేవరం కోరుకొనుమన్నాడు. శిశువులకు పీడ గలిగించే శక్తిని వరంగా అడిగారు. ఆ కోరిక నివ్వటానికి సమ్మతి లేకపోయినా ఇచ్చిన మాటకు కట్టుబడి- శిశువులు పుట్టింది మొదలు పదహారేళ్ళవరకు సప్తమాతృకల పీడ కలుగగలదని వరమిచ్చాడు. స్కందాపస్మారమనే పేరుగల దైత్యుడిని తన దేహం నుండి పుట్టించి వారికి రక్షకుడిగా నిలిపాడు. బలిశాంతులవలన వారి పీడ తొలగేటట్లు సూచించాడు. వారు కలిగించే పీడలన్నీ పరమేశ్వరభక్తుల నేమీ చేయలేవని అభయమిచ్చాడు.

అప్పుడు స్వాహాదేవి కుమారస్వామిని ఒక వరం కోరింది. అగ్నికీ స్వాహాదేవికీ ఎప్పుడూ ఎడం లేకుండా ఉండే వరమది. ఆమె కోరికను మన్నించి కుమారస్వామి - ద్విజులు అగ్నిలో హవ్యము లిచ్చేటప్పుడు స్వాహాకారంతో కలిపి ఇవ్వాలని కట్టడి చేశాడు. దాని వలన అగ్నితో స్వాహాదేవికి నిత్యసహవాసం సిద్ధించింది.

అంత బ్రహ్మదేవుడు సకలముని గణాలతో కూడి అక్కడకు వచ్చాడు. కుమారస్వామిని అభినందించి, పార్వతీ పరమేశ్వరులను అతని తల్లిదండ్రులుగా పరిచయం చేశాడు. కుమారస్వామి వారిని పూజించి స్తుతించాడు. దేవతలు కానుకలందించారు. ఈశ్వరుడు కుమారుని కౌగిటచేర్చి లాలించాడు. అతడిని వెంటబెట్టుకొని, దేవమునిగణాలు బారులు తీరి వెంటరాగా ఉత్సాహంగా సాగి భద్రవటం చేరాడు. కుమారస్వామిని సప్తమారుత స్కంధానికి అధిపతిని చేశాడు. దేవతలకు ఎప్పుడూ మేలు చేయుమన్నాడు. శివపదధ్యానాన్ని మరువ వద్దన్నాడు.

ఆ సమయంలో మహిషాసురుడు దేవతలపై తన భీకరసైన్యాన్ని పంపాడు. వారి ధాటికి భూమి కంపించింది. ఎన్నో ఉత్పాతాలు కలిగాయి. రాక్షససైన్యం భీకరంగా విజృంభించి దేవసేనను చీల్చి చెండాడింది. దేవతల సైన్యం ఛిన్నాభిన్నమైంది. దేవేంద్రుడు వారినందరిని పురికొల్పి తాను శత్రువులపై విరుచుకపడ్డాడు. పోరు భయంకరంగా సాగింది. రాక్షససైన్యం దేవతల చేతుల్లో నుగ్గు నుగ్గు అయింది. ఆ సంగతి గమనించి మహిషాసురుడు మండిపడి దేవతలపై తిరుగబడ్డాడు. ఒక మహాపర్వతాన్ని రెండు చేతులతో ఎత్తి దేవసైన్యం మీద విసిరాడు. పదివేలమంది దేవసైనికులు దాని క్రిందపడి చనిపోయారు. ఆ దృశ్యం చూచి ఇంద్రుడే భయపడి పారిపోయాడు. అంత మహిషాసురుడు రుద్రుని రథం మీద దాడిచేసి దాని అగ్రభాగాన్ని పట్టుకొన్నాడు. హరుడు రాక్షసుల చేజిక్కాడని మునులు దేవతలు భయపడ్డారు. శివుడు మందహాసంతో కుమారస్వామిని ఆ రాక్షసవధ చేయుమని ఆజ్ఞాపించాడు. కుమారస్వామి ప్రళయమహాగ్ని జ్వాలవలె రాక్షసుల మీద విజృంభించాడు. దేవతలు ధైర్యంతో ఆతడి వెంట నిలిచారు. స్కందుడు తన సహజశక్తిని రాక్షసుడిపై విసిరాడు. అది ఆ దానవుడిని దహనం చేసి చంపింది. కుమారుడు మరల మరల శక్తిని ప్రయోగించి దానవ సైన్యాన్ని మట్టుపెట్టాడు. దేవతలు, దేవేంద్రుడు ఆనందోత్సాహాలతో కుమారస్వామిని కీర్తించారు. లోకత్రయంలో కుమారస్వామి కీర్తి వ్యాపించింది. పరమేశ్వరుడు కుమారుడిని కౌగిలించుకొని ఆశీర్వదించాడు. తనపట్ల ఎంతటి భక్తి చూపుతారో అంతటి భక్తి కుమారస్వామి పట్ల కూడా చూపండని దేవతలకు పరమేశ్వరుడు ఆదేశించాడు. శివుడు భద్రవటం చేరాడు. అమరులు తమ నివాసాలకు పోయారు.

ఈ విధంగా షణ్ముఖుడు ఒక్కదినంలో రాక్షసులనందరినీ చంపాడు. జగాల నన్నింటినీ రక్షిస్తానని దయాగుణంతో అభయమిచ్చాడు. అటువంటి కుమారస్వామి కథను ఎవరు భక్తితో వింటారో, కీర్తిస్తారో, వారు సర్వదోషాల నుండి విముక్తులై, దివ్యశుభాలను పొందుతారు.

## సత్యాద్రౌపదీ సంవాదం

మార్కండేయమహర్షి ధర్మరాజు కోరిన కథలను చెపుతున్న ఆ సమయంలో సత్యభామా ద్రౌపదులు ఏకాంత స్థలంలో కూర్చుండి ఈ విధంగా సంభాషించుకొన్నారు.

**సత్యభామ:** ద్రౌపదీ! నీ భర్తలు సామాన్యులు గారు. లోకపాలకుల వంటివారు, పరాక్రమవంతులు, నిర్మల చరిత్రం కలవారు. అంతటి వారిని నీవు ఒకేరకంగా అనురాగంతో ఏవిధంగా సేవిస్తావు? నీ భర్తలయిదుగురూ ఒకరికంటె మరొకరు నీకు అనురక్తులు కావటం ఆశ్చర్యంగా ఉంది. అందరూ నీతో ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడతారు కాని కోపగించుకోరు. పతుల వలన నీవు పొందే ఈ విశేష సౌభాగ్యానికి కారణం ఏమిటి? ఏదైనా వ్రతం చేసిన ప్రభావమా? మంత్రౌషధ మహిమా? నాకు తెలియచెప్పుము. నీ వలన ఆ కిటుకు తెలుసుకొని నా భర్త అయిన శ్రీకృష్ణుడిని నా వశం చేసికొని, అత్యంత స్నేహానురాగాలను పొందుతాను.

**ద్రౌపది :** (సత్యభామ మాటలు ద్రౌపదికి కొంచెం కోపం తెప్పించాయి. కాని, కోపాన్ని అణచుకొని చిరునవ్వు మొగం మీద పులుముకొని నిబ్బరంగా ఇట్లా అన్నది) సత్యా! నన్ను ఈ విధంగా దుర్మార్గురాలుగా భావించటం నీకు న్యాయమేనా? నీవు శ్రీకృష్ణదేవుడి భార్యవైనావు కాబట్టి నిన్ను నే నేమీ అనలేకపోతున్నాను. అంతటి వాడి భార్యవు నీవు ఇంతటి మాటలు అనవచ్చునా? (అంటూ ఎగతాళిగా నవ్వులాట కన్నట్లుగా అంటూనే సత్యభామ అవివేకం ఆమెకే తెలిసి వచ్చేటట్లు నిపుణంగా మాట్లాడింది.)

మంత్రాలను, తంత్రాలను, ఔషధాలను అనేక విధాలుగా ప్రయోగిస్తే భర్తలు భార్యలను వలచి వారి వలలో పడతారని అనుకొనటం వెర్రితనం. వాటి వలన భర్తలకు భార్యలపై అంతకు ముందున్న ప్రేమకూడా పోతుంది కాని, లాభ మేమీ కలుగదు. మంత్రతంత్రాలతో మగడిని లొంగదీసుకొనాలనుకొనే భార్యతో కలిసి జీవించటం పాముతో పొత్తువలె భర్త భావిస్తాడు. మగడిని వశం చేసికొనటానికి పెట్టే మందులూ మాకులూ వికటిస్తే భర్తకు మూగతనం, జడత్వం, వివిధ రోగాలూ మొదలైన బాధలేర్పడవచ్చును. ఆ బాధలు భార్యవలన ఏర్పడినవని తెలిస్తే ఆమె లోకనిందకు పాల్పడి, దుర్గతిపాలు కావలసి వస్తుంది.

కాబట్టి భార్య భర్త పట్ల కపటచర్యలు చేయరాదు. అతడి మనస్సును తెలిసికొని తదనుగుణంగా మసలితే అదే అన్నిపనులూ సాధించి పెట్టుతుంది.

పాండవులపట్ల నే నెట్లా వర్తిస్తూ పతుల అనురాగాన్ని పొందగలిగానో చెప్పుతాను వినుము. నా పతులు మరే వనితలతో కూడినా నేను కోపగించుకొనను. ఎప్పుడూ అహంకరించను; మదాన్ని ప్రదర్శించకుండా, ప్రమాదానికి లోనుకాకుండా వారందరికి ఏకాగ్రతతో ఎప్పుడూ భక్తితో సేవలు చేస్తుంటాను. చూపులో, పలుకులో, కోర్కెలో, స్నేహంలో ఎప్పుడూ ఎటువంటి తేడా లేకుండా ఉంటాను. దేవతలనైనా పరపురుషులుగా భావిస్తాను. స్నానభోజన శయన సేవలను పతులకు నేనే స్వయంగా నిర్వహిస్తాను. పతులకు ఆసనపాద్య విధులు నేనే చేస్తాను. ఇతరుల చేత ఆ పనులు చేయించను. ఆయా కాలాలలో క్రమం తప్పకుండా స్నానభోజనాదులను అమర్చటం, ధనధాన్యాలు వృథావ్యయం కాకుండా చూడటం, ఇంటి పనులు చక్కదిద్దుకొనటం, బంధువులకు ప్రమోదం కల్గించటం మొదలైన బాధ్యతలన్నీ నేనే నిర్వహిస్తాను. ముందువాకిట్లో చాలాసార్లు నిలవటం, యువతులతో కలసిమెలసి తిరగటం, గిల్లికజ్జాలు పెట్టుకొనటం, హాస్యపు మాటలతో పెద్దగా విరగబడి నవ్వటం- మొదలైనవి నాకు నచ్చనివి. భర్తలు ఇంట్లో లేకపోతే, ప్రవాసంలో ఉంటే నేను పుష్పగంధాదులతో అలంకరించుకొనను, పతులనే మనస్సులో తలపోస్తూ ఉంటాను. అత్తకు భక్తితో సేవలు చేస్తాను. ఆమె చెప్పినట్లు వింటాను. గురు విప్రజనాతిథి పూజలు భక్తిభావంతో చేస్తాను. ఓర్పు, మెత్తదనం, మంచిమనసు అనే గుణాలను ఎల్లప్పుడూ కలిగి ఉంటాను.

పాండవులు నాపట్ల చాల మృదువుగా ఉంటారని వారిని లెక్కచేయక తేలికగా చూడను. వారికి కోపం వస్తే విషసర్పాలవలె క్రూరులని తెలిసి జాగ్రత్తగా సేవిస్తాను. ప్రతినిత్యం ధర్మరాజుపంక్తిలో ఎనిమిదివేల మంది బ్రాహ్మణులు, పదివేలమంది యతులు బంగారు పళ్ళాలలో భోజనం చేస్తారు. వారందరికీ అన్నపానాదులు, వస్త్రభూషణ సత్కారాలూ సక్రమంగా జరిగేటట్లు స్వయంగా నేను పర్యవేక్షిస్తాను. అంతేకాక ధర్మరాజు కొలువులో నూరువేల మంది పరిచారకులు రేయింబవళ్ళు అతిథి సత్కారాలు సమకూర్చటంలో నిమగ్నులై ఉంటారు. వారి బాధ్యతలు, జీతబత్యాలు, యోగక్షేమాలు అన్నీ నేనే చూస్తుంటాను. అట్లాగే ఉత్తమ గజాశ్వాలు నూరువేలకు పైగా ఉన్నాయి. వాటి పోషణ బాధ్యతలను నేనే నిర్వహిస్తాను. చిట్టచివరకు గోపాలకులను, భృత్యులను కూడా స్వయంగా పలకరించి వారి యోగక్షేమాలను విచారిస్తాను. ఈ పనులన్నీ నిర్వహించి రాత్రి ఒకజాము మాత్రమే కలత నిద్రపోయి వెంటనే లేచి కార్యనిర్వహణ దీక్షలో మునిగిపోతాను. నాభర్తలు ఆ విషయాలన్నీ నా మీద వదలి నిశ్చింతగా తమ రాజ్యభార వ్యవహారాలలో నిమగ్నులై ఉంటారు. ఇటువంటి ప్రవర్తనతో నా పతుల అనురాగాన్ని పొందగలుగుతున్నానే కాని, నీవనుకొన్నట్లు మందుమాకుల మహిమల వలన గాని, మరే ఇతర ఇంద్రజాలాల వలన గాని కాదు సుమా!

**సత్యభామ :** (సిగ్గుపడి తలవంచుకొని) నాకు తెలియక అజ్ఞానంతో నిన్నిట్లా అడిగాను. నా తెలివి తక్కువతనానికి మన్నించుము. నా మాటలు నవ్వులాటల కన్నవిగా తీసికొమ్ము. ఈ లోకంలో నీ చరిత్ర మహిమ గౌరవించదగింది.

**పతివ్రతాధర్మాలు**

**ద్రౌపది :** సత్యభామా! పతి మనస్సును ఆకట్టుకొనే నిపుణమైన ఉపాయాలను చెప్పుతాను వినుము. ఇవి ఉత్తమమైనవి. ధర్మంతో కూడినవి, మంచి నడవడి కలిగించేవి.

పతిని మించిన దైవం సతికి మరొకరు లేరు. పతి సంతోషించి కరుణిస్తే ధనధాన్య సంతాన గౌరవాలూ, కీర్తి, సద్గతులూ కలుగుతాయి. ఎప్పుడైన ఎంతో కష్టపడితేనే గాని కాస్త సుఖం కలుగదు. పతి సేవవలన అమితమైన శుభం సుఖం లభిస్తుంది. కాబట్టి ఎప్పుడూ భర్త పట్ల అనుకూలభావం, ప్రేమ, భయభక్తులు, ప్రీతి ప్రసరిస్తే అతడు సతిపట్ల ఆసక్తుడౌతాడు.

శ్రీకృష్ణుడు నీ ముంగిట్లోకి రాగానే లేచి ఎదురుపోయి మనసారా ఆహ్వానించుము. అంతఃపురంలోకి చేరగానే ఆసనాది గౌరవాలన్నీ నీవే స్వయంగా సమకూర్చుము. నీ మగడు మనసుపడి నీతో గోముగా చెప్పిన వలపు మాటలను నీ ప్రాణ

స్నేహితురాంద్రకు కూడా చెప్పవద్దు. ఆ మాటలు సవతులకు తెలిస్తే రవరవలు కలుగుతాయి. శ్రీకృష్ణుడి మనస్సు విరుగుతుంది. పతికి నచ్చిన మిత్రులు విందుకు వస్తే వారిని ఆదరించుము. పతికి నచ్చని వారు నీకు మిత్రులైనా వారిని నీవు మెచ్చుకొనవద్దు. నీకు పుత్రులైనను ప్రద్యుమ్నాదులతో కలిసి ఏకాంతంలో ఒకే ఆసనంలో ఉండ తగదు. లోకులు పలుగాకులు. ఉత్తమ కుల సతులతో స్నేహం చేయుము. శీలం లేని వనితలకు దూరంగా మసలుకొమ్ము. ఈవిధంగా నడచుకొనటమే పతిసౌభాగ్యలాభానికి ఉపాయం.

**సత్యభామ :** (సంతోషంతో) ద్రౌపదీ! నీవు ధర్మజ్ఞురాలవు. నీ భర్తలు దేవతల వంటివారు. ధర్మతేజో బలశౌర్య సంపన్నులు. కాబట్టి వారికి ధరణీరాజ్యం తప్పక దక్కుతుంది. మీకు కీడుచేసిన కౌరవులకు దిక్కులేని చావు మూడుతుంది. వారి వనితలు రోదిస్తుంటే చూచి నీవు సంతోషపడతావు. ఉత్తములైన కొడుకులను కన్న ఇల్లాలివి. నీకు చింత వద్దు. నీ కొడుకులను రుక్మిణీ సుభద్రలు తమ కొడుకులుగా ప్రేమతో చూచుకొంటున్నారు. వారి దిగులు నీకు వద్దు. నిశ్చింతగా ఉండుము.

అంతలో కృష్ణుడు పాండవులను వీడ్కొని ప్రయాణానికి సిద్ధమయ్యాడు. సత్యభామ ద్రౌపదిని స్నేహపూర్వకంగా కౌగిలించుకొని వీడ్కోలు పలికింది. అంత సత్యభామా సహితుడై శ్రీకృష్ణుడు ద్వారవతీపురానికి వెళ్ళాడు. మార్కండేయమహర్షి పాండవుల నాశీర్వదించి తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళాడు.

పాండవులు కామ్యకవనం నుండి ద్వైతవనానికి చేరారు. అప్పుడు హస్తినాపురం నుండి ఒక బ్రాహ్మణుడు వచ్చి పాండవులను దర్శించి, తిరిగి హస్తినాపురానికి వెళ్ళి, ధృతరాష్ట్రుడితో పాండవుల వనవాస జీవిత క్లేశాలను గురించి వివరించి చెప్పాడు. వాటిని విని ధృతరాష్ట్రుడు దుఃఖించాడు. దుర్యోధనుడి దుర్వర్తనానికి వాపోయాడు. మహాబలవంతులైన పాండవులు అరణ్యవాస క్లేశాలవలన పొందుతున్న బాధలను పేరుపేరున పేర్కొని పరితపించాడు. ప్రత్యేకించి భీమార్జునుల పరాక్రమాలను, ప్రతీకార పౌరుషాలను తలచి లోలోన భయపడ్డాడు. కౌరవులు పాండవులపట్ల చేసిన కీడులను వరుసగా స్మృతికి తెచ్చుకొని పాండవుల వలన రాబోయే కీడును శంకించి కౌరవనాశనం దాపురించిందని దద్దరిల్లాడు. దుర్యోధనుడు ధృతరాష్ట్రుడి మనోవేదనను పసికట్టి శకుని కర్ణులతో కూడి రహస్య సమావేశం జరిపి, కార్యాలోచనం చేశాడు.

## ఘోషయాత్ర

పాండవులు ద్వైతవన సరోవర తీరంలో ఉన్నారు. వారు వనవాస క్లేశాలను అనుభవిస్తున్నారనీ, వారి ముందు కౌరవసంపదను ప్రదర్శించి వారికి మరింత దుఃఖాన్ని కలిగించాలనీ దుష్టచతుష్టయం పన్నాగం పన్నింది. ద్వైతవనంలో ఉన్న గోవులు క్రూరమృగబాధకు గురి అవుతున్నాయనీ, తత్క్షణమే ప్రభువులు వాటికి రక్షణ కల్పించాలనీ సమంగుడనే గోపాలుడి ద్వారా నాటకమాడించి ఒక వినతిని కల్పించారు. దానిని నమ్మినా ధృతరాష్ట్రుడు మొదట దుర్యోధనాదులను గోరక్షకు పంపటానికి అంగీకరించలేదు. శకుని నచ్చ చెప్పిన తరువాత ఎట్టకేలకు సమ్మతించాడు. అయితే, ఆ వనంలోనే నివసిస్తున్న పాండవుల కెటువంటి కీడును తలపెట్టవద్దని హెచ్చరించాడు. దుర్యోధనుడు దాని కంగీకరించి ఘోషయాత్ర ప్రకటించాడు. మహావైభవంగా, అట్టహాసంగా, సకుటుంబ పరివారంగా దుర్యోధనాదులు ద్వైతవనం చేరి వసతిగృహాలుగా డేరాలు వేయించి, వినోద విలాసాలతో కాలం గడపసాగారు. గోవుల సంపదను పరిశీలించి తగిన భద్రతలను ఏర్పాటు చేశారు. ధార్తరాష్ట్రుల సంపదలనూ, వైభవాలనూ చూచి పాండవులూ, ద్రౌపదీ మనసులలో బాధపడాలని వారి పన్నాగం.

ద్వైతవనంలో దుర్యోధనాదులు కొంతకాలం మృగయా వినోదం సాగించారు. ద్వైతసరోవర ప్రాంతంలో ధర్మరాజు యజ్ఞదీక్షితుడై ఉన్నాడని తెలిసి, సరోవరానికి ఆవలి ఒడ్డున క్రీడాగృహాలను నిర్మించటానికి భటులను ఆజ్ఞాపించాడు. ఆ ప్రయత్నాన్ని కొందరు గంధర్వులు అడ్డగించారు. చిత్రసేనుడనే గంధర్వరాజు క్రీడార్థం కల్పించుకొన్న కొలను కాబట్టి, ఇతరులు దానిని ఉపయోగించరాదని హెచ్చరించారు. కౌరవసేనలు వారి మాటలు లెక్కసేయక చిత్రసేనుడి గంధర్వసేనతో యుద్ధానికి సిద్ధమయ్యారు. పోరు ఘోరంగా జరిగింది. గంధర్వుల దాడికి కౌరవసైన్యం నిలవటం కష్టతరమైంది. దుశ్శాసన కర్ణాది వీరులందరూ తమ తమ సైన్యాలతో పోరుకు దిగారు. దుశ్శాసనాదులు గంధర్వుల దాడికి ఆగలేక వెనుదిరిగి దుర్యోధనుడి వద్దకు వెళ్ళారు.

కర్ణ డొక్కడే రణరంగంలో నిలిచి గంధర్వులను ఎదుర్కొన్నాడు. వేలమంది గంధర్వులను చంపాడు. కాని, వెంటనే శతసహస్ర సంఖ్యలో గంధర్వులు వచ్చేవారు, రణరంగమంతా నిండి శత్రువులను ముంచి వేశారు. అప్పుడు దుర్యోధనుడు శకుని దుశ్శాసనాది వీరులతో కలిసి ససైన్యుడై కదనరంగానికి కదలి వెళ్ళాడు. భయంకర యుద్ధం సాగింది. కౌరవవీరుల బాణవర్షానికి గంధర్వులు చాలామంది నేలగూలారు. ఆ సంగతి తెలిసి గంధర్వపతి అయిన చిత్రసేనుడు మదగజాన్ని ఎక్కి కోపంతో కౌరవుల మీదకు స్వయంగా ససైన్యుడై యుద్ధానికి వచ్చాడు. చిత్రసేనుడు మాయాయుద్ధ నిపుణుడు, వివిధాస్త్రాలను ప్రయోగించి గాలి ఆడకుండా చేశాడు. సూర్యకిరణాలు సోకకుండా చీకట్లు కల్పించాడు. కౌరవసేనలో ప్రతి ఒక్కొక్క వీరుడికీ పదిమంది చొప్పున గంధర్వులు చుట్టుముట్టి హతమార్చటం మొదలు పెట్టారు. ఆ ధాటికి ఆగలేక కౌరవసైన్యం ధర్మరాజును శరణువేడటానికి పరుగెత్తటం మొదలుపెట్టింది. కర్ణుడు వారందరికీ ధైర్యం చెప్పి, పారిపోకుండా ఆపి, కులపర్వతం వలె స్థిరంగా నిలిచి గంధర్వులను వీరోచితంగా ఎదుర్కొన్నాడు. దుర్యోధనాదులందరూ అతడికి అండగా నిలిచారు.

అప్పుడు అనంతసత్త్వులైన గంధర్వులు కర్ణుడిని చుట్టుముట్టారు. అతడి రథాన్ని కూలగొట్టారు. కర్ణుడు వికర్ణుడి రథ మెక్కి రణభూమికి దూరంగా తొలగిపోయాడు. దుర్యోధనుడు పోరు సాగించాడు. చిత్రసేనుడు అతడిపై విజృంభించి రథాన్ని విరుగగొట్టాడు. దుర్యోధనుడి జుట్టుపట్టి లాగి నేలపై పడవేశాడు. పెడకేల బంధించి సింహనాదం చేశాడు. అతడి ఆజ్ఞతో గంధర్వులు దుశ్శాసనాది భ్రాతృవర్గాన్నీ, కౌరవుల భార్యలనూ, మంత్రులనూ పట్టి బంధించారు. ఆ దృశ్యం చూచి కౌరవసైన్యంలోని మిగిలిన వారంతా ఆక్రోశిస్తూ పరుగెత్తి ధర్మరాజును శరణువేడారు. జరిగిన కథంతా చెప్పారు. దుర్యోధనుడికి సకుటుంబంగా చిత్రసేనుడి చెరనుండి విముక్తి కలిగించుమని ధర్మరాజును శరణువేడారు.

భీమసేను డప్పుడు పెద్దగా నవ్వి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు. 'మనం చేయవలసిన పని గంధర్వులే చేశారు. ఎంతో మంచి పని జరిగింది! మన కే భారమూ లేకుండా. ఇప్పుడు ఊరకుంటే చాలు మనకు జయం కలుగుతుంది. పుట్టుక నుండి కపటిగా పాపాలకు దిట్టగా పెరిగి లోకులచేత తిట్లుపడ్డ ఆ క్రూరుడికి బ్రహ్మదేవుడు తగిన శాస్తి చేశాడు. వనవాస క్లేశాల ననుభవిస్తున్న మనలను పరిహసించటానికి పన్నాగం పన్ని వచ్చిన ఆ పాపి తన పాపఫలాన్ని అనుభవిస్తున్నాడు. వాడి మీద దయచూపవలసిన అవసరం లేదు.'

ధర్మరా జామాటలు విని భీముడితో ఈ విధంగా పలికాడు - 'భీమసేనా! ఇది పరుషవాక్యాలు పలికే సమయమా? శరణుజొచ్చిన వారిని కరుణతో చూడటం నీ ధర్మం కాదా? ఒక వంశంలో పుట్టి, జ్ఞాతులమైన వారం మనం. అర్థసంబంధమైన అభిప్రాయభేదాలు మనమధ్య ఉండవచ్చును. కాని, ఇతరులవలన మనకు అవమానం కలిగేటప్పుడు ఒకరు మరొకరిని ఆదుకొనకపోవటం నింద్యం. దుర్యోధనుడు దుర్మార్గుడే కావచ్చును. భార్యలతో సహా పగవారిచేత పట్టుబడగా మనం ఉపేక్ష చేస్తే కులహాని అవుతుంది. అంతే కాదు, శరణువేడిన వారిని రక్షించటం సామాన్యక్షత్రియుడికే ధర్మం కాగా, నీవంటి బలవంతులకు అవశ్యకర్తవ్యమని వేరే చెప్పవలెనా? లెమ్ము, నీవూ, నీ తమ్ములూ రథా లెక్కి వెళ్ళి దుర్యోధనుడి చెరవిడిపించండి'- అని ధర్మరాజన్నాడు. భీముడు కోపంతో దుర్యోధనుడు తమకు పూర్వం చేసిన అపకారాలనన్నింటినీ అన్నకు గుర్తు చేసి, వాటిని మరచిపోయి ఎప్పుడూ దయచూపితే, కార్యహాని అవుతుందని హెచ్చరించాడు. అప్పుడు ధర్మరాజు భీమసేనుడిని బుజ్జగిస్తూ ఇట్లా అన్నాడు.

'రక్షించుమని వేడితే బలహీనుడైనా తనకు ఓపినంత చేస్తాడు. నీవంటి శూరుడు దీనుల వైఖరి చూచి కూడా ఊరకుంటాడా? భయంకర శత్రువైనా శరణని వస్తే సంతోషంతో రక్షించాలి. ఇది దయామయుల తీరు. దానికి ఏ ధర్మాలూ సరిగావు. దుర్యోధనుడు మీ బలశౌర్యాలు తెలిసిన వాడు కాబట్టి, మీరు తప్పక తనను విడిపిస్తారనే ఆశతో వీరందరినీ పంపి ఉంటాడు. అతడిని రక్షిస్తే పుణ్యం, కీర్తి కలుగుతాయి. నిజానికి నేను ని న్నింత బలవంతపెట్టకూడదు. అయినా నేను యజ్ఞదీక్షలో ఉన్నాను కాబట్టి నేను వెళ్ళరాదు కాబట్టి, నిన్ను వెళ్ళమంటున్నాను. ముందుగా గంధర్వులను సామోపాయంతో నచ్చచెప్పి పని సాధించండి. సామమార్గంలో మాట వినకపోతే శత్రువుల నోడించి కార్యాన్ని పూర్తి చేయండి. తద్వారా నాయజ్ఞాన్ని

సఫలం చేయండి.' ధర్మజుడి మాటలకు భీముడు ఎట్టకేలకు అంగీకరించాడు. అర్జునుడు కూడ ధర్మరాజు ఆజ్ఞను తీసికొని దుర్యోధనుడి చెరవిడిపిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. నకుల సహదేవులు భీమార్జునుల వెంట నడిచి గంధర్వసేనలపై విజృంభించారు.

చిత్రసేనుడు వారిని అస్త్రశస్త్రాలతో ఎదుర్కొన్నాడు. అర్జునుడు సౌమ్యంగా దుర్యోధనుడిని చెరవిడిపించుమని కోరాడు. కాని,అతడి మాట పట్టించుకొనకుండా గంధర్వపతి అర్జునుడి రథాన్ని భగ్నం చేయపోయాడు. కవ్వడి విజృంభించి గంధర్వులను బాణవర్షంతో నొప్పించాడు. అప్పుడు గంధర్వులు చెరపట్టిన దుర్యోధనాదులను రక్షించుకొంటూ ఆకాశానికి ఎగిరి గంధర్వలోకంవైపు పరుగెత్తసాగారు. అర్జునుడు ఆకాశమంతా బాణాలతో కప్పి వారిని నిలువరించాడు. గంధర్వులు వలలో చిక్కిన పక్షులవలె విలవిలలాడారు. గంధర్వులు భీమాదుల మీద అస్త్రశస్త్రాలు ప్రయోగించారు. అర్జునుడు ఆగ్నేయాస్త్రంతో వారిని మంటలలో చిక్కుకొనేటట్లు చేశాడు. చిత్రసేనుడు మాయాయుద్ధం చేశాడు. అర్జునుడు శబ్దభేదులైన బాణాలతో చిత్రసేనుడి శరీరాన్ని గాయపరిచాడు. అప్పుడు చిత్రసేనుడు యుద్ధం చాలించి అర్జునుడి ఎదుట నిలిచి ఈవిధంగా అన్నాడు:

**చిత్రసేనుడు :** అర్జునా! దురాత్ముడైన ఈ దుర్యోధనుడు మిమ్మల్ని అపహసించటానికి ఈ వనానికి భార్యాబంధు సమేతంగా వచ్చాడు. ఇతడిని బంధించి తెమ్మని ఇంద్రుడు నన్ను పంపాడు. అందువలన దుర్యోధనాదులను ఇంద్రుడివద్దకు తీసికొని పోతున్నాను. నీవు నన్ను అడ్డగించబోకుము. నీవు నా స్నేహితుడవు. నీమీద నాకు మాత్సర్యం లేదు.

**అర్జునుడు :** చిత్రసేనా! ఈ సుయోధనుడు మాకు సహోదరుడు. కాబట్టి ఇతడిని వదలిపెట్టటం నీ కర్తవ్యం. అట్లా చేస్తే ధర్మరాజు సంతోషిస్తాడు. ఇంద్రుడి ఆజ్ఞ అయినా మరేదైనా దానిని ధర్మరాజు సమక్షంలో చెప్పి, ఆయన ఎట్లా ఆదేశిస్తే అట్లా చేయవలసిందే. కాబట్టి నా మాట విని ధర్మరాజు కడకు రమ్ము - అని పలికి, చిత్రసేనుడిని ఒప్పించి ధర్మరాజు వద్దకు తీసికొని వెళ్ళాడు.

చిత్రసేనుడు పెడరెక్కలు విరిచికట్టిన దుర్యోధనుడిని స్వయంగా ధర్మరాజు ఎదుట నిలిపి, అతడి దుష్టస్వభావాన్ని బయటపెట్టాడు. ధర్మరాజు చిత్రసేనుడి ఔదార్యాన్ని కొనియాడి, అతడిని గౌరవించి, గంధర్వలోకానికి సాగనంపాడు. ఆపైన దుర్యోధనాదుల బంధాలను ఊడదీయించాడు. 'ఎప్పుడూ ఇటువంటి సాహసాలు చేయకుము సోదరా! దుర్జనుడు సాహసిస్తే నశిస్తాడు. కాబట్టి వెంటనే నీ తమ్ములను కుటుంబాలను తీసికొని నగరానికి వెళ్ళిపొమ్ము. దీన్ని మనసులో పెట్టుకొని బాధపడకుము' - అని మెత్తగా మందలించి దుర్యోధనుడిని వీడ్కొలిపి పంపించాడు. ధర్మజుడి ధర్మప్రవృత్తిని ధౌమ్యాదులందరూ ప్రశంసించారు.

దుర్యోధనుడు పాండవుల చేత విడిపించబడిన అవమానాన్ని, అపకీర్తిని భరించలేక నగరానికి తిరిగిపోతూ మార్గమధ్యంలోనే ప్రాయోపవేశం మొదలు పెట్టాడు. కర్ణ, శకుని, దుశ్శాసనాదులు ఎన్నో రీతుల చెప్పిచూచారు. కాని, ఫలం లేకపోయింది. ఆనాటి రాత్రి పాతాళవాసులైన రాక్షసులు కృత్యను సృష్టించి పంపి దుర్యోధనుడిని తమవద్దకు తెప్పించుకొన్నారు. అతడి పూర్వజన్మ వృత్తాంతం వివరించి చెప్పారు. రాక్షసులు తపస్సుచేసి పరమేశ్వరుడిని మెప్పించి రాక్షసపతిగా అతడిని పొందారు. పరమేశ్వరుడు స్వయంగా సృష్టించటం వలన అతడి శరీర పూర్వభాగం సహజవజ్రతుల్యం. అస్త్రశస్త్రాలు ఆ భాగాన్ని ఏమీ చేయలేవు. అయినా కోమలంగా, మనోహరంగా, స్త్రీ జనరంజకంగా ఉంటుంది. దుర్యోధనుడు భూలోకంలో పుట్టటంతోనే అతడికి సహాయంగా అనేక దైత్యదానవగణాలు వివిధ రాజకులాలలో భగదత్తాది రాజకుమారులుగా పుట్టారు. భీష్మద్రోణకృపాదులు దేవాంశసంభవులైనా, వారి భావాలు రాక్షసావేశాలై ఉంటాయి. అందువలన యుద్ధంలో నిర్దయులై బంధువులను సంహరిస్తారు. పాండవులు బంధుప్రేమను విడిచి యుద్ధానికి దిగి దుర్యోధనుడి చేత సంహరించబడతారు. అతడి మనసులో అర్జునుడి వలన భయం ఉండటం రాక్షసులు పేర్కొని, నరకాసురాంశతో కర్ణుడు పుట్టాడనీ, అతడు తన దివ్యాస్త్రాలతో కృష్ణార్జునులను సంహరిస్తాడనీ చెప్పారు. పాండవరక్షణార్థం ఇంద్రుడు కర్ణుడి కవచకుండలాలను కపటరూపంతో అపహరిస్తాడు. భూమిపై వేయి లక్షలమంది సంశప్తకులు పుట్టారు. వారందరు దనుజులు. వారు యుద్ధంలో ఇంద్రసుతుడైన అర్జునుడిని నిగ్రహిస్తారు. శత్రుకంటకాలు లేని భూతలాన్ని దుర్యోధనుడు పాలిస్తాడని రాక్షసులు ధైర్యం చెప్పారు. రాక్షస

వంశానికే దుర్యోధనుడు ఆశాకిరణమని అభివర్ణించారు. ప్రాయోపవేశం చేయవద్దని చెప్పారు. కృత్య ఎప్పటివలె ఆతడిని వసతిమందిరంలో ఉంచింది. దుర్యోధను డది నిజమని నమ్మాడు. పాండవులను చంపగల ధైర్యం తెచ్చుకొన్నాడు. దైత్యులు తనతో చెప్పిన అంశాలను రహస్యంగా తనమదిలో దాచుకొన్నాడు. తెల్లవారగానే కర్ణుడు వచ్చి తాను రాబోయే మహాయుద్ధంలో అర్జునుడిని సంహరిస్తానని తన ఆయుధ మంటి శపథం చేశాడు. కర్ణుడి మాటలు, రాత్రి దానవులు చెప్పిన మాటలు ఒకటిగా ఉండటం గమనించి దుర్యోధనుడు ప్రాయోపవేశాన్ని వదలి హస్తినాపురానికి ససైన్యంగా వెళ్ళాడు.

భీష్మాదులు ఘోషయాత్రలో జరిగిన సంఘటనలు తెలిసికొని పాండవులతో కలిసి ఉండుమని దుర్యోధనుడికి హితవు చెప్పారు. కాని, అతడు ఆ మాటలు పెడచెవిన పెట్టి తాతను అనాదరించాడు; కర్ణుడి అండను నమ్మి ఉప్పొంగిపోయాడు. ధర్మరాజువలె దుర్యోధనుడు కూడా రాజసూయ యాగం చేయాలని సంకల్పించాడు. కర్ణశకునులు ఆ అభిప్రాయాన్ని బలపరచారు. ఆ విషయాన్ని పురోహితుడితో సంప్రతించారు. అతడుకూడా విద్వజ్జనులతో విచారించి పాండవులను జయించకుండా రాజసూయం చేయటం ధర్మం కాదు కాబట్టి దాని వంటి ఫలమిచ్చే వైష్ణవమనే యజ్ఞాన్ని పేర్కొన్నాడు. దుర్యోధనుడు పెద్దల అనుమతితో వైష్ణవ యజ్ఞాన్ని వివిధ దక్షిణలతో వైభవోపేతంగా చేశాడు.

ఆ యజ్ఞానికి పాండవులను ఆహ్వానించటానికి ఒకదూతను పంపారు. ధర్మరాజు తాము వనవాసవ్రతంలో ఉండటం చేత రాలేమని సందేశం పంపాడు. భీముడు క్రోధోద్రిక్తుడై ఇట్లా పలికాడు. 'ఓ దూతా! పదమూడేళ్ళు పూర్తికాగానే ధర్మరాజు శస్త్రాస్త్రాలనే యజ్ఞాగ్నిలో కౌరవులనే పశువులను వేలుస్తూ యుద్ధమనే సత్రయాగం చేయటానికి వస్తాడు కాని, అందాకా హస్తినాపురానికి రా' డని దుర్యోధనుడితో చెప్పుమని నిష్ఠురంగా పలికాడు. యజ్ఞంలో పాల్గొన్న సభాసదులలో కొందరు ఆ వైష్ణవ యజ్ఞం అపూర్వమని ప్రశంసించారు. మరికొందరు ధర్మజుడి రాజసూయమే ఆ యజ్ఞముకంటె ఉదాత్తమైనదని భావించారు. యజ్ఞాంతంలో అవభృథ స్నానం చేసి దుర్యోధనుడు పెద్దల ఆశీస్సులతో బంగారు సింహాసనం మీద తేజరిల్లాడు. అప్పుడు కర్ణుడు దుర్యోధనుడికి ఆనందం కలిగేటట్లుగా - యుద్ధంలో అర్జునుడిని చంపేంతవరకు కాళ్ళగోళ్ళు తీసికొన నని శపథం చేశాడు. దుర్యోధనుడు ఉప్పొంగిపోయాడు. అనంత సంపదను ప్రియసత్కారాలతో పంచిపెడుతూ త్యాగభోగాలతో తులతూగుతూ ఉన్నాడు. కర్ణుడి శపథం విని ధర్మరాజు విషణ్ణుడై కంటిమీద కూరుకు లేకుండా వేదనపడ్డాడు.

## వ్రీహిద్రోణోపాఖ్యానం

పాండవులు ద్వైతవనం నుండి కామ్యకవనం చేరారు. అక్కడకు వ్యాసమునీంద్రుడు వచ్చాడు. పాండవుల పూజలందుకొని వారికి ఈ విధంగా బోధించాడు.

మానవులకు సుఖదుఃఖాలు వరుసగా వస్తూ ఉంటాయి. పండితు లాసత్యం తెలిసికొని మోదఖేదాలు పొందకూడదు. ధర్మరాజా! నీవు ఆపదలకు ఓర్చుకొని తపస్సు చేయుము. తపస్సు సకల సౌఖ్యాలను కలిగిస్తుంది. క్షమ, అహింస, సత్యం, సమత, ఇంద్రియనిగ్రహం, శమం, పరిత్యాగం - అనేవి తపో లక్షణాలు. వీటిలో ఒక్కొక్కటి ఉత్తమ గతికి సోపానాలు, తపశ్శక్తితో కూడిన దానం చేస్తే అధిక ఫలం కలుగుతుంది. కష్టార్జితమైన ధనాన్ని దానం చేయటం ఉత్తమం. అన్యాయార్జితమైన విత్తాన్ని దానం చేయటం మూర్ఖన్యాయం. దానివలన ఫలమేమీ ఉండదు. న్యాయంగా ఆర్జించిన ధనం కొద్దిగానైనా సరే గౌరవప్రదం. అది యోగ్యుడైన వాడికి దానం చేస్తే ఎంతో ఫలిస్తుంది. దానికి ఉదాహరణంగా ఈ కథ వినుము.

పూర్వం కురుక్షేత్రంలో ముద్గలుడనే విప్రుడు ఉంఛవృత్తితో జీవించేవాడు. ఆ పుణ్యాత్ముడు అతిథిప్రియుడు. అతడు పక్షోపవాసవ్రతం చేపట్టాడు. పాడ్యమి మొదలు పదునాల్గు రోజులు ఒక్కొక్క గింజగా తూమెడు వడ్లు సమకూర్చేవాడు. పర్వదినాన (అమావాస్య పూర్ణిమలలో) ఆ బియ్యాన్ని పాకం చేసి, దేవపితృపూజలు చేసి, పుత్రకళత్రాదులతో భుజిస్తూ దేహయాత్ర సాగిస్తుండేవాడు.

ఒక పర్వదినాన ముద్గలుడి ఇంటికి దుర్వాసమునీంద్రుడు అతిథిగా వచ్చాడు. ముద్గలు డతడిని పూజించి అన్నం వడ్డించాడు. దుర్వాసుడు వండిన అన్నమంతా తిన్నంత తిని మిగిలిన దానిని దేహమంతా పులుముకొని వెళ్ళాడు. ముద్గలుడికి

తినటానికి ఏమీ మిగులలేదు. అయినా, అతడు నిర్వికారంగా పక్షోపవాసవ్రతం సాగిస్తూనే ఉన్నాడు. దుర్వాసుడు, ఆరు పర్వాలు వరుసగా వచ్చి ముద్గలుడిని పరీక్షించాడు. కాని, అతడిలో ఎటువంటి అసహనం కనపడలేదు. దానవ్రతంలో దీక్ష తగ్గలేదు. దుర్వాసు డతని దానశీలతకు మెచ్చి బొందితో స్వర్గం పొందే వరం ప్రసాదించి వెళ్ళాడు. ఆ తరువాత దేవదూత దివ్యరథాన్ని తెచ్చి ముద్గలుడిని స్వర్గానికి రమ్మని ఆహ్వానించాడు. ముద్గలుడు స్వర్గలోకంలోని గుణదోషాలను తెలుపుమని దేవదూత నడిగాడు. అత డీవిధంగా చెప్పాడు.

స్వర్గం ఈలోకానికి పైగా ప్రకాశమానంగా ఉంటుంది. అది దివ్యదృష్టితో చూడగలిగింది, దేవయానంతో చేరగలిగింది. తపస్వులు, సోమయాజులు, సత్యసంధులు, ఉత్తములు, జితేంద్రియులు, సమబుద్ధి కలవారు. దానపరులు, రణశూరులు - ఆ లోకంలో నివసిస్తారు. అందులో అప్సరసలు, సాధ్యులు, దేవమునులు వేరువేరుగా తగిన చోట్ల ఉంటారు. ముప్ఫయిమూడు వేల యోజనాల విస్తీర్ణం గల మేరుపర్వత శిఖరం మీద ఆ లోకం ఉంటుంది. నందన వనోద్యానాలు పుణ్యాత్ముల విహారస్థలాలు. అక్కడి వారికి ఆకలిదప్పులు, శీతోష్ణబాధలు, జరారోగ బాధలు ఉండవు. మనస్సు కాహ్లాదం కలిగించే ప్రకృతి సౌందర్యం అక్కడ ఉంటుంది. ఆ లోకవాసులు దివ్యదేహాలతో దివ్యభోగాలను అనుభవిస్తూ ఉంటారు. దివ్య విమానాలలో తిరుగుతూఉంటారు. ఆ లోకం మీద బ్రహ్మలోకం ఉన్నది. అందులో శోక మనేది ఉండదు. మానవులు, బ్రహ్మలు, మునులు అందులో వసిస్తారు. లోభం, క్రోధం, పాపం, అపకీర్తి, దుఃఖం, మరల పుట్టటం అనేవి అక్కడివారి కుండవు. ప్రళయం తరువాత కూడా ఆ లోకం నిలిచి ఉంటుంది. ఇంద్రాదులు కూడా ఆ లోకాన్ని పొందాలని అనుకొంటారు.

స్వర్గంలో ఉండే దోషాలు కూడా వినుము. జీవు లాలోకంలో పుణ్యఫలాలను అనుభవిస్తారే కాని, పుణ్యం చేసికొనలేరు. పుణ్యఫలానంతరం మరల భూమిపై జన్మ లెత్తుతూ ఉంటారు. స్వర్గ సుఖం నిత్యం కాదు. అందులోని వారు అసూయలకు పాల్పడతారు. అయినా బ్రహ్మలోకం తరువాత స్వర్గమే ఉత్తమం - అని దేవదూత వివరించాడు. ముద్గలుడు పునర్జన్మలేని బ్రహ్మలోకాన్ని పొందగోరి స్వర్గలోక భోగాన్ని త్యజించాడు. ఉంఛవృత్తి మాని జ్ఞానయోగంతో సమత్వాన్ని సాధించి మోక్షాన్ని పొందాడు.

కాబట్టి ధర్మరాజా! నీవు రాజ్యాన్ని కోల్పోయావని విచారించక తపస్సు చేయుము. దాని వలన శుభాలు కలుగుతాయి. పదమూడవ యేడు ముగియగానే రాజ్యం నీకు లభిస్తుంది - అని చెప్పి ధర్మరాజును ఓదార్చి వ్యాసుడు తన ఆశ్రమానికి పోయాడు.

## సైంధవపరాభవం

ఒకనాడు పాండవులు తృణబిందుడి ఆశ్రమంలో ధౌమ్యుడిని, ద్రౌపదిని ఉంచి వేటకు వెళ్ళారు. ఆ సమయంలో సైంధవుడు సాల్వకన్యను వివాహమాడే నిమిత్తమై ఆ వైపునుండి ససైన్యుడై తరలిపోతున్నాడు. ఆశ్రమ ద్వారంలో నిలిచి ఉన్న ద్రౌపదిని చూచాడు. ఆమె యొక్క అపూర్వ లావణ్యవైభవాన్ని చూచి మోహించి ఆమెకు తన కోర్కెను కోటికాస్యుడనే మిత్రుడి ద్వారా తెలియపరిచాడు. దూతకు ద్రౌపది తన వివరాలు తెలిపి, తాను పాండవపత్ని అనీ,సంతానవతీ అనీ, పేర్కొని, పాండవులు వేటనుండి తిరిగి వచ్చేంతవరకు ఉండి వారి అతిథ్యాన్ని స్వీకరించి వెళ్ళుమని చెప్పుతుంది. ఆ సంగతి కోటికాస్యుడు సైంధవుడికి నివేదించాడు.

సైంధవుడు మదనాతురుడై, రథం, దిగి, ద్రౌపది ఉన్న ఆశ్రమంలో ప్రవేశించి, ఆమెను పలకరించాడు. ఆమె అతిథి మర్యాదలు చేసింది. సైంధవు డామెను వలపుగొన్న మాటలతో పలకరించి తనవెంట రమ్మని అనుచితమాడాడు. ఆమె తనకు చెల్లెలని కూడా భావించకుండా కామాంధకారంతో మాట్లాడిన అతడి వైఖరికి నిష్ఠురంగా సమాధానం చెప్పింది. పాండవులు ఆగ్రహిస్తే అతడికి కలిగే విపత్తును చెప్పి హెచ్చరించింది. అయినా, అతడు లెక్కచేయకుండా ఆమెను బలాత్కారంగా ఎత్తుకొని, రథం మీద ఉంచుకొని బయలుదేరాడు. ద్రౌపది ధౌమ్యుడిని పిలుస్తూ ఆక్రందించింది. ధౌమ్యుడు సైంధవుడిని హెచ్చరిస్తూ అతడి రథం వెంట పరుగిడసాగాడు.

పాండవులకు అడవిలో అపశకునాలు ఎదురయ్యాయి. కలతచెంది వారందరూ కలిసి ఆశ్రమానికి తిరిగివచ్చారు. ద్రౌపది చెలికత్తె అయిన ధాత్రేయిక వలన జరిగినదంతా తెలిసికొన్నారు. అందరూ సైంధవుడి మీదకు లంఘించారు. వారి రథాలను చూచి సైంధవుడు వారిని పరిచయం చేయుమని ద్రౌపదిని కోరాడు. ఆమె క్రమంగా పాండవ పరాక్రమ మూర్తులను వర్ణించి చెప్పి, వారిబారిన పడినవారికి మృత్యువు తప్పదని హెచ్చరించింది.

పాండవులు దిక్కులు చీకట్లు క్రమ్మేటట్లు బాణాలు గుప్పించారు. త్రిగర్త, శిబి, సింధు, సౌవీర సైన్యాలు పాండవుల నెదుర్కొన్నాయి. భీముడు సైంధవుడినీ, యుధిష్ఠిరార్జునులు సౌవీరులనూ, నకుల సహదేవులు మిగిలిన వారినీ ఢీకొన్నారు. సంకుల సమరం సాగింది. రణభూమి శవమయం అయిపోయింది. సైంధవుడు ద్రౌపదిని నేలపై దిగవిడిచి రథం తోలుకొని పలాయనం చిత్తగించాడు. భీమార్జునులు ఆ దుర్మార్గుడిని విడిచిపెట్ట దలచలేదు. పాంచాలి క్రుద్ధురాలై సైంధవుడిని చంపటానికి వారిద్దరినీ పురికొల్పింది. ధర్మరాజు మాత్రం సైంధవుడిని చంపవద్దని హెచ్చరించాడు. ధౌమ్యధర్మజద్రౌపదులను, నకుల సహదేవులను ఆశ్రమానికి తిరిగి పంపి, భీమార్జునులు అతడిని వెన్నంటి తరిమి పట్టుకొన్నారు. భీముడు సైంధవుడిని చితకపొడిచాడు. మొగంనుండి నెత్తురుకారుతూ అతడు మూర్ఛపోయాడు. వాడియైన కత్తితో అతడి తల, మీసం గొరిగి 'పాండవదాసుడ'నని సభలలో చెప్పుకొనటానికి అంగీకరించినందువలన సైంధవుడిని ప్రాణాలతో వదిలాడు. ధర్మజుడి ఆనతి మేరకు భీమార్జునులాతడిని ప్రాణాలతో తీసికొని పోయి' ఇడుగో పాండవ దాసుడు' అని అన్న పాదాలముందు పడవేశారు. పాండవదాసుడైతే ప్రాణాలతో వదలివేయండని ధర్మజుడు పలికాడు. ద్రౌపది అతడి దైన్యాన్ని చూచి వదలిపెట్టుమన్నది. సైంధవుడు అవమానభారంతో క్రుంగుతూ వెళ్ళిపోయాడు. ధర్మరాజు చూపిన కరుణకు అక్కడివారందరూ జయజయ ధ్వానాలు చేశారు.

సైంధవుడు విషణ్ణుడై గంగాద్వార క్షేత్రం వద్దకు వెళ్ళి, పరమేశ్వరుడిని గూర్చి బొటనవ్రేలి మీద నిలిచి తపస్సు చేశాడు. శివుడనుగ్రహించి ప్రత్యక్షమై వరం కోరుకొనుమన్నాడు. సైంధవుడు పాండవులనైదుగురను ససైన్యంగా ఓడించే వరం కోరాడు. శివుడది అసాధ్యమని పేర్కొన్నాడు. అర్జునుడిని జయించటం తనకే కష్టతరమని పలికాడు. పార్థుడు లేనప్పుడు మిగిలిన పాండవులను ఒకనాటి యుద్ధంలో నిలువరించగలిగే వరాన్ని ప్రసాదించి అంతర్ధానమైనాడు. సైంధవుడు తిరిగి సింధు దేశానికి వెళ్ళాడు.

ఆ తరువాత కొన్నాళ్ళకు కామ్యకవనంలో ఉంటున్న పాండవులవద్దకు మార్కండేయ మహర్షి వచ్చాడు. సైంధవుడు పాంచాలి పట్ల వ్యవహరించిన తీరును ధర్మరాజు చెప్పాడు. అతడిని అవమానించటానికి తాము పడ్డ కష్టాన్ని కూడ వివరించాడు. ద్రౌపదివలె కష్టాలపాలైన వనితగాని, ధర్మరాజువలె శోకసముద్రంలో మునిగిన రాజుకాని ఏకాలంలోనైనా ఎవరైనా ఉన్నారా? అని అడిగాడు. మార్కండేయముని సీతారాము లున్నారని పేర్కొన్నాడు. వారి కథను వివరించాడు.

**రామాయణకథ**

**ధర్మరాజు :** మార్కండేయ మహర్షీ! రాము డెవరి వంశంవాడు? రావణుడు ఎవరి కొడుకు? అతడు ఏ కారణం వలన సీతను అపహరించాడు? రామరావణయుద్ధం ఏ విధంగా ప్రవర్తిల్లింది? నాకు వివరించి చెప్పండి.

**మార్కండేయుడు :** ఇక్ష్వాకు వంశంలో ప్రసిద్ధుడైన అజమహారాజు కొడుకు దశరథుడు. అతడికి ముప్వురు భార్యలు. కౌసల్యకు రాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులు జన్మించారు. రాముడు విదేహరాజైన జనకుడి కూతురు సీతను వివాహమాడాడు.

బ్రహ్మమానసపుత్రుడైన పులస్త్యుడికి వైశ్రవణుడు పుత్రుడు. అతడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి నలకూబరుడనే కొడుకును, లోకపాలకత్వం, ధనేశ్వరత్వం, లంకానగరం, శంకరుడితో స్నేహం - అనే వరాలను పొందాడు. అతడి మహిమను చూచి తండ్రి అయిన పులస్త్యుడు అసూయపడి, తన శరీరం నుండి విశ్రవసుడిని సృష్టించి వైశ్రవణుడికి కీడు చేయుమని ఆజ్ఞాపించాడు. ఆ సంగతి తెలిసి వైశ్రవణుడు విశ్రవసుడి వద్దకు వెళ్ళి, అతడిని ప్రసన్నుడిని చేసికొని నృత్తగీత విద్యావిశారద

లయిన ముగ్గురు రాక్షస స్త్రీలను అతడికి పరిచారికలుగా ఇచ్చాడు. వారు పుష్పోత్కట, మాలిని, పాక(బక) - అనేవారు. వారు చేసే సేవలకు ప్రీతుడై విశ్రవసుడు వారికి పుత్రదానం చేశాడు. పుష్పోత్కటకు రావణ కుంభకర్ణులు, మాలినికి విభీషణుడు, పాక(బక)కు ఖరుడు, శూర్పణఖ అనే కవలబిడ్డలు జన్మించారు. వారు క్రమంగా పెరిగి పెద్దవారయ్యారు. రావణుడు లోకమందు లోకభయంకరుడయ్యాడు. కుంభకర్ణుడు క్రూరుడుగా మారాడు. విభీషణుడు ఉత్తమచిత్తుడయ్యాడు. ఖరుడు బ్రాహ్మణులను చంపి వారి మాంసం తినేవాడయ్యాడు, శూర్పణఖ పాపకర్మురాలయింది.

వారందరూ వేదవేదాంగాలను నేర్చుకొని గంధమాదన పర్వతం మీద ఉంటూ, వైశ్రవణుని సంపద తపస్సిద్ధమని తెలిసి మత్సరబుద్ధితో వారుకూడా తపస్సులు చేయ సంకల్పించారు. రావణుడు వాయుభక్షకుడై ఘోరతపస్సు చేశాడు. నియతాహారుడై కుంభకర్ణుడు, పర్ణాహారుడై విభీషణుడు తపస్సులు చేశారు. ఖరశూర్పణఖలు వారికి సపర్యలు చేశారు. వేయి సంవత్సరాలు గడిచాయి. రావణుడు తన పదితలలలో ఒకదానిని ఖండించి అగ్నిలో వేల్చాడు. అట్లాగే వేయేండ్ల కొక తల చొప్పున ఆహుతి చేస్తూ వచ్చాడు. పదో తలను త్రెంచుకొనే సమయంలో బ్రహ్మ ప్రత్యక్షమై వరం కోరుకొనుమన్నాడు. సమస్త దేవతలు, పితృగణాలు, దైత్యులు, సర్పాలు, గంధర్వులు, రక్షోగణాలు, విద్యాధరయక్షజాతులు తననేమీ చేయలేనట్లు, కామరూపంతో స్వేచ్ఛగా విహరించ గలిగేటట్లు వరాలు కోరాడు. 'మనుష్యుల వలన తప్ప ఇతరుల వలన నీకు ప్రాణభయం ఉండ' దని బ్రహ్మ వరమిచ్చాడు. కుంభకర్ణుడు గాఢమైన నిద్రను కోరాడు. దానిని బ్రహ్మ ప్రసాదించాడు. విభీషణుడు ఆపదల సమయంలోకూడా తన మనస్సు పాపచింతలకు లోనుకాకుండ ధర్మబద్ధమై ఉండాలనీ, బ్రహ్మాస్త్రాన్ని ప్రసాదించాలనీ కోరాడు. రాక్షసుడైనా విభీషణుడు ధర్మబుద్ధి కలవాడని తెలిసి అతడు అడిగిన వరాలిచ్చి, అమరత్వాన్ని ప్రసాదించాడు బ్రహ్మ.

రావణుడు వరగర్వంతో వైశ్రవణుడిపై దండెత్తాడు. వైశ్రవణుడు భీతుడై యక్షకింపురుషులతో కలిసి లంకానగరం విడిచి గంధమాదన పర్వతం వైపు పోతూ ఉండగా ఆతడిని అవమానించి పుష్పక విమానాన్ని హరించాడు. కుబేరుడు కోపించి ఆ విమానం రావణుడి శత్రువుల పాలౌతుందని శపించాడు. రావణుడు రాక్షస రాజ్యానికి రాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు. అతడు దేవేంద్రాదులను జయించి, వారి పదవులను ఆక్రమించి జగద్రావణం చేసి, రావణుడని లోకంలో ప్రఖ్యాతి పొందాడు.

దేవతలు రావణుడి ఆగడాలను బ్రహ్మకు నివేదించుకొన్నారు. బ్రహ్మ ఆ సమస్యను అంతకుపూర్వమే విష్ణువుతో నివేదించాడు. ఆ దేవదేవుడు మానవాకారంతో అవతరించి ఆ రాక్షసుడిని సమూలంగా నశింపచేస్తానని మాట ఇచ్చాడు. ఇంద్రాది దేవతలు భల్లూక వానర జాతులలో మహావీరులై పుట్టుతారనీ, భయపడవద్దనీ బ్రహ్మ దేవతలకు, ఋషులకూ నివేదించాడు. వారి యెదుటనే దుంధుభి అనే గంధర్వ వనితను పిలిచి మంథర అనే కుబ్జరూపంగా భూలోకంలో పుట్టి తగినవిధంగా దేవకార్యాన్ని నిర్వహించటానికి నియోగించాడు. ఆ తరువాత దేవతలందరూ తమ తమ అంశలతో మహాకపివీరులను భువిపై పుట్టించారు.

**ధర్మరాజు :** మహర్షీ! దశరథుడు ధర్మమూర్తి అయిన రాముడిని అరణ్యానికి ఎందుకు పంపాడు? ఆ కథ చెప్పండి.

**మార్కండేయుడు:** దశరథ మహారాజు తన కొడుకులలో పెద్దవాడైన శ్రీరాముడు అన్నివిధాలా యౌవరాజ్య పట్టాభిషేక యోగ్యుడని నిరూపించి అభిషేకానికి ముహూర్తం నిర్ణయించాడు. ఆ శుభదినంనాడు మంథర ప్రబోధానికిలోనై కైకేయి దశరథ మహారాజును రెండు వరా లడిగింది. ఒకటి - యౌవరాజ్య పదవిలో భరతుడికి పట్టాభిషేకం చేయాలి. రెండు- రాముడు పదునాలుగేండ్లు అడవిలో గడపాలి. ఆ మాటలు విన్న దశరథుడు పిడుగుపడ్డ చెట్టువలె మూర్ఛితుడై భూమిపై పడ్డాడు. ఆ సంగతి రాముడు తెలిసికొని తన తండ్రి సత్యప్రతిజ్ఞుడు అగుగాక- అని తలచి సీతాసమేతంగా అడవికి బయలుదేరాడు. లక్ష్మణుడు వారిని అనుసరించాడు. రాముడు వనానికి వెళ్ళాడని తెలిసి దశరథుడు తద్వియోగ దుఃఖంతో రాముడినే స్మరిస్తూ ప్రాణాలు వదిలాడు.

దశరథ మరణానంతరం కైకేయి భరతుడిని పిలిపించింది. తండ్రి మరణవార్త వినిపించింది. రాముడు వనానికి వెళ్ళాడని చెప్పింది. అర్హుడైన అతడిని రాజ్యభారాన్ని స్వీకరించుమని కోరింది. భరతుడా మాటలు విని కోపశోకాలతో కలత

చెందాడు. తల్లి చేసిన ఆ దురంతానికి దురపిల్లాడు. తల్లిని నిందించాడు. తండ్రికి అపరక్రియలు నిర్వర్తించాడు. వెంటనే మంత్రిసామంతబంధు పౌర వర్గాలతో చిత్రకూట పర్వతానికి వెళ్ళి రాముడిని దర్శించాడు. పితృమరణవార్త అన్నలకు తెలియచెప్పాడు. శ్రీరాముడిని తిరిగివచ్చి రాజ్యభారాన్ని చేపట్టుమని అనేక విధాల ప్రార్థించాడు. రాముడు తమ తండ్రి సత్యవాక్పరిపాలకుడుగా చిరకీర్తి పొందాలంటే తాను అరణ్యవాసం చేయటమే ధర్మమని ప్రబోధించి, భరతుడి కోరికపై తన పాదుక లాతని కిచ్చి పంపాడు. భరతుడు పాదుకలను నందిగ్రామంలో ఉంచి సేవిస్తూ, రాముడి రాకకై ఎదురుచూచాడు.

రాముడు చిత్రకూటం నుండి శరభంగ మహర్షి వద్దకు వెళ్ళాడు. ఆయన ఆదేశంతో దండకారణ్యంలో ప్రవేశించి గోదావరీ తీరంలో పంచవటిలో ఆశ్రమం నిర్మించుకొని ఉన్నాడు. అప్పుడు శూర్పణఖ వారికి అపకారం తలపెట్ట రాగా రామలక్ష్మణులు కోపించి దాని ముక్కు చెవులు కోసి అవమానించారు. ఆమె రోదించింది. ఖరదూషణులు పదహారు వేల రాక్షసులతో రామలక్ష్మణులపై దాడిచేశారు. వారిని క్షణకాలంలో చంపి రాముడు దండకారణ్యాన్ని రాక్షసభయం నుండి దూరం చేశాడు. శూర్పణఖ జరిగినదంతా లంకలోని రావణుడికి నివేదించింది. అతడు వెంటనే గోకర్ణ క్షేత్రానికి వెళ్ళి అక్కడ తపస్సు చేసికొంటున్న మారీచుడిని చూచి, రాముడిని అవమానించటానికి అతడి సహాయాన్ని అర్థించాడు. మారీచుడు రామపరాక్రమాన్ని రావణుడికి నివేదించాడు. అతడితో వైరం కులక్షయ కారకమని హితవు చెప్పాడు. ఆ మాటలకు రావణుడు కోపించి మారీచుడిని చంపబోయాడు. అతడి చేతిలో చచ్చేదానికంటె రాముడి చేతిలో మరణించటమే ముక్తిదాయకమని భావించి మారీచుడు రావణుడికి సహాయం చేయటానికి అంగీకరించాడు. బంగారు లేడి రూపం దాల్చి సీతను ప్రలోభపెట్టాలనీ, రాము డా లేడిని వెన్నంటి దూరదూరాలకు పోవాలనీ, అప్పుడు రావణుడు సీతను చెరపట్టాలనీ వ్యూహం సిద్ధం చేశాడు.

మారీచుడు కనకమృగరూపంలో రామాశ్రమ ప్రాంతంలో తిరుగాడసాగాడు. జానకి ఆ మృగాన్ని పట్టి తెమ్మని రాముడిని కోరింది. విధివశాన రాముడు ఆమె కోర్కెను తీర్చటానికి మాయామృగం వెంట బయలుదేరాడు. ఆ మాయామృగం రాముడికి చిక్కక అతడిని చాలాదూరం అడవిలోకి తీసికొని వెళ్ళింది. రాముడు విసిగి దానిని బాణంతో కొట్టాడు. ఆ లేడి రాముడిగొంతుతో 'హా లక్ష్మణా! సీతా!' అంటూ అరిచి కుప్పకూలిపోయింది. సీత ఆ పిలుపు విని రాముడి కేదో ఆపద కలిగిందని శంకించి లక్ష్మణుడిని ఆతడికి సాయం పొమ్మని కోరింది. 'రాముడు సర్వరక్షకుడు. అతడి కే కీడూ రాదు. అది రాక్షసమాయ; రాముడిప్పుడే తిరిగివస్తాడు' - అని లక్ష్మణుడు సీతకు ధైర్యం చెప్పాడు. కాని, సీత కోపంతో వివేకాన్ని కోల్పోయి లక్ష్మణుడి సంకల్పాన్ని శంకించి నిందించింది. రాముడి తరువాత తాను లక్ష్మణుడికి వశం కానని నిష్ఠురాలాడి లక్ష్మణుడి శీలాన్ని అవమానించింది. అతడు చేసేది లేక, ఆమె మాటలు భరించలేక, ఆమెను ఒంటిగా వదలి అన్నగారి కొరకు అడవిలోకి వెళ్ళాడు.

ఆ సమయంలో రావణుడు మాయా సన్యాసి వేషంలో సీతను సమీపించాడు. ఆతడిని అతిథిగా భావించి సీత పూజలు చేసింది. ఆమె సౌందర్యానికి ఆశ్చర్యపడి, రావణుడు తనను రావణుడిగా పరిచయం చేసికొని, తన పరాక్రమ విశేషాలను కీర్తించుకొని, తనకు భార్య కమ్మని కోరాడు. రాముడు సామాన్య మానవుడనీ, అతడితో కలసి అడవులలో ఇడుమలు పడవద్దనీ, తనను పొంది పరమభోగాల ననుభవించుమనీ కోరాడు. సీత తన పతిభక్తిని చాటిచెప్పే పలుకులు పలికింది. మిన్ను విరిగి నేల గూలినా రాముడిని దప్ప అన్యుని స్మరించనన్నది. రావణుడు భయంకరాకారాన్ని తాల్చి ఆమె నెత్తుకొని ఆకాశానికి ఎగసి లంకవైపు వేగంగా పోజొచ్చాడు. సీత తన దీనస్థితిని ఎలుగెత్తి రోదిస్తూ తెలిపింది. 'రక్షించండి' అని విలపించింది. ఆమె మాటలు విని సమీప పర్వత గుహలో నుండి జటాయువు రెక్కలు ఎగిరే కులపర్వతం వలె ఎగసి, రావణుడిపై దాడిచేశాడు. ఇద్దరి నడుమ పోరు ఘోరంగా సాగింది. కాని, చివరకు దశకంఠుడు రెక్కలను నరకటంతో జటాయువు నేలకూలాడు. రావణుడు వేగంగా పోసాగాడు. సీత నిరాశచెంది మార్గమధ్యంలో కొందరు కపివరులను గమనించి చింపిన చీర కొంగులో తన ఆభరణాలను మూటకట్టి, దానిని వారిముందు పడేటట్లు విడిచింది. రావణుడు లంకకు చేరి సీతను అశోకవనంలో ఉంచి, ఆమెకు కాపలాగా రాక్షసీ గణాన్ని ఏర్పరచి అంతఃపురానికి వెళ్ళాడు.

రాముడు మాయామృగాన్ని చంపి తిరిగివస్తూ ఎదురుగా వస్తున్న లక్ష్మణుడిని చూచి సీత నొంటిగా వదలివచ్చినందుకు మందలించాడు. కాని, లక్ష్మణుడు సీత తనను అవమానించి పలికిన మాటలు చెప్పి తన తప్పు లేదని మనవి చేసికొన్నాడు. రాముడు బాధపడుతూ ఆశ్రమానికి చేరాడు. చైతన్యం లేని శరీరం వలె సీత లేని కుటీరాన్ని చూచాడు. మూర్ఛపోయాడు.

లక్ష్మణుడి సేవలతో కొంతసేపటికి తెప్పరిల్లాడు. సీతాన్వేషణకు తమ్ముడితో కలిసి బయలుదేరాడు. మార్గంలో జటాయువును దర్శించారు. అతడు చెప్పిన కథనంతా విన్నారు. రావణుడు సీతను తీసికొని పోయిన దిక్కు చూపించి జటాయువు ప్రాణాలు విడిచాడు. అతడికి రామలక్ష్మణులు అత్యంత గౌరవంతో అగ్నిసంస్కారం చేసి దక్షిణాభిముఖులై పయనించారు.

దారిలో కబంధుడు లక్ష్మణుడిని కబళించబోయాడు. రాముడు అతడి బాహువును నరికి లక్ష్మణుడిని రక్షించాడు. లక్ష్మణుడు అతడి రెండవ బాహువును నరికాడు. కబంధుడు శాపవిముక్తుడై విశ్వావసుడనే గంధర్వుడుగా నిలిచాడు. అతడు సీత లంకలో ఉన్నదనీ, రామలక్ష్మణులు పంపా సరోవరం దాటి ఋశ్యశృంగ పర్వతం చేరి, సుగ్రీవుడితో చెలిమి చేస్తే కార్యసిద్ధి కలుగుతుందనీ చెప్పి అంతర్ధానమయ్యాడు. అతడు సూచించినట్లు రామలక్ష్మణులు ఋశ్యశృంగ పర్వతం చేరి సుగ్రీవుడితో స్నేహం చేశారు. సుగ్రీవుడు సీత జారవిడిచిన ఆభరణాల మూటను రాముడికి సమర్పించాడు. రాముడు వాలిని చంపి వానరరాజ్యాన్ని సుగ్రీవుడికి ఇస్తానని ప్రతిజ్ఞ చేశాడు. సుగ్రీవుడు సీతను తేవటంలో రాముడికి సహాయ పడతానని మాట ఇచ్చాడు.

ఆ తరువాత రామ సహాయంతో సుగ్రీవుడు కిష్కంధకు వెళ్ళి వాలిని ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. వాలి రోషోద్రేకంతో సుగ్రీవుడిపై విజృంభించాడు. తార హితవు చెప్పినా పట్టించుకొనలేదు. వాలి సుగ్రీవుల మధ్య భీకరమైన ద్వంద్వ యుద్ధం ప్రవర్తిల్లింది. ఇద్దరిదీ ఒకేరూపం కావటంతో రాముడు వాలిపై బాణం సంధించటం కష్టమైపోయింది. అదనెరిగి లక్ష్మణుడి ప్రేరణతో హనుమంతు డొక చిగురాకు దండను సుగ్రీవుడి మెడలో గుర్తుగా ఉంచాడు. రాముడు వాలిని గుర్తించి అతడి గుండెపై బాణంతో కొట్టాడు. వాలి రాముడిని నిందిస్తూ ప్రాణాలు వదిలాడు. రాముడు తారను సుగ్రీవుడికి వశం చేసి, అతడిని వానర సామ్రాజ్య ప్రభువుగా పట్టాభిషేకం చేశాడు.

అప్పుడు గ్రీష్మకాలం ముగుస్తున్నది. వర్షర్తువు ముందున్నది. ఆ సమయం దాటగానే వానర సేనలతో సీతాన్వేషణం చేయిస్తానని సుగ్రీవుడు మాట ఇచ్చాడు. రామలక్ష్మణులను అంతవరకు మాల్యవత్కూటంలో నివసించడానికి వసతి కల్పించాడు.

అశోకవనంలో సీత- వలలో చిక్కిన లేడిపిల్లవలె చిక్కి రామధ్యాన వివశురాలై శోకిస్తూ ఉన్నది. రాక్షసీగణం సీత చుట్టూ చేరి రావణ ప్రశంస చేసి సీతమనసు బాధపెట్టేవారు. సీత వారితో తెగవేసి చెప్పింది. తాను రాముడిని తప్ప అన్యపురుషుల నాశించనని. ఆ సంగతిని రావణుడికి తెలియచెప్పటానికి రాక్షసస్త్రీలు వనితలు అతడి వద్దకు వెళ్ళారు. ఆ సమయంతో త్రిజట అనే సాత్త్విక రాక్షసవనిత సీతను సమీపించి అవింధ్యుడనే వృద్ధ దైత్యుడు తెలిపిన రామక్షేమ వార్తను, సుగ్రీవాదులతో కలిసి చేస్తున్న యుద్ధ యత్నాలను గురించి సీతకు నివేదించింది. తనకు వచ్చిన స్వప్న వృత్తాంతం వివరించి రావణపతనం, రామవిజయం, సీతారామ పునస్సమాగమం, శ్రీరామ పట్టాభిషేకం మొదలైనవి తప్పక జరుగనున్నాయని ధైర్యం చెప్పింది. సీత ఆ మాటలపై విశ్వాసం ఉంచి కొంత ఊరట చెందింది.

రావణుడు దేవదానవగంధర్వాది భూతవర్గాలను జయించగలిగాడే కాని మన్మథుడిని జయించలేకపోయాడు. ఒకనాడు సీతను స్మరించి మదనతాపాన్ని ఓర్వలేక దివ్యమాల్యాభరణాలను అలంకరించుకొని అశోకవనానికి బయలుదేరాడు. అలంకరించుకొన్న రావణుడు నడుస్తున్న కల్పవృక్షంవలె ఉన్నా, చూడటానికి శ్మశానంలో ఉన్న మఱ్ఱిచెట్టువలె భయంకరంగా కనపడుతున్నాడు. అతడు రోహిణీ నక్షత్రాన్ని సమీపించే శనైశ్చరుడివలె సీతను సమీపించి ప్రణయపూర్వకంగా ఈ విధంగా పలికాడు.

**రావణుడు :** ఓ మదిరాక్షీ! నీ వెందుకు అనవసరంగా ఆవేదనపడతావు? అలంకృతవై నన్నునుగ్రహించుము. వేయిమాట లెందుకు? దేవయక్షరాక్షస అప్సరఃకిన్నర పన్నగాసురాంగన లెందరున్నా వారందరినీ కాదని నిన్ను నే ననురాగంతో ఆదరించటం నీ అదృష్టం సుమా! దీన్ని నీవు తెలిసికొనలేక పోతున్నావు. గర్వంతో కూడుకొన్న ఆలోచనలే చేస్తున్నావు. ఇక రాము డంటావా? గౌరవాన్నీ, రాజ్యాన్నీ కోల్పోయి అరణ్యంలో దుఃఖ సముద్రంలో మునిగిన ఒక అల్పమానవుడు. అతడి మీద అమితంగా వలపు లొలకపోస్తూ మనసును

వగపు వెల్లువలో తల్లడిల్లగా చేసికొంటూ ఈ విధంగా ఉండటం ఏమి సుఖం? చెప్పుము. నేను సకల లోకాలకు అధిపతిని. నాకు బంట్లుగా పదునాలుగుకోట్లమంది దానవులు, ఇరువది ఎనిమిది కోట్లమంది రాక్షసులు, ఎనుబదిఆరు కోట్ల మంది యక్షులు సేవలు చేస్తారు. ధనాధిపతి కుబేరుడు నా అన్న. బ్రహ్మతో తుల్యుడైన విశ్రవసుడు నా తండ్రి. కుబేరుడి విలాసవనితలైన గంధర్వాప్సరోగణాలు నన్ను సేవిస్తారు. నాకు 'పంచమలోకపాలకుడు' అనే కీర్తి త్రిలోకాలలో వ్యాపించి ఉంది. ఇంద్రభవనం (స్వర్గం)లో వలెనే నా ఇంటకూడా భక్ష్యభోజ్యాది వస్తువులు తామరతంపరలుగా ఉన్నాయి. ఇంతటి నా వైభవానికీ, ఇంతటి నా జీవితానికి నీవు అధీశ్వరివై సుఖంగా భోగించుము.

**సీత :** (క్రోధశోక వ్యాకుల హృదయంతో ఒక గడ్డిపోచను చూస్తూ, రావణుడివైపు చూడకుండా అతడిని గడ్డిపోచవలె హీనుడిగా పరిగణిస్తూ) అక్కటా! నేను పరాంగనను, అబలను, పతివ్రతను, చూడ నేను మానవాంగనను, నీవు రాక్షసుడవు. మనిద్దరికి పొత్తెక్కడ? మనసులో అనురాగం ఆవంతలేని ఆడదాని పొందు ఏమంత సౌఖ్యం కలిగిస్తుంది? అదట్లా ఉంచుము. నీవు బ్రహ్మదేవుడి మనుమడివనీ, లోకపాలకుడితో సమానుడవనీ, శివుడి స్నేహితుడైన కుబేరుడి తమ్ముడవనీ నీ మహిమను నీవే చెప్పుకొన్నావు. ఇట్టి నీవు ధర్మాన్ని తెలిసికొని పాపవర్తనాన్ని విడవటం నీ కర్తవ్యం కాదా? సిగ్గులేకుండా ఈ విధంగా ప్రగల్భాలు పలకటం ప్రతాపమా? ఔచిత్యమా? (అని అంటూ పైటకొంగు కప్పుకొని దయనీయంగా దుఃఖించింది).

రావణుడు మరికొన్ని దుర్భాషలాడి. అంతర్ధానమయ్యాడు. సీత రాక్షసీజనుల చేత రక్షించబడుతూ అశోకవనిలో శోకమూర్తిగా ఉన్నది.

**సీతాన్వేషణ**

శ్రీరాముడు మాల్యవంత పర్వత గుహామందిరంలో వర్షర్తువును సీతా విరహంతో వెళ్ళబుచ్చాడు. శరదృతువు వచ్చింది. రాత్రులు దీర్ఘమయ్యాయి. వెన్నెలలు క్రుమ్మరిస్తున్నాయి. రాముడు సీతా విరహాన్ని సహించలేక లక్ష్మణుడిని సుగ్రీవుడి వద్దకు పంపాడు. సీతాన్వేషణ యత్నాలు మొదలుపెట్టి కృతజ్ఞుడై మసలాడా సరి. లేదా సుగ్రీవుడిని వాలివలెనే సంహరించుమని ఆదేశించాడు. సుగ్రీవు డప్పటికే కపి సేనలను నాల్గుదిక్కులా పంపాడు. నెలరోజుల గడువిచ్చాడు. గడువు పూర్తి కావటానికి అప్పటికి అయిదు రోజులింకా మిగిలి ఉన్నాయి. ఆ సంగతి సుగ్రీవుడు స్వయంగా వచ్చి రాముడికి నివేదించాడు. సుగ్రీవుడి చిత్తశుద్ధికి రాముడు హర్షించాడు.

తూర్పు, పడమర, ఉత్తరం దిక్కులకు పోయిన వానర వీరులు తిరిగి వచ్చి సీత జాడ తెలియలేదని రాముడికి నివేదించారు. రాముడు ఖిన్నుడైనాడు. దక్షిణ దిశకు పోయిన కపివీరులు తప్పక సీతాక్షేమ వార్త తెస్తారని ప్రాణాలు నిలువ బెట్టుకొని ఉన్నాడు. మరొక నెల గడిచింది. వానరులు మధువనంలోని పండ్లను విశృంఖలంగా తిని దానిని పాడు చేస్తున్నారన్న వార్త సుగ్రీవుడికి అందింది. అంగద జాంబవదాదులు, హనుమదాదులు సీతను కనుగొన్న హర్షాన్ని ప్రదర్శిస్తున్నట్లు కపిరాజు పసిగట్టాడు. దానిని రాముడికి సూచించాడు.

దక్షిణ దిశకు వెళ్ళిన వానరులందరూ సుగ్రీవ లక్ష్మణ సహితుడై ఉన్న రాముడిని చూచి సంతోషాతిశయంతో నమస్కరించారు. మతిమంతుడైన హనుమంతుడు తాను లంకానగరంలో సీతను చూచిన శుభవార్తను రాముడికి నివేదించాడు. ఆ పైన సీతాన్వేషణ యాత్రను గురించి విపులంగా వివరించి చెప్పాడు.

వానరులందరూ దక్షిణాభిముఖంగా పయనిస్తూ ఒకపెద్ద భూవివరం (సొరంగం)లో ప్రవేశించి కొన్ని వేలయోజనాలు చీకట్లో పయనించారు. సూర్యప్రకాశంలో వెలుగొందే మయుడి నగరాన్ని కనుగొన్నారు. అందులోని ప్రభావతిని దర్శించారు. ఆమె పెట్టిన విందులు భుజించి, సహ్యాదర్దుర పర్వతాలను దాటి దక్షిణ సముద్ర తీరానికి చేరారు. ఆ విశాల వారాశిని

దాటలేమనీ, సీతను కాంచలేమనీ, తమ బ్రతుకులు నిరర్థకాలనీ తలంచి కపులందరూ నిరశనవ్రతం పట్టారు. సీతారక్షణలో జటాయువు ప్రదర్శించిన భక్తిపరాక్రమాలను ప్రశంసించారు. వారి మాటలు విని సంపాతి పర్వతం మీదినుండి దిగి అక్కడికి వచ్చి, తన సోదరుడు జటాయువు మరణించిన వార్త తెలిసికొని, విచారించి, సీత లంకలో ఉంటుందనీ, పదివేల యోజనాల విస్తీర్ణమున్న సముద్రాన్ని దాటటానికి ఉపాయం ఆలోచించండనీ సలహా చెప్పి వెళ్ళాడు.

వానరుల ప్రేరణతో హనుమంతుడు సముద్రలంఘన యత్నం చేశాడు. లంకానగరం చేరాడు. అశోకవనంలో మూర్తీభవించిన శోకరసంవలె నున్న సీతను చూచాడు. నిరంతరం రామస్మరణ చేస్తున్న ఆమెను సీతగా గుర్తించాడు. ఆమెను సమీపించి తనను రామదూతగా పరిచయం చేసికొన్నాడు. రామలక్ష్మణుల కుశలవార్త తెలిపాడు. సుగ్రీవ సహాయంతో లంకపై రాముడు దాడిచేసి సీతను చెరనుండి విముక్తురాలిని చేసే ప్రయత్నాలు జరుగుతున్నాయని ధైర్యం చెప్పాడు.

సీతకు త్రిజట చెప్పిన మాటలు స్మృతికి వచ్చాయి. ఆమె హనుమంతుడి మాటలు నమ్మింది; శిరోమణిని ఆనవాలుగా ఇచ్చింది. చిత్రకూటంలో జరిగిన కాకాసుర వృత్తాంతాన్ని గుర్తుగా చెప్పింది. హనుమంతుడిని వీడ్కోలిచ్చి పంపింది. అతడు లంకాదహనం చేసి, వారధి దాటి రాముడిని జేరి కథనంతా చెప్పి, సీత పంపిన ఆనవాలును రాముడి కిచ్చాడు. ఆ శిరోరత్నాన్ని రాముడు కౌగిలించుకొని సీతయే తనకు లభించినంత హర్షాన్ని పొందాడు. వెంటనే లంకపై యుద్ధయాత్ర ప్రకటించాడు.

అపార కపిసైన్యం సమకూడింది. ఒక సుముహూర్తాన రణభేరి మ్రోగించి దక్షిణసముద్ర తీరాన్ని చేరింది. వారందరికీ సముద్రం దాటటం ఒక పెద్దప్రశ్నగా మారింది. ఎన్నో యోచనలు చేశారు. వాటన్నింటిని రాముడు కాదన్నాడు. లక్ష్మణుడితో కలిసి సముద్ర తీరంలో దర్భశయనాలపై వసించి ఉపవాసముండి సముద్రుడిని ఉపాసించారు. అతడు ప్రత్యక్షమై రాముడి కోరిక నడిగాడు. వానరసేన లంకకు చేరటానికి అనువుగా నీటిని చీల్చుకొని బాట ఇమ్మని రాముడు సముద్రుడిని కోరాడు. సముద్రుడు అట్లా చేస్తే అది ఒక విపరీతమైన సంప్రదాయమౌతుందని చెప్పి వారధి కట్టి దాటండని సూచించాడు. మయుడి కుమారుడైన నలుడి సహాయంతో కపులు వారధి నిర్మించారు. రాముడు అపార కపిసేనతో సముద్రాన్ని దాటి లంకను ముట్టడించాడు.

**రామరావణయుద్ధం**

సాగరాన్ని దాటేముందే విభీషణుడు మంత్రులతో కలిసివచ్చి రాముడిని శరణు వేడాడు. అతడిని లంకా సామ్రాజ్యానికి ప్రభువుగా పట్టాభిషేకం చేస్తానని రాముడు ప్రతిజ్ఞ చేశాడు. శుకసారణులనే రాక్షసులు మారురూపాలతో రామసైన్యంలో గూఢచారి వృత్తితో మెలగుతూ ఉండగా విభీషణుడు వారిని గుర్తించి రాముడికి ఒప్పజెప్పాడు. రాముడు వారికి రామసైన్య విశేషాలనన్నింటినీ చూపజేసి తిరిగి లంకకు పంపాడు. వారు వెళ్ళి కపిసైన్యం దుర్జయమని రావణుడికి హితవు చెప్పారు. కాని, అతడు దానిని పెడచెవినబెట్టి యుద్ధానికి సిద్ధమయ్యాడు. రాముడు యుద్ధం మొదలు పెట్టే ముందు సామోపాయంగా అంగదుడిని రాయబారిగా రావణుడి వద్దకు పంపాడు. అంగదుడి హితవు రావణుడు వినకపోగా అతడిని దండించబోయాడు. అంగదుడు కుప్పించి ఎగసి రామసైన్యంలో దూకాడు. సామదానాదులు విఫలమయ్యాయి. ఇక మిగిలింది దండోపాయమే.

లంకానగర దుర్గం శత్రుదుర్భేద్యం. కోట గోడలమీద నల్లమబ్బులవలె రాక్షసులు భయంకరంగా నిలబడి ఉన్నారు. వీరోత్సాహంతో పొంగులువారుతున్న వానరవీరులు వేనకువేలు ఒక్కసారిగా కుప్పించి కోట గోడలమీద వాలి, రాక్షసవీరులను చంపి, బురుజుల నాక్రమించి, నగరవాసులకు భయం కలిగించారు. రావణుడు కోటానకోట్ల రాక్షసవీరులను వారిపైకి పంపాడు. వారు విజృంభించి కపివీరులను పారద్రోలి ప్రాకారాన్ని మరల కైవసం చేసికొన్నారు. కోతులతో కపిలవర్ణంతో వెలిగిపోయిన కోట మరల రాక్షసులతో మేఘవర్ణంగా మారింది.

రామలక్ష్మణులు యుద్ధానికి నాంది పలికారు. వానరవీరులు గుమికూడి కోటగోడ లెగబ్రాక నారంభించారు. రాక్షస కపివీరులకు బాహాబాహి యుద్ధం సాగింది. రావణుడు- పర్వతుడు, ప్రఘసుడు, ఖరుడు, క్రోధవశుడు, ప్రరుజుడు అనే

అయిదుగురు సేనాపతులను రాక్షసపిశాచ సేనలతో యుద్ధానికి పంపాడు. వారు అదృశ్యాకారులై విజృంభించి వానరసేనను నొప్పించారు. వారిని విభీషణుడు స్వయంగా ఢీకొని సేనాపతులను చంపి, రాక్షససైన్యంలో సగభాగాన్ని అంతమొందించాడు. మిగిలిన సగం సైన్యం లంకలోకి పరుగెత్తిపోయింది.

రావణుడు క్రుద్ధుడై మంత్రులతో కలిసి యుద్ధరంగానికి వచ్చాడు. రాముడు రావణుడితో, లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో, సుగ్రీవుడు విరూపాక్షుడితో, తారుడు నిఖర్వటుడితో ఎదుర్కొని వీరోచిత యుద్ధం చేశారు. రాముని పరాక్రమం అవక్రమని తెలిసి రావణుడు లంకకు తిరిగి వెళ్ళాడు. అతడి వెంట అతడి కొడుకులు, మంత్రులు కూడా వెళ్ళారు. అప్పుడు రావణుడి సేనాని ప్రహస్తుడు ప్రతాపంతో కపిసేనను ఎదుర్కొన్నాడు. విభీషణుడికీ ప్రహస్తుడికీ భీకరయుద్ధం సాగింది. విభీషణుడు ప్రయోగించిన శక్తితో ప్రహస్తుడు నేలకూలాడు. వెంటనే ధూమ్రాక్షుడు ప్రచండంగా పూనుకొని కపిసేనను నుగ్గు చేయనారంభించాడు. అతడిని హనుమంతుడు అనంతబలంతో ఢీకొన్నాడు. ఇంద్రుడికీ వృత్రాసురుడికీ జరిగిన యుద్ధాన్ని తలపించేటట్లు వారిద్దరూ వివిధాయుధాలతో భయంకరమైన యుద్ధం చేశారు. చివరకు హనుమంతుడు ఒక మహావృక్షంతో కొట్టిన దెబ్బలకు ధూమ్రాక్షుడు నెత్తురుకక్కి చచ్చాడు.

రావణుడు విషణ్ణుడై మరొకమార్గం లేక గాఢనిద్రలో ఉన్న కుంభకర్ణుడిని లేపి కపిసేన మీదకు పంపాడు. కుంభకర్ణుడు కపివీరులను లెక్కచేయక సరాసరి శ్రీరాముడిమీదకే నడిచాడు. అడ్డం వచ్చి యుద్ధం చేస్తున్న కపివీరులను వేలమందిని పొట్టనబెట్టుకొన్నాడు. సుగ్రీవుడు కోపించి అతడిమీద లంఘించాడు. ఆ రాక్షసుడు కపివీరుడిని పట్టాడు. దానిని చూచి లక్ష్మణుడు కుంభకర్ణుడి మీద పిడుగువంటి బాణాన్ని వేశాడు. ఆ రాక్షసుడు ఆ దెబ్బకు నొచ్చుకొని సుగ్రీవుడిని వదలి, కోపించి లక్ష్మణుడితో పోరుకు సిద్ధమయ్యాడు. సౌమిత్రి అతడి బాహువులు త్రుంచాడు. కాని, వెంటనే ద్విగుణీకృతంగా బాహువులు మొలవటం గమనించాడు. కోపించి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అది కుంభకర్ణుడిని నిలువునా కూల్చింది.

తమ్ముడి చావుకు రావణుడు విచారించాడు. అప్పుడు అతడి పెద్దకొడుకు మేఘనాదుడు తండ్రి అనుమతితో మాయాయుద్ధ పాండిత్యాన్ని ప్రదర్శించి వానరవీరులను గగ్గోలు పరిచాడు. లక్ష్మణుడికీ, మేఘనాదుడికీ మధ్య భీకరాస్త్ర ద్వంద్వ యుద్ధం సాగింది. అంతలో అంగదుడు పూనుకొని ఒకమద్దిచెట్టుతో ఆ రాక్షసుడి రథాన్ని ధ్వంసం చేశాడు. మేఘనాదుడు అదృశ్యుడై ఆకాశంలో విహరిస్తూ మాయాయుద్ధం చేయటం మొదలుపెట్టాడు. రామలక్ష్మణులు శబ్దభేది దివ్యాస్త్రాలు ప్రయోగించారు. సుగ్రీవాదులు వృక్షాలు తీసికొని ఆకసానికి ఎగసి యుద్ధం చేశారు. ఇంద్రజిత్తు సుగ్రీవాదుల ప్రయత్నాలను వమ్ముచేసి రామలక్ష్మణులను అస్త్రాలతో బంధించి గాయపరచి మూర్ఛపడేటట్లు వేశాడు. విభీషణుడు బ్రహ్మాస్త్ర ప్రయోగం చేసి వారిని బంధ విముక్తులను చేశాడు. సుగ్రీవుడు విశల్యకరణి అనే ఔషధంతో వారి విరిగిన ఎముకలను, కలిగిన గాయాలను మానేటట్లు చేశాడు. రామలక్ష్మణులు మరల యుద్ధం ప్రారంభించారు. శ్వేతుడైన గుహ్యుడు పంపిన దివ్యజలాలను విభీషణుడు రామలక్ష్మణులకు అందించాడు. ఆ జలంతో కన్నులు కడుక్కోగానే అదృశ్య వస్తువులన్నీ కంటికి స్పష్టంగా గోచరించాయి. అన్నదమ్ము లామేఘనాదుని నొప్పించారు. అతడు ఆశ్చర్యపోయి హోమం చేయటానికి పూనుకొన్నాడు. అతడు హోమాన్ని పూర్తిచేస్తే అజేయుడౌతాడు. అందువలన విభీషణుడు లక్ష్మణుడిని అతని పైకి పురికొలిపి వధించుమని ప్రేరేపించాడు. లక్ష్మణు డతనిపై విజృంభించాడు. ఇరువురి మధ్య ఘోరయుద్ధం జరిగింది. చివరకు లక్ష్మణుడి నిశిత బాణాలకు ఇంద్రజిత్తు భుజాలనూ, శూలానికి తలనూ కోల్పోయి చెట్టువలె నేలపై కూలి మరణించాడు.

పుత్రశోకాన్ని భరించలేక రావణుడు క్రుద్ధుడై అశోకవనానికి వెళ్ళి కత్తితో సీతను చంపటానికి పూనుకొన్నాడు. అప్పుడు అవింధ్యుడనే వృద్ధుడు స్త్రీవధ వీరోచిత కార్యం కాదని హితవు చెప్పి ఆ పని మాన్పించాడు. రావణుడు పౌరుషంతో కపిసేన మీద దండెత్తాడు. మాయాయుద్ధంలో తనదేహం నుండి అనేకమంది వీరులను సృష్టించి కపిసేనను సంక్షోభ పరిచాడు. రామలక్ష్మణులు వారినందరినీ సంహరించారు. రావణుడు మాయాయుద్ధాన్ని ప్రచండంగా సాగించాడు. ఇంద్రుడు మాతలితో తన రథాన్ని రాముడికి పంపాడు. రథారూఢుడైన రాముడు రావణుడిపై శస్త్రాస్త్రాలను నిరాఘాటంగా ప్రయోగించాడు. చివరకు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి దశకంఠుడిని తుదముట్టించాడు. ఇంద్రాది దేవతలు శ్రీరాముడిని కీర్తించి పూలవాన కురిపించారు. శ్రీరాముడు విభీషణుడికి లంకారాజ్య పట్టాభిషేకం చేశాడు.

విభీషణుడు అవింధ్యుడితో కలిసి సీతను సగౌరవంగాతెచ్చి శ్రీరాముడి కర్పించారు. దుష్టాచారుడైన రావణుడు తన యింట నుంచుకొన్న సీతను తాను గ్రహిస్తే లోకనింద వస్తుందని శ్రీరాముడు సీతను పరిగ్రహించనన్నాడు. శత్రువుపై ప్రతీకారంగానే యుద్ధం చేసి విజయం సాధించా నన్నారు. సీత అతడి మాటలకు మూర్ఛపోయి, కొంతసేపటికి తేరుకొని, తన సచ్చరిత్రం తేటపడేటట్లు అగ్నిప్రవేశం చేయటానికి సిద్ధమైంది. అప్పుడు పంచభూతాలు అందరూ వినేటట్లుగా సీతా శీలపావిత్ర్యాన్ని పతివ్రతామహత్త్వాన్ని చాటిచెప్పాయి. ఆ తరువాత బ్రహ్మదేవుడు దేవగణాలతో ప్రత్యక్షమై సీతాదేవి పవిత్రచరిత్రాన్ని కీర్తించాడు. శ్రీరాముడు సీతను పరిగ్రహించి, సర్వసేనాసమేతుడై పుష్పకమెక్కి అయోధ్య చేరి, భరతాదులను కూడి, పట్టాభిషిక్తుడై అనేకయాగాలు చేసి, అనేక వేలేండ్లు భూమిని ధర్మమయంగా పాలించాడు.

శ్రీరాముడు వనవాసక్లేశాలను అనుభవించి, శత్రువులు చేసిన అపకారం వలన కలిగిన దురవస్థలకు ఓర్చి, శుభాలను పొందినట్లే, ధర్మరాజుకూడా వనవాస దుఃఖానంతరం సర్వసామ్రాజ్యసౌఖ్యాన్ని పొందగలడని మార్కండేయమహర్షి చెప్పాడు. ధర్మజుడు రాముడి పరాక్రమాన్ని జానకి పాతివ్రత్య మహిమనూ తెలిసికొని ఆశ్చర్యపోయాడు.

## సావిత్రికథ

పతిభక్తితో సమస్త దుఃఖాలను సహించి శుభాలు పొందిన పుణ్యవతి చరిత్రం వినాలని ఉన్నదని ధర్మరాజు అడుగగా మార్కండేయమహర్షి సావిత్రికథను చెప్పాడు.

అశ్వపతి మద్రదేశానికి అధిపతి. సంతానం కొరకు అతడు పదునెనిమిదేళ్ళు సావిత్రీదేవిని గురించి తపస్సు చేశాడు. ఆ దేవి ప్రత్యక్షం కాగా పుత్రుడిని వరంగా కోరుకొన్నాడు. ఆమె పుత్రిక కలుగుతుందని అనుగ్రహించింది. ఆమె కారణంగా అశ్వపతికి నూరుగురు పుత్రులు పుట్టుతారని చెప్పి దేవి అంతర్ధానం చెందింది. ఆ రాజుకు మాళవి అనే భార్యయందు సావిత్రి అనే పుత్రిక జన్మించి, శుక్లపక్షచంద్రబింబం వలె పెరిగి యౌవనవతి అయింది. ఆమె సౌందర్యం దేవతాస్త్రీలకంటె మిన్నగా ఉండేది. సాళ్వదేశాధిపతి అయిన ద్యుమత్సేనుడి కొడుకు సత్యవంతుడు తనకు తగిన గుణవయోరూప వైభవాలు కలవాడుగా తెలిసికొని, సావిత్రి మనసులో అతడినే భర్తగా నిశ్చయించుకొని, సహజమైన సిగ్గుతో ఎవరికీ చెప్పకుండా ఉండింది.

ఒకనాడు నారదుడు అశ్వపతి వద్దకు వచ్చాడు. తండ్రివద్దనున్న సావిత్రిని చూచి త్వరలో వివాహం చేయుమని సలహా చెప్పాడు. సావిత్రి తాను సత్యవంతుడినే వివాహమాడుతానని తండ్రికి తెలిపింది. ద్యుమత్సేనుడు రాజ్యాన్ని కోల్పోయి, చూపును కోల్పోయి అడవులలో నివసిస్తున్నా అతడి కొడుకైన సత్యవంతుడినే ఆమె ఎన్నుకొన్నది. అశ్వపతి ఆ సత్యవంతుడి గుణశీలాదులను గురించి సర్వజ్ఞుడైన నారదుడిని అడిగాడు. ఆ మహర్షి ఇట్లా చెప్పాడు: 'ఎల్లప్పుడూ సత్యం పలకటం చేత సత్యవంతుడని సార్థక నాముడయ్యాడు. అతడికి చిత్రాశ్వుడనే రెండోపేరు ఉన్నది. తేజస్సులో సూర్యుడిని, బుద్ధిలో బృహస్పతిని, పరాక్రమంలో ఇంద్రుడిని, ఓర్పులో భూమిని, కాంతిలో చంద్రుడిని, అందంలో అశ్వినిదేవతలను పోలి ఉంటాడు. తపస్సు, శమం, దమం, దానం, బ్రాహ్మణభక్తి అధికంగా ఉన్నవాడు. అంతటివాడిలో ఒకదోషం కూడా ఉన్నది. ఈనాడు మొదలుకొని ఒక సంవత్సరానికి చనిపోతాడు. ఇది చెప్పవలసినమాట కాబట్టి చెప్పుతున్నా' నని నారదుడు పలికాడు. అశ్వపతి ఆ అల్పాయుష్కుడైన వరుడిని వీడి మరొక వరుడిని కోరుకొమ్మని సావిత్రిని అడిగాడు.

ఆమె తన నిర్ణయాన్ని ఇట్లా చెప్పింది- 'మనోవాక్కాయకర్మలలో మనస్సు ముఖ్యమైనది. అట్టి మనస్సుతో ప్రేమించిన భర్తను మానటం ధర్మమా? సత్యవంతు డెటువంటి వాడైనా కానీ, నేను అతడిని తప్ప మరొకరిని కోరను.' ఆమె మాటలు విని అశ్వపతి ఏమీ అనలేక నారదుడివైపు దీనంగా చూచాడు. ఆ మహర్షి ఇట్లా అన్నాడు.

'నీ కూతురు సుగుణాల కుప్ప. ఆమె మనసు మార్చటం మనకు శక్యం కాదు. ఇంక అనుమానం ఎందుకు? ఆ వరుడికిచ్చి వెంటనే వివాహం చేయుము. ఆమె చేసిన పుణ్యమహిమవలననైనా ఆమె భర్త పరిపూర్ణచిరాయువు పొందగలడు'. నారదుడి మాటలు అశ్వపతి శిరసావహించి సావిత్రి వివాహానికి నిశ్చయించాడు. ఆ దేవర్షి దేవలోకానికి వెళ్ళాడు.

ఒక మంచిరోజున అశ్వపతి తన కుమార్తెను సర్వవివాహ సంభారాలతో సహా తీసికొని ద్యుమత్సేనుడి వద్దకు వెళ్ళి, సావిత్రిని సత్యవంతుడి కిచ్చి పెండ్లి చేయటానికి వచ్చినట్లు తెలిపి, ఆమెను కోడలిగా స్వీకరించుమని అతడిని కోరాడు. 'రాజ్యాన్ని కోల్పోయి అడవులలో కష్టాలు పడుతున్న తమతో ఆ సుకుమారి ఉండి ఓర్చుకొనగలదా?' అని ద్యుమత్సేను డడిగాడు. అతడితో అశ్వపతి ఇట్లా అన్నాడు. 'కలిమిలేములు కలకాలం ఉండేవి కావు. కలిమికి పొంగటం, లేమికి క్రుంగటం ధీరుల స్వభావం కాదు. ఆ సంగతి నాకు తెలుసు. మా అమ్మాయి కూడా వయసుకు చిన్నదైనా, తెలివితేటలలో ధీమంతురాలు. మా కూతురిని గురించి నే నింతకంటె ఎక్కువ చెప్పటం న్యాయంకాదు. నీతో వియ్యమందుదామని మనసుపడి వచ్చాను. నా ప్రార్థన మన్నించకుండా ఉండటం మీకు న్యాయం కాదు' అని వేడుకొన్నాడు. ద్యుమత్సేను డంగీకరించాడు. ఆశ్రమవాసులైన ముని గణాల సమక్షంలో సావిత్రీ సత్యవంతుల వివాహం శాస్త్రోక్తంగా జరిగింది. అశ్వపతి అల్లుడికీ, కూతురికీ కానుక లిచ్చి తన రాజధానికి తిరిగి వెళ్ళాడు.

సావిత్రి రాణివాసపు అలంకారాలను తీసివేసి, నారచీరలు కట్టి, భక్తితో భర్తకు సేవలు చేసింది. అత్తమామలను కథలతో, మాటలతో, సేవలతో సంతోషపెట్టింది. క్రమంగా కాలం గడిచింది. సంవత్సరం ముగియటానికి నాలుగు రోజులు తక్కువగా ఉన్నది. నారదుడు పేర్కొన్నట్లు నాల్గవ రోజు తన భర్త చనిపోతాడని తెలిసిన సావిత్రి త్రిరాత్రోపవాసవ్రతం చేపట్టింది. అత్తమామలు వారించగా, కష్టమైన ఆ వ్రతాన్ని పరమశుభాలు కోరి ప్రారంభించాననీ, కారణం కాలాంతరంలో తెలియవస్తుందనీ సావిత్రి వారికి నచ్చజెప్పింది.

నాల్గవరోజు తెల్లవారుజాముననే సావిత్రి నిద్రలేచింది. భర్త మరణించే దినమని మనసులో సంతాపం చెందింది. వ్రతవిధులాచరించింది. అత్తమామలకూ, ఆశ్రమ విప్రులకూ నమస్కరించి సుమంగళిగా భర్తృవాల్లభ్యాన్ని పొందేటట్లు నిండుదీవెన లందుకొన్నది. త్రిరాత్రులు ముగిసాయి కాబట్టి, ఆనాడు పారణచేయుమని అత్తమామలు కోరినా ఆనాడు ప్రొద్దుకుంకేవరకు ఉపవాసవ్రత దీక్ష పట్టానని చెప్పి వారిని ఒప్పించింది. సమిధలు, దర్భలు, ఫలాలు తేవటానికి సత్యవంతుడు అడవికి బయలుదేరాడు. అతడివెంట తానూ వెళ్ళటానికి సావిత్రి సిద్ధమయింది. సత్యవంతుడూ, అత్తమామలూ వద్దన్నా తన కోర్కెను మన్నించండని వారిని ప్రార్థించింది. ఎన్నడూ, ఏమీ కోరని సావిత్రి కోరికను వారు కాదనలేకపోయారు. సత్యవంతుడు తన వెంటవచ్చిన సావిత్రికి అడవిలోని ఎన్నో ప్రకృతి రమణీయ దృశ్యాలను చూపాడు. ఆ తరువాత ఎన్నో ఫలాలు కోసి బుట్టనింపాడు. ఆ తరువాత ఒక చెట్టెక్కి గొడ్డలితో కట్టెలకై కొమ్మలను నరుకుతున్నాడు. ఉన్నట్లుండి ఆయాసపడుతూ గొడ్డలి క్రింద పారవేసి క్రిందకు దిగాడు. అతడి మొగం వెలవెలపోయింది. శరీరం వశం తప్పింది, మనస్సు భ్రమచెంది తూలింది. తల శూలాలతో పొడుస్తున్నట్లు నొప్పిపుట్టింది. నేలమీద నిలవలేకపోయాడు- కొంతసేపు విశ్రాంతి తీసికొందామని సావిత్రి తొడపై తలనుంచి పవళించాడు. క్రమంగా అతడు సోలిపోయాడు. నిశ్చేతనుడయ్యాడు.

అప్పుడు సావిత్రి యెదుట నీలమేఘంవలె నల్లనైనవాడు, పెద్దకోరలతో, ఎర్రనిచూపులతో, బంగారుబట్టలతో, భయంకరాకారంతో ప్రళయాగ్నివలె ప్రజ్వలిస్తూ, పాశధరుడై ఒక దివ్యపురుషుడు నిలిచాడు. మెల్లగా అతడు సత్యవంతుడిని సమీపించాడు. సావిత్రి భయపడి, పతిశరీరాన్ని ప్రక్కన ఉంచి ఆ దివ్యపురుషుడితో ఇట్లా మాట్లాడింది.

**సావిత్రి :** అయ్యా! మీ రెవరు? ఇక్కడికి ఏం చెయ్యాలని వచ్చారు?

**యముడు :** అమ్మా! నేను కాలుడను. పాతివ్రత్య మహిమవలన నీవు నన్ను చూడగలిగావు కాని, నేను ఇతరులకు కానరాను. నీ భర్త పరమ పుణ్యాత్ముడు కాబట్టి నేనే స్వయంగా వచ్చాను. అతడి అంత్యకాలం వచ్చింది. నేనే ఇతడి ప్రాణాలను తీసికొని పోతాను. (అని ప్రకాశిస్తున్న సత్యవంతుడి జీవుడిని (ప్రాణాలను) దేహం నుండి బయటికి లాగి భయంకర పాశంతో గట్టిగా బిగించి, దక్షిణదిశగా ఘోరమైన మార్గంలో పయనం సాగించాడు).

**సావిత్రి :** (తన భర్త దేహాన్ని రహస్యస్థలంలో దాచి యముని వెంట బయలుదేరింది)

**యముడు :** (ఆమెను చూచి దయతో) నీవు కోమలాంగివి. ఎందుకు వస్తున్నావు? వద్దు ఈ బాట ఇకమీద నీవు నడవటానికి శక్యం కానిది.

**సావిత్రి :** పతులెక్కడికి పోతే సతులుకూడా అక్కడికి పోవాలి కదా! మహానుభావా! నీ దయవలన, నా పతిభక్తి వలన నేను ప్రవేశించలేని చోట్లున్నాయా? అన్ని మార్గాలలోనూ ధర్మమార్గం ప్రధానం. అటువంటి ధర్మానికి సజ్జనులే ఆధారమని పెద్దలంటారు. సజ్జనులలో ఉత్తముడవు నీవు. నీ దర్శనం వలన పరమశుభాలను పొందకుండా నేను వట్టి మనుషులవలె ఊరకే ఎట్లా తిరిగిపోతాను? (అని ప్రగల్భంగా మాట్లాడింది).

**యముడు :** ఓ కోమలాంగీ! నీ ఉదార వాక్యవిన్యాసానికి నేను మెచ్చుకొంటున్నాను. నాకు మనసు ప్రసన్నమయింది. నీ భర్త జీవితం తప్ప ఏదైనా వరం కోరుకో ఇస్తాను.

**సావిత్రి :** ప్రభూ! సాళ్వభూపతి రాజ్యాన్ని కోల్పోయి అడవులలో ఇడుమలు పడుతూ జీవిస్తున్నాడు. ఆయనకు కనుచూపు వచ్చేటట్లు కరుణించుము.

**యముడు :** తథాస్తు! నీవింక రావద్దు. తిరిగి వెళ్ళుము. (వేగంగా పోసాగాడు)

**సావిత్రి :** (కొంతదూరం వెళ్ళి) దేవా! ఉత్తములైనవారు త్రికరణశుద్ధిగా ఎప్పుడూ ఎవ్వరికీ ఎగ్గుచేయరు. దీనులైన వారిని దయతో కాపాడాలని చూస్తారు. ఇవ్వదలచుకొంటే ఎదుటివారి కోర్కెలన్నీ తీరేటట్లుగా నిండుగా దండిగా ఇస్తారు. ఆశ్రయించిన వారి మనస్సులకు అధికమైన ఆనందాన్ని కలిగిస్తారు. నీకు తెలియని ధర్మం ఏముంది? ధర్మగతులన్నీ నీ అధీనాలే. అందువలననే నీవు ధర్మదేవతగా వెలిశావు. సమస్త జీవులకూ వారివారి కర్మఫలాలను సమబుద్ధితో సమకూరుస్తావు కాబట్టి నీవు సమవర్తివని జగత్ప్రసిద్ధి పొందావు. సర్వభూతాలనూ నీవు యమిస్తావు (నియమిస్తావు) కాబట్టి నిన్ను యముడని పిలుస్తారు. పాపాలను శమింపజేస్తావు కాబట్టి నీవు శమనుడవైనావు.

**యముడు :** సావిత్రీ! దప్పిక గొన్నవారికి చల్లని నీరిస్తే ఎట్లా సంతోషం కలుగుతుందో అట్లా నిష్కల్మషమైన నీ సమంజస వాక్యాలు నన్ను సంతోషపెట్టాయి. కాబట్టి, సత్యవంతుడి ప్రాణాలు తప్ప ఏ కోరికనైనా అడుగుము. దాన్ని సఫలం చేస్తాను.

**సావిత్రి :** దేవా! ద్యుమత్సేనుడు శత్రువుల వలన కోల్పోయిన రాజ్యాన్ని తిరిగిపొందేటట్లు వరమిచ్చి నన్ను అనుగ్రహించుము.

**యముడు :** అట్లే అగుగాక! ఇక నీవు రావద్దు. ఆగిపో, నీ భక్తి నీమగడికి చెందింది. ఇది దుర్గమమైన త్రోవ. నీ వడిగినవన్నీ ఇచ్చాను. ఇక రావటానికి అనుజ్ఞ లేదు.

**సావిత్రి :** ప్రథమ ధర్మాధ్యక్షా! ధర్మాత్ములు తాము చేసే ధర్మాచరణలను ఎన్నడూ ఎటువంటి పరిస్థితులలోనూ తప్పరు. ధార్మికులు మోహాన్నీ, తాపాన్నీ పొందరు. కాబట్టి, భర్తను అనుసరించటాన్ని సతి ఏవిధంగానూ విడవటం ధర్మంకాదు. సమాహితంతో మనసును నిలిపి మోహావేశం పొందకుండా ధర్మస్థితిలో ఉండేటట్లు చేయటం దోషంకాదు కదా!

**యముడు :** నీవు ధర్మవిశేషాలు బాగా తెలిసినదానవు కాబట్టి, నీ భర్త బ్రతుకుతప్ప ఏదైనా వరం కోరుకొమ్ము.

**సావిత్రి :** దేవా! మా తండ్రి మద్రేశ్వరుడు. మగసంతానం లేనివాడు. ఆయనకు నూరుగురు కొడుకులు కలిగేటట్లు వరాన్ని ప్రసాదించుము.

**యముడు :** నీ వడిగిన వరాన్ని ఇచ్చాను. ఇవ్వేళ నీవు చాలాదూరం వచ్చి అలసిపోయావు. ఇక తిరిగిపోవటం మంచిది.

**సావిత్రి :** నాకు దప్పిక లేదు. నా పతి చరణాలయందు భక్తితో ఆసక్తమై ఉన్న నా మనసు అలసిపోలేదు. భర్తను ఆశ్రయించి ఉండటం తప్ప, భార్యలకు మరొకధర్మం లేదుకదా! ఆత్మధర్మంతో కూడుకొన్న పుణ్యాత్ములు దొరకటం దుర్లభం. వారు పుణ్యతీర్థాలవలె పవిత్రమూర్తులు. వారిని దర్శిస్తే సమస్త పాపాలు శాంతిస్తాయి. వాళ్ళ వలననే కదా సూర్యచంద్రులు గతులు తప్పకుండా తిరుగుతున్నారు. సముద్రాలు పొంగకుండా ఉన్నాయి. ఈ భూమి నిబ్బరంగా నిలిచి ఉంది. మరొకమాట! ఏడుమాట లాడితే ఎటువంటి వారైనా మంచివారికి బంధువు లౌతారని లోకంలో ప్రసిద్ధి ఉంది. మరి మీతో చాలా సేపటి నుండి ఇన్ని మాటలు మాట్లాడటం వలన మీకు నేనే బంధువునని వేరే చెప్పాలా? కాబట్టి మిత్రుల, బంధువుల మనసులోని కోర్కెలను తీర్చటం మీవంటి మహానుభావులకు అవశ్యకర్తవ్యం.

**యముడు :** నీకు ప్రసన్నుడయ్యాను. నీ మనసులో ఉన్న కోరిక నొకదానిని వరంగా కోరుకొమ్ము ఇస్తాను.

**సావిత్రి :** ధర్మమూర్తీ! ఇంతకుముందు సత్యవంతుడి జీవితం తప్ప ఏదైనా కోరుకొనుమని అడుగుతూ ఉండేవాడివి. ఇప్పుడామాట లేదు. కాబట్టి సంతోషంతో అడుగుతాను. సతికి వైధవ్యం భరించరానిది. భర్త లేని వనిత శుభకార్యాలన్నింటిలోనూ దూరంగా ఉంచబడుతుంది. నా సతీధర్మం సురక్షితంగా నిలిచేటట్లు సుగుణాలశాలి అయిన నా భర్తను నాకు అనుగ్రహించి పుణ్యాత్ముడ వనిపించుకొమ్ము!

**యముడు :** (అంగీకారంతో సత్యవంతుడిని పాశవిముక్తుడిని చేసి) ఓ కోమలీ! ఇడుగో నీ మనోనాథుడు. తీసికొనుము.ఇతడిక మీద నాలుగు శతాబ్దాలు జీవిస్తాడు. నూరుగురు కొడుకులను క్రమంగా కంటాడు. అనేక యజ్ఞాలు చేసి, అమరులను సంతోషపెట్టి కీర్తిమంతుడౌతాడు. అతడి వంశానికే వన్నెతెస్తాడు. (అని చెప్పి అదృశ్యుడయ్యాడు).

సావిత్రి తిరిగివచ్చి, పతి శిరస్సును తన తొడపై ఉంచుకొని కూర్చున్నది. కొంతసేపటికి సత్యవంతుడు చైతన్యవంతుడయ్యాడు. చాలాసేపు నిద్రపోయినట్లు, కలలో ఒక బలవంతుడు తనను బలవంతంగా లాగినట్లు, అది కలగా కాక నిజమైనట్లు భయంపుడుతున్నట్లు, పేర్కొంటూ ఆ బలవంతు డెవరో చెప్పుమని సత్యవంతుడు సావిత్రిని అడిగాడు. ఆమె ఆ సంగతంతా రేపు చెప్పుతానని పలికి, చీకటిపడుతున్నది కాబట్టి, త్వరగా ఆశ్రమానికి వెళ్ళాలని హెచ్చరించింది. అతడు చాలా నీరసించి ఉన్నాడు. అంతప్రొద్దుపోయే దాకా తల్లిదండ్రులకు దూరంగా ఉన్నందుకు వారెంత విచారిస్తున్నారో అని ఆవేదనపడ్డాడు. సావిత్రి అతడిని ఓదారుస్తూ, బరువుగా ఉన్న పండ్లబుట్టను చెట్టుకు తగిలించి, గొడ్డలి నిపుణంగా చేతపట్టుకుని, భర్తను తన చేతులతో పొదివిపట్టి, అడుగులలో అడుగులు వేయించుకొంటూ మెల్లగా, మాటలతో మనసు నుల్లాస పరుస్తూ సావిత్రి సత్యవంతుడిని ఆశ్రమానికి తీసికొనిపోసాగింది.

యము డిచ్చిన వరంవలన ద్యుమత్సేనుడికి చూపు వచ్చింది. కన్నులువచ్చినా ఆత్మకు కన్నులవంటి కొడుకును కాంచలేక కన్నులు లేనివాడి వలెనే ఆ రాజు సతీసమేతంగా దుఃఖించాడు. ఆశ్రమవాసులు ఆ రాజుకు దృష్టివచ్చినందుకు ఆశ్చర్యపడ్డారు. కొడుకు త్వరలో తిరిగివస్తాడని ఆ రాజదంపతులకు ధైర్యం చెప్పసాగారు. అంతలో సావిత్రీ సమేతుడై సత్యవంతుడు వచ్చాడు. తల్లిదండ్రు లా కొడుకును కౌగిలించుకొని, వారి రాకలోని ఆలస్యానికి కారణాన్ని అడిగారు. సావిత్రి జరిగిన కథంతా చెప్పింది. ద్యుమత్సేన వంశాన్ని ఆపత్సముద్రంనుండి రక్షించిన నావగా ఆమెను అందరూ కీర్తించారు. ఆ తరువాత ద్యుమత్సేనుడికి రాజ్యం దక్కింది. సత్యవంతుడు యువరాజయ్యాడు. ఆ విధంగా సావిత్రి తన భర్తను, అత్తమామలను, తల్లిదండ్రులను, వంశాన్ని ఉద్ధరించింది. సావిత్రి వంటిదే ద్రౌపది. పరమపతివ్రత. ధర్మాత్మురాలు, ఉభయవంశాలను ఉద్ధరించే పుణ్యాత్మురాలు- అని మార్కండేయమహర్షి చెప్పాడు. అనంతరం తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళాడు.

## కర్ణుడి దానవీరం

పాండవ వనవాసంలో పన్నెండవ యేడు గడుస్తున్నది. కర్ణుడి సహజ కవచకుండలాలను బ్రాహ్మణరూపంలో దానంగా గ్రహించి, రాబోయే మహాయుద్ధంలో అర్జునుడికి మేలు చేయాలని ఇంద్రుడు సంకల్పించాడు. ఆ తలపు తెలిసికొని సూర్యుడు ముందుగానే కర్ణుడి దగ్గరకు బ్రాహ్మణవేషంలో వచ్చి, అతడికి ఇంద్రుడి వ్యూహాన్ని గురించి వివరించి చెప్పాడు. అప్పుడు కర్ణుడు తన జన్మవ్రతమైన దానవ్రతాన్ని ప్రాణంపోయినా విడనాడనని పలుకుతాడు. 'శతక్రతుడు, జితదైత్యుడు, స్వర్గాధిపతి, దేవతల సార్వభౌముడు అయిన ఆ దేవేంద్రుడే పాండవపక్షపాతంతో మాయాబ్రాహ్మణవేషంతో నన్ను భిక్షకోసం యాచించటానికే వస్తే అతడి కీర్తియే తరిగిపోతుంది. నా కీర్తి మూడు లోకాలు నిండి పెరిగిపోతుంది. అదే జరిగితే అంతకంటె పుణ్యం మరేముంటుంది?' అని దానవీరుడైన కర్ణుడు ప్రాణాలకంటె కీర్తి గొప్పదని చెప్పి సూర్యుడి మాటను మృదువుగా కాదన్నాడు. సూర్యుడెన్నో విధాలుగా బ్రతిమలాడి చెప్పాడు. అట్లా కర్ణుడి మీద వాత్సల్యాన్ని ప్రకటించటానికి దేవనిర్మితమైన రహస్యం ఒకటి ఉన్నదని కర్ణ జన్మవృత్తాంతాన్ని సూచించి రహస్యంగా ఉంచాడు. కాలాంతరంలో అది వెలువడుతుందని పలికాడు. కర్ణార్జునుల నడుమ పగ పెరిగి యుద్ధం వస్తే సహజ కవచకుండలధారి అయిన కర్ణుడు అర్జునుడికంటె అధికుడౌతాడు. అర్జును డాతడిని చంపలేడు. అందువలన ఇంద్రుడు కర్ణుడిని మోసం చేసి, తన కొడుకుకు మేలు చేసికొనదలచాడు. కాబట్టి కవచకుండల దానం మానుమని సూర్యుడు కర్ణుడికి హితవు చెప్పాడు. అయినా, కర్ణుడు దాని నంగీకరించలేదు. సూర్యుడు అతడిపట్ల జాలిపడ్డాడు. చివరకు ఒక ఉపాయం చెప్పాడు. ఇంద్రుడి వద్ద అమోఘమైన శక్తి అనే ఆయుధం ఉంది. అది శత్రువును సంహరించి మరల తిరిగివస్తుంది. కవచకుండలాలను దానం చేసే కర్ణుడు వాటికి ప్రతిఫలంగా ఇంద్రశక్తిని పొందవలసిందిగా సూర్యుడు సూచించి అంతర్ధానమయ్యాడు. సూర్యుడన్నంత పనీ జరిగింది. కపట బ్రాహ్మణవేషంతో వచ్చి ఇంద్రుడు కర్ణుడి కవచకుండలాలను దానంగా పొందాడు. కర్ణుడి కోరికపై ఇంద్రుడు శక్తిని అతడి కిచ్చాడు. అయితే, ప్రాణసంశయ స్థితిలో అసాధ్యుడైన మహావీరుడి మీద ఆ శక్తిని ఒక్కసారి మాత్రమే ప్రయోగించి అతడిని సంహరించటానికి వీలుంటుందనీ, ఆ ప్రయోజనం తీరిన తరువాత ఆ శక్తి ఇంద్రుడిని చేరుతుందని చెప్పి శక్తి ప్రదానం చేశాడు. కర్ణుడు శక్తిని గ్రహించి, దానిని అర్జునుడిపై ప్రయోగించి దివిజనాథుడికి తగిన బుద్ధిచెప్పాలని లోలోన భావించి సంతృప్తుడైనాడు. ఇంద్రుడి మహిమవలన కవచకుండలాలు కోల్పోయినా, కర్ణుడి శరీరం ఉదయభానుడి అరుణవర్ణంతో ప్రకాశించింది. కర్ణుడి కవచకుండలాల సంగతి తెలిసి పాండవులు సంతోషించారు. కౌరవులు చింతించారు.

ఈ సందర్భంలోనే జనమేజయుడికి వైశంపాయనుడు కర్ణజన్మవృత్తాంతాన్ని వివరించి చెప్పాడు.

## యక్షప్రశ్నలు

మార్కండేయమహర్షి వలన అనేక పుణ్యకథలు విని ధర్మరాజు మరల ద్వైతవనానికి తిరిగివచ్చాడు. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు తాను కోల్పోయిన అరణిని తన కిప్పించుమని ధర్మరాజును శరణు వేడాడు. మృగ మొకటి ఆ అరణిని కొమ్ముకు తగిలించుకొని పారిపోయిందనీ, అరణి లేకపోతే నిత్యానుష్ఠానం నిలిచిపోతుందనీ, దానిని త్వరగా తెచ్చి ధర్మస్థితిని కాపాడుమనీ ధర్మరాజు నా బ్రాహ్మణుడు ప్రార్థించాడు.

అరణిని తేవటానికి ధర్మరాజు తమ్ములతో కలిసి బయలుదేరాడు. మృగం వారికి చిక్కకుండా చాలాదూరం పరుగెత్తి చివరకు కనపడకుండా పోయింది. పాండవులకు దాహం వేసింది. ఒక మర్రిచెట్టు నీడన పాండవులు విశ్రాంతి తీసికొనటానికి ఆగారు. అప్పుడు వారి మధ్య ఈ క్రింది సంభాషణ జరిగింది.

**నకులుడు :** ఉత్తమ కులశీలాలతో, దయాగుణంతో, ధర్మాచరణ బుద్ధితో జీవిస్తున్న మనకు ఈ విధమైన అలజడి రావటానికి మూలకారణ మేమిటి?

**ధర్మరాజు :** సుఖదుఃఖాలకు కారణం వారు వారు చేసికొన్న పూర్వకర్మమే. మరొక కారణం ఉండటానికి వీలులేదని ప్రాజ్ఞు లంటారు.

**భీముడు :** ఆనాడు ప్రాతికామి పోయి పాంచాలిని నిండుకొలువులోనికి తెచ్చినప్పుడు కోపోద్రేకంతో కౌరవులందరిని మట్టుపెట్టకుండా నే నూరుకొన్నందుకు ఈ ఆపద మనకు కలిగింది.

**అర్జునుడు :** తమ్ముడా! ఆనాడు ఆ సభలో ఆ కర్ణుడు మదించి ఆ విధంగా పలికిన మాటలను విని కూడా కోపగించుకొనకుండా తలవంచుకొని సామాన్య జనుడివలె అడవులకు నడచిరావటంవలననే మన కీ అనంతదుఃఖాలు మీదపడ్డాయి.

**సహదేవుడు :** కపటద్యూతపరుడు, దుష్టుడు అయిన ఆ శకునిని పట్టి వెంటనే ప్రాణాలు తీయకపోవటం చేతనే మనం అడవులలో ఈ అగచాట్లు పడుతున్నాం.

ఆ మాటలు విన్న ధర్మరాజు నకులుడిని పిలిచి, దగ్గరలో ఏదైన నీటికొలను ఉంటే గమనించి, అక్కడినుండి నీరు తెచ్చి తమకు దప్పిక తీర్చవలసిందిగా కోరాడు. నకులుడు చెట్టెక్కి చూచి, సరోవరాన్ని గుర్తించి, అక్కడికి వెళ్ళి, నీటిని త్రాగబోగా, ఒక అశరీరభూతం అతడిని వారించింది. తటాకం తనదనీ, జలాలు త్రాగాలంటే ముందుగా తానడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పాలనీ హెచ్చరించింది. ఆ మాటలు లెక్కచేయక నకులుడు నీరు త్రాగి ఆ సరోవరతీరంలో నిశ్చేష్టితుడై పడిపోయాడు.

నకులుడు రావటం ఆలస్యమైనదని ధర్మరాజు సహదేవుడిని పంపాడు. అతడూ అట్లాగే వ్యవహరించి సరోవర తీరంలో పడిపోయాడు. ఆ తరువాత అర్జునుడు, ఆ తరువాత భీముడు కూడా అదేవిధంగా అయినారు. చివరకు ధర్మరాజే స్వయంగా తమ్ములను వెదకికొంటూ వచ్చి, వారి పరిస్థితిని గమనించి కొన్నిక్షణాలు విషాదంతో నిర్విణ్ణుడైపోయాడు.

క్రమంగా ధైర్యం తెచ్చుకొని పరిస్థితులను పరిశీలించాడు. ఎవరూ వచ్చిన జాడలు లేవు. యుద్ధం జరిగిన జాడలు లేవు. భీమాదుల శరీరాలపై గాయాలు కానరావు. మరెందుకు వారట్లా ఉన్నారో తెలియక మథనపడ్డాడు. కౌరవులు పన్నిన పన్నాగమే అని శంకించాడు. భీమాదుల మొగాలు వివర్ణాలు కాకపోవటం చేత, త్రాగిన నీరు విషమయం కాదని నిశ్చయించాడు. మహావైభవంతో జీవించవలసిన భీమాదు లనాథలుగా పడిఉన్నందుకు విచారించాడు. వారందరూ మృతిపొందితే తాను హస్తినాపురి కేగి తల్లికీ బంధువులకూ ఏమని సమాధానం చెప్పేదని బిగ్గరగా శోకించాడు. అతడు దప్పికకు ఆగలేకపోయాడు. కొలనులో దిగాడు. అశరీరభూతం అతడిని వారించింది.

'ఓ ధర్మరాజా! నే నొక కొంగను. ఈ జలాశయం నా సొత్తు. నీ తమ్ములు నా మాట మన్నించక నీరుగ్రోలి ప్రాణాలు కోల్పోయారు. నీవూ అట్లాగే చేస్తే నీపనీ అంతే ఔతుంది. నే నడిగిన ప్రశ్నలకు తగిన సమాధానాలు చెప్పి నీరు త్రాగితే నీకు మేలౌతుంది' అని హెచ్చరించింది. ధర్మరాజు ఆలోచిస్తూ ఇట్లా పలికాడు. 'అయ్యా! నీవు బకరూపంలో ఉన్న రుద్రుడవా? అగ్నివా? వాయువువా? లేకపోతే కులపర్వతాలవంటి నా తమ్ములను పడద్రోచే బలం ఒక పక్షికి కలుగుతుందా? దేవాసురగంధర్వయక్షాదులకు కూడా దుర్జయులైన ఈ వీరులను ఈ విధంగా చేసి, కానివాడవుగా ఉన్న నిన్ను భావిస్తే నాకు అద్భుత భయకౌతుకాలు ఏర్పడుతున్నాయి. ఇంతకు నీ వెవ్వరవు? నీ ఉద్దేశ మేమిటి? నాకు తెలిపి నా హృదయవేదనను మాన్పు' మని వేడుకొన్నాడు.

అప్పుడు తాటిచెట్టంత పొడవున భయంకరాకారంతో ఒక యక్షుడు ఆ సరోవర తీరంలో నిలబడి అతడి అనుమతి లేకుండ ఆ నీరు త్రాగితే ఎంతటి వారైనా చనిపోతారనీ, ధర్మరాజు విచారశీలుడు కాబట్టి ఆలోచించ గలిగాడనీ, తన ప్రశ్నలకు సమాధానాలు చెప్పవలసిందనీ అడిగాడు. ధర్మజుడు వినయశీలుడై 'నానేర్చు విధంగా చెప్పుతాను. అడుగు' మన్నాడు.

**యక్షుడి ప్రశ్నలు - ధర్మరాజు సమాధానాలు**

01. సూర్యుడిని నడిపే శక్తి ఏది? - బ్రహ్మము.

02. సూర్యుడిని సేవిస్తూ తిరిగే దెవ్వరు? - సురకోటి.

03. సూర్యుడు దేనివలన అస్తమిస్తాడు? - ధర్మునిచేత.

04. సూర్యుడికి ఆధారమేది? - సత్యం.

05. శ్రోత్రియుడని దేనివలన పిలువబడతాడు? - శ్రుతమువలన.

06. పురుషుడు దేనివలన మహత్త్వాన్ని పొందగలడు? - తపస్సు చేత.

07. పురుషుడు దేనిచేత సహాయయుతు డౌతాడు? - ధృతిచేత.

08. పురుషుడు దేనిచేత బుద్ధిమంతు డౌతాడు? - బుధులను సేవించటం చేత.

09. బ్రాహ్మణుడు దేనివలన దేవభావాన్ని పొందుతాడు? - అధ్యయనం వలన.

10. అతడికి సాధుభావం ఏవిధంగా కలుగుతుంది? - అధికవ్రతశీలం వలన.

11. అతడికి అసాధుత్వం దేనివలన కలుగుతుంది? - శిష్టవృత్తిని వదలటం వలన.

12. అతడు దేనివలన మానుషు డౌతాడు? - మృత్యుభయం వలన.

13. జీవన్మృతుడు ఎటువంటి వాడు? - దేవాతిథి పితృభృత్య జనాలకు అన్నం పెట్టకుండా తానే తినేవాడు.

14. భూమికంటే గొప్పదైన దెవరు? - తల్లి.

15. ఆకాశం కంటె పొడవైన దెవరు? - తండ్రి.

16. గాలికంటె వేగం కలిగిన దేది? - మనస్సు.

17. గడ్డిపోచకంటే హీనమైన దేది? - చింత.

18. నిద్రిస్తూ కూడా కన్ను మూయని దేమిటి? - చేప.

19. పుట్టికూడా చేతనత్వం పొందని దేది? - గ్రుడ్డు.

20. రూపముండి హృదయం లేని దేది? - రాయి.

21. వేగం వలన ప్రకాశించేది ఏది? - ఏరు.

22. బాటసారికి, రోగార్తుడికి, గృహస్థుడికి, మృతుడికి మిత్రులెవరు?

-వరుసగా... సార్థము, వైద్యుడు, సద్భార్య, చేసినధర్మం.

23. ధర్మువుకు కుదురేది? - దాక్షిణ్యం.

24. కీర్తికి ఆశ్రయ మేది? - దానం.

25. స్వర్గానికి అనువైన మార్గ మేది? - సత్యం.

26. సుఖాల కన్నిటికీ ఆశ్రయ మేది? - శీలం.

27. నరుడికి ఆత్మ ఎవ్వరు? - పుత్రుడు.

28. మానవుడికి దైవికమైన చుట్ట మెవ్వరు? - భార్య.

29. మానవుడి జీవిక దేనివలన కలుగుతుంది? - పర్జన్యుడి వలన.

30. మానవుడు దేనిని కొనియాడి అభివృద్ధి చెందుతాడు? - దానం.

31. ఉత్తమ ధర్మ మేది? - అహింస.

32. ఎప్పుడూ పండి ఉండేది ఏది? - యాగకర్మ.

33. దేనిని నిగ్రహిస్తే ప్రయోజనసిద్ధి కలుగుతుంది? - మనోஉహంకారం.

34. ఎవరితోడి చెలిమి ఎన్నటికీ చెడిపోకుండా ఉంటుంది? - సజ్జన స్నేహం.

35. లోకానికి ఎవరు దిక్కు? - సజ్జనులు.

36. దేనివలన జలమూ, అన్నమూ సంభవిస్తాయి? - ఆకాశం, భూమి, జలం.

37. విషం వంటి దేది? - విప్ర ధనం.

38. శ్రాద్ధవిధికి సమయ మేది? - బ్రాహ్మణుల రాక.

39. మానవుడు వేటిని వదలిపెట్టితే సర్వజనసమ్మతుడు,
నిశ్శోకుడు, అర్థవంతుడు, సుఖి కాగలడు? - గర్వం, క్రోధం, లోభం, తృష్ణ.

40. పురుషు డెవ్వడు? - యశస్వి

41. సర్వధని అయినవా డెవ్వడు? - సమచిత్తుడు.

ధర్మరా జిచ్చిన సముచిత సమాధానాలకు యక్షుడు సంతోషించి 'నలుగురు తమ్ములలో ఒకడిని మాత్రం బ్రతికిస్తాను. అతడి నెన్నుకో'మ్మని ధర్మరాజును అడిగాడు. ధర్మరాజు నకులుడిని బ్రతికించుమని కోరుకొన్నాడు. 'భీమార్జునులలో ఎవరైనా అయితే నీకు సహాయకులుగా అండదండలందించ గలిగిన మేటి వీరులౌతారుగాని నకులుడు ఎందుకు పనికివస్తా' డని యక్షుడు ప్రశ్నించాడు. 'కుంతీపుత్రులలో మొదటివాడిని నేనున్నాను. అట్లాగే మాద్రి పుత్రులలో నకులుడు బ్రతికి ఉండటం ధర్మ' మని ధర్మరాజన్నాడు. యక్షుడు ధర్మరాజు యొక్క ధర్మబుద్ధికి, సమచిత్తానికి సంతోషించి, చనిపోయిన భీమాదుల నందరినీ పునర్జీవితులను చేశాడు. ధర్మాత్ముడని ప్రజలచేత పొగడబడే ధర్మరాజు ధర్మహానికి ఓర్వడని నిరూపించుకొన్నాడు.అతడు అన్నివిధాలా సార్థకనామధేయుడు.

'ఓ యక్షనాయకా! నీవు యక్షమాత్రుడ వని నేననుకొనటం లేదు. ఏ ఇంద్రుడవో, కుబేరుడవో, అగ్నిదేవుడవో, వాయుదేవుడివో, కాక జగన్మాన్యుడైన నా తండ్రి ధర్మదేవతవో దయతో ఎరిగించుము' అని ధర్మరాజు ప్రార్థించాడు.

ఆ మహాత్ముడు చిరునవ్వుతో ఇట్లా అన్నాడు- 'ఓ రాజేంద్రా! నేను ధర్ముడను. సత్యం, శౌచం, దానం, తపస్సు, శమము, దాంతి, యశస్సు, జ్ఞానం అనేవి నా మూర్తులు. ఉత్తమ ధార్మికుడవు, నా కుమారుడవు అయిన నిన్ను చూడాలనే వేడుకతో వచ్చాను. నన్నాశ్రయించిన వారు దుర్గతి పొందరు. కాబట్టి నీ కిష్టమైన వరం కోరుకొమ్ము' అని అన్నాడు.

ధర్మరాజు సంభ్రమంతో భక్తిభావంతో ధర్ముడికి నమస్కరించి స్తుతించాడు. హరిణం అపహరించిన బ్రాహ్మణుడి అరణిని తిరిగి ఇప్పించి కర్మలోపం ధర్మలోపం కాకుండా కరుణించుమని అడిగాడు. ధర్మజుని ధర్మబుద్ధికి సంతోషించి ఆ మాయ నంతా తానే కల్పించానని తెలిపి, ధర్ముడు అరణిని ధర్మరాజుకు తిరిగి ఇచ్చాడు.

'ధర్మజా! పదమూడవ యేడు వస్తూ ఉన్నది. మీరు అజ్ఞాతవాసం చేయవలసి ఉన్నది. ఆ కాలంలో మీరు ఎవ్వరు ఎక్కడ ఏ రూపంలో తిరగాలని అనుకొంటే ఆ రూపాలు మీకు ఏర్పడుతాయి. మిమ్మల్ని అజ్ఞాతవాసంలో ఎవ్వరూ పాండవులని గుర్తించకుండా ఉండేటట్లు వరమిస్తున్నాను. ఇంకేదైనా కావాలంటే అడుగుము' అని ధర్ముడు పలికాడు.

'దేవా! ధర్మదేవతవు నీవే దయతో ప్రత్యక్షమయ్యావు, ధన్యుడనైనాను. ఇంకేమి కోరేది? ఎప్పుడూ నామనస్సు ధర్మమందే స్థిరమై ఉండేటట్లు అనుగ్రహించు' మన్నాడు. ఆ దేవు డాతడికి ఆ వరం అనుగ్రహించాడు. పాండవులు తిరిగి ఆశ్రమానికి వెళ్ళారు. బ్రాహ్మణునికి అరణి నిచ్చివేశారు. బ్రాహ్మణాశీస్సులను పొందారు.

ఈ విధంగా పాండవులు అరణ్యవాసవ్రతాన్ని నియతితో పూర్తి చేశారు.

**ఇంతవరకు నన్నయపేర ఎఱ్ఱన రచించిన ఆరణ్యపర్వశేషం.**

**ఇది ఆరణ్యపర్వ కథాసారంలో రెండవభాగం.**

**ఇంతటితో ఆరణ్యపర్వ కథాసారం ముగిసింది.**

**జి.వి. సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు

## శ్రీమదాంధ్ర మహాభారతం

**సంపుటము - 5**

**ఆరణ్యపర్వము**

**(శేష భాగము)**

**(ఆరణ్యపర్వశేషము : ఎఱ్ఱాప్రెగ్గడ విరచితము)**

# విషయసూచిక



## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము

# షష్ఠాశ్వాసము

# సప్తమాశ్వాసము





# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వ శేషము

(4వ ఆశ్వాసము 142వ పద్యము నుండి 5,6,7 ఆశ్వాసములు)

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము -చతుర్థాశ్వాసము

### ఇక్కడ నుండి ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వము

శ్రీమదాంధ్ర మహాభారతం అన్ని వ్రాత ప్రతులలోనూ "ఇక్కడ నుండి ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వము'' అనే శీర్షిక కానవస్తున్నది. విద్వాంసులు అందరు ఏకగ్రీవంగా ఈ విషయాన్ని ఆమోదిస్తున్నారు.

ఎఱ్ఱన పూరించిన ఆరణ్యపర్వశేషంలోని కవిత్వంలో ఆతడి ఆత్మీయతాముద్ర కనబడుతుంది. అయినను, 'సకలలోకైక విదితుడైన నన్నయభట్టు మహాకవీంద్రు సరస సారస్వతాంశప్రశస్తి' తనను చెందగా తాను "తత్కవితారీతియుఁ గొంత దోఁప' - 'తద్రచనయ కా' ఆరణ్యపర్వశేషాన్ని పూరించానని చెప్పుకొన్నాడు.

అనగా ఎఱ్ఱాప్రెగ్గడ తాను వ్రాసిన భాగాన్ని నన్నయభట్టుపేరుమీదనే కొనసాగించాడు. ఆశ్వాసాంత పద్యాలు రాజరాజనరేంద్రుడి సంబోధనలే. ఆశ్వాసాంత గద్యలలో 'ఇది సుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతంబునందు' - అని రచించాడు.

ఎఱ్ఱాప్రెగ్గడ చేసింది నిష్కామ సారస్వతసేవ. శైలిలోనూ, కొన్ని ఛందోవిషయాలలోను ఎఱ్ఱాప్రెగ్గడ తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకొని ఉండటంచేత విమర్శకులు, సాహితీవేత్తలు ఈతడి భారతకవితకు గల విశిష్టతను గుర్తించి ఉన్నారు. భారతరచనవలననే 'కవిత్రయం'లో ఎఱ్ఱనకు తరతరాల తెలుగుసాహిత్యచరిత్రలో సముచితస్థానం లభించింది.

**చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా**
**వరణము లై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను**
**ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ**
**గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్. 142**

**ప్రతిపదార్థం:** స్ఫురత్+అరుణ+అంశు, రాగ, రుచిన్= ప్రకాశిస్తున్న ఎర్రనికిరణాలుకల, అనగా-బాలసూర్యుడికాంతియొక్క తళతళచేత; పొంపిరి+పోయి= అతిశయించి; నిరస్త, నీరద+ఆవరణములు+ఐ= తొలగించబడిన మబ్బుల చుట్టుకొనుటలు కలవై, అనగా మబ్బులు క్రమ్మటం తొలగినవై; దళత్, కమల, వైభవ, జృంభణము= వికసిస్తున్న పద్మాల సంపదయొక్క అతిశయం; ఉల్లసిల్లన్= వ్యక్తమయ్యేటట్లుగా; ఉద్ధురతర, హంస, సారస, మధువ్రత, నిస్వనముల్= మిక్కిలి దట్టంగా వ్యాపించిన హంసలయొక్క, బెగ్గురు పిట్టలయొక్క, తుమ్మెదలయొక్క మ్రోతలు; చెలంగఁగాన్= విస్తరించగా; వాసర, ముఖంబులు= దినారంభసమయాలు, అనగా ప్రొద్దు పొడుపులు; శారద, వేళన్= శరత్కాలంలో; చూడఁగన్= చూడటానికి; కరము= మిక్కిలి; వెలింగెన్= శోభించాయి.

**తాత్పర్యం:** శరత్కాలంలో సూర్యోదయ సమయాలు కనులపండువుగా శోభిల్లాయి. అప్పుడు మబ్బులు క్రమ్మటాలు తొలగిపోయాయి, బాలభానుడి అరుణకిరణాలు విస్తరించాయి. పద్మాలు వికసించి, శోభాయమానంగా వెలుగొందాయి. హంసలు, బెగ్గురుపిట్టలు, తుమ్మెదలు చేసే కలరవాలు వెల్లివిరిశాయి.

**విశేషం:** ఉద్ధురం అంటే దట్టంగా వ్యాపించటం, ఉద్ధురతరము= మిక్కిలి దట్టంగా వ్యాపించటం. విశేషణాలకు 'తర-తమ' ప్రత్యయాలు చేరినపుడు ఆధిక్యాన్ని సూచిస్తాయి.

**శా. దానాంభఃపటలంబునం బృథుపయోధారావళిం దాల్చి గ**
**ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో**
**దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గె నాఁ**
**గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్. 143**

**ప్రతిపదార్థం:** వన+అంతంబునన్= అడవిలోపలిభాగంలో; మద+ఉత్కట, ద్విరద, సంఘంబుల్= పొగరు ఎక్కిన ఏనుగుల గుంపులు; దాన+అంభస్+పటలంబునన్= మదజలాల సముదాయంచేత; పృథు, పయస్+ధారా+ఆవళిన్= ఎక్కువైన నీటిధారల సముదాయాన్ని; తాల్చి= ధరించి; గర్జా, నిర్ఘోషము= మేఘాలు చేసే ధ్వనిని; బృంహిత+ఛలనన్= ఏనుగులు చేసే ఘీంకారం అనే మిషతో; ప్రచ్ఛాదించి= కప్పిపుచ్చి; ప్రావృట్+పయోద+అనీకంబు= వానకాలపు మబ్బుల గుంపు; శరద్+భయంబునన్= శరదృతువు వలని వెరపుచేత; నిగూఢ+ఆకారతన్= రహస్యమైన ఆకృతితో; డిగ్గెన్= (భూమికి) దిగినవి; నాన్+కాన్= అన్నట్లుగా; ఒప్పారెన్= విలసిల్లాయి.

**తాత్పర్యం:** అడవిలో మదించిన ఏనుగులగుంపులు విలసిల్లాయి. శరత్కాలానికి వెరచి, వానకాలంలోని మబ్బుల గుంపు మారువేషంలో భూమికి దిగి వచ్చాయా అన్నట్లు అవి కన్పించాయి. మదించిన ఏనుగులు కాబట్టి వాటికి మదజలం స్రవించటం కద్దు. అవి మబ్బులకు ఉండే నీటిజల్లులో అన్నట్లున్నాయి. అట్లే, ఏనుగులు చేసే బృంహితధ్వనులు మేఘాలగర్జనలో అన్నట్లున్నాయి.

**విశేషం:** అలం : ఉత్ప్రేక్ష. మదపుటేనుగులు ఉపమేయం. వానకారు మబ్బులు ఉపమానం.

**క. కలనీలకంఠకోలా౹ హలలీలలు సెలఁగె, రాజహంసకులంబుల్**
**విలసించె, సప్తపర్ణా । వలి విగళిత కుసుమ కుటజ వాటిక లడరెన్. 144**

**ప్రతిపదార్థం:** కల, నీలకంఠ, కోలాహల, లీలలు= అవ్యక్తమధురాలైన నెమళ్ళకలకల ధ్వనులతో కూడిన విలాసాలు; చెలఁగెన్= ఒప్పినాయి; రాజహంస, కులంబుల్= రాజహంసల గుంపులు; విలసించెన్= శోభిల్లాయి; సప్త పర్ణ+ఆవలి, విగళిత, కుసుమ, కుటజ, వాటికలు= ఏడాకుల అరటిచెట్ల గుంపులు; రాలిన పువ్వులు గల కొండమల్లె (పొన్న) పొదరిండ్లు; అడరెన్= విలసిల్లాయి.

**తాత్పర్యం:** నెమళ్ళ కలరవాలతో కూడిన ఆటలు విలసిల్లాయి. అనగా నెమళులు అవ్యక్తమధురాలైన ధ్వనులు చేస్తూ నృత్యం చేశాయి. రాజహంసలగుంపులు శోభిల్లాయి. ఏడాకుల అరటిచెట్ల గుంపులు మరియు పూలురాలిన కొండమల్లెల పొదలు విలసిల్లాయి.

**విశేషం:** శరత్కాలంలో నెమళుల క్రేంకారనాదాలు విస్తరిల్లుతాయి. రాజహంసలకు శరదృతువు వినోదవిహారసమయం. ఆ ఋతువులో కొండమల్లె (పొన్న) చెట్లనుండి తెల్లని పువ్వులు రాలుతాయి. 'రాజహంసకులములన్ దిలకించె సప్తపర్ణావళి విగళిత కుసుమ కుటజ వాటికల గెడన్' - ఈ పాఠాంతరం కొన్ని ప్రతులలో ఉన్నది.

**మ.** **అతిగాంభీర్యవిభూతి నేకచుళుకాహంకారనిశ్శేషశో**
**షితపాథోధిపయస్కుఁ డైన ముని దోఁచెం బుణ్యతేజోమయా**
**కృతి నయ్యామ్యదిగంతవీథిఁ బ్రకటక్రీడాకళాగర్వ గ**
**ర్జితమండూకకళంకితాంబుశుచితాసిద్ధిప్రదాచార్యుఁ డై.** **145**

**ప్రతిపదార్థం:** అతిగాంభీర్య, విభూతిన్= మిక్కుటమైననిండుదనంతో కూడినవైభవంచేత; ఏక, చుళుక+అహంకార, నిశ్శేష, శోషిత, పాథోధి, పయస్కుఁడు= ఒకపుడిసిలితో - గర్వంతో శేషం లేకుండ అంటే మిగులకుండగా ఎండించబడిన సముద్రజలాలు కలవాడు, అనగా గర్వంతో ఒక్క పుడిసిలి పట్టి సముద్రజలం అంతటినీ ఒక్కచుక్కకూడ మిగులకుండ ఎండింపచేసినవాడు; ఐన= అయినట్టి; ముని= ఋషి, అనగా అగస్త్యుడు, అగస్త్యనక్షత్రం; ఆ+యామ్య, దిగంత(దిక్+అంత)వీథిన్= ఆ దక్షిణదిశ చివరిభాగంలోని బాటలో; పుణ్య, తేజస్+మయ (తేజోమయ)+ఆకృతిన్= శుభం పావనం ఐన కాంతితో కూడినరూపంతో; ప్రకట, క్రీడా, కళా, గర్వ, గర్జిత, మండూక, కళంకిత+అంబు, శుచితా, సిద్ధిప్రద+ఆచార్యుఁడు+ఐ= వ్యక్తమైన ఆటసొబగులోని పొగరుతో పెద్దధ్వని చేసే (బెక బెక మనే) కప్పలచేత బురదగా చేయబడిన నీటికి నిర్మలత్వ ప్రాప్తిని ప్రసాదించే గురువై; తోఁచెన్= కానుపించాడు.

**తాత్పర్యం:** ఆ శరత్కాలంలో ఆకసాన దక్షిణదిశలో అగస్త్యనక్షత్రం కన్పించింది. ఆ అగస్త్యుడు మిక్కుటమైన నిండు వ్యక్తిత్వంగల మహర్షి. ఆయన సమస్త సముద్రజలాన్ని తనపుడిసిలి పట్టి, ఒక్కచుక్క మిగులకుండ త్రాగివేశాడు. అంతవరకు బెకబెకమని సవ్వడి చేస్తూ క్రీడాలాలసాలైన కప్పలవలన బురదగా చేయబడిన నీళ్లకు నిర్మలత్వాన్ని ప్రసాదించే గురువు ఆ అగస్త్యుడు.

**విశేషం:** 1) వర్షాకాలంలో కప్పలు బెక బెక మంటాయి. అది కప్పలకు ఋతుకాలం. వర్షాకాలంలో నీళ్లు బురదగా ఉంటాయికదా. శరత్కాలంలో అగస్త్యనక్షత్రోదయ మౌతుంది. అప్పుడు నీరు నిర్మల మౌతుంది. 2) అగస్త్యమహర్షి తన తపోమహిమవలన సముద్రజలాలను పుడిసిలితో పానంచేసిన పురాణగాథ సుప్రసిద్ధం. కాలకేయాదిరాక్షస నిగ్రహార్థం అగస్త్యుడు సాగరజలాలను పుడిసిలి బట్టి నిశ్శేషంగా పానం చేశాడు.

**తే.** **విశదశారదాంబుద పరివేష్టనమునఁ । బోలుచు గగనంబు ప్రతిబింబములో యనంగ**
**వికచకాశవనీ పరివేష్టనమున । నతిశయిల్లె నిర్మలకమలాకరములు.** **146**

**ప్రతిపదార్థం:** విశద, శారద+అంబుద, పరివేష్టనమునన్= స్వచ్ఛమైన శరదృతువుకు సంబంధించిన మబ్బుల చుట్టురేకచేత; పొలుచు= ఒప్పునట్టి; గగనంబు= ఆకాశంయొక్క; ప్రతిబింబములు+ఒ= మారురూపాలో; అనంగన్= అన్నట్లుగ; వికచ, కాశ, వనీ, పరివేష్టనమునన్= పూచిన రెల్లుచెట్ల గుంపులతో చుట్టబడటంచేత; నిర్మల, కమల+ఆకరములు= స్వచ్ఛమైనసరస్సులు (కమల+ఆకరములు= పద్మాలకు నెలవులు); అతిశయిల్లెన్= శోభిల్లాయి.

**తాత్పర్యం:** తెల్లని శరత్కాల మేఘాలు చుట్టుముట్టి ఉన్న ఆకసానికి ప్రతిరూపాలో అను నట్లు తెల్లనిపూలు పూచిన రెల్లుమొక్కలచేత చుట్టుకొనబడిన నిర్మలసరస్సులు శోభిల్లాయి.

**విశేషం:** 1)అలం : ఉత్ప్రేక్ష. 2) శరదృతువులోని మేఘాలు తెల్లగా ఉంటాయి. అవి ఆకసంలో ఉంటాయి. రెల్లుపూలుకూడ తెల్లగా ఉంటాయి. అవి సరస్సుల చుట్టూ ఉంటాయి. శరదృతువులో రెల్లుపూలు పూస్తాయి. ఆకసం నిర్మల సరోవర జలాలలో

ప్రతిఫలిస్తూ ఉంటుంది. ఆకాశంలోని తెల్లమబ్బులే నిర్మలమైన నీటిలో ప్రతిఫలించాయా అన్నట్లు సరోవరాలలో రెల్లుపూలు శోభిల్లాయి.

**వ. అట్టి శారదాగమంబున నుత్ఫుల్లకమలకల్హారకేసరకరాళకలితకల్లోలమాలినియు, ననేకమునిలోకసతత సంసేవ్యమాన విపుల పులినోత్సంగయు, నిరంతర తీర వానీర వనమండలీవిలసితయు, నాకాశసంకాశవిశద సలిలయు నైన సరస్వతీమహానది ననుదినస్నానపానాదివిశేషంబులం బరితోషంబు నొందుచుఁ బాండునందనులు మరుభూమిం గొన్నిదినంబులు వసియించి, తదనంతరంబ ధౌమ్యాదిభూసురులు నింద్రసేనాదిభృత్యులు దోడ నరుగుదేరఁ గామ్యకవనంబునకు వచ్చి, యచ్చటిమునులచేత నభినందితులై, యందు సముచితవర్తనంబుల నున్నంత; నొక్కనాఁడు. 147**

**ప్రతిపదార్థం:** అట్టి, శారద+ఆగమంబునన్= శరత్కాలం వచ్చినప్పుడు; ఉత్ఫుల్ల, కమల, కల్హార, కేసర, కరాళ, కలిత, కల్లోల మాలినియున్= వికసించిన పద్మాలయొక్క ఇంచుక తెలుపు ఇంచుక ఎరుపురంగు కల సౌగంధిక పుష్పాలయొక్క కింజల్కాల సర్జ రసతైలంతో కూడిన కెరటాల దొంతరలదండ కలదిన్నీ; అనేక, ముని, లోక, సతత, సంసేవ్యమాన, విపుల, పులిన+ఉత్సంగయున్= పెక్కు మంది ఋషులసముదాయంచేత ఎల్లప్పుడు ఆరాధించబడుతున్న విశాలమైన ఇసుకతిన్నెలనెడి ఒడి కలదిన్నీ; నిరంతర, తీర, వానీరవన, మండలీ విలసితయున్= దట్టంగా ఒడ్డునందుండే నీటి ప్రబ్బలి తోపుల గుంపులచే శోభిల్లేదిన్నీ; ఆకాశ, సంకాశ, విశద, సలిలయున్= ఆకసంతో సరిపోలే స్వచ్ఛమైన నీరు కలదిన్నీ; ఐన; సరస్వతీ, మహానదిన్= సరస్వతి అనే పేరు కల గొప్ప ఏటిలో; అనుదిన, స్నాన, పాన+ఆది, విశేషంబులన్= ప్రతిరోజు స్నానం చేయటం నీరు త్రాగటం మున్నగు గొప్ప పనులచేత; పరితోషంబున్= సంతసాన్ని; ఒందుచున్= పొందుతూ; పాండునందనులు= పాండవులు; మరుభూమిన్= మరువు అనే పేరుకల దేశంలో; కొన్ని, దినంబులు= కొన్ని రోజులు; వసియించి= నివసించి; తద్+ అనంతరంబు+అ= అటుపిమ్మట; ధౌమ్య+ఆది, భూసురులున్= ధౌమ్యుడు మున్నగు బ్రాహ్మణులున్నూ, ఇంద్రసేన+ఆది, భృత్యులు= ఇంద్రసేనుడు మున్నగు సేవకులున్నూ; తోడన్= తమతో; అరుగుదేరన్= రాగా; కామ్యక, వనంబునకున్= కామ్యకం అనే పేరు కల అరణ్యానికి వచ్చి; అచ్చటి, మునులచేతన్= అచట ఉన్న ఋషులచేత; అభినందితులు+ఐ= సంతోషింపజేయబడినవారై; అందున్= (ఆ కామ్యకవనంలో;)సముచిత వర్తనంబులన్= ఎప్పటికప్పటికి సరిపడే పనులు చేస్తూ; ఉన్న+అంతన్= ఉండగా; ఒక్క, నాఁడు= ఒక రోజున.

**తాత్పర్యం:** అది శరదృతువు. ఆ శరత్కాలంలో సరస్వతీ మహానదిలో నిత్యమూ క్రుంకులిడుతూ, ఆనదీజలాలు త్రాగుతూ పాండవులు సంతోషంతో మరుదేశంలో కొన్ని నాళ్ళు గడిపారు. వికసించిన కమలాలతో, సౌగంధికపుష్పాలతో, ఆ పుష్పపరాగ తైలంతో తడిసిన కెరటాల దొంతరలతో, పెక్కుమంది ఋషులచేత ఎల్లప్పుడు ఆరాధించబడే ఇసుకతిన్నెలతో పాండవులకు ఆ సరస్వతీనది కనులపండువుగా కన్పించింది. అటు పిమ్మట పాండవులు ధౌమ్యుడు మున్నగు బ్రాహ్మణులు, ఇంద్రసేనుడు మున్నగు సేవకులు తమతోపాటు రాగా, కామ్యకవనం చేరి అక్కడి ఋషులచేత అభినందించబడి, అచట యథోచితకర్తవ్యాలు నెరవేరుస్తున్నారు. ఒకనాడు.

**విశేషం:** మహాభారతంలో పలుతావుల సరస్వతీ మహానది ప్రసక్తి ఉన్నది. వేదాలలో పెక్కుపర్యాయాలు సరస్వతీనది అభివర్ణితం. ఇప్పుడు 'ప్రయాగ' గంగా యమునా సంగమ క్షేత్రం. ఒకానొకప్పుడు సరస్వతికూడ అచ్చటనే కలిసెడిదనీ, అందుచేతనే దానికి 'త్రివేణీక్షేత్ర' మనే నామం ఏర్పడిం దనీ పెద్దల ప్రవచనం. ఇప్పుడు సరస్వతి 'అంతర్వాహిని' అని అంటారు. భారతదేశంలో

ఏర్పడిన భౌగోళికమైన మార్పులలో పేర్కొన దగింది సరస్వతీనది అంతర్ధానం. ఒకనొకప్పుడు జీవనదిగా ఉన్న సరస్వతీ మహానది ఎప్పుడు ఎట్లు ఇంకిపోయింది? ఈ విషయంపై పెక్కురు ఇంకను పరిశోధనలు చేస్తున్నారు.

**క. వాసవనందనసఖుఁ డగు । భూసురుఁ డొకఁ డరుగుదెంచి భూవినుతగుణో**
**ద్భాసితు ధర్మజు విప్రస । భాసీనుం గాంచి యిట్టు లనియెం బ్రీతిన్. 148**

**ప్రతిపదార్థం:** వాసవ నందన సఖుఁడు+అగు= దేవేంద్రుడి కుమారుడైన అర్జునుడి యొక్క మిత్రుడు అయిన; భూసురుఁడు+ఒకఁడు= ఒక బ్రాహ్మణుడు; అరుగుదెంచి= వచ్చి; భూ, వినుత, గుణ+ఉద్భాసితున్= భూమి యందలి ప్రజలచేత పొగడబడిన మంచి లక్షణాలు కలిగి ప్రకాశిస్తున్న; విప్ర, సభా+ఆసీనున్= బ్రాహ్మణు లున్నసభలో కూర్చొని ఉన్నవాడిని; ధర్మజున్= ధర్మరాజును; కాంచి= చూచి; ప్రీతిన్= సంతోషంతో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులమధ్య కూర్చొని కొలువుదీరి ఉన్న ధర్మరాజువద్దకు, అర్జునుడిమిత్రు డైన బ్రాహ్మణుడు ఒకడు వచ్చి అనురాగంతో ఈ విధంగా వచించాడు.

**చ. 'జనవర! నీవుఁ దమ్ములును సమ్మద మొప్పఁగ నివ్వనంబునం**
**దునికి ధ్రువంబుగా విని మహోజ్జ్వలతేజుఁడు దేవకీసుతుం**
**డనఘుఁడు మిమ్ముఁ జూచుటకునై యిదె వచ్చుచునున్నవాఁడు మీ**
**కును ననిశంబుఁ దా హితమ కోరుచునుండు నతండు నెయ్యుఁడై. 149**

**ప్రతిపదార్థం:** జనవర!= ఓ రాజా!; నీవున్= నీవున్నూ; తమ్ములును= (నీ) సోదరులున్నూ; సమ్మదము+ఒప్పఁగన్= ప్రీతి ఇంపెసలారగా; ఈ+వనంబునందున్= ఈ అడవిలో; ఉనికి= ఉండటం; ధ్రువంబుగాన్= నిశ్చయంగా; విని= ఆలకించి; మహా+ఉజ్జ్వల, తేజుఁడు= గొప్పగా వెలుగొందే కాంతి కలవాడు; అనఘుఁడు= పాప రహితుడు; దేవకీ, సుతుండు= దేవకి యొక్క కుమారుడు; మిమ్మున్+చూచుటకున్+ఐ= మిమ్ములను దర్శించటానికి; ఇదె= ఇదిగో; వచ్చుచున్+ఉన్నవాఁడు= వస్తున్నాడు; అతండు= అతడు (దేవకీసుతుడైన ఆ కృష్ణుడు); తాన్= తాను; నెయ్యుఁడు+ఐ= మిత్రుడై; మీకునున్= మీకు; అనిశంబున్= ఎల్లప్పుడున్నూ; హితము+అ= మేలునే; కోరుచున్+ఉండున్= కోరుతుంటాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఈ అడవిలో నీవూ, నీసోదరులూ నెమ్మదితో ఉన్నట్లు నిశ్చయంగా తెలిసికొని, మీకు సదా మేలుకోరే మీ మిత్రుడు, గొప్ప తేజస్వి, పాపరహితుడు, దేవకీసుతుడు అయిన శ్రీకృష్ణుడు మిమ్మల్ని చూడవలె ననే కోరికతో ఇక్కడకు ఇప్పుడే వస్తున్నాడు.

**వ. మఱియు ననేకయుగసహస్రజీవియు నప్రమేయతపఃప్రభాసియు వినుతవిధేయుఁడును నైన మార్కండేయుండును భవదీయదర్శనార్థం బీక్షణంబ చనుదెంచు' నని చెప్పిన యనంతర ముహూర్తంబున.150**

**ప్రతిపదార్థం:** మఱియున్= అదియునుంగాక; అనేక, యుగసహస్ర, జీవియున్= పెక్కు వేల యుగాలు బ్రదికినట్టివాడున్నూ; అప్రమేయ, తపస్+ప్రభాసియున్= గొప్ప తపస్సుచేత ప్రకాశించే వాడున్నూ; వినుత, విధేయుఁడునున్= మహాత్ములయెడ అణకువ కలవాడున్నూ; ఐన= ఐనట్టి; మార్కండేయుండును= మృకండుమహామునిపుత్రుడున్నూ; భవదీయ, దర్శన+అర్థంబు= నిన్ను చూడటం కొరకై; ఈ క్షణంబు+అ= ఈ నిమేషకాలంలోనే, చనుదెంచున్= వస్తాడు; అని చెప్పిన, అనంతర, ముహూర్తంబునన్= అనిచెప్పిన తరువాతి క్షణంలోనే.

**తాత్పర్యం:** అంతేకాక, పెక్కువేల యుగాలు జీవించినవాడున్నూ, గొప్ప తపస్సు చేసిన వాడున్నూ, మహాత్ములపట్ల వినయవిధేయతలు చూపేవాడున్నూ, మృకండు మహర్షి పుత్రుడున్నూ ఐన మార్కండేయుడు ఈ క్షణంలోనే నిన్ను చూడటంకొరకై వస్తున్నాడు' అని చెప్పిన మరుక్షణంలోనే.

శ్రీకృష్ణుఁడు సత్యభామతోడఁ బాండవులయొద్దకు వచ్చుట (సం. 3-180-7)

**సీ.** **శైబ్యసుగ్రీవాదిజవనాశ్వయుక్త మై । యాబద్ధనూత్నరత్నాంశుపటల**
**భాసితం బై చారుపతగ పతాకా వి । భూషితగగన మై పొలుపు మిగులు**
**దివ్యరథంబున దేవకీసుతుఁడు ప్రి । యంబున సత్యభామాన్వితముగఁ**
**దరళసౌదామినీదామసముజ్జ్వల । ధారాధరోత్సంగతలమునందు**

**ఆ.** **శచియుఁ దాను వెలుఁగు శతమఖుండును బోలె । నరుగుదెంచె ఘనరథాంగనేమి**
**విపులఘోష తాండవిత బర్హిశబ్ద శ । బ్దాయమాన వనవిభాగుఁ డగుచు.** **151**

**ప్రతిపదార్థం:** శైబ్య, సుగ్రీవ+ఆది, జవన+అశ్వ, యుక్తము+ఐ='శైబ్యం' 'సుగ్రీవం' మొదలైన వేగంగా పోయే గుర్రాలతో కూడినదై; ఆబద్ధనూత్నరత్న+అంశు, పటల, భాసితంబు+ఐ= కూర్చబడిన రతనాల వెలుగుల సముదాయంతో ప్రకాశించేదై; చారు, పతగ, పతాకా, విభూషిత గగనము+ఐ= మనోహర మైన పక్షి (గరుత్మంతుడి) జెండాచేత అలంకరించబడిన ఆకసం కలిగినదై; పొలుపు, మిగులు= అందంతో అతిశయించిన; దివ్య, రథంబునన్= దేవతాసంబంధమైన మహిమ కల్గిన తేరియందు; దేవకీ సుతుఁడు= దేవకి కుమారుడైన శ్రీకృష్ణుడు; ప్రియంబునన్= ప్రేమతో; సత్యభామా+అన్వితముగన్= సత్యభామతో కూడి; తరళ, సౌదామినీ, దామ, సముజ్జ్వల, ధారాధర+ఉత్సంగ, తలమునందున్= మెరుస్తున్న మెరుపు తీగెల దండలతో ప్రకాశిస్తున్న మేఘాల ఒడియందు; శచియున్+తాను, వెలుఁగు, శతమఖుండును, పోలెన్= (భార్యయైన) శచితోపాటు వెలుగొందే దేవేంద్రుడివలె; ఘన, రథాంగ, నేమి, విపుల ఘోష, తాండవిత, బర్హి, శబ్ద, శబ్దాయమాన, వన, విభాగుఁడు+అగుచున్= గొప్పవైన రథచక్రాల పట్టాలయొక్క ఎక్కువైన నాదంచేత నర్తిస్తున్న నెమళ్ళు చేసే సవ్వడులచేత ధ్వనిస్తున్న అడవి కలవాడౌతూ; అరుగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** దేవకీనందనుడైన శ్రీకృష్ణుడు, తన దేవేరి అయిన సత్యభామతోపాటు, రథాన్ని ఎక్కి గొప్ప వైభవం ఒప్పారేటట్లుగా ధర్మరాజును సందర్శించటానికై ఏతెంచాడు. శ్రీకృష్ణుడు సత్యభామతోపాటు రథంపై ఉన్నప్పుడు వారిరువురు మెరపు తీగలతో మిరుమిట్లు గొల్పుతూ ఉన్న మేఘాల మధ్య ప్రకాశిస్తున్న దేవేంద్రుడూ శచీదేవివలె వెలుగొందారు. ఆ రథంమీద గరుడలాంఛనంతో చెక్కబడిన జెండా ధగ ధగ లాడుతున్నది. ఆ రథానికి శైబ్యసుగ్రీవాది అశ్వాలు పూన్చబడ్డాయి. అది పొదగబడిన క్రొత్త రత్నాల కాంతులతో వెలుగొందుతూ ఉన్నది. ఆ రథచక్రాల సవ్వడి మేఘగర్జనలవలె ధ్వనించింది. ఆ ధ్వనికి అడవిలో ఉన్న నెమళ్ళు నృత్యం చేయసాగాయి.

**విశేషం:** శ్రీకృష్ణుడు విష్ణుమూర్తి అవతారం. విష్ణుదేవుడి రథానికి కట్టే గుఱ్ఱాలు. 1. శైబ్యం 2. సుగ్రీవం 3. మేఘపుష్పం 4. వలాహకం. మేఘగర్జనలకు నెమళ్ళు నృత్యం చేయటం సహజం. ఆ శ్రీకృష్ణుడి రథచక్రఘోష మేఘగర్జనను పోలటంచేత అక్కడ అడవిలోని నెమళ్ళు నృత్యం చేసినట్లు ఇక్కడ అభివర్ణితం.

**వ. ఇట్లు వచ్చి వాసుదేవుండు రథావతరణంబు సేసి, ధర్మనందనున కభివందనం బొనరించి, భీమార్జున నకుల సహదేవులం గౌఁగిలించుకొని, ద్రౌపదిం గారవించి, ధౌమ్యాది మహీసురులచేత నభినందితుం డయ్యెఁ; నంతఁ గౌంతేయాగ్రజుండు గదాధరునకు నర్ఘ్యాదిసత్కారంబులు నిర్వర్తించి, తమ్ములుం దానును విప్రజనంబులు నతనిం బరివేష్టించి యుండి; రప్పుడు కృష్ణుండు ధనంజయుం దన చేరువ నునిచికొని చిరకాల దర్శనోల్లసితంబు లైన యాలోకనంబుల నతని యాకారం బత్యాదరంబున నభినందించి ధర్మరాజున కి ట్లనియె. 152**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; వచ్చి= ఏతెంచి; వాసుదేవుండు= వసుదేవుడి కుమారుడైన శ్రీకృష్ణుడు; రథ+అవతరణంబు +చేసి= తేరునుండి దిగి; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; అభివందనంబు+ఒనరించి= నమస్కారం చేసి; భీమ+అర్జున, నకుల, సహదేవులన్= భీముడిని, అర్జునుడిని, నకులుడిని, సహదేవుడిని; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; ద్రౌపదిన్+ గారవించి= ద్రౌపదిని మన్నించి; ధౌమ్య+ఆది, మహీ సురులచేతన్= ధౌమ్యుడి మొదలైన బ్రాహ్మణులచేత; అభినందితుండు+ అయ్యెన్= అభినందించబడినవాడు అయ్యాడు; అంతన్= అంతట; కౌంతేయ+అగ్రజుండు= కుంతీకుమారులలో మొదటివాడు- ధర్మరాజు; గదా ధరునకున్= శ్రీకృష్ణుడికి; అర్ఘ్య+ఆది, సత్కారంబులు= స్వాగత పురస్సర మైన పూజాద్రవ్యాలు ఇవ్వటం మొదలైన మన్ననలు; నిర్వర్తించి= చేసి; తమ్ములున్+తానును= తన సోదరులున్నూ తానున్నూ; విప్ర జనంబులున్= బ్రాహ్మణులున్నూ; అతనిన్= అతడిని (అనగా శ్రీకృష్ణుడిని); పరివేష్టించి+ఉండిరి= చుట్టూ కూర్చొని ఉన్నారు; అప్పుడు= ఆ సమయంలో; కృష్ణుడు; ధనంజయున్= అర్జునుడిని; తన చేరువన్= తనకు దగ్గరగా; ఉనిచికొని= ఉంచుకొని; చిరకాల, దర్శన+ఉల్లసితంబులు+ఐన= చాలాకాలానికి చూడటంవలన మిక్కిలి వికసించిన; ఆలోకనంబులన్= చూపులతో; అతని+ఆకారంబు= అతడి (అర్జునుడి) రూపాన్ని; అతి+ఆదరంబునన్= మిక్కిలి మన్ననతో; అభినందించి= సంతోషపడేటట్లు చేసి; ధర్మరాజునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** వసుదేవుడికుమారుడైన శ్రీకృష్ణుడు ఈ విధంగా వచ్చి రథాన్ని దిగి, ధర్మరాజుకు నమస్కరించాడు. భీముడిని, అర్జునుడిని, నకులుడిని, సహదేవుడిని కౌగిలించుకొని మన్నన తెలిపాడు. ద్రౌపదిని గౌరవించాడు. ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులు శ్రీకృష్ణుడిని గౌరవించారు. ధర్మరాజు శ్రీకృష్ణుడికి అర్ఘ్యాన్ని ఇచ్చి, స్వాగత సత్కారాలు సలిపాడు. అంతట ధర్మరాజూ అతని తమ్ములూ బ్రాహ్మణులూ శ్రీకృష్ణుడి చుట్టూ కూర్చున్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుడిని తనకు దగ్గరగా చేర్చుకొని, చాలాకాలం తరువాత కలిసికొనటంచేత ఏర్పడిన అభిమానం చొప్పున అతడిపై అనురాగం జాలువారే చూపులు పరపి, అభినందించాడు. ఆ తరువాత శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడి గద పేరు 'కౌమోదకి'. శ్రీకృష్ణుడికి దానివలన గదాధరుడు అనే పేరు ఏర్పడింది.

**సీ. 'భాగ్యంబు గాదె యీ పార్థుండు హరుఁ డాది । యైన నిర్జరసమూహంబువలన
నెలమిఁ గృతాస్త్రుఁడై యేతెంచు; టరయంగ । ధన్యుండ వైతివి ధర్మతనయ!
నీ ధర్మనిష్ఠయు నీ తపంబును జూవె । యింతకుఁ గారణం బిద్ధచరిత!
రాజ్యంబుకంటెను రాజేంద్ర! ధర్మంబె । యిష్టమై యుండు నీ కెల్లనాఁడు ;**

**తే. వేదవేదాంగ విదుఁడవు, వివిధయజ్ఞ। కర్త వైతి, ధనుర్వేదకర్మఠుఁడవు,**
**ధరణి యెల్ల నేలెడి రాజధర్మ మమర। సులభ మయ్యె నీ కిహపరశోభనంబు. 153**

**ప్రతిపదార్థం:** ఈ పార్థుండు= ఈ అర్జునుఁడు; హరుఁడు+ఆది+ఐన= శివుడు మున్నగువారైన; నిర్జర, సమూహంబువలనన్= దేవతల సముదాయం వలన; ఎలమిన్= ప్రీతితో; కృత+అస్త్రుఁడు+ఐ= ఆర్జించిన అస్త్రాలు కలవాడై; ఏతెంచుట= రావటం; భాగ్యంబు, కాదె= అదృష్టం కదా; అరయంగన్= పరిశీలించగా; ధర్మతనయ!= ఓధర్మరాజా!; ధన్యుండవు+ఐతివి= చరితార్థుడవు అయినావు; నీ, ధర్మ, నిష్ఠయున్= నీకు ధర్మం నిర్వహించటంలో ఉన్న తదేకదీక్షయున్నూ; నీ, తపంబును= శరీరక్లేశాన్ని ఓర్చుకొని, ఇంద్రియాలను కైవసం చేసికొనే నీ సాధన; చూవె= కదా; ఇంతకున్+కారణంబు= ఇంతవరకు మీరు సాధించిన ఘనకార్యాల సముదాయానికి హేతువు; ఇద్ధ, చరిత!= ప్రకాశించే నడవడి కలవాడా!; రాజ+ఇంద్ర!= రాజేంద్ర= రాజులలో ఇంద్రుడివంటి వాడా, రాజశ్రేష్ఠుడా!; నీకున్+ఎల్లనాఁడు= నీకు అన్ని సమయాలలో; రాజ్యంబు కంటెను= భూమిని పాలించటం కంటె కూడా; ధర్మంబు+ఎ= ధర్మమే; ఇష్టము+ఐ+ఉండున్= సమ్మతమై ఉంటుంది; వేద, వేద+అంగ, విదుఁడవు= వేదాలను, వేదాంగాలను తెలిసినట్టి పండితుడవు; వివిధ, యజ్ఞ, కర్తవు+ఐతివి= ఎన్నో జన్నాలు చేసినవాడవు అయితివి; ధనుస్+వేద, కర్మఠుఁడవు= విలువిద్యలో ఆరితేరినవాడవు; ధరణి+ఎల్లన్= భూమినంతటిని; ఏలెడి= పరిపాలించేటి; రాజధర్మము= రాజులకు సంబంధించిన కర్తవ్యనిర్వహణం; అమరన్= ఒప్పియుండగా; నీకున్= నీకు; ఇహ, పర, శోభనంబు= ఈ లోకంలోనూ పరలోకంలోనూ కూడ కలిగే మేలు సులభము+అయ్యెన్= సులువు అయింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆ అర్జునుడు పరమేశ్వరుడు మొదలుగా గల దేవతలనేకుల దయవలన అస్త్రలాభం పొంది రావటం నీ భాగ్యంకదా! దానివలన నీవు కృతార్థుడ వైనావు. ఓ పవిత్రచరిత్రా! ధర్మాచరణలో నీకున్న నిష్ఠ, నీ తపస్సే దీనికంతకు కారణం. ఓ రాజశ్రేష్ఠుడా! నీ కెల్లప్పుడూ రాజ్యంకంటె ధర్మమే ఇష్టమై ఉంటుంది. నీవు వేదవేదాంగాలను తెలిసినవాడవు, అనేక యజ్ఞాలు చేసినవాడవు, విలువిద్యలో ఆరితేరినవాడవు. భూమి నంతటినీ పరిపాలించగల రాజధర్మం నీయందు ప్రకాశిస్తూ, నీకు ఇహంలోనూ పరంలోనూ శుభాన్ని సులభ సాధ్యం చేసింది.

**చ. దమమును సత్యయుక్తియును ధైర్యనిరూఢియు నిత్యతృప్తియున్**
**శమమును నీకు నైజములు; సన్మతి నర్థవశంబుఁ గామలో**
**భములును బొందఁ; వట్లగుటఁ బార్థివకుంజర! ధర్మరాజనా**
**మమునఁ ద్రిలోకపూజ్యమహిమం బొగడొందెద వివ్విధంబునన్.' 154**

**ప్రతిపదార్థం:** పార్థివ, కుంజర!= రాజులలో శ్రేష్ఠుడైనవాడా!; దమమును= ఇంద్రియ నిగ్రహమున్నూ; సత్య, యుక్తియును= నిజాన్నే మాటాడే నైపుణ్యమున్నూ; ధైర్య, నిరూఢియున్= చిత్తస్థైర్యమున్నూ; నిత్య, తృప్తియున్= ఎల్లప్పుడున్నూ తనివి చెందటమున్నూ; శమమును= అంతరింద్రియ నిగ్రహమున్నూ; నీకున్= నీకు (ధర్మరాజునకు); నైజములు= స్వభావసిద్ధాలు; సత్+మతిన్= సన్మతిన్= మంచి బుద్ధి ఉండటంచేత; అర్థ వశంబున్= ధనానికి లోబడటం; కామలోభములును+పొందవు= కోర్కెలకు దురాశలకు నీవు లోబడవు; అట్లు+అగుటన్= ఆ విధంగా ఉండటంచేత; ధర్మరాజ నామమునన్= ధర్మరాజు అనే పేరుతో; ఈ+విధంబునన్= ఈ రీతిగా; త్రిలోక, పూజ్య, మహిమన్= మూడులోకాలలో ఆరాధించదగిన గొప్పదనంతో; పొగడు+ఒందెదవు= కీర్తి నార్జిస్తూ ఉన్నావు.

**తాత్పర్యం:** ఇంద్రియ నిగ్రహం, సత్యసంధత, ధైర్యసాహసాలు, ఎల్లప్పుడూ తనివిచెంది ఉండటం, అంతరింద్రియ నిగ్రహం నీకు సహజగుణాలు. మంచిబుద్ధి కలవాడవైనందున నీవు ధనానికి లోబడిఉండవు. నీకు దురాశలు లేవు.

రాజులలో శ్రేష్ఠుడవైన ఓధర్మరాజా! నీవు సార్థకనామధేయుడవు. అందుచేతనే, నీకు మూడులోకాలలోనూ ఆరాధించదగిన గొప్పదనం ఏర్పడింది.'

**వ. అని వెండియు. 155**

**ప్రతిపదార్థం:** అని, వెండియున్= అనిచెప్పి, మరియు.

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**శా. 'ద్యూతవ్యాజమునన్ సభాంగణమునన్ దుర్యోధనుం డట్లు దు**
**ర్నీతిం గూరి యొనర్చినట్టి యఘముల్ నిష్కంపధైర్యోన్నమ**
**చ్చేతస్సారుఁడ వైన నీ కొకనికిం జెల్లెన్ సహింపంగ; వి**
**ఖ్యాతక్షాంతులు లేరె ధార్మికులు? నిక్కం, బిట్టిరే యెవ్వరున్? 156**

**ప్రతిపదార్థం:** ద్యూత, వ్యాజమునన్= జూదం అనే మిషచేత; సభా+అంగణమునన్= సభా ప్రదేశంలో; దుర్యోధనుండు= దుర్యోధనుడు; అట్లు= ఆవిధంగా; దుస్+నీతిన్+కూరి= చెడ్డ నీతిలో చొచ్చి; ఒనర్చినట్టి= చేసినట్టి; అఘముల్= పాపాలు; నిస్+కంప, ధైర్య+ఉత్+నమత్+చేతస్+సారుఁడవు+ఐన= చలించని ధైర్యంచేత పెంపొందించబడిన మనస్ స్థైర్యం కలిగినవాడవు అయిన; నీకున్+ఒకనికిన్= నీకు ఒక్కడికి మాత్రమే; సహింపంగన్+చెల్లెన్= ఓర్చుకొనటానికి వీలైంది; ధార్మికులు= ధర్మం ప్రకారం నడచుకొనేవారు; విఖ్యాత, క్షాంతులు= పేరు కెక్కిన సహనస్వభావం కలవారు; లేరె= లేరా, (అనగా ఉన్నారు కాని); ఎవ్వరున్= ఇంకెవ్వ రైనను; నిక్కంబు= నిజంగా; ఇట్టిరు+ఏ= ఇట్టి వారలా? (నీవంటివారలు కారు సుమా).

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఆనాడు నిండుకొలువుకూటంలో జూదం అనే మిష కల్పించి దుర్యోధనుడు ఆరీతిగా ఎంతటి దురంతాలకు ఒడి గట్టాడు! అటువంటి ఘోరమైన పాపకృత్యాలను నీవు కాబట్టి సహించ గలిగావు. నీ క్షమాగుణం ప్రశంసించతగింది, చలించని మనోధైర్యంతో కూడిన అట్టి సహనం నీకొక్కడికే చెల్లింది. లోకంలో సహనశీలురు పలువురు ఉండవచ్చు నేమో కాని, నిజంగా నీవంటివారు మరెవ్వరైనా ఉన్నారా?

**ఉ. ఉల్లము సత్యసంయమము నూనినవాఁడవు నీవు విక్రమం**
**బొల్లమిఁ గౌరవాధములయుద్ధతి యమ్మెయిఁ జెల్లెఁగాక; యొం**
**డెల్లను నేల? నీదుమది నించుక కిన్క జనించినన్ మహీ**
**వల్లభ! యప్డ రూపఱదె వారక వైరికులంబు సర్వమున్. 157**

**ప్రతిపదార్థం:** మహీవల్లభ!= భూమికి భర్తవైన ఓ రాజా- ధర్మరాజా!; సత్య, సంయమమున్= సత్యవ్రతం గల; ఉల్లమున్= మనస్సును; ఊనినవాఁడవు= కలవాడవు; నీవు= నీవు; విక్రమంబు+ఒల్లమిన్= పరాక్రమం ప్రదర్శించటానికి ఇష్టపడకపోవటంచేత; కౌరవ+అధముల= కౌరవ కులంలో నీచులైనవారి (దుర్యోధనాదులయొక్క); ఉద్ధతి= దర్పం; ఆ+మెయిన్= ఆవిధంగా; చెల్లెన్+కాక= సాగింది కాని; ఒండు+ఎల్లనున్+ఏల?= వేరొక రీతి అంతా ఎందుకు?; నీదు, మదిన్= నీ మనస్సులో; ఇంచుక, కిన్క= కొంచెం కోపం; జనించినన్= పుట్టినట్లైతే (కలిగినట్లైతే); అపుడు+అ= అప్డ= అప్పుడే; వారక= ఉడుగక; వైరి, కులంబు= శత్రుసముదాయం; సర్వమున్= సమస్తమున్నూ; రూపు+అఱదె= నశించదా?

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నీవు సత్యసంధతతో కూడిన హృదయంకలవాడవు. హింసతో కూడిన పరాక్రమం నీకు ఇష్టం కాలేదుకాని, నీవే కాస్త కోపించి విజృంభించి ఉంటే కౌరవులదర్పం ఆ విధంగా కొనసాగిఉండేది కాదు. వేరుమాట లెందుకు? నీ మనస్సులో ఇంచుక కోపం ప్రజ్వరిల్లినట్లయితే నీ శత్రువు లందరూ ఆ క్షణంలో నశించి పోయి ఉండేవారుకదా!

**చ. వినుత భవన్నియోగ మను వేల యలంఘ్యము గాన యిమ్మెయిన్**
**ఘనభుజవీచివిభ్రమవికాసముఁ జూపక నిల్చెఁ గాక స**
**జ్జననుత! చూడ నీ యనుజసాగరముల్ దఱితోడ విద్విష**
**జ్జనలయకాలులై కడఁగు సర్వజగంబుల నాక్రమింపఁగన్. 158**

**ప్రతిపదార్థం:** సత్+జన నుత!= మంచివారిచేత పొగడబడినవాడా!; నీ+అనుజసాగరముల్= నీ తమ్ములు అనే సముద్రాలు; వినుత= గొప్పగా పొగడబడిన; భవత్+నియోగము+అను, వేల= నీయొక్క ఆజ్ఞ అనే చెలియలికట్ట; అలంఘ్యము= దాట రానిది; కాన= కాబట్టి; ఈ+మెయిన్= ఈవిధంగా; ఘన, భుజ, వీచి, విభ్రమ, వికాసమున్= గొప్పవైన భుజాలు అనే కెరటాల ఉవ్వెత్తు పొంగును; చూపక నిల్చెన్+కాక= ప్రదర్శించకున్నాయి కాని; చూడన్= అరయగా; తఱితోడన్= అవకాశం వచ్చినపుడు; విద్విషత్+జన, లయకాలులు+ఐ= శత్రువులు అయిన జనులకు ప్రళయకాలంలోని యములు ఔతూ; సర్వ జగంబులన్= అన్ని లోకాలను; ఆక్రమింపఁగన్= కైవసం చేసికొనటానికి; కడఁగున్= పూనుకొంటాయి.

**తాత్పర్యం:** నీ తమ్ములు సముద్రాలవంటివారు. నీ ఆనతి అనే చెలియలికట్ట వారికి మీరరానిది. అందుచేత వారు పరాక్రమవిజృంభణం చూపక ఆగారు. వారి భుజ పరాక్రమప్రాభవం ఉవ్వెత్తుగా లేచి పొంగారే కడలి కెరటాల వంటిది! అయినప్పటికిని అవకాశం వచ్చినప్పుడు సమస్తలోకాలను ఆక్రమించుకొనగలిగిన శక్తి వారికి ఉన్నది. అదను దొరికినప్పుడు వారు శత్రువులను ప్రళయకాలంలోని యముడివలె విజృంభించి నాశనం చేయగలరు!

**విశేషం:** అలం: రూపకం. ధర్మరాజు నియోగం=వేల. అనుజులు= సాగరాలు, ఘనభుజాలు= వీచి విభ్రమ వికాసం. ఉపమేయాలకు, ఉపమానాలకు అభేదాధ్యవసాయం కల్పించబడింది. ప్రళయకాలంలో సముద్రాలు, యముడు విజృంభించటం ఉపపన్నం.

**ఉ. అంధక వృష్ణి భోజ కుకురాన్వయభూపతు లెల్ల నీదెసన్**
**బాంధవ సౌహృద ప్రణయ భక్తివిశేషము లొప్ప నీ మనో**
**గ్రంథి యడంగఁజేయ నెసకంబునఁ బూనినవారు లోభ మో**
**హాంధులు ధార్తరాష్ట్రులు జనాధిప! మార్కొనువారె వారలన్? 159**

**ప్రతిపదార్థం:** జన+అధిప!= జనులకు అధిపతి అయినవాడా, ఓ ధర్మరాజా!; అంధక, వృష్ణి, భోజ, కుకుర+అన్వయ, భూపతులు+ఎల్లన్= అంధక, వృష్ణి, భోజ, కుకుర వంశాలకు సంబంధించిన రాజులు అందరున్నూ; నీదెసన్= నీయెడ; బాంధవ, సౌహృద, ప్రణయ, భక్తి, విశేషములు+ఒప్పన్= చుట్టరికం, మైత్రి, ప్రేమ, ఆరాధనతో కూడిన గొప్పభావాలు అలరారేటట్లుగా; నీ, మనస్+గ్రంథి= నీ మనస్సుకు సంబంధించిన కంతివంటి బాధను; అడంగన్+చేయన్= అణగేటట్లు చేయటానికి; ఎసకంబునన్= మిక్కుటమైన ఉత్సాహంతో; పూనినవారు= పట్టుదల వహించి ఉన్నారు; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుడి

కుమారులైన కౌరవులు; లోభ, మోహ+అంధులు= దురాశచేత, భ్రాంతిచేత కనులు కానవివారు; వారలన్=వారిని (ఆ రాజులనందరిని); మార్కొనువారు+ఎ?= ఎదిరించి పోరాడగలిగినవారా?

**తాత్పర్యం:** ధర్మరాజా! అంధక, వృష్ణి, భోజ, కుకుర వంశాలకు చెందిన ప్రభువులు అందరూ నీయెడ బంధు ప్రేమతో, స్నేహంతో, పూజ్యభావంతో నీ మానసిక వ్యాకులతను పోగొట్టటానికై ఉత్సహిస్తున్నారు. దురాశతో భ్రాంతితో కన్నులు కన్పించక గ్రుడ్డివారైన ధార్తరాష్ట్రులు ఆ రాజులను అందరిని ఎదిరించి పోరాడగలరా?

**క. చతురంభోధిపరీత । క్షితితల సామ్రాజ్యలక్ష్మికిం బతివి జగ
న్నుత! నీవ; నీవు దలఁచిన । నతిదుష్కర మెందు లే దనర్గళమహిమన్.' 160**

**ప్రతిపదార్థం:** జగత్+నుత!= లోకంలోని ప్రజలచేత పొగడబడినవాడా, ఓ ధర్మరాజా!; నీవు+అ= నీవే; చతుర్+అంభస్+ధి, పరీత, క్షితి తల, సామ్రాజ్య, లక్ష్మికిన్= నాలుగు సముద్రాలచేత చుట్టుకొనబడి ఉన్న గొప్ప రాజ్యసంపదకు; పతివి= భర్తవు; అనర్గళ, మహిమన్= అడ్డు లేని ప్రాభవంతో; నీవు= నీవు; తలఁచినన్= తలచుకొంటే; ఎందున్= ఎచ్చటను; అతిదుష్కరము= మిక్కిలి చేయలేనిది అంటూ ఏదీ; లేదు= లేదు.

**తాత్పర్యం:** జగత్తులోని ప్రజలచేత పొగడబడిన ఓ ధర్మరాజా! నీవు సంకల్పిస్తే చేయలేని పని ఎక్కడాలేదు. నాలుగుసముద్రాలచేత ఆవరించబడిన సువిశాల సామ్రాజ్యానికి నీవే సార్వభౌముడవు.'

**విశేషం:** జగత్+నుత= జగన్నుత, జగత్తు అనగా జగత్తులోని ప్రజలు. ఇది అజహల్లక్షణ అని ఆలంకారిక నిర్దేశం. జగత్తు అనే పదాన్ని వదలకుండ జగత్తులోని ప్రజలు అని ఇట అర్థం చెప్పవలసివచ్చింది. కావున అజహత్= వదలని, లక్షణ= లక్షణార్థం.

**వ. అనిన సంతసిల్లి కుంతీనందనుండు దేవకీనందనుతోడ 'దేవా! యెవ్విధంబున నైన నల్పావశిష్టంబైన వనవాసకాలంబును నజ్ఞాతవర్తనంబును దీర్చి, లోకనింద్యంబు గాని విక్రమంబునం బగఱ జయింపఁ గోరెదము; దీని నంతయు నిర్వహించు భారంబు నీయదియ; నిన్ను శరణంబు సొచ్చిన మాకుం బరమశోభనంబులును సులభంబు లగుట నిశ్చయంబుగాదె!' యనియె; నప్పుడు కృష్ణుండు నిజసమీపంబున నున్న పాంచాలిం జూచి యిట్లనియె. 161**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన; కుంతీనందనుండు= కుంతియొక్క కొడుకు ధర్మరాజు; సంతసిల్లి= సంతోషించి; దేవకీనందనుతోడన్= దేవకియొక్క కొడుకైన శ్రీకృష్ణుడితో; దేవా!= ప్రభువా!; ఏ+విధంబునన్+ఐనన్= ఏ విధంగానైనా; అల్ప+అవశిష్టంబు+ఐన= కొద్దిగా మిగిలి ఉన్నట్టి; వన, వాస, కాలంబునున్= అడవిలో నివసించవలసిన సమయాన్ని; అజ్ఞాత, వర్తనంబును= ఒరులకు తెలియకుండ బ్రదుక వలసిన నడవడికను; తీర్చి= నిర్వహించి; లోక, నింద్యంబు కాని= లోకులచేత నిందింపదగని; విక్రమంబునన్= పరాక్రమంచేత; పగఱన్= శత్రువులను; జయింపన్+కోరెదము= గెలువటానికి కోరుకొంటున్నాం; దీనిన్+అంతయున్= ఈ పనినంతటిని; నిర్వహించు= నెరవేర్చే; భారంబు= బరువు; నీ+అది+అ= నీదే; నిన్నున్= నిన్ను; శరణంబు+చొచ్చిన= కాపాడవలెననే కోరికతో ప్రార్థించి చేరిన; మాకున్= మాకు (పాండవులకు); పరమ, శోభనంబులును= గొప్ప మేళ్ళు; సులభంబులు+అగుట= సులువుగా చేకూరుట; నిశ్చయంబు= ధ్రువం; కాదె= కదా; అనియెన్= అని అన్నాడు; అప్పుడు= ఆ సమయంలో, కృష్ణుండు= కృష్ణుడు; నిజసమీపంబునన్+ఉన్న= తనకు దగ్గరగా ఉన్న; పాంచాలిన్= ద్రౌపదిని; చూచి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు చెప్పిన మాటలకు ధర్మరాజు సంతోషించాడు. అప్పుడు ధర్మరాజు ఈవిధంగా సమాధానం చెప్పాడు- 'దేవా! మా ఒడంబడిక ప్రకారం ఇంక మేము నిర్వహించవలసిన అరణ్యవాసం ఎంతోకాలం మిగిలి ఉండలేదు. ఆ స్వల్పవనవాసాన్నీ, మరియు ఒకయేడు అజ్ఞాతవాసాన్నీ ఎట్లో ముగియజేసికొన్నపిమ్మట మాపరాక్రమం చూపటం మంచిది. అప్పుడు మమ్మల్ని లోకం నిందించదు కదా! దీనినంతా నిర్వహించేభారం నీదే. మేము నీభక్తులం; నిన్ను శరణు చొచ్చిఉన్నాం. ఇక మాకు మేలు కలగటం ధ్రువం'. అంతట శ్రీకృష్ణుడు తనకు దగ్గరగా నిలిచిఉన్న ద్రౌపదితో ఈవిధంగా పలికాడు.

**సీ.** **'నీ పుత్త్రులేవురు నీరజలోచన! । యదుకుమారులుఁ దారు ముదముతోడ**
**ననుపమ స్నేహసమాహితహృదయు లై । కరిహయారోహణపరతఁ దగిలి**
**యాడుచు, వివిధశస్త్రాస్త్ర ప్రయోగముల్ । గఱచుచు నొండెల్ల మఱచి యున్న**
**వారు; ప్రద్యుమ్నుండు వారికి దివ్యాస్త్ర । జాతంబు లెల్లను బ్రీతి నొసఁగెఁ;**

**ఆ.** **దన్వి యా సుభద్ర తన పుత్త్రుకంటె నీ । తనయులందుఁ గూర్మిఁ దనరఁ జేయు;**
**నూఱడిల్లు మింక; నుజ్జ్వలోన్నతులఁ బెం । పారఁ గాల మనతిదూర మయ్యె'.** **162**

**ప్రతిపదార్థం:** నీరజలోచన!= పద్మాలవంటి కన్నులు కల ద్రౌపదీ!; నీపుత్త్రులు= నీకొడుకులు; ఏవురు= ఐదుగురు; యదు, కుమారులున్= యదువంశంలోని బాలురూ; తారు= తామూ; ముదముతోడన్= సంతోషంతో; అనుపమ, స్నేహ, సమాహిత, హృదయులు+ఐ= సాటిలేని చెలిమితో ఏకమైన హృదయాలు కలవారలై; కరి, హయ+ఆరోహణ, పరతన్= ఏనుగులను, గుర్రాలను ఎక్కి స్వారి చేయటంలోని దీక్షతో; తగిలి+ఆడుచున్= ఉత్సహిస్తూ; వివిధ, శస్త్ర+అస్త్రప్రయోగముల్= పెక్కు శస్త్రాలను అస్త్రాలను ప్రయోగించటం; కఱచుచున్= నేర్చుకొంటూ; ఒండు+ఎల్లన్, మఱచి, ఉన్నవారు= మిగిలినది అంతా విస్మరించి ఉన్నారు; వారికిన్= (ద్రౌపదికుమారులకు, యాదవకుమారులకు); ప్రద్యుమ్నుండు; దివ్య+అస్త్ర, జాతంబులు+ఎల్లను= దైవసంబంధ మైన మంత్రబాణ సముదాయాలను అన్నింటిని; ప్రీతిన్= సంతోషంతో; ఒసఁగెన్= ఇచ్చాడు; తన్వి, ఆ సుభద్ర= సుకుమారి అయిన ఆ సుభద్ర; (శ్రీకృష్ణుడి చెల్లెలు- అర్జునుడిభార్య); తన, పుత్త్రుకంటెన్= తనకొడుకు (అభిమన్యుడి) కంటె; నీ, తనయులందున్= నీయొక్క కొడుకులయందు; కూర్మిన్= ప్రేముడిని; తనరన్+చేయున్= విలసిల్లజేస్తుంది; ఇంకన్= ఇకమీద; ఊఱడిల్లుము= ఉపశాంతిచెందుము; ఉజ్జ్వల+ఉన్నతులన్+పెంపు+ఆరన్= వెలుగొందే అభివృద్ధితో అతిశయించటానికి; కాలము= సమయం; అనతిదూరము+అయ్యెన్= తక్కువ దూరం అయింది- అంటే సమీపించింది.

**తాత్పర్యం:** 'ద్రౌపదీ! నీఐదుగురు కొడుకులు యాదవరాజకుమారులతో పాటు సంతోషంగా కాలం గడుపుతున్నారు. వారు యదుకుమారులతోపాటు ఏనుగులను ఎక్కటం, గుర్రాలను స్వారీ చేయటం మున్నగు వీరకృత్యాలతో అస్త్రశస్త్రాలు ప్రయోగించటం అభ్యసిస్తూ, మిగిలిన అంశాలను అన్నిటినీ మఱచి ఉత్సాహంతో ఉన్నారు. ప్రద్యుమ్నుడు వారందరికి దివ్యాస్త్రాలను ప్రీతితో ఇచ్చాడు. సుభద్ర తన కొడుకుమీదకంటె, ఎక్కువ ప్రేముడితో నీకొడుకులను ఆదరిస్తున్నది. ఇక నీవు ఊరడిల్లవచ్చును. పాండవులెల్లరు ఉజ్జ్వలమైన ఉన్నతులతో వెలుగొందే శుభసమయం సమీపిస్తున్నది.'

## మార్కండేయుండను మహాముని పాండవులయొద్దకు వచ్చుట (సం. 3-180-39)

**వ. అని యాశ్వాసించు సమయంబునం బరమతపోవృద్ధుం డయిన మార్కండేయుండు సనుదెంచినం గృష్ణుండును బాండవులును నతని నెదుర్కొని యథోచితవిధులం బూజించిరి; మునీంద్రుండును బ్రత్యేకంబ వారి కుశలంబు లడిగెఁ; దదనంతరంబ యందఱు నాసీనులై యున్నయెడఁ బాండవహితార్థియై వనజోదరుం డమ్మునివరున కి ట్లనియె. 163**

**ప్రతిపదార్థం:** అని= ఆవిధంగా చెప్పి; ఆశ్వాసించుసమయంబునన్= (ద్రౌపదిని) ఓదార్చే సమయంలో; పరమ, తపస్+వృద్ధుండు= మిక్కుట మైన తపస్సుచేత అధికుడైన వాడు; మార్కండేయుండు= మార్కండేయుడు (అనెడి ముని); చనుదెంచినన్= రాగా; కృష్ణుండును= శ్రీకృష్ణుడును; పాండవులును; అతనిన్= (మార్కండేయుడిని); ఎదుర్కొని= ఎదురుగా వెడలి స్వాగతం చెప్పి; యథా+ఉచిత, విధులన్= ఆ (సమయానికి) తగినట్లు, సంప్రదాయానికి అనుగుణమైన మర్యాదలతో; పూజించిరి= ఆరాధించారు; ముని+ఇంద్రుండును= ఋషులలో శ్రేష్ఠుఁడు అయిన మార్కండేయుడును; ప్రత్యేకంబు+అ= విడివిడిగా, విశేషంగా; వారి కుశలంబులు= వారి యోగక్షేమాలు; అడిగెన్= ప్రశ్నించి తెలిసికొన్నాడు; తద్+అనంతరంబు+అ= అటుమీదట; అందఱున్= అందరును; ఆసీనులు+ఐ+ఉన్న+ఎడన్= కూర్చొని ఉన్న సమయంలో; పాండవ, హిత+అర్థి+ఐ= పాండవులమేలు కోరినవాడై; వనజ+ఉదరుండు= శ్రీకృష్ణుడు; ఆ+మునివరునకున్= ఆమునులలో శ్రేష్ఠుడైన వాడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్పి శ్రీకృష్ణుడు ద్రౌపదీదేవిని ఊరడించాడు. ఆ సమయాన తపోవృద్ధుడైన మార్కండేయ మహర్షి అక్కడికి వచ్చాడు. వచ్చిన మునీశ్వరుడికి కృష్ణుడూ పాండవులూ ఎదురేగి ఆహ్వానించి, ఆతిథ్యస్వాగత మర్యాదలతో అతడిని అర్చించారు. మార్కండేయుడు అందరి యోగక్షేమాలు విచారించాడు. అందరు కూర్చొని ఉన్నపిదప, పాండవుల మేలుకోరేవాడై శ్రీకృష్ణుడు ఆ మునివరుడితో ఇట్లా పలికాడు.

**ఉ. 'ఏనును బాండునందనులు నిమ్మునిముఖ్యులు నిప్డు లోకస**
**మ్మానితవాక్య! నీదయిన మంజులవాగమృతప్రవాహమున్**
**వీనులదోయి నించుచును వేడుకఁ గ్రోలికొనంగ నాత్మలం**
**బూనెద; మస్మదీప్సితము పూర్ణము సేయఁగ నర్హ మెమ్మెయిన్. 164**

**ప్రతిపదార్థం:** లోక, సమ్మానిత, వాక్య!= లోకంలోని జనులచేత గౌరవించబడినమాటలు కలవాడా!; ఏనును= నేనున్నూ; పాండునందనులున్= పాండవులున్నూ; ఈ+ముని ముఖ్యులున్= మునులలో శ్రేష్ఠులైన వీరున్నూ; ఇప్డు= ఇప్పుడు; నీదు+అయిన= నీ యొక్క; మంజుల, వాక్+అమృత, ప్రవాహమున్= మనోహరమైన మాటలు అనే అమృతధారను; వీనులదోయిన్= రెండుచెవులలోనూ; నించుచును= నింపుకొంటూ; వేడుకన్+క్రోలికొనంగన్= సంబరంతో ఆస్వాదించ గోరి; ఆత్మలన్+పూనెదము= మనసార కోరుకొంటాము; ఏ+మెయిన్= ఏవిధంగానైనా; అస్మత్+ఈప్సితము= మాకోరిక; పూర్ణము, చేయఁగన్= నెరవేర్చటానికి; అర్హము= తగింది.

**తాత్పర్యం:** 'వాక్య నిపుణుడవైన మార్కండేయమహర్షీ! నేనున్నూ, పాండవులున్నూ ఇక్కడి మునిశ్రేష్ఠులున్నూ మీ మాటలను వినవలె నని ఉవ్విళ్ళూరుతున్నాం. మీ పలుకులు లోకంలోని ప్రజ లెల్లరూ గౌరవించేవి. మీ వాగమృతం మా వీనులకు విందు చేయాలి. మా ఈ కోరికను తాము దయచేసి మన్నించ వేడికోలు.

**వ. కావున. 165**

**తాత్పర్యం:** కాబట్టి.

**క. దేవ నరదేవ ధరణీ । దేవ చరిత్రములు భర్తృదేవత లనఁగా**
**భూవినుత లయిన సతుల ప్ర । భావము లెఱిఁగింపు మోలిఁ బ్రస్ఫుటములుగన్.' 166**

**ప్రతిపదార్థం:** దేవ, నరదేవ, ధరణీదేవ, చరిత్రములు= దేవతలయొక్కయు, రాజులయొక్కయు, బ్రాహ్మణులయొక్కయు జరిగినకథలు; భర్తృదేవతలు= పతివ్రతలు; అనఁగాన్= అని; భూవినుతలు= భూమియందు కీర్తించబడినవారు అనగా అశేషభూజనులచేత ప్రశంసించబడినవారు; అయిన; సతుల= మంచి ఇల్లాండ్ర యొక్క; ప్రభావములు= మహిమలు; ఓలిన్= వరుసగా; ప్రస్ఫుటములుగన్= తేటతెల్ల మయ్యేటట్లుగా; ఎఱిఁగింపుము= తెలియజెప్పుము.

**తాత్పర్యం:** దేవతల, రాజుల, బ్రాహ్మణుల వృత్తాంతాలను, మహాపతివ్రతలుగా భూలోకంలో యశస్సు నార్జించిన సతీమణుల మహిమలను వరుసగా తేటతెల్ల మయ్యేటట్లు ఎఱిగించుము.'

**వ. అని యడుగుచున్నయెడ నారదుం డేఁగుదెంచిన, నందఱు ప్రత్యుద్గతు లయి ప్రణమిల్లి యాతని నుచితసత్కారంబులం బ్రీతునింజేసిన, నమ్మహాముని మార్కండేయునింజూచి 'కృష్ణపాండవప్రియార్థంబుగాఁ బరమపుణ్య కథాకథనం బొనరింతువుగాక!' యని పలికి వారల నామంత్రణంబు సేసి నిజేచ్ఛం జనియెఁ; దదనంతరంబ ధర్మతనయుండు మార్కండేయున కి ట్లనియె. 167**

**ప్రతిపదార్థం:** అని, అడుగుచున్న; ఎడన్= ఆ విధంగా ప్రశ్నిస్తున్న సమయంలో; నారదుండు= నారదుడు; ఏఁగుదెంచినన్= రాగా; అందఱు= అచట ఉన్న పాండవులు మున్నగువారు అందరున్నూ; ప్రత్యుద్గతులు+అయి= లేచి (సగౌరవంగా) నిల్చినవారై; ప్రణమిల్లి= నమస్కరించి; ఆతనిన్= ఆ నారద మహర్షిని; ఉచిత, సత్కారంబులన్= తగినమర్యాదలతో (మన్నించి); ప్రీతునిన్= సంతృప్తి చెందినవాడినిగా; చేసినన్= చేయగా; ఆ+మహాముని= ఆ నారదమహర్షి; మార్కండేయునిన్; చూచి; కృష్ణ, పాండవ, ప్రియ+అర్థంబుగాన్= శ్రీకృష్ణుడికి పాండవులకు సంతసం కలిగేటట్లుగా; పరమ పుణ్య, కథా, కథనంబు= గొప్పశుభ ఫలాల నిచ్చే వృత్తాంతాలను చెప్పటం; ఒనరింతువు+కాక= చేయుదువు గాక; అని పలికి= అని చెప్పి; వారలన్; ఆమంత్రణంబు, చేసి= వీడ్కోలు చెప్పి; నిజ+ఇచ్ఛన్= తనకు ఇష్టమైన చొప్పున; చనియెన్= వెళ్ళాడు; తద్+ అనంతరంబు+అ= అటు పిమ్మట; ధర్మతనయుండు= ధర్మపుత్రుడు; మార్కండేయునకున్; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని ప్రశ్నిస్తున్న సమయాన నారదమహాముని అక్కడికి వచ్చాడు. అందరున్నూ ఆమహర్షికి ఎదురేగి నమస్కరించి, తగిన మర్యాదలతో సంభావించి అతడిని ఆనందింప జేశారు. ఆ నారదమహర్షి, మార్కండేయుడిని చూచి, 'కృష్ణుడు, పాండవులు సంతోషించేటట్లు పుణ్యకథలు చెప్పుము' అని పలికి, వారలను వీడ్కొని తాను ఇచ్చ వచ్చిన చొప్పున వెళ్ళాడు. అటుపిమ్మట ధర్మరాజు మార్కండేయ మహర్షితో ఈ విధంగా అన్నాడు.

**సీ. 'కడఁగి ధర్మముతోడ నడచుచు నే మిట్లు । దందడి దుఃఖంబుఁ బొందుటయును**
**నేపున నెప్పుడు పాపంబు సేయుచు । ధృతరాష్ట్రజులు సుఖోన్నతు లగుటయుఁ,**

**గని యివ్విపర్యయమునకు నే నూహింతుఁ । బాయక నరుఁ డిప్డు సేయు కర్మ**
**మున ఫల మిందుఁ బొందునొ? పరలోకంబు । నందుఁ బొందునొ? యిందు నందుఁ గనునొ?**

**ఆ. విశ్వకర్తయైన యీశ్వరుఁ గానని । పురుషుఁ గర్మఫలము పొరయకున్నె ?**
**యొడలితోనఁ గృతము వెడలిపోవునొ? యిది । దెలియవలయు నాకు నలఘుపుణ్య ! 168**

**ప్రతిపదార్థం:** అలఘుపుణ్య!= తక్కువకాని, అనగా గొప్పపుణ్యం కలవాడా!; కడఁగి= పూని; ధర్మముతోడన్= న్యాయంతో కూడిన ప్రవర్తనతో; నడచుచున్= ప్రవర్తిస్తూ; ఏము= మేము; ఇట్లు= ఈవిధంగా; దందడి= అధికమైన; దుఃఖంబు= బాధ; పొందుటయును= అనుభవించటయున్నూ; ఏపునన్= అతిశయించి; ఎప్పుడు= ఎల్లప్పుడు; పాపంబు= పాపం; చేయుచున్= ఆచరిస్తూ; ధృతరాష్ట్రజులు= ధృతరాష్ట్రుడి కొడుకులు; సుఖ+ఉన్నతులు= సౌఖ్యాన్ని పొందటంచేత గొప్పవారు; అగుటయున్; కని= చూచి; ఈ+విపర్యయమునకున్= ఈతారుమారునకు; ఏన్= నేను; ఊహింతున్= ఈవిధంగా ఊహచేస్తాను (భావిస్తాను); నరుఁడు= మానవుడు; ఇప్డు= ఇపుడు; చేయు= ఒనరించే; కర్మమునన్= పనివలన; ఫలము= ఫలితం; ఇందున్= ఈ ఇహలోకంలో; పొందునొ?= అనుభవిస్తాడా?; పర, లోకంబునందున్= మరణించిన పిదప ఐన లోకంలో; పొందునొ?= అనుభవిస్తాడా?; ఇందున్= ఈ లోకంలోనూ; అందున్= పరలోకంలోనూ; కనునొ?= పొందుతాడా?; విశ్వ కర్త+ఐన= సృష్టినిర్మాత అయిన; ఈశ్వరున్= దేవుడిని; కానని= చూడని; పురుషున్= మనుజుని= మానవుడిని; కర్మఫలము= చేసిన పనుల ఫలితం; పొరయక+ఉన్నె= చేరకుండునా; ఒడలితోనన్= దేహంతోనే; కృతము= చేసినకర్మ; వెడలిపోవునొ?= తొలగిపోతుందా?; ఇది= ఈవిషయం; నాకున్, తెలియవలయున్= నాకు తెలిసికొనవలసినట్టిది.

**తాత్పర్యం:** 'మార్కండేయ మహామునీ! మేము పూనికతో ధర్మం ఆచరిస్తున్నవారమే అయినప్పటికీ ఈవిధంగా ఇడుమలు పొందుతూ మిక్కుట మైన దుఃఖాన్ని అనుభవిస్తున్నాం. ధృతరాష్ట్రుడి కొడుకులు ఎల్లప్పుడు పాపకార్యాలనే చేస్తున్నవారే అయినప్పటికీ గొప్పసౌఖ్యాలను అనుభవిస్తున్నారు. ఈ విపరీతస్థితిని గురించి నేను ఎక్కువగా ఆలోచించవలసి వస్తోంది. నా ఈ ధర్మసందేహాన్ని దయచేసి తాము తీర్చాలి. మనుజుడు ఈభూలోకంలో ఇప్పుడు చేసే కర్మఫలం ఇక్కడే ఇప్పుడే అనుభవిస్తాడా? పరలోకంలో అనుభవిస్తాడా? లేక ఇహంలోనూ పరంలోనూ కూడా అనుభవిస్తాడా? సృష్టికర్తఅయిన పరమేశ్వరుడిని సందర్శించని మానవుడిని కర్మఫలం పొందకుండా ఉంటుందా? మరణించిన పిదప శరీరపాతంతోపాటు చేసిన కర్మకూడా వెడలిపోతుందా? ఓ మహానుభావా! ఈ విషయాన్ని నాకు తేటతెల్లం చేయండి.

**విశేషం:** ఇది గొప్ప ప్రశ్న! చెడ్డవారు ఎందుకు సౌఖ్యాలు అనుభవిస్తున్నారు? మంచివారికే ఎందుకు దుఃఖం సంప్రాప్తిస్తున్నది? మహాభారతంలో ఈ ప్రశ్నకు సమాధానం పలుతావుల చర్చించబడింది.

**వ. ఇంతయు నెఱింగింప నీవ యర్హుండ' వనినఁ బరమజ్ఞాననిధి యైన యత్తపోనిధి యతని కి ట్లనియెఁ 'దొల్లి విధాత ప్రథమకల్పంబున నత్యంతనిర్మలంబులును ధర్మతంత్రంబులును నైన శరీరంబులు సృజియించె; నట్లు పుట్టింపఁబడిన యా మనుష్యులు మహాసత్త్వసంపన్నులు, సత్యవాదులు, సత్యసంకల్పులు, బ్రహ్మభూతాత్ములు, స్వచ్ఛందజీవులు నై దేవయానంబుల విహరించుచు ననాయాసంబున నధికఫలసిద్ధింబొందుచు, సర్వ ధర్మజ్ఞులై విగతమత్సరులై బహుసహస్రసంతానులై బహుసహస్ర సంవత్సరాయుష్యులై వర్తిల్లుచుండి; రంతఁ గాలాంతరంబునం గామక్రోధాది గుణంబులు దమ్ముం బొందుటయు మాయా ప్రవర్తనులై దేవతలచేత**

**విడువంబడి యల్పాయువులు, నల్పబలశరీరసత్త్వులును, దరిద్రులును, నిష్ఫలారంభులును, బహురోగ పీడితులును, నాస్తికులును నై యొండొరుల మెచ్చక దురితంబులు సేయుచుఁదిర్యగ్యోనులం బుట్టుచు, నరకాగ్నులం గ్రాఁగుచు, గతాగతభ్రమణంబుల నలయం దొడంగి; రిట్లు దిరుగుచున్న సంసార చక్రంబునందు. 169**

**ప్రతిపదార్థం:** ఇంతయున్= ఈ విషయాన్ని అంతటిని; ఎఱింగింపన్= తెలియచెప్పటానికి; ఈవు+అ= నీవుమాత్రమే; అర్హుండవు= తగినవాడవు, సమర్థుడవు; అనినన్= అని చెప్పగా; పరమ, జ్ఞాన, నిధి+ఐన= మిక్కిలి గొప్ప దైన జ్ఞానానికి నెలవు, పాదు అయిన; ఆ+తపస్+నిధి= తపస్సుకు ఆకరమైనవాడైన ఆ మార్కండేయ మహర్షి; అతనికిన్= అతడికి అనగా ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు; తొల్లి= పూర్వకాలంలో; విధాత= బ్రహ్మదేవుడు; ప్రథమ+కల్పంబునన్= మొట్టమొదటి 'కల్పం'లో (కల్పం అనగా మనుష్యమానంలో నాలుగు యుగాలు వేయిమారులు తిరిగి వస్తే బ్రహ్మకు ఒక పగలు ఔతుంది); అత్యంత, నిర్మలంబులును= మిక్కిలి స్వచ్ఛమైనవిన్నీ; ధర్మ, తంత్రంబులును+ఐన= ధర్మాన్ని అనుసరించి నడిచేవిన్నీ అయిన; శరీరంబులు= దేహాలు; సృజియించెన్= నిర్మించాడు; అట్లు= ఆవిధంగా; పుట్టింపఁబడిన= సృజించబడిన; ఆ, మనుష్యులు= ఆ మానవులు; మహాసత్త్వ సంపన్నులు= మిక్కిలి బలవంతులు; సత్యావాదులు= నిజం మాటాడేవారున్నూ, సత్యసంకల్పులు= నిజమయ్యే కోరికలు కలవారున్నూ; బ్రహ్మ, భూత+ఆత్ములు= జ్ఞానానుభూతిని పొందినవారున్నూ, (బ్రహ్మస్వరూపాన్ని పొందినవారు); స్వచ్ఛందజీవులును+ఐ= స్వాతంత్ర్యం కలిగి నడవడికను దిద్దుకొనినవారున్నూ అయి; దేవ, యానంబుల= దేవతలు చరించే మార్గాలలో; విహరించుచున్= తిరుగుతూ; అనాయాసంబునన్= శ్రమలేకుండగా; అధిక, ఫల, సిద్ధిన్= మిక్కుటమైన ఫలితం లభించటాన్ని; పొందుచున్= పొందుతూ; సర్వ, ధర్మ, జ్ఞులు+ఐ= అన్నిధర్మాలను తెలిసినవారై; విగత, మత్సరులు+ఐ= పోయిన మాత్సర్యం కలవారై అనగా అసూయాద్వేషాలు లేనివారై; బహుసహస్ర సంతానులు+ఐ= పెక్కువేలమంది కొడుకులు, కూతుళ్ళు కలవారై; బహుసహస్ర, సంవత్సర+ఆయుష్యులు+ఐ= పెక్కువేలేండ్ల ఆయుర్దాయం కలవారై; వర్తిల్లుచున్+ఉండిరి= బ్రదుకుతూ ఉండేవారు, సంచరిస్తూ ఉండేవారు; అంతన్= అటుపిమ్మట; కాల+అంతరంబునన్= తరువాతి కాలంలో; కామ, క్రోధ+ఆది, గుణంబులు= కామం, కోపం మొదలైన లక్షణాలు; తమ్మున్= తమను (అనగా ఆ మానవులను); పొందుటయున్= చేరటంవలన; మాయా, ప్రవర్తనులు+ఐ= చెడు నడవడిక కలవారై; దేవతలచేతన్= వేల్పులచేత; విడువన్+పడి= వదలివేయబడినవారై; అల్ప+ఆయువులు= తక్కువ కాలం బ్రదికేవారు; అల్ప, బల, శరీర, సత్త్వులును= తక్కువబలం, కల్గిన దేహం, సత్త్వగుణంకలవారున్నూ; దరిద్రులును= బీదవారున్నూ; నిష్ఫల+ఆరంభులును= ఫలించని ప్రయత్నాలు చేసేవారు - అనగా చేసిన ప్రయత్నాలు విఫలమయ్యేవారున్నూ; బహు, రోగ, పీడితులును= పెక్కు జబ్బులచేత బాధపడేవారున్నూ; నాస్తికులునున్+ఐ= వేదాలను, దేవుడిని తిరస్కరించే వారున్నూ అయి; ఒండొరులన్= ఒండు+ఒరులన్= ఒకరిని ఒకరు; మెచ్చక= అంగీకరించక; దురితంబులు= పాపాలు; చేయుచున్= ఆచరిస్తూ; తిర్యక్+యోనులన్= జంతువులయందు, పక్షులయందు; పుట్టుచున్= జన్మిస్తూ; (తిర్యగ్యోనులందు పుట్టటం అంటే పక్షిజాతులందుగాని, మృగజాతులందుగాని జన్మించటం); నరక+అగ్నులన్= నరకంలోని నిప్పు లందు; క్రాఁగుచున్= మండుతూ; గత+ఆగత, భ్రమణంబులన్= పోవటం, రావటం - అంటే చావటం పుట్టటం అనే వలయాలలో తిరగటంవలన; అలయన్+తొడంగిరి= అలసట చెందారు; ఇట్లు= ఈ రీతిగా; తిరుగుచున్న; సంసార, చక్రంబునందున్= ప్రపంచ మనే వలయంలో.

**తాత్పర్యం:** ఆ ప్రశ్నకు ఆ మార్కండేయమహర్షి మాత్రమే సముచితసమాధానం చెప్పగల సమర్థుడని ధర్మరాజు ఆ మహర్షిని ప్రశంసించాడు. గొప్పజ్ఞానం కలవాడైన మార్కండేయమహర్షి ధర్మరాజుతో ఈవిధంగా చెప్పాడు. 'ఓధర్మరాజా! పూర్వకాలంలో, బ్రహ్మదేవుడు తొలుత సృష్టికి ఉపక్రమించిన సమయంలో మనుష్యులశరీరాలు నిర్మలాలై ఉన్నాయి. వారు పుణ్యాత్ములై ఉన్నారు. అట్టి మనుజులు గొప్పబలవంతులై ఎల్లప్పుడు సత్యాన్నే పలికే

వారు. వారి కోరికలు ఈడేరేవి. వారు జ్ఞానులు. వారు సర్వతంత్రస్వతంత్రులై దేవతలు వెళ్ళే దారులలో పయనించగలిగారు. తక్కువ ప్రయత్నంతో ఎక్కువఫలితాలను సులువుగా పొందగలిగారు. వారు సమస్త ధర్మాలు తెలిసికొనగలిగారు. వారికి అసూయ మొదలైన దుర్గుణాలు ఉండేవి కావు. వారికి వేలకొలది కొడుకులు, కూతుళ్ళు ఉండేవారు. వారు వేలకొలది సంవత్సరాలు జీవించేవారు, కాని, కాలం గడచినపిదప, మనుష్యులలో కామం, క్రోధం మొదలైన దుర్గుణాలు ప్రవేశించాయి. వారి ప్రవర్తనలో మాయ చొరబడింది. అందుచేత దేవతలు వారిని విడనాడారు. తదుపరి, వారు బలం లేని శరీరాలతో, ఆయుర్దాయం క్షీణించి, దరిద్రులై, చేసిన గొప్ప ప్రయత్నాలకు తక్కువ ఫలితాలు పొంది, పెక్కు జబ్బులచేత పీడించబడసాగారు. ఇక ఒకరినొకరు నిందించుకొంటూ. వేదాలను దేవుడిని నిరసించి పాపకార్యాలు చేస్తూ, మరణానంతరం పశుపక్షులుగా తిరిగి జన్మించసాగారు, నరకంలోని అగ్నిలో వేగుతూ, పుట్టుతూ చస్తూ, మరల పుట్టుతూ చస్తూ సంసారవలయంలో చిక్కుకొని బ్రదుకసాగారు.

**విశేషం:** పుట్టటం, చావటం, మరలా పుట్టటం, చావటం అనే విషవలయాన్నిగూర్చి భారతీయవేదాంతులు పలుతావుల నొక్కి వక్కాణించి ఉన్నారు. తొలుత సృష్టియొక్క తొలిఉషస్సులలో ధర్మదేవత కామధేనురూపాన నాల్గుపాదాలతో నడిచిన దనిన్నీ, రాను రాను కలియుగంలో ఏకపాదమాత్రంగా నిలిచిన దనిన్నీ మూలమహాభారతంలో కనబడుతుంది.

**చ.** **మనుజులు పుణ్యపాపములు మానక యి ట్లొనరించుచుం దుదిం**
**దనువు దొఱంగి పోవునెడఁ దప్పదు నీడయవోలెఁ గర్మమున్**
**వెనుకన యేఁగి భూరిసుఖవిస్మృతియుం బటుదుఃఖదైన్యమున్**
**దనుకఁగఁ జేయుఁ; గ్రమ్మఱఁగఁ దాన యొనర్చు భవంబు దేహికిన్. 170**

**ప్రతిపదార్థం:** మనుజులు= మానవులు; పుణ్య, పాపములు= మంచివిచెడ్డవి అయిన పనులు; మానక= విడువక; ఇట్లు+ఒనరించుచున్= ఈవిధంగా చేస్తూ; తుదిన్= చివరకు; తనువు= శరీరం; తొఱంగిపోవు+ఎడన్= విడిచిపెట్టే సమయంలో; నీడ+అ+పోలెన్= ఛాయవలె; కర్మమున్= చేసిన క్రియల ఫలితంకూడా; తప్పదు= తప్పదు; వెనుకన్+అ= వెనువెంటనే; ఏఁగి= వెళ్ళి; భూరి, సుఖ, విస్మృతియున్= గొప్ప సౌఖ్యాన్ని మరచుటయున్నూ; పటు= మిక్కిలి; దుఃఖ, దైన్యమున్= శోకంవలన ఏర్పడే కష్టాన్ని; తనుకఁగన్+చేయున్= ఏర్పడేటట్లు చేస్తుంది; క్రమ్మఱఁగన్= మరల; దేహికిన్= శరీరం ధరించినవాడికి, అనగా మానవుడికి; తాను+అ= తానే అనగా ఆ కర్మమే; భవంబు= పుట్టుక; ఒనర్చున్= కలుగజేస్తుంది.

**తాత్పర్యం:** ఈ విధంగా జననమరణాల వలయంలో తగుల్కొని మానవులు పుణ్యాలు పాపాలు విడనాడక చేయటంచేత, చనిపోయిన తరువాత కూడా వారి కర్మ నీడవలె వెనువెంటనే నడచివెళ్ళి, సౌఖ్యాన్ని మరపుకు తెచ్చి, దుఃఖం వలన అధిక దైన్యానికి పాల్పడ జేసి శరీరధారులకు మరల మరల జన్మలను కలిగిస్తూనే ఉంటుంది.

**క.** **విను మనుజున కెవ్విధమునఁ । దన చేసిన సుకృత దుష్కృతంబులు నెఱయం**
**దన కనుభవింపఁ బా లివి; । తనువు సెడుం గాని కర్మతతి సెడ దనఘా! 171**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడైన వాడా! (ధర్మరాజా); విను= ఆలకించుము; మనుజునకున్= మానవునకు; ఏ విధమునన్= ఏ రీతిగా నైనా; తన, చేసిన= తాను చేసినట్టి; సుకృత, దుష్కృతంబులు= పుణ్య పాపాలు; నెఱయన్= నిండుగా; తనకున్= తనకు; అనుభవింపన్+పాలివి= అనుభవింపదగినవి; తనువు= శరీరం; చెడున్+కాని= పాడయిపోతుంది-అనగా

నశించిపోతుంది కాని; కర్మ, తతి= పుణ్యపాపకర్మలు చేయటం వలన ఏర్పడే ఫలితాల సముదాయం; చెడదు= చెడిపోదు-అనగా నశించదు.

**తాత్పర్యం:** పాపరహితుడ వైన ఓ ధర్మరాజా! నేను వివరించేది సావధానంగా ఆలకించుము. మనుజులు తాము చేసిన పుణ్యపాపాలఫలం ఏవిధంగానైనా సరే అనుభవించక తప్పదు. శరీరం నశించిపోతుంది కాని, కర్మ (ఫల) సముదాయంమాత్రం ఎన్నటికీ నశించదు.

**వ. మఱియు నొక్క నిదర్శనంబు సెప్పెద. 172**

**ప్రతిపదార్థం:** మఱియున్= అదనంగా; ఒక్క= మరియొక; నిదర్శనంబు= ఉదాహరణం; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** అంతే కాక, నీకు మరొక ఉదాహరణను వివరించి చెప్పగలను.

**క. ఈ లోకమ యగుఁ గొందఱ; । కా లోకమ కొందఱకు; నిహంబును బరమున్**
**మే లగుఁ గొందఱ కధిపా! । యే లోకము లేదు వినవె యిలఁ గొందఱకున్. 173**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా! (ఓధర్మరాజా!); కొందఱకున్= కొంత మందికి; ఈ, లోకము+అ= ఈలోకం మాత్రమే; అగున్= ఏర్పడుతుంది, అనగా కొందరికి ఈభూలోకం సుఖంగా ఉంటుంది; కొందఱకున్= కొంతమందికి; ఆ లోకము+అ= ఆలోకం మాత్రమే అనగా కొంతమందికి పరలోకసౌఖ్యం మాత్రమే ప్రాప్తిస్తుంది; కొందఱకున్= కొంతమందికి; ఇహంబును= ఈ లోకమున్నూ; పరమున్= పరలోకమున్నూ; మేలు+అగున్= శుభంగా పరిణమిస్తుంది; ఇలన్= భూలోకంలో; కొందఱకున్= కొంత మందికి; ఏ, లోకము= ఏలోకం కూడా; లేదు= ఉండదు అనగా కొందరు ఏలోకంలోకూడా (ఇహంలోగాని పరంలోగాని) మేలు పొందలేరు; వినవు+ఎ= సావధానంగా విందువుగాక.

**తాత్పర్యం:** ధర్మరాజా! కొందరు ఈభూలోకంలో సౌఖ్యం అనుభవిస్తారు. కొందరకు పరలోకసౌఖ్యం కలుగుతుంది. కొందరికి ఇహపరాలలో రెండింటను మేలు కలుగుతుంది. కొందరికి ఇహపరసౌఖ్యాలు రెండూ దక్కవు. ఈ విషయాన్ని సావధానంగా వివరిస్తాను.

**వ. అది యెట్లంటేని. 174**

**ప్రతిపదార్థం:** అది= ఆవిషయం; ఎట్లు+అంటి(వి)+ఏని= ఏవిధంగా జరుగుతుందని ప్రశ్నించావా.

**తాత్పర్యం:** ఆ విషయం ఏరీతిగా సంభవిస్తుందని నీవు ప్రశ్నిస్తే దానికి సమాధానం చెప్పుతాను.

**చ. ధనములు సాలఁ గల్గి సతతంబును నింద్రియవాంఛ సల్పుచున్**
**మనమున నెన్నఁడున్ సుకృతమార్గము పొంతకుఁ బోక లోభమో**
**హనిహతబుద్ధు లై తిరుగునట్టి జనుల్ పరలోకసౌఖ్యముల్**
**గనుటకు నేర; రిప్పటి సుఖంబులు మేలయి తోఁచు వారికిన్. 175**

**ప్రతిపదార్థం:** లోభ, మోహ, నిహత, బుద్ధులు+ఐ= ఇతరుల ద్రవ్యాన్ని కైవసం కావించుకొనవలె ననే అత్యాశచేతను, ధర్మ మేదో తెలియక పోవటంవలన కలిగే తబ్బిబ్బుచేతను పోగొట్టబడిన బుద్ధికలవారై; తిరుగు+అట్టి; జనుల్= ప్రజలు; ధనములు=

సంపదలు; చాలన్= మిక్కుటంగా; కల్గి= ఉండి; సతతంబును= ఎల్లప్పుడున్నూ; ఇంద్రియ, వాంఛ, సల్పుచున్= ఐహిక సౌఖ్యాలను అనుభవించవలె ననే కోరికలు కోరుతూ; మనమునన్= మనసులో; ఎన్నఁడున్= ఎప్పుడున్నూ; సుకృత, మార్గము= పుణ్య పథం, మంచి త్రోవ; పొంతకున్= వైపునకు; పోక= వెళ్లక; పరలోక, సౌఖ్యముల్= ఆముష్మికసుఖాలు; కనుటకున్= పొందటానికి; నేరరు= సమర్థులు కారు; వారికిన్= అట్టివారికి- అనగా ధనవంతులై విషయలోలురై తిరుగాడేవారికి; ఇప్పటి, సుఖంబులు= వర్తమానకాలంలో భూలోకంలో అనుభవించే సౌఖ్యాలు; మేలు+అయి= మంచివి అయి; తోఁచున్= కన్పిస్తాయి.

**తాత్పర్యం:** అధిక సంపదలు కలిగి, పుణ్యం ఆర్జించే మార్గాలవైపునకు పోవక, లోభ మోహాలకు లోనై, విషయసుఖాలను అనుభవించవలె నని మనస్సులో ఎల్లప్పుడు తలపోసే వారు, ఆముష్మిక సౌఖ్యాన్ని సంపాదించ సమర్థులు కారు. వారికి ఐహికసుఖాలే మంచివిగా కనబడుతూ ఉంటాయి.

**విశేషం:** ఇంద్రియాలు పది. జ్ఞానేంద్రియాలు - చర్మం, కన్ను, చెవి, జిహ్వ, ముక్కు అయిదు. కర్మేంద్రియాలు- వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ - అయిదు. ఇంద్రియ నిగ్రహంతో కూడిన ఆత్మసంయమనమే విశ్వవిజయంగా సనాతన భారతీయసంస్కృతి పలుతావుల నొక్కి చెప్పింది.

**మ.** **ఉపవాసవ్రత సంతతాధ్యయన తీర్థోపాసనాది క్రియై**
**క పరత్వంబునఁ జేసి యైహికము దుఃఖప్రాయమై పోవఁగా**
**విపులానందముఁ బొందఁ గల్గుఁ దుది నావిర్భూతభోగైకలో**
**లుపబుద్ధిం జిరపుణ్యశీలురకు నా లోకంబునన్ భూవరా!** **176**

**ప్రతిపదార్థం:** భూ, వరా!= భూమికిభర్తవయిన ఓరాజా! (ఓధర్మరాజా!); ఉపవాస, వ్రత, సంతత+అధ్యయన, తీర్థ+ఉపాసన+ఆది, క్రియా+ఏక, పరత్వంబునన్= ఆహారం స్వీకరించక నియమంతో ఉండే నోములవలన ఎల్లప్పుడూ (వేదాలుమున్నగువాటిని) చదవటం, పుణ్యతీర్థాలకు యాత్రలు చేసి, జపాలు మున్నగు పనులను చేయటంలో మాత్రమే నిమగ్నమైఉండటం; చేసి= చేత; ఐహికము= ఈలోకంలోని అనుభవం; దుఃఖ, ప్రాయము+ఐ= శోకంతో కూడింది; పోవఁగాన్= సాగగా; తుదిన్= చివరకు; ఆవిర్భూత, భోగ+ఏక, లోలుప, బుద్ధిన్= కేవల సౌఖ్యాలే (నిజమైన సౌఖ్యాలే) అనుభవించవలెనన్న తలంపు కలగటంచేత; చిర, పుణ్య, శీలురకున్= ఎల్లప్పుడున్నూ మంచిపనులనే చేసే స్వభావం కలవారికి; ఆ, లోకంబునన్= (మరణానంతరం చేరునట్టి) మరొకలోకంలో-అనగా పరలోకంలో; విపుల+ఆనందమున్= గొప్పదైన సంతోషం; పొందన్+కల్గున్= అనుభవించటానికి వీలు కల్గుతుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! నియమ నిష్ఠలతో కూడిన ఉపవాసవ్రతాలు, వేదాధ్యయనం, తీర్థయాత్రలు, మొదలైన పుణ్యకార్యాలు నిరంతరంగా చేయటంచేత ఈ లోకంలోని అనుభవం దుఃఖమయం కాగా, చివరకు కేవల సౌఖ్యాలే సత్యమైన సౌఖ్యాలే అనుభవించాలనే తలంపు జనించటంచేత చిరపుణ్యశీలురైన వీరికి పరలోకంలో గొప్ప సౌఖ్యాన్ని పొందటానికి వీలు కలుగుతుంది.

**విశేషం:** ఈ ప్రకరణంలో - సంస్కృత మహాభారతమూలంలోని ఈ శ్లోకం అనుశీలించదగింది.

యే యోగయుక్తాస్తపసి ప్రసక్తాః । స్వాధ్యాయశీలా జరయన్తి దేహాన్ ।
జితేంద్రియా భూతహితే నివిష్టా । సైషామసౌ నాయమరిఘ్నలోకః ॥ 11-186-39

**ఉ. ధర్మము సల్పుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థముం**
**బేర్మియుఁ గాంచి ధర్మవిధిఁ; బెండిలి యై ప్రజలన్ సృజించి స**
**త్కర్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ వొనరించు సజ్జనుల్**
**ధర్మజ! యిందు నందును ముదంబునఁ గాంతు రభీష్టసౌఖ్యముల్. 177**

**ప్రతిపదార్థం:** ధర్మజ!= ఓధర్మరాజా!; ధర్మము+అ= ధర్మం మాత్రమే; సల్పుచున్= చేస్తూ; తగిలి= నిష్ఠతో; ధర్మ, పథంబునన్+చేసి= ధర్మమార్గాన్ని అనుసరించి; అర్థమున్= ధనాన్ని; పేర్మియున్= ఘనతను; కాంచి= పొంది; ధర్మ, విధిన్= ధర్మప్రకారంగా; పెండిలి+ఐ= వివాహం చేసికొని; ప్రజలన్= సంతానాన్ని; సృజించి= పుట్టించి, (కని); సత్, కర్మములన్= మంచి పనులు; (చేసి); ప్రశస్తములు, కాన్= మెచ్చ దగినట్లుగా; క్రతువుల్= యజ్ఞాలు; పొనరించు= చేసే; సత్+జనుల్= మంచివారు; అభీష్ట, సౌఖ్యముల్= కోరుకొనిన సుఖాలు; ఇందున్= ఈ భూలోకంలో; అందును= ఆ పరలోకంలోనూ; కాంతురు= పొందగలరు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ధర్మాన్ని ఆచరించి, ధర్మమార్గాన్ని అనుసరించి, ధనాన్ని, గొప్పతనాన్ని ఆర్జించి, ధర్మయుక్తంగా వివాహం చేసికొని సంతానాన్ని కని, మంచికర్మలను ఆచరించి, మెచ్చదగిన యజ్ఞాలను చేసే మంచివారు ఈ భూలోకంలో ఆ పరలోకంలోకూడ వారు కోరుకొన్న సౌఖ్యాలను అనుభవిస్తారు.

**ఆ. సత్యమును శమంబు శౌచంబు లేక, నా । స్తిక్యమును నిషిద్ధసేవనంబు**
**గలిగి తిరుగు దుష్టకష్టజనశ్రేణి । పొలియు నుభయలోకములకుఁ గాక. 178**

**ప్రతిపదార్థం:** సత్యమును= సత్యాన్ని పాటించటం; శమంబు= ఇంద్రియ నిగ్రహం; శౌచంబు= శుచిత్వం అనగా పరిశుభ్రత; లేక= ఉండకుండగా; నాస్తిక్యమును= (వేదాల యందు) దేవుడియందు నమ్మకం లేకపోవటం; నిషిద్ధ, సేవనంబు= శాస్త్రాలు కూడదని వెలివేసినవాటిని ఆచరించటం; కలిగి= ఉండి; తిరుగు= సంచరించే; దుష్టకష్ట, జన, శ్రేణి= చెడ్డవారు, పాపులు అయిన మనుజుల సముదాయం; ఉభయ, లోకములకున్= రెండు లోకాలకు (అనగా ఇహ పరాలు రెండింటికి); కాక= సరిపడక; పొలియున్= నశిస్తుంది.

**తాత్పర్యం:** నిజాన్ని చెప్పక, ఇంద్రియనిగ్రహం పాటించక; పరిశుభ్రత (పవిత్రత) కలిగిఉండక, చేయగూడని పనులను చేస్తూ, నాస్తికులై తిరిగేవారు ఇహపరలోకాలు రెంటికి చెడినవారై చెడునడవడికతో దుఃఖాన్ని అనుభవిస్తూ నశిస్తారు.

**వ. ఇది మనుష్యుల కర్మగతిప్రకారంబు. 179**

**ప్రతిపదార్థం:** ఇది; మనుష్యుల= మానవుల; కర్మ, గతి, ప్రకారంబు= కర్మ నడిచే తీరు.

**తాత్పర్యం:** ఇది మానవుల కర్మ నడిచే తీరు.

**చ. జనవర! మీరు దివ్యులరు; సమ్మతి దేవహితార్థ మి మ్మహిన్**
**జననము నొందినారరు; ప్రశస్తపరాక్రమలీలఁ బేర్చి యిం**

**క నఖిలశత్రునిర్మథనకర్మ మొనర్చి మహీభరంబు దీ**
**ర్చి నియతిఁ బెక్కు జన్నములు సేసి భజింతురు దేవభావమున్.' 180**

**ప్రతిపదార్థం:** జనవర!= ఓ రాజా! (ధర్మరాజా!); మీరు; దివ్యులరు= దేవతల అంశలతో పుట్టినవారు; ఈ+మహిన్= ఈ భూలోకంలో; సమ్మతిన్= అంగీకారంతో; దేవహిత+అర్థము= దేవతలకు మేలు చేయటం కొరకై; జననమున్+ఒందినారరు= పుట్టారు; ఇంకన్= ఇక మీదట; ప్రశస్త, పరాక్రమ, లీలన్= మెచ్చదగిన శౌర్య మహిమ చేత; పేర్చి= అతిశయించి; అఖిల, శత్రు, నిర్మథన, కర్మము= సమస్తశత్రువులను సంహరించే కార్యాన్ని; ఒనర్చి= నిర్వహించి; మహీ, భరంబు+తీర్చి= భూమియొక్క బరువును తగ్గించి; నియతిన్= నిష్ఠతో; పెక్కు జన్నములు= అనేక యజ్ఞాలు; చేసి= ఒనర్చి; దేవ, భావమున్= దివ్యత్వాన్ని; భజింతురు= సేవిస్తారు - అనగా పొందుతారు.

**తాత్పర్యం:** జనపతివైన ధర్మరాజా! మీరు వేల్పుల అంశలతో ఈ భూలోకంలో జన్మించారు. దేవతల సమ్మతితో, వారికి మేలుచేయటం కోసం మీరు పుట్టారు. ఇకపై మీరు మీ పరాక్రమ వైభవాన్ని ప్రదర్శించి, సమస్తశత్రువులను జయించి, భూభారాన్ని తగ్గిస్తారు. పెక్కుయజ్ఞాలు చేసి, తప్పక దివ్యత్వాన్ని పొందుతారు'.

మార్కండేయుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట (సం. 3-182-1)

**వ. అనిన విని ధర్మనందనుండు 'బ్రాహ్మణప్రభావంబు వినవలతుం జెప్పవే' యనిన మార్కండేయుం డిట్లని చెప్పెఁ; దొల్లి హైహయవంశోద్భవుండైన ధుంధుమారుండను కుమారుండు మృగయాసక్తుండై వనంబునఁ గ్రుమ్మరువాఁ డొక్కయెడం దృణలతాగుల్మమధ్యంబునం గృష్ణాజినోత్తరీయుం డై యున్నవాని నొకవిప్రు దవ్వులం గని మృగం బను బుద్ధిం జేసి యేసి, డాయంజని, నిశ్చేతనుండైన యతనిం జూచి యత్యంతదుఃఖితుండయి పురంబునకుం బోయి నిజవంశవృద్ధులైన హైహయుల కంత వృత్తాంతంబునుం జెప్పి, వారిం దోడ్కొని వచ్చి యవ్విప్రకళేబరంబు సూపిన. 181**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ధర్మనందనుండు= ధర్మరాజు; బ్రాహ్మణ, ప్రభావంబు= బ్రాహ్మణులయొక్క మహిమ; వినవలతున్= ఆలకించగోరుతున్నాను; చెప్పవే= వచింపవలయును; అనినన్= అని పల్కగా; మార్కండేయుండు= మార్కండేయుడు; ఇట్లు+అని= ఈవిధంగా; చెప్పెన్= వచించాడు; తొల్లి= పూర్వకాలంలో; హైహయ, వంశ+ఉద్భవుండు+ఐన= హైహయ వంశంలో పుట్టిన; ధుంధుమారుండు+అను= ధుంధుమారుడు అనే పేరు కల; కుమారుండు= పుత్రుడు (యువకుడు); మృగయా+ఆసక్తుండు+ఐ= వేటయందు మిక్కిలి ఇష్టంకలవాడై; వనంబునన్= అడవిలో; క్రుమ్మరు వాఁడు= తిరిగేవాడు; ఒక్క+ఎడన్= ఒకచోట; తృణ, లతా, గుల్మ, మధ్యంబునన్= గడ్డితీగల, పొదల సందున; కృష్ణ+అజిన+ ఉత్తరీయుండు+ఐ= జింకచర్మాన్ని పైన వేసికొనే వస్త్రంగా కప్పుకొన్నవాడై; ఉన్నవానిన్= ఉన్నవాడిని; ఒక, విప్రున్= ఒక బ్రాహ్మణుడిని; దవ్వులన్+కని= దూరం నుండి చూచి; మృగంబు+అను, బుద్ధిన్+చేసి= లేడి అనే ఊహతో (జింకగా భావించి); ఏసి= (బాణాన్ని) ప్రయోగించి; డాయన్+చని= దగ్గరకు వెళ్ళి; నిస్+చేతనుండు+ఐన= కదలిక లేక ఉండగా (చనిపోయి ఉండగా); అతనిన్+చూచి= వాడిని చూచి; అతి+అంత, దుఃఖితుండు+అయి= మిక్కిలివిషాదంతో కూడినవాడై; పురంబునకున్+పోయి= నగరానికి వెళ్లి; నిజ, వంశ, వృద్ధులు+ఐన= తనవంశంలో వయసు మళ్ళిన పెద్దలు అయిన; హైహయులకున్= హైహయవంశంలో పుట్టినవారికి; అంత, వృత్తాంతంబునున్= సమస్త సమాచారాన్ని; చెప్పి; వారిన్= వారలను; తోడ్కొని వచ్చి= వెంట బెట్టుకొని తీసికొని తెచ్చి; ఆ+విప్ర, కళేబరంబు= ఆ బ్రాహ్మణుడియొక్క శరీరాన్ని; చూపినన్= చూపగా.

**తాత్పర్యం:** అని చెప్పగా, ధర్మరాజు బ్రాహ్మణమహిమను వినగోరి, ఆ విషయాన్ని వివరించుమని అడుగగా మార్కండేయమహర్షి ఈ విధంగా చెప్పాడు: పూర్వకాలంలో హైహయవంశానికి చెందిన రాజకుమారుడు ధుంధుమారుడు వేటకొరకై అడవిలో తిరుగుతూ జింక చర్మాన్ని ఉత్తరీయంగా ధరించి, పొదలమాటున ఉన్న ఒక యువకుడిని చూచి, జింకగా భ్రమించి బాణప్రయోగం చేసి దగ్గరకు వెళ్ళాడు. అక్కడ ఆ విప్రుడి మృతకళేబరాన్ని కాంచి, మిక్కిలి దుఃఖించి, రాజధానికి వెళ్ళి జరిగినసంగతి తన పెద్దవారికి వివరించి, వారిని వెంటబెట్టుకొని అడవికి తోడ్కొనితెచ్చి, ఆ బ్రాహ్మణుడి శవాన్ని చూపాడు.

**తే.** **వార లందఱు వందురి వగచి యచటి । కతిసమీపంబునను దార్క్ష్యుఁడను మునీంద్రు**
**నాశ్రమం బున్న నయ్యెడ కరిగి కనిరి । దేవమునిసిద్ధలోకప్రతీక్ష్యుఁ దార్క్ష్యు. 182**

**ప్రతిపదార్థం:** వారలు+అందఱు= వారలు అనగా వృద్ధ హైహయులు అందరు; వందురి= దుఃఖించి; వగచి= విచారించి; అచటికిన్= ఆ ప్రదేశానికి; అతి సమీపంబునను= మిక్కిలి దగ్గరగా; తార్క్ష్యుఁడు+అను= తార్క్ష్యుడు అనే పేరుకల; ముని+ఇంద్రు+ఆశ్రమంబు+ఉన్నన్= ఋషులలో శ్రేష్ఠుడైన వాడి కుటీరం ఉండగా; ఆ+ఎడకున్= ఆ చోటికి; అరిగి= వెళ్ళి; దేవ, ముని,సిద్ధ, లోక, ప్రతీక్ష్యున్= వేల్పులు, ఋషులు, సిద్ధులసమూహాలు ఎదురుచూడదగినవాడిని; తార్క్ష్యున్; కనిరి= చూచారు.

**తాత్పర్యం:** అంతట, ఆ వృద్ధహైహయులు అందరున్నూ, అచటికి దగ్గరగా ఉన్న తార్క్ష్యుడు అనే పేరుగల మహర్షి ఆశ్రమానికి వెళ్ళారు. ఆ మహర్షి సందర్శనానికై వేల్పులు, మునులు, సిద్ధులు ఎదురుచూడటం కద్దు. అంతటి మహానుభావుడు ఆ తార్క్ష్య మహర్షి

**క.** **కని భక్తి మ్రొక్కుటయు, న । య్యనఘుఁడు దీవించి వారి కర్హమ్మగు పూ**
**జనము లొనరింపఁ బంచెం । దన శిష్యులఁ బరమసంశితవ్రతుఁడు దయన్. 183**

**ప్రతిపదార్థం:** కని= చూచి; భక్తిన్= భక్తితో; మ్రొక్కుటయున్= నమస్కారం చేయగా; ఆ+అనఘుఁడు= పాపరహితుడైన ఆ మహానుభావుడు; దీవించి= ఆశీర్వదించి; వారికిన్= (ఆ హైహయులకు); అర్హమ్ము+అగు= తగినట్లుగా; పూజనములు= సత్కారపూర్వకంగా చేసే ఆతిథ్యమర్యాదలు; ఒనరింపన్= చేయటానికి; తనశిష్యులన్= తనదగ్గర చదువుకొనే విద్యార్థులను; పరమ, సంశిత, వ్రతుఁడు= తీక్ష్ణమైన వ్రతానుష్ఠానం కలవాడు; దయన్= కరుణతో; పంచెన్= నియోగించాడు.

**తాత్పర్యం:** ఆ హైహయులు తనను సందర్శించి నమస్కారం చేయగా, తీక్ష్ణమైన వ్రతానుష్ఠానంతో కూడిన గొప్ప సౌశీల్యం కల ఆ మహర్షి వారిని దీవించి, వారికి ఆతిథ్యమర్యాదలు చేయటానికి తనశిష్యులను నియోగించాడు.

**వ.** **హైహయులు నమ్మునీంద్రునకు సాష్టాంగదండప్రణామంబుసేసి 'మహాత్మా! యిక్కుమారుండు మృగయాసక్తుం డై వచ్చి యింతకుమున్న యివ్వనంబున నొక్కబ్రాహ్మణుం గృష్ణాజినసంవృతు నతిశాంతుం బాపంబునం జేసి మృగం బను బుద్ధి నేసిన నతండు మృతుం డయ్యె; నేము మహాపాతకదూషితుల మైతిమి గావున మీ చేయు సత్కారంబుల కర్హులము గా; మిప్పాపంబున కెయ్యది నిష్కృతి?' యనిన నవ్వుచుఁ దార్క్ష్యుం డి ట్లనియె. 184**

**ప్రతిపదార్థం:** హైహయులున్= హైహయ వంశంలో పుట్టినవారు; ఆ+ముని+ఇంద్రునకున్= మునులలో శ్రేష్ఠుడైన ఆతడికి; స+అష్ట+అంగ, దండ, ప్రణామంబు+చేసి= ఎనిమిది అవయవాలు భూమిని తాకేటట్లుగా నమస్కారం చేసి; మహా+ఆత్మ!= గొప్పఆత్మకలవాడా!; ఈ+కుమారుండు= ఈ(రాజ)పుత్రుడు; మృగయా+ఆసక్తుండు+ఐ= వేటయందు మిక్కిలి కోరిక కలవాడై; వచ్చి= చేరి; ఇంతకున్, మున్ను+అ= ఇంతకు ముందే; ఈ+వనంబునన్= ఈ అడవిలో; ఒక్క, బ్రాహ్మణున్= ఒక విప్రుడిని; కృష్ణ+అజిన, సంవృతున్= జింకచర్మంచేత చుట్టబడినవాడిని (జింకచర్మాన్ని కప్పుకొని ఉన్నవాడిని); అతిశాంతున్= వికారాలు ఉపశమించిన మిక్కిలి నెమ్మదితో కూడినవాడిని; పాపంబునన్+చేసి= పాపంచేత (పాపంప్రాప్తించేకర్మవలన); మృగంబు+అను, బుద్ధిన్= జింక అనే ఊహతో; ఏసినన్= (బాణాన్ని ప్రయోగించి) కొట్టగా; అతండు= (ఆ బ్రాహ్మణయువకుడు); మృతుండు+అయ్యెన్= మరణించాడు; ఏము= మేము; మహా, పాతక, దూషితులము+ఐతిమి= గొప్ప పాపంచేత చెరుపబడినవారము ఐనాము; కావునన్= కాబట్టి; మీ, చేయు= మీరు చేసే; సత్కారంబులకున్= గౌరవమర్యాదలకు; అర్హులము, కాము= తగినవారము కాము; ఈ+పాపంబునకున్= ఈ పాపానికి; ఏ+అది= ఏది; నిష్కృతి= పరిహారం; అనినన్= అని అడుగగా; నవ్వుచున్= నవ్వుతూ; తార్క్ష్యుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** హైహయులు మహానుభావుడైన ఆ ఋషికి సాష్టాంగ నమస్కారం చేసి, 'మహాత్మా!, యువకుడైన ఈ రాకుమారుడు వేటపట్ల తమకంతో- జింకచర్మం ధరించి పొదల మాటున ప్రశాంతంగా తపస్సు చేసికొంటున్న బ్రాహ్మణకుమారుడిని, జింకగా భ్రాంతి చెంది, బాణంతో కొట్టి సంహరించాడు. అందుచేత మేము అందరం పాతకుల మైనాము. కాబట్టి, మీరు చేసే ఈ ఆతిథ్యసత్కారాలు పొందే అర్హతను మేము కోల్పోయాం. ఈ మహాపాపానికి ఏదైనా పరిహారం ఉన్నదా? దయచేసి తెలుపండి' అని విన్నవించారు. అంతట ఆ మహర్షి చిరునవ్వుతో ఇట్లా బదులు పలికాడు.

**క. 'వినుఁ డెన్నఁడు మా యాశ్రమ । మున నెవ్వారలకు లేవు భూరిభయవ్యా**
**ధినిరోధమృత్యుదోషా । ద్యనేకదుఃఖములు త్రిజగదాశ్చర్యముగన్. 185**

**ప్రతిపదార్థం:** వినుఁడు= ఆలకించండి; ఎన్నఁడు= ఎప్పుడైనా కాని; మా+ఆశ్రమమునన్= మా ఆశ్రమంలో; ఏ+వారలకున్= ఎట్టివారికి కాని; త్రి, జగత్+ఆశ్చర్యముగన్= మూడులోకాలకు అచ్చెరువు కొలిపేటట్లుగా; భూరి, భయ, వ్యాధి, నిరోధ, మృత్యు, దోష+ఆది+అనేక, దుఃఖములు= గొప్పవైన వెఱపు, రోగం, చెరబడటం, చావు మున్నగు దోషాలవలన ఏర్పడే పెక్కు బాధలు; లేవు= ఉండవు.

**తాత్పర్యం:** 'ఆలకించండి. మా ఆశ్రమంలో ఏ కాలంలోనూ, ఎవరికిగాని భయం, రోగం, చావు, చెరబడటం, వీటివలన సంక్రమించే బాధలు ఏర్పడవు. ఈ విషయం మూడులోకాలకు అచ్చెరువు గొలిపేటటువంటిది.'

**వ. అని పలికి తనపుత్త్రు నధికతపోబలసమన్వితుం జూపి. 186**

**ప్రతిపదార్థం:** అని పలికి= అనిచెప్పి; అధిక, తపస్+బల, సమన్వితున్= గొప్పతపస్సు అనే బలంచేత కూడినవాడైన; తన, పుత్త్రున్= తనకుమారుడిని; చూపి.

**తాత్పర్యం:** అని చెప్పి, గొప్పతపస్సు అనే బలం కలిగిన తన కుమారుడిని చూపించి (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'ఈతఁ డగునె మీ బాలకు । చేత నిహతుఁ డైనఁవాడు సెప్పుఁ' డనుడు వా**
**రాతఁడ తమ మును చూచిన । యాతం డగుటకు మహాద్భుతాత్మకు లగుచున్. 187**

**ప్రతిపదార్థం:** మీ, బాలకుచేతన్= మీ(రాజ)పుత్రుడిచేత; నిహతుఁడు+ఐనవాఁడు= చంపబడినవాడు; ఈతఁడు+అగునన్+ఎ= ఇతడే అగునా?; చెప్పుఁడు= వచించండి; అనుడున్= అని చెప్పగా; వారు= (ఆ హైహయులు); ఆతఁడు+అ= అతడే; తమ, మును, చూచిన, ఆతండు+అగుటకున్= తాము లోగడ చూచిన వాడే కావటంవలన - అనగా చంపబడినవాడే కావటంవలన; మహా+అద్భుత+ఆత్మకులు+అగుచున్= గొప్ప ఆశ్చర్యాన్ని పొందిన హృదయాలు కలవారు ఔతూ.

**తాత్పర్యం:** 'ఈతడేనా మీ రాజకుమారుడిచేత చంపబడినవాడు? చెప్పండి' అని ఋషీశ్వరుడు హైహయులను అడిగాడు. ఆ హైహయులు అతడిని చూచి, లోగడ మరణించినవాడు, తాము చూచినవాడు ఆ యువకుడే అని గుర్తించి ఆశ్చర్యం చెందారు.

**క. 'మృతుఁ డయి క్రమ్మఱ సం । జీవితుఁ డయ్యె నితండు; కరము విస్మయ మిది భూ**
**నుత! యిట్టి మహిమ కలిమికిఁ । గత మెయ్యది? యానతిమ్ము కారుణ్యమునన్. 188**

**ప్రతిపదార్థం:** భూనుత!= భూమి యందలి ప్రజలచేత పొగడ బడినవాడా!; ఇతండు= ఈ బ్రాహ్మణకుమారుడు; మృతుఁడు+అయి= చనిపోయి; క్రమ్మఱన్= మరల; సంజీవితుఁడు+అయ్యెన్= తిరిగి బ్రదికినవా డయ్యాడు; ఇది= ఇది; కరము= మిక్కిలి; విస్మయము= ఆశ్చర్యకరమైనది; ఇట్టి= ఈవిధమైన; మహిమ, కలిమికిన్= ప్రభావం కలిగి ఉండటానికి; కతము+ఏ+అది= కారణం ఏది; కారుణ్యమునన్= దయతో; ఆనతి+ఇమ్ము= వివరించి చెప్పండి.

**తాత్పర్యం:** 'భూజనులచేత పొగడబడిన ఓ మహానుభావా! ఈ బ్రాహ్మణ కుమారుడు మరణించి మరల బ్రతికాడు. ఇది మిక్కిలి ఆశ్చర్యకరమైన అంశం. మీకు ఇట్టి మహిమ ఏర్పడటానికి గల కారణం దయచేసి వివరించి చెప్పండి'.

**వ. అని యడిగినఁ దార్క్ష్యం డిట్లనియె. 189**

**తాత్పర్యం:** ఆవిధంగా అడుగగా తార్క్ష్యుడు ఇట్లా అన్నాడు.

**శా. ఆలస్యం బొక యింత లేదు, శుచి యాహారంబు, నిత్యక్రియా**
**జాలం బేమఱ, మర్చనీయు లతిథుల్, సత్యంబ పల్కంబడున్,**
**మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు; మట్లౌట నె**
**క్కాలంబుం బటురోగమృత్యుభయశంకం బొంద మే మెన్నఁడున్. 190**

**ప్రతిపదార్థం:** ఆలస్యంబు+ఒక+ఇంత, లేదు= జాగుచేయటం ఎంతమాత్రమూ ఉండదు; ఆహారంబు= భోజనం; శుచి= పరిశుభ్రంగా ఉంటుంది; నిత్య, క్రియా, జాలంబు+ఏమఱము= ప్రతిదినమూ జరుపవలసిన పనులను చేయటం ఏమాత్రమూ మరచిపోము; అతిథుల్= ఇంటికి వచ్చేవారు; అర్చనీయులు= పూజింపబడుతుంటారు; సత్యంబు+అ= నిజం మాత్రమే; పల్కంబడున్= మాచే వచించబడుతూ ఉంటుంది; నెమ్మిన్= ప్రీతితో; మేలు+ఐ= శుభంకలిగి, లేదా మేలు పొంది; శాంతియున్= ఎట్టి వికారాలు లేని నెమ్మదియు; బ్రహ్మచర్యమును= ఇంద్రియనిగ్రహంతో కూడిన నిష్కామవ్రతాన్ని; తాల్తుము=

ధరిస్తాము; అట్లు+ఔటన్= ఆ విధంగా ఉండటంచేత; ఏము= మేము; ఎన్నఁడున్= ఎప్పుడుకూడా; ఏ+కాలంబున్= ఏ సమయంలో కూడా; పటు, రోగ, మృత్యు, భయ, శంకన్= తీవ్రమైనరోగ, మరణ, భయ, ఆందోళనలను; పొందము= అనుభవించం.

**తాత్పర్యం:** మహర్షి చెప్పిన సమాధానం ఇది - ' ఈఆశ్రమంలో మేము కొన్ని నియమాలను నిష్ఠతో ఆచరిస్తాం. ఇక్కడ మేం ఎన్నడున్నూ కాలహరణం చేయం. ఆహారం పరిశుభ్రంగా ఉంచుతాం. అతిథులను పూజిస్తాం. సత్యవ్రతాన్ని సదా పాటిస్తాం. శాంతి, బ్రహ్మచర్యం మాకు మేలైన అనుష్ఠానాలు. ఇట్టి నియమాలను నిష్ఠతో పాటించటంచేత, ఇక్కడ మాకు మృత్యుభయమే లేదు. అట్లాగే ఎటువంటి భయాందోళనలకూ ఈ ఆశ్రమంలో తావు లేదు.

**విశేషం:** కాలంయొక్క విలువను గుర్తించి ఒక్క నిముసంకూడ వృథాపుచ్చక పోవటం, ఆహారపరిశుభ్రత, అతిథిసత్కారం, సత్యవ్రతం, బ్రహ్మచర్యదీక్ష, శాంతి - అలనాటి ప్రాచీనభారతీయ ఆశ్రమజీవితంలో మృత్యుంజయసిద్ధిగా అనుష్ఠించబడేవని స్పష్టం.

**వ. ఇది యస్మదీయ ప్రభావంబు; మీకుఁ బాతకభయంబువలవ; దరుగుం' డనినం దార్క్ష్యు వీడ్కొని హైహయులు నిజనివాసంబులకుం జనిరి; భరతవంశోత్తమ! యిట్టిది బ్రాహ్మణప్రభావం' బని మఱియు మార్కండేయుండు 'బ్రహ్మక్షత్త్రస్వరూపనిదర్శనం బయిన యొక్కయితిహాసంబు సెప్పెద విను' మని ధర్మరాజున కిట్లనియె.191**

**ప్రతిపదార్థం:** ఇది, అస్మదీయ, ప్రభావంబు= ఇది మాదైన మహిమ; మీకున్= మీకు; పాతక, భయంబు= పాపం దాపురిస్తుందనే వెరపు; వలవదు= పెట్టుకొన నవసరం లేదు; అరుగుండు= వెళ్ళండి; అనినన్= అని చెప్పగా; తార్క్ష్యున్= తార్క్ష్యుడిని (వద్ద); వీడ్కొని= సెలవుగైకొని; హైహయులు; నిజ, నివాసంబులకున్= తాము నివసించే గృహాలకు; చనిరి= వెళ్ళారు; భరత, వంశ+ఉత్తమ!= భరతవంశాన పుట్టిన వారిలో శ్రేష్ఠుడా! (ధర్మరాజా!); బ్రాహ్మణ, ప్రభావంబు= బ్రాహ్మణులయొక్క మహిమ; ఇట్టిది= ఇటువంటిది; అని= అనిచెప్పి; మఱియున్= మరల; మార్కండేయుండు; బ్రహ్మ, క్షత్త్ర, స్వరూప, నిదర్శనంబు+అయిన= బ్రాహ్మణులయొక్కయు, క్షత్రియుల యొక్కయు కలరూపును (నిజస్వభావాన్ని) తెలిపేదైన; ఒక్క+ఇతిహాసంబు= ఒక కథ; చెప్పెదన్= వినిపిస్తాను; వినుము; అని; ధర్మరాజునకున్= ధర్మపుత్రుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఇది మా మహిమ. మీకు పాపం వస్తుందనే భయం లేదు వెళ్ళండి' అని చెప్పగా, ఆ హైహయులు ఆ మహర్షి వద్ద సెలవు తీసికొని, తమ ఇండ్లకు వెళ్ళారు. భరతవంశంలో శ్రేష్ఠుడవైన ఓధర్మరాజా! బ్రాహ్మణులయొక్క మాహాత్మ్యం ఇటువంటిది' అని చెప్పి, 'ఈ గాథయేకాక, బ్రాహ్మణుల క్షత్రియుల స్వభావాలను వివరించే మరొక గాథ కూడ వినిపిస్తాను; సావధానంగా ఆలకించుము' అని మార్కండేయమహర్షి ధర్మరాజుతో ఈవిధంగా అంటున్నాడు.

**విశేషం:** మహాభారతంలో - 'సంబోధనలు' పలురీతుల కానిపిస్తాయి. 'మీకు పాతకభయంబు వలవ దరుగుండు' - అనే మాటలు తార్క్ష్యుడు హైహయులకు చెప్పినవి. ఇక-'భరతవంశోత్తమ' అనే సంబోధనం - మార్కండేయమహర్షి ధర్మరాజును ఉద్దేశించినట్టిది.

**చ. వినుతచరిత్రుఁ డత్రి యను విప్రవరుండు తపం బొనర్పఁ గా**
**ననమున కేఁగుచుండి తన నాతిఁ గనుంగొని యిట్లనుం 'దపం**
**బున కిదె యేను బూని వనభూమికిఁ బోవుచు నున్నవాఁడ, నో**
**వనరుహనేత్ర! నీవు నట వచ్చెదొ పుత్త్రులయొద్ద నుండెదో.' 192**

**ప్రతిపదార్థం:** వినుతచరిత్రుఁడు= మిక్కిలి గొప్పగా పొగడబడిన జీవితం కలవాడు; అత్రి+అను, విప్రవరుండు= అత్రి అనే పేరుగల బ్రాహ్మణోత్తముడు; తపంబు+ఒనర్పన్= తపస్సు చేసికొనటానికి; కాననమునకున్= అడవికి; ఏఁగుచున్+ఉండి= వెళ్ళుతూ; తన, నాతిన్= తన వనితను (భార్యను); కనుంగొని= చూచి; ఇట్లు+అనున్= ఈవిధంగా వచించాడు; ఓవనరుహనేత్ర!= పద్మాలవంటి కన్నులు కలదానా!; ఇది+ఎ= ఇదే= ఇప్పుడే; ఏను= నేను; తపంబునకున్= తపస్సు చేసికొనటానికై; పూని= సిద్ధపడి; వనభూమికిన్= అడవికి; పోవుచున్+ఉన్నవాఁడన్= వెళ్లుతూ ఉన్నాను; నీవున్= నీవు కూడా; అట వచ్చెదు+ఒ= అక్కడికి వస్తావో; పుత్త్రులయొద్దన్= కొడుకులదగ్గర; ఉండెదో= నివసిస్తావో.

**తాత్పర్యం:** మహానుభావుడైన అత్రి అనే బ్రాహ్మణశ్రేష్ఠుడు తపస్సుచేసికొనటానికై అడవికి వెళ్ళాలని తలపోసి తన భార్యను సమీపించి, ఈవిధంగా అన్నాడు: 'పద్మాలవంటి కన్నులుకలదానా! ఏను తపస్సు చేసికొనటానికై అరణ్యానికి పోవ సంకల్పించాను. నీవు నాతోపాటు అరణ్యానికి వస్తావా? లేక, నీకొడుకులదగ్గరనే ఉంటావా?'

**చ. అనుటయు భార్య యిట్లనియె 'నక్కట! పుత్త్రులకుం గుటుంబభా**
**ర నియమవృత్తు లెల్లను దిరంబుగఁ జేయక యాశ్రమాంతరం**
**బునకు మహాత్మ! నీకు నిటు వోవుట ధర్మువు గాదు; వైన్యభూ**
**జనపతి యిచ్చు నర్థులకుఁ జాలఁగ; నర్థము వేఁడు మవ్విభున్.' 193**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనిచెప్పగా; భార్య= అత్రి మహర్షి పెండ్లం; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పింది; అక్కట!= అయ్యో!; మహా+ఆత్మ!= ఓ మహానుభావా!; పుత్త్రులకున్= కొడుకులకు; కుటుంబ, భార, నియమ, వృత్తులు+ఎల్లను= కుటుంబాన్ని ఏవిధంగా మోయవలెనో అందుకు ఏర్పరచదగిన కట్టుబాటులు, జీవనోపాయాలు అన్నిటిని; తిరంబుగన్= నిలుకడగా; చేయక= ఏర్పాటు చేయకుండా; ఆశ్రమ+అంతరంబునకున్= ఇంకొక ఆశ్రమానికి; ఇటు, పోవుట= ఈవిధంగా పోవటం, నీకున్= నీకు; ధర్మువు+కాదు= ధర్మం కాదు; వైన్యభూజనపతి= వైన్యప్రభువు; అర్థులకున్= వేడినవారికి; అర్థము= ధనం; చాలఁగన్= మిక్కుటంగా; ఇచ్చున్= దానంచేస్తాడు; ఆ+విభున్= ఆ రాజును; వేఁడుము= ప్రార్థించుము.

**తాత్పర్యం:** అని చెప్పగా అత్రిభార్య ఈవిధంగా సమాధానం చెప్పింది. 'అయ్యో, ఓ మహానుభావా! కుటుంబంయొక్క బరువును ఏవిధంగా భరించవలెనో, ఎట్టి ఏర్పాటులు అవసరమో, కొడుకులకు బాగా విశదీకరించి కట్టుబాటులు, జీవనాధారాలు చేయకుండానే, గృహస్థాశ్రమాన్ని విడిచి వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించటం మీబోటివారికి ధర్మంకాదు. వైన్యమహారాజు వేడినవారికి ధనాన్ని దానం చేస్తాడు. ఆప్రభువును ప్రార్థించి కావలసిన ధనాన్ని సంపాదించి కొడుకులకు ఇచ్చి, అటుపిమ్మట నీవు తపస్సుకై అడవికి పోవచ్చును.'

**విశేషం:** ప్రాచీన భారతీయ సంస్కృతి ప్రకారం మానవజీవితం - బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం - అని నాలుగు ఆశ్రమాలుగా వింగడించబడింది. శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్ । వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే

తనుత్యజామ్॥'' అని కాళిదాసు రఘువంశం. చిన్నతనంలో విద్యాభ్యాసం చేయాలి; యౌవనంలో గృహస్థాశ్రమాన్ని స్వీకరించి విషయ భోగాలను అనుభవించాలి; ముసలితనంలో వానప్రస్థంలో ఇంద్రియనిగ్రహంతో ఇలువీడి కుటుంబానికి దూరంగా ఉండాలి. మరణించటానికి పూర్వమే సన్న్యాసం స్వీకరించాలి. ఇది సనాతన భారతీయసంప్రదాయం. ఏ వయసుకు తగిన ఆశ్రమం ఆ వయస్సున పాటించాలి. ఆమరణ బ్రహ్మచర్యాన్నిగాని శాశ్వతభోగలాలసత్వాన్నిగాని సనాతనభారతీయసంస్కృతి శాసించ లేదు.

**వ.** **అనినం గొండొక విచారించి భార్యపలుకులు ధర్మయుక్తంబు లగుటకు సంతసిల్లి, యమ్మహాద్విజుం డప్పుడు చని యశ్వమేధాధ్వరదీక్షితుండయి, విప్రులకు నపారధనంబు లిచ్చుచున్న వైన్యుం గని యాశీర్వాద పురస్సరంబుగా ని ట్లనియె.** **194**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+మహా, ద్విజుండు= ఆ గొప్పబ్రాహ్మణుడు; కొండొక, విచారించి= కొంత ఆలోచన చేసి; భార్య, పలుకులు= పెండ్లాం చెప్పిన మాటలు; ధర్మ, యుక్తంబులు+అగుటకున్= ధర్మంతో కూడినవి కావటంచేత; సంతసిల్లి= సంతోషించి; అప్పుడు= ఆ వేళలో; చని= వెళ్ళి; అశ్వమేధ+అధ్వర, దీక్షితుండు+అయి= అశ్వమేధ మనే యజ్ఞాన్ని చేయటానికి పూనినవాడై; విప్రులకున్= బ్రాహ్మణులకు; అపార, ధనంబులు= మితి లేని ద్రవ్యాలను; ఇచ్చుచున్+ఉన్న= దానం చేస్తున్న; వైన్యున్= వైన్యుడు అనేరాజును; కని= చూచి; ఆశీర్వాద, పురస్సరంబుగాన్= దీవెనలు మొట్టమొదట చేసినవాడై; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** అత్రికి భార్య చెప్పిన మాటలు నచ్చినవి. ఆమె మాటాడింది ధర్మంగా ఉన్నట్లు ఆయన భావించి, కొంత తడవు ఆలోచించి, ఆ బ్రాహ్మణోత్తముడు వైన్య మహారాజు కడకు వెళ్ళాడు. అప్పుడు ఆ మహారాజు అశ్వమేధయాగ దీక్ష వహించి ఉంటూ బ్రాహ్మణులకు మితి లేని ధనాలను దానం చేస్తున్నాడు. అత్రి మహాముని ఆ మహారాజును సమీపించి మొట్టమొదట ఆశీర్వాదం చెప్పి, తదుపరి ఈవిధంగా అన్నాడు.

**ఉ.** **'నీవ విధాత, వింద్రుఁడవు నీవ, సమస్తజనేశ్వరుండవున్**
**నీవ, యశేషధర్మములు నీవ యెఱుంగుదు, నిన్నుఁ బోలఁగా**
**నీ వసుధాతలంబున మహీశ్వరు లెవ్వరు లేరు, సన్మునీం**
**ద్రావలి యెప్డు నిన్నుఁ గొనియాడుఁ బరిస్ఫుటవాక్యభంగులన్.'** **195**

**ప్రతిపదార్థం:** నీవు+అ= నీవే; విధాతవు= బ్రహ్మదేవుడవు; నీవు+అ= నీవే, ఇంద్రుఁడవు= వేల్పులరాజవు; నీవు+అ= నీవే; సమస్త, జన+ఈశ్వరుండవున్= సమస్తజనులకు పతియైన పరమేశ్వరుడవు; నీవు+అ= నీవే; అశేష, ధర్మములు= సమస్త ధర్మాలు; ఎఱుంగుదు= తెలిసిఉన్నావు; ఈ, వసుధా, తలంబునన్= ఈభూతలంలో; నిన్నున్+పోలఁగాన్= నీతో సరితూగ గల; మహీ+ఈశ్వరులు= మహారాజులు; ఎవ్వరున్ లేరు= ఎవరూ లేరు; పరిస్ఫుట, వాక్య, భంగులన్= తేటతెల్లమయ్యే వాక్యాల తీరు తీయాలతో; సత్+ముని+ఇంద్ర+ఆవలి= ఉత్తమ ఋషుల సముదాయం; ఎప్డు= ఎల్లప్పుడు; నిన్నున్= నిన్ను; కొనియాడున్= ప్రశంసిస్తుంది.

**తాత్పర్యం:** 'ఓ మహారాజా! నీవే బ్రహ్మదేవుడవు; నీవే ఇంద్రుడవు; సమస్తధర్మాలు తెలిసిన వాడవు నీవే; నీతో సరిపోలిన మహారాజులు ఈ భూప్రపంచంలో మరి ఎవ్వరూ లేరు. తేటతెల్ల మయ్యే మాటల నుడికారపు ఇంపు సొంపులతో మేలి ఋషులు మహానుభావులు నిన్ను సదా ప్రశంసిస్తారు.'

**చ. అని పలుకంగ గౌతమమహాముని యచ్చట నుండి యంతయున్**
**విని, కలుషించి, 'యేల యిటు వీఁకున నో రఱుగంగఁ బ్రేలె; దీ**
**జనపతియే విధాతయును శక్రుఁడు నీశుఁడు నర్థకాంక్షి వై**
**మనమున శంక లేక యొక మానవు నింత నుతింప నేటికిన్?' 196**

**ప్రతిపదార్థం:** అని పలుకంగన్= అని వచించగా; గౌతమ, మహా, ముని= గౌతముడు అనే గొప్పఋషి; అచ్చటన్+ఉండి= అక్కడ ఉండి; అంతయున్; విని; కలుషించి= కోపించి; ఏల= ఎందుకు; ఇటు= ఈవిధంగా; వీఁకునన్= పూనికతో; నోరు+అఱుగంగన్= నోరు అరిగేటట్లుగా; ప్రేలెదు= నోటికి వచ్చినట్లు మాటాడతావు; ఈ జనపతియే= ఈమహారాజే; విధాతయును= బ్రహ్మయును; శక్రుఁడున్= ఇంద్రుడూ; ఈశుఁడున్= శివుడూనా; అర్థకాంక్షివి+ఐ= ధనాన్ని కోరుతున్నవాడి వై; మనమునన్= మనస్సులో; శంకలేక= జంకు గొంకులు లేకుండా; ఒక మానవున్= ఒక మనుష్యుడిని; ఇంత= ఈవిధంగా గొప్ప చేసి; నుతింపన్+ఏటికిన్?= పొగడటం ఎందుకు?

**తాత్పర్యం:** అని అత్రి ఆ విధంగా ప్రశంసించగా, అక్కడ ఉన్న గౌతమమహర్షి ఆ స్తోత్రాన్ని అంతా విని, ఆగ్రహించి ఈ విధంగా పలికాడు: 'ఓ అత్రీ! నీవు కేవలం ధనకాంక్షతో నోటికి వచ్చినట్లు ప్రేలుతున్నావు. ఈ మహారాజు నిజంగా బ్రహ్మదేవుడా? ఇంద్రుడా? శివుడా? జంకు గొంకులు ఏమాత్రం లేకుండా ఒక మానవమాత్రుడిని ఈ విధంగా ప్రస్తుతించటం దేనికి?'

### అత్రిగౌతముల పరస్పరసంవాదము (సం. 3-183-11)

**వ. అనుటయు నత్రి యి ట్లనియె. 197**

**తాత్పర్యం:** అని చెప్పిన పిమ్మట అత్రిమహర్షి ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'ఊరక మీఱ నాడెదవు; యుక్త మయుక్తము నాత్మఁ జూడఁగా**
**నేరవు; సర్వలోకములు నిర్మలనీతిపరాక్రమంబు లొ**
**ప్పారఁగ నేలి ధర్మముల కన్నిటికిం గుదురై వెలుంగు ధా**
**త్రీరమణుండు మేటిగ నుతింపఁగ వోలదె నాకు నిమ్మెయిన్?' 198**

**ప్రతిపదార్థం:** ఊరక, మీఱన్+ఆడెదవు= నిరర్థకంగా అధికప్రసంగం చేస్తున్నావు; యుక్తము= తగింది; అయుక్తమున్= తగనిది అని; ఆత్మన్+చూడఁగాన్+నేరవు= ఆంతర్యంలో విచారించ జాలవు; సర్వ, లోకములు= సమస్తమైన ప్రపంచాలను; నిర్మల, నీతి, పరాక్రమంబులు= స్వచ్ఛమైన నీతి, శౌర్యాలు; ఒప్పు+ఆరఁగన్= విలసిల్లేటట్లుగా; ఏలి= పరిపాలించి; ధర్మములకున్+ అన్నిటికిన్= సమస్తమైన ధర్మాలకు; కుదురు+ఐ= నెలవై (ఆలవాలమై); వెలుంగు= ప్రకాశించే; ధాత్రీ, రమణుండు= రాజు (భూమికి సంతసం చేకూర్చే భర్త); మేటిగ= గొప్పగా; ఈ+మెయిన్= ఈ రీతిగా; నాకున్; నుతింపఁగన్+పోలదు+ఎ= పొగడటం సరికాదా?

**తాత్పర్యం:** 'ఏది ఉచితం, ఏది అనుచితం అనే ఆంతర్యం విచారించకుండ నీవు నిరర్థకమైన అధిక ప్రసంగానికి పాల్పడ్డావు. రాజే ధర్మానికి కుదురు. రాజే స్వచ్ఛమైన శౌర్యంతో సమస్తలోకాలను పరిపాలించే ప్రభువు. ధర్మ

రక్షణకు, పరిపాలనకు ఆధారకేంద్రమైన రాజు యొక్క గొప్పతనాన్ని స్థానాన్ని గుర్తించి ఈ రీతిగా ప్రశంసించటం నాకు తగదా?'

**విశేషం:** కేవలం ధనకాంక్షచేత ఒక మానవమాత్రుడిని ఇంద్రుడు చంద్రుడు ఈశ్వరుఁడు అని ముఖ స్తుతి చేయటం అనుచితం- అని గౌతమమహర్షి ఆక్షేపణం. ధర్మనిర్వహణలో సామాజికవ్యవస్థకు పరిపాలనలో కేంద్ర గరిమనాభి రాజు. అతడు వ్యవస్థగాని వ్యక్తి మాత్రుడు కాడు. అతడి గౌరవభూమిక గుర్తించటం నేరం కాజాలదు- అని అత్రి వాదం. ఇది సులభంగా తేలే వివాదం కాదు కాబట్టి మధ్యవర్తి అయిన తగవరి కావలసి వచ్చింది.

**వ. అని త న్నాక్షేపించిన గౌతముండు. 199**

**తాత్పర్యం:** అని తనను విమర్శించగా గౌతముడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**ఆ. 'కలయ నరలు వచ్చి తల తెల్ల నైనంతఁ । జేసి నీకు నెట్లుఁ జేరు నెఱుక?**
**జ్ఞానవృద్ధుఁడైన వాని మాటలు గదా । సభలఁ జెల్లు నార్యజనుల కెక్కి.' 200**

**ప్రతిపదార్థం:** కలయన్, నరలు, వచ్చి= ముసలితనంచేత తెల్లనైన వెంద్రుకలు అలముకొని; తల= శిరస్సు; తెల్లన+ ఐనంతన్+చేసి= తెలుపు రంగుగా మారినంతమాత్రంచేత; నీకున్; ఎఱుక= తెలివిడి, జ్ఞానం; ఎట్లున్= ఏవిధంగా; చేరున్= ఏర్పడుతుంది; జ్ఞాన వృద్ధుఁడు+ఐన వాని మాటలు కదా= వయస్సుచేత కాక పాండిత్యంచేత పెద్దవాడు అయినవాడి పలుకులు కదా; ఆర్య జనులకున్+ఎక్కి= పూజించతగినవారి మనస్సులలో చేరి; సభలన్= పెద్దల సమావేశాలలో; చెల్లున్= సరిపడతాయి.

**తాత్పర్యం:** 'వయసుమళ్లి, తలవెంద్రుకలు తెల్లబడినంతమాత్రాన నీకు జ్ఞానం సంక్రమిస్తుందా? పాండిత్యంలో పెద్ద అయినవాడిమాటలు సభలలో రాణిస్తాయి. ఆర్యులు జ్ఞానవృద్ధుడి మాటలనే అంగీకరిస్తారు కదా!'

**వ. అని తొడంగి యయ్యిరువురు మహానాదంబుగా వివాదంబు సేయుచుండఁగాశ్యపనామధేయుం డైన ముని సభాసదులైన మునులం జూచి వీరలవాదు మనచేతఁ జక్కంబడదు; సకలధర్మజ్ఞుం డయిన సనత్కుమారు నడుగుద' మనిన నా సదస్యులందఱు సనత్కుమారుపాలికిం జని యత్రిగౌతములవివాదంబు తెఱం గెఱింగించిన, నతండు వారల కి ట్లనియె. 201**

**ప్రతిపదార్థం:** అని= అని వచించి; తొడంగి= (వాదుకు) ఉపక్రమించి; ఆ+ఇరువురు= ఆ ఇద్దరు (ఋషులు); మహా, నాదంబుగాన్= పెద్ద రొద పుట్టేటట్లుగా; వివాదంబు= మాటల జగడం; చేయుచుండన్= సలుపుతుండగా; కాశ్యప నామధేయుండు+ ఐన= కాశ్యపుడు అనేపేరు కల; ముని= ఋషి; సభాసదులు+ఐన= సభలో ఉన్న; మునులన్+చూచి= ఋషులను చూచి; వీరల వాదు= (అత్రిగౌతమమునుల) వివాదం; మనచేతన్= (ఇక్కడ ఈసభలో ఉన్న) మనచేత; చక్కన్+పడదు= సరిగాదు, తీరదు; సకల ధర్మజ్ఞుండు+అయిన= సమస్త మైన ధర్మాలు తెలిసినవాడైన; సనత్కుమారున్= సనత్కుమారుడిని; అడుగుదము= కోరుదాం; అనినన్= అని చెప్పగా; ఆసదస్యులు+అందఱు= ఆసభలో ఉన్నసభ్యులు అందరున్నూ; సనత్కుమారు, పాలికిన్= సనత్కుమారుడు ఉన్నచోటికి; చని= వెళ్ళి; అత్రిగౌతముల, వివాదంబు, తెఱంగు= అత్రి గౌతముల మాటలజగడపు తీరు; ఎఱింగించినన్= తెలియజేయగా; అతండు= ఆ సనత్కుమారుడు; వారలకున్= ఆసదస్యులకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అత్రి గౌతములు ఇరువురున్నూ ఆవిధంగా మాటలజగడాన్ని ఆరంభించారు. అది పెద్దరొదగా మారింది. అప్పుడు కాశ్యపుడు అనే పేరుకల ఋషి, సదస్యులైన మునులతో ఈవిధంగా అన్నాడు- 'వీరి వాదం మనవంటివారు తీర్పు చెప్పదగింది కాదు. సమస్తధర్మాలు తెలిసిన సనత్కుమారుడిని అడిగితే ఆయన తగవరిగా తీర్పు చెప్పవచ్చును.' ఆ మాటలు విని, ఆ సదస్యు లందరు కలిసి సనత్కుమారుడి దగ్గరికి వెళ్ళి, అత్రిగౌతముల వివాదాన్ని వివరించి చెప్పారు. సనత్కుమారుడు ఆ వివాదాన్ని సావధానంగా ఆలకించి ఈ విధంగా చెప్పాడు.

**చ. 'అత్రి నిజంబ పల్కెఁ; దగ నాతని వాక్యము ధర్మయుక్త; మీ**
**ధాత్రి సమస్తమున్ బృహదుదగ్రభుజాగ్రమునందుఁ దాల్చు సత్**
**క్షత్రియుఁ డెల్లవారలను గావను బ్రోవఁ బ్రభుండు; గావునన్**
**శత్రునిషూదనుం డతఁడు శక్రుఁడు నీశ్వరుఁడున్ విధాతయున్. 202**

**ప్రతిపదార్థం:** అత్రి= అత్రి (మహర్షి); నిజంబు+అ= నిజమే; పల్కెన్= చెప్పాడు; తగన్= ఒప్పునట్లుగా; ఆతని, వాక్యము= అతడు చెప్పినమాట; ధర్మ యుక్తము= ధర్మంతో కూడింది; ఈ, ధాత్రి, సమస్తమున్= ఈభూమి అంతయు; బృహత్+ఉదగ్ర, భుజ+అగ్రమునందున్= పెద్దది, గొప్పది అయిన భుజంయొక్క పైభాగంలో; తాల్చు= ధరించే; సత్‌క్షత్రియుఁడు= మంచిక్షత్రియుడు; ఎల్లవారలను= అందరిని; కావను= రక్షించటానికి; ప్రోవను= పోషించటానికీ; ప్రభుండు= ప్రభువు; కావునన్= కాబట్టి; అతఁడు= అట్టిరాజు; శత్రునిషూదనుండు= శత్రువులను నిర్జించేవాడు; శక్రుఁడు= వేల్పులఱేడైన ఇంద్రుడు; ఈశ్వరుఁడున్= శివుడును; విధాతయున్= బ్రహ్మదేవుడుకూడ.

**తాత్పర్యం:** 'అత్రి చేసింది సరైన వాదమే. ఆతడి ప్రతివాదన సత్యమైనదే, ధర్మంతో కూడినదే. ఈ భూమండలాన్ని సమర్థవంతమైన తనభుజస్కంధంమీద ధరించే సత్‌క్షత్రియుడు, అందరిని కాపాడే ప్రభువు, శత్రువులను నిర్జించేవాడు, కాబట్టి అతడే ఇంద్రుడు, ఈశ్వరుడు, బ్రహ్మదేవుడు అని చెప్పటం సముచితం.

**క. జనులకు నెల్లను బూజ్యుఁడు । జనపాలుం; డతని మహితశాసనమున స**
**జ్జనులును మునులును సద్విధిఁ । జనువారలు గాక; కడవఁ జన దెవ్వరికిన్. 203**

**ప్రతిపదార్థం:** జనపాలుండు= రాజు; జనులకున్+ఎల్లను= ప్రజలందరికి; పూజ్యుఁడు= ఆరాధించదగినవాడు; అతని మహిత శాసనమునన్= అతడియొక్క గొప్పఆజ్ఞవలన; సత్+జనులును= మంచి మనుజులున్నూ; మునులును= ఋషులున్నూ; సత్+విధిన్= మంచి మార్గంలో; చనువారలు= ప్రవర్తించేవా రౌతారు; కాక= ఆవిధంగా కాక; ఎవ్వరికిన్= ఎవరికైనను; కడవన్+చనదు= అతడి ఆజ్ఞను జవదాటటానికి వీలు కాదు.

**తాత్పర్యం:** ప్రజలందరికి ఆరాధించతగినవాడు ప్రజలను పరిపాలించే ప్రభువు. మీరజాలని ఆతడి ఆజ్ఞవలననే మంచివారు, ఋషులు మంచిమార్గంలో నడవగలరు. ఎవ్వరూ ఆతడి ఆనతి జవదాట రాదు.

**వ. క్షత్రియప్రభావం బే మనవచ్చు! విరాట్టు, సమ్రాట్టు, విధిజితుండు, సత్యమన్యుండు, యథాజీవుండు, ధర్ముండు నను భవ్యనామంబుల నిగమంబులు పార్థివుం గొనియాడుఁ; దొల్లి యధర్మంబునకు వెఱచి బ్రాహ్మణులు నిజతేజోబలంబులు క్షత్రియులందు నిక్షేపించిరి; నాఁటంగోలె బ్రాహ్మ్యంబువలన క్షత్రంబు ప్రవర్తిల్లుచుండు; బ్రహ్మక్షత్త్రంబులు పరస్పరసంశ్రయంబులు; వెలిగా వర్తింప నేరవు; క్షత్రియుండు బ్రాహ్మణ సంసేవనంబునం**

**దేజోనిరూఢుం డయి యాదిత్యుండు చీఁకటి నడంచునట్లు దురితంబుల నడంచు; నట్లగుటంజేసి క్షత్త్రియుండు సర్వాధికుం డగుట నిశ్చయం' బనిన, నమ్మునులందఱుఁ జని వైన్యునకుఁ దత్ప్రకారం బంతయు నెఱింగించిన నా భూవరుం డత్రిం జూచి. 204**

**ప్రతిపదార్థం:** క్షత్త్రియ, ప్రభావంబు= క్షత్రియుడి మహిమ- అనగా రాజకులానికి సంబంధించినవాడి శక్తి; ఏమి+అనవచ్చున్!= ఏవిధంగా చెప్పవీలవుతుంది!; విరాట్టు= విశేషమైన దక్షత గల ప్రభువు; సమ్రాట్టు= గొప్ప రాజు; విధి, జితుండు= అదృష్టాన్ని జయించినవాడు; సత్య, మన్యుండు= సత్యంకొరకైన కోపం కలవాడు; యథా, జీవుండు= ప్రాణి కోటిని క్రమబద్ధంగా శాసించేవాడు; ధర్ముండు= ధర్మంతో కూడిన నడవడిక కలవాడు; అను= అనునట్టి; భవ్య, నామంబులన్= మనోహరమైన పేళ్ళతో; నిగమంబులు= వేదాలు; పార్థివున్= రాజును; కొనియాడున్= పొగడుతాయి; తొల్లి= పూర్వం; అధర్మంబునకున్= ధర్మం లేమికి; వెఱచి= భయపడి; బ్రాహ్మణులు= బ్రహ్మజ్ఞానం కలమేధావులు; నిజ, తేజస్+బలంబులు= తమవైన వెలుగు శక్తులు; క్షత్త్రియులందున్= రాచకొలంవారియందు; నిక్షేపించిరి= దాచిపెట్టారు; నాఁటన్+కోలెన్= ఆసమయంనుండి; బ్రాహ్మ్యంబువలనన్= బ్రాహ్మణులకు సంబంధించిన మహిమ వలన; క్షత్త్రంబు= క్షత్రియులకు సంబంధించిన పరాక్రమం; ప్రవర్తిల్లుచుండున్= ఒప్పుతూ ఉంటుంది; బ్రహ్మ, క్షత్త్రంబులు= బ్రాహ్మణుల మహిమ, క్షత్రియులమహిమ; పరస్పర, సంశ్రయంబులు= ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉండేవి; వెలిగాన్= ఒకదానిని విడిచి వేరొకటి ఉండేవిగా; వర్తింపనేరవు= ఒప్పవు; క్షత్త్రియుండు= రాచకొలంవాడు; బ్రాహ్మణ, సంసేవనంబునన్= బ్రాహ్మణులను సేవించటంవలన; తేజస్+ నిరూఢుండు+అయి= వెలుగుతో కూడుకొన్నవాడై; ఆదిత్యుండు= సూర్యుడు; చీఁకటిన్= అంధకారాన్ని; అడంచు+అట్లు= పోగొట్టే రీతిగా; దురితంబులన్= పాపాలను; అడంచున్= పోగొట్టుతాడు; అట్లు= ఆవిధంగా; అగుటన్+చేసి= జరుగుటవలన; క్షత్త్రియుండు= పరాక్రమం కలిగిన రాచకులంవాడు; సర్వ+అధికుండు+అగుట= అందరిని మించేవాడు కావటం; నిశ్చయంబు= దృఢమైన నిర్ధారణ; అనినన్= అని చెప్పగా; ఆ+మునులు+అందఱున్= ఆఋుషులు అందరున్నూ; చని= వెళ్లి; వైన్యునకున్= వైన్యుడు అనే పేరుకల ఆరాజుకు; తద్, ప్రకారంబు+అంతయున్= ఆవిధంగా జరిగిన సంగతిని అంతటిని; ఎఱింగించినన్= తెలుపగా; ఆ, భూ, వరుండు ఆరాజు (అనగా వైన్యమహారాజు); అత్రిన్+చూచి= అత్రిని కనుగొని.

**తాత్పర్యం:** పరాక్రమంతో భూజనులను పరిపాలించే ప్రభువుయొక్క మహిమను ఏవిధంగా వర్ణించటానికి వీలౌతుంది? విశిష్టమైన పరిపాలనాదక్షత కలవాడు, గొప్పప్రభువు, అదృష్టాన్ని తనవశం చేసికొన్నవాడు, సత్యాన్ని కాపాడటానికి ఆగ్రహావేశం కలవాడు, ప్రజలను క్రమశిక్షణతో నడిపించేవాడు, ధర్మంతో కూడిన నడవడిక కలవాడు అనే అర్థాలు కల శబ్దాలతో వేదాలు రాజును అభివర్ణిస్తాయి. పూర్వకాలంలో అధర్మం ప్రబలుతుందేమోననే భయంతో, బ్రాహ్మణులు తమశక్తి యుక్తులను రాజులయందు దాచిపెట్టారు. ఆ సమయంనుండి, బ్రాహ్మణులతేజస్సు క్షత్రియులగొప్పతనం ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నాయి. క్షాత్రబలం లేని బ్రాహ్మణశక్తి, బ్రాహ్మణశక్తి లేని క్షాత్రం రాణించజాలవు. క్షత్రియుడు బ్రాహ్మణులను పూజించటంచేత, తేజస్సును ఆర్జించి, సూర్యుడు చీకటిని పోగొట్టేటట్లు పాపాలను హరింపచేయగలడు. అందుచేత క్షత్రియుడు అందరికంటె అధికుడు. ఇది నిశ్చయం' అని సనత్కుమారుడు తీర్పుచెప్పాడు. అంతట ఆతీర్పును వినిన ఆ మునులు ఆసంగతిని వైన్యమహారాజు కడ కేగి విన్నవించారు. అప్పుడు వైన్యమహారాజు అత్రిని గౌరవించి, (ఈవిధంగా పలికాడు).

**క. 'నను నెల్లజనులకంటెను । ఘనుఁ డని కొనియాడి తీవు కడు నిజముగఁ గా**
**వున నిదె ప్రీతుఁడ నైతిన్ । గొను మిచ్చెద నీకు నేను గోటిధనంబుల్.' 205**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; ఎల్ల, జనులకంటెను= అందరు మనుజులకంటెను; ఘనుఁడు+అని= గొప్పవాడు అని; కొనియాడితి+ఈవు= నీవు పొగిడావు; కడు, నిజముగన్= మిక్కిలిసత్యంగా; కావునన్= కాబట్టి; ఇదె= ఇప్పు డీసమయంలో; ప్రీతుఁడన్+ఐతిన్= సంతోషించాను; ఏను= నేను; నీకున్= నీకు; కోటిధనంబుల్= కోటిద్రవ్యాలు; ఇచ్చెదన్= ఇస్తాను; కొనుము= స్వీకరించుము.

**తాత్పర్యం:** నీవు నన్ను అందరికంటెను గొప్పవాడ వని పొగిడావు; నాకు మిక్కిలి సంతోష మైనది. కావున నీకు కోటి ధనాలను దానంగా ఇస్తాను; దయచేసి స్వీకరించుము.

**క. అని యిష్టధనము లిచ్చినఁ। గొని వచ్చి మునీశ్వరుండు గొడుకులకుఁ బ్రియం**
**బునఁ బంచి యిచ్చి యిమ్ములఁ। జనియె వనంబునకు ధర్మసంహితబుద్ధిన్. 206**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; ఇష్ట, ధనములు+ఇచ్చినన్= కోరినద్రవ్యాలు ఇవ్వగా; కొనివచ్చి= తీసికొనివచ్చి; ముని+ఈశ్వరుండు= ఋషులలో శ్రేష్ఠుడైన (అత్రి); కొడుకులకున్= పుత్రులకు; ప్రియంబునన్= ప్రేమతో; పంచి+ఇచ్చి= భాగాలు చేసి ఒసంగి; ధర్మ, సంహిత, బుద్ధిన్= ధర్మం నెరవేర్చ వలె ననే కోరికతో కూడిన ఆలోచనతో; వనంబునకున్= అడవికి; ఇమ్ములన్= ప్రీతితో; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, వైన్యమహారాజు తనకు ఇచ్చిన ధనాలనుగైకొని ఇంటికి పోయి, అత్రి మహాముని వాటిని కొడుకులకు పంచిపెట్టి ధర్మంతో కూడిన ఆలోచనతో తాను అడవికి వెళ్ళాడు.

**వ. అని చెప్పి మార్కండేయుండు పాండవేయునితో నిట్లను; సరస్వతీగీత యను నితిహాసంబు సెప్పెద; నందు విశిష్టధర్మంబు లెఱుఁగ నగుఁ; దొల్లి తార్క్ష్యుండను మునివరుండు భారతి నారాధించిన నద్దేవి ప్రత్యక్షం బగుటయు ని ట్లని యడిగె. 207**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; మార్కండేయుండు= మృకండుమహాముని కుమారుడైన మార్కండేయుడు; పాండవేయునితోన్= పాండురాజుకొడు కైన (ధర్మరాజుతో); ఇట్లు+అనున్= ఈవిధంగా చెప్పాడు; సరస్వతీ, గీత+అను= సరస్వతీ గీత అనే పేరు కల; ఇతిహాసంబు= జరిగిన కథ; చెప్పెదన్= వినిపిస్తాను; అందున్= (ఆ ఇతిహాసంలో); విశిష్ట, ధర్మంబులు= విశేషంగా పేర్కొనదగిన ధర్మాలు అనగా ధర్మసూక్ష్మాలు; ఎఱుఁగన్+అగున్= తెలిసికొనటానికి వీలౌతుంది; తొల్లి= పూర్వకాలంలో; తార్క్ష్యుండు+అను= తార్క్ష్యుడు అనే పేరుకల; ముని, వరుండు= ఋషులలో గొప్పవాడు; భారతిన్+ఆరాధించినన్= సరస్వతీదేవిని ప్రార్థించగా; ఆ+దేవి; ప్రత్యక్షంబు+అగుటయున్= తనయెదుట కన్పించగా; ఇట్లు+అని+అడిగెన్= ఈ విధంగా ప్రార్థించాడు.

**తాత్పర్యం:** ఆవిధంగా వైన్యుడిచరితాన్ని చెప్పి, పిమ్మట ధర్మరాజుతో మార్కండేయమహర్షి ఈవిధంగా అన్నాడు. 'నీకు ఇప్పుడు సరస్వతీగీత అనే ఇతిహాసం వినిపిస్తాను. అందులో పెక్కు ధర్మసూక్ష్మాలు ఉన్నవి. నీవు వాటిని గ్రహించటం అవసరం. పూర్వకాలంలో తార్క్ష్యుడు అనే ఒక గొప్పఋషి ఉన్నాడు. అతడు సరస్వతీదేవినిగూర్చి తపస్సు చేయగా, ఆ దేవి అతడికి ప్రత్యక్ష మయింది. అతడు ఆ సరస్వతీదేవిని ఈవిధంగా అడిగాడు.

**క. 'పురుషున కెయ్యది ధర్మువు?। పురుషుం డెద్దానఁ బరమపుణ్యాత్మకుఁ డై**
**చిరపుణ్యగతులు వడయును?। దిరముగ నిది యానతిమ్ము దేవీ! నాకున్.' 208**

**ప్రతిపదార్థం:** దేవీ!= ఓ సరస్వతీదేవీ!; పురుషునకున్= మానవుడికి (ఇచట జనులకు అనిభావం); ఏ+అది= ఏది; ధర్మువు= ధర్మం; పురుషుండు= పురుషుడు; ఏ+దానన్= దేనివలన; పరమ, పుణ్య+ఆత్మకుఁడు+ఐ= శ్రేష్ఠమైన పుణ్యాలతో కూడుకొన్న అంతరంగం కలవాడై; చిర, పుణ్య, గతులు= శాశ్వతమైన పుణ్యంతో కూడిన మార్గాలు; పడయును?= పొందుతాడు?; నాకున్= నాకు; ఇది= ఈవిషయం; తిరముగన్= గట్టిగా నాటుకొని ఉండేటట్లుగా; ఆనతి+ఇమ్ము= దయతో చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓసరస్వతీ దేవీ! దయతో ఈప్రశ్నలకు నీవు సరైన సమాధానాలను నాకు సెలవిమ్ము. మనుజుడు పాటించవలసిన ధర్మం ఏది? మనుజుడు ఏవిధంగా పుణ్యగతులు సంపాదించగలుగుతాడు? ఆపుణ్యం ఎట్లా శాశ్వతంగా ఉంటుంది? నీవు చెప్పే సమాధానాలు నా మనస్సుకు సదా అంటిపెట్టుకొని ఉండేటట్లు సెలవిమ్ము.'

**వ. అనిన వానికి నప్పరమేశ్వరి యి ట్లనియె. 209**

**తాత్పర్యం:** అని అడుగగా, ఆ సరస్వతీదేవి అతడికి ఈవిధంగా సమాధానం చెప్పింది.

**మ. 'ధృతి వేదంబులు నాలుగుం జదివి భూదేవుండు నానాధ్వర**
**వ్రతుఁ డై యుండెడునట్టిపుణ్యుఁ డమరావాసంబునం దుండు ను**
**న్నతవృత్తస్తనభారమంథర మరున్నారీపరీరంభ సం**
**భృత రోమాంచ సమంచితాంగుఁ డగుచుం బెక్కేండ్లు సంప్రీతితోన్. 210**

**ప్రతిపదార్థం:** ధృతిన్= ధైర్యంతో (అనగా దీక్షతో); వేదంబులు, నాలుగున్, చదివి= నాలుగువేదాలను పఠించి; భూ, దేవుండు= బ్రాహ్మణుడు; నానా+అధ్వర, వ్రతుఁడు+ఐ+ఉండెడు+అట్టి+పుణ్యుఁడు= పెక్కు యజ్ఞాలను చేసే పూనికతో మెలగి పుణ్యాన్ని ఆర్జించినవాడు; అమర+ఆవాసంబునందున్= దేవతలు నివసించే స్వర్గలోకంలో; ఉన్నత, వృత్త, స్తన, భార, మంథర, మరుత్+నారీ, పరీరంభ, సంభృత, రోమాంచ, సమ్+అంచిత+అంగుఁడు+అగుచున్= ఎత్తయిన, గుండ్రని గబ్బిగుబ్బలతో తిరుగాడే దేవలోకపు స్త్రీల కౌగిలింతలవలన ఏర్పడిన గగురుపాటుతో కూడిన శరీరం కలవాడౌతూ; పెక్కు+ఏండ్లు= అనేక సంవత్సరాలు; సంప్రీతితోన్= మిక్కుట మైన సంతోషంతో; ఉండున్= నివసిస్తాడు.

**తాత్పర్యం:** 'దీక్షతో నాలుగువేదాలు పఠించి, పెక్కు యాగాలు చేసి పుణ్యాన్ని ఆర్జించిన బ్రాహ్మణుడు మరణించిన పిమ్మట స్వర్గలోకానికి పోతాడు. అక్కడ గబ్బిగుబ్బలతో నడయాడే అప్సరసల కౌగిలింతలవలన ఏర్పడిన గగుర్పాటు గల దేహంతో అతడు పెక్కు సంవత్సరాలు మిక్కిలి సంతోషంతో గడపుతాడు.

**సీ. మేలగు క్రేపుతోఁ బాలు సాలఁగ గల్గి। లాలితం బగు తొలిచూలు మొదవుఁ**
**బాత్రభూతుం డైన శ్రోత్రియునకు నిచ్చు। సదమలచరితుఁ డమ్మొదవు మేన**
**నెన్నిరోమము లుండు నన్ని వేలేఁడులు। సురలోకసౌఖ్యవిస్ఫురణ నొందు;**
**భారంబునకుఁ జాలి భూరిసత్త్వాఢ్య మై। బిరుదైన యెద్దు భూసురున కిచ్చి**

**ఆ. నరుఁడు ధేనుదశక మిరవొంద నిచ్చిన। ఫలము వడయు; మఱియు వలువ లొసఁగి**
**చంద్రలోకమునకు సంప్రీతుఁడై చనుఁ;। గనక మిచ్చి నాకమునకు నరుగు. 211**

**ప్రతిపదార్థం:** మేలు+అగు= మేలగు= మంచిదైన; క్రేపుతోన్= దూడతో; పాలు= క్షీరం; చాలఁగన్+కల్గి= ఎక్కువగా ఉండి; లాలితంబు+అగు= ఒప్పారునట్టి; తొలి, చూలుమొదవున్= మొదటి కానుపు కన్న ఆవును; పాత్రభూతుండు+ఐన= యోగ్యత

కలిగినట్టి; శ్రోత్రియునకున్= సదాచారం పాటించే బ్రాహ్మణుడికి; ఇచ్చు= ఒసగునట్టి; సత్+అమల, చరితుఁడు= మంచిదైన నిర్మలమైన సత్ప్రవర్తన కలిగినవాడు; ఆ+మొదవు, మేనన్= ఆ ఆవుయొక్క దేహంలో; ఎన్నిరోమములు+ఉండున్= ఎన్ని వెంట్రుకలు ఉంటాయో; అన్ని, వేల+ఏఁడులు= అన్నివేల సంవత్సరాలు; సురలోక, సౌఖ్య, విస్ఫురణన్= స్వర్గ లోకంలో అనుభవించే సౌఖ్యాన్ని; ఒందున్= పొందుతాడు; భారంబునకున్+చాలి= బరువు మోసే బలం కలిగి; భూరి, సత్త్వ+ఆఢ్యము+ఐ= గొప్పశక్తితో కూడి ఉన్నదై; బిరుదు+ఐన+ఎద్దున్= మెచ్చదగిన ఎద్దును; భూసురునకున్= బ్రాహ్మణుడికి; ఇచ్చి= ఒసగి; నరుఁడు= మనుజుడు; ధేను, దశకమున్= పది ఆవులను; ఇరవు+ఒందన్= ఒప్పారేటట్లుగా; ఇచ్చిన= ఒసగిన; ఫలము= ఫలితం (పుణ్యం); పడయున్= పొందుతాడు; మఱియున్= ఇంకను; వలువలు+ఒసఁగి= బట్టలు ఇచ్చి; సంప్రీతుఁడు+ఐ= మిక్కిలి సంతోషం చెందినవాడై; చంద్రలోకమునకున్= చంద్రుడి లోకానికి; చనున్= వెళ్ళుతాడు; కనకమున్+ఇచ్చి= బంగారాన్ని ఒసగి; నాకమునకున్= స్వర్గలోకానికి; అరుగున్= వెళ్ళుతాడు.

**తాత్పర్యం:** మంచిదూడతో ఉండి, ఎక్కువ పాల నిస్తున్న మొదటి చూలు ఆవును యోగ్యుడైన శ్రోత్రియ బ్రాహ్మణుడికి దానమిచ్చిన పుణ్యాత్ముడు (మరణానంతరం) స్వర్గలోకానికి చేరుతాడు. ఆ ఆవుదేహంమీద ఎన్నివెంట్రుకలు ఉంటాయో అన్ని వేల సంవత్సరాలు ఆదాత స్వర్గలోకంలో ఉంటాడు. బరువు మోయగల బలం కలిగిన కోడెయెద్దును బ్రాహ్మణుడికి దానం చేసినవాడు పది ఆవులను దానం చేసిన పుణ్యఫలాన్ని ఆర్జిస్తాడు. మరియు, వస్త్రదానం చేస్తే చంద్రలోకానికి పోతాడు. బంగారాన్ని దాన మిస్తే స్వర్గలోకం పొందుతాడు.

**క.** **కృతమతి యై యేడేఁడులు । హుతవహు ఘృతమునను బ్రీతి నొందించిన సు**
**వ్రతుఁ డీరేడుతరంబుల । పితరులఁ గొని దివికి నేఁగుఁ బెంపెసలారన్.** **212**

**ప్రతిపదార్థం:** కృతమతి+ఐ= దీక్షతో కూడిన బుద్ధికలవాడై; ఏడు+ఏఁడులు= ఏడు సంవత్సరాలు; హుతవహున్= అగ్నిహోత్రుడిని; ఘృతమునను= నేతిని వేల్చుట చేత; ప్రీతిన్+ఒందించిన= తృప్తి చెందేటట్లుగా చేసిన; సు, వ్రతుఁడు= మంచి నోమును నోచిన వాడు; ఈరేడు తరంబుల= పదునాలుగు పురుషాంతరాల తరబడి; పితరులన్= పితృదేవతలను; కొని= వెంటబెట్టుకొని; పెంపు+ఎసలు+ఆరన్= గొప్పదనం ఒప్పారేటట్లుగా; దివికిన్+ఏఁగున్= స్వర్గానికి వెళ్ళుతాడు.

**తాత్పర్యం:** దీక్షతో ఏడుసంవత్సరాలు అగ్నిహోత్రుడిని నేతితో వేల్చి సంతృప్తి చెందించిన నైష్ఠికుడు పదునాలుగు తరాలకు చెందిన పితృదేవతలను తనతోపాటు తీసికొని గొప్పదనం ఒప్పారేటట్లుగా స్వర్గలోకానికి వెళ్ళుతాడు.

**క.** **సతతంబును శుచియై దే । వతలఁ బ్రదీప్తాగ్నియందు వదలక సంత**
**ర్పితులుగఁ జేసి పడయు నం । చితముగ గోలోకవాస చిరసౌఖ్యంబుల్.** **213**

**ప్రతిపదార్థం:** సతతంబును= ఎల్లప్పుడును; శుచి+ఐ= పవిత్రుడై ఉండి; వదలక= విడువక; ప్రదీప్త+అగ్ని+అందున్= మండుతుండే అగ్నిలో; దేవతలను= వేల్పులను; సంతర్పితులుగన్+చేసి= తృప్తి చెందిన వారినిగా చేసి; అంచితముగన్= ఒప్పునట్లుగా; గోలోక, వాస, చిర, సౌఖ్యంబుల్= గోలోకంలో నివసించే శాశ్వతమైన సుఖాన్ని; పడయున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఎల్లప్పుడును పవిత్రతను పాటించి, అగ్నిహోత్రంలో నిరంతరాయంగా హవిస్సులు వేల్చి దేవతలను తృప్తి పొందించేవాడు చాలకాలం గోలోకంలో నివసించి సౌఖ్యాలను అనుభవిస్తాడు.

**వ. అగ్నిహోత్రం బస్మదాత్మకం బని యెఱుంగుము; సకలయజ్ఞంబులందుఁ గల్గింపఁ బడు విశిష్టద్రవ్యంబు లన్నియు మదీయంబు; లేను మహనీయం బైన యగ్నిహోత్రముఖంబునం బ్రభవింతు; నాత్మజ్ఞు లగు మహాత్ములకు నఖిలసంశయచ్ఛేదంబు సేయుదు; ననవరత స్వాధ్యాయ దానవ్రత పరాయణులైన తపోధను లెందేని వీతశోకులై వసియింతు; రట్టిది మామకంబైన పరమపదంబు; వినుము! ప్రచుర మధుక్షీరతోయంబులును శర్కరాసైకతంబులును మాంసాపూపప్రకరతీరంబులును బాయసకర్దమంబులు నైన యేఱు లనేకంబు లుత్పాదించి యింద్రాగ్ని ప్రముఖు లైన దివిజులకుఁ దృప్తి సేసి యజనశీలురు మత్పదంబుం బ్రాపింతు' రని చెప్పినఁ దార్క్ష్యుండు కృతాంజలియై. 214**

**ప్రతిపదార్థం:** అగ్నిహోత్రంబు= అగ్ని; అస్మత్+ఆత్మకంబు= నా స్వరూపమే అయినట్టిది; అని; ఎఱుంగుము= తెలిసికొనుము; సకల, యజ్ఞంబులందున్= అన్ని జన్నాలలో; కల్గింపఁబడు= వాడబడే; విశిష్ట ద్రవ్యంబులు= విశేష పదార్థాలు; అన్నియున్= సమస్తాలున్నూ; మదీయంబులు= నావే; ఏను= నేను; మహనీయంబు+ఐన= గొప్ప దైన; అగ్నిహోత్ర, ముఖంబునన్= అగ్నియొక్క మొగంలో; ప్రభవింతున్= పుట్టుతాను; ఆత్మజ్ఞులు+అగు= ఆత్మనుగూర్చిన జ్ఞానాన్ని ఎఱిగినట్టి; మహా+ఆత్ములకున్= గొప్పవారికి; అఖిల, సంశయ+ఛేదంబు, చేయుదున్= అన్నిసందేహాలను త్రుంచివేస్తాను; అనవరత, స్వాధ్యాయ, దాన, వ్రత, పరాయణులు+ఐన= ఎల్లప్పుడు వేదాలను వల్లెవేసే, ఇతరులకు (తమకున్నవాటిని) దానంచేసే దీక్షతో నోములు నోచే; తపస్+ధనులు= తపోధనులు= తపస్సునే ధనంగా కలవారు; ఎందున్+ఏని= ఎచ్చోటనైనా; వీతశోకులు+ఐ= పోయినదుఃఖం కలవారై (దుఃఖం లేనివారై); వసియింతురు= నివసిస్తారు; అట్టిది= అటువంటిది; మామకంబు+ఐన= నాదైన; పరమపదంబు= గొప్పస్థానం; వినుము= ఆలకించుము; ప్రచుర, మధు, క్షీర, తోయంబులును= అధికమైన తేనెయే, అధికమైన పాలే నీళ్ళుగా గలవై; శర్కరా, సైకతంబులును= చక్కెర అనే ఇసుకతిన్నెలు కలిగినవై; మాంస+అపూప+ప్రకర, తీరంబులును= మాంసం, పిండివంటకాలు మున్నగునవి అనే గట్టులు కలిగిననియును అయి; పాయస, కర్దమంబులును+ఐన= పాయసాలు అనే బురదలు కలిగినవి అయిన; ఏఱులు+అనేకంబులు= పెక్కునదులు; ఉత్పాదించి= పుట్టించి; ఇంద్ర+అగ్ని, ప్రముఖులు+ఐన= ఇంద్రుడు అగ్ని మున్నగువారైన; దివిజులకున్= దేవతలకు; తృప్తిచేసి= సంతుష్టిని కల్గించి; యజనశీలురు= యజ్ఞాలు చేసేవారు; మత్+పదంబున్= నాదైన స్థానాన్ని; ప్రాపింతురు= పొందుతారు; అని చెప్పినన్= అని వచించగా; తార్క్ష్యుండు; కృత+అంజలి+ఐ= ఘటించిన కైమోడ్పు కలవాడై-అనగా నమస్కరించినవాడై.

**తాత్పర్యం:** అగ్నిహోత్రం నా స్వరూపానికి సంబంధించిందని తెలిసికొనుము; అన్ని యజ్ఞాలలోనూ సమకూర్చబడే వస్తువులు అన్నియు నాకు సంబంధించినవే. నేను అగ్నిహోత్రుడి ముఖంలోనుండి పుట్టుతాను. ఆత్మనుగూర్చిన పరిజ్ఞానం గల విద్వాంసులు అందరకు సమస్త సందేహాలను తీర్చగలను; ఎల్లప్పుడు వేద వేదాంగ పారాయణ చేస్తూ, దానధర్మాలు చేసి దుఃఖాతీతులై బ్రదికే మహాత్ములు ఉండేచోటు నా విశిష్టస్థానం. తేనె పాలు చక్కెర మాంసం పిండివంటలు పుష్కలంగా వెచ్చించి (తేనె, పాలు అనే నీళ్ళతో, చక్కెరలనే ఇసుక తిన్నెలతో, మాంసం పిండివంటలు అనే తీరాలతో, పాయసాలనే బురదలతో అనేక నదులను కల్పించి) యజ్ఞాలు చేసి దేవతలకు సంప్రీతి చేకూర్చే నైష్ఠికులు మరణానంతరం నా లోకానికి చేరగలరు' అని సరస్వతీదేవి ఆనతిచ్చింది. అంత ఆమెకు తార్క్ష్యుడు భక్తితో నమస్కరించి ఆమెను ఇట్లా ప్రార్థించాడు.

**విశేషం:** ఇచట అలంకారం రూపకం. యజ్ఞాలలో యజమానులు పెక్కు ఏఱులు ఉత్పాదిస్తా రట. నదులలోని నీరు - మధుక్షీరాలు, శర్కరలు - సైకతాలు, మాంసాపూప ప్రకరాలు తీరాలు; పాయసాలు కర్దమాలు. ఇట ఉపమానోపమేయాలకు అభేదాధ్యవసాయం కల్పించబడింది.

**ఉ. అంబ! నవాంబుజోజ్జ్వలకరాంబుజ । శారదచంద్రచంద్రికా**
**డంబరచారుమూర్తి! ప్రకట స్ఫుట భూషణ రత్న రోచిరా**
**చుంబితదిగ్విభాగ! శ్రుతిసూక్తవివిక్తనిజప్రభావ! భా**
**వాంబరవీథివిశ్రుతవిహారి! ననుం గృపఁ జూడు భారతీ! 215**

**ప్రతిపదార్థం:** భారతీ!= ఓ సరస్వతీ!; అంబ!= మాతృమూర్తి అయిన దేవీ!; నవ+అంబుజ+ఉజ్జ్వల, కర+అంబుజ!= క్రొత్తపద్మాలవలె వెలుగొందే చేతులు అనే పద్మాలు కలదానా!; శారద, చంద్ర, చంద్రికా+ఆడంబర, చారు, మూర్తి!= శరత్కాలంలోని చంద్రుడి వెన్నెల యొక్క దర్పంవంటి దర్పంతో మనోహరమైన ఆకృతి కలదానా!; ప్రకట, స్ఫుట, భూషణ, రత్న, రోచిస్+ఆచుంబిత, దిశ్+విభాగ!= పైకి బాగా కనుపించే ఆభరణాలకు చెందిన రత్నాలయొక్క కాంతులచేత బాగుగా స్పృశించిన (ముద్దుపెట్టబడిన) దిక్కులయొక్క భాగాలు కలదానా!; శ్రుతి, సూక్త, వివిక్త, నిజ, ప్రభావ!= వేదాలలోని సూక్తాలలో (సూక్తులలో) బాగా వెల్లడించబడిన సొంతమహిమ కలదానా!; భావ+అంబర, వీథి, విశ్రుత, విహారి!= ఆలోచనలు అనే ఆకాశపుదారులలో ప్రసిద్ధమైన విహారం కలదానా!; ననున్= నన్ను; కృపన్+చూడు= దయతో చూడుము.

**తాత్పర్యం:** అమ్మా! సరస్వతీ దేవీ! క్రొత్తపద్మాలవలె ధగధగలాడే చేతులు కలదానా! శరత్కాలంలోని వెన్నెలవెలుగువలె మిలమిలలాడే మనోహరాకారం కలదానా! దిగ్దిగంతాలవరకు కాంతులు వెల్లివిరియజేసే రత్నభూషలు కలదానా! వేదాలలోని సూక్తాలలో వెల్లడించబడిన స్వీయమహిమ కలిగినదానా! ఆలోచనల ఆకాశపు దారుల్లో ప్రశస్తరీతిలో విహరించేదానా! నన్ను దయతో మన్నించుము.

**విశేషం:** ఈ పద్యం తెలుగువారి నాలుకలపై చాటువువలె చిరకాలంనుండి నాట్య మాడుతున్నది. చాలామందికి ఈపద్యం వ్రాసిన కవి ఎఱ్ఱన అని తెలియదు. పోతన భాగవతంలోని అవతారికలో ఈపద్యం కన్పించటంచేత పలువురు ఇది పోతనకవికృత మనిన్నీ, భాగవతంలోని పద్యం అనిన్నీ భ్రమించటం కద్దు. అనుప్రాసాలంకార ప్రియుడైన పోతనమహాకవి ఈ పద్యాన్ని తన భాగవత అవతారికలో ఒజ్జబంతిగా స్వీకరించి చేర్చె నని భావించవచ్చును. అలం : రూపకం. (కరాంబుజ) అనుప్రాసం. బిందుపూర్వక బకారప్రయోగ పౌనఃపున్యం, అట్లే చంద్ర చంద్రికా, సూక్త, వివిక్త - విహారి, భారతీ !

**వ. అని వినుతించి కృతార్థుం డయ్యె' ననిన విని మృకండుపుత్త్రునకుఁ బాండుపుత్త్రుం డి ట్లనియె 'మునీంద్రా! వైవస్వతమను వెత్తెఱంగునం బ్రభావసంపన్నుం డయ్యెఁ జెప్పవే' యనిన మార్కండేయుం డి ట్లనియె.216**

**ప్రతిపదార్థం:** అని వినుతించి= అని పొగడి; కృత+అర్థుండు+అయ్యెన్= ధన్యుడు అయినాడు; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; మృకండుపుత్త్రునకున్= మార్కండేయుడికి; పాండుపుత్త్రుండు= పాండురాజుకొడుకు-ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు; ముని+ఇంద్రా!= మునులలో ఇంద్రుడివంటివాడా!; వైవస్వత మనువు= వైవస్వతుడు అనే మనువు; ఏ+తెఱంగునన్= ఏవిధంగా; ప్రభావ, సంపన్నుండు+అయ్యెన్= గొప్పదనంతో కూడినవాడు అయినాడు?; చెప్పవే= వచించ బూనుకొనుము; అనినన్= అని చెప్పగా; మార్కండేయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆవిధంగా ప్రశంసించి, ధన్యుడయినాడు' అని చెప్పగా విని, మార్కండేయుడితో ధర్మరాజు ఈవిధంగా పలికాడు - 'మునీంద్రా! వైవస్వతమనువు ఏరీతిగా గొప్పమహిమను సంపాదించగలిగాడు? దయచేసి చెప్పండి' అని అడుగగా, మార్కండేయమహర్షి ఈ విధంగా చెప్పాడు.

**క. 'విను చాక్షుషమన్వంతర । మున వైవస్వతుఁడు పరమపుణ్యుండు దపం**
**బొనరించె నిరాహారత । ననుపమధైర్యుండు దశసహస్రాబ్దంబుల్. 217**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; చాక్షుష, మన్వంతరమునన్= చాక్షుషుడు అనే మనువుకాలంలో; పరమ, పుణ్యుండు= మిక్కిలి సుకృతం కలవాడు; అనుపమధైర్యుండు= సాటిలేని ధైర్యం కలవాడు; వైవస్వతుఁడు= వైవస్వతుడు అనేవాడు; నిర్+ఆహారతన్= తిండి లేకుండా; దశ, సహస్ర+అబ్దంబుల్= పదివేలసంవత్సరాలు; తపంబు+ఒనరించెన్= తపస్సు చేశాడు.

**తాత్పర్యం:** ఆలకింపుము. పుణ్యాత్ముడు, సాటిలేని ధైర్యం కలవాడు అయిన వైవస్వతుడు చాక్షుషమన్వంతరంలో ఆహారం తీసికొనకుండ పదివేలసంవత్సరాలు తీవ్రతపస్సు చేశాడు.

**విశేషం:** మనువు - ప్రాచీనభారతీయసంస్కృతి పదునాల్గురు మనువులను పేర్కొంటున్నది.

"స్వాయంభువో మను స్తాత స్వారోచిషస్తథా
ఉత్తమస్తామసశ్చైవ రైవతశ్చాక్షుష స్తథా
వైవస్వతశ్చ కౌరవ్య సాంప్రతో మను రుచ్యతే
సావర్ణిశ్చ మనుస్తాత భౌచ్యో రౌచ్యస్తథైవ చ
తథైవ మేరుసావర్ణాశ్చత్వారో మనవః స్మృతాః." హరివంశమ్, 1-7-4

మన్వంతరం అనగా, డెబ్బదియొక్క దివ్యయుగాలకాలం. ప్రస్తుతం జరుగుచున్నది ఏడవ మనువు వైవస్వత మన్వంతరం. మన్వంతరం:- కృతయుగం-17,28,000 మానవ వత్సరాలు; త్రేతాయుగం-12,96,000 మానవ వత్సరాలు; ద్వాపరయుగం - 8, 64,000 మానవ వత్సరాలు; కలియుగం- 4,32,000 మానవ వత్సరాలు. ఈ నాలుగు యుగాలు కలిసినకాలం ఒక మహాయుగం. వేయి మహాయుగాలు గడిస్తే బ్రహ్మకు ఒక పగలు. అట్లే బ్రహ్మకు ఒక రాత్రి. ఒక బ్రహ్మదివసంలో పదునాల్గురు మనువులు పరిపాలిస్తారు. అనగా 337, 142, 658 సంవత్సరాలు ఒక మన్వంతరం. ఇంతవరకు స్వాయంభువు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు అనే మనువుల ఏలుబడి గడిచింది. ప్రస్తుతం గడుస్తున్నది వైవస్వత మన్వంతరం -అందులో ప్రస్తుతం కలియుగం ఇరువది ఎనిమిదవ ఆవృత్తం.

**ఆ. అనఘుఁ డూర్ధ్వబాహుఁ డై యేకపాదంబు । నందు నిలిచి బదరికాశ్రమమునఁ**
**జలిపె మఱియుఁ బెక్కుసంవత్సరంబులు । తపము సకలజనులుఁ దను నుతింప. 218**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= (పాపరహితుడైన) పుణ్యాత్ముడు (వైవస్వతుడు); ఊర్ధ్వబాహుఁడు+ఐ= పైకి చాచి నమస్కరిస్తున్న చేతులు కలవాడై; ఏకపాదంబునందున్= ఒంటికాలిమీద; నిలిచి= నిలబడి ఉండి; బదరికా+ఆశ్రమమునన్= బదరిక అనే పేరు కల ఆశ్రమంలో; సకల, జనులున్= ప్రజలందరూ; తనున్= తనను; నుతింపన్= పొగడగా; పెక్కు, సంవత్సరంబులు= అనేక సంవత్సరాలు; తపము= తపస్సు; చలిపెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఆ వైవస్వతుడు చేతులు పైకి ఎత్తి నమస్కరిస్తూ ఒంటికాలిపై సదా నిలబడి ఉండి బదరికాశ్రమంలో ఎన్నో ఏండ్లు, సర్వజనులు తనను పొగడేటట్లుగా తపస్సు చేశాడు.

**విశేషం:** బదరికాశ్రమం హిమాలయపర్వతశ్రేణులమధ్య సముద్రపు నీటిమట్టానికి సుమారు 13 వేల అడుగుల ఎత్తున అలకనందా నదీతీరంలో గల పుణ్యక్షేత్రం. బదరిక అనగా రేగుచెట్టు. ఈ వనంలో నరనారాయణులు తపస్సుచేసినట్లు పురాణకథనం. ఇచ్చట బ్రహ్మకపాలం, ఉష్ణకుండం ఉన్నవి.

మార్కండేయుండు ధర్మరాజునకు వైవస్వతు వృత్తాంతంబును చెప్పుట (సం. 3-185-1)

**వ. ఆ వైవస్వతుం డొక్కనాఁడు గృతస్నానుం డయి జలాశయతీరంబున నున్నయెడ నొక్కమత్స్యంబు జలంబుల దరికిం జనుదెంచి యి ట్లనియె; 'నయ్యా! యేను గడు నల్పమత్స్యంబ నగుటం జేసి బలవంతంబు లగు జలచరంబులవలన నాకుఁ దద్దయు భయంబు గలిగియుండు; నిమ్మడువు మహామత్స్యసంకులంబు గావున నపాయంబు వొందకుండ నన్నుద్ధరించి, యొండెడం బెట్టవే! యేను నీకుఁ బ్రత్యుపకారంబు సేయనోపుదు' ననిన విస్మితుండై యతం డమ్మీను నెత్తికొని పోయి యొక్కనూతియందు విడిచి దానిం బలుమాఱు నరసికొని యుండె; నదియును గ్రమంబున వర్ధిల్లి యొక్కనాఁ డమ్మనువున కి ట్లనియె. 219**

**ప్రతిపదార్థం:** ఆ వైవస్వతుండు; ఒక్క, నాఁడు= ఒక రోజున; కృతస్నానుండు+అయి= చేయబడిన స్నానం కలవాడై (స్నానం చేసినవాడై); జల+ఆశయ, తీరంబునన్= చెరువు గట్టుపైః ఉన్న+ఎడన్= ఉన్న తరుణంలో; ఒక్కమత్స్యంబు= ఒక చేప; జలంబులదరికిన్+చనుదెంచి= నీటిఒడ్డు సమీపానికి వచ్చి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికింది; అయ్యా!= అయ్యా!; ఏను= నేను; కడున్= మిక్కిలి; అల్ప, మత్స్యంబను= చిన్నిచేపను; అగుటన్+చేసి= కావటంచేత; బలవంతంబులు+అగు= బలంగలిగిఉన్న; జల, చరంబులవలనన్= నీటిలో చరించే జంతువులవలన; నాకున్= నాకు; తద్దయున్= మిక్కిలి; భయంబు+కలిగి+ఉండున్= భీతి ఉంటున్నది; ఈ+మడువు= ఈ చెరువు; మహా, మత్స్య, సంకులంబు= గొప్పగొప్పచేపలచేత దట్టమైనది; కావునన్= కాబట్టి; అపాయంబు+పొందకుండన్= ప్రమాదంవాటిల్లకుండ; నన్నున్+ఉద్ధరించి= నన్ను పైకి తీసి; ఒండు+ఎడన్= వేరొకచోట; పెట్టవే?= ఉంచవా? అని ప్రార్థిస్తున్నాను; ఏను= నేను; నీకున్; ప్రతి+ఉపకారంబు= చేసిన మేలుకు తిరిగి చేసేమేలు; చేయన్+ఓపుదున్= చేయజాలుతాను; అనినన్= అనిచెప్పగా; విస్మితుండు+ఐ= అచ్చెరువు చెందినవాడై; అతండు= అతడు (వైవస్వతుడు); ఆ+మీనున్= ఆచేపను; ఎత్తికొని పోయి= (ఆ చెఱువునుండి) తీసికొనిపోయి; ఒక్కనూతియందున్= ఒక చేదుడు బావిలో; విడిచి= వదలిపెట్టి; దానిన్= దానిని (ఆచేపను); పలుమాఱున్= చాల సార్లు; అరసికొని= చూచికొని; ఉండెన్; అదియును= ఆ చేపకూడా; క్రమంబునన్= వరుసగా; వర్ధిల్లి= పెంపుచెంది; ఒక్కనాఁడు= ఒక రోజున; ఆ+మనువునకున్= ఆవైవస్వతుడితో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పింది.

**తాత్పర్యం:** ఆ వైవస్వతుఁడు ఒకనాడు స్నానంచేసి చెఱువుగట్టున ఉండగా, ఒకచేప నీటిఒడ్డుదగ్గరికి వచ్చి అతడితో ఈవిధంగా అన్నది- 'అయ్యా! నేను మిక్కిలి చిన్న చేపను. ఈ చెరువులో పెద్దపెద్ద జలచరాలు ఎన్నెన్నో ఉన్నాయి. అవి నన్ను సులువుగా కబళించి వేయవచ్చును. అందుచేత పెద్దచేపలంటే నాకు మిక్కిలి భయం ఏర్పడింది. ఎట్టి ప్రమాదం నాకు సంభవించకుండగా, నాయందు కరుణ కలిగి, నన్ను కాపాడాలని నిన్ను ప్రార్థిస్తున్నాను. దయచేసి వేరొకచోటికి తరలించి నన్ను రక్షించుము. నీకు ప్రత్యుపకారం చేస్తాను'. ఆ చేపమాటలకు వైవస్వతుడు ఆశ్చర్యం చెంది, ఆ చేపను తీసికొనివెళ్లి ఒకనూతిలో పడవేసి, అప్పుడప్పుడు దాని యోగక్షేమాలను చూస్తూ ఉండేవాడు. కాలక్రమాన ఆ చేప బాగా పెంపొంది పెద్దగా ఎదిగి ఆ వైవస్వతుడితో ఇట్లా అన్నది.

**ఆ. 'అనఘ! నీ ప్రయత్నమున నా శరీరంబు । పొదలె; నాకు నిందు మెదల నెడము**
**సాల; దట్లుగాన మేలగు నొండొక । యెడకుఁ గొంచుఁ బొమ్ము కడఁగి నన్ను. 220**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపంలేనివాడా, పుణ్యాత్ముడా!; నీ ప్రయత్నమునన్= నీవు చేసిన కృషివలన; నా,శరీరంబు= నా దేహం; పొదలెన్= పెంపు చెందింది; నాకున్= నాకు; ఇందున్= (ఈనూతిలో); మెదలన్= తిరుగాడటానికి; ఎడము=

తగినచోటు; చాలదు= సరిపోవటం లేదు; అట్లు+కాన= అందుచేత; మేలు+అగు= శుభము ఒనగూడునట్టి, ఒండొక+ఎడకున్= వేరొకచోటికి; కడఁగి= పూని; నన్నున్= నన్ను; కొంచున్+పొమ్ము= తీసికొని పొమ్ము.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! నీవు చేసిన ఉపకారం వలన, నాశరీరం పెరిగి పెద్దదైంది. ఈ నూతిలోని స్థలం నాకు తిరగటానికి సరిపోవటం లేదు. కాబట్టి అనువైన వేరొకచోటికి నన్ను తిరిగి తీసికొని పొమ్ము.'

**వ. అనిన నతం డాజలచరంబుఁ గొని చని యొక్క బావియందు విడిచిన, నది యెప్పటియట్ల యక్కజంబుగాఁ బొదలి, తనకు బావియందు నవకాశంబు పర్యాప్తం బగుటం జెప్పి, యతనిచేత గంగమడువున విడువంబడి, కాలక్రమంబున నచ్చోటఁ దిరుగం బట్టు చాలకున్న నమ్మనువున కెఱింగించిన, నతం డెత్తికొనిపోయి సముద్రంబునం బెట్టిన, నది వాని కి ట్లనియె. 221**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; అతండు= అతడు (వైవస్వతుడు); ఆ, జలచరంబున్+కొని చని= ఆచేపను తీసికొని వెళ్లి; ఒక్కబావి+అందున్= ఒకపెద్దనూతిలో; విడిచినన్= వదలిపెట్టగా; అది= (ఆచేప); ఎప్పటి+అట్ల= ఇదివరకు మాదిరిగానే; అక్కజంబుగాన్= ఆశ్చర్యకరంగా; పొదలి= పెరిగి పెద్దదై; తనకున్= తనకు (ఆచేపకు); బావి+అందున్= పెద్దనూతిలో; అవకాశంబు= తెఱపి; పర్యాప్తంబు+అగుటన్= చాలకపోవటాన్ని; చెప్పి= వచించి (తెలిపి); అతనిచేతన్= (ఆ వైవస్వతుడిచేత); గంగమడువునన్= గంగయందు లోతైనచోటున; విడువన్+పడి= వదలిపెట్టబడి; కాల, క్రమంబునన్= కాలక్రమంగా; అచ్చోటన్= ఆ ప్రదేశంలో; తిరుగన్= అటూ ఇటూ తిరగటానికి; పట్టు= ఎడం; చాలక+ఉన్నన్= సరిపోకపోవటంచేత; ఆ+మనువునకున్; ఎఱింగించినన్= తెలుపగా; అతండు= అతడు (ఆ మనువు); ఎత్తికొనిపోయి= తీసికొని వెళ్ళి; సముద్రంబునన్= సముద్రంలో; పెట్టినన్= ఉంచగా; అది= (ఆచేప); వానికిన్= అతడితో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పింది.

**తాత్పర్యం:** ఆ చేపమాటలు విన్నపిదప, వైవస్వతుడు ఆ చేపను ఆ చిన్ననూతిలోనుండి తీసికొనివెళ్ళి ఒక పెద్దబావిలో పడవైచి దానిని రక్షిస్తూ ఉన్నాడు. ఆ చేప ఆ బావిలో దినదినాభివృద్ధి చెంది, పెరిగి పెద్దదై, తనకు ఇంక అక్కడ ఉండటానికి తగిన అవకాశం లేదని చెప్పింది. అంతట ఆతడు ఆచేపను అక్కడనుండి తరలించి గంగమడువులో విడిచిపెట్టాడు. ఆ చేపపెరుగుదలకు గంగమడువు కూడ సరిపోలేదు. అంతట ఆ వైవస్వతుడు ఆ చేపను ఎత్తికొనిపోయి సముద్రంలో విడిచిపెట్టాడు.

**క. 'ఉపకారం బొనరించితి । కృపతో నా కిట్లు నీవుఁ గృతమతి వై; ప్ర**
**త్యుపకారం బొనరించెద । విపులగుణాభరణ! తెలియ విను నా పలుకుల్. 222**

**ప్రతిపదార్థం:** విపుల, గుణ+ఆభరణ!= గొప్ప గుణగణాలు అనే భూషణాలు కలవాడా!; తెలియన్= తెలిసేటట్లుగా; నా, పలుకులు= నా మాటలు; విను= ఆలకింపుము; నీవున్= నీవు; కృతమతివి+ఐ= పరిణతి చెందిన బుద్ధి కలవాడవై- అనగా మంచి మనస్సు కలవాడవై; నాకున్+ఇట్లు= నాకు ఈరీతిగా; కృపతోన్= దయతో; ఉపకారంబు= మేలు; ఒనరించితి(వి)= చేశావు; ప్రతి+ఉపకారంబు= ప్రత్యుపకారంబు= చేసిన మేలుకు జోడగుమేలు; ఒనరించెదన్= (నీకు) చేస్తాను.

**తాత్పర్యం:** 'గొప్పగుణగణాలు గల మహానుభావా! నీవు కరుణ గలవాడవు; మంచి నిశ్చయంతోకూడిన మనస్సుతో నీవు నాకు మేలు చేశావు. తిరిగి నీకు నేను మేలు చేస్తాను. ఇప్పుడు నేను చెప్పుతున్న మాటలు దయచేసి సావధానంగా వినుము.

**తే. తడవు లే దింక; నిఖిలభూతములుఁ బ్రళయ । మొందనున్నవి యిప్పు; డొండొండ పొంగి
కలయఁబాఱుఁ బయోధు లుగ్రముగఁ బుణ్య । చరిత! యిదియ మన్వంతరసంధి యండ్రు. 223**

**ప్రతిపదార్థం:** పుణ్యచరిత!= పుణ్యమైన ప్రవర్తన కలవాడా!; తడవు= వ్యవధి; లేదు= లేదు; ఇంకన్= ఇక మీదట; నిఖిల, భూతములున్= అన్ని సజీవ నిర్జీవపదార్థాలున్నూ; ప్రళయము+ఒందన్+ఉన్నవి= సర్వనాశనం కానున్నవి; ఇప్పుడు= ఈ సమయంలో; పయోధులు= సముద్రాలు; ఒండు+ఒండ, పొంగి= ఒక్కొకటే క్రమంగా పొంగి; ఉగ్రముగన్= భయంకరంగా; కలయన్+పాఱున్= కలిసిపోయి అంతటా ప్రవహిస్తాయి; ఇది+అ= ఇదియే; మన్వంతర సంధి= ఒక మన్వంతరానికి, మరియొక మన్వంతరానికి మధ్య కాలం; అండ్రు= అని అంటారు; (మన్వంతరం= ఒకమనువు ఏలుబడికాలం - యుగాల సమాహారం.)

**తాత్పర్యం:** ఓ పుణ్యచరితుడా! ఇక వ్యవధానం లేకుండా ప్రళయం దాపురించబోతున్నది. ఇప్పుడు ఈ సృష్టిలో ఉన్న సజీవ నిర్జీవ పదార్థాలన్నీ సర్వనాశనం కానున్నవి. సముద్రాలన్నీ పొంగిపొరలి కలిసిపోయి ప్రవహించగలవు. దీనిని పెద్దలు మన్వంతరసంధి అని అభివర్ణిస్తారు.

**వ. కావున నీవు దృఢరజ్జుబంధురంబును సకలధాన్యతండుల కలితంబునుంగా నొక్క పేరోడ గావించి, సప్తముని సహితుండ వై దాని నెక్కి సముద్రంబు దరియందు నన్నుం దలంచునది; యేనును ఘనశృంగశోభితంబయిన రూపంబునఁ బొడసూపి మీకు మేలొనరించెద' నని యమ్మత్స్యంబు ననియె; వైవస్వతుండును దదుక్తప్రకారంబున నోడ నిర్మించి సప్తమునిసహితంబుగాఁ గృతారోహణుండై పయోధిఁ దఱియం దొడంగె; నంత. 224**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఈవు= (ఓవైవస్వతుడా) నీవు; దృఢ, రజ్జు, బంధురంబును= గట్టిగా పేనబడిన బలం గల త్రాటిచేత దృఢంగా కట్టబడినదిన్నీ; సకల; ధాన్య, తండుల, కలితంబునున్+కాన్= అన్ని విధాలయిన ధాన్యాల విత్తనపు గింజలతో కూడినట్టిదిగా; ఒక్క, పేరు+ఓడ= ఒకపెద్దనావను; కావించి= నిర్మించి; సప్త, ముని, సహితుండవు+ఐ= ఏడుగురు ఋషులతో కూడినవాడ వై; దానిన్= ఆ ఓడను; ఎక్కి= ఆరోహించి; సముద్రంబుదరియందున్= కడలియొడ్డుదగ్గర; నన్నున్= నన్ను; తలంచునది= స్మరించవలసింది; ఏనును= నేనును; ఘన, శృంగ, శోభితంబు+అయిన= పెద్దకొమ్ముతో ఒప్పారేదైన; రూపంబునన్= ఆకారంతో; పొడసూపి= కన్పించి; మీకున్; మేలు+ఒనరించెదన్= ఉపకారం చేయగలను; అని= అని చెప్పి; ఆ+మత్స్యంబు= ఆ చేప; చనియెన్= వెళ్ళిపోయింది; వైవస్వతుండును; తద్+ఉక్త, ప్రకారంబునన్= ఆ(చేపచేత) చెప్పబడిన రీతిగా; ఓడ= నౌక; నిర్మించి= నిర్మాణంచేసి; సప్త, ముని, సహితంబుగాన్= ఏడుగురు ఋషులతోపాటు; కృత+ఆరోహణుండు+ఐ= ఎక్కినవాడై; పయోధిన్= సముద్రాన్ని; తఱియన్+తొడంగెన్= చేరబోయాడు; అంతన్= అటుపిమ్మట.

**తాత్పర్యం:** ప్రళయకాలం సమీపిస్తున్నది కాబట్టి నీవు ఒక పెద్ద ఓడను నిర్మించుము. ఆ ఓడ దృఢమైన గొప్ప త్రాటితో బాగుగా కట్టబడి చాలకాలంవరకు మను నట్టిదిగా ఉండాలి. అందులో వివిధ ధాన్యాల విత్తనపు గింజలను సమృద్ధిగా సేకరించి పెట్టాలి. నీవు సప్తమునులతోపాటు ఆ ఓడ నెక్కి సముద్రం చేరేటప్పుడు నన్ను స్మరించునది. నేను పెద్ద కొమ్ము కల పెనుచేప ఆకారంతో కన్పించి మీకు ఉపకారం చేస్తాను' అని ఆ చేప చెప్పింది. అంతట ఆ వైవస్వతుడు ఆ చేప చెప్పినరీతిగా పెద్ద ఓడను నిర్మించి, సప్తర్షులతోపాటు ఆ నౌక నెక్కి సముద్రాన్ని చేరబోయాడు. అంతలో.

**మ. మతి వైవస్వతుచేఁ దలంపఁబడి యమ్మత్స్యంబు దోఁతెంచె నా**
**యతశృంగోన్నతమూర్తి; నాతఁడుఁ దదాజ్ఞాయత్తుఁ డై తచ్ఛిరో**
**గతశృంగాగ్రమునం దగిల్చె నతిదీర్ఘం బైన పాశంబు; న**
**ద్భుతవేగంబున నోడ నీడ్చె నది యంభోరాశిమధ్యంబునన్. 225**

**ప్రతిపదార్థం:** వైవస్వతుచేన్= వైవస్వతుడిచేత; మతిన్= బుద్ధిలో; తలంపఁబడి= స్మరించబడి; ఆ+మత్స్యంబు= ఆ చేప; ఆయత, శృంగ+ఉన్నత, మూర్తిన్= పొడుగైన కొమ్ముచేత ఎత్తుగా ఉన్న ఆకృతితో; తోఁతెంచెన్= ప్రత్యక్షమయింది; తద్+ఆజ్ఞా+ఆయత్తుఁడు+ఐ= ఆ(చేప); ఆనతిచేత సంసిద్ధుడై; ఆతఁడు= అతడు (వైవస్వతుడు); తద్+శిరోగత, శృంగ+అగ్రమునన్= ఆ(చేపయొక్క) తలయందున్న కొమ్ము చివరిభాగానికి; అతి, దీర్ఘంబు+ఐన= మిక్కిలి పొడవైన; పాశంబున్= ఆ గొప్ప త్రాటిని; తగిల్చెన్= తగిలించాడు; అది= (ఆచేప); అద్భుత, వేగంబునన్= అచ్చెరువును కలిగించే వేగంతో; అంభస్+రాశి, మధ్యంబునన్= సముద్రపు మధ్యభాగాన; ఓడన్= ఆ నౌకను; ఈడ్చెన్= లాగింది.

**తాత్పర్యం:** వైవస్వతుడిచేత స్మరించబడిన చేప వెంటనే వచ్చింది; పొడుగైన కొమ్ము గలిగి, మిక్కిలి ఎత్తయిన ఆకృతితో ఉన్న ఆ చేపయొక్క అనుమతి పొంది, అతడు ఆ చేప తలపై ఉన్న పెద్దకొమ్ముకొసకు మిక్కిలి పొడుగైన ఆ త్రాటిని తగిల్చాడు. అంతట అచ్చెరువు గొల్పే వేగంతో ఆచేప ఓడను సముద్రమధ్యంలో ఈడ్చుకొని పోయింది.

**వ. తదనంతరంబ. 226**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**సీ. గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన । యొత్తుచు నెడముల నుత్తరించి,**
**వేడుకఁ జేతులు విచ్చి యాడెడునట్లు । లోలోర్మిపంక్తులఁ గ్రాలి క్రాలి,**
**ప్రచురహాసస్ఫూర్తి పచరించు చాడ్పున । నురుఫేనరోచులఁ దెరలు గవిసి,**
**యురువడి వర్ధిల్లుచున్న జలంబుచేఁ । బొంగారి దెసలెల్ల బ్రింగికొనుచుఁ,**

**ఆ. బ్రబలవిలయకాలపటురయబహుళ స । మీరణౌఘదుర్నివార మగుచు**
**నుగ్రభంగిగాఁ బయోనిధు లొక్కటఁ । బెల్లు రేఁగి జగము లెల్ల ముంచె. 227**

**ప్రతిపదార్థం:** పయస్+నిధులు= సముద్రాలు; గరుసులు= అవధులు; కడవంగన్= మీరేటట్లుగా; కదలి= సంచరించి; అల్ల+అల్లన= క్రమక్రమంగా; ఒత్తుచున్= నొక్కుచు; ఎడములన్= మధ్యభాగాలను; ఉత్తరించి= దాటి; వేడుకన్= వినోదంతో; చేతులు= హస్తాలు; విచ్చి= విప్పి; ఆడెడు+అట్లు= ఇటుఅటుత్రిప్పేటట్లు; లోల+ఊర్మి, పంక్తులన్= చలించే కెరటాల వరుసలతో; క్రాలి, క్రాలి= మెరసి మెరసి; ప్రచుర, హాస, స్ఫూర్తి= అధికమైన నగవులతోడి ప్రకాశాన్ని; పచరించు చాడ్పునన్= వ్యాపింపచేస్తున్నట్లుగా; ఉరు, ఫేనరోచులన్= గొప్పవైన నురుగుల వెలుగులతో; తెరలు, కవిసి= క్రిందికి పైకి లేస్తూ; ఉరువడిన్= మిక్కిలివేగంగా; వర్ధిల్లుచున్+ఉన్న= పొంగారుతున్న; జలంబుచేన్= నీటిచేత; పొంగు+ఆరి= పై కుబికి; దెసలు+ఎల్లన్= దిక్కు లన్నింటిని; మ్రింగికొనుచున్= కబళిస్తూ; ప్రబల, విలయ, కాల, పటు, రయ, బహుళ, సమీరణ+ఓఘ, దుస్+నివారము+అగుచున్= మిక్కుటమైన ప్రళయ సమయంలోనిదై, ఎక్కువ వేగంగా పలురీతుల వీచే పెనుగాలి ప్రవాహంచేత అడ్డగించటానికి అనువు గాని విధంగా; ఉగ్ర, భంగిగాన్= భయంకరమైన విధంగా; ఒక్కటన్= ఒకేసమయంలో; పెల్లు రేఁగి= మిక్కిలి అతిశయించి; జగములు+ఎల్లన్= ప్రపంచాల నన్నింటిని; ముంచెన్= (నీటిలో) మునిగేటట్లు చేశాయి.

**తాత్పర్యం:** వైవస్వతుడు, సప్తర్షులు ఆవిధంగా ఓడపై ఎక్కి, సముద్రమధ్యభాగాన్ని చేరినపిమ్మట సముద్రాలన్నీ పొంగులువారి ఒకేసమయంలో మహాభయంకరంగా విజృంభించి జగా లన్నిటిని ముంచివేశాయి. చెలియలికట్టలను త్రెంచుకొని సముద్రజలాలు మిట్టపల్లాలను ఏకం చేస్తూ, వినోదంకొఱకై చేతులు విచ్చి ఆడుతున్నట్లున్న పెనుకెరటాలతో పొంగి, నవ్వులాటలు ఆడుతున్నట్లున్న నురుగులతో త్రుళ్లింతలాడుతూ పై కుబుకుతున్న నీటితో దిక్కు లన్నిటిని ఆక్రమించి సముద్రాలన్నీ లోకాలనన్నింటిని ముంచివేశాయి.

**విశేషం:** ఈ సీసపద్యం ఎఱ్ఱనకవితాశిల్పానికి నిదర్శనప్రాయం. ఇందులో ఎఱ్ఱన తన కాలంలోని ఉప్పెనను ప్రళయ జలంగా వర్ణించి ఉంటాడు. ఎఱ్ఱన ఆరణ్యపర్వ శేషాన్ని నన్నయపేరు మీదనే, నన్నయకవితాశిల్పాన్ని అనుకరించి 'తద్రచనయకా' వ్రాయబూనాడు. అయినను ఎఱ్ఱన స్వీయకవితాముద్ర అచ్చటచ్చట గోచరిస్తూనే ఉన్నది. ఎఱ్ఱనకు సమకాలీనులు ప్రసాదించిన బిరుదం- 'ప్రబంధపరమేశ్వరుడు. ప్రబంధశైలికి అంతరాత్మ వర్ణనాప్రియత్వం. ఈ సీసపద్యంలో ఎఱ్ఱనమహాకవికి కల వర్ణనాభిరుచి సుస్పష్టంగా స్వయంవ్యక్తమౌతున్నది.

**వ. ఇట్లు లోకంబెల్ల నేకార్ణవం బైన నమ్మత్స్యంబు దజ్జలాంతరంబున ననేకసహస్రవర్షంబు లయ్యోడం దిగుచుచుఁ బదంపడి యప్పెనువెల్లి యల్లనఁ దిగిచి పోవందొడంగునెడం దుహినగిరిశృంగసమీపంబున నయ్యోడ నిలిపి వారలతోడ. 228**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; లోకంబు+ఎల్లన్= ప్రపంచం అంతయును; ఏక+అర్ణవంబు+ఐనన్= ఒకేఒక సముద్రం కాగా; ఆ+మత్స్యంబు= ఆ చేప; తత్+జల+అంతరంబునన్= ఆనీటిమధ్యభాగంలో; అనేక, సహస్ర, వర్షంబులు= పెక్కువేలేండ్లు; ఆ+ఓడన్+తిగుచుచున్= ఆనౌకను ఇటునటు నడుపుతూ; పదంపడి= పిమ్మట; ఆ+పెను, వెల్లి= ఆ పెద్దవరద; అల్లనన్= క్రమంగా; తిగిచిపోవన్+తొడంగు+ఎడన్= తగ్గిపోవటానికి పూనుకొనే అదనులో; తుహిన, గిరి, శృంగ, సమీపంబునన్= మంచుకొండయొక్క శిఖరందగ్గరలో; ఆ+ఓడన్= ఆ ఓడను; నిలిపి= ఆపి; వారలతోడన్= ఆ వైవస్వతుడితో, సప్తర్షులతో.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రపంచమంతా ఒకే ఒక సముద్రంగా మారిపోయింది. అప్పుడు ఆ చేప ఆ నీటి మధ్యభాగంలో పెక్కువేల సంవత్సరాలు ఆ ఓడను లాగింది, పిమ్మట ఆ వరద తగ్గుమొగం పట్టిన పిదప, ఆ ఓడను హిమాలయపర్వతశిఖరం దరికి చేర్చి ఆ చేప వైవస్వతుడితో, సప్త ఋషులతో ఈ విధంగా అన్నది.

**తే. 'ఈ నగంబుశృంగంబున నిపుడు మీరు । గట్టుఁ డియ్యోడ' ననిన నక్షణమ వారు**
**నట్ల చేసిరి; విను, మమ్మహాద్రిశృంగ । మనఘ! నౌబంధనం బన నవనిఁ బరఁగె. 229**

**ప్రతిపదార్థం:** ఈ నగంబు శృంగంబునన్= ఈ పర్వతపు శిఖరానికి; ఇపుడు= ఇప్పుడు; మీరు; ఈ+ఓడన్= ఈ ఓడను; కట్టుఁడు= బంధించండి; అనినన్= అని చెప్పగా; ఆ+క్షణము+అ= ఆ త్రుటికాలంలోనే; వారు (వైవస్వతుడును సప్తర్షులును); అట్లు+అ= ఆ విధంగానే; చేసిరి= చేశారు; అనఘ!= ఓపుణ్యాత్ముడా!; వినుము= ఆలకించుము; ఆ+మహా+అద్రిశృంగము= ఆపెద్దకొండ శిఖరం; నౌబంధనంబు= నౌకను కట్టినచోటు; అనన్= అనే పేరుతో; అవనిన్= భూలోకంలో; పరఁగెన్= ఒప్పారింది.

**తాత్పర్యం:** 'ఓ వైవస్వతా! సప్తర్షులారా! ఈ పర్వతశిఖరాన ఈ ఓడను కట్టండి' అని ఆ చేప చెప్పగా, వారు ఆక్షణంలోనే ఆవిధంగా చేశారు. అందుచేత అప్పటినుండి ఆ కొండకొమ్ముకు 'నౌబంధనం' అనే పేరు ఏర్పడింది.

**క. మనుసహితు లైన మునులం । గనుఁగొని, యమ్మీను గరము గారవమున ని**
**ట్లనుఁ, 'బ్రళయంబున కీడునఁ । జనకుండఁగ మీకు రక్ష సలిపితిఁ గరుణన్. 230**

**ప్రతిపదార్థం:** మను సహితులు+ఐన= మనువుతో కూడుకొనిన; మునులన్+కనుఁగొని= ఋషులను చూచి; ఆ+మీను= ఆ చేప; కరము, గారవమునన్= మిక్కుటమైన పూజ్యభావంతో, ఇట్లు+అనున్= ఈవిధంగా పలికింది; ప్రళయంబునన్= సర్వం నాశనమయ్యే సమయాన; కీడునన్+చనకుండఁగన్= అపాయం చెందకుండగా; మీకున్; కరుణన్= దయతో; రక్ష సలిపితిన్= కాపాడాను.

**తాత్పర్యం:** ఆ చేప వైవస్వతమనువుతోపాటు కూడికొని ఉన్న సప్తర్షులతో ఈ విధంగా పలికింది; 'ఈ ప్రళయకాలంలో ప్రమాదం రాకుండ దయతో మిమ్మల్ని కాపాడాను.

**క. మునులార! యేను విశ్వం । బునకుఁ బరమకర్త యగు ప్రభుఁడ; వాత్సల్యం**
**బున మత్స్య మైన రూపం । బున నిమ్మెయి నిన్ని చందములఁ జనవలసెన్. 231**

**ప్రతిపదార్థం:** మునులార!= ఓఋషులార!; ఏను= నేను; విశ్వంబునకున్= జగత్తుకు; పరమ, కర్త+అగు= ఏకైకసృష్టికర్త అయిన; ప్రభుఁడన్= పరిపాలకుడను; వాత్సల్యంబునన్= అనురాగంతో కూడిన దయతో; మత్స్యము+ఐన, రూపంబునన్= చేప అయిన ఆకారంతో; ఈ+మెయిన్= ఈవిధంగా; ఇన్ని, చందములన్= ఇన్ని విధాలుగా; చనన్‌వలసెన్= చరించవలసి వచ్చింది.

**తాత్పర్యం:** ఓ మహర్షులారా! నేను ఈ సమస్తవిశ్వాన్ని సృష్టించి పరిపాలిస్తున్న ఏకైకప్రభుడను. కేవలం మీమీద నాకు ఏర్పడిన వాత్సల్యంవలన నేను మత్స్యమైన రూపంతో ఇన్నివిధాల చరించవలసివచ్చింది.

**వ. మీరు నిర్భయు లై చరియించునది; మఱియు నిమ్మనువును, దేవాసురమానుషం బైన జగం బఖిలంబును సృజియించు; మత్ప్రసాదంబున నతనికిఁ బరమజ్ఞానోదయం బగు' నని చెప్పి యయ్యాదిమత్స్యం బదృశ్యం బయ్యెఁ; వైవస్వతుండును మఱియు నధికతపంబు సేసి సకలచరాచరభూతంబుల సృజియించె. 232**

**ప్రతిపదార్థం:** మీరు; నిర్భయులు+ఐ= భయం లేనివారై; చరియించునది= సంచరించండి; మఱియున్= ఇదికాక; ఈమనువును; దేవ+అసుర, మానుషంబు+ఐన= దేవతలకు, రాక్షసులకు మనుజులకు సంబంధించిన; జగంబు+అఖిలంబును= ప్రపంచం సమస్తాన్నీ; సృజియించున్= నిర్మిస్తాడు; మత్+ప్రసాదంబునన్= నాదయవలన; అతనికిన్= (ఆమనువుకు); పరమ+జ్ఞాన+ఉదయంబు+అగున్= గొప్పతెలివిడి పుట్టుతుంది; అని, చెప్పి= అని పలికి; ఆ+ఆది, మత్స్యంబు= ఆ మొదటిచేప; అదృశ్యంబు+అయ్యెన్= కన్పించకుండ మాయ మయింది; వైవస్వతుండును; మఱియున్= అటుపిమ్మట; అధిక, తపంబు, చేసి= ఎక్కువ తపస్సు చేసి; సకల, చర+అచర, భూతంబులన్= కదలునట్టి కదలనట్టి సమస్తమైన పదార్థాలను అన్నింటిని; సృజియించెన్= నిర్మించాడు.

**తాత్పర్యం:** మీరు ఎట్టిభయం లేకుండ సంచరించండి. ఈ వైవస్వతమనువు ఇక చరాచరజగత్తును సృష్టించగలడు; నా దయవలన అతనికి పరమజ్ఞానం లభించగలదు' అని చెప్పి ఆ చేప మాయమయింది. అంతట వైవస్వతుడు గొప్పతపస్సు చేసి దేవతలకు రాక్షసులకు మనుజులకు సంబంధించిన జగత్తులను సృష్టించాడు.

**క. పరమం బగు వైవస్వతు । చరితం బతిభక్తి వినినఁ జదివినను మహా**
**దురితంబు లడఁగు జనులకు । నిరవుగ సిద్ధించు ననఘ । యిహపరసుఖముల్.' 233**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓపుణ్యాత్ముడా!; పరమంబు+అగు= మిక్కిలిగొప్పది అయిన; వైవస్వతు చరితంబు= వైవస్వతుడియొక్క నిజ, కథ; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; వినినన్= ఆలకించినా; చదివినను= పఠించినా; జనులకున్= ప్రజలకు; మహా, దురితంబులు= మిక్కుటాలైన పాపాలు; అడఁగున్= నశిస్తాయి; ఇహ, పర, సుఖముల్= భూలోకస్వర్గలోక సౌఖ్యాలు; ఇరవుగన్= సరిపడేటట్లుగా; సిద్ధించున్= లభిస్తాయి.

**తాత్పర్యం:** ఈ వైవస్వతుడి కథ జీవితగాథలలో మిక్కిలి విశిష్టమైనది. పరమమైన విజ్ఞానం కలిగించేది. దీనిని భక్తితో వినినవారికీ, చదివినవారికీ, సర్వపాపాలు నశిస్తాయి, ఇహపరసౌఖ్యాలు లభిస్తాయి.'

**విశేషం:** ఈ వైవస్వతచరితం చివర ప్రత్యేకమైన ఫలశ్రుతి కన్పిస్తున్నది. అందుచేత మహాభారతంలో చేరినట్టి ప్రాచీన గాథలలో ఇది ఒకటి అని విమర్శకుల అభిప్రాయం. ప్రపంచంలో ప్రాచీనవాఙ్మయాలలో పలుతావుల జలప్రళయం సంభవించటం, అప్పుడు మానవులు కొందరు మాత్రం ముఖ్యమైన జంతుజాలంతో పాటు ఒక నౌకలో చిరప్రయాణం చేయటం గూర్చిన గాథలు కన్పిస్తున్నవి. మహాభారతంలోని జలప్రళయంలో తప్పించుకొని, నౌకలో చేరినది వైవస్వతమనువు, సప్తర్షులు. బైబిలులో నోవా, నోవాతోపాటు కొన్ని జంతువులు ఒక నౌకలో జలప్రళయంనుండి తప్పించుకొని బ్రదికినగాథ సుప్రసిద్ధం.

**వ. అనిన నమ్మేదినీశ్వరుం డమ్మునీశ్వరునకుఁ బ్రణతుండై యి ట్లనియె. 234**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+మేదినీ+ఈశ్వరుండు= భూమికి అధిపతి అయిన ఆరాజు (ధర్మరాజు); ఆ+ముని+ఈశ్వరునకున్= ఆ మునులకు అధినేత అయిన (మార్కండేయుడికి); ప్రణతుండు+ఐ= నమస్కరించినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా ధర్మరాజు మార్కండేయుడితో ఇట్లా అన్నాడు.

**క. 'పరమేష్ఠికల్పుఁడవు ని । ర్భరభూరితపఃప్రభావపరిపూర్ణుఁడ వ**
**చ్చెరువు భవన్మాహాత్మ్యము । సురమునిలోకప్రణామశోభితచరణా! 235**

**ప్రతిపదార్థం:** సురముని, లోక, ప్రణామ, శోభిత, చరణా!= దేవతల, ఋషుల సముదాయాలయొక్క నమస్కారాలచేత ఒప్పారిన పాదాలు కలవాడా!; పరమేష్ఠి, కల్పుఁడవు= బ్రహ్మతో సరిసమానుడవు; నిర్భర, భూరి, తపస్+ప్రభావ, పరిపూర్ణుఁడవు= గాఢమూ, గొప్పదీ అయిన తపస్సుయొక్క మహిమచేత నిండైన వాడవు; భవత్+మాహాత్మ్యము= నీదైన గొప్పతనం; అచ్చెరువు= ఆశ్చర్యం కలిగించేది.

**తాత్పర్యం:** దేవతల, ఋషుల సమూహాలు చేసే నమస్కారాలచేత ఒప్పారే పాదాలు గల మార్కండేయ మహర్షీ! నీవు బ్రహ్మదేవుడితో సమానమైనవాడివి; నీ తపస్సుయొక్క మహిమ మిక్కిలి కీర్తించదగింది. నీ మహిమ ఆశ్చర్యకర మైనది.

**క. అడరి నిఖిలాండకోటియుఁ । జెడునప్పుడుఁ జెడక నీవు జీవించెద; వే**
**ర్పడ జగములు గ్రమ్మఱఁ గలి । గెడునప్పుడు సూచెదవు వికృతిరహితుఁడ వై. 236**

**ప్రతిపదార్థం:** అడరి= కలతచెంది; నిఖిల+అండ+కోటియున్= సమస్తమైన జగత్తుల గోళముల సముదాయాలున్నూ; చెడున్+అప్పుడున్= నశించేటప్పుడు; నీవు; చెడక= చెడిపోవక, నశించక; జీవించెదవు= బ్రదికిఉంటావు; క్రమ్మఱన్= తిరిగి; జగములు= లోకాలు; ఏర్పడన్= స్పష్టములై; కలిగెడు+అప్పుడు= వ్యక్తమై, పుట్టేటప్పుడు; వికృతి, రహితుఁడవు+ఐ= ఎట్టి మార్పును లేనట్టివాడవై; చూచెదవు= (సాక్షివై) చూస్తూ ఉంటావు.

**తాత్పర్యం:** ఈ సృష్టిలోని గ్రహతారకాగోళాలతోడి లోకాలన్నీ నశించిపోయే ప్రళయకాలంలో కూడ, నీవు నశించకుండా బ్రదికి ఉంటావు. ప్రళయానికి పిమ్మట మరల సమస్తలోకాలు పుట్టినప్పుడు కూడ నీవు కేవలం సాక్షీభూతుడవై చూస్తూ ఉంటావు.

**విశేషం:** అండం అనగా గ్రుడ్డు. ఇచట నిఖిలాండకోటి అనే ప్రయోగంలో అండం అనగా గుండ్రంగా ఉండే గ్రహతారకా గోళ, లోకాలయొక్క సముదాయం అని అర్థం ఏర్పడుతున్నది. భగవంతుడిని గూర్చి వేదాంతులు తరచు వాడే సంబోధనం- అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా!; అఖిలాండాలతో ఏర్పడినట్టిది బ్రహ్మాండం.

**చ. తొడరి చరాచరప్రతతితో జగమంతయు వార్ధిఁదొట్టి న**
**ప్పుడు లలితాబ్జపీఠమునఁ బొల్చు చతుర్ముఖుఁ బద్మగర్భుఁ బెం**
**పడర భజించి తీవు; జగదాదిజుఁ డైన ప్రభుండు నీయెడం**
**గడు ననురక్తుఁడై యొసఁగెఁ గాదె మునీశ్వర! యీ ప్రభావమున్. 237**

**ప్రతిపదార్థం:** ముని+ఈశ్వర!= ఋషులకు అధిపతి అయినవాడా!; తొడరి= పూని; చర+అచర, ప్రతతితోన్= కదలునట్టి, కదలనట్టి, పదార్థసముదాయంతో; జగము+అంతయున్= ప్రపంచం అంతయును; వార్ధిన్= సముద్రంలో; తొట్టిన+అప్పుడు= మునిగిన సమయంలో; లలిత+అబ్జ, పీఠమునన్= మనోహరమైన తామరపువ్వు అనే పీఠంమీద; పొల్చు= ఒప్పారెడి; చతుర్ముఖున్= నాలుగుమోములు కల బ్రహ్మదేవుడిని; పద్మగర్భున్= పద్మం జన్మస్థానంగా గలవాడు- బ్రహ్మను; పెంపు+అడరన్= గొప్పతనం అతిశయింపగా; ఈవు= నీవు; భజించితి(వి)= ఆరాధించావు; ఈప్రభావమున్= ఈగొప్పతనాన్ని; జగత్+ఆదిజుఁడు+ఐన= ప్రపంచానికి మొట్టమొదటివాడైన; ప్రభుండు= పరిపాలకుడు; నీ+ఎడన్= నీయందు; కడు= మిక్కిలి; అనురక్తుఁడు+ఐ= ప్రేమకలవాడై; ఒసఁగెన్+కాదె= ఇచ్చి ఉన్నాడు కదా.

**తాత్పర్యం:** మునీశ్వరా! ఈ సృష్టి సమస్తం చరాచరప్రకృతితో సముద్రంలో మునిగిపోయినపుడు మనోహరమైన పద్మపీఠాన చెలువారు బ్రహ్మదేవుడిని ఆరాధించిన పుణ్యాత్ముడవు నీవు; సృష్టికి ఆధారభూతుడైన ప్రభువు నీయందు అనుగ్రహం కలిగినవాడై నీకు ఇట్టి గొప్పతనాన్ని ప్రసాదించాడు కదా!

**క. జగముల నెల్లను మ్రింగెడు । జగదంతకు మౌళి వామచరణం బిడి పె**
**ల్లగు రోగజరాభరముం । దిగ విడువఁగఁ జెల్లె నీకుఁ ద్రిభువనవినుతా! 238**

**ప్రతిపదార్థం:** త్రి, భువన, వినుతా!= మూడులోకాలచేత పొగడబడినవాడా!; జగములన్+ఎల్లను= లోకాలను అన్నింటిని; మ్రింగెడు= కబళించెడు; జగత్+అంతకు, మౌళిన్= జగత్తును సంహరించే యముడియొక్క శిరస్సునందు; వామ, చరణంబు+ఇడి= ఎడమపాదం పెట్టి (తన్ని); పెల్లు+అగు= మిక్కుటమైన; రోగ, జరా, భరమున్= వ్యాధివలన ముసలితనంవలన ఏర్పడే బరువును (దుఃఖాన్ని); దిగవిడువఁగన్= క్రిందికి త్రోసివేయుటకు; నీకున్= నీకు; చెల్లెన్= సాధ్యమైనది.

**తాత్పర్యం:** మూడులోకాలచేత పొగడబడిన ఓ మార్కండేయమహర్షీ! జగత్తులను అన్నిటిని అంత మొందించే యముడిశిరస్సును నీ యెడమకాలితో తన్ని, మిక్కుటమైన భారాన్ని కల్గించే ముసలితనంనుండి వ్యాధులనుండి విముక్తుడవు కాగలిగావు. ఇట్టి గొప్పతనం నీకు మాత్రమే సాధ్యమైనది.

**వ. సకలచరాచరోత్పత్తిస్థితివిలయప్రకారంబులు నీకుం బెక్కుమాఱులు ప్రత్యక్షంబు లయి కానంబడి యుండుఁ గావున ని న్నడిగెద; లోకంబులు విలయకాలంబున నెట్టిభంగి యగు? నెఱింగింపు' మనిన మార్కండేయుం డి ట్లనియె. 239**

**ప్రతిపదార్థం:** సకల, చర+అచర+ఉత్పత్తి, స్థితి, విలయ, ప్రకారంబులు= సమస్తమైన కదలునట్టి కదలనట్టి భూతాల యొక్క పుట్టుట, ఉండుట, నశించుట యొక్క పద్ధతులు; నీకున్= నీకు; పెక్కుమాఱులు= ఎన్నోసారులు; ప్రత్యక్షంబులు+అయి= ఎదురుగా గోచరించినవై; కానంబడి= కన్పించి; ఉండున్= ఉంటాయి; కావునన్= కాబట్టి; నిన్నున్+అడిగెదన్= నిన్ను ప్రశ్నిస్తాను; లోకంబులు= జగత్తులు; విలయ, కాలంబునన్= ప్రళయ సమయంలో; ఎట్టి, భంగి= ఏరీతి; అగున్?= ఔతాయి?; ఎఱింగింపుము= తెలియజేయుము; అనినన్= అని చెప్పగా; మార్కండేయుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ సకల చరాచరసృష్టిస్థితిలయాల ప్రకారాలు పలుమారులు ఆవృత్తాలుగా నీవు చూచావు. ఇవి పుట్టటం, ఉండటం, గిట్టటం నీకు అనుభవామ్రేడితాలుకదా. కాబట్టి నిన్నే ఈ ప్రశ్నలు అడుగవలసివచ్చింది. లోకాలు ప్రళయకాలంలో ఏరీతిగా ఉండునో దయచేసి వివరించి తెల్పుము' అని అడుగగా, మార్కండేయమహర్షి ఈ విధంగా చెప్పాడు.

### మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ బ్రళయప్రకారంబు సెప్పుట (సం. 3-186-13)

**సీ. 'శాశ్వతు నఖిలభూతేశ్వరు నవ్యయు । నాదిదేవుని జగదాదిజన్ము**
**నాదిమధ్యాంతవిచ్ఛేదవిదూరు నా । శ్చర్యకారణకర్మధుర్యు నజరు**
**నీ కిష్టసఖుఁడును నీకుఁ బ్రెగ్గడయు నై । వెలుఁగొందుచున్న యీ యలఘుపుణ్యు**
**లాలితదీర్ఘవిశాలసితేక్షణుఁ । గనకవర్ణాంబరు వనజనాభు**

**ఆ. నింద్రనీలవర్ణు నింద్రాదిసురగణ । వినుతుఁ గృష్ణుఁ గరము వినయ మొప్పఁ**
**దలఁచి, యతని యాజ్ఞఁ దలకొని యెఱిఁగింతు । వినుము వరుసతోడ మనుజనాథ! 240**

**ప్రతిపదార్థం:** శాశ్వతున్= ఎల్లకాలం ఉండేవాడిని; అఖిల, భూత+ఈశ్వరున్= సర్వచేతనాచేతనపదార్థాలకు అధిపతి అయిన వాడిని; అవ్యయున్= నాశరహితుడైనవాడిని; ఆదిదేవునిన్= దేవతలలో మొదటి దేవుడైనవాడిని; జగత్+ఆది, జన్మున్= సృష్టిలో మొట్టమొదట పుట్టినవాడిని; ఆది, మధ్య+అంత, విచ్ఛేదవిదూరున్= మొదలు, మధ్య, తుది అనే విభాగాలకు అతీతుడైనవాడిని; ఆశ్చర్యకారణకర్మధుర్యున్= అచ్చెరువుకు హేతువైన పనులను చేయునట్టి మహిమ కలవాడిని; అజరున్= ముసలితనం లేనట్టివాడిని; నీకున్+ఇష్ట, సఖుఁడును= నీకు అభిమానపాత్రుడైన మిత్రుడును; నీకున్+ప్రెగ్గడయున్+ఐ= నీకు మంత్రి అయినవాడు నై; వెలుఁగొందుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; ఈ అలఘు, పుణ్యున్= ఈ గొప్పపుణ్యం కలవాడిని; లాలిత, దీర్ఘ, విశాల, సిత+ఈక్షణున్= మనోహర మైన పొడుగైనటువంటి, విరివియైనటువంటి, తెల్లనై నటువంటి చూపులు కలవాడిని;

కనక, వర్ణ+అంబరున్= పసిడి రంగుబట్టలు కలవాడిని; వనజనాభున్= పద్మం నాభియందు కలవాడిని, శ్రీ విష్ణుదేవుడిని; ఇంద్ర, నీల, వర్ణున్= ఇంద్రనీలమణివంటి నల్లనిరంగు గల (శరీరం) కలవాడిని; ఇంద్ర+ఆది, సుర, గణ, వినుతున్= ఇంద్రుడు మొదలైన వేల్పులగుంపుల చేత ప్రస్తుతించబడేవాడిని; కృష్ణున్= శ్రీకృష్ణుడిని; కరమున్= మిక్కిలి; వినయము+ఒప్పన్= నమ్రత ఒప్పేటట్లుగా; తలఁచి= స్మరించి; అతని+ఆజ్ఞన్, తలకొని= అతడి ఆనతి వహించి; వరుసతోడన్= క్రమంగా; ఎఱిఁగింతున్= తెలుపుతాను; మనుజనాథ!= ఓరాజా (ధర్మరాజా)!; వినుము.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! నీవు అడిగిన ప్రశ్నలకు సమాధానం మహానుభావుడు అవతారమూర్తి అయిన శ్రీకృష్ణుడి ఆనతిచొప్పున తెలుపగలను వినుము. శ్రీకృష్ణుడు నీకు ప్రియమిత్రుడు మాత్రమే కాదు. అతడు నీకు మంత్రి మాత్రమే కాడు. అతడు నాశరహితుడు. ఎల్లప్పుడు ఉండునట్టివాడు. అఖిల భూతాలకు ఈశ్వరుడు. ఆదిదేవుడు. ముసలితనం లేనివాడు. మొదలు, మధ్య, తుది అనే విభాగాలకు అతీతుడు. ఆశ్చర్యం కలిగించే కార్యాలను నెరవేర్చగలవాడు. ఇంద్రుడు మొదలైన వేల్పులచేత ఆరాధించబడేవాడు పీతాంబరధారి అయి సువిశాలనేత్రాలతో విలసిల్లే ఈ కృష్ణుడు పద్మాన్ని నాభియందు తాల్చే ఆ విష్ణుమూర్తి అవతారమే.

**వ. కృత త్రేతా ద్వాపర కలినామంబు లయిన యుగంబులు నాలుగును బండ్రెండువేల దివ్యవర్షంబులం బర్యవసితంబులగునియ్యుగంబులు నాలుగు నొక్కమహాయుగం బనం బరఁగు; మహాయుగసహస్రపర్యంతం బైనకాలంబు బ్రహ్మకు దివసంబ నాఁబరఁగుఁ; దద్దివసావసానంబునందు శతవార్షికంబైన యనావృష్టిదోషంబు ప్రవర్తిల్లు నప్పుడు. 241**

**ప్రతిపదార్థం:** కృత, త్రేతా, ద్వాపర, కలి, నామంబులు+అయిన= కృతం, త్రేత, ద్వాపరం, కలి- అనే పేళ్ళు కలిగినవయిన; యుగంబులు= పెక్కుసంవత్సరాల పరిమాణం గల కాలమానాలు; నాలుగును= నాలుగున్నూ; పండ్రెండు వేల దివ్యవర్షంబులన్= పండ్రెండువేల వేల్పుటేండ్లు (దేవమానంలో పండ్రెండువేల ఏండ్లు); పర్యవసితంబులు+అగున్= ముగుస్తాయి; ఈ+యుగంబులు నాలుగున్= ఈ నాలుగు యుగాలు అనగా కృతత్రేతాద్వాపరకలియుగాలు నాలుగు వెరసి; ఒకమహాయుగంబు= ఒకమహాయుగం; అనన్+పరఁగున్= అనేనామంతో వ్యవహరించబడుతుంది; మహాయుగ; సహస్ర, పర్యంతంబు+ఐన, కాలంబు= వేయిమహాయుగాలు గడచునట్టి కాలం; బ్రహ్మకున్= బ్రహ్మదేవునికి; దివసంబు+అ, నాన్+పరఁగున్= పగలు అనగా ఒప్పుతుంది; తద్+ దివస+అవసానంబునందున్= ఆ పగలు గడచిన పిమ్మట; శతవార్షికంబు+అయిన= నూరేండ్లు పట్టునట్టి; అనావృష్టి, దోషంబు= వాన కురియకపోవటం అనే కీడు; ప్రవర్తిల్లున్= ఏర్పడుతుంది; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కృత త్రేతా ద్వాపర కలియుగాలనే నాలుగు యుగాలు పండ్రెండువేల దివ్యసంవత్సరాల సమాహారం. పై నాలుగు యుగాలు కలిస్తే ఒక మహాయుగం ఔతుంది. ఒక వేయి మహాయుగాలు కలిస్తే బ్రహ్మదేవుడికి ఒక పగలు (బ్రహ్మదివసం) ఔతుంది. ఆ బ్రహ్మదివసపు చివర నూరు సంవత్సరాలు అనావృష్టి ఏర్పడుతుంది. అప్పుడు.

**ఆ. సప్తహయుఁడు మూర్తిసప్తకంబు ధరించి । కరము వేఁడి మిగులు కరము లొప్ప**
**నదనదీజలములు నుదధిజలంబులుఁ । బీల్చి జగము లెల్లఁ బ్రేల్చుఁ గడఁగి. 242**

**ప్రతిపదార్థం:** సప్తహయుఁడు= ఏడుగుర్రాలు కలవాడు అనగా సూర్యుడు; మూర్తిసప్తకంబు= ఏడు ఆకారాలు; ధరించి= తాల్చి; కరము= మిక్కిలి; వేఁడి= ఉష్ణం; మిగులు= అతిశయించే; కరములు+ఒప్పన్= కిరణాలు శోభించగా; నద, నదీ,

జలములున్= నదములయొక్క నదులయొక్క నీళ్ళు; ఉదధిజలంబులున్= సముద్రంలోని నీళ్లు; పీల్చి= త్రాగి; కడఁగి= పూని; జగములు+ఎల్లన్= అన్నిలోకాలను; ప్రేల్చున్= మండజేస్తాడు.

**తాత్పర్యం:** ఆకాలంలో, సూర్యుడు ఏడాకారాలు ధరించి మిక్కిలి తీక్ష్ణాలైన కిరణాలతో ప్రకాశించి, నదులలోని నదాలలోని నీళ్ళు, సముద్రాలలోని నీళ్ళు త్రాగి లోకాల నన్నింటిని మండింపజేస్తాడు.

**విశేషం:** సూర్యుడు ప్రాచీన భారతీయ వాఙ్మయంలో 'సప్తహయుడు' గా ప్రసిద్ధుడు. సూర్యకిరణాల వ్యాప్తిచేత ఏర్పడే ఇంద్రధనుస్సును- సప్తవర్ణశబలితం, VIBGYOR అని నవీనశాస్త్రజ్ఞులు నిరూపించిఉన్నారు. దీనినే మన ప్రాచీనులు అర్థవాదరూపాన చెప్పారు. నది= ఏరు- పశ్చిమం నుండి తూర్పుకు ప్రవహించే ఏరు. నదము= తూర్పునుండి పడమరకు ప్రవహించే ఏరు.

**చ. దినకరతిగ్మతేజము ప్రదీప్తహుతాశనుఁ డై యుగాంతసం**
**జనిత మహాసమీరణవశంబునఁ బేర్చి నగవ్రజంబుతో**
**మనుజులతోడ నిర్జరసమాజముతోడ భుజంగపంక్తితో**
**దనుజులతో జగత్త్రయముఁ దత్క్షణమాత్ర నొనర్చు నీఱుగన్. 243**

**ప్రతిపదార్థం:** దినకర తిగ్మతేజము= సూర్యుడియొక్క తీక్ష్ణమైన దీప్తి; ప్రదీప్త హుతాశనుఁడు+ఐ= బాగా మండే అగ్నిహోత్రుడై; యుగ+అంత, సంజనిత, మహా, సమీరణవశంబునన్= యుగాల చివరికాలంలో అనగా ప్రళయకాలంలో పుట్టే, గొప్ప గాలికి లోబడిందై; పేర్చి= అతిశయించి; నగ, వ్రజంబుతోన్= కొండల గుంపులతో; మనుజులతోన్= మనుష్యులతో; నిర్జరసమాజముతోడన్= దేవతలసముదాయంతో; భుజంగ, పంక్తితోన్= పాముల వరుసతో (భుజంగులనేవారు దేవతలలో ఒకతెగ); దనుజులతోన్= రాక్షసులతో; జగత్+త్రయమున్= మూడులోకాలను; తద్+క్షణమాత్రన్= ఒక త్రుటిమాత్రంలోనే; నీఱుగన్= బుగ్గిగా; ఒనర్చున్= చేస్తాడు.

**తాత్పర్యం:** సూర్యుడియొక్క వేడిమి ప్రళయకాలంలో వీచే గాలితోపాటు చెలరేగి ఈ మూడులోకాలను - పర్వత సమూహాలను, దేవతల, మనుష్యుల, భుజంగాల, రాక్షసుల సమూహాలను ఒక్కక్షణంలోనే బూడిద అయ్యేటట్లు నిర్మూలించగలదు.

**వ. తదనంతరంబ. 244**

**తాత్పర్యం:** అటు పిమ్మట.

**మ. సితపీతారుణనీలపింగరుచులై స్నిగ్ధంబులై యుద్యతా**
**యతవిద్యుల్లలితంబు లై ఘనగిరీంద్రాకారఘోరంబు లై**
**తతనిర్ఘాతనిపాతభీమభిదురధ్వానంబు లై సంతతో**
**ద్ధతసంవర్తవలాహకంబులు వెసం దోఁతెంచు దిగ్భిత్తులన్. 245**

**ప్రతిపదార్థం:** సిత, పీత+అరుణ, నీల, పింగ, రుచులు+ఐ= తెలుపు, పసుపు, ఇంచుకెరుపు, నలుపు, గోరోచనపురంగు, వెలుగులు కలవై; స్నిగ్ధంబులు+ఐ= దట్టమైనవై; ఉద్యత్+ఆయత, విద్యుత్+లలితంబులు+ఐ= పైకెత్తబడి నిడివిగా ఉండే

మెఱుపుతీగెలతో కూడి మనోహరా లైనవై; ఘన, గిరి+ఇంద్ర+ఆకార, ఘోరంబులు+ఐ= పెద్దవి నిడివికలవి అయిన శ్రేష్ఠములైన కొండలవంటి ఆకారాలచేత భయంకరాలుగా కన్పించునట్టివై; తత నిర్ఘాత నిపాత భీమ భిదుర ధ్వానంబులు+ఐ= విస్తారంగా పిడుగులు పడటంచేత భయంకరమైన వజ్రపాతంయొక్క ధ్వనివంటి ధ్వనులు కలవై; సంతత+ఉద్ధత, సంవర్త, వలాహకంబులు= ఎల్లప్పుడూ అతిశయించి ఉండే సంవర్తం, వలాహకం అనే పేరులు గల (ప్రలయకాల) మేఘాలు; దిక్+భిత్తులన్= దిక్కులనెడి గోడలపై; వెసన్= శీఘ్రంగా; తోఁతెంచున్= గోచరిస్తాయి.

**తాత్పర్యం:** ఎల్లప్పుడు క్షణక్షణం అతిశయించేవైన ప్రళయకాలమేఘాలు, తెలుపు, పసుపు, ఎరుపు, నలుపు, గోరోచనం రంగుల కాంతులు కలిగినవై, మిరుమిట్లు గొలుపే మెఱుపుతీగెలతో మనోహరాలై, గొప్పనిడివి గల కొండల ఆకారాలు భీతి గొల్పుతూ, విస్తారంగా పిడుగులు కురిపిస్తూ, వజ్రాయుధం వంటి భయంకరాలైన నినాదాలు చేస్తూ వేగంగా దిక్కులు పిక్కటిల్లేటట్లు దట్టంగా ఆవరిస్తాయి.

**విశేషం:** ప్రళయకాలంలో ఆవరించే మేఘాలకు సంవర్తం అని, వలాహకం అని పేర్లు.

**ఉ.** **పెల్లునఁ గూలు తజ్జలము పెక్కువ నొక్కట నమ్మహానలం**
**బెల్లను నాఱిపోవుఁ బృథివీశ్వర! యేఱులు నబ్ధులున్ వెసం**
**దొల్లిటి యట్ల నిండుఁ; బటుతోయదసంఘము లంతఁ బోక గ**
**ర్జిల్లుచు వెండియుం గురియుఁ జిత్రముగాఁగ ననేకకాలముల్.** **246**

**ప్రతిపదార్థం:** పృథివీ+ఈశ్వర!= భూమికి అధిపతియైనవాడా!; పెల్లునన్= మిక్కుటంగా; కూలు= క్రిందికిపడే; తద్+జలము, పెక్కువన్= ఆ మేఘాలనుండి అమితంగా పడేటటువంటి నీటియొక్క ఆధిక్యంచేత; ఆ+మహా+అనలంబు+ఎల్లను= ఆ గొప్పఅగ్నిహోత్రం అంతయును; ఆఱిపోవున్= చల్లారిపోతుంది; ఏఱులు= నదులు; అబ్ధులున్= సముద్రాలును; వెసన్= శీఘ్రంగా; తొల్లిటి+అట్లు+అ= పూర్వం మాదిరిగానే; నిండున్=(నీటితో) నిండుతాయి; అంతన్= అటుపిమ్మట; తోయద సంఘములు= మేఘాల సముదాయాలు; పోక= వెడలిపోక; గర్జిల్లుచున్= పెద్దధ్వని చేస్తూ; వెండియున్= మరల; చిత్రము+కాఁగన్= అచ్చెరువు కొలిపేటట్లుగా; అనేకకాలముల్= పెక్కునాళ్ళు; కురియున్= వర్షిస్తాయి.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! మిక్కుటంగా కురిసిన ఆ వాననీటిచేత, ఆ మహాగ్ని అంతా ఆరిపోతుంది. అంతట పూర్వంమాదిరిగానే ఏరులు, సముద్రాలు నీటితో నిండి ప్రవహిస్తాయి. ఇంకను ఆ మేఘాలు చెదరిపోకుండా ఆకసంలోనే నిలిచి, గర్జిల్లుతూ చాలాకాలం వర్షిస్తూనే ఉంటాయి.

**శా.** **ధారాపాతనితాంతవేగమున నిద్ధాత్రీతలం బాహతం**
**బై రూపేది మునుంగుఁ దోయములలో నత్యంతగంభీరవాః**
**పూరం బంతయు ముంచి మించుటయు దిగ్భూమీనభోభాగముల్**
**వే రూపింపఁగ రాకయుండఁ దమముల్ వేష్టించుఁ ద్రైలోక్యమున్.** **247**

**ప్రతిపదార్థం:** ధారాపాతనితాంతవేగమునన్= ఎల్లప్పుడు ఎడతెగకుండగా కురుస్తున్న వాననీటిచాలుయొక్క వడిచేత; ఈ+ధాత్రీ, తలంబు= ఈ భూమిపైభాగం; ఆహతంబు+ఐ= బాగుగా కొట్టబడినట్టిదై; రూపు+ఏది= ఆకృతిని కోలుపోయి; తోయములలోన్= నీటిలో; మునుంగున్= మునిగిపోతుంది; అత్యంత, గంభీర, వార్+పూరంబు+అంతయున్= మిక్కుటమగు లోతుగల

నీటిసముదాయం అంతయు; ముంచి= కప్పివేసి; మించుటయున్= అతిశయించటంచేత; దిక్+భూమీ, నభస్+భాగముల్= దిక్కులయొక్కయు, భూమి యొక్కయు, ఆకసంయొక్కయు ప్రదేశాలు; వేరుపింపఁగన్, రాక+ఉండన్= వేగంగా వేరు చేసి చూపించటానికి వీలులేకుండా ఉండగా; త్రైలోక్యమున్= మూడులోకాలను; తమముల్= చీకట్లు; వేష్టించున్= చుట్టుముట్టుతాయి.

**తాత్పర్యం:** ఎల్లప్పుడూ ఎడతెగక కురిసే వర్షాలచేత భూగోళమంతా బాగుగా కొట్టబడి, రూపాన్ని కోల్పోయి నీటిచేత పూర్తిగా ఆవరించబడుతుంది. మిక్కిలి లోతైన నీరు ముంచెత్తటంచేత దిక్కులు ఇవి, ఇవి భూభాగాలు, ఇది ఆకాశం అని వేర్పరచటానికి వీలుండదు. పెనుచీకట్లు దట్టంగా మూడులోకాలను ఆవరిస్తాయి.

**తే.** **అంతఁ బరమేష్ఠిచోదిత మైన యొక్క। మారుతము నలి రేఁగి దుర్వారభంగి**
**విలయకాలవిశృంఖలవిపులవారి । ధరచయంబుల నెల్లను విరియ నడఁచు. 248**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత; పరమేష్ఠి, చోదితము+ఐన= బ్రహ్మచేత ఆజ్ఞాపించబడిన; ఒక్క, మారుతము= ఒక్కగాలి; నలి రేఁగి= మిగుల విజృంభించి; దుర్వారభంగిన్= వారించటానికి వీలులేనిరీతిగా; విలయ, కాల, విశృంఖల, విపులవారిధరచయంబులన్+ ఎల్లను= ప్రళయసమయంలో స్వేచ్ఛగా విస్తరించిన మేఘాలసముదాయాలను అన్నింటిని; విరియన్+అడఁచున్= విచ్చిపోయేటట్లుగా అణచివేస్తుంది.

**తాత్పర్యం:** అంతట, బ్రహ్మదేవుడిచేత ఆజ్ఞాపించబడిన ఒక పెనుగాలి విజృంభించి,వారించటానికి వీలులేని విధంగా వీస్తుంది. అది అంతవరకు స్వేచ్ఛగా విస్తరించి ఉన్న మేఘాలనన్నింటిని చెదరగొట్టి అణచివేస్తుంది.

**క.** **ఆ మారుతంబు గ్రోలి పి । తామహుఁ డెంతయును ఘోరతర మగు సలిల**
**స్తోమంబునందు నడుమం । దామరపై నిదురవోవుఁ దద్దయు నెమ్మిన్. 249**

**ప్రతిపదార్థం:** ఆ మారుతంబున్= ఆగాలిని; క్రోలి= ఆస్వాదించి; పితామహుఁడు= బ్రహ్మదేవుడు; ఎంతయును ఘోరతరము+అగు= మిక్కిలి భయంకరమైన; సలిల, స్తోమంబునందు= నీటిసముదాయంలో; నడుమన్= మధ్యభాగాన; తామరపైన్= పద్మంపై; తద్దయు, నెమ్మిన్= మిక్కిలిప్రీతితో; నిదుర+పోవున్= నిద్రపోతాడు.

**తాత్పర్యం:** ఆ గాలిని పీల్చి, బ్రహ్మదేవుడు ఆభయంకరమైన వరదనీటిమధ్య పద్మంపై మిక్కిలిప్రీతితో నిద్రిస్తాడు.

**వ.** **ఇట్టి కల్పాంతంబు లనేకంబులు సనియె; నింకఁ గానున్నవి యనేకంబులు; విను; మతీతకల్పాంత సమయంబున నేను బ్రబలాంధకారంబున నేదెసయుం గానక యొక్కండన యత్యంతభయాతురుండ నగుచుం బెద్దకాలంబు పరిభ్రమించుచుండ నొక్కతఱి నయ్యుదకమధ్యంబున నత్యున్నతం బయిన వటభూరుహంబు గానంబడియె; మఱియుఁ దదీయ పర్ణపర్యంకంబునందు. 250**

**ప్రతిపదార్థం:** ఇట్టి కల్పాంతంబులు= ఇటువంటి బ్రహ్మదినాల అంత్యభాగాలు; అనేకంబులు= పెక్కులు; చనియెన్= నడచినవి; ఇంకన్= ఇకమీదట; అనేకంబులు= (పెక్కులు); కానున్నవి= కడవనున్నవి; వినుము= ఆలకింపుము; అతీత, కల్ప+అంత, సమయంబునన్= కడచిన కల్పానికి చివరికాలంలో; ఏను= నేను; ప్రబల+అంధకారంబునన్= పెనుచీకటిలో; ఏదెసయున్+కానక= ఏదిక్కును చూడలేక; ఒక్కండను+అ= ఒక్కడనే ఏకాంతంగా; అత్యంతభయ+ఆతురుండను+అగుచున్= మిక్కిలి వెఱపు చెందినవాడను ఔతూ; పెద్ద కాలంబు= చాలకాలం; పరిభ్రమించుచుండన్= తిరుగాడుతుండగా; ఒక్క,

తటిన్= ఒక అదనులో; ఆ+ఉదక, మధ్యంబునన్= ఆనీటినడుమ; అతి+ఉన్నతంబు+అయిన= మిక్కిలి ఎత్తుగా ఉన్న; వట, భూరుహంబు= మఱ్ఱిచెట్టు; కానంబడియెన్= కన్పించింది; మఱియున్= అంతియకాక; తదీయ, పర్ణ, పర్యంకంబునందున్= ఆ ఆకు పాన్పుపై.

**తాత్పర్యం:** ఈవిధమైన కల్పాంతాలు ఎన్నో గడచాయి; ఇకమీద ఎన్నో కల్పాంతాలు గడవనున్నవి; ఆలకింపుము; జరిగిన కల్పాంతకాలాలలో దట్టంగా విస్తరించిన పెనుచీకటిమధ్య, దిక్కుతోచక ఏకాంతంగా నేను చాలాకాలం తిరుగాడవలసివచ్చింది. ఒక తఱి, ఆపెనువరదనీటి నడుమ నాకు ఒక పెద్దమఱ్ఱిచెట్టు కన్పించింది. ఆ మఱ్ఱిచెట్టు ఆకు పాన్పుమీద.

**విశేషం:** కల్పాంతం అనగా కల్పం చివర దాపురించే ప్రళయం, కల్పం అనగా బ్రహ్మదినం. మనుష్యమానంలో కృతత్రేతాద్వాపర కలియుగాలు నాలుగున్నూ వేయిమారులు తిరిగివస్తే బ్రహ్మకు ఒక పగలు ఔతుంది. బ్రహ్మయొక్క దివాభాగంలో జగత్తు చేష్టాయుక్త మౌతుంది. అతడి రాత్రిభాగంలో జగత్తు నిశ్చేష్టమై ఉంటుంది.

**క. కమనీయజలదవర్ణుని, । హిమకరబింబాస్యు, నుద్యదినతేజుఁ బ్రమో**
**దమునఁ బవళించువానిం । గుమారు నొక్కరునిఁ గుసుమకోమలుఁ గంటిన్. 251**

**ప్రతిపదార్థం:** కమనీయజలదవర్ణునిన్= అందమైన మేఘంవంటి రంగు కలవాడిని; హిమకరబింబ+ఆస్యున్= చంద్రబింబంవంటి మొగం కలవాడిని; ఉద్యత్+ఇన, తేజున్= ప్రకాశిస్తున్న సూర్యుడివంటి వెలుగు కలవాడిని; ప్రమోదమునన్= సంతోషంతో; పవళించువానిన్= శయనించేవాడిని; కుసుమకోమలున్= పువ్వువంటి సౌకుమార్యంకలవాడిని; కుమారున్+ఒక్కరునిన్= ఒక చిన్నబాలకుడిని; కంటిన్= చూచాను.

**తాత్పర్యం:** నీలమేఘశ్యాములుడై, చంద్రబింబంవంటి మొగం కలవాడై, ప్రకాశిస్తున్న సూర్యుడివంటి తేజస్సుకలవాడై సంతోషంతో శయనించిఉన్న ఒక చిన్నిబాలకుడిని చూచాను. ఆ బాలకుడు పువ్వువంటి సౌకుమార్యం కలవాడు.

**వ. కని, విస్మితుండనై యాత్మగతంబున. 252**

**తాత్పర్యం:** ఆ బాలకుడిని చూచి, మిక్కిలి ఆశ్చర్యం కలవాడనై నాలో నేను (ఈవిధంగా ఆలోచించాను).

**క. లోకంబులు దెగటారఁగ । నేకార్ణవమైన యిచట నిబ్బాలుఁ డొకం**
**డేకతమున నిద్రించుచు । నేకతమున నున్నవాఁడొ? యెవ్వాఁ డగునో! 253**

**ప్రతిపదార్థం:** లోకంబులు= ప్రపంచాలు; తెగటారఁగన్= నశించిపోగా; ఏక+అర్ణవము+ఐన+ఇచటన్= ఒకే ఒక సముద్రంగా మారిన ఈస్థలంలో; ఈ+బాలుఁడు+ఒకండు= ఈ చిన్నికుమారుడు ఒక్కడు; ఏకతమునన్= ఒంటరిగా; నిద్రించుచున్= నిదురపోతూ; ఏ, కతమునన్= ఏకారణంచేత; ఉన్నవాఁడు+ఒ= ఉన్న వాడగునో; ఏ+వాఁడు+అగునో= అతడు ఎవడై ఉంటాడో?

**తాత్పర్యం:** ఈ సృష్టిలోని లోకాలు అన్నీ నాశం చెంది, ఒకే ఒక సముద్రంగా మారిన ఈస్థలంలో ఈచిన్ని బాలకుడు ఒంటరిగా ఏకారణంవలన నిదురిస్తూ ఉన్నాడో? ఈతడు ఎవ్వడు అయి ఉంటాడో?

**తే. అని తలంచుచు నల్లన యక్కు మారుఁ। జేరఁబోయిన నాతండు సితసరోజ**
**రేఖ దలకొనఁగా నలరించెఁ గన్ను। లవధరించెను నను లోచనాంచలముల. 254**

**ప్రతిపదార్థం:** అని తలంచుచున్= అని ఆలోచిస్తూ; అల్లన= మెల్లమెల్లగా; ఆ+కుమారున్= ఆ బాలకుడిని; చేరన్+పోయినన్= సమీపించగా; ఆతండు= ఆకుమారుడు; సిత, సరోజ, రేఖ= తెల్లని పద్మంయొక్క సౌందర్యం, తలకొనఁగాన్= విస్తరించగా; కన్నులు; అలరించెన్= వికసింపజేశాడు; ననున్= నన్ను; లోచన+అంచలములన్= కనుగొలకులతో; అవధరించెను= దయ జాలువార చూచాడు.

**తాత్పర్యం:** అని యోచిస్తూ మెల్లమెల్లగా నేను ఆ బాలకుడిని చేరబోయాను. ఆ బాలకుడు తెల్లని కనుదమ్ములు విప్పారగా నాపై ఓరచూపులు సారించాడు.

**వ. తదనంతరంబ గంభీరమధురస్వరంబున ని ట్లనియె, 'నయ్యా! నిన్ను నతిశ్రాంతుంగా నెఱింగితిఁ; గొండొకసేపు విశ్రమింప వలతేని నవకాశం బిచ్చెద; నాశరీరంబు ప్రవేశించి సుఖంబున శయనింపు' మని తనవదనంబు వివృతంబుగాఁ జేసిన, నేనును బలాత్కార క్షిప్తుండునుం బోలెఁ బరవశుండ నై తన్మార్గంబున నతని యుదరంబుఁ బ్రవేశించి, యందు. 255**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట, వెనువెంటనే; గంభీర, మధుర, స్వరంబునన్= లోతైన, తియ్యనైన కంఠధ్వనితో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు; అయ్యా!= ఆర్యా!; నిన్నున్= నిన్ను; అతిశ్రాంతుంగాన్= మిక్కిలి బడలిక చెందిన వాడినిగా; ఎఱింగితిన్= తెలిసికొన్నాను; కొండొకసేపు= కొంతకాలం మేర; విశ్రమింపవలతు(వు)+ఏనిన్= విశ్రాంతిని తీసికొన కోరుతున్నయెడల; అవకాశం+ఇచ్చెదన్= అదను కల్పిస్తాను; నా శరీరంబు= నాదేహం; ప్రవేశించి= చొరబడి; సుఖంబునన్= సుఖంగా; శయనింపుము= పవ్వళించుము; అని= అని చెప్పి; తన వదనంబు= తన నోరు; వివృతంబుగాన్+చేసినన్= తెరవబడినట్టిదిగా చేయగా; ఏనును= నేను కూడా; బలాత్కార, క్షిప్తుండునున్+పోలెన్= బలవంతంగా నెట్టివేయబడినవాడి రీతిగా; పరవశుండను+ఐ= తన్మయత్వం చెందినవాడనై; తద్+మార్గంబునన్= ఆదారివెంట; అతని= ఆ బాలకుడి; ఉదరంబున్= కడుపులోనికి; ప్రవేశించి= చొరబడి; అందున్= దానిలో.

**తాత్పర్యం:** అటుపిమ్మట వెనువెంటనే లోతైనతియ్యని కంఠధ్వనితో ఆ బాలకుడు ఇట్లా అన్నాడు: 'అయ్యా! నీవు మిక్కిలి డస్సి ఉన్నట్లు తోస్తున్నది. నీకు విశ్రాంతి తీసుకొనాలనే కోరిక ఉన్నట్లయితే అటువంటి అదను నీకు కల్పిస్తాను, నాదేహంలోకి ప్రవేశించి, సుఖంగా పవళించుము' అని చెప్తుతూ అతడు తన నోరు విప్పాడు. అంతట బలవంతంగా నెట్టివేయబడినట్లుగా నేను ఆ బాలకుడి నోటిదారివెంట, అతని కడుపులోకి ప్రవేశించాను. అందులో.

**సీ. గంగాదినదులతోఁ గనకశైలాదిభూ। ధరములతో సముద్రములతోడ**
**వివిధపట్టణనవద్వీపవర్షములతో। బహుకర్మరతు లైన ప్రజలతోడఁ**
**బక్షిమృగవ్యాళపశుసంఘములతోడఁ। దద్దయు నొప్పారు ధాత్రిఁ గంటి;**
**సూర్యేందుతారకాజ్యోతిరుజ్జ్వల మైన। గగనంబుఁ బవనమార్గములుఁ గంటి;**

**తే. శక్రయమవరుణాది నిర్జరసమేత। మైన నాకంబు గంటి; మహాహియక్ష**
**రాక్షసాసురవిద్యాధర ప్రముఖులఁ। గంటి; వేయేల సకలలోకములుఁ గంటి. 256**

**ప్రతిపదార్థం:** గంగా+ఆది, నదులతోన్= గంగమొదలైన ఏరులతోను; కనకశైల+ఆది, భూధరములతోన్= బంగారుకొండ (మేరుపర్వతం) మున్నగు పర్వతాలతోను; సముద్రములతోడన్= సాగరాలతోను; వివిధ, పట్టణ, నవద్వీప, వర్షములతోన్= పెక్కునగరాలతోనుక్రొత్తదీవుల భూఖండాలతోను; బహు, కర్మ, రతులు+ఐన, ప్రజలతోడన్= పెక్కుపనులు చేయటంలో ఆసక్తులై ఉన్న జనులతోనూ; పక్షి, మృగ, వ్యాళ, పశు, సంఘములతోడన్= పిట్టలు, జంతువులు, పాములు, నాలుగుకాళ్ల జంతువుల సమూహాలతోనూ, తద్దయున్= మిక్కుటంగా; ఒప్పారు= శోభిల్లే; ధాత్రిన్= భూమిని; కంటిన్= చూచాను; సూర్య+ఇందు, తారకా, జ్యోతిస్+ఉజ్జ్వలము+ఐన= సూర్యుడితో, చంద్రుడితో, నక్షత్రాల కాంతులతో ధగధగలాడుతున్న; గగనంబున్= ఆకాశాన్ని; పవన, మార్గములున్= వాయువు సంచరించే తెరువులను; కంటిన్= చూచాను; శక్ర, యమ, వరుణ+ఆది, నిర్జర, సమేతము+ఐన= ఇంద్రుడితో, యముడితో, వరుణుడు మున్నగు దేవతలతో కూడిఉన్న; నాకంబున్= స్వర్గలోకాన్ని; కంటిన్= చూచాను; మహా+అహి, యక్ష, రాక్షస+అసుర, విద్యాధర, ప్రముఖులన్= గొప్పపాములు (భుజంగులు) యక్షులు రాక్షసులు, అసురులు, విద్యాధరులు మున్నగువారిని; కంటిన్= చూచాను; వేయి+ఏల= వేయిమాటలు ఎందుకు?; సకల, లోకములున్= అన్నిజగత్తులు; కంటిన్= చూచాను.

**తాత్పర్యం:** గంగ మొదలైన నదులతో, మేరుపర్వతం మున్నగు పర్వతాలతో, సముద్రాలతో, పెక్కునగరాలతో, పెక్కుదీవులతో, భూఖండాలతో వివిధ వ్యాపారాలను చేసికొనటంలో నిమగ్నులైఉన్న ప్రజానీకాలతో, పక్షులు, మృగాలు, పాములు, పశువులు తిరుగాడుతున్న ప్రదేశాలతో ఒప్పారే సువిశాలభూభాగాలను చూచాను. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ప్రకాశిస్తున్న ఆకసాన్ని చూచాను, వాయువులు చరించే మార్గాలను చూచాను. ఇంద్రుడు, వరుణుడు, యముడు మున్నగు దేవతలు నివసించేలోకాలను చూచాను. భుజంగులు, యక్షులు, రాక్షసులు, అసురులు, విద్యాధరులు మున్నగువారు నివసించేలోకాలను చూచాను. వేయిమాటలతో విస్తరించి అభివర్ణించ నక్కరలేదు. ఒక్క ముక్కలో చెప్పవలె ననిన, నేను సమస్తలోకాలూ ఆ బాలకుడి కడుపులో ఉండటం చూచాను.

**చ.** **అరుదుగ నమ్మహాత్ముని మహాజఠరాంతరభూమి నూఱువ**
**త్సరముల యంతకాలము వసం బఱి త్రిమ్మరితిం గడంగి య**
**ప్పరుసున నెందుఁ గాల్గొనఁగఁ బట్టదు చిత్తము భీతిమీఱఁ ద**
**త్పరమతి నంత నక్కపటబాలు పదంబులు సంస్మరించితిన్.** **257**

**ప్రతిపదార్థం:** అరుదుగన్= అచ్చెరువుగా; ఆ+మహా+ఆత్మని= గొప్ప ఆత్మ గల ఆమహానుభావుడి; మహా, జఠర+అంతర, భూమిన్= గొప్పకడుపు అనే భూప్రదేశంలో; నూఱు, వత్సరముల+అంత, కాలము= వందయేండ్లకు సరిపడే కాలం; వసంబు+అఱి= స్వాధీనత తప్పి; త్రిమ్మరితిన్= తిరుగాడాను; కడంగి= పూని; ఆ+పరుసునన్= ఆవిధంగా; ఎందున్= ఎచటను; కాల్+కొనఁగన్= కాలూనటానికి; నిలవటానికి; పట్టదు= ఏర్పడదు; చిత్తము= మనస్సు; భీతిమీఱన్= భయం అతిశయించగా; తద్ +పరమతిన్= తదేకధ్యానంతో; అంతన్= అటుపిమ్మట; ఆ కపటబాలు పదంబులు= ఆ మాయబాలకుడి యొక్క పాదాలు; సంస్మరించితిన్= ధ్యానించాను.

**తాత్పర్యం:** ఆ మహాత్ముడి కడుపులో ఉన్న భూప్రదేశంలో నూరుసంవత్సరాలు ఆశ్చర్యంతో తిరుగాడాను గాని ఎచ్చటను సుస్థిరంగా నిలవలేకపోయాను. మనస్సు భీతిచేత ఆవరించబడింది. అంతట మాయావిగా తోచిన ఆ బాలకుడి పాదాలనే ధ్యానించసాగాను.

**వ. ఇట్లు శరణ్యవరేణ్యుం డైన కారుణ్యనిధి నద్దేవుం దలంచుచుండ నతండు నన్నుం దనవదనానిలవేగంబునం జేసి వెలువరించె; నంత నెప్పటియ ట్లమ్మహావటవిటపిశయనుం డైన యబ్బాలు నాలోకించితి; నంత.258**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; శరణ్య, వరేణ్యుండు+ఐన= శరణు పొందదగిన వారిలో గొప్పవాడు అయిన; కారుణ్యనిధిన్= దయకు పెద్ద నెలవు అయినవాడు; ఆ+దేవున్= ఆ దేవుడిని; తలంచుచుండన్= ధ్యానిస్తూ ఉండగా; అతండు= ఆబాలకుడు; నన్నున్; తనవదన+అనిల, వేగంబునన్+చేసి= తన నోటిగాలియొక్క వడిచేత; వెలువరించెన్= వెలికి వచ్చేటట్లుగా చేశాడు; అంతన్= అటు పిమ్మట; ఎప్పటి+అట్లు+అ= ఇంతకు ముందు ఉన్నరీతిగనే; ఆ+మహావట విటపిశయనుండు+ఐన= ఆగొప్పమర్రిచెట్టుపై పవళించి ఉన్నవాడైన; ఆ+బాలున్= ఆ కుర్రవాడిని; ఆలోకించితిన్= చూచాను; అంతన్= అటుపిమ్మట.

**తాత్పర్యం:** దయానిధి అయినవాడు, ఆశ్రయించదగిన వారిలో శ్రేష్ఠుడైనవాడు అయిన ఆదేవుడిని నేను సంస్మరిస్తూ ఉండగా, ఆ దేవుడు తన నోటినుండి వెలువడిన గాలివేగంచొప్పున నన్ను వెలువరించాడు. అంత యథాప్రకారం ఆ మర్రిచెట్టు(ఆకు)పై పవళించిఉన్న ఆ బాలకుడిని చూచాను. అంత.

**క. ననుఁ గనుఁగొని యెలనవ్వునఁ । దనవదనము వింతచెన్ను దలకొనఁగా ని**
**ట్లను నబ్బాలుఁడు 'విశ్రమ । మొనరించితె యనఘ! యస్మదుదరములోనన్?' 259**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; కనుఁగొని= చూచి; ఎలనవ్వునన్= చిరునవ్వుతో; తనవదనము= తనమొగం; వింతచెన్ను= అచ్చెరు వొనరించే సొగసు; తలకొనఁగాన్= వహింపగా; ఆ+బాలుఁడు; ఇట్లు+అనున్= ఈవిధంగా పలికాడు; అనఘ!= పాపరహితుడా!; అస్మత్+ఉదరములోనన్= నా పొట్టలో; విశ్రమము+ఒనరించితి(వి)+ఎ?= విశ్రమించావా?

**తాత్పర్యం:** నన్ను చూచి చిరునవ్వు తనమొగానకు అచ్చెరువుగొలిపే సొగసు చేకూర్చగా ఆబాలకుడు ఈవిధంగా పలికాడు. 'పుణ్యాత్ముడా! నా పొట్టలో నీవు విశ్రాంతి తీసికొన్నావా?'

**వ. అనిన నేనును సంభ్రమంబున నతనిం జేరనరిగికెందామరరేకులందెగడు నంగుళంబులు గలిగి తరుణకిసలయ సుకుమారంబు లయిన తచ్చరణకమలంబులు శిరంబునం జేర్చి 'దేవా! దేవరప్రసాదంబున నత్యాశ్చర్యకారణం బైన సకలచరాచరభూత ప్రపంచంబుఁ జూచితి; భవదీయమాయాప్రభావంబు భావింప నేరకున్నవాఁడ. 260**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఏనును= నేనును; సంభ్రమంబునన్= తొట్రుపాటుచొప్పున; అతనిన్+చేరన్+అరిగి= అతడిదగ్గరకు చేరేటట్లుగా వెళ్లి; కెందామరరేకులన్ (కెంపు+తామరరేకులన్)= ఎర్రనితామరపువ్వుల రేకులను; తెగడు= నిరసించే; అంగుళంబులు, కలిగి= చేతివ్రేళ్లు కలిగి; తరుణ, కిసలయ, సుకుమారంబులు+అయిన= లేతచిగురుటాకులవలె మెత్త నైన; తద్+చరణ, కమలంబులు= ఆ(బాలకుడి) పాదపద్మాలు; శిరంబునన్+చేర్చి= తలమీద హత్తుకొని; దేవా= ఈశ్వరా!; దేవర, ప్రసాదంబునన్= దేవరవారిదయవలన; అతి+ఆశ్చర్య, కారణంబు+ఐన= మిక్కిలి అచ్చెరువు కొలుపుటకు హేతువైన; సకల, చర+అచర, భూత, ప్రపంచంబున్= సమస్తమైన కదలునట్టి కదలనట్టి పదార్థాలు కల జగత్తును; చూచితిన్= దర్శించాను; భవదీయ, మాయా, ప్రభావంబు= నీదైన భ్రమను కూర్చునట్టి మహిమ; భావింపనేరక+ఉన్నవాఁడ(న్)= ఆలోచించి అర్థం చేసికొనజాలకున్నాను.

**తాత్పర్యం:** అని చెప్పినపుడు, నేను తొట్రుపాటుచొప్పున ఆ బాలకుడిదగ్గరకు చేరబోయాను. ఆ బాలకుడిచేతివ్రేళ్ళు ఎఱ్ఱతామరపువ్వుయొక్క రేకులకంటె సొగసైనవి, అతడి పాదపద్మాలు లేతచిగురుటాకులకంటె సుకుమారాలుగా ఉన్నాయి. ఆతడి చరణాలను నాశిరస్సున తాల్చి. 'దేవా! నీదయవలన, మిక్కుటమైన అచ్చెరువు కలిగించే సకల చరాచరసృష్టిని నీపొట్టలో చూచాను; నీమాయాప్రభావాన్ని ఎంత యోచించినా నేను అర్థం చేసికొనలేకున్నాను.

**శా. ఈ యేకార్ణవ మీ వటక్షితిరుహం బీ పర్ణపర్యంక మి**
**ట్లై యొప్పారుచునుండఁగా నుదరభాగైకప్రదేశంబునం**
**దీ యీరేడుజగంబులున్ మెలఁగఁగా నిట్లున్న బాలత్వ మే**
**నేయందంబున నిశ్చయించి సుఖి నై యేపారుదుం జెప్పవే! 261**

**ప్రతిపదార్థం:** ఈ+ఏక+అర్ణవము= ఒకే ఒక్కటిగా ఏర్పడిన ఈసముద్రం; ఈ, వట, క్షితిరుహంబు= ఈమఱ్ఱిచెట్టు; ఈ. పర్ణ, పర్యంకము= ఈ ఆకు శయ్య; ఇట్లు+ఐ= ఈవిధంగా నుండినదై; ఒప్పారుచున్+ఉండఁగాన్= విలసిల్లుతూఉండగా; ఉదర, భాగ+ఏక, ప్రదేశంబునందున్= పొట్టలోపలి భాగంలోనే ఇమిడి ఉన్న స్థలంలో; ఈ+ఈరు+ఏడు, జగంబులున్= ఈపదునాలుగు లోకాలును; మెలఁగఁగాన్= వర్తిల్లగా; ఇట్లు+ఉన్న= ఈ రీతిగా ఉన్న; బాలత్వము= పసిపిల్లవాడి తనం; ఏన్= నేను; ఏఅందంబునన్= ఏవిధంగా; నిశ్చయించి= నిర్ణయించి; సుఖిని+ఐ= సౌఖ్యాన్ని పొందే వాడనై; ఏపారుదున్= ఒప్పారుతాను; చెప్పవే= చెప్పగోరుతాను.

**తాత్పర్యం:** దేవా! స్థూలదృష్టికి నీవు ఒకపసిబాలకుడివిగా భాసిస్తున్నావు. సూక్ష్మదృష్టితో ఎంత తరచి చూచినప్పటికీ నీ మహిమ నా ఊహలను దాటిపోతున్నది. ఇది ఎటు చూచినా అంతు దరి చిక్కని ఒకేఒక పెనుకడలి. దీనిని ఏమనవలెె? మరి ఈ పెను మఱ్ఱి చెట్టు, ఆకు శయ్య ఏమిటి? నీపొట్టలో పదునాలుగు లోకాలు పెట్టుకొని పసిపాపడి వలె పవ్వళించటం ఏమిది? ఈ పసిబిడ్డడి సొగసు ఎట్టి దని నిర్వచించగలను? నిశ్చయించగలను? ఆ ఆనందసౌఖ్యం నాకు ఏవిధంగా చేకూరునో దయచేసి నీవే చెప్పాలి.

**క. నాదైన యాశ్రితత్వము । నీదగు చిత్తమునఁ గలిమి నియతమ యేనిన్**
**సాదరఫణితుల నన్నవ । సాదితసమ్మోహుఁగాఁ బ్రసాదింపఁదగున్.' 262**

**ప్రతిపదార్థం:** నాదు+ఐన, ఆశ్రితత్వము= నేను నిన్ను ఆశ్రయించటం; నీదు+అగు, చిత్తమునన్= నీదైన మనస్సులో, కలిమి= కలిగి ఉండటం; నియతము+అ+ఏనిన్= నిత్యమైనదే అయితే; స+ఆదర, ఫణితులన్= ఆదరంతో కూడిన తీరుతెన్నులతో; నన్నున్= నన్ను; అవసాదిత సమ్మోహున్+కాన్= పోగొట్టబడిన భ్రాంతి కలవాడినిగా; ప్రసాదింపన్+తగున్= అనుగ్రహించదగును.

**తాత్పర్యం:** దేవా! నేను నీకు నిజమైన ఆశ్రితుడను. ఆ సంగతి నీ మనస్సులో ఎల్లప్పుడూ పాయక నిల్చేదే అయితే, నన్ను ఆదరించి నీవు నా భ్రాంతిని దయచేసి తొలగించి, నన్ను రక్షించుము.'

నారాయణుఁడు మార్కండేయునకుఁ దన ప్రభావంబు సెప్పుట : (సం. 3-187-1)

**క. అని యేను వేఁడికొనుటయు । ఘనతరకరుణారసానుకలితహృదయుఁ డై**
**తన దివ్యమహిమ యిట్లని । వనజాక్షుఁడు సెప్పె గారవంబున నాకున్. 263**

**ప్రతిపదార్థం:** అని= అట్లు పలికి; ఏను= నేను; వేడికొనుటయున్= ప్రార్థించటమున్నూ; వనజ+అక్షుఁడు= పద్మాలవంటి కన్నులు కలవాడు- విష్ణుమూర్తి; ఘనతర, కరుణా, రస+అనుకలిత, హృదయుఁడు+ఐ= మిక్కిలి గొప్ప దైన దయ అనెడి రసం చేత కూడిన డెందం కలవాడై; తన, దివ్య, మహిమ= తనయొక్క దేవతాసంబంధమైన గొప్పతనం; ఇట్లు+అని= ఈ విధంగా వివరించి; గారవంబునన్= గౌరవభావంతో; నాకున్= నాకు; చెప్పెన్= వచించాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా నేను ప్రార్థించటంచేత, పద్మాలవంటి కన్నులు కల విష్ణుదేవుఁడు నాయందు గొప్పదైన దయకలవాడై, మిక్కుటమైన వాత్సల్యంతో తన దివ్యమహిమను నాకు ఈ విధంగా వివరించి చెప్పాడు.

**ఆ. 'అనఘ! దేవతలును మునులును నాదైన । మహిమఁ దెలియ లేరు, మహితబుద్ధి**
**నతులపుణ్యమతివి పితృభక్తుఁడవు గాన । యెలమి నీకుఁ జెప్పవలసెఁ దెలియ. 264**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! (ఓమార్కండేయమహర్షీ); నాదు+ఐన, మహిమ= నాకు సంబంధించిన గొప్పతనం; దేవతలును= వేల్పులును; మునులును= ఋషులును; తెలియన్‌లేరు= గ్రహించనేరరు; మహితబుద్ధిన్= గొప్ప దైన మతిచేత; అతుల, పుణ్యమతివి= సాటిలేని సుకృతంతో కూడిన బుద్ధి కలవాడవు; పితృభక్తుఁడవు= తండ్రియందు పూజ్యభావం కలవాడివి; కాన= కావున; ఎలమిన్= సంతసంతో; నీకున్= నీకు; తెలియన్= తెలిసేటట్లుగా; చెప్పవలసెన్= వచించవలసి వచ్చింది.

**తాత్పర్యం:** 'ఓపుణ్యాత్ముడా! వేల్పులు ఋషులు కూడ నామహిమ తెలియ నేరరు; నీవు గొప్పమేధావివి; సాటిలేని సుకృతం ఆర్జించినవాడవు; తండ్రిని ఆరాధించేవాడవు. కావున సంతసంతో నీకు తెలిసేటట్లుగా నామహిమ వివరించి చెప్పవలసి వచ్చింది.

**క. నారము లందురు జలముల; । నారయ నారములు నాకు నయనం బగుటన్**
**నారాయణుఁ డను పేర, న । పారనిగమఫణితులందుఁ బరఁగుదుఁ బేర్మిన్. 265**

**ప్రతిపదార్థం:** జలములన్= నీళ్ళను; నారములు+అందురు= 'నారములు' అని అంటారు; ఆరయన్= విచారించి చూడగా; నారములు= జలములు; నాకున్+అయనంబు+అగుటన్= నాకు స్థానం కావటంచేత; నారాయణుఁడు= నార+అయనుఁడు= నారములు అయనముగా అనగా స్థానంగా కలవాడు; అను పేరన్= అనే పేరుమీద; అపార= పారం లేని అనగా అంతు కనరాని; నిగమఫణితులందున్= వేదపద్ధతులలో; పేర్మిన్= పెంపారేటట్లుగా; పరఁగుదున్= ఒప్పారుతూ ఉంటాను.

**తాత్పర్యం:** ఓ మార్కండేయ మహర్షీ! జలాలకు పర్యాయపదం నారములు. నాకు జలాలు స్థానం. అందుచేత నాకు 'నారాయణుడు' (నారములు స్థానంగా కలవాడు) అనే సార్థకనామధేయం ఏర్పడింది.

**తే. అట్టి నారాయణాఖ్యుండ నైన నేను । శాశ్వతుండ నై ప్రభుఁడనై సకలజగము**
**లోలిఁ బుట్టింతుఁ బాలింతు నుచితవేళ । సంహరింతుఁ జిదానందశాలి నగుచు. 266**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; నారాయణ+ఆఖ్యుండను+ఐన= నారాయణుడు అనే పేరుకలిగినవాడనైన; నేను; శాశ్వతుండను+ఐ= ఎల్లప్పుడు ఉండేవాడనై; ప్రభుఁడను+ఐ= పరిపాలించేవాడనై; చిత్+ఆనందశాలిన్+అగుచున్= జ్ఞానంతో కూడిన ఆనందం కలవాడను ఔతూ; సకల జగములు= లోకాలను అన్నింటిని; ఓలిన్= క్రమంగా; పుట్టింతున్= ఉద్భవింపచేస్తాను; పాలింతున్= ఏలుకొంటాను; ఉచిత వేళన్= తగిన సమయంలో; సంహరింతున్= నశింపజేస్తాను.

**తాత్పర్యం:** ఆవిధంగా 'నారాయణుఁడు' అనే పేరు కల నేను ఎల్లప్పుడూ ఉండేవాడిని, పాలించేవాడిని. జ్ఞానంతో కూడిన ఆనందం కలవాడినౌతూ, వెల్లివిరిసే ఈ లోకాలనన్నిటిని క్రమంగా నేను సృష్టిస్తాను. నేనే ఏలుకొంటాను. తగిన సమయంలో వాటిని లయంచేస్తాను.

**మత్తకోకిలము.**

> **అంబుజాసనుఁ డింద్రుఁ డీశ్వరుఁ డంతకుండు ధనేశ్వరుం**
> **డంబుధీశుఁడు లోనుగా సుర లస్మదాకృతు; లుర్వి పా**
> **దంబు, లగ్ని ముఖంబు, సూర్యసుధాకరుల్ నయనంబు, లీ**
> **యంబరంబు శిరంబుగా నిటు లద్భుతాకృతి నుండుదున్.** **267**

**ప్రతిపదార్థం:** అంబుజ+ఆసనుఁడు= పద్మం ఆసనంగా కలవాడు- బ్రహ్మదేవుడు; ఇంద్రుఁడు= వేల్పులదొర అయిన ఇంద్రుడు; ఈశ్వరుఁడు= శివుడు; అంతకుండు= యముడు; ధన+ఈశ్వరుండు= ధనానికి అధిపతి అయిన కుబేరుడు; అంబుధి+ఈశుఁడు= సముద్రాలకు ప్రభువు- వరుణుడు; లోనుగాన్, సురలు= మొదలుగాగల దేవతలు; అస్మత్+ఆకృతులు= నా ప్రతిరూపాలు ధరించిన వారే; ఉర్వి= భూమి (నాకు); పాదంబులు= కాళ్ళు; అగ్ని= అగ్ని; ముఖంబు= (నా)మొగం; సూర్య, సుధాకరుల్= సూర్యుడూ చంద్రుడూ; (నా) నయనంబులు=(నా) కన్నులు; ఈ+అంబరంబు= ఈ ఆకాశం; శిరంబు+కాన్= తలఅయి; ఇటులు= ఈవిధంగా, అద్భుత+ఆకృతిన్= అచ్చెరువు గొలిపే ఆకారంతో; ఉండుదున్= ఉంటాను.

**తాత్పర్యం:** పద్మం పీఠంగా గల బ్రహ్మదేవుడున్నూ, వేల్పులను పాలించే ఇంద్రుడున్నూ, ధనానికి అధిపతి అయిన కుబేరుడున్నూ, సముద్రాలకు అధిపతి అయిన వరుణుడున్నూ, మిగిలిన వారందరున్నూ, నా అంశను పంచుకొన్న నా ప్రతినిధులే సుమా! భూమి నాయొక్క పాదాలు, అగ్నిహోత్రుడు నా ముఖం, సూర్యచంద్రులు నా నేత్రాలు, ఈ ఆకాశం నా శిరస్సు, ఈ విధమైన అద్భుతాకారం ధరించి నేను విలసిల్లుతాను.

**విశేషం:** 1. ఇట విష్ణుపారమ్యం ప్రతిపాదించబడింది. శ్రీమన్మహావిష్ణువే సృష్టిస్థితిలయకారు డైన పరమాత్మగా ఇట అభివర్ణితం. మహాభారతకథలో శ్రీకృష్ణుడు నిర్వహించిన విశిష్టపాత్ర అందరికీ తెలిసిందే. ఆ కృష్ణుడు సమకాలీనులచేత విష్ణుమూర్తి అవతారంగా అగ్గింపబడటం మహాభారతంలోనే సుస్పష్టంగా ఉన్నది. విష్ణు తత్త్వాన్ని వేదవ్యాసమహర్షి ప్రతిపాదించాడనిన్నీ దానిని వైశంపాయనుడు విస్తరించి వర్ణించాడనిన్నీ, శ్రీ వైద్య మొదలైన విమర్శకుల అభిప్రాయం, వైశంపాయనమహర్షి జనమేజయుడి సత్రయాగంలో తన భారతం వినిపించాడు. భారతం మహాభారతమైనది. ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులకు విన్పించింది సత్త్రయాగసమయంలోనే. ఇతడే విష్ణు పారమ్యం, శివపారమ్యం, బహుదేవతా పారమ్యాలను ప్రబోధించే పలుగాథలను అభివర్ణించి శివకేశవాద్వైతతత్త్వాన్ని సైంధవవధఘట్టంలో ప్రతిపాదించిన సమన్వయ సంధాత. మహాభారతంలో మొట్టమొదట ద్రౌపదీ స్వయంవరఘట్టంలో ఎట్టి పూర్వపరిచయం లేకుండానే శ్రీకృష్ణపాత్ర ప్రవేశపెట్టబడటం గమనించదగింది.

2. మత్తకోకిలలోని ప్రతిపాదంలోనూ ర,స,జ,జ,భ,ర - అనే గణాలు వరుసగా ఉంటాయి. 11వ అక్షరం యతి స్థానం. ప్రాసనియమం ఉన్నది.

**చ.** **అతులితదక్షిణాన్వితమహాధ్వరసంఘము లే నొనర్చితిం;**
**జతురమనీషితాప్రచురసౌఖ్యులు భూసురముఖ్యు లంచిత**

**వ్రతులు మహీపతుల్ సుగుణవంతులు వైశ్యులు భక్తి నన్ను సం**
**తతమును గొల్తు రీక్షితి నుదాత్తమహాక్రతు కర్మశీలురై. 268**

**ప్రతిపదార్థం:** అతులిత, దక్షిణా+అన్విత, మహా+అధ్వర, సంఘములు= సాటిలేని, దక్షిణలతో కూడిన గొప్పయజ్ఞాలు పెక్కులు; ఏను= నేను; ఒనర్చితిన్= చేశాను; చతుర, మనీషితా, ప్రచుర, సౌఖ్యులు= ఎప్పటి కప్పుడు వికసించే బుద్ధిచేత విస్తరించే సౌఖ్యాలు కలవారు (అగు); భూసుర, ముఖ్యులు= బ్రాహ్మణశ్రేష్ఠులు; అంచితవ్రతులు= గొప్ప వ్రతాలు గల; మహీపతుల్= రాజులును; సుగుణవంతులు వైశ్యులు= మంచిలక్షణాలు కల కోమటులును; నన్నున్; సంతతమును= ఎల్లప్పుడూ; భక్తిన్= పూజ్యభావంతో; ఈ క్షితిన్= ఈ భూమిమీద; ఉదాత్త, మహాక్రతు, కర్మ శీలురు+ఐ= దానాలతో కూడిన గొప్పయజ్ఞాలు చేసే స్వభావం కలవారై; కొల్తురు= పూజిస్తారు.

**తాత్పర్యం:** నేను ఎన్నో యజ్ఞాలను సాటిలేని దక్షిణలతో చేసి ఉన్నాను. మేధావులై నిరతం సుఖించే బ్రాహ్మణోత్తములున్నూ, మెచ్చుకొనదగిన దీక్షాదక్షతలు కల ప్రభువులున్నూ, సద్గుణాలు కల వైశ్యులున్నూ దానధర్మాలతో కూడిన యజ్ఞాలు చేసే స్వభావం కలవారై నన్ను భక్తితో ఆరాధిస్తారు.

**చ. విలయపయోధిమగ్న మగు విశ్వమహీవలయంబుఁ దొల్లి యే**
**నలఘువరాహవిగ్రహుఁడ నై వెస నెత్తితి, శేషమూర్తి నై**
**లలితఫణాసహస్రకము లావునఁ దాల్తు నశేషధాత్రియున్**
**జలనిధి నిమ్నగా నగ లసన్నగరీ వనమండలంబుతోన్. 269**

**ప్రతిపదార్థం:** విలయ, పయోధిమగ్నము+అగు= ప్రళయకాల సముద్రంలో మునిగిపోయిందైన; విశ్వ, మహీ, వలయంబున్= సమస్తమైన భూగోళాన్ని; తొల్లి= పురాతనకాలంలో; ఏన్= నేను; అలఘువరాహవిగ్రహుఁడను+ఐ= గొప్ప పంది ఆకారం కలవాడ నై; వెసన్= శీఘ్రంగా; ఎత్తితిన్= ఉద్ధరించాను; శేషమూర్తిన్+ఐ= ఆదిశేషుడి ఆకారం కలవాడనై; లలిత, ఫణా, సహస్రకము, లావునన్= సుకుమారమైన వేయిపడగలయొక్క శక్తిచొప్పున; అశేషధాత్రియున్= సమస్తభూమిని; జలనిధి, నిమ్నగా, నగ, లసత్నగరీ, వన, మండలంబుతోన్= సముద్రాల, నదుల, పర్వతాల, ఒప్పారే నగరాల, అడవులతోడి సమూహంతో; తాల్తున్= ధరిస్తాను.

**తాత్పర్యం:** ప్రళయకాలంలో సముద్రంలో మునిగిపోయిన సమస్త భూగోళాన్ని వరాహరూపం ధరించి ఉద్ధరించింది నేనే. సముద్రాలతో నదులతో పర్వతాలతో పట్టణాలతో అడవులతో ఒప్పారే ఈ సమస్త భూమండలాన్నీ మనోజ్ఞమైన వేయిపడగలపై ఆదిశేషుడిరూపంతో ధరిస్తున్నవాడను నేనే సుమా!

**క. బాడబదహనుఁడనై వడి । నేడు సముద్రముల జలము లేఁ గ్రోలుదు నీ**
**రేడుజగంబులు విలయముఁ । గూడెడు నెడఁ దజ్జలంబు గొనకొని విడుతున్. 270**

**ప్రతిపదార్థం:** బాడబదహనుఁడను+ఐ= బడబాగ్నినై; వడిన్= వేగంగా; ఏడుసముద్రములజలములు= ఏడుసముద్రాలలోని నీళ్ళు; ఏన్= నేను; క్రోలుదున్= త్రాగుదును; ఈరేడు, జగంబులు= పదునాలుగు లోకాలు; విలయమున్+కూడెడు+ఎడన్= ప్రళయంతో కూడే సమయంలో అనగా- ప్రళయకాలంలో; తత్+జలంబు= ఆ నీరు; గొనకొని= పూని; విడుతున్= విడిచిపెట్టుతాను.

**తాత్పర్యం:** బాడబమనే అగ్నినయి ఏడుసముద్రాల నీళ్లను నేను త్రాగుతాను, ఆ నీళ్లను ప్రళయకాలంలో నేను విడిచిపెట్టుతాను.

**విశేషం:** బడబ అనగా ఆడుగుఱ్ఱం యొక్క ఆకృతిలో సముద్రగర్భంలో ఉండే అగ్ని.

**చ. వదనభుజోరుపాదముల వర్ణచతుష్టయమున్ యుగాదియం**
**దొదవ సృజింతు; ఋగ్యజుషసూక్తులు సామము నయ్యథర్వమున్**
**విదితముగా మదీయముఖవీథుల నుద్భవమొందు; నన్నియుం**
**దుదిఁ బరివర్తనక్రమవిధూతము లై ననుఁ జేరుఁ గ్రమ్మఱన్. 271**

**ప్రతిపదార్థం:** వదన, భుజా+ఊరు, పాదములన్= ముఖం, భుజాలు, తొడలు, కాళ్ళనుండి; వర్ణచతుష్టయమున్= నాలుగువర్ణాలను; యుగ+ఆదియందున్= యుగాలకు ముందుగా; ఒదవన్= కలిగేటట్లుగా; సృజింతున్= సృష్టిచేస్తాను; ఋక్+యజుష, సూక్తులు= ఋగ్వేదానికి యజుర్వేదానికి సంబంధించిన మంచిమాటలు; సామమును= సామవేదాన్ని; ఆ+అథర్వమున్= ఆ అథర్వవేదాన్ని; విదితముగాన్= తెల్లమయ్యేటట్లుగా; మదీయ, ముఖ, వీథులన్= నామొగం అనెడి తెరువులందు; ఉద్భవము+ఒందున్= పుట్టుతాయి; అన్నియున్= (పైన చెప్పబడిన వన్నీ) అన్నియును; పరివర్తన, క్రమ, విధూతములు+ఐ= మార్పుచెందేవరుసపద్ధతిచేత చెదరగొట్టబడినవై; క్రమ్మఱన్= మరల; ననున్+చేరున్= నన్ను పొందుతాయి.

**తాత్పర్యం:** సృష్టి ఆరంభించే సమయంలో నా నోటినుండి, భుజాల నుండి, తొడలనుండి, పాదాలనుండి నాలుగు వర్ణాలను సృష్టిస్తాను. అట్లే నాలుగువేదాలు- ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం నాముఖాలనుండి ఉద్భవిస్తాయి. ఇవి అన్నీ తుట్టతుదకు ప్రళయకాలంలో అవశ్యంగా చెందేమార్పుకు లోనై తిరిగి నన్నే చేరుతాయి.

**క. అనహంకృతు లక్రోధను । లనసూయులు సంగరహితు లధ్యాత్మవిదుల్**
**ఘనసత్యాత్మకులు మహా । మునులు ననుం గొల్తు రెపుడు మోక్షాపేక్షన్. 272**

**ప్రతిపదార్థం:** అనహంకృతులు= అహంభావం లేనివారు; అక్రోధనులు= కోపం లేనివారు; అనసూయులు= అసూయ లేనివారు; సంగరహితులు= మమత్వం లేనివారు; అధ్యాత్మవిదుల్= విజ్ఞానవేత్తలు; ఘనసత్య+ఆత్మకులు= గొప్పదైన సత్యంలో నిష్ఠ కలవారు; మహామునులు= గొప్పఋషులు; మోక్ష+అపేక్షన్= ముక్తిమీది ఆసక్తిచేత; ఎపుడున్= ఎల్లప్పుడు; ననున్= నన్ను; కొల్తురు= ఆరాధిస్తారు.

**తాత్పర్యం:** అహంభావం లేనివారు, కోపం లేనివారు, అసూయ లేనివారు, మమకారం లేనివారు, ఆత్మజ్ఞానం ఎరిగినవారు, సత్యమునందు నిష్ఠకలవారూ అయిన మహర్షులు ముక్తికొరకై సదా నన్ను ఆరాధిస్తారు.

**తే. అఖిలనక్షత్రతారాగ్రహములు గగన । పవనదిశలును మత్స్వరూపములు వినవె!**
**సకలరత్నాకరంబులు శయ్యగాఁగ । నిత్యసుఖలీలమై శయనింతు నేను. 273**

**ప్రతిపదార్థం:** అఖిల, నక్షత్ర, తారా, గ్రహములు= సమస్త మైన చుక్కలు, తారలు (సూర్యాది) గ్రహాలు; గగన, పవన, దిశలును= ఆకసం, వాయువు, దిక్కులున్నూ; మత్+స్వరూపములు= నా ఆకృతులే అని; వినవె= తెలిసికొనుము; సకల, రత్న+ఆకరంబులు= సమస్త సముద్రాలు; శయ్య, కాఁగన్= శయనం కాగా; ఏను= నేను; నిత్య, సుఖ, లీలమైన్= ఎల్లప్పుడు సంతోషించే స్వభావం కలవాడనై; శయనింతున్= పవ్వళిస్తాను.

**తాత్పర్యం:** సమస్తమైన నక్షత్రాలు, తారలు, గ్రహాలు, ఆకసం, వాయువులు, దిక్కులు అన్నీ నా ఆకృతులే. సమస్త సముద్రాలు పర్యంకంగా నేను నిత్యసంతోషినై పవళించి ఉంటాను- అని తెలిసికో.

**విశేషం:** ఇట 'నక్షత్రతారా' ప్రయోగం స్థూలదృష్టికి పునరుక్తిగా తోచవచ్చును. అయినా-నక్షత్రాలు అనగా అశ్వినీభరణ్యాది నక్షత్రాలు అనిన్నీ, తారలు అనగా తదితర నక్షత్రాలనిన్నీ కవిహృదయంగా తెలిసికోవాలి. అశ్విన్యాది నక్షత్రాలేకాక, గగనంలో లెక్కకు మిక్కిలి చుక్కలు కనబడతాయి కదా! రత్నాకరం-అనగా రత్నాలకు నెలవైనది-అనగా సముద్రం అని రూఢ్యర్థం.

**క. దానము సత్యంబు తపో । జ్ఞానాహింస లనఁబరఁగు సాత్త్వికగుణసం**
**తానముఁ గామక్రోధా । జ్ఞానంబులు మన్మయములు సంయమివర్యా! 274**

**ప్రతిపదార్థం:** సంయమి, వర్యా= ఓఋషిశ్రేష్ఠుడా!; దానము= ఈవి (తనకు కలదానిని నిర్వ్యాజంగా పరోపకారార్థం ఇవ్వటం); సత్యంబు= నిజం (పలకటం); తపస్+జ్ఞాన+అహింసలు= తపస్=తపం; జ్ఞాన= (శాస్త్ర) మోక్ష విషయకమైన తెలివిడి; అహింసలు= హింస చేయకపోవటం; అనన్+పరఁగు= అనిపిలువబడెడి; సాత్త్విక, గుణ, సంతానమున్= సౌమ్యమైన లక్షణాల సముదాయం; కామ, క్రోధ+అజ్ఞానంబులు= కోరికలు, కోపం, తెలియకపోవటాలు; మత్+మయములు= నాయందు నిండినట్టివే.

**తాత్పర్యం:** ఓఋషిశ్రేష్ఠుడా! ఈవి, నిజం పలకటం, తపస్సు, తెలివిడి, అహింసలు అనబడే సాధుసౌమ్యలక్షణాలున్నూ, కోరికలు, కోపతాపాలు, అజ్ఞానం అనే తామసగుణాలున్నూ నా యందు నిండినవే.

**విశేషం:** ఆధ్యాత్మికవికాసానికి దానం, సత్యం, తపం, జ్ఞానం, అహింస విశిష్టలక్ష్యాలుగా వివరించబడినవి. "అహింసా పరమో ధర్మః!" "సత్యం వద" మున్నగునవి సుప్రసిద్ధాలు. అన్నిమతాలున్నూ 'దానము' యొక్క విశిష్టతను నొక్కివక్కాణించాయి. షోడశదానాలు: గోదానం, భూదానం, తిలదానం, హిరణ్యదానం, రత్నదానం, విద్యాదానం, కన్యాదానం, దాసీదానం, శయ్యాదానం, గృహదానం, అగ్రహారదానం, రథదానం, గజదానం, అశ్వదానం, ఛాగ(మేక)దానం, మహిషీదానం. ఇచ్చట సద్గుణాలు మాత్రమే కాక కామక్రోధాదులు కూడ 'మన్మయములు' అనే నారాయణప్రవచనం గమనించతగింది.

**క. విను మింకఁ బెక్కుమాటలఁ । బని యేటికి? జగమునందుఁ బ్రకటితముగఁ గ**
**ల్గినయదియు నేన, లేనిది । యును నేన; సునిశ్చితముగ నూహింపు మెదన్. 275**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకింపుము; ఇంకన్= ఇకమీద; పెక్కు, మాటలన్= పలుమాటలచేత; పని+ఏటికి?= అవసర మేమికలదు? జగమునందున్= లోకంలో; ప్రకటితముగన్+కల్గిన+అదియున్= సుస్పష్టంగా ఉండి ఉన్నదియును; ఏను+అ= ఏన= నేనే; లేనిదియును= అవ్యక్తమైనది అంతయునుకూడ; నేను+అ= నేనే; ఎదన్= (నీ) హృదయంలో; సునిశ్చితముగన్= ఎట్టిసందేహానికి తావు లేకుండా ఉండే సత్యంగా; ఊహింపుము= భావించుము.

**తాత్పర్యం:** ఇక నేను చెప్పేది సావధానంగా ఆలకించుము. ఈ జగత్తులో సుస్పష్టంగా వ్యక్తమై కన్పిస్తున్నది అంతా నేనే! ఈ జగత్తులో అవ్యక్తమై లేనిదిగా తట్టేది అంతా నేనే! ఈ సంగతి నీవు ఎట్టి సందేహాలకు తావు లేకుండా సత్యంగా తెలిసికొమ్ము.

**ఉ. ఎప్పుడు ధర్మహాని యగు, నెప్పు డధర్మము మీఱుఁ, గ్రూరు లై**
**యెప్పుడు దైత్యు లుబ్బుదురు, హీనతఁ బొందుదు రెప్డు వేల్పు లే**

**నప్పుడు సత్కులీనుల గృహంబుల నుద్భవ మొంది లీలమై**
**నెప్పటియట్ల నిల్పుదు సురేంద్రుల నంచితధర్మపద్ధతిన్. 276**

**ప్రతిపదార్థం:** ఎప్పుడు= ఏసమయంలో; ధర్మ, హాని+అగున్= ధర్మానికి కీడు మూడుతుందో; ఎప్పుడు; అధర్మము మీఱున్= అధర్మం అతిశయిస్తుందో; ఎప్పుడు; దైత్యులు= రాక్షసులు; క్రూరులు+ఐ= ఇతరులకు హాని కలిగించేవారై; ఉబ్బుదురు= విజృంభిస్తారో; వేల్పులు= దేవతలు; హీనతన్+పొందుదురు= అణగారిపోతారో; అప్పుడు= ఆసమయంలో; (నేను) సత్+కులీనుల గృహంబులన్= మంచికులాలకు చెందినవారి ఇండ్లలో; ఉద్భవము+ఒంది= పుట్టి; లీలమైన్= విలాసంతో, మహిమతో; సురేంద్రులన్= దేవతలను, దేవేంద్రుడిని; అంచిత, ధర్మ, పద్ధతిన్= ఒప్పిదమైన ధర్మమార్గంలో; ఎప్పటి+అట్లు+అ= యథాప్రకారం; నిల్పుదున్= నిలబెట్టుతాను.

**తాత్పర్యం:** లోకంలో ఎప్పుడు ధర్మానికి కీడు ఏర్పడుతుందో, ఎప్పుడు అధర్మం విజృంభిస్తుందో, ఎప్పుడు రాక్షసులు క్రూరులై అతిశయిస్తారో, ఎప్పుడు వేల్పులు హీనస్థితికి దిగజారుతారో, అప్పుడు మంచికులానికి సంబంధించిన వారి ఇండ్లలో జన్మించి, దేవతలను, దేవేంద్రుడిని కాపాడి యథాప్రకారం ధర్మమార్గంలో నిలబెట్టుతాను.

**విశేషం:** ఈఘట్టం భగవద్గీతలోని శ్రీకృష్ణప్రవచనాన్ని స్మరణకు తెస్తున్నది.

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత । అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం । ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

భగవద్గీత : 4-7,8

**క. సితరక్తనీలపీత । ద్యుతి విలసితరూపములఁ జతుర్యుగముల నే**
**నతిధృతిఁజరియించి సమం । చితధర్మస్థాపనంబు సేయుదు ననఘా! 277**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; సితరక్తనీలపీతద్యుతివిలసితరూపములన్= తెల్లని ఎర్రని నల్లని పసుపురంగుల కాంతులతో విలసిల్లే ఆకృతులలో; చతుర్+యుగములన్= నాలుగుయుగాలలో; ఏన్= నేను; అతిధృతిన్= మిక్కిలిధైర్యంతో; చరియించి= ప్రవర్తించి; సమ్+అంచిత= మిక్కిలి పూజించదగిన; ధర్మస్థాపనంబు= ధర్మాన్ని నెలకొల్పటం; చేయుదున్= చేస్తాను.

**తాత్పర్యం:** ఓపుణ్యాత్ముడా! కృతయుగంలో తెల్లని ఆకృతితో, త్రేతాయుగంలో ఎర్రనిరూపంతో, ద్వాపరయుగంలో నల్లనిదేహంతో, కలియుగంలో పసుపుపచ్చని ఆకృతితో విలసిల్లుతూ నాలుగుయుగాలలో నేను ఆరాధించదగిన ధర్మాన్ని నెలకొల్పుతాను.

**మత్తకోకిలము.**

**కాలచక్రము నిర్వికల్పము గాఁగ నేన నయింతు ను**
**న్మీలితక్రమవిక్రమైకమృద్ధినై; లయవిక్రియా**
**వేళ నింతయు సంహరింతుఁ బ్రవృద్ధయోగబలోల్లస**
**త్కాలరూపము దాల్చి దుర్వహగర్వనిర్వహబుద్ధి నై. 278**

**ప్రతిపదార్థం:** కాలచక్రము= కాలం అనే చక్రం; నిర్వికల్పము= వికల్పం లేనట్టిది, నిర్ణీతక్రమాన్ని ఎన్నడున్నూ తప్పనట్టిది; కాఁగన్= అయ్యేటట్లుగా; ఉత్+మీలిత, క్రమ, విక్రమ+ఏక, సమృద్ధిన్+ఐ= వికసించే పద్ధతిచొప్పున ప్రసరించే పరాక్రమంయొక్క అతిశయంకలవాడనై; ఏను+అ= ఏన= నేనే; నయింతున్= నడపుతాను; లయ, విక్రియా,వేళన్= ప్రళయం వచ్చిన సమయంలో; ప్రవృద్ధ,యోగ, బల+ఉల్లసత్, కాల రూపము= కొనసాగి పెంపొందిన శక్తిచేత ఒప్పారే యముడి ఆకృతిని; తాల్చి= ధరించి; దుర్వహ, గర్వ, నిర్వహ, బుద్ధిన్+ఐ= వహించ శక్యంగాని మదాన్ని పూనే మతికలవాడనై; ఇంతయున్= దీనిని ఇంతటిని, ఈ సమస్తసృష్టిని; సంహరింతున్= నాశ మొనరిస్తాను.

**తాత్పర్యం:** క్రమపరిణామవికాసం చెందే నాపరాక్రమంచేత కాలచక్రాన్ని నిర్ణీతక్రమాన్ని ఎన్నడూ తప్పనట్టిదిగా నేనే నడుపుతాను. ప్రళయకాలంలో, పెంపొందే శక్తిచేత విలసిల్లే యముడిరూపం ధరించి ఈ సృష్టిని అంతటిని దురంత గర్వాతిరేకంతో నేనే సంహరిస్తాను.

**విశేషం:** వృత్త లక్షణానికి ఆరణ్యపర్వం 4.267 విశేషం చూడండి.

**క. నా తెఱఁగంతయు నిప్పుడు । చేతోముద మొదవ నీకుఁ జెప్పితిఁ ద్రిజగ**
**ద్ధాత యగు పితామహుఁడు సు । జాతుఁడు నాయెడలఁ జక్క సగబాలు సుమీ! 279**

**ప్రతిపదార్థం:** నాతెఱఁగు+అంతయున్= నావిధాన్ని అంతటిని; ఇప్పుడు= ఈ సమయంలో; నీకున్= నీకు; చేతస్+ముదము+ ఒదవన్= మనస్సుకు సంతోషం కలిగేటట్లుగా; చెప్పితిన్= వచించాను; త్రిజగత్ ధాత+అగు= మూడులోకాలు సృజించేవాడైన; పితామహుఁడు= బ్రహ్మదేవుడు; సుజాతుఁడు= గొప్పపుట్టుక కలవాడు; నాయెడలన్= నాకు సంబంధించినమేరకు; చక్క= చక్కగా; సగము+పాలు, సుమీ= సగంవంతు, సుమా!

**తాత్పర్యం:** నా వృత్తాంతాన్ని అంతా నీ మనస్సుకు ఆహ్లాదకరంగా వివరించి చెప్పాను. మూడులోకాలను సృష్టించే బ్రహ్మదేవుడు కూడ నాలో సగం అంశం మాత్రమే అని గ్రహించుము.

**వ. నారాయణాభిధానుండ నైన యేను బాలరూపంబున శంఖచక్రగదాధరుండ నై యేకార్ణవంబునందు మహాయుగసహస్రసమయంబయిన కాలంబున యోగనిద్రాపరవశుండనై యుండుదు; నిట్టి దారుణకల్పాంతంబు సూచి నీవు భీతుండ వగు టెఱింగి, నీవలని యనుగ్రహంబున నాత్మగుప్తంబు లైన సకలలోకంబులు గనునట్టి తెఱంగుఁ గావించితి; నీ వింక నిశ్శంకహృదయుండ వయి వలసినయెడం జరియింపుము; మదీయనాభికమలకర్ణికాశయనుం డయి యున్న చతురాననుండు మేల్కని సృజియించు లోకంబు లేర్పడం జూచెద' వని యానతిచ్చి యద్దేవుం డచ్చోటన యంతర్హితుం డయ్యె; నత్యంత విచిత్రం బైన యీవృత్తాంతంబు నాకు ననుభవగోచరం బైనయది. 280**

**ప్రతిపదార్థం:** నారాయణ+అభిధానుండను+ఐన= నారాయణుడు అనే పేరు కలవాడను అయిన; ఏను=నేను; బాల, రూపంబునన్= పసిబిడ్డని ఆకృతిలో; శంఖచక్రగదాధరుండను+ఐ= శంఖ చక్ర గదలను ధరించినవాడనై; ఏక+అర్ణవంబునందున్= ఒకేఒకటిగా మారిన సముద్రంలో; మహా, యుగ, సహస్ర, సమయంబు+అయిన= వేయిమహాయుగాలకు సరిసమానమైన; కాలంబునన్= సమయంలో; యోగ, నిద్రా, పరవశుండను+ఐ= యోగానికి సంబంధించిన నిదుర చొప్పున మైకం చెందినవాడనై; ఉండుదును= ఉంటాను; ఇట్టి= ఇటువంటి; దారుణ, కల్ప+అంతంబు= ఘోరమైనది, కల్పం చివర దాపురించేది అయిన

ప్రళయం; చూచి= అరసి; నీవు; భీతుండవు+అగుట= భయపడినవాడవు కావటం; ఎఱింగి= తెలిసికొని; నీవలని, అనుగ్రహంబునన్= నీమీది దయచేత; ఆత్మ, గుప్తంబులు+ఐన= నాలో దాచబడిన; సకల, లోకంబులు= అన్ని జగత్తులు; కను+అట్టి= చూచునట్టి; తెఱంగున్= మార్గాన్ని; కావించితిని= కల్పించాను; నీవు+ఇంకన్= నీవు ఇకమీద; నిస్+శంకహృదయుండవు+అయి= ఎట్టి సందేహాలు లేని హృదయం కలవాడవై; వలసిన+ఎడన్= ఇచ్చవచ్చినచోట; చరియింపుము= సంచరించుము; మదీయ, నాభి, కమల, కర్ణికా, శయనుండు+అయి= నాబొడ్డులో ఉన్నట్టి పద్మము యొక్క దుద్దునందు పవ్వళించి ఉన్న వాడయి; ఉన్న= ఉన్నట్టి; చతురాననుండు= (చతుర్+ఆననుండు) బ్రహ్మదేవుడు (నాలుగుమోములుకలవాడు); మేల్కని= (యోగనిద్రనుండి) లేచి; సృజియించు= నిర్మించే; లోకంబులు= జగత్తులు; ఏర్పడన్+చూచెదవు= రూపుకట్టటం చూస్తావు; అని+ఆనతి+ఇచ్చి= అని దయతో చెప్పి; ఆ+దేవుండు= (ఆ బాలకుడు); ఆ+చోటన్+అ= ఆస్థలంలోనే; అంతర్హితుండు+అయ్యెన్= మాయమైనాడు; అత్యంత, విచిత్రంబు+అయిన= మిక్కిలి ఆశ్చర్యకరమైన; ఈవృత్తాంతంబు= ఈసంఘటన; నాకున్; అనుభవ, గోచరంబు+ఐన+ అది= నాకు ప్రత్యక్షంగా కనుపించినట్టిది.

**తాత్పర్యం:** నారాయణుడు అనే పేరు కల నేను వేయిమహాయుగాలమేర బాలరూపం ధరించి, వటపత్రశాయినై ప్రపంచాన్ని అంతటిని ఆవరించిన ఒకే ఒక సముద్రంపై యోగనిద్రలో మునిగి ఉంటాను. కల్పాంతసమయాలలో దాపురించే భయంకరప్రళయాన్ని చూచి నీవు భయపడి ఉండటం తెలిసికొని, నీమీది వాత్సల్యంచొప్పున నీకు నా పొట్టలో దాచిఉంచిన ప్రపంచాలను చూపించాను. ఇక నీవు యథేచ్ఛగా నీకు తోచిన చోటికి పోవచ్చును. ఇక నాబొడ్డుతామరలో నిదురిస్తున్న బ్రహ్మదేవుడు మేల్కొని సృష్టించే జగత్తులను నీవు చూడగలవు' అని దయతో సెలవిచ్చి ఆ బాలదేవుడు అక్కడనే మాయమైనాడు, మిక్కిలి ఆశ్చర్యకరమైన ఈసంఘటనను నేను ప్రత్యక్షమైన అనుభవంచేత తెలిసికొన్నాను.

**విశేషం:** నిద్ర వేరు, యోగనిద్ర వేరు. నిద్ర యథేచ్ఛగా వచ్చేది కాదుకదా. యోగంవలన వచ్చే నిద్ర యోగనిద్ర. ఇది యథేచ్ఛా ప్రవర్తితం. యోగిసంకల్ప శక్తివలన ఏర్పడేది. అనుభవగోచరం అయిన జ్ఞానం తెలివిడి వేరు, శాస్త్రపఠనంవలన వచ్చే తెలివిడి వేరు. మొదటిది ప్రత్యక్షపరిజ్ఞానం, రెండవది శాస్త్రజన్యమైన పరోక్షపరిజ్ఞానం.

**శా.** **నా కమ్మైఁ బొడసూపెఁ దాను గృపతో నా కందు; నేఁ డియ్యెడన్**
**నీకున్ గాదిలిచుట్టమై సచివుఁడై నెయ్యంబుమై నున్న పు**
**ణ్యాకారుం గమలాయతాక్షుఁ గరుణైకాయత్తు నత్యుత్తమ**
**శ్లోకుం గృష్ణునిఁ గంటి; నా సుకృతముల్ శోభిల్లెఁ బక్వంబు లై.** **281**

**ప్రతిపదార్థం:** ఆ కందు= ఆ చిన్ని బాలుఁడు; తాను; కృపతోన్= దయతో; నాకు+అమ్మైన్= నాకు ఆవిధంగా; పొడసూపెన్= కన్పించాడు; నేఁడు ఇయ్యెడన్= ఈనాడు ఈచోటనే; నీకున్= నీకు; గాదిలి, చుట్టము+ఐ= ప్రియమైన బంధువై; సచివుఁడు+ఐ= మంత్రిఅయి; నెయ్యంబు, మైన్+ఉన్న= స్నేహంతో ఉన్న; పుణ్య+ఆకారున్= సుకృతం మూర్తీభవించినవాడిని; కమల+ఆయత+ అక్షున్= తామరపువ్వులవలె నునుసోగకన్నులు కలవాడిని; కరుణా+ఏక+ఆయత్తున్= దయతో నిండుగా కూడినట్టివాడిని; అతి+ఉత్తమశ్లోకున్= మిక్కిలి పూజనీయు డైన వాడిని; కంటిన్= చూచాను; నా, సుకృతముల్= నాపుణ్యాలు; పక్వంబులు+ఐ= పండినవై; శోభిల్లెన్= విలసిల్లాయి.

**తాత్పర్యం:** శ్రీమన్నారాయణమూర్తి వాత్సల్యంతో నాకు ఆవిధంగా దర్శనం అనుగ్రహించాడు నాడు! ఆ బాలదేవుడే నేడు నీకు అనుగుబంధువుగా, మంత్రిగా, స్నేహంతో ఉన్నాడు. ఆ పుణ్యమూర్తిని, కరుణార్ద్రహృదయుడిని,

కమలాలవంటి నునుసోగ కన్నులు కలవాడిని, పరమపూజనీయుడిని శ్రీకృష్ణుడిని ప్రత్యక్షంగా సందర్శించే భాగ్యం నాకు అబ్బింది. నా పుణ్యాలు ఫలించాయి.

**క. ఈ దేవదేవుకరుణం। గాదే కురునాథ! నిర్వికారుఁడనై నిః**
**ఖేదుఁడ నై యుండుదు దే। వాదివివిధభూతవిలయ మయ్యెడునపుడున్. 282**

**ప్రతిపదార్థం:** కురునాథ!= కురువంశానికి అధిపతి వైన ధర్మరాజా!; ఈదేవదేవు కరుణన్+కాదే= ఈ పరమదేవుడి దయవలన మాత్రమే కదా; దేవ+ఆది, వివిధ, భూత, విలయము+అయ్యెడున్+అపుడున్= దేవతలు మొదలుగాగల పెక్కు పదార్థాల యొక్క సర్వనాశనం అయ్యే సమయంలో కూడా; నిస్+వికారుఁడను+ఐ= ఎట్టి మార్పును లేనట్టివాడనై; నిస్+ఖేదుఁడను+ఐ= దుఃఖం లేనివాడ నై; ఉండుదున్= ఉంటాను.

**తాత్పర్యం:** ధర్మజా! దేవదేవుడైన ఈశ్రీకృష్ణుడి దయవలననే కదా నేను ప్రళయకాలంలో సయితం దేవతలు మొదలైన సకలభూతాలు లయమందేటప్పుడుకూడ, దుఃఖరహితుడనుగా, నిర్వికారుడనుగా మనగల్గాను.

**తే. అనఘ! యిద్దేవుసన్నిధి యగుటఁ గాదె! నాకుఁ బూర్వవర్తనకథనంబునందు**
**బోధ మిప్పుడు గలిగె; నిప్పుణ్యుఁ బరమ। పురుషుఁ బ్రభవిష్ణుఁ గృష్ణుని శరణు సొరుము.' 283**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓధర్మరాజా!; ఈ+దేవు సన్నిధి+అగుటన్+కాదె= ఈదేవుడి (శ్రీకృష్ణుడి) దర్శనం అగుట చేతనే కదా!; పూర్వ, వర్తన, కథనంబునందున్= ఎప్పుడో వెనుక జరిగిన దానిని చెప్పటంలో; బోధము= జ్ఞానం; నాకున్= నాకు; ఇప్పుడు= ఈసమయంలో; కలిగెన్= కలిగింది; ఈ పుణ్యున్= గొప్పమహిమ కల వాడిని; పరమపురుషున్= పరమాత్మను; ప్రభవిష్ణున్= విష్ణువును; కృష్ణునిన్= శ్రీకృష్ణుడిని; శరణు+చొరుము= కాపాడుమనే ప్రార్థనతో చేరుము.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడ వైన ఓ ధర్మరాజా! దేవదేవు డైన శ్రీకృష్ణుడి దర్శనభాగ్యం నా కిప్పుడు కలగటంచేతనేకదా, నాకు పూర్వసంఘటనలను జ్ఞాపకం చేసికొని చెప్పగలశక్తి చేకూరింది. గొప్పప్రభావం కలిగిన ఈ పుణ్యపురుషుడిని శ్రీకృష్ణపరమాత్మను శరణు పొందుము.

### మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ గలియుగధర్మంబులు సెప్పుట (సం. 3-188-5)

**వ. అనిన విని ధర్మనందనుం డనుజసహితుం డై కృష్ణునిం బ్రశంసావచనంబుల నభినందించి, మార్కండేయుం జూచి, 'మునీంద్రా! భవత్ప్రసాదంబున నత్యద్భుతకథాశ్రవణపరితోషితుల మైతిమి; కలియుగంబున సకలధర్మలోపం బగు నని చెప్పుదురు; తత్ప్రకారం బెఱింగింపవే!' యనిన నతం డతని కి ట్లనియె. 284**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని; ధర్మనందనుండు= ధర్మరాజు; అనుజసహితుండు+ఐ= తమ్ములతో కూడుకొనిన వాడై; కృష్ణునిన్= శ్రీకృష్ణుడిని; ప్రశంసా, వచనంబులన్= పొగడ్తతో కూడిన మాటలతో; అభినందించి= సంతోషింపచేసి; మార్కండేయున్+చూచి; ముని+ఇంద్రా!= ఋషులలో శ్రేష్ఠుడ వైన వాడా!; భవత్+ప్రసాదంబునన్= నీదైన అనుగ్రహంవలన; అతి+అద్భుత, కథా, శ్రవణ, పరితోషితులము+ఐతిమి= మిక్కిలి అచ్చెరువు నొందించే కథలను వినటంచేత సంతోషం చెందినవారం అయినాం; కలియుగంబునన్= కలియుగంలో; సకల, ధర్మ, లోపంబు+అగును+అని= అన్నిధర్మాలు తక్కువ అయిపోవటం జరుగుతుంది అని; చెప్పుదురు= అంటారు; తద్+ప్రకారంబు= ఆ తెఱగు; ఎఱింగింపవే= తెలుప వేడికోలు;

అనినన్= అని అడుగగా; అతండు= (మార్కండేయుడు); అతనికిన్= (ధర్మరాజుకు); ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆవిధంగా మార్కండేయుడు 'శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుడి అవతారం' అని చెప్పగా విని, ధర్మరాజు తనతమ్ములతోపాటు శ్రీకృష్ణుడిని ప్రశంసించాడు. పిమ్మట ధర్మరాజు మార్కండేయుడిని ఇట్లా అడిగాడు: 'మునీంద్రా! మేము నీదయవలన మిక్కిలి ఆశ్చర్యకర మైన కథలను వినటంచేత ఆనందపూరితులం అయినాం. కలియుగంలో సర్వధర్మాలు క్షీణిస్తాయని పెద్దలు చెప్పుతారు; ఆ విషయాన్ని దయచేసి వివరించి చెప్ప ప్రార్థన' - అని అనగా మార్కండేయుడు ధర్మరాజుకు ఈవిధంగా చెప్పాడు.

**క. 'కృతయుగమునందు ధర్మువు। చతురంశంబులను బరఁగఁ జను; నది త్రేతన్**
**ద్రితయమున నొక్కఁ డొకఁడుగఁ। బ్రతియుగమునఁ దఱుఁగఁ దొడఁగుఁ బాళులు వరుసన్. 285**

**ప్రతిపదార్థం:** కృతయుగమునందున్= కృతయుగంలో; ధర్మువు= ధర్మం; చతుర్+అంశంబులను= నాలుగు అంశాలలోనూ, (నాలుగు పాదాలలోనూ అనగా పరిపూర్ణంగా); పరఁగన్+చనున్= ఒప్పారుతుంది; అది= (ఆధర్మం); త్రేతన్= త్రేతాయుగంలో; త్రితయమునన్= మూడు భాగాలలో (ఉంటుంది); ఒక్కఁడు+ఒకఁడుగన్= ఒకటి ఒకటిగా; ప్రతియుగమునన్= ప్రతియుగంలోనూ; పాళులు= అంశాలు; వరుసన్= క్రమంగా; తఱుఁగన్, తొడఁగున్= తగ్గిపోతాయి.

**తాత్పర్యం:** 'కృతయుగంలో ధర్మం నాలుగుపాదాలతో సంపూర్ణంగా విలసిల్లుతుంది. త్రేతాయుగంలో మూడుపాళ్ళతో వర్ధిల్లుతుంది. వరుసగా, యుగానికి ఒక్కొక్కపాలు తగ్గి, ద్వాపరయుగంలో రెండు పాళ్ళున్నా, కలియుగంలో ఒకపాలు మాత్రమే వర్ధిల్లుతాయి.

**వ. అట్లగుటంజేసి ధర్మంబు కలియుగంబునఁ గరంబు దుర్లభం బయి పాదమాత్రావశిష్టంబయి యుండు; దత్ప్రవర్తనం బాకర్ణింపుము. 286**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆవిధంగా; అగుటన్+చేసి= జరగటంవలన; ధర్మంబు= ధర్మం; కలియుగంబునన్= కలియుగంలో; కరంబు= మిక్కిలి; దుర్లభంబు= లభించరానిది; పాద, మాత్ర+అవశిష్టంబు+అయి= ఒకపాదం మాత్రంగానే మిగిలి; ఉండున్= ఉంటుంది; తత్+ప్రవర్తనంబు= ఆ జరిగే విధం; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆవిధంగా కావటంచేత, కలియుగంలో ధర్మం క్షీణించి, ఒకపాదంమాత్రమే మిగిలిఉంటుంది. ఆవిషయాన్ని విశదీకరిస్తాను. వినుము.

**సీ. సత్యంబు నరులకు సంక్షిప్త మగు; సత్య। హాని నాయువు గడు నఱిగిపోవు;**
**నాయువు దఱిఁగిన నల్పంబు లగు విద్య;। లల్పవిద్యలను మోహంబు మిగులు;**
**మోహంబువలనఁ బై ముసురు లోభంబు; లో। భావేశమునఁ గామ మగ్గలించుఁ;**
**గామంబుపెంపునఁ గడఁగుఁ గ్రోధంబు; క్రో। ధనంబున వైర మెంతయును బెరుఁగు;**

**ఆ. వైరమున నశేషవర్ణులు నన్యోన్య। పీడ సేయుచును విభిన్నబుద్ధి**
**నొక్కఁడొకని మేర నుండక వర్ణ సం। కరము సేయఁగలరు కలియుగమున. 287**

**ప్రతిపదార్థం:** సత్యంబు= సత్యం; నరులకున్= మానవులలో; సంక్షిప్తము+అగున్= క్షీణిస్తుంది; సత్యహానిన్= నిజానికి ఏర్పడిన కీడువలన; ఆయువు= ఆయుర్దాయం; కడున్= మిక్కుటంగా; అఱిగిపోవున్= తగ్గిపోతుంది; ఆయువు= ఆయుస్సు; తఱఁగినన్= క్షీణించగా; విద్యలు= చదువులు; అల్పంబులు+అగున్= తక్కువ ఔతాయి; అల్పవిద్యలను= తగ్గిన విద్యలచేత; మోహంబు= భ్రాంతి మూలకమైన అజ్ఞానం; మిగులున్= అతిశయిస్తుంది; మోహంబువలనన్= భ్రాంతిమూలక మైన అజ్ఞానంచేత; లోభంబు= అత్యాసక్తి; పైముసురున్= పైనక్రమ్ముకొంటుంది; లోభ+ఆవేశమునన్= అత్యాసక్తి విజృంభించటం మూలంగా; కామము= కోరిక; అగ్గలించున్= విజృంభిస్తుంది; కామంబు పెంపునన్= కామం అతిశయించటంచేత; క్రోధంబు= కోపం; కడఁగున్= ఒదవును; క్రోధంబునన్= కోపంవలననే; వైరము= పగ; ఎంతయున్= మిక్కుటంగా; పెరుఁగున్= అతిశయిస్తుంది; వైరమునన్= శత్రుత్వంవలన; అశేష, వర్ణులున్= అన్నివర్ణాలవారు; అన్యోన్య,పీడ+చేయుచును= ఒకరి నొకరు హింసించుకొంటూ; విభిన్నబుద్ధిన్= భేదభావంతో; ఒక్కఁడు ఒకని మేరన్+ఉండక= ఎవరిహద్దులలో వారు ఉండక; కలియుగమునన్= కలియుగంలో; వర్ణ సంకరము+చేయఁగలరు= కులాల మిశ్రమాలను చేస్తారు.

**తాత్పర్యం:** మనుజులలో సత్యం తరిగిపోతుంది. సత్యహానిమూలంగా ఆయుర్దాయం తగ్గుతుంది. ఆయుస్సు క్షీణించటంవలన చదువులు తరిగిపోతాయి. అల్పవిద్యలవలన మోహం ప్రబలుతుంది. మోహం ప్రబలటంవలన లోభం పైగ్రమ్ముతుంది. లోభం విజృంభించటంచేత కామం అధికమవుతుంది. కామం వలన కోపం ఏర్పడుతుంది. క్రోధం అతిశయించటం వలన పగ ఏర్పడుతుంది. పగ ఏర్పడటం వలన భిన్నకులాలవారు అన్యోన్యహింసకు పాల్పడతారు. ఈవిధంగా ఎవరిహద్దులలో వారు ఇముడకపోవటంచేత వర్ణసాంకర్యం ఏర్పడుతుంది.

**క. జపనియమస్వాధ్యాయ । ప్రపంచములు విడువఁగలరు బ్రాహ్మణులు, జనా**
**ధిప! శూద్రులు విపుల తపః । క్షపితులు గాఁగలరు, వినవె! కలికాలమునన్. 288**

**ప్రతిపదార్థం:** జన+అధిప!= జనులకు అధిపతివైన ఓ ధర్మరాజా!; కలికాలమునన్= కలియుగంలో; జప, నియమ, స్వాధ్యాయ, ప్రపంచములు= మంత్రాదుల ఆవృత్తి, అనుష్ఠానం, వేదాధ్యయనం వీటిని; బ్రాహ్మణులు= విప్రులు; విడువఁగలరు= వదలిపెట్టుతారు; శూద్రులు= (నాల్గవజాతివారైన) శూద్రులు; విపుల, తపస్+క్షపితులు= గొప్పతపస్సుచేత క్లేశమునొందినవారు; కాఁగలరు= ఔతారు; వినవె= అవధానతతో ఆలకించుము.

**తాత్పర్యం:** జనులకు ప్రభు వైన ఓధర్మరాజా! కలికాలంలో బ్రాహ్మణులు మంత్రాలను వల్లెవేయటం మానేస్తారు, నిగ్రహాన్ని కోల్పోతారు, వేదాధ్యయనాన్ని వీడుతారు; శూద్రులు తపస్సు నాచరిస్తారు. ఈ విషయాలను సావధానంగా ఆలకించుము.

**విశేషం:** నియమం అనగా కేవలనిగ్రహం మాత్రమే కాదు. పతంజలి అష్టాంగయోగంలో నియమాన్ని ఈవిధంగా ప్రస్తావించాడు. నియమం= బాహ్యాభ్యంతరశౌచం+సంతోషం+తపస్సు+స్వాధ్యాయం+ఈశ్వరప్రణిధానం.

**మ. వివిధవ్యాఘ్రమృగోరగాకులము లై విస్తీర్ణశూన్యాటవీ**
**నివహాభీలము లై యరాజకములై నిర్మూలధర్మంబులై**
**ద్రవిళాభీరతురుష్కబర్బరపుళిందవ్యాప్తిదుష్టంబు లై**
**భువిలో నెల్లెడఁ బాడగున్ జనపదంబుల్ దద్యుగాంతంబునన్. 289**

**ప్రతిపదార్థం:** తద్+యుగ+అంతంబునన్= ఆయుగంలోపలిభాగంలో; వివిధ, వ్యాఘ్ర, మృగ+ఉరగ+ఆకులములు+ఐ= పెక్కు పెద్దపులుల చేతను, జంతువులచేతను, పాములచేతను కలతనొందించబడినట్టివై; విస్తీర్ణ, శూన్య+అటవీ, నివహ+ఆభీలములు+ఐ= విస్తరించిన, పాడుపడినట్టి అడవుల సముదాయంచేత భయంకరాలై; అరాజకములు+ఐ= ప్రభువుల ఆధిపత్యం చెల్లనట్టివై; నిర్మూల, ధర్మంబులు+ఐ= నశింపజేయబడిన ధర్మాలు కలవై; ద్రవిళ+ఆభీర, తురుష్క, బర్బర, పుళింద, వ్యాప్తిదుష్టంబులు+ఐ= ద్రవిళులు, ఆభీరులు, తురుష్కులు, బర్బరులు, పుళిందులు (అయిన అనాగరకజాతులవారి) విజృంభణచేత చెడినట్టివై; భువిలోన్= పుడమిలో; ఎల్ల+ఎడన్= అన్నిచోటులలో; జనపదంబుల్= మనుజులు నివసించే పల్లెపట్టులు; పాడు+అగున్= చెడిపోతాయి.

**తాత్పర్యం:** కలియుగంలో, భూమిమీద అన్నిచోటులలో ప్రజలు నివసించే పల్లెలు పాడయిపోతాయి. పెక్కు పెద్దపులులకు జంతువులకు పాములకు నెలవై భయంకరాలౌతాయి. అడవులు విస్తరించి పల్లెలను భయంకరంగా క్రమ్ముతాయి. అవి అరాజకాలౌతాయి. ప్రభుత్వాధికారం నశిస్తుంది. ధర్మాలు నిర్మూలించబడతాయి. దుష్టులైన ద్రవిళులు, ఆభీరులు, తురుష్కులు, బర్బరులు, పుళిందులు విజృంభిస్తారు. జనపదాలు సర్వనాశన మౌతాయి.

**విశేషం:** ఎఱ్ఱన కలియుగవర్ణన సూక్ష్మదృష్టితో అనుశీలించదగింది. ఎఱ్ఱన కలికాలవర్ణనలో సంస్కృతభారతమూలాన్ని అచ్చటచట అతిక్రమించాడు. ఈపద్యంలోని 'తురుష్క' శబ్దప్రయోగం అట్టిదే. ఎఱ్ఱన మహాకవి తుఘ్లక్ చక్రవర్తికి సమకాలీనుడు. ఓరుగల్లు తురుష్కాక్రాంత మయ్యేనాటికి ఎఱ్ఱన మహాకవి బహుశః నూనూగుమీసాలనూత్నయౌవనంలో ఉండిఉంటాడు.

**క. క్షత్త్రియజాతులు శూద్రచ । రిత్త్రంబున శౌర్యమును సిరియుఁ దేజంబున్**
**మైత్త్రియును లేక చెదరి ధ । రిత్త్రీశ్వర! శూన్యు లై చరించెదరు ధరన్. 290**

**ప్రతిపదార్థం:** క్షత్త్రియజాతులు= రాచకొలంవారు; శూద్రచరిత్త్రంబునన్= శూద్రులప్రవర్తనతో; శౌర్యమును= పరాక్రమాన్ని; సిరియున్= సంపదను; తేజంబున్= దీప్తిని; మైత్త్రియును= నెయ్యమును; లేక= ఉండక; చెదరి= ఒకచోట ఉండక ఇటు అటు పోయి; ధరిత్త్రీ+ఈశ్వర!= ఓరాజా!; ధరన్= భూమిపై; శూన్యులై= దిగజారినవారై; చరించెదరు= తిరుగాడుతారు.

**తాత్పర్యం:** ఓధర్మరాజా! పరాక్రమ ప్రాభవంచేత రాజ్యంలోని ప్రజలను రక్షించి పరిపాలించవలసిన రాచకొలంవారు శౌర్యం, సంపద, తేజస్సు, మైత్రి లేకుండ, దిగజారిపోయి సేవకవృత్తిని అవలంబించే శూద్రులవలె భూలోకంలో తిరుగాడుతారు.

**క. రసగంధద్రవ్యంబులు । పసచెడు, సస్యంబు లల్పఫలము లగు, మహిం**
**బసిపాఁడి దఱుఁగుఁ, దరువులఁ । గుసుమఫలంబులును గరముఁ గొంచెంబు లగున్. 291**

**ప్రతిపదార్థం:** రసగంధద్రవ్యంబులు= ద్రవాలుగా ఉండేవి, వాసనగలవి అయిన పదార్థాలు; పస చెడున్= సారాన్ని కోల్పోతాయి; సస్యంబులు= పంటలు; అల్ప, ఫలములు+అగున్= తక్కువ దిగుబడి కలవి ఔతాయి; మహిన్= భూమియందు; పసిపాఁడి= ఆవులపాలు; తఱుఁగున్= తగ్గిపోతాయి; తరువులన్= చెట్లయందు; కుసుమ, ఫలంబులును= పూలున్నూ పండ్లున్నూ; కరమున్= మిక్కుటంగా; కొంచెంబులు+అగున్= క్షీణిస్తాయి.

**తాత్పర్యం:** భూలోకంలో ద్రావకాలు, సువాసనద్రవ్యాలు సారాన్ని కోల్పోతాయి. పంటలదిగుబడి తగ్గిపోతుంది. ఆవులపాలు తరిగిపోతాయి. వృక్షాలవలన పువ్వులు పండ్లు మిక్కిలి కొంచెంగా లభిస్తాయి.

**క. అరులు మిగులఁ గొని రాజులు । నరులకు నెంతయును భయ మొనర్తురు; ధరణీ**
**సురులు గడఁగి వాణిజ్యముఁ । గరిసనమును జేయఁగలరు కలియుగవేళన్. 292**

**ప్రతిపదార్థం:** కలియుగవేళన్= కలియుగసమయంలో; రాజులు= ప్రభువులు; అరులు= పన్నులు; మిగులన్+కొని= మిక్కుటంగా తీసికొని; నరులకున్= మనుజులకు; ఎంతయును= ఎంతయో ఎక్కువగా; భయము+ఒనర్తురు= భయాన్ని కలిగిస్తారు; ధరణీసురులు= బ్రాహ్మణులు; కడఁగి= పూని; వాణిజ్యమున్= వర్తకవ్యాపారాన్ని; కరిసనమును= సేద్యాన్ని; చేయఁగలరు= చేస్తారు.

**తాత్పర్యం:** కలియుగసమయంలో ప్రభువులు పన్నులు మిక్కుటంగా విధించి వసూలుచేసి మనుజులను పీడించి భయపెట్టుతారు. బ్రాహ్మణులు వర్తకవ్యాపారానికి దిగుతారు, సేద్యాన్ని చేస్తారు.

**సీ. పాషండదర్శనబహుళంబు లయ్యెడు । వర్ణాశ్రమంబులు వసుమతీశ!**
**తవిలి శరీరంబుఁ దద్దయుఁ బ్రోతురు । పుణ్యఫలంబులు బొంకు లనుచుఁ;**
**గాలంబుతోఁ గూడఁ గలుగవు వానలు; । పొల్లులై బీజముల్ వొలిసిపోవుఁ;**
**గ్రయవిక్రయంబులఁ గపటంబు దఱచగుఁ; గడఁగి యిల్లడసొమ్ము లడఁచికొంద్రు;**

**ఆ. సాధుచరితు లైన జనులు దుర్గతుల రో । గములఁ దెగుదు; రల్పకాలమునన**
**పాపపరులు లగ్గుఁ బరమాయువును నరో । గతయు సిరియుఁ బొందఁగాంతు రెందు. 293**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ!= భూమికి పరిపాలకుడైన ఓరాజా!; వర్ణ+ఆశ్రమంబులు= కులాలు, ఆశ్రమాలు (బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సన్న్యాసం); పాషండ, దర్శన, బహుళంబులు+అయ్యెడున్= నాస్తికులకు చెందిన తత్త్వాలుగా పరిణమిస్తాయి; పుణ్య, ఫలంబులు= సుకృతాలు చేయటంవలన కలిగే ఫలితాలు; బొంకులు= అసత్యాలు; అనుచున్= అని తలస్తూ; తవిలి= పూని; శరీరంబున్= దేహాన్ని; తద్దయున్= మిక్కుటంగా; ప్రోతురు= పోషించి రక్షిస్తారు; కాలంబుతోన్+కూడన్=ఋతువులకు అనుగుణంగా; వానలు= వర్షాలు; కలుగవు= ఉండవు, కురియవు; బీజముల్= గింజలు (విత్తనాలు); పొల్లులు+ఐ= పస లేనివై; పొలిసిపోవున్= వ్యర్థాలౌతాయి; క్రయవిక్రయంబులన్= కొనటాల్లో అమ్మకాలలో; కపటంబు= మోసం; తఱచు+అగున్= ఎక్కువ ఔతుంది; కడఁగి= పూని; ఇల్లడ సొమ్ములు= తాకట్టుగా పెట్టబడిన ఆభరణాలు; అడఁచికొంద్రు= దాచివేస్తారు; సాధుచరితులు+ఐన= మంచినడవడి కలిగిన; జనులు= మనుజులు; దుర్గతులన్= చెడ్డస్థితులచేత; రోగములన్= వ్యాధులచేత; అల్పకాలముననన్+అ= కొద్దిసమయంలోనే; తెగుదురు= చనిపోతారు. పాపపరులు= పాపాత్ములు; లగ్గున్= శుభాన్ని; పరమ+ఆయువును= గొప్పఆయుస్సును; అరోగతయున్= ఆరోగ్యాన్ని; సిరియున్= సంపదను; ఎందున్= అన్నిచోటులలో; పొందన్+కాంతురు= పొందగలుగుతారు!

**తాత్పర్యం:** ఓధర్మరాజా! కలియుగంలో వర్ణాశ్రమాలు నాస్తికవేదాంతంతో ప్రబలుతాయి. పుణ్యాపాపఫలాలు అసత్యాలని నిరసిస్తూ మనుజులు దేహాన్నే ముఖ్యంగా భావించి దేహసంరక్షణకే పూనుకొంటారు. సకాలంలో వర్షాలు కురియవు. విత్తనాలు సారంలేనివై పొల్లుగా పరిణమిస్తాయి. క్రయవిక్రయవ్యాపారాలలో మోసం అధికమౌతుంది. తాకట్టుగా తమ వద్ద పెట్టిన ఆభరణాలను అన్యాయంగా దాచివేస్తారు. సాధుజనులు అష్టకష్టాలు అనుభవిస్తారు, రోగాలతో బాధపడి అల్పాయుష్కులై మరణిస్తారు. పాపులు దీర్ఘాయువులై విలసిల్లి శుభాలు అనుభవిస్తారు, సిరిసంపదలతో తులదూగుతారు!

**విశేషం:** పాషండులు నాస్తికులు, దేవుడులేడనీ, వేదాలు ప్రామాణికాలు కావనీ చెప్పేవారు. పాషండులలో చార్వాకులు సుప్రసిద్ధులు. 'ఋణం కృత్వా ఘృతం పిబేత్' 'అప్పుచేసి నేయి త్రాగుము' అనేది వారి వేదాంతం. దర్శనం అంటే తాత్త్విక సిద్ధాంతసంపుటం.

**క. ఉఱవగు నారికెపంటలు, । గొఱియల పాఁడియును దఱచగుం, బురుషులకుం**
**దెఱవలు సుట్టము లయ్యెద, । రెఱచియు భుజియింతు రర్థి నెల్ల జనంబుల్. 294**

**ప్రతిపదార్థం:** ఆరికెపంటలు= 'ఆరికె' సస్యం; ఉఱవు+అగున్= అధికం ఔతుంది. (ఆరికె= ఒక పంటవిశేషం); గొఱియల, పాఁడియును= గొర్రెలపాలదిగుబడియున్నూ; తఱచు+అగున్= అభివృద్ధి ఔతుంది; పురుషులకున్= మగవారలకు; తెఱవలు= స్త్రీలు; చుట్టములు= వివాహేతరబంధం గలవారు; అయ్యెదరు= కాగలరు; ఎల్ల, జనంబుల్= మనుజులు అందరును; ఎఱచియున్= మాంసాన్ని; అర్థిన్= కోరికతో; భుజియింతురు= తింటారు.

**తాత్పర్యం:** ఆరికె మొక్కల సేద్యం ఎక్కువ ఔతుంది. గొర్రెలపాడి అభివృద్ధి చెందుతుంది. మగవారికి స్త్రీలు ఉంపుడుకత్తెలవుతారు. మనుజులు అందరు ప్రీతితో మాంసాన్ని తింటారు.

**విశేషం:** ఈ పద్యంలోని 'పురుషులకుం దెఱవలు సుట్టము లయ్యెదరు' అనే ప్రయోగం అనుశీలించ దగింది. చుట్టము అనగా బంధువు అనేది నిఘంటువులలోని అర్థం. చుట్టరికం అంటే జారత్వ సంబంధం అనే అర్థం ఇచ్చే ప్రయోగం మనుచరిత్రలో ఉన్నది. 'కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధిపట్టికి మేనక చుట్టరికము' - మనుచరిత్ర 2-73. ఎఱ్ఱనకవిహృదయం కలియుగంలో మగవారికి ఆడువారు భార్యలు కాక, జారత్వబంధం కల చుట్టాలు మాత్రమే ఔతారు- అని చెప్పవచ్చును. ఇప్పట్టున సంస్కృత మహాభారత మూలం. 'భార్యా మిత్రాశ్చ పురుషా భవిష్యంతి యుగక్షయే' (11-193-30).

**క. పితృదైవతకార్యంబుల । నితరేతరభోక్తలగుదు రెల్లయెడలఁ గు**
**త్సితదేశకాలపాత్ర । ప్రతతియ వర్తించు దైవపైతృకవిధులన్. 295**

**ప్రతిపదార్థం:** ఎల్లఎడలన్= అంతటను; పితృ, దైవత, కార్యంబులన్= పితృదేవతలకు చేసే శ్రాద్ధకర్మలలో; ఇతర+ఇతర, భోక్తలు+అగుదురు= ఒకరికి ఇంకొకరు తినెడివారలు ఔతారు; దైవపైతృకవిధులన్= దేవాలయాలలో జరిగే పూజలలోను శ్రాద్ధకర్మలలోను; కుత్సిత, దేశ, కాల, పాత్ర, ప్రతతి+అ= రోతగలిగించే ప్రదేశం, సమయం, వ్యక్తుల సమూహం మాత్రమే; వర్తించున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** అన్నిచోట్లా పితృదేవతలకు చేసే శ్రాద్ధకర్మలలో, ఒకరికొరకు వేయబడిన పిండప్రదానాలను ఇంకొకరు తింటారు. దేవకార్యాలలోనూ, పితరులకై చేసే శ్రాద్ధకర్మలలోనూ ప్రదేశంకాని, సమయంకాని, వ్యక్తులుకాని, రోతగొలిపేటట్లుగానే ఉంటాయి. అంటే దైవపైతృకకార్యాలు ఎక్కడ కూడా దేశకాలపాత్రాలకు అనుగుణంగా జరుగవు.

**క. హేతుప్రత్యయవాదవి । చేతసులై వేదనింద సేయుచును మఖ**
**వ్రాతంబులు వ్రతములుఁ బెడఁ । బాతురు దుర్మార్గకర్మపరు లై విప్రుల్. 296**

**ప్రతిపదార్థం:** విప్రుల్= బ్రాహ్మణులు; దుర్మార్గ,కర్మపరులు+ఐ= చెడుదారులు పట్టినవారై; హేతు, ప్రత్యయ, వాద విచేతసులు+ఐ= హేతువునందు నమ్మకంతో కూడినవాదంలో పరిపూర్ణంగా నిండిన మనస్సు కలవారై; వేద, నింద చేయుచును=

వేదాలను తూలనాడుతూ; మఖ, వ్రాతంబులు= యజ్ఞాల సముదాయాలను; వ్రతములున్= నోములను; పెడఁబాతురు= విడనాడుతారు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులు హేతువాదంలో విపరీతమైన విశ్వాసం కలవారై, చెడుత్రోవలు పట్టినవారై, వేదాలను నిందిస్తూ వ్రతాలు యజ్ఞయాగాదులు విడనాడుతారు.

**మ.** **వనితాదుర్బలదీనబంధుజనసర్వస్వాపహారుల్ సుహృ**
**జ్జనమాతాపితృపుత్త్రహంతలు యదృచ్ఛాకర్మశీలుర్ ధరన్**
**జనసంపూజితు లై చరింతురు; వినష్టశ్రీకు లై విప్రు లా**
**జనులం జేరి పరిగ్రహించెద రవజ్ఞాపూర్వదుర్విత్తముల్.** **297**

**ప్రతిపదార్థం:** వనితా, దుర్బల, దీన, బంధు, జన, సర్వస్వ+అపహారుల్= ఆడువారి, బలంలేనివారి, దరిద్రుల, బంధుజనుల సమస్తాన్ని అపహరించేవారున్నూ; సుహృత్+జన, మాతా, పితృ, పుత్త్రహంతలు= మిత్రులైన జనులను, తలిదండ్రులను, కన్నబిడ్డలను చంపేవారున్నూ; యదృచ్ఛాకర్మశీలుర్= ఇచ్చవచ్చినచొప్పున ప్రవర్తించే వారున్నూ; ధరన్= భువిపై; జన, సంపూజితులు+ఐ= జనులచేత ఆరాధించబడిన వారై; చరింతురు= తిరుగాడుతారు; విప్రులు= బ్రాహ్మణులు; వినష్టశ్రీకులు+ఐ= పోగొట్టుకొనబడిన సంపద కలవారై-దరిద్రులై; ఆజనులన్+చేరి= అట్టి మనుజులచెంత చేరి; అవజ్ఞాపూర్వదుర్విత్తముల్= అవమానంతో కూడిన ఆ చెడ్డ ద్రవ్యాలను; పరిగ్రహించెదరు= పుచ్చుకొంటూ ఉంటారు.

**తాత్పర్యం:** ఆడువారి, బలహీనుల, దీనులైనవారి, బందుగుల సర్వస్వం అపహరించే దుష్టులు, తలిదండ్రులను కన్న బిడ్డలను మిత్రులను చంపేవారు, ఇచ్చవచ్చినచొప్పున ప్రవర్తించే స్వైరవిహారులు భూలోకంలో ప్రజలచేత పూజించబడుతూ సంచరిస్తారు. బ్రాహ్మణులు అట్టి దుర్మార్గుల దరి చేరి, పరమదరిద్రులై వారిచ్చే ద్రవ్యాలను సిగ్గు, అవమానాలు దిగమ్రింగి పుచ్చుకొంటారు.

**మ.** **ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బశ్యతో**
**హరులై సాధుల దోఁచి చేకుఱు తదీయ స్త్రీధన క్షేత్రముల్**
**హరియింపంగలవారు; దారుణతరం బై పెల్లు చెల్లుం బర**
**స్పరవైరంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణి నాశంబుగన్.** **298**

**ప్రతిపదార్థం:** నృపుల్= ప్రజలను పరిపాలించేరాజులు; ధరణీ, రక్షణము+ఆచరింపక= భూమిని కాపాడక (అనగా భూప్రజలను రక్షించక); దర్పంబునన్= గర్వంతో; పశ్యతోహరులు+ఐ= బహిరంగంగా దొంగతనం చేసే బందిపోటు దొంగలై; సాధులన్= సౌమ్యంగా బ్రదికే సజ్జనులను; దోఁచి= దోపిడిచేసి; చేకుఱు= లభించునట్టి; తదీయస్త్రీధనక్షేత్రముల్= వారివైన స్త్రీలను సంపదలను పొలములను; హరియింపంగలవారు= దోచుకొనగలవారు; ధరాతల+ఇంద్రులకున్= భూమిని పరిపాలించే ప్రభువులకు; దారుణతరంబు+ఐ= మిక్కిలి భయంకరమై; పరస్పర, వైరంబు= ఒకరితో మరి ఒకరికి కయ్యం; విశ్వ, ప్రాణి, నాశంబుగన్= ప్రపంచంలోని ప్రాణులు నశించేటట్లుగా; పెల్లు= అధికంగా; చెల్లున్= ప్రవర్తిస్తుంది.

**తాత్పర్యం:** భూమిని పరిపాలించే రాజులు ప్రజలను రక్షించటానికి బదులు, బహిరంగంగా దోపిడిచేసే దొంగలై ప్రవర్తిస్తారు. వారు సాధువులను దోచి వారి స్త్రీధనక్షేత్రాలను హరిస్తారు. భూమి నేలే రాజులకు ఒండొరులతో గొప్పయుద్ధాలు జరుగుతాయి. ప్రపంచంలోని ప్రాణికోటి సర్వనాశనమౌతుంది.

**క. సుతుఁ డవమానించు జనకుఁ; । బతి నవమానించు భార్య; పడఁతులుఁ బతులున్**
**మతి నొండొరువుల మెచ్చక । సతతముఁ జరియింతు రిష్టసంచారములన్. 299**

**ప్రతిపదార్థం:** సుతుఁడు= కొడుకు; జనకున్= తండ్రిని; అవమానించున్= కించపరుస్తాడు; భార్య= పెండ్లం; పతిన్= భర్తను; అవమానించున్= కించపరుస్తుంది; మతిన్= మనసులో; ఒండొరువులన్= ఒకరినొకరు; మెచ్చక= లక్ష్యపెట్టక; సతతమున్= ఎల్లప్పుడు; ఇష్టసంచారములన్= ఇచ్చవచ్చినరీతిగా; చరియింతురు= ప్రవర్తిస్తారు.

**తాత్పర్యం:** కుమారుడు తండ్రిని అవమానిస్తాడు. భార్య భర్తను కించపరుస్తుంది. భార్యాభర్తలు ఒకరినొకరు లక్ష్యపెట్టక, ఇచ్చవచ్చినట్లు సంచరిస్తారు.

**క. నడవవు దేవపితృక్రియ, । లుడుగును వేదార్థసమ్యగుపదేశంబుల్,**
**గడఁగు మహామోహతమము, । పుడమి సమస్తంబుఁ గుజనభూయిష్ఠ మగున్. 300**

**ప్రతిపదార్థం:** దేవపితృక్రియలు= దేవుడికి పితృదేవతలకు జరపవలసిన పనులు, అనగా దేవపూజలు శ్రాద్ధక్రియలు; నడవవు= జరగవు; వేద+అర్థ, సమ్యక్+ఉపదేశంబుల్= వేదాలలోని భావాలకు సంబంధించిన సముచితమైన బోధనలు; ఉడుగును= అంతరిస్తాయి; మహా+మోహ, తమము= గొప్ప అజ్ఞానం అనెడి చిమ్మచీకటి; కడఁగున్= క్రమ్ముతుంది; పుడమి= భూమి; సమస్తంబున్= సర్వమును; కుజన, భూయిష్ఠము+అగున్= దుష్టులైన జనులతో నిండిపోతుంది.

**తాత్పర్యం:** దేవాలయాలలో పూజలు, పితృదేవతలకు శ్రాద్ధదినవారక్రియలు జరుగవు. వేదవేదాంత వేదాంగ ప్రబోధం అంతరిస్తుంది. అజ్ఞానం అనే చిమ్మచీకటి దట్టంగా గుబురుకొంటుంది. భూలోకమంతా దుష్టులతో క్రిక్కిరిసిపోతుంది.

**సీ. పదియాఱువర్షముల్ పరమాయు వయ్యెడు । ధరణీశ! కలియుగాంతమున వినవె;**
**యేడును నెనిమిదియేండ్ల ప్రాయంబునఁ । బ్రజ లుద్భవింతురు భామినులకు;**
**ద్రవ్యవిహీనులై దాత యొక్కఁడు లేక । యన్యోన్యతస్కరు లగుదు రెందు;**
**నెఱిఁగెడువారును నెంతయుఁ గ్రూరు లై । చెనసి పాపంబు సేసెదరు సూవె!**

**తె. యన్నవిక్రయ మొనరింతు రఖిలజనులు, । వేదవిక్రయు లగుదురు విప్రవరులు,**
**పణ్యయోనుల యగుదురు పద్మముఖులు । గష్టతర మైన యక్కలికాలవేళ. 301**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= భూమికి ప్రభువైన ఓధర్మరాజా!; వినవె= అవధానంతో ఆలకించుము; కష్టతరము+ఐన= మిక్కుటమైన దుఃఖంతో కూడిన; ఆ కలికాలవేళన్= ఆ కలియుగ సమయంలో; పది+ఆఱు, వర్షముల్= పది ఆరేండ్లు; కలియుగ+అంతమునన్= కలియుగం లోపల; పరమ+ఆయువు+అయ్యెడున్= గొప్ప ఆయుర్దాయం ఔతుంది; ఏడునున్+ఎనిమిది +ఏండ్ల ప్రాయమునన్= ఏడుసంవత్సరాలు, లేక ఎనిమిది వత్సరాల వయస్సు వచ్చినప్పుడు; భామినులకున్= స్త్రీలకు; ప్రజలు+ఉద్భవింతురు= సంతానం కలుగుతుంది; ఎందున్= ఎచ్చటెచ్చటను; ద్రవ్యవిహీనులు+ఐ= దరిద్రులై; దాత= దానం చేసేవాడు; ఒక్కఁడు లేక= ఒకవ్యక్తి కూడా లేకపోయి; అన్యోన్య, తస్కరులు+అగుదురు= ఒకరిసొత్తు మరొకరు దొంగలించేవారు ఔతారు; ఎఱిఁగెడువారును= తెలిసిన జ్ఞానులు సయితం; ఎంతయున్= మిక్కిలి; క్రూరులు+ఐ= దుష్టులై; చెనసి= కడగి; పాపంబు+చేసెదరు+చూవె= చెడ్డపనులను చేస్తారు సుమా!; అఖిలజనులు= అందరు; అన్నవిక్రయము+ఒనరింతురు= అన్నాన్ని ధనం కోరి అమ్ముతారు; విప్రవరులు= బ్రాహ్మణోత్తములు; వేదవిక్రయులు= వేదాలను అమ్మేవారు అనగా జ్ఞానాన్ని

ధనం కొఱకై అమ్మేవారు; అగుదురు= ఔతారు; పద్మముఖులు= పద్మంవంటి ముఖం కలవారు- స్త్రీలు; పణ్యయోనులు+అ= ధనం కొఱకే మానాన్ని అమ్ముకొనేవారు; అగుదురు= ఔతారు.

**తాత్పర్యం:** ఓధర్మరాజా! కలియుగంలో ప్రజల ఆయుఃప్రమాణం పదియారేండ్లకు మించదు. ఏడెనిమిది సంవత్సరాల వయస్సు వచ్చే సరికే ఆడపిల్లలు సంతానవతులు ఔతారు. దానం చేసేదాతలు కరవై, ప్రజలు ఒకరిసొత్తు నొకరు అపహరిస్తారు. తెలిసిన జ్ఞానులు సయితం మిక్కిలి దుష్టులై, వెనుకాడక పాపకృత్యాలు చేస్తారు. అంతేకాక, పరమదుఃఖంతో నిండిన ఆ కలికాలంలో అందరును అన్నాన్ని ధనం కొఱకై అమ్ముతారు. బ్రాహ్మణోత్తములు జ్ఞానాన్ని అమ్ముకుంటారు. అందమైన ఆడవారు తమ మానాలను ధనం కొఱకై అమ్ముకొంటారు.

**తరువోజ.**

**ఉక్కున శూద్రు లత్యుగ్రు లై కవిసి । యొండొండ పెక్కండ్ర నుఱక చంపుటయు**
**దిక్కెవ్వరును లేక దీనులై వసుమ । తీసురుల్ నాలుగు దెసలఁ బాఱెదరు;**
**ముక్కడిచోరులు ముట్టి నిశ్శేష । ముగ ధనావలిఁ గొని మొగి వధియింప**
**స్రుక్కి కాకులయట్ల శూన్యులై చెదరి । సొంపఱి యడవులు సొత్తురు జనులు. 302**

**ప్రతిపదార్థం:** ఉక్కునన్= దర్పంతో; శూద్రులు= నాలుగవ జాతివారు; అతి+ఉగ్రులు+ఐ= మిక్కిలి భయంకరులై; కవిసి= విజృంభించి; ఒండు+ఒండ= ఒక్కరొక్కరే క్రమంగా; పెక్కండ్రన్= పలువురిని; ఉఱక= లక్ష్యపెట్టక (నిర్దాక్షిణ్యంగా); చంపుటయున్= సంహరించటం; దిక్కు+ఎవ్వరును, లేక= కాపాడేవారెవ్వరున్నూ లేక; దీనులు+ఐ= దుఃఖం పొందేవారై; వసుమతీ, సురుల్= బ్రాహ్మణులు; నాలుగుదెసలన్= నాలుగుదిక్కులకు; పాఱెదరు= పారిపోతారు; ముక్కడిచోరులు= నీచులు అయిన దొంగలు; ముట్టి= చేరి; నిస్+శేషముగన్= శేషం లేకుండా, అనగా పూర్తిగా; ధన+ఆవలిన్= సంపదలను; కొని= గ్రహించి; మొగి= కడగి; వధియింపన్= సంహరించగా; స్రుక్కి= వెతచెంది; కాకుల+అట్లు+అ= కాకులవలె; శూన్యులు+ఐ= ఏమియులేనట్టి వారై; జనులు= ప్రజలు; సొంపు+అఱి= శోభ నశించి; అడవులు+చొత్తురు= అరణ్యాలలోకి చేరతారు.

**తాత్పర్యం:** నాల్గవజాతివారైన శూద్రులు మిక్కిలిభయంకరమైన పరాక్రమంతో విజృంభించి ఒకరొకరే వరుసగా పలువురు ప్రజలను సంహరిస్తారు. బ్రాహ్మణులు తమను రక్షించేవారు ఎవ్వరూ లేక, నాలుగుదిక్కులా చెల్లాచెదరై పారిపోతారు. దుష్టు లైన దొంగలు చెలరేగి ద్రవ్యాన్ని హరించటంమాత్రమే కాక ప్రాణాలను కూడా హరిస్తారు. ఆ బాధలతో అలమటించి, ప్రజలు దరిద్రులై కాకులవలె అడవులలో తలదాచుకుంటారు.

**విశేషం:** ద్విపద పాదద్వయం ఒక తరువోజ పాదం. మూడు ఇంద్ర గణాలమీద ఒక సూర్యగణం, మరల మూడింద్ర గణాల మీద ఒక సూర్యగణం ప్రతిపాదంలోనూ ఉంటాయి. రెండేసి గణాల మీద పాదంలో మూడు యతులుంటాయి. ప్రాస నియమం ఉంది. అన్ని పాదాలూ మొదటి పాదాన్ని అనుసరించి గుర్వాదులో, లఘ్వాదులో కావాలి.

**క. శ్రుతిధర్మంబులు శూద్రులు । ప్రతిభం జెప్పంగ వినుచు బ్రాహ్మణజాతుల్**
**ధృతి సెడి తత్సేవకు లై । యతినిందితకర్మకారు లయ్యెద రధిపా! 303**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధర్మరాజా!, శ్రుతిధర్మంబులు= వేదాలకు సంబంధించిన ధర్మాలు; శూద్రులు= శూద్రులు; ప్రతిభన్+చెప్పంగన్= ప్రతిభతో వివరించి చెప్పగా; బ్రాహ్మణజాతుల్= విప్రులలోని పెక్కు తెగలవారు; ధృతి+చెడి= ధైర్యం

కోలుపోయి; వినుచున్= ఆలకిస్తూ; తద్+సేవకులు+ఐ= వారికి దాసులై; అతి, నిందిత, కర్మకారులు+అయ్యెదరు= మిక్కుటంగా నిందించబడిన పనులు చేసేవారు ఔతారు.

**తాత్పర్యం:** వేదాలకు సంబంధించిన ధర్మాలనుగూర్చి శూద్రులు వివరించి చెప్పగా, బ్రాహ్మణులలోని పెక్కు తెగలవారు వీను లొగ్గి వింటారు. అంతేకాక, ధైర్యం కోలుపోయి వారు ఆ శూద్రులకు సేవకులౌతారు. మిక్కిలి నిందించదగిన పనులు చేసేవారు ఔతారు.

**మత్తకోకిలము.**

**దేవతాయతనంబులున్ జగతీసురావసథంబులుం**
**బావనాశ్రమభూములుం జెడి పాడగున్ శుభవృక్ష వ**
**ల్లీవనంబులు నాశ మొందుఁ గలిప్రచారమునందు దు**
**స్త్రీవిహారము మద్యపానముఁ జెల్లుఁ బెల్లుగ నెల్లెడన్. 304**

**ప్రతిపదార్థం:** కలిప్రచారమునందున్= కలియుగం నడుస్తున్నప్పుడు; దేవతా+ఆయతనంబులున్= దేవతల కోవెలలు; జగతీసుర+అవసథంబులున్= బ్రాహ్మణుల ఇండ్లును; పావన+ఆశ్రమ, భూములున్= పవిత్రాలైన ఆశ్రమప్రదేశాలును; చెడి, పాడు+అగున్= చెడిపోయి పాడుపడతాయి; శుభ, వృక్ష, వల్లీ, వనంబులు= మంచి చెట్లు, తీగెలు, తోటలు; నాశము+ఒందున్= నశిస్తాయి; దుస్+స్త్రీవిహారము= చెడిపోయిన స్త్రీల విజృంభణం; మద్యపానమున్= కల్లు (మొదలైన) మత్తు కలిగించే పానీయాలు త్రాగటం; ఎల్ల+ఎడన్= అన్ని చోట్ల; పెల్లుగన్= మిక్కుటంగా; చెల్లున్= ప్రవర్తిల్లుతాయి.

**తాత్పర్యం:** కలియుగం నడచేటప్పుడు దేవాలయాలున్నూ, బ్రాహ్మణుల గృహాలున్నూ, పవిత్రమైన ఆశ్రమాలున్నూ పాడయిపోతాయి; మంచి చెట్లు, తీగెలు, అడవులు ధ్వంసం అయిపోతాయి. దుష్టస్త్రీల విజృంభణం, మద్యపానం మిక్కుటంగా ప్రవర్తిల్లుతాయి.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు: ఆరణ్యపర్వం 4.267 పద్య విశేషవ్యాఖ్య.

**క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు; । గురుఁడును శిష్యునెడ వంచకుం డగు; మది నొం**
**డొరువుల నొల్లరు బంధులు; । పొరిఁబొరి గఱవు లగుఁ బ్రజకుఁ బొడమును భయముల్. 305**

**ప్రతిపదార్థం:** శిష్యుఁడు= విద్యార్థి; గురువున్= గురువును; కొనియాడఁడు= మెచ్చుకొనడు; గురుఁడును= అధ్యాపకుడుకూడ; శిష్య+ఎడన్= తనదగ్గర చదువుకొనే విద్యార్థియెడ; వంచకుండు+అగున్= మోసగాడు ఔతాడు; బంధులు; మదిన్=మనస్సులో; ఒండు+ఒరువులన్= ఒకరినొకరు; ఒల్లరు= అంగీకరించరు; పొరిన్+పొరిన్= మాటిమాటికి; కఱవులు+అగున్= కాటకాలు ఏర్పడుతాయి; ప్రజకున్= జనులకు; భయముల్= భీతులు; పొడమును= కలుగుతాయి.

**తాత్పర్యం:** కలియుగంలో శిష్యుడు గురువును మెచ్చడు. గురువు శిష్యుడిని మోసగిస్తాడు. బంధువులు ఒకరి నొకరు అనురాగంతో చూడరు. మాటిమాటికి కరవులు ఏర్పడతాయి. ప్రజలకు భయాందోళనలు అధికమౌతాయి.

**తే. ఇవ్విధంబున ధర్మంబు లెల్ల నపగ । తమునఁ బడ జనులెల్లను దల్లడిల్ల**
**బహువిధోత్పాతములు పుట్టుఁ బార్థివేంద్ర! । కడఁగి తత్కలికాల సంక్షయమునందు. 306**

**ప్రతిపదార్థం:** పార్థివ+ఇంద్ర!= రాజులలో ఇంద్రుడి వంటివాడా!; తద్+కలి, కాలసంక్షయమునందున్= ఆ కలియుగంలో దాపురించే వినాశంలో; ఈ+విధమునన్; ధర్మంబులు+ఎల్లన్= అన్ని ధర్మాలున్నూ; అపగతమునన్+పడన్= నాశనం చెందగా; జనులు+ఎల్లను= ప్రజలు అందరును; తల్లడిల్లన్= అట్టుడికి పోగా; కడఁగి= ఒదవి; బహు, విధ,+ఉత్పాతములు= పెక్కురకాలైన భయంకర అపశకునాలు; పుట్టున్= పుట్టుతాయి.

**తాత్పర్యం:** రాజులలో శ్రేష్ఠుడ వైన ఓధర్మరాజా! ఆ కలియుగంలో ఏర్పడే వినాశంలో ఈవిధంగా అన్నిధర్మాలూ తలక్రిందులౌతాయి. ప్రజాసమూహం తల్లడిల్లుతుంది. భయంకరమైన దుశ్శకునాలు దాపురిస్తాయి.

**క. క్రమమున రాష్ట్రములును నగ । రములును నాశంబు నొందు; రక్షాచ్యుతులై**
**భ్రమియింతురు జను లతి దు । ర్గమ గిరిసరిదంతికములఁ గడునాతురు లై. 307**

**ప్రతిపదార్థం:** క్రమమునన్= వరుసగా; రాష్ట్రములును= ప్రదేశాలున్నూ; నగరములును= పట్టణాలున్నూ; నాశంబున్+ఒందున్= నాశనం చెందుతాయి; జనులు= ప్రజలు; కడున్= మిక్కుటంగా; ఆతురులు+ఐ= కష్టాలకు లోనవటంచేత ఆవేదన చెందినవారై; అతిదుర్గమ గిరి సరిత్+అంతికములన్= నడవటానికి మిక్కిలి కష్టమైన పర్వతాల, నదుల ప్రాంతాలలో; రక్షా, చ్యుతులు+ఐ= భద్రతలేనివారై; భ్రమియింతురు= తిరుగాడుతారు.

**తాత్పర్యం:** వరుసగా ప్రదేశాలు, పట్టణాలు నాశనమౌతాయి. ప్రజలు శాంతి భద్రతలు కోలుపోయి, మిక్కిలి దైన్యంతో దాటశక్యంగాని కొండలలో, ప్రవాహాల ప్రదేశాల్లో ఇటు నటు తిరుగాడుతారు.

### కలియుగంబున విష్ణుండు గల్కిరూపంబున ధర్మంబు ప్రతిష్ఠించుట (సం. 3-188-89)

**వ. అంతఁ గలియుగాంతంబునందు భువనవిదితం బయిన శంబళ గ్రామంబున కల్క్యాత్మకుం డైన విష్ణుయశుం డను బ్రాహ్మణుండు జనియించి, సంస్మరణమాత్రన వేదశాస్త్రంబులును సమస్త శస్త్రాస్త్రవిశేషంబులు నధిగమించి సార్వభౌముండయి. 308**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; కలి, యుగ+అంతంబునందున్= కలియుగంయొక్క కడపటిభాగంలో; భువన, విదితంబు+అయిన= లోకానికి అంతటికి తెలిసినట్టి; శంబళగ్రామంబునన్= శంబళ అనే పల్లెటూరిలో; కల్కి+ఆత్మకుండు+ఐన= కల్కిరూపుండైన; విష్ణుయశుండు+అను+బ్రాహ్మణుండు= 'విష్ణుయశుడు' అనే పేరు కల విప్రుడు; జనియించి= పుట్టి; సంస్మరణమాత్రన్+అ= జ్ఞాపకం చేసికొనటం మాత్రంచేతనే; వేద, శాస్త్రంబులును, సమస్త, శస్త్ర+అస్త్ర, విశేషంబులును= వేదాలను. శాస్త్రాలను, అన్నిఆయుధాలను, మంత్రబాణాలలో గొప్పవైనవాటిని; అధిగమించి= పొంది; సార్వభౌముండు+అయి= రారాజు అయి.

**తాత్పర్యం:** అంతట ఆ కలియుగంకడపటిభాగంలో, ప్రపంచంలో అందరికి తెలిసినట్టి; శంబళగ్రామంలో కల్కి అవతార మైన విప్రుడు - విష్ణుయశుడు అనే పేరు గలవాడు పుట్టుతాడు. అతడికి కేవలం స్మరణమాత్రంచేతనే చదువనక్కరలేకుండానే వేదాలు శాస్త్రాలు అవగత మౌతాయి. అతడు ఆయుధాలను అన్నిటిని, శస్త్రాస్త్రవిశేషాలను, సులువుగా సంపాదించి సార్వభౌము డౌతాడు.

**మధ్యాక్కర.**

**అసదృశతేజుఁడు బ్రాహ్మణానీకసహితుఁ డై కడఁగి**
**వసుమతియందు నధర్మవర్తు లై యున్న మ్లేచ్ఛులను**
**మసలక నిజశక్తిఁ జేసి మడియించి ధర్మంబు నిలిపి**
**వసునిభుం డొనరించుఁ బేర్మి వాజిమేధము నిష్ఠ యొప్ప. 309**

**ప్రతిపదార్థం:** అసదృశతేజుఁడు= సాటిలేని తేజంకలవాడు; బ్రాహ్మణ+అనీక, సహితుఁడు+ఐ= విప్రులసమూహంతో కూడినవాడై; కడఁగి= పూని; వసుమతి+అందున్= భూమియందు; అధర్మ, వర్తులు+ఐ+ఉన్న, మ్లేచ్ఛులను= ధర్మాన్ని అనుసరించని అనాగరకు లైన తెగలవారిని; మసలక= విడువక; నిజ, శక్తిన్+చేసి= తనదైన బలంచేత; మడియించి= సంహరించి; ధర్మంబు= ధర్మాన్ని; నిలిపి= ప్రతిష్ఠించి; వసు, నిభుండు= వసువుతో సమానుడైనవాడు (విష్ణుయశుడు); వాజిమేధము= అశ్వమేధయాగాన్ని; నిష్ఠ+ఒప్పన్= దీక్షతో; పేర్మిన్= అతిశయంతో; ఒనరించున్= చేస్తాడు.

**తాత్పర్యం:** సాటిలేనితేజస్సు కలవాడైన విష్ణుయశుడు బ్రాహ్మణబృందాలతో కూడి, పూనికతో అధర్మవర్తనులయిన మ్లేచ్ఛులను సంహరించి, ధర్మాన్ని తిరిగి నెలకొల్పుతాడు. తదుపరి, వసునిభుడైన ఆతడు దీక్షతో అశ్వమేధయాగం చేస్తాడు.

**విశేషం:** మధ్యాక్కరలోని ప్రతిపాదంలోనూ వరుసగా రెండు ఇంద్రగణాలు, ఒక సూర్యగణం, రెండు ఇంద్రగణాలు, ఒక సూర్య గణం ఉంటాయి. నాలుగో గణం మొదటి అక్షరం యతిస్థానం. ప్రాస నియతి ఉన్నది.

**క. ఘనుఁ డిలయెల్లను బ్రాహ్మణ । ధనముగ భాగించి యిచ్చి ధర్మయశోవ**
**ర్ధనుఁ డై వార్ధకమున న । త్యనఘుండు దపోవనంబునందు వసించున్. 310**

**ప్రతిపదార్థం:** ఘనుఁడు= గొప్పవాడు (విష్ణుయశుడు); ఇల+ఎల్లను= భూమిని అంతటిని; బ్రాహ్మణధనముగన్= విప్రుల సొత్తుగా; భాగించి+ఇచ్చి= పంచిఇచ్చి; ధర్మ, యశస్+వర్ధనుఁడు+ఐ= ధర్మాన్నీ, కీర్తినీ పెంపొందించేవాడై; వార్ధకమునన్= ముసలితనంలో; అతి+అనఘుండు= మిక్కిలి పుణ్యంకలవాడు; తపస్+వనంబునందున్= తపస్సు చేసికొనే అడవిలో; వసించున్= నివసిస్తాడు.

**తాత్పర్యం:** ఘనుడై, మిక్కిలి పుణ్యం ఆర్జించినవాడై విష్ణుయశుడు భూమినంతటిని విప్రులకు చెందిన సొత్తుగా భావించి, దానిని వారికి భాగించి పంచిపెట్టి, ముసలితనంలో తాను తపోవనంలో నివసిస్తాడు.

**వ. అతనిచేతం బ్రతిష్ఠితం బైన ధర్మంబు ననుసరించి బ్రాహ్మణాదివర్ణంబులు సమర్యాదంబులై వర్తింపంగలయవి; దాననచేసి కృతయుగంబు సంప్రాప్తం బగు; నందు. 311**

**ప్రతిపదార్థం:** అతనిచేతన్+ప్రతిష్ఠితంబు+ఐన= ఆవిష్ణుయశుడిచేత నెలకొల్పబడిన; ధర్మంబున్= ధర్మాన్ని; అనుసరించి= అనుగుణంగా నడచుకొని; బ్రాహ్మణ+ఆది+వర్ణంబులు= బ్రాహ్మణులు మొదలైన కులాలు; సమర్యాదంబులు+ఐ= మర్యాదలతో (హద్దులతో) కూడినవై; వర్తింపంగలయవి= నడచుకొనగలవు; దానన్+అ+చేసి= అందుచేతనే; కృతయుగంబు; సంప్రాప్తంబు+అగున్= తిరిగి సంభవిస్తుంది; అందున్= ఆ కృతయుగంలో;

**తాత్పర్యం:** అతనిచేత స్థాపించబడిన ధర్మాన్ని అనుసరించి బ్రాహ్మణులు మొదలైన వర్ణాలవారు వారి వారి మర్యాదలను పాటించేవారై వర్తిస్తారు. దానివలన తరువాతియుగమైన కృతయుగం ప్రవర్తిల్లుతుంది. అందులో.

**శా. ఆరామవ్రజచైత్యసద్మవనదేవాగారసౌమ్యంబులై**
**భూరి బ్రహ్మతపస్వి సంకులములై పుణ్యాధ్వరారంభ సం**
**భారోదారములై నితాంతఫలిత భ్రాజిష్ణుసస్యంబులై**
**యారూఢస్థితి నెల్లదేశములు నొప్పారుం బ్రకాశంబులై. 312**

**ప్రతిపదార్థం:** ఆరామ, వ్రజ, చైత్య, సద్మ, వన, దేవ+అగార, సౌమ్యంబులు+ఐ= తోటల సమూహాలతో, గుడులతో, ఇండ్లతో, ఉద్యానాలతో, దేవాలయాలతో, ప్రశాంతంగా ఉండేవై; భూరి, బ్రహ్మ తపస్వి, సంకులములు+ఐ= గొప్పవారైన బ్రహ్మర్షులచేత క్రిక్కిరిసినవై; పుణ్య+అధ్వర+ఆరంభ, సంభార+ఉదారములు+ఐ= సుకృతం కల్పించే యజ్ఞాలు మొదలు పెట్టటానికి ఉద్దేశించబడిన వస్తుసామగ్రిచేత దట్టములైనవై; నితాంత, ఫలిత, భ్రాజిష్ణు సస్యంబులు+ఐ= ఎల్లప్పుడు మంచి దిగుబడితో దేదీప్యమానమైన పంటలు కలిగినవై; ఆరూఢస్థితిన్= ఒప్పారునవిగా ఉండేవై; ఎల్లదేశములున్= అన్ని ప్రదేశాలున్నూ; ప్రకాశంబులు+ఐ= విలసిల్లేవై; ఒప్పారున్= వర్ధిల్లుతాయి.

**తాత్పర్యం:** ఇంక కృతయుగం తిరిగి ఆరంభించటంచేత ధర్మం నాలుగుపాదాలతో పరిపూర్ణమై వికసిస్తుంది. అన్ని దేశాలున్నూ ఆదర్శప్రాయంగా ఒప్పారుతాయి. తోటలు, ఉద్యానవనాలు గుడులు, దేవాలయాలతో వర్ధిల్లే దేశాలు బ్రహ్మర్షిసమూహాలతో క్రిక్కిరిసి పుణ్యయజ్ఞాలు చేయటంకొరకు ఉద్దేశించబడిన వస్తుసామగ్రితో ఒప్పారుతాయి. ఆ విష్ణుయశుడిచేత నెలకొల్పబడిన ధర్మాన్ని అనుసరించి, బ్రాహ్మణులు మొదలైన కులాలవారు సంప్రదాయాలను అనుసరించి ప్రవర్తించగలరు.

**క. సమయముతోడఁ గురియు వ । ర్షములు, గరము తేజ మెక్కి చరియించు నవ**
**క్రములై గ్రహంబు, లారో । గ్యము సౌఖ్యము సమధికముగఁ గలుగు నరులకున్. 313**

**ప్రతిపదార్థం:** సమయముతోడన్= సకాలంలో; వర్షములు= వానలు; కురియున్= కురుస్తాయి; గ్రహంబులు= గ్రహాలు (కుజుడు, బుధుడు మున్నగు గ్రహాలు); అవక్రములు+ఐ= వంకరటింకర కాని నడకతో; తేజము+ఎక్కి= మిక్కుటమైన కాంతిని పొంది; చరియించున్= తిరుగుతాయి; నరులకున్= మనుజులకు; ఆరోగ్యము= స్వాస్థ్యం, రోగాలు లేని సుఖస్థితి; సౌఖ్యము= సుఖం; సమ్+అధికముగన్+కలుగున్= మిక్కిలి ఎక్కువగా ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** వానలు సకాలంలో కురుస్తాయి. గ్రహాలు వక్రగమనం లేకుండగా మిక్కుటమైన కాంతితో తిరుగుతాయి. మనుజులకు ఆయురారోగ్యాలు కలుగుతాయి.

**వ. ఇది కృతయుగప్రవర్తనంబు; త్రేతాద్వాపర యుగంబులందుఁ ద్రితయ ద్వయపాదంబుల ధర్మంబ వర్తిల్లు; నిట్టి తెఱంగునం గాలగతు లనేకంబులు నాకుం బ్రత్యక్షసిద్ధంబు లయ్యెఁ; నీ వడిగిన యతీతానాగతంబు లయిన విశేషంబు లెఱింగించితి; నింక నొక్క హితోపదేశంబు సేసెద; నాకర్ణింపుము. 314**

**ప్రతిపదార్థం:** ఇది= ఇది; కృత, యుగ, ప్రవర్తనంబు= కృతయుగం నడిచే తెరగు; త్రేతా, ద్వాపర, యుగంబులందున్= త్రేతాయుగంలోనూ, ద్వాపరయుగంలోనూ; త్రితయ, ద్వయపాదంబులన్= మూడు, రెండు పాదాలతో; ధర్మంబు+అ=

ధర్మమే; వర్తిల్లున్= విలసిల్లుతుంది; ఇట్టి+తెఱంగునన్= ఈవిధంగా; కాల, గతులు= కాలపు నడకలు; అనేకంబులు= పెక్కురీతులు; నాకున్+ప్రత్యక్షసిద్ధంబులు+అయ్యెన్= నాకు స్వానుభవపూర్వకంగా కన్పడినవి; నీవు+అడిగిన= నీవు ప్రశ్నించిన; అతీత+అనాగతంబులు+అయిన= భూతకాలంలో జరిగినవి, భవిష్యత్కాలంలో జరుగబోయేవి అయిన; విశేషంబులు= ముఖ్యంగా పేర్కొనదగిన సంగతులు; ఎఱింగించితిన్= తెలిపితిని; ఇంకన్= ఇకమీద; ఒక్క= ఒక; హిత+ఉపదేశంబు+చేసెదన్= నీ మేలు కోరి చెప్పేమాట వినిపిస్తాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ఇంతవరకు నేను నీకు చెప్పింది కృతయుగంలో జరిగే తీరుతెన్నులు. త్రేతాయుగంలో మూడు పాదాలతో, ద్వాపరయుగంలో రెండుపాదాలతో ధర్మం వర్తిల్లుతుంది. ఈవిధంగా కాలచక్రం పలుమారులు తిరుగుతూ ఉంటుంది. ఆ విషయం నాకు స్వానుభవపూర్వకమైనది. జరిగిన సంగతులతో పాటు రాబోయే కాలంలో జరిగేవికూడ జోడించి వివరించి చెప్పాను. ఇక నీకు ఒక ముఖ్యమైన ఉపదేశం నీ మేలుకోరి చెపుతాను. సావధానంగా వినుము.

**క. ధరణీసురులకు నెప్పుడుఁ । గర మిష్టము సేయుమయ్య కౌరవవంశో**
**త్తర! విప్రులు సంతుష్టిం । బొరసినఁ జేకుఱు నశేషపుణ్యఫలంబుల్. 315**

**ప్రతిపదార్థం:** కౌరవ వంశ+ఉత్తర!= కౌరవ వంశంలో శ్రేష్ఠుడవు అయినవాడా!; ధరణీసురులకున్= బ్రాహ్మణులకు; ఎప్పుడున్= ఎల్లవేళలలో; కరము= మిక్కిలి; ఇష్టము+చేయుము+అయ్య= కోరినదానిని నెరవేర్చు మయ్య; విప్రులు= బ్రాహ్మణులు; సంతుష్టిన్+పొరసినన్= సంతృప్తి చెందితే; అశేష పుణ్యఫలంబుల్= పెక్కు సుకృత్యాల ఫలితాలు; చేకుఱున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** కౌరవవంశంలో శ్రేష్ఠుడ వైన ఓ ధర్మరాజా! నీవు ఎల్లప్పుడూ బ్రాహ్మణులకు ఇష్టమైనదానిని చేయుము; ఎందుచేత నంటే, బ్రాహ్మణులు సంతృప్తి చెందితే సమస్తపుణ్యాలు కలుగుతాయికాబట్టి.

**సీ. సకలభూతములందు సదయాత్ముఁడవు గమ్ము; । పాలింపు ప్రజల నీ ప్రజలఁ బోలె;**
**విశదవృద్ధాచారవేదివై ధర్మంబు । సలుపుము దురితవర్జనము గాఁగ;**
**నెఱుఁగమిఁ బాప మొక్కించుక దొడరినఁ । జయ్యన ప్రతికారశాలి వగుము;**
**గర్వంబు విడువుము, గరము ప్రియంబును । నిజమునుగా వచోనియతి నడపు;**

**తే. కాలగతు లెల్ల నెఱిఁగి యస్ఖలితబోధ । యుక్తుఁడవు గమ్ము; భరతవంశోద్భవుఁడవు**
**నీవు గావున నత్యంతనిర్మలుఁడవు । ప్రాజ్ఞుఁడవు; నీకు వేఱ చెప్పంగ నేల? 316**

**ప్రతిపదార్థం:** సకల+భూతములందున్= అన్ని ప్రాణులపట్ల; సదయ+ఆత్ముఁడవు+కమ్ము= జాలితో కూడిన ఆత్మ కలవాడవు అగుము; ప్రజలన్= (నీరాజ్యంలోని) జనులను; నీ, ప్రజలన్+పోలెన్= నీసంతానంవలెనే; పాలింపు(ము)= ఏలుకొనుము; విశదవృద్ధ+ఆచార, వేదివి+ఐ= తెల్లముగా ముసలివారి ప్రవర్తనను తెలిసికొనే వాడివై; దురిత, వర్జనము+కాఁగన్= పాపాలు వదలివేయబడినవి అగునట్లుగా; ధర్మంబు= ధర్మాన్ని; చలుపుము= ఆచరించుము; ఎఱుఁగమిన్= అజ్ఞానంచొప్పున; పాపము+ ఒక్కించుక= కొంచెం పాపం; తొడరినన్= ఏర్పడితే; చయ్యన= వెనువెంటనే; ప్రతికారశాలివి+అగుము= మారుచేత చేసే వాడివి అగుము; గర్వంబు= గర్వాన్ని (అహంకారాన్ని); విడువుము= వదలి పెట్టుము; కరము= మిక్కిలి అయిన; ప్రియంబును= ఇష్టమును; వచస్+నియతి= మాటలాడే నియమం; నిజమును, కాన్= సత్యంతో కూడిందిగా; నడపు(ము)= నిర్వహించుము; కాల, గతులు+ఎల్లన్+ఎఱిఁగి= కాలం ఏయే రీతులుగా నడచునో వాటిని అన్నింటిని తెలిసికొని; అస్ఖలిత, బోధ, యుక్తుఁడవు, కమ్ము= జారనట్టి జ్ఞానంతో కూడినవాడవు అగుము; నీవు; భరత, వంశ+ఉద్భవుఁడవు= భరతవంశంలో

పుట్టినవాడవు; కావునన్= కాబట్టి; అతి+అంత, నిర్మలుఁడవు= మిక్కిలి స్వచ్ఛమైన శీలం కలవాడవు; ప్రాజ్ఞుఁడవు= బాగా అన్నివిషయాలను తెలిసికొనినవాడవు; నీకున్= నీకు; వేఱు+అ= వేరుగా, ప్రత్యేకించి; చెప్పంగన్+ఏల= చెప్పటం ఎందుకు? (అంటే) చెప్పనవసరం లేదు.

**తాత్పర్యం:** ఈ సృష్టిలో ఉన్న చరాచర మైన సమస్తభూతాలపట్ల జాలిగలిగినవాడవు కమ్ము. నీరాజ్యంలోని పౌరులను నీ కన్నబిడ్డలవలెనే పరిపాలించుము. ధర్మాన్ని నిర్ణయించుకొనేటప్పుడు, లోగడ జ్ఞానవృద్ధులైన మహానుభావులు ఏవిధంగా ఆచరించారో పరిశీలించి, ఆవిధంగా ప్రవర్తించుము. తెలియక కొంచెం పాప మేర్పడినా వెంటనే దానికి ప్రాయశ్చిత్తము చేసుకొనుము. అహంభావాన్ని విడిచిపెట్టుము; సత్యాన్ని ప్రియాన్ని మాటాడుము; కాలాన్ని అనుసరించి జ్ఞానం పరిణతి చెందుతుందనే విషయాన్ని మరవకుండటంచేత, నీ తెలివితేటలు జారిపడకుండుగాక! నీవు భరతవంశంలో పుట్టినవాడవుకాబట్టి మిక్కిలి పవిత్రుడవు. కల్మషం లేనివాడవు. సర్వవిషయాలు బాగా ఎరిగిన ప్రాజ్ఞుడవు. నీకు ఇంతకంటె విస్తరించి చెప్పనవసరం లేదు.

**విశేషం:** మహాభారతంలో పలుతావుల 'కాలగతి'ని గూర్చిన ప్రస్తావన వస్తుంది. కాలగతులు తెలియకపోతే బోధ స్ఖలితం కావచ్చు ననే హెచ్చరిక ఇట గమనించతగింది.

**వ. అనిన విని యుధిష్ఠిరుండు 'మునీంద్రా! నీయానతిచ్చిన వాక్యంబు లన్నియు నవహితుండ నై వింటి; నింతకుమున్ను నా యోపిన తెఱంగున లోభమాత్సర్యాది దుర్గుణంబులు పరిహరింతు; నింకను భవదుక్తం బైన ధర్మశాసనంబును బ్రయత్నంబునం బాలించెద'నని యతనికిఁబ్రణమిల్లి మఱియును బ్రాహ్మణప్రభావంబు వినువాఁ డై యతనిం బ్రార్థించినఁ, దద్విషయం బైన యితిహాసం బతనికి నమ్మహాముని యిట్లని చెప్పె.317**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ముని+ఇంద్రా!= మునులలో ఇంద్రుడి వంటి వాడా!; నీ+ఆనతి+ఇచ్చిన= నీవు సెలవిచ్చిన; వాక్యంబులు+అన్నియున్= మాటలు అన్నింటిని; అవహితుండను+ఐ= శ్రద్ధతో కూడినవాడనై; వింటిన్= ఆలకించాను; ఇంతకున్, మున్ను= ఇదివరకు; నా+ఓపిన, తెఱంగునన్= నాకు శక్తి వంచన లేని తీరుగా; లోభ, మాత్సర్య+ఆది, దుర్గుణంబులు= అత్యాశ, అసూయ మొదలైన చెడులక్షణాలు; పరిహరింతున్= లేకుండేటట్లుగా చేస్తూ ఉన్నాను; ఇంకను= మరియును; భవత్+ఉక్తంబు+ఐన= నీచేత చెప్పబడిందైన; ధర్మ, శాసనంబును= ధర్మంతో కూడిన ఆనతిని; ప్రయత్నంబునన్= సాధనంచేత; పాలించెదన్= అనుసరిస్తాను; అని= అనిచెప్పి; అతనికిన్= (మార్కండేయమహర్షికి); ప్రణమిల్లి= నమస్కారంచేసి; మఱియును= ఇంకను; బ్రాహ్మణ, ప్రభావంబు= విప్రులయొక్క మహిమ; వినువాఁడు+ఐ= ఆలకించటానికి కుతూహలం కలవాడై; అతనిన్= (ఆమార్కండేయమహర్షిని); ప్రార్థించినన్= వేడగా; తద్+విషయంబు+ఐన= ఆ బ్రాహ్మణమహిమకు సంబంధించిన; ఇతిహాసంబు= పూర్వకాలంలో జరిగిన కథ; అతనికిన్= (ఆధర్మరాజుకు); ఆ+మహాముని= ఆమహర్షి అయిన మార్కండేయుడు; ఇట్లు+అని= ఈవిధంగా; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని ధర్మరాజు ఇట్లా అన్నాడు: 'మహామునీ! మీరు సెలవిచ్చిన మాటలన్నీ శ్రద్ధతో విన్నాను. ఇదివరకే నా శక్తివంచన లేకుండా అత్యాశ, అసూయ మొదలైన చెడుగుణాలను పరిహరిస్తూ ఉన్నాను. ఇప్పుడు మీచేత బోధించబడిన ఈ ధర్మశాసనాన్ని ప్రయత్నపూర్వకంగా ఆచరిస్తాను'- అని అంటూ మార్కండేయ మహర్షికి నమస్కరించి, బ్రాహ్మణప్రభావాన్ని గురించి తెలియజెప్పుమని ప్రార్థించాడు. ఆ మహాముని ఆ అంశానికి సంబంధించిన ఒక ఇతిహాసాన్ని ఈవిధంగా చెప్పాడు.

మార్కండేయుండు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట (సం. 3-190-1)

**చ. ఘనుఁడు పరిక్షితుం డనఁ బ్రకాశితుఁ డైన మహీవిభుండు భా**
**నునిభుఁడు భానువంశ్యుఁడు వినూతనకీర్తి యయోధ్య యేలువాఁ**
**డనుపముఁ డొక్కనాఁడు మృగయారతుఁడై చరియించెఁ గానన**
**మ్మున నొకరుండ యిమ్ముల నపూర్వజవోగ్రహయాధిరూఢుఁడై. 318**

**ప్రతిపదార్థం:** ఘనుఁడు= గొప్పవాడు; పరిక్షితుండు+అనన్= పరిక్షితుడు అనేపేరుతో; ప్రకాశితుఁడు+ఐన= వెలుగొందిన; మహీ, విభుండు= భూమికి భర్త అయిన రాజు; భాను, నిభుఁడు= సూర్యుడితో సమానుడైనవాడు; భానువంశ్యుఁడు= సూర్యవంశానికి చెందినవాడు; వినూతనకీర్తి= మిక్కిలి క్రొత్తదైన యశస్సు గల వాడు; అయోధ్య+ఏలువాఁడు= అయోధ్య అనే పట్టణం రాజధానిగా కల రాజ్యం ఏలే వాడు; అనుపముఁడు= సాటిలేని వాడు; ఒక్కనాఁడు= ఒకానొక దినమున; కాననమ్మునన్= అడవిలోపల; ఒకరుండు+అ= ఒంటరిగా; ఇమ్ములన్= ప్రీతితో; అపూర్వజవ+ఉగ్ర, హయ+అధిరూఢుఁడు+ఐ= క్రొంగ్రొత్తదైనది, వేగంచేత భయంకరమైనది అయిన గుర్రాన్ని ఎక్కినవాడై; మృగయా, రతుఁడు+ఐ= వేటలో మిక్కిలితమకం కలవాడై; చరియించెన్= తిరుగాడాడు.

**తాత్పర్యం:** పూర్వకాలంలో అయోధ్యను పరిపాలించే ప్రభువు, సూర్యుడితో సమానమైన తేజస్సు కలవాడు, సూర్యవంశంలో పుట్టినవాడు, ముందెవ్వరును ఆర్జించనంత యశస్సు నార్జించినవాడు, సాటిలేని పరాక్రమ ప్రాభవాలు కలవాడు అయిన పరిక్షితు డనే మహారాజు ఒకానొకనాడు అడవికి వెళ్ళి, సంప్రీతితో మిక్కిలి వేగంతో పరుగెత్తగల గుర్రాన్ని ఎక్కి వేటయందలి తమకంతో తిరుగాడజొచ్చాడు.

**వ. ఇవ్విధంబునం బెక్కుమృగంబుల వధియించుచుఁ గ్రుమ్మరువాఁ డొక్కయెడ. 319**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; పెక్కుమృగంబులన్= అనేకజంతువులను; వధియించుచున్= చంపుతూ; క్రుమ్మరువాఁడు= తిరిగేవాడు; ఒక్క+ఎడన్= ఒకచోటున.

**తాత్పర్యం:** ఆవిధంగా పెక్కుమృగాలను వేటాడుతూ ఆ అడవిలో ఒకచోట.

**ఆ. మదగజాభిరామ మృదులయానం బొప్ప । నల్లఁ బొలయుచును లతాంతరములఁ**
**గరములీలఁ గమ్మవిరులు గోయుచునున్న । పువ్వుఁబోఁడి నొక్క పొలఁతిఁ గనియె. 320**

**ప్రతిపదార్థం:** మదగజ+అభిరామ, మృదుల, యానంబు+ఒప్పన్= మదించిన ఏనుగువలె అందమైన మృదువైన నడక ఒప్పారగా; అల్లన్= మెల్లమెల్లగా; పొలయుచును= తిరుగాడుతూ; లతా+అంతరములన్= తీగలమధ్య; కరములీలన్= మిక్కుటమైన హొయలుతో; కమ్మవిరులు= అందమైన పూవులు; కోయుచున్+ఉన్న= త్రుంచుతున్న; పువ్వుబోఁడిన్= పరిమళించే పువ్వువంటి మేను కలదానిని; ఒక్కపొలఁతిన్= ఒక స్త్రీని; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** ఆమహారాజు ఒక అందగత్తెను చూచాడు. ఆమె మదించిన ఏనుగునడకవంటి నడక కల సొగసరి. మెల్లమెల్లగా నడయాడుతూ, పువ్వువంటి సుకుమారసుందరమైన దేహం కల ఆ జవరాలు తీగలమధ్యకు చొరబడి, పరిమళపుష్పాలను కోస్తూ తిరుగుతున్నది.

**క. కని యంతఁ గదిసి యా కా। మిని యొప్పులఁ జూడ్కి దగుల మీఱిన తమకం**
**బున ననిమిషలోచనుఁ డై। జననాథుఁడు మదనబాణసంహతిఁ దూలెన్. 321**

**ప్రతిపదార్థం:** కని= చూచి; అంతన్= అంతట; కదిసి= సమీపించి; ఆ, కామిని+ఒప్పులన్= ఆజవ్వనిసొగసులయందు; చూడ్కి= చూపు; తగులన్= తగులుకొనటంవలన; మీఱిన= అతిశయించిన; తమకంబునన్= మోహంతో; అనిమిష, లోచనుఁడు+ఐ= మూతపడని కన్నులు కలవాడై; జననాథుఁడు= రాజు (పరిక్షితుడు); మదన, బాణ, సంహతిన్= మన్మథుడి తూపులతాకిడిచేత; తూలెన్= ఇటునటు చలించెను.

**తాత్పర్యం:** ఆ ఒప్పులకుప్ప అయిన అందగత్తెను చూచి, ఆ మహారాజు ఆమెదగ్గరకు వెళ్లి, కనురెప్పలు మూయకుండ ఆమెను చూడసాగాడు. అంతట అతడు మన్మథుడి తూపులచేత కొట్టబడి తూలిపోయాడు.

**వ. అదియును నతిసుందరం బైన తదీయమూర్తివిభవంబునకు మెచ్చి సాభిప్రాయంబుగా నవలోకించె; నంత నమ్మహీకాంతుం డక్కాంత కి ట్లనియె. 322**

**ప్రతిపదార్థం:** అదియునున్= ఆమెయును; అతిసుందరంబు+ఐన= మిక్కిలి అందమైనట్టి; తదీయ, మూర్తి, విభవంబునకున్= ఆతడియొక్క ఆకారసంపదకు; మెచ్చి= గొప్పగా ఎంచి; స+అభిప్రాయంబుగాన్= (వలపుతో కూడిన) ఆలోచనతో కూడినట్టిదిగా; అవలోకించెన్= చూచింది; అంతన్= పిదప; ఆ+మహీ, కాంతుండు= భూమికిభర్త అయిన ఆ రాజు; ఆ+కాంతకున్= ఆ సౌందర్యవతితో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** తనవైపు వలపుచూపులు సారించిన రాజుగారి సుందరాకృతికి సంతోషించి, ఆ సుందరాంగికూడ ఆతడిపై నర్మగర్భ మైన ఓరచూపులు ప్రసరింపజేసింది. అప్పుడు ఆమహారాజు ఆసౌందర్యవతితో ఇట్లా పలికాడు.

**ఉ. 'ఎవ్వరి దాన వంబుజదళేక్షణ! యేకత మిట్టు లేల నీ**
**వివ్వనభూమియందుఁ జరియించెదు?' నావుడుఁ 'దండ్రిపంపునం**
**దివ్వనభూమియందుఁ జరియించెద సద్వరుఁ గోరి; కన్య; నే**
**నెవ్వరిదానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా!' 323**

**ప్రతిపదార్థం:** అంబుజ, దళ+ఈక్షణ!= తామరపువ్వురేకులవంటి కన్నులు కలదానా!; ఎవ్వరిదానవు= నీవు ఎవరికి చెందినదానవు; ఏకతము+ఇట్టులు= ఒంటరిగా ఈరీతిగా; ఏల= ఎందుకొరకు; నీవు; ఈ+వనభూమియందున్= ఈ అడవిసీమలో; చరియించెదు= తిరుగాడుతున్నావు? నావుడున్= అని అడుగగా; రాజనందనా!= ఓ రాజకుమారా! తండ్రిపంపునందున్= మానాన్నగారి ఆనతి చొప్పున; ఈ+వనభూమియందున్= ఈ అడవిలో; సత్+వరున్+కోరి= మంచిభర్తను పడయ నెంచి; చరియించెదన్= తిరుగుతున్నదానను; కన్యను= పెండ్లికాని దానను; ఏన్= నేను; ఎవ్వరిదానన్+కావలయున్= నేను ఎవరికి చెందినదానను కావలయునో; ఏర్పడన్+చెప్పుము= (నీవే యోచించి) నిర్ధారణ చేసి తెలుపుము.

**తాత్పర్యం:** 'పద్మపత్రాలవంటి అందమైన కన్నులు గల ఓచిన్నదానా! నీవు ఎవ్వరిదానవు? ఇక్కడ, ఈ అడవిలో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నావు? ' అని ఆ మహారాజు ఆమెను ప్రశ్నించాడు. అంతట ఆమె, 'ఓరాజకుమారా! నేను పెండ్లికాని జవరాలను. తండ్రి ఆనతిచొప్పున ఈ అడవిలో మంచిపెండ్లికొడుకును అన్వేషిస్తూ తిరుగుతున్నాను. ఇప్పుడు ఆలోచించి చెప్పుము. ఇక నేను ఎవ్వరిదానను కావలయునో'.

**విశేషం:** ఈ పద్యంలోని సంభాషణచారిమ గమనించదగింది. 'అంబుజదళేక్షణ' అనే సంబోధనలోని స్వారస్యం సుస్పష్టం. అంతేకాక, రాజుమాటలు నర్మగర్భాలు. ఆమె సమాధానం రాజు చాతుర్యానికి తీసిపోలేదు. 'రాజనందనా' అనే సంబోధనం మాత్రమేకాక - 'ఏను కన్యను, సద్వరుఁ గోరి ఈ అడవిలో గ్రుమ్మరుచుంటిని - నేను ఎవ్వరి దానఁ గావలయును - ఏర్పడఁజెప్పుము' అనే మాటలోని సద్యఃస్ఫూర్తి స్వారస్యం గమనించతగింది. ఈ పద్యం ప్రబంధకవులకు ఒజ్జబంతి అయింది. మనుచరిత్రలో పెద్దన వ్రాసిన సుప్రసిద్ధపద్యం - 'ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ! యొంటిఁ జరించె దోట లే కివ్వనభూమి' - అనేది - ద్విరుక్తవకార ప్రాసతో భాషలోను, భావంలోను, ఛందస్సులోను ఎఱ్ఱనపద్యానికి మనోహరమైన ప్రతికృతి అని చెప్పవచ్చును. ఎఱ్ఱనమహాకవి కూడ ఈ పద్యం తదుపరి వ్రాసిన వచనంలో 'దాని ప్రగల్భవచనంబులకు' అని ఈ పద్యంలోని సంభాషణచారిమను సూచించాడు.

**వ.** **అనిన దానిప్రగల్భవచనంబులకు నధికవిలోలుం డై భూపాలుండు దనయభిలాషం బెఱింగించిన నమ్మగువ 'నన్నెన్నండును జలవిహారంబునకుఁ జొనుపకుండు నది; యట్లయిన నిన్ను వరియించెద' ననిన వాఁడును దత్సమయంబున కొడంబడి దానిం దోడ్కొని పురంబునకుఁ జనుదెంచి యిష్టసుఖతత్పరుం డయి యుండె; నంత నొక్క శరత్సమయంబునందు.** **324**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; దాని= ఆమెయొక్క; ప్రగల్భ, వచనంబులకున్= తెలివితేటలతో కూడిఉన్న మాటలకు; అధిక, విలోలుండు+ఐ= ఎక్కువగా చలించినవాడై; భూపాలుండు= రాజు (ఆ పరిక్షితుడు); తన+అభిలాషంబు= తనకోరిక; ఎఱింగించినన్= తెలుపగా; ఆ+మగువ= ఆవనిత; నన్నున్+ఎన్నండును= నన్ను, ఎప్పుడుకూడా; జల, విహారంబునకున్= నీటిలో విహరించటానికి; చొనుపక+ఉండునది= నియమించకుండ ఉండవలె; అట్లు+అయినన్= ఆవిధంగా అయితే; నిన్నున్; వరియించెదన్= (వలపుతో) ఎన్నుకొంటాను; అనినన్= అని చెప్పగా; వాఁడును= (ఆపరిక్షితుడును); తద్+సమయంబునకున్= ఆమె పెట్టిన ఒప్పందానికి; ఒడంబడి= అంగీకరించి; దానిన్= ఆమెను; తోడ్కొని= వెంటనిడుకొని; పురంబునకున్= (రాజధాని) పట్టణానికి; చనుదెంచి= వెళ్ళి; ఇష్ట, సుఖ, తత్+పరుండు+అయి+ఉండెన్= తనకు నచ్చిన సౌఖ్యాలను అనుభవించటంలో ఏకాగ్రత కలవాడై, ఉన్నాడు; అంతన్= అటుపిమ్మట; ఒక్క= ఒక; శరద్సమయంబునందున్= శరదృతువులో.

**తాత్పర్యం:** రాజు ఆమెసమాధానవచనాలలోని తెలివితేటలు గుర్తించాడు. అంతకుముందే ఆరాజు ఆమె రూపసౌందర్యానికి ముగ్ధుడైనాడు. ఇప్పుడు ఆమె వాక్చాతుర్యంవలన, మరింత ముగ్ధుడయ్యాడు. ఇంక అతడు ఆమెకు తనవలపు తలపు వెల్లడించాడు. ఆమె తన సమ్మతి తెలుపుతూ ఒక ఒడంబడిక సూచించింది - ఆతడు తనను ఎప్పుడూ జలవిహారానికి నియోగించరాదని. ఆతడు ఆ ఏర్పాటుకు అంగీకరించి ఆమెను తనతోపాటు వెంటబెట్టుకొని తనరాజధాని నగరానికి చేరాడు. అతడు అటు కొంతకాలం తాను కోరిన సుఖాలను అనుభవిస్తుండగా శరదృతువు వచ్చింది.

**విశేషం:** ఇట - 'అధికవిలోలుండై' అనే ప్రయోగంలోని స్వారస్యం గమనించదగింది. రాజు తొలుదొల్త ఆమె స్వరూపసౌందర్యానికి - 'విలోలుడు'. తదుపరి ఆమె 'ప్రగల్భవచనాలకు' ఇప్పుడు - 'అధిక' విలోలుడు.

**చ.** **అతులితపుష్పపల్లవ ఫలాన్వితభూరుహభూరివల్లరీ**
**వితతముఁ జారుకైరవనవీనసరోరుహషండమండలా**
**యతసరసీమనోహరము నైన పురోపవనంబునన్ సము**
**న్నతవిభవుండు వాసభవనంబు లొనర్పఁగఁ బంచి యిమ్ములన్.** **325**

**ప్రతిపదార్థం:** అతులిత, పుష్ప, పల్లవ, ఫల+అన్విత, భూరుహ, భూరి, వల్లరీ, వితతమున్= సాటి లేని పువ్వులు, చిగురుటాకులు, పండ్లతో కూడిన చెట్లయొక్కయు, గొప్పతీగెలయొక్కయు సముదాయాలు కలిగినదిన్నీ; చారు, కైరవ, నవీన, సరోరుహ, షండ, మండల+ఆయత, సరసీ, మనస్+హరమును= సుందరమైన తెల్లకలువల, క్రొంగ్రొత్తపద్మాలగుంపుల గుండ్రని ఆవరణలుకల నిడువైన సరస్సులచేత మనస్సును హరించేది; ఐన=ఐనట్టి; పుర+ఉపవనంబునన్= నగరమందలి= ఉద్యానవనంలో; ఇమ్ములన్= ప్రీతితో; సమ్+ఉన్నత, విభవుండు= మిక్కిలి ఎత్తయిన సంపద కలవాడు - ఆ మహారాజు; వాసభవనంబులు= ఉండటానికి అనువైన మందిరాలు; ఒనర్పఁగన్= నిర్మించటానికి; పంచి= ఆజ్ఞాపించి.

**తాత్పర్యం:** ఆ పరిక్షితమహారాజు ప్రీతితో తనరాజధానిలోని ఉద్యానవనంలో క్రీడించటానికి అనువైన భవనాలను నిర్మించటానికి ఆజ్ఞాపించాడు. ఆ ఉద్యానవనం మిక్కిలి సుందరమైనది. అందులో సాటిలేని పుష్పాలతో చిగురుటాకులతో విలసిల్లే గొప్పచెట్లు, లతలు ఉన్నాయి. ఆ ఉద్యానవనంలోని సరస్సులు, గొప్పవైశాల్యం కలవి. అందులో తెల్లకలువలు, పద్మసంతతులు మనోహరాలై వికసిస్తూ ఉంటాయి.

**విశేషం:** నన్నయ వృత్తాలు సుకుమారసుందర సంస్కృత సమాసాలతో - 'అక్షర రమ్యత' తొలుకాడుతూ ఉంటాయి. ఈపద్యం వ్రాసినది ఎఱ్ఱనమహాకవి అయినను, ఇందు నన్నయ శయ్య గుబాళిస్తున్నది. ఎఱ్ఱనయే తాను 'తద్రచనయకా' నన్నయను అనుకరించినట్లు ఆరణ్యపర్వం చివర ప్రకటించాడు కదా!

**క. దేవీసహితంబుగఁ బృ । థ్వీవరుఁ డవ్వనమునందు విహరించె ఘనాం**
**తావసరవాసరంబుల । భావితపద్మవనపవనపరిచితుఁ డగుచున్. 326**

**ప్రతిపదార్థం:** దేవీ, సహితంబుగన్= భార్యతోపాటుగా; పృథ్వీ; వరుఁడు= రాజు (పరిక్షితుడు); ఆ+వనమునందున్= ఆ అడవిలో; ఘన+అంత+అవసరవాసరంబులన్= వర్షాకాలం పూర్తిఅయిన పిమ్మట వచ్చే శరదృతువులోని రోజులలో; భావిత, పద్మవన, పవన, పరిచితుఁడు+అగుచున్= తామరపూవులతోటనుండి వెలువడే గాలియొక్క పరిమళంతో నెయ్యంకలవాడై; విహరించెన్= ప్రీతితో తిరుగాడాడు.

**తాత్పర్యం:** ఆ పరిక్షిన్మహారాజు ఆ శరదృతువులోని దినాలలో తామరపువ్వులతోటలనుండి ప్రసరించే పరిమళంతో కూడిన గాలులు పీలుస్తూ, తనదేవేరితో కలిసి ఆ అడవిలో విహరించాడు.

**వ. అంత నొక్కనాఁడు నితాంతఘర్మజలకణకలితశరీరుండై ప్రియాసమేతంబుగా వాసగృహంబు వెలువడి తత్సమీపంబున నతిమనోహరం బయిన కమలాకరంబుఁ గని దాని తీరంబున నయ్యుగ్మలి నునిచి తాను గృతావగాహుం డై. 327**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట; ఒక్కనాఁడు= ఒకానొక దినమున; నితాంత, ఘర్మజల, కణ, కలిత, శరీరుండు+ఐ= ఎడతెగని చెమ్మటనీటి బొట్టులచేత కూడిన మేను కలవాడై; ప్రియా సమేతంబుగాన్= వలపుగత్తెతో పాటుగా; వాస, గృహంబు= నివసించే ఇల్లు; వెలువడి= బయటకు వచ్చి; తత్+సమీపంబునన్= ఆచోటికి దగ్గరగా ఉన్న; అతి, మనస్+హరంబు+ఐన= మిక్కిలి సుందరమైన (మనస్సును మిక్కుటంగా ఆకర్షించే దైన); కమల+ఆకరంబున్= సరస్సును; కని= చూచి, దాని, తీరంబునన్= దాని (ఆకొలనియొక్క) ఒడ్డున; ఆ+ఉగ్మలిన్= ఆ పొలతిని; ఉనిచి= ఉంచి; తాను= (ఆ పరిక్షితుడు); కృత+అవగాహుండు+ఐ= నీటిలోకి దిగినవాడై.

**తాత్పర్యం:** అంతట, ఒకానొక దినమున ఆ పరిక్షిన్మహారాజు చెమటబిందువులచేత తడిసిన దేహం కలవాడై ప్రియురాలితోపాటు తనవిడిదిఇల్లును వెలువడివచ్చి, ఎదుట మనోహరమైన ఒక కొలనును, తామరపువ్వులతో కళకళలాడుతున్న దానిని చూచాడు. అతడు తనప్రేయసిని ఆకొలనుగట్టున ఉంచి, తాను ఆ నీటిలోకి దిగాడు.

**క. 'మే లై యున్నది జలము వి। శాలనయన! చెమట వోవఁ జయ్యన దేహ**
**క్షాళన మొనరింపు' మనిన। నా లేమ దరస్మితాననాంబుజ యగుచున్. 328**

**ప్రతిపదార్థం:** విశాలనయన!= నిడివిఅయిన కన్నులు కలదానా!; జలము= నీరు; మేలు+ఐ+ఉన్నది= చాల బాగా ఉన్నది; చెమట+పోవన్= స్వేదజలం పోయేటట్లుగా; చయ్యన= వేగంగా; దేహ, క్షాళనము= మేను కడుగుకొనటం, స్నానం చేయటం; ఒనరింపుము= చేయుము; అనినన్= అని చెప్పగా; ఆ, లేమ= ఆ వనిత; దరస్మిత+ఆనన+అంబుజ+అగుచున్= చిరునవ్వుతో కూడిన ముఖపద్మం కలదై.

**తాత్పర్యం:** 'నిడివిఅయిన కన్నులు గల ఓచిన్నదానా! ఈ సరోవరంలోని నీరు మిక్కిలి నిర్మలంగా ఉన్నది. నీవుకూడా, నీశరీరంలోని చెమట పోగొట్టుకొనటానికై సంప్రీతితో రివ్వున ఈ కొలనులో దిగి స్నానం చేయుము' అని ఆ రాజు చెప్పగా విని ఆమె తనముఖపద్మంలో చిరునవ్వు వెల్లివిరిసేటట్లుగా. (తరువాతిపద్యంతో అన్వయం)

**ఆ. మడుఁగు సొచ్చి మునిఁగి మాయ మై పోయిన। నద్భుతాత్ముఁ డగుచు నవనివిభుఁడు**
**మడుఁగు గలయ వెదకి మానినిఁ గానక। జలము లెల్ల వెడలఁ జల్లె గడఁగి. 329**

**ప్రతిపదార్థం:** మడుఁగు+చొచ్చి= సరోవరంలోకి ప్రవేశించి; మునిఁగి= నీటిలో అణగి; మాయము+ఐ+పోయినన్= కనుపించకుండ అంతర్ధానమై పోగా; అవని విభుఁడు= భూమికి భర్తఐనరాజు; అద్భుత+ఆత్ముఁడు+అగుచున్= అచ్చెరువుతో నిండిన ఆత్మకలవాడు ఔతూ; మడుఁగు= కొలను; కలయవెదకి= పూర్తిగా గాలించి; మానినిన్= మగువను; కానక= అరయక; కడఁగి= పూని; జలములు+ఎల్లన్= నీళ్ళుఅంతటిని; వెడలన్+చల్లెన్= బయటకు పోయేటట్లు చిమ్మివేశాడు.

**తాత్పర్యం:** ఆసరోవరంలోకి ప్రవేశించి ఆమె అదృశ్యమయిపోయింది. అంతట రాజు మిక్కుట మైన ఆశ్చర్యం పొంది, ఆకొలను అంతటిని గాలించాడు. ఎంత వెదకినా ఆమె కన్పించలేదు. అందుచేత ఆ రాజు ఆ కొలనిలోని నీటి నంతటిని వెలికి చిమ్మివేశాడు.

**వ. ఇట్లు సల్లి యందు మండూకంబు లనేకంబు లున్నం జూచి 'యివి మత్ప్రియాంగనను మ్రింగినవి గా కేమి' యని కలుషించి యనుచరులం బిలిచి 'నాకుఁబ్రియంబు సేయవలసినవారు గలిగినం బుడమిం గల కప్పల నెల్లం బొడవడంగించునది' యని పంచిన నలుదిక్కులకుం జని తదీయ కింకరవర్గంబు. 330**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా, చల్లి= (నీటిని) విరజిమ్మి; అందున్= (ఆకొలనునందు); మండూకంబులు= కప్పలు; అనేకంబులు= పెక్కు; ఉన్నన్+చూచి= ఉండటం తిలకించి; ఇవి= (ఈ కప్పలు); మత్+ప్రియా+అంగనను= నాయొక్క వలపుకత్తెను; మ్రింగినవి= భక్షించినవి; కాక+ఏమి= ఇదికాక ఇంక వేరుగా ఏమి జరిగిఉంటుంది?; అని= అని; కలుషించి= కోపంచెంది; అనుచరులన్+పిలిచి= సేవకులను రావించి; నాకున్= నాకు; ప్రియంబు+చేయవలసినవారు= ప్రీతిని ఘటించవలసినవారు; కలిగినన్= ఉన్నచో; పుడమిన్+కల= భూమిపై ఉన్నట్టి; కప్పలన్+ఎల్లన్= కప్పలను అన్నింటిని; పొడవు+అడంగించునది= చంపేది; అని; పంచినన్= ఆజ్ఞాపించగా; తదీయ కింకరవర్గంబు= ఆతడి సేవకుల సమూహం; నలుదిక్కులకున్+చని= నాలుగు వైపులకు వెళ్ళి.

**తాత్పర్యం:** ఈవిధంగా ఆ కొలనులోని నీటినంతా బయటికి చిమ్మి. అందులో పెక్కు కప్పలు ఉండటం రాజు చూచాడు. అతడు ఆ కప్పలే తన ప్రేయసిని మ్రింగాయని తలపోసి, తనసేవకులను పిలిచి ఈ విధంగా ఆజ్ఞాపించాడు; 'నాకు ప్రీతి ఘటించవలె ననే తలపు మీకు ఉన్నట్లయితే ఈ భూలోకంలో ఉన్న కప్పల నన్నిటిని సంహరించండి'. అంత ఆరాజభటులు నలుదిక్కులకు వెళ్ళారు.

**చ. కొలఁకుల వాగులన్ నదులఁ గ్రోవుల బావుల నిర్ఝరంబులం**
**గలయఁగ రోసి రోసి వడిఁ గప్పలఁ గుప్పలుగా వధించుచో**
**నలుగుల మందు భేకనివహంబు గనుంగొని భేకనాయకుం**
**డలఘుతపస్విరూపమున నా నృపుపాలికి వచ్చి యిట్లనున్. 331**

**ప్రతిపదార్థం:** కొలఁకులన్= మడుగులను; వాగులన్= చిన్నఏరులను; నదులన్= పెద్దఏరులను; క్రోవులను= నీళ్ళు పారే ప్రదేశాలను; బావులన్= నూతులను; నిర్ఝరంబులన్= సెలయేఱులను; కలయఁగన్= పూర్తిగా; రోసి, రోసి= వెదకి వెదకి; వడిన్= వేగంగా; కప్పలన్= కప్పలను; కుప్పలుగాన్= మేటలు పడేటట్లుగా; వధించుచోన్= సంహరించటంచేత; అలుగులము+ అందు= వెతచెందే; భేక, నివహంబు= కప్పలసముదాయాన్ని; కనుంగొని= చూచి; భేక, నాయకుండు= కప్పల అధినేత; అలఘుతపస్విరూపమునన్= గొప్పఋషి ఆకారంతో; ఆ నృపుపాలికిన్= ఆ రాజు దగ్గరకు; వచ్చి= ఏగుదెంచి; ఇట్లు+అనున్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ రాజభటులు నీరుండే తావులు అన్నిటిని-చెరువులు, మడువులు, సెలయేరులు, వాగులు, నదులు, వాననీరు పోవటానికై త్రవ్విన కాలువలు అన్నిటిని వెదకి వెదకి కప్పలను చంపసాగారు. అంతట ఆకులత చెందిన కప్పలను చూచి, కప్పలనాయకుడు ఒక మహర్షిరూపం ధరించి రాజుకడకు అరుదెంచి, ఈవిధంగా అన్నాడు.

**ఉ. 'అక్కట! లోకమెల్ల నగ నాఱడి కప్పలఁ జంప నేల ? యిం**
**దెక్కడి పెంపు గల్గుఁ బృథివీశ్వర! కోపము డింపు; కప్పలం**
**జక్కని చూడ్కిఁ జూడు; మిది చాల నధర్మము' నావుడున్ విభుం**
**'డెక్కడి మాట? నాసతికి నెగ్గొనరించెఁ గడంగి భేకముల్.' 332**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; లోకము+ఎల్లన్= లోకంలోని జనులందరూ; నగన్= నవ్వగా; ఆఱడి= వ్యర్థంగా; కప్పలన్= కప్పలను, చంపన్+ఏల= వధించటం ఎందుకు?; ఇందున్= (ఈవిధంగా సంహరించేపనిలో); ఎక్కడి పెంపు+కల్గున్= ఎక్కడినుండి గొప్పతనం లభిస్తుంది?; పృథివీ+ఈశ్వర!= భూమికి అధిపతి వైన ఓమహారాజా!; కోపమున్= ఆగ్రహాన్ని; డింపు= క్రిందకు నెట్టుము అనగా తగ్గించుకొనుము; కప్పలన్= కప్పలను; చక్కని, చూడ్కిన్+చూడుము= మంచి చూపులతో చూడుము; ఇది= (ఈవిధంగా కప్పలను చంపటం); చాలన్+అధర్మము= మిక్కిలి అన్యాయం; నావుడున్= అని చెప్పగా; విభుండు= రాజు; ఎక్కడిమాట= ఏ తీరుతెన్ను కల పలుకు?; నాసతికిన్= నా భార్యకు; భేకముల్= కప్పలు; కడంగి= పూని; ఎగ్గు= కీడు; ఒనరించెన్= చేశాయి.

**తాత్పర్యం:** 'ఇది ఎంత ఆశ్చర్యం! మహారాజా! నీవు ఆలోచించావా? కప్పలను ఈవిధంగా సంహరించటం అన్యాయం. లోకమంతా ఈ నికృష్టచర్యను చూచి నవ్వుతున్నది సుమా! దీనివలన నీకు ఏవిధమైన గొప్పదనం కూడా

రాదు కదా! మహారాజా! నీఆగ్రహాన్ని తగ్గించుకొనుము. కప్పలపై జాలిచూపు సారించుము' అని మహర్షిరూపంలో ఉన్న భేకనాయకుడు అడిగాడు. అంతట రాజు 'ఏమయ్యా! నీవు ఈవిధంగా తగవు చెప్పుతున్నావు; ఈకప్పలు నా ప్రేయసికి కీడు చేశాయి కాబట్టే నేను కసిదీర్చుకొంటున్నాను. ఇది న్యాయమే' అని సమాధానమిచ్చాడు.

**క. 'నా యిష్టవనిత మ్రింగిన । మాయపుఁబుర్వు లివి వీని మడియింతు మునీం**
**ద్రా! యుడుగుము నీ' వనుటయు । నాయన యత్యంతదుఃఖితాత్ముం డగుచున్. 333**

**ప్రతిపదార్థం:** నా+ఇష్టవనితన్= నాకు ప్రీతికరమైన వనితను, నాప్రేయసిని; మ్రింగిన= భక్షించిన; మాయపున్+పుర్వులు+ఇవి= దొంగ కీటకాలు ఇవి; వీనిన్= వీటిని; మడియింతున్= చంపుతాను; ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడా!; ఉడుగుము= మానుము; నీవు; అనుటయున్= అనిచెప్పుటయున్నూ; ఆయన= (ఆముని); అతి+అంత, దుఃఖిత+ఆత్ముండు+ అగుచున్= మిక్కిలి వెతచెందిన ఆత్మ కలవాడు ఔతూ.

**తాత్పర్యం:** 'నా ప్రేయసిని మ్రింగిన దొంగ పురుగులు ఈ కప్పలు; వీటిని సంహరిస్తాను. ఓమునీంద్రా! నీప్రయత్నాన్ని ఇంక విరమించుము' అని ఆ రాజు సమాధానం చెప్పాడు. రాజు మాటలు వినిన ఆ మునివరేణ్యుడు మిక్కుటంగా వెత చెందాడు.

**వ. 'ఏను మండూకనాయకుఁడ; నాయు వనువాఁడ; నమ్మగువ నా కూతురు సుశోభన యనునది; దానిచేత ననేకులుబేలువడిరి; నీవెంతవాఁడ?' వనిన నప్పరిక్షితుం 'డట్లేని నాకు నమ్మెలఁతుకఁదెచ్చి యొప్పింపవలయు' నని ప్రార్థించిన నతండు నవ్వుచు నవ్వామనయనం దలంపున రావించి యారాజునకు నిచ్చి, దానిం జూచి కోపించి 'నీవు గడుం జెట్టవు; ప్రసిద్ధు లగు రాజులం బెక్కండ్రం జిక్కులం బెట్టితివి గావున నీకుం బుట్టెడు కొడుకులు కపటవర్తను లయ్యెడు' మని కూఁతు శపియించి, మండూకరాజు నిజేచ్ఛం జనియెఁ; బరిక్షితుండును సంప్రాప్తమనోరథుండయి సుశోభనయందుఁగ్రమంబున శలుండును నలుండును వలుండును నను ముప్వురు గొడుకులం బడసి, యం దగ్రజుండయిన శలు నభిషిక్తుం జేసి తపోవనంబున కరిగె; నంత. 334**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మండూక, నాయకుఁడన్= కప్పలకు రాజును; ఆయువు అనువాఁడన్= ఆయువు అనే పేరుగలవాడను; ఆ+మగువ= ఆ వనిత; నా, కూఁతురు= నా పుత్రిక; సుశోభన+అను+అది= సుశోభన అనే పేరు కలది; దానిచేతన్= ఆమెచేత; అనేకులు= పెక్కుమంది; బేలు+పడిరి= మోసపోయారు; నీవు+ఎంతవాఁడవు= నీవు ఏమాత్రపువాడివి? (అనగా ఆ అందరి కంటె నీవు ఏమాత్రం తెలివికలవాడవు కావు అని భావం); అనినన్= అని చెప్పగా; ఆ+పరిక్షితుండు; అట్లు+ఏనిన్= ఆవిధం నిజమే అయితే; నాకున్= నాకు, ఆ మెలఁతుకన్= ఆ పొలతిని; తెచ్చి= తీసికొనివచ్చి; ఒప్పింపవలయున్= సమ్మతింపచేయవలెను; అని, ప్రార్థించినన్= వేడికొనగా; అతండు= (ఆ కప్పలదొర); నవ్వుచున్= నవ్వుతూ; ఆ+వామనయనన్= ఆ అందమైన కన్నులు కలదానిని; తలంపునన్= స్మరణమాత్రం చేతనే; రావించి= వచ్చేటట్లుచేసి; ఆరాజునకున్= ఆప్రభువుకు; ఇచ్చి= ఆమెను ఇచ్చి; దానిన్+చూచి= ఆమెను చూచి; కోపించి= ఆగ్రహం చెంది; నీవు; కడున్+చెట్టవు= మిక్కిలి చెడ్డదానవు; ప్రసిద్ధులు+అగు= పేరుకెక్కిన; రాజులన్= ప్రభువులను; పెక్కండ్రన్= పలువురను; చిక్కులన్+పెట్టితివి= కష్టాల పాలు చేశావు; కావునన్= కాబట్టి; నీకున్+పుట్టెడు, కొడుకులు= నీకు పుట్టే పుత్రులు; కపట, వర్తనులు+అయ్యెడున్= మోసంతో నిండిన ప్రవర్తన కలవారు ఔతారు; అని; కూఁతున్= పుత్రికను; శపియించి= శాపం పెట్టి; మండూకరాజు= కప్పలదొర;

నిజ+ఇచ్ఛన్= తన కోరిక ప్రకారం; చనియెన్= వెళ్ళాడు; పరిక్షితుండును= పరిక్షితుడు అనే ఆ రాజున్నూ; సంప్రాప్త మనోరథుండు+ఐ= ఒడగూడిన కోరిక కలవాడై; సుశోభనఅందున్= సుశోభన అనే దేవియందు; క్రమంబునన్= వరుసగా; శలుండును; నలుండును; వలుండును; అను= అనే పేర్లుకల; ముప్వురు, కొడుకులన్= ముగ్గురుపుత్రులను; పడసి= పొంది; అందున్= (ఆకొడుకులలో); అగ్రజుండు+అయిన= మొదట పుట్టిన వా డయిన; శలున్= శలుడిని; అభిషిక్తున్+చేసి= రాజ్యం ఏలుటకు పట్టం కట్టి; తపస్+వనంబునకున్= తపస్సుచేసికొనే అడవికి; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= పిమ్మట.

**తాత్పర్యం:** 'ఓమహారాజా! నేను ఋషివరేణ్యుడను కాను. నేను కప్పలదొరను. నాపేరు ఆయువు. నీప్రేయసి నాకూతురే. ఆమె ఎందరినో మోసగించింది. నీవు ఆమెకు ఒక లెక్కా? నీవు మంచివాడవుగా కనిపిస్తున్నావు' అని అతడు అన్నాడు. అంతట ఆ రాజు 'అయితే దయచేసి నీవు నాప్రేయసిని రప్పించి నా కప్పగించు' అని ప్రార్థించాడు. ఆ కప్పలదొర స్మరణమాత్రంచేతనే తన కూతురును అక్కడ ప్రత్యక్షం కావించి, ఆమెతో ఇట్లా చెప్పాడు- 'నీవు మిక్కిలి చెడ్డదానవు. నీవు పలువురు రాజులను లోగడ ఇట్లే మోసగించి ఉన్నావు. నిన్ను శపిస్తున్నాను. నీకు పుట్టే కొడుకులు మోసగాండ్రు అయ్యెదరుగాక'. పిదప కప్పలదొర తనకు తోచిన చోటికి వెళ్ళిపోయాడు. అంత పరిక్షిన్మమహారాజు ఈడేరిన కోరికగల వాడై ఆ సుశోభనయందు శలుడు, నలుడు, వలుడు అనే ముగ్గురు కొడుకులను పడసి, వారిలో పెద్దవాడయిన శలుడికి పట్టంకట్టి తాను తపోవనానికి పోయాడు.

**క. శలుఁ డొక్కనాఁడు కనకో । జ్జ్వల మగు రథ మెక్కి వేఁట సని పెక్కుమృగం**
**బులఁ జంపఁగ నొక్క మృగం । బలఘుతరశరాగ్రవిద్ధమై వెసఁ బఱచెన్. 335**

**ప్రతిపదార్థం:** శలుఁడు= (శలు డనే ఆ రాజకుమారుడు); ఒక్కనాఁడు= ఒకానొక దినమున; కనక+ఉజ్జ్వలము+అగు= బంగారంవలె ధగధగ వెలుగొందుతున్న; రథమున్= తేరును; ఎక్కి; వేఁట+చని= వేటకై వెళ్ళి; పెక్కు మృగంబులన్= పలుజంతువులను; చంపఁగన్= సంహరించగా; ఒక్క, మృగంబు= ఒక జంతువు; అలఘు, తర, శర+అగ్ర, విద్ధము+ఐ= మిక్కిలి గొప్పదైన బాణపు చివరిభాగంచేత కొట్టబడినదై; వెసన్= శీఘ్రంగా; పఱచెన్= పారిపోయింది.

**తాత్పర్యం:** రాజకుమారు డైన శలుడు ఒకానొక దినం బంగారుకాంతులతో వెలుగొందే తేరు నెక్కి అడవికి వేటకు పోయాడు. అతడు వేటాడి ఎన్నో జంతువులను సంహరించాడు. అందులో ఒకజంతువు మిక్కిలి వాడియైన బాణం గ్రుచ్చుకొనికూడ, తప్పించుకొని పారిపోయింది.

**ఆ. ఇట్లు పఱచుటయును నెంతయు రయమున । నమ్మృగంబువెనుక నరిగి యరిగి**
**యెయిద లేక ధారుణీశుండు సారథిఁ । బదరి 'తేరు వేగ పఱపు' మనియె. 336**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; పఱచుటయునున్= (మృగం) పారిపోవటంతో; ఎంతయున్= ఎంతయో (మిక్కిలి); రయమునన్= వేగంతో; ఆ+మృగంబు, వెనుకన్= ఆ జంతువు వెనుక; అరిగి+అరిగి= వెళ్లి, వెళ్లి; ఎయిద లేక= వెంబడించనేరక; ధారుణీ+ఈశుండు= భూమికి భర్త ఐన రాజు (శలుండు); సారథిన్= తేరు తోలేవాడిని; పదరి= కోపించి; తేరు= రథం; వేగ= రయంగా; పఱపుము+అనియెన్= నడపుము అని ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** దెబ్బతిన్నమృగం తప్పించుకొని పారిపోవటంచేత మిక్కిలి వేగంగా ఆ శలుడు తన తేరు పోనిచ్చాడు. కాని, ఆతడు ఆ మృగాన్ని తరమటంలో వెనుకపడిపోయాడు. అందుచేత ఆతడు తన సారథిని కోపంతో హెచ్చరించి 'రథాన్ని మరింత వేగంగా పోని'మ్మని ఆజ్ఞాపించాడు.

**సీ. అనవుడు సూతుఁ డిట్లను 'దేవ! మన మెంత । దఱిమిన మృగము దద్దయు జవంబు**
**గలదు; రథ్యంబులు గడుకొని కూడంగఁ । జాలవు; వలవని జాలి యేల?**
**మన తేరిహరులు వామ్యము లైన నమ్మృగ । మగపడు; లేకున్న నలవి గాదు'**
**నా విని' వామ్యముల్ నాఁగ నెవ్వని హయం । బులు సెప్పు' మనియె నబ్భూవిభుండు;**

**తే. వామదేవమహామునివరుని హరులు । వామ్యములు నాఁగఁ జను' నని వాఁడు సెప్పెఁ;**
**'నతని యాశ్రమ మెచ్చట? నచటి కిపుడ । తేరు వోవ ని' మ్మనియె ధాత్రీవిభుండు. 337**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; సూతుఁడు= రథసారథి; ఇట్లు+అనున్= ఈవిధంగా అన్నాడు; దేవ!= ఓప్రభూ!; మనము+ఎంత+తఱిమినన్= మనం ఎంతగా ముందుకు పరుగెత్తటానికి హెచ్చరించినప్పటికినీ; మృగము= జంతువు (లేడి); తద్దయున్= మిక్కిలిగా; జవంబు+కలదు= శక్తికలదు; రథ్యంబులు= గుఱ్ఱాలు; కడుకొని= ఉత్సహించి; కూడంగన్+చాలవు= (ఆ మృగాన్ని) చేరలేవు; వలవని= సాధ్యంకాని దానికై పడే; జాలి+ఏల= వేదన ఎందుకు?; మనతేరిహరులు= మన రథానికి పూన్చిన గుఱ్ఱాలు; వామ్యములు+అయినన్= సవ్యజాతికి చెందినవి అయితే; ఆ+మృగము= ఆ జంతువు; అగపడున్= కన్పిస్తుంది; లేక+ఉన్నన్= లేకపోతే; అలవికాదు= సాధ్యంకాదు; నాన్+విని= అనగా విని; వామ్యముల్= సవ్యజాతికి చెందినవి; నాఁగన్= అనగా; ఎవ్వని, హయంబులు= ఎవడికి చెందిన గుఱ్ఱాలు; చెప్పుము= వచింపుమని; ఆ+భూవిభుండు= ఆరాజు; అనియెన్= అన్నాడు; వామదేవ, మహామునివరుని, హయములు= వామదేవుడు అనే పేరుకల మహర్షిశ్రేష్ఠుడియొక్క గుఱ్ఱాలు; వామ్యములు= సవ్యజాతికి చెందినవి; నాఁగన్= అనగా; చనును= చెల్లుతాయి; అని; వాఁడు= (రథసారథి); చెప్పెన్= చెప్పాడు; ధాత్రీవిభుండు= భూమికి భర్త అయిన రాజు; అతని+అశ్రమము= (ఆ వామదేవుడియొక్క ఆశ్రమం); ఎచ్చటన్= ఎచట ఉన్నదో; అచటికిన్= ఆ స్థలానికి; ఇపుడు+అ= ఇప్పుడే; తేరు= రథం; పోవనిమ్ము+అనియెన్= పోయేటట్లుగా చేయుము (అనగా తోలుము అని భావం).

**తాత్పర్యం:** ఆవిధంగా రాజుగారు ఆజ్ఞాపించగా, రథసారథి ఇట్లా చెప్పాడు: 'ప్రభూ! మనం రథాన్ని ఎంత వేగంగా తోలినప్పటికి ఆమృగాన్ని చేరలేం; ఆమృగం మిక్కిలిశక్తిమంతమై వేగంగా పరుగెత్తగలిగింది; మనగుఱ్ఱాలు అంతవడిగా పరుగెత్తలేవు; సాధ్యంకాని దానికై ఈ మనోవేదన ఎందుకు? మన తేరిగుఱ్ఱాలు 'వామ్య' జాతికి చెందిన వైతే ఆమృగం వశమౌతుంది.' అంత ఆ రాజు 'వామ్య'జాతికి చెందిన అశ్వాలు ఎచ్చట ఉన్నాయి? అవి ఎవరివి?' అని ప్రశ్నించాడు. 'వామ్యహయాలు వామదేవుడు అనే మహర్షి దగ్గర ఉన్నాయి' అని సారథి సమాధానం చెప్పాడు. రాజు తత్‌క్షణమే రథాన్ని వామదేవమహర్షి ఆశ్రమానికి పోనిమ్మని ఆజ్ఞాపించాడు.

**విశేషం:** 'వలవని జాలియేల?' - అనే పాఠానికి 'వలవని జోలి యేల' - అనే పాఠాంతరం ఉన్నది.

**వ. వాఁడును రథంబు సత్వరంబుగా వామదేవునాశ్రమంబునకుం బఱపినం జని, యాతం డాతపోనిధిం గని నమస్కరించి, 'మునీంద్రా! నాచేత నేటువడి యొక్కమృగంబు రయంబునం బఱచె; నమ్మృగంబు వధియింపవలయు; భవదీయహయంబుల నీవలయు' ననిన నతండు' నీవు కృతకార్యుండవై మా హయంబులం దడయక యొప్పింపవలయు, నట్లేనిం గొనిపొ' మ్మనిన వల్లె యని వామ్యంబులం గొని రథయుక్తంబులం గావించి తదీయజవంబునకు మెచ్చుచు ముహూర్తమాత్రంబునఁ గూడముట్టి మృగంబు సమయించి మగిడి నిజపురంబునకు వచ్చి. 338**

**ప్రతిపదార్థం:** వాఁడును= (ఆ రథసారథియును); రథంబున్= తేరును; సత్వరంబుగాన్= వేగంగా; వామదేవు+ఆశ్రమంబునకున్= వామదేవుడియొక్క తోటవిడిదికి; పఱపినన్= తోలుకొనిపోనివ్వగా; చని= వెళ్లి; అతండు= (ఆ పరిక్షితుడు); ఆతపస్+నిధిన్= తపస్సునకు నెలవు అయిన వాడిని; కని= చూచి; నమస్కరించి= వందనంచేసి; ముని+ఇంద్రా!= మునులలో ఇంద్రుడివంటివాడా!; నాచేతన్, ఏటు, పడి= నాచేత దెబ్బతిని; ఒక్క, మృగంబు= ఒకజంతువు; రయంబునన్= వేగంగా; పఱచెన్= పారిపోయింది; ఆ+మృగంబున్= ఆజంతువును; వధియింపన్వలయున్= చంపాలి; భవదీయహయంబులన్= నీయొక్కగుర్రాలను; ఈవలయున్= ఇవ్వాలి; అనినన్= అని అడుగగా; అతండు= (ఆ వామదేవుడు); నీవు; కృతకార్యుండవు+ఐ= నెరవేరిన పని కలవాడ వై; మా, హయంబులన్= మాగుర్రాలను; తడయక= ఆలసించక; ఒప్పింపవలయును= అప్పగించవలె; అట్లు+ఏనిన్= ఆవిధంగా చేయటానికి ఇష్టమైతే; కొనిపొమ్ము= తీసికొని వెళ్ళుము; అనినన్= అని చెప్పగా; వల్లె+అని= సరే అని చెప్పి; వామ్యంబులన్+కొని= సవ్యజాతి గుర్రాలను తీసికొని; రథ, యుక్తంబులన్+కావించి= తేరుకు కూడినట్టివాటినిగా చేసి; తదీయ, జవంబునకున్= (ఆగుర్రాలయొక్క) వేగానికి; మెచ్చుచున్= సంతోషిస్తూ; ముహూర్తమాత్రంబునన్= క్షణకాలంలోనే; కూడ, ముట్టి= సమీపించి, చేరి; మృగంబున్= లేడిని; సమయించి= చంపి; మగిడి= తిరిగి; నిజపురంబునకున్= తనపట్టణానికి; వచ్చి= చేరి.

**తాత్పర్యం:** ఆ రథసారథి తేరును వేగంగా వామదేవుడి ఆశ్రమానికి తోలాడు. పరిక్షితుడు ఆమహర్షిని సందర్శించి నమస్కరించి, 'మునులలో శ్రేష్ఠుడవైనవాడా! నాచేత ఒకమృగం దెబ్బతిని తప్పించుకొని పారిపోయింది. దానిని సంహరించాలి. దయచేసి నీ గుర్రాలను ఇమ్ము' అని ప్రార్థించాడు. ఆ మహర్షి, 'మహారాజా! నీ పని పూర్తిఅయిన పిమ్మట తిరిగి నాగుర్రాలను నాకు ఇవ్వాలి. అందుకు సమ్మతిస్తే, నీవు నా గుర్రాలను తీసికొనుము' అని చెప్పాడు. రాజు అందుకు అంగీకరించాడు. అంతట, రథసారథి వామ్యజాతికి చెందిన ఆగుర్రాలను తేరునకు పూన్చాడు. రాజు ఆగుర్రాల వేగాన్ని మెచ్చుకొన్నాడు. క్షణకాలంలో ఆరథం దెబ్బతిన్న మృగాన్ని చేరుకొన్నది. రాజు ఆజంతువును వేటాడి చంపి, రాజధానినగరానికి తిరిగి వెళ్ళాడు.

**మత్తకోకిలము.**

> **'రాజయోగ్యము లైన యీ హయరత్నముల్ జవసత్త్వ వి**
> **భ్రాజితంబులు వాని కేటికిఁ బాఱువానికి' నంచు నా**
> **రాజు రాజసబుద్ధి నంతిపురంబునం దిడఁ బంచె న**
> **వ్వాజియుగ్మము; వేడ్క నూనినవాఁడు దోస మెఱుంగునే?** **339**

**ప్రతిపదార్థం:** రాజ, యోగ్యములు+ఐన= రాజులకు మాత్రమే తగినవి అయిన; ఈ, హయరత్నముల్= ఈగొప్పగుఱ్ఱాలు; జవ, సత్త్వ, విభ్రాజితంబులు= వేగంచేత బలంచేత విలసిల్లేవి; వానికిన్+ఏటికిన్+పాఱువానికిన్= బ్రాహ్మణుడైన వాడికెందుకు?; అంచున్= అని ఆలోచిస్తూ; ఆ రాజు= ఆ ప్రభువు; రాజసబుద్ధిన్= అహంభావపూరిత మైన బుద్ధితో; అంతిపురంబు నందున్= అంతఃపురంలో- రాజుగారిలోపలి నగరిలో; ఆ+వాజి, యుగ్మమున్= ఆ గుర్రాల జతను; ఇడన్= ఉంచటానికి; పంచెన్= ఆజ్ఞాపించాడు; వేడ్కన్+ఊనినవాఁడు= వ్యామోహంతో కూడిన కోరికను పూనినవాడు; దోసము= తప్పు; ఎఱుంగును+ఏ= తెలియునా?

**తాత్పర్యం:** 'ఈ గొప్పగుర్రాలు రాజులకు మాత్రమే యోగ్యా లైనవి. ఇంత గొప్ప బలం, వేగం కల గుర్రాలు పేదబాపనికి ఎందుకు?' అని ఆలోచించి దురహంకారంతో వాటిని అంతిపురంలో ఉంచుమని ఆజ్ఞాపించాడు. వేడుక పూనినవాడు తప్పును గమనించగలడా?

**విశేషం:** హయరత్నములు= అనగా గుర్రాలలో శ్రేష్ఠములైనవి. 'రత్నహారీ తు పార్థివః' - అనే న్యాయం చొప్పున శ్రేష్ఠాలైన వాటిని గైకొనే హక్కు రాజులకు ఉంటుంది. అలం: అర్థాంతరన్యాసం. వృత్త లక్షణానికి చూడు: ఆరణ్యపర్వము 4.267 విశేషం.

**వ. అట వామదేవుండును దనయశ్వంబుల శలుండు గొనిపోయి మగుడ నొప్పింపక తడయుటకాత్మగతంబున. 340**

**ప్రతిపదార్థం:** అటన్= అచట, (ఆశ్రమంలో); వామదేవుండును= వామదేవుడుకూడ; తన+అశ్వంబులన్= తనగుర్రాలను; శలుండు= శలుడు (అనేరాజు); కొనిపోయి= తీసికొనివెళ్ళి; మగుడన్= తిరిగి; ఒప్పింపక= అప్పగించక; తడయుటకున్= ఆలస్యం చేయటానికి; ఆత్మ, గతంబునన్= తన లోలోపల (ఆలోచించాడు).

**తాత్పర్యం:** ఇట శలుడు అంతఃపురం చేరిన పిదప, అట ఆశ్రమంలో వామదేవమహర్షి శలుడు గుర్రాలను తనకు తిరిగి ఇవ్వకపోవటాన్నిగూర్చి తనలో తానే ఈవిధంగా యోచించాడు.

**తే. 'రాజపుత్త్రుండు బలియుండు రాజసుండుఁ । గొండి; కాతండు వేడుకఁ గొనుచు నరిగె**
**నశ్వములఁ గ్రమ్మఱఁగ నిత్తు నను విచార । మెవ్విధంబున నతనికి నేల కలుగు?' 341**

**ప్రతిపదార్థం:** రాజపుత్త్రుండు= రాకొమరుడు, (శలుడు); బలియుండు= బలం కలవాడు; రాజసుండున్= అహంకారం కలవాడు; కొండిక= బాలుడు; ఆతండు= అతడు (చిన్నవాడయిన రాజకుమారుడు); అశ్వములన్= గుర్రాలను; వేడుకన్+కొనుచున్+అరిగెన్= సంబరంతో కూడిన కోరికతో తీసికొని వెళ్ళాడు; అతనికిన్= (ఆశలుడికి); క్రమ్మఱఁగన్= మరల; ఇత్తున్= ఇస్తాను; అను= అనునట్టి; విచారము= ఆలోచన; ఏ+విధంబునన్= ఏరీతిగా; ఏల= ఎందులకు; కలుగున్= ఏర్పడుతుంది?

**తాత్పర్యం:** 'శలుడు వయస్సులో చిన్నవాడు, రాజపుత్రుడు, బలవంతుడు, అహంకారం గర్వం దర్పం కలవాడు. గుర్రాలను తిరిగి ఇచ్చివేయవలె ననే ఆలోచన అతడికి ఏరీతిగానైనా ఎందుకు కలుగుతుంది?'

**వ. అని శంకించి నిజశిష్యునాత్రేయుండనువానింజూచి' శలుండు మన వామ్యంబులం గొనిపోయి యొక్కమాసం బరుగుదెంచె; వాఁడును దనయంతఁ దెచ్చుట గలుగనేరదు; నీ వరిగి మనతురంగరత్నంబులం గొని ర'మ్మని పంచిన, నప్పుడ కదలి యయోధ్యానగరంబునకుం జని. 342**

**ప్రతిపదార్థం:** అని= ఆరీతిగా; శంకించి= సందేహించి; నిజ, శిష్యున్= తనదగ్గర చదువుకొనే వాడిని; ఆత్రేయుండు+అనువానిన్= ఆత్రేయుడు అనే పేరు కలవాడిని; చూచి= అరసి; శలుండు= శలుడు; మన, వామ్యంబులన్= సవ్యజాతికి చెందిన మన గుర్రాలను; కొనిపోయి= తీసికొనివెడలి; ఒక్క, మాసంబు= ఒకనెల; అరుగుదెంచెన్= కడచింది; వాఁడును= (ఆ శలుడును); తన అంతన్= తనంతట తానై; తెచ్చుట= (ఆ గుర్రాలను తిరిగి) తీసికొనివచ్చి ఇవ్వటం; కలుగనేరదు= జరుగదు; నీవు+అరిగి= నీవు (అచటికి) వెళ్లి; మన, తురంగ, రత్నంబులన్= శ్రేష్ఠాలైన మనగుర్రాలను; కొనిరమ్ము= తీసికొనిరమ్ము; అని పంచినన్= అని ఆజ్ఞాపించగా; అప్పుడు+అ= అప్పుడే; కదలి= బయలుదేరి; అయోధ్యా, నగరంబునకున్= అయోధ్య అనే పట్టణానికి; చని= వెళ్ళి.

**తాత్పర్యం:** అని లోలోపల శంక ఏర్పడగా వామదేవుడు తనశిష్యుడైన ఆత్రేయుడిని పిలిచి ఈవిధంగా చెప్పాడు: 'శలమహారాజు శ్రేష్ఠాలైన మన గుర్రాలను తీసికొనివెళ్లి ఒకనెలరోజులు అయింది. ఆతడు తనంతట తాను గుర్రాలను

మనకు తిరిగిఇచ్చేటట్లు కన్పించటం లేదు. కావున, నీవు వెళ్ళి మన గుఱ్ఱాలను అడిగి వెనుకకు తీసికొనిరమ్ము.' గురువుగారి ఆజ్ఞను అనుసరించి ఆత్రేయుడు వెంటనే బయలుదేరి అయోధ్యానగరానికి వెళ్ళాడు.

**క. మనుజపతిఁ గాంచి యాతఁడు । 'మునిపతి పుత్తేర నధిపముఖ్య! యిచటి కేఁ**
**జనుదెంచితి మా హయముల । నెనసిన నెయ్యంబుతోడ నిమ్మని యడిగెన్. 343**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= (ఆత్రేయుడు); మనుజపతిన్= రాజును; కాంచి= చూచి; అధిపముఖ్య!= ఓ రాజశ్రేష్ఠుడా!; మునిపతి= మునులలో శ్రేష్ఠుడు (వామదేవుడు) పుత్తేరన్= పంపగా; ఇచటికిన్= ఇచ్చటికి (అయోధ్యకు); ఏన్= నేను; చనుదెంచితిన్= వచ్చాను; ఎనసిన= సరిపోలిన; నెయ్యంబుతోడన్= స్నేహంతో; మా, హయములన్= మా గుఱ్ఱాలను; ఇమ్ము+అని= ఇవ్వవలసింది అని; అడిగెన్= కోరాడు.

**తాత్పర్యం:** ఆత్రేయుడు రాజును సందర్శించాడు. 'రాజులలో శ్రేష్ఠుడ వైన ఓ మహారాజా! మునులలో శ్రేష్ఠుడైన వామదేవుడు పంపగా నేను ఈ అయోధ్యానగరానికి వచ్చాను. నీవు లోగడ తీసికొనిన మా గుఱ్ఱాలను దయచేసి స్నేహపూర్వకంగా తిరిగి మాకు ఇవ్వవలసింది' అని అడిగాడు.

**విశేషం:** ఇచట 'ఎనసిన నెయ్యంబుతోడ' అనే ప్రయోగంలో స్వారస్యం అరయదగింది. మునిశిష్యుడు ఆత్రేయుడు 'ఓమహారాజా మేము మిక్కుటమైన స్నేహభావంతో అడగగానే మా గుఱ్ఱాలను నీకు ఇచ్చాం. నీవు సయితం అట్టి స్నేహభావాన్నే మాయెడ చూపవలసి ఉన్నది కదా! ఇప్పటికే ఆలస్యమైనది. ఇకనైన కర్తవ్యం గుర్తించవలెను సుమా!' అనే హెచ్చరిక ఇందులో ఇమిడి ఉన్నది. ఇది మిక్కిలి సౌమ్యమైన హెచ్చరిక.

**క. అనవుడు శలుఁ డిట్లనియెం । 'జను నినుఁ బుత్తేర నతఁడు, సాలుదు వీవుం**
**గొనిపోవఁ దురంగంబులఁ, । జనుమీ! దుర్భాషణములు సైఁపవు మాకున్.' 344**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని పలుకగా; శలుఁడు; ఇట్లు+అనియెన్; అతఁడు= (వామదేవుడు); నినున్+పుత్తేరన్= నిన్నుపంపటం; చనున్= సరిపోయింది; ఈవున్= నీవును; తురంగంబులన్= గుఱ్ఱాలను; కొనిపోవన్= తీసికొనిపోవటానికి; చాలుదువు= సరిపోతావు; మాకున్= మాకు; దుర్భాషణములు= చెడుమాటలు; సైఁపవు= రుచించవు; చనుమీ!= వెళ్ళిపోవయ్యా!

**తాత్పర్యం:** ఆత్రేయుడు ఆవిధంగా చెప్పగా, శలుడు ఈవిధంగా సమాధానం చెప్పాడు: 'ఆయన పంపటం, గుఱ్ఱాలను తీసికొనిపోవటానికి నీవు రావటం బాగుంది! 'పోవయ్యా!పోపో! మేము మహారాజులం. ఇంతకు మించి దురుసు మాటలాడటం మాకు ఇష్టంలేదు! అంతరం గుర్తించకుండ నీవు నోటికి వచ్చినట్లు మాట్లాడటం మేము సహించలేం; జాగ్రత్త'.

**విశేషం:** ఇందు 'దుర్భాషణములు సైఁపవు మాకున్' అనే ప్రయోగంలోని అంతరార్థం గుర్తించదగింది. 'మాకున్' అనే బహువచనప్రయోగం రాజదర్పసూచకం. 'అసలు రాజుగారి దగ్గరకు రావలసింది అడుగవలసింది, మీ గురువుగారు కాగా, కుఱ్రకుంక వయిన నిన్నా ఇక్కడకు పంపేది? ఇంతకంటె దురుసు మాటలు మాకు రావని రాజసంగా మందలించాడు. 'ఎనసిన నెయ్యంబుతోడ' అనేమాట సమస్కంధులమధ్య చెల్లుతుంది కాని, రాజుగారితో ఒక బ్రాహ్మణబాలకుడు అనదగింది కాదు' అని శలుడి మాటలలోని అంతరార్థం.

**వ. అనిన నమ్ముని కుమారుండు గ్రమ్మఱి చని గురునకు నవ్విధం బెఱింగించిన, వామదేవుండు క్రోధపరీతచేతస్కుం డై శలునిపాలి కరిగి యి ట్లనియె. 345**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+మునికుమారుండు= ఆ మునిపుత్రుడు; క్రమ్మఱి, చని= తిరిగివెళ్లి; గురునకున్= ఒజ్జకు; ఆ+విధంబున్= ఆ తీరును; ఎఱింగించినన్= తెలుపగా; వామదేవుండు; క్రోధ, పరీత, చేతస్కుండు+ఐ= కోపంచేత చుట్టుకొనబడిన మనస్సు కలవాడై; శలునిపాలికిన్= శలుడిదగ్గరకు; అరిగి= వెళ్ళి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆత్రేయుడు తిరిగి వెళ్ళి, రాజు చెప్పిన మాటలను గురువుగారికి నివేదించాడు. రాజుగారి సమాధానం వినిన వామదేవుడికి మిక్కుటమైన కోపం వచ్చింది. అతడు ఆగ్రహంచేత చుట్టబడిన మనస్సు కలవాడై శలుడి దగ్గరకు వెళ్ళి ఈవిధంగా పలికాడు.

**క. 'ఇమ్ము నరేశ్వర! మా తుర । గమ్ముల; నీ కార్య మయ్యెఁగాదే; కడులో**
**భమ్మున నొండుల సొమ్ములు । రమ్మనినన్ వచ్చునే? యెరవు సతత మగునే? 346**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= ఓరాజా!; మా తురగమ్ములన్= మా గుర్రాలను; ఇమ్ము= ఇచ్చివేయుము; నీకార్యము= నీపని; అయ్యెన్+కాదే= నెరవేరిందికదా; కడున్= మిక్కిలి; లోభమ్మునన్= దురాశచేత; ఒండులసొమ్ములు= ఇతరుల ద్రవ్యాలు; రమ్ము+అనినన్= రావలెను అని కోరితే; వచ్చును+ఏ= వస్తాయా?; ఎరవు= ఇల్లడ- తిరిగి ఇచ్చే ఒడంబడికతో తీసికొన్నది; సతము+అగునే= శాశ్వతం అవుతుందా?

**తాత్పర్యం:** 'ఓరాజా! మా గుర్రాలను మాకు ఇమ్ము. నీ పని నెరవేరింది కదా! మిక్కుటమైన దురాశచొప్పున పరుల ద్రవ్యాలను కాంక్షించినంతమాత్రాన అవి చేకూరుతాయా? ఎరవుగా పుచ్చుకొన్నది ఎల్లకాలం ఉంచుకొనటానికి వీలౌతుందా?

**క. పరధనహరణము దురితము । పరికింపుము; వరుణుచేతిపాశంబుల ని**
**ష్ఠురముగఁ గట్టువడకు; ని । ర్భరనరకకృశాను శిఖలఁ బడకుము మీఁదన్.' 347**

**ప్రతిపదార్థం:** పరికింపుము= ఆలోచించి చూడుము; పర, ధన, హరణము= ఇతరులసొత్తు అపహరించటం; దురితము= పాపం; వరుణుచేతి పాశంబులన్= వరుణుడియొక్క చేతిలో ఉండే త్రాళ్లచేత; నిష్ఠురముగన్= కఠినంగా; కట్టు+పడకు= బంధించబడకుము; మీఁదన్= అటుపిమ్మట (పరలోకం చేరినపిదప); నిర్భర, నరక, కృశాను, శిఖలన్= భరించశక్యంగాని నరకలోకంలోని అగ్నిజ్వాలలలో; పడకుము= కూలవద్దు.

**తాత్పర్యం:** ఆలోచన చేసి చూడుము. ఇతరులసొత్తును అపహరించటం పాపం. అట్టిపాపం చేసినవారు వరుణపాశాలచేత కఠినంగా బంధించబడతారు. పిదప భరించరాని నరకలోకంలోని అగ్నిజ్వాలలలో పడిపోతారు.'

**విశేషం:** ఇట పరధనాన్ని హరించింది రాజు. అందుచేత అతడికి రాజదండన భయం లేదు కదా. ఇక వామదేవుడు పెట్టిన భయం 'మీఁదన్.' ఇహదండన తప్పినప్పటికీ పరదండనమాత్రం తప్పదు అని హెచ్చరిక.

**చ. అనుటయు నాతఁ డిట్లనియె 'నాఱడివిప్రుల కేల యశ్వముల్?**
**ఘనతరసత్త్వమూర్తు లనఁ గాఁ దగు నెడ్లను రెంటి నిచ్చెదన్;**

**విను మటుగాక బల్లిదపువేసడముల్ వలతేని నిత్తుఁ గై**
**కొనుము తగంగ; వామ్యములఁ గోరక పొ; మ్మడియాస లేటికిన్?' 348**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పినపిదప; ఆతఁడు= (శలుడు); ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు; అశ్వముల్= గుఱ్ఱాలు; ఆఱడి= వ్యర్థంగా; విప్రులకున్+ఏల= బ్రాహ్మణులకు ఎందుకు?; ఘన, తర, సత్త్వమూర్తులు= మిక్కుటమైన గొప్పబలం గల రూపాలు కలవి; అనఁగాన్+తగు= అని చెప్పదగిన; ఎడ్లను= ఎద్దులను; రెంటిని; ఇచ్చెదన్= ఇస్తాను; వినుము= ఆలకించుము; అటు+కాక= ఆవిధం నచ్చకపోతే; బల్లిదము+వేసడముల్= మిక్కిలి బలంకలిగిన కంచరగాడిదలు; వలతు+ఏనిన్= కోరితే; ఇత్తున్= ఇస్తాను; కైకొనుము= స్వీకరించుము; తగంగన్= తగునట్లుగా; వామ్యములన్= సవ్యజాతి గుఱ్ఱాలను; కోరక= కాంక్షించక; పొమ్ము= వెళ్ళుము; అడి+ఆసలు= అడియాసలు= వ్యర్థమైన కోరికలు; ఏటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** అంతట ఆ రాజు ఇట్లా పలికాడు. 'గుఱ్ఱాలు బ్రాహ్మణులకు ఎందుకు? అవి వారికి నిరుపయోగాలు కదా! మంచిబలం గల రెండు ఎద్దులను ఇస్తాను. వినుము. ఒకవేళ నీకు అవి నచ్చకపోతే, నీకు ఇష్టమైనయెడల గొప్ప బలంగల కంచరగాడిదలను ఇస్తాను; స్వీకరించుము. సవ్యజాతికి చెందిన గుఱ్ఱాలను నీవు కోరటం అనుచితం. వ్యర్థమైనకోరికలు కోరక తిరిగి పొమ్ము.'

**క. అనిన 'నివి యేటి మాటలు? । వినువారలు నవ్వ నకట! విప్రులధనముల్**
**గొని వేఱ యొంటి నిచ్చెద । నను టిది యేనాఁటిచంద?' మని ముని పలికెన్. 349**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; వినువారలు, నవ్వన్= వినేవారు నవ్వేటట్లుగా; ఇవి, ఏటి, మాటలు?= ఇవి ఏవిధమైన మాటలు?; అకట!= అయ్యో!; విప్రుల, ధనముల్= బ్రాహ్మణుల సొత్తులు; కొని= తీసుకొని; వేఱు+అ+ఒంటిన్= మరొకటి, ఇంకొకటి; ఇచ్చెదన్ అనుట= ఇస్తాననటం; ఇది= ఈ రీతిది; ఏనాఁటి చందము= ఏకాలానికి చెందినతీరు; అని; ముని= ఋషి (వామదేవుడు); పలికెన్= అన్నాడు.

**తాత్పర్యం:** రాజు చెప్పిన మాటలకు వామదేవముని ఇట్లా బదులు పలికాడు: 'మహారాజా! నీవు చెప్పే సమాధానం వినినవారు నవ్వుతారు. అకటా! బ్రాహ్మణులసొత్తు అపహరించటమే ఒక మహాపాపం. అంతేకాక దానికి బదులు మఱేదో ఒకటి ఇస్తా నని చెప్పటం హాస్యాస్పదం. ఇది ఏకాలానికి చెందిన న్యాయమయ్యా? నాకు ఆశ్చర్యంగా ఉన్నది'.

**క. పలుకుటయు నలిగి శలుఁ 'డి । ప్పలుగుఁ దపసి నంటఁ గట్టి పటుశూలములం**
**బొలియింపుఁ' డనుచు భీకర । బలుల నియోగించెఁ దనదు పార్శ్వజనములన్. 350**

**ప్రతిపదార్థం:** పలుకుటయున్= మాటాడగా; అలిగి= కోపించి; శలుఁడు=(రాజు); ఈ+పలుగు+తపసిన్= దుష్టుడైన ఈ మునిని; అంటన్+కట్టి= బంధించి; పటుశూలములన్= గొప్పవైన బల్లేలతో; పొలియింపుఁడు= చంపండి; అనుచున్= అని చెప్తుతూ; భీకరబలులన్= భయంకరులైన బలంకలవారిని; తనదు, పార్శ్వజనములన్= తనచుట్టుప్రక్కల ఉండే వారిని; వినియోగించెన్= ఏర్పరిచాడు.

**తాత్పర్యం:** వామదేవుడిమాటలకు రాజైన శలుడికి కోపం వచ్చింది. 'దుష్టుడైన ఈ మునిని పట్టి బంధించి శూలాలతో పొడిచి చంపండి' అని తన చుట్టూఉన్న బలిష్ఠులైన భటులను ఆజ్ఞాపించాడు.

**వ. అంతయుం జూచి వామదేవుండు ఘనరోషభీషణ ప్రహాసదుర్నిరీక్ష్యముఖుం డగుటయు, నాక్షణంబ ఘోరాకారు లగు రాక్షసు లనేకులు పుట్టి నిశాతశూలంబుల నా భూపాలుంబొడిచి కాలగోచరుం జేసిరి; మునీంద్రుఁడు నిజేచ్ఛం జనియెఁ; దదనంతరంబ శలానుజుండు నలుం డనువాఁడు నిజరాజ్యపట్టభద్రుండై సుఖంబుండఁ గొండొకకాలంబునకు వామదేవుండు సనుదెంచివానింగని' 'మహాత్మా! నీవు ధర్మపరుండవు; ధర్మువుదప్పనోడుదేని, మా హయంబుల ని' మ్మనుటయు, నలుం డలిగి నిజసమీపంబున నున్న సారథిం జూచి యిట్లనియె. 351**

**ప్రతిపదార్థం:** అంతయున్+చూచి= (జరిగింది) అంతా గమనించి; వామదేవుండు= వామదేవుడనే ముని; ఘనరోషభీషణప్రహాస+దుస్+నిరీక్ష్యముఖుండు+అగుటయున్= గొప్పదైన కోపంచేత భయంకరంగా ఏర్పడిన వెగటునవ్వుచేత చూడటానికి వీలులేని మొగం కలవాడు కాగా; ఆ క్షణంబు+అ= త్రుటికాలంలోనే; ఘోర+ఆకారులు+అగు= భయంకరమైన రూపంగల; రాక్షసులు+అనేకులు= రక్కసులు పలువురు; పుట్టి= ఉద్భవించి; నిశాత, శూలంబులన్= వాడి అయిన బల్లేలతో; ఆ, భూపాలున్= ఆ రాజును; పొడిచి= గ్రుచ్చి; కాలగోచరున్+చేసిరి= సంహరించారు; ముని+ఇంద్రుండు= మునులలో ఇంద్రుడివంటివాడు (వామదేవుడు); నిజ+ఇచ్ఛన్= తన ఇచ్ఛచొప్పున; చనియెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= అటుమీదట; శల+అనుజుండు= శలుడియొక్క తమ్ముడు; నలుండు+అనువాఁడు; నిజరాజ్యపట్టభద్రుండు+ఐ= తనయొక్క రాజ్యానికి పట్టంకట్టబడినవాడై; సుఖంబు+ఉండన్= సుఖంగా ఉండగా; కొండొక, కాలంబునకున్= కొంతకాలానికి; వామదేవుండు; చనుదెంచి= వచ్చి; వానిన్= అతడిని (నలుడిని); కని= చూచి; మహా+ఆత్మా!= గొప్పఆత్మకలవాడా!; నీవు; ధర్మపరుండవు= ధర్మాన్ని ఆచరించేవాడవు; ధర్మువు, తప్పన్+ఓడుదు(వు)+ఏని= ధర్మాన్ని అతిక్రమించటానికి జంకేవాడవు అయితే; మా, హయంబులన్= మా గుర్రాలను; ఇమ్ము= ఇచ్చునది; అనుటయున్= అని చెప్పగా; నలుండు; అలిగి= కోపించి; నిజ, సమీపంబునన్+ఉన్న= తనకు దగ్గరలో ఉన్న; సారథిన్+చూచి= రథం నడిపేవాడిని చూచి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** జరిగినదంతా చూచిన వామదేవుడిముఖం కోపంతో భయంకరంగా కన్పడింది. ఆ క్షణంలోనే పెక్కండ్రు రక్కసులు ఉద్భవించి ఆ రాజును శూలాలతో పొడిచి చంపేశారు. పిదప వామదేవుడు తన ఇచ్ఛవచ్చినచోటికి వెడలిపోయాడు. అటుపిమ్మట, శలుడితమ్ముడైన నలుడు సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతడు కొంతకాలం సుఖంగా రాజ్యాన్ని పరిపాలించాడు. ఒకానొకనాడు వామదేవుడు అచటికి వచ్చి, 'మహానుభావుడవైన ఓ మహారాజా! నీవు ధర్మాన్ని అనుసరించేవాడవు. ధర్మువు తప్పి చరించటానికి జంకేవాడివైతే, మా గుర్రాలను మాకిమ్ము' అని అడిగాడు. ఆ మునిమాటలకు రాజు కోపించి తనకు దగ్గరగా ఉన్న సారథిని చూచి ఇట్లా పలికాడు.

**సీ. 'కడుఁ గ్రొవ్వి తేఁకువ సెడియె నీ పాఱుండు । వీఁకమై నిప్పుడు వీని ఱొమ్ము**
**వ్రయ్యంగ నేసెదఁ జయ్యన విషదిగ్ధ । సాయకమును శరాసనముఁ దెమ్ము'**
**నావుడు నమ్మహీదేవుండు నగుచు ని । ట్లనియె; 'న న్నేయఁ దెమ్మనిన విశిఖ**
**మంతఃపురంబున సంతసంబున నున్న । యనఘు భవత్సుతుఁ దునుముఁగాక!'**

**తే. యనఁగఁ దదనంతరంబ ఘోరాస్త్రనిహతుఁ । డైన బాలునిఁ గొనుచు హాహారవంబు**
**లెసఁగ నంతిపురంబువా రెల్ల వచ్చి; । రది ధ్రువంబుగఁ గనియును నవ్విభుండు. 352**

**ప్రతిపదార్థం:** కడున్+క్రొవ్వి= మిక్కుటంగా చెడబలిసి; ఈ పాఱుండు= ఈ బ్రాహ్మణుడు; తేఁకువ+చెడియెన్= మంచి చెడుగులను వివక్షించే తెలివితేటలను కోల్పోయాడు; వీఁకమైన్= పరాక్రమంతో; ఇప్పుడు= ఈ సమయంలో; వీనిఱొమ్మున్=

వీడివక్షాన్ని; వ్రయ్యంగన్+ఏసెదన్= ముక్కలు అయ్యేటట్లుగా కొట్టుతాను; చయ్యనన్= శీఘ్రంగా; విషదిగ్ధసాయకమును= విషంతో పూయబడిన బాణాన్ని; శరాసనమున్= విల్లును; తెమ్ము= తీసికొని రమ్ము; నావుడున్= అని చెప్పగా; ఆ+మహీదేవుండు= ఆబ్రాహ్మణుడు (వామదేవుడు); నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు; నన్నున్+ఏయన్= నన్ను కొట్టటానికి; తెమ్ము+అనిన= తీసికొని రమ్మనిన; విశిఖము= బాణం; అంతఃపురంబునన్= లోపలిరాచనగరిలో; సంతసంబునన్+ ఉన్న= సంతోషంతో ఉన్న; అనఘున్= పాపరహితుడైన; భవత్+సుతున్= నీకొడుకును; తునుమున్+కాక= సంహరిస్తుందిగాక; అనఁగన్= అని వచించగా; తద్+అనంతరంబు+అ= అటుపిమ్మటవెంటనే; ఘోర+అస్త్ర+నిహతుఁడు+ఐన= భీతిని కలిగించే మంత్రబాణంచేత చంపబడినవాడైన; బాలునిన్+కొనుచున్= పిల్లవాడిని తెస్తూ; హాహా, రవంబులు+ఎసఁగన్= ఏడుపురొదలు విస్తరించగా; అంతిపురంబువారు+ఎల్లన్= లోపలిరాచనగరులోనివారందరున్నూ; వచ్చిరి= అరుగుదెంచారు; అది= (ఆవిధంగా జరిగినదానిని) ధ్రువంబుగన్= సత్యమైన సంఘటనగా; కనియును= చూచికూడా; ఆ+విభుండు= ఆరాజు.

**తాత్పర్యం:** 'కండకావరంచేత ఈ బ్రాహ్మణుడు యుక్తాయుక్తపరిజ్ఞానాన్ని కోలుపోయాడు. ఇతడి వక్షాన్నిపరాక్రమంతో ఛేదిస్తాను. విషం పూసిన అమ్ముతో పాటు విల్లును నాకు తెచ్చిఇమ్ము' అని ఆరాజు పలికాడు. ఆ మాటలకు వామదేవుడు నవ్వి, 'రాజా! నన్ను సంహరించటానికై నీవు ఉద్దేశించిన బాణం, అంతఃపురంలో ఉన్న అమాయకుడైన నీకొడుకునే పరిమార్చగలదు. జాగ్రత్త' అని హెచ్చరించాడు. అటుపిమ్మట, ఘోరమైన అస్త్రంచేత చంపబడిన బాలకుడి మృతదేహాన్ని మోసికొంటూ అంతిపురంలోని వారు ఏడ్పురొదలతో అచ్చటికి వచ్చారు. జరిగినసంగతి కనులార చూచినప్పటికి, బుద్ధిలేక రాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. కోపావేశఘూర్ణమాన విగ్రహుం డగుచుఁ దన దురాగ్రహంబు విడువక సమీపవర్తులం జూచి. 353**

**ప్రతిపదార్థం:** కోప+ఆవేశ, ఘూర్ణమాన, విగ్రహుండు+అగుచున్= కినుకవలన ఏర్పడిన ఒళ్ళెరుగని తమకంచేత తిరుగుడుపడిన దేహంకలవాడై; తన దుస్+ఆగ్రహంబు= తన చెడుకోపం; విడువక= వదలక; సమీపవర్తులన్ చూచి= దగ్గరగా ఉన్నవారిని చూచి.

**తాత్పర్యం:** కినుకవలన ఒడలు తెలియని తమకంతో తల్లడిల్లిన ఆకారం కలవాడై ఆవేశాన్ని అణచుకొనజాలక, ఆ రాజు తన సమీపంలో ఉన్నవారిని చూచి.

**మ. 'వినుఁడీ సర్వజనంబులుం గడఁగి యీ విప్రున్ దురాలాపు దు**
**ర్జనునిం దున్మెద నస్మదీయసుమహచ్చాపోగ్రనిర్ముక్త బా**
**ణనిపాతచ్ఛిదురాంగరక్తజలశోణక్షోణిసంగస్థుఁగాఁ**
**గనుఁడీ యీ దురితాత్ము' నంచు నతి శీఘ్రప్రాప్తకోదండుఁ డై. 354**

**ప్రతిపదార్థం:** సర్వజనంబులున్= ప్రజలందరును; వినుఁడు+ఈ= సావధానంగా ఆలకించండి; కడఁగి= పూని; ఈవిప్రున్= ఈ బ్రాహ్మణుడిని; దుస్+ఆలాపున్= చెడుమాటలు ప్రేలేవాడిని; దుస్+జనునిన్= చెడ్డవాడిని; తున్మెదన్= సంహరిస్తాను; అస్మదీయ, సు, మహత్+చాప+ఉగ్ర, నిస్+ముక్తబాణ, నిపాత, ఛిదుర+అంగ, రక్త, జల, శోణ, క్షోణి, సంగస్థున్+కాన్= నాదైన మిక్కిలి గొప్పదైన వింటినుండి భయంకరంగా వెడలిన అమ్ములచేత కొట్టబడి ముక్కలుగా చేయబడిన దేహంయొక్క నెత్తురునీరుచేత ఎర్రనైన నేలయొక్క పొత్తునం దున్న వాడినిగా; ఈదురిత+ఆత్మున్= ఈపాపంతో కూడిన ఆత్మ కలవాడిని; కనుఁడు+ఈ= చూడండి; అంచున్= అంటూ; అతిశీఘ్రప్రాప్త కోదండుఁడు+ఐ= మిక్కిలి వేగంగా పొందబడిన విల్లు కలవాడై.

**తాత్పర్యం:** 'అందరూ నాప్రతిజ్ఞ సావధానంగా ఆలకించండి. నోటికి వచ్చినట్లు ప్రేలెడి ఈదురాత్ముడైన బ్రాహ్మణుడిని నేను సంహరిస్తాను. క్షణంలో నావింటినుండి వెలువడిన బాణంచేత నెత్తురుకారుతున్న ఈతనిదేహం నేలపై పొరలాడటం మీరందరూ సావధానంగా చూస్తారు గాక' అని పలుకుతూ మిక్కుటమైన వేగంతో వింటిని చేతబూనాడు.

**క. శర మరిఁ బోయుటయును ద । త్కరయుగ్మము బాణకార్ముకంబులతోఁ జె**
**చ్చెర సంస్తంభము నొందుడు । నరనాథుఁడు విస్మయోపనతమానసుఁడై. 355**

**ప్రతిపదార్థం:** శరము= బాణం; అరిన్+పోయుటయును= అల్లెత్రాటితో కూర్చేసరికి; తద్+కర, యుగ్మము= అతడియొక్క చేతులజంట; బాణ, కార్ముకంబులతోన్= అమ్ముతోను వింటితోను; చెచ్చెరన్= శీఘ్రంగా; సంస్తంభమున్+ఒందుడున్= కదలలేక పోగా, నరనాథుఁడు= రాజు; విస్మయ+ఉపనత, మానసుఁడు+ఐ= ఆశ్చర్యం పొందిన మనస్సు కలవాడై.

**తాత్పర్యం:** బాణాన్ని అల్లెత్రాటితో కూరుస్తున్నంతలోనే ఆరాజు రెండుచేతులున్నూ అమ్ముతోపాటు, వింటితోపాటు స్తంభించిపోయాయి. అందుచేత ఆ రాజు ఆశ్చర్యచకితచిత్తుడైనాడు.

**విశేషం:** ఉ.వి.ఆం.మ.భా సంశోధిత ప్రతిలో 'విస్మయావనత మానసుఁడై'- అనే పాఠమున్నది. దానికంటే వావిళ్ళ ప్రతిలోని 'విస్మయోపనత మానసుఁడై' అనే పాఠం సార్థకం.

**క. పుల్లవడి చలము రోషముఁ । బొల్లయు నై చనఁగఁ గొంతప్రొద్దు మొగమునన్**
**వెల్లఁదనము గదుర నిలిచి । యెల్లజనులు వినఁగ మఱియు నిట్లని పలికెన్. 356**

**ప్రతిపదార్థం:** పుల్ల+పడి= భయపడి; చలమున్ రోషమున్= మాత్సర్యమూ, కోపమూ; పొల్లయున్+ఐ, చనఁగన్= వ్యర్థమై పోవగా; కొంత, ప్రొద్దు= కొంతసమయం; మొగమునన్= ముఖంలో; వెల్లఁదనము= వెలవెలపాటు; కదురన్= క్రమ్ముకొనగా; నిలిచి= స్తంభించిపోయి; ఎల్లజనులున్= అందరు ప్రజలు; వినఁగన్= ఆలకింపగా; మఱియున్= వెండియు; ఇట్లు+అని పలికెన్= ఈవిధంగా వచించాడు;

**తాత్పర్యం:** ఆ రాజు భయపడి స్తంభించిపోయాడు. అసూయ, రోషంకూడ వ్యర్థమై పోయాయి. అతడు కొంతతడవు మొగం వెలవెలబోయి నిలిచి, తదుపరి అందరూ వింటూఉండగా ఈవిధంగా పలికాడు.

**ఉ. 'ఆడితిఁ బెక్కుమాట; లవి యెల్లను వమ్మయి పోయె; నస్త్రసం**
**తాడనశక్తి గీడ్పడియెఁ; దథ్యము బ్రాహ్మణశక్తి యెక్కు; డే**
**నోడితి వామదేవునకు; నో జనసంఘములార! సజ్జనా**
**మ్రేడితకీర్తి నిమ్ముని నమిత్రనిషూదను నాశ్రయించెదన్'. 357**

**ప్రతిపదార్థం:** ఓ జనసంఘములు+ఆర!= ఓప్రజల సమూహములారా!; పెక్కు, మాటలు= ఎన్నోమాటలు; ఆడితిన్= అన్నాను; అవి+ఎల్లను= (ఆమాటలు అన్నీకూడా); వమ్ము+అయి, పోయెన్= వ్యర్థమైపోయాయి; అస్త్ర, సంతాడన, శక్తి= మంత్ర, పురస్సరమైన ఆయుధాలశక్తి; కీడ్పడియెన్= నశించిపోయింది; బ్రాహ్మణశక్తి= విప్రులయొక్క మహిమ; ఎక్కుడు= అధికమైనది; తథ్యము= నిజం; వామదేవునకున్; ఏన్= నేను; ఓడితిన్= పరాజయం పొందాను; ఈ+మునిన్(వామదేవుడిని); సత్+ జన+ ఆమ్రేడిత, కీర్తిన్= మంచివారలచేత పలుమారులు పొగడబడిన యశస్సు కలవాడిని; అమిత్రనిషూదనున్= శత్రువులను చంపేవాడిని; ఆశ్రయించెదన్= శరణు వేడుతాను.

**తాత్పర్యం:** 'ప్రజలారా! నేను ఎంతో అధికప్రసంగం చేశాను. అంతా వ్యర్థమైపోయింది. ఇప్పుడు పశ్చాత్తాపం చెందాను. నా ఆయుధాల పస చెడింది. బ్రాహ్మణులశక్తిగొప్పది. ఇది సత్యం అని స్వానుభవంచేత తెలిసికోగలిగాను. నేను ఓడిపోయాను. వామదేవమహర్షి గెలుపొందాడు! ఆతడు శత్రువులను నిర్జించేశక్తికల మహానుభావుడు. సజ్జనులచేత పలుమారులు పొగడబడే ఆ మునీంద్రుడినే నేను శరణువేడుతాను.'

**వ. అని యివ్విధంబున నతం డేపు దప్పి జోహారు వెట్టుటయుఁ, దదీయ బంధుమిత్త్ర జనంబులు భయసంభ్రమంబులతో నమ్మునినాథు శరణు సొచ్చి యనునయించినఁ, బ్రసన్నుండై యమ్మహాత్ముండు దత్కరయుగస్తంభనంబు మాన ననుగ్రహించి, తదీయనందను ప్రాణంబు లొసంగెఁ; నంత నమ్మహీకాంతుండు భార్యాసహితంబుగా నతనికిఁ బ్రణమిల్లి హయంబులఁ దెచ్చి యొప్పించినం గైకొని వామదేవుఁ డరిగెఁ; 'నిట్టిది బ్రాహ్మణప్రభావం' బని చెప్పిన విని. 358**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; ఈ+విధంబునన్= ఈ తీరుగా; అతండు= (ఆ రాజు); ఏపు+తప్పి= గర్వం వీడి; జోహారు+పెట్టుటయున్= నమస్కరించుటయున్నూ; తదీయబంధుమిత్రజనంబులు= అతడి యొక్క చుట్టాలున్నూ, స్నేహితులున్నూ అయినవారు; భయసంభ్రమంబులతోన్= వెఱపు, తొట్రుపాటులతో; అమ్మునినాథు, శరణు+చొచ్చి= మునులలో శ్రేష్ఠుడైన ఆతడిని శరణుకోరుతూ చేరి; అనునయించినన్= బతిమాలగా; ప్రసన్నుండు+ఐ= శాంతించినవాడై; ఆ, మహా+ఆత్ముండు= ఆ గొప్ప ఆత్మకలవాడు (వామదేవుడు); తద్+కర, యుగ, స్తంభనంబు= ఆతడియొక్క చేతులజంట మ్రాన్పడిపోయిఉండటం; మానన్= నయమయ్యేటట్లు; అనుగ్రహించి= దయచేసి; తదీయ, నందను, ప్రాణంబులు= ఆతడి కొడుకుయొక్క అసువులు; ఒసంగెన్= ఇచ్చాడు; అంతన్= పిదప; ఆ+మహీకాంతుండు= భూమికిభర్తఅయిన ఆ రాజు; భార్యాసహితంబుగాన్= పెండ్లాంతోపాటు; అతనికిన్= (వామదేవుడికి); ప్రణమిల్లి= నమస్కరించి; హయంబులన్= గుర్రాలను; తెచ్చి= తీసికొనివచ్చి; ఒప్పించినన్= ఒప్పగించగా; కైకొని= స్వీకరించి; వామదేవుఁడు= వామదేవుడు; అరిగెన్= వెళ్ళాడు; ఇట్టిది= ఇటువంటిది; బ్రాహ్మణ, ప్రభావంబు= విప్రులయొక్క మహిమ; అని, చెప్పినన్, విని.

**తాత్పర్యం:** అని ఈ విధంగా ఆరాజు గర్వాన్ని వదలి ఆమునికి నమస్కరించాడు. అంతట ఆ రాజు చుట్టాలున్నూ మిత్రులున్నూ వామదేవుడిని శరణు వేడారు. పిదప, అతడు ప్రసన్నుడై, రాజు రెండు చేతులు మ్రాన్పడటం తొలగించాడు, రాజుకొడుకును తిరిగి బ్రదికించాడు. రాజు అంతఃపురంనుండి ఆ గొప్పగుర్రాలను తెప్పించి మునీశ్వరుడికి సమర్పించాడు. ఆమేలి గుర్రాలను తీసికొని వామదేవుడు వెళ్ళాడు. 'ఇటువంటిది బ్రాహ్మణప్రభావం' - అని మార్కండేయమహర్షి సోదాహరణంగా ధర్మరాజుకు వివరించి చెప్పాడు.

**క. మునిపతికి మ్రొక్కి కుంతీ । తనయుఁడు 'మీకంటె వృద్ధతముఁ డగు పురుషుం<br>దనఘా! కలఁడె జగమ్మున?' । నని యడిగిన నాతఁ డిట్టులని యెఱిఁగించెన్. 359**

**ప్రతిపదార్థం:** కుంతీతనయుఁడు= కుంతికొడుకు (ధర్మరాజు); మునిపతికిన్= మునిరాజుకు (మార్కండేయుడికి); మ్రొక్కి= నమస్కరించి; అనఘా!= పుణ్యాత్ముడా!; జగమ్మునన్= లోకంలో; మీకంటెన్; వృద్ధ, తముఁడు+అగు= వయస్సులో మిక్కిలి పెద్దవాడైన పురుషుండు= మగవాడు; కలఁడు+ఎ= ఉన్నాడా?; అని అడిగినన్= అని ప్రశ్నించగా, ఆతఁడు= (మార్కండేయుడు); ఇట్టులు+అని+ఎఱిఁగించెన్= ఈవిధంగా తెలియజెప్పాడు;

**తాత్పర్యం:** ధర్మరాజు మార్కండేయమహర్షికి నమస్కరించి ఈవిధంగా ప్రశ్నించాడు. 'పుణ్యపురుషా! ఈ లోకంలో మీకంటె కూడ వయస్సులో మిక్కిలి వృద్ధుడైన పురుషుడు ఉన్నాడా?' ఆప్రశ్నకు సమాధానంగా ఆ మహర్షి ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** వృద్ధతముఁడు= అందరికంటె ముసలివాడు. 'తర-తమ' ప్రత్యయాలు ఉత్తరోత్తరాధిక్యసూచకాలు.

**మార్కండేయుఁడు ధర్మరాజునకు నింద్రద్యుమ్నుని కథ సెప్పుట (సం. 3-191-2)**

**క. ఘనుఁ డింద్రద్యుమ్నుం డను । జనపతి గలఁ; డాతఁ డింద్రసదనమున ముదం**
**బున నుండఁగ బహుకాలం । బున కాతని కీర్తి లోకమున మాయుటయున్. 360**

**ప్రతిపదార్థం:** ఘనుఁడు= గొప్పవాడు; ఇంద్రద్యుమ్నుండు+అను, జనపతి, కలఁడు= ఇంద్రద్యుమ్నుడు అనే పేరు కల రాజు ఉండేవాడు; ఆతఁడు= అతడు (ఇంద్రద్యుమ్నుడు); ఇంద్రసదనమునన్= ఇంద్రుడి ఇంటిలో (స్వర్గలోకంలో); ముదంబునన్+ఉండఁగన్= సంతసంతో నివసించగా; బహుకాలంబునకున్= చాలకాలానికి; ఆతని కీర్తి= ఇంద్రద్యుమ్నుడి యశస్సు; లోకమునన్= జగత్తులో; మాయుటయున్= క్షీణించిపోవటంచేత.

**తాత్పర్యం:** ఇంద్రద్యుమ్నుడు అనే ఒక గొప్పమహారాజు ఉండేవాడు. అతడు చిరకాలం స్వర్గలోకంలో సంతసంతో నివసించాడు. చాలకాలానికి లోకంలో ఆతని కీర్తి మాయమై పోవటంచేత. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అమరు 'లిచ్చోట నుండలే వరుగు' మనుచు । నుర్విఁ ద్రోచిన నతఁడు నా యున్నకడకు**
**నర్థిఁ జనుదెంచి యిట్లను 'నసఘ! నన్ను । నిద్ధపుణ్యు నింద్రద్యుమ్ను నెఱుఁగు దయ్య?' 361**

**ప్రతిపదార్థం:** అమరులు= దేవతలు; 'ఇచ్చోటన్= ఈస్థలంలో; ఉండలేవు= నివసించజాలవు; అరుగుము= వెళ్ళుము;' అనుచున్= అనిచెప్పుతూ; ఉర్విన్= భూమికి; త్రోచినన్= నెట్టగా; అతఁడు= (ఆ ఇంద్రద్యుమ్నుడు); నా+ఉన్న, కడకున్= నేను ఉన్నచోటికి; అర్థిన్+చనుదెంచి= కోరికతో వచ్చి; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; అనఘ!= పాపరహితుడా; ఇద్ధపుణ్యున్= ప్రకాశించే పుణ్యం కలవాడిని; నన్నున్= నన్ను; ఇంద్రద్యుమ్నున్= ఇంద్రద్యుమ్నుడిని; ఎఱుఁగుదు+అయ్య= ఎఱుగుదువా?'

**తాత్పర్యం:** దేవతలు ఆ ఇంద్రద్యుమ్నుడిని 'ఇక నీవు స్వర్గంలో ఉండజాలవు; నీ పుణ్యం తరిగిపోయింది' అని చెప్పి, అతడిని భూలోకానికి నెట్టారు. అంతట ఆ ఇంద్రద్యుమ్నుడు నే నున్నచోటికి వచ్చి ఈవిధంగా పలికాడు. 'ఓ పుణ్యాత్ముడా! ప్రకాశించే పుణ్యాలు కల ఇంద్రద్యుమ్నుడను నేను. అయ్యా! నన్ను నీవు ఎరుగుదువా?'

**సీ. అనుడు నే నిట్లంటి నయ్య! ని న్నెఱుఁగంగఁ । జాలనయ్యెద; హిమశైలశృంగ**
**వాసియై యుండు ప్రావారకర్ణుం డను । పేరి ఘూకము గడు పెద్ద; యదియు**
**నాకంటె నిన్ను నిర్ణయముగ నెఱుఁగుఁ బొ । మ్మనుటయు; నన్ను రమ్మనియె నతఁడు;**
**ఘనరసాయనఘుటికాప్రయోగంబున । దేహతాపంబు వర్ధిల్లె నందుఁ**

**తే. గదలి రాఁజాల నే నంటిఁ; గడఁగి యన్న । రేంద్రుఁ డశ్వమై ననుఁ బ్రీతి నెత్తికొనుచు**
**నయ్యులూకముపాలికి నరిగి నన్ను । నడిగినట్టుల దానిని నడుగుటయును. 362**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని పలుకగా; ఏన్= నేను; ఇట్లు+అంటిన్= ఈవిధంగా అన్నాను; అయ్య= ఆర్యా!; నిన్నున్+ఎఱుఁగంగన్+చాలను+అయ్యెదన్= నిన్ను తెలియజాలకున్నాను; హిమ, శైల, శృంగ, వాసి+ఐ+ఉండు= మంచుకొండ శిఖరంమీద నివసించే వాడై ఉన్న; ప్రావారకర్ణుండు+అను, పేరి= ప్రావారకర్ణుడు అనే పేరు కలిగిన; ఘూకము= గ్రుడ్లగూబ; కడు, పెద్ద= మిక్కిలి పెద్దది (వయస్సులో); అదియున్= ఆ గుడ్లగూబయు; నాకంటెన్= నన్నుమించి; నిన్నున్= నిన్ను; నిర్ణయముగన్= నిశ్చయంగా; ఎఱుఁగున్= తెలియును; పొమ్ము= వెళ్ళుము; అనుటయున్= అని అనగా; నన్నున్= నన్ను; అతఁడు= అతడు (ఇంద్రద్యుమ్నుడు); రమ్ము+అనియెన్= (తనతోకూడ) రమ్ము అని అడిగాడు; ఘన, రసాయన; ఘుటికాప్రయోగంబునన్= గొప్పదైన రసౌషధానికి సంబంధించిన మాత్రను వాడటంచేత, దేహతాపంబు= శరీరంయొక్కబాధ; వర్ధిల్లెన్= వృద్ధిచెందింది. అందున్= అచ్చటికి; ఏను= నేను రాన్+చాలను+అంటిన్= రావటానికి శక్తి సరిపోదు అని చెప్పాను; కడఁగి= పూనుకొని ఆ, నర+ఇంద్రుఁడు= ఆరాజు (నరులలో ఇంద్రుడివంటివాడు); అశ్వము+ఐ= గుర్రం రూపం ధరించి; ననున్= నన్ను; ప్రీతిన్= అనురాగంతో; ఎత్తికొనుచున్= మీదపెట్టుకొంటూ; ఆ+ఉలూకము, పాలికిన్= ఆ గుడ్లగూబ ఉన్నచోటికి; అరిగి= వెళ్ళి; నన్నున్= నన్ను; అడిగిన+అట్టులు+అ= ప్రశ్నించినరీతిగానే; దానినిన్= (ఆగ్రుడ్లగూబను); అడుగుటయును= ప్రశ్నించగా.

**తాత్పర్యం:** అప్పుడు నేను ఈవిధంగా పలికాను: 'అయ్యా! నేను నిన్ను తెలిసికొనలేకపోయాను, కాని, హిమాలయపర్వతశిఖరంకడ నివసించే ప్రావారకర్ణుడు అనే పేరుకల గ్రుడ్లగూబ వయస్సులో మిక్కిలి పెద్దది; అందుచేత అతడు నాకంటె నిన్నుగూర్చి నిశ్చయంగా తెలియగలడు; అతడి దగ్గరికి పొమ్ము'. అంతట ఆ ఇంద్రద్యుమ్నుడు తనతోపాటు నన్ను కూడ రమ్మన్నాడు! 'అయ్యా!ముసలితనంలో శక్తినొసగే మాత్రను సేవించి యున్నాను. అందువలన కలిగిన దేహతాపం కారణంగా కదలలేకుండా ఉన్నాను' అని చెప్పాను. అప్పుడు ఆ ఇంద్రద్యుమ్నుడు గుర్రపురూపం ధరించి నన్ను తన వీపుపై ఉంచుకొని ఆ గుడ్లగూబ ఉన్నచోటికి వెళ్ళి, నన్ను అడిగినట్లే అతడు ఆ గుడ్లగూబను అడిగాడు.

**విశేషం:** ప్రాచీనభారతీయసాహిత్యంలో జంతుపాత్రలు బహుళాలు. అవి మానవచిత్తప్రవృత్తులకు ప్రతీకలే. ఆ జంతువుల పేర్లు సార్థకాలు. ప్రావారకర్ణుడు= ఉత్తరీయాలవంటి చెవులు కలవాడు అనగా భుజాలపై వ్రాలునట్టి నిడివిఅయిన చెవులుకలవాడని అర్థం.

**వ. అదియునుం గొండొకసేపు దలపోసి చూచి 'యేను నిన్ను నిక్కువంబుగా నెఱుంగనేర; నింద్రద్యుమ్నం బను కొలనియందు నాళీకజంఘుం డనుపేరి బకవల్లభుండు వసియించు; నవ్విహంగంబు నాకుఁ బెద్ద; నిన్నెఱుంగు నరుగు' మనిన నమ్మనుజపతి నాతోడఁగూడ నయ్యులూకంబు మోచికొని నాళీకజంఘునొద్దకుం జని తనపేరు సెప్పి 'నన్నెఱుంగుదే?' యనిన నదియు 'నే నిన్నెఱుంగంజాల నాకంటెఁ జిరకాలజీవి యైన యకూపారుండను కచ్ఛపంబు గల; దదియును నిక్కొలన నుండు నజ్జలచరము నిన్నెఱుంగంబోలు; నడిగి చూతముగాక' యుని యక్కమఠంబుఁబేర్కొని' యొక్క సందేహంబు నిర్ణయించుట కయి యీయార్యజనంబులు నిన్ను గుఱించి వచ్చినవారు; నీవు సనుదేరవలయు' నని పలుకుటయును. 363**

**ప్రతిపదార్థం:** అదియునున్= (ఆగ్రుడ్లగూబకూడ); కొండొకసేపు= కొంతసమయం; తలపోసి= యోచించి; చూచి= అరసి; ఏను= నేను; నిక్కువంబుగాన్= నిజంగా; ఎఱుంగనేరను= తెలియజాలను; ఇంద్రద్యుమ్నంబు+అను, కొలనిఅందున్= ఇంద్రద్యుమ్నం అనే పేరుకల సరస్సులో; నాళీకజంఘుండు+అను, పేరి= నాళీకజంఘుడు అనే పేరు కల; బక వల్లభుండు=

కొంగలరేడు; వసియించున్= నివసిస్తాడు; ఆ+విహంగంబు= ఆపక్షి; నాకున్+పెద్ద= నాకంటె వయస్సులో పెద్దది; నిన్నున్+ఎఱుంగున్= నిన్ను తెలియును; అరుగుము= వెళ్ళుము; అనినన్= అని చెప్పగా; ఆ+మనుజపతి= ఆరాజు; నాతోడన్+కూడ= నాతోపాటుగా; ఆ+ఉలూకంబున్= ఆగ్రుడ్లగూబను; మోచికొని= వహించి; నాళీకజంఘునొద్దకున్+చని= నాళీకజంఘుడివద్దకు వెళ్ళి; తనపేరు+చెప్పి; నన్నున్+ఎఱుంగుదు+ఏ+అనినన్= నన్ను తెలియుదువా నీవు- అని అడుగగా; అదియున్= (ఆకొంగకూడ); ఏన్= నేను; నిన్నున్+ఎఱుంగన్+చాలన్= నిన్నుతెలియజాలను; నాకంటెన్= నన్ను మించి; చిర, కాల, జీవి+ఐన= చాలకాలం బ్రదికిన వాడైన; అకూపారుండు+అను= అకూపారుడు అనేపేరు కల; కచ్ఛపంబు= తాబేలు; కలదు= ఉన్నది; అదియునున్= అదిన్నీ; ఈ+కొలనన్+ఉండున్= ఈసరస్సులో నివసిస్తూ ఉంటుంది; ఆ+జలచరము= నీటిలో తిరిగే ఆ జంతువు (తాబేలు); నిన్నున్+ఎఱుంగన్+పోలున్= నిన్ను తెలిసిఉండవచ్చును; అడిగి= ప్రశ్నించి; చూతము, కాక= చూస్తాం గాక; అని= అని చెప్పి; ఆ+కమఠంబున్= ఆతాబేలును; పేర్కొని= పేరుపెట్టి పిలిచి; ఒక్కసందేహంబు= ఒక అనుమానం; నిర్ణయించుటకున్+అయి= నిశ్చయించటంకొరకై; ఈ+ఆర్యజనంబులు= ఈ పెద్దలు; నిన్నున్+గుఱించి= నీకొరకై; వచ్చినవారు= వచ్చారు; నీవు; చనుదేరవలయున్= రావలెను; అని పలుకుటయును= అని అనటమున్నూ.

**తాత్పర్యం:** ఆ గుడ్లగూబ కొంతసేపు యోచించి, 'నాకు నీవు ఎవరవో తెలియరాలేదు. ఇంద్రద్యుమ్నం అనే పేరుకల ఒకసరోవరం ఉన్నట్లు నాకు తెలియును. ఆ సరస్సులో నాళీకజంఘుడు అనే పేరుకల గొప్పకొంగ ఉన్నది. ఆ కొంగ వయస్సులో నాకంటెను పెద్దది. నిన్నుగూర్చి ఆకొంగకు తెలియును. అక్కడకు వెళ్ళుము' అని చెప్పింది. అంత ఆ ఇంద్రద్యుమ్నుడు నాతోపాటు ఆ గుడ్లగూబను సయితం తనవీపుపైన ఎక్కించుకొని ఆకొంగ దగ్గరకు వెళ్ళాడు. అతడు, తనపేరు చెప్పి ఆ కొంగ తన్నెరుంగునేమో అని ప్రశ్నించాడు. ఆ కొంగ, తాను ఇంద్రద్యుమ్నుడిని ఎరుగను కాని, ఆకొలనులో ఒకతాబేలు కలదనిన్నీ, ఆ తాబేలు అచటి జలచరాలలో ఎక్కువ వయస్సు కలదు అనిన్నీ, ఆ తాబేలుకు తెలిసివుండవచ్చును అని చెప్పి చూతము గాక' అని ఆ తాబేలును పేరెత్తి పిలిచి ఇట్లా పలికింది- 'ఒక సందేహం తీర్చుకొనటానికై పెద్దలు నీకడకు వచ్చారు. నీవు దయచేసి ఇటు రమ్ము.'

**తే.** **కొలను వెలువడి చనుదెంచెఁ గూర్మవిభుఁడు; । వార లడిగి 'రింద్రద్యుమ్నధారుణీశు**
**నెఱుఁగుదే?' యన నదియు నొక్కింతతడవు । దలఁచికొని కన్నుఁగవ నశ్రుజలము లొలుక.** **364**

**ప్రతిపదార్థం:** కూర్మవిభుఁడు= తాబేటిరేడు; కొలను= సరోవరం; వెలువడి= బయటికి వచ్చి; చనుదెంచెన్= అరుగుదెంచాడు; వారలు= (నాళీకజంఘుడు, ప్రావారకర్ణుడు); అడిగిరి= (ఇట్లా) ప్రశ్నించారు; ఇంద్రద్యుమ్న, ధారుణీ+ఈశున్= ఇంద్రద్యుమ్నుడు అనెడి రాజును; ఎఱుఁగుదు+ఏ= తెలియుదువా; అనన్= అని అడుగగా; అదియున్= (ఆతాబేలును); ఒక్కింతతడవు= ఒక కొంతసేపు; తలఁచికొని= జ్ఞాపకం తెచ్చికొని; కన్ను+కవన్= కనులజంటయందు; అశ్రు, జలములు+ఒలుకన్= కన్నీరు కారగా.

**తాత్పర్యం:** తాబేలు ఆ సరస్సునుండి బయలువెడలి కనిపించింది. 'ఇంద్రద్యుమ్నమహారాజును నీవు ఎరుగుదువా?' అని వారు ప్రశ్నించారు. అంత, ఆ తాబేలు కొంచెంసేపు జ్ఞాపకం తెచ్చుకొని, కన్నీరు కనులనుండి కారుతుండగా,

**విశేషం:** 'ఒక్కింతతడవు తలఁచికొనుట' - 'కన్నుఁగవ నశ్రుజలము లొలుకుట' - 'ఎలుగు రాలుపడుట' మున్నగునవి మానుషవిభావాలే కదా! ఈ పద్యం తిక్కన మహాకవి ఆంగికసాత్త్వికాభినయవర్ణనను తలపిస్తుంది. ఎఱ్ఱనపై - నన్నయ ప్రభావముద్రమాత్రమే గాక తిక్కన కవితాశిల్పప్రభావమున్నూ గోచరిస్తుంది.

**వ.** **ఎలుంగు రాలుపడ వారలం గనుంగొని యి ట్లనియె.** **365**

**ప్రతిపదార్థం:** ఎలుంగు= కంఠస్వరం; రాలుపడన్= బొంగురుపోగా; వారలన్= ఇంద్రద్యుమ్నుడిని, నాళీకజంఘుడిని, ప్రావారకర్ణుడిని; కనుంగొని= చూచి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** గద్గదస్వరంతో వారిని చూచి ఈవిధంగా పలికింది.

**ఉ.** **'అక్కట! నే నెఱుంగనె మహాగుణభూషణు నమ్మహాత్ము న**
**న్నిక్కడఁ బెక్కుమాఱులు ననేకభయంబులఁ బొందకుండఁగా**
**నక్కటికంబుతోడఁ దగ నాతఁడు గైకొని కాచెఁ గాదె! పెం**
**పెక్కిన యన్నరోత్తముని నెన్నఁటికిన్ మఱవంగవచ్చునే? 366**

**ప్రతిపదార్థం:** అక్కట= (ఇది ఆశ్చర్యార్థకం - జాలితో కూడిన అచ్చెరువును దెలిపేది); మహా, గుణ, భూషణున్= గొప్పగుణాలు ఆభరణాలుగా కల వాడిని; ఆ+మహా+ఆత్మున్= ఆమహాత్ముడిని; నేను+ఎఱుంగను+ఎ= నేను తెలియనా?; నన్నున్; ఇక్కడన్; పెక్కు, మాఱులు= అనేకపర్యాయాలు; అనేక, భయంబులన్= పెక్కుఆపదలను; పొందకుండఁగాన్= పడయకుండ; అక్కటికంబుతోడన్= దయతో; తగన్= ఒప్పేటట్లుగా; ఆతఁడు= ఆ యింద్రద్యుమ్నుడు; కైకొని= స్వీకరించి; కాచెన్+కాదె= కాపాడాడు కదా; పెంపు+ఎక్కిన= గొప్పతనాన్ని సంపాదించిన; ఆ+నర+ఉత్తమునిన్= ఆ జనులలో శ్రేష్ఠుడు అయినవాడిని; ఎన్నఁటికిన్= ఎప్పటికైనను; మఱవంగన్వచ్చును+ఏ= విస్మరించటానికి వీలు ఉన్నదా?

**తాత్పర్యం:** 'అయ్యో! ఎంతమాట! ఆ ఇంద్రద్యుమ్న మహారాజునా నేను మరచిపోవటం ! ఆతడు మహాత్ముడు, గొప్పగుణాలచేత అలంకరించబడినవాడు. పెక్కుమారులు ఆ మహనీయుడు నన్ను పెక్కు ఆపదలనుండి కాపాడాడు. జనులలో శ్రేష్ఠుడై ఎంతో గొప్పతనాన్ని ఆర్జించిన ఆ ఇంద్రద్యుమ్నుడిని నేను సదా కృతజ్ఞతతో స్మరించవలసి ఉన్నది.

**తే.** **అమ్మహాత్ముండు బహువిధయజ్ఞదక్షి । ణార్థముగ విప్రవరులకు నర్థి నిచ్చు**
**గోగణంబుల గొరిజల గ్రొచ్చియయ్యెఁ । గాదె యీ సరోవరము జగన్నుతముగ.' 367**

**ప్రతిపదార్థం:** ఆ+మహా+ఆత్ముండు= ఆ గొప్ప ఆత్మకలవాడు; బహు, విధ, యజ్ఞ, దక్షిణా+అర్థముగన్= పెక్కురకాలైన యజ్ఞాలలో దానాలకు ఇచ్చే ధనంగా; విప్రవరులకున్= బ్రాహ్మణులకు; అర్థిన్= ప్రీతితో; ఇచ్చు= ఒసగు; గోగణంబుల= ఆవుల సమూహాలయొక్క; గొరిజలన్= గిట్టలచేత; జగత్+నుతముగన్= లోకం పొగడేటట్లుగా; ఈ సరోవరము= ఈ మడుగు; గ్రొచ్చి= త్రవ్వబడి; అయ్యెన్+కాదె= ఏర్పడినది గదా!

**తాత్పర్యం:** మహానుభావుడైన ఆ ఇంద్రద్యుమ్న మహారాజు ఎన్నో యజ్ఞాలు చేసి, దక్షిణగా అనేకగోవులను బ్రాహ్మణులకు దానంచేశాడు. ఆ మహాత్ముడు దానం చేసిన వేనకువేల ఆవుల గిట్టల రాపిడే కదా! లోకం పొగడే ఈ మడుగు ఏర్పడటానికి కారణం.

**వ.** **అనిన యనంతరంబ దేవదూతలు విమానంబు గొనుచుఁ జనుదెంచి యింద్రద్యుమ్నుం గని 'మహాత్మా! నీ కీర్తి జగంబునందు శాశ్వతంబై నిలిచె; నీకుఁ ద్రిదివనివాసంబు సుస్థిరం బయ్యెఁ; నరుగుదెమ్ము; విమానం బెక్కు' మని, వెండియు. 368**

**ప్రతిపదార్థం:** అనిన+అనంతరంబు+అ= అని పలికిన వెంటనే; దేవదూతలు= స్వర్గలోకానికి చెందిన ప్రతినిధులు; విమానంబు, కొనుచున్= ఆకసంలో చరించే వాహనాన్ని తీసికొనివస్తూ; చనుదెంచి= అరుగుదెంచి; ఇంద్రద్యుమ్నున్+కని= ఇంద్రద్యుమ్నుడిని చూచి; మహా+ఆత్మా!= గొప్పఆత్మకలవాడా!; నీకీర్తి= నీయశస్సు; జగంబునందున్= లోకంలో; శాశ్వతంబు+ఐ= ఎల్లకాలం ఉండునట్టిదై; నిలిచెన్= నిలబడింది; నీకున్= నీకు; త్రిదివ+నివాసంబు= స్వర్గలోకంలో నివసించటం; సు, స్థిరంబు+అయ్యెన్= బాగా ఎల్లప్పుడు ఉండునట్టిది అయింది; అరుగుదెమ్ము= రమ్ము; విమానంబు= విమానం; ఎక్కుము= అధిరోహించుము; అని= అని చెప్పి; వెండియున్= మఱియును.

**తాత్పర్యం:** తాబేలు ఆ మాటలు చెప్పగానే దేవతల ప్రతినిధులు విమానాన్ని గైకొనివచ్చి ఇంద్రద్యుమ్నుడితో ఇట్లా పలికారు: 'మహాత్మా! నీ యశస్సు లోకంలో ఎల్లప్పుడు ఉంటుంది. నీకు శాశ్వతస్వర్గసౌఖ్యం లభిస్తుంది. దయచేసి ఈ విమానం ఎక్కి స్వర్గలోకానికి రమ్ము' అని, ఇంకా ఇట్లా అన్నారు.

**క. 'తన కీర్తి యెంతకాలము । వినఁబడు నిజ్జగమునందు వెలయఁగ నందాఁ**
**కను బుణ్యలోకసౌఖ్యం । బున నెంతయు నుల్లసిల్లుఁ బురుషుం డనఘా!' 369**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! ఓఇంద్రద్యుమ్నమహారాజా!; తన, కీర్తి= తనయశస్సు, ఈ+జగమునందున్= ఈలోకంలో; ఎంతకాలము= ఎంతసమయం; వినఁబడున్= (ప్రజలచేత) ఆలకించబడునో; వెలయఁగన్= విలసిల్లేటట్లుగా; అందాఁకను= అంతవరకును; పురుషుండు= నరుడు; పుణ్య, లోక, సౌఖ్యంబునన్= సుకృతం చేసికొనటంవలన లభించే లోకంలోని సుఖంతో; ఎంతయున్= మిక్కుటంగా; ఉల్లసిల్లున్= సంతసిస్తాడు.

**తాత్పర్యం:** 'పాపరహితుడా! ఈలోకంలో తనయశస్సు ఎంతకాలం విలసిల్లుతూ వినబడునో అంతకాలం నరుడు స్వర్గలోకసౌఖ్యాలను అనుభవిస్తాడు.'

**విశేషం:** ఈప్రకరణంలో భగవద్గీతలోని ఈ క్రింది శ్లోకం స్మరించదగింది. "తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం । క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి'' ॥ 9-21.॥

**వ. అనిన నమ్మహీకాంతుండు దివిజకింకరులంజూచి 'యిమ్ముదుసలి తాపసుని, వృద్ధవిహంగంబును గార్యార్థంబు సహాయులుగాఁదెచ్చితి; వీరిని నిజస్థానంబుల నునిచివచ్చెద; నించుకనిలువుం' డని వారిచేత ననుజ్ఞాతుండై నన్నును నులూకంబును నెప్పటి నెలవులం బెట్టి తానును దేవయానంబున దివంబున కరిగె' నని చెప్పినఁ బ్రీతుఁడై పృథానందనుండు. 370**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; ఆ+మహీకాంతుండు= భూమికి భర్త అయిన ఆ రాజు; దివిజకింకరులన్= దేవ సేవకులను; చూచి= అరసి; ఈ+ముదుసలితాపసునిన్= వృద్ధుడైన ఈ తపసిని; వృద్ధ, విహంగంబును= ముసలిదైన పక్షిని; కార్య+అర్థంబు= పని నెరవేరటం కొరకై; సహాయులుగాన్= తోడ్పడేవారలుగా; తెచ్చితిన్= తీసికొనివచ్చాను; వీరిని= (మార్కండేయుడిని, ప్రావారకర్ణుడిని, నాళీకజంఘుడిని) నిజస్థానంబులన్= తమతమ నెలవులలో; ఉనిచి= పెట్టి; వచ్చెదన్= వస్తాను; ఇంచుక= కొంచెం సేపు; నిలువుండు+అని= నిలిచి ఉండండి అని చెప్పి; వారిచేతన్= (ఆదేవదూతలచేత); అనుజ్ఞాతుండు+ఐ= అనుమతి పొందిన వాడై; నన్నునున్= నన్ను (మార్కండేయుడిని); ఉలూకంబునున్= గ్రుడ్లగూబనూ (ప్రావారకర్ణుడిని); ఎప్పటి నెలవులన్+పెట్టి= లోగడ ఉన్నచోటులందే ఉంచి; తానును= ఇంద్రద్యుమ్నుడును); దేవయానంబునన్= దేవతల విమానంలో; దివంబునకున్= స్వర్గలోకానికి; అరిగెన్= వెళ్ళాడు; అనిచెప్పినన్= అని వచించగా; ప్రీతుఁడు+ఐ= సంతుష్టి చెందినవాడై; పృథానందనుండు= కుంతీదేవికొడుకు (ధర్మరాజు).

**తాత్పర్యం:** అని దేవతలు చెప్పగా విని, ఇంద్రద్యుమ్నుడు దేవదూతలతో ఇట్లా బదులు పలికాడు: 'నాపనిమీద ఈ ముదుసలి మహర్షిని, ఈ ముసలిపక్షిని వారిసాయాన్ని కోరి ఇప్పుడు తోడ్కొనివచ్చాను. వీరిని వారివారినెలవులలో దింపి తిరిగిరాగలను. కొంచెం తాళండి'. అని చెప్పి దేవదూతలచేత అనుమతించబడినవాడై యథాస్థానాలలో వారిని దిగబెట్టి, తదుపరి తాను వేల్పులవిమానం ఎక్కి స్వర్గలోకానికి వెళ్ళాడు. ఆ కథ విసిన కుంతీపుత్రుడైన ధర్మరాజు మిక్కిలి ప్రీతిచెందాడు.

**విశేషం:** ఇంద్రద్యుమ్నోపాఖ్యానంలో ఈక్రింది అంశాలు అనుశీలించదగినవి - 1. ఇది ఒక స్వయంసంపూర్ణమైన మనోహరగాథ. 2. ఇది భగవద్గీతలోని ఒకభావానికి సోదాహరణ వివరణం. పుణ్యకార్యాలు చేసిన స్వర్గసౌఖ్యాలు లభిస్తాయి. నరుడు పుణ్యక్షయం కాగానే భూలోకానికి దిగిపోవలసిందే. పుణ్యకార్యాలకీర్తి ఎంతకాలం నిలుచునో అంతకాలం పురుషుడు స్వర్గసౌఖ్యాలను అనుభవిస్తాడు. 3. దీర్ఘాయుర్దాయం- మనుజులలో అరుదు. దీనికి అపవాదంగా - ఏమార్కండేయమహర్షియో కనబడతాడు. గుడ్లగూబ, కొంగ, తాబేలు ఎక్కువ కాలం బ్రదుకు నని ఈ ఉపాఖ్యానం చెప్పుతున్నది. ఈ విషయాలపై జీవశాస్త్రజ్ఞులు ఇంకను పరిశోధనలు చేయదగును. 4. ఈ ఉపాఖ్యానంలో గల 'కొసమెరుపు' గుర్తించదగింది. ఇంద్రద్యుమ్నుడు ఎంతోకష్టపడి తనకు సాక్ష్యానికి పనికివచ్చే చిరంజీవులను అన్వేషించటం, తుదకు- దేవతలు అతనిపుణ్యం అక్షయమైన దని అతడిని తిరిగి స్వర్గానికి ఆహ్వానించినప్పుడు స్వార్థబుద్ధితో ఆతడు తనకు సాయంచేసినవారిని వదలిపెట్టక, వారిని యథాస్థానాలలో దిగబెట్టి తదుపరి వేల్పులవిమానం ఎక్కటం విశేషం.

**క.** **'నీకంటె వృద్ధతముని గు । ణాకర! యెఱిఁగించి; తిది మహాద్భుత!' మని సు**
**శ్లోకుఁడు మునివరునకుఁ బు । ణ్యాకృతికిఁ గృతప్రణాముఁడై కడుభక్తిన్.** **371**

**ప్రతిపదార్థం:** గుణ+ఆకర!= మంచిలక్షణాలకు నెలవైనవాడా!; నీకంటెన్, వృద్ధతమునిన్= నిన్ను వయస్సులో మించినవాడిని; ఎఱిఁగించితి(వి)= తెలిపితివి; ఇది; మహా+అద్భుతము= ఇది గొప్ప అచ్చెరువును కలిగించేది; అని= అని చెప్పి; సుశ్లోకుఁడు= కీర్తిమంతుడు (ధర్మరాజు); పుణ్య+ఆకృతికిన్= మూర్తీభవించిన పుణ్యానికి (పుణ్యమే ఆకృతిగా గల వాడికి); ముని, వరునకున్= మునులలో శ్రేష్ఠుడైనవాడికి, (మార్కండేయుడికి); కృత, ప్రణాముఁడు+ఐ= చేయబడిన నమస్కారం కలవాడై (నమస్కరించి); కడున్= మిక్కుటమైన; భక్తిన్= భక్తితో.

**తాత్పర్యం:** 'మంచిగుణాలకు నెలవైన ఓ మార్కండేయమహర్షీ ! నీకంటెకూడ వయస్సులో మించినవాడినిగూర్చి వివరించావు. ఇది మిక్కిలి ఆశ్చర్యం కలిగించే విషయం' అని పలికి పూజ్యుడైన ధర్మరాజు మార్కండేయమహర్షికి మిక్కిలిభక్తితో నమస్కరించాడు.

**విశేషం:** ఆరణ్యపర్వం బృహద్గ్రంథం కావటానికి ముఖ్యకారణం స్వయంసంపూర్ణాలైన పలుగాథలు ఇందులో చేరటమే. ఈ కథాహారానికి, ఏకవాక్యతను చేకూర్చింది ధర్మరాజుశీలంలోని జిజ్ఞాస.

### మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ గువలాశ్వచరిత్రము సెప్పుట (సం. 3-192-4)

**వ.** **'మునీంద్రా! యిక్ష్వాకువంశోద్భవుండైన కువలాశ్వునకు ధుంధుమారుం డను పేరెట్లు గలిగెఁ జెప్పవే!' యని యడిగిన నతం డి ట్లనియె.** **372**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= మునులలో ఇంద్రుడివంటివాడా!; ఇక్ష్వాకు, వంశ+ఉద్భవుండు+ఐన= ఇక్ష్వాకువంశంలో పుట్టిన; కువలాశ్వునకున్; ధుంధుమారుండు+అను, పేరు; ఎట్లు+కలిగెన్= ఏవిధంగా ఏర్పడింది; చెప్పవు+ఏ= వచింపవా; అని అడిగినన్= అని ప్రశ్నించగా; అతండు= (మార్కండేయుడు); ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'మునులలో శ్రేష్ఠుడవైన ఓ మార్కండేయమహాముని ! ఇక్ష్వాకువంశంలో జన్మించిన కువలాశ్వుడికి ధుంధుమారుడు అనే పేరు ఏరీతిగా ఏర్పడిందో దయచేసి చెప్పవా' అని అడుగగా ధర్మరాజునకు మార్కండేయమహర్షి ఈ విధంగా చెప్పాడు.

**ఉ.** **'శంకరసన్నిభుండు జనశంకరుఁడున్ గరుణాకరుం డనా**
**తంకుఁ డుదంకుఁ డన్ముని వ్రతస్థితుఁ డై మరుభూమియందు ని**
**శ్శంకమతిన్ వసించి యనిశంబును నవ్యయు నచ్యుతున్ మనః**
**పంకజవేదిపై నిడి తపం బొనరించె ననేకవర్షముల్.** **373**

**ప్రతిపదార్థం:** శంకర, సన్నిభుండు= శివుడితో సమానుడు; జన, శంకరుఁడున్= ప్రజలకు శుభాలు కలిగించేవాడును; కరుణా+ఆకరుండు= దయకు నెలవైనవాడు; అనాతంకుఁడు= ఎదురుఅడ్డాలు సరకుపెట్టనివాడు అగు; ఉదంకుఁడు+అన్, ముని= ఉదంకుడు అనే నామంగల ఋషి; వ్రతస్థితుఁడు+ఐ= దీక్షను పూనినవాడై; మరుభూమియందున్= ఎడారి బంజరుభూమియందు; నిశ్శంక, మతిన్= సందేహాలు లేని నిశ్చలమనస్సుతో; వసించి= ఉండి; అనిశంబును= ఎల్లప్పుడును; అవ్యయున్= అక్షరుడైన భగవంతుడిని; అచ్యుతున్= పతనం లేని భగవంతుడిని - అనగా ఆ విష్ణుదేవుడిని; మనస్+పంకజ, వేదిపైన్= మనస్సు అనే తామరపూవుతిన్నెపై; ఇడి= స్థాపించి; అనేకవర్షముల్= పెక్కుసంవత్సరాలు; తపంబు+ఒనరించెన్= తపస్సు చేశాడు.

**తాత్పర్యం:** శివుడితో సమానుడైనవాడున్నూ, ప్రజలకు శుభాలు చేకూర్చేవాడున్నూ, దయామయుడున్నూ, ఎదురు లేనివాడున్నూ, అగు ఉదంకుడనే ఋషి దీక్షతో ఎడారిబంజరుభూమిలో నివసించి, ఎల్లప్పుడును నాశంలేనివాడున్నూ, జారనట్టి స్థితి గలవాడున్నూ అయిన విష్ణుదేవుడిని తనమనస్సు అనెడి తమ్మిపూవుతిన్నెపై నిడి పెక్కుసంవత్సరాలు తపస్సు చేశాడు.

**తే.** **అతనిభక్తికిఁ బ్రియమంది యాదిదేవుఁ । డంబుజాక్షుఁ డధోక్షజుఁ డక్షరుండు**
**గరుణఁ బ్రత్యక్ష మగుటయుఁ గని యతండు । ప్రణతి యొనరించి యిట్లని ప్రస్తుతించె.** **374**

**ప్రతిపదార్థం:** అతని భక్తికిన్= (ఆ ఉదంకుడి); భక్తికి; ప్రియము+అంది= ప్రీతిని చెంది; ఆదిదేవుఁడు= మొదటిదేవుడు; అంబుజ+అక్షుఁడు= పద్మాలవంటి కన్నులు కలవాడు; అధోక్షజుఁడు= జితేంద్రియులకు ప్రత్యక్షమయ్యేవాడు; అక్షరుండు= నాశం లేని వాడు అగు విష్ణువు; కరుణన్= దయతో; ప్రత్యక్షము+అగుటయున్= సాక్షాత్కరించటమున్నూ; కని= చూచి; అతండు= (ఉదంకుడు); ప్రణతి+ఒనరించి= నమస్కారం చేసి; ఇట్లు+అని= ఈ విధంగా పలికి; ప్రస్తుతించెన్= పొగడాడు.

**తాత్పర్యం:** ఉదంకుడి భక్తికి సంతసిల్లి, అతడి దీక్షకు మెచ్చి నాశంలేనివాడున్నూ, తమ్మిపువ్వువంటి కన్నులు కలవాడున్నూ అయిన శ్రీమన్మహావిష్ణువు సాక్షాత్కరించాడు. ఉదంకుడు విష్ణుమూర్తికి నమస్కరించి, అతడిని ఈవిధంగా ప్రస్తుతించాడు.

**మత్తకోకిలము.**

**'దేవదేవ! శ్రుతిప్రమాణవిధేయ! మాధవ! జంగమ**
**స్థావరాత్మకమైన లోకము సర్వమున్ భవదీయమా**
**యావిధేయము విశ్వరూపుఁడ వవ్యయుండవు నీవ స**
**ద్భావసుస్థితి ని న్నెఱింగినఁ బాయుఁ బాపము లచ్యుతా! 375**

**ప్రతిపదార్థం:** దేవదేవ!= దేవులకు దేవుడవైనవాడా!; అచ్యుతా!= ఓవిష్ణుమూర్తీ!; శ్రుతి, ప్రమాణ, విధేయ!= వేదాలలో నెలకొల్పబడిన సత్యానికి లోబడినవాడా!; మాధవ!= లక్ష్మీదేవికి భర్తవయినవాడా!; జంగమ, స్థావర+ఆత్మకము+ఐన= కదలునది, కదలక స్థిరంగా ఉండునది అయిన; లోకము= జగత్తు; సర్వమున్= అంతయున్నూ; భవదీయ, మాయా, విధేయము= నీదైన మాయకు లోబడి ఉన్నది; విశ్వరూపుఁడవు= సృష్టిసమస్తమున్నూ రూపంగా కలిగినవాడవు; అవ్యయుండవు= నాశం లేనివాడవు; నీవు+అ= నీవు మాత్రమే; సత్+భావస్థితిన్= సత్యమైన యోచన యొక్క ఉనికితో; నిన్నున్+ఎఱింగినన్= నిన్ను తెలిసికొంటే; పాపములు= దోషాలు; పాయున్= తొలగిపోతాయి.

**తాత్పర్యం:** విష్ణుమూర్తీ! దేవతలకు దేవుడవైన వాడా! వేదాలు నెలకొల్పిన సత్యానికి నెలవైనవాడా! ఈ చరాచరసృష్టి అంతయు నీమాయకు లోబడినట్టిదే, ఈ సృష్టి అంతయు నీరూపమే. నీవు క్షయం లేనివాడవు. చ్యుతిలేనివాడవు. సరిఅయిన భావంతో నిన్ను ధ్యానిస్తే పాపాలన్నీ పటాపంచలై తొలగిపోగలవు.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు: ఆరణ్యపర్వము: 4.267 విశేషం.

**చ.** **అనిమిషసిద్ధసంయమివిహంగభుజంగమముఖ్యు లెల్ల ని**
**న్ననిశముఁ గొల్చి నీ దయఁ గృతార్థతఁ బొందుదు; రెందు నీవు నె**
**మ్మనమున సంతసిల్లుదు సమస్తజగంబులు శాంతిఁ బొందు; నీ**
**కినుకకు మాఱు లేదు శివకీర్తిత! యీ భువనత్రయంబునన్. 376**

**ప్రతిపదార్థం:** శివకీర్తిత!= శివుడిచేత పొగడబడినవాడా!; అనిమిష, సిద్ధ, సంయమి, విహంగ, భుజంగమ, ముఖ్యులు+ఎల్లన్= వేల్పులలో, ముక్తులలో, యోగులలో, ఆకసంలో సంచరించేవారిలో, పన్నగులలో గొప్పవారుఅందరున్నూ; నిన్నున్=నిన్ను; అనిశమున్= ఎల్లప్పుడును; కొల్చి= ఆరాధించి; నీదయన్= నీ కరుణచేత; కృతార్థతన్= ధన్యత్వాన్ని; పొందుదురు= లభింపజేసికొంటారు; ఎందున్= ఎక్కడైనా; ఈవు= నీవు; నెఱ+మనమునన్= నిండుమనస్సున; సంతసిల్లుదు(వు)= సంతోషింతువో; సమస్త, జగంబులున్= అన్నిలోకాలున్నూ; శాంతిన్+పొందున్= శాంతిని అనుభవిస్తాయి; నీ కినుకకున్= నీ కోపానికి; ఈ భువన, త్రయంబునన్= ఈ మూడు లోకాలలో; మాఱు లేదు= ఎదురు లేదు.

**తాత్పర్యం:** శివుడిచేత ప్రస్తుతించబడినవాడా! దేవతలలో, ముక్తులలో, యోగులలో, విహంగులలో, పన్నగులలో గొప్పవారలు అందరున్నూ ఎల్లప్పుడు నిన్ను ఆరాధించి నీ దయచేతనే ధన్యత్వం పొందుతారు. నీవు నిండు మనస్సుతో సంతసిస్తే అన్ని లోకాలున్నూ శాంతిని పొందుతాయి. నీవు ఆగ్రహిస్తే దానికి ఇక ప్రతిక్రియ లేనే లేదు.

**మత్తకోకిలము.**

**విక్రమత్రయలీల నోలిన విష్టపత్రితయంబుఁ బె**
**ల్లాక్రమించితి, క్రూరులైన సురారివీరులఁ బ్రస్ఫుర**

**చ్చక్రవిక్రమకేళిఁ ద్రుంచితి, సర్వయజ్ఞ ఫలావహ**
**ప్రక్రియాత్ముఁడ వీవు నిశ్చలభక్తిగమ్య ! జనార్దనా! 377**

**ప్రతిపదార్థం:** నిశ్చల, భక్తిగమ్య= చలించని భక్తికి అందుబాటులో ఉండేవాడా!; జనార్దనా!= ఓ విష్ణుదేవా!; విక్రమత్రయలీలన్= మూడుపాదాలతో ఆడినఆటతో; ఓలిన్+అ= వరుసగా; విష్టపత్రితయంబున్= మూడులోకాలను; పెల్లు+ఆక్రమించితి(వి)= బాగాకైవసం చేసికొన్నావు; క్రూరులు+ఐన= బాధ కలిగించే ప్రవర్తన కలవారైన; సుర+అరి, వీరులన్= దేవతలకు శత్రువులైన రాక్షసవీరులను; ప్రస్ఫురత్+చక్ర, విక్రమకేళిన్= ప్రకాశించే చక్రంయొక్క విజృంభణ మనే విలాసంచేత; త్రుంచితి(వి)= సంహరించావు; ఈవు= నీవు; సర్వ,యజ్ఞ, ఫల+ఆవహ, ప్రక్రియా+ఆత్ముఁడవు= అన్నియజ్ఞాలు చేయటం వలన ఏర్పడే ఫలితాల నొసగే వివిధ కర్మలకు అంతస్సారమైన వాడవు.

**తాత్పర్యం:** చలించని భక్తిచేత పొందదగిన ఓవిష్ణుమూర్తీ! నీవు మూడుపాదాల హొయలుతో మూడులోకాలను ఆక్రమించినవాడవు. క్రూరులై దేవతలకు శత్రువులైన రాక్షసులను నీ చక్రంతో సంహరించావు. సర్వయజ్ఞాలకు, ఫలాలను ఒసగే సర్వప్రక్రియలకు (సమస్తకార్యవిధానములకు) నీవే అంతస్సారమైనవాడివి.

**విశేషం:** 'విక్రమత్రయలీల' - మూడుపాదాలతో ముల్లోకాలను ఆక్రమించినకథ - వామనావతారగాథ భాగవతంలో సుప్రసిద్ధం. వామనరూపాన వదాన్యుడైన బలిచక్రవర్తిని మూడుఅడుగులమేర అర్థించి, పడసి, పిదప 'త్రివిక్రముడై' ముల్లోకాల నాక్రమించి, అతడిని పాతాళానికి బోనణచాడు. వృత్తలక్షణానికి చూడు: ఆరణ్యపర్వము: 4.267 విశేషం.

**వ. అనిమఱియుంబెక్కుభంగులంబ్రస్తుతించినం గరుణించిపాంచజన్యధరుండు వరంబడుగు మనిన నుదంకుండు 'దేవా! భవదీయదివ్యరూపంబుఁ బ్రత్యక్షంబుగాఁ గంటి; నింతకంటెవరం బెయ్యది గల? దైనను నామనంబు నిత్యంబును సత్యధర్మశమంబులయందు సుస్థిరంబై నీయందు దృఢభక్తికంబు గావలయు; నిదియ నాకు వరం' బనుటయు నద్దేవుండు 'నీకోరినయట్ల యిచ్చితి; మత్ప్రసాదంబున నీకుం బరమజ్ఞాన యోగంబును సిద్ధించుఁ; ద్రిలోకహితం బైన కార్యం బొక్కటి నీచేత సాధితం బయ్యెడు; నది యెయ్యది యనిన వినుము; ధుంధుండను దానవుండు జగంబుల కుపద్రవంబు సేయంగలవాఁడు; తద్వధార్థం బై నీవు బృహదశ్వసూనుం డైన కువలాశ్వు నుద్యుక్తుంజేసెద; వన్నరేంద్రుండు మత్ప్రసాదలబ్ధం బైన యోగబలంబునం జేసి భవన్ని యోగంబున నయ్యసురం బరిమార్పసమర్థుండగు; నవ్విశేషంబునకు నీవలన నఖిలలోకంబులు సంతసిల్లెడు' నని పలికి విష్ణుదేవుం డంతర్హితుండయ్యెః నుదంకుండును బూర్వప్రకారంబునం దపంబు సేయుచుండె; మఱియును. 378**

**ప్రతిపదార్థం:** అని= ఆవిధంగా పలికి; మఱియున్= ఇంకా; పెక్కు, భంగులన్= అనేకరీతులుగా; ప్రస్తుతించినన్= పొగడుతూ వర్ణించగా; కరుణించి= దయగలిగి; పాంచజన్యధరుండు= పాంచజన్యం అనే పేరుగల శంఖాన్ని వహించేవాడు-విష్ణువు; వరంబు+అడుగుము+అనినన్= కావలసిన కోరిక కోరుకొమ్ము అని అనగా; ఉదంకుండు; దేవా!= భగవానుడా!; భవదీయ, దివ్య, రూపంబున్= నీదైన దివ్యమైన ఆకృతిని; ప్రత్యక్షంబుగాన్+కంటిన్= కనులముందు సాక్షాత్కరించగా చూచాను; ఇంతకంటెన్= దీనికంటె; వరంబు= వలసినకోరిక; ఏ+అది= ఏది; కలదు?= ఉన్నది?; ఐనను= అయినప్పటికిని; నామనంబు= నా మనస్సు; నిత్యంబును= ఎల్లప్పుడును; సత్య, ధర్మ, శమంబులయందున్= నిజమునందు, ధర్మమునందు, ఇంద్రియ నిగ్రహమునందును; సుస్థిరంబు+ఐ= బాగా నిలిచి చలించనిదై; నీయందున్; దృఢ, భక్తికంబు, కావలయున్= గాఢమైనభక్తితో

కూడినదిగా ఉండాలి; ఇది+అ= ఇదిమాత్రమే; నాకున్= నాకు; వరంబు= వలసినకోరిక; అనుటయున్= అని చెప్పుటయున్నూ; ఆ+దేవుండు= ఆ దేవుడు (శ్రీవిష్ణువు); నీ, కోరిన, అట్ల+ఇచ్చితిన్= నీవు కోరిన ప్రకారమే ఇచ్చాను; మత్+ప్రసాదంబునన్= నా అనుగ్రహంవలన; నీకున్= నీకు; పరమ, జ్ఞాన, యోగంబును= గొప్పదైన పరిపూర్ణజ్ఞానంయొక్క తీరుతీయం, సిద్ధించున్= లభిస్తుంది; త్రిలోకహితంబు+ఐన= మూడులోకాలకు మేలు చేకూర్చే; కార్యంబు+ఒక్కటి= పని ఒకటి; నీచేతన్= నీమూలాన; సాధితంబు+అయ్యెడున్= సాధింపబడేది అగుగాక; అది= (ఆత్రిలోకహితకార్యం); ఏ+అది= ఏది; అనినన్= అని అడిగితే; వినుము; ధుంధుండు+అను, దానవుండు= ధుంధుండు అనే పేరుగల రాక్షసుడు; జగంబులకున్= లోకాలకు; ఉపద్రవంబు= ప్రమాదం; చేయంగలవాఁడు= చేయగలఁడు; తద్+వధ+అర్థంబు+ఐ= ఆతడిని సంహరించటం కొరకై; నీవు; బృహదశ్వ సూనుండు+ఐన= బృహదశ్వుడి కుమారుడైన; కువలాశ్వున్= కువలాశ్వుడిని; ఉద్యుక్తున్+చేసెదవు= ఆయత్తపడేవాడినిగా చేస్తావు; ఆ+నర+ఇంద్రుండు= నరులలో ఇంద్రుడివంటివా డయిన ఆరాజు; మత్+ప్రసాద, లబ్ధంబు+ఐన= నా అనుగ్రహంవలన సిద్ధించింది అయిన; యోగబలంబునన్+చేసి= యోగంయొక్క శక్తివలన; భవత్+నియోగంబునన్= నీపనుపువలన; ఆ+అసురన్= ఆరాక్షసుడిని; పరిమార్పన్= సంహరించటానికి; సమర్థుండు+అగున్= శక్తికలిగినవాడు ఔతాడు; ఆ+విశేషంబునకున్= పేర్కొనదగిన ఆ సంఘటనకు; నీవలనన్= నీమూలాన; అఖిల, లోకంబులు= అన్ని జగాలు; సంతసిల్లెడున్= సంతోషించగలవు; అని, పలికి= అని చెప్పి; విష్ణుదేవుండు= విష్ణువు; అంతర్హితుండు+అయ్యెన్= మాయమైనాడు; ఉదంకుండును; పూర్వప్రకారంబునన్= వెనుకటి మాదిరిగానే; తపంబు= తపస్సు; చేయుచుండెన్= సల్పుతున్నాడు; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** అని ఇంకను పెక్కురీతుల నుతిచేయగా, పాంచజన్యాన్ని ధరించే విష్ణుదేవుడు కరుణించి ఉదంకుడిని వరం కోరుకొనుమన్నాడు. అప్పుడు ఉదంకుడు ఇట్లా ప్రార్థించాడు: 'దేవా! నీవు నాకు సాక్షాత్కరించటమేచాలు. ఇంతకంటె నేను కోరదగిన వరం ఏముంటుంది? అయినను, నీ ఆజ్ఞచొప్పున నా వేడికోలు వినిపించెద. నామనస్సు ఎల్లప్పుడు సత్యంపై, ధర్మంపై ఇంద్రియనిగ్రహంపై ప్రసరించి సదా నీయందు భక్తితో లగ్నమై ఉండుగాక' విష్ణుమూర్తి అతడు కోరిన వరాన్ని అనుగ్రహించటం మాత్రమేగాక తనదయవలన అతడికి గొప్పజ్ఞానంగూడ సిద్ధించగలదని చెప్పాడు. అంతేకాక, మూడులోకాలకు శుభం చేకూర్చే కర్తవ్యాన్ని ఉదంకుడు నెరవేర్చవలెనని నిర్దేశించాడు. ఆ త్రిలోకహితకార్యం ఎట్టిదో, దానిని విష్ణుమూర్తి ఇట్లా వివరించాడు. 'ధుంధుడు' అనే రాక్షసుడు లోకాలకు విపత్తు కల్పించగలడు. ఆతడిని సంహరించటానికై నీవు బృహదశ్వుడి కుమారుడైన కువలాశ్వుడిని ఆయత్తం చేయాలి; ఆ రాజు నా అనుగ్రహంవలన లభించిన శక్తిచేతను, నీ నియోగంవలనను ఆ రాక్షసుడిని వధించే శక్తిని ఆర్జించగలడు. చరిత్రాత్మకమైన ఆ సంఘటనవలన అన్నిలోకాలు సంతసించగలవు' అని పలికి విష్ణుమూర్తి అంతర్ధానం చెందాడు. ఉదంకుడు వెనుకటివలెనే తిరిగి తపస్సు చేయసాగాడు.

**విశేషం:** 1. ఉదంకుడు కోరుకొనినవరం 'విష్ణుదేవుడియెడ దృఢభక్తి'. విష్ణుదేవుడు అతనికి భక్తితోపాటు - 'పరమజ్ఞానయోగాన్ని' గూడ ప్రసాదించాడు. ఉదంకునకు చివరకు లభించినవి- సత్యం, ధర్మం, ఇంద్రియనిగ్రహం, జ్ఞానం. అనగా ఇది కర్మ, భక్తి, జ్ఞానయోగాల సంపుటం.

**సీ.** **అనఘుఁ డిక్ష్వాకుఁ డీ యఖిలభూచక్రంబు । నేలి నాకమునకు నేఁగుటయును**
**నతని నందనుఁడు శశాదుండు రాజయ్యెఁ । వాఁడు కకుత్‌స్థుఁ డన్వానిఁ గనియెఁ**
**నతఁ డనేనసుఁ డను నాత్మజుఁ బడసె నా । పృథివీపతికిఁబుట్టెఁ బృథుఁడనంగఁ**
**బృథుఁడు విష్వగుఁ డనుపేరి పుత్త్రకుఁ గాంచె; । నతనికి జనియించె నార్ద్రుఁ డనఁగ**

**తే. నార్ద్రునకుఁ బుట్టె యువనాశ్వుఁడను తనూజుఁ; । డాతనికిఁ బుట్టె శ్రావస్తుఁ డను విభుండు;**
**దత్సుతుఁడు బృహదశ్వుఁ డా ధరణిపతికి । నుగ్రతేజుండు గువలాశ్వుఁ డుదితుఁ డయ్యె. 379**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= పాపరహితుడు; ఇక్ష్వాకుఁడు; ఈ అఖిలభూచక్రంబున్= సమస్తమైన ఈ భూమండలం అంతటిని; ఏలి= పరిపాలించి; నాకమునకున్= స్వర్గలోకానికి; ఏఁగుటయునున్= వెళ్ళుటయున్నూ; అతనినందనుఁడు= అతని కుమారుడు; శశాదుండు; రాజు+అయ్యెన్= రాజు అయినాడు; వాఁడు= (ఆ శశాదుడు); కకుత్స్థుఁడు+అన్‌వానిన్= కకుత్స్థుడు అనేవాడిని; కనియెన్= కన్నాడు; అతఁడు= (ఆ కకుత్స్థుడు); అనేనసుఁడు+అను, ఆత్మజున్+పడసెన్= అనేనసుడు అనేకొడుకును పొందాడు; ఆ పృథివీ, పతికిన్= ఆ రాజుకు; పృథుఁడు+అనంగన్= పృథుడు అనే పేరు కలవాడు; పుట్టెన్= జన్మించాడు. పృథుఁడు; విష్వగుఁడు+అనుపేరి; పుత్త్రకున్= కుమారుడిని; కాంచెన్= పొందాడు; అతనికిన్= (ఆ విష్వగుడికి); ఆర్ద్రుఁడు+అనఁగన్= ఆర్ద్రుడు అనేవాడు; జనియించెన్= పుట్టాడు; ఆర్ద్రునకున్; యువనాశ్వుఁడు+అను; తనూజుఁడు= కొడుకు; పుట్టెన్; ఆతనికిన్= ఆయువనాశ్వునకు; శ్రావస్తుఁడు+అను, విభుండు= శ్రావస్తుడు అనే రాజు; పుట్టెన్; తద్+ సుతుఁడు= ఆతడి కొడుకు; బృహదశ్వుఁడు; ఆధరణీపతికిన్= ఆరాజునకు; ఉగ్రతేజుండు= భయంకరమైన తేజస్సుకలవాడు; కువలాశ్వుఁడు; ఉదితుఁడు+అయ్యెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడైన ఇక్ష్వాకు డీ భూమండలాన్ని ఏలి స్వర్గలోకానికి వెళ్ళాడు. అతడి వంశవృక్షం ఈవిధంగా ఉన్నది. ఇక్ష్వాకుడు; అతడి కొడుకు శశాదుడు; అతడికొడుకు కకుత్స్థుడు; అతడి కొడుకు అనేనసుడు; అతడి కొడుకు పృథుడు; అతడి కొడుకు విష్వగుడు; అతడి కొడుకు ఆర్ద్రుడు; అతడి కొడుకు యువనాశ్వుడు; అతడి కొడుకు శ్రావస్తుడు; అతడి కొడుకు బృహదశ్వుడు; అతడికొడుకు కువలాశ్వుడు.

**వ. అక్కువలాశ్వునకు నఖిలాస్త్రశస్త్రవిద్యావిశారదులనధికసత్త్వసంపన్నులు నైన పుత్త్రు లేకవింశతి సహస్రంబులు పుట్టి; రంత బృహదశ్వుండు నిజపుత్త్రుం గువలాశ్వుం బ్రాప్తసంతాను నత్యంతధర్మాన్వితు నఖిల మహీరాజ్యభార ధౌరేయుంగా నభిషేకించి, తపోవనంబునకుం బోవ సమకట్టి, యయోధ్యానగరంబు వెలువడు నవసరంబున నవ్వార్త విని యుదంకుండు సనుదెంచి బృహదశ్వున కిట్లనియె. 380**

**ప్రతిపదార్థం:** ఆ+కువలాశ్వునకున్; అఖిల+అస్త్ర+శస్త్ర, విద్యా, విశారదులు= అన్నిమంత్రబాణాలకు, ఆయుధాలకు సంబంధించిన చదువులలో నేర్పరులు; అధిక, సత్త్వ, సంపన్నులు+ఐన= గొప్పబలం అనెడి సంపద కలవారలును అయిన; పుత్త్రులు= కొడుకులు; ఏకవింశతి సహస్రంబులు= ఇరువదియొక్క వేలమంది; పుట్టిరి= జన్మించారు; అంతన్= పిదప; బృహదశ్వుండు; తనపుత్త్రున్= తనకొడుకును; కువలాశ్వున్= కువలాశ్వుడిని; ప్రాప్తసంతానున్= పొందిన బిడ్డలు కలవాడిని; అత్యంతధర్మ+ అన్వితున్= మిక్కిలి గొప్పదైన ధర్మంతో కూడినవాడిని; అఖిల, మహీ, రాజ్య, భార, ధౌరేయున్+కాన్= సమస్తమైన భూమిని పరిపాలించే బరువును మోసే వాడినిగా; అభిషేకించి= పట్టంగట్టి; తపస్+వనంబునకున్= తపస్సు చేసికొనే అడవికి; పోవన్, సమకట్టి= వెళ్ళటానికి ఉద్యమించి; అయోధ్యా, నగరంబు= అయోధ్యఅనేపట్టణం; వెలువడు, అవసరంబునన్= బయలువెడలే సమయంలో; ఆ+వార్త= ఆసమాచారం; విని= ఆలకించి; ఉదంకుండు; చనుదెంచి= వచ్చి, బృహదశ్వునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ కువలాశ్వ మహారాజుకు ఇరువదియొక్కవేలమంది కొడుకులు పుట్టారు. వారు అందరు మిక్కిలి బలం కలవారు. అస్త్ర శస్త్రాలకు సంబంధించిన విద్యలలో ఆరితేరినవారు, సంతానవంతుడు, మిక్కిలి ధర్మాత్ముడు అయిన కువలాశ్వుడికి పట్టంగట్టి, సమస్తభూమండల సామ్రాజ్యాన్ని పరిపాలించేబరువు బాధ్యతలను ఆతడిపై

మోపి, అతడితండ్రి అయిన బృహదశ్వుడు తపోవనానికి పోవటానికి ఉత్సహించాడు. ఆ సమాచారం తెలిసికొని అయోధ్యానగరానికి వచ్చి, ఉదంకుడు ఆ మహారాజుతో ఇట్లా పలికాడు.

**ఉ. 'నీవు ప్రజాభిరక్షణము నెమ్మి నొనర్పు; మరణ్య భూమికిం**
**బోవఁగ నేల? రాజులకు భూప్రజఁ గాచుటఁ బోలు; ధర్మువుల్**
**భూవర! కల్గునే యడవిఁ బోయి వసించినఁ గాని కాదె? ర**
**క్షావిధిఁ గాదె సద్గతులు గాంచిరి తొల్లిటి రాజముఖ్యులున్. 381**

**ప్రతిపదార్థం:** భూవర!= భూమికి భర్తవైన ఓరాజా!; ప్రజా+అభిరక్షణము= ప్రజలను బాగా కాపాడటం; నెమ్మిన్= ప్రీతితో; ఒనర్పుము= చేయుము; అరణ్య, భూమికిన్= అడవినేలకు; పోవఁగన్+ఏల= పోవటం ఎందుకు; రాజులకున్= ప్రభువులకు; భూ, ప్రజన్= భూమిపై నివసించే జనులను; కాచుటన్+పోలు= కాపాడటంతో సమానమైన; ధర్మువుల్= ధర్మాలు; కల్గును+ఏ= ఉండునా; అడవిన్+పోయి= అడవిలోకి వెళ్ళి; వసించినన్+కాని= నివసించినగాని; కాదు+ఎ?= సరిపడదా?; తొల్లిటి= పూర్వకాలంలోని; రాజముఖ్యులున్= ప్రభువులలో ఎన్నదగినవారలును; రక్షా, విధిన్+కాదు+ఎ= (ప్రజలను) కాపాడే కర్తవ్యాన్ని నెరవేర్చుటచేతనే కదా; సత్+గతులు= మంచిపుణ్యాన్ని కలిగించే తెన్నులు; కాంచిరి= పొందారు.

**తాత్పర్యం:** 'ఓ బృహదశ్వమహారాజా! నీవు ప్రీతితో నీరాజ్యంలోని ప్రజలను రక్షించుము. అడవికి పోయి తపస్సు చేయటంవలననే పుణ్యం వస్తుందా? రాజుల కర్తవ్యం ప్రజలను కాపాడటమే. అదే వారి పరమధర్మం. ఆ ధర్మాన్ని నెరవేర్చటం అడవిలో ఒనగూడుతుందా? పూర్వకాలంలో గొప్పరాజులు ప్రజలను రక్షించే ధర్మాన్ని నెరవేర్చటం వలననే కదా పుణ్యాన్ని ఆర్జించారు.

**క. నీ రక్షణంబుకతమున । ధారుణి మముబోఁటి సాధుతపసులు నిత్య**
**ప్రారంభధర్మకర్మో । ద్ధారు లగుట; యదియు నీదు ధర్మువు గాదే! 382**

**ప్రతిపదార్థం:** నీ రక్షణంబు కతమునన్= నీవు కాపాడుతూ ఉండటం మూలంగా; ధారుణిన్= భూమిపై; మముబోఁటి= మావంటి; సాధు, తపసులు= సౌమ్యశీలం గలిగి తపస్సు చేసికొనేవారు. నిత్య, ప్రారంభ, ధర్మ, కర్మ, ఉద్ధారులు+అగుట= ప్రతి దినము మొదలుపెట్టి చేసే ధర్మంతో కూడియున్నకర్మలునెరవేర్చేవారు కావటం; అదియున్= ఆవిధంగా జరగటమున్నూ; నీదు, ధర్మువు= నీయొక్క ధర్మం; కాదు+ఏ= కదా!

**తాత్పర్యం:** నీవు కాపాడుతూ ఉండటంచేతనే సాధువులైన మావంటితపస్వులు నిత్యంభూమిమీద తమ తమ ధర్మకర్మలు యథావిధిగా నెరవేర్చగలుగుతున్నారు. ఇదికూడా నీ కర్తవ్యమే కదా.

**వ. విను మొక్కయద్భుతంబు సెప్పెదఁ; దొల్లి మధుకైటభు లనం బ్రఖ్యాతు లైన యసురులతనయుండు ధుంధుం డనువాఁడు మహాబలపరాక్రమ సంపన్నుండు నిజతపోబలంబునం బితామహువలన వరంబు వడసి, దేవదానవ గంధర్వాదులకు నజయ్యుం డై చరియించుచుండు; నయ్యసుర యిపుడు మదీయాశ్రమ సమీపంబున బహుయోజనవిస్తీర్ణం బగు సముద్రవాలుకాపులినతలంబునందు మహావివరంబు గావించుకొని సుఖంబున నిద్రించుచున్నవాఁడు; వాలుకాంతరితశరీరుండైన వాని నిశ్వాసపవనంబు**

**ధూమదహనజ్వాలాభీలం బయి సంవత్సరంబున కొక్కమాటు వెలువడి భూనభోంతరంబెల్లను నిరంతరసికతారజఃపటలంబుమాఁటుకొనంజేయుఁ; దదీయ వేగంబునఁ దత్సమీప భూమి శైలకాననంబు లేడు దినంబులదాఁకఁ గంపించుచుండు; నిట్టి దారుణత్వంబుకతంబున మాకు మా యాశ్రమంబున నుండుట సంకటంబు; గావున నద్దురాత్ము వధియించి మాకును లోకంబులకును హితంబు సేసి కృతకృత్యుండవై మఱి తపోవనంబున కరుగుము. 383**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకింపుము; ఒక్క= ఒక్క; అద్భుతంబు= అచ్చెరువు; చెప్పెదన్= చెప్పుతాను; తొల్లి= పూర్వకాలంలో; మధు, కైటభులు+అనన్= మధువు కైటభుడు అనే పేళ్లమీద; ప్రఖ్యాతులు+ఐన= పేరుకెక్కిన; అసురుల= రాక్షసుల యొక్క; తనయుండు= కొడుకు; ధుంధుండు+అనువాఁడు= ధుంధుడు అనేపేరు కలవాడు; మహా, బల, పరాక్రమ, సంపన్నుండు= గొప్పదైన బలం శౌర్యం అనే సంపద కలవాడు; నిజ, తపస్+బలంబునన్= తనయొక్క తపస్సు యొక్క శక్తిచొప్పున; పితామహువలనన్= బ్రహ్మదేవుడివలన; వరంబు= వలసినకోరిక; పడసి= సంపాదించి; దేవ, దానవ, గంధర్వ+ఆదులకున్= దేవతలు, రాక్షసులు, గంధర్వులు మున్నగువారలకు; అజయ్యుండు+ఐ= జయింప నలవిగానివాడై; చరియించుచుండున్= తిరుగుతుంటాడు; ఆ+అసుర= ఆరాక్షసుడు; ఇపుడు; మదీయ+ఆశ్రమ, సమీపంబునన్= నా ఆశ్రమానికి దగ్గరగా; బహుయోజనవిస్తీర్ణంబు+అగు= పెక్కు ఆమడల వైశాల్యంగల; సముద్రవాలుకాపులినతలంబునందున్= కడలిగట్టున ఉండే ఇసుకతిన్నెల చోటులందు; మహా, వివరంబు= గొప్పదైన సొరంగాన్ని; కావించుకొని= నిర్మించుకొని; సుఖంబునన్= హాయిగా; నిద్రించుచున్నవాఁడు= నిదురపోతున్నాడు; వాలుకా+అంతరిత, శరీరుండు+ఐన= ఇసుకతిన్నెలో దూరిఉన్న శరీరము కలవాడైన; వాని నిశ్వాసపవనంబు= వాడు పీల్చిన పిమ్మట మరల బయటికి విడిచేగాలి; ధూమదహనజ్వాలా+ఆభీలంబు+అయి= పొగతోకూడిన అగ్నిశిఖలచే భయంకరమైనదై; సంవత్సరంబునకున్+ ఒక్కమాటు= ఏటేట ఒకసారి; వెలువడి= బయటికి వ్యాపించి; భూ, నభస్+ అంతరంబు+ఎల్లన్= భూమికి ఆకసానికి నడుమ ఉండే అవకాశమంతటికిని; నిరంతర, సికతా, రజస్+పటలంబు= ఎల్లప్పుడున్నూ ఇసుకధూళి; మాఁటుకొనన్+చేయున్= కప్పేటట్లు చేయును; తదీయవేగంబునన్= ఆ(ఇసుకదుమ్ము) తీవ్రతకు; తద్+సమీప, భూమి, శైల, కాననంబులు= అక్కడికి చేరువగా ఉన్ననేల, కొండలు, అడవులు; ఏడుదినంబుల దాఁకన్= ఏడురోజులవరకును; కంపించుచుండున్= వణకిపోతూ ఉంటాయి; ఇట్టి= ఇటువంటి; దారుణత్వంబుకతంబునన్= భయంకరమైన సంఘటనవలన; మాకున్= మాకు; మా+ఆశ్రమంబునన్= మా ఆశ్రమంలో; ఉండుట= నివసించటం; సంకటంబు= కష్టం; కావునన్= కాబట్టి; ఆ+దురాత్మున్= ఆ దుష్టుడిని; వధియించి= చంపి; మాకును= (నాకును, మా ఆశ్రమవాసులకును); లోకంబులకును= జగత్తులకును; హితంబు+చేసి= మేలు ఒనగూర్చి; కృతకృత్యుండవు+ఐ= చేయవలసిన పనిని చేసినవాడవై; మఱి= తదుపరి; తపస్+వనంబునకున్= తపస్సు చేసికొనే అడవికి; అరుగుము= వెడలుము.

**తాత్పర్యం:** అచ్చెరువును గూర్చు ఒకవింతను వివరించి చెప్పుతాను వినుము. పూర్వకాలంలో మధుకైటభులు అనేపేర్లతో ప్రసిద్ధికెక్కిన రాక్షసుల కుమారుడు ధుంధుడు అనేవాడు గొప్పబలం కలవాడు. గొప్పశౌర్యంగలవాడు. అతడు గొప్పతపస్సుచేసి బ్రహ్మదేవుడిని మెప్పించి వరం సంపాదించాడు. అందుచేత అతడు దేవతలను రాక్షసులను గంధర్వులను లెక్కపెట్టక విహరించాడు. అతడిని ఎవరూ గెలువలేకపోయారు. ఆ రాక్షసుడు ఇప్పుడు మాఆశ్రమానికి దగ్గరగా, మిక్కిలి విశాలాలైన కడలి ఇసుకమేటలలో ఒక పెద్ద సొరంగం ఏర్పరచుకొని హాయిగా నిదురిస్తున్నాడు. ఇసుకతిన్నెలలో ఉన్న అతడి శరీరం నుండి అతడు పీల్చిన పిమ్మట బయటకు వదిలే పెనుగాలి, పొగతో గూడిన అగ్నిశిఖలచే భయంకరంగా సంవత్సరానికి ఒకసారి వెలువడి దగ్గరగా ఉన్న కొండలు అడవులు ఇసుకదుమ్ముచేత

మాటువడేటట్లు చేస్తూ ఉంటుంది. అట్లా ఏడురోజులు ఎడతెగక ఆ దారుణవాయువులు చెలరేగుతుంటాయి. అందుచేత మాకూ, మాఆశ్రమంలో ఉన్నవారికీ మిక్కిలి కష్టంగా ఉన్నది. కాబట్టి నీవు ఆ దుర్మార్గుడిని సంహరించి మాకే కాక ఇతరులకుగూడ మేలు చేసి, ధన్యాత్ముడవై పిదప తపోవనానికి వెళ్ళుము.

**తే.** **'ఎవ్వఁ డమ్మహాసురు వధియించు పనికిఁ। బూను నతనికి నాత్మీయభూరిశక్తి**
**యిచ్చి జయ మిత్తు' నని యానతిచ్చె నధిప! యాదరంబున నాకుఁ జక్రాయుధుండు.** **384**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓరాజా!; ఎవ్వఁడు; ఆ+మహాసురున్= ఆ గొప్ప రక్కసుడిని; వధియించుపనికిన్+పూనున్= సంహరించే కార్యానికి పూనుకొంటాడో; అతనికిన్= అట్టివాడికి; ఆత్మీయభూరిశక్తి= నాదైన గొప్పబలం; ఇచ్చి= ఒసగి; జయము= గెలుపు; ఇత్తును= ఇస్తాను; అని= అని పలికి; చక్ర+ఆయుధుండు= చక్రం ఆయుధంగా గల విష్ణుదేవుడు; ఆదరంబునన్= అభిమానం చూపుతూ; నాకున్= నాకు; ఆనతి+ఇచ్చెన్= ఆజ్ఞ ఇచ్చాడు.

**తాత్పర్యం:** ఓ మహారాజా! 'ఆ గొప్ప రాక్షసుడైన ధుంధువును వధించే పనికి ఎవ్వడు పూనుకొంటాడో, అట్టివాడికి నాశక్తిసామర్థ్యాలనిచ్చి అతడికి విజయం చేకూర్చగల' నని, మిక్కిలి అభిమానంతో విష్ణుదేవుఁడు నాకు సెలవిచ్చాడు.

**వ.** **కావున.** **385**

**తాత్పర్యం:** కాబట్టి.

**చ.** **'అతులితవిష్ణుశక్తిసముపాహితమూర్తివి గమ్ము లెమ్ము! సం**
**తతభుజశక్తి నిట్టి యవధాన మొనర్పఁగ నీవ కాని యీ**
**క్షితి నితరుండు లేఁ; డధికకీర్తియుఁ బుణ్యముఁ జేరు నిన్ను; నూ**
**ర్జితగుణ! యింతవట్టుఁ దగఁ జేయుము; గావుము లోక మంతయున్.'** **386**

**ప్రతిపదార్థం:** ఊర్జితగుణ!= గొప్పవైన మంచిలక్షణాలు కలవాడా!; అతులిత విష్ణుశక్తి సముపాహితమూర్తివి+కమ్ము= సాటిలేనట్టి విష్ణువుయొక్క బలంచేత ఆరోపించబడిన ఆకృతి కలవాడవు అగుము; లెమ్ము= మేలుకొనుము; సంతతభుజశక్తిన్= ఎల్లప్పుడు ఉండే పరాక్రమంచేత; ఇట్టి= ఇటువంటి; అవధానము+ఒనర్పఁగన్= ఏకాగ్రతతో కూడిన ఘనకార్యం చేయటానికి; ఈక్షితిన్= ఈభూమిపై; ఈవు+అ+కాని= నీవే తప్ప; ఇతరుండు= మఱిఒకడు; లేఁడు= ఉండడు; అధిక, కీర్తియున్= మిక్కుటమైన కీర్తియు; పుణ్యమున్= సుకృతమూ; నిన్నున్+చేరున్= నిన్ను పొందుతాయి; లోకము+అంతయున్= జగత్తునంతటిని; కావుము= రక్షించుము; ఇంత+పట్టున్= ఈ మేరకైన పనిని; తగన్= ఒప్పునట్లుగా; చేయుము= ఆచరించుము.

**తాత్పర్యం:** 'గొప్పవైన మంచి లక్షణాలతో విలసిల్లే ఓ బృహదశ్వమహారాజా! నీవు మేలుకొనుము; విష్ణువుయొక్క బలం సాటిలేనిది, అట్టిశక్తి నిన్ను ఆవహిస్తుంది; ఎల్లప్పుడు ప్రజ్వలించే శౌర్యసాహసాలతో కూడిన ఇట్టి ఘనకార్యం ఈభూలోకంలో నీవు తప్ప ఇంకెవ్వరు నెరవేర్చగలరు? కాబట్టి ఈ లోకాన్నంతటిని కాపాడుము. నీకు గొప్పపుణ్యం చేకూరగలదు. నీకు నిరుపమానమైన యశస్సు లభిస్తుంది.'

**వ.** **అనినం గృతాంజలి యై యుదంకునకు బృహదశ్వుం డి ట్లనియె.** **387**

**తాత్పర్యం:** అని అనగా బృహదశ్వుడు చేతులుజోడించి ఉదంకుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'విమలమతి నస్త్రసన్న్యా । సము సేసితిఁ, దప మొనర్ప సమకట్టితి, నిం**
**క మునీంద్ర! తపోవనగమ । నము దప్పదు నాకు; వినుము నా విన్నపమున్. 388**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్ర!= మునులలో ఇంద్రుడివంటివాడా!; విమల, మతిన్= కల్మషం లేని బుద్ధితో; అస్త్రసన్న్యాసము+ చేసితిన్= మంత్రబాణాలను వదలిపెట్టాను; తపము+ఒనర్పన్, సమకట్టితిన్= తపస్సు చేయటానికై పూనుకొన్నాను; ఇంకన్= ఇంకమీద; తపస్+వన, గమనము= తపస్సు కొరకు అడవికి వెడలటం; నాకున్; తప్పదు= తప్పించుకొనరానిది; నావిన్నపమున్= నావిజ్ఞప్తిని; వినుము.

**తాత్పర్యం:** 'మునులలో శ్రేష్ఠుడవైన ఓ ఉదంకమహర్షీ! నా విన్నపం వినుమని ప్రార్థిస్తున్నాను. ఎట్టి కాలుష్యం లేని మంచి మనసుతో నేను అస్త్రసన్న్యాసం చేసి ఉన్నాను. ఇంక ఆయుధాలను ముట్టను. తపస్సు చేయటానికై వ్రతాన్ని పూనాను. ఇక తపోవనానికి వెడలటం నాకు తప్పనిసరి అయింది.

**చ. అనఘుఁడు మత్సుతుండు గువలాశ్వుఁడు వీఁడె మహాబలుండు స**
**జ్జనహితకారి ధైర్యనిధి సంభృతకీర్తి భవత్ప్రియార్థ మై**
**జననుత! యమ్మహాసురునిఁ జంపుట కోపు నవార్యశౌర్యవ**
**ర్ధనులగుచున్న పుత్త్రులును దాను నభేద్యభుజావిభూతితోన్. 389**

**ప్రతిపదార్థం:** జననుత= ప్రజలచేత పొగడబడినవాడా!; అనఘుఁడు= పాపరహితుడు; మత్+సుతుండు= నాకొడుకు; కువలాశ్వుఁడు; వీఁడు+ఎ= ఇదిగోవీడే; మహా, బలుండు= గొప్ప బలం కలవాడు; సత్+జన, హితకారి= మంచివారలకు మేలు చేసేవాడు; ధైర్య, నిధి= దీమసం ప్రోగైన నెలవు; సంభృతకీర్తి= నిండైన కీర్తి కలవాడు; భవత్+ప్రియ+అర్థము+ఐ= నీకు ఇష్టం కలిగించటంకొరకై; తానును= కువలాశ్వుడును; అవార్య, శౌర్య, వర్ధనులు+అగుచున్న= వారించటానికి వీలు లేకుండగా విలసిల్లే శూరత్వంతో పెంపొందుతున్న; పుత్త్రులును= కొడుకులును; (కువలాశ్వుడి పుత్రులును); అభేద్య, భుజా, విభూతితోన్= భేదింపరాని, పరాక్రమసంపదతో; ఆ+మహా+అసురునిన్= ఆ గొప్పరక్కసుడిని; చంపుటకున్= సంహరించటానికి; ఓపున్= చాలును.

**తాత్పర్యం:** జనులచేత పొగడబడిన ఓ ఉదంకమహర్షీ! నాకుమారుడు కువలాశ్వుడు పుణ్యాత్ముడు, గొప్పబలవంతుడు. చూడుము. ఒక్కడే చాలు. మంచివారలకు మేలొనగూర్చేవాడు. ఇతడు ధైర్యసాహసాలు గలవాడు. గొప్ప పేరు ప్రతిష్ఠలు ఆర్జించినవాడు. ఇతని పుత్రులు మొక్కవోని శౌర్యసంపద గలవారు. కువలాశ్వుడును, అతని కొడుకులును అప్రతిహతశౌర్యంతో ఆ రక్కసుడిని వధించి నీఅభీష్టం నెరవేర్చగలరు.

**వ. నాకుం దపంబున కనుజ్ఞ యీవలయు' నని పలికి యక్కార్యంబునకుఁ బుత్త్రు సమర్పించి యమ్మునిచేత నభినందితుండై బృహదశ్వుండు దపోవనంబునకరిగె' ననిన విని ధర్మనందనుండు, మార్కండేయుతో 'ధుంధుండు మధుకైటభులపుత్త్రుండని చెప్పితి; రమ్మధుకైటభు లెక్కాలంబువా? రేమి యై?' రని యడిగిన నతం డి ట్లనియె. 390**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; తపంబునకున్= తపస్సుకు; అనుజ్ఞ= అనుమతి; ఈవలయున్= ఇయ్యవలెను; అని పలికి= అని చెప్పి; ఆ+కార్యంబునకున్= ఆ పనికి; పుత్త్రున్= కొడుకును; సమర్పించి= ఒసగి (నియోగించి), ఉదంకునకు ఒప్పగించి;

ఆ మునిచేతన్= ఆ ఉదంకమహర్షిచేత; అభినందితుండు+ఐ= పొగడబడినవాడై; బృహదశ్వుండు; తపస్+వనంబునకున్= తపస్సు చేసికొనే అడవికి; అరిగెన్= వెళ్ళాడు; అనినన్= అనిచెప్పగా; విని= ఆలకించి; ధర్మనందనుండు= ధర్మరాజు; మార్కండేయునితో; ధుంధుండు; మధుకైటభుల పుత్త్రుండు+అని= మధుకైటభులయొక్క కొడుకు అని; చెప్పితిరి; ఆ మధుకైటభులు; ఏ+కాలంబు, వారు= ఏకాలానికి చెందినవారు; వారు+ఏమి+ఐరి= వారు ఏవిధంగా పరిణమించారు; అని అడిగినన్= అని ప్రశ్నించగా; అతండు= మార్కండేయుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** నాకు తపస్సు చేసికొనటానికి దయచేసి అనుమతి ప్రసాదింపుము. మీరు కోరిన పనికి నాకుమారుడిని నియోగించి మీకు ఒప్పగించాను' అని బృహదశ్వుడు చెప్పాడు. ఉదంకుడు సంతోషించి బృహదశ్వుడిని అభినందించాడు. అతడు తపోవనానికి వెళ్ళాడు. ఆవృత్తాంతం విని ధర్మరాజు 'ధుంధుడు మధుకైటభుల కుమారుడని తాము చెప్పియుంటిరికదా! వారు ఏకాలానికి చెందినవారు? వారిగతి చివర కేమైనది?' అని ప్రశ్నించగా, మార్కండేయ మహాముని ఈవిధంగా చెప్పాడు.

### మార్కండేయుఁడు ధర్మరాజునకు మధుకైటభుల చరిత్రము సెప్పుట (సం. 3-194-13)

**సీ.** **'అధిప! తొల్లి జగత్త్రయంబు నేకార్ణవ । మై యుండఁగా నప్డు హరి యొకండ**
**భాసుర భోగీంద్రపర్యంకమున భవ్య । యోగనిద్రాసుఖయుక్తి నలర**
**నతిదీర్ఘమగు కాల మరిగెఁ; బదంపడి । దైత్యు లిద్దఱు మహోదాత్తబలులు**
**మధుకైటభులు నాఁగ మథితశాత్రవు లేఁగు । దెంచి యప్పరమాత్ము దివ్యనాభి**

**ఆ.** **కమలమున వెలుంగు కమలాసనునిఁ గని । దర్పదోషనిహతిఁ దలర వ్రేయ,**
**నతఁడు భీతి నొంది యాక్రోశ మొనరించె । 'నాదిపురుష! నన్ను నరయు' మనుచు.** **391**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! (ధర్మరాజా!); తొల్లి= పూర్వకాలంలో; జగత్+త్రయంబున్= జగత్తులు మూడును; ఏక+అర్ణవము+ఐ+ఉండఁగాన్= ఒకే సముద్రమై ఉండగా; అప్డు= అప్పుడు; హరి= విష్ణువు; ఒకండు+అ= ఒక్కడే; భాసుర, భోగి+ఇంద్ర, పర్యంకమునన్= ప్రకాశించే పాములరేడు శయ్యగా ఉండగా; భవ్య, యోగ, నిద్రా, సుఖ, యుక్తిన్= శుభమైన యోగంవలన చేకూరినట్టిది అయిన నిద్రవలన ఏర్పడిన సౌఖ్యంతో కూడి; అలరన్= ఒప్పగా; అతి, దీర్ఘము+అగు= చాల నిడివి గల; కాలము+అరిగెన్= కాలం కడచింది; పదంపడి= పిమ్మట; దైత్యులు= రాక్షసులు; ఇద్దరు= ఇరువురు; మహా+ఉదాత్త, బలులు= మిక్కిలిగొప్పదైన శక్తికలవారు; మధుకైటభులు; నాఁగన్= మధుకైటభులు అనగా; మథితశాత్రవులు= మథించబడిన శత్రువులుకలవారు; ఏఁగుదెంచి= వచ్చి; ఆ+పరమ+ఆత్ము= ఆ దేవదేవుడియొక్క; దివ్యనాభికమలమునన్= దివ్యమైన బొడ్డుతామరలో; వెలుంగు= ప్రకాశించే; కమల+ఆసనునిన్= బ్రహ్మదేవుడిని, (తామరపువ్వు ఆసనంగా కలవాడిని); కని= చూచి; దర్పదోషనిహతిన్= గర్వం వలన ఏర్పడిన తప్పుయొక్క తాకిడితో; తలరన్= కలుగునట్లుగా; వ్రేయన్= కొట్టగా; అతఁడు= (బ్రహ్మదేవుడు); భీతిన్+ఒంది= భయంచెంది; ఆదిపురుష!= మొదటి పురుషుడా! - ఓ పరమాత్మా!; నన్నున్= నన్ను (బ్రహ్మదేవుడిని); అరయుము= చూడుము; అనుచున్= అని పలుకుతూ; ఆక్రోశము+ఒనరించెన్= పెద్దపెట్టున ఏడ్చాడు;

**తాత్పర్యం:** 'ఓధర్మరాజా! పూర్వకాలంలో మూడులోకాలున్నూ ఒకేఒక మహాసముద్రంగా ఏర్పడి ఉండగా, అప్పుడు ఆ విష్ణుమూర్తి ఒక్కడే ఆదిశేషుడిమీద పవ్వళించి యోగనిద్రాముద్రలో సౌఖ్యతన్మయుడై ఉండగా చాలాకాలం

గడచింది. పిదప, మధుకైటభులు అనే పేర్లుగల ఇద్దరు రాక్షసులు మిక్కిలి గొప్ప బలంగలవారై, ఎందరో శత్రువులను నిర్మూలించినవారై వచ్చి, విష్ణుమూర్తినాభిలో విలసిల్లే కమలంలో ఉన్న బ్రహ్మదేవుడిని గర్వంతో కొట్ట నారంభించారు. అప్పుడు బ్రహ్మ 'ఓ ఆదిదేవా! రక్షించు' మంటూ పెద్దపెట్టున ఏడ్చాడు.

**ఉ.** **ఆ తెఱఁ గాత్మఁ గాంచి కమలాక్షుఁడు మేల్కని ఘోరవిక్రమో**
**పేతుల దైత్యసింహుల నపేతభయాత్ములఁ జూచి 'మీర లి**
**ట్లీతని నుక్కునం బఱుప నేల? భవద్బలశౌర్యయుక్తికిం**
**బ్రీతుఁడ నైతిఁ; జెచ్చెర నభీష్టవరంబులు వేఁడుఁ డిచ్చెదన్.'** **392**

**ప్రతిపదార్థం:** ఆ, తెఱఁగు= ఆ రీతిని; ఆత్మన్+కాంచి= తనమనస్సులో గ్రహించి; కమల+అక్షుఁడు= పద్మాలవంటి కన్నులు కలవాడు- విష్ణుమూర్తి; మేల్కని= నిద్రనుండి లేచి; ఘోర, విక్రమ+ఉపేతులన్= భయంకరమైన పరాక్రమంతో కూడినవారిని; దైత్యసింహులన్= రాక్షసులలో సింహాలవంటివారిని; అపేత, భయ+ఆత్ములన్= పోయినట్టి భయంగల ఆత్మలు కలవారిని; చూచి; మీరలు= మీరు(మధుకైటభులు); ఇట్లు= ఈవిధంగా; ఈతనిన్= (ఈ బ్రహ్మదేవుడిని); ఉక్కునన్= శౌర్యంతో; పఱుపన్+ఏల= బాధించటం ఎందుకు; భవత్+బల, శౌర్య, యుక్తికిన్= మీ శక్తిపరాక్రమాల కూడికకు; ప్రీతుఁడన్+ఐతిన్= సంతోషించినవాడను అయినాను; చెచ్చెరన్= శీఘ్రంగా; అభీష్టవరంబులు= ఇష్టమైన కోరికలు; వేఁడుఁడు= కోరుకొనండి; ఇచ్చెదన్= ఇస్తాను.

**తాత్పర్యం:** మధుకైటభుల అత్యాచారం ఆత్మలో గ్రహించి విష్ణుమూర్తి యోగనిద్రనుండి మేలుకొన్నాడు. దారుణమైన పరాక్రమంచేత భయం లేకుండా విర్రవీగుతున్న రాక్షసులు సింహసదృశులు విష్ణుమూర్తికి కన్పించారు. అంతట విష్ణుదేవుడు వారలతో, 'నేను మీ ధైర్యసాహసాలకు శౌర్యానికి సంతోషించాను. మీరు కోరిన వరాలు ఇవ్వగలను; శీఘ్రంగా వేడండి' అని అన్నాడు.

**తే.** **అనినఁ గలకల నవ్వి యయ్యసురవరులు । 'నీవు మా కేమి యిచ్చెదు? నీకు నేము**
**వరము లిచ్చెద మడుగుము వలచితేని' । ననిన వారల కిట్లను నవ్విభుండు.** **393**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+అసురవరులు= ఆ రాక్షసశ్రేష్ఠులు; నీవు= నీవు (ఓవిష్ణుదేవా); మాకున్+ఏమి+ఇచ్చెదు= (మాకు ఏమి ఇస్తావు); నీకున్ (విష్ణుదేవుడికి); ఏము= (మధుకైటభులం); వరములు+ఇచ్చెదము= వలసిన కోరికలు ఇస్తాము; వలచితి+ఏనిన్= ఇష్టపడితే; అడుగుము= కోరుకొనుము; అనినన్= అని చెప్పగా; ఆ+విభుండు= ఆ ప్రభువు (విష్ణుదేవుడు); వారలకున్= (మధుకైటభులకు); ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** విష్ణుదేవుడిమాటలు విని మధుకైటభులు కలకలనవ్వి ఇట్లా చెప్పారు 'ఓ విష్ణుదేవా! నీవా మాకు వరాలు ఇచ్చేవాడివి? నీ వరాలు మా కేమీ వద్దు. నీకే మేము వరం ఇవ్వగలం. కావలసివస్తే అడుగుము'. అంతట విష్ణుదేవుడు ఇట్లా బదులు పలికాడు.

**క.** **'సత్యవ్రతులార! వరం । బత్యంతప్రీతి మిమ్ము నడిగెద లోక**
**ప్రీత్యర్థముగా నాచే । మృత్యువునం బొందుఁ డిపుడ మీర లిరువురున్.'** **394**

**ప్రతిపదార్థం:** సత్యవ్రతులార!= సత్యాన్ని దీక్షతోపాటించే అసురులారా!; వరంబు= వలసినకోరిక; అతి+అంత, ప్రీతిన్= మిక్కిలివేడుకతో; మిమ్మున్ అడిగెదన్= మిమ్మల్ని అడుగుతాను; మీరలు ఇరువురున్= మీరు ఇద్దరున్నూ; లోక, ప్రీతి+అర్థముగాన్= లోకంలోని ప్రజలందరికి సంతసం కలగటం కొరకై; ఇపుడు+అ= ఈక్షణంలోనే; నాచేన్= నాచేతను; మృత్యువునన్+ పొందుఁడు= మరణించుడు.

**తాత్పర్యం:** 'ఆడినమాట తప్పక దీక్షతో పాటించే మధుకైటభులారా! మిక్కిలి వేడుకతో మిమ్మల్ని నేనే ఒక వరం కోరుతాను. లోకానికి మేలు కలగటం కొరకై మీరు ఇరువురున్నూ ఇప్పుడే నాచేత మరణించండి'.

**వ. అనిన వార లొండొరువుల మొగంబులు చూచికొని యా చక్రధరున కిట్లనిరి. 395**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; వారలు; ఒండు+ఒరువుల, మొగంబులు= వారలు (మధుకైటభులు) ఒకరి మొగాన్ని ఒకరు చూచికొని; ఆ చక్రధరునకున్= చక్రం ధరించే ఆ విష్ణువుకు; ఇట్లు+అనిరి= ఈవిధంగా అన్నారు.

**తాత్పర్యం:** అని విష్ణుదేవుడు ఆడిన మాటలు విని ఆ మధుకైటభులు ఇరువురూ ఒకరిమొగం ఒకరు చూచికొని ఆ విష్ణుదేవుడితో ఇట్లా బదులు పలికారు.

**చ. 'నగి నగి యేనియున్ విను జనార్దన! యెన్నఁడు బొంకు పల్కు; మ**
**త్యగణిత విక్రమోరుబలధైర్యసమగ్రుల; మెల్ల భంగిఁ గా**
**లగతి దొలంగఁ ద్రోవఁగఁ దలం బగునే? ; యగుఁ గాక! నీకు మె**
**చ్చుగ నిదె ప్రాణ మిచ్చెదము; స్రుక్కము చావున కాత్మ నేమియున్. 396**

**ప్రతిపదార్థం:** జనార్దన!= ఓవిష్ణుమూర్తీ!; విను; నగి= నగి+ఏనియున్= నవ్వులాట కొరకుకూడ; ఎన్నడున్= ఎన్నడున్నూ; బొంకు= అసత్యం; పల్కము= మాటాడం; అతి+అగణిత, విక్రమ+ఉరు, బల, ధైర్య, సమగ్రులము= మిక్కుటంగా లెక్క పెట్టజాలని శౌర్యంచేత గొప్పదైన శక్తితో దీమసంతో పరిపూర్ణుల మైన వారలం; ఎల్లభంగిన్= ఎన్ని విధాలనైనను; కాలగతిన్= కాలంయొక్క నడకను; తొలంగన్, త్రోవఁగన్= తొలగేటట్లుగా; త్రోసివేయటానికి; తలంబు+అగునే= శక్యం ఔతుందా; అగున్+కాక= నీకోరికనెరవేరుగాక!; నీకున్, మెచ్చుగన్= నీవు అభినందించేటట్లుగా; ప్రాణము+ఇచ్చెదము= ప్రాణం ఇస్తాం; చావునకున్= మరణానికి; ఆత్మన్+ఏమియున్= మనస్సునందు ఏమీ; స్రుక్కము= బాధపడం.

**తాత్పర్యం:** 'ఓ విష్ణుదేవా! మా ప్రతిన ఆలకింపుము. మేము నవ్వులాటకొరకైనా ఆడినమాట తప్పేవారం కాము. వర్ణనాతీతమైన గొప్పపరాక్రమం గలవారం. ధైర్యసాహసాలు గలవారం. ఎట్టివారికిని కాలగతిని మార్పుచేయటం శక్యమైన పనికాదు. ఆ మాటకేమి గాని, ఇప్పుడు నీకు ప్రీతి కలిగించేటట్లు మాప్రాణం ఇవ్వటానికి సంసిద్ధులం. మేము మనస్సులో కూడ ఎట్టి దుఃఖాన్ని పొందటం లేదుసుమా!

**ఆ. చంపెదేని మమ్ము జలములు లేని దే। శమునఁ జంపవలయుఁ గమలనాభ!**
**నిక్కమింత వట్టు; నీచేత మడియంగఁ। దగుదు' మనిన నగుచు నగధరుండు. 397**

**ప్రతిపదార్థం:** కమలనాభ!= తామరపువ్వు బొడ్డులో కలవాడా!, (ఓవిష్ణుదేవా!); మమ్మున్= (మా ఇరువురను- మధుకైటభులను); చంపెదు+ఏనిన్= సంహరిస్తే; జలములు= నీళ్ళు; లేనిదేశమునన్= లేనిచోటున; చంపవలయున్= సంహరించాలిసుమా;

నీచేతన్= నీచేత; మడియంగన్= చావగా; తగుదుము= ఒప్పుతాం; నిక్కము= నిజం; ఇంతవట్టు= ఇంతమేర; అనినన్= అని చెప్పగా; నగ ధరుండు= (కొండను ధరించినవాడు) విష్ణుదేవుడు; నగుచున్= పరిహసిస్తూ, నవ్వుతూ.

**తాత్పర్యం:** ఓవిష్ణుదేవా! నీవు మమ్ము చంపదలిస్తే నీరు లేనిచోట చంపాలి. ఇది మేము నిజంగా ఏర్పరచుకొన్న నియమం. నీవు ఈ నియమానికి లోబడితే నీచేత మేము చావటానికి సంసిద్ధంగా ఉన్నాం' -అని మధుకైటభులు అనగా, విష్ణుదేవుడు నవ్వుతూ.

**వ. త్రైలోక్యంబును జలమయం బగుట నాలోకించి. 398**

**ప్రతిపదార్థం:** త్రైలోక్యంబును= మూడు లోకముల మేరయును; జలమయంబు= నీటితో నిండటం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** మూడులోకాలున్నూ నీళ్లతో నిండిపోయి ఉండటం చూచి (గమనించి).

**క. పరమేశుఁడు దన యూరులు । పరపుగ నొనరించి వానిపైఁ దచ్ఛిరముల్**
**పరుషతరశితసుదర్శన । ఖరధారానిహతిఁ జేసి గ్రక్కునఁ దునిమెన్. 399**

**ప్రతిపదార్థం:** పరమ+ఈశుఁడు= దేవదేవుడైన విష్ణుమూర్తి; తన, ఊరులు= తనతొడలు; పరపుగన్= శయ్యగా; ఒనరించి= చేసి; వానిపైన్= (ఆ తొడలపై); తద్+శిరముల్= వారితలలు; పరుషతర, శిత, సుదర్శన, ఖర, ధారానిహతిన్+చేసి= మిక్కిలి కఠినమైన, వాడిఅయిన సుదర్శన మనే చక్రాయుధంయొక్క కరకుఅంచుల దెబ్బచేత; గ్రక్కునన్= వేగంగా; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** విష్ణుమూర్తి తన తొడలనే వేదికగా చేసి వారి తలలను వాటిపై ఉంచి, పరుషమైనదీ, వాడి అయినదీ అయిన సుదర్శన చక్రధారతో తెగనరికాడు.

**తే. పరఁగ నమ్మధుకైటభాసురులసుతుఁడు । సువ్వె ధరణీశ! ధుంధుఁడన్ శూరవరుఁడు**
**వాఁడు వరగర్వమునఁ జేసి వాఁడి మిగిలి । యమరపతిఁ దొట్టి వేల్పుల నభిభవించె'. 400**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= ఓరాజా, ధర్మరాజా!; ధుంధుఁడు+అన్, శూర, వరుఁడు= ధుంధుఁడు అనేపేరు గల వీరశ్రేష్ఠుడు; పరఁగన్= ఒప్పునట్లుగా; ఆ+మధుకైటభ+అసురుల, సుతుఁడు= ఆ మధుకైటభులు అనే రక్కసుల కుమారుడు; సువ్వె= సుమా; వాఁడు= (ఆధుంధుడు); వర, గర్వమునన్+చేసి= వరం పొందటంవలన ఏర్పడిన అహంకారంచేత; వాఁడి, మిగిలి= శౌర్యం అతిశయించి; అమరపతిన్+తొట్టి= దేవేంద్రుడు మొదలుకొని; వేల్పులన్= దేవతలను; అభిభవించెన్= అవమానించాడు.

**తాత్పర్యం:** 'ఓధర్మరాజా! ఆ మధుకైటభుల కొడుకే ధుంధుడు అనేశూరశ్రేష్ఠుడు. వరలాభంవలన ఏర్పడిన అహంభావంచేత శౌర్యం అతిశయించి, దేవేంద్రుడు మొదలైన దేవతల నందరినీ అవమానించాడు.'

**వ. అని చెప్పి యమ్మునీంద్రుం డి ట్లనియె: నట్లు బృహదశ్వుచేత ననుజ్ఞాతుండై కువలాశ్వుండు శుభదినంబున నుదంకపురస్సరంబుగాఁ గృతప్రస్థానుం డై. 401**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; ఆ+ముని+ఇంద్రుండు= మునులలో శ్రేష్ఠుడైనవాడు మార్కండేయుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు; అట్లు= ఆవిధంగా; బృహదశ్వుచేతన్= బృహదశ్వుడిచేత; అనుజ్ఞాతుండు+ఐ= ఆజ్ఞాపించబడినవాడై;

కువలాశ్వుండు= కువలాశ్వుడు; శుభ, దినంబునన్= మంచి రోజున; ఉదంకపురస్సరంబుగాన్= ఉదంకుడిని ముందు నిడుకొని; కృత, ప్రస్థానుండు+ఐ= చేయబడిన ప్రస్థానం కలవాడై అనగా దండయాత్రకు ఉపక్రమించి.

**తాత్పర్యం:** మార్కండేయమహర్షి ఇంకా ఈవిధంగా చెప్పాడు- ఆవిధంగా బృహదశ్వుడిచేత ఆజ్ఞాపించబడి అతడిపుత్రుడు కువలాశ్వుడు ఒకానొక శుభముహూర్తాన ఉదంకమహామునిని మార్గదర్శకుడిగా ముందు ఉంచుకొని దండయాత్రకు తరలి వెళ్ళాడు.

**తరలము.**

**దనుజనిర్మథనైకతత్పరతావిజృంభణ మొప్ప స**
**ద్వినుతతేజుఁడు ఘోరసంగరవిక్రమోత్సవలీలమై**
**ఘనభుజాబలభూరిదుర్వహగర్వసంగ్రహు లైన నం**
**దను లనేకసహస్రసంఖ్యులు దన్నుఁ గొల్వ నుదగ్రుఁడై. 402**

**ప్రతిపదార్థం:** సత్+వినుత, తేజుఁడు= మంచివారలచేత పొగడబడినప్రతాపం కలవాడు, కువలాశ్వుడు; దనుజ నిర్మథన+ఏక, తద్+పరతా, విజృంభణము+ఒప్పన్= రాక్షసులను ధ్వంసం చేయటంలో మాత్రమే కేంద్రీకరించబడి నిమగ్నమైన మోహరింపు విలసిల్లగా; ఘోర, సంగర, విక్రమ+ఉత్సవ, లీలమైన్= భయంకరమైన యుద్ధానికి సంబంధించిన శౌర్యంయొక్క ఆట మాదిరిగా; ఘన భుజాబల భూరి దుర్వహ గర్వ సంగ్రహులు+ఐన= గొప్పదైన బాహువులశక్తికి సంబంధించిన మిక్కుటమైన భరించటానికి శక్యంగాని అహంభావాన్ని చేర్చుకొనిన వారు ఐన - అనగా మిక్కుటమైన ధైర్యశౌర్యసాహసాలు కలవారైన; నందనులు= కొడుకులు; అనేక, సహస్ర, సంఖ్యులు= పెక్కువేలమంది; తన్నున్= తనను; కొల్వన్= ఆరాధించగా; ఉదగ్రుఁడు+ఐ= అతిశయించినవాడై.

**తాత్పర్యం:** మంచివారిచేత ప్రస్తుతించబడిన తేజస్సు కలవాడైన కువలాశ్వుడు, రాక్షసులను సంహరించవలెననే కుతూహలంతో దీక్షతో విజృంభించి, దారుణయుద్ధాన్ని పండుగవేడుకగా నిర్వహించే సంకల్పంతో, ధైర్యశౌర్యసాహసోపేతులైన కొడుకులు వెన్నంటి వస్తూ ఉండగా, దండయాత్రకు బయలుదేరాడు.

**విశేషం:** తరలవృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా న, భ, ర, స, జ, జ, గ - అనే గణాలు ఉంటాయి. 12వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది.

**మ. చతురంగధ్వజినీపదప్రవిహతిన్ సర్వంసహాచక్ర మా**
**తతకంపంబుగ నేఁగెఁ; నప్పుడు దగం దైత్యారి యారాజునం**
**దతులం బైన నిజాంశశక్తి సొనిపెన్; హర్షించి రింద్రాది దే**
**వతలున్ సన్మునిముఖ్యులున్ నృపతి కైశ్వర్యోన్నతిం జేయుచున్. 403**

**ప్రతిపదార్థం:** చతురంగ, ధ్వజినీ, పద ప్రవిహతిన్= నాలుగు అంగాలతో కూడిన సేనయందలి భటులయొక్క పాదాలతాకిడిచేత; సర్వం సహాచక్రము= సమస్తమైన భూమండలం, ఆతత, కంపంబుగన్= మిక్కుటంగా చలించేదిగా; (కువలాశ్వుడు) ఏఁగెన్= వెళ్ళాడు; అప్పుడు= ఆసమయంలో; తగన్= ఒప్పునట్లుగా; దైత్య+అరి= రాక్షసులకు శత్రు వైన విష్ణుమూర్తి; ఆ రాజునందున్= ఆ కువలాశ్వుడిలో; అతులంబు+ఐన= సాటిలేని; నిజ+అంశ, శక్తి= తనలో ఒకభాగమైన బలాన్ని; చొనిపెన్= చొప్పించాడు;

ఇంద్ర+ఆది, దేవతలున్= ఇంద్రుడు మొదలగు వేల్పులున్నూ; సత్+ముని, ముఖ్యులున్= గొప్పఋషులలో ప్రధానులైన వారలున్నూ; నృపతికిన్= రాజుకు - కువలాశ్వుడికి; ఐశ్వర్య+ఉన్నతిన్+చేయుచున్= సంపద పెంపొందేటట్లుగా చేస్తూ; హర్షించిరి= సంతోషించారు.

**తాత్పర్యం:** రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలాలు అనే నాలుగు అంగాలతో కూడిన సేనతో భూమండలం కంపించేటట్లుగా కువలాశ్వుడు దండు వెడలాడు. అప్పుడు రాక్షసులకు శత్రువైన విష్ణుదేవుడు తనశక్తిని కొంత ఆ రాజులో ప్రవేశపెట్టాడు. అందుకు దేవేంద్రుడు మున్నగు దేవతలున్నూ మునిశ్రేష్ఠులున్నూ సంతోషించారు. వారి ఆశీస్సులచేత కువలాశ్వుడు అభ్యున్నతి చెంది వెలుగొందాడు.

**ఆ. మొరసి దివ్యతూర్యములు నందనద్రుమ । సురభికుసుమవృష్టి గురిసెఁ గలయ**
**సప్రతీపభంగి యగు మందపవనవి । చేష్టితంబు గర మభీష్ట మయ్యె. 404**

**ప్రతిపదార్థం:** దివ్య, తూర్యములు= స్వర్గలోకంలోని మంగళవాద్యాలు; మొరసెన్= నినదించాయి; నందన, ద్రుమ, సురభి, కుసుమ, వృష్టి= నందనం, అనేపేరు గల ఉద్యానంలోని చెట్లయొక్క సువాసనతో కూడిన పూలవాన; కురిసెన్= వర్షించింది; కలయన్= చుట్టుపట్టుల వ్యాపించేటట్లుగా; అప్రతీపభంగి+అగు= అనుకూలంగా ఉన్న; మందపవన విచేష్టితంబు= మెలమెల్లగా వీచే పిల్లగాలుల ప్రసారం; కరము= మిక్కిలి; అభీష్టము+అయ్యెన్= ఇంపుగొలుపునట్టిది అయింది.

**తాత్పర్యం:** స్వర్గలోకంలోని మంగళవాద్యాలు నినదించాయి. నందనోద్యానంలోని చెట్లకు సంబంధించిన పూలవాన కురిసింది. అనుకూలమయిన పిల్లతెమ్మెరలు వీస్తూ ఇంపుగొలిపాయి.

**క. గగనమున సురవిమానము । లగణితముగఁ గ్రందుకొనియె; ననుకూలము లై**
**మృగపక్షిగతులు శోభన । మగు టేర్పడఁ జెప్పె నజ్జనాధిపుయాత్రన్. 405**

**ప్రతిపదార్థం:** ఆ+జన+అధిపు, యాత్రన్= ఆ రాజుయొక్క దండయాత్రలో; సుర, విమానములు= వేల్పుల విమానాలు; గగనమునన్= ఆకసంలో; అగణితముగన్= లెక్కకుమిక్కిలై; క్రందుకొనియెన్= గుమిగూడాయి. అనుకూలములు+ఐ= తగినవియై మృగపక్షిగతులు= జంతువులు పక్షులు సంచరించే విధానాలు; శోభనము+అగుట= మేలు చేకూరటాన్ని; ఏర్పడన్+చెప్పెన్= తేటతెల్లమయ్యేటట్లు సూచించాయి.

**తాత్పర్యం:** ఆరాజు దండయాత్రకు ఉపక్రమించినప్పుడు పెక్కుశుభశకునాలు తారసిల్లాయి. ఆకసంలో వేలుపుల విమానాలు గుమిగూడి కన్పించాయి. జంతువుల, పక్షుల సంచారం శుభం జరుగగలదనే సూచనలను తేటతెల్లం చేసింది.

**వ. ఇట్లు సని కువలాశ్వుండు సముద్రతీరంబున విడిసి నిజపుత్త్రుల నానాస్త్రశస్త్రజ్ఞుల ననేకసహస్ర సంఖ్యలగు వారల నవారితజవసత్త్వుల నవ్వాలుకాపులినఖననంబు సేయ నియోగించిన. 406**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; చని= వెడలి; కువలాశ్వుండు; సముద్రతీరంబునన్= కడలిఒడ్డున; విడిసి= తాత్కాలికంగా ఆగి; నిజపుత్త్రులన్= తనకొడుకులను; నానా+అస్త్ర, శస్త్రజ్ఞులన్= పెక్కురకాలైనమంత్రాయుధాలను, ఆయుధాలను ఎఱిగినవారలను; అనేక, సహస్ర, సంఖ్యలు+అగు, వారలన్= పెక్కువేలసంఖ్యకలవారిని; అవారిత, జవ, సత్త్వులన్= వారించటానికి వీలులేని

వేగం బలం కలవారిని; ఆ+వాలుకా, పులిన, ఖననంబు+చేయన్= ఆ ఇసుకతిన్నెలను త్రవ్వుపనిచేయటానికి; నియోగించినన్= ఏర్పాటుచేయగా.

**తాత్పర్యం:** ఈవిధంగా దండు వెడలిన కువలాశ్వుడు సముద్రతీరం చేరి, అక్కడ తాత్కాలికమైన శిబిరాలు నెలకొల్పాడు. పెక్కు అస్త్రాలు శస్త్రాలు ప్రయోగించటంలో నిపుణులైన తనపుత్రులను పెక్కువేలమందిని, ఆ కడలితీరంలో ఇసుకతిన్నెలను త్రవ్వటం కొరకై నియోగించాడు.

**మ. నరనాథోత్తము నందనుల్ గడఁగి నానా శూలకుద్దాల ము**
**ద్గర కాష్ఠాదుల నయ్యుదగ్రసికతౌఘంబంతయున్ సప్త వా**
**సరముల్ వాయక పాయ గ్రొచ్చి నడుమన్ సంసుప్తుఁడై యున్న యా**
**సురవైరిం గని రుగ్రనిశ్వసననిష్ఠ్యూతాగ్ని కీలావృతున్. 407**

**ప్రతిపదార్థం:** నరనాథ+ఉత్తము, నందనుల్= రాజులలో శ్రేష్ఠుడు అయిన కువలాశ్వుడియొక్క కొడుకులు; కడఁగి= పూని; నానాశూల కుద్దాల, ముద్గర, కాష్ఠ+ఆదులన్= పెక్కుబల్లాలు, గడ్డపారలు, సమ్మెటలు, కొయ్యమేకులు మున్నగు పరికరాలతో; ఆ+ఉదగ్ర+సికతా+ఓఘంబు+అంతయున్= దట్టమైన ఆ ఇసుక సముదాయాన్ని అంతటిని; సప్తవాసరముల్= ఏడునాళ్ళు, పాయక= విడువక; పాయగ్రొచ్చి= సొరంగంగా లోతుగా త్రవ్వి; నడుమన్= మధ్యభాగంలో; సంసుప్తుఁడు+ఐ+ఉన్న= నిదురపోయినవాడుగా ఉన్న- అనగా నిదురిస్తున్న; ఉగ్ర, నిశ్వసన, నిష్ఠ్యూత+అగ్ని, కీలా+ఆవృతున్= భయంకరమైన నిట్టూర్పులచేత వెలిగ్రక్కబడిన నిప్పులమంటలచే చుట్టుకొనబడిన వాడైన; ఆ, సుర, వైరిన్= ఆ రక్కసుడిని; కనిరి= చూచారు.

**తాత్పర్యం:** కువలాశ్వుడి కొడుకులు బల్లేలు, గునపాలు, సమ్మెటలు, కొయ్యమేకులు మున్నగు పరికరాలతో ఆ ఇసుకతిన్నెలను సొరంగంగా ఏడురోజులపాటు త్రవ్వారు. అక్కడ నిదురిస్తున్న రక్కసుడిని చూచారు. ఆ రాక్షసుడి ముఖంనుండి వేడినిట్టూరుపుగాలులు అగ్నిజ్వాలలతో కలిసి వెలువడి ఆ ప్రాంతాన్ని క్రమ్ముకొన్నాయి.

**చ. అడరి నిశాతపట్టిస గదాసి పరశ్వధశూలహస్తు లై**
**తడయక వార లందఱును దానవుదేహము వీఁక వ్రేసియుం**
**బొడిచియు నొంప నెంతయును బ్రొద్దున కయ్యసురాధముండు బి**
**ట్టొడలు గదల్చి నీల్గి వివృతోగ్రముఖుం డయి యావులించినన్. 408**

**ప్రతిపదార్థం:** అడరి= విజృంభించి; నిశాత, పట్టిస, గదా+అసి, పరశ్వధ, శూల, హస్తులు+ఐ= వాడిమి గల పట్టిసాలనే ఆయుధాలు, గదలు, కత్తులు, గండ్రగొడ్డళ్ళు, బల్లేలు చేతులలో పూని; తడయక= ఆలసించక; వారలు+అందఱును= వారందరూ (కువలాశ్వుడి కొడుకులు); దానవుదేహము= రక్కసుడిశరీరం; వీఁకన్= పరాక్రమంతో; వ్రేసియున్= కొట్టియును; పొడిచియున్= గ్రుచ్చియు; నొంపన్= బాధించగా; ఎంతయును ప్రొద్దునకున్= ఎంతో సేపటికి; ఆ+అసుర+అధముండు= రాక్షసులలో నీచుడైనవాడు; బిట్టు+ఒడలు, కదల్చి= ఎక్కువగా శరీరాన్ని కంపింపజేసి; నీల్గి= ఒళ్ళు విరిచికొని; వివృత+ఉగ్ర, ముఖుండు+అయి= తెరవబడింది భయంకరమైనది అయిన మొగం (నోరు) కలవాడై; ఆవులించినన్= ఆవులించగా.

**తాత్పర్యం:** కువలాశ్వుడి కుమారులు పెక్కు ఆయుధాలు పట్టిసాలు, గదలు, కత్తులు, గండ్రగొడ్డళ్ళు, బల్లేలు చేతులలో పూనినవారై ఆ రక్కసుడిని చుట్టుముట్టారు. ఆ ఆయుధాలతో వారు ఆ రక్కసుడిని చాలసేపు మోదగా మోదగా, అతడు శరీరాన్ని కదల్చి, నోరు భయంకరంగా తెరిచి ఆవులించాడు.

**ఉ. భోరున విస్ఫులింగములు పొడ్మఁగఁ దన్ముఖనేత్రనాసికా**
**ద్వారములందు వెల్వడియె దారుణవహ్ని శిఖాకలాపముల్**
**వారక యందు వ్రుంది రనివార్యులు రాజకుమారు లందఱున్**
**ఘోరత సాగరుల్ గపిలుకోపమునన్ నశియించు చాడ్పునన్. 409**

**ప్రతిపదార్థం:** భోరునన్= శీఘ్రంగా; విస్ఫులింగములు= అగ్నికణాలు; పొడ్మఁగన్= ఉద్భవించగా; తద్+ముఖ, నేత్ర, నాసికా, ద్వారములందున్= ఆతడియొక్క మొగం, కన్నులు, ముక్కు వీటి రంధ్రాలనుండి; దారుణ, వహ్ని, శిఖా, కలాపముల్= ఘోరమైన అగ్నిజ్వాలల సముదాయాలు; వెల్వడియెన్= బయటికి వ్యాపించాయి; వారక= ఉడుగక; అందున్= అగ్నిలో; రాజకుమారులు+అందఱున్= రాచకొడుకులు అందరున్నూ; అనివార్యులు= వారించటానికి అలవిగానివారు; ఘోరతన్= భయంకరంగా; సాగరుల్= సగరునిపుత్రులు; కపిలుకోపమునన్= కపిలమహర్షియొక్క కినుకచేత; నశియించుచాడ్పునన్= ధ్వంసమైన రీతిగా; వ్రందిరి= ధ్వంసమయ్యారు.

**తాత్పర్యం:** ఆ రక్కసుడి నోటి నుండి, కన్నుల నుండి, ముక్కునుండి అగ్నికణాలతో జ్వాలలు బయలుదేరాయి. ఆ ఘోరమైన అగ్నిజ్వాలలలో తప్పించుకొనటానికి వీలులేక అలనాడు సగరుని కొడుకులందరూ కపిలమహర్షి కోపానికి ఆహుతి అయినట్లుగా, కువలాశ్వుడి కుమారులు అందరూ నశించారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు దృఢాశ్వ కపిలాశ్వ భద్రాశ్వులు దక్కం దక్కిన కొడుకులందఱుఁ బొడవడంగినఁ గడంగి కినుకం గువలాశ్వుండు సంహారసమయ సప్తాశ్వుండునుం బోలె నుజ్జ్వలుం డయి కదియుటయు, నద్దానవుండు క్రోధసంరంభంబున సముత్థితుండై యొక్కశూలంబెత్తికొని కవిసె నప్పుడమ్మహీవిభుండు తదీయదేహజనితం బై మండుచున్న యనలం బాత్మీయయోగవిద్యాప్రభవం బగు జలప్రవాహంబునం బ్రశాంతంబు గావించి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన. 410**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; దృఢాశ్వ, కపిలాశ్వ, భద్రాశ్వులు+తక్కన్= దృఢాశ్వుడు కపిలాశ్వుడు భద్రాశ్వుడు అనేవారు తప్ప; తక్కిన= మిగిలిన; కొడుకులు+అందఱున్; పొడవు+అడంగినన్= రూపుమాయగా; కడంగి= పూని; కినుకన్= కోపంతో; కువలాశ్వుండు; సంహార, సమయ, సప్తాశ్వుండునున్+పోలెన్= ప్రళయకాలంలోని సూర్యుడిని పోలుతూ; ఉజ్జ్వలుండు (ఉత్+జ్వలుండు)+అయి= మిక్కుటంగా ప్రకాశించేవాడై; కదియుటయున్= చుట్టుముట్టుటయున్నూ; ఆ+దానవుండు= ఆరాక్షసుడు; క్రోధసంరంభంబునన్= కినుకవలన ఏర్పడిన వేగిరపాటుతో; సముత్థితుండు+ఐ= లేచి విలువబడి; ఒక్కశూలంబు= ఒక బల్లెం; ఎత్తికొని= తీసికొని; కవిసెన్= ఎదిరించాడు; అప్పుడు; ఆ+మహీవిభుండు= భూమికి భర్తయైన ఆ రాజు (కువలాశ్వుడు); తదీయ, దేహ, జనితంబు+ఐ= ఆ (రాక్షసుడియొక్క) శరీరంనుండి పుట్టినది అయిన; మండుచున్న= జ్వలిస్తున్న; అనలంబు= అగ్ని; ఆత్మీయ, యోగ, విద్యా, ప్రభవంబు+అగు= తనదైన యోగవిద్యయొక్క నేర్పువలన జనించినది అయిన; జల, ప్రవాహంబునన్= నీటిపారుదలచేత; ప్రశాంతంబు, కావించి= అణగారిపోయేటట్లుగా చేసి; బ్రహ్మ+అస్త్రంబు= బ్రహ్మకు సంబంధించిన మంత్రబాణం; ప్రయోగించినన్= నాటేటట్లు విడిచిపెట్టగా.

**తాత్పర్యం:** ఈ విధంగా కువలాశ్వుడి కొడుకులు దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అనే ముగ్గురుతప్ప అందరూ మరణించారు. అంతట కోపంతో ప్రళయకాలంలోని సూర్యుడివలె విజృంభించి, కువలాశ్వుడు ఆ రాక్షసుడిని చుట్టుముట్టి యుద్ధం చేశాడు. ఆ రాక్షసుడు లేచి నిల్చొని ఒక్కబల్లెం చేతబట్టి కువలాశ్వుడిని ఎదుర్కొన్నాడు. అంతట రాజు తన యోగశక్తివలన ఉద్భవించిన జలప్రవాహంచేత ఆ రాక్షసుడి దేహంనుండి మండుతున్న అగ్నిజ్వాలలను ఆర్పివేసి, ఆతడిపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **ఆ దివ్యాస్త్ర జ్వలనము । భూదిగ్గగనములు వెలుఁగఁ బొదివి మహోగ్రం**
**బై దానవేంద్రుదేహము । బూదిగ నొనరించెఁ జిత్రముగ నొకమాత్రన్.** **411**

**ప్రతిపదార్థం:** ఆ దివ్య+అస్త్ర, జ్వలనము= ఆ వేలుపుబాణంయొక్క మంట; భూ, దిక్+గగనములు= పుడమి, దిక్కులు, ఆకాశమున్నూ; వెలుఁగన్+పొదివి= దీప్తులు వ్యాపించ క్రమ్ముకొని; మహా+ఉగ్రంబు+ఐ= మిక్కిలి భయంకరమై; దానవ+ఇంద్రుదేహము= ఆ గొప్ప రాక్షసుడియొక్క శరీరం; చిత్రముగన్= అచ్చెరువు ఒనగూర్చునట్లుగా; ఒకమాత్రన్= ఒకత్రుటి కాలంలో; బూదిగన్= బుగ్గిగా; ఒనరించెన్= చేసింది.

**తాత్పర్యం:** దివ్యశక్తిగల ఆ బ్రహ్మాస్త్రం భూమినీ ఆకాశాన్నీ దిక్కులనూ మిరుమిట్లు గొలిపేటట్లుగా వెలిగించి, ఒక్క త్రుటికాలంలో ఆ రక్కసుడి శరీరాన్ని బుగ్గిగా చేసింది.

**విశేషం:** రాక్షస+ఇంద్రుఁడు= రాక్షసులలో ఇంద్రుడు అనగా గొప్పరాక్షసుడు, ఇంద్రశబ్దం శ్రేష్ఠవాచకం. ఇట్లే కవీంద్రుడు మున్నగు ప్రయోగాలు.

**వ.** **అంత.** **412**

**తాత్పర్యం:** పిదప,

**క.** **'సురశత్రుఁడైన ధుంధునిఁ । బరిమార్చితి వీవు జగదభయకారివి భూ**
**వర! ధుంధుమారుఁ డనఁగాఁ । బరఁగు' మనిరి సురలు మునులు పార్థివముఖ్యా!** **413**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= రాజులలో శ్రేష్ఠుడవైనవాడా! ధర్మరాజా!; సుర, శత్రుఁడు+ఐన= వేల్పులకు విరోధి అయిన; ధుంధునిన్= ధుంధుడు (అను పేరు గల రక్కసుడిని); పరిమార్చితివి= సంహరించావు; ఈవు= నీవు; జగత్+అభయ, కారివి= లోకానికి భయం పోగొట్టి శాంతిని అనుగ్రహించిన వాడవు; భూవర!= భూమికి భర్తవైన ఓరాజా!; ధుంధుమారుఁడు+అనఁగాన్= ధుంధుమారుడు అనే పేరుతో; పరఁగుము= ఒప్పుము (అని); సురలు= దేవతలు; మునులు= ఋషులు; అనిరి= (అని) చెప్పారు.

**తాత్పర్యం:** రాజులలో పేర్కొనదగిన ఓ ధర్మరాజా! ఆ రక్కసుడిని సంహరించిన కువలాశ్వుడిని దేవతలు ఋషులు ఇట్లా అభినందించారు- 'రాజులలో శ్రేష్ఠుడవైన ఓకువలాశ్వా! నీవు దేవతలకు విరోధి అయిన ధుంధుని

సంహరించి లోకానికి అభయప్రదానం చేసిన మహావీరుడవు. ఇప్పటినుండి లోకవ్యవహారంలో నీవు 'ధుంధుమారుడు' అనే బిరుదుపేరుతో విలసిల్లుము'.

**వ. ఇట్లు ప్రసన్నులై యింద్రాదిదేవతలు నుదంకప్రముఖ సంయమి వరులును నమ్మహీవరు నభినందించి 'నీ కెయ్యది యిష్టంబు వేఁడు' మనిన, నతండు బ్రాహ్మణభక్తియు ననవరతదానశీలతయు విష్ణునితోడి సఖ్యంబును వరంబులుగాఁ దనకుఁ గోరిన, నట్ల యొసంగి, వారలందఱు నిజనివాసంబుల కరిగిరి; కువలాశ్వుండును విజయోల్లాసభాసితుండై పురంబున కరిగి, సముజ్జ్వల సామ్రాజ్యసౌఖ్యంబులంబరఁగెనని మార్కండేయుండు ధర్మరాజునకుఁ గువలాశ్వుండు ధుంధుమారుం డైన విధంబు సెప్పె నని వైశంపాయనుండు జనమేజయున కెఱింగించిన తెఱంగు. 414**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; ప్రసన్నులు+ఐ= సంప్రీతిని చెందినవారై; ఇంద్ర+ఆది, దేవతలు= ఇంద్రుడు మున్నగు వేల్పులు; ఉదంక, ప్రముఖ, సంయమి, వరులును= ఉదంకుడు మున్నగు ఋషివరేణ్యులును; ఆ+మహీవరున్= రాజులలో శ్రేష్ఠుడైన ఆతడిని; అభినందించి= సంతసంతో మెచ్చికొని; నీకు+ఏ+అది, ఇష్టంబు= నీకు ఏది ప్రీతిని చేకూరుస్తుందో అది; వేడుము= కోరుకొనుము; అనినన్= అని వచించగా; అతండు= (కువలాశ్వుడు); బ్రాహ్మణభక్తియున్= విప్రులయెడ పూజ్యభావమున్నూ; అనవరత, దాన, శీలతయున్= ఎల్లప్పుడు పరోపకృతికై తన సొత్తు నిచ్చే స్వభావాన్నీ; విష్ణుని తోడి సఖ్యంబును= విష్ణుమూర్తితో స్నేహాన్నీ; వరంబులుగాన్= వలసిన కోరికలుగా; తనకున్= తనకు(కువలాశ్వుడికి); కోరినన్= కోరగా; అట్లు+అ= అట్లే; ఒసంగి=ఇచ్చి; వారలు+అందఱు= వారు అందరును (ఇంద్రాదిదేవతలు); నిజ, నివాసంబులకున్= తాము నివసించే స్థానాలకు; అరిగిరి= వెళ్ళారు; కువలాశ్వుండును; విజయ+ఉత్+లాస, భాసితుండు+ఐ= గెలుపుచేత ఏర్పడిన గొప్పఉత్సాహంచేత వెలుగొందినవాడై; పురంబునకున్= (తన రాజధాని) నగరానికి; అరిగి= వెళ్ళి; సముజ్జ్వల, సామ్రాజ్యసౌఖ్యంబులన్= మిక్కిలిగా శోభించే గొప్పరాజ్యాన్ని ఏలేటప్పుడు లభించే సుఖాలతో; పరఁగెను= విలసిల్లాడు; అని; మార్కండేయుండు; ధర్మరాజునకు; కువలాశ్వుండు; ధుంధుమారుండు+ఐన, విధంబు= ధుంధుమారుడు అయిన (అనే పేరుమీద పరగిన) రీతిని; చెప్పెన్= చెప్పెను; అని; వైశంపాయనుండు; జనమేజయునకున్; ఎఱింగించిన= తెల్పిన; తెఱంగు= విధం.

**తాత్పర్యం:** ఈవిధంగా, సంప్రీతిని చెందిన దేవతలు ఇంద్రుడు మున్నగువారున్నూ, ఉదంకుడు నాయకుడుగా గల ఋషివరేణ్యులున్నూ ఆ కువలాశ్వమహీపతిని అభినందించి, 'నీకు ఇష్టమైన వరాన్ని కోరుకొమ్ము' అన్నారు. ఆ మహారాజు తనకు విప్రులయెడ పూజ్యభావాన్నీ, తాను ఎల్లప్పుడు పరోపకారబుద్ధితో ఇతరులకు దానాలు చేసేస్వభావం కలిగిఉండేటట్లుగానూ; విష్ణుభక్తినీ వరాలుగా ఇమ్మని అర్థించాడు. వారు అతడికి ఆ వరాలు ప్రసాదించి తమతమ నెలవులకు వెళ్ళారు. కువలాశ్వుడు గెలుపువలన ఏర్పడిన సంతోషంతో తన రాజధానీనగరానికి తిరిగి వెళ్ళి, గొప్పగా వెలుగొంది విలసిల్లెడి సామ్రాజ్యసౌఖ్యాలను అనుభవిస్తూఉన్నాడని మార్కండేయమహర్షి ధర్మరాజునకు కువలాశ్వుడు ధుంధుమారుడనే బిరుదుపేరు పడసిన తీరును వివరించి చెప్పాడు. ఆ కథను సర్పయాగసమయంలో జనమేజయమహారాజుకు, వైశంపాయనమహర్షి వినిపించాడు.

**విశేషం:** ఈకథ చదివే వారికి సహజంగా పుట్టే సందేహం ఒకటి. కువలాశ్వుడు విజయం సంపాదించిన సంతోషం సహజమైనదే కాని, వేలకువేలమంది కొడుకులు మరణించిరిగదా. అది విషాదదాయకం కాదా? కొన్ని ప్రతులలో - 'ఉదంకుని నిజాశ్రమంబున

కనిచి, కుమారసహస్రంబులతో నిజపురంబున కరిగి వారాంగనానృత్యగాన విశేషంబు లాలోకించుచు' అనే పాఠంకూడా ఉన్నది. అంతకు ముందుగా, కువలాశ్వుడు 'దనుజునివలన మృతులైన తనసుతులు గలుగను వరంబు గోరిన' - 'రాక్షసనిహతులైన యతని పుత్త్రులం బునర్జీవితులుగా బ్రసాదించి వార లేగి' రనియున్నూ కలదు. సంస్కృతమూలంలో ఇది లేదు. అందుచేత ఈ భాగం తెలుగులో ప్రక్షిప్తంగా భావించే విమర్శకులు ఉన్నారు. 'వారాంగనా' ప్రసక్తి వలన ఆర్వాచీనుడు ఎవ్వడో తెలుగులో ఈ యధికపాఠాన్ని పాఠకుల సందేహనివృత్తికై చేర్చియుండవచ్చును.

## ఆశ్వాసాంతము

**క.** **చరమయుగచరిత ధర్మ। స్థిరీకరణచతురచరిత! ధీగుణలీలా**
**పరికరపరిచితనయ। విస్తర! వితరణ వివరణైక దానవినోదా!** **415**

**ప్రతిపదార్థం:** చరమ, యుగ, చరిత, ధర్మ, స్థిరీకరణచతురచరిత!= చివరియుగం అనగా, కలియుగచరిత్రలో ధర్మాన్ని స్థాపించటంలో నేర్పుకలచరిత్రకలవాడా!; ధీ, గుణ, లీలా, పరికర, పరిచిత, నయ, విస్తర!= బుద్ధిబలంయొక్క లక్షణంచేత ఆటపనిముట్టుగా ఏర్పడిన విలసిల్లిన సౌమ్యరాజనీతి వ్యాపింపజేసేవాడా!; వితరణ, వివరణ+ఏక, దానవినోదా!= త్యాగానికి వ్యాఖ్యానప్రాయమే అనే రీతిగా పరోపకారంకొరకు తన సొత్తును ఇతరులకు ఇచ్చివేయటం అనే వినోదం కలవాడా!

**తాత్పర్యం:** కలియుగంలో ధర్మం క్షీణిస్తున్నప్పటికీ, తిరిగి ఆ కలియుగంలోనే ధర్మాన్ని నిశ్చలంగా నిలిచేటట్లు ప్రతిష్ఠించే నేర్పుకలవాడా! శేముషీ వైభవంచేత పరిపాలనలో శాంతిభద్రతలు విలసిల్లునట్టి సౌమ్యరాజనీతి కలవాడా! త్యాగం అనే మాటకు, నిదర్శనప్రాయం అని చెప్పి చూపగలిగేటట్లుగా, పరోపకారార్థమై నిజసంపదను ఇతరులకు ఉచితంగా ఇచ్చివేయటం అనే వినోదం కలవాడా!

**విశేషం:** ఇది ఆశ్వాసాంతపద్యాలలో మొదటిది. ఈ సంబోధనలు కృతిపతి అయిన రాజరాజనరేంద్రుడికి అన్వయించేవి. రాజరాజనరేంద్రుడు కలియుగంలో ధర్మసంస్థాపకుడు, రాజనీతిచతురుడు, పరిపాలనాదక్షుడు, ఆదర్శదాత అని- ఈ సంబోధనల సారాంశం.

**మాలిని.**

**కరివరకిరికూర్మక్ష్మాధరాధీశ తుల్యో। ద్ధరణగుణధురీణోద్దండబాహార్గళాగ్ర**
**స్ఫురిత నిఖిలగోత్రాభోగ భాగైక భోగా! తరుణ రుచిరమూర్తీ! ధర్మతంత్రానువర్తీ!** **416**

**ప్రతిపదార్థం:** కరివర, కిరి, కూర్మ, క్ష్మాధరాధీశ, తుల్య+ఉద్ధరణ, గుణ, ధురీణ+ఉద్దండ, బాహా+అర్గళ+అగ్ర, స్ఫురిత, నిఖిల, గోత్ర+ఆభోగ, భాగ+ఏకభోగా!= శ్రేష్ఠమైన ఏనుగులు అనగా దిగ్గజాలు, వరాహం, తాబేలు, కొండలరేడుతో సమానమైనఉద్ధరించే లక్షణాన్ని వహించే గడియవంటి గొప్పవైన చేతుల చివరిభాగంవలన సూచించబడే సమస్త భూమి సామ్రాజ్య భాగాన్ని ముఖ్యంగా అనుభవించేవాడా!; తరుణ, రుచిర, మూర్తీ!= యౌవనంతో ప్రకాశించే ఆకృతి గలవాడా!; ధర్మ, తంత్ర+అనువర్తీ!= ధర్మంతో కూడినప్రణాళికను అనుసరించేవాడా!

**తాత్పర్యం:** దిగ్గజాలతో, ఆదివరాహంతో, ఆదికూర్మంతో, కులపర్వతాలతో సమానమైన భుజశక్తితో సమస్తమైన భూమిని ఏకభోగంగా భరించే సార్వభౌమా! రాజరాజా! యౌవనతేజస్సు గల ఆకృతి కలవాడా! ధర్మాన్నే రాజనీతిగా చేసి అనుసరించేవాడా!

**విశేషం:** మాలినీ వృత్తంలో ప్రతిపాదానికీ 15 అక్షరాలుంటాయి. న,న,మ,య,య అనే గణాలు పాదంలో వరుసగా నిలుస్తాయి. 9వ అక్షరం యతిమైత్రి స్థానం. ప్రాసనియమం ఉన్నది. పురాణ సారస్వతంలో భూమిని భరించేశక్తిగలవి - దిగ్గజాలు, ఆదివరాహం, ఆదికూర్మం, క్ష్మాధరం అనగా పర్వతం. కులపర్వతాలు భూమిని భరించేవి. "మహేంద్రోమలయస్సహ్యశ్శుక్తిమాన్ గంధమాదనః । వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః."

**గద్యము.**

**ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబున యక్ష యుద్ధంబును, గుబేరదర్శనంబును, నర్జునాగమనంబును, బాండవులకడకు నింద్రుండు సనుదెంచుటయు, నర్జునుండు నివాతకవచ కాలకేయ పౌలోమ వధ ప్రకారం బెఱింగించుటయు, నాజగరంబును, బాండవులు గామ్యకవనంబునకు వచ్చుటయుఁ; గృష్ణమార్కండేయాగమనంబును, బ్రాహ్మణప్రభావంబును, సరస్వతీగీతయు, వైవస్వతు చరితంబును,గల్పాంతప్రకారంబును, యుగధర్మకీర్తనంబును, వామ్యాశ్వహరణంబును, నింద్రద్యుమ్నోపాఖ్యానంబును, ధుంధుమారచరితంబును నన్నది చతుర్థాశ్వాసము.417**

**ప్రతిపదార్థం:** ఇది= (ఈ గ్రంథం-ఆరణ్యపర్వం చతుర్థాశ్వాసం); సకల సుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబు+ఐన= అందరు మంచికవుల సముదాయంచేత స్తుతించబడిన నన్నయభట్టుచేత వ్రాయబడిన, శ్రీమహాభారతంబునందున్= శ్రీమహాభారతంలో; ఆరణ్యపర్వంబునన్= ఆరణ్యపర్వంలో; యక్షయుద్ధంబును= యక్షులతోడిపోరున్నూ; కుబేరదర్శనంబునున్= కుబేరుడిని చూచుటయున్నూ; అర్జున+ఆగమనంబును= అర్జునుడు వచ్చుటయున్నూ; పాండవులకడకున్= పాండవులు ఉన్నచోటికి; ఇంద్రుండు= ఇంద్రుడు; చనుదెంచుటయున్= వచ్చుటయున్నూ; అర్జునుడు; నివాతకవచ, కాలకేయ, పౌలోమ, వధప్రకారంబు= నివాతకవచులయొక్కయు, కాలకేయులయొక్కయు, పౌలోముల యొక్కయు సంహార విధం; ఎఱింగించుటయున్= తెలియజేయుటయున్నూ; అజగరంబును= కొండచిలువకు సంబంధించిన వృత్తాంతమున్నూ; పాండవులు= పాండురాజు కొడుకులు; కామ్యకవనంబునకున్= కామ్యకం అనే పేరుగల అడవికి; వచ్చుటయున్= రాకయూ; కృష్ణ మార్కండేయ+ ఆగమనంబును= కృష్ణుడు, మార్కండేయుడు వచ్చుటయున్నూ; బ్రాహ్మణ, ప్రభావంబును= విప్రులయొక్క మహిమయున్నూ; సరస్వతీగీతయున్= సరస్వతీ గీతయు; వైవస్వతు, చరితంబును= వైవస్వతుడి కథయున్నూ; కల్ప+అంత, ప్రకారంబును= కల్పంచివర దాపురించే ప్రళయం జరిగే తీరున్నూ,యుగధర్మకీర్తనంబును= యుగాలకు సంబంధించిన లక్షణాలను గూర్చిన వర్ణనయున్నూ; వామ్య+అశ్వ, హరణంబును= వామ్యజాతిగుర్రాల అపహరణం; ఇంద్రద్యుమ్న+ఉపాఖ్యానంబును= ఇంద్రద్యుమ్నుడినిగూర్చిన కథయున్నూ; ధుంధుమారచరితంబునున్= ధుంధుమారుడి కథయూ; అన్నది= అనునట్టిది; చతుర్థ+ఆశ్వాసము= నాలుగవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది అందరు కవులచేత పొగడబడిన నన్నయభట్టు వ్రాసిన శ్రీమదాంధ్రమహాభారతంలో ఆరణ్యపర్వంలోని నాలుగవ ఆశ్వాసం. ఇందలి విషయానుక్రమణిక ఇది. యక్షయుద్ధం, కుబేరదర్శనం, అర్జునాగమనం, పాండవులకడకు ఇంద్రుడు రావటం, అర్జునుడు నివాతకవచులను కాలకేయులను పౌలోములను సంహరించినతీరు, కొండచిలువ వృత్తాంతం, పాండవులు కామ్యకవనానికి రావటం, కృష్ణమార్కండేయులరాక, విప్రులమహిమ, సరస్వతీగీత, వైవస్వతమనువుగాథ, ప్రళయప్రకారం, యుగధర్మవర్ణనం, వామ్యాశ్వాలను అపహరించటం, ఇంద్రద్యుమ్నుడికథ, ధుంధుమారచరితం.

**విశేషం:** ఆరణ్యపర్వం నాలుగవ ఆశ్వాసంలో 141 పద్యముల వరకు వ్రాసినది నన్నయభట్టు. తరువాత అనగా 142వ పద్యమునుండి ఆరణ్యపర్వంలోని ఏడవ ఆశ్వాసం తుదవరకు వ్రాసింది ఎఱ్ఱన. అయినను, ఆశ్వాసాంతంలో ఎఱ్ఱన - 'నన్నయభట్ట ప్రణీతంబు' అని వ్రాయటమే గాక - ఆశ్వాసాంతపద్యాలను నన్నయకు ఆశ్రయప్రదాత అయిన రాజరాజనరేంద్రుడి సంబోధనలుగానే కూర్చాడు. తెలుగుదేశంలో లభించిన ఆంధ్రమహాభారతం వ్రాతప్రతులు అన్నిటిలో 142 పద్యమునుండి- ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వారంభము - అనియే కలదు. ఎఱ్ఱనయే ఆరణ్యపర్వం చిట్టచివర ఏడవ ఆశ్వాసాంతపద్యాలలో తాను నన్నయభట్ట కవితారీతియు తోచేటట్లు ఆరణ్యపర్వాన్ని పూరించా నని స్పష్టంగా వ్రాశాడు.

**ఆరణ్యపర్వంలో చతుర్థాశ్వాసం సమాప్తం.**



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము -పంచమాశ్వాసము

**శ్రీయువతీప్రియ! నృప నా । రాయణ బిరుదాంక భీమ! రమణీయ గుణ**
**శ్రీయుత! నిర్మలధర్మప । రాయణ! రవితేజ! రాజరాజనరేంద్రా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ, యువతీ, ప్రియ!= సిరిజవరాలికి ఇష్టుడ వైనవాడా!; నృప, నారాయణ, బిరుద+అంక, భీమ!= రాజులలో విష్ణుమూర్తి అనెడి బిరుదు ఉండుటచేత భయాన్ని కలిగించేవాడా!; రమణీయ, గుణ, శ్రీ, యుత!= అందమైన మంచి లక్షణాలనెడి సంపదతో కూడి ఉన్నవాడా!; నిర్మల, ధర్మ, పరాయణ!= కల్మషం లేక స్వచ్ఛమైన ధర్మం నెరపటంలో పూనిక కలిగిన వాడా!; రవి, తేజ!= సూర్యుడి వంటి వర్చస్సు కలవాడా!; రాజరాజనరేంద్రా!= రాజరాజనరేంద్రుడు అనే నామధేయం కలవాడా!

**తాత్పర్యం:** యౌవనంలో ఉన్న లక్ష్మీదేవికి ఇష్టమైనవాడా! రాజులలో విష్ణుమూర్తి అనే బిరుదు కలిగి శత్రువులకు భయాన్ని కలిగించేవాడా! మనోహరమైన సద్గుణాలు కలవాడా! స్వచ్ఛమైన ధర్మాన్ని ఆచరించే దీక్ష పూనినవాడా! సూర్యుడి తేజస్సు వంటి తేజస్సు గలవాడా! ఓ రాజరాజనరేంద్రా!

**విశేషం:** (i) ఇది ఆశ్వాసారంభ పద్యం. ఈ పంచమాశ్వాసాన్ని రచించినది ఎఱ్ఱన మహాకవి. ఈ పద్యరచన నాటికి సుమారు రెండువందల సంవత్సరాలకు పూర్వమే కీర్తిశేషుడైన రాజరాజనరేంద్రుడి సంబోధనం ఇది. - నన్నయ వాడిన భావాలనే గుదిగ్రుచ్చి ఎఱ్ఱన మరల ప్రయోగించాడు. (ii) చాళుక్య ప్రభువులు రాజనారాయణ బిరుదాంకితులు.

### ధర్మరాజునకు మార్కండేయుఁడు పుత్త్రున కుండఁదగు గుణంబులం దెల్పుట (సం. 3-196-1)

**వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు బహుభంగుల మార్కండేయుండు వివరింపం బుణ్యకథావిశేషంబులు విని సంతుష్టహృదయుం డై కౌంతేయపూర్వజుండు మఱియు నమ్మునీంద్రున కి ట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= ఆ కథను చెప్పే సూతుడు; శౌనక+ఆది, మహా, మునులకున్+చెప్పెన్= శౌనకుడు మున్నగు గొప్ప ఋషులకు వచించాడు; అట్లు= ఆవిధంగా; మార్కండేయుండు; బహుభంగులన్= పెక్కు రీతులుగా; వివరింపన్= విస్తరించి చెప్పగా; కౌంతేయ, పూర్వజుండు= కుంతీ కుమారులలో ముందు జన్మించినవాడు - ధర్మరాజు; పుణ్య కథా, విశేషంబులు= సుకృతాన్ని కలిగించే గాథలలోని గొప్ప విషయాలు; విని= ఆలకించి; సంతుష్ట, హృదయుండు+ఐ= మిక్కుటంగా తృప్తిచెందిన గుండె కలవాడై; మఱియున్= ఇంకా; ఆ+ముని+ఇంద్రునకున్= ఋషులలో శ్రేష్ఠుడైన ఆ మార్కండేయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా శౌనకుడు మున్నగు మహర్షులకు సూతుడు నైమిశారణ్యంలో సత్రయాగసందర్భంగా మహాభారతకథ వినిపించాడు. మార్కండేయ మహర్షి ఎన్నో పుణ్యకథలను చెప్పగా విని, మిక్కిలి సంతృప్తి చెందిన ధర్మరాజు మరల ఆ మహర్షితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** మార్కండేయమహర్షి చెప్పిన పుణ్యకథలు పెక్కు ఆరణ్యపర్వంలో ఉన్నాయి. మహాభారతానికి పూర్వం ఇట్టి కథలు లోకంలో బహుళప్రచారంలో ఉన్నాయనిన్నీ వాటిని సూతుడు సంగ్రహించి ఆరణ్యపర్వంలో చేర్చాడనిన్నీ నవీన విమర్శకుల అభిప్రాయం.

**సీ.** **'సమధిక దర్పదుర్జయములై నిగిడెడు । నింద్రియంబులఁ గుదియించి తెచ్చి**
**మనసు పొందున నిడి మన సహంకారంబు । పజ్జకుఁ బాపి సద్భక్తియుక్తి**
**నెరయంగ ననిశంబు నిజభర్తృ శుశ్రూష । యందు సమాహిత యైన వనిత**
**యఖిలలోకోత్కృష్ట యని యెప్డు నూహింతు; । నరయఁ బతివ్రత లైన వారి**

**తే.** **చరిత మత్యంతధర్మసూక్ష్మంబుఁ గరము । దుష్కరము గాదె తలఁప నిర్ధూత దురిత!**
**యట్లు గావున విన వేడ్క యయ్యెఁ జెప్ప । వయ్య ! పుణ్యసతీ ప్రభావంబు నాకు.** **3**

**ప్రతిపదార్థం:** నిర్ధూత, దురిత!= విసరివేయబడిన పాపాలు కలవాడా!; సమధిక, దర్ప, దుర్జయములు+ఐ= మిక్కిలి ఎక్కువ అయిన గర్వం కలిగిఉండటంచేత గెలువరానట్టివై; నిగిడెడు= విజృంభించెడు; ఇంద్రియంబులన్= జ్ఞానకర్మేంద్రియాలను; కుదియించి; తెచ్చి= అణగారేటట్లుగా చేసిపెట్టి; మనసు, పొందునన్+ఇడి= మనస్సుకు లోబడేటట్లుగా చేసి; మనసు+ అహంకారంబు, పజ్జకున్+పాపి= మనస్సును-నేను నాది అనే భావం దగ్గరనుండి వేరు చేసి; సత్+భక్తి, యుక్తి= మంచి భక్తితో కూడికొని ఉండటం; నెరయంగన్= ఒప్పునట్లుగా; అనిశంబున్= ఎల్లప్పుడును; నిజ, భర్తృ, శుశ్రూషయందున్= తనయొక్క పెనిమిటికి పరిచర్య ఒనరించటంలో; సమాహిత+ఐన= కూడిఉన్నట్టిదైన; వనిత= స్త్రీ; అఖిల, లోక+ఉత్కృష్ట= సమస్త జగాలలో గొప్పది; అని; ఎప్డున్= ఎల్లప్పుడును; ఊహింతున్= భావన చేస్తాను; అరయన్= చూడగా; పతివ్రతలు+ఐన వారి, చరితము= భర్తను భక్తితో సేవించటంలోనే నిమగ్నురాం డ్రయిన భార్యల నడవడి; అత్యంత, ధర్మ, సూక్ష్మంబున్= మిక్కిలిలోతుగా పరిశీలిస్తేగాని తెలియనట్టి ధర్మంతో కూడినట్టిదిన్నీ; కరము= మిక్కిలి; దుష్కరము= ఆచరించేందుకు కష్టం అయినట్టిదిన్నీ; కాదె= అవుతుందికదా; తలఁపన్= ఆలోచించగా; నాకున్, పుణ్య, సతీ, ప్రభావంబు= గొప్ప పతివ్రతల మహిమ; వినన్= వినటానికి; వేడ్క+అయ్యెన్= సంబరమైనది. అట్లు+కావునన్= ఆ విధంగా ఉన్నది కాబట్టి; చెప్పవయ్యా= దయచేసి చెప్పుము.

**తాత్పర్యం:** పాపాలను పటాపంచలు చేయగలిగిన ఓ మార్కండేయ మహర్షీ! గొప్ప పతివ్రతల మాహాత్మ్యాలను గూర్చిన కథలు వినవలెనని నాకు మిక్కిలి వేడుకగా ఉన్నది. దయచేసి అట్టి కథలు నాకు వినిపించ వేడికోలు. అరికట్టటానికి వీలు లేని ఇంద్రియాలను అరికట్టి, వాటిని మనస్సుకు లోబడేటట్లుగా చేసి, ఆ మనస్సును అహంకారానికి లోను గాకుండగా చేసి, తన పెనిమిటికి ఎల్లప్పుడు సేవ చేసే వనిత - అన్ని జగాలలో గొప్పది అని నా అభిప్రాయం. అట్టి పతివ్రతల నడవడిలో ధర్మ సూక్ష్మాలు ఇమిడే ఉంటాయి. కావున అట్టి పుణ్యకథలు వినిపింపుము.

**విశేషం:** 'ధర్మసూక్ష్మము' అనే ప్రయోగంలోని స్వారస్యం అరయ దగింది. ధర్మం తెలియటం కష్టం. స్థూలదృష్టికి 'ధర్మము'గా గోచరించినట్టిది - తరచి విచారించినప్పుడు అనగా సూక్ష్మ దృష్టితో పరికించినపుడు అధర్మం కావచ్చును. రాబోయే ధర్మవ్యాధుడి కథలో పెక్కు 'ధర్మ సూక్ష్మములు' వివరించబడినవి.

**వ. మఱియుఁ దల్లిదండ్రు లిరువురయందును బుత్త్రనిమిత్తం బైన యాయాసం బెవ్వరి కెక్కుడు? వారలయెడం బుత్త్రుం డెట్టివాఁడు గావలయు? హీనయోని జాతుం డైన పురుషుం డేమి తెఱంగు నడవడిం బరమధార్మికుల లోకంబులు వడయు? నివి యన్నియు వివరింప నీవ యర్హుండ' వనిన నమ్మహాముని యమ్మహీపతి కి ట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; తల్లిదండ్రులు= మాతా పితలు; ఇరువురయందును= ఇద్దరియందును; పుత్త్ర నిమిత్తంబు+ఐన= కొడుకునుగూర్చిన; ఆయాసంబు= శ్రమ; ఎవ్వరికిన్+ఎక్కుడు= ఎవరికి మిక్కుటంగా ఉంటుంది; వారలయెడన్= ఆ తల్లిదండ్రుల పట్ల; పుత్త్రుండు= కొడుకు; ఎట్టివాఁడు, కావలయున్= ఏ విధంగా ప్రవర్తించదగినవాడు అయిఉండాలి; హీనయోని జాతుండు+ఐన= తక్కువ కులంలో పుట్టినట్టి; పురుషుండు= మనుజుడు; ఏమి తెఱంగు, నడవడిన్= ఏ విధమైన ప్రవర్తనవలన; పరమ, ధార్మికుల, లోకంబులు= గొప్ప పుణ్యాత్ములు పొందే లోకాలు - స్వర్గాలు; పడయున్= పొందుతాడు; ఇవి+అన్నియున్= ఇట్టి విషయాలు అన్నిటిని; వివరింపన్= వెల్లడించటానికి; నీవు+అ= నీవ=నీవు మాత్రమే; అర్హుండవు= తగిన వాడవు; అనినన్= అని చెప్పగా; ఆ+మహాముని= గొప్పవాడయిన ఆ ఋషి; ఆ+మహీపతికిన్= ఆ రాజుకు (ధర్మరాజుకు); ఇట్లు+అనియెన్= ఆ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విషయాలే గాక, మఱికొన్నిటిని గూర్చి కూడ తాము దయచేసి వివరించ వేడికోలు. సంతాన విషయాన, తలిదండ్రులు ఇరువురూ పడే శ్రమలో ఎవరిది అధికం అని చెప్పవచ్చును? తలిదండ్రుల విషయంలో పుత్రుడు ఎట్టి నడవడి కలవాడై ఉండదగును? తక్కువ కులంలో జన్మించిన మనుజుడు గొప్ప ధర్మాత్ముడు పొందే లోకాలను ఏవిధంగా పొందగలడు? ఈ ప్రశ్నలకు సరిఅయిన సమాధానం చెప్పగల అర్హత నీయందు మాత్రమే ఉన్నది' అని ధర్మరాజు పలుకగా మార్కండేయమహర్షి ఈ విధంగా ప్రత్యుత్తరం ఇచ్చాడు.

**సీ. 'జతనంబు మిగుల మాసములు దొమ్మిది యుద । రంబునం గరము భరంబుతోడ**
**భరియించి పదపడి ప్రాణసంశయ దశ । నొంది పుత్త్రునిఁ గాంచు నెందుఁ దల్లి;**
**తపములు యజ్ఞముల్ దానముల్ వ్రతములు । దేవతా సజ్జన సేవనములుఁ**
**గావించుఁ బుత్త్రునిఁ గామించి జనకుఁ; డి । ట్లిరువుర పాటును సరియె తలఁపఁ;**

**సీ. దనయుఁ గని తల్లిదండ్రులు దమకు నతఁడు । భక్తుఁ డగుటకు ధర్మానురక్తుఁ డగుట**
**కాసపడుదురు; విను మట్టియాస సిద్ధిఁ । బొందఁ జేయు నతఁడ చువ్వె నందనుండు. 5**

**ప్రతిపదార్థం:** ఎందున్= ఏ పరిస్థితుల్లో అయినా; తల్లి= మాత; పుత్త్రునిన్= కొడుకును; ఉదరంబునన్= కడుపులోపల; మాసములు= నెలలు; తొమ్మిది; జతనంబు= యత్నము; మిగులన్= ఎక్కువ అగునట్లుగా; కరము= మిక్కిలి; భరంబుతోడన్= బరువుతో; భరియించి= మోసి; పదపడి= పిదప; ప్రాణ, సంశయ, దశన్+ఒంది= అసువులు కోల్పోవునేమో అనే సందేహ స్థితిని పొంది; కాంచున్= కంటుంది, జనకుడు= తండ్రి; పుత్త్రునిన్= కొడుకును; కామించి= కోరి; తపములు= శరీరక్లేశాన్ని కలిగించే ఉపవాసాది వ్రతాలు; యజ్ఞముల్= క్రతువులు; దానముల్= తన ద్రవ్యాన్ని ఇతరులకు సమర్పణ చేయటాలు; వ్రతములు= నోములు; దేవతా, సత్+జన, సేవనములున్= దేవతలను, మంచి మనుష్యులను అర్చించటాలు; కావించున్= చేస్తాడు; ఇట్లు= ఈ రీతిగా; ఇరువుర పాటును= ఇద్దరూ పడే శ్రమకూడా; తలఁపన్= ఆలోచించగా; సరియె= సమానాలైనవే; తల్లిదండ్రులు= మాతయు పితయును; తనయున్= కొడుకును; కని= పొంది; తమకున్= తమకు (తల్లిదండ్రులకు); అతఁడు= ఆ

కొమరుడు; భక్తుఁడు+అగుటకున్= అర్చించేవాడు కావటానికి; ధర్మ+అనురక్తుఁడు= ధర్మంలో ఎక్కువ ఇష్టం కలవాడు కావటానికి; ఆస, పడుదురు= కోరుకొంటారు; వినుము= ఆలకింపుము; అట్టి+ఆస= అటువంటి కోరిక; సిద్ధిన్+పొందన్+చేయు+ అతఁడు+అ= నెరవేరేటట్లుగా ఒనరించే అతడు మాత్రమే; నందనుండు= కొడుకు; చుమ్మె= చుమ్ము+ఎ= సుమా. (నిశ్చయార్థకం).

**తాత్పర్యం:** 'కొడుకును తల్లి - తొమ్మిది నెలలు తన కడుపులో మోసి, మిక్కిలి ప్రయత్నంతో మిక్కుటమైన శ్రమకు ఓర్చి, ఆస్థితిలో అసువులు కోల్పోతానేమో అనే సందేహ స్థితికి వచ్చి ప్రసవిస్తుంది. తండ్రి - కొడుకు పుట్టవలెననే కోరికతో ఉపవాసాది వ్రతాలు చేసి, క్రతువులు నిర్వహించి, దాన ధర్మ కార్యాలు సలిపి, నోములు నోచి, దేవతలను సజ్జనులను పూజిస్తాడు. ఈ విధంగా సంతానానికై పడే శ్రమ తలిదండ్రులు ఇరువురకూ సమానమైనదే అని చెప్పవచ్చును. తలిదండ్రులు - కొడుకు పుట్టిన పిదప ఆతడు తమయెడ ప్రేమ కలిగి తమను ఆరాధించాలనీ ధర్మాచరణలో ఆసక్తికలవాడు కావాలనీ కోరుకొంటారు. అందుచేత, తలిదండ్రుల కోరిక తీర్చేవాడే నిజమైన పుత్రుడు అని చెప్పాలికదా!

**విశేషం:** నందనుడు అనే శబ్దానికి అర్థం - 'సంతోషింప చేసేవాడు'. తలిదండ్రులను సంతసింపజేసేవాడే నిజమైన నందనుడు. ఇట్టి నందన శబ్ద ప్రయోగంలోని స్వారస్యం గుర్తించ తగింది.

**క. జననియు జనకుఁడు నెవ్వని । యనువర్తనమునఁ బ్రియంబు నందుదు రెదఁ ద**
**త్తనయుఁడు ధర్మముఁ గీర్తియు । ననూనముగఁ బడయుఁ బొందు నక్షయగతులన్. 6**

**ప్రతిపదార్థం:** జననియున్= తల్లియును; జనకుఁడున్= తండ్రియును; ఎవ్వని+అనువర్తనమునన్= ఏ(కుమారుడి) నడవడి వలన; ఎదన్= హృదయంలో; ప్రియంబున్+అందుదురు= సంతోషం పొందుతారో; తత్+తనయుఁడు. ఆ కొడుకు; ధర్మమున్= ధర్మాన్ని; కీర్తియున్= యశస్సునూ; అనూనముగన్= ఎక్కువగా; పడయున్= పొందుతాడు; అక్షయ, గతులన్= నాశనం పొందని స్థితులను అనగా గొప్ప పుణ్యలోకాలను; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఏ కుమారుడు తనను కన్న తలిదండ్రులకు తన నడవడికవలన మిక్కుటమైన సంతోషాన్ని కలిగిస్తాడో ఆ కొమరుడే ధర్మాన్ని, కీర్తిని గొప్పగా సంపాదిస్తాడు. అట్టివాడే శాశ్వతమైన పుణ్యలోకాలను ఆర్జిస్తాడు.

### మార్కండేయుఁడు ధర్మజునకుఁ బతివ్రతా మాహాత్మ్యంబు సెప్పుట (సం. 3-196-20)

**వ. మఱియు నిజభర్తృ శుశ్రూషయందు నిత్యాసక్తయయిన పతివ్రతకు నఖిలయజ్ఞదానతపఃఫలంబులు సులభంబు లగు; నొక్కయితిహాసంబు సెప్పెద; నందు నీ యడిగిన యర్థంబు లన్నియుఁ దేటపడు నాకర్ణింపుము; కౌశికుం డను బ్రాహ్మణుండు ధర్మతపశ్శీలుండు సంతతాధ్యయనతత్పరుం డయి యొక్క విశిష్టగ్రామంబున నుండు; నతం డొక్కనాఁడు గ్రామసమీపంబునం దొక్కవృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండం దదీయ శాఖాగతం బైన యొక్క కొక్కెర యాతనిపై రెట్ట వెట్టిన, నమ్మహాద్విజుం డలిగి చూచుటయు నది యప్పుడ నిశ్చేతనం బై నేలంబడినం గనుంగొని యతండు. 7**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; నిజ, భర్తృ, శుశ్రూషఅందున్= తనయొక్క పెనిమిటియొక్క పరిచర్యలో; నిత్య+ఆసక్త+ అయిన= ఎల్లప్పుడు ఇష్టం కలిగినట్టిది అయిన; పతివ్రతకున్= సాధ్వికి; అఖిల, యజ్ఞ, దాన, తపస్+ఫలంబులు= అన్ని

క్రతువులు, దానాలు, కఠిన వ్రతాలు చేస్తే సంక్రమించే పుణ్యాలు; సులభంబులు+అగున్= సులువుగా లభిస్తాయి; ఒక్క+ఇతిహాసంబు+చెప్పెదన్= ఒక యథార్థ గాథ వినిపిస్తాను; అందున్= ఆ ఇతిహాసంలో; నీ+అడిగిన= నీవు ప్రశ్నించిన; అర్థంబులు+అన్నియున్= భావాలు అన్నియును; తేటపడున్= వెల్లడి ఔతాయి; ఆకర్ణింపుము= వినుము; కౌశికుండు+అను, బ్రాహ్మణుండు= కౌశికుడు అనే పేరుకల విప్రుడు; ధర్మ, తపస్+శీలుండు= ధర్మాన్ని, తపస్సును ఆచరించే స్వభావం కలవాడు; సంతత+అధ్యయన, తత్పరుండు+అయి= ఎల్లప్పుడు వేదాలు చదువుకొనటంలోనే నిమగ్నుడైనవాడయి; ఒక్క, విశిష్ట, గ్రామంబునన్= పేర్కొనదగిన ఒకపల్లెటూరిలో; ఉండున్= నివసించేవాడు; అతండు= ఆ బ్రాహ్మణుడు; ఒక్క, నాఁడు= ఒక్క రోజున; గ్రామసమీపమునందున్= ఆ ఊరికి దగ్గరలో; ఒక్క, వృక్ష, మూలంబునన్= ఒక చెట్టు మొదట; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై; వేదంబులు= వేదాలు; గుణియించుచుండన్= వల్లెవేస్తుండగా; తదీయ, శాఖాగతంబు+ఐన= ఆ చెట్టు కొమ్మమీద ఉన్న; ఒక్క, కొక్కెర= ఒక కొంగ; ఆతనిపైన్= ఆ కౌశికుడిమీద; రెట్ట+పెట్టినన్= మలవిసర్జనం చేయగా; ఆ+మహా, ద్విజుండు= ఆ గొప్ప బ్రాహ్మణుడు; అలిగి, చూచుటయున్= కోపించి, చూడటంచేత; అది= ఆ కొక్కెర; అప్పుడు+అ= అప్పటికప్పుడే; నిస్+చేతనంబు+ఐ= పోయిన ప్రాణాలు కలదై - అనగా చనిపోయి; నేలన్+పడినన్= భూమిమీద పడగా; కనుంగొని= చూచి; అతండు= ఆ కౌశికుడు.

**తాత్పర్యం:** అంతేకాదు; తన పెనిమిటికి సేవ చేయటంలో ఎల్లప్పుడూ ఇష్టం గల పతివ్రతకు సమస్త యజ్ఞాలు, దానాలు, తపస్సులు చేసిన పుణ్యాలు లభిస్తాయి. ఈ విషయాన్ని రూఢి చేసే ఒక యథార్థగాథను నిదర్శనంగా నీకు వినిపిస్తాను. ఆ ఇతిహాసంలో నీవు అడిగిన ప్రశ్నలకు అన్నిటికిని సరైన సమాధానం లభిస్తుంది. పూర్వం కౌశికుడు అనే బ్రాహ్మణుడు ఒకానొక పల్లెటూరులో నివసిస్తూ ఉండేవాడు. ఆతడు ధర్మాత్ముడు. తపస్వి. ఎల్లప్పుడూ వేదాలను వల్లె వేసేవాడు. ఒకనాఁడు అతడు ఒకచెట్టు మొదట కూర్చొని వేదాలు వల్లెవేస్తుండగా, ఆ చెట్టుకొమ్మపై వాలిఉన్న ఒకకొంగ అతడిపై రెట్ట వేసింది. అంతట ఆ కౌశికుడికి మిక్కుట మైన కోపం వచ్చింది. అతడు ఆగ్రహంతో ఆ పక్షిని చూచాడు. వెంటనే ఆ పక్షి ప్రాణాలు కోల్పోయి నేలపై పడిపోయింది. అప్పుడు అతడు (పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు.)

**క.** **'అక్కట! నాహృదయము గడు । నక్కటికము లేనిదయ్యెఁ; ననిమిత్తమ యీ**
**కొక్కెర నిటు సేసితి; నా । కెక్కడి శాంతి?' యని వికలహృదయుం డగుచున్. 8**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; నాహృదయము= నాగుండె; కడున్= మిక్కిలి; అక్కటికము= దయ; లేనిది+అయ్యెన్= లేనట్టిది అయింది; అనిమిత్తము+అ= ఎటువంటి కారణం లేకుండానే; ఈ కొక్కెరన్= ఈ కొంగను; ఇటు+చేసితిన్= ఈవిధంగా చేశాను అనగా ఈ రీతిగా చంపాను; నాకున్+ఎక్కడి, శాంతి+అని= నాకు ఏవిధంగా శాంతి లభిస్తుంది అని; వికల, హృదయుండు+అగుచున్= కలత చెందిన ఎడద గలిగినవాడు ఔతూ;

**తాత్పర్యం:** 'అయ్యో! నా గుండె దయలేనిది అయింది కదా! నిష్కారణంగా నావలన ఈ కొంగ ప్రాణాలు పోగొట్టుకుంది. నేను ఘోరపాపానికి ఒడిగట్టాను, ఇక నాకు ఏవిధంగా శాంతి లభించగలదు?' అని వాపోతూ ఆ కౌశికుడు కలత చెందిన ఎడద కలవా డయ్యాడు.

**వ.** **పెక్కుభంగుల వగచి, మధ్యాహ్నం బగుటయుఁ గృతాహ్నికవిధానుండై గ్రామంబున కరిగి, యందు శుచులైన విప్రగృహంబుల కరిగి భిక్షాచరణంబు సేయుచు, నం దొక్క పుణ్యగృహంబువాకిట నిలిచి 'భిక్షాం దేహి' యనుటయు, నా యింటియవ్వయు నతిసంభ్రమంబున భిక్ష యిడుటకుం బాత్రశోధనంబు సేయు నెడ. 9**

**ప్రతిపదార్థం:** పెక్కు, భంగులన్= పలురీతుల; వగచి= విచారించి; మధ్య+అహ్నంబు+అగుటయున్= పట్టపగలు నడిమిప్రొద్దు కావటంచేత (మధ్నాహ్నం పంద్రెండుగంటలు-నేటి భాషలో); కృత+ఆహ్నిక, విధానుండు+ఐ= పగలు నెరవేర్చవలసిన కృత్యాలు కలవాడై అనగా పగలు నడిప్రొద్దున చేయదగు విధులు చేసినవాడై; గ్రామంబునకున్+అరిగి= పల్లెటూరికి వెళ్లి; అందున్= ఆ గ్రామంలో; శుచులు+ఐన= పవిత్రులు, అయిన; విప్ర, గృహంబులకున్= బ్రాహ్మణుల ఇండ్లకు; అరిగి= వెళ్లి; భిక్షా+ఆచరణంబు= బిచ్చమెత్తుకొనటం; చేయుచున్= చేస్తూ; అందు+ఒక్క= (ఆ గృహాలలో ఒక); పుణ్య, గృహంబు, వాకిటన్= సుకృతం ఆర్జించిన వారు నివసించే ఇంటి గడప ముందు; నిలిచి= నిలబడి; 'భిక్షాందేహి'= బిచ్చాన్ని ఇమ్ము; అనుటయున్= అని అనటమున్నూ; ఆ+ఇంటి+అవ్వయున్= ఆ ఇంటిఇల్లాలును; అతిసంభ్రమంబునన్= మిక్కిలి వేగిరపాటుతో; భిక్ష+ఇడుటకున్= బిచ్చం వేయటానికి; పాత్ర, శోధనంబు= పాత్రను శుద్ధిచేయటం; చేయు+ఎడన్= చేసే తరుణంలో.

**తాత్పర్యం:** పలురీతుల విచారించి, అప్పుడు మిట్టమధ్యాహ్నసమయం కావటంచేత, ఏతత్కాలకృత్యాలైన సంధ్యావందనాదికాలు నిర్వర్తించి, సమీపగ్రామానికి వెళ్లి, పరిశుభ్రత, పవిత్రత కల బ్రాహ్మణ గృహాలకు పోయి, "భిక్షాం దేహి" అన్నాడు. అట్లా అంటూ ఒక పుణ్యగృహంముందు నిలిచి భిక్షను కోరాడు. అంతట- ఆ ఇంటి ఇల్లాలు మిక్కిలి వేగిరపాటుతో ఆ బ్రాహ్మణయోగికి భిక్ష సమర్పించటానికై పాత్రను కడుగసాగింది. ఆ సమయంలో.

**ఉ. ఆ యెలనాఁగభర్త కడు నాఁకటఁ దూలుచు వచ్చె; వచ్చినం**
**దోయజనేత్ర సంభ్రమముతోఁ దగుపీఠము వెట్టి పాద్యముం**
**బాయక మజ్జనక్రియయు భక్తి నొనర్చి ప్రియోక్తు లొప్పఁగా**
**నాయనఁ బ్రీతుఁ జేసె రుచిరాన్నరసంబులఁ జేసి చెచ్చెరన్. 10**

**ప్రతిపదార్థం:** ఆ+ఎలనాఁగ, భర్త= ఆ మగువ పెనిమిటి; కడున్= మిక్కిలి; ఆఁకటన్= ఆకలిచేత; తూలుచున్= తొట్రుపడుతూ; వచ్చెన్= వచ్చాడు; వచ్చినన్= అట్లా రాగా; తోయజనేత్ర= పద్మాలవంటి కన్నులు కల ఆ మగువ; సంభ్రమముతోన్= వేగిరపాటుతోడ; తగు= తగిన; పీఠము, పెట్టి= కూర్చుండే ఆసనం ఉంచి; పాద్యమున్= కాళ్లు కడుగుకొనటానికి నీటిని (ఇచ్చి); పాయక మజ్జన, క్రియయున్= వదలక తలనిండా స్నానం చేయించుటయున్నూ; భక్తిన్= పూజ్యభావంతో; ఒనర్చి= చేసి; ప్రియ+ఉక్తులు+ఒప్పఁగాన్= మనస్సుకు ఇష్టాలైన మాటలు విలసిల్లేటట్లుగా; రుచిర+అన్న, రసంబులన్+చేసి= కమ్మని అన్నాన్ని వడ్డించి పానీయాలు సమర్పించటం చేత; చెచ్చెరన్= వేగంగా; ఆయనన్= అతడిని, తన భర్తను; ప్రీతున్+చేసెన్= సంతృప్తి చెందిన వాడినిగా చేసింది.

**తాత్పర్యం:** అంతలో, ఆ ఇల్లాలి పెనిమిటి ఆకలితో తూలుతూ ఇల్లు చేరాడు. భర్తను చూడటంతోనే ఆమె కన్నులు తామర పువ్వులవలె వికసించాయి. ఆమె వేగిరపాటుతో భర్తకు ఎదురేగి కాళ్లు కడుగుకొనటానికి నీటిని అందించింది. పూనికతో అతడికి తలఅంటి స్నానం చేయించింది. అనురాగంతో మంచి మాటలు చెప్పుతూ అతడికి అన్నం వడ్డించింది. పానీయాలు అందించింది. భర్తకు సంపూర్ణ సంతుష్టి కల్పించింది.

**చ. కుడిచినపిమ్మటం గుసుమకోమలి విస్తృతసంస్తరంబుగా**
**నొడికపు సెజ్జ చేసి ప్రియుఁ డొయ్యన యందు శయింపఁ దమ్ములం**
**బిడి చరణంబు లొత్తి మదిరేక్షణ యంతటిలోఁ దలంచె ము**
**న్నడరఁగ భిక్షకై నిలిచినట్టి మహీసురముఖ్యు నాత్మలోన్. 11**

**ప్రతిపదార్థం:** కుడిచినపిమ్మటన్= (భర్త) భోజనం చేసిన పిదప; కుసుమకోమలి= పువ్వువలె మృదువైనది; విస్తృత, సంస్తరంబుగాన్= విశాలంగా పరచిన పరుపు కలదిగా; ఒడికము+సెజ్జ, చేసి= మనోహరమైన మెత్తని శయ్యను ఏర్పరచి; ప్రియుఁడు= భర్త; అందున్= ఆ శయ్యపై; ఒయ్యన= తిన్నగా; శయింపన్= పండుకొనగా; తమ్ములంబు+ఇడి= తాంబూలం అందించి; చరణంబులు+ఒత్తి= కాళ్లు పిసికి; మదిరా+ఈక్షణ= మత్తెక్కించే కన్నులు కలది, మగువ; అంతటిలోన్= ఆ సమయంలో; మున్ను= అంతకు ముందు; అడరఁగన్= పూనికతో; భిక్షకై= బిచ్చానికై; నిలిచినట్టి= వాకిట నిలబడినట్టి; మహీసుర, ముఖ్యున్= బ్రాహ్మణులలో శ్రేష్ఠుడైన వాడిని; ఆత్మలోన్= మనస్సులో; తలంచెన్= స్మరించింది. జ్ఞాపకం చేసికొన్నది.

**తాత్పర్యం:** ఆమెభర్త సంతృప్తిగా భోజనం చేసిన పిదప, ఆ పూబోడి అతనికి మెత్తని శయ్యను ఏర్పరచింది. భర్త ఆ పరుపుపై హాయిగా పవళించిన పిమ్మట అతడికి ఆమె తాంబూల మిచ్చింది. కాళ్లు పిసికింది. భర్తకు సమస్తపరిచర్యలు చేసిన పిదప, అంతకుముందు తన వాకిలివద్ద భిక్షకొరకు నిలిచిన బ్రాహ్మణశ్రేష్ఠుడిని స్మరించింది.

**విశేషం:** మదిరేక్షణ అనే పదానికి కాటుకపిట్ట వంటి కన్నులు గలది (స్త్రీ) అని కూడా అర్థం చెప్పవచ్చు.

**వ. ఇట్లు దలంచి భిక్ష గొనుచుం జనుదెంచిన నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజితలోచనుం డగుచు ని ట్లనియె. 12**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; తలంచి= యోచించి; భిక్షన్+కొనుచున్+చనుదెంచినన్= బిచ్చం (ఇవ్వటానికి అన్నాన్ని) తీసికొనిరాగా; ఆ+మగువన్+చూచి= ఆ వనితను చూచి; కౌశికుండు= కౌశికుడు; రోష, రంజిత, లోచనుండు+అగుచున్= కోపంచేత, ఎర్రబడిన కన్నులు కలవాడు ఔతూ; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా ఆలోచించి, ఆ బ్రాహ్మణ బ్రహ్మచారికి బిచ్చం పెట్టటానికై పాత్రలో అన్నం నింపికొని వచ్చిన ఆ ఇల్లాలిని చూచి కౌశికుడు, కోపంచేత ఎర్రబడిన కన్నులు కలవాడై ఇట్లా అన్నాడు.

**క. 'అడిగినయప్పుడ చెచ్చెరఁ । గడపినఁ బో నవ్వ! యేను గడుదుర్మతి వై**
**పడఁతి! నను నిలిపి భిక్షం । బిడక కడు నవజ్ఞ సేసి తేల మదమునన్?' 13**

**ప్రతిపదార్థం:** అవ్వ!= అమ్మా!; అడిగిన+అప్పుడు+అ= నేను బిచ్చం వేడిన వెనువెంటనే; చెచ్చెరన్= శీఘ్రంగా; కడపినన్= వెడలు మని అంటే; ఏను= నేను; పోను+అ= పోన= వెళ్లిపోయి ఉండేవాడను కదా; కడున్= మిక్కిలి, దుర్మతివి+ఐ= చెడుబుద్ధి కలిగిన దానివై; పడతి!= ఓవనితా!; ననున్= నన్ను; నిలిపి= ఆపి; భిక్షంబు+ఇడక= బిచ్చం వేయక; మదమునన్= గర్వంతో; కడున్= మిక్కిలి; అవజ్ఞ= అవమానం; చేసితి+ఏల= ఎందుకు చేశావు?

**తాత్పర్యం:** అమ్మా! అడిగినప్పుడు వెంటనే పొమ్మని అంటే నేను పోయి ఉందునుగదా! మిక్కిలి దుర్బుద్ధి గలదానివై గర్వంతో నన్నిట్లా నిలబెట్టి భిక్షం పెట్టకుండా మిక్కిలి అవమానం ఎందుకు చేసినావమ్మా?

**చ. అనినఁ బతివ్రతాతిలక మాతని కిట్లను 'నయ్య! మత్ప్రియుం**
**డనుపమితక్షుధాకలితుఁడై చనుదెంచిన భక్తి నమ్మహా**
**త్మునకు సపర్యసేయుచు మిమున్ మదిలోనఁ దలంపఁజాల నై**
**తి; నిదియుఁ దప్పుగాఁ గొనక ధీరత యొప్ప సహింపఁగాఁ దగున్.' 14**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; పతివ్రతాతిలకము= పతివ్రతలలో శ్రేష్ఠురాలైన ఆమె; ఆతనికిన్= ఆ కౌశికుడికి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నది; అయ్య!= ఆర్యా!; మత్+ప్రియుండు= నా మగడు; అనుపమితక్షుధా+కలితుఁడు+ఐ= సాటిలేని అనగా మిక్కిలి ఎక్కువైన ఆకలిచేత కూడినవాడై; చనుదెంచినన్= రాగా; భక్తిన్= పూజ్యభావంతో; ఆ+మహా+ఆత్మునకున్= ఆ గొప్పఆత్మ గల మహనీయుడికి; సపర్య+చేయుచున్= సేవలు సల్పుతూ; మిమున్= మిమ్ము; మదిలోనన్= మనస్సులో; తలంపన్+చాలను+ఐతిన్= స్మరించ లేక పోయితిని; ఇదియున్= ఈ విధంగా మిమ్ము స్మరించకపోవటం; తప్పుగాన్+కొనక= అపరాధంగా గ్రహించక; ధీరత+ఒప్పన్= సహనం విలసిల్లేటట్లుగా; సహింపఁగాన్+తగున్= ఓర్చుకొనటం మంచిది.

**తాత్పర్యం:** ఆ కౌశికుని అధిక్షేపణకు సవినయంగా ఆ ఇల్లాలు ఇట్లా బదులు పలికింది. 'అయ్యా! నా పెనిమిటి మిక్కిలి ఆకలితో ఇంటికి వచ్చాడు. అందుచేత భక్తితో ఆ మహాత్ముడికి సేవలు చేస్తూ మిమ్ము స్మరింపజాలక పోయాను. దీనిని మీరు అపరాధంగా గ్రహించరాదు. సహనంతో ఓర్చుకొనదగును.

**వ. అనిన నమ్మహీదేవుం డప్పతివ్రత కి ట్లనియె. 15**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆ+మహీదేవుండు= ఆ బ్రాహ్మణుడు; ఆ+పతివ్రతకున్= ఆ సాధ్వికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా ఆ బ్రాహ్మణుడు ఆ పతివ్రతకు ఈవిధంగా బదులు పలికాడు.

**ఉ. 'నీ మగఁ డంత యెక్కుడె? మనీషులు భూసురు లింత తక్కువే?**
**కోమలి! యేల యిట్లు గడుఁ గ్రొవ్వునఁ గానవు లోకవంద్యులన్?**
**భూమిసురేంద్రులన్ దివిజపుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చుచో**
**నేమిట నొక్కొవారు గడు నెల్లిద మై రిటు నీకు నిచ్చటన్. 16**

**ప్రతిపదార్థం:** కోమలి!= ఓ వనితా!; నీ మగఁడు= నీ భర్త; అంత+ఎక్కుడు+ఎ= అంత గొప్పతనం కలవాడా?; మనీషులు= గొప్పమేధ కలిగినవారు, విద్వాంసులు; భూసురులు= బ్రాహ్మణులు; ఇంత, తక్కువ+ఏ?= ఇంత హీనత కలవారా?; ఏల= ఎందులకు; ఇట్లు= ఈవిధంగా; లోక, వంద్యులన్= లోకంలోని ప్రజలచేత నమస్కరించ తగినవారిని; కడున్= మిక్కిలి; క్రొవ్వునన్= మదంతో; కానవు= చూడవు; భూమిసుర+ఇంద్రులన్= బ్రాహ్మణశ్రేష్ఠులను; దివిజపుంగవుఁడు+ఆదిగన్= వేల్పులలో శ్రేష్ఠుడైన ఇంద్రుడు మున్నగువారు; భక్తిన్= పూజ్యభావంతో; కొల్చుచోన్= ఆరాధిస్తుంటే; వారు= ఆ బ్రాహ్మణులు; నీకున్; ఇచ్చటన్= ఇచ్చట; ఇటు= ఈవిధంగా; కడున్= మిక్కిలి; ఏమిటన్+ఒక్కొ= ఎందుకో మఱి; ఎల్లిదము+ఐరి= చులకన అయినారు?

**తాత్పర్యం:** 'ఏమమ్మా! నీ భర్తయే అంత గొప్పవాడని తలపోస్తున్నావా? నీ ఉద్దేశంలో విజ్ఞానులైన విప్రులు అంత తక్కువవా రయినారా? బ్రాహ్మణులు జగత్సంపూజ్యులు. దేవేంద్రుడు సయితం బ్రాహ్మణులను భక్తితో ఆరాధిస్తాడుకదా! నీవు మాత్రం గర్వంతో అట్టివారిని చులకనగా చూడటం నాకు మిక్కిలి ఆశ్చర్యకరంగా ఉన్నది.

**క. అవమానితు లై ధరణీ। దివిజులు గ్రోధాగ్నిశిఖల దీపించి మహా**
**ద్రి వనద్వీపంబులతో। నవని నయినఁ బొడవడంతు రప్రతికారుల్. 17**

**ప్రతిపదార్థం:** ధరణీ, దివిజులు= బ్రాహ్మణులు (పుడమివేల్పులు); అవమానితులు+ఐ= అగౌరవింపబడినవారై; క్రోధ+అగ్ని, శిఖలన్= కోపం అనే అగ్నిజ్వాలలచేత; దీపించి= మండిపోయి; అప్రతికారుల్= తిరుగు లేనివారు; మహా+అద్రి, వన, ద్వీపంబులతోన్= గొప్పకొండలతో అడవులతో దీవులతో పాటుగా; అవనిన్+అయినన్= భూమిని సయితం; పొడవు+అడంతురు= నాశనం చేయగలరు.

**తాత్పర్యం:** బ్రాహ్మణులు అవమానించబడితే వారి కోపం అగ్నిజ్వాలలవలె ఎగసి, ఈ పుడమిని సమస్తాన్నీ కొండలతో, అడవులతో, దీవులతో పాటుగా దహించివేస్తుంది. వారి మహిమ తిరుగు లేనిది సుమా!

**వ. నీ వింత నెఱుంగ నొల్ల వైతివి గాకేమి' యనిన నయ్యంగన యి ట్లనియె. 18**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; ఇంతన్= ఈ విషయం, ఎఱుంగన్+ఒల్లవు+ఐతివి+కాక+ఏమి= తెలియలేకపోయావు గదా; అనినన్= అని అనగా; ఆ+అంగన= ఆ వనిత; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** నీవు ఈ విషయం తెలుసుకోలేకపోయావు అని చెప్పగా ఆ పతివ్రత ఇట్లా బదులు పలికింది.

**సీ. 'దేవతాసములు భూదేవతావరు లౌట । యేను దన్మాహాత్మ్య మెఱుఁగ నయ్య!**
**యొక విప్రుఁ డలిగి పయోనిధిజలము ల । పేయముల్ గాఁగ శపింపఁ డెట్లు;**
**దండకవిషయంబు దగ్ధంబు సేయండె । యలుకమై నొక్క మహాద్విజుండు;**
**వాతాపి యను దైత్యవరు మ్రింగి యఱిగించు । కొనఁడె భూదేవుఁ డొక్కొరుఁడు గినిసి;**

**తే. ధరణి మఱియును బెక్కు విధంబులందు । బ్రహ్మవిదు లైన బ్రాహ్మణప్రభుల మహిమ**
**వినమె! యెఱిఁగి యెఱింగి సద్వినుత చరిత! కొఱవి గొని వెఱ్ఱినే తలఁ గోఁకి కొనఁగ? 19**

**ప్రతిపదార్థం:** సత్+వినుత, చరిత!= మంచివారలచేత పొగడబడిన ప్రవర్తన కలవాడా!; భూ, దేవతావరులు= పుడమివేల్పు లైన విప్రులు, దేవతాసములు+ఔట= వేల్పులతో సమానులు; అగుట; ఏను= నేను; తత్+మాహాత్మ్యము= వారి మహిమ; ఎఱుఁగన్+అయ్య!= తెలియనిదాననా?; ఒక, విప్రుఁడు= ఒక బ్రాహ్మణుఁడు; అలిగి= కోపించి; పయస్+నిధి, జలంబులు= సముద్రంలోని నీళ్ళు; అపేయముల్+కాఁగన్= త్రాగకూడనివయ్యేటట్లుగా; శపింపఁడు+ఎట్లు= శాపం ఇవ్వలేదా?; ఒక్క, మహా, ద్విజుండు= ఒక గొప్ప బ్రాహ్మణుడు; దండక, విషయంబు= దండకం అనే పేరు గల అరణ్య ప్రదేశం; అలుకమైన్= కోపంతో; దగ్ధంబు+చేయండు+ఎ= తగులబడేటట్లుగా చేయడా?; భూదేవుఁడు+ఒక్కొరుఁడు= ఒకానొక విప్రుడు; కినిసి= కోపించి; వాతాపి+అను, దైత్యవరున్= వాతాపి అనే పేరుగల రాక్షస శ్రేష్ఠుడిని; మ్రింగి= భక్షించి; అఱిగించుకొనఁడు+ఎ= జీర్ణంచేసికొనడా?; ధరణిన్= భూమిలో; మఱియును= ఇంకను; పెక్కు, విధంబులందున్= పలురీతులలో; బ్రహ్మవిదులు+ఐన= బ్రహ్మజ్ఞానం తెలిసిన; బ్రాహ్మణ, ప్రభుల మహిమ= విప్రులలో శ్రేష్ఠులైన వారి గొప్పదనం; వినమె= ఆలకించమా?; ఎఱిఁగి, ఎఱింగి= తెలిసి తెలిసి; కొఱవిన్+కొని= మండేకట్టెను తీసికొని; తలన్= శిరస్సును; గోఁకికొనఁగన్= బరుకుకొనటానికి, వెఱ్ఱినే= పిచ్చిదాననా?

**తాత్పర్యం:** 'పుడమివేల్పులైన బ్రాహ్మణులు దేవతలతో సమానులే. నాకు వారి గొప్పతనం తెలియదా? ఒక బ్రాహ్మణుడు కోపించి సముద్ర జలాలు త్రాగకూడనివయ్యేటట్లుగా శపించలేదా? మరొక బ్రాహ్మణోత్తముడు దండక ప్రదేశం తగులబడిపోయేటట్లుగా చేయలేదా? ఒక విప్రుడు వాతాపి అనే గొప్ప రక్కసిని, తిని జీర్ణించుకొనలేదా? అంతేకాక, భూలోకంలో బ్రాహ్మణోత్తములమహిమ వినమా? మంచివారలచేత పొగడబడిన నడవడి గల ఓ విప్రోత్తమా! తెలిసి తెలిసి నేను బ్రాహ్మణులను అవమానించి కొరవితో తలగోకుకొనే పిచ్చిదాననా?

**విశేషం:** సముద్ర జలాలను త్రాగగూడనివిగా శపించిన విప్రుడు దుర్వాసుడు; దండకారణ్యాన్ని కోపంతో దహింపజేసిన విప్రుడు శుక్రాచార్యుడు; వాతాపిని జీర్ణించుకొన్న బ్రాహ్మణుడు అగస్త్యుడు.

**వ. నా తెఱంగు సెప్పెద నాకర్ణింపుము. 20**

**తాత్పర్యం:** నేను అనుసరించే మార్గాన్ని వివరించి చెప్పుతాను; దయచేసి వినుము.

**తే. పతియచూవె నాపాలికిఁ బరమదైవ; । మేను వాఙ్మనఃక్రియలఁ దద్ధితమ యెపుడుఁ**
**గోరి యొనరింతు; దీని మిగులఁగ నొండు । ధర్మువులు గాన నెందును దలఁచి చూచి. 21**

**ప్రతిపదార్థం:** పతి+అ= పతియ, చూవె= భర్త మాత్రమే కదా; నాపాలికిన్= నాయెడల; పరమదైవము= గొప్పదేవుడు - పరమాత్మ, ఏను= నేను; వాక్+మనస్+క్రియలన్= మాటలచేత, మనస్సుచేత, పనులచేతను; తత్+హితము+అ= ఆతడియొక్క శ్రేయాన్నే; ఎపుడున్= ఎల్లప్పుడున్నూ; కోరి= అభిలషించి; ఒనరింతున్= చేస్తాను; దీని మిగులఁగన్= దీనిని మినహాయించి; ఒండుధర్మువులు= వేరైన ధర్మాలు; తలఁచి, చూచి= ఆలోచించి చూచి; ఎందును= ఎక్కడకూడా కానన్= చూడను.

**తాత్పర్యం:** నా దృష్టిలో నా పాలికి గొప్ప దేవుడు నా భర్తమాత్రమే. నేను త్రికరణశుద్ధిగా, మనస్సుచేత, మాటలచేత, కర్మలచేత నా పతి శ్రేయస్సునే కాంక్షిస్తాను. ఆ విధంగానే నా ఆచరణను తీర్చిదిద్దుకొంటాను. ఎంత ఆలోచించి తరచి చూచినా, ఇంతకంటె గొప్ప ధర్మాలు నాకు కనుపించటం లేదు సుమా!

**వ. నీ వతిక్రోధనుండ వగుటయు నెఱుంగుదు; నీకోపంబున నొక్కకొక్కెర నిహతం బయ్యెం గాదె! యిది మదీయపాతివ్రత్యమహిమం జేసి కాంచితిం; గాన క్రోధంబు గొనియాడుట లగ్గు గా' దని యి ట్లనియె.22**

**ప్రతిపదార్థం:** నీవు= ఓ కౌశికా!; అతిక్రోధనుండవు= మిక్కిలి కోపంతో కూడిన స్వభావం కలవాడివి; అగుటయున్= అగుటయును; ఎఱుంగుదున్= తెలిసినదానను; నీకోపంబునన్= నీ ఆగ్రహంవలన; ఒక్క, కొక్కెర= ఒక కొంగ; నిహతంబు+ అయ్యెన్+కాదె= చచ్చిపోయిందికదా; ఇది= ఈ విషయం (కొంగ చనిపోవటం); మదీయ, పాతివ్రత్య, మహిమన్+చేసి= నాయొక్క పాతివ్రత్య ప్రభావంచేత; కాంచితిన్= చూచాను; కాన= కావున; క్రోధంబు= కోపాన్ని; కొని+ఆడుట= ఆదరించటం; లగ్గు, కాదు= మేలు కాదు; అని= అని పలికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** నీవు తీవ్ర కోపంతో కూడిన స్వభావం కలవాడ వని నాకు తెలియును. నీ కోపంవలన ఒకకొంగ చనిపోయింది కదా! ఈ విషయం నా పాతివ్రత్య మహిమవలన నేను తెలిసికొన్నాను. కావున కోపాన్ని వహించటం మంచిది కాదు సుమా!' అని చెప్పి, మఱియు ఆమె ఇట్లా అన్నది.

**తే. 'క్రోధ మోహ నామకు లైన ఘోరశత్రు । లిరువు రెరియించుచుండుదు రెపుడు నంత**
**రంగ మయ్యుభయంబు నడంగకున్నఁ । గలదె యూరక బ్రాహ్మణ్యగౌరవంబు? 23**

**ప్రతిపదార్థం:** క్రోధ, మోహ, నామకులు+ఐన= కోపం, మోహం అనే పేర్లు గలవారైన, ఘోర, శత్రులు= భయంకరమైన విరోధులు; ఇరువురు= ఇద్దరు, ఎపుడున్= ఎల్లప్పుడు; అంతరంగమున్= హృదయాన్ని; ఎరియించుచున్+ఉండుదురు= తగులబెట్టుతుంటారు; ఆ+ఉభయంబున్= ఆ రెండున్నూ; అడంగక+ఉన్నన్= నశించకపోతే; బ్రాహ్మణ్య= బ్రాహ్మణులకు సంబంధించిన, గౌరవంబు= గొప్పతనం; ఊరక కలదె?= నిష్కారణంగా ఏర్పడుతుందా?

**తాత్పర్యం:** మానవుల హృదయాలలో, కోపం మోహం అనేపేర్లు కల శత్రువులు ఇద్దరు మిక్కిలి భయంకరమైన వారు నివసిస్తుంటారు. వారిని ఇద్దరను అణచివేయకపోతే, బ్రాహ్మణులకు నిజమైన గొప్పతనం ఎట్లా ఏర్పడుతుంది?

**సీ.** **ఎవ్వఁడు సత్యంబ యెప్పుడుఁ బల్కు హింఁ । సావిదూరుఁడు గురుజనహితార్థి**
**యింద్రియంబుల నోర్చి యెల్లవారలఁ దన । యట్ల కాఁ జూచు ధర్మాభిరతుఁడు**
**గామంబు దగులండు కర్మంబు లాఱును । సముచిత సంప్రయోజ్యత నొనర్చు**
**నట్టి పుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁడని । యనిశంబుఁ గీర్తింతు రమరవర్యు;**

**ఆ.** **లార్జవంబు శమము నధ్యయనంబును । బరమధనము సువ్వె బ్రాహ్మణునకు**
**ధర్మగతికి నివియ తగు సాధనంబులు । వేదవిహితముఖ్యవిధులు నివియ.** **24**

**ప్రతిపదార్థం:** ఎవ్వఁడు= ఎవడు; సత్యంబు+అ= నిజాన్ని మాత్రమే; ఎప్పుడున్= సతతం; పల్కున్= మాటాడుతాడో; హింసా, విదూరుండు= ఎవరికిని ఎట్టిపీడ చేయనివాడో; గురు, జన, హిత+అర్థి= గురువులు అయిన వారల మేలు కోరే వాడో; ఇంద్రియంబులన్+ఓర్చి= ఇంద్రియాలను నిర్జించి; ఎల్లవారలన్= అందరను; తన+అట్ల, కాన్+చూచు= తనవంటివారలనుగానే చూచే; ధర్మ+అభిరతుఁడు= ధర్మంలో మిక్కిలి ఇష్టం కలవాడో; కామంబు= కోరికయందు; తగులండు= చిక్కుకొనడో; కర్మంబులు+ఆఱును= ఆరుపనులను (షట్ కర్మములను); సముచిత, సంప్రయోజ్యతన్+ఒనర్చున్= తగిన పద్ధతిలో ఆచరించునో అట్టి= పైనచెప్పబడినట్టి విధంగా ఉన్న వాడిని; పుణ్య+ఆత్మునిన్= సుకృతాలు ఆర్జించే మహానుభావుడిని; అనఘున్= పాపరహితుడైనవాడిని; అమరవర్యులు= వేల్పులలో శ్రేష్ఠులు; బ్రాహ్మణుఁడు+అని= బ్రహ్మజ్ఞానం కలవాడని; అనిశంబున్= ఎల్లప్పుడును; కీర్తింతురు= పొగడుతారు; బ్రాహ్మణునకున్= బ్రహ్మజ్ఞానంగలవిప్రుడికి; ఆర్జవము= తిన్ననైన ప్రవర్తన; శమమున్= అంతరింద్రియనిగ్రహం; అధ్యయనంబును= వేదాలను చదవటం; పరమ, ధనము+చువ్వె= ధనాలలో గొప్పధనం సుమా; ఇవి+అ= ఇవియే (అనగా పూర్వోక్తాలైన గొప్పగుణగణాలు మాత్రమే); ధర్మగతికిన్= ధర్మమార్గానికి; తగు= ఉచితమైన; సాధనంబులు= ఉపకరణాలు; ఇవి+అ= ఇవియే; వేద, విహిత, ముఖ్య, విధులు= వేదాలచేత నిర్ణయించబడిన కర్తవ్యాలు.

**తాత్పర్యం:** ఎవడు బ్రాహ్మణుడు? ఎవడికి బ్రాహ్మణ్యగౌరవం చెందదగింది? ఎవడు ఎల్లప్పుడును సత్యాన్నే పలుకుతాడో; ఎవడు ఎప్పుడును ఎవరినీ పీడించడో, ఎవడు తల్లితండ్రులు ఒజ్జలు మొదలైన గురువులకు మేలు తలుస్తాడో, ఎవడు సర్వభూతాల యెడ సానుభూతి కలిగి ఉంటాడో, ఎవడు కోరికలను విసర్జిస్తాడో, ఎవడు షట్కర్మలను తగినట్లుగా ఆచరించే అనుష్ఠానవేదాంతియో, అట్టి పుణ్యాత్ముడే, అట్టి మహాత్ముడే బ్రాహ్మణుడు. అట్టి మహానుభావుడినే అచ్చమైన బ్రాహ్మణుడిగా దేవతలు ప్రస్తుతిస్తారు. ఆర్జవ, ఇంద్రియనిగ్రహ, వేదాధ్యయనాలే బ్రాహ్మణుడికి గొప్పధనాలు. ధర్మపథానికి ఇట్టి సద్గుణగణాలే సాధనాలు. ఇవియే వేదాలచేత ఆదేశించబడిన కర్తవ్యాలు.

**విశేషం:** (i ) గురుజనులు:- తండ్రి, మేనమామ, అన్నగారు, చదువు చెప్పిన ఉపాధ్యాయుడు, మంత్రమును ఉపదేశించినవాడు మున్నగువారు గురుజనాలుగా పరిగణించబడతారు. (ii) షట్కర్మలు:- 1. యజనం 2. యాజనం 3. అధ్యయనం 4. అధ్యాపనం 5. దానం 6. ప్రతిగ్రహం.(iii) ధమ్మపదంలో 'ఎవడు బ్రాహ్మణుడు' అని ఒక ప్రత్యేక ప్రశ్న పరంపర ఉన్నది. అందును ఎన్నో సద్గుణగణాలు కలవాడే బ్రాహ్మణుడని చెప్పబడింది. మహాభారతంలోను, వైదికవాఙ్మయంలోను బ్రహ్మజ్ఞానం,

సౌశీల్యం, సద్గుణగణసంచయాలే బ్రాహ్మణత్వ లక్షణాలుగా పలుమారులు నొక్కి వక్కాణించబడ్డాయి. జన్మచేత బ్రాహ్మణత్వాన్ని ఎన్నటం అర్వాచీన లౌకిక సంప్రదాయమే.

**వ. ధర్మంబు బహుమార్గదృష్టంబయి సూక్ష్మంబయియుండు; నీవు కేవల స్వాధ్యాయపరుండవు గాని ధర్మ సూక్ష్మత యెఱుంగవు; గావునం దడయక మిథిలానగరంబున కరుగు; మందు జితేంద్రియుండును సత్యవాదియు మాతాపితృభక్తుండును నయినవాఁడు ధర్మవ్యాధుం డను కిరాతుండు నీకు నఖిలధర్మంబులు నెఱింగించి, సంశయచ్ఛేదంబు సేయు; నాదెసం బ్రసన్నుండ వగునది; వనితలకుం బరిజ్ఞానంబు లేదు గావున వా రెట్టి యపరాధంబు సేసినను సహింపవలయుఁ గదా!' యనినఁ గౌశికుం డి ట్లనియె. 25**

**ప్రతిపదార్థం:** ధర్మంబు= ధర్మం; బహు, మార్గ దృష్టంబు+అయి= పెక్కు తెరువులలో తిరుగాడేదిగా కన్పించేది అయి; ఉండున్= ఉంటుంది; ఈవు= నీవు; కేవల, స్వాధ్యాయ, పరుండవు= వేదాలు వల్లెవేయటంలో మాత్రమే నిష్ఠ కలిగినవాడవు; కాని= అంతేకాని; ధర్మ, సూక్ష్మత= ధర్మాధర్మవిచక్షణతలోని ఆంతర్యం; ఎఱుంగవు= తెలియనివాడవు; కావునన్= కాబట్టి; తడయక= ఆలస్యం చేయక; మిథిలా, నగరంబునకున్= మిథిల అనే పేరు కల పట్టణానికి; అరుగుము= వెళ్లుము; అందున్= ఆ మిథిలలో; జిత+ఇంద్రియుండును= జయించబడిన ఇంద్రియాలు కలవాడును- విషయలోలత్వాన్ని అతిక్రమించిన వాడును; సత్యవాదియున్= నిజాన్ని భాషించేవాడును; మాతాపితృభక్తుండునున్= తల్లిదండ్రులయెడ పూజ్యభావం కలవాడును; అయినవాఁడు; ధర్మవ్యాధుండు+అను, కిరాతుండు= ధర్మవ్యాధుఁడు అనే నామం పొందిన బోయవాడు; నీకున్; అఖిల ధర్మంబులున్= సమస్త ధర్మాలూ, ఎఱింగించి= తెలిపి; సంశయచ్ఛేదంబు+చేయున్= సందేహాలను తెగగొట్టివేస్తాడు; నాదెసన్= నాయెడల; ప్రసన్నుండవు+అగుము= అనుగ్రహం కలవాడవు కమ్ము; వనితలకున్= ఆడువారికి; పరిజ్ఞానంబు= ఎక్కువ తెలివిడి; లేదు= ఉండదు; కావునన్= కాబట్టి; వారు= ఆడువారు; ఎట్టి= ఏవిధమైన; అపరాధంబు= నేరం; చేసినను= చేసినప్పటికీ; సహింపవలయున్+కదా= ఓర్చుకొనవలసిందే కదా!; అనినన్= అని చెప్పగా; కౌశికుండు= కౌశికుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మం మిక్కిలి క్లిష్టమైనది. స్థూలదృష్టికి ఒక విధంగా, సూక్ష్మదృష్టికి మరొక తీరుగా కన్పిస్తుంది. ధర్మంయొక్క తీరుతీయాలు పెక్కు తెరగులు. నీవు వేదాలను వల్లెవేయటంలో మాత్రమే ఎక్కువనిష్ఠ కలవాడవు గాని ధర్మసూక్ష్మత గుర్తించగలిగిన విచక్షణ ఉన్నవాడవు కావు. కావున నీవు మిథిలానగరానికి వెళ్లి, ఆ పట్టణంలో 'ధర్మవ్యాధుడు' అనే పేరుతో విలసిల్లే బోయవాడిని సందర్శించు. అతడు జితేంద్రియుడు. మాతాపితృభక్తుడు. ధర్మసూక్ష్మవేత్త. అతడు నీసంశయాల నన్నింటిని పోగొట్టి నీకు విచక్షణాజ్ఞానం ప్రసాదించగలడు. నాయెడ అనుగ్రహం చూపుము. ఆడువారికి విజ్ఞానం ఉండదుకదా! అజ్ఞానంలో పడి కొట్టుకొనే నాబోటి ఆడువారు ఎటువంటినేరం చేసినా క్షమించవలెను కదా' అని ఆమె చెప్పిన మాటలు విని కౌశికుడు ఈవిధంగా బదులు పలికాడు.

**క. 'నిను దూఱఁదగదు నీకత । మున నాచిత్తము ప్రశాంతిఁ బొరసెఁ బురంధ్రీ**
**జన వినుత! పోయి వచ్చెద । ననుపమశోభనసమృద్ధు లయ్యెడు నీకున్.' 26**

**ప్రతిపదార్థం:** పురంధ్రీ, జన, వినుత= మగడు బిడ్డలుగల అనగా ఇల్లాండ్రసముదాయంచేత పొగడబడినదానా!; నినున్= నిన్ను; దూఱన్+తగదు= నిందించరాదు; నీ, కతమునన్= నీకారణాన; నా చిత్తము= నా మనస్సు; ప్రశాంతిన్= మిక్కిలి శాంతిని; పొరసెన్= పొందింది; పోయివచ్చెదన్= వెళ్ళివస్తాను (మిథిలానగరానికి నీఆదేశం ప్రకారం వెళ్ళుతాను); నీకున్= నీకు; అనుపమ, శోభన, సమృద్ధులు= సాటిలేనటువంటి శుభాల పెంపు; అయ్యెడున్= కలిగెడుగాక.

**తాత్పర్యం:** 'అమ్మా! నీవు కేవలం ఒక ఆడుదానివి కావు. మేటి ఇల్లాండ్రకు మేలుబంతివై కర్మయోగిని వైన నీ మూలాన నాకు జ్ఞానోదయం అయింది. నా మనస్సుకు ప్రశాంతి లభించింది. నీ ఆదేశం ప్రకారం నేను మిథిలానగరానికి వెళ్ళుతాను. నీకు మేలు కలుగుగాక!'

### కౌశికుం డను బ్రాహ్మణుండు ధర్మవ్యాధుని యొద్దకుఁ బోవుట (సం. 3-197-1)

**వ. అని యా క్షణంబ యమ్మహాద్విజుండు ధర్మవ్యాధ దర్శనలాలసుండై కదలి పతివ్రతయెఱుకకు విస్మయం బందుచు దన్నుం గృతాపరాధునింగాఁ దలంచుచు ననేకనగర గ్రామంబు లతిక్రమించి చని, యనుపమానశోభాసనాథం బయిన మిథిలానగరంబు సొచ్చి, రాజమార్గంబు దఱిసి, యచ్చటి జనంబుల ధర్మవ్యాధుం డున్నయెడ నడిగి, వా రెఱింగింప నట యేఁగి ముందట నల్పమృగమాంసఖండంబు లంగడిం బచరించి యమ్ముచున్నవాని, ననవరత విక్రయాగత జనసమావృతు నక్కిరాతుం గని, యతిజుగుప్సితం బయిన సూనాపణంబు సేర నొల్లక తొలంగి యొక్కయెడ నుండె; నంత. 27**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా చెప్పి; ఆ క్షణంబు+అ= ఆ క్షణంలోనే; ఆ+మహా, ద్విజుండు= ఆ గొప్పబ్రాహ్మణుడు; ధర్మవ్యాధ, దర్శన, లాలసుండు+ఐ= ధర్మవ్యాధుడిని చూడవలె ననే కోరిక కలవాడై; కదలి= అచ్చటి నుండి వెడలి; పతివ్రత, ఎఱుకకున్= పతివ్రతయొక్క తెలివిడికి; విస్మయంబు+అందుచున్= ఆశ్చర్యం చెందుతూ; తన్నున్= తనను; కృత+అపరాధు నిన్+కాన్= దోషం చేసిన వాడినిగా; తలంచుచున్= మనసులో ఎన్నుకొంటూ; అనేక, నగర, గ్రామంబులు= పెక్కు పట్టణాలు, పల్లెటూళ్లు; అతిక్రమించి= దాటి; చని= వెళ్లి; అనుపమాన, శోభా, సనాథంబు+అయిన= సాటిలేని వైభవంతో కూడినట్టి; మిథిలా, నగరంబు+చొచ్చి= మిథిల అనే పట్టణాన్ని చేరి; రాజమార్గంబు= రాజుగారు ఊరేగేతెరువు; తఱిసి= సమీపించి; అచ్చటి= అక్కడున్న; జనంబులన్= ప్రజలను; ధర్మవ్యాధుండు+ఉన్న+ఎడన్= ధర్మవ్యాధుడు నివసించే చోటును; అడిగి= ప్రశ్నించి; వారు= (ఆజనులు); ఎఱింగింపన్= తెలుపగా; అట+ఏగి= ఆ చోటికి వెళ్లి; ముందటన్ ఎదురుగా; అల్ప, మృగ, మాంస, ఖండంబులు= చిన్న చిన్న ముక్కలుగా చేయబడిన లేడి మాంసాలు; (లేక జంతువుల మాంసపు ముక్కలు); అంగడిన్= దుకాణంలో; పచరించి= ఏర్పరచి పెట్టి; అమ్ముచున్నవానిన్= విక్రయిస్తున్న వాడిని; అనవరత, విక్రయ+ఆగతజన, సమావృతున్= ఎడతెగకుండా కొనటానికై వస్తున్న ప్రజలచేత చుట్టుకొనబడినవాడిని; ఆ+కిరాతున్= ఆ బోయవాడిని; కని= చూచి; అతిజుగుప్సితంబు+అయిన= మిక్కిలి రోతపుట్టించేది అయిన; సూన+ఆపణంబు= జంతువులను చంపి వాటి మాంసాన్ని అమ్మే అంగడి; చేరన్+ఒల్లక= సమీపించటానికి ఇష్టపడక; తొలంగి= దూరంగా నిలిచి; ఒక్క+ఎడన్= ఒకచోట; ఉండెన్; అంతన్= పిమ్మట.

**తాత్పర్యం:** అంతట కౌశికుడు ఆ గృహిణిని వీడ్కొని వెళ్ళాడు. అతడు ఆ పతివ్రత జ్ఞానానికి ఆశ్చర్యపోయాడు. తాను తప్పుచేసినవాడుగా లోలోపల పశ్చాత్తాపం పొందాడు. అట్లే- అతడు ఎన్నో పల్లెలు, పట్టణాలు దాటి పయనించి ఎట్టకేలకు మిథిలానగరం చేరి, ఆ రాజధానిశోభను తిలకించి, రాజమార్గంలోని పౌరులను అడిగి, ధర్మవ్యాధుడు ఉండేచోటు తెలిసికొన్నాడు. అక్కడికి కౌశికుడు చేరినప్పుడు, ధర్మవ్యాధుడు తన అంగడిలో మాంసాన్ని ముక్కలుచేసి అమ్ముతున్నాడు. మాంసాన్ని కొనుగోలు చేసే జనులచేత ఆ అంగడి క్రిక్కిరిసి ఉండింది. రోత పుట్టించే ఆ దృశ్యాన్ని చూడలేక ఆ బ్రాహ్మణుడు ప్రక్కకు ఒదిగి ఒకచోట నిలబడి ఉన్నాడు.

**ఆ. వాఁడు నతనిరాక పోఁడిగ నిజబుద్ధి । నెఱిఁగి యతనియున్నయెడకు వచ్చి**
**పరమభక్తిమ్రొక్కి ధరణీసురేశ్వరుఁ । గుశల మడిగి ప్రియము గొనలు నిగుడ. 28**

**ప్రతిపదార్థం:** వాఁడున్= (ఆ ధర్మవ్యాధుఁడును); అతనిరాక= ఆ కౌశికుడు రావటం; పోఁడిగన్= ఒప్పుగా; నిజ, బుద్ధిన్= తనమనస్సుచేత; ఎఱిఁగి= తెలిసికొని; అతని+ఉన్న+ఎడకున్= అతడు ఉన్న చోటికి; వచ్చి= చేరి; పరమ, భక్తిన్= మిక్కిలి పూజ్యభావంతో; మ్రొక్కి= నమస్కరించి; ధరణీ, సుర+ఈశ్వరున్= బ్రాహ్మణోత్తముడిని; కుశలము= యోగక్షేమాలను; అడిగి= ప్రశ్నించి తెలిసికొని; ప్రియము= సంతోషం; కొనలు నిగుడన్= విస్తరించగా.

**తాత్పర్యం:** ఆ ధర్మవ్యాధుడు కౌశికుడు తనవద్దకు ఆ రీతిగా రావటం తన మనశ్శక్తిచేత తెలిసికొని, ఆ విప్రుడు నిలిచిఉన్న చోటికి చేరి అభివాదం చేసి, మిక్కిలి ప్రీతితో అతడిని సంభావించాడు.

**విశేషం:** అతిథులు అభ్యాగతులు తమవద్దకు వచ్చినపుడు వారి యోగక్షేమాలు అడగటం స్వాగతమర్యాదలో అంతర్భాగం.

**చ. 'అనఘ! నితంబినీతిలక మైన పతివ్రత నా తెఱంగు సె**
**ప్పినఁ జనుదెంచి తీవు ననుఁ బ్రీతిఁ గనుంగొన; నీమనోరథం**
**బును మదిలో నెఱుంగుదుఁ; బ్రమోదముఁ బొందితి; రమ్ము మద్గృహం**
**బున' కని పల్కి తోడుకొనిపోయె నతండు మహీసురోత్తమున్. 29**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా!; నితంబినీ, తిలకము+ఐన= ఆడువారిలో ఉత్తమురాలు అని చెప్పదగిన; పతివ్రత= భర్తను సేవించే గొప్ప ఇల్లాలు; నాతెఱంగు= నా తీరుతెన్నులు; చెప్పినన్= వచించగా; ఈవు= నీవు; ననున్= నన్ను; ప్రీతిన్= ప్రేమతో; కనుంగొనన్= చూడటానికి; చనుదెంచితి= వచ్చావు; నీ, మనో, రథంబును= నీ కోరికను; మదిలోన్= మనస్సులో; ఎఱుంగుదున్= తెలిసికొంటిని; ప్రమోదమున్= సంతోషాన్ని; పొందితిన్= చెందితిని; మత్+గృహంబునకున్= నా యింటికి; రమ్ము+అ= రమ్ము; అని పల్కి= అని వచించి; అతండు= (ఆ ధర్మవ్యాధుడు); మహీసుర+ఉత్తమున్= బ్రాహ్మణులలో గొప్పవాడయిన ఆ కౌశికుడిని; తోడుకొని పోయెన్= తనవెంట తీసికొని వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! నీకు నన్నుగూర్చి ఆ పతివ్రత చెప్పింది గదా! అందుచేత నీవు నన్ను చూడవలెననే కోరికతో నా దగ్గరకు విచ్చేశావు. ఈ విషయాన్ని నేను నా మనస్సుచేత తెలిసికొనగలిగాను. ఎంతో సంతోషం పొందాను. దయచేసి నాయింటికి రమ్ము' అని సగౌరవంగా స్వాగతం చెప్పి, ధర్మవ్యాధుడు బ్రాహ్మణోత్తము డైన కౌశికుడిని తన యింటికి తీసికొని వెళ్ళాడు.

**వ. కౌశికుండును ధర్మవ్యాధునెఱుక కచ్చెరు వంది పతివ్రతయెఱుకయుం దలంచి 'యిది రెండవు నాశ్చర్యంబు గంటి పొ' మ్మని తలంచుచుఁదదీయభవనంబున కరిగి వానిచేతంబూజితుం డయి యిష్టకథాప్రసంగంబున నుండి యతని కి ట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** కౌశికుండును= కౌశికుడనబడే ఆ బ్రాహ్మణుడును; ధర్మవ్యాధు+ఎఱుకకున్= ధర్మవ్యాధుడి తెలివిడికి; అచ్చెరువు+అంది= ఆశ్చర్యం పొంది; ఇది= (పతివ్రత తనను మిథిలకు వెళ్ళి ధర్మవ్యాధుడిని సందర్శించు మని చెప్పిన విషయం ఆవ్యాధుడికి తెలియటం); రెండు+అవు+ఆశ్చర్యంబు= రెండవది అయిన వింత; (మొదటి వింత కొక్కెర

చనిపోయిన సంగతి పతివ్రతకు తెలియటం); కంటిన్ పొమ్ము+అని= చూచాను గదా అని; తలంచుచున్= అని ఆలోచిస్తూ; తదీయభవనంబునకున్= ఆతడి యొక్క అనగా ధర్మవ్యాధుడియొక్క ఇంటికి; అరిగి= వెళ్ళి; వానిచేతన్= అతడి చేత; పూజితుండు+అయి= ఆరాధించబడినవాడై; ఇష్ట, కథా, ప్రసంగంబునన్= నచ్చినట్టి కథలను గూర్చిన సంభాషణలలో; ఉండి= కడపి; అతనికిన్= ఆ ధర్మవ్యాధుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** కౌశికుడికి ధర్మవ్యాధుడి మాటలు రెండవ వింతగా తోచాయి. అతడికి మొట్టమొదట వింతగొలిపినవి పతివ్రత మాటలు. ఈ రెండు వింతలనుగూర్చి ఆలోచిస్తూ కౌశికుడు ధర్మవ్యాధుడి ఇంటికి వెళ్లి, అచటి అతిథి సత్కారాలను పొంది, ఉచిత సంభాషణలు సలిపి, అతడితో ఈ విధంగా పలికాడు.

**విశేషం:** (i)కౌశికుడు ఎదుర్కొనినవి రెండు వింతలు. మొట్టమొదట అరణ్యంలో తాను ఏకాంతంగా వేదాధ్యయనం చేసేటప్పుడు తన ఆగ్రహానికి లోనయి చెట్టుమీది కొంగ కాలిపోయి నేలమీద పడటాన్ని పతివ్రత తెలిసికొనటం. (ii) రెండవ వింత: తాను సుదూరంగా ఎక్కడో ఆనాడు పతివ్రతతో నెరపిన సంభాషణ - మిథిలానగరంలో ఉన్న ధర్మవ్యాధుడికి ఇక్కడ తెలియటం.

**తే.** **'నీవు గడు ధర్మవిదుఁడవు జీవహింస । జీవనంబుగ నడచుట శిష్టపథమె?**
**యకట! యీ ఘోరకర్మంబునకు మదీయ । బుద్ధి దద్దయు దుఃఖంబు వొందె నిపుడు.** **31**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; కడున్= మిక్కిలి; ధర్మవిదుఁడవు= ధర్మాన్ని తెలిసినవాడవు; జీవహింస= ప్రాణులకు పీడ కలిగించటం; జీవనంబుగన్= బ్రదుకుతెరువుగా; నడచుట= వర్తించటం; శిష్ట, పథము+ఎ?= మంచి మార్గం కాగలదా?; అకట!= అయ్యో!; ఈఘోర, కర్మంబునకున్= ఈ భయంకరమైనపనికి; మదీయ, బుద్ధి= నామనస్సు; తద్దయున్= మిక్కుటంగా; ఇపుడు= ఈసమయంలో; దుఃఖంబు+పొందెన్= విషాదాన్ని పొందింది.

**తాత్పర్యం:** 'ఓమహానుభావా! నీవు ధర్మమార్గం అనగా ఎట్టిదో బాగా తెలిసినవాడవు కదా! 'జీవహింస'ను బ్రదుకుతెరువుగా గైకొని ప్రవర్తించటం న్యాయమా? నీవు చేస్తున్న భయంకరమైన ఈ పాపకృత్యంవలన నా మనస్సు మిక్కిలి పరితపిస్తున్నది.

**వ.** **అనుటయు లుబ్ధకుం డి ట్లనియె; 'బ్రాహ్మణులకుఁ దపస్స్వాధ్యాయ సత్యశౌచబ్రహ్మచర్యంబులును, రాజులకు దండనీతియు, వైశ్యులకుఁ గృషిపశుపాలనవాణిజ్యంబులును, శూద్రులకు శుశ్రూషయు నెట్లు పరమధర్మం బయి చెల్లు; నట్ల మాకును మృగమాంసోపజీవనంబు పరమధర్మంబు; విశేషించి యిది వంశక్రమాగతం బయిన యాచారంబు; విను; మదియునుం గాక యీ దేశంబునకు రాజైన జనకుండు రాజధర్మతత్పరుండయి సకలవర్ణధర్మరక్షణంబు వదలకుండు; నట్లుగాన యాత్మకర్మంబులు విడుచువానిం దనపుత్త్రునైనను దండితుం జేయుఁ గావున నేనును నిజకర్మపరిత్యాగంబు సేయ నోడుదు; నీదృశప్రవర్తనుండ నయ్యును.** **32**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పటంతో; లుబ్ధకుండు+ఇట్లు+అనియెన్= వ్యాధుడు(ధర్మవ్యాధుడు) ఈవిధంగా అన్నాడు; బ్రాహ్మణులకున్= విప్రులకు; తపస్+స్వాధ్యాయ, సత్య, శౌచ, బ్రహ్మచర్యంబులును= తపస్సుచేయటం, వేదాలను వల్లెవేయటం, నిజం చెప్పటం, పరిశుభ్రతను పాటించటం, ఇంద్రియనిగ్రహంతో కూడిన జ్ఞానాన్ని ఆర్జించటం; రాజులకున్= క్షత్రియు లైన పాలకులకు; దండనీతియున్= దుష్టులను శిక్షించటం శిష్టులను రక్షించటంతో కూడిన పాలన; వైశ్యులకున్=

కోమట్లకు; కృషి= వ్యవసాయం; పశుపాలన= పశురక్షణ; వాణిజ్యంబులును= వర్తకమున్నూ; శూద్రులకున్= నాలవజాతివారికి; శుశ్రూషయున్= సేవయును; ఎట్లు= ఏవిధంగా; పరమ, ధర్మంబు+అయి= మిక్కిలి గొప్పది అయిన ధర్మం ఔతూ; చెల్లున్= తగును; అట్లు+అ= అదే విధంగా; మాకును= మాబోటి వారలకును; మృగ, మాంస+ఉపజీవనంబు= జంతువుల మాంసంపై ఆధారపడి బ్రతకటం; పరమ, ధర్మంబు= గొప్పదైన ధర్మం; విశేషించి= విశదీకరించి వివరిస్తే; ఇది= మృగమాంసోపజీవనం; వంశ, క్రమ+ఆగతంబు+అయిన= కుటుంబంలో వరుసగా వస్తున్న; ఆచారంబు= సంప్రదాయం; వినుము; అదియునున్+కాక= అంతకంటె మిక్కుటంగా ఎన్నదగింది; ఈదేశంబునకున్= ఈ(మిథిలా) రాజ్యానికి; రాజు+అయిన= ప్రభువు అయిన; జనకుండు; రాజ, ధర్మ, తత్, పరుండు+అయి= ప్రభుత్వం నిర్వహించే విధులను నిష్ఠతో ఆచరించే వాడయి; సకల, వర్ణ, ధర్మ రక్షణంబు= అన్ని కులాలవారు నెరవేర్చవలసిన ధర్మాలను రక్షించటాన్ని; వదలక+ఉండున్= మీరకుండ కాపాడుతుంటాడు; అట్లు+కాన= ఆవిధంగా చేస్తాడు కాబట్టి; ఆత్మ, కర్మంబులు= తాను చేయవలసిన కర్మలను; విడుచువానిన్= త్యజించే వాడిని; తన పుత్త్రున్+ఐనను= తన కొడుకును అయినప్పటికిని; దండితున్+చేయున్= శిక్షను అనుభవించేవాడినిగా చేస్తాడు; కావునన్= కాబట్టి; ఏనును= నేను సయితం; నిజ, కర్మ, పరిత్యాగంబు= నాదైన పనులను వదలటం; చేయన్+ఒడుదున్= చేయటానికి జంకుతాను; ఈ, దృశ్యప్రవర్తనుండన్+అయ్యునున్= ఈ విధంగా కనిపించే నడవడి కలవాడ నైనప్పటికిని.

**తాత్పర్యం:** అంతట, ధర్మవ్యాధుడు కౌశికుడితో ఇట్లా చెప్పాడు. 'ఎవరికి అనువైన ధర్మాలు వారు ఆచరించవలసి ఉన్నది. బ్రాహ్మణులు నిర్వహించవలసిన ధర్మాలు - తపస్సు, వేదాలను చదవటం, పరిశుభ్రత పాటించటం, ఇంద్రియనిగ్రహంతో కూడి జ్ఞానసముపార్జనం చేయటం; క్షత్రియప్రభువులు పాటించవలసినధర్మం శిష్టరక్షణం దుష్టశిక్షణంతో గూడిన పరిపాలన; వైశ్యులు ఆచరించవలసిన ధర్మాలు - వ్యవసాయం, వర్తకం, పాడిపంటలు అభివృద్ధిచేయటం; శూద్రులకు విహితమైన ధర్మం పరిచర్య. అట్లే, వ్యాధులు నెరవేర్చదగిన ధర్మం మాంసవిక్రయం. మాంసోపజీవనం మాకు వంశక్రమంగా సంక్రమించిన ఆచారం. అంతేకాక, ఇది మిథిలారాజ్యం. ఈ దేశానికి ప్రభువు జనకమహారాజు ఎవరివంశవృత్తులు వారు నిర్వహించవలె నని శాసించేవాడు. ఆ శాసనం మీరేవాడు తన కొడుకైనాసరే దండన విధిస్తుంటాడు. ఇన్ని కారణాలచేత నేను నా స్వధర్మ మైన మాంసవిక్రయాన్ని వీడజాలకున్నాను. స్థూలదృష్టికి నా ప్రవర్తన ఈ రీతిగా కన్పించవచ్చును. కానీ.....

**తే.** **జీవహింస యెన్నండును జేయ ననఘ! యొరులు సంపి తెచ్చిన మాంస మొనర విలిచి**
**తగిన వెల కమ్మి బ్రదుకుదుఁ; దద్ధనమున । నమలమానసశాంతి నా యర్థ మెందు.** **33**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా! ఓకౌశికమహర్షీ!; జీవహింస= ప్రాణులను పీడించటం; ఎన్నండును= ఎప్పుడు కూడా; చేయన్= చేయను; ఒరులు= ఇతరులు; చంపి= సంహరించి; తెచ్చిన= తీసికొనివచ్చిఇచ్చిన; మాంసము= మాంసం; ఒనరన్= ఒప్పేటట్లుగా; విలిచి= కొని; తగినవెలకున్= సరియైన ధరకు; అమ్మి= విక్రయించి; తత్+ధనమునన్= ఆ విధంగా సంక్రమించిన డబ్బువలన; బ్రదుకుదున్= జీవిస్తాను; అమల, మానస, శాంతి= స్వచ్ఛమైన మనస్సుకు సంబంధించిన తృప్తి; ఎందున్= అన్ని విధాలుగా; నా, అర్థము= నా సంపద, అనగా జీవిత పురుషార్థమని భావం!

**తాత్పర్యం:** నా అంతట నేను ఎప్పుడూ ఎట్టి జీవహింసకూ పాల్పడను. ఇతరులు మృగాలను చంపి తెచ్చి ఇచ్చిన మాంసాన్ని నేను కొని, కొద్ది లాభాన్ని మాత్రమే చూచికొని సరిఅయిన ధరకు విక్రయిస్తాను. ఆ విధంగా లభించిన ధనంవలన జీవిస్తాను. నా ధనంవలన నాకు మనశ్శాంతికూడ కలుగుతుంది. అదే నా పరమార్థం.

**విశేషం:** బ్రతకటానికి కావలసిన ధనం - న్యాయార్జితమైనదానిని, అధికలాభానికి దురాశకు పాల్పడక సంపాదిస్తాననీ, దానివలన తనకు తృప్తి కలుగుతుందనీ ధర్మవ్యాధుడు నొక్కి వక్కాణించాడు. 'జీవించుటకొరకు మాత్రమే ధనం- గాని ధనం కొరకే జీవించటం కూడదు' అని అతడి సందేశం.

**చ. వినయము విస్తరిల్ల గురువృద్ధజనాతిథి విప్ర దేవతా**
**ర్చన లొనరింతు, సత్యమును శౌచము నేమఱ, నీగి మన్ననం**
**దనుపుదు భృత్యబంధుతతిఁ, దాల్మి వహింతు, నసూయఁ జేయ, నెం**
**దును మదిఁ దృష్ణ సొన్పఁ, బరదోషకథావిముఖుండ నెప్పుడున్. 34**

**ప్రతిపదార్థం:** వినయము= అణకువతో కూడిన ప్రవర్తన; విస్తరిల్లన్= వర్ధిల్లేటట్లుగా; గురు, వృద్ధ, జన+అతిథి, విప్ర, దేవతా+ అర్చనలు= ఒజ్జలకు ముసలివారికి అతిథులకు బ్రాహ్మణులకు దేవతలకు పూజలు; ఒనరింతున్= చేస్తాను; సత్యమును= నిజం పలుకటం; శౌచమున్= పరిశుభ్రత పాటించటం; ఏమఱను= మరచిపోను; ఈగి= దానంచేత; మన్ననన్= మర్యాదలు చేయటం చేతను; భృత్యబంధుతతిన్= సేవకులను, చుట్టాలను; తనుపుదున్= తృప్తి చెందిస్తాను; తాల్మిన్= ఓర్పును; వహింతున్= వహిస్తాను; అసూయన్+చేయన్= మాత్సర్యాన్ని చెందను; ఎందును= ఎట్టి విషయంలోనైనా; మదిన్= మనసులో; తృష్ణ+చొన్పన్= దాహాన్ని (ఎక్కువ అభిలాషను) ప్రవేశపెట్టను; ఎప్పుడున్= ఏ సమయంలోనైనా; పర, దోష, కథా, విముఖుండన్= ఇతరుల తప్పులను గూర్చిన ప్రసంగాలను ఎన్నబోను.

**తాత్పర్యం:** నేను మిక్కిలి అణకువతో కూడిన ప్రవర్తనతో గురువులను, పెద్దలను, అతిథులను, బ్రాహ్మణులను, దేవతలను పూజిస్తాను. సత్యవ్రతాన్ని పాటిస్తాను. పరిశుభ్రతను ఎన్నడూ మరవను. సేవకులకు దానా లిస్తాను. బంధువులను మర్యాదలు చేసి మన్నిస్తాను. ఓర్పును వహిస్తాను. అసూయ చెందను. ఎట్టి విషయాలలోను మిక్కుటమైన కోరికలను పెంచుకోను. ఎప్పుడూ ఇతరుల దోషాలను గూర్చిన ప్రసంగాలను వినను.

**క. సతతోపవాసనియమ । వ్రతములఁ జరియింతు నేకవనితాప్రియుఁడన్**
**ఋతుకాలరతుఁడ నిందా । స్తుతులందు మనంబు నాకుఁ దుల్యత నుండున్. 35**

**ప్రతిపదార్థం:** సతత+ఉపవాస, నియమ, వ్రతములన్= ఆహారాన్ని గైకొనకుండే నిబంధనలతో, నోములతో ఎల్లప్పుడును; చరియింతున్= నడుస్తాను, (ఆచరిస్తానని భావం); ఏక, వనితా, ప్రియుఁడన్= ఒకే స్త్రీయందు ప్రీతికలవాడను - ఏకపత్నీవ్రతం పాటించేవాడిని; ఋతు, కాల, రతుఁడన్= కాలానుగుణమైన సమయాలలోనే సంభోగించటంలో ఇష్టం కలవాడను; నిందా, స్తుతులందున్= తెగడ్తలలో, పొగడ్తలలో; మనంబు= మనస్సు; నాకున్; తుల్యతన్= సమభావంతో; ఉండున్= ఉంటుంది.

**తాత్పర్యం:** నేను ఎల్లప్పుడున్నూ ఆహార విహారాలలో నిష్ఠ, నియమాలను పాటిస్తాను. ఉపవాస వ్రతాలను పాటిస్తాను. ఏకపత్నీవ్రతుడను. ఋతుకాలాలను అనుసరించి సంభోగిస్తాను. నామనస్సులో పొగడ్తకు ఉబ్బను. తెగడ్తకు వెతచెందను.

**వ. అట్లగుటం జేసి హీనయోనిజుండ నయ్యును నిర్మలుండ నైతిం; బ్రసంగవశంబున నింత సెప్పవలసె; నీవు ధర్మబోధార్థంబు నాయున్నయెడకుం జనుదెంచితి గావున నీకు ధర్మవిశేషంబు లెఱింగించెద; నవధానతత్పరుండ వయి యాకర్ణింపుము. 36**

**ప్రతిపదార్థం:** అట్లు+అగుటన్+చేసి= ఆవిధంగా జరగటంవలన; హీన, యోనిజుండన్+అయ్యును= తక్కువకులంలో పుట్టిన వాడను అయినప్పటికిన్నీ; నిర్మలుండన్+ఐతిన్= స్వచ్ఛమైన శీలం కలవాడను అయినాను; ప్రసంగ, వశంబునన్= సంభాషణ ధోరణినిబట్టి; ఇంత+చెప్పవలసెన్= ఇంతమేర ఈ విధంగా చెప్పవలసి వచ్చింది; నీవు; ధర్మ, బోధ+అర్థంబు= ధర్మాన్ని తెలిసికొనటానికై; నా+ఉన్న+ఎడకున్= నేను ఉన్నచోటికి; చనుదెంచితి(వి)= వచ్చావు; కావునన్= కాబట్టి; నీకున్; ధర్మ, విశేషంబులు= ధర్మాలలోని ప్రత్యేకవిభాగాలు- ధర్మసూక్ష్మాలు; ఎఱింగించెదన్= తెలియపరుస్తాను; అవధాన, తత్, పరుండవు+అయి= ఏకాగ్రతలో నిష్ఠ కలవాడవై; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అందుచేత, నేను తక్కువకులంలో పుట్టినప్పటికిన్నీ, మంచిశీలం ఏర్పరచుకొన గలిగాను; ఇది నీకు చెప్పటం నాగొప్పదనం చాటుకొనటానికి కాదు. సంభాషణ చేయవలసివచ్చింది కాబట్టి చెప్పక తప్పింది కాదు. నీవు నా దగ్గరకు వచ్చింది ధర్మసూక్ష్మాలను తెలిసికొనటానికే కదా. నీకు ధర్మాలలోని ప్రత్యేకభేదాలను తెలుపుతాను. శ్రద్ధతో జాగరూకుడ వై వినుము.

**విశేషం:** ఇచట ధర్మవ్యాధుడు తననుగూర్చి తాను కొంత చెప్పుకొనవలసివచ్చింది. అది ఆత్మస్తుతిగా భాసించటానికి కొంత సావకాశమున్నది. అందుచేత ధర్మవ్యాధుడు సంకోచించి, - 'ఇంత' చెప్పవలసె అని క్షమాపణ చెప్పుకొన్నాడు. ఇచట 'ఇంత' అను సార్థకప్రయోగంలోని స్వారస్యం గమనించ తగింది.

### ధర్మవ్యాధుఁడు కౌశికునకు ధర్మవిశేషంబు లెఱిఁగించుట (సం. 3-198-19)

**క.** **తనకులధర్మము విడువక । మనుట పరమధర్మ మండ్రు మాన్యులు; చిత్తం**
**బునఁ గృప గలుగుట ముఖ్యపుఁ । బని; సైరణ వలయు నఖిలభావములందున్.** **37**

**ప్రతిపదార్థం:** మాన్యులు= గొప్పవారు; తనకులధర్మము= తనకులానికి చెందిన ధర్మం; విడువక= వదలక; మనుట= జీవించటం; పరమ, ధర్మము+అండ్రు= గొప్ప దైన ధర్మం అని అంటారు; చిత్తంబునన్= మనస్సులో; కృప= దయ; కలుగుట= ఉండటం; ముఖ్యము+పని= ప్రధాన మైన సంగతి; అఖిల, భావములందున్= అన్నిఅభిప్రాయాలలోను; సైరణ= ఓర్పు; వలయున్= ఉండాలి.

**తాత్పర్యం:** పెద్దలు చెప్పే గొప్పమాట ఏమంటే - తన కులానికి చెందిన ధర్మాన్ని విడువకుండా ఆచరించటం మంచిది. అసలు మనస్సులో దయ అనేభావం ఉండాలి. దయాగుణమే అన్నిటికంటె గొప్పది. ఈ ప్రపంచంలో విభిన్నభావాలు ఎన్నో ఉండవచ్చును. తన అభిప్రాయమే మంచిది. ఇతరుల భావాలు చెడ్డవి అనే భావం మంచిది కాదు. అన్నిభావాలయెడ సహనం ఉండాలి.

**విశేషం:** ఈ పద్యంలో రెండు గొప్ప గుణాలు (i) దయ (ii) సహనం శీలానికి గీటురాళ్లుగా పేర్కొనబడినవి. తాను బ్రాహ్మణుడు కావచ్చును. అహింసావ్రతాన్ని తాను పాటిస్తున్నట్లు తలపోయవచ్చును. కాని, మాంసవిక్రయం అధర్మమనే శీఘ్రనిర్ణయానికి పాల్పడరాదు. భిన్నభావాలయెడ సైరణ లేకపోతే ధర్మసూక్ష్మాన్ని ఎఱుగరాదుగదా!- 'సైరణ వలయు నఖిలభావములందున్' అనునది మహాభారతం అందించిన సందేశాలలో మేల్తరంగా ఎన్నదగింది.

**ఆ.** **విడువవలయు విషయవిషమవాంఛల నెద । విడుపుఁబోలు గుణము వెదకి యెందుఁ**
**గానరైరి బుధులు గలదె పరిత్యాగ । శీలునకు నసాధ్యసిద్ధి యెందు.** **38**

**ప్రతిపదార్థం:** ఎదన్= హృదయంలో; విషయ, వాంఛలన్= శబ్దస్పర్శాదులకు సంబంధించిన వంకరటింకర కోరికలను; విడువవలయున్= వదలిపెట్టాలి; బుధులు= పెద్దలు; వెదకి= అన్వేషణంచేసి; విడుపున్+పోలు, గుణము= వదలిపెట్టుట (త్యాగం) అనే దానితో సమానమైన లక్షణాన్ని; ఎందున్= ఎచటను; కానరు+ఐరి= చూడలేక పోయారు; ఎందున్= ఎచట నైనను; పరిత్యాగశీలునకున్= వదలిపెట్టే స్వభావం కలవాడికి; అసాధ్యసిద్ధి= సాధించలేనట్టి ప్రయోజనం; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** ఇంద్రియసుఖాలపై గల కోరిక హృదయపూర్వకంగా వీడాలి. త్యాగంతో సరిసమానమైన లక్షణం ఎక్కడా కనపడదని అనుభవపూర్వకంగా అన్వేషించి పెద్దలు చెప్పిన తీర్పుమాట. - త్యాగంచేసే స్వభావం గలవాడికి ఎచటనైన అసాధ్యమైన దెక్కడైనా ఉన్నదా?

**విశేషం:** ప్రాచీనభారతీయసంస్కృతి - 'త్యాగము'ను వేనోళ్ల ప్రస్తుతించింది. సిద్ధార్థుడు బుద్ధుడైనది - రాముడు దేవుడైనది భారతభూమిలో త్యాగమాహాత్మ్యంవలననే. 'న కర్మణా న ప్రజయా, న ధనేన త్యాగే నై కే, అమృతత్వ మానశుః' - ఇది వేదవచనం.

**సీ.** **సత్యహితాలాప చతురత యర్హంబు, । సంతత సుజన పూజనము వలయు,**
**విను కామసంరంభవిద్వేషములఁ జేసి । మతి గలంగినను ధర్మంబు దప్పఁ**
**ద్రొక్కక నడచు టత్యుత్తమసరణి; య । ప్రియములయందును బ్రియములందు**
**దైన్యహర్షంబులఁ దగులక యున్నట్టి । కల్యాణవర్తనకాంక్ష లెస్స;**

**తే.** **యెగ్గు సేసినవారికి హితము సేఁత । యార్యజనములు గీర్తింతు; రన్యదోష**
**కారి దనపాపమునఁ దాన కాలిపోవు; । వేఱ వానికిఁ గీడు గావింప నేల?** **39**

**ప్రతిపదార్థం:** సత్య, హిత+ఆలాప, చతురత= నిజాన్ని వచించటం, మేలుకలిగించే దానిని పలకటంలో నేర్పు; అర్హంబు= తగినట్టిది; సంతత, సుజన, పూజనము= ఎల్లప్పుడు మంచివారలను ఆరాధించటం; వలయున్= చేయతగినది; విను= వినుము; కామ, సంరంభ, విద్వేషములన్+చేసి= కోరికల త్రొక్కిసలాటచేత ఏర్పడే పగబూనుటలవలన; మతి+కలంగినను= బుద్ధి చెడిపోయినను; ధర్మంబు+తప్పన్+త్రొక్కక= ధర్మమార్గాన్ని విడిపోవకుండగ; నడచుట= ప్రవర్తించటం; అతి+ఉత్తమ+ సరణి= మిక్కిలి మంచిదైన పద్ధతి; అప్రియముల+అందును= తనకు ఇష్టం కాని సంగతులలోనూ; ప్రియములందున్= ఇష్టా లైన సంగతులలోనూ; దైన్య, హర్షంబులన్= క్రుంగిపోవటంలో గాని, ఉబ్బిపోవటంలోగాని; తగులక= చిక్కుకొనక; ఉన్నట్టి= ఉండునట్టి; కల్యాణ, వర్తన, కాంక్ష= మేలినడవడి పెంపొందించుకొనే కోరిక; లెస్స= మేలు; ఎగ్గుచేసినవారికిన్= అపకారం చేసిన వారికి; హితము+చేఁత= మేలుచేయటం; ఆర్యజనములు= పూజించదగినవారు; కీర్తింతురు= పొగడుతారు; అన్య, దోషకారి= ఇతరులకు చెడు చేసేవాడు; తనపాపమునన్= తాను చేసిన దోషం (పాపం) వలన; తాను+అ= తానే; కాలిపోవున్= మండిపోతాడు; వేఱు+అ= భిన్నంగా, (అనగా అంతకంటె అదనంగా); వానికిన్= (అట్టి పాపికి); కీడు= హాని; కావింపన్+ఏల= ఎందుకు చేయాలి? (అనగా చేయ నవసరం లేదు).

**తాత్పర్యం:** ఎల్లప్పుడూ మంచివారిని పూజించాలి. సావధానంగా ఆలకించుము: ఒక్కొక్కవేళ కోరికలు సందడి కలిగించినప్పటికిని ధర్మమార్గాన్ని తప్పకుండగా తన నడవడి తీర్చి దిద్దుకొనాలి. ఇది మిక్కిలి మంచి పద్ధతి. తనకు శుభం కలిగినా, అశుభం ప్రాప్తించినా పొంగిపోరాదు. క్రుంగిపోకూడదు. అపకారం చేసినవారికి సయితం ఉపకారం చేయటమే ఆర్యులు పొగడే పద్ధతి. అపకారం చేసిన పాపాత్ముడు తనపాపంచేత తానే కాలిపోతాడు కదా! ఇక అట్టి పాపాత్ముడికి వేరే హాని చేయటం అనవసరం.

**క. ధార్మికులు సలుపు నుత్తమ । కర్మముఁ జెడనాడు నాస్తికజనము; విను! మా**
**దుర్మతుల తెఱఁగు గైకొని । ధర్మమునెడఁ బ్రీతి వదలఁ దగదు బుధునకున్. 40**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; నాస్తికజనము= వేదప్రామాణ్యాన్ని అంగీకరించక దేవుడు లేడు అని వాదించే వారలకూటమి; ధార్మికులు= ధర్మాత్ములు; చలుపు= చేసే; ఉత్తమ, కర్మమున్= మంచిపనిని; చెడనాడున్= తెగడుతుంది; ఆ, దుర్మతుల తెఱఁగు= ఆ చెడ్డబుద్ధి కలవారల పద్ధతిని; కైకొని= అంగీకరించి, స్వీకరించి; బుధునకున్= మంచివాడికి; ధర్మము+ఎడన్= ధర్మంపట్ల; ప్రీతి= అభిమానం; వదలన్+తగదు= వీడటం మంచిది కాదు.

**తాత్పర్యం:** వేదప్రామాణ్యాన్ని అంగీకరించక దేవుడు లేడు అని వాదించేవారు, ధర్మాత్ములు చేసే మంచిపనులను నిందిస్తారు. అట్టి దురాత్ముల పద్ధతిని అంగీకరించి, బుధుడు ధర్మంపట్ల అభిమానాన్ని వీడకూడదు.

**విశేషం:** నాస్తికుడు - అనేమాటకు లేదు అని ఎంచేవాడు అని అర్థం. వేదములందు, భగవంతుడియందు, పరలోకములందు నమ్మకం లేనివాడు అనే అర్థంలో నాస్తికశబ్దం బహుళంగా ప్రయోగించబడింది.

**క. మది మఱపునఁ బాపము దన । కొదవుటయును బిదప వగచి యొక సగమును నే**
**నిది సేయ నింక ననియెడు । మదిఁ బెఱసగమును నరుండు మలుఁగు నఘంబున్. 41**

**ప్రతిపదార్థం:** మది, మఱపునన్= మనస్సు ఏమరుపాటులో ఉన్నపుడు (అనాలోచితంగా); పాపము= దురితం; తనకున్+ ఒదవుటయును= తనకు సంప్రాప్తంకావటమున్నూ; పిదపన్= పిమ్మట; వగచి= దుఃఖించి; ఒక, సగమును= ఒక సగభాగాన్ని; ఏన్+ఇది+చేయన్+ఇంకన్= నేను ఇట్టిపనిని ఇక మీద చేయను; అనియెడు, మదిన్= అని తలపోసే మనస్సువలన; పెఱ, సగమును= ఇంకొక సగభాగాన్ని; అఘంబున్= పాపమును; నరుండు= మనుజుడు; మలుఁగున్= తొలగించుకొంటాడు.

**తాత్పర్యం:** ఆలోచించకుండ తనకు పాపం సంప్రాప్తమయినపుడు తాను చిత్తశుద్ధితో పశ్చాత్తాపం చెందితే చేసిన పాపంలో సగభాగాన్నీ, ఇక అట్టి పాపాన్ని తాను చేయనని అనుకొనటంవలన మిగిలిన సగభాగం పాపాన్నీ నరుడు తొలగించుకొనవచ్చును.

**తే. పాపముల కెల్ల నెక్కుడు పాతకములు । సువ్వె క్రోధలోభంబులు సువ్రతాత్మ!**
**వాని రెంటి జయించినవాఁడు గాని । యెందుఁ బరమధార్మికుఁ డని యెన్నఁబడఁడు. 42**

**ప్రతిపదార్థం:** సువ్రత+ఆత్మ!= మంచిదీక్ష కల ఆత్మను కలవాడా! (ఓకౌశికమహర్షీ); పాపములకున్+ఎల్లన్+ఎక్కుడు, పాతకములు= దురితాలలో అన్నిటికంటె అధికమైన దురితాలు; క్రోధ, లోభంబులు+చువ్వె= కోపం; పిసినితనం కదా; వాని రెంటిన్= ఆ రెంటిని (అనగా కోపలోభాలను); జయించిన వాఁడు, కాని= నిగ్రహించిన మనుజుడు గాని; ఎందున్= ఎచటనైనను; పరమ, ధార్మికుఁడు+అని= గొప్ప ధర్మాత్ముడు అని; ఎన్నన్+పడఁడు= ఎంచబడడు.

**తాత్పర్యం:** ఓ మహర్షీ! అన్ని పాపాలలో మిక్కిలి చెడ్డవైన పాపాలు కోపం, లోభం. కోపలోభాలను జయించనివాడిని ధర్మాత్ములలో గొప్పవాడు అని ఎచటను ఎవరును ఎంచరు సుమా.

**వ. శిష్టచరితంబులుగాని మార్గంబులుగొన్ని తృణసంవృతంబులైన కూపంబులుం బోలెఁగపట ధర్మ సంవృతంబులై యుండు; వాని దవ్వులన పరిత్యజించి శిష్టాచారంబుల నడపుట ధర్మలక్షణం' బనినం గౌశికుండు 'శిష్టాచారంబు లెయ్యవి? యెఱింగింపు' మనుటయు ధర్మవ్యాధుం డి ట్లనియె. 43**

**ప్రతిపదార్థం:** శిష్ట, చరితంబులు+కాని, మార్గంబులు= సజ్జనులచే ఆచరింపబడని పద్ధతులు కొన్ని; తృణ, సంవృతంబులు+ అయిన= గడ్డిచేత కప్పబడినవి అయిన; కూపంబులున్+పోలెన్= నూతులు వలెనే; కపట, ధర్మ, సంవృతంబులు+ఐ= తప్పుడుధర్మాలచేత కూడినవి అయి; ఉండున్= ఉంటాయి; వానిన్= వాటిని; దవ్వులన్+అ= దూరంనుండే; పరిత్యజించి= వదలిపెట్టి; శిష్ట+ఆచారంబులన్= సజ్జనుల సదాచారాలను; నడపుట= ఆచరించటం; ధర్మ, లక్షణంబు= ధర్మంయొక్క ప్రత్యేకస్వభావం; అనినన్= అని చెప్పగా; కౌశికుండు; శిష్ట+ఆచారంబులు= మంచివారి ప్రవర్తనలు (మంచి ప్రవర్తనలు); ఏ+అవి= ఎయ్యవి; ఎఱింగింపుము= తెలియజేయుము; అనుటయున్= అని చెప్పటమున్నూ; ధర్మవ్యాధుండు= ధర్మవ్యాధుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** సజ్జనులు పాటింపని కొన్ని మార్గాలు పైకి ధర్మాలుగా కన్పించవచ్చును. దట్టంగా మొలచిన గడ్డిచేత కప్పబడిన నూతులు పైకి నేలమాదిరిగానే గన్పించినా లోపల లోతైన గోతులుగానే ఉండి తెరువరులకు భ్రాంతి కల్పించవచ్చును. అందుచేత, దూరంనుండే కపటధర్మాలను పరిత్యజించాలి. శిష్టాచారాలను స్వీకరించి ఆచరించటం ధర్మలక్షణం' అని ధర్మవ్యాధుడు చెప్పగా విని, కౌశికుడు, 'మహాత్మా! శిష్టాచారాలు ఏవి?; తెలుపుము' అని ప్రార్థించాడు. అంతట, ధర్మవ్యాధుడు కౌశికుడికి ఇట్లా బదులు చెప్పాడు.

**సీ. 'దానంబు, సత్యంబుఁ, దపము, యజ్ఞము, నార్జ । వముఁ, గామలోభాది వర్జనంబు**
**గురుజన శుశ్రూష, క్రోధ రాహిత్యంబు । దమము, సంతోష, మధ్యయన నిరతి,**
**దాంభికత్వము లేమి, దైన్యంబు వొరయమి । యనసూయ, యనహంక్రియాభియుక్తి,**
**దలఁపంగ నాద్యమై తనరు ధర్మమ యెప్డుఁ । గొనియాట, నాస్తికగోష్ఠిఁ జనమి,**

**తే. శీలసంరక్ష, తీర్థసంసేవ, శౌచ, । మఖిలభూతంబులందు దయార్ద్రుఁ డగుట,**
**మితహితోక్తులు, సంశ్రితమిత్త్రగుప్తి । యిన్నియును శిష్టచరితంబు లిద్ధచరిత! 44**

**ప్రతిపదార్థం:** ఇద్ధచరిత!= వెలుగొందే గొప్ప ప్రవర్తన కలవాడా!; దానంబు= పరోపకారార్థం తన ధనాన్ని ఇతరులకు ఇవ్వటం; సత్యంబున్= నిజం పలకటం; తపము= మనస్సును ఇంద్రియాలను నిగ్రహించటం; యజ్ఞమున్= క్రతువులను నిర్వహించటం; ఆర్జవమున్= ఋజుత్వం - పరులను మోసపుచ్చని నడవడిక; కామ, లోభ+ఆది, వర్జనంబు= కోరికలను, దురాశలను మున్నగు వాటిని వీడటం; గురు, జన, శుశ్రూష= గురువులకు సేవ చేయుటం; క్రోధ, రాహిత్యంబు= కోపం లేకపోవటం; దమము= బహిరింద్రియ నిగ్రహం; సంతోషము= తృప్తితో కూడిన ఆనందం; అధ్యయన నిరతి= వేదాలను చదవటంలోని దీక్ష; దాంభికత్వము లేమి= పటాటోపం లేకపోవటం; దైన్యంబు+పొరయమి= హీనతను పొందకుండటం; అనసూయ= అసూయ లేకపోవటం; అనహంక్రియా+అభియుక్తి= అహంకారంతో కూడి ఉండకపోవటం; తలఁపంగన్= యోచించగా; ఆద్యము+ఐ= మొట్టమొదటిదై; తనరు= ఒప్పునట్టి; ధర్మము+అ= ధర్మమే; ఎప్డున్= ఎల్లప్పుడును; కొనియాట= ఆదరించటం; నాస్తిక, గోష్ఠిన్‌చనమి= నాస్తికుల కూటమిలోకి వెళ్ళకుండటం; శీల, సంరక్ష= ప్రవర్తనను కాపాడుకొనటం; తీర్థ, సంసేవ= పుణ్యక్షేత్రాలను సేవించటం; శౌచము= పరిశుభ్రత పాటించటం; అఖిల, భూతములందున్= అన్ని జీవరాసులలో; దయా+ ఆర్ద్రుఁడు+అగుట= దయచేత తడిసిన చిత్తంకలవాడు కావటం; మిత, హిత+ఉక్తులు= తక్కువగా మాట్లాడటం, శ్రేయస్కర

మైన పలుకులు పలకటం; సంశ్రిత, మిత్ర, గుప్తి= ఆశ్రయించిన స్నేహితులను కాపాడటం; ఇన్నియును= ఇన్ని లక్షణాలు అన్నియును కలిసి; శిష్ట చరితంబులు= మంచివారి ప్రవర్తనలు.

**తాత్పర్యం:** మహానుభావా! ఎన్నియో గొప్పగుణాలు కలిసినగాని శిష్టాచారం సిద్ధించదు. శిష్టాచారాన్ని వింగడిస్తే ఈ క్రింది గుణాలను ఎన్నవచ్చును. ఉపకారార్థం తన ద్రవ్యాన్ని ఇవ్వటం, ఎల్లప్పుడును నిజమే మాట్లాడటం; ఇంద్రియాలను మనస్సును నిగ్రహించటం, క్రతువులను నిర్వహించి విశ్వశ్రేయం ఒనగూర్చటం, ఇతరులను మోసగించ నట్టి నిర్మల శీలం అలవరచుకొనటం, కామం కోపం మున్నగు గుణాలను అనగా కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలను ఉజ్జగించటం, తల్లి తండ్రి విద్యాదానం చేసిన ఉపాధ్యాయుడు మున్నగు వారిని సదా మన్నించటం, కోపం లేని శాంతస్వభావాన్ని ఆర్జించటం, ఇంద్రియనిగ్రహం దీక్షతో సాధించటం, ఎల్లప్పుడు సంతోషంతో సంతృప్తితో ఉండటం, వేదాధ్యయన తత్పరత్వం, పటాటోపం ప్రదర్శించక సదా వినయం గలిగి ఉండటం, ఎన్నడును నీచత్వానికి దిగజారి పోవకుండటం, నాస్తికుల కూటమిలో చేరకుండటం, శీలాన్ని కాపాడుకొనటం, తీర్థయాత్రలు చేయటం, అఖిల భూతాలపట్ల దయకలిగిన ఎడద గలిగిఉండటం, మితభాషణం చేయటం, హితభాషణం చేయటం, ఆశ్రయించిన స్నేహితులను కాపాడటం.

**విశేషం:** ఈ పద్యంలో ఇంచుమించుగా సనాతన భారతీయ సంస్కృతి అంతయు వివరించబడి ఉన్నది. దానం అనగా త్యాగంతో కూడిన ఈవి. దశదానాలు కలవు. షోడశ దానాలు ఉన్నవి. ఇచట సందర్భాన్ని బట్టి త్యాగపూరితమై పరోపకారార్థం ఇచ్చే ద్రవ్యం అనే అర్థమే చెప్పుకోవాలి. (చతురుపాయాలలో దానం ఉన్నది కాని అది ఇచట వర్తించదు.) యజ్ఞం అనగా పూజ, యజ్ఞయాగాలు బహుళాలు. పంచమహాయజ్ఞాలు పేర్కొన దగినవి. 1. బ్రహ్మయజ్ఞం, 2. దేవయజ్ఞం, 3. పితృయజ్ఞం, 4. భూతయజ్ఞం, 5. మనుష్యయజ్ఞం. (ధర్మవ్యాధుడు చేసిన మాతాపితృ శుశ్రూష యజ్ఞంగానే పేర్కొనదగింది.)

**క.** **విను శిష్టచరిత గైకొని । యనసూయత నడవ నడవ నంతఃకరణం**
**బునఁ బొదలు నట్టి సమ్మద । మనఘా! దుర్లభము సూవె యన్యపథములన్. 45**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడ వైన ఓపుణ్యాత్ముడా!; విను= ఆలకింపుము; శిష్టచరిత= మంచి ప్రవర్తన; కైకొని= అవలంబించి= అనసూయతన్, నడవన్ నడవన్= అసూయ లేని ప్రవర్తన తీర్చిదిద్దుకొనగా; అంతఃకరణంబునన్= లోపలి మనస్సులో; పొదలునట్టి= ఏర్పడే; సమ్మదము= సంతోషం; అన్యపథములన్= ఇతర మార్గాలలో; దుర్లభము+చూవె= లభించటం మిక్కిలి కష్టం సుమా.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడ వైన ఓ కౌశికమునీ! ఆలకింపుము. సత్ప్రవర్తనతోకూడి, అసూయను విడనాడి ప్రవర్తిస్తే లభించే సంతోషం ఇతర మార్గాలను అనుసరిస్తే అంత సులభంగా దొరకదు సుమా.

**విశేషం:** 'వ్యాధగీత' అని ప్రసిద్ధి నార్జించిన ధర్మవ్యాధోపాఖ్యానం అందించే సందేశం సుస్పష్టం. కర్మయోగం వ్యాధగీతకు అంతరాత్మ. ఇందు ముఖ్యపాత్రలుగా ఎన్నదగిన పతివ్రత కర్మయోగిని. అట్లే ధర్మవ్యాధుడును కర్మయోగియే. భర్తృశుశ్రూషచేత ఇల్లాలు తరించింది. మాతాపితృసేవచేత, కులధర్మం మాంసవిక్రయంచేత వ్యాధుడు 'ధర్మ' వ్యాధుడయ్యాడు. అందుచేత 'శిష్టచరిత' వలన లభించే సమ్మదం ఇతర పథాలలో అంత సులువుగా దొరకదని ధర్మవ్యాధుడు చాటిచెప్పగలిగాడు. అయిన ఆ 'ఇతర పథములు' ఏవి? అవి భక్తి జ్ఞానాదులు. ధర్మవ్యాధుడు జ్ఞాని కాకపోలేదు. అయినను అతని నిష్ఠ కర్మయోగంలోనే

ఉంది. ఇచట ధర్మవ్యాధుడు కర్మయోగి తదుపరి జ్ఞానయోగి. తలిదండ్రుల సేవ ఉజ్జగించిన కౌశికుడు 'కేవల స్వాధ్యాయ నిరతుడు'. అందుచేత ధర్మవ్యాధుడు కౌశికుడితో, 'నీవు చేసిన యకార్యం బొక్కటి గలదు' - అది మాతాపితృ సేవ విడనాడటం అని నొక్కి వక్కాణించవలసి వచ్చింది.

**వ. కావున శిష్టాచారనియతిం జేసి గురుశుశ్రూష సలిపి కృతాధ్యయనుండ వై పరమజ్ఞానపరిపక్వం బైన చిత్తంబుతోడం గామక్రోధ మహామకరసంకీర్ణయు విషయజలపరిపూర్ణయు నైన మోహజలధి నస్థలితధైర్యం బను తెప్పం జేసి యశ్రమంబున నిస్తరించి కృతార్థుండ వగు' మని మఱియు నిట్లనియె. 46**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; శిష్ట+ఆచార, నియతిన్+చేసి= మంచి నడవడికలోని దీక్షచేత; గురు, శుశ్రూష, సలిపి= గురువులైనవారలకు సేవ చేసి; కృత+అధ్యయనుండవు+ఐ= వేదాలను చదివినవాడవై; పరమ, జ్ఞాన, పరిపక్వంబు+ఐన= గొప్పతెలివిడిచేత పండినది అయిన; చిత్తంబుతోడన్= మనస్సుతో; కామ, క్రోధ, మహా, మకర, సంకీర్ణయున్= కోరికలు కోపం అనే గొప్ప మొసళ్లతో నిండినదియున్నూ; విషయ జలపరిపూర్ణయును= ఇంద్రియార్థములనే నీళ్లతో నిండినదియున్నూ; ఐన= ఐనట్టి; మోహ, జలధిన్= భ్రాంతి అనెడి సముద్రాన్ని; అస్థలిత, ధైర్యంబు+అను= జారనట్టి గంభీరత అనెడి; తెప్పన్+చేసి= పడవచేత; అశ్రమంబునన్= సులువుగా; నిస్తరించి= దాటి; కృత+అర్థుండవు+అగుము= ధన్యుడవు కమ్ము; అని= అని చెప్పి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** కాబట్టి నీవు శిష్టాచారంచొప్పున నీప్రవర్తన తీర్చిదిద్దుకొని, గురుజను లైనవారి పరిచర్య చేయునది. తదుపరి సంక్రమించే జ్ఞానంచేత పండిన మనస్సు కలవాడవై మోహసముద్రాన్ని దాటునది. ఆ మోహసముద్రం కామక్రోధా లనెడి మొసళ్లతో కూడి, ఇంద్రియార్థములనెడి నీటితో నిండిన గొప్పసముద్రం. ఆ సముద్రాన్ని దాటటానికి ధైర్యం అనెడి పడవ అవసరం. అప్పుడు నీవు ధన్యుడవు కాగలవు' అని చెప్పి, మఱియు ఇట్లు పలికాడు.

**విశేషం:** అలం: రూపకం. మోహజలధి అనుటకు మోహ మహానది అనే పాఠాంతరం ఉన్నది.

**క. 'క్రమమున శిష్టాచార। క్రమ మెఱుఁగఁగ ధర్మమునకుఁ గడు వాటం బై**
**విమలం బగుఁ జిత్తము స। త్యమును నహింసయును దనకుఁ దావలములుగన్. 47**

**ప్రతిపదార్థం:** చిత్తము= మనస్సు; క్రమమునన్= వరుసగా; శిష్ట+ఆచార, క్రమము= మంచి నడవడిక విధానం; ఎఱుఁగఁగన్= తెలియగా; ధర్మమునకున్; కడున్= మిక్కిలి; వాటంబు+ఐ= అనువు అయినదై; సత్యమును= నిజాన్ని; అహింసయును= ఏప్రాణికి పీడచేయక పోవుటయున్నూ; తనకున్= తనకు; తావలములుగన్= ఉనికిపట్టులుగా; విమలంబు+అగున్= నిర్మలం కాగలదు.

**తాత్పర్యం:** మంచి నడవడికయొక్క వరుస తెలిసినప్పుడు ఆచరించినప్పుడు, ధర్మానికి మిక్కిలి అనువైనదై, అహింస సత్యం తనకు ఉనికిపట్టులు కాగా, మనస్సు స్వచ్ఛత సంపాదించుకొంటుంది. అనగా - చిత్తం నిర్మల మై ధర్మానికి నెలవు కావటానికి కావలసిన అంశం అహింసతో సత్యంతో జతగూడిన శిష్టాచారం.

**ఆ. విను మహింస ధర్మవితతి కెల్లను మేటి; । యదియు సత్యయుక్త మైన వెలయు**
**ననఘ! శిష్టచరితలందు సత్యమ కడు । నధిక మనిరి శ్రుతుల నరసి బుధులు. 48**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపంలేనివాడా! ఓపుణ్యాత్ముడా!; వినుము= ఆలకింపుము; ధర్మ, వితతికిన్+ఎల్లను= వివిధ ధర్మాలలోను; అహింస= ఏప్రాణికీ ఎట్టిపీడ కలిగించకుండటం; మేటి= గొప్పది; అదియున్= అదియే (ఆ అహింసయే); సత్యయుక్తము+ఐనన్= నిజంతో జతకూడిన యెడల; వెలయున్= వెలుగొందుతుంది; శిష్టచరితలందున్= మంచి ప్రవర్తనలందు; సత్యము+అ= నిజమే; బుధులు= పండితులు; శ్రుతులన్= వేదాలను; అరసి= చూచి; కడున్= మిక్కిలి; అధికము= గొప్పది; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడ వైన ఓకౌశికమునీ! ఆలకింపుము. అన్నిధర్మాలలోను అహింస గొప్పది. ఆ అహింస సత్యంతో కూడిన యెడల వెలుగొందుతుంది. శిష్టాచారంలో సత్యమే గొప్పదైనదని పెద్దల ప్రవచనం.

**తే.** **వేద విహితంబులును శాస్త్రవిహితములును । శిష్టచరితంబులును నన< జెప్ప నొప్పి**
**ధర్మములు మూ<డువిధములఁ దనరుచుండుఁ । గడఁగి యిన్నియు సద్గతికారణములు.** **49**

**ప్రతిపదార్థం:** వేద, విహితంబులును= వేదాలచేత కూర్చబడినవిన్నీ; శాస్త్ర, విహితములును= శాస్త్రాలచేత కూర్చబడినవిన్నీ; శిష్ట, చరితంబులును= మంచి నడవడికలును; (మంచివారి ప్రవర్తనలును); అనన్+చెప్పన్+ఒప్పి= అని వర్ణించటానికి అనువై; ధర్మములు; మూడు, విధములన్= మూడురీతులుగా; తనరుచుండున్= ఒప్పుతూ ఉంటాయి. కడఁగి= పూని; ఇన్నియున్= ఇవి అన్నియును; సత్+గతి, కారణములు= ఉత్తమ మార్గానికి (మోక్షానికి) హేతువులు.

**తాత్పర్యం:** ధర్మాలు మూడు తెరగులు. ఒకటి వేదాలచేత విధించబడినట్టివి. రెండు-శాస్త్రాలచేత నిర్దేశించబడినట్టివి. మూడు-పెద్దల మంచినడవడికలు. పైమూడుపద్ధతులున్నూ సద్గతికి హేతువులే.

**మ.** **అనయంబున్ శ్రుతవంతుఁడై వినుతశిష్టాచారమార్గంబులం**
**జను పుణ్యాత్ముఁడు దుర్గముల్ గడచి ప్రజ్ఞాహర్మ్యసంరూఢుఁడై**
**కనుచుండుం బటు మోహపంకజలమగ్నం బైన లోకంబు వీఁ**
**క నధోభాగమునందు డింది కడుదుఃఖం బొందఁగా నవ్వుచున్.'** **50**

**ప్రతిపదార్థం:** అనయంబున్= ఎల్లప్పుడును; శ్రుతవంతుఁడు+ఐ= వేదాలలో పరిపూర్ణమైన జ్ఞానం కలవాడై; వినుత, శిష్ట+ఆచార, మార్గంబులన్= పొగడబడిన మంచినడవడికలయొక్క తెరువులలో; చను= వెడలే; పుణ్య+ఆత్ముఁడు= సుకృతం చేసికొన్నవాడు, దుర్గముల్= దాటటానికి వీలులేని కోటలను; కడచి= అతిక్రమించి; ప్రజ్ఞా, హర్మ్య, సంరూఢుఁడు+ఐ= సామర్థ్యంతో కూడినబుద్ధి అనే మేడపై అధివసించెడివాడై; పటు, మోహ, పంక, జల, మగ్నంబు+ఐన= మిక్కిలి భ్రాంతి అనెడి బురదనీటిలో మునిగి ఉండినట్టి; లోకంబు= లోకము; అధోభాగము+అందున్+డింది= క్రింది భాగంలో పడి; వీఁకన్= దైన్యంతో; కడు దుఃఖంబు= మిక్కిలి విచారము; ఒందఁగాన్= పొందగా; నవ్వుచున్= హసించుచు; కనుచున్+ఉండున్= చూస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** ఎల్లప్పుడును వేదాలలో పరిపూర్ణజ్ఞానం కలిగిన విద్వాంసుడు ప్రజ్ఞ అనెడి మేడను అధివసించి, క్రింద ఉన్న మోహమనే బురదనీటిలో కూరుకుపోయి దైన్యంతో మిక్కిలి దుఃఖించే లోకాన్ని చూచి నవ్వుకొంటాడు.

**విశేషం:** అలం: రూపకం.

ధర్మవ్యాధుఁడు కౌశికున కహింసాస్వరూపంబు సెప్పుట (సం. 3-199-1)

**వ. అని పలికి ధర్మవ్యాధుండు మఱియు నిట్లనియె; 'నయ్యా! నీవు దొలుత నావర్తనంబు గనుంగొని యిది హింసా బహుళంబు గాదె? యని పలికితివి; దాని కేను దగు తెఱంగు సెప్పితి; నది య ట్లుండె; హింస యిట్టిది యహింస యిట్టి దని విభాగింప నెవ్వరికి నేర నగు? 51**

**ప్రతిపదార్థం:** అని, పలికి= అని చెప్పి; ధర్మవ్యాధుండు= ధర్మవ్యాధుడు; మఱియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు; అయ్యా!= ఆర్యా!; నీవు; తొలుతన్= మొదట; నావర్తనంబు= నా నడవడికను; కనుంగొని= అరసి; ఇది= (ఈనాప్రవర్తన); హింసాబహుళంబు+కాదు+ఎ= ప్రాణులకు పీడ కలిగించే క్రియలతో కూడినట్టిది కాదా; అని, పలికితివి= అని అన్నావు; దానికిన్= (ఆ విమర్శకు); ఏను= నేను; తగుతెఱంగు+చెప్పితిన్= సముచిత సమాధానం పలికితిని; అది+అట్లు+ఉండెన్= ఆ విమర్శ అట్లాగే ఉండుగాక; హింస= ప్రాణులను పీడించే క్రియ; ఇట్టిది= ఇటువంటిది; అహింస= ప్రాణులను పీడించనట్టి క్రియ; ఇట్టిది+అని= ఇటువంటిది, అని; విభాగింపన్= వింగడించటం; ఏ+వారికిన్= ఏ మనుజులకు; నేరన్+అగు= వీలు అవుతుంది?

**తాత్పర్యం:** అని చెప్పి, ధర్మవ్యాధుఁడు ఇంకనూ ఇట్లా అన్నాడు: 'ఆర్యా, నీవు మొదట నాకొక ప్రశ్న వేశావు. నేను చేస్తున్న మాంసవిక్రయం హింసాయుతమైన కార్యం గదా? అని అప్పుడు అడిగావు. ఆ ప్రశ్నకు అప్పుడే నేను నాకు తోచిన ప్రత్యుత్తరం ఇచ్చాను. అది అప్పటికి సరిఅయిన సమాధానమే. ఇప్పుడు - ఆ విషయాన్నే సూక్ష్మంగా విమర్శించి చెప్పదలచాను. ఇది - 'హింస,' ఇది - 'అహింస' అని ఎవ్వరు సుస్పష్టంగా నిర్వచించగలరు? అట్టి నిర్వచనం సాధ్యం కాదని నా అభిప్రాయం.

**క. మును తన చేసిన కర్మం । బునఁ జూవె నశించు భూతములు సంపెడు వాఁ**
**డు నిమిత్తమాత్ర మింతయె । యని చెప్పఁగ వినమె యంచితాచారులచేన్. 52**

**ప్రతిపదార్థం:** మును= పూర్వకాలంలో (ఈజన్మంలో వెనుకటిజన్మంలో); తన చేసిన కర్మంబునన్= తాను ఒనరించిన కర్మవలన; చూవె= సుమ్ము; భూతములు= ప్రాణులు; నశించున్= నశిస్తాయి; చంపెడువాఁడు= సంహరించేవాడు; నిమిత్తమాత్రము= ఉపకరణంమాత్రమే; ఇంత+ఎ= ఇది ఇట్టిదే; అని చెప్పఁగన్= అని పలుకగా, అంచిత+ఆచారులచేన్= ఒప్పారే పనులు చేసెడి పెద్దలవలన; వినము+ఎ= ఆలకింపమా?

**తాత్పర్యం:** పెద్దలు చెప్పెడిమాట, జనశ్రుతిలో తరచు వినబడుతున్నది, మనకు అందరికి తెలిసింది ఉన్నదికదా. ప్రాణులు క్షయం పొందటానికి మూలకారణం ఆ యాప్రాణులు చేసిఉన్న కర్మయే. చంపేవాడు కేవలం ఒక వ్యాజం మాత్రమే సుమా.

**వ. అదియునుం గాక. 53**

**తాత్పర్యం:** అదీ కాకుండ.

**క. ఫలమూలౌషధిశాకం । బులుఁ బశుమృగతతులు భక్ష్యములుగా భూతం**
**బుల కజుఁడు సేసె నని య । స్ఖలితంబుగ మ్రోయు శ్రుతులఁ గాదన వశమే! 54**

**ప్రతిపదార్థం:** ఫల, మూల, ఓషధి, శాకంబులున్= పండ్లున్నూ, వేళ్లున్నూ, సస్యములూ, కూరగాయాలూ; పశు, మృగతతులు= జంతువులు మున్నగునవి; భూతంబులకున్= ప్రాణులకు; భక్ష్యములుగాన్= ఆహారపదార్థాలుగా; అజుఁడు= బ్రహ్మదేవుడు; చేసెన్= ఏర్పరిచాడు; అని; అస్ఖలితంబుగన్= సుస్పష్టంగా (జారకుండా); మ్రోయు= నినదించు (గట్టిగా వక్కాణించు); శ్రుతులన్= వేదాలను; కాదు+అనన్, వశమే= కాదు అని తిరస్కరించటానికి వీలు ఉన్నదా?

**తాత్పర్యం:** మఱియును, పండ్లు, వేళ్లు, ధాన్యాలు, కూరలు వివిధ జంతు సంతతులు ప్రాణులకు ఆహారంగా బ్రహ్మదేవుడు ఏర్పరచినట్లు వేదాలు నొక్కివక్కాణిస్తున్నాయి కదా! ఇక అట్టి వేదప్రామాణ్యాన్ని ఎట్లా తిరస్కరించ గలం?

**సీ.** **అనఘ! యౌశీనరుం డగు శిబి నిజగాత్ర । హింస నింద్రాగ్నుల కిడఁడె మాంస;**
**మతనికి లేదయ్యె నయ్య యుత్తమ గతి? రంతిదేవుం డనురాజు తొల్లి**
**యనుదినంబును గోసహస్రద్వయంబుఁ దా । వధియింపఁడే వేయి వత్సరములు;**
**దురిత మమ్మహితాత్ముఁ దొడరెనే? వేదార్థ । నిరతులై యత్యంత నియతు లైన**

**తే.** **ధారుణీసురముఖ్యు లధ్వరములందుఁ । బశువరింపరే పశువులఁ; బరమపుణ్య**
**గతులు గలుగవె వారికిఁ? గడఁగి యగ్ను । లధికమాంసార్థు లని శ్రుతులందు వినమె!** **55**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! ఔశీనరుండు+అగు, శిబి= ఉశీనరుని కుమారు డైన శిబి; నిజ, గాత్ర, హింసన్= తన దైన దేహాన్ని పీడించి; ఇంద్ర+అగ్నులకున్= ఇంద్రుడికీ, అగ్నికిన్నీ; మాంసము= మాంసము (తన దేహంనుండి కత్తితో కోసి తీసిన మాంసాన్ని); ఇడఁడె= ఇవ్వలేదా; ఉత్తమ, గతి= మంచి మార్గం (అనగా పుణ్యపదవి); అతనికిన్= (ఆ శిబికి); లేదు+అయ్యెన్+అయ్య?= అయ్యా! కలుగక పోయిందా?; తొల్లి= పూర్వకాలంలో; రంతిదేవుండు+అను, రాజు= రంతిదేవుడు అనేపేరు గల ప్రభువు; అనుదినంబును= ప్రతిరోజు; గో, సహస్ర, ద్వయంబున్= రెండువేల ఆవులను; తాన్= తాను; వేయి, వత్సరములు= వేయిఏండ్లు; వధియింపఁడే= సంహరించలేదా; దురితము= పాపం; ఆ+మహిత+ఆత్మున్= ఆ గొప్ప ఆత్మకలవాడిని; తొడరెనే= పొందిందా?; వేద+అర్థ, నిరతులు+ఐ= వేదాలలోని భావాలను బాగా ఎరిగిన వారై; అతి+అంత, నియతులు+ఐన= మిక్కిలి గొప్ప దీక్షకలిగిన వారైన; ధారుణీ సుర ముఖ్యులు= బ్రాహ్మణులలో ఉత్తములు; అధ్వరములందున్= యజ్ఞాలలో; పశువులన్= జంతువులను; పశువరింపరే= బలిఇవ్వలేదా?; వారికిన్= (అట్టి బ్రాహ్మణోత్తములకు); పరమ, పుణ్య, గతులు+కలుగవు+ఎ= గొప్పవైన పుణ్యస్థానాలు లభించలేదా?; అగ్నులు= నిప్పులు; కడఁగి= పూని; అధిక, మాంస+అర్థులు+అని= మిక్కుటంగా మాంసాన్ని కోరుకొనేవి అని; శ్రుతులందున్= వేదాలలో; వినమె!= ఆలకించమా!

**తాత్పర్యం:** పుణ్యాత్ముడ వైన ఓ కౌశికమునీ! ఉశీనరుడి పుత్రుడైన శిబిచక్రవర్తి తన శరీరంలోని మాంసాన్నే కోసి ఇంద్రుడికీ అగ్నిహోత్రుడికీ ఇవ్వలేదా? ఆ శిబిచక్రవర్తికి పుణ్యం లభించలేదా? రంతిదేవుడు అనే మహారాజు పూర్వకాలంలో వేయి సంవత్సరాలపాటు ప్రతిదినం రెండువేల ఆవులను వధించి సంతర్పణం చేయలేదా? ఆ మహానుభావుడికి పాపం చుట్టుకొన్నదా? వేదవేదాంగ పారంగతు లైన బ్రాహ్మణోత్తములు యజ్ఞయాగాదులలో పశువులను సంహరించలేదా? వారికి పుణ్యలోకాలు సమకూరలేదా? అగ్నులు మాంసాహారాన్ని మిక్కుటంగా కోరేవి అని వేదాలు ఘోషించటం లేదా? అందుచేత మాంసాహారం కేవలహింసగా పరిగణించటానికి వీలు లేదు.

**క. పిత్రుదైవత కార్యములం । దతిభక్తిని మాంస మిడుట యర్హమనియుఁ ద**
**త్పిత్రుదైవశేషములు స । మ్మతి భోజ్యము లనియు మునులమతములు గావే. 56**

**ప్రతిపదార్థం:** పిత్రు, దైవత, కార్యములందున్= శ్రాద్ధక్రియలలోను, దేవతలకు బలినివేదన చేసే క్రియలలోనూ; అతిభక్తిని= మిక్కుటమైన పూజ్యభావంతో; మాంసము+ఇడుట= మాంసంపెట్టటం; అర్హము+అనియున్= సరైన పద్ధతే అనిన్నీ; తద్+పిత్రు, దైవశేషములు= ఆ విధంగా శ్రాద్ధాలలో పితరులకు నైవేద్యం చేయగా మిగిలినవి, దేవతలకు నైవేద్యం చేయగా మిగిలినవి (అయినమాంసాలు); సమ్మతిన్= మంచిబుద్ధితో; భోజ్యములు= భుజించదగినవి; అనియున్= అనిన్నీ; మునుల, మతములు+కావే= ఋషీశ్వరుల అభిప్రాయాలే కదా.

**తాత్పర్యం:** పిత్రుదేవతలకు శ్రాద్ధక్రియలలో నైవేద్యంగా మాంసం సమర్పించటం సరైన పద్ధతి అనిన్నీ, ఆ శ్రాద్ధాలలో నివేదించబడిన పిమ్మట మిగిలిన మాంసం ఆహారంగా స్వీకరించదగింది అన్నీ పెద్దలైన ఋషుల అభిప్రాయమే కదా.

**మ. హలికుం డెంతయు నోజతో దునఁగ సీరాగ్రంబునం జోఁకి ప్రా**
**ణు లనేకంబులు సచ్చు, హింస యది యౌనో కాదో! వేయేల? మ**
**ర్త్యులు నేలం జరియించుచోఁ బదములం ద్రొక్కంబడుం బెక్కు జం**
**తులు హింసావిధి గాదనంగ వశమే దోషజ్ఞ! యూహింపుమా! 57**

**ప్రతిపదార్థం:** దోషజ్ఞ!= ఓ పండితుడా!; హలికుండు= వ్యవసాయదారుడు; ఎంతయున్= మిక్కుటమైన; ఓజతోన్= ఉత్సాహంతో; దునఁగన్= దున్నగా; సీర+అగ్రంబునన్+చోఁకి= నాగలికఱ్ఱు తాకి; ప్రాణులు+అనేకంబులు= పెక్కుజీవాలు; చచ్చున్= మరణిస్తాయి; అది= (ఆవిధంగా నాగలిక్రిందబడి జీవాలు చావటం); హింస= ప్రాణిపీడ; ఔనో, కాదో= అవునా? కాదా? అనేది చర్చించవలసిన విషయమేకదా; వేయి+ఏల= వేయిమాటలు ఎందుకు పలుకవలె?; మర్త్యులు= మనుజులు; నేలన్+చరియించుచోన్= నేలమీద నడచేటప్పుడు; పెక్కు, జంతులు= అనేక జీవాలు; పదములన్= పాదాలతో త్రొక్కన్+పడున్= త్రొక్కివేయబడతాయి; హింసావిధి= ప్రాణిపీడనంజరిగేపద్ధతి; కాదు+అనంగన్, వశమే= (అది) కాదు అని చెప్పటానికి వీలు ఉన్నదా?; ఊహింపుమా= యోచన చేయుము.

**తాత్పర్యం:** ఓ పండితోత్తమా! నాగలితో రైతు భూమిని దున్నేటప్పుడు, ఆ నాగలికఱ్ఱును తాకి ఎన్ని జీవాలు చచ్చిపోవటం లేదు? అది హింస కాదని వాదించటానికి వీలున్నదా? తర్జన భర్జనలు అనవసరం. మనుజులు నేలపై నడచేటప్పుడు కూడ వేలకొలది ప్రాణులు చనిపోతున్నాయి. అది హింస కాదని వాదించటానికి వీలు లేదు కదా! ఈ విషయాన్ని దయచేసి నీవే ఆలోచించి తేల్చుకొనుము.

**విశేషం:** ఇచట ధర్మవ్యాధుడు కౌశికుడిని, 'దోషజ్ఞ' అని సంబోధించాడు. దోషజ్ఞ అనే శబ్దానికి 'పండితుడు' అని రూఢ్యర్థం. వాచ్యార్థం - దోషాలను ఎరిగినవాడు. ఈ ప్రకరణంలో దోషజ్ఞ శబ్ద ప్రయోగంలోని స్వారస్యం గమనించదగింది. కౌశికుడు ధర్మవ్యాధుడిని మాంసవిక్రయాన్ని దోషంగా ఎన్నిఉన్నాడు గదా!

**చ. సలిలము లుర్వి యాకసము సర్వము జంతుమయంబు గావునం**
**గలుగు నవశ్యమున్ సకలకర్మములందును హింస, హింసకుం**

**దొలఁగిన దేహయాత్రయును దుర్ఘట మైనటు లుండు; నింతయుం**
**దలఁపరు హింస సేయ మని తారు తలంతురు గొంద ఱిమ్మహిన్. 58**

**ప్రతిపదార్థం:** సలిలములు= నీళ్లు; ఉర్వి= భూమి; ఆకసము= ఆకాశం; సర్వము= అంతయున్నూ; జంతుమయంబు= ప్రాణులతో కూడిఉన్నట్టిది; కావునన్= కాబట్టి; సకల, కర్మములందును= అన్ని పనులలోను; హింస= ప్రాణిపీడనం; అవశ్యమున్+కలుగున్= తప్పక ఏర్పడుతుంది; హింసకున్+తొలఁగినన్= ప్రాణిపీడనానికి దూర మైతే; దేహయాత్రయును= జీవితం నడపటం కూడ; దుర్ఘటము+ఐన+అటులు+ఉండున్= సాధ్యం కానట్లు తోస్తుంది; ఇమ్మహిన్= ఈ భూమిలో; కొందఱు= కొంతమంది మనుషులు; ఇంతయున్+తలఁపరు= దీనిని ఆలోచించరు; హింస+చేయము+అని= ప్రాణిపీడన చేయము అని; తారు= తాము; తలంతురు= తలపోస్తారు.

**తాత్పర్యం:** జలాలు, భూమి, ఆకాశం, అన్నీ ప్రాణుల సమూహాలతో నిండిఉన్నవి. కాబట్టి, అన్ని పనులలోను ఏదో కొంత హింస జరుగక తప్పదు. హింస అసలే చేయకుండ మానవజీవితం సాగించటం సాధ్యం కాదు. కొందరు ఈ విషయాన్ని గుర్తించక తాము ఎప్పుడూ ఎట్టి హింస చేయమని అహింసావ్రతుల మని అనుకొని భ్రమిస్తుంటారు.

**విశేషం:** పాశ్చాత్యశాస్త్రజ్ఞులు ఇటీవలనే గాలిలో నీళ్లలో ఆకాశంలోను, వేలకువేలు సూక్ష్మజీవులు కలవని కనుగొన్నారు. ఈ విషయం నిష్కర్షగా నిర్వచించబడింది.

**క. పనివడి యహింస వ్రతముగఁ। గొని వనమున నున్న మునులకుం దొడరదె హిం**
**సనము తరుమూల ఫలశా। కనిపీడన మదియు హింస గాదొకొ తలఁపన్. 59**

**ప్రతిపదార్థం:** పని+పడి= పూని; అహింస= ప్రాణులకు ఎట్టి పీడను చేయక పోవటం; వ్రతముగన్+కొని= దీక్షగా పాటించటానికి పూనుకొని; వనమునన్+ఉన్న= అడవిలో నివసిస్తున్న; మునులకున్= ఋషులకు; హింసనము= ప్రాణులను హింసించటం; తొడరదె?= కలుగదా?; తలఁపన్= యోచనచేయగా; తరు, మూల, ఫల, శాక, నిపీడనము+అదియున్= చెట్లు, వేళ్లు, పండ్లు, ఆకుకూరలు గట్టిగా తరగటం కోయటం అనేవి కూడ; హింస+కాదొకొ?= ప్రాణులను హింసించటం కాదా?

**తాత్పర్యం:** తాము కేవలం అహింసావ్రతాన్నే పాటిస్తూ అరణ్యాలలో నివసిస్తున్నవారం అనుకొని కందమూల ఫలాలను ఆహారంగా స్వీకరించే మునులుకూడ నిజానికి అహింసావ్రతులు కాజాలరు. ఏలన, కందమూలఫలాలలో కూడ ప్రాణం ఉన్నది. అదికూడా జీవహింసయే అని యోచన చేస్తే తేటతెల్లం అవుతుంది.

**తే. హింస సేయనివాఁడు లేఁ డిజ్జగమున। నొక్కఁడైనను, దమతమ, యోపినట్లు**
**హింసతెరువున కెడఁగల్గి యేఁగవలయు। నదియ చూవె యహింసనా నతిశయిల్లు. 60**

**ప్రతిపదార్థం:** ఈ+జగమునన్= ఈలోకంలో; హింస+చేయనివాఁడు= ప్రాణిపీడ చేయనివాడు; ఒక్కఁడు+ఐనను= ఒకడు కూడ; లేఁడు= లేడు; తమతమ+ఓపినట్లు= తమకు తామకు వీలు అయినట్లుగా; హింస తెరువునకున్+ఎడన్+కల్గి= ప్రాణిపీడ చేసే మార్గానికి దూరంగా ఉండి; ఏఁగవలయున్= నడవాలి; అది+అ+చూవె= అట్టిదే సుమా; అహింస+నాన్= అహింస అనగా; అతిశయిల్లున్= శోభిల్లుతుంది.

**తాత్పర్యం:** ఈలోకంలో హింస చేయనివాడు ఒకడైనా ఉండడు. అయినప్పటికిని తమకు వీలైనంతమేరకు హింస చేయకయే జీవయాత్ర సాగించాలి. ఆవిధంగా యథాశక్తి ప్రాణిపీడన చేయకపోవటమే 'అహింస' అని చెప్పనొప్పును.

**వ. ధర్మంబు బహుప్రకారం బై యుండుఁ; దదీయసూక్ష్మగతి దురవబోధంబు; గావున శ్రుతిప్రమాణంబువలనను వృద్ధాచారనిదర్శనంబులను నెఱింగికొనునది. 61**

**ప్రతిపదార్థం:** ధర్మంబు= ధర్మం (లోకమును మంచిస్థితిలో నిలబెట్టేది); బహుప్రకారంబు+ఐ+ఉండున్= ఎన్నో రీతులలో ఉంటుంది; తదీయ, సూక్ష్మ, గతి= ఆ(ధర్మంయొక్క) అగోచరమైనంత అల్పరూపత్వంయొక్క నడక; దురవబోధంబు= తెలియజాలనట్టిది; కావునన్= కాబట్టి; శ్రుతి, ప్రమాణంబువలనను= వేదాలయొక్క నిరూపణంమూలంగానూ; వృద్ధ+ఆచార, నిదర్శనంబులనున్= పెద్దల నడవడికలవలన ఏర్పడిన ఉదాహరణలవలననూ; ఎఱింగి కొనునది= తెలియునది.

**తాత్పర్యం:** ధర్మాన్ని తెలియటం కష్టం. ధర్మం పెక్కురకాలుగా ప్రవర్తిల్లుతుంది. ధర్మసూక్ష్మత తెలియరానట్టిది. కాబట్టి ధర్మాన్ని తెలియటానికి వేదాల ప్రమాణం, పెద్దల నడవడిక, ఆధారాలుగా గ్రహించదగును.

**విశేషం:** ఇచట - 'వేదప్రమాణము' అనే ప్రయోగం మిక్కిలి అర్థవంతమైనది. చార్వాకులు మున్నగు నాస్తికులు హేతువాదులు ప్రత్యక్ష ప్రమాణాన్ని మాత్రమే అంగీకరిస్తారు. వేదప్రమాణాన్ని అంగీకరించరు. ప్రాచీనులు తార్కికులు సత్యనిరూపణానికి కొన్ని ప్రమాణాలను నిర్వచించారు. అందులో ముఖ్యమైనవి: 1. ప్రత్యక్షం, 2. అనుమానం, 3. ఉపమానం, 4. శబ్దం, 5. అర్థాపత్తి, 6. అనుపలబ్ధి, 7. సంభవం, 8. ఐతిహ్యం. ఇందు మొదటి నాలుగింటిని తార్కికులు, ఆరింటిని వేదాంతులు, ఎనిమిదింటిని పౌరాణికులు అంగీకరిస్తారు. శబ్దప్రమాణం అనగా శ్రుతిప్రమాణం.

**ఉ. భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చుఁ; ద**
**ద్భూతభయాస్పదం బగు ప్రభూతపుసత్యము బొంకు నట్ల; ప్రా**
**ణాతురుఁ డైనచోఁ, బరిణయంబునయందును బల్కు బొంకు స**
**త్యాతిశయంబ యండ్రు; మహితాత్మక! యిట్టివి ధర్మసూక్ష్ముల్.' 62**

**ప్రతిపదార్థం:** మహిత+ఆత్మక!= గొప్పఆత్మకలవాడా!; భూత, హితంబుగాన్= జీవులకు మేలుకలిగించేటట్లుగా; పలుకు= మాట్లాడే; బొంకును= అసత్యం కూడ; సత్యఫలంబున్+ఇచ్చున్= నిజం పలికిన ఫలితాన్నే ఇస్తుంది; తద్+భూత, భయ+ఆస్పదంబు+అగు= ఆ జీవులకు భీతికి నెలవైన; ప్రభూతము+సత్యము= ప్రభూతపు సత్యము= గొప్ప దైన నిజం; బొంకు+అట్లు+అ= అసత్యం వంటిదే; ప్రాణ+ఆతురుఁడు+ఐనచోన్= ప్రాణం పోవునేమో అనే భయం కలిగి నప్పుడు; పరిణయంబునఅందున్= పెండ్లిలోనూ; పల్కు= వచించే; బొంకు= అసత్యం; సత్య+అతిశయంబు+అ= సత్యంకంటె గొప్పదే; అండ్రు= అంటారు; ధర్మసూక్ష్మముల్= ధర్మాన్ని ప్రస్తరించేటప్పుడు ఏర్పడే అగోచరా లైన ముఖ్యమైన చిన్న అంశాలు; ఇట్టివి= ఇటువంటివి.

**తాత్పర్యం:** ఓ మహానుభావా! ధర్మాన్ని ప్రస్తరిస్తే అగోచరా లైనను ముఖ్యమైన చిన్న అంశాలుగా విడివడుతుంది. ప్రాణికోటికి మేలు జరగటానికై చెప్పబడిన అసత్యం సత్యం కంటె కూడ గొప్పది. ప్రాణికోటికి కీడు గలిగించే సత్యం అసత్యంతో సమానం. ప్రాణరక్షణకూ వివాహం జరిపించటానికీ ఆడిన అసత్యం సత్యం కంటె ఘనమైనది. ఇవి ధర్మ సూక్ష్మాలు సుమా!

**విశేషం:** భాగవతంలో శుక్రప్రోక్తమైన సుప్రసిద్ధపద్యం ఇప్పట్టున స్మరింపదగింది - "వారిజాక్షులందు వైవాహికములందు । ప్రాణవిత్తమాన భంగమందు చకిత గోకులాగ్రజన్మరక్షణయందు । బొంకవచ్చు నఘము వొంద దధిప!" భాగవతంలోని ఈ

పద్యం వామన చరిత్రఘట్టంలోనిది. భారత పద్యంలో చెప్పబడిన తాత్పర్యంలో పరోపకారపారీణతతో కూడిన విశ్వశ్రేయం, స్వార్థరహితమైన త్యాగం జీవనాడి.

**వ. అని తెలిపి మఱియు నతండు. 63**

**ప్రతిపదార్థం:** అని తెలిపి= అని వివరించి చెప్పి; మఱియున్= వెండియును; అతండు= (ఆ ధర్మవ్యాధుడు).

**తాత్పర్యం:** అని తెలియజెప్పి ధర్మవ్యాధుడు ఇంకా (ఇట్లా అన్నాడు).

**క. 'ఒప్పెడునది యైనను గడు । నొప్పనియది యైన నిజకులోచితపథముం**
**దప్పఁ దగదండ్రు ధార్మికు । లప్పని నిజభాగ్యవిహిత మని యుండఁదగున్. 64**

**ప్రతిపదార్థం:** ధార్మికులు= ధర్మంతోకూడిన నడవడి కలవారు; ఒప్పెడున్+అది+ఐనను= సరిపడునట్టిది అయినను; కడున్= మిక్కిలి; ఒప్పని+అది+ఐనన్= సరిపడనట్టిదే అయినను; నిజ, కుల+ఉచిత, పథమున్= తనకులానికి తగినట్టి మార్గాన్ని; తప్పన్+తగదు+అండ్రు= తప్పరాదు అని చెప్పుతారు; ఆ+పని= ఆకార్యం (అనగా కులవృత్తి); నిజ, భాగ్య, విహితము= తనఅదృష్టంచేత ఏర్పడింది; అని= అని తలపోసి; ఉండన్+తగున్= ఉండదగును.

**తాత్పర్యం:** తన కులవృత్తి సరిపడేది కావచ్చును; సరిపడనిది కావచ్చును. ఎట్లయినా అట్టికులవృత్తిని వీడరా దని ధార్మికులు చెప్పుతారు. అట్టి కులవృత్తి తనకు దైవంచేత ఏర్పరచబడినట్లుగనే భావించుకొనాలి.

**క. విను, పూర్వకర్మఫలములు । దనకు వశము గాక పొందుఁ దఱితో వానిం;**
**గనుఁగొననేరక మూఢుఁడు । దన కాపద యైనచోట దైవము దూఱున్. 65**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; పూర్వ, కర్మఫలములు= లోగడ చేసిన కర్మలవలన ఏర్పడిన ఫలాలు; తనకున్ వశము+కాక= తనకు శక్యంగాకుండగా; తఱితోన్= తగిన సమయంలో; పొందున్= అనుభవిస్తాడు; మూఢుఁడు= అవివేకి; వానిన్= అట్టివాటిని అనగా అట్టి పూర్వకర్మఫలాలను; కనుఁగొననేరక= అరయజాలక; తనకున్+ఆపద+ఐన, చోటన్= తనకు విపత్తు ఏర్పడిన చోట; దైవమున్= దేవుడిని; దూఱున్= నిందిస్తాడు.

**తాత్పర్యం:** ఎవడు చేసిన కర్మలఫలితం వాడు అనుభవించక తప్పదు. వాటిని ఆపటానికి ఎవరికీ శక్యం కాదు. ఆయా వేళల అవి సంప్రాప్తిస్తాయి. ఆ సంగతి తెలియని మూఢుడు తనకు ఆపదవచ్చినప్పుడు దేవుడిని దూషిస్తాడు.

**విశేషం:** కర్మ సిద్ధాంతంలో భగవంతుడు కేవలం సాక్షిమాత్రుడే. ప్రతిజీవి తాను చేసిన కర్మలనుబట్టి ఫలితాలను అనుభవించక తప్పదు.

**తే. కార్యఫలములయెడఁ దాన కర్త ననుట । కడు నెఱుంగమిఁ జువ్వె! తాఁ గర్తయేని**
**తగిలి తనదైన కార్యజాతంబు నెల్లఁ । జెడక ఫలియించునట్లుగాఁ జేయరాదె! 66**

**ప్రతిపదార్థం:** కార్యఫలముల+ఎడన్= చేసిన పనులయొక్క ఫలితాలను పొందటంలో; తాను+అ= తానే; కర్తన్+అనుట= చేసే సామర్థ్యం కలవాడను; అనుట= అని భావించటం; కడున్= మిక్కిలి; ఎఱుఁగమిన్+చువ్వె= అజ్ఞానంచేత సుమా!; తాన్= తాను; కర్త+ఏని= తానే పనులను నిర్వహించే సమర్థుడు అయితే; తగిలి= పూని; తనదు+ఐన= తాను చేయునట్టివైన; కార్య,

జాతంబున్+ఎల్లన్= అనేక రకాల పనులు అన్నియున్నూ; చెడక= వ్యర్థం కాకుండగా; ఫలియించున్+అట్లుగాన్+చేయన్‌రాదె= విజయం పొందునట్లుగనే చూడరాదా?

**తాత్పర్యం:** తాను చేసే పనులు కొన్ని ఫలిస్తాయి; కొన్ని ఫలించవు; కాబట్టి తాను చేసే పనులయొక్క జయాపజయాలు తన సామర్థ్యంమీదనే ఆధారపడి ఉంటాయి అని భావించటం అజ్ఞానం కదా! అట్లుగాక, తాను చేసేపనులకు తానే సర్వసమర్థుడైన యెడల, అన్ని పనులలో విజయాన్నే సాధించవచ్చును కదా!

**వ. అది యెట్లంటేని. 67**

**తాత్పర్యం:** అది ఏవిధంగా జరుగుతుంది అని నీ వడిగితివా (సమాధానం ఇదిగో).

**సీ. నీతిమంతులు ధర్మనిరతులు దక్షులు । నగువారు సేయు కార్యములు గొన్ని**
**సిద్ధిఁ బొందవు, దుష్టచిత్తులు క్రూరు లై । చేయఁ గొన్ని విశేషసిద్ధిఁ బొందు;**
**నూరక యుండంగ నొందుఁ గొందఱ విపు । లార్థముల్; గొంద ఱాయాస పడియు**
**నిష్ఫలారంభు లై నిలుతురు; గొందఱు । పేదవారికిఁ బ్రజ పెల్లు వొడము**

**తే. నర్థవంతులు గొందఱ కర్థి నధిక । దానములు ధర్మములు సువ్రతములుఁ జేయఁ**
**బ్రజలు వుట్టరు; విను మిట్టిభంగి సుమ్ము । కర్మఫల మాత్మతంత్రంబు గాక యుండు. 68**

**ప్రతిపదార్థం:** నీతిమంతులు= న్యాయమైన నడవడిక కలవారు (యథోచిత మైన తత్త్వాన్ని ఎఱిగి పాటించేవారు); ధర్మనిరతులు= ధర్మంలో దీక్ష కలవారు; దక్షులున్+అగువారు= సామర్థ్యం కలవారు; చేయు, కార్యములు= చేసే పనులు; కొన్ని= కొన్ని(పనులు); సిద్ధిన్+పొందవు= జయప్రదాలు కావు; దుష్ట చిత్తులు= చెడ్డ మనస్సుకలవారు; క్రూరులు+ఐ= హింసతో కూడినట్టి భయంకర మైన కృత్యాలు చేసేవారును ఐ; చేయన్= ఆచరించగా; కొన్ని= కొన్ని(పనులు); విశేషసిద్ధిన్+పొందున్= గొప్ప విజయం పొందుతాయి; ఊరక+ఉండంగన్= ఏపని చేయకుండ ఉన్నా; కొందఱన్= కొంతమందిని; విపుల+అర్థముల్= గొప్ప ధనాలు (విజయాలు); ఒందున్= పొందుతాయి; కొందఱు= కొంతమంది; ఆయాసపడియున్= శ్రమ పడికూడా; నిష్ఫల+ఆరంభులు+ఐ= ఫలం శూన్యం అయిన ప్రయత్నాలు కలవారై; నిలుతురు= ఉంటారు; కొందఱు= కొంతమంది; పేదవారికిన్= దరిద్రులకు; ప్రజ= సంతానం; పెల్లు+పొడమున్= అధికంగా కలుగుతుంది; అర్థవంతులు కొందఱకున్= ధనవంతు లైన కొంతమందికి; అర్థిన్= కోరికతో; అధిక, దానములు, ధర్మములు, సువ్రతములున్+చేయన్= ఎక్కువగా తమ ద్రవ్యాలను ఇతరులకు ఉచితంగా పంచిపెట్టి పలువురకు ఉపయోగపడే మంచిపనులు; మంచినోములు చేసినను; ప్రజలు+పుట్టరు= సంతానం కలుగదు; వినుము; కర్మఫలము= లోగడ చేసిన కర్మలవలన ఏర్పడేఫలితం; ఇట్టిది+సుమ్ము= ఇటువంటిది సుమా; (కర్మఫలము) ఆత్మతంత్రంబు= తన ఇష్టానుసారంగా నడచేది; కాక+ఉండున్= కానట్టిది.

**తాత్పర్యం:** 'ఆ కర్మఫలకర్తృత్వం ఎటువంటిది?' అని నీవు అడిగితే నా సమాధానం వినుము. ఈ ప్రపంచంలో అన్నివిషయాలు ఏ యే రీతులలో జరుగుతాయో ఆ యా పద్ధతులను న్యాయాన్ని తెలిసి ప్రవర్తించేవారున్నూ, ధర్మాత్ములున్నూ, సామర్థ్యంకలవారున్నూ చేసే పనులు కొన్ని జయప్రదాలు కాకపోవచ్చును. దుర్మార్గులు, క్రూరులు, అవివేకులు అయిన వారు చేసే పనులు కొన్ని విజయవంతాలు కావచ్చును. కొందరు, ఏపనీ చేయక ఊరకే కూర్చొనిఉన్నప్పటికీ, వారికి ఐశ్వర్యవిజయాలు లభించవచ్చును. కొందరు ఎంతో కష్టించి, గొప్ప పరిశ్రమ చేసినా

వారికి జయం లభించదు. నిరుపేదలకు మిక్కుటంగా సంతానం కలుగుతుంది. ధనవంతులైన కొందరికి దానధర్మాలు యజ్ఞయాగాలు ఎన్ని చేసినా, సంతానం కలుగదు. ఇది కర్మవిపరిపాకం. తన అభీష్టానుసారంగా కర్మఫలం లభించదు.

**క. పురుషుఁడు కర్మాధీనత। నరుగక తనవశమ యనిన నాపదలు రుజల్**
**మరణంబును నివి యేమియుఁ। బొరయక యుండంగ బ్రదుకఁబోలదె చెపుమా! 69**

**ప్రతిపదార్థం:** పురుషుఁడు= మనుజుడు; కర్మ+అధీనతన్= లోగడ చేసిన కర్మలవలన ఏర్పడే పరిపాకానికి లోబడి; అరుగక= ప్రవర్తింపక; తన, వశము+అ+అనినన్= అంతయు తన అధీనంలోనే ఉన్నది అనినట్లయితే; ఆపదలు= విపత్తులు; రుజల్= రోగాలు; మరణంబును= చావును; ఇవి= (పైన చెప్పబడినవి); ఏమియున్+పొరయక+ఉండంగన్= ఏవియు సంప్రాప్తించకుండగా, బ్రదుకన్+పోలదె= జీవించరాదా; చెపుమా= వచించవయ్యా.

**తాత్పర్యం:** మనుజుడు కర్మాధీనుడు కాకుండగా, తన ఇష్టప్రకారమే అంతా తీర్చిదిద్దుకోగలిగితే - తనకు ఇక్కట్టులు, రోగాలు, చావు మున్నగునవి ఏవీ సంప్రాప్తించకుండానే జీవితాన్ని గడపవచ్చునుగదా? నీవే చెప్పుము.

**ఆ. కర్మవశతఁ జూవె కలుగు దేహము; దేహ। వర్తనంబు కర్మవశతఁ బుట్టు;**
**దేహపాత మైన దేహస్థుఁ డగు జీవుఁ। డరుగుఁ గర్మవిహిత మైన యెడకు'. 70**

**ప్రతిపదార్థం:** దేహము= శరీరం; కర్మవశతన్+చూవె= లోగడ చేసిన కర్మలవలన ఏర్పడే పరిపాకంచొప్పుననే; కలుగున్= ఏర్పడుతుంది; దేహవర్తనంబు= శరీరపు నడవడిక; కర్మవశతన్+పుట్టున్= కర్మకు లోబడి ఏర్పడుతుంది; దేహపాతము+ఐనన్= దేహంపడిపోయినప్పుడు అనగా మరణించినప్పుడు; దేహస్థుఁడు+అగు, జీవుఁడు= దేహంలో ఉన్న ఆత్మ; కర్మ, విహితము+ఐన+ ఎడకున్= కర్మంచేత ఏర్పడిన చోటుకు; అరుగున్= వెళ్ళుతాడు.

**తాత్పర్యం:** పూర్వం చేసిన కర్మవిపరిపాకంచేతనే మానవశరీరం ఏర్పడుతుంది. శరీర ప్రవర్తనకూడా కర్మపరిపాకాన్ని బట్టియే ఏర్పడుతుంది. మరణించిన పిదప జీవుడూ తన కర్మపరిపాకం నిర్దేశించిన చోటికే వెళ్ళుతాడు.

**విశేషం:** పూర్వజన్మలో చేసిన కర్మలను బట్టియే మనుజులకు మరుజన్మ కలుగుతుంది. ఆ జన్మలో మనుజుడి ప్రవర్తనకు పూర్వజన్మకర్మపరిపాకమే మూలం. 'బుద్ధిః కర్మానుసారిణీ!'

**వ. అనినం గౌశికుండు 'జీవుం డెట్టివాఁ?' డని యడిగిన లుబ్ధకుం డి ట్లనియె. 71**

**ప్రతిపదార్థం:** లుబ్ధకుండు= బోయవాడు;

**తాత్పర్యం:** అని ధర్మవ్యాధుడు చెప్పగా, కౌశికుడు 'జీవుడు ఎటువంటివాడు?' అని ప్రశ్నించాడు. తిరిగి ధర్మవ్యాధుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

### ధర్మవ్యాధుఁడు కౌశికునకు జీవలక్షణంబులు సెప్పుట (సం. 3-200-26)

**క. 'విను జీవుండు సనాతనుఁ। డనఘుఁడు నిజకర్మవశత నధ్రువదేహం**
**బునఁ బొందు దేహపాతం। బున నెప్పుడుఁ జెడఁ డతండు భూసురవర్యా! 72**

**ప్రతిపదార్థం:** భూసురవర్యా!= ఓ బ్రాహ్మణోత్తమా!; విను; జీవుండు= జీవుడు; సనాతనుఁడు= శాశ్వతంగా ఉండేవాడు; అనఘుఁడు= పాపంలేనివాడు; నిజ, కర్మ, వశతన్= తనకర్మకు లోబడి; అధ్రువ, దేహంబునన్+పొందున్= శాశ్వతంగాని అనగా నశించే శరీరాన్ని పొందుతాడు; దేహ, పాతంబునన్= మరణించినప్పుడు; ఎప్పుడున్= ఎప్పుడున్నూ; అతండు= (ఆ జీవుడు) చెడఁడు= నశించడు.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణులలో ఉత్తముడవైన ఓ కౌశికమహర్షీ! వినుము. జీవుడు శాశ్వతంగా ఉండేవాడు. పాపరహితుడు. అతడు తన కర్మవశాన అశాశ్వతమై నశించే శరీరాన్ని తాలుస్తాడు. దేహం మరణసమయాన నశిస్తుంది కాని శాశ్వతుడైన ఆ జీవుడు నశించడు సుమా!

**క.** **ఈ యొడలు విడిచి వేఱొక । కాయముఁ గైకొని శరీరి కర్మవశగతిం**
**బోయి సుఖదుఃఖములు గనుఁ; । బాయక వెండియును దేహబంధముఁ బొందున్.'** **73**

**ప్రతిపదార్థం:** ఈ+ఒడలు= ఈ దేహం; విడిచి= వదలిపెట్టి; వేఱు+ఒక, కాయమున్= ఇంకొక శరీరాన్ని; కైకొని= స్వీకరించి; శరీరి= శరీరం ధరించిన జీవుడు; కర్మ, వశ, గతిన్= కర్మకు లోబడిన తెరువున; పోయి= వెడలి; సుఖ, దుఃఖములు+కనున్= సౌఖ్యాన్నీ, శోకాన్నీ పొందుతాడు; పాయక= విడువక; వెండియును= మరల మరల; దేహ బంధమున్= పునర్జన్మను; పొందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఈ శరీరాన్ని విడిచి, జీవుడు తాను చేసిన కర్మకు అనురూప మైన ఇంకొక జన్మలో సుఖదుఃఖాలను అనుభవిస్తాడు. అట్లే అతడు ఎన్నో జన్మలు పొందుతాడు.'

**వ.** **అనిన విని బ్రాహ్మణుండు లుబ్ధకునితోడం 'బుణ్యపాపానురూపంబు లయిన దేహబంధంబు లెట్టి?' వనిన వాఁ డి ట్లనియె.** **74**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; బ్రాహ్మణుండు= (కౌశికుడు); విని; లుబ్ధకునితోడన్= వ్యాధుడితో; పుణ్య, పాప+అనురూపంబులు+అయిన= పుణ్యానికీ, పాపానికీ తగినవి అయిన, దేహబంధంబులు= జన్మలు; ఎట్టివి?= ఏవిధాలైనవి?; అనినన్= అని అడుగగా; వాఁడు= (ధర్మవ్యాధుడు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని ధర్మవ్యాధుడు చెప్పాడు. ఆ మాటలు విని, కౌశికుడు ధర్మవ్యాధుడిని మరల ఈ విధంగా ప్రశ్నించాడు. 'పుణ్యకర్మలవలన ఎట్టి పునర్జన్మ ఏర్పడుతుంది? పాపకర్మలవలన ఏర్పడే మరు జన్మ ఎటువంటిది?' అని. ధర్మవ్యాధుడు ఆ ప్రశ్నకు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**చ.** **'స్థిరమగు పుణ్యకర్మమున దేవభవం బగుఁ, బుణ్యపాప సం**
**కరమున మానుషత్వ మగుఁ, గల్మషముల్ పశుకీట భావముం**
**బొరయఁగఁ జేయు; నిప్పగిదిఁ బుట్టుచుఁ జచ్చుచు మోహవార్ధిలోఁ**
**దిరుగుచునుండుఁ గాని యొకతీరము సేరఁడు జీవుఁ డెన్నఁడున్.** **75**

**ప్రతిపదార్థం:** స్థిరము+అగు, పుణ్య, కర్మమునన్= శాశ్వతమైన పుణ్యం కలిగించే పనులవలన; దేవభవంబు+అగున్= దేవతా జన్మ ఏర్పడుతుంది; పుణ్య, పాప, సంకరమునన్= పుణ్యాపాపాలతో మిశ్రితమైన కర్మవలన; మానుషత్వము+అగున్=

మనుజులకు సంబంధించిన (జన్మ) కలుగుతుంది; కల్మషముల్= పాపాలు; పశు, కీట, భావమున్= జంతువులకు పురుగులకు సంబంధించిన జన్మలను; పొరయఁగన్+చేయున్= సంభవింపజేస్తాయి; ఈ+పగిదిన్= ఈరీతిగా; పుట్టుచున్, చచ్చుచున్, మోహ, వార్ధిలోన్= భ్రాంతి అనే సముద్రంలో; తిరుగుచున్+ఉండున్+కాని= పరిభ్రమిస్తుంటాడే కాని; జీవుఁడు; ఎన్నఁడున్= ఎప్పటికిని; ఒక, తీరము+చేరఁడు= ఒక గట్టుకు చేరుకొనడు. అనగా జన్మరాహిత్యాన్ని పొందలేడని భావం.

**తాత్పర్యం:** శాశ్వత మైన పుణ్యకార్యాలు చేస్తే దేవలోకంలో జన్మ లభిస్తుంది. పుణ్యాలు పాపాలు కలగలిపి చేస్తే మనుజజన్మ కలుగుతుంది. కేవలం పాపాలే చేస్తే, జంతువులుగా పురుగులుగా పుట్టుతారు. ఈ విధంగా జీవుడు పుట్టుతూ చస్తూ సదా సంసారమనే భ్రాంతిసాగరంలో తిరుగాడుతాడే కాని ఎన్నటికిని ఒక ఒడ్డు చేరుకొనలేడు.

**చ.** **ఇది సకలంబుఁ గాంచి బుధుఁ డెన్నఁడుఁ బాపము పొంతఁ బోక ని**
**ర్మదనిరహంక్రియాత్ముఁడును మత్సరదూరుఁడు నై చరించుఁ బెం**
**పొదవఁగ ధర్మమార్గమున నొయ్యన ధర్మము తీ పెఱింగి తా**
**వదలఁడు సత్క్రియావిధము వారక యెక్కు డొనర్చు ధర్మముల్.** **76**

**ప్రతిపదార్థం:** బుధుఁడు= పండితుడు; ఇది= దీనిని (జీవుడు మోహసముద్రంలో పడి చావుపుట్టుకల చక్రంలో తిరుగుతూ ఉండటాన్ని); సకలంబున్= అంతటిని; కాంచి= చూచి, గమనించి; ఎన్నఁడున్= ఏనాడుకూడా, ఎప్పుడుకూడా; పాపము, పొంతన్= దోషమైన పని దగ్గరకు; పోక= పోకుండా; నిర్మద, నిరహంక్రియా+ఆత్ముఁడును= పొగరులేని, అన్నింటికీ నేనేకర్తననే అహంకారంలేని, చిత్తంకలవాడున్నూ; మత్సర, దూరుఁడును+ఐ= అసూయ లేనివాడున్నూఅయి; పెంపు+ఒదవఁగన్= అభివృద్ధి కలిగేటట్లు; ధర్మమార్గమునన్= ధర్మం తప్పనిబాటలో; చరించున్= నడుస్తాడు; ఒయ్యన= క్రమంగా; ధర్మము, తీపు+ఎఱింగి= ధర్మంలోని రుచి మరిగి; సత్+క్రియా, విధమున్= మంచిపనులు చేసే పద్ధతిని; తా(న్)= తాను; వదలఁడు= వదలిపెట్టడు; వారక= ఆపకుండా; ఎల్లప్పుడూ, ధర్మముల్= విధివిధానంగా ఉండే పనులు; ఎక్కుడు= అధికంగా; ఒనర్చున్= చేస్తాడు.

**తాత్పర్యం:** జీవుడు మోహసముద్రంలో పడి చావుపుట్టుకల చక్రంలో తిరుగుతూ ఉంటాడన్న సంగతి నంతా పండితుడైనవాడు బాగా గమనించి ఎప్పుడూ పాపపు పనులజోలికి పోకుండా, పొగరు అహంకారంలేని మనస్సుతో, అసూయను వదలిపెట్టి ధర్మమార్గంలో నడుస్తూ పెంపును పొందుతాడు. అట్లా ధర్మాన్ని ఎల్లప్పుడూ ఆచరించటం వలన దానిలోని రుచిని మరుగుతాడు. దానివలన మంచిపనులు సదా చేస్తుంటాడు. ధర్మకార్యాలను ఎక్కువగా చేస్తుంటాడు.

**చ.** **చిరముగ ధర్మముల్ నడపఁ జిత్తము దేఱుఁ బ్రసన్నచిత్తుఁ డై**
**పరువడి నింద్రియార్థముల భంగులు రిత్తలుగా నెఱింగి చె**
**చ్చెర నవి యంతవట్టు నిరసించి తపో దమ సత్యశీలతం**
**బరిణతి నొందుఁ బొందుఁ బిదపం బరమార్థపదప్రభావమున్.'** **77**

**ప్రతిపదార్థం:** చిరముగన్= చాలకాలం; ధర్మముల్= లోకాన్ని మంచి స్థితిలో నిలబెట్టే పనులను; నడపన్= ఆచరించగా; చిత్తము= మనస్సు; తేఱున్= నిర్మలమౌతుంది; ప్రసన్న చిత్తుఁడు+ఐ= తేరుకొనిన మనస్సు కలవాడై; పరువడిన్= శ్రద్ధతో; ఇంద్రియ+అర్థముల భంగులు= విషయసుఖాలకు సంబంధించిన భావాల రీతులు; రిత్తలుగాన్= వ్యర్థాలైనవిగా; ఎఱింగి= తెలిసికొని; చెచ్చెరన్= శీఘ్రంగా; అవి= (ఆ ఇంద్రియార్థాలు); అంత+పట్టు= అంతమేరకు; నిరసించి= త్యజించి; తపస్+దమ,

సత్య, శీలతన్= చిత్తప్రసాదాన్నిగలిగించే శరీరక్లేశం మున్నగు పనులచేత, ఇంద్రియనిగ్రహంచేత, నిజాన్ని సదా భాషించే స్వభావంచేత; పరిణతిన్+ఒందున్= గొప్పవికాసాన్ని పొందుతాడు; పిదపన్= తదుపరి; పరమ+అర్థ, పద, ప్రభావమున్= మిక్కిలిగొప్పదైన ఆధ్యాత్మికమైన ఉన్నతి యొక్క మహిమను; పొందున్= ఏర్పరచుకొంటాడు.

**తాత్పర్యం:** చిరకాలం ధర్మాలను ఆచరించటంవలన మనస్సు నిర్మల మౌతుంది. చిత్తం ప్రశాంతిని బొందటంచేత, ఇంద్రియ సౌఖ్యాలు వ్యర్థాలైనవి అని తెలుస్తుంది. అట్టి జ్ఞానం లభించిన వెంటనే వాటిని విడనాడి తపస్సు, ఇంద్రియనిగ్రహం, సత్యవ్రతం, మున్నగు సద్గుణాల చేత ఆధ్యాత్మికమైన ఉన్నతస్థితి మహిమ గోచరిస్తుంది. అదియే గొప్ప పరిణత స్థితి.'

**వ. అనిన నమ్మహాద్విజుండు ధర్మవ్యాధున కి ట్లనియె. 78**

**తాత్పర్యం:** అనగా ఆ ఉత్తమబ్రాహ్మణుడైన కౌశికుడు ధర్మవ్యాధుడితో ఈవిధంగా అన్నాడు.

**ఆ. 'ఇంద్రియంబు లనఁగ నెయ్యవి? యవి నిగ్ర । హింపకున్నఁ బాప మేమి దొడరు?**
**వాని నిగ్రహించువానికి నగు ఫలం । బెట్టి?' దనిన నాతఁ డిట్టు లనియె. 79**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులు+అనఁగన్+ఎయ్యవి?= ఇంద్రియాలు అనగా ఏవి?; అవి= (ఇంద్రియాలు); నిగ్రహింపకున్నన్= అదుపులో పెట్టకుంటే; పాపము+ఏమి+తొడరున్= ఎట్టి దురితం సంక్రమిస్తుంది; వానిన్= (ఇంద్రియాలను); నిగ్రహించువానికిన్= లోబరచుకొనే వాడికి; అగు ఫలంబు= లభించే ఫలం; ఎట్టిది= ఏవిధమై నట్టిది; అనినన్= అనగా (అని కౌశికుడు అడుగగా); ఆతఁడు= (ధర్మవ్యాధుడు); ఇట్టులు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఇంద్రియాలు అనగా ఏవి? ఇంద్రియాలను అదుపులో పెట్టకపోతే కలిగే పాప మేమి? వాటిని నిగ్రహించేవాడికి కలిగే లాభ మేమి?' అని అడిగిన కౌశికుడి ప్రశ్నలకు ధర్మవ్యాధుడు ఈవిధంగా సమాధానం ఇచ్చాడు.

**విశేషం:** ఇంద్రియాలు అయిదు+అయిదు= పది. జ్ఞానేంద్రియాలు అయిదు; త్వక్కు, చక్షువు, శ్రోత్రం, జిహ్వ, ఘ్రాణం, కర్మేంద్రియాలు అయిదు: వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ. మనస్సుతో కూడి ఏకాదశేంద్రియాలుగా ప్రాచుర్యం.

**క. 'విను విషయజ్ఞానమునకు । ననయంబును మనసు మూల; మది కామక్రో**
**ధనిరూఢ మగుచుఁ బురుషుని । ననిశము నెలయించు నింద్రియార్థక్రియలన్. 80**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; విషయ, జ్ఞానమునకున్= ఇంద్రియార్థాల తెలివిడికి; అనయంబును= ఎల్లప్పుడును; మనసు= చిత్తం; మూలము= ఆధారం; అది= (ఆ మనస్సు); కామ, క్రోధ, నిరూఢము+అగుచున్= కోరికలతో, కోపతాపాలతో కూడుకొన్నది కావటంచేత; ఇంద్రియ+అర్థ, క్రియలన్= ఇంద్రియభోగాలకు సంబంధించిన పనులలో; పురుషునిన్= మనుజుడిని; అనిశమున్= ఎల్లప్పుడు; ఎలయించున్= ప్రవేశపెడుతుంది.

**తాత్పర్యం:** 'ఇంద్రియార్థాల తెలివిడికి ఆధారమైనది మనస్సు. అది కోరికలతో, కోపతాపాలతో కూడితే మనుజుడిని విషయభోగాలవైపు తరలిస్తుంది.

**విశేషం:** ఇంద్రియార్థాలు అయిదు. శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం.

**సీ.** **ఇంద్రియార్థంబుల కెలసిన పురుషుండు । గాఢరాగంబునఁ గరఁగుచుండు;**
**రాగంబువలనఁ దిరంబగు లోభంబు । లోభియై కరుణకు లోనుగాఁడు;**
**మఱి సముద్ధతవృత్తి మరగుఁ బాపక్రియఁ । దగువారు సెప్పెడి తగవు వినఁడు;**
**కుజనుల దెసఁ బ్రీతి గొఱలుఁ; దుల్యంబులు । గాకుండు వాఙ్మనఃకర్మభంగు;**

**ఆ.** **లిహమునందుఁ బుణ్యహీనుఁడై చెడిపోవుఁ । బరమునందు దుఃఖభరము నొందుఁ;**
**గాన యింద్రియార్థగతిఁ బోక సాధుసం । సర్గఁ జేసి సుగతిఁ జనుట యొప్పు.** **81**

**ప్రతిపదార్థం:** ఇంద్రియ+అర్థంబులకున్= విషయసుఖాలకు; ఎలసిన= లోనైన; పురుషుండు= మనుజుడు; గాఢ, రాగంబునన్= మిక్కుట మైన కామం చేత; కరఁగుచుండున్= ద్రవిస్తూ ఉంటాడు; రాగంబువలనన్= కామంవలన; లోభంబు= పిసినారితనం; తిరంబు+అగున్= ఎక్కువ కాలం నిలుస్తుంది; లోభి+ఐ= లోభం కలవాడై; కరుణకున్= దయకు; లోను+కాఁడు= లోబడడు; మఱి= అదనంగా; సమ్+ఉద్ధతి, వృత్తి= ఎక్కువ గర్వంతో కూడిన భావంచేత; పాపక్రియన్= దురితంతో కూడిన పనియందు; మరగున్= అభిలాష పెంచుకొంటాడు; తగువారు= యోగ్యులు; చెప్పెడి= వచించెడి; తగవు= ధర్మం; వినఁడు= ఆలకించడు. కుజనుల+దెసన్= చెడ్డవారి యెడల; ప్రీతి= అభిమానం; కొఱలున్= అతిశయిస్తుంది; వాక్+మనస్+కర్మ, భంగులు= మాట, మనస్సు, క్రియల రీతులు; తుల్యంబులు= సమమైనవి; కాక+ఉండున్= కావు; ఇహమునందున్= ఈ లోకంలో; పుణ్య, హీనుఁడు+ఐ= సుకృతం లేనివాడై; చెడిపోవున్= నశిస్తాడు; పరమునందున్= ఇంకొకలోకంలో; దుఃఖ, భరమున్= శోకపు బరువును; ఒందున్= పొందుతాడు; కాన= కాబట్టి; ఇంద్రియ+అర్థ, గతిన్= విషయ సుఖాల మార్గంవైపు; పోక= వెడలక; సాధు, సంసర్గన్+చేసి= మంచివారలతోడి కలయిక చేత; సుగతిన్= మంచి మార్గంలో; చనుట= వెడలటం; ఒప్పు= మంచిది.

**తాత్పర్యం:** విషయసుఖాలకు చిక్కిన మనుజుడు మిక్కుటమైన కామప్రవృత్తికి లోనౌతాడు. మిక్కుటమైన కామ ప్రవృత్తికి లోనుకావటంవలన చాలకాలం నిలిచే లోభం ఏర్పడుతుంది. లోభి కావటంవలన దయకు దూరమైనవా డౌతాడు. గర్వానికి లోనౌతాడు, పాపకార్యాలకు పాల్పడతాడు; యోగ్యులైన వారు చెప్పే ధర్మాన్ని ఆలకించడు. చెడ్డవారి స్నేహం చేస్తాడు. వాక్కుకు, మనస్సుకు, చేతలకు బొత్తిగా పొంతన కుదురదు. ఆ విధంగా అతడు ఈలోకంలో చెడిపోతాడు. పరం దక్కక అతడు దుఃఖమగ్నుడౌతాడు. కాబట్టి విషయభోగాలలో మనస్సును చిక్కనీయక, సాధుజనుల సహవాసం చేసి సుగతికి పోవటం మంచిది.

**వ.** **ఇంద్రియంబు లన నెయ్యవి యనియు, నింద్రియ జయసిద్ధియు నీవు నన్నడిగితివి; తత్ప్రకారంబు బ్రహ్మవిద్యావిషయంబు మాబోఁటివారికి నవాచ్యం బై యుండు; నైనను నీవు బ్రాహ్మణప్రవరుండవు గావున సద్బ్రాహ్మణ ప్రియం బవశ్యకర్తవ్యంబు; పరమబ్రహ్మవిదు లైన బ్రాహ్మణవరులకు నమస్కరించి, బ్రహ్మవిద్యాప్రపంచం బెఱింగించెద; నవధాన పరుండ వై యాకర్ణింపుము.** **82**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులు+అనన్+ఎయ్యవి= ఇంద్రియాలు అనగా ఏవి; అనియున్= అనియున్నూ; ఇంద్రియ, జయ, సిద్ధియున్= ఇంద్రియాలపై గెలుపు ఎట్లా సిద్ధిస్తుంది అనిన్నీ; నీవు= నీవు; నన్నున్= నన్ను; అడిగితివి= ప్రశ్నించావు; తత్+ప్రకారంబు= ఆవిధం; బ్రహ్మ, విద్యా, విషయంబు= ఆధ్యాత్మికజ్ఞానానికి సంబంధించిన సంగతి; మాబోఁటివారికిన్= నా వంటి వారలకు; అవాచ్యంబు+ఐ+ఉండున్= చెప్ప నలవి కానట్టిదిగా ఉంటుంది. ఐనను= అయినప్పటికిని; ఈవు= నీవు;

బ్రాహ్మణ, ప్రవరుండవు= విప్రులలో ఉత్తముడవు; కావునన్= కాబట్టి; సత్+బ్రాహ్మణ, ప్రియంబు= మంచి విప్రులకు ఇష్టమైనది; అవశ్య కర్తవ్యంబు= తప్పనిసరిగా చేయవలసినట్టిది; పరమ బ్రహ్మవిదులు+ఐన= ఆధ్యాత్మిక తత్త్వాన్ని లెస్సగా తెలిసినవారైన; బ్రాహ్మణ వరులకున్= విప్రులలో శ్రేష్ఠు లైన వారికి; నమస్కరించి= వందనం చేసి; బ్రహ్మ, విద్యా ప్రపంచంబు= ఆధ్యాత్మిక తత్త్వం యొక్క విస్తారం అంతటిని; ఎఱింగించెదన్= తెలుపుతాను; అవధానపరుండవు+ఐ= ఏకాగ్రతతో కూడిన నిష్ఠ కలవాడవై; ఆకర్ణింపుము= ఆలకింపుము.

**తాత్పర్యం:** ఇంద్రియాలు అనగా ఏవి? ఇంద్రియనిగ్రహం ఎట్లా లభిస్తుంది? అని నీవు నన్ను ప్రశ్నించావు. అది ఆధ్యాత్మికతత్త్వం. అది నాబోటి వారు చెప్పటానికి అలవి కానిది; అయినను నీవు బ్రాహ్మణోత్తముడవు. జిజ్ఞాసువవు; తెలిసికొనటానికి యోగ్యత యున్నవాడవు. మంచి విప్రులకోరిక ఈడేర్చటం తప్పనిసరిగా చేయవలసినపని. కాబట్టి, మహానుభావులు ఆధ్యాత్మిక తత్త్వకోవిదులు అయిన బ్రాహ్మణోత్తములను ధ్యానించి, వారికి సవినయంగా నమస్కరించి, బ్రహ్మజ్ఞానాన్నిగూర్చి నీకు సవిస్తరంగా తెలుపగలను. ఏకాగ్రతతో కూడిన నిష్ఠతో ఆలకించుము.

### ధర్మవ్యాధుఁడు కౌశికునకు బ్రహ్మవిద్యాప్రపంచం బెఱింగించుట (సం. 3-201-16)

**తే.** **అంబరము వాయు వగ్ని దోయమ్ము ధరణి । భూతపంచక మిది; క్రమంబున మహాత్మ!**
**శబ్ద సంస్పర్శ రూప రసములు గంధ । సంయుతంబుగ భూతపంచక గుణములు.** **83**

**ప్రతిపదార్థం:** మహా+ఆత్మ!= గొప్ప ఆత్మ కలవాడా!; అంబరము= ఆకాశం; వాయువు= గాలి; అగ్ని= నిప్పు; తోయమ్ము= నీరు; ధరణి= నేల; ఇది; క్రమంబునన్= వరుసగా; భూతపంచకము= పంచభూతాల సంపుటి(అవి); శబ్ద, సంస్పర్శ, రూప రసములు= నాదం, తాకుడు, ఆకృతి, ద్రవం; గంధ సంయుతంబుగన్= వాసనతో కూడినవై ఉండటం; భూత పంచకగుణములు= పంచభూతాల గుణాలు.

**తాత్పర్యం:** గొప్పఆత్మ గల ఓ కౌశికమహర్షీ! ఆకాశం, గాలి, నిప్పు, నీరు, నేల అనేవి పంచభూతాలు. వీటి గుణాలు వరుసగా నాదం, స్పర్శ, ఆకృతి, ద్రవం, వాసనలు. అనగా: ఆకాశ గుణం శబ్దం; వాయు గుణం స్పర్శం; అగ్ని గుణం రూపం; నీటి గుణం రసం; భూమి గుణం గంధం.

**క.** **ఒనరఁగ నాకస మాదిగ । ననులోమముతోడ నిమ్మహాభూతము లే**
**నును బుట్టు నొకటి కొక్కటి । యనయముఁ బ్రతిలోమగతి లయంబునఁ బొందున్.** **84**

**ప్రతిపదార్థం:** ఒనరఁగన్= వరుసగా; ఆకసము+ఆదిగన్= ఆకాశం మొదలుగా; అనులోమముతోడన్= క్రిందివరుసగా; ఈ+మహాభూతములు+ఏనును= ఈ గొప్పభూతాలు అయిదున్నూ; పుట్టున్= ఉద్భవిస్తాయి; ఒకటికిన్+ఒక్కటి= ఒకదానివరుస ఒకటి; అనయమున్= ఎల్లప్పుడును; ప్రతిలోమగతిన్= పైవరుస క్రమాన; లయంబునన్= వినాశాన్ని; పొందున్= పొందుతాయి.

**తాత్పర్యం:** ఆకసం మొదలుగా పంచభూతాలు వరుసగా అనులోమ క్రమంలో పుట్టుతాయి. అవి ప్రతిలోమ క్రమంలో లయమౌతాయి. (అనగా ఆకాశంనుండి వాయువు; వాయువునుండి అగ్ని, అగ్నినుండి నీరు, నీటినుండి భూమి పుట్టుతాయి. ఇది అనులోమ క్రమం. ఇక ప్రతిలోమ క్రమాన ప్రళయకాలంలో భూమి నీటిలో, నీరు అగ్నిలో, అగ్ని వాయువులో, వాయువు ఆకాశంలో లయిస్తాయి.

**వ. శ్రోత్రంబును ద్వక్కును జక్షువును జిహ్వాయు ఘ్రాణంబును నను నియ్యేనగు నింద్రియంబులు శబ్ద స్పర్శ రూపరసగంధంబు లింద్రియ విషయంబు లై యుండు; నింద్రియపంచకంబునకు షష్ఠం బై మనస్సుప్రకాశిల్లు; సప్తమాష్టమంబు లై బుద్ధియు నహంకారంబును వర్తిల్లు; సత్త్వంబును రజస్సును దమస్సును గుణంబు లై యుండు; నీ చెప్పంబడిన మహాభూతప్రముఖ ప్రపంచంబంతయు నవ్యక్తం బను తత్త్వంబునం దావిర్భావతిరోభావంబులం బొందుచుండు. 85**

**ప్రతిపదార్థం:** శ్రోత్రంబును= చెవియున్నూ; త్వక్కును= చర్మమున్నూ; చక్షువును= కన్నున్నూ; జిహ్వాయున్= నాలుకయున్నూ; ఘ్రాణంబునున్= ముక్కున్నూ; అను+ఈ+ఏను+అగు= అనబడే ఈ అయిదు అయిన; ఇంద్రియంబులు= ఇంద్రియాలు; శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులు= నాదం, తాకుడు, ఆకృతి, ద్రవం, వాసనలు; ఇంద్రియవిషయంబులు+ఐ+ఉండున్= ఇంద్రియార్థాలు అయి ఉంటాయి (వీటికి తన్మాత్రలు అని పేరు); ఇంద్రియ పంచకంబునకున్= అయిదు ఇంద్రియాలకు; షష్ఠంబు+ఐ= ఆరవది అయి; మనస్సు= చిత్తం; ప్రకాశిల్లున్= వెలుగొందుతుంది; సప్తమ+అష్టమంబులు+ఐ= ఏడవది ఎనిమిదివది అయినవి; బుద్ధియున్+అహంకారంబును= తెలివియున్నూ, నేను అనెడి అభిమాన భావమున్నూ; వర్తిల్లున్= ఉంటాయి; సత్త్వంబును= సాధువులకుండే మంచితనం అనేగుణం; రజస్సును= భూలోకవాసులలో సర్వసాధారణంగా ఉండే అహంభావపూరితమైన లక్షణం; తమస్సును= కోపతాపాలలో కూడిన మూఢత్వం (త్రిగుణములు= సత్త్వరజస్తమోగుణాలు); గుణంబులు+ఐ+ఉండున్= గుణాలు అయి ఉంటాయి; ఈ చెప్పంబడిన= ఈ విధంగా వివరించబడిన; మహా, భూత, ప్రముఖ, ప్రపంచంబు+అంతయున్= గొప్ప భూతాలతో కూడుకొనిన లోకం అంతయున్నూ; అవ్యక్తంబు+అను, తత్త్వంబు నందున్= వ్యక్తం కానట్టి అనగా అగోచరమైనది అనే తత్త్వంలో; ఆవిర్భావ, తిరస్+భావంబులన్= పుట్టుక మరలిపోవటాలను; పొందుచుండున్= పొందుతూ ఉంటాయి.

**తాత్పర్యం:** చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు - ఇవి ఐదు ఇంద్రియాలు. శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం - ఇవి ఐదు ఇంద్రియార్థాలు: వీటికి పంచతన్మాత్రలు అని వ్యపదేశం. ఇంద్రియపంచకానికి తోడు ఆరవది మనస్సు. బుద్ధి ఏడవది. అహంకారం ఎనిమిదవది. సత్త్వం, రజస్సు, తమస్సు - ఇవి మూడున్నూ త్రిగుణాలు. ఈ భూతప్రపంచం సర్వమున్నూ 'అవ్యక్తం' అనే తత్త్వంలో ఉదయిస్తుంది. తిరిగి అందులోనే లయిస్తుంది.

**విశేషం:** ప్రపంచం : అనగా విస్తారం : విరివి. పెక్కు విధాలు గలిగిన విస్తరణ. బ్రహ్మవిద్యా ప్రపంచం అనగా వేదాంతజ్ఞాన విస్తారం. ఇందు 'తత్త్వమునందు ఆవిర్భావ తిరోభావంబులందు' అనే వాక్యం సృష్టినిగూర్చి ప్రళయాన్నిగూర్చి తెలుపుతుంది. సృష్టికి ఆద్యప్రకృతి అయిన మూలపదార్థాన్నిగూర్చి వివిధమతాలు వేరు వేరు సిద్ధాంతాలను నెలకొల్పినవి.

| <u>మతాలు</u> | <u>తత్త్వాలు</u> |
|---|---|
| బౌద్ధం | శూన్యం |
| చార్వాకులు | పంచభూతాలు |
| అర్హతులు | జీవం - అజీవం |
| అర్హతులు (కొందరు) | జీవం - ఆకాశం - ధర్మం - అధర్మం - పుద్గలం. |
| సాంఖ్యులు | పంచభూతాలు 5, పంచతన్మాత్రలు 5, ఏకాదశేంద్రియాలు 11, అవ్యక్తం 1, బుద్ధి 1, అహంకారం 1, ఆత్మ 1 = మొత్తం 25. |

| | |
|---|---|
| యోగులు | సాంఖ్యులు 25+ఈశ్వరుడు |
| ద్వైతులు | స్వతంత్రం+అస్వతంత్రం |
| విశిష్టాద్వైతులు | తత్త్వత్రయం = చిత్తు+అచిత్తు+ఈశ్వరుడు |
| అద్వైతులు | బ్రహ్మం. |

**క. అవ్యక్త తత్త్వ మరయఁగ । నవ్యక్తం బయ్యు నిట్టి దై లక్ష్య మగున్**
**సువ్యక్తేంద్రియ భూతా । ది వ్యవహారార్థ లింగదృష్టాకృతి యై. 86**

**ప్రతిపదార్థం:** అరయఁగన్= పరిశీలించగా; అవ్యక్త, తత్త్వము= వ్యక్తం కాకుండ అగోచరంగా ఉండే యాథార్థ్యం; అవ్యక్తంబు+అయ్యున్= వ్యక్తం కానట్టిదే అయినప్పటికిని; ఇట్టిది+ఐ= ఈ విధంగా ఏర్పడేదై; సువ్యక్త+ఇంద్రియ, భూత+ఆది, వ్యవహార+అర్థ, లింగ, దృష్ట+ఆకృతి+ఐ= బాగా గోచరించునట్టిదై ఇంద్రియాలలో భూతములు మున్నగునట్టి వానితో కూడి లౌకికమైన వాడుకలు, భావప్రతీతి, లింగ, భేదంతో కన్పించే రూపం కలదై; లక్ష్యము+అగున్= గ్రహించదగినట్టిది ఔతుంది.

**తాత్పర్యం:** అవ్యక్తమై అగోచరమయ్యే తత్త్వం - అవాఙ్మానస గోచరం అనిర్వచనీయం అనుభవైకవేద్యం అయినదే అయినను, లోకవ్యవహారంలో, ఇంద్రియాలకు భూతాలకు అనువయిన భావనలో లింగభేదంతో కూడిన రూపంతో కన్పించవచ్చును. ఆవిధంగానే అవ్యక్తతత్త్వాన్ని లౌకికులైన మానవులు గ్రహించ వీలు కల్గుతుంది. అనగా అవ్యక్త తత్త్వం వ్యవహారంలో సాకారం కావచ్చును. అసలు అది నిరాకారం. అవ్యక్తం.

**వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 87**

**తాత్పర్యం:** అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**తే. అనఘ! శబ్దాది విషయంబులందుఁ దగిలి । యిచ్చఁ జరియించు నెప్పుడు నింద్రియములు;**
**బుధుఁడు దత్త్వభావముఁ దనబుద్ధి నెఱిఁగి । యేమఱక వానిఁ దగఁ గుదియింప వలయు. 88**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా!; శబ్ద+ఆది, విషయంబులందున్= శబ్దం మొదలైనవాటిలో; తగిలి= చిక్కుకొని; ఎప్పుడున్= ఎల్లప్పుడును; ఇంద్రియములు= భోగసాధనాలు; ఇచ్చన్= ఇష్టం వచ్చినట్లుగా; చరియించున్= తిరుగుతాయి; బుధుఁడు= తెలివిగలవాడు; తత్త్వభావమున్= వేదాంతాన్ని, యాథార్థ్యజ్ఞానాన్ని; తన బుద్ధిన్= తన తెలివితో; ఎఱిఁగి= తెలిసికొని; ఏమఱక= అవధానం పోగొట్టుకొనక; వానిన్= (ఆ ఇంద్రియాలను); కుదియింపవలయున్= నిగ్రహించాలి.

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్ముడా! ఇంద్రియాలు శబ్దం మొదలైన భోగసాధనాలలో చిక్కుకొని, ఇష్టానుసారంగా నడుస్తూ ఉంటాయి. బుద్ధిమంతుడు ఏమఱుపాటు చెందక జ్ఞానాన్ని ఆర్జించి ఇంద్రియాలను నిగ్రహించాలి.

**ఉ. ధీరుఁడు నిర్జితేంద్రియుఁడు దెల్లముగాఁ దనుఁ గాంచు భూత వి**
**స్తారనిగూఢ మైన పరతత్త్వముగాఁ, దనయందు భూత వి**
**స్తారము నెల్లఁ గాంచు సతతస్ఫుటదర్శనుఁ డై సమగ్ర వి**
**స్ఫారతఁ బొంది నిర్మలతపంబులయందుఁ జలింప కెన్నఁడున్. 89**

**ప్రతిపదార్థం:** ధీరుఁడు= నిలుకడ కల చిత్తం కలవాడు; నిర్జిత+ఇంద్రియుఁడు= నిగ్రహించబడిన ఇంద్రియాలు కలవాడు- ఇంద్రియాలను జయించినవాడు; సతత, స్ఫుటదర్శనుఁడు+ఐ= ఎల్లప్పుడును బాగా కన్పించే చూపు కలవాడై సమగ్ర, విస్ఫారతన్+పొంది= పూర్ణమైన వికాసాన్ని పొందిన వాడై; నిర్మల, తపంబుల+అందున్= స్వచ్ఛమైన తపస్సులు చేయటంలో; ఎన్నడున్= ఎప్పుడును; చలింపక= వణకక; తెల్లముగాన్= విశదంగా, స్పష్టంగా; భూత, విస్తార, నిగూఢము+ఐన= అన్ని పదార్థాలలో వ్యాపించి రహస్యంగా ఉన్నట్టి; పరతత్త్వముగాన్= పరబ్రహ్మంగా; తనున్+కాంచున్= తనను తెలిసికొంటాడు; తనయందున్= తనలోపల; భూత, విస్తారమున్+ఎల్లన్= ప్రపంచంలో విస్తరించిన పదార్థాల నన్నిటిని, కాంచున్= తెలిసికొంటాడు.

**తాత్పర్యం:** స్వచ్ఛమైన తపస్సులు చేసి జ్ఞానాన్ని ఆర్జించిన మహనీయుడు సర్వభూతాలలో తనను తెలిసికొంటాడు; తనయందు సర్వభూతాలను తెలిసికొంటాడు.

**విశేషం:** 'ఏకమ్ సత్ విప్రాః బహుధా వదంతి.' 'ఏక మేవాఽద్వితీయమ్' - మున్నగు ఉపనిషద్వాక్యాలకు అనురూప మైనది ఈ పద్యం. భిన్ననామరూపభేదాత్మక మైన ప్రపంచంలో అంతర్లీనంగా ఉన్న ఆత్మపదార్థాన్ని తపస్విఅయినవాడు ఇంద్రియనిగ్రహంతో గుర్తించగలడు.

**క. తప మనఁగ సకల విషయ । వ్యపేత మగు నట్టి బుద్ధివైభవము సుమీ!**
**తపమున సుస్థిరుఁ డగు యో । గపరునకుం గలవె యొండు కర్తవ్యంబుల్. 90**

**ప్రతిపదార్థం:** తపము+అనఁగన్= తపస్సు అనగా; సకల, విషయ, వ్యపేతము+అగు+అట్టి= అన్ని విషయాలనుండి వెనుకకు మరల నట్టి; బుద్ధి, వైభవము, సుమీ= జ్ఞానంయొక్క గొప్పదనం సుమా; తపమునన్= తపస్సులో; సుస్థిరుఁడు+అగు= నిలుకడ చెందిన వాడగు; యోగపరునకున్= యోగాసక్తునకు; ఒండు= వేరే; కర్తవ్యంబుల్= నెరవేర్చవలసిన పనులు; కలవె= ఉన్నవా? (లేవు).

**తాత్పర్యం:** తపస్సు అనగా అన్ని విషయాలనుండి వెనుకకు మరలిన మనస్సుతో కూడిన వైరాగ్యమే కదా! తపస్సులో నిలుకడ కనిన యోగికి ఇక చేయవలసిన పనులు వేరేమీ ఉండవు.

**క. స్వర్గనరకంబు లింద్రియ । వర్గ సమాచరణమునన వచ్చును వినవే!**
**స్వర్గ మగుఁ దన్నివారణ । దుర్గతి యగుఁ దన్నిరోధ దుర్బలతమెయిన్. 91**

**ప్రతిపదార్థం:** స్వర్గనరకంబులు= స్వర్గమున్నూ నరకమున్నూ; ఇంద్రియ, వర్గ, సమాచరణమునన్+అ= ఇంద్రియ సమూహాల యొక్క ప్రవర్తన వలన; వచ్చును= సంక్రమిస్తుంది; వినవే!= వినలేదా!; తద్+నివారణన్= ఆ (ఇంద్రియాలను) నిగ్రహించటంచేత; స్వర్గము+అగున్= స్వర్గం ప్రాప్తిస్తుంది; తత్+నిరోధ, దుర్బలత, మెయిన్= ఆ ఇంద్రియాలను నిగ్రహించటంలో ఏర్పడిన బలహీనతచేతనే; దుర్గతి= దుర్గతి, నరకం; అగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఇంద్రియాలను నిగ్రహించటం వలన స్వర్గం లభిస్తుంది. ఆ ఇంద్రియాలను నిగ్రహించజాలని బలహీనత వలననే నరకం ప్రాప్తిస్తుంది.

**విశేషం:** పాపాలు చేసినవారికి యమలోకం ప్రాప్తిస్తుందనిన్నీ, పుణ్యాలు చేసిన వారికి స్వర్గం లభిస్తుందనిన్నీ - పురాణ సాహిత్యంలో చెప్పబడిన అంశం. అర్థవాదరూపంగా గ్రహించనగునని భారత సందేశం.

"న మోక్షో నభసః పృష్ఠే । న పాతాళే న భూతలే ।
సర్వాశాసంక్షయే చేతః । క్షయో మోక్ష ఇతీర్యతే". 70 అన్నపూర్ణ అధర్వవేదం

మోక్షం అనేది ఆకాశం వెనుకగాని పాతాళంలో గాని భూమిమీద గాని ఉండే చోటు గాదు. ఆశాపరివృత మైన చిత్తవృత్తి నశించటమే నిజమైన మోక్షం - అన్న వేదవాక్య మిక్కడ అనుసంధించదగింది.

**చ. అరదము దేహ, మింద్రియము లశ్వము, లాత్ముఁడు సూతుఁ డమ్మహా**
**తురగచయంబు ధైర్య మను తోరపుఁ బగ్గములన్ దృఢంబుగా**
**నురవడిఁ బోక యుండ వెర వొప్పఁగఁ బట్టినవాఁడు సేమపుం**
**దెరువున నేఁగు నప్పరమధీరుఁడు సువ్వె యుదారుఁ డెయ్యెడన్. 92**

**ప్రతిపదార్థం:** దేహము= శరీరం; అరదము= రథం; ఇంద్రియములు= భోగానుభవ స్థానాలు; అశ్వములు= గుర్రాలు; ఆత్ముఁడు= ఆత్మ అనే పురుషుడు; సూతుఁడు= సారథి; ఆ+మహాతురగచయంబు= ఆగొప్పగుర్రాల సమూహం; ధైర్యము+అను, తోరపున్+పగ్గములన్, తోరపున్+పగ్గములన్= నిలుకడ కలిగిన చిత్తం అనే గొప్పపగ్గాలతో; దృఢంబుగాన్= గట్టిగా; ఉరవడిన్= వేగంగా; పోకయుండన్= పారిపోవకుండేటట్లుగా; వెరవు+ఒప్పఁగన్= ఉపాయం భాసించేటట్లుగా; పట్టినవాఁడు= చేతిలో నిగ్రహించి పూనినవాడు; సేమము+తెరువునన్= క్షేమంగల మార్గాన; ఏఁగున్= వెళ్ళుతాడు; ఆ+పరమధీరుఁడు+చువ్వె= ఆశ్రేష్ఠుడైన, ధీరుడే సుమా; ఏ+ఎడన్= ఎక్కడైనా; ఉదారుఁడు= గొప్పవాడు.

**తాత్పర్యం:** ఈ దేహమే ఒక రథం. ఇంద్రియాలు ఈ రథానికి పూన్చిన గుర్రాలు - అని చెప్పవచ్చును. ఆత్మయే ఈ రథాన్ని నడిపే సారథి. చలించని చిత్తం అనే పగ్గాలను చేతబూని ఉపాయంతో ఎవడు ఈ గుర్రాలను తన అదుపులో పెట్టి నడపగలడో అట్టివాడే ధీరుడు. అట్టివాడే క్షేమమార్గాన పోయేవాడు.

**విశేషం:** ఈ దేహం ఒక రథం. ఇంద్రియాలు అనునవి గుర్రాలు. ఆ గుర్రాలను అదుపులో పెట్టి నడిపించవలసిన గొప్పసారథి - ఆత్మ. అనుభవం మిక్కిలి ప్రాచీనమైనది. "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు" - ఇత్యాదులు, మరియు "యస్తువిజ్ఞానవాన్ భవతి । యుక్తేన మనసా సదా । తస్యేంద్రియాణి వశ్యాని । సదశ్వా ఇవ సారథేః" అనే ఉపనిషద్వాక్యాలు ఇట స్మరించదగినవి.

**తే. ఇంద్రియంబులు దివిచిన యెడక పాఱు । చుండు మన సెప్డుఁ దద్వేగ ముడుపకున్న**
**నెడలి చెడిపోవు బుద్ధి యుదీర్ణపవన । హతిఁ బయోనిధిలోఁ గల మవియు నట్లు. 93**

**ప్రతిపదార్థం:** ఇంద్రియంబులు= శరీరంలో భోగస్థానా లైన అవయవాలు; తివిచిన+ఎడకు+అ= ఆకర్షించిన (లాగిన) చోటికే; మనసు= మనస్సు; ఎప్డున్= ఎపుడును; పాఱుచుండున్= ప్రవహిస్తూ ఉంటుంది; తద్+వేగము= ఆ ఇంద్రియాల శీఘ్రగమనం; ఉడుపక+ఉన్నన్= ఆపకపోతే; ఉదీర్ణ, పవన, హతిన్= పెనుగాలి తాకిడికి; పయస్+నిధిలోన్= సముద్రంలో; కలము= పడవ; అవియున్+అట్లు= నశించిపోయేటట్లుగా; బుద్ధి= తెలివి; ఎడలి= వికలం అయి; చెడిపోవున్= పాడయిపోతుంది.

**తాత్పర్యం:** ఇంద్రియాలు ఆకర్షించిన చోటికే మనస్సు సదా ప్రసరిస్తూ ఉంటుంది. ఆ ప్రసార వేగాన్ని అదుపులో పెట్టకపోతే సముద్రంలో పెనుగాలి తాకిడికి పగిలి నశించే పడవవలె, బుద్ధి పాడైపోతుంది.

**క. ఏనింద్రియములు మనసును । బూని తనవశంబ యైన బురుషుండు గదా**
**ధ్యానసమాధిసమగ్రుఁడు । వానిం గీర్తింతు రమరవరులున్ మునులున్.' 94**

**ప్రతిపదార్థం:** ఏను+ఇంద్రియములు= అయిదు ఇంద్రియాలు= 1. త్వక్కు, 2. చక్షువు, 3. శ్రోత్రం, 4. జిహ్వ, 5. ఘ్రాణం; మనసును= చిత్తమున్నూ; పూని= దీక్షతో; తన, వశంబు+అ+ఐన= స్వాధీనమైన; పురుషుండు= మనిషి; కదా= సుమా; ధ్యాన, సమాధి, సమగ్రుఁడు= చిత్తచాంచల్యం లేక ఏకాగ్రంగా తలపోయటంలో సంపూర్ణమైన నిష్ఠ కలవాడు; అమరవరులున్= వేల్పులలో ఉత్తములు; మునులున్= ఋషులును; వానిన్= (అట్టి ధ్యానయోగిని); కీర్తింతురు= పొగడుతారు.

**తాత్పర్యం:** ఐదు ఇంద్రియాలను తన వశం చేసికొనినవాడే కదా ధ్యానయోగి; అట్టివాడినే గదా దేవతలు, ఋషులు పొగడుతారు.'

**వ. అనిన నవ్విప్రుండు సత్త్వరజస్తమోగుణంబులతెఱం గెఱింగింపు మనిన నెఱు కి ట్లనియె. 95**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పినపిదప; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; సత్త్వ, రజః+తమః+గుణంబులతెఱంగు= సత్త్వము, రజస్సు, తమస్సు అనే గుణాల విధం; ఎఱింగింపుము= తెలుపుము; అనినన్= చెప్పగా; ఎఱుక= బోయవాడు (ధర్మవ్యాధుడు); ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పిన కౌశికమునితో ధర్మవ్యాధుడు ఇట్లా పలికాడు.

**ధర్మవ్యాధుఁడు కౌశికునకు సత్త్వరజస్తమోగుణంబుల తెఱం గెఱింగించుట (సం. 3-203-3)**

**క. అతినిందితము తమోగుణ । మతిబోధమయంబు సత్త్వ మనయంబుఁ బ్రకా**
**శత నొప్పు; నుభయగుణమి । శ్రతఁ బరఁగు రజోగుణంబు సన్నుతచరితా! 96**

**ప్రతిపదార్థం:** సత్+నుత, చరితా!= మంచివారిచేత ప్రశంసించబడిన శీలం కలవాడా! ఓ కౌశికమునీ!; తమస్+గుణము= తమోగుణము= తమస్సు అనే చెడుగుణం; అతినిందితము= మిక్కిలి గర్హించతగింది; సత్త్వము= సత్త్వం అనే మంచిగుణం; అతిబోధమయంబు= మిక్కుటమైన జ్ఞానంతో కూడినట్టిది; అనయంబున్= ఎల్లప్పుడును; ప్రకాశతన్+ఒప్పున్= వెలుగొందుతుంది; రజస్+గుణము= రజోగుణము= రజస్సు అనే గుణం; ఉభయ గుణమిశ్రతన్+పరఁగున్= రెండింటియొక్క కలయికచేత అనగా తమోగుణ సత్త్వగుణాల రెండిటియొక్క సమ్మేళనంవలన ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** పొగడబడినశీలం కల ఓ కౌశికమునీ! తమోగుణం మిక్కిలి హేయమైనది. సత్త్వగుణం జ్ఞానంతో కూడి వెలుగొందేది. ఇక రజోగుణమా, తమోగుణ సత్త్వగుణాల రెంటి యొక్క సమ్మేళనం.

**మ. అసుఖాకారత నిద్ర దైన్యము విమోహం బక్షమత్వంబుఁ దా**
**మసభావంబులు; రాగలోభజడతామానంబు లూహింప రా**
**జసవృత్తంబులు; ధైర్యశాంతికరుణాసంతోషవిద్యాదు లిం**
**పెసఁగన్ సాత్త్విక చేష్టితంబులు; నిజం బి ట్లాత్మఁ గ న్మిన్నియున్. 97**

**ప్రతిపదార్థం:** అసుఖ+ఆకారత= తృప్తి లేని రూపం; నిద్ర= కూర్కుచెందటం; దైన్యం= దురవస్థ; విమోహంబు= మిక్కుటమైన భ్రాంతి; అక్షమత్వంబున్= సహనం కోల్పోవటం; తామసభావంబులు= తమోగుణానికి చెందిన లక్షణాలు; ఊహింపన్= ఆలోచించగా; రాగ, లోభ, జడతా, మానంబులు= కోరికలు, పిసినారితనం, కదలిక లేకపోవటం, అహంకారం అనేవి; రాజసవృత్తంబులు= రజోగుణానికి సంబంధించిన అంశాలు; ధైర్య, శాంతి, కరుణా, సంతోష, విద్యా+ఆదులు= నిలుకడ

కలిగిన చిత్తం, మనస్తృప్తి, దయ, ఆనందం, జ్ఞానం మొదలైనవి; ఇంపు+ఎసఁగన్= ప్రియం ఏపారేటట్లుగా; సాత్త్విక, చేష్టితంబులు= సత్త్వగుణానికి సంబంధించిన లక్షణాలు; నిజంబు= ఇది సత్యము; ఇట్లు= ఈ రీతిగా; ఆత్మన్= నీలోలోపల; ఇన్నియున్= వీటిని ఇన్నింటిని; కన్కు= కనుము; అరయుము= తెలిసికొనుము.

**తాత్పర్యం:** సంతృప్తిలేని రూపం, నిద్దురమత్తులో ఉండటం, హీనత్వం, మిక్కుటమైన భ్రాంతి, సహనం లేకపోవటం అనేవి తమోగుణాన్ని సూచించే లక్షణాలు. దురాశ, పిసినిగొట్టుతనం, జడత్వం, దురహంకారం, రజోగుణాన్ని సూచించే లక్షణాలు. ఆపద దాపురించినప్పటికీ చలించని చిత్తవృత్తి, మానసిక సంతృప్తి, జాలి, సంతోషం, తెలివితేటలు మొదలైనవి సత్త్వగుణాన్ని సూచించే లక్షణాలు. ఇది నిజం. ఇదంతా నీ మనస్సులో గ్రహించుము.

**చ. అనఘుఁడు సాత్త్వికుం డగు మహాత్ముఁడు బోధనిరూఢి సర్వముం**
**గనికొని లోకవృత్తములు గావని రోసి సమస్తసంగభం**
**గనిరతుఁ డై తొఱంగు మమకారవికార మహంక్రియాచ్యుతిం**
**బనుపడి సంయమప్రకట భావన నుత్తమశాంతిఁగైకొనున్. 98**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= పాపం చేయనివాడు; సాత్త్వికుండు= సత్త్వగుణం కలవాడు; అగు= అయినట్టి; మహా+ ఆత్ముఁడు= గొప్ప ఆత్మ గలవాడు; బోధ, నిరూఢిన్= జ్ఞానం స్థిరపడటంవలన; సర్వమున్= అంతటిని; కనికొని= అరసి తెలిసికొని; లోక, వృత్తములు= ఐహికానికి చెందిన అంశాలు; కావు+అని, రోసి= సరిఅయినవి కావు అని అసహ్యాన్ని చెంది; సమస్త, సంగ, భంగ, నిరతుఁడు+ఐ= అన్ని కలయికలను విడవటంలో ఆసక్తిగలవాడై; మమకార వికారము= ఇది నాది అనే భావాన్ని; (అహంకారాన్ని); తొఱంగున్= విడిచిపెట్టుతాడు; అహంక్రియాచ్యుతిన్= అహంకారం జారిపోవటంచేత; సంయమ, ప్రకట, భావన= ఇంద్రియనిగ్రహంతో గూడిన వైరాగ్యం విరిసిన ఆలోచన; పనుపడి= కుదురుకొనేటట్లుగా చేసి; ఉత్తమ శాంతిన్= గొప్పదైన ఆనందాన్ని; కైకొనున్= స్వీకరిస్తాడు.

**తాత్పర్యం:** పాపరహితు డైన మహానుభావుడు జ్ఞానాన్ని ఆర్జించి, ఐహికంలోని విషయాలు అన్నీ సరిఅయినవి కావని తెలిసికొని, వైరాగ్యభావాన్ని పెంపొందించుకొని, సంగమును త్యజించి, అహంకారాన్ని నిర్మూలించుకొంటాడు. అహంకారం జారిపోవటంచేత ఇంద్రియనిగ్రహం ఏర్పడినట్టి యోగీశ్వరుడు గొప్పశాంతిని అనుభవిస్తాడు.

**వ. సత్త్వగుణనిబద్ధుం డగునేని శూద్రుం డైనను జన్మాంతరంబున వైశ్యత్వంబు నొంది క్రమంబున రాజభూసురభావంబులు భజించి భవవిముక్తుం డగు' నని చెప్పిన నమ్మహీదేవుం డమ్మహానుభావు నభినందించి. 99**

**ప్రతిపదార్థం:** సత్త్వ, గుణ, నిబద్ధుండు+అగున్+ఏని= సత్త్వగుణాలతో కూడినవాడు అయి ఉంటే; శూద్రుండు+ఐనను= శూద్రుడుగా (ఈజన్మలో) పుట్టి ఉన్నప్పటికిని; జన్మ+అంతరంబునన్= మరియొక పుట్టుకలో; వైశ్యత్వంబున్+ఒంది= వైశ్యుడుగా పుట్టుకను పొంది; క్రమంబునన్= వరుసగా; రాజ, భూసుర, భావంబులు= క్షత్రియుడుగా, బ్రాహ్మణుడుగా పుట్టటం; భజించి= పొంది; భవ, విముక్తుండు అగున్+అని= జన్మరాహిత్యం పొందుతాడని; చెప్పినన్= వచించగా; ఆ+మహీ, దేవుండు= ఆ బ్రాహ్మణుడు- కౌశికుడు; ఆ+మహా+అనుభావున్= ఆ మహాత్ముడిని - ధర్మవ్యాధుడిని; అభినందించి= సంతోషంతో ప్రస్తుతించి.

**తాత్పర్యం:** సత్త్వగుణాలు కలవాడు ఈ జన్మలో శూద్రుడై పుట్టి ఉన్నప్పటికిన్నీ, మరుజన్మలో వైశ్యుడై పుట్టుతాడు. అట్లే వరుసగా - తదుపరి జన్మలలో క్షత్రియుడై, బ్రాహ్మణుడై పుట్టుతాడు. అప్పుడు జన్మరాహిత్యాన్ని పొందగలడు' - అని చెప్పగా, కౌశికుడు ధర్మవ్యాధుడిని అభినందించాడు.

**తే. 'దేహమున ధాతు సంశ్రయదీప్తుఁ డగుచు । వహ్ని యెట్లుండు? శారీరవాయువులకు**
**నెలవు లెయ్యవి? యవి నాకు నిశ్చయముగఁ । జెప్పు' మనుటయు నిట్లని చెప్పె నతఁడు. 100**

**ప్రతిపదార్థం:** దేహమునన్= శరీరంలో; ధాతు, సంశ్రయ, దీప్తుఁడు+అగుచున్= ధాతువులయొక్క ఆధారంచేత ప్రజ్వలించినవాడయి; వహ్ని= అగ్నిహోత్రుడు; ఎట్లు+ఉండున్= ఏ విధంగా మనుతుంటాడు? శారీరవాయువులకున్= దేహంలో ఉండే గాలులకు; నెలవులు= ఉండేచోటులు; ఏ+అవి= ఏవి?; అవి= ఆ విషయాలను; నాకున్; నిశ్చయముగన్= సందేహాలకు తావులేకుండ, ఖండితంగా; చెప్పుము= తెలుపుము; అనుటయున్= అని పలికినపిమ్మట; ఇట్లు+అని= ఈరీతిగా; అతఁడు= (ఆ ధర్మవ్యాధుఁడు); చెప్పెన్= పలికాడు.

**తాత్పర్యం:** మానవశరీరంలో ధాతువుల ఆశ్రయంచేత అగ్ని ఎట్లా ప్రజ్వలిస్తుంది? శరీరంలోని వాయువులకు ఆటపట్టులు ఏవి? ఈ విషయాలను దయచేసి నాకు సందేహాలకు ఆస్కారం లేని రీతిగా-వివరించి తెలుప వేడికోలు.

**విశేషం:** దేహం - అనేకధాతువులతో ఏర్పడేది. ధాతువు అనగా ఆధారభూతమైన పదార్థం అని అర్థం. ధాతువులు ఏడు : 1. వస, 2. అసృక్కు, 3. మాంసం, 4. మేదస్సు, 5. అస్థి, 6. మజ్జ, 7. శుక్రం, పక్షాంతరంలో మఱి కొందరు ధాతువు లనగా: 1. రోమం, 2. త్వక్కు, 3. మాంసం, 4. అస్థి, 5. స్నాయువు, 6. మజ్జ, 7. ప్రాణం. అందుచేత సంఖ్యాశాస్త్రంలో ధాతువుకు సప్త సంఖ్యాపరిగణనం ఏర్పడింది.

**సీ. మూర్ధదేశమునకు వర్ధితం బై పర్వు । నాత్మాగ్ని; నాభి దదాశ్రయంబు;**
**శిరమునఁ బావకాంతరమునఁ జరియించుఁ । బ్రాణుండు భూతాత్మభావుఁ డతఁడు;**
**వరుసఁ బ్రాణాపాను లిరువురు నయ్యగ్ని । వెలిగింతు రనపేతవృత్తు లగుచు;**
**గుదవస్తితలము లాస్పదములుగా వహ్ని । పరిగతుం డగుచు నపానుఁ డుండు;**

**తే. గడఁగి విణ్మూత్రనిర్గమకారి యతఁడు; । కర్మబలయత్నకారి యై కంఠతలము**
**నం దుదానుండు వర్తించు; నఖిలదేహ । సంధులందును వ్యానుండు సంచరించు. 101**

**ప్రతిపదార్థం:** ఆత్మ+అగ్ని= ఆత్మ అనబడే అగ్ని; మూర్ధదేశమునకున్= తల ఉన్న చోటికి; వర్ధితంబు+ఐ= ఎదిగి, వ్యాపించినట్టిదై; పర్వున్= విలసిల్లుతుంది; నాభి= బొడ్డు; తద్+ఆశ్రయంబు= ఆ(ఆత్మాగ్నికి) ఆధారం; ప్రాణుండు= ప్రాణమనే పేరు గల వాయువు; శిరమునన్= తలలో; పావకాంతరమునన్= నిప్పుమధ్య; చరియించున్= తిరుగాడుతుంది; అతఁడు= ఆ ప్రాణుడు; భూత+ఆత్మ, భావుఁడు= సకలజీవులకు ఆత్మవంటివాడు; ప్రాణ+అపానులు+ఇరువురున్= ప్రాణుడు, అపానుడు అనే వాయువులు రెండున్నూ; వరుసన్= క్రమంగా; ఆ+అగ్నిన్= ఆ అగ్నిని; అనపేతవృత్తులు+అగుచున్= ఎల్లప్పుడును తొలగని చేష్టలు కలవారౌతూ; వెలిగింతురు= జ్వలింపచేస్తారు; అపానుఁడు= అపానం అనే పేరు గల వాయువు; గుద, వస్తితలములు= మూడి, పొత్తికడుపులు అనేచోటులు; ఆస్పదములు+కాన్= నెలవులుగా; వహ్నిపరిగతుండు+అగుచున్=

అగ్ని చేత చుట్టుకొనబడినవాడై; ఉండున్= నివసిస్తాడు. అతఁడు= వాడు; కడఁగి= పూని; విట్+మూత్ర, నిర్గమకారి= మలమున్నూ, మూత్రమున్నూ బయటికి పోయేటట్లు చేసేవాడు; ఉదానుండు= ఉదానుడు అనే పేరు గల వాయువు; కర్మ, బల, యత్నకారి+ఐ= కర్మయొక్క శక్తిని అనుసరించి ప్రయత్నంచేసే వాడై; కంఠతలమునందున్= మెడచోటునందు; వర్తించున్= పనిచేయును; వ్యానుండు= వ్యానుడు అనే పేరుగల వాయువు; అఖిలదేహసంధులందున్= అన్ని అవయవాలు ఒకదానితో మరిఒకటి కలిసే చోటులందు; సంచరించున్= తిరుగాడుతాడు.

**తాత్పర్యం:** ఆత్మాగ్ని నాభినుండి శిరస్సువరకు వ్యాపిస్తూంటుంది. ప్రాణుడు అనే వాయువు, ఆ అగ్నిమధ్యగా శిరస్సులో చరిస్తూంటుంది. అతడు సర్వభూతాలకు జీవత్వాన్ని ప్రసాదించేవాడు. ప్రాణుడికి తోడుగా అపానుడు ఎల్లప్పుడు ఆ అగ్నిని జ్వలింప చేస్తుంటాడు. అపానుడు ముడ్డి, పొత్తికడుపు మధ్య అగ్నిచేత పరివేష్టితుడై ఉంటాడు. అతడే మలమూత్రాలను విసర్జించేటట్లుగా చేస్తాడు. ఉదానుడు అనేవాయువు కంఠంలో నివసిస్తాడు. కర్మతంత్రాన్ని నడుపుతాడు. వ్యానుడు అనేవాయువు శరీరంలోని వివిధాలైన అవయవాలు ఒకదానితో మరియొకటి కలిసేచోటులలో ఉంటుంది.

**విశేషం:** పంచప్రాణాలు : 1. ప్రాణం, 2. అపానం, 3. ఉదానం, 4. వ్యానం, 5. సమానం - అనే పేరులు గల వాయువులు. ఈ పద్యంలో నాలుగు ప్రాణవాయువులను గూర్చి చెప్పబడింది. రాబోయే పద్యంలో సమానవాయువును గూర్చి వ్రాయబడింది.

**క. విను, ప్రాణాపానులు న । య్యనలుఁడుఁ బ్రాపుగ సమానుఁ డన్నరసవిపా**
**చనుఁ డగుచు నాభిదేశం । బున నుండును సకలధాతుపోషకవృత్తిన్. 102**

**ప్రతిపదార్థం:** విను= ఆలకింపుము; ప్రాణ+అపానులు= ప్రాణం అపానం అనేవాయువులు; ఆ+అనలుఁడున్+ప్రాపుగన్= ఆ అగ్నినాశ్రయించి సమానుడు అనే వాయువు; అన్న, రస, విపాచనుఁడు+అగుచున్= ఆహారపానీయాలను జీర్ణం చేసేవాడు ఔతూ; సకల, ధాతు, పోషక, వృత్తిన్= శరీరంలోని మూల పదార్థాల నన్నింటిని పెంపొందించే పనితో; నాభిదేశంబునన్= బొడ్డులో; ఉండును= నివసిస్తాడు.

**తాత్పర్యం:** సమానుడు అనేపేరు గల వాయువు నాభిప్రదేశంలో ఉండి, ఆహార పానీయాలను జీర్ణింపచేసి, శరీరంలోని ధాతువులు పెంపొందేటట్లుగా చేస్తుంది. సమానుడు ఆత్మాగ్నికి ప్రాణాపానులకు తోడై సహకరిస్తాడు.

**క. ఇది పరమయోగదర్శన । విదితం; బిప్పాటఁ బవనవిదు లైన మునుల్**
**వదలక యభ్యాసవిధిన్ । ముదమున ధరియింతు రాత్మమూర్ధతలమునన్. 103**

**ప్రతిపదార్థం:** ఇది= (ఈ పంచప్రాణాల విషయం); పరమ, యోగ, దర్శనవిదితంబు= శ్రేష్ఠమైన యోగశాస్త్రం చేత తెలియబడునది; ఈ+పాటన్= ఈరీతిగా; పవన, విదులు+ఐన, మునుల్= వాయువులను గూర్చి తెలిసికొనిన ఋషులు; వదలక= విడువక; అభ్యాసవిధిన్= నిరంతరం ఆచరించటంవలన; ముదమునన్= సంతసంతో; ఆత్మన్= ఆత్మను (ఆత్మాగ్నిని); మూర్ధతలమునన్= తలయందు; ధరియింతురు= వహిస్తారు.

**తాత్పర్యం:** పంచప్రాణాలను గూర్చినట్టి, ఆత్మాగ్నిని గూర్చినట్టి, ఈ పరిజ్ఞానం గొప్పయోగదర్శనం వలన మాత్రమే తెలియదగింది. అభ్యాసంవలన నిష్ణాతు లైన ఋషులు ఆత్మను మూర్ధప్రదేశంలో ధరిస్తారు.

**విశేషం:** 'యోగదర్శనము' - అనే ప్రయోగం మిక్కిలి అర్థవంతమైనది. దర్శనం అనగా క్రోడీకరించబడిన జ్ఞానం. 'షడ్దర్శనములు' - 'సర్వదర్శనసార సంగ్రహము' - మున్నగు శీర్షికలు అనుశీలించ దగినవి.

**వ. ప్రాణాపానసమాహితుండై సకలదేహంబులందును జరియించుచున్న పావకుండు జీవాత్ముండుగా నెఱుంగు; మఱతండు జలంబుల నున్న కమలపత్త్రంబునుంబోలె దేహంబునం దుండియు నిర్లేపస్వరూప దీపితుం డయి వెలుంగుచుండు; నిట్టి జీవాత్ముండ కదా పరమాత్ముండు. 104**

**ప్రతిపదార్థం:** ప్రాణ+అపాన, సమాహితుండు+ఐ= ప్రాణుడు అపానుడు అనేవాయువులతో చుట్టుకొనబడినవాడై; సకల, దేహంబులందును= అన్ని శరీరాలలో; చరియించుచున్న= తిరుగాడుతున్న; పావకుండు= అగ్ని; జీవ+ఆత్ముండుగాన్= జీవాత్మగా; ఎఱుంగుము= తెలిసికొనుము; అతండు= (ఆజీవాత్ముడు); జలంబులన్+ఉన్న= నీళ్లలోఉన్న; కమల, పత్త్రంబునున్+ పోలెన్= తామరాకు వలె; దేహంబునందున్+ఉండియున్= శరీరంలో ఉన్నప్పటికిని; నిర్లేప, స్వరూప, దీపితుండు+అయి= పూయబడని ఆకృతిచేత వెలుగొందుతూ (అనగా నీటిచేత తడువని తామరాకువలె); వెలుంగుచున్+ఉండున్= ప్రకాశిస్తుంటాడు; ఇట్టి= ఈవిధమైన; జీవ+ఆత్ముండు+అ, కదా= జీవాత్ముడు మాత్రమే కదా; పరమ+ఆత్ముఁడు= పరబ్రహ్మం (భగవంతుడు).

**తాత్పర్యం:** ప్రాణుడు అపానుడు అనబడే వాయువులతో కలసిమెలసి అన్ని శరీరాలలో నడయాడే అగ్నియే జీవాత్మ అని తెలిసికొనుము. నీటిలో తడిసిపోకుండగా ఉండే తామరాకువలె ఆ జీవాత్మ దేహంలో నిర్లిప్తుడై ఉంటాడు. ఆ జీవాత్మయే పరమాత్మ.

**క. చేతన రహితక్షేత్రముఁ । జేతనముం బొరయఁ జేయు జీవాత్మ దశో**
**పేతుఁడు పరమాత్ముఁడు వి । ఖ్యాతుఁడు త్రైలోక్యసంప్రకల్పనుఁ డనఘా! 105**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడ వైన ఓ కౌశికమునీ!; చేతన, రహితక్షేత్రమున్= కదలిక లేనట్టి శరీరం; చేతనమున్+ పొరయన్+చేయు= కదలేటట్లుగా చేసేవాడు; జీవ+ఆత్మ, దశ+ఉపేతుఁడు= జీవాత్మ అనెడి అవస్థతో కూడినవాడు; పరమ+ ఆత్ముఁడు= పరబ్రహ్మం - భగవంతుడు; విఖ్యాతుఁడు= కీర్తికెక్కినవాడు; త్రైలోక్య, సంప్రకల్పనుఁడు= మూడులోకాలను సృష్టించగల శక్తి కలవాడు.

**తాత్పర్యం:** అచేతనమైన దేహాన్ని చేతనంగా చేసేవాడు. 'జీవాత్మ'గా భాసించే ఆ పరమాత్మయే. అతడు సుప్రసిద్ధుడు. మూడు లోకాలను సృష్టించగల శక్తి కలవాడు.

**క. భూతములయందు వెలిఁగెడు । భూతాత్ముని నెఱుఁగుదురు ప్రబుద్ధులు నిత్య**
**జ్యోతిర్మయు నవ్యయు న । ద్వైతం బగు బుద్ధి సూక్ష్మధర్మమువలనన్. 106**

**ప్రతిపదార్థం:** భూతముల+అందున్= పదార్థాల అన్నిటిలో; వెలిఁగెడు= ప్రకాశించే; భూత+ఆత్మునిన్= భూతాలకు ఆత్మఅయినవాడిని; జ్యోతిర్మయున్= ప్రకాశంతో నిండినవాడిని; అవ్యయున్= శాశ్వతుడిని; అద్వైతంబు+అగు= ఒకటియే అయిన; బుద్ధిన్= తెలివితో; సూక్ష్మ, ధర్మమువలనన్= వింగడించిన ధర్మాన్ని తెలియటంవలన; ప్రబుద్ధులు= గొప్పబుద్ధిగలవారు= జ్ఞానులు; ఎఱుఁగుదురు= తెలిసికొంటారు.

**తాత్పర్యం:** స్థూలదృష్టికి భిన్ననామరూపభేదాలచేత సాక్షాత్కరించే జగత్తులో అంతర్లీనంగా ఉన్న 'ఏకత్వాన్ని సూక్ష్మదృష్టితో గ్రహించగల జ్ఞానులు అద్వైతయోగం వలన జ్యోతిర్మయుడైన, శాశ్వతుడైన భూతాత్మునిగా గుర్తిస్తారు'.

**విశేషం:** ఎఱ్ఱాప్రెగడకు శంకరాచార్యులవారు ప్రతిపాదించిన 'అద్వైత' సిద్ధాంతంపై గల మక్కువ ఇక్కడ వ్యక్తమౌతున్నది.

**వ. అని మఱియుఁ గౌశికునకు ధర్మవ్యాధుండు బ్రహ్మవిద్యా ప్రభావంబు తెఱంగు సంప్రయోగరహస్యంబు తెలియ ని ట్లనియె. 107**

**ప్రతిపదార్థం:** అని= అనిచెప్పి; ధర్మవ్యాధుండు; మఱియున్= ఇంకను; కౌశికునకున్= (జిజ్ఞాసువుగా తనవద్దకు వచ్చిన ఆ విప్రుడికి); బ్రహ్మ, విద్యా, ప్రభావంబు, తెఱంగు= ఆధ్యాత్మికమైన జ్ఞానానికి సంబంధించిన మహిమయొక్క విధానం; సంప్రయోగ రహస్యంబు= కార్యాచరణలో స్వయంవ్యక్తమయ్యే దాపరికం; తెలియన్= తెల్లమయ్యేటట్లుగా; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి అంతటితో ఆగకుండా, ధర్మవ్యాధుడు వేదాంతజ్ఞానంయొక్క మహిమ ఆచరణలో ఎట్లా వెలువడుతుందో కౌశికుడికి ఇట్లా తెలియచెప్పాడు.

**విశేషం:** ఇట - 'సంప్రయోగరహస్యంబు తెలియన్' - అనే ప్రయోగం అనుశీలించదగింది. సిద్ధాంతం వేరు. దానిని అనుభూతిలోకి తెచ్చుకొని ఆచరణలోకి అనువదించటం వేరు. సిద్ధాంతం అందరకూ తెలిసినదే కావచ్చును. దాని ఆచరణలోకి దానిని అనువదించటానికి- 'సంప్రయోగ రహస్యములు' - తెలియవలెను. అవి నిగూఢ విషయాలు. ఆ రహస్యాలను వెల్లడించేది తరువాతి పద్యం. అనగా ధర్మవ్యాధుడు కౌశికుడికి కేవలసిద్ధాంతజ్ఞానాన్ని మాత్రమే తెలిపి ఊరకొనక, సంప్రయోగ రహస్యాలను కూడ వివరించాడు.

**సీ. 'తెలివి నొందిన బుద్ధిగల మహాత్ముండు శు । భాశుభ కర్మములందుఁ జొరఁడు;**
**క్రమమున సౌఖ్యదుఃఖము లాదిగా నశే । షద్వంద్వములయందు సమత నుండు;**
**విను, మట్టిపుణ్యున కొనరింపవలయు కా । ర్యం బెఱింగించెద ననుదినంబు**
**నియతాశియును జితేంద్రియుఁడు నై పూర్వరా । త్రమ్మున నపరరాత్రమ్మునందు**

**తే. యోగధారణనిరతుఁడై యుండవలయు; నపుడు బోధదీపంబున నాత్మ నాత్మ**
**యందుఁ గనుచు నివాతదీపానుకారి । యై వెలుంగుచు నమృతమయత్వ మొందు. 108**

**ప్రతిపదార్థం:** తెలివిన్+ఒందిన= జ్ఞానాన్ని ఆర్జించిన; బుద్ధి, కల, మహాత్ముండు= మేధావి అయిన గొప్పవాడు; శుభ+అశుభ, కర్మములందున్= మేలుకలుగునట్టి లేక, కీడు కలుగునట్టి పనులలో; చొరఁడు= ప్రవేశించడు; క్రమమునన్= వరుసగా; సౌఖ్య, దుఃఖములు= సుఖం, బాధ; ఆదిగాన్= మొదలైన; అశేష, ద్వంద్వముల+అందున్= అన్ని జంటలలో; సమతన్+ఉండున్= సమభావంతో ఉంటాడు; వినుము; అట్టి; పుణ్యునకున్= పుణ్యాన్ని ఆర్జించేవాడికి; ఒనరింపవలయు, కార్యంబు= చేయవలసిన పని, కర్తవ్యం; ఎఱింగించెదన్= తెలుపుతాను; వినుము; అనుదినంబున్= ప్రతిదినమున్నూ; నియత+అశియును= మితముగా భుజించువాడున్నూ; జిత+ఇంద్రియుఁడును+ఐ= ఇంద్రియాలను నిగ్రహించిన వాడును అయి; పూర్వరాత్రమ్మునన్+అపర రాత్రమ్మునందున్= రాత్రికి ముందు వేళలలో, రాత్రి అయిన తరువాతి వేళలో అనగా అన్నివేళలలో; యోగధారణ నిరతుఁడు+ఐ= యోగసాధనలో పూనిక కలవాడై; ఉండవలయున్; అపుడు= ఆసమయంలో - అనగా యోగసాధన వేళలో; బోధ దీపంబునన్= జ్ఞాన మనెడి దీపంవలన; ఆత్మన్= పరమాత్మను; ఆత్మ+అందున్= తన ఆత్మలో; కనుచున్= చూస్తూ; నివాత, దీప+అనుకారి+ఐ= గాలి లేనిచోట వెలుగొందే దీపాన్ని అనుకరించేవాడై; వెలుంగుచున్= ప్రకాశిస్తూ; అమృతమయత్వము= చావులేని స్థితప్రజ్ఞత్వస్థితిని, అమరత్వాన్ని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** 'జ్ఞానాన్ని ఆర్జించిన మహానుభావుడు మంచిపనులలో గాని చెడు పనులలోగాని నిర్లిప్తుడుగా ఉంటాడు. అట్టివాడు - సుఖ దుఃఖాలు మొదలైన ద్వంద్వాలకు అతీతుడు. అన్నిటియెడల ఆతడు సమభావాన్ని పెంపొందించుకొంటాడు. అట్టి పుణ్యాత్ముడు చేయవలసిన కర్తవ్యాలను వివరిస్తాను వినుము. ప్రతిదినం, ఎల్లవేళల అతడు యోగసాధన చేస్తూ మితాహారియై ఇంద్రియాలను నిగ్రహించాలి. ఇంద్రియాలను నిగ్రహించిన యోగి ఆత్మలో పరమాత్మను దర్శించి, గాలి లేనిచోట వెలుగొందే దీపంవలె నిశ్చలు డై ప్రకాశిస్తాడు. అమృతమయుడు ఔతాడు.

**విశేషం:** (i) "తమసో మా జ్యోతిర్గమయ, అసతో మా సద్గమయ,
మృత్యో ర్మా అమృతం గమయ" - అనే వేదమంత్రాన్ని ఇక్కడ అనుసంధించుకోవాలి.
(ii) ద్వంద్వాతీతుడు అయిన స్థితప్రజ్ఞుడిని గూర్చి విపులంగా భగవద్గీత రెండవ అధ్యాయంలో వివరించబడింది.

**క. కామంబును గ్రోధంబును । నేమఱక జయింపవలయు నెల్ల విధములన్**
**ధీమహిత! యిదియ సతత । క్షేమంకర మైన పథము గృతబుద్ధులకున్. 109**

**ప్రతిపదార్థం:** ధీమహిత!= బుద్ధిచేత గొప్పవాడయినవాడా, మేధావి వయిన ఓ కౌశికా!; కామంబును= కోరికలను పెంచుకొనటమున్నూ; క్రోధంబును= కోపమును; ఏమఱక= మరపులేకుండ; జయింపవలయున్= గెలువవలెను; ఎల్ల, విధములన్= అన్నిరీతులలోను; ఇది+అ= ఇదిమాత్రమే అనగా కామక్రోధాలను అణచివేయటమే; కృతబుద్ధులకున్= పరిపక్వం అయిన మనస్సు కలవారలకు; సతత, క్షేమంకరము+ఐన, పథము= ఎల్లప్పుడును మేలును ఒనగూర్చెడి మార్గం.

**తాత్పర్యం:** మేధావి అయిన ఓ కౌశికమహర్షీ! ఎల్లప్పుడును ఏమరక కామక్రోధాలను అణచిపెట్టాలి. మనస్సు పరిపక్వమైనవారలకు ఇది ఒక్కటి మాత్రమే శుభాన్ని చేకూర్చే ఉత్తమమార్గం.

**క. నిత్యముఁ గర్మియుఁ గర్మఫ । లత్యాగియు నగుట లెస్స లౌల్యవియోగం**
**బత్యుత్తమ యోగము ద । త్ప్రత్యయలక్ష్యుండు సూవె బ్రాహ్మణుఁడు మహిన్. 110**

**ప్రతిపదార్థం:** నిత్యమున్= అనుదినం, ఎల్లప్పుడును; కర్మియున్= పనులు చేసేవాడును; కర్మ, ఫల, త్యాగియున్= చేసిన పనుల వలన సంక్రమించే ఫలితాన్ని విడిచేవాడును; అగుట; లెస్స= మంచిది; లౌల్య, వియోగంబు= కోరికలనుండి విడివడటం; అతి+ఉత్తమ, యోగము= మిక్కిలి మంచిదైన యోగం; బ్రాహ్మణుఁడు= విప్రుడు (జ్ఞానాన్ని ఆర్జించిన వాడు); మహిన్= భూమిపై; (భూలోకంలో); తత్+ప్రత్యయ, లక్ష్యుండు+చూవె= ఆ ఆశయానికి తగిన ఉదాహరణం సుమా!

**తాత్పర్యం:** మనుజుడు ఎల్లప్పుడు కర్మను ఆచరిస్తూనే ఉండవలెను; కాని, ఆ కర్మలవలన కలిగే ఫలాన్ని మాత్రం విడనాడాలి. తాను చేసే పనులలోనే మునిగి తేలుతుండటం మంచిది కాదు. కర్మఫలితాలను విడనాడటమే మిక్కిలి మంచిదైన యోగం. నిజానికి జ్ఞానాన్ని ఆర్జించిన బ్రాహ్మణుడు ఈ ఆశయానికి నిదర్శనప్రాయుడుగా అనుష్ఠాన వేదాంతిగా బ్రదుకదగును.

**చ. అరయఁగ జీవితంబు గడునస్థిర; మింత యెఱింగి యాత్మ నె**
**వ్వరిదెసఁ గీడురోయక ధ్రువం బగు మైత్రి భజించి సత్కృపా**

**నిరతుఁడు నిష్పరిగ్రహుఁడు నిత్యతపస్వియు నిత్యతృప్తుఁడుం**
**బరమశమాన్వితుండు నగు బ్రాహ్మణుఁ డొందు సనాతన స్థితిన్. 111**

**ప్రతిపదార్థం:** అరయఁగన్= యోచించగా; జీవితంబు= బ్రదుకు; కడున్= మిక్కిలి; అస్థిరము= నిలుకడలేనట్టిది; ఇంత+ఎఱింగి= ఈ విషయాన్ని అంతటిని సంపూర్ణంగా గ్రహించి; ఆత్మన్= మనస్సులో; ఎవ్వరిదెసన్= ఎవరియెడలను; కీడు= చెడుగును; రోయక= తలపోయక; ధ్రువంబు+అగు= నిజమైన; మైత్రి= స్నేహం; భజించి= నెరపి; సత్+కృపా+నిరతుఁడు= మంచిదయ కలిగినవాడు; నిష్పరిగ్రహుఁడు= ఎవరి దగ్గరనుండియు ఏమియు అడిగి పుచ్చుకొననివాడు; నిత్య, తపస్వియున్= ఎల్లప్పుడు తపస్సు చేసికొనే వాడును; నిత్య, తృప్తుఁడున్= ఎల్లప్పుడును తనివిచెందిఉండే వాడును; పరమ, శమ+అన్వితుండున్= మిక్కిలి గొప్ప దైన శాంతం కలవాడును; అగు= అయినట్టి; బ్రాహ్మణుఁడు= జ్ఞానాన్ని ఆర్జించిన విప్రుఁడు; సనాతన, స్థితిన్= శాశ్వతంగా ఆనందమయమైన స్థితిని; ఒందున్= పొందుతాడు.

**తాత్పర్యం:** ఆలోచన చేస్తే మానవుల బ్రతుకులు బొత్తిగా నిలుకడ లేనట్టివి. ఈ విషయాన్ని అనుభవపూర్వకంగా తనలో తెలిసికొనినవాడు ఎవరికిని ఎట్టి అపకారాన్ని తలపోయడు. అందరియెడ ప్రేమపూర్వక మైన స్నేహభావాన్నే పెంపొందించుకొంటాడు. అట్టి జ్ఞాని ఎల్లప్పుడు జాలితో నిండిన గుండె కలవాడై, ఎల్లప్పుడు తపస్సు చేసికొంటూ ఎవరినీ యాచించడు. ఎవరిదగ్గరనుండి ఏమీ తీసుకొనడు. అతడు నిత్యసంతృప్తుడు. ఆ విధంగా గొప్పఇంద్రియనిగ్రహం సాధించిన బ్రాహ్మణుడు, శాశ్వతమైన ఆనందస్థితిని పొందగలడు.

**వ. నీవడిగిన యఖిలధర్మంబులు సంక్షేపరూపంబున నెఱింగించితి; నింక నెయ్యది వినవల' తనినం గౌశికుండు' 'మహాత్మా! వినవలయునవి యెల్లను విశదంబుగా వింటిం; బ్రబుద్ధుండ నైతి; నీవు సర్వజ్ఞుండ వగుట దెల్లం బయ్యె' ననిన ధర్మవ్యాధుం డతని కి ట్లనియె. 112**

**ప్రతిపదార్థం:** నీవు+అడిగిన= నీవు ప్రశ్నించిన; అఖిల, ధర్మంబులు= అన్ని ధర్మాలు; సంక్షేపరూపంబునన్= కుదించి; ఎఱింగించితిన్= తెలియజేశాను; ఇంకన్= ఇకమీదట; ఏ+అది= ఏది; వినవలతు(వు)= ఆలకించకోరుతున్నావు; అనినన్; కౌశికుండు; మహాత్మా!= గొప్పఆత్మ కల ఓ ధర్మవ్యాధుడా!; వినవలయునవి= వినవలసినవి; ఎల్లను= అన్నియున్నూ; విశదంబుగాన్= తేటతెల్లంగా; వింటిన్= ఆలకించాను; ప్రబుద్ధుండను+ఐతిన్= మిక్కుటంగా విజ్ఞానంచేత మేలుకొలుపబడిన వాడను అయినాను; నీవు= నీవు; సర్వజ్ఞుండవు+అగుట= అన్ని విషయాలు క్షుణ్ణంగా తెలిసినవాడవు కావటం; తెల్లంబు+అయ్యెన్= స్పష్టంగా తెలిసింది; అనినన్= అనిచెప్పగా; ధర్మవ్యాధుండు; అతనికిన్= ఆకౌశికుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** నీవు ప్రశ్నించిన విషయాలు అన్నిటిని గూర్చి నేను నాకు తెలిసినంతమేర కుదించి నీకు తెలియజేసి ఉన్నాను. ఇక, నీవు మఱియేవిషయాలనుగూర్చి తెలియగోరుతున్నావు?'- అని ధర్మవ్యాధుడు కౌశికుడిని అడిగాడు. అంతట కౌశికుడు, 'మహానుభావా! వినవలసిన విషయాలను అన్నింటిని నీవు విశదంగా వివరించి చెప్పగా విన్నాను. నీవు చెప్పిన విషయాలవలన నేను ఆధ్యాత్మికంగా మేలుకొనగలిగాను. నీవు అన్ని విషయాలు తెలిసిన సర్వజ్ఞుడవు అని నేను గుర్తించగలిగాను' అని ధర్మవ్యాధుడికి ధన్యవాదాలు సమర్పించాడు. అప్పుడు కౌశికుడితో ధర్మవ్యాధుడు ఈవిధంగా చెప్పాడు.

## ధర్మవ్యాధుఁడు కౌశికునిఁ దన జననీజనకులయొద్దకుఁ దోడ్కొని పోవుట (సం. 3-204-3)

**క. 'ఏ నిమ్మెయి నుత్తమ వి । జ్ఞానోన్నతి వడయుటకు నిజం బగు మూలం**
**బైనది గల దొక ధర్మము । భూనుత! యది నీకు దృష్టముగ నెఱిఁగింతున్. 113**

**ప్రతిపదార్థం:** భూనుత!= భూమియందలి ప్రజలచేత పొగడబడిన ఓ కౌశికమునీ!; ఏను= నేను; ఈ+మెయిన్= ఈ రీతిగా; ఉత్తమ, విజ్ఞాన+ఉన్నతి= మంచి దైన గొప్ప జ్ఞానంలోని ఆధిక్యం; పడయుటకున్= పొందటానికి; నిజంబు+అగు= సత్యమైన; మూలంబు+ఐనది= ఆధారం అయినది; ఒక ధర్మము= ఒక ధర్మం (మంచిపనులు చేయటానికి మూలమైన ఆశయానికి ధర్మం అని వ్యపదేశం); కలదు= ఉంది; అది= ఆధర్మం; నీకు; దృష్టముగన్= కంటికి కనిపించేటట్లుగా, ప్రత్యక్షంగా; ఎఱిఁగింతున్= తెలుపగలను. (ఈపద్యానికి ఆయువుపట్టు అని చెప్పదగిన శబ్దం - 'దృష్టముగ'.)

**తాత్పర్యం:** ఓ కౌశిక మహర్షీ!, నీవు నన్ను సర్వజ్ఞుడ వంటూ ప్రస్తుతించావు. ఈ రీతిగా, నాకు ఇంతటి విజ్ఞానం సంక్రమించడానికి మూల మైన ధర్మం ఒకటి ఉన్నది. ఆ ధర్మాన్ని నీకు కంటికి కనుపించేటట్లుగా ఎరిగించగలను.

**విశేషం:** (i) ధర్మం అనేది ఒక ఆశయం. విశ్వశ్రేయానికి ఆధారభూతమైన ఆదర్శం - 'ధర్మము'. ఆ ధర్మం కంటికి కనబడేది కాదు గదా! అయినను - ధర్మవ్యాధుఁడు తనకు ఆధారమైన ఆ ధర్మాన్ని ప్రత్యక్షంగా కౌశికుడికి చూపించగలనని చెప్తుతున్నాడు! జననీ జనకులే తనకు ప్రత్యక్ష దైవాలు అనీన్నీ, మాతాపితలసేవ తన ఆదర్శం అనీన్నీ ధర్మవ్యాధుడు చెప్పి - కౌశికుడికి తన తలిదండ్రులను చూపించాడు.

(ii) ధర్మం అనిర్వచనీయం. సుప్రసిద్ధమైనది - పెద్దల నిర్వచనం ఈ క్రింది శ్లోకంలో కానవచ్చును.

శ్లో॥ ధృతి క్షమా దమోఽస్తేయం । శౌచ మింద్రియనిగ్రహః
ధీ ర్విద్యా సత్య మక్రోధో । దశకం ధర్మలక్షణమ్. ॥ - మనుస్మృతి 6-92.

**వ. అభ్యంతరగృహంబునకురఁ' మ్మని యతనిం దోడ్కొని చని మనోహరంబై చతుశ్శాలంబై వివిధసౌరభసంవాసితం బైన హర్మ్యంబునందు మహితాసనాసీను లైన వారిం దన జననీ జనకుల నభిమతాహారపరితోషితులఁ బరమాంబరాభరణ గంధమాల్యాలంకృతమూర్తుల నతనికిం జూపి, తానును దత్పాదప్రణామంబు సేసి, వారలఁ గుశలం బడిగిన, నయ్యిరువురుం బుత్త్రున కి ట్లనిరి. 114**

**ప్రతిపదార్థం:** అభ్యంతర, గృహంబునకున్= లోపలఉన్న గదిలోకి; రమ్ము+అని= దయచేయుము అని ఆహ్వానించి; తోడ్కొని= వెంటపెట్టుకొని; చని= వెళ్లి; మనస్+హరంబై= మనస్సును ఆకర్షించేదై - అందమైనది అయి; చతుః+శాలంబు+ఐ= నాలుగు వైపులను వాకిళ్లు కలిగినదై; వివిధ, సౌరభ, సంవాసితంబు+ఐన= పెక్కు పరిమళాలచేత గుబాళించేదైన; హర్మ్యంబునందున్= మేడపై; మహిత+ఆసన+ఆసీనులు+ఐన+వారిన్= గొప్ప గద్దెలపై కూర్చొనిఉన్నవారలను; తన, జననీ, జనకులను= తన తల్లిని తండ్రిని; అభిమత+ఆహార, పరితోషితులన్= వారికి ఇష్టమైన ఆహారంతినటంచేత సంతృప్తిచెంది ఉన్నట్టి వారలను; పరమ+అంబర+ఆభరణ, గంధ, మాల్య+అలంకృతమూర్తులన్= గొప్ప వైన వస్త్రాలు, సొమ్ములు, పరిమళద్రవ్యాలు, పువ్వులతో అలంకరించబడిన దేహాలు కలవారలను; అతనికిన్+చూపి= (ఆ కౌశికుడికి చూపించి); తానును= (ధర్మవ్యాధుడును); తత్+పాద, ప్రణామంబు+చేసి= ఆ తలిదండ్రుల కాళ్లకు మ్రొక్కి; వారలన్= వారిని; కుశలంబు= క్షేమంగా ఉన్నారా అని; అడిగినన్= ప్రశ్నించగా; ఆ+ఇరువురున్= ఆతలిదండ్రులు ఇద్దరున్నూ; పుత్త్రునకున్= కొడుకుతో (ధర్మవ్యాధుడితో); ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** అంతట ధర్మవ్యాధుడు కౌశికమహర్షిని సగౌరవంగా ఆహ్వానించి, తన ఇంటిలో ఉన్న ఒక గదిలోకి తీసికొనివెళ్ళాడు; అది మిక్కిలి అందమైనది. ఆ అభ్యంతర గృహానికి నలువైపుల సావిడులు ఉన్నాయి. మంచి గాలి వెలుతురు అక్కడకు చేరుతున్నాయి. అది ఒక పెద్దమేడ. ఆ మేడపై పెక్కు పరిమళాలు గుబాళిస్తాయి. అందు, గొప్ప ఆసనాలమీద ధర్మవ్యాధుడి తలిదండ్రులు కూర్చొని ఉన్నారు. కోరిన ఆహారాన్ని వారు గైకొని, సంతృప్తిగా సేదతీరుతున్నారు. వారిదేహాలపై క్రొంగ్రొత్తపువ్వులు, ధగధగలాడే నగలు ఒప్పారుతున్నాయి. ధర్మవ్యాధుడు తన తలిదండ్రులను కౌశికుడికి పరిచయం చేసి, తాను వారలిరువురి పాదాలకు మ్రొక్కి, వారి యోగక్షేమాలను గూర్చి అడిగి తెలిసికొన్నాడు. అప్పుడు ధర్మవ్యాధుడి తలిదండ్రులు తమ తనయుడితో ఇట్లా పలికారు.

**సీ.** **'అన్న! కుమార! నీయట్టి సత్పుత్త్రుండు । గలుగ మా కేమిటఁ గడమ సెపుమ!**
**నీ చేయు ధర్మంబ నీకుఁ దోడయ్యెడుఁ । బరమాయు రర్థసంపదలుఁ గనుము;**
**నీ చరిత్రంబున నిఖిలవంశముఁ బవి । త్రిత మయ్యె మానుషదేహ మేల**
**ధరియించితో కాని తత్త్వమారయఁ బర । దేవత వీవు; సందియము వలదు;**

**తే.** **వాఙ్మనఃకర్మములఁ బితృవత్సలత్వ । మొక్కరూపుగఁ జలుపుచు నున్నయట్టి**
**సద్గుణాకరు నిన్నెన్ని జామదగ్న్యు । నొకని నెన్నంగఁ దగుఁ గాక యొరులు గలరె!'** **115**

**ప్రతిపదార్థం:** అన్న!= ప్రియమైనవాడా!; కుమార!= కొడుకా; నీ+అట్టి= నీవంటి; సత్+పుత్త్రుండు= మంచి కొడుకు; కలుగన్= ఉండగా; మాకున్+ఏమిటన్= మాకు ఎందులో; కడమ+చెపుమ= కొదువ కలదో చెప్పుము అనగా మాకు ఎట్టి లోటును లేదు అన్నమాట; నీచేయుధర్మంబు+అ= నీవు ఆచరించే ధర్మమే; నీకున్; తోడు+అయ్యెడున్= సాయం ఔతుంది; పరమ+ఆయుః +అర్థ, సంపదలున్+కనుము= గొప్పదైన ఆయుర్దాయం (చిరకాలం బ్రతకటం), ధనం, ఐశ్వర్యాలు పొందుము; నీచరిత్రంబునన్= నీ ప్రవర్తన వలన; నిఖిల, వంశమున్= మన వంశం అంతయు; పవిత్రతము+అయ్యెన్= పావనం అయింది; (నీవు) మానుష, దేహము= మనుజుడిగా పుట్టి మనుజుడి శరీరాన్ని; ఏల= ఎందుకు; ధరియించితి+ఓ, కాని= వహించావో కాని; తత్త్వము= నిజం; ఆరయన్= పరిశీలించగా; పరదేవతవు+ఈవు= నీవు దేవతలలో కెల్ల గొప్ప దేవతవు; సందియము, వలదు= ఎట్టి అనుమానానికి ఆస్కారం లేదు; వాక్+మనస్+కర్మములన్= త్రికరణశుద్ధిగా - వాక్కుతోడ, మనస్సుతోడ, ఆచరణయందును; పితృ, వత్సలత్వము= తలిదండ్రులపై ప్రేముడి; ఒక్కరూపుగన్= ఎడతెగకుండగ ఒకేమాదిరిగా; చలుపుచున్+ఉన్న+అట్టి= కొనసాగిస్తూన్న; సత్+గుణ+ఆకరున్= మంచి లక్షణాలకు నెలవైన వాడిని; నిన్నున్+ఎన్ని= నిన్ను పరిగణనం చేసి; జామదగ్న్యున్= జమదగ్ని కొడుకు అయిన పరశురాముడిని; ఒకనిన్= మరియొకడిని; ఎన్నంగన్+తగున్+కాక= లెక్కించటం; తగునే కాని; ఒరులు= ఇతరులు; కలరె= ఉన్నారా? (లేరు అని భావం).

**తాత్పర్యం:** 'ప్రియమైన కుమారా! ధర్మవ్యాధా! నీ వంటి మంచికొడుకు మాకు ఉండగా, ఇక మా కేమి లోటు? నీవు ధర్మమూర్తివి. నీవు రక్షిస్తున్న ధర్మమే నిన్ను రక్షించగలదు. నీవు చిరకాలం జీవించి ధనధాన్యసంపదలతో తులతూగుదువు గాక, నీ ప్రవర్తన వలన మన వంశం పావనమైనది. నీవు కారణజన్ముడవు. నీవు దేవతలలో దేవతవు గాని మనుష్యమాత్రుడవు గావు. అసలు ఈ భూలోకంలో నీవు ఎందుకు ఈ మానవదేహాన్ని ధరించి అవతరించావో మాకు తెలియదు. నీవు త్రికరణశుద్ధితో తలిదండ్రులను ఆరాధిస్తున్నావు. ఇందుకు ఎంతమాత్రం సందియం లేదు. నీదీక్ష నిరుపమానం. తలిదండ్రులను ఆరాధించటంలో నిన్ను ముందు చెప్పి, తదుపరి పరశురాముడిని చెప్పాలి. మరి ఎవ్వరును నీకు సాటి రారు'.

**విశేషం:** పరశురాముడి కథ సుప్రసిద్ధం. ఆతడు పితృవాక్యపరిపాలనకై తల్లిని వధించి తదుపరి సంప్రీతుడైన తండ్రిచేత తల్లిని తిరిగి బ్రతికేటట్లు వరం సాధించాడు.

**వ. అని పలికి; రప్పుడు ధర్మవ్యాధుండు వారికిం గౌశికుం జూపి, 'యిమ్మహాత్ముండు మనలఁ జూచువేడ్కనిటవచ్చె' నని చెప్పిన నావృద్ధు లతనికి నర్ఘ్యసత్కారంబులు గావించినం, గైకొని, యతండు వారలఁగుశలం బడిగెఁ; నంత నవ్విప్రునకు లుబ్ధకుం డి ట్లనియె. 116**

**ప్రతిపదార్థం:** అని పలికిరి= అని అన్నారు; అప్పుడు= ఆసమయంలో; ధర్మవ్యాధుండు; వారికిన్= (తన తలిదండ్రులకు); కౌశికున్+చూపి= కౌశికుడిని చూపించి; ఈ మహా+ఆత్ముండు= ఈ గొప్ప ఆత్మ కలవాడైన బ్రాహ్మణుడు; మనలన్; చూచువేడ్కన్= దర్శించ వలె ననే కుతూహలంతో; ఇట+వచ్చెన్= ఇచటికి వచ్చాడు; అని చెప్పినన్; ఆవృద్ధులు= ఆముదుసలులు; అతనికిన్= ఆ కౌశికుడికి; అర్ఘ్యసత్కారంబులు= తగిన గౌరవమర్యాదలు; కావించినన్= చేయగా; కైకొని= స్వీకరించి; అతండును= అతడును(కౌశికుడును); వారలన్= వారలను అనగా ఆ వృద్ధులను; కుశలంబు+అడిగెన్= యోగక్షేమాలనుగూర్చి ప్రశ్నించాడు; అంతన్= తదుపరి; లుబ్ధకుండు= వ్యాధుడు; ఆ+విప్రునకున్= ఆ బ్రాహ్మణుడితో (కౌశికునకు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పిన పిమ్మట ధర్మవ్యాధుడు తన తలిదండ్రులకు కౌశికుడిని చూపించి, 'ఈ మహానుభావుడు మనలను చూడవలె నని పూనికతో ఇక్కడికి వచ్చాడు' అని అన్నాడు. ఆ వృద్ధులు కౌశికుడికి స్వాగతమర్యాదలు చేశారు. కౌశికుడు వారి యోగక్షేమాలనుగూర్చి ప్రశ్నించాడు. అంతట ధర్మవ్యాధుడు కౌశికుడికి ఇట్లా చెప్పాడు.

**సీ. 'జననుత! వీరు నా జననియు జనకుండుఁ। జూవె! వీరలకు శుశ్రూష సేసి,**
**యిట్టి పరిజ్ఞాన మేనుఁ బ్రాపించితి। నమరులఁ బూజింతు రర్థి నెల్ల**
**వారును; నొండు దైవంబుల నెఱుఁగ; నీ వృద్ధుల నాపాలి వేల్పు లనఘ!**
**కమనీయ ఫలపుష్పగంధభూషణవస్త్ర। ములు మనోహరభక్ష్యభోజ్యములును**

**తే. వీరి కెపుడు నివేదింతు, వేడ్కఁ బుత్త్ర। దారసహితుండ నై నియతముగ సేవ**
**యాచరింతును; వేదముల్ యజ్ఞములు వ్ర। తంబులును వీర నా కను తలఁపు దృఢము. 117**

**ప్రతిపదార్థం:** జననుత!= ప్రజలచేత కీర్తించబడినవాడా! కౌశికమునీ; వీరు= ఈ పెద్దలు; నా జననియున్, జనకుండున్= నా తల్లిగారు తండ్రిగారు; చూవె= సుమ్ము; వీరలకున్= వీరికి; శుశ్రూష= పరిచర్య; చేసి= సలిపి; ఇట్టి= ఈ విధమైన; పరిజ్ఞానము= గొప్పజ్ఞానం; ఏనున్= నేనును; ప్రాపించితిన్= పొందాను; ఎల్లవారును= అందరును; అర్థిన్= కోరికతో; అమరులన్= దేవతలను; పూజింతురు= అర్చిస్తారు; ఒండుదైవములన్= వేరే దేవతలను; ఎఱుఁగన్= నేనెరుగను; ఈ వృద్ధులు+అ= ఈ ముదుసలివారే; నా పాలి వేల్పులు= నాకు లభించిన దేవతలు; అనఘ!= పాపం చేయనట్టి ఓ పుణ్యాత్ముడా!; కమనీయ, ఫల పుష్ప, గంధ, భూషణ, వస్త్రములున్= కమ్మని పండ్లు, పూలు, పరిమళద్రవ్యాలు, నగలు, బట్టలు; మనస్+హర, భక్ష్య, భోజ్యములును= మనస్సుకు అనువైన తినుబండారాలున్నూ; వీరికిన్; ఎపుడున్= ఎల్లప్పుడును; నివేదింతున్= సమర్పిస్తాను; వేడ్కన్= కుతూహలంతో; పుత్త్ర, దార, సహితుండను+ఐ= కొడుకులతో, భార్యతో కూడిన వాడనై; నియతముగన్= దీక్షతో; సేవ= పరిచర్య; ఆచరింతును= చేస్తాను; వేదముల్= వేదాలు; యజ్ఞముల్= క్రతువులు; వ్రతంబులును= నోములును; నాకున్= నాకు; వీరు+అ= వీరే; అను, తలఁపు= అనే ఆలోచన; దృఢము= గట్టిది.

**తాత్పర్యం:** 'ప్రజలచేత కీర్తించబడినవాడా! నాతలిదండ్రులు వీరే. వీరికి పరిచర్య చేయటంచేతనే నాకు ఈ పరిజ్ఞానం లభించింది. అందరూ వేడుకతో తమకోరికలు ఈడేరటానికై దేవతలను పూజిస్తారు. నాకు నాతలిదండ్రులే ప్రత్యక్షదేవతలు. వేరే దేవతలను నేను ఎఱుగను. ఈ ముదుసలులే నాపాలిటి వేల్పులు. వీరలను చందనచర్చతో, పండ్లతో, పూవులతో వారలకు కావలసిన తినుబండారాలతో అర్చిస్తాను. నా శ్రీమతితో నా బిడ్డలతో కలిసి వీరికి సేవ చేస్తాను. వారి సేవయే నేను చేసే యజ్ఞం. అదియే వేదాలు, నోములు - అనే భావమే నాలో లోతుగా నాటుకొని ఉన్నది.

**తే. జనని జనకుఁడు సద్గురుఁ డనలుఁ డాత్ముఁ । డనఁగ నియ్యేవురును నే గృహస్థుచేత**
**సుగతివాంఛఁ బ్రసాదితు లగుదు రట్టి । వాఁడ సూవె ధర్మాత్ముండు వసుధమీఁద'. 118**

**ప్రతిపదార్థం:** జనని=తల్లి; జనకుండు= తండ్రి; సత్+గురుఁడు= మంచిఒజ్జ; అనలుఁడు= అగ్ని; ఆత్ముఁడు= ఆత్మ; అనఁగన్= అని చెప్పబడెడి; ఈ+ఏవురునున్= ఈ అయిదుగురున్నూ; ఏగృహస్థుచేతన్= ఏ ఇంటియజమానిచేత; సుగతివాంఛన్= పుణ్యం లభించవలె ననే కోరికతో; ప్రసాదితులు+అగుదురు= సంతోషం పొందించబడిన వారు అగుదురో; అట్టివాఁడు+అ+చూవె= అట్టివాడే సుమా; వసుధమీఁదన్= భూమిపై; ధర్మ+ఆత్ముండు= ధర్మంతో కూడిన ఆత్మకలవాడు - సుకృతుడు.

**తాత్పర్యం:** పుణ్యంకోరే గృహమేధి-తల్లి, తండ్రి, గురువు, అగ్ని, ఆత్మ అనే అయిదుగురిని అర్చించి సంతోషపరచాలి. భూమిపై అట్టి గృహస్థుడే ధర్మాత్ముడు.'

**వ. అని చెప్పి యిట్లనియెఁ; 'బతివ్రత పనుపునం జేసి నీవు ధర్మజ్ఞానార్థంబు నాయున్నయెడకుం జనుదెంచిన నప్పతివ్రతవలని యనుగ్రహంబున నీకు నెల్లవియు నెఱింగించితిఁ గాని, నీదెస నాదు చిత్తంబు ప్రియంపడియుండదు; నీచేసిన యకార్యం బొక్కటి గల దది యెయ్యది యనిన; 119**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు; పతివ్రతపనుపునన్+చేసి= గొప్పఇల్లాలు యొక్క నియోగంవలన; నీవు; ధర్మ, జ్ఞాన+అర్థంబు= ధర్మాన్నిగూర్చిన జ్ఞానాన్ని పొందటానికై; నా+ఉన్న+ఎడకున్= నేను ఉన్నచోటికి; చనుదెంచినన్= రాగా; ఆ+పతివ్రతవలని, అనుగ్రహంబునన్= ఆ మంచి ఇల్లాలి యొక్క దయవలన; నీకున్= నీకు; ఎల్లవియున్= సర్వమును; ఎఱింగించితిన్= తెలిపాను; కాని= అంతేకాని; నీదెసన్= నీయెడ; నా+చిత్తము= నాదు, మనస్సు; ప్రియంపడి, ఉండదు= ప్రీతిని చెందియుండ లేదు; నీ చేసిన= నీవు ఒనర్చిన; అకార్యంబు= చెడ్డపని; ఒక్కటి కలదు= ఒకటి ఉన్నది; అది+ఎయ్యది+అనినన్= ఆ (అకార్యం) ఏది అని అడిగితే.

**తాత్పర్యం:** అని చెప్పి ధర్మవ్యాధుడు ఇట్లు పలికాడు: ' ఆ పతివ్రత అనుగ్రహంతో నిన్ను పంపింది కాబట్టి, ఆమెపై నాకు గల గౌరవప్రపత్తి చేతను, నీవు జిజ్ఞాసువుగా నే నున్న చోటికే వచ్చి అడిగావు కాబట్టి నాకు తెలిసినమేరకు అంతయు నీకు తెలియజెప్పాను. కాని, నీయందు నాకు ప్రీతి యేర్పడ లేదు. దానికి ఒక మూలకారణం ఉన్నది. నీవు చేసినది ఒక చెడ్డపని ఉన్నది. ఆ చెడ్డపని ఏది అని అడిగితే.

**ఉ. ఎంతయు వృద్ధు లై తమకు నీ వొకరుండవ తెప్ప గాఁగ న**
**త్యంతముదంబునన్ బ్రదుకు తల్లిని దండ్రిని నుజ్జగించి ని**

**శ్చింతుఁడ వై సదాధ్యయనశీలత వారియనుజ్ఞ లేక యే**
**కాంతము యెమ్మెయిన్ వెడలి తక్కట! నీవు గరంబు క్రూరతన్.** **120**

**ప్రతిపదార్థం:** ఎంతయున్, వృద్ధులు+ఐ= మిక్కిలి ముసలివారై; తమకున్; నీవు+ఒకరుండవు+అ= నీవు ఒక్కడవు మాత్రమే; తెప్పకాఁగన్= ఆధారం కాగా; (తెప్ప= నదిని దాటే ఉడుపం); అత్యంత ముదంబునన్= మిక్కిలి సంతోషంతో; బ్రదుకు= జీవించే; తల్లినిన్ తండ్రినిన్= తల్లిని తండ్రిని; ఉజ్జగించి= వదలిపెట్టి; అక్కట= అయ్యో!; నిశ్చింతుఁడవు+ఐ= విచారం లేనట్టివాడవై; సదా+అధ్యయన, శీలతన్= ఎల్లప్పుడును వేదాలను వల్లెవేసే స్వభావం చొప్పున; వారి+అనుజ్ఞ, లేక= ఆ తలిదండ్రులయొక్క అనుమతి లేకుండా; ఏకాంతము+అ= ఒంటరిగా; ఏ+మెయిన్= ఏరీతిగా; నీవు; కరంబు= మిక్కిలి; క్రూరతన్= కఠినత్వంతో; వెడలితి= వెళ్ళావు.

**తాత్పర్యం:** నీ తలిదండ్రులు మిక్కిలి ముసలివారు. వారికి నీవు ఒకడవే ఆధారం. నీమీదనే తమ ప్రేముడిని అంతయు పెట్టుకొని బ్రదుకుతున్న నీతలిదండ్రులను వదలిపెట్టావు. వారిని వదలివచ్చేటప్పుడు నీవు వారి అనుమతిని తీసికొన లేదు. నీవు వేదాధ్యయనం చేసి జ్ఞానాన్ని ఆర్జించి, తరింప నెంచావు. కాని, నీతలిదండ్రులగతి ఏమవుతుందో అని ఆలోచించలేదు. కఠినమైన నీ ప్రవర్తన నాకు నచ్చ లేదు.

**ఆ.** **నీక వగచి వగచి నిర్భిన్నహృదయు లై । విగతచక్షు లైరి వినవె? వార;**
**లరిగి యింక నైన నమ్ముదుసళ్ల యు । దగ్రశోకవహ్ని నార్పవయ్య!** **121**

**ప్రతిపదార్థం:** నీకున్+అ= నీకోసమే; వగచి వగచి= మిక్కిలిదుఃఖించి; నిర్భిన్నహృదయులు+ఐ= పగిలిన గుండెలు కలవారై; వారు= (నీతలిదండ్రులు); విగతచక్షులు+ఐరి= పోయిన కన్నులు కలవారు అయ్యారు - గ్రుడ్డివార లయ్యారు. వినవె= ఆలకించవా?; అరిగి= వెడలి; ఇంకన్+ఐనన్= ఇకమీదట నైన; ఆ+ముదుసళ్ల+ఉదగ్ర, శోక, వహ్నిన్= ఆ వృద్ధులయొక్కగొప్ప దైన దుఃఖం అనెడి అగ్నిని; ఆర్పవయ్య= ఉపశమింప చేయుము.

**తాత్పర్యం:** నీకోసమే మిక్కుటంగా గుండెలు పగిలేటట్లు నీ తలిదండ్రులు ఏడ్చి యేడ్చి గ్రుడ్డివారయ్యారు. ఆ సంగతి నీవు ఆలకించ లేదా? ఇకమీదట నైనా, నీవు వారిదగ్గరకు పోయి, ఆ ముదుసలుల శోకాగ్నిని ఆర్పవలెను సుమా!

**క.** **నీయధ్యయనమ్మును సుకృ । తాయాసము నిష్ఫలంబు లై చను గురుసే**
**వాయుక్తి లేక తక్కినఁ । జేయుము నాపలుకు; మేలు సేకుఱు నీకున్.'** **122**

**ప్రతిపదార్థం:** నీ+అధ్యయనమ్మును= నీ చదువున్నూ; సుకృత+ఆయాసమున్= పుణ్యాన్ని ఆర్జించటానికై పడెడి శ్రమయున్నూ; గురు, సేవా, యుక్తి, లేక తక్కినన్= తలిదండ్రుల పరిచర్య లేకపోతే; నిష్ఫలంబులు+ఐ= ఫలం లేనట్టివి అయి అనగా వ్యర్థాలై; చనున్= పోతాయి; నాపలుకు చేయుము= నేను చెప్పిన చొప్పున నడచుకొనుము; నీకున్= నీకు; మేలు= శుభం; చేకుఱున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** నీ చదువు గాని, పుణ్యాన్ని ఆర్జించటానికై నీవు పడెడి శ్రమగాని, తలిదండ్రులకు పరిచర్య చేయకపోతే వ్యర్థా లౌతాయి సుమా! నేను చెప్పిన విధంగా నడచుకొనుము. నీకు మేలు కలుగుతుంది'.

**విశేషం:** గురుశబ్దానికి విశాల మైన అర్థం ఉన్నది. గురువులు= తలిదండ్రులు, మాతామహి పితామహులు, పినతండ్రి,అన్న, మేనమామ, ఉపాధ్యాయుఁడు, విద్య చెప్పినవాడు, మంత్రోపదేశం చేసినవాడు, గురుపరిచర్య - లేకుంటే జ్ఞానం కలుగదు అని సనాతన సంప్రదాయం.

**వ. అనినఁ గౌశికుం డతని కిట్లనియె. 123**

**తాత్పర్యం:** అనగా విని కౌశికుడు ఆ ధర్మవ్యాధుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'ఇది యట్టిద నీ చెప్పిన । సదమలహితవాక్యభంగి సకలము వింటిన్;**
**వదలక యిమ్మెయిన చరిం । చెద గురుజనములకుఁ బ్రీతిఁ జేసెద ననఘా! 124**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపం లేనట్టివాడా!(ఓ ధర్మవ్యాధుడా!); ఇది= (నీవు చెప్పింది); అట్టిది+అ= అటువంటిదే, నిజమే; నీ, చెప్పిన= నీవు చెప్పిన; సత్+అమల, హిత, వాక్య, భంగి= మంచివి, స్వచ్ఛమైనవి, మేలుచేకూర్చేవి అయిన మాటలతీరు; సకలమున్= అంతయును; వింటిన్= ఆలకించాను; వదలక= విడిచిపెట్టక; ఈ+మెయిన్+అ= ఈవిధంగానే; చరించెదన్= నడచుకొంటాను; గురుజనములకున్= పెద్దలయిన తలిదండ్రులకు; ప్రీతిన్= సంతోషాన్ని; చేసెదన్= కల్గిస్తాను.

**తాత్పర్యం:** అని చెప్పిన ధర్మవ్యాధుడితో కౌశికుడు ఇట్లా పలికాడు: 'పుణ్యాత్ముఁడ వైన ఓ ధర్మవ్యాధుడా! నీవు చెప్పినమాటలు సరిఅయినవే. స్వచ్ఛమైనవే. నాకు మేలు చేకూర్చేవే. వాటిని సావధానంగా విన్నాను. నీవు చెప్పిన విధంగా నడచుకొంటాను. నా తలిదండ్రులకు పరిచర్య చేసి నా జన్మ ధన్యం చేసికొంటాను.

**క. నాదైన భాగ్యవశమునఁ ।గాదే నీతోడి చెలిమి గలిగెం, బరమా**
**హ్లాదమనస్కుఁడ నైతి, శు । భోదయముల కెల్ల నింక యుక్తుఁడ నైతిన్. 125**

**ప్రతిపదార్థం:** నాదు+ఐన= నాకు సంక్రమించిన; భాగ్య, వశమునన్+కాదు+ఏ= అదృష్టంచొప్పున కదా; నీతోడి, చెలిమి= నీతో స్నేహం; కలిగెన్= ఏర్పడింది; పరమ+ఆహ్లాద, మనస్కుఁడన్+ఐతిన్= మిక్కుటమైన సంతోషంతో నిండిన మనస్సు కలవాడను అయినాను; శుభ+ఉదయములకున్+ఎల్లన్= మేలు కలిగించే వాటి కన్నిటికిని; యుక్తుఁడను+ఐతిన్= యోగ్యుడిని అయినాను.

**తాత్పర్యం:** నీతో స్నేహం కలగటం నా అదృష్టం. నా మనస్సు అమితమైన సంతోషంతో నిండింది. నాకు కలుగబోయే శుభాల కన్నిటికిని ఇది సూచకం.

**క. పాపకృతం బగు దుర్గతి । మోపుఁ గనకయుండ ననుఁ బ్రబోధాత్మక లీ**
**లాపరిణతుఁ గావించితి; । నాపాలిటి వేల్ప వీవ నరనుతచరితా! 126**

**ప్రతిపదార్థం:** నర, నుత, చరితా!= జనులచేత పొగడబడిన ప్రవర్తన కలవాడా!; ఓ ధర్మవ్యాధుడా!; పాపకృతంబు+అగు= పాపం చేయటంచేత ఏర్పడిన; దుర్గతి= చెడుమార్గం; మోపున్+కనక+ఉండన్= బరువు కాంచక ఉండేటట్లుగా; ననున్= నన్ను; ప్రబోధ+ఆత్మక, లీలా, పరిణతున్+కావించితి(వి)= జ్ఞానంవలన కలిగే మహిమతో గొప్పవాడిగా వికసించేటట్లుగా చేశావు; ఈవు+అ= నీవే; నాపాలిటి= నాకు సంబంధించిన; వేల్పవు= దేవతవు.

**తాత్పర్యం:** జనులచేత పొగడబడే ప్రవర్తన కలవాడా, ఓ ధర్మవ్యాధా! పాపం చేయటంచేత దుర్గతి ప్రాప్తించి ఆ బరువు మోస్తూ బ్రదుకకుండ నీవు నన్ను ఉద్ధరించి, నాకు జ్ఞానం గలిగించి, గొప్పవాడినిగా నేను వికసించేటట్లు చేశావు. నీవే నా పాలిటి దేవుడవు.

**చ. అనుపమ మెట్టివారలకు నందదు ధర్మపథంబు ధాత్రిలోఁ;**
**విను, పదివేవురం దొకఁడు విశ్రుతధర్మపరాయణుండు గ**
**ల్గునొ కలుగండొ సందియము; గోరి సనాతనధర్మ మూఁది యె**
**వ్వనికిని నీకుఁ బోలె బుధవత్సల! యిట్లు చరింపవచ్చునే. 127**

**ప్రతిపదార్థం:** బుధవత్సల!= జ్ఞానులచేత ఆదరించబడెడివాడా!; విను= ఆలకింపుము; ధాత్రిలోన్= లోకములో; ధర్మ, పథంబు= ధర్మంతో గూడిన మార్గం; అనుపమము= సాటి లేనిది; ఎట్టివారలకున్= ఎటువంటి మనుజులకు ఐనను; అందదు= దొరకదు; పదివేవురందున్+ఒకఁడు= పదివేలమందిమనుజులలో ఒక్కడు; విశ్రుత, ధర్మ, పరాయణుండు= కీర్తికి ఎక్కిన ధర్మవ్రతుడు అనగా ధర్మాన్నే ఎల్లప్పుడు పాటించేవాడు అనే పేరు ప్రతిష్ఠలు ఆర్జించినవాడు; కల్గును+ఒ= కలుగునా?; కలుగండు+ఒ= కలుగడా?; సందియము= సంశయించవలసింది; కోరి= పూనికతో; సనాతనధర్మము+ఊఁది= ప్రాచీనకాలంనుండి అనుస్యూతంగా ఆచరించబడుతున్న ధర్మాన్ని తెలిసి గ్రహించి; ఇట్లు= ఈవిధంగా; ఎవ్వనికిని= ఏమనుజుడికి ఐనను; నీకున్+పోలెన్= నీవు ఆచరిస్తున్న విధాన్ని పోలి; చరింపన్‌వచ్చున్+ఏ?= నడవడిక తీర్చిదిద్దుకొనటానికి వీలు ఉన్నదా?

**తాత్పర్యం:** జ్ఞానులచేత ఆరాధింపబడెడి ఓ ధర్మవ్యాధుడా!; ధర్మమార్గం మిక్కిలి సూక్ష్మమైనది. సాటి లేనిది, ఎట్టివారలకును అది అందుబాటులో ఉండనట్టిది. ఈ భూప్రజలలో పదివేలమంది జనులలో ఒకడైనను అచ్చమైన ధర్మాన్ని ఆచరిస్తున్నట్లు పేరుప్రతిష్ఠలు ఆర్జించినవాడు ఉన్నాడా? ఉన్నట్లు ఖండితంగా చెప్పలేం. సనాతనధర్మాన్ని నీవలె గ్రహించిన అనుష్ఠానవేదాంతి మరియొకడు లేడు.

**చ. నిను నొక శూద్రుఁగాఁ దలఁపనేర గుణాకర; నీ చరిత్రముం**
**గన మది నద్భుతం బొలసెఁ; గావున నెయ్యది కారణంబుగా**
**నొనరఁగ నిట్టి జన్మమును నొందితి చెప్పుము; భూత భావివ**
**ర్తనములయందు నీకు విదితంబులు గానివి గల్గ వెమ్మెయిన్'. 128**

**ప్రతిపదార్థం:** గుణ+ఆకర!= మంచి లక్షణాలకు నెలవైన వాడా! ఓ ధర్మవ్యాధుడా!; నినున్= నిన్ను; ఒక, శూద్రున్+కాన్= ఏదో ఒక శూద్రవంశంలో పుట్టిన సామాన్య మనుజుడిగా; తలఁపనేరన్= ఎంచలేను; నీచరిత్రమున్+కనన్= నీశీలమును అరయగా; మదిన్= మనసునందున; అద్భుతంబు+ఒలసెన్= వింత గలిగింది; కావునన్= కాబట్టి; ఏ+అది= ఏది; కారణంబు+కాన్= హేతువుగా; ఒనరఁగన్= పొసగేటట్లుగా; ఇట్టి= ఈవిధమైన; జన్మమును= పుట్టుకను; ఒందితి(వి)= పొందావో; చెప్పుము= వివరించుము; భూత, భావి, వర్తనములయందున్= లోగడ జరిగినట్టి ఘటనలలోగాని, ఇక ముందుకాలంలో జరుగబోయే ఘటనలలోగాని; నీకున్, విదితంబులు+కానివి= నీకు తెలియనట్టివి; ఏ+మెయిన్= ఏరీతిగా నైనను; కల్గవు= ఉండవు.

**తాత్పర్యం:** మంచి గుణాలకు నెలవైన ఓ ధర్మవ్యాధుడా! నీవు ఒక శూద్రుడవు మాత్రమే అని భావించలేను; నీ శీలాన్ని అనుశీలించగా నామనస్సులోఇది మిక్కిలి వింతగా ఉన్నది. నీవు ఏకారణంవలన శూద్రజన్మను పొందావో

దయచేసి చెప్పుము. నీవు త్రికాలజ్ఞుడవు. నీకు తెలియని అంశాలు గతానికి సంబంధించినవి గాని భవిష్యత్తుకు సంబంధించినవి గాని లేవు.'

**వ. అనిన నతనికి ధర్మవ్యాధుం డిట్లనియె. 129**

**తాత్పర్యం:** అని కౌశికుడు పల్కగా, ధర్మవ్యాధుడు అతడికి ఈవిధంగా బదులు పలికాడు.

ధర్మవ్యాధుఁడు కౌశికునకుఁ దన పూర్వజన్మ వృత్తాంతంబు సెప్పుట (సం. 3-205-21)

**క. 'జననుత! నీ వెయ్యది యడి । గినఁ దెలుపుట నా కవశ్యకృత్యము గాదే!**
**విను చెప్పెదఁ; బూర్వభవం । బున నే నొక బ్రాహ్మణుండఁ బుణ్యచరితుఁడన్. 130**

**ప్రతిపదార్థం:** జన, నుత!= ప్రజలచేత కీర్తించబడినవాడా!; నీవు+ఏ+అది+అడిగినన్= నీవు దేనిని గూర్చి ప్రశ్నించినా; తెలుపుట= వివరించి చెప్పటం; నాకున్+అవశ్య, కృత్యము+కాదు+ఏ= నాకు తప్పనిసరిగా నెరవేర్చవలసిన పనియే సుమా; విను, చెప్పెదన్; పూర్వ, భవంబునన్= లోగడ పుట్టువునందు; ఏన్= నేను; ఒక, బ్రాహ్మణుండన్= ఒక విప్రుడను; పుణ్య చరితుఁడన్= సుకృతంతో కూడిన ప్రవర్తన కలవాడను.

**తాత్పర్యం:** ప్రజలచేత కీర్తించబడిన ఓ కౌశికమునీ! నీవు ఏ ప్రశ్నలు వేసినా వాటికి అన్నింటికి సమాధానాలు చెప్పటం నా కర్తవ్యంగా భావిస్తున్నాను. గతజన్మలో నేను ఒక బ్రాహ్మణుడను. సుకృతాన్ని ఆర్జించే ప్రవర్తన గలవాడిని.

**వ. వేదవేదాంగపారంగతుండ నై యుండుదు; నాకుం బ్రియసఖుం డైన యొక్క రాజపుత్త్రుతోడి సంగతిం జేసి ధనుర్వేదంబును నభ్యసించితి; నొక్కనాఁ డమ్మహీపతి వేఁట వోయిన నేనును నతనితోడన చని వనంబునం బెక్కు మృగంబుల నేయుచుండ నం దొక్కబాణంబు దృణలతాంతరితదేహుండైన మునివరు నొక్కరుం దాఁకిన నతఁడు హా! యనుచుం బడియె; నంత నేనును. 131**

**ప్రతిపదార్థం:** వేద, వేదాంగ, (వేద+అంగ) పారంగతుండను+ఐ= వేదాలయొక్క వేదాంగాలయొక్క అవ్వలిఒడ్డును చేరినవాడనై, (అనగా సంపూర్ణంగా తెలిసిన వాడనై); ఉండుదున్= ఉండేవాడను; నాకున్+ప్రియ, సఖుండు+ఐన= నాకు మిక్కిలి ఇష్టుడైన మిత్రుడు అయిన; ఒక్క, రాజపుత్త్రుతోడి= ఒకానొక రాచకొడుకుతోడి; సంగతిన్+చేసి= కూడిక (స్నేహం) వలన; ధనుః +వేదంబును= విలువిద్యను; అభ్యసించితిన్= నేర్చుకొన్నాను; ఒక్కనాఁడు= ఒకానొకరోజున; ఆ+మహీ, పతి= ఆ రాజు; వేఁట+పోయినన్= వేటాడడానికై పోగా; నేనునున్= నేనుకూడ; అతనితోడన్+అ= ఆతడివెనువెంటనే; చని= వెళ్లి; వనంబునన్ అడవిలో; పెక్కు, మృగంబులన్= అనేకజంతువులను; ఏయుచున్+ఉండన్= బాణాలతో కొట్టుతుండగా; అందున్+ఒక్క, బాణంబు= ఆ బాణాలలో ఒకబాణం; తృణ, లతా+అంతరిత, దేహుండు+ఐన= గడ్డిచేతను తీగలచేతను చుట్టుకొనబడిన శరీరం కలవా డయిన; మునివరున్+ఒక్కరున్= ఋషులలో శ్రేష్ఠుడు అయిన ఒకరిని; తాఁకినన్= తగులగా; అతఁడు= (ఆమునివరుడు); హా+అనుచున్+పడియెన్= హా అనే (బాధతోకూడినశోకము) ధ్వనితో పడిపోయాడు; అంతన్= పిమ్మట; ఏనును= నేనును.

**తాత్పర్యం:** పూర్వజన్మంలో నేను వేదాలను, వేదాంగాలను క్షుణ్ణంగా చదివినవాడినే. కాని, నాకు ఒక రాకుమారుడితో స్నేహం ఏర్పడటంచేత విలువిద్యను నేర్చాను. ఒకానొకరోజున ఆ మహారాజుతో నేనుగూడ అడవికి వేటకు పోయి

పెక్కుజంతువులను సంహరించాను. అంతలో నాబాణ మొకటి, గడ్డిచేతను తీగెలచేతను కప్పబడిన ఒక మునివరుడి శరీరానికి తాకింది. వెంటనే ఆతడు హాహాకారం చేస్తూ బాధతో నేలపై ఒరిగిపోయాడు. అప్పుడు నేను.

**విశేషం:** వేదములు నాలుగు. 1.ఋగ్వేదం, 2.యజుర్వేదం, 3. సామవేదం, 4. అధర్వణవేదం. వేదాంగం అంటే వేదానికి అవయవం. వేదము యొక్క సరియైన అర్థాన్నీ, మంత్రోపయోగం మొదలైన వాటిని తెలిపేది. వేదాంగాలు ఆరు 1.శిక్ష, 2.వ్యాకరణం 3. ఛందస్సు 4. నిరుక్తం 5. జ్యోతిషం 6. కల్పం.

**ఆ. డాయఁబోయి తీవ్రసాయకవిద్ధుఁ డై । పొరలుచున్న విప్రవరునిఁ జూచి**
**తలఁకి యనునయంపుఁ బలుకులు పలికినఁ, । గినిసి యిట్టు లనియె మునివరుండు. 132**

**ప్రతిపదార్థం:** డాయన్+పోయి= సమీపించి; తీవ్రసాయకవిద్ధుఁడు+ఐ= వాడి అయిన బాణాలచేత కొట్టబడినవాడై; పొరలుచున్+ఉన్న= ఇటు అటూ బాధతో మెలికలు తిరుగుతున్నటువంటి; విప్రవరునిన్+చూచి= బ్రాహ్మణులలో ఉత్తముడైనవాడిని సందర్శించి; తలఁకి= భయపడి; అనునయంపు+న్+పలుకులు= ఓదార్పుమాటలు; పలికినన్= పలుకగా; ముని, వరుండు= ఋషులలో శ్రేష్ఠుడైనవాడు; కినిసి= కోపించి; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అంతట నేను బ్రాహ్మణోత్తముడిని సమీపించాను. అతడు నాబాణంచేత ఛేదించబడిన శరీరం కలవాడై బాధచేత ఇటూఅటూ పొరలాడుతున్నాడు. ఆ దృశ్యాన్ని చూచి చలించినవాడనై నేను ఓదార్పుమాటలను పలుకగా, ఆవిప్రుడు మిక్కిలి ఆగ్రహించి ఈవిధంగా అన్నాడు.

**ఆ. 'బ్రాహ్మణుండవయ్యుఁ బాపప్రవృత్తివై । శూద్రకర్మమునకుఁ జొచ్చి తీవు**
**గాన నిక్కువము మృగవ్యాధజన్ముండ । వగుము మీఁద' ననియె; ననిన నేను. 133**

**ప్రతిపదార్థం:** ఈవు= నీవు; బ్రాహ్మణుండవు+అయ్యున్= విప్రుడవై పుట్టికూడా; పాపప్రవృత్తివి+ఐ= చెడ్డపనులు చేసే స్వభావం కలవాడవై; శూద్ర, కర్మమునకున్= శూద్రులు చేసే పనికి; చొచ్చితి(వి)= చొరబడ్డావు; కానన్= కావున; మీఁదన్= తదుపరి (అనగా రాబోయే జన్మలో); మృగ, వ్యాధ, జన్ముండవు= జంతువులను హింసించి జీవించే బ్రతుకుతెరువు కలవాడవు; అగుము= కమ్ము; నిక్కువము= యథార్థం; అనియెన్= అని అన్నాడు (శపించాడు); అనినన్= అట్లా అనగా; ఏను= నేను;

**తాత్పర్యం:** 'నీవు పుట్టింది బ్రాహ్మణకులంలో. కాని, చెడ్డ వైన హింసాకృత్యాలు చేయటానికి పూనుకొన్నావు. హింస శూద్రుల కను వైనది కాని బ్రాహ్మణులకు తగినపని కాదు. కావున, నీవు రాబోయేజన్మలో శూద్రుడవుగా జన్మించి మృగవ్యాధవృత్తితో బ్రతుకగలవు. ఇది తథ్యం' అని శపించాడు. అపుడు నేను ఆ బ్రాహ్మణోత్తముడితో ఈ విధంగా నివేదించుకొన్నాను..

**చ. 'ఎఱుఁగక తప్పు సేసితి సహింపఁగదే! కడుదుర్భవంబునం**
**బఱుపకుమయ్య!' నావుడుఁ గృపన్ మునినాథుఁడు 'దప్ప దివ్విధం;**
**బెఱుకుకులంబునందు జనియించియు ధర్మువు లెల్ల నిమ్ముగా**
**నెఱిఁగెదు, తల్లిదండ్రులకు నెంతయుఁ బ్రీతి యొనర్తు భక్తితోన్. 134**

**ప్రతిపదార్థం:** ఎఱుఁగక= తెలియకపోవటంచేత; తప్పు= నేరం; చేసితిన్= చేశాను; సహింపన్‌కదే= క్షమించవలసినవాడవుకదా!; కడున్= మిక్కిలి; దుర్భవంబునన్= చెడ్డజన్మంలో; పఱుపకుమయ్య!= నియోగించకండి; నావుడున్= అని చెప్పగా; మునినాథుఁడు= ఋషులలో శ్రేష్ఠుడు; కృపన్= దయతో; ఈ+విధంబు= ఈరీతి; తప్పదు= జరుగక తీరదు; ఎఱుకు, కులంబునందున్= వ్యాధకులంలో; జనియించియున్= పుట్టినప్పటికిని; ధర్మువులు+ఎల్లన్= అన్నిధర్మాలను; ఇమ్ముగాన్= సంప్రీతితో; ఎఱిఁగెదు= తెలిసికొంటావు; భక్తితోన్= పూజ్యభావంతో; తలిదండ్రులకున్= మాతాపితలకు; ఎంతయున్= ఎక్కువగా; ప్రీతి= తృప్తిని; ఒనర్తు(వు)= చేయగలవు.

**తాత్పర్యం:** 'అజ్ఞానంచేత ఇట్టి అపరాధం చేశాను, క్షమించ వేడికోలు. నన్ను చెడుజన్మం పొందేటట్టుగా చేయకుమా మహానుభావా!' అని నేను ప్రార్థించాను. అప్పుడు ఆ మునిశ్రేష్ఠుడు నాపై దయకలిగి 'నాశాపానికి తిరుగు లేదు. నీవు ఎఱుకవై జన్మించినప్పటికీన్నీ, ధర్మాధర్మపరిజ్ఞానం కలవాడవు కాగలవు. అంతేకాక, తల్లిదండ్రులకు భక్తితో శుశ్రూష చేసి తరించగలవు.

**వ. గురుశుశ్రూషం జేసి నీకుఁ బరమశోభనం బగు; జాతిస్మరత్వంబునుం గలుగు; నపరజన్మంబునఁ బరమబ్రాహ్మణుండ వయ్యెద' వని యనుగ్రహించిన, నవ్విప్రుని దేహంబునందు నాటిన బాణంబు మెత్తన పెఱికి, యతనిం దదీయాశ్రమంబునకుం జేర్చితి; నా చేసినపుణ్యంబున నమ్మహాత్ముండు నపాయంబు వొందం డయ్యెఁ; నాకు నిట్టిజన్మంబు నొంద వలసె' నని చెప్పినం గౌశికుం డిట్లనియె. 135**

**ప్రతిపదార్థం:** గురు, శుశ్రూషన్+చేసి= పెద్దలకు పరిచర్య చేయటంవలన; నీకున్= నీకు; పరమ, శోభనంబు+అగున్= మిక్కుటమైన మేలు చేకూరగలదు; జాతిస్మరత్వంబునున్+కలుగున్= పూర్వజన్మయొక్కజ్ఞాపకం లభిస్తుంది; అపర, జన్మంబునన్= తదుపరిపుట్టువులో; పరమ, బ్రాహ్మణుండవు= గొప్పవిప్రుడవు; అయ్యెదవు= కాగలవు; అని= అని చెప్పి; అనుగ్రహించినన్= దయచూపగా; ఆ+విప్రుని= ఆ బ్రాహ్మణుడి; దేహంబునందున్= శరీరంలో; నాటిన= గ్రుచ్చుకొనిన; బాణంబు= అమ్ము; మెత్తన= మృదువుగా; పెఱికి= బయటకు లాగి; అతనిన్= ఆ బ్రాహ్మణుడిని; తదీయ+ఆశ్రమంబునకున్= అతనియొక్క తపోవనానికి; చేర్చితిన్= చేర్చాను; నా, చేసిన= నేను చేసిన; పుణ్యంబునన్= సుకృతంవలన; ఆ+మహా+ఆత్ముండున్= ఆ గొప్ప ఆత్మ గలవాడును, ఆ మహానుభావుడును; అపాయంబు+పొందండయ్యెన్= ప్రమాదానికి లోనుకాలేదు; నాకున్+ఇట్టి, జన్మంబు= నాకు ఈవిధమైన పుట్టుక; ఒందవలసెన్= పొందవలసివచ్చింది; అని చెప్పినన్= అని వచించిన పిదప; కౌశికుండు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'పెద్దలకు (తలిదండ్రులకు) సేవ చేయటంవలన నీకు మిక్కుటమైన మేలు కలుగగలదు. అపుడు నీకు పూర్వజన్మపరిజ్ఞానంగూడ ఉంటుంది. తదుపరి జన్మలో మరల నీవు బ్రాహ్మణుడ వై పుట్టగలవు' అని ఆతడు దయతో పలికాడు. అంతట నేను ఆ బ్రాహ్మణోత్తముడి శరీరంలో గ్రుచ్చుకొనిన బాణాన్ని మృదువుగా పెరికి, బయటకు తీశాను. పిమ్మట ఆతడిని ఆతడి ఆశ్రమానికి చేర్చాను. నా పుణ్యంవలన ఆతడికి మృత్యుప్రమాదం తప్పింది. కాని, నాకు ఈ శూద్రజన్మ తారసిల్లింది' అని చెప్పిన ధర్మవ్యాధుడితో కౌశికుడు ఈవిధంగా అన్నాడు.

**తే. 'జన్మ మిట్టిది, చరితంబు చంద మిట్టి । దెన్నఁడును నిట్టిచోద్య మే నెందుఁ జూడ;**
**నింక జన్మాంతరముదాఁక నేల? యిపుడ । పుణ్యచరిత మై నీవు విప్రుఁడవ కావె! 136**

**ప్రతిపదార్థం:** జన్మము+ఇట్టిది= నీపుట్టుక ఇటువంటిది; చరితంబు చందము+ఇట్టిది= ప్రవర్తనతీరు ఇటువంటిది; ఎన్నఁడును= ఎప్పుడును; ఇట్టి= ఇటువంటి; చోద్యము= వింత; ఏన్= నేను; ఎందున్+చూడన్= ఎచటను చూడలేదు; ఇంకన్=

ఇకమీద; జన్మ+అంతరముదాఁకన్+ఏల= వేరొకజన్మ ఏర్పడేవరకూ ఆగవలెనా?; ఇపుడు+అ= ఇప్పుడే; పుణ్య, చరితమైన్= సుకృతంతో కూడిన ప్రవర్తనవలన; నీవు; విప్రుఁడవు+అకావె!= బ్రాహ్మణుడవే కదా!

**తాత్పర్యం:** 'ప్రస్తుతం నీ జన్మ చూస్తే శూద్రజన్మం. కానీ, ప్రవర్తనతీరు అనుశీలిస్తే ఇది ఒక వింత. ఇట్టి వింత ఇంతవరకు నేను ఎన్నడూ చూచి ఉండలేదు. నీవు మరుజన్మం వరకు ఆగవలెనా? ఈ జన్మంలోనే పుణ్యచరిత్రుడ వయిన నీవు నిజంగా బ్రాహ్మణుడవే సుమా!

**ఆ. పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును । నిజము శూద్రుకంటె నీచతముఁడు;**
**సత్యశౌచధర్మశాలి శూద్రుం డయ్యు, । నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు. 137**

**ప్రతిపదార్థం:** పాపవర్తనుండు= చెడునడవడి కలవాడు; బ్రాహ్మణుండు+అయ్యును= బ్రాహ్మణకులంలో పుట్టినవాడు అయినాకూడ; శూద్రుకంటెన్= శూద్రుని కన్ననూ; నీచతముఁడు= మిక్కిలి నికృష్టు డైన తుచ్ఛుడు; నిజము= సత్యమే(ఈమాట ముమ్మాటికి నిజం అనిభావం); సత్య, శౌచ, ధర్మశాలి= ఎల్లప్పుడు నిజాన్ని మాట్లాడేవాడున్నూ, పరిశుభ్రతను పాటించేవాడున్నూ, ధర్మాన్నే ఆచరించేవాడున్నూ; శూద్రుండు+అయ్యున్= శూద్రకులంలో పుట్టినవాడైనప్పటికిని; అతఁడు= వాడు; సత్+ద్విజుండు+అ= మంచిబ్రాహ్మణుడేఅని; మునులు= ఋషులు; అనిరి= పేర్కొన్నారు.

**తాత్పర్యం:** చెడుప్రవర్తన కలవాడు బ్రాహ్మణకులంలో పుట్టినప్పటికినీ శూద్రుడికంటె అధముడే. ఇది నిజం, పరిశుభ్రత పాటించి సత్యాన్నే పలికే ధర్మాత్ముడు శూద్రకులంలో జన్మించినప్పటికిన్నీ అతడు సద్బ్రాహ్మణుడే అని మునులు తీర్పుచెప్పారు.

**విశేషం:** 1) ద్విజుఁడు= రెండు జన్మలు కలవాడు. అనగా శారీరకమైన పుట్టువు ఒకజన్మం, జ్ఞానార్జన తదుపరి ఎత్తేది మరియొక జన్మం. జ్ఞానోదయమైతే తప్ప బ్రాహ్మణకుటుంబంలో పుట్టినవాడైనా నిజమైన ద్విజుడు (బ్రాహ్మణుడు) కాఁజాలడు. 2) 'ఎవడు బ్రాహ్మణుడు? - ఈప్రశ్నను సనాతనవైదికమతానుయాయులే గాక బౌద్ధులు పాషండులుకూడ పలుసారులు వేసిఉన్నారు. మహాభారతం నిష్కర్షగా ఎవడును జన్మచేత బ్రాహ్మణుడు కాజాల డనిన్నీ 'సత్యశౌచధర్మశాలి' మాత్రమే నిజమైన బ్రాహ్మణుడనిన్నీ నిర్ణయించింది. అందుచేత ఈ పద్యం మిక్కిలి విలువ కలది, అంతేకాక, ఒకవేళ 'సత్యశౌచధర్మశాలి' శూద్రకులంలో జన్మించి ఉన్నప్పటికీ, ఆతడు నిజంగా బ్రాహ్మణుడే అని ఖండితంగా నొక్కివక్కాణించింది. ఇచ్చట- 'అనిరి మునులు' అనే ప్రయోగం అనుశీలించదగింది. లోకవ్యవహారంలో జన్మ 'కులమును'- నిర్ణయించవచ్చును గాని ఆర్షదృష్టిలో లేదు. మునులదృష్టిలో- 'సత్యశౌచధర్మశాలి' శూద్రకులంలో పుట్టినప్పటికీ బ్రాహ్మణుడే. కౌశికుడి దృష్టిలో ఈజన్మంలోనే శూద్రకులంలో పుట్టిన ధర్మవ్యాధుడు బ్రాహ్మణుడే.

**క. అనయంబు నాత్మకర్మం । బున నతినీచ మగు భవముఁ బొందవలసెనే**
**యని నీవు నిరంతరమును । మనమున దుఃఖింపవలదు మహితచరిత్రా! 138**

**ప్రతిపదార్థం:** మహిత చరిత్రా!= గొప్ప ప్రవర్తన కలవాడా! ఓధర్మవ్యాధా!; అనయంబున్= ఎల్లప్పుడును; ఆత్మకర్మంబునన్= తాను చేసిన కర్మవలన; అతినీచము+అగు= మిక్కిలి నికృష్టమైన; భవమున్= జన్మను; పొందవలసెనే= పొందవలసివచ్చింది కదా; అని; నీవు; నిరంతరమును= ఎల్లప్పుడును; మనమునన్= మనస్సులో; దుఃఖింపన్వలదు= విచారించబోకుము.

**తాత్పర్యం:** గొప్పదైన నడవడిగల ఓమహానుభావా! ధర్మవ్యాధుడా! పూర్వజన్మలో చేసిన కర్మయొక్క విపరిపాకంవలన ఈ జన్మలో నీచమైన జన్మం ఏర్పడింది కదా అని నీవు మనస్సులో సదా విచారించ వలదు.

చ. **నిజగుణదోషకర్మముల నెట్టన మేలును గీడు వచ్చుఁ; ద**
**త్ప్రజనితసౌఖ్యదుఃఖములఁ బ్రాజ్ఞులు దుల్యమనస్కులై మనో**
**రుజలును దేహజంబు లగు రోగములున్ హితధర్మకర్మభే**
**షజములఁ జేసి పాపుదురు సర్వము సాత్త్వికదృష్టిఁ జూచుచున్.** 139

**ప్రతిపదార్థం:** నిజ, గుణ, దోష, కర్మములన్= తనదైన మంచిచెడుపనులవలన; నెట్టన= అవశ్యం, తప్పనిసరిగా; మేలును= శుభమున్నూ; కీడున్= చెడుగున్నూ; వచ్చున్= దాపురిస్తాయి; తద్+ప్రజనిత, సౌఖ్య, దుఃఖములన్= ఆవిధంగా ఏర్పడిన సుఖదుఃఖాలయందు; ప్రాజ్ఞులు= పండితులు; తుల్య, మనస్కులు+ఐ= సమమైన చిత్తం కలవారలై; మనస్+రుజలును= మానసికంగా ఏర్పడే రోగాలును; దేహజంబులు+అగు= దేహంనుండి పుట్టిన; రోగములున్= వ్యాధులును; హిత, ధర్మ, కర్మ, భేషజములన్+చేసి= అనుకూలమైన ధర్మంతో కూడిన పనులు అనే వైద్యాలను చేసి; సర్వము= అంతటిని; సాత్త్విక, దృష్టిన్+చూచుచున్= మంచితనంతో కూడిన చూపులతో చూస్తూ; పాపుదురు= తొలగద్రోస్తారు.

**తాత్పర్యం:** తాము లోగడ మంచిపనులను చేస్తే తదుపరి మేలు కలుగుతుంది. అట్లే చెడుపనులను చేసిఉంటే కీడు కలుగుతుంది. ఆవిధంగా ఏర్పడే సుఖదుఃఖాలను పండితులు సమబుద్ధితో అనుభవిస్తారు. అట్టిసాధుజనులు అన్నిటిని సాత్త్వికదృష్టితోనే చూస్తూ, తమకు ఏర్పడే మానసికవ్యాధులను, శారీరకవ్యాధులను అనువైన ధర్మకర్మలు చేయటంద్వారా పాపుకొంటారు.

క. **ప్రియములు వాయుటయును న। ప్రియములు వెసఁ బొందుటయును బెల్లుగ నగుఁ ద**
**త్క్రియలందు మూఢమతికి హృ। దయతాపము పాయ దెపుడు దరికొనుచుండున్.** 140

**ప్రతిపదార్థం:** ప్రియములు+పాయుటయును= ఇష్టాలైనవి ఎడబాయటమున్నూ; అప్రియములు= ఇష్టం కానివి; వెసన్= వేగంగా; పొందుటయును= లభించటమున్నూ; పెల్లుగన్+అగున్= ఎక్కువగా జరుగుతుంటాయి; తత్+క్రియలందున్= ఆ పనులలో; మూఢమతికిన్= అవివేకికి; హృదయతాపము= గుండెయందు ఏర్పడేవేదన; ఎపుడున్= ఎప్పుడును; పాయదు= పోదు; దరికొనుచుండున్= మండుతూ ఉంటుంది.

**తాత్పర్యం:** శుభాలు దూరం కావటం, అశుభాలు దాపురించటం ఎక్కువగా ఏర్పడేటప్పుడు మూఢుడు మిక్కుటమైన హృదయపరితాపానికి లోనౌతూ ఉంటాడు. అందుమూలాన ఆ తాపం తగ్గదు సరిగదా, సదా మండుతూ ఉంటుంది.

తే. **వగతుమన్న నెవ్వారికి వగవఁ జనదు। చిత్తమున నేమిటికి సంతసింపరాదు**
**కాన గతమునందును ననాగతమునందు। వగవ రార్యులు సంతోషవంతు లగుచు.** 141

**ప్రతిపదార్థం:** వగతుము+అన్నన్= దుఃఖించవలసివచ్చింది అని చెప్పినప్పటికి; ఎవ్వారికిన్= ఎవరికైనను; వగవన్+చనదు= శోకించకూడదు; చిత్తమునన్= మనస్సులో; ఏమిటికిన్= ఎందులకైనను; సంతసింపరాదు= ఉబ్బరాదు; కాన= కాబట్టి; గతమునందునన్= జరిగిపోయినకాలాన్ని గూర్చియున్నూ; అనాగతమునందున్= రానట్టి అనగా భవిష్యత్కాలాన్ని గూర్చియున్నూ; ఆర్యులు= పూజ్యులు; సంతోషవంతులు+అగుచున్= సంప్రీతిని చెందిన వారై; వగవరు= శోకించరు.

**తాత్పర్యం:** ఎంతటి కష్టాలు దాపురించినా దుఃఖించరాదు. అట్లే, ఎప్పుడును సంతోషించరాదు. ఆర్యులు జరిగిన కాలాన్ని గూర్చి గాని భవిష్యత్కాలాన్నిగూర్చిగాని శోకించక- సదా సంతృప్తులై ఉంటారు.

**క. వగపునఁ దేజోహీనుం । డగు నాత్మహితక్రియలకు నక్షముఁ డగు న**
**వ్వగపు దొఱఁగి యుద్యోగము । దగఁ జేయఁగఁ గలుగు నంచితము లగు శుభముల్. 142**

**ప్రతిపదార్థం:** వగపునన్= దుఃఖంవలన; తేజస్+హీనుండు+అగున్= కాంతి గోలుపోయినవాడు కాగలడు; ఆత్మహిత, క్రియలకున్= తనకు మేలు చేకూర్చే పనులకు; అక్షముఁడు+అగున్= సామర్థ్యం లేనివాడు కాగలడు; ఆ+వగపు+తొఱఁగి= ఆ దుఃఖం వదలి; ఉద్యోగము= ప్రయత్నం; తగన్+చేయఁగన్= సరిపడేటట్లుగాచేస్తే; అంచితములు+అగు= ఒప్పారునట్టి; శుభముల్= మేళ్లు; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** దుఃఖంవలన కాంతి కోలుపోవటం సంభవిస్తుంది; దుఃఖంవలన, తనకు మేలు కలిగించేపనులు నిర్వహించే సామర్థ్యం కొరవడుతుంది. దుఃఖాన్ని వీడి, సరిఅయిన ప్రయత్నాలను చేస్తే మంచిగా శుభాలు కలుగుతాయి.

**వ. కావున భూతంబుల సదసత్ప్రకారంబులు గనికొని ధీరుండ వై యుండు' మనిన ధర్మవ్యాధుండు 'మహాత్మా! నీ చెప్పినయంతవట్టు నిదర్శనంబులుగాఁగొని యేను నిఃఖేదుండ నై యున్నవాఁడ; భవిష్యత్కాలసద్భావంబునందు సమాహితుండ నై యుండువాఁడ' ననియె; నంత నా భూదేవుండు. 143**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; భూతంబుల, సత్+అసత్+ప్రకారంబులు= పదార్థాల ఆంతర్యాలకు సంబంధించిన సత్యం, అసత్యంయొక్క రీతులను; కనికొని= అరసి; ధీరుండవు+ఐ= స్థైర్యంకలవాడవై; ఉండుము= బ్రతుకుము; అనినన్= అని చెప్పగా; ధర్మవ్యాధుండు; మహా+ఆత్మ!= గొప్ప ఆత్మ కలవాడా!; (మహానుభావా); నీ చెప్పిన+అంత+పట్టు= నీవు చెప్పిన మేరకు; నిదర్శనంబులు+కాన్= ఉదాహరణాలు అయ్యేటట్లుగా; కొని= కడగి; ఏను= నేను; నిః+ఖేదుండను+ఐ= దుఃఖంలేని వాడనై అనగా పూర్ణసంతృప్తి కలవాడనై; ఉన్నవాఁడన్= ఉన్నాను; భవిష్యత్+కాల+సత్+భావంబునందున్= రాబోయే సమయంలో మంచిజరుగుతుందనే ఆలోచనలో; సమాహితుండను+ఐ= నిష్ఠకలవాడనై; ఉండువాఁడన్= ఉన్నాను; అనియెన్= అని చెప్పాడు; అంతన్= పిమ్మట; ఆ భూదేవుండు= ఆ బ్రాహ్మణుడు (కౌశికుడు).

**తాత్పర్యం:** కాబట్టి సర్వపదార్థాల ఆంతర్యంలోని సత్యాసత్యసమీక్ష చేసి స్థైర్యంతో బ్రదుకుము అని కౌశికముని చెప్పాడు. అంతట ధర్మవ్యాధుడు 'మహానుభావా! నీవు చెప్పిన ఆదర్శాలకు ఉదాహరణప్రాయంగానే నేను నా బ్రతుకును తీర్చిదిద్దుకొంటున్నాను. నేను నిత్యసంతృప్తుడను. భవిష్యత్కాలంలో నాకు శుభం చేకూరగల దని నానమ్మకం' అని అన్నాడు. అంతట కౌశికముని ఈ విధంగా బదులుపలికాడు.

**చ. 'అతులిత పుణ్యమూర్తివి, కృతాత్ముఁడ వెందును నీవు ధర్మ మూ**
**ర్జితముగ నెప్పు డేమఱక చేయుచు నుండుము, నిత్యశోభన**
**స్థితి వెలుగొందు; మేను భవదీయసమాగతిఁ జేసి ధర్మ సు**
**స్థితమతి నైతి న న్ననుమతింపు గుణాకర! పోయి వచ్చెదన్.' 144**

**ప్రతిపదార్థం:** గుణ+ఆకర!= మంచిలక్షణాలకు నెలవైనవాడా, ఓధర్మవ్యాధా!; నీవు= నీవు; అతులిత పుణ్యమూర్తివి= సాటిలేని సుకృతాలు ఆకృతి తాల్చినవాడవు; కృత+ఆత్ముఁడవు= సిద్ధిపొందిన ఆత్మకలవాడవు అనగా ధన్యుడవు; ఎందును= ఎచ్చటను; నీవు= నీవు; ధర్మము= ధర్మమును; ఊర్జితముగన్= సదా వికసించేటట్లుగా; ఎప్పుడున్= ఎల్లవేళల; ఏమఱక= ఎట్టి మరపు లేకుండ; చేయుచున్+ఉండుము= ఆచరిస్తూ ఉండుము; నిత్య, శోభన, స్థితిన్= ఎల్లప్పుడూ శుభాలు ఏర్పడేటట్లుగా;

వెలుగొందుము= ప్రకాశించుము; ఏను= నేను; భవదీయ, సమాగతిన్+చేసి= నీ కలయికవలన; ధర్మ, సు, స్థిత, మతిన్+ఐతిన్= ధర్మం ఎల్లప్పుడు పాదుకొని ఉండే బుద్ధికలవాడను అయినాను; నన్నున్+అనుమతింపుము= నాకు సెలవు దయచేయునది; పోయి వచ్చెదన్= నీదగ్గర వీడ్కోలు గైకొని వెళ్ళగలవాడను.

**తాత్పర్యం:** 'మంచిగుణాలకు నెలవైన ఓ ధర్మవ్యాధుడా! నీవు పున్నెములప్రోవవు. నీజీవితం ధన్యమైనది. సదా ధర్మాన్నే ఆచరించేవాడవై నీ బ్రతుకును తీర్చిదిద్దుకొనుము; నీ చరిత్రలవలన ధర్మం విస్తరించి వెలుగొందగలదు. నీకు ఎల్లప్పుడు మేలు కలుగు గాక. నిన్ను కలిసికొనటంచేత నా జన్మం ధన్యమైనదిగా భావిస్తున్నాను. నీవలన నేను ధర్మసూక్ష్మాలను తెలిసికొన గలిగాను. నీమూలాన నాకు జ్ఞానోదయమైనది. ఇక దయచేసి నాకు సెలవును అనుగ్రహించుము. నిన్ను వీడ్కొని నేను పోయి వస్తాను.'

**వ. అని వానికిం బ్రదక్షిణంబు సేసి వీడ్కొని చని కౌశికుండు నిజజననీజనకుల కతిభక్తి శుశ్రూష చేసి కృతార్థుం డయ్యెం; బాండవోత్తమా! నీయడిగిన తెఱంగునం బతివ్రతామాహాత్మ్యంబును బితృశుశ్రూషావిశేషంబును హీనవర్ణుం డైనవాఁడు ధర్మంబు సలుపు నుపాయంబును జెప్పితి' ననిన విని ధర్మతనయుండు సంతసిలి మఱియు మార్కండేయు నిట్లని యడిగె. 145**

**ప్రతిపదార్థం:** అని= ఆరీతిగా పలికి; వానికిన్+ప్రదక్షిణంబు+చేసి= (ధర్మవ్యాధుడికి) కుడివైపుగా చుట్టుదిరిగి (నమస్కరించి); వీడ్కొని= సెలవుగైకొని; చని= వెళ్ళి (మిథిలానగరినుండి స్వస్థలానికి వెళ్లి); నిజ, జననీజనకులకున్= తనతల్లికిని తండ్రికిని; అతిభక్తిన్= మిక్కుటమైన పూజ్యభావంతో; శుశ్రూష, చేసి= సేవ ఒనరించి; కృతార్థుండు+అయ్యెన్= ధన్యుడు అయ్యాడు (కౌశికుడు); పాండవ+ఉత్తమా!= పాండురాజు కొడుకులలో శ్రేష్ఠుడవు అయినవాడా! (ఓధర్మరాజా!); నీ+అడిగిన= నీవు ప్రశ్నించిన; తెఱంగునన్= పద్ధతిచొప్పున; పతివ్రతా, మాహాత్మ్యంబును= పతిసేవ చేసే సతుల గొప్పతనాన్ని; పితృ, శుశ్రూషా, విశేషంబును= (తలి)దండ్రులకు సేవచేయుటంలోని గొప్పతనాన్ని; హీనవర్ణుండు+ఐనవాఁడు= తక్కువకులంలో పుట్టినట్టివాడు; ధర్మంబు= ధర్మాన్ని; సలుపు= చేసే; ఉపాయంబును= తెరువును; చెప్పితిన్= వచించాను; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ధర్మతనయుండు= ధర్మరాజు; సంతసిలి= సంతోషించి; మఱియున్= ఇంకా; మార్కండేయున్= మృకండుడి కొడుకు అయిన మార్కండేయుడిని; ఇట్లు+అని= ఈ విధంగా; అడిగెన్= ప్రశ్నించాడు.

**తాత్పర్యం:** అంతట కౌశికముని ధర్మవ్యాధుడికి ప్రదక్షిణనమస్కారం చేసి అతడివీడ్కోలు గైకొని తన స్వస్థానానికి వెళ్ళాడు. అచట ఆతడు తన తలిదండ్రులకు సేవచేసి తరించాడు. ఓ ధర్మరాజా! ఇంతకుముందు నీవడిగిన ప్రశ్నలు 1) భర్తకు శుశ్రూష చేసి ధన్యత్వం చెందిన పతివ్రతలమహిమ, 2) తలిదండ్రులకు పరిచర్య చేయటంలోని విశేషం 3) తక్కువకులంలో పుట్టినవాడు ధర్మాత్ముడై వెలుగొందే విధానం గూర్చి నీకు సోదాహరణంగా వివరించిఉన్నాను'- అని మార్కండేయ మహర్షి ధర్మరాజుతో అన్నాడు. ధర్మరాజు మిక్కిలి సంతోషించి మఱియు ఇట్లా పలికాడు.

**తే. 'అగ్నిదేవుండు తొల్లి మహాతపంబు । సేసె నని విందు; నది యేల చేసె ననఘ!**
**యంగిరసుఁ డేమి కతమున నగ్ని యయ్యె? । నగ్ను లెన్ని విధంబుల నతిశయిల్లు? 146**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడ వైన ఓ మార్కండేయ మహర్షీ!; తొల్లి= పూర్వకాలంలో; అగ్ని దేవుండు= అగ్ని దేవుడు; మహా+తపము= గొప్ప తపస్సు; చేసెన్; అని; విందున్= వింటాను; అది= (అట్టి తపస్సు); ఏల= ఎందుకు; చేసెన్= చేశాడు?;

అంగిరసుఁడు= అంగిరసుడు (అనే పేరుగల ముని); ఏమి, కతమునన్= ఏ కారణం వలన; అగ్ని+అయ్యెన్?= అగ్ని అయినాడు?; అగ్నులు= నిప్పులు; ఎన్ని విధంబులన్= ఎన్ని రీతుల; అతిశయిల్లున్?= ఒప్పారుతాయి?

**తాత్పర్యం:** 'మహానుభావా! అగ్నిదేవుడు పూర్వకాలంలో గొప్ప తపస్సు చేసి ఉన్నట్లు విని ఉన్నాను. ఆ విధంగా అగ్ని దేవుడు గొప్ప తపస్సు చేయటానికి గల కారణ మేమి? అంగిరసుడు అగ్నిగా మారినట్లు విన్నాను. దానికి కారణం ఏమిటి? అగ్నులు ఎన్ని విధాలు?

**మార్కండేయుఁడు ధర్మరాజునకు నంగిరసుం డగ్నియైన తెఱంగు సెప్పుట (సం. 3-207-5)**

**వ.** **ఇంతయు వినవలతు' ననిన, నమ్మహాముని యిట్లని చెప్పె; 'నగ్నిదేవుండు దేవతలతోడి యలుకం జేసి హవ్యంబులు వహింప నొల్లక వనంబునకుం జని బహుకాలంబు ఘోరతపంబు సేయుచు నత్యంతకృశుం డై యాత్మ గతంబున. 147**

**ప్రతిపదార్థం:** ఇంతయున్= దీనినంతటిని; వినవలతున్= ఆలకింప కోరుతున్నాను; అనినన్= అని చెప్పగా; ఆ+మహా+ముని= ఆ గొప్ప ఋషి; ఇట్లు+అని, చెప్పెన్= ఈ విధంగా వచించాడు; అగ్ని దేవుండు= అగ్ని దేవుడు; దేవతలతోడి అలుకన్+చేసి= దేవతలమీదికోపంచేత; హవ్యంబులు= యజ్ఞాలలో వేల్చబడే హోమ ద్రవ్యాలు; వహింపన్+ఒల్లక= మోయటానికి ఇష్టపడక; వనంబునకున్+చని= అడవికి వెళ్లి; బహుకాలంబు= పెక్కు నాళ్లు; ఘోర, తపంబు= మిక్కిలి భయంకరమైన తపస్సు; చేయుచున్= చేస్తూ; అత్యంత, కృశుండు+ఐ= మిక్కిలి చిక్కిపోయిన శరీరం కలవాడై; ఆత్మ గతంబునన్= తనలో తాను.

**తాత్పర్యం:** ఈ విషయాన్ని సవిస్తరంగా వినగోరుతున్నాను' అని ధర్మరాజు అడిగాడు. అంతట మార్కండేయ మహర్షి ఇట్లా బదులు పలికాడు: 'అగ్ని దేవుడు దేవతలపై కోపించి హోమద్రవ్యాలు మోయటానికి ఇష్టపడక, అడవికి పోయి మిక్కిలి కఠోర మైన తపస్సు చేయటానికి పూనుకొన్నాడు. నిరంతర తపస్సువలన అతడి శరీరం మిక్కిలి చిక్కిపోయింది. అప్పుడు అగ్నిదేవుడు ఈ విధంగా చింతించాడు.

**విశేషం:** సనాతన సంస్కృతిలో అగ్ని హవ్యవాహనుడుగా సుప్రసిద్ధుడు. యజ్ఞాలలో హోమద్రవ్యాలను అగ్నిలో వేలుస్తారు. అగ్ని వాటిని కొనిపోయి దేవతలకు అర్పిస్తాడని పురాణకథనం.

**చ.** **'అలుకమెయిం దొలంగి విపినాంతరభూమికి వచ్చి యిట్లు నే**
**వెలుఁగక యున్నచో భువనవృత్తము సర్వము నిల్చు, నిల్చినన్**
**జలరుహసూతి వేఱొకనిఁ జయ్యన నగ్ని పదంబునందుఁ దా**
**నిలుపక యున్నె? నే నిచట నిల్చుట పోలదు పోయెదన్ వెసన్'. 148**

**ప్రతిపదార్థం:** అలుకమెయిన్= కోపవశాన; తొలంగి= ఉన్నచోటు విడిచి; విపిన+అంతర, భూమికిన్= అడవి మధ్య భాగానికి; వచ్చి= చేరి; ఇట్లు= ఈ విధంగా; నేన్= నేను; వెలుఁగక+ఉన్నచోన్= మండకుండా ఉంటే; భువన వృత్తము= లోక వ్యవహారం; సర్వమున్= అంతా; నిల్చున్= ఆగిపోతుంది; నిల్చినన్= ఆగిపోయిన యెడల; జలరుహసూతి= పద్మంలో పుట్టినవాడు-బ్రహ్మదేవుడు; వేఱు+ఒకనిన్= ఇంకొకరిని; చయ్యనన్= శీఘ్రంగా; అగ్ని పదంబునందున్= అగ్ని యొక్క పదవియందు;

తాన్= తాను; నిలుపక+ఉన్నె= నిలబెట్టి ఉంచడా? నేన్= నేను; ఇచటన్= (అడవిలో); నిల్చుట= ఉండటం; పోలదు= ఉచితం కాదు; వెసన్= శీఘ్రంగా; పోయెదన్= తిరిగిపోతాను, అనగా అడవినుండి మరలి స్వస్థలానికి చేరగలను అని భావం.

**తాత్పర్యం:** దేవతలపై కోపించి నేను ఈ విధంగా ఈ అడవికి వచ్చి ఉన్నాను. నేను మండక పోతే లోక వ్యవహారం అంతా నిలిచి స్తంభించి పోతుంది కదా! అందుచేత సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడు ఈ కర్తవ్యం నిర్వహించటానికై నాస్థానంలో మరియొకడిని నియమించడా? అందుచేత నేను ఇక్కడ చిరకాలం జాగు చేయటం మంచిది కాదు. కాబట్టి నేను ఇక్కడినుండి తిరిగి నా స్వస్థానానికి శీఘ్రమే మరలి పోతాను.

**వ. అని తలంచి తపంబు సాలించి నిజపదంబున కున్ముఖుండై చని చని, యంతకు మున్న బ్రహ్మనియోగంబునం ద్రిలోకంబులకు నగ్నియై వెలుంగుచున్నవాని నధికతపో విజృంభితు నంగిరసుం గని, భయంపడి, యెప్పటి యట్ల మగిడిపోవు నెడ నంగిరసుం డతనిపాలికిం జనుదెంచి, యిట్లనియె. 149**

**ప్రతిపదార్థం:** అని, తలంచి= అంటూ ఆలోచించి; తపంబు= తపస్సు; చాలించి= విడిచి పెట్టి; నిజ, పదంబునకున్= తన పదవికి; ఉన్ముఖుండు+ఐ= ఇష్టపడినవాడై; చని, చని= వెళ్లి వెళ్లి (అడవి నుండి బహుదూర ప్రయాణం చేసి అని అర్థం); అంతకున్, మున్ను+అ= అంతకు పూర్వమే; బ్రహ్మ, నియోగంబునన్= బ్రహ్మదేవుడి ఏర్పాటు వలన; త్రిలోకంబులకున్= మూడు లోకాలకున్నూ; అగ్ని+ఐ= నిప్పు అయి; వెలుంగుచున్నవానిన్= ప్రకాశిస్తున్నవాడిని; అధిక, తపస్+విజృంభితున్= మిక్కుటమైన తపస్సుచేత అతిశయించి ఉన్నవాడిని; అంగిరసున్+కని= అంగిరసుడు (అనే వాడిని) చూచి; భయము+పడి= భీతిచెంది; ఎప్పటి+అట్లు+అ= యథా ప్రకారం (అనగా లోగడ ఉన్నట్లుగనే); మగిడిపోవు+ఎడన్= తిరిగి పోయేటప్పుడు; అంగిరసుండు; అతని పాలికిన్+చనుదెంచి= అగ్నిదేవుడి దగ్గరకు వచ్చి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అగ్నిదేవుడు తనలో తాను ఆవిధంగా ఆలోచించుకొని, తన తపస్సు విరమించి, తిరిగి తన పదవిని అధిష్ఠించదలచి అడవిని వీడి తరలి వెళ్ళాడు. కాని అగ్నిదేవుడు స్వస్థానాన్ని చేరటానికి ముందే బ్రహ్మదేవుడు అగ్నిదేవుడి పదవిలో అంగిరసుడు అనే మునీశ్వరుడిని నియోగించి ఉన్నాడు. అంగిరసుడు త్రిలోకాలకు అగ్నిహోత్రుడై గొప్ప తేజస్సుతో ప్రకాశించి విజృంభించాడు. మహాతేజస్వి అయిన అంగిరసుడిని చూచి భయపడి అగ్నిదేవుడు మరలి పోసాగాడు. అంతట అంగిరసుడు అగ్నిదేవుడిని గుర్తించి, అతడి కడకు వెళ్లి ఇట్లా అన్నాడు.

**చ. 'అనఘ! జగత్త్రయార్చితుఁడవై తిమిరాపహరుండవై తగన్
వనరుహగర్భుచేఁ బ్రథమవహ్నిపదంబునఁ గల్పితుండ వై
తనరుదు; రమ్ము! నీ దగు పదంబున నే నిటులుండ నోడుదున్;
ఘనముగ నీవు నీ పదము గైకొనవే! యవికల్పభావనన్'. 150**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా! (ఓ అగ్ని దేవుడా); జగత్+త్రయ+అర్చితుఁడవు+ఐ= మూడులోకాల చేత పూజించబడిన వాడవై; తగన్= ఒప్పేటట్లుగా; వనరుహ గర్భుచేన్= బ్రహ్మదేవుడిచేత; ప్రథమ, వహ్ని, పదంబునన్= మొట్టమొదటి అగ్ని పదవిలో; కల్పితుండవు+ఐ= నియమించబడిన వాడవై; తనరుదు= విరాజిల్లుతావు; రమ్ము; నీదు+అగు, పదంబునన్= నీకు సంక్రమించిన పదవిలో; ఏన్= నేను; ఇటులు+ఉండన్+ఓడుదున్= ఉండటానికి జంకుతున్నాను; ఘనముగన్= గొప్పగా; ఈవు= నీవు; అవికల్ప, భావనన్= తిరుగు లేని ఆలోచనతో; నీ పదము= నీ పదవిని; కైకొనవే!= స్వీకరించుమయ్యా!.

**తాత్పర్యం:** పాపరహితుడ వైన ఓ అగ్నిదేవుడా! నీవు మూడులోకాలచేత పూజించబడినవాడవు; మొట్టమొదట బ్రహ్మదేవుడిచేత అగ్నిహోత్రపదవిలో నెలకొల్పబడినవాడవు. నీ పదవిని తిరిగి నీవే చేపట్టటం ధర్మం. నేను నీ పదవిలో ఉండటానికి సరిపోను. నీవు తిరిగి నీ పదవిని గొప్పగా అలంకరించుము. నీకు ఎట్టి జంకు గొంకులు అవసరం లేదు సుమా! ఇది నేను చిత్తశుద్ధితో నీకు చేసే విన్నపం.

**వ. అనిన నగ్నిదేవుం డిట్లనియె. 151**

**తాత్పర్యం:** అనగా అగ్నిదేవుడు ఈ విధంగా అన్నాడు.

**క. 'విను నా కీర్తి జగంబులఁ। బొనుఁగు పడియె; నీవు భువనపూజితవృత్తిం**
**బనుపడితి గానఁ దగు నీ। యనలపదము నీక; నాకు నలవడ దింకన్. 152**

**ప్రతిపదార్థం:** విను(ము)= ఆలకింపుము; నా కీర్తి= నాయొక్క యశస్సు; జగంబులన్= లోకాలలో; పొనుఁగు పడియెన్= నిస్తేజమై పోయింది; ఈవు= నీవు; భువన, పూజిత, వృత్తిన్= లోకాలచేత ఆరాధించబడిన క్రియకు; పనుపడితివి= పూనుకొన్నావు; కానన్= కాబట్టి; ఈ అనలపదము= ఈ అగ్నిహోత్రుడి పదవి; నీకున్+అ= నీకే; తగున్= ఒప్పుతుంది; ఇంకన్= ఇకమీద; నాకున్= నాకు; అలవడదు= ఒప్పదు.

**తాత్పర్యం:** అని చెప్పిన పిదప, అగ్నిహోత్రుడు ఈవిధంగా బదులు పలికాడు. 'మహాశయా!, నా విన్నపం అవధరింప వేడికోలు. నా కీర్తి లోకంలో మరుగుపడింది. నీవా ఇప్పుడు జగజ్జేగీయమానంగా వెలుగొందుతున్నావు. లోకాలు నిన్ను ఆరాధిస్తున్నవి. అందుచేత అగ్నిహోత్రపదవి నీకు మాత్రమే ఒప్పుతున్నది. ఆ పదవి నాకు ఇక సరిపడదు.

**వ. 'నీవు ప్రథమాగ్నివైయుండు; మేను ద్వితీయంబగు ప్రాజాపత్యవహ్నినైవర్తించెద' ననిన నంగిరసుండు 'దేవా! యి ట్లానతీ వలదు; ప్రథమాగ్నిత్వంబు నీవ కైకొని, నన్ను నీకుం బ్రథమపుత్త్రుంగా నాదరింపు' మనినం బావకుండు దాని కొడంబడియె; నివ్విధంబున నంగిరసుం డగ్నికి నగ్రతనయుం డై యగ్నిసారూప్యంబునం దేజరిల్లె; నయ్యంగిరసునకు శివ యను దానికి బృహత్కీర్తియు, బృహజ్జ్యోతియు, బృహద్బ్రహ్మయు, బృహన్మనసుండును, బృహన్మంత్రుండును, బృహద్భానుండును, బృహస్పతియు నన నేడ్వురు గొడుకులు, మఱియు భానుమతియును, రాగయు, సినీవాలియుఁ, గుహువు, నర్చిష్మతియు, మహిష్మతియు, మహామతియు నన నేడ్వురు గూఁతులుం బుట్టిరి. 153**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; ప్రథమ+అగ్నివి+ఐ+ఉండుము= మొదటి అగ్నివి అయి ఉండునది; ఏను= నేను; ద్వితీయంబు+అగు= రెండవది అయిన; ప్రాజాపత్య, వహ్నిని+ఐ= ప్రాజాపత్యం అనే పేరుగల నిప్పునై; వర్తించెదన్= మెలగుతాను; అనినన్= అని చెప్పగా; అంగిరసుండు; దేవా; ఇట్లు+ఆనతి+ఈవలదు= ఈవిధంగా శాసించవలదు; ప్రథమ+అగ్నిత్వంబు= మొదటి అగ్నిగా ఉండే పదవి; నీవు+అ= నీవు మాత్రమే; కైకొని= స్వీకరించి; నన్నున్; నీకున్+ప్రథమ, పుత్త్రున్+కాన్= నీ మొదటి కొడుకు వలె; ఆదరింపుము= కరుణతో కాపాడుము; అనినన్= అని చెప్పగా; పావకుండు= అగ్ని; దానికిన్= (ఆమాటకు); ఒడంబడియెన్= సమ్మతించాడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; అంగిరసుండు; అగ్నికిన్; అగ్రతనయుండు+ఐ= మొదట కొడుకై; అగ్ని, సారూప్యంబునన్= అగ్నితో సమానమైన ఆకారంతో; తేజరిల్లెన్= వెలుగొందాడు; ఆ+అంగిరసునకున్; శివ+అనుదానికిన్=

"శివ'' అనే పేరు గల ఆమెకు; బృహత్కీర్తియున్; బృహత్+జ్యోతియున్; బృహత్+బ్రహ్మయున్; బృహత్+మనసుండును; బృహత్+మంత్రుండును; బృహత్+భానుండును; బృహస్పతియున్; అనన్= అనే పేరులు గల వారలు; ఏడ్వురు, కొడుకులు= ఏడుగురు పుత్రులును; మఱియున్= అదనంగా; భానుమతియును; రాగయున్; సినీవాలియున్; కుహవున్; అర్చిష్మతియున్; మహిష్మతియున్; మహా మతియున్; అనన్= అని పిలువబడే; ఏడ్వురు+కూఁతులున్= ఏడుగురు పుత్రికలు; పుట్టిరి= జన్మించారు.

**తాత్పర్యం:** 'నీవు మొదటి అగ్నిపదవిలో ఉండుము. నేను ప్రాజాపత్యం అనే పేరు గల ద్వితీయ మైన అగ్ని పదవిలో ఉండగలను'. అని అగ్నిహోత్రుడు పలుకగా, అంగిరసుడు ఇట్లు బదులు పలికాడు. 'దేవా! నీవే ప్రథమాగ్ని హోత్ర పదవి గైకొని, నన్ను నీ అనుగు పుత్రుడిగా ఆదరించుము.' ఆ సూచనను అగ్ని ఆమోదించాడు. ఈ విధంగా అంగిరసుడు అగ్నిహోత్రుడికి మొదటి కొడుకు అయ్యాడు. అంగిరసుడికి శివ అనే భార్య వలన ఏడుగురు కొడుకులు- 1. బృహత్కీర్తి 2. బృహజ్జ్యోతి 3. బృహద్బ్రహ్మ 4. బృహన్మనసుడు 5. బృహన్మంత్రుడు 6. బృహద్భానుడు 7. బృహస్పతి పుట్టారు. అంతేకాక ఏడుగురు పుత్రికలు జన్మించారు. వారి పేర్లు వరుసగా ఇవి- 1. భానుమతి 2. రాగ 3. సినీవాలి 4. కుహువు 5. అర్చిష్మతి 6. మహిష్మతి 7. మహామతి.

**విశేషం:** అగ్నులు మూడు విధాలు 1. గార్హపత్యం 2. దక్షిణం 3. ఆహవనీయం. ఇందు ప్రాజాపత్యం అనే అగ్ని గార్హపత్యానికి సంబంధించింది. (ప్రాజాపత్యము= (మీరిరువురు కూడి ధర్మం చేయండని వరుడితో సంభాషించి కన్యాదానం చేసే వివాహవిధికి ప్రాజాపత్యం అని అర్థం.)

**క. తనయుఁడు బృహస్పతికి న । త్యనఘుఁడు శంయుండు పుట్టి యాగంబులలో**
**మునుమును హవిషాజ్యము దాఁ । గొనియెడు వాఁ డయ్యె నధికగుణయుక్తి మెయిన్. 154**

**ప్రతిపదార్థం:** బృహస్పతికిన్= బృహస్పతి అనే కుమారుడికి; తనయుఁడు;= కొడుకు; అతి+అనఘుఁడు= పాపం ఏ మాత్రమున్నూ లేని మహానుభావుడు; శంయుండు; పుట్టి; యాగంబులలోన్= యజ్ఞాలలో; మును మును= ముందుగా; హవిష+ఆజ్యము= హోమద్రవ్యంగా అగ్నిలో వేసే నేతిని; అధిక, గుణయుక్తిమెయిన్= హెచ్చిన మంచి గుణాలతో కూడి ఉండటం చేత; తాన్= తాను; కొనియెడువాఁడు+అయ్యెన్= స్వీకరించేవాడు అయ్యాడు.

**తాత్పర్యం:** అంగిరసుడి కుమారులలో బృహస్పతికి శంయుడు జన్మించాడు. ఆ శంయుడు మహానుభావుడు. గొప్ప గుణాలు కలవాడు. క్రతువులు జరిగేటప్పుడు హోమంలో వేల్చే నేతిని మొట్టమొదట శంయుడికి సమర్పించేవారు. అనగా- క్రతువులలో అతడికి మొదటి పీట వేసి, పూజించేవారు.

**వ. ఆ శంయునకు ధర్మపత్ని యైన సత్యకు భరద్వాజుండును భరతుండును నా నిరువురు కొడుకులు పుట్టి; రందు భరతునకు భారతుం డను కొడుకును, భారతి యను కూఁతురుం బుట్టిరి; భరద్వాజునకు వీర యను దానికి వీరుండు పుట్టె. 155**

**తాత్పర్యం:** ఆ శంయునకున్నూ ఆతని భార్య యైన సత్యకున్నూ భరద్వాజుడు భరతుడు అనే పేరులు గల ఇరువురు కొడుకులు జన్మించారు. ఆ భరతుడికి భారతుఁడు, అనే ఒక కొడుకు భారతి అనే ఒక కూతురు కలిగారు. భరద్వాజునకు అతడి భార్య వీర అనే ఆమెకును వీరుడు అనేవాడు జన్మించాడు.

**క. వానికి సరయువునకుఁ బటు । భానుం డై పుట్టె సుతుఁడు భానుఁ డనఁగ; నా**
**భానునకు నిశ్చ్యవనుఁ డనఁ । గా నాత్మజుఁ డుద్భవించెఁ గడు నుజ్జ్వలుఁ డై. 156**

**ప్రతిపదార్థం:** వానికిన్= ఆ వీరుడికి; సరయువునకున్= సరయువు అనే పేరు గల ఆతని భార్యకు; పటు భానుండు+ఐ= మిక్కిలిగా వెలుగొందువాడై; భానుఁడు+అనఁగన్= భానుడు అనే పేరు కలవాడుగా; సుతుఁడు= కొడుకు; పుట్టెన్= జన్మించాడు; ఆ భానునకున్; నిశ్చ్యవనుఁడు+అనఁగాన్= నిశ్చ్యవనుడు అనే పేరుకలవాడుగా; ఆత్మజుఁడు= కొడుకు; కడున్= మిక్కిలి; ఉత్+జ్వలుఁడు+ఐ= ప్రకాశించేవాడై; ఉద్భవించెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** వీరుడు అనువాడికి తేజస్వి అయిన భానుడు పుట్టాడు. భానుడికి నిశ్చ్యవనుఁడు జన్మించాడు.

**చ. అతనికిఁ బుట్టెఁ బుత్త్రుఁడు నిరంతరతేజుఁ డుదారకీర్తి ని**
**ష్కృతి యను పేరివాఁడు విను కిల్బిషభాజను లైన మానవుల్**
**సతతము నా కృశాను నతిసక్తమనస్స్థితిఁ గొల్చి దోష ని**
**ష్కృతిఁ దగఁ గాంతు; రట్లగుట గీర్తిత మయ్యెఁ దదాఖ్య వానికిన్. 157**

**ప్రతిపదార్థం:** అతనికిన్= (ఆ నిశ్చ్యవనుడికి); పుత్త్రుడు= కొడుకు; నిరంతర, తేజుఁడు= ఎల్లప్పుడు కాంతితో వెలుగొందేవాడు; ఉదార, కీర్తి= గొప్ప యశస్సు కలవాడు; నిష్కృతి+అను, పేరివాఁడు= 'నిష్కృతి' అనే నామం కలవాడు; పుట్టెన్; విను; కల్బిష భాజనులు+ఐన= పాపానికి పాత్రు లైన; మానవుల్= జనులు; సతతమున్= ఎల్లప్పుడును; ఆ కృశానున్= ఆ అగ్నిని; అతి, సక్త, మనస్,+స్థితిన్= మిక్కుటంగా లగ్నమైన చిత్తంతో; కొల్చి= ఆరాధించి; దోష, నిష్కృతిన్= పాపాల నుండి విడుదలను; తగన్= ఒప్పిదముగా, కాంతురు= పొందుతారు; అట్లు+అగుటన్= ఆ విధంగా జరగటం చేత; వానికిన్= ఆ నిష్కృతి అనే పేరు గల వాడికి; తత్+ఆఖ్య= ఆ పేరు; కీర్తితము+అయ్యెన్= పొగడ్తకెక్కినది అయింది.

**తాత్పర్యం:** ఆ నిశ్చ్యవనుడికి మిక్కిలి తేజస్వి అయిన నిష్కృతి అనే పేరు కలవాడు జన్మించాడు. అతడు సార్థక నామధేయుడు. నిష్కృతి అనగా విడుదల. ఆ అగ్నిని ఆరాధించే మానవులకు సమస్త పాపాల నుండి విడుదల లభిస్తూ ఉంటుంది కాబట్టి ఆతడికి అట్టి పేరుప్రతిష్ఠలు ఏర్పడ్డాయి.

**క. ఘనుఁడు రుజస్కరుఁ డనఁగా । జనియించెను నాతనికి; రుజస్కరునకు న**
**త్యనుపమకాంతిపరుం డై । జనియించెం గ్రోధుఁ డనఁగ జనవరతిలకా! 158**

**ప్రతిపదార్థం:** జనవర తిలకా!= రాజ శ్రేష్ఠుడా!; ఆతనికిన్= (ఆ నిష్కృతికి); ఘనుఁడు= గొప్పవాడు; రుజస్కరుఁడు+అనఁగాన్= రుజస్కరుడు అనే పేరు కలవాడు; జనియించెను= పుట్టాడు; రుజస్కరునకున్; అతి+అనుపమ, కాంతి పరుండు+ఐ= మిక్కుటంగా ఉండి, సాటిలేనట్టిదైన వెలుగుతో వెలుగొందేవాడై; క్రోధుఁడు+అనఁగన్= క్రోధుడు అనే పేరు కలవాడు; జనియించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** రాజులలో గొప్పవాడ వయిన ఓ ధర్మరాజా! గొప్పవాడయిన ఆ నిష్కృతికి రుజస్కరుడు జన్మించాడు. ఆ రుజస్కరుడికి క్రోధుఁడు అనేవాడు ఉద్భవించాడు. అతడు అపరిమిత కాంతిమంతుడు.

**వ. ఆ క్రోధునకు రసుండు పుట్టె; రసునకు స్వాహా యను కన్యకయుం గాముం డను కొడుకునుం బుట్టిరి; కామునకు నమోఘుండు పుట్టె; నమోఘునకు నుక్థుండు పుట్టె; మఱియుం గాశ్యపుండును వాసిష్ఠుండును**

**బ్రాణుండును నాంగిరసుండును జ్యవనుండును నను వా రేవురు తేజస్వి యైన కొడుకుం బడయుదు మని యనేక వర్షంబులు ఘోర తపంబు సేసి మహావ్యాహృతిస్మరణంబు సేయుచున్నంత. 159**

**తాత్పర్యం:** క్రోధుడికి రసుడు, రసుడికి స్వాహా అనే కన్యక, కాముడనే కొడుకు పుట్టారు. కాముడికి అమోఘుడు పుట్టాడు. అమోఘుడికి ఉక్థుండు పుట్టాడు. అంతియేకాక-కాశ్యపుడు వాసిష్ఠుడు ప్రాణుడు ఆంగిరసుడు చ్యవనుడు- అనే ఐదుగురున్నూ తేజస్వి అయిన కొడుకును పొందటానికి పెక్కేళ్ళు కఠోరమైన తపస్సు చేసి మహావ్యాహృతిమంత్రాన్ని జపిస్తూ ఉన్నారు.

**విశేషం:** 'వ్యాహృతి'= సంధ్యావందనం చేసే వేళలలో బ్రాహ్మణులు ఉచ్చరించే ఊర్ధ్వలోక నామ సంకీర్తన రూపమైన మంత్ర విశేషం.

**చ. అనలము చాయ మస్తకము, నర్కనిభం బగు బాహుయుగ్మముం,**
**గనకసముజ్జ్వలంబు లగు కన్నులుఁ, జర్మము కృష్ణవర్ణతం**
**దనరిన జంఘలుం గల యుదాత్తపు దేహము దేజరిల్లఁగాఁ**
**దనయుఁడు పుట్టె వారలకుఁ దద్దయు నద్భుత మంద లోకముల్. 160**

**ప్రతిపదార్థం:** అనలము= నిప్పు; చాయ= రంగు; మస్తకము= శిరస్సు; అర్క, నిభంబు+అగు= సూర్యుడితో సరిపోలునట్టి; బాహు, యుగ్మమున్= చేతుల జంటయును; కనక, సమ్, ఉత్+జ్వలంబులు+అగు= బంగరువలె మెరసిపోయే; కన్నులున్= నేత్రాలును; చర్మము= తోలు; కృష్ణవర్ణతన్= నల్లని రంగుతో; తనరిన= ఒప్పిన; జంఘలున్= కాలి పిక్కలును; కల= ఉన్న; ఉదాత్తపు దేహము= గొప్ప దైన శరీరం; తేజరిల్లఁగాన్= ప్రకాశించగా; వారలకున్= వారికి (ఆ యేవురకును); లోకముల్= భువనాలు; తద్దయున్= మిక్కుటంగా; అద్భుతము+అందన్= అచ్చెరువు పొందేటట్లుగా; తనయుఁడు= కొడుకు; పుట్టెన్= జన్మించాడు.

**తాత్పర్యం:** ఆ యేవురకును జగములు అచ్చెరువు పొందేటట్లుగా ఒక కొడుకు జన్మించాడు. ఆ పుత్రుడి దేహం మిక్కిలి ఉదాత్తమైనది. ఆతడి శిరస్సు నిప్పురంగు కలది. రెండు చేతులు సూర్యుడి వలె మిరుమిట్లు కొల్పుతూ వెలుగొందు నట్టివి. కన్నులు బంగరు వన్నె ధగధగలు కలవి. అతడి శరీరం నల్లనిది. బలమైన పిక్కలు అతనికి ఉన్నాయి.

**వ. ఇట్లు పుట్టిన యప్పావకుండు పంచజనకప్రభవుండు గావునం బాంచజన్యుం డను పేరం బ్రసిద్ధుం డై దశ సహస్రవర్షంబులు దపంబు సేసి నిజమస్తకంబున బృహద్రథంతరులనువారలను, వదనంబున హరిని, నాభియందు శివుని, బలంబున నింద్రునిం, బ్రాణముల వాయ్వగ్నులను, బాహుయుగదంతపుటంబుల విశ్వభూతంబుల సృజియించె మఱియును. 161**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పుట్టిన= జన్మించిన; ఆ పావకుండు= ఆ అగ్ని; పంచ, జనక, ప్రభవుండు= ఐదుగురు తండ్రులకు పుట్టిన వాడు; పాంచజన్యుండు= పాంచజన్యుడు (అయిదుగురకు పుట్టినవాడు); అను, పేరన్= అనే పేరు మీద; ప్రసిద్ధుండు+ఐ= కీర్తి కెక్కిన వాడై; దశ, సహస్ర, వర్షంబులు= పది వేల ఏండ్లు; తపంబు+చేసి= తపస్సు ఆచరించి; నిజ, మస్తకంబునన్= తనదైన శిరస్సునందు; బృహద్రథంతరులు+అను, వారలను= బృహద్రథంతరులు అనే వారలను; వదనంబునన్=

మొగము నందు; హరిని= విష్ణువును; నాభియందున్= బొడ్డునందు; శివునిన్= ఈశ్వరుడిని; బలంబునన్= శుక్లం వలన; ఇంద్రునిన్= వేల్పుల దొర అయిన ఇంద్రుడిని; ప్రాణములన్= అసువులనుండి; వాయు+అగ్నులను= గాలిని నిప్పును; బాహు, యుగ, దంత, పుటంబులన్= చేతుల జంటలోను పళ్ళ దొప్పలలోను; విశ్వ, భూతంబులన్= సమస్త పదార్థాలను; సృజియించెన్= నిర్మించాడు; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** ఈ రీతిగా జన్మించిన ఆ అగ్నిదేవుడు అయిదుగురుతండ్రులకు పుట్టినవాడు కావున 'పాంచజన్యుడు' అనే పేరుమీద విలసిల్లాడు. అతడు పదివేలసంవత్సరాలు తపస్సు చేశాడు. అతడిశిరస్సునుండి బృహద్రథంతరులు పుట్టారు. ఆతడి మొగంనుండి విష్ణువు ఉద్భవించాడు. నాభినుండి శివుడు పుట్టాడు. వీర్యం నుండి ఇంద్రుడు జన్మించాడు. ప్రాణాలనుండి వాయువు అగ్ని జన్మించారు. చేతులజంటనుండి దంతాల నుండి సమస్త భూతాలు ఆవిర్భవించాయి. అంతియ కాక.

**విశేషం:** 'నిజ మస్తకంబున బృహదంతరు లను వారలను' అని పెక్కు తెలుగు వ్రాత ప్రతులలో ఉన్నది. కాని సంస్కృతమూలంలో "బృహద్రథంతరం మూర్ధ్నో వక్త్రా ద్వాతరసా హరౌ'' అని ఉన్నది. (చిత్రశాలా ప్రతి. 3-220-7).

**క. తపుఁ డను వహ్ని నిరంతర । తపోనిరూఢుఁ డయి పంచదశపుత్త్రుల న**
**త్యపరిమిత ఘోర తేజో । విపులాత్ములఁ గనియెఁ గపటవృత్తినిపుణులన్. 162**

**ప్రతిపదార్థం:** తపుఁడు+అను, వహ్ని= తపుడు అనే పేరు కల అగ్ని; నిరంతర, తపస్+నిరూఢుఁడు+అయి= ఎల్లప్పుడును తపస్సు చేయటంలోనే మిక్కుటమైన దీక్షకలవాడు అయి; అతి+అపరిమితమైన ఘోర, తేజస్+విపుల+ఆత్ములన్= మిక్కుటమైన దారుణమైన ప్రకాశంతో ఎక్కువగా కూడుకొని ఉన్నట్టి వారలను అనగా మిక్కిలి భయంకరమయిన తేజస్సుతో వెలుగొందే వారలను; కపట, వృత్తి, నిపుణులన్= మోసం చేయటంలో మిక్కిలి సామర్థ్యం కలవారిని; పంచ, దశ పుత్త్రులన్= పదునైదుమంది కొడుకులను; కనియెన్= (కొడుకులుగా) పొందాడు.

**తాత్పర్యం:** 'తపుడు'- అనే పేరు గల ఆ అగ్నిహోత్రుడు భయంకరమైన తేజస్సుతో జాజ్వల్యమానంగా వెలుగొందే కొడుకులు పదునైదుగురిని కన్నాడు. ఆ పుత్రులు మోసం చేయటంలో మిక్కిలి సామర్థ్యం కలవారు.

**వ. ఆ పదియేవురు సుభీముండు, నతిభీముండును భీముండును భీమబలుండును నతిబలుండు నను వా రొక్క మొగియును, సుమిత్త్రుండును మిత్త్రవంతుఁడును మిత్త్రజ్ఞుండును మిత్త్ర వర్ధనుండును మిత్త్రధర్ముండును నను వా రొక్క మొగియును, సురప్రవీరుండును వీరుండును సువేషుండును సువర్చసుండును సురహంతయు నను వారొక్క మొగియునుగానిట్లు మూఁడుమొత్తంబు లై యజమానుల యజ్ఞఫలంబు లపహరించు చుండుదురు; తత్ప్రశాంత్యర్థంబై యాగంబులందు నగ్నిచయనంబు సేయునది. 163**

**ప్రతిపదార్థం:** ఆ పది+ఏవురు= ఆ పదునైదు మంది; సుభీముండును; అతి భీముండును; భీముండును; భీమబలుండును; అతిబలుండు అనువారు; ఒక్క, మొగియును= ఒక పక్షంలోనూ; సుమిత్రుండును, మిత్రవంతుండును, మిత్రజ్ఞుండును, మిత్రవర్ధనుండును మిత్రధర్ముండును అనువారు; ఒక్క మొగియును= ఒక పక్షంలోను; సురప్రవీరుండును, వీరుండును, సువేషుండును, సువర్చసుండును, సురహంతయును; అనువారు; ఒక్క, మొగియును= ఒక పక్షమున్నూ; కాన్= ఒక వర్గం లోని వారలు అగునట్లుగా; ఇట్లు= ఈ రీతిగా; మూఁడు, మొత్తంబులు+ఐ= మూడు కక్ష్యలుగా చీలి; యజమానుల యజ్ఞ

ఫలంబులు= యజ్ఞాలు చేసేవారి యజ్ఞఫలాలు; అపహరించు చుండుదురు= దొంగలిస్తూ ఉంటారు; తత్+ప్రశాంతి+అర్థంబు+ఐ= వారలను అదుపులో పెట్టేదానికై; యాగంబులందున్= క్రతువులలో; అగ్ని, చయనంబు= అగ్నిని సంస్కరించటం; చేయునది= చేయాలి.

**తాత్పర్యం:** తపుడికి పదునైదుగురు పుత్రులు పుట్టి, మూడువర్గాలుగా చీలి పోయారు. ఒక వర్గంలో ఉన్నవారు. 1. సుభీముడు 2. అతిభీముడు 3. భీముడు 4. భీమబలుడు 5. అతిబలుడు. మరియొక వర్గంలోని వారు 1. సుమిత్రుడు 2. మిత్రవంతుడు 3. మిత్రజ్ఞుడు 4. మిత్రవర్ధనుడు 5. మిత్రధర్ముడు. మూడవవర్గంలోని వారు. 1. సురప్రవీరుడు 2. వీరుడు 3. సువేషుడు 4. సువర్చసుడు 5. సురహంత. పై మూడు వర్గాలలోని పదునైదుగురు యజ్ఞాలను చేసేవారిని బాధించి వారినుండి యజ్ఞఫలాలను దొంగిలిస్తూ ఉన్నారు. వారిని అదుపులో పెట్టటానికి అగ్నికి సంస్కారం చేయటం అవసరమైనది.

**తే.** **అధిప! విహగాకృతుల నొప్పు నగ్ని చయన । ముల యుదగ్రపక్షాఘాతములను విప్ర**
**వరుల మంత్రఘోషములను వారు నిహతు । లై భయంపడి చేరరు యజ్ఞభూమి.** **164**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! (ఓ ధర్మరాజా!); విహగ+ఆకృతులన్= పక్షుల ఆకారాలచేత; ఒప్పు= విలసిల్లే; అగ్ని, చయనములన్= అగ్నులను పేర్చటం చేత; ఉదగ్ర, పక్ష, ఆఘాతములను= గొప్పవైన రెక్కల తాకిడి చేతను; విప్ర వరుల, మంత్ర, ఘోషములను= బ్రాహ్మణోత్తములు మంత్రాలను పెద్దగా చదవటం చేతను; వారు= ఆ పదునేవురు యజ్ఞఫల హర్తలు; నిహతులు+ఐ= కొట్టబడిన వారై; భయము,పడి; భయంపడి= భీతిచెంది; యజ్ఞభూమిన్= యజ్ఞం జరిగే ప్రదేశాన్ని; చేరరు= సమీపించరు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆ పదునేవురిని విప్రులు భయపెట్టి యజ్ఞశాలను చేర నివ్వరు. బ్రాహ్మణోత్తములు మంత్రాలను ఉచ్చరించటంచేతనున్నూ, అగ్నులను పక్షులఆకారంతో పేర్చటంచేతనున్నూ, వారు రెక్కలచేత కొట్టబడి యజ్ఞశాలను చేరరు.

**వ.** **తపుండు మఱియు సకలయజ్ఞభాగభుజు లైన పుత్త్రుల నేవురం గనియె; నం దగ్రజుండు.** **165**

**తాత్పర్యం:** తపుడు సమస్త యజ్ఞభాగాలనూ భుజించేవారైన అయిదుగురు కొడుకులను కన్నాడు. వారిలో పెద్దవాడు.

**సీ.** **వైశ్వానరుం డను వహ్ని చాతుర్మాస్య । విధులందు భూసురవితతిచేతఁ**
**బర్జన్యసహితుఁ డై పరమార్చనముఁ గాంచు । నధిప!; రెండగు నాతఁ డఖిలమునకుఁ**
**బ్రభుఁడు దానై విశ్వపతి యన విలసిల్లు; । వినుము! మూఁడగు వాఁడు విశ్వమునకు**
**నాత్ముఁడై విశ్వకుం డన నొప్పు; నాలవు । నతఁడు భూతముల యాహార వితతి**

**తే.** **వెలయఁ బక్వము సేయుట విశ్వభుక్కు । నాఁగఁ బెంపొందు; గోపతి నామధేయుఁ**
**డై సమస్తధర్మక్రియలందు హేతు । వై ప్రశస్తి వహించు నేనగు నతండు.** **166**

**ప్రతిపదార్థం:** అధిప= ఓ రాజా!; వినుము; వైశ్వానరుండు+అను, వహ్ని= వైశ్వానరుడు అనే పేరు గల అగ్ని; చాతుర్మాస్య, విధులందున్= నాలుగు నెలల దీక్షకు సంబంధించిన నోములలో; భూసుర వితతిచేతన్= బ్రాహ్మణుల సముదాయంచేత;

పర్జన్య సహితుఁడు+ఐ= మేఘుడితో కూడుకొన్న వాడై; పరమ+అర్చనమున్+కాంచున్= గొప్ప పూజను పొందుతాడు; రెండు+అగు+ఆతఁడు= రెండవ వాడు; అఖిలమునకున్= అంతటికిని; ప్రభుండు= పాలకుడు; తాను+ఐ= తానే అయి; విశ్వపతి+అనన్= విశ్వపతి అనే పేరున; విలసిల్లున్= ఒప్పారును; మూఁడు+అగు, వాఁడు= మూడవవాడు; విశ్వమునకున్= ప్రపంచానికి; ఆత్ముఁడు+ఐ= అంతర్యామి అయి; విశ్వకుండు+అనన్+ఒప్పున్= విశ్వకుడు అనే పేరుతో విలసిల్లుతాడు; నాలవు+అతఁడు= నాలుగవ వాడు; భూతముల= జీవులయొక్క; ఆహార వితతి= తినుబండారాల సముదాయాన్ని; వెలయన్= ఒప్పిదంగా; పక్వము+చేయుట= మ్రగ్గేటట్లుగా చేయటం వలన; విశ్వభుక్కు, నాఁగన్= విశ్వభుక్కు అనే పేరుతో; పెంపొందున్= విస్తరిస్తాడు; గోపతి నామధేయుఁడు+ఐ= గోపతి అనే పేరు కలవాడై; ఏను+అగు+అతండు= ఐదవ వాడు; సమస్త, ధర్మ, క్రియలందున్= అన్ని విధాలైన ధర్మకార్యాలలో హేతువు+ఐ= కారణభూతుడై; ప్రశస్తి, వహించున్= కీర్తిని పొందుతాడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! తపుడు (యజ్ఞఫలహర్తలైన ఆ పదిహేనుమంది పుత్రులను మాత్రమే గాక) యజ్ఞభాగభోక్త లైన కొడుకుల నైదుగురను కన్నాడు. వారిలో మొదట పుట్టినవాడు 'వైశ్వానరుడు' . ఆ వైశ్వానరుడు- బ్రాహ్మణులచేత మేఘుడితో పాటు పూజించబడేవాడు. నాలుగునెలల నోములలో అతడు అర్చించబడేవాడు. ఓ ధర్మరాజా! రెండవవాడి పేరు - విశ్వపతి. సార్థక నామధేయుడు. అతడు సమస్తసృష్టికి ప్రభువు. మూడవవాడి పేరు 'విశ్వకుడు' అతడు విశ్వానికి అంతర్యామి. నాలుగవవాడి పేరు 'విశ్వభుక్కు'. అతడు భూతాల తినుబండారాలను పక్వం చేసేవాడు. అయిదవవాని పేరు 'గోపతి'. అతడు సర్వధర్మక్రియలకు హేతుభూతుడు.

**వ. మఱియు భానుం డను వహ్నికి సోమపుత్త్రియైన బృహద్భాసయందు బలదుండును మన్యుమంతుండును ధృతిమంతుండును నాగ్రయణుండును నగ్నియు సోముండును నన నార్వురు గొడుకులు నిశ యను కూఁతురుం బుట్టిరి; సకలతపఃఫలంబులు నిర్వహించుట కయి పురందరుండు మను నామ ధేయుం డైన కొడుకుం బడసె; నమ్మనువు భానుపుత్త్రియైన నిశాకన్యం బెండ్లియై, ప్రాజాపత్యం డను పేరఁ బరఁగి పరమబ్రాహ్మణులచేత నర్చితుం డయ్యె; నివ్విధంబున ననేక వహ్నులు సకలధర్మ క్రియాసాధకు లై వెలింగిరి; దక్షిణాగ్ని ప్రముఖంబు లైన వహ్నులు వాయుహతిం జేసి యన్యోన్య సంస్పృష్టంబు లయ్యె నేనియు, రజస్వలాది సంకరంబులం బొరసె నేనియు, మృతక జాతకాది సంస్పర్శనంబునం బొందెనేనియుఁ, దత్ప్రాయశ్చిత్తార్థం బై యష్టాకపాలేష్టి సేయ వలయు' నని చెప్పి మఱియు మార్కండేయుం డిట్లనియె.167**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; భానుండు+అను, వహ్నికిన్= భానుడు అనే పేరు కల అగ్నికి; సోమపుత్త్రి+ఐన= సోముడి కూతురు అయిన; బృహద్భాసఅందున్; బలదుండును; మన్యుమంతుండును; ధృతిమంతుండును; ఆగ్రయణుండును; అగ్నియున్; సోముండును; అనన్= అనగా; ఆర్వురు కొడుకులు= ఆరుగురు కుమారులు; నిశ+అను, కూఁతురున్= నిశ అనే పేరు కల పుత్త్రికయు; పుట్టిరి= జన్మించారు; సకల, తపస్+ఫలంబులు= అన్ని తపస్సులయొక్క ఫలితాలను; నిర్వహించుటకున్+ అయి= సాధించటం కొరకు; పురందరుండు= పురందరుడు అనేవాడు; మను నామ ధేయుండు+అయిన= మనువు అనే పేరు కలిగినట్టి; కొడుకున్+పడసెన్= పుత్రుడిని కన్నాడు; ఆ+మనువు; భానుపుత్త్రి+ఐన= భానుడు అనే వాడి కూతురు అయిన; నిశా కన్యన్= రాత్రి అనే కన్నెను; పెండ్లి+ఐ= వివాహ మాడి; ప్రాజాపత్యుండు; అను, పేరన్+పరఁగి= అనే నామంతో విలసిల్లి; పరమ, బ్రాహ్మణులచేతన్= గొప్ప విప్రుల చేత; అర్చితుండు+అయ్యెన్= పూజించబడ్డాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా; అనేక వహ్నులు= పెక్కు అగ్నిహోత్రులు; సకల, ధర్మ, క్రియా, సాధకులు+ఐ= అన్ని ధర్మ కార్యాలను సాధించే వారయి; వెలింగిరి= ప్రకాశించారు; దక్షిణ+అగ్ని, ప్రముఖంబులు+ఐన= దక్షిణాగ్ని మున్నగు నట్టివి

అయిన; వహ్నులు= నిప్పులు; వాయు, హతిన్+చేసి= గాలిచేత కొట్టబడటంచేత; అన్యోన్య, సంస్పృష్టంబులు= ఒక దానితో మరియొకటి కలయిక చెంది నట్టివి; అయ్యెన్+ఏనియున్= అయినప్పటికిని; రజస్వల+ఆది, సంకరంబులన్= ముట్టు అయిన ఆడువారిమైల సోకటం, పొరిసెన్+ఏనియున్= పొందినప్పటికిని; మృతక, జాతక+ఆది, సంస్పర్శనంబునన్+పొందెను+ఏనియున్= చావు, పుట్టుక మొదలైన వాటిచేత కలిగే మైల సోకటం వలన దోషం కలిగినప్పటికి; తత్+ప్రాయశ్చిత్త+అర్థంబు+ఐ= ఆ దోష నిష్కృతి కొరకై; అష్టా కపాల+ఇష్టి= ఎనిమిది మట్టి పాత్రలచేత సంస్కరించబడెడి క్రతువు; చేయన్‌వలయున్= చేయాలి; అని; చెప్పి; మఱియున్; మార్కండేయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'భానుడు అనే వహ్నికి అతడి భార్య (సోమపుత్రి) అయిన బృహద్భాస యందు బుధుడు, మన్యుమంతుడు, ధృతిమంతుడు, ఆగ్రయణుడు, అగ్ని, సోముడు అనే ఆర్గురు కొడుకులున్నూ, నిశ అనే కూతురున్నూ కలిగారు. పురందరుడు సర్వతపస్సులఫలాలు పొందటానికై మనువు అనే పేరు గల కొడుకును కన్నాడు. ఆ మనువు భానువహ్నిపుత్రిక అయిన నిశ అనే వధువును పెండ్లాడాడు. ఆ మనువుకే ప్రాజాపత్యుడు అనే గౌరవ నామధేయం ఏర్పడింది. అతడిని బ్రాహ్మణోత్తములు పూజించారు. ఈ విధంగా పెక్కు వహ్నులు ధర్మక్రియలకు హేతుభూతులు అయ్యారు. దక్షిణాగ్ని మొదలైనవి గాలి తాకిడికి ఒకదానితో ఒకటి కలిసి పోయినప్పుడున్నూ; ముట్టయిన స్త్రీలు తాకుట చేతనున్నూ ఏర్పడిన దోషాలను పరిహరించటానికి, పురుడువలన మరణంవలన ఏర్పడే మైలచేత కలిగే దోషాలను పరిహరించటానికి 'అష్టాకపాలేష్టి' ఎనిమిది మట్టి పాత్రలలో అగ్నికి సంస్కారం చేసి చేసే క్రతువు చేయవలసి వస్తుంది' అని చెప్పి, మరల మార్కండేయమహర్షి ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** సోమపుత్రి అను నెడ సోముడి కూతురు అని అర్థం చెప్పుకొనటమే ఉత్తమ పద్ధతి. సోముడు అనగా చంద్రుడు, శివుడు, వాయువు, పితృదేవతలలో ఒకడు, వసువులలో ఒకడు, కుబేరుడు, యముడు, సుగ్రీవుడు అనే వివిధార్థాలు ఉన్నాయి. అట్లే మనువు, భానుడు మున్నగు చోట్ల అవి నామధేయాలుగానే స్వీకరించాలి.

**క. 'ఆపుఁ డను వహ్ని యతులిత । రూప యయిన ముదిత యను తరుణియందు జగ**
**ద్దీపకు నపారతేజు మ । హాపూజ్యం గనియె నగ్ని నద్భుతనామున్. 168**

**ప్రతిపదార్థం:** ఆపుఁడు+అను, వహ్ని= 'ఆపుడు' అనే పేరు కల అగ్ని; అతులిత, రూప+అయిన= సాటి లేని అందం గల; ముదిత+అను, తరుణి+అందున్= ముదిత అనే పేరుకల జవ్వనియందు; జగత్+దీపకున్= లోకాలను వెలుగొంద జేసే వాడిని; అపార తేజున్= మిక్కిలి ఎక్కువ అయిన కాంతి కలవాడిని; మహా, పూజ్యున్= గొప్పగా ఆరాధించబడే వాడిని; అద్భుత నామున్= అచ్చెరువు కొలిపే పేరు కల వాడిని; అగ్నిన్= అగ్నిని; కనియెన్= కన్నాడు (పుత్రుడుగా పడశాడు).

**తాత్పర్యం:** ఆపుడు అనే వహ్నికిని, అతిలోక సౌందర్యవతి అయిన ముదితకు అచ్చెరువు గొలిపే పేరు కల 'అగ్ని' ముద్దుబిడ్డ అయి జన్మించాడు.

**విశేషం:** మానవచరిత్రలో నాగరకతా క్రమపరిణామ వికాసంలో 'అగ్ని' నిర్వహించిన భూమిక ఉగ్గడించ దగింది. అగ్ని బహుముఖ ప్రయోజనాలను నిర్వహించింది. నిత్యాగ్నిహోత్రతత్పరులు- అగ్నిసంప్రదాయాన్ని నిలబెట్టి యున్నారు. అర్థవాద రూపాన ఈ అగ్నిహోత్రాలను నిర్వహించిన కుటుంబాల వివరణాన్ని ఈ ప్రకరణంలో మహాభారతం వివరించినట్లు ఎంచవచ్చును.

**చ. అతఁడు త్రిలోకతంత్రము నిరంతర మై చన నిర్వహించుచున్**
**శతమఖుఁ డాది యైన సురసంతతికిం బ్రియ మొప్ప హవ్యముల్**
**సతతము మోచి యిచ్చుచు భృశం బగు తద్భర మోర్వలేక సు**
**వ్రత నిరతుం డధర్వుఁ డనువానికి నిట్లను నాదరంబుతోన్. 169**

**ప్రతిపదార్థం:** అతఁడు= (ఆ అగ్ని); త్రిలోక తంత్రము= మూడు భువనాల వ్యవహారం; నిరంతరము+ఐ+చనన్= ఎల్లప్పుడును కొనసాగేదిగా జరుగగా; నిర్వహించుచున్= నెరపుతూ; శతమఖుఁడు+ఆది+ఐన= దేవేంద్రుడు మొదలైన; సుర సంతతికిన్= వేల్పుల సముదాయానికి; ప్రియము+ఒప్పన్= ప్రీతి విలసిల్లేటట్లుగా; హవ్యముల్= హోమంలో వేల్చే ద్రవ్యాలు; సతతమున్= ఎల్లప్పుడు; మోచి+ఇచ్చుచున్= బరువును భరించి ఇస్తూ; భృశంబు+అగు= మిక్కుటమైన; తత్+భరమున్= ఆ బరువును; ఓర్వలేక= భరించలేక; సువ్రత, నిరతుండు= మంచి నోమును దీక్షతో నెరవేర్చునట్టి (ఆ అగ్ని); అధర్వుఁడు+అను వానికిన్ అధర్వుడు అనే పేరు గలవానికి; ఆదరంబుతోన్= మన్ననతో; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** మూడులోకాల వ్యవహారాలను ఎడతెగనిదీక్షతో అగ్ని నిర్వహిస్తున్నాడు. దేవేంద్రుడు మున్నగు వేల్పులకు యజ్ఞాలలో సమర్పించబడే హోమద్రవ్యాలను తాను మోచి సంప్రీతితో వారికి సమర్పిస్తూ ఉన్నాడు. ఈ నిరంతరభారాన్ని చాలాకాలం నిర్వహించిన పిదప, డస్సి, అగ్ని- అధర్వుడు అనే వాడిని చేరి గౌరవంతో కూడిన అభిమానంతో ఇట్లా పలికాడు.

**వ. 'ఏను దుర్బలుండ నైతి; నీవు దేవతలకు హవ్యంబులు మోచి యి' మ్మని వానిం బంచి, తాను సముద్రంబు సొచ్చి యందు దాఁగుటయు, దేవత లద్దేవముఖుం డున్న యెడ రోయం దొడంగిన నబ్ధిచరంబు లైన మత్స్యంబులు సురలకు నగ్నిదేవుండు జలధి నుండుట సెప్పుటయుం గనలి యనలుండు మీలం జూచి' జనంబులు మిమ్ము నిర్దయు లై వధియింతురు గావుత' మని శాపం బిచ్చె; నప్పుడు. 170**

**ప్రతిపదార్థం:** ఏను= నేను (అనగా అగ్ని); దుర్బలుండన్+ఐతి(ని)= బలం లేనివాడను అయినాను; నీవు= నీవు; దేవతలకున్= వేల్పులకు; హవ్యంబులు= హోమంలో వేల్చబడిన ద్రవ్యాలు; మోచి+ఇమ్ము+అని= వహించి ఇమ్ము అని; వానిన్= అధర్వుడిని; పంచి= నియమించి; తాను= అగ్ని; సముద్రంబు= సముద్రంలో; చొచ్చి= ప్రవేశించి; అందున్= ఆ సముద్రంలో; దాఁగుటయున్= రహస్యంగా నివసించటమున్నూ; దేవతలు= వేల్పులు; ఆ+దేవముఖుండు= ఆ అగ్ని; ఉన్న+ఎడన్= ఉన్నచోటు; రోయన్+తొడంగినన్= వెదకటానికి పూనుకొనగా; అబ్ధిచరంబులు+ఐన= సముద్రంలో తిరుగాడునట్టి; మత్స్యంబులు= చేపలు; సురలకున్= దేవతలకు; అగ్ని దేవుండు; జలధిన్+ఉండుట+చెప్పుటయున్= సముద్రంలో (దాగి) ఉండటాన్ని చెప్పగా; కనలి= కోపగించి; అనలుండు= అగ్నిహోత్రుడు; మీలన్+చూచి= చేపలను చూచి; జనంబులు= ప్రజలు; మిమ్మున్= మిమ్ము (చేపలను); నిర్దయులు+ఐ= జాలి లేని వారై; వధియింతురు+కావుతన్= చంపుదురు గాక!; అని; శాపంబు+ఇచ్చెన్= శాపం ఇచ్చాడు; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** 'నేను ఇంక బలంలేనివాడను అయినాను. ఓ అధర్వుడా! నీవు దేవతలకు హోమద్రవ్యాలను మోచికొనిపోయి అందించునది' అని పలికి అతడిని అందుకు నియమించి, అగ్నిహోత్రుడు సముద్రంలో ప్రవేశించి దాగాడు. అంతట వేల్పులు అగ్నిదేవుడు ఎచట దాగాడో తెలియటానికై వెదక సాగారు. సముద్రంలో చరించే చేపలు అగ్నిదేవుడి ఉనికి దేవతలకు తెలియ చెప్పాయి. అప్పుడు చేపలపై ఆగ్రహించి అగ్నిదేవుడు 'జనులు జాలి లేకుండగా మిమ్ము చంపగలరు' అని శాప మిచ్చాడు.

**విశేషం:** శాపం:- భవిష్యత్కాలంలో అవశ్యంగా జరుగ గలదు అనే విధి వాక్యం. ఇందులో మూడు అంగాలు ఉంటాయి. 1. భవిష్యదర్థకం ఇది. 2. శపించేవాడు గొప్ప మహిమ కలవాడై ఉంటాడు. 3. ఇది కోపహేతువు. ఫలము ఏదో ఒక కీడు.

**ఆ. హవ్య వహనమునకు నమరోత్తములు దన్ను । వేయువిధుల నొలసి వేఁడుకొనిన**
**నెట్లు నియ్యకొనక యెంతయు విసిగి స । మీరసఖుఁడు దనదుమేను విడిచె. 171**

**ప్రతిపదార్థం:** హవ్య వహనమునకున్= హోమంలో వేల్చిన ద్రవ్యాలను మోయటానికి; అమర+ఉత్తములు= వేల్పులలో గొప్పవారు; తన్నున్= తనను (అగ్నిని); వేయు విధులన్= అనేక విధాలుగా; ఒలసి= పూని; వేడుకొనినన్= ప్రార్థించగా; ఎట్లున్= ఏ రీతిగా; ఇయ్యకొనక= అంగీకరించక; ఎంతయున్= మిక్కిలి; విసిగి= అలసి పోయి; సమీరసఖుఁడు= గాలి నెచ్చెలి - అగ్ని; తనదు మేను= తన శరీరం; విడిచెన్= వదిలాడు.

**తాత్పర్యం:** దేవతలలో శ్రేష్ఠులు అగ్నిహోత్రుడిని మరల హోమద్రవ్యాలను మోచి తమకు అందించాలని వేయి విధాల ప్రార్థించారు. కాని, అగ్ని అందులకు సమ్మతించలేదు. అంతే కాక, అతడు విసిగి వేసారి తనదేహాన్ని త్యజించాడు.

**వ. ఇట్లు సంత్యక్తశరీరుం డై ధరాతలంబు ప్రవేశించుటయు, నతనిచేత విడువంబడిన దేహంబువలనం బూయంబున గంధకంబు, నస్థుల దేవదారువును, శ్లేష్మంబున స్ఫటికంబును, బిత్తంబున మరకతంబును, వాతంబునఁగృష్ణశిలయు, నఖంబుల నభ్రకంబును, స్నాయుసంచయంబునం బ్రవాళంబునుం బుట్టె; నతండు భూగర్భస్థితుండై ఘోరతపంబుసేయుచున్నంత భృగ్వంగిరఃప్రముఖులైన మహామునులు నిజతపోబలంబున నతనికి నాప్యాయనంబు సేయుటయుఁ దేజస్వి యై ధరణి వెలువడి వచ్చి యమ్మహాత్ముం డమ్మహామునులం జూచి తదీయతేజంబు దనకు దుస్సహం బగుటయు భయంపడి క్రమ్మఱ నంబుధి సొచ్చి యడంగిన. 172**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; సంత్యక్త శరీరుండు+ఐ= వదలి పెట్టబడిన దేహం కలవాడై - అనగా దేహాన్ని త్యజించిన వాడై; ధరాతలంబు= భూమి ప్రదేశాన్ని; ప్రవేశించుటయున్= చొరబడటమున్నూ; అతని చేతన్; విడువన్+పడిన= వదలిపెట్టబడిన దేహంబువలనన్= శరీరంలోని; పూయంబునన్= చీము రసినుండి; గంధకంబున్= గంధకము (ఉపధాతు విశేషమైన మందు దినుసు) (దీపావళి 'రోలు రోకలి' ప్రేలుడు పదార్థాలలో ఒకటి); అస్థులన్= ఎముకల నుండి; దేవదారువును= దేవదారు చెట్టును; శ్లేష్మంబునన్= కఫం నుండి; స్ఫటికంబును= కర్పూరమును; పిత్తంబునన్= పిత్తమనే దేహ ధాతువు నుండి; మరకతంబును= నవరత్నాలలో ఒకటి అయిన; 'పచ్చ'ను; వాతంబునన్= దేహధాతువులలో ఒకటి అయిన గాలి నుండి; కృష్ణ శిలయున్= పాషాణాన్ని (నల్లరాయిని); నఖంబులన్= గోళ్ల నుండి; అభ్రకంబును= బేగడను (కాకిబంగారము); స్నాయు సంచయంబునన్= నరాల, రక్త నాళాల సముదాయం నుండి; ప్రవాళంబునున్= పగడమును; పుట్టెన్= ఆవిర్భవించాయి; అతండు= (ఆ అగ్నిహోత్రుడు); భూగర్భ స్థితుండు+ఐ= భూమిలోపలి భాగంలో ఉన్నవాడై; ఘోరతపంబు= కఠిన మైన తపస్సు; చేయుచున్+ ఉన్నంతన్= సలుపుతూఉండగా; భృగు+అంగిరస్+ప్రముఖులు+ఐన= భృగువు అంగిరసుడు మున్నగు; మహా+మునులు= గొప్ప ఋషులు; నిజ, తపస్+బలంబునన్= తమ దైన తపస్సు యొక్క గొప్ప శక్తి వలన; అతనికిన్= (అగ్ని హోత్రుడికి); ఆప్యాయనంబు+చేయుటయున్= తృప్తి కల్గించగా; తేజస్వి+ఐ= కాంతి కలవాడై; ధరణిన్= భూమినుండి; వెలువడి వచ్చి= బయటకు వచ్చి; ఆ+మహా+ఆత్ముండు= ఆ గొప్పవాడు (అగ్ని హోత్రుడు); ఆ+మహా+మునులన్= ఆ గొప్ప ఋషులను; చూచి= కాంచి; తదీయ, తేజంబు= వారల యొక్క కాంతి; తనకున్= (అగ్నిహోత్రుడికి); దుస్సహంబు=

సహించటానికి అలవికానిది; అగుటయున్; భయంపడి= భీతిచెంది; క్రమ్మఱన్= మరల; అంబుధి+చొచ్చి= సముద్రంలో ప్రవేశించి; అడంగినన్= దాగి ఉండగా.

**తాత్పర్యం:** ఈ విధంగా, శరీరాన్ని విడిచిపెట్టినవాడై అగ్నిదేవుడు భూమిలోకి ప్రవేశించాడు. అట్లా అగ్ని చేత విడువబడిన కళేబరంనుండి ఎన్నియో పదార్థాలు ఆవిర్భవించాయి. చీమురసినుండి గంధకం ఏర్పడింది. ఎముకలనుండి దేవదారు చెట్లు పుట్టాయి. కఫంనుండి కర్పూర మేర్పడింది. పిత్తంనుండి నవరత్న విశేషమైన 'పచ్చ' జనించింది. వాతంనుండి పాషాణశిల రూపొందింది. గోళ్ల నుండి కాకిబంగారం ఉద్భవించింది. నరాల, రక్త, నాళాల నుండి పగడ మేర్పడింది. అగ్నిహోత్రు డాపైన భూగర్భంలోనే ఉండి కఠోరతపస్సు చేశాడు. భృగుడు మున్నగు మహర్షులు అతడి తపస్సును మెచ్చి అతడిని ఆశీర్వదించారు. అగ్నిహోత్రు డంతట తృప్తి చెంది, భూగర్భం నుండి బయటకు వచ్చాడు కాని, అతడు ఆ మహర్షుల తేజస్సును చూచి భయపడి మరల సముద్రంలోకి పోయి దాక్కొన్నాడు.

**క. విను జననాయక! సంయమి । జనములు వహ్నిపని యంతఁ జాలించి ప్రియం**
**బున నంచితవిధి సంగ్రహ । మునకై పూజించి రధికపుణ్యు నధర్వున్. 173**

**ప్రతిపదార్థం:** జననాయక!= ప్రజలకు నేత వయిన ఓ ధర్మరాజా!; విను= వినుము; సంయమిజనములు= ఋషుల సమూహాలు; వహ్ని పని= అగ్ని కార్యం; అంతన్= అంతట; చాలించి= ఆపి; ప్రియంబునన్= ప్రీతితో; అంచితవిధి సంగ్రహమునకై= చేయవలసిన క్రియలను చేయటానికై; అధికపుణ్యున్= గొప్ప పుణ్యం కలవాడిని; అధర్వున్= అధర్వుడిని; పూజించిరి= అర్చించారు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆలకించుము. అంతట మునిగణాలు అగ్నిని వదలి పెట్టి, తాము చేయవలసిన విధ్యుక్త ధర్మాలను నిర్వహించటానికై అధర్వుడిని అర్చించ సాగారు.

**వ. అయ్యధర్వాగ్ని తేజంబును నమ్మును లతనికిం జేయు బహుమానంబునుం దన్ముఖంబున నమరులు దృప్తు లగుచునికియుం జూచి సహింపక పావకుండు సకలభూతంబులుఁ జూచుచుండ నంబుధి వెలువడి వచ్చి నిఖిలలోకహితార్థంబుగా నెప్పటియట్ల హవ్యవహత్వంబు నంగీకరించె; ని ట్లనేకశాఖం బయిన యగ్ని వంశంబు ప్రశంసాభాజనం బయ్యెఁ; నగ్ను లెంద ఱైనను దదాత్మ యైన తేజం బొక్కటి' యని చెప్పిన విని సంతసిల్లి యమ్మహామునికి ధర్మతనయుం డి ట్లనియె. 174**

**ప్రతిపదార్థం:** ఆ+అధర్వ+అగ్ని, తేజంబునున్= అధర్వుడు అనే ఆ అగ్నియొక్క కాంతిని; ఆ+మునులు; అతనికిన్+చేయు= (అధర్వుడికి) ఒనరించే; బహుమానంబునున్= గౌరవమర్యాదను; తద్+ముఖంబునన్= ఆతని మొగం నుండి; అమరులు= దేవతలు; తృప్తులు+అగుచున్+ఉనికియున్= తనివి చెందటమున్నూ; చూచి= అరసి; సహింపక= ఓర్వజాలక; పావకుండు= అగ్నిహోత్రుడు; సకల భూతంబులున్= అన్ని భూతాలున్నూ; చూచుచున్= చూస్తూ ఉండగా; అంబుధి= సముద్రంనుండి; వెలువడి= బయటకు వచ్చి; నిఖిలలోక, హిత+అర్థంబుగాన్= అన్ని లోకాలకు మేలు చేకూరేటట్లుగా; ఎప్పటి+అట్లు+అ= యథా ప్రకారం; హవ్య వహత్వంబున్= హోమంలో వేల్చబడే ద్రవ్యాలను తాల్చటాన్ని; అంగీకరించెన్= సమ్మతించాడు; ఇట్లు= ఈ విధంగా; అనేక, శాఖంబు+అయిన= పెక్కు కొమ్మలుగా ఏర్పడిన; అగ్ని వంశంబు= అగ్ని యొక్క కుటుంబం; ప్రశంసా, భాజనంబు+అయ్యెన్= కీర్తించ తగింది అయింది; అగ్నులు= వహ్నులు; ఎందఱు+ఐనను= ఎందరు అయినప్పటికి; తద్+ఆత్మ+ఐన= వారి అందరికి ఆత్మ, లేక సారభూతం అని చెప్ప దగిన; తేజంబు= కాంతి; ఒక్కటి= ఒక్కటే; అని=

అంటూ; చెప్పినన్= పలుకగా; విని= ఆలకించి; సంతసిల్లి= సంతోషించి; ఆ+మహామునికిన్= ఆ గొప్ప ఋషికి; ధర్మతనయుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** అధర్వుడు అనే పేరు గల ఆ అగ్ని యొక్క కాంతిని, ఆ ఋషులు అతడికి చేసే గౌరవమర్యాదలను చూచి, ఆతడిద్వారా వేల్పులు తనివి పొందటాన్ని గ్రహించి, ఓర్వజాలక అగ్నిహోత్రుడు అన్ని భూతాలు చూస్తూ ఉండగా సముద్రగర్భంనుండి బయటకు వచ్చి యథాప్రకారం తాను హోమద్రవ్యాలను వహించటానికి సమ్మతించాడు. అఖిలలోకాలకు ఆవిధంగా శ్రేయస్సు కల్గించాడు. ఈ రీతిగా అగ్నివంశంలో ఎందరెందరో ఉగ్గడించదగిన వారు విలసిల్లారు. అగ్నులలో ఎందరెందరో వేరు వేరు వారలు విలసిల్లినప్పటికిన్నీ, అందరిలో వెలుగొందిన తేజం ఒక్కటే' అని మార్కండేయమహర్షి ధర్మరాజుకు వివరించి చెప్పాడు. అంతట ధర్మరాజు ఈ విధంగా పలికాడు.

**క. 'మునినాథ! మహాసేనుం। డనలునకుం గృత్తికలకు హరునకు సుతుఁడై**
**న నిమిత్త మేమి తెలుఁ గే। వినవలతుం జెప్పవే! సవిస్తరఫణితిన్'. 175**

**ప్రతిపదార్థం:** మునినాథ!= ఋషులకు వల్లభుడవైనవాడా! అనగా మునులలో శ్రేష్ఠుడవైన ఓ మార్కండేయుడా!; మహాసేనుండు= కుమారస్వామి; అనలునకున్= అగ్నిహోత్రుడికి; కృత్తికలకున్= కృత్తికలు అనే చుక్కలకు; హరునకున్= శివుడికి; సుతుఁడు+ఐన= కొడు కైన; నిమిత్తము= కారణం; ఏమి తెలుఁగు= ఎటువంటిది; ఏన్= నేను; విన వలతున్= విన గోరుతున్నాను; సవిస్తర, ఫణితిన్= విపుల మైన పద్ధతిలో; చెప్పవే= చెప్పవా? (చెప్పుము).

**తాత్పర్యం:** 'ఓ మార్కండేయమహామునీ! కుమారస్వామి ఏవిధంగా అగ్నిహోత్రుడికి, కృత్తికలకు, శివుడికి పుత్రుడయ్యాడో విన గోరుతున్నాను. దయచేసి నాకు సంపూర్ణంగా వివరించి చెప్పుము'.

**వ. అనిన మార్కండేయుం డతని కిట్లని చెప్పెఁ; దొల్లి దైత్యులతోడ రణంబు సేసి యోటువడి దేవగణసహితుం డై దేవేంద్రుండు దొలంగిపోయి దానవుల నోర్వనోపునట్టి మహాసత్త్వుం డగు సేనాపతి నెందుఁ బడయుదు నొకో! యని యొక్కనాఁడు మానసం బను శైలంబునకుం జని యం దొక్కయెడ నొక్కరుండ కార్యచింతాపరుం డై యున్న యెడ. 176**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; మార్కండేయుండు; అతనికిన్= (ధర్మరాజునకు); ఇట్లు+అని చెప్పెన్= ఈ విధంగా పలికాడు; తొల్లి= పూర్వకాలంలో; దైత్యుల తోడన్= రాక్షసులతో; రణంబు+చేసి= యుద్ధంచేసి; ఓటువడి= ఓడిపోయి; దేవగణ సహితుండు+ఐ= వేల్పుల సముదాయంతో కూడిన వాడై; దేవేంద్రుండు= వేల్పుల దొర; తొలంగిపోయి= (యుద్ధం నుండి) ఆవలికి పోయి; దానవులన్= రాక్షసులను; ఓర్వన్+ఓపునట్టి= జయించజాలునట్టి; మహాసత్త్వుండు+అగు= గొప్ప బలం కలవాడైన; సేనాపతిన్= సేనకు నాయకుని; ఎందున్= ఎచ్చట; పడయుదున్+ఒకో+అని= పొందగలనో అని; ఒక్కనాఁడు= ఒకానొకరోజున; మానసంబు+అను, శైలంబునకున్+చని= మానసం అనే పేరు కల కొండవద్దకు వెళ్లి; అందున్= (ఆ కొండ మీద); ఒక్క+ఎడన్= ఒకచోట; ఒక్కరుండు+అ= ఏకాంతంగా ఉండి; కార్య, చింతా, పరుండు+ఐ= చేయవలసిన పనిని గూర్చి యోచించేవాడై; ఉన్న+ఎడన్= ఉండగా.

**తాత్పర్యం:** అనిన, మార్కండేయుడు ధర్మరాజుకు ఈ విధంగా చెప్పాడు: పూర్వకాలంలో రాక్షసులతో యుద్ధం చేసి దేవేంద్రుడు ఓడిపోయాడు. వేల్పుల సముదాయం ఎంతగా పోరాడినా వారికి విజయం లభించలేదు. ఇక

రాక్షసులపై గెలుపు ఏ విధంగా లభిస్తుందా! అని దేవేంద్రుడు ఏకాంతంగా యోచింపసాగాడు. అతడు మానసం అనే పేరుగల కొండపైకి వెళ్ళి ఒకచోట ఆలోచన చేస్తున్నాడు. అప్పుడు.

**తే. 'ఒక్క దనుజాధముండు మొఱ్ఱో యనంగ । నన్నుఁ జెఱఁగొని పోయెడు నన్నలార!**
**యెవ్వ రిట విడిపింపరే యింత వట్టు । పుణ్యమునఁ బోవరయ్య! కారుణ్యబుద్ధి'. 177**

**ప్రతిపదార్థం:** అన్నలార!= అయ్యలారా!; నన్నున్= నన్ను; ఒక్క= ఒక; దనుజ+అధముండు= రాక్షసులలో నీచుడు; మొఱ్ఱో+అనంగన్= (ఆపదలో ఉన్నట్లు) 'కేక' వేయగా; చెఱ+కొని పోయెడున్= నిర్బంధించి తీసికొని పోతున్నాడు; ఇటన్= ఇచట; ఎవ్వరు= ఎవరు? విడిపింపరే= చెరనుండి బయట పడ వేయరా; ఇంత+పట్టు= ఈ మాత్రం; కారుణ్య బుద్ధిన్= జాలిగల మనస్సుతో; పుణ్యమునన్+పోవరు+అయ్య= పుణ్యమార్గాన ప్రవర్తింపరా!.

**తాత్పర్యం:** సోదరులారా! ఒక నీచరాక్షసుడు నన్ను చెఱపట్టి బలాత్కారంగా తీసికొని పోతున్నాడు; ఇక్కడ నన్ను ఈ రాక్షసుడిబారినుండి కాపాడేవారు ఎవ్వరూ లేరా? నా మొఱ ఆలకించి పుణ్యం కట్టుకొనే వారు ఎవ్వరూ లేరా?

**వ. అని యిట్లు సువ్యక్తం బైన వనితావిలాపంబు వీతెంచినం బురందరుండు నిజాంతరంగంబు గరుణాతరంగితం బగుటయు 'నోడ కోడకు మిదె యేను వచ్చితి' ననుచు నద్దిక్కునకు నడచి ముందట నతిభయంకరాకారుం బటుగదాహస్తు నప్రచలితవిద్యుల్లతారుచిరమూర్తి యైనదాని నొక్క కన్నియం గొని గగనతలంబునం బఱచువానిం బ్రబలవలాహకవినీలదేహుఁ గేశి యను దానవుం గని సరభసుం డై.178**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; సువ్యక్తంబు+ఐన= స్పష్టంగా వినిపిస్తున్న; వనితా, విలాపంబు= ఆడుదాని ఆర్తధ్వని; వీతెంచినన్= రాగా; పురందరుండు= దేవేంద్రుడు; నిజ+అంతరంగంబు= తన హృదయం; కరుణా, తరంగితంబు+అగుటయున్= దయఅనే అలలతో నిండినది కావటం చేత; ఓడకుము+ఓడకుము= భయపడకుము భయపడకుము; ఇదె= ఇదుగో ఇప్పుడే; ఏను= నేను; వచ్చితిన్= (నిన్ను ఆదుకోటానికి) వచ్చాను; అనుచున్= అని పలుకుతూ; ఆ+దిక్కునకున్= ఆ ఆర్తనాదం వెడలిన వైపునకు నడచి; ముందటన్= ఎదురుగా; అతిభయంకర+ఆకారున్= మిక్కిలి వెరపు గొలిపే రూపం కలవాడిని; పటు గదా హస్తున్= గొప్ప గదను పూనిన చేయి కలవాడిని; అప్రచలిత, విద్యుత్+లతా, రుచిర, మూర్తి+ఐన దానిన్= కదలకుండా ఉన్నట్టి మెరపుతీగ వలె వెలుగొందే రూపం కల దానిని; ఒక్క కన్నియన్= ఒక కన్యకను; కొని= పట్టుకొని; గగన, తలంబునన్= ఆకాశస్థలాన; పఱచువానిన్= పరుగెత్తేవాడిని; ప్రబల, వలాహక, వినీల, దేహున్= గొప్ప మబ్బువంటి నల్లని శరీరం కలవాడిని; కేశి+అను, దానవున్= కేశి అనే పేరు కల రాక్షసుడిని; కని= చూచి; సరభసుండు+ఐ= వేగంతో కూడినవాడై.

**తాత్పర్యం:** అట్లా ఒక స్త్రీయొక్క ఆర్తనాదం వినిపించింది. దేవేంద్రుడు వెంటనే తన హృదయం జాలిచేత కరగి పోవటం చేత 'భయపడకుమమ్మా! ఇదుగో నేను ఇక్కడనే ఉన్నాను; ఇప్పుడే వచ్చి నిన్ను కాపాడగలను' అని గట్టిగా పలుకుతూ ఆ యేడ్పు వచ్చిన వైపునకు తరలి వెళ్ళాడు. అంతట అక్కడ ఒక రాక్షసుడు మిక్కిలి వెరపు గొలిపే రూపం కలవాడు, నల్లనిమబ్బును పోలిన దేహం కలవాడు, గొప్ప గదను చేత ధరించిన వాడు కన్పించాడు. అతడు స్థిరమైనసౌదామని వంటి శరీరసౌందర్యం గల ఒక కన్యకను చెఱబట్టి ఆకాశంలో పరుగెత్తుతున్నాడు. కేశి అనే ఆ రాక్షసుడిని చూచి దేవేంద్రుడు మిక్కుటమైన వేగంతో (తరువాతి పద్యంతో అన్వయం).

ఇంద్రుఁడు కేశి యను రాక్షసునిఁ బాఱఁదోలుట (సం. 3-213-10)

**ఉ.** **'ఓరి దురాత్మ! యీ యబల నోడక యేటికిఁ బట్టినాడ వం**
**భోరుహనేత్ర విడ్వు; మెట వోయినఁ బ్రాణము గొందు నింకఁ బ్ర**
**స్ఫారమహీధరప్రకరభంగవిహారధురీణ ముగ్ర దై**
**త్యారుణరంజితోగ్ర కులిశాస్త్రము సు మ్మిదె' యంచు డాసినన్.** **179**

**ప్రతిపదార్థం:** ఓరి, దురాత్మ!= ఓరీ పాపహృదయం కలవాడా! చెడ్డ ఆత్మకల రాక్షసుడా!; ఈ+అబలన్= ఈ ఆడుదానిని; ఓడక= వెనుదీయక; ఏటికిన్= ఎందుకు; పట్టినాఁడవు= చెఱగొన్నావు; అంభస్+రుహ+నేత్ర= పద్మాల వంటి కన్నులు కల ఆడుదానిని; విడ్వుము= వదలి పెట్టుము; ఎట+పోయినన్= నీవు ఎక్కడికి వెళ్లి నప్పటికిని; ఇంకన్= ఇక; ప్రాణమున్+కొందున్= (నీ) అసువులను తీస్తాను- అనగా నిన్ను చంపుతాను; ప్రస్ఫార, మహీధర, ప్రకర, భంగ, విహార, ధురీణము= నిడివి ఐన కొండల సముదాయాన్ని ముక్కలుగా చేస్తూ తిరుగాడటంలో సామర్థ్యం కలది; ఉగ్ర, దైత్య+అరుణ, రంజిత+ఉగ్ర+కులిశ+అస్త్రము= భయం కలిగించే రాక్షసులను చంపటంచేత వారి నెత్తుటిచే ఎర్రనైన వజ్ర మంత్రాయుధం; సుమ్మ= సుమా; ఇదె= ఇదిగో; అంచున్= అంటూ; డాసినన్= సమీపించగా.

**తాత్పర్యం:** 'ఓ నీచ రాక్షసుడా! ఈ ఆడుదానిని ఎట్టి శంక లేకుండ, ఎందుకు చెరబట్టినావురా? పద్మాల వంటి కన్నులు కల ఈ అబలను వెంటనే విడిచిపెట్టుము. నీవు ఎటు పారిపోయినా నిన్ను నేను విడువను. నీ అసువులు తీయగలను. ఇదిగో! నావద్ద వజ్రాయుధం ఉన్నది. దీనితో నేను లోగడ ఎందరినో రాక్షసులను వధించిఉన్నాను. వారి నెత్తురుతో ఎర్రబడినట్టిది సుమా ఈ వజ్రాయుధం. ఎన్నో కొండలను కూల్చినట్టిది నా వజ్రాయుధం' అంటూ దేవేంద్రుడు ఆ రాక్షసుడిని సమీపించాడు.

**మత్తకోకిలము**

**ఘోరవిక్రముఁడైన కేశియుఁ గ్రోధఘూర్ణితచిత్తుఁ డై**
**ధీరుఁ డుక్కున నిల్చి యగ్గదఁ ద్రిప్పి వాసవు వైచె; న**
**వ్వీరుఁడున్ గద చూర్ణితంబుగ వ్రేసె నాసుర భంగిఁ బొం**
**గారి దారుణవజ్రపాతరయంబునం బటుహస్తుఁడై.** **180**

**ప్రతిపదార్థం:** ఘోర, విక్రముఁడు+ఐన= భయంకర మైన పరాక్రమం కలవాడైన; కేశియున్= కేశి అనే దానవుడుకూడ; క్రోధ, ఘూర్ణిత, చిత్తుఁడు+ఐ= కోపం చేత తిరుగుడు పడిన మనస్సు గలవాడై; ధీరుఁడు= ధైర్యం గలవాడు; ఉక్కునన్= బలంతో; నిల్చి= నిలువబడి; ఆ+గదన్= ఆగదను; త్రిప్పి= గిరగిర వేగంగా త్రిప్పి; వాసవున్+వైచెన్= దేవేంద్రుడిపై ప్రయోగించాడు; ఆ+వీరుఁడున్= ఆ శూరుడుకూడ; గద= గద; చూర్ణితంబుగన్= పొడి అయ్యేటట్లుగా; ఆసుర భంగిన్= రాక్షసుడి మాదిరిగనే (అనగా) ఆ కేశిదానవుడు (ప్రయోగించినట్లుగానే); పొంగారి= ఉత్సహించి; పటు హస్తుఁడు+ఐ= గొప్ప బాహువు కలవాడై; దారుణ, వజ్ర, పాత, రయంబునన్= భయాన్ని కొలిపే వజ్రపుదెబ్బయొక్క వేగంతో; వ్రేసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** వెఱపు కొలిపే పరాక్రమం కల ఆ కేశి రాక్షసుడు, కోపంచేత తిరుగుడు పడిన మనస్సు గలవాడు ఔతూ దేవేంద్రుడిని ఎదిరించి ఆతడిపై తన గదను గిరగిర త్రిప్పి ప్రయోగించాడు. దేవేంద్రుడున్నూ ఆ దానవుడు

ప్రయోగించినట్లుగనే బలం గల బాహువుతో వేగంగా తన వజ్రాయుధాన్ని ప్రయోగించి ఆ గదను ముక్కలు ముక్కలుగా చేశాడు.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడు: ఆరణ్య. 4.267 విశేషం.

**ఆ. అసుర వీఁక నొక మహాచలశృంగంబు । విఱిచి వైచె నమరవిభునిమీఁద**
**గోత్రవైరి ఘోరకులిశాభిహతి వ్రయ్య । నడిచె దానిఁ జదల నదరు లెగయ. 181**

**ప్రతిపదార్థం:** అసుర= రాక్షసుడు; వీఁకన్= ఉత్సాహంతో; ఒక= ఒక; మహా+అచల, శృంగంబు= గొప్ప కొండ శిఖరాన్ని; విఱిచి= విరగగొట్టి; అమర, విభుని మీఁదన్= దేవతల ప్రభువు మీద; వైచెన్= ప్రయోగించాడు; గోత్రవైరి= (పర్వతాలకు శత్రువు అయిన) ఇంద్రుడు; దానిన్= ఆ కొండ శిఖరాన్ని; ఘోర, కులిశ+అభిహతిన్= భయంకరమైన వజ్రం యొక్క దెబ్బ చేత; చదలన్= ఆకసంలో; అదరులు= నిప్పు కణాలు; ఎగయన్= వ్యాపించగా; వ్రయ్యన్+అడిచెన్= ముక్కలు ముక్కలుగా అయ్యేటట్లు కొట్టాడు.

**తాత్పర్యం:** రాక్షసుడు ఉత్సాహంతో ఒక కొండశిఖరం పెల్లగించి దేవేంద్రుడిపై ప్రయోగించాడు. అంతట దేవేంద్రుడు తన వజ్రాయుధాన్ని ప్రయోగించి ఆ కొండ శిఖరాన్ని ముక్కలు ముక్కలు చేసి వేశాడు. అప్పుడు ఆ గిరిశిఖర వజ్రాయుధాల రాపిడికి ఆకసాన నిప్పుకణాలు వ్యాపించాయి.

**వ. ఇట్లు దన సాధనంబులు విఫలంబు లైనం దలంకి దానవుం డక్కన్నియ దిగవిడిచి పఱచిన, నింద్రుండు దానిం జేరంజని 'నీ వెవ్వరిదాన? వీ రక్కసుచేత నెట్లు పట్టువడి?' తనిన నది యతని కిట్లనియె 'నయ్యా! యే నరిష్టనేమి యను ప్రజాపతి కూఁతుర, దేవసేనయనుదాన, దైత్యసేన చెలియల; నేనును మాయప్పయుం గేళికౌతుకంబునఁ దండ్రియనుమతంబు వడసి సఖీజన సహితంబుగా వెడలి యిమ్మానసనగంబు సాను దేశంబులం గ్రుమ్మరుచుండం గేశి నామధేయుం డైన యీ యసురాధముండు. 182**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; తన, సాధనంబులు= తన పరికరాలు; విఫలంబులు+ఐనన్= వ్యర్థాలు కాగా; తలంకి= భయపడి; దానవుండు= రాక్షసుడు; ఆ+కన్నియన్= ఆ కన్యను; దిగవిడిచి= అచ్చట వదలిపెట్టి; పఱచినన్= పారిపోగా; ఇంద్రుండు; దానిన్+చేరన్+చని= ఆమె దగ్గరకు వెళ్లి; నీవు+ఎవ్వరి దానవు= నీవు ఎవ్వరి అమ్మాయివి; ఈరక్కసుచేతన్= ఈ రాక్షసుడిచేత; ఎట్లు= ఏ రీతిగా; పట్టు+పడితి= చెఱపెట్టబడిన దానవు అయినావు; అనినన్= అని అడుగగా; అది= ఆమె; అతనికిన్= దేవేంద్రుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది; అయ్యా= ఆర్యా; ఏను=నేను; అరిష్టనేమి+అను= అరిష్ట నేమి అనే పేరుకల; ప్రజాపతి కూఁతురన్= ప్రజాపతి యొక్క పుత్రికను; దేవసేన+అనుదానన్= దేవసేన అనే పేరు గల దానిని; దైత్యసేన, చెలియలన్= దైత్యసేన అనే పేరుగల ఆమె సహోదరిని; ఏనును= నేనున్నూ; మా+అప్పయున్= మా అక్కయున్నూ; కేళి కౌతుకంబునన్= విహరించుటయెడ గల ప్రీతి చొప్పున; తండ్రి+అనుమతంబు+పడసి= తండ్రి యొక్క అనుజ్ఞను పొంది; సఖీజనసహితంబుగాన్= చెలికత్తియలతో కలసి; వెడలి= వెళ్లి; ఈ+మానస, నగంబు= ఈ మానస పర్వతం (యొక్క); సాను దేశంబులన్= చరియల యందు; క్రుమ్మరుచున్+ఉండన్= విహరిస్తూ ఉండగా; కేశి నామధేయుండు+ఐన= కేశి అనే పేరు కల; ఈ+అసుర+అధముండు= రాక్షసులలో నీచుడు అయిన ఈతఁడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తన ఆయుధాలు వమ్మయి పోగా, భయపడి ఆ రాక్షసుడు ఆ కన్యను వదలి పారిపోయాడు. అంతట ఇంద్రుడు ఆ కన్యకను చేరి, ఓదార్చి, 'నీవు ఎవ్వరిదానవు? ఈ రాక్షసుడికి ఎట్లా చిక్కావు?'

అని అడిగాడు. ఆమె, 'ఆర్యమహాశయా! నేను అరిష్టనేమి అనే ప్రజాపతి కూతురిని. నా పేరు దేవసేన. మా అక్క పేరు దైత్యసేన. నేనున్నూ మా అక్కయున్నూ తండ్రిగారి అనుమతి పొంది, చెలికత్తెలతో కలిసి ఈ మానస పర్వతం యొక్క చరియలలో విహరిస్తూ ఉన్నాం. అంతట కేశి అనే పేరు కల ఈ నీచరాక్షసుడు ఈ అత్యాచారానికి ఒడిగట్టాడు.

**క.** **పలుమాఱు వచ్చి తన దు । ర్విలసితములు మాకుఁ జూపు వేడుక దోఁపన్**
**బలుకును మేలమునఁ జెనకఁ । దలఁచుఁ గదియు మదనకదనదళితహృదయుఁ డై.** **183**

**ప్రతిపదార్థం:** పలుమాఱు= చాల పర్యాయాలు; వచ్చి; తన దుర్విలసితములు= తనయొక్క చెడు హొయలు; మాకున్+చూపున్= మాకు (నాకున్నూ మా అక్కకున్నూ) ప్రదర్శిస్తాడు; వేడుక తోఁపన్+పలుకును= తన కుతూహలం బయలు పడేటట్లుగా మాటలాడుతాడు; మేలమునన్= పరిహాసంతో; చెనకన్+తలఁచున్= నొప్పించ తలుస్తాడు; మదన, కదన, దళిత, హృదయుఁడు+ఐ= మన్మథుడికి సంబంధించిన యుద్ధంకొరకై (రతిక్రీడ కొరకై) వికసించిన డెందం కలవాడై; కదియున్= సమీపిస్తాడు.

**తాత్పర్యం:** కేశి రాక్షసుడు ఎన్నో మారులు మా దగ్గరకు చేరి, అతడి యొక్క హొయలు ప్రదర్శిస్తూ ఉండేవాడు. వేళాకోళం చేస్తూ ఉండేవాడు. మన్మథక్రీడకు సంబంధించిన కోర్కెలు ప్రదర్శిస్తూ సమీపిస్తూ ఉండేవాడు.

**తే.** **వాని చేష్టలన్నియు దైత్యసేన కభిమ । తంబు లై యుండు; నాకు నెంతయును దుస్స**
**హములు; వినవె! యిమ్మెయిన యక్కమలనయనఁ । గోరి దానవుఁ డెలయించి కొంచుఁ జనియె.** **184**

**ప్రతిపదార్థం:** వినవె= (శ్రద్ధతో) వినవయ్యా!; వాని చేష్టలు+అన్నియున్= ఆ రాక్షసుడి యొక్క పనులు అన్నీ; దైత్యసేనకున్= దైత్యసేనకు (మా అక్కకు); అభిమతంబులు+ఐ+ఉండున్= ఇష్టమై ఉండేవి; నాకున్+ఎంతయును, దుస్సహములు+అ= నాకు మాత్రం ఎంత మాత్రమూ సహించరానివిగా ఉండేవి; ఇమ్మెయిన్+అ= ఈ రీతిగానే; ఆ+కమలనయనన్= ఆ అమ్మాయిని (పద్మాల వంటి కనులు కలదానిని); కోరి= వరించి; దానవుఁడు= రాక్షసుడు; ఎలయించి కొంచున్= తన వశం చేసికొంటూ; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** శ్రద్ధతో వినుము. అతడి చేష్టలన్నీ దైత్యసేనకు ఇష్టమై ఉండేవి. నాకు మాత్రం సహించరానివిగా ఉండేవి. దానితో ఆ రాక్షసుడు ఆమెను వశం చేసికొని తీసికొని వెళ్ళాడు.

**తే.** **అంతఁ బోక వెండియు వచ్చి యింత సేసె । నద్దురాత్ముఁడు నన్ను; మీ దైన కరుణఁ**
**దొడరి దుఃఖసాగరమునఁ బడుట దప్పె' । ననిన నయ్యింద్రుఁ డనియె నయ్యతివఁ జూచి.** **185**

**ప్రతిపదార్థం:** ఆ+దురాత్ముఁడు= ఆ చెడ్డవాడు; అంతన్+పోక= ఆ విధంగా చేసి- వెడలక; వెండియున్ వచ్చి= మరల వచ్చి; నన్నున్= నన్ను; ఇంత+చేసెన్= ఇంత (ఇంతటి ఆగడం) ఒనరించాడు; మీదైన, కరుణన్= మీ యొక్క దయవలన; తొడరి= పూని; దుఃఖ, సాగరమునన్+పడుట= శోకం అనే సముద్రంలో పడిపోవటం; తప్పెన్= తప్పింది; అనిన్= అని చెప్పగా; ఆ ఇంద్రుఁడు= ఆ+దేవేంద్రుడు; ఆ+అతివన్+చూచి= ఆ వనితను చూచి; అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** మా అక్కను ఆకర్షించి లేవదీసికొని పోవటంతో ఆగక, ఆ దుర్మార్గుడు మరల నా దగ్గరికి వచ్చి ఇంతటి ఆఘాయిత్యం చేశాడు. మీ దయవలన నేను ఇట్టి దుఃఖసాగరంలో పడిపోకుండ తప్పించుకోగలిగాను' అని దేవసేన పలుకగా, ఇంద్రుడు ఆమెతో ఇట్లా బదులు పలికాడు.

**క. 'విను, దక్షతనూజలు మా । జననియు మీ తల్లియును; నిజంబుగ మా కీ**
**వనుజ వయితి; వనజానన! యొనరంగా వేఁడు నీకు నొక వర మిత్తున్'. 186**

**ప్రతిపదార్థం:** వనజ+ఆనన!= పద్మం వంటి మొగం కలదానా!; వినుము= ఆలకించుము; మా జననియున్= మా తల్లియున్నూ; మీ తల్లియును= మీ జననియున్నూ; దక్షతనూజలు= దక్షుడి యొక్క పుత్రికలు; నిజంబుగన్= యథార్థంగా; మాకున్= నాకు; ఈవు= నీవు; అనుజవు+అయితి(వి)= సహోదరివి అయినావు; ఒనరంగాన్= ఒప్పిదమౌనట్లుగా; వేడుము= కోరుకొనుము; నీకున్= నీకు; ఒక వరము= ఒక కోరిక; ఇత్తున్= అనుగ్రహిస్తాను.

**తాత్పర్యం:** పద్మం వంటి మొగం కల సుందరీ!; వినుము; నీవు నాకు చెల్లెలి వౌతావు. మీ అమ్మగారు మా అమ్మగారు దక్షుడి పుత్రికలే. అందుచేత కోరుకో. ఇష్టమైన వరాన్ని నీకు నేను ప్రసాదిస్తాను.

**విశేషం:** శాపానికి ప్రతియోగ కల్పన - వరం. కోరినవరం ప్రసాదించే మహిమ మహానుభావులకు ఉంటుంది.

**వ. అనిన దేవసేన దేవేంద్రున కి ట్లనియె. 187**

**తాత్పర్యం:** అని అనగా దేవసేన దేవేంద్రుడితో ఇట్లా అన్నది.

**తే. 'అనఘ! మాతండ్రి యొక్కనాఁ డతిముదమున । నన్ను నుపలాలనము సేసి 'నాతి! నీవు**
**ప్రథిత పౌరుషుఁ డగు భర్తఁ బడయు' దనియె; । నట్టి వానిని నీవు నా కరయవలయు. 188**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా (ఓ దేవేంద్రుడా!); మా తండ్రి= మా నాన్న; ఒక్కనాఁడు= ఒక రోజున; అతి, ముదమునన్= మిక్కిలి సంతోషంతో; నన్నున్; ఉపలాలనము+చేసి= గారాబం చేసి; నాతి!= ఓ అమ్మాయీ!; నీవు; ప్రథిత పౌరుషుఁడు+అగు= గొప్ప పేరు కెక్కిన పరాక్రమశాలి అయినట్టి; భర్తన్= పెనిమిటిని; పడయుదు(వు)= పొందుతావు; అనియెన్= అని చెప్పాడు; అట్టివానినిన్= (మా తండ్రిగారు చెప్పినట్లు గొప్పపరాక్రమవంతుడిని); నీవు= నీవు; నాకున్= నాకు; అరయ వలయున్= వెదకవలెను (నాకు భర్తగా సమకూర్చాలి).

**తాత్పర్యం:** అని చెప్పిన పిమ్మట, దేవసేన దేవేంద్రుడిని ఈ విధంగా అడిగింది: 'పాపరహితుడ వైన ఓ మహానుభావా! మా జనకుడు చిన్నప్పుడు నన్ను గారాబం చేసి, 'అమ్మా! నీకు గొప్ప పేరుప్రతిష్ఠలు ఆర్జించిన మహాపరాక్రమశాలి భర్త కాగలడు' అని చెప్పాడు. ఆయనమాటలు నిజం చేయటమే నేను నీనుండి కోరుకొనే వరం.

**చ. అనిమిష దానవేంద్రులకు నైన నజయ్యుఁడు, నుగ్రవైరిభం**
**జనుఁడు, త్రిలోకరక్షణవశంవదుఁడున్, భవదిష్టమిత్రుఁడున్**
**ఘనగుణకీర్తనుండు నగు కాంతునిఁ గోరెద; నా మనోరథం**
**బు నెరయ సంఘటించి సురపుంగవ! నన్నుఁ గృతార్థఁ జేయవే!' 189**

**ప్రతిపదార్థం:** సురపుంగవ!= దేవతలలో శ్రేష్ఠుడవైన వాడా!; అనిమిష, దానవ+ఇంద్రులకున్+ఐనన్= దేవతలలో రాక్షసులలో శ్రేష్ఠులు అయిన వారికి కూడ; అజయ్యుఁడు= గెలువ శక్యం కానివాడు; ఉగ్ర, వైరి, భంజనుఁడు= భయంకరులైన శత్రువులను చంపేవాడు; త్రి, లోక, రక్షణ, వశంవదుఁడున్= మూడు లోకాలను రక్షించటం తనకు స్వాధీనమై ఉన్నవాడు;

భవత్+ఇష్ట, మిత్రుఁడున్= నీకు అనుగు నెచ్చెలి అయిన వాడు; ఘన, గుణ కీర్తనుండును+అగు= గొప్ప గుణాలు కలిగి ఉండటంచేత కొనియాడబడేవాడు అయిన; కాంతునిన్= భర్తను; కోరెదన్= వాంఛిస్తాను; నా మనోరథంబు= నా కోరిక; నెరయన్= సిద్ధించేటట్లుగా; సంఘటించి= ఒనగూర్చి; నన్నున్= నన్ను; కృతార్థన్+చేయవే= ధన్యురాలిని చేయవా?.

**తాత్పర్యం:** దేవతలలో శ్రేష్ఠుడవైన ఓ దేవేంద్రుడా!; నీవు అనుగ్రహించిన మేరకు నేను వరం కోరుకొంటున్నాను. దేవతలలో రాక్షసులలో శ్రేష్ఠులకు కూడ గెలువ శక్యం కానివాడు. భయంకరులైన శత్రువులను పరిమార్చేవాడు, మూడులోకాల రక్షణం తనకు వశమైనవాడు, నీకు ఆప్తమిత్రుడు అయినవాడు, నాకు భర్త కావలెనని కోరుకొంటున్నాను. నా కోరిక ఈడేర్చి నన్ను ధన్యురాలినిగా చేయ వేడికోలు'.

**వ. అనిన నింద్రుండు దీనికిం బతి యెవ్వం డగు నొకో! యని కొండొక విచారించు నెడ, నమ్ముహూర్తంబు రౌద్ర నామకంబయి సోమ సూర్యసంగమ కారణం బయిన యమావాస్యాముఖం బై యుండం, బూర్వసంధ్యారాగ రక్తాంబుద ప్రతిబింబ పటల పాటలితోదకం బయిన జలనిధి సమీపంబున నమరాసుర సమర సంకులంబుగా నరుణకిరణుం డుదయించుచుండఁ దత్కాలంబున భృగ్వంగిరఃప్రముఖు లైన మునులు వేల్చు హవ్యంబులు మోచికొని హవ్యవహనుండు సూర్యమండలంబు ప్రవేశించుచుండం గనుంగొని, యిది సూర్యసోమాగ్ని సమాగమం బయిన రౌద్ర నామక ముహూర్తంబు గావున సూర్యసోమాగ్ని తేజంబున జనియించిన వాఁడు దీనికిఁ బ్రియుండు గావలయు నని మనంబున నిశ్చయించి, యతం డా క్షణంబ.190**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; ఇంద్రుండు= వేలుపుదొర; దీనికిన్= ఈమెకు (దేవసేనకు); పతి= భర్త; ఎవ్వండు+అగున్+ఒకో= ఎవ్వడు కాగలడో; అని; కొండొక విచారించు+ఎడన్= కొంతసేపు ఆలోచించే టప్పుడు; ఆ+ముహూర్తంబు= ఆ లగ్నం; రౌద్ర, నామకంబు+అయి= రౌద్రం అనే పేరు కలిగినదై; సోమ, సూర్య, సంగమ, కారణంబు+అయిన= సూర్యుడున్నూ చంద్రుడున్నూ కలియటానికి హేతువైన; అమావాస్యా, ముఖంబు+ఐ= కృష్ణపక్షంలోని కడపటి తిథియొక్క ఆరంభం కలదై; ఉండన్= ఉండటం చేత; పూర్వ, సంధ్యా, రాగ, రక్త+అంబుద, ప్రతిబింబ, పటల, పాటలిత+ఉదకంబు+అయిన= ఉదయసంధ్యా కాలంలోని ఎర్రని వెలుగులతో ఎర్రబడిన మబ్బుల ప్రతిబింబ సముదాయంచేత ఎర్రబడినట్లున్న నీరు గల; జలనిధి, సమీపంబునన్= సముద్రం దగ్గర; అమర+అసుర, సమర, సంకులంబుగాన్= దేవతలు రాక్షసులు చేసే యుద్ధ సంక్షోభంవలె; అరుణ కిరణుండు= సూర్యుడు, ఎఱ్ఱని కిరణాలు కలవాడు; ఉదయించుచున్+ఉండన్= పొడుస్తూ ఉండగా; తద్+కాలంబునన్= ఆ సమయంలో; భృగు+అంగిరస్+ప్రముఖులు+ఐన= భృగువు, అంగిరసుడు మున్నగునట్టి; మునులు= ఋషులు; వేల్చు, హవ్యంబులు= యజ్ఞకుండాలలో వేసే హోమద్రవ్యాలు; మోచికొని= వహించి; హవ్యవహనుండు= అగ్నిహోత్రుడు; సూర్య, సోమ+అగ్ని, సమాగమంబు+అయిన= సూర్యుడున్నూ, చంద్రుడున్నూ, అగ్నిహోత్రుడున్నూ, కలిసేది అయిన; రౌద్ర, నామక, ముహూర్తంబు= రౌద్రం అనే పేరు కల లగ్న సమయం; కావునన్= కాబట్టి; సూర్య, సోమ+అగ్ని తేజంబునన్= సూర్యుడి యొక్కయు, చంద్రుడి యొక్కయు, అగ్నిహోత్రుడి యొక్కయు కాంతితో; జనియించినవాఁడు= పుట్టినవాడు; దీనికిన్= ఈమెకు (దేవసేనకు); ప్రియుండు= భర్త; కావలయున్= కావాలి; అని= అంటూ; మనంబునన్= మనసులో; నిశ్చయించి= నిర్ణయించి; అతండు= దేవేంద్రుడు; ఆ+క్షణంబు+అ= ఆ త్రుటిలోనే.

**తాత్పర్యం:** దేవసేన వేడిన వరం వినినంతనే దేవేంద్రుడు ఈ విధంగా యోచించాడు. 'ఈమెకు భర్త ఎవ్వడౌతాడు? ఈ ముహూర్తం రౌద్రం అనే పేరు కలది గదా! ఈనాడు తిథి అమావాస్య. అమావాస్యనాడు సూర్యుడు చంద్రుడు ఏకరాశిలో కలిసి ఉంటారు. అంతేకాక- ఇది సూర్యోదయ సమయం. ఈ ప్రభాతకాలంలో సూర్యుడి ఎర్రని

కిరణాలచేత ఎర్రనైన మబ్బులు ప్రతిబింబించటంచేత, సముద్రం కూడ ఎరుపురంగుకలదై కన్పిస్తున్నది. దేవదానవ యుద్ధాన్ని తలపింపజేస్తూ సముద్రం సంక్షుభితమై ఉన్నది. బాలభానుడు ఉదయిస్తున్న ఈ లగ్నంలో భృగువు, అంగిరసుడు మున్నగు మహర్షులు యజ్ఞకుండాలలో వేల్చిన హోమద్రవ్యాలను వహించి అగ్నిహోత్రుడు సూర్య మండలం ప్రవేశిస్తున్నాడు. ఇది సూర్యుడు, చంద్రుడు, అగ్నిహోత్రుడు కలిసిన రౌద్రముహూర్తం. కాబట్టి సూర్య చంద్రాగ్నిహోత్రుల తేజస్సులో జన్మించినవాడు ఈ దేవసేనకు భర్త కాగలడు' అని నిర్ణయించుకొన్నాడు.

**విశేషం:** అమావాస్య-కృష్ణపక్షంలోని కడపటి దివసం. ఆనాడు సూర్యుడు చంద్రుడు ఆకసంలో ఒకేచోట ఉంటారు. కాని, చంద్రుడు చర్మచక్షువులకు అమావాస్యనాడు కన్పించడు గదా! భారతీయుల జ్యోతిష పరిజ్ఞానం పేర్కొనదగింది. దుర్బిణీ యంత్రాలు లేని ప్రాచీనకాలంలో పాశ్చాత్యులకు తెలియని అంశాలు ఎన్నో ఆనాడు ప్రాచీనభారతీయులకు సుగమాలు. దేవసేన- వరం కోరిన ముహూర్తాన్ని బట్టి దేవేంద్రుడు ఆమెకు ఎటువంటి భర్త- భవిష్యత్కాలంలో లభిస్తాడో జ్యోతిషగణితాన్ని అన్వయించి తెలిసికొనగలిగాడు.

**క. బాలం దోడ్కొని యబ్జజు । పాలికిఁజని మ్రొక్కి త్రిదశపాలుఁడు 'దేవా!**
**యీ లలనకుఁ దగు వరునిఁ గృ । పాలుఁడవై యొసఁగు' మనినఁ బద్మజుఁ డనియెన్. 191**

**ప్రతిపదార్థం:** త్రిదశ పాలుఁడు= వేల్పుల దొర అయిన ఇంద్రుడు; బాలన్+తోడ్కొని= కన్యకను తన వెంటపెట్టుకొని; అబ్జజు పాలికిన్+చని= బ్రహ్మదేవుడి కడ కేగి; మ్రొక్కి= నమస్కరించి; దేవా!= ఓ బ్రహ్మదేవా!; ఈ, లలనకున్= ఈ అమ్మాయికి; తగువరునిన్= యోగ్యుడైన భర్తను; కృపాలుఁడవు+ఐ= దయ కలిగినవాడవై; ఒసఁగుము= ఇమ్ము; అనినన్= అని చెప్పగా; పద్మజుఁడు= తామరపువ్వులో పుట్టిన వాడైన బ్రహ్మ; అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు ఆ కన్యకను తన వెంట పెట్టుకొని బ్రహ్మదేవుడి కడకు వెళ్ళి నమస్కరించి ఇట్లా పలికాడు; 'దేవా! ఈమెకు యోగ్యుడైన భర్తను ప్రసాదించుము. నీవు దయామయుడవు' అనగా, బ్రహ్మదేవుడు ఇట్లా బదులు పలికాడు.

**విశేషం:** త్రిదశపాలుఁడు అనగా దేవతలను పాలించేవాడు. త్రిదశులు - అనగా దేవతలు - ఎల్లప్పుడు ముప్పదేండ్ల వయసుతో ఉండే నిత్య యౌవనులు అన్నమాట.

**ఉ. 'దీపితవిక్రమాస్పదుఁడు దీనికి వల్లభుఁ డయ్యెడుం ద్రిలో**
**కీపరిరక్షణక్షముఁడు గీర్తితమూర్తి యొకండు; వాఁడ మీ**
**యాపదలెల్లఁ బాపుటకునై ధృతిఁ బూను నశేష దేవసే**
**నాపతి భావమున్ విబుధనాయక! శీఘ్రము భావ్య మింతయున్.' 192**

**ప్రతిపదార్థం:** విబుధ నాయక!= వేల్పులకు నేతవైన దేవేంద్రా!; దీపిత, విక్రమ+ఆస్పదుఁడు= ప్రజ్వలించబడిన పరాక్రమానికి నెలవు అయినవాడు; త్రిలోకీ పరిరక్షణ క్షముఁడు= మూఁడులోకాలను కాపాడ గల సామర్థ్యం కలవాడు; కీర్తిత మూర్తి= పేరు ప్రతిష్ఠలను ఆర్జించిన ఆకారం కలవాడు; ఒకండు= ఒకడు; దీనికిన్= ఈమెకు (ఈ దేవసేనకు); వల్లభుఁడు= భర్త; అయ్యెడున్= కాగలడు; వాఁడు+అ= అతడే; మీ ఆపదలు+ఎల్లన్= మీకు దాపురించే కష్టాలను అన్నింటిని; పాపుటకున్+ఐ=

పోగొట్టుట కొఱకై; అశేష, దేవ సేనాపతి భావమున్= సమస్త మైన దేవతల సేనలకు ఆధిపత్యాన్ని; ధృతిన్+పూనున్= స్థైర్యశౌర్యాలతో వహిస్తాడు. ఇంతయున్= ఇది అంతయు; శీఘ్రము+అ= మిక్కిలి వేగంగానే; భావ్యము= జరుగుతుంది.

**తాత్పర్యం:** ఓ దేవేంద్రా!, ఈ దేవసేనకు గొప్ప వీరుడు భర్త కాగలడు. ఆతడు మూడులోకాలను కాపాడగల సామర్థ్యం కలవాడౌతాడు. ఆతడే మీ ఆపదలను పారద్రోలి మిమ్ములను రక్షించగలడు. దేవసైన్యాల కన్నింటికి ఆతడు సేనాపతి కాగలడు. ఇది అంతా సమీప భవిష్యత్కాలంలోనే జరుగుతుంది సుమా!

**విశేషం:** ఈ దేవసేన భర్త 'అశేష దేవసేనాపతి' కాగలడు అనటంలో సుకుమార సుందర మైన వ్యంగ్యం ఉన్నది. దేవసేనాపతి= దేవసేన యనే కన్యకు భర్త అని సుస్పష్టమైన అర్థం సుగమం. అశేష దేవసేనాపతి భావము-అంటే దేవతల సర్వసేనా నాయకుడు (సేనా నాయకత్వము) అనేది మరొక అర్థం. దేవసేన భర్త, దేవసేన అనుకన్యకకు భర్తయేగాక, దేవతల సర్వసేనలకు నాయకుడు కూడ కాగలడని బ్రహ్మ వచించాడు. దేవసేన సార్థక నామధేయురాలు కావటం ఇక్కడ చమత్కారం.

**వ. అనినం బ్రీతుం డై పితామహు వీడ్కొని యింద్రుండు సనియెఁ; దదనంతరంబ వసిష్ఠ ప్రముఖులైన సప్త మహామును లమావాస్యాహోమంబు సేయ సమకట్టిన, నమరు లందఱు నందుల హవిర్భాగంబులు గొనుటకు నాసన్ను లగుటయు. 193**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన; ప్రీతుండు+ఐ= సంతృప్తిచెందిన వాడై; పితామహున్= బ్రహ్మదేవుడిని; వీడ్కొని= సెలవుగైకొని; ఇంద్రుండు; చనియెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట; వసిష్ఠ, ప్రముఖులు+ఐన= వసిష్ఠుడు మున్నగువారైన; సప్త, మహామునులు= ఏడుగురు ఋషులు; అమావాస్యా, హోమంబు+చేయన్, సమకట్టినన్= అమావాస్యనాడు అగ్నికుండాలలో హోమాలు చేయటానికి పూనగా; అమరులు+అందఱున్= వేల్పులు ఎల్లరు; అందులన్, హవిస్+భాగంబులు= ఆ హోమద్రవ్యాలలో తమ తమ వంతులు; కొనుటకున్= స్వీకరించటానికి; ఆసన్నులు+అగుటయున్= చేరగా.

**తాత్పర్యం:** అనగా సంతృప్తి చెంది ఇంద్రుడు బ్రహ్మదేవుడికడ సెలవు గైకొని వెడలిపోయాడు. ఆ తరువాత, వసిష్ఠుఁడు మున్నగు మహర్షులు ఏడుగురు అమావాస్యా హోమం చేయటానికి ఉద్యమించారు. దేవతలు అందరు తమ తమ హవిస్సుల వంతులు తీసికొనటానికి సంసిద్ధులై సమీపించారు.

**క. ఆహవనీయ ముఖంబున । నాహూతుం డై హుతాశుఁ డమ్మును లిడఁగా**
**నాహుతులు గొని దివిజ సం । దోహమునకు వరుస నొసఁగఁ దొడఁగెం బ్రీతిన్. 194**

**ప్రతిపదార్థం:** ఆహవనీయ, ముఖంబునన్= త్రేతాగ్నులలో మొదటిదైన ఆహవనీయం అనే పేరుగల అగ్ని పేరున; ఆ హూతుండు+ఐ= పిలువబడినవాడై; హుతాశుఁడు= అగ్నిహోత్రుడు; ఆ+మునులు= ఆ ఋషులు; ఆహుతులు= దేవతల నుద్దేశించి మంత్రపురస్సరంగా వేల్చబడిన హోమద్రవ్యాలు; ఇడఁగాన్= సమర్పించగా; కొని= గ్రహించి; దివిజ, సందోహమునకున్= వేల్పుల గుంపులకు; వరుసన్= క్రమంగా; ప్రీతిన్= సంతసంతో; ఒసఁగన్+తొడఁగెన్= ఇవ్వసాగాడు.

**తాత్పర్యం:** సప్తర్షులు ఆహవనీయ మనే పేరున తనను ఆహ్వానించగా, అగ్నిహోత్రుడు ఆ మునులు సమర్పించిన హోమద్రవ్యాలను గైకొని వాటిని దేవతలకు క్రమానుక్రమణిక చొప్పున సంతసంతో అందించసాగాడు.

అగ్నిదేవుండు మునిపత్నులం గామించుట (సం. 3-213-42)

**సీ.** **ఆ సమయంబున నమ్మునీంద్రుల భార్య । లందఱు సుస్నాన మొందఁ జేసి**
**రమణీయ మాల్యాంబర విభూషణాద్యలం । కారంబు లొనరించి గారవమునఁ**
**జనుదెంచి పతులకు సన్మతిం బరిచర్య । సేయుచు మెలఁగంగ వాయుసఖుఁడు**
**మెలఁతల వాలిక మెఱుఁగుఁ గన్నుల యొప్పుఁ । దెలినవ్వుమొగముల విలసనములు**

**తే.** **నడబెడంగులు నన్నువనడుములందు । వెలయు వళులభావంబులు వలుఁదచన్నుఁ**
**గవల నిక్కును నేర్పడఁ గని, కరంగి । మదనమార్గణ విదళిత హృదయుఁడయ్యె.** **195**

**ప్రతిపదార్థం:** ఆ, సమయంబునన్= ఆ కాలంలో; ఆ+ముని+ఇంద్రుల, భార్యలు= ఆ గొప్ప ఋషుల పెండ్లాలు; అందఱున్= అందరును; సుస్నానము= మంచి అభ్యంగన స్నానం; ఒందన్= ఇంపారగా; చేసి= ఆచరించి; రమణీయ, మాల్య+అంబర, విభూషణ+ఆది+అలంకారంబులు= అందమైన పువ్వులు, బట్టలు, నగలు మొదలైన సింగారింపులు; ఒనరించి= చేసికొని; గారవమునన్= మన్ననతో; చనుదెంచి= వచ్చి; పతులకున్= భర్తలకు; సత్+మతిన్= మంచి బుద్ధితో; పరిచర్య+ చేయుచున్= సేవచేస్తూ; మెలఁగంగన్= తిరుగాడగా; వాయుసఖుఁడు= అగ్నిహోత్రుడు; మెలఁతల, వాలిక, మెఱుఁగు+కన్నుల+ఒప్పున్= వనితల నిడివి అయిన వెలుగొందే నేత్రాల అందాన్ని; తెలినవ్వు మొగముల విలసనములు= తేట వైన ముఖాలలో విస్తరిల్లే నవ్వుల సింగారాలను; నడ బెడంగులు= నడకల ఒయ్యారాలు; అన్నువ నడుములందున్= సన్నని నడుములలో; వెలయు= ఒప్పారు; వళుల భావంబులు= మడతల పొందికలు; వలుఁద, చన్నుఁ గవల నిక్కును= గబ్బిగుబ్బల పొటమరింతలను; ఏర్పడన్+కని= స్పష్టంగా చూచి; కరంగి= ద్రవించి; మదన, మార్గణ విదళిత, హృదయుఁడు+అయ్యెన్= మన్మథుడియొక్క బాణాలచేత చీల్చబడిన గుండె కలవాడయ్యాడు.

**తాత్పర్యం:** అమావాస్యా హోమం చేస్తున్న సమయంలో సప్తర్షుల భార్యలు అందరున్నూ చక్కగా స్నానం చేసి అందమైన పువ్వులు ముడుచుకొని, క్రొత్త బట్టలు కట్టుకొని, ఆభరణాలు ధరించి, సహధర్మచారిణులై తమ తమ భర్తలకు గౌరవంతో శుశ్రూష చేస్తూ ఉన్నారు. వాయుసఖుడైన అగ్నిహోత్రుడు సప్తర్షుల భార్యల సౌందర్యాన్ని చూచి, కనువేదురుతో భ్రమందసాగాడు. ఆ అంగనల వాలుచూపులు, నునుసోగనేత్రాలు, మందహాసాలు చిందే వదనాలు, నడకలలోని ఒయ్యారాలు, సన్నని నడుములలోని ముడతలు, గబ్బిగుబ్బల పొటమరింతలు చూచి కరగి అగ్నిహోత్రుడు మన్మథబాణాలకు గురి అయి చలించిన హృదయం కలవాడయ్యాడు.

**వ.** **ఇట్లు వికలేంద్రియుండై వైశ్వానరుం డమ్మునిపత్నులయందుఁ దగిలిన డెందంబు మగిడింప నేరక వారలం గదియ నప్పళించి గార్హపత్యకుండంబునం దావేశించి.** **196**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; వికల+ఇంద్రియుండు+ఐ= వశం తప్పిన ఇంద్రియాలు కలవాడై; వైశ్వానరుండు= అగ్ని దేవుడు; ఆ+ముని, పత్నుల యందున్= ఆ ఋషుల భార్యల యందు; తగిలిన= అంటిన; డెందంబు= హృదయం; మగిడింపన్, నేరక= త్రిప్పజాలక; వారలన్= (ఆ మునుల భార్యలను); కదియన్+అప్పళించి= దగ్గరగా ఉండి స్పృశింపగోరి; గార్హపత్య కుండంబునందున్= గృహస్థులు గార్హపత్యమనే పేరుగల అగ్నిని వెలిగించే కుండంలో; ఆవహించి= చేరి.

**తాత్పర్యం:** ఈ విధంగా అగ్నిహోత్రుడు ఇంద్రియనిగ్రహాన్ని కోల్పోయినవాడై, ఆ ఋషులభార్యలయందు తగుల్కొనిన తన హృదయాన్ని మరలించ జాలకపోయాడు. ఆ మునీంద్రుల భార్యలను సమీపంలో ఉండి తాకగోరినవాడై, అతడు గార్హపత్య కుండంలో చేరాడు.

**విశేషం:** అగ్నులు మూడుతెరగులు 1) ఆహవనీయం 2) గార్హపత్యం 3) దక్షిణం. యజ్ఞానికి అనువైనది ఆహవనీయం. గృహస్థులకు అనువైనది గార్హపత్యం. దక్షిణం త్రేతాగ్నులలో అగ్రగణ్యం. ఇది శ్రోత్రియ బ్రహ్మచారులకు అనువైనది.

**చ. అతివలు దన్నుఁ జేరుటకు నాసపడుం, బొరిఁ జేరుచోట నా**
**యత విలసచ్ఛిఖాగ్రముల నల్లన వారల నంటుఁ, గౌతుకం**
**బతిశయమై తదంగలత లాదటఁ గౌఁగిటఁ జేర్పఁ గోరుఁ, గం**
**పిత ధృతి యై కలంగుఁ, గడుఁబెల్లగు రాగరసంబు ముంపఁగన్. 197**

**ప్రతిపదార్థం:** అతివలు= అంగనలు (ఆ మునిభార్యలు); తన్నున్= తనను (అగ్నిహోత్రుడిని); చేరుటకున్= దగ్గరకు రావటానికి; ఆసపడున్= ఆశిస్తాడు; పొరిన్= క్రమంగా; చేరుచోటన్= కలిసిన స్థలంలో; ఆయత, విలసత్+శిఖా+అగ్రములన్= నిడివి అయి ఒప్పారే జ్వాలలయొక్క కొసల భాగాలచేత; అల్లన= మృదువుగా; వారలన్= (ఆ ముని భార్యలను); అంటున్= తాకుతాడు. కౌతుకంబు+అతిశయము+ఐ= వేడుక మిక్కుటమై; తద్+అంగ, లతలు= వారల శరీరాలు అనే తీగలను; ఆదటన్= ఆసక్తితో; కౌఁగిటన్+చేర్పన్+కోరున్= ఆలింగనం చేసుకో గోరుతాడు; కంపిత, ధృతి+ఐ= చలించిన స్థైర్యం కలవాడై; కడున్= మిక్కిలి, పెల్లు+అగు= ఎక్కువ అయిన; రాగ, రసంబు, ముంపఁగన్= వలపు ప్రవాహం ముంచెత్తగా; కలంగున్= బాధ పడతాడు.

**తాత్పర్యం:** అగ్నిదేవుడు ఆ మునిభార్యలు తన దరికి చేరవలెనని పరితపించసాగాడు. తన దరికి చేరినప్పుడు, వరుసగా వారిని తన జ్వాలలచేత మృదువుగా తాకి స్పర్శసుఖం అనుభవించాడు. సుకుమార మైన లతలను బోలు వారి శరీరాలను తాక గోరాడు. వారిని తన కౌగిలిలో బంధించ తలపోశాడు. ఈ విధంగా ఆతడు తన స్థైర్యాన్ని కోలుపోయి మన్మథ వికారానికి లోనై బాధపడసాగాడు.

**విశేషం:** ఇందులో మన్మథావస్థలు మనోహరంగా వర్ణించబడ్డాయి. ఈ కాముకచేష్టలు నిసర్గరమణీయాలు. అలం: స్వభావోక్తి.

**వ. అంత నమ్మునీంద్రుల హోమవిధి సమాప్తం బగుటయు, జాతవేదుండు మదనవేదనాభరంబు సహింప నోపక నిర్జనం బయిన వనంబునకుం జని మునిపత్నీసమాగమంబు దుర్లభంబుగా వగచి వెగడంది శరీరంబు దిగ విడువ సమకట్టు నెడ, తదీయవల్లభ యైన స్వాహాదేవి తత్ప్రకారం బంతయు నెఱింగి, యతనికిం బ్రియంబు సేయునది యై సప్తమునులలో నంగిరసుభార్య శివ యను దాని రూపంబు గైకొని చని, యేకతంబ యున్న హుతాశనుం గనుంగొని యిట్లనియె. 198**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; ఆ+ముని+ఇంద్రుల, హోమ, విధి= ఆ ఋషులలో శ్రేష్ఠులైన వారల యొక్క యజ్ఞం; సమాప్తంబు+అగుటయున్= పూర్తి కావటం చేత; జాతవేదుండు= అగ్ని హోత్రుడు; మదన వేదనాభరంబు= మన్మథ బాధ యొక్క బరువు; సహింపన్+ఓపక= ఓర్వజాలక; నిర్జనంబు+అయిన= జనులు లేనట్టి; వనంబునకున్+చని= అడవికి వెళ్ళి; ముని, పత్నీ, సమాగమంబు= ఋషుల భార్యల యొక్క కలయిక; దుర్లభంబుగాన్= పొందరానిదిగా; వగచి= విచారించి; వెగడు+అంది= దిగులుతో నిస్పృహ చెంది; శరీరంబు= దేహం; దిగవిడువన్, సమకట్టున్+ఎడన్= త్యజించటానికి పూనుకొని ఉండగా; తదీయ, వల్లభ+ఐన= ఆతడి భార్య అయిన; స్వాహాదేవి= స్వాహ అనే పేరు గల శ్రీమతి; తద్+ప్రకారంబు+అంతయున్+ఎఱింగి= ఆ తీరు నంతటిని తెలిసికొని; అతనికిన్= (అగ్ని దేవుడికి); ప్రియంబు= ప్రీతిని; చేయునది+ఐ= కలిగించేదై; సప్త, మునులలోన్= ఏడుగురు ఋషులలో; అంగిరసు, భార్య= అంగిరసుడు అనే మునియొక్క పెండ్లం;

శివ+అను దాని రూపంబు= శివ అనే పేరు గల ఆమెయొక్క ఆకారాన్ని; కైకొని= స్వీకరించి; చని= వెళ్లి; ఏకతంబు+అ+ఉన్న= ఒంటరిగానే ఉన్న; హుతాశనున్= అగ్నిహోత్రుడిని; కనుంగొని= దర్శించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** ఆ తరువాత సప్తర్షులు ప్రారంభించిన అమావాస్యా హోమం ముగిసింది. ఇక ఆతడికి సప్తర్షుల భార్యలు కనిపించరుగదా! అందువలన అగ్నిహోత్రుడు విరహబాధ చేత తపించి, మన్మథ తాపం ఓర్వజాలక, చింతతో జనం లేని అరణ్యంలోకి పోయి, తన దేహం పరిత్యజించ సమకట్టాడు. అప్పుడు అగ్నిహోత్రుడిభార్య స్వాహాదేవి ఆ వృత్తాంతాన్ని పసికట్టి తనభర్తకు ప్రీతి కలిగించటానికై తాను సప్తర్షులలో నొకడైన అంగిరసుడి భార్య శివ అనే ఆమె రూపాన్ని ధరించి, అడవికి వెళ్లి అక్కడ ఒంటరిగా ఉన్న అగ్నిహోత్రుడిని చేరి ఇట్లా పలికింది.

**తే.** **'అంగిరసుభార్య నేను శివాభిధాన; । ననఘ! నాకును నాతోడి యంగనలకు**
**ననుదినంబును నతిమనోహర విలాస । మైన నీమూర్తిపైఁ గోర్కి యడరియుండు. 199**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా! ఏను= నేను; అంగిరసు, భార్యన్= అంగిరసుడు అనే మునియొక్క భార్యను; శివా+అభిధానన్= శివ అనే పేరు గలదానిని; నాకును; నాతోడి+అంగనలకున్= నాతోపాటు కల వనితలకును (అనగా సహవ్రతులైన సప్తర్షుల భార్యలకును); అనుదినంబును= ప్రతి దినం కూడా; అతి మనస్+హర, విలాసము+ఐన= మిక్కిలిగా మనస్సును ఆకర్షించే హొయలు కలది అయిన; నీ మూర్తిపైన్= నీ ఆకారంపై; కోర్కి= అభిలాష; అడరి+ఉండున్= అతిశయమై ఉంటుంది.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! నేను అంగిరసుడు అనే మునీశ్వరుడి భార్యను. నా పేరు శివ. నాకున్నూ, నాతోడి వారలయిన సప్తర్షుల భార్యలకున్నూ నీమీద వలపు ఏర్పడింది. నిత్యం మనోహర మైన నీ ఆకారంపై మేము అందరం మరులుగొన్నాం.

**ఉ.** **నీ మదిచంద మిట్టి దని నిక్క మెఱుంగక మే మజస్రముం**
**గామశరాహతిం గలఁగి కాఱియ వొందుదు మాత్మలందు; నీ**
**కామము మాదెసం గలిమి కౌతుకచేష్టలయం దెఱింగి యు**
**ద్దామ మనోరథప్రచలితస్థితి నందఱముం గ్రమంబునన్. 200**

**ప్రతిపదార్థం:** నీ మది చందము= నీ మనస్సు యొక్క విధం; ఇట్టిది+అని= ఇటువంటిది అని; నిక్కము= నిజం; ఎఱుంగక= తెలియ జాలక; మేము= మేము (సప్తర్షుల భార్యలం); అజస్రమున్= ఎల్లప్పుడున్నూ; కామ, శర+ఆహతిన్= మన్మథుడి బాణాలతో కొట్టబడటంచేత; ఆత్మలందున్= మా మనస్సులలో; కలఁగి= వెత చెంది; కాఱియ+పొందుదుము= బాధపడుతుంటాం; నీ కామము= నీ కోరిక; మా దెసన్+కలిమి= మా యందు ఉండటం; కౌతుక, చేష్టల+అందున్= వేడుక చూపే పనులలో (హావభావాలలో); ఎఱింగి= తెలిసికొని; ఉద్దామ, మనోరథ, ప్రచలిత, స్థితిన్= మిక్కిలియైన కోరికచే సడలిన మానసిక పరిస్థితి గలిగి; అందఱమున్= (సప్తర్షుల భార్యలం అందరమున్నూ); క్రమంబునన్= వరుసగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** నీ మనస్సు ఏ రీతిగా ఉన్నదో మాకు తెలియక మేము సదా మన్మథతాపానికి చిక్కి వెత చెందాం. కాని, నీకు కూడ మాయందు వలపు ఉన్నదని నీ వేడుకచేష్టలతో గూడిన హావభావాలవలన తెలిసికొన్నాం. ఇక, మేమందరమున్నూ మిక్కుటమైన కోరికచేత చలించని మనోనిబ్బరం కలవారమై, క్రమంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

చ. నినుఁ గవయందలంచి యిట నెమ్మిమెయిం జనుదెంచినార మిం
పునఁ జెలు లెల్లఁ; దొల్త ననుఁ బొమ్మని పంచిన వచ్చితిన్; మనం
బనవరతానురాగమున నంగజకేళి భజింపు మింక నొం
డని యెడ సేసితేనిఁ గుసుమాస్త్రుఁడు సైఁపఁడు నన్నుఁ బావకా!' 201

**ప్రతిపదార్థం:** పావకా!= అగ్నిహోత్రుడా!; నిన్నున్; కవయన్+తలంచి= పొందగోరి; ఇటన్= ఇక్కడకు; నెమ్మి మెయిన్= ప్రీతితో; ఇంపునన్= ఇష్టంతో; చెలులు+ఎల్లన్= సఖులం అందరం; చనుదెంచినారము= వచ్చాం; తొల్తన్= మొదట; ననున్= నన్ను; పొమ్ము+అని, పంచినన్= వెళ్లుము అని నియోగించగా; వచ్చితిన్= వచ్చాను; మనంబు= మనస్సు; అనవరత+ అనురాగమునన్= ఎల్లప్పుడును వలపుతో ఉండేటట్లుగా; అంగజ కేళి= మన్మథ క్రీడ- సంభోగం; భజింపుము= అనుభవించుము; ఇంకన్= ఇకమీద; ఒండు+అని= వే రొక మాట చెప్పి; ఎడ+చేసితి+ఏనిన్= దూరం చేశావా; కుసుమ+అస్త్రుఁడు= పూవులు మంత్ర బాణాలుగా కలవాడు - మన్మథుడు; నన్నున్= నన్ను; సైఁపఁడు= ఓర్వడు.

**తాత్పర్యం:** ఓ అగ్నిదేవుడా! నీ మీద వలపు చొప్పున, నిన్ను పొందాలి- అనే తమకంతో మే మందరం వచ్చాం. సఖులు అందరూ నన్ను ముందుగా నీ దగ్గరికి వెళ్లాలని నిర్ణయించి ఇటకు పంపారు. అందుచేత నేను నీదరికి వచ్చాను. నీవు మనసార నన్ను మన్మథ క్రీడలో తనుపుము. కాక, మరొక రకంగా పలికి నన్ను నిరాకరించావా, నన్ను మన్మథుడు సైపడు సుమా!'

వ. అనిన సంతసిల్లి యగ్నిదేవుండు దానిం గైకొనియె; నదియును నతని నభిమత భోగంబులం బ్రీతునిం జేసి, తదీయ తేజోధాతువు ధరియించి యచ్చోటు వాసి యాక్షణంబ గరుడి యై గగనంబునకు నెగసి యతిత్వరిత గమనంబున శ్వేతపర్వతంబునకుం జని యందొక్కయెడ శరవణస్తంబ సంవృతం బైన కాంచనకుండంబు నందు నిజభర్తృశుక్లంబు సంగ్రహించి, మఱియును. 202

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; సంతసిల్లి= సంతోషించి; అగ్నిదేవుండు= అగ్నిహోత్రుడు; దానిన్+కైకొనియెన్= దానిని స్వీకరించాడు (ఆమెను అంగీకరించాడు); అదియును= ఆమెయును (స్వాహా దేవియు); అతనిన్= అగ్నిహోత్రుడిని; అభిమత, భోగంబులన్= ఇష్టమైన సౌఖ్యాలచేత; ప్రీతునిన్+చేసి= సంతృప్తి చెందిన వాడిగా చేసి; తదీయ, తేజస్+ధాతువు= ఆతడి యొక్క శుక్లాన్ని; ధరియించి= వహించి; ఆ+చోటు+పాసి= ఆ స్థలం వదలిపెట్టి; ఆ, క్షణంబు+అ= ఆ ముహూర్తంలోనే, వెనువెంటనే; గరుడి+ఐ= ఆడ గరుడపక్షి అయి; గగనంబునకున్+ఎగసి= ఆకసానికి ఎగిరి; అతి, త్వరిత, గమనంబునన్= మిక్కిలి వేగం కల పయనంతో; శ్వేత పర్వతంబునకున్+చని= తెల్లకొండకు వెళ్లి; అందున్+ఒక్క+ఎడన్= ఆ శ్వేతపర్వతంలో ఒక చోట; శరవణస్తంబ సంవృతంబు+ఐన= రెల్లుగడ్డికాడలచేత చుట్టుకొనబడిఉన్న; కాంచన, కుండంబునందున్= బంగారు కుండలో; నిజ భర్త శుక్లంబు= తన పెనిమిటి వీర్యాన్ని; సంగ్రహించి= నిక్షిప్తం చేసి, కూర్చిపెట్టి; మఱియును ఇంకను.

**తాత్పర్యం:** ఆ మాటలకు అగ్నిహోత్రుడు సంతోషించాడు. అంతట ఆమె అగ్నిహోత్రుడిని శృంగారభోగంలో తేల్చి, ఆతని వీర్యాన్ని వహించి, ఆచోటు విడిచి ఆడగరుడపక్షి అయి ఆకాశానికి ఎగిరి, మిక్కిలి వేగంగా పయనించి శ్వేతపర్వతానికి చేరింది. అక్కడ ఒక చోట రెల్లుగడ్డికాడలచేత చుట్టుకొనబడిఉన్న ఒక బంగారు కుండలో తనభర్త శుక్లాన్ని కూర్చిపెట్టింది.

**క. మునిపత్నులరూపులు గై । కొని యిట్టుల వరుసఁ బుష్పకోమలి ప్రియుఁ బ్రీ**
**తునిఁ జేయుచు రేతస్కం । దన మొనరించుచును వచ్చెఁ దత్కలశమునన్. 203**

**ప్రతిపదార్థం:** మునిపత్నుల రూపులు= ఋషుల భార్యల ఆకారాలు; కైకొని= స్వీకరించి; ఇట్టులన్= ఈ విధంగానే; వరుసన్= క్రమంగా; పుష్పకోమలి= పువ్వు వంటి సౌకుమార్యం కలది (స్వాహాదేవి); ప్రియున్= భర్తను (అగ్నిహోత్రుడిని); ప్రీతునిన్+చేయుచున్= సంతృప్తి చెందినట్టివాడిని చేస్తూ; తద్+కలశమునన్= ఆ కుండలో; రేతస్కందనము= శుక్లాన్ని ప్రోగు చేయటం; ఒనరించుచును వచ్చెన్= చేయసాగింది.

**తాత్పర్యం:** పూవుబోడి అయిన స్వాహాదేవి క్రమంగా మునులభార్యల రూపాలు గైకొని, వరుసగా అగ్నిహోత్రుడి కడ కేగి, ఆతడిని సంతుష్టుడిని చేసింది. ఈ రీతిగా ప్రతి పర్యాయమున్నూ ఆమె తన భర్త శుక్లాన్ని రెల్లుగడ్డి నడుమన ఉన్న కలశంలో నిక్షిప్తం చేసింది.

**తే. విను, పతివ్రతాతిలక మై వెలయునట్టి । యయ్యరుంధతి రూపంబు నలవరింప**
**నెట్లు నేరద కాని యయ్యింతి యున్న । యువిద లార్వుర రూపులు నొనరఁ దాల్చె. 204**

**ప్రతిపదార్థం:** విను= వినుము; ఆ+ఇంతి= ఆ వనిత (స్వాహాదేవి); పతివ్రతా, తిలకము+ఐ= పతివ్రతలలో శ్రేష్ఠురాలు అయి; వెలయు+అట్టి= ఒప్పారే; ఆ+అరుంధతి రూపంబున్= ఆ అరుంధతి యొక్క ఆకృతిని; అలవరింపన్+ఎట్లు+నేరదు+అ+కాని= తాల్చటానికి ఏ విధంగానూ అనువు లభింపనిదైనది కాని; ఉన్న= తక్కిన; ఉవిదలు+ఆర్వుర, రూపులు= వనితలు ఆర్గురి ఆకారాలు; ఒనరన్+తాల్చెన్= ఒప్పేటట్లుగా ధరించింది.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఈ విషయాన్ని అవధానంతో ఆలకించుము. స్వాహాదేవి ఆర్గురుఋషులభార్యల రూపాలు ధరించి అగ్నిదేవుడిని తృప్తి పొందించగలిగింది కాని, పతివ్రతలలో శ్రేష్ఠురాలైన 'అరుంధతి' రూపాన్ని మాత్రం ధరించలేకపోయింది. (అరుంధతి వసిష్ఠ మహర్షి భార్య.)

**వ. ఇవ్విధంబున నాఱుమాఱులు ప్రస్కందితం బైన యగ్నితేజంబున. 205**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఆఱుమాఱులు= ఆరు సారులు; ప్రస్కందితంబు+అయిన= స్రవింపజేయబడిన; అగ్ని, తేజంబు= అగ్నిహోత్రుడి వీర్యం.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆరుమారులు స్రవింపజేయటం ద్వారా సేకరించబడిన అగ్నియొక్క వీర్యంనుండి.

## కుమారస్వామి యవతారము (సం. 3-211-17)

**క. ఆదిత్యనిభుఁడు విపుల । ద్వాదశబాహుండు షడ్వదనుఁ డఖిలదిశా**
**రోదోంతరంబు వెలుఁగ మ । హోదారుండై కుమారుఁ డుదయం బయ్యెన్. 206**

**ప్రతిపదార్థం:** ఆదిత్య, నిభుఁడు= సూర్యుడితో సమానుడు; విపుల; ద్వాదశ, బాహుండు= నిడివి అయిన పంద్రెండు చేతులు కలవాడు; షట్+వదనుఁడు= ఆరు మొగాలు కలవాడు; అఖిల, దిశా, రోదస్+అంతరంబు= అన్ని దిక్కుల మధ్యభాగం; వెలుఁగన్= ప్రకాశించగా; మహా+ఉదారుండు+ఐ= మిక్కిలి గొప్పవాడయి; కుమారుఁడు= (కుమార స్వామి); ఉదయంబు+అయ్యెన్= ఉద్భవించాడు.

**తాత్పర్యం:** సూర్యసమానుడు, నిడివిఅయిన పన్నెండు బాహువులు కలవాడు, ఆరు ముఖాలు కలవాడు; సర్వదిశలలో ఆకసానికి భూమికి మధ్య గల ప్రదేశమంతా వెలుగొందేటట్లుగా, మిక్కిలి గొప్పవాడయిన కుమారస్వామి జన్మించాడు.

**వ. ఇట్లు శుక్లపక్షంబునం బాడ్యమియందు వీర్యనిషేకంబును, విదియయందు గర్భవ్యక్తియుఁ, దదియయందు శరీరమాత్రావిర్భావంబునుం, జతుర్థియందు సకలావయవ సంపూర్ణతయు నై యుదయించిన కుమారుండు పంచమి యందు సముత్థితాకారుండై, పేర్చిత్రిపురదహన సాధనం బైన హరకార్ముకం బమ్మహీధరంబునందు నిక్షిప్తంబై యున్న దానిం బుచ్చుకొని గుణధ్వని సేసిన, నమ్మహాధ్వని విని కలుషించి యైరావత సుప్రతీకంబులను దిగ్గజంబు లయ్యగ్ని భవుమీఁదం బఱతెంచిన నమ్మహాభుజుండా రెంటినిం బెనఁచిపట్టి రెండుచేతుల ధరియించి, తన సహజం బైన శక్తి యొక్క కేలం, గ్రీడార్థ కలితం బైన కుక్కుటం బొక్కకేలను, బరిపూర్యమాణనినదం బైన శంఖంబు గరద్వయంబునం దాల్చి, హస్తయుగళంబున గగనంబు వ్రేయుచుం బాణియుగ్మంబు వక్త్రంబుల నిడికొని బాల్యోచితంబులైన యంగుళి చర్వణంబులు పొరిఁబొరి నొనరించుచు, నిశిత సాయకంబునం గ్రౌంచపర్వత విభేదనంబు సేసి, పటుశక్తిపాతంబున శ్వేతశైలశృంగభంగంబు గావించి చెలంగి యాఱు ముఖంబుల నొక్కపెట్ట యార్చినం, బ్రళయభైరవారావభీషణం బైన తదాఘోషణంబున.207**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; శుక్లపక్షంబునన్= శుక్లపక్షంలో; పాడ్యమి అందున్= మొదటి తిథియందు; వీర్యనిషేకంబును= శుక్లాన్ని ఉంచటమున్నూ; విదియ+అందున్= రెండవ తిథియందు; గర్భవ్యక్తియున్= కడుపు కనుపించటమున్నూ; తదియయందున్= మూడవ తిథియందు; శరీర మాత్ర+ఆవిర్భావంబునున్= దేహం మాత్రం ఉదయించటమున్నూ; చతుర్థియందున్= నాలుగవ తిథియందు; సకల+అవయవ, సంపూర్ణతయున్+ఐ, ఉదయించిన= అన్ని అంగాలు నిండి పుట్టిన; కుమారుండు= కుమారస్వామి; పంచమి యందున్= ఐదవ తిథియందు; సముత్థిత+ఆకారుండు+ఐ= బాగా లేచి నిలబడే రూపం కలవాడు అయి; పేర్చి= అతిశయించి; త్రిపుర దహన సాధనంబు+అయిన= మూడు నగరాలను కాల్చి వేయటానికి ఉపకరణం అయిన; హరు, కార్ముకంబు= శివుడి యొక్క విల్లు; ఆ+మహీధరంబు నందున్= ఆ కొండయందు; నిక్షిప్తంబు+ఐ= ఉంచబడినదై; ఉన్నదానిన్= ఉన్నటువంటి దానిని; పుచ్చుకొని= గ్రహించి; గుణ, ధ్వని, చేసినన్= అల్లెత్రాటిని మ్రోగించగా; ఆ+మహా, ధ్వని= ఆ గొప్ప శబ్దం; విని= ఆలకించి; కలుషించి= ఆగ్రహం చెంది; ఐరావత సుప్రతీకంబులు+అను= ఐరావతం, సుప్రతీకం అనే పేళ్ళు కల; దిక్+గజంబులు= దిగ్గజాలు- దిక్కులలో ఉండే ఏనుగులు; ఆ+అగ్నిభవుమీఁదన్= ఆ అగ్నియొక్క కుమారుడి మీద; పరతెంచినన్= ఎదుర్కొనటానికి రాగా; ఆ+మహాభుజుండు= గొప్ప భుజాలు కలవాడు అనగా ఆ మహాపరాక్రమశాలి; ఆ రెంటినిన్= (ఆ ఐరావత సుప్రతీకాలను రెండింటిని); పెనఁచిపట్టి= కదలకుండగా బిగియబట్టి; రెండు, చేతులన్= రెండు హస్తాలతో; ధరియించి= తాల్చి; తన, సహజంబు+ఐన= తనకు నైసర్గికంగా సంక్రమించిన; శక్తి= శక్తి అనే ఆయుధాన్ని; ఒక్క కేలన్= ఒక చేతిలో; క్రీడా+అర్థ, కలితంబు+ఐన= వినోదం కొరకై కూడుకొని ఉన్న; కుక్కుటంబున్= కోడిని; ఒక్కకేలను= ఒక చేతితోనూ; పరిపూర్యమాణ నినదంబు+ఐన= బాగా పూరింపబడి నినదించేదైనట్టి; శంఖంబు= సంకువు; కరద్వయంబునన్= రెండు చేతులతోను; తాల్చి= ధరించి; హస్త, యుగళంబునన్= రెండు చేతులతో; గగనంబు వ్రేయుచున్= ఆకసాన్ని చరుస్తూ; పాణి యుగ్మంబు= రెండు చేతులు; వక్త్రంబులన్= నోళ్ళలో; ఇడికొని= ఉంచి; బాల్య+ఉచితంబులు+అయిన= శిశువుకు తగినవైన; అంగుళి చర్వణంబులు= బొటన వ్రేళ్ళను చప్పరించటం; పొరిన్+పొరిన్+ఒనరించుచున్= మాటిమాటికి చేస్తూ; నిశిత, సాయకంబునన్= గొప్పదైన 'శక్తి' అనే ఆయుధాన్ని ప్రయోగించటంచేత; శ్వేత, శైల, భంగంబు, కావించి= తెల్లకొండ శిఖరాన్ని క్రిందకు పడగొట్టి; చెలంగి= అతిశయించి; ఆఱు ముఖంబులన్= ఆరు మోములతో; ఒక్కపెట్ట= ఒకేసారి; ఆర్చినన్= గొప్ప కేకవేయగా; ప్రళయ, భైరవ+ఆరావ, భీషణంబు+ఐన= ప్రళయకాలంలోని శివగణాధిపుడు చేసే భయంకరనాదంవలె భీతి కలిగించేది అయిన; తద్+ఆఘోషణంబునన్= ఆతడియొక్క (కుమారస్వామి చేసిన) పెద్ద అరుపు వలన.

**తాత్పర్యం:** ఈ విధంగా కుమారస్వామి ఆవిర్భవించి, దినదినాభివృద్ధి పొందాడు. శుక్లపక్షంలో పాడ్యమినాడు వీర్యనిషేకం, రెండవ తిథి విదియనాటికే గర్భం కన్పించటం, మూడవ తిథి తదియనాటికి దేహం మాత్రం ఆవిర్భవించటం జరిగి, నాలుగవ తిథి చతుర్థి నాటికి సాంగోపాంగంగా సంపూర్ణమైన ఆకృతి ఆతనికి లభించింది. పంచమి నాడు లేచి నిల్చినవాడై కుమారుడు ఆ కొండలో దాచబడి ఉన్నట్టి వింటిని - పరమశివుడు త్రిపురాలను కాల్చినట్టి కోదండాన్ని - పుచ్చుకొని, అల్లెత్రాటిని మ్రోగించాడు. ఆ మహాధ్వనికి అలిగి, ఐరావత సుప్రతీకాలు అనే రెండు దిగ్గజాలు ఆ కుమారుడిపైకి విజృంభించాయి. అంతట ఆ మహావీరుడు ఆ రెండు దిగ్గజాలను తన రెండు చేతులతో నణచి పెట్టాడు. ఒక చేతిలో తనకు పుట్టుకతోడనే సంక్రమించిన 'శక్తి' అనే ఆయుధాన్ని ధరించాడు. ఒక్క చేతితో వినోదార్థం ఒక కోడిని పట్టుకొన్నాడు. రెండు చేతులతో పట్టి శంఖాన్ని పూరించాడు. రెండు చేతులతో ఆకసాన్ని చరచాడు; రెండు చేతులు నోళ్ళలో ఉంచుకొని, శిశుసహజంగా బొటన వేళ్ళను లీలగా చప్పరించాడు. ఒక వాడిబాణాన్ని ప్రయోగించి క్రౌంచపర్వతాన్ని బ్రద్దలు కొట్టాడు. తన గొప్ప ఆయుధమైన 'శక్తి'ని ప్రయోగించి శ్వేతశైలశృంగాన్ని విరుగ గొట్టాడు. తదుపరి తన ఆరు మొగాలతో ఆ కుమారుడు సింహనాదం చేశాడు. కుమారస్వామి కావించిన ఆ ధ్వని ప్రళయకాలంలో శివగణాధిపుడైన భైరవుడు చేసే భయంకరనాదం వలె పిక్కటిల్లింది.

**విశేషం:** 1. శివుడు రాక్షసులకు ఆవాసాలైన మూడుపురాలను నాశనంచేశాడు- అందువల్లే అతడు త్రిపురాంతకు డయ్యాడు. ఇది పురాణగాథ. 2. దిగ్గజాలు:- దిగ్గజాలు ఎనిమిది. 1. ఐరావతం 2. పుండరీకం 3. వామనం 4. కుముదం. 5. అంజనం 6. పుష్పదంతం 7. సార్వభౌమం. 8. సుప్రతీకం. ఇవి ఎనిమిది దిక్కులలో భూమిని మోస్తాయని సాహితీసమయం. ప్రళయం:- జగత్తు అంతా నశించే కాలం. అప్పుడు లయకారుడైన శివుడు ప్రళయతాండవం చేస్తాడు. భైరవుడు అనగా శివుడు అని అర్థం. శివగణాధిపులలో భైరవుడు సుప్రసిద్ధుడు. ఈ ప్రకరణంలో భైరవశబ్దానికి శివగణనేత అని అర్థం చెప్పటం సమంజసం.

**మ.** **కులశైలంబులు గ్రక్కునం గదలె; దిక్కుల్ వ్రయ్య లయ్యెన్; మహీ**
**వలయం బంతయు దిర్దిరం దిరిగె; దేవవ్రాతముల్ సాధ్వసా**
**కులతం బొందెఁ; బయోధు లన్నియును సంక్షోభించె; సప్తాశ్వస**
**ప్తులు బిట్టుల్కి రథంబు నల్దెసలకుం బో నీడ్చె సంభ్రాంతమై.** **208**

**ప్రతిపదార్థం:** కుల శైలంబులు= కుల పర్వతాలు; గ్రక్కునన్+కదలెన్= వేగంగా చలించాయి; దిక్కుల్= దిక్కులు; వ్రయ్యలు+అయ్యెన్= పగిలాయి; మహీ, వలయంబు+అంతయున్= భూమండలం సమస్తమున్నూ; దిర్దిరన్+తిరిగెన్= గుండ్రంగా గిరగిర తిరిగింది; దేవ వ్రాతముల్= వేల్పుల సముదాయాలు; సాధ్వస+ఆకులతన్+పొందెన్= భయంతో కూడిన సంచలనానికి లోనయ్యాయి; పయోధులు= సముద్రాలు; అన్నియును; సంక్షోభించెన్= ఆకులతను పొందాయి; సప్త+అశ్వ, సప్తులు= సూర్యుడి యొక్క గుర్రాలు; బిట్టు= మిక్కిలి; ఉల్కి= భయపడి; సంభ్రాంతము+ఐ= ఎక్కువ మోహానికి లోనై తిరుగుడు పడి; రథంబు= తేరును; నల్ దెసలకున్= నాలుగు దిక్కులకు; పోన్+ఈడ్చెన్= పోయేటట్లుగా లాగాయి.

**తాత్పర్యం:** కులపర్వతాలు వేగంగా చలించాయి, దిక్కులు బ్రద్దలయ్యాయి. భూమండలం గిరగిర తిరుగసాగింది, వేల్పుల సమూహాలు తొట్రుపాటుతో సంచలించాయి. సముద్రాలు పొంగులు వారాయి, సూర్యుడి గుర్రాలు మిగుల భ్రమ చెంది రథాన్ని ఇటు నటు నాలుగుదెసలకు ఈడ్వసాగాయి.

**విశేషం:** (1) కులపర్వతాలు ఏడు. "మహేంద్రో మలయ స్సహ్య శ్శుక్తిమాన్ గంధమాదనః, వింధ్యశ్చ పారియాత్ర శ్చ సప్తైతే కులపర్వతాః". ఈ ఏడు కులపర్వతాలున్నూ భూమిని భరించేవి- అని పురాణకథనం. అందుచేత 'మహీధరము'- భూమిని మోసేది అనగా పర్వతం అనే అర్థ మేర్పడింది. (2) సప్తాశ్వుడు అనగా సూర్యుడు. సూర్యుడి రథానికి ఏడు గుర్రాలు అని ప్రాచీన సాహిత్యసమయం.

**క. ఇట్టిమహోత్పాతంబులు । పుట్టినఁ గని మునులు లోకములకు శుభముగా**
**నెట్టన శాంతికవిధు ల । ప్పట్టున నొనరించి రాత్మభావనపరులై. 209**

**ప్రతిపదార్థం:** ఇట్టి= ఈ విధమయిన; మహా+ఉత్పాతంబులు= గొప్పవైన భూతవికారాలు (ఉపద్రవాలు); పుట్టినన్= కలుగగా; కని= చూచి; మునులు= ఋషులు; లోకములకున్= జగాలకు; శుభముగాన్= మేలు కలిగేటట్లుగా; నెట్టన్= బాగుగా; శాంతిక విధులు= ఉపద్రవాలు తొలగించటానికై చేసే జపహోమాలు మున్నగు క్రియలు; ఆత్మ భావన పరులు+ఐ= బ్రహ్మజ్ఞానంలో నిల్పిన బుద్ధి కలవారై; ఆ+పట్టునన్= ఆ వేళ; ఒనరించిరి= చేశారు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఏర్పడిన భూతవికారాలను కాంచి, ఆ ఉపద్రవాలు ఉపశమించి లోకకల్యాణం కలుగటానికై జ్ఞానులు అయిన ఋషులు శాంతికవిధులగు జపహోమాదిక్రియలను ఆ సమయంలో నెరవేర్చారు.

**విశేషం:** ఉత్పాతాలు - శుభాన్ని అశుభాన్ని సూచించే ప్రకృతివికారాలు. ఇవి మూడు విధాలు :- 1. దివ్యం:- సూర్యగ్రహణం చంద్రగ్రహణం మొదలైనవి. 2. అంతరిక్షం :- ఉల్కాపాతం మున్నగునవి. 3. భౌమము:- భూకంపాలు ఉప్పెనలు మున్నగునవి.

**వ. ఆ సమయంబునం జైత్రరథ వననివాసు లైన జనులందఱుం గూడి 'యంగిరః ప్రముఖ మునీంద్రుల భార్యలకు నగ్నిదేవువలనం బుట్టిన బాలుండు లోకంబులకు నిట్టి యనర్థంబు సేయం దొడంగె' నని యాక్రోశించిన, నయ్యపవాదంబునకు రోసి యా సప్తమునులలోన వసిష్ఠుండు దక్కఁ దక్కిన యార్వురుఁ దమ వనితలం బరిత్యజించిరి; మఱియును గొందఱు జనులు 'వీ రేమి సేయుదు? రన్నిపోకలం బోయినది వహ్ని భార్యయ కాక' యని పలుకం జొచ్చి; రంత నమ్మహామునులపాలికిఁ బావకాంగన సనుదెంచి యిట్లనియె. 210**

**ప్రతిపదార్థం:** ఆ, సమయంబునన్= ఆ వేళను; చైత్ర రథ, వన, నివాసులు+ఐన= 'చైత్ర రథం'- అనే పేరుగల అడవిలో ఉండునట్టి; జనులు+అందఱున్+కూడి= ప్రజలు అందరున్నూ కలిసి; అంగిరస్+ప్రముఖ, ముని+ఇంద్రుల, భార్యలకున్= అంగిరసుడు మున్నగు ఋషివరేణ్యుల పెండ్లాలకు; అగ్నిదేవువలనన్+పుట్టిన= అగ్నిదేవుడివలన జన్మించిన; బాలుండు= పిల్లవాడు; లోకంబులకున్= జగములకు; ఇట్టి= ఈ విధమైన; అనర్థంబు= ఉపద్రవం; చేయన్+తొడంగెన్= చేయడానికి ఉపక్రమించాడు; అని= అంటూ; ఆక్రోశించినన్= ఎలుగెత్తి దుఃఖంతో ప్రకటించగా; ఆ+అపవాదంబునకున్= ఆ నిందకు; రోసి= వెత చెంది; ఆ సప్తమునులలోనన్= ఆ ఏడుగురి ఋషులలో; వసిష్ఠుండు+తక్కన్= వసిష్ఠుడు మినహాయించి; తక్కిన+ఆర్వురున్= మిగిలిన ఆరుమంది ఋషులున్నూ; తమ, వనితలన్= తమ భార్యలను; పరిత్యజించిరి= వదలి పెట్టారు; మఱియును+కొందఱు జనులు= మరికొందరు ప్రజలు; వీరు+ఏమి+చేయుదురు= (ఈ ఋషుల భార్యలు) ఏమి చేయగలరు; ఇన్ని+పోకలన్+పోయినది= ఇన్ని విధాలైన పద్ధతులలో వెళ్లింది; వహ్నిభార్య+అ, కాక= అగ్ని దేవుడి ఇల్లాలు మాత్రమే కదా అని, పలుకన్+చొచ్చిరి= అని చెప్పసాగారు; అంతన్= అటుపిమ్మట; ఆ+మహా, మునుల, పాలికిన్= ఆ గొప్ప ఋషుల దగ్గరకు; పావక+అంగన= అగ్ని దేవుడి ఇల్లాలు; చనుదెంచి= వచ్చి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** ఆ సమయంలో 'చైత్రరథం' అనే పేరు గల అడవిలో నివసించే జనులందరు కూడి, 'ఈ ఉపద్రవం కలిగించింది ఋషులభార్యలకు అగ్నిదేవుడివలన జన్మించిన బాలకుడు' అని ఘోషించారు. ఆ నిందకు తాళజాలక, వసిష్ఠుడు తప్ప తక్కిన ఋషులు ఆర్గురూ తమ భార్యలను వదలి వేశారు. కాని, కొందరు ప్రజలు 'పాపం ఈ ఋషులభార్యలు చేసిన తప్పు ఏమున్నది? ఈ నాటకం అంతటిని ఆడింది అగ్నిదేవుడి భార్యయే కదా' అని పలికారు. అంతట అగ్నిదేవుడిభార్య ఆ మునుల దగ్గరకు వెళ్లి ఈ విధంగా చెప్పింది.

**క. 'వినుఁ డేను వహ్నివలనం। గనిన కుమారుండు వాఁడు; గడు నిజ మిది; మీ**
**వనితలకుం బని గా; దిటు। సనునే కులసతుల విడువ సత్పురుషులకున్?' 211**

**ప్రతిపదార్థం:** వినుఁడు= ఆలకించండి; ఏను= నేను; వహ్నివలనన్= అగ్నిదేవుడి వలన; కనిన= కన్నట్టి; కుమారుండు= కొడుకు; వాఁడు= (ఆ బాలుడు); కడున్, నిజము+ఇది= ఇది అచ్చమైన సత్యం; మీ వనితలకున్+పని+కాదు= (ఇది) మీ భార్యలవలన జరిగిన కార్యం కాదు; ఇటు= ఈ రీతిగా; సత్+పురుషులకున్= మంచి మగలకు; కులసతులన్= పతివ్రతలైన భార్యలను; విడువన్+చనునే= విడిచిపెట్టటం మంచిదా? (కాదని భావం).

**తాత్పర్యం:** 'అయ్యలారా!, నా మనవి ఆలకించ వేడికోలు. ఈ బాలుడు నాకును నా భర్త అయిన అగ్నిదేవుడికిని జన్మించినవాడు. ఇది మీ భార్యలవలన జరిగిన పని కాదు. సజ్జనులు పతివ్రతలైన భార్యలను విడనాడటం న్యాయం కాదు గదా!'

**వ. అని యెంత సెప్పిన వారొడంబడ రైరి; తదనంతరంబ విశ్వామిత్రుండు గుమారు కడ కరిగి యద్దేవు శరణంబు సొచ్చి వివిధ వాక్యంబులం బ్రస్తుతించి, తదాదేశంబున నతనికి జాతకర్మాదివిధు లొనరించిన, నదియంతయు నెఱింగి యమరు లెల్ల నమరేంద్రుం గానఁ జని యిట్లనిరి. 212**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; ఎంత+చెప్పినన్= ఏ విధంగా చెప్పినప్పటికీ; వారు= (ఆ ఆర్గురు మునులు); ఒడంబడరు+ఐరి= సమ్మతించని వారు అయ్యారు- అంగీకరించలేదు; తద్+అనంతరంబు+అ= అటుపిమ్మటనే; విశ్వామిత్రుండు= విశ్వామిత్రుడు అనే ఋషి; కుమారు కడకున్+అరిగి= (ఆ) బాలకుడి దగ్గరకు వెళ్లి; ఆ+దేవున్= ఆ వేల్పును; శరణంబు+చొచ్చి= ఆశ్రయించి; వివిధ, వాక్యంబులన్= పలుతెరగుల మాటలచేత; ప్రస్తుతించి= పొగడి; తద్+ఆదేశంబునన్= ఆతడి యొక్క ఆజ్ఞ మేరకు; అతనికిన్= (ఆ బాలుడికి); జాత, కర్మ+ఆది, విధులు= పుట్టినపుడు చేయవలసిన జప హోమాలు, వ్రతాలు మున్నగు క్రియలు; ఒనరించినన్= చేయగా; అమరులు+ఎల్లన్= వేల్పులు అందరున్నూ; అది+అంతయున్+ఎఱింగి= ఆ విషయాన్నంతా తెలిసికొని; అమర+ఇంద్రున్+కానన్+చని= దేవేంద్రుడిని చూడటానికి వెళ్లి; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** ఆ విధంగా అగ్నిభార్య చెప్పింది. కాని ఆ ఋషులు సమ్మతించలేదు. అటు పిమ్మట విశ్వామిత్రుడు అనే ఋషి ఆ బాలకుడివద్దకు వెళ్లి ఆతడిని శరణువేడుకొని, ఆతడి అనుమతిప్రకారం ఆతడికి జాతకర్మాదులను నెరవేర్చాడు. ఆ విషయాన్ని అంతా తెలిసికొని దేవతలు దేవేంద్రుడి వద్దకు వెళ్లి ఈ విధంగా పలికారు.

**విశేషం:** జాతకర్మం= బిడ్డ పుట్టినప్పుడు జరిగే మంత్ర తంత్ర కర్మకాండం. పుట్టినప్పటినుండి గిట్టేవరకు జరిగేవి షోడశ కర్మలు. అందులో జాతకర్మం ఒకటి. వీటికి సంస్కారాలు అని పేరు. షోడశకర్మలు. 1. గర్భాధానం 2. పుంసవనం 3.

సీమంతం 4. జాతకర్మం 5. నామకరణం 6. అన్నప్రాశం 7. చౌలం 8. ఉపనయనం 9. ప్రాజాపత్యం 10. సౌమ్యం 11. ఆగ్నేయం 12. వైశ్వదేవం 13. గోదానం 14. సమావర్తనం 15. వివాహం 16. అంత్యసంస్కారం.

**ఉ. 'దారుణశౌర్యధుర్యుఁ డతిదర్పిత చిత్తుఁడు వహ్నిసూనుఁ డ**
**న్వీరుఁడు నిన్నుఁ గైకొనక వీఁకమెయిం జనుదెంచు నిప్డు దు**
**ర్వారత నీ పదంబు గొనువాంఛ నవశ్యముఁ; గాన యింతలో**
**నీరస మెత్తి వాని వధియింపుము చెచ్చెర విక్రమోద్ధతిన్. 213**

**ప్రతిపదార్థం:** దారుణ, శౌర్య, ధుర్యుఁడు= ఘోరమైన పరాక్రమం వహించేవాడు; అతి, దర్పిత, చిత్తుఁడు= మిక్కిలి గర్వం కల మనస్సు గలవాడు; వహ్ని సూనుఁడు+అన్+వీరుఁడు= అగ్నిదేవుడి కొడుకు అనే వీరుడు; నిన్నున్+కైకొనక= ఇంద్రుడవైన నిన్నుసైతం లెక్కపెట్టక; వీఁక మెయిన్= ఉత్సాహంతో; ఇప్డు= ఇప్పుడు; దుర్వారతన్= అడ్డగించటానికి అనువు కాకుండగ; నీ పదంబున్= నీ పదవిని; కొను వాంఛన్= గ్రహించే కోరికతో; అవశ్యమున్= తప్పనిసరిగా; చనుదెంచున్= వస్తాడు; కాన= కావున; ఇంతలోన్= ఈ లోపుగా; ఈరసము+ఎత్తి= ఆగ్రహించి; చెచ్చెరన్= వేగంగా; విక్రమ+ఉద్ధతిన్= పరాక్రమం యొక్క ఆధిక్యం చూపున; వానిన్= ఆ బాలుడిని; వధియింపుము= చంపుము.

**తాత్పర్యం:** అగ్నికుమారుడు మిక్కుటమైన పరాక్రమం కలవాడు. మిక్కిలి గర్వం కలవాడు. నిన్ను కూడ సరకు గొనడు; నీ పదవిని ఆక్రమించవలె ననెడి దురుద్దేశంతో ఉత్సాహం చూపున తప్పక నీ పయి దండెత్తి రాగలడు. కావున, నీవు ఈ లోపుగనే ఆగ్రహించి ఆతడిని వేగంగా సంహరించుము.

**వ. అట్లయిన నీకు నింద్రత్వంబు శాశ్వతం బగు; నేమును బ్రదుకుదుము; లోకంబు లవ్యాకులంబు లగు' నని నం బురందరుం డప్పుడ సప్తమాతృకలం బిలిచి 'మీరు సని వహ్నిసంభవుం డైన కుమారు సమయించి, నాకుఁ బ్రియంబు సేయుం' డని పంచినం, బనిపూని వారు ఘోరంబుగా నతనిపై నడరి తదీయ తేజోవిశేషంబునకు భయంబంది. యతని శరణంబు సొచ్చి, 'యేము లోకమాతలము; మాయందు నీవు మాతృభావంబు సేయ నర్హుండ' వనినం గుమారుండు వారి నభినందించి చేకొనియె; నంత నగ్నియు నిజపుత్త్రుపాలికి వచ్చి, యతని చేతంబూజితుం డయి తదీయ రక్షాపరత్వంబున నిలిచె; మాతృగణంబు క్రోధంబునం బుట్టినయది లోహితాస్య యను భామిని కుమారునకు దాదియై యుపలాలనంబు సేయుచుండె; నఖిలభూతగణంబులుం బఱతెంచి క్రౌంచారిం బరివేష్టించె; నది యంతయు విని కలుషించి. 214**

**ప్రతిపదార్థం:** అట్లు+అయినన్= ఆ విధంగా జరిగితే; నీకున్= నీకు; ఇంద్రత్వంబు= ఇంద్రపదవి; శాశ్వతంబు+అగున్= ఎల్లప్పుడు ఉండేది కాగలదు; ఏమును= మేము కూడా; బ్రదుకుదుము= (హాయిగా) జీవించ గలం; లోకంబులు= జగాలు; అవ్యాకులంబులు+అగున్= కలత చెందినట్టివి కాగలవు; అనినన్= అని చెప్పగా; పురందరుండు= దేవేంద్రుడు; అప్పుడు+అ= వెనువెంటనే; సప్తమాతృకలన్+పిలిచి= ఏడుగురు తల్లులను ఆహ్వానించి; మీరు= మీరు (సప్త మాతృకలు); చని= వెళ్ళి; వహ్ని, సంభవుండు+ఐన= అగ్ని దేవుడికి పుట్టినట్టి; కుమారున్= బాలకుడిని; సమయించి= చంపి; నాకున్= నాకు; ప్రియంబు+ చేయుండు= సంతృప్తి సంఘటించండి; అని= అని చెప్పి; పంచినన్= ఆజ్ఞాపించి పంపగా; వారు= (ఆ సప్త మాతృకలు); పని, పూని= ఆ కార్యం నెరవేర్చ వలెననే దీక్షను వహించి; ఘోరంబుగాన్= క్రూరంగా; అతనిపైన్= ఆ బాలకుడిపై; అడరి= విజృంభించి; తదీయ, తేజన్+విశేషంబునకున్= ఆతని యొక్క దేదీప్యమానమైన వెలుగుకు; భయంబు+అంది= వెరపు

చెంది; అతనిన్, శరణంబు+చొచ్చి= అతడికి లొంగిపోయి, అతడిని కాపాడుమని వేడుకొని; ఏము= మేము; లోక మాతలము= జగాలకు తల్లులం; మా అందున్= మా యెడల; నీవు= నీవు; మాతృ భావంబు+చేయన్+అర్హుండవు= తల్లి యెడల చూపే ప్రేమను చూపతగినవాడవు; అనినన్= అని పలుకగా; కుమారుండు= బాలుడు; వారినిన్= వారిని (సప్త మాతృకలను); అభినందించి= గౌరవించి; చేకొనియెన్= మన్నించి ఆదరించాడు; అంతన్= అటు పిమ్మట; అగ్నియున్= అగ్ని హోత్రుడున్నూ; నిజపుత్రుపాలికిన్= తన కొడుకు దగ్గరికి; వచ్చి= అరుదెంచి; అతని చేతన్= (కుమారుడిచేత); పూజితుండు+అయి= అర్చించబడినవాడై; తదీయ, రక్షా, పరత్వంబునన్= ఆతడి యొక్క సంరక్షణలో ఉన్నవాడై; నిలిచెన్= ఉన్నాడు; మాతృగణంబు క్రోధంబునన్= తల్లుల సముదాయం యొక్క కోపం వలన; పుట్టిన+అది= జన్మించినట్టిది; లోహితాస్య+అను, భామిని= లోహితాస్య అనే పేరు కల స్త్రీ (ఎర్రని మొగం కలది లోహితాస్య); కుమారునకున్= బాలుడికి; దాది+ఐ= పరిచర్యలు చేసేదై (మాతృస్థానీయ అయి); ఉపలాలనంబు+చేయుచున్+ఉండెన్= ప్రేమతో సేవలు చేస్తూ ఉన్నది; అఖిల, భూత గణంబులున్= సమస్తమైన భూతాల సముదాయాలు; పఱతెంచి= అరుగుదెంచి; క్రౌంచారిన్= (క్రౌంచ+అరిన్) కుమారుడిని; పరివేష్టించెన్= చుట్టును చేరి కొలుస్తూ ఉన్నారు; అది+అంతయున్+విని= ఆ విషయాన్ని అంతా ఆలకించి; కలుషించి= ఆగ్రహం చెంది

**తాత్పర్యం:** ఆ విధంగా నీవు ఆ బాలకుడిని సంహరిస్తే నీకు ఇంద్రపదవి శాశ్వతంగా దక్కగలదు; మేముకూడా హాయిగా జీవించగలం' అని చెప్పగా విని, దేవేంద్రుడు వెంటనే సప్తమాతృకలను పిలిచి 'మీరు అగ్నిహోత్రుడి కుమారుడిని చంపండి' అని ఆజ్ఞాపించాడు. ఆ సప్తమాతృకలు దేవేంద్రుడి పనుపు చేయటానికి ఉద్యమించి, కుమారుడి దగ్గరకు వెళ్ళారు. కాని, కుమారుడి దేదీప్యమానమైన తేజస్సును చూచి, భయపడి, అతడిని శరణువేడి, అతడికి పాదాక్రాంతలు అయి ఇట్లా అన్నారు. 'మేము లోకమాతలం; నీవు మమ్మల్ని తల్లులవలెనే చూడదగును.' అనగా కుమారుడు తనను శరణు చొచ్చిన ఆ సప్తమాతృకలను అభినందించి మన్నించాడు. అంతట అగ్నిహోత్రుడుకూడ తన తనయుడి కడకు వచ్చి, అతడిని సంరక్షించే పనిలో ఉండి, అతడిచేత పూజించబడుతూ ఉన్నాడు. సప్తమాతృకలకోపం నుండి ఉద్భవించిన లోహితాస్య అనే స్త్రీ, కుమారుడికి మాతృస్థానీయ యైన దాదిఅయి గారాబంగా అతడిని పెంచుతూ ఉండింది. అఖిల భూతగణాలు స్వచ్ఛందంగా వచ్చి కుమారుడి చుట్టూ చేరారు. ఆ విషయాన్నంతా తెలిసికొనిన దేవేంద్రుడు కోపించాడు.

**విశేషం:** సప్తమాతృకలు= ఏడ్గురు తల్లులు 1. బ్రాహ్మి 2. మాహేశ్వరి 3. కౌమారి 4. వైష్ణవి 5. వారాహి 6. ఇంద్రాణి 7. చాముండ.

### ఇంద్రుఁడు కుమారస్వామిపై నెత్తివచ్చుట (సం. 3-216-3)

**ఉ. స్కందునిమీఁద నెత్తి బలగర్వితుఁడై నడతెంచె నుద్భట**
**స్యందన సామజాశ్వభట సంకుల సైన్య సమగ్ర దేవతా**
**బృంద సమేతుఁడై భువనభీకరసంగరకాంక్ష నింద్రుఁ డ**
**స్పందితశౌర్యుఁ డగ్నికణజాత భయంకరవజ్రహస్తుఁడై. 215**

**ప్రతిపదార్థం:** అస్పందిత శౌర్యుఁడు= చలించని పరాక్రమం కలవాడు ఇంద్రుడు; బలగర్వితుఁడు+ఐ= బలంచేత గర్వించినవాడై; ఉత్+భట, స్యందన, సామజ+అశ్వ, భట, సంకుల, సైన్య, సమగ్ర, దేవతా, బృంద, సమేతుఁడు+ఐ= అతిశయించిన, రథాలతో, ఏనుగులతో, గుర్రాలతో, సైనికులతో, క్రిక్కిరిసిన సేనఅందున్న వేల్పుల సముదాయంతో కూడినట్టివాడై; భువన, భీకర, సంగర, కాంక్షన్= లోకభయంకరమైన యుద్ధంమీది కోరికతో; అగ్ని కణ, జాత, భయంకర, వజ్ర హస్తుఁడు+ఐ= నిప్పు

కణాలు విరజిమ్మటం చేత వెరపు గొలిపే వజ్రాయుధాన్ని చేతియందు ధరించినవాడై; స్కందుని మీఁదన్= కుమారస్వామి పైకి; ఎత్తి= దండెత్తి; నడతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** తన శక్తిసామర్థ్యాలమీది నమ్మకంచేత ఏర్పడిన గర్వంతో, ఉత్సాహంతో ఉరకలు వేస్తున్న రథాలు ఏనుగులు భటులతో కూడిన అపార దేవతాసైన్యంతో లోకభయంకరమైన యుద్ధం చేయటానికి ఉత్సహించిన వాడై, నిప్పులు చెరగుతున్న వజ్రాయుధాన్ని చేతపట్టినవాడై దేవేంద్రుడు కుమారుస్వామిపై దండెత్తి వచ్చాడు.

**వ. అంత. 216**

**తాత్పర్యం:** అప్పుడు.

**తరలము.**

**తరళదీధితిపుంజనిర్భరదారుణాయుధపాణు లై**
**తెరలఁ ద్రోచి దివౌకసుల్ పఱతెంచి యార్చుచుఁ దాఁకి రా**
**శరవణోద్భవు; నాతఁడుం దగ సంభ్రమస్ఫుటరోష వి**
**స్ఫురితనిష్ఠురహాసజృంభణమున్ వహించినఁ జెచ్చెరన్. 217**

**ప్రతిపదార్థం:** దివౌకసుల్= దేవతలు; తరళ, దీధితి, పుంజ, నిర్భర, దారుణ+ఆయుధ, పాణులు+ఐ= ప్రకాశించే కాంతుల సముదాయంచేత చుట్టుకొనబడి భయంకరంగా కనిపించే ఆయుధాలు కల చేతులు కలవారై; తెరలన్+త్రోచి= ఉప్పొంగి వచ్చి; పఱతెంచి= వేగంగా అరుగుదెంచి; ఆర్చుచున్= కేకలు వేస్తూ; ఆ శరవణ+ఉద్భవున్= రెల్లుగడ్డి గుంపులో జన్మించిన ఆ కుమారస్వామిని; తాఁకిరి= ఎదుర్కొన్నారు; ఆతఁడున్= ఆ కుమారుడుకూడా; తగన్= అనువుగా, సంభ్రమ, స్ఫుట, రోష, విస్ఫురిత, నిష్ఠుర, హాస, జృంభణమున్= వేగిరిపాటుతో వ్యక్తమైన కోపంచేత వ్యాపించిన కఠోరమైన అతిశయించిన నగవును; వహించినన్= పొందగా; చెచ్చెరన్= వేగంగా.

**తాత్పర్యం:** అటు పిమ్మట దేవతలు తళతళ వెలుగొందుతున్న భయంకర మైన ఆయుధాలు చేతులలో ధరించినవారై ఉత్సాహం ఉప్పొంగేటట్లుగా కేకలు వేస్తూ కుమారస్వామిపై దండెత్తి వచ్చారు. అప్పుడు ఆ కుమారస్వామి వేగిరపాటుతో కూడిన కోపంవలన ఏర్పడిన కఠోరమైన నవ్వు తన పెదవులపై విరియగా, వేగంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు: ఆరణ్య. 4.402 విశేషం.

**తే. అతని ముఖగహ్వరంబుల నద్భుతముగ । నుగ్రదహనశిఖావళు లుద్భవించి**
**వేల్పుమూఁకల నరికట్టి వేల్వఁ దొడఁగె; । నంత నెంతయు సంభ్రాంతు లగుచు సురలు. 218**

**ప్రతిపదార్థం:** అతని, ముఖ, గహ్వరంబులన్= ఆ కుమారస్వామి మొగాలు అనే గుహలనుండి; అద్భుతముగన్= అచ్చెరువు కొలుపుతూ; ఉగ్ర, దహన, శిఖా+ఆవళులు= భయంకరమైన అగ్ని జ్వాలల సముదాయాలు; ఉద్భవించి= పుట్టి; వేల్పు మూఁకలన్= దేవతల గుంపులను; అరికట్టి= అణచివేసి; వేల్వన్+తొడఁగెన్= కాల్చివేయసాగాయి; అంతన్= అటు పిమ్మట; సురలు= దేవతలు; ఎంతయున్; సంభ్రాంతులు+అగుచున్= మనస్సు చెదరినవారు ఔతూ.

**తాత్పర్యం:** ఆ కుమారస్వామి ముఖాలనే గుహలనుండి ఆశ్చర్యకరంగా అగ్నిజ్వాలల సముదాయాలు వెలువడి, దేవతల గుంపులను అణచివేసి కాల్చసాగాయి. అంతట దేవతలు మనస్సు చెదరినవారు ఔతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'నీ కింకరులము మమ్ముం । జేకొని కృపఁ గావు' మనుచు శిఖినందను న**
**స్తోకబలు శరణు వేఁడినఁ । జేకొని దాహభయ ముడుగఁ జేసె నతండున్. 219**

**ప్రతిపదార్థం:** నీ, కింకరులము= నీ యొక్క సేవకులం; మమ్ముస్= మమ్ము; చేకొని= స్వీకరించి; కృపన్+కావుము= దయతో కాపాడుము; అనుచున్= అని పలుకుతూ; అస్తోక, బలున్= ఎక్కువ శక్తి కలవాడిని; శిఖినందనున్= అగ్నిహోత్రుడి పుత్రుడైన కుమారస్వామిని; శరణు వేడినన్= అభయాన్ని ప్రార్థించగా; అతండున్= ఆ కుమారస్వామియును; చేకొని= స్వీకరించి; దాహ, భయము= అగ్నివలన ఏర్పడిన వెరపును; ఉడుగన్+చేసెన్= తొలగిపోయేటట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** అంతట దేవతలు, 'ఓ మహానుభావా! మేము నీకు భృత్యులం; మమ్మ నీ దాసులుగా స్వీకరించి దయతో కాపాడునది' అంటూ కుమారస్వామిని ప్రార్థించారు. కుమారస్వామి వారిపై జాలికలిగి, శరణార్థులైన ఆ దేవతలను అగ్నిభయంనుండి తప్పించి, వారికి అభయం ఇచ్చాడు.

**వ. ఇట్లు దేవతలు గుమారు నాశ్రయించినం జూచి బలసూదనుండు క్రోధఘూర్ణితనయనుండై యతనిమీఁద వజ్రంబు వైచిన, నది తదీయ దక్షిణపార్శ్వంబుఁ దాఁకిన, నం దొక్క పురుషుండు గాంచనవర్ణుండును శక్తి ధరుండును మేషవదనుండును నై విశాఖుం డను పేరం బ్రభవించె; మఱియునుం గన్యాకుమార గణంబు లనేకంబులు వుట్టె; నది యెల్లనుం గని జనితభయుం డై హరిహయుం డగ్నిసంభవు నభయం బని కొలిచె; నంత నమరులు సంతసిల్లి సింహనాదంబులు సెలంగ షణ్ముఖ శతమఖులం బరివేష్టించి' రని చెప్పి వెండియు మార్కండేయుం డి ట్లనియె. 220**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దేవతలు= వేల్పులు; కుమారున్+ఆశ్రయించినన్= కుమారస్వామిని శరణు వేడగా; చూచి= అరసి; బలసూదనుండు= దేవేంద్రుడు; క్రోధ, ఘూర్ణిత, నయనుండు+ఐ= కోపం చేత తిరుగుడు పడిన కన్నులు కలవాడై; అతని మీఁదన్= (ఆ కుమారస్వామిపై); వజ్రంబు= వజ్ర మనే ఆయుధాన్ని; వైచినన్= వేయగా; అది= (ఆ వజ్రాయుధం); తదీయ, దక్షిణ పార్శ్వంబున్= ఆ (కుమారస్వామియొక్క) కుడివైపు దేహభాగాన్ని; తాఁకినన్= స్పృశించగా; అందున్= (ఆ కుడి పార్శ్వంలో); ఒక్క, పురుషుండు= ఒక మగవాడు; కాంచన వర్ణుండును= బంగరు మిసిమిరంగు కలవాడున్నూ; శక్తి ధరుండును= శక్తి అనే ఆయుధాన్ని తాల్చిన వాడున్నూ; మేష వదనుండునున్= మేక మొగం కలవాడున్నూ; ఐ= అగుచు; విశాఖుండు+అనుపేరన్= విశాఖుడు అనే పేరు కలవాడై; ప్రభవించెన్= పుట్టాడు; మఱియునున్= ఇంకను; కన్యా, కుమార, గణంబులు+అనేకంబులు= పెక్కుమంది బాల బాలికల గుంపులు; పుట్టెను= ఉద్భవించాయి; అది+ఎల్లనున్+కని= ఆ సంఘటనను అంతటిని చూచి; జనిత, భయుండు+ఐ= పుట్టిన భయం కలవాడై - అనగా భయపడి; హరిహయుండు= దేవేంద్రుడు; అగ్ని సంభవున్= అగ్నిహోత్రుడికొడుకైన కుమారస్వామిని; అభయంబు+అని, కొలిచెన్= శరణు వేడుకొనెను; అంతన్= పిమ్మట; అమరులు= దేవతలు; సంతసిల్లి= సంతోషించి; సింహ నాదంబులు+చెలంగన్= సింహ గర్జనలు ధ్వనించగా; షట్+ముఖ, శతమఖులన్= ఆరు మొగాల దేవర అయిన కుమారస్వామిని, నూరు జన్నముల దేవర అయిన దేవేంద్రుడిని; పరివేష్టించిరి= చుట్టును చేరి కూర్చొన్నారు; అని చెప్పి= అని పలికి; వెండియున్= తిరిగి; మార్కండేయుండు= మార్కండేయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా, దేవతలు కుమారస్వామిని శరణువేడటంచేత దేవేంద్రుడు ఆగ్రహోదగ్రు డయ్యాడు. అతడు కుమారస్వామిపై తన వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆ వజ్రాయుధం కుమారస్వామి శరీరంలోని కుడి భాగాన తాకింది. అప్పుడు ఆ భాగంనుండి ఒక పురుషుడు బంగరుమిసిమిరంగు కల శరీరంతో, మేక మొగంతో జన్మించాడు. ఆ పురుషుడు శక్తి అనే ఆయుధాన్ని ధరించాడు. అతడిపేరు విశాఖుడు. అతడితో పాటు లెక్కకు మిక్కిలి బాల బాలికలు ఉద్భవించారు. ఆ వింతసన్నివేశాన్ని చూచి భయపడి దేవేంద్రుడు తాను కూడ కుమారస్వామిని శరణు వేడాడు. అక్కడ ఉన్న దేవతలందరు సంతోషింతో సింహనాదాలు చేస్తూ కుమారస్వామి దేవేంద్రుల చుట్టూ చేరి నిల్చారు' అని చెప్పి మార్కండేయమహర్షి మరియు ఈ విధంగా తెలిపాడు.

**సీ.** **అయ్యగ్నిసంభవు నాయతోన్నతబాహు, । నాముక్తకవచుఁ, దేజోమహిష్ఠు,**
**నాలోహితాంబరు, హారికుండలకర్ణుఁ, । గనకరత్నోజ్జ్వల ఘనకిరీటు,**
**సంపూర్ణయౌవను, సర్వలక్షణయుక్తుఁ । గని, యనురాగిల్లి కమలనిలయ**
**సాకార యై వచ్చి యఖిలంబుఁ జూడంగ । సితపద్మహస్త యై యతనిఁ బొందె;**

**ఆ.** **శ్రీసమేతుఁడై విశేషకాంతిస్ఫూర్తి । నొలసి పూర్ణచంద్రుచెలువు దాల్చి**
**యున్నవానిఁ జూచి రుత్ఫుల్లలోచన । కుముదు లగుచు మునులు నమరవరులు.** **221**

**ప్రతిపదార్థం:** కమల నిలయ= పద్మ నివాసిని అయిన లక్ష్మీదేవి; ఆ+అగ్ని, సంభవున్= అగ్నిహోత్రుడి కుమారుడైన ఆ కుమారస్వామిని; ఆయత+ఉన్నత, బాహున్= నిడివి అయిన మరియు ఎత్తైన భుజాలు కలవాడిని; ఆ ముక్త కవచున్= ధరించబడిన కవచం కలవాడిని- అనగా కవచం ధరించిన వాడిని; తేజస్+మహిష్ఠున్= దేదీప్యమాన మైన వెలుగు చేత గొప్ప వాడైన వాడిని; ఆలోహిత+అంబరున్= మిక్కిలి ఎర్ర నైన వస్త్రాలు కలవాడిని; హారి, కుండల, కర్ణున్= అందమైన దుద్దులు గల చెవులు కలవాడిని; కనక, రత్న+ఉజ్జ్వల, ఘన, కిరీటున్= బంగారంతో మణులతో ప్రకాశించే గొప్ప కిరీటం కలవాడిని; సంపూర్ణ, యౌవనున్= నిండు జవ్వనంతో తొణికిసలాడుతున్న వాడిని; సర్వ, లక్షణ, యుక్తున్= అన్ని మంచి గుణాలతో కూడిఉన్న వాడిని; కని= చూచి; అనురాగిల్లి= ప్రేమించి; స+ఆకార+ఐ, వచ్చి= శరీర ధారిణి అయి అరుగుదెంచి; అఖిలంబున్+చూడంగన్= సమస్తం (సర్వభూతాలును) చూస్తూఉండగా; సిత, పద్మ, హస్త+ఐ= తెల్లని తామరపువ్వులను రెండు చేతుల్లో ధరించినదై; అతనిన్= ఆకుమారస్వామిని; పొందెన్= చేరింది; మునులున్= ఋషులును; అమర, వరులున్= దేవతలలో శ్రేష్ఠులును; శ్రీ, సమేతుఁడు+ఐ= లక్ష్మీదేవితో కూడిన వాడై; విశేష, కాంతి, స్ఫూర్తిన్+ఒలసి= గొప్పదైన వెలుగు యొక్క వ్యాప్తిచేత ఒప్పారి; పూర్ణ, చంద్రు, చెలువు+తాల్చి= నిండు చందురుడి పోలుపు ధరించి; ఉన్నవానిన్= ఉన్న వాడిని, కుమారస్వామిని; ఉత్+ఫుల్ల, లోచన, కుముదులు+అగుచున్= బాగా వికసించిన తెల్లకలువలవంటి కన్నులు కలవారు ఔతూ; చూచిరి= తిలకించారు.

**తాత్పర్యం:** అగ్నిహోత్రుడి పుత్రుడైన ఆ కుమారస్వామి నిడివి అయి ఎత్తైనభుజాలు కలవాడు. కవచాన్ని ధరించిన వాడు. దేదీప్యమానమైన వెలుగు వెల్లి విరిసిన ముఖం కలవాడు. మిక్కిలి ఎర్రనైన వస్త్రాలు ధరించినవాడు. మణులు పొదిగిన బంగారు కిరీటం ధరించిన వాడు. నిండు జవ్వనం తొణికిసలాడుతున్నవాడు. సర్వ సద్గుణ విరాజితుడు. అట్టి అతడిని చూచి ప్రేమించి, లక్ష్మీదేవి శరీరధారిణి అయి వచ్చి అతడిని చేరింది. ఆమె చేతిలో శృంగారకమలం విరిసి ఉంది. ఆ రీతిగా లక్ష్మీయుక్తుడై దేదీప్యమానంగా వెలుగొందుతున్న కుమారస్వామిని పూర్ణచంద్రుడివలె సౌందర్యంతో ఒప్పారేవాడిని ఋషులు వేల్పులు ఆనందంతో ఆశ్చర్యంతో తిలకించారు.

**వ. అంత షష్ఠదివసంబు సంప్రాప్తం బయ్యె; నందు మహామునులందఱు మహాసేను నతిభక్తిం బూజించి, కృతాంజలులై యిట్లనిరి. 222**

**ప్రతిపదార్థం:** అంతటన్= అటు పిమ్మట; షష్ఠ దివసంబు= ఆరవ రోజు; సంప్రాప్తంబు+అయ్యెన్= వచ్చింది; అందున్= అక్కడ; మహా, మునులు+అందఱున్= గొప్ప ఋషులు అందరున్నూ; మహాసేనున్= కుమారస్వామిని; అతిభక్తిన్= మిక్కిలి పూజ్యభావంతో; పూజించి= ఆరాధన చేసి; కృత+అంజలులు+ఐ= ఘటించిన కైమోడుపులు కలవారలై- నమస్కరించిన వారై; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** ఆ పిమ్మట ఆరవదినం వచ్చింది. అచట ఉన్న గొప్ప ఋషులు కుమారస్వామిని భక్తితో ఆరాధించి, నమస్కారాలు చేసి ఈ విధంగా పలికారు.

**ఉ. 'పుట్టిన యాఱునాళులకుఁ బొంపిరివోయి జగంబు లన్నియున్**
**దట్టుఁడ వై జయించితి ముదంబుగ నీదు మహత్త్వ మెంతయుం**
**జిట్టలు గాదె! యిట్టి యవిజేయుఁడ వింద్రపదంబు నీక కాఁ**
**బట్టము గట్టి యేలుము కృపన్ మము నెల్లను వహ్నిసంభవా!' 223**

**ప్రతిపదార్థం:** వహ్నిసంభవా!= అగ్నిహోత్రుడి కొడుకు వయిన ఓ కుమారస్వామీ!; పుట్టిన= జన్మించిన; ఆఱు, నాళులకున్= ఆరు రోజులకు; పొంపిరి+పోయి= అతిశయించి; జగంబులు+అన్నియున్= లోకాలు అన్నింటిని; దట్టుఁడవు+ఐ= ధీరుడవై; ముదంబునన్= సంతోషంతో; జయించితి(వి)= గెలిచావు; నీదు, మహత్త్వము= నీ యొక్క గొప్పదనం; ఎంతయున్= మిక్కుటంగా; చిట్టలు+కాదె= అచ్చెరువు కొల్పేది కదా; ఇట్టి+అవిజేయుఁడవు= ఈ విధంగా ఓటమి చెందని వీరుడవు; ఇంద్ర పదంబు= ఇంద్రుడి యొక్క పదవి; నీకున్+అ+కాన్= నీకు మాత్రమే ఉండేటట్లుగా; పట్టము+కట్టి= పట్టాభిషేకం చేసి; మమున్+ఎల్లను= మమ్ముల నందరిని; కృపన్= దయతో; ఏలుము= పరిపాలించుము.

**తాత్పర్యం:** 'అగ్నిదేవుడి పుత్రుడవైన కుమారస్వామీ! నీ మహిమ మిగుల ఆశ్చర్యకరమైనది. నీవు పుట్టిన ఆరురోజులకే అవలీలగా జగాలనన్నింటిని జయించావు కదా! నీవు అజేయుడవైన మహావీరుడవు. కాబట్టి ఇంద్రపదవిని అధిష్ఠించి, దయతో నీవు మమ్ములను అందరిని పరిపాలించుము'.

**వ. అనినం గ్రౌంచారి వారలం జూచి' యింద్రపదవి నుండువారి కెయ్యది కరణీయం?' బని యడుగుటయు వారిట్లనిరి. 224**

**తాత్పర్యం:** అని పలుకగా, కుమారస్వామి అక్కడ ఉన్నవారిని చూచి 'ఇంద్రపదవిలో ఉండేవారు నెరవేర్చవలసిన పని ఏది?' అని ప్రశ్నించగా, వారు ఇట్లా బదులు పలికారు.

**మ. 'బలముం దేజము నించి లోకముఁ గృపం బాలించు టర్కేందు భూ**
**జల తేజః పవనాంబరంబులకు నస్థైర్యంబు గాకుండ ని**
**శ్చలశక్తిస్థితి నీఁగి శిష్టజనరక్షాదుష్టశిక్షాసమా**
**కలనం బింద్రపదస్థుఁ డౌ నతనికిం గర్తవ్యముల్ షణ్ముఖా!' 225**

**ప్రతిపదార్థం:** షట్+ముఖా!= ఆరు మోముల దేవరా!; ఇంద్ర పదస్థుఁడు+ఔ= ఇంద్రుడి యొక్క పదవిలో ఉండే; అతనికిన్= అతడికి; బలమున్= శక్తిని; తేజమున్= వెలుగును; నించి= నింపి; లోకమున్= జగత్తును; కృపన్= దయతో; పాలించుట= ఏలుట; అర్క+ఇందు, భూ, జల, తేజస్+పవన+అంబరంబులకున్= సూర్యుడికి, చంద్రుడికి, భూమికి, నీటికి, అగ్నికి, గాలికి, ఆకసానికిన్నీ; అస్థైర్యంబు+కాకుండన్= చలనం లేకుండా, అనగా తిరంగా ఉండటానికై; నిశ్చల, శక్తి, స్థితిన్+ఈఁగి= చలించని సామర్థ్యం ఒసగి; శిష్ట, జన రక్షా, దుష్ట, శిక్షా, సమ్+ఆకలనంబు= మంచివారిని రక్షించటం చెడ్డవారిని శిక్షించటం జరుపుతుండటం; కర్తవ్యముల్= చేయవలసిన పనులు.

**తాత్పర్యం:** 'ఆరుమోములదేవరా! ఓ కుమారస్వామీ! స్వీయసామర్థ్యం తేజస్సు లోకంలో నిలిపి, దుష్టులను శిక్షించటం శిష్టులను రక్షించటం మూలంగా పరిపాలన చేయటం, పంచభూతాలు సూర్యచంద్రులు తిరంగా ఉండేటట్లు చూడటం ఇంద్రపదవి నధిష్ఠించేవాడు చేయదగిన పనులు.

**చ. అనునెడ నింద్రుఁ డిట్లనియె, 'నట్లయినం గడులెస్స; దేవ! నీ**
**వనిమిషనాయకత్వమునయం దభిషిక్తుఁడవై ముదంబుతో**
**ననుఁ బని గొమ్ము నీదు కరుణన్ దొసఁ గెల్లను దీఱి యుండెదన్;**
**ఘనతర శౌర్యసారుఁడవు గావున నర్హుఁడ వింద్రలక్ష్మికిన్. 226**

**ప్రతిపదార్థం:** అను+ఎడన్= అని చెప్పేటప్పుడు; ఇంద్రుఁడు= వేలుపుదొర; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అట్లు+అయినన్= ఆ విధంగా జరిగితే (అనిన దేవతల ప్రార్థన మేరకు కుమారస్వామి ఇంద్రపదవిని స్వీకరిస్తే); కడు= మిక్కిలి; లెస్స= మంచిది; దేవ!= ఓ కుమారస్వామీ!; నీవు; అనిమిష నాయకత్వమున+అందున్= దేవతల యొక్క నాయకత్వంలో; అభిషిక్తుఁడవు+ఐ= అభిషేకించబడిన వాడవు అయి (అభిషేకం ప్రభుత్వ లాంఛనం); ముదంబుతోన్= సంతోషంతో; ననున్= నన్ను; పని+కొమ్ము= పనులను చేయటానికై నియోగించుము; నీదు కరుణన్= నీ యొక్క దయవలన; దొసఁగు+ ఎల్లను+తీఱి+ఉండెదన్= దోషాలు అన్నిటిని దాటిన వాడవై ఉండగలను; ఘనతర శౌర్యసారుఁడవు= గొప్పదైన పరాక్రమం యొక్క సారాన్ని పొందిన వాడవు; కావునన్; ఇంద్ర లక్ష్మికిన్= ఇంద్రపదవి యొక్క ఐశ్వర్యానికి; అర్హుఁడవు= తగిన వాడవు, యోగ్యుడవు.

**తాత్పర్యం:** అనగా, ఇంద్రుడు ఈ విధంగా చెప్పాడు: 'దేవతలు చెప్పిన మాటలు బాగా ఉన్నవి. ఓ కుమారస్వామీ! నీవు దేవేంద్రపదవిలో అభిషిక్తుడవై నన్ను నీ భృత్యుడిగా ఏలుకొనుము. నేను నీ ఆజ్ఞప్రకారం నడచుకొనగలను. నాకంటె పరాక్రమంలో నీవు అధికుడవు కాబట్టి ఇంద్రపదవికి నీవే యోగ్యుడవు.

**వ. ఏను దేవేంద్రపదవి నుండ నోడుదు; నెట్లనిన భవదీయ తేజోవిశేషంబులు సూచి విస్మితులై కొందఱు నీకు నింద్రపదవియందు వేడ్కపుట్టునట్లుగా నే మేనింజెప్పి నావలనం గొఱగామి కల్పించి, నీకును నాకును భేదంబు సేయం జూతురు; దానం జేసి నీవు కుపితుండవై నాయెడం గృపదప్పిన నెవ్వారికి వారింప నలవిగాదు; లోకభయంకరంబైన విగ్రహంబు ప్రవర్తిల్లుఁ గావున నవశ్యంబును దివిజరాజ్యంబు నీక యొప్పించితి; మమ్మెల్ల నేలి కొ' మ్మనినఁ గుమారుండు నవ్వుచు ని ట్లనియె. 227**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; దేవ+ఇంద్ర, పదవిన్= వేల్పులకు ప్రభువు అయిన ఇంద్రుని పదవిలో; ఉండన్+ఓడుదున్= ఉండుటకు జంకెదను; ఎట్లు+అనినన్= అందుకు కారణం ఏమి అని అడిగితే; భవదీయ, తేజస్+విశేషంబులు= నీయొక్క

దేదీప్యమైన గొప్పకాంతి మున్నగునవి; చూచి= అరసి; విస్మితులు+ఐ= అచ్చెరువు పొందిన వారై; కొందఱు= కొంతమంది; నీకున్; ఇంద్ర, పదవి+అందున్= వేల్పులకు ప్రభువుగా ఉండే పదవిలో; వేడ్క= ఆసక్తి; పుట్టునట్లుగాన్= కలుగునట్లుగా; ఏమి+ఏనిన్+చెప్పి= ఏదో ఒకటి కల్పించి పలికి; నా వలనన్= నాయందు; కొఱగామి కల్పించి= లోటుపాటు నిరూపించి; నీకును, నాకును= నీకును నాకును మధ్య; భేదంబు+చేయన్+చూతురు= శత్రుత్వం ఏర్పడేటట్లు ప్రయత్నాలు చేయగలరు; దానన్+చేసి= అందువలన; నీవు; కుపితుండవు+ఐ= కోపం చెందిన వాడవై; నా+ఎడన్= నా యెడల; కృపన్+తప్పినన్= దయమాలితే, ఆగ్రహిస్తే; ఏ+వారికిన్= ఎట్టి వారికినైనను; వారింపన్= ఆపుటకు; అలవి+కాదు= శక్యం కాదు; లోక, భయంకరంబు+ఐన= లోకానికి అంతటికీ భయం కలిగించేది అయిన; విగ్రహంబు= కయ్యం; ప్రవర్తిల్లున్= ఏర్పడుతుంది; కావునన్= కాబట్టి; అవశ్యంబును= తప్పనిసరిగా; దివిజ రాజ్యంబు= దేవతల ఏలుబడి; నీకున్+అ= నీకు ఒక్కడికే; ఒప్పించితిన్= సమర్పించాను; మమ్మున్+ఎల్లన్= మమ్మలిని అందరిని (వేల్పుల నందరిని); ఏలి కొమ్ము= పరిపాలించుకొమ్ము; అనినన్= అని చెప్పగా; కుమారుండు= కుమారస్వామి; నవ్వుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'నేను దేవేంద్రపదవిని ఇక అధిష్ఠింప జాలను. ఎందుకంటే దేదీప్యమానమైన నీ తేజస్సు చూచి, అచ్చెరువు పొందిన కొంతమంది నీవే దేవతలకు తగిన ప్రభుడవు అని చెప్పి, నీకు దేవేంద్రపదవిపై అభిలాష కలిగేటట్లు చూడగలరు. అప్పుడు నామీద నీకు ఆగ్రహం ఏర్పడవచ్చును. అప్పుడు నీవు నాపై పరాక్రమించిన, నిన్ను ఆపగల వార లెవరు? మనమధ్య ఏర్పడే శత్రుత్వం జగత్తుకు వినాశకరం. అందుచేత నీకును, నాకును, లోకానికి మేలు కలుగ వలెననే మంచిఉద్దేశంతో ఈ దేవలోక రాజ్యాన్ని నీకు సమర్పించటానికి ఉద్యమించాను. నన్ను, నాతోడి వేల్పులను దయతో పరిపాలించుము' అని దేవేంద్రుడు అభ్యర్థించాడు. ఆ మాటలు విని ఆదరాభిమానాలు సూచించే నవ్వుతో కుమారస్వామి ఇట్లా బదులు పలికాదు.

**ఉ.** **'అట్టివి యేల పుట్టు? నమరాధిప! నీవ జగత్ప్రభుండ వై**
**యిట్టల మైన తేజము వహించి సుఖంబున నుండు; మేను నీ**
**చుట్టమనై భుజాబలము సొంపున నీ కెలసంబు దీర్చెదం;**
**జట్టన నన్నుఁ బంపుము భృశంబుగ నెయ్యది కార్య మిత్తఱిన్?'** **228**

**ప్రతిపదార్థం:** అమర+అధిప!= ఓ దేవేంద్రుడా!; అట్టివి= అటువంటివి - అనగా చెప్పుడుమాటలవలన మనమధ్య ఏర్పడే విభేదాలు; ఏల= ఎందువలన; పుట్టున్?= కలుగుతాయి; నీవు+అ= నీవు మాత్రమే; జగత్+ప్రభుండవు+ఐ= లోకాలను పరిపాలించే రాజువుఅయి; ఇట్టలము+ఐన= హెచ్చు అయిన; తేజము= దేదీప్యమానమైన కాంతి; వహించి= ధరించి; సుఖంబునన్+ఉండుము= సౌఖ్యాన్ని అనుభవించుము; ఏను= నేను; నీ చుట్టమును+ఐ= నీ యొక్క బంధువును ఐ; భుజా, బలము, సొంపునన్= పరాక్రమం యొక్క సొగసుచేత; నీ కెలసంబు= నీ యొక్క పని; తీర్చెదన్= నెరవేరుస్తాను; చట్టనన్= శీఘ్రంగా; నన్నున్= నన్ను; పంపుము= నియోగించుము; ఈ+తఱిన్= ఈ సందర్భాన; భృశంబుగన్= వేగంగా; కార్యము= నెరవేర్చవలసిన పని; ఎయ్యది= ఏది?

**తాత్పర్యం:** 'ఓ దేవేంద్రా! చెప్పుడుమాటలవలన నీకును నాకును మధ్య శత్రుత్వం ఎన్నటికిని ఏర్పడదు. నీవు మనస్సులో ఎట్టి సంకోచాన్ని పెట్టుకొనవలదు. నీవు గొప్ప తేజస్సు కలవాడవు. అనుభవజ్ఞుడవు. పరిపాలనలో సామర్థ్యం ఉన్నవాడివి. నీవే దేవలోకాన్ని నిశ్చితంగా ఏలుకొనుము. నేను నీకు బంధువుగా నీ అండ నిలిచి నా పరాక్రమం ప్రదర్శించి నీ పనులను నిర్వహించగలను. ఇప్పుడు అవశ్యం నెరవేర్చదగిన కర్తవ్యాన్ని సూచింపుము. వెంటనే నెరవేర్చగలను'.

**చ. అనవుడు సంతసిల్లి యతఁ డాతని కిట్లను 'నట్టు లైన నీ**
**పనుపున నేను సత్యహితభాషణ! యింద్రపదంబునందు ని**
**ల్చి నెగడువాఁడ నైతి; సురసేనల కెల్లను నాయకుండ వై**
**ఘనభుజ! నీవు సత్కృప జగద్భయమోచన మాచరింపవే!' 229**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; అతఁడు= (దేవేంద్రుడు); సంతసిల్లి= సంతోషించి; ఆతనికిన్= (కుమారస్వామికి); ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; సత్యహిత భాషణ!= నిజంగా మేలొనగూర్చునట్టి దానిని వచించేవాడా, ఓ కుమార స్వామీ!; అట్టులు+ఐనన్= ఆ విధంగా అయితే; (అనగా నీవు చెప్పినట్లుగా నీవు నాకు బంధువుగా ఉండి, నాకు అండగా నిలిస్తే); నీ పనుపునన్= నీ అనుమతి చొప్పున; ఏను= నేను; ఇంద్ర, పదంబు నందున్= దేవేంద్ర పదవిలో; నిల్చి= ఉండి; నెగడువాఁడన్+ఐతిన్= ఒప్పునట్టివాడను అయినాను; ఘన, భుజ!= గొప్ప బాహువులు కలవాడా! మిక్కుటమైన పరాక్రమం కలవీరుడా!; సుర, సేనలకున్+ఎల్లను= సమస్తమైన వేల్పుల భటులకు; నాయకుండవు+ఐ= నేతవు అయి-సేనాధిపతివై; నీవు; సత్+కృపన్= మంచి దయతో; జగత్+భయ, మోచనము= లోకానికి ఏర్పడిన భీతిని తొలగించటం; ఆచరింపవే!= చేయవా! (చేయుము).

**తాత్పర్యం:** అని కుమారస్వామి చెప్పాడు. ఆ మాటలు విని దేవేంద్రుడు మిక్కిలి సంతసించాడు. అంతట దేవేంద్రుడు కుమారస్వామితో ఈ విధంగా అన్నాడు: 'సత్యాన్ని వచించేవాడా! నామేలు కోరి వచించేవాడా! నీ మాటలు విశ్వసించి నీ అనుమతి చొప్పును నేను ఈ దేవేంద్రపదవిలో ఉండటానికి అంగీకరిస్తున్నాను; గొప్ప పరాక్రమంగల మహాబాహుడా! నీవు దేవతా సైన్యానికి నాయకుడవై, సర్వసేనాపతివై పరాక్రమ ప్రాభవంతో లోకంలో ఏర్పడి ఉన్న భయాన్ని తొలగించటానికి దయతో పూనుకొనుము'.

**వ. అనినఁ గుమారుండు మరుత్పతి కిట్లనియె. 230**

**తాత్పర్యం:** అనగా కుమారస్వామి దేవేంద్రుడితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'నీకుఁ బ్రియంబుగా భవదనీకినికిం బతి నయ్యెదన్ భుజో**
**త్సేకపటుప్రభావము లజేయములై పెనుపొందఁ బేర్చి ఘో**
**రాకృతు లైన నీ రిపుల నందఱఁ దున్మెద సర్వలోక ర**
**క్షాకరణైకవృత్తి నవికల్పుఁడ నయ్యెదఁ; గట్టు పట్టమున్'. 231**

**ప్రతిపదార్థం:** నీకున్+ప్రియంబుగాన్= నీకు సంతోషం కలిగేటట్లుగా; భవత్+అనీకినికిన్= నీ సైన్యానికి; పతిన్= భర్తను; అయ్యెదన్= ఔతాను; భుజ+ఉత్సేక, పటు, ప్రభావములు= భుజ పరాక్రమంయొక్క గొప్ప మహిమలు; అజేయములు+ఐ= గెలవటానికి వీలు లేనివై; పెనుపు+ఒందన్= అతిశయించగా; పేర్చి= విజృంభించి; ఘోర+ఆకృతులు+ఐన= వెఱపు గొలుపే రూపాలు కలవారైన; నీ, రిపులన్+అందఱన్= నీ యొక్క శత్రువులను అందరను; తున్మెదన్= సంహరిస్తాను; సర్వ, లోక, రక్షా, కరణ+ఏక, వృత్తిన్= సమస్తమైన జగత్తును కాపాడే కార్యంలో మాత్రమే దీక్ష కలవాడనై; అవికల్పుఁడన్+అయ్యెదన్= సందేహం లేనివాడను కాగలను; పట్టమున్= (సర్వసేనాపతి పదవికి) అధికారాన్ని; కట్టు(ము)= నిబంధించునది.

**తాత్పర్యం:** అని ఇంద్రుడు పలుకగా, కుమారస్వామి ఇట్లా సమాధానం చెప్పాడు: 'నీకు సంతుష్టి కలిగేటట్లుగా నేను నీ సర్వసైన్యాధిపత్యాన్ని వహించగలను; గొప్పపరాక్రమం ప్రదర్శించి వెఱపు గొలిపే నీ శత్రువుల నందరిని సంహరించగలను; నిస్సంశయంగా విశ్వశ్రేయాన్ని ఒనగూర్చగలను. దీనికి తిరుగు లేదు. ఇక, నీ సర్వసేనాపతిగా నాకు పట్టం గట్టుము'.

**వ. అనిన నతిప్రీతుం డగుచుఁ బురుహూతుండు సకలసురమునిగణసమేతుండై తత్క్షణంబ కుమారునకు నఖిలదేవసేనాధిపత్యంబునం దభిషేకం బొనరించె; మునివరుల జయజయ శబ్దంబులు నమరుల సింహ నాదంబులుం గిన్నర గంధర్వగానంబులు మంగళతూర్యరావంబులు నప్సరో నర్తనంబులుఁ గల్పతరు కుసుమ వర్షంబులు సమకాలప్రవృత్తంబు లయ్యెం; బరార్ధ్యభూషణమణిప్రభాలంకృతంబైన కుమారు మౌళిభాగంబున నుజ్జ్వలంబైన ధవళాతపత్రంబు సురగిరిశిఖరోపరిగతం బగు శరచ్చంద్ర బింబంబు ననుకరించు చుండె; నట్టియెడ. 232**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అతి ప్రీతుండు+అగుచున్= మిక్కిలి సంతుష్టిని చెందినవాడు ఔతూ; పురుహూతుండు= దేవేంద్రుడు; సకల, సుర, ముని, గణ, సమేతుండు+ఐ= సమస్తమైన వేల్పులయొక్క మునుల యొక్క సమూహాలతో కూడిన వాడై; తద్+క్షణంబు+అ= ఆ క్షణంలోనే - వెను వెంటనే; కుమారునకున్= కుమారస్వామికి; అఖిల, దేవ, సేనా+ఆధిపత్యంబు నందున్= సమస్తమైన వేల్పులయొక్క సర్వసేనాపతి పదవిలో; అభిషేకంబు+ఒనరించెన్= లాంఛనమైన స్నానాన్ని చేయించాడు; మునివరుల జయజయ శబ్దంబులున్= ఋషులలో శ్రేష్ఠులైనవారు పలికిన ఆశీర్వాదాన్ని సూచించే జయం జయం అనే మాటలును; అమరుల, సింహనాదంబులున్= వేల్పులు సంతోషంతో చేసిన సింహగర్జనలవంటి కేకలును; కిన్నర, గంధర్వ గానంబులు= కిన్నరులు, గంధర్వులు పాడిన పాటలును; మంగళ, తూర్య, రావంబులున్= శుభాన్ని సూచించే వాద్యధ్వనులును; అప్సరస్+నర్తనంబులున్= దేవవేశ్యలు చేసిన నాట్యాలున్ను; కల్ప, తరు, కుసుమ వర్షంబులున్= వేలుపు చెట్లనుండి కురిసిన పూలజల్లులున్ను; సమకాల ప్రవృత్తంబులు+అయ్యెన్= ఒకే సమయంలో ఏర్పడ్డాయి; పరార్ధ్య, భూషణ, మణి, ప్రభా+ అలంకృతంబు+ఐన= శ్రేష్ఠాలైన నగల యందలి మణులయొక్క కాంతులచేత అలంకరించబడిన; కుమారు, మౌళి, భాగంబునన్= కుమారస్వామియొక్క శిరస్సుపైభాగాన; ఉత్+జ్వలంబు+ఐన= మిక్కుటంగా వెలుగొందుతున్న; ధవళ+ఆతపత్రంబు= తెల్లని గొడుగు; సుర, గిరి, శిఖర+ఉపరి, గతంబు+అగు= వేల్పుకొండ యొక్క పై భాగానికి చేరిన; శరత్+చంద్ర, బింబంబున్= శరత్కాలంలో కనబడే చంద్రమండలాన్ని; అనుకరించుచున్+ఉండెన్= సరిపోలుతున్నది; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ మాటలు విని దేవేంద్రుడు మిక్కిలి ఆనందించాడు. అతడు వెనువెంటనే వేల్పులతో మహర్షులతో కూడి కుమారస్వామిని సర్వసైన్యాధిపతిగా నియమించి అభిషేకించాడు. దేవర్షులు జయజయధ్వానాలతో కుమారస్వామిని ఆశీర్వదించారు. వేల్పులు సింహనాదాలు చేసి తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు. కిన్నరులు, గంధర్వులు పాటలు పాడారు. దేవకన్యకలు నాట్యం చేశారు. కల్పవృక్షాలు పువ్వులను వర్షించాయి. ఇవి అన్నీ ఏకకాలంలోనే జరిగాయి. అప్పుడు కుమారస్వామిశిరస్సుమీద నవరత్నాలతో పొదుగబడిన విలువైన ఆభరణాలు వెలుగొందాయి. ఆతడి శిరస్సుపై ప్రకాశించే తెల్లనిగొడుగు శరత్కాలంలో మేరుపర్వతశిఖరంమీద ఉదయించిన చంద్రబింబంవలె ప్రకాశించింది. ఆ సమయంలో.

**విశేషం:** కిన్నరులు= అశ్వముఖాలు నరశరీరాలూ కలవారు. దేవతలలో ఒక తెగ. గంధర్వులు= వేల్పులలో ఒక తెగ. గాయకులు.

## ఈశ్వరుండు గుమారస్వామియొద్దకు వచ్చుట (సం. 3-218-25)

**శా. నానాసిద్ధగణంబు గొల్వఁ బరమానందంబునం జంద్ర రే**
**ఖా నవ్యాంచితమౌళి భూరిభుజగాకల్పోజ్జ్వలాకారుఁ డీ**
**శానుం డానతశంకరుండు గిరిజాసంయుక్తుఁడై వచ్చెఁ ద**
**త్సేనానిం బ్రియాసూను షణ్ముఖుని వీక్షింపం గడుం బ్రేమతోన్. 233**

**ప్రతిపదార్థం:** చంద్ర, రేఖా, నవ్య+అంచిత, మౌళి= చంద్రవంకచేత క్రొత్తగా ఒప్పారు నట్టి శిరం కలవాడు- శివుడు; ఈశానుండు= శివుడు; ఆనత శంకరుండు= వినయంతో నమస్కరించువారలకు శుభం కలిగించేవాడు; నానా, సిద్ధ, గణంబు= పెక్కుమంది సిద్ధుల సముదాయం; కొల్వన్= సేవించగా; పరమ+ఆనందంబునన్= గొప్పదైన సంతోష తన్మయత్వంతో; భూరి, భుజగ+ఆకల్ప+ఉత్+జ్వల+ఆకారుఁడు= గొప్పవైన పాములచేత అలంకరించబడి మిక్కిలి ప్రకాశించే ఆకారం కలవాడు- అనగా భుజగభూషణుడైన శివుడు; గిరిజా+సంయుక్తుఁడు+ఐ= పార్వతీదేవితో కూడిన వాడై; తద్+సేనానిన్= ఆ సేనాధిపతి అయిన కుమారస్వామిని; ప్రియ, సూనున్= అనుగు కొడుకును; షట్+ముఖునిన్= ఆరుముఖాలు కలవాడిని; వీక్షింపన్= చూడటం కొరకై; కడున్= మిక్కిలి; ప్రేమతోన్= అనురాగంతో; వచ్చెన్= అరుదెంచాడు.

**తాత్పర్యం:** బాలచంద్రధరుడు భక్తులకు శుభం కలిగించేవాడు, నాగభూషణుడు అయిన ఈశ్వరుడు సిద్ధగణాలు తనను సేవిస్తూ ఉండగా, పార్వతీసమేతుడై తన కుమారుడైన షణ్ముఖుడిని చూడటానికై ప్రేమతో అరుదెంచాడు.

**విశేషం:** (1) సిద్ధులు = అణిమాదులైన అష్ట సిద్ధులు కలిగిన దివ్యపురుషులు. (2) కుమారస్వామి శివుడి పుత్రుడైన కథ. పార్వతీ పరమేశ్వరులు శృంగారమందిరంలో ఉండగా అగ్నిదేవుడు 'బల్లి' రూపంలో గోడపై నక్కిఉన్నాడు. ఆ బల్లిని చూచి పార్వతీదేవి ఇంచుక సంచలించినపుడు శివుడికి రేతఃస్ఖలన మైనది. అప్పుడు శివు డాగ్రహించి ఆ రేతస్సును ఆ బల్లి నోటిలో పోశాడు. అగ్నిహోత్రుడు ఆ వీర్యాన్ని భరించజాలక ఆవేదనపడుతూ తదుపరి మునిపత్నులను వలచాడు. స్వాహాదేవి సంగ్రహించిన రేతస్సుకు మాతృక శివుడే, ఈ విధంగా షణ్ముఖుడు ఈశ్వరుడికి ప్రియపుత్రుడు.

**వ. ఇట్లు వచ్చి మహాదేవుండు మహాసేనుం గౌఁగిలించుకొని యతనికి విశ్వకర్మ నిర్మితంబును హేమమయంబును నయిన పుష్పమాలిక యొసంగె' నని చెప్పిన విని ధర్మజుండు 'కుమారుఁడు రుద్రాంశజుఁ డని చెప్పుదు; రదియె?' ట్లనిన మార్కండేయుండు పాండవేయున కిట్లనియె; 'వినుము; రుద్రుండు మున్ను వీర్యంబు వహ్నియందు సంగ్రహించినఁ దత్తేజోవిశేషంబునం జేసి పావకుండు గుమారు నుత్పాదించె; నదియునుం గాక, యగ్ని రుద్రుం డని వేదవిదు లైన విప్రులవలన వినంబడు; నట్లగుటం గుమారుండు వహ్నిసంభవుండును, రుద్రసూనుండును నని చెప్పంబడియె; నగ్నిభామిని గృత్తికాఖ్యలైన మునిపత్ను లార్వుర రూపంబులు గైకొని, ప్రియ సమాగమంబు సలిపి శ్వేతశైలంబున రేతస్స్కందంబు సేయుటం బ్రభవించినవాఁడు గావునఁ గార్తికేయ స్కంద నామంబులం బరఁగె' నని చెప్పి యిట్లనియె. 234**

**ప్రతిపదార్థం:** మహాదేవుండు= పరమశివుడు; ఇట్లు= ఈ రీతిగా; వచ్చి= అరుగుదెంచి; మహాసేనున్= కుమారస్వామిని; కౌఁగిలించుకొని= ఆశ్లేషణం చేసి; అతనికిన్= ఆ కుమారస్వామికి; విశ్వకర్మ, నిర్మితంబును= విశ్వకర్మచేత చేయబడినట్టిదియును; హేమ, మయంబును= బంగారంతో కూడినట్టిది; అయిన= అయినట్టి; పుష్ప, మాలిక= పూలదండ; ఒసంగెన్= ఇచ్చాడు; అని చెప్పినన్; విని; ధర్మజుండు; కుమారుఁడు= కుమారస్వామి; రుద్ర+అంశజుఁడు= రుద్రుడి యొక్క అంశతో జన్మించినవాడు;

అని చెప్పుదురు= అంటూ (పెద్దలు) వచిస్తారు; అది+ఎట్లు+అనినన్= అది ఏ విధంగా చెల్లును అని అడుగగా; మార్కండేయుండు= మార్కండేయుడు అనే ఋషి; పాండవేయునకున్= పాండురాజు కొడుకైన ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; వినుము= ఆలకింపుము; మున్ను= పూర్వం; రుద్రుండు= శివుడు; వీర్యంబు= (తన) శుక్లం; వహ్ని+అందున్= అగ్ని లోపల; సంగ్రహించినన్= నిక్షేపించగా; తద్+తేజస్+విశేషంబునన్+చేసి= ఆ గొప్ప శుక్లం వలన; పావకుండు= అగ్నిహోత్రుడు; కుమారున్= కుమారస్వామిని; ఉత్పాదించెన్= పుట్టించాడు; అదియున్+కాక= అంతమాత్రమే కాక; అగ్ని= అగ్నిహోత్రుడు; రుద్రుండు+అని= శివుడు అని; వేద విదులు+ఐన= వేదాల అర్థం తెలిసిన వారైన; విప్రుల వలనన్= బ్రాహ్మణుల నుండి; వినంబడున్= తెలుస్తున్నది; అట్లు+అగుటన్= కాబట్టి; కుమారుండు= కుమారస్వామి; వహ్ని, సంభవుండును= అగ్నిహోత్రుడివలన పుట్టినట్టివాడున్నూ; రుద్ర సూనుండును= శివుడి యొక్క కొడుకున్నూ; అని చెప్పంబడియెన్= అంటూ చెప్పబడింది; అగ్నిభామిని= అగ్నిహోత్రుడి భార్య; కృతికా+ఆఖ్యలు+ఐన= కృత్తికలు అనే పేర్లు కల వారైన; ముని, పత్నులు= ఋషుల భార్యలు; ఆర్వుర, రూపంబులు= ఆరుగురి ఆకారాలు; కైకొని= స్వీకరించి; ప్రియ, సమాగమంబు+సలిపి= భర్త పొందును అనుభవించి; శ్వేత శైలంబునన్= శ్వేతశైలం (తెల్లని కొండ) అనే పేరుగల కొండపై; రేతస్+స్కందంబు= శుక్లాన్ని సంగ్రహించటం; చేయుటన్= చేయటంవలన; ప్రభవించినవాఁడు= జన్మించినవాడు; కావునన్= కాబట్టి; కార్తికేయ, స్కంద, నామంబులన్= కార్తికేయుడు, స్కందుడు- అనే పేరులతో; పరఁగెన్= ఒప్పారినాడు; అని చెప్పి= అని వచించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా తెలిపాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పరమశివుడు వచ్చి మహాసేనుడైన షణ్ముఖుడిని కౌగిలించుకొని అతడికి విశ్వకర్మచేత చేయబడిన బంగారు పూలదండను బహూకరించాడు. మార్కండేయుడు ఆ కథ వినిపించగా, ధర్మరాజు మరొక ప్రశ్నవేశాడు. 'మార్కండేయ మహామునీ! కుమారస్వామి రుద్రుడితేజస్సువలన పుట్టినవాడని పెద్దలు చెప్తుతారుకదా! మీరు చెప్పిన గాథవలన అతడు అగ్నిహోత్రుడి పుత్రుడని తేలింది. దీనిని సమన్వయించటం ఎట్లా?' అని. అప్పుడు మార్కండేయ మహర్షి ధర్మరాజుకు ఈ విధంగా సమాధానం చెప్పాడు. 'వినుము. పూర్వం శివుడు తన వీర్యాన్ని అగ్నిహోత్రుడియందు నిక్షేపించాడు. ఆ శివశుక్లంవలన అగ్నిహోత్రుడు కుమారస్వామిని కన్నాడు. అంత మాత్రమే కాక వేదాల అంతరార్థం తెలిసిన బ్రాహ్మణ పండితోత్తములు అగ్నిని రుద్రుడని కూడా చెప్తుతారు. అందుచేత కుమారస్వామి అగ్నిహోత్రుడి పుత్రుడు; శివుడి కుమారుడు అని చెప్పవచ్చును. అగ్నిహోత్రుడి భార్య స్వాహాదేవి కృత్తికలు అనే పేరులు కల ఋషిపత్నుల రూపాలు ధరించి, భర్తృవాల్లభ్యాన్ని అనుభవించి కన్నపుత్రుడు కనుక, కుమారస్వామికి కార్తికేయుడు అనే పేరు సార్థకమైనది. అగ్నిభార్య తన పతియొక్క రేతస్సును స్కందం చేయటం వలన ఉద్భవించిన కుమారుడు కనుక అతడికి స్కందుడు అనే' మరియొక పేరు ఏర్పడింది.

**విశేషం:** (1) కుమారస్వామి శివుడికుమారుడు అనటానికి ఆధారమైన గాథ 233 పద్యం చివర విశేషాంశ వివరణలో అనుశీలించేది. (2) కార్తికేయుఁడు= కృత్తికలకు పుట్టినవాడు. ఇందు జ్యోతిష విశేషం ఉల్లేఖించబడింది. ప్రస్తుతం ప్రచారంలో ఉన్నది అశ్విన్యాది నక్షత్ర పరిగణనం. విషువత్తు సంచలనంవలన ఒకానొకప్పుడు కృత్తికాది నక్షత్ర పరిగణనం ఏర్పడింది. భారతంలోని కుమారస్వామిగాథను పరిశీలిస్తే ప్రాచీనభారతీయులు సాధించిన లోకోత్తరజ్యోతిషపరిజ్ఞానం స్వయంవ్యక్తం కాగలదు.

**తే.** **అప్పు డింద్రుండు మున్ను దా నబ్జభవు ని । యోగమున సురక్షితముగ నునిచినట్టి**
**దేవసేనకుఁ గన్యకాతిలకమునకుఁ । జెలువముగ నలంకారంబు సేయఁ బనిచి.** **235**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఇంద్రుండు= దేవేంద్రుడు; మున్ను= లోగడ; తాన్= తాను; అబ్జభవు, నియోగమునన్= బ్రహ్మదేవుడి ఆనతి చొప్పున, సురక్షితముగన్= క్షేమంగా; ఉనిచినట్టి= ఉంచినటువంటి; దేవసేనకున్= దేవసేన (అనెడి); కన్యకా, తిలకమునకున్= కన్నెలలో ఉత్తమోత్తమురాలు అయిన దానికి; చెలువముగన్= అందచందాలు ఒనగూడేటట్లుగా; అలంకారంబు= ఆభరణాలతో ఆహార్యం; చేయన్+పనిచి= చేయటానికి ఆజ్ఞాపించి.

**తాత్పర్యం:** ఆ సమయంలో, అది మంచి అవకాశమని భావించి, ఇంద్రుడు లోగడ తాను, బ్రహ్మదేవుడి ఆనతిచొప్పున సురక్షితంగా సాకుతున్న దేవసేన అనే కన్యారత్నాన్ని అలంకరించి తీసికొని రమ్మని ఆజ్ఞాపించాడు.

**వ. సముచిత ప్రకారంబున నచ్చటికిఁ దెప్పించి కుమారుం జూచి 'యిక్కన్నియ భవదర్థం బై పరమేష్ఠిచేత సృజియింపంబడియెం గావున నివ్వరవర్ణినిం బరిగ్రహింపు' మనిన న ప్పార్వతీనందనుండు మందస్మిత సుందర వదనారవిందుం డయి యమ్ముహూర్తంబునందు. 236**

**ప్రతిపదార్థం:** సముచిత ప్రకారంబునన్= తగిన మర్యాద చొప్పున; అచ్చటికిన్= ఆచోటికి; తెప్పించి= వచ్చునట్లుగా చేసి; కుమారున్+చూచి; కుమారస్వామిని చూచి; ఈ+కన్నియ; భవత్+అర్థంబు+ఐ= నీ కొరకై; పరిమేష్ఠిచేతన్= బ్రహ్మదేవుడిచేత; సృజియింపంబడియెన్= సృష్టించబడింది; కావునన్= కాబట్టి; ఈ+వరవర్ణినిన్= ఈ అన్నులమిన్నను (ఈ అమ్మాయిని); పరిగ్రహింపుము= పెండ్లాడుము; అనినన్= అని చెప్పగా; ఆ+పార్వతీ నందనుండు= కుమారస్వామి; మందస్మిత, సుందర, వదన+అరవిందుండు+అయి= చిరునవ్వుచేత అందం చేకూర్చబడిన పద్మం వంటి ముఖం గలవాడై; ఆ ముహూర్తంబు నందున్= ఆ లగ్నంలో.

**తాత్పర్యం:** దేవేంద్రుడు ఆ సమయానికి తగిన మర్యాదతో సాలంకృత అయిన దేవసేనను అచటికి తెప్పించి కుమారస్వామితో ఇట్లన్నాడు: 'ఈ సుందరిని ప్రత్యేకంగా నీ కోసమే బ్రహ్మదేవుడు సృష్టించాడు. కాబట్టి నీవు లోకోత్తర సౌందర్యవతి అయిన ఈ కన్యకను వివాహమాడుము.' అంతట చిరునవ్వులు వెల్లివిరిసిన మొగంతో పార్వతీనందనుడైన కుమారస్వామి ఆ శుభలగ్నంలో

**ఉ. మానిత విక్రమోజ్జ్వలుఁడు మంగళతూర్యనినాద మొప్పఁ దే**
**జోనిధి వహ్నిసాక్షిగ విశుద్ధవిధిజ్ఞుఁడు దేవమంత్రి మం**
**త్రానుగమం బొనర్పఁగఁ బ్రియం బెసలార వరించెఁ జారుప**
**ద్మానన దేవసేనఁ గరియానఁ గరగ్రహణ ప్రయుక్తితోన్. 237**

**ప్రతిపదార్థం:** మానిత, విక్రమ+ఉత్+జ్వలుఁడు= కొనియాడబడిన శౌర్యం చేత మిక్కిలి వెలుగొందేవాడు; తేజోనిధి= (తేజస్+నిధి) దేదీప్యమానమైన కాంతికి నెలవైన వాడు; మంగళ, తూర్య, నినాదము+ఒప్పన్= శుభాన్ని ప్రకటించే వాద్యాల ధ్వనులు విలసిల్లగా; విశుద్ధ, విధిజ్ఞుఁడు= నిర్మల మైన శాస్త్ర సూత్ర విధానం తెలిసినవాడు; దేవమంత్రి= దేవతలకు మంత్రి అయినవాడు (బృహస్పతి); మంత్ర+అనుగమంబు+ఒనర్పఁగన్= వేద ఋక్కులు వల్లించబడుతుండగా; చారు పద్మ+ఆననన్= అందమైన పద్మం వంటి మొగం కలదానిని; కరియానన్= ఏనుగు నడక వంటి నడక కలదానిని; దేవసేనన్= దేవసేనను; వహ్ని సాక్షిగన్= అగ్ని సాక్షిగా; కర, గ్రహణ, ప్రయుక్తితోన్= చేతిని చేతితో పట్టుకొనే చక్కని విధానంతో; ప్రియంబు+ఎసలారన్= సంతసం పొంగులు వారగా; వరించెన్= పెండ్లాడాడు.

**తాత్పర్యం:** గొప్ప శౌర్యం కలవాడు. దేదీప్యమానమైన కాంతికి ఆకరమైనవాడు, శాస్త్రసూత్రాలు విధించిన పద్ధతి నెరిగినవాడు, అగ్ని సాక్షిగా, వైదిక మంత్రాలు చదువబడుతుండగా, కుమారస్వామి సంతోషం తన మనసులో ఉప్పొంగుతుండగా లోకోత్తరసౌందర్యరాశి అయిన దేవసేనను పాణిగ్రహణం చేసికొన్నాడు.

**విశేషం:** ఈ పద్యంలో రెండు ముఖ్యాంశాలు ఉన్నవి. (1) వివాహ సంప్రదాయం: వహ్నిసాక్షికం మంత్ర పూతం, శాస్త్ర విధ్యుక్తం అని ఎఱ్ఱన పేర్కొనటం (2) పాణి గ్రహణం= వివాహం; వైవాహిక విధికి పాణిగ్రహణానికి అవినాభావ సంబంధం ఇచ్చట సుస్పష్టంగా పేర్కొనబడింది.

**ఆ. గుహుఁడు దేవసేనఁ గోరి పెండిలి యైన । యాదినంబు షష్ఠి యగుటఁ జేసి**
**యర్చనీయ మయ్యె నాదివసంబు లో । కముల నెల్ల వెలసె గారవమున. 238**

**ప్రతిపదార్థం:** గుహుఁడు= కుమారస్వామి; దేవసేనన్= దేవసేన (అనే కన్యక)ను; కోరి= అభిలషించి; పెండిలి+ఐన= వివాహమాడిన; ఆ దినంబు= ఆ రోజు; షష్ఠి= (ఆరవతిథి); అగుటన్+చేసి= కావటం వలన; ఆ దివసంబు= ఆ రోజు; అర్చనీయము+అయ్యెన్= పూజించదగింది అయింది; లోకములన్+ఎల్లన్= అన్ని లోకాలలో; గారవమునన్= గొప్పతనంతో; వెలసెన్= ఒప్పారింది.

**తాత్పర్యం:** కుమారస్వామి అనురాగంతో దేవసేనను వరించి, పెండ్లాడిన దివసం షష్ఠి కావటం చేత లోకంలో ఆ రోజు (షష్ఠి) పూజించదగిన రోజు అయింది.

**విశేషం:** నేటికిని భారతదేశంలో స్కందషష్ఠి - లేదా- సుబ్రహ్మణ్య షష్ఠి పండుగగా జరుపబడుతున్నది.

**క. ఏ దినమునందు షణ్ముఖు । శ్రీదేవి వరించెఁ గమలచిహ్నితకర యై**
**యా దివసము పంచమి లో । కాదరణీయంబు లక్ష్మి కాస్పద మయ్యెన్. 239**

**ప్రతిపదార్థం:** ఏ దినము నందున్= ఏ రోజున; శ్రీదేవి= లక్ష్మీదేవి; కమల, చిహ్నిత, కర+ఐ= పద్మాలను పూనిన చేతులుగలదై; షట్+ముఖున్= ఆరు మొగాల దేవరను- కుమారస్వామిని; వరించెన్= అనురాగంతో స్వీకరించిందో; ఆ దివసము= ఆ రోజు; పంచమి= (అయిదవ తిథి); లోక+ఆదరణీయము= లోకాలచేత ఆదరించ దగింది; లక్ష్మికిన్= శ్రీదేవికి; ఆస్పదము+అయ్యెన్= నెలవు అయింది.

**తాత్పర్యం:** ఏ రోజున లక్ష్మీదేవి చేతులలో కమలాలను ధరించి కుమారస్వామిని వరించిందో ఆ రోజు పంచమి, ఆ తిథి లోకాలన్నింటికి ఆదరించదగినదైంది. లక్ష్మికి నెలవు అయింది.

**వ. ఇట్లు విహితమంగళాచారుం డయిన కుమారు పాలికిం జనుదెంచి నిజభర్తలచేతం బరిత్యక్తలైన ముని భార్యలార్వురు నధికదైన్యవివర్ణవదన లై యిట్లనిరి. 240**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; విహిత, మంగళ+ఆచారుండు+అయిన= శాస్త్రంచేత చెప్పబడిన శుభసంప్రదాయం నెరవేర్చిన వాడయిన; కుమారు పాలికిన్= కుమారస్వామి సన్నిధికి; చనుదెంచి= వచ్చి; నిజభర్తలచేతన్= తమ పెనిమిటులచేత; పరిత్యక్తలు+ఐన= విడువబడినట్టివారైన; ముని భార్యలు= ఋషుల పెండ్లాలు; ఆర్వురు= ఆరుగురు; అధిక, దైన్య, వివర్ణ, వదనలు+ఐ= మిక్కిలి దుఃఖం చేత పాలిపోయిన మొగాలు కలవారై; చనుదెంచి= వచ్చి; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** ఈ విధంగా, శాస్త్ర చోదిత మైన పద్ధతిలో వివాహవిధిని నిర్వర్తించిన కుమారస్వామిసన్నిధికి, తమ భర్తలచేత విడనాడబడిన ఆర్గురు మునుల భార్యలు వచ్చి, దుఃఖంచేత పాలిపోయిన మొగాలు కలవారై ఈ విధంగా పలికారు.

**చ.** **'కనుకనిఁ గూడి దుర్జనులు గానక చూడక యేము హవ్యవా**
**హనునకు నిన్నుఁ గంటి మని యాడిన నిందకు నోడి మమ్ముఁ జ**
**య్యనఁ బతు లుజ్జగించిరి ప్రియంబున నింకిట నీవు మాకు నం**
**దనుఁడవు మమ్ముఁ బ్రోవ విహితంబు గుమారక! నీ కవశ్యమున్.** **241**

**ప్రతిపదార్థం:** కనుకనిన్= జాగరూకతతో; కూడి= కలిసి; కానక= అరయక; చూడక= వివక్షచేయక; దుర్జనులు= చెడ్డవారు; ఏము= మేము (ఋషుల భార్యలం); హవ్యవాహనునకున్= అగ్నిహోత్రునకు; నిన్నున్= నిన్ను (కుమారస్వామిని); కంటిమి= ప్రసవించాం; అని+ఆడిన, నిందకున్+ఓడి= అని పల్కిన అపవాదానికి జంకి; మమ్మున్= మమ్ము; చయ్యనన్= శీఘ్రంగా; పతులు= భర్తలు; ఉజ్జగించిరి= విడనాడారు; కుమారక!= కుమారస్వామీ! (క-అల్పార్థం); ప్రియంబునన్= ప్రీతితో; ఇంకన్+ఇట= ఇక ఇచట; నీవు; మాకున్ (ఋషుల భార్యలకు); నందనుఁడవు= పుత్రుడవు; మమ్మున్= మమ్ము; ప్రోవన్= కాపాడటం; నీకున్; అవశ్యమున్= తప్పనిసరిగా; విహితంబు= నెరవేర్పవలసిన పని.

**తాత్పర్యం:** 'దుర్జనులు మంచి చెడుగులు లోతుగా వివక్ష చేయక, ఋషిపత్నుల మైన మేము అగ్నిహోత్రుడితో వ్యభిచరించి నిన్ను కన్నామని ఒక నీలాపనిందను ప్రచారం చేశారు. అందుచేత మా భర్తలు మమ్ము విడనాడారు. ఇక నీవే మాకు పుత్రనిర్విశేషుడవు. మమ్ము కాపాడటం నీకు ఇప్పుడు అవశ్యకర్తవ్యం.

**తే.** **పుణ్యలోకంబులకుఁ బాసి పొక్కుచున్న । మమ్ముఁ జేకొని కరుణాసమగ్రబుద్ధిఁ**
**బుణ్యగతియందు నిల్పుము పుత్త్రభావ । దృష్టి వెలయ మా యలమట దీర్పవయ్య!** **242**

**ప్రతిపదార్థం:** పుణ్య, లోకంబులకున్+పాసి= సుకృతం వలన పొందే జగత్తులను కోల్పోయి; పొక్కుచున్న= తపిస్తున్న; మమ్మున్= మునిభార్యలమైనమమ్ము; చేకొని= ఆదరించి; కరుణా, సమగ్ర, బుద్ధిన్= దయనిండిన మనస్సుతో; పుణ్యగతి+అందున్= సుకృతం కలిగే మార్గంలో; నిల్పుము= స్థాపించుము; పుత్త్ర, భావ, దృష్టి= కొడుకుకు ఉండే ఆలోచన సూచించే చూపు; వెలయన్= విలసిల్లేటట్లుగా; మా+అలమట= మా దైన్యం; తీర్పవు+అయ్య!= పోగొట్టవా! (పోగొట్టుమని భావం).

**తాత్పర్యం:** మేము సుకృత లోకాలను పోగొట్టుకొని మిక్కుట మైన బాధను అనుభవిస్తున్నాం. నీవు మమ్ము దయతో నిండిన మనస్సుతో ఆదరించి అభిమానాన్ని చూపాలి. ఇక నీవే మా పుత్రుడవు. తల్లిని చూచేటట్లు నీవు మమ్ము చూడాలి'.

**క.** **అనినఁ గుమారుఁడు వినయం । బున నిట్లను నేను మీకుఁ బుత్త్రుఁడ; మీరల్**
**ననుఁ గన్న తల్లులరు వినుఁ; । డనుమానం బేల మీ ప్రియం బొనరింతున్.** **243**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; కుమారుఁడు= కుమారస్వామి; వినయంబునన్= అణకువతో; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; ఏను= నేను; మీకున్= మీకు; పుత్రుఁడన్= కొడుకును; మీరల్= మీరు (ఋషిపత్నులు); ననున్+కన్న,

తల్లులరు= నన్ను కన్న మాతలు; వినుఁడు= ఆలకింపుడు; అనుమానంబు= సందియం; ఏల= ఎందుకు?; మీ ప్రియంబు= మీకు ప్రీతిని; ఒనరింతున్= చేస్తాను.

**తాత్పర్యం:** అని చెప్పగా, కుమారస్వామి ఈ విధంగా సమాధానం చెప్పాడు: 'నేను మీకు కొడుకును. మీరు నా కన్న తల్లులు. ఈ విషయంలో సందేహానికి తావు లేదు. మీకు నేను సంతుష్టిని చేకూర్చగలను.

**సీ.** **అనుచుఁ జేరువ నున్న యనిమిషపతిఁ జూచి। 'వీరికిఁ దగుపదం బారయంగ**
**వలయు' నావుడు బలవైరి యిట్లనుఁ 'జంద్ర। సతులైన యా దక్షసుతలలోన**
**రోహిణి పొరువున రుచి నొప్పు నభిజిత్తు। నా నొక్కచుక్క దాఁ బూని యిప్డు**
**డందఱకంటె నత్యంతవల్లభ నేన। యగుదుఁ జంద్రున కని వగచి యర్థిఁ**

**ఆ.** **దపము సేయ నరిగెఁ; దత్పదం బది రిత్త। యున్న యదియు; వీరి నునుపు మచట'**
**ననిన వారిఁ బ్రీతి నతఁడు వీడ్కొలిపినఁ। గడఁగి వారు సనిరి గగనమునకు.** **244**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని చెప్పుచు; చేరువన్+ఉన్న= సమీపంలో ఉన్న; అనిమిష, పతిన్+చూచి= దేవేంద్రుడిని చూచి; వీరికిన్= కృత్తికలకు; తగు= తగినట్టి; పదంబు= పదవి (గొప్ప స్థానం); ఆరయంగన్ వలయున్= చూడవలయును; నావుడున్= అని చెప్పగా; బల, వైరి= దేవేంద్రుఁడు; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికాడు; చంద్ర, సతులు+ఐన= చంద్రుడి భార్యలు అయిన; ఆ దక్షసుతలలోనన్= ఆ దక్షప్రజాపతి పుత్రికలలో; రోహిణి పొరువునన్= రోహిణీ నక్షత్రానికి చేరువగా; రుచిన్+ఒప్పు= వెలుగొందు; అభిజిత్తు= అభిజిత్తు; నాన్= అనగా; ఒక్క, చుక్క= ఒక నక్షత్రం; తాన్+పూని= తాను కడగి; ఇప్డు= ఈ సమయంలో; ఏను+అ= నేనే; చంద్రునకున్; అందఱకంటెన్= అన్ని నక్షత్రాల కంటె; అత్యంత వల్లభన్= మిక్కుటమైన కూర్మి పేర్మిగల భార్యను; అగుదున్= కాగలను; అని, వగచి= తలపోసి; అర్థిన్= అభిలాషతో; తపము+ చేయన్+అరిగెన్= తపస్సు చేయటానికై వెళ్ళింది; తద్+పదంబు+అది, రిత్త= ఆ స్థానం ఇప్పుడు శూన్యంగా; ఉన్న+అదియున్= ఉన్నది; వీరిన్= ఈ కృత్తికలను; అచటన్= ఆ స్థానంలో; ఉనుపుము= ఉంచుము; అనినన్= అని చెప్పిన; వారిన్= ఆ కృత్తికలను; ప్రీతిన్= ప్రేముడితో; అతండు= ఆ కుమారస్వామి; వీడ్కొనినన్= సాదరంగా సాగనంపగా; కడఁగి= పూని; వారు= ఆ కృత్తికలు; గగనమునకున్= ఆకసానికి; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** అని పలుకుతూ కుమారస్వామి తనకు సమీపాన ఉన్న దేవేంద్రుడితో ఈ విధంగా చెప్పాడు: 'ఈ కృత్తికలు నాకు మాతృనిర్విశేషలు. వీరికి తగిన గౌరవస్థానం చూపటం నా కర్తవ్యం'. అంతట దేవేంద్రుడు ఇట్లు సమాధానం చెప్పాడు. 'దక్షప్రజాపతికి పుట్టిన పుత్రికలు పలువురు చంద్రుడికి భార్యలైరి. ఆ తారకలలో రోహిణి ప్రక్కన దీప్తి వహించి 'అభిజిత్తు' అనే నక్షత్రం మిడిసిపాటుతో తానే సవతులందరను మించి చంద్రుడికి ప్రియవల్లభ కాగోరి తపస్సు చేసికొనటానికై వెళ్లింది. ఇప్పుడు ఆమె స్థానం (రోహిణి పొరువున నున్నచోటు) ఖాళీగా ఉన్నది. ఆ చోట ఈ కృత్తికలను నిల్పటం సమంజసం'. ఆ మాటల నాలకించిన కుమారస్వామి కృత్తికలకు సాదరమైన వీడ్కోలు ఇచ్చాడు. ఆ కృత్తికలు సంప్రీతితో అరిగి గగనంలో రోహిణిపొరువున నిల్చారు.

**విశేషం:** మహాభారతంలోని ఈ పద్యం భారతీయ జ్యోతిష శాస్త్ర చరిత్రలో మిక్కిలి ప్రాముఖ్యం వహిస్తున్నది. సూర్యుడు మున్నగు గ్రహాలు గగనమండలాన సంచరించే మార్గానికి - జ్యోతిష శాస్త్రంలో - 'క్రాంతి వలయం' అని పేరు. అందు అశ్విని మున్నగు నక్షత్రాలు ఉన్నవి. భూగోళం యొక్క ఇరుసు ఊహారేఖ పొడిగించబడితే ఎచట క్రాంతి వలయాన్ని తాకునో అది

జ్యోతిర్వలయానికి ఆదిమస్థానం. సంప్రదాయ సిద్ధంగా అది అశ్విని. కాని, ప్రతి సంవత్సరం ఆ బిందువు కొంత చలిస్తుంది. దానికి విషువత్తు అని పేరు. ఈ విషువత్తు యొక్క చలనాన్ని పూర్వికులు భారతీయులు, యవనులు గ్రహించారు గాని, నిష్కర్షగా నిగణించలేకపోయారు. ఇప్పుడు ఆ బిందువు అశ్వినికి వెనుక సుమారు $23^{1/2^0}$ దూరంలో ఉన్నట్లు నవీనఖగోళశాస్త్రవేత్తలు నిర్ధారణ చేసి ఉన్నారు. కుమారస్వామి గాథ అర్థవాదరూపాన ఈ విషువత్తు చలనబిందువు కృత్తికయందు ఉన్న సమయాన్ని సూచిస్తున్నది.

**వ. నాఁటంగోలెఁ గృత్తిక లార్వురు నగ్ని దైవత్యం బనంబరఁగు నక్షత్రం బై దివంబున వెలింగిరి; తదనంతరంబ స్వాహాదేవి యేతెంచి కుమారుం గని 'నీవు మత్పుత్త్రుండవు నిత్యంబును నీపాల వసియింపవలతు' ననినం బ్రీతుండై యాతం 'డట్ల కాక నీవు మత్సమీపంబున నుండి యేనును నీ కోడలుం గొనియాడం బ్రియంబున నుండు' మనియె, నప్పుడు కుమారమాతృకలు హవిషయుఁ గాళియుఁ గౌశికయు నుద్ధతయు శారికయు నార్యయు వైధాత్రియు ననువార లేడ్వురుం గుమారుముందట నిలిచి యిట్లనిరి. 245**

**ప్రతిపదార్థం:** నాఁటం+గోలెన్= ఆ రోజునుండి; కృత్తికలు+ఆర్వురును= కృత్తికలు అనే నక్షత్రాలు ఆరును; అగ్ని దైవత్యంబు+ అనన్+పరఁగు= అగ్నిని దేవతగా కలిగినట్టిది అనబడెడి; నక్షత్రంబు+ఐ= తారఅయి; దివంబునన్= ఆకసంలో; వెలింగిరి= వెలుగొందారు; తద్+అనంతరంబు+అ= అటు పిమ్మటనే; స్వాహాదేవి= స్వాహా అనే పేరు కల దేవి, అగ్నిహోత్రుడి భార్య; ఏ తెంచి= వచ్చి; కుమారున్+కని= కుమారస్వామిని చూచి; నీవు= నీవు; మత్+పుత్త్రుండవు= నా యొక్క కొడుకువు; నిత్యంబును= ఎల్లప్పుడును; నీపాలన్= నీ దగ్గర; వసియింపన్ వలతున్= ఉండవలె నని కోరుకొంటాను; అనినన్= అని చెప్పగా; ప్రీతుండు+ఐ= సంతోషించిన వాడై; ఆతండు= ఆ కుమారస్వామి; అట్లు+అ+కాక= అట్లే జరుగుతుంది గాక; నీవు= (ఓ స్వాహాదేవీ); మత్+సమీపంబునన్+ఉండి= నా దగ్గరే ఉండి; ఏనును= నేనును; నీ కోడలున్= నీ కుమారుడి భార్యయు; కొనియాడన్= ప్రశంసించి సేవ చేస్తూ ఉండగా; ప్రియంబునన్+ఉండుము+అనియెన్= ప్రీతితో ఉండుమని వచించాడు; అప్పుడు= ఆ సమయంలో; కుమార మాతృకలు= కుమార మాతృకలు అనేవారు; హవిషయున్, కాళియున్, కౌశికయున్, ఉద్ధతయున్, శారికయున్, ఆర్యయున్, వైధాత్రియున్+అనువారలు= హవిష, కాళి, కౌశిక, ఉద్ధత, శారిక, ఆర్య, వైధాత్రి అనేవారు; ఏడ్వురున్= ఏడుగురును; కుమారు ముందటన్= కుమారస్వామి ఎదుట; నిలిచి= నిలబడి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** ఆ దినంనుండి కృత్తికలు ఆర్వురు నక్షత్రకూటమిగా ఏర్పడి ఆకసంలో వెలుగొందారు. కృత్తిక అగ్నిని అధిదేవతగా కలిగినట్టిదిగా సుప్రసిద్ధమైనది. తదుపరి స్వాహాదేవి అరుగుదెంచి, కుమారస్వామిని చూచి ఇట్లా పలికింది: 'కుమారా! నీవు నా కొడుకువు. నేను ఎల్లప్పుడును నీ దగ్గరే ఉండవలె నని కోరుకొంటున్నాను.' ఆమె మాట విని కుమారస్వామి ఇట్లా బదులు పలికాడు. 'అమ్మా! సంతోషం. నీవు ఎల్లప్పుడూ నా దగ్గరే ఉండి నీ కుమారుడనైన నేనున్నూ, నా భార్య అయిన నీ కోడలున్నూ చేసే సపర్యలచేత సంప్రీతిని చెందుము'. అంతట కుమార మాతృకలు ఏడుగురు- హవిష, కాళి, కౌశిక, ఉద్ధత, శారిక, ఆర్య, వైధాత్రి అనేవారు కుమారస్వామివద్దకు వచ్చి ఈ విధంగా పలికారు.

**విశేషం:** (1) కుమారస్వామి మాతృగర్భంనుండి పుట్టినవాడు కాడు. మహాభారతంలో ద్రోణుడు గూడ 'కలశజుడు'. లోకోత్తర శక్తియుక్తులతో మాతృగర్భంలో కాక శోధననాళికలలో అప్రాకృత సంతానం ఉద్భవింప చేయటానికి ఆధునిక జీవశాస్త్రజ్ఞులు కృషి సలుపుతున్నారు. భవిష్యత్కాలంలో ఇట్టికృషి ఫలించే సూచనలు కన్పిస్తున్నవి. ఇట్టి కృషి సఫలీకృతమైన గాథ- మహాభారతంలో

పేర్కొనబడినట్టిది - కుమారస్వామి జనన ఘట్టం. (2) కుమారస్వామి - మాతృగర్భజుడు కాకపోయినప్పటికి ఆతడిని కథాక్రమంలో పుత్రుడిగా సంభావించిన వారు- పార్వతీ పరమేశ్వరులు, అగ్నిదేవుడు స్వాహాదేవి, కృత్తికలు. వారితోపాటు ఆనుషంగికంగా కుమారుడికొరకు వచ్చిన ఉపమాతలు కుమార మాతృకలు ఏడుగురు! వీరు బాలారిష్ట చిహ్నికలు. అసలు తల్లులకంటె, బాలబాలికలను సాకవలసింది వీరే కదా! కాని, ఈ కుమారమాతృకల గాథ మూలసంస్కృతమహాభారతంలో పలుప్రతులలో కానబడటం లేదు. అందుచేత ఈ గాథ ప్రక్షిప్తమని కొందరు విమర్శకులు భావిస్తున్నారు.

**ఉ. 'మమ్ము జగత్త్రయంబునకు మాతలఁగా నొనరింపు మిప్డు; ము**
**న్నిమ్ముల నొప్పు మాతృకల కెక్కుడు గావుత మేము; సర్వలో**
**కమ్ములఁ దొంటి మాతృకలఁ గైకొనకుండుటయుం బ్రియంబుతో**
**మ మ్మనిశంబుఁ గొల్చుటయు మాకు వరంబుగ నిమ్ము షణ్ముఖా!' 246**

**ప్రతిపదార్థం:** షట్+ముఖా!= ఆరు మోములుగల దేవరా!; కుమారస్వామీ!; మమ్మున్= (కుమార మాతృకలను); ఇప్డు= ఇప్పుడు; జగత్+త్రయంబునకున్= మూడు లోకాలకు; మాతలన్+కాన్= తల్లులు అయ్యేటట్లుగా; ఒనరింపుము= చేయుము; ఏము= మేము; మున్ను= పూర్వం, ఇంతకుముందు; ఇమ్ములన్+ఒప్పు= ప్రీతితో ఒప్పారెడు; మాతృకలకున్= తల్లులకు; ఎక్కుడు+కావుతన్= హెచ్చు అయినవారలం అగుదుముగాక; సర్వలోకమ్ములన్= అన్ని జగత్తులలోనూ; తొంటి, మాతృకలన్= పూర్వపు మాతృకా దేవతలైన బ్రాహ్మి, మాహేశ్వరి మున్నగు ఏడుగురిని; కైకొనక+ఉండుటయున్= స్వీకరించక ఉండటమున్నూ; మమ్మున్= ఇప్పటి సప్తమాతృకలమైన మమ్మల్ని; అనిశంబున్= ఎల్లప్పుడును; ప్రియంబుతోన్= ప్రేమతో; కొల్చుటయున్= ఆరాధించటమున్నూ; మాకున్= (సప్త మాతృకలమైన మాకు); వరంబుగన్= ఈడేరెడి కోరికగా; ఇమ్ము= ఒసంగుము.

**తాత్పర్యం:** ఆరుమొగాలదేవర వైన ఓ కుమారస్వామీ! సప్తమాతృకలమైన మమ్ము మూడులోకాలకు మాతృకా దేవతలనుగా నియమించుము. సర్వలోకాలలోనూ మునుపటి మాతృకలు (బ్రాహ్మి, మాహేశ్వరి మున్నగువారు) దేవతలుగా పరిగణించబడకుందురుగాక! అందరు మమ్ము త్రిజగన్మాతలుగా ఆరాధిస్తారు గాక! మాకు ఈ కోరిక ఈడేరేటట్లుగా దయతో వరాన్ని అనుగ్రహించుము.

### కుమారస్వామి సప్తమాతృకల బాలగ్రహంబులఁ జేయుట (సం. 3-219-18)

**ఆ. అనిన నగుచు నాతఁ 'డట్లేల వారల । పేర్మి మాన్పఁ దగవె? ప్రీతి నొండు**
**వరము వేఁడుఁ డిత్తు వదలక' యనుడు నా । స్కందమాత లనిరి గారవమున. 247**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; నగుచున్= నవ్వుతూ; ఆతఁడు= (ఆ కుమారస్వామి); అట్లు+ఏల= ఆ విధంగా ఎందుకు; వారల, పేర్మి= వారల యొక్క ఆధిక్యం; మాన్పన్= పోగొట్టటం; తగవె?= ధర్మ మౌతుందా?; ప్రీతిన్= సంతుష్టితో; ఒండు= ఇంకొక, వరము= ఈడేరే కోరిక; వేఁడుఁడు= ప్రార్థించుడు; వదలక+ఇత్తున్= తప్పక ఇస్తాను; అనుడున్= అని చెప్పగా; ఆ స్కంద మాతలు= ఆ కుమారస్వామి తల్లులు; గారవమునన్= గొప్పతనంతో; అనిరి= పలికారు.

**తాత్పర్యం:** ఆ మాటలకు కుమారస్వామి నవ్వాడు. 'మునుపటి మాతృకల పేరిమి మాన్పటానికి మీ రెందుకు కోరుకొంటున్నారు? మీకు మేలు కలిగేటట్లుగా వేరొక వరాన్ని కోరుకొనండి. తప్పక ఇస్తాను' అని కుమారస్వామి పలుకగా, స్కందమాతలు ఇట్లా సమాధానం చెప్పారు.

**క. 'అగుఁగాక యట్ల; యే మీ । జగములఁ గల శిశువులకు నజస్రముఁ బీడల్**
**దగ నొనరించుచు నీ కృప । నెగడెద; మివ్వరము మాకు నీ వొసఁగఁ దగున్.' 248**

**ప్రతిపదార్థం:** అగున్+కాక+అట్లు+అ= ఆ విధంగానే జరుగుగాక- అనగా మేము కోరిన వరాన్నే ఒసంగుము; ఏము= మేము; ఈ జగములన్+కల= ఈ లోకాలలో ఉన్నట్టి; శిశువులకున్= బిడ్డలకు; అజస్రమున్= ఎల్లప్పుడును; పీడల్= వ్యథలు; తగన్= అనువుగా; ఒనరించుచున్= చేస్తూ; నీకృపన్= నీ దయచేత; నెగడెదము= వర్ధిల్లెదం; ఈ+వరము= ఈ కోరిక; మాకున్= మాకు (సప్త మాతృకలమైన మాకు); నీవు; ఒసఁగన్+తగున్= ఇవ్వదగును.

**తాత్పర్యం:** 'మేము కోరిన వరాన్నిమాత్రమే మాకు అనుగ్రహించుము. మేము ఈ లోకాలలోని పసిబిడ్డలకు ఎల్లప్పుడూ బాధలను కలిగిస్తాం. నీ దయవలన వర్ధిల్లుతాం. ఈ వరాన్ని నీవు మాకు ఇవ్వాలి.'

**వ. అనినం గార్తికేయుం డి ట్లనియె. 249**

**తాత్పర్యం:** అనగా కుమారస్వామి ఇట్లా అన్నాడు.

**క. 'అక్కట! కీడు దలంచితి; । రిక్కార్యము దగవె? యైన నిచ్చితి; మీకున్**
**మ్రొక్కినఁ గొల్చిన వేఁడిన । నక్కటికముతోడఁ గావుఁడమ్మ శిశువులన్. 250**

**ప్రతిపదార్థం:** అక్కట= అయ్యో; కీడున్+తలంచితిరి= హానిని చేయటానికి ఆలోచించారు; ఈ కార్యము= ఈ పని; తగవె?= న్యాయమైనదా? (న్యాయమైనది కాదు); ఐనన్= అయినప్పటికిని - న్యాయం కానిది అయినప్పటికిని; ఇచ్చితిన్= ఒసంగితిని (అనగా మీరు కోరిన వరం న్యాయం కానిది అయినప్పటికి అనుగ్రహించాను); మీకున్= సప్త మాతృకలయిన మీకు; మ్రొక్కినన్= నమస్కరించినా; కొల్చినన్= ఆరాధించినా; వేఁడినన్= ప్రార్థించినా; అక్కటికముతోడన్= దయతో; శిశువులన్= పసి బిడ్డలను, కావుఁడు+అమ్మ= కాపాడండి అమ్మలారా!

**తాత్పర్యం:** అని సప్తమాతృకలు చెప్పగా కృత్తికలకు జన్మించిన కుమారస్వామి ఇట్లా బదులు పలికాడు. 'అయ్యో!, మీరు పసిబిడ్డలకు హాని చేయటానికి తలపోశారు. ఇది న్యాయమైన ఆలోచన కాదు కదా. మీరు ఈ కోరిక మాత్రమే ఈడేరాలని కోరారు. కాబట్టి మీకు ఈ వరాన్ని అనుగ్రహిస్తున్నాను. కాని, మిమ్ములను ఆరాధిస్తే, మీకు నమస్కరిస్తే, మిమ్మల్ని ప్రార్థిస్తే మాత్రం మీరు పసిబిడ్డలకు కీడు చేయక ఉంటారుగాక! దయ చూపెదరు గాక! అని అమ్మలారా! మిమ్ము అర్థిస్తున్నాను.

**క. పాయక పదియాఱేఁడుల । ప్రాయమునందాఁక నరుల బాధింపుఁడు మీ**
**రాయత మదంశజనితు న । జేయు నొకని మీకు రక్షఁ జేయం బనుతున్. 251**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు (ఓ సప్తమాతృకలారా); పాయక= వదలి పెట్టక; పది+ఆఱు+ఏఁడుల, ప్రాయము నందాఁకన్= పది ఆరేండ్ల వయసు నిండే వరకు; నరులన్= మనుషులను; బాధింపుఁడు= వ్యథల పాలు చేయండి; ఆయత, మత్+అంశ, జనితున్= విస్తారమైన నా అంశలో పుట్టినవాడిని; అజేయున్= గెలవటానికి అలవికాని వాడిని; ఒకనిన్= ఒక పురుషుడిని; మీకున్= (సప్త మాతృకలైన మీకు); రక్షన్+చేయన్+పనుతున్= కాపాడటానికై నియమించగలను.

**తాత్పర్యం:** ఓ సప్త మాతృకలారా! పదునారేండ్ల వయసు నిండేవరకు మీరు, బాలబాలికలను ఆవహించి బాధించండి. నా గొప్ప అంశతో జన్మించినట్టి ఒక మహాపురుషుడిని మిమ్ము కాపాడటానికై నియమిస్తాను.

**వ. అని పలికి యమ్మహాసేనుండు నిజదేహంబునం గాంచనవర్ణుండైన పురుషు నొక్కరు నుత్పాదించిన వాఁడునుం, బుట్టి నప్పుడ యాఁకలి గదిరి తిరిగి నేలంబడి మూర్ఛితుం డైనం, గుమారుండు వానికిఁ జైతన్యం బొసంగె; నతండును స్కందాపస్మారం బను పేరి గ్రహం బై మాతృకాగణరక్షకుం డయ్యె; మఱియు శకుని మాత యైన వినతయు, దైత్యమాత యైన దితియు, గోమాత యైన సురభియు, శునకమాత యైన సరమయు, వృక్షమాత యైన కరంజయు, సర్పమాత యైన కద్రువయుఁ, గుమారుదాది యైన లోహితాస్యయు మాతృగణ సమన్వితలై గర్భపీడనంబును, శిశుపీడనంబునుం జేయుచు, మనుష్యులవలన బలిమంత్రోపహారదాన తర్పణంబులఁదృప్తిం బొంది బాలురకు నాయురారోగ్యసుఖంబుల నొసంగుదురు; షోడశ వర్షంబుల మీఁదఁ గొన్నిగ్రహంబులు గలవు చెప్పెద; వినుము. 252**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; ఆ+మహాసేనుండు= ఆ కుమారస్వామి; నిజ, దేహంబునన్= తన శరీరం నుండి; కాంచన వర్ణుండు+ఐన= బంగారు మిసిమిరంగు కలవాడైన; పురుషున్+ఒక్కరున్= ఒక మగవాడిని; ఉత్పాదించినన్= పుట్టించగా; వాఁడును= ఆ పురుషుడును; పుట్టినప్పుడు+అ= పుట్టిన వెనువెంటనే; ఆఁకలి గదిరి= క్షుద్బాధచేత పీడించబడి; తిరిగి= మరల; నేలన్+పడి= భూమి మీద పడిపోయి; మూర్ఛితుండు+ఐనన్= స్పృహదప్పి పడిపోయిన వాడు కాగా; కుమారుండు= కుమారస్వామి; వానికిన్= ఆ మూర్ఛితుడికి; చైతన్యంబు+ఒసంగెన్= కదలిక ప్రసాదించాడు; అతండును= ఆ మూర్ఛితు డైన పురుషుడును; స్కంద+అపస్మారంబు+అను+పేరి= కుమారస్వామికి సంబంధించిన మూర్ఛ అనే పేరు కలిగినట్టి; గ్రహంబు= పట్టి పీడించే పిశాచం; ఐ= అయి; మాతృకా, గణ, రక్షకుండు+అయ్యెన్= మాతృకల గుంపును కాపాడే వాడు అయ్యాడు; మఱియున్= ఇంకను; శకునిమాత+ఐన= పక్షుల తల్లి అయిన; వినతయున్= వినత యనే ఆమెయున్నూ; దైత్య, మాత= రాక్షసులతల్లి; ఐన= అయిన; దితియున్= దితియున్నూ; గోమాత+ఐన= గోవులకు తల్లి అయిన; సురభియున్= సురభి అనే పేరు కలదియు; శునక, మాత+ఐన= కుక్కలకు తల్లి అయిన; సరమయున్= సరమ అనే పేరు కలదియున్నూ; వృక్ష, మాత+ఐన= చెట్లకు తల్లి అయిన; కరంజయున్= కరంజయున్నూ (కానుగుచెట్టు); సర్ప, మాత+ఐన= పాములకు తల్లి అయిన; కద్రువయున్= కద్రువయున్నూ; కుమారు దాది+ఐన= కుమారస్వామికి మాతృస్థానీయ అయి పెంచిన దాది అయిన; లోహితాస్యయున్= లోహితాస్య అనే పేరు కలిగిన ఆమెయున్నూ; మాతృ, గణ, సమన్వితలు+ఐ= మాతృకలతో కూడిన వారై; గర్భపీడనంబును= గర్భాలకు చేటుచేయుటయున్నూ; శిశు, పీడనంబునున్= పసిపాపలకు బాధ గలిగించటమున్నూ; చేయుచున్= సల్పుతూ; మనుష్యుల వలనన్= నరుల వలన; బలి, మంత్ర, ఉపహార, దానతర్పణంబులన్= నైవేద్యాలు, జపాలు, కానుకలు, దానాలు, తృప్తి చెందించటానికై ఒసగబడే నీళ్లు-అనువాటివలన; తృప్తిన్+పొంది= సంతుష్టి చెంది; బాలురకున్= పసిబిడ్డలకు; ఆయున్+ఆరోగ్య, సుఖంబులన్= చాలాకాలం బ్రతకటం, జబ్బులు లేకుండ ఉండటం, తదితర సౌఖ్యాలను; ఒసంగుదురు= ఇస్తారు; షోడశ వర్షంబుల మీఁదన్= పదునారేండ్ల వయసు నిండిన పిదప; కొన్ని, గ్రహంబులు= పట్టి పీడించే పిశాచాలు కొన్ని; కలవు= ఉన్నాయి; చెప్పెదన్= వివరించి పలుకుతాను; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** కుమారస్వామి ఆ విధంగా చెప్పి, తన శరీరంనుండి బంగారుచాయ గల ఒక మగవాడిని ఉద్భవింపజేశాడు. ఆ పసిడిమిసిమి మగవాడు పుట్టిన వెంటనే ఆకలిబాధచేత తలతిరిగి నేలమీద పడిపోయాడు. ఆ విధంగా మూర్ఛపోయినట్టి ఆతడికి కుమారస్వామి చైతన్యం ప్రసాదించాడు. అతడు స్కందాపస్మారం అనే పేరు కలిగిన పిశాచంగా రూపొంది మాతృకలను కాపాడే అంగరక్షకు డయ్యాడు. ఇంకను, శకునితల్లి వినత, రాక్షసులతల్లి దితి, ఆవులతల్లి సురభి, కుక్కలతల్లి సరమ, చెట్లతల్లి కరంజ, పాములతల్లి కద్రువ, కుమారస్వామి దాది లోహితాస్య, మాతృకలతో కలిసి గర్భాలకు పీడనూ, శిశువులకు బాధలు కలిగి ఉంటారు. కాని, మనుజులు వారిని శాంతింప

చేయటానికై జపాలు, బలులు, కానుకలు, ముడుపులు, తర్పణాలు చెల్లించినప్పుడు తృప్తి చెంది పసిపాపలకు ఆయువు, ఆరోగ్యం, సుఖం కలిగిస్తుంటారు. ఇక పదునారేండ్ల వయసు నిండిన పిదప కూడ మనుష్యులను పట్టి పీడించే పిశాచాలు కొన్ని ఉన్నాయి. చెప్పుతాను సావధానుడ వై ఆలకింపుము.

**సీ.** **నిద్రించుతఱి నొండె నెఱయ మేల్కని యున్న । తఱి నొండె సురసముదయముఁ గాంచి**
**బ్రమసి పల్వలుకులు పలుకు మానవుఁ జోఁకు । నదియ దేవగ్రహ మని యెఱుంగు**
**నది శయానుం డయ్యు నాసీనుఁ డయ్యుఁ బి । తృశ్రేణిఁ గని యున్మదించె నేని**
**నది పితృ గ్రహము భ్రాంతాత్ముఁ డై నరుఁడు గం । ధర్వులఁ గనిన గాంధర్వ మనియుఁ**

**తే.** **బరఁగు గ్రహము చోఁ కది కాలపర్యయమునఁ । గదిరి భ్రమియించె నేని యక్షగ్రహంబు**
**వాత పైత్యాది వికృతుల వలన బుద్ధి । దప్పుటయు నొక్క గ్రహవైకృతంబ యండ్రు.** **253**

**ప్రతిపదార్థం:** నిద్రించు తఱిన్+ఒండెన్= నిదుర పోయే సమయంలో కాని; నెఱయన్, మేల్, కని+ఉన్న, తఱిన్+ఒండెన్= పూర్తిగా మేల్కొని ఉన్న సమయంలో కాని; సుర సముదయమున్+కాంచి= వేల్పుల గుంపును చూచి; బ్రమసి= భ్రాంతిపొంది; పల్+పలుకులు= పెక్కు మాటలు; పలుకు= మాటాడు; మానవున్= మనుజుడిని; చోఁకున్+అది+అ= పట్టు నట్టిదియే; దేవ, గ్రహము= వేల్పులకు సంబంధించిన పిశాచం; అని+ఎఱుంగునది= తెలిసికొనునది; శయానుండు+అయ్యున్= పండుకొని ఉన్నట్టి వాడైనను; ఆసీనుఁడు+అయ్యున్= కూరుచున్న వాడయినను; పితృ శ్రేణిన్+కని= ప్రేతలను (చనిపోయిన వారి రూపాలను) చూచి; ఉత్+మదించెన్+ఏని= వెఱ్ఱితనపు లక్షణం ఆవహించుకొంటే; అది= అటువంటిది; పితృ గ్రహము= పితరులకు సంబంధించినట్టి పిశాచం; భ్రాంత+ఆత్ముఁడు+ఐ= బ్రమసినట్టి వాడై; నరుఁడు= మనుష్యుడు; గంధర్వులన్+కనిన= పాటలు పాడే వేల్పులను చూస్తే; గాంధర్వము+అనియున్= (అది) గంధర్వులకు చెందిన గ్రహం అనిన్నీ; పరఁగు= ఒప్పు; గ్రహము, చోఁకు= పిశాచం యొక్క పీడ (గ్రహం ఆవహించటం); అది= అది; కాలపర్యయమునన్= కాలం యొక్క మార్పు వలన; కదిరి= అతిశయించి; భ్రమియించెన్+ఏని= భ్రాంతిని చెందినట్లయితే; యక్షగ్రహంబు= యక్షులకు సంబంధించిన పిశాచం; వాత, పైత్య+ఆది, వికృతుల వలనన్= వాతం, పైత్యం మున్నగు వికారాలవలన; బుద్ధి= మనస్సు; తప్పుటయున్= చలించటం; ఒక్క, గ్రహ, వైకృతంబు+అ= ఏదో ఒక పిశాచం వలన దాపురించిన పీడ; అంద్రు= అని చెప్పుతారు.

**తాత్పర్యం:** నిద్రలో మైమరచి ఉన్నపుడు కాని, మేల్కొని ఉన్నపుడు కాని వేల్పుల గుంపులను చూస్తే అది దేవతాపిశాచం పట్టి పీడించటం అని తెలియాలి. అప్పుడు నరుడు వివశుడై ప్రేలాపన చేస్తాడు. కూరుచున్నప్పుడు కాని పండుకొనినపుడు కాని పితృదేవతలను కాంచి మనస్సు చలిస్తే అది పితృగ్రహబాధ అని తెలియాలి. నరుడు, భ్రాంతిలో మునిగి వేల్పులు పాడే పాటలను విని కలత చెందితే అది గంధర్వగ్రహంవలన కలిగిన పీడ అని తెలియాలి. కాలం తెచ్చే మార్పులవలన కలత చెంది భ్రమిస్తే అది యక్షగ్రహ మని గుర్తించాలి. వాత పైత్య ప్రకోపంచేత వెర్రి తలకెక్కితే అదికూడ ఏదో ఒకగ్రహంవలన సంభవించిన పీడ అని తెలియాలి.

**విశేషం:** ఈ పద్యంలో చెప్పబడిన వన్నీ ప్రాయికంగా మానసిక రోగాలు. పూర్వకాలంలో మానసికరోగాలకు కారణాలు గ్రహ బాధలుగా భావిస్తుండేవారు. ఈ పద్యంలో 'అంద్రు' (అని చెప్పుతారు) అనే ప్రయోగం గమనించదగింది. లోకంలో ప్రచారంలో ఉన్న భావం ఇందు పొందుపరచబడింది.

**క. విను డెబ్బది యేఁడుల దాఁ । కను మానవులకు గ్రహోపఘాతంబులు గ**
**ల్గు; ననంతరంబ గ్రహముల । పని వలవదు; ముదిమి యెల్ల పనులకుఁ జాలున్. 254**

**ప్రతిపదార్థం:** విను= ఆలకింపుము; డెబ్బది+ఏఁడుల, దాఁకను= డెబ్బది సంవత్సరాల వయస్సు వరకు; మానవులకున్= మనుజులకు; గ్రహ+ఉపఘాతంబులు= పట్టి పీడించే పిశాచాలవలన ఏర్పడే జాడ్యాలు; కల్గున్= ఏర్పడతాయి; అనంతరంబు+అ= పిమ్మట; గ్రహముల, పని= పిశాచాలు చేసే కార్యం; వలవదు= అవసరం లేదు; ముదిమి= ముసలితనం; ఎల్ల పనులకున్= అన్నిగ్రహాల ప్రభావాలకూ (జాడ్యములకు); చాలున్= సరిపోతుంది.

**తాత్పర్యం:** సావధానంగా వినుము. మానవులకు డెబ్బది సంవత్సరాల వయస్సు వచ్చే వరకును గ్రహాలవలన సంక్రమించే జాడ్యాలు ఏవేవో పీడిస్తాయి. ఆ పైన గ్రహాలు పీడించే అవసరం లేదు. ఎందుకంటే ముసలితనమే అన్ని జాడ్యాలను సంక్రమింపచేస్తుంది కదా!

**క. నియతి గలిగి యింద్రియముల । జయించి శుచులైన శాంతిసంపన్నులకున్**
**భయ మొనరింపఁగ లే వ । వ్యయ పుణ్యా! గ్రహము లే యవస్థల యందున్. 255**

**ప్రతిపదార్థం:** అవ్యయ పుణ్యా!= తరుగని సుకృతం కలవాడా, ఓ ధర్మరాజా!; నియతి+కలిగి= నిష్ఠతో కూడిన నియమాలు పాటించటం కలిగి ఉండి; ఇంద్రియములన్ జయించి= ఇంద్రియాలను గెలిచి; శుచులు+ఐన= మాలిన్యం లేని పరిశుద్ధులు అయిన; శాంతి సంపన్నులకున్= శాంతియే సంపదగా కల వారలకు; గ్రహములు= పట్టి పీడించే పిశాచాలు; ఏ+అవస్థల యందున్= ఎట్టి పరిస్థితులలోను; భయము= భీతి; ఒనరింపఁగన్‌లేవు+అ= కలుగజేయజాలవు సుమా.

**తాత్పర్యం:** గొప్పపుణ్యాన్ని ఆర్జించిన ఓ ధర్మరాజా! ఇందులో ఒక కిటుకు ఉన్నది. ఈ గ్రహబాధలు పిశాచ పీడలు దుర్బలమనస్కులకు హాని చేయగలవే కాని, నీతినియమ నిష్ఠలు కలిగి ఇంద్రియాలను గెలువ గలిగిన వారికి ఎట్టిభీతిని కలిగించ నేరవు.

**విశేషం:** (1) కడచిన పద్యాలలో గ్రహపీడలను గూర్చి చెప్పబడింది. ఈ పద్యం చెప్పిన తీరునుబట్టి తెలిసే దేమంటే 'మనస్సు నిబ్బరంగా లేని వారలకు అన్ని పిశాచపీడలు వర్తిస్తాయి. మనోనిగ్రహం కలవారికి ఎట్టిభయాలు లేవు. (2) గ్రహపీడలు మానసిక రుగ్మతలు. మనస్సును నిగ్రహించినవారికి ఇంద్రియవిజేతలకు ఎట్టి గ్రహపీడలు ఉండవు. పతంజలి యోగనిర్వచనం ఈ సందర్భంలో స్మరించతగింది. "యోగః చిత్తవృత్తినిరోధః".

**వ. మఱియు నొక్కటి సెప్పెద. 256**

**తాత్పర్యం:** మరి ఇంకొకటి వినిపిస్తాను.

**ఆ. ఆదిదేవుఁడగు మహాదేవుమీఁద నె । వ్వాని మనసు భక్తివైభవమున**
**నుల్లసిల్లు నతని నెల్లకార్యముల డ । గ్గఱదు సూవె గ్రహవికారవితతి.' 257**

**ప్రతిపదార్థం:** ఆది, దేవుఁడు+అగు= మొట్టమొదటి వేలుపు అయిన; మహాదేవు మీఁదన్= పరమశివుడిమీద; ఎవ్వాని మనసు= ఎవడి బుద్ధి; భక్తి, వైభవమునన్= ఆరాధన యొక్క మహత్త్వంతో; ఉల్లసిల్లున్= విలసిల్లుతుందో; అతనిన్= అట్టివాడిని; ఎల్ల

కార్యములన్= అన్ని పనులలో; గ్రహ, వికార, వితతి= పట్టి పీడించే పిశాచాల పీడల గుంపు; డగ్గఱదు+చూవె= సమీపించదు సుమా.

**తాత్పర్యం:** ఇంకొక విశేషాన్ని వివరిస్తాను సావధానంగా ఆలకింపుము. గ్రహపీడలకు ఇంద్రియనిగ్రహం మాత్రమే విరుగుడు అని తలపోయకుము. పరమశివుడియందు గాఢమైన భక్తి విలసిల్లితే చాలు. శివభక్తి అన్నిరకాల పిశాచ పీడలకు సులువైన విరుగుడు సుమా!'

**వ. అని చెప్పి మార్కండేయుం డిట్లనియె; 'నట్లు గుహుండు గ్రహంబుల నియోగించు నెడ నగ్నివల్లభ యల్లన నతనిం జేర నరిగి యి ట్లనియె; 258**

**ప్రతిపదార్థం:** అని, చెప్పి= అంటూ పలికి; మార్కండేయుండున్; ఇట్లు+అనియెన్; అట్లు= ఆ రీతిగా; గుహుండు= కుమార స్వామి; గ్రహంబులన్= గ్రహాలను; నియోగించు+ఎడన్= ఏర్పరచే సమయంలో; అగ్ని, వల్లభ= అగ్నిహోత్రుడి భార్య; స్వాహాదేవి; అల్లనన్= మెల్లమెల్లగా; అతనిన్= (కుమారస్వామిని); చేరన్+అరిగి= సమీపించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** ఆ విధంగా మార్కండేయమహర్షి ధర్మరాజుతో చెప్పి, మరియు ఈ విధంగా అన్నాడు: 'ఆ రీతిగా కుమారస్వామి గ్రహాలను నియమించే సమయంలో అగ్నిదేవుడిభార్య అయిన స్వాహాదేవి కుమారస్వామిని సమీపించి ఈ విధంగా పలికింది.

**తే. 'పుత్త్ర! విను మేను దక్షునిపుత్త్రి; నన్నుఁ। బావకుని కిచ్చె మా తండ్రి బాల్యముననుు;**
**నన్ను నతఁ డొల్లఁ డెంతయు; నాకుఁ బతికి । నెపుడు నెడ లేని పొందుగా నీ వొనర్పు.' 259**

**ప్రతిపదార్థం:** పుత్త్ర!= ఓ కొడుకా! (కుమారస్వామీ!); వినుము= ఆలకింపుము; ఏను= నేను; దక్షుని, పుత్త్రిన్= దక్షుని (ప్రజాపతి) కూతురిని; నన్నున్= నన్ను; మా తండ్రి= (మా తండ్రి అయిన దక్షుడు); బాల్యముననుు= చిన్నతనంలోనే; పావకునికిన్= అగ్నిహోత్రుడికి; ఇచ్చెన్= (పెండ్లిచేశాడు); నన్నున్= నన్ను; అతఁడు= (ఆ అగ్నిహోత్రుడు); ఎంతయున్= ఏ మాత్రంకూడా; ఒల్లఁడు= ఇష్టపడడు; నాకున్= నాకును; పతికిన్= నా భర్తకును; ఎపుడున్= ఎల్లప్పుడూ; ఎడలేని, పొందుగాన్= విడిపోనట్టి అన్యోన్య బంధంతో కూడిన పొత్తుగా; నీవు+ఒనర్పుము= నీవు చేయునది.

**తాత్పర్యం:** 'పుత్త్రుడ వైన ఓ కుమారస్వామీ!, నేను దక్షప్రజాపతి కూతురిని. మా తండ్రి నన్ను నా చిన్నతనంలో అగ్నిహోత్రుడికి ఇచ్చి పెండ్లి చేశాడు. కాని, అగ్నిహోత్రుడికి నాయందు ఏ మాత్రం కూడా అనురాగం లేదు. నాకు నా భర్తతో ఎడబాటు ఇష్టం లేదు. కాబట్టి నీవు నాకూ నా భర్తకూ ఎప్పుడూ ఎడబాటు లేని అవినాభావ బంధాన్ని కూర్చవలెనని నా కోరిక.

**వ. అనిన నగ్నిభవుండు 'మహాద్విజులు వహ్నియందు హవ్యంబులు స్వాహాకార కలితంబు లైన మంత్త్రంబుల నొసంగువారు; దానంజేసి నీకుఁ బ్రియునితోడి నిత్యసహవాసంబు సిద్ధించు' ననియె; నప్పుడు సకల మునిగణ సమేతుండై చనుదెంచి కమలాసనుండు మహాసేను నభినందించి, యంతకు మున్న సన్నిహితుండై యున్న మహాదేవు దెసఁ జూచి, యతని కి ట్లనియె. 260**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; అగ్నిభవుండు= అగ్నిహోత్రునికి పుట్టిన కుమారస్వామి; మహాద్విజులు= బ్రాహ్మణోత్తములు; వహ్నియందున్= అగ్నిలో; హవ్యంబులు= హోమ ద్రవ్యాలు; స్వాహా, కార కలితంబులు+ఐన= స్వాహా అనే శబ్దంతో కూడిన; మంత్రంబులన్= దివ్యాక్షరాల ఉచ్చారణతో; ఒసంగువారు= వేల్చగలరు; దానన్+చేసి= అందుచేత; నీకున్= నీకు ( ఓ స్వాహాదేవీ నీకు); ప్రియుని తోడి= భర్తతోడి; నిత్య, సహవాసంబు= ఎల్లప్పుడును కలసి మెలసి ఉండటం; సిద్ధించున్= లభిస్తుంది; అనియెన్= అని చెప్పాడు; అప్పుడు= ఆ సమయంలో; సకల, ముని, గణ, సమేతుండు+ఐ= పెక్కు ఋషుల సముదాయంతో కూడిన వాడై; కమల+ఆసనుండు= పద్మం ఆసనంగా కల బ్రహ్మదేవుడు; చనుదెంచి= వచ్చి; మహాసేనున్= కుమారస్వామిని; అభినందించి= మెచ్చుకొని; అంతకుమున్ను+అ= అంతకు పూర్వమే; సన్నిహితుండు+ఐ+ఉన్న= సమీపానికి చేరి ఉన్న; మహా దేవుదెసన్= పరమశివుడు ఉన్న దిక్కు చూచి; అతనికిన్= ఆ పరమశివుడికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చెప్పగా, కుమారస్వామి ఇట్లా పలికాడు: 'అమ్మా! స్వాహాదేవీ! యజ్ఞయాగాదులు చేసేటప్పుడు బ్రాహ్మణోత్తములు హవ్యాలను అగ్నిలో వేల్చేటపుడు స్వాహా శబ్దోత్తర పదవిశిష్టంగా మంత్రాలను ఉచ్చరిస్తారు గాక! ఆ విధంగా నీకును నీ భర్త అయిన అగ్నిహోత్రుడికిని అవినాభావ సంబంధం ఏర్పడగలదు.' ఆ సమయానికి అక్కడికి ఋషులతో కలిసి బ్రహ్మదేవుడు విచ్చేసి, కుమారస్వామిని అభినందించాడు. అంతకు ముందే అక్కడ ప్రత్యక్షమై నిలిచిన పరమశివుడిని గాంచి, బ్రహ్మదేవుడు ఈ విధంగా కుమారస్వామితో చెప్పాడు.

**ఆ. 'అనఘ! యితఁడె త్రిపురహరుఁడు త్రిలోచనుం; । డిదె త్రిలోక మాత హిమనగేంద్ర**
**తనయ; వీరు నీకుఁ దల్లియుఁ దండ్రియుఁ । జువ్వె! వీరిఁ గొల్వు సుచిరభక్తి. 261**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడ వైనవాడా!, ఓ కుమారస్వామీ! ఇతఁడు+ఎ= ఈయనయే సుమా; త్రిపుర, హరుఁడు= మూడు (రాక్షస) నగరాలను నాశనం చేసినవాడు; త్రి, లోచనుండు= మూడు కన్నులు కలవాడు; ఇది+ఎ= ఈ మెయే సుమా; త్రిలోక, మాత= మూడు జగాలకు తల్లి; హిమ, నగ+ఇంద్ర, తనయ= మంచుకొండల ఱేని యొక్క కూతురు, పార్వతీ దేవి; వీరు= ఈ పార్వతీపరమేశ్వరులు; నీకున్= కుమారస్వామివైన నీకు; తల్లియున్+తండ్రియున్= మాతాపితలు; చువ్వె= సుమా; సుచిర భక్తిన్= చాలాకాలం వరకు ఉండే (స్థిరమగు) పూజ్యభావంతో; వీరిన్= పార్వతీ పరమేశ్వరులను; కొల్వు(ము)= అర్చించుము.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ముడ వైన ఓ కుమారస్వామీ! ఈ మహానుభావుడే పరమశివుడు. మూడు కన్నుల దేవర. మూడు పట్టణాలను నాశనం చేసిన పరాక్రమశాలి. ఈమెయే హిమాలయ పర్వతరాజపుత్రి పార్వతీదేవి. ఈ పార్వతీపరమేశ్వరులే నీ తలిదండ్రులు సుమా. నీ తలిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులను తరుగని భక్తితో ఆరాధించటం నీ పవిత్రకర్తవ్యం.

**వ. అగ్నిదేవునియందును దదీయ భార్యయందును దారు నిజయోగబలంబునం జేసి యావేశించి, యా దంపతులు లోకహితార్థంబుగా నిన్నుం గని' రని చెప్పినఁ, బార్వతీ నందనుండు సానందహృదయుం డయి, సకలలోక గురువు లైన పార్వతీ పరమేశ్వరులం బూజించి, సంస్తుతించె; నంత నింద్రుండు కార్తికేయునకు నైరావణ భూషణం బైన ఘంటాద్వయంబు నొసంగిన, నం దొక్కటి కుమారుండు గైకొని యొక్కటి విశాఖున కిచ్చెం; బదంపడి. 262**

**ప్రతిపదార్థం:** తారు= వారు =పార్వతీ పరమేశ్వరులు; నిజ యోగ బలంబునన్+చేసి= తమ యోగశక్తి యొక్క పటుత్వం వలన; అగ్నిదేవుని+అందును= అగ్నిహోత్రుడి అందున్నూ; తదీయ, భార్య+అందును= ఆతడి యొక్క పెండ్లము నందున్నూ;

ఆవేశించి= ఆధ్యాత్మికంగా చొరబడి; ఆ దంపతులు= ఆ భార్యాభర్తలు; లోక, హిత+అర్థంబుగాన్= విశ్వ కల్యాణం కొరకై; నిన్నున్+కనిరి= నిన్ను (పుత్రుడిగా) కన్నారు; అని చెప్పినన్= అంటూ పలుకగా; పార్వతీ నందనుండు= పార్వతీదేవి కొడుకైన కుమారస్వామి; స+ఆనంద, హృదయుండు+అయి= ఆనందంతో కూడిన డెందం కలవాడై; సకల, లోక, గురువులు+ ఐన= సమస్త జగత్తులకు తలిదండ్రులు అయిన; పార్వతీ పరమ+ఈశ్వరులన్= పార్వతిని, పరమశివుడిని; పూజించి= అర్చించి; సంస్తుతించెన్= కొనియాడినాడు; అంతన్= అంతట; ఇంద్రుండు= వేలుపు దొర; కార్తికేయునకున్= కుమార స్వామికి; ఐరావణ భూషణంబు+ఐన= ఐరావతం అనే పేరుకల వెల్లయేనుగుకు అలంకారాలైన; ఘంటాద్వయంబున్= రెండు గంటలు; ఒసంగినన్= బహూకరించగా; అందున్+ఒక్కటి= ఆరెండు గంటలలో ఒక గంట; కుమారుండు= కుమారస్వామి; కైకొని= స్వీకరించి; ఒక్కటి= ఒక గంట; విశాఖునకున్; ఇచ్చెన్= బహూకరించాడు; పదంపడి= పిమ్మట.

**తాత్పర్యం:** అగ్నిహోత్రుడిలోనూ ఆతడి సతిలోనూ పార్వతీ పరమేశ్వరులు తమ యోగశక్తిపాటవంచొప్పున ఆవేశించి, నిన్ను పుత్రుడిగా కన్నారు. సమస్త జగత్తులకు తల్లిదండ్రు లైన పార్వతీపరమేశ్వరులు విశ్వకల్యాణం కొరకై నిన్ను పుత్రుడిగా పొందారు' అని బ్రహ్మదేవుడు కుమారస్వామితో చెప్పాడు. బ్రహ్మదేవుడి మాటలకు కుమారస్వామి డెందం ఉప్పొంగింది. అతడు ఆనందపరవశు డయ్యాడు. సర్వలోకాలకు మాతాపితలు అయిన పార్వతీపరమేశ్వరులను కుమారస్వామి పూజించి ప్రశంసించాడు. అంతట దేవేంద్రుడు తన వాహనమైన వెల్లయేనుగు ఐరావతానికి భూషణాలైన రెండు గంటలను కుమారస్వామికి బహూకరించాడు. కుమారస్వామి ఒక గంటను తాను స్వీకరించి, మరొక గంటను విశాఖుడికి సమర్పించాడు. ఆ తరువాత.

**విశేషం:** (1) 'యోగబలమునంజేసి ఆవేశించుట.' యోగ సాధన వలన పెక్కు మహిమలు అతిలోకాలైనవి, ఇంద్రియాతీతాలైనవి, ఒనగూడుతాయని పెద్దలు చెప్పుతారు. ఇంద్రియాలలోని దైన కంటిచూపు వేరు; యోగదృష్టి వేరు; అట్లే శరీరబలం వేరు; యోగబలం వేరు. పార్వతీపరమేశ్వరులు యోగబలంవలన అగ్నిహోత్రుడిని అతడి భార్యను ఆవేశించినట్లు ఈ గాథ అభివర్ణిస్తున్నది. (2) ఐరావతం స్వర్గలోకంలో దేవేంద్రుడియొక్క వాహన మైన పట్టపుటేనుగు. లోకంలోని ఏనుగులు నల్లగా ఉంటాయి. ఐరావతం తెల్లని ఏనుగు అని సాహితీసమయం.

### ఈశ్వరుండు కుమారసహితుండై భద్రవటంబు సేరుట (సం. 3-221-1)

**మ.** **తనయుం గౌఁగిటఁ జేర్చుచున్ వరుస మూర్ధఘ్రాణముం జేయుచున్**
**జనితానంద మనస్కుఁడై గిరిసుతాసంయుక్తుఁ డీశానుఁ డ**
**య్యనఘుం దోడ్కొని బద్ధకేసరి సహస్రస్యందనారూఢుఁ డై**
**చనియెన్ భద్రవటస్థలంబునకు నైశ్వర్యం బవార్యంబుగన్.** **263**

**ప్రతిపదార్థం:** గిరి, సుతా, సంయుక్తుఁడు= పార్వతీదేవితో కూడినట్టివాడు; ఈశానుఁడు= శివుడు; తనయున్= కొడుకును (కుమారస్వామిని); కౌఁగిటన్+చేర్చుచున్= కౌగిలించుకొంటూ; వరుసన్= మాటికి; మూర్ధ, ఘ్రాణమున్+చేయుచున్= శిరస్సును వాసన చూస్తూ (మూర్కొంటూ); జనిత+ఆనంద, మనస్కుఁడు+ఐ= కలిగిన సంతోషంతో కూడిన మనస్సు కలవాడై; ఆ+అనఘున్= ఆ పుణ్యాత్ముడిని (కుమారస్వామిని); తోడ్కొని= వెంటబెట్టుకొని; బద్ధ, కేసరి, సహస్ర, స్యందన+ ఆరూఢుఁడు+ఐ= వేయి సింహాలు పూన్చబడిన రథం కలవాడై; భద్ర, వట, స్థలంబునకున్= 'భద్రవటం' అనే పేరు కల చోటికి (భద్రవటం అనగా ఏపుగా, విశాలంగా ఎదిగి క్షేమంగా ఉన్న మఱ్ఱిచెట్టు గల స్థానం); ఐశ్వర్యంబు= విభూతి; అవార్యంబుగన్= వారించటానికి వీలు లేకుండగా అతిశయించి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** పార్వతీసమేతుఁడైన పరమేశ్వరుడు తన కుమారుడైన కుమారస్వామిని కౌగిలించుకొని పలుమారులు తల నిమిరి వాసన చూచి వాత్సల్యంతో లాలించాడు. తదుపరి కుమారస్వామిని తోడ్కొని వేయిసింహాలు పూన్చిన తన రథాన్ని ఎక్కి, ఐశ్వర్యప్రకర్షతో ఆనందతన్మయత్వంతో భద్రవటం అనే పేరు కల పుణ్యక్షేత్రానికి చేరాడు.

**విశేషం:** ఈశ్వరుడి యొక్క భావం- 'ఐశ్వర్యం'. ఐశ్వర్యం అంటే సంపద. 'విభూతి' - పరమేశ్వర లాంఛనం. విభూతి ఎనిమిది విధాలు. ఇవి దివ్యాలు అతిలోకాలు అయిన శక్తులు. 1. అణిమ 2. మహిమ 3. గరిమ 4. లఘిమ 5. ప్రాప్తి 6. ప్రాకామ్యం 7. ఈశిత్వం 8. వశిత్వం.

**వ.** **అమ్మహాదేవు ముందట ననేక యక్షగణ పరివృతుండును బుష్పకాధిరూఢుండును కుబేరుండును, వెనుక దెస నమరగణ సమన్వితుండును నైరావతారోహణోల్లాసియునై వాసవుండును, దక్షిణపక్షంబునం బ్రబల రక్షోయక్ష రక్షితుండై యమోఘ నామ ధేయుండైన యక్షోత్తముండును, గృతపరికరులైన వసు రుద్రాదిత్యులును, దాపలి పక్షంబున నతిభయంకర వ్యాధి మృత్యు పరివేష్టితుండై పితృపతియును, వివిధయాదోనివహ సనాథుం డయిన వరుణుండును నడచిరి; మఱియు మూర్తిమంతంబు లై శూల పట్టిస గదా ముసలాదికంబులైన యద్దేవు నాయుధంబులుఁగమండలు ప్రముఖోపకరణంబులుం జనియె; నయ్యాదిదేవునకు నా సన్నుండయి చంద్రుండును ధవళాతపత్రంబు ధరియించె; ననిలాగ్నులు చామరహస్తులై కొల్చిరి; విద్యయు, సావిత్రియు, గాంధారియుఁ గేశినియు నను దేవాంగనలు దాక్షాయణిం గొల్చి చనిరి; త్రిలోచనసఖుం డైన పింగళుం డను యక్షుండు వృషభకేతనంబు దాల్చె; నివ్విధంబున నభిరామ విభవోదారుండై కుమార గురుండు భద్రవటంబు సేర నరిగి, యచ్చటఁ గుమారుం జూచి యిట్లనియె.264**

**ప్రతిపదార్థం:** ఆ+మహా+దేవు, ముందటన్= ఆ పరమశివుడికి ముందుగా; అనేక, యక్ష, గణ, పరివృతుండును= పెక్కు మంది యక్షుల చేత చుట్టుకొనబడి ఉన్నవాడున్నూ; పుష్పక+అధిరూఢుండును= పుష్పకం అనే విమానంపైకి ఎక్కి ఉన్నవాడున్నూ అయిన; కుబేరుండును= కుబేరుడున్నూ; వెనుక దెసన్= (ఆ ఊరేగింపులో శివుడి రథానికి) వెనుక భాగంలో; అమర, గణ, సమన్వితుండును= దేవతల సముదాయంతో కూడినవాడును; ఐరావత+ఆరోహణ+ఉల్లాసియును+ఐ= ఐరావతం అనే పేరు కల తెల్లని ఏనుగును అధిరోహించటం వలన గోచరించే సంతోషం కలవాడును అయి; వాసవుండును= దేవేంద్రుడున్నూ; దక్షిణ పక్షంబునన్= కుడివైపున; ప్రబల, రక్షస్+యక్ష, రక్షితుండు+ఐ= మిక్కుటమైన బలం కల రాక్షసులచేతను యక్షులనే వేల్పుల తెగవారిచేతను కాపాడబడెడి వాడై; అమోఘ నామధేయుండు+ఐన= అమోఘుడు అనే పేరు కలిగిన; యక్ష+ఉత్తముండును= యక్షులలో శ్రేష్ఠుడును; కృత పరికరులు+ఐన= ఆయుధాలను చేబూనిన; వసు, రుద్ర+ఆదిత్యులును= వసువులు, రుద్రులు, సూర్యులును; దాపలి పక్షంబునన్= ఎడమ వైపున; అతి, భయంకర, వ్యాధి, మృత్యు, పరివేష్టితుండు+ఐ= మిక్కిలి వెరపు గొలిపే రోగాలచేత మరణం చేత చుట్టుకొనబడి ఉండిన వాడైన; పితృ పతియును= ప్రేతాలకు అధినేత అయిన యముడును; వివిధ, యాదః+నివహ, సనాథుండు+అయిన= పెక్కు జలజంతువుల సముదాయంతో కూడిన వాడయిన; వరుణుండును= వరుణుడును (దిక్పాలకులలో ఒకడు); నడచిరి= నడచి వెళ్ళారు; మఱియున్= ఇంకను; మూర్తి మంతంబులు+ఐ= ప్రత్యక్షంగా కన్పించే ఆకారాలు కలవి అయి; శూల, పట్టిస, గదా, ముసల+ఆదికంబులు+ఐన= బల్లెం; ఇనుపరేకు వంటి ఆయుధం (పట్టాకత్తి), గద, రోకలి, మున్నగునవి అయిన; ఆ+దేవు+ఆయుధంబులున్= ఆ దేవుడి (శివుని) ఆయుధాలును; కమండలు, ప్రముఖ+ఉపకరణంబులున్= పానపాత్రికమున్నగు పనిముట్లును; చనియెన్= వెళ్ళాయి; ఆ+ఆది దేవునకున్= ఆ పరమశివుడికి; ఆసన్నుండు+అయి= దగ్గరగా ఉన్నవాడై; చంద్రుండును; ధవళ+ఆతపత్రంబు= వెల్ల గొడుగు; ధరియించెన్= మోశాడు; అనిల+అగ్నులు= వాయువు, నిప్పు; చామర హస్తులు+ఐ= చమరీ మృగం వెంట్రుకలలో

తయారయిన వీవనలను చేతులలో ధరించిన వారై; కొల్చిరి= సేవించారు; విద్యయున్, సావిత్రియున్, గాంధారియున్+ కేశినియున్+అను= విద్య, సావిత్రి, గాంధారి, కేశిని అనే పేరులు కల; దేవ+అంగనలు= దేవతాస్త్రీలు; దాక్షాయణిన్= పార్వతీదేవిని; కొల్చి= సేవిస్తూ; చనిరి= వెళ్ళారు. త్రిలోచన, సఖుండు+ఐన= ముక్కంటి అయిన శివుడికి మిత్రుడు అయిన; పింగళుండు+అను, యక్షుండు= పింగళుడు అనే యక్షుడు; వృషభ కేతనంబు+తాల్చెన్= ఎద్దు బొమ్మ గల జెండాను పట్టుకొన్నాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా; అభిరామ, విభవ+ఉదారుండు+ఐ= అందమైన సంపదతో గూడిన గొప్పతనం కలవాడై; కుమార, గురుండు= కుమారస్వామి యొక్క తండ్రి అయిన పరమశివుడు; భద్రవటంబు+చేరన్+అరిగి= భద్రవటం అనే క్షేత్రాన్ని చేరి; అచ్చటన్= అక్కడ; కుమారున్+చూచి= కుమారస్వామిని చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** భద్రవటక్షేత్రాన్ని చేరేటప్పుడు పరమశివుడి ఊరేగింపు వర్ణించబడింది. వేయిసింహాలు పూన్చిన రథంమీద పరమశివుడు దేదీప్యమానంగా వైభవోపేతంగా ఆసీనుడై ఉన్నాడు. శివుడికి ముందట - పెక్కుమంది యక్షుల పరివారాలతో కూడినవాడున్నూ, సుప్రసిద్ధమైన పుష్పకం అనే విమానాన్ని అధిష్ఠించినవాడున్నూ అయిన కుబేరుడు సాగాడు. వెనుకభాగంలో దేవేంద్రుడు ఐరావతం అనే తెల్లయేనుగుపై వైభవంతో అధిష్ఠించి ఉన్నాడు. కుడివైపున అమోఘుడు అనే పేరు కల గొప్ప యక్షనాయకుడు నడిచాడు. వసువులు, రుద్రులు, ఆదిత్యులు తమ తమ ఆయుధాలతో అందులో పాల్గొన్నారు. ఎడమభాగంలో భీకరవ్యాధులచేత మృత్యుదేవతచేత చుట్టుకొనబడిన యముడు సాగాడు. వివిధ సముద్రాలతో కూడిన వరుణుడు అచట నిలిచాడు. ఇంకను, శూల పట్టిస గదా ముసలాదికాలైన పరమేశ్వరుడి ఆయుధాలు ప్రత్యక్షంగా కన్పించే ఆకారాలను ధరించి వెలుగొందుతూ నడిచాయి. అట్లాగే, కమండలువు మున్నగు శివుని పనిముట్లుకూడ అట్లే ఆ ఊరేగింపులో పాల్గొన్నాయి. పరమశివుడికి సమీపంలో నిలిచి, చంద్రుడు వెల్ల గొడుగు పట్టుకొన్నాడు. వాయుదేవుడు అగ్నిహోత్రుడు చామరాలతో వీస్తూ ఉన్నారు. విద్య, సావిత్రి, గాంధారి, కేశిని యనే దేవతావనితలు పార్వతీదేవిని సేవిస్తూ సాగారు. ముక్కంటికి అనుగునెచ్చెలి అయిన పింగళుడు అనే యక్షుడు ఎద్దుబొమ్మ కల జెండాను ఎత్తిపట్టి ముందు నడిచాడు. ఈ విధంగా కన్నుల పండువుగా ఊరేగుతూ కుమారస్వామితండ్రి అయిన శివుడు భద్రవటక్షేత్రాన్ని చేరాడు. భద్రవటాన్ని చేరిన పిదప, పరమశివుడు తన పుత్రుడైన కుమారస్వామితో ఇట్లా పలికాడు.

**విశేషం:** (1) పుష్పకం :- కుబేరుడి విమానం. ఇందులో ఎందరు ఎక్కినా, ఇంకొకరికి చోటు ఉంటుందట! 'పుష్పకం' - రామాయణ పఠితలకు చిరపరిచితమైనదే. రావణుడు కుబేరుడిని జయించి పుష్పకవిమానాన్ని తనస్వాధీనం చేసికొన్నాడు. రావణ వధానంతరం పుష్పకంలో అయోధ్యకు చేరి రాముడు దానిని తిరిగి కుబేరుడికి పంపించాడు. (2) దాక్షాయణి అనగా దక్షప్రజాపతికూతురు, సతీదేవి. ఆమె ఆహ్వానం లేకపోయినప్పటికి తండ్రిచేసే యజ్ఞానికి వెళ్లి, అవమానించబడి, అగ్నికుండం (యోగాగ్ని) సృష్టించుకొని దగ్ధమైపోయి, మరుజన్మలో పార్వతిగా పుట్టింది. ఇక్కడ దాక్షాయణి అనగా ప్రకరణానుబద్ధంగా పార్వతి అనే అర్థం సిద్ధించింది. (3) ఈ ఊరేగింపు అంతయు మహారాజవైభవస్ఫోరకం. ఎట్టిన సమకాలీన చక్రవర్తుల వైభవం ఈ వర్ణనలో ప్రతిబింబితం (4) ద్వాదశాదిత్యులు:- పండ్రెండు మంది సూర్యులు. ధాతా మిత్రోర్యమా రుద్రో వరుణ స్సూర్య ఏవచ । భగో వివస్వాన్ పూషా చ సవితా దశమః స్మృతః; ఏకాదశ స్తథా త్వష్టా విష్ణు ర్ద్వాదశ ఉచ్యతే॥ 1. ధాత 2. మిత్రుడు 3. అర్యముడు 4. రుద్రుడు 5. వరుణుడు 6. సూర్యుడు 7. భగుడు 8. వివస్వంతుడు 9. పూష 10. సవితృడు 11. త్వష్ట 12. విష్ణువు (5) రుద్రులు :- ఏకాదశ రుద్రులు. 1. అజుడు 2. ఏకపాదుఁడు 3. అహిర్బుధ్నుడు 4. విరూపాక్షుడు 5. సురేశ్వరుడు 6. జయంతుడు 7. బహురూపుడు 8. త్ర్యంబకుడు 9. అపరాజితుడు 10. వైవస్వతుడు 11. హరుడు.

**తే. 'సప్తమం బైన మారుత స్కంధమునకుఁ । బతివి గమ్ము కుమార! దేవతల కెపుడుఁ**
**గార్య మొదవినఁ జేకొని కడఁకఁ దీర్పు; । మనిశమును మత్పదధ్యానఘనుఁడ వగుము. 265**

**ప్రతిపదార్థం:** ఓ కుమారస్వామీ!; సప్తమంబు+ఐన= ఏడవదియగు; మారుత స్కంధమునకున్= మరుత్తులకు సంబంధించిన సేనా విభాగానికి; పతివి+కమ్ము= అధినేతవు అగుము; దేవతలకున్= వేల్పులకు; ఎపుడున్= ఏ సమయంలో నైనా; కార్యము+ఒదవినన్= పని ఏర్పడితే; చేకొని= పూనుకొని; కడఁకన్+తీర్పుము= పూనికతో నిర్వహించుము; అనిశమును= ఎల్లప్పుడును; మత్+పద, ధ్యాన, ఘనుఁడవు+అగుము= నా పాదాలను ధ్యానించటంచేత గొప్పవాడవు అగుము.

**తాత్పర్యం:** కుమారస్వామీ! ఏడవది అయిన మారుత సేనావిభాగానికి నాయకుడవు కమ్ము. దేవతలకు పని కలిగినపుడు పూనికతో వారిని కాపాడుము. ఎల్లప్పుడు నాయందు భక్తి కలిగి ఉండుము.

**విశేషం:** రాజ్యాంగం సప్తాంగాలతో కూడినది. 1. స్వామి 2. అమాత్యుడు 3. సుహృత్తు 4. కోశం 5. రాష్ట్రం 6. దుర్గం 7. బలం. ఇచ్చట 'మరుత్తులు' ఏడవ రాజ్యాంగంలోని బలం. మరుత్తులు అనగా గాలులు.

## కుమారస్వామి మహిషాసురుం జంపుట (సం. 3-221-29)

**క. చనుము శుభంబుల నొందుము । తనూజ!' యని కౌఁగిలించి తద్దయుఁ బ్రేమం**
**బున నతని వీడుకొలుపఁగ । ననఘ! మహోత్పాతములు రయంబునఁ బొడమెన్. 266**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! పుణ్యాత్ముడా, ఓ ధర్మరాజా!; తనూజ!= కుమార! కుమారస్వామీ!; చనుము= వెళ్లుము; శుభంబులన్= శుభములను; ఒందుము= పొందుము; అని= పలికి; కౌఁగిలించి= ఆశ్లేషించి; తద్దయున్= మిక్కిలి; ప్రేమంబునన్= అనురాగంతో; అతనిన్= కుమారస్వామిని; వీడుకొలుపగన్= ఆమంత్రణంచేయగా; మహా+ఉత్పాతములు= గొప్ప భూత వికారాలు; రయంబునన్= శీఘ్రంగా; పొడమెన్= కన్పించాయి.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడవైన ఓ ధర్మరాజా! వినుము. అంతట పరమశివుడు తన కుమారుడైన కుమారస్వామిని కౌగిలించుకొని శుభంబులు పొందుమని ఆశీర్వదించి వీడ్కొలిపాడు. అప్పుడు వెంటనే గొప్ప ఉత్పాతాలు పొడసూపాయి.

**విశేషం:** ఉత్పాతాలు శుభాశుభసూచకమైన భూతవికారాలు. అవి మూడు రకాలు. (1) దివ్యం:- సూర్యగ్రహణం, చంద్ర గ్రహణం మున్నగునవి. (2) అంతరిక్షం :- ఉల్కాపాతం మున్నగునని (3) భౌమం :- భూకంపం మున్నగునవి.

**ఆ. దెసలు మండె, ధరణి దిర్దిరఁ దిరిగె, న । భ్రంబు మ్రోసె, వడఁకెఁ బర్వతములు,**
**జగము ఘోరతిమిర సంవృతమయ్యె, ని । ర్జరులమనము లెల్ల సంభ్రమించె. 267**

**ప్రతిపదార్థం:** దెసలు= దిక్కులు; మండెన్= అగ్నిజ్వాలలతో జ్వలించాయి; ధరణి= భూమండలం; దిర్దిరన్+తిరిగెన్= గిరగిర తిరిగింది; అభ్రంబు= ఆకసం; మ్రోసెన్= ధ్వనించింది; పర్వతములు= కొండలు; వడఁకెన్= కంపించాయి; జగము= లోకం; ఘోర, తిమిర, సంవృతము+అయ్యెన్= భయంకర మైన చిమ్మచీకట్లతో క్రమ్ముకొన్నది అయింది. నిర్జరుల మనములు+ఎల్లన్= (ముసలితనం లేని) దేవతల మనస్సులు అన్నీ; సంభ్రమించెన్= తిరుగుడు పడ్డాయి.

**తాత్పర్యం:** దిక్కులలో అగ్నిజ్వాలలు వ్యాపించాయి. భూగోళం గిరగిర తిరిగింది. ఆకసం ధ్వనించింది. కొండలు వణికాయి. ప్రపంచమంతా భయంకరమైన చిమ్మచీకటులు క్రమ్ముకొన్నాయి. దేవతల గుండెలు దద్దరిల్లాయి.

**వ. తదనంతరంబు 268**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**మ. ఘనశస్త్రాస్త్ర మహోజ్జ్వలంబు చతురంగ వ్యాప్త భూమండలం**
**బు నితాంతోద్ధత ఘోరఘోష బధిరీభూతాఖిలాశాముఖం**
**బనిరోధోద్గత వేగ ముగ్ర దనుజేంద్రానీక మేతెంచె నీ**
**సున నీశానముఖామరప్రతతిపై శుంభద్భుజారంభమై. 269**

**ప్రతిపదార్థం:** ఘన, శస్త్ర+అస్త్ర, మహా+ఉత్+జ్వలంబు= గొప్పవైన ఆయుధాల చేతను, మంత్రపూతమైన ఆయుధాల చేతను దేదీప్యమానంగా ప్రకాశించేదిన్నీ; చతురంగ వ్యాప్త భూమండలంబు= నాలుగు అంగాలు గల సేనచేత విస్తరించిన భూమండలం కలిగినదిన్నీ; నితాంత+ఉద్ధత, ఘోర, ఘోష, బధిరీభూత+అఖిల+ఆశా ముఖంబు= ఎల్లప్పుడూ గర్వంతో భయంకరమైన నాదంతో దిగ్దిగంతాలకు చెవుడు కల్పించేదిన్నీ; అ నిరోధ+ఉత్+గత, వేగము= ఆటంకం లేక పైకి ఉరికే వేగం కలిగినదిన్నీ అయిన; ఉగ్ర, దనుజ+ఇంద్ర+అనీకము= భయంకరమైన రాక్షసనాయకుడి సేన; ఈసునన్= రోషంతో; ఈశాన ముఖ,+అమర, ప్రతతిపైన్= శివుడు మొదలుగాగల వేల్పుల గుంపుపై; శుంభత్+భుజ+ఆరంభము+ఐ= ప్రకాశించే పరాక్రమం యొక్క ఎత్తికోలు కల్గినదై; ఏతెంచెన్= దండెత్తి వచ్చింది.

**తాత్పర్యం:** తదుపరి, శివుడు మున్నగు నాయకులతో కూడిన దేవతలపైకి రాక్షసులసైన్యం మహాపరాక్రమ ప్రాభవంతో కూడిన పటాటోపంతో దండెత్తి వచ్చింది. ఆ రాక్షస సైన్యం- గొప్ప అస్త్రాలతో శస్త్రాలతో దేదీప్యమానంగా వెలుగొందిది. భూమండలాన్ని అంతటిని ఆక్రమించిన చతురంగబలం కలిగినట్టిది, దిగ్దిగంతాలు మారుమ్రోగుతూ వినేవారి చెవులు చిల్లులు పడేటట్లు శబ్దాలు చేసేది. ఆపలేని వేగం గలది.

**విశేషం:** చతురంగ బలం: 1. రథాలు 2. గుర్రాలు 3. ఏనుగులు 4. భటులు.

**వ. ఇట్లు మహిషాసుర సంరక్షితం బయిన దానవసైన్యంబు పఱతెంచి చుట్టుముట్టి యసంఖ్యసాయకంబులు గదాఖడ్గ ముసల పరిఘశతఘ్ని ప్రముఖానేక ప్రహరణంబులు ప్రయోగించి, నిమిషమాత్రంబున ననిమిష సైన్యంబునం బ్రచుర మాతంగ తురంగ రథిక పదాతి ప్రకరంబులం బరిమార్చినం గార్చిచ్చు పొదివినం జెదరి పఱచు మృగంబులుం బోలె నమరులు సమరవిముఖులై తొలంగం బాఱినం జూచి నముచిసూదనుండు సింహనాదంబు సేయుచు నెలుంగెత్తి సురగణంబుల కిట్లనియె. 270**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; మహిష+అసుర సంరక్షితంబు+అయిన= మహిషుడు అనే రాక్షసుడిచేత కాపాడబడిన; దానవ, సైన్యంబు= రాక్షసుల సేన; పఱతెంచి= దండెత్తి వచ్చి; చుట్టు ముట్టి= చుట్టును ముట్టడించి; అసంఖ్య సాయకంబులు= లెక్కకు మిక్కిలి బాణాలు; గదా, ఖడ్గ, ముసల, పరిఘ, శతఘ్ని ప్రముఖ+అనేక, ప్రహరణంబులు= గద, కత్తి, రోకలి, ఇనుపగుదియ, నూరుమందిని ఒకేసారి చంపగల యంత్రాయుధం మున్నగు పెక్కు ఆయుధాలు; ప్రయోగించి= ఉపయోగించి; నిమిష మాత్రంబునన్= క్షణమాత్రంలో; అనిమిష సైన్యంబునన్= దేవతలసేనలోని; ప్రచుర, మాతంగ, తురంగ, రథిక,

పదాతి, ప్రకరంబులన్= దట్టంగా ఉన్న ఏనుగులు, గుర్రాలు, రథవీరులను, కాల్బలపు గుంపులను; పరిమార్చినన్= నాశనం చేయగా; కార్చిచ్చు= దావాగ్ని; పొదివినన్= అలముకొన్న; చెదరి= కకావికలై; పఱచు= పారిపోయే; మృగంబులున్+పోలెన్= లేళ్ల వలె; అమరులు= దేవతలు; సమర, విముఖులు+ఐ= యుద్ధం చేయటానికి తొలగినవారై; తొలంగన్+పాఱినన్+చూచి= చెదరి పారిపోవటం చూచి; నముచి సూదనుండు= దేవేంద్రుడు (నముచి అనే రాక్షసుడిని సంహరించినవాడు); సింహ నాదంబు+చేయుచున్= సింహగర్జన వంటి ధ్వనిని చేస్తూ; ఎలుంగు+ఎత్తి= కంఠస్వరం ఎత్తి (బిగ్గరగా మాటలు వినిపించేటట్లు); సుర, గణంబులకున్= వేల్పుల గుంపులకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా రాక్షసుల సైన్యం దేవతలపైకి దండెత్తి వచ్చింది. ఆ రాక్షస సేనలకు నాయకుడు మహిషుడు అనే రాక్షసుడు. ఆ రాక్షససేనలు దేవతలను చుట్టుముట్టి లెక్కకు మిక్కిలి బాణాలను, గదలు, కత్తులు, రోకళ్లు, ఇనుప గుదియలు, శతఘ్నులు మున్నగు ఆయుధ విశేషాలను ఉపయోగించి, క్షణంలోనే దేవతల సైన్యంలోని ఏనుగులను, గుర్రాలను, రథాలను, రథికులను, కాల్బలాలను నాశనం చేశాయి. అప్పుడు కార్చిచ్చుకు భయపడి పరుగెత్తే లేళ్లవలె దేవతలు యుద్ధం చేయటానికి భయపడి వెనుదిరిగి పారిపోయారు. అట్లా భీతితో పారిపోయే దేవతలను చూచి, దేవేంద్రుడు సింహనాదం చేస్తూ ఇట్లా పలికాడు.

**చ. 'వలవదు సంభ్రమంబు, గరువంబుగ నియ్యెడ నెల్లవారు నే**
**ర్పలవడ వాహనంబులు మహాస్త్రములున్ సమకట్టి క్రమ్మఱుం;**
**డలవునఁ దున్మివైవుఁడు దురాత్ముల దైత్యుల; నేను గల్గఁగాఁ**
**దలరఁగ నేల మీకు? ధృతిఁ దాల్పుఁడు నిల్వుఁడు గెల్వుఁ డుక్కునన్'. 271**

**ప్రతిపదార్థం:** సంభ్రమంబు= భయంతో కూడిన తొట్రుపాటు; వలవదు= వద్దు; గరువంబుగన్= ఠీవితో; ఈ+ఎడన్= ఈ తరుణంలో; ఎల్లవారున్= అందరు; నేర్పు+అలవడన్= సామర్థ్యం పెంపొందించుకొని; వాహనంబులు= యానములు; మహా+అస్త్రములున్= గొప్పవి మంత్రపూతాలు అయినవి అయిన ఆయుధాలు; సమకట్టి= ఆయత్తం చేసికొని; క్రమ్మఱుండు= మరలి రండి; అలవునన్= శక్తి సామర్థ్యంతో; దురాత్ములన్= చెడ్డవారలను; దైత్యులన్= రాక్షసులను; తున్మివైవుఁడు= సంహరించండి; నేను+కల్గఁగాన్= నేను ఉండగా; మీకున్= మీకు; తలరఁగన్+ఏల= ఆరాటం చెందనేల?; ధృతిన్+ తాల్పుఁడు= ధైర్యం వహించండి; నిల్వుఁడు= ఆగండి; ఉక్కునన్= పరాక్రమంతో; గెల్వుఁడు= జయించండి.

**తాత్పర్యం:** (ఈ పద్యం దేవేంద్రుడు తన పల్కుల ద్వారా దేవతలను ప్రోత్సహించిన విధాన్ని వివరిస్తున్నది). ఓ దేవతలారా! మీరు భయపడి పారిపోవద్దు. ఈ తొట్రుపాటు మంచిది కాదు. నేను మీతో కలిసి యుద్ధం చేయగలను. నే నుండగా మీకు భయం ఎందుకు? ఆత్మగౌరవంతో మీరందరు తిరిగి వచ్చి మీ శక్తి సామర్థ్యాన్ని చూపండి. వాహనాలు మహాస్త్రాలు సరిదిద్దుకొని దుర్మార్గులైన రాక్షసులను సంహరించండి. ధైర్యం వహించండి. రణరంగంలో స్థిరభావంతో నిల్వండి. మీకు విజయం సిద్ధించటం తథ్యం.

**ఆ. అనినఁ బోక నిల్చి యాహవోత్సాహులై । సకలవాహనాస్త్రశస్త్రచయము**
**లలవరించి పేర్చి యార్చి తాఁకిరి వసు । రుద్ర సాధ్యముఖ మరుత్ప్రవరులు. 272**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; పోక= వెనుదిరిగి పారిపోకుండగా; నిల్చి= నిలిచి; ఆహవ+ఉత్సాహులు+ఐ= యుద్ధం చేయటంలో ఉత్సాహం కలవారై; సకల, వాహన+అస్త్ర, శస్త్ర, చయములు+అలవరించి= సమస్తమైన వాహనాలు, మంత్రపూతాలైన

ఆయుధాలు, యుద్ధ పరికరాల సముదాయాలను సంతరించుకొని; పేర్చి= అతిశయించి; ఆర్చి= సింహనాదాలు చేసి; వసు, రుద్ర, సాధ్య, ముఖ, మరుత్+ప్రవరులు= వసువులు, రుద్రులు, సాధ్యులు మున్నగు వేల్పు వీరులు; తాఁకిరి= (శత్రువులతో) తలపడ్డారు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు ఆ విధంగా ప్రోత్సాహక వాక్యాలు పలుకగా, దేవతలు పారిపోకుండా నిలిచి, ఉత్సాహంతో వాహనాలు అస్త్రాలు అలవరించుకొని సింహనాదాలతో శత్రువులను తాకారు. వసువులు రుద్రులు మున్నగు దేవతలు ఆ విధంగా మరల రణరంగంలో చేరి యుద్ధం సాగించారు.

**మ. అమరానీక విసృజ్యమాన బహుశస్త్రాస్త్రాహతిన్ భిన్నదే**
**హములై ఘోరమదేభముల్ బహులరక్తాంగంబులై తూలెఁ దీ**
**వ్రమహావాత నిపాత జాత రభస వ్యాధూత సంధ్యారుణా**
**భ్రములో నా నవశంబులై యొఱలుచుం బ్రత్యర్థి సైన్యంబులన్. 273**

**ప్రతిపదార్థం:** ప్రత్యర్థి, సైన్యంబులన్= విరోధుల సైన్యాలలో; అమర+అనీక, విసృజ్యమాన, బహు, శస్త్ర+అస్త్ర+ఆహతిన్= దేవతల సైన్యాలచేత విడువబడుతున్న పెక్కు ఆయుధాల యొక్క, మంత్ర బాణాల యొక్క తాకిడి చేత; ఘోర, మద+ఇభముల్= భయంకరాలైన మదించిన ఏనుగులు; భిన్న దేహములు+ఐ= చీల్చబడిన శరీరాలు గలిగినట్టివి అయి; బహుల, రక్త+ అంగంబులు+ఐ= మిక్కుటంగా నెత్తురుతో కూడిన అవయవాలతో గూడినట్టివై; తీవ్ర, మహా, వాత, నిపాత, జాత, రభస, వ్యాధూత, సంధ్యా+అరుణ+అభ్రములో+నాన్= అధికమైన, గొప్పదైన గాలిచేత కొట్టబడటం వలన ఏర్పడిన సంక్షోభం కారణంగా చెల్లాచెదరుగా నైన, సంజవేళలో ఎర్రనిమబ్బులో అనునట్లుగా; అవశంబులు+ఐ= అదుపుతప్పినవై; ఒఱలుచున్= కలతచెంది ఆర్చుచు; తూలెన్= చెల్లాచెదరై పడిపోయాయి.

**తాత్పర్యం:** శత్రుసైన్యాలలోని మదపుటేనుగులు దేవతల సైన్యాలచేత ప్రయోగించబడిన పెక్కు శస్త్రాలచేతను అస్త్రాలచేతను కొట్టబడి చీల్చబడిన దేహాలు కలిగి, నెత్తురు కారెడి అవయవాలతో కూడినవై, అధికమైన గాలిచేత కొట్టబడి సంక్షోభాన్ని చెంది చెల్లాచెదరయ్యే సంధ్యాసమయంలోని మబ్బులో అనునట్లుగా, చెల్లాచెదరైపోయాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**మ. పురుహూతాగ్రసరప్రభూత బలసంభూతాస్త్ర నిర్ధూత మై**
**తిరిగెన్ బెంపఱి దైత్యవాహినుల నుద్వృత్తాశ్వికశ్రేణి వి**
**స్ఫురితోత్పాత సమీరవేగ విముఖీభూతాకృతిం దూలు భీ**
**కరరత్నాకరజాత సంతతతరంగవ్రాతముం బోలుచున్. 274**

**ప్రతిపదార్థం:** పురుహూత+అగ్రసర, ప్రభూత, బల, సంభూత+అస్త్ర, నిర్ధూతము+ఐ= దేవేంద్రుడు నాయకుడై ముందున్న గొప్ప సేననుండి పుట్టిన మంత్రయుక్తాలైన ఆయుధాలచేత చెదరగొట్టబడినదై; పెంపు+అఱి= అతిశయం నశించి; దైత్యవాహినులన్= రాక్షస సేనలలో; ఉత్+వృత్త+ఆశ్విక, శ్రేణి= గర్వించిన గుర్రపు సైనికుల గుంపు; విస్ఫురిత+ఉత్+పాత, సమీర, వేగ, విముఖీ భూత+ఆకృతిన్= ప్రకటంగా ఉవ్వెత్తుగ పైకెగసి ఎదురుగా వీస్తున్న పెనుగాలి దెబ్బలయొక్క వేగం చేత వెనుకకు మరలించబడిన ఆకారంతో; తూలు= చెదరిపోయే; భీకర, రత్నాకర, (రత్న+ఆకర) జాత, సంతత, తరంగ,

వ్రాతమున్= భయంకరమయిన సముద్రంలో పుట్టి ఎల్లప్పుడూ నడయాడే కెరటాల గుంపును; పోలుచున్= సమానం ఔతూ; తిరిగెన్= ఇటునటూ చెదరిపోయింది.

**తాత్పర్యం:** దేవేంద్రుడి నాయకత్వంలో విజృంభించిన సైన్యం ప్రయోగించిన శస్త్రాలచేత, అస్త్రాలచేత, రాక్షస సైన్యంలోని ఆశ్వికదళం పెనుగాలిచేత వెనుకకు నెట్టబడి విరిగిపడే కడలి కెరటాల వలె చెదరి వెనుకకు పారిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ.

**చ.** **అడరుచు దేవసైన్యవిశిఖాగ్ని శిఖావలి చుట్టుముట్టినం**
**గడువడి దానవధ్వజినిఁ గల్గు రథప్రకరంబు లన్నియుం**
**బొడిపొడి యయ్యెఁ నుగ్రతర భూరిదవానల మెల్లదిక్కులం**
**బొడమిన వంటకట్టియల ప్రోవులు రూపఱుమాడ్కిఁ దోఁపఁగన్.** **275**

**ప్రతిపదార్థం:** అడరుచున్= అతిశయిస్తూ; దేవ, సైన్య, విశిఖ+అగ్ని= వేల్పుల సైన్యానికి సంబంధించిన బాణాల అగ్నియొక్క; శిఖా+ఆవలి= మంటల సమూహం; చుట్టు ముట్టినన్= నలువైపులా ఆవరించగా; కడువడిన్= మిక్కిలి వేగంతో; దానవ, ధ్వజినిన్= రాక్షసుల సైన్యంలో; కల్గు= ఉండే; రథ, ప్రకరంబులు= తేరుల గుంపులు; అన్నియున్= సమస్తమున్నూ; ఉగ్ర, తర, భూరిదవ+అనలము= మిక్కిలి భయంకరమున్నూ, మిక్కుటమున్నూ అయిన కార్చిచ్చు; ఎల్ల, దిక్కులన్= అన్ని దెసలను; పొడమిన= ఆక్రమించిన; వంట కట్టియల ప్రోవులు= వంట కొఱకు ఉపయోగించే కఱ్ఱముక్కల గుంపులు; రూపు+అఱు, మాడ్కిన్+తోఁపఁగన్= నశించే విధంగా కనబడుతూ ఉండగా; పొడిపొడి+అయ్యెన్= బూడిదగా మారిపోయాయి.

**తాత్పర్యం:** ఉత్సాహంతో దేవతల సైన్యం విజృంభించింది. వేల్పులు ప్రయోగించిన బాణాగ్నిజ్వాలలు వేగంగా నలుదెసల క్రమ్ముకొన్నాయి. రాక్షసులసేనలలోని రథాలు అన్నియు కార్చిచ్చు క్రమ్ముకొనినపుడు కాలిపోయే వంట కట్టెల వలె బూడిద బుగ్గి అయిపోయాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**శా.** **గీర్వాణప్రవిముక్తబాణపటలక్రీడావిలూనంబు లై**
**గర్వోన్మత్తసురారిశీర్షములు వీఁకన్ డొల్లెఁ గల్పచ్ఛిదా**
**నిర్విద్ధాంబుదమండలోద్గత మహానిర్ఘాతపాతావధూ**
**తోర్వీభృద్ఘనగండశైలములతో నూహింపఁ దుల్యంబులై.** **276**

**ప్రతిపదార్థం:** గీర్వాణ, ప్రవిముక్త, బాణ, పటల, క్రీడా, విలూనంబులు+ఐ= దేవతలచేత విడువబడిన అమ్ముల గుంపుల చేత (ఆటలోవలె) అలవోకగా ఛేదించబడినవై; గర్వ+ఉత్+మత్త, సుర+అరి, శీర్షములు= గర్వంచేత మిగుల మదించిన రాక్షసుల యొక్క తలకాయలు; వీఁకన్= బాగా; కల్ప+ఛిదా, నిర్విద్ధ+అంబుద, మండల+ఉత్+గత, మహా, నిర్ఘాత, పాత+అవధూత+ ఉర్వీభృత్+ఘన, గండ, శైలములతోన్= కల్పంయొక్క చివరిభాగంలో అనగా ప్రళయకాలంలో బాగా క్రమ్ముకొనిన, మేఘముల సమూహం నుండి వెల్వడుతున్న పిడుగుపాటులవలన చెల్లాచెదరైన కొండలనుండి రాలిపడుతున్న పెద్ద పెద్ద రాళ్ళతో; ఊహింపన్+తుల్యంబులు+ఐ= భావించటానికి సమానాలై; డొల్లెన్= రాలి క్రింద పడ్డాయి.

**తాత్పర్యం:** గర్వంచేత మదించిన రాక్షసుల తలకాయలు వేల్పుల బాణాలచేత కొట్టబడి, ప్రళయకాలంలో మేఘమండలంనుండి పడే పిడుగులచే కొట్టబడి ముక్కలు చెక్కలై పడే కొండలనుండి ఎగిరిపడుతూ వున్న గొప్పరాళ్ళవలె రాలి క్రింద బడ్డాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఉపమేయం రాక్షసుల బాణాలచేత కొట్టబడి నేలపై పడినట్టి దేవతల తలలు. ఉపమానం ప్రళయ కాలంలో పిడుగులపాటువలన కొట్టబడి నేలపై కూలే కొండల రాళ్లు. ఇచట 'ఊహింప' తుల్యంబులు - అనే ప్రయోగం అనుశీలించదగును. ఉపమానం (పోలిక) స్పష్టంగా వెల్లడియైతే అది ఉపమ అలంకారం. అది ఊహించవలసివస్తే ఉత్ప్రేక్ష.

**వ. ఇట్లు నిహన్యమానంబు లగుచు దైత్యసైన్యంబులు దైన్యంబు నొంది నిలువ నోపక నలుదెసలం జెదరిన నొదరి యందటి నదల్చి మహిషాసురుం డొక్కమహాశైలంబు వెఱికి యిరుగేల నమర్చికొని యమరులమీఁదం గవిసినం గని, జనితోత్సాహం బైన యసురానీకం బతనిం గూడుకొని భేరీ నిస్సాణ పణవాది తూర్య రవంబులు సింహనాదంబులుఁ జెలంగం గడంగిన, నింద్రాది సురులును బెలుచ సంగరోన్ముఖులై నిలిచిన.277**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నిహన్య మానంబులు+అగుచున్= చంపబడుతున్నవి ఔతూ; దైత్య సైన్యంబులు= రాక్షస సేనలు; దైన్యంబున్+ఒంది= దీనత్వం పొంది; నిలువన్+ఓపక= స్థిరంగా ఉండలేక; నలు, దెసలన్+చెదరినన్= నాలుగు దిక్కులకు పారిపోగా; ఒదరి= పూని; అందటిన్+అదల్చి= అందరిని అరికట్టి; మహిష+అసురుండు= మహిషుడు అనెడి రాక్షసుడు; ఒక్క, మహా, శైలంబు= ఒక పెద్ద కొండను; పెఱికి= కూరుకొని ఉన్న దానిని పైకి పెకలించి; ఇరు+కేలన్= రెండు చేతులలో; అమర్చి కొని= పొదివి పట్టుకొని; అమరులమీఁదన్= వేల్పుల మీద; కవిసినన్= పోరాటానికి పూనుకొనగా; కని= చూచి; జనిత+ఉత్సాహంబు+ఐన= ఉత్సాహం కలిగినదైన; అసుర+అనీకంబు= రాక్షసుల సేన; అతనిన్+కూడుకొని= (ఆ మహిషాసురుడితో కలిసి); భేరీ, నిస్సాణ, పణవ+ఆది, తూర్యరవంబులు= భేరి, నిస్సాణం, పణవం మున్నగునవి యుద్ధంలో సైనికులకు ఉత్సాహం కలిగించటానికై మ్రోగింపబడే వాద్య విశేషాలు. అవి చేసేనాదాలతో; సింహనాదంబులు= సింహగర్జనను అనుకరిస్తూ రణరంగంలో వీరులు చేసిన అరుపులు; చెలంగన్= అతిశయించగా; కడంగినన్= పూనుకొనగా; ఇంద్ర+ఆది, సురులును= ఇంద్రుడు మొదలైన దేవతలును; పెలుచన్= ఆటోపంతో; సంగర+ఉత్+ముఖులు+ఐ= యుద్ధం చేయటంలో అభిరుచి కలవారై; నిలిచినన్= నిలబడగా.

**తాత్పర్యం:** ఈ విధంగా రాక్షసులు రణరంగంలో మరణిస్తూ దైన్యం చెంది నిలువజాలక నలుదిక్కులకు పారిపోసాగారు. అంతట, మహిషాసురుడు పారిపోయే రాక్షసభటులకు ప్రోత్సాహం కలిగించి వారిని కూడగట్టుకొని వచ్చి, ఒక పెద్ద కొండను పెకలించి తన రెండు చేతులతో పట్టుకొని దేవతలపైకి విజృంభించాడు. అంతట ఉద్రేకంతో ధైర్యం తెచ్చుకొనిన రాక్షస సైనికులు మహిషాసురుడితో కలిసి, భేరులు మున్నగు వాద్యాలను మ్రోగించి సింహనాదాలు చేస్తూ దేవతలను ముట్టడించారు. అప్పుడు ఇంద్రుడు మున్నగు దేవతలు రాక్షసులను రణరంగంలో అరికట్టడానికై నిలబడ్డారు.

**విశేషం:** ప్రాచీన భారతదేశంలో యుద్ధరంగంలో సైనికులను పురికొల్పటానికై భేరులు, తప్పెటలు మున్నగు వాద్యాలను ఉపయోగించేవారు. భేరి= ఢక్క పెద్దడోలు. నిస్సాణము= ఇదికూడా చర్మవాద్య విశేషం, తప్పెటవంటిది; పణవము= ఏనుగు తోలుతో చేయబడిన వాద్యం. తూర్యము= ఢక్క మొదలైన ఒక వాద్య విశేషం.

**క. మహిషుఁడు బల మేర్పడ న । మ్మహిధరమున్ వైచె నయ్యమరసైన్యముపై**
**మహి సంచలింపఁగా దశ । సహస్ర యోధవరు లపుడు సమసిరి దానన్. 278**

**ప్రతిపదార్థం:** మహిషుఁడు; బలము+ఏర్పడన్= శక్తి విలసిల్లేటట్లుగా; ఆ+మహిధరమున్= ఆ కొండను; ఆ+అమర సైన్యముపైన్= ఆ దేవతల సేనపై; మహి= భూమి; సంచలింపఁగాన్= కంపించేటట్లుగా; వైచెన్= విసిరాడు; దానన్= ఆ కొండ వలన; అపుడు= ఆ సమయంలో; దశ, సహస్ర, యోధ, వరులు= పదివేల మంది గొప్ప వీరులు; సమసిరి= చచ్చారు.

**తాత్పర్యం:** మహిషాసురుడు ఆ కొండను దేవతల సేనపై విసిరాడు. ఆ కొండతాకిడికి దేవతలసేనలలో పదివేల మంది గొప్పయోధులు మరణించారు.

**ఉ. అంతయుఁ జూచి యెంతయు భయంబున నింద్రునిఁదొట్టి నిర్జరుల్**
**భ్రాంతమనస్కులై తిరుగఁబడ్డ మదాంచితఘోరమూర్తి యై**
**యంతకశౌర్యుఁ డా దనుజుఁ డంత దిగంతము దూలఁ గిట్టి కా**
**లాంతకుఁ డైన రుద్రుని రథాగ్రము చెచ్చెరఁ బట్టె నుద్ధతిన్. 279**

**ప్రతిపదార్థం:** అంతయున్+చూచి= జరిగింది సమస్తమున్నూ గమనించి; ఎంతయున్, భయంబునన్= కొలదికి మీరిన వెరపుతో; ఇంద్రునిన్+తొట్టి, నిర్జరుల్= ఇంద్రుడు మొదలుగా గల దేవతలు; భ్రాంత మనస్కులు+ఐ= మోహం చేత కలవర పడిన మనస్సులు కలవారై; తిరుగన్+పడ్డన్= తిరుగు ముఖాలతో మరలినవారు కాగా; మద+అంచిత, ఘోర, మూర్తి+ఐ= గర్వంతో కూడిన భయంకరమైన ఆకృతి కలవాడై; అంతక శౌర్యుఁడు= యముడి వంటి పరాక్రమం కలవాడు; ఆ దనుజుఁడు= ఆ రాక్షసుడు (ఆ మహిషుఁడు); అంతన్= ఆ సమయంలో; దిక్+అంతము= దిక్కుల చివరి భాగం; తూలన్= చలించగా; కిట్టి= సమీపించి; కాల+అంతకుఁడు+ఐన= కాలాన్ని రూపుమాపేవాడైన; రుద్రుని= శివుని; రథ+అగ్రము= తేరుకొనభాగాన్ని; చెచ్చెరన్= వేగంగా; ఉద్ధతిన్= రోషంతో; పట్టెన్= పట్టుకొన్నాడు.

**తాత్పర్యం:** ఆ సన్నివేశాల నన్నిటిని తిలకించి, మిక్కిలి వెరపుతో ఇంద్రుడు మొదలగు దేవతలు కలవరపడి మరలినారు. అప్పుడు యముడితో సమానమైన పరాక్రమం గల ఆ మహిషాసురుడు దిక్కులు సంచలించేటట్లుగా విజృంభించి, గర్వంతో కూడిన భయంకరమూర్తి అయి, కాలాంతకుడైన శివుడి తేరుకొనభాగాన్ని రోషంతో శీఘ్రంగా పట్టుకొన్నాడు.

**చ. 'హరుఁ డదె చిక్కె నింక నసురాధిపుచేఁ దెగు' నంచుఁ బొంగి భీ**
**కరముగ దైత్యు లార్వఁగ జగత్త్రితయంబును గంప మొందఁగాఁ**
**దెరలి మునీశ్వరుల్ గరము దీనతఁ బొందఁగ మందహాస భా**
**సురముఖుఁ డై పురారి నిజసూనుఁ గుమారునిఁ జూచి యిట్లనున్. 280**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు; అది+ఎ= అదె= అదిగో; చిక్కెన్= వశం అయ్యాడు; ఇంకన్= ఇకమీదట; అసుర+అధిపుచేన్= రాక్షసుల ప్రభువు చేత (మహిషుడిచేత); తెగున్= చచ్చును; అంచున్= అని పలుకుతూ; దైత్యులు= రాక్షసులు; పొంగి= ఉత్సహించి; భీకరముగన్= భయంకరంగా; ఆర్వఁగన్= పెద్ద పెట్టున అరువగా; జగత్+త్రితయంబును= మూడు లోకాలున్నూ; కంపము+ఒందఁగాన్= భయంతో సంచలించగా; తెరలి= తిరుగుడుపడి; ముని+ఈశ్వరుల్= ఋషిశ్రేష్ఠులు; కరము=

మిక్కిలి; దీనతన్+పొందఁగన్= దైన్యం చెందగా; మంద, హాస, భాసుర, ముఖుఁడు+ఐ= చిరునవ్వుచేత వెలుగొందిన మొగం కలవాడై; పుర+అరి= శివుడు; నిజ, సూనున్= తన కొడుకును; కుమారునిన్+చూచి= కుమారస్వామిని కనుగొని; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంతట రాక్షసభటులు 'ఇదిగో శివుడు చిక్కాడు; ఇక అతడు మహిషాసురుడిచేత చస్తాడు' అని భయంకరంగా అరిచారు. దానితో మూడులోకాలున్నూ కంపించిపోయాయి. ఋషిరేణ్యులు చిన్నవోయారు. కాని, పరమశివుడు మాత్రం చిరునవ్వులు చిందే మొగంతో తన కుమారుడైన కుమారస్వామితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'చూచితె వీని సాహసము శూరత మద్రథరోధి యయ్యెఁ ని**
**న్నీచుఁ గృతాపరాధు నవినీతు గతాయువు మృత్యుదేవికిన్**
**గోచరుఁ జేయు మీవు రణకోవిద!' నావుడు షణ్ముఖుండు గో**
**త్రాచలసన్నిభుండు మదనాంతకుమాటకుఁ బొంగి యుక్కునన్. 281**

**ప్రతిపదార్థం:** రణ, కోవిద!= యుద్ధం చేయటంలో ప్రావీణ్యం కలవాడా, ఓ కుమారస్వామీ!; ఈవు= నీవు; వీని= ఈ మహిషుడి యొక్క; సాహసమున్; తెగువను; చూచితి(వి)+ఎ= సందర్శించావు కదా; శూరతన్= పరాక్రమం చూప్పున; మత్+రథ, రోధి+అయ్యెన్= నా తేరుకు ఆటంకం కల్పించిన వాడు అయ్యాడు; ఈ+నీచున్= ఈ నీచుడిని; కృత+అపరాధున్= చేసిన నేరం కలవాడిని; అవినీతున్= నీతి లేనివాడిని; గత+ఆయువున్= పోయిన ఆయుర్దాయం కలవాడిని; మృత్యు, దేవికిన్+గోచరున్+చేయుము= మృత్యుదేవతకు కనిపించేవాడినిగా ఒనరించుము; నావుడున్= అని చెప్పగా; గోత్ర+అచల, సన్నిభుండు= కుల పర్వతాలతో సమానమైన వాడగు; షణ్ముఖుండు= ఆరుమొగాల దేవర అయిన కుమారస్వామి; మదన+అంతకు, మాటకున్= మన్మథుడిని సంహరించిన శివుడియొక్క పలుకులకు; పొంగి= ఉత్సాహం చెంది; ఉక్కునన్= బలంతో.

**తాత్పర్యం:** 'యుద్ధం చేయటంలో ఆరితేరిన ఓ కుమారుడా!; చూచినావు కదా ఈ మహిషుడి సాహసం! వీడు నారథాన్నే అడ్డగించగలిగాడు. ఈ నీచుడికి ఆయువు తీరింది. ఇక వీడు మృత్యువువాత పడటం తప్పదు. ఈ దురహంకారిని నీవు శీఘ్రంగా సంహరించుము' అని శివుడు ఆజ్ఞాపించాడు. అప్పుడు కులపర్వతాల వంటి స్థైర్యం గలవాడైన కుమారస్వామి శివుడి మాటలకు ఉప్పొంగినవాడయ్యాడు.

**విశేషం:** స్థైర్యాన్ని పర్వతంతో పోల్చటం పరిపాటి. పర్వతాలలో శ్రేష్ఠాలు భూమిని మోసే 'కుల' పర్వతాలు. 1. మహేంద్రం 2. మలయం 3. సహ్యం 4. శుక్తిమంతం 5. గంధమాదనం 6. వింధ్యం 7. పారియాత్రం అనే ఏడున్నూ కులపర్వతాలు.

**ఉ. లోహితరత్నభూషణుఁడు లోహితమాల్యధరుండు విస్ఫుర**
**ల్లోహితలోచనుండు నవలోహితవస్త్రుఁడు లోహితాస్యుఁ డై**
**యాహవకేళికిం గడఁగునప్పుడు సూడఁగ నొప్పె లోకని**
**ర్దాహసమిద్ధ నూతనపతంగుఁడ పోలె రథాధిరూఢుఁ డై. 282**

**ప్రతిపదార్థం:** లోహిత, రత్న, భూషణుఁడు= ఎర్రని మణులతో చేయబడిన ఆభరణాలను తాల్చినవాడు; లోహిత మాల్యధరుండు= ఎర్రని పూలమాలలు ధరించినవాడు; విస్ఫురత్+లోహిత, లోచనుండు= ప్రకాశించే (కోపంతో) ఎర్రబడిన కన్నులు కలవాడు;

నవ, లోహిత, వస్త్రుఁడు= క్రొత్తవి అయిన ఎర్రని బట్టలు ధరించినవాడు; లోహిత+ఆస్యుఁడు+ఐ= (కోపంతో) ఎర్రబడిన మొగం కలవాడయి; ఆహవ, కేళికిన్+కడఁగు+అప్పుడు= యుద్ధం అనే ఆటకు పూనుకొనే సమయంలో; లోక, నిర్దాహ, సమ్+ఇద్ధ, నూతన, పతంగుఁడు+అ, పోలెన్= జగత్తును తగులబెట్టేటట్లు దేదీప్యమానంగా ప్రకాశించే క్రొత్త సూర్యుడితో సరిపోలుతున్నవాడయి; రథ+అధిరూఢుఁడు+ఐ= తేరిపై ఎక్కినవాడయి; చూడఁగన్= చూడటానికి; ఒప్పెన్= విలసిల్లాడు.

**తాత్పర్యం:** యుద్ధం చేయటానికి ఉపక్రమించిన కుమారస్వామి రథారూఢుడై, ప్రళయకాలంలో లోకాలను మాడ్చి వేయటానికి సమర్థుడై - దేదీప్యమానమైన తేజస్సు గలిగి ఉదయించే సూర్యుడివలె వెలుగొందాడు. ఆ సమయంలో కుమారస్వామి ఎర్రని మణులు పొదిగిన ఆభరణాలను ధరించి ఉన్నాడు. ఎర్రని క్రొత్త ఉడుపులను తాల్చి ఉన్నాడు. మిరుమిట్లుగొలిపే ఎర్రని కన్నులు కలవాడైనాడు. ఆతడి ముఖం క్రోధంతో ఎర్రబారింది.

**విశేషం:** ఎరుపు కోపానికి చిహ్నం. శౌర్యాన్ని సూచించే కవిసమయం. కుమారస్వామి లోహితాంబరుఁడుగా సుప్రసిద్ధుఁడు.

**ఉ.** **ఆతని నుగ్రతేజు నిటలాక్షతనూభవుఁ జూచి నిర్జర**
**వ్రాతము భీతిఁ బోవిడిచి వారక ధీరత నిల్చె; నంత ని**
**ర్ధూతవిరోధివైరివధ దోహలియై వడివైచెఁ దీవ్ర ని**
**ర్ఘాతము తోడఁబుట్టు వనఁగాఁ దగు నుజ్జ్వలశక్తి దైత్యుపైన్.** **283**

**ప్రతిపదార్థం:** ఆతనిన్= ఆ కుమారస్వామిని; ఉగ్రతేజున్= భయంకరమైన తేజస్సు కలవాడిని; నిటల+అక్ష, తనూ భవున్= ఫాలనేత్రుడైన పరమశివుడి కుమారుడిని; చూచి= అరసి; నిర్జర, వ్రాతము= దేవతల సమూహం; భీతిన్+పోన్; విడిచి= భయాన్ని వదలిపెట్టి; వారక= మానక; ధీరతన్= ధైర్యంతో; నిల్చెన్= నిలబడింది; అంత= అప్పుడు; నిర్ధూత, విరోధి= శత్రువులను చెదరగొట్టే కుమారస్వామి; వైరి, వధ, దోహలి+ఐ= శత్రువులను సంహరించే ఉత్సాహం కలవాడై; వడిన్= వేగంగా; తీవ్ర, నిర్ఘాతము, తోడన్+పుట్టువు+అనఁగాన్+తగు= గాఢమైన పిడుగుకు సహోదరమైనది అని చెప్పదగు; ఉత్+జ్వల, శక్తిన్= మిక్కిలిగా వెలుగొందే శక్తి అనే ఆయుధాన్ని; దైత్యుపైన్= రాక్షసుడిపై= మహిషుడిపై; వైచెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** గొప్పతేజస్సుతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ముక్కంటి పట్టిని కుమారస్వామిని చూచి దేవతలు భయాన్ని వీడి ఉత్సాహంతో రణరంగంలో ధైర్యంగా నిలబడ్డారు. అంతట శత్రువును సంహరించే కోరికతో ఉత్సాహం వెల్లివిరిసి కుమారస్వామి ఆ రాక్షసుడైన మహిషుడిపై పిడుగునకు తోబుట్టువు అని చెప్పదగిన గొప్ప ఆయుధమైన శక్తిని ప్రయోగించాడు.

**క.** **దారుణకల్పాంతాగ్ని స । మారంభము దోఁప నమ్మహాశక్తి రయం**
**బారంగ నడరి దివిజేం । ద్రారాతిం బొదివి భస్మితాంగునిఁ జేసెన్.** **284**

**ప్రతిపదార్థం:** ఆ+మహా, శక్తి= ఆ గొప్ప శక్తి అనే ఆయుధం; కల్ప+అంత, అగ్ని, సమ్+ఆరంభము, తోఁపన్= ప్రళయకాలమందలి అగ్నియొక్క ఆటోపారంభం స్ఫురించేటట్లుగా; రయంబు+ఆరంగన్+అడరి= శీఘ్రచర్యతో విజృంభించి; దివిజ+ ఇంద్ర+ అరాతిన్+పొదివి= దేవతలయొక్క అధిపతి అయిన ఇంద్రుడి శత్రువును (మహిషుడిని) చేరి; భస్మిత+అంగునిన్+ చేసెన్= బూడిదగా మారిన శరీరం కలవాడినిగా చేసింది.

**తాత్పర్యం:** 'శక్తి' అనే ఆయుధవిశేషం, ప్రళయకాలమందలి అగ్నియొక్క ప్రారంభాన్ని తలపించేటట్లుగా మహిషాసురుడిని చేరి ఆతడి శరీరాన్ని బూడిదబుగ్గి అయ్యేటట్లు తగులబెట్టింది.

**వ.** **ఇవ్విధంబున మహిషాసురుం బరిమార్చి కుమారుండు మఱియు నమ్మహాశక్తిం బునః పునః ప్రయోగంబు గావించుచు ననేకదైత్యదానవ శతసహస్రంబుల వధియించె; నద్దేవుని పారిషదగణంబుం గవిసి యసురులం దునిమి తూఁటాడి తదీయరక్తపాన మాంసఖాదనంబులు సేసి మత్తిల్లి యాడుచుం బాడుచు నతనిఁ గొనియాడుచు విహరించె; నిట్లు వైరులం బొలియించి తిమిరంబు విరియించిన తిమిర వైరియుం బోలె వెలుంగుచున్న కార్తికేయు నజేయుం జేర నరుగుదెంచి దేవేంద్రుం డతనిం గౌఁగిటం జేర్చి యిట్లనియె.285**

**ప్రతిపదార్థం:** ఇవ్విధంబునన్= ఈ రీతిగా; కుమారుండు= కుమారస్వామి; మహిష+అసురున్= మహిషుడు అనే రాక్షసుడిని; పరిమార్చి= సంహరించి; మఱియున్= ఇంకను; ఆ+మహాశక్తిన్= ఆ గొప్ప శక్తి అనే ఆయుధ విశేషాన్ని; పునః, పునః, ప్రయోగంబు= తిరిగి తిరిగి వాడటం; కావించుచున్= చేస్తూ; అనేక, దైత్య, దానవ, శత, సహస్రంబులన్= పెక్కు వేల మంది దైత్యులను (దితివంశజులను), దానవులను (దనువు వంశజులను); వధియించెన్= సంహరించాడు; ఆ+దేవుని= ఆ కుమారస్వామి యొక్క; పారిషద గణంబున్= కొలువు కూటానికి సంబంధించిన భటుల గుంపుకూడ; కవిసి= ముట్టడించి; అసురులన్= రాక్షసులను; తునిమి తూఁటాడి= ముక్క చెక్కలు చేసి; తదీయ, రక్త, పాన మాంస, ఖాదనంబులు+చేసి= వారల యొక్క నెత్తురులు త్రాగి మాంసాలు తిని; మత్తిల్లి= మదించి; ఆడుచున్+పాడుచున్= ఆటలు ఆడుతూ పాటలు పాడుతూ; అతనిన్= కుమారస్వామిని; కొనియాడుచున్= ప్రశంసిస్తూ; విహరించెన్= స్వేచ్ఛగా తిరిగాయి; ఇట్లు= ఈ రీతిగా; వైరులన్= శత్రువులను; పొలియించి= సంహరించి; తిమిరంబు, విరియించిన= చీకటిని పారద్రోలిన; తిమిర వైరియున్+పోలెన్= సూర్యుడివలె; వెలుంగుచున్న= ప్రకాశిస్తున్న; కార్తికేయున్= కుమారస్వామిని; అజేయున్= జయించ నలవికానివాడిని; చేరన్+అరుగుదెంచి= సమీపానికి వచ్చి; దేవేంద్రుండు= దేవతలకు ప్రభువు అయిన ఇంద్రుడు; అతనిన్+ ఆ కుమార స్వామిని; కౌఁగిటన్+చేర్చి= కౌగిలించుకొని; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా కుమారస్వామి మహిషుడు అనే రాక్షసుడిని సంహరించాడు. పిదప కుమారస్వామి శక్తి అనే ఆ గొప్ప ఆయుధాన్ని రాక్షసులపై పలుమారులు ప్రయోగించాడు. అందువలన ఆ రక్కసులు అందరు చనిపోయారు. అంతట కుమారస్వామిపరివారానికి చెందిన భటగణములు ఆ రాక్షసులను చీల్చి చెండాడి వారల నెత్తురులు త్రాగి, మాంసాలను భక్షించి మత్తెక్కి, ఆడుతూ పాడుతూ కుమారస్వామిని కొనియాడారు. ఈ విధంగా, చిమ్మచీకట్లను పారద్రోలి దేదీప్యమానంగా ప్రకాశించే సూర్యుడివలె తేజరిల్లిన కుమారస్వామిదగ్గరకు వచ్చి, దేవేంద్రుడు ఆతడిని కౌగిలించుకొని ఈ రీతిగా పలికాడు.

**చ.** **'కమలభవప్రదత్తవరగర్వితుఁడై మముఁ జీరికిం గొనం**
**దమితపరాక్రముండు దనుజాధిపుఁ డీతఁడు నీ మహోగ్ర కో**
**పమను దవాగ్నియందు శలభంబును బోలె నశించె; వీనికిన్**
**సములగువారు వెండియును జచ్చిరి నూర్వురు దైత్యు లీ యనిన్. 286**

**ప్రతిపదార్థం:** అమిత పరాక్రముండు= గొప్ప శౌర్యం కలవాడు; దనుజ+అధిపుఁడు= రాక్షసులయొక్క రాజు; ఈతఁడు= (ఈ మహిషుడు); కమల, భవ, ప్రదత్త, వర, గర్వితుఁడు+ఐ= బ్రహ్మదేవుడిచేత ఈయబడిన వరంచేత మదించినవాడై;

మమున్= మమ్ములను (దేవతలను); చీరికిన్+కొనండు= లెక్క చేయడు; నీ, మహా+ఉగ్ర కోపము+అను, దవ+అగ్ని+అందున్= నీదైన మిక్కిలి భయంకరమైన ఆగ్రహం అనే కార్చిచ్చులో; శలభంబును+పోలెన్= మిడుతవలె; నశించెన్= నాశనమయ్యాడు; వెండియును= మఱియును; వీనికిన్ సములు+అగువారు= వీడితో (మహిషుడితో) సమానమైనవారు; నూర్వురు, దైత్యులు= వందమంది రాక్షసులు; ఈ+అనిన్= ఈ యుద్ధంలో; చచ్చిరి= మరణించారు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడివలన పొందిన వరంచేత మదించిన ఈ మహిషాసురుడు దేవతలమైన మమ్మల్ని సరకు చేయలేదు; ఈతడు గొప్ప శౌర్యవంతుడు, రాక్షసులకు ప్రభువు. కాని, వీడు నీ గొప్పకోపం అనెడి కార్చిచ్చులో పడి మిడుతవలె మాడిపోయాడు. అంతేకాక, ఈ యుద్ధంలో ఈ మహిషుడితో సమానులు అనదగిన వందమంది రాక్షసవీరులు సైతం మరణించారు. ఇది అంతా నీ పరాక్రమంచేతనే సాధించబడింది.

**క. లోక త్రయంబు నందును । నీ కీర్తి వెలింగె నమరనికరము నేనున్**
**నీ కింకరులము గుణర । త్నాకర! రక్షింపు మమ్ము ననిశము కృపతోన్.' 287**

**ప్రతిపదార్థం:** గుణరత్న+ఆకర!= మంచి గుణాలు అనే రత్నాలకు సముద్రం వంటివాడా!; నీ కీర్తి= నీ యశస్సు; లోక త్రయంబు నందును= మూడు లోకాలలోను; వెలింగెన్= ప్రకాశించింది; అమర, నికరమున్= వేల్పుల సముదాయమున్నూ; నేనున్= నేనున్నూ (ఇంద్రుడనైన నేనున్నూ); నీ కింకరులము= నీకు సేవకులము; అనిశము= ఎల్లప్పుడు; కృపతోన్= దయతో; మమ్మున్= మమ్ములను అనగా దేవతలను; రక్షింపు(ము)= కాపాడుము.

**తాత్పర్యం:** మంచి గుణాలకు సముద్రం వంటివాడా! ఓ కుమారస్వామీ! నీ యశస్సు మూడులోకాలలో వెల్లివిరిసింది. నేనున్నూ, వేల్పులం అందరమున్నూ నీ యొక్క సేవకులం. దయతో నీవు మమ్మల్ని ఎల్లప్పుడూ కాపాడుము.'

**వ. అని పలికె; నప్పుడు పార్వతీసుందరుండు నిజనందనుఁ బునఃపునరాలింగనంబుల నభినందించి, పురందర ప్రముఖులం జూచి, 'యిక్కుమారునందు నాయందు దెట్లట్ల సభక్తికచిత్తులరై వర్తిల్లుం' డని యాజ్ఞాపించి, యనంతరంబ భద్రవటంబునకుం జనియె; నమరులు ప్రమదంబునం దమ తమ నివాసంబులకుం జని; రి వ్విధంబున. 288**

**ప్రతిపదార్థం:** అని పలికెన్= అని చెప్పాడు; అప్పుడు= ఆ సమయంలో; పార్వతీ సుందరుఁడు= పార్వతీదేవికి భర్త అయిన శివుడు; నిజ, నందనున్= తన కుమారుడైన కుమారస్వామిని; పునః, పునః+ఆలింగనంబులన్= మరల మరల కౌగిలించుకొనటం చేత; అభినందించి= సంతోషింపజేసి; పురందర, ప్రముఖులన్+చూచి= దేవేంద్రుడు మున్నగు నాయకులను అరసి; ఈ+కుమారునందున్= ఈ కుమారస్వామి పట్ల; నాయందున్+ఎట్లు+అట్లు+అ= నా యందు ఏ విధంగా ఉంటారో, అట్లే; సభక్తిక, చిత్తులరు+ఐ= పూజ్యభావంతో కూడిన అనురాగం కల మనస్సు కలవారై; వర్తిల్లుండు= ప్రవర్తించండి; అని= అని చెప్పి; ఆజ్ఞాపించి= ఆనతి ఇచ్చి; అనంతరంబు+అ= అటు పిమ్మట; భద్రవటంబునకున్= భద్రవటం అనే చోటికి; చనియెన్= వెళ్లాడు; అమరులు= దేవతలు; ప్రమదంబునన్= సంతోషంతో; తమతమ నివాసంబులకున్= తాము తాము నివసించే స్థలాలకు; చనిరి= వెళ్ళారు; ఈ+విధంబునన్= ఈ రీతిగా.

**తాత్పర్యం:** అని చెప్పాడు. అంతట శివుడు తన కుమారుడైన కుమారస్వామిని పలుమారులు కౌగిలించుకొని అభినందించాడు. పిదప శివుడు దేవేంద్రుడు మున్నగు నాయకులతో 'మీరు నన్ను ఏ విధంగా పూజ్యభావంతో

కూడిన అనురాగంతో చూస్తున్నారో అట్లే ఈ కుమారస్వామిని కూడ మన్నించండి' అని ఆజ్ఞాపించి, తాను భద్రవటానికి వెళ్ళాడు. పిమ్మట దేవతలు తమ తమ నివాసస్థానాలకు వెళ్ళిపోయారు. ఈ రీతిగా.

**ఉ. ఒక్కదినంబునందు బలియుండు సురారుల నెల్లఁ దున్మి పెం**
**పెక్కి దయార్ద్రుఁ డై యభయ మిచ్చె జగంబుల కెల్ల షణ్ముఖుం;**
**డిక్కథ భక్తితో వినిన నెప్పుడుఁ గీర్తన సేసినన్ జనుల్**
**నిక్కము సర్వదోషముల నీఁగి భజింతురు భవ్య భద్రముల్. 289**

**ప్రతిపదార్థం:** బలియుండు= బలం కలవాడు; షట్+ముఖుండు= ఆరుమోముల దేవర అయిన కుమారస్వామి; ఒక్క దినంబునందున్= ఒక రోజులోనే; సుర+అరులన్+ఎల్లన్+తున్మి= దేవతలయొక్క శత్రువులయిన రాక్షసులను అందరిని సంహరించి; పెంపు+ఎక్కి= అతిశయించి; దయా+ఆర్ద్రుఁడు+ఐ= కరుణచేత తడిసినవాడై; జగంబులకున్+ఎల్లన్= సమస్త లోకాలకు; అభయము+ఇచ్చెన్= రక్షణ కల్పించటానికి హామీ ఇచ్చాడు; జనుల్= ప్రజలు; ఈ+కథన్= ఈ కథను; భక్తితోన్= పూజ్యభావంతో; వినినన్= ఆలకిస్తే; ఎప్పుడున్= ఏ సమయంలో; కీర్తన+చేసినన్= చదివితే; సర్వ, దోషములన్+ఈఁగి= అన్ని పాపాలనుండి విముక్తి చెంది; భవ్య భద్రముల్= శ్రేష్ఠమైన శుభములను; భజింతురు= పొందుతారు; నిక్కము= నిజం.

**తాత్పర్యం:** బలవంతుడైన ఆరుమోములదేవర కుమారస్వామి దేవతలకు శత్రువులైన రాక్షసుల నందరిని ఒక్కరోజులోనే సంహరించి, మూడులోకాలలోని ప్రజలకు అభయం ప్రసాదించాడు. ఈ కథను మనుజులు ఎవ్వరైనా ఎప్పుడైనా, వినినా, చదివినా, సమస్తదురితాలు తొలగి, ఉత్కృష్టములైన శుభాలను పొందగలరు. ఇది ముమ్మాటికి నిజం.

**వ. అని మార్కండేయుండు సెప్పినఁ బాండవులు సంతుష్టహృదయు లై యమ్మహాత్మునిం బ్రశంసించిరి; వా రివ్విధంబున నభీష్టకథాగోష్ఠిం బ్రవర్తిల్లు నెడఁ గృష్ణవల్లభ యైన సత్యభామయుఁ బాంచాలియు నేకతంబ యొక్క యెడఁ బ్రియసల్లాపసంసక్తలై యుండి; రప్పుడు సత్యభామ ద్రౌపది కి ట్లనియె. 290**

**ప్రతిపదార్థం:** అని మార్కండేయుండు; చెప్పినన్= చెప్పగా; పాండవులు; సంతుష్ట హృదయులు+ఐ= మిక్కిలి తృప్తి చెందిన హృదయాలు కలవారై; ఆ+మహా+ఆత్మునిన్= ఆ మహానుభావుడిని; ప్రశంసించిరి= పొగడారు; వారు= ఆ పాండవులు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; అభీష్ట, కథా, గోష్ఠిన్+ప్రవర్తిల్లు+ఎడన్= ఇష్టమైన కథలను పలువురు కలిసి శ్రద్ధతో వింటున్న సమయంలో; కృష్ణ, వల్లభ+ఐన= శ్రీకృష్ణుడి భార్య అయిన; సత్యభామయున్, పాంచాలియున్= ద్రౌపదియు; ఏకతంబు+అ= రహస్యంగా, ఏకాంతంగా; ఒక్క+ఎడన్= ఒక చోట; ప్రియ సల్లాప సంసక్తలు+ఐ+ఉండిరి= తమకు ఇష్టమైన సంభాషణ జరపటంలో ఆసక్తలై ఉన్నారు; అప్పుడు= ఆ సమయంలో; సత్యభామ; ద్రౌపదికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ విధంగా మహిషాసుర సంహార గాథను, కుమారస్వామి పరాక్రమప్రాభవాలను మార్కండేయమహర్షి పాండవులకు వినిపించాడు. ఈ రీతిగా పాండవులు మిక్కుటమైన శ్రద్ధతో, భక్తితో పెక్కు కథలను మార్కండేయ మహర్షివలన విని, సంతృప్తి చెంది ఆ మహర్షిని పూజించి అభినందించారు. ఆ సమయంలో శ్రీకృష్ణుడి భార్య అయిన సత్యభామ, పాండవ ధర్మపత్ని అయిన ద్రౌపది ఇష్టసల్లాపాలలో నిమగ్నలై ఉన్నారు. అప్పుడు సత్యభామ పాంచాలితో ఒంటరిగా ఇట్లు పలికింది.

**విశేషం:** పాండవులు అరణ్యావాసం చేస్తున్నప్పుడు మార్కండేయమహర్షి వచ్చి, వారికి ఎన్నో కథలను వివరించి చెప్పాడు. మార్కండేయ మహర్షి వచ్చినప్పుడే శ్రీకృష్ణుడుకూడ తన ధర్మపత్నిఅయిన సత్యభామతోపాటు వచ్చి ఆ పురాణకథాగోష్ఠిలో పాల్గొన్నాడు. సత్యభామ ప్రాగల్భ్యవతిగా, స్వాభిమానవతిగా ప్రసిద్ధికెక్కిన పౌరాణిక పాత్ర. ద్రౌపది వినయవతి. ఇరువురి ఆంతరంగిక సంభాషణ అనుశీలించతగినది.

### సత్యా ద్రౌపదీ సంవాదము (సం. 3-222-1)

**సీ.** **'నీ ప్రియభర్తల నిర్మలచరితులఁ । బ్రకటతేజుల లోకపాలనిభులఁ**
**బార్థుల నీ వొకభంగిన వదలక । చెలువ! యెబ్భంగి భజింతు దగిలి?**
**యొక్క రొక్కనికంటె నువిద! నీ కేవురు । ననురక్తు లగుట యత్యద్భుతంబు;**
**నగుమొగంబుల కాని నలినాక్షి! నీ దెసఁ బతులకుఁ గింకిరిపాటు లేదు;**

**తే.** **వ్రతము పెంపొ? మంత్రౌషధ వైభవంబొ? । సరస నైపథ్యకర్మ కౌశలమొ? చతుర**
**విభ్రమోల్లాస రేఖయొ? వెలఁది! నీ వి । శేష సౌభాగ్య హేతువు సెపుమ నాకు. 291**

**ప్రతిపదార్థం:** చెలువ= అందమైనదానా! (ఓ ద్రౌపదీ); నీ ప్రియ భర్తలన్= నీకు ప్రీతిపాత్రులైన పెనిమిటులను; నిర్మల చరితులన్= కళంకం లేని పరిశుద్ధమైన శీలాలు కలవారిని; ప్రకట తేజులన్= దేదీప్యమానమైన వెలుగుతో భాసించేవారిని; లోకపాలనిభులన్= దిక్పాలకులతో సమానమైన వారిని; పార్థులన్= కుంతీకుమారులను, పాండవులను; నీవు; వదలక= వదలిపెట్టకుండ; ఒక భంగిన్+అ= ఒకే విధంగా (అందరను సమానంగా); ఏ+భంగిన్= ఏ రీతిగా; తగిలి= ఆసక్తి గలిగి; భజింతు(వు)= ఆరాధిస్తావు?; ఉవిద!= ఓ వనితా! ద్రౌపదీ!; ఒక్కరు+ఒక్కని కంటెన్= ఒకరిని మించి మరి ఒకరు; నీకున్= నీకు; ఏవురు= అయిదుగురు; అనురక్తులు+అగుట= ప్రేముడి కలవారు కావటం; అతి+అద్భుతంబు= మిక్కిలి అచ్చెరువు కలిగించే అంశం; నలిన+అక్షి!= పద్మాల వంటి కన్నులు గలదానా!; నగు, మొగంబుల కాని= నవ్వుతో కూడిన ముఖాలతో తప్ప; నీ దెసన్= నీ యెడల; పతులకున్= భర్తలకు; కింకిరిపాటు, లేదు= కోపంతో గూడిన ఏవగింపు ఉండదు; నీ విశేష, సౌభాగ్య హేతువు= నీ యొక్క గొప్పదైన భర్తృవాల్లభ్యానికి (భర్తచేత నీవు పొందుతున్న మిక్కిలి అనురాగానికి) కారణం; వ్రతము+పెంపు+ఒ= నోములు నోయటం వలన కలిగిన అతిశయమా?; మంత్ర+ఔషధ, వైభవంబు+ఒ= మంత్రాలయొక్క, మందులయొక్క గొప్పతనమా?; సరస నైపథ్య కర్మ కౌశలము+ఒ= చక్కని వస్త్రాద్యలంకార విశేషంలో నీకు గల నేర్పరి తనమా?; చతుర, విభ్రమ+ఉల్లాస, రేఖ+ఒ= తెలివితేటలయొక్క చురుకుదనపు ఒరపా?; నాకున్= నాకు (సత్యభామ అయిన నాకు); చెపుమ= వివరించి తెలుపుము.

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులు కల ఓ ద్రౌపదీ! నీ భర్తలు అయిదుగురును నీయందు మిక్కుటమైన అనురాగం కలవారు. ఒకరిని మించి మరొకరు నీ మీద ప్రేముడి ప్రదర్శిస్తుంటారు. వారందరి యెడల నీవు సమానమైన ఆసక్తి గలిగి మసలుకొంటూ వుంటావు. వారు అందరు దేదీప్యమానమైన తేజస్సు కలవారు, పరిశుద్ధమైన శీలం కలవారలు, దిక్పాలకులతో సమానమైన ప్రాభవం కలవారు. అటువంటి వారు అందరును నీయెడ ఎల్లప్పుడు మురిపంతో ముసిముసినవ్వులు ప్రసరింపచేయటం వింతలలో వింత. ఇట్టి అద్భుత మహిమ నీకు ఏ విధంగా చేకూరింది? ఏవైనా గొప్ప నోములు నోచావా? మంత్రతంత్రాలు అభ్యసించావా? మందులు మాకులు ప్రయోగించావా? వస్త్రాద్యలంకారంలో తెలివితేటలు కారణమా? చురుకుదనాలు ఒయ్యారాలు ఒలికించగల నేర్పు ఏదైనా నీకు ఉన్నదా? భర్తల అనురాగాన్ని ఈ విధంగా నీవు చూరగొనటానికి గల కారణం నాకు చెప్పగోరుతున్నాను.

**క. ఏనును నీవలన నిజము । గా నిది యంతయును నెఱిఁగి కమలదళాక్షుం**
**బూని వశగతునిఁ జేసి య । నూనస్నేహానుభోగయుక్తిఁ దలిర్తున్.' 292**

**ప్రతిపదార్థం:** ఏనును= (సత్యభామ నయిన) నేనును; నీవలనన్= నీ దగ్గర నుండి; నిజముగాన్= సత్యంగా; ఇది+ అంతయునున్+ఎఱిఁగి= దీనిని అంతటిని తెలిసికొని; కమల దళ+అక్షున్= తామరరేకులవంటి కన్నులు కలవాడిని (శ్రీకృష్ణుడిని); పూని= ప్రయత్నించి; వశగతునిన్+చేసి= లోబరచుకొని; అనూన, స్నేహ+అనుభోగయుక్తిన్= మిక్కుటమైన సౌఖ్యానుభవంతో కలిసి యుండటంతో; తలిర్తున్= విలసిల్లుతాను.

**తాత్పర్యం:** ద్రౌపదీ! నీవ్యక్తిత్వం అసాధారణ మైనది. నీవు ఏ విధంగా నీ భర్తల అనురాగాన్ని చూరకొనగలిగావో ఆ కిటుకును, ఆ లోగుట్టును నాకు నిజంగా తెలిపితే నేను కూడా ఆ విధంగానే నా భర్త అయిన శ్రీకృష్ణుడి ప్రేముడిని చూరగొంటాను.'

**క. అని యడిగిన మది నించుక । గినుక వొడమ నడఁచుకొనుచుఁ గృష్ణ మృదులహా**
**సిని యగుచుఁ గృష్ణభామినిఁ । గనుఁగొని యి ట్లనియె నిర్వికారాకృతియై. 293**

**ప్రతిపదార్థం:** అని, అడిగినన్= అని ప్రశ్నించగా; మదిన్= మనస్సులో; ఇంచుక, కినుక+పొడమన్= కొంచెం కోపం ఏర్పడగా; అడఁచు కొనుచున్= అణచివేసికొంటూ; కృష్ణ= ద్రౌపది; మృదుల, హాసిని+అగుచున్= చిరునవ్వుతో కూడింది ఔతూ; కృష్ణ భామినిన్+కనుఁగొని= శ్రీకృష్ణుడి భార్యను (సత్యభామను) పరికించి; నిర్వికార+ఆకృతి+ఐ= ఏవిధమగు మానసిక భారం పైకి కనిపించనీయని ఆకారం కలదియై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** సత్యభామ ఆ విధమైన ప్రశ్నలు వేయటంచేత ద్రౌపదికి తన మనస్సులో కొంచెం కోపం వచ్చింది. తాను భర్తలప్రేమ చూరగొనటానికి మంత్రాలు, మందులు, మాకులు, అలంకరణంలో నేర్పరితనం-ఇట్టివానిని హేతువులుగా పేర్కొనటం సత్యభామకు ఉచితమగు ప్రవర్తనకాదు కదా! అందుచేత ద్రౌపదికి కోపం వచ్చింది. అయినను, ద్రౌపది తన కోపాన్ని అణచుకొన్నది. (కోపాన్ని అణచుకొనటం ఉత్తమలక్షణం). తదుపరి శ్రీకృష్ణుడి భార్యఐన సత్యభామతో ద్రౌపది ఈ విధంగా పలికింది.

**క. 'నను నిట్లు దుష్టవనితా । జనమునటులుగాఁ దలంపఁ జనునే నీకున్?**
**మన సొప్పదు పురుషోత్తము । వనితవుగాఁ దగవు నీవు వనరుహనయనా!' 294**

**ప్రతిపదార్థం:** వనరుహ, నయనా!= పద్మాల వంటి కన్నులు కలదానా!; (ఓ సత్యభామా!); ననున్= నన్ను (ద్రౌపది నైన నన్ను); ఇట్లు= ఈ విధంగా; దుష్ట, వనితా జనము+అటులుగాన్= చెడ్డ స్త్రీల మాదిరిగా; నీకున్= నీకు; తలంపన్+చనునే= భావించవచ్చునా; మనసు+ఒప్పదు= (నీవు ఇట్టి మాటలు పల్కుతావని) మనస్సు అంగీకరించదు; నీవు= నీవు; పురుష+ఉత్తము, వనితవు+కాన్+తగవు= మగవారలలో శ్రేష్ఠుడు అయిన శ్రీకృష్ణుడికి ఇల్లాలివి కాదగినదానవు కావు.

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులు కలదానా! సత్యభామా! నీవు ఎంతటి అందకత్తెవైనను, నన్ను తక్కువస్థాయిలోని ఆడువారితో జమకట్టి ఇటువంటి మాటలు మాటలాడవచ్చునా? అసలు నీవు ఇటువంటి మాటలు పలుకుతావనే విషయాన్ని నా మనస్సు అంగీకరించటం లేదు. పురుషోత్తముడైన శ్రీకృష్ణుడికి భార్యగా ఉండదగిన యోగ్యత నీకు

లేదు సుమా' అని మెత్తమెత్తగా చీవాట్లు పెట్టింది ద్రౌపది - సత్యభామతో సరససల్లాపాలు చేస్తున్న మాదిరిగా పైకి కనపడుతూనే.

**విశేషం:** ఈ కందపద్యంలో ఎఱ్ఱనపై తిక్కన కవితాశిల్పప్రభావం కనపడుతున్నది. పురుషోత్తమ శబ్దం సార్థకం.

**వ. అని మేలంపుఁ జందంబున దాని వివేకవిహీనత యెఱుక పడ నాడి, పాంచాలి మఱియు ని ట్లనియె.295**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; మేలంపున్+చందంబునన్= సరసపు పలుకులు పలికినట్లుగా; దాని= (సత్యభామయొక్క); వివేక, విహీనత= వివేకం లేకపోవటాన్ని (విచక్షణజ్ఞానం లోపించటాన్ని); ఎఱుక+పడన్= తేటతెల్లం అయ్యేటట్లుగా; ఆడి= పలికి; పాంచాలి= ద్రౌపది; మఱియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** ద్రౌపది ఆ విధంగా హాస్యగర్భితమైన మాటలలో సత్యభామకు ఆమె తెలివితక్కువతనాన్ని తేటతెల్లం చేసి ఇంకను ఈ రీతిగా పలికింది.

**చ. 'అలయక మంత్ర తంత్ర వివిధౌషధ భంగులఁ జేసి యెంతయున్**
**వలతురు నాథు లంట మగువా! కడుబేలతనంబు; దాన మున్**
**గలిగిన ప్రేమయుం బొలియుఁ గాని యొకండును సిద్ధిఁబొంద; ద**
**ప్పొలఁతుక తోడి మన్కి యహిపొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్. 296**

**ప్రతిపదార్థం:** మగువా!= వనితా! (= ఓ సత్యభామా!); అలయక= డస్సిపోక - అనగా పూనికతో; మంత్ర, తంత్ర, వివిధ+ఔషధ, భంగులన్+చేసి= దివ్యాక్షరాలను జపించటం, వశీకరణ ప్రక్రియలను చేయటం, పెక్కు మందులను వాడటం మున్నగు పద్ధతులవలన; ఎంతయున్= ఎక్కువగా; నాథులు= భర్తలు; వలతురు= అనురాగం చూపుతారు; అంట= అనటం, అనుకోవటం; కడు= మిక్కిలి; బేలతనంబు= తెలివితక్కువతనం; దానన్= దాని వలన; మున్= అంతకుముందు; కలిగిన= ఏర్పడిన; ప్రేమయున్= అనురాగంకూడా; పొలియున్+కాని= నశిస్తుందేకాని; ఒకండును= ఒక్కటియున్నూ; సిద్ధిన్+పొందదు= ఫలించదు; ఆ+పొలఁతుకతోడి మన్కి= ఆ వనితతో కలిసి ఉండటం; విభుండు= మగడు; ఎఱింగినన్= తెలిసికొంటే మాత్రం (మందులు, మంత్ర, తంత్రాల ప్రయోగం చేస్తున్నట్లు పసికట్టితే); అహి, పొత్తుగన్= పాముతో చెలిమి చేస్తున్న మాదిరిగనే; చూచున్= చూస్తాడు.

**తాత్పర్యం:** 'ఓ సత్యభామా! మంత్రతంత్రాలతో మందులుమాకులతో భర్త వశుడౌతాడని అనుకొనటం తెలివి తక్కువతనం మాత్రమే. దానివలన, భార్యపై భర్తకు అంతకుముందు ఏర్పడిన అనురాగం కూడ నశిస్తుంది. ఎట్టి లాభం కలుగదు. అట్టి భార్యతో కాపురం చేయటం, పాముతో చెలిమి చేయటం వంటిదే అని భర్త భావిస్తాడు.

**చ. మగువ యొనర్చు వశ్యవిధి మందులు మాఁకులు నొండుచందమై**
**మగనికిఁ దెచ్చు రోగములు, మానక మూకజడాదిభావముల్**
**మొగి నొనరించు, నద్దురితముల్ దన చేసిన చేఁత లై తుదిన్**
**జగమున కెక్కి నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్. 297**

**ప్రతిపదార్థం:** మగువ= ఆడుది; ఒనర్చు= చేసే; వశ్యవిధి= (భర్తను) లోబరచుకొనటానికై చేసే ప్రక్రియ; మందులు, మాఁకులు= ఔషధాలు, ఔషధాలను పోలినవి; ఒండు చందము+ఐ= వేరు విధంగా ప్రవర్తిల్లి; మగనికిన్= భర్తకు; రోగములు=

జబ్బులు; మానక= తగ్గక; మూక, జడ+ఆది, భావముల్= మూగతనం, మొద్దుబారటం, మున్నగు స్థితిగతులు; తెచ్చున్= సంక్రమింపజేస్తాయి; మొగిన్= పూనికతో వరుసగా; ఒనరించు= చేసెడి; ఆ+దురితముల్= ఆ పాపాలు; తన చేసిన చేతలు+ఐ= తాను స్వయంగా చేసిన పనులై (స్వయంకృతమైన అపరాధాలై); తుదిన్= చివరకు; జగమునకున్+ఎక్కి= లోకానికి అంతటికీ తెలిసి; ఇంతికిన్= ఆడుదానికి (భార్యకు); నిందయును= అపవాదాన్నీ; సత్+గతి, హానియున్= ఉత్తమ గతులకు కీడు కలుగటయున్నూ; వచ్చున్= ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** భర్త తనకు లోబడి ఉండాలనే ఆరాటం చొప్పున భార్య వశీకరణ తంత్రాలు, మందులు, మాకులు ప్రయోగిస్తే, అవి బెడిసికొట్టి అనుకొనని విధంగా భర్తకు మూగతనం, మనస్సు, శరీరం మొద్దుబారటం మున్నగు జబ్బులు కొని తెచ్చి పెట్టుతాయి. ఆమెకు లోకంలో అపకీర్తి వస్తుంది. అది అంతయు ఆమె స్వయంకృతాపరాధమే కాబట్టి, ఆమెకు ప్రాప్తించేది తుదకు నరకయాతన మాత్రమే.

**క. కావునఁ బతులకు నెప్పుడుఁ । గావింపం దగదు కపటకర్మంబులు; ద**
**ద్భావ మెఱిఁగి యనువర్తిని । యై వనిత చరింప, నదియ యగు నెల్లవియున్. 298**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; పతులకున్= భర్తలకు; ఎప్పుడున్= ఏ సమయంలో కూడా; కపట కర్మంబులు= మోసపు పనులు; కావింపన్+తగదు= చేయరాదు; తద్+భావమున్+ఎఱింగి= ఆ (భర్త యొక్క) అభిప్రాయాన్ని తెలిసికొని; అనువర్తిని+ఐ= అనుకూలమైన ప్రవర్తన కలదై; వనిత= మగువ (భార్య); చరింపన్= ప్రవర్తించటం చేత; అది+అ= అదియే; ఎల్లవియున్= సమస్తమును (భర్తను ఆకర్షించే ఉత్తమ పద్ధతులన్నీ); అగున్= ఔతుంది.

**తాత్పర్యం:** కాబట్టి భార్యలు ఎప్పుడును భర్తలయెడ మోసపు పనులు చేయరాదు. భర్త అభిప్రాయాలు తెలిసికొని, వాటికి అనుకూలంగా భార్య ప్రవర్తించాలి. అట్టి అనుకూల దాంపత్యమే సకల రీతుల భర్తను ఆకట్టుకొనే ఉత్తమ విధానమని గ్రహించాలి.

**వ. పాండవులయెడ నే నెట్టిదాన నై యిట్టిసౌభాగ్యంబు నందితి; నది నీకు నెఱింగించెద నేర్పడ వినుము. 299**

**ప్రతిపదార్థం:** పాండవుల+ఎడన్= పాండురాజు కొడుకుల పట్ల (నా భర్తల యెడ); నేను= నేను; ఎట్టి దానను+ఐ= ఎటువంటి దానినై; ఇట్టి= ఈ విధమైన (నీవు గుర్తించినట్టి); సౌభాగ్యంబున్= భర్తృ ప్రేమ అనెడి సంపదను; అందితిన్= పొందానో; అది= (ఆ సంగతి); నీకున్= నీకు; ఎఱింగించెదన్= తెలియపరుస్తాను; ఏర్పడన్+వినుము= సావధానంగా ఆకర్ణింపుము.

**తాత్పర్యం:** పాండవుల పట్ల నేనెటువంటి దానినై వ్యవహరించి, ఇట్లాంటి పతివాల్లభ్యాన్ని (పతుల అనురాగాన్ని) పొందగలిగానో, దాన్ని నీకు తెలియపరుస్తాను. విశదంగా వినుము.

**సీ. పతు లాత్మ నొండొక్క పడఁతులఁ । గలసిన నలుగ, నెయ్యెడల నహంకరింప;**
**మదముఁ బ్రమాదంబు మాని వారికిఁ జిత్త । మేకముఖంబుగ నెల్లప్రొద్దు**
**భక్తి సేయుదుఁ; జూపుఁ బలుకును గోర్కియుఁ । జెయ్వులు వింతగాఁ జేయ నెపుడు;**
**నమర గంధర్వ యక్షాదులం దైనను । బురుషు నన్యునిఁ దృణంబుగఁ దలంతు;**

**తే. స్నాన భోజన శయనాది సంప్రయోగ । మర్థిఁ బతులకు మున్నెందు నాచరింపఁ;**
**బతులు వచ్చిన నాసన పాద్య విధుల । భక్తితో నేన కావింతుఁ బనుప నొరుల. 300**

**ప్రతిపదార్థం:** పతులు= భర్తలు; ఆత్మన్= మనస్సుతో; ఒండు+ఒక్క, పడఁతులన్= వేరొక స్త్రీలను; కలసినన్= కూడినప్పటికీ; అలుగన్= కోపగించుకోను; ఏ+ఎడలన్= ఏ సందర్భాలలోను; అహంకరింపన్= అహంకారాన్ని ప్రదర్శించను; మదమున్= గర్వాన్ని; ప్రమాదంబున్= పొరపాటును; మాని= ఉజ్జగించి; వారికిన్= భర్తలకు; చిత్తము+ఏక, ముఖంబుగన్= మనస్సును ఏకాగ్రంగా నిలిపి; ఎల్లప్రొద్దున్= ఎల్లవేళల; భక్తి+చేయుదున్= ఆరాధిస్తాను; చూపున్= వీక్షణం; పలుకును= మాటయును; కోర్కియున్= వాంఛయు; చెయ్వులు= చేష్టలు; వింతగాన్= అసాధారణంగా అచ్చెరువు గొలిపేటట్లుగా; ఎప్పుడున్= ఎపుడును; చేయను= ఒనరించను; అమర, గంధర్వ, యక్ష, ఆదులందున్+ఐనను= దేవతలు, గంధర్వులు, యక్షులు మున్నగు దివ్యజాతులకు చెందినవారయినను; పురుషున్= మగవాడిని; అన్యునిన్= ఇతరుడిని; తృణంబుగన్= గడ్డిపోచగా; తలంతున్= ఎంచుతాను; స్నాన, భోజన, శయన+ఆది, సంప్రయోగము= జలకమాడటం, ఆహారం తినటం, పడుకోవటం మున్నగు పనులలో కూడా; అర్థిన్= పూనికతో (మనసార కోరికతో); పతులకున్= భర్తలకు; మున్ను= ముందుగా; ఎందున్= ఎచటను; ఆచరింపన్= చేయను; పతులు= భర్తలు; వచ్చినన్= వస్తే; ఆసన, పాద్యవిధులన్= కూర్చుండటానికై పీట వేయటం, కాళ్ళుకడుగు కొనటానికి నీళ్ళుఇవ్వటం మున్నగు పనులు; భక్తితోన్= పూజ్యభావంతో; కావింతున్= చేస్తాను; ఒరులన్= ఇతరులను; పనుపన్= నియమించను.

**తాత్పర్యం:** భర్తలు అన్యకాంతలయెడ అనురక్తులయి వారిని కూడినప్పటికీ నేను కోపం చెందను; ఎప్పుడును స్వాతిశయం చూపక, ఎల్లప్పుడును భర్తలయెడ వినయంతో పూజ్యభావంతో వారికి పరిచర్య చేస్తాను. వింత పనులను చేయను. వింతమాటలు పలుకను. పరపురుషులు దేవతలైనా సరే, యక్షులైనా సరే, పరపురుషులైన వారిని గడ్డిపోచతో సమంగా చూస్తాను. స్నానం, భోజనం, శయనం మున్నగు సౌకర్యాలను భర్తలకు ముందుగా ఏర్పరచి, తదుపరి నేను అనుభవిస్తాను. భర్తలు ఇంటికి విచ్చేసినపుడు, వారికి కాళ్లు కడుగుకొనటానికి నీరు, కూర్చొనటానికి ఆసనాలు నేనే స్వయంగా ఏర్పాటుచేస్తాను కాని, ఆ పనులు చేయటానికై సేవకులను నియోగించను.

**చ. తగియెడు వేళలందు నియతంబుగ మజ్జన భోజన క్రియల్**
**దగ నొడఁగూర్తు భర్తలకు; ధాన్యధనంబులు రిత్తమై వ్యయం**
**బగుటకు నోర్వ నెప్పుడు, గృహస్థలభాండ విశోధనంబు లి**
**మ్ముగ నొకనాఁడు నేమఱఁ, బ్రమోదము సల్పుదు బంధుకోటికిన్. 301**

**ప్రతిపదార్థం:** భర్తలకున్= పతులకు; తగియెడు వేళలందున్= ఆయా సమయాలలో; మజ్జన భోజన, క్రియల్= స్నానం ఆహారం పెట్టటం అనెడి పనులు; నియతంబుగన్= ముందుగా నిర్ణయించబడిన పద్ధతి మీరకుండగా; తగన్= ఒప్పిదంగా, ఆయా పనులకు అనువైన రీతిగా; ఒడఁగూర్తున్= ఏర్పాటు చేస్తాను; ధాన్య, ధనంబులు= ధాన్యాలు ద్రవ్యాలు; రిత్తమైన్= అనవసరంగా, వ్యర్థంగా; వ్యయంబు+అగుటకున్= ఖర్చు కావటానికి; ఓర్వన్= సమ్మతించను; ఎప్పుడున్= అన్ని సమయాలలో; గృహ, స్థల, భాండ, విశోధనంబులు= ఇల్లు వాకిళులు చిమ్మటం, పాత్రలు తోమికడగటం; ఇమ్ముగన్= చక్కగా; ఒకనాఁ డున్= ఒక రోజు కూడ; ఏమఱన్= మరచి వదలిపెట్టను; బంధు కోటికిన్= చుట్టాల సముదాయాలకు; ప్రమోదము= సంతోషం; సల్పుదున్= కలిగిస్తాను.

**తాత్పర్యం:** నా పతులకు ఆయా సమయాలలో నిర్ణీతపద్ధతి తప్పకుండా స్నానం, ఆహారం మున్నగు సదుపాయాలను సమకూరుస్తాను. ధాన్యం కాని ధనం కాని వ్యర్థం కానీయను, అనవసరంగా వెచ్చింపను; ఇల్లు వాకిళులు పాత్రలు ఎప్పుడు పరిశుభ్రంగా ఉండేటట్లుగా, మరపు ఏమరుపాటు లేకుండా సదా కాచుకొని చూచుకొంటాను. చుట్టాలందరికి సదా సంతోషం కలిగిస్తాను.

**క. పలుమాఱుం దలవాకిట । మెలఁగుట, యసతీజనైకమిత్రత, కలహం**
**బుల కెలయుట, నగుపలుకులఁ । బెలుచ నగుట నాకుఁ గానిపేరివి మగువా! 302**

**ప్రతిపదార్థం:** మగువా!= వనితా, ఓ సత్యభామా!; పలుమాఱున్= ఎక్కువ సారులుగా; తల వాకిటన్= ఇంటి ముంగిట; మెలఁగుట= తిరుగుతుండటం; అసతీ జన+ఏక, మిత్రత= సతులుకాని ఆడువారలతో ఎక్కువగా స్నేహం చేయటం; కలహంబులకున్+ ఎలయుట= విరోధాలకు పాల్పడటం; నగు పలుకులన్= హాస్యపు మాటలతో; పెలుచన్+నగుట= ఎక్కువగా నవ్వటం, నాకున్=నాకు, కానిపేరివి= నాకు సంబంధించినట్టివి కావు.

**తాత్పర్యం:** పలుమారులు ఇంటిగుమ్మందగ్గర, ముంగిలిట్లో తిరుగుతూ ఉండటం, చెడ్డ ఆడువారితో ముఖ్యంగా స్నేహం చేయటం, వాదులాడటం, హాస్యపు మాటలతో మితిమీరి నవ్వటం మున్నగునవి నాకు ఇష్టం కలిగించేవి కావు. అట్టి పనుల జోలికి నేను ఎన్నడూ పోను.

**క. పతు లిచ్ఛమెయిఁ బ్రవాస । స్థితులైనం బుష్పగంధ దీప్తాభరణ**
**ప్రతతి ధరియింపఁ దద్గత । మతి నగుచుఁ దదాగమంబ మదిఁ గాంక్షింతున్. 303**

**ప్రతిపదార్థం:** పతులు= భర్తలు; ఇచ్ఛమెయిన్= తమతమ అభీష్టానుసారంగా; ప్రవాస స్థితులు+ఐనన్= గ్రామాంతరాలకు వెళ్లి ఉన్నట్లయితే; పుష్ప, గంధ, దీప్త+ఆభరణ, ప్రతతిన్= పూవులు, పరిమళ ద్రవ్యాలు, ప్రకాశించే అలంకారాల సముదాయాన్ని; ధరియింపన్= తాల్చను; తద్+గత, మతిన్+అగుచున్= వారియందే (ఆ భర్తల యందే) నిలుపబడిన మనస్సు కల దానను ఔతూ; తద్+ఆగమంబు+అ= వారి (ఆ భర్తల యొక్క) రాకను మాత్రమే; మదిన్= మనస్సులో; కాంక్షింతున్= కోరుకొంటూ ఉంటాను.

**తాత్పర్యం:** భర్తలు వారి వారి కోరిక మేరకు వేరుచోటులకు వెళ్లితే, నేను పువ్వులు ముడువను. పరిమళపు మై పూతలు పూసికొనను. మిరుమిట్లు గొలుపుతూ వెలుగొందే ఆభరణాలను ధరించను. భర్తలపట్లనే మనస్సు లగ్నం చేసికొని వారు ఎప్పుడు తిరిగి ఇంటికి చేరుతారా అని యెదురుతెన్నులు చూస్తూ వారి రాకకై నిరీక్షిస్తుంటాను.

**ఉ. అత్తకు భక్తి గల్గి మది నాయమ సెప్పిన మాడ్కి జీవికా**
**వృత్తము లావహింతు; గురువిప్రజనాతిథి పూజనంబు ల**
**త్యుత్తమభక్తి నేన తగ నోపి యొనర్తుఁ; బ్రియంబుఁ దాల్మియున్**
**మెత్తఁదనంబు సన్మతియు మేలుగఁ దాల్తు సమస్తభంగులన్. 304**

**ప్రతిపదార్థం:** అత్తకున్= భర్తయొక్క తల్లియెడ; భక్తి= పూజ్యభావం; కల్గి= ఉండి; మదిన్= మనస్సులో; ఆయమ= ఆమె (అత్తగారు); చెప్పిన మాడ్కిన్= సెలవిచ్చిన రీతిగా; జీవికావృత్తములు= నిత్య జీవితానికి సంబంధించిన ఆచరణలు; ఆవహింతున్= నెరవేరుస్తాను; గురు, విప్ర, జన+అతిథి, పూజనంబులు= గురుజనులు, విప్రజనులు, అతిథిజనులయొక్క సపర్యలు; అతి+ఉత్తమ, భక్తిన్= మిక్కిలి ఎక్కువైన పూజ్యభావంతో; ఏను+అ= నేనే స్వయంగా; తగన్=చక్కగా; ఓపి= సహించి; ఒనర్తున్= చేస్తాను; సమస్త భంగులన్= అన్ని పద్ధతులలో ఎల్లప్పుడును ఎల్ల రీతులలో; ప్రియంబున్= సంప్రీతిని; తాల్మియున్= ఓర్పును; మెత్తఁదనంబున్= మృదుత్వాన్ని; సత్+మతియున్= మంచితనాన్ని; మేలుగన్= శుభంగా; తాల్తున్= ధరిస్తాను.

**తాత్పర్యం:** అత్తగారియెడ పూజ్యభావం కలిగి, ఆమె చెప్పిన రీతిగనే నా దినచర్యను తీర్చిదిద్దుకొంటాను. పెద్దలు బ్రాహ్మణులు అతిథులు విచ్చేసినపుడు, వారి సేవకు అనుచరులను నియోగించక, పూజ్యభావంతో వారికి సపర్యలు నేను చేస్తాను; సంప్రీతి, క్షమ, వినయం, మంచితనం అనే శుభగుణాలను ఎల్లప్పుడును విడనాడక సదా ప్రవర్తిస్తాను.

**విశేషం:** పెద్దలకు చేయవలసిన సేవలు చేయటంలో గమనించవలసిన ముఖ్యాంశాలు (1) సేవకులకు ఆ పనులు ఒప్పగించక తానే చేయటం (2) ఆ సేవ హృదయపూర్వకంగా భక్తిభావంతో చేయటం.

**క. కడు మృదువు లనుచుఁ దేఁకువ। సెడి యెపుడుఁ జరింప భరతసింహులు గోపం**
**బడరిన నాశీవిషముల। వడువునఁ గ్రూరు లని వెఱపు వదలక కొల్తున్. 305**

**ప్రతిపదార్థం:** భరత, సింహులు= భరతుడి వంశంలో పుట్టినవారిలో శ్రేష్ఠులు (సింహాలవంటివారు) అయిన పాండవులు; కడు, మృదువులు+అనుచున్= చాల మెత్తని (స్వభావంకల) వారని అనుకొంటూ; ఎపుడున్= ఏ సమయంలో కూడా; తేఁకువ+చెడి= భయంలేకుండా; చరింపన్= ప్రవర్తించను; కోపంబు+అడరినన్= కోపం కలిగితే (వస్తే); ఆశీవిషముల, వడువునన్= పాముల వలె; క్రూరులు+అని= కఠినమైనవారని, నొప్పించేవారని, భయంకరులని; వెఱపు= భయం; వదలక= వీడకుండా (భయంతో అని భావం); కొల్తున్= సేవిస్తాను.

**తాత్పర్యం:** భరతవంశంవారిలో శ్రేష్ఠులైన పాండవులు ఎంత మెత్తటివారో అంత కఠినులు. వారు మనసుమెత్తనివారని తెలిసినా ఎప్పుడూ వారిపట్ల భయం లేకుండా నిర్లక్ష్యంగా ప్రవర్తించను. వారికే కోపంవస్తే పాముల్లాగా భయంకరులు, మనసు గట్టిపడి బాధిస్తారుకూడా. అందువలన వారికి ఎప్పుడూ భయంతోనే సేవలు చేస్తుంటాను.

**సీ. మాయత్తఁ బృథ్వీసమానఁ బృథాదేవిఁ। గుంతిభోజాత్మజఁ గోమలాంగి**
**సతతంబు భోజనస్నానాదికములయం। దిమ్ముగఁ బరిచర్య యేన చేసి**
**సంప్రీతఁ జేయుదు; జనవంద్యుఁ డగు ధర్మ। తనయునిబంతి నిత్యంబుఁ బసిఁడి**
**పళ్ళెరంబులఁ గుడ్చు బ్రాహ్మణు లతిపుణ్యు। లెనిమిదివేలు సమిద్ధమతులు**

**తే. యతులు పదివేలు; వారల కనుదినంబు। నన్నపానంబు లర్థసహాయ నగుచు**
**నొడికముగ నేన కావింతు నుచిత వస్త్ర। భూషణాదులఁ బరితోషముగ నొనర్తు. 306**

**ప్రతిపదార్థం:** పృథాదేవిన్= పృథ అనే పేరు కల దేవిని; పృథ్వీ, సమానన్= భూదేవితో సమానమైన (అనగా మిక్కిలి ఓర్పు గల) దానిని; కుంతిభోజ+ఆత్మజన్= కుంతిభోజుడు అనే రాజుగారి కూతురును; కోమల+అంగిన్= మెత్తని శరీరం కలదానిని; మా+అత్తన్= మా అత్తగారిని; సతతంబు= ఎల్లప్పుడును; భోజన, స్నాన+ఆదికములఅందున్= ఆహారం, స్నానం మున్నగు క్రియల అందు; ఇమ్ముగన్= ప్రీతితో; పరిచర్య= సేవ; ఏను+అ= నేనే; చేసి= ఒనరించి; సంప్రీతన్+చేయుదున్= మిక్కిలి సంతృప్తి చెందినట్టి దానినిగా చేస్తాను; జనవంద్యుఁడు= జనులచేత నమస్కరించ దగినవా డయిన; ధర్మతనయుని, బంతిన్= ధర్మరాజుయొక్క వరుసలో (సహపంక్తిని); నిత్యంబున్= ప్రతి దినమున్నూ; పసిఁడి, పళ్ళెరములన్= బంగారు కంచాలలో; కుడ్చు= తినునట్టి; బ్రాహ్మణులు= విప్రులు; అతి పుణ్యులు= మిక్కిలి సుకృతాలు ఒనరించినట్టివారు; ఎనిమిది, వేలు= ఎనిమిదివేల మంది; సమ్+ఇద్ధ మతులు= గొప్ప వెలుగొందే బుద్ధికలవారు; యతులు= సన్న్యాసులు; పదివేలు= పదివేలమంది; వారలకున్= వారికి; అను దినంబున్= ప్రతిరోజున్నూ; అన్నపానంబులు= తిండియును త్రాగు నీరును; అర్థ సహాయన్+అగుచున్= తగినట్లుగా సాయం చేసే దానను ఔతూ; ఒడికముగన్= తెలివితేటలు చూపుతూ ఒప్పిదంగా;

ఏను+అ= నేనే; కావింతున్= చేస్తాను; ఉచిత, వస్త్ర, భూషణ+ఆదులన్+తగినట్టి బట్టలు ఆభరణాలు మున్నగు వాటిని; పరితోషముగన్= సంతోషంగా; ఒనర్తున్= చేస్తాను.

**తాత్పర్యం:** మా అత్తగారు కుంతీదేవి కుంతిభోజుడు అనే మహారాజుగారికూతురు. ఓర్పులో భూదేవితో పోల్చదగింది. సుకుమారి. ఆమెకు స్నానం, ఆహారం మున్నగు సదుపాయాలను స్వయంగా నేనే సమకూరుస్తుంటాను. ప్రజలచేత ఆరాధించబడే ధర్మరాజు ప్రతిదినం భోజనసమయాన తన సహపంక్తిని ఎనిమిదివేలమంది బ్రాహ్మణులకు బంగారుకంచాలలో అన్నసంతర్పణ చేస్తాడు. అట్లే సన్న్యాసులు పదివేల మందికి భోజనం పెడతాడు. వారికి అందరికి నేనే స్వయంగా వడ్డన వార్పులు సరిచూచి, వారికి తగిన బట్టలు, ఆభరణాలు సమకూరుస్తుంటాను. అందరికీ సంతోషం సమకూర్చటం నా కర్తవ్యంగా పరిగణిస్తాను.

**వ. మఱియు ధర్మరాజునగరియందుఁ గనకమణిమయ భూషణాలంకృతు లయిన పరిచారకులు నూఱువేలు రేయును బగలును బాత్రహస్తులై యభ్యాగత భోజనంబు లొడఁగూర్చువారు నందఱ గలరు; వీ రెల్ల నిట్టిట్టిమెలఁకువ మెలంగుదు రని తత్కృతాకృతంబు లేన యెఱుంగుదు; నిరంతర మదధారా తరంగిత కపోలంబు లయిన భద్రగజశతసహస్రంబులుఁ బ్రభూతజవసత్త్వసన్నుతంబు లయిన యుత్తమాశ్వ శతసహస్రంబులుం గలవు; వానికి నన్నింటికి నిత్యోచితంబు లయిన ఖాద్యంబు లొనరింపను బాలింపను దగినవారి నేన నియమింతు; నఖండభాండాగారపూరితంబు లయిన యగణ్యమణి కనకాదివస్తువులను బ్రతిదినవిహితంబు లయిన యాయ వ్యయంబులు నా యెఱుంగని యవియు లేవు; గోపాల జనంబులు దుదిగాఁ గల సకల భృత్య జనంబుల జీవితంబుల నరసి యేన నడపుదుం; బరమయశోధను లగు పాండునందనులు నిజకుటుంబభారంబు సర్వంబు నాయంద సమర్పించి తారు నిర్భరులై యిష్టవిహారంబుల నుండుదు; రే నెల్ల వెంటల నప్రమత్త నై వర్తింతు. 307**

**ప్రతిపదార్థం:** ॥మఱియున్= ఇంకను; ధర్మరాజు నగరియందున్= ధర్మరాజు యొక్క అంతఃపురంలో; కనక, మణిమయ, భూషణ+అలంకృతులు+అయిన= బంగారంతో, రత్నాలతో కూడిన నగలచేత అలంకరించబడిన వారయిన; పరిచారకులు= సేవకులు; నూఱువేలు= లక్షమంది; రేయును= రాత్రియును; పగలును= పగలును; పాత్రహస్తులు+ఐ= పాత్రలను పూనిన చేతులు కలవారై; అభ్యాగత, భోజనంబులు= పిలువక పోయినా వచ్చిన అతిథులకు ఆహారాలు; ఒడగూర్చువారు= సమకూర్చే వారు; అందఱు+అ+కలరు= (సేవకులు) అంతమందే ఉన్నారు; వీరు+ఎల్లన్= వీరందరును; ఇట్టి+ఇట్టి= ఇటువంటి ఇటువంటి; మెలఁకువన్= తెలివి తేటలతో కూడిన దీక్షతో; మెలంగుదురు= ప్రవర్తిస్తారు; అని= అని; తద్+కృత+అకృతంబులు= వారిచేత చేయబడినవి చేయబడనివి; ఏను+అ= నేనే; ఎఱుంగుదున్= తెలిసికొంటాను; నిరంతర, మద, ధారా, తరంగిత, కపోలంబులు+అయిన= ఎల్లప్పుడు కారుతున్న మదజలాల ధారల అలలచేత ఆవరించబడిన చెక్కిళ్లు కలవి అయిన; భద్ర, గజ, శత సహస్రంబులున్= పట్టపుటేన్గులు లక్షలును; ప్రభూత, జవ, సత్త్వ, సన్నుతంబులు+అయిన= అతిశయించిన వేగంతో శక్తితో పొగడబడినట్టివి అయిన; ఉత్తమ+అశ్వ, శత సహస్రంబులున్= మంచి గుర్రాలు లక్షలు; కలవు= ఉన్నవి; వానికిన్+అన్నింటికిన్= ఆ ఏనుగులు గుర్రాలు అన్నిటికిని; నిత్య+ఉచితంబులు+అయిన= ప్రతి దినానికి తగినట్టివి అయిన; ఖాద్యంబులు= ఆహారాలు; ఒనరింపను= ఏర్పాటు చేయుటకున్నూ; పాలింపను= సరిచూచుటకున్నూ; తగిన వారిన్= సమర్థులను; ఏను+ అ= నేనే; నియమింతున్= ఏర్పాటు చేస్తాను; అఖండ, భాండ+ఆగార, పూరితంబులు+అయిన= పూర్తిగా భాండాగారములలో నింపబడిన; అగణ్య, మణి, కనక+ఆది, వస్తువులను= లెక్కకు మించిన రత్నాలు బంగారాలు మొదలగు పదార్థాలను; ప్రతి, దిన, విహితంబులు= ప్రతిరోజూ ఏర్పాటుగా జరిగేవి; అయిన= అయినట్టి; ఆయ, వ్యయంబులును= రాబడి ఖర్చులున్నూ; నా+ఎఱుంగనివి= నాకు తెలియనివి; లేవు= ఉండవు; గోపాల జనంబులు=

గొల్లవారు; తుదిగాన్= చివరి వారుగా; కల= ఉన్న; సకల, భృత్య, జనంబుల జీవితంబులన్= అందరు సేవకుల సముదాయం యొక్క జీతభత్యాలను; అరసి= పరిశీలించి చూచి; ఏను+అ= నేనే; నడపుదున్= ప్రవర్తింప చేస్తాను; పరమ, యశస్+ధనులు+ అగు= గొప్ప కీర్తినే సంపదగా కల; పాండు నందనులు= పాండవులు; నిజ, కుటుంబ భారంబున్= తమదైన సంసారపు బరువు నంతటిని; నాయందున్+అ= నామీదనే; సమర్పించి= ఉంచి; తారు= తాము; నిర్భరులు+ఐ= బరువు లేనివారై; ఇష్ట, విహారంబులన్= తమకు నచ్చిన నడవడికలతో; ఉండుదురు= ప్రవర్తిల్లుతారు; ఏను= నేను; ఎల్ల వెంటన్= అన్ని ఎడలను; అప్రమత్తను+ఐ= అజాగ్రత్త లేని దాననై; వర్తింతున్= మెలగుతాను.

**తాత్పర్యం:** ఇంకను చెప్పుతాను. సావధానంగా వినుము. ధర్మరాజు దినచర్య విశిష్టవైభవోపేత మైనది. ఆయన అంతఃపురంలో నూరువేలమంది సేవకులు పవలు రాత్రి అనక సేవ చేస్తూంటారు. ఆ సేవకులు రత్నాలతో పొదుగబడిన బంగారు ఆభరణాలు ధరించేవారు. వారు చేతులలో ఎల్లప్పుడు పాత్రలను పూని అతిథులకు అభ్యాగతులకు ఆహారపానీయాలు సమకూరుస్తుంటారు. వారందరు ఎట్టి జాగరూకతతో ఉన్నారో ఏ ఉపచారాలు చేస్తున్నారో ఏ అపచారాలు చేస్తున్నారో అని నేను ఎల్లప్పుడూ కనిపెట్టుతుంటాను. ఎల్లప్పుడు మదజలం స్రవించే పట్టపుటేనుగులు లక్షలు; గొప్ప బలం వేగం కల గుర్రాలు లక్షలు ఉన్నవి. వాటికి అన్నింటికి సరిఅయిన ఆహారాన్ని సమకూర్చటానికి, వాటిని అదుపులో పెట్టి క్రమశిక్షణలో నిర్వహించటానికి తగినవారిని నేనే నియమిస్తుంటాను. బొక్కసంలో ఉండే రత్నరాసులు బంగారు వస్తువులు నిత్యం జరిగే ఆదాయ వ్యయాలు అన్నీ నాకు తెలియును. నాకు తెలియని అంశం ఒక్కటి కూడా లేదు. సేవకులలో చివరిశ్రేణికి చెందిన గొల్లవారలకు, తదితరులకు ఇచ్చే జీతభత్యాలు నేనే సరిచూస్తుంటాను. సుగృహీత నామధేయు లైన పాండవులు తమ సంసారపు బరువును నామీద మోపి, హాయిగా తమకు ఇష్టమైనతావులలో విహరిస్తుంటారు. కుటుంబాన్ని అంతటిని ఈదే దానిని నేనే. అన్నివిషయాలను నేనే చూచుకొంటాను. అన్నివైపులా జాగరూకత వహిస్తాను.

**ఆ. వేగ జాము గలుగ వెడనిద్రఁ బొందుదుఁ। గాని రాజ్యభారకార్యయుక్తి**
**నబ్జనయన! నాకు నాహార నిద్రల। కెడయు లేదు సువ్వె యెల్లప్రొద్దు. 308**

**ప్రతిపదార్థం:** అబ్జనయన!= పద్మాల వంటి కన్నులు కలదానా, ఓ సత్యభామా!; వేగన్= తెలవారటానికి; జాము= ఏడున్నర గడియల కాలం; కలుగన్= ఉండగా; వెడ నిద్రన్= కలత నిద్దురను; పొందుదున్= అనుభవిస్తాను; కాని= అయినను; రాజ్య, భార, కార్య, యుక్తిన్= పరిపాలనయొక్క బరువుకు సంబంధించిన పనుల కూటమి చేత; నాకున్; ఎల్ల ప్రొద్దున్= ఎల్లప్పుడును; ఆహార నిద్రలకున్= తిండి తినటానికీ, నిద్దుర పోవటానికీ; ఎడయు లేదు, చువ్వె!= విరామంకూడా లేదు సుమా!

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు కల ఓ సత్యభామా! తెలవారుటకు ఇంకా ఒక జాము ప్రొద్దు మాత్రమే ఉన్నప్పుడు నాకు కొంత నిదుర పోవటానికి అవకాశం లభిస్తుంది. ఎల్లప్పుడు నాకు కడుపునిండ తిండి తినటానికి కనుల నిండ నిదురపోవటానికి సరిఅయిన తీరికే ఉండదు.

**ఆ. ఇట్టి వర్తనముల నెపుడుఁ బాండవులకుఁ। దగిలి ప్రియము సేయఁ దగితిఁ గాని**
**మగువ! నీవు సెప్పు మందులు మాఁకులు। నింద్రజాలములును నే నెఱుంగ.' 309**

**ప్రతిపదార్థం:** మగువ!= వనితా, ఓ సత్యభామా!; ఇట్టి= ఇటువంటి (అనగా పతివ్రతా చర్యల వలననే); వర్తనములన్= చర్యల వలన; ఎపుడున్= ఎల్లప్పుడు; పాండవులకున్= పాండునందనులకు; తగిలి= పూని; ప్రియము+చేయన్+తగితిన్+కాని=

సంప్రీతి కలిగించటానికి చాలినాను గాని; నీవు+చెప్పు= నీవు చెప్పే; మందులు మాఁకులు= ఔషధాలు (మున్నగునవి) ఔషధాల వంటివి; ఇంద్రజాలములును= కనుకట్టులును; నేన్= నేను; ఎఱుంగన్= తెలియజాలను.

**తాత్పర్యం:** ఓ సత్యభామా! నేను నుడివిన పతివ్రతాచర్యలవల్లనే నా భర్తల అనురాగాన్ని చూరగొనగల్గితిని; పాండవులకు ప్రియం చేయటం మాత్రమే నే నెరిగిన ధర్మం. నీవు చెప్పిన మందులు మాకులను గూర్చి నా కేమీ తెలియదు. ఇంద్రజాలవిద్యలు నాకు తెలియవు.'

**విశేషం:** ఇంద్రజాలం అనగా లేనిది ఉన్నట్లు నయనభ్రాంతిని కల్పించే హస్తలాఘవం.

**వ. అనిన విని లజ్జాకలితచిత్త యగుచు సత్యభామ పాండవభామిని కిట్లనియె. 310**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని; లజ్జా, కలిత చిత్త+అగుచున్= సిగ్గుచేత కూడిన మనస్సు కలది ఔతూ; సత్యభామ; పాండవ, భామినికిన్= పాండవుల సతి (అయిన ద్రౌపదికి); ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** అనగా విని సత్యభామ సిగ్గుతో కూడిన మనస్సుతో ద్రౌపదితో ఇట్లా అన్నది.

**క. 'ఏ నెఱుఁగమి ని ట్లడిగితి; । నా నేరమి సైఁప వలయు; నగవుగఁ గొనుమీ**
**మానిని! నా పలుకులు; స । న్మానితము భవచ్చరిత్రమహిమ ధరిత్రిన్.' 311**

**ప్రతిపదార్థం:** మానిని!= మగువా, ఓ ద్రౌపదీ!; ఏను= నేను; ఎఱుఁగమిన్= అజ్ఞానం చొప్పున; ఇట్లు+అడిగితిన్= ఈ విధంగా ప్రశ్నించాను; నా నేరమి= నా యొక్క అజ్ఞానాన్ని; సైఁపన్‌వలయున్= క్షమించవలెను; నా పలుకులు= నా మాటలు; నగవుగన్+కొనుము+ఈ= పరిహాసంగా స్వీకరించుము; భవత్+చరిత్ర, మహిమ= నీప్రవర్తన యొక్క గొప్పదనం; ధరిత్రిన్= భూమిపై; సత్+మానితము= మంచి పేరు ప్రతిష్ఠల నార్జించింది.

**తాత్పర్యం:** ద్రౌపది చెప్పిన మాటలు ఆలకించి సత్యభామ సిగ్గుచేత తలవంచుకొనవలసి వచ్చింది. అందుచేత ఆమె ద్రౌపదికి క్షమాపణ చెప్పుకొన్నది. 'అభిమానవతివైన ఓ ద్రౌపదీ! నేను కేవలం అజ్ఞానం చొప్పున 'మందులు మాకులు' వశీకరణవిద్యలనుగూర్చి ప్రస్తావించాను. వాటిని దయతో' పరిహాస ప్రసంగాలుగా స్వీకరించి నన్ను మన్నించుము. నీ సౌశీల్యం నీకు ప్రపంచంలో పేరుప్రతిష్ఠలను ఆర్జించింది.'

**వ. అనినం బాంచాలి మందస్మితానన యగుచు 'నది యట్ల కాక' యని పలికి మఱియు నిట్లనియె. 312**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా (అని సత్యభామ పలుకగా); పాంచాలి= పాంచాల రాజపుత్రి అయిన ద్రౌపది; మంద, స్మిత+ఆనన+అగుచున్= చిరునవ్వుతో కూడిన మొగం కలది ఔతూ; అది= (నీవు మందులు మాకులు గూర్చి చేసిన ప్రసంగం) అట్లు+అ= ఆ విధంగానే (అనగా కేవలం నవ్వుటాల కొరకు అనిన మాటలుగానే); కాక= అగుగాక; అని పలికి= అని చెప్పి; మఱియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** అని సత్యభామ క్షమాపణ కోరగా, ద్రౌపది చిరునవ్వులు చిందే మొగంతో సమాధానాన్ని ఇట్లా చెప్పింది. 'నీవు మందులు మాకులు గూర్చి చేసిన ప్రస్తావన, కేవలం నవ్వుటాలకు మాత్రమే జరిపినట్లుగా అనుకొందాంఅని.' మరల ద్రౌపది సత్యభామతో ఈ విధంగా పలికింది.

**విశేషం:** (1) ఈ పద్యాలు వ్రాసిన మహాకవి కవిత్రయంలో మూడవవాడయిన ఎఱ్ఱాప్రెగ్గడ. కాని తాను 'ఇది నన్నయ భట్ట ప్రణీతమైనది' అని తాను నన్నయను అనుకరిస్తున్నట్లుగా ప్రకటించాడు. నన్నయ కవితాశిల్పంలో ఎన్నదగినది 'ప్రసన్న కథా కవితార్థయుక్తి'. తిక్కన కవితాశిల్పంలో ఎన్నదగిన అంశము- "సంభాషణ చతురత. సత్యాద్రౌపదీ సంవాదంలోని 'సంభాషణ చారిమ' కు ఎఱ్ఱన మహాకవికి ఒజ్జబంతి ప్రసాదించిన మహనీయుడు తిక్కనయే. అంతేకాక 'మందస్మితానన' అయిన పాంచాలి లజ్జాకలితచిత్త అయిన సత్యభామ.... ఈ సాత్త్వికాభినయ వర్ణన తిక్కన ప్రభావమని చెప్పవచ్చును. పూర్వోక్తమైన వచనం (307 సంఖ్య)లో నన్నయ శైలి కన్పిస్తున్నది. నన్నయ తిక్కన మహాకవు లిరువురి కవితాశిల్పాలు ఎఱ్ఱన రచనలో గంగాయమునలవలె సంగమించిన వని చెప్పదగును.

### ద్రౌపది సత్యభామకుఁ బతివ్రతాధర్మంబులు సెప్పుట (సం. 3-223-1)

**క.** **'పతిమనసు నాఁచికొనియెడు । చతురోపాయంబు నీకుఁ జపలాక్షి! సుని**
**శ్చిత మతిఁ జెప్పెద విను మూ । ర్జితమును ధర్మాన్వితము సుశీలంబునుగన్.** **313**

**ప్రతిపదార్థం:** చపల+అక్షి!= చలించే కన్నులు కలదానా!; (ఓ సత్యభామా); పతి మనసున్= భర్త యొక్క మనస్సును; ఆఁచికొనియెడు= ఆకర్షించి కట్టుకొనే; చతుర+ఉపాయము= తెలివి తేటలతో కూడిన వెరవు; నీకున్; నిశ్చితమతిన్= సందేహం లేకుండా ఖండితంగా; ఊర్జితమును= గొప్పది అయినట్టిదిన్నీ; ధర్మ+అన్వితమున్= ధర్మంతో కూడినట్టిది; సుశీలంబుగన్= మంచి నడవడితో కూడినట్టిదిగా; చెప్పెదన్; వినుము;

**తాత్పర్యం:** 'చంచలమైన కన్నులు కల ఓ సత్యభామా!, భర్తయొక్క మనస్సుకు ఆకర్షించి పట్టుకొనే ఉపాయం నీకు చెప్పగలను. సావధానంగా ఆకర్ణించుము. ఆ ఉపాయం అచ్చమైన తెలివితేటలతో కూడింది; గొప్పతనాన్ని చేకూర్చేది. ధర్మంతో కూడింది. మంచినడవడి సమకూర్చేది సుమా! (మందులకు మాకులకు వశీకరణలకు తంత్రాలకు ఇంద్రజాలానికి సంబంధించింది కాదు అనే హెచ్చరిక అంతర్గర్భితం).

**చ.** **పతిఁ గడవంగ దైవతము భామల కెందును లేదు; ప్రీతుఁడై**
**పతి గరుణించెనేనిఁ గలభాషిణి! భాసురభూషణాంబరా**
**న్విత ధనధాన్యగౌరవము విశ్రుతసంతతియున్ యశంబు స**
**ద్గతియును గల్గు; నొండుమెయిఁ గల్గునె యెన్నితెఱంగు లారయన్?** **314**

**ప్రతిపదార్థం:** కలభాషిణి!= అవ్యక్తమధుర మైన మాటలు మాటాడుదానా, ఓ సత్యభామా!; భామలకున్= మగువలకు; పతిన్= భర్తను; కడవంగన్= మించునట్టి; దైవతము= దైవం; ఎందును లేదు= ఎచ్చటను లేదు. పతి= భర్త; ప్రీతుఁడు+ఐ= తృప్తి చెందిన వాడయి; కరుణించెన్+ఏనిన్= దయ చూపితే; భాసుర, భూషణ+అంబర+అన్విత, ధన, ధాన్య గౌరవమున్= ప్రకాశించే ఆభరణాలతో వస్త్రాలతో కూడిన, సంపద, తిండి గింజలు అనువాని గొప్పతనం; విశ్రుత, సంతతియున్= పేరు కెక్కిన సంతానమున్నూ; యశంబున్= కీర్తి; సత్+గతియును= పుణ్య పదమున్నూ; కల్గున్= ఏర్పడతాయి, ఒండు మెయిన్= వేరొక రీతిగా; ఎన్ని, తెఱంగులు= ఎన్ని మార్గాలు; అరయన్= పరిశీలించినప్పటికి; కల్గును+ఎ= ఏర్పడునా? (= ఏర్పడవు).

**తాత్పర్యం:** అవ్యక్తమధురవాక్యాలు పలుకునట్టి ఓ సత్యభామా! భర్తను మించిన దైవం భార్యకు మరొకరు లేరు. భర్త దయచూపితే భార్యకు ఆభరణాలు లభిస్తాయి, ధన ధాన్య సంపదలు కలుగుతాయి, మంచి సంతానం

ఏర్పడుతుంది, కీర్తి లభిస్తుంది, పుణ్యం సంప్రాప్తిస్తుంది. ఆలోచించి చూస్తే భర్తవలనకాక వేరువిధంగా భార్యకు అభ్యుదయ పరంపరలు సంప్రాప్తించవుకదా!

**విశేషం:** చపలాక్షి, కలభాషిణి అనే సంబోధనలలో సత్యభామపట్ల ద్రౌపది 'ఎత్తిపొడుపు' ధ్వనిస్తుంది.

**ఆ. కరము దుఃఖపడినఁ గాని యొక్కింత సౌ । ఖ్యంబు ధర్మగతియుఁ గలుగ దెందుఁ,**
**జూడు మబల! భర్తృశుశ్రూష ఫలము సం । తత శుభంబు గలదు, ధర్మ మొదవు. 315**

**ప్రతిపదార్థం:** అబల= మగువ, ఓ సత్యభామా!; కరము= మిక్కుటంగా; దుఃఖపడినన్+కాని= కష్టాన్ని అనుభవించిన గాని; ఒక్క+ఇంత= కొంత, కొంచెం; సౌఖ్యంబు= సుఖం; ధర్మగతియున్= ధర్మంతో గూడిన పదం; ఎందున్= ఎచటను; కలుగదు= ఏర్పడదు; చూడుము= గమనించుము; భర్తృ శుశ్రూష ఫలము= పతికి చేసిన సేవ యొక్క ఫలితం; సంతత, శుభంబు= ఎల్లప్పుడు కలిగే మేలు; కలదు= ఉంటుంది; ధర్మువు= ధర్మం; ఒదవున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ఓ సత్యభామా! ఎంతో శ్రమిస్తే కాని కొంచెం సుఖం కలుగదు. పుణ్యం లభించటానికి మిక్కిలి శ్రమించవలసి ఉంటుంది. భర్తకు పరిచర్య చేస్తే సులువుగా పుణ్యం లభిస్తుంది. శీఘ్రంగా ఎల్లప్పుడూ మేలు కలుగుతుంది. దానివలన ధర్మం కూడా ప్రాప్తిస్తుంది.

**క. కావున నిత్యము సమ్య । గ్భావము ప్రేమంబు వెరవు భక్తియుఁ బ్రియముం**
**గావింపుము నీ ప్రియునెడ । భావముఁ దా నెఱిఁగి భర్త బాగుగ మరగున్. 316**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; నిత్యమున్= ప్రతి దినం; సమ్యక్+భావము= సరియైన యోచనం (ఆలోచన); ప్రేమంబు= ప్రేముడి; వెరవు= ఉపాయం; భక్తియున్= పూజ్యభావనను; ప్రియమున్= సంప్రీతిని; నీ ప్రియు+ఎడన్= నీ భర్తయెడల; కావింపుము= ఒనరించుము; భావమున్= అనురాగ పూరితమైన యోచనం; తాన్= తాను(భర్త); ఎఱిఁగి= తెలిసికొని; భర్త= పెనిమిటి; బాగుగన్= మంచిగా; మరగున్= వలపుతో కూడి ప్రవర్తిస్తాడు.

**తాత్పర్యం:** ఓ సత్యభామా! నీకు ప్రియుడైన నీ భర్తయెడ ప్రతిదినం సరైన ఆలోచన, ప్రేముడి, ఉపాయం, ఆరాధనాభావం, సంప్రీతి ప్రసరింప జేయుము. నీ ప్రేముడి గుర్తించి నీభర్త నీయెడ అనురాగంతో ప్రవర్తిస్తాడు.

**మ. వనజాక్షుండు గడంగి నీ దగు గృహద్వారంబు సేరంగ వ**
**చ్చెననంగా విని లెమ్ము సంభ్రమముతోఁ జెన్నొందు నభ్యంతరం**
**బునకున్ వచ్చిన నాసనాదికరణంబుల్ దీర్పఁ దత్తజ్జనం**
**బు నియోగించితి నంచు నుండక ప్రియంబుల్ సేయు మీవుం దగన్. 317**

**ప్రతిపదార్థం:** వనజ+అక్షుండు= పద్మాలవంటి కన్నులు కలవాడు (శ్రీకృష్ణుడు); నీది+అగు= నీదగు, నీ యొక్క; గృహద్వారంబు+చేరంగన్, వచ్చెన్+అనంగాన్= ఇంటి గుమ్మందగ్గరికి వచ్చాడనే మాట ఆలకించినంతనే; విని; సంభ్రమముతోన్= తొట్రుపాటుతో; లెమ్ము= లేచి నిల్చుండుము; చెన్ను+ఒందు= అందమైన; అభ్యంతరంబునకున్= అంతఃపురం లోకి; వచ్చినన్= వస్తే; ఆసన+ఆది, కరణంబుల్= కూర్చొనటానికి చేసే సదుపాయాలు; తీర్పన్= సమకూర్చుటకు; తద్+తద్+ జనంబున్= ఆయా మనుజులను; నియోగించితిని= ఏర్పాటు చేశాను; అంచున్= అని తలపోస్తూ; ఉండక= ఊరుకొనక; ఈవున్= నీవును; తగన్= ఒప్పిదంగా; ప్రియంబుల్+చేయుము= ప్రీతి కలిగించే వాటిని ఒనరించుము.

**తాత్పర్యం:** నీ భర్త అయిన శ్రీకృష్ణుడు పద్మాలవంటి కన్నులు కలవాడు. ఆతడు నీ ఇంటి గుమ్మం దగ్గరికి చేరగానే నీవు తొట్రుపాటుతో శీఘ్రంగా ఎదురేగి స్వాగతం పలుకుము. అతడే చెచ్చెర నీ అంతఃపురంలో ప్రవేశిస్తే, అతడికి కూర్చొనటానికి సదుపాయాలు చేయటానికై సేవకులను పలువురిని నియమించాను కదా అని నీవు ఉపేక్ష చేయరాదు. నీవే స్వయంగా ఎదురేగి ఆతడిని మన్నించి ఆతని అనురాగాన్ని చూరగొనుము.

**చ. తివిరి మురారి నీకుఁ గడు తీపుగఁ జెప్పిన పల్కు గల్గినం**
**గువలయనేత్ర! నీ మనసు గూడినవారికి నైన నెప్డుఁ జె**
**ప్పవలదు; దాన నొండొక నెపంబు ఘటింతు రెఱింగి రేని నీ**
**సవతులు కృష్ణుబుద్ధి విరసంబగు నీదెసఁ దత్ప్రయుక్తిచేన్. 318**

**ప్రతిపదార్థం:** కువలయ నేత్ర!= నల్లగలువల వంటి కన్నులు కలదానా, ఓ సత్యభామా!; తివిరి= కడగి; ముర+అరి= ముర అనెడి రాక్షసుడికి శత్రువైన శ్రీకృష్ణుఁడు; నీకున్= నీకు; కడున్= మిక్కిలి; తీపుగన్= తీయగా; చెప్పిన పల్కు= చెప్పినమాట; కల్గినన్= ఉంటే; నీ మనసు+కూడిన వారికిన్+ఐనన్= నీ మనస్సుకు నచ్చిన నెచ్చెలులకైన; ఎప్డున్= ఎపుడుకూడా; చెప్పన్‌వలదు= చెప్పరాదు; దానన్= అందు వలన; నీ సవతులు= నీతోపాటు నీ భర్త పెండ్లి ఆడిన మగువలు; ఎఱింగిరి+ఏనిన్= (సంగతిని) తెలిసికొంటే; ఒండు+ఒక, నెపంబు= వేరొక మిష; ఘటింతురు= కల్పిస్తారు; తద్+ప్రయుక్తిచేన్= ఆ ప్రయోగం వలన; నీ దెసన్= నీ యెడల; కృష్ణు, బుద్ధి= శ్రీకృష్ణుడి మనస్సు; విరసంబు= రసం లేనిది, ప్రేముడి లేనిది; అగున్= కాగలదు.

**తాత్పర్యం:** నల్లకలువలవంటి కన్నులు కల ఓ సత్యభామా! నీయందు మిక్కుటమైన మక్కువ చూపి, శ్రీకృష్ణుడు నీకు సరససల్లాపప్రసంగవశాన ఏదైన రహస్యం చెప్పితే, దానిని నీవు నీ అనుగు నెచ్చెలులకు కూడ చెప్ప కూడదు. ఒకవేళ ఆ సంగతి నీ సవతులకు తెలిస్తే నీమీద నింద మోపి ఆ రహస్యాన్ని బట్టబయలు చేయగలరు. అప్పుడు నీ మీద గల ప్రేమాభిమానాలు శ్రీకృష్ణుడి మనస్సులో సన్నగిల్లుతాయి; జాగ్రత్త.

**చ. పతికి ననుంగు లైన తగు బంధుల మిత్త్రుల భోజనాది స**
**త్కృతముల నాదరించుచు నకృత్రిమభక్తినియుక్తి సంతతో**
**త్థితమతివై చరింపుము; తదీయ హితేతరవృత్తు లైన వా**
**రతివ! భవత్సుహృజ్జనము లైనను గైకొనకుండు మెప్పుడున్. 319**

**ప్రతిపదార్థం:** అతివ!= ఓ మగువా, ఓ సత్యభామా!; పతికిన్= భర్తకు; అనుంగులు+ఐన= ఇష్టులు అయిన; తగు బంధులన్, మిత్త్రులన్= తగిన చుట్టాలను స్నేహితులను; భోజన+ఆది, సత్+కృతములన్= ఆహారం మున్నగు మంచి సదుపాయాలొనరించటంలో; ఆదరించుచున్= మన్నిస్తూ; అకృత్రిమ భక్తి నియుక్తిన్= స్వచ్ఛమైన పూజ్యభావం కలిగిఉండటంచేత; సంత+ఉత్థిత, మతివి+ఐ= ఎల్లప్పుడును మేలుకొన్నబుద్ధిగలదానివై; చరింపుము= ప్రవర్తించుము; తదీయ, హిత+ఇతర, వృత్తులు+ఐనవారు= ఆతడి యొక్క మేలుకు వ్యతిరేకమైన ప్రవర్తన కలవారలను; భవత్+సుహృత్+జనములు+ఐనను= నీ యొక్క మిత్రములైనవారు అయినప్పటికిని; ఎప్పుడున్= ఎన్నడును; కైకొనక+ఉండుము= ఆదరించకుము.

**తాత్పర్యం:** ఓ సత్యభామా!, భర్తకు ప్రీతిపాత్రులైన చుట్టాలకు, మిత్రులకు ఆహారపానీయాలు మొదలైన సదుపాయాలను సమకూర్చటంలో నీవు ప్రత్యేకమైన జాగ్రత్త వహించుము. వారిని పూజ్యభావంతో గౌరవించుము. భర్త మేలు కోరక అతడికి వ్యతిరేకమైన చర్యలు చేసేవారు, నీకు మిత్రములైనప్పటికి వారిని ఆదరించకుము.

క. **విను, ప్రద్యుమ్నాది భవ । త్తనయులయెడ నైన నేకతంబున నేకా**
**సనమున నుండుట దూష్యం । బని యెఱుఁగుము; సతులచరిత లతిదుష్కరముల్. 320**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; ప్రద్యుమ్న+ఆది, భవత్+తనయుల+ఎడన్+ఐనన్= ప్రద్యుమ్నుడు మున్నగు నీ కుమారుల యెడ నైనప్పటికి; ఏకతంబునన్= రహస్యంగా; ఏక+ఆసనమునన్= ఒకే వేదికపై; ఉండుట= (కూర్చొని) ఉండటం; దూష్యంబు+ అని= మంచిది కాదు అని; ఎఱుంగుము= తెలిసికొనుము; సతుల చరితలు= ఆడువారి నడవడులు; అతి, దుష్కరముల్= మిక్కిలి కష్టంతో చేయదగినవి.

**తాత్పర్యం:** సత్యభామా! శ్రద్ధతో ఆలకింపుము. ఆడువారి నడవడి మిక్కిలి కష్టంతో జాగరూకతతో తీర్చిదిద్దుకొన వలసి నట్టిది. ప్రద్యుమ్నాదులు నీకు పుత్ర నిర్విశేషులే. అయినప్పటికిని అట్టివారితో కూడి ఏకాంతంగా, ఒకే వేదికపై ఉండరాదు.

**విశేషం:** ప్రద్యుమ్నుడు రుక్మిణికి శ్రీకృష్ణుడికి పుట్టిన కొడుకు.

క. **కులవతులును సతులును ని । ర్మల మతులును నయిన యట్టి మగువలతోడం**
**జెలిమి యొనరించునది; దు । ర్విలసిత వనితాభియుక్తి విడువుము తరుణీ! 321**

**ప్రతిపదార్థం:** తరుణీ!= జవ్వనీ! ఓ సత్యభామా!; కులవతులును= ఆభిజాత్యవతులున్నూ (మంచి కుటుంబంలో జన్మించిన వారున్నూ); సతులును= పతివ్రతలున్నూ; నిర్మల మతులునున్= స్వచ్ఛమైన బుద్ధి కలవారున్నూ; అయిన+అట్టి= అయినట్టి; మగువలతోడన్= స్త్రీలతో; చెలిమి= స్నేహం; ఒనరించునది= చేయాలి; దుర్విలసిత, వనితా+అభియుక్తి= చెడ్డ హొయలు పోయే మగువలతో కలసి మెలసిఉండటం; విడువుము= వదలి పెట్టుము.

**తాత్పర్యం:** జవ్వని వైన ఓ సత్యభామా! మంచికుటుంబానికి చెంది మంచిబుద్ధి గల పతివ్రతలతో మాత్రమే నీవు స్నేహం చేయుము. వన్నెలవిసనకర్రలై విర్రవీగే వనితలతో ఎన్నడూ కలసి మెలసి తిరుగవద్దు.

వ. **ఇది నీకుఁ బరమసౌభాగ్యమూలం బయిన యుపాయం' బనినం బ్రీతచిత్తయై సత్యభామ యిట్లనియె.322**

**ప్రతిపదార్థం:** ఇది= (నేను చెప్పిన ఈ మాట); నీకున్; పరమ, సౌభాగ్య, మూలంబు+అయిన= భర్తయొక్క అధికమైన అభిమానాన్ని చూరగొనటానికి కారణమయిన; ఉపాయంబు= వెరవు; అనినన్= అని చెప్పగా; సత్యభామ= సత్యభామ; ప్రీత, చిత్త+ఐ= సంతృప్తిచెందిన మనస్సు కలదై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** నేను చెప్పిన ఈ మాటలు నీవు నీభర్తఅభిమానాన్ని అమితంగా చూరగొనటానికి ఆధారాలు ఔతాయి' అని ద్రౌపది చెప్పింది. సత్యభామ సంతృప్తి చెంది, ద్రౌపదితో ఇట్లా పలికింది.

సీ. **'నీవు ధర్మజ్ఞవు, దేవసన్నిభులు నీ । భర్తలు మహనీయ కీర్తిధనులు**
**ధైర్యతేజోబలశౌర్యసంపన్నులు । గావున వీరికి నే విధమున**
**ధారుణీరాజ్యంబు సేరెడుఁ దడయక । మీ కెగ్గు సేసిన లోకనింద్య**
**చరితుండు గౌరవధరణీశువనితలు । దిక్కులే కలమటఁ బొక్కుచుండఁ**

**తే.** **గని ముదంబునఁ బొందెదు వనిత! నీవు । సుతుల నత్యంతనిర్మలమతుల శౌర్య**
**యుతులఁ గాంచిన సద్గుణాన్వితవు వగపు । వలదు చిత్తంబులో నీకు జలజనయన!** **323**

**ప్రతిపదార్థం:** జలజనయన!= పద్మాల వంటి కన్నులు కలదానా, ఓ ద్రౌపదీ! నీవు= (ఓ ద్రౌపదీ) నీవు; ధర్మజ్ఞవు= ధర్మాన్ని ఎఱిగిన దానివి; నీ భర్తలు= నీ పతులు (పాండవులు); దేవ సన్నిభులు= దేవతలతో సమానులు; మహనీయ, కీర్తి, ధనులు= గొప్ప దైన యశస్సు అనే సంపద కలవారు; ధైర్య, తేజస్+బల, శౌర్య, సంపన్నులు= మనస్సు కలగని గంభీరత, దేదీప్యమాన మైన వెలుగు, శక్తి, పరాక్రమం అనే సంపద కలవారు; కావునన్= కాబట్టి; వీరికిన్= నీ భర్త లైన పాండవులకు; ఏవిధమునన్= ఎట్లయినను, తడయక= శీఘ్రంగా; ధారుణీ రాజ్యంబు= భూమిని పరిపాలించటం, భూమిపై ప్రభుత్వం; చేరెడున్= సంక్రమిస్తుంది; మీకున్+ఎగ్గు+చేసిన= మీకు అపకారం చేసిన; లోక, నింద్య, చరితుండు= జగత్తున గర్హింప దగిన ప్రవర్తనగలవాడు; కౌరవ, ధరణీ+ఈశు; వనితలు= కురువంశానికి చెందిన రాజు(దుర్యోధనుడి) యొక్క స్త్రీలు; దిక్కులేక= సాయం లేక; అలమటన్= కష్టాలలో; పొక్కుచుండన్= వెత చెందుతుండగా; కని= చూచి; ముదంబునన్+పొందెదు= సంతోషాన్ని అనుభవిస్తావు; వనిత!= మగువా!; నీవు= నీవు (= ఓ ద్రౌపదీ); సుతులన్= కొడుకులను; అతి+అంత నిర్మల, మతులన్= మిక్కిలి స్వచ్ఛమైన బుద్ధి కలవారిని; శౌర్య యుతులన్= పరాక్రమంకలవారిని; కాంచిన= పొందిన; సత్+గుణ+అన్వితవు= మంచి లక్షణాలతో కూడిన దానవు; నీకున్, చిత్తంబులోన్= మనస్సులో; వగపు వలదు= దుఃఖం ఉండరాదు.

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులు కలదానా!, ద్రౌపదీ! నీవు ధర్మం తెలిసిన దానవు; నీ భర్తలు దేవతలతో సమానులు; లోకంలో పేరుప్రతిష్ఠలను ఆర్జించిన గొప్పవారు; దేదీప్యమాన మైన తేజస్సుతో బలంతో పరాక్రమంతో వెలుగొందేవారు. ఏ విధంగానైనా అట్టి వీరులకు భూరాజ్యం సంక్రమించటం తథ్యం. మీకు అపకారం చేసిన దుష్టుడు లోకులచేత గర్హింపబడిన దుర్యోధనుడి భార్యలు దిక్కులేక కష్టాలు అనుభవించవలసి వస్తుంది. అప్పుడు నీ మనస్సుకు సంతృప్తి కల్గుతుంది. నీవు వీరపత్నివి మాత్రమే కాదు. నీ కొడుకులు అతిలోక పరాక్రమ వంతులు. నీవు వీరమాతవు, సద్గుణరాశివి. నీకు మనస్సులో పరితాపం ఉండరాదు సుమా!

**వ.** **ప్రతివింధ్యాదు లైన నీ పుత్త్రు లేవురు నిప్పుడు వచ్చి యదుపురంబున నున్నవారు; వారికి నొక్కటం గొఱంత లేదు; రుక్మిణియు సుభద్రయుఁ దక్కినవారలు నక్కుమారుల యెడం దమ కొడుకుల కంటె గారవంబు సేయుదురు; వారి దెస నిశ్చింతవు గ' మ్మనియె; నయ్యవసరంబునం గృష్ణుండు పాండవుల వీడ్కొని మార్కండేయాది విప్రజనంబు నామంత్రణంబు సేసి గమనోన్ముఖుం డగుటయు, సత్యభామ యాజ్ఞసేనిం గౌఁగిలించుకొని సగౌరవంబుగా వీడ్కొనియె; నంత వాసుదేవుండును బ్రియాసహితంబుగా రథారూఢుం డై ద్వారవతీపురంబున కరిగె; మార్కండేయుండును బాండవేయుల నాశ్వాసించి నిజాశ్రమంబునకుం జనియె; నని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుం డి ట్లనియె.** **324**

**ప్రతిపదార్థం:** ప్రతివింధ్య+ఆదులు+ఐన= ప్రతివింధ్యుడు మొదలుగా గల; నీ పుత్త్రులు= నీ కొడుకులు; ఏవురున్= అయిదుగురును; ఇప్పుడు= ఈ సమయంలో; వచ్చి= అరుగుదెంచి; యదుపురంబునన్= ద్వారకానగరంలో; ఉన్నవారు= ఉన్నారు; వారికిన్= నీ పుత్రులకు; ఒక్కటన్+కొఱంత లేదు= ఏ ఒక్క అంశంలోనూ లోటు లేదు; రుక్మిణియున్= ఆ కృష్ణుడి మొదటి భార్య; సుభద్రయున్= శ్రీకృష్ణుడి చెల్లెలును; తక్కిన వారలున్= మిగిలిన వారును; ఆ+కుమారుల+ఎడన్= ప్రతివింధ్యుడు మున్నగు వారిపట్ల; తమ కొడుకుల కంటెన్= తమయొక్క పుత్రులకంటెగూడ; గారవంబు+చేయుదురు=

మన్నన, మర్యాద చూపిస్తారు; వారి దెసన్= ఆ ప్రతివింధ్యాదుల విషయమై; నిశ్చింతవు+కమ్ము+అనియెన్= దుఃఖం లేని దానవు అగుము అని చెప్పింది. ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కృష్ణుండు; పాండవులన్; వీడ్కొని= వెళ్ళటానికి మర్యాదపూర్వకంగా అనుమతి తీసికొని; మార్కండేయ+ఆది, విప్ర, జనంబున్= మార్కండేయుడు మున్నగు బ్రాహ్మణుల సముదాయాన్ని; ఆమంత్రణంబు+చేసి= వీడ్కొని; గమన+ఉత్+ముఖుండు+అగుటయున్= ప్రయాణానికి ఉద్యుక్తుడు కాగా; సత్యభామ= శ్రీకృష్ణుని భార్య; యాజ్ఞసేనిన్= ద్రౌపదిని; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; సగౌరవంబుగాన్= మన్నన చొప్పున; వీడ్కొనియెన్= ఆమంత్రణం చేసింది; అంతన్= పిదప; వాసుదేవుండు= వసుదేవుడి కుమారుడైన శ్రీకృష్ణుడు; ప్రియా, సహితంబుగాన్= ప్రియురాలు అయిన సత్యభామతో పాటుగా; రథ+ఆరూఢుండు+ఐ= తేరుపై ఎక్కిన వాడై; ద్వారవతీ పురంబునకున్= ద్వారకా నగరానికి; అరిగెన్= వెళ్లాడు; మార్కండేయుండును; పాండవేయులన్; ఆశ్వాసించి= ఓదార్పు మాటలు చెప్పి, ఊరడించి; నిజ+ఆశ్రమంబునకున్= తన యొక్క ఆశ్రమానికి; చనియెన్= వెళ్ళాడు; అని చెప్పినన్= అని వచింపగా; వైశంపాయనునకున్= భారత కథ చెప్పిన ఋషికి; జనమేజయుండు భారత కథను సర్పయాగసందర్భాన ప్రధానశ్రోత అయిన రాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఓ ద్రౌపదీ! నీ కొడుకులు ప్రతివింధ్యుడు మున్నగువారు అయిదుగురు ఈ సమయంలో ద్వారకానగరంలో ఉన్నారు. వారికి అక్కడ ఎట్టి లోటు లేకుండా, రుక్మిణి సుభద్ర తక్కినవారూ కలిసి చూస్తున్నారు. వారు నీ కొడుకులను తమకొడుకులకంటె మిన్నగా అభిమానంతో మన్నించి లాలిస్తున్నారు. అందుచేత నీవు సంతృప్తితో సంతోషంతో ఇచట సుఖంగా ఉండుము' అని చెప్పింది. అంతట శ్రీకృష్ణుడు పాండవులను వీడ్కొని, మార్కండేయుడు మున్నగు బ్రాహ్మణఋషులకు నమస్కరించి ప్రయాణానికి వారి అనుమతి తీసికొన్నాడు. అప్పుడు సత్యభామ ద్రౌపదిని కౌగిలించుకొని మన్నన తెలిపి మర్యాదగా తాను శ్రీకృష్ణుడితోపాటు వెళ్ళటానికి ఆమె అనుమతి పొందింది. అంత శ్రీకృష్ణుడు సత్యభామతోపాటు తేరుపై ఎక్కి ద్వారకానగరానికి వెళ్ళాడు. మార్కండేయమహర్షికూడ పాండవులకు ఓదార్పుమాటలు చెప్పి ఊరడించి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు - అని వైశంపాయనుడు సర్పయాగశాలలో జనమేజయుడికి భారతకథ వినిపించాడు.

**విశేషం:** (1) వైశంపాయనుడు - వేదవ్యాసమహర్షి శిష్యులలో ఒకడు. జనమేజయుడు- సర్పయాగం చేసిన మహారాజు, పరీక్షితుడి కొడుకు. పరీక్షితుడు అభిమన్యుడి పుత్రుడు. అభిమన్యుడు అర్జునుడి కొడుకు. పాండవులకు ద్రౌపది యందు వరుసగా జన్మించినవారు - ఉపపాండవులు: ప్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేనులు.

**క. 'వనముల ని ట్లనిశంబును । ఘనతర దుఃఖానుభవ వికల్పితు లగుచున్**
**మనుజోత్తము లప్పార్థులు । జననుత! యటమీఁద నెట్లు చరియించి రొకో!' 325**

**ప్రతిపదార్థం:** జననుత!= జనులచేత పొగడబడినవాడా! ఓ వైశంపాయన మహర్షీ!! వనములన్= అడవులలో; ఇట్లు= ఈ రీతిగా; అనిశంబును= ఎల్లప్పుడున్నూ; ఘన, తర, దుఃఖ+అనుభవ,వికల్పితులు+అగుచున్= మిక్కిలి ఎక్కువైన శోకాన్ని అనుభవించినవారు ఔతూ; మనుజ+ఉత్తములు= నరులలో శ్రేష్ఠులు; ఆ+పార్థులు= పృథ యొక్క కొడుకులు అయిన పాండవులు; అట మీఁదన్= ఆ పిమ్మట; ఎట్లు= ఏ విధంగా; చరియించిరి+ఒకో!= నడచిరో కదా!

**తాత్పర్యం:** ఓ వైశంపాయన మహర్షీ! మనుజులలో శ్రేష్ఠులు కుంతీకుమారులైన పాండవులు ఆ విధంగా అడవులలో నివసిస్తూ పెక్కుకష్టాలు పడుతూ బ్రదికిరికదా! పిదప వారు ఏ విధంగా తమ నడవడికలు తీర్చి దిద్దుకొన్నారో తెలుప వేడికోలు.

**వ. అనిన నమ్మునీశ్వరుం డిట్లని చెప్పెఁ; 'గృష్ణుండు సనిన యనంతరంబ పాండవులు గామ్యకవన నివాసంబు పరిత్యజించి, యనేక వన శైల నదనదీ విశేషంబు లాలోకించుచు ద్వైతవనంబునకుం జని, యం దున్న యెడం గరిపురంబున నుండి యొక్క బ్రాహ్మణుండు సరసకథాకథనకుశలుండు సనుదెంచి, కౌంతేయులం గని, యుచితసల్లాపంబు సేసి, మగిడి ధృతరాష్ట్రుపాలికిం జనిన, నమ్మహీపాలుండు పాండవుల కుశలం బడుగుటయు, నవ్విప్రుండు వా రేవురు ననవరతశీతవాతాతపకర్శితాంగులై బహుదుఃఖసాగరంబున మునింగియున్న వా రనియు, వీరనాథ యయ్యును ననాథయుం బోలెఁ బాంచాలి పరమశోకార్తయై యున్నది యనియుం జెప్పిన విని, వైచిత్రవీర్యుండు విషణ్ణహృదయుండై కన్నీరు దొరుఁగం గొండొకసేపు వలుక కుండి, పదంపడి నిట్టూర్పు నిగిడించి గద్గదకంఠుం డగుచు నిట్లనియె. 326**

**ప్రతిపదార్థం:** అనినన్= అని జయమేజయుడు అడుగగా; ఆ+ముని+ఈశ్వరుండు= ఆ ఋషులలో శ్రేష్ఠుడైనవాడు (వైశంపాయనుడు); ఇట్లు+అని, చెప్పెన్= ఈ విధంగా పలికాడు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; చనిన+అనంతరంబు+అ= వెడలిన వెంటనే; పాండవులు= పాండునందనులు; కామ్యక, వన నివాసంబు= కామ్యకం అనే పేరు గల అడవిలో ఉండటం; పరిత్యజించి= వదలిపెట్టి; అనేక, వన, శైల, నద, నదీ, విశేషంబులు= పెక్కు అడవులు పర్వతాలు తూరుపునుండి పశ్చిమానికి పారే ఏరులు; పశ్చిమంనుండి తూరుపునకు పారే ఏరులు, అందు ముఖ్యము లైనవి; ఆలోకించుచున్= చూస్తూ; ద్వైత వనంబునకున్+చని= ద్వైతం అనే పేరు కల అడవికి వెళ్ళి; అందున్= అక్కడ; ఉన్న+ఎడన్= నివసిస్తున్నప్పుడు; కరిపురంబున నుండి= హస్తినాపురం నుండి; ఒక్క బ్రాహ్మణుండు= ఒక విప్రుడు; సరస, కథా, కథన, కుశలుండు= చక్కటి కథలను చెప్పటంలో నేర్పరి; చనుదెంచి= వచ్చి; కౌంతేయులన్+కని= కుంతీకుమారులను, పాండవులను సందర్శించి; ఉచిత, సల్లాపంబు+చేసి= తగిన మర్యాదలతో కూడిన మాటలాడి; మగిడి= తిరిగి; ధృతరాష్ట్ర పాలికిన్+చనినన్= ధృతరాష్ట్రుడి కడకు వెళ్ళగా; ఆ+మహీ, పాలుండు= ఆ భూభర్త అయిన మహారాజు; పాండవుల కుశలంబు= పాండునందనుల యొక్క యోగ క్షేమాల్ని; అడుగుటయున్= ప్రశ్నించగా; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; వారు+ఏవురున్= వారు అయిదుగురూ-పంచపాండవులు; అనవరత, శీత, వాత+ఆతప, కర్శిత+అంగులు+ఐ= ఎల్లప్పుడును చలిగాలులచేత ఎండలచేత కృశించిన శరీరం కల వారలై; బహు, దుఃఖ, సాగరంబునన్= పెక్కు కష్టాలనెడి సముద్రంలో; మునింగి+ఉన్నవారు+అనియున్= నిమగ్నులై ఉన్నవారలు అనియున్నూ; వీరనాథ+అయ్యును= వీరు లైన భర్తలు కలది అయినప్పటికిన్నీ; అనాథయున్+పోలెన్= కాపాడేవారు లేక దిక్కు లేని స్త్రీ వలె; పాంచాలి= పాంచాలదేశ ప్రభువు యొక్క పుత్రిక అయిన ద్రౌపది; పరమ, శోక+ఆర్త+ఐ= మిక్కుటమైన దుఃఖంచేత దీనురాలు అయి; ఉన్నది; అనియున్+చెప్పినన్; విని; వైచిత్రవీర్యుండు= విచిత్రవీర్యుడి కొడుకు అయిన ధృతరాష్ట్రుడు; విషణ్ణ, హృదయుండు+ఐ= కలత చెందిన మనసు కలవాడై; కన్నీరు; తొరుఁగన్= జారుతుండగా; కొండొక సేపు= కొంత తడవు; పలుకక+ఉండి= మాటాడకుండి; పదంపడి= పిదప; నిడు+ఊరుపు= దీర్ఘ నిశ్వాసం; నిగిడించి= బయటకు వదలి; గద్గద కంఠుండు అగుచున్= డగ్గుత్తిక బడిన గొంతుక కలవాడవుతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అంతట వైశంపాయనమహర్షి జనమేజయుడికి ఈ విధంగా ప్రత్యుత్తర మిచ్చాడు. శ్రీకృష్ణుడు ద్వారకానగరానికి వెళ్ళిన తరువాత పాండవులు కామ్యకవనంలో నివసించటం మాని, ద్వైతవనానికి తమ ఆవాసాన్ని మార్చారు. మార్గమధ్యాన వారు పెక్కు అడవులను పర్వతాలను నదులను నదాలను ఆయా విశేషాలను చూచారు. అప్పుడు హస్తినానగర నివాసియు, చక్కని కథలను చెప్పటంలో నేర్పరి అయిన ఒక బ్రాహ్మణుడు ద్వైతవనానికి వచ్చి, పాండవులను సందర్శించి మాట్లాడి, తిరిగి హస్తినాపురానికి చేరాడు. ధృతరాష్ట్రుడు పాండవుల యోగక్షేమాలను

గూర్చి ఆవిప్రుడిని ప్రశ్నించాడు. ఆ బ్రాహ్మణుడు - పాండవులు అడవులలో పెక్కు ఇడుమలు పడుతున్నారు అనిన్నీ, ఎండలకు మాడి, చలికి వణకి, వానలకు తడిసి దుఃఖసాగరంలో మునిగి ఉన్నారు అనిన్నీ, వీరులను భర్తగా పడసినప్పటికినీ, కాపాడేవారు లేని దీనురాలివలె పాంచాలరాజపుత్రిక అయిన ద్రౌపది వెతలతో అల్లాడుతున్నది అనిన్నీ చెప్పాడు. ధృతరాష్ట్రుడు పాండవులు పడుతున్న పాట్లు విని కొంతసేపు మిన్నకుండి, ఆపైన దుఃఖంచేత వేడినిట్టూర్పులు విడిచి డగ్గుత్తిక పడిన గొంతుకతో ఈ విధంగా పలికాడు.

**విశేషం:** ధృతరాష్ట్రుడి వర్ణనం ఆంగికాభివర్ణనం. ఇది మూలసంస్కృతమహాభారతంలో కానరాదు. నాటకీయమైన ఈ ఆంగికాభివర్ణన తిక్కన మహాకవి కవితాశిల్పంలోని విశేషం. ఇప్పట్టున ఎఱ్ఱనమహాకవి తిక్కనకవితాశిల్పాన్ని అనుకరించాడని చెప్పవచ్చును. 'సరస కథా కథన కుశలుండు'- 'అనవరత శీత వాతాతప కర్శితాంగులు' మున్నగు పదగుంఫనలు నన్నయ్య 'ప్రసన్న కథా కవితార్థ యుక్తి'ని తలపింప జేస్తాయి.

### ధృతరాష్ట్రుండు పాండవుల వనవాసక్లేశంబునకు దుఃఖించుట (సం. 3-225-8)

**క. 'నా చేసిన కీడునఁ గడు । నీచుం డగు నా తనూజునేరమి నిమ్మై**
**నోచెల్ల పార్థులకుఁ బు । ణ్యాచారుల కెందు లేని యాపద వచ్చెన్. 327**

**ప్రతిపదార్థం:** ఓచెల్ల= అయ్యో! ఎంతటి అనర్థం జరిగింది; నా చేసిన= నేను ఒనరించిన; కీడునన్= అపకారం వలన; కడున్= మిక్కిలి; నీచుండు+అగు= దుష్టుడు అయిన; నా తనూజు నేరమిన్= నా కొడుకు యొక్క అజ్ఞానం వలన; ఈ+మైన్= ఈ రీతిగా; పార్థులకున్= పృథయొక్క కొడుకులకు, పాండవులకు; పుణ్య+ఆచారులకున్= సుకృతం కలిగించే నడవడిక కలవారలకు; ఎందున్, లేని= ఎచటను ఉండని; ఆపద= గొప్ప కష్టం; వచ్చెన్= దాపురించింది.

**తాత్పర్యం:** 'అయ్యో! ఎంతటి అనర్థం దాపురించింది పాండవులకు? ఇది అంతయు దుర్మార్గుడైన నా కొడుకు దుర్యోధనుడి అజ్ఞానంవలన జరిగిన దురంతమే కదా! ఇది నేను చేసిన అపకారమే. పాండవులు పుణ్యప్రదమైన ప్రవర్తన కలవారు. వారికి ఎంతటి ఇక్కట్లు దాపురించాయి!

**క. నా పెద్దకొడుకు ధర్మజుఁ । గాపురుషవిదూరు ధీరుఁ గౌరవకుల సం**
**దీపకు నివ్విధమున సం । తాపితుఁగాఁ జేసెనే విధాతృఁ డదయుఁడై. 328**

**ప్రతిపదార్థం:** నా పెద్ద కొడుకు= మొదటి కుమారుడు; ధర్మజున్= ధర్మరాజును; కాపురుష, విదూరున్= చెడ్డవారికి దూరంగా ఉండేవాడిని, మంచివాడిని; ధీరున్= మనస్సును నిగ్రహించినవాడిని; కౌరవ, కుల, సందీపకున్= కౌరవుల వంశాన్ని ప్రకాశవంతం చేసేవాడిని; ఈ+విధమునన్= ఈ రీతిగా; విధాతృఁడు= బ్రహ్మదేవుడు; అదయుఁడు+ఐ= జాలిమాలినవాడై; సంతాపితుఁ గాన్= మిక్కిలి కష్టపడేవాడినిగా; చేసెనే= ఒనరించాడు సుమా!

**తాత్పర్యం:** నేను నా పెద్దకొడుకుగా భావించే ధర్మరాజు, దుష్టులకు దూరంగా ఉండే ధర్మాత్ముడు. మంచివాడు. కౌరవ వంశాన్ని వెలుగొందచేసేవాడు. అట్టివాడికి బ్రహ్మదేవుడు ఇటువంటి ఇక్కట్టులను దాపురింపచేశాడే!

**చ. అమలనివాతసౌధములయందు మనోజ్ఞమరాళతూల త**
**ల్పముల శయించి రేపులు శుభస్థితి మాగధసూతగీతనా**

**దములఁ బ్రబోధముం బొరయు ధర్మసుతుండు కఠోరభూమిభా**
**గమున శయించి మేల్కను సృగాలనినాదవికీర్ణకర్ణుఁడై. 329**

**ప్రతిపదార్థం:** అమల, నివాత, సౌధముల అందున్= స్వచ్ఛమైనట్టివి, పెనుగాలిపాటు లేనట్టివి అయిన మేడల యందు; మనోజ్ఞ, మరాళ, తూల, తల్పములన్= మనోహరమైన హంసతూలికాశయ్యల; శయించి= పండుకొని; రేపులు= తెల్లవారువేళల; శుభస్థితిన్= మంచిగా; మాగధ, సూత, గీత, నాదములన్= వేకువవేళ పాటలయొక్క సవ్వడులచేత; ప్రబోధమున్+పొరయు= నిద్దుర మైకంనుండి మేల్కొనే; ధర్మసుతుండు= ధర్మరాజు; కఠోర, భూమి, భాగమునన్= శరీరానికి నొప్పికలిగించే గట్టి నేలపై; శయించి= పవ్వళించి; సృగాల, నినాద, వికీర్ణ, కర్ణుఁడు+ఐ= నక్కల కూతలచేత బ్రద్దలయిన చెవులు కలవాడై; మేల్కనున్= నిదురనుండి లేస్తాడు.

**తాత్పర్యం:** ఈదురుగాలిపాటు లేక ప్రశాంతమై స్వచ్ఛంగా ఉండే మేడలపై మనోహరమైన హంసతూలికా తల్పాలపై నిదురించే ఆగర్భశ్రీమంతుడైన మహారాజకుమారుడు ధర్మనందనుడు. వేకువవేళలో అతడిని మాగధులు సుప్రభాతగీతికలు ఆలపించి మంగళతూర్యరావాలతో మేలుకొల్పేవారు. అక్కటా! అట్టి రాజకుమారుడు విధివైపరీత్యంచేత నేడు కఠినభూభాగాన పవ్వళించి కర్ణకఠోరాలైన నక్కలకూతలకు నిద్దుర మేలుకొంటున్నాడు కదా!

**విశేషం:** ప్రాచీనకాలంలో ప్రభాతకాలాన రాజులను రాజకుమారులను మేలుకొల్పటానికై, మాగధులు, వందులు వైతాళిక గీతికలు ఆలపించేవారు. సూతులు పౌరాణికులు సుప్రసిద్ధశ్లోకాలను కర్తవ్యప్రబోధగీతికలను వినిపించేవారు. అవి రాజమర్యాదలు.

**క. నాగాయుతసత్త్వుఁడు ది । జ్నాగాయతహస్తుఁ డనిలనందనుఁడు మహో**
**ద్వేగాత్ముఁ డగుచు డస్సిన । నాగము క్రియ నుండకున్నె నవసి వనమునన్. 330**

**ప్రతిపదార్థం:** నాగ+అయుత, సత్త్వుఁడు= పదివేల ఏనుగులయొక్క గొప్ప బలం కలవాడు; దిక్+నాగ+ఆయత హస్తుఁడు= దిగ్గజపు తొండం వంటి పొడవైన హస్తాలు కలవాడు; అనిల నందనుఁడు= వాయు పుత్రుడు-భీముడు; మహా+ఉద్వేగ+ ఆత్ముఁడు+అగుచున్= గొప్ప ఆవేశంతో కూడిన ఆత్మ కలవాడు అవుతూ; డస్సిన= శ్రమించిన; నాగము, క్రియన్= ఏనుగు వలె; నవసి= తపించి; వనమునన్= అడవిలో; ఉండక+ఉన్నె= ఉండడా?

**తాత్పర్యం:** వాయుపుత్రుడైన భీముడు పదివేల ఏనుగుల గొప్పబలం కలవాడు. ఆజానుబాహుడు, దిగ్గజపు తొండం వంటి హస్తాలు కలవాడు. అతడికి గొప్ప ఆవేశం వస్తే ఆపటానికి ఎవరి తరం? ఆతడు పరితాపం చెంది అలసిన ఏనుగువలె అడవిలో తపిస్తూ ఉండడా?

**విశేషం:** దిగ్గజాలు ఎనిమిది. 1. ఐరావతం 2. పుండరీకం 3. వామనం 4. కుముదం 5. అంజనం 6. పుష్పదంతం 7. సార్వభౌమం 8. సుప్రతీకం.

**ఉ. అన్నలుఁ దమ్ములున్ సతియు నార్తిమెయిన్ బహుదుఃఖమగ్నులై**
**యున్నతెఱంగు సూచి విజయుండు యుధిష్ఠిరవాక్యబద్ధుఁ డై**
**సన్నుతుఁ డుగ్రపన్నగము చాడ్పున రోఁజుచుఁ గ్రోధశోక వే**
**గోన్నతి నాత్మ నేమనుచునుండునొ నా సుతుతప్పు లెన్నుచున్. 331**

**ప్రతిపదార్థం:** అన్నలున్= అగ్రజులును (ధర్మరాజును, భీముడును); తమ్ములున్= (అనుజులు - నకుల సహదేవులు; సతియున్= భార్యయు (ద్రౌపదియును); ఆర్తిమెయిన్= దైన్యం చొప్పున; బహు, దుఃఖ, మగ్నులు+ఐ= పెక్కు కష్టాలలో మునిగినవారై; ఉన్న, తెఱంగు= ఉన్న విధం; చూచి= అరసి; విజయుండు= అర్జునుడు; యుధిష్ఠిర వాక్య బద్ధుఁడు+ఐ= ధర్మరాజుయొక్క మాటకు కట్టుపడినవాడై; సత్+నుతుఁడు= పేరు ప్రతిష్ఠలను ఆర్జించినవాడు; ఉగ్ర పన్నగము చాడ్పునన్= భయంకరమైన పాము మాదిరిగా; రోఁజుచున్= బుసకొట్టుతూ; క్రోధ, శోక వేగ+ఉన్నతిన్= కోపం యొక్కయు, దుఃఖం యొక్కయు తీవ్రగమనంయొక్క అతిశయంచేత; నాసుతు, తప్పులు= నా కుమారు డైన దుర్యోధనుడి దోషాలను; ఎన్నుచున్= గణిస్తూ; ఆత్మన్= మనస్సులో; ఏమి+అనుచున్+ఉండును+ఒ= ఏ విధంగా ఆలోచిస్తుంటాడో కదా!

**తాత్పర్యం:** ఈ పద్యంలో ధృతరాష్ట్రుడు అర్జునుడి భావాలను గూర్చి అనుశీలిస్తున్నాడు. 'అర్జునుడు మహావీరుడు. తన అన్నలైన ధర్మరాజు, భీముడున్నూ, తమ్ములు అయిన నకుల సహదేవులున్నూ దైన్యంతో పెక్కు ఇక్కట్లు పడుతూ అడవిలో ఉండటం చూచి అతిలోక పరాక్రమవంతుడైన ఆతడు తాత్కాలికంగా అన్నగారి మాటకు కట్టుపడి ఉన్నప్పటికినీ మనస్సులోపల పగబట్టిన త్రాచుపామువలె దుర్యోధనుడు చేసిన దోషాలను ఎన్నుతూ కోప దుఃఖాల వేగంచేత రోజుతూ రొప్పుతూ కాలం గడుపుతున్నాడు కాబోలు' అని ధృతరాష్ట్రుడు వాపోయాడు.

**విశేషం:** ధృతరాష్ట్రుడికి భీముడి బలమన్నా, అర్జునుడి పరాక్రమమన్నా మిక్కిలి భయం. అతడికి పాండవుల సౌశీల్యం దుర్యోధనాదుల దుశ్చర్యలు, శకుని కర్ణుల దురాగతాలు అన్నీ తెలుసు. ధృతరాష్ట్రుడు తెలియని మూర్ఖుడు కాడు; తెలిసిన మూర్ఖుడు. ఈ విషయం పూర్వోక్త పద్యాలవలన, ముందు చెప్పబోయే పద్యాలవలన తేటతెల్లం కాగలదు.

**క.** **అక్కట! మృదుగాత్రులు గడుఁ । జిక్కని మనసులు గుమారసింహులు గవ లిం**
**పెక్కిన సుఖముల కర్హులు; । స్రుక్కి నవయ నోర్చియునికి చోద్యం బరయన్'** **332**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యోపాపం! (జాలితో కూడిన ఆశ్చర్యార్థకం); మృదు, గాత్రులు= సుకుమారమైన శరీరాలు కలవారు; కడున్= మిక్కిలి; చిక్కని మనసులు= సాంద్రమైన హృదయాలు కలవారు; కుమార సింహులు= బాలసింహాల వంటివారు; (సింహకిశోరాలు); కవలు= జంటగా పుట్టినవారు నకుల సహదేవులు; ఇంపు+ఎక్కిన, సుఖములకున్+అర్హులు= భోగాలతో కూడిన సౌఖ్యాలను పొందటానికి యోగ్యత కలవారు; స్రుక్కి= తపించి; నవయన్+ఓర్చి= కష్టపడటానికి ఓర్పు కలిగి; ఉనికి= ఉండటం; అరయన్= చూడగా; చోద్యంబు= ఆశ్చర్యం.

**తాత్పర్యం:** అయ్యోపాపం! సుకుమారశరీరాలు కలవారు నకులసహదేవులు; కవలబిడ్డలు, కొదమసింగాల వంటివారు. అట్టివారు భోగభాగ్యాలతో సమస్తసౌఖ్యాలను అనుభవించ తగినవారే కాని అడవిలో పెక్కు ఇక్కట్లు ఓర్పుతో భరించటం ఆశ్చర్యకరమైన విషయం'.

**వ.** **అని పలికి, వెండియు.** **333**

**తాత్పర్యం:** అని చెప్పి, మఱియు (ధృతరాష్ట్రుడు) ఈ విధంగా పలికాడు.

**చ.** **'అనుపమతేజుఁ డున్నతభుజాగ్రుఁ డుదగ్రుఁడు వైరినిగ్రహుం**
**డనఘుఁడు వాయుసూనుఁడు నిజాగ్రజు చేసిన సత్యపాశబం**
**ధనమునఁ జిక్కి తత్సమయతత్పరుఁడై యిటు ఘోరదుఃఖ వే**
**దనములు సైఁచెఁ గాక మది తద్దయుఁ గ్రోధమయంబు వానికిన్.** **334**

**ప్రతిపదార్థం:** అనుపమ తేజుఁడు= సాటిలేని గొప్పతేజస్సు కలవాడు; ఉన్నత, భుజ+అగ్రుఁడు= ఎత్తయిన భుజాల కొనలు కలవాడు; వైరి నిగ్రహుండు= శత్రువులతో పోరాడేవాడు; అనఘుఁడు= పుణ్యాత్ముఁడు; వాయు సూనుఁడు= వాయువుకు పుత్రుడైన భీముడు; నిజ+అగ్రజు, చేసిన= తనయొక్క అన్నగారు ఒనరించిన; సత్య, పాశ, బంధనమునన్= సత్యం అనెడి త్రాళ్లచేత కట్టుబడటంచేత; చిక్కి= లోబడి; తద్, సమయ, తత్పరుఁడు+ఐ= ఆతడి యొక్క ఒడబాటుకు కట్టుబడినవాడై; ఇటు= ఈవిధంగా (అడవిలో ఇడుమలు పొందుతూ ఉండటం); ఘోర, దుఃఖ, వేదనములు= భయంకరమైన కష్టపరితాపాలు; సైఁచెన్+కాక= ఓర్పుతో భరించెనే కాని; వానికిన్= ఆ భీముడికి; మది= మనస్సు; తద్దయున్= మిక్కిలి; క్రోధ, మయంబు= కోపంతో నిండి నట్టిది.

**తాత్పర్యం:** వాయుపుత్రుడైన ఆ భీముడు ఉన్నాడే, వాడు సాటిలేని తేజస్సు కలవాడు. గొప్ప భుజాగ్రాలుకలవాడు; కయ్యానికి కాలుదువ్వేవాడు, అసాధారణ బలవంతుడు. అతడి అన్నగారు సత్యసంధుడు కావున, అన్నగారు అంగీకరించిన నియమాలను తాను ఉల్లంఘించ నేరడుకాబట్టి ఈ రీతిగా అడవులపాలయి ఘోరకష్టనష్టాలను అనుభవిస్తున్నాడు కాని వాడిమనస్సు ఉద్రిక్తమైనది, కోపమయమైనది సుమా!

**విశేషం:** సత్యపాశ - సత్యమనెడి పాశము - అలంకారం రూపకం.

**సీ.** **శకుని కైతవము, దుశ్శాసను చేసిన । దుష్కర్మమును, గర్ణు తులువతనము**
**దుర్యోధనుని దైన దుర్ణయంబును, జిత్త । మునఁ గిరిశల్యముల్ వోలె నలఁప**
**దావాగ్ని తెఱఁగున దరికొని క్రోధంబు । వనవాస మనియెడు వాయుగతుల**
**నంతకంతకుఁ బేర్చి యవయవంబుల నెల్ల । మండంగ నెప్పుడు మధ్యముండు**

**ఆ.** **మొగము జేవురింప ముడివడు బొమలతో । నవుడు గఱచుచును భయంకరముగ**
**నున్నరూపు వాయకుండు నామది వాఁడ । మిత్తి నాదు పుత్త్రమిత్త్రతతికి.** **335**

**ప్రతిపదార్థం:** శకుని, కైతవము= శకునియొక్క మోసం; దుశ్శాసను చేసిన= దుశ్శాసనుడు చేసిన; దుష్కర్మమును= చెడ్డపనియును; కర్ణు తులువ తనము= కర్ణుడి యొక్క నీచత్వం; దుర్యోధనునిది+ఐన= దుర్యోధనుడి యొక్క; దుర్ణయంబును= చెడు నీతిని; చిత్తమునన్= మనస్సునందు; కిరి శల్యముల్+పోలెన్= ఏదు పంది ఎముకలవలె- ముండ్లవలె; నలఁపన్= పీడించగా; దావ+అగ్ని, తెఱఁగునన్= కారుచిచ్చువలె; దరికొని= వ్యాపించి; క్రోధంబు= కోపం; వనవాసము= అరణ్యంలో నివసించటం; అనియెడు= అనునట్టి; వాయుగతులన్= గాలి సంచలనం చేత; అంతకున్+అంతకున్= క్రమ క్రమంగా; పేర్చి= అతిశయించి; అవయవంబులన్+ఎల్లన్= శరీరభాగాలు అన్నిటిని; మండంగన్= దహించగా; మధ్యముండు= మధ్యపుట్టినవాడు (కుంతీదేవికి పుట్టిన వారిలో నడిపివాడు) భీముడు; మొగము= ముఖం; జేవురింపన్= ఎర్రబడగా; ముడివడు బొమలతోన్= ముడులు వారిన కనుబొమలతో; అవుడు+కఱచుచును= పెదవి కొరుకుతూ; భయంకరముగన్= ఉగ్రంగా; ఉన్న రూపు= ఉండే ఆకారం; నామదిన్= నా మనస్సును; పాయక+ఉండున్= విడువక నిలిచి ఉంటుంది; వాఁడు+అ= వాడే (భీముడే); నాదు= నా యొక్క; పుత్త్ర, మిత్ర తతికిన్= కొడుకుల సముదాయానికి స్నేహితుల సముదాయానికి; మిత్తి= మృత్యువు.

**తాత్పర్యం:** శకుని మాయాద్యూతంలో చేసిన మోసం, దుశ్శాసనుడు నిండుసభలో చేసిన చెడ్డపని (ద్రౌపదీ వస్త్రాపహరణం), కర్ణుడి నీచత్వం (కౌరవులను సమర్థించటం), దుర్యోధనుడి చెడ్డ నాయకత్వం (జూదం మిష

కల్పించి పాండవుల రాజ్యం అపహరించటం మున్నగు కార్యాలు) మనస్సులో ఏదుపంది ముండ్లవలె గ్రుచ్చుకొన్నట్లు బాధించటంచేత కోపం అతడిలో కార్చిచ్చువలె వ్యాపించింది. భీముడికోప మనే అగ్నిహోత్రుడికి అడవిలో పడుతున్న ఇక్కట్లు అనే వాయువు తోడ్పడి, అగ్నిని ప్రజ్వలింపజేసి అతడి అవయవాలను అన్నింటిని క్రమక్రమంగా దహిస్తుంది. అందుచేత కుంతీకుమారులలో మధ్యముడైన ఆ భీముడి ఆకారం, జేవురించిన మొగం, ముడుతలు పడిన కనుబొమలు, పెదవి కరచెడి దంతాలు, ఆ భీకరాకృతి నా మనస్సులో ఎల్లప్పుడు సాక్షాత్కరిస్తూ ఉంటుంది. ఆ భీముడే నా పుత్రులకు మిత్రులకు అందరకు మృత్యువు.

**విశేషం:** అలం: ఉపమ; రూపకం.

**క. అంతకసుతు హృదయంబున । నంత గలుగ నేర దలుక, యర్జును మదిలో**
**నంత గలుగ; దమ్మారుతి । యంతకనిభుఁ డధికరోషుఁ డనవరతంబున్. 336**

**ప్రతిపదార్థం:** అంతక సుతు హృదయంబునన్= యముడి కుమారుడి (ధర్మరాజు) మనసులో; అలుక= కోపం; అంత కలుగన్ నేరదు= అంత (యెక్కువ) ఉండ జాలదు; అర్జును మదిలోన్= అర్జునుడి యొక్క మనస్సులో; అంత= భీముని హృదయంలో ఉన్నంత కోపం; కలుగదు= ఏర్పడదు; ఆ, మారుతి= ఆ వాయునందను డైన భీముడు; అంతక, నిభుఁడు= యముడితో సమానుడు; అనవరతంబున్= ఎల్లప్పుడును; అధిక రోషుఁడు= మిక్కుటమైన కోపం కలవాడు.

**తాత్పర్యం:** భీముడు యముడితో సమానుడు సుమా! ఆతడి యెదలోని కోపం మెండైనది. ఎల్లప్పుడు అతడు రోషంతో రుసరుసలాడుతూ ఉంటాడు. భీముడికి ఉన్న కోపతాపాలు ధర్మరాజుకు లేవు. అర్జునుడిలో కానరావు.

**తే. అర్జునానిలప్రేరితం బగుచుఁ బేర్చి, । వాయుతనయ దవాగ్ని దుర్వారభంగిఁ**
**గర్ణసౌబల సహితముగా మదీయ । పుత్త్రశత కాననము వెసఁ బొదువ కున్నె. 337**

**ప్రతిపదార్థం:** వాయు, తనయ దవ+అగ్ని= భీముడు అనే కారుచిచ్చు; అర్జున+అనిల, ప్రేరితంబు+అగుచున్= అర్జునుడు అనే వాయువుచేత ప్రేరేపించబడినది ఔతూ; పేర్చి= అతిశయించి, దుర్వార, భంగిన్= అడ్డుకొనటానికి వీలు లేనివిధంగా; కర్ణ, సౌబల, సహితముగాన్= కర్ణుడితో శకునితోపాటుగా; మదీయ పుత్త్రశతకాననమున్= నా నూరుగురు కొడుకులు అనే అడవిని; వెసన్= వేగంగా; పొదువక+ఉన్నె= నాశనం చేయక ఉంటుందా.

**తాత్పర్యం:** భీముడు అనే కార్చిచ్చు అర్జునుడు అనే వాయువుచేత ప్రేరేపించబడి, అతిశయించి, కర్ణశకునులతోపాటు నా పుత్రులు అనే అడవిని వేగంగా దహించి వేయదా?

**విశేషం:** అలం: సమగ్రమైన రూపకం.

**క. అగుఁగాక కర్మఫలములు; । దగఁ గుడువక పోవ వశమె దైవకృతంబుల్**
**మగుడునె; కౌరవ్యులకుం । దెగుకాలం బయ్యెఁ; వగపు తెరు విం కేలా? 338**

**ప్రతిపదార్థం:** కర్మఫలములు= చేసిన క్రియలకు కలిగే ఫలితాలు; అగున్+కాక= జరిగి తీరుతాయి కదా; తగన్= సరిపడేటట్లుగా; కుడువక పోవన్ వశము+ఎ= అనుభవించక తప్పునా; దైవకృతంబుల్= విధి విపరిపాకాలు; మగుడునె= వ్యర్థంగా వెనుకకు

తిరిగి పోతాయా; కౌరవ్యులకున్= కౌరవులకు (దుర్యోధనుడు మున్నగు వారికి); తెగు కాలంబు= మరణించే సమయం; అయ్యెన్= దాపురించింది; వగపు తెరువు= విచారించే మార్గం; ఇంకన్+ఏలా= ఇక ఎందుకు?

**తాత్పర్యం:** చేసినకర్మకు తగినఫలం అనుభవించక తప్పదు కదా! ఇది విధి విపరిపాకం. అనుభవించక తప్పదు. దుర్యోధనుడు మున్నగువారికి మరణకాలం ఆసన్నమైంది. ఇది అవశ్యభవితవ్యం. ఇక విచారించి ప్రయోజనం లేదు.

**క. ఏను వలదన్న జూదము । మానఁడ, సుతుదుర్ణయంబు మగిడింపక దు**
**ర్మానమునఁ గులక్షయ సం । ధానమునకుఁ దొడఁగితిని విధాతృని చెయిదిన్. 339**

**ప్రతిపదార్థం:** ఏను= నేను (ధృతరాష్ట్రుడు); వలదు+అన్నన్ జూదము= వద్దు అనిన జూదం; మానఁడు+అ= వదలి పెట్టడు (దుర్యోధనుడు); సుతు దుర్ణయము= కొడుకు యొక్క చెడు నడవడి; మగిడింపక= మరలించక; దుర్మానమునన్= చెడ్డ స్వాతిశయం చొప్పున; కుల, క్షయ, సంధానమునకున్= వంశం నశించే పనికి; విధాతృని చెయిదిన్= బ్రహ్మదేవుడి చర్యవలన; తొడగితిని= సమకట్టాను.

**తాత్పర్యం:** నా కుమారుడైన దుర్యోధనుడు నేను వలదు అని వారించినప్పటికి, నా మాట వినక, జూదానికి ఒడిగట్టాడు. ఆతడి చెడునడవడికను నేను మరలించ లేకపోయాను. దుష్టమైన నా అహంకారంవలన వంశం నశించే మార్గం ఏర్పడింది. అది ఎవరు తప్పించగలరు? అది బ్రహ్మదేవుడి చర్య.

**తే. రాత్రి తెగుదల దిన మేల రాకయుండు? । దినము తెగుదల రాత్రి యేతేర కున్నె?**
**పరఁగ సుఖదుఃఖములు గాల పర్యయమున । నెందు మనుజులఁ బొందక యేల యుడుగు? 340**

**ప్రతిపదార్థం:** రాత్రి తెగుదలన్= రేయి చిట్టచివర; దినము= పగలు; ఏల= ఎందుకు; రాక+ఉండున్= రాకుండును; దినము తెగుదల= పగటి చిట్టచివర; రాత్రి= రేయి; ఏతేరక+ఉన్నె= రాక ఉంటుందా?; పరఁగన్= ఒప్పిదంగా; సుఖ, దుఃఖములు= సౌఖ్యాలున్నూ కష్టాలున్నూ; కాల పర్యయమునన్= కాలంయొక్క మార్పువలన; ఎందున్= ఎచటను; మనుజులన్= మనుష్యులను; పొందక= తాకక; ఏల= ఎందుకు; ఉడుగున్= మానును.

**తాత్పర్యం:** రాత్రి ముగిస్తే పగలు ఏర్పడుతుంది. పగలు గడిస్తే రాత్రి వస్తుందికదా. అట్లే సుఖాలు దుఃఖాలు క్రమక్రమంగా మనుజులకు కల్గుతుంటాయి. అది కాలాన్నిబట్టి సహజంగా సంక్రమించే మార్పుసుమా!

**ఉ. మేలున సంతసిల్లు నెడ మేకొని యాపద లొందు, నాపదల్**
**దూలఁగ భూరిసౌఖ్యములు దోఁచుఁ; గృతంబులు తప్ప వెమ్మెయిం;**
**బోలఁగ నింతయుం గని ప్రబుద్ధమనస్కులు ఖేదమోదని**
**ర్గాళితధైర్యసాగరులు గాక సుఖింతురు సర్వకాలమున్. 341**

**ప్రతిపదార్థం:** మేలునన్= శుభాలు ప్రాప్తించేటప్పుడు; సంతసిల్లు+ఎడన్= సంతోషించేపట్టున; మేకొని= కూడి; ఆపదలు= కీడులు; ఒందున్= కలుగుతాయి; ఆపదల్= కష్టాలు; తూలఁగన్= తొలగగా; భూరి సౌఖ్యములు= గొప్ప సుఖాలు; తోఁచున్= ఉదయిస్తాయి; ఏ+మెయిన్= ఏ విధంగానైనా సరే; కృతంబులు= చేసిన కర్మలు; తప్పవు= జరిగి తీరతాయి; పోలఁగన్= సరి అయ్యేటట్లుగా, అమరేటట్లుగా; ఇంతయున్= ఈ రీతిగా జరిగిన దానిని అంతటిని; కని= చూచి; ప్రబుద్ధ మనస్కులు=

మేల్కొన్న మనస్సు కలవారు- జ్ఞానులు; ఖేద, మోద, నిర్గాళిత, ధైర్య సాగరులు కాక= దుఃఖం సంతోషం అనెడి వాటిచేత జారిన ధీరత్వం అనే సముద్రం కలవారు కాకుండగా; సర్వకాలమున్= ఎల్లప్పుడును; సుఖింతురు= సౌఖ్యాన్ని అనుభవిస్తారు.

**తాత్పర్యం:** శుభాలు ప్రాప్తించిన వని సంతోషించేటప్పుడే ఆపదలు సంభవిస్తాయి; ఆపదలు వచ్చినపుడు గొప్ప సౌఖ్యాలు ఒనగూడుతాయి. పూర్వజన్మలో చేసిన కర్మలు అనుభవించక తప్పదు. ఈ కర్మవిపరిపాకం సిద్ధించటం తెలిసిన జ్ఞానులు సుఖానికీ, దుఃఖానికీ అతీతులుగా ఉండే ధైర్యసాగరులు. ఎల్లప్పుడు వారు నిర్వికల్పంగా సుఖాన్నే అనుభవించగలరు.

**చ. సిరికిఁ దొలంగి కానల వసించి కృశించిన పార్థుఁ డట్టె ని**
**ర్జరుల వరంబునం బరమ సమ్మద లీల మహాస్త్ర లాభ వి**
**స్ఫురణముఁ బొంది యద్దివికిఁ బోయి శరీరముతోన క్రమ్మఱన్**
**ధరణికి వచ్చె; నిట్టివి గదా! వివిధాద్భుత కర్మపాకముల్. 342**

**ప్రతిపదార్థం:** సిరికిన్= సంపదకు; తొలంగి= దూరమయి; కానలన్= అడవులలో, వసించి= ఉండి; కృశించిన= చిక్కిపోయిన (క్షీణించిన); పార్థుఁడు+అట్టె, కుంతీకుమారుడు అర్జునుడా; నిర్జరుల వరంబునన్= వేల్పులు ఇచ్చిన వరం వలన; పరమ, సమ్మద లీలన్= మిక్కుటమైన సంతోషంతో కూడిన ఆటగా; మహా+అస్త్ర, లాభ, విస్ఫురణమున్= గొప్ప మంత్రాయుధాలు ప్రాప్తించటం వలన వికాసం; పొంది= చెంది; ఆ+దివికిన్= ఆ స్వర్గానికి; పోయి= వెళ్లి; శరీరముతోన= దేహంతోనే; క్రమ్మఱన్= తిరిగి; ధరణికిన్= భూమికి; వచ్చెన్= అరుదెంచాడు; వివిధ+అద్భుత, కర్మపాకముల్= అచ్చెరువు కలిగించే పెక్కు కర్మల యొక్క పరిణతులు; ఇట్టివి+కదా= ఇటువంటివేకదా!

**తాత్పర్యం:** చూడుము. ఆలోచిస్తే ఇది ఎంతటి అద్భుతమైన వృత్తాంతమో! సంపదలను కోల్పోయిన అర్జునుడు అడవులలో నివసిస్తూ, చిక్కి శల్యమైపోయాడు కదా! అంతలో ఆతడు దేవతలనుండి వరాలు సాధించి గొప్పవైన అస్త్రాలను ఆర్జించగలిగాడుకదా! అంతేకాక ఆతడు బొందితో దేవలోకానికి పోయి తిరిగి బొందితో క్షేమంగా భూలోకానికి విచ్చేశాడు. ఇది ఎంత అద్భుతం! ఇది ఏ జన్మలో చేసిన కర్మకు లభించిన ఫలమో కదా!

**క. గాండీవము విల్లటె, యా । ఖండల నందనుఁడు విల్లు గలవాఁడటె, త**
**త్కాండంబులు దివ్యము లటె, । యొండేటికి వారిధనమ యుర్వియు సిరియున్.' 343**

**ప్రతిపదార్థం:** గాండీవము= గాండీవము అనునది (అర్జునుడి ధనుస్సు); విల్లు+అటె= ధనువు అట (అట+ఎ=అటె); ఆఖండల, నందనుఁడు= దేవేంద్రుడి కొడుకు అర్జునుడు; విల్లు కలవాఁడు= ధానుష్కుడు; అట+ఎ= అటె= అట; (ఆశ్చర్యార్థకం); తద్+కాండంబులు= ఆ వింటి యొక్క బాణాలు; దివ్యములు+అట+ఎ= దేవతా మహిమ కలవి అట; ఒండు+ఏటికి= వేరు (మాటలు) ఎందుకు; ఉర్వియున్= భూమియు; సిరియున్= సంపదయును; వారి ధనము+అ= వారికి మాత్రమే చెందిన సొత్తుకదా!

**తాత్పర్యం:** గాండీవం విల్లట! అది అతిలోకమహిమ కలది. అనన్యసాధారణమైనది. ఆ విల్లును ధరించేవాడు కూడ లోకోత్తరవీరుడైన అర్జునుడట. అతడు దేవేంద్రుడి కొడుకు. ఆ వింటిబాణాలు దేవతామహిమ కలవి. ఇక చెప్పే దేముంది? ఈ భూమండలమంతా ఈ లోకంలోని సంపద అంతా ఇక ఆ పాండవులకు మాత్రమే చెందే సొత్తు కదా!'

**విశేషం:** గాండీవం- అర్జునుడి విల్లు. లోకోత్తరమైన ఈ ధనుస్సును అగ్నిహోత్రుడు అర్జునుడికి ఖాండవవనదహన సమయంలో బహూకరించాడు. గాండీవంతోపాటు అగ్ని అర్జునుడికి అక్షయతూణీరాన్ని (తరుగని అమ్ములు కల పొదిని) బహూకరించాడు.

**వ. అని ధృతరాష్ట్రుండు బహువిధంబు లగు వలుకులు వలుక విని, దుర్యోధనుండు శకునిం జూచి 'యీ రా జేల యింత భీతుం డయ్యె?' ననుచు నతండునుం దానును గర్ణసహితుండై యొక్క వివిక్తప్రదేశంబునకుం జని కార్యాలోచనంబున నున్న యెడం గర్ణుం డి ట్లనియె. 344**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; బహు విధంబులు+అగు= పెక్కు రీతులు అయిన; పలుకులు= మాటలు; పలుకన్= వచింపగా; విని= ఆలకించి; దుర్యోధనుండు; శకునిన్+చూచి; ఈ రాజు= ఈ ప్రభువు (ధృతరాష్ట్రుడు); ఏల= ఎందుకు; ఇంత= ఈ విధంగా మిక్కుటంగా; భీతుండు+అయ్యెన్= భయం పొందినవాడు అయ్యాడు; అనుచున్= అని అంటూ; అతండునున్+తానును= శకునియు, దుర్యోధనుడును; కర్ణ సహితుండు+ఐ= కర్ణుడితో కూడినవాడై; ఒక్క= ఒక; వివిక్త ప్రదేశంబునకున్= రహస్యంగా ఉండే చోటుకు; చని= వెళ్ళి; కార్య+ఆలోచనంబునన్= చేయవలసిన పనిని గూర్చి యోచన చేస్తూ; ఉన్న+ఎడన్= ఉన్నప్పుడు; కర్ణుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు దుర్యోధనుడికి చెప్పాడు. అంతట దుర్యోధనుడు శకునితో 'ఎందుకు ఈ రాజు ఇట్లా పిరికిమాటలు పలుకుతున్నాడు? ఈయనకు ఇంతటిభయం ఎందుకు కల్గింది?' అని అన్నాడు. పిదప దుర్యోధనుడు శకునికర్ణులతో కలిసి, ఏకాంతప్రదేశానికి చేరి మంత్రాలోచనకు పూనుకొన్నాడు. అప్పుడు కర్ణుడు ఈ విధంగా పలికాడు.

**సీ. 'పాలితశౌర్యులు పాండవేయులు దుఃఖ । శీలురై యడవులపాలు వడిరి;**
**ధరణీశ! తొల్లి యింద్ర ప్రస్థపురమున । ధర్మనందను పాలఁ బేర్మితోడ**
**శోభిల్లుచున్న విశ్రుతలక్ష్మి నీ బుద్ధి । బలమున నిన్నుఁ బెంపొలయఁ బొందెఁ;**
**బరువడి దక్షిణ పశ్చిమోత్తర పూర్వ । దేశస్థులయిన మహీశులెల్ల**

**తే. నీక యరిగాపులై; రిప్డు నిఖిలజలధి । శైలకాననద్వీపవిశాల మైన**
**మహి సమస్తంబు నేలుము మహిమ యెసఁగ । లీల నింద్రుండు సురలోక మేలు నట్లు. 345**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= ఓ రాజా (దుర్యోధన మహారాజా!) పాలిత శౌర్యులు= గొప్ప శౌర్యవంతులు; పాండవేయులు= పాండవులు; దుఃఖ శీలురు+ఐ= కష్టాలను అనుభవించే స్వభావం కలవారై; అడవుల పాలు+పడిరి= అరణ్యాలలో నివసించ వలసి వచ్చింది; తొల్లి= పూర్వం; ఇంద్రప్రస్థపురమునన్= ఇంద్రప్రస్థం అనే నగరంలో; ధర్మనందనుపాలన్= ధర్మపుత్రుని సమక్షంలో; పేర్మితోడన్= అతిశయం తోడ; శోభిల్లుచున్న= విలసిల్లుతున్న; విశ్రుత లక్ష్మి= కీర్తికెక్కిన సంపద; నీ బుద్ధి బలమునన్= నీ యొక్క తెలివితేటలవలన; నిన్నున్= నిన్ను; పెంపు+ఒలయన్= గొప్పతనం ఏర్పడేటట్లుగా; పొందెన్= చెందింది; పరువడిన్= క్రమంగా; దక్షిణ, పశ్చిమ+ఉత్తర+పూర్వ దేశస్థులు+అయిన= దక్షిణం, పడమర, ఉత్తరం, తూర్పు దేశాలలో ఉన్న; మహీ+ఈశులు= రాజులు; ఎల్లన్= అందరును; నీకున్+అ= నీకే; అరిగాపులు+ఐరి= సామంతులు (కప్పం చెల్లించే తాబేదారులు) అయ్యారు; ఇప్డు= ఇపుడు; నిఖిల, జలధి, శైల, కానన, ద్వీప, విశాలము+ఐ= సమస్తమైన సముద్రాలు, పర్వతాలు, అడవులు, దీవులతో విరివి అయిన; మహి సమస్తంబున్= భూమిని అంతటిని; మహిమ+ఎసఁగన్= గొప్పతనం విలసిల్లేటట్లుగా; లీలన్= ఆటగా; ఇంద్రుండు= వేల్పుల దొర; సురలోకమున్= స్వర్గసీమను; ఏలునట్లు= పరిపాలించేటట్లు; ఏలుము= పరిపాలించుము.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధన మహారాజా! పరాక్రమ ప్రాభవాలు చూపినట్టి పాండవులు తమ శౌర్యాన్ని అదుపులో పెట్టుకొని కష్టాలను అనుభవిస్తూ అడవులలో వసిస్తున్నారు. అలనాడు ఇంద్రప్రస్థపురంలో ధర్మనందనుడి సమక్షంలో వెల్లివిరిసిన సుప్రసిద్ధ సంపద నేడు నీ తెలివితేటలవలన నిన్ను వరించింది. నేల నాలుగుచెరగులలోని రాజులు ఉత్తరం, దక్షిణం, తూర్పు, పడమర, దిక్కులలో ఉండే రాజులు నీకు కప్పం చెల్లించి నీ ఆధిపత్యాన్ని అంగీకరించే సామంతులుగా ఉన్నారు. విస్తారమైన సముద్రంతో పర్వతాలతో అడవులతో దీవులతో సువిశాలమైన ఈభూమండల మంతటిని దేవేంద్రుడు స్వర్గలోకాన్ని ఏలుకొనేటట్లు సార్వభౌముడవై పరిపాలించుము.

### కర్ణ శకుని దుర్యోధనులు మంతనంబు సేయుట (సం. 3-226-9)

**ఉ. జానపదుల్ పురీజనులు సంతతముం బ్రమదం బెలర్ప నీ**
**దైన శుభోదయంబ హృదయంబులఁ గోరుచునున్నవారు; స**
**మ్మానము నొంది కౌరవసమాజము నిన్ను భజింప భూరితే**
**జోనిధి వై వెలింగెదవు సూర్యుని చాడ్పున నీవ యిమ్మహిన్. 346**

**ప్రతిపదార్థం:** జానపదుల్= జనపదాలలో అనగా పల్లెటూళ్ళలో నివసించే ప్రజలు; పురీజనులు= పట్టణాలలో నివసించే ప్రజలు; సంతతమున్= ఎల్లప్పుడును; ప్రమదంబు+ఎలర్పన్= సంతోషం అతిశయించేటట్లుగా; నీది+ఐన= నీ యొక్క; శుభ+ఉదయంబు+అ= మేలుకలగటాన్నే; హృదయంబులన్= మనసులలో; కోరుచున్+ఉన్నవారు= కాంక్షిస్తున్నారు; సమ్మానమున్+ఒంది= గౌరవాన్ని పొంది; కౌరవ, సమాజము= కౌరవ వంశంలోనివారు; నిన్నున్; భజింపన్= ఆరాధించగా; భూరి, తేజస్+నిధివి+ఐ= గొప్పదైన వెలుగుకు నెలవైనవాడవై; సూర్యుని చాడ్పునన్= సూర్యుడి మాదిరిగా; నీవు+అ= నీవే; ఈ+మహిన్= ఈ భూలోకంలో; వెలింగెదవు= ప్రకాశిస్తావు.

**తాత్పర్యం:** నీ పరిపాలన పట్టణాలలో ఉండేవారికి మాత్రమే కాక పల్లెటూళ్లలో ఉండే ప్రజలకు కూడ నచ్చింది. అన్నివర్గాలకూ చెందిన అశేషప్రజానీకం నీ యొక్క అభ్యుదయాన్నే కోరుతున్నారు. ఈ విధంగా సమస్త ప్రజల అభిమానాన్నీ చూరగొని గౌరవానికి పాత్రుడవైన నీవు దేవేంద్రుడు స్వర్గలోకాన్ని ఏలుకొనేటట్లుగా ఈ భూమండలాన్ని సార్వభౌముడవై పరిపాలించుము. కౌరవవంశానికి చెందినవారందరు నిన్ను ఆరాధించగలరు. నీవు దేదీప్యమానంగా ఆకసాన ప్రకాశించే సూర్యుడివలె భూమండలంలో వెలుగొందగలవు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. పాండవు లిప్పుడు పరమదుఃఖార్తు లగుచు ద్వైతవన సరోవర సమీపంబున నున్నవా రని వింటిమి; నీవు సకల సామ్రాజ్యవిభవంబు మెఱసి చని, యందు నీ తేజంబు ఘర్మసమయంబునాఁటి తపనుతేజంబై పగతుర కన్నులు గమర, నతిదుస్సహం బగు నట్లుగాఁజేయుము; దొల్లి నహుషపుత్త్రుం డయిన యయాతియుం బోలె నుజ్జ్వలుండ వై యున్న నిన్నుం జూచి, పాండవులు హృదయఖేదంబుగా వగచెదరు; మిత్త్రజన మోదంబును శత్త్రుజన ఖేదంబునుం గదా సంపదలకుం దగియెడు ఫలంబు. 347**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు= ఈ సమయంలో పాండవులు= పాండురాజ నందనులు; పరమ, దుఃఖ+ఆర్తులు+అగుచున్= మిక్కుటమైన కష్టాలచేత దైన్యాన్ని చెందినవారు ఔతూ; ద్వైత, వన, సరోవర, సమీపంబునన్= ద్వైతం అనే పేరు కల అడవిలో

ఉన్న కొలను దగ్గర; ఉన్నవారు+అని= నివసిస్తున్నారు అని; వింటిమి= విన్నాం; నీవు సకల, సామ్రాజ్య, విభవంబు= సమస్త మైన గొప్ప ప్రభుత్వ సంపద; మెఱసి= ప్రకాశింపజేసి; చని= వెళ్ళి; అందున్= అచట (ఆ ద్వైతవనంలో); నీ తేజంబు= దేదీప్యమాన మైన నీ వెలుగు; ఘర్మ సమయంబు నాఁటి= వేసవికాలంలోని; తపను తేజంబు+ఐ= సూర్యుడి యొక్క గొప్ప కాంతి అయి; పగతుర కన్నులు= శత్రువుల నేత్రాలు; కమరన్= మాడిపోయేటట్లుగా; అతి దుస్సహంబు+అగునట్లుగాన్= మిక్కుటమై భరించ శక్యం కానట్టిదిగా; చేయుము; తొల్లి= పూర్వం; నహుష పుత్త్రుండు+అయిన= నహుషుడి కొడుకు అయిన; యయాతియున్+పోలెన్= యయాతివలె; ఉత్+జ్వలుండవు+ఐ= గొప్పగా ప్రకాశించేవాడవై; ఉన్న= ఉండిన; నిన్నున్+ చూచి; పాండవులు; హృదయ ఖేదంబుగాన్= మనస్సుకు దుఃఖం కలిగేటట్లుగా; వగచెదరు= దుఃఖిస్తారు; మిత్ర, జన, మోదంబును= స్నేహితులకు సంతోషం; శత్రు, జన ఖేదంబును= విరోధులకు దుఃఖం; కదా= (కలిగించటమే సుమా); సంపదలకున్= ఐశ్వర్యానికి; తగియెడు= తగినట్టి; ఫలంబు= ప్రయోజనం.

**తాత్పర్యం:** ఈ సమయంలో పాండవులు మిక్కిలి కష్టాలను అనుభవిస్తూ దైన్యంతో ద్వైతవనంలో ఒక కొలను దగ్గర నివసిస్తున్నారు అని విన్నాం. నీవు ఇప్పుడు సార్వభౌముడవై గొప్ప సామ్రాజ్యాన్ని ఏలుకొంటూ భోగభాగ్యాలతో తులదూగుతున్నావు. ఇప్పుడు నీవు అక్కడికి సపరివారంగా వెళ్ళి, మండువేసవిలో ప్రకాశించే సూర్యుడిమాదిరిగా వారికి నీతేజస్సు చాటి చూపుము. అలనాడు నహుషచక్రవర్తి కుమారుడైన యయాతివలె దేదీప్యమానంగా వెలుగొందే నిన్ను చూచి పాండవులు హృదయాలలో మిక్కిలి దుఃఖిస్తారు. మిత్రులను సంతోషపెట్టటం, శత్రువులను పరితపింపచేయటమే కదా సంపదలు కలిగినందుకు ఫలం.

**విశేషం:** అలం: ఉపమ, రూపకం.

**క.** **ధన ధాన్య పుత్త్ర బాంధవ। జనలాభంబులును దలఁప సరిగావు సుఖం**
**బునఁ దాను దనరి శత్రులు। ఘనతర దుఃఖముల నుండఁ గని యలరుటకున్.** **348**

**ప్రతిపదార్థం:** తలఁపన్= ఆలోచన చేసి పరిశీలించగా; ధన, ధాన్య, పుత్త్ర, బాంధవ, జన లాభంబులును= ధనం, పంటగింజలు, కొడుకులు, చుట్టాలు సమృద్ధిగా ప్రాప్తించటమున్నూ; తాను= తను; సుఖంబునన్= సౌఖ్యంగా; తనరి= విలసిల్లి; శత్రులు= విరోధులు; ఘన, తర, దుఃఖములన్= మిక్కిలి ఎక్కువైన కష్టాలలో; ఉండన్= ఉండగా; కని= చూచి; అలరుటకున్= సంతసించటానికి; సరిగావు= సమానం కావు.

**తాత్పర్యం:** తనకు ధనం ఉండవచ్చును. ధాన్యాలు ఉండవచ్చును. బంధువులు తనతో సహకరించవచ్చును. ఇది గొప్ప సంతోష యోగం కాదు. తాను సౌఖ్యాలతో విలసిల్లుతున్నప్పుడు తన విరోధులు మిక్కుటమైన వెతలను అనుభవించగా చూడటమే అచ్చమైన సంతోషయోగం. తనకు కలిగే మేలుకంటె శత్రువులకు కలిగే కీడు మాత్రమే అచ్చమైన ఆనందాన్ని కల్గిస్తుంది.

**ఉ.** **నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులో విప**
**ద్భారము నొంది వందురిన ఫల్గును నుజ్జ్వలరాజ్యవైభవో**
**దారులమై కనుంగొని ముదంబునఁ బొందఁగఁ గాంచుకంటె నిం**
**పారఁగ నొండు గల్గునె కృతార్థత యెందును గౌరవేశ్వరా!** **349**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా!= కౌరవకులానికి అధిపతివి అయినవాడా, దుర్యోధనా!; నారలు= పీచుతో అల్లబడిన వస్త్రాలు; కట్టి= ధరించి; కూరలు= శాకాలు; అశనంబుగన్= తిండిగా; ఉగ్రవనంబులోన్= భయంకరమైన అడవిలో; విపత్+భారమున్= ఆపదల యొక్క బరువును; ఒంది= అనుభవించి; వందురిన= దుఃఖించిన; ఫల్గునున్= అర్జునుడిని; ఉత్+జ్వల, రాజ్య, వైభవ+ఉదారులము+ఐ= మిక్కిలి వెలుగొందే ప్రభుత్వ సంపదచేత గొప్ప వారలమయి; కనుంగొని= చూచి; ముదంబునన్= సంతోషాన్ని; పొందఁగన్, కాంచు కంటెన్= పొందేటట్లు చూడటంకంటె; ఇంపు+ఆరఁగన్= సంప్రీతిని చెందేటట్లుగా; ఒండు= వేరొకటి; కృతార్థత= ధన్యత్వం; ఎందును= ఎచట నైనను; కల్గును+ఎ= ఉంటుందా?

**తాత్పర్యం:** కౌరవులకు అధినేత వయిన ఓ దుర్యోధన సార్వభౌమా! సుకుమారసుందర మైన జిలుగు పట్టుపుట్టాలు కాక, ముదుక నారచీరలు ధరించి భయంకరమైన అడవిలో నివసిస్తూ, కందమూలఫలాలు భక్షిస్తూ నికృష్ట జీవితాన్ని గడుపుతున్నాడు అర్జునుడు. ఇక మనమా, దేదీప్యమానంగా వెలుగొందే భోగభాగ్యాలను అనుభవిస్తున్నవారం. మనం ఇప్పుడు అర్జునుడి దైన్యాన్ని కనులారా చూడటం కంటె మన జీవితాలకు ఇంకొక ధన్యత్వం కల్గుతుందా?

**తే.** **అతుల సౌభాగ్య పుణ్య సమగ్ర గరిమ । నొప్పుచున్న నీ దేవుల యొప్పు సూచి**
**ధృతి దఱిఁగి తన్నుఁ దాన నిందించు కొనుచు । హృదయమునఁ బాండవాంగన యెరియ వలదె!' 350**

**ప్రతిపదార్థం:** పాండవ+అంగన= పాండవుల భార్య అయిన ద్రౌపది; అతుల, సౌభాగ్య, పుణ్య, సమగ్ర, గరిమన్= సాటిలేని సంపదయొక్కయు సుకృతంయొక్కయు సంపూర్ణమైన గొప్పతనంచేతను; ఒప్పుచున్న= విలసిల్లుతున్న; నీ దేవుల+ఒప్పు= నీ రాణుల శోభ; చూచి; ధృతి+తఱిఁగి= ధైర్యం కోలుపోయి; తన్నున్+తాన్+అ= తనను తానే; నిందించుకొనుచున్= తిట్టుకొంటూ; హృదయమునన్= డెందంలో; ఎరియన్ వలదె?= కుమిలి పోవలదా?

**తాత్పర్యం:** నీ రాణులు సాటిలేని సంపదలతో భోగభాగ్యాలతో అలరారుతుండటం చూచి, ధైర్యాన్ని కోలుపోయి తనను తాను నిందించుకొంటూ పాండవుల భార్య అయిన ద్రౌపది తన దురవస్థకు మనసులో లోలోన (దుఃఖిస్తూ) కుమిలిపోవాలి సుమా!'

**వ.** **అనిన నిది వోలు నని నాగకేతనుండు సంప్రీతుం డై కొండొక విచారించి, రాధేయుం జూచి యిట్లనియె.351**

**ప్రతిపదార్థం:** అనినన్= అని కర్ణు డనగా; నాగకేతనుండు= సర్పము ధ్వజ చిహ్నంగా గలవాడు- దుర్యోధనుడు; ఇది= ఈ నీమాట; పోలున్+అని= తగునని; సంప్రీతుండు+ఐ= మిక్కిలి సంతృప్తి చెందినవాడై; కొండొక= ఇంచుక; విచారించి= ఆలోచించి; రాధేయున్= కర్ణుడిని; చూచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని కర్ణుడు చెప్పాడు. ఆ మాటలు విని నాగకేతను డైన దుర్యోధనుడు మిక్కిలి సంతృప్తి చెందిన వాడై, కొంత ఆలోచించి, కర్ణుడికి ఈ విధంగా ప్రత్యుత్తరం చెప్పాడు.

**క.** **'నా తలఁపును నిట్టిది; నీ । వేతెఱఁ గెఱిఁగించి తది యభీష్టము; మన మా**
**ద్వైతవనంబున కరుగుట । భూతలపతి యనుమతింపఁ బోలదు మదిలోన్. 352**

**ప్రతిపదార్థం:** నా తలఁపునున్= నా ఆలోచన కూడా; ఇట్టిది= ఇటువంటిదే; నీవు= నీవు; ఏతెఱఁగు= ఏ మార్గం; (ఎటువంటి అనువైన ఉపాయం); ఎఱిఁగించితి= తెలిపావో; అది= (మన ఐశ్వర్య ప్రదర్శనం); అభీష్టము= మిక్కిలి ఇష్టమైనది; మనము;

ఆ ద్వైత వనంబునకున్= ఆ ద్వైతం అనే పేరు గల అడవికి; అరుగుట= వెడలుట; భూతలపతి= రాజు (ధృతరాష్ట్ర ప్రభువు); మదిలోన్= మనస్సులో; అనుమతింపన్+పోలదు= అంగీకరించటానికి వీలు కాదు (అంగీకరించడు).

**తాత్పర్యం:** నా అభిప్రాయం కూడా ఇటువంటిదే సుమా! నీవు సరి అయిన ఉపాయాన్ని సూచించావు. నీవు చెప్పిన మాటలు నాకు మిక్కిలి ఇష్టము లైనవి. కాని, మనం ద్వైతవనానికి వెళ్ళటానికి ప్రభువైన ధృతరాష్ట్రుడు అంగీకరించజాలడు.

**తే. అందుఁ బాండవు లుండుట యాంబికేయుఁ। డెఱుఁగు; మన మవ్వనంబున కేఁగుటయును**
**గడఁగి పార్థులతోడి విగ్రహము కొఱక। యని యవశ్యంబు వారించు నతఁడు మనల. 353**

**ప్రతిపదార్థం:** అందున్= దానిలో, ఆద్వైతవనంలో; పాండవులు+ఉండుట= పాండురాజు నందనులు నివసించటం; ఆంబికేయుఁడు = అంబిక కొడుకు - ధృతరాష్ట్రుడు; ఎఱుఁగున్= తెలియును; మనము= మనం; ఆ+వనంబునకున్= ఆ అడవికి (ద్వైత వనానికి); ఏగుటయును= వెళ్లటమున్నూ; కడఁగి= పూని; పార్థులతోడి= కుంతీకుమారులతోడి; విగ్రహము కొఱకున్+అ= కయ్యానికి మాత్రమే; అని= అని చెప్పి; అవశ్యంబున్= తప్పకుండా; అతఁడు= (ఆ ధృతరాష్ట్రుడు); మనలన్= మనలను, వారించున్= అడ్డగిస్తాడు.

**తాత్పర్యం:** ఆ ద్వైతవనంలో పాండవులు ప్రస్తుతం నివసిస్తున్న సంగతి, మహారాజు ధృతరాష్ట్రుడికి తెలియును. ఇప్పుడు మనం ఆ ద్వైతవనానికి విహారయాత్రకు వెళ్ళటం, పాండవులతో కయ్యానికి కాలు దువ్వటమే ఔతుందని ఆయన తలపోసి మనలను అక్కడకు వెళ్ళటానికి అనుమతించడు అని నా భయం.

**వ. అదియునుం గాక. 354**

**తాత్పర్యం:** అంతేకాక.

**ఉ. ఉరుతరవిక్రమాఢ్యు లనియున్ మహనీయతపోవిశేష సు**
**స్థిరు లనియుం బృథాసుతుల దిక్కునఁ దద్దయు భీతుఁ డై నిరం**
**తరమును మానవేంద్రుఁ డెదఁ దాపము నొందుచునుండు; వింటె? యి**
**క్కురువిభుఁ డింతసేపు గడుఁ గూర్చి విలాపము సేసె వారికిన్. 355**

**ప్రతిపదార్థం:** ఉరుతర, విక్రమ+ఆఢ్యులు+అనియున్= మిక్కిలి గొప్ప దైన శౌర్యం కలవారు అనిన్నీ; మహనీయ, తపస్+విశేష, సుస్థిరులు+అనియున్= గొప్పది సాటిలేనిది అయిన తపస్సు చేయుటం చేత లభించిన నిలుకడ కలవారు అనిన్నీ; పృథా, సుతుల, దిక్కునన్= కుంతీకుమారుల యెడ; తద్దయున్= మిక్కిలి; భీతుఁడు+ఐ= భయపడినవాడై; నిరంతరమును= ఎల్లప్పుడున్నూ; మానవ+ఇంద్రుఁడు= మనుజులలో ఇంద్రుడు అనగా ప్రభువు ధృతరాష్ట్రుడు; ఎదన్= హృదయంలో; తాపమున్= కష్టం; ఒందుచున్+ఉండున్= అనుభవిస్తుంటాడు; వింటె? (వింటి+ఎ?)= విన్నావా?; ఈ+కురు విభుఁడు= ఈ కురువంశానికి చెందిన రాజు ధృతరాష్ట్రుడు; ఇంత సేపు= ఇంత సమయం; వారికిన్= వారి యెడల; పాండవుల యెడ; కడున్+కూర్చి= మిక్కిలి అనుసంధించి; విలాపము+చేసెన్= దుఃఖించాడు.

**తాత్పర్యం:** అంతమాత్రమేకాక, ధృతరాష్ట్రుడికి పాండవులన్న మిక్కిలి భయం ఏర్పడింది. పాండవులు సాటిలేని శౌర్యం కలవారనీ, గొప్పదైన తపస్సు చేసి, మిక్కుటమైన స్థైర్యాన్ని ఆర్జించారనిన్నీ ఎల్లప్పుడు కౌరవవంశ నేత

అయిన ధృతరాష్ట్ర మహారాజు తన డెందంలో దుఃఖిస్తూ ఉంటాడు. వినలేదా? ఇంతసేపటివరకు ఆయన పాండవుల శౌర్యధైర్యాలనుగూర్చి ఉగ్గడిస్తూనే ఉన్నాడు గదా!

**వ. అతనియొద్ద నుండి విదురుండును వారిన పెట్టుచోటు గానక పొగడుచుండు; జూదంబు నాఁట నుండియు విదురుండు పాండవపక్షపాతి యగుట దెల్లం బయ్యె; మన విచారించిన యిక్కార్యంబు చిన్నసన్న యెఱింగె నేనియు నాతం డెల్లభంగుల విఘ్నంబు సేయుం గావున నిది యంతయు రహస్యంబుగా నొనరించుకొని, ధృతరాష్ట్రుండు దీని కనుమతించు తెఱం గెయ్యది యట్టి యుపాయంబు నీవును శకునియు నూహించు నది; మనము రేపకడ వచ్చి కురుపితామహుం డైన భీష్మునిఁ గురువంశోత్తముం డయిన ధృతరాష్ట్రుని నొడంబఱిచి, వెడలుద' మని వారి వీడ్కొలిపి దుర్యోధనుం డభ్యంతరగృహంబున కరిగి, యా రాత్రి సముచిత ప్రకారంబునఁ గడపెఁ; బ్రభాతం బగుటయుఁ గర్ణుండు దుర్యోధనుకడకుం జని యిట్లనియె. 356**

**ప్రతిపదార్థం:** విదురుండును= విదురుడును; అతని యొద్దన్+ఉండి= (ఆ ధృతరాష్ట్రుడి కడ ఉండి); పెట్టుచోటు+కానక= తనకు కూడుపెట్టే చోటని కూడా గమనించకుండా; వారిన్+అ= వారినే, ఆ పాండవులనే; పొగడుచుండున్= ప్రశంసిస్తూ ఉంటాడు; జూదంబు, నాఁటన్+ఉండియున్= జూదం జరిగినరోజునుండి; విదురుండు; పాండవ, పక్షపాతి+అగుట= పాండవుల యందు ఎక్కువ ప్రీతి కలవాడు కావటం; తెల్లంబు+అయ్యెన్= స్పష్టం అయింది; మన విచారించిన= మనం ఆలోచించిన; ఈ+కార్యంబు= ఈ పని; చిన్న సన్న= చిన్న గుర్తు; ఎఱింగెన్+ఏనియున్= తెలిసికొన్నప్పటికీ; ఆతండు= ఆ విదురుడు; ఎల్లభంగులన్= ఎల్ల విధాల; విఘ్నంబు+చేయున్= ఆటంకం కల్పిస్తాడు; కావునన్= కాబట్టి, ఇది+అంతయున్= మన ఆలోచన అంతా; రహస్యంబుగాన్= ఎవరికి తెలియకుండా ఉండేటట్లుగా; ఒనరించుకొని= ఏర్పరచుకొని; ధృతరాష్ట్రుండు; దీనికిన్= మనం ఏర్పరచుకొన్న కార్యానికి; అనుమతించు తెఱంగు= అంగీకరించే మార్గం; ఎయ్యది= ఏదో; అట్టి= అటువంటి; ఉపాయంబు= వెరవు; నీవును= ఓ కర్ణా నీవును; శకునియున్= శకునియు; ఊహించునది= యోచన చేయండి; మనము= మనం (నేను నీవు శకునియున్నూ); రేప కడ= ఉదయాన్నే; వచ్చి= అరుదెంచి (కొలువు కూటానికి ఏగుదెంచి); కురు పితామహుండు+అయిన, భీష్మునిన్= కురు వంశానికి తాతగారు అయిన భీష్ముడిని; కురు, వంశ+ఉత్తముండు+అయిన= కురువంశంలో శ్రేష్ఠుడు, ప్రభువు అయిన; ధృతరాష్ట్రుని; ఒడంబఱిచి= అంగీకరింపజేసి; వెడలుదము= వెళ్ళుదాము; అని= అని వచించి; వారిన్= కర్ణశకునులను; వీడ్కొలిపి= సాగనంపి; దుర్యోధనుండు= సుయోధనుడు; అభ్యంతర గృహంబునకున్= అంతఃపురంలోకి; అరిగి= వెళ్లి; ఆ+రాత్రి= ఆరేయి; సముచిత ప్రకారంబునన్= తగిన రీతిని; కడపెన్= వెళ్ళబుచ్చాడు; ప్రభాతంబు+అగుటయున్= తెల్లవారుటయున్నూ; కర్ణుండు; దుర్యోధను కడకున్+చని= సుయోధనుని దగ్గరకు వెళ్లి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడికి పాండవులంటే భయం. ఆ మహారాజు కడ మంత్రిగా ఉన్న విదురుడు కుడిచే కూడు కౌరవులది. కాని, అతడి అభిమానం మాత్రం పాండవులపై ఉంటుంది. విదురుడి పాండవ పక్షపాతం జూదం జరిగిన రోజునే ఎల్లరకు తేటతెల్ల మయింది. అతడు ఎల్లప్పుడును పాండవులను ప్రశంసిస్తూనే ఉంటాడు. ఆతడికి మన ఆలోచన ఏ మాత్రం పొక్కినప్పటికిన్నీ ఇక మనకు ఆతడు ఆటంకాలు కల్పించటం తథ్యం. అందుచేత మనం రహస్యంగా మనపని నెరవేర్చుకొనవలసి ఉన్నది. ధృతరాష్ట్రుడు మన ఆలోచనకు ఏ రీతిగా సమ్మతిస్తాడా? అని ఆలోచించి దానికి తగిన ఉపాయం కనిపెట్టాలి. అట్టి వెరవును నీవును శకునియు ఆలోచించండి. మనము రేపు ఉదయం తిరిగి కొలువుకూటానికి చేరి కురువంశపితామహుడు అయిన భీష్ముడిని, కురువంశ శ్రేష్ఠుడైన ధృతరాష్ట్రుడిని, అంగీకరింపజేసి, ద్వైతవనవిహారయాత్రకు వెడలుదాము' అని చెప్పి దుర్యోధనుడు అంతఃపురానికి అరిగి ఆ రేయి

యథోచితకృత్యాలతో గడిపాడు. మరునాడు తెల్లవారిన పిమ్మట కర్ణుడు దుర్యోధనుడి కడకు వెళ్ళి ఈ విధంగా పలికాడు.

**ఉ. 'భూతలనాథ! యే నొకటి పోల నుపాయము గంటి; నిప్పు డా**
**ద్వైతవనంబునందు విదితంబుగ నున్నవి గో కదంబముల్;**
**ప్రీతిగఁ దద్విలోకనము పేరఁ జనం దగు; ధారుణీశ్వరుం**
**డీతెఱఁ గైనఁ బొమ్మనును; నభీష్టముఁ జేకుఱు నెల్లభంగులన్'. 357**

**ప్రతిపదార్థం:** భూతలనాథ!= భూమికి భర్తైన ఓ రాజా! ఓ సుయోధనా!; ఏను= నేను; ఒకటి= ఒకటి; పోలన్+ఉపాయము= సరిపడే వెరవును; కంటిన్= కనుగొన్నాను; ఇప్పుడు= ఈ సమయంలో; ఆ ద్వైత వనంబునందున్= ద్వైతం అనే పేరు కల ఆ అడవిలో; గో, కదంబముల్= ఆవుల మందలు; విదితంబుగన్= విస్పష్టంగా; ఉన్నవి= ఉన్నాయి; ప్రీతిగన్= సంతృప్తిగా; తద్+విలోకనము, పేరన్= వాటిని (ఆ ఆవుల మందలను) చూడటం అనే నెపం చొప్పున; చనన్+తగున్= వెళ్ళవచ్చును; ధారుణీ+ఈశ్వరుండు= భూమికి భర్తఅయిన - ధృతరాష్ట్రుడు; ఈ తెఱఁగు+ఐనన్= ఈ విధం అయితే; పొమ్ము+అనున్= మనం పోవటానికి అనుమతిస్తాడు; అభీష్టము= (మన) కోరిక; ఎల్ల భంగులన్= అన్ని విధాలా; చేకుఱున్= నెరవేరుతుంది.

**తాత్పర్యం:** 'ఓ సుయోధన మహారాజా! నాకు సరైన ఒక మంచి ఉపాయం స్ఫురించింది. ఈ సమయంలో ఆ ద్వైతవనంలో మన ఆవులమందలు ఉన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే కదా. ఆ ఆవులమందలను చూడటం కొరకై మనం ద్వైతవన విహారయాత్రకు వెళ్ళుతున్నట్లు ప్రకటిస్తే ధృతరాష్ట్ర మహారాజు అంగీకరించగలడు. ఎవ్వరూ అనుమానించటానికి ఎట్టి ఆస్కారమూ ఉండదు. ఈ విధంగా మన కోరిక ఈడేర గలదు.'

**క. నా విని సుబల తనూజుఁడు । 'దేవా! నీ యాన, యేను దెల్లంబుగ రే**
**యీ వెఱవె నెమ్మనమ్మున । భావించితి' ననియె; నంతఁ బ్రహసితముఖులై. 358**

**ప్రతిపదార్థం:** నాన్= అని చెప్పగా; విని= ఆలకించి; సుబల తనూజుఁడు= సుబలుడి కొడుకు (శకుని); దేవా!= ఓ దుర్యోధన మహారాజా! ; నీ+ఆన= నీ మీద ఒట్టు సుమా; ఏను= నేను; తెల్లంబుగన్= స్పష్టంగా; రే= రాతిరి; ఈ వెఱవు+ఎ= ఈ ఉపాయాన్నే; నెమ్మనమునన్= నిండు మనస్సులో; భావించితిన్= తలపోశాను; అనియెన్= అని చెప్పాడు. అంతన్= పిదప; ప్రహసిత ముఖులు+ఐ= నవ్వు మొగాలు కలవారై.

**తాత్పర్యం:** అని కర్ణుడు చెప్పగా ఆలకించి సుబలుడి కొడుకైన శకుని ఉప్పొంగిన సంతోషంతో, 'ఓ దుర్యోధన మహారాజా! నీ మీద ఒట్టుపెట్టి చెప్పుతున్నాను. కర్ణుడు ఇప్పుడు చెప్పిన ఉపాయమే ఈ రాత్రి నాకు తట్టింది. నిండుమనసుతో నేను కర్ణుడి ఆలోచనతో ఏకీభవిస్తున్నాను' అని వచించాడు. అంతట నవ్వులు చిందుతున్న ముఖాలతో వారు. (తరువాతి వచనంలో అన్వయం).

**వ. ఒండొరుల చెయి సఱచి నవ్వుచు నమ్మువ్వురుం దత్‌క్షణంబ సమంగ నామధేయుం డయిన గోపాలకు నొక్కనిం గఱపికొని ధృతరాష్ట్రుపాలికిం దోడ్కొని సముచిత ప్రసంగ సేవా విశేషంబుల నమ్మహీవిభు సుముఖుం జేసి యనంతరంబ 'దేవా! ద్వైతవనంబు నందుల కీలారంబుననుండి వీఁడె యొక్క గోపకుండు వచ్చె' ననిన, నతండును వాని కభిముఖుండై పసుల సేమం బడుగుటయు వాఁ డిట్లనియె. 359**

**ప్రతిపదార్థం:** ఒండు+ఒరులు= ఒకరినొకరు; చెయి+చఱచి= చేతులు కలిపి ధ్వనిని చేసి; నవ్వుచున్= నవ్వుతూ; ఆ+ముప్వురున్= ఆ ముగ్గురును (దుర్యోధనుడు, శకుని, కర్ణుడును); తద్+క్షణంబు+అ= ఆ క్షణంలోనే; సమంగ, నామధేయుండు+అయిన= 'సమంగుడు' అనే పేరు కలిగినట్టివాడిని; గోపాలకున్= గొల్లవాడిని; ఒక్కనిన్= ఒకడిని; కఱపికొని= ప్రబోధం చేసి (ఏ విధంగా ప్రవర్తించవలెనో చెప్పి చూపి); ధృతరాష్ట్రుపాలికిన్= ధృతరాష్ట్రుడి కడకు; తోడ్కొని= తీసికొని వెళ్లి; సముచిత, ప్రసంగ, సేవా, విశేషంబులన్= అప్పటికి సరిపడే సంభాషణలతో రాచమర్యాదలచేత; ఆ+మహీ విభున్= ఆ రాజును (ధృతరాష్ట్రుడిని); సుముఖున్+చేసి= (తమకు) అనుకూలుడిగా చేసికొని; అనంతరంబు+అ= అటు పిమ్మటనే; దేవా!= ఓ మహారాజా! ధృతరాష్ట్ర ప్రభూ! ద్వైతవనంబు, నందుల, కీలారంబున నుండి= ద్వైతం అనెడి అడవిలోని గొల్లల ఆలమంద నుండి; వీఁడు+ఎ= సమంగుడు అనే పేరుగల; ఒక్క= ఒక; గోపకుండు= గొల్లవాడు; వచ్చెన్= అరుగుదెంచాడు; అనినన్= అని చెప్పగా; అతండును= ఆ ధృతరాష్ట్రుడును; వానికిన్= ఆ గొల్లవాడికి; అభిముఖుండు+ఐ= ఎదురుగా మొగాన్ని పెట్టినవాడై; పసుల సేమంబు= పశువుల (ఆవుల) క్షేమాన్ని; అడుగుటయున్= ప్రశ్నించటమున్నూ; వాఁడు= ఆ గోపాలుడు (సమంగుడు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** కర్ణుడు సూచించిన ఉపాయం దుర్యోధనుడికీ శకునికీ నచ్చింది. అంతట సంతోషంతో వారు ముగ్గురును ఉప్పొంగిన సంతోషంతో అన్యోన్యకరచాలనాలు చేసికొన్నారు. వెనువెంటనే వారు సమంగుడు అనే పేరు కల ఒక గొల్లవాడిని కలిసికొని వాడికి ధృతరాష్ట్రుడి కడ ఏ విధంగా మాటాడవలెనో ఏ విధంగా నటించవలెనో చక్కగా నేర్పి కొలువుకూటానికి తోడ్కొనిపోయారు. అక్కడ మొదట ఈ విషయాన్ని ప్రస్తావించక, తగిన రీతిని సంభాషించి, రాచమర్యాదలు నెరపి, ధృతరాష్ట్రుడిని ప్రసన్నుడిని కావించుకొని, తదుపరి 'మహాప్రభూ! ద్వైతవనంలో ఉన్న మన ఆవులమందనుండి ఒక గొల్లవాడు దేవర దర్శనార్థం వచ్చాడు. ఇడుగో! ఇతడే, అవధరించండి' అని చెప్పారు. అంతట- ధృతరాష్ట్రుడు ఆ గోపాలకుడి దిక్కు మొగం పెట్టి, ఆవులక్షేమాన్నిగూర్చి ప్రశ్నించాడు. అంతట ఆ గోపాలకుడు ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** సమంగు డనే గొల్లవాడు అసలు ద్వైతవనంలోని పసులమంద కాపరులలో ఒకడు కాడు. అతడికి కొలువుకూటంలో ధృతరాష్ట్రుడి సమక్షంలో ఎట్లా నటించవలెనో నేర్పారు దుర్యోధనుడు కర్ణుడు శకుని.

### కర్ణ సౌబలులు ధృతరాష్ట్రుచేత ఘోషయాత్ర కనుజ్ఞ గొనుట (సం. 3-227-2)

**ఉ. 'ద్వైతవనంబునట్టి సుఖవాసము గోవుల కెందు లేదు; ధా**
**త్రీతలనాథ! యిప్పుడు ప్రదీప్తములై సతతంబుఁ బేర్చి గో**
**వ్రాతభయంకరంబు లగు వాలుమృగంబులు సంచరించు; మీ**
**కా తెఱఁగెల్లఁ జెప్పుటకునై యిట వచ్చితి నేను జెచ్చెరన్.' 360**

**ప్రతిపదార్థం:** ధాత్రీతల నాథ!= ఓ మహారాజా! (ధృతరాష్ట్ర ప్రభూ!); ద్వైతవనంబు+అట్టి= ద్వైతమనే పేరు గల అడవి వంటి; సుఖవాసము= సౌఖ్యంతో కూడిన నివాసం; గోవులకున్= ఆవులకు; ఎందున్= ఎచటను ( మరి ఏ వనంలోను); లేదు= ఉండదు; ఇప్పుడు= ఈ సమయంలో; ప్రదీప్తములు+ఐ= విజృంభించి నట్టివై; సతతంబున్= ఎల్లప్పుడును; పేర్చి= చెలరేగి; గో, వ్రాత, భయంకరంబులు+అగు= ఆవుల సముదాయానికి భయాన్ని కలిగించేవి అయిన; వాలు మృగంబులు= పులి మొదలయిన క్రూర జంతువులు; సంచరించున్= తిరుగాడుతున్నాయి; మీకున్= (ఓ ధృతరాష్ట్ర ప్రభూ!) తమకు; ఆ

తెలుఁగు+ఎల్లన్= ఆ విషయ మంతటిని; చెప్పుటకున్+ఐ= విశదంగా వచించటానికై; ఏను= నేను; చెచ్చెరన్= శీఘ్రంగా; ఇట వచ్చితిన్= ఇక్కడకు వచ్చాను.

**తాత్పర్యం:** 'భూమిని అంతటిని పరిపాలించే ఓ ధృతరాష్ట్ర మహారాజా! ద్వైతవనంలో ఆవులు ఇంతవరకు సుఖంగా ఉన్నవి. అది ఆవులకు హాయి కల్గించే అడవి. కాని, ఇప్పుడు పరిస్థితి తారుమారయింది. అక్కడ ఇప్పుడు క్రూర జంతువులు విజృంభించి విచ్చలవిడిగా తిరుగాడుతూ, ఆవులకు భయం కలిగించి హాని చేస్తున్నవి. మీకు ఆ విషయాన్ని వివరించి విన్నవించుకొనటానికి నేను ఇక్కడికి వచ్చాను. ఇక ఆలస్యం కాకుండా ఆవులను కాపాడటానికై తాము సత్వరచర్య గైకొన వేడికోలు'.

**వ. అనిన యనంతరంబ కర్ణసౌబలులు ధృతరాష్ట్రుతోడ 'దేవా! యట్లయినం దడయక దుష్టమృగనాశనంబును, గోగణ సంరక్షణంబును జేయుటకు భవత్సూను దుర్యోధను నియోగింపు' మనిన నతండు గొండొకవిచారించి యి ట్లనియె. 361**

**ప్రతిపదార్థం:** అనిన+అనంతరంబు+అ= అని చెప్పిన పిమ్మటనే; కర్ణసౌబలులు= కర్ణుడు శకుని; ధృతరాష్ట్రుతోడన్= ధృతరాష్ట్రుడితో; దేవా!= ఓ మహాప్రభూ!; అట్లు+అయినన్= ఆ విధంగా జరిగితే; దుష్ట, మృగ, నాశనంబును= చెడ్డ జంతువుల యొక్క సంహారాన్ని; గోగణ సంరక్షణంబును= ఆవుల మందలకు గట్టి భద్రతను కల్పించటాన్ని; చేయుటకు; భవత్+సూనున్= నీ యొక్క కొడుకును; దుర్యోధనున్= సుయోధనుడిని; నియమింపుము= నియోగింపుము; అనినన్= అని చెప్పగా; అతండు= అతడు (ధృతరాష్ట్రుడు); కొండొక విచారించి= కొంతసేపు ఆలోచించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** గోపాలుడు ఆ విధంగా నివేదించిన వెనువెంటనే కర్ణుడును, సుబలుడి సుతుడైన శకునియు ధృతరాష్ట్రుడితో సమయానికి అతికేటట్లుగా ఇట్లా అన్నారు. 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! గోపాలుడు చెప్పిన మాటలు నిజాలే అని తలపోస్తున్నాం. కావున, గోవులను కాపాడటానికీ, క్రూరమృగాలను సంహరించటానికీ నీ కొడుకు దుర్యోధనుడిని నియోగించుము.' ఆ మాటలు వినిన పిదప ధృతరాష్ట్రుడు కొంత తడవు ఆలోచించి ఈ విధంగా అన్నాడు.

**మ. 'తగు గోరక్ష యొనర్ప, దుష్టమృగ విధ్వంసంబుఁ గావింప మే**
**లగు; నైనన్ వినుఁ డవ్వనాంతరమునం దాసక్తిమై నున్న వా**
**రు గరిష్ఠాత్ములు పాండురాజుతనయుల్, రూఢప్రతాపాఢ్యు; ల**
**ట్లగుటన్ మీ గమనంబు నామదిఁ బ్రియంబై తోఁప దెబ్బంగులన్. 362**

**ప్రతిపదార్థం:** గో, రక్ష+ఒనర్పన్= గోవులను కాపాడటం; తగున్= మంచిది; దుష్ట, మృగ, విధ్వంసంబున్= క్రూరజంతువుల వినాశం; కావింపన్= చేయటంవలన; మేలు+అగున్= శుభం కలుగుతుంది; ఐనన్= అయినప్పటికిని; వినుఁడు= ఆలకించండి; ఆ+వన+అంతరము నందున్= ఆ అడవి మధ్యలో; ఆసక్తిమైన్= అభిలాషతో; పాండురాజు తనయుల్= పాండవులు; గరిష్ఠ+ఆత్ములు= గొప్ప అంతరంగాలు గల మహానుభావులు; రూఢ, ప్రతాప+ఆఢ్యులు= ప్రసిద్ధికెక్కిన శౌర్యంతో కూడినవారు; ఉన్నవారు= ఉన్నారు; అట్లు+అగుటన్= అందుచేత (పాండవులు ఆ అడవిలో ఉండటం వలన); మీ గమనంబు= మీరు వెళ్ళటం (మీరు ఆ ద్వైతవనానికి వెళ్లటం); ఎబ్బంగులన్(ఏ+అంగులన్)= ఎన్ని విధాలుగా చూచినా; నామదిన్= నా మనస్సుకు; ప్రియంబు+ఐ= ఇష్టమై; తోఁపదు= కన్పించదు.

**తాత్పర్యం:** గోరక్షణం చేయటం మంచిదే. అది రాజులకు ముఖ్యమైన కర్తవ్యమే. క్రూరమృగాలను సంహరిస్తే తప్ప గోవులను కాపాడటానికి వీలు కాదు. ఆ మాట కూడా నిజమే. కాని, ఆ ద్వైతవనంలోనే పాండవులు అభిలాషతో నివసిస్తున్నారు. వారు మహానుభావులు. వారి శౌర్యం సుప్రసిద్ధమైనది, జగద్విదితమైనది, అనేక పరీక్షలలో విజయం సాధించినట్టిది. అందుచేత మీరు ఆ ద్వైతవనానికి వెళ్ళటం ఎన్నిరీతుల ఆలోచించినా నా మనస్సుకు ఏ మాత్రం నచ్చటం లేదు.

**విశేషం:** ఉ.వి. మహాభారత సంశోధిత ప్రతిలో 'దుష్టమృగ విధ్వసంబు నూహింప మేలగు' అనే పాఠం ఉన్నది. దానికంటె "విధ్వంసంబుఁగావింప మేలగు" అనే పాఠాంతరమే మేలని భావించి ఇక్కడ స్వీకరించటమైనది.

**చ. వనమున కేఁగి వందురిన వా రని వారల మీ రవశ్యముం**
**జెనకఁ దలంతు; రప్పురుషసింహులు భూరితపోనిధుల్ మనం**
**బునఁ గలుషించిరేనియుఁ దపోమహిమన్ మిము నిర్దహింతు రొం**
**డె నతులితాస్త్ర శక్తిని వడిం దునుమాడుదు రాజి నందఱన్. 363**

**ప్రతిపదార్థం:** వనమునకున్= అడవికి; ఏఁగి= వెడలి; వందురిన వారు= దైన్యం పొందినవారు; అని= అని తలపోసి; వారలన్= ఆ పాండవులను; మీరు= మీరు (దుర్యోధనుడు కర్ణుడు శకుని ప్రభృతులు); అవశ్యమున్= తప్పకుండా; చెనకన్+తలంతురు= కీడు చేయ తలపోస్తారు; ఆ+పురుష సింహులు= మగవారిలో సింగాల వంటివారు (పాండవులు); భూరి, తపస్+నిధుల్= మిక్కుటమైన తపస్సుకు గనుల వంటివారు; మనంబునన్= మనస్సులో; కలుషించిరి+ఏనియున్= కోపాన్ని పూనితే; తపస్+మహిమన్= తపస్సుయొక్క గొప్పతనంచేత; మిమున్= మిమ్ము (దుర్యోధన ప్రభృతులైన మిమ్ము); నిర్దహింతురు= కాల్చివేస్తారు; ఒండెన్= లేదా; అతులిత+అస్త్ర, శక్తిని= సాటిలేని మంత్రపూరితమైన ఆయుధాలచేత; వడిన్= శీఘ్రంగా; ఆజిన్= యుద్ధంలో; అందఱన్= ఎల్లరను; తునుమాడుదురు= ముక్కలు ముక్కలుగా ఖండిస్తారు.

**తాత్పర్యం:** అడవులకు వెళ్ళి దైన్యంతో బ్రదుకుతున్నవారినిగా భావించి మీరు పాండవులను అవమానించటానికి పూనుకొంటారు. ఇక ఆ పాండవులన్నో పురుషసింహులు, తపోనిధులు. వారికి కోపం వస్తే తమ తపోబలం వలన మిమ్మల్ని దహించి వేస్తారు. లేదా యుద్ధంలో మిమ్మల్ని అందరిని ముక్కలు ముక్కలుగా ఖండించి వేస్తారు.

**క. మున్నును మీచేతఁ గడున్ । బన్నము వడి నొచ్చినారు పార్థులు; మిమ్ముం**
**గన్నంత నలుగకుండునె । పన్నగరిపుసన్నిభుండు పవనజుఁ డాత్మన్. 364**

**ప్రతిపదార్థం:** మున్నును= మునుపు, పూర్వం; పార్థులు= కుంతీ కుమారులైన పాండవులు; మీ చేతన్= మీ వలన; కడున్= మిక్కిలి; బన్నము+పడి= పరాభవం పొంది; నొచ్చినారు= కష్టాలు అనుభవించి ఉన్నారు; మిమ్మున్= మిమ్మల్ని; కన్నంతన్= చూడగానే; పన్నగ, రిపు, సన్నిభుండు= పాములకు శత్రువైన గరుత్మంతుడితో సమానమైనవాడు; పవనజుఁడు= వాయుపుత్రుడైన భీముడు; ఆత్మన్= మనస్సులో; అలుగక+ఉండును+ఎ?= ఆగ్రహించక ఉంటాడా?

**తాత్పర్యం:** పాండవులు మునుపు మీ చేత అవమానించబడి మిక్కిలి నొచ్చి ఉన్నవారు కదా! ఇపుడు మిమ్మల్ని చూచినంతనే పాములకు శత్రువైన గరుత్మంతుడితో సమానమైన బలం కలవాడైన భీముడు మనస్సులో కోపించక ఊరుకొంటాడా? మిమ్మల్ని చూచినతోడనే పాండవులకు మీపై ఆగ్రహం కలగటం తథ్యం.

**వ. అదియునుం గాక.** **365**

**తాత్పర్యం:** అంతే కాక.

**చ. ఒకరుఁడ ధాత్రి యంతయును నోర్చెఁ గృతాస్త్రుఁడు గాక యుండియుం**
**బ్రకటితబాహువిక్రముఁడు ఫల్గునుఁ డిప్డు మహేంద్రుపాల న**
**త్యకుటిల దివ్యబాణవిదుఁడై యెలమిం జనుదెంచె నట్టి వా**
**నికి నెదురంగ శక్యమగునే రణభూముల నింక నేరికిన్?** **366**

**ప్రతిపదార్థం:** ఫల్గునుఁడు= అర్జునుడు; కృత+అస్త్రుఁడు= మంత్రపూరితమైన బాణవిద్యలో ఆరితేరినవాడు; కాక+ఉండియున్= కానప్పుడే; ఒకరుఁడు+అ= ఒక్కడు మాత్రమే (ఏకైక వీరుడై); ధాత్రి+అంతయును= భూమి సమస్తాన్నీ; ఓర్చెన్= జయించాడు; ఇప్డు= ఇపుడు; మహేంద్రుపాలన్= దేవేంద్రుడి సమక్షంలో; అతి+అకుటిల, దివ్య, బాణ, విదుఁడు+ఐ= మిక్కిలి స్వచ్ఛమైనవి, దేవతా మహిమ కలిగినవి అయిన బాణాలను తెలిసినవాడై; ఎలమిన్= ప్రీతితో; చనుదెంచెన్= వచ్చాడు; అట్టి వానికిన్= అట్టి గొప్ప అస్త్రాలు సంపాదించిన అర్జునుడిని; రణభూములన్= యుద్ధరంగాలలో; ఎదురంగన్= ఎదుర్కొనటానికి; ఏరికిన్= ఎవరికైనను; శక్యము అగును+ఏ?= సాధ్యం అవుతుందా?

**తాత్పర్యం:** మఱియును అర్జునుడు సాధారణమైన వీరుడు కాడు. అతడు దివ్యాస్త్రాలను ఆర్జించక ముందే, ఏకైకవీరుడై దిగ్విజయయాత్ర చేసి భూమిని సమస్తాన్నీ జయించగల్గాడు. ఇక, ఇపుడు ఆతడు దేవేంద్రుడి సమక్షంలో దేవతామహిమ గల గొప్పఅస్త్రాలను సంపాదించి, తిరిగివచ్చాడు. అట్టి అర్జునుడిని ఇక రణరంగంలో ఎదుర్కొని పోరాడటం ఎవరికీ సాధ్యం కాదు.

**తే. చెనకి మీరు వారికిఁ గీడు సేయుటయును । వారు మీ కెగ్గుసేఁతయు వగవ మేలు**
**గాదు; వలసిన ఘోషరక్షణ మొనర్పఁ । దగినవారలఁ బుత్తము దడయ కందు.'** **367**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు (దుర్యోధన ప్రభృతులు); వారికిన్= పాండవులకు; చెనకి= దుష్టబుద్ధితో పూని; కీడు= అపకారం; చేయుటయును= చేయటమున్నూ; వారు= ఆ పాండవులు; మీకున్= దుర్యోధన ప్రభృతులైన మీకు; ఎగ్గు= అపకారం; చేఁతయున్= చేయట మున్నూ; వగవన్= ఆలోచించగా; మేలు+కాదు= శుభం కాదు; తడయక= ఆలసించక; అందున్= అచటికి (ద్వైతవనానికి); ఘోష, రక్షణము= ఆవుల మందలను కాపాడటం; ఒనర్పన్= చేయటానికి; తగిన వారలన్= యోగ్యులైన వారలను; పుత్తము= నియోగిద్దాం.

**తాత్పర్యం:** దుష్టబుద్ధితో మీరు ఆ పాండవులకు కీడు చేయటం, వారు మీకు తిరిగి కీడు చేయటం అనేదాన్ని ఆలోచించి చూస్తే శ్రేయస్కరమైన పద్ధతి కాదు. ఆవులమందలను కాపాడటానికై ఆలస్యం చేయకుండా సమర్థులు అయినవారలను ఎన్నుకొని నియోగిద్దాం.'

**వ. అని యొడంబడకున్న నయ్యాంబికేయునకు శకుని యిట్లనియె.** **368**

**తాత్పర్యం:** అని అంగీకరించని ఆ ధృతరాష్ట్రుడితో శకుని ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'పాలితవిక్రమోన్నతులు పాండుతనూజులు; వారి కప్రియం**
**బేల యొనర్తు మే మధిప! యే మటు సేసితిమేనియుం బ్రతి**
**జ్ఞాలపితుండు ధర్మజుఁడు సత్యము దప్పునె? తమ్ము లేల త**
**చ్ఛీల మతిక్రమింతు? రిది సిద్ధము; నమ్ముము నెమ్మనంబునన్. 369**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! ఓ ధృతరాష్ట్ర ప్రభూ!; పాండు, తనూజులు= పాండురాజు కొడుకులు; పాలిత విక్రమ+ఉన్నతులు= క్రమశిక్షణతో కూడిన శౌర్యంతో గొప్పవారైన వారు; వారికిన్= పాండవులకు; ఏము= మేము (దుర్యోధన ప్రభృతులం); ఏల= ఎందుకు; అప్రియంబు= కీడు; ఒనర్తుము?= చేస్తాము?; ఏము= మేము; అటు+చేసితిమి+ఏనియున్= ఆ విధంగా (పాండవులకు కీడు) చేసినప్పటికిని; ధర్మజుఁడు= ధర్మపుత్రుడు; ప్రతిజ్ఞాలపితుండు= శపథం యొక్క మాటకు కట్టుబడిన వాడు; సత్యము= నిజం; తప్పును+ఎ?= అతిక్రమిస్తాడా?; తమ్ములు= సోదరులు (భీముడు అర్జునుడు నకులుడు సహదేవుడు); ఏల= ఎందుకు; తద్+శీలము= తచ్ఛీలము= ఆతని యొక్క నడవడికను; అతిక్రమింతురు= దాటుతారు; ఇది= మేము వారికి కీడు చేయకపోవటం, చేసినను సత్యసంధుడైన ధర్మరాజు అతడి తమ్ములు ప్రతిజ్ఞను అతిక్రమించక పోవటం; సిద్ధము= ఈడేరేది; నెమ్మనంబునన్ (నెఱ+మనంబునన్)= నిండు మనస్సుతో; నమ్ముము= విశ్వసించుము.

**తాత్పర్యం:** పాండవులు క్రమశిక్షణతో కూడిన శౌర్యం కలవారు. వారికి మేము కీడు చేయ తలపోయం. ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఒకవేళ మేము పాండవులకు కీడు చేసినప్పటికీ, అజాతశత్రువు, సత్యసంధుడు అయిన ధర్మరాజు తాను చేసిన ప్రతిజ్ఞను అతిక్రమించడు. అట్లే అతడి తమ్ములు భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, అన్నగారి ఆజ్ఞ జవదాటరు. ఇది నిక్కం. నిండు మనస్సుతో మా మాట విశ్వసించుము.

**క. మాకును జిత్తంబుల మృగ । యాకౌతుక మతిశయిల్లినది; గోగణర**
**క్షాకరణము గార్యం బటె; । యేకీడును నేల పొందు నిందు మహీశా!' 370**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశా!= (ఓ ధృతరాష్ట్ర) రాజా!; మాకును= దుర్యోధన ప్రభృతులమైన మాకును; చిత్తంబులన్= మనస్సులలో; మృగయా, కౌతుకము= వేటపట్ల తమకం; అతిశయిల్లినది= హెచ్చింది; గో, గణ, రక్షా, కరణము= ఆవుల మందలను కాపాడే పని; కార్యంబు+అటె= కర్తవ్యం అట కదా; ఇందున్= ఈ గోరక్షణ కార్యంలో; ఏ కీడునున్= ఏ హానియున్నూ; ఏల= ఎందుకు; పొందున్?= ఏర్పడుతుంది?

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! మా మనస్సులలో వేటపట్ల తమకం అతిశయిస్తున్నది. ఆవులను రక్షించటం మంచి పని. ఇట్టి ఉత్తమ కార్యం చేసేటప్పుడు ఏ విధంగా కీడు కలుగుతుంది?[9]

**క. అనిన నతఁడు గొండొకవడి । మనమున నూహించి 'బుద్ధిమంతుల రై గో**
**ధనము నరసి తడయక రం' । డని వారికి నెట్టకేల కనుమతి యిచ్చెన్. 371**

**ప్రతిపదార్థం:** అనినన్= అని(శకునియు కర్ణుడును) చెప్పగా; అతఁడు= (ధృతరాష్ట్రుడు); కొండొక వడి= కొంతసేపు; మనమునన్= మనస్సులో; ఊహించి= తలపోసి; బుద్ధిమంతులరు+ఐ= మంచిబుద్ధి కలవారై; గోధనమున్= ఆవులు అనే సంపదను; అరసి= చూచి, రక్షించి; తడయక= ఆలస్యం చేయక; రండు= తిరిగి రండి; అని= అని చెప్పి; ఎట్టకేలకున్= తుట్టతుదకు; అనుమతి= అంగీకారం; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** కర్ణుడును శకునియు కలసి ఆ విధంగా నివేదించగా ధృతరాష్ట్రుడు కొంతసేపు ఆలోచించి- 'సరే, సద్బుద్ధి కలవారై గోవులను కాపాడి ఆలస్యం చేయకుండ తిరిగి రండి' అని చెప్పి వారలకు ఘోషయాత్రకు అనుమతి ఇచ్చాడు.

**ఆ. ఆ క్షణంబ కౌతుకాతిశయ వ్యగ్ర। హృదయుఁడైన ఫణధరేంద్రకేతు**
**నాజ్ఞఁ గరిపురంబునం దెల్ల ఘోషింపఁ। బడియె ఘోషయాత్ర ప్రకటలీల. 372**

**ప్రతిపదార్థం:** ఆ క్షణంబు+అ= ఆ నిమిషంలోనే, వెనువెంటనే; కౌతుక+అతిశయ, వ్యగ్ర, హృదయుఁడు+ఐన= సంతోషం ఉప్పొంగటంచేత తొట్రుపాటుతో కూడిన డెందం కలవాడైన; ఫణ, ధర+ఇంద్ర, కేతు+ఆజ్ఞన్= పడగను ధరించే శ్రేష్ఠమైన పాముగుర్తుగల కల జెండా కలవాడియొక్క - అనగా దుర్యోధనుడియొక్క; ఆజ్ఞన్= ఆజ్ఞవలన; కరిపురంబునందున్= హస్తినాపురిలో; ఘోషయాత్ర= ఆవుల మందలను కాపాడటానికైన ప్రయాణం; ప్రకట లీలన్= అందరకు తెలిసే విధంగా; ఘోషింపన్+పడియెన్= చాటించబడింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రమహారాజు అనుమతి ఇచ్చిన వెనువెంటనే ఎటువంటి ఆలస్యం చేయకుండా నాగకేతను డైన దుర్యోధనుడి ఆజ్ఞచేత హస్తినాపురంలో అందరకు తెలిసేటట్లు ఘోషయాత్ర చాటింపబడింది. 'ఘోషయాత్ర' కు ధృతరాష్ట్రమహారాజు అనుమతించటం చేత దుర్యోధనుడి మనస్సు సంతోషంతో ఉప్పొంగిపోయింది.

**విశేషం:** పూర్వకాలంలో ప్రధానంగా మహాభారతయుగంలో వీరులు తమకు నచ్చిన లాంఛనాన్ని తమతమ పతాకాలపై ముద్రించుకొనేవారు. ఆ చిహ్నం ఆ యా రథికులను రణరంగంలో గుర్తించటానికి ఉపయుక్తంగా ఉండేది.

### దుర్యోధనుఁడు ఘోషయాత్రవోవుట (సం. 3-228-23)

**సీ. అంతఁ బ్రహృష్టాత్ముఁడై లలితాంబరా। భరణాంగరాగవిస్ఫురితమూర్తి**
**నొప్పారి విభుఁడు సహోదరులును గర్ణ। గాంధారులును బ్రియబాంధవులును**
**సముచిత వాహన సైన్య సమేతులై। కొలువంగ వెడలె నుజ్జ్వలవిభూతి**
**నాందోళికాది వాహనములఁ దత్ప్రియ। ప్రమదలు బహుసహస్రములు సనిరి**

**ఆ. కడఁగి పౌరు లెల్లఁ గైసేసి పడఁతులుఁ। దారు నడచి రతిముదంబుతోడఁ**
**బ్రకట శకట వైశ్య పణ్యాంగనాది సం। కులత నుల్లసిల్లె ఘోషయాత్ర. 373**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతట; విభుఁడు= రాజు (దుర్యోధనుడు) ప్రహృష్ట+ఆత్ముఁడు+ఐ= మిక్కుటంగా ఆనందించిన డెందం కలవాడై; లలిత+అంబర+అంగరాగ, విస్ఫురిత, మూర్తిన్= మనోహరాలు అయిన వస్త్రాలతో, భూషణాలతో, మైపూతలతో విలసిల్లే దేహం కలవాడై; ఒప్పారి= శోభిల్లి; సహోదరులును= తోడబుట్టిన తమ్ములును; కర్ణ, గాంధారులుకు= కర్ణుడు గాంధార రాజపుత్రుడైన శకునియు; ప్రియ, బాంధవులును= అనుగు చుట్టాలున్నూ; సముచిత, వాహన, సైన్య, సమేతులు+ఐ= తగిన యానసదుపాయాలతో భటులగుంపులతో కూడినవారై; కొలువంగన్= తనను సేవించగా; వెడలెన్= బయలుదేరాడు; ఉత్+జ్వల విభూతిన్= మిక్కుటంగా వెలుగొందే సంపదతో; ఆందోళికా+ఆది, వాహనములన్= పల్లకీలు మున్నగు వాహనాలలో; తద్+ప్రియ, ప్రమదలు= ఆ దుర్యోధనుడియొక్క అనుగు పడతులు; బహు సహస్రములు= పెక్కు వేలమంది; చనిరి=

వెళ్ళారు; కడఁగి= పూనిక వహించి; పౌరులు+ఎల్లన్= హస్తినలో వసించేవారు అందరున్నూ; కైసేసి= అలంకరించుకొని; పడఁతులు= వనితలు; తారు= తాము; అతిముదంబుతోడన్= మిక్కుటమైన సంతోషంతో; నడచిరి= పయనించారు; ఘోషయాత్ర= ఆలమందలకడ కేగే ప్రయాణం; ప్రకట, శకట, వైశ్య, పణ్య+అంగనా+ఆది, సంకులతన్= బాగా కనుపించిన బండ్లు, వర్తకులు, వెలయాండ్రు మున్నగువారల కోలాహలంతో; ఉల్లసిల్లెన్= శోభిల్లింది.

**తాత్పర్యం:** అంతట దుర్యోధనుడు ఆనందంతో ఉప్పొంగిన హృదయం కలవాడై మనోహరాలైన బట్టలు, భూషణములు, మైపూతలతో విలసిల్లే దేహం కలవాడై, తానును తన తమ్ములును కర్ణుడు గాంధార రాజపుత్రుడు శకుని అనుగుచుట్టాలును వారి వారికి తగిన వాహనాలతో సపరివారంగా అనుసరించగా ఘోషయాత్రకు ఉపక్రమించాడు. అతని రాణులు ప్రియమైన అంగనలు పల్లకీ మున్నగు వాహనాలను అధిరోహించి వేలమంది వెంబడించారు. హస్తినాపురంలోని ప్రముఖపౌరులు తమప్రియభామినులతోపాటు ముందు నడిచారు. సింగారించబడిన శకటాలలో వర్తకులు వెలయాండ్రు మున్నగువారు పయనించారు. ఆ ఘోషయాత్ర మిక్కిలి కోలాహలంగా కొనసాగింది.

**విశేషం:** (1) ఈ సీసపద్యంలోని అభివర్ణనకు సంస్కృత మహాభారతంలో మాతృక లేదు. అందుచేత ఈ వర్ణనం ఎఱ్ఱన మహాకవి సమకాలీన సమాజంలో మహారాజుల విహార యాత్రలను ప్రతిబింబిస్తున్నట్లు భావించవచ్చును. (2) ఎఱ్ఱన వర్ణనా ప్రియుడు. అతడికి సమకాలీనులు ఒసంగిన 'ప్రబంధ పరమేశ్వర' బిరుదం సార్థకమైనది. చూడండి - 375 సంఖ్య సీసపద్యంలోని ఆవులమంద వర్ణనం.

**వ. మఱియు నమ్మహీపతి పయనంబున కనురూపంబుగా నెనిమిదివేలు రథంబులు, ముప్పది వే లేనుంగులుఁ, దొంబది వేలు గుఱ్ఱంబులు, శతసహస్రసంఖ్య కాల్బురుం గల మహాసైన్యంబుతోడ నడిచె; మృగయాకుశలు లైన మృగయులును, విట విదూషక వంది వైతాళికాది జను లనేకు లనుగమించి; రిట్లు గవ్యూతిమాత్రం బగు నేల యరిగి, యచ్చట విడిసి యద్దినశేషంబును రాత్రియుం గడపి, మఱునాఁడు వివిధ గిరిగహనంబు లతిక్రమించి ఘోషంబు లున్న వనంబు సొచ్చి, యం దొక్క రమణీయప్రదేశంబున శిబిరంబు గావించి యమ్మనుజేంద్రుండు. 374**

**ప్రతిపదార్థం:** మఱియున్= వెండియు; ఆ+మహీపతి= ఆ రాజు (దుర్యోధనుడు); పయనంబునకున్= ప్రయాణానికి; అనురూపంబుగాన్= తగినట్లుగా; ఎనిమిది వేలు రథంబులు; ముప్పది వేలు ఏనుంగులు; తొంబది వేలు గుఱ్ఱములు; శత సహస్ర సంఖ్య= ఒక లక్ష; కాల్బురున్= కాల్బలం, పదాతులు; కల= ఉన్న; మహా, సైన్యంబు తోడన్= గొప్ప సేనతో; నడిచెన్= సాగాడు; మృగయా, కుశలులు+ఐన= వేటలో నేర్పరులు అయిన; మృగయులును= వేటకాండ్రను; విట, విదూషక, వంది, వైతాళిక+ఆది, జనులు= శృంగార ప్రియులు, హాస్యగాండ్రు, స్తోత్ర పాఠకులు, మేలుకొలుపులు పాడేవారు మున్నగు జనులు; అనేకులు= పెక్కుమంది; అనుగమించిరి= సహయాత్రికులై పయనించారు; ఇట్లు= ఈ రీతిగా; గవ్యూతి మాత్రంబు+అగు, నేల+అరిగి= రెండు కోసుల దూరం కల భూమిని పయనించి; అచ్చటన్= ఆ చోట; ఆ స్థలంలో; విడిసి= తాత్కాలికంగా పయనం ఆపి నివసించి; ఆ+దిన, శేషంబును= ఆ దివసంలో (పయనింపగా) మిగిలిన పగలును, రాత్రియున్= రేయిని; కడపి= పుచ్చి; మఱునాఁడు= మరుసటిరోజున; వివిధ, గిరి గహనంబులు= పెక్కు పర్వతాలు, అడవులు; అతిక్రమించి= దాటి; ఘోషంబులు+ఉన్న= ఆలమందలు కల; వనంబు+చొచ్చి= అడవిలో ప్రవేశించి; అందున్= ఆ అడవిలో; ఒక్క= ఒక; రమణీయ ప్రదేశంబునన్= అందమైన స్థలంలో; శిబిరంబు+కావించి= స్కంధావారం నెలకొల్పి; ఆ మనుజ+ఇంద్రుండు= ఆ రాజు, దుర్యోధనుడు.

**తాత్పర్యం:** అంతేకాక. దుర్యోధనుడి ఘోషయాత్రకు అనుగుణంగా ఎనిమిదివేల రథాలూ, ముప్పైవేల ఏనుగులు, తొంభైవేల గుర్రాలు, నూరువేలమంది (లక్షమంది) భటులు ఉన్న పెద్దసైన్యం ఆతడి వెంట నడిచింది. వేటలో నేర్పరులైన వేటగాండ్రున్నూ, విటులు, విదూషకులు, వందులు, వైతాళికులు మొదలైనవారు అనేకమంది అతడి వెంట వెళ్ళారు. అందరూ కలిసి రెండుకోసుల దూరం వెళ్ళారు. అక్కడ ఆ మిగిలిన పగటి వేళను, రాత్రివేళను గడిపారు. మరురోజు మరల బయలుదేరి పెక్కు కొండలు గుట్టలు దాటి ఆవుల మందలున్న అడవిలో ప్రవేశించారు. ఆ వనంలో ఒక అందమైన చోట శిబిరాలను ఏర్పరచుకొన్నారు. అప్పుడు దుర్యోధనమహారాజు.

**సీ.** **నానా సహస్ర సంఖ్యానంబులై సంత । తానంద విగతభయత్వ లీల**
**నక్కాననమున నే దిక్కు సూచిన నతి । సంకులంబుగఁ గుంద శంఖ చంద్ర**
**హార నీహార డిండీర పటీర ము । క్తాహార హీర సంకాశములును**
**గాదంబ కాలేయ కాదంబినీ నీల । జాల తమాలికా సన్నిభములు**

**తే.** **ప్రౌఢబంధూకపల్లవ భాసితములు । వికచ కాంచన చంపక విస్ఫుటములు**
**నైన వర్ణంబు లొప్ప నేత్రాభిరామ । భంగి నలరారు గోకదంబములఁ గనియె.** **375**

**ప్రతిపదార్థం:** నానా, సహస్ర, సంఖ్యానంబులు+ఐ= పెక్కు వేల సంఖ్యగలవై, సంతత+ఆనంద, విగత, భయత్వ, లీలన్= ఎల్లప్పుడు గొప్ప హర్షంవలన పోయిన భయం గలవై, ఆ+కాననమునన్= ఆ అడవిలో; ఏ దిక్కు+చూచినన్= ఏ వైపు చూచినా; అతి సంకులంబుగన్= మిక్కిలి దట్టంగా; కుంద, శంఖ, చంద్రహార, నీహార, డిండీర, పటీర, ముక్తాహార, హీర, సంకాశములును= మల్లెపువ్వులతో, శంఖాలతో, చంద్రహారాలతో; మంచుతో, నురుగుతో, చందనంతో, ముత్యాలపేరులతో, వజ్రాలతో సరిసమానాలైనవి; కాదంబ, కాలేయ కాదంబినీ, నీల జాల తమాలికా, సన్నిభములు= నీలమణుల సమూహాలు, ధూమ్రవర్ణాలైన ముక్కు కాళ్లు రెక్కలు కల హంసలతో, వర్షాకాలానికి సంబంధించిన మబ్బులగములతో, నల్లని కాంతుల, చీకటి చెట్లతో సమానాలైనవి; ప్రౌఢ బంధూక, పల్లవ, భాసితములు= ముదిరిన మంకెనపువ్వులయొక్క చిగుళ్లవలె విలసిల్లేవి; వికచ, కాంచన, చంపక, విస్ఫుటములు= వికసించిన బంగారు సంపంగి పువ్వులవలె శోభిల్లేవి; ఐ= అయినట్టి; వర్ణంబులు= రంగులు; ఒప్పన్= విలసిల్లగా; నేత్ర+అభిరామ, భంగిన్= కనుల పండువుగా; అలరారు= ఒప్పారే; గో, కదంబములన్= ఆవుల మందలను; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఆ అడవిలో రంగు రంగుల ఆవుల మందలను సందర్శించాడు. అచట లెక్కపెట్టలేనన్ని పెక్కువేలకొలది ఆవులు స్వేచ్ఛగా ఎల్లప్పుడు ఆనందంతో తిరుగాడుతున్నాయి. ఏ వైపు చూచినా ఆవులే. వాటిలో కొన్ని తెల్లని రంగు కలవి. ఆ తెలుపులో కూడ ఎంచదగిన ఛాయా భేదాలు పొడగట్టుతాయి. కొన్ని ఆవులు మల్లెపూలను, కొన్ని శంఖాలను, కొన్ని చంద్రహారాలను, కొన్ని మంచుగడ్డలను; కొన్ని నురుగును; కొన్ని చందనాన్ని, కొన్ని ముత్యాల పేరులను, కొన్ని వజ్రాలను పోలి తెల్లగా ఉన్నాయి. మరికొన్ని ఆవులు నల్లగా ఉన్నాయి. ఆ నలుపులో కూడ ఛాయాభేదాలు ఎన్నదగినవే. నల్లని ముక్కు నల్లని కాళ్లు నల్లని రెక్కలు కల హంసలవలె కొన్ని ఆవులున్నాయి. మరికొన్ని వర్షాకాలపు మబ్బుల దొంతరలను పోలుతున్నాయి. కొన్ని నల్లని వన్నెగల చీకటిచెట్లరంగులో ఉన్నాయి. కొన్ని ఎఱుపు రంగు కలవి. మంకెన పూల చిగురుటాకుల రంగులు కలవి కొన్ని ఆవులు. కొన్ని పసిడి చంపకాల వలె మిలమిలలాడుతున్నాయి. కనులపండువుగా తిరుగాడుతున్న ఆవులమందలను దుర్యోధనుడు అక్కడ సందర్శించాడు.

**విశేషం:** సంస్కృత మహాభారతంలో దుర్యోధనుడు ఆవులను చూచినట్లు ఉన్నది. తెలుగులోని ఈ సీసపద్యం ఎఱ్ఱన మహాకవి స్వకపోలకల్పితం. ఎఱ్ఱన కవితా శిల్పానికి వర్ణనాభిరుచికి ఈ సీసపద్యం మచ్చుతునక అని చెప్పవచ్చును.

**వ. కని తదీయసమృద్ధికి సంతసిల్లుచు గోపాలజనంబులు సవినయంబుగాఁ దన్నుం గాంచిన నాదరించి వారు దనకు నగ్గోవులపేళ్ళును లక్షణంబులు నేర్పడి నెఱింగించుచుండఁ బేరువేఱ వత్సంబులు వత్సతరంబులు మహోక్షంబులు ధేనువులు దర్ణకంబులు మొదలైన గోవిశేషంబుల నాలోకించుచు నయ్యైవిధంబులఁ బసికిం దగిన రక్షణంబు గావింప నర్హ జనంబుల సవిశేషంబుగా నియోగించి, మఱియును. 376**

**ప్రతిపదార్థం:** కని= చూచి; తదీయ సమృద్ధికిన్= ఆ (గోవుల యొక్క) అభివృద్ధికి; సంతసిల్లుచున్= ఆనందిస్తూ; గోపాల జనంబులు= గొల్లవారు; సవినయంబుగాన్= నమ్రతతో కూడినవారై; తన్నున్= తనను (దుర్యోధనుడిని); కాంచినన్= చూడగా; ఆదరించి= అభిమానం చూపి; వారు= (ఆ గోపాలురు); తనకున్= తనకు (దుర్యోధనుడికి); ఆ+గోవుల= ఆ ఆవుల; పేళ్ళును= నామాలను; లక్షణంబులున్= గుణాలును; ఏర్పడన్= స్పష్టంగా; ఎఱింగించుచుండన్= తెలుపుతుండగా; పేరు వేఱ= పేర్లలోని భేదాలుకల; వత్సంబులు= దూడలు; వత్స తరంబులు= మోయటానికి, దున్నటానికి పంపదగిన వయసు కల కోడెదూడలు; మహా+ఉక్షంబులు= ఆఁబోతులు; ధేనువులు= పాడి ఆవులు; తర్ణకంబులు= అప్పుడే పుట్టిన లేగదూడలు; మొదలు+ఐన= మున్నగు; గో విశేషంబులన్= గోవులలోని ముఖ్యభేదాలను; ఆలోకించుచున్= చూస్తూ; అయ్యై విధంబులన్= ఆయా రీతుల; పసికిన్= పశువులకు; తగిన= సరిఅయిన; రక్షణంబు, కావింపన్= కాపాడటంకొరకై; అర్హజనంబులన్= యోగ్యులైనవారిని; సవిశేషంబుగాన్= గొప్పతనం భాసించేటట్లుగా; నియోగించి= ఏర్పాటు చేసి; మఱియును= వెండియును.

**తాత్పర్యం:** దుర్యోధనుడు అక్కడి ఆవులను పరిశీలించి చూచి, వాటి సమృద్ధికి సంతోషించి, గొల్లవారిని అభినందించాడు. గొల్లలు దుర్యోధనుడికి వినయంతో గోవులలోని విశేషాలను వివరించి చెప్పి చూపించారు. అందులో ఆవుదూడలు కొన్ని. కొన్ని ఆఁబోతులు. కొన్ని పాడిఆవులు. కొన్ని దున్నే వయసు వచ్చిన కోడెదూడలు. కొన్ని అప్పుడే పుట్టిన లేగదూడలు. దుర్యోధనుడు ఆ గోవులను అన్నింటిని సంరక్షించటానికి యోగ్యత నేర్పు కలవారిని ఎన్నుకొని నియోగించాడు.

**క. గోపాలసమన్వితుఁ డై । యా పాలమునఁ దిరిగి గోరసాస్వాదనలీ**
**లా పరితృప్తిఁ దలిర్చె మ । హీపాలుఁడు నెమ్మితోడ నిష్టులుఁ దానున్. 377**

**ప్రతిపదార్థం:** మహీపాలుఁడు= రాజు (దుర్యోధనుడు); నెమ్మితోడన్= ప్రీతితో; ఇష్టులున్= మిత్రులును, తానున్= తానున్నూ (కూడి); గోపాల సమన్వితుఁడు+ఐ= గొల్లవారితో కూడినవాడై; ఆ పాలమునన్= ఆ క్షేత్రంలో; తిరిగి= నడయాడి; గో, రస+ఆస్వాదన, లీలా, పరితృప్తిన్= పాలను త్రాగటం అనే క్రీడలోని సంతృప్తితో; తలిర్చెన్= ఒప్పాడు.

**తాత్పర్యం:** దుర్యోధన మహారాజు తాను తన మిత్రులతో కలిసి ఆ అడవిలో గొల్లవారితో కూడి విహరించి పాలు త్రాగి మిక్కుటమైన సంతృప్తి చెంది సంతసించాడు.

**వ. తదనంతరంబ గాయక నర్తకాదులు వంది మాగధ జనంబులుం గనిన నాదరించి, వారికి నభిమతధనంబు లొసంగి, మృగయావినోదంబునకుం దొడంగి. 378**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట; గాయక, నర్తక+ఆదులు= పాటలు పాడేవారు, నాట్యం చేసేవారు మున్నగువారు; వంది, మాగధ, జనంబులు= స్తోత్ర పాఠకులు; కనినన్= సందర్శించగా; ఆదరించి= అభిమానం చూపి; వారికిన్= వారికి; అభిమత ధనంబులు= కోరిన డబ్బులు; ఒసంగి= ఇచ్చి; మృగయా, వినోదంబునకున్= వేట వేడుకకు; తొడంగి= పూని.

**తాత్పర్యం:** గోవులను సందర్శించి గోరక్షణకు తగిన ఏర్పాటులు చేసిన పిమ్మటనే, దుర్యోధనుడు పాటలు పాడేవారికి నాట్యం చేసేవారికి, స్తోత్రాలు చేసేవారికి దర్శనమిచ్చి, వారిని మన్నించి వారికి కోరిన ధనమిచ్చి సత్కరించాడు. తరువాత. వేట వేడుకకు ఉపక్రమించాడు.

**మ. హరిణవ్రాతములం గలంచుచు నుదగ్రానేకపశ్రేణిఁ జె**
**చ్చెర బంధించుచు నుగ్రసింహనివహచ్ఛేదైక సక్రోధబం**
**ధురతం బేర్చుచుఁ బ్రస్ఫురన్మహిషశార్దూలోద్ధతక్రోడ ని**
**ర్భరపాతంబు లొనర్చుచుం దిరిగె భూపశ్రేష్ఠుఁ డక్కానలోన్. 379**

**ప్రతిపదార్థం:** భూప, శ్రేష్ఠుఁడు= దుర్యోధన సార్వభౌముఁడు; ఆ+కానలోన్= ఆ అడవిలో; హరిణవ్రాతములన్= లేడిగుంపులను; కలంచుచున్= కలవరపెట్టుతూ; ఉదగ్ర+అనేకప, శ్రేణిన్= భయంకరాలైన ఏనుగుల సమూహాలను; చెచ్చెరన్= వేగంగా; బంధించుచున్= కట్టివైచుచు; ఉగ్ర, సింహనివహ+ఛేద+ఏక, సక్రోధ, బంధురతన్= భయంకరాలైన సింహాల గుంపులను ఖండించటమునందు మిక్కుటమైన కోపంతో కూడి ఉండటం చేత; పేర్చుచున్= అతిశయిస్తూ; ప్రస్ఫురత్+మహిష, శార్దూల+ఉద్ధత క్రోడ, నిర్భర, పాతంబులు= ప్రకాశించే దున్నపోతులు పెద్దపులులు మదించిన అడవిపందులు మిక్కుటంగా నేలపై కూల్చడాలు; ఒనర్చుచున్= సలుపుతూ; తిరిగెన్= చరించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఆ అడవిలో వేటాడుతూ లేడిగుంపులను కలత పెట్టాడు. మదించిన ఏనుగులను శీఘ్రంగా చెర పట్టాడు. సింహాలను కోపంతో ఖండించాడు. అట్లే అడవిపందులను చంపాడు. దున్నపోతులు పెద్దపులులు గుట్టలు గుట్టలుగా నేలపై కొరిగేటట్లుగా వేటాడాడు.

**విశేషం:** ఎఱ్ఱన 'ప్రబంధ పరమేశ్వర' బిరుదాన్ని సార్థకం చేసే పద్యాలలో ఇది ఒకటి. ఈ పద్యంలో దుర్యోధనుడి వేట వర్ణించబడింది. ప్రబంధాలలో ఉండవలె నని నిర్దేశించిన అష్టాదశవర్ణనలలో వేట ఒకటి.

**వ. మఱియు ననవరతసురభిసరసీరుహప్రకరకీర్ణంబు లగు జలాశయంబు లాలోకించుచు, నతిమనోహర ప్రసూనఫలభరితపాదప వనాభ్యంతరంబుల విహరించుచు, మన్మథ మయూర మధుకర కీర కోకిలాలాప కోలాహలంబు లాకర్ణించుచుఁ; గ్రమంబునం బరిజనసమన్వితుండై ధార్తరాష్ట్రుండు ద్వైతవన సరోవరంబు సేరం జనియె; నంత నట ధర్మతనయుండు తత్సమీపంబున మునిజనసహాయుండై వన్యంబు లగు మూల ఫలవిశేషంబులు సాధనంబులుగా సద్యస్కందం బను యజ్ఞంబు సేయుచుండె; నప్పుడు దుర్యోధనుండు నిజభృత్యజనుల నక్కొలనిదరిం గ్రీడాగృహంబులు నిర్మింప నియోగించిన. 380**

**ప్రతిపదార్థం:** మఱియున్= వెండియు; అనవరత, సురభి, సరసీరుహ, ప్రకర కీర్ణంబులు+అగు= ఎల్లప్పుడు పరిమళాలు వెదజల్లే పద్మాల సముదాయాలచేత కప్పబడినవి అయిన; జలాశయంబులు= చెరువులు; ఆలోకించుచున్= చూస్తూ; అతి,

మనోహర, ప్రసూన, ఫల, భరిత, పాదప, వన+అభ్యంతరంబులన్= మిక్కిలి ఆహ్లాదకరమైన పువ్వులు, పండ్లు కల చెట్లతో కూడిన అడవులలోపల; విహరించుచున్= సరదాగా తిరుగాడుతూ; మన్మథ, మయూర, మధుకర, కీర, కోకిల+ఆలాప, కోలాహలంబులు= మనస్సును మథించే నెమళ్లయొక్క; తేనెటీగలయొక్క, చిలుకలయొక్క, కోకిలలయొక్క గానాల కలకల నాదాలు; ఆకర్ణించుచున్= వింటూ; క్రమంబునన్= వరుసగా; పరిజన, సమన్వితుండు+ఐ= సేవకులతో కూడినవాడై; ధార్తరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడి కొడుకు అయిన దుర్యోధనుడు; ద్వైత వన సరోవరంబు= ద్వైత వనంలోని కొలను; చేరన్+చనియెన్= సమీపించాడు; అంతన్= అంతట; అట= అచట; ధర్మతనయుండు= ధర్మపుత్రుడు; తత్+సమీపంబునన్= ఆ కొలను దగ్గర; ముని, జన, సహాయుండు+ఐ= ఋషుల సముదాయంతో కూడినవాడై; వన్యంబులు+అగు= అడవికి సంబంధించినవి అయిన; ఫల విశేషంబులు= పేర్కొనదగిన పండ్లు; సాధనంబులుగాన్= పరికరాలుగా; సద్యస్కందంబు+అను= సద్యస్కందం-అనే పేరు కల; యజ్ఞంబు= క్రతువు; చేయుచుండెన్= చేస్తూ ఉన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; దుర్యోధనుండు; నిజ, భృత్య, జనులన్= తన యొక్క సేవకుల బృందాన్ని; ఆ+కొలని దరిన్= ఆ సరోవరందగ్గర; క్రీడా గృహంబులు= వినోదం కొరకై కట్టే ఇండ్లు; నిర్మింపన్= కట్టటానికి; నియోగించినన్= ఏర్పాటు చేయగా.

**తాత్పర్యం:** అంతేకాక దుర్యోధనుడు ఆ అడవిలో విహరించాడు. ఆతడు అక్కడ ఎల్లప్పుడును పరిమళాలు వెదచల్లే పద్మాలతో తామర తంపరలతో కప్పబడిన చెరువులను చూచాడు. మిక్కుటంగా హృదయాలకు ఆహ్లాదం కలిగించేవి, పండ్లతో నిండినవి అయిన చెట్లతో కళకళలాడే వనాలలో విహరించాడు. మనస్సును మథించే స్వరాలను, కోకిలల కూజితాలు తేనెటీగల సవ్వడులు నెమిళ్ల నృత్య నినాదాలు చిలుకల పాటలు కలరుతాలు ఆలకించాడు. పిదప, సేవకులచేత పరివేష్టించబడినవాడై ధృతరాష్ట్రుడి కొడుకైన దుర్యోధనుడు ద్వైతవనంలోని సరస్సు దరి చేరాడు. అక్కడ ధర్మరాజు సద్యస్కందం అనే పేరు కల ఒక క్రతువు చేస్తూ ఉన్నాడు. ఆ క్రతువులోని విశేష మేమంటే - అది అడవిలో దొరికే పండ్లతో శాకాలతో మాత్రమే జరుపబడుతుండటం. ఋషులు పలువురు- ఆ క్రతువులో ధర్మరాజుకు సాయంచేస్తూ ఉన్నారు. అప్పుడు దుర్యోధనుడు తన సేవకులకు ఆసమీపంలో వినోదంకొరకై క్రీడాగృహాలను నిర్మించటానికి ఆజ్ఞాపించాడు.

**క. వారును సంభ్రమమున న । వ్వారిరుహాకరముపొంత వదలక క్రీడా**
**గారములు గట్టఁ దొడఁగుడు । వారించుచు బాఱుతెంచి వడి గంధర్వుల్. 381**

**ప్రతిపదార్థం:** వారును= దుర్యోధనుడి సేవకులును; సంభ్రమమునన్= వేగంతో కూడిన తొట్రుపాటుతో; ఆ+వారిరుహ+ఆకరము పొంతన్= ఆ సరోవరం కడ (పద్మాలకు ఆకరం అయిన సరోవరం వద్ద); వదలక= విడువక; క్రీడా+ఆగారములు= వినోదం కొరకై నిర్మించే గృహాలు; కట్టన్+తొడఁగుడున్= నిర్మించటానికి ఉపక్రమించగా; గంధర్వుల్= గంధర్వులు, (వేల్పుల లో ఒకజాతివారు); వడిన్= శీఘ్రంగా; వారించుచున్= అడ్డగిస్తూ; పాఱుతెంచి= వచ్చి.

**తాత్పర్యం:** దుర్యోధనుడి సేవకులు సంరంభంతో ఆ సరోవరం దగ్గర క్రీడాగృహాలు నిర్మించసాగారు. అంతలో ఆ భటులను అడ్డగిస్తూ గంధర్వులు అచటికి వచ్చి చేరారు.

**వ. 'ఇది చిత్రసేనుం డను గంధర్వపతికిం గ్రీడార్థంబు కల్పితం బైనది గావున మీ రిక్కొలను సేరక తొలంగి పోవునది' యనిన వారు మగుడం జని, దుర్యోధనునకుఁ జెప్పుటయు, నతండు రణదుర్మదు లైన సైనికులం గొందఱం బంచిన, నరిగి వారలు గంధర్వుల కిట్లనిరి. 382**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ సరోవరం; చిత్రసేనుండు+అను= చిత్రసేనుడు అనే పేరు కల; గంధర్వ పతికిన్= గంధర్వుల రాజుకు; క్రీడా+అర్థంబు= వినోదం కొరకు; కల్పితంబు+ఐనది= నిర్మించబడింది. కావునన్= కాబట్టి; మీరు= దుర్యోధన సేవకులైన మీరు; ఈ+కొలను= ఈ సరోవరం; చేరక= సమీపించక; తొలంగి పోవునది= దూరంగా వెడలిపొండి; అనినన్= అని చెప్పగా; వారు= ఆ దుర్యోధనుడి సేవకులు; చేరక= సమీపించక; తొలంగి పోవునది= దూరంగా వెడలిపొండి; అనినన్= అని చెప్పగా; వారు= ఆ దుర్యోధనుడి సేవకులు; మగుడన్+చని= తిరిగి వెళ్లి; దుర్యోధనునకున్, చెప్పుటయున్; అతండు; రణ దుర్మదులు+ఐన= యుద్ధం చేయటంలో ఇచ్ఛగలిగి మదించినవారు అయిన; సైనికులన్= భటులను; కొందఱన్= కొంతమందిని; పంచినన్= నియోగించగా; అరిగి= వెడలి (కొలనుకడ ఉన్న గంధర్వులవద్దకు వెళ్లి); వారలు= ఆ భటులు; గంధర్వులకున్; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** 'ఈ సరోవరం చిత్రసేనుడు అనే గంధర్వులరాజు ప్రత్యేకంగా విహరించటం కొరకు నిర్మించబడింది కావున, మీరు ఈ కొలనుదరికి చేరరాదు. వేగమే తిరిగి పొండు' అని గంధర్వులు దుర్యోధనుడి సేవకులతో చెప్పారు. అంతట ఆ మాటలు దుర్యోధనుడి సేవకులు దుర్యోధనుడిదగ్గర కేగి చెప్పారు. దుర్యోధనుడు యుద్ధం చేయటానికై మదించి ఉన్న భటులను కొందరను ఏరి, అక్కడికి పంపగా, వారు కొలనువద్దకు వెళ్లి గంధర్వులతో ఈ విధంగా పలికారు.

**మ. 'బలియుం డా ధృతరాష్ట్రసూనుఁడు మహాబాహుండు దుర్యోధనుం**
**డలఘుం డీ కమలాకరంబునకుఁ గ్రీడార్థంబు గౌతూహలం**
**బెలయంగాఁ బ్రియకామినీసహితుఁడై యేతెంచుచున్నాఁడు మీ**
**ర్వల దిందుండఁ, దొలంగి పొం' డనవుడున్ వారుద్ధతక్రోధులై. 383**

**ప్రతిపదార్థం:** బలియుండు= బలం కలవాడు; ఆ ధృతరాష్ట్ర సూనుఁడు= ధృతరాష్ట్రుడి కొడుకు అయిన దుర్యోధనుడు, మహాబాహుండు= గొప్ప చేతులు కలవాడు, పరాక్రమవంతుడు; దుర్యోధనుండు; అలఘుండు= గొప్పవాడు; ఈ కమల+ఆకరంబునకున్= పద్మాలకు నెలవైన ఈ సరోవరానికి; క్రీడా+అర్థంబు= వినోదం కొరకు; కౌతూహలంబు= వేడుక; ఎలయంగాన్= అతిశయించగా; ప్రియకామినీ సహితుఁడు+ఐ= ఇష్టం కల వలపుకత్తెలతో కూడుకొని; ఏతెంచుచున్నాఁడు= వస్తున్నాడు; మీర్+వలదు+ఇందున్+ఉండన్= మీ రిక్కడ ఉండరాదు; తొలంగిపొండు= ఈ చోటు విడిచి దూరంగా వెళ్లండి; అనవుడున్= అని చెప్పగా; వారు= గంధర్వులు; ఉద్ధత క్రోధులు+ఐ= అతిశయించిన ఆగ్రహం కలవారై.

**తాత్పర్యం:** 'ఓ గంధర్వులారా! మహాబలవంతుడైన దుర్యోధనసార్వభౌముడు ధృతరాష్ట్రుడికొడుకు, పరాక్రమశాలి, వీరాధివీరుడు ఈ సరోవరతీరంలో తన వలపుకత్తెలతో కలిసి జలక్రీడ లాడాలనే వేడుకతో విచ్చేశాడు. అందుచేత మీరు ఇక్కడ ఉండకూడదు. దూరంగా పొండు' అని కౌరవభటులు చెప్పారు. గంధర్వులు అమితంగా ఆగ్రహించారు.

**వ. ఒండొరువుల మొగంబులు సూచి పెలుచ నవ్వి వారల కిట్లనిరి. 384**

**ప్రతిపదార్థం:** ఒండొరువుల మొగంబులు= ఒకరి మొగాలు ఒకరు; చూచి= అరసి; పెలుచ నవ్వి= అట్టహాసం సలిపి; వారలకున్= దుర్యోధనుడి భటులకు; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** దుర్యోధనుడిభటుల ప్రగల్భవచనాలను ఈసడిస్తూ గంధర్వులు ఒకరిమొగాలు ఒకరు చూచి అట్టహాసం చేసి ఇట్లా పలికారు.

**క. 'ఎదిరిం దన్ను నెఱుంగఁడు । మదమునఁ బ్రాణంబుఁ దనదుమానముఁ గోల్పో**
**మదిఁ దలఁచినాఁడు మీనృపుఁ । డిది యేటికిఁ జెనఁటిచెయ్వు లిన్నియు నిచటన్. 385**

**ప్రతిపదార్థం:** మీ నృపుఁడు= మీ రాజు, దుర్యోధనుడు; ఎదిరిన్= ఎదుటివారిని; తన్నున్= తనను; ఎఱుంగఁడు= తెలియజాలడు; మదమునన్= గర్వం చొప్పున; ప్రాణంబున్= అసువులు; తనదు మానమున్= తనయొక్క గౌరవాన్ని; కోల్పోన్= పోగొట్టు కొనటానికి; మదిన్= మనస్సులో; తలఁచినాఁడు= తలపోశాడు; ఇది= ఈ పని అంతయు; చెనఁటి చెయ్వులు= చెడ్డ పనులు; ఇన్నియున్= ఇన్ని (పెక్కులు); ఇచటన్= ఇచట; ఈ సరోవరతీరాన; ఏటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధన భటులారా! మీ రాజుకు తన శక్తి తెలియదు; ఎదుటివారి శక్తి అంతకంటె తెలియదు. మీ రాజు గర్వాతిరేకంచొప్పున తన గౌరవాన్నే కాదు, చివరకు తన ప్రాణాన్ని కోలుపోవలసి వస్తుంది. పాపం మీ ప్రభువుకు ఈ విషయం తెలిసినట్లు కన్పించదు. గంధర్వులస్థావర మైన ఈ సరోవరతీరాన మీ రాజు ఇట్టి దుస్సాహసాలకు ఒడిగట్టటం తగదు. జాగ్రత్త!

**వ. బుద్ధిమంతుల రై యూరక చనుట లెస్స యనుం' డనినం గ్రమ్మఱి చని వారు కురుపతికిం దద్వచనంబుల తెఱం గంతయుం జెప్పుటయు, నతండు రోషావేశవివశుం డై తమ్ముల దొరలం జూచి, 'మీ రిందఱు మీ మీ సైన్యంబులతోడం గూడి కడంగి, దుర్వినీతు లైన గంధర్వులగర్వంబు మాన్పి సరోవరం బాక్రమించునది; వారికి సహాయుం డయి సురగణసమేతంబుగ నింద్రుండు సనుదెంచె నేనియు నవలీల జయించునది' యని నియోగించిన. 386**

**ప్రతిపదార్థం:** బుద్ధిమంతులరు+ఐ= బుద్ధికలవారై, వివేకవంతులై; ఊరక= ఏమీ చేయకుండ ఉండి; చనుట= వెడలిపోవటం; లెస్స= మంచిది; అనుండు= అని చెప్పండి; అనినన్= అని గంధర్వులు చెప్పగా; వారు= కౌరవభటులు; క్రమ్మఱి= వెనుతిరిగి, చని= వెడలి; కురుపతికిన్= కురువంశానికి నాయకుడైన దుర్యోధనుడికి; తత్+వచనంబుల తెఱంగు= వారియొక్క (గంధర్వుల యొక్క) మాటల తీరు తెన్ను; అంతయున్= సమస్తమున్నూ; చెప్పుటయున్= చెప్పగా; అతండు= అతడు (దుర్యోధనుడు); రోష+ఆవేశ, వివశుండు+ఐ= కోపం యొక్క ప్రజ్వలనం చేత వశం తాను తప్పినవాడై; తమ్ములన్= సోదరులను; దొరలన్= సామంత ప్రభువులను; చూచి= మీరు+ఇందఱున్; మీ మీ సైన్యంబులతోడన్= మీ మీ ఆధిపత్యానికి లోబడి ఉన్న సేనలతో; కూడి= కలిసి; కడంగి= పూని; దుర్వినీతులు+ఐన= మర్యాద అణకువ లేనట్టి; గంధర్వుల గర్వంబు= గంధర్వుల యొక్క అహంకారం; మాన్పి= పోగొట్టి; సరోవరంబు= కొలనును; ఆక్రమించునది= అధీనంలోకి తెచ్చేది; సురగణ సమేతంబుగన్= వేల్పుల సమూహంతో కూడినవాడై; వారికిన్= ఆ గంధర్వులకు; సహాయుండు+అయి= తోడ్పడేవాడై; ఇంద్రుండు= వేల్పుల దొర; చనుదెంచెన్+ఏనియున్= వచ్చినప్పటికిని; అవలీలన్= సులువుగా, లెక్క చేయకుండా; జయించునది= ఓడించాలి (నెగ్గునది); అని= అని పలికి; నియోగించినన్= నియమించగా.

**తాత్పర్యం:** 'తెలివితేటలు కలవారై వివేకంతో ఊరక వెడలటం మంచిది అని మీ రాజుకు చెప్పండి' అని గంధర్వులు పలుకగా దుర్యోధనుడిభటులు వెనుకకు మరలి వెళ్ళి ఆతడికి గంధర్వులు చెప్పిన మాటల తీరు తెన్నులు వివరించి చెప్పారు. అంతట దుర్యోధనుడు ఆగ్రహంతో తన వశం తప్పినవాడై, తన సోదరులను సామంతప్రభువులను చూచి, 'మీరు ఇంతమంది మీమీ సేనలతో దండెత్తి వెళ్ళి దురహంకారంతో విర్రవీగుతున్న గంధర్వులమదం మాన్పి సరోవరాన్ని ఆక్రమించండి. వారికి దేవేంద్రుడు దేవతలతోపాటు సాయం చేయటానికి వచ్చినాసరే వారిని జయించండి' అని ఆజ్ఞాపించాడు.

**క. అతులచతురంగసేనా । న్వితు లయి ధృతరాష్ట్రసుతులు నిరతిశయ రయో**
**ద్ధతసింహనాదబధిరీ । కృదిఙ్ముఖు లగుచుఁ జనిరి గినుక యెలర్పన్. 387**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్ర సుతులు= ధృతరాష్ట్రుడి కుమారులు; అతుల, చతురంగ సేనా+అన్వితులు+అయి= సాటిలేని నాలుగు దళాల సైన్యంతో కూడిన వారయి; నిరతిశయ, రయ+ఉద్ధత= అతిక్రమించటానికి వీలు కాని వేగంతో ఏర్పడిన గర్వంతో; సింహనాద బధిరీకృత, దిక్+ముఖులు+ఐ= సింహనాదాలచేత చెవుడుపడిన దిక్కులయొక్క మొగాలు కలవారై (అనగా సింహగర్జనలవంటి కేకలచేత దిక్కులు చిల్లులు పడేటట్లుగా చేసిన వారై); కినుక+ఎలర్పన్= కోపం అతిశయించగా; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి కొడుకులు ఆగ్రహావేశపరవశు లయి సాటిలేని చతురంగబలాలు కల సేనలతో గంధర్వులపై దండెత్తి వెళ్ళారు. వారు సాటిలేనివేగంతో గర్వంతో సింహనాదాలు చేస్తూ వెళ్ళారు. ఆ సింహనాదాలకు దిక్కులు పిక్కటిల్లాయి.

**వ. ఇట్లు సనుదెంచు కురువీరుల కడ్డంబు వచ్చి కొందఱు గంధర్వులు ప్రియపూర్వకంబుగా 'నిట యేల వచ్చెదరు? మీకు మాతోడి విద్వేషం బేటికి? నిలువుం' డనినం బెలుచ నార్చి సేనాగ్రచరులు వారలమీఁదం బ్రచురశస్త్రాస్త్ర పాతంబు సేయం దొడంగినం, దొలంగి చని, యా గంధర్వు లాక్షణంబ చిత్రసేనునకు నంతయుఁ జెప్పి పుచ్చినం, బ్రబలరోషరంజితాననుండై యతండు. 388**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; చనుదెంచు= అరుగుదెంచే; కురువీరులకున్= కురువంశానికి చెందిన యోధులకు; అడ్డంబు వచ్చి= ఎదురుగా చనుదెంచి నిల్చి; కొందఱు గంధర్వులు= కొంతమంది గంధర్వులు; ప్రియపూర్వకంబుగాన్= సామవచనాలతో; ఇట+ఏల, వచ్చెదరు= ఇక్కడికి ఎందుకు వస్తారు; మీకున్= కౌరవభటులైన మీకు; మాతోడి= గంధర్వులమైన మాతో; విద్వేషంబు= కయ్యం; ఏటికిన్= ఎందుకు?; నిలువుండు= ఆగుడు; అనినన్= అని పలుకగా; పెలుచన్+ఆర్చి= పెద్ద కేకలు పెట్టి; సేనా+అగ్రచరులు= సైన్యంలో ముందు నడిచేవారు; వారల మీఁదన్= ఆ గంధర్వులపై; ప్రచుర, శస్త్ర+అస్త్ర, పాతంబు= ప్రసిద్ధమైన బాణాలను మంత్రమహిమతో కూడిన బాణాలను ప్రయోగించటం; చేయన్+తొడంగినన్= సలుపుటకు పూనగా; తొలంగి= ఆ చోటు వీడి; చని= వెళ్ళి; గంధర్వులు; ఆ క్షణంబు+అ= ఆ నిమిషంలోనే; చిత్రసేనునకున్= (గంధర్వ ప్రభువు అయిన) చిత్రసేనుడికి; అంతయున్= సమస్తాన్నీ; చెప్పి పుచ్చినన్= నివేదించగా; ప్రబల, రోష, రంజిత+ఆననుండు+ఐ= మిక్కుటమైన కోపంచేత ఎర్రబడిన ముఖం కలవాడై; అతండు= చిత్రసేనుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా దండెత్తివస్తున్న కౌరవయోధులకు అడ్డం వచ్చి కొందరుగంధర్వులు సామవాక్యాలతో ఇట్లా అన్నారు- 'ఓ దుర్యోధనభటులారా! కౌరవనేతలారా! మీరెందుకు దండెత్తి వస్తున్నారు? మీకూ మాకూ కయ్యం ఎందుకు? ఆగండి అని. కాని, ఆ సాంత్వనవాక్యాలను కౌరవులు లెక్కచేయక సింహనాదాలు చేశారు. సైన్యానికి ముందు నడిచే భటులు గంధర్వులపై శస్త్రాలు అస్త్రాలు ప్రయోగించారు. అంతట గంధర్వులు తప్పుకొని, వెళ్లి తమప్రభువైన చిత్రసేనుడికి జరిగిన సంగతి నివేదించారు. చిత్రసేనుడి మొగం కోపంతో ఎర్రబడింది.

**క. 'చనుఁడు రయంబున నా దు । ర్జనులం గౌరవులఁ బొదివి సమయింపుఁడు మీ'**
**రని బహుసహస్ర సంఖ్యులఁ । బనిచెను గంధర్వవరులఁ బ్రకటితబలులన్. 389**

**ప్రతిపదార్థం:** మీరు= ఓ గంధర్వులారా; రయంబునన్= వేగంగా; చనుఁడు= వెళ్ళండి; మీరు! ఆ దుర్జనులన్= ఆ చెడ్డవారిని; కౌరవులన్= కురువంశస్థులను; పొదివి= చుట్టుముట్టి; సమయింపుఁడు= సంహరించండి; అని= అని (ఆజ్ఞాపించి); బహు, సహస్ర, సంఖ్యులన్= పెక్కు వేల మందిని; గంధర్వ వరులన్= గంధర్వులలో శ్రేష్ఠులైనవారిని; ప్రకటితబలులన్= సుప్రసిద్ధమైన బలం కలవారిని; పనిచెను= నియమించాడు.

**తాత్పర్యం:** 'ఓ గంధర్వులారా, మీరు వేగంగా దండెత్తి పొండి. చెడ్డవారైన ఆ కౌరవులను చుట్టుముట్టి సంహరించండి' అని చెప్పి, చిత్రసేనుడు యుద్ధంలో ఆరితేరిన వీరులైన పెక్కు వేలమంది గంధర్వభటులకు ఆజ్ఞ నిచ్చాడు.

**వ. ఇట్లు పనిచిన. 390**

**తాత్పర్యం:** ఈ విధంగా చిత్రసేనుడు తన సైనికులను ఆజ్ఞాపించగా.

**ఉ. ఆయత కుంత కార్ముక గదాసి పరశ్వధ శూల పట్టిసా**
**ద్యాయుధ ఘోరహస్తులు గులాచలతుంగతనుల్ ప్రచండతే**
**జోయుతు లా వియచ్చరులు శూరతమై నడతెంచి బల్విడిం**
**గో యని తాఁకి రుగ్రరణకోవిదులై కురురాజసైన్యమున్. 391**

**ప్రతిపదార్థం:** ఆయత, కుంత, కార్ముక, గదా+అసి, పరశ్వధ, శూల, పట్టిస+ఆది+ఆయుధ, ఘోర, హస్తులు= నిడుపైన బల్లెం, విల్లు, గద, కత్తి, గండ్ర గొడ్డలి, కొఱ్ఱు, అడ్డకత్తి మున్నగు పోటుముట్టులతో భయంకరమైన చేతులు కలవారు; కుల+అచల, తుంగ, తనుల్= కుల పర్వతాలవలె ఎత్తు అయిన శరీరాలు కలవారు; ప్రచండ, తేజస్+యుతులు= భయంకరమైన కాంతితో కూడినవారు; ఆ వియత్+చరులు= ఆ (ఆకసంలో చరించేవారు) గంధర్వులు; శూరత మైన్= పరాక్రమం చొప్పున; నడతెంచి= వచ్చి; బల్విడిన్= బలంతో; 'కో' యని= కో అనే సవ్వడి చేస్తూ; ఉగ్ర, రణ, కోవిదులు+ఐ= భయంకరమైన యుద్ధం చేయటంలో నేర్పు గలవారై; కురు, రాజ, సైన్యమున్= కురువంశానికి చెందిన రాజుయొక్క (దుర్యోధనుడి యొక్క) సేనను; తాకిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** నిడుపైన బల్లెము, విల్లు, గుదియ, కత్తి, గండ్ర గొడ్డలి, కొఱ్ఱు, అడ్డకత్తి మున్నగు పోటుముట్లను ధరించిన భయంకరమైన చేతులు కలవారు, కులపర్వతాలవలె ఎత్తైన శరీరాలు కలవారు, దేదీప్యమానమైన వర్చస్సుతో వెలుగొందేవారు, ఆకాశంలో సంచరించగల శక్తి గలిగిన గంధర్వులు పరాక్రమంతో దండెత్తి వచ్చి సింహనాదాలు చేస్తూ దుర్యోధనుడి సేనలను ఢీకొన్నారు.

**వ. ఇవ్విధంబున గంధర్వులు బెట్టిదంబుగాఁ గిట్టి నొప్పింపం దొడంగినం గలంగి దుశ్శాసనాది కౌరవులు ససైన్యంబుగాఁ దెరలి దుర్యోధను చేరువకుం బఱచినఁ, గర్ణుం డొక్కరుండ సుస్థిరుం డయి నిలిచి గంధర్వుల నిలువరించి భల్లార్ధచంద్ర ప్రముఖ బహువిధబాణపాతంబులం దదీయదేహంబులు ఖండించుచు నిమిష మాత్రంబునఁ జిత్రసేను సైనికశతంబుల రూపుమాపుటయు, మఱియుం బైపై గంధర్వులు శతసహస్ర సంఖ్యులు తోఁతెంచినం బృథివి యెల్లను గంధర్వమయం బై నట్లుండె నప్పుడు. 392**

**ప్రతిపదార్థం:** ఇవ్విధంబునన్= ఈ రీతిగా; గంధర్వులు= వేలుపుజాతివారు; బెట్టిదంబుగాన్= ప్రగాఢంగా, మిక్కుటంగా; కిట్టి= ఎదిరించి, ఢీకొని; నొప్పింపన్= బాధింపగా; తొడంగినన్= సమకట్టగా; కలంగి= కలతచెంది; దుశ్శాసన+ఆది, కౌరవులు=

దుశ్శాసనుడు మున్నగు కురువంశస్థులు; ససైన్యంబుగాన్= తమ సేనలతోపాటు; తెరలి= వెనుకకు మరలి; దుర్యోధను చేరువకున్= దుర్యోధనుడి దగ్గరకు; పఱచినన్= పారిపోగా; కర్ణుండు+ఒక్కరుండు+అ= కర్ణుడు ఒకడు మాత్రమే (ఏకైక వీరుడై); సుస్థిరుండు+అయి= కదలకుండ నిలిచినవాడై; నిలిచి= ఆగి; గంధర్వులన్= గంధర్వులను; నిలువరించి= ఆపి; భల్ల+అర్ధచంద్ర ప్రముఖ బహుల బాణపాతంబులన్= ఈటె, చంద్రవంక మున్నగు అనేకమైన అమ్ములు ప్రయోగించటం చేత; తదీయ దేహంబులు= వారియొక్క (గంధర్వులయొక్క) శరీరాలు; ఖండించుచున్= ముక్కలు ముక్కలుగా చేస్తూ; నిమిషమాత్రంబునన్= క్షణకాలంలో; చిత్రసేను సైనిక శతంబులన్= చిత్రసేనుడియొక్క భటులను వందలకొలది; రూపు మాపుటయున్= సంహరించటమున్నూ; మఱియున్= వెండియు; పైపైన్= అదనంగా; గంధర్వులు; శతసహస్ర సంఖ్యలు= లెక్కకు లక్షల మంది; తోఁతెంచినన్= రాగా; పృథివి+ఎల్లను= భూమి అంతయు; గంధర్వ, మయంబు+ఐనట్లు= గంధర్వులతో నిండింది అయినట్లు; ఉండెన్= ఉండింది; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా గంధర్వులు కౌరవసేనలను చుట్టుముట్టి నొప్పించసాగారు. దుశ్శాసనుడు మొదలైన కౌరవులు గంధర్వులధాటికి తాళజాలక రణరంగం వీడి దుర్యోధనుడి సమక్షానికి పారిపోయి చేరారు. కాని, కర్ణుడు ఒక్కడే యుద్ధభూమిలో స్థైర్యంతో నిలిచి బల్లెములతో అర్ధచంద్రబాణాలతో గంధర్వులశరీరాలు ఖండించి నిమిషమాత్రములో చిత్రసేను సైనికులను వందలకొలది సంహరించాడు. ఎంతమంది రణరంగంలో కూలుతున్నా, ఆగక గంధర్వులు లక్షలకొలది వచ్చి కర్ణుడిపై పడసాగారు. భూమిఅంతా అపుడు గంధర్వులతో నిండి ఉన్నట్లు కన్పించింది. అప్పుడు.

**చ.** **శకునియుఁ దమ్ములుం బ్రబలసైన్యముతో నడతేర నాహవో**
**త్సుకమతి యై సుయోధనుఁడు సూతతనూభవుఁ డున్నచోటికిం**
**బ్రకటభుజోగ్రతం గడఁగి బల్విడిఁ దద్రిపుకోటిఁ దాఁకినన్**
**సకలజగద్భయంకరలసత్సమరోత్సవ మయ్యె నయ్యెడన్.** **393**

**ప్రతిపదార్థం:** సుయోధనుఁడు= దుర్యోధనుడు; శకునియున్= సౌబలుడు; తమ్ములున్= అనుజ సోదరులును; ప్రబల సైన్యముతోన్= మిక్కుటమైన సేనతో; నడతేరన్= తరలి రాగా; ఆహవ+ఉత్సుక, మతి+ఐ= యుద్ధం చేయటంలో ఉత్సాహం కల మనస్సు కలవాడై; సూత, తనూభవుఁడు= సూతుడి పుత్రుడైన కర్ణుడు; ఉన్న చోటికిన్= ఉన్న స్థలానికి; ప్రకట, భుజ+ఉగ్రతన్= సుస్పష్టంగా వెల్లడి అయిన పరాక్రమం యొక్క భయంకరత్వం చొప్పున; కడఁగి= పూని; బల్విడి= బలం చూపి; తద్+రిపుకోటిన్= ఆ శత్రు సమూహాన్ని; తాఁకినన్= తలపడగా; ఆ+ఎడన్= ఆ సమయంలో, అచట; సకల, జగత్+భయంకర, లసత్, సమర+ఉత్సవము= సమస్తమైన జగత్తుకు వెరపు గొలుపేది ప్రకాశించేది అయిన యుద్ధమనే పండుగ; అయ్యెన్= జరిగింది.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తనవెంట శకునీ, తమ్ములూ ససైన్యులై రాగా, ప్రబలసేనలతో కూడి యుద్ధం చేసే ఉత్సాహంతో కర్ణుడున్న స్థలానికి పరాక్రమాటోపంతో చేరి గంధర్వులను చుట్టుముట్టాడు. అప్పుడు జగద్భయంకరమైన ఘోరయుద్ధం కౌరవులకూ గంధర్వులకూ జరిగింది.

**క.** **కొండొకసేపునకు మహో । ద్దండనృపానేకఘోరతరవిశిఖవ్రా**
**ఖండిత శరీరులై ధృతి । ఖండితముగఁ బల్లటిలిరి గంధర్వు లనిన్.** **394**

**ప్రతిపదార్థం:** కొండొక సేపునకున్= కొంత తడవునకు; గంధర్వులు; మహా+ఉద్దండ, నృప+అనేక, ఘోరతర, విశిఖ, వ్యాఖండిత, శరీరులు+ఐ= గండరగండలు అయిన ప్రభువులచేత విడువబడిన భయంకరమైన బాణాలచేత ముక్కలుగా చేయబడిన దేహాలు కలవారై; ధృతి, ఖండితముగన్= ధైర్యం కత్తిరించబడినదికాగా; అనిన్= యుద్ధంలో; గంధర్వులు= పల్లటిలిరి= చలించారు.

**తాత్పర్యం:** శకునితో తమ్ములతో కలసి దుర్యోధనుడు కొంతసేపు యుద్ధం చేయబూనగా, ఉద్దండులైనవారు విడిచిన భయంకర బాణాలచేత ఖండించబడిన దేహాలు కలవారై గంధర్వులు తల్లడిల్లిపోయారు.

### చిత్రసేనుం డను గంధర్వరాజు దుర్యోధనునితో యుద్ధము సేయుట (సం. 3-230-21)

**క. గంధర్వులు దెరలుట విని । గంధర్వవిభుండు క్రోధకలుషితమతి యై**
**గంధగజము చందమున, మ । దాంధగతిం గవిసెఁ గౌరవానీకముపై. 395**

**ప్రతిపదార్థం:** గంధర్వులు; తెరలుటన్= వెనుబడటం; చావటం; విని= ఆలకించి; గంధర్వ విభుండు= గంధర్వుల రాజు, చిత్రసేనుఁడు; క్రోధ, కలుషిత, మతి+ఐ= కోపంచేత కలత చెందిన బుద్ధి కలవాడై; కౌరవ+అనీకముపైన్= కౌరవుల సేనపై; గంధ, గజము, చందమునన్= మదించిన యేనుగు మాదిరిగా; మద+అంధ, గతిన్= మదంచేత కన్ను గాననివాడై; కవిసెన్= ముట్టడించాడు.

**తాత్పర్యం:** గంధర్వులు యుద్ధంలో ఓడిపోయిన వృత్తాంతాన్ని ఆలకించి, గంధర్వప్రభువైన చిత్రసేనుడు మదపుటేనుగు మాదిరిగా, మదంచేత గ్రుడ్డితనం ఏర్పడినరీతిగా కౌరవసైన్యాన్ని ఎదుర్కొన్నాడు.

**వ. ఇట్లు గవిసి చిత్రసేనుండు. 396**

**తాత్పర్యం:** ఈ విధంగా ముట్టడించి చిత్రసేనుడు.

**శా. మాయాసంగరకోవిదుండు వికసన్మాయాస్త్రజాలంబులన్**
**వాయువ్యాప్తి యడంగ నర్కకిరణవ్రాతంబు రుద్ధంబుగాఁ**
**జేయం జొచ్చినఁ, ద్రెళ్ళెఁ దేరులు, కరుల్ శీర్ణంబు లయ్యెన్, దళ**
**త్కాయం బయ్యె హయాలి, గూలిరి భటుల్ కౌరవ్యసైన్యంబునన్. 397**

**ప్రతిపదార్థం:** మాయా, సంగర, కోవిదుండు= మోసంతో కూడిన యుద్ధంలో నేర్పరితనం కలవాడు, చిత్రసేనుడు; వికసత్+ మాయా+అస్త్ర, జాలంబులన్= శోభిల్లేవి, మాయతో కూడినవి అయిన మంత్రమహిమతో కూడిన ఆయుధ సముదాయాలచేత; వాయు, వ్యాప్తి+అడంగన్= గాలి వీవటం (వ్యాపించటం) లేకుండేటట్లుగా; అర్క, కిరణ, వ్రాతంబు= సూర్యుడి రశ్మల సముదాయం (సూర్యకాంతి); రుద్ధంబుకాన్= అడ్డగించబడేటట్లు; చేయన్+చొచ్చినన్= చేయసాగగా; కౌరవ్య సైన్యంబునన్= కౌరవుల సైన్యంలో; తేరులు= రథాలు; త్రెళ్లెన్= కూలిపోయాయి; కరుల్= ఏనుగులు; శీర్ణంబులు+అయ్యెన్= ఖండించ బడ్డాయి; హయ+ఆలి= గుర్రాల గుంపులు; దళత్+కాయంబు+అయ్యెన్= ఖండించబడిన శరీరాలు కలవి అయ్యాయి; భటుల్= సైనికులు; కూలిరి= నేల కొరిగారు.

**తాత్పర్యం:** ఈ విధంగా చిత్రసేనుడు యుద్ధం చేయటానికి ఉపక్రమించినపుడు కౌరవసేన చిందరవందర అయిపోయింది. చిత్రసేనుడు మాయాయుద్ధం నేర్చినవాడు. అతడు మాయతో కూడిన మంత్రబాణాలను ప్రయోగించాడు. అందుచేత గాలి ఆడటం ఆగిపోయింది. సూర్యకిరణాలకాంతి అడ్డగించబడింది. రథాలు విరిగి పోయాయి. ఏనుగులు ఖండించబడ్డాయి. గుర్రాలశరీరాలు తుత్తునియలయ్యాయి. భటులు నేల కూలారు.

**క. పొదలి యొకని కొక్కనికిని । బదుగురు పదుగురుగఁ గవిసి పౌరవసేనం**
**బొదివి సమయింపఁ దొడఁగిరి । వదలక గంధర్వు లని నవార్యోద్ధతులై. 398**

**ప్రతిపదార్థం:** గంధర్వులు; అవార్య+ఉద్ధతులు+ఐ= వారించరాని అతిశయం కలవారయి; పొదలి= విజృంభించి; ఒకనికిన్+ ఒక్కనికిని= ఒకడికి ఒక్కొక్కడికిన్నీ (ఒక్కొక్క కౌరవభటుడికి); పదుగురు, పదుగురుగన్= పదిమంది పదిమందిగా; కవిసి= చుట్టుముట్టి; పౌరవసేనన్= కౌరవులసేనను; పొదివి= అలముకొని; సమయింపన్= సంహరించటానికి; వదలక= విడువక; తొడఁగిరి= పూనుకొన్నారు.

**తాత్పర్యం:** కౌరవసేనలోని ఒకభటుడి చుట్టు పదిమంది గంధర్వభటులు చుట్టుముట్టి, కేవలం సంఖ్యాబలం చొప్పున వారించటానికి వీలులేనివారై, గంధర్వులు కౌరవుల భటులను సంహరించటానికి సిద్ధపడ్డారు.

**వ. అవ్వియచ్చరుల విక్రమంబునకు నోర్వక బెదరి చెదరి కురురాజసైన్యంబు ధర్మనందనుం డున్న కందువకుఁ బాఱందొడంగె; నప్పుడు రాధేయుం డజేయుండై కులశైలంబునుం బోలెఁ దరలక నిలిచి గంధర్వులు గురియు శరవర్షంబున మునుఁగుచుఁ దన యోపినంత పెనంగుచుండె; సోదర సౌబల సహాయుండై దుర్యోధనుండు గర్ణసాహాయ్యంబు వదలక నిలిచె; నంత ననంతసత్త్వు లైన గంధర్వు లనేకులు సుట్టుముట్టి. 399**

**ప్రతిపదార్థం:** కురు, రాజ, సైన్యంబు= కౌరవుల రాజుయొక్క (దుర్యోధనుడి) భట సమూహం; ఆ+వియత్+చరుల= ఆకసంలో తిరిగే వారైన ఆ గంధర్వులయొక్క; విక్రమంబునకున్= శౌర్యానికి; ఓర్వక= తాళజాలక; బెదరి= భయపడి; చెదరి= ఇటు అటు పారి; ధర్మనందనుండు= ధర్మపుత్రుడు; ఉన్న కందువకున్= ఉన్నచోటికి; పాఱన్+తొడంగెన్= పరుగెత్తి పోవటానికి మొదలుపెట్టారు; అప్పుడు= ఆ సమయంలో; రాధేయుండు= రాధ కుమారుడైన కర్ణుడు; అజేయుండు+ఐ= జయించ శక్యంకానివాడై; కులశైలంబునున్+పోలెన్= కుల పర్వతంవలె; తరలక= వెనుదిరుగక; నిలిచి= నిలబడి; గంధర్వులు= వేలుపుజాతివారు; కురియు= వర్షించే; శర వర్షంబునన్= బాణాలనెడి వానలో; మునుఁగుచున్= మునిగిపోతూ; తన+ ఓపికన+ అంత= తన శక్తి మేరకు; పెనంగుచుండెన్= పోరాడుతూ ఉన్నాడు; సోదర సౌబల సహాయుండు+ఐ= తమ్ములును శకునియు సాయంగా కలవాడై; దుర్యోధనుండు= సుయోధనుడు; కర్ణ సాహాయ్యంబు= కర్ణుడికి తోడ్పడుతుండటం; వదలక= విడువక; నిలిచెన్= నిలబడెను; అంతన్= పిదప; అనంత, సత్త్వులు+ఐన= తుది లేని బలంగలవారైన; గంధర్వులు; అనేకులు= పెక్కుమంది; చుట్టుముట్టి= పొదివి.

**తాత్పర్యం:** ఆ గంధర్వుల పరాక్రమానికి సహించలేక వికావికలై, దుర్యోధనుడి సైన్యం ధర్మరాజున్న చోటికి పరుగెత్తసాగింది; అప్పుడు కర్ణుడు వెనుదిరగక, కులపర్వతంవలె స్థిరంగా నిలిచి గంధర్వులు గుప్పించే బాణాల వర్షంలో మునుగుతూ కూడా తాను శక్తివంచన లేకుండా యుద్ధం చేస్తూ ఉన్నాడు. సోదరులూ, శకునీ తనకు సహాయం చేస్తూ ఉండగా దుర్యోధనుడు కర్ణుడికి ఆసటబాసటగా నిలిచాడు. అప్పుడు అమితబలులైన గంధర్వులు అనేకమంది వారిని చుట్టుముట్టారు.

**ఉ. కొందఱు సూతు, నశ్వములఁ గొందఱు, కొందరు చాపదండముం**
**గొందఱు చక్రయుగ్మకముఁ, గొందఱు విస్ఫురితాతపత్రముం**
**గొందఱు కూబరంబు, మఱి కొందఱు కేతువుఁ, గొంద ఱక్షమున్**
**దందడిఁ దున్మివైచి విరథత్వ మొనర్చిరి సూతసూతికిన్. 400**

**ప్రతిపదార్థం:** కొందఱు= కొంతమంది (గంధర్వులు); సూతున్= సారథిని; కొందఱు= కొంతమంది; అశ్వములన్= గుర్రాలను; కొందఱు= కొంతమంది; చాప దండమున్= విల్లుయొక్క కాండాన్ని; కొందఱు= కొంతమంది; చక్ర, యుగ్మకమున్= (రథం యొక్క) చక్రాల జంటను; కొందఱు= కొంతమంది; విస్ఫురిత+ఆతపత్రమున్= ప్రకాశించే గొడుగును; కొందఱు= కొంతమంది; కూబరంబు= రథం యొక్క నొగలును; మఱి కొందఱు= ఇంకా కొంతమంది; కేతువున్= పతాకాన్ని; కొందఱు= కొంతమంది; అక్షమున్= రథం యొక్క ఇరుసును; దందడిన్= తరచైన వరుసలో; తున్మివైచి= ఖండించి; సూతసూతికిన్= సూతుడి కొడుకైన కర్ణుడికి; విరథత్వము+ఒనర్చిరి= తేరు లేనితనాన్ని కలిగించారు (రథాన్ని ధ్వంసం చేశారు).

**తాత్పర్యం:** గంధర్వభటులలో కొంతమంది సారథిని, కొంతమంది గుర్రాలను, కొంతమంది వింటిబద్దను, కొంతమంది రెండుచక్రాలను; కొందరు వెలుగొందుతున్న గొడుగును; కొందరు నొగలును; మరికొంతమంది జెండాను; కొందరు ఇరుసును ఖండించి సంరంభంతో కర్ణుడిరథాన్ని ముక్కలు ముక్కలు చేశారు.

**వ. ఇట్లు విరథుం డయి కర్ణుండు వికర్ణురథం బెక్కిరణభూమికిం దొలంగి చనియె; దుర్యోధనుండు విముఖుండు గాక పరబలంబు మార్కొని పెనంగం దొడంగినం గినిసి చిత్రసేనుండు వానిం దలపడి తదీయస్యందనంబు రాధేయురథంబు నట్లు భగ్నంబుగాఁ జేయించి, విరథుం డగు నమ్మహీవిభుం గేశాకర్షణంబున నేలం బడవైచి పెడకేలు గట్టి సింహనాదంబు సేసినం, దక్కిన గంధర్వులుం గనుకనిం బేర్చి యతని వనితా జనంబులను, దత్సోదరు లగు దుశ్శాసన దుర్విషహ దుర్ముఖ వివింశతి చిత్రసేన విందానువిందులను, దత్తనూభవులను, దదీయమంత్రులను బట్టి బంధించి చిత్రసేనున కొప్పించి; రంతఁ బెఱకౌరవులును బౌరులు నమాత్యులుం జెదరి యాక్రోశించుచుం బఱచి, ధర్మపుత్త్రు శరణు సొచ్చి యి ట్లనిరి. 401**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; విరథుండు+అయి= తేరును కోలుపోయినవాడయి; కర్ణుండు= కర్ణుడు; వికర్ణ, రథంబున్+ ఎక్కి= వికర్ణుడియొక్క తేరును ఎక్కి (వికర్ణుడు దుర్యోధనుడి తమ్ముడు); రణ, భూమికిన్= యుద్ధం చేసే స్థలానికి; తొలంగి= వదలి దూరంగా; చనియెన్= వెళ్లాడు; దుర్యోధనుండు= సుయోధనుడు; విముఖుండు+కాక= (యుద్ధభూమికి) వెనుదిరిగిన మొగం కలవాడు కాక; పరబలంబున్= శత్రు సేనను; మార్కొని= ఎదిరించి; పెనంగన్+తొడంగినన్= పోరాడటం సాగించగా; కినిసి= కోపించి; చిత్రసేనుండు= గంధర్వ రాజు; వానిన్= దుర్యోధనుడిని; తలపడి= చుట్టుముట్టి; తదీయ, స్యందనంబు= ఆతడి యొక్క (దుర్యోధనుడి యొక్క) రథాన్ని; రాధేయు రథంబు+అట్ల= కర్ణుడి తేరు వలెనే; భగ్నంబుగాన్= ముక్కలు అయ్యేటట్లుగా, చేయించి= ఒనర్చి; విరథుండు+అగు= తేరును కోలు పోయినవాడు అయిన; ఆ+మహీవిభున్= ఆ రాజును (దుర్యోధనుడిని); కేశ+ఆకర్షణంబునన్= జుట్టు పట్టుకొని; నేలన్= భూమిమీద; పడన్వైచి= పడేటట్లుగా త్రోచి; పెడకేలు+కట్టి= చేతులు వెనుకకువిరిచి బంధించి; సింహనాదంబు+చేసినన్= (విజయ సూచకమైన) సింహం చేసే గర్జన వంటి శబ్దం చేయగా; తక్కిన= మిగిలిన; గంధర్వులున్; కనుకనిన్= సంభ్రమంతో; పేర్చి= అతిశయించి; అతని= దుర్యోధనుడి యొక్క; వనితా జనంబులను= స్త్రీల సమూహాలను; తద్+సోదరులు+అగు= ఆతని తోడబుట్టువులు అయిన; దుశ్శాసన, దుర్విషహ, దుర్ముఖ, వివింశతి, చిత్రసేన, వింద+అను విందులను= దుశ్శాసనుడు, దుర్విషహుడు; దుర్ముఖుడు; వివింశతి,

చిత్రసేనుడు, విందుడు, అనువిందుడు అనే పేర్లు కల వారలను; తద్+తనూభవులను= ఆతడి యొక్క (దుర్యోధనుడి) కొడుకులను; తదీయ, మంత్రులను= ఆతడి యొక్క సచివులను; పట్టి= పట్టుకొని; బంధించి= చెఱపట్టి; చిత్రసేనునకున్= చిత్రసేనుడికి; ఒప్పించిరి= అప్పగించారు; అంతన్= పిదప; పెఱ కౌరవులును= తక్కిన కౌరవ వంశస్థులును; పౌరులును= (హస్తినా)పుర వాసులును; అమాత్యులున్= మంత్రులును; చెదరి= చెల్లాచెదరై; ఆక్రోశించుచున్= రోదనం చేస్తూ; పఱచి= పరుగెత్తి; ధర్మపుత్త్రున్= ధర్మరాజును; శరణు+చొచ్చి= రక్షణ ఇమ్మని ఆశ్రయించి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడు రథాన్ని కోలుపోయినవాడై, దుర్యోధనుడి తమ్ముడైన వికర్ణుడిరథం ఎక్కి యుద్ధభూమిని వీడి వెళ్లాడు. (అంతకుముందు కర్ణుడు ఏకైకవీరుడై చాలసేపు గంధర్వులతో పోరాడి వారిని నిలువరించి ఉన్నాడు). దుర్యోధనుడు యుద్ధభూమిని వీడక నిలబడి శత్రుసేనలను ఎదిరించి పోరాటం కొనసాగించటం చూచి గంధర్వరాజు అయిన చిత్రసేనుడు కోపించి, దుర్యోధనుడితో తలపడి, ఆతడి రథాన్నిగూడ కర్ణుడిరథంవలెనే భగ్న మొనరించాడు. పిదప, రథాన్ని కోలుపోయిన దుర్యోధనుడిని చిత్రసేనుడు జుట్టుపట్టుకొని యీడ్చి నేలమీద పడవైచి, ఆతని చేతులు వెనుకకు విరిచి కట్టి, విజయసూచకంగా సింహనాదం చేశాడు. ఆ దృశ్యాన్ని చూచి, సంభ్రమంతో మిగిలిన గంధర్వులు విజృంభించి దుర్యోధనుడి భార్యలను, తమ్ములైన దుశ్శాసనుడు, దుర్విషహుడు, దుర్ముఖుడు, వివింశతి, చిత్రసేనుడు, విందుడు, అనువిందుడు అనే వారిని, దుర్యోధనుడి కుమారులను, దుర్యోధనుడి మంత్రులను పట్టి బంధించి చిత్రసేనుడికి అప్పగించారు. అంతట మిగిలిన కౌరవులు, హస్తినాపుర జనులు, మంత్రులు రోదిస్తూ పారిపోయి ధర్మపుత్రుడిని శరణు వేడి ఇట్లా పలికారు.

**విశేషం:** ప్రాచీనభారతదేశంలో శరణువేడటం అనే సంప్రదాయం పేర్కొన తగింది. శరణు వేడటం అంటే దిక్కులేని దీనులు గొప్పవారిని రక్షణకై ప్రార్థించటం. శరణు వేడినచో శత్రువుల నైనను కాపాడటం అలనాటి వీరమర్యాద, క్షాత్రధర్మం.

**మ. 'ఘనబాహాబలదుర్నివారమహిమన్ గంధర్వవీరుల్ సుయో**
**ధనుఁ దత్కాంతలఁ దత్సహోదరుల బంధప్రాప్తులం జేసి కై**
**కొని వేపోవుచు నున్న వా రదె; రిపుక్షోభంబు గావించి, నీ**
**యనుజవ్రాతముఁ గావవే కరుణ నిండారంగ రాజోత్తమా!' 402**

**ప్రతిపదార్థం:** రాజ+ఉత్తమా!= ప్రభువులలో శ్రేష్ఠుడవైన వాడా! ఓ ధర్మరాజా!; ఘన, బాహా, బల, దుర్నివార, మహిమన్= గొప్ప పరాక్రమ శక్తి కలగటం వలన వారించటానికి వీలులేని గొప్పతనం వలన; గంధర్వ వీరుల్= వేలుపుజాతివారైన శూరులు; సుయోధనున్= దుర్యోధనుడిని; తద్+కాంతలన్= ఆతడి యొక్క వనితలను; తద్+సహోదరులన్= ఆతడి యొక్క తమ్ములను; బంధప్రాప్తులన్+చేసి= సంకెళ్లతో బంధించి; కైకొని= తీసుకొని; వే= వేగంగా; పోవుచున్+ఉన్నవారు+అదె= వెళ్ళుతున్నారు అరుగో; రిపు, క్షోభంబు+కావించి= శత్రువులకు కలత కలుగజేసి; నీ అనుజ, వ్రాతమున్= నీ సహోదరుల సమూహాన్ని; కరుణ= దయ; నిండు+ఆరంగన్= పరిపూర్ణం కాగా, కావవే!= రక్షించవే! (కాపాడుము).

**తాత్పర్యం:** 'రాజులలో శ్రేష్ఠుడ వైన ఓ ధర్మరాజా! గంధర్వయోధులు సాటిలేని శౌర్యం ప్రదర్శించి వారించటానికి వీలులేని మహిమతో దుర్యోధనుడిని, అతని కాంతలను, సహోదరులను చెఱబట్టి తీసికొని పోతున్నారు. శత్రువులను జయించి, నీవు ఇప్పుడు నీ సోదరులను కాపాడవలెనని మా ప్రార్థన. ఇట్టి దయ చూపుట నీకే తగును.'

**వ. అని కృతాంజలులై పలుకుచున్న వారిం జూచి భీమసేనుండు ప్రహసితాననుం డగుచు ధర్మపుత్త్రున కి ట్లనియె.403**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; కృత+అంజలులు+ఐ= ఘటించిన నమస్కృతి కలవారై, (క్రైమోడ్చి); పలుకుచున్న వారిన్+చూచి= మాటలాడుతున్న వారిని గమనించి; భీమసేనుండు= భీముడు; ప్రహసిత+ఆననుండు+అగుచున్= బాగా నవ్విన మొగం కలవాడు ఔతూ; ధర్మపుత్త్రునకున్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అంటూ అంజలి ఘటించి ప్రార్థిస్తున్న దుర్యోధనుడి మంత్రులను చూచి, భీమసేనుడు సంతోషంతో నవ్వుదొంతరులు వెల్లివిరిసిన ముఖంతో ధర్మపుత్రుడితో ఇట్లా అన్నాడు.

**క. 'మనకుఁ జులుకనయ్యెఁ; మన చేయుపనియ గం। ధర్వవరులు గూడి తగ నొనర్చి;**
**రింత లెస్స యగునె! యే భారమును లేక। యూరకుండ మనల నొందె జయము. 404**

**ప్రతిపదార్థం:** మనకున్+మనకు; చులుకన+అయ్యెన్= సులువు అయింది; మన చేయుపని+అ= మనం నిర్వహించవలసిన కార్యమే; గంధర్వ వరులు= గంధర్వులలో శ్రేష్ఠులు; కూడి= కలిసి; తగన్= ఒప్పిదముగా; ఒనర్చిరి= చేశారు; ఇంత= ఈ పాటిదైన; లెస్స+అగునె= మంచిపని జరిగింది కదా; ఏ భారమును= ఎట్టి బరువు బాధ్యతలును; లేక= లేకుండగనే; ఊరక+ఉండన్= మిన్నకుండగా; మనలన్= మనలను; జయము= గెలుపు; ఒందెన్= పొందింది.

**తాత్పర్యం:** 'ఆహా! ఎంత మంచిపని జరిగింది! అసలు మనం చేయవలసిన కర్తవ్యాన్ని మనకు ఎట్టి భారం లేకుండగానే, మనం ఎట్టి కష్టం పడకుండగానే గంధర్వ శ్రేష్ఠులు నెరవేర్చి మనకు గొప్ప ఉపకారం చేశారు. మనకు విజయం సులువుగా లభించింది గదా!

**విశేషం:** తెలుగులో సుప్రసిద్ధమైన సామెత "కాగల కార్యం గంధర్వులు తీర్చారు" అనేది ఈ కథనుబట్టె ఏర్పడింది.

**తే. పుట్టుగల్లరియై పాపములకు నెల్ల। దిట్టయై లోకములచేతఁ దిట్టు వడిన**
**కట్టిఁడికి నిట్టి కష్టంబుగా నొనర్చి। తగ విధాతృఁడు చతురుఁ డై నెగడె నేఁడు. 405**

**ప్రతిపదార్థం:** పుట్టు+కల్లరి+ఐ= జన్మం చేతనే (అనగా పుట్టినప్పటి నుండియు) అబద్ధాలాడేవాడై; పాపములకున్= దురితాలకు; ఎల్లన్= అన్నిటికిని; దిట్ట+ఐ= సమర్థుడు అయి; లోకములచేతన్= జగత్తులలోని ప్రజలు అందరి చేతను; తిట్టు+పడిన= తెగడ్తలు పొందిన; కట్టిఁడికిన్= దుర్మార్గుడికి; ఇట్టి కష్టంబుకాన్= ఇటువంటి కష్టం (గంధర్వుల చేత చెఱవడటం) కలిగేటట్లు; ఒనర్చి= చేసి; తగన్= సరిపోలునట్లు; విధాతృఁడు= బ్రహ్మదేవుడు; నేఁడు= ఈ రోజున; చతురుఁడు+ఐ= తెలివితేటలు కలవాడయి; నెగడెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** పుట్టుకచేతనే అసత్యవాది అయి, అన్నిపాపాలు చేయటంలో నేర్పరి అయి, లోకాలచేత నిందించబడిన దుర్మార్గుడికి చివరకు ఈ విధంగా గంధర్వులచేత పరాభవం కల్పించి తగిన న్యాయం చేకూర్చిన బ్రహ్మదేవుడు తెలివిగలవా డని నేటికి ఋజువయింది కదా!

**మ. విపరీతస్థితి నొంది ఘోరవిపినోర్వీవాసులై నిత్యదుః**
**ఖపరాధీనతఁ దూలి రంచు మనలన్ గర్వోద్ధతస్వాంతుఁ డై**

**యపలాపింపఁగ వచ్చి దుర్ణయపరుం డా ధార్తరాష్ట్రుండు దో**
**షపరీతాత్ముఁడు దత్ఫలంబు గుడిచెన్ సత్యంబు సామాత్యుఁడై.** **406**

**ప్రతిపదార్థం:** విపరీతస్థితిన్+ఒంది= తారుమారైన గతి పొంది; ఘోర, విపిన+ఉర్వీ, వాసులు+ఐ= భయంకరమైన అడవిలో నివసించేవారు అయి; నిత్య, దుఃఖ పరాధీనతన్= ఎల్లప్పుడును కష్టాలకు లోనయి ఉండటంచేత; తూలిరి+అంచున్= పడిపోయారు అంటూ; మనలన్= మనలను; ఆ, ధార్తరాష్ట్రుండు= ఆ ధృతరాష్ట్రుడి కొడుకు దుర్యోధనుఁడు; గర్వ+ఉద్ధత, స్వాంతుఁడు+ఐ= మదంచేత మత్తెక్కిన మనస్సు కలవాడై; అపలాపింపఁగన్= అవమానించగా; వచ్చి= అరుగుదెంచి; దుర్ణయపరుండు= చెడు నడవడిక కలవాడు; దోష, పరీత+ఆత్ముఁడు= నేరాలతో కూడిన ఆత్మ కలవాడు- దుష్టుడు; స+అమాత్యుఁడు+ఐ= మంత్రులతో కూడిన వాడయి; తత్+ఫలంబు= తన చెడు నడవడికకు తగిన ఫలితాన్ని; కుడిచెన్= అనుభవించాడు; సత్యంబు= ఇది నిజం.

**తాత్పర్యం:** స్థితిగతులు తారుమారై, అడవులలో ఇడుమలు గుడుచుచు మిక్కుటమైన దైన్యానికి లోబడి పతనం చెందిన వారని తలపోసి మనలను గర్వంచేత మదించిన చిత్తం కలవాడై అవమానించటానికి వచ్చిన ధృతరాష్ట్రుడికొడుకు దుష్టాత్ముడు దుర్యోధనుడు అమాత్యులతో కలిసి తగిన శాస్తిని అనుభవించాడు. ఇది నిజం.

**వ. వానిదెసం గృప సేయ వల' దనిన ననుజునకు నగ్రజుం డిట్లనియె.** **407**

**ప్రతిపదార్థం:** వాని, దెసన్= వాని పట్ల, దుర్యోధనుడి యెడ; కృప+చేయన్+వలదు= దయచూప వద్దు; అనినన్= అని చెప్పగా; అగ్రజుండు= అన్నగారు (ధర్మరాజు); అనుజునకున్= తమ్ముడికి; (భీముడితో); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడియెడ దయ చూపరాదు సుమా' అనిన భీమసేనుడితో ధర్మరాజు ఇట్లా పలికాడు.

**క. 'అకట! యిది పరుషవాక్యము। లకు సమయమె? శరణు సొచ్చి లఘుభావముతో**
**వికలగతి నున్న కౌరవ। నికరమునకుఁ గరుణ సేయ నీకుం దగదే!** **408**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; ఇది= ఈ పట్టు; పరుష, వాక్యములకున్= కఠినమైన మాటలకు; సమయమె?= వేళ? (కాదు); శరణు+చొచ్చి= శరణు వేడుకొని; లఘుభావముతోన్= అభిమానాన్ని కోల్పోయిన తేలికతనంతో; వికలగతిన్+ఉన్న= కలతచెంది ఉన్న; కౌరవ నికరమునకున్= కౌరవుల సముదాయానికి; కరుణ+చేయన్= దయచూపటం; నీకున్= నీకు (బలవంతుడ వైన ఓ భీమసేనా! నీకు); తగదే= తగదా (తగును).

**తాత్పర్యం:** 'అయ్యో, భీమసేనా! నీవు బలవంతుడవుకదా! శరణు చొచ్చిన వారిపై నీవంటివారు జాలి చూపవలెనే కాని కఠినమైన మాటలు మాటాడరాదు. కలత చెంది శరణు వేడిన కౌరవులపై నీవు దయచూపాలి సుమా. ఇది క్షాత్రధర్మం.

**వ. ఏ కాన్వయజాతు లైన వారికి నర్థనిమిత్తం బైన భేదం బొక్కొకమాటు ప్రవర్తిల్లు; నంతన చేసి సహజస్నేహంబు దప్పనేరదు; జ్ఞాతిజనంబులు దమలో నెట్టివారైన నొప్పుం గాని, యన్యులవలనం బరిభవంబు దొడరినప్పుడు దా రొం డొరులఁ జేకొన కునికి లోక నింద్యంబు; దుర్యోధనుండు దుర్వినీతుం డైనను సభార్యుం డయి పరులచేతం బట్టు వడియె; దీని నుపేక్షించిన మనకుం గులహాని యగు; నదియునుం గాక శరణాగత**

**రక్షణంబు రాజమాత్రుం డగు వాని కెల్ల ధర్మంబు; నీయట్టి బాహుబలసంపన్నునకు నిట్టి సుకర్మంబు కర్తవ్యం బని వేఱు చెప్పనేల? లెమ్ము! నీవును తమ్ములు నిమ్ముల రథంబు లెక్కిసర్వాయుధసన్నద్ధులై చని సుయోధను చెఱ దలఁగుం' డనినఁ బవననందనుండు ధర్మనందనున కి ట్లనియె. 409**

**ప్రతిపదార్థం:** ఏక+అన్వయ, జాతులు+అయిన వారికిన్= ఒకే వంశంలో పుట్టినవారికి; అర్థనిమిత్తంబు+ఐన= ధనానికి సంబంధించిన; భేదంబు= కలహం; ఒక్కొకమాటు= ఒకానొక పర్యాయం; ప్రవర్తిల్లున్= సంభవిస్తుంది; అంతన+చేసి= అంత మాత్రం చేతనే; సహజ స్నేహంబు= ప్రకృతిసిద్ధంగా ఉండే నెయ్యం; తప్ప నేరదు= విడిపోదు; జ్ఞాతి జనంబులు= ఏక కుటుంబాన పుట్టిన వారలు; తమలోన్= తమలో తాము; ఎట్టివారు+ఐనన్= ఎటువంటివారు ఐనను; ఒప్పున్= సరిపోతుంది; కాని= కాని; అన్యుల వలనన్= పరుల మూలంగా; పరిభవంబు= పరాభవం; తొడరినప్పుడు= ఏర్పడినప్పుడు; తారు= తాము; ఒండొరులన్= ఒకరినొకరు; చేకొనక+ఉనికి= తోడ్పడకుండటం; లోక, నింద్యంబు= ప్రజలచేత గర్హించబడతగింది; దుర్యోధనుండు= సుయోధనుడు; దుర్వినీతుండు+అయినను= చెడ్డ నడవడిక కలవాడు అయినను; సభార్యుండు+అయి= భార్యలతో కూడినవాడై; పరులచేతన్= ఇతరుల చేత; పట్టువడియెన్= బంధించబడ్డాడు; దీనిన్= ఈ విషయాన్ని; ఉపేక్షించినన్= లెక్కచేయకపోతే; మనకున్= మనకు; కులహాని+అగున్= కుటుంబానికి కీడు కలుగుతుంది; అదియున్+కాక= అంతమాత్రమే కాక; శరణ+ఆగత, రక్షణంబు= రక్షణకై ప్రార్థించ వచ్చినవారిని కాపాడటం; రాజ మాత్రుండు+అగు వానికిన్+ఎల్లన్= కేవలం రాజు అయిన వాడికి; ధర్మంబు= ధర్మం; నీ+అట్టి, బాహు, బల, సంపన్నునకున్= నీ వలె పరాక్రమమే సంపదగా కల వాడికి; ఇట్టి= ఇటువంటి; సుకర్మంబు= మంచి పని; కర్తవ్యంబు= అవశ్యం ఆచరించవలసిన కృత్యం; అని= అని; వేఱు= ప్రత్యేకంగా; చెప్పన్+ఏల= చెప్పటెందుకు; లెమ్ము= లేచి నిలబడుము, వెళ్ళటానికి సంసిద్ధం కమ్ము; నీవును; నీ తమ్ములున్= నీ సహోదరులును; ఇమ్ములన్= సంప్రీతితో; రథంబులు+ఎక్కి= తేరులను అధిరోహించి; సర్వ+ఆయుధ సన్నద్ధులు+ఐ= సమస్త మైన పోటుముట్లు సమకూర్చుకొనిన వారై; చని= వెడలి; సుయోధను+చెఱ= దుర్యోధనుడి బంధం; తలఁగుండు= పోగొట్టండి; అనినన్= అని చెప్పగా; పవన నందనుండు= వాయుపుత్రుడైన భీముడు; ధర్మనందనునకున్= ధర్మపుత్రుడికి; ఇట్లు అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఒకేవంశంలో పుట్టినవారికి ధనానికి సంబంధించిన కలహాలు అప్పుడప్పుడు ఏర్పడవచ్చును. అంతమాత్రంచేత ప్రకృతిసిద్ధమైన ప్రేమ తప్పిపోరాదు. ఒకే కుటుంబానికి చెందినవారు తమలో తాము ఏ విధంగా ప్రవర్తించినా సరిపోతుంది కాని, ఇతరులవలన అవమానం కలిగితే ఒకరికొకరు సాయం చేసికొనకపోతే లోకులచేత గర్హించబడతారు. దుర్యోధనుడు చెడునడవడి కలవాడే కావచ్చును. అతడు మనజ్ఞాతి. అతడు తన భార్యలతోపాటు ఇతరులచేత బంధించబడ్డాడు. దీనిని మనం లెక్కపెట్టకపోతే అది మన కుటుంబానికి సయితం అవమాన మౌతుందికదా! అంతేకాక, రాజవంశంలో పుట్టినవాడు బలహీనుడైనప్పటికి శరణాగతులను కాపాడవలెను. ఇది రాజవంశ మర్యాద. బలహీనుడికే శరణాగత రక్షణం కర్తవ్యమైనప్పుడు నీ వంటి బలము గలవానికి అది అవశ్యకర్తవ్యం అని వేరుగా చెప్పవలెనా? ఇక వాదాలు మాని నీ కర్తవ్యాన్ని నిర్వహించటానికి వేగంగా పూనుకొనుము. నీవూ నీ సోదరులూ హృదయపూర్వకంగా రథాల నెక్కి, మీ మీ ఆయుధాలు ధరించి, దండెత్తి వెళ్లి దుర్యోధనుడిని చెఱ విడిపించండి' అని చెప్పగా ధర్మపుత్రుడికి భీమసేనుడు ఇట్లా బదులు పలికాడు.

**సీ. 'అనుమాన మొక్కింతయును లేక యలిగి జ । లంబులఁ ద్రోచె, విషంబు వెట్టె**
**గృహదాహ మొనరించె, విహితదురోదర । కపటుఁడై రాజ్యంబు నపహరించె,**

**జనులెల్లఁ జూడంగ వనజాక్షిఁ బాంచాలిఁ । దలవట్టి యీడ్పించె, వలువ లొలువఁ**

**బనిచెఁ; బుట్టినకోలె మనకు నక్కట! సుయో । ధనుఁ డెగ్గు సేయని దినము కలదె?**

**తే. వానిచేఁత లొకటి యేనియుఁ దలఁపవు; నీవు మనుజనాథ! కేవలంపుఁ**

**గరుణ పూని యుండు దరయ నెప్పుడు; నిట్టు । లైన మనకుఁ గార్యహాని గాదె?' 410**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా! ఓ ధర్మరాజా!; అనుమానము= సందేహం; ఒక్క+ఇంతయును= ఏ మాత్రమున్నూ; లేక= లేకుండా; అలిగి= ఆగ్రహించి; జలంబులన్= నీళ్లలో; త్రోచెన్= నన్ను పడవేశాడు; విషంబు= విషం; వెట్టెన్= తినిపించాడు; గృహదాహము= ఇల్లు తగులబెట్టటం (లక్కఇల్లు); ఒనరించెన్= చేశాడు; విహిత, దురోదర, కపటుఁడు+ఐ= ఏర్పరచిన జూదంలో మోసగాడై; రాజ్యంబున్= రాజ్యాన్ని; అపహరించెన్= అన్యాయంగా కాజేశాడు; జనులు+ఎల్లన్= ప్రజలు అందరు; చూడంగన్= చూస్తుండగా; వనజ+అక్షిన్= పద్మాల వంటి కన్నులు కలదానిని; పాంచాలిన్= ద్రౌపదిని; తల+పట్టి= శిరస్సును (శిరోజాలు) పట్టి; ఈడ్పించెన్= లాగించాడు; వలువలు= వస్త్రాలు; ఒలువన్= తొలగించటానికి; పనిచెన్= నియోగించాడు; పుట్టిన కోలెన్= జన్మించినప్పటి నుండి; మనకున్= మనకు (పాండవులకు); అక్కట!= అయ్యో; సుయోధనుఁ డు= దుర్యోధనుడు; ఎగ్గు= కీడు; చేయని= చేయనట్టి; దినము= రోజు; కలదె= ఉన్నదా (లేదని భావం); వాని చేఁతలు= దుర్యోధనుడి యొక్క పనులు; ఒకటి+ఏనియున్= ఒక్కటయినను; తలఁపవు= స్మరించవు; నీవు; కేవలము+కరుణ+పూని= అచ్చమైన దయ వహించి; ఉండుదు(వు)= ఉంటావు; అరయన్= పరిశీలించగా; ఎప్పుడున్= ఎల్లయెడల; ఇట్టులు+ఐనన్= ఈ విధంగానే జరిగితే; మనకున్= మనకు (పాండవులకు); కార్య హాని+కాదె?= పనులకు కీడు కలుగదా?

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఆ దుర్యోధనుడు మనకు చేసిన అపకారాలను నీవు స్మరించటం లేదు. అతడు సందేహించకుండ నన్ను గంగమడుగులోనికి త్రోయించాడు, అన్నంలో విషం పెట్టి చంపింప తలపోశాడు. లక్కయింటిలో పెట్టి మనలను దహించాలని చూచాడు. జూదమనే పన్నాగంతో మోసం చేసి రాజ్యాన్ని అపహరించాడు. పద్మాల వంటి కన్నులు కలదానిని - పాంచాల రాజపుత్రిని, ద్రౌపదిని నిండుసభలో వస్త్రాపహరణం చేయించాడు. పుట్టినప్పటి నుండీ ఈ దుర్యోధనుడు అనుదినం మనకు అపకారాలు చేస్తూనే ఉన్నాడు కదా! నీవు కేవలం దయామయుడవై అతడి తప్పులు అన్నింటిని మన్నిస్తే అది మనపనులకు హానికరమవుతుందికదా!.

**వ. అని పూర్వవైరస్మరణకలుషితుండై పలికిన నతనికి నజాతశత్రుండు సాంత్వనపూర్వకంబుగా ని ట్లనియె.411**

**ప్రతిపదార్థం:** అని= అని; పూర్వ, వైర, స్మరణ, కలుషితుండు+ఐ= కడచిన కాలంలోని శత్రుత్వాన్ని జ్ఞాపకం చేసికొనటం చేత, కలత చెందిన వాడై; పలికినన్= మాట్లాడగా; అతనికిన్= ఆ భీమసేనుడికి; అజాత శత్రుండు= పుట్టని శత్రువులు కలవాడు- అనగా ఎవరినీ విరోధులుగా పరిగణించని మహానుభావు డైన సాత్త్వికస్వభావుడు ధర్మజుడు; సాంత్వన పూర్వకంబుగాన్= ఓదార్పుమాటలతో; ఇట్లు అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని, పూర్వ శత్రుత్వాన్ని జ్ఞాపకం చేసికొనటంచేత కలతచెందిన భీముడితో, అజాతశత్రువు అయిన ధర్మరాజు ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** ఈ ఘట్టం ధర్మరాజుకు ఏర్పడిన 'అజాతశత్రువు' అనే బిరుదాన్ని సార్థకం చేస్తున్నది.

**ఆ. 'కావరయ్య యనినఁ గరము దుర్బలుఁ డైనఁ । జెనసి యోపినంత సేయు ననిన,**

**నూరకుండునయ్య? యుత్తమశూరుండు । దీనజనుల యున్నతెఱఁగు సూచి. 412**

**ప్రతిపదార్థం:** కావరు+అయ్య+అనినన్= కాపాడండి అయ్యా! అని అడిగితే; కరమున్= మిక్కిలి; దుర్బలుఁడు+ఐనన్= బలహీనుడే అయినప్పటికి; చెనసి= పూని; ఓపినంత= చేతనైనంత మేర; చేయున్= ఒనరిస్తాడు; అనినన్= అనగా; ఉత్తమ శూరుండు= మంచి వీరుడు; దీనజనుల, ఉన్న, తెఱఁగు= కష్టంలో ఉండి ధైర్యం కోలుపోయిన వారు ఉన్న విధం; చూచి= అరసి; ఊరక+ఉండునయ్య?= ఉపేక్ష వహించి ఏమీ చేయక మిన్నకుంటాడా?

**తాత్పర్యం:** దయచేసి మీరు నన్ను కాపాడరా అని దీనంగా ప్రార్థిస్తే, బలహీనుడైనా సరే సాయం చేస్తాడు కదా! మరి, నీవంటి గొప్పవీరుడు దీనజనుల వెత చూచి ఏ సాయం చేయక మిన్నక ఉంటాడా?

**క. శరణం బని వచ్చిన భీ। కరశత్రువు నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం**
**గరుణాపరుల తెఱం గిది; । యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్. 413**

**ప్రతిపదార్థం:** శరణంబు+అని= నాకు దిక్కు లేదు కాపాడుము నిన్ను ప్రార్థిస్తున్నాను; అని; వచ్చిన= అరుదెంచిన; భీకర, శత్రువున్+అయినన్= భయంకరమైన విరోధిని సయితము; ప్రీతిన్= ప్రేమతో; కావఁగన్ వలయున్= రక్షించవలెను; ఇది= శరణాగతులను కాపాడటం; కరుణా పరుల, తెఱంగు= దయ కలిగిన వారి పద్ధతి. దీనికిన్= ఈ శరణాగత రక్షణకు; ఇరవుగన్= సరిపోలగా; ఏ ధర్మంబుల్= మరి ఏ ఇతర ధర్మాలున్నూ; సరికావు= సమానమైనవి కావు.

**తాత్పర్యం:** శరణు వేడితే భయంకరమైన శత్రువును సయితం ప్రేమతో రక్షించాలి. ఇది దయార్ద్రహృదయుల పద్ధతి. ఈ శరణాగతసంరక్షణతో సాటి అయిన ధర్మాలు వేరేవీ లేవు. ఇది పరమధర్మం.

**విశేషం:** ప్రాచీన భారతీయ సంస్కృతికి ఈ పద్యం మణిదర్పణం. దయ, క్షమ, ఔదార్యం - ఆత్మాభిమానం పెనగొని ప్రాచీన క్షాత్రధర్మం - 'శరణాగత రక్షణ' పరమధర్మంగా ప్రతిష్ఠించింది. భారతీయసాహిత్యంలో మాత్రమేకాక భారతదేశచరిత్రలో కూడ భారతీయుల శరణాగతరక్షణ పరాయణత్వానికి పెక్కు ఉదాహరణలు ఉన్నాయి. శరణాగత త్రాణం కొరకై ఆత్మబలిదానం ఒనర్చిన మహావీరులచరిత్రలు రాజస్థాన కథావళిలో (రచయిత: కర్నలు టాడ్ దొర: తెలుగు సేత: కీర్తి శేషులు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు) కాన వస్తాయి. ఈ రాజనీతి సిద్ధాంతం భారతీయుల బలం, మరియు బలహీనత అనే నవీన విమర్శకులు ఉన్నారు.

**వ. ధృతరాష్ట్రసూనుండు భవదీయ బలశౌర్యంబులపేర్మి యెఱుంగుం గావునఁ దన్ను నవశ్యంబును విడిపింతు రని మనదెస బద్ధాశుం డై యుండు; నిది మనకుఁ బుణ్యంబును గీర్తియుం జేకొను సమయంబు; ని న్నింత నిర్బంధింప వలవ; దేన యరుగుదు; నిప్పుడు యజ్ఞదీక్షితుండ నై యున్నవాఁడఁగావున నాకుం జనరాదు; మీరు వేగఁ జని గంధర్వులం బ్రియపూర్వకంబుగా ననునయించి సుయోధను విడిపించునది; సామవచనంబులం దీరకున్నఁ బరాక్రమంబుననైనం బ్రతివీరుల నోర్చి కార్యంబు దీర్చునది; నా చేయు జన్నంబు సఫలంబు సేయుం' డనిన భీముం డెట్టకేనియు నియ్యకొనియె; నర్జునుండును ధర్మరాజు పనుపు గైకొని కురురాజుచెఱ దలఁగఁ బ్రతిజ్ఞసేసె; నకుల సహదేవులు నుత్సాహసమేతు లయి; రన్నలువురు నాముక్త కవచులు, నాబద్ధ తూణీరులు, నాకలిత కార్ముకులు, నారూఢ రథులు నయి, యగ్రజు వీడ్కొని, యతిత్వరితగతి నడచినం గౌరవసైన్యం బంతయు వారిం గూడుకొని సింహనాదంబులు సెలంగం జనియె; ని ట్లరిగి వారలు గంధమాదనంబున కయిచనుచున్న యవ్వియచ్చరానీకంబుం గూడ ముట్టిన. 414**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రసూనుండు= ధృతరాష్ట్రుడి కొడుకు-దుర్యోధనుడు; భవదీయ, బల, శౌర్యంబుల, పేర్మి= నీ యొక్క శక్తి, పరాక్రమాల యొక్క అతిశయం; ఎఱుంగున్+కావునన్= తెలియును కాబట్టి; తన్నున్= తనను (దుర్యోధనుడిని); అవశ్యంబును= తప్పకుండగా; విడిపింతురు+అని= విడిపించగల రని; మన దెసన్= మన యెడ; బద్ధ+ఆశుండు+ఐ= గట్టిగా నాటుకొనిన కోరిక కలవాడై; ఉండున్= ఉంటాడు; ఇది= ఈ కాలం; మనకున్= మనకు (పాండవులకు); పుణ్యంబును= సుకృతాన్ని; కీర్తియున్= యశస్సును; చేకొను= స్వీకరించదగిన; సమయంబు= అనువైన కాలం; నిన్నున్+ఇంత= నిన్ను ఇంతమేరకు; నిర్బంధింపన్ వలవదు= బలవంతపెట్టరాదు; ఏను+అ= నేనే; అరుగుదున్= వెళ్ళుతాను; (కాని) ఇప్పుడు= ఈ సమయంలో; యజ్ఞ, దీక్షితుండను+ఐ= క్రతువులో తాత్పర్యం కలవాడనై; ఉన్నవాడన్= ఉన్నాను; కావునన్= కాబట్టి; నాకున్+చన్‌రాదు= నాకు వెళ్ళటానికి వీలు లేదు; మీరు= (నీవును, అర్జునుడును, నకులుడును, సహదేవుడును); వేగన్= శీఘ్రంగా; చని= వెళ్లి; గంధర్వులన్= గంధర్వులను; ప్రియపూర్వకంబుగాన్= ప్రియం ముందుండేటట్లుగా (ప్రేమతో); అనునయించి= బుజ్జగించి, మీ వైపునకు త్రిప్పుకొని; సుయోధనున్= దుర్యోధనుడిని; విడిపించునది= బంధవిముక్తుడిని చేయండి; సామవచనంబులన్= సాత్త్వికమైన మాటలచేత; తీరక+ఉన్నన్= పని నెరవేరకుంటే; పరాక్రమంబునన్+ఐనన్= శౌర్యాన్ని ప్రదర్శించటంచేతనైనా; ప్రతి వీరులన్= శత్రు యోధులను; ఓర్చి= జయించి; కార్యంబు= కర్తవ్యాన్ని; తీర్చునది= నెరవేర్చండి; నా చేయు= నేను చేసే; జన్నంబు= యజ్ఞం; సఫలంబు+చేయుండు= ఫలితాన్ని ఇచ్చేదిగా ఒనరించండి; అనినన్= అని (ధర్మరాజు) చెప్పగా; భీముండు; ఎట్టకేనియున్= తుట్టతుదకు; ఇయ్యకొనియెన్= అంగీకరించాడు; అర్జునుండును= అర్జునుడు సయితం; ధర్మరాజు పనుపు= ధర్మరాజు నియోగం; కైకొని= స్వీకరించి; కురురాజు చెఱ= కురువంశపు రాజు అయిన దుర్యోధనుడి నిర్బంధం; తలఁగన్= తొలగించటానికి; ప్రతిజ్ఞ= శపథం; చేసెన్= చేశాడు; నకుల సహదేవులు= నకులుడును సహదేవుడును; ఉత్సాహ సమేతులు= లోకోత్తర కార్యాన్ని నెరవేర్చటానికైన స్థిర సంకల్పంతో కూడినవారు; ఐరి= అయినారు; ఆ+నలువురు= భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు; ఆముక్త కవచులు= ధరించబడిన కవచాలు కలవారు; ఆ బద్ధ తూణీరులు= అమ్ములపొదులు ధరించినవారు; ఆకలిత కార్ముకులు= ధనుస్సులతో కూడినవారు; ఆ రూఢ రథులు= తేరులను ఎక్కినవారు; అయి; అగ్రజున్= అన్నవద్ద; వీడ్కొని= అన్న వద్ద సెలవు గైకొని; అతి త్వరిత గతిన్= మిక్కిలి శీఘ్రమైన గమనంతో; నడచినన్= వెడలగా; కౌరవ సైన్యంబు+అంతయున్= కౌరవుల సేన సమస్తమున్నూ; వారిన్= వారిని (భీమార్జున నకుల సహదేవులను); కూడుకొని= కలిసి; సింహనాదంబులు+చెలంగన్= సింహగర్జనల వంటివి సమరోత్సాహ సూచకములును అయిన శబ్దాలు ఒప్పారేటట్లుగా; చనియెన్= వెడలింది; ఇట్లు+అరిగి= ఈ విధంగా వెడలి; వారలు= భీముడు-అర్జునుడు-నకులుడు-సహదేవుడు; గంధమాదనంబునకు+అయి= గంధమాదనం అనే పర్వతం చేరటం కొరకై; చనుచున్+ఉన్న= పయనిస్తున్న; ఆ+వియత్+చర+అనీకంబున్= ఆకాశంలో చరించే గంధర్వులయొక్క సైన్యాన్ని; కూడ ముట్టినన్= చేరగా.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్రుడి కుమారుడైన దుర్యోధనుడికి మీ యొక్క బల పరాక్రమ ప్రాభవాలు తెలియును; మనం అతడికి జ్ఞాతులం; ఏకకుటుంబానికి చెందినవారం కాబట్టి తప్పకుండగా మనం తనను బంధవిముక్తుడిని కావించగలమని మనమీద పెద్ద ఆస పెట్టుకొని ఉంటాడు. ఇది పుణ్యకార్యం. ఈ పుణ్యకార్యం చేయటంవలన మనకు కీర్తిప్రతిష్ఠలు పెరుగుతాయి. ఈ సదవకాశాన్ని మనం జారవిడుచుకొనరాదు సుమా! నేను ప్రస్తుతం ఈ యజ్ఞం నిర్వహించటంలో నిమగ్నుడనై ఉన్నాను. ఈ పవిత్రకార్యాన్ని మధ్యలో విడిచిపెట్టకూడదు. అసలు నేనే వెళ్ళి దుర్యోధనుడిని విడిపించవలసింది. నిన్ను బలవంతం చేయటం భావ్యం కాదు కాని నేను యజ్ఞదీక్షలో ఉండటంచేత కదలటానికి వీలు లేదు కనుక ఇంతగా నిన్ను వేడుకొనవలసి వచ్చింది. మీరు శీఘ్రంగా వెళ్ళి, ముందు సామవాక్యాలతో గంధర్వులను ప్రార్థించి సుయోధనాదులను విడిపించాలి. ఒకవేళ సాంత్వనవాక్యాలను గంధర్వులు లెక్కచేయకపోతే మీరు శౌర్యసాహసాలు ప్రదర్శించి అయినా సుయోధనుడిని విడిపించాలి. అట్లాచేసి నే చేసే యజ్ఞం సఫలం

చేయండి' అని ధర్మరాజు ప్రబోధించగా ఎట్టకేలకు భీముడు అంగీకరించాడు. అర్జునుడు ధర్మరాజు ఆజ్ఞను సంతోషంతో స్వీకరించి దుర్యోధనుడిని బంధముక్తుడిని చేస్తానని శపథం చేశాడు. నకులసహదేవులును లోకోత్తరకార్యనిర్వహణంలోని స్థిరసంకల్పంతో అర్జునుడిని అనుసరించారు. భీముడు అర్జునుడు నకులుడు సహదేవుడు కవచాలు ధరించారు. అమ్ములపొదులను సంతరించుకొన్నారు. ధనుస్సులను సమకూర్చుకొన్నారు. రథాలను అధిరోహించారు. వారు ధర్మరాజును వీడ్కొని వేగంగా వెడలి, గంధమాదనపర్వతాన్ని చేర పయనిస్తున్న గంధర్వసైన్యాన్ని సమీపించారు. కౌరవసైన్యం భీమార్జున నకులసహదేవుల నాయకత్వంలో పురోగమించి గంధర్వసేనను చేరగానే ఉత్సాహంతో సింహనాదాలు చేశారు.

**విశేషం:** గంధమాదనం కులపర్వతాలలో ఒకటి. అది దేవతలకు నివాసయోగ్యం.

### భీమార్జున నకులసహదేవులు గంధర్వులతో యుద్ధంబు సేయుట (సం. 3-233-5)

**క. కని గంధర్వులు గ్రమ్మఱి । ఘనులం బాండవుల నగ్నికల్పులఁ దేజో**
**ధనుల నమరేంద్రసదృశుల । ననఘుల మార్కొనిరి ప్రకటితాటోపమునన్. 415**

**ప్రతిపదార్థం:** గంధర్వులు; కని= చూచి; క్రమ్మఱి= వెనుతిరిగి; పాండవులన్= పాండు నందనులను; ఘనులన్= గొప్పవారిని; అగ్నికల్పులన్= అగ్నితో సమానులు అయినవారిని; తేజస్+ధనులన్= వర్చస్సు అనే ధనం కలవారిని; అమర+ఇంద్ర, సదృశులన్= దేవేంద్రుడితో సమానులు అయినవారిని; అనఘులన్= పాపరహితులను; ప్రకటిత+ఆటోపమునన్= బాగా వెల్లడి అయిన విజృంభణతో; మార్కొనిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** గంధర్వులు తమను తాకుటకై వచ్చిన సేనను చూచారు. వారు గంధమాదనానికి పోవటం మాని, వెనుకకు తిరిగి - గొప్పవారు, అగ్ని సమానులు, దేదీప్యమానమైన కాంతితో వెలుగొందేవారు, దేవేంద్రుడితో సమానులు, పుణ్యాత్ములు అయిన పాండవులను తమ శక్తిసామర్థ్యాలు ప్రకటమయ్యేటట్లుగా ఎదుర్కొన్నారు.

**ఉ. అగ్రజువాక్యముల్ దలఁచి యర్జునుఁ డప్పుడు వారితోడ న**
**త్యుగ్రత దక్కి యెంతయుఁ బ్రియోక్తుల నిట్లను 'మీకు మాయెడన్**
**విగ్రహ మేల? నెయ్యమున విడ్వుఁడు కౌరవరాజుఁ; బార్థివ**
**ప్రాగ్రసరుండు ధర్మసుతు ప న్పిది; మీకు నలంఘ్య మిత్తఱిన్.' 416**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు= అర్జునుడు; అప్పుడు= ఆ సమయంలో; అగ్రజు వాక్యమున్= అన్నగారి (ధర్మరాజు యొక్క) మాటలను, తలఁచి= స్మరించి; వారితోడన్= గంధర్వులతో; అతి+ఉగ్రత= మిక్కుటమైన తీక్ష్ణత; దక్కి= వదలి; ఎంతయున్= మిక్కుటంగా; ప్రియ+ఉక్తులన్= ప్రీతితో కూడిన మాటలతో; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికాడు; మీకున్= ఓ గంధర్వులారా! మీకు; మా+ఎడన్= మా పట్ల, పాండవుల యెడ; విగ్రహము+ఏల= విరోధం ఎందుకు?; కౌరవ రాజున్= కురు ప్రభువు అయిన దుర్యోధనుడిని; నెయ్యమునన్= స్నేహంతో; విడ్వుఁడు= వదలిపెట్టండి; పార్థివ ప్రాగ్రసరుండు= రాజులలో మొట్టమొదట లెక్కించదగినవాడు, సార్వభౌముడు; ధర్మసుతు, పన్పు+ఇది= ఇది ధర్మపుత్రుడి ఆజ్ఞ; ఈ తఱిన్= ఈ సందర్భంలో; (ఇది); మీకున్= మీకు (గంధర్వులకు); అలంఘ్యము= దాటటానికి వీలుకానిది.

**తాత్పర్యం:** అప్పుడు అన్నగారైన ధర్మరాజు చెప్పిన హితోపదేశాన్ని స్మరించి, అర్జునుడు ఆ గంధర్వులకు ఈ విధంగా హెచ్చరిక చేశాడు: 'ఓ గంధర్వులారా! మీకు మాతో విరోధం ఎందుకు? మేం దుర్యోధనుడిని విడిపించటానికై వచ్చాం. మీరు స్నేహపురస్సరంగా ఆతడిని విడిచి పెట్టండి. ఇది రాజులలో అగ్రేసరుడైన ధర్మరాజు గారి ఆజ్ఞ. ఈ ఆజ్ఞ మీరు జవదాటరానిదిగా గ్రహించండి'

**విశేషం:** ధర్మరాజు సత్త్వమూర్తి. అందుచేత సామవాక్యాలతో పని సాధించవలె నని తమ్ములకు సూచించాడు. అర్జునుడికి అన్నగారి మీద గౌరవమున్నది కాని ఆతడు అన్నగా రంత సాత్త్వికుడు కాడు. మొదట సామవాక్యాలు పలికినను చివరకు అర్జునుడు చేర్చిన హెచ్చరికలో కొంత అహంకారపూరితమైన ఆత్మప్రత్యయం అంతర్గర్భితంగా ఇమిడి ఉన్నది. అర్జునుడికి అసలు కావలసింది - తన శక్తి సామర్థ్యాలు ప్రదర్శించటం. గంధర్వులతో నెయ్యం, దుర్యోధన బంధవిముక్తి అర్జునుడిదృష్టిలో ఆనుషంగికాలే. ధర్మరాజు ఆజ్ఞ గంధర్వులు జవదాటటానికి వీలు లేదు - అనేమాటలోని యెత్తిపొడుపు గంధర్వులు గ్రహించక పోలే దని వారి ప్రత్యుత్తరమే సాక్ష్యమిస్తున్నది.

**వ. అనిన నతనికి గంధర్వు లిట్లనిరి. 417**

**తాత్పర్యం:** అనగా అర్జునుడితో గంధర్వులు ఈ విధంగా అన్నారు.

**తే. 'ధర్మజుఁడు మాకుఁ బ్రభుఁడె? యా ధర్మతనయు । నాజ్ఞ నే మేల యొనరింతు? మనిమిషేంద్రుఁ**
**డొక్కరుఁడ మమ్ము శాసింప నొడయఁ; డన్యు । లెందు నెవ్వరైనను భయ మేమి మాకు?' 418**

**ప్రతిపదార్థం:** ధర్మజుఁడు= ధర్మరాజు; మాకున్, ప్రభుఁడె?= మాకు పరిపాలకుడా?; ఆ ధర్మతనయు+ఆజ్ఞన్= ఆ ధర్మరాజు యొక్క ఆనతిని; ఏము= మేము; ఏల+ఒనరింతుము?= ఎందుకు ఆచరిస్తాం?; అనిమిష+ఇంద్రుఁడు= దేవేంద్రుడు; ఒక్కరుఁడు+అ= ఒకడు మాత్రమే; మమ్మున్= మమ్మల్ని (గంధర్వులను); శాసింపన్= ఆజ్ఞాపించటానికి; ఒడయఁడు= ఏలిక; అన్యులు= ఇతరులు; ఎందున్= ఎచటనైనా; ఎవ్వరు+ఐనను= ఎవరైనను; మాకున్= మాకు (గంధర్వులకు); భయము+ఏమి?= ఏమి భయం?

**తాత్పర్యం:** ధర్మరాజు మాకు ప్రభువు కాడు కదా. ఆ ధర్మరాజు ఆనతిని మే మెందుకు పాటించాలి? దేవేంద్రుడు ఒక్కడే మమ్మల్ని ఆజ్ఞాపించదగిన ఏలిక. ఇతరులు ఎంతటివారైనా మాకు భయం లేదు.

**వ. అనిన వివ్వచ్చుం డవ్వియచ్చరుల నుపలక్షించి, 'మునుమున్న తెగువకుం జొర నేల? యని ప్రియంబును ధర్మంబునుంగాఁ బలికితి; నెట్లును మీరు సామసాధ్యులరు గాకునికి దోఁచుచున్నయది గావున నుగ్రంబయిన విగ్రహంబున దుర్యోధను విడిపింతు' నని వారలమీఁద నిశితవిశిఖప్రకరంబులు ప్రయోగించె; నా గంధర్వులు నతనిపైఁ బటుబాణవర్షంబులు గురిసి; రి ట్లా నలువురకు ననేకగంధర్వశతసహస్రంబులతో నతిఘోరసమరం బయ్యె; నందు. 419**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన; వివ్వచ్చుండు= అర్జునుడు; ఆ+వియత్+చరులన్= ఆ గంధర్వులను (ఆకాశంలో చరించే వారిని); ఉపలక్షించి= చూచి; మునుమున్న+అ= మొట్టమొదటనే; తెగువకున్= సాహసానికి; చొరన్+ఏల= చొచ్చుకొని పోనేల; అని= తలచి; ప్రియంబును= ఇంపైనదియును; ధర్మంబునున్+కాన్= ధర్మమును అయ్యేటట్లుగా; పలికితిన్=

వచించాను; ఎట్లును= ఏ రీతిగానైనా; మీరు= గంధర్వులైన మీరు; సామ సాధ్యులరు= సామంతో లొంగేవారు; కాక+ఉనికి= కానట్లుగా; తోఁచుచున్నఅది= తలపునకు తట్టుతున్నది; కావునన్= కాబట్టి; ఉగ్రంబు+అయిన= భయంకరమైన; విగ్రహంబునన్= యుద్ధంలో; దుర్యోధనున్= దుర్యోధనుడిని; విడిపింతున్= బంధముక్తుడిని కావిస్తాను; అని= అని పలికి; వారలమీఁదన్= గంధర్వులపై; నిశిత విశిఖ ప్రకరంబులు= వాడిఅయిన బాణాల సముదాయాలు; ప్రయోగించెన్= వేశాడు; ఆ గంధర్వులున్= ఆ గంధర్వులున్నూ; అతనిపైన్= అర్జునుడి మీద; పటు, బాణ, వర్షంబులు= అధికమైన అమ్ముల వానలు; కురిసిరి= వర్షించారు; ఇట్లు= ఈ విధంగా; ఆ నలువురకున్= ఆ నలుగురికి (అర్జునుడు, భీముడు, నకులుడు, సహదేవుడు అనే వారికి); అనేక, గంధర్వ, శత సహస్రంబులతోన్= పెక్కు లక్షల మంది గంధర్వులతో; అతిఘోర సమరంబు+అయ్యెన్= మిక్కిలి భయంకరమైన యుద్ధం జరిగింది; అందున్= ఆ యుద్ధంలో.

**తాత్పర్యం:** అని గంధర్వులు బదులుపలికారు. అంతట అర్జునుడు గంధర్వుల నుద్దేశించి ఇట్లా పలికాడు: 'మొట్టమొదటనే సాహసానికి దిగటం మంచిది కాదని సామవాక్యాలతో ప్రియంగా ధర్మంగా వివరించి పలికాను. కాని, మీరు సామానికి లొంగేవారు కారని తెల్లమైనది. కాబట్టి, భయంకరమైన యుద్ధంలో దుర్యోధనుడిని బంధ ముక్తుడిని చేస్తాను' అని అర్జునుడు గంధర్వులపై వాడిఅయిన బాణాలను ప్రయోగించాడు. గంధర్వులున్నూ అర్జునుడిపై బాణాలవర్షం కురిపించారు. ఈ విధంగా భీముడికి అర్జునుడికి నకులుడికి సహదేవుడికిన్ని లక్షల కొలది గంధర్వులతో మిక్కిలి భయంకరమైన పోరాటం కొనసాగింది. ఆ యుద్ధంలో.

**తరలము.**

> **కదిసి యర్జునుతేరు భగ్నముగా నొనర్పఁ దలంచి పె**
> **ల్లొదవి ఖేచరకోటి గ్రమ్ముటయుం బురందర నందనుం**
> **డదయుఁడై పదిలక్షలం బ్రళయాగ్నికల్పుల దివ్యులం**
> **గదనశూరుల నిర్దహించెఁ బ్రకాండదివ్యశరార్చులన్.** **420**

**ప్రతిపదార్థం:** కదిసి= దగ్గరకు చేరి; అర్జును తేరు= అర్జునుడి యొక్క రథం; భగ్నముకాన్+ఒనర్పన్+తలంచి= విరుగ గొట్టటానికి ఊహించి; పెల్లు+ఒదవి= మిక్కిలి పుట్టి; ఖేచరకోటి= ఆకసంలో సంచరించేవారి సముదాయం, గంధర్వులు; క్రమ్ముటయున్= చుట్టుముట్టటమున్నూ; పురందర నందనుండు= దేవేంద్రుడి కొడుకు, అర్జునుఁడు; అదయుఁడు+ఐ= జాలి లేనివాడై; ప్రళయ+అగ్ని, కల్పులన్= ప్రళయ కాలంలోని అగ్నితో సమానులను; దివ్యులన్= వేల్పులను; పది లక్షలన్= పది లక్షల మందిని (10,00,000); కదన శూరులన్= యుద్ధ వీరులను; ప్రకాండ, శర+అర్చులన్= శ్రేష్ఠాలున్నూ దేవతా సంబంధమైన మహిమకలవియున్నూ అయిన బాణాలయొక్క అగ్నిజ్వాలలచేత; నిర్దహించెన్= కాల్చివేశాడు.

**తాత్పర్యం:** గంధర్వులు, అర్జునుడి రథాన్ని చేరి, చుట్టుముట్టి దానిని భగ్నం చేయటానికి పూనుకొన్నారు కాని అర్జునుడు కఠినచిత్తుడై ఆ గంధర్వులను ప్రళయకాలంలోని అగ్నితో సమానులైనవారిని, యుద్ధంలో గొప్ప శక్తి సామర్థ్యాలు కలవారిని పదిలక్షలమందిని తనయొక్క శ్రేష్ఠమైన మంత్రబాణాల అగ్నిజ్వాలలో దగ్ధమయ్యేటట్లు చేశాడు.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడు. ఆర. 4.402 విశేషం.

**మహాస్రగ్ధర.**

> **ఘనకోదండోగ్రమౌర్వీ । క్వణ మఖిలనభో । గహ్వరాభోగభాగం**
> **బున నాపూర్ణంబుగా ను । బ్బునఁ గవలు మరు । త్పుత్త్రుడుం దీవ్రనారా**
> **చ నితాంతాపాతలీలా । సరభసగతులై । శత్రువీరవ్రజంబుం**
> **దునుమం దచ్ఛోణితంబుల్ । దొరిఁగి మడువులై । తొట్టె నయ్యుద్ధభూమిన్.** **421**

**ప్రతిపదార్థం:** ఘన, కోదండ+ఉగ్ర, మౌర్వీ, క్వణము= గొప్పవైన ధనుస్సునుండి వెలువడిన భయంకరమైన అల్లెత్రాటి ధ్వని; అఖిల, నభస్, గహ్వర+ఆభోగ, భాగంబునన్= సమస్తమైన ఆకాశమనే గుహలోని విశాలమైన స్థలాన్నంతటిని; ఆ పూర్ణంబున్+కాన్= నిండినదికాగా; ఉబ్బునన్= ఉత్సాహంతో; కవలు= జంటబిడ్డలు (నకుల సహదేవులు); మరుత్+పుత్త్రుడున్= వాయునందనుడును (భీముడును); తీవ్ర, నారాచ, నితాంత, ఆపాత, లీలా, సరభస గతులు+ఐ= తీక్ష్ణాలైన బాణాలను ఎల్లప్పుడు ప్రయోగించట మనే ఆటలో సంభ్రమంతో కూడిన నడవడిక కలవారై; శత్రు వీరవ్రజంబున్= విరోధి యోధుల సముదాయాన్ని; తునుమన్= ఖండించగా; తద్+శోణితంబుల్= వారియొక్క అనగా శత్రువీరులయొక్క నెత్తురులు; ఆ+యుద్ధభూమిన్= ఆ రణరంగంలో; తొరిఁగి= స్రవించి; మడువులు+ఐ= కాలువలు అయి; తొట్టెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** గొప్పదైన వింటినుండి వెలువడిన భయంకరమైన అల్లెత్రాటిచప్పుడు ఆకాశం అనెడి విశాలమైన గుహలో పరిపూర్ణంగా నిండగా, భీముడును నకులసహదేవులును ఉత్సాహంతో విజృంభించి తీవ్రములైన బాణాలను ప్రయోగించే ఆటలో సంభ్రమంతో కూడిన నడవడిక కలవారలై విరోధియోధుల సమూహాలను ఖండించారు. ఆ యోధులశరీరాలనుండి కారిన నెత్తురుటేరులు ఆ రణరంగంలో ప్రవహించాయి.

**విశేషం:** మహాస్రగ్ధరలోని ప్రతిపాదానికీ 22 అక్షరాలుంటాయి. ప్రతిపాదంలోనూ వరుసగా -స, త, త, న, స, ర, ర, గ - అనే గణాలుంటాయి. 9, 16వ అక్షరాలతో యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది. శార్దూల వృత్తపాదంలోని మొదటి గురువును రెండు లఘువులుగా మారిస్తే మత్తేభ వృత్తమైనట్లే, స్రగ్ధరాపాదంలోని మొదటి గురువును రెండు లఘువులుగా మారిస్తే మహాస్రగ్ధర పాదమౌతుంది.

**వ.** **ఇట్లు కౌంతేయులచేతం బీడితులై గంధర్వులు దుర్యోధనాదుల చెఱ లేమఱక గొనుచు గగనంబునకు నెగసి త్రోచిపోవ నుంకించిన నెఱింగి సవ్యసాచి రయంబున నతినిబిడబాణజాలంబులం జేసి దిఙ్న భోమార్గంబులు నీ రంధ్రంబులుగాఁ గప్పిన నగ్గగనచరులు వలలోనం జిక్కిన పులుఁగులుం బోలెఁ బోవ నేరక శరపంజరంబునం జిక్కియు నుక్కుసెడక యన్నలువురమీఁద వివిధాయుధప్రకరంబులు ప్రయోగించిన.422**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; గంధర్వులు; కౌంతేయుల చేతన్= కుంతీకుమారుల చేత; పీడితులు+ఐ= బాధించబడిన వారై; దుర్యోధన+ఆదుల చెఱలు= దుర్యోధనుడు మున్నగువారియొక్క బంధాలు; ఏమఱక= మరపు లేకుండ; కొనుచున్= పట్టుకొంటూ; గగనంబునకున్= ఆకసానికి; ఎగసి= ఎగిరి; త్రోచిపోవన్= తప్పించుకొని పోవటానికి; ఉంకించినన్= ప్రయత్నించగా; ఎఱింగి= తెలిసికొని; సవ్యసాచి= కవ్వడి (రెండు చేతులతో బాణాలు ప్రయోగించే నేర్పరి అర్జునుడు); రయంబునన్= వేగంగా; అతి, నిబిడ, బాణ జాలంబులన్+చేసి= మిక్కిలి దట్టమైన బాణాల సముదాయాలతో; దిఙ్నభో మార్గంబులు= దిక్+నభస్+మార్గంబులు= దిక్కులు ఆకాశం అనెడి తెరువులు; నీరంధ్రములుగాన్= రంధ్రాలు లేనట్టివిగా - అనగా మిక్కిలిదట్టంగా; కప్పినన్= మూయగా; ఆ+గగన చరులు= ఆకాశాన చరించే ఆ గంధర్వులు; వలలోనన్= వలలోపల;

చిక్కిన= చిక్కుకొనిన; పులుఁగులున్+పోలెన్= పక్షుల వలె; పోవన్‌నేరక= తప్పించుకొని పోలేక; శర పంజరంబునన్= బాణాలతో నిర్మించబడిన గూటిలో; చిక్కియున్= బంధించబడియు; ఉక్కు+చెడక= బలం నశించక; ఆ+నలువుర మీఁదన్= ఆ నలుగురిపై (భీమ అర్జున నకుల సహదేవులపై); వివిధ+ఆయుధ, ప్రకరంబులు= పలురకాలైన పోటుముట్ల సముదాయాలు; ప్రయోగించినన్= ఉపయోగించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవులచేత బాధించబడినవారై గంధర్వులు దుర్యోధనాదులబంధాలను సడలించకుండా గట్టిగా పట్టుకొంటూ ఆకసానికి ఎగిరి తప్పించుకొని పారిపోవటానికి ప్రయత్నించటాన్ని అర్జునుడు తెలివితేటలతో గుర్తించాడు. అంతట సవ్యసాచి అయిన అర్జునుడు మిక్కిలి దట్టములైన బాణపరంపరలను ప్రయోగించి ఆ గగనచారులైన గంధర్వులు తప్పించుకొని ఆకసంలో ఎగిరిపోకుండా దిక్కులను మూసివేశాడు. ఇంక గంధర్వులు వలలో చిక్కిన పక్షులవలె చిక్కుపడినప్పటికిని, బలము కోలుపోక పాండవులపై పెక్కురకాలైన పోటుముట్లను ప్రయోగించారు.

**మ.** **అవి యెల్లం దునుమాడి క్రీడి ఘనరోషాభీలుఁడై శాతభ**
**ల్లవితానం బడరించినం దలలు డొల్లం గాయముల్ మింట నుం**
**డి వడిం గుంభినిఁ గూలఁగా రుధిరవృష్టిం గాలువల్ పాఱఁగా**
**దివి గంధర్వుల క్రం దడంగె జగ ముద్వేగంబునం బొందఁగన్.** **423**

**ప్రతిపదార్థం:** అవి+ఎల్లన్= గంధర్వులు ప్రయోగించిన పోటుముట్లను అన్నింటిని; తునుమాడి= ఖండించి; క్రీడి= అర్జునుఁడు; ఘన, రోష+ఆభీలుఁడు+ఐ= గొప్ప కోపంతో భయంకరుడై; శాత, భల్ల, వితానంబు= పదనైన భల్లాస్త్రాల సముదాయం (బల్లెముల పరంపరలను ఉద్భవింపజేసే అస్త్రాలు భల్లాస్త్రాలు); అడరించినన్= ప్రయోగించగా; తలలు= శీర్షాలు; డొల్లన్= దొరలి క్రింద పడగా; కాయముల్= శరీరాలు; మింటనుండి= ఆకసం నుండి; వడిన్= వేగంగా; కుంభినిన్= భూమిపై; కూలఁగాన్= క్రిందికి పడగా; రుధిర, వృష్టిన్= నెత్తురు వానచేత; కాలువల్= కాలువలు (ప్రవాహాలు); పాఱఁగాన్= ప్రవహించగా; దివిన్= ఆకసంలో; గంధర్వుల క్రందు= గంధర్వుల యొక్క సమ్మర్దం; జగము= లోకం; ఉద్వేగంబునన్+పొందఁగన్= వ్యాకులతను చెందేటట్లుగా; అడంగెన్= తగ్గింది.

**తాత్పర్యం:** గంధర్వులు ప్రయోగించిన ఆయుధాల నన్నిటిని, అర్జునుడు కోపంచేత భయంకరుడై భల్లాస్త్రం ప్రయోగించి ఖండించాడు. అంతట గంధర్వుల తలలు డొల్లినాయి. ఆకసంనుండి వారిదేహాలు ఖండించబడి వేగంగా భూమిపై పడ్డాయి. నెత్తురువాన కురిసి, రణరంగంలో కాలువలు ప్రవహించాయి. జగత్తు వ్యాకులత చెందింది. ఇంక ఆకసంలో గంధర్వుల సమ్మర్దం అణగింది.

**వ.** **మఱియును నర్జునప్రయుక్తం బైన ఆగ్నేయాస్త్రంబు దావాగ్ని నీరసవిపినంబు దహించు తెఱంగున గంధర్వ నివహంబు నీఱు సేయం దొడంగినం గినిసి చిత్రసేనుండు భీమసేనానుజుమీఁదం బటు గదాదండంబు వైచిన నతండు దాని నేడు తునియలుగా సేయుటయు, గంధర్వరాజు మాయాబలంబున నంతర్హితుం డై.** **424**

**ప్రతిపదార్థం:** మఱియును= ఇంకను; అర్జున ప్రయుక్తంబు+అయిన= అర్జునుడిచేత ప్రయోగించబడిన; ఆగ్నేయ+అస్త్రంబు= అగ్నికి సంబంధించిన మంత్రాయుధం; దావ+అగ్ని= కార్చిచ్చు; నీరస విపినంబున్= ఎండిన అడవిని; దహించు తెఱంగునన్= కాల్చివేసే రీతిగా; గంధర్వ నివహంబున్= గంధర్వుల సముదాయాన్ని; నీఱు+చేయన్+తొడంగినన్= బుగ్గిగా మార్చి వేయసాగగా;

చిత్రసేనుండు= గంధర్వరాజు; కినిసి= కోపగించి; భీమసేన+అనుజు మీఁదన్= భీముడి తమ్ముడిమీద - అర్జునుడిపై; పటు, గదా, దండంబు= గొప్ప నిడివియైన గదాయుధాన్ని; వైచినన్= వేయగా; అతండు= అర్జునుడు; దానిన్= ఆ గదను; ఏడు తునియలుగా= ఏడుముక్కలుగా; చేయుటయును= ఖండించుటయున్నూ; గంధర్వరాజు= చిత్రసేనుడు; మాయాబలంబునన్= వంచనతో కూడిన శక్తిచేత; అంతర్హితుండు+ఐ= కనుపించకుండాపోయి.

**తాత్పర్యం:** అంతేగాక అర్జునుడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రం - ఎండిపోయిన అడవిని అగ్ని దహించే రీతిగా-గంధర్వసేనను తగులబెట్టింది. తన సేనలు బుగ్గి కావటంచేత కోపగించి గంధర్వరాజైన చిత్రసేనుడు అర్జునుడిపై గొప్ప గదాదండాన్ని విసిరాడు. అర్జునుడు ఆ గదను ఏడు తునియలుగా ఖండించాడు. ఇక చేసేది లేక మాయావి అయిన చిత్రసేనుడు కనుపించకుండా మాయమై.

**క. నలువురు పార్థుల నత్యు । జ్జ్వల శరవర్షముల ముంచి జలధరముక్రియం**
**బెలుచన గర్జిల్లుచు మొ । క్కలుఁడయి తన విక్రమంబుఁ గడఁకయుఁ జూపెన్. 425**

**ప్రతిపదార్థం:** (ఆ చిత్రసేనుడు); నలువురు పార్థులన్= నలుగురు కుంతీకుమారులను; అతి+ఉత్+జ్వల, శర, వర్షములన్= ఎంతగానో ప్రకాశించే అమ్ములవానలలో; ముంచి= తడిపి; జలధరము క్రియన్= మేఘంవలె; పెలుచన= గట్టిగా; గర్జిల్లుచున్= పెను ధ్వని చేస్తూ; మొక్కలుఁడు+అయి= మిడిసిపడే వాడయి; తన, విక్రమంబు= తనయొక్క శౌర్యం; కడఁకయున్= పట్టుదలను; చూపెన్= ప్రదర్శించాడు.

**తాత్పర్యం:** చిత్రసేనుడు భీమార్జుననకులసహదేవులపై తీవ్రమైన అమ్ములవాన కురిపించి, మేఘంవలె గర్జిస్తూ తనపరాక్రమాన్ని పట్టుదలను ప్రదర్శించాడు.

**ఆ. దాని నుఱక యింద్రసూనుండు గాండీవి । శబ్దభేదు లయిన సాయకములఁ**
**జిత్రసేను సర్వగాత్రంబు భేదించి । యొక్క మాత్రలోన నుడిపెఁ గడఁక. 426**

**ప్రతిపదార్థం:** దానిన్+ఉఱక= దానిని లక్ష్యపెట్టక; ఇంద్రసూనుండు= ఇంద్రుడి కొడుకు; గాండీవి= గాండీవాన్ని ధరించేవాడు-అర్జునుడు; శబ్ద భేదులు+అయిన= శబ్దాన్ని బట్టి లక్ష్యాన్ని తునుమాడేవైన; సాయకములన్= బాణాలచేత; చిత్రసేను, సర్వ, గాత్రంబున్= చిత్రసేనుడి శరీరాన్నంతటిని, భేదించి= బ్రద్దలు కొట్టి; ఒక్క మాత్రలోనన్= ఒక త్రుటి కాలంలోనే; కడఁకన్= పూనికను; ఉడిపెన్= పోగొట్టాడు.

**తాత్పర్యం:** కన్నులకు కనుపించకుండ మరుగై, మేఘంవలె గర్జిస్తూ బాణాలు ప్రయోగిస్తున్న చిత్రసేనుడి మాయ వ్యర్థం అయ్యేటట్లుగా, శబ్దాన్ని బట్టి లక్ష్యాన్ని భేదించే అమ్ములచేత అర్జునుడు చిత్రసేనుడి శరీరాన్ని తూట్లు పడేటట్లు చేసి ఆతడి పూనికను వమ్ము చేశాడు.

**విశేషం:** ఒకనాటిరాత్రి అర్జునుఁడు బాల్యంలో భోజనం చేస్తుండగా దీపం ఆరిపోయింది. అయినను అతడు అభ్యాసవశాన తినగలిగాడు. అంతట, అట్లే కంటికి కన్పింపక పోయినా, అభ్యాసవశాన అమ్ములతో లక్ష్యాన్ని భేదించవచ్చు నని ఆలోచించి బహుళసాధన చేసి శబ్దభేదిసాయకవిద్యను నేర్చాడు. ఈ కథ మహాభారతం ఆదిపర్వంలో ఉన్నది.

**వ. ఇట్లు నొచ్చి గంధర్వనాయకుండు రణసంరంభంబు విడిచి యర్జునుంజేరంజని తనపొడ సూపి నిలిచిన, నవ్వీరుండును నాత్మసఖుం డయిన ఖేచరపతి తెఱంగు సూచి సంహృతాస్త్రుం డయ్యె; వృకోదరాదులును**

**సమరవిరామంబు నొందిరి; వారలందఱుఁ దమ తమ రథంబుల మీఁదన యుండి యొండొరులఁ గుశలంబు లడిగి; రప్పు డర్జునుండు చిత్రసేనున కి ట్లనియె.** **427**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నొచ్చి= వెత చెంది; గంధర్వ నాయకుండు= గంధర్వుల నేత, చిత్రసేనుడు; రణ సంరంభంబు= యుద్ధ సన్నాహం; విడిచి= వదలిపెట్టి; అర్జునున్= అర్జునుడిని; చేరన్+చని= సమీపించి; తన పొడ చూపి= తనరూపు కన్పించి; నిలిచినన్= నిలబడగా; ఆ+వీరుండును= ఆ అర్జునుడు కూడా; ఆత్మ, సఖుండు, అయిన= తన యొక్క చెలికాడు అయిన; ఖేచరపతి తెఱంగు= గంధర్వరాజు తీరు; చూచి= గమనించి; సంహృత+అస్త్రుండు+అయ్యెన్= ఉపసంహారం చేసిన మంత్రాయుధాలు కలవాడయ్యాడు (ఆయుధాలను ప్రయోగించటం విరమించాడు); వృకోదర+ఆదులును= భీముడు మున్నగువారును; సమర విరామంబున్+ఒందిరి= యుద్ధాన్ని ఆపారు; వారలు+అందఱున్= వారు అందరు (చిత్రసేనుడును పాండవులును); తమ తమ రథంబుల మీఁదన= తమ తేరులపైననే; ఉండి; ఒండొరులన్= ఒకరినొకరు; కుశలంబులు= యోగక్షేమాలు; అడిగిరి= ప్రశ్నించారు; అప్పుడు= ఆ సమయంలో; అర్జునుండు; చిత్రసేనునకున్= చిత్రసేనుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా నొచ్చి, గంధర్వరాజు చిత్రసేనుడు మాయాసంగరాన్ని విరమించి అర్జునుడిదగ్గరికి వచ్చి నిజరూపంతో కన్పించాడు. అర్జునుడును అనుగునెచ్చెలిఅయిన చిత్రసేనుడి దుస్థితికి వగచి, అస్త్రప్రయోగాన్ని ఉజ్జగించాడు. భీమసేనుడు మున్నగువారుకూడా యుద్ధాన్ని విరమించారు. అంతట చిత్రసేనుడును పాండవులును తమ తమ రథాలపైననే ఉండి, ఒకరి నొకరు యోగ క్షేమాలు విచారించుకొన్నారు. అర్జునుడు అపుడు చిత్రసేనుడితో ఇట్లా అన్నాడు.

**క. 'వీరోత్తమ! నీ కిమ్మెయి । వైరము దగునయ్య? కౌరవప్రకరముతోఁ**
**గౌరవపతి విడువుము త । ద్దారానుజసుత సమన్వితంబుగ నెమ్మిన్.'** **428**

**ప్రతిపదార్థం:** వీర+ఉత్తమ!= శూరులలో శ్రేష్ఠుడవైనవాడా, ఓ చిత్రసేనా!; నీకున్; ఈ+మెయిన్= ఈ రీతిగా; కౌరవ, ప్రకరముతోన్= కౌరవ సమూహంతో; వైరము= శత్రుత్వం; తగునయ్య?= ఉచితం అగునా?; కౌరవపతిన్= కురురాజును దుర్యోధనుడిని; తద్+దార+అనుజ, సుత, సమన్వితముగన్= ఆతడి యొక్క భార్యలతో, తమ్ములతో, పుత్రులతో సహితంగా; నెమ్మిన్= ప్రీతితో; విడువుము= వదలిపెట్టుము.

**తాత్పర్యం:** 'శూరులలో శ్రేష్ఠుడవైన ఓ చిత్రసేనా! నీకు ఈ రీతిగా కౌరవులసముదాయంతో శత్రుత్వం తగునా? కౌరవరాజు అయిన దుర్యోధనుడిని విడిచిపెట్టుము. ఆతనితోపాటుగా, ఆతడి భార్యలను, సహోదరులను సంప్రీతితో బంధముక్తులను చేయుము!'

**వ. అనిన నతం డర్జునున కిట్లనియె.** **429**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అర్జునుడు చెప్పగా; అతండు= చిత్రసేనుడు; అర్జునునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని అర్జునుడు చిత్రసేనుడికి చెప్పాడు. అంతట చిత్రసేనుడు అర్జునుడితో ఇట్లా బదులు పలికాడు.

**సీ. 'ఈ దురాత్ముఁడు మిమ్ము నివ్వనంబున నితాం । తాయాసపీడితు లైనవారిఁ**
**బరమధర్మాత్ముల భార్యాసమేతుల । నపహసింపఁ దలంచి యరుగుదెంచె;**

**నింతయు నెఱిఁగి సురేంద్రుండు గలుషించి । యనుజవధూసహాయాన్వితముగఁ**
**బాపవర్తను వీనిఁ బట్టి తెమ్మని నన్నుఁ । బనిచిన వచ్చితిఁ బార్థ! వినవె;**

**తే.** **శక్రుపాలికి నిదె కొని చనుచున్న । వాఁడ; నీ వింక నొం డన వలదు వినుము !**
**మత్సఖుండవు గావున మత్సరంబు । నలుకయును లేదు నీదెస ననఘ! నాకు'.** **430**

**ప్రతిపదార్థం:** పార్థ!= ఓ అర్జునా! వినవె= వినుము, వినుచుంటివి గదా!; ఈ దురాత్ముఁడు= ఈ దుష్టుడు దుర్యోధనుడు; మిమ్మున్= మిమ్ములను (పాండవులను); ఈ+వనంబునన్= ఈ అడవిలో; నితాంత+ఆయాస, పీడితులు+ ఐనవారిన్= ఎల్లప్పుడు శ్రమచేత వెతచెందినవారిని; పరమ, ధర్మ+ఆత్ములన్= గొప్ప ధార్మికులను; భార్యా, సమేతులన్= పెండ్లంతో కలిపి ఉన్న వారిని; అపహసింపన్+తలంచి= వెక్కిరించ తలపోసి; అరుగుదెంచెన్= వచ్చాడు; ఇంతయున్+ఎఱిఁగి= ఈ విషయాన్నంతటిని గ్రహించి; సుర+ఇంద్రుండు= దేవేంద్రుడు; కలుషించి= ఆగ్రహించి; అనుజ, వధూ, సహాయ+అన్వితముగన్= సోదరులు భార్యలు సాయం చేసేవారితో సహా; పాపవర్తనున్= పాపంతో కూడిన నడవడిక కలవాడిని; వీనిన్= దుర్యోధనుడిని; పట్టి తెమ్ము+అని= బంధించి తీసికొని రమ్ము అని ఆజ్ఞాపించి; నన్నున్= నన్ను; పనిచినన్= నియోగించగా; వచ్చితిన్= అరుగుదెంచాను; ఇది+ఎ= ఇదిగో; శక్రు పాలికిన్= దేవేంద్రుడి సమక్షానికి; కొని= బంధించి; చనుచున్+ఉన్నవాఁడన్= వెళ్ళుతున్నాను; ఈవు+ఇంకన్= నీవు ఇకమీద; ఒండు= వేరొకటి; అనన్‌వలదు= చెప్పవద్దు; వినుము= నేను చెప్పిన మాటకు అంగీకరించుము; అనఘ!= పాపరహితుడా! మత్+సఖుండవు= నా చెలికాడవు; కావునన్= కాబట్టి; నీ దెసన్= నీ యెడల; నాకున్= నాకు; మత్సరంబు= అసూయ; అలుకయును= కోపమును; లేదు= ఉండదు.

**తాత్పర్యం:** నీకు తెలియని విషయాన్ని తెలుపుతున్నాను. సావధానంగా వింటే నీకే తెలుస్తుంది. నీమీద నాకు ఎట్టి కోపంగాని అసూయ కాని లేదు. నీవు నాకు ప్రియమిత్రుడవు. ఈ దుర్యోధనుడు దురాత్ముడు. మీరు ఈ అడవిలో పలుపాట్లు పడుతుండగా మిమ్ము ఎగతాళి చేయటానికి ఈ ఘోషయాత్ర అనే మిష పెట్టి ఇక్కడికి వచ్చాడు. మీరు పరమధర్మాత్ములు. ఈ అడవిలో మీ భార్యతోపాటు కలసి ఉన్న మిమ్ము వెక్కిరించ తలపోయవచ్చునా? ఈ సంగతి నంతయు గ్రహించిన దేవేంద్రుడు ఈ దురాత్ముడిని, ఈ దురాత్ముడి పరివారాన్ని బంధించి తెమ్మని నన్ను ఆజ్ఞాపించాడు. నీవు వేరుమాట చెప్పవద్దు. ఈతడిని దేవేంద్రుడి సమక్షంలో నిలుపవలసి ఉన్నది.

**తే.** **అనిన నర్జునుఁ డతని కిట్లనియె 'నీ సు । యోధనుఁడు మాకు వినుము సహోదరుండు**
**గాన యీతని విడుచుట కర్జ; మిదియ । ధర్మజున కెంతయును ప్రమోదంబు సేఁత.** **431**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చిత్రసేనుడు పలుకగా; అర్జునుఁడు; అతనికిన్= చిత్రసేనునకు; ఇట్లు+అనియెన్; వినుము= ఆలకింపుము; ఈ సుయోధనుండు; మాకున్= మాకు (మా పాండవులకు); సహోదరుండు= సోదరుఁడు; కాన= కావున; ఈతనిన్= ఈ దుర్యోధనుడిని; విడుచుట= వదలటం; కర్జము= చేయదగిన పని; ఇది+అ=ఇదియే; ధర్మజునకున్= ధర్మరాజుకు; ప్రమోదంబు+చేఁత= ఆనందం చేకూర్చటం.

**తాత్పర్యం:** అర్జునుడు చిత్రసేనుడితో ఈ విధంగా వచించాడు: 'ఈ దుర్యోధనుడు ఎటువంటి వాడైనను ఇతడు మాకు సోదరుఁడు'. ఆలకింపుము. ఇతడిని నీవు విడిచిపెట్టటమే చేయదగిన పని. ఏలన, అదియే ధర్మరాజుకు ఆనందాయకమైన పని.

చ. **అమరవరేణ్యు పన్పయిన, నావల యెయ్యది యైన, నిప్డు ధ**
**ర్మమహితుఁడైన ధర్మజుసమక్షమునం దెఱిఁగించి, యాతఁ డే**
**క్రమమున నెద్ది సెప్పె నది గైకొని చేయుము; నీవు మత్ప్రియా**
**ర్థము చనుదెమ్ము' నావుడును దాని కొడంబడి చిత్రసేనుఁడున్.** 432

**ప్రతిపదార్థం:** అమర వరేణ్యు పన్పు+అయినన్= దేవతలలో శ్రేష్ఠుడు అయిన ఇంద్రుడి ఆజ్ఞ అయినప్పటికి; ఆవల= తదుపరి; ఏ+అది= ఏది; ఐనన్= అయినను; ఇప్డు= ఈ సమయంలో; ధర్మ, మహితుఁడు+ఐన= ధర్మంచేత గొప్పవాడయిన; ధర్మజు సమక్షమునందున్= ధర్మరాజు మ్రోల; ఎఱిఁగించి= తెలిపి; ఆతఁడు= ధర్మరాజు; ఏ క్రమమునన్= ఏ వరుసలో; ఎద్ది= ఏది; చెప్పెన్= చెప్పినాడో; అది= దానిని; కైకొని= అంగీకరించి; నీవు= నీవు; చేయుము= ఆచరింపుము; మత్+ప్రియ+అర్థము= నా ప్రీతి కొరకై; చనుదెమ్ము= రమ్ము; నావుడును= అని చెప్పగా; దానికిన్= ఆ మాటకు; ఒడంబడి= అంగీకరించి; చిత్రసేనుఁడున్= చిత్రసేనుడుకూడా.

**తాత్పర్యం:** అది దేవేంద్రుడి ఆజ్ఞయే కావచ్చును. తరువాత ఏదైనా కావచ్చును. ముందుగా ఇపుడు చేయవలసిన పని- మనం ధర్మరాజువద్దకు వెళ్ళి, ఆయనకు అంతయు చెప్పి, ఆయన ఎట్లా నిర్ణయిస్తే ఆ విధంగా నడచుకొనవలెను. ముందు నీవు నా ప్రీతికొరకు ధర్మరాజుకడకు రమ్ము' అని అర్జునుడు పలికాడు. అందుకు చిత్రసేనుడు సమ్మతించాడు.

చిత్రసేనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చి దుర్యోధను విడిచిపెట్టి పోవుట (సం. 3-235-11)

వ. **వారలుం దాను ధర్మజుకడకుం జనిన, నయ్యజాతశత్రుండు చిత్రసేను నతిప్రియంబునం బూజించి, 'మహాత్మా! యీ సుయోధనుండు సానుజామాత్యుం డయి మీచేత వధియింపం బడకునికి మేలయ్యె; మీ కారణంబున మా వంశంబునకు కొండొకహాని వొంద దయ్యె; వీఁ డెట్టి యపరాధంబు సేసినను, నదియంతయు సహించి మాకుంగా వీని విడువవలయు' నని ప్రార్థించిన, నతం 'డట్ల కాక' యని దుర్యోధనాదుల నందఱ విడిచి పాండుపుత్త్రుల నామంత్రణంబు సేసి, దివంబున కరిగి తత్ప్రకారంబు సకలంబును నింద్రునకు నివేదించిన, నింద్రుండును సమరనిహతు లయిన గంధర్వుల నమృతవృష్టిం జేసి బ్రదికించె; నిట యుధిష్ఠిరుండును ధార్త రాష్ట్రునకు బంధమోక్షణంబు గావించి వాని కిట్లనియె.** 433

**ప్రతిపదార్థం:** వారలున్= వారూ (భీమార్జున నకుల సహదేవులును); తానున్= చిత్రసేనుడును; ధర్మజు కడకున్= ధర్మరాజు సమక్షానికి; చనినన్= వెడలగా; ఆ+అజాత శత్రుండు= శత్రువులు లేనట్టివాడు ఆ ధర్మరాజు; చిత్రసేనున్= చిత్రసేనుడిని; అతి ప్రియంబునన్= మిక్కిలి ప్రీతితో; పూజించి= అర్చించి; మహా+ఆత్మా!= మహానుభావుడ వైన ఓ చిత్రసేనా!; ఈ సుయోధనుండు= ఈ దుర్యోధనుడు; స+అనుజ+అమాత్యుండు+అయి= తమ్ములతోడను మంత్రులతోడను కూడినవాడై; మీచేతన్= గంధర్వుల చేత; వధియింపంబడకునికి= సంహరింపబడకపోవడంవలన; మేలు+అయ్యెన్= శుభం జరిగింది; మీ కారణంబునన్= మీ మూలాన; మా వంశంబునకున్= మా కుటుంబ కూటమికి; కొండొక హాని= ఒక కీడు; పొందదు+అయ్యెన్= పొందలేదు; వీఁడు= ఈ దుర్యోధనుడు; ఎట్టి= ఎటువంటి; అపరాధంబు= నేరం; చేసినను= ఒనరించినప్పటికీ; అది+అంతయున్= అది సమస్తం; సహించి= ఓర్చి; మాకున్+కాన్= మా కొరకుగా; వీనిన్= దుర్యోధనుడిని; విడువ వలయును= విడిచి పెట్టనగును; అని= చెప్పి; ప్రార్థించినన్= వేడుకొనగా; అతండు= అతడు (చిత్రసేనుడు); అట్లు+అ+కాక= ఆ విధంగానే

జరుగుగాక; అని= అని చెప్పి; దుర్యోధన+ఆదులన్= దుర్యోధనుడు మున్నగువారలను; అందఱన్= అందరిని; విడిచి= వదలిపెట్టి; పాండుపుత్రులన్= పాండునందనులను; ఆమంత్రణంబు+చేసి= వీడ్కొని; దివంబునకున్= స్వర్గానికి; అరిగి= వెడలి; తద్+ప్రకారంబు= ఆ విధమును; సకలంబున్= అంతటిని; ఇంద్రునకున్= వేలుపుల దొరకు; నివేదించినన్= విన్నవించగా; ఇంద్రుండును= దేవేంద్రుడును; సమర, నిహతులు+అయిన= యుద్ధంలో చంపబడిన; గంధర్వులన్= గంధర్వులను; అమృతవృష్టిన్+చేసి= అమృతపు వాన కురిపించటం చేత; బ్రదికించెన్= పునర్జీవితులను చేశాడు; ఇట= ఇచట; యుధిష్ఠిరుండును= ధర్మరాజును; ధార్తరాష్ట్రునకున్= ధృతరాష్ట్రుడి కొడుకగు దుర్యోధనుడికి; బంధ మోక్షణంబు+కావించి= కట్లువిప్పించి; వానికిన్= దుర్యోధనునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** పాండవులు చిత్రసేనుడు కలిసి ధర్మనందనుడి దగ్గరకు వెళ్ళారు. ఆ అజాతశత్రుడు చిత్రసేనుడిని స్వాగతమర్యాదలతో మన్నించి 'మహానుభావా! ఈ దుర్యోధనుడు మాకు సోదరుడు. మా అదృష్టంవలన ఈతడు, ఈతని భార్యలు, తమ్ములు, అమాత్యులు, మీచేత సంహరించబడక సజీవులై ఉన్నారు. మీరు దయ చూపుటచేత మాకుటుంబానికి కీడు కలుగలేదు. మీకు మా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు తెలుపుతున్నాను. మీకు ఈతడు ఎట్టి అపచారం చేసినా మన్నించి, మాయందు దయచూపి ఈతడిని విడిచిపెట్ట వేడికోలు' అని అన్నాడు. ధర్మరాజు మాటలు కాదనలేక చిత్రసేనుడు దుర్యోధనాదులను విడిచిపెట్టి పాండునందనుల వీడ్కొని స్వర్గానికి పోయి, జరిగిన వృత్తాంతం అంతటిని దేవేంద్రుడికి విన్నవించాడు. ఇంద్రుడు అమృతవర్షం కురిపించి యుద్ధంలో మరణించిన గంధర్వులను బ్రదికించాడు. ఇట ద్వైతవనంలో ధృతరాష్ట్రసూనుడైన దుర్యోధనుడికి బంధమోక్షణం చేసి, ధర్మరాజు అతడితో ఇట్లు పలికాడు.

**ఉ.** **'ఎన్నఁడు నిట్టి సాహసము లింక నొనర్పకు మయ్య! దుర్జనుం**
**డన్నన సాహసక్రియలయందుఁ గడంగి నశించుఁ; గావునం**
**గ్రన్నన తమ్ములన్ దొరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్;**
**సన్నుత! దీని కొండొకవిషాదముఁ బొందకుమీ మనంబునన్.'** **434**

**ప్రతిపదార్థం:** ఎన్నఁడున్= ఎపుడును; ఇట్టి= ఇటువంటి (ఇంతటి పరాభవానికి దారితీసే); సాహసములు= తెగువలు; ఇంకన్= ఇక మీద (ఏదో తెలియక దురహంకారంతో ఈ పని చేశావు; ఇకమీద భవిష్యత్కాలంలోమాత్రం జాగరూకత వహించేది. బుద్ధి తెచ్చుకొనేది); ఒనర్పకుమయ్య= నాయనా చేయకుము; దుర్జనుండు= చెడ్డవాడు; అన్నునన్= ఒడలెరుగక; సాహస క్రియల అందున్= తెగువతో కన్నుమిన్ను కానని పనులందు; కడంగి= పూనిక వహించి; నశించున్= నాశనం చెందుతాడు; కావునన్= కాబట్టి; క్రన్నన= శీఘ్రంగా; తమ్ములన్= అనుజులను; దొరలన్= సామంత ప్రభువులను; కైకొని= వెంట నిడుకొని; ఇమ్ములన్= సంప్రీతితో; వీటికిన్= (రాజధాని) నగరానికి; పొమ్ము; సన్నుత= సత్+నుత!= మంచివారిచేత పొగడబడినవాడా! ఓ దుర్యోధనా!; దీనికిన్= ఇపుడు ఈ విధంగా జరిగిన అవమానంవలనకలిగే; ఒండొక విషాదమున్= ఒకానొక (గాఢమైన) దుఃఖం; మనంబునన్= మనస్సులో; పొందకుము= అనుభవించకుము.

**తాత్పర్యం:** నాయనా! దుర్యోధనా! ఎప్పుడైనాసరే ఇటువంటి పరాభవాన్ని చేకూర్చే సాహసకృత్యాలకు ఒడిగట్టకుము. ఇపుడు జరిగిందేదో జరిగిపోయింది. ఇకమీద భవిష్యత్కాలంలోనైనా బుద్ధి కలిగి ప్రవర్తించుము. దుర్జనుడు దురభిమానంతో తన అంతరం ఎదిరి గొప్పతనం తెలియక కన్నుమిన్నుకానక సాహసానికి కడంగి నశిస్తాడు.

జాగ్రత్త సుమా! ఇక శీఘ్రంగా తమ్ములను దొరలను గైకొని నీ రాజధాని నగరానికి వెడలుము. మంచివారిచేత పొగడబడినవాడా! ఇట్టి అవమానం జరిగినందుకు, ఎటువంటి దుఃఖాన్ని నీ మనస్సులో అనుభవించవద్దు.

**విశేషం:** ఎఱ్ఱన మహాకవి వ్రాసిన పద్యాలలో ఇది తలమానికం. ఎఱ్ఱాప్రెగ్గడ కవితాశిల్పానికి ఈ పద్యం సమ్యగుదాహరణంగా ఎన్నదగింది. "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్" అని రసగంగాధరకర్త శ్రీ జగన్నాథ పండితరాయల నిర్వచనం చొప్పున ఈ పద్య మొక్కటే ఒక మహాకావ్యసదృశం. ఇందు నన్నయ్యను దలపించే ప్రసన్నకథా కవితార్థ యుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థ సూక్తులు ఉన్నవి. తిక్కన మహాకవిని తలపింపచేసే "సంభాషణ చారిమ" సజీవ పాత్ర చిత్రణమున్నూ ఉన్నాయి." వాక్యం రసాత్మకం కావ్యమ్" అన్నట్లు రసభావ నిరంతరాలైన వాక్యాల సంపుటం ఈ పద్యం. "అల్పాక్షరముల అనల్పార్థ రచన"కు ఈ పద్యం ఉత్తమోత్తమోదాహరణం. ప్రతివాక్యంలో వెల్లివిరిసే మనోహర భావగుంఫనమే కాక వాక్యాంతరాలలో జాలువారే వ్యంగ్య వైభవం- అర్థాంతర స్ఫూర్తి సహృదయ హృదయైక వేద్యం. ఈ పద్యంలో వ్యంగ్యగర్భితంగా స్ఫురించే అంతరార్థాంతరాలు హృదయంగమాలు.

(1) ఎన్నడూ ఇట్టి సాహసాలు ఇకపై ఒనర్పకు మయ్యా. ఇకమీద ఇట్టి దుస్సాహసాలు చేయకుము- అనగా ఇంతకుపూర్వం దుర్యోధనుడు ఎన్నో చేసినట్లే కదా! అయితే ఇప్పుడు పాపం బ్రద్దలైంది.

(2) ఇట్టి సాహసములు- ఇటువంటి సాహసాలు. వీటికే అతడు సద్యఃఫలం అనుభవించాడు. దుర్యోధనుడిచేత అద్దం పెట్టాడు "మెత్తని పులి" ధర్మరాజు. ఆతడు తన మొగం అందులో చూచుకొనవచ్చును. అల మతి విస్తరేణ.

(3) దుర్జనుడు సాహసక్రియలయందు నశిస్తాడని ధర్మరాజు చేసిన హెచ్చరిక దుర్యోధనుడికి అనుభవ సద్యః సిద్ధం.

(4) 'క్రన్నన తమ్ములం దొరలఁగైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్.' 'నాయనా దుర్యోధనా! ఇక్కడ నీవు పొందిన అవమానం నీ రాజధానిలోని వారలకు తెలియదు కదా. ఈ పరాభవాన్ని దులుపుకొని, ఏమియు జరుగనట్లుగా తిరిగి పొమ్మ' అన్నాడు ధర్మరాజు. అనగా, 'ఏమి మొగం పెట్టుకొని తిరిగి నీవు రాజధానికి పోగలవు?' అనే ఎత్తిపొడుపు ఇందులో అంతర్గర్భితం.

(5) 'సన్నుత' అనే సంబోధనం నెత్తిమీదసుత్తితో మొత్తిన ఎత్తిపొడుపు.

(6) ఇంత అవమానం జరిగింది కావున 'కొండొక' విషాదం పొందకుమీ మనంబునన్. ఇది దుర్యోధనుడికి విషాద సన్నివేశంగాక మరేమి. అది "కొండొక" విషాదమా? నిలువెల్ల దహించే దుర్భరమైన అవమానాగ్ని కాదా? ధర్మరాజు చిచ్చరపిడుగు కాదు చలిపిడుగు. గంధర్వుల బాణాలకు ధర్మరాజు మెత్తనిపలుకుల కున్న పదను ఉన్నదా? ధర్మరాజు పెట్టిన సున్నితమైన చీవాట్లు దుర్యోధనుడిని ఆపాదమస్తకం దహించి వేసినవి. శీఘ్రంగా దుర్యోధనుడు రాజధానికి తరలిపోలేకపోయాడు. ధర్మరాజు చేసిన హెచ్చరిక దుర్యోధనుడికి ప్రాయోపవేశానికి పూర్వరంగాన్ని తీర్చిదిద్దిన నాటకీయ ప్రస్తావనయే. గంధర్వులు చేసింది ఏమున్నది? దుర్యోధనుడిని ఓడించి బంధించారు. అర్జునుడి చేతిలో ఓడిపోయి దుర్యోధనుడిని వదలిపెట్టిపోయారు. ధర్మరాజు చేసింది మహోపకారం ఏమున్నది? ధర్మరాజు సుకుమార సుందరంగా చేసిన పని దుర్యోధన తేజోవధ.

**వ. అని బుద్ధి సెప్పి వీడ్కొలిపిన, నతండును దీనాననుం డగుచుం జనియె; ననుజసహితుండయిన ధర్మతనయు ధార్మికత్వంబు ధౌమ్యాది భూసురులును దదాశ్రమవాసు లయిన మహామునులును బహువిధంబులం బ్రస్తుతించి రని వైశంపాయనవర్ణితం బయిన కథావిశేషంబు సవిస్తరంబుగా. 435**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; బుద్ధి+చెప్పి= హితోపదేశం చేసి; వీడ్కొలిపినన్= ఆ మంత్రణం చేసి పంపగా; అతండును= దుర్యోధనుడును; దీన+ఆననుండు+అగుచున్= దర్పం తరిగిన మొగం కలవాడై; చనియెన్= వెళ్లాడు; అనుజ సహితుండు= తమ్ములతో కూడినవాడు; అయిన= ఐన; ధర్మతనయు, ధార్మికత్వంబు= ధర్మనందనుడి యొక్క ధర్మశీలాన్ని; ధౌమ్య+ఆది, భూసురులును= ధౌమ్యుడు మున్నగు విప్రులును; తద్+ఆశ్రమ వాసులు+అయిన= పాండవుల యొక్క ఆశ్రమంలో నివసించే; మహా, మునులును= గొప్ప ఋషులును; బహు విధంబులన్= పెక్కు భంగుల; ప్రస్తుతించిరి= పొగడారు; అని= అని చెప్పి; వైశంపాయన, వర్ణితంబు+అయిన= వైశంపాయనుడిచేత వర్ణించబడినట్టి; కథావిశేషంబు= పేర్కొనదగిన కథ; సవిస్తరంబుగాన్= విరివి అయిన అంశాలలో కూడినట్టిదిగా.

**తాత్పర్యం:** దుర్యోధనుడిని ఆ విధంగా మందలించి హితోపదేశం చేసి ధర్మనందనుడు వీడ్కొలిపాడు. దుర్యోధనుడు దర్పం తరిగి తేజోహీనుడై మొగం వంచుకొని వెడలిపోయాడు. ధౌమ్యుడు మున్నగు విప్రులున్నూ ఆశ్రమంలో నివసించే మహర్షులున్నూ ధర్మనందనుడియొక్కయు అతడి తమ్ములయొక్కయు ధర్మశీలాన్ని ప్రశంసించారు. అది వైశంపాయనమహర్షి వర్ణించి చెప్పిన కథావిశేషం. విరివి అయిన అంశాలతో కూడింది.

**క. రాజకులతిలక! భువన వి । రాజిత సితకీర్తి! దివిజరాజవిభవ! ని**
**ర్వ్యాజ పరాక్రమ! సకల ధ । రాజన సంపూజ్య! ధర్మరక్షణ దక్షా! 436**

**ప్రతిపదార్థం:** రాజ, కుల, తిలక!= రాజులవంశంలో శ్రేష్ఠుడవైనవాడా!; భువన, విరాజిత, సిత, కీర్తి!= లోకంలో వెలుగొందిన తెల్లని యశస్సు కలవాడా!; దివిజ, రాజ, విభవ!= దేవేంద్రుడివంటి ఐశ్వర్యం కలవాడా!; నిర్వ్యాజ, పరాక్రమ!= కారణం లేని అనగా సహజసిద్ధమైన శౌర్యంకలవాడా!; సకల, ధరా, జన, సంపూజ్య!= అందరు భూప్రజలచేత అర్చించబడేవాడా!; ధర్మ, రక్షణ, దక్షా!= ధర్మాన్ని కాపాడే శక్తి కలవాడా!

**తాత్పర్యం:** రాజులలో శ్రేష్ఠుడైనవాడా! లోకంలో వెలుగొందిన తెల్లని యశస్సు కలవాడా! దేవేంద్రుడితో సమానమైన ఐశ్వర్యం కలవాడా! సహజమైన పరాక్రమం కలవీరుడా! సమస్తభూప్రజలచేత అర్చించబడేవాడా! ధర్మాన్ని కాపాడటంలో సామర్థ్యం కలవాడా! ఓ రాజరాజనరేంద్రా!

**విశేషం:** (1) ఈ పద్యం ఆశ్వాసాంతంలోని సంబోధనం. ఇందులోని సంబోధనలు అన్నియు కృతిపతి అయిన రాజరాజ నరేంద్రుడికి అన్వయించేవి. (2) నన్నయ్య మహాకవి తన ఆంధ్రమహాభారతాన్ని శ్రీ రాజరాజ నరేంద్రుడికి అంకితమిచ్చాడు. (3) ఈ ఆశ్వాసాన్ని ఈ ఆశ్వాసాంత పద్యాలను వ్రాసింది ఎఱ్ఱన. అయినప్పటికి తాను ఆరణ్యపర్వశేషాన్ని నన్నయ్యపేరుమీదనే పూరించాడు కాబట్టి ఆశ్వాసాంతసంబోధనలను కృతిపతి అయిన రాజరాజనరేంద్రుడినే ఉద్దేశించి వ్రాశాడు.

**స్రగ్విణి.**

**సర్వలోకాశ్రయా! సౌమ్యభావోదయా! నిర్వికారాకృతీ! నిత్యసత్యోన్నతీ!**
**గర్వితోద్యద్భుజాకల్ప! కల్లోల్లస । త్సర్వసర్వంసహాచక్ర! చక్రాయుధా! 437**

**ప్రతిపదార్థం:** సర్వ,లోక+ఆశ్రయా!= సమస్త లోకాలకు అండ అయినవాడా!; సౌమ్య, భావ+ఉదయా!= సాత్త్వికమైన ఆలోచనల ఆరంభం కలవాడా!; నిర్వికార+ఆకృతీ!= నిర్వికారమైన ఆకారం కలవాడా!; నిత్య, సత్య+ఉన్నతీ!= ఎల్లప్పుడును నిజాన్ని పాటించే గొప్పతనం కలవాడా!; గర్విత+ఉదృత్+భుజ+ఆకల్ప!= మదించినవారికి ప్రకాశించే పరాక్రమాన్ని పన్నెడివాడా!; గర్వితులను అణచే పరాక్రమప్రకర్ష కలవాడా!; కల్ప+ఉల్లసత్+సర్వ, సర్వంసహాచక్ర!= న్యాయ ప్రకారం వెలుగొందే సమస్తభూమండలం కలవాడా!; చక్ర+ఆయుధా!= నారాయణమూర్తీ!

**తాత్పర్యం:** సర్వలోకాలకు అండ అయినవాడా! ప్రశాంతమైన గంభీరమైన ఆకారం కలవాడా! ఎల్లప్పుడున్నూ నిజాన్ని పాటించటంచేత ఏర్పడిన గొప్పతనం గలవాడా! మదించినవారిని అణచగలిగిన పరాక్రమప్రాభవం కలవాడా!; న్యాయం ప్రకారం యావద్భూమండలాన్ని పరిపాలించేవాడా!; విష్ణుమూర్తీ! ఓ రాజరాజనరేంద్రా!

**విశేషం:** (1) చాళుక్యులు, శ్రీ రాజరాజనరేంద్రుడి వంశస్థులు "లోకాశ్రయ" - "జనాశ్రయ" బిరుదాంకితులు. "రాజనారాయణ" బిరుదాంకితులు. ఈ పద్యంలోని సర్వలోకాశ్రయా - చక్రాయుధా సంబోధనలు బిరుదనామ సూచకాలు. (2) స్రగ్విణీ వృత్తంలోని ప్రతిపాదంలో వరుసగా నాలుగు రగణాలుంటాయి. 7వ అక్షరం యతిమైత్రి స్థానం. ప్రాస నియమం ఉన్నది.

**గద్యము.**

> **ఇది సకలసుకవిజనవినుత నన్నయ్యభట్ట ప్రణీతం బైన శ్రీ మహాభారతంబునం దారణ్యపర్వంబునఁ బతివ్రతా చరిత్రంబును, ధర్మవ్యాధుండు గౌశికునకుఁ బరమధర్మం బెఱింగించుటయు, నగ్నివంశానుకీర్తనంబును, గుమారోత్పత్తియు, సత్యాద్రౌపదీ సంవాదంబును, బాండవులు ద్వైతవనంబునకుం జనుటయు, ధృతరాష్ట్ర వాక్యంబులును, దుర్యోధనాదుల దుర్మంత్రంబున ఘోషయాత్రయుఁ, గౌరవ గంధర్వ యుద్ధంబును, దుర్యోధనాదులు గంధర్వులచేతం బట్టువడుటయు, నర్జునుండు వారల విడిపించుటయు నన్నది పంచమాశ్వాసము. 438**

**తాత్పర్యం:** ఇది ఉత్తమ కవులందరిచేత కీర్తించబడిన నన్నయభట్టుచేత రచించబడిన శ్రీ మహాభారతంలోని ఆరణ్యపర్వంలో పతివ్రతా చరిత్రమున్నూ, ధర్మవ్యాధుడు కౌశికుడికి ఉత్తమధర్మాన్ని బోధించటమున్నూ, అగ్నివంశాన్ని కీర్తించటమున్నూ, కుమారస్వామి పుట్టుకయున్నూ, సత్యాద్రౌపదీ సంవాదమున్నూ, పాండవులు ద్వైతవనానికి వెళ్లటమున్నూ, ధృతరాష్ట్రుడి వాక్యాలున్నూ, దుర్యోధనుడు మొదలైనవారి దురాలోచనమున్నూ, ఘోషయాత్రయున్నూ, కౌరవ గంధర్వ యుద్ధమున్నూ, దుర్యోధనుడు మొదలైనవారు గంధర్వులచేత యుద్ధంలో పట్టుబడటమున్నూ, అర్జునుడు వారిని విడిపించటమున్నూ అనే అంశాలతో కూడిన అయిదవ ఆశ్వాసం.

-:ఆరణ్యపర్వంలో పంచమాశ్వాసం సమాప్తం :-



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము -షష్ఠాశ్వాసము

**శ్రీలలితమూర్తి ! సుమహ ! చ్ఛాళుక్యవరేణ్య ! పుణ్యచారిత్ర ! విచి**
**త్రాలంకారోజ్జ్వల కవి। తాలాపకలాప ! సంతతానందమతీ! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ, లలితమూర్తి!= సిరిసంపదలచేత మనోహరమైన ఆకృతికలవాడా!; సుమహత్+చాళుక్య, వరేణ్య!= మిక్కిలి గొప్పదైన చాళుక్య వంశంలో శ్రేష్ఠుడవైనవాడా!; పుణ్యచారిత్ర!= పవిత్రమైన ప్రవర్తన కలవాడా!; విచిత్ర+అలంకార+ఉత్+జ్వల, కవితా+ఆలాప, కలాప!= మిక్కిలి అచ్చెరువు కలిగించే అలంకారాలచేత వెలుగొందే కవిత్వ భాషణమనెడి భూషణం కలవాడా!; సంతత+ఆనంద, మతీ!= ఎల్లప్పుడూ సంతోషంతో కూడిన బుద్ధి కలవాడా!; ఓ రాజరాజనరేంద్రా!

**తాత్పర్యం:** సిరిచేత తులదూగే మనోహరమైన రూపం కలవాడా!; ఓ రాజరాజనరేంద్రా! చాళుక్యరాజులలో శ్రేష్ఠుడా! పవిత్రమైన నడవడి కలవాడా! చిత్రవిచిత్రాలైన అలంకారాలతో వెలుగొందే కవిత్వ భాషణమనెడి భూషణం కలవాడా! నిత్యసంతుష్టమతీ!

**విశేషం:** 1. ఎప్పుడో ఎఱ్ఱనకు సుమారు రెండువందల సంవత్సరాలకు ముందు వేంగీమండలాన్ని ఏలినవాడు రాజరాజ నరేంద్రుడు. అతడు శ్రీమదాంధ్రమహాభారత కృతిపతి. ఆనాడు కృతికర్త నన్నయభట్టు. ఈనాడు ఈకృతికర్త ఎఱ్ఱాప్రెగ్గడ. అయినను ఎఱ్ఱన శ్రీ రాజరాజనరేంద్రుడినే కృతిపతిగా మన్నించి తాను ఆరణ్యపర్వశేషాన్ని నన్నయపేరుమీదనే వ్రాసి ప్రకటించటం ఇందలి విశేషం. ఈ సంబోధనలు అన్నీ అలనాటి ఆరాజరాజనరేంద్రుడికే అన్వయిస్తాయి. కృతిపతి కావ్యానికి ప్రథమ ప్రధానశ్రోత అనే సాహితీసంప్రదాయాన్ని నన్నయనుండి నేటివరకును తెలుగుకవులు పాటిస్తున్నారు.

### దుర్యోధనుని విషాదము (సం. 3-236-1)

**వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె; నట్లతిమానుషంబైన యర్జునుపరాక్రమంబును, నత్యంతదైన్యాస్పదం బగు దుర్యోధనుపరాభవంబును, ధర్మజుదయయు నాకర్ణించి, విస్మయ జుగుప్సాకలితమానసుం డగుచు జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= ఆ కథకుడు (పౌరాణికుడు అయిన ఉగ్రశ్రవసుడు); శౌనక+ఆది+మహామునులకున్= శౌనకుడు, మున్నగుగొప్ప మునులకు; చెప్పెన్= వచించాడు; అట్లు= ఆ రీతిగా; అతిమానుషంబు+ఐన= మనుజులశక్తికి మించింది అయిన; అర్జును, పరాక్రమంబును= అర్జునుడియొక్క శౌర్యాన్ని; అతి+అంత+దైన్య+ఆస్పదంబు+అగు= మిక్కుటమైన దర్పాన్ని కోలుపోయినట్టిస్థితికి నెలవైన; దుర్యోధను, పరాభవంబును= దుర్యోధనుడియొక్క అవమానాన్ని; ధర్మరాజు దయయున్= ధర్మరాజు చూపిన జాలియు; ఆకర్ణించి= విని; విస్మయ, జుగుప్సా+కలిత మానసుండు+అగుచున్= అచ్చెరువు, రోత కలిసిన మనస్సు కలవాడు ఔతూ; జనమేజయుండు= జనమేజయమహారాజు; వైశంపాయనునకున్; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** మహాభారతకథను ఉగ్రశ్రవసుడు శౌనకుడు మున్నగు మహామునులకు చెప్పాడు. ఆ విధంగా మనుజులశక్తిని అతిక్రమించిన అర్జునుడియొక్కశౌర్యం, మిక్కిలిదైన్యంతో కూడిన దుర్యోధనుడి అవమానం, ధర్మరాజు ప్రదర్శించిన జాలినిగురించి ఆకర్ణించి, జనమేజయుడు అచ్చెరువు రోత పెనగొన్న చిత్తంతో వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. షష్ఠాశ్వాసం మొదట గల ఈవాక్యం పంచమాశ్వాసంలోని తుదిపదంతో - 'సవిస్తరముగా' అనే దానితో అన్వయిస్తున్నది. 2. మహాభారతకథను వైశంపాయనుడు జనమేజయుడికి సర్పయాగసందర్భంలో వినిపించాడు. జనమేజయుడు అర్జునుడి కుమారుడైన అభిమన్యుడికి పౌత్రుడు. పరీక్షిత్తుకు కొడుకు. 3. జనమేజయుడికి 'విస్మయము' - 'జుగుప్స' కలిగాయి. జుగుప్స బీభత్సరసానికి స్థాయిభావం. విస్మయం= అద్భుతం - నవరసాలలో ఒకటి. అర్జునుడి పరాక్రమానికి విస్మయం, దుర్యోధనుడి పరాభవానికి జుగుప్స. అవిక్రమం.

**చ.** **'అనిశముఁ బాండుపుత్త్రులకు నప్రియకార్యము రోయునట్టి దు**
**ర్జనుఁడు సుయోధనుం డటులు శత్రులచే నవమానితుండుఁ బే**
**ర్చినకృప నొప్పుచున్న కురుసింహులచేత విమోక్షితుండు నై**
**మనమున లజ్జ లేక మునిమండన! యెమ్మెయి నేఁగె వీటికిన్? 3**

**ప్రతిపదార్థం:** మునిమండన!= ఋషులకు అలంకారంగా ఉండేవాడా! ఓవైశంపాయనా!; అనిశమున్= ఎల్లప్పుడున్నూ; పాండుపుత్త్రులకున్= పాండునందనులకు; అప్రియకార్యము= హితవుకాని పనిని, కీడును; రోయునట్టి= వెదకునట్టి; దుర్జనుఁడు= చెడ్డమనుజుడు; సుయోధనుండు= దుర్యోధనుడు; అటులు= ఆ విధంగా; శత్రులచేన్= విరోధులచేత; అవమానితుండున్= అవమానించబడినవాడును; పేర్చిన= అతిశయించిన; కృపన్= దయతో; ఒప్పుచున్న= శోభిల్లుతున్న; కురుసింహులచేతన్= కురువంశంలో సింహాలవంటి వారైన పాండవులచేత; విమోక్షితుండును+ఐ= విడిపించబడిన వాడై; మనమునన్= చిత్తంలో; లజ్జ లేక= సిగ్గు లేకుండా; వీటికిన్= (తన) పట్టణానికి; ఏ+మెయిన్= ఏరీతిగా; ఏఁగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'ఋషులలో శ్రేష్ఠుడవైన ఓవైశంపాయనా! ఎల్లప్పుడూ పాండవులకు కీడు చేయటానికే అవకాశాల కొరకు వెదకే దుర్జనుడు దుర్యోధనుడు. అతడు ఆవిధంగా శత్రువులచేత అవమానించబడటం మాత్రమే కాక కురువంశాన సింహాలవంటి పాండవుల పరాక్రమంచేత బంధమోక్షణం పొంది సిగ్గుపడకుండ ఏరీతిగా తన రాజధానికి తరలి వెళ్ళాడు?

**విశేషం:** 1. దుర్యోధనుడు శత్రువులైన గంధర్వులచేత ఓడించబడటం ఒకపరాభవం. తాను ఎల్లప్పుడూ అపకారంచేసిన పాండవుల దయవలన బంధమోక్షణం పొందటం ఇంకొక పరాభవం. 2. ఇక్కడ పాండవులు 'కురుసింహులు' గా పేర్కొనబడ్డారు. దుర్యోధనాదులు కౌరవులు. పాండురాజపుత్రులు పాండవులు. ఉభయులూ కౌరవులేకదా! వివక్షకొరకు కౌరవపాండవ వ్యపదేశం ఏర్పడింది. దీనికే కురుపాండవన్యాయం అని పేరు.

**మత్తకోకిలము.**

**మేనఁ బ్రాణముఁ దాల్చి భంగము ద్రింగి యెప్పటిచాడ్పునన్**
**మానవేంద్రుఁడ నేను దద్దయు మానినన్ దలఁ పాత్మలోఁ**
**బూను టాతని కెట్లు గల్గెఁగఁ బోలు నారయ నద్భుతం**
**బైన తచ్చరితంబు సెప్పుమ యంతయుం బరిపాటితోన్.' 4**

**ప్రతిపదార్థం:** మేనన్= దేహంలో; ప్రాణమున్+తాల్చి= అసువులు ధరించి; భంగమున్ మ్రింగి= పరాభవాన్ని దిగమ్రింగి; ఎప్పటిచాడ్పునన్= యథాప్రకారం, లోగడ ఉన్నట్లుగనే; మానవ+ఇంద్రుఁడన్= మనుజులలో శ్రేష్ఠుడను, రాజును; నేను= నేను; తద్దయున్= మిక్కిలి; మానిన్= అభిమానం కలవాడిని; అన్= అనెడి; తలఁపు= ఆలోచన; ఆత్మలోన్= మనస్సులో; పూనుట= వహించటం; ఆతనికిన్= దుర్యోధనుడికి; ఎట్లు= ఏవిధంగా; కల్గఁగన్+పోలున్= కలగటానికి సరిపడుతుంది; ఆరయన్= పరిశీలించగా; అద్భుతంబు+ఐన= ఆశ్చర్యకరమైన; తత్+చరితంబు= ఆతడి ప్రవర్తన; అంతయున్= అంతటిని; పరిపాటితోన్= వరుసగా; చెప్పుము= చెప్పుము.

**తాత్పర్యం:** దుర్యోధనుడు స్వాభిమానధురంధరుడని వింటాం. అంతటి పరాభవం పొందిన తరువాత అతడు - 'నేను ఒక మహారాజును, అభిమానవంతుడిని, నాకు ప్రాణాలు, మానాభిమానాలు ఉన్నవి. ఇటువంటి పరాభవాన్ని ఎట్లా దిగమ్రింగగలను?' అనే ఆలోచన అతడికి కలుగకుండా ఎట్లా ఉంటుంది? పరిశీలించగా ఇది ఒక అద్భుతవృత్తాంతం. ఆపైన దుర్యోధనుడు ఏవిధంగా ప్రవర్తించాడో దయచేసి సవిస్తరంగా తెలపండి. నాకు విన కుతూహలంగా ఉన్నది.'

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు- ఆరణ్య. 4.267 విశేషాంశం.

**వ.** **అని యడిగిన నమ్మహాముని యిట్లను; నట్లు కౌంతేయులచేత బంధమోక్షితుం డై దుర్యోధనుండు లజ్జా కజ్జలితహృదయుం డగుచుఁ జెదరిన సేనలం గూర్చుకొని కొంత దవ్వరిగి యొక్కసమతలంబునం బటమందిరవిరచనంబు నిర్వర్తించి, యభ్యంతరమందిరమ్మున నొక్కరుండును దల్పంబుపయిం బడి చింతాపరవశత్వంబు నొంది, రాహుకబళనకలుషితుం డైన రోహిణీపతియునుంబోలె విషాదవివర్ణుం డయి యున్నయెడఁ గర్ణుండు వచ్చి, సముచితంబుగాఁ గని యన్నరేంద్రున కిట్లనియె.** **5**

**ప్రతిపదార్థం:** అని అడిగినన్= అని (జనమేజయుడు) ప్రశ్నించగా; ఆ+మహాముని= ఆ గొప్పఋషి; ఇట్లు అనున్; అట్లు; కౌంతేయులచేతన్= పాండవులచేత; బంధమోక్షితుండు+ఐ= చెఱవిడిపించబడినవాడై; దుర్యోధనుండు= సుయోధనుడు; లజ్జా, కజ్జలిత, హృదయుండు= సిగ్గుచేత మలినమైన డెందం కలవాడు (అనగా అవమానఖిన్నుడు); అగుచున్= ఔతూ; చెదరిన సేనలన్+కూర్చుకొని= నలువైపులకు పారిపోయిన సైన్యాలను ఒకచోటికి చేర్చుకొని; కొంత దవ్వు= కొంత దూరం; అరిగి= పయనించి; ఒక్క= ఒక; సమతలంబునన్= మిట్టపల్లాలు లేని స్థలంలో; పట, మందిర, విరచనంబు= వస్త్రాలచేత ఏర్పరచెడి గృహ నిర్మాణం; నిర్వర్తించి= చేసి; అభ్యంతర మందిరమ్మునన్= లోపలి గదిలో; ఒక్కరుండును= ఒకడు మాత్రమే; తల్పంబు పయిన్+పడి= మంచంమీద శయనించి; చింతాపరవశత్వంబున్+ఒంది= విషాదపూరితమైన ఆలోచనలో మునిగి; రాహు, కబళన, కలుషితుండు+ఐన= రాహువు మ్రింగటంచేత మాలిన్యం పొందిన; రోహిణీపతియునున్+పోలెన్= చంద్రుడివలె; విషాద వివర్ణుండు+అయి= దుఃఖంచేత పాలిపోయినవాడయి; ఉన్న+ఎడన్= ఉన్నప్పుడు; కర్ణుండు= కర్ణుడు; వచ్చి= అరుగుదెంచి; సముచితంబుగాన్+కని= తగిన మర్యాదలు పాటించి, చూచి; ఆ+నర+ఇంద్రునకున్= ఆరాజుతో, దుర్యోధనుడితో; ఇట్లు+అనియెన్= ఈ ప్రకారం చెప్పాడు.

**తాత్పర్యం:** అని జనమేజయుడు ప్రశ్నించగా వైశంపాయనమహర్షి ఈ విధంగా బదులు పలికాడు: ఆ విధంగా దుర్యోధనుడు పాండవులచేత చెరవిడిపించబడినవాడై అవమాన ఖేదంతో అలమటించే హృదయంతో చెల్లాచెదరైన సేనలను చేర్చుకొని కొంతదూరం ప్రయాణంచేసి మిట్టపల్లాలు లేని ఒకస్థలంలో పటకుటీరాలు నిర్మించుకొని విడిది చేశాడు. కాని, తన మనస్సుకు శాంతి లేకపోవటంచేత లోపలిగదిలో ఏకాంతంగా మంచంపై పవళించి

పరితపించసాగాడు. పరాభవఖిన్నుడైన దుర్యోధనుడు రాహువుచేత మ్రింగబడిన చంద్రుడివలె కాంతి దొరగి పాలిపోయాడు. అప్పుడు కర్ణుడు అక్కడికి వచ్చి రాజమర్యాదలు నిర్వర్తించి దుర్యోధనుడిని సందర్శించి, ఇట్లా పలికాడు.

**చ. 'మనుజవరేణ్య! చూడ నతిమానుష మమ్మెయిఁ గయ్య మెందుఁ గ**
**ల్గునె? పటువిక్రమాన్వితులఁ గ్రోధనిబద్ధులఁ గామరూపులం**
**జెనయఁగ వచ్చునే ఖచరసింహుల నేరికి?; నట్టివారి నే**
**పునఁ దునుమాడి గెల్చితి విభూతి యెలర్పఁగ నీవుఁ దమ్ములున్. 6**

**ప్రతిపదార్థం:** మనుజవరేణ్య!= మనుజులలో శ్రేష్ఠుడవైనవాడా! దుర్యోధన మహారాజా!; చూడన్= అరయగా; అతిమానుషము= మానవులకు సాధ్యంకాని పని అది; ఆ+మెయిన్= ఆ రీతిగా; కయ్యము= పోరాటం; ఎందున్= ఎక్కడైనా; కల్గునె= ఉండునా? ఉండదు; పటు, విక్రమ+అన్వితులన్= మిక్కుటమైన శౌర్యం కలవారలను; క్రోధ నిబద్ధులన్= ఆగ్రహంచేత కట్టబడిన వారిని; కామరూపులన్= తాము కోరిన రూపాలు ధరించ గల్గిన శక్తికలవారిని; ఖచరసింహులన్= ఆకసంలో చరించే గంధర్వులలో సింహాలవంటివారిని; ఏరికిన్= ఎవరికైనను; చెనయఁగన్ వచ్చునే= ఎదుర్కొన వచ్చునా?; అట్టివారిన్= అటువంటి వారిని (ఆ గంధర్వులను); ఏపునన్= అతిశయంతో; తునుమాడి= సంహరించి; నీవున్= నీవున్నూ; తమ్ములున్= నీ సోదరులున్నూ; విభూతి+ఎలర్పఁగన్= బలం శోభిల్లగా; గెల్చితి(వి)= జయించావు.

**తాత్పర్యం:** 'మనుజులలో శ్రేష్ఠుడవైన ఓ దుర్యోధనమహారాజా! మానవులకు సాధ్యంకాని ఘనకార్యాన్ని నీవు సాధించావు. అటువంటి యుద్ధం ఎక్కడా కానరాదు. వారు గంధర్వులలో సింహాలవంటివారు, మిక్కుటమైన శౌర్యం కలవారు, కోపంతో విజృంభించినవారు, కోరిన రూపాలను ధరించగల మాయావులు. అట్టివారిని మానవమాత్రులు ఎట్లా ఎదుర్కొనగలరు? నీవూ నీతమ్ములూ అటువంటి గంధర్వులను నిర్మూలించి గెలుపొందటం పేర్కొనదగింది సుమా!

**ఉ. అప్పుడు నీవు సూడఁగ ననంతములై ఖచరేంద్రసైన్యముల్**
**గప్పె ననేకసాయకనికాయములన్ వడి నన్ను; నేనునుం**
**గుప్పలు గూల నేసి రిపుకోటి వధించితి; నంతలోన న**
**న్నొప్పరికించె సైన్యతతి; యొక్కఁడ నై రణభూమి నొచ్చితిన్. 7**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; నీవు+చూడఁగన్= నీవు చూస్తుండగా; అనంతములు+ఐ= అంతులేనివై; ఖచర+ఇంద్ర, సైన్యముల్= గంధర్వపతి సేనలు; అనేక, సాయక, నికాయములన్= పెక్కుబాణాల సముదాయాలను; వడిన్= రయంగా; నన్నున్= నన్ను; కప్పెన్= చుట్టుముట్టాయి; నేనునున్= నేను సయితం; రిపుకోటిన్= శత్రుసమూహాన్ని; కుప్పలుకూలన్+ఏసి= గుట్టలు గుట్టలుగా పడేటట్లు బాణాలు ప్రయోగించి; వధించితిన్= సంహరించాను; అంతలోనన్= ఆ విధంగా జరుగుతున్న సమయంలో; సైన్యతతి= సేనలగుంపులు; నన్నున్= నన్ను; ఒప్పరికించెన్= ఉపేక్షించాయి; రణభూమిన్= యుద్ధరంగంలో; ఒక్కఁడన్+ఐ= ఒంటరివాడినై; నొచ్చితిన్= బాధపడ్డాను.

**తాత్పర్యం:** ఆసమయంలో, నీవు చూస్తుంటివికదా! గంధర్వపతిభటులు పెక్కుబాణాలసమూహాలతో నన్ను ఆచ్ఛాదించారు. కాని, నేను లెక్కకు మించిన శత్రుబలాలతో పోరాడి వారిని కుప్పలు కుప్పలుగా కూల్చివేశాను. మనసేనలు నాకు తోడ్పడజాలక పోయినవి. నేను ఒక్కడనై రణరంగంలో బాధపడ్డాను.

**వ. ఆలోనన విరథుండ నై వికర్ణురథం బెక్కిన నది సమర ప్రదేశంబునకుఁ దొలంగఁ బఱచె; దేవా! నీవు బలవిక్రమాతిశయంబులం బ్రతివీరుల నోర్చి యక్షతుండ వై యుండుటఁ గనుంగొని కృతార్థుండ నైతి; నిట్టి పరాక్రమంబు సేసిన వా రిజ్జగంబున నెవ్వరు గల? రిది యత్యద్భుతం' బనినం గౌరవేశ్వరుం డాత్మగతంబున 'నీతండు మత్ప్రకారం బెఱుంగక యిట్లు వలికెం గాకేమి?' యని లజ్జితుం డగుచు రాధేయున కి ట్లనియె.8**

**ప్రతిపదార్థం:** ఆలోనన్+అ= ఆసమయంలోపలనే; విరథుండన్+ఐ= రథాన్ని కోల్పోయిన వాడినై; వికర్ణురథంబు= వికర్ణుడియొక్క తేరు; ఎక్కినన్= అధిరోహించగా; అది= (ఆరథం); సమర, ప్రదేశంబునకున్= యుద్ధభూమికి; తొలంగన్= దూరం అయ్యేటట్లుగా; పఱచెన్= పరుగెత్తి పోయింది; దేవా= ఓప్రభూ; నీవు= నీవు; బలవిక్రమ+అతిశయంబులన్= బలశౌర్యాలయొక్క పెంపుచేత; ప్రతివీరులన్= శత్రుపక్షంలోని శూరులను; ఓర్చి= ఓడించి; అక్షతుండవు+ఐ= గాయాలు పొందని వాడవై; ఉండుటన్+కనుంగొని= ఉండటం చూచి; కృత+అర్థుండన్+ఐతిన్= ధన్యుడను అయినాను; ఇట్టి= ఇటువంటి; పరాక్రమంబు+చేసినవారు= శౌర్యం ప్రదర్శించినవారు; ఈ+జగంబునన్= ఈలోకంలో; ఎవ్వరు+కలరు? ఎవరు ఉన్నారు? (ఎవరూ లేరు); ఇది= ఈ పరాక్రమ ప్రదర్శనం; అతి+అద్భుతంబు= మిక్కిలి అచ్చెరువు కలిగించేది; అనినన్= అని (కర్ణుడు)పలుకగా; కౌరవ+ఈశ్వరుండు= కౌరవులప్రభువు, దుర్యోధనుడు; ఆత్మగతంబునన్= తన మనస్సులో; ఈతండు= ఈతడు (కర్ణుడు); మత్+ప్రకారంబు= నాదైన చందం; ఎఱుంగక= తెలియక; ఇట్లు= ఈ రీతిగా; పలికెన్= మాట్లాడాడు; కాక+ఏమి= అంతేగాని వేరువిధం ఏమీ కాదు; అని= అని తలచి; లజ్జితుండు+అగుచున్= సిగ్గు చెందిన వా డౌతూ; రాధేయునకున్= రాధకొడుకు అయిన కర్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంతలోనే నారథం విరిగిపోయింది. నేను రథం లేనివాడినై వికర్ణుడిరథం ఎక్కాను. అది యుద్ధభూమి నుండి దూరంగా తొలగిపోయింది. ప్రభూ! నీవు బలపరాక్రమాలు అతిశయించగా శత్రువులను జయించి గాయాలు లేకుండా ఉండటం చూచి నేను ధన్యుడినయ్యాను. ఇటువంటి పరాక్రమాన్ని ప్రదర్శించినవారు ఈ లోకంలో ఎవరున్నారు? ఇది మిక్కిలి ఆశ్చర్యకరం' - అని కర్ణుడు అన్నాడు. ఆమాటలు దుర్యోధనుడు విని లోలోన 'ఇతడికి నాకు జరిగిన సంగతి తెలిసినట్లు లేదు కాబోలు' అని సిగ్గుపడుతూ కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'అనఘ! తమ్ములు నేను నంబరచరకోటిఁ । దలపడి పోరంగ బలయుగంబుఁ**
**జచ్చియు నొచ్చియుఁ జలమునఁ బెనఁగె; నా । సమయమ్మునందు విక్రమ మెలర్ప**
**గంధర్వపతితోడఁ గలిగెఁ గయ్యము నాకు; । నాతని శరములచేత నాజి**
**నేను నొచ్చితి; వేయు నేల? భార్యానుజ । సుతమిత్త్రజనసమన్వితము గాఁగ**

**తే. నన్నుఁ జెఱగొని గంధర్వనాయకుండు । నెగసె దివమున; కప్పుడు బెగడి చెదరి**
**పఱచి మనవార లెల్లను బాండుసుతుల । శరణు సొచ్చిరి దైన్యసంభరితు లగుచు. 9**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైనవాడా!; తమ్ములున్; ఏనున్; అంబర, చర, కోటిన్= గంధర్వుల సమూహంతో; తలపడి= మార్కొని; పోరంగన్= యుద్ధంచేయగా; బలయుగంబున్= రెండు సేనలున్నూ; చచ్చియున్= మరణించికూడా; నొచ్చియున్= వెతచెందికూడా; చలమునన్= పౌరుషంతో; పెనఁగెన్= పోరాడాయి; ఆసమయమ్మునందున్= ఆప్పుడు; గంధర్వ, పతితోడన్= గంధర్వులకు రాజు అయిన చిత్రసేనుడితో; విక్రమము+ఎలర్పన్= శౌర్యం శోభిల్లేటట్లుగా; నాకున్= నాకు; కయ్యము= యుద్ధం; కలిగెన్+ఏర్పడింది; ఆతని శరములచేతన్= ఆ చిత్రసేనుడియొక్క బాణాలచేత; ఆజిన్= యుద్ధంలో; ఏను= నేను; నొచ్చితిన్= వెతచెందాను; వేయున్+ఏల= వేయిమాటలు ఎందుకు; భార్యా+అనుజ, సుత, మిత్ర, జన,

సమన్వితముగాఁగన్= పెండ్లాము, తమ్ములు, కొడుకులు, స్నేహితుల సముదాయంతోపాటుగా; నన్నున్= నన్ను; చెఱ+కొని= బంధించి; గంధర్వ నాయకుండు= గంధర్వులకు అధినేత చిత్రసేనుఁడు; దివమునకున్= ఆకసానికి; ఎగసెన్= ఎగిరాడు; అప్పుడు= ఆసమయంలో; బెగడి= భయపడి; చెదరి= నలువైపులకు పారిపోయి; మనవారలు= మనవారు; ఎల్లను= అందరు; పఱచి= పరుగెత్తి; దైన్యసంభరితులు+అగుచున్= దీనత్వంతో కూడినవారు ఔతూ; పాండుసుతులన్= పాండవులను; శరణు+చొచ్చిరి= అభయాన్ని కోరారు.

**తాత్పర్యం:** 'పాపరహితుడ వైన ఓకర్ణా! నేనూ తమ్ములూ గంధర్వుల నెదిరించి పోరాటం సలిపాం; ఉభయసేనలలో పలువురు మరణించారు, గాయపడ్డారు; అయినా పోరాటం పౌరుషంతో కొనసాగింది. అప్పుడు గంధర్వపతి చిత్రసేనుడికీన్నీ నాకున్నూ ద్వంద్వయుద్ధం జరిగింది. ఆతడు నన్ను ఓడించి నన్నూ, నాభార్యలనూ, తమ్ములనూ, స్నేహితులనూ, కొడుకులనూ, అందరినీ బంధించి, ఆకసానికి ఎగశాడు. అంతట మనవారు హాహాకారాలు చేస్తూ దీనులై పాండవులవద్దకు పరుగెత్తి వారిని శరణువేడారు.

**ఉ.** **వారలయార్తిఁ జూచి జనవంద్యుఁడు ధర్మసుతుండు దమ్ములన్**
**భూరిబలాఢ్యులం బరమపుణ్యుఁడు నన్ విడిపింపఁ బంచె; న**
**వ్వీరులు నుక్కునం గవిసి వీఁకున ఖేచరకోటిఁ దొల్త నిం**
**పారఁ బ్రియోక్తులం దెలఁచి; రంతటఁ దీరద కార్య మెమ్మెయిన్.** **10**

**ప్రతిపదార్థం:** వారల+ఆర్తిన్+చూచి= (కౌరవభటులయొక్క) వేదన గమనించి; పరమపుణ్యుఁడు= గొప్ప సుకృతం చేసినవాడు; జనవంద్యుఁడు= ప్రజలచేత నమస్కరించదగినవాడు; ధర్మసుతుండు= ధర్మనందనుడు; భూరి, బల+ఆఢ్యులన్= గొప్పబలంతో కూడినవారలను; పరమ పుణ్యుఁడు= గొప్ప సుకృతం చేసిన ధర్మజుడు; తమ్ములన్= అనుజులను; నన్= నన్ను; విడిపింపన్= బంధముక్తుడిని చేయటానికి; పంచెన్= నియోగించాడు; ఆ+వీరులు= ఆ శూరులు; ఉక్కునన్= బలంతో; వీఁకునన్= ఉత్సాహంతో; కవిసి= మార్కొని; ఖేచరకోటిన్= గంధర్వులను; తొల్తన్= (తొలుతన్); మొదట; ఇంపు+ఆరన్= ప్రీతితో; ప్రియోక్తులన్ (ప్రియ+ఉక్తులన్)= మంచి మాటలతో; తెలఁచిరి= ప్రార్థించారు; అంతటన్= దానితో ఆపిదప; కార్యము= పని; ఏ+మెయిన్= ఏరీతిగానూ; తీరదు+అ= నెరవేరలేదు.

**తాత్పర్యం:** మన కౌరవభటుల ఆవేదన గమనించి, జనులచేత పూజింపబడే ధర్మరాజు, పుణ్యాత్ముడు నన్ను బంధవిముక్తిడిని చేయించటంకొరకై గొప్పబలవంతులు మహాశూరులు అయిన తమ్ములను నియోగించగా, వారు ఉత్సాహంతో గంధర్వులను ఎదుర్కొన్నారు; మొట్టమొదట పాండవులు గంధర్వులను సామవాక్యాలతో నన్ను బంధవిముక్తుడిని చేయండని ప్రార్థించారు. కాని, గంధర్వులు అందుకు సమ్మతించలేదు.

**ఆ.** **అంతఁ దెగువసేసి యంతకాకారు లై । భీమపార్థయములు భీమబలులు**
**ఖచరతతులమీఁదఁ బ్రచురబాణౌఘముల్ । గురిసి రాహవమున ఘోరభంగి.** **11**

**ప్రతిపదార్థం:** అంతన్= పిదప; తెగువ+చేసి= సాహసించి; అంతక+ఆకారులు+ఐ= యముడివంటి రూపాలు కలవారై; భీమబలులు= భయంకర మైన శక్తి కలవారు; భీమ, పార్థ, యములు= భీముడు, అర్జునుడు, కవలును (నకులసహదేవులును); ఖచర, తతుల, మీఁదన్= గంధర్వులపై; ప్రచుర, బాణ+ఓఘముల్= పెక్కుఅమ్ములప్రవాహాలు; ఆహవమునన్= యుద్ధంలో; ఘోరభంగిన్= భయంకరరీతిలో; కురిసిరి= వర్షించారు.

**తాత్పర్యం:** అంతట సాహసించి, భీముడు అర్జునుడు నకులసహదేవులు యముడివలె భయంకరాకారాలతో విజృంభించి, గంధర్వులపై భీకరయుద్ధం చేసి పెక్కుబాణాలను వర్షించారు.

**వ. తదీయబాణపాతంబుల నొచ్చి గంధర్వులు మమ్ముం గొనుచు గగనంబునం బఱచిన, నర్జునుండు వారికిం బోవరాకుండ నతినిబిడబాణజాలంబుల నంబరమార్గంబు నిరోధించినం, జిత్రసేనుండు దనప్రియసఖుండైన శతమఖసుతుం జేరనరిగి కుశలం బడిగిన, నర్జునుండునుం బ్రీతుండై వాని ననునయించి, 'యీ దుర్యోధనుండు మాతోడంబుట్టువు గావున నితని విడువవలయు' ననిన నాగంధర్వనాయకుండు. 12**

**ప్రతిపదార్థం:** తదీయ, బాణ, పాతంబులన్= వారియొక్క (పాండవులయొక్క) అమ్ములతాకిడికి; నొచ్చి= వెతచెంది; గంధర్వులు; మమ్మున్+కొనుచున్= మమ్మల్ని బందీలుగా వెంటపెట్టుకొని తీసికొనిపోతూ; గగనంబునకున్= ఆకసానికి; పఱచినన్= పారిపోగా; అర్జునుండు; వారికిన్; పోవరాకుండన్= వెళ్ళటానికి వీలులేకుండా; అతినిబిడబాణజాలంబులన్= మిక్కిలి దట్టమైన అమ్ముల సముదాయంచేత; అంబర, మార్గంబు= ఆకాశపథం; నిరోధించినన్= అడ్డగించగా; చిత్రసేనుండు; తన, ప్రియ, సఖుండు+ఐన= తనకు అనుగుచెలికాడు అయిన; శతమఖ, సుతున్= దేవేంద్రుడికొడుకును, అర్జునుడిని; చేరన్+అరిగి= సమీపించి; కుశలంబు= యోగక్షేమాలు; అడిగినన్= ప్రశ్నించగా; అర్జునుండునున్; ప్రీతుండు+ఐ= సంతృప్తి చెందినవాడై; వానిన్= చిత్రసేనుడిని; అనునయించి= ఓదార్చి; ఈ దుర్యోధనుండు; మాతోడన్+పుట్టువు= మా సోదరుడు; కావునన్= కాబట్టి; ఇతనిన్= ఈ దుర్యోధనుడిని; విడువవలయున్= వదలిపెట్టవలెను; అనినన్= అని చెప్పగా; ఆ గంధర్వనాయకుండు= గంధర్వులకు నేత అయిన ఆ చిత్రసేనుఁడు.

**తాత్పర్యం:** పాండవులు ప్రయోగించిన బాణాలకు నొచ్చి గంధర్వులు మమ్మల్ని పట్టుకొని ఆకాశమార్గాన పారిపోవటానికై ఎగసినారు. కాని, అర్జునుడు ఆకాశాన్ని అమ్ముల సముదాయంతో నింపి వారిపన్నాగాన్ని భగ్నంచేశాడు. అంత చేసేది లేక చిత్రసేనుడు తన బాల్యసఖుడైన అర్జునుడిని సమీపించి యోగక్షేమాలను అడిగి అతడిని ప్రసన్నుడిని చేశాడు. అర్జునుడు ప్రీతిచెంది, 'ఈ దుర్యోధనుడు మాకు సహోదరుడు. ఇతడిని విడువవలె' నని చిత్రసేనుడిని అర్థించాడు. అంతట గంధర్వనాయకుఁ డైన చిత్రసేనుడు.

**చ. మనదుర్మంత్రిత మంతయు । ఘనుఁ డప్పార్థునకుఁ జెప్పి 'ఘనభుజ! యిది యిం**
**ద్రుని పను పగుట నవశ్యం । బును నీతని విడువ' ననియె భూరిబలుం డై. 13**

**ప్రతిపదార్థం:** భూరిబలుండు+ఐ= గొప్ప బలం కలవాడై; మన, దుర్మంత్రితము= మన చెడు ఆలోచన; అంతయున్= సమస్తం; ఘనుఁడు= గొప్పవాడైన; ఆ+పార్థునకున్= ఆ అర్జునుడికి; చెప్పి= విన్పించి; ఘనభుజ!= గొప్పభుజాలు కలవాడా! ఓ అర్జునా!; ఇది= ఈపని - దుర్యోధనాదులను బంధించటం; ఇంద్రుని పనుపు+అగుటన్= ఇంద్రుడి నియోగం కావటంచేత; అవశ్యంబునున్= తప్పనిసరిగా; ఈతనిన్= ఇతడిని(దుర్యోధనుడిని); విడువన్+అనియెన్= వదలను అని చెప్పాడు.

**తాత్పర్యం:** మనం పన్నిన చెడుపన్నాగా న్నంతటిని గొప్పవాడైన ఆ అర్జునుడికి వివరించి చెప్పి, 'మహాశూరుడ వైన ఓ అర్జునా! ఈపని (దుర్యోధనాదులును బంధించటం) మా అంతట మేము చేసింది కాదు. ఇది ఇంద్రుడి ఆజ్ఞవలన తప్పనిసరిగా చేయవలసి వచ్చింది. కనుక విడువను అని పరాక్రమించి పలికాడు.

**క. కడు లజ్జయు దైన్యంబును । నడరి ముసుఁగు వడఁగ నాకు నాత్మగతమునం**
**బుడమి వివరంబు లేదే । యడఁగెద నన్నట్టి దయ్యె నప్పుడు కర్ణా! 14**

**ప్రతిపదార్థం:** కర్ణా!= ఓకర్ణా!; కడున్= మిక్కుటమైన; లజ్జయున్= సిగ్గున్నూ; దైన్యంబును= హీనస్థితియున్నూ; అడరి= ప్రజ్వలించి; ముసుఁగు+పడఁగన్= కప్పివేయగా; నాకున్; ఆత్మగతమునన్= మనస్సులో; అప్పుడు= ఆ సమయంలో; పుడమిన్= భూమిలో; వివరంబు= రంధ్రం; లేదే= లేదుగదా; అడఁగెదన్= అణగి లోపలికి దూరిపోతానుగాక; అన్నట్టిది+అయ్యెన్= అనిపించింది.

**తాత్పర్యం:** మిక్కుటమైన సిగ్గూ, హీనస్థితీ నన్ను కప్పివేశాయి. నామనస్సులో 'అయ్యో! ఇప్పుడు భూమిలో పెద్దబెజ్జం పడితే ఎంత బాగుండేది. నేను దానిలోనికి దూకి నశించి ఉండేవాడినికదా! ఇట్టి అవమానం తప్పిఉండేది' అని అనిపించింది.

**వ. అంతం గౌంతేయులు గంధర్వులం దోడ్కొని ధర్మరాజుపాలికిం జని, మనదుర్మంత్రంబుకతంబున బంధగోచరుండ నయిన నన్ను నయ్యజాతశత్రుముందట నివేదించిన, నతండు విడిచి పుత్తెంచె నిది మదీయ వృత్తాంతంబు. 15**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ మీదట; కౌంతేయులు= కుంతీకుమారులు(భీమార్జునకులసహదేవులు); గంధర్వులన్= గంధర్వులను; తోడ్కొని= వెంటబెట్టుకొని; ధర్మరాజు పాలికిన్= ధర్మరాజు దగ్గరికి; చని= వెడలి; మనదుర్మంత్రంబుకతంబునన్= మన చెడ్డఆలోచనవలన; బంధగోచరుండన్+అయిన, నన్నున్= చెరపెట్టబడిన నన్ను; ఆ+అజాతశత్రుముందటన్= ఆ ధర్మరాజు ఎదుట; నివేదించినన్= సమర్పించగా; అతండు= అతడు (ఆ అజాతశత్రుడు); విడిచి పుత్తెంచెన్= విడిపించి పంపాడు; ఇది, మదీయ వృత్తాంతంబు= ఇది నాకు సంబంధించిన సంగతి.

**తాత్పర్యం:** అంతట, భీముడు అర్జునుడు నకులుడు సహదేవుడు గంధర్వులను తమవెంటబెట్టుకొని ధర్మరాజు సమక్షానికి వెళ్ళారు. మనచెడ్డపన్నాగం బెడిసికొట్టటంచేత చెరపెట్టబడిన నన్ను ఆ అజాతశత్రుండు అయిన ధర్మరాజుముందట నిల్పారు. ఆ అజాతశత్రుడు నన్ను విడిచి పుచ్చాడు. ఇది నా జరిగిన కథ.

**క. ఒవ్వనివారల యెదురన । యివ్విధమున భంగపడితి నే; నింక జనుల్**
**నవ్వఁగ నేటి బ్రదుకుగా । నివ్వసుమతి యేలువాఁడ? నెట్లు చరింతున్? 16**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఒవ్వనివారల+ఎదురన్+అ= శత్రువుల యొక్క సమక్షంలోనే; ఈ+విధమునన్= ఈ రీతిగా; భంగపడితిన్= అవమానం పొందాను; ఇంకన్= ఇకమీద; జనుల్= ప్రజలు; నవ్వఁగన్= వేళాకోళంచేయగా; ఏటి; బ్రదుకు+కాన్= ఎటువంటి జీవితంగా; ఈ+వసుమతి= ఈ భూమిని; ఏలువాఁడన్?= పరిపాలించగలను?; ఎట్లు= ఏవిధంగా; చరింతున్?= ప్రవర్తించగలను?.

**తాత్పర్యం:** శత్రువుల సమక్షంలో ఈవిధంగా మిక్కిలి పరాభవం పొందానుగదా! ఇక ప్రజలు అందరు నన్ను వెక్కిరించరా! ఇటువంటి బ్రదుకు నాకిక ఎందుకు? ఈ భూమిని నేను ఇక ఎట్లా పరిపాలించగలను?; ఇకమీద ఏమొగం పెట్టుకొని తిరుగాడగలను?

**విశేషం:** ఒవ్వు= గిట్టు, సరిపడు అని ఈక్రియకు అర్థం. అయితే - ఈధాతువుకు - వ్యతిరేకార్థంలో మాత్రమే 'ఒవ్వని' - అని ప్రయోగాలు కన్పిస్తున్నాయి.

**ఉ. అక్కట! యమ్మహారణమునందు వియచ్చరకోటితోడఁ బే**
**రుక్కునఁ బోరి యేను మృతి నొందఁగ నేరన; యట్టు లైన నీ**
**తక్కువపాటు లేక ప్రమదంబున దేవపదంబు నొందుదున్;**
**మిక్కిలి యైన కీర్తియును మేదినియందు వెలుంగు నిత్యమై. 17**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో! (ఎంతటి దురవస్థప్రాప్తించింది); ఆ+మహారణమునందున్= ఆ గొప్ప యుద్ధంలో; వియత్+చరకోటితోడన్= గంధర్వుల సమూహంతో; పేరు+ఉక్కునన్= గొప్ప పరాక్రమంతో; పోరి= యుద్ధంచేసి; ఏను= నేను; మృతిన్+ఒందఁగన్+నేరను+అ= నేను మరణించి ఉండలేకపోయాను కదా! (చనిపోయిఉంటే ఎంత బాగా ఉండేది); అట్టులు+ఐనన్= ఆవిధంగా జరిగిఉన్నట్లయితే - (అంటే వీరమరణం పొంది ఉంటే); ఈ తక్కువపాటు= ఈపరాభవం; లేక= ఉండకుండా; ప్రమదంబునన్= సంతోషంతో; దేవపదంబున్= స్వర్గలోకాన్ని; ఒందుదున్= అనుభవిస్తాను; మిక్కిలి+ఐన= మిక్కుటమైన; కీర్తియును= యశస్సుకూడా; మేదినిఅందున్= భూలోకంలో; నిత్యము+ఐ= శాశ్వతమైనదై; వెలుంగున్= ప్రకాశిస్తుంది.

**తాత్పర్యం:** అయ్యో! నాకు ఎంతటి దురవస్థ ప్రాప్తించింది ! ఆ యుద్ధంలో గంధర్వసమూహాలతో పరాక్రమం ప్రదర్శించి పోరాడి వీరమరణం పొందజాలక పోయాను. ఆ విధంగా వీరమరణం పొంది ఉన్నట్లయితే నాకు ఈ పరాభవం ఉండేదికాదు, స్వర్గంలోకం ప్రాప్తించేది. గొప్పదైనకీర్తి భూమిపై శాశ్వతంగా వెలుగొందేది.

### దుర్యోధనుండు ప్రాయోపవేశంబు సేయఁబూనుట (సం. 3-238-10)

**వ. కావున నిట్టి దురవస్థపాలైతి; నేను ప్రాయోపవేశంబునఁ బ్రాణపరిత్యాగంబుఁ జేసెద; మీరందఱు దుశ్శాసనుం బురస్కరించుకొని పురంబున కరుగునది; మిత్రులకుఁబ్రమోదంబును శత్రులకు నిర్వేదనంబునుం జేయుచు మను నట్టియేను నేఁడు పోఁడిమిసెడి, పగతురచేత శిరస్తాడనంబు సేయంబడి సిగ్గువడక బంధు జనంబులలోని కేమని యరుగుదు? నాంబికేయుం గని యే మని పలుకుదుఁ? గురువృద్ధు లైన భీష్మబాహ్లికులయు నాచార్యులయిన కృప ద్రోణులయు సమ్ముఖంబున నెట్లు నిలుతుఁ? బరిజనులుం బౌరులుం బురోహితులు నన్నుం గనిన నేమని సంభాషింతు? నిది యాత్మదోషంబున నైన యపాయంబు, నా కవశ్యభోక్తవ్యంబు. 18**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఇట్టి= ఇటువంటి; దురవస్థ= చెడుస్థితి; పాలు+ఐతి= పొందాను; ఏను= నేను; ప్రాయోపవేశంబునన్= ఆహారం తీసికొనకుండా ఆమరణ ఉపవాస దీక్షతో (నిరశన వ్రతం అవలంబించి); ప్రాణ, పరిత్యాగంబున్= అసువులను విడవటం, మరణించటం; చేసెదన్= చేస్తాను; మీరు+అందఱున్= మీరు (శకుని కర్ణాదులు) అందరును; దుశ్శాసనున్= దుశ్శాసనుడిని; పురస్కరించుకొని= ముందిడుకొని, నాయకుడిగా పరిగ్రహించి; పురంబునకున్= నగరానికి (హస్తినాపురికి); అరుగునది= వెళ్లండి; మిత్రులకున్= స్నేహితులకు; ప్రమోదంబును= సంతోషాన్ని; శత్రులకున్= విరోధులకు; నిర్వేదనంబునున్= దైన్యాన్ని; చేయుచున్= చేస్తూ; మనునట్టి= బ్రతుకునట్టి; ఏను= నేను; నేఁడు= ఈనాడు; పోఁడిమి+చెడి= సొగసు కోల్పోయి; పగతురచేతన్= శత్రువులచేత; శిరస్+తాడనంబు= తలతన్నబడటం; చేయంబడి=

ఒనరించబడి; సిగ్గు+పడక= లజ్జ చెందకుండ; బంధుజనంబులలోనికిన్= చుట్టపక్కాలలోకి; ఏమని= ఏమి అని - ఏమొగంపెట్టుకొని; అరుగుదున్?= వెళ్లగలను?; ఆంబికేయున్+కని= అంబిక పుత్రుడు అయిన ధృతరాష్ట్రుడిని చూచి; ఏమి+అని= ఏవిధంగా; పలుకుదున్?= మాటలాడగలను?; కురు, వృద్ధులు+ఐన= కురువంశంలో పెద్దలు అయిన; భీష్మ, బాహ్లికులయున్= భీష్ముడి యొక్కయు, బాహ్లికుడియొక్కయు; ఆచార్యులు+అయిన= గురువులు అయిన; కృప, ద్రోణులయున్= కృపాచార్యుడియొక్క, ద్రోణుడి యొక్కయు; సమ్ముఖంబునన్= ఎదుట; ఎట్లు= ఏరీతిగా; నిలుతున్?= నిలబడగలను?; పరిజనులున్= సేవకులును, పౌరులున్= పురజనులును పురోహితులు= పురోహితులు; నన్నున్= నన్ను; కనినన్= చూడగా; ఏమి+అని= ఏ రీతిగా; సంభాషింతున్= మాట్లాడగలను?; ఇది= ఈ పరాభవం; ఆత్మదోషంబునన్= నాఅంతట నేను చేసికొన్న తప్పువలన (స్వయంకృతాపరాధం చొప్పున); ఐన= జరిగిన; అపాయంబు= కీడు; (కావున); నాకున్; అవశ్య, భోక్తవ్యంబు= తప్పనిసరిగా అనుభవించదగింది.

**తాత్పర్యం:** కాబట్టి, ఇటువంటి దీనస్థితి నాకు దాపురించింది. నేను నిరశనవ్రతం పూని మరణిస్తాను. నాకు గత్యంతరం లేదు. మీరు అందరు దుశ్శాసనుడిని నాయకుడిగా పరిగ్రహించి హస్తినాపురానికి పొండి, మిత్రులకు సంతోషాన్ని, శత్రువులకు దుఃఖాన్నీ కలిగిస్తూ తిరిగిన నేను ఈనాడు శత్రువులచేత పరాభవించబడి పరువు పోగొట్టుకొని తలవంచుకొని తిరగలేను. శత్రువులచేత తన్నబడిన శిరస్సుతో నేను చుట్టపక్కాలనడుమ ఏమొగం పెట్టుకొని పోగలను? ధృతరాష్ట్రుడితో ఎట్లా సంభాషించగలను? ఏమని మాట్లాడగలను? కురువంశంలో పెద్దలైన భీష్మ, బాహ్లికులతో ఎట్లా ఎదుటనిల్చి మాటాడగలను? గురువులైన కృపాచార్య, ద్రోణాచార్యులవారి సమక్షంలో, ఎట్లా నిలిచి మాటాడగలను? సేవకులకు ఆజ్ఞ లెట్లా ఇవ్వగలను? పురజనులూ, పురోహితులూ నన్ను సందర్శించవస్తే వారి నేవిధంగా పలకరించగలను? ఇది అంతా నా స్వయంకృతాపరాధం. పశ్చాత్తాపంతో ప్రాయశ్చిత్తానికి పూనుకొన్నాను. ఈ కర్మవిపరిపాకం నేను అనుభవించక తప్పదు.

**క. విను దుర్వినయాత్మకుఁ డగు । జనుఁ డుజ్జ్వల మైన సిరియు సద్విద్యయుఁ గ**
**ల్గిన నందు మెలఁగనేరక । చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్. 19**

**ప్రతిపదార్థం:** విను(ము)= ఆలకించుము; దుర్వినయ+ఆత్మకుఁడు+అగు, జనుఁడు= చెడ్డ అహంకారం కల వ్యక్తి; ఉత్+జ్వలము+ఐన= మిక్కుటంగా ప్రకాశించే; సిరియున్= సంపదయున్నూ; సత్+విద్యయున్= మంచి చదువును; కల్గినన్= లభించగా; అందున్ (సిరియందును, చదువులందును); మెలఁగన్‌నేరక= ప్రవర్తింపజాలక; చెనఁటి, తెఱంగునకున్= మూర్ఖుని పద్ధతిలో; చొచ్చి= చేరి; తుదిన్= చివరకు; చెడిపోవున్= నశిస్తాడు.

**తాత్పర్యం:** ఆలకించుము. చెడ్డ అహంకారం కలవాడు సిరిసంపదలతో తులతూగవచ్చును, మంచిచదువు చదువ వచ్చును. కాని, వాటిని సవ్యంగా ఉపయోగించుకొననేరక మూర్ఖులు పోయే దారిని చేరి తుట్టతుదకు చెడిపోతాడు.

**క. అకటకట యిట్టికష్టము । నకు వచ్చితి నయ్య యేను; నన్నటె వైరి**
**ప్రకరము లనిఁ బట్టినఁ గృప । నొకరుఁడు విడిపించె దైవ మోపదె యెట్లున్. 20**

**ప్రతిపదార్థం:** అకట+అకట= అయ్యో! అయ్యో!; ఏను= నేను; ఇట్టి, కష్టమునకున్ వచ్చితినయ్య= ఇటువంటి దీనస్థితికి దిగజారవలసి వచ్చింది; నన్నున్+అటె= నా అంతటివాడిని సయితం; వైరి, ప్రకరములు శత్రు సమూహాలు; అనిన్= యుద్ధంలో; పట్టినన్= బంధించగా; కృపన్= జాలితో; ఒకరుఁడు= ఎవడో మరొకడు; విడిపించెన్= బంధవిముక్తుడిని చేశాడు; ఎట్లున్= ఏరీతిగా అయినా; (ఏది ఎట్లా జరగాలన్నా); దైవము= అదృష్టశక్తి; ఓపదె= శక్తికలదు కాదా? (శక్తికలదని భావం).

**తాత్పర్యం:** అయ్యో! అయ్యో! నాకు ఎంతటి దురవస్థ కలిగింది. నా అంతటివాడిని శత్రువులు యుద్ధంలో ఓడించి చెఱబట్టటమా! జాలితో ఒకడెవడో వచ్చి నన్ను బంధవిముక్తుడిని చేయటమా! ఏవిధంగా జరిపించటానికైనా దైవానికి శక్తి ఉన్నది. ఎంతటి బలవంతులైనా విధిచేతిలో కీలుబొమ్మలే కదా!

**క. మానము సెడియును నిమ్మై। మేనం బ్రాణంబు లెట్లు మేకొని తాల్తుం?**
**గాన యిది నిశ్చయముగాఁ। బూనితి నాతెగువ మాన్పఁ బోల దొరులకున్.' 21**

**ప్రతిపదార్థం:** మానము+చెడియునున్= ఆత్మాభిమానం పాడైపోయినప్పటికిని; ఇమ్మైన్= ఈ రీతిగా; మేనన్= శరీరంలో; ప్రాణంబులు= అసువులు; మేకొని= అంగీకరించి; ఎట్లు= ఏవిధంగా; తాల్తున్= ధరించగలను? కాన= కావున; ఇది= ఈ నిరశనవ్రతం; నిశ్చయముగాన్= దృఢమైన ఉద్దేశంతో; పూనితిన్= వహించాను; నాతెగువ= నా సాహసం; ఒరులకున్= ఇతరులకు; మాన్పన్+పోలదు= ఆపటానికి వీలు లేదు.

**తాత్పర్యం:** 'ఆత్మాభిమానం పాడయిపోయి, ఈ విధంగా ఈ శరీరంలో అసువులను నేను ఎట్లా భరించగలను? మానం కంటె ప్రాణం గొప్పది కాదు. ఇది నా దృఢమైన అభిప్రాయం, నేను ప్రాయోపవేశదీక్ష పూని ప్రాణాలను విడనాడదలచాను. దీనికి తిరుగు లేదు. ఎవరూ నా సాహసాన్ని మాన్పలేరు' అని దుర్యోధనుడు పలికాడు.

**వ. అని పలికి సమీపగతుం డయిన దుశ్శాసను నాలోకించి యమ్మహీపాలుం డి ట్లనియె. 22**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; సమీపగతుండు+అయిన= దగ్గరకు వచ్చి నిలచిఉన్న; దుశ్శాసనున్= దుస్ససేనుడిని; ఆలోకించి= చూచి; ఆ+మహీపాలుండు= ఆ రాజు, ఆదుర్యోధనుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** అంత - ఆతనిదరికి వచ్చి నిలబడిన దుశ్శాసనుడిని చూచి దుర్యోధనుడు ఇట్లా అన్నాడు.

**సీ. 'అన్న! దుశ్శాసన! నిన్ను రాజ్యమునకుఁ। బట్టంబు గట్టెదఁ బతివి గమ్ము;**
**శకునికర్ణులు దీర్పఁ బ్రకటవసుంధరా। వలయమంతయు మహోజ్జ్వలత నేలు;**
**భ్రాతృవర్గమునకుఁ బ్రీతి సేయుము; బంధుఁ। జనుల బోషింపుము; సద్ద్విజులకు**
**నుత్తమంబుగఁ దగువృత్తులు సెల్లింపు;। గురుజనంబుల భక్తిఁ గొలువు మెపుడు;**

**తే. నింద్రుఁ డమరగణంబుల నేలునట్లు। ధరణి పతుల నేలుము; బాహుదర్ప మొప్పఁ**
**బగఱ నుక్కడఁగింపుము; పరమమిత్త్రు। లైన శూరులఁ గొనియాడు మర్థ్వభంగి'. 23**

**ప్రతిపదార్థం:** అన్న, దుశ్శాసన!= నాయనా, దుశ్శాసనా!; నిన్నున్; రాజ్యమునకున్= ప్రభుత్వానికి; పట్టంబు+కట్టెదన్= పట్టాభిషిక్తుడిని చేస్తాను; పతివి+కమ్ము= రాజువు అగుము; శకుని, కర్ణులు, తీర్పన్= శకుని, కర్ణుడు అమర్చగా; ప్రకట, వసుంధరా, వలయమున్= కనుపించునట్టి భూమండలాన్ని; అంతయున్= సమస్తం; మహా+ఉత్+జ్వలతన్= గొప్పగా ప్రకాశించేటట్లుగా; ఏలు(ము)= పరిపాలించుము; భ్రాతృవర్గమునకున్= సోదరసముహానికి; ప్రీతి+చేయుము= సంతుష్టిని కల్గించుము; సత్+ద్విజులకున్= మంచి బ్రాహ్మణులకు; ఉత్తమంబుగన్= శ్రేష్ఠంగా; తగు వృత్తులు= ఉచితమైన ఈనాములు; చెల్లింపు(ము)= ఇమ్ము; ఎపుడున్= ఎల్లప్పుడును; గురుజనంబులన్= పెద్దలైన వారిని; భక్తిన్= పూజ్యభావంతో; కొలువుము= ఆరాధించుము; ఇంద్రుఁడు= వేలుపుదొర; అమర, గణంబులన్= వేల్పుల సముదాయాలను; ఏలునట్లు= పరిపాలించేటట్లుగా; ధరణిపతులన్= రాజులను; ఏలుము= పరిపాలించుము; పగఱన్= శత్రువులను; బాహుదర్పము+ఒప్పన్= పరాక్రమం శోభిల్లేటట్లుగా; ఉక్కు+అడఁ

గింపుము= మదాన్ని అణచివేయుము; పరమమిత్త్రులు+ఐన= మిక్కిలి స్నేహితులు అయిన; శూరులన్= వీరులను; అర్హభంగిన్= ఉచితమైన పద్ధతిలో; కొనియాడుము= కీర్తించుము.

**తాత్పర్యం:** 'నాయనా! దుశ్శాసనా! నీకు పట్టం కట్టుతాను, నీవే రాజువు కమ్ము; శకుని కర్ణుడు నీకు సర్వాన్నీ అమర్చి పెట్టగలరు. ఈ భూమండలమంతటిని దేదీప్యమానుడవై పరిపాలించుము. సోదరసమూహానికి సంతృప్తి కలిగించుము. చుట్టపక్కాలను పోషించుము. బ్రాహ్మణోత్తములకు అగ్రహారాలను దానంచేయుము. పెద్దలను పూజించుము. పరాక్రమంతో శత్రువులను నాశనం చేయుము. శూరులైన మిత్రులను సముచితంగా సమ్మానించుము.

**వ. అనిన నమ్మాట దనహృదయంబునకు నిశితశూలంబయిన, నతండు నిలువ నోపక యగ్రజు పాదంబులపయిం బడి, 'దేవా! యిట్లానతీఁ దగదు; నాకుం బ్రసన్నుండ వగు' మని నిజనేత్రజలంబులం దదీయ చరణయుగళం బభిషేకించుచు నిట్లనియె. 24**

**ప్రతిపదార్థం:** అనినన్= అని దుర్యోధనుడు చెప్పగా; ఆ+మాట= ఆ పలుకు; తన, హృదయంబునకున్= తన డెందానికి; నిశిత శూలంబు+అయినన్= వాడి బల్లెంవలె తగులగా; అతండు= దుశ్శాసనుడు; నిలువన్+ఓపక= ఆగజాలక; అగ్రజు= అన్నయొక్క; పాదంబులపయిన్+పడి= కాళ్లమీద వ్రాలి; దేవా!= ప్రభూ! (ఓదుర్యోధనసార్వభౌమా!); ఇట్లు= ఈ రీతిగా; ఆనతి+ఈన్+తగదు= ఆజ్ఞాపించరాదు; నాకున్+ప్రసన్నుండవు+అగుము= నాపట్ల అనుగ్రహం కలవాడవు కమ్ము; అని= అని చెప్పి; నిజనేత్ర, జలంబులన్= తన కన్నీళ్లతో; తదీయ, చరణ, యుగళంబు= అతడి పాదాలజంటను; అభిషేకించుచున్= తడుపుతూ; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడు చెప్పాడు. దుర్యోధనుడిమాటలు దుశ్శాసనుడి హృదయానికి వాడిబల్లేలమాదిరి గ్రుచ్చుకొన్నాయి. అంతట దుశ్శాసనుడు నిలువజాలక అన్న అయిన దుర్యోధనుడి కాళ్లమీద పడి, తన కన్నీళ్లతో ఆతడికాళ్లు తడిపి ఇట్లా పలికాడు.

**చ. 'అవని విదీర్ణ మైనను, హిమాద్రి చలించుట గల్గినన్, మహా**
**ర్ణవ మది యింకినన్, దివసనాథుఁడుఁ జంద్రుఁడు దేజ మేదినం,**
**గువలయనాథ! నీకు నొక కుత్సితభావముఁ గల్గ నేర్చునే!**
**భవదుపయోగ్య మైన నృపభారము నాకు వహింప శక్యమే? 25**

**ప్రతిపదార్థం:** కువలయనాథ!= భూమికి భర్తవైన రాజా! (ఓ దుర్యోధన సార్వభౌమా!); అవని= భూమి; విదీర్ణము+ఐనను= బ్రద్దలయినప్పటికి; హిమ+అద్రి= మంచుకొండ; చలించుట= కదలటం; కల్గినన్= ఏర్పడినప్పటికి; మహా+అర్ణవము= గొప్పసముద్రం; అది= అది(అంతటిది); ఇంకినన్= ఎండిపోయినప్పటికి; దివసనాథుఁడున్= సూర్యుడున్నూ (పగటికిభర్త); చంద్రుఁడున్= చందమామయున్నూ; తేజము= వెలుగు; ఏదినన్= కోలుపోయినప్పటికీ; నీకున్= నీకు; ఒక= ఒక; కుత్సితభావమున్= నికృష్ట మైన ఆలోచన; కల్గన్‌నేర్చునే?= కలుగ గలదా?; భవత్+ఉపయోగ్యము+ఐన= నీకు ఉపయోగపడ దగిన; నృపభారము= రాజునకు సంబంధించిన బరువు, బాధ్యత; నాకున్= నాకు; వహింపన్= మోయటానికి; శక్యము+ఏ?= సాధ్యం అగునా?

**తాత్పర్యం:** ఓ దుర్యోధన సార్వభౌమా! రాజ్యభారం వహించవలసిన వాడవు నీవే. నీకొరకే ఈ రాజ్యం ఏర్పడింది. ఈపృథివి ముక్క చెక్కలు అగు గాక. సముద్రం ఇంకిపోవుగాక! సూర్యచంద్రులు తమతేజాలు కోలుపోతారుకాక. నీలో ఎట్టి నికృష్టభావాలు పొడసూపకుండునుగాక! నేను నీవు వహింపదగిన రాజ్యభారాన్ని మోయజాలను సుమా!

**క. హితు లైనవారిఁ బ్రోచుచు । సతతంబును రిపుల నెల్లఁ జమరుచు నిఖిల**
**క్షితితలము నీవ యేలుము । శతసంవత్సరము లధిప! జయశీలుఁడవై.' 26**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓమహారాజా!; హితులు+ఐనవారిన్= మిత్రులు అయిన వారిని; ప్రోచుచున్= కాపాడుతూ; సతతంబును= ఎల్లప్పుడును; రిపులన్+ఎల్లన్= శత్రువులనందరిని; చమరుచున్= నాశనం చేస్తూ; నిఖిలక్షితితలమున్= సమస్తమైన భూమండలాన్ని; నీవు+అ= నీవే; శతసంవత్సరములు= నూరు ఏండ్లు; జయశీలుఁడవు+ఐ= విజయం సాధించే స్వభావం కలవాడవై; ఏలుము= పరిపాలించుము.

**తాత్పర్యం:** మహారాజా! మిత్రులను కాపాడుతూ, శత్రువులను నశింపజేస్తూ నీవు ఈ భూమండలం సమస్తం విజయపరంపరలను సాధిస్తూ నూరుసంవత్సరాలు పరిపాలింపుము.'

**వ. అనుచునయ్యువరాజు దుఃఖాతిభారవిహ్వలుండై యెలుంగెత్తి యేడ్చిన, నయ్యన్నయుంగన్నీరొలుక నూరకుండె; నప్పుడు కర్ణుండు వారలంజూచి' యిట్లేల బాలిశులుంబోలెనేడ్చెదరు? ధైర్యంబులు ధరియించి శోకవ్యసనంబులు విడువుండు; శోకశీలురం జూచి పగతురు సంతసిల్లుదురు; శోకశీలురకుఁ బైపై శోకంబులు వొందు' నని దుర్యోధనుం బేర్కొని యిట్లనియె. 27**

**ప్రతిపదార్థం:** అనుచున్= అనిపలుకుతూ; ఆ+యువరాజు= ఆ దుశ్శాసనుడు; దుఃఖ+అతిభార, విహ్వలుండు+ఐ= వగపుబరువుచేత క్షోభించి అవయవాల పట్టు తప్పినవాడై; ఎలుంగు+ఎత్తి= కంఠస్వరాన్ని ఎక్కువ చేసి; ఏడ్చినన్= శోకించగా; ఆ+అన్నయున్= ఆ అగ్రజుడు అయిన దుర్యోధనుడు కూడా; కన్నీరు+ఒలుకన్= కంటినీరు కారగా; ఊరకుండెన్= మిన్నకున్నాడు; అప్పుడు= ఆ సమయంలో; కర్ణుండు= కర్ణుడు; వారలన్+చూచి= వారలను (దుర్యోధన దుశ్శాసనులను) కాంచి; ఇట్లు+ఏల= ఈవిధంగా ఎందుకు; బాలిశులున్+పోలెన్= పసిబిడ్డలవలె, మూర్ఖులవలె; ఏడ్చెదరు= శోకిస్తారు; ధైర్యంబులు= చిత్తవైకల్యం లేని మనోనిగ్రహాలు; ధరియించి= వహించి; శోకవ్యసనంబులు= దుఃఖం కష్టాలు; విడువుండు= వదలిపెట్టండి; శోకశీలురన్+చూచి= ఏడుపుగొట్టువారిని కాంచి; పగతురు= శత్రువులు; సంతసిల్లుదురు= ప్రమోదం చెందుతారు; శోకశీలురకున్= దుఃఖవివశులయ్యే స్వభావం కలవారికి; పైపైన్= క్రమంగా; శోకంబులు= దుఃఖాలు; పొందును= కలుగుతాయి; అని= అని చెప్పి; దుర్యోధనున్+పేర్కొని= దుర్యోధనుడిని సంబోధించి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, యువరాజు అయిన దుశ్శాసనుడు సంక్షోభించిన హృదయంతో వశం తప్పిన అవయవాలు కలవాడై బిగ్గరగా ఏడ్చాడు. అన్నగారైన దుర్యోధనుడు కంటినీరు కారుస్తూ మిన్నకున్నాడు. అపుడు కర్ణుడు వారిని చూచి, 'ఈవిధంగా మీరు ఇరువురూ పసిబిడ్డలవలె ఎందుకు ఏడుస్తున్నారు? మీరు ధైర్యంగా ఉండవలసినవారు. దుఃఖం మంచిది గాదు. ఏడ్చేవారిని చూచి శత్రువులు సంతోషిస్తారు. అంతేకాక, దుఃఖించే వారికి మరికొన్ని కష్టాలు క్రమంగా దాపురించి పైనబడుతుండటం కద్దు' అని చెప్పి, దుర్యోధనుడిని సంబోధించి ఈవిధంగా పలికాడు.

**ఉ. 'ఒకయల్పమనుజు క్రియ సో । మకులోత్తమ! నీకు నిట్లు మహనీయసుఖ**
**ప్రకృతి యగు నిజశరీరం । బకట! విడువఁ దలఁపనగునె? యవిహితబుద్ధిన్. 28**

**ప్రతిపదార్థం:** సోమ, కుల+ఉత్తమ!= చంద్రవంశంలో పుట్టినవారిలో శ్రేష్ఠుడవైనవాడా!; ఒక+అల్ప, మనుజు, క్రియన్= ఒకనీచమానవుడి వలె; నీకున్= నీకు; ఇట్లు= ఈ రీతిగా; అవిహితబుద్ధిన్= క్రమశిక్షణ లేని మనస్సులో; మహనీయ, సుఖ

ప్రకృతి+అగు= గొప్ప సౌఖ్యాలను అనుభవించే స్వభావం కలది అయిన; నిజ శరీరంబు= స్వీయదేహం; అకట!= అయ్యో!; విడువన్= విడిచిపెట్టటానికి; తలఁపన్+అగునె= ఆలోచించవచ్చునా (ఆలోచించరాదు).

**తాత్పర్యం:** చంద్రవంశంలో జన్మించిన వారిలో శ్రేష్ఠుడవైన ఓసుయోధనమహారాజా! ఒక నీచమానవమాత్రుడి మాదిరిగా నీవు దుఃఖించతగునా? గొప్ప భోగభాగ్యాలు అనుభవించతగిన నీశరీరాన్ని విడిచిపెట్టటానికై అయ్యో! ఆత్మహత్యకు పూనతగునా? అట్టిపని క్రమశిక్షణ లేని దుర్బలమనస్కులు మాత్రమే చేస్తారు కాని నీవంటివారికి అది తగినపని కాదుసుమా!

**తే.** **శోకమగ్నుండ వగు నిన్నుఁ జూచి బెగడి । యధిప! నీతమ్ములును నేను నధికదుఃఖ**
**వహ్ని పాల్పడ మయ్య! మావలనఁ గరుణ । గలిగి తీర్పవె యిందఱఁ గౌరవేంద్ర! 29**

**ప్రతిపదార్థం:** అధిప= రాజా! (దుర్యోధనమహారాజా!)!; శోకమగ్నుండవు+అగు= దుఃఖంలో మునిగిన వాడవయిన; నిన్నున్= నిన్ను; చూచి= అరసి; బెగడి= ధైర్యంవీడి; నీ తమ్ములును= నీ అనుజులును; నేను= నేను (కర్ణుడును); అధిక, దుఃఖ, వహ్ని= గొప్పశోకం అనెడి అగ్నికి; పాల్పడము+అయ్యా= వశమైనవారలముకామా? (దుఃఖమనెడి అగ్నికి చిక్కుతాము); కౌరవ+ఇంద్ర!= కౌరవులకు ప్రభువైనవాడా! దుర్యోధనసార్వభౌమా!; మా వలనన్= మా యందు; కరుణ= దయ; కలిగి= ఉండి; ఇందఱన్+ ఇంతమందిని; తీర్పవె?= సంతృప్తిని పొందింపవా?

**తాత్పర్యం:** కౌరవులకు ప్రభు వయిన ఓ దుర్యోధన సార్వభౌమా! నీవు మాకు అధిపతివి. నీవు దుఃఖంలో మునిగితే నిన్ను చూచి, దుశ్శాసనుడు మున్నగు నీతమ్ములున్నూ, నేనున్నూ మిక్కుటమైన దుఃఖం అనే అగ్నికి ఆహుతి అయిపోతాంకదా! నీవు మాపట్ల జాలి గలిగి ఇంతమందిని సంతృప్తి పరచటానికైనా నీ నిరశనవ్రతం విరమించదగును.

**విశేషం:** 1. దుఃఖవహ్ని= దుఃఖం అనే అగ్ని. అలం : రూపకం. 2. ప్రాయోపవేశం దుర్యోధనుడి ఆత్మహత్యకు దారితీయటం మాత్రమేగాక- పలువుర మరణాలకు కారణం ఔతుందని కర్ణుడి హెచ్చరిక.

**వ.** **పాండవులచేత విముక్తుండ నైతి నని వగచె; దంతియకాని నీకుం గార్యగతియందు వివేకంబు సాల; దది యెట్లనిన, నేరాజు రాజ్యంబున నిశ్చింతు లయిన జనులు తమతమ జీవనంబుల వర్తింతు రారాజునకు నట్టిజనులుబంట్లు; గావునఁదా రమ్మహీపతికిం దీఱమిగల్గిన చోట్ల నెల్లనుందమపౌరుషంబులు నెఱపవలయుఁ; గౌంతేయులు నీదేశంబున నుండి నీయాజ్ఞవలనం గృతారంభులై యున్న వా రగుటంజేసి వారు నీకింకరులు; నీకునైన యక్కఱ దీర్చుట వారి కర్త్వకృత్యంబు; దీని కింత వనర నేల?; యదియునుంగాక పాండవులు జూదంబునాఁడ నీకు దాసు లైరి; తదీయంబు లైన మణికనకాదివస్తువులును భవదధీనంబులై యున్నయవి; వారు నిన్నుం గొలిచియుండుట లేకుండెనేనియు నింతటి కెలసంబు దీర్ప నేనియు వలదే; యిది యంతయు నూహించి వలవనివగలం బొగులక లెమ్ము! పురంబునకు నడువుము; నామాట వినక నిర్బంధపరుండ వైతేనియు ని న్నేమనవచ్చు; నిందఱము నీపోయిన గతిన పోవంగలవారము; నీవు లోకంబు చేత నగుఁబాటును బొందెద; వింతియ' యని కర్ణుండు సెప్పిన విని దుర్యోధనుండు వెండియుం బ్రాయోపవేశంబునందు నిశ్చయంబు వదలకున్నం గనుంగొని శకుని యి ట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** పాండవులచేతన్; విముక్తుండన్+ఐతిన్= బంధమోక్షణం చేయబడినవాడను అయినాను; అని= అంటూ; వగచెదు= దుఃఖిస్తావు; అంతియకాని= అంతేకాని; నీకున్; కార్యగతియందున్= చేయవలసిన పనిని జరపటంలో; వివేకంబు=విచారణచేసి భిన్నవస్తువులందు గల సూక్ష్మభేదాన్ని గుర్తించే తెలివి; చాలదు= సరిగా లేదు; అది= (వివేకంలేకపోవటం); ఎట్లు+అనినన్= ఎటువంటిది అంటే; ఏరాజు రాజ్యంబునన్= ఏప్రభువు ఏలుతున్న సీమలో; నిశ్చింతులు= దుఃఖం లేని వారు; అయినజనులు; తమ, తమ, జీవనంబులన్= తమతమత బ్రదుకుతెరువులలో; వర్తింతురు= (సుఖంగా) మెలగుతారో; ఆరాజునకున్= ఆప్రభువుకు; అట్టి జనులు= ఆవిధంగా (సుఖజీవితం గడిపే) ప్రజలు; బంట్లు= సేవకులు; కావునన్= కాబట్టి; తారు= తాము; ఆ+మహీపతికిన్= ఆరాజుకు; తీఱమి+కల్గిన, చోట్లన్+ఎల్లనున్= ఆపద (అక్కర) ఏర్పడిన అన్నితావుల్లో; తమపౌరుషంబులు= తమపరాక్రమాలు; నెఱపన్‌వలయున్= ప్రదర్శించాలి; కౌంతేయులు= కుంతీదేవి కుమారులు అయిన పాండవులు; నీదేశంబునన్+ఉండి= నీవు పరిపాలించే రాజ్యంలో నివసించి; నీ+ఆజ్ఞవలనన్= నీ ఆనతిచొప్పున; కృత+ఆరంభులు+ ఐ+ఉన్నవారు= చేయబడిన ప్రయత్నాలు కలవారు (నెరవేరిన పనులు కలవారు); అగుటన్+చేసి= అగుటచేత; వారు= ఆ పాండవులు; నీకింకరులు= నీసేవకులు; నీకున్+ఐన= నీకు ఏర్పడిన; అక్కఱ= అవసరాన్ని; తీర్చుట= నెరవేర్చుట; వారికిన్= ఆ పాండవులకు; అర్హకృత్యంబు= తగినపని; దీనికిన్= ఈవిధంగా జరిగినదానికి; ఇంత= ఇంత ఎక్కువగా, ఈవిధంగా; వనరన్+ఏల?= దుఃఖించటం ఎందుకు?; అదియునున్+కాక= అంత మాత్రమే కాక (పై చెప్పబడిన హేతువుకు అదనంగా); పాండవులు= పాండునందనులు; జూదంబునాఁడు+అ= ద్యూతం ఆడిన రోజే; నీకున్; దాసులు; ఐరి; తదీయంబులు+అయిన= వారి వైన; మణి, కనక+ఆది, వస్తువులును= రత్నాలు, బంగారాలు మున్నగు పదార్థాలు సయితం; భవత్+అధీనంబులు+ఐ= నీకు లోబడినవి అయి; ఉన్న+అవి= ఉన్నవి; వారు= ఆ పాండవులు; నిన్నున్, కొలచి+ఉండుట+ లేకుండెన్+ఏనియున్= నిన్ను నీ కొలువుకూటంలో సేవించి ఉండటం చేయకపోయినా; ఇంతటి= ఈవిధంగా ఉన్నటువంటి; కెలసంబు= పని; తీర్పన్+ఏనియున్, వలదే= చేయవద్దా (చేసి తీరవలెను); ఇది+అంతయున్= ఈవిషయాన్ని అంతటిని; ఊహించి= ఆలోచించి; వలవని= కూడని; వగలన్= దుఃఖాలలో, పొగులక= వెతచెందక; లెమ్ము= లేచి నిలబడుము (అనగా అజ్ఞానం వీడి మేలుకొని అనంతరం కర్తవ్యం నిర్వహించటానికి సంసిద్ధుడవు కమ్ము); పురంబునకున్= నగరానికి (హస్తినాపట్టణానికి); నడువుము= బయలుదేరుము; నామాటన్= నేను చెప్పిన పలుకులను; వినన్= ఆలకించక (అంగీకరించక); నిర్బంధ పరుండవు+ ఐతి+ ఏనియున్= బంధంలో చిక్కుకొన్నవాడవు అయితే; నిన్నున్= నిన్ను; ఏమి+అనన్‌వచ్చున్= ఏమనగలము?; ఇందరము= ఇంతమందిమి; నీపోయినగతిన్+అ= నీవు వెళ్లే మార్గంలోనే; పోవన్+కలవారము= వెడలగలవారం; నీవు= నీవు, ఓదుర్యోధనమహారాజా!; లోకంబుచేతన్= లోకంలోని అందరుప్రజలచేత; నగుఁబాటును, పొందెదవు= నవ్వుల పాలవుతావు; ఇంతియ= ఇంతే సుమా!; అని; కర్ణుండున్ చెప్పినన్; విని= ఆలకించి వెండియున్= మరల; ప్రాయోపవేశంబునందున్= నిరశనవ్రతదీక్షను పూనటంలోని; నిశ్చయంబు= నిర్ణయాన్ని; వదలక+ఉన్నన్= వీడక ఉండగా; కనుంగొని= గమనించి; శకుని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'నేను గంధర్వులచేత జయించబడటం ఒకవిధమైన పరాభవం. అంతకంటె శోచనీయమైనది నాశత్రువులు అయిన పాండవులచేత చెఱనుండి విడుదల చేయబడటం. ఇది ఇమ్మడి పరాభవం' అని అభిమానధనుడ వైన నీవు దుఃఖించటం ఆలోచిస్తే స్థూలదృష్టికి సరిఅయినదే కాని, సూక్ష్మదృష్టికి సరి అయినది కాదు. జ్ఞానానికి మూలం విచక్షణ. అసలు పాండవులు ఎవరు? వారు నీరాజ్యంలో సుఖంగా జీవిస్తున్న పౌరులు కదా! రాజుకు ఆపదవచ్చినప్పుడు తమప్రాణాలొడ్డి అయినా పౌరులు రాజుకు సేవ చేయాలికదా! పాండవులు నీసేవకులు. నీవు పాండవులకు ఏలిక అయిన సార్వభౌముడవు. పాండవులు నీరాజ్యంలో శాంతిభద్రతలను అనుభవిస్తూ నివసిస్తున్న సేవకులు. సేవకుల ధర్మం రాజరక్షణ. కాబట్టి వారు తమ ప్రభు ఋణం దీర్చుకొనటానికి నిన్ను విడిపించారు. ఇది వారికి అవశ్యకర్తవ్యం. అంతేగాక - జూదంలో నీకు ఓడిపోయిననాడే పాండవులు నీకు దాసులు. వారి ధనధాన్యసంపదలు పౌరుషప్రాభవాలు

అన్నియు నీసొత్తుకదా! అసలు పాండవులు నీకొలువుకూటంలోనే ఉండి నిత్యమూ నీకు సేవలు చేయవలసిన వారే. ఏదో అక్కర యేర్పడినపుడు ముందుకు వచ్చి నీకు సేవ చేసి తమస్వామిభక్తిని ప్రకటించి ధన్యులైనారు. ఈవిధంగా, సూక్ష్మదృష్టితో విచక్షణ చేసి నీప్రాయోపవేశ దీక్షను విరమించి, మునుముందు నిర్వహించవలసిన పనికి పూనుకొనుము. లేదేని లోకులు నిన్ను పరిహసిస్తారు' అని కర్ణుడు దుర్యోధనుడికి హితబోధ చేశాడు. కాని, దుర్యోధనుడు తన పట్టుదల వదలక, నిరశనవ్రతదీక్షను పూనటంలోనే స్థిరసంకల్పం కలవాడయ్యాడు. అప్పుడు శకుని దుర్యోధనుడితో ఈ విధంగా చెప్పాడు.

**క. 'కర్ణుని యాడిన మాటలు । నిర్ణయమున కింత యొప్పునే! యిప్పలుకుల్**
**కర్ణంబులఁ జొనుపుము; దుః । ఖార్ణవపారంబుఁ బొందు మవనీనాథా ! 31**

**ప్రతిపదార్థం:** అవనీనాథా!= భూమికి భర్తవైన రాజా! (ఓదుర్యోధనా!); కర్ణుని+ఆడినమాటలు= కర్ణుడు చెప్పిన పలుకులు; నిర్ణయమునకున్= కర్తవ్యాన్ని నిశ్చయించటానికి; ఇంత= ఈవిధంగా, ఇంతచక్కగా; ఒప్పునే!= సరిపడునా!; ఈ+పలుకుల్= ఈమాటలు; కర్ణంబులన్= చెవులలోకి; చొనుపుము= దూర్చుము; దుఃఖ+అర్ణవ, పారంబున్= శోకం అనెడి సముద్రపు అవ్వలిగట్టును; పొందుము= పడయుము, చేరుము.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనమహారాజా ! కర్ణుడు చక్కని చిక్కని హితబోధ నీకు చేశాడు. ఆతని మాటలు సందర్భశుద్ధి కలవి. విచక్షణ విజ్ఞానంతో కూడినట్టివి. ఆతడు చెప్పినట్లుగా ప్రవర్తించి, నీకు దాపురించిన దుఃఖ సముద్రంనుండి బయటపడు.

**విశేషం:** దుఃఖార్ణవము= దుఃఖం అనెడి అర్ణవము అలం: రూపకం.

**తరలము.**

**కడఁగి బుద్ధిబలంబునంద యకంటకంబుగఁ జేసి యేఁ**
**బుడమిరాజ్యము సర్వముం దగఁ బుచ్చి యిచ్చిన నిమ్ములం**
**గుడువ నేరక దీని నిచ్చటఁ గూలఁ దన్ని శరీరమున్**
**విడుతుఁ గా కని నిశ్చయించెదు వెఱ్ఱి వైతె నరేశ్వరా! 32**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వరా!= ప్రజలకు అధిపతి వైన ఓరాజా! దుర్యోధనా!; కడఁగి= పూని; బుద్ధిబలంబునందున్+అ= కేవలం తెలివితేటల మహిమచేత మాత్రమే; ఏన్= నేను; పుడమి రాజ్యమున్= భూమిరాజ్యాన్ని అకంటకంబుగన్+చేసి= శత్రువులులేని దానినిగా ఒనర్చి, సర్వమున్= సమస్తం (సర్వరాజ్యం); తగన్= ఒప్పునట్లుగా; పుచ్చి యిచ్చినన్= తీసి ఇవ్వగా; ఇమ్ములన్= సంప్రీతితో; కుడువన్నేరక= అనుభవించజాలక; దీనిన్; ఇచ్చటన్; కూలన్+తన్ని= పతనమయ్యేటట్లుగా కాలితో తాడించి; శరీరమున్= దేహాన్ని; విడుతున్+కాక+అని= విడిచిపెట్టుతాను సుమా అని; నిశ్చయించెదు= నిర్ణయిస్తున్నావు; వెఱ్ఱివి+ఐతి+ఎ= పిచ్చివాడవు అయినావా?.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా ! నీవు సాధారణమానవుడవు కావు; సార్వభౌముడవు. నీకర్తవ్యాన్ని గూర్చి జాగరూకతతో యోచించుము. నీకు ఈ భూమిరాజ్యాన్ని సమస్తాన్నీ కేవలం నాబుద్ధిబలంచేత (అనగా మాయాద్యూతమహిమచేత)

నీకు సంపాదించి ఇచ్చాను. నీవు నీబాహుబలంచేత సంపాదించింది కాదుకదా ఈ రాజ్యం. నీవు ఆర్జించినచో దానిని నీవు త్యజింప వచ్చునుగాని, నేను నీకు సంపాదించి ఇచ్చిన దానిని నీవు త్యజిస్తే నామనస్సు ఖేదపడుతుందికదా. నీవు కష్టపడి సంపాదించ నక్కరలేకుండా, సంక్రమించిన రాజ్యాన్ని హాయిగా అనుభవించకుండ ప్రాయోపవేశదీక్షతో ఆత్మహత్యకు పూనుకొనటం అవివేకం. నీకు పిచ్చి ఎక్కిందా ఏమిటి?

**విశేషం:** వృత్త లక్షణానికి చూడు. 4.402 విశేషాంశం.

**ఆ. నీకు వృద్ధసేవ లేకున్కి యిప్పుడు । నాకుఁ దెల్లమయ్యెఁ బ్రాకటముగఁ**
**గోపమును మనోనుతాపంబుఁ బొందుచో । ధీరుఁ డపుడ యడఁప నేరవలదె. 33**

**ప్రతిపదార్థం:** నీకున్= (ఓదుర్యోధనా) నీకు; వృద్ధసేవ= పెద్దలసేవ (పెద్దలకు పరిచర్యచేయుటం); లేక+ఉన్కి= లేకపోవటం; నాకున్= నాకు; ప్రాకటముగన్= సుస్పష్టంగా; తెల్లము+అయ్యెన్= తెలిసింది; ధీరుఁడు= ధైర్యం కలవాడు (జంకుగొంకులు లేక ఆపదలలో కలతచెందని మనస్సు కలిగి నిలువగలవాడు); కోపమును= ఆగ్రహాన్ని; మనస్+అనుతాపంబున్= చిత్తంలో ఏర్పడిన వ్యాకులతను; పొందుచోన్= అనుభవించేటప్పుడు; అపుడు+అ= అప్పుడే; అడఁపన్ నేరవలదె= అణచివేయవలదా (అణచివేయాలి సుమా).

**తాత్పర్యం:** నీలోని లోపాన్ని నేను కనిపెట్టాను. నీవు యువరాజుగా పుట్టి పెరిగిన ఆగర్భశ్రీమంతుడవు. నీవు పెద్దలకు పరిచర్య చేయలేదు. పెద్దలకు పరిచర్య చేయటంచేత లభించే వ్యావహారికజ్ఞానం వేరు. సిద్ధాంతాలను గూర్చిన శ్రుతపాండిత్యం వేరు. అప్పుడప్పుడు - కోపం రావచ్చును. మానసిక వ్యాకులత ఏర్పడవచ్చును. ధీరుడైనవాడు అట్టి వికారాలను వెనువెంటనే త్రుంచివేయాలి కాని వాటి వలన విహ్వలుడు కాగూడదు.

**విశేషం:** గ్రాంథిక జ్ఞానం చాలదు. "చదువు - అనుభవమ్ముసాటి గాదు". శ్రుతులు స్మృతులు భిన్నభిన్నమార్గాలు సూచిస్తాయి. ఎచ్చటను ఏకైకప్రమాణం కానరాదు. ఇక కర్తవ్యం నిర్ణయించడం ఎట్లా? పెద్దలు నడిచిన మార్గమే శరణ్యం. ఇది ప్రాచీనసంస్కృతిమర్యాద. "ధర్మము బహుమార్గ దృష్టంబు". మహాభారతంలో ధర్మవ్యాధుడి గాథలోని ప్రవచనం. ధర్మం గ్రాంథిక జ్ఞానంవలన తెలియనగును గాని 'ధర్మసూక్ష్మములు' - పెద్దల ప్రవర్తనల వల్లనే తేటతెల్లం ఔతాయి. మహాభారతం పంచమవేదం. ధర్మతత్త్వజ్ఞుల దృష్టిలో పలుతావులలో ధర్మశాస్త్రం. మహాభారతంలో పలుతావులలో సూక్ష్మప్రస్తావన ఉన్నది. దయ్యాలు వేదాలను వల్లెవేయవచ్చును. శకుని - మాయాద్యూతకారుడు. ధర్మపన్నాలను ఉదాహరించటానికి జంకలేదు.

**తే. పిఱికితనము నేమఱుటయు నొఱువతనము । మెత్తఁబాటును గార్యంబు నత్తెఱంగు**
**నేరమియు విషయంబులఁ గూరుటయును । గలుగు పతికి నుండదు సిరి దొలఁగి పోవు. 34**

**ప్రతిపదార్థం:** పిఱికితనమున్= భయపడే స్వభావమూ, ఏమఱుటయున్= మరపూ; ప్రమత్తతా; ఒఱువతనము= వికారత్వమున్నూ, మెత్తఁబాటును= మృదు స్వభావమున్నూ; కార్యంబు+ఆ+తెఱంగు, నేరమియున్= చేయవలసిన పనిని ఏవిధంగా చేయవలెనో ఆవిధం తెలియక పోవుటయున్నూ; విషయంబులన్= ఇంద్రియసుఖాలలో; కూరుటయును= తగులుకొనుటయును; కలుగు= ఉండే; పతికిన్= రాజుకు; సిరి= లక్ష్మి; తొలఁగిపోవున్= దూరమైపోతుంది.

**తాత్పర్యం:** భయపడేస్వభావం, ప్రమత్తత, వికారత్వం, మరీ మెత్తదనం, కర్తవ్యాలను నిర్వహించటంలో విచక్షణ లేకపోవటం మొదలైన లక్షణాలు కల రాజుకు సిరి తొలగిపోతుంది.

**వ. కావునఁ గార్యజ్ఞుండ వగుము; కార్యజ్ఞానం బెట్టి దనిన. 35**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; కార్యజ్ఞుండవు+అగుము= చేయవలసిన పనిని ఏవిధంగా చేయనగునో తెలిసినవాడవు కమ్ము; కార్యజ్ఞానంబు= కర్తవ్యాన్ని గూర్చిన తెలివిడి; ఎట్టిది+అనినన్= ఎటువంటిదంటే.

**తాత్పర్యం:** కావున నీవు చేయవలసిన పనిని ఏవిధంగా చేయవలెనో తెలిసికొన్న వాడవు కమ్ము. కర్తవ్యాన్ని గూర్చిన జ్ఞానం ఎటువంటిదంటే.

**ఉ. కౌరవనాథ! నీకు నుపకారము సేసిరి పాండవేయు ల**
**వ్వీరులయందు నెయ్యమును వేడ్కయు నొప్పఁగ నీ వభీష్టస**
**త్కారముసేఁత యుక్తమగుఁ గాక ప్రియంపడ నర్హమైనచో**
**దారుణశోకవహ్నిపరితాపముఁ బొందుట యిప్డు ధర్మువే? 36**

**ప్రతిపదార్థం:** కౌరవనాథ!= కౌరవులకు ప్రభువైనవాడా- ఓదుర్యోధనసార్వభౌమా!; పాండవేయులు= పాండురాజు కొడుకులు; నీకున్; ఉపకారము+చేసిరి= సాయం చేశారు; ఆ+వీరులయందున్= ఆ శూరులతో; నెయ్యమును= మైత్రియును; వేడ్కయున్= ఆనందమును; ఒప్పఁగన్= విలసిల్లగా; నీవు; అభీష్టసత్కారము+చేఁత= మిక్కిలిఇష్టమైన సమ్మానం చేయటం; యుక్తము+అగున్+ కాక= సరిపోలుతుంది గాక; ప్రియంపడన్= ఇష్టపడటానికి; అర్హము+ఐనచోన్= యోగ్యమైనచోట; దారుణ, శోక, వహ్ని, పరితాపమున్= భయంకరమైన దుఃఖం అనే అగ్నిలో పడిన ఆవేదనను; పొందుట= అనుభవించటం; ఇప్డు= ఇపుడు, ఈసమయంలో; ధర్మువే= ధర్మమా,- ధర్మం కాదుసుమా.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనమహారాజా! పాండునందనులు నీకు ఉపకారం చేసినమాట నిజం. నీవు వారికి ప్రత్యుపకారం చేయటం పాడి. వారిని సత్కరించుము. ప్రేమతో వారియెడ మైత్రి నెరపుము. అంతేకాని, సంతోషింపవలసినచోట నీవు ఘోరమైన దుఃఖమనే అగ్నిలో పడి వెతచెందటం సరైనపని కాదు సుమా!

**చ. కృతముఁ దలంచి చిత్తమునఁ గిల్బిషమంతయు నుజ్జగించి స**
**న్మతులఁ బృథాతనూజుల నమానుషతేజులఁ బిల్వఁ బంచి, త**
**త్పితృధన మైన రాజ్యము నభీష్టముగాఁ దగ నిమ్ము; నీకు నీ**
**క్షితివలయంబునం బరమకీర్తియుఁ బుణ్యముఁ గల్గు భూవరా! 37**

**ప్రతిపదార్థం:** భూవరా!= భూమికి భర్త అయిన రాజా, - దుర్యోధనా! చిత్తమునన్= మనస్సులోపల; కృతమున్+తలంచి= పాండవులు నీకొనర్చిన ఉపకారమును స్మరించి; కిల్బిషము+అంతయున్= పాపం సర్వమూ; ఉజ్జగించి= వదలిపెట్టి; సత్+మతులన్= మంచిబుద్ధి కలవారిని; పృథాతనూజులన్= కుంతియొక్క కొడుకులను, పాండవులను; అమానుష, తేజులన్= మనుజులకు అతీతమైన దివ్యమైన వర్చస్సు కలవారిని; పిల్వన్+పంచి= ఆహ్వానించటానికి ఆజ్ఞ నొసగి; తత్+పితృధనము+ఐన= వారల తండ్రికి సంబంధించిన సొత్తు అయిన; రాజ్యమున్= (పరిపాలనకు లోబడిన) దేశాన్ని; అభీష్టముగాన్= సంప్రీతితో; తగన్+ఇమ్ము= ఒప్పునట్లుగా ఒసంగుము; నీకున్= నీకు; ఈ క్షితివలయంబునన్= ఈ భూమండలంలో; కీర్తియున్= యశస్సు; పుణ్యమున్= సుకృతం; కల్గున్= లభిస్తుంది.

**తాత్పర్యం:** పాండవులు నీకు చేసిన మేలును గుర్తించి, నీమనస్సులో ఉన్న పాపాన్ని అంతటిని తుడిచి వేసి, వారిని ఆహ్వానించుము. కుంతీకుమారులు సజ్జనులు, లోకోత్తర పరాక్రమవంతులు, దివ్యతేజస్సు కలవారు, పాండవులకు పైతృకమైన రాజ్యాన్ని ఇచ్చి, సంప్రీతితో సమ్మానించుము. అప్పుడు నీకు ఈ భూమండలాలలో సాటిలేని కీర్తి, పుణ్యం లభించగలవు.

**క. వారలు నీతోఁబుట్టువు; । లీరాజ్యము మీరు వారు నేకం బై పెం**
**పారఁగ నేలుఁడు; దీనం । గౌరవకులనాథ ! సౌఖ్యగౌరవ మొందున్.' 38**

**ప్రతిపదార్థం:** కౌరవకులనాథ!= కౌరవవంశానికి అధినేత వైన ఓ దుర్యోధనా! వారలు= వారు (ఆపాండవులు); నీతోఁ బుట్టువులు= నీ సహోదరులు; ఈరాజ్యము= మీ పరిపాలనకు లోబడిన ఈ దేశం; మీరున్, వారున్= మీరున్నూ, వారున్నూ (కౌరవులు, పాండవులు); ఏకంబు+ఐ= ఐకమత్యంతో కూడినవారై; పెంపు+ఆరఁగన్= అభ్యుదయం కలిగేటట్లుగా; ఏలుఁడు= పరిపాలించుడు; దీనన్= దీనివలన (కౌరవపాండవులు) ఏకం కావటంచేత; సౌఖ్యగౌరవము+ఒందున్= అధిక సుఖం ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** కౌరవవంశానికి అధినేత వైన ఓ దుర్యోధనా! పాండవులు నీకు తోడబుట్టినవారు. మీరూ పాండవులూ ఐకమత్యం కలిగి ఈ రాజ్యాన్ని పరిపాలించండి. ఆ విధంగా చేస్తే మీ ఉభయులకూ సౌఖ్యం గొప్పతనం చేకూరుతాయి.

**వ. అని శకుని చెప్పుచుండ నగ్గాంధారీనందనుండు నిజచరణసమీపంబునం బడి యున్న దుశ్శాసనుం గ్రుచ్చి యెత్తి మూర్ధాఘ్రాణంబు సేసి కర్ణసౌబలులం జూచి 'మీ రేల నన్నుఁగారించెదరు? ధర్మైశ్వర్యధనభోగంబులందు నా కభిలాషంబు లేదు; ప్రాయోపవేశంబునందుఁ గృతనిశ్చయుండ నైతి; మీ రింక నొండు విఘ్నంబులు సేయక యూరక మీ వలయునెడకుం బొం' డనిన వారలు 'దేవా! నీవిధం బిట్టిద యయ్యె నేని మే మెందుఁ జేరెదము? నీతోడివారము కాక' యని; రంతం గమలహితుండు పశ్చిమాచల సమీపగతుం డగుటయు నన్నరనాథుండు సురలోకగమనకుతూహలి యై శుచిస్నానంబు సేసి వల్కలంబులు ధరియించి, సంధ్యాసమయ సముచితంబులగు కరణీయంబులు నిర్వర్తించి, వివిక్తదేశంబునందు దర్భాస్తరణంబున నాసీనుండై వాఙ్నియతుండై. 39**

**ప్రతిపదార్థం:** అని= అనుచు; శకుని; చెప్పుచున్+ఉండన్= వచిస్తూ ఉండగా; ఆ+గాంధారీనందనుండు= గాంధారి కొడుకు దుర్యోధనుడు; నిజ, చరణ, సమీపంబునన్= తనఅడుగులదగ్గర; పడి+ఉన్న= వ్రాలిఉన్న; దుశ్శాసనున్; గ్రుచ్చి+ఎత్తి= కౌగిలించుకొని లేవదీసి; మూర్ధ+ఆఘ్రాణంబు+చేసి= తలను వాసన చూచి; కర్ణసౌబలులన్= కర్ణుడిని మరియు శకునిని; చూచి= అరసి; మీరు= మీరు; ఏల= ఎందులకు; నన్నున్= నన్ను; కారించెదరు?= బాధిస్తారు?; ధర్మ+ఐశ్వర్య, ధన, భోగంబులందున్= ధర్మంలో సంపదలో ద్రవ్యంలో సౌఖ్యాలను అనుభవించటంలో; నాకున్ అభిలాషంబు= కోరిక; లేదు; ప్రాయోపవేశంబు నందున్= ఆహారం తీసికొనకుండా మరణించటంలో; కృత, నిశ్చయుండన్+ఐతిన్= చేయబడిన నిర్ణయం కలవాడను అయినాను (నిరాహారదీక్షపూనటానికి దృఢసంకల్పం వహించాను); మీరు= కర్ణ శకుని దుశ్శాసనాదులు ఇంకన్= ఇక, ఒండు= వేరు; విఘ్నంబులు= ఆటంకాలు; చేయక= సలుపక, ఊరక= మిన్నక; మీవలయు+ఎడకున్= మీకు ఇష్టమైన

చోటికి; పొండు= వెళ్లండి; అనినన్= అని చెప్పగా; వారలు= వారు (కర్ణశకుని దుశ్శాసనులు); దేవా!= ప్రభూ!; నీవిధంబు= నీ పద్ధతి; ఇట్టిది+అ= ఇది మాత్రమే (ప్రాయోపవేశమే); అయ్యెన్+ఏని= అయితే; మేము= మేము (కర్ణశకుని దుశ్శాసనాదులము); ఎందున్= ఎక్కడికి; చేరెదము= వెళ్ళుతాం; నీతోడివారము+అ, కాక= నీతోడనే సహగమనం చేసే వారం సుమా; అనిరి= అనిచెప్పారు; అంతన్= అంతట; కమలహితుండు= పద్మమిత్రుడు సూర్యుడు; పశ్చిమ+అచల, సమీప, గతుండు+అగుటయున్= పడమటికొండ దగ్గరకు వెళ్ళినవాడు కావటమున్నూ (అస్తమించుటయున్నూ); ఆ+నరనాథుండు= ఆరాజు- సుయోధనుడు; సురలోక గమన, కుతూహలి+ఐ= స్వర్గలోకానికి పోవటంలో వేడుకగలవాడై, (మరణించటానికి ఉద్యుక్తుడై); శుచిస్నానంబు+చేసి= పరిశుద్ధస్నానంచేసి; వల్కలంబులు= నారబట్టలు; ధరియించి= తాల్చి; సంధ్యా, సమయ, సముచితంబులు+అగు= సంజవేళల చేయదగినవి అయిన; కరణీయంబులు= విధులు; నిర్వర్తించి= చేసి; వివిక్త, దేశంబునందున్= ఏకాంతమైన స్థలంలో; దర్భ+ఆస్తరణంబునన్= దర్భలతో చేయబడిన చాపమీద; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడయి; వాక్+నియతుండు+ఐ= మౌనవ్రతం పూనినవాడై.

**తాత్పర్యం:** ఆవిధంగా శకుని అభిప్రాయం వివరించాడు. అంతట దుర్యోధనుడు తన పాదాలదగ్గర వ్రాలి కన్నీరు కారుస్తున్న తమ్ముడు దుశ్శాసనుడిని కౌగిట చేర్చి ఎత్తి శిరస్సును నిమిరి వాసన చూచి, కర్ణుడితో శకునితో, 'ఎందుకు మీరు నన్ను బాధిస్తున్నారు? నాకు ధర్మంపై కాని, సంపదపైకాని, ధనధాన్యాలపై కాని ఇష్టం లేదు. నిరాహారదీక్ష పూనుటకే నేను నిశ్చయించుకొన్నాను. ఇది నా దృఢసంకల్పం సుమా! నన్ను వారించకండి; మీరు మీఇష్టం వచ్చిన చోటికి పొండి' అని చెప్పాడు. అంతట వారు 'ప్రభూ! మేము నిన్ను విడిచి వేరేచోటికి పోజాలం. నీతోపాటు సహగమనం చేయగలం' అని బదులు పలికారు. అప్పుడు సూర్యుడు అస్తమించే వేళ అయింది. దుర్యోధనుడు స్వర్గలోకానికి వెళ్లటానికి నిశ్చయించుకొని స్నానం చేసి పవిత్రమైన దర్భలచాపమీద కూర్చొని, సంధ్యాసమయంలో చేయదగిన పనులు చేసి ఏకాంతప్రదేశంలో మౌనవ్రతం అవలంబించినవాడై.

**క. క్రమమున బాహ్యేంద్రియక । ర్మము లెల్లను వదల విడిచి మహిత సమాధి**
**క్రమదశ నుండె నివాత । స్తిమితంబై వెలుఁగుచున్న దీపము పోలెన్. 40**

**ప్రతిపదార్థం:** క్రమమునన్= వరుసగా; బాహ్య+ఇంద్రియ, కర్మములు+ఎల్లను= పైకి కనిపించే ఇంద్రియాలు చేసే పనులు అన్నిటిని; వదలన్ విడిచి= వీడునట్లుగా త్యజించి; మహిత, సమాధి క్రమదశన్= గొప్ప సమాధి స్థితిలో; నివాతస్తిమితంబు+ఐ= గాలి లేమిచే కదలకుండ ఉండునట్టిదై; వెలుఁగుచున్న= ప్రకాశిస్తున్న; దీపము, పోలెన్= జ్యోతివలె; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** నిరాహారదీక్షను పూనిన దుర్యోధనుడు క్రమక్రమంగా బాహ్యా లైన ఇంద్రియాలు చేసే క్రియలను ఉజ్జగించ గలిగాడు. గొప్ప 'సమాధి' స్థితిలో గాలి లేని చోట నిశ్చలంగా ప్రకాశిస్తున్న దీపంవలె వెలుగొందాడు.

**విశేషం:** 1. అలం : "ఉపమ". 2. బాహ్యేంద్రియాలు ఇవి పది. జ్ఞానేంద్రియాలు అయిదు- చక్షువు, త్వక్కు, శ్రోత్రం, జిహ్వ, ఘ్రాణం. కర్మేంద్రియాలు అయిదు- వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ. అంతరింద్రియం - మనస్సు. 3. సమాధి. యోగప్రస్థానంలో సమాధి చిట్టచివరి దశ. పతంజలి యోగసాధనను- అష్టాంగ మార్గంగా ప్రస్తరించాడు. 1. యమం. 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధారణ 7. ధ్యానం 8. సమాధి. చిత్తవృత్తి నిరోధం యోగం. చిత్తం బహుధాచంచలం. సమాధిలో చిత్తచాంచల్యం నశించి బుద్ధి స్థిరసౌదామని వలె భాసిస్తుంది. అది అలలు లేని కడలి. స్తిమిత మైన దీపకళిక.

ప్రాయోపవిష్టుండైన దుర్యోధనుని గృత్య పాతాళంబునకుఁ గొనిపోవుట (సం. 3-239-18)

**సీ. ఆ సమయమున ము న్నమరేంద్ర విజితు లై । యహిలోకమున నున్న యసురవరులు**
**ధృతరాష్ట్రనందను తెగువ యెఱింగి యా । త్మీయపక్షక్షయస్థితికి వగచి**
**యాతనిఁ బిలిపింప నప్పుడు శుక్రాదు । లైన భూసుర సమూహములచేత**
**వేల్మి వెట్టించిన వేగంబ యొక కృత్య । వెలువడి భీషణవికృతమూర్తి**

**ఆ. 'యేమి పనులు గలిగె నెఱిఁగింపుఁ' డనిన, వా । 'రిచటి కిపుడు కౌరవేంద్రు ననఘు**
**నుజ్జ్వలాంగు నా సుయోధనుఁ దెమ్ము, ప్రా । యోపవేశవృత్తి నున్నవాని. 41**

**ప్రతిపదార్థం:** ఆసమయమునన్= ఆకాలంలో, మున్ను= అంతకుపూర్వం; అమర+ఇంద్ర, విజితులు+ఐ= వేల్పుల దొర అయిన ఇంద్రుడిచేత ఓడించబడిన వారయి; అహిలోకమునన్+ఉన్న= పాతాళలోకంలో ఉన్న; అసుర, వరులు= రాక్షసశ్రేష్ఠులు; ధృతరాష్ట్రనందను, తెగువ= ధృతరాష్ట్రుడి కొడుకు (దుర్యోధనుడి) యొక్క సాహసాన్ని; ఎఱింగి= తెలిసికొని; ఆత్మీయ, పక్ష, క్షయస్థితికిన్= తమవర్గం యొక్క నాశనం ఏర్పడటానికి; వగచి= దుఃఖించి; ఆతనిన్= ఆతడిని (దుర్యోధనుడిని); పిలిపింపన్= ఆహ్వానించి రప్పించటం కొరకై; అప్పుడు= ఆ సమయంలో; శుక్ర+ఆదులు+ఐన= శుక్రుడు మొదలుగా గల; భూసుర, సమూహములచేతన్= బ్రాహ్మణుల సముదాయం చేత; వేల్మి+పెట్టించినన్= హోమం చేయించగా; వేగంబు+అ= శీఘ్రంగా; ఒక కృత్య= అభిచారక్రియవలన పుట్టిన భీషణ వికృతమూర్తి విశేషం; భీషణ మూర్తి= భయంకరమైన అంగవికారంతో కూడిన రూపంకల్గినది (కృత్య); వెలువడి= బయటపడి; ఏమి= ఎటువంటి; పనులు+కలిగెన్= కార్యాలు ఏర్పడ్డాయి; ఎఱిఁగింపుఁడు= తెలుపుడు; అనినన్= అని అడుగగా; వారు= ఆ రాక్షస నాయకులు; ఇచటికిన్= ఇక్కడకు (పాతాళలోకానికి); అనఘున్= పాపరహితుడైనవాడిని; కౌరవ+ఇంద్రున్= కౌరవులలో శ్రేష్ఠుడయిన వాడిని; ఉత్+జ్వల+అంగున్= ప్రకాశించే దేహం కలవాడిని; ఆ+సుయోధనున్= ఆ దుర్యోధనుడిని; ప్రాయోపవేశ వృత్తిన్+ఉన్నవానిన్= మృతినొందేదాకా నిరాహార వ్రతాన్ని పూనినవాడిని; తెమ్ము= తీసికొని రమ్ము.

**తాత్పర్యం:** దేవేంద్రుడిచేత ఓడించబడినవారై ఆ సమయంలో పాతాళలోకంలో ఉన్న రాక్షసనాయకులు ధృతరాష్ట్రుడి కొడుకు అయిన దుర్యోధనుడు సాహసించి నిరాహారదీక్షను పూనిన సంగతి తెలిసికొని తమ వర్గం క్షయం చెందుతున్నదని దుఃఖించారు. అంతట వారు పాతాళహోమాన్ని చేయసంకల్పించి, శుక్రుడు మున్నగువారిచేత 'వేల్మి' పెట్టించారు. ఆ అభిచారహోమకుండం నుండి 'కృత్య' - భయంకర స్వరూపంతో ఆవిర్భవించి, 'నేను చేయవలసిన పనిని తెలపండి' అని అర్థించింది. అంతట రాక్షసశ్రేష్ఠులు- ఆమరణ నిరాహారదీక్షను పూనిన దుర్యోధనుడిని పాతాళలోకానికి తెమ్మని ఆ కృత్యను నియోగించారు.

**వ. అని పనిచినం గృత్యయు నాక్షణంబ చని ప్రాయోపవిష్టుండై యున్న దుర్యోధను గ్రుచ్చి యెత్తికొని రసాతలం బునకుం దెచ్చి, దైత్యులకు సమర్పించినం, బ్రీతులై వారు వానిం గౌఁగిలించుకొని కుశలం బడిగి, యిట్లనిరి: 'అయ్యా! నీవు శూరుండవు. శూరజన రక్షితుండవు, భరతకులోద్వహుండ; విట్టి సాహసం బేల చేసితివి? మఱి యాత్మఘాతుకునకు లోకంబున నిందయు, హీనతయు, దుర్గతియుం బ్రాపించు; లోకవిరుద్ధంబు లై మూల ఘాతంబు లైన కార్యంబులయందు నీయట్టి బుద్ధిమంతులు ప్రవర్తిల్లుదురే? యట్లుగావున, నీ వఖిల ధర్మార్థయశోభోగనాశం బైన యీదుర్విచారంబు విడువుము; ధైర్యంబును బ్రతాపంబును బాటింపుము;**

**శత్రుజనభంజనంబు సేయుము; నీవు మనుష్యమాత్రుండవు గావు; నీపూర్వజన్మప్రకారంబు సెప్పెద; మాకర్ణింపుము. 42**

**ప్రతిపదార్థం:** అని పనిచినన్= అని నియోగించగా; కృత్యయున్= కృత్యయును; ఆ క్షణంబు+అ= ఆ నిమేషమందే; చని= వెడలి; ప్రాయోపవిష్టుండు+ఐ+ఉన్న= నిరాహారదీక్షను వహించి ఉన్న; దుర్యోధనున్= సుయోధనుడిని; గ్రుచ్చి+ఎత్తికొని= కౌగిలించుకొని పైకెత్తి పట్టుకొని; రసాతలంబునకున్= పాతాళలోకానికి; తెచ్చి= తీసికొనివచ్చి; దైత్యులకున్= రాక్షసులకు; సమర్పించినన్= సాదరంగా ఇవ్వగా; ప్రీతులు+ఐ= సంతుష్టిచెందిన వారయి; వారు= ఆరాక్షసులు; వానిన్= దుర్యోధనుడిని; కౌఁగిలించుకొని= అక్కున చేర్చి; కుశలంబు+అడిగి= యోగక్షేమాలనుగూర్చి ప్రశ్నించి; ఇట్లు+అనిరి= ఈవిధంగా అన్నారు; అయ్యా!= ఆర్యా! (పూజించతగినవాడా!); నీవు; శూరుండవు= వీరుడవు; శూర, జన, రక్షితుండవు= వీరులైన వారిచేత కాపాడబడేవాడవు; భరత, కుల+ఉత్+వహుండవు= భరతవంశాన్ని ఉద్ధరించేవాడవు; ఇట్టి= ఇటువంటి; సాహసంబు= తెగువ; ఏల= ఎందుకు; చేసితివి= ఒనరించావు; మఱి= అంతియకాక; ఆత్మ, ఘాతుకునకున్= తనను తాను చంపుకొనేవాడికి; లోకంబునన్= ప్రపంచంలో; నిందయున్= అపవాదున్నూ; హీనతయున్= కొంచెపాటున్నూ; దుర్గతియున్= చెడ్డతెరువును; ప్రాపించున్= సంభవిస్తాయి; లోకవిరుద్ధంబులు+ఐ= ప్రపంచానికి వ్యతిరేకాలు అయి; మూల ఘాతంబులు+ఐన= ఆధారాలకే నష్టంవాటిల్లచేసేవి అయిన; కార్యంబుల+అందున్= పనులలో; నీ+అట్టి, బుద్ధిమంతులు= నీవంటి ఆలోచనపరులు ప్రవర్తిల్లుదురే= నడచెదరా; అట్లు+కావునన్= అందుచేత; నీవు; అఖిల, ధర్మ+అర్థ, యశస్+భోగ, నాశంబు+ఐన= సమస్తమైన ధర్మాలకు, సంపదలకు, కీర్తికి, సౌఖ్యానుభూతులకు నష్టం వాటిల్లచేసేది అయిన; ఈ, దుర్+విచారంబున్= ఈ చెడుయోచనను; విడువుము= వదలిపెట్టుము; ధైర్యంబును= స్థిరమైన చిత్తానికి సంబంధించిన నిలుకడయును; ప్రతాపంబును= శౌర్యాన్ని; పాటింపుము= అనుసరించుము; శత్రు, జన, భంజనంబు+చేయుము= విరోధులైన వారిని ఓడించుము; నీవు= నీవు (ఓ దుర్యోధనా నీవు); మనుష్యమాత్రుండవు= కేవలం మనుజుడవుమాత్రం; కావు; నీపూర్వజన్మప్రకారంబు= నీవెనుకటి పుట్టుకకు సంబంధించిన వృత్తాంతం; చెప్పెదము= వచిస్తాం; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అని చెప్పి రాక్షసులు కృత్యను నియోగించారు. కృత్య ఆక్షణమే బయలుదేరి భూలోకానికి పోయి అక్కడ నిరాహారదీక్షలో ఉన్న దుర్యోధనుడిని కౌగిలించుకొని ఎత్తికొని మరల పాతాళలోకానికి వచ్చి రాక్షసులకు ఆతడిని సమర్పించింది. అంతట ఆ రాక్షసులు సంతసించి, ప్రీతిపూర్వకంగా దుర్యోధనుడిని మన్నించి ఆతడి యోగక్షేమాల నడిగి తెలిసికొని ఇట్లా పలికారు. 'అయ్యా! దుర్యోధనా! నీవు వీరుడవు. మహావీరులచేత కొలువబడుతున్నవాడవు; భరతవంశాన్ని ఉద్ధరించటానికి పుట్టినవాడివి. నీవు ఇటువంటి సాహసం ఎందుకు చేశావు? పిరికితనంతో ఆత్మహత్యకు పూనుకొన్నావు. ఆత్మహత్య చేసికొనేవాడికి ఈ ప్రపంచంలో అపకీర్తి దాపురిస్తుంది. దుర్గతి ప్రాప్తిస్తుంది. అతడిని అందరు హీనుడిగా పరిగణిస్తారు. నీవంటి మేధావులు లోకంలో అసహజంగా ఎంచబడే ప్రవర్తనకు లోనౌతారా? ధర్మాన్ని అర్థాన్ని సర్వసౌఖ్యానుభూతులను నాశం చేసే ఈ చెడుయోచన నీకు ఎట్లా కలిగింది? ఈ దురాలోచన వదలిపెట్టుము. ధైర్యంతో, శౌర్యంతో విజృంభించి శత్రువులను నాశనంచేయుము. నీవు సాధారణమనుష్యుడవు కావు. నీపూర్వజన్మవృత్తాంతం వివరించి చెప్తుతాం. వినుము. నీవు ఎంతటి గొప్పవాడవో నీకే తెలుస్తుంది.

**ఉ. ఏము తపంబు సేసి పరమేశ్వరు నీశ్వరుఁ బార్వతీమనః**
**కాముకుఁ గామవైరి నవికారుఁ బురాంతకుఁ బ్రీతుఁ జేసినం**

**గామితదాయి యైన శితికంఠుఁడు నిన్ను సృజించి యిచ్చె ను**
**ద్దామదయావిధేయుఁడు ముదంబున మాకు నధీశ్వరుండుగన్.** **43**

**ప్రతిపదార్థం:** ఏము= మేము (రాక్షసులం); తపంబు+చేసి= తపస్సు ఒనర్చి; పరమ+ఈశ్వరున్= మహాదేవుడిని; ఈశ్వరున్= శివుడిని; పార్వతీ, మనస్+కాముకున్= పార్వతీదేవియొక్క మనస్సును చూరగొనినవాడిని; కామ వైరిన్= మన్మథుడికి శత్రువును- శివుడిని; అవికారున్= మార్పు లేని వాడిని- పుర+అంతకున్= త్రిపురాలను నాశనం చేసినవాడిని; ప్రీతున్+చేసినన్= సంతృప్తి చెందిన వాడినిగా ఒనరించగా; కామితదాయి+ఐన= కోరికలను ఇచ్చేవాడైన; శితికంఠుఁడు= నల్లని కంఠం కలవాడు- శివుడు; నిన్నున్= దుర్యోధనా! నిన్ను; ఉద్దామ, దయా, విధేయుఁడు= గొప్ప దైన కరుణకు లోబడిన వాడు- శివుడు; ముదంబునన్= సంతోషంతో; మాకున్= రాక్షసులమైన మాకు; అధీశ్వరుండుగన్= అధినేతగా; సృజించి= సృష్టించి; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! రాక్షసుల మైన మేము పరమేశ్వరుడినిగూర్చి గొప్పతపస్సు చేశాం. ఆ పరమశివుడు పార్వతీదేవిమనస్సును చూరగొనిన మహానుభావుడు, మన్మథుడిని దహించిన మహిమాన్వితుడు, త్రిపురాలను భస్మం చేసిన వీరుడు, కోరినవరాలను ఒసగు నట్టి దేవదేవుడు ఆ మహాదేవుడు. మా తపస్సును మెచ్చుకొని, మిక్కుటమైన కరుణతో నిన్ను సృష్టించి మాకు అధినేతగా ప్రసాదించాడు.

**విశేషం:** 1. శివుడు పార్వతిని పెండ్లాడటం 2. శివుడు మన్మథుడిని దహించటం 3. శివుడు త్రిపురాలను భస్మం చేయటం సుప్రసిద్ధ పౌరాణిక గాథలు.

**ఉ. నీదగు పూర్వదేహము వినిర్మలవజ్రశిలావిశేష సం**
**పాదిత మస్త్రశస్త్రపరిపాటనభేద్యము గాదు, నిత్యనిః**
**ఖేదము పుష్పకోమలము ఖేచర భూచరకామినీమనో**
**హ్లాదన; మిట్లుగా నభవుఁ డర్థి నొనర్చె నుమాసమేతుఁడై.** **44**

**ప్రతిపదార్థం:** నీదగు= నీది+అగు; నీయొక్క; పూర్వదేహము= శరీరంలోని మొదటిభాగం (శిరస్సునుండి బొడ్డువరకు ఉన్నభాగం); వినిర్మల, వజ్ర, శిలా, విశేష, సంపాదితము= స్వచ్ఛ మైన వజ్రాలతో, గొప్పపాషాణాలతో సమకూర్చబడింది; అస్త్ర, శస్త్ర, పరిపాటనభేద్యముకాదు= మంత్రమహిమ గల ఆయుధాలతోను, ఆయుధాలతో ఖండింప శక్యమైనది కాదు; నిత్యనిః +ఖేదము= ఎల్లప్పుడును ఆనందతన్మయత్వంతో కూడి ఉండేది; పుష్పకోమలము= పూలవలె సుకుమార మైనది; ఖేచర; భూచరకామినీ, మనోహ్లాదనము= (ఖే,చర, భూ, చర, కామినీ, మనస్+హ్లాదనము)= ఆకాశంలో చరించే దేవతాస్త్రీలకు భూమిలోని స్త్రీలకు మనస్సుకు సంతోషం కలిగించేది; ఇట్లు+కాన్= ఈవిధంగా ఉండేటట్లుగా; అభవుఁడు= శివుడు; ఉమాసమేతుఁ డు+ఐ= పార్వతీదేవితో కూడినవాడై; అర్థిన్= ప్రీతితో; ఒనర్చెన్= చేశాడు.

**తాత్పర్యం:** నీశరీరం అమానుషం. పరమశివుడు పార్వతీదేవితో కూడిన వాడై నీశరీరాన్ని ప్రత్యేకలక్షణాలతో నిర్మించాడు. నీ శరీరంలోని పూర్వభాగం స్వచ్ఛమైన వజ్రశిలతో ఏర్పరచబడింది. అస్త్రాలు గాని శస్త్రాలుగాని నీశరీరాన్ని ఖండించలేవు. నీ శరీరం నిత్యసమ్మోదంతో దేవతాస్త్రీలకు, మానవవనితలకు మానసికోల్లాసం కల్గించేది; పుష్పసౌకుమార్యం కలది.

ఉ. నీవు ధరిత్రిఁ బుట్టుటయు నీకు సహాయము చేయఁ గోరి నా
నావిధ దైత్యదానవగణంబులు రాజకులంబులందు స
ద్భావన నుద్భవించెఁ బటుబాహులు దివ్యమహాస్త్రకోవిదుల్
ద్రావితవైరు లుర్వి భగదత్తపురస్సరు లైన వీరులై. 45

**ప్రతిపదార్థం:** నీవు= ఓదుర్యోధనా! నీవు; ధరిత్రిన్= భూమిలో; పుట్టుటయున్= జన్మించగా; నీకున్; సహాయము= సాయం; చేయన్+కోరి= చేయతలపోసి; నానా, విధ, దైత్య, దానవ, గణంబులు= పెక్కురకాలైన రాక్షససమూహాలు; రాజకులంబులందున్= క్షత్రియవంశాలలో; సత్+భావనన్= మంచి ఆలోచనతో; పటుబాహులు= గొప్ప పరాక్రమం కలవారు; దివ్య, మహా+అస్త్ర, కోవిదుల్= దేవతామహిమ కల గొప్ప మంత్రపూరితమైన ఆయుధాలను ఎరిగినవారు; ద్రావిత, వైరులు= తరుమగొట్టబడిన శత్రువులు కలవారు (శత్రువులను ఓడించగలవారు); భగదత్త, పురస్సరులు+ఐన వీరులు+ఐ= భగదత్తుడు మొదలుగా గల శూరులు అయి; ఉర్విన్= భూమిపై; ఉద్భవించెన్= జన్మించారు.

**తాత్పర్యం:** నీవు కారణజన్ముడ వై భూలోకంలో అవతరించటంతోడనే, నీకు సాయం చేయటానికి రాక్షసులు పెక్కు తెగలకు చెందినవారు అందరు క్షత్రియవంశాలలో జన్మించారు. ఆ రాక్షస వీరులు గొప్ప పరాక్రమవంతులు. దివ్యాలైన అస్త్రాలు శస్త్రాలు ప్రయోగించే నేర్పరులు. శత్రువులను పారద్రోలగలిగినవారు. వారే భగదత్తుడు మున్నగువారు.

**విశేషం:** దైత్యులు= దితిసంతతివారు. దానవులు= దనువుసంతతివారు.

వ. భీష్మద్రోణకృపాదులు గొందఱు దేవాంశసంభవులైనను దదీయభావంబులు రాక్షసావేశంబు నొందెడు; దానంజేసి వారు నిర్దయులై విమూఢులుంబోలె నన్యోన్య పరుషంబులు వలుకుచు నలుక మిగులం బుత్త్ర పౌత్త్రమిత్త్రభ్రాతృ శిష్యగురుబాలవృద్ధజనభేదంబులు విచారింపక సమరంబు సేసి దివ్యంబులు మానుషంబులు నైన వివిధాస్త్ర శస్త్రంబులఁ బాండవపక్షక్షయంబు గావింపం గలవారు; పాండవులు బంధుస్నేహంబు విడిచి తెగువకుం జొచ్చి నీచేత నిహతు లగుదురు; నీమనంబున బీభత్సువలని భయంబు గొంత గలదు; దాని నెఱింగి యేమునుం దగు నుపాయంబు దలంచితి; మది యెట్లనినఁ గృష్ణుచేతం జచ్చిన నరకాసురునంశంబు గర్ణు నావేశింపం గల యది; తత్కారణంబునం గృష్ణార్జునులతోడ బద్ధవైరుండై యవ్వీరుండు నిజదివ్యాస్త్రంబులం గృష్ణుల నిద్దఱ నిర్దహించు; నివ్విధం బెఱింగి యింద్రుండు పాండవ రక్షణార్థంబు వచ్చి కర్ణుకవచకుండలంబులు గపట రూపంబున నపహరింపం గలవాఁడు; మఱియును. 46

**ప్రతిపదార్థం:** భీష్మ, ద్రోణ, కృప+ఆదులు= భీష్ముడు ద్రోణుడు కృపుడు మొదలైన; కొందఱు= కొంతమంది; దేవ+అంశ, సంభవులు+ఐనను= దేవతలయొక్క మహిమలో పాలు పంచుకొని పుట్టినవారే అయినను; తదీయ భావంబులు= వారియొక్క అభిప్రాయాలు; రాక్షస+ఆవేశంబున్= రక్కసులయొక్క వేగిరపాటును; ఒందెడున్= పొందుతాయి; దానన్+చేసి= అది కారణంగా; వారు; నిర్దయులు+ఐ= దయలేనివారై; అన్యోన్య పరుషంబులు= ఒకరినిగూర్చి ఇంకొకరు కఠినపదాలు; పలుకుచున్= మాటాడుతూ; అలుక, మిగులన్= కోపం అతిశయించగా; పుత్త్ర, పౌత్త్ర, మిత్త్ర, భ్రాతృ, శిష్య, గురు, బాల, వృద్ధజన, భేదంబులు= కొడుకులు, మనుమలు, స్నేహితులు, సోదరులు, తమదగ్గర చదువుకొనేవారు, ఉపాధ్యాయులు, బాలురు, ముసలివారు అనే తేడాలను; విచారింపక= ఆలోచించక; సమరంబు+చేసి= యుద్ధంచేసి; దివ్యంబులు= దేవతామహిమ

కలవియున్నూ; మానుషంబులును+ఐన= మనుజులశక్తికి అనువైనవీ అయిన; వివిధ+అస్త్ర, శస్త్రంబులన్= పెక్కు మంత్రాయుధాలచేత, ఆయుధాలచేత; పాండవ, పక్ష, క్షయంబు= పాండవవర్గంవారి నాశనాన్ని; కావింపన్+కలవారు= చేస్తారు; పాండవులు; బంధు స్నేహంబు= చుట్టాలపై ఉండే నెయ్యం; విడిచి= వదలిపెట్టి; తెగువకున్+చొచ్చి= సాహసానికి పూని; నీచేతన్= ఓదుర్యోధనా! నీచేత; నిహతులు+అగుదురు= చంపబడతారు; నీమనంబునన్= నీచిత్తంలో; బీభత్సువలనిభయంబు= అర్జునుడిని గూర్చిన వెరపు; కొంత= కొంచెం; కలదు= ఉన్నది; దానిన్; ఎఱింగి= తెలిసికొని; ఏమునున్= మేముకూడా; తగు= సరిపడెడి; ఉపాయంబు= వెరవు; తలంచితిమి= ఆలోచించాం; అది= ఆ ఉపాయం; ఎట్లు+అనినన్= ఏవిధమైనది, అంటే; కృష్ణుచేతన్+చచ్చిన= శ్రీకృష్ణుడిచేత సంహరించబడిన; నరక+అసురు+అంశంబు= నరకుడు అనే రాక్షసుడి వ్యక్తిత్వమహిమ; కర్ణున్= కర్ణుడిని; ఆవేశింపన్+కల+అది= పూనగలదు; తత్+కారణంబునన్= ఆ హేతువువలన; కృష్ణ+అర్జునులతోడన్; బద్ధవైరుండు+ఐ= గాఢంగా ఏర్పడిన శత్రుత్వం కలవాడై; ఆ+వీరుండు= ఆశూరుడు; నిజ, దివ్య+అస్త్రంబులన్= తన వైన దేవతామహిమ గల ఆయుధాలచేత; కృష్ణులన్+ఇద్దఱన్= ఇరువురు కృష్ణులను (శ్రీకృష్ణుడిని అర్జునుడిని); నిర్దహించున్= కాల్చివేస్తాడు; ఈ+విధంబున్= ఈ తీరును; ఎఱింగి= తెలిసికొని; ఇంద్రుండు; పాండవ రక్షణ+అర్థంబు= ఆ పాండునందనులను కాపాడటంకొఱకై; కర్ణుకవచకుండలంబులు= కర్ణుడియొక్క మైమరువును, కుండలాలను; కపటరూపంబునన్= మాయావియై; అపహరింపన్+కలవాఁడు= వంచనతో సంపాదించగలడు; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** భీష్ముడు ద్రోణుడు కృపుడు మున్నగువారు దేవతలమహిమలు పంచుకొని జన్మించిన మహానుభావులే కాని వారి చిత్తవృత్తులపై రాక్షసులప్రభావం ప్రసరించటంచేత వారు క్రూరులై ఒకరినొకరు నిందించికొంటూ బుద్ధిహీనులవలె ప్రవర్తించి, కొడుకులు మనుమలు స్నేహితులు సోదరులు శిష్యులు గురువులు, పిన్నలు, పెద్దలు అనే విచక్షణ లేకుండా యుద్ధంచేసి పాండవపక్షంపై దేవతామహిమ గల ఆయుధాలు ప్రయోగించి వారి సేనలను నాశనం చేస్తారు. పాండవులు చుట్టరికం మరచి దుస్సాహసంతో నీపై యుద్ధం చేసి మరణిస్తారు. నీ చిత్తంలో అర్జునుడిపై కొంతభీతి ఉన్నది. ఆవిషయం మాకు తెలుసు. దానికి ఒక మంచి విరుగుడు ఆలోచించాం. శ్రీకృష్ణుడిచేత నరకాసురుడు సంహరించబడ్డాడు గదా. ఆ నరకుడి అంశ కర్ణుడి ఆత్మీయతలో ప్రవేశించగలదు. అప్పుడు కర్ణుడు ఇనుమడించిన మహిమతో ఇద్దరు కృష్ణులను (శ్రీకృష్ణుడిని అర్జునుడిని) దహించగలడు. ఇంద్రుడు పాండవులను కాపాడటం కొరకై కర్ణుడిని మోసగించి, అతడి సహజ కవచకుండలాలను అపహరించగలడు. దీనివలన తనకొడుకు అయిన అర్జునుడు కర్ణుడికి తీసికట్టు అని దేవేంద్రుడు భయపడినట్లే తేలుతున్నదిగదా! ఇంకను మేము వివరించి చెప్పేది సావధానంగా వినుము.

**క. క్షితి సంశప్తకు లనఁగా । శతలక్షసహస్రసంఖ్య జనియించిరి ద**
**ర్పితులై దనుజులు దద్బల । తతిచే సమరమున నింద్రతనయుఁడు సిక్కున్. 47**

**ప్రతిపదార్థం:** దనుజులు= రాక్షసులు; క్షితిన్= భూమిపై; సంశప్తకులు+అనఁగాన్= ప్రతిజ్ఞ చేసి యుద్ధంనుండి మరలక విజయమో వీరస్వర్గమో చూరగొనెడి వీరులు అని పేరొందగా; శతలక్షసహస్రసంఖ్యన్= వందలక్షలవేల లెక్కలో; దర్పితులు+ఐ= గర్వం కలవారై; జనియించిరి= పుట్టారు; తత్+బల, తతిచేన్= ఆ సేనల సముదాయంచేత; సమరమునన్= యుద్ధంలో; ఇంద్రతనయుఁడు= ఇంద్రుడి కొడుకు, అర్జునుడు; చిక్కున్= దొరికిపోతాడు.

**తాత్పర్యం:** భూలోకంలో లక్షలు కోట్లకొలది వీరులు రాక్షసులు సంశప్తకులు అనే పేరుకలవారు జన్మించారు. వారు గొప్ప గర్వం కలవారు. వారు రణరంగంలో వెనుకంజవేయని వీరులు. 'విజయమో వీరస్వర్గమో' చూరగొనటానికై శపథంచేసి పోరాడే ధీరులు వారు. ఆ సంశప్తకులచేత అర్జునుడు ఓడించబడతాడు.

**తరలము.**

**నిహతకంటక మైన యిద్ధరణీతలం బఖిలంబు నీ**
**మహితశాసనగోచరం బగు మానవేంద్ర! ప్రసన్నతా**
**మహిమ నొందుము, నీవ తేపవు మాకు నందఱకుం; గురూ**
**ద్వహ! విషాదము వొందఁ బాడియె దైత్యపక్షభయంబుగన్? 48**

**ప్రతిపదార్థం:** మానవ+ఇంద్ర!= మనుజులలో ఇంద్రుడివంటి వాడవయిన ఓరాజా! దుర్యోధనా!; నిహత కంటకము+ఐన= చంపబడిన శత్రువులు కలది అయిన; ఈ+ధరణీతలంబు= ఈభూమండలం; అఖిలంబున్= సమస్తం; నీ మహిత శాసనగోచరంబు+అగున్= నీయొక్క గొప్ప దైన పరిపాలనకు లోబడుతుంది; ప్రసన్నతా, మహిమన్+ఒందుము= గొప్ప అనుగ్రహం కలవాడవు అగుము; నీవు+అ= నీవే; మాకున్+అందఱకున్= మా అందరికిన్నీ; తేపవు= తెప్పవు- అవ్వలిదరి చేర్చే పడవవు; కురు+ఉద్వహ!= కురువంశాన్ని ఉద్ధరించేవాడా, ఓదుర్యోధనా!; దైత్య, పక్ష, భయంబుగన్= రాక్షసులవర్గం భీతిచెందేటట్లుగా; విషాదము= దుఃఖం; పొందన్= అనుభవించగా; పాడియే?= న్యాయమా? (న్యాయం కాదు).

**తాత్పర్యం:** కురువంశాన్ని ఉద్ధరించే ఓ దుర్యోధనమహారాజా! ఎట్టి ఆటంకాలున్నూ లేని ఈభూమండలం సమస్తం నీ పరిపాలనలోకి వస్తుంది. నీవు ఏకచ్ఛత్రాధిపతి వై ఏలుకొనుము. మాయందు దయ చూపుము. నీవే మాకందరకు తెప్పవంటి వాడివి. రాక్షసులపక్షం దైన్యం చెందేటట్లుగా నీవు దుఃఖించటం న్యాయం కాదు.

**విశేషం:** వృత్తలక్షణానికి చూడు- 4.402 విశేషాంశం.

**మ. చను; మిం కొండు దలంపు మాను' మని యాశ్వాసించి వానిం బునః**
**పునరాలింగన మాచరించి యెలమిం బూజించి, దైత్యోత్తముల్**
**జననాథోత్తము వీడు కొల్పిరి; తదాజ్ఞం జేసి యాకృత్యయున్**
**మును దాఁ దెచ్చిన చోటఁ బెట్టె నధిపున్ మోదంబు సంధిల్లఁగన్. 49**

**ప్రతిపదార్థం:** చనుము= వెళ్లుము; ఇంకన్+ఒండు= వేరొక; తలంపు= ఆలోచన; మానుము= వదలుము; అని= అని చెప్పి; ఆశ్వాసించి= ఊరడించి; వానిన్= వానిని (దుర్యోధనుడిని); పునః+పునః+ఆలింగనము= మాటికి మాటికీ కౌగిలించుకొనుట; ఆచరించి= చేసి; ఎలమిన్= సంతోషంతో; పూజించి= ఆరాధించి; దైత్య+ఉత్తముల్= రాక్షసులలో శ్రేష్ఠులు; జన, నాథ+ఉత్తమున్= రాజులలో శ్రేష్ఠుడు అయిన వాడిని (దుర్యోధనుడిని); వీడుకొల్పిరి= మర్యాదపూర్వకంగా సెలవిచ్చి పంపారు; తత్+ఆజ్ఞన్+చేసి= వారి యొక్క (రాక్షసులయొక్క) ఆనతిచొప్పున; ఆ+కృత్యయున్= కృత్యకూడా; మును= లోగడ; తాన్= తాను; తెచ్చినచోటన్= (ఎచటినుండి దుర్యోధనుడినితెచ్చిందో) ఆస్థలంలోనే; మోదంబు= సంతోషం; సంధిల్లఁగన్= విలసిల్లేటట్లు; అధిపున్= రాజును (దుర్యోధనమహారాజును); పెట్టెన్= ఉంచింది

**తాత్పర్యం:** ఆ రాక్షసనాయకులు దుర్యోధనుడిని సమ్మానించి పలుమారులు కౌగిలించుకొని ఆదరంతో, 'ఓదుర్యోధన మహారాజా! నీవు వేరొక ఆలోచన నీమనస్సులోనికి రానీయవద్దు. నీకు విజయం సిద్ధిస్తుంది' అని ఊరడించి పలికి, అతడిని వీడ్కొలిపారు. ఆ రాక్షసులఆజ్ఞచొప్పున ఆ కృత్య దుర్యోధనమహారాజును తాను తెచ్చిన స్థలానికి గొంపోయి సంతోషం కలిగేటట్లు విడిచిపెట్టింది.

**ఉ. అంత సుయోధనుండు హృదయంబున విస్మయ మంది యంత వృ**
**త్తాంతము స్వప్నవృత్తము క్రియం దలపోసి నిజంబ కాఁగ న**
**త్యంతము నిశ్చయించుచుఁ బృథాసుతులన్ సమరంబులోన ని**
**ర్జింతున కాక యంచు వికసిల్లె దురాశయ భగ్నబుద్ధియై. 50**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట; సుయోధనుండు= దుర్యోధనుడు; హృదయంబునన్= డెందంలో; విస్మయము+అంది= అచ్చెరువునంది; అంత, వృత్తాంతము= జరిగింది అంతయు; స్వప్న, వృత్తము క్రియన్= కలలో జరిగిన సంగతివలె; తలపోసి= తలచి; నిజంబు+అ+కాఁగన్= సత్యంగా జరిగినట్లుగనే; అత్యంతమున్= మిక్కుటంగా; నిశ్చయించుచున్= నిర్ణయిస్తూ; సమరంబులోనన్= యుద్ధంలో; పృథాసుతులన్= కుంతి కొడుకులను- పాండవులను; నిర్జింతును+కాక+అంచున్= జయిస్తాను సుమా అని తలపోస్తూ; దురాశయ, భగ్న, బుద్ధి+ఐ= చెడుకోరికచేత ఖండించబడిన మనస్సు కలవాడై; వికసిల్లెన్= ఒప్పారాడు.

**తాత్పర్యం:** పిమ్మట దుర్యోధనుడు మనసులో ఆశ్చర్యపడ్డాడు. జరిగినదంతా కలయా నిజమా అని తర్కించుకొని, మొదట కల అనుకొని తుదకు నిజమే అనుకొని నిర్ణయించుకొన్నాడు. దురాశచేత భగ్నమైన చిత్తంచొప్పున దుర్యోధనుడు యుద్ధంలో పాండవులను సంహరించగలనని ఉవ్విళులూరాడు.

**క. విను, జనమేజయ! పౌరవ । జనవిభుఁ డబ్బంగి రాత్రిచరితం బగు న**
**ద్దనుజ సమాభాషణ మె । వ్వనికిని నెఱిఁగింపకుండువాఁ డయ్యె మదిన్. 51**

**ప్రతిపదార్థం:** జనమేజయ!= ఓ జనమేజయమహారాజా!; విను= ఆలకించుము; పౌరవ, జనవిభుఁడు= పురువంశానికి చెందినరాజు, సుయోధనుడు; ఆ+భంగిన్= ఆ రీతిగా; రాత్రిచరితంబు+అగు= రేయి జరిగింది అయిన; ఆ+ దనుజసమాభాషణము= రాక్షసులు జరిపిన సంభాషణం; మదిన్= మనస్సులో ఉంచుకొని; ఎవ్వనికిని= ఏమనుజుడికిని; ఎఱిఁ గింపక+ఉండువాఁడు+అయ్యెన్= తెలుపకుండటానికి నిశ్చయించుకొన్నాడు.

**తాత్పర్యం:** ఓ జనమేజయమహారాజా! భారతకథను ఆలకింపుము. పౌరవవంశంలోనివాడై దుర్యోధనుడు ఆరాత్రి జరిగిన వృత్తాంతాన్ని ఎవరికిని తెలుపరాదని తన మనస్సులో నిశ్చయించుకొన్నాడు.

**వ. అంతఁబ్రభాతం బగుటయు రాధేయుండు సుయోధనుపాలికిం జని హేతుమద్వాక్యంబుల నతని కి ట్లనియె.52**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; ప్రభాతంబు+అగుటయున్= తెల్లవారుటయు; రాధేయుండు= రాధకొడుకు కర్ణుడు; సుయోధనుపాలికిన్+చని= దుర్యోధనుడికడకు వెళ్లి; హేతుమత్+వాక్యంబులన్= కార్యకారణాలు పొసగునట్టి మాటలతో; అతనికిన్= దుర్యోధనుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంతట తెల్లవారింది. కర్ణుడు దుర్యోధనుడివద్దకు వెళ్లి, కార్యకారణాలు ఏర్పడేటట్లుగా ఈవిధంగా చెప్పాడు.

**ఉ. 'చచ్చిన పిమ్మటం గడిఁదిశత్రుల నోర్వఁగవచ్చునే? శుభం**
**బిచ్చునె చావు లెందును నరేశ్వర! యాఱడి చత్తు నంట దా**
**మెచ్చగునయ్య యేరికిని? మేనికి జీవము గల్గుచోన పెం**
**పచ్చుగ సిద్ధిఁ బొందు విజయార్థసుఖంబులు మర్త్యకోటికిన్. 53**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= రాజా! దుర్యోధనా!; చచ్చిన పిమ్మటన్= మరణించిన తరువాత; కడిఁది శత్రులన్= గొప్ప విరోధులను; ఓర్వఁగన్+వచ్చునే= జయించనగునా (గెలువరాదు); చావులు= మరణాలు; ఎందును= ఎచట నైనను; శుభంబు+ఇచ్చునే?= మేలును కలిగిస్తాయా?; ఆఱడి= వ్యర్థంగా; చత్తును= మరణిస్తాను; అంట= అని పలకటం; ఏరికిన్= ఎవరికైనను; మెచ్చు+అగునయ్యె?= మెచ్చికోలు సంపాదిస్తుందా? మేనికిన్= శరీరానికి; జీవము= ప్రాణం; కల్గుచోన్+అ= ఉన్నప్పుడు మాత్రమే; మర్త్యకోటికిన్= మనుజుల సముదాయానికి; పెంపు= అతిశయం; అచ్చుగన్= ఉట్టిపడేటట్లుగా; విజయ+అర్థ, సుఖంబులు= గెలుపువలన కలిగే సౌఖ్యాలు; సిద్ధిన్+పొందున్= ఫలిస్తాయి.

**తాత్పర్యం:** ఓ దుర్యోధన మహారాజా! చచ్చిన తరువాత బలవంతులైన విరోధులను జయించగలమా? చావు లెక్కడయినా శుభాలను చేకూర్చగలవా? వ్యర్థంగా చస్తానంటే అది ఎవ్వరికైనా మెప్పు కలిగిస్తుందా? శరీరంలో ప్రాణాలున్నప్పుడే మానవకోటి గెలుపు వలన లభించే సౌఖ్యాలను అధికంగా పొందగలరు.

**ఉ.** **కావున శోకదైన్యముల కాలము గా దిది; లెమ్ము విక్రమ**
**శ్రీవిలసిల్లు' మంచుఁ గురుసింహుని సింహసమానుఁ జారుశ**
**య్యావివశాంగు నంగపతి యాదటఁ దా నిరుగేల గ్రుచ్చి సం**
**భావన నెత్తుచుం బ్రణయభాషల వెండియు వాని కి ట్లనున్.** **54**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; శోక, దైన్యముల, కాలము= దుఃఖానికి లేమిడికి తగిన సమయం; కాదు+ఇది= ఇది కాదు; లెమ్ము= లేచి నిలబడుము (కర్తవ్యానికి పూనుకొనుము); విక్రమశ్రీ= పరాక్రమసంపదతో; విలసిల్లుము= శోభిల్లుము; అంచున్= అని పలుకుతూ; కురుసింహునిన్= కురువంశంలో సింహంవంటి వాడిని (దుర్యోధనుడిని); సింహసమానున్= సింహంతో సరిపోలేవాడిని; చారు శయ్యా, వివశ+అంగున్= మనోహరమైన పరుపుపై వశంతప్పిన (పండుకొన్న) శరీరం కలవాడిని, (దుర్యోధనుడిని); అంగపతి= అంగదేశానికి ప్రభువు (కర్ణుడు); ఆదటన్= ఆదరంతో; తాన్= తాను (కర్ణుడు); ఇరుకేలన్= రెండు చేతులతో; గ్రుచ్చి= పొదివి; సంభావనన్= గౌరవంతో; ఎత్తుచున్= కౌగిలించి లేపుతూ; ప్రణయ, భాషలన్= ప్రీతితో కూడిన మాటలతో; వెండియున్= ఇంకా; వానికిన్= దుర్యోధనుడికి; ఇట్లు+అనున్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** కాబట్టి ఇది దుఃఖంచెందవలసిన సమయం కాదు. నిర్వేదం పొందదగిన కాలంకూడా కాదు. నీవు పరాక్రమ ప్రాభవాలతో శోభిల్లవలసిన అదను ఇది' అని కర్ణుడు ప్రోత్సాహవాక్యాలు పలుకుతూ సింహంవంటి కౌరవశ్రేష్ఠుడైన దుర్యోధనుడిని ప్రేముడితో కౌగిలించుకొని పర్యంకంనుండి లేపి సంభావించి ఇంకను ప్రీతి పూర్వకమైన మాటలతో ఈవిధంగా పలికాడు.

**క.** **'మది నర్జునుఁ జూచి భయం । బొదవినయది నీకు; వాని నుగ్రరణమునం**
**బదునాలవయేఁడు జయిం । చెద; నాయుధ మంటి ప్రతిన సేసితి నధిపా!'** **55**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓరాజా! దుర్యోధనా!; నీకున్= (ఓదుర్యోధనా!) నీకు; మదిన్= మనస్సులో; అర్జునున్+చూచి= అర్జునుడిని చూచి (తలచి); భయంబు= భీతి; ఒదవిన+అది= ఏర్పడింది; వానిన్= అతడిని (అర్జునుడిని); ఉగ్ర, రణమునన్= ఘోరయుద్ధంలో; పదునాలవ+ఏఁడు= పదునాలుగవ సంవత్సరం; జయించెదన్= గెలుస్తాను; ఆయుధము+అంటి= పోటుముట్టును (శస్త్రాన్ని) స్పృశించి; ప్రతిన+చేసితిన్= శపథం చేస్తున్నాను.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనమహారాజా! నీ మనస్సులో అర్జునుడంటే భయం దాగి ఉన్నది. కాని, ఇదుగో ఇప్పుడు ఆయుధాన్ని ముట్టుకొని శపథం చేస్తున్నాను. బాగా వినుము. పదునాల్గవయేట భయంకర యుద్ధంలో అర్జునుడిని సంహరిస్తాను.'

**విశేషం:** పూర్వకాలంలో వీరులు అయుధంపట్టుకొని ఒట్టుపెట్టి ప్రతిజ్ఞ చేస్తే వారు ప్రాణాలను ఒడ్డి అయినాసరే ఆ ప్రతిజ్ఞను నెరవేర్చేవారు.

### దుర్యోధనుఁడు ప్రాయోపవేశము మాని కరిపురంబునకుఁ బోవుట (సం. 3-240-40)

**చ.** **అనవుడుఁ దత్ప్రతిజ్ఞయు సురారులవాక్యములుం దలంచి య**
**జ్జనపతి గాఢనిశ్చయవశంవదుఁ డై శయనంబు డిగ్గి చ**
**య్యనఁ 'బయనంబు సేయుఁ' డని యప్పు డమాత్యులఁ బంచి యిమ్ములన్**
**దినముఖకృత్యముల్ సలిపి దీపితుఁడై వెడలెం బ్రియంబుతోన్.** **56**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా (అని కర్ణుడు శపథంచేయగా); తత్+ప్రతిజ్ఞయున్= ఆతని శపథాన్నీ; సుర+అరుల, వాక్యములన్= దేవతలకు విరోధులయిన రాక్షసుల మాటలను; తలంచి= స్మరించి; ఆ+జనపతి= ఆ రాజు (ఆ దుర్యోధనుడు); గాఢనిశ్చయవశంవదుఁడు+ఐ= తీవ్రమైన నిర్ణయానికి లోబడిన వాడై-కృతనిశ్చయుడై; శయనంబు= మంచం; డగ్గి= దిగి; చయ్యనన్= వేగంగా; పయనంబు= ప్రయాణం; చేయుఁడు= సాగనివ్వండి; అని= అని చెప్పి; అప్పుడు= ఆ సమయంలో; అమాత్యులన్= మంత్రులను; పంచి= ఆజ్ఞాపించి; ఇమ్ములన్= ప్రీతితో; దిన, ముఖ, కృత్యముల్= ప్రొద్దుపొడుపువేళ చేయదగిన పనులను; సలిపి= చేసి; ప్రియంబుతోన్= ప్రీతితో; దీపితుఁడు+ఐ= ప్రకాశిస్తున్నవాడై; వెడలెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఇటు కర్ణుడు చేసిన శపథం, అటు రేయి రాక్షసులు పలికిన ప్రోత్సాహకవాక్యాలు స్మరించుకొని, ప్రాయోపవేశాన్ని మానటానికి కృతనిశ్చయుడై శయ్య దిగి, దుర్యోధనుడు మంత్రులను పిలిచి ప్రయాణసన్నాహాలు చేయటానికి ఆజ్ఞాపించి, తాను కాలకృత్యాలు తీర్చి ప్రకాశిస్తున్నవాడై వెళ్ళాడు.

**వ.** **అయ్యవసరంబున.** **57**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**చ.** **రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్రసం**
**చయములఁ జంచలచ్చటుల సైనికమత్స్యములన్ మహోన్నతం**
**బయి కురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుఁ బొంగెఁ బ్రస్ఫుర**
**ద్ధ్వయదమనోహరప్రకటభంగులఁ దద్భటవార్ధి యుద్ధతిన్.** **58**

**ప్రతిపదార్థం:** తత్+భట, వార్ధి= ఆ సైనికులు అనే సముద్రం; కురురాజచంద్రు+ఉదయంబునన్= కురువంశానికి చెందిన రాజు (దుర్యోధనుడు) అనే చంద్రుడి పొడుపుచేత; రయ, విచలత్+తురంగమ, తరంగములన్= వేగంగా కదలుతున్న గుర్రాలు అనే కెరటాలతో; మద, నాగ, నక్ర, సంచయములన్= మదించిన ఏనుగులు అనే మొసళ్లగుంపులతో; చంచలత్+చటుల, సైనిక, మత్స్యములన్= మిక్కుటంగా ఇటునటు కదలాడే భటులు అనే చేపలతో; మహా+ఉన్నతంబు+అయి= మిక్కిలి గొప్పది

అయి; ప్రస్ఫురత్+భయద, మనస్+హర, ప్రకట, భంగులన్= మిక్కుటంగా భీతిని కలిగించే మనస్సును హరించే సౌందర్యాన్ని వెల్లడించే రీతులతో (రమణీయ భయానక మయి); ఉద్ధతిన్= అతిశయంతో; తద్దయున్= మిక్కుటంగా; పొంగెన్= విజృంభించింది.

**తాత్పర్యం:** వేగంగా కదిలేగుఱ్ఱాలు అనే కెరటాలతో; మదించిన ఏనుగులు అనే మొసళ్ళగుంపులతో, మిక్కుటంగా కదలాడే సైనికులనే చేపలతో వెల్లివిరిసి కౌరవరాజు దుర్యోధనుడనే చంద్రుడి సందర్శనంతో ఆ సైన్యం అనెడి సముద్రం ఉత్సాహంతో రమణీయభయానకంగా విజృంభించింది.

**విశేషం:** 1.అలం: పరిణామం. కొందరు ఆలంకారికుల మతంలో పరిణామాలంకారం రూపకప్రభేదమే. 2. ఈపద్యం వ్రాసింది - ఎఱ్ఱన. అరణ్యపర్వంలో ఎఱ్ఱన నన్నయపేరుమీదనే 'తత్కవితారీతియు కొంత దోప' పూరించినట్లు చెప్పుకొన్నాడు. కాబట్టి ఈ పద్యంలో నన్నయకవితారీతి కొంతమాత్రమేకాక సొంతంగా కనపడుతుంది. ఎఱ్ఱన వ్రాసిన ఈపద్యానికి శిశుపాలవధ ఘట్టంలో నన్నయ వ్రాసిన ఈక్రిందిపద్యానికి జన్యజనకభావం సుస్పష్టం.

**'రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగనక్రసం**
**చయములఁ జంచలచ్చటుల సైనికమత్స్యములన్ భయంకరం**
**బయి యదువృష్ణిభోజకుకురాంధకవాహినియుం గలంగె ని**
**ర్దయతరరోషమారుత నితాంతసమీరిత మై క్షణంబునన్.' ( సభాపర్వం - 2.33)**

**చ. చామరపుండరీకవిలసత్సితచారుపతాకలం గురు**
**గ్రామణియాత్ర నెంతయును గాంతి వహించె నభంబు శారదో**
**ద్దామమరాళమండలసితస్ఫుటపద్మవనీపరిస్ఫుర**
**త్తామరసాకరంబున విధంబున భూచరనేత్రపర్వమై. 59**

**ప్రతిపదార్థం:** భూ, చర, నేత్ర, పర్వము+ఐ= పుడమిపై చరించే మానవుల కన్నులకు పండువు అయి; నభంబు= ఆకసం; చామర, పుండరీక, విలసత్+సిత, చారు, పతాకలన్= వింజామరలతో వెల్లగొడుగులతో శోభిల్లుతున్న తెల్లని అందమైన జెండాలతో; కురు, గ్రామణి, యాత్రన్= కురువంశంలో శ్రేష్ఠుడైన దుర్యోధనుడి ప్రయాణంలో; శారద+ఉద్దామ, మరాళ, మండల, సిత, స్ఫుట, పద్మ, వనీ, పరిస్ఫురత్+తామరస+ఆకరంబున, విధంబున= శరత్కాలంలోని గొప్ప హంసల గుంపులతోనూ, తెల్లగా వికసించిన పద్మాలగుంపులతోనూ ప్రకాశించే తామరకొలను మాదిరిగా; ఎంతయును= మిక్కుటంగా; కాంతివహించెన్= వెలుగొందింది.

**తాత్పర్యం:** దుర్యోధనుడి ప్రయాణంలో ఆకాశం కనులపండువుగా శోభిల్లింది. అప్పుడు వింజామరలతో ఆకసాన్ని నింపుతూ దుర్యోధనుడి సేనలు పయనించాయి. అప్పుడు శరత్కాలంలో గొప్పహంసలగుంపులతో, వికసించిన పద్మాలతో కళకళలాడుతున్న తామరకొలనువలె ఆకసం శోభించింది.

**విశేషం:** అలం: ఉపమ. 2. చామరం= చమరీమృగపు వెంట్రుకలచేత తయారు చేయబడిన వీవన. చామరం వెల్లగొడుగు రాజలాంఛనాలు. 3. వృత్తరచనలో నన్నయకు ఒకవిశిష్టశయ్య ఉన్నది. నన్నయ మాటలలో చెప్పవలెనంటే అది 'అక్షరరమ్యత' సుదీర్ఘ సంస్కృత సమాస సంఘటన నన్నయశైలికి గీటురాయి. స్థూలదృష్టికి ఈపద్యం నన్నయయే వ్రాశాడు అని అనిపించేటట్లు ఎఱ్ఱన వ్రాయగలిగాడు. ఛందోభంగిమలోకూడ నన్నయ ఒడుపు ఉన్నది.

**ఉ. ఇట్లు దుర్యోధనుండు గర్ణసౌబలసమేతుండై దుశ్శాసనాద్యనుజ గణంబునుం దక్కిన యమాత్యులుం గొలువఁ జెలువు మిగులం జని కరిపురంబు ప్రవేశించి సముచిత వ్యాపారంబుల నుండునంత, నొక్కనాఁడు మంత్రి జన పరివేష్టితుండై యున్న రాజునకు భీష్ముం డిట్లనియె. 60**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; దుర్యోధనుండు= సుయోధనుడు; కర్ణసౌబల సమేతుండు+ఐ= కర్ణుడితో, శకునితో కూడినవాడై; దుశ్శాసన+ఆది+అనుజ, గణంబునున్= దుశ్శాసనుడు మున్నగు తమ్ముల సముదాయమున్నూ; తక్కిన= మిగిలిన; అమాత్యులున్= మంత్రులున్నూ; కొలువన్= సేవించగా; చెలువుమిగులన్= అందం అతిశయించేటట్లుగా; చని= వెళ్లి; కరిపురంబు= హస్తినాపట్టణం; ప్రవేశించి= చేరిచొరబడి; సముచిత వ్యాపారంబులన్= తగిన పనులలో; ఉండు+అంతన్= ఉన్నంతలో; ఒక్కనాఁడు= ఒకరోజున; మంత్రిజన పరివేష్టితుండు+ఐ+ఉన్న= అమాత్యులచేత చుట్టుకొనబడియున్న; రాజునకున్= ప్రభువునకు (దుర్యోధనుడికి); భీష్ముండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా దుర్యోధనుడు శకునితో కర్ణుడితో దుశ్శాసనుడు మున్నగు తమ్ములతో మంత్రులతో కలిసి హస్తినాపురం చేరి రాచఠీవితో కొలువుదీర్చి ఉండగా, ఒకనాడు భీష్ముడు దుర్యోధనుడితో ఈ విధంగా పలికాడు.

**మ. 'హితులై పెద్దలు బుద్ధిసెప్పఁగఁ గ్రియాహీనుండవై త్రోచి పో**
**యితి దుష్టాత్ములఁ గూడి; దానికి ఫలం బెట్లయ్యెనో చూచితే!**
**గతవిద్వేషుఁడు ధర్మనందనుఁడు గల్గంబట్టి యప్పాట దు**
**ర్గతికిం దప్పితిగాక చిక్కితిగదా గంధర్వుచే నాజిలోన్. 61**

**ప్రతిపదార్థం:** పెద్దలు= వయస్సు ముదిరి అనుభవం సంపాదించినవారు; హితులు+ఐ= (నీ) శ్రేయోభిలాషులు అయి; బుద్ధి+చెప్పఁగన్= హితవుబోధించగా; క్రియా, హీనుండవు+ఐ= కొరమాలిన వాడవై; త్రోచి= ప్రక్కకు నెట్టి; దుష్ట+ ఆత్ములన్+కూడి= దుర్జనులతోచేరి; పోయితి(వి)= వెళ్ళావు; దానికిన్= ఆవిధంగా వెళ్లినదానికి; ఫలంబు= ఫలితం, పర్యవసానం; ఎట్లు= ఏరీతిగా; అయ్యెనో= పరిణమించిందో; చూచితి+ఏ= చూచావు (అనుభవించావు) కదా!; గత విద్వేషుఁడు= పోయిన శత్రుత్వం కలవాడు, పగలేనివాడు; ధర్మనందనుఁడు= ధర్మజుడు; కల్గన్+పట్టి= ఉండటంచేత; ఆ+పాటన్= ఆ విధంగా; దుర్గతికిన్= చెడ్డ అవస్థకు; తప్పితి(వి)+కాక= తప్పించుకొన్నావు కాని; ఆజిలోన్= యుద్ధంలో; గంధర్వుచేన్= గంధర్వుడు అయిన చిత్రసేనుడి చేతిలో; చిక్కితి(వి)+కదా= లొంగిపోయావు కదా! (బందీవి అయ్యావుకదా!).

**తాత్పర్యం:** 'అనుభవజ్ఞులు గౌరవింపదగిన పెద్దలు నీకు హితవు బోధించి, ఘోషయాత్రకు వెడలవద్దని చెప్పి ఉన్నారు. వారు చేసిన హెచ్చరికను నీవు సరకుచేయక గర్వంతో చెడ్డవారి చెప్పుడుమాటలకు చెవియొగ్గి బయలుదేరావు. ఈ దుస్సాహసం ఏరీతిగా పరిణమించిందో నీకే తెలిసింది కదా! అజాతశత్రుడు, మహానుభావుడు అయిన ధర్మరాజు ఉండటంచేత నీవు బ్రదికి బయటపడ్డావు. లేకపోతే గంధర్వు డైన చిత్రసేనుడి చెరసాలలో మ్రగ్గుతూ ఉండేవాడవు గదా.

**ఉ. నీవును దమ్ములున్ సతులు నెయ్యురు వైరులచే గృహీతులై**
**పోవఁగఁ బాఱిపోయెఁ గడుఁ బొల్లఁదనంబున సూతపుత్త్రుఁ డీ**

**కావరుఁ గష్టచిత్తు నధికంబుగ నమ్ముదు నీవు వీని బా**

**హావిభవంబు గయ్యమున నక్కడఁ జూచితె కన్నులారఁగన్.** **62**

**ప్రతిపదార్థం:** నీవును= ఓదుర్యోధనా! నీవున్నూ; తమ్ములున్= అనుజులున్నూ; సతులు= కులపాలికలైన స్త్రీలున్నూ; నెయ్యురు= మిత్రులున్నూ; వైరులచేన్= శత్రువులచేత; గృహీతులు+ఐ= చెరపట్టబడినవారై; పోవఁగన్= వెడలగా; సూతపుత్త్రుఁడు= సూతుని కొడుకు (కర్ణుడు); కడున్= మిక్కిలి; పొల్లఁదనంబునన్= వ్యర్థత్వమున, - ఎందుకు పనికిరానితనంతో; పాఱిపోయెన్= పిరికితనంతో పరుగెత్తిపోయాడు; నీవు; ఈ కావరున్= ఈ దుర్మదుడిని; కష్టచిత్తున్= వెతకు లోనైన మనస్సు కలవాడిని అనగా స్థైర్యం లేనివాడిని; అధికంబుగన్= ఎక్కువగా; నమ్ముదు(వు)= విశ్వసిస్తావు; వీని= ఈతని (కర్ణుడియొక్క); బాహావిభవంబు= భుజ పరాక్రమం; అక్కడన్= అచట; కయ్యమునన్= యుద్ధంలో; కన్నులు+ఆరఁగన్= కనుల నిండుచూపుతో; చూచితి(వి)+ఎ= అరసితివి కదా.

**తాత్పర్యం:** దుర్యోధనా! నీకు సూతుడికొడుకైన కర్ణుడంటే మిక్కిలి అభిమానం కదా! కానీ, నీవే స్వయంగా నీ కన్నులతో చూచావు ఆతడి పరాక్రమం. నీ తమ్ములు, స్త్రీలు, ప్రియమిత్రులు అందరు గంధర్వులచేతికి చిక్కినపుడు నీవు మహావీరుడు అని అనుకొన్న కర్ణుడు పిరికిపందవలె మిమ్మందరను వదలిపెట్టి పారిపోయాడుకదా. నీ ప్రాణమిత్రుడు కర్ణుడు స్థైర్యం లేనివాడని గంధర్వులతో ఏర్పడిన కయ్యం ఋజువు చేసింది.

**ఉ.** **ఆయతబాహు లుగ్రబలు లార్యులు పార్థులు వారిభూరిశౌ**

**ర్యాయుధ నైపుణక్రియలయందుఁ బదాఱవపాలుఁ బోలఁ డీ**

**వాయపురజ్జులాఁ డధిప! వారలచందము వీని చందమున్**

**నీయెడ నిక్కమై తెలిసెనే ఖచరేంద్రుల పోరిలోపలన్.** **63**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! ఓ దుర్యోధనమహారాజా!; పార్థులు= కుంతికొడుకులు(పాండవులు); ఆయతబాహులు= నిడివిఅయిన చేతులు కలవారు- పరాక్రమవంతులు; ఉగ్రబలులు= భయంకర మైన శక్తి కలవారు; ఆర్యులు= పూజించతగినవారు; వారి= వారియొక్క (పాండవులయొక్క); శౌర్య+ఆయుధ, నైపుణ, క్రియలఅందున్= పరాక్రమంతో శస్త్రాలను ప్రయోగించే నేర్పరితనాలలో; ఈ వాయపు, రజ్జులాఁడు= వ్యర్థంగా కలహించేవాడు (నోటి దురుసు కలవాడు కర్ణుఁడు); పదాఱవపాలున్= పదునారవభాగం (1/16 వ వంతు); పోలఁడు= సరిగాడు; వారల చందమున్= ఆ పాండవుల విధము; వీని చందమున్= ఈ కర్ణుడి విధం; ఖచర+ఇంద్రులు= గంధర్వశ్రేష్ఠులయొక్క; పోరిలోపలన్= యుద్ధంలో; నీ+ఎడన్= నీకు సంబంధించినమేరకు; నిక్కము+ఐ= నిజము అయి, నిజంగా; తెలిసెన్+ఏ= తెల్లం అయిందా? లేదా? (తేటతెల్లం అయింది కదా).

**తాత్పర్యం:** ఓదుర్యోధన మహారాజా! పాండవులు పరాక్రమం కలవారు. భయంకర మైన శక్తి కలవారు. బలంతో పాటు పూజించతగిన మంచితనం కలవారు. వారి పరాక్రమంలోగాని, వారికి ఆయుధాలు ప్రయోగించటంలో కల నేర్పరితనంలో కాని పదునారవపాలుగూడ లేనివాడు ఈ కర్ణుడు వ్యర్థంగా కయ్యానికి కాలుదువ్వే స్వభావంగల వాక్శూరుడు. ఈమధ్య గంధర్వులతో జరిగిన పోరాటంలో నీవే నీకన్నులతో అటు పాండవుల పరాక్రమప్రాభవాలను ఇటు కర్ణుడి పారుబోతుతనాన్నీ తెలిసికొన్నావు.

**క.** **కులమును సిరియును జెఱుపక । యలఘుస్థితి నింకనైన నప్పాండవులం**

**గలసి మనవయ్య! నాదగు । పలుకు వినఁగదయ్య! హితము పథ్యము సుమ్మీ!'** **64**

**ప్రతిపదార్థం:** కులమును= వంశాన్ని; సిరియును= ఐశ్వర్యాన్నీ; చెఱుపక= పాడు చేయక; అలఘుస్థితిన్= గొప్పతనంతో; ఇంకన్+ఐనన్= ఇకమీదట నైనా; ఆ+పాండవులన్= ఆ పాండునందనులతో; కలసి= కూడుకొని; మనవయ్యా= బ్రదుకవయ్యా; నాది+అగు= నాయొక్క; పలుకు= మాట; వినఁగదయ్యా= విని పాటించవయ్యా! హితము= (ఇది నీకు) శ్రేయస్సు కూర్చేది; పథ్యము= మేలు (ఒనగూర్చేది); సుమ్మీ= సుమా.

**తాత్పర్యం:** నీవంశాన్ని పాడు చేయకుము, నీసంపద పోగొట్టుకొనకుము, ఇకమీదనైనా, ఆ పాండునందనులతో నెయ్యం నెరపి సుఖశాంతులతో బ్రదుకుము. ఇది నేను నీకు చేస్తున్న హితబోధ. ఇది నేను నీమేలు కోరి చెప్పుతున్నాను సుమా!'

**వ. అనిన భీష్మువచనంబుల దెస ననాదరంబు సేసి, దుర్యోధనుండు గర్ణసౌబలులం జూచి నవ్వుచు, వారలుం దమ్ములుం దోడన చన నక్కడ వాసి చనియె; భీష్ముండును లజ్జితుం డై నిజగృహంబున కరిగె; నంతఁ గౌరవేశ్వరుండు గ్రమ్మఱ యెప్పటిచోటికిం జనుదెంచి మంత్రులతోడ మంతనం బుండి 'మన కెయ్యది కర్తవ్యం? బెయ్యది సేసినఁ దేజోలాభంబు లగు?' నని యడిగినఁ గర్ణుండు 'దేవా! నీ కింక నే విచారమ్ములు నేల? నిష్కంటకంబైన యీ పృథివి సకలంబునుం బాలించుచు మహేంద్రమహిమతోడ నఖిలసుఖంబులు ననుభవింతుగా' కనినం బ్రీతుండై యతండు వాని కి ట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలికిన; భీష్మువచనంబుల దెసన్= భీష్ముడియొక్క పలుకులపట్ల; అనాదరంబు+చేసి= తిరస్కారం చూపి; దుర్యోధనుండు= సుయోధనుడు; కర్ణ, సౌబలులన్+చూచి= కర్ణుడిని, శకునిని అరసి; నవ్వుచున్= హసిస్తూ; వారలున్= కర్ణుడు, శకుని; తమ్ములున్= సహోదరులును; తోడనచనన్= అతనివెంట వెళ్ళగా; అక్కర+పాసి= ఆస్థలం విడిచి; చనియెన్= వెళ్ళాడు; భీష్ముండును= భీష్ముడుకూడా; లజ్జితుండు+ఐ= సిగ్గుపడినవాడై; నిజగృహంబునకున్= తనయొక్క ఇంటికి; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= అటుపిమ్మట; కౌరవ+ఈశ్వరుండు= దుర్యోధనుడు; క్రమ్మఱ= మరలి; ఎప్పటిచోటికిన్= మునుపుఉన్నస్థలానికి; చనుదెంచి= వచ్చి; మంత్రులతోడన్= అమాత్యులతో; మంతనంబు+ఉండి= యోచనచేసి, సంప్రదించి; మనకున్; ఎయ్యది= ఏది; కర్తవ్యంబు?= చేయదగినపని?; ఎయ్యది= ఏది; చేసినన్= చేస్తే; తేజస్+లాభంబులు= వర్చస్సు అధికంకావటం, అభ్యుదయం చేకూరటం; అగును= ఏర్పడుతాయి; అని అడిగినన్= అని ప్రశ్నించగా; కర్ణుండు= కర్ణుడు; దేవా!= ప్రభూ, (ఓదుర్యోధనమహారాజా!); నీకున్; ఇంకన్= ఇకమీద; ఏవిచారమ్ములు= ఏ ఆలోచనలు; ఏల= ఎందులకు; నిష్కంటకంబు+ఐన= శత్రువులు లేనటువంటి; ఈపృథివి= ఈభూమి; సకలంబునున్= సమస్తం; పాలించుచున్= ఏలుకొంటూ; మహా+ఇంద్ర, మహిమతోడన్= దేవేంద్రుడి గొప్పశక్తివంటి శక్తితో; అఖిల సుఖంబులు= అన్నిసౌఖ్యాలు; అనుభవింతు(వు)+కాక= పొందెదవుగాక; అనినన్= అని చెప్పగా; ప్రీతుండు+ఐ= సంతసంచెందినవాడై; అతఁడు= దుర్యోధనుడు; వానికిన్= అతడికి (కర్ణుడికి); ఇట్లు+అనియెన్;

**తాత్పర్యం:** ఆ విధంగా పలికిన భీష్ముడి మాటలపట్ల గౌరవం చూపకుండా దుర్యోధనుడు కర్ణుడినీ, శకునినీ చూచి నవ్వుకొంటూ, వారూ తమ్ములూ కలిసి తన వెంటరాగా అక్కడినుండి తొలగివెళ్ళిపోయాడు. భీష్ముడుకూడా సిగ్గుపడి స్వగృహానికి వెళ్ళాడు. ఆ తరువాత దుర్యోధనుడు తిరిగి మునుపున్నప్రదేశానికి వచ్చి మంత్రులతో మంతనాలు మొదలుపెట్టాడు. 'ఇప్పుడు మనం ఏమి చెయ్యాలి? ఏది చేస్తే వర్చస్సు అధికమౌతుంది?' అని అడిగాడు. దానికి కర్ణుడిట్లా అన్నాడు. 'ప్రభూ! నీ వింక ఎటువంటి చింతలు లేకుండా ఈ నేలనంతా దేవేంద్ర మహిమతో ఏలుతూ అఖిల సుఖాలను అనుభవించుము' - అనగా సంతోషించి దుర్యోధనుడు కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**క. 'నీయట్టివీరవరుఁడు స। హాయుం డటె, పడయరాని యదియుం గలదే?**
**ధీయుత! నా కెయ్యదియును। బాయక విను మింక నొక్క పని దెల్లముగన్. 66**

**ప్రతిపదార్థం:** ధీయుత!= బుద్ధిమంతుడా!, ఓకర్ణా!; నీ+అట్టి= నీ వంటి; వీర, వరుఁడు= శూరులలో శ్రేష్ఠుడైనవాడు; సహాయుండు+అటె= సాయం చేసేవాడు కాగా; నాకున్; ఎయ్యదియును= ఏది అయినను; పడయరాని+అదియున్+కలదే= పొందరానిది ఉన్నదా; పాయక= వదలక; ఇంకన్= ఇకమీదట; ఒక్కపని= ఒకకార్యం; తెల్లముగన్= తెలిసేటట్లుగా; వినుము= ఆలకింపుము.

**తాత్పర్యం:** 'మేధావి వైన ఓ కర్ణా! సావధానంగా ఆకర్ణించుము. నీవంటి మహావీరుడు నాకు సాయం చేయటానికి ఉండగా, నేను పొందరానిదేదీ ఉండదు. నాకు ఒక కర్తవ్యం నెరవేర్చవలె నని మిక్కిలి వేడుకగా ఉన్నది.

**తే. ధర్మజుఁడు రాజసూయంబుఁ బేర్మిఁ జేసి। నంతనుండియు నమ్మహితాధ్వరమున**
**యం దభిప్రాయమై యుండు; నొంద నాకు। నమ్మఖంబు సేయింపవే యనఘ! నన్ను.' 67**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడ వైనవాడా, ఓకర్ణా!; ధర్మజుఁడు= ధర్మపుత్రుడు; రాజసూయంబున్= రాజసూయమనే యజ్ఞాన్ని; పేర్మిన్= గౌరవంతో; చేసినంతనుండియున్= ఒనరించినప్పటినుండియున్నూ; ఆ+మహిత+అధ్వరమున అందున్= అ గొప్పయజ్ఞంలో; అభిప్రాయము+ఐ+ఉండున్= కోరిక అయి ఉన్నది; నాకున్; ఆ+మఖంబు= ఆ యజ్ఞం (ఆరాజసూయయాగం); ఒందన్= పొందేటట్లుగా; నన్నున్+చేయింపవే= నాచేత చేయింపవా.

**తాత్పర్యం:** ధర్మరాజు రాజసూయయాగాన్ని చేసిన నాటినుండి నేనుకూడా ఆరాజసూయయాగాన్ని చేయాలని మనస్సులో గాఢంగా అభిలషిస్తున్నాను. మహావీరుడవైన ఓకర్ణా! నీవు నాచేత ఆ మహాయాగాన్ని చేయించి పుణ్యం కట్టుకొనుము' అని దుర్యోధనుడు ప్రార్థించాడు.

**వ. అనినం గర్ణుండు గౌరవపతి కి ట్లనియె. 68**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; కర్ణుండు; కౌరవపతికిన్= దుర్యోధనుడికి (కౌరవులరాజుకు); ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** కర్ణుడు దుర్యోధనుడితో ఈవిధంగా బదులు పలికాడు.

**క. 'అగుఁగాక యేమి యిప్పుడు। జగతిం గల నృపతు లెల్ల జనవర! నీ కి**
**మ్ముగ వశవర్తుల కావునఁ। దగ నుద్యోగింపు మిపుడు తత్క్రతు విధికిన్. 69**

**ప్రతిపదార్థం:** అగున్+కాక= ఆవిధంగా జరుగుగాక (సరే ధర్మరాజు గొప్పగా రాజసూయం చేసి ఉండవచ్చును గాక); ఏమి= ఏమి (ఎందుకు); ఇప్పుడు= ఈ సమయంలో; జగతిన్+కల= లోకంలో ఉన్న; నృపతులు+ఎల్లన్= రాజులు అందరు; జనవర= ఓరాజా! దుర్యోధనా!; నీకున్; ఇమ్ముగన్= సంప్రీతితో; వశవర్తులు+అ= లోబడిఉన్నవారే; కావునన్= కాబట్టి; తగన్= సరిపడునట్లుగా; తత్క్రతువిధికిన్= ఆ యజ్ఞవిధానానికి; ఇపుడు= ఈసమయంలో; ఉద్యోగింపుము= ప్రయత్నించుము.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధన సార్వభౌమా! పూర్వం ధర్మరాజు రాజసూయయాగం చేసి ఉండవచ్చును. అదేమి గొప్ప! ఇపుడు నీవుమాత్రం చేయనేరవా? ఏమి ? ఇప్పుడు, ఈ లోకంలోగల రాజులు అందరున్నూ నీకు సామంతులేకదా! నీకు ఆ యాగంపై అంతమక్కువ ఉంటే, ఇపుడు ప్రారంభించుము.

**ఉ. రాజులఁ బిల్వఁ బంపుము, ధరాసురసంఘము నామతింపు, పే**
**రోజ నుదాత్తయజ్ఞగృహయూపతతుల్ సమకట్టఁ బంపు, వి**
**భ్రాజితభక్ష్యభోజ్యవిధి భవ్యపదార్థము లానయింపు, మ**
**వ్యాజ విభూతిమై నమరవల్లభుచాడ్పునఁ జేయు జన్నమున్. 70**

**ప్రతిపదార్థం:** రాజులన్= ప్రభువులను; పిల్వన్+పంపుము= పిలిపించు; ధరా, సుర, సంఘమున్= బ్రాహ్మణుల సముదాయాన్ని; ఆమతింపు(ము)= ఆహ్వానించుము; పేరోజన్= (పేరు+ఓజన్=) మిక్కుటమైన ఉత్సాహంతో; ఉదాత్త, యజ్ఞగృహ, యూప, తతుల్= గొప్పవైన యాగశాలలు యాగపశువులను కట్టే కంబాల సముదాయాలను; సమకట్టన్= సమకూర్చటంకొరకు; పంపు(ము)= నియోగించుము; విభ్రాజిత, భక్ష్యభోజ్యవిధి= శోభిల్లే తినుబండారాలు పిండివంటలు సమకూర్చే క్రమంలో; భవ్యపదార్థములు= యోగ్యమైన వస్తువులు; ఆనయింపుము= తెప్పించుము; అవ్యాజ విభూతిమైన్= సహజమైనసంపదతో (ఏప్రయోజనాన్ని అభిలషించని ఐశ్వర్యం చొప్పున); అమర, వల్లభు, చాడ్పునన్= దేవేంద్రుడి మాదిరిగా; జన్నమున్= యజ్ఞాన్ని; చేయు(ము)= ఒనరింపుము.

**తాత్పర్యం:** రాజులను అందరను ఆహ్వానించటానికై దూతలను పంపుము. బ్రాహ్మణులను ఆహ్వానించుము; గొప్ప ఉత్సాహం వెల్లివిరిసేటట్లుగా యాగశాలలు నిర్మించుము. యూపస్తంభాలను సమకూర్చుకొనుము. అన్నసంతర్పణ చేయటానికై తినుబండారాలు పిండివంటలు సమకూర్చటానికి యోగ్యమైన పదార్థాలు తెప్పించుము. ఏప్రయోజనానికి ఎట్టి ప్రతిఫలం ఆశించకుండగా దేవేంద్రుడి మాదిరిగా గొప్ప యజ్ఞాన్ని చేయుము.

**వ. అనిన సంతోసిల్లి కురుపతి యప్పుడు పురోహితునిం బిలిపించి, 'రాజసూయ యజ్ఞంబు సంపూర్ణ దక్షిణంబుగాఁ జేయవలయుఁ; దత్ప్రయోగ విశేషంబులకు మీరు సాలియుండునది' యనినం బురోహితుండు దగిన విద్వజ్జనంబులతోడ విచారించి దుర్యోధనున కి ట్లనియె. 71**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (కర్ణుడు) చెప్పగా; సంతోసిల్లి= సంతోషించి; కురుపతి= దుర్యోధనుడు; అప్పుడు+అ= ఆసమయంలో; పురోహితునిన్= వైదికకర్మకాండను నిర్వహించే విప్రుడిని; పిలిపించి= ఆహ్వానించి, రప్పించుకొని; రాజసూయయజ్ఞంబు= రాజసూయం అనే క్రతువు; సంపూర్ణ దక్షిణంబుగాన్= సాంతంగా, చివర ఇచ్చే దక్షిణతో పాటుగ; చేయవలయున్= నిర్వహించవలెను; తత్+ప్రయోగ, విశేషంబులకున్= ఆ క్రతువును నిర్వహించటంలో పేర్కొనదగిన అంశాలకు; మీరు= (వైదికవిప్రులయిన) మీరు; చాలి+ఉండునది= సరిపోయేటట్లుగా ఉద్యుక్తులు కండి; అనినన్= అని (దుర్యోధనుడు) చెప్పగా; పురోహితుండు= వైదికవిప్రుడు; తగిన= యోగ్యులు అయిన; విద్వత్+జనంబులతోడన్= పండితులైన వారలతో; విచారించి= సంప్రదించి; దుర్యోధనునకున్= సుయోధనుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** కర్ణుడిమాటలకు దుర్యోధనుడు సంతసించాడు. పిదప దుర్యోధనుడు పురోహితుడిని పిలిపించి రాజసూయయజ్ఞాన్ని యథావిధిగా, నిండైన దక్షిణలతో చేయవలయు నని ప్రార్థించాడు. పురోహితుడు పండితులైన వైదికవిప్రులతో సంప్రదించి దుర్యోధనుడికి ఇట్లా తెలిపాడు.

**విశేషం:** పురస్+హితుడు= పురోహితుడు. పురోహితుడు వైదికవైదుష్యం కలవాడు మాత్రమే కాక, యజమానుని శ్రేయోభిలాషి అయిఉండాలి.

**చ. 'జనవర! నీకుఁ బాండవులు శత్రులు గావున వారి నాజి నో**
**ర్చిన మఱి కాక మున్న యిటు సేయఁగ శక్యమె రాజసూయమున్?**
**వినుము దగంగ నిప్పటికి వేఱొక యజ్ఞము సేయు మిమ్ములం;**
**బనుపుము తత్క్రియావివిధభంగులకుం దగువారి వేగమై. 72**

**ప్రతిపదార్థం:** జనవర!= ఓ దుర్యోధనామహారాజ!; నీకున్= నీకు; పాండవులు; శత్రులు= విరోధులు; కావునన్= కాబట్టి; వారిన్= వారిని (పాండవులను); ఆజిన్= యుద్ధంలో; మఱి= ఇంక; ఓర్చినన్= జయించిననే; కాక= తప్ప; మున్ను+అ= అంతకు ముందే; రాజసూయమున్; ఇటు= ఈ విధంగా; చేయఁగన్= సలుపగా; శక్యమె= సాధ్యం అవుతుందా?; వినుము= ఆలకించుము; తగంగన్= తగునట్లుగా; ఇప్పటికిన్= ఇప్పటి స్థితిగతులకు అనువుగా; ఇమ్ములన్= సంప్రీతితో; వేఱు+ఒక, యజ్ఞము= ఇంకొక యాగం; చేయుము= సలుపుము; వేగమైన్= శీఘ్రంగా; తత్+క్రియా, వివిధ, భంగులకున్= ఆ పనులలోని పెక్కురీతులకు; తగువారిన్= యోగ్యులైనవారిని; పనుపుము= నియోగించుము.

**తాత్పర్యం:** 'ఓదుర్యోధన మహారాజా! నీకు పాండవులు శత్రువులు కదా! శత్రురాజులను అందరను నిశ్శేషంగా జయించిన పిమ్మటనే కాని రాజసూయయాగం చేయటం శాస్త్రసమ్మతం కాదు. పాండవులను యుద్ధంలో జయించిన పిమ్మట మాత్రమే నీకు ఆ యజ్ఞం చేసే అర్హత సంక్రమిస్తుంది. అందుచేత ప్రస్తుతం నీవు ఇంకొకయజ్ఞం చేయటానికి ఉపక్రమించటం మంచిది. ఇక శీఘ్రంగా అట్టి యాగాన్ని నిర్వహించటానికి యోగ్యత కలవారిని ఎన్నుకొనుము.

**తే. రాజసూయంబు నట్టిద రాజవర్య! । వైష్ణవం బను యాగంబు; వాసుదేవుఁ**
**డిమ్మఖము సేసెఁ దొల్లి; యభీష్ట మిదియు; । చేయు నిర్విఘ్నముగ నిది సెల్లు నీకు'. 73**

**ప్రతిపదార్థం:** రాజవర్య!= రాజులలో శ్రేష్ఠుడవైన వాడా!; ఓదుర్యోధనమహారాజా!; వైష్ణవంబు+అను యాగంబు= వైష్ణవం అనే పేరు గల యజ్ఞం; రాజసూయంబు+అట్టిది+అ= రాజసూయం వంటిదే; ఈ+మఖము= ఈ యజ్ఞాన్ని; వాసుదేవుఁడు= వసుదేవుడి కొడుకు, శ్రీకృష్ణుడు; తొల్లి= పూర్వం; చేసెన్= సలిపాడు; అభీష్టము+ఇది+అ= కోరదగింది ఇదే; నిర్విఘ్నముగన్= ఆటంకాలు లేకుండా; చేయు(ము)= నిర్వహింపుము. నీకున్; ఇది= వైష్ణవ యాగం; చెల్లున్= తగును.

**తాత్పర్యం:** ఓ దుర్యోధన మహారాజా! రాజసూయయాగంవంటిదే వైష్ణవయాగం. దానిని మునుపు వాసుదేవుడు చేశాడు. ఇది అభిలషించతగింది. ఈ యాగాన్ని ఎట్టి ఆటంకాలు లేకుండా చేసేది. ఇది నీకు తగిన యజ్ఞంసుమా!'.

**క. అనిన నిది వోలు నని య । జ్జననాథుఁడు సూతతనయసౌబలులు ప్రియం**
**బున ననుమతింప నభిమత । వినుతాధ్వరసంప్రయోగవిహితోద్యముఁ డై. 74**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (పురోహితుడు) చెప్పగా; ఇది+పోలున్+అని= ఇది బాగా ఉన్న దని; ఆ+జననాథుఁడు= ఆరాజు (దుర్యోధనుడు); సూతతనయ, సౌబలులు= కర్ణుడును, శకునియు; ప్రియంబునన్= ప్రీతితో; అనుమతింపన్= అంగీకరించగా; అభిమత, వినుత+అధ్వర, సంప్రయోగ, విహిత+ఉద్యముఁడు+ఐ= కోరినట్టిది ప్రశంసించబడినట్టిది అయిన యజ్ఞాన్ని నిర్వహించటంలో అభిరుచితో కూడిన ప్రయత్నం కలవాడై.

**తాత్పర్యం:** పురోహితుడు చెప్పినమాటలు సముచితంగా ఉన్నవని దుర్యోధనుడు తలపోశాడు. సంతసంతో కర్ణుడు, శకుని అట్లే అని సమ్మతించారు. అంతట దుర్యోధనుడు యజ్ఞాన్ని చేయటానికి వలసిన సన్నాహాలలో నిమగ్నుడయ్యాడు.

**క. తనయుద్యోగము జననీ । జనకులకును ద్రోణవిదురశాంతనవ కృపా**
**ది నిఖిలమాన్యజనమ్ముల । కును దగ నెఱిఁగించి భరతకుంజరుఁ డెలమిన్. 75**

**ప్రతిపదార్థం:** భరత, కుంజరుఁడు= భరతవంశంలో ఏనుగువంటివాడు (శ్రేష్ఠుడు), దుర్యోధనుడు; ఎలమిన్= సంతోషంతో; తన+ఉద్యోగము= తనప్రయత్నం; జననీజనకులకును= తలిదండ్రులకును, (గాంధారికి ధృతరాష్ట్రుడికిని); ద్రోణ, విదుర, శాంతనవ, కృప+ఆది, నిఖిల, మాన్యజనమ్ములకును= ద్రోణుడు, విదురుడు, శంతనుని పుత్రుడు భీష్ముడు, కృపుడు మున్నగుసమస్తమైన పూజనీయు లైన వారికిని; తగన్= ఒప్పిదంగా; ఎఱిఁగించి= తెలిపి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు జన్నమొనర్చే తనసన్నాహాన్నిగూర్చి తల్లిదండ్రులు అయిన గాంధారికిని ధృతరాష్ట్రుడికి, పెద్దలు అయిన ద్రోణుడు విదురుడు భీష్ముడు కృపుడు మున్నగువారికి తెలిపి, తాను సంతోషంతో. (తదుపరి పద్యంతో అన్వయం).

### దుర్యోధనుఁడు వైష్ణవం బను యజ్ఞంబు సేయుట (సం. 3-242-1)

**వ. వారిచేత ననుజ్ఞాతుం డయి నగరసమీపంబున నొక్క పుణ్యస్థలంబునం దఖిలయజ్ఞగృహంబులు నతిరమణీయంబులుగాఁజేయించి యజ్ఞోపకరణంబులును సమస్తవస్తువిశేషంబులును సమకట్ట నియోగించి శుభదినంబునం బరమబ్రాహ్మణసహాయుం డై నియతదీక్షాశోభనంబు వహించె నంత. 76**

**ప్రతిపదార్థం:** వారిచేతన్= తలిదండ్రులచేత, పెద్దలచేత; అనుజ్ఞాతుండు+ఐ= అనుమతించబడినవాడై; నగర సమీపంబునన్= హస్తినాపురం దగ్గరగా ఉన్న స్థలంలో; ఒక్క, పుణ్య, స్థలంబునందున్= సుకృతం కలిగించే ఒకచోట; అఖిల యజ్ఞ, గృహంబులున్= జన్నం చేయటానికి ఉపకరించే ఇండ్లను అన్నిటిని; అతిరమణీయంబులుగాన్= మిక్కిలి అందంగా; చేయించి= నిర్మించి; యజ్ఞ+ఉపకరణంబులును= జన్నం చేయటానికి కావలసిన కొరముట్లు; సమస్త వస్తు విశేషంబులును= అన్నిపదార్థాలను; సమకట్టన్= సమకూర్చటంకొరకు; నియోగించి= ఆజ్ఞాపించి; శుభదినంబునన్= మంచిరోజున; పరమ, బ్రాహ్మణ, సహాయుండు+ఐ= గొప్పవిప్రులు సాయంగా కలవాడై; నియత, దీక్షాశోభనంబు= శాస్త్రాలలో విధించబడిన క్రమశిక్షణ పాటించటంవల్ల, ఏర్పడే మంగళమును; వహించెన్= పొందాడు; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తలిదండ్రులచేతను పెద్దలచేతను అనుమతించబడినవాడై యజ్ఞసన్నాహాలు చేశాడు. హస్తినాపురానికి దగ్గరగా ఒకపుణ్యస్థలం ఎన్నికచేసి, అచట యజ్ఞానికై పెక్కు ఇండ్లు అందచందాలు ఒప్పార నిర్మింపజేశాడు. యజ్ఞానికి కావలసిన వస్తుసామగ్రిని అంతటిని ఉపకరణాల నన్నింటిని సమకూర్పజేశాడు. ఒకశుభ ముహూర్తంలో బ్రాహ్మణోత్తముల సాయంతో శాస్త్రాలలో విధించబడిన క్రమశిక్షణ పాటించటంవలన ఏర్పడే దీప్తితో కూడిన సౌందర్యం పొందాడు.

**ఆ. అఖిలదేశవాసు లైన రాజులను బ । విత్రచరితు లైన విప్రవరుల**
**నర్థిఁ బిలువ దూత లరిగిరి కౌరవే । శ్వరుని యాజ్ఞఁజేసి సమ్మదమున. 77**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరుని+ఆజ్ఞన్+చేసి= దుర్యోధనుడి ఆనతి చొప్పున; అఖిల, దేశ, వాసులు+ఐన= అన్ని రాజ్యాలలో నివసిస్తూఉండేవారైన; రాజులను= ప్రభువులను; పవిత్రచరితులు+ఐన= పావనమైన ప్రవర్తన గల; విప్రవరులన్= బ్రాహ్మణోత్తములను; అర్థిన్= ప్రీతితో; పిలువన్= ఆహ్వానించటంకొరకై; దూతలు= రాయబారులు; సమ్మదమునన్= సంతోషంతో; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** అన్నిదేశాలలో నివసించే రాజులను, పవిత్రమైన ప్రవర్తన గల బ్రాహ్మణోత్తములను ఆహ్వానించటంకొరకై రాయబారులు దుర్యోధనుడి ఆజ్ఞచొప్పున సంతోషంతో బయలుదేరి వెళ్ళారు.

**వ. అందొక్క దూతం బిలిచి దుశ్శాసనుండు 'నీవు ద్వైతవనంబునకుం జని పాండవులను దదాశ్రమవాసు లైన భూసురులను గౌరవేశ్వరు నధ్వరంబునకుఁబిలువు' మని పనిచిన, వాఁడునుంజని ధర్మరాజుం గని యిట్లనియె. 78**

**ప్రతిపదార్థం:** దుశ్శాసనుండు; అందున్+ఒక్కదూతన్= ఆదూతలలో ఒక రాయబారిని; పిలిచి= ఆహ్వానించి; నీవు= (ఓ దూతా) నీవు; ద్వైతవనంబునకున్+చని= ద్వైతవనానికి పోయి; పాండవులను= పాండునందనులను; తత్+ఆశ్రమవాసులు+ఐన= వారియొక్క ఆశ్రమంలో నివసించేవారు అయిన; భూసురులను= విప్రులను; కౌరవ+ఈశ్వరు+అధ్వరంబునకున్= దుర్యోధనుడి యజ్ఞానికి; పిలువుము= ఆహ్వానించుము; అని పనిచినన్= అని ఆజ్ఞాపించగా; వాఁడునున్= ఆ దూతయు; చని= వెడలి; ధర్మరాజున్+కని= ధర్మపుత్రుడిని చూచి; ఇట్లు+అనియెన్= ఈరీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు దూతలలో ఒకడిని పిలిచి 'నీవు ద్వైతవనానికి పోయి పాండవులను, పాండవుల ఆశ్రమంలో నివసించే బ్రాహ్మణులను యజ్ఞానికి రమ్మని ఆహ్వానించుము' అని చెప్పాడు. ఆ దూత ద్వైతవనానికి పోయి ధర్మరాజును సందర్శించి ఈ విధంగా పలికాడు.

**ఉ. 'వీరుఁడు గౌరవుండు నిజవిక్రమలబ్ధ సమున్నతార్థ సం**
**భారములన్ మహాధ్వర మపారబలుం డొనరించుచుండి పెం**
**పారఁగ నిన్నుఁ దమ్ముల మహాద్విజులం బిలువంగఁ బంచె ధా**
**త్రీరమణేశ! నెమ్మిఁ జనుదెమ్ము తదధ్వరముం గనుంగొనన్.' 79**

**ప్రతిపదార్థం:** ధాత్రీ, రమణ+ఈశ!= రాజులలో శ్రేష్ఠుడ వైనవాడా, ఓధర్మరాజా!; వీరుఁడు= పరాక్రమవంతుడు; కౌరవుండు= దుర్యోధనుడు; నిజ, విక్రమ, లబ్ధ, సమున్నత+అర్థ, సంభారములన్= తనయొక్క శౌర్యంచేత పొందబడిన మిక్కిలి గొప్ప వైన పదార్థాల సముదాయంచేత; మహా+అధ్వరము= గొప్పజన్నం; అపారబలుండు= అంతులేని శక్తి కలవాడు (దుర్యోధనుడు); ఒనరించుచున్+ఉండి= చేస్తూ ఉన్నవాడై; పెంపు+ఆరఁగన్= అతిశయం శోభిల్లేటట్లుగా; నిన్నున్= (ఓధర్మరాజా) నిన్నును; తమ్ములన్= (నీ) అనుజులను; మహా, ద్విజులన్= బ్రాహ్మణోత్తములను; పిలువంగన్= ఆహ్వానించగా; పంచెన్= (నన్ను) నియోగించాడు; తద్+అధ్వరమున్= ఆ యజ్ఞాన్ని; నెమ్మిన్= ప్రీతితో; కనుంగొనన్= చూడటంకొరకై; చనుదెమ్ము= రమ్ము.

**తాత్పర్యం:** రాజులలో శ్రేష్ఠుడ వైన ఓ ధర్మరాజా! కౌరవులలో వీరుడైన దుర్యోధనుడు తన శౌర్యానికి, ప్రాభవానికి అనురూపమైన గొప్పయజ్ఞాన్ని చేయటానికి పూనుకొన్నాడు. ఆ మహాక్రతువుకై అంతులేని సంభారాలు సమస్త వస్తుసామగ్రి సమకూర్చబడినవి. ఇట్టి గొప్పయజ్ఞాన్ని తిలకించటానికై నిన్నును, నీ తమ్ములను, నీతోఉన్న

బ్రాహ్మణోత్తములను ఆహ్వానించటానికై, దుర్యోధనసార్వభౌముడు ప్రత్యేకంగా మీవద్దకు నన్ను దూతగా నియోగించి పంపాడు. దయచేసి యజ్ఞానికి రమ్ము.

**విశేషం:** "అనాహూతోఽధ్వరం గచ్ఛేత్" - "ఆహ్వానం లేకుండానే యజ్ఞానికి వెళ్ళవలెను" అనే ప్రాచీనసంప్రదాయం. అయినను పాండవులకు ప్రత్యేకదూత వచ్చి ఆహ్వానం సయితం అందించాడుగదా. ఇక పాండవులు యజ్ఞానికి వెళ్లటం విధ్యుక్త కర్తవ్యం అని రాయబారి సూచన. అయినను - ఈ ఆహ్వానంలో అంతర్గర్భితంగా దుర్యోధనుడి ఐశ్వర్యప్రాభవం - పరాక్రమప్రకర్ష ఇమిడి ఉన్నవి. దానిని పాండవులు గుర్తించక పోలేదు.

**వ. అనిన ధర్మజుండు వాని కిట్లనియె. 80**

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు ఆ దూతతో ఇట్లా అన్నాడు.

**చ. 'అనఘుఁడు ధార్తరాష్ట్రుఁడు మహాధ్వరకర్మధురీణుఁ డయ్యె నా**
**విని ప్రియమందెఁ జిత్తము; పవిత్రిత మయ్యెఁ గులంబు; వింటె! యై**
**నను దగ మేము పూనిన ఘనంబగు పూనికి దీర్చ కెవ్విధం**
**బున నట రా నొడంబడము? భూవరుతో నిది సెప్పు మేర్పడన్.' 81**

**ప్రతిపదార్థం:** అనఘుఁడు= పాపరహితుడు; ధార్తరాష్ట్రుఁడు= ధృతరాష్ట్రుడికొడుకు (దుర్యోధనుడు); మహా+అధ్వర, కర్మ, ధురీణుఁడు+అయ్యెన్= గొప్పయజ్ఞాన్ని నిర్వహించే పనిని చేపట్టినవాడు అయినాడు; నాన్= అనగా; విని= ఆలకించి; చిత్తము= మనస్సు; ప్రియము+అందెన్= ప్రీతి చెందింది; కులంబు= వంశం (మా కురువంశం); పవిత్రితము+అయ్యెన్= పావనం అయింది; వింటి+ఎ= సావధానంగా ఆలకించావుకదా; ఐనను= అయినప్పటికిని; తగన్= ఒప్పిదంగా; మేము= మేము (పాండవులమైన మేము); పూనిన= చేపట్టిన; ఘనంబు+అగు= గొప్పది అయిన; పూనికి= దీక్ష; తీర్పక= నెరవేర్చక; ఏ+విధంబునన్= ఏరీతిగా; అట= అచటికి (ఆ యజ్ఞానికి) రాన్= రావటానికి; ఒడంబడము?= సమ్మతించగలం; భూవరుతోన్= భూమికి భర్తఅయిన రాజుతో (దుర్యోధనుడితో); ఇది= ఈవిషయం; ఏర్పడన్= విశదంగా; చెప్పుము= వచింపుము.

**తాత్పర్యం:** 'మహానుభావుడు దుర్యోధనుడు గొప్పయజ్ఞాన్ని చేయటానికి పూనుకొని, అంతటి సన్నాహాలు చేసి మమ్మల్ని ఆహ్వానించినందుకు సంతోషం. ఈ యజ్ఞంవలన మాకురువంశం పావనమౌతుంది. కాని, మా సమాధానం సావధానంగా వినుము. మేం చేసిన శపథాన్ని నెరవేర్చటానికి ముందే - అంటే, అరణ్యవాసం, అజ్ఞాతవాసం ముగించటానికి ముందుగానే - మేము యజ్ఞాన్ని సందర్శించటం ఏవిధంగా సముచితం ఔతుంది? ఈ విషయాన్ని దయచేసి మీరాజుతో వివరించి తెలుప వేడికోలు.'

**విశేషం:** ఈ సమాధానంలో ధర్మరాజుశీలం సాత్త్వికసంపద తెలివితేటలు మంచితనం స్వయంవ్యక్తమౌతున్నాయి.

**వ. అనియె; నప్పుడు భీమసేనుం డాదూతం జూచి, 'యోరి! వినుము! పదుమూఁడగునేఁటి కడపటఁ బాండవాగ్రజుండు దీప్తం బగుశస్త్రాస్త్రదహనంబునందు ధార్తరాష్ట్రసుతశతకంబును బశువరించివేల్చి రణసత్త్రంబు సేయుటకునై వచ్చుం గాని యందాఁకం జనుదెంచుట గలుగ దని యాదుర్యోధను నెదురన వాయోడక చెప్పు' మనిన, వాఁడును మగిడి చని ధర్మనందను ప్రియవచనంబులను వృకోదరు నిష్ఠురోక్తులను ధార్తరాష్ట్రుల కెఱింగించెఁ; దదనంతరంబ. 82**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని ధర్మరాజు పలికాడు; అప్పుడు= ఆ సమయంలో; భీమసేనుండు= భీముడు; ఆదూతన్= ఆ రాయబారిని; చూచి; 'ఓరి!= (ఓదూతా!); వినుము= ఆలకింపుము; పదుమూఁడు+అగు= పదమూడవది అయిన; ఏఁటి, కడపటన్= సంవత్సరంచివర; పాండవ+అగ్రజుండు= పాండవులలో మొదట పుట్టినవాడు, ధర్మరాజు; దీప్తంబు+అగు= ప్రజ్వలిస్తున్నది అయిన; శస్త్ర+అస్త్ర, దహనంబునందున్= బాణాలవలన, మంత్రమహిమగల బాణాలవలన ఏర్పడే అగ్నిలో; ధార్తరాష్ట్ర, సుత, శతకంబును= ధృతరాష్ట్రుడియొక్క నూరుమంది కొడుకులను; పశువరించి= బలి అయ్యే జంతువులనుగా చేసి; వేల్చి= హోమంలో పడవేసి; రణసత్రంబు= యుద్ధం అనెడి యజ్ఞం; చేయుటకున్+ఐ= చేయటానికై; వచ్చున్+కాని= వస్తాడు కాని; అందాఁకన్= అంతవరకు; చనుదెంచుట= రావటం; కలుగదు= జరుగదు; అని= అనిచెప్పి; ఆదుర్యోధను +ఎదురన్+అ= ఆ సుయోధనుడిఎదుటనే; వాయి+ఓడక= నోరువిప్పటానికి జంకక; చెప్పుము= వచింపుము; అనినన్= అని చెప్పగా; వాఁడును= దూతయును; మగిడిచని= తిరిగి వెళ్ళి; ధర్మనందను ప్రియ, వచనంబులను= ధర్మరాజు చెప్పిన ఇంపైన మాటలను; వృక+ఉదరు= భీముడియొక్క; నిష్ఠుర+ఉక్తులను= కఠినమైన మాటలను; ధార్తరాష్ట్రులకున్= ధృతరాష్ట్రుడి కుమారులకు; ఎఱింగించెన్= తెలిపాడు; తద్+అనంతరంబు+అ= అటు పిమ్మటనే.

**తాత్పర్యం:** అని ధర్మరాజు చెప్పాడు. ఆ సమయంలో జోక్యం కల్పించుకొని, భీమసేనుడు ఆ దూతతో 'ఓరీ దూతా! సావధానంగా నేను చెప్పేమాటలను వినుము. నేటికి పదమూడవసంవత్సరం ముగిసిన పిమ్మట - మా అరణ్యావాసం, అజ్ఞాతవాసం ముగిసిన తరువాత - పాండవుల అన్నగారు ధర్మనందనుడు పిలువకుండానే తాను కావించే యుద్ధయజ్ఞంలో ధృతరాష్ట్రుడి నూరుమంది కొడుకులను యజ్ఞపశువులను చేసి తన శస్త్రాస్త్రాలనే అగ్నిలో వేల్చడానికి వస్తాడు. ఆ యుద్ధ యజ్ఞం జరిగేటప్పుడే మేం రాగలం. అంతవరకు ఊరక అచటికి రాజాలమని నీవు జంకకుండా సుస్పష్టంగా దుర్యోధనుడితో చెప్పుము' అని గర్జించాడు. ఆ దూత తిరిగి వెళ్లి, ధర్మరాజు పలికిన సామవాక్యాలను, భీముడి పరుషమైన మాటలను ధృతరాష్ట్రుడికొడుకులకు వివరించి చెప్పాడు. అటు పిమ్మట.

**క. చనుదెంచిరి కౌరవశా । సనమున ధరణిఁ గల నిఖిల జనపతులును స**
**న్మునులును సమస్తజనులును । ఘనభుజుజన్నంబుఁ జూడఁ గరిపురమునకున్. 83**

**ప్రతిపదార్థం:** కౌరవశాసనమునన్= కురువంశంలోనివాడైన దుర్యోధనుడి ఆజ్ఞ మేరకు; ధరణిన్+కల= భూమిపై ఉన్న; నిఖిల జనపతులును= అందరు రాజులును; సత్+మునులును= ఉత్తములైన ఋషులున్నూ; సమస్త, జనులును= అందరు ప్రజలున్నూ; కరిపురమునకున్= హస్తినాపురికి; ఘనభుజు జన్నంబున్= గొప్పపరాక్రమం కలవాడైన దుర్యోధనుడి యజ్ఞాన్ని; చూడన్= సందర్శించటం కొరకై; చనుదెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** దుర్యోధనుడిశాసనంమేరకు, భూమిలోని రాజులు అందరు, ప్రజలు అందరు, గొప్పఋషులు అతడు చేస్తున్న యజ్ఞాన్ని సందర్శించటానికై వచ్చారు.

**వ. వారి కెల్లను దగిన సత్కారంబులు సేయను బాత్రదానంబులు గావింపను ధృతరాష్ట్రుండు విదురుం బనిచె; నివ్విధంబునఁ బ్రసిద్ధ దక్షిణాన్వితంబై ప్రభూతాన్నపానసంతర్పిత సకలజనంబై యభిమతాంబరాభరణ పరిపూజిత భూసురప్రకరంబై యథాకాలవిహితకర్మకలాపంబై యథాశాస్త్రీయంబై వైష్ణవయాగంబు నిర్విఘ్నంబుగఁ బరిసమాప్తం బగుటయు. 84**

**ప్రతిపదార్థం:** వారికిన్+ఎల్లను= యాగానికి వచ్చినవారందరికీ; తగిన, సత్కారంబులు+చేయను= ఉచితమైనమర్యాదలను కావించటానికి; పాత్రదానంబులు= అర్హతనుపట్టి దానాలు; కావింపను= చేయటానికి; ధృతరాష్ట్రుండు; విదురున్= విదురుడిని; పనిచెన్= నియోగించాడు; ఈ+విధంబునన్= ఈరీతిగా; ప్రసిద్ధ, దక్షిణ+అన్వితంబు+ఐ= కీర్తికి ఎక్కిన దక్షిణలతో కూడింది అయి (దక్షిణ= పండితులైన బ్రాహ్మణులకు బహుమానంగా సమర్పించబడే ధనం); ప్రభూత+అన్న, పాన, సంతర్పిత, సకల, జనంబు+ఐ= విరివిగా అన్నపానీయాలు సమకూర్చబడటంచేత సంతృప్తిచెందిన ప్రజలు కలదై; అభిమత+అంబర+ఆభరణ, పరిపూజిత, భూసుర, ప్రకరంబు+ఐ= కోరిన వస్త్రాలచేత, భూషణాలచేత బాగుగా సమ్మానించబడిన బ్రాహ్మణుల సముదాయం కలదై; యథా, కాల, విహిత, కర్మ కలాపంబు+ఐ= ఏసమయానికి ఏయేపనులు జరుగవలెనని శాస్త్రాలు నిర్దేశించాయో అట్లే జరిగిన అన్ని పనులు కలదై; యథాశాస్త్రీయంబు+ఐ= శాస్త్రం నిర్దేశించిన విధులను అనుసరించినది అయి; వైష్ణవయాగంబు= వైష్ణవయజ్ఞం; నిర్విఘ్నంబుగాన్= ఎట్టి ఆటంకాలు లేకుండా; పరిసమాప్తంబు+అగుటయున్= పూర్తిగా ముగిసినది కాగా.

**తాత్పర్యం:** ఆ యజ్ఞానికి విచ్చేసినవారికి సమ్మానంచేయటానికి, అర్హతలను బట్టి దానాలు ఇవ్వటానికి ధృతరాష్ట్రుడు విదురుడిని నియోగించాడు. ఈవిధంగా ఆ యాగానికి గొప్పపేరుప్రతిష్ఠలు కలిగాయి. అందులో బ్రాహ్మణులకు పుష్కలంగా దక్షిణలు లభించాయి. గొప్ప అన్నదానం జరిగింది. ప్రజలకు అందరికి అన్నపానాలు లభించటంచేత వారికి సంతృప్తి కలిగింది. బ్రాహ్మణులకు అందరకు సంతృప్తికరంగా వస్త్రాలు ఆభరణాలు లభించాయి. శాస్త్రంలో చెప్పబడిన విధులు అన్నియు సక్రమంగా సకాలంలో జరిగాయి. కర్మకాండలలో ఎట్టిలోపాలు జరుగలేదు. శాస్త్రవిధ్యుక్త ప్రకారం జరిగిన ఆ వైష్ణవయాగం ఎట్టి ఆటంకాలు లేక ప్రాయశ్చిత్తానికి అక్కరలేకుండా ముగిసింది.

**క. అవభృథశోభితుఁడై కౌ । రవముఖ్యుఁడు భూరికనకరత్నతతుల భూ**
**దివిజులఁ బూజించి నృపుల । వివిధ విధుల సత్కరించి వీడ్కొలిపెఁ దగన్. 85**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యుఁడు= దుర్యోధనుడు; అవభృథశోభితుఁడు+ఐ= యజ్ఞం ముగిసిన పిదప చేసే పవిత్రస్నానంచేత శోభిల్లుతున్నవాడై; భూరి, కనక, రత్న, తతులన్= మిక్కుటమైన బంగారంచేత, రత్నసముదాయాలచేత; భూదివిజులన్= బ్రాహ్మణులను; పూజించి= ఆరాధించి; నృపులన్= రాజులను; వివిధ, విధులన్= పెక్కుతెరగులైన మర్యాదలతో; సత్కరించి= గౌరవించి; తగన్= ఒప్పిదముగా; వీడ్కొలిపెన్= ఆమంత్రణం చేసి, సగౌరవంగా పంపాడు.

**తాత్పర్యం:** యజ్ఞం పూర్తిఅయిన పిదప చేసే పవిత్రస్నానంచేత శోభిల్లినవాడై కౌరవనాయకు డైన దుర్యోధనుడు బ్రాహ్మణులకు పసిడినాణేలను రత్నమాణిక్యాలను పెక్కు బహూకరించి పూజించాడు. యజ్ఞానికి విచ్చేసిన రాజులను అందరను సమ్మానించి అనేకమర్యాదలు చేసి వారివారిదేశాలకు సగౌరవంగా సాగనంపాడు.

**వ. అట్టియెడ నధ్వరోత్సవాగతు లైన జను లనేకులు ధృతరాష్ట్రనందను సమ్ముఖంబున ని ట్లనిరి. 86**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆసమయంలో; అధ్వర+ఉత్సవ+ఆగతులు+ఐన= యజ్ఞమనేపండుగను చూడటానికై వచ్చినవారైన; జనులు= ప్రజలు; అనేకులు= పలువురు; ధృతరాష్ట్రనందను సమ్ముఖంబునన్= ధృతరాష్ట్రుడి కొడుకైన దుర్యోధనుడి ఎదుట; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** ఆసమయంలో యజ్ఞాన్ని సందర్శించటానికి ఏతెంచిన ప్రజలు పలువురు ధృతరాష్ట్రుడికుమారు డైన దుర్యోధనుడిని ఈవిధంగా అభినందించారు.

**క. 'జనపతు లెవ్వరు నివ్విధ । మున నిర్విఘ్నముగ నఖిలభూజనసమ్మో**
**దనముగఁ జేసిరె సత్క్రతు । వనఘ! భవత్పుణ్యమహిమ లాశ్చర్య మిలన్. 87**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడైనవాడా, ఓదుర్యోధనా!; జనపతులు+ఎవ్వరున్= రాజులు ఎవ్వరు గాని; ఈ+విధమునన్= ఈరీతిగా; నిర్విఘ్నముగన్= ఎట్టి ఆటంకాలు లేకుండగా; అఖిల, భూ, జన, సమ్మోదనముగన్= భూమియందలి ప్రజలు అందరికిని సంప్రీతి కలిగేటట్లుగా; సత్+క్రతువు= మంచి జన్నం; చేసిరి+ఎ= సలిపి ఉండిరా; భవత్+పుణ్య, మహిమలు= నీయొక్క సుకృతానికి సంబంధించిన గొప్పప్రభావాలు; ఇలన్= భూమియందు; ఆశ్చర్యము= అచ్చెరువు కలిగిస్తున్నవి.

**తాత్పర్యం:** 'ఓదుర్యోధనా! నీవు గొప్పపుణ్యాత్ముడవు; ఎట్టి లోటుపాటులు లేకుండా, ఎట్టి దొసగులు దొరలకుండా భూమియందలి ప్రజలందరు సంతోషించేటట్లుగా ఇంతగొప్ప జన్నాన్ని ఇంత ఘనంగా మున్ను ఎవరును చేసి ఉండలేదు. నీ పుణ్యమహిమలు అచ్చెరువు కలిగిస్తున్నవి.

**శా. సారోదారవిభూతిమై మును హరిశ్చంద్రుం డొనర్చెం గ్రియా**
**పారీణుండయి రాజసూయ; మది సెప్పన్ వింటి; మయ్యజ్ఞముం**
**గౌరవ్యోత్తముఁ డైన ధర్మసుతుఁడుం గావింపగాఁ గంటి; మే**
**మా రెండున్ సరిగావు నీమఖముతో నత్యున్నతిన్ భూవరా! 88**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా, దుర్యోధనా!; మును= పూర్వకాలంలో; హరిశ్చంద్రుండు= హరిశ్చంద్రుడు; సార+ఉదార, విభూతిమైన్= దట్టమైన గొప్పదైన ఐశ్వర్యంచొప్పున; క్రియాపారీణుండు+అయి= అనుష్ఠానంలో నేర్పు కలవాడై; రాజసూయము= రాజసూయం (అనేయాగం); ఒనర్చెన్= చేశాడు; అది+చెప్పన్= దానినిగూర్చి పలుకగా; వింటిమి= విన్నాం; ఆ+యజ్ఞమున్= ఆ జన్నమున్నూ; కౌరవ్య+ఉత్తముఁడు+ఐన= కౌరవవంశానికి చెందినవారిలో గొప్పవాడైన; ధర్మసుతుఁడున్= ధర్మనందనుడు కూడ; కావింపఁగాన్= చేయగా; కంటిమి= చూచాం; ఏము= మేము; ఆ రెండున్= ఆరెండును (హరిశ్చంద్రుడు చేసిన రాజసూయయాగం ధర్మరాజు చేసిన రాజసూయం); నీమఖముతోన్= నీవు చేసిన జన్నంతో (వైష్ణవయాగంతో); అతి+ఉన్నతిన్= మిక్కిలి గొప్పతనంలో; సరి, కావు= సమానం కావు.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనమహారాజా! ఎప్పుడో పూర్వకాలంలో అష్టైశ్వర్యాలతో తులతూగే హరిశ్చంద్రుడు అనుష్ఠానవేదాంతిఅయి రాజసూయయాగాన్ని వైభవోపేతంగా నిర్వహించాడని విని ఉన్నాం. ఈ మధ్య కౌరవకులీనుడైన ధర్మనందనుడు ఆ రాజసూయయాగాన్ని సల్పటం కనులార చూచి ఉన్నాం. కాని, వైభవంలో ఆరెండు యజ్ఞాలున్నూ నీవు చేసిన వైష్ణవయాగానికి సాటిరావు.

**క. ఈ జన్న మొనర్చియకా । దే జగదావర్తకీర్తి దీపితులై య**
**వ్యాజసురలోకసుఖముల । భ్రాజిల్లిరి రఘు యయాతి భరతాది నృపుల్'. 89**

**ప్రతిపదార్థం:** రఘు, యయాతి, భరత+ఆది, నృపుల్= రఘువు, యయాతి, భరతుడు మున్నగురాజులు; ఈ జన్నము= ఈ యాగం; ఒనర్చి+అ+కాదే= చేయటంచేత మాత్రమే కదా; జగత్+ఆవర్త, కీర్తి, దీపితులు+ఐ= లోకంలో సుడితిరిగిన యశస్సుచేత వెలుగొందినవారై; అవ్యాజ, సురలోక సుఖములన్= సహజమైన స్వర్గలోకసౌఖ్యాలతో; భ్రాజిల్లిరి= శోభిల్లారు.

**తాత్పర్యం:** పూర్వం ఈయజ్ఞం చేయటంవల్లనే కదా రఘువు, యయాతి, భరతుడు మున్నగు రాజులు లోకాలచుట్టూ వ్యాపించిన గొప్పయశస్సుచేత వెలుగొందారు. అందుచేతనే కదా వారికి శాశ్వత మైన స్వర్గలోకసౌఖ్యాలు సంప్రాప్తించాయి.

**తే. అని నుతింపంగ మఱియును నంద కొంద । ఱయ్యుధిష్ఠిరు రాజసూయంబు చిదుర**
**పాలుఁ బోల దీమఖము వైభవసమృద్ధి । నని తలంచిరి నిజహృదయంబులందు. 90**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; నుతింపంగన్= ప్రస్తుతించగా; మఱియును= వెండియును; అందున్+అ= అందే (వారిలోనే); కొందఱు= కొంతమంది; వైభవ, సమృద్ధిన్= సంపదయొక్క అతిశయంలో; ఈ మఖము= ఈ యజ్ఞం (దుర్యోధనుడు చేసిన వైష్ణవయాగం); ఆ+యుధిష్ఠిరు= ఆ ధర్మరాజుయొక్క; రాజసూయంబు= రాజసూయంయొక్క; చిదురపాలున్= సూక్ష్మఖండం అయిన భాగాన్ని; పోలదు= సరికాదు; అని= అంటూ; నిజహృదయంబులందున్= తమడెందాలలో; తలంచిరి= భావించారు.

**తాత్పర్యం:** అని కొందరు ప్రస్తుతించారు. కాని వారిలో మఱికొందరుమాత్రం - ధర్మరాజు చేసిన రాజసూయయాగంతో పోలిస్తే ఐశ్వర్యాతిశయంలో దుర్యోధనుడు చేసిన ఈ యజ్ఞం ఒక అణువుతో గూడ సరిపోలదు- అని తమ హృదయాలలో తలపోశారు.

**వ. అనంతరంబ నిరంతరానందమందమందాయమానమానసుం డగుచు మానవేశ్వరుండు దమ్ములు దొరలు బంధుజనంబులుం బరివేష్టింపఁ బౌరజనదత్తాశీర్వాద జయజయశబ్ద శబ్దాయమాన దిగ్విభాగుం డగుచుఁ బుణ్యాంగనా కరకలిత లలితాక్షతవిక్షేపంబులును, బటువందిమాగధ సంకీర్తనంబులును గైకొనుచుఁ బురప్రవేశంబు సేసి, రాజమందిరగతుండై ధృతరాష్ట్రునకు గాంధారికిఁ గృపద్రోణభీష్ములకుం బ్రణమిల్లి యుల్లంబు వికసిల్లఁ గనకాసనాసీనుండయ్యెఁ; నప్పుడు కర్ణుం డతని కి ట్లనియె. 91**

**ప్రతిపదార్థం:** అనంతరంబు+అ= తరువాతనే; మానవ+ఈశ్వరుండు= రాజు(దుర్యోధనుడు); నిరంతర+ఆనంద, మంద, మందాయ మాన మానసుండు+అగుచున్= ఎడతెగని సంతోషంచేత మెత్తమెత్తనైన మనస్సు కలవాడౌతూ; తమ్ములు= అనుజులు; దొరలు= సామంతులు, బంధు జనంబులున్= పలువురు చుట్టాలును; పరివేష్టింపన్= చుట్టూ చేరి కొలువ; పౌరజనదత్త+ఆశీర్వాద, జయ, జయ, శబ్ద, శబ్దాయమాన, దిక్+విభాగుండు+అగుచున్= పురంలో నివసించే పలువురు ప్రజలచేత ఇవ్వబడిన దీవనలు, జయజయ అనే నాదాలచేత నినదిస్తున్న దిక్కులయొక్క విభాగాలు కలవాడు ఔతూ; పుణ్య+అంగనా, కర, కలిత, లలిత+అక్షత, విక్షేపంబులును= ముత్తయిదువులయొక్క చేతులలోకూడిన మనోహరాలైన సేసల జల్లులను; పటు, వంది, మాగధ, సంకీర్తనంబులును= ప్రశస్తమైన వందులు మాగధులు గానంచేసే పాటలును; కైకొనుచున్= గ్రహిస్తూ; పురప్రవేశంబు+చేసి= నగరంలో చొచ్చి; రాజ, మందిర, గతుండు+ఐ= రాజు నివసించే భవనానికి వెళ్లినవాడై; ధృతరాష్ట్రునకున్ (తండ్రికి); గాంధారికిన్= (తల్లికి); కృప, ద్రోణ, భీష్ములకున్= కృపుడికి, ద్రోణుడికి, భీష్మునకు; ప్రణమిల్లి= నమస్కరించి; ఉల్లంబు= మనస్సు; వికసిల్లన్= వికసించగా; కనక+ఆసన+ఆసీనుండు+అయ్యెన్= పసిడిగద్దియపై కూర్చొన్నాడు; అపుడు= ఆసమయంలో; కర్ణుండు; అతనికిన్= దుర్యోధనుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** పిమ్మట సంతోషంచేత స్నిగ్ధమయిన చిత్తంతో దుర్యోధనుడు తమ్ములు దొరలు చుట్టాలు పలువురు తనచుట్టూ చేరి కొలువ, హస్తినాపురాన్ని రాచఠీవితో ప్రవేశించాడు. పౌరుల జయజయనినాదాలతో దిక్కులు మారుమ్రోగాయి. పుణ్యవనితలు తమ సుకుమారహస్తాలతో సేసలు చల్లారు. వందిమాగధులు ప్రశంసలు చదివి కీర్తించారు. దుర్యోధనుడు రాజప్రాసాదాన్ని చేరి తలిదండ్రులైన గాంధారికి ధృతరాష్ట్రుడికి నమస్కరించాడు. గురువులైన

కృపాచార్యులకు ద్రోణాచార్యులకు అభివాదం చేశాడు. పితామహుడైన భీష్ముడికి వందన మాచరించాడు. ఆవిధంగా సంతోష తన్మయత్వంతో పసిడిగద్దియపై ఆసీనుడయిన దుర్యోధనుడితో కర్ణుడు ఈవిధంగా పలికాడు.

**ఉ. 'భాగ్యము గాదె కౌరవనృపాల! భవన్మఖ మిష్టసత్క్రియా**
**యోగ్యత నిర్వికల్పముగ నొందె సమాప్తి; నశేషధాత్రియున్**
**భోగ్యమ నీకు; నింక రణభూమిఁ బృథాసుతులన్ జయించి స**
**మ్యగ్యమశాలివై భువనమాన్య! యొనర్పుము రాజసూయమున్. 92**

**ప్రతిపదార్థం:** కౌరవనృపాల!= కురవంశానికి చెందినరాజా! దుర్యోధనా!; భాగ్యము+కాదే= ఎంతటి అదృష్టమో కదా; భవత్+మఖము= నీయొక్కయజ్ఞం; ఇష్ట+సత్+క్రియా; యోగ్యతన్= ఇంపైన మంచిపనుల కలయికచేత; నిర్వికల్పముగన్= ఎట్టిఅవరోధాలు లేకుండా; సమాప్తిన్+ఒందెన్= ముగిసింది; నీకున్; అశేషధాత్రియున్= సమస్తభూమియును; భోగ్యము+అ= అనుభవించ దగిందే సుమా; ఇంకన్= ఇకమీద; భువనమాన్య!= లోకంచేత ఆరాధింపదగినవాడా, ఓదుర్యోధన మహారాజా! రణభూమిన్= యుద్ధరంగంలో; పృథాసుతులన్= కుంతికొడుకులను (పాండవులను); జయించి= గెలిచి; సమ్యక్+యమశాలివి+ఐ= సముచిత మైన నియమము కలవాడవు అయి; రాజసూయమున్= రాజసూయం (అనేయజ్ఞాన్ని); ఒనర్పుము= చేయుము.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనమహారాజా! నీవు వైష్ణవయాగాన్ని అనుకొన్నరీతిగా, శాస్త్రోక్తంగా ఎట్టి ప్రాయశ్చిత్తాలూ అక్కరలేకుండా జగజ్జేగీయమానంగా నిర్వహించావు. ఆహా! నీవు ఎంతటి అదృష్టవంతుడివి! ఇక యుద్ధరంగంలో పాండునందనులను జయించి భువనమాన్యుడవై రాజసూయయాగాన్ని నియమంతో చేయుము.

**విశేషం:** 1. సమ్యగ్యమశాలి: సముచితమైన - 'యమము' కలవాడు. 'యమం' అష్టాంగాలలో ఒకటి. 1. యమం 2. నియమం 3. ప్రాణాయామం 4. ప్రత్యాహారం 5. ధ్యానం 6. ధారణ 7. మననం 8. సమాధి. యమం దశవిధం : 1. సత్యం 2. దయ 3. క్షమ 4. ధృతి 5. మితాహారం 6. ఆర్జవం 7. బ్రహ్మచర్యం 8. అస్తేయం 9. అహింస 10. శౌచం.

**క. అది యెమ్మెయి నగునో యని । మదిలో వగవంగవలదు; మఘవతనూజుం**
**గదనంబునఁ జంపక యే । పదనఖధావన మొనర్పఁ బార్థివముఖ్యా!' 93**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= రాజులలో శ్రేష్ఠుడవైనవాడా! ఓదుర్యోధనమహారాజా!; అది= పాండవులను యుద్ధంలో జయించటం; ఏ+మెయిన్= ఏరీతిగా; అగునో+అని= జరుగునో అని; మదిలోన్= మనస్సులో; వగవంగన్‌వలదు= విచారించవద్దు; మఘవతనూజున్= ఇంద్రుడికుమారుడిని- అర్జునుడిని; కదనంబునన్= యుద్ధంలో; చంపక= సంహరించకుండా; ఏన్= నేను; పద, నఖ, ధావనమున్= కాళ్లకు ఉన్నగోళ్లయొక్క శుద్ధిని, ఒనర్పన్= చేయను.

**తాత్పర్యం:** రాజరాజు వయిన ఓదుర్యోధనసార్వభౌమా! యుద్ధంలో పాండవులను జయించటం ఏవిధంగా జరుగుతుందో అని నీవు నీమనస్సులో చింతించబోకుము. నేను రణరంగంలో దేవేంద్రుడికొడుకు అయిన అర్జునుని సంహరించగలను. అంతవరకు, నేను నాకాళ్ళగోళ్లు కడుగుకొన నని శపథం చేస్తున్నాను.'

**విశేషం:** 'గదనమున నే జయింపన్' - అనే పాఠాంతరం కొన్ని ప్రతులలో కానవస్తున్నది.

**తే. అనినఁ గర్ణుఁ గౌఁగిటఁ జేర్చి యన్నరేంద్ర । నందనుఁడు 'నీ సహాయత నాకుఁ గలుగఁ**
**బాండవుల నోర్చు టెంతటి పని మహాత్మ!' । యని సహోదరసహితుఁడై హర్ష మొందె. 94**

**ప్రతిపదార్థం:** అనినన్= అని కర్ణుడు ప్రతిజ్ఞ చేయగా; ఆ+నర+ఇంద్ర, నందనుఁడు= ఆ రాజపుత్రుడు (దుర్యోధనుడు); కర్ణున్= కర్ణుడిని; కౌఁగిటన్+చేర్చి= ఆలింగనంచేసి; నీసహాయత= (ఓ కర్ణా) నీయొక్క సాయం; నాకున్= నాకు (దుర్యోధనుడికి); కలుగన్= ఉండగా; పాండవులన్= పాండునందనులను; ఓర్చుట= జయించటం; ఎంతటి పని?= ఎంత పని - మహా+ఆత్మ!= ఓ మహానుభావుడా, కర్ణ! అంటే మిక్కిలి సులువైన కార్యం సుమా; అని= అని చెప్పి; సహోదర, సహితుఁడు+ఐ= సోదరులతో పాటుగ; హర్షమున్+ఒందెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** అని కర్ణుడు ప్రతిజ్ఞ చేశాడు. అంతట దుర్యోధనుడు కర్ణుడిని ఆలింగనం చేసికొని 'మహాత్ముడవైన ఓ కర్ణా! నాకు నీ సాయం ఉండగా పాండవులను జయించటం ఏమంత కష్టమైన కార్యం కాదు సుమా' అని చెప్పి సోదరులతో పాటు సంతోషించాడు.

**వ. అట ధర్మతనయుండు సూతతనయు ప్రతిజ్ఞ విని వాని బలశౌర్యవిభవంబును నభేద్యకవచ ప్రభావంబును దలంచి విషణ్ణహృదయుం డై రేయెల్లను గన్ను మూయుట లేక వగచుచుండె; నిట దుర్యోధనుండునుం గర్ణసౌబలప్రవర్తిత కార్యఖడ్గుం డై భీష్మద్రోణకృపాదులకును మహనీయు లైన మహీసురులకు ననుదినంబును బ్రియ సత్కారంబులు సలుపుచు ధనంబు దత్తభుక్తఫలంబుగా వగచి, నిరంతర త్యాగ భోగంబుల ననురాగంబు నొందుచుండె ననిన' వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె. 95**

**ప్రతిపదార్థం:** అటన్= అచట (ద్వైతవనంలో); ధర్మతనయుండు= ధర్మసుతుడు; సూతతనయు ప్రతిజ్ఞ= సూతునికొడుకు (కర్ణుడి) యొక్క శపథం; విని= ఆలకించి; వాని= అతడియొక్క - కర్ణుడి యొక్క; బలశౌర్యవిభవంబును= బలం పరాక్రమం అనే సంపదను; అభేద్య, కవచ, ప్రభావంబును= భేదించుటకు వీలుగాని తనుత్రాణంయొక్క మహిమను; తలంచి= స్మరించి; విషణ్ణ, హృదయుండు+ఐ= దుఃఖంతో నిండిన డెందం కలవాడై; రే+ఎల్లను= రాత్రి అంతయును; కన్ను= నేత్రం; మూయుట= నిమీలించటం; లేక= లేకుండగా; (నిదురమాని); వగచుచుండెన్= దుఃఖిస్తూ ఉన్నాడు; ఇటన్= ఇచట (హస్తినాపురంలో); దుర్యోధనుండునున్= సుయోధనుడును; కర్ణ, సౌబల, ప్రవర్తిత, కార్య, ఖడ్గుండు+ఐ= కర్ణుడిచేత శకునిచేత నడపబడిన కార్యం, ఖడ్గం కలవాడై (సంధివిగ్రహాలు కలవాడై); భీష్మ, ద్రోణ, కృప+ఆదులకును= భీష్ముడు కృపుడు ద్రోణుడు మున్నగు వారలకును; మహనీయులు+ఐన= మహానుభావులు అయిన, మహీసురులకున్= బ్రాహ్మణులకు; అనుదినంబును= నిత్యమున్నూ; ప్రియ, సత్కారంబులు= ఇష్టమైన సమ్మానాలు; సలుపుచున్= చేస్తూ; ధనంబు= డబ్బు; దత్తభుక్తఫలంబు+కాన్= ఇచ్చుట తినుట ప్రయోజనలుగా గలది యని; వగచి= యోచించి; నిరంతర, త్యాగభోగంబులన్= ఎల్లప్పుడును ఇతరులకు ఇవ్వటం తాను అనుభవించటంలో; అనురాగంబున్= ప్రేమడిని; ఒందుచుండెన్= సంపాదిస్తూ ఉన్నాడు; అనినన్= అని చెప్పగా; వైశంపాయనునకున్; జనమేజయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అక్కడ - ద్వైతవనంలో ధర్మరాజు కర్ణుడి ప్రతిజ్ఞ విని భయపడ్డాడు. కర్ణుడి సహజకవచకుండలాలను అభేద్యకవచాన్ని, అతడి పరాక్రమాన్నీ స్మరించి ధర్మరాజు నిదురించలేకపోయాడు. ఇక్కడ - హస్తినాపురంలో దుర్యోధనుడు కర్ణశకునుల మాటలు వింటూ, వారు చెప్పిన విధంగా రాజకార్యాలను సంధివిగ్రహాలను నెరపుతున్నాడు. అంతేకాక, దుర్యోధనుడు భీష్మద్రోణకృపాదులయెడల, బ్రాహ్మణోత్తములయెడ భక్తి ప్రపత్తులు చూపుతున్నాడు. తనకు సంక్రమించిన ఐశ్వర్యాన్ని దొరికిన పండును అనుభవిస్తున్నట్లుగా భావించి, తాను భోగాలను అనుభవిస్తూ, సహచరులకు తనసంపద పంచిపెట్టుతూ, త్యాగం భోగం మేళవించి బ్రదుకుతూ, అందరి అనురాగాన్నీ పొందుతున్నాడని గడచినకథ వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు సర్పయాగ సందర్భంలో వివరించి చెప్పాడు. అంతట జనమేజయుడు ఈ విధంగా వైశంపాయనుడిని ప్రశ్నించాడు.

**విశేషం:** 'కార్యఖడ్గములు' - ఈపద గుంఫనం తిక్కననాడు మిక్కిలి ప్రచారంలో ఉన్నట్టిది. రాజనీతిలోని - సామదానభేదదండోపాయాలలో కార్యం అంటే సామం. ఖడ్గమంటే దండం. నన్నయయుగంనుండి తిక్కన యుగం వరకు మంత్రులు - దండనాథులుగా కూడా ఉన్నారు. 'సంధివిగ్రహపాత్రుడు' - అనే అధికారి ఆ యుగాలలో ప్రాముఖ్యం వహించినటుల సమకాలీన శాసనాలు తెలుపుతున్నవి. తిక్కనకు సమకాలీను డైన గణపతిదేవ చక్రవర్తి కార్యఖడ్గనిపుణుడు, ఖడ్గతిక్కన - గంటం తిక్కన సోదరులు. కవితిక్కన, ఖడ్గతిక్కన ఇరువురును కార్యఖడ్గ నిపుణులే. ఎఱ్ఱన మహాకవికి అనుగుమిత్రుడయిన మల్లారెడ్డి ఖడ్గప్రియుడుమాత్రమే కాదు, కవితాప్రియుడుకూడ. ఈ సంప్రదాయం తెలుగునేలపై చిరకాలం వర్ధిల్లింది. శ్రీకృష్ణదేవరాయల కాలంలో పరాకాష్ఠ నందింది. శ్రీకృష్ణదేవరాయలు కవికాలికి గండపెండేరం (వీరుడికి తొడిగేది అందె; గండడు= వీరుడు) తొడిగాడు; శ్రీకృష్ణదేవరాయలు కార్యఖడ్గనిపుణులలో మేరుపూస. తాను 'సాహితీ సమరాంగణ సార్వభౌముడను' అని చాటుకొన్నాడు. కలం, కత్తి తెలుగు సంస్కృతిని చిరకాలం 'పడుగు' - 'పేక' పేనినవి.

**క. 'దుర్యోధను చెఱఁ దలిఁగి య । వార్యపరాక్రములు పాండవప్రభులు మహా**
**శ్చర్యచరితు లవ్వనమున । నార్యులు మఱి యెట్టివార లైరి మునీంద్రా!' 96**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రా!= ఋషులలో శ్రేష్ఠుడవైన వాడా! ఓ వైశంపాయనమునీ!; దుర్యోధను చెఱన్= దుర్యోధనుడియొక్క బంధాన్ని; తలిఁగి= పోగొట్టి; అవార్యపరాక్రములు= వారించటానికి శక్యంగాని శౌర్యం కలవారు; మహా+ఆశ్చర్య, చరితులు= మిక్కిలి అచ్చెరువు కొలిపే నడవడి కలవారు; ఆర్యులు= పూజించదగినవారు; పాండవ ప్రభులు= రాజులు అయిన పాండవులు; ఆ+వనమునన్= ఆ అడవిలో; మఱి= వెండియు; ఎట్టివారలు= ఎటువంటి వారు; ఐరి= అయినారు.

**తాత్పర్యం:** 'ఓ వైశంపాయన మహర్షీ! పాండవులు ఎదురులేని పరాక్రమం కలవారు. వారు దుర్యోధనుడికి బంధమోక్షం చేసిన పిదప ఆ అడవిలో ఏవిధంగా ప్రవర్తించారు. వారు మాననీయులు. వారిచరిత్ర ఆశ్చర్యకరమైనది. ఇంకను వారు ఏవిధంగా తమ జీవితాలను తీర్చిదిద్దుకొన్నారో వినవలెనని కుతూహలంగా ఉన్నది. దయచేసి వినిపించుము.

**ద్వైతవనంబునందలి మృగసమూహము ధర్మజు స్వప్నంబునందు వచ్చి తమదుఃఖంబు సెప్పుట (సం. 3-244-2)**

**వ. అని యడిగిన నమ్మహాముని యమ్మహీపతి కి ట్లనియె. 97**

**తాత్పర్యం:** అని అడుగగా ఆ గొప్పఋషి అయిన వైశంపాయనుడు రాజైన జనమేజయుడితో ఈవిధంగా అన్నాడు.

**సీ. 'ద్వైతవనంబున ధర్మజుం డొకనాఁడు । నిద్రింపఁగాఁ దద్వనేచరంబు**
**లగునట్టి మృగజాతు లన్నియుఁ గలలోన । వచ్చి కన్నుల నశ్రువారి దొరుఁగఁ**
**ద మ్మెఱింగించి యాతనితోడ నిట్లను । 'ధర్మాత్మ! మీరు నిత్యంబుఁ గడఁగి**
**చంపంగఁ జంపంగ సమసి యల్పావశి । ష్టము లయ్యె నిప్పు డస్మత్కులంబు**

**తే. లేము బీజమాత్రమ దక్కి యిట్లు వనరు । చున్నవారము; మీ రింక నొండు గడకు**
**నరిగి, మముఁ గావరే కరుణార్ద్రబుద్ధి' । ననిన నట్లకా కని వాని కభయ మిచ్చి. 98**

**ప్రతిపదార్థం:** ధర్మజుండు; ద్వైతవనంబునన్= ద్వైతమనే పేరు గల అడవిలో; ఒకనాఁడు; నిద్రింపఁగాన్= నిద్రపోగా; తద్+ వనేచరంబులు= ఆ అడవిలో తిరుగాడే జంతువులు; అగునట్టి= అయినట్టి; మృగజాతులు+అన్నియున్= జంతువిశేషాలు అన్నియును; కలలోన వచ్చి= స్వప్నంలో వచ్చి; కన్నులన్= నేత్రాలలో; అశ్రువారి= కన్నీరు; తొరుఁగన్= జారగా; తమ్ముఁన్+ఎఱింగించి= తమను తెలియ చెప్పుకొని; ఆతనితోడన్= ధర్మరాజుతో; ఇట్లు+అనున్= ఈవిధంగా పలికాయి; ధర్మ+ఆత్మ!= మీరు= మీరు (పాండవులు); నిత్యంబున్= ప్రతిదినం; కడఁగి= పూని; చంపంగన్+చంపంగన్= పలుమారులు చంపగా; సమసి= చచ్చి; అల్ప+అవశిష్టములు+అయ్యెన్= కొద్దిగా మాత్రమే మిగిలినట్టివి అయినవి; ఇప్పుడు= ఈ సమయంలో; అస్మత్+ కులంబులు= మా జాతులు; ఏము= మేము; బీజమాత్రమ+తక్కి= విత్తనానికి మాత్రం మిగిలిఉండి; ఇట్లు= ఈ రీతిగా; వనరుచున్నవారము= వెతచెందుతున్నాం; మీరు= పాండవులైనమీరు; ఇంకన్= ఇకమీద; ఒండు+కడకున్= వేరొకచోటికి; అరిగి= వెడలి; మమున్= మమ్ము; కరుణా+ఆర్ద్ర, బుద్ధిన్= దయతో తడిసిన చిత్తంతో; కావరే?= రక్షించరా?; అనినన్= అని చెప్పగా; అట్లు+అ, కాక+అని= సరే ఆ విధంగానే జరుగుగాక అనిచెప్పి; వానికిన్= ఆ జంతువులకు; అభయము+ఇచ్చి= కాపాడటానికి మాట ఇచ్చి.

**తాత్పర్యం:** అని జనమేజయుడు ప్రశ్నించాడు. అంతట వైశంపాయనమహర్షి ఇట్లా జనమేజయుడికి బదులు పలికాడు. ద్వైతవనంలో ఒకనాడు ధర్మనందనుడు నిద్రిస్తూ ఉండగా ఆతడికి స్వప్నంలో ఆ అడవిలో నివసించే జంతుజాలాలు కన్పించి, 'పుణ్యాత్మా! మీరు నిత్యం వేటాడి మమ్ములను చంపటంచేత మా సంఖ్య నానాటికి క్షీణించింది. ఇప్పుడు మా జాతులు బీజప్రాయంగా మాత్రమే మిగిలిఉన్నాయి. మీరు జాలిగుండె కలవారుకదా! మా వంశాలు అంతరించిపోవకముందే మీరు వేరొకచోటికి పోతే మేము బ్రదుకగలం' అని విన్నవించాయి. ధర్మరాజు ఆ మృగసంతతిపై కరుణపూని వాటికి అభయమిచ్చాడు.

**క. జనపతి మేల్కొని యంతయు । ననుజుల కెఱిఁగించి యిట్టు లను 'నబ్దముపై**
**నెనిమిది నెల లుండితి మి । వ్వనమునఁ; దగు నింక నొండువలనికిఁ బోవన్. 99**

**ప్రతిపదార్థం:** జనపతి= రాజు (ధర్మరాజు); మేల్కొని= నిద్రనుండి లేచి; అంతయున్= (తనస్వప్నవృత్తాంతాన్ని) అంతటిని; అనుజులకున్= తమ్ములకు; ఎఱిఁగించి= తెలిపి; ఇట్టులు+అనున్= ఈ విధంగా పలికాడు; అబ్దముపైన్= సంవత్సరంపై; ఎనిమిది నెలలు= అష్టమాసాలు; ఈ+వనమునన్= ఈఅడవిలో; ఉండితిమి= (ఈ ద్వైతవనంలో) నివసించాం; ఇంకన్= ఇకమీద; ఒండువలనికిన్= వేరొక చోటికి; పోవన్= వెళ్ళటం; తగున్= ఉచితమౌతుంది.

**తాత్పర్యం:** ధర్మరాజు నిదురమేల్కొని తనతమ్ములతో ఈ విధంగా చెప్పాడు; 'మనం ఈద్వైతవనానికి వచ్చి ఒకసంవత్సరంమీద ఎనిమిది నెలలు గడిచాయి. ఇంకొకచోటికి పోవటం ఉచితం.

**వ. ఇప్పుడు కామ్యక వనంబు బహుమృగాకీర్ణంబై సరసఫలభరిత భూరుహప్రకరంబై విమలకమలా కరాభిరామంబై యున్న యది యని వింటిమి గ్రమ్మఱ గావునం నందులకుం జని తృణబిందునాశ్రమంబున వసియించుటలెస్స' యనినం దమ్ములు 'దేవా! నీ వెట్లు నిశ్చయించితి మాకు నదియ యిష్టం' బని పలికిరి; తదనంతరంబ. 100**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు= ఈసమయంలో; కామ్యకవనంబు= కామ్యకం అనే పేరు కల అడవి; బహు, మృగ+అకీర్ణంబు+ఐ= పెక్కు జంతువులతో దట్టమైనదై; సరస, ఫల, భరిత, భూరుహ, ప్రకరంబు+ఐ= మంచి పండ్లతో నిండిన చెట్లసముదాయం

కలదై; విమల, కమల+ఆకర+అభిరామంబు+ఐ= స్వచ్ఛమైన సరోవరాలచేత అందమైనదై; ఉన్న+అది= ఉన్నది; అని= అంటూ; వింటిమి= ఆలకించాం; కావునన్= కాబట్టి; క్రమ్మఱన్= తిరిగి; అందులకున్= ఆ అడవికి; చని= వెడలి; తృణబిందు+ఆశ్రమంబునన్= తృణబిందుమహామునియొక్క ఆశ్రమంలో; వసియించుట= ఉండటం; లెస్స= మంచిది; అనినన్= అని (ధర్మరాజు) చెప్పగా; తమ్ములు= అనుజులు; దేవా!= ప్రభూ!; నీవు+ఎట్లు= నీవు ఏవిధంగా; నిశ్చయించితి(వి)= నిర్ణయించావో; మాకున్; అది+అ= అదియే; ఇష్టంబు= ఇంపైనది; అని+పలికిరి= అని వచించారు; అనంతరంబు+అ= అటు పిమ్మట.

**తాత్పర్యం:** ఈ సమయంలో కామ్యకవనం పెక్కు జంతువులకు నిలయమై ఉన్నది. ఆ వనంలో మంచిపండ్లతో నిండిన చెట్లు పెక్కు ఉన్నాయి. ఆ అడవిలో పలు సరోవరాలు ఉండటంచేత అది మనోహరంగా కన్పిస్తుందని విన్నాను. కావున మనం ఆ అడవికి వెళ్లి అందు కల తృణబిందుమహర్షి ఆశ్రమంలో ఉండటం మంచిది అనిపిస్తున్నది' అని ధర్మరాజు పలికాడు. అంతట అతడి తమ్ములు; 'దేవా! నీ నిర్ణయమే మా నిర్ణయం' అని పలికారు. పిమ్మట.

**క. అనుజన్ములుఁ బాంచాలియు । నను చరవర్గంబు బ్రాహ్మణావలియును దోఁ**
**జనుదేరఁగ సమ్మదమున । ఘనతేజుఁడు సనియెఁ గామ్యకవనంబునకున్. 101**

**ప్రతిపదార్థం:** ఘనతేజుఁడు= గొప్పవర్చస్సు కలవాడు- ధర్మరాజు; కామ్యకవనంబునకున్= కామ్యకం అనే పేరుగల అడవికి; అనుజన్ములున్= తమ్ములున్నూ; పాంచాలియున్= ద్రౌపదియున్నూ; అనుచర, వర్గంబున్= పరివారమున్నూ; బ్రాహ్మణ+ ఆవలియును= విప్రుల సముదాయమున్నూ; తోన్+చనుదేరఁగన్= తోడుగా రాగా; సమ్మదమునన్= సంతోషంతో; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** గొప్పవర్చస్సు కల ధర్మరాజు తనతమ్ములు, ద్రౌపది, సేవకుల సముదాయం బ్రాహ్మణులు పలువురున్నూ తోడుగా బయలుదేరగా కామ్యకవనానికి వెళ్లాడు.

**వ. ఇట్లరిగి యందుఁగృతనివాసులై యవ్వీరులు శాఖఫలమూలంబులంజేసి దేహయాత్రలు నడపుచు నొండొరుల యలజడి సూచి యత్యంతదుఃఖపరవశు లగుచు, జూదంబునాఁడు దమపడినపాట్లు దలంచి కలంగుచుఁ గ్రోధశోకంబులు దమలోన నుపశమించుకొనుచు వర్తిల్లం, బదునొక్కండగు నేఁడు సనిన నందఱుం గాలంబు గడగాంచినవారలై వెడవెడ వికసిల్లిన చిత్తంబులతో నుచితవృత్తంబుల నుండునంత.102**

**ప్రతిపదార్థం:** ఆ+వీరులు; ఇట్లు+అరిగి= ఈవిధంగా వెడలి; అందున్= ఆ కామ్యకవనంలో; కృతనివాసులు+ఐ= ఏర్పరచుకొన్న నివాసాలు కలవారై; శాక, ఫల, మూలంబులన్+చేసి= కాయగూరలు, పండ్లు, వేళ్ళచేత; దేహయాత్రలు= బ్రదుకులు; నడపుచున్= నెరపుతూ; ఒండు+ఒరుల+అలజడి= ఒకరి వెతలు ఇంకొకరు; చూచి= అరసి; అతి+అంత, దుఃఖ, పర, వశులు+అగుచున్= మిక్కుటమైన శోకానికి లోనయ్యేవారు ఔతూ; జూదంబునాఁడు= ద్యూతం ఆడినరోజున; తమపడినపాట్లు= తాము అనుభవించిన దురవస్థలు; తలంచి= జ్ఞాపకంచేసికొని; కలంగుచున్= కలతచెందుతూ; క్రోధ శోకంబులు= కోపాన్నీ, దుఃఖాన్నీ; తమలోన్+అ= తమయందే; ఉపశమించుకొనుచున్= అణచుకొంటూ; వర్తిల్లన్= నడచుకొంటూ ఉండగా; పదునొక్కండు+అగు+ఏఁడు= పదునొకండవ సంవత్సరం; చనినన్= గడవగా; అందఱున్= అందరును (పాండవులుఎల్లరు); కాలంబు+కడ+కాంచినవారలు+ఐ= సమయంయొక్క తుదిని పొందినవారై; వెడవెడ= ఇంచుక ఇంచుక; వికసిల్లిన= విప్పారిన; చిత్తంబులతోన్= మనస్సులతో; ఉచిత, వృత్తంబులన్= తగిన నడవడికలలో; ఉండు+అంతన్= ఉంటూండగా;

**తాత్పర్యం:** ఈవిధంగా పాండవులు కామ్యకవనానికి వెడలి అందులో నివాసాలను ఏర్పరచుకొన్నారు. ఆ వీరులు అక్కడ కాయగూరలు పండ్లు వేరులు మున్నగువాటిని తింటూ శరీరపోషణకు చాలిన ఆహారం మాత్రమే స్వీకరిస్తూ ఉన్నారు. ఒకరు అనుభవిస్తున్న వెతలను ఇంకొకరు గమనించి మిక్కిలి దుఃఖానికి లోనౌతూ ఉన్నారు. జూదం జరిగిననాడు తాము పడిన బాధలు స్మరించి కలతచెందుతూ పదకొండవ సంవత్సరం గడిపి, వనవాసకాలం చివరకు రావటంతో ఇంచుక ఇంచుక వికసించిన మనస్సులతో సమయోచితమైన నడవడికలు నెరపుతున్నారు.

**శా. ప్రీతుండై చనుదెంచె నాశ్రితజనాభీష్టక్రియాశీలుఁ డు**
**ద్గీతామ్నాయుఁడు నిర్విధూతదురితక్లేశుండు యోగామృత**
**స్ఫీతస్వాంతుఁ డనంతసంతతసమావిర్భూతకారుణ్యధా**
**రాతోయస్నపనైకశీలుఁ డగు పారాశర్యుఁ డచ్చోటికిన్. 103**

**ప్రతిపదార్థం:** ఆ+చోటికిన్= ఆస్థలానికి (కామ్యకవనానికి); ప్రీతుండు+ఐ= సంతృప్తి చెందినవాడై; ఆశ్రిత, జన+అభీష్ట, క్రియా, శీలుఁడు= ఆశ్రయించినవారికి ఇష్టాలైన పనులను చేసే స్వభావం కలవాడు; ఉత్+గీత+ఆమ్నాయుఁడు= బాగా పలుకబడిన వేదాలు కలవాడు; నిర్విధూత, దురిత, క్లేశుండు= దూరంగా విసరివేయబడిన పాపాలవలనవగు దుఃఖాలు కలవాడు; యోగ+అమృత, స్ఫీత, స్వాంతుఁడు= యోగ మనే అమృతాన్ని సేవించటంచేత విస్తరించిన మనస్సు కలవాడు; అనంతసంతతసమ్+ఆవిర్భూత, కారుణ్యధారా, తోయ, స్నపన+ఏక, శీలుఁడు+అగు= అంతం లేనట్టిదిన్నీ, ఎల్లప్పుడూ ఉండేదిన్నీ, లెస్సగా పుట్టేదిన్నీ అయిన దయ అనెడి ప్రవాహ రూపమైన నీటిలో స్నానం చేయించే స్వభావం కలవాడు-సంతతదయామయుడు; అగు పారాశర్యుఁడు= పరాశరుడిపుత్రుడు అయిన వ్యాసుడు; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఆ కామ్యకవనానికి పరాశరమహర్షిపుత్రుడైన వేదవ్యాసమహర్షి విచ్చేశాడు. శ్రీవేదవ్యాసమహర్షి పాండవులయెడ ప్రీతి కలవాడు, ఆశ్రితుల కోరికలు ఈడేర్చే స్వభావంకల మహానుభావుడు. వేదాల స్వరూపాన్ని నిర్ణయించి లెస్సగా గానం చేసినవాడు. పాపదుఃఖాలను దూరంగా విసరివేయగలిగిన మహాత్ముడు. యోగామృతాన్ని క్రోలటంచేత వికసించిన మనస్సు కల మహర్షి. నిర్మలకారుణ్య జలధారలచేత ఎదుటివారిని స్నానమాడించే మహనీయుడు.

**విశేషం:** వేదవ్యాసమహర్షి మహాభారత రచయిత. తెలుగులో మహాభారతాన్ని నిర్మించిన కవిత్రయం వారు వేదవ్యాసమహర్షిని ఉప్పొంగిన డెందంతో అభివర్ణించారు. వ్యాసుడియెడ కవిత్రయానికి గల భక్తిప్రపత్తులు వారు వ్రాసిన పద్యాలలో తొణికిసలాడుతుంటాయి. నన్నయభట్టు పారాశర్యుడిని అభివర్ణించిన పద్యం. 'నీలగిరీంద్రశృంగమున నిర్మల మైన సువర్ణవల్లరీ। జాలమువోని పింగళ విశాలజటాచయ మొప్పగా వచ। శ్శీలలితుండు వచ్చి నిలిచెన్ హరినీలవినీలవిగ్రహా! రాళరుచుల్ వెలుంగఁగఁ బరాశరసూనుఁడు తల్లిముంగటన్'. నన్నయభట్టు-వేరొకచోట వేదవ్యాసుడిని గూర్చి వ్రాసిన పద్యం-తిక్కనకు ఒజ్జబంతి అయింది. 'విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞాన సంపద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ। ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యం బైన యామ్నాయమున్'- తిక్కన వేదవ్యాసుడినిగూర్చి వ్రాసిన పద్యం ఇది.

**క. మునిపతి దోదవ్వులఁ గని। జనపతి దమ్ములును దాను సంప్రీతి నెదు**
**ర్కొని యర్ఘ్యాది విశేషా। ర్చనలం బరితుష్టుఁ జేసె సంభృతభక్తిన్. 104**

**ప్రతిపదార్థం:** జనపతి= రాజు = (ధర్మరాజు); మునిపతిన్= ఋషులలో శ్రేష్ఠుడు వ్యాసుడిని; దోదవ్వులన్= దూరదూరంలోనే; కని= చూచి; తాను= తానున్నూ; తమ్ములును= అనుజులును; సంప్రీతిన్= మిక్కలిసంతుష్టితో; ఎదుర్కొని= ఎదురేగి

స్వాగతంచెప్పి; అర్ఘ్య+ఆది, విశేష+అర్చనలన్= స్వాగతం చెప్పడానికై చేతికి అందించే నీరు మున్నగు ప్రత్యేకమైన పూజలతో; సంభృతభక్తిన్= నిండిన పూజ్యభావంతో; (వ్యాసుడిని); పరితుష్టున్+చేసెన్= మిక్కిలి తృప్తిచెందినవాడినిగా చేశాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు వేదవ్యాసమహర్షిని దూరంలోనే చూచి, తానును తమ్ములును ఎదురేగి స్వాగతం చెప్పి ప్రీతితో ఆ మహర్షికి అర్ఘ్యపాద్యాల నిచ్చి, పూజించి సమ్మానించారు.

**వ. కృష్ణద్వైపాయనుండును ననవరతవనవాసాయాస కృశదేహుల నధికదుఃఖాయమాన హృదయులం దన మనుమలం జూచి వగచి, ధర్మపుత్త్రున కి ట్లనియె. 105**

**ప్రతిపదార్థం:** కృష్ణద్వైపాయనుండును= వేదవ్యాసుడును; అనవరత, వన, వాస+ఆయాస, కృశ, దేహులన్= ఎల్లప్పుడును అడవిలో నివసించటం అనే శ్రమచేత కృశించిన శరీరాలు కలవారిని; అధిక, దుఃఖాయమానహృదయులన్= మిక్కుటంగా శోకిస్తున్న హృదయాలు కలవారిని; తనమనుమలన్= తన మనుమల్ని; చూచి; వగచి= దుఃఖించి; ధర్మపుత్త్రునకున్= ధర్మనందనుడికి; ఇట్లు+అనియెన్= ఈరీతిగా పలికాడు.

**తాత్పర్యం:** ఎల్లప్పుడును అడవిలో నివసించటంచేత ఆ శ్రమకు తట్టుకొనలేక శుష్కించిన శరీరాలు కలవారలను మిక్కుటమైన శోకంచేత పీడించబడిన హృదయాలు కల తన మనుమలను పాండవులను చూచి, వేదవ్యాసమహర్షి మిక్కిలి పరితపించి ధర్మరాజుతో ఈవిధంగా చెప్పాడు.

**విశేషం:** 1. వ్యాసుడు పరాశరమహర్షి కొడుకుకాన పారాశర్యుడు కృష్ణద్వైపాయనుడు. (పరాశరునకు, సత్యవతికి) ద్వీపంలో జన్మించినవాడు కాబట్టి ఈయనకు - 'ద్వైపాయనుఁడు' అనే నామధేయం సిద్ధించింది. నల్లనిదేహం కలవాడు కావున కృష్ణద్వైపాయనుడు. వేదాలను ప్రస్తరింపజేసినవాడు కావున వేదవ్యాసుడు.

**ఉ. 'కాలవిపర్యయంబున సుఖంబును దుఃఖము వచ్చుచుండు; నె**
**క్కాలము నేరికిన్ ధ్రువము గాదు సుఖంబును దుఃఖమున్ మహీ**
**పాల! బుధుండు దద్వివిధభంగు లెఱింగి ప్రమోద ఖేదసం**
**శీలుఁడు గాఁడు రెంటను బ్రసిద్ధపథంబున నప్రమత్తుఁడై. 106**

**ప్రతిపదార్థం:** మహీపాల!= ఓరాజా! ధర్మనందనా!; కాలవిపర్యయంబునన్= సమయం తారుమారు కావటంవలన; సుఖంబును= సౌఖ్యం; దుఃఖమున్= శోకం; వచ్చుచుండున్= కలుగుతుంటాయి; ఏ+కాలమున్= ఏసమయంలోనూ; ఏరికిన్= ఎవరికిని; సుఖంబును= సౌఖ్యం; దుఃఖమున్= ఆవేదన; ధ్రువంబు+కాదు= స్థిరమైనది కాదు; బుధుండు= తెలివికలవాడు; తద్+వివిధ, భంగులు+ఎఱింగి= దానియొక్క (కాలవిపర్యంయొక్క) పెక్కురీతులు తెలిసికొని; ప్రసిద్ధపథంబునన్= బాగా తెలిసిన మార్గంలో; అప్రమత్తుఁడు+ఐ= జాగ్రత్తకలవాడై. రెంటను= రెండింటిలోనూ (మోదఖేదాలు రెండింటిలో); ప్రమోద, ఖేద, సంశీలుఁడు+ కాఁడు= సంతోషం గాని, ఆవేదన గాని పొందే స్వభావంకలవాడు కాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! కాలం తారుమారు కావటంవలన ఒకప్పుడు సౌఖ్యం మరియొక సమయంలో దుఃఖం దాపురిస్తూ ఉంటాయి. ఎవరికైనను సుఖదుఃఖాలు స్థిరంగా ఉండవు. తెలివికలవాడు కాలంతెచ్చిపెట్టే పెక్కురీతులను తెలిసికొని సంతోషం చెందడు, ఆవేదన పొందడు. సుఖదుఃఖాలయెడ జాగరూకుడై ఉండి పేరొందుతాడు.

**క. విను నీవును నాపదలకు । మనమున నొక్కింత యోర్చి మహనీయముగా**
**నొనరింపుము తపము; దపం । బునన కదా సకలసౌఖ్యములు సిద్ధించున్. 107**

**ప్రతిపదార్థం:** విను= ఆలకింపుము; నీవును= ఓ ధర్మరాజా నీవు సయితం; ఆపదలకున్= ఇడుమలకు; మనమునన్= మనస్సులో; ఒక్క+ఇంత= కొంచెం; ఓర్చి= సహించి; మహనీయముగాన్= గొప్పగా; తపము= తపస్సు (తదేకదీక్షతో కష్టాలను సరకు చేయక చిత్తాన్ని ఏకాగ్రతకు నిలయంచేసి సలిపే సాధన); ఒనరింపుము= చేయుము; తపంబునన+ కదా=తపస్సుచేతనే కదా; సకల సౌఖ్యములు= సమస్త సుఖాలు; సిద్ధించున్= లభిస్తాయి.

**తాత్పర్యం:** ధర్మరాజా! నాహితోపదేశాన్ని సావధానంగా ఆలకించుము. మనస్సులో ఆపదలను లెక్కసేయకుము. కొంచెం ఓర్మి వహించుము. అన్నిటికంటె తపస్సు గొప్పది. తపస్సువలననే సర్వసౌఖ్యాలును లభిస్తాయి. కావున నీవు తపస్సు చేయుము.

**క. క్షమయు నహింసయు సత్యము । సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా**
**గమును దపోలక్షణములు । గ్రమమున నిన్నియును నూర్ధ్వగతికారణముల్. 108**

**ప్రతిపదార్థం:** క్షమయున్= ఓర్పును; అహింసయున్= జీవకోటికి ఎట్టి హానిని చేయకుండటమున్నూ; సత్యమున్= నిజం పలకటం; సమతయున్= సర్వభూతాలు సమానాలే అనే జ్ఞానానుభూతియున్నూ; ఇంద్రియ జయంబున్= విషయసుఖాలను జయించటమున్నూ; శమమున్= అంతరింద్రియ నిగ్రహమున్నూ; పరిత్యాగమును= స్వార్థమును ఉజ్జగించి, దానంచేయటమున్నూ; తపస్+లక్షణములు= తపస్సును సూచించే చిహ్నాలు; క్రమమునన్= వరుసగా; ఇన్నియును= ఈలక్షణాలు ఇన్నియును; ఊర్ధ్వగతి= ఉత్తమపదానికి; కారణముల్= హేతువులు.

**తాత్పర్యం:** ఓర్పు, అహింస, సత్యం, సమత్వం, ఇంద్రియ నిగ్రహం, శమం, స్వార్థత్యాగంతో కూడిన దానం అనేవి తపస్సుయొక్క చిహ్నాలు.

**తే. ఇందుఁ జేసిన పుణ్యంబ యందుఁ గుడుచు । మీఁది జన్మంబునకు నది మేలుఁ జేయుఁ**
**గాన తనశక్తితోఁ గూడ దానధర్మ । చిరపరోపకారంబులు సేయవలయు'. 109**

**ప్రతిపదార్థం:** ఇందున్= ఇచట (ఈలోకంలో); చేసిన= ఒనర్చిన; పుణ్యంబు+అ= సుకృతమే; అందున్= అక్కడ (పరలోకంలో); (జీవుడు- తపస్సు చేసినవాడు); కుడుచున్= అనుభవిస్తాడు; మీఁది జన్మంబునకున్= రాబోయే పుట్టుకకు; అది= ఆ పుణ్యం; మేలున్+చేయున్= శుభం కలిగిస్తుంది; కాన= కాబట్టి; తనశక్తితోన్+కూడన్= యథాశక్తి, శక్తివంచన లేకుండగా; దాన, ధర్మ, చిర, పర+ఉపకారములు= దానం, ధర్మం, ఎల్లప్పుడు ఇతరులకు మేలు; చేయవలయున్= చేయాలి.

**తాత్పర్యం:** ఇహంలో చేసిన సుకృతం మాత్రమే జీవి పరంలో అనుభవిస్తాడు. ఆ పుణ్యమే రాబోయే జన్మంలోకూడ శుభం చేకూరుస్తుంది. కావున శక్తివంచనలేకుండా దానధర్మాలు చేయతగును. పరోపకారం చేయాలి.'

**విశేషం:** 1. దానం అనగా తనధనాన్నిగాని ద్రవ్యాలను గాని ప్రతిఫలాపేక్ష లేకుండా దీనులకు ఇవ్వటం. 2. 'ధర్మము' అనే పదానికి సువిశాలమైన అర్థం ఉన్నది. అందులో స్వార్థత్యాగం మాత్రమే కాక, పరోపకారం మాత్రమే కాక విశ్వశ్రేయస్సు కూడ ఇమిడి ఉన్నది. లోకాన్ని మంచిస్థితిలో నెలకొల్పేది - ధర్మం. మనుస్మృతిలోని ధర్మలక్షణ నిర్వచనం సుప్రసిద్ధమైనది. "ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్'.(6.92)

**వ. అనినం బాండవాగ్రజుండు 'దానతపంబులలో దుష్కరం బెయ్యది? యెద్దాన నధికఫలం బగు?' నని యడిగిన వేదవ్యాసుం డి ట్లనియె. 110**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (వ్యాసమహర్షి) చెప్పగా; పాండవ+అగ్రజుండు= పాండవులలో మొదట పుట్టినవాడు (ధర్మరాజు); దానతపంబులలోన్= దానం తపస్సు- ఈ రెండింటిలో; ఎయ్యది= ఏది; దుష్కరంబు= చేయటానికి కష్టమైనది; ఏ+దానన్= దేనివలన; అధిక, ఫలంబు+అగున్= ఎక్కువ ఫలితం లభిస్తుంది; అని+అడిగినన్= అని అడుగగా; వేదవ్యాసుడు= వ్యాసమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా తెలిపాడు.

**తాత్పర్యం:** అని వ్యాసమహర్షి ప్రవచించాడు. అంతట ధర్మరాజు ప్రత్యుత్తరంగా ఒక ప్రశ్న వేశాడు. 'దానం గొప్పదే. తపస్సు గొప్పదే. అయితే దానంకంటె తపస్సు గొప్పదా? తపస్సుకంటె దానం గొప్పదా?' అని. ఆ ప్రశ్నలకు వేదవ్యాసమహర్షి ఈవిధంగా ప్రత్యుత్తరం ఇచ్చాడు.

**సీ. 'దాన మూర్జితఫలదం బర్థసాధ్య మై । పరఁగుటఁ గరము దుష్కరము నదియ;**
**నరులకు నధిప! ప్రాణంబులకంటెను । రూపింప నర్థంబు తీపు వినవె**
**యుగ్రంబు లైన యాయుధముల మొనలపై । నుఱుకుట యంభోధి దఱిసి చనుట**
**కృషి పాశుపాల్యసంక్లేశంబు నొందుట । యడవులఁ గొండల నిడుమ వడుట**

**ఆ. నవసి పొవసి యనుదినముఁ బరప్రేష్యులై । యునికిఁ దలఁప నర్థమునకు చూవె!**
**యట్టి దుఃఖలబ్ధ మైన యయ్యర్థంబు । విడుచు టెవ్విధమునఁ గడిఁది గాదె? 111**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా, ఓధర్మరాజా!; దానము= ఈవి; ఊర్జిత, ఫలదంబు= గొప్పఫలితాన్ని ఇస్తుంది; అర్థ, సాధ్యము+ఐ= ధనంచేత సాధించతగింది ఔతూ; పరఁగుటన్= ఒప్పుటచేత; కరమున్= మిక్కిలి; దుష్కరము= కష్టసాధ్యం; అది+అ= అదే ధనం మాత్రమే; నరులకున్= మనుజులకు; ప్రాణంబుల కంటెను= అసువుల కంటెకూడా; రూపింపన్= ఏర్పరచగా; అర్థంబు= ధనం; తీపు= మధురమైనదిఅని; వినవె= వినలేదా; ఉగ్రంబులు+ఐన= భయంకరాలు అయిన; ఆయుధముల మొనలపైన్= శస్త్రాలయొక్క కొనలపైకి; ఉఱుకుట= దుముకుట; అంభోధి= అంభస్+ధిన్= సముద్రమును; తఱిసి= దాటి; చనుట= వెళ్లటం; కృషి= వ్యవసాయం; పాశుపాల్యసంక్లేశంబున్= పశువులను పెంచటంచేత పొందే శ్రమ; ఒందుట= పొందటం; అడవులన్= అరణ్యాలలో; కొండలన్= పర్వతాలలో; ఇడుమ+పడుట= కష్టపడటం; నవసి= కృశించి; పొవసి= లోపల కుమిలి; అనుదినమున్= ప్రతిరోజూ (అన్నిరోజులూ); పరప్రేష్యులు+ఐ= ఇతరులచే పంపదగినవారై; ఉనికిన్= ఉండటమున్నూ; తలఁపన్= ఆలోచించగా; అర్థమునకున్ చూవె= ధనం కొరకే కదా; అట్టి= ఆ విధమైన; దుఃఖ, లబ్ధము+ఐన= ఆవేదనచేత పొందబడినట్టి; ఆ+అర్థంబు= ఆ ధనం; విడుచుట= త్యాగం చేయటం; ఏ+విధమునన్= ఏతీరుగానైనా; కడిఁది+కాదె= గొప్పది కాదా (ధనాన్ని విడిచి చేసే దానం గొప్పదే సుమా).

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! దానం అంటే ధనాన్ని విడనాడటమే కదా! అందుచేత అది గొప్పఫలాన్ని చేకూర్చేది. ధనాన్ని త్యాగంచేయటం మిక్కిలి కష్టమైన పని. ఏలన, మనుజులకు ప్రాణాలమీది తీపికంటే ధనంపైగల తీపి అధికం. ఆయుధాల కొసలపై ఉరికి యుద్ధం చేయటం, సముద్రాన్ని దాటి దూరదేశాలకు పోవటం, వ్యవసాయం పశుపాలనం చేసి కష్టాలు అనుభవించటం. అడవులలో కొండలలో ఇడుమలు పొందటం, ఇతరులకు భృత్యులై చెమటోడ్చి శ్రమించటం కేవలం ధనంకొరకే కదా! ఆ విధంగా ఎన్నో కష్టాల నోర్చి సంపాదించటానికి మనుజులు పూనుకొనే ధనాన్ని త్యాగం చేయటం గొప్పవిషయమే అని అంగీకరించక తప్పదు.

**శా. అన్యాయార్జిత మైన విత్తమునఁ జేయం బూను దానంబు మూ**
**ర్ఖన్యాయం బది; దానఁజేసి ఫలపాకం బేమియున్ లేదు; యు**
**క్తన్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స**
**మ్మాన్యంబై తగఁ బాత్రయోగమున సౌమ్యంబై ఫలించుం దుదిన్. 112**

**ప్రతిపదార్థం:** అన్యాయ+ఆర్జితము+ఐన= పాడి తప్పి సంపాదించిన; విత్తమునన్= ధనంతో (న్యాయమార్గంలో కాకుండ సంపాదించబడిన ధనం); చేయన్+పూను, దానంబు= చేయటానికి దొరకొనిన; ఈవి; మూర్ఖన్యాయంబు= బుద్ధిలేని వారి పరిపాటి; అది; దానన్+చేసి= దానివలన; ఫలపాకంబు+ఏమియున్= ఫలితంయొక్క పూర్ణత్వం, ఏమియును; లేదు= ఉండదు; యుక్త, న్యాయ+ఆర్జితము= సరియైన పద్ధతిలో పాడిదప్పక సంపాదించబడింది; ఇంచుక+అంత+అయినన్= కొంచెం మాత్రమే అయినప్పటికి; కాలంబు= సమయం; దేశంబు= సీమ; సత్+మాన్యంబు+ఐ= మిక్కుటంగా గౌరవం చెందినదై; తగన్= సముచితంగా; పాత్రయోగమునన్= సరిఅయిన వాటితో కలియటంవలన; తుదిన్= చివరకు; సౌమ్యంబు+ఐ= మంచిదై; ఫలించున్= మంచిఫలితాన్ని ఇస్తుంది.

**తాత్పర్యం:** పాడితప్పి సంపాదించిన ధనాన్ని దానంచేయటం బుద్ధిహీనుల పరిపాటి. అట్టి దానంవలన పుణ్యఫలం సిద్ధించదు. సరియైనపద్ధతిలో పాడి తప్పక ఆర్జించిన ధనాన్ని కొంచెంగా నైన దానం చేయటంవలన గొప్ప సుకృతం సిద్ధిస్తుంది. దానం మంచిఫలితాల నివ్వటానికి చూడవలసినవి మూడు ముఖ్యాంశాలు. 1. దానం సకాలంలో ఇవ్వబడాలి. 2. దానం సరియైన ప్రదేశంలో ఇవ్వబడాలి. 3. దానం పాత్రుడికి, యోగ్యుడికి చెందాలి.

**వ. తొల్లి ముద్గలుం డను మహాద్విజుండు సన్మార్గోపార్జితం బైన వ్రీహిద్రోణంబు సత్పాత్రంబున వినియోగించి కాదె పరమసిద్ధిం బొందె' ననిన విని ధర్మనందనుండు 'మునీంద్రా! ముద్గలుండు వ్రీహిద్రోణం బెబ్భంగి నుపార్జించె? నెట్టి పాత్రంబునఁ బ్రతిపాదించె?; వినవలతుం జెప్పవే!' యనిన నతం డిట్లనియె. 113**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వకాలంలో; ముద్గలుండు+అను= ముద్గలుడు అనే పేరు గల; మహా, ద్విజుండు= గొప్ప బ్రాహ్మణుడు; సత్+మార్గ+ఉప+ఆర్జితంబు+ఐన= మంచి పద్ధతిలో సంపాదించబడింది అయిన; వ్రీహిద్రోణంబు= వరిగింజలు పోసి నింపిన కలశం; సత్+పాత్రంబునన్= యోగ్యుడైన మనుజుడియందు; వినియోగించి+కాదె= ఉపయోగించటంచేతనేకదా; పరమసిద్ధిన్+పొందెన్= కైవల్యాన్ని పొందాడు; అనినన్= అని (వ్యాసుడు) చెప్పగా; విని= ఆలకించి; ధర్మనందనుండు= ధర్మసుతుడు, ధర్మరాజు; ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడ వయినవాడా, ఓవ్యాసమహర్షీ! ముద్గలుండు= ముద్గలుడు; వ్రీహిద్రోణంబు= వరిగింజలు నింపిన కలశాన్ని; ఏ+భంగిన్= ఏరీతిగా; ఉపార్జించెన్= సంపాదించాడో; ఎట్టి= ఎటువంటి; పాత్రంబునన్= యోగ్యుడైన వ్యక్తియందు; ప్రతిపాదించెన్= వినియోగించాడో; వినవలతున్= వినవలె నని ఉన్నది; చెప్పవే= వచించవా - వచించుము; అనినన్= అని చెప్పగా; అతండు= అతడు (వేదవ్యాసమహర్షి); ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** పూర్వకాలం ముద్గలుడు అనే బ్రాహ్మణోత్తముడు మంచిమార్గాన్ని అనుసరించి సంపాదించిన వరిగింజలు నింపిన కలశాన్ని యోగ్యుడైన వ్యక్తికి దానం చేయటంచేతనే కదా కైవల్యపదాన్ని పొందాడు' అని వ్యాసమహర్షి చెప్పాడు. అంతట ధర్మరాజు, 'ఓ వ్యాసమహామునీ! బ్రాహ్మణోత్తము డైన ముద్గలమహర్షి వ్రీహిద్రోణాన్ని (వరిగింజలు నింపిన కలశాన్ని) ఏ విధంగా సంపాదించి యోగ్యతగలవ్యక్తి అయిన ఎవరికి దానిని ఏవిధంగా దానంచేశాడు?

వినవలెనని ఉన్నది. దయచేసి నాకు ఆ వృత్తాంతం వివరించుము' అని అడిగాడు. వ్యాసమహర్షి ఈ విధంగా బదులు పలికాడు.

### వ్యాసుఁడు ధర్మజునకు వ్రీహిద్రోణాఖ్యానంబు సెప్పుట ( సం. 3-246-3)

**క. 'అతిథిప్రియుఁడు విశిష్ట । వ్రతుఁడు విమత్సరుఁడు సత్యవచనుండు విని**
**ర్జిత విషయేంద్రియుఁడు సము । న్నత పుణ్యుఁడు ముద్గలుఁడు ఘనస్థిరబుద్ధిన్. 114**

**ప్రతిపదార్థం:** అతిథిప్రియుఁడు= అన్నపానీయాదిసౌకర్యాలకొరకై వచ్చినవారియెడ ఇష్టం కలవాడు; విశిష్ట, వ్రతుఁడు= గొప్పదీక్షతో కూడిన నియమాలు పాటించేవాడు; వి, మత్సరుఁడు= మాత్సర్యం లేనివాడు- ఓర్వలేనితనం లేనివాడు; సత్యవచనుండు= నిజం మాటాడేవాడు; వినిర్జిత, విషయ+ఇంద్రియుఁడు= బాగా జయించబడిన ఇంద్రియార్థాలు ఇంద్రియాలు కలవాడు; సమ్+ఉన్నత, పుణ్యుఁడు= మిక్కిలి గొప్ప సుకృతాన్ని ఆర్జించినవాడు; ముద్గలుఁడు= ముద్గలుడు అనే పేరు కల ముని; ఘన, స్థిర, బుద్ధిన్= గొప్పది చలింపక నిలకడగా ఉండేది అయిన తెలివితో.

**తాత్పర్యం:** ముద్గలుడు మహానుభావుడు. అన్నపానాదిసౌకర్యాలతో తనగృహానికి వచ్చేవారిని ఆదరించేవాడు, అతిథులను అభ్యాగతులను గొప్పదీక్షతో ప్రీతితో సేవించేవాడు, నిత్యసత్యవచనుడు, వైరాగ్యం కలవాడు, ఇంద్రియాలను జయించినవాడు, గొప్ప సుకృతాన్ని సంపాదించినవాడు, నిలకడ గల గొప్పతెలివితేటలతో (తరువాతి గద్యంతో అన్వయం).

**వ. పుత్త్రదారసహితంబుగాఁ గురుక్షేత్రంబున వసియించి యుంఛవృత్తిపరాయణుండై పాడ్యమిం దొడంగి పదునాలుగు దివసంబు లొక్కొక్కగింజయకా నేరి తూమెఁడు వడ్లు సమకూర్చి పర్వదినంబునఁ బాకంబు సేయించి దేవపితృపూజనంబు లొనరించి యతిథుల కన్నంబు వెట్టి మిగిలిన యన్నంబునఁ దానును బుత్త్ర కళత్రంబులును దేహయాత్ర నడపుచు నివ్విధంబునఁ బక్షోపవాసవ్రతంబున వర్తిల్లుచున్నయెడ నొక్క పర్వదినంబునందు. 115**

**ప్రతిపదార్థం:** పుత్త్ర, దార, సహితంబుగాన్= కొడుకులతో భార్యతో కూడినవాడై; కురుక్షేత్రంబునన్= కురుక్షేత్రం అనేప్రదేశంలో; వసియించి= నివసించి; ఉంఛ, వృత్తి, పరాయణుండు+ఐ= పొలాలలో రాలిన గింజలను ఏఱికొని బ్రదుకుటయే జీవనోపాధిగా కలవాడయి; పాడ్యమిన్+తొడంగి= అమావాస్య, పౌర్ణమి తదుపరి మొదటితిథి మొదలుకొని; పదునాలుగు దివసంబులు= పదునాల్గు రోజులు; ఒక్కొక్క= (ఒక్క+ఒక్క) ఒక్కటి ఒకటి; గింజ+అ+కాన్= విత్తునుగా; ఏరి= సేకరించి; తూమెఁడు= (తూము+ఎఁడు) నాలుగుకుంచాలతో సరిఅయిన ద్రోణం నిండునటువంటి; వడ్లు= వరిగింజలు; సమకూర్చి= సంపాదించి; పర్వదినంబునన్= పండుగ నాఁడు (పూర్ణిమ లేదా అమావాస్య తిథులలో); పాకంబు+చేయించి= వంటచేయించి; దేవ, పితృ, పూజనంబులు= దేవతలకు, పితరులకు ఆరాధనలు; ఒనరించి= చేసి; అతిథులకున్= అన్నపానాదులకై వచ్చేవారికి; అన్నంబు+పెట్టి= అన్నం వడ్డించి; మిగిలిన+అన్నంబునన్= శేషించిన అన్నంతో; తానును= తానూ (ముద్గలుడున్నూ); పుత్త్ర, కళత్రంబులును= పిల్లలు పెండ్లమున్నూ; దేహయాత్ర= శరీరపు యాత్ర; నడపుచున్= ప్రవర్తింపజేస్తూ; ఈ+విధంబునన్= ఈ రీతిగా; పక్ష+ఉపవాసవ్రతంబునన్= పదునైదు రోజుల నిరాహారదీక్షతో; వర్తిల్లుచున్న+ఎడన్= నడపుతున్నపుడు; ఒక్క= ఒక్క; పర్వదినంబునందున్= పండుగనాడు (అమావాస్య లేదా పూర్ణిమనాడు).

**తాత్పర్యం:** పుత్రులతో భార్యతో కలిసి కురుక్షేత్రంలో నివసించి 'ఉంఛవృత్తి' (పొలాలలో రాలిన ధాన్యాన్ని ఏరుకొనటం) జీవనోపాధిగా చేసికొని బ్రదుకుతూ, పదునైదు రోజులు నిరాహారదీక్షతో గడుపుతున్నాడు. అనగా పాడ్యమితిథినాడు మొదలిడి చతుర్దశి వరకు వారు వడ్లగింజలను ఏరటం మొదలుపెట్టేవారు. ఆ ఉంఛవృత్తిలో ఒక్కొక్క వరిగింజచొప్పున ఏరి తూమెడు (అనగా నాలుగు కుంచాల) ధాన్యం ప్రోగు చేసేవారు. ఆ పదునాలుగురోజులు ఉపవాసముండి పర్వదినంనాడు (అమావాస్యనాడు, పూర్ణిమనాడు) వంట చేయించేవారు. అట్లా వండిన అన్నంలో దేవతలకు, పితరులకు నివేదనం చేసి, అతిథులకు పెట్టి, మిగిలినదానిని ముద్గలుడూ, పిల్లలూ, పెండ్లామున్నూ భుజించేవారు. ఈవిధంగా శరీరధారణకుమాత్రమే వారు ఆహారం స్వీకరిస్తూ పక్షోపవాసవ్రతాన్ని నిర్వహిస్తున్న సమయంలో ఒక పర్వదినాన.

**మ.** **మతి నత్యంత జుగుప్సితం బయిన యున్మత్త స్వరూపంబుతో**
**గతవస్త్రుండును ముక్తకేశుఁడు బహుగ్రామ్యోక్తిశీలుండు నై**
**హితపుణ్యుండు మునీశ్వరుం డతిథి యై యేతెంచె దుర్వాసుఁడన్**
**యతి యమ్ముద్గలుపాలికిం బటుబుభుక్షాయత్తతం దూలుచున్.** **116**

**ప్రతిపదార్థం:** మతిన్= బుద్ధికి; అత్యంతజుగుప్సితంబు+అయిన= మిక్కుటంగా రోతను పుట్టించేటటువంటి; ఉన్మత్త స్వరూపంబుతోన్= పిచ్చివాడి ఆకారంతో; గతవస్త్రుండును= చినిగిపోయిన బట్టలు కలవాడును; ముక్తకేశుఁడున్= విరబోసికొన్న జుట్టు కలవాడున్నూ; బహుగ్రామ్య+ఉక్తి, శీలుండున్+ఐ= పల్లెటూరి అనాగరకపు మాటల స్వభావం కలవాడున్నూ అయి; హితపుణ్యుండు= ప్రియ మైన సుకృతం పేర్చినవాడున్నూ; ముని+ఈశ్వరుండు= ఋషులలో శ్రేష్ఠుడు అయినవాడు; దుర్వాసుఁడు+అన్+యతి= దుర్వాసుడనే ఋషి; అతిథి+ఐ= ఆగంతకు డై; ఆ+ముద్గలు పాలికిన్= ఆ ముద్గలుడి సన్నిధికి; పటు, బుభుక్షా+ఆయత్తతన్= మిక్కుటమైన ఆకలితో కూడినవాడై; తూలుచున్= ఇటునటు వాలుతూ; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** దుర్వాసుడు ముద్గలుడిసన్నిధికి విచ్చేశాడు. అప్పుడు దుర్వాసుడి ఆకారం పిచ్చివాడివేషంవలె ఉన్నది. వస్త్రాలు చినిగిపోయినవి, జుట్టు విరబోసికొన్నాడు. అతడు పల్లెటూరికి చెందిన అనాగరికుడివలె నోటికి వచ్చినట్లు మాటలాడసాగాడు. అయినను అతడు పుణ్యమూర్తి అయిన మహర్షి. అతిథిగా ఆకలి అంటూ ఆర్తుడై వచ్చాడు.

**క.** **అతనిఁ గని యించుకంతయు । మతి ననుమానంబు లేక మానుగఁ బ్రత్యు**
**ద్గతుఁడై యర్ఘ్యముఁ బాద్యము । నతిభక్తి నొనర్చి మునికులాగ్రణి నెమ్మిన్.** **117**

**ప్రతిపదార్థం:** ముని, కుల+అగ్రణి= ఋషుల సముదాయంలో శ్రేష్ఠుడైన ముద్గలుడు. నెమ్మిన్= ప్రీతితో; అతనిన్= అతనిని (దుర్వాసుడనే మహర్షిని); కని= చూచి; మతిన్= బుద్ధియందు; ఇంచుక+అంతయున్= కొంచెంకూడ; అనుమానంబు+ లేక= సందేహంలేకుండా; మానుఁగన్= ఒప్పునట్లుగా; ప్రత్యుద్గతుఁడు+ఐ= సగౌరవంగా ఎదురేగినవాడై; అర్ఘ్యమున్= పూజాద్రవ్యమును; పాద్యమున్= కాళ్లు కడుగుకొనుటానికై ఇచ్చే నీరును; అతిభక్తిన్= మిక్కుటమైన పూజ్యభావంతో; ఒనర్చి= చేసి;

**తాత్పర్యం:** ఆ దుర్వాసమహర్షిని చూచి, కొంచెమయినను సందేహించక సగౌరవంగా లేచి ఎదురేగితోడ్తెచ్చి ముద్గల మహర్షి అతడికి అర్ఘ్యపాద్యాదులు సమర్పించి, మిక్కిలి పూజ్యభావంతో అతిథిసత్కారం నిర్వహించాడు.

**క. అన్నంబు వెట్టె నతఁడు త । దన్నంబంతయును గుడిచి యాత్మఁ దనిసి, శే**
**షాన్నంబు మేన నిండఁగ । సన్నుతుఁ డలఁదికొని మగుడఁ జనియె నిజేచ్ఛన్. 118**

**ప్రతిపదార్థం:** అన్నంబు+పెట్టెన్= అన్నం పెట్టాడు; అతఁడు= ఆ దుర్వాసుడు; తత్+అన్నంబు+అంతయును= ఆ అన్నం అంతటిని; కుడిచి= ఆరగించి; ఆత్మన్= మనస్సులో; తనిసి= తృప్తిచెంది; శేష+అన్నంబున్= మిగిలిన అన్నమును; మేనన్= శరీరమునందు; నిండఁగన్= నిండేటట్లుగా; సన్నుతుఁడు= మంచివారలచేత పొగడబడినవాడు; అలఁదికొని= పూసికొని; నిజ+ఇచ్ఛన్= తనఇష్ట ప్రకారం; మగుడన్+చనియెన్= తిరిగి వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** ముద్గలమహాముని దుర్వాసుడికి భోజనం పెట్టాడు. దుర్వాసుడు ఆ అన్నాన్ని ఆరగించి మిగిలిన అన్నాన్ని తనశరీరం నిండా పూసికొని, తనఇష్టం వచ్చినచోటికి తిరిగి వెళ్ళిపోయాడు.

**విశేషం:** 'మగిడి చనియె' - అనే పాఠాంతరం కొన్ని ప్రతులలో ఉన్నది.

**క. మునిపతి పర్వము పర్వం । బున మఱియును నరుగుదెంచు; ముద్గలుఁడును దా**
**ననశనుఁడై యుండియు న । మ్మునివరునకు నొసఁగు నన్నముం బ్రియ మెసఁగన్. 119**

**ప్రతిపదార్థం:** మునిపతి= మునులకు భర్త, మునులలో శ్రేష్ఠుడు, (దుర్వాసుడు); పర్వము పర్వంబునన్= పండుగ పండుగకు అనగా అమావాస్య, పూర్ణిమ తిథులలో; మఱియును= వెండియును; అరుగుదెంచున్= వస్తాడు; ముద్గలుడును= ముద్గలమహర్షియు; తాన్= తాను; అనశనుఁడు+ఐ, ఉండియున్= తిండి లేనివాడై ఉన్నప్పటికిని; ఆ+మునివరునకున్= ఆ మునిశ్రేష్ఠుడికి (దుర్వాసుడికి); అన్నమున్; ప్రియము+ఎసఁగన్= ప్రీతిపెంపారగా; ఒసఁగున్= ఇస్తాడు.

**తాత్పర్యం:** దుర్వాసుడు పర్వపర్వానికి-అమావాస్య, పూర్ణిమతిథులు-వదలకుండ మరల మరల వస్తూనే ఉన్నాడు. ముద్గలమహర్షి తాను నిరాహారుడై ఉండికూడ దుర్వాసుడికి అతిథిమర్యాదలతో సగౌరవంగా సంప్రీతితో అన్నం పెట్టుతూనే ఉన్నాడు.

**వ. ఇవ్విధంబున నాఱుపర్వంబులు గుడిచి దుర్వాసుండు వాని చిత్తంబున నొక్కకొఱంతయుం గానక యద్భుతప్రమోదమగ్నమానసుండై వాని కిట్లనియె. 120**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈతీరున; ఆఱుపర్వంబులు= ఆరుపండుగలు; కుడిచి= ఆహారం ఆరగించి; దుర్వాసుండు; వాని చిత్తంబునన్= ముద్గలమహర్షి మనస్సున; ఒక్క= ఒక్క; కొఱంతయున్= లోపమును; కానక= చూడక; అద్భుత, ప్రమోద, మగ్న, మానసుండు+ఐ= ఆశ్చర్యకరమైన సంతోషంతో మునిగిన చిత్తం కలవాడై; వానికిన్= ముద్గలుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆరుపర్వదినాలలో ఆహారాన్ని స్వీకరించి దుర్వాసుడు ముద్గలుడిని పరీక్షించాడు. కాని, ముద్గలుడి మనస్సులో లేశమైనా లోపం కన్పించలేదు. అందుచేత దుర్వాసుడు అచ్చెరువుతోకూడిన సంతోషంలో మునిగి ముద్గలుడితో ఇట్లా పలికాడు.

**క. 'నీయట్టి దానశీలుని । నీ యఖిలమునందుఁ గాన నెన్నండును స**
**త్త్వాయత్తమతివి సాధువి । ధేయుండవు నీవు పుణ్యతేజుఁడ వనఘా! 121**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడ వైన ఓ ముద్గలమహర్షీ!; నీ+అట్టి= నీవంటి; దానశీలునిన్= దానంచేసే స్వభావం కలవాడిని; ఈ+అఖిలమునందున్= ఈ సమస్తంలో (ఈసమస్త భూమిలో); ఎన్నండును= ఎప్పుడును; కానన్= చూడలేదు; సత్త్వ+ఆయత్త; మతివి= సత్త్వగుణ నిబద్ధమైన బుద్ధి కలవాడవు; సాధువిధేయుండవు= సౌమ్యులు, సజ్జనులు అయినవారికి లోబడి ఉండేవాడవు; నీవు= నీవు; పుణ్యతేజుఁడవు= సుకృతంవలన ఏర్పడే వర్చస్సు కలవాడవు.

**తాత్పర్యం:** పాపరహితుడవైన ఓ ముద్గలమహామునీ!; నీతో సరిపోలే దానశీలుడిని నేను ఈ పృథివిలో ఎన్నడూ చూడలేదు సుమా! నీవు సత్త్వగుణుడవు. సుకృతం చేయటంవలన ఏర్పడే గొప్పవర్చస్సు కలవాడవు నీవు.

**చ.** **మనమున నేవగింప, కవమానము సేయక, యించుకంతయున్**
**గినియక, యోలమందక, యకృత్రిమభక్తి నొనర్చి తీవు స**
**జ్జననుత! యన్నదానము; ప్రసాదము సత్యము ధైర్యమున్ దమం**
**బును నపరిగ్రహత్వమును బొల్పుగ నీధనమయ్యె నియ్యెడన్.** **122**

**ప్రతిపదార్థం:** సత్+జన+నుత!= మంచివారిచేత పొగడబడినవాడా! (ఓముద్గలమహర్షీ); ఈవు= నీవు; మనమునన్= చిత్తమున; ఏవగింపక= అసహ్యపడక; అవమానము+చేయక= అగౌరవం చూపక; ఇంచుక+అంతయున్= కొంచెమైనను; కినియక= కోపించక; ఓలము+అందక= మరుగుపడక; అకృత్రిమ, భక్తిన్= కపటములేని భక్తితో; అన్నదానము= అన్నాన్ని దానం చేయటం; ఒనర్చితి= చేశావు. ఈ+ఎడన్= ఈతరుణంలో; ప్రసాదము= ప్రసన్నత; అనుగ్రహంతో కూడిన చిత్త నిర్మలత్వం; సత్యము= నిజం; ధైర్యమున్= ప్రతికూలస్థితిలో కూడ చలించని నిబ్బరం; దమంబును= ఇంద్రియనిగ్రహం; అపరిగ్రహత్వమును= ఒరులసొత్తును గైకొనకుండటం; పొల్పుగన్= అందంగా; నీధనము= నీసంపద; అయ్యెన్= అయినాయి.

**తాత్పర్యం:** మంచివారలచేత ప్రశంసించబడే ఓ ముద్గలమహర్షీ! నీవు మహానుభావుడవు. అన్నదానం చేయటంలో నీకు గల నిష్ఠ సాటిలేనిది. నీమనస్సు పరమపవిత్రమైనది. అన్నదానం చేసేటప్పుడు ఇంచుక కూడ నీమనస్సులో ఏవగింపు కానరాలేదు; కోపతాపాలు కన్పించలేదు; మరుగు లేదు. నీవు అతిథులను అవమానించకుండా, అతిథిపూజను స్వచ్ఛమైన భక్తితో నిర్వర్తించావు. ప్రసన్నత, సత్యం, ధైర్యం, బహిరింద్రియ నిగ్రహం, ఇతరుల సొత్తుపై ఈషణ్మాత్రం కోరికలేకపోవటం అనేవి నీకు సంపదలు.

**చ.** **చవులకుఁ బ్రేముడించు ననిశంబును నాలుక, దాల్మిపెంపు ధ**
**ర్మువును శమంబుఁ ద్రెక్కొను సముద్ధతి నాఁకలి; వీని రెంటనుం**
**దవులవు జీవితస్థితివిధాయక మన్నము నీవు జీవితే**
**చ్ఛ విడిచి; తిప్పు డేమని ప్రశంస యొనర్తు నినుం దపోనిధీ!** **123**

**ప్రతిపదార్థం:** తపోనిధీ!= తపస్+నిధీ!= తపస్సుకు నెలవు అయినవాడా, ఓ ముద్గలమహర్షీ!; నాలుక= జిహ్వ; అనిశంబును= ఎల్లప్పుడును; చవులకున్= రుచులకు; ప్రేముడించున్= ప్రియపడుతుంది; ఆఁకలి= ఆహారంకొరకైన వేగిరపాటు, తాల్మి, పెంపున్= ఓర్పుయొక్క అతిశయాన్ని; ధర్మువును= ధర్మాన్ని, శమంబున్= శాంతినీ; సముద్ధతిన్= మిక్కుటమైన పోటరింపుతో; త్రెక్కొనున్= చెరచును; వీని రెంటనున్= ఈరెండింటియందును (నాలుకను+ఆకలిని); తవులవు= ఆసక్తిచూపవు; అన్నము= ఆహారము జీవిత, స్థితివిధాయకము= బ్రదుకుతెన్నును నిర్ణయించేది; నీవు= నీవు; జీవిత+ఇచ్ఛన్= బ్రదుకునందలి కోరికను; విడిచితి(వి)= వదలిపెట్టావు; ఇప్పుడు= ఈస్థితిలో; నినున్= నిన్ను; ఏమి+అని= ఏవిధంగా; ప్రశంస+ఒనర్తున్= పొగడగలను? (ఎంతపొగడినా తక్కువే అని భావం).

**తాత్పర్యం:** తపస్సుకు నిలయమైనవాడా! ఓముద్గలమహర్షీ! నాలుక ఎల్లప్పుడు రుచులను అనుభవించటానికి ఉవ్విళ్ళూరుతుంటుంది. ఓర్పును ధర్మాన్ని ఇంద్రియనిగ్రహాన్ని ఆకలి నాశనం చేయగలదు. పై రెండింటియందు నీవు ఆసక్తుడవుకావు. నీవు బ్రదుకుతెన్నును తీర్చిదిద్దే అన్నాన్ని, బ్రదుకవలెననే కోరికను కూడ విడనాడితివి. నిన్ను ఎంతని పొగడగలను? నీగొప్పతనం మాటలలో వర్ణించలేనట్టిదిసుమా!

**విశేషం:** వ్యక్తుల జీవితాలపై ప్రపంచచరిత్రపై 1. నాలుక 2. ఆకలి వేసే ప్రభావం సుప్రసిద్ధం. వ్యాసమహర్షి ఆకలి తట్టుకొనలేక కాశిని శపించాడు. విశ్వామిత్రుడు శునకమాంసం దొంగిలించాడు. నాలుక ప్రేరేపించే రుచులు మరగి - పాశ్చాత్యులు సుగంధద్రవ్యాల వ్యాపారంనిమిత్తం ప్రాచ్యప్రపంచచరిత్రనే మార్చారు. ప్రపంచచరిత్రలో ఆకలి అనేకవిప్లవాలను రేకెత్తించింది. మహాభారతం ఈ సత్యాన్ని ఏనాడో గుర్తించింది.

**క. మనమున నింద్రియముల వ । ర్తనమును సరిగా నొనర్చు ధర్మంబు దపం**
**బని చెప్పుదు; రట్టి తపం । బనఘా! నీయంద కలిగె నభినవభంగిన్. 124**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా, ఓముద్గలమునీ!; మనమునన్= చిత్తమునందు; ఇంద్రియముల వర్తనమును= ఇంద్రియాలయొక్క నడవడికను; సరిగాన్= సముచితంగా; ఒనర్చు= చేయు; ధర్మంబు= ధర్మము; తపంబు= తపస్సు; అని చెప్పుదురు= అని వచిస్తారు; అట్టి, తపంబు= అటువంటి తపస్సు (పైన చెప్పబడిన నిర్వచనానికి అనువైన తపస్సు); అభినవ, భంగిన్= కొంగ్రొత్త తీరుతెన్నులలో; నీ+అందున్+అ= నీలో మాత్రమే; కలిగెన్= ఏర్పడింది.

**తాత్పర్యం:** చిత్తాన్ని ఇంద్రియాల నడవడిని సరిగా ఉండేటట్లు చేసే ధర్మమే తపస్సు అని పెద్దల నిర్వచనం. ఓముద్గలమునీ! ఆ నిర్వచనానికి అనువైన తపస్సు నీయందు మాత్రమే కొంగ్రొత్తగా వ్యక్తమైనది.

**విశేషం:** 1. ఆంధ్రమహాభారతంలో అర్థవంతాలైన కందపద్యాలు - అల్పాక్షరముల అనల్పార్థరచనకు ఉదాహరణప్రాయాలైనవి కొన్ని ఉన్నాయి. ఈపద్యం అట్టి విశిష్ట రచన. ఇందులో తపస్సు అనే పదానికి చక్కని చిక్కని నిర్వచనం ఉన్నది. తపస్సు అంటే శరీరాన్ని తపింపచేసికొనటం కాదుగదా! 'ధర్మంబు' - ఇచట 'ముఖ్యలక్షణము' అనే అర్థంలో ప్రయోగించబడింది. 2. ఈపద్యంలో - 'అభినవభంగిన్' అనే ప్రయోగం అనుశీలించ తగింది. పెద్దలు తపస్సుకు ఇచ్చిన నిర్వచనం కొంగ్రొత్త తీరుతెన్నులలో" - ఇతఃపూర్వం మరి ఎచట కన్పించనట్టి విధంగా ముద్గలమహర్షిలో గోచరించింది. 3. ఈవాక్యాలు చెప్పింది అంతర్ముఖుడైన దుర్వాసుడు తనలోను ఇతర ఋషులలోను లేని మనోధర్మాన్ని దుర్వాసుడు ముద్గలుడిలో దర్శించి తన్మయుడయ్యాడు. ఉన్మీలనం కల్పించింది. దుర్వాసుడు నైసర్గికంగా శీఘ్రకోపనుడే అయినప్పటికి, క్రాంతిదర్శి అయిన తపస్వి కాబట్టి ముద్గలుడిలోని విశిష్ట తపశ్శక్తిని గుర్తించి ప్రశంసించగలిగాడు.

**ఉ. ప్రీతుఁడ నైతి నీవలనఁ; బేర్చిన పుణ్యఫలంబు లెల్ల నీ**
**చేతివ యయ్యెః; నీ దగు ప్రసిద్ధతపోవిభవంబు నిర్జర**
**వ్రాతము లిప్డు సాటెఁ; ద్రిదివంబున కీవును మేనితోడ వి**
**ఖ్యాతిగ దేవయానమున గ్రక్కున నేఁగెదు సంయమీశ్వరా!' 125**

**ప్రతిపదార్థం:** సంయమి+ఈశ్వరా!= సంయమం కలిగిన మునులలో శ్రేష్ఠుడా - ఓముద్గలమహర్షీ!; నీవలనన్= నీయందు; ప్రీతుఁడన్+ఐతిన్= సంతృప్తి పొందినవాడను అయినాను; పేర్చిన= కుప్పలుగా కూర్చిన; పుణ్య, ఫలంబులు+ఎల్లన్= సుకృతాల

యొక్క ఫలితాలు అన్నియు; నీచేతివి+అ+అయ్యెన్= నీహస్తంలోనివే అయినవి- అనగా నీయందే ఉన్నవి; నీది+అగు= నీయొక్క; ప్రసిద్ధ, తపస్+విభవంబు= పేరుప్రతిష్ఠలు కాంచిన తపస్సు అనే సంపద; నిర్జరవ్రాతములు= దేవతల సముదాయాలు; ఇప్డు= ఇపుడు; చాటెన్= ప్రచారంచేశాయి; ఈవును= నీవును; మేనితోడన్= శరీరంతోనే; త్రిదివంబునకున్= స్వర్గలోకానికి; దేవయానమునన్= దేవతలు తిరిగే విమానంలో; విఖ్యాతిగన్= యశస్సుపొందుతూ; గ్రక్కునన్= శీఘ్రంగా; ఏఁగెదు= వెళ్లగలవు.

**తాత్పర్యం:** ఇంద్రియనిగ్రహాన్ని సాధించిన ఋషులలో శ్రేష్ఠుడ వైన ఓ ముద్గలమహామునీ! నీవలన నేను మిక్కిలి సంతృప్తి చెందాను. ఇతఃపూర్వం ఏర్పడిన పుణ్యాలు అన్నీ నీకు కరతలామలకాలే. అన్ని సిద్ధులును నీకు లభించినవే. దేవతలు నీ తపోవైభవాన్ని కీర్తిస్తున్నారు. గొప్పకీర్తితో స్వర్గలోకానికి నీవు ఈశరీరంతోనే దేవవిమానంలో వెళ్ళగలవు'

**వ. అని పలికి దుర్వాసుం డరిగెఁ; దదనంతరంబ హంససారస యుక్తంబును గింకిణీమాలికా మనోహరంబును గామగమనంబును నయిన విమానంబు గొనుచు దేవదూత ముద్గలుకడకుం జనుదెంచి యి ట్లనియె.126**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని వచించి; దుర్వాసుండు; అరిగెన్= వెళ్ళాడు; తత్+అనంతరంబు+అ= అటు పిమ్మట; హంస, సారస, యుక్తంబును= అంచలతో బెగ్గురుపక్షులతో కూడుకొన్నదియున్నూ; కింకిణీ, మాలికా, మనోహరంబును= చిరుగంటల వరుసలచేత అందంగా ఉండి మనస్సుకు ఆహ్లాదం కలిగించేదియున్నూ; కామగమనంబును= కోరినచోటికి పోగలిగినట్టిదియున్నూ; అయిన= అయినట్టి; విమానంబున్= విమానాన్ని; కొనుచున్= తీసికొనివస్తూ; దేవదూత= దేవతల రాయబారి; ముద్గలుకడకున్= ముద్గలుడి దగ్గరికి; చనుదెంచి= వచ్చి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి దుర్వాసుడు వెళ్లిపోయాడు. పిదప, దేవదూత ముద్గలుడివద్దకు విమానం తెచ్చాడు. ఆ విమానంలో హంసలు బెగ్గురుపక్షులు ఉన్నాయి. చిరుగంటల వరుసలచేత ఆవిమానం కనుల కింపుగా గోచరించింది. ఆ విమానం కోరినచోటికి పోగలిగినమహిమ కలది.

**క. 'అనఘ! భవత్సుకృతంబున । ననిమిషలోకాభిగమ మవాప్తం బయ్యెం;**
**జనుదెమ్ము విమానము చ । య్యన నెక్కుము చిత్తమునఁ బ్రహర్షం బెసఁగన్' 127**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! ఓముద్గలమహామునీ!; భవత్+సుకృతంబునన్= నీపుణ్యంవలన; అనిమిష, లోక+అభిగమము= స్వర్గలోకాన్ని పొందటం; అవాప్తంబు+అయ్యెన్= ప్రాప్తించింది అయింది; చిత్తమునన్= మనస్సునందు; ప్రహర్షంబు= మిక్కుటమైన ఆనందం; ఎసఁగన్= విలసిల్లగా; చనుదెమ్ము= రమ్ము; విమానము= విమానమును; చయ్యనన్= శీఘ్రంగా; ఎక్కుము= అధివసించుము.

**తాత్పర్యం:** మహానుభావుడ వయిన ఓ ముద్గలమునీ! నీవు చేసిన పుణ్యకర్మవలన స్వర్గలోకం సిద్ధించింది. దయచేసి రమ్ము; ఆకాశాన పయనించగల విమానం ఇదిగో. దీనిని శీఘ్రంగా ఎక్కుము; మనస్సులో ఆనందాన్ని నింపుకొనుము.

**విశేషం:** ఆకాశయానంచేయగల విమానాలను గూర్చి పలుతావుల భారతంలో కలదు. ఇక్కడ వర్ణించబడిన విమానానికి సారథి సంకల్పమే గమ్యానికి చేర్చగలదు. 'కామగమనం' కల విమానం ఇది.

**వ. అనిన దేవదూతం జూచి ముద్గలుండు 'మహాత్మా! దివిజలోకం బెట్టిది? వినవలతు; నందుల గుణదోషంబు లెఱింగింపవలయు; సత్పురుషులతోడి మైత్రి సాప్తపదీనం బని చెప్పుదురు గావున మైత్త్రిం బురస్కరించి ని న్నడిగెద' ననిన నతం డమ్మునీంద్రున కి ట్లనియె. 128**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ముద్గలుండు; దేవదూతన్= దేవతల రాయబారిని; చూచి మహా+ఆత్మా!= గొప్ప ఆత్మకలవాడా!, ఓ దేవదూత!; దివిజలోకంబు= స్వర్గలోకం; ఎట్టిది= ఎటువంటిది; వినన్ వలతున్= వినాలని కోరుతున్నాను; అందులగుణదోషంబులు= ఆ స్వర్గలోకంలోని మంచిలక్షణాలూ లోపాలూ; ఎఱింగింపవలయున్= తెలుప వలెను; సత్+పురుషులతోడిమైత్రి= మంచివారితోడి స్నేహం; సాప్తపదీనంబు+అని= ఏడుఅడుగులకు (లేదా ఏడుమాటలకు) సంబంధించింది అని (పెద్దలు); చెప్పుదురు= వచిస్తారు; కావునన్= కాబట్టి; మైత్రిన్= స్నేహాన్ని; పురస్కరించి= ముందుపెట్టుకొని; నిన్నున్+అడిగెదన్; అనినన్; అతండు= ఆ దేవదూత ఆ+ముని+ఇంద్రునకున్= ఆ ఋషిశ్రేష్ఠుడికి (ముద్గలుడికి); ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దేవదూతతో ముద్గలమహాముని ఇట్లా చెప్పాడు: 'మహాత్మా! స్వర్గలోకం ఎటువంటిది? దానినిగురించి వినాలని కోరుకొంటున్నాను. అందలి మంచిచెడులనుగురించి దయచేసి నాకు వివరించండి. మంచివారలతో మైత్రి 'సాప్తపదీనం' అని పెద్దలు చెప్పుతారుకదా! మన ఉభయులకు స్నేహం ఏర్పడింది కాబట్టి చనువు పెంచుకొని నిన్ను ఈ విధంగా ప్రశ్నిస్తున్నాను, అనగా, దేవదూత ముద్గలుడికి ఈవిధంగా బదులు పలికాడు.

**విశేషం:** స్నేహం సాప్తపదీనం అని సనాతన సంప్రదాయం. పదం అంటే రెండు అర్థాలు ఉన్నాయి. ఒకటి మాట, ఇంకొకటి అడుగు. ఏడు అడుగులు కలిసి నడిచినా ఏడుమాటలు కలిసి మాట్లాడినా సఖ్యం ఏర్పడుతుందని అర్థం. ఇక్కడ దేవదూతా ముద్గలుడూ ఏడుపదాలు కలిసి సంభాషించారు. కాబట్టి సఖ్యం ఏర్పడినట్లే.

### ముద్గలునకు దేవదూత పుణ్యలోకంబుతెఱంగు సెప్పుట (సం. 3-247-2)

**క.** **'ఈ లోకమునకు మీఁదై । చాలఁగ వెలుఁగొందుచుండు స్వర్లోకము నా**
**నాలంకారయుతము ది । వ్యాలోకము దేవయాన మది మునినాథా! 129**

**ప్రతిపదార్థం:** మునినాథా!= మునులకు ప్రభువైనవాడా! (ఓముద్గలమహామునీ!); ఈలోకమునకున్= ఈ లోకానికి; మీఁదు+ఐ= పైన ఉండేదయి; చాలఁగన్= మిక్కుటంగా; స్వర్లోకము= (స్వర్+లోకము=) స్వర్గలోకం; వెలుఁగొందుచున్+ఉండున్= ప్రకాశిస్తుంటుంది; నానా+అలంకార, యుతము= అనేక రకాలుగా అందాన్ని ఇనుమడింపచేసే భూషణాలతో కూడింది; అది= ఆ స్వర్గలోకం; దివ్య+ఆలోకము= దేవతామహిమగల చూపు కలది; దేవయానము= దేవతలు నడయాడేది;

**తాత్పర్యం:** మునులలో శ్రేష్ఠుడవైన ఓ ముద్గలా! స్వర్గలోకం భూలోకానికి పైన ఉంటుంది. నిత్యం ప్రకాశిస్తూ ఉంటుంది. అందులో ఎన్నో అందమైన భూషణాలు ఉంటాయి. దివ్యుల యొక్క దృష్టి గలిగి ఉంటుంది. దేవతలు నడయాడే స్థలం అది స్వర్గలోకం.

**చ.** **అమలతపోనివాసులు మహాధ్వరశీలురు సత్యసంధు లు**
**త్తములు జితేంద్రియుల్ సములు దానపరుల్ రణశూరు లందు హ**
**ర్షమున వసింతు; రచ్చరలు సాధ్యులు దేవమునుల్ మరుద్వసు**
**ప్రముఖులు వేఱువేఱ తగుపట్టుల నుండుదు రంద యిమ్ములన్. 130**

**ప్రతిపదార్థం:** అమల, తపస్+నివాసులు= స్వచ్ఛ మైన తపస్సులో నివసించేవారు; మహా+అధ్వర, శీలురు= గొప్పయజ్ఞాలను చేసే స్వభావం కలవారు; సత్యసంధులు= సత్యాన్ని పాటించటానికి శపథం చేసినవారు; ఉత్తములు= మంచివారు; జిత+

ఇంద్రియుల్= జయించిన ఇంద్రియాలు కలవారు; సములు= సమబుద్ధిని ఆర్జించినవారు; దానపరుల్= దానాన్ని వ్రతంగా పాటించేవారు; రణశూరులు= యుద్ధంలో పరాక్రమం ప్రదర్శించేవారు; అందున్= ఆ స్వర్గంలో; హర్షమునన్= సంతోషంతో; వసింతురు= నివసిస్తారు; అచ్చరలు= అప్సరసలు; సాధ్యులు= విశిష్టులైన దేవతలు; దేవమునుల్= దేవర్షులు; మరుత్+వసు, ప్రముఖులు= మరుత్తులు వసువులు మున్నగువారు; వేఱువేఱ= ప్రత్యేకంగా; తగు= సముచితమైన; పట్టులన్= స్థలాలలో; ఇమ్ములన్= సంప్రీతితో; ఉందురు= నివసిస్తారు.

**తాత్పర్యం:** స్వచ్ఛమైన తపస్సులో సిద్ధిపొందిన మహర్షులు, గొప్పయజ్ఞాలను చేసినవారు, సత్యాన్ని పాటించటానికై ప్రతిజ్ఞచేసి కృతకృత్యులైనవారు, దానధర్మాలు చేసినవారు, యుద్ధాలలో గొప్పపరాక్రమం ప్రదర్శించినవారు స్వర్గలోకంలో సంతోషాన్ని అనుభవిస్తూ నివసిస్తారు. అందులో అప్సరసలు, సాధ్యులు, దేవర్షులు, మరుత్తులు, వసువులు ప్రీతితో ఆయాస్థలాలలో నివసిస్తూ ఉంటారు.

**విశేషం:** సాధ్యులు= దేవతలలో ఒకగణానికి చెందినవారు. మనువు, హనుమంతుడు, విష్ణువు, ధర్ముడు మున్నగువారు. వసువులు= దేవతలలో ఒక గణానికి చెందినవారు. అష్టవసువులు. 1. ఆపుడు 2. ధ్రువుడు 3. సోముడు 4. అధర్వుడు 5. అనిలుడు 6. ప్రత్యూషుడు 7. అనలుడు 8. ప్రభాసుడు. మరుత్తులు= వాయుదేవతలు. వేదవాఙ్మయంలో వీరు మిక్కుటమైన ప్రభావం గల దేవతలుగా వర్ణించబడ్డారు.

**వ. మఱియు ముప్పదిమూఁడు వేల యోజనంబుల విస్తృతంబైన మేరుశిఖరంబునందు నందనప్రముఖంబు లైన దేవోద్యానంబులు పుణ్యపరులకుం గ్రీడాస్థానంబులై విలసిల్లు; నయ్యెడల నాఁకలియు నీరువట్టును శీతోష్ణభయంబులును జరారోగవికృతులును బుట్ట; వెయ్యెడలం జూచిన నతిమనోహరంబై సకలేంద్రియ తర్పణం బై యుండు; నిట్టి పుణ్యలోకంబునకు నర్హు లైన పుణ్యపురుషులు విధినియోగ పక్వంబు లయిన మానుషశరీరంబులు విడిచి తేజోమయంబు లగు దివ్యదేహంబులు ధరియించి వివిధాంబరాభరణ భూషితులును నమ్లానకుసుమమాలికా మనోహరులునై కనకవిమానంబులందు దేవదూతలచేతం గొనిపోవంబడి యందు శోకభ్రమశ్రమాయాసవిరహితు లై వివిధసుఖంబు లనుభవించుచుందుదురు.** **131**

**ప్రతిపదార్థం:** మఱియున్; ముప్పదిమూఁడువేలయోజనంబుల= ముప్పదిమూడువేలామడల; విస్తృతంబు+అయిన= వైశాల్యంగల; మేరుశిఖరంబునందున్= మేరువు అనెడి పర్వతంయొక్క కొనభాగంలో; నందన ప్రముఖంబులు+ఐన= నందనం మున్నగునవి అయిన; దేవ+ఉద్యానంబులు= వేలుపులయొక్క తోటలు; పుణ్యపరులకున్= సుకృతాన్ని ఆర్జించినవారికి; క్రీడాస్థానంబులు+ఐ= ఆటలకు అనువైన చోటులై; విలసిల్లున్= శోభిల్లుతాయి; ఆ+ఎడలన్= ఆ చోటులలో; ఆఁకలియున్= ఆహారం తినవలెననే కోరికయున్నూ; నీరువట్టును= దప్పికయున్నూ; శీత+ఉష్ణ, భయంబులును= చలివలన వేడి వలన కలిగే వెరపులున్నూ; జరా, రోగ, వికృతులును= ముసలితనానికి, జబ్బులకు సంబంధించిన దురవస్థలున్నూ; పుట్టవు= కలుగవు; ఏ+ఎడలన్= ఏచోట్లలో; చూచినన్= దర్శించినా; అతిమనోహరంబు+ఐ= మిక్కిలి సొగసుగా ఉండి మనస్సుకు ఆహ్లాదం కలిగించేదై; సకల+ఇంద్రియ, తర్పణంబు+ఐ+ఉండున్= అన్ని ఇంద్రియాలకు సంతుష్టి చేకూర్చేదై ఉంటుంది; ఇట్టి= ఇటువంటి; పుణ్యలోకంబునకున్= సుకృతంచేత సిద్ధించే లోకానికి; అర్హులు+ఐన= యోగ్యులు అయిన; పుణ్యపురుషులు= సుకృతం ఆర్జించినవారు; విధినియోగపక్వంబులు+అయిన= అదృష్టంతోకూడి పండినటువంటి; మానుష శరీరంబులు= మనుజ జన్మకు సంబంధించిన దేహాలు; విడిచి= వదలిపెట్టి; తేజస్+మయంబులు+అగు= వర్చస్సుతో కూడిన; దివ్యదేహంబులు= దివ్య శరీరాలు; ధరియించి=

వహించి; వివిధ+అంబర+ఆభరణ, భూషితులును= పెక్కు రకాలైనవస్త్రాలచేత, భూషణాలచేత అలంకరించబడిన వారై; అమ్లాన, కుసుమ, మాలికా, మనస్+హరులును= వాడనటువంటి పూలదండలచేత అందమైన వారున్నూ; ఐ= ఔతూ; కనక, విమానంబులందున్= బంగారంతో చేయబడిన విమానాలలో; దేవదూతలచేతన్= దేవతల ప్రతినిధులచేత; కొనిపోవంబడి= తీసికొనివెళ్లబడి; అందున్= ఆ స్వర్గంలో; శోక, భ్రమ, శ్రమ+ఆయాస, విరహితులు+ఐ= దుఃఖం, మోహం, కష్టమైనపని చేయటంవలన కలిగే అలసట లేనివారై; వివిధ సుఖంబులు= పెక్కువిధాలైన భోగాలు; అనుభవించుచున్+ఉండుదురు= పొందుతూ ఉంటారు.

**తాత్పర్యం:** స్వర్గలోకంలో ముప్పదిమూడువేల ఆమడల వైశాల్యంగల మేరుపర్వత శిఖరం ఉన్నది. అక్కడ వేలుపుల పెంపుడుతోట నందనోద్యానం ఉన్నది. దాహం లేదు. చలివలన వేడివలన కలిగే పీడలు ఉండవు. ముసలితనం లేదు. వ్యాధులు లేవు. ఎటుచూచినా, మనోహరాలైన దృశ్యాలే. అది సకలేంద్రియాలకు సంపూర్ణసంతృప్తి ఘటించే లోకం. అట్టి స్వర్గలోకానికి పోవటానికి అర్హులైన పుణ్యాత్ములు ఆయుస్సు తీరినపిదప రాలిపడిపోయే మనుజదేహాలను విడనాడి, తేజోమయశరీరాలను ధరించగలరు. వారు కోరిన వస్త్రాలు, అలంకారాలు, ఆభరణాలు, వాడిపోని పూలదండలు, మనోహరాలైన పసిడివిమానాలు సమకూర్చబడి దేవదూతలచేత స్వర్గానికి కొనిపోబడతారు. ఆ స్వర్గలోకంలో ఉన్నప్పుడు వారికి ఇక ఎట్టి దుఃఖాలు ఉండవు. కష్టపడి పనిచేయడంవలన కలిగే అలసట ఉండదు. వారు నిరంతర సౌఖ్యాలు అనుభవిస్తూ ఆనందంలో ఓలలాడుతారు.

**ఆ. అనఘ! యింద్రలోకమునకంటె మీఁద ని । శ్శోక మగుచు బ్రహ్మలోక మమరు;**
**నది యనన్యదీప్తసదన మై తన దైన । వెలుఁగునను జగంబు వెలుఁగఁ జేయు. 132**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా! ఓముద్గలమహామునీ!; ఇంద్రలోకమునకంటెన్= స్వర్గలోకంకంటె కూడ; మీఁదన్= పైన; నిశ్శోకము+అగుచున్= దుఃఖం లేనిది ఔతూ; బ్రహ్మలోకము= బ్రహ్మయొక్క భువనం (సత్యలోకం); అమరున్= ఉంటుంది; అది= ఆ బ్రహ్మలోకం; అనన్య, దీప్త, సదనము+ఐ= సాటిలేకుండ వెలిగే నివాసం అయి; తనది+ఐన= తనయొక్క; వెలుఁగునను= దీప్తిచేతనే; జగంబున్= లోకాన్ని; వెలుఁగన్+చేయున్= ప్రకాశించేటట్లు చేస్తుంది.

**తాత్పర్యం:** పుణ్యాత్ముఁడ వైన ఓ ముద్గల మహామునీ! స్వర్గలోకంపైన ఇంకొక గొప్పలోకం - బ్రహ్మలోకం ఉన్నది. అది దుఃఖరహిత మైనది. స్వయంప్రకాశమానమై సాటిలేకుండ వెలుగొందేది. ఆ బ్రహ్మలోక ప్రదీప్తిచేతనే జగత్తు ప్రకాశిస్తుంది.

**చ. మనువులు ధాతలున్ మునులు మానుగ నుండుదు; రందు లోభముం**
**గినుకయుఁ గిల్బిషంబు నపకీర్తియు దుఃఖము జన్మవైకృతం**
**బును జనియింప; వీభువనముల్ దెగునప్పుడు నాశమొంద ద**
**ద్వినుతపదంబు; దానియెడ వేడుక సేయుదు రింద్రముఖ్యులున్. 133**

**ప్రతిపదార్థం:** మనువులు= మనువులు అనే దేవతలు; ధాతలున్= బ్రహ్మలు; మునులున్= ఋషులు; మానుగన్= ఒప్పిదంగా; అందున్= ఆ బ్రహ్మలోకంలో; ఉండుదురు= ఉంటారు; లోభమున్= పిసినిగొట్టుతనం; కినుకయున్= కోపం; కిల్బిషంబు= పాపం; అపకీర్తి= చెడుపేరు; దుఃఖము= ఆవేదన; జన్మ; వైకృతంబును= పుట్టుకమార్పు; జనియింపవు= పుట్టవు, కలుగవు; ఈ భువనముల్= ఈ లోకాలు; తెగునప్పుడు= నశించేటప్పుడు, (ప్రళయకాలంలో); ఆ+వినుతపదంబు=

అప్రశంసనీయమైన లోకం; నాశము+ఒందదు= నశించదు; దాని+ఎడన్= ఆ బ్రహ్మలోకంపట్ల; ఇంద్రముఖ్యులున్= ఇంద్రుడు మొదలైనవారు; వేడుక+చేయుదురు= కోరుకొంటారు.

**తాత్పర్యం:** మనువులు, బ్రహ్మలు, ఋషులు బ్రహ్మలోకంలో ఉంటారు. అక్కడ లోభం, కోపం, పాపం, దుర్యశం, ఆవేదన, పునర్జన్మలు ఉండవు. లోకాలన్నీ ప్రళయకాలంలో నాశనమౌతాయి కాని సత్యలోకం శాశ్వతంగా ఉంటుంది. ఆ పదం అందుకోడానికై ఇంద్రుడు మున్నగువారు సయితం కోరుకొంటారు.

**విశేషం:** 1. ప్రాచీన భారతీయుల కాలమానం విశిష్టమైనది. 4,320,000 సంవత్సరాలు ఒక మహాయుగం. అట్టివి 1000 మహాయుగాలు బ్రహ్మదేవుడికి ఒక పగలు. బ్రహ్మదేవుడికి ఒక పగలు, ఒకరాత్రి అట్టివి కలిస్తే ఒక దినం. 14 మనువులు బ్రహ్మదేవుడి ఒక దినంలో పరిపాలిస్తారు. మనువు పరిపాలనకు మన్వంతరం అని పేరు. మన్వంతరంలో 337, 142,657 1/2 మానవదినాలు ఉంటాయి. మనువులు పదునలుగురు. 1. స్వాయంభువుడు 2. స్వారోచిషుడు 3. ఉత్తముడు 4. తామసుడు 5. రైవతుడు 6. చాక్షుషుడు 7. వైవస్వతుడు 8. సూర్యసావర్ణి 9. దక్షసావర్ణి 10. బ్రహ్మసావర్ణి 11. ధర్మసావర్ణి 12. రుద్రసావర్ణి 13. రౌచ్యుడు 14. భౌచ్యుడు.

**వ. స్వర్గంబునం గల గుణంబు లెఱింగించితిఁ దదీయదోషంబులు సెప్పెద వినుము. 134**

**తాత్పర్యం:** స్వర్గలోకంలో ఉండే గుణాలు చెప్పాను. ఇక దానిలోని దోషాలను చెప్పుతాను వినుము.

**తే. ఇందుఁ జేసినపుణ్యంబు లెల్ల నందుఁ । గుడుచుఁ గాని మర్త్యున కందుఁ గడఁగి పుణ్య**
**మాచరింపంగఁ గాదు; పుణ్యావసాన । మగుడు భూమిక ద్రోతురు మగుడ నతని. 135**

**ప్రతిపదార్థం:** ఇందున్= ఈ (భూ) లోకంలో; చేసిన= ఒనర్చిన; పుణ్యంబులు+ఎల్లన్= సుకృతాలు అన్నియును; అందున్= స్వర్గలోకంలో; కుడుచున్= అనుభవిస్తాడు; కాని= కాని; మర్త్యునకున్= మనుజుడికి; అందున్= స్వర్గలోకంలో; కడఁగి= పూని; పుణ్యము= సుకృతం; ఆచరింపంగన్= చేయటానికి; కాదు= వీలులేదు; పుణ్య+అవసానము+అగుడున్= సుకృతం క్షీణించినపిదప; భూమికిన్+అ= భూలోకానికే; మగుడన్= తిరిగి; అతనిన్= ఆ మనుజుని; ద్రోతురు= క్రిందికి పడవేస్తారు.

**తాత్పర్యం:** ఈ భూలోకంలో చేసినట్టి పుణ్యఫలాలను ఆ స్వర్గలోకంలో మనుజుడు అనుభవించగలడు. కాని, స్వర్గలోకంలో మనుజుడు ఎట్టి పుణ్యాన్ని ఆర్జించటానికి వీలు లేదు. మనుజుడు చేసిన పుణ్యం అనుభవించిన పిమ్మట అతడు స్వర్గలోకంలో ఉండటానికి వీలులేదు. అతడిని తిరిగి భూలోకంలోనికి త్రోసివేస్తారు.

**క. కడు మరగిన సౌఖ్యంబులు । విడుచుటఁ జిత్తంబు దుఃఖవివశముగ మహిం**
**బడుఁ జూవె; పుణ్యలోకం । బెడలిన మనుజుండు దేజ మేది యబలుఁ డై. 136**

**ప్రతిపదార్థం:** పుణ్యలోకంబు+ఎడలిన= స్వర్గలోకం విడనాడిన; మనుజుండు= మనుష్యుడు; తేజము+ఏది= వర్చస్సు తరిగిపోయి; అబలుఁడు+ఐ= శక్తికోలుపోయినవాడై; కడున్= మిక్కుటంగా; మరగిన, సౌఖ్యంబులు= అనుభవించటానికి అలవాటుపడిన భోగాలు; విడుచుటన్= వదలిపెట్టుటవలన; చిత్తంబు= మనస్సు; దుఃఖ, వివశముగన్= ఆవేదనకు మిక్కుటంగా లోనై; మహిన్= భూమిమీద; పడున్+చూవె= పడతాడుసుమా.

**తాత్పర్యం:** స్వర్గంనుండి తేజమును కోల్పోయి పుణ్యహీనుడై భూమిపై తిరిగి పడిన మనుజుడు మనస్సులో ఆవేదన పొందుతాడు. ఏలన భోగాలు అనుభవించటానికి అలవాటుపడినవాడు వాటిని విడనాడటం అంటే ఆవేదన పొందటమే కదా.

**విశేషం:** పుణ్యం తరిగిపోయిన పిమ్మట మనుజుడి ఆత్మ స్వర్గలోకంనుండి భూలోకం చేరి పునర్జన్మ మెత్తుతుంది. ఈవిషయం భగవద్గీతలో చెప్పబడింది. "తే పుణ్య మాసాద్య సురేంద్రలోకం । అశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్ । తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం । క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి".

**క. తన తక్కువయునికియు న । న్యుని యున్నతశీలతయుఁ గనుంగొని చిత్తం**
**బున నెరియుచునికి గలుగును । జననుత! సురలోకవాస జనులకు నెల్లన్. 137**

**ప్రతిపదార్థం:** జన, నుత!= ప్రజలచేత ప్రశంసించబడినవాడా! ఓముద్గలమహాముని!; తన, తక్కువ+ఉనికియును= తాను తక్కువ స్థితిలో ఉండటమున్నూ; అన్యుని+ఉన్నత శీలతయున్= ఇతరుడియొక్క ఎక్కువస్థితిని; కనుంగొని= అరసి; చిత్తంబునన్= మనుస్సులో; ఎరియుచున్+ఉనికి= పరితపిస్తూ ఉండటం; సుర, లోక, వాస, జనులకున్= స్వర్గలోకంలో నివసించే ప్రజలకు; ఎల్లన్= అందరకును; కలుగును= ఉంటుంది.

**తాత్పర్యం:** స్వర్గలోకంలో నివసించే జనులు సయితం తమమనస్సులలో పరితాపం చెందుతారు. తాను హీనస్థితిలో ఉండటం. ఇంకొకడు హెచ్చుస్థాయిలో ఉండటం అరసినపుడు వారికి మనస్తాపం కలుగుతుంది.

**వ. బ్రహ్మలోకంబునం దక్కఁదక్కిన పుణ్యలోకంబులం దెల్ల నిదియ మేరయై చెల్లు; మఱియుఁ బుణ్యలోకపరిభ్రష్టుండ మర్త్యలోకంబున సుఖశీలుం డయి పుట్టు; నీలోకంబు గర్మభూమియు నాలోకంబు ఫలభూమియు నని యెఱుంగుము; నీవలని యాదరంబునంజేసి యింతయుం జెప్పితి; నీ వింకఁ దడయ నేల? చనుదె' మ్మనిన ముద్గలుండు గొండొక విచారించి దేవదూతం జూచి యిట్లనియె. 138**

**ప్రతిపదార్థం:** బ్రహ్మలోకంబునన్+తక్కన్= బ్రహ్మలోకంలో తప్ప; తక్కిన= మిగిలిన; పుణ్యలోకంబులందున్+ఎల్లన్= సుకృతంవలన పొందగల భువనాలయందు అన్నిచోటులలో; ఇది+అ= ఇది మాత్రమే; ఈవిధమైన మనస్తాపం చెందటమే; మేర+ఐ= అవధి అయి; చెల్లున్= ప్రవర్తిల్లుతుంది; మఱియున్= ఇంకను; పుణ్యలోక, పరిభ్రష్టుండు+అ= పుణ్యాన్ని ఆర్జించటంచేత పొందిన భువనాలనుండి త్రోయబడినవాడే; మర్త్యలోకంబునన్= చావునకు లోనయ్యే మనుజులు ఉండే భూలోకంలో; సుఖశీలుండు+అయి= భోగాలను అనుభవించేవాడై; పుట్టున్= జన్మిస్తాడు; ఈలోకంబు= ఈ(భూ) లోకం; కర్మ, భూమియున్= కర్మలు చేసే సీమ (కర్మచేసి పుణ్య పాపాలను ఆర్జించేచోటు); ఆ లోకంబు= ఆస్వర్గసీమ; ఫలభూమియున్= భూలోకంలో చేసిన కర్మకు అనువైన ఫలితాన్ని అనుభవించే సీమ; అని+ఎఱుంగుము= అని తెలిసికొనుము; నీవలని+ఆదరంబునన్+చేసి= నీయందు నాకు కల అభిమానం చొప్పున; ఇంతయున్= ఇంతమేర (ఈ స్వర్గలోకవృత్తం); చెప్పితిన్= వచించాను; నీవు= నీవు, ఇంకన్= ఇక మీదట; తడయన్+ఏల?= ఆలసించటం ఎందుకు? చనుదెమ్ము= స్వర్గానికి దయసేయుము; అనినన్= అని పలుకగా; ముద్గలుండు= ముద్గలుడు; కొండొక, విచారించి= కొంత తడవు ఆలోచించి; దేవదూతన్+చూచి= దేవతల ప్రతినిధిని కాంచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** బ్రహ్మలోకానికి తక్కిన పుణ్యలోకాలకు మధ్య నున్న తారతమ్యం ఇదే. పుణ్యం క్షీణించిన పిదప స్వర్గలోకంనుండి త్రోసివేయబడిన వాడే తిరిగి భూలోకంలో సౌఖ్యాలను అనుభవించే స్వభావం కలవాడుగా జన్మిస్తాడు. భూలోకం 'కర్మభూమి'. భూలోకంలో చేసిన కర్మవలన పుణ్యపాపాలు సిద్ధిస్తాయి. స్వర్గసీమ ఫలభూమి. స్వర్గలోకంలో జీవి భూలోకంలో చేసిన కర్మల కనువైన పుణ్యానికి తగిన స్వర్గభోగాలను తత్ఫలితంగా అనుభవిస్తాడు. నీయందు గల అభిమానంచొప్పున నేను నీకు ఈ విషయాలు వివరించి చెప్పాను. ఇక ఆలస్యం ఎందుకు? నీవు స్వర్గలోకానికి

విచ్చేయుము' అని దేవదూత చెప్పిన మాటలు విని ముద్గలుడు కొంతతడవు ఆలోచించి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**ఆ. 'ఇట్టి దివ్యసుఖము లే నొల్లఁ; బదివేలు । వచ్చె నాకు; నమరవర్గమునక**
**యుండనిమ్ము వాని నో యన్న! విచ్చేయు । మిష్టమైన యెడకు నిపుడ నీవు. 139**

**ప్రతిపదార్థం:** ఓ+అన్న!= ఓయన్న, ఓదేవదూతా!; ఇట్టి= ఇటువంటి; దివ్యసుఖములు= స్వర్గలోకానికి సంబంధించిన భోగాలు; ఏన్= నేను; ఒల్లన్= అనుభవించటానికి సమ్మతించను; నాకున్ పదివేలు వచ్చెన్ = నాకు పదివేల (భోగాలు) వచ్చినట్లుగనే భావిస్తున్నాను; వానిన్= ఆభోగాలను; అమరవర్గమునకున్+అ= వేల్పులసముదాయానికే; ఉండన్+ఇమ్ము= ఉండనిమ్ము!; ఇపుడు+అ= ఇప్పుడే; నీవు= (ఓ దేవదూతా!) నీవు; ఇష్టము+ఐన+ఎడకున్= కోరిన చోటికి; విచ్చేయుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** ప్రియమైన ఓదేవదూతా! నాకు స్వర్గభోగాలు అవసరంలేదు.అట్టివి పదివేలు నాకు కలిగినట్లే భావించుకొంటున్నాను. ఆ భోగాలను అన్నింటిని వేల్పులే అనుభవిస్తారుగాక! ఇక నీవు ఈ క్షణంలోనే నీకు నచ్చిన చోటికి వెడలిపొమ్ము.

**క. ఎయ్యెడకుఁ జనినఁ బురుషుం । డియ్యెడకును మగుడకుండు నెక్కాలము నే**
**నయ్యుత్తమపదవికినై । యెయ్యనువున నైన నుత్సహించెద బుద్ధిన్.' 140**

**ప్రతిపదార్థం:** ఏ+ఎడకున్= ఏచోటికి; చనినన్= వెడలినప్పుడు; పురుషుండు= మనుజుడు, జీవుడు; ఈ+ఎడకును= ఈచోటికి (భూలోకానికి); ఏ+కాలమున్= ఏ సమయంలోను; మగుడక+ఉండున్= తిరిగిరాక ఉంటాడో; ఏన్= నేను ఆ+ఉత్తమ, పదవికిన్+ఐ= అట్టి మంచిస్థాయికి; ఏ+అనువునన్+ఐనన్= ఏ ఉపాయంచేత నయినా; బుద్ధిన్= మనసులో; ఉత్సహించెదన్= ఉత్సాహంతో ప్రయత్నిస్తాను.

**తాత్పర్యం:** ఏచోటికి చేరితే జీవుడు తిరిగి ఈ భూలోకానికి రాకుండా శాశ్వతంగా ఉండగలడో, అట్టి గొప్పస్థాయికి చేరటానికై నేను ఏమార్గంలోనైనా చిత్తశుద్ధితో శక్తివంచన లేకుండా ప్రయత్నం చేయగలను.

**విశేషం:** 1. స్వర్గలోకాన్ని చేరటానికి నిరసించిన ఉదాత్తపాత్ర ముద్గలుడు. 2. ముద్గలుడి గాథకు సమాంతరమైనది సక్తుప్రస్థుని కథ. భారతంలోని అశ్వమేధపర్వం చూడండి.

**వ. అని దేవదూత వీడ్కొలిపి ముద్గలుండు శిలోంఛవృత్తి విడిచి, పరమశాంతిం గైకొని, నిర్వికల్పం బైన జ్ఞానయోగంబునం జేసి తుల్యనిందాస్తుతియును సమలోష్టాశ్మకాంచనుండును నై పరమసిద్ధిం బొందెఁ; బాండవోత్తమా! నీవును రాజ్యరహితుండనైతి నని వగవక తపంబు సేయుము; తపంబునంజేసి శుభంబులు సేకుఱుఁ; బదుమూఁడవునేఁటి కడపటఁ బితృపైతామహంబైన రాజ్యంబు నిన్నుం బ్రాపించు' నని యిట్లు సాత్యవతేయుండు గౌంతేయుల నాశ్వాసించి నిజాశ్రమంబునకుం జనియె; నంత. 141**

**ప్రతిపదార్థం:** అని= వచించి; దేవదూతన్= దేవతలప్రతినిధిని; వీడ్కొలిపి= పంపి; ముద్గలుండు; శిలా+ఉంఛవృత్తి= పండినచేలలో నేలరాలిన వరిగింజలను ఏరుకొని బ్రదుకు తెరువు సాగించటం; విడిచి= వదలిపెట్టి; పరమశాంతిన్= గొప్పదైన నిర్వికార చిత్తవృత్తిని; కైకొని= గ్రహించి; నిర్వికల్పంబు+ఐన= మార్పు లేని; జ్ఞానయోగంబునన్+చేసి= జ్ఞానయోగంచేత; తుల్య, నిందా,

స్తుతియును= పొగడ్తలపట్ల, తెగడ్తలపట్ల సమాన మైన భావం కలిగి ఉండేవాడున్నూ; సమలోష్ట+అశ్మకాంచనుండును= మట్టిగడ్డ, రాయి, బంగారం అనే వాటిని సమభావంతో చూచువాడున్నూ; ఐ= అయి; పరమసిద్ధిన్= గొప్పకైవల్యస్థాయిని; పొందెన్= పొందాడు; పాండవ+ఉత్తమా!= పాండవులలో శ్రేష్ఠుడా, ఓధర్మరాజా!; నీవును= నీవుసయితమూ; రాజ్య, రహితుండను= రాజ్యంలేనివాడను; ఐతిన్+అని= అయినాను అని; వగవక= దుఃఖించక; తపంబు+చేయుము= తపస్సు చేయుము; తపంబునన్+చేసి= తపస్సుచేయడంచేత; శుభంబులు+చేకుఱున్= మంగళాలు ప్రాప్తిస్తాయి; పదుమూఁడవు+ఏఁటి, కడపటన్= పదమూడవ సంవత్సరం చివర; పితృపైతామహంబు+ఐన= తండ్రికి తాతకు సంబంధించిన; రాజ్యంబు= పరిపాలించే దేశం; నిన్నున్= నిన్ను; ప్రాపించున్= పొందుతుంది; అని= అని చెప్పి; ఇట్లు= ఈరీతిగా; సాత్యవతేయుండు= సత్యవతికొడుకు (వేదవ్యాసమహర్షి); కౌంతేయులన్= కుంతీకుమారులను-పాండవులను; ఆశ్వాసించి= ఓదార్చి; నిజ+ఆశ్రమంబునకున్= తనయొక్క ఆశ్రమానికి; చనియెన్= వెళ్ళాడు; అంతన్= పిదప.

**తాత్పర్యం:** అని చెప్పి, దేవదూతను గౌరవమర్యాదలతో వీడుకొల్పి, ముద్గలుడు ఉంఛవృత్తిని విడిచి గొప్ప నిర్వికారచిత్తప్రశాంతిని పొంది గొప్పజ్ఞానయోగి అయ్యాడు. అప్పుడు అతడికి పొగడ్తల తెగడ్తలపట్ల సమభావం ఏర్పడింది. మట్టిపెళ్ళ, రాయి, బంగారం అతడి దృష్టిలో భేదం లేనట్టివే. ఆవిధంగా అతడు జీవన్ముక్తుడు అయ్యాడు. పాండవులలో పెద్దవాడవు అయిన ఓ ధర్మరాజా! నీవు నీరాజ్యాన్ని గోలుపోయినందుకు దుఃఖించకుము. కర్మయోగంచేతనే కాక జ్ఞానయోగంవలనగూడ చరితార్థత సిద్ధిస్తుంది. నీవు తపస్సు చేయుము. తపస్సువలన సమస్త శుభాలును చేకూరగలవు. పదమూడు సంవత్సరాలు గడిచినపిదప నీకు నీ తండ్రితాతలకు సంబంధించిన రాజ్యం చేకూరగలదు' అని సత్యవతికొడుకు అయిన వేదవ్యాసమహర్షి కుంతీకుమారు లైన పాండవులను ఓదార్చి తనఆశ్రమానికి వెళ్ళాడు. అంతట.

**విశేషం:** 1. భగవద్గీత మహాభారతానికి గుండెకాయ వంటిది అని పెద్దల అభిభాషణం. మహాభారతంలోని ఉపాఖ్యానాలన్నియు భగవద్గీతలో చెప్పబడిన సిద్ధాంతాలకు వ్యాఖ్యానప్రాయాలైన ఉదాహరణలే అని పెద్దల ప్రవచనం. అందుకు ముద్గలుడి గాథ చక్కని నిదర్శనం. 'తుల్యనిందాస్తుతియును' - 'సమలోష్టాశ్మకాంచనుడు' ఈ పదగుంఫనాలు భగవద్గీతలోనివే. ఈ ప్రకరణంలో భగవద్గీతలోని యీక్రింది శ్లోకాలు అనుస్మరించదగినవి. "జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః । శీతోష్ణసుఖదుః ఖేషు తథా మానావమానయోః॥' 6-1; "జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః । యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః॥'' 6-8.

**మ. వితతానేకమృగాకులంబును సదావిర్భూత నానాతరు**
**ప్రతతీపుష్పసుగంధబంధురశుభావాసంబు బ్రహ్మర్షిసం**
**శ్రితపుణ్యాశ్రమమండలంబు నగుచుం జెల్వొందు నక్కానలో**
**ధృతపుణ్యుల్ విహరించి రేవురును గుంతీపుత్త్రు లిచ్ఛాగతిన్. 142**

**ప్రతిపదార్థం:** వితత+అనేక, మృగ+ఆకులంబును= విస్తరించిన పెక్కుజంతువులచేత నిండినది; సదా+ఆవిర్భూత, నానా, తరు, ప్రతతీ, పుష్ప, సుగంధబంధురశుభ+ఆవాసంబున్= ఎల్లప్పుడు పుట్టుతున్న పెక్కు చెట్లగుంపులకు సంబంధించిన పూల పరిమళంతో కూడి మంగళకరమై నివాసయోగ్య మైన స్థలం; బ్రహ్మ+ఋషి, సంశ్రిత, పుణ్య+ఆశ్రమ మండలంబును+అగుచున్= బ్రహ్మజ్ఞానాన్ని ఆర్జించిన మునులచేత ఆశ్రయించబడినట్టి పుణ్యప్రద మైన ఆశ్రమాల సమూహాలు కలిగినది ఔతూ; చెల్వొందు= శోభిల్లే; ఆ+కానలోన్= ఆ అడవిలో; ధృతపుణ్యుల్= ధరించిన పుణ్యంకలవారు, పుణ్యాత్ములు; కుంతీపుత్త్రులు= కుంతీకుమారులు; ఏవురును= ఐదుగురును; ఇచ్ఛాగతిన్= ఇచ్చవచ్చినట్లు; విహరించిరి= వినోదంగా తిరిగారు.

**తాత్పర్యం:** కుంతీపుత్త్రు లైన పాండవులు అయిదుగురును స్వేచ్ఛగా వినోదంగా ఆ అడవిలో సంచరించారు. పాండవులు పుణ్యాన్ని ఆర్జించినవారు. ఆ అడవిలో బ్రహ్మజ్ఞానాన్ని ఆర్జించిన ఋషివరేణ్యులు నివసించే ఆశ్రమాలు పెక్కు ఉన్నాయి. పెక్కుమృగాలు విస్తారమైన ఆ అరణ్యంలో క్రుమ్మరుతూ ఉన్నాయి. ఆ అడవిలో పెక్కుచెట్లు ఉన్నాయి. ఆ చెట్లలో ఎప్పటికప్పుడు వికసించే పూవులయొక్కపరిమళం ఆ అడవిలో వ్యాపించి సుఖశుభనివాసానికి తోడ్పడుతున్నది.

**విశేషం:** కవిత్రయం పలుతావులలో - పాండవులను కుంతీపుత్త్రులుగానే అభివర్ణించటం కద్దు. ఈ పద్యంలో సుస్పష్టంగా ఎఱ్ఱన 'కుంతీపుత్త్రులేవురును' అని ప్రయోగించాడు. కుంతికి పుత్రులు ముగ్గురు. నకులసహదేవులు మాద్రికొడుకులు. ధర్మశాస్త్ర ప్రకారం భర్తకొడుకులు, భార్యకు సయితం పుత్రులే. అర్జునుడిని పేర్కొంటూ తిక్కనవిరాటపర్వంలో - వచ్చెం గుంతీసుతమధ్యముండు అని ప్రయోగించాడు.

**వ. ఒక్కనాఁడమ్మహారథులు దృణబిందు నాశ్రమంబున ధౌమ్యసహితంబుగాఁబాంచాలి నునిచి యేవురు నొక్కట మృగయార్థంబు నలుదిక్కులకుం జనిన యనంతరంబ. 143**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు= ఒకరోజున; ఆ+మహా, రథులు= గొప్పరథాలు కలవారు అనగా గొప్పవీరులు; తృణబిందు+ ఆశ్రమంబునన్= తృణబిందు మహామునియొక్క ఆశ్రమంలో; ధౌమ్య, సహితంబుగాన్= ధౌమ్యుడితో పాటుగ; పాంచాలిన్+ఉనిచి= ద్రౌపదిని ఉంచి; ఏవురున్= అయిదుగురును (ధర్మజ భీమార్జున నకుల సహదేవులు); ఒక్కటన్= ఒకేతరి; మృగయా+అర్థంబు= వేట కొరకై; నలు, దిక్కులకున్= నాలుగు దిక్కులకును; చనిన+అనంతరంబు+అ= వెళ్లిన పిదపనే.

**తాత్పర్యం:** ఒకానొకరోజున మహావీరులైన పాండవులు అయిదుగురు తృణబిందు మహాముని ఆశ్రమంలో పురోహితుడైన ధౌమ్యుడిని, ద్రౌపదిని ఉంచి తాము ఒకేసారి వేటాడటంకొరకై నలుదిక్కులకు వెళ్ళారు. వారు వెళ్లిన తరువాత వెంటనే

### సైంధవుఁడు ద్రౌపదిం జూచి మోహించుట (సం. 3-248-6)

**చ. వీరుఁడు సైంధవుండు జనవిశ్రుతశౌర్యుఁడు సాల్వకన్య నిం**
**పారఁగఁ బెండ్లియాడుటకునై నిజవైభవ ముల్లసిల్ల వి**
**స్ఫార చతుర్విధోరుబలసంగతుఁడై చనుచుండి యాశ్రమ**
**ద్వారమునందుఁ గాంచె ద్రుపదక్షితిపాలతనూజ నచ్చటన్. 144**

**ప్రతిపదార్థం:** వీరుఁడు= పరాక్రమవంతుడు; సైంధవుండు= సింధుదేశానికి ప్రభువు; జనవిశ్రుతశౌర్యుఁడు= ప్రజలలో పేరుకెక్కిన పరాక్రమవంతుడు; ఇంపు+ఆరఁగన్= సంప్రీతితో; సాల్వకన్యన్= సాల్వ రాజుయొక్క కుమార్తెను; పెండ్లి+ఆడుటకునై= వివాహం చేసికొనటానికై; నిజవైభవము= తన సంపద; ఉల్లసిల్లన్= శోభించగా; వి, స్ఫార, చతుః+విధ+ఉరు, బల, సంగతుఁడు+ఐ= బాగా వ్యాపించిన నాలుగు అంశాలకు సంబంధించిన గొప్పసేనతో కూడిన వాడై; (అంటే రథగజతురగభటులతో కూడిన సైన్యంతో); చనుచున్+ఉండి= పయనిస్తూ+ఉండి; ఆశ్రమద్వారమునందున్= ఆశ్రమంయొక్క వాకిటిలో; అచ్చటన్= ఆ అరణ్యంలో; - ద్రుపద, క్షితిపాల, తనూజన్= ద్రుపదరాజుకూతురును; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** సింధుదేశాన్ని పాలించేవీరుడు, పరాక్రమవంతుడుగా గొప్ప పేరుప్రతిష్ఠల నార్జించిన వాడైన సైంధవుడు (జయద్రథుడు) సాల్వరాజ పుత్రికను వివాహమాడటానికై చతురంగ బలసమేతుడై దర్పంతో పయనిస్తూ మార్గమధ్యంలో ఆ కామ్యకవనంలో తృణబిందుమహామునియొక్క ఆశ్రమద్వారం వద్ద నిలిచి ఉన్న ద్రౌపదిని చూచాడు.

**విశేషం:** సైంధవుడు సింధుదేశపు ప్రభువు. అతడిపేరు జయద్రథుడు. తెలుగుదేశంలో సైంధవుడనే పేరుకు విశేషప్రచారం ఉన్నది కాని భారతదేశంలోని ఇతరప్రాంతాలలో - జయద్రథుడనే పేరు ఎక్కువ ప్రచారంలో ఉన్నది.

**ఉ.** **నీలపయోదమండలము నిశ్చలలీల వెలుంగఁజేయుచుం**
**గ్రాలెడు వాలుఁ గ్రొమ్మెఱుఁగు కైవడిఁ దద్వనభూమి నెంతయున్**
**లాలితదేహకాంతిపటలంబునఁ జేసి వెలుంగఁజేయు న**
**బ్బాల వినీలకుంతలవిభాసినిఁ జూచి సవిస్మయాత్ముఁడై.** **145**

**ప్రతిపదార్థం:** నీల, పయోద (పయస్+ద) మండలము= నల్లని మేఘాల గుంపు; నిశ్చల, లీలన్= కదలకుండా ఉన్న రీతిగా; వెలుంగన్+చేయుచున్= ప్రకాశింపజేస్తూ; క్రాలెడు= దేదీప్యమానంగా వెలుగొందే; వాలు+క్రొత్త+మెఱుఁగు, కైవడిన్= పొడుగైన క్రొత్త విద్యుల్లత మాదిరిగా; తత్+వనభూమిన్= ఆ అరణ్యసీమను; ఎంతయున్= మిక్కుటంగా; లాలిత, దేహ, కాంతి, పటలంబునన్+చేసి= సుకుమారమైన శరీరముయొక్క ప్రభారాశి చేత; వెలుంగన్+చేయు= ప్రకాశింపజేసే; ఆ+బాలన్= ఆ లేతజవరాలిని; వినీల కుంతల, విభాసినిన్= మిక్కిలి నల్లనైన ముంగురులచేత వెలుగొందే దానిని - ద్రౌపదిని; చూచి; స, విస్మయ+ఆత్ముఁడు+ఐ= అచ్చెరువుతో కూడినమనస్సు కలవాడై. (క్రింది పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** నల్లని మబ్బులగుంపును దేదీప్యమానంగా వెలుగొందజేసే క్రొత్తవిద్యుల్లతవలె, ఆ అడవినంతటిని తన శరీరప్రభలచేత ప్రకాశింపజేస్తున్న లేజవరాలు నల్లని ముంగురులు గల ద్రౌపదిని చూచి సైంధవుడు మనస్సులో మిక్కిలి ఆశ్చర్యపడ్డాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **మగువఁదగిలిన చూడ్కుల మగుడఁ దిగువ । నేర్పు సాలక యతఁడు కందర్పదర్ప**
**గోచరాత్ముఁ డై నిజసఖుఁ గోటికాస్యుఁ । డను నృపాత్మజుఁ జూచి యి ట్లనియెఁ బ్రీతి.** **146**

**ప్రతిపదార్థం:** మగువన్+తగిలిన= వనితయందు మగ్నమైన (ద్రౌపదియందు లగ్నమైన); చూడ్కులన్= చూపులను; మగుడన్= వెనుకకు; తిగువన్= మరలించటానికి; నేర్పు+చాలక= సామర్థ్యం సరిపోవక; అతఁడు= సైంధవుడు; కందర్ప, దర్ప, గోచర+ఆత్ముఁడు+ఐ= మన్మథుడియొక్క గర్వానికి లోబడిన ఆత్మకలవాడై; కోటికాస్యుఁడు+అను= కోటికాస్యుడు అనే పేరుకల; నృపాత్మజున్= (నృప+ఆత్మజున్) రాజపుత్రుడిని; నిజ, సఖున్= తనమిత్రుడిని; చూచి; ప్రీతిన్= సంతోషంతో; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** ద్రౌపదియందు లగ్నమైన చూపులను వెనుకకు మరలింపజాలక, మన్మథుడిబారికి చిక్కిన ఆ జయద్రథుడు (సింధుదేశప్రభువు) తన ప్రాణమిత్రుడు అయిన కోటికాస్యుడను రాజకుమారుని సంబోధించి ఈ విధంగా పలికాడు.

ఉ. 'ఇన్నలినాక్షి యెవ్వతియొ? యివ్విపినంబున నేకతంబ యి
ట్లున్న నిమిత్త మేమియొ? సురోత్తమకన్యయొ, యక్షకాంతయో,
పన్నగభామయో, మనుజభామిని గామి నిజంబ; యిట్టి చె
ల్వున్నదియే మహీతలము నుగ్మలు లెవ్వరియందు నారయన్. **147**

**ప్రతిపదార్థం:** ఈ, నలిన+అక్షి= పద్మాలవంటి కన్నులు కల ఈమె; ఎవ్వతి+ఒ= ఎవరికి సంబంధించినదో; ఈ+విపినంబునన్= ఈఅరణ్యంలో; ఏకతంబు+అ= ఒంటరిగా; ఇట్లు+ఉన్న= ఈ విధంగా ఉన్న; నిమిత్తము= కారణం; ఏమి+ఒ= ఏమిటో; సుర+ఉత్తమ, కన్య+ఒ= దేవతా స్త్రీయో; యక్ష, కాంత+ఓ= యక్షజాతికి చెందిన ఆమెయో; పన్నగ, భామ+ఓ= సర్పజాతికి చెందిన సుందరియో; మనుజ, భామిని+కామి= మానవవనిత కాకపోవటం; నిజంబు+అ= సత్యంసుమా; ఆరయన్= పరిశీలించి చూడగా; మహీతలము+ఉగ్మలులు+ఎవ్వరియందున్= భూలోకానికి చెందినవనితలలో ఎవ్వరియందుకూడా; ఇట్టి= ఇటువంటి (లోకోత్తరమైన); చెల్వు= సొగసు; ఉన్నది+ఏ?= ఉన్నదా? (లేదు లేదు సుమా).

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు కల ఈ సుందరాంగి ఎవరు? ఒంటరిగా ఈ అరణ్యంలో ఈ విధంగా నివసించటానికి గల కారణ మేమిటి? ఈ లోకోత్తరసౌందర్యవతి దేవతా స్త్రీయా, యక్షజాతికి చెందిన కన్యయా? పన్నగ భామినియా? ఈమె భూలోకంలోని మానవజాతి స్త్రీమాత్రం కాజాలదు. ఎందుకంటే - ఈ అందచందాలు మానవవనితలలో ఎక్కడా లేవు కదా!

**విశేషం:** అలం: ఉల్లేఖం.

ఉ. లీల యెలర్పఁగా నబల లేఁజిగురాకును బోలె నొప్పు కెం
గేలు కదంబశాఖతుదిఁ గీల్కొనఁ జేసి వసంతవిభ్రమో
న్మీలిత బాలవల్లిక్రియ మేలగుచూడ్కుల మించి పావక
జ్వాలయ పోలెఁ జిత్తము నిజం బెరియింపఁ దొడంగెఁ జూచితే. **148**

**ప్రతిపదార్థం:** అబల= స్త్రీ (ద్రౌపది); లీల+ఎలర్పఁగాన్= విలాసం అతిశయించగా; లేత+చిగురు+ఆకును+పోలెన్= లేత చిగురుటాకు వలె; ఒప్పు= శోభిల్లు; కెంగేలు= (కెంపు+కేలు) ఎఱ్ఱని చేయి; కదంబ, శాఖ, తుదిన్= కడిమిచెట్టు కొమ్మచివరను; కీల్కొనన్+చేసి= తగిలించి; వసంత, విభ్రమ+ఉన్మీలత, బాల, వల్లి, క్రియన్= ఆమనియొక్క విజృంభణచేత బాగా శోభిల్లిన లేతలతవలె; మేలు+అగు= సొగసైన; చూడ్కులన్= చూపులచేత; మించి= రాణించి; పావక, జ్వాల+అ+పోలెన్= అగ్నిశిఖవలె; చిత్తమున్= నా మనస్సును; ఎరియింపన్+తొడంగెన్= మండింపసాగింది; నిజంబు= సత్యం; చూచితి+ఏ= చూచావు కదా.

**తాత్పర్యం:** ప్రియమిత్రుడవైన ఓ కోటికాస్యుడా! చూచావుకదా ఆ మనోహర దృశ్యం. ఆ సుందరాంగి కడిమిచెట్టు కొమ్మను తనచేతితో పట్టుకొని నిల్చిందికదా! ఆమెచేయి లేతచిగురుటాకువలె ఎఱ్ఱగా సుకుమారంగా ఉన్నది. ఆమని పొంగులువారు అందచందాలతో శోభిల్లే లేత లతవలె అలరారుతూ ఆ కదంబవృక్షం కడ కన్పిస్తున్నది. అందమైన చూపులతో అతిశయించే ఆ సుందరి అగ్నిశిఖవలె నామనస్సును నిజంగా దహిస్తున్నది సుమా.

**విశేషం:** ఈ పద్యం ఎఱ్ఱనకు సమకాలీనులు ప్రసాదించిన ప్రబంధపరమేశ్వర బిరుదాన్ని సార్థకం చేస్తున్నది. అది పూలచెట్లు లతలు అల్లిబిల్లిగా అల్లుకొనిన అరణ్యంలోని ఆశ్రమం. ఆ ఆశ్రమం గడప నానుకొని ఉన్న ఒక కడిమిచెట్టు. ఆ కడిమిచెట్టు

గుత్తులుగుత్తులుగా ఎఱ్ఱని పూలను పూస్తూంది. ఆకడిమి చెట్టు కొమ్మను తనకెంగేలితో అంటిపట్టుకొని వసంతవిభ్రమోన్మీలిత మైన లేతలత వలె ద్రౌపది ఆశ్రమద్వారం దగ్గర నిలిచి వాలుచూపులు ప్రసరిస్తున్నది. ఆమె అగ్నిశిఖవలె సైంధవుడి చిత్తాన్ని దహించింది. కదంబ పుష్పాలు ఎఱుపు. కదంబవృక్షాన్ని నవీనులు - 'అరణ్యదావాగ్నిజ్వాల' అని అభివర్ణించటం కద్దు. అలం: ఉపమ.

**ఉ. ఈ కమలాక్షి నాకు హృదయేశ్వరి యైనఁద్రిలోకరాజ్యముం**
**జేకుఱ నేలినట్లు విలసిల్లనె! దర్పకవీరు బంటుఁగాఁ**
**గైకొని సర్వభోగములుఁ గాంతు; నొడంబడఁ బల్కి దీనికిన్**
**నాకును బొందొనర్చి కరుణం జరితార్థునిఁ జేయవే ననున్.' 149**

**ప్రతిపదార్థం:** ఈ, కమల+అక్షి= పద్మాలవంటి కన్నులు కల ఈమె; నాకున్; హృదయ+ఈశ్వరి= హృదయానికి ఈశ్వరి, వలపుకత్తె; ఐనన్= అయితే; త్రిలోకరాజ్యమున్= మూడులోకాల ప్రభుత్వం; చేకుఱన్= లభించగా; ఏలినట్లు= పరిపాలించినట్లు; విలసిల్లనె= శోభిల్లనా; దర్పకవీరున్= వీరు డైన మన్మథుడిని; బంటున్+కాన్= సేవకుడిగా; కైకొని= స్వీకరించి; సర్వభోగములున్= సకలసౌఖ్యములును; కాంతున్= అనుభవిస్తాను; ఒడంబడన్+పల్కి= అంగీకరించేటట్లుగా చేసి; దీనికిన్= ఈమెకూ; నాకును= నాకూ; పొందు+ఒనర్చి= సంయోగం కల్పించి; కరుణన్= దయతో; ననున్= నన్ను; చరిత+అర్థునిన్= ధన్యుడిని; చేయవే= చేయవా (దయచేసి చేయుము).

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు గల ఈమనోహరాంగి నాకు వలపుకత్తె అయితే మూడులోకాలను పరిపాలించే సార్వభౌముడివలె మన్మథవీరుడిని నాభృత్యుడిగా చేసుకొని సర్వసౌఖ్యాలను అనుభవించగలను. ప్రియమిత్రమా! నీవు పూనుకొని ఈమెను అంగీకరింపజేసి, ఈమెకూ, నాకూ సంయోగం కూర్చి దయతో నాజన్మ ధన్యం చేయాలి సుమా!'

**వ. అని పనిచినం గోటికాస్యుండు గ్రక్కునం బాంచాలిపాలికిం జని ప్రణయసుభగంబుగా నమ్మగువ కి ట్లనియె. 150**

**ప్రతిపదార్థం:** అని పనిచినన్= అని (సైంధవుడు); నియోగించగా; కోటికాస్యుండు; గ్రక్కునన్= శీఘ్రంగా; పాంచాలి పాలికిన్= పాంచాలదేశరాజుపుత్రిక (ద్రౌపది) వద్దకు; చని= వెళ్ళి; ప్రణయసుభగంబుగాన్= ప్రేమమాధుర్యం ఉట్టిపడేటట్లుగా; ఆ+మగువకున్= ఆ వెలదికి (ద్రౌపదికి); ఇట్లు+అనియెన్;

**తాత్పర్యం:** అని సైంధవుడు నియోగించగా అతడిమిత్రు డైన కోటికాస్యుడు వేగంగా ద్రౌపది ఉన్నచోటికి వెళ్ళి ప్రేమమాధుర్యాలు ఉట్టిపడేటట్లుగా ఈవిధంగా పలికాడు.

**సీ. 'మృగనేత్ర! దారుణమృగసమాకుల మైన । యివ్వనాంతరమున నేకతంబ**
**యిట్లు నీ యున్కికి నెయ్యది మూల? మి । వ్వన దేవతవొ, సురేశ్వరునితోడ**
**నలిగి ధరిత్రికి నరుగుదెంచిన శచీ । లలనవో, హరియురస్థ్సలి దొరంగి**
**కేలిఁ గ్రుమ్మరు పద్మగేహవో భవదీయ । జనకత్వమున సముజ్జ్వలితుఁ డైన**

**తే. పుణ్యుఁ డేవంశమునవాఁడు పొలఁతి! నీదు । జీవితేశ్వరుఁ డగు సుఖజీవితాత్ముఁ**
**డెవ్వఁ డబల! నీనామమ్మై యింపు మిగులు । శబ్ద మెయ్యది? నాకు నిజంబు సెప్పుము. 151**

**ప్రతిపదార్థం:** మృగనేత్ర!= లేడిచూపులవంటి చూపులు కలదానా!; దారుణ, మృగ, సమ్+ఆకులము+ఐన= భయంకరా లైన జంతువులతో క్రిక్కిరిసిన; ఈ, వన+అంతరమునన్= ఈ అరణ్యంమధ్య; ఏకతంబు+అ= ఒంటరిగా; ఇట్లు= ఈరీతిగా; నీ+ఉన్కికిన్= నీవు ఉండటానికి; మూలము= హేతువు; ఎయ్యది= (ఏ+అది) ఏది; ఈ, వన, దేవతవొ= ఈ వన దేవతవా; సుర+ఈశ్వరునితోడన్= దేవేంద్రుడితో; అలిగి= కోపగించి; ధరిత్రికిన్= భూమికి; అరుగుదెంచిన= వచ్చిన; శచీ, లలనవొ= దేవేంద్రుడి భార్య అయిన శచీదేవివా; (లలన= స్త్రీ); హరి+ఉరస్+స్థలిన్+తొరంగి= విష్ణుదేవుడి వక్షఃస్థలం వీడి; కేలిన్= లీలకొరకై; క్రుమ్మరు= విహరించే; పద్మగేహవొ= లక్ష్మీదేవివో (పద్మం గృహంగా కలదానవో); పొలఁతి!= ఓసుందరీ!; భవదీయ జనకత్వమునన్= నీకు తండ్రిగా ఉండటంచేత; సమ్+ఉత్+జ్వలితుఁడు= మిక్కుటంగా ప్రకాశించేవాడు; ఐన= ఐనట్టి; పుణ్యుఁడు= సుకృతి; ఏవంశమునవాఁడు?= ఏ వంశానికి చెందినవాడు?; నీదు= నీయొక్క; జీవిత+ఈశ్వరుఁడు+అగు= భర్త అయిన; సుఖ, జీవిత+ఆత్ముఁడు= సౌఖ్యంతో కూడిన బ్రదుకు కలవాడు; ఎవ్వఁడు?= ఎవడు?; అబల!= ఇంతి, సుకుమారీ!; నీనామము+ఐ= నీపేరు అయినదై; ఇంపుమిగులు= సొంపారే; శబ్దము= పదం; ఏ+అది?= ఏది?; నాకున్; నిజంబు= సత్యం; చెపుము+అ= పలుకుము.

**తాత్పర్యం:** లేడిచూపులవంటి చూపులు కలదానా! భయంకర జంతువులతో కలతచెందిన ఈ అరణ్యం మధ్య ఒంటరిగా ఏల నివసిస్తున్నావు? ఇక్కడ నీవు ఉండటానికి కారణ మేమిటి? నీవు మూర్తీభవించిన వనదేవతవా? దేవేంద్రుడితో కలహించి దివినుండి భువికి దిగివచ్చిన శచీదేవివా? విష్ణుమూర్తి వక్షఃస్థలం వీడి వినోదంగా ఈ విపినంలో విహరించటానికి వచ్చిన లక్ష్మీదేవివా? నిన్ను కన్న ఆ అదృష్టవంతుడు ఎవరు? అతని దే వంశం? నీ ప్రేమకు పాత్రు డైన నీభర్త ఆ గొప్ప సుఖభోగి ఎవ్వరు? నీపేరులో పొసగటంవలన ఇంపారే ఆ శబ్దం ఏది? దయచేసి నాకు సత్యం చెప్పుము.

**విశేషం:** 1. ఈపద్యంలోని పోకడలు, పదగుంఫనలు, ఒడుపులు, విరుపులు, మెరుపులు తరువాతి ప్రబంధకర్తలకు ఒజ్జబంతులైనవి. ఇందలి సంభాషణచాతురి అనుశీలించ తగింది. 2. లోకోత్తరమైన నీ సౌందర్యం మమ్ము ఆకర్షించింది సుమా! అని చెప్పడం ఇందలి ఆంతర్యం.

**క.** **కరిరాజగమన! మాతెఱఁ । గరయఁ దలఁచితేని వినవె యధికబలుఁడ నే**
**సురథుఁ డను రాజుపుత్త్రుఁడ । నరిమథనుఁడఁ గోటికాస్యుఁ డనఁ జనువాఁడన్.** **152**

**ప్రతిపదార్థం:** కరిరాజగమన!= మదపుటేనుగునడకవంటి నడక కలదానా!; మాతెఱఁగు= మాతీరు; అరయన్+తలఁచితి+ఏని= తెలిసికొనదలిస్తే; వినవె= ఆలకించుమా; ఏన్= నేను; అధిక, బలుఁడన్= మిక్కిలి శక్తి కలవాడిని; సురథుఁడు+అను, రాజుపుత్త్రుఁడన్= సురథుడు అనేపేరు కల రాజుకొడుకును; అరి, మథనుఁడన్= శత్రువులను బాధించే వాడిని; కోటికాస్యుఁడు+ అనన్+చనువాఁడన్= కోటికాస్యుడు అనే పేరుచేత పిలువబడేవాడిని.

**తాత్పర్యం:** మత్తేభ మందగంభీరగమనం కలదానా! నీకు మావిషయం సవిస్తరంగా తెలిసికొనటానికి వివరిస్తాను. వినుము. నేను మిక్కిలి బలం కలవాడను. సురథుఁడు అనే మహారాజు కొడుకును. శత్రుసంహారం చేసే సామర్థ్యం కలవాడను. కోటికాస్యుడు అని నన్ను పిలుస్తారు.

**తే.** **అల్ల కాంచన రథముపై నలరువాఁడు । ఘనుఁడు క్షేమంకరుండు త్రిగర్తవిభుఁడు;**
**మఱియు నినుఁ జూచుచున్నాఁడు మగువ! వాఁడె । దీప్తభుజఁ డైన కాళింగదేశవిభుఁడు.'** **153**

**ప్రతిపదార్థం:** మగువ!= ఓ వనితా!; అల్ల= అదుగో (కనిపిస్తున్న అనతిదూరంలో); కాంచనరథముపైన్= బంగారంతో నిర్మించబడిన తేరిపై; అలరువాఁడు= శోభిల్లేవాడు; ఘనుఁడు= గొప్పవాడు; క్షేమంకరుండు= క్షేమంకరుడు అనేవాడు; త్రిగర్త, విభుఁడు= త్రిగర్తదేశానికి ప్రభువు; మఱియున్= ఇంకను (ఆ త్రిగర్తవిభుడుగాక); నినున్= నిన్ను; చూచుచున్నాఁడు= చూస్తున్నాఁడు (అంటే కోరుతున్నాడనిభావం); వాఁడు+ఎ= వాడే; దీప్తభుజుఁడు+ఐన= ప్రకాశించే భుజాలు కలవాడైన, పరాక్రమవంతుడైన; కాళింగ, దేశ, విభుఁడు= కళింగదేశానికి ప్రభువు.

**తాత్పర్యం:** సుందరీ! అడుగో మనకు కనిపిస్తున్న ఆ బంగారు రథంమీద శోభిల్లేవాడు త్రిగర్తదేశానికి రాజు, క్షేమంకరుడు. కోరికతో కూడుకొన్న చూపులు ప్రసరిస్తున్నాడే, ఆ మహాపరాక్రమశాలి, కళింగదేశానికి అధిపతి.

**తే.** **ఉల్ల పద్మాకరము పొంతనుండి నిన్ను । మెచ్చి కనుఁగొనుచున్న యున్మీలితాక్షుఁ**
**డుత్పలాక్షి! యిక్ష్వాకువంశోద్భవుండు । సుబలభూపతిపుత్త్రుండు సుభగుఁ డతఁడు. 154**

**ప్రతిపదార్థం:** ఉత్పల+అక్షి!= కలువలవంటి కన్నులు కలదానా!; ఉల్ల= ఇంచుక దూరంలో; పద్మ+ఆకరముపొంతన్+ఉండి= తామరలకు నిలయమైన సరోవరం సమీపంలో ఉండి; నిన్నున్= నిన్ను (ద్రౌపదిని); మెచ్చి, కనుఁగొనుచున్+ఉన్న= ప్రశంసించి చూస్తూ ఉన్న; ఉత్+మీలిత+అక్షుఁడు= బాగా విప్పారిన కన్నులు కలవాడు; ఇక్ష్వాకు, వంశ+ఉద్భవుండు= ఇక్ష్వాకు మహారాజు వంశంలో పుట్టినవాడు; సుబలభూపతి, పుత్త్రుండు= సుబలుడు అనే రాజు యొక్క కొడుకు; అతఁడు= ఆతడు; సుభగుఁడు= మనోహరుడు, భాగ్యవంతుడు.

**తాత్పర్యం:** కలువలవంటి కన్నులు కలదానా! అల్లంతదూరంలో తామరకొలను వద్ద నిలువబడి నిన్ను మెచ్చి చూస్తూ ఉన్న ఆ విప్పారిన కన్నులవాడున్నాడే ఆతడు ఇక్ష్వాకువంశంలో పుట్టినవాడు, సుబలుడనే రాజు కుమారుడు. అతడు మనోహరుడైన భాగ్యవంతుడు.

**విశేషం:** అంతటి ఉత్తమవంశజుడు, అంతటి సుక్షత్రియుడు, అంతటి మనోహరుడు సైతం నిన్ను మెచ్చుకొని కనులు విచ్చుకొని చూస్తున్నాడని చెప్పటంవలన ద్రౌపది హృదయంలో సైంధవునిపట్ల ఉన్ముఖీకరణం జరగాలని మాటనేర్పరితనం ప్రకటించాడు కోటికాస్యుడు.

**వ.** **అరుణాశ్వయుక్తంబు లయిన రథంబులయందు రత్నమయభూషణు లయి సమిద్ధవహ్నులుం బోలె వెలుంగుచున్న యా సౌవీరకుమారులు పన్నిద్దఱుం దన్నుం జేరి కొలువ ననేకసహస్రకరితురగరథపదాతి పరివృతుండై మహాగజంబుపై శోభిల్లుచున్న యవ్వీరుండు సింధుసౌవీరనాథుం డైన జయద్రథుం; దమ్మను జేశ్వరుం డిప్పుడు నీతెఱం గెఱుంగఁ దివిరి, నన్ను నిట పుత్తెంచె' ననినఁ బాండవపత్ని మృదుసంభ్రమంబునం గదంబశాఖ విడిచి యుత్తరీయంబు సంగతంబు గావించుకొని కోటికాస్యున కి ట్లనియె. 155**

**ప్రతిపదార్థం:** అరుణ+అశ్వ, యుక్తంబులు+అయిన= ఎర్రని గుర్రాలు పూన్చబడినవి అయిన; రథంబుల+అందున్= తేరులలో; రత్నమయభూషణులు+అయి= మణులతో నిండిన ఆభరణాలు ధరించిన వారయి; సమ్+ఇద్ధ, వహ్నులున్+పోలెన్= మిక్కుటంగా ప్రజ్వలిస్తున్న అగ్నులవలె; వెలుంగుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; ఆ సౌవీరకుమారులు= ఆ సౌవీర దేశానికి చెందిన రాచబిడ్డలు; పన్నిద్దఱున్= పండ్రెండు మంది; తన్నున్+చేరి= తనకు సహాయంగా ఉండి; కొలువన్= సేవించగా; అనేక, సహస్ర, కరి, తురగ, రథ, పదాతి పరివృతుండు+ఐ= పెక్కువేల ఏనుగులు గుర్రాలు తేరులు కాల్బలాలచేత చుట్టబడినవాడై; మహా,

గజంబుపైన్= గొప్ప ఏనుగుపై; శోభిల్లుచున్+ఉన్న= ఒప్పారుతున్న; ఆ+వీరుండు; సింధూసౌవీరనాథుండు+ఐన= సింధుదేశానికి సౌవీరదేశానికి ప్రభువు అయిన; జయద్రథుండు= జయద్రథుడు; ఆ+మనుజేశ్వరుండు= ఆరాజు; ఇప్పుడు= ఈ సమయంలో; నీ తెఱంగు= నీతీరు; ఎఱుంగన్= తెలిసికొనటానికి; తివిరి= పూని; నన్నున్= నన్ను; ఇట= ఇక్కడికి; పుత్తెంచెన్= నియోగించాడు; అనినన్= అని (కోటికాస్యుడు) చెప్పగా; పాండవపత్ని= పాండవుల భార్య - ద్రౌపది; మృదు సంభ్రమంబునన్= సున్నితమైన తత్తరపాటుతో; కదంబ, శాఖన్= కడిమిచెట్టుకొమ్మను; విడిచి= వదలిపెట్టి; ఉత్తరీయంబు= పైన కప్పుకొనే వస్త్రం; సంగతంబు+కావించుకొని= సవ్యంగా ఉండేటట్లు సవరించుకొని; కోటికాస్యునకున్= కోటికాస్యుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** 'అదుగో! ఎర్రని గుర్రాలు పూన్చబడిన ఆ రథాలమీద మణులు పొదిగిన ఆభరణాలు ధరించి ప్రజ్వలించే అగ్నులవలె ప్రకాశిస్తున్న సౌవీరరాజపుత్రులు పన్నెండుమంది సేవించగా వెలుగొందుతున్న జయద్రథుడు నీతీరుతెన్నులను అరసిరమ్మని నన్ను నియోగించాడు. ఆ జయద్రథమహారాజు వైభవం తిలకించుము. పెక్కువేల చతురంగబలాలు, రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలాలు అతడిని పరివేష్టించి ఉన్నవి కదా! ఆ మహాసేనలమధ్య మత్తేభంమీద అధివసించి ఉన్నవాడే సింధుసౌవీరదేశాలకు అధినేత అయిన జయద్రథుడు'- అని వివరించి కోటికాస్యుడు చెప్పాడు. ఆ మాటలు విన్న ద్రౌపది మెత్తని తత్తరపాటుతో తన ఉత్తరీయాన్ని సవ్యంగా అమర్చుకొని కడిమిచెట్టు కొమ్మను వదలి కోటికాస్యుడితో ఇట్లా చెప్పింది.

**తే.** **'అన్న! యిచ్చట నే నొంటి నున్నదాన; । నీ వచటి కేఁగుదెంచుట నియతి యగునె?**
**సుతవతిని ధర్మవతి నన్ను నితరకాంత । గాఁ దలంచి పెక్కులు వల్కఁ గాదు నీకు. 156**

**ప్రతిపదార్థం:** అన్న!; ఇచ్చటన్= ఈచోట (ఈ ఆశ్రమంలో); ఏన్= నేను; ఒంటిన్= ఒంటరిగా; ఉన్నదానన్= ఉన్న ఆడుదానిని; నీవు= నీవు; ఇచటికిన్= ఈ చోటికి; ఏఁగుదెంచుట= రావటం; నియతి+అగును+ఎ= మర్యాద ఔతుందా?= (కాదని భావం); సుతవతిని= కొడుకులు కలదానిని నేను; ధర్మవతిన్= పాడి పాటించే దానను; నన్నున్; ఇతర కాంతగాన్= ఇంకొక విధమైన ఆడుదానిగా; తలంచి= ఊహించి; పెక్కులు+పల్కన్= అధికప్రసంగం చేయటం; నీకున్+కాదు= నీకు తగదు సుమా.

**తాత్పర్యం:** అన్నా! ఓ కోటికాస్యా! ఇక్కడ ఈ అరణ్యంలో ఈ ఆశ్రమంలో నేను ఒంటరిగా ఉన్నాను కదా! నీవు నాదగ్గరకు రావడం సమంజసం కాదు. నేను కొడుకులు గలదానను. ధర్మాన్ని అనుసరిస్తున్నదానిని. నన్ను తదితర సామాన్య స్త్రీగా ఊహించి నీవు పలుమాటలాడటం పాడిగాదు.

**వ.** **నీవు శిబివంశోద్భవుం డయిన సురథుపుత్త్రుండ వగు టే నెఱుంగుదు; నస్మత్ప్రకారంబు సెప్పెద విను; మేను బాంచాలపతి యైన ద్రుపదుకూఁతురఁ, గృష్ణ యనుదానం; బాండునందను లగు యుధిష్ఠిరభీమార్జున నకుల సహదేవులకు ధర్మపత్ని; నవ్వీరు లిప్పుడు నన్ను నివ్వనంబున నునిచి. 157**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు (ఓకోటికాస్యా!); శిబి, వంశ+ఉద్భవుండు+అయిన= శిబియొక్క వంశంలో జన్మించిన; సురథు, పుత్త్రుండవు+అగుట= సురథుడి కొడుకువు కావటం; ఏను+ఎఱుంగుదున్= నాకు తెలుసు; అస్మత్+ప్రకారంబు= నాసంగతి; చెప్పెదన్= వచించగలను; వినుము= ఆలకించుము; ఏను= నేను; పాంచాలపతి+ఐన= పాంచాలదేశ ప్రభువు అయిన; ద్రుపదు కూఁతురన్= ద్రుపదుడియొక్క పుత్త్రికను; కృష్ణ+అనుదానన్= కృష్ణ అనే పేరు కలదానను; పాండునందనులు+అగు=

పాండురాజుయొక్క కొడుకులు అయిన; యుధిష్ఠిర, భీమ+అర్జున, నకుల సహదేవులకున్= ధర్మరాజుకు, భీముడికి, అర్జునుడికి, నకులుడికి, సహదేవుడికి; ధర్మపత్నిన్= అగ్నిసాక్షిగా వివాహం అయిన భార్యను; ఆ+వీరులు= పరాక్రమవంతులైన ఆ పాండవులు; ఇప్పుడు= ఈసమయంలో; నన్నున్; ఈ వనంబునన్= ఈ అడవిలో; ఉనిచి= ఉంచి.

**తాత్పర్యం:** ఓకోటికాస్యుడా! దానవీరుడుగా సుప్రసిద్ధుడైన శిబిచక్రవర్తివంశంలో జన్మించిన సురథుడికొడుకువు నీవు. ఆ సంగతి నాకు తెలుసు. ఇక నావిషయం చెపుతాను వినుము. నేను పాంచాలప్రభువు అయిన ద్రుపదుడియొక్క పుత్రికను. నన్ను కృష్ణ అని పిలుస్తారు. పాండురాజుకొడుకులు అయిన ధర్మరాజుకు భీముడికి అర్జునుడికి నకుల సహదేవులకు నేను ధర్మపత్నిని. వీరులైన పాండవులు ఇప్పుడు నన్ను ఈ అరణ్యంలో ఉంచి.

**విశేషం:** 1. శిబి - ప్రాచీన భారతీయవాఙ్మయంలో దానవీరుడుగా సుప్రసిద్ధి గాంచిన చక్రవర్తి. పావురాన్ని తరుముకొని వచ్చిన డేగ., పావురం శిబి శరణువేడటం, డేగకు తన శరీరం కోసి పావురం బరువు మాంసం ఇవ్వడానికి పూనుకోవటం, చివరకు తానే పావురానికి బదులు డేగకు ఆహారం కావటానికి సిద్ధపడటం (ఈకథ మహాభారతంలో ఆరణ్యపర్వంలోనే ఏడవఆశ్వాసంలో ఉన్నది). బౌద్ధవాఙ్మయంలో పరోపకారార్థం ఆత్మబలిదానం చేసికొనిన బోధిసత్త్వుడుగా శిబి వర్ణించబడ్డాడు.

**తే.** **ధర్మజుఁడు దూర్పు, భీముఁడు దక్షిణంబు, । నర్జునుఁడు పడమర, గవ లర్థి నుత్త**
**రంబుగా వేఁట వోయిరి రాజముఖ్యు; । లనఘు లింతకు వత్తురు వినుతబలులు.** **158**

**ప్రతిపదార్థం:** ధర్మజుఁడు= ధర్మరాజు; తూర్పు= తూరుపుదిక్కుకు; భీముఁడు= భీముడు; దక్షిణంబు= దక్షిణదిక్కుకు; అర్జునుఁడు= అర్జునుడు; పడమర= పశ్చిమానికీ; కవలు= జంటబిడ్డలు (నకులసహదేవులు); అర్థిన్= ప్రీతితో; ఉత్తరంబుగాన్= ఉత్తరదిశకు; వేఁట+పోయిరి= వేటాడటానికై వెళ్ళారు; రాజముఖ్యులు= రాజులలో శ్రేష్ఠులు; అనఘులు= పాపరహితులు అయిన మహానుభావులు; వినుత, బలులు= ప్రశంసించబడిన పరాక్రమం కలవారు (పాండవులు); ఇంతకున్= ఈ లోపలనే, కొద్దిసేపటిలోనే; వత్తురు= రాగలరు.

**తాత్పర్యం:** ధర్మరాజు తూరుపు దిక్కుకూ, భీముడు దక్షిణదిక్కుకూ, అర్జునుడు పడమటిదిశకూ, నకుల సహదేవులు ఉత్తరదిశకూ వేటకు వెళ్ళారు. రాజులలో శ్రేష్ఠులు, పుణ్యాత్ములు, పరాక్రమోపేతులు అయిన పాండవులు కొద్దిసేపటిలో ఇక్కడికి తిరిగి రాగలరు.

**వ.** **మీ రమ్మహాత్ములకు మాననీయులరు గావున నార్యజనమిత్త్రులగు నక్కురుకులపవిత్రులు సేయు సత్కారంబులు గైకొనిపోవుదురు గాని యొక్కింతతడ వియ్యాశ్రమసమీపంబున నిలువుం' డని పలికి యల్లన యవ్వరవర్ణిని భయంబునం బర్ణగృహంబు సొచ్చినం, గోటికాస్యుండును గ్రమ్మఱి చని, జయద్రథునితోడ నబ్భామిని పాంచాలకన్యక యనియును, బాండవపత్ని యనియునుం జెప్పిన, నద్దురాత్ముండు మదనకంపితహృదయుం డగుచు, నమ్మగువ నపహరింపం దివిరి కతిపయజనసమేతంబుగా నరిగి, సింహాగారంబు సొచ్చు వృకంబునుంబోలెఁ బాండవ నివాసంబు సొత్తెంచి, పాంచాలిం గని దాని కిట్లనియె.159**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు; ఆ+మహా+ఆత్ములకున్= ఆ మహానుభావులకు; మాననీయులరు= ఆరాధించ తగినవారు; కావునన్= కాబట్టి; ఆర్య, జన, మిత్త్రులు+అగు= పూజించతగిన పెద్దలకు స్నేహితులు అయిన; ఆ+కురు, కుల, పవిత్రులు= కురువంశాన్ని పావనంచేసేవారైన-ఆ పాండవులు; చేయు= ఆచరించే; సత్కారంబులు= మర్యాదలు, మన్ననలు; కైకొని=

స్వీకరించి; పోవుదురు+కాని= వెళ్లెదరుగాక; ఒక్కింత, తడవు= కొంచెంసేపు; ఈ+ఆశ్రమసమీపంబునన్= ఈ ఆశ్రమానికి దగ్గరగా; నిలువుండు= ఆగుడు; అని పలికి= అని వచించి; ఆ+వరవర్ణిని= శ్రేష్ఠమైన శరీరకాంతి కల ఆ సుందరి ద్రౌపది; భయంబునన్= భీతిచేత; అల్లన= మెల్లగా; పర్ణగృహంబు+చొచ్చినన్= ఆకులతో నిర్మించబడిన కుటీరంలో ప్రవేశించగా; కోటికాస్యుండును= కోటికాస్యుడు అనే వాడుకూడ; క్రమ్మఱి= మరలి; చని= వెళ్ళి; జయద్రథునితోడన్= సైంధవుడితో; ఆ+భామిని= ఆ వనిత; పాంచాలకన్యక+అనియును= పాంచాలదేశప్రభువుయొక్క కూతురు అనిన్నీ; పాండవపత్ని+అనియునున్= పాండునందనుల భార్య అనిన్నీ; చెప్పినన్= తెల్పగా; ఆ, దురాత్ముండు= ఆ చెడుబుద్ధి గలవాడు (జయద్రథుడు); మదన, కంపిత, హృదయుండు+అగుచున్= మన్మథుడిచేత చలింపజేయబడిన డెందం కలవాడు ఔతూ; ఆ+మగువన్= ఆ వనితను; అపహరింపన్+తివిరి= బలాత్కారంగా పట్టుకొని పోవటానికి పూనుకొని; కతిపయ జనసమేతంబుగాన్= కొంతమందితో కూడుకొని; అరిగి= వెడలి; సింహ+అగారంబు= సింహం ఉండే నెలవును; చొచ్చు= ప్రవేశించే; వృకంబునున్+పోలెన్= తోడేలువలె; పాండవనివాసంబు= పాండవులు నివసించే గృహం; చొత్తెంచి= చేరి; పాంచాలిన్+కని= ద్రౌపదిని చూచి; దానికిన్= ఆమెతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** మీరు మహాత్ములైన పాండవులచేత అతిథిమర్యాదలు పొంద తగినవారు. పాండవులు పూజ్యులకు మర్యాదలు మన్ననలు చేసి తమకురువంశాన్ని పావనం చేసికొనేవారు. కాబట్టి మీరు కొంతసేపు ఈ ఆశ్రమ సమీపంలో నిలవండి' అని పలికి, భీతితో ఆ వరవర్ణిని, పర్ణకుటీరంలోకి పోయింది. కోటికాస్యుడు మరలివెళ్లి, జయద్రథుడితో ఆ సుందరాంగి ద్రుపదమహారాజుకూతురనీ, పాండవుల ధర్మపత్ని అనీ తెలియచెప్పాడు. కాని, దురాత్ముడైన సైంధవుడు ద్రౌపదిని బలాత్కారంగా తీసికొని పోవ తలపెట్టి, కొంతమంది భృత్యులను వెంటపెట్టుకొని, మన్మథావేశంతో, కంపించే డెందంతో సింహ ముండే నెలవును సమీపించే తోడేలువలె పాండవులు నివసించే పర్ణకుటీరాన్ని చేరి, ద్రౌపదిని చూచి ఈ విధంగా పలికాడు.

**క. 'వామాక్షి! నీకుఁ గుశలమె? । నీమన సెవ్వారియందు నిత్యప్రేమం**
**బై మెఱయు నట్టి సొబగులు । నీమగ లేవురకు నిపుడు నెమ్మదియె మదిన్?' 160**

**ప్రతిపదార్థం:** వామ+అక్షి!= అందమైన కన్నులు కలదానా, ద్రౌపదీ!; నీకున్; కుశలమె= క్షేమంకదా; నీమనసు= నీచిత్తం; ఏ+వారియందున్= ఎవరియందు; నిత్య, ప్రేమంబు+ఐ= ఎల్లప్పుడూ అనురాగంతో కూడి ఉండి; మెఱయున్= శోభిల్లుతుందో; అట్టి= అటువంటి; సొబగులు= సౌందర్యవంతులు; నీ మగలు= నీ భర్తలు; ఏవురకున్= ఐదుగురికిన్నీ; ఇపుడు= ఈవేళ; మదిన్= మనస్సులో; నెమ్మదియె= సంప్రీతియే కదా.

**తాత్పర్యం:** అందమైన కన్నులు కలదానా! ద్రౌపదీ! నీకు కుశలమే కదా! నీ అనురాగానికి ఎల్లప్పుడూ నోచుకొన్న నీ భర్తలు, అదృష్టవంతులైన అందగాండ్రు, పాండవులు క్షేమంగా ఉన్నారుగదా!

**విశేషం:** వామాక్షి - వరవర్ణిని - మానవతి అనే ప్రయోగాలు కేవలం స్త్రీవాచకాలుమాత్రమే కాక - సందర్భాన్నిబట్టి సార్థకంగా ఎన్నదగినవి. అట్లే. రాజముఖ్యులు, వినుతబలులు, అనఘులు మున్నగు ప్రయోగాలు స్వీకరించదగినవి.

**వ. అనిన వానికి సమ్మానవతి యి ట్లనియె. 161**

**తాత్పర్యం:** అని అడుగగా జయద్రథుడితో ద్రౌపది ఈవిధంగా పలికింది.

**చ. 'స్థిరమతు లైన పార్థులకు సేమమ, నీకు ననామయంబె భూ**
**వర! తగ వింద వైతి కురువర్యుల యింటికి; నట్లు గావునం**
**బరువడి నాసనక్రియయుఁ బాద్యముఁ గైకొను మాదరంబుతో**
**సరసకురంగమాంసములఁ జల్పుము భోజనకృత్య మిత్తటిన్. 162**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా! ఓ జయద్రథా!; స్థిర, మతులు+ఐన= ధైర్యంగల; పార్థులకున్= కుంతీపుత్రులకు, (పాండవులకు); సేమము+అ= కుశలమే; నీకున్= ఓ జయద్రథా! నీకు; అనామయంబు+ఎ= రోగం లేకుండా ఉన్నదికదా, ఆరోగ్యమే కదా!; కురు, వర్యుల+ఇంటికిన్= కురువంశంలో శ్రేష్ఠులు అయిన (పాండవుల) గృహానికి; తగన్= ఒప్పినట్లుగా విందవు+ఐతి(వి)= అతిథివి అయినావు; అట్లు+కావునన్= ఆ విధంగా అతిథివి అయినావు కాబట్టి; పరువడిన్= సముచితంగా; ఆసనక్రియయున్= సుఖంగా కూర్చుండటం; పాద్యమున్= స్వాగత చిహ్నంగా ఇచ్చే నీరును; ఆదరంబుతోన్= అభిమానంతో; కైకొనుము= స్వీకరించుము; సరసకురంగమాంసములన్= రుచికర మైన లేడిమాంసాలతో (కూడిన); భోజనకృత్యము= ఆహారాన్ని స్వీకరించటం; ఈ+తటిన్= ఈ అదనులో; చల్పుము= చేయుము.

**తాత్పర్యం:** 'పాండవులు స్థిరచిత్తులు. వారు కుశలంగా ఉన్నారు. వారిమాట కేమి కాని నీవు ఆరోగ్యంగా ఉన్నావు కదా. ఓ రాజా, జయద్రథా! కురువంశంలోశ్రేష్ఠులు అయిన పాండవులకు నీవు ఇప్పుడు అతిథివి అయినావు. కావున సంప్రదాయసిద్ధ మైన మర్యాదలకు మన్ననలకు నీవు అర్హుడివి. దయచేసి ఉచితాసనాన్ని స్వీకరించుము. స్వాగతచిహ్నమైన పాద్యాన్ని గ్రహించుము. రుచికరాలైన లేడిమాంసాలతో విందుభోజనం ఆరగించుము.

**ఆ. వేఁట వోయినారు విభు లిప్డు వత్తురు। వారు వచ్చి నీకు వలయునట్టి**
**ప్రియము లాచరింపఁ బ్రీతుండ వై మఱి। యిష్టజనులు నీవు నేఁగు మనఘ!' 163**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; విభులు= భర్తలు; (పాండవులు); వేఁట+పోయినారు= వేటకు వెళ్ళారు; ఇప్డు= ఇంతలోనే; వత్తురు= రాగలరు; వారు; వచ్చి; నీకున్; వలయు+అట్టి= కావలసిన; ప్రియములు= ప్రీతికరా లైనవి (మర్యాదలు మున్నగునవి); ఆచరింపన్= చేయగా; ప్రీతుండవు+ఐ= సంతుష్టి చెందినవాడవు అయి; మఱి= తిరిగి; ఇష్టజనులు= హితులును; నీవున్= నీవును; ఏఁగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడవైన ఓ జయద్రథా! నా భర్తలు పాండవులు వేటకు వెళ్ళి ఉన్నారు. వారు వచ్చేవేళ అయింది. వారు వచ్చినపిమ్మట నీకు తగిన మర్యాదలు చేయగలరు. ఆ సత్కారాలను గ్రహించిన పిమ్మట నీవు నీపరివారంతో వెళ్ళవచ్చును.

**చ. అనవుడు సైంధవుం డనియె; 'నంబుజలోచన! నీవు మాకుఁ జే**
**యు నతిథిపూజ లన్నియును నొక్కట నైనఁ గొఱంతలేక వ**
**చ్చినవియ; మన్మథాస్త్రముల చిక్కునఁ గాఱియ వొందె డెంద; మిం**
**క ననుఁ గృతార్థుఁ జేయుము దగన్; రథ మెక్కుము లెమ్ము నెమ్మితోన్. 164**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (ద్రౌపది) పలుకగా; సైంధవుండు= జయద్రథుడు; అనియెన్= చెప్పాడు; అంబుజలోచన!= పద్మాలవంటి కన్నులు కలదానా, ద్రౌపదీ!; నీవు; మాకున్; చేయు= ఒనర్చు; అతిథిపూజలు+అన్నియునున్= అతిథి సత్కారాలు

అన్నియున్నా; ఒక్కటన్+ఐనన్= ఒకదానియందు అయినను; కొఱంత, లేక= లోపం లేకుండా; వచ్చినవి+అ= చేకూరినవి సుమా; మన్మథ+అస్త్రముల= మన్మథుడియొక్క మంత్రబాణాలయొక్క; చిక్కునన్= ఇరుకుకొనినముడిలో; డెందము= హృదయం; కాఱియ+పొందెన్= వెత చెందింది; ఇంకన్= ఇకమీద; ననున్= నన్ను; కృత+అర్థున్= ధన్యుడిగా; చేయుము= ఒనర్పుము; తగన్= ఒప్పిదంగా; నెమ్మితోన్= సంప్రీతితో; లెమ్ము= లేచి రమ్ము; రథము+ఎక్కుము= తేరుపై ఎక్కుము.

**తాత్పర్యం:** అని ద్రౌపది చెప్పింది. జయద్రథుడు ఈ విధంగా బదులు పలికాడు. 'పద్మాలవంటి కన్నులు కల ద్రౌపదీ! నీవు మాకు చేయదలచిన అతిథిమర్యాదలు అన్నిటిని పొందాను. ఏలోపం రాలేదు. కాని, మన్మథుడి మంత్రబాణాలచేత నాహృదయం తూట్లు పడింది. ఇంక నీవు నన్ను ధన్యుడిని చేయాలి. ఇక మారుమాట చెప్పక సమ్మతించి దయచేసి లేచిరమ్ము. ప్రీతితో రథాన్ని ఎక్కుము.

**మ.** **ధరణీరాజ్యము గోలుపోయి ఘనకాంతారస్థలీవాసులై**
**సరివా రెల్లను నవ్వఁ గుత్సితదశాసంప్రాప్తిమై నున్న ము**
**ష్కరులం బార్థులఁ గొల్చినం గలదె సౌఖ్యం? బెంతయున్ బేలవై**
**తరవిందానన! శ్రీవిహీనులఁ గరం బర్థింతురే కామినుల్?** **165**

**ప్రతిపదార్థం:** అరవింద+ఆనన!= పద్మమువంటి మొగం కలదానా, ఓ ద్రౌపదీ!; ధరణీ, రాజ్యము= భూ ప్రభుత్వాన్ని; కోలుపోయి= పోగొట్టుకొని; ఘన, కాంతార, స్థలీ, వాసులు+ఐ= గొప్ప అరణ్యప్రదేశంలో నివసించేవారై; సరివారు= తోడివారు; ఎల్లను= అందరును; నవ్వన్= వెక్కిరించగా; కుత్సిత, దశా, సంప్రాప్తిమైన్= చెడుకాలం దాపరించటంచేత; ఉన్న= జీవిస్తున్న; ముష్కరులన్= దీనులను; పార్థులన్= కుంతీపుత్రులైన పాండవులను; కొల్చినన్= సేవిస్తే; సౌఖ్యంబు= సుఖం; కలదు+ఎ= లభిస్తుందా (లభించదుసుమా); ఎంతయున్= ఎంతగానో; బేలవు+ఐతి(వి)= తెలివిలేనిదానివి అయినావు; కామినుల్= ఆడువారు; శ్రీవిహీనులన్= ధనం లేని వారిని; కరంబు= మిక్కుటంగా; అర్థింతురు+ఏ= కోరుకొంటారా (కోరరుగదా).

**తాత్పర్యం:** పద్మంవంటి మొగం కల సుందరీ! ద్రౌపదీ! రాజ్యాన్ని పోగొట్టుకొని, తోడివారలు అందరు వెక్కిరిస్తూ ఉండగా అడవులలో ఇడుమల పొందుతున్నవారుకదా పాండవులు. అట్టి దీనులను సేవించటం నీతెలివితక్కువ తనం సుమా! దానివలన నీకు సుఖమేమీ కలుగదు. ధనం లేని దరిద్రులను ఆడవారు కోరుకొనరుకదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం

**ఆ.** **చిగురుబోఁడి! నిఖిలసింధుసౌవీరభూ । వలయరాజ్యగౌరవంబుతోన**
**నన్ను నేలికొని మనఃప్రియభోగైక । యోగ్య వగుము ; విడువు మొండుదలఁపు'.** **166**

**ప్రతిపదార్థం:** చిగురుబోఁడి!= తలిరుటాకువలె సుకుమారమైన దేహం కలదానా! ద్రౌపదీ!; నిఖిల, సింధు, సౌవీర, భూ, వలయ, రాజ్య గౌరవంబుతోన్+అ= సమస్తమైన సింధు సౌవీరదేశాలకు చెందిన భూమండల ప్రభుత్వ మహిమతో సంపూర్ణంగా కూడి; నన్నున్= నన్ను (జయద్రథుడిని); ఏలికొని= వలచి పరిపాలించి; మనస్+ప్రియ, భోగ+ఏక, యోగ్యవు+అగుము= చిత్తానికి ఇంపైన సౌఖ్యం అనుభవించటానికి తగినదానివి కమ్ము; ఒండు తలఁపున్= వేరొక ఊహను; విడువుము= వదలిపెట్టుము.

**తాత్పర్యం:** తలిరుటాకులవంటి సౌకుమార్యంతో ఇంపెసలారే శరీరం కల ద్రౌపదీ! నేను సమస్తమైన సింధు సౌవీరరాజ్యాలను ఏలుకొనే మహారాజును; నన్ను నీవు ఏలుకొనుము; మనస్సుకు ఆనందాన్ని చేకూర్చే భోగాలను అన్నింటిని హాయిగా అనుభవించుము. వేరే ఊహ వదలిపెట్టుము.'

**వ. అనినం బాంచాలి ప్రకంపితచిత్త యగుచుఁగొండొక దొలంగి, వానిదెస ననాదరదృష్టిం జూచుచుఁ దనపతుల రాకయ కోరుచుం బ్రతివాక్యంబులఁ గొంతకాలక్షేపంబు సేయుటకై వాని కి ట్లనియె. 167**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (జయద్రథుడు) చెప్పగా; పాంచాలి= ద్రౌపది; కొండొక, తొలంగి= ఇంచుక తప్పుకొని; ప్ర, కంపిత, చిత్త+అగుచున్= మిక్కిలి వణకునట్టి మనస్సు కలిగినట్టిదై; వానిదెసన్= ఆ జయద్రథుడివైపు; అనాదర, దృష్టిన్= గౌరవం లేని చూపుతో; చూచుచున్= అరయుచు; తన, పతుల= తన భర్తల; రాక+అ= రావటాన్నిమాత్రమే; కోరుచున్= వాంఛిస్తూ; ప్రతివాక్యంబులన్= సమాధానపూర్వకాలయిన మాటలచేత; కొంత= కొంతమేర; కాలక్షేపంబు+చేయుటకై= కాలంగడపటంకొరకై; వానికిన్ జయద్రథుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** జయద్రథుడిమాటలకు భయపడి ద్రౌపది హృదయం కంపించింది. ఆమె కొంతతొలగి దూరంగా జరిగి నిలబడింది. ఆతడివైపు గౌరవంలేని చూడ్కులు నిగుడించింది. మనస్సులో తన భర్తలు ఎప్పుడు వస్తారా అని ఎదురుతెన్నులు చూడసాగింది. వారు వచ్చేవరకు, సమాధానం చేప్పేమిషతో కొంతసేపు కాలం గడపటానికి సంకల్పించి, ద్రౌపది జయద్రథుడితో ఇట్లా పలికింది.

**తే. 'తలఁపఁ బాండవధార్తరాష్ట్రులకుఁ జెలియ । లైన యా దుస్సలకుఁ బతి వనఘ! నీవు;**
**నాకుఁ దోఁబుట్టువవు గావె? నీకుఁ జనునె । పాడి దప్పిన మాటలు వలుక నిచట? 168**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపం లేనివాడా!; తలఁపన్= ఆలోచించగా; పాండవ, ధార్తరాష్ట్రులకున్= పాండునందనులకున్నూ, ధృతరాష్ట్రనందనులకున్నూ; చెలియలు= సహోదరి; ఐన= అయినట్టి; ఆ దుస్సలకున్= ఆ దుస్సలకు (దుస్సల ధృతరాష్ట్రుడి కూతురు); నీవు= జయద్రథా! నీవు; పతివి= భర్తవు; నాకున్= నాకు; తోన్+పుట్టువవు+కావె= సహోదరుడవే కావా?; పాడి+తప్పిన= న్యాయాన్ని అతిక్రమించిన మాటలు; ఇచటన్= ఈచోట; పలుకన్= మాటలాడటం; నీకున్; చనునె?= తగునా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడికూతురు దుస్సల పాండునందనులకున్నూ, ధృతరాష్ట్రుడి కుమారులకున్నూ వరుసనుబట్టి ఆలోచించగా సోదరియే కదా! ఆమెకు నీవు భర్తవు. కాబట్టి నీవు నాకు సహోదరుడవే ఔతావు. ఇప్పుడు ఇక్కడ నీవు ఈ విధంగా న్యాయాన్ని అతిక్రమించిన మాటలు పలకటం తగునా?

**క. నయమును ధర్మము గల య । న్వయమున జనియించినాఁడ; వక్కట! ధర్మ**
**క్రియ యెఱుఁగంగా వలదె? యు । భయలోకవిరుద్ధ మైన పథ మేమిటికిన్?' 169**

**ప్రతిపదార్థం:** నయమును= నీతియున్నూ; ధర్మము= న్యాయమున్నూ; కల= ఉన్న; అన్వయమునన్= వంశంలో; జనియించినాఁడవు= పుట్టావు; అక్కట!= అయ్యో!; ధర్మక్రియ= ధర్మపుతీరు; ఎఱుఁగంగాన్‌వలదె= తెలియవద్దా?; ఉభయ, లోక, విరుద్ధము+ఐన= రెండులోకాలకు వ్యతిరేకం అయిన (ఇహం+పరం= ఉభయలోకాలు); పథము= మార్గం; ఏమిటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** నీవు నీతి ధర్మం ఉన్న వంశంలో పుట్టినవాడవు. అయ్యో! ధర్మాన్ని ఏవిధంగా అనుష్ఠించవలెనో నీవు తెలిసికొనవద్దా? ఇహపరాలకు వ్యతిరేక మైన ఈ మార్గంలో పోవటం ఎందుకు?'

**విశేషం:** 1. 'నీతి' - ఈలోకానికి, అంటే ఇహలోకానికి సంబంధించింది. లోకసంగ్రహార్థం ఏర్పడింది నీతి. ఇక - 'ధర్మం' పరలోకానికి, మరణానంతరం జీవుడు వెళ్ళే లోకానికి సంబంధించింది. ఇహపరాలకు - ఉభయలోకాలకు సమన్వయం సాధించటమే మానవజన్మకు పరమార్థం అని మహాభారతసందేశం.

**క. అనిన నద్దురాత్ముండు దరస్మితాననుం డగుచు ని ట్లనియె. 170**

**ప్రతిపదార్థం:** అనినన్= ద్రౌపది అట్లా చెప్పగా; ఆ+దుర్+ఆత్ముండు= ఆ చెడుబుద్ధి గలవాడు (సైంధవుడు); దర, స్మిత+ఆననుండు+అగుచున్= చిరునవ్వుతో కూడిన ముఖం కలవాడవుతూ; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని అనగా ఆ దుర్మార్గుడు చిరునవ్వుతో వికసించిన మొగం కలవాడౌతూ ఇట్లా అన్నాడు.

**క. 'వనజాక్షి! రాజధర్మము । వినవే యెన్నఁడును మనుజవిభులకుఁ బ్రమదా**
**జనులయెడ వావి వెదకం । జనదు; వలసినట్ల వేడ్క సలుపఁగఁ జెల్లున్. 171**

**ప్రతిపదార్థం:** వనజ+అక్షి!= పద్మాలవంటి కన్నులు కలదానా- ద్రౌపదీ! రాజధర్మము= ప్రభువుల ధర్మం; వినవే= ఆలకించవా; ఎన్నఁడును= ఎప్పుడును; మనుజవిభులకున్= రాజులకు; ప్రమదాజనుల+ఎడన్= ఆడువారి యెడల; వావి= వరుస; వెదకన్+చనదు= అన్వేషించరాదు; వలసినట్ల= కావలసిన రీతిగా; వేడ్క= వినోదం; సలుపఁగన్= ఆచరించగా; చెల్లున్= తగును.

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు కల ద్రౌపదీ! సాధారణమనుజధర్మం వేరు, రాజధర్మం వేరు సుమా! రాజులకు స్వేచ్ఛ ఉన్నది. రాజులు ఆడువారియెడల బంధుత్వంలోనితారతమ్యాలను వావి వరుసలను అన్వేషించ నవసరం లేదు. అవసరమయిన పట్టులలో యథేచ్ఛగా వినోదం సలుపవచ్చు.

**క. విను మదియుఁగాక జగమున । వనితారత్నంబు లెల్లవారికి భోగం**
**బునయెడ సాధారణము; లొ । కనిధన మని గరుసు గలదె కరినిభగమనా! 172**

**ప్రతిపదార్థం:** కరి, నిభ, గమనా!= ఏనుగుతో సాటి అయిన నడక కలదానా, ద్రౌపదీ!; వినుము= ఆలకించుము; అదియున్+కాక= మఱియును; జగమునన్= లోకంలో; వనితా, రత్నంబులు= అన్నులమిన్నలు; ఎల్లవారికిన్= అందరికిని; భోగంబున+ఎడన్= అనుభవించటంలో; సాధారణములు= అందరికీచెందే వారు; ఒకని ధనము+అని= ప్రత్యేకం ఒకడి సొత్తు అని; గరుసు+కలదె= మర్యాద ఉన్నదా? (లేదు).

**తాత్పర్యం:** ఏనుగు వలె మందగంభీరంగా నడిచేదానా, ద్రౌపదీ! ఆలకింపుము. ఒకవిశేష విధి ఉన్నది. లోకంలో అన్నులమిన్నలు అందరు అనుభవించదగిన వారలే గాని ప్రత్యేకంగా ఒకరి సొత్తు అని చెప్పరాదు. అసలు ఆడువారు ఒకరికి మాత్రమే చెందిన సొత్తు అనటానికి ఏదైన హద్దు ఉన్నదా? లేదు కదా.'

**విశేషం:** ఉ.వి. ఆంధ్రమహాభారత సంశోధిత ప్రతిలో 'ఒకని ధనమని గురుతుగలదె' అనే పాఠం స్వీకరించబడింది. పెక్కు ప్రతులలో 'గురుతు'కు బదులు 'గరుసు' అనే పాఠాంతరం ఉన్నట్లు అధస్సూచికలో తెల్పబడింది. గరుసు అంటే మర్యాద. గురుతు అనేపదంలో శకటరేఫం ఉండాలి. అప్పుడా పదానికి ఈ వస్తువు ఫలానివారిది అని తెలిపే ఒక గుర్తు అనే అర్థం ఏర్పడుతుంది. డబ్బు సంచీలకు లక్కగుర్తులు వేసి పేర్లు వ్రాసిపెట్టటం లోకంలో పరిపాటి. అట్లాగే స్త్రీ అనే ధనానికి ప్రత్యేకించి ఫలానివారికి చెందుతుందనే లక్కగుర్తులవంటి, లేదా నామ పత్రాలవంటి భౌతికమైన గుర్తులుంటాయా? అనే భావం ఏర్పడుతుంది. దీనికంటె పెక్కుప్రతులలో ఉన్న 'గరుసు'= మర్యాద - అనే పాఠమే ఔచిత్యవంతంగా ఉంటుందని భావించి ఈ ప్రతిలో పాఠంగా గ్రహించటమైనది. గురుదు, గురుసు- అనే పాఠాంతరాలు కూడా ఉన్నాయి. అన్నిటికంటె 'గరుసు' పాఠం సముచితం (సంపా.)

**వ. అనిననయ్యంగన క్రోధకలుషితాంతరంగయై 'యిప్పాపాత్ముండు ప్రియ వచనంబులం బోవండు; బెట్టిదంబులం గాని చక్కంబడఁ' డని తలంచి యిట్లనియె. 173**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (జయద్రథుడు) చెప్పగా; ఆ+అంగన= ద్రౌపది; క్రోధ, కలుషిత+అంతరంగ+ఐ= కోపంచేత కలతచెందిన చిత్తం కలదిఅయి; ఈ+పాప+ఆత్ముండు= ఈ దురాత్ముడు; ప్రియవచనంబులన్= మంచి మాటలతో; పోవండు= పోడు; బెట్టిదంబులన్+కాని= కరకు మాటలతోకాని; చక్కంబడఁడు= దారికిరాడు (సరిపడడు); అని; తలంచి= భావించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** అని జయద్రథుడు పలికాడు. ఆ మాటలు వినిన ద్రౌపది కోపంచేత కలతపడిన మనస్సు కలదై, 'ఈ దుష్టుడు మంచిమాటలతో దారికి రాడు. ఈతడిపట్ల కఠినత్వం చూపక తప్పదు' అని ఆలోచించి ఈ విధంగా చెప్పింది.

### ద్రౌపది సైంధవునితో నిష్ఠురోక్తులు వలుకుట (సం. 3-252-1)

**చ. 'ప్రకటితశౌర్యసారుల నభగ్నపరాక్రమ నిర్జితాహిత**
**ప్రకరులఁ బాండునందనులఁ బాండుయశస్కుల నాత్మలోఁ దలం**
**పక నను ధిక్కరించెదు నృపాలకులాధమ! నీదుగర్వదు**
**ర్వికసన మింతఁ బోదు; తుది వ్రేఁగగుఁ; దక్కుము దుష్ప్రలాపముల్. 174**

**ప్రతిపదార్థం:** నృపాల, కుల+అధమ!= రాజుల వంశంలో పుట్టిన నీచుడా, ఓ జయద్రథా!; ప్రకటితశౌర్యసారులన్= వెల్లడిచేయబడిన పరాక్రమం యొక్క నిగ్గు కలవారిని అనగా తమపరాక్రమాలను ఋజువు చేసికొన్నవారిని; అభగ్నపరాక్రమ, నిర్జిత+అహిత, ప్రకరులన్= మొక్కవోని (తమ) శౌర్యంచేత జయించబడిన శత్రుసమూహాలు కలవారిని; పాండు యశస్కులన్= తెల్లని కీర్తి కలవారిని; పాండు నందనులన్= పాండురాజు కొడుకులను; ఆత్మలోన్= మనస్సులో; తలంపక= స్మరించక; ననున్= నన్ను; ధిక్కరించెదు= అవమానిస్తున్నావు; నీదు= నీయొక్క; గర్వదుర్వికసనము= నీ అహంకారపు చెడువిజృంభణం; ఇంతన్= ఇంతటితో; పోదు= ఆగదు. తుదిన్= చివరకు; వ్రేఁగు+అగున్= భరింపజాలనిది ఔతుంది, దుష్ఫలితాన్ని ఇస్తుంది; దుష్ప్రలాపముల్= చెడ్డవైనవి అహంకార పూరితాలైనవి అయిన మాటలు; తక్కుము= మానుము.

**తాత్పర్యం:** రాజులవంశంలో జన్మించిన ఓ నీచుడా, జయద్రథా! పాండవులు గొప్పపరాక్రమవంతు లైన సంగతి ప్రపంచానికి ఈవరకే ఋజువైన విషయం. మొక్కవోని శౌర్యంతో పాండవులు శత్రుసమూహాలను నిర్జించి ఉన్నారు. నిష్కళంకయశస్సును ఆర్జించిన పాండవులను లెక్కచేయక నీవు నన్ను అవమానిస్తున్నావు. ఇక నీ అహంకార పూరిత మైన ప్రేలాపన కట్టిపెట్టుము. ఇంతటితో ఆగకపోతే చివరకు నీవు దుర్భరమైన ఫలితాన్ని చవిచూడవలసి వస్తుంది.

**మ. హిమవత్పాదవనాంతకేలిరతిమై నేపారి కోపారుణ**
**క్రమనేత్రాంచలమై ప్రభూతమదరేఖం బైన గంధద్విపేం**
**ద్రము డాయం జని సిల్లు సూపుట సుమీ ధర్మాత్ము నత్యుగ్రవి**
**క్రముఁ గౌంతేయవరిష్ఠు నీవు దొడరంగాఁ జూచు టూహింపఁగన్. 175**

**ప్రతిపదార్థం:** ధర్మ+ఆత్మున్= ధర్మాన్ని ఆచరించేవాడిని; అతి+ఉగ్ర, విక్రమున్= మిక్కిలి భయంకర మైన శౌర్యం కలవాడిని; కౌంతేయ వరిష్ఠున్= కుంతీకుమారులలో శ్రేష్ఠుడిని- ధర్మరాజును; నీవు= నీవు; తొడరంగాన్+చూచుట= ఎదిరించ తలపోయటం; ఊహింపఁగన్= ఆలోచించగా; హిమవత్+పాద, వన+అంత, కేలి, రతిమైన్= హిమాలయాల అడుగుల సమీపంలో కల అరణ్యంమధ్య వినోద విహారంలో నిమగ్నమై; ఏపారి= అతిశయించి; కోప+అరుణ, నేత్ర+అంచలము+ఐ= క్రోధం వలన ఎర్రవారిన కనుగొలకులు కలది అయి; ప్రభూత, మద రేఖంబు+ఐన= అధికమైన గర్వచ్ఛాయ కలది అయిన; గంధద్విప+ఇంద్రమున్= మదించిన గొప్ప ఏనుగును; డాయన్+చని= సమీపించి; సిళ్లు+చూపుట, సుమీ= ఏనుగును పొడిచే అంకుశాన్ని ప్రదర్శించటం సుమా.

**తాత్పర్యం:** హిమాలయపర్వతసానువులందు మధ్యగా ఉన్న అరణ్యాలలో వినోదిస్తూ, క్రోధంచేత ఎర్రనైన కనుచూపులతో విహరించే మత్తేభాన్ని సమీపించి, అంకుశం చూపించటం ఎటువంటిదో, కుంతీకుమారులలో శ్రేష్ఠుడు, ధర్మాత్ముడు, మిక్కిలి భయంకర మైన పరాక్రమం కలిగినవాడైన యుధిష్ఠిరుడిని నీవు ఎదిరంచబూనటం అటువంటిదే సుమా! జాగ్రత్త.

**విశేషం:** మదించిన ఏనుగును సమీపించి ఎవరైనా అంకుశాన్ని చూపితే అది అతడిని వధిస్తుంది. అట్లాగే జయద్రథుడు ద్రౌపదిని కోరి ధర్మజుడితో వైరం కొని తెచ్చుకొన్నట్లే. అంకుశాన్ని సహించని మదేభంవలెనే ధర్మరాజు తన నవమానించే జయద్రథుడిని బ్రతుకనీయడని ఇందులో హెచ్చరిక. పాండవులలో ఒక్కొక్కరిని ఒక్కొక్క బలిష్ఠమైన వనజంతువుతో పోల్చి చెప్పటం ఇందులోని అలంకార సార్థక్యం. అలం: రూపకం.

**ఉ.** **శాతనఖాగ్రఖండిత లసన్మదకుంజర కుంభముక్త ము**
**క్తాతతశైలకందర గుహాంతర సుప్త మృగేంద్రకేసర**
**వ్రాతము వేడ్క నూఁచికొన వారక చేరుటగాదె క్రోధని**
**ర్ఘాతమహోగ్రు భీముఁ జెనకం దలపోయుట నీకు నెమ్మెయిన్.** **176**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు (ఓజయద్రథా! నీకు); ఏ+మెయిన్= ఏ విధంగా అయినను; క్రోధ, నిర్ఘాత, మహా+ఉగ్రున్= కోపముచే పిడుగులపాటువలె మిక్కిలి భయంకరుడు అయిన; భీమున్= భీముడిని; చెనకన్= ఎదిరించటానికి; తలపోయుట= ఆలోచించటం; శాత, నఖ+అగ్ర; ఖండిత, లసత్+మద, కుంజర, కుంభ, ముక్త, ముక్తా+ఆతత, శైల, కందర, గుహా+అంతర, సుప్త, మృగ+ఇంద్ర, కేసర, వ్రాతమున్= వాడియైన గోళ్లకొనల భాగాలచేత ముక్కలు చేయబడినవై ప్రకాశించే మదపుటేనుగుల కుంభస్థలాలనుండి జారిన ముత్యాలచేత విరివి అయిన కొండకనుమలలోని గుహలమధ్యలో నిద్రించే సింహంయొక్క జూలులోని వెండ్రుకలగుంపును; వేడ్కన్= వినోదం కొరకు; ఊఁచికొనన్= ఊగించటానికి; వారక= ఆగక; చేరుట+కాదె= చొరబడటంకాదా.

**తాత్పర్యం:** ఓ జయద్రథా! నీవు భీమసేనుడిని ఎదిరించబూనటం ఏవిధంగా చూచినా కూడని పని. కోపంతో వాడిఅయిన గోళ్లకొనలతో మదించిన ఏనుగుల కుంభస్థలాలనుండి వెలువడిన ముత్యాలతో విరివి అయిన కొండకనులమధ్య నున్న గుహలలో నిదురించే సింహంయొక్క జూలులోని వెంట్రుకలను పట్టి ఊగించటానికి చేసే సాహసంవంటిదే సుమా. జాగ్రత్త. కాబట్టి ఇట్టి సాహసానికి ఒడిగట్టకు. నీకు చేటు మూడుతుంది.

**విశేషం:** ధర్మరాజును మదేభమని చెప్పి భీమసేనుడిని సింహమని పేర్కొనటం విశేషం. నిద్రిస్తున్న సింహం జూలును వినోదంకోసం లాగినా అది ప్రాణాంతకమే అవుతుంది. ద్రౌపదిని కోరటం భీమసింహపుజూలును లాగటంవంటిది. మదేభకుంభస్థలాలను బ్రద్దలు చేసిన భీమసింహానికి జూలులాగే (ఎలుకవంటి బలహీనుల) ప్రయత్నం కోపకారణ మౌతుందని హెచ్చిరిక. అలం. రూపకం

**మ. చలజిహ్వాగ్రవిలీఢవిస్ఫురిత దంష్ట్రాభీషణం బైన బె**
**బ్బులిఁ గోలం గొని వ్రేసి త్రోసి తొలఁగం బోవచ్చినన్ వచ్చుఁ గా**
**క లసత్క్రూరశరాగ్నిదుస్సహుని నగ్గాండీవి నల్గించి యె**
**వ్వలనన్ మానధనాఢ్యులై బ్రతికిపోవన్ వచ్చునే యేరికిన్. 177**

**ప్రతిపదార్థం:** చల, జిహ్వా+అగ్ర, విలీఢ, విస్ఫురిత, దంష్ట్రా+భీషణంబు+ఐన= కదలే నాలుకకొనచేత నాకబడుతూ బాగా కనిపించే కోరపండ్లచేత భయంకరమైన; బెబ్బులిన్= పెద్దపులిని; కోలన్+కొని= కఱ్ఱ చేత బూని; వ్రేసి= కొట్టి; త్రోసి= నెట్టి; తొలఁగన్= ప్రక్కకు తప్పుకొని; పోవచ్చినన్+వచ్చున్+కాక= వెడలి పోవచ్చు నేమో కాని; లసత్+క్రూర, శర+అగ్ని, దుః +సహునిన్= నొప్పించేవి అయిన బాణాలనే నిప్పులు విరజిమ్మటంచేత భరించలేని వాడిని; ఆ+గాండీవిన్= గాండీవం అనే విల్లు ధరించే అర్జునుడిని; అల్గించి= కోపించేటట్లు చేసి; ఏ+వలనన్= ఏరీతిగా నైనను; ఏరికిన్= ఎవరికైనను; మానధన+ఆఢ్యులు+ ఐ= మానం అనే ధనం కలవారై, చిత్తౌన్నత్యం కలవారై; బ్రతికి= జీవించి; పోవన్+వచ్చునే= పోవటానికి వీలు కలదా? (బ్రదికి తప్పించుకొని పోవటానికి వీలులేదు).

**తాత్పర్యం:** గాండీవం అనే గొప్ప విల్లును ధరించే వాడు అర్జునుడు. అతడికి కోపం తెప్పించేవారు చావు తప్పించుకొని బ్రదికి బట్టకట్టటం సాధ్యంకాదు. నాలుక కొన కదుపుచు నోరు తెరచి కోరపళ్ళతో భయంకరంగా మీదికి ఉరికే పెద్దపులిని చేతికఱ్ఱతో కొట్టి ప్రక్కకు నెట్టి; తప్పించుకొని పోవచ్చునేమో కాని క్రూరమైన బాణాలనే అగ్ని గుప్పించే అర్జునుడిబారినుండి ఎవరు తప్పించుకొని పోగలరు? మాన ప్రాణాలను ఎవరు రక్షించుకోగలరు?

**విశేషం:** అర్జునుడిని బెబ్బులితో పోల్చటం సార్థకం. అవమానిస్తే పగపట్టి ప్రాణం తీసే క్రూరమృగం బెబ్బులి. ద్రౌపదిని కామించి అర్జునుడి బారి నుండి తప్పించుకొనటం జయద్రథునికి అసాధ్యమని ఇందులో హెచ్చరిక!

**ఉ. బోరన విస్ఫులింగములు వొడ్మఁగ నుగ్రవిషంబు గ్రక్కుచుం**
**గ్రూరవిచేష్టనాలుకలు గ్రోయు మహోరగరాజయుగ్మముం**
**జేరి పదాహతిం గినియఁ జేయఁ దలంచుట గా నెఱుంగు దు**
**ర్వారులు మాద్రిపుత్త్రుల కవజ్ఞ యొనర్పఁ దలంచు టేర్పడన్. 178**

**ప్రతిపదార్థం:** దుర్వారులు= అడ్డగించటానికి సాధ్యంకానివారు; అగు మాద్రి పుత్త్రులకున్= మాద్రికొడుకులకు, (నకులసహదేవులకు); అవజ్ఞ= అవమానం; ఒనర్పన్= చేయటానికి; తలంచుట= ఆలోచించటం; బోరనన్= శీఘ్రంగా; విస్ఫులింగములు= నిప్పురవ్వలు; పొడ్మఁగన్= పుట్టగా; ఉగ్ర, విషంబు= భయంకర మైన గరళాన్ని; క్రక్కుచున్= బయటికి వదులుతూ; క్రూర, విచేష్టన్= నొప్పజేసే వ్యాపారంచేత; నాలుకలు= జిహ్వలు; క్రోయు= విషమంగా చాఁచు; మహా+ఉరగ, రాజ, యుగ్మమున్= మిక్కిలి గొప్ప వైన పాములజంటను; చేరి= సమీపించి; పద+ఆహతిన్= పదాల తాకిడిచేత; కినియన్+చేయన్= కోపగింప చేయాలని; తలంచుట+కాన్= ఆలోచించటంవలె; ఏర్పడన్= సుస్పష్టంగా; ఎఱుంగు= తెలిసికొనుము.

**తాత్పర్యం:** వారించశక్యంగాని పరాక్రమం కలిగిన నకులసహదేవులకు అవమానం చేయటానికి ఆలోచించటం ఎటువంటిదో సుస్పష్టంగా తెలిసికొనుము. శీఘ్రంగా అగ్నికణాలను వ్యాపింపజేస్తూ భయంకరమైన గరళాన్ని క్రుక్కుతూ కాటువేయటానికై నాలుకలు చాస్తూ మీదకు ఉరికే గొప్పపాములజంటను పాదాలతో త్రొక్కి కోపింపచేయటం వంటిదే. జాగ్రత్త సుమా.

**విశేషం:** నకుల సహదేవులు కవలలు కాబట్టి భయంకర విషసర్పాలజంటగా పోల్చటం సార్థకం. అలం: ఉపమ.

**ఉ. ఆలములోన వీఁక నమరాసురకోటికి నైన దుర్జయుల్**
**వాలినవీరు లవ్విభులు; వారికి నెగ్గొనరించి పోయి పా**
**తాళము సొచ్చి డాఁగినను దప్పదు మృత్యువు నీకు నక్కటా!**
**కాలము నిండె; నీవశము గాదు విధాతృని చెయ్వి త్రోవఁగన్. 179**

**ప్రతిపదార్థం:** ఆ+విభులు= ఆ రాజులు- పాండవులు; ఆలములోనన్= యుద్ధంలో; వీఁకన్= పరాక్రమంలో; అమర+అసుర, కోటికిన్+ఐనన్= దేవతల, రాక్షసుల సమూహాలకైనా; దుర్జయుల్= జయింప శక్యం కానివారు; వాలిన, వీరులు= గడిదేరిన పరాక్రమం కలవారు; వారికిన్= వారలకు (ఆ పాండవులకు); ఎగ్గు+ఒనరించి= కీడు చేసి; పోయి= వెడలి; పాతాళము+చొచ్చి= భూమికి క్రిందనున్న లోకం చేరి; డాఁగినను= దాగినప్పటికి; మృత్యువు= మరణం; తప్పదు; అక్కటా!= అయ్యో! ఎంత చేటు వచ్చింది; నీకున్= నీకు (ఓ జయద్రథా); కాలము నిండెన్= ఆయువు తీరింది; విధాతృనిచెయ్వి= బ్రహ్మదేవుడి చేష్ట; త్రోవఁగన్= తప్పించగా; నీవశము+కాదు= నీకు సాధ్యం కాదు.

**తాత్పర్యం:** ఓ జయద్రథా! నీకు ఆయువు తీరింది. నీకింక చావు తప్పదు. ఈ విధివిపరిపాకాన్ని తప్పించుకొనటం నీకు సాధ్యంకాదు. నీవు పాతాళలోకంలో చేరి దాగినా నీవు మరణించటం తథ్యం. యుద్ధంలో పరాక్రమంలో పాండవులు రాక్షసులకు కాని, వేల్పులకు కాని జయించ నలవిగాని గొప్పవీరులు. వారికి కీడు తలపెట్టటం అవివేకం. జాగ్రత్త.

**క. తేలును గర్కటియును దెగు। కాలమునకుఁ జూలుదాల్చుగతిఁ బార్థుల యి**
**ల్లాల నయిన నాదెస దు। శ్శీలుఁడవై తిది వినాశచిహ్నము గాదే!' 180**

**ప్రతిపదార్థం:** తేలును= వృశ్చికమున్నూ; కర్కటియును= ఎండ్రియున్నూ; తెగు, కాలమునకున్= చనిపోయే సమయానికి; చూలు= గర్భం; తాల్చు= ధరించే; గతిన్= రీతిగా; పార్థుల+ఇల్లాలన్+అయిన= పాండవుల భార్యను అయిన; నాదెసన్= నాయెడ; దుశ్శీలుఁడవు= చెడు నడవడిక కలవాడవు; ఐతి(వి)= అయినావు; ఇది= ఇది (నాయెడ చెడునడవడిక కలవాడవు కావటం); వినాశ, చిహ్నము= నాశనాన్ని దెలిపేగుర్తు; కాదే?= కాదా?

**తాత్పర్యం:** తేలు, ఎండ్రి, ఆయువు తీరిన సమయాననే గర్భం ధరిస్తాయి. ఆ రీతిగా నీకు ఆయువు ముగిసే కాలం దాపురించటం చేతనే పాండవుల ధర్మపత్నినైన నాయెడ చెడుస్వభావం ప్రదర్శించావు. ఇది నీ వినాశ కాలానికి చిహ్నం.'

**విశేషం:** 1. అలం: ఉపమ. 2. తేలు, ఎండ్రి గర్భము ధరించి చూలునిండిన పిమ్మట పిల్లలు తల్లి దేహాన్ని చీల్చి బయటకు వస్తాయి. మహాభారతం జీవశాస్త్రవిషయమై ప్రదర్శించిన నిశితదృష్టికి ఈపద్యం నిదర్శనప్రాయం.

**వ. అనిన జయద్రథుండు నవ్వుచు నవ్వెలంది కి ట్లనియె. 181**

**తాత్పర్యం:** అనగా, సైంధవుడు నవ్వుతూ ద్రౌపదితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'వారిజనేత్ర! పాండుసుతవర్గము నేఁ డిఁట మాకు వింతయే?**
**భీరులఁ బోలె నేల వెఱపించెదు మాటల మమ్ము? వింటె! సౌ**
**వీరకులప్రసూతులము వీరుల మే; మితర క్షితీశ సా**
**ధారణబుద్ధి సేయకు ముదాత్తచరిత్రుల మైన మాదెసన్. 182**

**ప్రతిపదార్థం:** వారిజనేత్ర!= పద్మాలవంటి కన్నులు కలదానా ద్రౌపదీ!; పాండు, సుత, వర్గము= పాండురాజు కొడుకుల సముదాయం; నేఁడు= ఈరోజున; ఇట= ఇచ్చట; మాకున్; వింత+ఏ= అచ్చెరువు గాదు సుమా; మమ్మున్= మమ్మల్ని; భీరులన్+పోలెన్= పిరికివారిని వలె; మాటలన్= వట్టి బడాయి మాటలతో; ఏల= ఎందుకు; వెఱపించెదు= భయపెట్టుతున్నావు; వింటె= ఆలకింపుము; సౌవీరకుల ప్రసూతులము= సౌవీరులవంశంలో జన్మించిన వారలం; ఏము, వీరులము= మేం పరాక్రమవంతులం; ఉదాత్త చరిత్రులము+ఐన= గొప్ప స్వభావం కలవారము అయిన; మా+దెసన్= మాపట్ల; ఇతర, క్షితి+ఈశ, సాధారణబుద్ధి+చేయకుము= పెర రాజులతో సామ్యాన్ని తెచ్చే ఆలోచన చేయకుము.

**తాత్పర్యం:** 'ఓద్రౌపదీ! పద్మాలవంటి కన్నులుగల సుందరీ! పాండవుల సంగతి మాకు చిరకాలంనుండి బాగా తెలుసు. ఇప్పుడు ఇచట నీవు వారి పరాక్రమాతిశయాలనుగూర్చి అతిశయోక్తులతో అభివర్ణించి మమ్ము భయపెట్ట నవసరం లేదు. మేము పిరికిపందలం కాము. సౌవీరులవంశంలో జన్మించిన పరాక్రమవంతులం. ఇతరరాజులవంటి వారముకాము సుమా! గొప్ప స్వభావం కల మమ్ము సామాన్యుల సాటిగా ఎంచకుము.

**వ. వలవని మాటలం దేర్చినం దీరదు; వేగంబ యల్ల కనకరథం బొండె నల్లమహాగజంబు నొండె నెక్కుము; బీరంపుమాట లాడక ప్రియవచనంబుల నస్మత్ప్రసాదభాజనంబ వగు' మనిన విని యాజ్ఞసేని వాని కిట్లనియె. 183**

**ప్రతిపదార్థం:** వలవనిమాటలన్= అనవసర మయిన పలుకులతో; తేర్చినన్= ఊరడిస్తే; తీరదు= చక్కబడదు; వేగంబు+అ= శీఘ్రమే; అల్ల= అదుగో దగ్గరగా ఉన్న; కనకరథంబు+ఒండెన్= పసిడితేరు కాని; అల్ల= అదుగో దగ్గరగా ఉన్న; మహా, గజంబున్,+ఒండెన్= గొప్ప ఏనుగును కాని; ఎక్కుము; బీరంపు మాటలు+ఆడక= ఆత్మప్రశంసలతో కూడిన మాటలు పలుకక; ప్రియవచనంబులన్= మంచి మాటలతో; అస్మత్+ప్రసాద, భాజనంబవు+అగుము= నా అనుగ్రహానికి యోగ్యమైనదానవు కమ్ము; అనినన్= అని జయద్రథుఁడు చెప్పగా; విని= ఆలకించి; యాజ్ఞసేని= ద్రౌపది; వానికిన్= జయద్రథుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పింది.

**తాత్పర్యం:** 'అనవసరమైన మాటలు మాట్లాడి ఊరడింపచూస్తే ఇది చక్కబడే పని కాదు. అదుగో అది నా పసిడితేరు. వేగమే దానిని ఎక్కుము. లేదా అల్లదిగో ఆ గొప్పయేనుగు కన్పిస్తున్నదికదా. దానిని ఎక్కుము. ఆత్మప్రశంసలు మానుము. మంచిమాటలతో నా అనుగ్రహానికి పాత్రురాలవు కమ్ము' అని జయద్రథుడు పలికిన ఆమాటలు విని ద్రౌపది ఇట్లా బదులు పలికింది.

**ఆ. 'వీరపత్ని నయ్యు వీరసహోదరి। నయ్యు నీకుఁ జూడ ననదవోలె**
**నున్నదాన; నెట్టు లున్నను నాకు నిన్। దెలుప నేల పలుకు తియ్య మేల? 184**

**ప్రతిపదార్థం:** వీరపత్నిన్+అయ్యున్= పరాక్రమవంతుల భార్యను అయినా; వీరసహోదరిన్+అయ్యున్= వీరులయొక్క చెల్లెలిని అయినప్పటికిన్నీ; నీకున్= నీకు (ఓ సైంధవా నీకు); చూడన్= చూడగా; అనద+పోలెన్= దీనురాలివలె; ఉన్నదానన్= ఉన్నాను; ఎట్టులు+ఉన్నను= ఏవిధంగా నీకు కనిపిస్తున్నప్పటికి; నాకున్= నాకు; నిన్+తెలుపన్+ఏల= నావిషయాన్ని నీకు నచ్చేటట్లుగా తెలుపటం ఎందుకు; పలుకుతియ్యము+ఏల= నీతో ప్రియవచనాలు పలకటమెందుకు?

**తాత్పర్యం:** 'ఓజయద్రథా! నేను వీరులయొక్క ధర్మపత్నిని. వీరుల ఇంటి ఆడపడుచును. నీదృష్టిలో నేను దీనురాలినిగా కన్పించవచ్చును. నీకు నేను ఏ విధంగానైనా కనిపించవచ్చును. నీకు బోధించవలసిన అవసరం నాకు లేదు. నీతో ప్రియముగా నేను పలకవలసింది లేదు.

**చ.** **అతులితవృష్ణి కేకయబలావళితోఁ బటుశంఖఘోష భీ**
**షితభువనత్రయుం డగుచు శీఘ్రతురంగరథాధిరూఢుఁ డై**
**జితదనుజాన్వయుండు యదుసింహుఁడు వెన్నుఁడు ముట్టి నిన్ బరి**
**క్షతబలుఁ జేయు నాకు దెసగల్గు టెఱింగెదు గాక యత్తఱిన్.** **185**

**ప్రతిపదార్థం:** అ, తులిత, వృష్ణి, కేకయ, బల+ఆవళితోన్= సాటిలేనట్టి వృష్ణుల, కేకయుల సేనల సమూహాలతో; పటు, శంఖ, ఘోష, భీషిత, భువన, త్రయుండు+అగుచున్= గొప్పదగు పాంచజన్యమనేశంఖ నాదాలచేత వెరగొందే టట్లు చేయబడిన మూడులోకాలు కలవాడు ఔతూ; శీఘ్ర, తురంగ, రథ+అధిరూఢుఁడు+ఐ= వేగంగా పరుగెత్తగల గుర్రాలను పూన్చిన తేరుకలవాడు ఔతూ; జిత, దనుజ+అన్వయుండు= జయించబడిన రాక్షసవంశం కలవాడు; యదు, సింహుఁడు= యదువులలో సింహంవంటివాడు; వెన్నుఁడు= శ్రీకృష్ణుడు; నిన్= నిన్ను; ముట్టి= తాకి; పరిక్షతబలున్+చేయున్= బాగా క్షీణించిన శక్తి కలవాడినిగా ఒనర్చును; ఆ+తఱిన్= ఆ తరుణంలో; నాకున్; దెస= దిక్కు; కల్గుట= ఉండటం; ఎఱింగెదు గాక= తెలిసికొంటావు సుమా!.

**తాత్పర్యం:** సైంధవా! యదుసింహుడైన శ్రీకృష్ణుడు నా సహోదరుడు. సాటిలేని వృష్ణికేకయ సేనాసముహంతో, పాంచజన్యమనే తన శంఖధ్వనికి ముల్లోకాలు దద్దరిల్లగా వడిగల గుర్రాలు పూన్చిన రథమెక్కవస్తారు. రాక్షసకుల విధ్వంసకుడైన మా అన్న నిన్నెదిర్చి నీబలపౌరుషాలను నిర్మూలించినప్పుడుగాని నాకు దిక్కున్నదో లేదో తెలియ గలదు.

**విశేషం:** 1. సైంధవుడిని జయించటానికి పాండవులు చాలరా? ద్రౌపది శ్రీకృష్ణుడిని గూర్చి ఇక్కడ ప్రసంగించటం. ఎందుకు? అనే ప్రశ్న రావచ్చును. ద్రౌపది - పాండవులు వచ్చేవరకు ఏదో మాటలాడి కొంత కాలక్షేపం చేయవలసి ఉన్నది. ఈ విషయం 167 సంఖ్యగల గద్యంలో ద్రౌపదియే స్పష్టంగా వివరించి ఉన్నది. కాలక్షేప వాక్యాలలో కూడా పాండవులకు శ్రీకృష్ణుడి అండదండలున్నవన్న వాస్తవాన్ని చెప్పి సైంధవుడిని బెదిరించి అతని దుష్ప్రవర్తనను మాన్పటానికి ద్రౌపది యత్నించింది.

**సీ.** **గాండీవరేఖ యాఖండలు చాపంబు। కరణిగాఁ, దద్గుణక్వణము ఘోర**
**గర్జగా, నవిరళగంభీరవీరర। సాపూర్ణమై సంతతావలిప్త**
**శత్రుప్రతాపోష్ణ సమయంబు శమితంబు। గా, మిత్రబర్హికేకారవంబు**
**లెసఁగంగఁ దోఁతెంచి యింద్రనందన మహా। జలధరం బాయతసాయకోరు**

**ఆ. వృష్టి ముంచుటయును వెరఁగంది నిలువంగ। నలవిగాక పఱచు నప్పు డైన**
**నాత్మదోషవృత్తికై మనంబున వగ। చెదవు గాక! యిపుడు సెప్ప నేల? 186**

**ప్రతిపదార్థం:** గాండీవ, రేఖ= గాండీవం రూపురేక; అఖండలు, చాపంబు, కరణి+కాన్= ఇంద్రధనుస్సు మాదిరిగా ఏర్పడగా; తత్+గుణ, క్వణము= ఆ గాండీవంయొక్క అల్లెత్రాడు మ్రోగించగా విన్పించే నాదం; ఘోరగర్జగాన్= భయంకరమైన (మేఘ) గర్జనగా; అవిరళ, గంభీర, వీర, రస+ఆపూర్ణము+ఐ= ఎడతెగనిది, లోతైనది అయిన శౌర్యం అనెడి నీటితో నిండింది అయి; సంతత+అవలిప్త, శత్రు, ప్రతాప+ఉష్ణ, సమయంబు= ఎల్లప్పుడును గర్వించిన శత్రువులయొక్క పరాక్రమం అనెడి వేడిప్రొద్దు; శమితంబు+కాన్= తగ్గిపోవగా; మిత్ర, బర్హి, కేకా+ఆరవంబులు= స్నేహితులు అనే నెమిళ్ళయొక్క కూతల సవ్వడులు; ఎసఁగంగన్= అతిశయించగా; తోఁతెంచి= సాక్షాత్కరించి; ఇంద్ర, నందన, మహా, జలధరంబు= ఇంద్రనందనుడు (అర్జునుడు) అనే గొప్పమేఘం; ఆయత, సాయక+ఉరు, వృష్టి= ఎడతెగని బాణాలు అనే గొప్పవానలో; ముంచుటయును= మునిగేటట్లుగా తడపటంచేత; వెరఁగు+అంది= భీతిల్లి; నిలువంగన్= నిలబడటానికి; అలవి+కాక= శక్యం కాక; పఱచునప్పుడు= పారిపోయేటప్పుడు; ఐనన్= అయినను; ఆత్మ, దోష, వృత్తికిన్+ఐ= జరిగిన నీ తప్పుల కొరకై; మనంబునన్= చిత్తంలో; వగచెదవు+కాక= దుఃఖించగలవుసుమా; ఇపుడు= ఈసమయంలో; చెప్పన్+ఏల= చెప్పటం ఎందుకు?

**తాత్పర్యం:** నీవు చేసిన తప్పులకు నీవు పశ్చాత్తాపం చెందే తరుణం శీఘ్రంగా సమీపిస్తున్నది. ఇప్పుడే నేను నీకు చెప్పటం అనవసరం. చూడు. అర్జునుడు వేగంగా రాగలడు. అతడి ధనువైన - గాండీవం ఇంద్రధనుస్సువలె భాసించగలదు. గాండీవము యొక్క అల్లెత్రాటిమ్రోత మేఘగర్జనవలె విస్తరించగలదు. శత్రువుల ప్రతాపమనే ఎండ వేడి చల్లారగలదు. అర్జునుడు అనే మేఘం వాడిబాణపరంపరలు అనే వర్షాన్ని వర్షించగలదు. స్నేహితులనే నెమిళ్లు అపుడు సంతసిల్లి కేకలు వేస్తాయి. అట్టి అర్జునుడి బాణవర్షపాతంలో మునిగి ఉక్కిరిబిక్కిరై నీవు ప్రాణభయంతో పారిపోతావు సుమా!

**విశేషం:** అలం: రూపకం. ఉపమేయ ఉపమానాల వరుస- అర్జునుడు - మేఘం; గాండీవం- ఇంద్రధనుస్సు; అల్లెత్రాటిమ్రోత - మేఘగర్జన; బాణపరంపర - వర్షధార. ఇట సంపూర్ణంగా ఉపమానోపమేయాలకు అభేదాధ్యవసాయం సిద్ధించింది.

**ఉ. ఘోరగదావిదారణ విఘూర్ణితశాత్రవకుంభికుంభముల్**
**చీరుచు మౌక్తికంపుతతిచే రణభూమి నలంకరించు కే**
**ళీరసలోలుఁ డై సమదలీల బకాంతకుఁ డేఁగుదేరఁ గ**
**న్నారఁగఁ జూచి కాక యిటు లంతకు నీమది త్రుళ్ళడంగునే? 187**

**ప్రతిపదార్థం:** ఘోర, గదా, విదారణ, విఘూర్ణిత శాత్రవ కుంభికుంభముల్= భయంకరమైన గదచేత తాడింపబడి తలక్రిందులుగా త్రెళ్లినవైన శత్రువులకు చెందిన ఏనుగులతలకట్లు; చీరుచున్= చీలికలు చేస్తూ; మౌక్తికంపుతతిచేన్= ముత్యాల సముదాయంతో; రణభూమిన్= యుద్ధరంగాన్ని; అలంకరించు= సింగారించు; కేళీరసలోలుఁడు+ఐ= వినోదార్థం తన్మయత్వం చెందినవాడై; సమదలీలన్= గర్వ విలాసంతో; బక+అంతకుఁడు= బకుడు అనే రాక్షసుడిని సంహరించినవాడు, భీమసేనుడు; ఏఁగుదేరన్= రాగా; కన్ను+ఆరఁగన్= కన్నులు వికసించేటట్లుగా; చూచి+కాక= కాంచినప్పుడు గాని; ఇటులు= ఈరీతిగా; అంతకున్= అంతవరకు; నీమదిత్రుళ్లు= నీచిత్తము యొక్క మిడిసిపాటు; అడంగునే= అణగునా; అణగదు.

**తాత్పర్యం:** భీమసేనుడు రావటం కన్నులార చూచినప్పుడుగాని నీ చిత్తంలోని మిడిసిపాటు తగ్గదు. భీమసేనుడి పరాక్రమం ఎట్టిదో నీకు తెలియునా? భయంకరమైన గదతో అతడు శత్రువుల మత్తేభయూధాల కుంభస్థలాలను బ్రద్దలు కొట్టి, అందుండి జారిన ముత్యాలచేత రణరంగాన్ని సింగారించగలడు.

**విశేషం:** 1. ముత్యాలతో ముగ్గులు పెట్టటం ఆగర్భశ్రీమంతుల అలంకార విశేషం. 2. ముత్యాలు లభించే స్థలాలు 1. సముద్రం 2. వెదురుబొంగులు 3. ఏనుగు కుంభస్థలాలు. ఏనుగు కుంభస్థలాలు చీలినపుడు ముత్యాలు రాలటం కవిసమయం.

**క. ననుఁ బెఱవనితల చందం । బున నవమానింప నీకుఁ బోలదు మత్పా**
**వనపాతివ్రత్యమహిమ । ననిశము నేకీడు నెందు నందదు నన్నున్.' 188**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; పెఱ, వనితల, చందంబునన్= ఇతర స్త్రీలమాదిరిగా; అవమానింపన్= అగౌరవానికి లోనుచేయగా; నీకున్= ఓజయద్రథా నీకు; పోలదు= తగదు; మత్+పావన, పాతివ్రత్య, మహిమన్= నాయొక్కపవిత్రమైన పాతివ్రత్యంయొక్క గొప్పతనంవలన; నన్నున్= నన్ను; అనిశమున్= ఎల్లప్పుడును; ఏకీడున్= ఎట్టిముప్పును; ఎందున్= ఎచటను; అందదు= చెందదు.

**తాత్పర్యం:** ఇతర వనితలవలె నీవు నన్ను అవమానించటానికి వీలులేదు. పరమపవిత్ర మైన నా పాతివ్రత్యమహిమ నన్ను ఎల్లప్పుడును కాపాడగలదు'.

**వ. అని పలికి ద్రౌపది యద్దురాత్ముండు దన్నుఁ బట్ట సమకట్టు క న్నెఱింగి తమపురోహితు ధౌమ్యునిం బేర్కొని యాక్రోశించిన, నతం డతిరయంబునఁ జనుదెంచు నాలోన. 189**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని వచించి; ద్రౌపది= పాంచాలి; ఆ+దురాత్ముండు= ఆ దుష్టమైన ఆత్మ కలవాడు (సైంధవుడు); తన్నున్= తనను (దౌపదిని); పట్టన్= బంధింప; సమకట్టు= పూనుకొనే; కన్ను+ఎఱింగి= జాడ తెలిసికొని; తమపురోహితున్= తమయొక్క వైదికవిప్రుడిని; ధౌమ్యునిన్= ధౌమ్యుడిని; పేర్కొని= పేరెత్తి పిలిచి; ఆక్రోశించినన్= బిగ్గరగా ఏడ్చిన; అతండు= ధౌమ్యుడు; అతి, రయంబునన్= మిక్కుటమైన వేగంతో; చనుదెంచు= వచ్చే; అలోనన్= లోపలనే.

**తాత్పర్యం:** అని చెప్పింది ద్రౌపది. కాని, దురాత్ము డైన సైంధవుడిచూపులో ఆతడు తనను బలాత్కరించటానికి సిద్ధంగా ఉన్నట్లు గ్రహించి, ఆమె తమపురోహితుడైన ధౌమ్యుడిని పేరెత్తి పిలిచి బిగ్గరగా ఏడ్వటం మొదలు పెట్టింది. ధౌమ్యుడు ద్రౌపది ఆర్తనాదం విని మిక్కిలి వేగంతో పరుగెత్తుకొని రాసాగాడు. కాని ఆతడు వచ్చేటంతలోనే.

### సైంధవుఁడు ద్రౌపదిని బలాత్కారముగా నెత్తికొని పోవుట (సం. 3-252-23)

**చ. పాపవినిశ్చయుండు సతిపయ్యెదకొంగు గడంగి పట్టినం**
**గోపముతో నుదల్చికొని కోమలియున్ వెస వాని ద్రేయుడుం**
**బోపడి వాఁడు చిత్రముగ భూమితలంబునఁ ద్రెళ్ళె మారుత**
**క్షేపవిభగ్నమూల మయి చెచ్చెరఁ ద్రెళ్ళు మహీరుహంబునాన్. 190**

**ప్రతిపదార్థం:** పాప, వినిశ్చయుండు= దుష్కృతం చేయటానికి నిర్ణయించుకొన్న వాఁడు, జయద్రథుడు; సతి, పయ్యెదకొంగు= పతివ్రతయొక్క పైట కొంగును; కడంగి= పూనికతో; పట్టినన్= గ్రహించగా; కోమలియున్= సుకుమారి అయిన ద్రౌపదియును;

కోపముతోన్= ఆగ్రహంతో; ఉదల్చికొని= విదిల్చివేసి; వెసన్= శీఘ్రంగా; వానిన్= అతనిని (జయద్రథుడు); వ్రేయుడున్= కొట్టగా; పోవడి= త్రోయబడినట్లయి తూలి; వాఁడు= జయద్రథుడు; మారుత, క్షేప, విభగ్నమూలము+అయి= గాలిచేత కొట్టబడి భగ్నమైన వ్రేళ్ళు కలది అయి; చెచ్చెరన్= శీఘ్రంగా; త్రెళ్లు= పడిపోయే; మహీరుహంబు= వృక్షం; నాన్= అనగా; చిత్రముగన్= ఆశ్చర్యం కలిగేటట్లుగా; భూమితలంబునన్= భూమిపైభాగంమీద; త్రెళ్లెన్= పడిపోయాడు.

**తాత్పర్యం:** చెడ్డపని చేయటానికి కృతనిశ్చయుడైన ఆ పాపాత్ముడు జయద్రథుడు పతివ్రత అయిన ద్రౌపది పయ్యెద కొంగును పట్టి లాగాడు. సుకుమారి అయిన పాంచాలికూడా వేగంగా వాడిని ప్రక్కకు నెట్టి కోపంతో కొట్టగా ఆ జయద్రథుడు పెనుగాలికి కూకటివేళ్లతో పెల్లగిలిపడిన వృక్షమో అన్నట్లు ఆశ్చర్యకరంగా నేలపై పడిపోయాడు.

**వ. ఇట్లు నేలంబడి తడయక యెగసి జయద్రథుండు మగువం దిగిచి రథంబుపై నిడికొని సపరివారుం డయి యరుగం దొడంగె; నప్పు డప్పాలఁతి పురోహితునకు మ్రొక్కిన నమ్మహాత్ముండు సైంధవుం బేర్కొని యిట్లనియె. 191**

**ప్రతిపదార్థం:** జయద్రథుండు= సైంధవుడు; ఇట్లు= ఈరీతిగా; నేలన్= భూమిమీద; పడి= వ్రాలి; తడయక= ఆలస్యం కాకుండా, ఎగసి= పైకి లేచి నిలబడి; మగువన్= వనితను (ద్రౌపదిని); తిగిచి= లాగిపట్టి, ఆకర్షించి; రథంబుపైన్= తేరిమీద; ఇడికొని= పెట్టుకొని; సపరివారుండు+అయి= (తన) అనుచరులతో పాటుగా; అరుగన్+తొడంగెన్= వెడలసాగాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+పాలఁతి= ఆ మగువ- ద్రౌపది; పురోహితునకున్= వైదికవిప్రుడికి; మ్రొక్కినన్= నమస్కరించగా; ఆ+మహా+ఆత్ముండు= ఆ మహనీయుడు (ధౌమ్యుడు); సైంధవున్= జయద్రథుడిని; పేర్కొని= పేరుతో పిలిచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈవిధంగా నేలమీద పడిన జయద్రథుడు వేగంగా లేచి నిలబడి త్వరపడి ద్రౌపదిని బంధించి పట్టి తేరుపై పెట్టుకొని, తన అనుచరులు వెంబడించగా వెడలసాగాడు. అప్పుడు ద్రౌపది పురోహితు డైన ధౌమ్యుడికి నమస్కరించింది. ఆ మహానుభావుడు సైంధవుడిని సంబోధించి ఈ విధంగా అన్నాడు.

**మ. 'తగునే రాజకులప్రసూతులకు నత్యంతంబు నేతాదృశం**
**బగు దుష్కర్మము? నాదుపల్కు విను; మీ యబ్జాక్షి పుణ్యాత్మ, యి**
**మ్మగువన్ వే విడు ; పాండునందనులు నీమానంబుఁ బ్రాణంబు నే**
**పగిదిం గొందురు గాని పోవిడువ; రీపాపంబు నిన్ ద్రెక్కొనున్'. 192**

**ప్రతిపదార్థం:** రాజ, కుల, ప్రసూతులకున్= రాజులవంశంలో పుట్టినవారికి; ఏతాదృశంబు+అగు= ఇటువంటిది అయిన; దుష్కర్మము= చెడుపని; అత్యంతంబు= మిక్కుటంగా; తగునే= భావ్యమా?; నాదు, పల్కు= నామాట; వినుము= ఆలకించవయ్యా; ఈ+అబ్జ+అక్షి= ఈపద్మాలవంటి కన్నులు కలది; పుణ్య+ఆత్మ= సుకృతంతో కూడిన ఆత్మకలది, మంచిఇల్లాలు; ఈ+మగువన్= ఈ వనితను, ద్రౌపదిని; వేవిడు= శీఘ్రంగా వదలిపెట్టుము; పాండు నందనులు= పాండురాజపుత్రులు; నీ మానంబు= నీ మానాన్ని; ప్రాణంబున్= ప్రాణాన్ని; ఏపగిదిన్= ఏరీతిగానైనను; కొందురు= తీస్తారు; కాని= కాని; పో విడువరు= పోవ నివ్వరు; ఈ పాపంబు= ఈదుష్కృతం; నిన్= నిన్ను; త్రెక్కొనున్= చెరుస్తుంది.

**తాత్పర్యం:** ఇటువంటి పాపపుపని నీవంటి రాజవంశంలో జన్మించినవారికి తగునా? నాయనా! నామాట వినుము. ఈ ద్రౌపది పుణ్యాత్మురాలు. పతివ్రతా శిరోమణి. వేగంగా ఈమెను విడిచిపెట్టుము. పాండవులు ఎట్లాగయినా నీ మానాన్ని, ప్రాణాన్నీ తీస్తారు. ఈపాపం నిన్ను కట్టి కుడుపుతుందిసుమా!

**వ. అని యాక్రోశించుచు నమ్మహీసురవరుండు వానిపిఱుందన చనియె; నిట పాండవులు నవ్వనంబున ననేక మృగంబుల వధియించి యందఱు నొక్కయెడం గూడంబడి యాశ్రమాభిముఖులై వచ్చునెడఁ దమ్ములం జూచి ధర్మజుం డిట్లనియె. 193**

**ప్రతిపదార్థం:** అని+ఆక్రోశించుచున్= అని బిగ్గరగా అరుస్తూ; ఆ+మహీసురవరుండు= ఆ బ్రాహ్మణోత్తముడు; వాని పిఱుందన= జయద్రథుడి వెనుకనే; చనియెన్= వెళ్ళాడు; ఇట= ఇక్కడ; పాండవులు; ఆ+వనంబునన్= ఆ అడవిలో; అనేక, మృగంబులన్= పెక్కుజంతువులను; వధియించి= చంపి; అందఱున్= అందరును; ఒక్క+ఎడన్= ఒకచోట; కూడన్+పడి= కలిసికొని; ఆశ్రమ+అభిముఖులు+ఐ= ఆశ్రమానికి ఎదురుగా ఉండే ముఖాలు కలవారై; వచ్చు+ఎడన్= అరుగుదెంచే సమయంలో; ధర్మరాజు; తమ్ములన్+చూచి= ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని బిగ్గరగా అరుస్తూ బ్రాహ్మణోత్తముడైన ధౌమ్యుడు జయద్రథుడి రథంవెంబడి వెళ్ళాడు. ఇట-పాండునందనులు ఆ అడవిలో పెక్కు జంతువులను వేటాడి అందరు ఒకచోట కలిసికొని ఆశ్రమందెసగా వస్తున్నారు. అప్పుడు ధర్మరాజు తమ్ములతో ఇట్లా పలికాడు.

**సీ. 'ఇనుఁ డున్న దెసనుండి యెలుఁగింపఁ దొడఁగెఁ బ । క్షులు మృగంబులు నతిఘోరరుతుల;**
**మగిడెడు నిప్పుడు మనకు దాపలి దెస । నతిభీషణాకృతి నఱచె వఱడు;**
**పగఱచే నవమానపాటును గయ్యంబుఁ । గలుగు నీశకునప్రకార మరయఁ;**
**గడుకొని చెయి వెట్టి కలఁచినట్లయ్యెడుఁ । జిత్తంబుఁ, దనువు నిశ్చేష్ట మయ్యెఁ;**

**ఆ. నరుగుదెండు వేగ యాశ్రమంబునఁ గృష్ణ । నునిచి వచ్చినార మొంటి నకట!**
**తలఁపఁ గ్రూరమతులు ధార్తరాష్ట్రులు గడు । నెగ్గు సేయఁజూతు రెడరు వేచి. 194**

**ప్రతిపదార్థం:** ఇనుఁడు= సూర్యుడు; ఉన్న, దెసనుండి= ఉన్నదిక్కు నుండి; పక్షులు= పిట్టలు; ఎలుఁగింపన్+తొడఁగెన్= కూయసాగినవి; మృగంబులున్= జంతువులును; అతిఘోర, రుతులన్= మిక్కిలి భయంకరమైన స్వరాలతో; మగిడెడున్= తిరిగి పోతున్నవి; ఇప్పుడు= ఈ సమయంలో; మనకున్ దాపలిదెసన్= మనకుఎడమవైపు; వఱడు= ముసలినక్క; అతిభీషణ+ఆకృతిన్= మిక్కిలి భయంకరమైన ఆకారంతో; అఱచెన్= బిగ్గరగా అరిచింది; ఈశకున, ప్రకారము= ఈ శకునాల చొప్పు; అరయన్= పరిశీలించగా; పగఱచేన్= శత్రువులచేత; అవమానపాటును= పరాభవం; కయ్యంబున్= యుద్ధం; కలుగున్= సంభవిస్తాయి; చిత్తంబు= మనస్సు; కడుకొని= పూని; చెయి+పెట్టి= హస్తం పెట్టి; కలఁచినట్లు= కలగుండు పరిచినట్లు; అయ్యెడున్= ఔతున్నది; తనువు= శరీరం; నిశ్చేష్టము+అయ్యెన్= కదలిక మెదలిక లేకుండ స్తంభించి పోతున్నది; వేగ= శీఘ్రంగా; అరుగుదెండు= రండు; ఆశ్రమంబునన్= ఆశ్రమంలో; కృష్ణన్= ద్రౌపదిని; ఒంటిన్= ఒంటరిగా; ఉనిచి= ఉంచి; వచ్చినారము, అకట!= అయ్యో!; తలఁపన్= యోచింపగా; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుడి కుమారులు, కౌరవులు; క్రూరమతులు= కరుకుదనంగల బుద్ధికలవారు; ఎడరువేచి= సమయం చూచి; ఎగ్గు= కీడు; చేయన్+చూతురు= చేయటానికి ప్రయత్నిస్తారు.

**తాత్పర్యం:** 'సోదరులారా! ఇప్పుడు మనకు ఎన్నో అపశకునాలు ఎదురైనవి. పక్షులు సూర్యుడు ఉన్న దిక్కునుండి బిగ్గరగా కూస్తున్నవి. జంతువులు భయంకర నినాదాలతో మరలుతున్నవి. ఇప్పుడు మనకు ఎడమవైపుగా ముసలినక్క భయంకరమైన ఆకృతితో అరుస్తూ పోయింది. ఈ అపశకునాలను పట్టి చూస్తే మనకు ప్రస్తుతం శత్రువులవలన అవమానం కలగటం, యుద్ధం జరిగే సూచనలు కన్పిస్తున్నవి. మనస్సు చేయిపెట్టి కలచినట్లుగా క్షోభిస్తున్నది; శరీరం

చేష్టలు దక్కి స్తంభిస్తున్నది; ఆలోచనలు పరిపరివిధాల పోతున్నవి. ధృతరాష్ట్రుడి కొడుకులు దుష్టబుద్ధి కలవారు. మనం ద్రౌపదిని ఒంటరిగా విడిచిపెట్టి వచ్చాం. సమయం కొరకై వారు నిరీక్షిస్తూ ఉంటారు. ఏమి ముప్పు మూడనున్నదో. వేగంగా కదలండి, ఆశ్రమానికి ఆలస్యం చేయకుండా చేరుకొందాం.

**ఆ. కమలహీన మైన కమలాకరము వోలెఁ । రాజహీనమైన రాత్రి వోలెఁ**
**జూడఁ గామ్యకంబు శూన్యమై యున్నట్లు । దోఁచె; నేమి కీడు దొడరునొక్కొ!' 195**

**ప్రతిపదార్థం:** కమలహీనము+ఐన= పద్మాలు లేని; కమల+ఆకరము+పోలెన్= సరోవరంవలె; రాజహీనము+ఐన= చందమామ లేని; రాత్రి+పోలెన్= రాతిరివలె; చూడన్= చూడగా; కామ్యకంబు= కామ్యకం అనే ఈ అడవి; శూన్యము+ఐ+ఉన్నట్లు= ఏమియు లేనిదిగా ఉన్నట్లు; తోఁచెన్= మనస్సుకు తట్టింది; ఏమి కీడు= ఎటువంటి ఆపద; తొడరున్+ఒక్కొ!= కలుగునో కదా!.

**తాత్పర్యం:** ఈ కామ్యకవనం శూన్యమై, పద్మాలు లేని సరోవరంవలె, జాబిల్లి లేని రేయి వలె శోభావిహీనమై మనస్సుకు క్షోభ కలిగిస్తున్నది. ఎట్టి ఆపద ప్రాప్తించనున్నదో కదా!'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అనియె ని ట్లయ్యేవురు నరదంబులు సత్వరంబుగాఁ దోలుకొని యాశ్రమంబునకు వచ్చునెడఁ బాంచాలి పరిచారిక ధాత్రేయిక యనునది యతికరుణంబుగా నేడ్చుచున్నం గని, ధర్మతనయుసారథి యైన యింద్రసేనుండు రథంబు డిగ్గ నుఱికి చని 'ఇది యేల నేలంబడి పొరలుచు నేడ్చెదవు? నీ కపకారంబు సేసినవా రెవ్వ?' రనిన నది వానిం జూచి 'సైంధవుచేతం బాంచాలి చెఱపోయె' నని పలుకుచుఁ బెల్లేడ్చిన నింద్రసేనుం డి ట్లనియె. 196**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని (ధర్మరాజు) చెప్పాడు; ఇట్లు= ఈరీతిగా; ఆ+ఏవురును= ఆ అయిదుగురును (పంచపాండవులు); అరదంబులు= రథంబులు; సత్వరంబుగాన్= వేగంగా; తోలుకొని= నడిపించుకొని; ఆశ్రమంబునకున్= ఆశ్రమానికి; వచ్చు+ఎడన్= అరుగుదెంచే సమయంలో; పాంచాలి, పరిచారిక= ద్రౌపది యొక్క దాసి; ధాత్రేయిక+అనునది= ధాత్రేయిక అనే పేరుకలది; అతి, కరుణంబుగాన్= మిక్కిలి జాలి పుట్టేటట్లుగా; ఏడ్చుచున్నన్= ఆక్రోశిస్తుండగా; కని= అరసి; ధర్మతనయు, సారథి+ఐన= ధర్మరాజు తేరు నడిపేవాడు అయిన; ఇంద్రసేనుండు= ఇంద్రసేనుడు అనే వాడు; రథంబు తేరు నుండి; డిగ్గన్+ఉఱికి= క్రిందికి దుమికి; చని= వెడలి; ఇది ఏల= ఇట్లు ఎందుకు; నేలన్+పడి= భూమిపై పడి; పొరలుచున్= ఇటూ అటు దొర్లుతూ; ఏడ్చెదవు= విలపిస్తావు?; నీకున్; అపకారంబు+చేసినవారు= కీడు ఒనరించినవారు; ఎవ్వరు?= ఎవరు? అనినన్= అని ప్రశ్నించగా; అది= ఆమె (ధాత్రేయిక); వానిన్+చూచి= అతడిని (ఇంద్రసేనుడిని); చూచి; సైంధవుచేతన్= జయద్రథుడిచేత; పాంచాలి= ద్రౌపది; చెఱపోయెన్= బంధించబడింది; అని+పలుకుచున్= అని చెప్పుతూ; పెల్లు+ఏడ్చినన్= మిక్కిలి; ఆక్రోశించగా; ఇంద్రసేనుండు= ఇంద్రసేనుడు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు పలికాడు. వెంటనే పంచపాండవులు తమతమ రథాలను వేగంగా తోలుకొని ఆశ్రమానికి తిరిగి వచ్చారు. ఆశ్రమంలో ద్రౌపది దాసి ధాత్రేయిక భూమిపై పొర్లాడుతూ బిగ్గరగా ఏడుస్తూ ఉండటం చూచి, ధర్మరాజురథసారథి ఇంద్రసేనుడు రథంనుండి దూకి ఆమెవద్ద కేగి 'ఎందుకు ఈరీతిగా ఆక్రోశిస్తున్నావు? నీకెవరు

అపకారం చేశారు?' అని అడిగాడు. సైంధవుడు ద్రౌపదిని బలాత్కారంగా రథంమీద తీసికొని పోయాడని చెప్పి ఆమె మరింత బిగ్గరగా ఏడ్వసాగింది. అప్పుడు ఇంద్రసేనుడు ఇట్లా పలికాడు.

**సీ. 'పాండుపుత్త్రుల బహిఃప్రాణంబు నుత్తమ । శీలసమగ్రఁ బాంచాలతనయఁ**
**గొనిపోవునంతటి గుండెఁ గల్గెనె విమో । హాంధమానసుఁ డైన సైంధవునకు?**
**నేఁగుఁ గా కేమి మహీతలగతుఁ డైన । గగనంబునకు వేగ యెగసి చనినఁ**
**బోనిత్తురే పొరివుత్తురు గాక యు । ద్ధురవృత్తిఁ బార్థు లా దురితచరితు;**

**ఆ. వీరవరుల ఘోరవివిధాస్త్ర కౌశలం । బెఱుఁగఁ డయ్యెఁ గాక యేమి వాఁడు;**
**వగవకుండు మబల! వైరి నుగ్రతఁ దున్మి । మగువఁ దెత్తు రిపుడ మనుజవిభులు'. 197**

**ప్రతిపదార్థం:** అబల= ఓవనితా! ఓ ధాత్రేయిక!; వగవక+ఉండుము= దుఃఖించకుము; పాండుపుత్త్రుల, బహిఃప్రాణంబున్= పాండునందనులయొక్క బయటికి కనుపించే ప్రాణం ద్రౌపదిని. (అనగా ద్రౌపది పాండవులకు ప్రియతమ అని భావం); ఉత్తమశీలసమగ్రన్= మంచి స్వభావం కలదానిని; పాంచాలతనయన్= పాంచాల రాజు కూతురిని; కొనిపోవు+అంతటి= బలాత్కారంగా తీసుకుపోయేటంతటి; గుండె= గుండెకాయ (ధైర్యసాహసాలు); విమోహ+అంధ, మానసుఁడు+ఐన= మిక్కుటమైన భ్రాంతి అనెడి చీకటితో నిండిన చిత్తం కలవాడైన; సైంధవునకున్= జయద్రథుడికి; కల్గెను+ఎ= ఉన్నదా?; ఏఁగున్+కాక+ఏమి= అతడా ద్రౌపదిని చెఱపట్టి తనవెంట గొనిపోయిన పోవుగాక, ఇంతలో ఏమైనది; మహీ, తల, గతుఁడు+ఐనన్= భూమిపైన ఉన్నవాడయినను; గగనంబునకున్= ఆకాశానికి; వేగ= వేగంగా; ఎగసి చనినన్= ఎగిరి వెళ్ళినప్పటికీ; పార్థులు= పాండవులు; ఆ దురిత, చరితున్= ఆ పాపశీలుడిని; ఉద్ధురవృత్తిన్= కాఠిన్యంతో; పొరివుత్తురు+కాక= చంపుతారు కాని; పోనిత్తురే= వెడలనిస్తారా; వీర, వరుల= శూరులలో శ్రేష్ఠులైనవారి యొక్క, పాండవుల యొక్క; ఘోర, వివిధ+అస్త్ర, కౌశలంబు= భయంకరాలైన, పెక్కు ఆయుధాల నేర్పరితనం; వాఁడు= ఆ సైంధవుడు; ఎఱుఁగఁడు= తెలియనివాడు; అయ్యెన్+కాక+ఏమి= తెలియనివాడు అయినాడు గాక ఏమి? మనుజవిభులు= రాజులు (పాండవులు); వైరిన్= శత్రువును, జయద్రథుడిని; ఉగ్రతన్= భయంకరంగా; తున్మి= సంహరించి; మగువన్= వనితను (పాంచాలిని); ఇపుడు+అ= ఇప్పుడే; తెత్తురు= తీసికొని రాగలరు.

**తాత్పర్యం:** 'ద్రౌపది - పంచపాండవులకు ఆరవ ప్రాణం, మంచి నడవడిక కలది. అట్టి మహానుభావురాలిని బలాత్కారంగా ఎత్తుకొనిపోయేటంతటి ధైర్యసాహసాలు కలిగి ఉన్నాడా? మోహంచేత కన్నులు కనుపించని జయద్రథుడు! వాడు ఎక్కడికి పోగలడు? భూమిమీద ఉన్నా లేదా ఆకాశంలోకి ఎగిరిపోతున్నా వాడిని పోనిస్తారా? మహావీరులైన పాండవులు ఆ పాపాత్ముడిని పట్టి బంధించక వదులుతారా? ఆ అవివేకికి పాండవులయొక్క భయంకరాయుధాలనేర్పు తెలియదు. ఓ ధాత్రేయిక! నీవు అబలవు దుఃఖించకుము. మనుజులలో శ్రేష్ఠులైన పాండవులు జయద్రథుడిని సంహరించి, ద్రౌపదిని విడిపించుకొని వేగంగా తిరిగి రాగలరు. ఊరడిల్లుము'.

**వ. అనిన నయ్యంగన యపాంగతరంగితంబు లగు బాష్పజలంబు లల్లన కరపల్లవప్రమార్జనంబుల నపనయించుచు నతనిం గనుంగొని యిట్లనియె. 198**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (ఇంద్రసేనుడు) పలుకగా; ఆ+అంగన= ధాత్రేయిక; అపాంగ, తరంగితంబులు+అగు= కనుగొలకులనుండి కెరటాలవలె జాలువారిన; బాష్పజలంబులు= కన్నీళ్ళు; అల్లన= మృదువుగా; కర, పల్లవ, ప్రమార్జనంబులన్=

లేతచిగుళ్లవంటి చేతులతో తుడిచికొనటంచేత; అపనయించుచున్= తొలగించుకొంటూ; అతనిన్+కనుంగొని= ఇంద్రసేనుడిని చూచి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** అని చెప్పి ఇంద్రసేనుడు ధాత్రేయికను ఓదార్చాడు. అంతట ఆమె తనకనుగొలకులనుండి కెరటాలుగా కారుతున్న కన్నీళ్ళను తన మృదుహస్తాలతో తుడుచుకొంటూ, ఇంద్రసేనుడితో ఇట్లా చెప్పింది.

**ఆ. 'ఇంద్రకల్పు లైన యేవురు నృపతుల। నాత్మఁ గొనక యుఱక యంబుజాక్షి**
**నపహరించి నపుడ యద్దురాత్మునకును। జేటుమూఁడె వేఱ చెప్ప నేల? 199**

**ప్రతిపదార్థం:** ఇంద్రకల్పులు+ఐన= వేల్పులదొర అయిన ఇంద్రుడితో సమానులు అయిన; ఏవురున్నృపతులన్= అయిదుగురు రాజులను (పంచపాండవులను); ఆత్మన్+కొనక= తనమనస్సులో పరిగణించక; ఉఱక= లక్ష్యపెట్టక; అంబుజ+అక్షిన్= పద్మాలవంటి కనులు కలదానిని, ద్రౌపదిని; అపహరించిన+అపుడు+అ= బలాత్కారంగా కొనిపోయినప్పుడే; ఆ, దురాత్మునకును= ఆ దుష్టుడికి, సైంధవుడికి; చేటు= కీడు; మూఁడెన్= దాపురించింది; వేఱు+అ= వేరుగా ఇక; చెప్పన్+ఏల?= చెప్పటం ఎందుకు?

**తాత్పర్యం:** దేవేంద్రుడితో సరిసమానులైన పంచపాండవులను ధిక్కరించి, సౌందర్యవతి అయిన ద్రౌపదిని అపహరించినపుడే దురాత్ముడైన జయద్రథుడికి కీడు మూడింది. ఇక వేరుగా ఎందుకు చెప్పటం?

**ఉ. ఇంతకు మున్న వాఁడు సనియెం; గడు దవ్వుగఁ బోవకుండ న**
**త్యంతరయంబునం బటురథావళి యొప్పఁగ నేఁగుఁ డుగ్రులై**
**సంతనకట్టుఁ డస్త్రములు శస్త్రములుం, దొడుగుండు వర్మముల్,**
**సంతతదివ్యబాణముల శాత్రవుఁ దున్మఁడు దెండు నెచ్చెలిన్. 200**

**ప్రతిపదార్థం:** ఇంతకుమున్ను+అ= ఇంతకు పూర్వమే; వాఁడు= జయద్రథుఁడు; చనియెన్= వెళ్లాడు; కడున్= మిక్కిలి; దవ్వుగన్= దూరంగా; పోవకుండన్= అరుగకుండా; అత్యంతరయంబునన్= మిక్కిలి వేగంగా; పటురథ+ఆవళి= గొప్పఅరదాలసముదాయం; ఒప్పఁగన్= శోభిల్లగా; ఏఁగుడు= వెడలండి; ఉగ్రులు+ఐ= భయంకరులై; అస్త్రములు శస్త్రములున్= మంత్రమహిమకల ఆయుధాలు, ఆయుధాలు; సంతనకట్టుఁడు= ఆయత్తం చేయండి; వర్మముల్= కవచాలు; తొడుగుండు= ధరించండి; సంతత దివ్యబాణములన్= ఎడతెగక ప్రయోగించే అస్త్రాలచేత; శాత్రవున్= విరోధిని; తన్మఁడు= చంపండి; నెచ్చెలిన్ (నెఱ+చెలిన్)= ప్రియసఖిని, (ద్రౌపదిని); తెండు= తీసికొనిరండు.

**తాత్పర్యం:** ఓ ఇంద్రసేనా! జయద్రథుడు ఇప్పుడిపుడే కొన్నినిమిషాలకు ముందే వెడలిఉన్నాడు. అతడు దూరంగా పోకుండానే మిక్కిలి వేగంగా మీరు రథాల నెక్కి సమరసన్నాహంతో పొండి. అస్త్రశస్త్రాలను సమకూర్చుకొని ప్రయోగానికి సిద్ధంగా పెట్టుకొనండి. కవచాలను ధరించండి. ఎడతెగని దివ్యబాణాలను ప్రయోగించి శత్రువును సంహరించండి. అనుగుసఖి ద్రౌపదిని చెఱవిడిపించుకొని తెండి.

**సీ. బూదిలోఁ దొరఁగిన పూర్ణాహుతియుఁ బోలెఁ, । కుక్కతో లిత్తిలోఁ గూరినట్టి**
**రాజితకపిలగోరసధారయును బోలె, । మసనంబులోఁ బడ్డ మహిత పుష్ప**

**మాలికయునుబోలె మదిరాక్షి దుర్జను। కతమున దూషిత గాక మున్న**

**చనరయ్య! వేగంబ; చనునె సన్మంత్రవి। శ్రుతపురోడాశంబు శునకమునకుఁ?**

**తే. జనునె కమలసుగంధికాసారకేళి। కలుషశవఖాది యైన సృగాలమునకుఁ?**

**జనునె తన్వంగి సౌందర్యచతురభావ। భంగి యాదుష్టచరితుని పాలు వడఁగ?' 201**

**ప్రతిపదార్థం:** బూదిలోన్= బూడిదలో; తొరఁగిన= పడిన; పూర్ణ+ఆహుతియున్+పోలెన్= నిండుహోమద్రవ్యంవలె; కుక్కతోల్+ తిత్తిలోన్= కుక్కచర్మంతో చేయబడిన సంచిలో; కూరిన+అట్టి= నింపినట్టి; రాజిత, కపిల, గో, రస, ధారయునుబోలెన్= వెలుగొందే కపిల గోవు యొక్క పాలచాలువలె; మసనంబులోన్+పడ్డ= వల్లకాటిలో పడినట్టి; మహిత, పుష్ప, మాలికయునుపోలెన్= గొప్పపూలదండవలె; మదిర+అక్షి= మత్తెక్కించు కన్నులుగలది (స్త్రీ) ద్రౌపది; దుర్జనుకతమునన్= దుష్టుడిమూలాన; దూషిత= దోషంతో కూడినది; కాకమున్న= కాకముందే; వేగంబు+అ= శీఘ్రముగా; చనరయ్య= దయచేసి వెడలుడు; సత్+మంత్ర, విశ్రుత, పురోడాశంబు= మంచి వేదబుక్కులచేత వేల్చబడి పేరుకెక్కినయజ్ఞంలో హోమం చేయటానికై ప్రత్యేకంగా తయారుచేసిన పిండివంటకం; శునకమునకున్= కుక్కకు; చనునె= యోగ్యం అగునా? కమల, సుగంధి, కాసార, కేళి= పద్మాల యొక్క పరిమళంలో కూడిన సరోవరంలో వినోదంగా విహరించటం; కలుష, శవ, ఖాది+ఐన= క్రుళ్లిన పీనుగులను తినేది అయిన; సృగాలమునకున్= నక్కకు; చనునె?= సరియగునా?; తన్వంగి= సన్నని తనువుగల సుందరి - ద్రౌపదియొక్క; సౌందర్య, చతుర, భావ, భంగి= అందచందాలతో అలరారే భావాలతీరు; ఆ దుష్టచరితుని, పాలు,+వడఁగన్= ఆ దుర్మార్గస్వభావంకల జయద్రథుడి వశం కావటం; చనునె= భావ్యమా? (కాదనిభావం).

**తాత్పర్యం:** బూడిదలో పోసిన నిండుహోమద్రవ్యంవలె, కుక్కతోలుతిత్తిలో నింపిన కపిలగోవుయొక్క పాలవలె, శ్మశానంలో పడిన పూలదండవలె, మదిరాక్షియైన ద్రౌపది ఆ దుర్జను డైన జయద్రథుడిచేత అపవిత్రం కాకముందుగానే మీరు వేగంగా వెళ్ళి ఆమెను కాపాడండి. మంచివేదబుక్కులచేత పవిత్రం చేయబడిన యజ్ఞంలో హోమం చేయటకై తయారుచేయబడిన అపూపము కుక్కకు తగునా? పద్మాల పరిమళంచేత గుబాళించే సరోవరంలో క్రీడించటం క్రుళ్లినశవాలను తినే నక్కకు సరిఔతుందా? సౌందర్య చతుర భావభంగిమ గల ద్రౌపది ఆ దుర్జనుడైన జయద్రథుని బారిని పడటం తగునా?'

**విశేషం:** అలం: ఉపమ, నిదర్శన.

**పాండవు లేవురు సైంధవుపై యుద్ధమునకుఁ బోవుట (సం. 3-253-21)**

**వ. అని పలుకుచున్న ధాత్రేయిక పలుకులు విని దాని నాశ్వాసించి, యక్కురువీరు లేవురు నాక్షణంబ సన్నద్ధులై క్రోధావేశంబునంజేసి మహోరగంబులుం బోలె రోఁజుచు జయద్రథు వెన్నడిదాడివెట్టి, కూడముట్టి, తత్సైన్యంబు పిఱుంద నాక్రోశ వచనవిహ్వలుండై పోవుచున్న ధౌమ్యుం గని నమస్కరించి, 'మీ రింక విగతఖేదుల రై యొయ్యన రం' డని యామిషంబునకుం గవియు డేగలుం బోలె సైంధవసేనపయిం గవిసి, సింహనాదంబులు సేసి; రప్పుడు పాండుపుత్త్రుల రథంబులు నడియాలంబులు సూచి సైంధవుండు ద్రౌపది కిట్లనియె. 202**

**ప్రతిపదార్థం:** అని పలుకుచున్న= అని వచిస్తున్న; ధాత్రేయిక పలుకులు= ధాత్రేయి యొక్కమాటలు; విని= ఆలకించి; దానిన్= ఆ ధాత్రేయికను; ఆశ్వాసించి= ఓదార్చి; ఆ కురువీరులు= కురువంశానికి చెందిన ఆ శూరులు; ఏవురున్=

అయిదుగురున్నూ; ఆక్షణంబు+అ= ఆ నిమిషంలోనే; సన్నద్ధులు+ఐ= సన్నాహాలు గలవారై; క్రోధ+ఆవేశంబునన్+చేసి= కోపవిజృంభణచేత; మహా+ఉరగంబులున్+పోలెన్= గొప్పపాములవలె; రోఁజుచున్= నిట్టూరుపులు నిగుడిస్తూ; జయద్రథున్= సైంధవుడిని; వెన్నడి= వెనుక వెడలి; దాడి+పెట్టి= దండెత్తి; కూడన్ముట్టి= తఱిమి సమీపించి; తత్+సైన్యంబు, పిఱుందన్= ఆతడియొక్క సేనవెనుక; ఆక్రోశ వచన విహ్వాలుండు+ఐ= ఎలుగెత్తి ఏడ్పు మాటలాడటం చేత శోషించిన వాడై; పోవుచున్న= అరగుచున్న; ధౌమ్యున్+కని= ధౌమ్యుడిని చూచి; నమస్కరించి= వందనం చేసి; మీరు= ఓ ధౌమ్యమహామునీ మీరు; ఇంకన్= ఇకమీద; విగత, ఖేదులరు+ఐ= పోయిన దుఃఖం కలవారు అయి; ఒయ్యనన్= మెల్లగా; రండు= రండి; అని= అని చెప్పి; ఆమిషంబునకున్= మాంసంకొొరకై; కవియు= మూగు; డేగలున్+పోలెన్= గ్రద్దలవలె; సైంధవ, సేనపయిన్= జయద్రథుడి సైన్యంమీద; కవిసి= వేగంగా వ్రాలి; సింహనాదంబులు, చేసిరి= సింహగర్జనలవంటి కేకలు పెట్టారు; అప్పుడు= ఆ సమయంలో; పాండుపుత్రుల రథంబులున్= పాండవులయొక్క తేరులును; అడియాలంబులు= చిహ్నంబులు; చూచి= అరసి; సైంధవుండు= జయద్రథుడు; ద్రౌపదికిన్= పాంచాలికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధాత్రేయిక మాటలు విని, పాండవు లైదుగురూ ఆమెను ఓదార్చారు. వెంటనే యుద్ధానికి సిద్ధమై తీవ్రమైన కోపంతో మహాసర్పాలవలె బుసలుకొట్టుతూ జయద్రథుడిని వెంబడించి, దాడిచేసి, తరుముకుంటూ సమీపించారు. ఆతడి సైన్యం వెంట ఎలుగెత్తి శోకిస్తూ కేకలువేస్తూ అలసిపోయిన ధౌమ్యుడిని చూచి నమస్కరించారు. 'మీరింక విచారించక నెమ్మదిగానే రండి' అని చెప్పారు. మాంసంకోసం వేగంగా దూసుకొనిపోయే డేగలవలె సైంధవుడి సైన్యంమీద పాండవులు వాలారు. సింహనాదాలు చేశారు. అప్పుడు పాండవుల రథాలను టెక్కాలపై గుర్తులను గమనించి సైంధవుడు ద్రౌపదితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. పాండవులు ధౌమ్యుడిని మీరు అని బహువచనంలో సంబోధించటం గౌరవసూచకం. 2. అడియాలము-ప్రాచీనకాలంలో సమరవీరులు తమ ప్రత్యేక వ్యక్తిత్వాలను సూచించటానికై ధరించిన చిహ్నాలు, గొడుగులు, పతాకలు మున్నగునవి.

**క. 'ఈ వచ్చురథంబుల వా । రేవురు నీమగలె యంబుజేక్షణ! వీరిన్**
**భావించి యెవ్వఁ డెవ్వం । డేవిధమునవాఁడు సెపుమ! యెఱుఁగఁగ వలయున్!' 203**

**ప్రతిపదార్థం:** అంబుజ+ఈక్షణ!= పద్మాలవంటి కన్నులు కలదానా, ద్రౌపదీ!; ఈవచ్చు రథంబులవారు= ఈవిధంగా ఇటు వస్తున్న అరదాల మీద ఉన్నవారు; ఏవురు= అయిదుగురు; నీమగలె!= నీభర్తలా? వీరిన్= పాండవులను; భావించి= వివేచించి; ఎవ్వఁడు+ఎవ్వండు= ఎవడు ఎవడో; ఏవిధమునవాఁడు= ఏరీతిగా ఉండేవాడో; ఎఱుఁగఁగవలయున్= తెలియటం అవసరం; చెపుము+అ= దయచేసి చెప్పుము.

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు కల ద్రౌపదీ! రథాలపై వస్తున్న అయిదుగురున్నూ నీ భర్తలే కదా! వీరిలో ఎవడు ఎవడో ప్రత్యేకించి నాకు తెలుపుము. వీరి స్వరూపస్వభావాలు తెలియటం అవసరం'.

**విశేషం:** జయద్రథుడు ఏదో ఒకమిష పెట్టి ద్రౌపదితో సంభాషణకు ఉపక్రమించ దలచటం సహజం. లోగడ తాను పాండవులనుగూర్చి క్షుణ్ణంగా తెలిసినవాడ నని ద్రౌపదితో ప్రగల్భాలు పలికాడు. (చూడు: 192సంఖ్యపద్యం). ఇక ద్రౌపది సైంధవుడి కెందుకు సమాధానం చెప్పవలె? (చూడు: 205 సంఖ్య పద్యం).

**వ. అనిన నప్పాంచాలి యనాదరక్రోధఘూర్ణిత యగుచు నతని కిట్లనియె. 204**

**ప్రతిపదార్థం:** అనినన్= సైంధవుడు అట్లా చెప్పగా; ఆ+పాంచాలి= ఆ ద్రౌపది; అనాదర, క్రోధ, ఘూర్ణిత+అగుచున్= ఆదరము లేమి చేతను, కోపముచేతను, తిరుగుడు పడిన మనస్సు గలది అవుతూ; అతనికిన్= ఆ సైంధవునితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** జయద్రథుడి మాటలు విని ద్రౌపది వెగటుతో కూడిన కోపంతో నిలువెల్ల కంపిస్తూ అతడితో ఇట్లా పలికింది.

**ఆ. 'ఇంక వీరి నెఱిఁగి తేనియు నెఱుఁగక । యుండితేనిఁ జేయ నొండు గలదె?**
**దుర్మదమునఁ గరము దుశ్చరిత్రమునకుఁ । జొచ్చి నీకుఁ జేటుఁ దెచ్చికొంటి. 205**

**ప్రతిపదార్థం:** ఇంకన్= ఇకమీదట; వీరిన్= వీరిని-పాండవులను; ఎఱిఁగితి(వి)+ఏనియున్= తెలిసికొన్నప్పటికీ; ఎఱుఁగక+ఉండితి+ఏనిన్= తెలియక ఉండి పోయినప్పటికీ; చేయన్= చేయటానికి; ఒండు= ఇంకొకటి (వేరొకచొప్పు); కలదె?= ఉన్నదా?; దుర్మదమునన్= చెడ్డగర్వంచేత; కరము= మిక్కిలి; దుశ్చరితమునకున్= చెడుప్రవర్తనకు; చొచ్చి= చేరి; నీకున్= నీకు; చేటున్= ముప్పును; తెచ్చికొంటి(వి)= తెచ్చుకొన్నావు.

**తాత్పర్యం:** ఇక పాండవులనుగూర్చి నీవు తెలిసికొన్నా తెలిసికొనక పోయినా ఇప్పుడు నీకు గత్యంతర మేమైనా ఉన్నదా? దురహంకారంతో నీవు చెడునడవడికకు ఒడిగట్టి ఈప్రమాదానికి గురిఅయినావు. ఇది నీ స్వయంకృతాపరాధం. తగిన శిక్ష అనుభవించక తప్పదు.

**వ. 'అయినను నన్నడిగితివి గావునం జెప్పెద; నింతియ కాని నీవలని భయ మించుకంతయు నాకుఁ గలుగదు; సోదరసహితుం డైన ధర్మనందనుం గంటి; నింకఁ గుశలంబ' యని పలికి యిట్లనియె. 206**

**ప్రతిపదార్థం:** అయినను= అయినప్పటికిని; నన్నున్; అడిగితివి= ప్రార్థించావు; కావునన్= కాబట్టి; చెప్పెదను= వచిస్తాను; ఇంతియకాని= ఇంతమాత్రమే కాని; నీవలని భయంబు= నీ వలన ఏర్పడిన భీతి; నాకున్; ఇంచుక+అంతయున్= లేశమాత్రం కూడా; కలుగదు= ఏర్పడదు; సోదరసహితుండు+అయిన= తమ్ములతో కూడిన; ధర్మనందనున్+కంటిన్= ధర్మపుత్రుడిని చూచాను; ఇంకన్= ఇకమీద; కుశలంబు+అ= (నాకు) పూర్తిగా క్షేమమే; అని, పలికి= అని వచించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** కాని, నీవు ప్రార్థించావు కాబట్టి చెప్పుతున్నాను. అంతే కాని, నిన్ను చూచి భయపడి నీకు సమాధానం చెప్పటం లేదు. తమ్ములతో విచ్చేసిన ధర్మరాజును చూచాను. ఇక నాయోగక్షేమాలనుగూర్చి నాకు ఎట్టి భయమూ లేదు' అని చెప్పి ఇంకా ఈ విధంగా అన్నది.

**విశేషం:** సైంధవుడికి తాను ఎందుకు సమాధానం చెప్పటానికి పూనుకొన్నదో ద్రౌపది చెప్పింది. చెప్పనికారణంకూడ ఉండవచ్చునుకదా! సైంధవుడికి పిరికిమందు పోయటానికి ద్రౌపదికి అవకాశం చిక్కింది.

**మ. 'తనువృత్తాంగుఁడు శుద్ధకాంచనసముద్యద్వర్ణుఁ డభ్యుల్లస**
**ద్వనజాతాయతచారులోచనుఁడు దీవ్యద్భూరితేజోఘనుం**
**డనఘుం డల్ల రథంబుపై వెలుఁగు పుణ్యాత్ముండు ధర్మాత్మజుం**
**డనిరోధప్రతిభాప్రభావనిధి యత్యాశ్చర్యశౌర్యుం డనిన్. 207**

**ప్రతిపదార్థం:** అల్ల= అదిగో అనతిదూరంలో; రథంబుపైన్= తేరిపై; వెలుఁగు= ప్రకాశించే; పుణ్య+ఆత్ముండు= పుణ్యంతో కూడినవాడు, మహానుభావుడు; ధర్మ+ఆత్మజుండు= ధర్మనందనుడు; తను, వృత్త+అంగుఁడు= సన్నని గుండ్రని దేహం కలవాడు; శుద్ధ, కాంచన, సమ్+ఉద్యత్+వర్ణుఁడు= స్వచ్ఛమైన బంగారు రంగుతో వెలిగే మేనిచాయ గలవాడు; అభి+ఉత్+లసత్, వనజాత+ఆయత; చారు, లోచనుఁడు= వికసించిన పద్మాలవంటి అందమైన నిడివిగల కన్నులు కలవాడు; దీవ్యత్+భూరి, తేజస్+ఘనుండు= దేదీప్యమానమైన గొప్పతేజస్సుతో వెలుగొందే మహనీయుడు; అనఘుండు= పాప మెరుగని పుణ్యాత్ముడు; అనిరోధ, ప్రతిభా, ప్రభావ, నిధి= అడ్డగించటానికి వీలులేని లోకోత్తర ప్రజ్ఞకు మహిమకు నెలవు అయినవాడు; అనిన్= యుద్ధంలో; అతి+ఆశ్చర్య, శౌర్యుండు= మిక్కిలి అచ్చెరువు కొలిపే పరాక్రమం కలవాడు.

**తాత్పర్యం:** అడుగో! అనతిదూరంలో కన్పిస్తున్న రథంపై వెలుగొందుతున్నవాడు ధర్మనందనుడు. సన్నని గుండ్రని శరీరం కలవాడు. అచ్చమైన బంగారు రంగుతో మిలమిలలాడే దేహకాంతి కలవాడు. అప్పటికప్పుడే వికసించిన పద్మాలవలె అందమైన వాలుగన్నులు కలవాడు. దేదీప్యమాన మైన వర్చస్సుతో వెలుగొందేవాడు. పుణ్యశీలంకల మహానుభావుడు. యుద్ధంలో అప్రతిహత మైన పరాక్రమం కలవాడు. అతిలోకప్రతిభను, మహిమలను ప్రదర్శించే యుధిష్ఠిరుడు అతడే.

**చ.** **కురుకులశేఖరుం డతఁడు ఘోరరణంబుల నెట్టి శత్రులున్**
**శరణని సొచ్చిరేని విలసత్కరుణామతిఁ గాచు; నీవు చె**
**చ్చెరఁ జెడిపోక, నా పనుపు సేసి వినీతి యెలర్ప నమ్మహా**
**పురుషుని నాశ్రయింపుము; విభుండును నీదగు తప్పు లోఁ గొనున్.** **208**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ ధర్మరాజు; కురు, కుల, శేఖరుండు= కురువంశంలో శ్రేష్ఠుడు; ఘోర, రణంబులన్= భయంకర మైన యుద్ధాలలో; ఎట్టి, శత్రులున్= ఎటువంటి విరోధులైనా; శరణు+అని= మీరు దయ చూపుడు మీకు విధేయులం అని; చొచ్చిరి+ఏని= చేరితే; విలసత్+కరుణా, మతిన్= శోభిల్లే దయతో కూడిన బుద్ధితో; కాచున్= కాపాడుతాడు; నీవు= ఓ జయద్రథా! నీవు; చెడిపోక= పాడయిపోవక; చెచ్చెరన్= వెంటనే; నాపనుపు+చేసి= నా మాట విని; వినీతి+ఎలర్పన్= వినయం శోభిల్లేటట్లుగా; ఆ+మహాపురుషునిన్= ఆ మహానుభావుడిని; ఆశ్రయింపుము= శరణువేడుము; విభుండును= రాజును (ధర్మరాజును); నీదు+అగు= నీయొక్క; తప్పు= దోషం; లోన్+కొనున్= క్షమించగలడు.

**తాత్పర్యం:** ధర్మరాజు కురువంశంలో శ్రేష్ఠుడు. అతడు అజాతశత్రువు. ఎట్టిభయంకర యుద్ధంలోకాని ఎట్టి శత్రువే కాని, తనను ఆశ్రయించి శరణువేడితే దయామయుడై ఆ శత్రువును కాపాడగల స్వభావం కలవాడు. ఓజయద్రథా! ఇప్పటికిని మించి పోయింది లేదు. నామాట విని నీవు ఆ మహానుభావుడిని వెంటనే శరణువేడుము. మహాత్ము డైన ధర్మరాజు నీతప్పు క్షమించగలడు. ఇది నీకు తుది అవకాశం సుమా!

**చ.** **ఘనజవసత్త్వచారుతురగంబులఁ బూన్చిన యల్ల విస్ఫుర**
**త్కనకరథంబుపై నుదితకాయుఁడు సాలమహీరుహంబు చా**
**డ్పునఁ దనరారుచున్ వెలయు భ్రూకుటియున్ దశనోష్ఠపీడనం**
**బును నయి యున్నవాఁ డనిలపుత్త్రుఁడు భీముఁడు; భీముఁ డాజులన్.** **209**

**ప్రతిపదార్థం:** ఘన, జవ, సత్త్వ,చారు, తురగంబులన్= గొప్పవేగం బలం కలిగి అందంగా కనిపించే గుర్రాలను; పూన్చిన= కట్టిన; అల్ల= అల్లదిగో అనతి దూరంలో ఉన్న; వి, స్ఫురత్+కనక, రథంబుపైన్= ప్రకాశించే బంగారు తేరుపై; ఉదితకాయుఁడు= ఉదయించిన దేహం కలవాడు; సాల, మహీరుహంబుచాడ్పునన్= మద్దిచెట్టువలె; తనరారుచున్= శోభిల్లుతూ; వెలయు= ప్రకాశించే; భ్రూకుటియున్= బొమముడియును; దశన+ఓష్ఠ, పీడనంబును= పండ్లచేత పెదవిని కొరకుచుండటమున్నూ; అయి ఉన్నవాడు= కలిగినట్టివాడుగా ఉన్నవాడు; అనిలపుత్త్రుఁడు= వాయునందనుడు; భీముఁడు= భీమసేనుడు అనేవాడు; ఆజులన్= యుద్ధాలలో; భీముఁడు= భయంకరుడు అయినవాడు.

**తాత్పర్యం:** అదుగో ఆ రథాన్ని చూడు. అల్లదే గొప్పవేగం బలం గల గుర్రాలను పూన్చిన తేరది. ఆ రథంపై కనిపించే శరీరం కలవాడు, ఏపుగా ఎదిగిన సాలవృక్షంవలె కన్పించేవాడు, స్పష్టమైన బొమముడితో, పెదవిని కొరుకుతున్న దంతాలతో భయంకరంగా కనుపించేవాడు వాయుపుత్రు డైన భీమసేనుడు. ఆతడు యుద్ధాలలో భయంకరుడు అయిన సార్థకనాముడు.

**ఉ.** **ఈతని పౌరుషం బరయ నెందు నమానుషకృత్య మప్రతీ**
**ఘాత మనేక మద్భుతము; గర్వితు లౌ ధరణీశ్వరుల్ నిజం**
**బీతని నాజిలోఁ జెనయ నెవ్వరు నోడుదు; రిమ్మహాభుజుం**
**డాతతరోషుఁడైన బ్రళయానలు నట్టిఁడ; యాఱఁ డేమిటన్.** **210**

**ప్రతిపదార్థం:** ఈతని పౌరుషంబు= ఈ భీముడియొక్క పరాక్రమం; అరయన్= చూడగా; ఎందున్= ఎచటనైనను; అ, మానుషకృత్యము= మానవులకు అతీతమైన పని; అ, ప్రతీఘాతము= ఎదిరంచ వీలుగానిది; న+ఏకము= బహుముఖమైనది; అద్భుతము= అచ్చెరువు కలిగించేది; నిజంబు= సత్యం; గర్వితులు+ఔ= మదించిన వారయిన; ధరణీ+ఈశ్వరుల్= భూమిని పరిపాలించే రాజులు; ఈతనిన్= ఇతడిని; ఆజిలోన్= యుద్ధంలో; ఎవ్వరున్= ఎవరైనను; చెనయన్+ఓడుదురు= ఎదిరించటానికి జంకుతారు; ఈ, మహా, భుజుండు= గొప్పపరాక్రమం కల ఈ భీముడు; ఆతత రోషుఁడు+ఐనన్= విస్తరించిన ఆగ్రహం పూనినవాడు అయితే; ప్రళయ+అనలు+అట్టిఁడు+అ= ప్రళయకాలంలోని అగ్నిహోత్రుడితో సమానుడే సుమా; ఏమిటన్= ఏవిధంగానైనను; ఆఱఁడు= ఉపశమించడు.

**తాత్పర్యం:** ఈ భీమసేనుడి పరాక్రమం మానవులకు సాధ్యం కానిది. అతడికి ఎక్కడా ఎదురు లేదు. అతడికి ఆతడే సాటి. అతడి శౌర్యం బహుముఖ మైనది. అచ్చెరువు కలిగించేది. గర్వంచేత మదించిన రాజులు భీమసేనుడిని యుద్ధంలో ఎదిరించటానికి జంకుతారు. ఆ మహావీరుడికి కోపంవచ్చిందా, ఇక అతడు ప్రళయకాలంలోని అగ్నిహోత్రుడే ఔతాడు, ఏవిధంగానూ చల్లారడు.

**ఉ.** **ధర్మజు కూర్మితమ్ముఁడును దత్ప్రియశిష్యుఁడు నైనవాఁడు స**
**త్కర్ముఁడు వాఁడె చూడుము ప్రగాఢవికీర్ణి జితేంద్రియుండు దు**
**ష్కర్ములఁ గన్న సైపఁడు నికామభయంకర విక్రమక్రియా**
**నిర్మథితారి ఫల్గునుఁడు నిర్మలతేజుఁ డజేయుఁ డెలికిన్.** **211**

**ప్రతిపదార్థం:** ఫల్గునుఁడు= అర్జునుడు; ధర్మజు, కూర్మి, తమ్ముఁడును= ధర్మరాజుయొక్క అనుంగుతమ్ముడున్నూ; తత్+ప్రియ, శిష్యుఁడున్= ఆతనియొక్క కూరిమిశిష్యుడున్నూ; ఐనవాఁడు= అయినవాడు; సత్+కర్ముఁడు= మంచి ప్రవర్తన

కలవాడు; వాడు+ఎ= అడుగో వాడే; చూడుము= కనుగొనుము; ప్రగాఢ, వికీర్ణి= గొప్పదాత; జిత+ఇంద్రియుండు= ఇంద్రియాలను జయించినవాడు; దుష్కర్ములన్= చెడుపనులచేసేవారిని; కన్నన్= చూస్తే; సైపఁడు= సహించడు; నికామ, భయంకర, విక్రమ, క్రియా, నిర్మథిత+అరి= మిక్కిలి భీకరమైన శౌర్యంచేత చలింపచేయబడిన శత్రువులు కలవాడు; నిర్మలతేజుఁడు= స్వచ్ఛమైన వర్చస్సు కలవాడు; ఏరికిన్= ఎవరికైనను; అజేయుఁడు= జయించ రానివాడు.

**తాత్పర్యం:** ధర్మరాజుకు ప్రియమైన తమ్ముడు, ఆతడికి అనువైన శిష్యుడు, మంచిప్రవర్తన కలవాడు అడుగో చూడుము. అతడే సుమా! అర్జునుడు! అతడు మహావదాన్యుడు, ఇంద్రియనిగ్రహం కలవాడు, భయంకరమైన పరాక్రమంచేత శత్రువులను తపింప చేయగలవాడు, స్వచ్ఛమైన వర్చస్సు కలవాడు, ఎవరికిని జయింప శక్యంకానివాడు.

**క. అవశగతిఁ గామరోషా । ది వికారము లొందినను మదిని ధర్మపథ**
**ప్రవిహతి గానీఁ; డతఁ డా । దివిజేంద్రతనూజుఁ డద్వితీయుఁడు పేర్మిన్. 212**

**ప్రతిపదార్థం:** ఆ, దివిజ+ఇంద్ర, తనూజుఁడు= ఆ దేవేంద్రుడి కొడుకు; అవశగతిన్= అదుపు తప్పిన రీతిలో; కామ, రోష+ఆది, వికారములు= కోరికలు, కోపతాపాలు మున్నగు చిత్తవికృతులు; ఒందినను= పొందినప్పటికి; మదిని= మనస్సును; ధర్మ, పథ, ప్రవిహతి, కానీఁడు= ధర్మమార్గానికి దెబ్బతగిలేటట్లు చేయడు; అతఁడు; పేర్మిన్= గొప్పతనంలో; అ, ద్వితీయుఁడు= (రెండవ) సాటి లేనివాడు.

**తాత్పర్యం:** అతడు దేవేంద్రుడి కొడుకైన అర్జునుడు; గొప్పతనంలో సాటిలేని మేటి. కోరికలు, కోపతాపాలు అదుపుతప్పిన రీతిలో మనసున కలిగినప్పటికీ, వాటిని ధర్మమార్గాన్ని ధ్వంసం చేసేటట్లు ప్రవర్తింపచేయడు.

**చ. అయనయసంగ్రహుండు వినయవ్యవసాయి భయార్తలోకసం**
**శ్రయుఁడు కృతాస్త్రుఁ డాహవవిశారదశౌర్యుఁడు శిష్టబాంధవ**
**ప్రియుఁ డసమానసుందరగభీరశుభాకృతి యల్ల పుణ్యుఁ డా**
**రయ నకులుండు పాండుసుతరత్నము భాసురకీర్తి యిమ్మహిన్. 213**

**ప్రతిపదార్థం:** నకులుండు= నకులుడు; అయనయసంగ్రహుండు= మేలు చేసెడి నీతి విధానం బాగా తెలిసినవాడు; వినయవ్యవసాయి= నమ్రతను అలవరుచుకొనటానికి కృషిచేసినవాడు; భయ+ఆర్త, లోక, సంశ్రయుఁడు= భీతిచేత దీనులైన జనులకు ఆధారం అయ్యేవాడు; కృత+అస్త్రుఁడు= మంత్రమహిమ కల ఆయుధాలు ప్రయోగించటంలో సిద్ధహస్తుడు; ఆహవ, విశారద, శౌర్యుఁడు= యుద్ధం చేయటంలో కౌశలంతోకూడిన పరాక్రమం కలవాడు; శిష్ట, బాంధవ, ప్రియుఁడు= మంచివారైన బంధువులకు ఇష్టుడు; అసమాన, సుందర, గభీర, శుభ+ఆకృతి= సాటిలేనట్టి అందమైన లోతైన మంచిదైన ఆకారం కలవాడు (సాటిలేని సుందరుడు, లోతైన మనస్సు కలవాడు, శుభమైన ఆకారం కలవాడు); అల్ల= అదిగో చూడుము; పుణ్యుఁడు= సుకృతం చేసినవాడు; ఆరయన్= చూడగా; పాండుసుత రత్నము= పాండురాజు కొడుకులలో రత్నం (శ్రేష్ఠుడు); ఈ+మహిన్= ఈ లోకంలో; భాసురకీర్తి= ప్రకాశించే యశస్సు కలవాడు.

**తాత్పర్యం:** లోకానికి శ్రేయస్సు కలిగించే నీతి విధానం తెలిసిన వాడున్నూ, విజ్ఞానంవలన ఏర్పడిన వినయం కలవాడున్నూ, భయంచేత దీనులు అయిన ప్రజలను కాపాడి ధైర్యం చేకూర్చేవాడున్నూ, యుద్ధంచేయటంలో గడుసుదనం చూపగల పరాక్రమవంతుడున్నూ, మంచివారైన బంధువులకు సంప్రీతి ఘటించేవాడున్నూ,

సాటిలేనిసౌందర్యం కలిగిన ప్రియదర్శనుడున్నూ, పరోపకారపారీణుడున్నూ అయిన అడుగో అతడే పుణ్యాత్ముడు నకులుడు. పాండవులలో రత్నం. భూలోకంలో పేరుప్రతిష్ఠలను ఆర్జించినవాడు.

**ఉ. వీరుఁడు చిత్రయోధి దృఢవేధి కృతాస్త్రుఁడు భూరిబుద్ధి వి**
**స్ఫారుఁడు వాగ్విశారదుఁడు పార్థులకూరిమితమ్ముఁ డుజ్జ్వలా**
**కారుఁడు ధర్మదక్షుఁ డవికారుఁడు ప్రౌఢపతంగతేజుఁ డ**
**ద్ధీరుఁడు పాండవుండు సహదేవుఁడు దేవనిభుండు పెంపునన్. 214**

**ప్రతిపదార్థం:** సహదేవుఁడు= సహదేవుడు; వీరుఁడు= గొప్పపరాక్రమం కలవాడు; చిత్రయోధి= అచ్చెరువుగొలిపే యుద్ధం చేయగలవాడు; దృఢవేధి= గురిచూచి గట్టిగా తగిలేటట్లు ఆయుధాలు ప్రయోగించగలవాడు; కృత+అస్త్రుఁడు= మంత్రమహిమ గల ఆయుధాలను వాడటంలో సిద్ధహస్తుడు; భూరిబుద్ధివిస్ఫారుఁడు= గొప్ప తెలివి తేటలు విస్తరించిన మేధావి; వాక్+విశారదుఁడు= మాటలలో నేర్పరి; ధర్మదక్షుఁడు= ధర్మం నిర్వహించటంలో సమర్థత కలవాడు; పార్థుల కూరిమి తమ్ముఁడు= పాండవులకు ప్రియమైన కడగొట్టు తమ్ముడు; ఉత్+జ్వల+ఆకారుఁడు= గొప్పగా ప్రకాశించే రూపం కలవాడు, తేజస్వి; అవికారుఁడు= చిత్తవికారాలు లేనివాడు; ప్రౌఢపతంగతేజుఁడు= చండమార్తాండుడివంటి ప్రకాశం కలవాడు; ఆ+ధీరుఁడు= చిత్తస్థైర్యం కలవాడు; పాండవుండు= పాండురాజుయొక్క కొడుకు; పెంపునన్= గొప్పతనంలో; దేవ, నిభుండు= దేవతలతో సమానుడు;

**తాత్పర్యం:** సహదేవుడు మానవమాత్రుడు కాడు సుమా! అతిలోక తేజస్వి అయిన అతడు దేవతలతో సమానుడు. గొప్పపరాక్రమం కలిగినవాడు. ఆశ్చర్యం గొలిపేవిధంగా యుద్ధంచేయగలవాడు. గురిచూచి గాటంగా నాటేటట్లు ఆయుధాలు ప్రయోగించే లక్ష్యశుద్ధి కలవాడు. బుద్ధికుశలత కల మేటి మేధావి. పొంకంగా తూచితూచి మాటలు కూర్చగల వక్త. పాండవులు అనురాగంతో లాలించే కట్టకడపటి తమ్ముడు. దేదీప్యమాన మైన తేజస్సు కలవాడు, ధర్మనిర్వహణ సమర్థుడు, చండమార్తాండుడివలె వెలుగొందేవాడు. చిత్తవికారాలు లేని ధైర్యశాలి. గొప్పతనంలో దేవతలతో సమానుడు. అడుగో అతడే సహదేవుడు. చూడుము.

**తే. కొడుకులం దెల్లఁ గడుఁగూర్చు గొంతి యితని; । కిమ్మహాత్ముఁడు మహి చలియించె నేని**
**నగ్ని చల్లన యయ్యె నే నాత్మఁ దాను । ధర్మనిష్ఠుఁ డై సత్యంబు దప్పఁ డెపుడు. 215**

**ప్రతిపదార్థం:** గొంతి= కుంతీదేవి; ఇతనికిన్= ఇతనిపై (ఈ సహదేవుడిని); కొడుకులందున్+ఎల్లన్= అందరి కుమారులలో; కడున్ మిక్కుటంగా; కూర్చున్= వాత్సల్యం చూపుతుంది; ఈ+మహా+ఆత్ముఁడు= ఈ మహానుభావుడు; మహి= భూమి; చలియించెన్+ఏనిన్= కంపించినప్పటికిన్నీ; అగ్ని= నిప్పు; చల్లన+అయ్యెన్+ఏని= చల్లబడినప్పటికిన్నీ; తాను= తాను (సహదేవుడు); ఆత్మన్= మనస్సులో; ధర్మనిష్ఠుఁడు+ఐ= ధర్మంలోనే ఏకాగ్రత కలవాడై; ఎపుడున్= ఏ సమయంలోనూ; సత్యంబున్= నిజాన్ని; తప్పఁడు= వీడడు.

**తాత్పర్యం:** కుంతీదేవికి తన కొడుకులు అందరిపై కంటె ఈ సహదేవుడిమీదనే వాత్సల్యం మెండు. ఈ మహాత్ముడు సంతత సత్యసంధుడు. భూమి కంపించవచ్చును, అగ్గి చల్లబడవచ్చును కాని సహదేవుడు మాత్రం ధర్మనిష్ఠ వదలిపెట్టడు, బొంకు పలుకడు.

**వ. వీ రేవురు నత్యంతదుర్వారులు; వీరి బారిం బడిన వారాశినడుమ నుగ్రమకరాహతంబై యవియు పేరోడయుం బోలె నీసైన్యంబు వికలం బగు; నీవునుం బ్రాణం బొండె మానం బొండెఁ గోల్పోక మెయిమెయిం**

**బో నేర్చెదవే?' యనియె; నప్పుడు కౌంతేయులు సైంధవసేనం దలపడి దిఙ్ముఖంబున నెల్లం జీఁకట్లు గవియునట్లుగా బాణపటలంబులు పఱఁగింపం దొడంగిన. 216**

**ప్రతిపదార్థం:** వీరు+ఏవురున్= వీరు అయిదుగురు - పంచపాండవులు; అతి+అంత, దుర్వారులు= వారించుటకు శక్యంగాని వీరులు; వీరి= పాండవులయొక్క; బారిన్+పడిన= హింసకు గురియైతే; వారాశినడుమన్= సముద్రమధ్యంలో; ఉగ్ర, మకర+ఆహతంబు+ఐ= భయంకరమైన మొసళ్ల చేత కొట్టబడినట్టిదై; అవియు= పగులు; పేరు+ఓడయున్+పోలెన్= పెద్ద నావవలె; నీసైన్యంబు= నీసేన; వికలంబు+అగున్= చెదరుతుంది; నీవునున్= నీవు సయితం; ప్రాణంబు+ఒండెన్= ప్రాణంకాని; మానంబు+ఒండెన్= గౌరవంకాని; కోల్పోక= పోగొట్టుకొనక; మెయిమెయిన్= అనాయాసంగా; పో, నేర్చెదవే?= పోగలవా?; అనియెన్= అని చెప్పింది; అప్పుడు= ఆ సమయంలో; కౌంతేయులు= కుంతీపుత్రులు- పాండవులు; సైంధవసేనన్= జయద్రథుడి సైన్యాన్ని; తలపడి= తాకి; దిక్+ముఖంబునన్= దిక్కుల పురోభాగంలో; ఎల్లన్= పూర్తిగా; చీకట్లు= అంధకారాలు; కవియునట్లుగాన్= ముసిరేటట్లుగా; బాణ పటలంబులు= అమ్ముల సముదాయాలు; పఱఁగింపన్+తొడంగినన్= ప్రయోగించ సాగగా.

**తాత్పర్యం:** పంచపాండవులు జయించ నలవిగానివారు సుమా. ఎవరును వీరిబారినుండి తప్పించుకొనలేరు. సముద్రమధ్యంలో మొసళ్లకు చిక్కి బ్రద్దలయ్యే పెద్దనౌకవలె నీసైన్యం పాండవులకు చిక్కి వికలం కాగలదు. ఇక నీవు సయితం ప్రాణాన్ని కోల్పోతావు లేదా గౌరవాన్ని కోల్పోతావు' అని ద్రౌపది సైంధవుడిని హెచ్చరించింది. అంతలో పాండవులు సైంధవుడి సేనలను చుట్టుముట్టి ఆకసాన్ని చీకట్లు క్రమ్మేటట్లుగా అమ్ములసముదాయాలను ప్రయోగించారు.

**క. 'తొలఁగకుఁడు పొదువుఁ డేయుఁడు । నిలువుఁడు వడిఁ బొడువుఁ' డనుచు నిజయోధులఁ దాఁ గలయఁ బురికొల్పి సైంధవుఁ । డలఘు పరాక్రముఁడు నిలిచె నాహవభూమిన్. 217**

**ప్రతిపదార్థం:** తొలఁగకుఁడు= కదలిపోకండి; పొదువుఁడు= చుట్టుముాగండి; ఏయుఁడు= కొట్టండి; నిలువుఁడు= పారిపోకుండా ఆగండి; వడిన్= వేగంగా; పొడువుఁడు= గ్రుచ్చండి; అనుచున్= అని పలుకుతూ; నిజ, యోధులన్= తనభటులను; తాన్= తాను (సైంధవుడు); కలయన్= కలిసి పోరాటం సలిపేటట్లుగా; పురికొల్పి= ప్రోత్సహించి; అ, లఘు, పరాక్రముఁడు= గొప్ప శౌర్యం కలవాడు; సైంధవుఁడు= జయద్రథుడు; ఆహవభూమిన్= యుద్ధంలో; నిలిచెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** ప్రక్కకు కదలకండి, చుట్టుముట్టండి, కొట్టండి, ధైర్యంతో నిలబడండి, వేగంగా గ్రుచ్చండి' అంటూ తన సైనికులను ఐకమత్యంతో నిలిచి పోరాడం డని ప్రోత్సాహిస్తూ జయద్రథుడు గొప్పపరాక్రమం ప్రదర్శించేవాడై రణరంగంలో నిలబడ్డాడు.

**వ. ఇట్లు, త్రిగర్తశిబిసింధుసైన్యంబులతో ననేకనరపతిపరివృతుండై నిలిచిన జయద్రథుం జూచి, భీమసేనుండు క్రోధారుణలోచనుం డై, రథంబు డిగ్గి హేమబంధ బంధురంబును నయోమయంబును నగు గదాదండంబు ద్రిప్పుచు వానిపయిం గవిసిన నడ్డపడి కోటికాస్యుండు నిజసైన్యసంఘంబుతో నమ్మహావీరుం బొదువుటయు నతండు. 218**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; త్రిగర్తశిబి సింధుసైన్యంబులతోన్= త్రిగర్తులకు శిబికి సింధుదేశానికి సంబంధించిన సేనలతో; అనేక, నరపతి పరివృతుండు+ఐ= పెక్కురురాజులచేత చుట్టకొనబడినవాడై; నిలిచిన= నిలబడిన; జయద్రథున్+చూచి=

సైంధవుడిని అరసి; భీమసేనుండు= భీముడు; క్రోధ+అరుణ, లోచనుండు+ఐ= కోపంచేత ఎఱ్ఱవారిన నేత్రాలు కలవాడై; రథంబు+డిగ్గి= తేరు దిగి; హేమ, బంధ, బంధురంబును= బంగారు పిడిచేత పొదుగబడినదియున్నూ; అయస్+మయంబును= ఇనుముతో కూడినదియున్నూ; అగు= అయిన; గదాదండంబు= గదను; త్రిప్పుచున్= ఇటు నటు సంచలింపజేస్తూ; వానిపయిన్= అతడిపై, జయద్రథుడిపై; కవిసినన్= ఉఱకగా; కోటికాస్యుండు= కోటికాస్యుడు; అడ్డపడి= అడ్డంవచ్చి; నిజ, సైన్య, సంఘంబుతోన్= తనయొక్క సేనల సముదాయంతో; ఆ+మహావీరున్= ఆగొప్పయోధుడిని; పొదువుటయును= చుట్టుముట్టుటమున్నూ.

**తాత్పర్యం:** ఈవిధంగా త్రిగర్తశిబిసింధుసేనలు పెక్కురు రాజులు తన చుట్టు చేరిఉండగా రణరంగంలో నిలిచిన సైంధవుడిని చూచి భీముడు కోపంచేత ఎఱ్ఱబడిన కన్నులతో తనరథం దిగి, బంగారుపిడి గల ఇనుపగదను త్రిప్పుతూ అతడిపైకి ఉరికాడు. అంతట కోటికాస్యుడు భీముడికి అడ్డుపడి తనసేనలతో కలిసి ఆ మహావీరుడిని ఎదుర్కొన్నాడు.

**క. మదగజముల రథయోధులఁ । బదాతులను దురగములను బలువిడిఁ గలయం**
**జదుపుచు దుర్వారగతిన్ । విదితబలుఁడు ఘనగదాప్రవీణత మెఱసెన్. 219**

**ప్రతిపదార్థం:** మదగజములన్= మదించిన ఏనుగులను; రథయోధులన్= రథికులను; పదాతులను= కాల్బలాలను; తురగములను= గుఱ్ఱాలను; బలువిడిన్= ఉత్సాహంతో; కలయన్+చదుపుచున్= కలిసిపోవునట్లుగా నేలమట్టంచేస్తూ; దుర్వారగతిన్= వారించటానికి వీలులేని విధంగా; విదితబలుఁడు= తేటతెల్లమైన బలం కలవాడు అయిన భీముడు; ఘన, గదా, ప్రవీణతన్= గొప్పదైన గదయందు గల నేర్పును; మెఱసెన్= ప్రకాశింపచేశాడు.

**తాత్పర్యం:** భీముడు మత్తేభాలను, రథాలతో కూడిన రథికులను, గుఱ్ఱాలను, కాల్బలాలను కలతచెందించి నేలమట్టంచేసి, తన గదాప్రయోగకౌశలాన్ని ప్రకాశింపచేశాడు.

**వ. ఇట్లు విహరించి యహితసైన్యంబు నిహతం బగుటయుఁ జెలంగి సింహనాదంబు సేసి, యతండు సారథి సముపనీతం బైన రథంబు సాదరంబుగా నెక్కి గృహీతశరాసనుండై విక్రమించె; మఱియును. 220**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; విహరించి= యథేచ్ఛగా తిరిగి; అహిత సైన్యంబు= విరోధి సేన; నిహతంబు+అగుటయున్= చచ్చుటయున్నూ; చెలంగి= ఉత్సహించి; సింహనాదంబు+చేసి= సింహగర్జన వంటి కేక పెట్టి; అతండు= అతడు, భీముడు; సారథి, సముపనీతంబు+ఐన= సారథిచేత దగ్గరకు తీసికొనిరాబడిన; రథంబు= అరదం; సాదరంబుగాన్= అభిమాన పురస్సరంగా; ఎక్కి= ఆరోహించి; గృహీత, శరాసనుండు+ఐ= పట్టిన ధనుస్సు కలవాడై; విక్రమించెన్= పరాక్రమించాడు; మఱియును= వెండియును.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముడు రణరంగంలో యథేచ్ఛగా తిరిగి శత్రుసేనలను రూపుమాపి సింహనాదం చేశాడు. తదుపరి సారథి తనకడకు తీసికొని వచ్చిన రథాన్ని అధిరోహించి, విల్లు చేపట్టి అమ్ములతో మరల యుద్ధం చేయసాగాడు.

**క. అలిగి యుధిష్ఠిరుఁడును న । గ్గలికం బ్రతివీరు లదరఁ గార్ముక విద్యా**
**విలసనము మిగుల సొపి । రుల నూర్ద్వర రథికవరుల రూ పడఁగించెన్. 221**

**ప్రతిపదార్థం:** యుధిష్ఠిరుఁడును= ధర్మరాజును; అలిగి= కోపించి; అగ్గలికన్= పూనికతో; ప్రతివీరులు+అడరన్= శత్రువీరులు భయపడేటట్లుగా; కార్ముక, విద్యా, విలసనము= విలువిద్య యొక్క విలాసం; మిగులన్= అతిశయించగా; సౌవీరులన్= సౌవీరజాతికి చెందిన; నూర్వుర రథికవరులన్= వందమంది రథయోధులలో శ్రేష్ఠులను; రూపు+అడఁగించెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు కోపించి పూనికతో యుద్ధంచేసి శత్రువీరులు వెరపు చెందేటట్లుగా విలువిద్య ప్రకాశింప జేసి నూరుమంది సౌవీర రథయోధులను చంపాడు.

**క.** **నకులుఁడు నిశాతసాయక । నికరంబుల సమర ధారుణీతల మెల్లం**
**బ్రకట పరవీరవరమ । స్తక బంధురముగ నొనర్చె దారుణభంగిన్.** **222**

**ప్రతిపదార్థం:** నకులుఁడు= నకులుడు; నిశాత సాయక నికరంబులన్= వాడియైన అమ్ముల సముదాయాలచేత; సమర ధారుణీతలము+ఎల్లన్= యుద్ధభూమిని అంతటినీ; దారుణభంగిన్= ఘోరమైన విధంగా; ప్రకట పరవీరవరమస్తక బంధురముగన్= స్పష్టముగా శత్రువీరశ్రేష్ఠుల యొక్క తలకాయలతో నిండినదిగా; ఒనర్చెన్= చేశాడు.

**తాత్పర్యం:** నకులుడు వాడిఅమ్ములను ప్రయోగించి యుద్ధభూమంతా శత్రువీరుల తలకాయలతో నిండిపోయి భయంకరంగా కనబడేటట్లు చేశాడు.

**క.** **నారాచపాతముల దు । ర్వారుఁడు సహదేవుఁ డాహవ ముఖంబున న**
**శ్వారోహకులం గూల్చుచు । వీరవిహారంబు సలిపె వేడ్క యెలర్పన్.** **223**

**ప్రతిపదార్థం:** దుర్వారుఁడు= వారించుటకు వీలులేనివాడు; సహదేవుఁడు; నారాచపాతములన్= బాణాలను వర్షించటంచేత; ఆహవ, ముఖంబునన్= యుద్ధరంగపు ముందుభాగంలో; అశ్వ+ఆరోహకులన్= రౌతులను; కూల్చుచున్= సంహరిస్తూ; వేడ్క= వినోదం; ఎలర్పన్= శోభిల్లగా; వీరవిహారంబు= వీరుడు చేసే స్వేచ్ఛాయానం; సలిపెన్= చేశాడు.

**తాత్పర్యం:** బాణాలను ప్రయోగించి సహదేవుడు యుద్ధరంగంలో అనిమొనలోని అశ్వికులను సంహరించి వీరవిహారం చేశాడు.

**ఆ.** **సింధురాజసైన్య సింధుపూరమునందు । మహిత ఫల్గునాఖ్య మంథనగము**
**దిరిగి కలఁపఁదొడఁగెఁ బరనృపాలక మహా । జలచరవ్రజంబు సంచలింప.** **224**

**ప్రతిపదార్థం:** మహిత, ఫల్గున+ఆఖ్య, మంథనగము= అర్జునుఁడు అనే పేరుగల గొప్ప మందర పర్వతం; సింధు రాజ సైన్య సింధుపూరమునందున్= సింధురాజుయొక్క సేన అనెడి ముద్రజలసమూహంలో; తిరిగి= పరిభ్రమించి; పర, నృపాలక, మహా, జలచర, వ్రజంబున్= శత్రురాజులు అనెడి జలజంతువుల సముదాయం; సంచలింపన్= క్షోభించేటట్లుగా; కలఁపన్+తొడఁగెన్= కదిపి కుదిపి వేయసాగాడు.

**తాత్పర్యం:** సింధురాజుయొక్క సైన్యం అనెడి సముద్రజలాలలో అర్జునుడు అనే గొప్ప మందరపర్వతం కలయదిరిగి శత్రురాజులు అనే జలచర సముదాయాన్ని క్షోభింపజేస్తూ కదిపి కుదిపివేసింది.

**విశేషం:** (1)అలం: రూపకం. (2) క్షీరసాగర మథనం-దేవదానవులు మందరగిరిని కవ్వంచేసి పాలకడలిని చిలకడం, సుప్రసిద్ధ పౌరాణికగాథ,

**సీ. వారణకోటి దదారోహకులతోన । వివశమై యొఱలుచు నవనిఁ ద్రెళ్లె;**
**సూతహయధ్వజపాతపూర్వకముగ । రథములు దుమురయ్యె రథులతోన;**
**వెస రావుతులతోన వసమఱి హయములు । గెడసి యెల్లెడలను బుడమిఁ గప్పె;**
**దందడిఁ దెరలుచు సందడి పెల్లుగాఁ । గాలుబలంబులు గూలెఁ గలయఁ**

**ఆ. దుముల మధిక మయ్యె సమరతలంబున । ఘోరరుధిరవారిపూర మెసఁగె;**
**జితవిరోధిబలుఁడు శతమఖసూనుండు । చాపనైపుణంబు సూపునపుడు. 225**

**ప్రతిపదార్థం:** జిత, విరోధి, బలుఁడు= జయించబడిన శత్రువుల సైన్యం కలవాడు; శతమఖ, సూనుండు= ఇంద్రుడికొడుకు; చాపనైపుణంబు= వింటినేర్పు; చూపునపుడు= ప్రదర్శించేటప్పుడు; వారణకోటి= ఏనుగుల సముదాయం; తత్+ ఆరోహకులతోన్+అ= ఆ ఏనుగులను ఎక్కిన వీరులతో పాటుగా; వివశము+ఐ= వశం తప్పి; ఒఱలుచున్= వ్రాలుతూ; అవనిన్= భూమిపై; త్రెళ్లెన్= పడిపోయింది; సూత, హయ, ధ్వజ, పాత, పూర్వకముగన్= సారథి గుర్రాలు జెండాలు ముందు పడునటువంటివి కాగా; రథములు= అరదాలు; రథులతోడన్= రథయోధులతో పాటుగ; తుమురు+అయ్యెన్= ముక్కలు అయ్యాయి; వెసన్= శీఘ్రంగా; రావుతులతోన= ఆశ్వికులతోపాటు; వసమఱి= అదుపు తప్పి; హయములు= గుర్రాలు; కెడసి= చచ్చి; ఎల్ల+ఎడలను= అన్నిచోట్లలో; పుడమిన్= భూమిని; కప్పెన్= ఆవరించాయి; దందడిన్= దట్టంగా; తెరలుచున్= పొరలుచు; సందడి= సమ్మర్దం; పెల్లుగాన్= అతిశయించగా; కాలు బలంబులు= కాల్బలాలు, పదాతులు; కలయన్+కూలెన్= కుప్పకూలాయి; తుములము= సందడి కయ్యం; అధికము+అయ్యెన్= హెచ్చింది; సమర తలంబునన్= రణరంగంలో; ఘోర, రుధిర, వారి పూరము= భయంకర మైన నెత్తురు ప్రవాహం; ఎసఁగెన్= అధికమయింది.

**తాత్పర్యం:** అర్జునుడు తన విలువిద్యను ప్రదర్శించేటప్పుడు భయంకరమైన నెత్తురు ప్రవాహాలు ఏర్పడ్డాయి. అతడు శత్రువులసేనలు సంహరించే సామర్థ్యం కలవాడు. ఏనుగుల సమూహాలు వాటిపై ఎక్కి యుద్ధం చేస్తున్న వీరులతో పాటు వశంతప్పి భూమిపై వ్రాలిపడి పోయాయి. రథాలు రథికులతో, గుర్రాలతో జెండాలతోపాటు ముక్కలు చెక్కలై రణరంగాన్ని కప్పివేశాయి. గుర్రాలు రౌతులతోపాటు అధీనం తప్పి యుద్ధభూమిపై కూలిపోయాయి. కాల్బలాలు దొమ్మియుద్ధం చేస్తూ కుప్పలు కుప్పలుగా రణరంగంలో ఒరిగిపోయాయి. యుద్ధభూమి బీభత్సంగా కన్పించింది.

**తే. సవ్యకరమునందును నపసవ్యకరము । నందుఁ బర్యాయ సంగత మగుచుఁ జూడఁ**
**గొఱవి ద్రిప్పిన యొప్పున మెఱసెఁ బార్థు । గాండివము వాలుఁదూపులగని యనంగ. 226**

**ప్రతిపదార్థం:** పార్థు గాండివము= గాండివం అనే పేరు కల్గిన అర్జునుడివిల్లు; సవ్యకరము నందున్= ఎడమచేతిలోనూ; అపసవ్య, కరమునందున్= కుడి చేతిలోనూ; పర్యాయ సంగతము+అగుచున్= ఒకమారు అటు ఒకమారు ఇటు సమకూర్చబడినదై; చూడన్= అరయుగా; కొఱవి= మండెడు కర్ర; త్రిప్పిన+ఒప్పునన్= త్రిప్పిన విధంగా; వాలు+తూపుల గని= వాడి అమ్ములగని; అనంగన్= అనేటట్లుగా; మెఱసెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** అర్జునుడు కవ్వడి. (కవ+వడి) రెండు వడులు కలవాడు; సవ్యసాచి= రెండు చేతులతో బాణాలు ప్రయోగించేవాడు. అర్జునుడు గాండీవం చేతబట్టి ఒకసారి కుడిచేతితో మరొకమారు ఎడమచేతితో బాణాలు ప్రయోగించాడు. అప్పుడు గాండీవం అమ్ములగనివలె కన్పించింది. త్రిప్పుతున్న కొరవివలె ప్రకాశించింది.

**విశేషం:** అర్జునుడు గాండీవం అమ్ములగని వలె కన్పించటానికి మూలహేతువు అది అక్షయ తూణీరంతో కూడిఉండటం కావటమే. అగ్నిదేవుడు ఖాండవదహనసమయంలో అర్జునుడికి అక్షయతూణీరం (తరుగని అమ్ములపొది), ఇతరులు నరుకలేని ధనుస్సు అయిన గాండీవాన్ని బహూకరించాడు.

**వ. అట్టియెడం ద్రిగర్తపతి యైన సుధన్వుండు గదాహస్తుండై రథంబు డిగ్గి చని ధర్మతనయు రథ్యంబులఁ గూలనేసిన, నతండు నిశితసాయకంబున వానియురంబు వ్రచ్చి విగతజీవుం గావించి, సత్వరంబుగాఁ జని సహదేవు నరదం బెక్కె; మఱియును ద్రిగర్తులలోన మహాముఖ క్షేమంకరు లనువారు నకులుం బొదివి ఘనశరాసారంబు గురిసి జలధరంబులుం బోలె గర్జిల్లిన, నమ్మాద్రీసూనుండు వారి నిద్దఱఁ బెక్కమ్ముల నొప్పించె; నంతఁ దదీయాగ్రజుం డగు సురథుండు. 227**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ తరుణంలో; త్రిగర్తపతి+ఐన= త్రిగర్త దేశానికి ప్రభువు అయిన; సుధన్వుండు= సుధన్వుడు అనే వాడు; గదా, హస్తుండు+ఐ= గద చేతపూనిన వాడై; రథంబు, డిగ్గి= తేరు దిగి; చని= వెడలి; ధర్మతనయు, రథ్యంబులన్ ధర్మనందనుడియొక్క గుర్రాలను; కూలన్+ఏసినన్= సంహరించగా; అతండు= ఆ ధర్మరాజు; నిశిత, సాయకంబునన్= వాడిబాణంచేత; వాని= ఆ సుధన్వుడియొక్క; ఉరంబు= వక్షం; వ్రచ్చి= చీల్చి; విగతజీవున్+కావించి= చంపి; సత్వరంబుగాన్= వేగంగా; చని= వెడలి; సహదేవు+అరదంబు+ఎక్కెన్= సహదేవుడియొక్క తేరును అధిరోహించాడు; మఱియును= వెండియు; త్రిగర్తులలోనన్= త్రిగర్తులలో; మహాముఖ, క్షేమంకరులు+అనువారు= మహాముఖుడు క్షేమంకరుడు అనేవారు; నకులున్+పొదివి= నకులుడిని చుట్టుముట్టి; ఘనశర+ఆసారంబు= పెద్ద అమ్ములవాన; కురిసి= వర్షించి; జలధరంబులున్+పోలెన్= మేఘాలవలె; గర్జిల్లినన్= ఉరుమగా; ఆ+మాద్రీ, సూనుండు= ఆ మాద్రికొడుకు; వారిన్+ఇద్దఱన్= వారిరువురిని- మహాముఖ క్షేమంకరులను; పెక్కు+అమ్ములన్= అనేక బాణాలు ప్రయోగించి; నొప్పించెన్= బాధించాడు; అంతన్= అంతట; తదీయ+అగ్రజుండు+అగు= వారి యొక్క అన్న అయిన; సురథుండు= సురథుడు.

**తాత్పర్యం:** ఆ తరుణంలో త్రిగర్తదేశప్రభువు అగు సుధన్వుడు తనచేత గద ధరించి తేరు డిగ్గి ధర్మరాజుపై విజృంభించి అతడి రథానికి పూన్చిన గుర్రాలను చంపాడు. ధర్మరాజు ఒక వాడి బాణంతో ఆ సుధన్వుడివక్షం చీల్చి ఆతడిని సంహరించి, తాను సహదేవుడి రథంపై ఎక్కాడు. అంతట త్రిగర్తులలోని వీరులు మహాముఖుడును, క్షేమంకరుడును నకులుడిని చుట్టూ క్రమ్ముకొని, మేఘాలవలె గర్జిస్తూ అమ్ములజడివాన అతనిపై వర్షించారు. నకులుడు ఆ ఇరువురితో యుద్ధంచేసి, పెక్కుబాణాలు ప్రయోగించి వారిరువురిని బాధించాడు. అంతట వారి అన్న సురథుఁడు.

**చ. కరినికరంబుతోఁ దొడరి గర్వితుఁడై తనవారణేంద్రు న**
**క్కురుకులవీరుమీఁద నెసఁగొల్పినఁ దద్రథఘోటకంబులం**
**బరుషతఁ జంపు నగ్గజము వాయక వాఁ డసిచర్మహస్తుఁడై**
**ధరణికి దాఁటుచో నది మదంబున వెండియుఁ బైఁ గడంగినన్. 228**

**ప్రతిపదార్థం:** కరి, నికరంబుతోన్= ఏనుగుల సముదాయం తోడుగా పెట్టుకొని; తొడరి= పూని; గర్వితుఁడు+ఐ= మదించిన వాడై; తన, వారణ+ఇంద్రున్= తన యొక్క శ్రేష్ఠమైన ఏనుగును; ఆ+కురుకుల వీరుమీఁదన్= నకులుడిపై; ఎసఁగొల్పినన్= ఎదుర్కొనుటకు ప్రోత్సహించగా; తత్+రథ, ఘోటకంబులన్= ఆ నకులుడి తేరుయొక్క గుర్రాలను; పరుషతన్= కఠినంగా; చంపు= చంపే; ఆ+గజమున్= ఆ ఏనుగును; పాయక= వదలక (అంతటితో ఆగకుండా); వాఁడు= నకులుడు; అసిచర్మ

హస్తుఁడు+ఐ= కత్తిని డాలును చేతులలో ధరించినవాడై; ధరణికిన్= భూమికి; దాఁటుచోన్= ఉరికేటప్పుడు; అది= ఆ యేనుగు; వెండియున్= మరల; పైన్+కడంగినన్= నకులుడి మీదకు వచ్చి పడటంచేత.

**తాత్పర్యం:** సురథుడు తన ఏనుగులతండాన్ని తన వెంటపెట్టుకొని తన గజరాజాన్ని నకులుడిపై పురికొల్పాడు. ఆ యేనుగు విజృంభించి నకులుడి రథాశ్వాలను చంపింది. నకులుడు అంతట రథంపై నుండి కత్తిని డాలును చేబూని భూమిపై దూకినప్పుడు ఆ ఏనుగు మదించి ఆతనిపై విజృంభించింది.

**చ. తొలఁగక యమ్మహాబలుఁడు దోర్బల మొప్పఁ గృపాణపాతభం**
**గులఁ గరినాథు కేలు నిరుగొమ్ములతో బెరయంగఁ ద్రుంప బె**
**ట్టిలకు విచేష్టమై నొఱగు నేనుఁగుపై నతిమాత్రభీతి వి**
**హ్వలుఁ డగు శత్రు నుద్ధతిఁ గృతాంత విధేయునిఁ జేసె వ్రేల్మిడిన్. 229**

**ప్రతిపదార్థం:** ఆ+మహాబలుఁడు= ఆ గొప్ప బలవంతుడు- నకులుడు; తొలఁగక= (తాను విరథుడు అయినప్పటికీ యుద్ధభూమి) వీడక; దోర్బలము= భుజ శక్తి; ఒప్పన్= శోభిల్లగా; కృపాణ, పాత, భంగులన్= కత్తి వేటుల రీతులలో; కరినాథుకేలున్= ఆ గొప్ప ఏనుగు తుండాన్ని; ఇరు+కొమ్ములతోన్= రెండు దంతాలతో; బెరయంగన్= కలిసి ఒకటి అయ్యేటట్లుగా; త్రుంపన్= ఖండించగా; బెట్టు= మిక్కుటంగా; ఇలకున్= భూమికి; విచేష్టము+ఐ= చేష్టదక్కి, కదలిక లేనిదై; ఒఱగు= వ్రాలే; ఏనుఁగుపైన్= ఏనుగుమీదనే; అతి మాత్ర భీతి, విహ్వలుఁడు+అగు= కొలదికి మించిన భయంచేత చేష్టలుడిగినవాడు అయిన; శత్రున్= శత్రువును; ఉద్ధతిన్= గర్వంతో; వ్రేల్మిడిన్= శీఘ్రంగా; కృతాంత, విధేయునిన్ +చేసెన్= యముడికి అధీనుడిగా చేశాడు అంటే సంహరించాడు.

**తాత్పర్యం:** తాను విరథుడు అయినప్పటికీ, యుద్ధం విరమించక గొప్పబలం గల ఆ నకులుడు ఆ మత్తేభాన్ని తన కత్తితో ఎదుర్కొని దాని తుండాన్ని దంతాలను ఖండించాడు. ఆ యేనుగు చేష్ట దక్కి భూమిపై కూలిపోయింది. ఆ మత్తేభంమీద నున్న వీరుడు సురథుడు ఆ దృశ్యాన్ని చూచి మిక్కిలిభయంతో చేష్టలుడిగాడు. అంతట అతడిని నకులుడు యమలోకానికి పంపాడు.

**క. వైరులు దలఁకఁగ నిమ్మై । దారుణపౌరుషవిశేషదక్షుం డై య**
**వ్వీరుఁడు రయమున నరిగి స । మీరతనయునరద మెక్కి మెఱసెం బోరన్. 230**

**ప్రతిపదార్థం:** ఆ+వీరుఁడు= నకులుడు; వైరులు= శత్రువులు; తలఁకఁగన్= భయపడగా; ఇమ్మైన్= ఈ రీతిగా; దారుణ, పౌరుష, విశేష దక్షుండు+ఐ= భయంకరమున్నూ పేర్కొనదగినట్టిదియున్నూ అయిన పరాక్రమం చూపటంలో నేర్పరి అయి; రయమునన్= వేగంగా; అరిగి= వెళ్లి; సమీరతనయు+అరదము+ఎక్కి= వాయుపుత్రుడు అయిన భీమసేనుడి రథాన్ని ఎక్కి; పోరన్= యుద్ధంలో; మెఱసెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** శత్రువులు భయపడేటట్లుగా ఆ రీతిగా సాటిలేని శౌర్యసాహసాలు ప్రదర్శించినవాడయి, సమర్థుడు అయిన ఆ వీరుడు నకులుడు వేగంగా వాయుపుత్రుడైన భీముడి రథాన్ని ఎక్కి, యుద్ధంలో ప్రకాశించాడు.

**చ. ఘనుఁడు వృకోదరుండు దనుఁ గట్టలుకం దలపడ్డ కోటికా**
**స్యుని తురగంబులం దునిమి సూతునికంఠముఁ ద్రుంచి వైచి తీ**

**ప్రనిశిత మైన ప్రాసమున వాని యురంబు వగిల్చి చంపినం**
**గనుకనిఁ బాఱె భీతి యెసఁగంగఁ దదీయ చమూసమూహముల్. 231**

**ప్రతిపదార్థం:** ఘనుఁడు= గొప్పవాడు; వృక+ఉదరుండు= (తోడేలు పొట్ట వంటి కడుపు గలవాడు) భీముడు; తనున్= తనను; కట్టలుకన్ (కడు+అలుకన్)= మిక్కిలి కోపంతో; తలపడ్డ= ఎదుర్కొన్న; కోటికాస్యునిన్= కోటికాస్యుడనే వాడియొక్క; తురగంబులన్= అశ్వాలను; తునిమి= చంపి; సూతుని కంఠమున్= సారథి కుత్తుకను; త్రుంచి వైచి= నరికివేసి; తీవ్ర, నిశితము+ఐన= మిక్కిలి వాడి అయిన; ప్రాసమునన్= ఈటె చేత; వాని+ఉరంబు= కోటికాస్యుడి వక్షం; వగిల్చి= పగులగొట్టి; చంపినన్= సంహరించగా; కనుకనిన్= సంభ్రమంతో; తదీయ, చమూ, సమూహముల్= ఆతడియొక్క (కోటికాస్యుని యొక్క) సేనలగుంపులు; భీతి+ఎసఁగంగన్= భయం అతిశయించగా; పాఱెన్= పారిపోయాయి.

**తాత్పర్యం:** గొప్పవీరుడైన భీమసేనుడు తనపై మిక్కుటమైన కోపంతో దాడిచేసిన కోటికాస్యుడియొక్క రథాశ్వాలను చంపి, ఆతడి సారథి కుత్తుక నుత్తరించి వాడి అయిన ఈటెతో ఆతడి వక్షాన్ని చీల్చి చంపాడు. కోటికాస్యుడి మరణానంతరం ఆతడిసేనలు భయపడి చెల్లాచెదరై పారిపోయాయి.

### అర్జునుఁడు సౌవీరకుమారులం బన్నిద్దఱఁ జంపుట (సం. 3-255-27)

**వ. అంత నంగారకుండును, గుంజరుండును, సృంజయుండును, సుప్తకుండును, శత్రుంజయుండును, సుప్రబుద్ధుండును, శుభంకరుండును, భ్రమంకరుండును, శూరుండును, రథియును, గుహకుండును, బలాఢ్యుండును నను సౌవీరకుమారులు పన్నిరువురు నిక్ష్వాకు శిబి సైంధవ త్రిగర్త సైన్యంబులం గూడి క్రీడి మార్కొని పటుబాణజాలంబులం గప్పిన. 232**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతట; అంగారకుండును; కుంజరుండును, సృంజయుండును, సుప్తకుండును, శత్రుంజయుండును, సుప్రబుద్ధుండును, శుభంకరుండును, భ్రమంకరుండును, శూరుండును, రథియును, గుహకుండును, బలాఢ్యుండును; అను= అను పేర్లుగల; సౌవీర కుమారులు= సౌవీరదేశానికి చెందిన యువకులు; పన్నిరువురున్= పంద్రెండుమంది; ఇక్ష్వాకు, శిబి, సైంధవ, త్రిగర్త సైన్యంబులన్+కూడి= ఇక్ష్వాకులకు, శిబికి, సింధుదేశానికి, త్రిగర్తదేశానికి సంబంధించిన సేనలతోచేరి; క్రీడిన్= అర్జునుడిని; మార్కొని= ఎదిరించి; పటు బాణ జాలంబులన్= బలమైన అమ్ముల సముదాయాలతో; కప్పినన్= ఆవరించగా.

**తాత్పర్యం:** అంత అంగారకుడు, కుంజరుడు, సృంజయుడు, సుప్తకుడు, శత్రుంజయుడు, సుప్రబుద్ధుడు, శుభంకరుడు, భ్రమంకరుడు, శూరుడు, రథి, గుహకుడు, బలాఢ్యుడు అనే పేర్లుగల పన్నెండుమంది సౌవీరయువకులు, ఇక్ష్వాకు, శిబి, సైంధవ, త్రిగర్త సేనలు కూడిరాగా అర్జునుడిని ఎదుర్కొని అమ్ముల సముదాయాలు గుప్పించారు.

**మ. అతులక్రోధ విఘూర్ణమానహృదయుండై చండ గాండీవ ని**
**ర్గత భల్లౌఘములం దదస్త్రవితతుల్ ఖండించి సౌవీరసం**
**తతిఁ బన్నిద్దఱవిండ్లులం దునిమి దోర్దర్పంబు మీఱంగ స**
**స్మితుఁడై యాతఁడు దచ్ఛిరఃప్రకర విచ్ఛేదంబు సేసెన్ వెసన్. 233**

**ప్రతిపదార్థం:** అతుల, క్రోధ, విఘూర్ణమాన, హృదయుండు+ఐ= సాటిలేని కోపంచేత మిక్కుటంగా కలత చెందిన డెందం కలవాడై; చండ, గాండీవ, నిర్గతభల్ల+ఓఘములన్= భయంకర మైన గాండీవమనే వింటినుండి వెలువడిన బల్లేల సమూహాలచేత; తత్+అస్త్ర, వితతుల్= వారియొక్క అస్త్రాలసముదాయాలను; ఖండించి= ముక్కలు చేసి; సౌవీర సంతతిన్, పన్నిద్దర, విండ్లలన్= సౌవీరకుమారులు పన్నెండుమంది కార్ముకాలను; తునిమి= ఖండించి; దోర్దర్పంబు= భుజ పరాక్రమాటోపం; మీఱంగన్= అతిశయించగా; సస్మితుఁడు+ఐ= నవ్వుతో కూడినవాడై; ఆతఁడు= అర్జునుడు; వెసన్= శీఘ్రంగా; తత్+శిరః ప్రకర, విచ్ఛేదంబు= వారియొక్క తలల సముదాయంయొక్క ఖండనం; వెసన్= శీఘ్రంగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు కోపంతో నిండిన హృదయం కలవాడై తన గాండీవం నుండి వెలువడిన బల్లేల పరంపరలతో ఆ సౌవీరకుమారుల కార్ముకాలను విరిచి, పిదప వారల శిరస్సులను అలవోకగా ఖండించాడు.

**క. ఆకులముగ శైబ్యుల ని । క్ష్వాకుల, సైంధవులనుం ద్రిగర్తులనుం బో**
**నీక పొదివి రయమున న । స్తోకపరాక్రముఁడు దునిమి తూఁటాడె వడిన్. 234**

**ప్రతిపదార్థం:** అస్తోక పరాక్రముఁడు= తక్కువకాని అనగా గొప్పపరాక్రమం కలవాడు - అర్జునుడు; వడిన్= శీఘ్రంగా; ఆకులముగన్= కలతచెందేటట్లు; శైబ్యులన్= శిబి వంశానికి చెందినవారిని; సైంధవులనున్= సింధుదేశానికి సంబంధించినవారిని; త్రిగర్తులనున్= త్రిగర్తదేశీయులను; పోనీక= తప్పించుకొని పోకుండా; పొదివి= ఆక్రమించి; రయమునన్= వేగంగా; తునిమి తూఁటాడెన్= ముక్కలు ముక్కలుగా ఖండించాడు.

**తాత్పర్యం:** గొప్పవీరుడైన అర్జునుడు గుంపులు గుంపులుగా పోరాడుతున్న వారందరిని కలచివైచి, శిబివంశానికి చెందిన వారిని, ఇక్ష్వాకులను, సింధుదేశానికి సంబంధించిన వారిని, త్రిగర్తదేశీయులను తప్పించుకొని పోకుండా చుట్టుముట్టి అదిమిపట్టి శీఘ్రంగా తుత్తునియలు చేశాడు.

**వ. అప్పుడు రణభూమి యంతయు శవమయం బయ్యె, నంబరం బంతయుం గబంధమయం బయ్యెఁ; జారు కేయూర వీరాంకవిభూషితంబులైన బహుచరణచ్ఛేదంబులును, గార్ముకతూణీరకాండఖండంబులు, నక్షకూబర రథాంగకేతనత్రివేణుకశకలంబులును, బుండరీకవ్యజనచామర భంగంబులుం, గరవాలపరిఘ శక్తిగదా ముసలపట్టిసప్రాస లేశంబులు, నెక్కడఁ జూచిన రాసులై యుండెఁ; గీలాల పూరంబును మాంసపంకంబును గేశ శైవాలంబును నైన యపూర్వనదీప్రవాహంబునందు బహువిధక్రవ్యాదగణంబు లవగాహంబు సేయుచుఁ బ్రకటకోలాహలవ్యాకులం బగుచుండె; నివ్విధంబున. 235**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; రణభూమి+అంతయున్= యుద్ధ ప్రదేశమంతా; శవమయంబు+అయ్యెన్= పీనుగులతో నిండిపోయింది; అంబరంబు+అంతయున్= ఆకసం అంతయును; కబంధ, మయంబు+అయ్యెన్= మొండెములతో నిండింది; చారు, కేయూర, వీర+అంక, విభూషితంబులు+ఐన= అందమయిన భుజకీర్తులతో, వీర లాంఛనాలతో అలంకరించబడిన; బాహు, చరణ+ఛేదంబులును= చేతుల యొక్క, కాళ్ల యొక్క తునుకలున్నూ; కార్ముక, తూణీర కాండ ఖండంబులును= విండ్లు, అమ్ములపొదుల సమూహాల తునుకలు; అక్ష, కూబర, రథాంగ, కేతన, త్రివేణుక, శకలంబులును= ఇరుసులు, నొగలు, చక్రాలు, జెండాలు, మూడు ముల్లులు కల పరిగోలలయొక్క ముక్కలున్నూ; పుండరీక వ్యజన చామర భంగంబులును= తెల్లగొడుగులు విసనకర్రలు, చమరీమృగపు వెండ్రుకలతో చేయబడిన వీవనలయొక్క తునియలున్నూ; కరవాల, పరిఘ, శక్తి గదా ముసల పట్టిస ప్రాస లేశంబులును= కత్తులు, ఇనుపకట్ల గుదియలు, చిల్లకోలలు, గుదియలు,

రోకళ్లు, అడ్డకత్తులు, ఈటెల యొక్క చిరుముక్కలు; ఎక్కడన్= ఎచటను; చూచినన్= అరసినప్పటికిన్నీ; రాసులు+ఐ= ప్రోగులు అయి; ఉండెన్= ఉన్నాయి; కీలాల పూరంబును= నెత్తురు ప్రవాహమున్నూ; మాంస పంకంబును= మాంసం అనెడి బురదయున్నూ; కేశ శైవాలంబును= వెంట్రుకలు అనే నాచున్నూ; ఐన= అయిన; అపూర్వ నదీ ప్రవాహంబునందున్= విచిత్రమైన నదియొక్క వెల్లువలో; బహువిధ, క్రవ్యాద గణంబులు= పెక్కు రీతులయిన రాక్షసుల తండాలు; అవగాహంబు+ చేయుచున్= మునుగుతూ; ప్రకట, కోలాహల, వ్యాకులంబు+అగుచుండెన్= వెల్లడి అయిన కలకల ధ్వనితో కలత చెందింది; ఇవ్విధంబునన్= ఈ రీతిగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో యుద్ధప్రదేశమంతయు పీనుగుపెంటలతో నిండింది. ఆకసం మొండెములతో నిండింది. అందమైన భుజకీర్తులతో, రాజలాంఛనాలైన ఆభరణాలతో కూడిన చేతుల కాళ్ళ ముక్కలు, ధనుస్సుల అమ్ములపొదుల ముక్కలు, ఇరుసులు, నొగలు, చక్రాలు, జెండాలు, మూడు ముల్లులు కల అంకుశాల యొక్క ఖండాలు, వెల్లగొడుగులు, చామరాలు మున్నగువాటి ముక్కలు, కత్తులు, ఇనుపకట్ల గుదియలు, చిల్లకోలలు, గుదియలు, రోకళ్లు, అడ్డకత్తులు, ఈటెలు మున్నగు ఆయుధవిశేషాల ఖండికలును ఎక్కడ చూచినా ప్రోగులు ప్రోగులుగా పడి ఉన్నాయి. నెత్తురు అనే నీటివెల్లువతో మాంసమనే బురదతో వెంట్రుకలు అనే నాచుతో ఒక విచిత్రనది ఏర్పడింది. ఆ నెత్తురుటేటిలో పలురకాలైన రాక్షసపిశాచగణాలు మునుగుతున్నాయి. అక్కడ ఏర్పడిన వింత సమ్మర్దం కలకలం వర్ణనాతీతం. ఈ విధంగా.

**విశేషం:** (1) యుద్ధ బీభత్సాన్ని కనులార చూచినవాడు ఎఱ్ఱాప్రెగ్గడ. తిక్కనకూడ ప్రత్యక్షయుద్ధపరిచయం కల మహాకవియే. కాని, ఎఱ్ఱనకాలంలో జరిగిన యుద్ధబీభత్సం సైనికులనే గాక ప్రజానీకాన్ని అంతటిని ఆవరించినట్టిది. (2) అలంకారం రూపకం.

**క. గాండివపవనప్రేరిత । చండాంబకఘోరశిఖల శతమఖతనయో**
**ద్దండదహనుఁ డొకమాత్ర న । ఖండితసౌవీరసైన్యకానన మేర్చెన్. 236**

**ప్రతిపదార్థం:** శతమఖ, తనయ+ఉద్దండ, దహనుఁడు= అర్జునుడు అనే (దేవేంద్రుడి సుతుడు) అగ్నిహోత్రుడు; గాండివ, పవన ప్రేరిత, చండ+అంబక, ఘోర శిఖలన్= గాండీవ ధనువు అనే వాయువుచేత ప్రజ్వలించజేయబడిన భయంకర మైన బాణాలు అనెడి దారుణమైన అగ్నిజ్వాలలచేత; ఒక మాత్రన్= ఒక క్షణం లోపల మాత్రమే; అఖండిత, సౌవీర, సైన్య, కాననమున్= సమస్త మైన సౌవీరుల సేన అనే అడవిని; ఏర్చెన్= తగులబెట్టాడు.

**తాత్పర్యం:** దేవేంద్రసుతుడు అయిన అర్జునుడు అనే అగ్నిహోత్రుడు గాండివం అనే గాలిచేత ప్రేరేపించబడి, వాడిబాణాలు అనే జ్వాలలతో సౌవీరసైన్యం అనే అడవిని ఒక క్షణకాలంలో దహించి వేశాడు.

**విశేషం:** అలం: రూపకం.

**వ. అట్టి క్రందున జయద్రథుండు ద్రౌపదిని దిగ విడిచి రథంబు దోలుకొని పఱచె; నంత ధర్మజుండు ధౌమ్య సమన్విత యై యున్న పాంచాలిం గని నిజరథంబుపై నిడికొనియె; సైంధవు పలాయనం బెఱింగి యర్జునుండు శత్రుసేనాహననసంరంభంబున నున్న భీమసేనున కిట్లనియె. 237**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; క్రందునన్= యుద్ధ సమ్మర్దంలో; జయద్రథుండు= సైంధవుడు; ద్రౌపదిని= పాంచాలిని; దిగవిడిచి= దిగబెట్టి(తేరునుండి క్రిందికి దింపి విడిచిపెట్టి); రథంబున్= తేరును; తోలుకొని= ముందుకు నడిపించుకొని; పఱచెన్= పారిపోయాడు; అంతన్= అంతట; ధర్మజుండు= ధర్మరాజు; ధౌమ్య+సమన్విత= ధౌమ్యుడితో కూడినదై; ఉన్న= ఉన్నటువంటి; పాంచాలిన్+కని= ద్రౌపదిని చూచి; నిజరథంబుపైన్= తన తేరు మీద; ఇడికొనియెన్= ఉంచుకొన్నాడు; అర్జునుండు; సైంధవు, పలాయనంబు= జయద్రథుడు పారిపోవటం; ఎఱింగి= తెలిసికొని; శత్రు, సేనా, హనన, సంరంభంబునన్= విరోధి సేనను చంపే ఉద్రేకంలో; ఉన్న; భీమసేనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అర్జునుడు సౌవీరసైన్యాన్ని చెండాడే సంరంభంలో మునిగి ఉండగా, జయద్రథుడు ద్రౌపదిని తన రథంనుండి క్రిందికి దింపి, తాను వేగంగా తేరు తోలుకొని పారిపోయాడు. అంతట ధర్మరాజు ధౌమ్యుడితో కూడి ఉన్న ద్రౌపదిని తనరథంపైకి ఎక్కించుకొన్నాడు. అర్జునుడు సైంధవుడు పారిపోయిన సంగతి తెలిసికొని, ఇంకను సైనికులను ఉద్రేకంతో వధిస్తున్న భీమసేనుడికడ కరిగి ఇట్లా అన్నాడు.

**తే.** **'వీతలజ్జుఁడై పఱచె సౌవీరవిభుఁడు పానుఁగుప్రజ నేల యాఱడిఁ దునిమి వైవ**
**నద్దురాత్ముని వెనుకొని యసువు లిపుడు । గొనఁగవలయు, లే లెమ్ము సద్వినుతశౌర్య! 238**

**ప్రతిపదార్థం:** సత్+వినుత, శౌర్య!= మంచివారిచేత ప్రశంసించబడిన పరాక్రమం కలవాడా!; భీమసేనా!; వీత లజ్జుఁడు+ఐ= పోయిన సిగ్గు కలవాడై, సిగ్గు లేనివాడై; సౌవీరవిభుఁడు= సౌవీరులయొక్క రాజు- జయద్రథుఁడు; పఱచెన్= పారిపోయాడు; పానుఁగు ప్రజన్= తేజోవిహీనమైన జనమును; ఆఱడిన్= వ్యర్థంగా; తునిమివైవన్= సంహరించటం; ఏల= ఎందుకు; ఆ, దురాత్మునిన్= దుర్మార్గుడైన ఆ జయద్రథుడిని; వెనుకొని= వెంబడించి; ఇపుడు= ఈ సమయంలో; అసువులు= ప్రాణాలు; కొనఁగన్‌వలయున్= తీయాలి; లేలెమ్ము (లెమ్ము+లెమ్ము)= లెమ్ము; అనంతర కర్తవ్యాన్ని నిర్వహించటానికై తత్‌క్షణమే పూనుకొమ్ము.

**తాత్పర్యం:** 'మంచివారిచేత పొగడబడే పరాక్రమం కల ఓ భీమసేనా! వ్యర్థంగా అమాయకులు, దీనులు అయిన ఈ భటులను ఇక సంహరించటం మానుము. ఈ సౌవీరులరాజు జయద్రథుడు సిగ్గుమాలి యుద్ధాన్ని విడిచి పారిపోయాడు. ఇక మనం ఆతడినే వెంబడించి వాడిప్రాణాలు తీయాలి'.

**వ.** **అనిన నతండు గయ్యంబు సాలించి ధర్మతనయుం జూచి. 239**

**తాత్పర్యం:** అని అర్జునుడు ప్రబోధించగా యుద్ధాన్ని విరమించి ధర్మరాజువైపు చూచి.

**క.** **'జననాథ! ద్రుపదసుతఁ దో । డ్కొని ధౌమ్యుఁడు నీవుఁ గవలు గుఱుకొని మగుడం**
**జనుఁ డాశ్రమంబునకు నే । మును సైంధవువెనుకఁ గూడ ముట్టెదము వెసన్. 240**

**ప్రతిపదార్థం:** జననాథ!= రాజా, ఓ ధర్మరాజా!; ద్రుపదసుతన్= ద్రౌపదిని; తోడ్కొని= వెంట నిడుకొని; ధౌమ్యుఁడున్= ధౌమ్యుడును; నీవున్= నీవును; కవలు= నకుల సహదేవులు; గుఱుకొని= పూని (బుద్ధి పూర్వకంగా); ఆశ్రమంబునకున్= విడిదితోటకు; మగుడన్+చనుఁడు= మరలి వెళ్ళండి; ఏమును= మేము (నేనును, అర్జునుడును); వెసన్= శీఘ్రంగా; సైంధవు వెనుకన్= జయద్రథుడి యొక్క వెనుకభాగంలో; కూడ ముట్టెదము= వెంబడిస్తాం.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ద్రౌపదిని తీసికొని మీరున్నూ, ధౌమ్యుడున్నూ, నకులసహదేవులున్నూ నిశ్చింతగా ఆశ్రమానికి తిరిగిపొండి. నేనూ అర్జునుడూ కలిసి శీఘ్రంగా వెళ్ళి జయద్రథుడిని వెంబడించి ముట్టడిస్తాం.

**క. అతలంబునఁ గ్రుంగిన న । ద్భుతముగ దివమునకు నెగసి పోయినఁ బగతున్**
**హతుఁ జేయక మగుడము; విని । హతుఁడుగఁ జేయుదుము దివిజు లడ్డం బైనన్'. 241**

**ప్రతిపదార్థం:** అతలంబునన్+క్రుంగినన్= భూమిక్రింద ఉండే పాతాళలోకానికి దిగినప్పటికీ; అద్భుతముగన్= అచ్చెరువు కలిగించేటట్లుగా; దివమునకున్= ఆకాశానికి; ఎగసి, పోయినన్= ఎగిరిపోయినప్పటికీ; పగతున్= శత్రువును (జయద్రథుడిని); హతున్+చేయక= సంహరించకుండ; మగుడము= తిరిగి రాము; దివిజులు= దేవతలు; అడ్డంబు+ఐనన్= అడ్డుపడినప్పటికిని; వి, నిహతుఁడుగన్+చేయుదుము= సంహరించితీరుతాం.

**తాత్పర్యం:** పాతాళానికి దిగినా, ఆకాశంపైకి ఎగిరి పారిపోయినా శత్రువైన జయద్రథుడిని సంహరించగలం. దేవతలు అడ్డుపడినా ఆతడిని చంపకుండ విడిచిపెట్టం'.

**విశేషం:** (1) అతలం సప్తపాతాళాలలో ఒకలోకం. భూమిక్రింద అట్టివి ఏడులోకాలు కలవని పురాణకథనం. 1. అతలం 2. వితలం 3. సుతలం 4. తలాతలం 5. మహాతలం 6. రసాతలం 7. పాతాళం.

**తే. అనిన ధర్మజుఁ డిట్లను నద్దురాత్ముఁ । బొలియఁ జేయుట దగదు దుస్సలఁ దలంచి;**
**వాని నొకతప్పునకు సైఁప వలదె? యాంబి । కేయమహిషికి ఖేదంబు సేయఁ దగునె?' 242**

**ప్రతిపదార్థం:** అనినన్= అని(భీముడు) పలుకగా; ధర్మజుఁడు= ధర్మనందనుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; దుస్సలన్= దుస్సలను (ధృతరాష్ట్రుడి కూతురిని); తలంచి= స్మరించి; ఆ, దురాత్మున్= ఆ దుష్టుడిని, జయద్రథుడిని; పొలియన్+చేయుట= సంహరించటం; తగదు= కూడదు. వానిన్= అతడిని (జయద్రథుడిని), ఒక తప్పునకున్= ఒకనేరానికి; సైఁపన్ వలదె?= సైరింపరాదా?; ఆంబికేయ మహిషికిన్= అంబికాతనయుడైన ధృతరాష్ట్రుడి రాణికి (గాంధారికి); ఖేదంబు+ చేయన్+తగునె?= దుఃఖం కలిగించవచ్చునా?

**తాత్పర్యం:** అని భీముడు పలుకగా ధర్మరాజు ఇట్లా అన్నాడు- 'జయద్రథుడు ఎంతటి దురాత్ముడైనా ఆతడిని సంహరించటం కూడదు. అతడు ధృతరాష్ట్రుడి కూతురైన దుస్సలకు భర్త. మనం దుస్సలను చూచి అతడు చేసిన మొదటి నేరాన్ని క్షమించవలయును. ధృతరాష్ట్రుడి రాణి గాంధారి బాధపడుతుందనే మాట మనం మఱచి పోరానిదికదా!'

**వ. అనినం బాంచాలి భీమార్జునులతోడ 'నప్పాపాత్ముని దెసం గృప సేయ వలవ; దవశ్యంబును వాని వధియించి, నాకుం బ్రియంబు గావించునది; యట్టి ద్రోహి యెల్ల భంగుల వధ్యుం' డనియెఁ; దదనంతరంబ ధర్మనందనుండు ధౌమ్య ద్రౌపదీ నకుల సహదేవ సహితుండై, మగిడి నిజాశ్రమంబునకుం జనియె; నిట భీమ విజయులు రథంబులు రయంబునం దోలుకొని చని, క్రోశమాత్రాంతరంబున సైంధవుం గని; రప్పుడు కిరీటి దూరాపాత విశిఖంబుల జయద్రథురథ్యంబులం బడనేసిన. 243**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (ధర్మనందనుడు) చెప్పగా; పాంచాలి= ద్రౌపది; భీమ+అర్జునులతోడన్= భీముడితోడను; అర్జునుడితోడను; ఆ+పాప+ఆత్ముని, దెసన్= ఆ దుష్టుడిపట్ల; కృప+చేయన్, వలవదు= జాలి చూపవద్దు; అవశ్యంబును=

తప్పకుండ; వానిన్= అతడిని (జయద్రథుడిని); వధియించి= సంహరించి; నాకున్= నాకు; ప్రియంబు= ప్రీతి; కావించునది= చేయవలయును; అట్టి= అటువంటి; ద్రోహి= మోసం చేసినవాడు; ఎల్ల, భంగులన్= అన్ని విధాల: వధ్యుండు= చంపదగినవాడు; అనియెన్= అని చెప్పింది; తత్+అనంతరంబు+అ= అటు పిమ్మట; ధర్మనందనుండు= ధర్మరాజు; ధౌమ్య, ద్రౌపదీ, నకుల, సహదేవ, సహితుండు+ఐ= ధౌమ్యుడితో, పాంచాలితో, నకులుడితో, సహదేవుడితో కూడినవాడై; మగిడి= తిరిగి; నిజ+ ఆశ్రమంబునకున్= తన ఆశ్రమానికి; చనియెన్= వెళ్ళాడు; ఇట= ఇక్కడ, (ఈ కథలో); భీమ, విజయులు= భీముడు అర్జునుడు; రథంబులు= తేరులు; రయంబునన్= వేగంగా; తోలుకొని= ముందుకు నడిపించుకొని; చని= పయనించి; క్రోశమాత్ర+అంతరంబునన్= కూత వినిపించే దూరం లోపల; సైంధవున్= జయద్రథుడిని; కనిరి= చూచారు; అప్పుడు= ఆ సమయంలో; కిరీటి= అర్జునుడు; దూర+ఆపాత, విశిఖంబులన్= దూరంలో ఆకస్మికంగా పడే బాణాలచేత; జయద్రథురథ్యంబులన్= సైంధవుడి గుఱ్ఱాలను; పడవేసినన్= సంహరించగా.

**తాత్పర్యం:** ధర్మజుడు అట్లా చెప్పగా, ద్రౌపది భీమార్జునులతో ఈ రీతిగా పలికింది: 'పాపాత్ముడైన జయద్రథుడిపట్ల జాలి చూప తగదు. వాడు సంహరించదగినవాడు. అతడిని వధించి నాకు మీరు ప్రీతి చేయండి' అని. పిమ్మట, ధర్మరాజు ధౌమ్యుడితో, ద్రౌపదితో, నకులసహదేవులతో కలిసి తన ఆశ్రమానికి వెళ్లాడు. ఇక్కడ భీమార్జునులు తమతమ రథాలను వడిగా తోలుకొని కేక వినిపించే దూరం లోపలనే జయద్రథుడిని సమీపించారు. అంతట అర్జునుడు దూరంలో ఆకస్మికంగా పడే బాణాలను ప్రయోగించి, జయద్రథుడి రథానికి పూన్చిన గుఱ్ఱాలను కూలనేశాడు.

**క. తల్లడ పడి యరదము డిగి । విల్లును నమ్ములును విడిచి వెల్ల నగుచు మే**
**నెల్లఁ జెమర్పఁగ నూర్పులు । పెల్లుగ నమ్మనుజపశువు పెలుచం బఱచెన్. 244**

**ప్రతిపదార్థం:** ఆ+మనుజ పశువు= మనుజులలో జంతువు- ఆ జయద్రథుఁడు; తల్లడపడి= ఆందోళన చెంది; అరదమున్= రథం; డిగి= దిగి; విల్లును= ధనుస్సును; అమ్ములును= బాణాలను; విడిచి= వదలిపెట్టి; వెల్లన్+అగుచు= తెల్లబోతూ; మేను+ఎల్లన్= శరీర మంతా; చెమర్పఁగన్= చెమట పట్టగా; ఊర్పులు= నిశ్వాసాలు; పెల్లుగన్= అధికం కాగా; పెలుచన్= శీఘ్రంగా; పఱచెన్= పారిపోయాడు.

**తాత్పర్యం:** కలత చెంది ఉద్వేగంతో రథంనుండి క్రిందికి ఉరికి, ధనువును బాణాలను విడిచిపెట్టి వెలవెల బోయిన వాడై, శరీర మంతా చెమటపట్టగా వేడినిట్టూరుపులు వెదజల్లుతూ ఆ మనుజపశువు శీఘ్రంగా పారిపోయాడు.

**ఆ. వానిఁ జూచి నగుచు వార 'లోరోరి! యిం । కెందుఁ బోవ వచ్చుఁ బంద! నిలువు;**
**మిట్టికడిమి నమ్మియే ప్రల్లదంబులు । సేయఁ దొడఁగి' తనుచు డాయుటయును. 245**

**ప్రతిపదార్థం:** వారలు= భీముడును, అర్జునుడును; వానిన్= అతడిని (ఆ జయద్రథుడిని); చూచి= కాంచి; నగుచున్= నవ్వుతూ; ఓరోరి (ఓరి+ఓరి)= ఒరే ఒరే అని సంబోధిస్తూ; ఇంకన్+ఎందున్+పోవన్‌వచ్చున్= ఇంక ఎక్కడికి వెళ్ళుతావు?; పంద= పిరికివాడా, ఓ జయద్రథా!; నిలువుము= ఆగుము; ఇట్టి= ఇటువంటి; కడిమి= పరాక్రమాన్ని నమ్మియే= నమ్ముకొనేనా; ప్రల్లదంబులు= ఔద్ధత్యం; చేయన్+తొడగితి(వి)= చేయటానికి పూనుకొన్నావు; అనుచున్= అని పలుకుతూ; డాయుటయును= సమీపించగా.

**తాత్పర్యం:** జయద్రథుడిని చూచి నవ్వుతూ భీముడును అర్జునుడును- 'ఇక ఎక్కడికి పోగలవురా!, ఓ పిరికిపందా!, ఆగరా, నీకున్న ఇటువంటి పరాక్రమాన్ని నమ్ముకొనేనా అటువంటి దర్పపుకూతలు కూశావు' అంటూ అతడిని సమీపించారు.

**వ. మరలి చూచి వాఁ డొక్క గుల్మమధ్యంబుఁ దూఱుటయుఁ గని భీమసేనుండు రోషసందష్టాధరుం డగుచు రథంబు డిగ్గ నుఱికి. 246**

**ప్రతిపదార్థం:** వాఁడు= జయద్రథుఁడు; మరలి చూచి= వెనుకకు తిరిగి చూచి; ఒక్క= ఒక; గుల్మ మధ్యంబున్= పొదమధ్యలోకి; తూఱుటయున్= చొరబడి (దాగుకొనగా); కని= చూచి; భీమసేనుండు= భీముడు; రోష, సందష్ట+ అధరుండు+ అగుచున్= తీవ్రమైన కోపంతో ఔడు గరచినవాడై; రథంబు= తేరు; డిగ్గన్+ఉఱికి= క్రిందికి దూకి.

**తాత్పర్యం:** భీమార్జునులు వచ్చి మీద పడుతుండగా, జయద్రథుడు మరలిచూచి భయపడి ఒక పొదలోకి దూరి దాక్కొన్నాడు. అతడిని చూచి భీమసేనుడు ఆగ్రహావేశంతో పండ్లు పటపట కొరుకుతూ రథం మీదినుండి దూకి.

**క. ఒడిసి తలవట్టి నేలం । బడఁ దిగిచిన, వాఁడు పెనఁగఁ బడుటయుఁ జిక్కన్**
**మెడఁ ద్రొక్కి గాఢముష్టిం । బొడిచె మొగం బవియ రక్తపూరము దొరుఁగన్. 247**

**ప్రతిపదార్థం:** ఒడిసి= గడుసుదనం ప్రదర్శించి; తల పట్టి= శిరస్సును గ్రహించి; నేలన్+పడన్= భూమిపై పొరలేటట్లుగా; తిగిచినన్= దగ్గరగా లాగగా; వాఁడు= అతడు (ఆ జయద్రథుఁడు); పెనఁగన్+పడుటయున్= గుంజులాడుటయును; చిక్కన్= లొంగగా; మెడన్= కంఠాన్ని; త్రొక్కి= కాలితో అదిమిపట్టి; మొగంబు= ముఖం; అవియన్= బ్రద్దలయ్యేటట్లుగా; రక్తపూరము= నెత్తురు వెల్లువ; తొరఁగన్= స్రవించేటట్లు; గాఢముష్టిన్= కఠినమైన పిడికిలితో; పొడిచెన్= పొడిచాడు (గుద్దాడు).

**తాత్పర్యం:** భీముడు తెలివితేటలతో, ఒడుపుగా జయద్రథుడిని తల పట్టి భూమిపై పడేటట్లు లాగి త్రోశాడు. సైంధవుడు పెనగులాడాడుగాని చివరకు భీముడికి లొంగిపోయాడు. భీముడు అతడి మెడపై తనకాలు మోపి అదిమిపట్టి అతడిని తన పిడికిలితో పొడిచాడు. జయద్రథుడి మొగం గంట్లువారిపోయింది. ముక్కునుండి నెత్తురు వెల్లువగా కారింది.

**క. ఒడలెల్లఁ బిండికూడుగఁ । బొడిచి యెగయ నెత్తి త్రిప్పి భూస్థలి మీఁదన్**
**బడవైచి యురము మొగమును । నడిచెను వడముడి తలప్రహారకుశలుఁడై. 248**

**ప్రతిపదార్థం:** ఒడలు+ఎల్లన్= శరీరమంతా; పిండి కూడుగన్= పిండిచేత చేయబడిన ఆహారపదార్థంవలె ముద్ద అయ్యేటట్లు; పొడిచి= గుద్ది; ఎగయన్+ఎత్తి= పైకి లేచేటట్లుగా ఎత్తి; త్రిప్పి= గిరగిర మలిపి; భూస్థలిన్= భూమిపై; పడన్వైచి= పడేటట్లుగా విసిరివేసి; వడముడి= భీమసేనుడు (శత్రువులకు తాపం కలిగించేవాడు); తల ప్రహార కుశలుఁడు+ఐ= అరచేతితో కొట్టే దెబ్బలలో నేర్పరి అయి; ఉరము= వక్షాన్నీ; మొగమును= ముఖాన్ని; అడిచెను= కొట్టాడు.

**తాత్పర్యం:** భీముడు జయద్రథుడిని లొంగదీసి, శరీరాన్నంతటిని మెత్తగా అయ్యేటట్లు దెబ్బలు కొట్టి, పైకిలేవ నెత్తి, గిరగిర త్రిప్పి, తిరిగి భూమిపై పడవేసి, అరచేతితో వక్షాన్నీ, ముఖాన్నీ మోదాడు.

**వ. ఇట్లు బెట్టుగా నడఁచినఁ బగతుండు వివశుం డగుటయుం జూచి యర్జునుం 'డోహో! యింత సాలు; నింక నొచ్చినం బ్రాణ విముక్తుం డగుం గావున నజాత శత్రువచనంబులు దలంచి, వీనిఁ గరుణింపు' మనిన నతండు గవ్వడి దెసఁ గనుంగొని, 'ధర్మనందనుం డెప్పుడుఁ గరుణయకాని కార్యంబు చేటుపాటు విచారింపఁ జొరండు; నీవును నతనిభంగిన బేలవై; తిద్దురాత్ము నెట్లు సైఁప వచ్చు?' నని పలికె; ననంతరంబ. 249**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; బెట్టుగాన్= మిక్కుటంగా; అడఁచినన్= బాదగా; పగతుండు= శత్రువు; వి, వశుండు+ అగుటయున్= స్పృహ కోలుపోగా; చూచి= అరసి; అర్జునుండు; ఓహో= అయ్యో; ఇంత+చాలు= ఇంత మేరకు దెబ్బలు కొట్టింది చాలు; ఇంకన్= ఇంకమీద; నొచ్చినన్= వీడు బాధపడితే; ప్రాణ, విముక్తుండు+అగున్= అసువులు కోలుపోయేవాడు ఔతాడు; కావునన్= కాబట్టి; అజాతశత్రు వచనంబులు= (పుట్టుకచేత శత్రువులు లేనివాడయిన) ధర్మరాజుయొక్క మాటలు; తలంచి= స్మరించి; వీనిన్= వీడిని (జయద్రథుడిని); కరుణింపుము= దయచూపుము; అనినన్= అని (అర్జునుడు) పలుకగా; అతండు= అతడు (భీముడు); కవ్వడి (కవ+వడి) దెసన్= అర్జునుడివైపు; కనుంగొని= చూచి; ధర్మనందనుండు= ధర్మ తనయుడు; ఎప్పుడున్= ఏ సమయంలో అయినా; కరుణ+అ, కాని= దయ చూపటం మాత్రమే కాని; కార్యంబు, చేటు, పాటు= పనియొక్క మంచిచెడ్డలు; విచారింపన్+చొరండు= ఆలోచించటానికి పూనుకొనడు; నీవును= ఓ అర్జునా, నీవు కూడా; అతని భంగిన్+అ= ఆయన మాదిరిగానే; బేలవు+ఐతి= తెలివితక్కువవాడవు అయినావు; ఈ+దురాత్మున్= ఈ దుష్టుడిని; ఎట్లు= ఏ రీతిగా; సైఁపన్వచ్చున్= క్షమించవచ్చును; అని పలికెన్= అని అన్నాడు; అనంతరంబు+అ= అటుపిమ్మట.

**తాత్పర్యం:** ఈ రీతిగా గట్టిగా దెబ్బలు కొట్టటంచేత జయద్రథుడు స్పృహతప్పటం చూచి, అర్జునుడు భీముడితో ఇట్లా అన్నాడు. 'అయ్యో! ఇంత శిక్షించింది చాలు. ఇతడిపై జాలి చూపుము. ఇకమీద కొట్టితే ఈ జయద్రథుడు మరణిస్తాడు. అజాతశత్రువు అయిన ధర్మనందనుడి మాటలు స్మరించి, వీడిని కరుణించు'. అంతట భీముడు ఇట్లా అర్జునుడికి సమాధానం చెప్పాడు. 'ధర్మరాజు ఎల్లప్పుడూ జాలి చూపుమనే చెప్పుతుంటాడు. ఆయనకు లౌక్యం తెలియదు. అట్లా జాలిచూపటంవలన ఎన్నో అనర్థాలు దాపురిల్లి కార్యహాని కలుగుతుందని ఆలోచించడు. నీవుకూడా ధర్మరాజు వంటివాడవే సుమా! ఈ జయద్రథుడిని క్షమించరాదు' అన్నాడు. అటు పిమ్మట.

### భీముఁడు సైంధవుం బట్టికొని పరిభవించుట (సం. 3-256-9)

**ఆ.** **వాఁడియైన కత్తి వాతి యమ్మునఁ గొని । పగతుశిరము చెక్క లెగయ గొఱిగి**
**నరుల కెల్లఁ జూడ నవ్వగునట్లుగాఁ । గలయ నైదు గూఁకటుల నొనర్చె.** **250**

**ప్రతిపదార్థం:** వాడి+ఐన కత్తి వాతి+అమ్మునన్+కొని= పదనైన అంచుతో ఉన్న బాణాన్ని గ్రహించి; పగతు, శిరమున్= శత్రువు (జయద్రథుడి) యొక్క తలను; చెక్కలు+ఎగయన్= పీతోలు పైకి లేచిపోయేటట్లుగా; గొఱిగి= వెంద్రుకలు ఉత్తరించి; చూడన్= చూస్తే; నరులకున్+ఎల్లన్= ప్రజలందరికీ; నవ్వు+అగునట్లుగాన్= నవ్వు జనించేటట్లుగా; కలయన్= కూర్చి; ఐదు కూకటులన్= ఐదు పిలకలను; ఒనర్చెన్= కావించాడు.

**తాత్పర్యం:** పదను గల కత్తిఅంచు గల బాణంతో భీముడు జయద్రథుడితల పీతోలు లేచిపోయేటట్లుగా, వెంద్రుకలు గొఱిగి, చూచేవారు అపహసించేటట్లుగా ఐదు శిఖలుగా నిలిపాడు.

**వ.** **ఇట్లు రాజవేషంబు వికల్పితంబు సేసి యమ్మహాభుజుండు వాని కిట్లను 'నోరీ! బ్రదుకవలతేని నేఁడు మొదలుగా నెల్ల సభలయందును 'బాండవదాసుండ' నని పలుకునది' యనిన వాఁడును దండాఘాతభయంబున 'నట్లచేయుదు' ననియె; నంత నయ్యిరువురు నతనిం బెడకేలు గట్టి రథంబుపై నిడికొని నిజాశ్రమంబునకుం జని ధర్మపుత్త్రునకు నివేదించి, 'వీఁడె పాండవ దాసుం' డనిన, నతం 'డట్లేని వీని విడువుం' డనియెఁ; బాంచాలియు జయద్రథుం జూచి నవ్వుచు 'నిప్పాపాత్ముండు భవదీయ దాసుం డయ్యెం గావున వీనిం బో**

**విడువుం' డని విడిపించె; నా సైంధవుండును ధర్మజునకుఁ దత్సభా గతులైన మునులకు మ్రొక్కిన, నజాత శత్రుం డి ట్లనియె. 251**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; రాజవేషంబు, వికల్పితంబు+చేసి= రాజు ధరించే ఆహార్యం లేకుండగా చేసి; ఆ+మహాభుజుండు= ఆ గొప్ప పరాక్రమం కలవాడు; వానికిన్= అతడితో - జయద్రథునితో; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నాడు; 'ఓరీ!= నీచుడ వైన ఓ జయద్రథా!; బ్రదుకన్ వలతు(వు)+ఏని= నీవు బ్రదుక తలిస్తే; నేఁడు= ఈ రోజు; మొదలుగాన్= మొదలుకొని; ఎల్ల, సభలయందును= పెద్దల సమావేశాలు అన్నింటిలోనూ; పాండవ దాసుండన్= పాండవుల సేవకుడను; అని, పలుకునది= అని పేర్కొనాలి; అనినన్= అని (భీముడు) చెప్పగా; వాఁడును= అతడును (ఆ జయద్రథుఁడు కూడా); దండ+ఆ ఘాత, భయంబునన్= కఱ్ఱ దెబ్బవలని భీతితో; అట్లు+అ= ఆ విధంగానే; చేయుదున్+అనియెన్= చేస్తాను అన్నాడు; అంతన్= పిదప; ఆ+ఇరువురును= ఆ ఇద్దరున్నూ, భీముడును అర్జునుడును; అతనిన్= వాడిని (ఆ జయద్రథుడిని); పెడకేలు+కట్టి= చేతులు వెనుకకు విరిచి బంధించి; రథంబుపైన్+ఇడికొని= తేరుపై పెట్టుకొని; నిజ+ఆశ్రమంబునకున్+చని= తమ ఆశ్రమానికి వెళ్లి; ధర్మపుత్త్రునకున్= ధర్మనందనుడికి; నివేదించి= విన్నవించి; వీఁడె= ఇతడే; పాండవ దాసుండు+అనినన్= పాండునందనుల సేవకుడు అని వచించగా; అతండు= ధర్మనందనుడు; అట్లు+ఏని= అటులే అయితే (ఈ జయద్రథుడు పాండవుల కింకరుడే అయితే); వీనిన్; విడువుండు= వదలిపెట్టండి; అనియెన్= అని అన్నాడు; పాంచాలియున్= ద్రౌపదియును; జయద్రథున్+చూచి= సైంధవుడిని చూచి; నవ్వుచున్= పరిహసిస్తూ; ఈ+పాప+ఆత్ముండు= ఆ పాపి- జయద్రథుడు; భవదీయ దాసుండు= మీ యొక్క సేవకుడు; అయ్యెన్+కావునన్= అయినాడు కాబట్టి; వీనిన్= వీడిని (సైంధవుడిని); పో విడువుండు= యథేచ్ఛగా పొమ్మని విడిచిపెట్టండి; అని= అని చెప్పి; విడిపించెన్= బంధముక్తుడిని చేయించింది; ఆ సైంధవుండును= ఆ జయద్రథుండును; ధర్మజునకున్= ధర్మనందనుడికి; తత్+సభా+గతులు+ఐన= ఆతని యొక్క సభలో ఉన్న వారు అయిన; మునులకున్= ఋషులకు; మ్రొక్కినన్= నమస్కరించగా; అజాతశత్రుండు= శత్రువులు లేనివాడు (పుట్టని శత్రువులు కలవాడు) ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** భీముడు సైంధవుడికి రాజవేషం తొలగించి అతనితో ఇట్లా అన్నాడు: 'ఓరీ! నీచుడవైన జయద్రథా! నీవు బ్రదుక దలిస్తే ఈనాడు మొదలుగా నీవు అన్నిసభలలో పాండవదాసుడిని అని ప్రకటించుకొనుము- అని శాసించాడు. దెబ్బలకు జడిసి జయద్రథుడు అందుకు సమ్మతించాడు. అంతట భీమార్జునులు ఆ సైంధవుడిని చేతులు వెనుకకు విరిచి కట్టి తమరథంమీద పెట్టి తెచ్చి, ధర్మరాజుసమక్షంలో ఉంచి 'ఇతడే జయద్రథుడు; పాండవ దాసుడు' అని నివేదించారు. ధర్మరాజు 'ఇతడు పాండవదాసుడు అయినాడు కనుక ఇక చంపదగినవాడు కాడు. కావున విడిచి పెట్టండి' అని ఆజ్ఞాపించాడు. ద్రౌపదికూడా జయద్రథుడిని పరిహసిస్తూ 'ఈ పాపాత్ముడు మీకు కింకరుడైనాడు కాబట్టి బంధవిముక్తుడిని చేయండి' అని చెప్పింది. పాండవులు సైంధవుడిని విడిచిపెట్టారు. ఆతడు ధర్మరాజుకు ఆతడి ఆశ్రమసభకు విచ్చేసిన మునులకు నమస్కరించగా, అజాతశత్రువు సైంధవుడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'ఎట్టి కష్టుఁ డైన నిట్టిపాపము సేయ । నెత్తికొనునె! ధరణి నీవు దక్క**
**నరుగు మింక; నేమి యందుము నిన్ను నిం । ద్రియవిలోలు నల్పు ధృతివిహీను. 252**

**ప్రతిపదార్థం:** ధరణిన్= భూమిలో; నీవు= నీవు; తక్కన్= తప్ప; ఎట్టి= ఎటువంటి; కష్టుఁడు+ఐనన్= దుష్టుడు అయినప్పటికిని; ఇట్టి= ఇటువంటి; పాపము= కిల్బిషం (పరదారాపహరణం); చేయన్= చేయటానికి; ఎత్తికొనునె= పూనుకొంటాడా?; అరుగుము=

(యథేచ్ఛగా) వెళ్ళు; నిన్నున్; ఇంద్రియలోలున్= ఇంద్రియాలకు వశం అయినవాడిని; అల్పున్= నీచుడిని; ధృతి, విహీనున్= ధైర్యం లేనివాడిని; ఇంకన్= ఇంతకంటె; ఏమి+అందుము?= ఏ మని నిందించగలం?

**తాత్పర్యం:** ఎట్టి దుష్టుడు అయినా ఇటువంటి నీచపుపనికి (పరదారను అపహరించటానికి) పూనుకొంటాడా? నీ వంటి అల్పుడు మాత్రమే అట్టి నీచకృత్యానికి ఒడిగట్టుతాడు. నీ వంటి అల్పుడిని, నీ వంటి ఇంద్రియ వివశుడిని, నీ వంటి ధైర్యవిహీనుడిని, ఇంక ఏమని నిందించగలం? ఇక నీవు నీ ఇచ్ఛవచ్చినట్లు పొమ్ము.

**విశేషం:** ధర్మజుని మాటనేర్పరితనానికి, వాడితనానికీ ఈ కందం చక్కని ఉదాహరణం. 'ఎట్టి' 'ఇట్టి' అనే విశేషణాలతో అవాచ్యమైన అంశాలను చెప్పని ఔచిత్యం పాటించాడు. 'ధరణి నీవు దక్క' అని పేర్కొని భూమిజనుల్లో సైంధవునంతటి నీచుడు మరొకడు లేడని వ్యంగ్యం చేశాడు. ఈ ఉదంతంలో సైంధవునిలో కానబడే గుణాలు మూడు. 1. ఇంద్రియ లోలత్వం. 2. చెల్లెలివరుసను కూడా పాటించక ద్రౌపదిని హరించిన నైచ్యం. 3. ప్రగల్భాలు పలికి చివరకు పారిపోయే భీరుత్వం. ఈ మూడింటినీ చెప్పి 'ఇంక ఏమి అంటాం' అన్నాడు ధర్మజుడు. భీముని ప్రహారాలు సైంధవుడి దేహాన్ని పిండిపిండి చేశాయి. ధర్మజునిమాటలు మనస్సును తూట్లుపొడిచాయి.

**వ. ఇంక నెవ్వారికి నిట్టి కొఱగాములు సేయక బుద్ధిమంతుఁడవై యుండు' మనిన నతండు లజ్జావనత వదనుం డగుచు నచ్చోటు వాసి, గంగాద్వారంబున కరిగి యందు. 253**

**ప్రతిపదార్థం:** ఇంకన్= ఇకమీద; ఏ+వారికిన్= ఎవరికినీ; ఇట్టి= ఇటువంటి; కొఱగాములు= చెడ్డపనులు; చేయక; బుద్ధిమంతుఁడవు+ఐ= మంచిబుద్ధి కలవాడవు అయి; ఉండుము= జీవించుము; అనినన్= అని (ధర్మరాజు) చెప్పగా; అతండు= (జయద్రథుడు); లజ్జా+అవనత, వదనుండు+అగుచున్= సిగ్గుచేత వాల్చబడిన మొగం కలవాడు ఔతూ; ఆ+చోటు+పాసి= ఆ స్థలం విడిచి; గంగా ద్వారంబునకున్= గంగా నది సముద్రాన్ని కలిసే స్థలానికి వెడలి; అందున్= అచట.

**తాత్పర్యం:** ఇక మీదట నీవు ఎవ్వరియెడలను ఇట్టి చెడుపనులు చేయకుము. మంచిబుద్ధితో మెలగుము అని ధర్మరాజు మందలించాడు. సైంధవుడు అంతట సిగ్గుచేత తలవంచుకొని ఆ చోటు నుండి బయలుదేరి గంగానది సముద్రాన్ని కలిసే పుణ్యస్థలంవద్దకు వెళ్ళాడు.

**విశేషం:** సైంధవుడికి దాపురించింది కేవలం యుద్ధంలో కలిగిన ఓటమిమాత్రమే కాదు. పాండవులు అతడి తేజోవధ చేశారు. మానసికంగా ఆధ్యాత్మికంగా జయద్రథుడు దీనుడైనాడు. అతడు కోలుకొనటానికి పుణ్యక్షేత్రానికి పోవటం అవసరమైంది.

**శా. ఆదిత్యార్చితపాదపద్ము జగదేకాధీశు నీశుం ద్రిలో**
**కాదిం గామవిభేదిఁ బర్వతసుతాహ్లాదైకసంపాది నిః**
**ఖేదుం డై శివు నాత్మలో నిలిపి యక్షీణవ్రతారూఢతం**
**బాదాంగుష్ఠము నేల మోపి తప మొప్పం జేసె సద్భక్తిమైన్. 254**

**ప్రతిపదార్థం:** ఆదిత్య+అర్చిత, పాదపద్మున్= సూర్యుడిచేత ఆరాధించబడిన పద్మాలవంటి చరణాలు కలవాడినీ; జగత్+ఏక+అధీశున్= సృష్టికి అంతటికిని తా నొకడే ఆధిపత్యం వహించినవాడిని; ఈశున్= ఈశ్వరుడిని; త్రిలోక+ఆదిన్= మూడు భువనాలకు మూలం అయిన వాడిని; కామ విభేదిన్= మన్మథుడియొక్క విరోధిని; పర్వత, సుతా+హ్లాద+ఏక, సంపాదిన్= హిమవంతుని పుత్రియైన గౌరీదేవికి ఆనందాతిశయం కలిగించే వాడు ఐన; శివున్= ఈశ్వరుడిని; నిః,

ఖేదుండు+ఐ= దుఃఖంలేనివాడై (అవమానంవలన కలిగిన బాధ మరచిన వాడై జయద్రథుడు); ఆత్మలోన్= మనస్సులో; నిలిపి= ధ్యానించి; అ, క్షీణ, వ్రత+ఆరూఢతన్= గొప్ప దీక్షతో కూడినవాడై; పాద+అంగుష్ఠము= కాలియొక్క బొటనవ్రేలు (మాత్రమే); నేలన్+మోపి= భూమిని తాకేటట్లుగా ఉంచి; సత్+భక్తి, మైన్= మంచి భక్తితో; తపము= తపస్సు; ఒప్పన్+చేసెన్= శోభిల్లేటట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** జయద్రథుడు పరమశివుడినిగూర్చి నిష్ఠతో గొప్పతపస్సు చేశాడు. ఆ తపస్సు కఠోరదీక్షతో కూడింది. జయద్రథుడు తనపాదంబొటనవ్రేలును మాత్రమే భూమిపై నిలిపి పార్వతీపతిని, మన్మథవిరోధిని, సూర్యుడిచేత అర్చించబడిన పాదపద్మాలు కలవాడిని, సృష్టిసమస్తానికి అధిపతి అయినవాడిని, మూడు లోకాలు ఏర్పడటానికి మూలమైనవాడిని దృఢభక్తితో మనస్సులో ధ్యానిస్తూ ఘోర తపం చేశాడు.

**విశేషం:** కామవిలోలుడైన జయద్రథుడు కామవిభేదినిగూర్చి తపస్సు చేయటం సముచితం.

**ఉ. వానికి నమ్మహేశ్వరుఁడు వత్సలుఁ డై పొడసూపి, 'యీప్సితం**
**బైనది వేఁడు' మన్న, నతఁ డానతుఁడై 'పరమేశ! విక్రమా**
**హీనులఁ బాండునందనుల నేవుర సైన్యయుతంబుగా ననిం**
**బూని జయించు నట్టి వరముం గృపసేయుము నాకు' నావుడున్. 255**

**ప్రతిపదార్థం:** ఆ+మహా+ఈశ్వరుఁడు= ఆ పరమశివుడు; వత్సలుఁడు+ఐ= అనురాగం కలవాడయి; వానికిన్= అతడికి (ఆ జయద్రథుడికి); పొడ+చూపి= సాక్షాత్కరించి; ఈప్సితంబు+ఐనది= ఇష్టం అయినది; వేఁడుము= కోరుకొమ్ము; అన్నన్= అని (శివుడు) చెప్పగా; అతఁడు= వాడు- జయద్రథుఁడు; ఆనతుఁడు+ఐ= నమస్కరించినవాడై; పరమ+ఈశ!= ఓ పరమ శివా!; విక్రమ+అహీనులన్= పరాక్రమంచే తక్కువకానివారిని; పాండు, నందనులన్= పాండవులను; ఏవురన్= అయిదుగురినీ; అనిన్= యుద్ధంలో; సైన్య, యుతంబుగాన్= సేనలతోపాటుగా; పూని= కడగి; జయించు+అట్టి= గెలుచునట్టి; వరమున్= కోరికను; నాకున్= నాకు; కృప+చేయుము= అనుగ్రహించుము; నావుడున్= అని చెప్పగా.

**తాత్పర్యం:** జయద్రథుడి తపస్సుకు మెచ్చి పరమశివుడు అతడికి ప్రత్యక్షమయ్యాడు. శివుడాతడిని ఇష్టమైన వరాన్ని వేడుకొనుమన్నాడు. జయద్రథుడు శివుడికి నమస్కరించి, 'దేవా, శౌర్యవంతులైన పంచపాండవులను వారి సేనలతోకూడ నేను యుద్ధంలో జయించే వరాన్ని అనుగ్రహించుము' అని కోరుకొన్నాడు.

**క. 'ఇది వొసఁగదు పాండవులం । గదనమున జయింప నలవిగా దింద్రాది**
**త్రిదశులకు; వినవె! యైనను । వదలక నీకోర్కి దీర్పవలయున యెట్లున్. 256**

**ప్రతిపదార్థం:** ఇది+పొసఁగదు= (నీవు పంచపాండవులను యుద్ధంలో సైన్యసమేతంగా గెలవటం సాధ్యం కాదు); కదనమునన్= యుద్ధంలో; పాండవులన్= పాండునందనులను; జయింపన్= గెలవటానికి; ఇంద్ర+ఆది, త్రిదశులకున్= ఇంద్రుడు మున్నగు దేవతలకు; అలవి+కాదు= సాధ్యం కాదు; వినవె?= విన లేదా?; ఐనను= అయినప్పటికీ; వదలక= విడువక; ఎట్లున్= ఎట్లాగైనా; నీ కోర్కి= నీ అభీష్టం; తీర్పవలయున్+అ= నెరవేర్పవలసిందే సుమా.

**తాత్పర్యం:** 'ఓ జయద్రథా! నీవు పంచపాండవులను వారిసైన్యంతోపాటుగా యుద్ధంలో జయించవలెనని కోరి ఉన్నావు. ఇది సాధ్యం కాని కోరిక. ఎందుకంటే, దేవేంద్రుడు మున్నగుదేవతలుకూడ యుద్ధంలో పాండవులను

జయించలేరు. ఇక నీ వనగా ఎంత? అయినను నీవు గొప్పతపస్సు చేసి నన్ను మెప్పించావు కాబట్టి నీకోరిక నేను తీర్చవలసిందే. ఏదో విధంగా నీకోరిక తీరుస్తానుగాక!

**విశేషం:** శివుడు 'బోలా శంకరుడు' గానూ, భక్తసులభుడుగానూ సుప్రసిద్ధుడు. సైంధవుడు కోరినవరం అసాధ్యమైనది. అంతేకాక పాండవులలో ఒకడైన అర్జునుడు సైంధవుడు తపస్సు చేయటానికి ముందే తపస్సు చేసి శివుడివలన వరాలను పొంది ఉన్నాడు. అందుచేత ఇపుడు లోగడ తాను అర్జునుడికి ఒసగిన వరాలకు భంగం కాని విధంగానే శివుడు సైంధవుడికి అనుగ్రహం చూపదగును గదా. ఆ విషయమే శివుడు తరువాతి పద్యంలో వివరించి తెలిపాడు.

**చ. విజయుఁ డొకండు తక్క నతివీరులఁ బార్థుల నున్న నల్వురన్**
**నిజ మొకనాఁటి కయ్యమున నీవు జయింపుము; ఫల్గునుండు స**
**ర్వజగదజయ్యు విక్రముఁడు; వాని నెదుర్కొని నాకు నైనఁ బో**
**ర జితునిఁ జేయు టెంతయు భరం బగు; నిక్కము పల్కితిం జుమీ! 257**

**ప్రతిపదార్థం:** విజయుఁడు= అర్జునుడు; ఒకండు= ఒకడు; తక్కన్= తప్ప; అతివీరులన్= గొప్పపరాక్రమం కలవారిని; పార్థులన్+ఉన్న= పాండవులలో మిగిలిన; నల్వురన్= నలువురను; ఒకనాటి కయ్యమునన్= ఒక రోజున జరిగే యుద్ధంలో; నీవు= నీవు (ఓ జయద్రథా- నీవు); జయింపుము= గెలువుము; నిజము= నిక్కం; ఫల్గునుండు= అర్జునుడు; సర్వజగత్+అజయ్యు, విక్రముఁడు= సమస్తలోకాలచేతను జయించటానికి సాధ్యంకాని పరాక్రమం కలవాడు; వానిన్= అతడిని (అర్జునుడిని); ఎదుర్కొని= ఎదిరించి; పోరన్= యుద్ధంలో; జితునిన్+చేయుట= ఓడించబడినవాడినిగా చేయటం; నాకున్+ఐనన్= నాకు గూడ; ఎంతయున్= మిక్కిలి; భరంబు+అగున్= కష్టం ఔతుంది; నిక్కము= నిజం; పల్కితిన్, చుమీ!= వచించాను సుమా!

**తాత్పర్యం:** అర్జునుడు తప్ప, మిగిలిన పాండవులను యుద్ధంలో ఒకనాఁడుమాత్రమే జయించేటట్లు నీకు వరం ప్రసాదిస్తున్నాను. పాండవులు గొప్పవీరులు. అందులో నలుగురను జయించగలవు. అది చాలును నీకు. ఇది నిజం. ఇక అర్జునుడంటావా! అతడిని సర్వలోకాలు ఒక్కటై ఎదిరించినా జయింప జాలవు. అట్టి పరాక్రమం కలవాడు అతడు. నిజానికి నేనే యుద్ధంలో అతడిని ఎదుర్కొన్నా అతడిని జయించటం సులువు కాదు. నేను సత్యాన్ని చెప్పాను. ఇందులోని ఆంతర్యాన్ని గ్రహించుము.

**విశేషం:** ఫల్గునుఁడు= అర్జునుడు (ఫల్గుని నక్షత్రంలో జన్మించినవాడు).

**వ. అస్మత్ప్రసాదవిశేషంబునం జేసి వాని కిట్టి ప్రభావంబు గలిగె; నదియునుం గాక. 258**

**తాత్పర్యం:** నా అనుగ్రహవిశేషంచేత అర్జునుడికి ఇటువంటి మహిమ కలిగింది. అంతే కాక.

**క. నిఖిలాస్త్రశస్త్రవిద్యా । సఖుఁ డపరాజితయశోవిశాలుఁడు విష్ణుం**
**డఖిలేశ్వరుఁ డతనికిఁ బ్రియ । సఖుఁ డటె! యవ్వీరు గెల్వ శక్యమె నీకున్?' 259**

**ప్రతిపదార్థం:** నిఖిల+అస్త్ర, శస్త్ర, విద్యా సఖుఁడు= సమస్త మంత్ర మహిమలతో కూడిన ఆయుధాలయొక్కయు, శస్త్రాల యొక్కయు జ్ఞానంతో కూడినవాడు; అ, పరాజిత, యశస్+విశాలుఁడు= ఓటమి లేని కీర్తిచేత విస్తరించినవాడు; విష్ణుండు= శ్రీమన్నారాయణమూర్తి; అఖిల+ఈశ్వరుఁడు= అంతటికిని అధిపతి; అతనికిన్= ఆ అర్జునుడికి; ప్రియ, సఖుండు+అటె= కూరిమి మిత్రుడు కదా; ఆ+వీరున్= అటువంటి అర్జునుడిని, నీకున్= నీకు; గెల్వన్+శక్యమె= జయించ సాధ్యం ఔతుందా?

**తాత్పర్యం:** అతడికి ప్రియసఖుడు విష్ణుమూర్తి అవతారమైన శ్రీకృష్ణుడు. సమస్త శస్త్రాల అస్త్రాల ఆంతర్యాల పరిజ్ఞానం గల అర్జునుడిని గెలవటం ఎవ్వరికీ సాధ్యం కాదు.

**విశేషం:** తిక్కనకాలంనాటికే శైవ వైష్ణవాలు తెలుగుసమాజంలో ప్రాధాన్యంకొరకై పోటీపడుతుండేవి. తిక్కన సమన్వయ సంధాత అయి హరిహరనాథోపాసనకు ఉపక్రమించాడు. ఎఱ్ఱనగూడ సమన్వయ సంధాతయే. ఆతడు నృసింహపురాణకర్త. అయినా అతడు శైవుడే. ఈ పద్యంలో పరమశివుడినోట ఎఱ్ఱనమహాకవి 'విష్ణుం డఖిలేశ్వరుండు' అని పలికించటం గమనించదగిన అంశం.

**వ. అని పలికి యీశ్వరుం డంతర్హితుం డయ్యెఁ; సింధుపతియు నిజదేశంబునకుం జనియె' ననిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 260**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని వచించి; ఈశ్వరుండు= పరమశివుడు; అంతర్హితుండు+అయ్యెన్= మాయమయ్యాడు; సింధుపతియున్= సింధుదేశపురాజు కూడ, జయద్రథుడు; నిజదేశంబునకున్= తన (సింధుదేశానికి); చనియెన్= వెళ్లాడు; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; జనమేజయుండు; వైశంపాయనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చెప్పి పరమశివుడు మాయమయ్యాడు. సింధుదేశప్రభువు జయద్రథుడు స్వదేశానికి వెళ్ళాడు'. అని వైశంపాయన మహర్షి భారతకథను జనమేజయమహారాజుకు వినిపించాడు. అప్పుడు జనమేజయుడు వైశంపాయనుడిని ఈ విధంగా ప్రశ్నించాడు.

**విశేషం:** (1) జయద్రథుడు సింధుదేశంనుండి అసలు సాళ్వరాజకన్యకను వివాహం చేసికొనటానికై బయలుదేరాడు. మార్గమధ్యాన కామ్యకవనంలో అతడికి ఈ పరాభవం జరిగింది. పిమ్మట ఆతడు గంగాద్వారానికి పోయి తపస్సుచేశాడు. సింధుదేశం పశ్చిమ దిక్కున ఉన్నది. గంగానదీ ముఖద్వారం వంగదేశాన తూరుపుసముద్ర తీరాన ఉన్నది. అటనుండి జయద్రథుడు స్వదేశమైన సింధురాష్ట్రానికి వెళ్ళాడు. మరి- సాళ్వరాజపుత్రిని ఆతడు వివాహ మాడకుండానే స్వదేశానికి తిరిగి వెళ్ళాడని ఊహించవలసి వస్తున్నది.

**తే. 'ధర్మపత్నీసమేతులై తద్వనంబు । నం దపారదుఃఖాతురు లగుచు నున్న**
**రాజముఖ్యులు సత్త్వైకరతులు పాండు । సుతులు మఱి యేమి సేసిరి సూరిముఖ్య!' 261**

**ప్రతిపదార్థం:** సూరి ముఖ్య!= విబుధులలో శ్రేష్ఠుడ వైనవాడా- ఓ వైశంపాయన మహామునీ!; తత్+వనంబునందున్= ఆ కామ్యక వనంలో; ధర్మపత్నీ సమేతులు+ఐ= భార్యతో కూడినవారై, ద్రౌపదీ సహితులై; అపార, దుఃఖ+ఆతురులు+అగుచున్= మిక్కిలి ఆవేదనతో కలత చెందినవారు ఔతూ; ఉన్న= నివసిస్తున్న; రాజముఖ్యులు= రాజులలో శ్రేష్ఠులు; సత్య+ఏక, రతులు= సత్యంలో ముఖ్యమైన అభిరుచి కలవారు; పాండు, సుతులు= పాండు నందనులు; మఱి= ఇంక; ఏమి+చేసిరి= ఏ విధమైన కార్యాలను నెరవేర్చారు?

**తాత్పర్యం:** పండితులలో శ్రేష్ఠుడ వైనవాడా, ఓ వైశంపాయన మహర్షీ! ఆ అడవిలో అంతులేని దుఃఖాన్ని అనుభవిస్తూ, సత్యసంధులైన మహానుభావులు పాండవులు ధర్మపత్ని అయిన పాంచాలితో కూడి ఆ మీదట ఎట్టి కార్యాలు నెరవేర్చారు? దయచేసి వినిపించండి.

**విశేషం:** ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి సంశోధిత మహాభారతం అచ్చుప్రతిలో ఈ పద్యం మొదటిపాదం ఇట్లున్నది.- "ధర్మపత్నీ సమేతులై ద్వైతవనము", ద్వైతవనానికి పాఠాంతరం "తద్వనంబు"గా పేర్కొనబడింది. అప్పుడు పాండవులు ఉన్నది - "ద్వైతవనము" కాదు. 100 సంఖ్యగల గద్యం చూడండి. కాబట్టి తద్వనమ్ము- అనగా ఆ కామ్యకవనం అనే అర్థం ఇచ్చే పాఠమే సరియైనది కావున ఇట ఈ పాఠం స్వీకరించబడింది. 262 సంఖ్య గద్యంలో స్పష్టంగా "కామ్యక వనంబు" అని చెప్పబడింది.

**వ. అనిన నతం డిట్లనియె; నట్లు ద్రౌపదీమోక్షణం బొనరించిన పిదపం గామ్యకవననివాసుండై భూసుర నివహంబుతో నున్న ధర్మజుపాలికి మార్కండేయుం డరుగు దెంచిన, ననుజసహితంబుగాఁ బ్రత్యుద్గతుండై యమ్మునివరుం బ్రభూతసపర్యల సంతుష్టహృదయుం గావించి, యవ్విభుండు పాంచాలియెడ జయద్రథు చేసిన దుర్వ్యవసాయంబు వానిం బరిభవించుటకునై తమ పడిన యాయాసంబును నమ్మహాత్మున కెఱింగించి 'మహనీయ శౌర్యధైర్య ధర్మారంభ సమగ్రుల మైన మా కివ్విధంబున నఖిలసామ్రాజ్యభోగ వియోగంబై దుస్తరం బగు వనవాసంబు సంప్రాప్తం బయ్యెం గావున విధికృతం బెవ్వనికి నెబ్భంగుల నలంఘ్యం బని తలంచెద' నని పలికి మఱియు ని ట్లనియె. 262**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (జనమేజయుడు) చెప్పగా; అతండు= వైశంపాయనుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా వచించాడు; అట్లు= ఆ రీతిగా; ద్రౌపదీ మోక్షణంబు= పాంచాలి చెఱ విడిపించటం; ఒనరించిన పిదపన్= చేసిన పిమ్మట; కామ్యక, వన, నివాసుండు+ఐ= కామ్యకవనంలో జీవిస్తున్నవాడై; భూసుర, నివహంబుతోన్+ఉన్న= బ్రాహ్మణుల సమూహంతో కూడిఉన్న; ధర్మజు పాలికిన్= ధర్మనందనుడి కడకు; మార్కండేయుండు= మృకండు మహాముని పుత్రుడు; అరుగుదెంచినన్= రాగా; అనుజ సహితంబుగాన్= తమ్ములతో కూడినవాడై; ప్రత్యుద్గతుండు+ఐ= లేచి యెదురు వెళ్ళి స్వాగతం చెప్పినవాడై; ఆ+ముని, వరున్= ఆ ఋషులలో శ్రేష్ఠుడు అయినవాడిని; ప్రభూతసపర్యలన్= గొప్పవైన గౌరవంతో కూడిన సేవలతో; సంతుష్ట హృదయున్= సంతృప్తి చెందిన హృదయం కలవాడినిగా; కావించి= ఒనరించి; ఆ+విభుండు= ఆ రాజు (ధర్మనందనుడు); పాంచాలి+ఎడన్= ద్రౌపది పట్ల; జయద్రథు, చేసిన= సైంధవుడు చేసిన; దుర్వ్యవసాయంబు= చెడు కృత్యం; వానిన్= వాడిని జయద్రథుని; పరిభవించుటకున్+ఐ= అవమానించటం కొరకై; తమ పడిన= తాము అనుభవించిన; ఆయాసంబును= శ్రమయును; ఆ+మహా+ఆత్మునకున్= ఆ మహనీయుడికి (మార్కండేయుడికి); ఎఱింగించి= తెలిపి; మహనీయ, శౌర్య, ధైర్య, ధర్మ+ఆరంభ, సమగ్రులము+ఐన= గొప్ప పరాక్రమం చిత్త స్థైర్యం ధర్మమునే ఆచరించ వలెననే సంపూర్ణ వ్యక్తిత్వం కలవారలమైన; మాకున్= మాకు (పాండవులకు); ఈ+విధంబునన్= ఈరీతిగా; అఖిల, సామ్రాజ్య, భోగ, వియోగంబు+ఐ= సమస్తమైన గొప్పరాజ్యంవలన గలిగే సౌఖ్యాలకు ఎడబాటు కల్గి; దుస్తరంబు+అగు= దాటటానికి వీలు లేని; వన, వాసంబు= అడవిలో నివసించటం; సంప్రాప్తంబు+అయ్యెన్= దాపురించింది; కావునన్= కాబట్టి; విధి కృతంబు= దైవంచేత నిర్ణయించబడినట్టిది; ఎవ్వనికిన్= ఏ వ్యక్తికిని; ఏ+భంగులన్= ఏ రీతులలోనైనా; అలంఘ్యము= దాటరానిది; అని, తలంచెదన్= అని భావిస్తాను; అని పలికి= అని వచించి; మఱియున్= వెండియును; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** అని జనమేజయుడు ప్రశ్నించగా, వైశంపాయనమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు: ఆ రీతిగా ద్రౌపదిని చెఱవిడిపించి కామ్యకవనంలో బ్రాహ్మణసమూహంతోపాటు నివసిస్తున్న ధర్మరాజుకడకు మార్కండేయ మహర్షి వచ్చాడు. ధర్మరాజు తాను తమ్ములును ఆ మునీశ్వరుడికి ఎదురేగి స్వాగతసత్కారాలు చేసి, జయద్రథుడు పాంచాలియెడ చేసిన అత్యాచారాన్ని వివరించి తెలిపాడు. అప్పుడు పాండవులు జయద్రథుడితో, ఆతని పరివారవర్గంతో యుద్ధం చేయటం, వాడిని పరాభవించటానికి వారు పడిన ప్రయాస ఆ మహానుభావుడికి తెలిపి, 'మహాత్మా! మేము

మంచివారలం. పరాక్రమప్రాభవం కలవారలం. అయినను ఈ అడవిలో ఇట్టి ఇక్కట్లు అనుభవిస్తున్నాం. విధి విపరిపాకాన్ని ఎంతటి మంచివారైనా ఎంతటి పరాక్రమవంతులైనా తప్పించుకొనలేరని తలపోస్తున్నాను' అని నివేదించి మఱియు ఇట్లా పలికాడు.

**తే. 'ద్రుపదనందనక్రియఁ గడుదుఃఖపడిన । నృపవధూటియు నాయట్ల నియతశోక**
**వనధి నిర్మగ్నుఁ డైన భూవరసుతుండుఁ । గలఁడె వినఁ జూడ ననఘ! యెక్కాలమునను?' 263**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాప రహితుడా! ఓ మార్కండేయ మహర్షీ!; ద్రుపదనందన, క్రియన్= ద్రౌపదివలె; కడున్= మిక్కిలిగా; దుఃఖపడిన= ఆవేదనాన్ని అనుభవించిన; నృప, వధూటియున్= రాజకాంతయున్నూ; నా+అట్లు+అ= నావలెనే; నియత, శోక, వనధి, నిర్మగ్నుఁడు+ఐన= నిత్య దుఃఖం అనే సముద్రంలో మునిగి ఉన్నవాడైన; భూవర సుతుండున్= రాజకుమారుడును; ఏ+కాలముననను= ఏ సమయంలోనైనా; వినన్= వినడానికి; చూడన్= చూడడానికి; కలఁడె?= ఉన్నాడా?.

**తాత్పర్యం:** 'పుణ్యాత్ముడ వైన ఓ మార్కండేయ మహామునీ! ద్రౌపదివలె మిక్కుటమైన ఆవేదనను అనుభవించిన రాజకుమారియున్నూ, నా వలె నిరంతర దుఃఖసముద్రంలో ఓలలాడిన రాజకుమారుడున్నూ ఎక్కడ నయినా ఉన్నాడా? ఏ కాలంలోను మాబోటివారు ఉన్నట్లుగా వినలేదు. చూడలేదు.'

**వ. అనిన నతనికి నత్తపోనిధి యి ట్లనియె. 264**

**తాత్పర్యం:** అనిన ధర్మరాజుకు మహాతపశ్శాలి మార్కండేయుడు ఈ విధంగా చెప్పాడు.

**క. 'కడు దుఃఖము నొందితి నని । యుడుగక యిటు వగచె దేల యుర్వీశ్వర! నీ**
**పడు టేటిది? రఘురాముఁడు । గడఁగి యిడుమ వడఁడె! తొల్లి కాఱడవులలోన్. 265**

**ప్రతిపదార్థం:** ఉర్వీ+ఈశ్వర!= ఓ ధర్మరాజా!; కడున్= మిక్కిలి; దుఃఖమున్= ఆవేదనను; ఒందితిన్+అని= అనుభవించానని; ఉడుగక= మానక; ఇటు= ఈ రీతిగా; వగచెదు+ఏల= ఎందుకు విచారిస్తావు; నీ పడుట+ఏటిది= నీవు పడిన (దుఃఖం) ఏపాటిది?; రఘురాముఁడు= రఘువంశానికి చెందిన శ్రీరాముడు; తొల్లి= పూర్వకాలంలో; కడఁగి= పూని; కాఱు+అడవులలోన్= దట్టమైన (నల్లని) అరణ్యాలలో; ఇడుమ+పడఁడె!= కష్టం అనుభవించ లేదా!.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! మిక్కుటమైన ఆవేదన అనుభవించానని మానక ఇంతగా ఏల విచారిస్తున్నావు? నీవు పడిన కష్టాలకంటె రఘువంశంలో జన్మించిన శ్రీరాముడు ఎక్కువకష్టాలను అనుభవించి ఉన్నాడు. కారడవులలో నివసించి పెక్కు ఇడుమలు పొందాడు సుమా.

**ఉ. ఆ విభుకాంత గాదె జనకాత్మజ రావణుచే గృహీత యై**
**పోవదె; వానరప్రకరముల్ వెసఁ దోడుగ నేఁగి యా ధరి**
**త్రీవిభుఁ డబ్ధిఁ గట్టఁడె, వధింపఁడె దివ్యశరంబులన్ దశ**
**గ్రీవునిఁ; గ్రమ్మఱం జని యకిల్బిషరాజ్యవిభూతి నొందఁడే? 266**

**ప్రతిపదార్థం:** జనక+ఆత్మజ= జానకి; ఆ విభుకాంత+కాదె= ఆ రాజుయొక్క భార్యయేకదా; రావణుచేన్= రావణుడు అనే రాక్షసుడిచేత; గృహీత+ఐ= గ్రహించబడినదై, అపహరించబడినది అయి; పోవదె= వెడలలేదా; వానర ప్రకరముల్= కోతుల

మూకలు; వెసన్= శీఘ్రంగా; తోడుగన్= సాయంరాగా; ఏఁగి= వెడలి; ఆ, ధరిత్రీ విభుఁడు= ఆ రాజు (రాముడు); అబ్ధిన్= సముద్రాన్ని; కట్టఁడె= బంధించడా?; దశగ్రీవునిన్= పదికంఠాలు కలవాడిని రావణుడిని; దివ్యశరంబులన్= దేవతా మహిమ గల బాణాలచేత; వధింపఁడె?= సంహరించడా?; క్రమ్మఱన్= తిరిగి; చని= వెడలి; అకిల్బిష, రాజ్య విభూతిన్= పాపం లేని పుణ్యరాజ్యసంపదను; ఒందఁడే?= పొందడా?.

**తాత్పర్యం:** ఆ రఘురాముడి భార్యయే జనకమహారాజుకూతురు, మహాపతివ్రతాశిరోమణి అయిన సీత. ఆమె రావణాసురుడిచేత అపహరించబడలేదా? కోతిమూకల సాయంతో శ్రీరాముడు సముద్రంపై వారధి కట్టి దివ్యాస్త్రాల చేత రావణుడిని సంహరించలేదా? తిరిగి తన రాజ్యసంపదలను అనుభవించలేదా?

**విశేషం:** ఇట్టి ప్రశ్ననే ధర్మరాజు వేసినపుడు బృహదశ్వ మహాముని నలోపాఖ్యానాన్ని చెప్పాడు. నలదమయంతులు పడినపాట్లు ద్రౌపది పాండవులు పడిన ఇడుములకంటె విషాద పూరితాలు. అట్లే సీతారాముల వనవాసగాథను మార్కండేయుడు ధర్మరాజుకు వివరించి చెప్పాడు.

### ధర్మజునకు మార్కండేయుఁడు రామాయణకథ సెప్పుట (సం. 3-258-4)

**వ.** **అనిన విని ధర్మజుండు 'మునీంద్రా! రాముఁ డెవ్వనివంశంబున వాఁడు? రావణుం డెవ్వని తనయుం? డేమి నిమిత్తంబున సీతాపహరణంబు సేసె? రామరావణులకు సంగ్రామం బెట్లు వర్తిల్లెం? జెప్పవే!' యని రామాయణ కథాశ్రవణకుతూహలియై యడిగిన నమ్మహాముని యి ట్లనియె.** **267**

**ప్రతిపదార్థం:** అనినన్= అని మార్కండేయుడు చెప్పగా; విని= ఆలకించి; ధర్మజుండు= ధర్మనందనుడు; ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడవైనవాడా, ఓ మార్కండేయ మహామునీ!; రాముండు= శ్రీరాముడు; ఎవ్వని వంశంబున వాఁడు?= ఎవరి కుటుంబానికి చెందినవాడు?; రావణుండు; ఎవ్వని, తనయుండు?= ఎవరి కుమారుడు?; ఏమి నిమిత్తంబునన్= ఏ కారణం వలన; సీతా+అపహరణంబు+చేసెన్= సీతను ఎత్తుకొని పోయాడు?; రామ రావణులకున్= రామునకును రావణునకును; సంగ్రామంబు= యుద్ధం; ఎట్లు= ఏ రీతిగా; ప్రవర్తిల్లెన్?= జరిగింది?; చెప్పవే= వినిపించవా; అని= అంటూ; రామయణ, కథా, శ్రవణ, కుతూహలి+ఐ= రామాయణ కథను వినటానికి ఆసక్తి కలవాడై; అడిగినన్= ప్రశ్నించగా; ఆ+మహా, ముని= మార్కండేయుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని మార్కండేయుడు చెప్పగా ఆలకించి ధర్మరాజు- 'ఓ మార్కండేయ మహామునీ! శ్రీరాముడు ఏ వంశానికి చెందినవాడు? రావణుడు ఎవరి కుమారుడు? ఏ కారణాన రావణుడు సీతాదేవిని అపహరించాడు? రాముడికీ రావణుడికీ యుద్ధం ఏ విధంగా జరిగింది? దయచేసి వివరించి చెప్పవా?' అని రామాయణకథను వినవలె ననే వేడుకతో ప్రశ్నించాడు. మార్కండేయమహర్షి ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**విశేషం:** (1) ఇది మహాభారతంలో అంతర్గర్భితమైన రామాయణ కథ. ఎఱ్ఱన మహాకవి ప్రత్యేకంగా రామాయణాన్ని వ్రాశాడు. ఆ విషయంలో సందేహానికి ఎట్టి ఆస్కారమూ లేదు. కాని, దురదృష్టవశాన ఎఱ్ఱనరామాయణం నేడు ఉపలబ్ధం కాదు. ప్రాచీనాలంకారికులు ఎఱ్ఱన రామాయణంలోనివని ఉదాహరించిన పద్యాలు భారతాంతర్గతమైన ఈ రామాయణభాగంలో కన్పించవు. ఇక ఎఱ్ఱనరామాయణం ఏమైనట్లు? అది భవిష్యత్కాల పరిశోధకులు తేల్చవలసిన అంశం.

(2) రామాయణం అనగా శ్రీరామునియాత్ర వనవాసగమనం. నలోపాఖ్యానంవలె రామాయణగాథ కూడ విషాదాత్మకం; భావితాంతఃకరణప్రవృత్తిని సహృదయులకు సంఘటించే వృత్తం. నవరసరుచిరం. పలువురు రామాయణ మహాభారత కథలను అనుసరించి తులనాత్మక పరిశోధనకు పూనుకోవటం కద్దు. కురుక్షేత్ర సంగ్రామం మహాభారతకథకు వెన్నెముక. రామరావణ సంగ్రామం గూడ యుద్ధవర్ణనలో ప్రపంచసారస్వతంలో పేర్కొనదగిన ఘట్టం.

(3) ప్రాచీనభారతీయవాఙ్మయాన వీరగాథలు, విషాదాత్మకగాథలు సుప్రసిద్ధాలు. యుగయుగాంతరాల సహృదయుల హృదయాలను ఉర్రూతలూగించిన నలోపాఖ్యానం, రామాయణ గాథ మహాభారతంకంటె మిక్కిలి ప్రాచీనాలనిన్నీ పృథగ్భూతాలైన ఆ ప్రాచీనతను వీరవిషాదగాథలు మహాభారతంలో తరువాత చేర్చబడినవనిన్నీ పాశ్చాత్యవిమర్శకులు పలువురి అభిప్రాయం. రామాయణగాథ మిక్కిలి ప్రాచీన మైన దనటానికి నిర్వికల్పనిదర్శనం నవీనశాస్త్రజ్ఞులు నరుడికి ప్రపితామహులుగా భావించే 'వానర' పాత్రలు అందులో కన్పించటం.

**క. 'విను మిక్ష్వాకుకులంబున । జనియించె నజుండు నాఁ బ్రశస్తచరితుఁ డా**
**తని కొడుకు దశరథుఁడు; ముద । మున నాతఁడు పెండ్లియయ్యె ముగ్వురు సతులన్. 268**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; ఇక్ష్వాకు, కులంబునన్= ఇక్ష్వాకులయొక్క వంశంలో; అజుండు; నాన్= అనగా; ప్రశస్త, చరితుఁడు= మంచి స్వభావం కలవాడు; జనించెన్= పుట్టాడు; ఆతని కొడుకు= ఆతడి యొక్క (అజుడి యొక్క) పుత్రుడు; దశరథుఁడు= దశరథుడు అనేవాడు; ఆతఁడు= ఆ దశరథుడు; ముదమునన్= వేడుకతో; ముగ్వురు= ముగ్గురు; సతులన్= పతివ్రతలను; పెండ్లి+అయ్యెన్= వివాహమాడాడు.

**తాత్పర్యం:** చెపుతున్నాను సావధానంగా వినుము. ఇక్ష్వాకువంశంలో అజుడు అనే మంచి నడవడిక కల రాజు జన్మించాడు. అతడికి దశరథుడు అనే కొడుకు పుట్టాడు. ఆ దశరథుడు వేడుకతో ముగ్వురు సతులను పెండ్లాడాడు.

**వ. అందుఁ గౌసల్య కురాముండును, గైకేయికి భరతుండును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును జనియించి; రందు రామునకు విదేహరాజనందన యైన సీత ప్రియాంగన యయ్యెఁ; నిఁక రావణుజన్మంబు సెప్పెద వినుము. 269**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ ముగ్వురియందు; కౌసల్యకున్= కౌసల్యఅనే సతికి; రాముండును= రాముడు అనేవాడును; కైకేయికిన్; భరతుండును; సుమిత్రకున్; లక్ష్మణ; శత్రుఘ్నులును; జనియించిరి= పుట్టారు; అందున్= ఆ పుత్రులలో; రామునకున్; విదేహ, రాజ, నందన+ఐన= విదేహరాజుయొక్క కుమారి అయిన; సీత; ప్రియ+అంగన= ఇష్టమైన వనిత-భార్య; అయ్యెన్= అయింది; ఇఁకన్= ఇకమీద; రావణు జన్మంబు= రావణుడి పుట్టుకనుగురించి; చెప్పెదన్= వచిస్తాను; వినుము= ఆకర్ణించుము.

**తాత్పర్యం:** ఆ దశరథుడిభార్యలలో కౌసల్యకు రాముడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులున్నూ జన్మించారు. వారిలో రాముడికి విదేహరాజకుమారి సీత అనుగు భార్య అయింది. ఇక రావణుడిపుట్టుకనుగూర్చి చెప్పుతాను. ఆలకించుము.

**ఆ. అఖిలలోకకర్త యగు విరించికిఁ బుల । స్త్యుండు నాఁగ మానసుఁడు దనూజుఁ**
**డుద్భవించె; నతని కుదయించె వైశ్రవ । ణాభిధానుఁడైన యాత్మజుండు. 270**

**ప్రతిపదార్థం:** అఖిల, లోక, కర్త,+అగు= సమస్తలోకాలను సృష్టి చేసేవాడైన; విరించికిన్= బ్రహ్మదేవుడికి; పులస్త్యుండు; నాఁగన్= అనఁగా; మానసుఁడు= మనస్సుకు సంబంధించినవాడు; తనూజుఁడు= కొడుకు; ఉద్భవించెన్= జనించాడు; అతనికిన్= వాడికి (ఆ పులస్త్యుడికి); వైశ్రవణ+అభిధానుఁడు+ఐన= వైశ్రవణుడు అనే పేరు కల వాడైన; ఆత్మజుండు= కొడుకు; ఉదయించెన్= పుట్టాడు.

**తాత్పర్యం:** సమస్తలోకాలను సృజించే బ్రహ్మదేవుడికి 'మానస పుత్రుడై' పులస్త్యుడు అనేవాడు పుట్టాడు. ఆ పులస్త్యుడికి వైశ్రవణుడు అనే కుమారుడు జన్మించాడు.

**విశేషం:** కుమారుడు జన్మించటం అనగా వైవాహికధర్మాచరణలో భార్యాభర్తలకు సంతానం కలగటం. ఇట- పులస్త్యుడు సృష్టి కర్తకు ఆ విధంగా పుట్టిన కొడుకు కాడు. బ్రహ్మదేవుడి మనస్సునుండి పుట్టినవాడు. అనగా పులస్త్యుడు బ్రహ్మమానసపుత్రుడు.

**వ.** **ఆ వైశ్రవణుండు దన తండ్రి యగు పులస్త్యుని విడిచి, తాత యగు చతుర్ముఖునకుం దపంబు సేసి నలకూబరుం డను కొడుకును లోకపాలకత్వంబును ధనేశ్వరత్వంబును లంక యను పురంబును శంకరుతోడి సఖ్యంబును వరంబులుగాఁ బడసి, మహావిభూతితో వర్తిల్లుచున్నంగని, యలిగి, పులస్త్యుండు నిజశరీరంబునం దర్ధంబున విశ్రవసుం డను వాని సృజియించి, యా వైశ్రవణున కహితంబు సేయు మని పనిచిన నెఱింగి, కిన్నరేశ్వరుండు విశ్రవసుపాలి కరుదెంచి 'మహాత్మా! యేను నీకుం బుత్త్రుండ నయ్యెద; నాకుం గరుణింపు' మని యతనిం బ్రసన్నునిం జేసి నృత్తగీతవిద్యావిశారద లయిన రాక్షసస్త్రీలం బుష్పోత్కటయు, మాలినియు, బకయు నను వారి ముప్పుర నవ్వి ప్రవరునకుఁ బరిచారికలంగా నిచ్చిన.271**

**ప్రతిపదార్థం:** ఆ వైశ్రవణుండు= ఆ వైశ్రవణుడు; తన తండ్రి+అగు= తన యొక్క జనకుడు అయిన; పులస్త్యుని విడిచి= పులస్త్యుడిని వదలిపెట్టి; తాత+అగు= పితామహుడు అయిన; చతుర్ముఖునకున్= నాలుగు మోములు కల బ్రహ్మదేవుడిని గూర్చి; తపంబు+చేసి= తపస్సు చేసి; నలకూబరుండు+అను, కొడుకును= నలకూబరుడు అనే పేరు కల పుత్రుడిని; లోక పాలకత్వంబును= లోకాన్ని పరిపాలించటమున్నూ; ధన+ఈశ్వరత్వంబును= ధనానికి ఆధిపత్యం వహించటమున్నూ; లంక+అను పురంబును= లంక అనే పేరు కల పట్టణమున్నూ; శంకరుతోడి సఖ్యంబును= శివుడితోడి మైత్రియున్నూ; వరంబులుగాన్= వరాలుగా; పడసి= పొంది; మహా, విభూతితోన్= గొప్ప సంపదతో; వర్తిల్లు చున్నన్= సాగుతూ ఉండగా; కని= చూచి; అలిగి= కోపం పొంది; పులస్త్యుండు= పులస్త్యుడు (బ్రహ్మమానసపుత్రుడు); నిజ, శరీరంబు నందున్= తన దేహంలో; అర్థంబునన్= సగం భాగంతో; విశ్రవసుండు+అను వానిన్= విశ్రవసుడు అనే పేరు కల వాడిని; సృజియించి= పుట్టించి; ఆ వైశ్రవణునకున్; అహితంబు= కీడు; చేయుము+అని= సలుపుము అని; పనిచినన్= నియోగించగా; ఎఱింగి= తెలిసికొని; కిన్నర+ఈశ్వరుండు= కిన్నరులకు ప్రభువు; విశ్రవసుపాలికిన్!= విశ్రవసుడి దగ్గరకు; అరుదెంచి= వచ్చి; మహా+ఆత్మా= మహానుభావుడవైన ఓ విశ్రవసూ! ఏను= నేను; నీకున్= నీకు; పుత్త్రుండన్+అయ్యెదన్= కొడుకును కాగలను; నాకున్+కరుణింపుము= నాయెడ దయ చూపుము; అని= వచించి; అతనిన్= వాడిని- విశ్రవసుడిని; ప్రసన్నునిన్+చేసి= అనుకూలుడుగా చేసికొని; నృత్త, గీత, విద్యా, విశారదలు+అయిన= నాట్యంలోను, గానంలోను నేర్పుకలవారు అయిన; రాక్షస స్త్రీలన్= రాక్షస వనితలను; పుష్పోత్కటయు, మాలినియు, బకయున్+అనువారిన్= పుష్పోత్కట, మాలిని, బక అనే వారిని; ముప్పురన్= ముగ్గురిని; ఆ+విప్ర, వరునకున్= ఆ బ్రాహ్మణోత్తముడికి; పరిచారికలుగాన్= సేవకురాండ్రుగా; ఇచ్చినన్= అర్పించగా.

**తాత్పర్యం:** ఆ వైశ్రవణుడు తన తండ్రి అయిన పులస్త్యుడిని సరకుగొనక, పితామహుడు అయిన బ్రహ్మదేవుడిని గూర్చి తపస్సు చేసి, నలకూబరుడు అనే కొడుకును, లోకపాలకత్వాన్నీ (కిన్నరలోక ప్రభుత్వాన్ని), ధనానికి ఆధిపత్యాన్నీ,

లంకాపట్టణాన్నీ, శివుడితో స్నేహాన్నీ వరాలుగా పొందాడు. ఆ వైశ్రవణుడి సంపద చూచి కోపగించుకొని పులస్త్యుడు తన శరీరపు సగంభాగంనుండి విశ్రవసుడు అనేవాడిని సృజించి, ఆ వైశ్రవణుడికి కీడు చేయు మని నియోగించాడు. వైశ్రవణుడు ఆ వృత్తాంతాన్ని, తెలిసికొని, విశ్రవసుడి కడ కేగి 'మహాత్మా! నేను నీకు కొడుకుగా ఉండగలను; నాయందు దయ చూపుము' అని ప్రార్థించి, అతడి అనుగ్రహాన్ని చూరగొని, నృత్తంలోనూ గానంలోనూ ప్రావీణ్యం గల ముప్వురు రాక్షసవనితలను- 'పుష్పోత్కట, మాలిని, బక' అనే పేరుకల వారలను ఆ బ్రాహ్మణోత్తముడికి సేవకురాండ్రుగా సమర్పించాడు.

**విశేషం:** (1) ప్రాచీన పురాణవాఙ్మయంలో వైశ్రవణుడికి 'కుబేరుడు' అనే నామాంతరం ఉన్నది. అతడు కిన్నరలోకపాలకుడు. కిన్నరులు అశ్వముఖం నరశరీరం కల వేల్పులు. కిన్నరులు సంగీతప్రియులు.

(2) విశ్రవసుడికి పరిచారికలు ముప్వురు. పుష్పోత్కట, మాలిని, బక. బకకు పాఠాంతరం కొన్ని ప్రతులలో "పాక"గా కనుపిస్తున్నది. ఇట "బక" పాఠమే గ్రహించబడింది. కారణం-273 సంఖ్య గల గద్యంలో ఎఱ్ఱన బకకు ఖరుండును శూర్పణఖ యను కన్యకయు- 'మిథునంబై' ప్రభవించినట్లు వ్రాశాడు. సంస్కృత మూలం దాక్షిణాత్యప్రతిలో "బకాయాం మిథునమ్ జజ్ఞే ఖరః శూర్పణఖా తథా' అని ఉన్నది. దీనినిబట్టి ఎఱ్ఱన దాక్షిణాత్యప్రతినే ప్రామాణికంగా ఎన్నినట్లు తలపవచ్చును. కావున ఖరుడికి శూర్పణఖకు తల్లి అయిన పరిచారిక పేరు "బక" అని నిర్ణయించవచ్చును. కొన్ని ఔత్తరాహప్రతులందు ఆమె పేరు "పాక" అని ఉన్నది.

**క.** **పురుడున నయ్యువతులు నొం। డొరులం గడవంగ విలసదుపచారసమా**
**చరణప్రవీణభంగులఁ। బరితోషితుఁ జేసి రా తపస్విపరేణ్యున్.** **272**

**ప్రతిపదార్థం:** ఆ+యువతులు= ఆ జవరాండ్రు; పురుడునన్= పోలికలో (పోటీపడుతూ); ఒండు+ఒరులన్= ఒకరినొకరు; కడవంగన్= అతిక్రమించేటట్లుగా; విలసత్+ఉపచార, సమ్+ఆచరణ, ప్రవీణ భంగులన్= శోభిల్లే పరిచర్యలు బాగా చేసే సామర్థ్యంలోని రీతులలో; ఆ తపస్వి, వరేణ్యున్= ఆ మునులలో శ్రేష్ఠుడు అయినవాడిని; పరితోషితున్= మిక్కిలి సంతోషం చెందిన వాడినిగా; చేసిరి= ఒనరించారు.

**తాత్పర్యం:** సమానులయందుండే స్పర్ధతో ఆ జవ్వనులు ఆ మునిశ్రేష్ఠుడైన విశ్రవసుడికి పరిచర్య చేశారు. ఒకరి నొకరు మించవలెననే కోరికతో ఆతడిని మిక్కిలి సంతోషపెట్టారు.

**వ.** **ఇట్లు ప్రీతుండై యతండు వారలకుఁ బుత్త్రదానంబు సేసిన నందుఁ బుష్పోత్కటకు రావణ కుంభకర్ణులును, మాలినికి విభీషణుండును, బకకు ఖరుండును శూర్పణఖ యను కన్యకయు మిథునంబై ప్రభవించి; రక్కుమారులకు నలువురకుఁ దజ్జనకుండు జాతకర్మాదిసంస్కారంబు లొనరించి సగౌరవంబుగాఁ బెనిచి యుపనీతులం జేసె; నందు.** **273**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ప్రీతుండు+ఐ= సంతుష్టి చెందినవాడై; అతండు= అతడు- విశ్రవసుడు; వారలకున్= ఆ ముగ్గురు పరిచారికలకు; పుత్త్ర దానంబు+చేసినన్= సంతానాన్ని దానం చేయగా; అందున్= వారిలో; పుష్పోత్కటకున్= పుష్పోత్కట అనే ఆమెకు; రావణ, కుంభకర్ణులును= రావణుడు కుంభకర్ణుడు అనే వారున్నూ; మాలినికిన్= మాలిని అనే ఆమెకు; విభీషణుండును= విభీషణుడును; బకకున్= బక అనే ఆమెకు; ఖరుండును= ఖరుడును; శూర్పణఖ= శూర్పణఖ

అనే పేరు కల; కన్యకయున్= కన్నెయు; మిథునంబు+ఐ= జతగా, కవలై; ప్రభవించిరి= పుట్టారు; ఆ కుమారులకున్= ఆ బిడ్డలకు; నలువురకున్= నలుగురికి - రావణ కుంభకర్ణ విభీషణ ఖరులకు; తత్+జనకుండు= వారి తండ్రి విశ్రవసుడు; జాతకర్మ+ఆది, సంస్కారంబులు= పుట్టినప్పుడు చేసే కర్మలు మున్నగు క్రియలు; ఒనరించి= చేసి; స గౌరవంబుగాన్= మంచి మర్యాదలతో; పెనిచి= పెంచి; ఉపనీతులన్+చేసెన్= వడుగులు అయినవారిగా చేశాడు; అందున్= వారిలో.

**తాత్పర్యం:** ఈ విధంగా పరిచారికలయెడ ప్రీతి కలవాడై; విశ్రవసుడు వారలకు సంతానం ప్రసాదించాడు. పుష్పోత్కటకు రావణుడు కుంభకర్ణుడు జన్మించారు. మాలినికి విభీషణుడు పుట్టాడు. బకకు ఖరుడు శూర్పణఖ అనే ఆడ, మగజంట కవలబిడ్డలై ఉద్భవించారు. ఆ నలుగురు కుమారులకు తండ్రి అయిన విశ్రవసుడు జాత కర్మాది సంస్కారాలు చేసి వారలకు వడుగులు చేశాడు. వారిలో.

**విశేషం:** జాతకర్మలు పదునారు. జీవుడు పుట్టటానికి పూర్వంనుండి గిట్టేవరకు జరుగవలసిన వైదికసంస్కారాలు. 1. గర్భాదానం 2. పుంసవనం 3.సీమంతం 4. జాతకర్మం 5. నామకరణం 6. అన్నప్రాశనం 7. చౌలం 8. ఉపనయనం 9. ప్రాజాపత్యం 10. సౌమ్యం 11. ఆగ్నేయం 12. వైశ్వదేవం 13. గోదానం 14. సమావర్తం 15. వివాహం 16. అంత్యసంస్కారం.

**ఉ.** **ఆతతతేజుఁ డున్నతభుజాగ్రుఁడు లోకభయంకరుండు వి**
**ఖ్యాతపరాక్రముండు దశకంఠుఁడు సంతతరోషమానసుం;**
**డాతనియట్ల దుర్మదమయాత్ముఁడు క్రూరుఁడు గుంభకర్ణుఁడున్;**
**భీతివిదూరుఁ డార్యుఁడు విభీషణుఁ డుత్తమచిత్తుఁ డారయన్.** **274**

**ప్రతిపదార్థం:** దశకంఠుఁడు= పదికంఠాలు కలవాడు- రావణుడు; ఆతత+తేజుఁడు= విస్తార మయిన ప్రకాశం కలవాడు; ఉన్నత, భుజ+అగ్రుఁడు= ఎత్తయిన బాహువుల కొనలు కలవాడు; లోక భయంకరుండు= జగత్తులకు భీతి కలిగించే వాడు; విఖ్యాత, పరాక్రముండు= పేరు ప్రతిష్ఠల నార్జించిన శౌర్యం కలవాడు; సంతత, రోష, మానసుండు= ఎల్లప్పుడూ ప్రజ్వలించిన క్రోధం కలవాడు; కుంభకర్ణుఁడున్= కుంభకర్ణుడు అనేవాడు కూడ; ఆతని+అట్లు+అ= ఆతని వంటివాడే (రావణుడివంటివాడే); దుర్మద, మయ+ఆత్ముఁడు= చెడు గర్వంతో కూడిన ఆత్మ కలవాడు; క్రూరుడు= కఠిన చిత్తుడు; భీతి విదూరుఁడు= భయం లేని వాడు; విభీషణుడు= విభీషణుడు అనేవాడు; ఆర్యుఁడు= మంచి లక్షణాలు కలిగి పూజించ తగినవాడు; ఆరయన్= పరిశీలించగా; ఉత్తమ, చిత్తుఁడు= మంచి మనస్సు కలవాడు.

**తాత్పర్యం:** వారిలో రావణుడు విస్తారమైన వర్చస్సు కలవాడు, ఎత్తయిన భుజాలు కలవాడు, పేరుప్రతిష్ఠలను ఆర్జించిన పరాక్రమం కలవాడు, పదితలలు కలవాడు, ఎల్లప్పుడు ప్రజ్వలించే క్రోధంతో ఉండేవాడు. ఆతడివంటివాడే కుంభకర్ణుడు కూడ. మిక్కిలి కఠినచిత్తం కలవాడు, చెడుగర్వంతో నిండిన హృదయం కలవాడు. కాని, విభీషణుడు మాత్రం నిర్భయుడు, మంచిగుణాలు కలిగి మన్నించతగినవాడు. పరిశీలించి చూస్తే గొప్పమనస్సు కలవాడు.

**విశేషం:** ఎత్తైన భుజాలు కలిగి ఉండటం శౌర్యలక్షణంగా సాముద్రికశాస్త్రవేత్తలు భావిస్తారు.

**క.** **ఖరుఁడు ఖరతేజుఁ డవనీ । సుర పరిభవకారి మాంసశోణితభుజుఁ డు**
**ద్ధురచిత్తుఁడు శూర్పణఖయు । దురితచరిత ధర్మకర్మదూషిత యెపుడున్.** **275**

**ప్రతిపదార్థం:** ఖరుఁడు= ఖరుడు అనే పేరు కలవాడు; ఖర తేజుఁడు= వాడిమి, వేడిమి కలవాడు; అవనీ సుర, పరిభవ, కారి= బ్రాహ్మణులకు అపకారం చేసేవాఁడు; మాంస శోణిత భుజుఁడు= మాంసం నెత్తురు భుజించేవాడు; ఉద్ధుర చిత్తుఁడు= కఠిన మైన మనస్సు కలవాడు; శూర్పణఖ యున్= శూర్పణఖ అనే పేరు కలదికూడ; దురిత చరిత= పాపం చేసే స్వభావం కలది; ఎపుడున్= ఎల్లప్పుడును; ధర్మ, కర్మ, దూషిత= ధర్మమైన పనులచే తిరస్కరించబడేది.

**తాత్పర్యం:** ఖరుడు అనేవాడు వాడిమి, వేడిమిగల వర్చస్సు కలవాడు. బ్రాహ్మణులను అవమానించేవాడు. మాంసాన్ని నెత్తురును ఆహారంగా స్వీకరించేవాడు. కఠినమైన మనస్సు కలవాడు. శూర్పణఖ పాపాత్మురాలు. ధర్మకర్మలను తిరస్కరించేస్వభావం కలది.

**విశేషం:** రామాయణపాత్రలకు ఆయాపేరులు సార్థకనామధేయాలుగా కన్పిస్తాయి. ఖరుడు వాడిమి వేడిమి కలవాడనే కాక గాడిదవంటివాడు అని అర్థం కూడ ఏర్పడుతుంది. శూర్ప+నఖ= శూర్పణఖ= చేటలవంటి గోళ్లు కలది. కుంభకర్ణుఁడు= కుండల వంటి చెవులు కలవాడు. రావణుడు= జగద్రావణం చేసేవాడు.

**వ. ఆ రాక్షసకుమారులు దండ్రివలన నఖిలవేదవేదాంగ ధనుర్వేదపారగులై గంధమాదన గిరియందు సుఖం బుండి యొక్కనాఁ డతనికి మ్రొక్కవచ్చువాని నధికవిభవసమన్వితు వైశ్రవణుం జూచి తత్ప్రభావంబు తపోలబ్ధం బగుట విని జాతమత్సరు లయి తారును బితామహు నుద్దేశించి తపంబు సేయం దొడంగిరి; తత్ప్రకారంబు వినుము. 276**

**ప్రతిపదార్థం:** ఆ రాక్షస కుమారులు= ఆ రక్కసుల బిడ్డలు; తండ్రివలనన్= జనకుడివలన; అఖిల వేద, వేద+అంగ, ధనుః +వేద, పారగులు+ఐ= సమస్త వేదాలు, వేదాలయొక్క అంగాలు, విలువిద్యలయొక్క అవ్వలిగట్టును చేరినవారై; గంధమాదన, గిరియందున్= గంధమాదనం అనే పర్వతంలో; సుఖంబు+ఉండి= సౌఖ్యంతో నివసించి ఉండి; ఒక్కనాఁడు= ఒకరోజున; అతనికిన్= విశ్రవసునికి; మ్రొక్కన్ వచ్చు వానిన్= నమస్కరించటానికై వచ్చిన వాడిని; అధిక, విభవ, సమన్వితున్= గొప్ప సంపదతో కూడిన వాడిని; వైశ్రవణున్+చూచి= కుబేరుడిని కాంచి; తత్+ప్రభావంబు= ఆతడియొక్క మహిమ; తపస్+ లబ్ధంబు+అగుట= తపస్సువలన సిద్ధించింది. అగుట; విని= ఆలకించి; జాత మత్సరులు+అయి= అసూయ కలవారయి; తారును= తాముకూడా; పితామహున్= బ్రహ్మదేవుడిని; ఉద్దేశించి= లక్ష్యంగా పెట్టుకొని; తపంబు+చేయన్+తొడంగిరి= తపస్సు చేయడానికి పూనుకొన్నారు; తత్+ప్రకారంబు= ఆ తపస్సు యొక్క వృత్తాంతం; వినుము= ఆలకింపుము.

**తాత్పర్యం:** ఆ రాక్షసకుమారులు జనకుడిదగ్గర వేదాలు వేదాంగాలు విలువిద్య అన్నింటిని క్షుణ్ణంగా అభ్యసించి, గంధమాదనపర్వతంలో సుఖంగా ప్రొద్దుపుచ్చుతూ ఉన్నారు. ఒకనాడు కుబేరుడు విశ్రవసుడికి అభివాదం చేయటానికై అచటికి వచ్చాడు. కుబేరుడివైభవం, మహిమలు, అతడికి తపస్సువలననే సంక్రమించినట్లు విని, అసూయ చెంది తాముకూడ బ్రహ్మదేవుడినిగూర్చి తపస్సు చేయటానికి పూనుకొన్నారు. వారి తపోవృత్తాంతం వివరిస్తాను. వినుము.

**తే. మండు వేసవిఁబంచాగ్ని మధ్యమున, ఘ । నాగమంబున బయల, నత్యంత తుహిన**
**సమయమున నీరియందు, నిశ్చలత నిలిచి । దశముఖుఁడు వాయుభక్షుఁ డై తప మొనర్చె. 277**

**ప్రతిపదార్థం:** దశముఖుఁడు= పది మొగాలు కలవాడు; వాయు భక్షుఁడు+ఐ= గాలినిమాత్రమే ఆహారంగా భుజించినవాడై; మండు వేసవిన్= ఎండలు చెండుతున్న వేసవి కాలంలో; పంచ+అగ్ని, మధ్యమునన్= అయిదు అగ్నుల మధ్యలో ఉండి;

ఘన+ఆగమంబునన్= వర్షాకాలంలో; బయలన్= బహిరంగ ప్రదేశంలో; అత్యంత, తుహిన, సమయమునన్= మిక్కుటంగా మంచు కురిసే కాలంలో; నీరియందున్= జలంలో; నిశ్చలతన్= చలించకుండా; నిలిచి= నిలబడిఉండి; తపము= తపస్సు; ఒనర్చెన్= చేశాడు.

**తాత్పర్యం:** పదిమొగాలు కల రావణుడు కఠినతపస్సు చేశాడు. వేసవి మండుటెండల సమయంలో అయిదు అగ్నులనడుమ నిలిచి తపస్సు చేసేవాడు. వానకాలంలో ఆరుబయట, మంచుకురిసేకాలంలో నీటిలోనూ నిష్ఠతో నిలబడి రావణుడు కేవలం గాలినిమాత్రమే ఆహారంగా గైకొని తపస్సు చేశాడు.

**విశేషం:** పంచాగ్నులు= పంచ+అగ్నులు= అయిదు అగ్నులు. 1. ఆహవనీయం 2. దక్షిణాగ్ని 3. గార్హపత్యం 4. సభ్యం 5. అవసథ్యం. వాటిని వరుసగా వేదికకు పూర్వ దక్షిణ పశ్చిమ-దిక్కులలోనూ, సభ్యం అపసథ్యం ఈశాన్యదిక్కునను నిలుపుతారు.

**మ. నియతాహారుఁడు నిర్జితేంద్రియుఁడు నై నిష్కంపవృత్తిన్ మహీ**
**శయనుండై వ్రతముల్ చరించె నధికేచ్ఛం గుంభకర్ణుండు ధై**
**ర్యయుతుండై; ఘనుఁ డవ్విభీషణుఁడు పర్ణాహారవృత్తిన్ జపా**
**ధ్యయనాసక్తిఁ దపంబు సేసె మది నత్యంతంబు సంశుద్ధితోన్. 278**

**ప్రతిపదార్థం:** కుంభకర్ణుండు; నియత+ఆహారుఁడు= కట్టడికి లోనై తిండి తినే వాడు; నిర్జిత+ఇంద్రియుఁడున్+ఐ= గెలువబడిన ఇంద్రియాలు కలవాడై, ఇంద్రియాలను అదుపులో పెట్టిన వాడై; నిష్కంపవృత్తిన్= చలించని వ్యాపారం కలవాడై; మహీ, శయనుండు+ఐ= నేలమీద పడుకొంటున్నవాడై; అధిక+ఇచ్ఛన్= మిక్కుటమైన కోరికతో, లక్ష్యసిద్ధియందు తదేకధ్యానం కలవాడై; వ్రతముల్= నోములు; చరించెన్= ఆచరించాడు; ఘనుఁడు= గొప్పవాడు; ధైర్యయుతుండు+ఐ= వికారాలు లేనట్టి స్థిర చిత్తం కలవాడై; ఆ+విభీషణుఁడు; పర్ణ+ఆహార, వృత్తిన్= ఆకులు మాత్రమే తిండిగా భుజిస్తూ; జప+అధ్యయన+ఆసక్తిన్= మంత్రాల ఆవృత్తి, వేదాల పారాయణంలోని కోరికచేత; మదిన్= చిత్తంలో; అత్యంతంబున్= మిక్కుటంగా; సంశుద్ధితోన్= స్వచ్ఛమైన పవిత్రతతో; తపంబు+చేసెన్= తపస్సు చేశాడు.

**తాత్పర్యం:** కుంభకర్ణుడు ఆహారనియమాలను పాటిస్తూ, ఇంద్రియాలను నిగ్రహించి చలించనిమనస్సు కలవాడై వ్రతాల నాచరించాడు. గొప్పవా డైన ఆ విభీషణుడు ఆకులుమాత్రమే ఆహారంగా భుజించినవాడౌతూ మంత్రాలను ఆవృత్తి చేస్తూ, వేదాలను వల్లెవేస్తూ మనస్సును నిర్మలంగా పవిత్రంగా ఒనరించుకొంటూ తపస్సు చేశాడు.

**విశేషం:** ఇంద్రియాలను నిగ్రహించటం తపస్సుకు అపరిహార్యమైన లక్షణం.

**వ. ఖరుండును శూర్పణఖయు వారికిం దగిన పరిచర్యలు సేయుచుండి; రంత సహస్రవర్షంబులు నిండినం బంక్తివదనుండు దనమస్తకం బొక్కటి ఖండించి మండెడు నగ్నియందు వేల్చి మఱియు వేయేండ్ల కొక్కటిగాఁ దలలు తొమ్మిదియుం దఱిగి వేల్చిధైర్యంబు దఱుఁగక పదియగు తలయును ద్రెంప సమకట్టినఁ బితామహుండు ప్రత్యక్షంబై వారించి, వాని శిరంబు లెప్పటి యట్ల కలుగ నొసంగి 'యమరత్వంబు దక్కనొండు నీ కభిమతం బగునది యెయ్యది యైనను నడుగు' మనుటయు నన్నిశాచరుండు. 279**

**ప్రతిపదార్థం:** ఖరుండును= ఖరుడును; శూర్పణఖయున్= శూర్పణఖయు; వారికిన్= (రావణ, కుంభకర్ణ, విభీషణులకు); తగిన= సరిపోయే; పరిచర్యలు= సేవలు; చేయుచున్+ఉండిరి; అంతన్= అంతట; సహస్ర వర్షంబులు= వేయిఏండ్లు; నిండినన్= పూర్తి అయిన పిమ్మట; పంక్తి వదనుండు= దశకంఠుడు - రావణుడు; తన మస్తకంబు= తన శిరము; ఒక్కటి= ఒక్కటి; ఖండించి= కత్తిరించి; మండెడు= జ్వలించే; అగ్నియందున్= నిప్పులో; వేల్చి= ఆహుతి చేసి; మఱియున్= ఇంకను; వేయేండ్లకున్= వేయి సంవత్సరాలకు; ఒక్కటిగాన్= ఒక శిరస్సుగా; తలలు= శిరములు; తొమ్మిదియున్= తొమ్మిదింటిని; తఱిగి= నరికి; వేల్చి= ఆహుతి చేసి; ధైర్యంబు= చిత్తంలోని దిటవుతనం; తఱుఁగక= తగ్గక; పది+అగు, తలయును= పదియవ శిరస్సును; త్రెంపన్= త్రుంచటానికి; సమకట్టినన్= పూనగా; పితామహుండు= బ్రహ్మదేవుడు; ప్రత్యక్షంబు+ఐ= సాక్షాత్కరించి; వారించి= ఆపి; వాని శిరంబులు= ఆతని తలలు- రావణుడి తలలు; ఎప్పటి+అట్ల= యథాప్రకారం; కలుగన్= ఏర్పడేటట్లు; ఒసంగి= వరం ఇచ్చి; అమరత్వంబు, తక్కన్= చావు లేకపోవటం తప్ప; ఒండు= ఇంకొకటి; నీకున్+అభిమతంబు+అగునది= నీకు ఇష్టం అయినది; ఎయ్యది+ఐనను= ఏది అయినప్పటికి; అడుగుము= కోరుము; అనుటయున్= అని చెప్పటమున్నూ; ఆ+నిశాచరుండు= ఆ రాక్షసుడు- రావణుడు.

**తాత్పర్యం:** ఖరుడును శూర్పణఖయు తమ అన్నగారలు అయిన రావణుడికి కుంభకర్ణుడికి విభీషణుడికి అవసరమైన సేవలు చేస్తూ ఉన్నారు. వేయి సంవత్సరాలు ఆ విధంగా తపస్సు చేసినను బ్రహ్మదేవుడు సాక్షాత్కరించలేదు. అయినను రావణుడు తనదీక్షను వీడక తన పదితలలలో ఒక తలను ఖండించి అగ్నిలో ఆహుతి చేశాడు. అట్లే రావణాసురుడు మరి తొమ్మిదివేల సంవత్సరాలు కఠోరతపస్సు చేసి తన వేయి సంవత్సరాల కొక శిరస్సువంతున ఆహుతి చేస్తూ, చివరకు తన పదవ శిరస్సును కూడ ఖండించి అగ్నిలో వేల్చటానికి సంసిద్ధుడైనపుడు బ్రహ్మదేవుడు సాక్షాత్కరించాడు. అప్పుడు పితామహుడు రావణుడి తలలు తొమ్మిది యథాప్రకారం మొలిచేటట్లు వరాన్ని ఇచ్చి 'అమరత్వం తప్ప మరి యేదైన ఇంకొక వరాన్ని కోరుకొను' మని చెప్పాడు. అంతట ఆ రావణుడు.

**విశేషం:** (1) రావణుడు చేసింది తామస తపస్సు. అహంకారంతో, స్వార్థబుద్ధితో తన శక్తిసామర్థ్యాలు పెంచుకొనటానికై చేసే తపస్సు ఒక యెత్తు. విశ్వశ్రేయాన్ని కాంక్షించే తపస్సు మరియొక యెత్తు. (2) రావణుడు పదివేల సంవత్సరాలు తపస్సు చేసినట్లు ఇందులో ఉన్నది. ఈ కాలమానం ఎట్టిది? ఈ విషయంపై పండితులలో ఏకాభిప్రాయం కుదరలేదు.

**శా. 'దేవా! యేను సమస్త దేవ పితృదైతే యాహి గంధర్వ ర**
**క్షో విద్యాధర యక్షజాతులకు నక్షోభ్యుండఁగాఁ బ్రీతితో**
**నీ విశ్వంబునఁ గామరూపగతి నాత్మేచ్ఛావిహారుండఁగా**
**నీవే' నావుడు వాని కవ్వర మజుం డిచ్చెం గృపాలోలతన్. 280**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ బ్రహ్మదేవుడా!; ఏను= నేను; సమస్త, దేవ, పితృ, దైతేయ+అహి, గంధర్వ, రక్షస్+విద్యాధర, యక్షజాతులకున్= వేల్పులు, పిశాచాలు, దితి సంతతివారైన రాక్షసులు, పన్నగులు, గంధర్వులు, రక్కసులు, విద్యాధరులు, యక్షులకు సంబంధించిన అందరకును; అక్షోభ్యుండన్+కాన్= కలత చెందనివాడనుగా; ప్రీతితోన్= వేడుకతో; ఈ విశ్వంబునన్= ఈ సృష్టిలో; కామ, రూప, గతిన్= ఇచ్చ వచ్చిన ఆకృతిని ధరించే తీరులో; ఆత్మ+ఇచ్ఛా, విహారుండన్+కాన్= స్వయం సంకల్పాన్ని బట్టి పయనం కొనసాగించ గలవాడిగా; (వరమును); ఈవే= ఇయ్యవా, ఇమ్ము; నావుడున్= అని (రావణుడు) అనగా; వానికిన్= అతడికి- రావణుడికి; ఆ+వరము= ఆ కోరిక; అజుండు= బ్రహ్మదేవుడు; కృపాలోలతన్= దయతో కూడిన ఆసక్తితో; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** 'ఓ బ్రహ్మదేవా! ఈ వరాలను నాకు అనుగ్రహించుము. దేవతలచేత, పితరులచేత, దితిసంతతిచేత, పన్నగులచేత, గంధర్వులచేత, రాక్షసులచేత, విద్యాధరులచేత, యక్షజాతులచేత నేను ఓడిపోరాదు. వేడుకగా ఈ సువిశాల సృష్టిలో ఎక్కడికైనా కోరిన రూపంతో సంచరించే శక్తి కలవాడను కావలెను' - అని రావణుడు ప్రార్థించగా, బ్రహ్మదేవుడు దయాతత్పరుడై ఆతడికి కోరినవరం ఇచ్చాడు.

### బ్రహ్మ రావణ కుంభకర్ణ విభీషణులకు వరంబు లిచ్చుట (సం. 3-259-26)

**వ. 'మనుష్యజాతి యొక్కండుదక్క నీ చెప్పిన యందఱవలనను నీకు మరణభయంబు లే' దని పలికి, పరమేష్ఠి గుంభకర్ణుం జూచి 'వరం బడుగు' మనిన వాఁడు దైవోపహతుండై తనకు నాత్యంతికం బయిన నిద్ర యడిగిన నట్ల యగు నని, విభీషణున కభిముఖుం డగుటయు నతండు కృతాంజలియై జలజాసనుఁ బ్రస్తుతించి.281**

**ప్రతిపదార్థం:** మనుష్యజాతి= మనుజులు అనే తెగ; ఒక్కండు= ఒకటి; తక్కన్= తప్ప; నీ చెప్పిన= నీవు వచించిన; అందఱవలనను= అందరి మూలంగా; నీకున్; మరణభయంబు= చావువలని భీతి; లేదు= కలుగదు; అని పలికి= అని చెప్పి; పరమేష్ఠి= బ్రహ్మదేవుడు; కుంభకర్ణున్= కుంభకర్ణుడిని; చూచి= కాంచి; వరంబు+అడుగుము= కోరికను కోరుకొనుము; అనినన్= అని చెప్పగా; వాఁడు= అతడు- కుంభకర్ణుడు; దైవ+ఉపహతుండు+ఐ= దైవంచేత కొట్టబడినవాడై; తనకున్= తనకు; ఆత్యంతికంబు+అయిన= మిక్కిలి అయిన; నిద్ర= నిద్దుర; అడిగినన్= కోరగా; అట్ల+అగున్+అని= నీవు కోరినట్లే నీకు నిద్ర ఒనగూడునుగాక అని చెప్పి; (బ్రహ్మ) విభీషణునకున్; అభిముఖుండు+అగుటయున్= ఎదురుగా మొగము పెట్టిన వాడు అగుటయును; ఆతండు= అతడు (విభీషణుడు); కృత+అంజలి+ఐ= ఘటించబడిన కైమోడ్పు కలవాడై; జలజ+ఆసనున్= పద్మం ఆసనంగా కలవాడిని- బ్రహ్మదేవుడిని; ప్రస్తుతించి= పొగడి.

**తాత్పర్యం:** 'మనుజులచేత తప్ప నీవు కోరినమేరకు ఇతరజాతులవారిచేత నీకు చావువలనిభయం లేదు' అని రావణుడితో పలికి బ్రహ్మదేవుడు కుంభకర్ణుడిని చూచి వరం కోరుకొనుమని పలికాడు. ఆ కుంభకర్ణుడు దురదృష్టానికి చిక్కి, తనకు మిక్కిలి ప్రీతిగల నిద్ర కావాలి అని కోరాడు. 'సరే అటులే నీ కోరిక ఈడేరుగాక' అని చెప్పి, బ్రహ్మదేవుడు విభీషణుడికి ఎదురు మొగం పెట్టి నిలిచాడు. అంతట విభీషణుడు బ్రహ్మకు నమస్కరించి అతడిని ప్రస్తుతించాడు.

**క. 'పరమాపద యైనపుడును। దురితంబులు నా మనంబు దొడరమియును భా**
**సుర మగు బ్రహ్మాస్త్రమ్మును। గరుణింపవె' యనిన నిచ్చి కమలజుఁ డనియెన్. 282**

**ప్రతిపదార్థం:** పరమ+ఆపద= గొప్పదైన కీడు; ఐనపుడును= వచ్చి నప్పటికిని; దురితంబులు= పాపాలు; నామనంబున్= నా చిత్తాన్ని; తొడరమియును= చొరబడకుండటమున్నూ; భాసురము+అగు= ప్రకాశించేటటువంటి; బ్రహ్మ+అస్త్రమ్మును= బ్రహ్మకు సంబంధించిన దివ్యమహిమగల ఆయుధాన్ని; కరుణింపవె= అనుగ్రహించవా; అనినన్= అని అడుగగా; ఇచ్చి= ఒసగి; కమలజుఁడు+అనియెన్= పద్మంలో పుట్టినవాడు- బ్రహ్మదేవుడు పలికాడు.

**తాత్పర్యం:** 'ఎంతటి కీడు దాపురించినా నా మనస్సు పాపానికి పూనకుండేటట్లుగా వరం ఇచ్చి నాకు బ్రహ్మాస్త్రం అనుగ్రహించుము' అని విభీషణుడు ప్రార్థించాడు. విభీషణుడు కోరిన వరా లిచ్చి, అతనితో బ్రహ్మదేవుడు ఇట్లా పలికాడు.

**క. 'నిరతము రాక్షసభవమును । బొరసియు నీ విట్లు ధర్మబుద్ధి వగుట య**
**చ్చెరు విది గావున నీకును । దిరముగ నమరత్వ మిచ్చితిం గృప వత్సా! 283**

**ప్రతిపదార్థం:** వత్సా!= కుమారా!; నీవు= ఈవు; ఇట్లు= ఈ రీతిగా; రాక్షసభవమును= రక్కసి పుట్టుక; పొరసియున్= పొందినా; నిరతమున్= ఎల్లప్పుడు; ధర్మబుద్ధివి= ధర్మంతో కూడిన చిత్తం కలవాడవు; అగుట= అయి ఉండటం; అచ్చెరువు+ఇది= ఇది ఆశ్చర్యం; కావునన్= కాబట్టి; నీకును= నీకు మాత్రమే; తిరముగన్= స్థిరంగా; కృపన్= దయతో; అమరత్వము= చావు లేని స్థితి; ఇచ్చితిన్= ఇచ్చాను.

**తాత్పర్యం:** వత్సా, విభీషణా! 'నీవు రాక్షసవంశంలో జన్మించినప్పటికిని' ధర్మంలోనే బుద్ధి నిల్పటం ఆశ్చర్యకరం. అందుచేత నీకు అమరత్వం దయతో ఇస్తున్నాను'.

**వ. అని పలికి పితామహుం డంతర్హితుం డయ్యెఁ; దదనంతరంబ. 284**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; పితామహుండు= బ్రహ్మదేవుడు; అంతర్హితుండు+అయ్యెన్= మాయమయ్యాడు; తత్+అనంతరంబు+అ= అటు పిమ్మట.

**తాత్పర్యం:** అని పలికి బ్రహ్మదేవుడు అదృశ్యమయ్యాడు. అటు పిమ్మట.

**మ. వరగర్వోన్నతుఁ డై దశాననుఁడు దుర్వారోద్ధతిన్ దాడిమై**
**నరిగెం గిన్నరనాథుపై; నతఁడు కార్యం బాత్మ నూహించి సం**
**గరసన్నద్ధుఁడు గాక కింపురుష యక్షశ్రేణితోఁ గూడఁ దా**
**నరిగెన్ లంకఁ బరిత్యజించి రభసోద్యత్పుష్పకారూఢుఁడై. 285**

**ప్రతిపదార్థం:** వర, గర్వ+ఉన్నతుఁడు+ఐ (బ్రహ్మదేవుడు ఇచ్చిన) వరంచేత వర్ధిల్లిన దర్పంచేత గొప్పవాడై; దశ+ ఆననుఁడు= పది మొగాలు కలవాడు- రావణుడు; దుః+వార+ఉద్ధతిన్= వారించటానికి శక్యంగాని అతిశయంతో; కిన్నరనాథుపైన్= కుబేరుడిపై; దాడిమైన్+అరిగెన్= దండెత్తివెళ్ళాడు; అతఁడు= కుబేరుడు; కార్యంబు+ఆత్మన్+ఊహించి= సామంతో జరుగదగిన కర్తవ్యాన్ని మనస్సులో ఊహించి; సంగర సన్నద్ధుఁడు+కాక= యుద్ధ సన్నాహాలను చేయక; కింపురుష, యక్ష, శ్రేణితోన్+కూడన్= కింపురుషుల యక్షుల సముదాయాలతోకూడుకొని; తాన్= తాను (కుబేరుడు); లంకన్= లంకను; పరిత్యజించి; రభస+ఉద్యత్+పుష్పక+ఆరూఢుఁడు+ఐ= సంభ్రమంతో, శోభిల్లే పుష్పకం అనే విమానంలో ఎక్కినవాడై; తాన్+అరిగెన్= తాను వెళ్ళాడు.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడివలన తాను పొందిన వరాలచేత మిక్కుటమైన దర్పం కలవాడై రావణుడు వారించటానికి వీలుకాని పరాక్రమప్రాభవంతో కిన్నరపతి అయిన కుబేరుడిపై దండెత్తి వెళ్లాడు. కుబేరుడు ఇంక రావణుడిని ఎదిరించి యుద్ధం చేయటం లాభంలేదని గ్రహించి, తత్తరపాటుతో తన పుష్పకవిమానాన్ని అధిరోహించి లంకను వదలిపెట్టి పారిపోయాడు.

**విశేషం:** (1) లంక - నాలుగు వైపుల సముద్రం చేత ఆవరింపబడిన ద్వీపం. (2) కింపురుషుడు - అశ్వముఖాన్నీ నరశరీరాన్నీ కల వేల్పుతెగకు చెందినవాడు. (3) పుష్పకం - సంకల్పమాత్రంచేత గమ్యం తెలిసి చేరగల యథేచ్ఛాగమనం కొనసాగించగల

విమానం. (4) కార్యం - సామవిధానం అనుసరించే రాజనీతి. కార్యనీతి × ఖడ్గనీతి. కార్యం ఖడ్గనీతికి అనగా యుద్ధానికి వ్యతిరేకం.

**వ. ఇట్లతండు గంధమాదనంబునకుం జనునెడ వెన్నడిం దగిలి దానవుండు వాని మానంబుతోన విమానంబు నపహరించినం గనలి యక్షేశ్వరుండు 'గురుండ నగు నన్ను నవమానించితివి గావున నివ్విమానంబు నీ పగతు పా లయ్యెడు' మని శపించె నంత. 286**

**ప్రతిపదార్థం:** ఇట్లు+అతండు= ఈ విధంగా; అతండు= కుబేరుడు; గంధమాదనంబునకున్= గంధమాదనం అనే పర్వతానికి (వేల్పులు విహరించే కొండకు); చను+ఎడన్= వెడలేటప్పుడు; వెన్నడిన్+తగిలి= వెంబడించి; దానవుండు= రాక్షసుడు - రావణుడు; వాని మానంబుతోన= అతడి (కుబేరుడియొక్క) అభిమానం (పరువు)తోపాటే; విమానంబున్= అంతరిక్షవాహనం - పుష్పకం; అపహరించినన్= వంచించి తీసికొని పోవగా; కనలి= కలత చెంది; యక్ష+ఈశ్వరుండు= యక్షులకు ప్రభువు - కుబేరుడు; గురుండన్+అగు= పెద్దవాడను అయిన; నన్నున్= నన్ను; అవమానించితివి= అగౌరవించావు; కావునన్= కాబట్టి; ఈ+విమానము; నీ పగతుపాలు= నీ విరోధివశం; అయ్యెడున్+అని= ఔగాక అని; శపించెన్= శాపం ఇచ్చాడు; అంతన్= పిమ్మట.

**తాత్పర్యం:** ఈ విధంగా కుబేరుడు వేల్పులు విహరించే గంధమాదనపర్వతానికి పారిపోతూ ఉండగా, రావణుడు ఆతడిని వెంబడించి ఆతడి గౌరవాన్నేకాక పుష్పకవిమానాన్నికూడ అపహరించాడు. అంతట యక్షులకు రాజు అయిన కుబేరుడు ఆగ్రహించి, పెద్దవాడయిన తనను పరాభవించటంచేత ఆ విమానం శత్రువు పాలవుతుందని రావణుడిని శపించాడు.

**విశేషం:** శాపం - వరానికి వ్యతిరేకార్థకం.

**క. రాక్షసలక్ష్మీమహిమకు । రక్షకుఁడుగఁ బంక్తిముఖుని రాక్షసమాయా**
**దక్షు నభిషిక్తుఁ జేసిరి । రాక్షసబేతాళవరులు రాగం బెసఁగన్. 287**

**ప్రతిపదార్థం:** రాక్షస బేతాళ వరులు= రక్కసులలోని బేతాళులలోని నాయకులు; రాగంబు= ప్రేముడి; ఎసఁగన్= అతిశయించగా; రాక్షస లక్ష్మీమహిమకున్= రక్కసులయొక్క సంపద అనే గొప్పతనానికి; రక్షకుఁడుగన్= కాపాడేవాడుగా; రాక్షస, మాయా, దక్షున్= రక్కసుల మోసంలో నేర్పరిని; పంక్తిముఖునిన్= పదిమోములు కలవాడిని - రావణుడిని; అభిషిక్తున్+చేసిరి= పట్టం కట్టారు.

**తాత్పర్యం:** రాక్షస మాయలలో నేర్పరి అయిన రావణుడిని రాక్షససామ్రాజ్యాన్ని కాపాడే సార్వభౌముడిగా రక్కసుల బేతాళుల నాయకులు అనురాగంతో పట్టాభిషిక్తుడిని చేశారు.

**విశేషం:** (1) బేతాళులు - పిశాచులు. ఈ తెగ మాంసభక్షకులు, నెత్తురు త్రాగేవారు. మృతదేహపరాయణులుగా పురాణాలలో అభివర్ణించబడ్డారు. రాక్షసులకూ వీరికీ పొత్తు ఉన్నది.

**వ. వాఁడును బలదర్పమోహితుండై కడంగి యింద్రాదిదేవతల నొడిచి తత్పదంబు లాక్రమించి, యీసు మిగిలి జగద్ద్రావణంబు సేయుటం జేసి, రావణుం డను పేరం బ్రఖ్యాతి వహించి సకలభూత భయంకరుం డయ్యె;**

**నట్టియెడ దేవర్షులును, రాజర్షులునుం గూడి చని తత్ప్రకారం బగ్నిదేవునకుం జెప్పిన, నతండు వారిం దోడ్కొని వారిజాసనుపాలికిం జని యి ట్లనియె. 288**

**ప్రతిపదార్థం:** వాఁడును= దశకంఠుడును; బల, దర్ప మోహితుండు+ఐ= పరాక్రమ ప్రాభవాలచేత భ్రాంతి పొందినవాడై; కడంగి= పూనిక వహించి; ఇంద్ర+ఆది, దేవతలన్= ఇంద్రుడు మున్నగు వేల్పులను; ఒడిచి= ఓడించి; తత్+పదంబులు= వారి స్థానాలు; ఆక్రమించి= తన అధీనం చేసికొని; ఈసు మిగిలి= అసూయతో అతిశయించి; జగత్+రావణంబు= లోకం అరచేటట్లు చేయుటయున్+చేసి= సలుపుట చేత; రావణుండు= రావణుడు; అను పేరన్= అను నామంతో; ప్రఖ్యాతి= కీర్తి; వహించి= ధరించి; సకల, భూత, భయంకరుండు+అయ్యెన్= సమస్తచేతనా చేతనాలకు వెఱపు గొలిపేవాడు అయ్యాడు; అట్టి +ఎడన్= అట్టి తరుణంలో; దేవ+ఋషులును, రాజ+ఋషులను= దేవతలలోని మునులును, రాజులలోని మునులును; కూడి= కలిసి; చని= వెడలి; తత్+ప్రకారంబు= ఆ విధాన్ని; అగ్నిదేవునకున్= అగ్నిహోత్రుడికి; చెప్పినన్= వచించగా; అతండు= అతడు (అగ్నిదేవుడు); వారిన్= వారిని (రాజర్షులను దేవర్షులను); తోడ్కొని= వెంటనిడుకొని; వారిజాసను, పాలికిన్= బ్రహ్మదేవుడి కడకు; చని= వెడలి ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** రావణుడు గర్వంతో విజృంభించి, దేవేంద్రుడు మున్నగువారి నోడించి వారిస్థానాలను ఆక్రమించి జగత్తు ఆక్రోశించేటట్లుగా చేయటంచేత 'రావణుడు' అనే సార్థకనామధేయుడై సర్వభూతములకు భీతి కలిగించాడు. ఆ తరుణంలో దేవతలలో ఋషులును రాజులయిన ఋషులును కలిసి వెళ్ళి ఆ ఉపద్రవాన్నిగూర్చి అగ్నిదేవుడికి తెలిపారు. ఆ అగ్నిదేవుడు వారిని తన వెంటబెట్టికొని, బ్రహ్మదేవుడిపాలికి వెళ్ళి, ఇట్లు విన్నవించాడు.

**ఉ. 'భూరిభుజుండు విశ్రవసుపుత్త్రుఁడు పంక్తిముఖుండు దర్పదు**
**ర్వారుఁడు రాక్షసేంద్రుఁడు భవద్వరశక్తి నవధ్యుఁ డై మహా**
**ఘోరముగాఁ ద్రిలోకములకుం గడుఁ బీడ యొనర్పఁ జొచ్చె వృ**
**త్రారి పురోగమత్రిదశు లందఱుఁ గింకరు లైరి వానికిన్. 289**

**ప్రతిపదార్థం:** భూరి భుజుండు= గొప్ప బాహువులు కలవాడు, మిక్కుటమైన పరాక్రమం కల వీరుడు; విశ్రవసు పుత్త్రుఁడు= విశ్రవసుడి కుమారుడు; పంక్తి, ముఖుండు= పది మొగాలు కలవాడు; దర్పదుర్వారుఁడు= పరాక్రమ ప్రకర్ష చేత వారించటానికి వీలుగానివాడు; రాక్షస+ఇంద్రుఁడు= రాక్షసులయొక్క ప్రభువు; భవత్+వర శక్తిన్= నీవు అనుగ్రహించిన వరాల బలంవలన; అవధ్యుఁడు+ఐ= చంపటానికి వీలులేనివాడై; మహా ఘోరముగాన్= మిక్కిలి దారుణంగా; త్రిలోకములకున్= మూఁడు లోకాలకున్నూ; కడున్= మిక్కుటంగా; పీడ= హింస; ఒనర్పన్+చొచ్చెన్= చేయటానికి పూనుకొన్నాడు; వృత్ర+అరి, పురోగమ, త్రిదశులు, అందఱున్= వృత్రుడికి విరోధి అయిన దేవేంద్రుడు మొదలుగాగల దేవతలు అందరును; వానికిన్= అతడికి - ఆ రావణుడికి; కింకరులు+ఐరి= సేవకులు అయ్యారు.

**తాత్పర్యం:** 'గొప్పపరాక్రమప్రాభవం గల వీరుడు, విశ్రవసుడికుమారుడు, దశముఖుడు, రాక్షససార్వభౌముడు అయిన రావణుడు తన బలదర్పంచేత విర్రవీగుతూ వృత్రుడిని జయించిన దేవేంద్రుడు మున్నగు దేవతలను అందరిని జయించాడు. వారు వేరే గతిలేక ఆ రావణుడికి సేవకులైపోయారు.

**విశేషం:** త్రిదశులు= ఎల్లప్పుడును ముప్పదేండ్లప్రాయంలోనే ఉండేవారు; దేవతలు.

**ఉ. దానవుచేతఁ గష్టపడి దైన్యము నొందుట కోర్వలేక నీ**
**దైన పదాంబుజంబు లభయం బని చేరితి; మింక మమ్ము నె**
**ట్లైనఁ గృపార్ద్రమానసుఁడ వై తగఁ జేకొనవయ్య! మాకు ది**
**క్కైనను గాకయున్నఁ గమలాసన ! నీవ కదయ్య యెయ్యెడన్.' 290**

**ప్రతిపదార్థం:** కమల+ఆసన!= పద్మం పీఠంగా కలవాడా, ఓ బ్రహ్మదేవుడా!; దానవు చేతన్= రాక్షసుడిచేత, రావణుడి చేత; కష్టపడి= బాధలను అనుభవించి; దైన్యమున్+ఒందుటకున్= హీనత్వాన్ని పొందటానికి; ఓర్వలేక= భరించలేక; నీదు+ఐన= నీ యొక్క; పద+అంబుజంబులు= పద్మాలవంటి చరణాలు; అభయంబు+అని= శరణం అని తలపోసి; చేరితిమి= వచ్చాము; ఇంకన్= ఇక మీదట; మమ్మున్= మమ్మల్ని; ఎట్లు+ఐనన్= ఏ రీతిగా అయినా; కృపా+ఆర్ద్ర, మానసుఁడవు+ఐ= దయతో తడిసిన (మెత్తనైన) చిత్తం కలవాడవై; తగన్= సరిపడేటట్లుగా; చేకొనవు+అయ్య= స్వీకరించవా దేవా; మాకున్; దిక్కు+ఐననున్= గతి అయినను; కాక, ఉన్నన్= గతికాక పోయినప్పటికి (అంటే రక్షించినా రక్షింపక పోయినా); ఏ+ఎడన్= ఏదిక్కైనా; నీవు+అ= నీవే; కద+అయ్య= కదా.

**తాత్పర్యం:** ఓ బ్రహ్మదేవా! రావణాసురుడిచేత పెక్కుకష్టాలు అనుభవించి, ఇక ఆ బాధలకు ఓర్వజాలక నీ చరణారవిందాలే శరణ్యాలని ఇక్కడకు చేరాం. రక్షించినా రక్షింపకపోయినా మాకు వేరే దిక్కు లేదు. నీవే అన్నింటా దిక్కువు. దయామయుడవై మమ్మల్ని మన్నించుము. మా విన్నపాలు ఆలకించుము'.

**వ. అనినంబరమేష్ఠివారల కిట్లను; నిక్కార్యంబునకు నేను మున్న తగిన యుపాయంబు నిశ్చయించి నారాయణుం బ్రార్థించితి; నద్దేవుండు మనుష్యభావంబున నవతరించి, యా రాక్షసు వధియించువాఁ డయ్యె; నింద్రాది సురులునుం దమ తమ యంశంబులంజేసి ఋక్షవానరజాతులయందు జనియింపఁగలవారు; మీకు భయంబు వలవ' దని యగ్నిప్రముఖు లైన యమ్మహామునుల సమ్ముఖంబున దుందుభి యను గంధర్వ కామినిం బిలిచి 'నీవు కుబ్జరూపంబున మంథర యను పేర భూలోకంబున నుద్భవించి నీ నేర్చు విధంబున దేవకార్యంబులు నిర్వహింపు' మని పనిచి వారి వీడ్కొలిపెఁ; బదంపడి దివిజుల యంశావతారంబులం. జేసి. 291**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; పరమేష్ఠి= బ్రహ్మదేవుడు; వారలకున్= (బ్రహ్మర్షి, రాజర్షి, అగ్ని, ప్రభృతులకు); ఇట్లు+అనున్= ఈ రీతిగా చెప్పాడు; ఈ+కార్యంబునకున్= ఈ పనికి; ఏను= నేను; మున్న+అ= ఇంతకు ముందే; తగిన= సరి అయిన; ఉపాయంబు= వెరవు; నిశ్చయించి= నిర్ణయించి; నారాయణున్= విష్ణుదేవుడిని; ప్రార్థించితిన్= వేడుకొన్నాను; ఆ+దేవుండు= విష్ణువు; మనుష్య భావంబునన్= మనుజరూపంతో; అవతరించి= జన్మించి; ఆ రాక్షసున్= ఆ రక్కసుని (రావణుడిని); వధియించువాఁడు+అయ్యెన్= సంహరించగలవాడు అయ్యాడు; ఇంద్ర+ఆది, సురులునున్= ఇంద్రుడు మున్నగు వేల్పులును; తమ తమ పాళ్ల చేత; ఋక్ష, వానర, జాతులయందున్= ఎలుగుల, కోతుల తెగలలో; జనియింపన్+కలవారు= పుట్టగలరు; మీకున్= మీకు (అగ్ని ప్రభృతులకు); భయంబు= భీతి; వలవదు= అనవసరం; అని= అంటూ; అగ్ని ప్రముఖులు+ఐన= అగ్ని నాయకత్వాన వచ్చిన; ఆ+మహా, మునుల; సమ్ముఖంబునన్= సన్నిధిలో; దుందుభి+అను= దుందుభి అనే పేరు కల; గంధర్వ, కామినిన్= గంధర్వ జాతికి చెందిన కాంతను; పిలిచి= ఆహ్వానించి; నీవు= ఓ దుందుభీ! నీవు; కుబ్జ రూపంబునన్= మరుగుజ్జు ఆడదాని ఆకారాన; మంథర అను పేరన్= మంథర అనే నామంతో; భూలోకంబునన్= భూమిపై; ఉద్భవించి= జన్మించి; నీ నేర్పు విధంబునన్= నీ నేర్పును బట్టి; దేవ కార్యంబు= దేవతల పని; నిర్వహింపుము=

నెరవేర్చుము; అని పనిచి= అని నియోగించి; వారిన్= వారిని (అగ్ని ప్రభృతులను); వీడ్కొలిపెన్= సెలవు నిచ్చి పంపాడు; పదంపడి= పిదప; దివిజుల+అంశ+అవతారంబులన్+చేసి= దేవతలయొక్క పాళ్లను పంచుకొని జన్మించిన వారై;

**తాత్పర్యం:** అగ్ని మొదలైనవారలకు బ్రహ్మదేవుడు ఈ రీతిగా సమాధానం చెప్పాడు. ఈ సమస్యనుగూర్చి నేను ఇదివరకే ఆలోచించి ఒకనిర్ణయం తీసికొన్నాను. ఇంతకుముందే నేను ఈ విషయాన్ని శ్రీమన్నారాయణుడికి నివేదించి ఉన్నాను. ఆ దేవుడు భూలోకంలో మానవుడుగా అవతరించి రావణాసురుడిని సంహరించగలడు. ఇంద్రుడు మున్నగు దేవతలుకూడ, తమ తమ అంశాలతో వానరులుగా, ఎలుగులుగా అవతరించగలరు. ఇక మీకు భయం వద్దు. అంతేకాక, బ్రహ్మదేవుడు అగ్నిప్రభృతులసమక్షంలోనే, 'దుందుభి' అనే యక్షకాంతను పిలిచి, ఆమెను దేవకార్యం నిర్వహించటంకొరకై భూలోకంలో 'మంథర' అనే కుబ్జగా జన్మించుమనికూడా నియోగించాడు. ఆ తరువాత బ్రహ్మ అగ్నిప్రభృతులను వీడ్కొలిపి పంపాడు. పిదప దేవతల అంశలతో.

**మ. గురుశైలోన్నతగాత్రు లుద్ధత భుజో గ్రుల్ వజ్రపాషాణ క**
**ర్కరు లర్కప్రతిమానతేజులు, గుణాకల్పుల్, మహాకల్పభీ**
**కరకాలాంతకకల్పు లాజినిపుణుల్ గర్వోన్నతుల్ ఋక్షవా**
**నర వీరుల్ జనియించి రెల్లయెడలన్ నాగాయుతప్రాణులై. 292**

**ప్రతిపదార్థం:** గురు, శైల+ఉన్నత, గాత్రులు= పెద్దకొండలవలె ఎత్తైన శరీరాలు కలవారు; ఉద్ధత, భుజ+ఉగ్రుల్= దర్పంతో కూడిన భుజ పరాక్రమంతో అతిశయించిన వారు; వజ్ర, పాషాణ కర్కరులు= వజ్రాలవలె రాళ్లవలె కఠినాలైన దేహాలు కలవారు; అర్క, ప్రతిమాన, తేజులు= సూర్యుడితో సరిపోలే వర్చస్సు కలవారు; గుణ+ఆకల్పుల్= మంచిగుణాలు అనే భూషలు కలవారు; మహా, కల్ప, భీకర, కాల+అంతక, కల్పులు= గొప్ప ప్రళయసమయంలోని భయంకరమైన యముడితో సమానులు; ఆజి నిపుణుల్= యుద్ధంలో నేర్పరులు; గర్వ+ఉన్నతుల్= గొప్ప దర్పం కలవారు; ఋక్ష, వానర, వీరుల్= ఎలుగులకు కోతులకు సంబంధించిన శూరులు; నాగ+అయుత, ప్రాణులు+ఐ= పదివేల ఏనుగులకు ఉండే శక్తి కలవారై; ఎల్ల+ఎడలన్= అన్ని తావులలో; జనియించిరి= పుట్టారు.

**తాత్పర్యం:** పలుతావులలో ఎలుగులుగా కోతులుగా దేవతల అంశలు పంచుకొని వీరులు ఉద్భవించారు. ఆ వీరులు పెద్దకొండలవలె ఎత్తైనశరీరాలు కలవారు. దర్పంతో కూడిన పరాక్రమప్రాభవం కలవారు. వజ్రాల వలె, పాషాణాలవలె కఠినంగా ఉండే దృఢమైన దేహాలు కలవారు. సూర్యుడివంటి తేజస్సు కలవారు. మంచి గుణాలే ఆహార్యంగా కలవారు. ప్రళయకాలంలోని యముడితో సమానులు. యుద్ధంలో నేర్పరులు. పదివేల ఏనుగుల బలం కలవారు.

**క. అన విని యుధిష్ఠిరుం డ । మ్మునివరుతో 'ననఘ! ధర్మమూర్తిని నా రా**
**ముని నేల యరణ్యంబున । కనిచెను దశరథుఁడు సెపుమ యక్కథ నెల్లన్'. 293**

**ప్రతిపదార్థం:** అనన్ విని= అని చెప్పగా ఆలకించి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అమ్మునివరుతోన్= ఆ ఋషిశ్రేష్ఠుడితో (మార్కండేయుడితో); అనఘ!= పుణ్యాత్ముడా, మార్కండేయ మహర్షీ!; దశరథుఁడు; ధర్మమూర్తిని= ధర్మమే మానవాకృతి ధరించినవాడిని; ఆ రామునిన్= ఆ శ్రీరాముడిని; ఏల= ఎందుకు; అరణ్యంబునకున్= అడవికి; అనిచెను= పంపాడు; ఆ+కథను= ఆ గాథను; ఎల్లన్= సమస్తం; చెపుమ= వచింపుము.

**తాత్పర్యం:** ధర్మరాజు ఇట్లా పలికాడు: 'పుణ్యాత్ముడవైన ఓ మార్కండేయమహాముని! "మూర్తీభవించిన ధర్మం' అని పేరు గాంచిన శ్రీరాముడిని దశరథమహారాజు ఏల అడవికి పంపాడు? దయచేసి, ఆ కథను తెలుపుము'.

**విశేషం:** రాముడు ధర్మమూర్తి. "రామో విగ్రహవాన్ ధర్మః" అని వాల్మీకి రామాయణంలో ఉన్నది.

**వ. అని యడుగుటయు మార్కండేయుం డిట్లనియె: 'దశరథుండు నిజ సుకృత పాకంబునం జేసి రామ ప్రముఖులయిన కొడుకుల నలువురం గని, త్రైలోక్యరాజ్యంబు సంప్రాప్తం బయినయట్లు సంతసిల్లె; నక్కుమారులు క్రమంబున నుపనీతులు నఖిలవేదవేదాంగవినీతులు, యథాక్రమ పరిణీతులు నై విలసిల్లి రంత.294**

**ప్రతిపదార్థం:** అని+అడుగుటయున్= అని ప్రశ్నించటమున్నూ; మార్కండేయుండు; ఇట్లు+అనియెన్; దశరథుండు; నిజ, సుకృత, పాకంబునన్+చేసి= తన పుణ్యం పండటంవలన; రామ, ప్రముఖులు+అయిన= రాముడు మున్నగువారు అయిన; కొడుకులన్= కుమారులను; నలువురన్= నలుగురను; కని= కాంచి; త్రైలోక్య, రాజ్యంబు= మూడులోకాలపై ప్రభుత్వం; సంప్రాప్తంబు+అయిన+అట్లు= లభించినట్లు; సంతసిల్లెన్= సంతోషించాడు; ఆ+కుమారులు= ఆ కొడుకులు, (రాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు); క్రమంబునన్= వరుసగా; ఉపనీతులున్= ఉపనయనం (వడుగు) చేయబడినవారలు; అఖిల, వేద, వేదాంగ (వేద+అంగ) వినీతులు= సమస్త మైన వేదాలు, వేదాంగాలు నేర్చినవారు; యథాక్రమ పరిణీతులును+ఐ= క్రమము ననుసరించి వివాహితులును అయి; విలసిల్లిరి= శోభిల్లారు; అంతన్= అటు పిమ్మట.

**తాత్పర్యం:** ధర్మరాజుకు మార్కండేయుడు ఈ విధంగా చెప్పాడు: 'దశరథమహారాజు తాను చేసికొనిన పుణ్యం పండి, శ్రీరాముడు మున్నగు కొడుకులను కన్నాడు. పుత్రలాభంవలన తనకు మూడులోకాల సార్వభౌమత్వం చేకూరినట్లు దశరథుడు సంతోషించాడు. దశరథకుమారులు పెరిగి కాలక్రమాన వటువు (వడుగు) లయ్యారు. వేద వేదాంగాలను చదివారు. మరికొంతకాలానికి వరుసగా వివాహితులు అయ్యారు. అంతట.

**విశేషం:** వేదాలు:- ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం, అథర్వవేదం. వేదాంగాలు:- శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం. ధనుర్వేదం మున్నగు ఉపవేదాలుకూడా వేదాలలో అంతర్భాగాలే.

**సీ. అభినవపద్మదళాక్షు నక్షీణవి । స్తృతవక్షు నాజానుదీర్ఘబాహు**
**మధురస్మితానను మదగజగమను నా । రూఢయౌవను నభిరూపతేజు**
**శ్రీరమణీయుఁ బ్రసిద్ధయశోరమ్యు । నిఖిలవిద్యాగమనిపుణచిత్తు,**
**నింద్రసమాను జితేంద్రియు ధర్మజ్ఞుఁ । బౌరబాంధవజనప్రార్థనీయు**

**ఆ. దుష్టనిగ్రహైకధుర్యు విశిష్టసం । రక్షణాభిలోలు రామభద్రుఁ**
**గులపవిత్రుఁ బెద్దకొడుకుఁ గనుంగొని । రాజవరుఁడు గరము రాగ మెసఁగ. 295**

**ప్రతిపదార్థం:** రాజ, వరుఁడు= రాజులలో శ్రేష్ఠుడు, దశరథుఁడు; అభినవ, పద్మ, దళ+అక్షున్= కొంగ్రొత్త తమ్మిపూరేకులవంటి కన్నులు కలవాడిని; అక్షీణ, విస్తృత, వక్షున్= విశాలమైన పెద్దవక్షం గలవాడిని; ఆజాను, దీర్ఘ, బాహున్= మోకాళ్లవరకు వ్రేలాడే పొడుగుపాటిచేతులు కలవాడిని; మధుర, స్మిత+ఆననున్= తియ్యనైన చిరునవ్వులతో కూడిన మొగం కలవాడిని; మద, గజ,

గమనున్= మదించిన యేనుగునడకవంటి నడక కలవాడిని; ఆ రూఢ, యౌవనున్= వికసించిన జవ్వనంలో ఉన్నవాడిని; అభిరూపతేజున్= ఒప్పిదమగు కాంతిగలవాడిని; శ్రీ రమణీయున్= సిరికళతో అందమైనవాడిని; ప్రసిద్ధ, యశస్+రమ్యున్= వెల్లడి అయిన కీర్తితో సుందరుడు అయినవాడిని; నిఖిల, విద్యా, ఆగమ, నిపుణ, చిత్తున్= సమస్తమైన విద్యలలో వేదాలలో ప్రావీణ్యం సంపాదించిన మనస్సు కలవాడిని; ఇంద్ర సమానున్= దేవేంద్రుడితో సాటి వచ్చేవాడిని; జిత+ఇంద్రియున్= ఇంద్రియాలను జయించినవాడిని; ధర్మజ్ఞున్= ధర్మాన్ని ఎఱిగినవాడిని; పౌర, బాంధవ, జన ప్రార్థనీయున్= పౌరులచేత, చుట్టాలచేత ఆరాధించదగినవాడిని; దుష్ట, నిగ్రహ+ఏక, ధుర్యున్= దుర్జనులను శిక్షించటంలో పరిపూర్ణమైన శక్తి కలవాడిని; విశిష్ట, సంరక్షణ+అభిలోలున్= మంచివారిని కాపాడటంలో తత్పరత కలవాడిని; కుల, పవిత్రున్= వంశాన్ని పవిత్రం కావించినవాడిని; పెద్ద కొడుకున్= కుమారులలో పెద్దవాడిని; రామభద్రున్= శ్రీరాముడిని; కనుంగొని= చూచి; కరము= మిక్కిలి; రాగము= ప్రేమ; ఎసఁగన్= అతిశయిల్లగా.

**తాత్పర్యం:** అప్పటి కప్పుడే వికసించిన కొంగ్రొత్త తామరపువ్వురేకులవంటి కన్నులు కలవాడు. విశాలమైన వక్షం కలవాడు, ఆజానుబాహువయినవాడు, తియ్యనైన చిరునవ్వుదొంతరలు వెల్లివిరిసే ముఖం కలవాడు, మత్తేభంవంటి గంభీరగమనం కలవాడు, ఎలజవ్వనంలో ఉన్నవాడు, తన తనువునకు తగిన కాంతి గలిగి ప్రకాశిస్తున్నవాడు, తేజస్సు కలవాడు; సిరికళతో విలసిల్లుతున్నవాడు, పేరుప్రతిష్ఠలను ఆర్జించినవాడు, వివిధవిద్యలు వేదవేదాంగాలు క్షుణ్ణంగా చదివినవాడు, వేలుపుదొర అయిన దేవేంద్రుడికి సాటి వచ్చేవాడు, ఇంద్రియాలను జయించినవాడు, ధర్మం ఎఱిగినవాడు, పౌరులచేత బంధువులచేత ఆరాధించ దగినవాడు, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయగల ఆదర్శపరిపాలకుడు, రఘువంశాన్ని పావనం చేసేవాడు, తన పెద్దకుమారుడూ ఐన శ్రీరామచంద్రమూర్తిని దశరథమహారాజు ప్రేమ జాలువారగా కనుగొన్నాడు.

**విశేషం:** అభినవపద్మదళాక్షుఁడు - అనే పదగుంఫనంలో శ్రీరాముడు విష్ణుదేవుడి అవతారం అనే ధ్వని ఉన్నది. పద్మదళాక్షుడు అనేది విష్ణువుకు రూఢ్యర్థంలో పర్యాయపదం.

**వ. యౌవరాజ్యపదంబునకు నతని నభిషేకం బాచరింపం గోరి యాప్తమంత్రిజనసమ్మతంబునఁ బురోహిత నిరూపితం బైన శుభదినంబున నక్కార్యంబునకు సమకట్టునెడ భరతు దాది మంథర యనునది యమంద గతిం గైకేయిపాలికిం జని యిట్లనియె. 296**

**ప్రతిపదార్థం:** అతనిన్= శ్రీరాముడిని; యౌవ రాజ్య పదంబునకున్= యువరాజు పదవికి; అభిషేకంబు+ఆచరింపన్+కోరి= పట్టం కట్టటానికి (పవిత్రస్నానం చేయించటానికి); తలపోసి; ఆప్త, మంత్రి జన సమ్మతంబునన్= శ్రేయోభిలాషుల, మంత్రుల, ప్రజల అంగీకారం చొప్పున; పురోహిత నిరూపితంబు+ఐన= పురోహితులచేత ఏర్పరచబడిన; శుభ, దినంబునన్= మంచిరోజున; ఆ+కార్యంబునకున్= యౌవరాజ్య పట్టాభిషేకానికి; సమకట్టు+ఎడన్= పూనిన తరుణంలో; భరతు దాది= భరతుడిని పెంచిన సేవకురాలు; మంథర+అను+అది= మంథర అనే పేరు కలది; న+మంద, గతిన్= వేగం గల నడకతో; కైకేయి పాలికిన్+చని= కైక దగ్గరకు వెళ్లి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** యువరాజుపదవికి శ్రీరాముడిని పట్టాభిషిక్తుడిగా చేయదలచి దశరథమహారాజు శ్రేయోభిలాషులను, మంత్రులను, పౌరులను సంప్రదించి వారి అనుమతి పొందాడు. పురోహితుడిచేత శుభముహూర్తం నిర్ణయించబడింది. ఆ తరుణంలో భరతుడిని పెంచిన దాది మంథర అనే పేరు గల పరిచారిక, కైకదగ్గరకు వెళ్లి ఈ విధంగా చెప్పింది.

ఉ. 'అక్కట నీదెసం బతికి నాఱడి కూరిమి యయ్యెఁ; మాయపుం
జొక్కులు నీవు నిక్కముగఁ జూచి మనంబున మోసపోయి; తా
టక్కరి కోసలాత్మజయెడం బ్రియుఁడై యదె తత్తనూజు నిం
పెక్కఁగ యౌవరాజ్యమున నిప్పుడ పట్టము గట్టఁ బూనెడున్. 297

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; నీదెసన్= నీ యెడ; పతికిన్= భర్తకు- దశరథుడికి; ఆఱడి కూరిమి+అయ్యెన్= వ్యర్థమైన ప్రేమ అయింది; మాయము+చొక్కులు= కపటపు మోహాలు; నీవు= నీవు, (ఓ కైకా! నీవు); నిక్కముగన్+చూచి= నిజమనే భ్రాంతిలో పడి అరసి; మనంబునన్= చిత్తంలో; మోసపోయితి(వి)= వంచించబడ్డావు; ఆ టక్కరి= ఆ జిత్తులమారి; కోసల+ఆత్మజ+ఎడన్= కోసలరాజపుత్రిక అయిన కౌసల్యపట్ల; ప్రియుఁడు+ఐ= ప్రీతికలవాడై; అదె= అదిగో; తత్+తనూజున్= ఆమె కొడుకును; ఇంపు+ఎక్కఁగన్= ప్రీతి అతిశయించగా; యౌవరాజ్యమునన్= యువరాజు పదవియందు; ఇప్పుడు= ఈ వేళ; పట్టము= పట్టాభిషేకాన్ని; కట్టన్+పూనెడున్= కట్టటానికి సిద్ధపడ్డాడు.

**తాత్పర్యం:** 'అయ్యో! నీ భర్త అయిన దశరథుడికి నీపట్ల అచ్చమైన కూరిమి లేనట్లు తేలిపోయింది కదా. ఆహా! నీ యెడ ఎంతటి మోసపువలపును వెల్లడించాడు! ఆతడి నటనలు నీవు నిజాలని నమ్మి భ్రాంతిలో పడ్డావు. ఇదుగో ఇప్పుడు తెలిసింది కదా దశరథుడికి కోసలాత్మజ కౌసల్యపై గల అనురాగం. ఆమెకొడుకైన శ్రీరాముడికే నేడు యువరాజపట్టం కట్టుతున్నాడు. టక్కరికౌసల్య గెలిచింది. నీవు ఓటమి చెందావు.

ఆ. పుడమిఱేని మదికి నెడ యైతి నీ వింక; । నేమి సెప్పఁగలను వామనయన!
కడఁగి నిన్నుఁ గొడుకుఁ బెడవడ వైచి యా । సవతికొడుక యేలు నవని యింక'. 298

**ప్రతిపదార్థం:** వామనయన!= అందమైన కన్నులు కలదానా!, ఓ కైకేయీ!; నీవు= నీవు; పుడమి ఱేని మదికిన్= రాజుగారి చిత్తానికి; ఎడ+ఐతి(వి)= దూరం అయినావు; ఇంకన్= ఇకమీద; ఏమి+చెప్పన్‌కలను= ఏమని నీకు చెప్పేది?; కడఁగి= పూని; నిన్నున్= నిన్నును; కొడుకున్= నీ కొడుకు భరతుడిని; పెడవడవైచి= ప్రక్కకు నెట్టి, తొలగించి; ఆ, సవతి, కొడుకు+అ= ఆ సపత్ని అయిన కౌసల్య పుత్రుడు మాత్రమే; ఇంకన్= ఇక మీద; అవని= భూమి; ఏలున్= పరిపాలిస్తాడు.

**తాత్పర్యం:** అందమైన కన్నులు గల ఓ కైకేయీ! నీవు కన్నులు మూసికొని ఉన్నావు. ఇక నేను ఏమి చేయగలను? ఏమి చెప్పగలను? దశరథమహారాజు చిత్తానికి నీవు దూరమైనావు; నిన్నును నీ కొడుకు భరతుడిని దూరంగా నెట్టి తొలగించి, నీ సవతి కౌసల్యకొడుకు శ్రీరామచంద్రుడు భూరాజ్యాన్నంతటిని ఏలుకొంటాడు'.

క. అనిన నుదరిపడి కేకయ । తనూజ గడుసంభ్రమమునఁ దత్‌క్షణమ నరేం
ద్రునిపాలికిఁ జని యేకత । మున నిట్లనుఁ బ్రణయపూర్వముగ నాతనితోన్. 299

**ప్రతిపదార్థం:** అనినన్= అని (మంథర) చెప్పగా; ఉదరిపడి= వేగంగా కలత చెంది; కేకయ, తనూజ= కేకయ రాజు కూతురు, కైకేయి; కడు, సంభ్రమమునన్= మిక్కుటమైన తత్తరపాటుతో; తత్+క్షణము+అ= ఆ నిమేషంలోనే; నర+ఇంద్రుని, పాలికిన్= దశరథ మహారాజు వద్దకు; చని= వెడలి; ఏకతమునన్= ఒంటరిగా; ప్రణయ, పూర్వముగన్= అనురాగపురస్సరంగా; ఆతనితోన్= దశరథమహారాజుతో; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** మంథర చెప్పిన  మాటలు విని కైకేయి అదరిపడి, తత్తరపాటుతో తత్‌క్షణమే బయలుదేరి దశరథ మహారాజువద్దకు వెళ్లి, ఒంటరిగా కలిసికొని, అనురాగం చిందే మాటలు చెప్పి, ఈ విధంగా పలికింది.

**క. 'ధరణీశ! తొల్లి నాకుం । గరుణించిన వర మొకండు గల; దది మదిలోఁ**
**బరికించి యిప్పు డొసఁగుము; । చిరముగ సత్యవ్రతంబు సెల్లింపు తగన్.' 300**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= భూమికి అధినేత వైనవాడా, ఓ దశరథ మహారాజా!; తొల్లి= పూర్వం; నాకున్= నాకు; కరుణించిన= అనుగ్రహించి ఇచ్చిన; వరము= శపథం ప్రకారం తీర్చుకోరిక; ఒకండు= ఒకటి; కలదు= ఉన్నది; అది= ఆ వరం; మదిలోన్= మనస్సులో; పరికించి= అరసి; ఇప్పుడు= ఈ సమయంలో; ఒసఁగుము= ఇమ్ము; చిరముగన్= శాశ్వతంగా; సత్యవ్రతంబు= నిజాన్ని పాలించే నోమును; తగన్= సముచితంగా; చెల్లింపు= ఆచరింపుము.

**తాత్పర్యం:** 'భూమికి అధిపతి వైన ఓ దశరథమహారాజా! తొల్లి నీవు నాకు ఒకవరాన్ని అనుగ్రహించి ఉన్నావు. జ్ఞాపకం ఉన్నది కదా! దానిని నీ మనస్సులో పరికించుము. ఇప్పుడు నేను ఆ వరాన్ని కోరుకొంటున్నాను. నీవు సత్యవాక్యపరిపాలకుడవు కదా! ఆ వరాన్ని దయచేసి ఇప్పుడు నాకు ప్రసాదించుము'.

**విశేషం:** (1) సంస్కృత మూలభారతంలోకూడా రామాయణ కథ సంగ్రహంగానే ఉన్నది. ఎఱ్ఱాప్రెగ్గడ తెలుగుభారతంలో ఆ కథను మరింత సంక్షేపించి వ్రాశాడు. ఆరణ్యపర్వంలోని రామాయణకథలో బాలకాండాన్ని అంతటిని రెండు మూడు పద్యాలలో ఎఱ్ఱన సంగ్రహీకరించాడు. శ్రీరాముడి యౌవరాజ్యపట్టాభిషేకంతో కథ ప్రారంభిస్తున్నది. సీతాకల్యాణాన్ని కూడా ఎఱ్ఱన వదలిపెట్టాడు. (2) కైకకు తొల్లి దశరథుడు ఎందుకు వరం ఇచ్చాడు? ఆ విషయాన్ని ఎఱ్ఱన వివరించలేదు. ఆతడి ప్రణాళిక ననుసరించి అది వివరించ నవసరం లేదు. ఈ విషయం పెక్కురామాయణాలలో పెక్కురకాలుగా కన్పిస్తున్నది. సుప్రసిద్ధమైన ఆ కథ సంక్షేపంగా ఇది: ఒకసారి దశరథుడు యుద్ధం చేస్తూ ఉండగా అతడి రథచక్రాని కున్న సీల విరిగి పడిపోయింది. భర్తతోపాటు రణరంగాని కేగిన కైక సీలకు బదులు తన వ్రేలిని నిలిపి దశరథుడిని అపాయంనుండి కాపాడింది. అందుకు దశరథుడు సంప్రీతుడై ఆమెకు రెండువరాలు ఇచ్చాడు. కైకేయి భర్తకు ధన్యవాదాలు తెలిపి యథోచితసమయంలో తా నా వరాల నుపయోగించుకొనగలనని తెలిపింది. ఇప్పుడు ఆమె కోరుకొన దలచింది.

**వ. అనిన నతం డయ్యతివం గనుంగొని 'యవధ్యుల వధియించుటయును, వధ్యులం గాచుటయును, బ్రాహ్మణ ధనంబులు దక్క నన్యులధనం బపహరించుటయును, నభీష్టధనంబు నిచ్చుటయును మొదలుగా నతి దుష్కరంబులైన వాని నైనను భవత్ప్రియార్థము సేసెద; నెయ్యది సెప్పు' మనిన ప్రీత యై భరతమాత యి ట్లనియె. 301**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (కైకేయి) చెప్పగా; అతండు= అతడు= (దశరథుడు); ఆ+అతివన్= ఆ వనితను- కైకేయిని; కనుంగొని= చూచి; అవధ్యుల వధియించుటయును= చంపరానివారిని చంపటమున్నూ; వధ్యులన్= చంపదగిన వారిని; కాచుటయును= రక్షించటమున్నూ; బ్రాహ్మణ ధనంబులు= విప్రుల విత్తాలు; తక్కన్= తప్ప; అన్యుల ధనంబున్= ఇతరుల ద్రవ్యం; అపహరించుటయును= బలాత్కారంగా సంగ్రహించటమున్నూ; అభీష్ట, ధనంబున్= కోరిన డబ్బులు ఇచ్చుటయును= ఇవ్వటమున్నూ; మొదలుగాన్= మున్నగునవి; అతి, దుష్కరంబులు= చేయటానికి మిక్కిలి చెడ్డవి; వానిని ఐన+ఐనను= అట్టి పనులను సయితం; భవత్+ప్రియ+అర్థము= నీకు ప్రీతి ఘటించే కొరకు; చేసెదన్= చేస్తాను; ఏ+అది= ఏది; చెప్పుము; అనినన్; ప్రీత+ఐ= సంతుష్టి చెందినదై; భరతమాత= భరతుడి తల్లి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నది.

**తాత్పర్యం:** అని కైకేయి పలికింది. అంతట దశరథమహారాజు ఆమెకు ఇట్లా బదులు పలికాడు. 'చంపరానివారిని చంపటమున్నూ, చంపదగినవారిని కాపాడటమున్నూ, విప్రుల విత్తాల నపహరించటమున్నూ తప్ప, తక్కిన పనులు మిక్కిలి పాపకృత్యాలైనాసరే ఇతరుల ధనాన్ని హరించటం, కోరిన ధనాలను దానం చేయటం, మొదలైన చెడుపనులను సయితం నీ సంతృప్తికొరకై ఆచరించగలను. ఇక, నీకు ఇష్టమైనవరం వేడుకొనుము' అని అన్నాడు. అనగా భరతుడితల్లి కైక, దశరథుడితో ఇట్లా అన్నది.

**తే. 'యౌవరాజ్యపదంబునయందు భరతు । నధిప! యభిషేక మొనరింపు; మడవిలోన**
**నొలసి పదునాల్గువర్షంబు లుండ నాన । తిమ్ము రాముని; నురువర మ్మిదియ నాకు'. 302**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా, (ఓ దశరథ మహారాజా!); యౌవరాజ్య, పదంబున+అందున్= యువరాజుస్థానంలో; భరతున్= భరతుడిని; అభిషేకము+ఒనరింపుము= పట్టాభిషిక్తుడిని కావించుము; రామునిన్= శ్రీరాముడిని; అడవిలోనన్= అరణ్యంలో; ఒలసి= కడగి; పదునాల్గు వర్షంబులు= పదునాలుగు ఏండ్లు; ఉండన్= నివసించేటట్లుగా; ఆనతి+ఇమ్ము= ఆజ్ఞను ఒసంగుము; ఇది+అ= ఈ కోరిక తీర్చుటయే; నాకున్= నాకు; ఉరు, వరమ్ము= గొప్ప వరం.

**తాత్పర్యం:** 'ఓ దశరథమహారాజా! భరతుడికి యౌవరాజ్యపట్టాభిషేకం చేయుము. శ్రీరాముడిని పదునాలుగు సంవత్సరాలు అడవిలో నివసించు మని ఆనతిమ్ము. ఇదియే నేను కోరుకొనే గొప్పవరం.

**క. అనవుడు వీనులు గొఱవిం । గొని చూఁడిన యట్టు లైనఁ గువలయపతి పె**
**ల్చన పిడు గడఁ చిన క్రియఁ జే । తనరహితుం డగుచు ధరణితలమునఁ బడియెన్. 303**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (కైక) వచించగా; కువలయపతి= భూమండలానికి అధినేత అయినవాడు, (దశరథమహారాజు); వీనులు= చెవులు; కొఱవిన్+కొని= మండుతున్న కొయ్యను గైకొని; చూఁడిన= కాల్చిన; అట్టులు+ఐనన్= అట్టి విధంగా కాగా; పెల్చన= అధికంగా; పిడుగు+అడఁచిన, క్రియన్= పిడుగు మీదపడి క్రిందకు నొక్కిన రీతిగా; చేతన రహితుండు+అగుచున్= కదలిక మెదలిక లేనివాడు ఔతూ, స్పృహ తప్పినవాడు ఔతూ; ధరణితలమునన్= నేలపై; పడియెన్= కూలాడు.

**తాత్పర్యం:** కైకేయి చెప్పిన మాటలు వినేసరికి, చెవులలో మండేకట్టె దూర్చినట్లుగా మిక్కుటమైన వెత చెంది, ఆకస్మికంగా పిడుగుపాటుకు గురిఅయినవాడివలె దశరథమహారాజు స్పృహ తప్పి నేలపై పడి మూర్ఛచెందాడు.

**విశేషం:** అలం: ఉపమలు. క్రియన్= వలె. క్రియ అనే మాటకు 'వలె' అనే అర్థం తెలుగులో మాత్రమే కనివస్తున్నది. క్రియ అనేది ఇక్కడ తద్భవం. సంస్కృతంలో ఈపదానికి ఈ అర్థం లేదు.

**వ. అంతయు నెఱింగి రాఘవుండు నిజజనకుండు సత్యప్రతిజ్ఞుండు గావుత మని యాక్షణంబ సీతాసమేతుండయి వనంబునకు వెడలె; నతని పిఱుందన లక్ష్మణుండునుం జనియెఁ; దదనంతరంబ. 304**

**ప్రతిపదార్థం:** అంతయున్= ఆ జరిగిన సమస్తాన్నీ; ఎఱింగి= తెలిసికొని; రాఘవుండు= (రఘువు మహారాజు వంశానికి చెందినవాడు) శ్రీరాముడు; నిజ, జనకుండు= తన తండ్రి; సత్య ప్రతిజ్ఞుండు= సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు - అనగా తానుపల్కిన మాటను (వరాన్ని) నెరవేర్చినవాడు; కావుత మని(కావుతన్+అని)= అగు గాక అని తలపోసి; ఆ క్షణంబు+అ= ఆ త్రుటిలోనే, వెను వెంటనే; సీతా, సమేతుండు+అయి= సీతాదేవితో పాటుగ; వనంబునకున్= అరణ్యానికి; వెడలెన్=

వెళ్లాడు; అతని పిఱుందన్+అ= అతడి (శ్రీరాముడి) వెంబడే; లక్ష్మణుండునున్= లక్ష్మణుడున్నూ; చనియెన్= వెళ్లాడు; తత్+అనంతరంబు+అ= అటు పిమ్మటనే.

**తాత్పర్యం:** జరిగింది అంతా తెలిసికొని- అనగా కైకేయి వరం కోరటం, దశరథుడు మూర్ఛిల్లటం విని, శ్రీరాముడు తనతండ్రి అయిన దశరథుడు ఆడినమాట తప్పని సత్యసంధుడుగా ఉండుగాక అని తలపోసి, ఆ క్షణంలోనే బయలుదేరి సీతతో కలిసి అరణ్యవాసానికి వెళ్ళాడు. లక్ష్మణుడుకూడ ఆతడిని అనుసరించాడు. అటు పిమ్మట.

**విశేషం:** (1) రాఘవుడు అనగా రఘువంశానికి చెందినవాడు. వాచ్యార్థాన్నిబట్టి దశరథుడు, భరతుడు, లక్ష్మణుడు - ఆ కుటుంబంలోనివారు అందరూ రాఘవులే. అయినా, రూఢ్యర్థంలో రాఘవశబ్దం శ్రీరాముడిపరంగానే బహుళంగా వాడబడింది.

2) రాముడిని దేవుడిని చేసింది ఆతడి స్వచ్ఛంద స్వార్థత్యాగం. వ్యావహారికమైన కర్మజగత్తు స్వార్థపరాయణం. ఏ ఆదర్శంలోనైనా కొంత దివ్యత్వం ఇమిడి ఉంటుంది. త్యాగంలో లోకోత్తరమైన దివ్యత్వం మిక్కుటంగా ఉన్నది. 'న కర్మణా న ప్రజయా న ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః'' సత్క్రియలవలన కానీ, సత్సంతానంవలన కానీ, ధనంవలన కానీ అమృతత్వం లభించదు. అది త్యాగంవలన మాత్రమే సిద్ధిస్తుంది.

### దశరథుఁడు రామవిశ్లేషముచే సురలోకగతుం డగుట (సం.3-261-29)

**క.** **రాముఁడు సనుట విని మహో । ద్దామం బగు శోకవహ్ని దరికొనఁగను హా**
**రామ! గుణధామ! యని యని । భూమీశ్వరుఁ డసువియోగముం బ్రాపించెన్. 305**

**ప్రతిపదార్థం:** భూమి+ఈశ్వరుఁడు= పుడమికి అధిపతి, దశరథ మహారాజు; రాముఁడు+చనుట, విని= శ్రీరాముడు అరణ్యానికి వెళ్ళినవార్త విని; మహా+ఉద్దామంబు+అగు= మిక్కిలి ఎక్కువయింది అయిన; శోక వహ్ని= దుఃఖం అనే అగ్ని; దరికొనఁగను= అలముకొని మండగా; హా! రామ!= అయ్యో రామా! (నీవు వెడలి పోయావా?); గుణధామ!= మంచి గుణాలకు నెలవైన వాడా!; అని+అని= అని మాటిమాటికి పలవరిస్తూ; అసు, వి, యోగమున్= ప్రాణాలను విడవటం; ప్రాపించెన్= పొందాడు.

**తాత్పర్యం:** రాముడు అరణ్యవాసానికి వెడలిన వార్త విని, దశరథ మహారాజు మిక్కుటమైన ఆవేదనతో, 'హా రామా! సద్గుణాలకు నెలవైనవాడా! అతిలోకం, మహోన్నతం అయిన త్యాగం ప్రదర్శించి అడవులకు వెళ్ళావు; నీ గొప్పతనం ఋజువు అయింది. నిన్ను వదలి నే నెట్లా బ్రదుకగలను?' అని విలపించి విలపించి మరణించాడు.

**వ.** **ఇట్లు దశరథుండు సురలోకగతుం డగుటయుఁ, గైకేయి దనకొడుకు రావించి 'భూవల్లభుండు దేవభావంబు నొందె, రాముండును వనంబున కరిగె, నింక నర్హుండవు నీవ కావున నఖిలమహీరాజ్య రక్షణంబు సేయు' మనిన నక్కుమారుండు క్రోధశోకదందహ్యమానమానసుం డగుచుఁ దల్లి కి ట్లనియె. 306**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; దశరథుండు; సుర, లోక, గతుండు+అగుటయున్= దేవతలలోకానికి వెళ్ళటమున్నూ- మరణించటమున్నూ; కైకేయి= కేకయ రాజపుత్రి; తన కొడుకున్= తన పుత్రుడిని, భరతుడిని; రావించి= రప్పించి; భూవల్లభుండు= పుడమిపతి, రాజు (దశరథుడు); దేవ భావంబున్+ఒందెన్= దేవత్వాన్ని పొందాడు, మరణించాడు; రాముండును= శ్రీరాముడుకూడా; వనంబునకున్= అడవికి; అరిగెన్= వెళ్ళాడు; ఇంకన్= ఇకమీద; అర్హుండవు= తగినవాడవు; నీవు+అ= నీవే; కావునన్= కాబట్టి; అఖిల, మహీ, రాజ్య రక్షణంబు= సమస్తమైన భూరాజ్యాన్ని కాపాడటం; చేయుము= సల్పుము; అనినన్=

అని చెప్పగా; ఆ+కుమారుండు= ఆ పుత్రుడు (భరతుడు); క్రోధ, శోక, దందహ్యమాన, మానసుండు+అగుచున్= కోపంచేతను దుఃఖం చేతను మిగుల దహించబడిన చిత్తం కలవాడు ఔతూ; తల్లికిన్= మాతకు (కైకేయికి); ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా దశరథుడు దివంగతు డయ్యాడు. శ్రీరాముడు వనవాసానికి వెళ్ళాడు. కైకేయి భరతుడిని రప్పించి, 'మహారాజు (దశరథుడు) స్వర్గస్థుడైనాడు; రాముడు వనవాసానికి వెళ్లాడు; కనుక అర్హుడవైన నీవు రాజ్య భారాన్ని వహించు' మని కోరింది. కాని, భరతుడు ఆగ్రహంతో దుఃఖంతో కూడిన మనస్సు కలవాడై తల్లికి ఇట్లా బదులు పలికాడు.

**విశేషం:** (1) భరతుడికి - క్రోధం కలగటానికి కారణం - తల్లి నిర్వహించిన భూమిక. (2) దుఃఖానికి రెండు కారణాలు ఉన్నాయి. తండ్రిమరణం, అన్న అయిన శ్రీరాముడి అరణ్యగమనం.

**సీ.** **'దురితంబు లెన్నండుఁ బొరయక వెలుఁగొందు । కమలాప్తకులమునఁ గసటు గలిపి,**
**పరమధర్మాత్మకుఁ బురుహూతసన్నిభుఁ । బతి మ్రింగికొని, కృపఁ బాఱవైచి**
**యాయతబాహుఁ దేజోయుక్తు మాయన్నఁ । బటుధైర్యు నడవులపాలు వఱిచి,**
**జీవితహంత్రివై త్రోవంగరాని దు । ష్కీర్తి నా యౌదలఁ గీలుకొల్పి,**

**ఆ.** **శ్రీకి నెడలి సకలలోకంబుచేతను । దిట్టు గుడిచి కోర్కి దీర్చుకొంటి**
**పాపజాతురాల! యీ పాతకం బేమి । సేయ? దింక నేమి సేయువాఁడ?'** **307**

**ప్రతిపదార్థం:** పాప జాతురాల= పాపం చేసిన వర్గానికి చెందిన దానా, పాపాత్మురాలా!; దురితంబులు= పాపాలు; ఎన్నండున్= ఎప్పుడును; పొరయక= సంక్రమించకుండా; వెలుఁగు+ఒందు= ప్రకాశించే; కమల+ఆప్త, కులమునన్= సూర్యవంశంలో; కసటు+కలిపి= మాలిన్యం కలిగించి; పరమ, ధర్మ+ఆత్మకున్= గొప్ప ధార్మికుడిని; పురుహూత, సన్నిభున్= దేవేంద్రుడివంటివాడిని; పతిన్= భర్తను; మ్రింగికొని= కబళించి; కృపన్= దయను (జాలి అనే మంచి గుణాన్ని); పాఱన్‌వైచి= దూరంగా విసరివేసి; ఆయత బాహున్= పొడుగైన చేతులు కలవాడిని (పరాక్రమవంతుడిని); తేజస్+యుక్తున్= వర్చస్సు కలవాడిని; మా+అన్నన్= మా అన్న అయిన శ్రీరాముడిని; పటుధైర్యున్= గొప్పదైన చిత్తబలం కలవాడిని; అడవుల, పాలు, పఱిచి= అరణ్యాలపాలు చేసి; జీవిత హంత్రివి+ఐ= బ్రదుకులను హరించే దానివయి; త్రోవంగన్‌రాని= వదలించి వేయటానికి (నివారించటానికి) వీలులేని; దుష్కీర్తి= చెడ్డ పేరు; నా ఔదలన్= నా నడినెత్తిమీద; కీలు కొల్పి= ప్రతిష్ఠించి; శ్రీకిన్+ఎడలి= శ్రీకి దూరమైన (శోభ, కాంతి మున్నగు లక్షణాలకు దూరమై); సకల లోకంబుచేతను= సమస్త జగత్తుచేతను; తిట్టు+కుడిచి= తిట్లు తిని, నిందించబడి; కోర్కి+తీర్చుకొంటి(వి)= నీ అభిలాషను నెరవేర్చుకొన్నావు; ఈ పాతకంబు+ఏమి+చేయదు?= ఈ పాపం ఇంక ఏమి చేయకుండా ఉంటుంది? (అన్ని అనర్థాలకు ఈ ఒక్క పాపం చాలు); ఇంకన్= ఇక; ఏమి+చేయువాఁడన్?= నేను ఏమిచేసేది? ( చేసిన పాపానికి ఎటువంటి నిష్కృతి లేదు కాబట్టి నేను అయోమయంలో ఉన్నానని భావం).

**తాత్పర్యం:** 'పాపాలచేత మలినంగాని స్వచ్ఛమైన సూర్యవంశానికి మచ్చతెచ్చి, పరమధార్మికుడు దేవేంద్రుడితో సమానుడు అయిన భర్తను కబళించి, హృదయంలో ఇసుమంత జాలి లేకుండా దేదీప్యమానమైన వర్చస్సు కలవాడును, గొప్పపరాక్రమవంతుడును ఐన మా అన్న శ్రీరాముడిని అడవులలో ప్రవాసానికి పంపించి, జీవితాలను హరించేదానివై, నా నెత్తిమీద తొలగించ వీలుకాని అపకీర్తి బరువును మోపి, శ్రీకి ఎడబాటయి సమస్తలోకాలచేత నిందను పొంది

నీ కోరిక నెరవేర్చుకొన్నావు. ఓ పాపాత్మురాలా!, ఇంతటి దురితానికి ఒడిగట్టావు; ఈ పాతకానికి ఏ నిష్కృతి అయినా ఉన్నదా? ఇక నే నేమి చేయగలను?'

**వ. అని దుఃఖించి, భరతుండు దండ్రికి నుచితక్రియలు నిర్వర్తించి, యనంతరంబ సమస్త మంత్రి సామంత భూసుర పౌర జానపద సహితుండై కదలి, ముప్పురు దల్లులను వసిష్ఠ వామదేవులనుం బురస్కరించుకొని తానును శత్రుఘ్నుండును రామానునయార్థంబు చిత్రకూటశైలంబున కరిగి యందు. 308**

**ప్రతిపదార్థం:** అని దుఃఖించి= అనుచు పరితపించి; భరతుండు; తండ్రికిన్= జనకుడికి; ఉచిత క్రియలు= తగిన సంస్కారాలు (దినవార క్రియలు); నిర్వర్తించి= నిర్వహించి; అనంతరంబు+అ= ఆపైన వెంటనే; సమస్త, మంత్రి, సామంత, భూసుర, పౌర, జానపద సహితుండు+ఐ= అందరు అమాత్యులతో, కప్పం చెల్లించే రాజులతో, బ్రాహ్మణులతో, పట్టణవాసులతో, పల్లెలలో నివసించేవారలతో కూడుకొని; కదలి= పయనించి; ముప్పురు= ముగ్గురు; తల్లులను= జననులను; వసిష్ఠ, వామదేవులనన్= వసిష్ఠుడు, వామదేవుడు అనే పురోహితులను; పురస్కరించుకొని= ముందు పెట్టుకొని; తానును= తానున్నూ (భరతుడును); శత్రుఘ్నుండును= (సౌమిత్రి అయిన తమ్ముడు శత్రుఘ్నుడును); రామ+అనునయ+అర్థంబు= రాముడిని ఊరడించటంకొరకై; చిత్రకూట శైలంబునకున్= చిత్రకూటం అనే పేరుకల కొండకు; అరిగి= వెడలి; అందున్= అక్కడ.

**తాత్పర్యం:** అని పరిపరివిధాల దుఃఖించి, భరతుడు తన తండ్రికి అంత్యక్రియలు నిర్వహించాడు. పిదప అందరు మంత్రులతో, కప్పం చెల్లించే సామంతరాజులతో, బ్రాహ్మణులతో, పట్టణంలో నివసించే పౌరులతో, పల్లెటూళ్లలో నివసించే జానపదులతో కలిసి, ముప్పురు తల్లులైన కౌసల్య, సుమిత్ర, కైకేయి అనే రాణులతో, పురోహితులైన వసిష్ఠవామదేవులతో పాటు తానున్నూ, శత్రుఘ్నుడున్నూ శ్రీరాముడిని ప్రసన్నుడిని చేసికొనటానికై చిత్రకూటపర్వతానికి వెళ్లి అక్కడ.

**మ. కనియెం గోమలనీలమేఘసుభగాకారున్, జటావల్కలా
జినధారున్, సితభూతిభూషితుని, రాజీవాక్షుఁ, గల్యాణ కీ
ర్తనుఁ, గాకుత్స్థకులప్రదీపకుని, సీతాలక్ష్మణోపేతు, స
న్మునిలోకార్చితు, సత్కృపాభరణు, రామున్, రాజచూడామణిన్. 309**

**ప్రతిపదార్థం:** కోమల నీల మేఘ సుభగ+ఆకారున్= లలితమైన నల్లని మబ్బువంటి మనోహరమైన రూపం కలవాడిని; జటావల్కల+అజిన, ధారున్= జడలు, నారబట్టలు, జింకతోలు ధరించిన వాడిని; సిత భూతి భూషితునిన్= తెల్లని బూడిదను అలంకరించుకొన్నవాడిని; రాజీవ+అక్షున్= పద్మాలవంటి కనులు కలవాడిని; కల్యాణ కీర్తనున్= మంచి ప్రవర్తన కలవాడుగా ప్రశంసించబడే వాడిని; కాకుత్స్థ, కుల, ప్రదీపకునిన్= కకుత్స్థ వంశాన్ని వెలుగొంద జేసేవాడిని; సీతా, లక్ష్మణ+ఉపేతున్= సీతతో లక్ష్మణుడితో కూడుకొని ఉన్నవాడిని; సత్+ముని, లోక+అర్చితున్= ఉత్తములైన ఋషుల సముదాయంచేత పూజించ బడునట్టి వాడిని; సత్+కృపా+ఆభరణున్= మంచి దయ అనే ఆభరణంచేత అలంకరించబడిన వాడిని; రాజ చూడామణిన్= రాజులలో తలమానికంవంటివాడిని, రాజశ్రేష్ఠుడిని; (భరతుడు); రామున్= రాముణ్ణి; కాంచెన్= సందర్శించాడు.

**తాత్పర్యం:** భరతుడు శ్రీరాముడిని చిత్రకూటపర్వతంపై సందర్శించాడు. ఆ శ్రీరాముడు సుకుమారమైన నీలమేఘంవలె మనోహరంగా ఉన్నాడు. జడలు, నారబట్టలు, జింకతోలు ధరించాడు. తెల్లని విభూతి దేహానికి అందంగా పూసుకొన్నాడు. పద్మాలవంటి కనులు కలిగిఉన్నాడు. కకుత్స్థ వంశాన్ని వెలుగొంద జేసేవాడు, మహర్షుల చేత మన్నింపబడేవాడు, దయార్ద్రహృదయుడు, రాజులలో శ్రేష్ఠుడు.

**విశేషం:** (1) రాముడు రాజీవాక్షుడు. సంస్కృత రామాయణంలో పలుతావుల వాల్మీకిమహర్షి శ్రీరాముడిని 'రామో రాజీవలోచనః' అని అభివర్ణించాడు. (2) కకుత్స్థుడు సూర్యవంశంలో పుట్టిన వంశకర్త. వికుక్షిశశాదుల కుమారుడు. బ్రహ్మ విష్ణువుల ఆదేశంతో ఇంద్రుడిని వృషభ వాహనంగా చేసికొని దానవులపై దాడిచేసి వారిని సంహరించి దేవతలకు మేలు చేశాడు. కకుత్థులంలో కూర్చుండి వెళ్ళి దానవులతో యుద్ధం చేశాడు కాబట్టి కకుత్స్థుడని పేరు వచ్చింది. ఇంద్రవాహనుడనీ, పురంజయుడనీ అతడు ప్రసిద్ధుడు. అతని వంశానికి వన్నె తెచ్చినవాడు శ్రీరాముడు.

**వ. కని యంతంత నాక్రందన పరుం డగుచుం జని తదీయచరణంబులపయిం బడి పితృమరణప్రకారం బంతయు నెఱింగించి, 'దేవా! సకలసామ్రాజ్యధురీణుండ వై మమ్ముందఱ ననుశాసింపవే!' యని యర్హజన సహితంబుగా నతనిం బ్రార్థించిన. 310**

**ప్రతిపదార్థం:** కని= చూచి; అంతన్+అంతన్= సమీపానికి చేరుతూ వస్తుండగా; ఆక్రందన పరుండు+అగుచున్= ఏడుస్తున్నవాడై; చని= వెళ్లి; తదీయ చరణంబుల పయిన్+పడి= (ఆ శ్రీరాముడియొక్క) పాదాల మీద పడి; పితృ, మరణ, ప్రకారంబు+ అంతయున్= తండ్రి చావునుగూర్చిన వివరాలను సంపూర్ణంగా; ఎఱింగించి= తెలిపి; దేవా!= ప్రభూ!; సకల, సామ్రాజ్య, ధురీణుండవు+ఐ= సమస్తమైన గొప్ప రాజ్యాన్ని భరించేవాడవు అయి; మమ్మున్+అందఱను; అనుశాసింపవే= ఏలుకొనవా; అని= అంటూ; అర్హజన సహితంబుగాన్= యోగ్యులైన వారందరినీ కలుపుకొని; అతనిన్= అతడిని (శ్రీరాముడిని); ప్రార్థించినన్= వేడుకొనగా.

**తాత్పర్యం:** భరతుడు శ్రీరాముడిని సమీపించటానికి మునుముందుగనే రోదించసాగాడు. సమీపించి పెద్దపెట్టున ఏడుస్తూ భరతుడు శ్రీరాముడిపాదాలపై పడి, తండ్రి దశరథుడి మరణవృత్తాంతం సాకల్యంగా తెలిపి, 'దేవా! నీవు అయోధ్యకు తిరిగివచ్చి సింహాసనం అధిష్ఠించి మమ్ముల నందరిని ఏలుకొమ్ము' అని ప్రార్థించాడు. అతడితో పాటు వచ్చిన పెద్దలందరు భరతుడివాక్యాలను బలపరచారు.

**క. గురువాక్యరక్షణైకా । దరచిత్తుం డైన యయ్యుదాత్తచరితుఁ డె
ప్పరుసున నొడఁబడఁ డయ్యెను । సరసమహీరాజ్యసమనుశాసనమునకున్. 311**

**ప్రతిపదార్థం:** గురు, వాక్య, రక్షణ+ఏక+ఆదరచిత్తుండు+ఐన= తండ్రి పలికిన మాటలను కాపాడటంలోనే అభిమానం కలిగిన మనస్సు కలవాడయిన; ఆ+ఉదాత్త, చరితుఁడు= ఆ గొప్ప శీలం కలవాడు (శ్రీరాముడు); సరస మహీరాజ్య సమనుశాసనమునకున్= మనోహరమైన భూరాజ్యాన్ని పరిపాలించటానికి; ఏ+పరుసునన్= ఏ విధంగాకూడా; ఒడం బడఁడు+అయ్యెను= సమ్మతించ జాలకపోయాడు.

**తాత్పర్యం:** పితృవాక్యపరిపాలనలోనే లగ్న మైన మనస్సు గలిగిన ఆ గొప్పశీలం కల శ్రీరాముడు ఎన్నివిధాల తనను బ్రతిమాలినప్పటికీ తిరిగి భూరాజ్యాన్ని పరిపాలించటానికి ఎంతమాత్రం సమ్మతించలేదు.

**వ. భరతుండును రాముచేతఁ బ్రత్యాఖ్యాతుండై తదీయపాదుకంబులు గొని చని, వాని నర్చించుచు నంది గ్రామంబునందు వసియించి రాజ్యానుసంధానంబు సేయుచుండె; నిట రాఘవుం డయోధ్యాపుర సమీపం బగుటం జేసి క్రమ్మఱ భరతాగమనంబు శంకించి, చిత్రకూటంబు వాసి శరభంగుపాలికిం జని, యతని చేత సత్కృతుండై దండకారణ్యంబు సొచ్చి, యందు గోదావరీతీరంబున ననుజవధూసహితంబుగాఁగృత**

**నివాసుండై యున్నంత; దశగ్రీవుచెలియలు శూర్పణఖ సనుదెంచి, వారికి నపకారంబు సేయ మొనసినం గినిసి, యా రాజపుత్త్రులు దత్కర్ణనాసికావైకృతం బొనరించినం బదంపడి. 312**

**ప్రతిపదార్థం:** భరతుండును; రామచేతన్= శ్రీరాముడిచేత; ప్రతి+ఆఖ్యాతుండు+ఐ= బదులు చెప్పబడి మరలించబడిన వాడై; తదీయ పాదుకంబులు= ఆతనియొక్క (శ్రీరాముడియొక్క) పాదుకలు; కొని= స్వీకరించి; చని= వెడలి; వానిన్= వాటిని, ఆ పాదుకలను; అర్చించుచున్= ఆరాధిస్తూ; నందిగ్రామంబునందున్= నందిగ్రామం అనే స్థలంలో; వసియించి= నివసించి; రాజ్య+అనుసంధానంబు= రాజ్య పరిపాలన; చేయుచున్+ఉండెన్= చేస్తున్నాడు; ఇట= ఇచట (రాముడు ఉండేచోట); రాఘవుండు= రఘువంశానికి చెందినవాడు - శ్రీరాముడు; అయోధ్యా, పుర, సమీపంబు+అగుటన్+చేసి= అయోధ్య పట్టణం దగ్గరగా ఉండటంచేత; క్రమ్మఱన్= మరల; భరత+ఆగమనంబున్= భరతుడియొక్క రాకను; శంకించి= అనుమానించి; చిత్రకూటంబు+పాసి= చిత్రకూటపర్వతాన్ని వదలిపెట్టి; శరభంగు పాలికిన్+చని= శరభంగుడు అనే ఋషిదగ్గరకు వెళ్ళి; అతనిచేతన్= (ఆ శరభంగుడిచేత); సత్కృతుండు+ఐ= సమ్మానించబడినవాడై; దండక+అరణ్యంబు= దండకం అనే పేరు కల అడవి; చొచ్చి= ప్రవేశించి; అందున్= ఆ దండకవనంలో; గోదావరీ తీరంబునన్= గోదావరి అనే నది ఒడ్డున; అనుజ, వధూ, సహితంబుగాన్= తమ్ముడితోడను, భార్యతోడను కూడినవాడై; కృత నివాసుండు+ఐ= నెలవు ఏర్పరచుకొనినవాడై; ఉన్న+అంతన్= నివసించినంతట; దశగ్రీవు, చెలియలు= రావణుడి సోదరి; శూర్పణఖ= శూర్పణఖ యనే పేరు కలది; చనుదెంచి; వచ్చి; వారికిన్= వారికి (సీతారామ లక్ష్మణులకు); అపకారంబు+చేయన్= కీడు చేయటానికి; మొనసినన్= సమకట్టగా; కినిసి= కోపగించి; ఆ, రాజ, పుత్త్రులు= ఆ రాచబిడ్డలు; తత్+కర్ణ, నాసికా, వైకృతంబు+ఒనరించినన్= ఆమె చెవులకూ, ముక్కుకూ వికారం కలిగించగా (ముక్కూ చెవులూ కోయగా); పదంపడి= పిమ్మట.

**తాత్పర్యం:** భరతుడు శ్రీరాముడిచేత బదులు చెప్పబడి మరలింపబడినవాడై, అన్నగారి పాదుకలను అర్థించి కైకొని అయోధ్యకు దగ్గరగా ఉన్న నందిగ్రామం చేరి అక్కడ రాముడిపాదుకలను నెలకొల్పి, తాను రాముడి ప్రతినిధిగా రాజ్యం చేయసాగాడు. ఇట శ్రీరాముడు తాను చిత్రకూటంలోనే ఉంటే భరతుడు తిరిగి వచ్చి తనను అయోధ్యకు రమ్మని మరల ప్రార్థించవచ్చుననే భయంతో అటనుండి కదలి శరభంగమహర్షియొక్క ఆశ్రమానికి చేరాడు. శరభంగుడు శ్రీరాముడికి స్వాగతం చెప్పి సమ్మానించాడు. తదుపరి శ్రీరాముడు దండకారణ్యంలో ప్రవేశించి, అందులో గోదావరీతీరంలో తమ్ముడితో తన భార్యతో పర్ణశాలలను నిర్మించుకొని నివసించసాగాడు. అప్పుడు రావణుడిసహోదరి శూర్పణఖ అక్కడికి వచ్చి వారికి కీడు చేయబోగా వారు ఆగ్రహించి ఆమె ముక్కుచెవులు వికారం చేశారు. అంతట.

**ఉ.** **శూర్పణఖానిమిత్తమున శూరు లనేకులు రక్కసుల్ మహో**
**త్సర్పితరోషులై బహుళ సైన్యయుతంబుగ నెత్తి వచ్చుడున్**
**దర్పితవైరిభంజనుఁ డుదారుఁడు రాఘవుఁ డస్త్రవిద్య నే**
**ర్పేర్పడఁ గేలిఁ బోలె సమయించె రణాంగణభూమి నందఱన్. 313**

**ప్రతిపదార్థం:** శూర్పణఖా, నిమిత్తమునన్= శూర్పణఖ మూలాన, అంటే, శూర్పణఖకు జరిగిన పరాభవానికి ప్రతీకారంగా; శూరులు= వీరులు; అనేకులు= పెక్కుమంది; రక్కసుల్= రాక్షసులు; మహా+ఉత్+సర్పిత, రోషులు+ఐ= మిక్కుటంగా విజృంభించిన కోపం కలవారై; బహుళ, సైన్య, యుతంబుగన్= పెక్కు సంఖ్య గల భటులు గల సేనలతో కూడుకొని; ఎత్తి వచ్చుడున్= దండెత్తి యుద్ధం చేయటానికై అరుదెంచుటయును; దర్పిత, వైరి, భంజనుఁడు= గర్వించిన శత్రువులను నాశనం

చేసేవాడు; ఉదారుఁడు= గొప్పవాడు; రాఘవుఁడు= రఘువంశంలో పుట్టినవాడు; అస్త్ర, విద్య, నేర్పు+ఏర్పడన్= మంత్రమహిమ గల బాణాలను ప్రయోగించటంలో తనకు లభించిన కౌశలంతో; కేలిన్+పోలెన్= ఆట మాదిరిగా; రణ+అంగణ భూమిన్= యుద్ధరంగంలో; అందఱన్= అందరిని (రాక్షసభటులను అందఱను); సమయించెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** శూర్పణఖకు జరిగిన పరాభవానికి ప్రతీకారంగా పెక్కుమంది రక్కస వీరులు మిక్కిలి రోషంతో పెక్కు సేనలతో శ్రీరాముడిపై దండెత్తి వచ్చారు. మహా పరాక్రమోపేతుడు గొప్పవాడు శత్రుసంహారకుడు మంత్ర బాణాలను ప్రయోగించటంలో ఆరితేరినవాడు అయిన శ్రీరాముడు యుద్ధరంగంలో ఆ రక్కసిమూకలను సంహరించాడు.

**వ. ఇట్లు ఖరదూషణాదులం గొట్టి పదునాలుగువేలరాక్షసులం జంపి దండకారణ్యంబు విగతకంటకంబు గావించె; నంత శూర్పణఖయు రయంబున రావణుపాలికిం జని తచ్చరణంబులపయిం బడి యేడ్చినం, జెలియలి కైన వైకృతం బేర్పడం జూచి యన్నిశాచరనాథుం డి ట్లనియె. 314**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ఖర, దూషణ+ఆదులన్+కొట్టి= ఖరుడు దూషణుడు మొదలుగా గల వారిని ఓడించి; పదు, నాలుగు వేల రాక్షసులన్= పదు నాలుగువేల మంది రక్కసులను; చంపి= సంహరించి; దండక+అరణ్యంబున్= దండకం అనే పేరు గల అడవిని; విగత కంటకంబు= పోగొట్టబడిన ముండ్లు (శత్రువులు) కలదిగా; కావించెన్= చేశాడు; అంతన్= అటు పిమ్మట; శూర్పణఖయున్; రయంబునన్= శీఘ్రంగా; రావణు పాలికిన్+చని= రావణుడివద్దకు వెళ్లి; తత్+చరణంబుల పయిన్+పడి= ఆతడియొక్క పాదాలమీద వ్రాలి; ఏడ్చినన్= బిగ్గరగా శోకించగా; చెలియలికిన్+ఐన= సహోదరికి జరిగిన; వైకృతంబు= వికారం; ఏర్పడన్+చూచి= స్పష్టంగా పరిశీలించి; ఆ+నిశాచర, నాథుండు= ఆ రాక్షసపతి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** రాముడు, ఈ విధంగా, ఖరుడు దూషణుడు అనే రాక్షసులను వారిభటులను ఓడించి, పదునాలుగు వేలమంది రక్కసులను సంహరించి, దండకారణ్యంలో రాక్షసబాధ లేకుండా చేశాడు. అంతట శూర్పణఖ శీఘ్రంగా తన అన్న అయిన రావణాసురుడిపాలికి వెళ్ళి, ఆతడి పాదాలపై పడి బిగ్గరగా శోకించింది. రావణాసురుడుకూడా తన సహోదరికి జరిగిన పరాభవాన్ని గుర్తించి ఆమెకైన అంగవికారాన్ని పరిశీలించి చూచి శూర్పణఖతో ఇట్లా పలికాడు.

**సీ. 'ఎఱిఁగి యెఱింగి నేఁ డెవ్వాఁడు నిశిత వి । స్ఫారశూలాగ్రంబుపయికి నుఱికెఁ?**
**దలయంపియం దగ్గి దరికొల్పి యెవ్వండు । నేఁడు నెమ్మది శయనింపఁ జూచె?**
**నుగ్రవిషానలం బుమియుచున్న యహీంద్రుఁ । గడఁగి నేఁ డెవ్వండు గాలఁ దన్నె?**
**హుంకారఘోరమై యుదరు బెబ్బులి మీస । లుఱక యెవ్వాఁడు నేఁ డూఁచికొనియె?**

**ఆ. నిన్ను నెవ్వఁ డకట! నేఁ డిట్లు గడు భంగ । పఱిచెఁ జెపుమ నాకుఁ బద్మనయన!**
**యాయువును సిరియును నవశంబు లయ్యె నేఁ । డెవ్వనికొ తలంప నిజ్జగమున.' 315**

**ప్రతిపదార్థం:** పద్మనయన!= తామరపువ్వుల వంటి కన్నులు కలదానా!; ఎఱిఁగి+ఎఱింగి= తెలిసి- తెలిసి అంటే బాగా తెలిసి కూడ; నేఁడు= ఈవేళ; ఏ+వాఁడు= ఎవడు; నిశిత, విస్ఫార, శూల+అగ్రంబు, పయికిన్= వాడి అయిన విశాలమైన, బల్లెం మొనపైకి; ఉఱికెన్= దూకాడు?; ఎవ్వండు= ఎవడు; నేఁడు= ఈ వేళ; తలయంపియందున్= తలగడపై; అగ్గి= నిప్పు;

దరికొల్పి= ప్రజ్వలింపచేసి; నెఱ+మదిన్= నిండు మనస్సుతో (హాయిగా); శయనింపన్= నిదురించటానికి; చూచెన్= యత్నించాడు?; నేఁడు= ఈ వేళ; ఎవ్వండు= ఎవడు; ఉగ్ర, విష+అనలంబు= దారుణమైన విసం అనే అగ్గి; ఉమియుచున్న= నోటినుండి కక్కుతూ ఉన్న; అహి+ఇంద్రున్= పాములరేనిని; కడఁగి= పూని; కాలన్= కాలితో; తన్నెన్= మర్దించాడు? ఏ+వాఁడు= ఎవడు; నేఁడు= ఈ వేళ; హుంకార ఘోరము+ఐ= గాండ్రిస్తూ ఉండటంచేత భయంకరమై; ఉదరు బెబ్బులి= బెదరు గొలిపే పెద్దపులి (యొక్క); మీసలు= మూతిపై ఉండే వెండ్రుకలు; ఉఱక= లక్ష్యపెట్టక; ఊఁచి కొనియెన్?= లాగాడు?; అకట= ఔరా!; నేఁడు= ఈ వేళ; ఎవ్వఁడు= ఎవడు; నిన్నున్= నిన్ను, (ఓ శూర్పణఖా నిన్ను); ఇట్లు= ఈ రీతిగా; కడున్= మిక్కిలి; భంగపఱిచెన్= పరాభవించాడు; నాకున్= నాకు; చెపుము+అ= వచింపవే; ఈ+జగమునన్= ఈ లోకంలో; తలంపన్= ఆలోచించగా; ఎవ్వనికిన్+ఒ= ఎవడికో; ఆయువును= బ్రదికి ఉండే కాలం; సిరియును= ఐశ్వర్యం; అవశంబులు+అయ్యెన్= నశించాయి సుమా!

**తాత్పర్యం:** 'పద్మాలవంటి కన్నులు కలదానా!, నా ప్రియసహోదరీ! శూర్పణఖా! నీకు ఈ రీతిగా పరాభవం చేసిన నీచుడు ఎవ్వడు? నేటితో వాడికి ఆయువు తీరిపోయింది. ఐశ్వర్యం అడుగంటింది సుమా! ఈ లోకంలో వాడిని నే నింక బ్రదుకనిస్తానా? ఎవడు వాడు? తెలిసి తెలిసి ఎవడు వాడిఅయిన బల్లెం మొనపయికి ఉరికాడు? ఎవడు వాడు తలగడపై నిప్పు రగిల్చి, హాయిగా నిదురపోవాలని యత్నిస్తున్నాడు? ఎవడు వాడు దారుణ మైన విషాగ్ని క్రక్కే సర్పరాజాన్ని కాలితో త్రొక్కేడు? ఎవడు వాడు గాండ్రిస్తున్న పెద్దపులి మీసాలను పట్టుకొని ఊగాడు? వా డెవడో చెప్పుము'.

**క.** **అని పలుకునప్పు డాతని । ఘనతరముఖనేత్రనాసికాకర్ణములం**
**దనవరతరోషపావక । జనితశిఖావితతు లక్కజంబుగ వెడలెన్. 316**

**ప్రతిపదార్థం:** అని పలుకునప్పుడు= అని మాటాడేసమయంలో; ఆతని= ఆ రావణుడి; ఘనతర, ముఖ, నేత్ర, నాసికా, కర్ణములందున్= మిక్కుటంగా పెద్దవిగా ఉన్న మొగాలనుండి, కన్నులనుండి, ముక్కులనుండి, చెవులనుండి; అనవరత, రోషపావక, జనిత, శిఖా, వితతులు= ఎడతెగక ప్రజ్వలించిన కోపం అనే అగ్నినుండి పుట్టిన జ్వాలల సముదాయాలు; అక్కజంబుగన్= ఆశ్చర్యకరంగా; వెడలెన్= వెలువడ్డాయి.

**తాత్పర్యం:** అని వచించేటప్పుడు పెద్దవి అయిన ఆ రావణాసురుడి మొగాలనుండి, కనులనుండి, ముక్కులనుండి, చెవులనుండి కోపం అనే అగ్నినుండి ఆవిర్భవించిన జ్వాలలు అచ్చెరువు కొలుపుతూ బయటకు వెలువడ్డాయి.

**వ.** **శూర్పణఖయు నతనికి రాఘవు లున్న తెఱంగును, నిజపరిభవంబు దత్కృతం బగుటయు, ఖరదూషణాది రాక్షసవధయునుం జెప్పిన విని, ధనదానుజుం డాక్షణంబ పురసంరక్షణంబునం దాప్తజనంబుల నియోగించి, సన్నద్ధుండై యొక్కరుండ వెలువడి త్రికూటకాలపర్వతంబులు గడచి సముద్రతీరంబునఁ బరమేశ్వరనివాసం బైన గోకర్ణస్థానంబునకుం జని, యచ్చటం దొల్లి రామువలనం బ్రాప్తపరాభవుండై ప్రవ్రజనంబు నొంది తపంబు సేయుచున్నవానిం దనపూర్వామాత్యు మారీచుం గనిన, నతండును బ్రియసంభ్రమంబులతోడ నతనిం బూజించి కుశలం బడిగి, 'భవదాగమన నిమిత్తం బేమి?' యని యడిగిన నసురేశ్వరుం డి ట్లనియె.317**

**ప్రతిపదార్థం:** శూర్పణఖయున్= శూర్పణఖయును; అతనికిన్= వాడికి (రావణుడికి); రాఘవులు= రఘువంశంలోనివారు (రాముడును లక్ష్మణుడును); ఉన్న, తెఱంగును= ఉన్న తీరును; నిజ పరిభవంబు= తనకు జరిగిన అవమానం; తత్+కృతంబు+

అగుటయున్= వారిచేత జరుపబడింది కావటమున్నూ; ఖర, దూషణ+ఆది, రాక్షస, వధయునున్= ఖరుడు దూషణుడు మున్నగు రక్కసులను సంహరించటమున్నూ; చెప్పినన్= వచించగా; విని= ఆలకించి; ధనద+అనుజుండు= కుబేరుడి తమ్ముడు; పురరక్షణంబునందున్= (లంకా) పట్టణాన్ని కాపాడటంకొరకై; ఆ క్షణంబు+అ= ఆ నిమిషంలోనే; ఆప్త జనంబులన్= తనకు కూరిమి కలవారిని; నియోగించి= ఏర్పాటు చేసి; సన్నద్ధుండు+ఐ= సన్నాహాలు అన్నీ చేసికొన్నవాడై; ఒక్కరుండు+అ= ఏకాకిగా; వెలువడి= బయలుదేరి; త్రికూట, కాల, పర్వతంబులు= త్రికూటం, కాలం అనే కొండలు; కడచి= దాటి; సముద్రతీరంబునన్= కడలిఒడ్డున; పరమ+ఈశ్వర, నివాసంబు+అయిన= పరమశివుడు ఉండేచోటు అయిన (శివుడికోవెల ఉన్నచోటు); గోకర్ణస్థానంబునకున్+చని= గోకర్ణం అనేపేరు కల స్థలానికి వెళ్ళి; అచ్చటన్= ఆ స్థలంలో; తొల్లి= పూర్వం; రామువలనన్= శ్రీరాముడిచేత; ప్రాప్తపరాభవుండు+ఐ= అవమానం చెందినవాడై; ప్రవ్రజనంబున్+ఒంది= సన్న్యాసాన్ని స్వీకరించి; తపంబు+చేయుచున్+ఉన్నవానిన్= తపస్సు చేస్తున్న వాడిని; తనపూర్వ+అమాత్యున్= తనకు అంతకుముందు మంత్రిగా వ్యవహరించి ఉన్నవాడిని; మారీచున్= మారీచుడు అనేవాడిని; కనినన్= చూడగా; అతండును= ఆ మారీచుడును; ప్రియ సంభ్రమంబుల తోడన్= ప్రీతితోను తత్తరపాటుతోను; అతనిన్= ఆ రావణుడిని; పూజించి= అర్చించి; కుశలంబు+అడిగి= యోగక్షేమాలు విచారించి; భవత్+ఆగమన, నిమిత్తంబు= నీరాకకు కారణం; ఏమి+అని, అడిగినన్= ఏమి అని ప్రశ్నించగా; అసుర+ఈశ్వరుండు= రాక్షసులకు ప్రభువు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శూర్పణఖ తన అన్నఅయిన రావణుడితో రామలక్ష్మణులు ఉన్న స్థలాన్ని, తనకు జరిగిన పరాభవాన్నీ, ఖరుడు దూషణుడు మున్నగు రాక్షసులను వారు సంహరించిన తీరును సవిస్తరంగా చెప్పి దుఃఖించింది. రావణుడు లంకాపట్టణాన్ని సంరక్షించటంకొరకై తనకు ఆప్తులైనవారిని నియోగించి, తాను సన్నాహాలు చేసికొని, ఒంటరిగా బయలుదేరి త్రికూటపర్వతాన్ని కాలపర్వతాన్ని అతిక్రమించి సముద్రతీరంలో ఉన్న గోకర్ణానికి వెళ్ళాడు. అక్కడ గోకర్ణేశ్వరాలయం ఉన్నది. శ్రీరాముడిచేత పరాభవం పొంది ఈశ్వరుడినిగూర్చి మారీచుడు అక్కడే తపస్సు చేస్తున్నాడు. ఆ మారీచుడు ఒకనాడు రావణాసురుడికి విశ్వాసపాత్రుడైన మంత్రిగా పనిచేసి ఉన్నవాడే. రావణుడి రాకను గమనించి మారీచుడు సంతోషించి అతడికి స్వాగతం చెప్పి, యోగక్షేమాలను గూర్చి ప్రశ్నించి, ఆతడిరాకకు గల కారణాన్ని తెలిసికొన గోరాడు. అప్పుడు, రావణుడు మారీచుడితో ఇట్లా అన్నాడు.

**ఉత్సాహము.**

**'వినవె రాముఁ డనఁగ నొకఁడు విపులదర్పహృదయుఁ డై**
**మన ఖరుండు లోనుగా సమగ్రశౌర్యు లైన య**
**ద్దనుజవరులఁ దునిమి, యిపుడు దండకస్థలంబునం**
**దొనర నిర్భయత్వ మొప్ప నున్నవాఁడు మేటి యై. 318**

**ప్రతిపదార్థం:** వినవె?= వినలేదా?; రాముఁడు+అనఁగన్= రాముడు అనే పేరు కలవాడు; ఒకఁడు= ఒకవ్యక్తి; విపుల, దర్ప, హృదయుఁడు+ఐ= మిక్కుటమైన గర్వంతో కూడిన డెందం కలవాడై; మన ఖరుండు= మనవాడైన ఖరుడు; లోనుగాన్= మొదలైనట్టి; సమగ్ర, శౌర్యులు+ఐన= పరాక్రమంలో ఆరితేరినవారైన; ఆ+దనుజ, వరులన్= ఆ రాక్షస శ్రేష్ఠులను; తునిమి= సంహరించి; ఇపుడు= ఈ సమయంలో; దండకస్థలంబునన్= దండకం అనే పేరు కల ప్రదేశంలో; ఒనరన్= శోభిల్లేటట్లుగా; మేటి+ఐ= గొప్పవాడయి; నిర్భయత్వము= వెరపులేకుండటం; ఒప్పన్= శోభిల్లగా; ఉన్నవాఁడు= ఉన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ మారీచా! నీవు వినలేదా? శ్రీరాముడు అనే పేరు కలవాడు ఒకడు గర్వంతో విఱ్ఱవీగేవాడు మన రక్కసులను పరాక్రమవంతులను, ఖరుడు మున్నగు వారిని సంహరించి దండకం అనే ప్రదేశంలో జంకుగొంకులు లేక ధైర్యంగా ఉన్నాడు.

**విశేషం:** ఉత్సాహవృత్తంలోని ప్రతిపాదంలోనూ ఏడు సూర్యగణాలపై ఒక గురువు ఉంటుంది. అయిదవ గణం మొదటి అక్షరం యతి.

**ఆ.** **వానిఁ బరిభవింపవలయు నప్పనికి సా । హాయ్యకం బొనర్పు మనఘ! నాకు'**
**ననిన నధికభయసమావిష్టహృదయుఁడై । యమరవైరి కిట్టు లనియె నతఁడు.** **319**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా, ఓమారీచా!; వానిన్= అతడిని (శ్రీరాముని); పరిభవింపన్‌వలయున్= అవమానించాలి; ఆ+పనికిన్= ఆ కార్యానికి; నాకున్= నాకు; సాహాయ్యకంబు= సాయం; ఒనర్పుము= చేయుము; అనినన్= అని (రావణుడు) అనగా; అతఁడు= మారీచుడు; అధిక, భయ, సమావిష్ట, హృదయుఁడు+ఐ= మిక్కిలి వెఱపుతో కూడిన డెందం కలవాడై; అమర, వైరికిన్= వేల్పులవిరోధికి (రావణుడికి); ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఆ రాముడిని అవమానించి అతడిపై పగతీర్చుకోవాలి. పుణ్యాత్ముడ వైన ఓమారీచా! ఆ పనిలో నీవు నాకు చిన్న సాయం చేయాలి' అని రావణాసురుడు పలుకగా, మిక్కిలి భయంతో గజగజవణికే గుండెతో మారీచుడు ఇట్లా బదులు పలికాడు.

**చ.** **'ఎఱుఁగవు గాక రాఘవు నుదీర్ణభుజాబలరూఢి నాజిలో**
**నుఱక తదీయబాణరయ మోర్వ వశంబె పినాకికైన? ను**
**క్కఱ మఱి నీకు నిత్తెఱఁగు గాదన కే ఖలుఁ డొక్కొ బుద్ధిగాఁ**
**గఱపినవాఁడు సేటునకుఁ గాలము సేరెనొ గాక యిమ్మెయిన్.** **320**

**ప్రతిపదార్థం:** ఎఱుఁగవు+కాక= నీవు తెలియనేరవు గాని; ఆజిలోన్= యుద్ధంలో; రాఘవు+ఉదీర్ణ; భుజా, బలరూఢిన్= శ్రీరాముడి యొక్క గొప్పదైన బాహువులయొక్క శక్తి సామర్థ్యాన్ని; పినాకికిన్+ఐనన్= పినాకం అనే ధనువును ధరించిన వాడికి, (శివుడికి) అయినను; తదీయ, బాణ, రయము= ఆతడియొక్క (శ్రీరాముడి) బాణాల యొక్క వేగం; ఉఱక= మాటలాడక; ఓర్వన్‌వశంబు+ఎ= సహించటానికి శక్యమా; ఉక్కు+అఱన్= బలం నశించగా; మఱి= వెండియు; నీకున్= ఓరావణా నీకు; ఈ+తెఱఁగు= ఈ మార్గం; కాదనక= వలదు అని చెప్పక; ఏ ఖలుఁడు+ఒక్కో= ఏ దుర్మార్గుడో కదా; బుద్ధి+కాన్+కఱపిన వాఁడు= నీకు ఈ సంకల్పం కలిగేటట్లు చేసినవాడు; ఈ+మెయిన్= ఈరీతిగా; చేటునకున్= కీడునకు; కలము+చేరెనొకాక!= సమయం దాపురించిందేమో!

**తాత్పర్యం:** ఓ రావణా! నీకు శ్రీరాముడితో యుద్ధం చేయటం అంటే ఏమిటో తెలియదు. శ్రీరాముడు గొప్ప పరాక్రమవంతుడు. రామబాణం ఎటువంటిదో నీకు తెలియదు. పినాకపాణి అయిన ఆ పరమశివుడు సయితం రామబాణం ధాటికి ఓర్వజాలడు. ఈ ప్రయత్నం వ్యర్థం సుమా. మఱి ఏదుష్టుడు నీకు ఈ చెడుబుద్ధి కల్గించాడో కదా! నీకు వినాశకాలం దాపురించి ఈ విపరీతబుద్ధి పుట్టింది.

**ఆ. రామునితోడఁ దొల్లి రణమునఁ గడు భంగ । మొంది కాదె దైన్యయుక్తి నిట్లు**
**దపసి నైతి; నేఁడు తగ దమ్మహాత్ముని । యందు వైరబుద్ధి యధిప! నీకు.' 321**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! (ఓ రావణా!); తొల్లి= పూర్వం; రామునితోడన్= శ్రీరాముడితో; రణమునన్= యుద్ధంలో; కడున్= మిక్కిలి; భంగము+ఒంది, కాదె= పరాభవం అనుభవించే కదా; ఇట్లు= ఈ విధంగా; దైన్య, యుక్తిన్= దీనత్వంతో కూడికొని; తపసిన్+ఐతిన్= సన్యాసిని అయినాను; నీకున్= నీకు; ఆ+మహా+ఆత్మునియందున్= ఆ గొప్ప ఆత్మకలవానియందు (ఆ శ్రీరాముడియందు); వైరబుద్ధి= శత్రుత్వం; నేఁడు= ఈసమయంలో; తగదు= కూడదు.

**తాత్పర్యం:** రాజా, రావణా! ఇంతకుముందు నేను శ్రీరామచంద్రుడిశౌర్యం యుద్ధంలో చవిచూచి ఉన్నాను. ఆతడిని జయించ శక్యం కాదని తెలిసికొనటంచేతనే కదా ఇపుడు ఇక్కడ నేను ఈ విధంగా సన్యాసం స్వీకరించి తపస్సు చేసికొంటూ ఉంటున్నాను. కానిచో, నేను ఇంతటి దీనస్థితికి దిగజారేవాడిని కాను. శ్రీరాముడితో శత్రుత్వం వహించటం నీకు ఎంతమాత్రం మంచిది కాదు.

**వ. అనినం గలుషించి లంకేశ్వరుండు వానిం జూచి 'నా పనుపు సేయ వైతివేని నిన్నిప్పుడ కృతాంతగోచరుం జేయుదు' ననిన, వాఁడును దనమనంబున 'వీనిచేతం జచ్చుటకంటెను రాఘవకృతం బైన మరణంబు మే' లని తలపోసి, 'మహాత్మా! నీకు హితంబుఁగోరి చెప్పితి; నిది యిష్టంబు గాదేని భవదీయశాసనంబు గైకొని చేసెదం; బనుపు' మనినఁ బౌలస్త్యుం డిట్లను; 'నీవు రత్నమయతనూరుహం బగు కనకమృగంబ వై చని, జానకిం బ్రలోభింపవలయు; సీతాచోదితుండై రాముండు నిన్నుం బట్ట సమకట్టి నీ చేత నతిదూరంబు గొనిపోవంబడు; నప్పు డేను దద్భామిని నపహరించెదఁ; బ్రియావిరహదుర్మనస్కుండై యతండు చెడిపోవు' ననిన 'నట్ల కాక' యని మారీచుండు. 322**

**ప్రతిపదార్థం:** అనినన్= అని(మారీచుడు) చెప్పగా; లంకా+ఈశ్వరుండు= లంకకు అధిపతి-రావణుడు; కలుషించి= కోపించి; వానిన్= అతడిని (మారీచుడిని); చూచి= కాంచి; నాపనుపు= నాయొక్క ఆజ్ఞ; చేయవైతివి+ఏని= నెరవేర్చకున్నచో; నిన్నున్= నిన్ను; ఇప్పుడు+అ= ఈ సమయంలోనే; కృతాంత, గోచరున్+చేయుదున్= యముడికి కన్పించే వాడినిగా చేస్తాను. సంహరించగలను; అనినన్= అని (రావణుడు) చెప్పగా; వాఁడును= మారీచుడును; తన, మనంబునన్= తన మనస్సులో; వీనిచేతన్= ఇతడిచేత (ఈ రావణుడిచేత); చచ్చుటకంటెను= మరణించటంకంటెను; రాఘవు, కృతంబు+ఐన= రాముడిచేత కావింపబడిన; మరణంబు= చావు; మేలు+అని= మంచిది అని; తలపోసి= ఆలోచించి; మహా+ఆత్మా!= మహానుభావుడవైన ఓరావణా!; నీకున్= నీకు; హితంబున్= శ్రేయం; కోరి= కాంక్షించి; చెప్పితిన్= వచించాను; ఇది= (శ్రీరాముడితో శత్రుత్వం మంచిది కాదు అని) నేనే చెప్పిన హితవు; ఇష్టంబు కాదు+ఏని= నీకు సమ్మతం కానిచో; భవదీయ శాసనంబు= నీయొక్క ఆజ్ఞను; కైకొని= స్వీకరించి; చేసెదన్= ఆచరిస్తాను; పనుపుము= నన్ను నియోగించుము; అనినన్= అని (మారీచుడు) చెప్పగా; పౌలస్త్యుండు= పులస్త్యుడి కొడుకు-రావణుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; నీవు= నీవు; రత్న, మయ, తనూ రుహంబు+అగు= మణులతో కూడిన వెంద్రుకలు కల; కనక, మృగంబవు+ఐ= బంగారులేడిని అయి; చని= వెళ్ళి; జానకిన్= జనకుడికూతురు అయిన సీతను; ప్రలోభింపన్‌వలయున్= దురాశకు లోనయినట్టి దానినిగా (ఆకర్షించబడిన దానినిగా) చేయాలి; సీతా చోదితుండు+ఐ= సీతచేత పురికొల్పబడినవాడై; రాముండు= శ్రీరాముడు; నిన్నున్= నిన్ను (బంగారులేడిరూపంలో విహరిస్తుండే నిన్ను); పట్టన్= బంధించటానికి; సమకట్టి= ప్రయత్నించి; నీచేతన్; అతిదూరంబు= మిక్కిలిదవ్వు; కొనిపోవన్+పడున్= తీసికొని పోబడతాడు; అప్పుడు= ఆ సమయంలో; ఏను= నేను; తత్+భామినిన్= ఆ శ్రీరాముడియొక్క భార్యయైన సీతను;

అపహరించెదన్= బలాత్కారంగా గైకొంటాను; ప్రియా, విరహ, దుర్మనస్కుండు+ఐ= ప్రియురాలియొక్క ఎడబాటుచేత పాడైన చిత్తం కలవాడై; అతండు= శ్రీరాముడు; చెడిపోవున్= పాడౌతాడు; అనినన్= అని (రావణుడు) చెప్పగా; అట్లు+అ, కాక= అటులే జరుగునుగాక; అని= అని చెప్పి; మారీచుండు= మారీచుడు.

**తాత్పర్యం:** మారీచుడు చెప్పినమాటలకు లంకాధిపతి అయిన రావణునకు కోపంవచ్చింది. 'ఓ మారీచా! నేను చెప్పినట్లు నీవు చేయకపోతే, నిన్ను ఇప్పుడే సంహరిస్తాను' అని కత్తి దూశాడు. అంతట మారీచుడు - 'ఇప్పు డిక్కడ ఈ రావణుడిచేత మరణించటం కంటె ఆ రాముడి చేతిలోనే చావటం మంచిది'- అని తన మనస్సులో ఆలోచించి, 'మహాత్మా! నీకు హితవు చెప్పాను. నీ కది ఇష్టంగానిచో, నీ ఆజ్ఞను నేను శిరసావహిస్తాను. ఆజ్ఞాపించుము' అని అన్నాడు. రావణుడు ఈవిధంగా బదులు పలికాడు. 'రాముడినియుద్ధంలో జయించటం వేరుమాట. ముందు' నీవు రత్నమయమైన వెంట్రుకలతో రాజిల్లే బంగారు లేడిగా కామరూపం ధరించి, సీతకు కన్పించి ఆమెను ఆకర్షించవలయును. అంతట సీతాదేవి తనకు బంగారులేడి కావలెనని రాముడిని కోరుతుంది. అప్పుడు రాముడు బంగారులేడి రూపంలో ఉన్న నిన్ను వెంబడిస్తాడు. నీవు ఆవిధంగా శ్రీరాముడిని దవుదవ్వులకు కొనిపోతే, నేను సీతాదేవిని అపహరిస్తాను. ప్రియురాలిని ఎడబాసిన దుఃఖం చేత రాముడు చెడిపోతాడు'. మారీచుడు అందుకు సమ్మతించాడు.

### మారీచుండు మాయామృగంబై చనుదెంచుట (సం. 3-262-24)

**క. కనకమృగరూపమునఁ జని । యినవంశ్యుఁడు సతియు నున్నయెడ మెలఁగుటయుం**
**గని జానకి కౌతూహల । మునఁ బ్రియుఁ బ్రార్థించె హరిణపుంగవుఁ బట్టన్. 323**

**ప్రతిపదార్థం:** కనక, మృగరూపమునన్= బంగారులేడి ఆకారంలో; చని= వెళ్ళి; ఇనవంశ్యుఁడు= సూర్యవంశంలో పుట్టినవాడు, శ్రీరాముడు; సతియున్= భార్యయును; ఉన్న+ఎడన్= ఉన్నస్థలంలో; మెలఁగుటయున్= సంచరించటాన్ని; కని= చూచి; జానకి= జనకుడి కూతురు అయిన సీత; హరిణపుంగవున్+పట్టన్= లేళ్ళలో శ్రేష్ఠమైన దానిని (హరిణరాజాన్ని) పట్టటానికై; కౌతూహలమునన్= వేడుకతో; ప్రియున్= భర్తను; ప్రార్థించెన్= వేడింది.

**తాత్పర్యం:** మారీచుడు బంగరులేడిరూపం ధరించి, సూర్యవంశజుడైన రాముడు, సీత నివసిస్తున్న ప్రదేశానికి పోయి విహరించసాగాడు. జానకి ఆ బంగరులేడిని చూచి, వేడుకపడి తనకు దానిని తెచ్చిపెట్టుమని తనభర్త శ్రీరాముడిని ప్రార్థించింది.

**ఆ. ధరణిసుతయు విధియుఁ దన్నుఁ బ్రేరేపంగ । వివశబుద్ధి యగుచు నవనివిభుఁడు**
**మృగముఁ బట్టఁ దివిరె మృగనేత్రఁ గావ స । ద్వినుతబలు సుమిత్రతనయు నునిచి. 324**

**ప్రతిపదార్థం:** అవనివిభుఁడు= భూభర్త- శ్రీరాముడు; ధరణిసుతయున్= భూదేవికూతురు- సీతయును; విధియును= భాగధేయం, అదృష్టశక్తి; తన్నున్= తనను (రాముడిని); ప్రేరేపంగన్= ప్రేరేపణ చేయగా, ప్రోత్సహించగా; వి, వశ, బుద్ధి+అగుచున్= వశం తప్పిన మతి కలవాడు ఔతూ; మృగనేత్రన్= లేడికన్నుల వంటి కన్నుల కలదానిని - సీతను; కావన్= కాపాడటం కొరకై; సత్+వినుత, బలున్= మంచివారిచేత పొగడబడినపరాక్రమం కలవాడిని; సుమిత్రతనయున్= సుమిత్రయొక్క కొడుకును - లక్ష్మణుడిని; ఉనిచి= ఉంచి; మృగమున్= లేడిని; పట్టన్+తివిరెన్= బంధించటానికి పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** సీతాదేవి ప్రోత్సాహంతోమాత్రమేకాక విధివిలాసంవలన కూడ ఉచితజ్ఞుడు మేధావి అయిన శ్రీరాముడు వివశుడై లేడిని పట్టుకొనటానికై బయలుదేరాడు. సీతాదేవిని కాపాడటంకొరకై సుప్రసిద్ధపరాక్రమం గల లక్ష్మణుడిని నియోగించాడు.

**విశేషం:** బంగరులేడి వృత్తాంతం రామాయణగాథలో ఒక అద్భుత సన్నివేశం. ఇతివృత్తం ఇట ఒక మలుపు తిరిగింది. రామలక్ష్మణులు ప్రక్కనుండగా రావణుడు సీత నపహరించటం సాధ్యంకాదు. ఆ విషయం తెలిసినవాడు కనుకనే రావణుడు ఈ పన్నాగం పన్నాడు. సీత బంగరులేడిపై వ్యామోహం చెందటంలో వింత లేదు. రావణుడు ఆవిషయం ముందే ఊహించగలిగాడు కదా! ఇక-శ్రీరాముడు సీతమాట విని బంగరులేడిని వెంబడించటమా? శ్రీరాముడికి కామరూపు లైన రాక్షసుల మాయలు అనుభవామ్రేడితాలేకదా! అంతటి మేధావి బంగరులేడి వెంటపడటం వింతలలో వింత. అంతే కాదు. అతడు కేవలం భార్యావిధేయుడై, ఆమెకోరిక తీర్చటంకొరకు తన ఉచితజ్ఞతను, బుద్ధిసంపదను మంటకలిపాడా? రాముడు తాత్కాలికంగా విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయినట్లే. ఇది ఎట్లా జరిగింది? ఎందుకు జరిగింది? ఇది కేవలం సీతాదేవి కల్పించిన ప్రోత్సాహంమాత్రమే కాజాలదు. అది విధివిలాసం. ఇట్టి సన్నివేశాలు మానవజీవితంలో అప్పుడప్పుడు జరుగుతుంటాయి. అందుచేతనే 'మానవులు విధిచేతి కీలుబొమ్మలు' అనేవిశ్వాసం పలుతావుల రేకెత్తుతుంది.

**క. అసదృశకార్ముకధరుఁడై । మసలక యామృగము వెనుక మర్దితరిపుఁ డే**
**పెసఁగంగ నరుగఁ దొడఁగెను । వెస రుద్రుఁడు యజ్ఞమృగము వెనుకొనుమాడ్కిన్. 325**

**ప్రతిపదార్థం:** అసదృశ, కార్ముక, ధరుఁడు+ఐ= సాటిలేని కోదండమును ధరించినవాడై; మసలక= ఆలస్యం చేయక; ఆ, మృగము, వెనుకన్= ఆ లేడి వెంబడి; మర్దితరిపుఁడు= మర్దించబడిన శత్రువులు కలవాడు- శత్రుసంహారకుడు; ఏపు= అతిశయం; ఎసఁగంగన్= శోభిల్లేటట్లుగా; వెసన్= శీఘ్రంగా; రుద్రుఁడు= శివుడు; యజ్ఞమృగమున్= క్రతువుకు ఉద్దేశించబడిన పశువును; వెనుకొను మాడ్కిన్= వెంబడించిన మాదిరిగా; అరుగన్+తొడఁగెను= వెడలసాగాడు.

**తాత్పర్యం:** సాటిలేని కోదండమును ధరించిన వాడై శ్రీరాముడు తడయక ఆ లేడిని వెంబడిస్తూ అలనాడు పరమశివుడు యజ్ఞమృగాన్ని వెన్నాడినమాదిరిగా శీఘ్రంగా వెళ్ళాడు.

**విశేషం:** (1) అలం: ఉపమ. (2) శివుడు యజ్ఞమృగాన్ని వెంబడించిన సుప్రసిద్ధగాథ ఇక్కడ ఉదాహరించబడింది.

**వ. అట్టి యవసరంబున. 326**

**తాత్పర్యం:** అటువంటి సమయంలో.

**విశేషం:** 'అవసరము' అనే సంస్కృతపదం సంస్కృతవాఙ్మయంలోనూ, కవిత్రయకాలంలోనూ 'కాలము' 'సమయము' అనే అర్థంలో ప్రయోగించబడింది. అర్థవిపరిణామం చెంది నేడు- అక్కర, కావలసినట్టిది- అనే అర్థాల నిస్తున్నది. ఇది అనవసరం= ఇది అక్కరలేదు- అని నేటి వ్యవహారం.

**మ. పఱచున్ దవ్వుగఁ, జేయలంతి నిలుచుం, బట్టీక యాసాసలం**
**బఱువోవుం, బొదలందు డిందుఁ, బొడమున్, బిట్టుల్కి వే దాఁటుఁ, గ్ర**
**మ్మఱి చూచుం, జెవి దార్చి నిల్చు, మలయున్, మట్టాడు, గోరాడు, నే**
**మఱినట్లుండుఁ దృణంబు మేయు నెలయున్ మాయామృగం బిమ్ములన్. 327**

**ప్రతిపదార్థం:** మాయా, మృగంబు= మాయ బంగారులేడి; ఇమ్ములన్= ఇంపుగా; దవ్వగన్= దూరంగా; పఱచున్= పరుగెత్తుతుంది; చే+అలంతి= చేతికి అందేటంత తక్కువ దూరంలో; నిలుచున్= నిలబడుతుంది; పట్టు+ఈక= పట్టుబడకుండు; ఆసాసలన్= ఆసలు ఆసలు రేకెత్తించి; పిఱుపోవున్= వెనుకకు పోతుంది; పొదలందున్= పొదరిళ్ళలో; డిందున్= కనపడకుండా మాయమౌతుంది; పొడమున్= కన్పిస్తుంది; బిట్టు+ఉల్కి= మిక్కుటంగా భయపడి; వేదాఁటున్= వేగంగా గెంతుతుంది; క్రమ్మఱి= మరలి వెనక్కు; చూచున్= చూస్తుంది; చెవి+తార్చి, నిల్చున్= చెవులు నిక్కబొడిచేటట్లుగా చేసి నిలబడుతుంది; మలయున్= ప్రక్కదారిబట్టుతుంది; మట్టాడున్= త్రొక్కుతుంది; కోరాడున్= దుమ్ము రేపుతుంది; ఏమఱినట్ల+ఉండున్= పరధ్యానంగా కన్పిస్తుంది; తృణంబు= పచ్చగడ్డి; మేయున్= తింటుంది; ఎలయున్= విజృంభిస్తుంది.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఆ బంగరు మాయలేడి ఒకసారి దూరంగా పారిపోతుంది. ఒకతూరి చేతికి చిక్కినట్లుగా దగ్గరకు వస్తుంది. కాని, పట్టుబడదు. ఆసలు రేకెత్తిస్తూ వెనుకకు తగ్గుతుంది. పొదలలో అణగిపోతుంది. అవతల ప్రత్యక్షమవుతుంది. భీతి చెందినట్లు నిలబడిపోతుంది. అంతలో వేగంగా దాటుతూ పరుగెత్తుతుంది. మరలిచూచి చెవులు నిక్కించి నిలిచి చూస్తుంది. నేల త్రొక్కుతూ దుమ్మురేపుతుంది. కొమ్ములతో రాస్తుంది. పరాకుగా ఉన్నట్లు కన్పిస్తుంది. పచ్చగడ్డి మేస్తుంది. ఒక్కసారి పైకెగసి పారిపోతుంది.

**విశేషం:** అలం: స్వభావోక్తి. ఆంధ్రవాఙ్మయంలో హృదయంగమమైన స్వభావోక్తి అలంకారానికి ఈపద్యం చక్కని ఉదాహరణం. ఇది నన్నయభట్టుగారి ఒరవడికిగాక ఎఱ్ఱనగారి స్వకీయప్రతిభకే ఉదాహరణం. ఇది ఎఱ్ఱాప్రెగ్గడ ప్రబంధశైలికి నిదర్శనంగా ఎన్నదగింది.

**వ.** **ఇట్లతిదూరంబుగా నెలయించి యలయించిన నది రాక్షసమాయగా నూహించి రాఘవుం డమోఘబాణంబు దొడిగి తడయక యమ్మృగంబు నేసిన.** **328**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; అతిదూరంబుగాన్= దవుదవ్వులుగా; ఎలయించి= ప్రేరేపించి; అలయించినన్= అలసిపోయేటట్లుగా చేయగా; అది= ఆ బంగరులేడి చర్యలు; రాక్షసమాయగాన్= రక్కసులు పన్నిన మోసంగా; ఊహించి= తలపోసి; రాఘవుండు= రఘువంశంలోనివాడు- శ్రీరాముడు; అ+మోఘ, బాణంబు= వ్యర్థం కాని అమ్ము; తొడిగి= సంధించి; తడయక= ఆలసించక; ఆ+మృగమును= ఆ లేడిని; ఏసినన్= కొట్టగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ బంగరులేడి రాముడిని మోసగించి దూరప్రదేశానికి కొనిపోయింది. అంతవరకు ఆ బంగరులేడిని ప్రాణాలతోనే పట్టుకొనాలని శ్రీరాముడి ఆలోచన. కాని, అది అంతా రాక్షసమాయ అని గుర్తించి వెనువెంటనే ఆ లేడిపై రాముడు తిరుగులేని బాణాన్ని ప్రయోగించాడు. రామబాణం వ్యర్థం కాని మహిమ కలది. ఆ బాణం ప్రయోగించటం అంటే బంగరులేడి మరణించటం తథ్యం. ఇక సీతకోరిక ఈడేరదు.

**క.** **వాలమ్ము దాఁకి యొఱలుచు । నాలోనన రాము నెలుఁగునట్టి యెలుఁగు గా**
**'హా! లక్ష్మణ! సీతా!' యని । కూలి కపటమ్మృగము తన్నికొనుచుం జచ్చెన్.** **329**

**ప్రతిపదార్థం:** వాలు+అమ్ము= వాడిఅయిన (రామ) బాణం; తాఁకి= తగిలి; ఒఱలుచున్= అరుస్తూ; ఆ లోనన్+అ= ఆ లోపలనే; రాము+ఎలుఁగు+అట్టి+ఎలుఁగు+కాన్= శ్రీరాముడి కంఠస్వరాన్ని పోలిన కంఠస్వరంతో; హా లక్ష్మణ! = ఓ లక్ష్మణ!; సీతా= హా సీతా!; అని= అని అరుస్తూ; కూలి= నేలవ్రాలి; కపటమృగము= మాయలేడి; తన్నికొనుచున్= గిజగిజ అవయవాలు కంపింపచేస్తూ; చచ్చెన్= మరణించింది.

**తాత్పర్యం:** వాడిఅయిన రామబాణం తాకి, అరుస్తూ మాయలేడి నేలపై పడి, రాముడికంఠస్వరాన్ని పోలిన కంఠస్వరంతో 'హా లక్ష్మణా! హా సీతా!' అని బిగ్గరగా అరుస్తూ అవయవాలు కంపిస్తూండగా గిజగిజ తన్నుకొని చచ్చింది.

**విశేషం:** రామాయణగాథలో నాటకీయసన్నివేశాలలో ఇది ఒకటి. రాక్షస మాయామహిమ పరాకాష్ఠ చెందింది. 'రామబాణమహిమ మారీచుడికి అంతకుపూర్వం తెలిసిందే. కాని రావణుడికి రామబాణప్రభావం తెలియదు. రాముడికి మారీచుడి మాయామహిమ తెలియదు కాని రావణుడికి మాత్రం తెలియును. అందుచేతనే లంకనుండి రావణుడు గోకర్ణం చేరి మారీచుడి సాయం కోరాడు. జిత్తులమారి మారీచుడు మరణసమయంలో కూడ విడనాడని సద్యస్స్ఫూర్తితో శ్రీరాముడి కంఠస్వరాన్నిపోలిన కంఠస్వరంతో 'హా లక్ష్మణా హా సీతా' అని అరిచాడు. రామబాణం మారీచుడి ప్రాణాలను అపహరించగల్గింది. కాని, అతడి మోసపుతెలివితేటలు సీతాదేవినే అపహరింపజేశాయి.

**తరువోజ.**

**ఆ యెలుఁ గేర్పడ నవనీతనూజ । యాలించి తల్లడం బడరు చిత్తమున**
**'నోయన్న! లక్ష్మణ! యొలసి మీయన్న । యుగ్రరాక్షసబాధ నొందంగఁ బోలు;**
**నాయతభుజ! వింటె యమ్మహాభాగుఁ । డత్యంతదుఃఖార్తుఁ డై నిన్నుఁ జీరె;**
**బోయి వే కావు విస్ఫురితపుణ్యైక । భూషణోదార! యప్పురుషరత్నంబు'.** **330**

**ప్రతిపదార్థం:** అవనీ, తనూజ= భూదేవి కూతురు- సీతాదేవి; ఆ+ఎలుఁగు+ఏర్పడన్= ఆ కంఠస్వరం సుస్పష్టంగా; ఆలించి= విని; తల్లడంబు+అడరు, చిత్తమునన్= తత్తరపాటుతో వ్యాకులమైన మనస్సుతో; ఓ+అన్న, లక్ష్మణ!= ఓ అన్నా! లక్ష్మణా!; ఒలసి= కోరి; మీ+అన్న= శ్రీరాముడు; ఉగ్ర, రాక్షస, బాధన్= భయంకరమైన రక్కసులు కల్పించిన ఆవేదనను, ఒందంగన్+పోలున్= చెందియుండ వచ్చును; ఆయత భుజ!= నిడివిఅయిన బుజాలు కలవాడా!; పరాక్రమవంతుఁడవు+ఐన ఓ లక్ష్మణా!; వింటి(వి)+ఎ= ఆలకించితివిగదా; ఆ+మహా, భాగుఁడు= ఆ మహానుభావుడు - శ్రీరాముడు; అతి+అంత, దుఃఖ+ ఆర్తుఁడు+ఐ= మిక్కుటమైన ఆవేదనకు లోనయినవాడై; నిన్నున్= నిన్ను; చీరెన్= పిలిచాడు; పోయి= వెళ్ళి; వి, స్ఫురిత, పుణ్య+ఏక, భూషణ+ఉదార!= బాగా ప్రకాశించే సుకృతం ముఖ్యమైన ఆభరణంగా కల గొప్పవాడా!; ఆ+పురుష, రత్నంబున్= మగవారలలో శ్రేష్ఠుడు అయిన శ్రీరాముడిని; వే కావు(ము)= వేగంగా రక్షించుము.

**తాత్పర్యం:** ఆ మాయలేడినుండి వెలువడిన కంఠస్వరం శ్రీరాముడి కంఠస్వరంగా సుస్పష్టంగా గుర్తించి, తత్తరపడిన చిత్తంతో సీతాదేవి లక్ష్మణుడితో ఇట్లా పలికింది. 'ఓ లక్ష్మణా! విన్నావుకదా మీఅన్నగారి ఆర్తనాదం. ఆయన రాక్షసులు పన్నిన బాధకు గురి అయినట్లు తెల్లమౌతున్నది. పరాక్రమవంతుడవైన లక్ష్మణా! మిక్కుటమైన దుఃఖంలో మునిగిఉన్న పురుషరత్నం మీఅన్న. అతడిని రక్షించటం నీకర్తవ్యం. దేదీప్యమాన మైన పుణ్యమే నీకు ఏకైకభూషణంకదా!'

**విశేషం:** వృత్త లక్షణానికి చూడు- 4.302 విశేషాంశం.

**వ. అనిన నతం డా మానిని కి ట్లనియె.** **331**

**తాత్పర్యం:** అని సీత పల్కగా, ఆమెతో లక్ష్మణుడు ఈ విధంగా అన్నాడు.

**ఆ. 'అబల! వెఱవకుండు; మఖిలలోకములను । రాఘవేశ్వరునకు రణములోన**
**నెదురఁ గలఁడె శూరుఁ డెవ్వాఁడు? నతనికి । నెట్టియెడల దురిత మేల పొందు? 332**

**ప్రతిపదార్థం:** అబల= సీతా!; వెఱవక+ఉండుము= భయపడకుండా ఉండుము; అఖిలలోకములను= అన్నిభువనాలలోను; రాఘవ+ఈశ్వరునకున్= రఘుకులానికి చెందిన ప్రభువుకు, శ్రీరాముడికి; రణములోనన్= యుద్ధంలో; శూరుఁడు+ఎవ్వాఁడున్= ఎట్టివీరుడు అయినను; ఎదురన్+కలఁడు+ఎ= ఎదిరించి నెగ్గగలడా?; అతనికిన్= శ్రీరాముడికి; ఎట్టి+ఎడలన్= ఎట్టి పరిస్థితులలో కూడా; దురితము= పాపం, మిక్కుటమైనదుఃఖం; ఏల పొందున్?= ఎందుకు కలుగుతుంది? (కలుగదని భావం).

**తాత్పర్యం:** 'ఓ సీతా! భయపడకుము. రాఘవేశ్వరుడైన శ్రీరాముడిని యుద్ధంలో గెలువగల శూరుడు ఈ లోకంలోనే కాక ఏ లోకంలోనూ లేడు. శ్రీరాముడికి ఎక్కడైనాసరే ఎప్పుడైనా సరే ఎట్టి ఆపదా సంభవించదు.

**క. ఇనవంశోత్తముఁ డిప్పుడ । చనుదెంచుఁ బ్రియంబు నొందు జలజానన!' నా**
**విని జానకి లక్ష్మణు నెడ । జనితాశంక యయి క్రోధసంభ్రాంతమతిన్. 333**

**ప్రతిపదార్థం:** జలజ+ఆనన!= పద్మాలవంటి ముఖం కలదానా, సీతాదేవీ!; ఇన, వంశ+ఉత్తముఁడు= సూర్యవంశంలో శ్రేష్ఠుడు- శ్రీరాముడు; ఇప్పుడు+అ= ఇప్పుడే- ఇక కొన్నిక్షణాలలోనే; చనుదెంచున్= వస్తాడు; ప్రియంబున్+ఒందు(ము)= సంప్రీతిని చెందుము; నాన్= అనగా; విని= ఆలకించి; జానకి= జనకుడి కూతురు - సీత; జనిత+ఆశంక+అయి= పుట్టిన సందేహం కల్గినది అయి; క్రోధ, సంభ్రాంత, మతిన్= కోపంవలన తిరుగుడువడిన చిత్తంతో.

**తాత్పర్యం:** 'పద్మంవంటి ముఖం కలదానా! సీతాదేవీ! ఇప్పుడే ఇక కొన్నిక్షణాలలోపలనే సూర్యవంశంలో శ్రేష్ఠుడైన శ్రీరాముడు రాగలడు' అని లక్ష్మణుడు పలికాడు. సీతకు లక్ష్మణుడియెడ అనుమానం రేకెత్తింది. కోపం వచ్చింది. కోపం రావటంచేత ఏర్పడిన అపోహతో ఆమె ఇట్లా అన్నది.

**విశేషం:** సీత లక్ష్మణుడిని సందేహించవచ్చునా? ఈ ప్రశ్నకు పలువురు విమర్శకులు పలురీతుల సమాధానం చెప్పుతున్నారు. ఇట లక్ష్మణుడి సంబోధనం సీతనుగూర్చి- 'జలజానన!= పద్మంవంటి ముఖం కలదానా!' అనేది మాత్రం అందుకు హేతువు కాజాలదు. అట్టి పదాలు సర్వసాధారణంగా మర్యాదాసూచకాలు మాత్రమే. అబల, అంబుజేక్షణ, అరవిందలోచన, మానిని ఇత్యాదిశబ్దాలు అన్నీ స్త్రీసామాన్యవాచకాలే. నన్నయ భారతంలో గరుడుడు కన్నతల్లిని - 'పయోరుహాననా' అని సంబోధిస్తాడు. ఆపత్సమయంలో సీతకు మతిపోయి అట్లా పలికినట్లుగనే భావించనగును. తదుపరి ఆమె పశ్చాత్తాపం చెంది లక్ష్మణుడికి క్షమాపణ అందించింది (ఆంజనేయుడిద్వారా).

**సీ. 'నీతలం పెఱుఁగుదు; నీ కేల వలవని । జాలి నీ కి ట్లేల సంభవించె?**
**నతిఘోరశస్త్రవిషాగ్నులయం దొంట । వేగంబ ప్రాణముల్ విడుతుఁగాక**
**యే నేల నిను వరియింతు? బెబ్బులికాంత । యక్కట! నక్కపొం దాస పడునె?'**
**యని యిట్లు సత్పురుషాగ్రణి సౌమిత్రిఁ । బడఁతి యప్రియములు వలుకుటయును,**

**ఆ. జెవులు మూసికొనుచుఁ జిత్తంబు గలఁగ ల । క్ష్మణుఁడు దత్క్షణంబ మహిత శౌర్యుఁ**
**డతులబాణచాపహస్తుఁడై తనయన్న । చనిన చొప్పునంద చనఁ దొడంగె. 334**

**ప్రతిపదార్థం:** నీతలంపు= నీయొక్కయోచన; ఎఱుఁగుదున్= తెలియుదును; నీకున్+ఏల= నీకు ఎందుకు; వలవని= కూడని; జాలి= దయ; నీకున్= నీకు; ఇట్లు= ఈ విధంగా; ఏల= ఎందులకు; సంభవించెన్?= కలిగింది?; అతి, ఘోర, శస్త్ర, విష+అగ్నులయందున్= మిక్కిలిదారుణం అయిన ఆయుధాలు, విసం, నిప్పులలో; ఒంటన్= ఏదియో ఒకదానితో; వేగంబు+అ= శీఘ్రంగా; ప్రాణముల్= అసువులు; విడుతున్+కాక= విడుస్తానుగాని; ఏన్= నేను; ఏల= ఎందుకు; నినున్= నిన్ను; వరియింతున్?= వరిస్తాను?; అక్కట= అయ్యో; బెబ్బులికాంత= ఆడుపెద్దపులి; నక్కపొందు= జంబుకంతోడి కలయిక; ఆస+పడునె?= ఆశిస్తుందా? (ఆశించదు); అని= అని పలికి; యిట్లు= ఆ రీతిగా; సత్+పురుష+అగ్రణి= మంచి మగవారలలో శ్రేష్ఠుడైనవాడిని; సౌమిత్రిన్= సుమిత్రకొడుకును లక్ష్మణుడిని; పడఁతి= వనిత - సీత; అప్రియములు= కఠినవాక్యాలు; పలుకుటయును= పలకటమున్నూ; లక్ష్మణుఁడు; చిత్తంబు= మనస్సు; కలఁగన్= సంక్షోభంచెందగా; చెవులు; మూసికొనుచున్= కప్పుకొంటూ; తత్+క్షణంబు+అ= ఆ త్రుటిలోనే; మహితశౌర్యుఁడు= గొప్పపరాక్రమం కలవాడు; అతుల, బాణ, చాప, హస్తుఁడు+ఐ= సాటిలేని విల్లును అమ్ములను చేతిలో పూనినవాడై; తన అన్న= తన అగ్రజుడు- శ్రీరాముడు; చనిన చొప్పనందున్+అ= వెడలిన మార్గంలోనే; చనన్+తొడంగెన్= వెడలసాగాడు.

**తాత్పర్యం:** 'ఓ లక్ష్మణా! నీ ఆంతర్యం నాకు ఇప్పటికి అర్థమైంది. నీకు ఎందుకు నామీద ఇంతజాలి కలిగిందో నాకు తెలుసు. నేను భయంకరమైన ఆయుధాలచేతనో, విషంచేతనో, అగ్నిచేతనో ఆత్మహత్యకు పాల్పడతానుగాని, నిన్ను ప్రేమించి నీకు లొంగను. శ్రీరాముడు లేకపోతే నేను నీకు దక్కుతా నని ఎంతమాత్రం భావించకుము. ఆడుపెద్దపులి గుంటనక్కపొందుకు సమ్మతిస్తుందా?' అని సత్పురుషులలో శ్రేష్ఠుడు అయిన లక్ష్మణుడితో సీత కఠోరవాక్యాలు పలికింది. ఆ మాటలు వినలేక సౌమిత్రి చెవులు మూసికొంటూ, ఆక్షణంలోనే విల్లు అమ్ములు ధరించి బయలుదేరి అంతకుముందు అన్నగారు శ్రీరాముడు వెళ్ళిన మార్గంలోనే తానును వెళ్ళాడు.

**వ. అయ్యవసరంబున దశాననుండు. 335**

**ప్రతిపదార్థం:** ఆ సమయంలో పదిమోములు కలవాడైన రావణుడు.

**మ. కమనీయం బగు జన్నిదంబు శిఖయుం గౌపీనమున్ ధాతువ**
**స్త్రము దండంబును గుండియుం గుశపవిత్రంబుం గడున్ వృద్ధభా**
**వము సంధిల్లఁ ద్రిదండివేషధరుఁడై వచ్చెం బథిశ్రాంతి దే**
**హమునం దోఁపఁగ సీతయున్నెడకు మాయాదక్షుఁ డక్షీణతన్. 336**

**ప్రతిపదార్థం:** కమనీయంబు+అగు= అందమైన; జన్నిదంబున్= జందెమున్నూ (యజ్ఞోపవీతం); శిఖయున్= జుత్తుముడియున్నూ; కౌపీనమున్= గోచిగుడ్డయున్నూ; ధాతువస్త్రమున్= దేహాన్ని కప్పుకోటానికి మాత్రమే సరిపోయే బట్టయున్నూ; దండంబును= (చేతి) కఱ్ఱయున్నూ; కుండియున్= కమండలమున్నూ; కుశ, పవిత్రంబున్= దర్భలతో చుట్టబడిన అంగుళీయకమున్నూ; కడున్= మిక్కిలి; వృద్ధభావము= ముసలితనం; సంధిల్లన్= ఏర్పడగా; త్రిదండివేషధరుఁడు+ఐ= ఏకదండంగా కట్టిన మూడు దండాలను తాల్చే సన్న్యాసి ఆహార్యం ధరించిన వాడై; పథిశ్రాంతి= మార్గాయాసం; దేహమునన్= శరీరంలో; తోఁపఁగన్= కన్పించగా; సీత+ఉన్న+ఎడకున్= సీత నివసించే చోటికి; మాయాదక్షుఁడు= మోసం చేయటంలో నేర్పరి అయినరావణుడు; అక్షీణతన్= గొప్పతనంతో; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో పదిమొగాలుకల రావణుడు మారువేషంతో సీతాదేవి ఉన్నచోటికి అరుగుదెంచాడు. మనోహరమైన యజ్ఞోపవీతం, చిన్నజుత్తుముడి, గోచిగుడ్డ, దేహాన్ని కప్పిన చిన్నబట్ట, చేతికర్ర, కమండలువు, దర్భలతో

చుట్టబడిన ఉంగరం ధరించి, మిక్కిలిముసలితనం తోచేటట్లుగా త్రిదండి సన్యాసివేషం ధరించి మాయావి అయిన ఆ రావణుడు మార్గాయాసంచేత అలసిపోయినట్లుగా కనిపిస్తూ సీతవద్దకు వచ్చాడు.

**విశేషం:** (1) త్రిదండం- వాగ్దండ కర్మదండ మనోదండాల సమాహారం. మనస్సు-వాక్కు-కర్మ త్రికరణాలు. వీటిశుద్ధి ఏర్పడటం ఆధ్యాత్మికోన్నతికి పరాకాష్ఠ.

**తే.** **వాని నిక్కంపుమునియ కా వగచి రాము । వనిత గడుభక్తిఁ బూజించి వన్యఫలము**
**లొసఁగుటయు వానిఁ జేకొననొల్ల కసుర । మదనవివశుఁడై యిట్లను మగువఁజూచి. 337**

**ప్రతిపదార్థం:** వానిన్= అతడిని (ఆ త్రిదండి సన్యాసివేషంలో) వచ్చిన రావణుడిని; నిక్కంపు, ముని+అ, కా= నిజమైన యతిగనే; వగచి= భావించి, రామువనిత= శ్రీరాముడిభార్య- సీత; కడు= మిక్కిలి; భక్తిన్= పూజ్యభావంచేత; పూజించి= ఆరాధించి; వన్యఫలములు= అడవిలో కాచినపండ్లు; ఒసఁగుటయున్= ఇచ్చుటయున్నూ; వానిన్= వాటిని (ఆ వన్యఫలాలను); చేకొనన్= స్వీకరించటానికి; ఒల్లక= ఇష్టపడక; అసుర= రాక్షసుడు-రావణుడు; మదన, వివశుఁడు+ఐ= మన్మథుడికి లొంగిపోయిన వాడై; మగువన్+చూచి= వనితను- సీతను చూచి; ఇట్లు+అనున్.

**తాత్పర్యం:** యతివేషంలో వచ్చిన రావణుడిని నిజమైన మునిగనే భావించి శ్రీరాముడిభార్య అయిన సీత అతడిని పూజ్యభావంతో ఆరాధించి అతిథిసత్కారాలు చేసి అడవిపండ్లను సమర్పించింది. రావణుడు కామవికారానికి లోనయి, ఆపండ్లను స్వీకరించనొల్లకుండా సీతనే చూస్తూ ఇట్లా పలికాడు.

**మత్తకోకిలము.**

**'ఏను దానవనాయకుండ నహీనసత్త్వుఁడ రావణా**
**ఖ్యానిరూఢుఁడ లంక నాఁగ జగత్ప్రసిద్ధము మత్పురం**
**బానతాంగి! మదీయవల్లభ వై భజింపఁగ రాదె ది**
**వ్యానుభోగము లిష్టచేష్టితహారియౌవనలీలలన్. 338**

**ప్రతిపదార్థం:** ఆనత+అంగి!= వంగినదేహంకలదానా, సౌకుమార్యంగల సుందరీ!; ఏను= నేను; దానవ, నాయకుండన్= రాక్షసులకు అధినేతను; అహీనసత్త్వుఁడన్= గొప్పబలం కలవాడను; రావణ+ఆఖ్యా, నిరూఢుఁడన్= రావణుడు అనేపేరుతో ప్రసిద్ధుడను; మత్+పురంబు= నా రాజధాని; లంక= లంక; నాఁగన్= అనగా; జగత్+ప్రసిద్ధము= లోకంలో పేరు కెక్కింది; మదీయవల్లభవు+ఐ= నీవు నా ప్రేముడికి పాత్ర మైన భార్యవై; దివ్య+అనుభోగములు= స్వర్గసౌఖ్యాలు అనుభవించటాలు; ఇష్టచేష్టిత, హారి, యౌవనలీలలన్= కోరిన పనులతో మనోహరాలైన జవ్వనపు ఆటలను; భజింపఁగన్ రాదె= అనుభవించరాదా!

**తాత్పర్యం:** 'సౌకుమార్యం వెల్లివిరుస్తున్న సుందరీ!; నేను రాక్షసులకు సార్వభౌముడను, జగత్ప్రసిద్ధమైన లంకాపట్టణం నా రాజధాని. నాపేరు రావణుడు. నాకు ప్రేయసివై నీవు పడుచుదనపు కోరికలతో రంగరించబడిన ఆటలలో తేలియాడుతూ స్వర్గసౌఖ్యాలను అనుభవించుము.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడు- 4.267 విశేషాంశం.

**క. ఎక్కడి రాఘవుఁ డక్కట! । తక్కువ యగు పేదమనుజుఁ దగిలి వనమునం**
**బెక్కిడుమలఁ బడఁ దగునే! । తక్కుము మది నింక నొండుదలఁపులు తరుణీ!' 339**

**ప్రతిపదార్థం:** తరుణీ!= జవరాలా, సీతా!; ఎక్కడి రాఘవుఁడు= రఘువంశంలో జనించిన శ్రీరాముడు ఎంతటివాడు; అక్కట!= అయ్యో! (నీకు ఎంత లోటు ఏర్పడింది); తక్కువ+అగు= హీనుడు అయిన; పేదమనుజున్= దరిద్రుడు అయిన మానవుడిని; తగిలి= కూడుకొని; వనమునన్= అడవిలో; పెక్కు+ఇడుమలన్= అనేకాలైన కష్టాలను; పడన్+తగునే?= అనుభవించటం ఎందుకు?; మదిన్= (నీ)మనస్సులో; ఇంకన్= ఇకమీద; ఒండు, తలఁపులు= వేరేఆలోచనలు; తక్కుము= విడనాడుము.

**తాత్పర్యం:** పడుచుదనంలో ఉన్న సీతాదేవీ!; అయ్యో పాపం, నీకు ఎటువంటి కష్టం దాపురించింది! ఈ అడవులలో ఇన్ని కష్టాలు పడటం ఎందుకు? ఒక మనుజుడిని, ఒక దరిద్రుడిని పెళ్ళాడి అతడితో కలిసి ఉండటమా? నీ మనస్సులో వేరే ఆలోచనలు పెట్టుకోకుండా నన్ను చేరుము.

**వ. అనిన విని వైదేహి భయకంపిత దేహ యగుచు నతని కి ట్లనియె. 340**

**తాత్పర్యం:** అనగా విని భయంతో వణికే శరీరంతో సీత అతడితో ఇట్లా అన్నది.

**సీ. 'ఇట్లాడ నర్హమే యే నేడ? నీ వేడ? నక్షత్రతారాగణంబుతోడ**
**నాకసం బంతయు నవనిపైఁ గూలిన । వసుమతి వ్రస్సిన, వనధు లెల్ల**
**నింకినఁ, జంద్రదినేశ్వరు లన్యోన్య । విపులతేజంబులు వీడుపడిన**
**నే నేల యన్యుని నెడలోనఁ గామింతుఁ? । గరిణి యేనాఁట సూకరముఁ గలయు?**

**ఆ. మహితకమలమధురమధురసాస్వాదన । పరవశాత్మ యైన భ్రమరకాంత**
**రిత్తబుద్ధి నకట! రేఁగుఁబువ్వుల రసం । బాను నెట్లు? బేలవైతి గాక.' 341**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఆడన్= ఈ విధంగా మాట్లాడటం; అర్హమే= తగునా?; ఏన్+ఏడ= నేను ఎక్కడ?; నీవు+ఏడన్= నీవు ఎక్కడ?; నక్షత్ర, తారాగణంబుతోడన్= చుక్కలగుంపులతో; ఆకసంబు+అంతయున్= గగనం సర్వమున్నూ; అవనిపైన్= భూమిపై; కూలినన్= క్రిందకు పడినా; వనధులు= సముద్రాలు; ఎల్లన్= అన్నియును; ఇంకినన్= ఎండిపోయినా; వసుమతి= భూమి; వ్రస్సినన్= బ్రద్దలు అయినా; చంద్ర, దిన+ఈశ్వరులు= చంద్రుడున్నూ, సూర్యుడున్నూ; అన్యోన్య, విపుల, తేజంబులు= ఒకరికొకరికి సంబంధించి విస్తరించిన కాంతులు; వీడుపడినన్= ప్రసరించటం మానినప్పటికి; ఏన్= నేను; ఏల= ఎందుకు; ఎడలోనన్= హృదయంలో; అన్యునిన్= ఇతరుని; కామింతున్?= కోరుతాను?; కరిణి= ఆడుఏనుగు; ఏనాఁటన్= ఎక్కడైనా, ఎప్పుడైనా; సూకరమున్= పందిని; కలయున్= కూడునా?; మహిత, కమల, మధుర, మధు, రస+ఆస్వాదన, పర, వశ+ఆత్మ+ఐన= గొప్ప తమ్మిపువ్వులలోని తియ్యనైన తేనెద్రవాన్ని క్రోలుతూ తనను తాను ఒడలు మరచి ఆనందించే; భ్రమరకాంత= తుమ్మెద పడుచు; రిత్తబుద్ధిన్= మతిచెడి; అకట!= అయ్యో!; రేఁగు+పువ్వుల రసంబు= రేగుపూలలోని ద్రవాన్ని; ఎట్లు= ఏరీతిగా; ఆనున్?= ఆస్వాదిస్తుంది?; బేలవు+ఐతి(వి)+కాక= నీవు అవివేకివి అయినావు సుమా!

**తాత్పర్యం:** రావణుడిమాటలు ఆలకించి విదేహ రాజకుమారి అయిన సీత ఆతడితో ఇట్లా బదులు పలికింది. 'ఓరావణా! నీవు అవివేకివని తేలింది. నీపలుకులు ఎంతమాత్రం ఉచితాలు కావు సుమా! నేను ఎక్కడ? తులువ

వైన నీవు ఎక్కడ? తారతమ్యం గుర్తించక నీవు నీ నోటికి వచ్చినట్లు వాగుతున్నావు. సమస్తతారాగణంతో క్రాంతివలయంతోసహా ఆకాశం అంతా భూమిపై పడుగాక! భూమిఅంతా బ్రద్దలైపోనీగాక! సముద్రాలు అన్నీ ఎండిపోనీగాక! సూర్యచంద్రులు కాంతివిహీనులై గతులు తప్పనీగాక, నేను పరపురుషుడిని మనసులో కోరనే, కోరను. ఆడుఏనుగు ఎన్నడును పందిని కలయగోరునా? తమ్మిపువ్వులలోని తియ్యతేనెను గ్రోలి ఒడలు మరచి ఆనందించే ఆడుతుమ్మెద రేగుపువ్వులరసం ఆస్వాదించ కోరదు కదా! ఓరీ బుద్ధిహీనుడా! జాగ్రత్త. నన్ను ఎన్నడు నీవు కాంక్షించరాదు'.

**విశేషం:** (1) అలం: నిదర్శనం (2) నక్షత్రాలు అన్నా తారకలు అన్నా ఆకసంలో చుక్కలు అనియే అర్థం. నక్షత్రాలు-ఇరువదియేడు. అశ్విని, భరణి మున్నగునవి సూర్యుడిగతిలో గ్రహాలగతులలో ఉన్నట్టివి. అనగా, కాంతివలయంలో ఉన్నట్టివి. ఇక-తారలు అసంఖ్యాకా లైన నక్షత్రాలు - కాంతివలయానికి బయట ఉండే చుక్కలు అని చెప్పవచ్చును. ఈ విధంగా పునరుక్తిదోషాన్ని పరిహరించటం సులువు. కవిహృదయాన్ని స్వీకరించటం సహృదయలక్షణం.

### రావణుఁడు సీత నెత్తికొని లంకకుఁ బోవుట (సం. 3-262-39)

**వ.** **అని పలుకుచు నొయ్యనొయ్యన తొలంగం జనిన నద్దురాత్ముఁ డతిభయంకరంబుగా జంకించి యమ్మగువం బట్టికొని గగనంబున కెగసి లంకాపురాభిముఖుండై యరుగఁ దొడంగిన నయ్యింతి యెంతయుం దలరి యిట్లని విలాపంబు సేసె.** **342**

**ప్రతిపదార్థం:** అని పలుకుచున్= అని అంటూ; ఒయ్యన+ఒయ్యన= మెల్లగా మెల్లగా; తొలంగన్+చనినన్= దూరంగా పోగా; ఆ+దురాత్ముఁడు= ఆ చెడ్డవాడు (ఆ రావణుడు); అతిభయంకరంబుగాన్= మిక్కిలి భీతికలిగేటట్లుగా; జంకించి= బెదరేటట్లుగా చేసి; ఆ+మగువన్= ఆమెను(ఆసీతను); పట్టికొని= (బలాత్కారంగా) పట్టుకొని; గగనంబునకున్= ఆకసానికి; ఎగసి=ఎగిరి; లంకాపుర+అభిముఖండు+ఐ= లంకానగరం వైపు మొగం కలవాడై; అరుగన్+తొడంగినన్= పోసాగగా; ఆ+ఇంతి= సీతాదేవి; ఎంతయున్= మిక్కుటంగా; తలరి= ఆవేదనచెంది; ఇట్లు+అని, ఈ విధంగా పలుకుతూ; విలాపంబు+చేసెన్= ఆక్రోశించింది.

**తాత్పర్యం:** ఆ విధంగా రావణుడిని అధిక్షేపిస్తూ సీతాదేవి అతడికి దూరంగా మెలమెల్లగా తొలగిపో సాగింది. అంతట రావణుడు ఆమెను బెదిరించి భయంకరంగా ఆమెను పట్టుకొని ఆకసానికి ఎగిరి లంకాపట్టణం వైపు పోసాగాడు. అప్పుడు సీతాదేవి మిక్కుటమైన ఆవేదనతో ఈ రీతిగా ఆక్రోశించింది.

**ఉ.** **'దేవతలార! యో ధరణిదేవతలార! జగత్త్రయోన్నతుం**
**డై వెలుఁగొందు రామునికులాంగన జానకి నేను; నన్ను మో**
**హావిలుఁ డొక్క రక్కసుఁ డనర్గళుఁడై కొనిపోయెడుం; గృపం**
**గావరె! పుణ్యమున్ యశముఁ గైకొనరే! యిదె మీకు మ్రొక్కెదన్'.** **343**

**ప్రతిపదార్థం:** దేవతలార!= ఓవేల్పులారా!; ఓధరణి, దేవతలార!= ఓపుడమివేల్పులారా- ఓబ్రాహ్మణులారా!; జగత్+ త్రయ+ ఉన్నతుండు+ఐ= మూడులోకాలలో గొప్పవాడై; వెలుఁగొందు= ప్రకాశించే; రామునికుల+అంగనన్= శ్రీరాముడిభార్యను; ఏను= నేను; జానకిన్= జనకరాజుకూతురను - సీతను; నన్నున్= నన్ను; మోహ+ఆవిలుఁడు= కామంచేత కలగినవాడు; ఒక్క రక్కసుఁడు= ఒక రాక్షసుడు; అనర్గళుఁడు+ఐ= అడ్డు లేనివాడై, స్వేచ్ఛతో కూడినవాడై; కొనిపోయెడున్= బలాత్కారంగా

తీసికొనిపోతున్నాడు; కృపన్= దయతో; కావరె= కాపాడరా? (కాపాడండి); పుణ్యమున్= సుకృతాన్ని; యశమున్= కీర్తిని; కైకొనరే= గ్రహింపరా (దయచేసి నన్ను రక్షించి పుణ్యాన్ని కీర్తిని ఆర్జించండి); ఇదె= ఇదుగో; మీకున్= మీకు; మ్రొక్కెదన్= నమస్కరిస్తున్నాను.

**తాత్పర్యం:** 'ఓ వేల్పులారా! ఓ బ్రాహ్మణులారా! మూడులోకాలలోనూ గొప్పవాడై వెలుగొందే శ్రీరాముడిభార్యను నేను. జనకుడి కూతురిని సీతను. కాముకుడైన ఒకరాక్షసుడు నన్ను బలాత్కారంగా పట్టుకొని ఈ విధంగా తీసికొని పోతున్నాడు చూడండి. ఇతడిని అడ్డగించేవారు లేరా? దయచేసి నన్ను కాపాడండి. దీనురాల నయిన నన్ను రక్షిస్తే మీకు పుణ్యం, కీర్తి లభిస్తాయి. ఇదుగో మీకు నమస్కరిస్తున్నాను.

**క. అని యేడ్వఁగఁ దద్వచనము । లనఘుఁడు గిరిగహ్వరాంతరాలయగతుఁడై**
**విని యరుణసుతుఁడు తేజో । ఘనుఁడు జటాయు వను పక్షి కారుణ్యమునన్. 344**

**ప్రతిపదార్థం:** అని+ఏడ్వఁగన్= అని (సీతాదేవి) విలపించగా; తత్+వచనములు= ఆ సీతయొక్క మాటలు; అనఘుఁడు= పాపంలేనివాడు, పుణ్యాత్ముడు; గిరి, గహ్వర+అంతర+ఆలయ, గతుఁడు+ఐ= కొండగుహలోపల నున్న ఆవాసంలో ఉన్నవాడై; తేజస్+ఘనుఁడు= దేదీప్యమాన మైన కాంతితో శోభిల్లే గొప్పవాడు; అరుణ, సుతుఁడు= అరుణుడికొడుకు; జటాయువు+అనుపక్షి= జటాయువు అనే పేరుగల పెద్దగ్రద్ద; విని= ఆలకించి; కారుణ్యమునన్= జాలితో.

**తాత్పర్యం:** ఆవిధంగా సీతాదేవి బిగ్గరగా ఆక్రోశించటం విని, అరుణుడికొడుకు అయిన జటాయువు అనే పక్షిరాజు- పుణ్యాత్ముడు, దేదీప్యమాన మైన కాంతితో ప్రకాశించేవాడు, కొండగుహ లోపల నివసించేవాడు జాలితో.

**క. ఎఱకలు గల కులశైలము । తెఱఁగు మెయిన్ రయము మెఱయ దివికి నెగసి బె**
**ట్టుఱుము జలధరముక్రియ ను । క్కఱి భువనం బెల్ల నద్రువ నార్చుచుఁ గడిమిన్. 345**

**ప్రతిపదార్థం:** ఎఱకలు+కల= రెక్కలుకల; కులశైలము, తెఱఁగు మెయిన్= కులపర్వతంవలె; రయము= వేగం; మెఱయన్= ప్రకాశించగా; దివికిన్= ఆకసానికి; ఎగసి= ఎగిరి; బెట్టు+ఉఱుము= మిక్కుటంగా గర్జన చేస్తూ; జలధరముక్రియన్= మేఘంవలె; ఉక్కు+అఱి= బలంచెడి; భువనంబు+ఎల్లన్= జగము అంతయును; అద్రువన్= అదరగా; ఆర్చుచున్= అరచుచు; కడిమిన్= శౌర్యంతో.

**తాత్పర్యం:** రెక్కలు గల కులపర్వతంవలె వేగంగా వెడలివచ్చి ఆకసానికి ఎగిరి వేఘంవలె గర్జిస్తూ, మిక్కుటమైన పౌరుషం ప్రకాశించేటట్లుగా, జగత్తంతా అదరేటట్లుగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** (1)అలం: ఉపమ. (2) కులపర్వతాలు ఏడు. అవి భూమిని భరించేవి అని సనాతనసంప్రదాయం. 1. మహేంద్రం, 2. మలయం, 3. శుక్తిమంతం, 4. గంధమాదనం, 5. వింధ్యం, 6. పారియాత్రం, 7. సహ్యం. (3) అద్రువ- ॥। నగణం; ఇచట అ- గురువు కాదు; 'అ' తేల్చి పలకాలి. (4) జటాయువు- ఎఱకలు గల కులపర్వతంవలె వినువీథికి ఎగసినట్లు కవి వర్ణన. పర్వతానికి రెక్కలు ఉండవు. ఇక- కులపర్వతం రెక్కలు గలిగితే ఎట్లుంటుందో అట్లాఉన్నది జటాయువు- అని వర్ణన.

**ఉ. 'ఓరి దురాత్మ! యీ యబల నోడక యేటికిఁ బట్టినాఁడ? వం**
**భోరుహనేత్ర విడ్వు; మెట వోయినఁ బ్రాణముఁ గొందు నింక; ను**

**గ్రారివిభేదివిక్రము జటాయు నెఱుంగవె?' యంచు దర్పదు**
**ర్వారుఁడు వీఁకఁ దాఁకె సురవర్గవిఘాతకు నద్దశాననున్. 346**

**ప్రతిపదార్థం:** ఓరిదురాత్మ!= ఓరి దుష్టుడా (రావణా!); ఈ అబలన్= ఈ వనితను, బలంలేని ఆడుదానిని (సీతను); ఓడక= జంకక; ఏటికిన్= ఎందుకు; పట్టినాఁడవు= అపహరించావు; అంభోరుహనేత్రన్- అంభస్+రుహ, నేత్రన్= పద్మాలవంటి కన్నులు కలదానిని (ఈవనితను); విడ్వుము= విడువుము; ఎట+పోయినన్= నీవు ఎటు వెళ్ళినను; ప్రాణమున్+కొందున్= (నీ) అసువులను గైకొంటాను, నిన్నుచంపుతాను; ఇంకన్= ఇంతవరకును; ఉగ్ర+అరి, విభేది, విక్రమున్= భయంకరు లైన శత్రువులను సంహరించే పరాక్రమం కలవాడిని; జటాయువున్= జటాయువును; ఎఱుంగవె= తెలియవా; అంచున్= అని పలుకుతూ; దర్ప+దుర్వారుఁడు= గర్వంచేత వారించ నలవి కానివాడు; ఆ+దశ+ఆననున్= ఆ పదితలలు కల రావణుడిని; సుర, వర్గవిఘాతకున్= వేల్పుల సముదాయానికి మిక్కుటమైన హాని కలిగించేవాడిని రావణుడిని; వీఁకన్= ఉత్సాహంతో; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** 'ఓరీ, దుష్టుడా! ఈ ఆడుదానిని ఎందుకు చెరబట్టావురా? పద్మాలవంటి కన్నులు గల ఈమెను విడిచిపెట్టుము; నీవు నన్ను తప్పించుకొని పారిపోలేవు. నీవు ఎటుపోయినా నేను నిన్ను పట్టుకొని సంహరిస్తాను. భయంకరమైన శత్రువర్గాన్ని చీల్చిచెండాడే పరాక్రమంగల జటాయువును నేను; నన్ను నీవు ఎరుగవా?' అంటూ దర్పంతో చేరి వేలుపులకు హాని కలిగించే ఆ రావణుడిని ఉత్సాహంతో ఎదుర్కొన్నాడు.

**మ. ఘనపక్షాహతులం బ్రకాండపరిఘాఘాతంబులం దీవ్రశా**
**తనఖోచ్ఛేదములం బ్రదీప్తశరవేధక్రీడలం గ్రూరచం**
**చునిపాతంబులఁ బ్రౌఢకుంతముఖవిస్ఫోటంబులం దత్ఖగేం**
**ద్రనిశాటేంద్రుల పోరు సాధనసమత్వస్ఫూర్తి నొప్పెం గడున్. 347**

**ప్రతిపదార్థం:** ఘన, పక్ష+ఆహతులన్= గొప్పవైన రెక్కలదెబ్బలచేతను; ప్రకాండపరిఘ+ఆఘాతములన్= నిడివి అయిన ఇనుపకట్ల గుదియలతో కొట్టటంచేతను; తీవ్ర, శాత, నఖ+ఉత్+ఛేదములన్= గాఢమైన వాడిఅయిన గోళ్ళతో రక్కుటలచేతను; ప్రదీప్త, శరవేధక్రీడలన్= వాడియైన బాణాలచేత బాధించటం అనే ఆటలచేతను; క్రూరచంచునిపాతంబులన్= కఠినమైన ముక్కుతో పొడవటంచేతను; ప్రౌఢ, కుంత, ముఖవిస్ఫోటంబులన్= ముదురు మొనగలిగిన ఈటెపోటులచేతను; తత్, ఖగ+ఇంద్ర, నిశాట+ఇంద్రుల, పోరు= ఆ పక్షిరాజు (జటాయువు) రాక్షసరాజు (రావణుడు) ల యుద్ధం; సాధన, సమత్వ, స్ఫూర్తిన్= పరికరాల యొక్క సమానత్వం అగుపించటంలో; కడున్= మిక్కిలి; ఒప్పెన్= శోభిల్లింది.

**తాత్పర్యం:** పక్షులలో శ్రేష్ఠుడు అయిన జటాయువుకూ నిశాచరులలో శ్రేష్ఠుడు అయిన రావణాసురుడికీ జరిగిన భయంకరమైన యుద్ధంలో సాధనసమత్వం (ప్రయోగించిన పరికరాలలో సామ్యం) గోచరించింది. పక్షీంద్రుడు తనరెక్కలతో కొట్టాడు. రాక్షసేంద్రుడు ఇనుపకట్ల గుదియలు ప్రయోగించాడు. జటాయువు వాడియైన గోళ్లతో రక్కినాడు. రావణుడు వాడి అయిన బాణాలను ఉపయోగించాడు. పక్షి వెరపుగొలిపే ముక్కుతో చీరినాడు. రక్కసుడు నిడివిగల ఈటెను విసిరాడు.

**చ. పటుతరపక్షిపక్షముఖపాదనఖప్రవిఘాతఖండిత**
**స్ఫుటితశరీరుఁడై బహుళశోణితధారలు మేనఁ గ్రమ్మఁగాఁ**

**దటసముపాంతనిర్గళితధాతురసారుణసాంద్రనిర్ఝ రో**
**త్కటకులశైలలీల దశకంఠుఁడు నిల్చె నకుంఠితస్థితిన్.** **348**

**ప్రతిపదార్థం:** దశకంఠుఁడు= పదికంఠాలు కల రావణుడు; పటు, తర, పక్షి, పక్ష, ముఖ, పాద, నఖ, ప్ర, వి, ఘాత, ఖండిత, స్ఫుటిత, శరీరుఁడు+ఐ= మిక్కుటంగా పక్షియొక్కరెక్కలవలన, ముక్కువలన, పాదాలవలన, గోళ్ళవలన తగిన దెబ్బలుగలిగి బాగుగా నరుకబడి చిట్లిన దేహం కలవాడై; బహుళ, శోణితధారలు= పెక్కు నెత్తురుచారలు; మేనన్= దేహంలో, క్రమ్మగాన్= ఆవరించగా; తట, సముపాంత, నిర్గళిత, ధాతు, రస+అరుణ, సాంద్ర, నిర్ఝ ర+ఉత్కట, కులశైల, లీలన్= గట్టు సమీపంలో వెలికిజారిన మణిశిలలచేత ఎర్రనై దట్టమైన సెలయేళ్ళతో విరివిఅయిన కులపర్వతంవలె; అకుంఠిత, స్థితిన్= మొక్కవోని ధైర్యంతో; నిల్చెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** జటాయువుచేత మార్కొనబడిన రావణుడు కులపర్వతంవలె శోభిల్లాడు. జటాయువు తనరెక్కలచే, ముక్కుచే, పాదాలచే, గోళ్లచే, గీరి రావణుడిశరీరంనుండి నెత్తురు కారేటట్లు చేశాడు. తీరసమీపాన గల గైరికాదిధాతువులతో కలిసి ఎర్రబడిన నీళ్ళతో ప్రవహించే సెలయేళ్ళతో గూడిన కులపర్వతంవలె శోభిల్లుతూ రావణుడు ధీరుడై జటాయువును ఎదుర్కొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. పూర్ణోపమ.

**వ. తదనంతరంబ.** **349**

**తాత్పర్యం:** అటు పిమ్మట.

**క. తెఱపి గని దానవేశ్వరుఁ । డుఱక కృపాణమున నాఖగోత్తము నెఱకల్**
**నఱకినఁ గూలె నతం డిల । నఱవఱలై పవనహతమహాభ్రమ పోలెన్.** **350**

**ప్రతిపదార్థం:** తెఱపి+కని= (పోరులో) కొంతవిరామాన్ని గమనించి; దానవ+ఈశ్వరుఁడు= రాక్షసప్రభువు; ఉఱక= లెక్కచేయక కృపాణమునన్= కత్తితో; ఆ ఖగ+ఉత్తము+ఎఱకల్= ఆ పక్షీంద్రుడిరెక్కలు; నఱకినన్= ఖండించగా; అతండు= ఆతడు (జటాయువు); పవనహతమహా+అభ్రము+అ, పోలెన్= గాలిచేత కొట్టబడిన పెద్దమేఘంవలె; అఱవఱలు+ఐ= తుత్తునియలు అయి; ఇలన్= భూమిపై; కూలెన్= పడిపోయాడు.

**తాత్పర్యం:** ఆ పోరాటంలో కొంత విరామాన్ని గమనించి, రాక్షసప్రభువు రావణుడు తన కత్తిని ఎత్తి సులువుగా ఆ పక్షిరాజు అయిన జటాయువుయొక్క రెక్కలను తుత్తునియలుగా ఖండించాడు. అప్పుడు ఆ జటాయువు గాలిచేత కొట్టబడిన గొప్పమేఘంవలె ముక్కలుముక్కలుగా చెదరి పడ్డాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు జటాయువుం గూల్చి రావణుం డధికరయంబున నరుగునెడ జానకి తనకు దిక్కెవ్వరు లేమిం జేసి నిరాశయై యొక్కశైలశృంగంబునందుఁ గొందఱు వానరులు మెలంగుచున్నంగని, తన కట్టిన పుట్టంబుకొంగు సించి భూషణంబులు ముడిచి తత్ప్రదేశంబున వైచెం; బంక్తివదనుండును లంకాపురంబునకుం జని యం**

**దశోకవనమధ్యంబున నాసుమధ్య నునిచి, తదీయరక్షణార్థంబు రాక్షసీనివహంబు నియోగించె; నిట రాఘవుండు మాయామృగంబు వధియించి మగుడం జనుదెంచువాఁడు దన కెదురుగా వచ్చు లక్ష్మణుం గని 'రాక్షస గోచరం బైన వనంబున జానకి నొంటి యునిచి వచ్చి తప్పుసేసి' తని పలుకుటయు, సుమిత్రానందనుండు ధాత్రీతనయ తన్ను నవమానించి పలికిన తెఱంగు సెప్పిన. 351**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; జటాయువున్+కూల్చి= జటాయువును సంహరించి; రావణుండు= రావణుడు; అధిక, రయంబునన్= మిక్కుటమైన వేగంతో; అరుగు+ఎడన్= వెడలుతున్నప్పుడు; జానకి= జనకుడికూతురు- సీత; తనకున్, దిక్కు= తనకు సాయం; ఎవ్వరున్= ఎవరును; లేమిన్+చేసి= లేకపోవటంచేత; నిరాశ+ఐ= ఆస లేనిది అయి; ఒక్క శైలశృంగంబునందున్= ఒక పర్వతంయొక్క కొనభాగంలో; కొందఱు వానరులు= కొన్ని కోతులు; మెలంగుచున్నన్= సంచరిస్తూ ఉండటం; కని= చూచి; తనకట్టిన పుట్టంబు= తాను ధరించిన చీర; కొంగు+చించి= చివరిభాగం చింపి; భూషణంబులు= ఆభరణాలు; ముడిచి= కట్టకట్టి; తత్+ప్రదేశంబునన్= ఆ స్థలంలో; వైచెన్= పడవేసింది; పంక్తివదనుండును= పదితలలుకలవాడును- రావణుడును; లంకాపురంబునకున్= లంకాపట్టణానికి; చని= వెళ్లి; అందున్= (ఆలంకాపురంలో); అశోకవన మధ్యంబునన్= అశోకవృక్షాలతో నిండిన ఉద్యానవనంలో; ఆ సుమధ్యన్= అందమైన నడుము కలదానిని- సీతను; ఉనిచి= ఉంచి; తదీయరక్షణ+అర్థంబు= ఆమెనుకాపాడటం కొరకై; రాక్షసీ, నివహంబున్= ఆడురక్కసి గుంపులను; నియోగించెన్= ఏర్పాటు చేశాడు; ఇట= ఇక్కడ (ఈకథలో ఇచట అంటే దండకారణ్యంలో పర్ణశాలదరిని); రాఘవుండు= శ్రీరాముడు; మాయా, మృగంబు= మాయలేడిని; వధియించి= సంహరించి; మగుడన్+చనుదెంచువాఁడు= తిరిగి (ఆశ్రమానికి) వచ్చేవాడు; తనకున్+ఎదురుగాన్ వచ్చు= తనకు ఎదురుగా అరుగుదెంచే; లక్ష్మణున్+కని= లక్ష్మణుడిని చూచి; రాక్షస, గోచరంబు+అయిన= రక్కసులు నివసించేదైన; వనంబునన్= అడవిలో; జానకిన్= సీతను; ఒంటి+ఉనిచి= ఒంటరిగా విడిచిపెట్టి; వచ్చి= అరుగుదెంచి; తప్పు+చేసితి(వి)= దోషం చేశావు; అని పలుకుటయున్= అని (రాముడు) చెప్పటయు; సుమిత్రా, నందనుండు= సుమిత్రకొడుకు- లక్ష్మణుడు; ధాత్రీతనయ= భూదేవి కూతురు- సీత; తన్నున్= తనను (లక్ష్మణుడిని); అవమానించి= అగౌరవం చేసి; పలికిన తెఱంగు= మాటాడినతీరు; చెప్పినన్= వచించగా.

**తాత్పర్యం:** ఈవిధంగా జటాయువును సంహరించి రావణుడు మిక్కిలివేగంతో పోతూ ఉండగా, సీత తనకు ఇంక సాయం చేసేవారు ఎవరున్నూ లేరని నిరాశపడి, ఒక కొండశిఖరంపై కొంతమంది వానరులు విహరిస్తూ ఉండటం చూచి, ఆ శిఖరంమీద పడేటట్లుగా తన ఆభరణాలను చీరచెంగు చించి మూటకట్టి పడవేసింది. రావణుడు సీతను గైకొని లంకాపురానికి చేరి అందుగల అశోకవనంలో ఆమెను ఉంచాడు. ఆమెను సంరక్షించటానికై రాక్షసస్త్రీలను కొంతమందిని నియమించాడు. ఇట దండకారణ్యంలో శ్రీరాముడు మారీచుడిని సంహరించిన పిదప తమ పర్ణశాలకు వెళ్లుతున్నాడు. మార్గమధ్యంలో లక్ష్మణుడు ఎదురువచ్చాడు. అప్పుడు శ్రీరాముడు- 'రాక్షసులు నిండిఉండే దండకారణ్యంలో సీతను ఒంటరిగా విడిచిపెట్టి రావటం తప్పు సుమీ' అని హెచ్చరించాడు. లక్ష్మణుడు సీత తనను నిందించిన తీరు శ్రీరాముడికి చెప్పాడు. శ్రీరాముడి హృదయంలో ఆందోళన అధికమయింది.

**మధురాక్కర**

**కనకమృగ మట్లు దను దవ్వుగాఁ ద్రిప్పి తెచ్చుటకు,**
**వనజముఖి నేకతమ శూన్యవనమునయం దునిచి**
**వెనుక ననుజుండు వచ్చిన విధమునకు, మదిలోన**
**ననఘుఁ డెంతయు వగచుచు నరిగె నాశ్రమమునకు. 352**

**ప్రతిపదార్థం:** కనక, మృగము= బంగారులేడి; అట్లు= ఆరీతిగా; తనున్= తనను (శ్రీరాముడిని); దవ్వుగాన్= దూరంగా; త్రిప్పి= సంచరింపజేసి; తెచ్చుటకున్= తీసికొని రావటానికిన్నీ; వనజముఖిన్= పద్మంవంటి ముఖం కలదానిని- సీతను; ఏకతము+అ= ఒంటరిగా; శూన్యవనమునందున్= ఎవరున్నూ లేని (నరసంచారం లేని) అడవిలో; ఉనిచి= ఉంచి; వెనుకన్= (తాను వెళ్లిన మార్గం) వెంబడి; వచ్చిన= అరుదెంచిన; విధమునకున్= తీరుకు; మదిలోనన్= చిత్తంలో; అనఘుఁడు= పాపరహితుడు- శ్రీరాముడు; వగచుచున్= విచారిస్తూ; ఆశ్రమమునకున్= తాను నివసించే తోటవిడిదికి, పర్ణశాలకు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** బంగరులేడి తనను అడవిలో దవుదవ్వులకు కొనిపోయినందుకూ, పద్మంవంటిముఖంగల సీతను ఒంటరిగా నరసంచారం లేని ఆ అడవిలో విడిచిపెట్టి తన వద్దకు సోదరుడు లక్ష్మణుడు వచ్చినందుకూ అంతరంగంలో చింతిల్లుతూ పుణ్యాత్ముడైన శ్రీరాముడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు.

**విశేషం:** మధురాక్కర పాదంలో వరుసగా 1 సూర్యగణం 3 ఇంద్రగణాలు, 1 చంద్రగణం ఉంటాయి. నాల్గవ గణం మొదటి అక్షరం యతి. ప్రాస నియమం ఉన్నది.

**వ.** **అట్లు సని చేతనారహితం బైన శరీరంబునుంబోలె సీతావిహీనంబయి యున్న పర్ణగృహంబుం గనుంగొని రాఘవుండు మూర్ఛితుండై, లక్ష్మణ ప్రయత్నంబునఁ గొండొకవడికిఁ దెలివొందె; నంత నయ్యన్నయుం దమ్ముండును దత్ప్రదేశంబులయందు సుందరిం దడవుచుం జనువారు ముందట.** **353**

**ప్రతిపదార్థం:** అట్లు+చని= ఆ విధంగా నడచి; చేతనా, రహితంబు+ఐన= కదలిక మెదలిక లేనట్టి (అసువులు పాసిన); శరీరంబునున్+పోలెన్= దేహంవలె; సీతా విహీనంబు+అయి+ఉన్న= సీత లేనిది అయిఉన్న; పర్ణగృహంబున్= ఆకులతో నిర్మించిన ఇంటిని; కనుంగొని= చూచి; రాఘవుండు= రఘువంశంలో పుట్టినవాడైన రాముడు; మూర్ఛితుండు+ఐ= స్పృహ కోలుపోయినవాడు అయి; లక్ష్మణప్రయత్నంబునన్= లక్ష్మణుడు చేసిన కృషివలన; కొండొక వడికిన్= కొంతసేపటికి; తెలివి+ఒందెన్= తేరుకొన్నాడు; అంతన్= అటుమీద; ఆ+అన్నయున్, తమ్ముండును= ఆ అగ్రజుడును, లక్ష్మణుడును; తత్+ప్రదేశంబుల+అందున్= ఆయాచోటులలో; సుందరిన్= సౌందర్యవతిని- సీతను; తడవుచున్= వెదకుతూ; చనువారు= వెళ్ళేవారు; ముందటన్= ఎదుట.

**తాత్పర్యం:** రామలక్ష్మణులు ఆ విధంగా ఆందోళన చెందుతూ నడిచి సీత లేని పర్ణశాలను ప్రాణం లేని దేహంవలె నున్నదానిని చూచారు. రాముడు ఆ శూన్యపర్ణకుటీరాన్ని కాంచి మూర్ఛిల్లాడు. లక్ష్మణుడు శీతలోపచారాలు చేయగా కొంతతడవుకు శ్రీరాముడు తేరుకొన్నాడు. అంతట ఆ అన్నదమ్ములు ఇరువురును ఆయా ప్రదేశాలలో సీతాదేవిని వెదకుకొంటూ వెళ్ళుతున్నారు. ముందట....

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **కులిశపాతభంగుర మైన కులనగంబు । కరణిఁ బడియున్న గృధ్రంబుఁ గాంచి బుద్ధి**
**నదియు రాక్షసమాయయౌ నని తలంచి । యేయ సమకట్టుటయు విహగేంద్రుఁ డెఱిఁగి.** **354**

**ప్రతిపదార్థం:** కులిశపాతభంగురము+ఐన= వజ్రం (దెబ్బ) పడటంచేత పగిలినది అయిన; కుల, నగంబు= కులపర్వతం; కరణిన్= వలె; పడి+ఉన్న= నేలపై కూలి ఉన్న; గృధ్రంబున్= గద్దను; కాంచి= చూచి; బుద్ధిన్= చిత్తంలో; అదియున్= (ఆ

గద్దయును); రాక్షసమాయ+ఔన్+అని= రక్కసుల మోసమే అని; తలంచి= భావించి; ఏయన్= బాణంతో కొట్టటానికి; సమకట్టుటయున్= పూనుకోగా; విహగ+ఇంద్రుఁడు= పక్షులలో శ్రేష్ఠుడు- జటాయువు; ఎఱిఁగి= తెలిసికొని.

**తాత్పర్యం:** వజ్రాయుధం యొక్క దెబ్బతో కుప్పకూలిన కులపర్వతంవలె నేలపై పడిఉన్న గొప్పగద్దను చూచి అదికూడా రక్కసులు కల్పించిన మోసంగా భావించి, రామలక్ష్మణులు బాణాలను ప్రయోగించటానికి ఉద్యుక్తులైనారు. అంతట ఆసంగతి గ్రహించి వారలతో ఆ జటాయువు ఇట్లా పలికాడు.

**విశేషం:** (1) అలం: ఉపమ (2) పురాణకథ : పూర్వకాలంలో పర్వతాలు రెక్కలు కలిగి విహరిస్తూ ఉండేవట. అవి ఎక్కడ వ్రాలితే అక్కడ జనపదాలు, పొలాలు, అడవులు నాశనమౌతూ ఉండటంవలన దేవేంద్రుడు తన వజ్రాయుధంతో సంధించి ఆ కొండల రెక్కలను ఖండించాడు.

**క.** **'ఓయయ్యలార! యేను జ । టాయు వనంబరఁగు పక్షి నరుణతనయుఁడన్**
**మీయయ్య దశరథక్షితి । నాయకునకుఁ బ్రియసఖుండ' నావుడు వారల్.** **355**

**ప్రతిపదార్థం:** ఓ+అయ్యలార!= ఓ ఆర్యులారా- ఓరామలక్ష్మణులారా!; ఏను= నేను; జటాయువు+అనన్+పరఁగు= జటాయువు అనే పేర పిలువబడే; పక్షిన్= పక్షిని; అరుణతనయుఁడన్= అరుణుడి పుత్రుడను; మీ+అయ్య= మీతండ్రి; దశరథ, క్షితి, నాయకునకున్= దశరథమహారాజుకు; ప్రియసఖుండన్= ఇష్టుడ నయిన మిత్రుడను; నావుడున్= అనవుడు, అని చెప్పగా; వారల్= వారు, శ్రీరామలక్ష్మణులు.

**తాత్పర్యం:** 'ఓ ఆర్యులారా! శ్రీరామలక్ష్మణులారా! నేను జటాయువు అనే పక్షిని. అరుణుడి కుమారుడను. మీ తండ్రి దశరథమహారాజుకు మిత్రుడను' అని చెప్పాడు. అంతట శ్రీరామలక్ష్మణులు.

**విశేషం:** అరుణుడు= అనూరుడు- సూర్యుడి సారథి, గరుత్మంతుడి అన్న.

**వ.** **డాయ నరుగుదెంచుటయు నతండు వారితో రావణుండు వైదేహిం గొనిపోవుటయుఁ, దదర్థంబై తాను నద్దనుజుం దొడరి పెనంగుటయుం జెప్పి, యావల రావణుం డరిగినదెస నెఱింగించి విగతజీవుం డయ్యె; నయ్యిరువురు నప్పులుఁగుఱేనికి నతిగౌరవంబున నగ్నిసంస్కారాదికరణీయంబులు నిజజనక నిర్విశేషంబుగా నాచరించి దక్షిణాభిముఖులై చని చని.** **356**

**ప్రతిపదార్థం:** డాయన్+అరుగుదెంచుటయున్= సమీపంగా రావటమున్నూ; అతండు= అతడు (ఆ జటాయువు); వారితోన్= రామలక్ష్మణులతో; రావణుండు; వైదేహిన్= సీతను (విదేహరాజు కూతురును); కొనిపోవుటయున్= తీసికొని వెళ్ళటమున్నూ; తత్+అర్థంబు+ఐ= అందుకొరకై; తాను= తాను (జటాయువు); ఆ+దనుజున్= ఆ రాక్షసుడిని (రావణుడిని); తొడరి= పూని; పెనంగుటయున్= పోరాడటమున్నూ; చెప్పి= వచించి; ఆవలన్= ఆ పిదప; రావణుండు; అరిగిన= వెళ్ళిన; దెసన్= దిక్కును; ఎఱింగించి= తెలిపి; వి,గత, జీవుండు+అయ్యెన్= పోయిన జీవం కలవాడు అయ్యాడు, మరణించాడు; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరు- రామలక్ష్మణులు; ఆ+పులుగుఱేనికిన్= ఆ పక్షిరాజుకు (జటాయువుకు); అతి, గౌరవంబునన్= గొప్పభక్తితో; అగ్నిసంస్కార+ఆది, కరణీయంబులు= దహనం చేయటం మున్నగు (దినవార) క్రియలు: నిజ, జనక, నిర్విశేషంబుగాన్= తమయొక్క తండ్రితో సమానంగా; ఆచరించి= చేసి; దక్షిణ+అభిముఖులు+ఐ= దక్షిణదిక్కుగా మొగాలు కలవారై; చని, చని= వెళ్ళి వెళ్ళి.

**తాత్పర్యం:** రామలక్ష్మణులు జటాయువును సమీపించి నిలిచారు. అంతట ఆ పక్షిరాజు వారితో రావణుడు సీతను కొనిపోవటాన్నీ, తాను ఆ అత్యాచారాన్ని ఎదుర్కొని పోరాడి రెక్కలు కోల్పోయి నేలగూలటాన్నీ వివరించి చెప్పి, మరణించాడు. అంతట రామలక్ష్మణులు ఇరువురు తమ తండ్రితో సమానంగా భావించి జటాయువుకు అగ్నిసంస్కారాలు చేసి అంత్యక్రియలు నిర్వర్తించారు. జటాయువువలన రావణుడు దక్షిణదిక్కుకు పోయాడని తెలిసికొని తాముకూడ దక్షిణదిశగా పయనంచేయసాగారు.

**ఉ. ఉరమునయందుఁ గన్నులుఁ బృథూదరదేశమునందు నోరుఁ బ్ర**
**స్ఫురితభుజద్వయంబుఁ గులభూమిధరోన్నతభావముం గరం**
**బరుదుగ నుగ్రమైన వికృతాకృతితోడ నశేషసత్త్వఘ**
**స్మరుఁ డగుచున్నవానిఁ బటుసత్త్వుఁ గబంధునిఁ గాంచి రచ్చటన్. 357**

**ప్రతిపదార్థం:** అచ్చటన్= ఆ ప్రదేశంలో; ఉరమునయందున్= వక్షంలో; కన్నులున్; పృథు+ఉదరదేశమునందున్= విస్తార మైన కడుపు ఉన్న చోటులో; నోరున్= నోరున్నూ; ప్రస్ఫురిత, భుజ, ద్వయంబున్= బాగా విస్తరించిన రెండు బాహువులున్నూ; కుల, భూమిధర+ఉన్నతభావమున్= కులపర్వతంవంటి ఔన్నత్యాన్నీ; కరంబు= మిక్కిలి; ఉగ్రము+ఐన= భయంకర మైన; వికృత+ఆకృతితోడన్= వికారమయిన రూపంతో; అశేష సత్త్వ ఘస్మరుఁడు= పెక్కుజంతువులను చంపి తినేవాడు; అగుచున్నవానిన్= అయినవాడిని; పటుసత్త్వున్= మిక్కుటమైన బలం కలవాడిని; కబంధునిన్= కబంధుడు అనేవాడిని; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** రామలక్ష్మణులు, అచట వికృతమైన రూపం గల కబంధుడిని చూచారు. ఆ కబంధుడికి కన్నులు వక్షంలో ఉన్నవి. పెద్దకడుపులో నోరు ఉన్నది. మిక్కిలి పొడవైన బాహువులతో కులపర్వతంవలె ఎత్తైన, మిగుల భీతిని గొల్పే వికార స్వరూపంతో ఉన్నాడు. అమిత బలంగల ఆ కబంధుడు పెక్కుజంతువులను చంపి పొట్టనింపుకొనే గొప్ప తిండిపోతు.

**ఆ. అక్కబంధుఁ డామిషార్థియై లక్ష్మణుఁ । బట్టికొనియె బాహుబల మెలర్ప;**
**నతఁడు గడువిషణ్ణుఁడై 'యన్న! ననుఁ జూడు' । మనుచు రాముఁ జూచి యనియె మఱియు. 358**

**ప్రతిపదార్థం:** బాహుబలము+ఎలర్పన్= చేతులశక్తి శోభిల్లేటట్లుగా; ఆ+కబంధుఁడు; ఆమిష+అర్థి+ఐ= మాంసాన్ని కోరినవాడై; లక్ష్మణున్+పట్టికొనియెన్= లక్ష్మణుడిని పట్టుకొన్నాడు; అతఁడు= లక్ష్మణుడు; కడున్= మిక్కిలి; విషణ్ణుఁడు+ఐ= విచారంతో కూడినవాడై; అన్న!= అగ్రజా, శ్రీరామా!; ననున్= నన్ను; చూడుము= అరయుము; అనుచున్= అంటూ; రామున్= రాముడిని; చూచి; మఱియున్= రెండియు; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ కబంధుఁడు మాంసాహారం కొరకై అన్వేషిస్తూ యాదృచ్ఛికంగా లక్ష్మణుడిని పట్టుకొన్నాడు. లక్ష్మణుడు కబంధుడి బాహుబంధాన్ని విడిపించుకొనలేకపోయాడు. కబంధుడి బలం అట్టిది! అంత లక్ష్మణుడు విషాదంతో నిండిన చిత్తం కలవాడై 'అన్నా! శ్రీరామా! నన్ను చూడుము. నేను ఎట్టి దుఃస్థితిలో చిక్కానో!' అని చెప్పి, ఇంకా ఇట్లా పలికాడు.

## శ్రీరాముఁడు కబంధుఁ డను రాక్షసుం జంపుట (సం. 3-263-27)

**సీ. 'మహనీయసామ్రాజ్యమహిమ వాయుటయును, । బితృమరణంబు, నాభీలవిపిన**
**భూములఁ గడుదుఃఖమునఁ జరించుటయు, వై । దేహిఁ గోల్పడి వగఁ దిరుగుటయును,**
**దుదిఁ బోయి యే నిట్టు దొడరి యీ దానవు । వాతఁ జిక్కుటయును వగవ నీకుఁ**
**బైపయిఁ బెక్కులాపద లయ్యె నక్కట! । ధరణీశ! నీవు నా ధరణిసుతయుఁ**

**ఆ. గలసి పూజ్యరాజ్యగౌరవంబున వెలుఁ । గంగ నెలమిఁ జూడఁ గాన నైతి**
**నేను దలఁప నెట్టి హీనభాగ్యుండనో!' । యనుచు ననుజుఁ డార్తి నడలుటయును. 359**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ!= రాజా, శ్రీరామా!; మహనీయసామ్రాజ్యమహిమ= గొప్పదైనది, విస్తరించినది అయిన రాజ్యం యొక్క గౌరవం; పాయుటయును= వదలిపోవటమున్నూ; పితృ, మరణంబున్= తండ్రి చనిపోవటమున్నూ; ఆభీల, విపిన, భూములన్= భయంకరమైన అడవి ప్రదేశాలలో; కడున్= మిక్కుటమైన; దుఃఖమునన్= ఆవేదనతో; చరించుటయున్= తిరుగుటయున్నూ; వైదేహిన్= సీతను; కోల్పడి= పోగొట్టుకొని; వగన్= దుఃఖంతో; తిరుగుటయును= సంచరించటమున్నూ; తుదిన్+పోయి= చిట్టచివరకు; ఏన్= నేను; ఇట్టు= ఈరీతిగా; తొడరి= కడగి; ఈదానవువాతన్= ఈరాక్షసునినోటికి; చిక్కుటయును= వశం కావటమున్నూ; వగవన్= ఆలోచించగా; నీకున్= ఓరామా! నీకు; పై+పయిన్= ఒకదానిపై మరొకటి; పెక్కులు= అనేకాలైన; ఆపదలు+అయ్యెన్= కష్టాలు సంప్రాప్తాలయ్యాయి; అక్కట= అయ్యో! ఎంత దురవస్థ వాటిల్లింది; నీవున్= నీవును; ఆ ధరణిసుతయున్= భూమికి కూతురు అయిన సీతాదేవియున్నూ; కలసి= కూడి; పూజ్య, రాజ్య, గౌరవంబునన్= ఆరాధించదగిన రాజ్యమర్యాదలతో; వెలుగంగన్= ప్రకాశించగా; ఎలమిన్= సంతోషంతో; చూడన్+కానన్+ఐతిన్= దర్శింపజాలకపోయాను; నేను= నేను; తలఁపన్= యోచించగా; ఎట్టి= ఎటువంటి; హీనభాగ్యుండన్+ఓ= దురదృష్టవంతుడనో కదా; అనుచున్= అని అంటూ; అనుజుఁడు= తమ్ముడు (లక్ష్మణుడు); ఆర్తిన్= దుఃఖంతో; అడలుటయును= కలతచెందినవాడు కాగా.

**తాత్పర్యం:** 'అగ్రజా, శ్రీరామా! నీకు ఆపదలపై ఆపదలు దాపురించాయి. భోగభాగ్యాలతో తులతూగే రాజ్యం తొలగిపోయింది. తండ్రిగారు మరణించారు. భయంకరమైన అడవులలో తిరుగాడవలసి వచ్చింది. చిట్టచివరకు దురదృష్టదశకు పరాకాష్ఠగా- నేను ఈ రాక్షసుడికి చిక్కాను. ఇక ఈతడు నన్ను తన పొట్టనపెట్టుకొంటాడు. అయ్యో! శ్రీరామచంద్రా! నీవును నీదేవియైన సీతాదేవియు పట్టాభిషేకం చేసికొని, రాజలాంఛనాలతో శోభిల్లే సుందరదృశ్యాన్ని కనులపండువుగా కాంచలేకపోయానుగదా! ఇక నావంటి దురదృష్టవంతుడు ఎవడైనా ఉన్నాడా?' అంటూ లక్ష్మణుడు విచారంతో కలతచెందాడు.

**తే. విగతసంభ్రముఁ డై రామవిభుఁడు గడఁగి । 'యన్న! లక్ష్మణ! యోడకు మన్న, యేను**
**గలుగ నీ కేల యాపద గలుగనేర్చు? ననుచు గ్రక్కున నిశితమహాసి వెఱికి. 360**

**ప్రతిపదార్థం:** రామవిభుఁడు= రామరాజు; విగతసంభ్రముఁడు+ఐ= పోయిన తత్తరపాటు కలవాడై, ధైర్యం కలవాడై; కడఁగి= పూని; అన్న! లక్ష్మణ!= ప్రేమపాత్రుడ వైన లక్ష్మణా!; ఓడకుము+అన్న!= భయపడవద్దయ్యా!; ఏను= నేను; కలుగన్= ఉండగా; నీకున్= నీకు; ఆపద= కీడు; ఏల కలుగనేర్చున్= ఎందుకు ఏర్పడుతుంది; అనుచున్= అని అంటూ; గ్రక్కునన్= వేగంగా; నిశిత, మహా+అసి= వాడి అయిన గొప్పకత్తిని; వెఱికి= (ఒరనుండి) బయటకు లాగి.

**తాత్పర్యం:** శ్రీరాముడు ఎట్టి తత్తరపాటు చెందకుండా ధీరుడై నిలిచి 'ప్రియమైన తమ్ముడా! లక్ష్మణా! నేను ఉండగా నీకు ఎట్టి కీడు వాటిల్లదు' అంటూ ఒరనుండి గొప్పదైన తన కత్తిని తీశాడు.

**వ. ఆ రక్కసు డాచేయిఁ దునియ వ్రేసిన లబ్ధమోక్షణుండయి లక్ష్మణుండు ప్రకటసైంహికేయ దంష్ట్రాయంత్ర విముక్తుండయిన తిగ్మభానుండునుంబోలెఁ బ్రదీప్తుండయి తీక్ష్ణకౌక్షేయకంబునఁ దదీయ దక్షిణబాహు ఖండనంబు సేసి పార్శ్వద్వయంబు భేదించిన నాక్షణంబ కబంధుఁడు దివ్యరూపధరుం డగుటయుం గని రాఘవుండు విస్మితుండై. 361**

**ప్రతిపదార్థం:** ఆ, రక్కసు, డా, చేయిన్= ఆ రాక్షసుడియొక్క ఎడమచేతిని; తునియన్‌వ్రేసినన్= ఖండించగా; లబ్ధమోక్షణుండు+ అయి= పొందిన విముక్తి కలవాడు అయి (విముక్తి పొందినవాడై); లక్ష్మణుండు= లక్ష్మణుడు; ప్రకట, సైంహికేయదంష్ట్రా, యంత్ర, విముక్తుండు+అయిన= తేటతెల్లంగా కనుపించిన రాహువుయొక్క కోరలు అనే మరనుండి విడిచిపెట్టబడిన; తిగ్మ, భానుండునున్+పోలెన్= తీక్ష్ణమైన కిరణాలు కల సూర్యుడివలె; ప్రదీప్తుండు+అయి= వెలుగొంది; తీక్ష్ణ+కౌక్షేయకంబునన్= వాడి అయిన కత్తిచేత; తదీయ, దక్షిణ, బాహు, ఖండనంబు+చేసి= ఆతడియొక్క (ఆ కబంధుడియొక్క) కుడిచేతిని నరికి; పార్శ్వద్వయంబు= ప్రక్కలజంటను (కుడిప్రక్కగా, ఎడమప్రక్కగా ఉన్న ఉదరభాగాన్ని - అనగా చంకల క్రింది భాగాలను); భేదించినన్= చీల్చగా; ఆ, క్షణంబు+అ= ఆత్రుటిలోనే (వెంటనే); కబంధుఁడు; దివ్య, రూప, ధరుండు+అగుటయున్= దేవతలకు సంబంధించిన ఆకారం కలవాడు కావటం; కని= చూచి; రాఘవుండు= శ్రీరాముడు; విస్మితుండు+ఐ= అచ్చెరువును పొందినవాడై.

**తాత్పర్యం:** శ్రీరాముడు కబంధుడి ఎడమచేతిని తనకత్తితో ఖండించాడు. వెనువెంటనే కబంధుడిబారినుండి విముక్తుడైన లక్ష్మణుడు రాహువుయొక్క కోరలనుండి విడివడిన సూర్యుడివలె ప్రకాశిస్తూ వాడికత్తిని తీసి కబంధుడి కుడిచేతినికూడ ఖండించి, వాడిపొట్టను ఇరుప్రక్కల చీల్చాడు. ఆక్షణంలోనే ఆరాక్షసుడు దివ్యరూపం ధరించి నిల్చాడు. శ్రీరాముడు ఆశ్చర్యపోయాడు.

**విశేషం:** కౌక్షేయకం= కుక్షికిదగ్గరగా ధరించబడే కత్తి. సంశోధితప్రతిలో గౌక్షేయకంఅని ఉన్నది. అది అచ్చుపొరపాటు. పూర్వకాలంలో వీరులు తనపొట్టకు కత్తిని ఆత్మరక్షణకై ఉపయోగించేనిమిత్తం కట్టుకొంటూ ఉండేవారు.

**క. 'ఈవనమునందు రాక్షస । భావంబున నున్న నీకుఁ బ్రకటితదివ్య**
**త్వావాప్తి యైన కారణ । మేవిధ?' మనుటయును నాతఁ డిట్లని చెప్పెన్. 362**

**ప్రతిపదార్థం:** ఈవనమునందున్= ఈ అరణ్యంలో; రాక్షసభావంబునన్= రక్కసివై; ఉన్న= ఉన్నటువంటి; నీకున్= నీకు; ప్రకటిత దివ్యత్వ+అవాప్తి= తేటతెల్ల మైన దేవతాస్వరూపం పొందటానికి; ఐన, కారణము= అయిన హేతువు; ఏవిధము= ఏరీతిగా ఏర్పడింది అనుటయునున్= (అని రాముడు) ప్రశ్నించటమున్నూ!; ఆతఁడు= అతడు (దివ్యరూపం తాల్చిన కబంధుడు); ఇట్లు+అని= ఈరీతిగా; చెప్పెన్= వచించాడు.

**తాత్పర్యం:** 'ఓ దివ్యపురుషుడా! నీవు ఇంతవరకు ఈ అడవిలో రాక్షసరూపంలో రాక్షసజీవితాన్ని గడపి ఉన్నావుకదా! ఇప్పుడు నీకు ఈ దివ్యరూపం ఏవిధంగా సంప్రాప్తించింది?' అని శ్రీరాముడు ప్రశ్నించాడు. అంతట దివ్యరూపం తాల్చి నిల్చిన భూతపూర్వ కబంధుడు ఈ రీతిగా పలికాడు.

**వ. ఏను విశ్వావసుం డను గంధర్వుండ; బ్రహ్మశాపంబునం జేసి రాక్షసత్వంబు నొంది మీవలన శాపమోక్షంబు వడసితి; రావణుం డను రక్కసుండు జానకిం గొనిపోయి, లంకానగరంబున నునిచినవాఁడు; మీకు హితోపదేశంబు సేసెద; నిట పోవంబోవఁ బంపాభిధానం బయిన సరోవరంబు గలదు; దాని యావల ఋశ్యమూకం బనుశైలంబునందు వాలిసహోదరుండు సుగ్రీవుం డను వానరుండు సచివ చతుష్టయ సహితుండై యుండు; నతనితోడ సఖ్యంబు సేయుము; దానం జేసి నీకుఁ గార్యసిద్ధి యగు' నని పలికి గంధర్వుండు వారి వీడ్కొని నిజేచ్ఛం జనియెఁ; దదనంతరంబ యట చని చని. 363**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; విశ్వావసుండు+అను= విశ్వావసుడు అనే పేరుకల; గంధర్వుండన్= గంధర్వుడను; బ్రహ్మశాపంబునన్+చేసి= బ్రహ్మదేవుడియొక్క శాపంవలన; రాక్షసత్వంబున్= రాక్షసభావాన్ని; ఒంది= పొంది; మీవలనన్= (ఓ రామా! ఓలక్ష్మణా!) మీవలన; శాపమోక్షంబున్= శాపంనుండి విడుదల; పడసితిన్= పొందాను; రావణుండు+అను= రావణుడు అనేపేరు కల; రక్కసుండు= రాక్షసుడు; జానకిన్= సీతను; కొనిపోయి= అపహరించి; లంకానగరంబునన్= లంక అనే పట్టణంలో; ఉనిచినవాఁడు= ఉంచాడు; మీకున్= (రామలక్ష్మణులైన) మీకు; హిత+ఉపదేశంబు+చేసెదన్= మేలు కలిగించే మాటలను చెప్పుతాను; ఇట, పోవన్+పోవన్= ఇక్కడ నుండి వెళ్లగా వెళ్లగా, చాలాదూరం పయనించగా; పంపా+ అభిదానంబు+అయిన= పంప అనే పేరు కలిగిన; సరోవరంబు= సరస్సు; కలదు= ఉన్నది; దాని+ఆవలన్= ఆ పంపాసరోవరం దాటినపిదప; ఋశ్యమూకంబు+అను, శైలంబునందున్= ఋశ్యమూకం అనేపేరు గల కొండమీద; వాలిసహోదరుండు= వాలియొక్క తమ్ముడు; సుగ్రీవుండు+అను= సుగ్రీవుడు అనే పేరు గల; వానరుండు= కోతి; సచివచతుష్టయ, సహితుండు+ఐ= మంత్రులు నలుగురితో కూడినవాడు అయి; ఉండున్= నివసిస్తూ ఉంటాడు; అతనితోడన్= ఆ సుగ్రీవుడితో; సఖ్యంబు+ చేయుము= మైత్రి నెరపుము; దానన్+చేసి= దానివలన; నీకున్= నీకు; కార్యసిద్ధి+అగున్= కార్యం నెరవేరగలదు; అని పలికి= అని వచించి; వారిన్= వారిని (రామలక్ష్మణులను); వీడ్కొని= మర్యాదపూర్వకంగా సెలవు గైకొని; గంధర్వుండు= గంధర్వుడు; నిజ+ఇచ్ఛన్= తనయిచ్ఛ వచ్చిన చొప్పున; చనియెన్= వెళ్ళాడు; తత్+అనంతరంబు+అ= అటు పిమ్మట; చని చని= వెడలివెడలి (చాలదూరం ప్రయాణం చేసి).

**తాత్పర్యం:** 'నేను విశ్వావసుడు అనేపేరు గల గంధర్వుడను. బ్రహ్మదేవుడిశాపంవలన నాకు రాక్షసజన్మ వచ్చింది. నేడు మీమూలంగా నాకు శాపవిమోచనం కలిగింది. రావణుడు అనే రాక్షసుడు సీతను అపహరించి లంకాపట్టణానికి కొనిపోయాడు. మీమేలు కోరి నేను చెప్పే వాక్యాలు వినండి. ఇటనుండి బహుదూరం పయనించిన పిదప 'పంప' అనే పేరు గల సరోవరం చేరుతారు. ఆ సరస్సుకు కొంచెం దూరంలో ఋశ్యమూకం అనేపేరు గల పర్వతం ఉన్నది. ఆ పర్వతంమీద వాలితమ్ముడు సుగ్రీవుడు అనే వానరుడు నలుగురు మంత్రులతో కలిసి నివసిస్తున్నాడు. మీరు ఆ సుగ్రీవుడితో స్నేహం చేయండి. దానివలన మీపని నెరవేరగలదు' అని చెప్పి ఆ గంధర్వుడు రామలక్ష్మణులవద్ద మర్యాదగా సెలవుతీసికొని ఇచ్ఛవచ్చినచోటికి వెళ్ళాడు. పిమ్మట రామలక్ష్మణులు బహుదూరం పయనించి.

**సీ. కమనీయకమలినీకహ్లారదళకేస । రాన్వితజలముల నర్ఘ్యవిధియుఁ,**
**దరళతరంగహస్తములఁ బాద్యంబు, ను । న్మద చక్రసారసమధుపహంస**
**రుతులఁ బ్రియోక్తులు, రుచిరవానీర ని । వేశనచ్ఛాయల విశ్రమంబు**
**మందసంచారితమారుతంబుల నురు । తాపనోదనమును దగిలి యెపుడు**

**ఆ. నాచరించుచును సమంచితాతిథి జన । సేవనమునఁ దనదుజీవనంబు**
**ఫలము నొంద నొప్పు పంపాసరోవరం । బెదురఁ గాంచి రన్నరేంద్రసుతులు. 364**

**ప్రతిపదార్థం:** ఆ+నర+ఇంద్ర, సుతులు= ఆ రాజపుత్రులు (రామలక్ష్మణులు); కమనీయ, కమలినీ, కహ్లార, దళ, కేసర+అన్విత, జలములన్= మనోహరాలైన తామరతంపరలతో, ఇంచుక తెలుపు ఇంచుక ఎఱుపు రంగును గల సౌగంధికపుష్పాలయొక్క రేకులలోని కింజల్కాలతో కూడిననీళ్లతో; అర్ఘ్యవిధియున్= పూజాసత్కారానికి ఇచ్చే నీరును; తరళ, తరంగహస్తములన్= మెరుస్తున్న కెరటాలు అనేచేతులతో; పాద్యంబున్= పాదాలు కడుగుకొనటానికై స్వాగతపూర్వకంగా ఇచ్చే నీరును; ఉన్మద, చక్ర, సారస, మధుప, హంస, రుతులన్= బాగా మత్తిల్లిన చక్రవాకముల యొక్కయు, బెగ్గురుపక్షుల యొక్కయు, తుమ్మెదలయొక్కయు, అంచలయొక్కయు ధ్వనులచేత; ప్రియోక్తులు= ప్రియ+ఉక్తులు= (యోగక్షేమాల నడిగే) మంచిమాటలును; రుచిర, వానీర, నివేశన+ఛాయలన్= ప్రకాశించే నీటిప్రబ్బలిచెట్లు సమకూర్చే విడిదిఇండ్లనీడలలో; విశ్రమంబు= విశ్రాంతి; మంద, సంచారితమారుతంబులన్= మెలమెల్లగా వీచే గాలులచేత; ఉరు, తాపనోదనమును= మిక్కుటమైన ఎండను తొలగించుటయును; తగిలి= పూని; ఎపుడున్= ఎల్లప్పుడును; ఆచరించుచును= చేస్తూ; సమంచిత+అతిథి, జనసేవనమునన్= ఒప్పిద మయ్యేటట్లుగా అతిథిజనులకు పరిచర్యచేయటంలో; తనదు= తనయొక్క; జీవనంబు=(1) బ్రదుకు, (2)జలం; ఫలమున్+ఒందన్+ఒప్పు= ఫలించేటట్లుగా శోభిల్లు; పంపాసరోవరంబు= పంప అనే పేరు గల సరస్సును; ఎదురన్= తమముందర; కాంచిరి= చూచారు.

**తాత్పర్యం:** రాజపుత్రులైన ఆ రామలక్ష్మణులు తమకట్టెదురుగా ఉన్న పంపాసరోవరాన్ని చూచారు. ఆ పంపాసరోవరం సతతం అతిథి సత్కారం చేస్తూ తనజీవనం ధన్యమయ్యేటట్లు చేసికొంటున్నట్లు ఒప్పుతున్నది. పంపాసరస్సు ఎల్లప్పుడూ అతిథులకు అర్ఘ్యం సమర్పిస్తూ ఉన్నది. ఆ అర్ఘ్యజలం మనోహరా లైన తామరలచేతను, ఇంచుక తెలుపు ఇంచుక ఎఱుపురంగు గల రేకులతో శోభిల్లే సౌగంధికపుష్పాల కింజల్కాలతో పుప్పొడులతో పరిమళిస్తూ ఉన్నది. ఇక, మెరసే కెరటాలు అనే చేతులతో అతిథులకు కాళ్ళుకడిగేనీటిని సమర్పిస్తూ ఉన్నది. అలాగే చక్రవాకములు, హంసలు మున్నగు జలపక్షుల ధ్వనులనే ప్రియోక్తులతో ఆదరిస్తూ ఉన్నది. తీరాలలోని పొదరిండ్ల నీడలనే విశ్రమస్థలాలను నిర్దేశిస్తున్నది. మందమారుతాలచే తాపశ్రమను తొలగిస్తూ ఉన్నది. ఈ రీతిగా ఈ అతిథిసేవయే తనజీవనానికి ధన్యత కలిగించేటట్లు భావించేదిగా పంపాసరోవరం వారికి గోచరించింది!

**విశేషం:** (1) అతిథిసేవాపరాయణత్వమే ఉత్తమసంస్కృతికి నికషాయమానం. 'అతిథిదేవోభవ'- సనాతన భారతీయసంప్రదాయాన్ని సూచించే ఉపనిషదుక్తి. (2) అలం: సంపూర్ణ రూపకం. పంపాసరోవరానికి ఆతిథేయునకు ఇట అభేదాధ్యవసాయం హృదయంగమంగా వర్ణించబడింది. (3) అలం: శ్లేష. జీవనం అనగా అర్థం బ్రదుకు. అర్థాంతరం నీరు. ఆతిథేయునిపట్ల బ్రదుకు, పంపాసరోవరంపట్ల నీరు అన్వర్థం. (4) ఈ సీసపద్యం ప్రబంధపరమేశ్వరుడైన ఎఱ్ఱనకు గల వర్ణనాభినివేశానికి ఉదాహరణం.

**వ. ఆ సరోవరతీరంబునం గౌసల్యానందనుండు తత్తద్విషయవిశేషోల్లాసంబులవలనం గ్రొత్తయై చిత్తజానలంబు దరికొని చేతోవృత్తంబు నెరియింపం దొడంగినఁ దాల్మి దొఱంగి జానకిం బేర్కొని యాక్రందనవచనవివశుం డగుటయు, నతనికి లక్ష్మణుం డి ట్లనియె. 365**

**ప్రతిపదార్థం:** ఆ, సరోవర, తీరంబునన్= ఆ (పంపా)సరస్సుయొక్క ఒడ్డునందు; కౌసల్యానందనుండు= కౌసల్యకొడుకు- శ్రీరాముడు; తత్+తత్+విషయ, విశేష+ఉల్లాసంబులవలనన్= ఆయా ఇంద్రియార్థములు విశేషమైన వికాసమును పొందినవగుట

వలన; క్రొత్త+ఐ= వినూతన మైనట్టిదై; చిత్తజ+అనలంబు= మన్మథుడికి సంబంధించిన అగ్ని- కామోద్రేకం; దరికొని= సంక్రమించి; చేతస్+వృత్తంబున్= మానసికవ్యాపారాన్ని; ఎరియింపన్+తొడంగినన్= కలత చెందింప సాగగా; తాల్మి= ఓర్పు; తొఱంగి= వీడి; జానకిన్+పేర్కొని= సీతను స్మరించి బిగ్గరగా పలవించి; ఆక్రందన, వచన, వివశుండు+అగుటయున్= ఏడుస్తూ వశంతప్పినవాడు కాగా; అతనికిన్= రాముడికి; లక్ష్మణుండు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా వచించాడు.

**తాత్పర్యం:** ఆ పంపాసరోవర తీరంలో ఉద్దీపనవిభావా లైన ఆయా మనోహరపరిసరాలను చూచిన శ్రీరాముడు మన్మథభావవివశుడై సీతాదేవిని స్మరిస్తూ బిగ్గరగా ఎలుగెత్తి ఆమెను పేర్కొంటూ ఆక్రోశింపసాగాడు. అంతట లక్ష్మణుడు రాముడితో ఇట్లా పలికాడు.

**ఉ. 'పురుషవరేణ్య! యిట్లు మిముబోఁటులకుం జనునయ్య? యాపదల్**
**బొరసినచోఁ గలంగుట; ప్రభుత్వ మెలర్పఁగఁ దాల్మి యూఁది దు**
**స్తరతరమానసవ్యథలు దల్గుము; సంభృతపౌరుషుండ వై**
**యరయుము దేవి యున్నయెడ యారసి కార్యము దీర్పు నేర్పునన్. 366**

**ప్రతిపదార్థం:** పురుష, వరేణ్య!= పురుషులలో శ్రేష్ఠుడవైనవాడా- శ్రీరామా!; ఆపదల్+పొరసినచోన్= ఇడుములు తారసిల్లినపుడు; కలంగుట= కలతచెందటం; మిము బోఁటులకున్= మీవంటివారికి (మీవంటి మహానుభావులకు); ఇట్లు= ఈ రీతిగా; చనున్+అయ్య= తగునా?; ప్రభుత్వము+ఎలర్పఁగన్= పరిపాలన అతిశయించగా, అనగా నిగ్రహం శోభిల్లేటట్లుగా; తాల్మి+ఊఁది= ఓర్పు వహించి; దుస్తర, తర, మానసవ్యథలు= దాటటానికి మిక్కిలి కష్టమైన మనస్సులోని బాధలు; తల్గుము= (తలుగుము)= వదలిపెట్టుము; సంభృత, పౌరుషుండవు+ఐ= పౌరుషంగలవాడవు అయి; దేవి+ఉన్న+ఎడ= (సీతా)దేవి ఉన్నచోటు; అరయుము= కనుగొనుము; ఆరసి= కనుగొని; నేర్పునన్= సామర్థ్యంతో; కార్యము+తీర్పుము= పనిని నెరవేర్చుము.

**తాత్పర్యం:** పురుషులలో శ్రేష్ఠుడవైన శ్రీరామా! ఇక్కట్టులు దాపురించినపుడు మీవంటి మహానుభావులు కలతచెందరాదు. ఓర్పు వహించి నిగ్రహంతో మనస్సులోని వెతలను పారద్రోలాలి. అదే పౌరుషం అనిపించుకొంటుంది. సీతాదేవి ఉన్నచోటు తెలిసికొనుము. తెలిసికొనినపిమ్మట నేర్పుతో కర్తవ్యం నెరవేర్చుము.

**ఆ. అధిప! శిష్యుఁడను సహాయుండు భృత్యుండ । నైన యేను గల్గ నాత్మ నీకు**
**నేల వగవ?' నని మహీపతిచిత్తంబు । నలఁత డిందుపఱిచె నవరజుండు. 367**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓరాజా, శ్రీరామా!; శిష్యుఁడను= నీవు చెప్పిన చొప్పున నడచుకొంటూ నీకడ జ్ఞానం, శీలం నేర్చుకొనటానికి చేరినవాడిని; సహాయుండన్= నీకు తోడుపడే వాడిని; భృత్యుండన్= సేవకుడను; ఐన= ఐనట్టి; నేను= ఏను; కల్గన్= ఉండగా; నీకున్= నీకు; ఆత్మన్= మనస్సులోపల; వగవన్+ఏల?= విచారించటం ఎందుకు?; అని= అని చెప్పి; మహీపతి చిత్తంబు= రాజుయొక్క అనగా శ్రీరాముడియొక్క మనస్సులోని; అలఁత= వ్యాకులతను; అవరజుండు= తమ్ముడు- లక్ష్మణుడు; డిందుపఱిచెన్= తగ్గించాడు.

**తాత్పర్యం:** ఓరాజా! శ్రీరామా! నేను నీకు శిష్యుడిని, భక్తితో ఆరాధించేవాడిని, తోడుపడేవాడిని, పరిచారకుడను. నేను నీప్రక్కన ఉండగా మనస్సులో నీవు ఎందుకు విచారపడాలి?' అని ఊరడించి తమ్ముడైన లక్ష్మణుడు శ్రీరాముడి మనస్సులోని కలవరాన్ని ఉపశమింపజేశాడు.

**వ. తదనంతరంబ యయ్యిరువురుం బంపాసరోవరంబునం గృతస్నాను లయి దేవపితృతర్పణంబులు సేసి చని ముందట నతిబహుళబలాహకవ్యూహసన్నాహసమున్నతంబు లైన యభంగోత్తుంగ శృంగసముదయంబుల నఖిలగగన క్రోడపీడనంబు సేయుచున్న దాని ఋశ్యమూకశైలంబుఁ జేరి తదుపకంఠప్రదేశంబున విశ్రమించి యున్నంత. 368**

**ప్రతిపదార్థం:** తత్+అనంతరంబు+అ= అటుపిమ్మట; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరును (రామలక్ష్మణులు); పంపాసరోవరంబునన్= పంప అనే సరస్సులో; కృతస్నానులు+అయి= చేయబడిన స్నానం కలవారై (స్నానం చేసినవారై); దేవపితృతర్పణంబులు+చేసి= దేవతలకును, చనిపోయిన తండ్రితాతలు మున్నగువారలు తరించటానికై ఇచ్చే నీళ్లను వదలటం ద్వారా శ్రాద్ధక్రియలు నిర్వహించి; చని= పయనం కొనసాగించి; ముందటన్= ఎదురుగా; అతి, బహుళ బలాహకవ్యూహసన్నాహసమున్నతంబులు+ఐన= తరచైన పెక్కు మేఘాల సముదాయాల చేరికగలవై, మిక్కిలి ఎత్తై ఉన్న; అభంగ+ఉత్తుంగ, శృంగసముదయంబులన్= వంకరటింకరలు లేకుండా నిటారుగా ఉన్న శిఖరాలయొక్క గుంపులచేత; అఖిల, గగన, క్రోడ, పీడనంబు= సమస్తమైన ఆకాశంయొక్క వక్షానికి ఒరిపిడి; చేయుచున్నదానిన్= సలుపుచున్న దానిని; ఋశ్యమూకశైలంబున్+చేరి= ఋశ్యమూకం అనేపేరుగల పర్వతాన్ని చేరి; తత్+ఉపకంఠ; ప్రదేశంబునన్= ఆ(కొండయొక్క) సమీపంలో ఉన్న స్థలంలో - ఆ కొండచరియపై; విశ్రమించి+ఉన్నంతన్= అలపు దీర్చుకొనే సమయంలో.

**తాత్పర్యం:** పిమ్మట, రామలక్ష్మణులు పంపాసరోవరాన్ని చేరి అందులో స్నానంచేసి వేల్పులకు, పితరులకు తర్పణాలు విడిచారు. పిదప ఆ సరోవరానికి ముందుగా ఉన్న ఋశ్యమూకపర్వతాన్ని చూచారు.ఎత్తైన ఆ పర్వతపు శిఖరాలు మిక్కిలి ఎత్తుగా, నిటారుగా ఉండి ఆకాశం యొక్క వక్షఃస్థలాన్ని రాచుకొంటున్నట్లుగా ఉన్నాయి. ఆ శిఖరాల మీద దట్టంగా మేఘాలు ఆవరించి ఉన్నాయి. వారు- ఇరువురు ఆ కొండను చేరి- ఆ కొండ సమీప ప్రదేశంలో అలపు తీర్చుకొనడానికి కూర్చున్నారు.

**సీ. ఆ రాజపుత్త్రుల నారూఢతేజుల। వీరుల నున్నతోదారభుజులఁ**
**గనుఁగొని సుగ్రీవుఁ డనఘుఁ డగ్గిరిశృంగ। మునునుండి తానును దన సచివులుఁ**
**జింతించి వారివృత్తాంతము నెఱుఁగంగ। సంతతోత్సాహు ధీమంతు శౌర్య**
**వంతు నుత్తము హిమవంతునిఁబోని య। త్యంతసుస్థిరు హనుమంతుఁ బనిచె;**

**ఆ. నతఁడు నరిగి నృపతిసుతులతెఱం గెల్ల। నెఱిఁగి వనచరేంద్రు నెఱుఁగఁ జెప్పి**
**యుగ్రతేజుఁ డైన సుగ్రీవుతోఁ జెల్మి। యొనర సంఘటించె మనుజపతికి. 369**

**ప్రతిపదార్థం:** ఆ రాజపుత్త్రులన్= ఆ రాచబిడ్డలను; ఆరూఢతేజులన్= దేదీప్యమాన మైన కాంతికల వారిని; వీరులన్= పరాక్రమవంతులను; ఉన్నత+ఉదార, భుజులన్= ఎత్తైనవి, గొప్పవి అయిన భుజాలు కలవారిని; అనఘుఁడు= పాపం లేనివాడు; సుగ్రీవుఁడు= సుగ్రీవుడు అనే వానరరాజు; ఆ+గిరి, శృంగమునన్+ఉండి= ఆ కొండకొమ్మున నిలిచి ఉండి; తానును= తానున్నూ; తనసచివులున్= తనమంత్రులున్నూ; కనుగొని= చూచి; చింతించి= ఆలోచించి; వారి, వృత్తాంతమున్= వారిసంగతిని; ఎఱుఁగంగన్= తెలియటానికి; సంతత+ఉత్సాహున్= ఎడతెగని ఉత్సాహం కలిగినవాడిని; ధీమంతున్= తెలివి తేటలు కలవాడిని; శౌర్యవంతున్= పరాక్రమం కలవాడిని; ఉత్తమున్= మంచివాడిని; హిమవంతునిన్+పోని= హిమవంతుని వలె; అత్యంత సుస్థిరున్= మిక్కిలి స్థైర్యం కలవాడిని; హనుమంతున్= హనుమంతుడిని; పనిచెన్= నియోగించాడు; అతఁడున్= ఆ హనుమంతుడును; అరిగి= వెళ్లి (రామలక్ష్మణుల దగ్గరికి వెళ్లి); నృపతి, సుతుల, తెఱంగు+ఎల్లన్= రాజపుత్రుల

(రామలక్ష్మణుల) తీరుతెన్నులన్నిటిని; ఎఱిఁగి= తెలిసికొని; వన, చర+ఇంద్రున్= అడవిలో సంచరించే కోతులకు ప్రభువును- సుగ్రీవుడిని; ఎఱుఁగన్+చెప్పి= తెలిసేటట్లుగా వివరించి చెప్పి; మనుజపతికిన్= మానవుల రాజుకు శ్రీరాముడికి; ఉగ్ర తేజుఁడు+ఐన= మిక్కుటమైన వర్చస్సు కలవాడు అయిన; సుగ్రీవుతోన్= సుగ్రీవుడితో; చెల్మి= మైత్రి; ఒనరన్= ఒప్పిదంగా; సంఘటించెన్= ఏర్పరిచాడు.

**తాత్పర్యం:** వానరులప్రభువూ పుణ్యాత్ముడూ అయిన సుగ్రీవుడు ఆ రాజపుత్రులైన శ్రీరాముడిని లక్ష్మణుడిని దేదీప్యమానమైన తేజస్సుతో వెలుగొందుతున్నవారిని ఎత్తైనభుజాలతో మహావీరులుగా కన్పిస్తున్నవారిని ఆ కొండకొమ్మనుండి చూచాడు. అంతట ఆ సుగ్రీవుడు తన మంత్రులతో చర్చించి, ఆ రాజపుత్రులవృత్తాంతం తెలిసికొనటానికై హనుమంతుడిని నియోగించాడు. హనుమంతుడు సుగ్రీవుడి సచివుడు, పురుషకార్యం నిర్వహించటంలో లోకోత్తరకార్యాలను సాధించటంలో స్థిరమైన సంకల్పం కలవాడు, మేధావి, పరాక్రమం కలవాడు. మంచివాడు. చలించనిచిత్తం కలవాడు, స్థైర్యంలో హిమాలయపర్వతంవంటివాడు ఆ హనుమంతుడు- సుగ్రీవుని దూతగా ఆ రాజపుత్రులవద్దకు వెళ్లి, వారి సమాచారం సేకరించి, తేజస్వి అయిన సుగ్రీవుడిని గూర్చి వారికి తెలిపి, సుగ్రీవుడికి శ్రీరాముడికి స్నేహం సంఘటించాడు.

**విశేషం:** (1) అలం: ఉపమ. ధైర్యం గల వీరుడిని చలించని కొండతో పోల్చటం పరిపాటి. హనుమంతుడు హిమవంతుడితో ఇట పోల్చబడ్డాడు. (2) పూర్వకాలంలో రాయబారిగా రాజకార్యాలను తీర్చు సచివుడికి ఉండవలసిన లక్షణాలు ఇట హనుమంతుడి పరంగా పేర్కొనబడ్డాయి.

**వ.** **సుగ్రీవుండును మున్ను సీతాపరిత్యక్తంబై తమ ముందటం బడినం దారు గైకొని సంగ్రహించియున్న భూషణ నిచయంబు రామునకు నివేదించినంజూచి, యతండు సముత్సుకుండై వానికి వానరైశ్వర్యంబు ప్రతిశ్రుతంబు సేసి తదీయశత్రుం డైన వాలిం జంపఁ బ్రతిజ్ఞ సేసెఁ; గపీశ్వరుండును జానకిం దెచ్చుటకు సహాయంబుగా నొడంబడియె; నంతట నందఱుం గూడికొని వాలి నివాసం బైన కిష్కంధానగరంబున కరిగి; రప్పుడు భానుసూనుండును.** **370**

**ప్రతిపదార్థం:** సుగ్రీవుండును= సుగ్రీవుడుసయితం; మున్ను= అంతకుముందు; సీతా, పరిత్యక్తంబు+ఐ= సీతాదేవిచేత విడువబడినదై; తమ ముందటన్+పడినన్= తమ యెదుట పైనుండి క్రిందకు పడగా; తారు= తాము (సుగ్రీవాదివానరులు); కైకొని= స్వీకరించి; సంగ్రహించి+ఉన్న= దాచిఉంచిన; భూషణనిచయంబున్= ఆభరణాల సముదాయాన్ని, రామునకున్= శ్రీరాముడికి; నివేదించినన్= సమర్పించగా; అతండు= అతడు - శ్రీరాముడు; సముత్సుకుండు+ఐ= మిక్కుటమైన ఉద్వేగాన్ని పొందినవాడై; వానికిన్= అతడికి - సుగ్రీవుడికి; వానర+ఐశ్వర్యంబు= కోతులయొక్క ప్రభుత్వం; ప్రతిశ్రుతంబు చేసి= వాగ్దానం కావించి (సంపాదించిపెట్టటానికి అంగీకరించి); తదీయశత్రుండు+ఐన= ఆతడియొక్క (సుగ్రీవుడియొక్క) విరోధి అయిన; వాలిన్= వాలిని; చంపన్= సంహరించటానికై; ప్రతిజ్ఞ+చేసెన్= శపథం గైకొన్నాడు; కపి+ఈశ్వరుండును= కోతులరేడును-సుగ్రీవుడును; జానకిన్= సీతను; తెచ్చుటకున్= తీసికొనిరావటానికి (రావణుడి చెఱనుండి విడిపించి తేవటానికి); సహాయంబు+కాన్= సాయం చేయటానికి; ఒడంబడియెన్= సమ్మతించాడు; అంతట= అటుపిమ్మట; అందఱున్= అందరును (రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, అతని సచివులును); కూడికొని= కలసి; వాలినివాసంబు+ఐన= వాలి నివసించే చోటు అయిన; కిష్కింధానగరంబునకున్= కిష్కింధ అనే పేరు కల పట్టణానికి; అరిగిరి= వెళ్ళారు; అప్పుడు= ఆసమయంలో; భానుసూనుండును= సూర్యుడికొడుకు- సుగ్రీవుడును.

**తాత్పర్యం:** అప్పుడు సుగ్రీవుడు శ్రీరాముడికి సీతాదేవి ఆభరణాలమూటను సమర్పించాడు. సీత అంతకుముందు రావణుడిచేత కొనిపోబడేటప్పుడు తనసొమ్ములను మూట కట్టి వానరులు సంచరిస్తున్న ఋశ్యమూకపర్వతంమీద పడవేసింది గదా! శ్రీరాముడు సీతఆభరణాలను చూచి మిక్కుటమైన ఉద్వేగాన్ని చెంది ఆ మూటను దాచి తన కిచ్చిన సుగ్రీవుడికి ప్రత్యుపకారం చేయటానికి నిశ్చయించి, వానరరాజ్యాన్ని సుగ్రీవుడికి చెందేటట్లుగా చేయటానికి సుగ్రీవుడిశత్రువు అయిన వాలిని సంహరించటానికి శపథం చేశాడు. కోతులరేడు అయిన సుగ్రీవుడు సీతను రావణుడిచెరనుండి విడిపించే కార్యంలో సాయం చేయటానికి సమ్మతించాడు. అంతట వారందరూ కలిసి వాలిరాజధాని పట్టణమైన కిష్కింధకు వెళ్లారు. అప్పుడు రవిసుతుడైన సుగ్రీవుడు.

**విశేషం:** రామాయణగాథలో నవీనవిమర్శకుల దృష్టిని మిక్కుటంగా ఆకర్షించిన సన్నివేశం వాలిసంహారం. శ్రీరాముడి శీలానుశీలనంలో మిక్కిలిప్రాముఖ్యం వహించిన చర్చనీయాంశం కూడ వాలివధయే. శ్రీరాముడు వాలిని సంహరించటంలోని ఔచిత్యమేమిటి? శ్రీరాముడు తననుగురించి రామాయణంలోనే ఇతరులు ఏవిధంగా భావించినప్పటికి తానుమాత్రం దశరథుడిపుత్రుడు అయిన మానవమాత్రుడిగనే భావించుకొంటున్నట్లు వచించాడు. సీతావియోగభారంతో శ్రీరాముడు ఋశ్యమూకాన్ని చేరాడు. అప్పుడు అతడికి సుగ్రీవుడితో మైత్రి ఏర్పడింది. అది యాదృచ్ఛిక సంఘటన. మిత్రుడి శత్రువు తనకుగూడ శత్రువే అని భావించటం ఆదర్శమిత్రధర్మం.

**క. వాలిగృహద్వారంబున । వాలి మదం బెసఁగ నార్చి వారక బాహా**
**స్ఫాలనము సేయుటయు విని । వాలి మహారోషదుర్నివారోద్ధతుఁ డై. 371**

**ప్రతిపదార్థం:** వాలిగృహద్వారంబునన్= వాలియొక్క ఇంటికడపముందర; వాలి= క్రిందికి దిగి; మదంబు+ఎసఁగన్= గర్వం అతిశయించేటట్లుగా; ఆర్చి= పెనుకేక లిడి; వారక= ఉడుగక; బాహా+స్ఫాలనము+చేయుటయు= బుజాలపై చరచటం; విని= ఆలకించి; వాలి= వాలి; మహా, రోష, దుర్నివార+ఉద్ధతుఁడు+ఐ= గొప్పకోపం గలిగి, వారించటానికి వీలులేని గర్వంతో అతిశయించినవాడై.

**తాత్పర్యం:** సుగ్రీవుడు గర్వించినవాడై వాలి ఇంటికడపముందు నిలిచి, తన బాహువులను చేతులతో చరచి, చప్పుడుచేయటం విని, వాలి కోపంచేత, వారించటానికి వీలులేని పరాక్రమంచేత ఉప్పొంగినవాడై.

**వ. సమరసన్నాహం బమర వెలువడంబోయినఁ దదీయవల్లభ యగు తార యతని వారించి యిట్లను; 'నేఁటిచందంబు సూడ సుగ్రీవుండు బలవత్సహాయుండై వచ్చినవాఁ; డది యెట్లనిన దశరథనందనుం డైన రాముండు రావణుచేత నపహృతదారుం డయి, నిజసహోదరుం డగు లక్ష్మణుండును దానును సుగ్రీవ సహాయత్వం బపేక్షించి యతనికార్యంబు దీర్పంబూనె నని వింటి; నదియునుంగాక మహాబలు లైన మైందద్వివిదులు నతిలోకపౌరుషుం డయిన హనుమయు బ్రసిద్ధబుద్ధి యగు జాంబవంతుండును వానికి మంత్రులై యుండుదురు; గావున నీ విప్పుడు గయ్యంబునకుఁ బోక నా కిష్టంబు గా' దనిన, నవ్వుచు నవ్వనచరవీరుండు. 372**

**ప్రతిపదార్థం:** సమర సన్నాహంబు+అమరన్= యుద్ధానికి ముందుచేసే ప్రయత్నాలు శోభిల్లగా, కవచం మున్నగు ఆహార్యాలను అమర్చుకొని; వెలువడన్+పోయినన్= పో బోగా; తదీయ, వల్లభ+అగు= వాలియొక్క భార్య అయిన; తార= తార అనే ఆమె;

అతనిన్= వాలిని; వారించి= ఆపి; ఇట్లు+అనున్= ఈవిధంగా చెప్పింది; నేఁటి, చందంబు+చూడన్= ఈరోజు (సుగ్రీవుడి) వైఖరి గమనించగా; సుగ్రీవుండు= సుగ్రీవుడు; బలవత్+సహాయుండు+ఐ= సామర్థ్యం గలవారి తోడ్పాటు కలవాడై; వచ్చిన వాఁడు= వచ్చాడు; అది= (ఆ విషయం); ఎట్లు+అనినన్= ఏవిధంగా తెలుసు అని అడిగితే; దశరథనందనుండు= దశరథమహారాజు కొడుకు అయిన; రాముండు= రాముడు; రావణుచేతన్= రావణుడిచేత; అపహృతదారుండు+అయి= అపహరించబడిన భార్య కలవాడై; నిజ, సహోదరుండు+అగు= తనయొక్క తమ్ముడు అయిన లక్ష్మణుండును; తానును= తానును, శ్రీరాముడును; సుగ్రీవసహాయత్వంబు= సుగ్రీవుడియొక్క తోడ్పాటు; అపేక్షించి= కోరి; అతనికార్యంబున్= సుగ్రీవుడియొక్క పనిని; తీర్పన్= నెరవేర్చటానికి; పూనెను+అని= పట్టుపట్టాడు అని; వింటిన్= విన్నాను; అదియునున్+కాక= అంతేకాక; మహాబలులు+ఐన= గొప్పబలం కలవారు అయిన; మైంద ద్వివిదులును= మైందుడు, ద్వివిదుడును; అతిలోకపౌరుషుండు+అయిన= లోకాతీతమైన పరాక్రమం కలవాడు అయిన; హనుమయున్= హనుమంతుడును; ప్రసిద్ధబుద్ధి+అగు= గొప్పమేధావిగా కీర్తి వడసిన; జాంబవంతుండును; వానికిన్= సుగ్రీవుడికి; మంత్రులు+ఐ= సచివులు అయి; ఉండుదురు= ఉంటారు; కావునన్= కాబట్టి; నీవు+ఇప్పుడు= నీవు ఈ సమయంలో; కయ్యంబునకున్= యుద్ధానికి; పోక= వెళ్ళటం; నాకు+ఇష్టంబు+కాదు= నాకు సమ్మతం కాదు; అనినన్= అని (తార) వచించగా; ఆ+వనచర, వీరుండు= ఆ కోతులజాతికి చెందిన శూరుడు (వాలి); నవ్వుచున్= నవ్వుతూ.

**తాత్పర్యం:** వాలియుద్ధానికి పోయేటప్పుడు కావలసినయత్నాలను చేసి బయలుదేరటానికి చూస్తుండగా, అతడిభార్య అయిన తార, అతడిని ఆపి ఈ విధంగా అన్నది. 'సుగ్రీవుడి వైఖరి ఈనాడు వేరేవిధంగా కన్పిస్తున్నది. ఆతడికి వెనుక ఏదో గొప్ప బలం ప్రోత్సాహంగా ఉన్నట్లు తేలుతున్నది. నేను విన్నమాట ఒకటి ఉన్నది. దశరథమహారాజుకొడుకు శ్రీరామచంద్రుడు, అతడి తమ్ముడితో కలిసి వచ్చి సుగ్రీవుడితో స్నేహం చేశాడు. రావణుడు శ్రీరాముడి భార్యను అపహరించాడు, శ్రీరాముడికి సుగ్రీవుడు సాయంచేయటానికీ, సుగ్రీవుడికి శ్రీరాముడు తోడ్పడటానికీ పరస్పరమైత్రితో మెలగటానికీ వారలకు అంగీకారం కుదిరిందట. అంతేకాక, సుగ్రీవుడికి గొప్ప బలశాలులైన మైందుడు, ద్వివిదుడు, లోకోత్తరపరాక్రమశాలి అయిన హనుమంతుడు, మేధావులలో మేటి అయిన జాంబవంతుడును తోడ్పడగలరు. ఇప్పుడు నీవు సుగ్రీవుడితో యుద్ధంచేయటం నాకు సమ్మతం కాదు'. తారమాటలు విని వాలి నవ్వాడు.

**క. ఆ వనిత వచనములు సు । గ్రీవవిషయపక్షపాతకృత్రిమములుగా**
**భావించి యాదరింపక । తా వెడలె ననూనబాహుదర్పం బెసఁగన్. 373**

**ప్రతిపదార్థం:** ఆ, వనిత, వచనములు= ఆ తారయొక్కమాటలు; సుగ్రీవ, విషయ, పక్షపాత, కృత్రిమములుగాన్= సుగ్రీవుడినిగూర్చిన ప్రస్తావనకు సంబంధించి అభిమానం చూపే కల్పితాంశాలుగా; భావించి= తలపోసి; ఆదరింపక= సరకు గొనక; అనూన, బాహుదర్పంబు= గొప్పదైన పరాక్రమగర్వం; ఎసఁగన్= అతిశయించగా; తాన్= తాను (వాలి); వెడలెన్= బయలుదేరాడు.

**తాత్పర్యం:** తార మాటాడినవాక్యాలు, ఆమె సుగ్రీవుడియెడ గల అభిమానం చొప్పున లేనిపోని ఊహలతో కల్పించినవి అని తలపోసి, ఆ వాలి పరాక్రమగర్వంతో ముందుకు సాగాడు.

**వ. ఇట్లు వెడలి కట్టెదుర నున్న సుగ్రీవుం జూచి యి ట్లనియె. 374**

**తాత్పర్యం:** ఈవిధంగా, బయలుదేరి తనకు ఎదురుగా ఉన్న సుగ్రీవుడిని చూచి వాలి ఇట్లా పలికాడు.

## వాలిసుగ్రీవుల యుద్ధము (సం. 3-264-27)

**తే. 'ఓరి దుష్టాత్మ! యే నిట్లు పోరఁ బెక్కు । మాఱు లెగువంగ సిగ్గఱి పాఱుచుండు**
**నట్టి నీ కున్న యునికిన యిట్టలముగ । నిట్టి బీర మెక్కడనుండి పుట్టెఁ జెపుమ!' 375**

**ప్రతిపదార్థం:** ఓరి దుష్ట+ఆత్మ!= ఓరీ నీచుడా!; ఏను= నేను; ఇట్లు= ఈరీతిగా; పోరన్= యుద్ధంలో; పెక్కుమాఱులు= అనేకపర్యాయాలు; ఎగువంగన్= తరిమి తరిమి కొట్టగా; సిగ్గు+అఱి= సిగ్గు నశించి (సిగ్గులేక); పాఱుచుండు+అట్టి= పారిపోతూఉండేటి; నీకున్= నీకు; ఉన్న+ఉనికిన= ఉన్నట్లుండి, ఆకస్మికంగా; ఇట్టలముగన్= అధికంగా; ఇట్టి= ఇటువంటి; బీరము= అహంకారంతో కూడిన ధైర్యం; ఎక్కడనుండి= ఏచోటినుండి; పుట్టెన్= పుట్టింది? చెపుమ!= చెప్పరా!

**తాత్పర్యం:** 'ఓరీ నీచుడా! సుగ్రీవా! నేను ఎన్నోసారులు లోగడ నిన్ను యుద్ధంలో తఱిమి తఱిమి కొట్టానుకదా! నీవు అన్నిసారులు సిగ్గు లేక పారిపోయిన పిరికిపందవు. ఇప్పుడు ఉన్నట్లుండి ఒక్కమారు నన్ను ఈ విధంగా ఎదిరించే ధైర్యం నీకు ఏవిధంగా వచ్చిందిరా? చెప్పుము'.

**వ. అనినఁ బ్రహసితముఖుం డగుచు నబ్బలిముఖుం డి ట్లనియె. 376**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వాలి వచించగా; ప్ర, హసిత, ముఖుండు+అగుచున్= పకపక నవ్విన వదనం కలవాడు ఔతూ; ఆ, బలి, ముఖుండు= ఆ కోతి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని వాలి అధిక్షేపించగా, అతడితో సుగ్రీవుడు పకపకనవ్వుతూ ఈవిధంగా బదులు పలికాడు.

**క. 'ఆలిని రాజ్యముఁ గోల్పడి । యాలంబునఁ దూలపోయి యక్కట బ్రదు కిం**
**కేలా యని తెగువమెయిన్ । వాలి! రణము సేయ నమరి వచ్చితి నీతోన్. 377**

**ప్రతిపదార్థం:** వాలి!= ఓవాలీ!; ఆలిని= భార్యను; రాజ్యమున్= ప్రభుత్వాన్ని; కోల్పడి= పోగొట్టుకొని; ఆలంబునన్= యుద్ధంలో; తూలపోయి= ఓడిపోయి; అక్కట= అయ్యో! (ఎంతటిదురవస్థదాపురించింది); బ్రదుకు= జీవితం; ఇంకన్= ఇకమీద; ఏలా+అని= ఎందుకు అని; తెగువ మెయిన్= సాహసంచొప్పున; నీతోన్= నీతోడ; రణము+చేయన్= యుద్ధం చేయటానికి; అమరి= సిద్ధపడి; వచ్చితిన్= అరుగుదెంచాను.

**తాత్పర్యం:** 'ఓవాలీ! నేను ఎందుకు ఇంతటి ధైర్యంతో ఏగుదెంచానో చెప్పుతాను వినుము. నేను నాభార్యను కోల్పోయాను. నా రాజ్యాన్ని కూడా పోగొట్టుకొన్నాను. అయ్యో! ఇంతటి దురవస్థ నాకు దాపురించింది. ఇక ఈ నిరర్థక మైన జీవితం గడపి నేను బావుకొనేది ఏమున్నది? అందుచేత నాకు ధైర్యం వచ్చింది. నీతో యుద్ధానికి సిద్ధమై వచ్చాను.

**తే. చక్కఁ గమ్మింక ముందటి చంద మొందఁ । గలదె? తొంటి సుగ్రీవుండు గాఁడు నేఁడు;**
**నిన్నుఁ బొరివుచ్చి కాని పోనేర్చు నెట్లు?' ననుచు నుగ్రుఁడై యవ్వీరు నార్చి కవిసె. 378**

**ప్రతిపదార్థం:** చక్కన్+కమ్ము= నీవు సన్నద్ధుడవు కమ్ము; ఇంకన్= ఇక; ముందటిచందము= లోగడరీతి; ఒందన్+కలదు+ఎ= జరుగునా? (వెనుకటిమాదిరిగా ఇక జరుగదు సుమా); తొంటి, సుగ్రీవుండు= పూర్వపు సుగ్రీవుడు; నేఁడు= ఈదినం;

కాఁడు= కాడు; నిన్నున్= నిన్ను (ఓవాలీ నిన్ను); పొరి+పుచ్చికాని= నిన్ను సంహరించి కాని; ఎట్లు= ఏరీతిగా; పోనేర్చున్= పోగలడు? (నిన్నుసంహరించనిదే నేటి సుగ్రీవుడు పోజాలడు); అనుచున్= అని వచిస్తూ; ఉగ్రుఁడు+ఐ= భయంకరుడై; ఆ+వీరుని= ఆవాలిని; ఆర్చి= సింహనాదం చేసి, పెనుకేక పెట్టి; కవిసెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** ఓవాలీ! నీవు ఇంక సవ్యంగా యుద్ధానికి సన్నద్ధుడవు కమ్ము. వెనుకటి చరిత్ర వేరు. అలనాటి సుగ్రీవుడు వేరు. నేటి సుగ్రీవుడు వేరు. నేటి సుగ్రీవుడు నిన్ను యుద్ధంలో సంహరించకుండగా తిరిగిపోజాలడు సుమా' అంటూ భయంకరుడై సుగ్రీవుడు వాలిని ఎదుర్కొన్నాడు.

**వ. ఇవ్విధంబున. 379**

**తాత్పర్యం:** ఈ రీతిగా.

**ఉ. భూవినుతప్రభావులు ప్రభూత బలోద్ధతు లుగ్రవైరితే**
**జోవిజయుల్ నిరంతరయశోజయకాంక్షులు భూరిభూరుహ**
**గ్రావనఖాయుధుల్ బలిముఖప్రవరుల్ గడుఁ బొంగి వాలిసు**
**గ్రీవులు దాఁకి రొండొరు లకృత్రిమరోషకషాయవక్త్రులై. 380**

**ప్రతిపదార్థం:** భూవినుతప్రభావులు= భూమిచేత పొగడబడిన మహిమ కలవారు- అనగా భూలోకంలోని ప్రజలందరిచేత గుర్తించబడిన గొప్పతనం కలవారు; ప్రభూత, బల+ఉద్ధతులు= గొప్పబలం కలిగి ఉండటంచేత మదించినవారు; ఉగ్ర, వైరి, తేజస్+విజయుల్= భయంకరమైన శత్రువులయొక్క వర్చస్సును బాగా జయించ గలవారు; నిరంతర, యశస్+జయ, కాంక్షులు= ఎల్లప్పుడును కీర్తిని, గెలుపును కోరేవారు; భూరి, భూరుహ, గ్రావ, నఖ+ఆయుధుల్= గొప్పచెట్లు, రాళ్ళు, గోళ్ళు ఆయుధాలుగా కలవారు; బలిముఖ, ప్రవరుల్= కోతులలో శ్రేష్ఠులు; వాలి, సుగ్రీవులు= వాలియును, సుగ్రీవుడును; అకృత్రిమ, రోష, కషాయవక్త్రులు+ఐ= సహజమైనకోపంచేత ఎర్రబడిన మొగాలు కలవారై; కడున్= మిక్కిలి; పొంగి= ఉత్సహించి; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; తాకిరి= మార్కొన్నారు.

**తాత్పర్యం:** ఈ రీతిగా, భూలోకంలోని ప్రజలందరిచేత పొగడబడిన గొప్పతనం గలవారు; శత్రువుల తేజస్సును హరించేవారు. ఎల్లప్పుడును కీర్తిని, గెలుపును కోరుకొనేవారు, గొప్ప చెట్లు, రాళ్ళు, గోళ్ళు ఆయుధాలుగా చేసికొని పోరాడేవారు అయిన వాలిసుగ్రీవులు మిక్కుటమైన ఉత్సాహంతో విజృంభించి ఒకరినొకరు తలపడ్డారు.

**మ. తరుసంఘంబులు పూన్చి యొండొరుల నుద్యద్బాహులై వ్రేయ ని**
**ష్ఠురవక్షస్స్థలపాతవేగవిరళస్తోకంబులై పోయె న**
**త్తరుసంఘంబులు; వెండియుం గడఁగి యుద్యల్లీల నయ్యిద్దఱుం**
**బరుషానేకశిలాప్రయోగముల నొంపం జొచ్చి రన్యోన్యమున్. 381**

**ప్రతిపదార్థం:** తరుసంఘంబులు= చెట్లసముదాయాలు; పూన్చి= సంధించి; ఉద్యత్+బాహులు+ఐ= ఎత్తిన చేతులు కలవారలై; (చేతులు పైకెత్తి); ఒండు+ఒరులన్= ఒకరినొకరు; వ్రేయన్= కొట్టగా; ఆ+తరు+సంఘంబులు= ఆ చెట్లసమూహాలు; నిష్ఠుర, వక్షః+స్థల, పాత, వేగ, విరళ, స్తోకంబులు+ఐ= కఠిన మైన రొమ్ములపై పడి వేగంగా తుత్తునియలై నశించినవై; పోయెన్;

వెండియున్= మరల; కడఁగి= పూని; ఆ+ఇద్దఱున్= ఆ వాలిసుగ్రీవులు; ఉద్యత్+లీలన్= ప్రకాశించే రీతిగా; పరుష+అనేక, శిలాప్రయోగములన్= కఠినా లైన పెక్కురాళ్లు విసరుకొనటంచేత; అన్యోన్యమున్= ఒండొరులను; నొంపన్+చొచ్చిరి= బాధించసాగారు.

**తాత్పర్యం:** ఆ వాలిసుగ్రీవులు ఇరువురును మొట్టమొదట చెట్లను పెరికి ఒకరిపై నొకరు విసరి యుద్ధంచేశారు. ఆ చెట్లు వారి కఠినమైన రొమ్ములను తాకి తుత్తునియలై నశించాయి. ఇక, చెట్లు నశించగానే వారు రాళ్ళను గైకొని ఒండొరులతో యుద్ధం చేశారు.

**క. అతులితశిలావితానం । బితరేతరతనునిపాతహేలా సంచూ**
**ర్ణిత మగుటయు, వారలు పటు । గతిఁ గవిసిరి బాహుయుద్ధకౌతుకమతులై. 382**

**ప్రతిపదార్థం:** అతులిత, శిలావితానంబు= సాటిలేని రాళ్లసముదాయం; ఇతర+ఇతర, తను, నిపాత, హేలా, సంచూర్ణితము+ అగుటయున్= ఒండొరుల దేహాలపై విసరటం అనే ఆటలో పొడిపొడి అయిపోవటంచేత; వారలు= వాలిసుగ్రీవులు; బాహు, యుద్ధ, కౌతుకమతులు+ఐ= చేతులతోనే పోరాటం సాగించటంలో వేడుక కలిగిన చిత్తం కలవారు అయి; పటుగతిన్= సామర్థ్యంతో; కవిసిరి= మార్కొన్నారు.

**తాత్పర్యం:** చెట్లు పట్టుకొని పోరాటం సాగించారు. చెట్లు నశించాయి. ఇక, రాళ్ళనే ఆయుధాలుగా స్వీకరించి వాలిసుగ్రీవులు పోరాటం కొనసాగించారు. కాని, ఆ రాళ్ళుకూడా వారి ఇరువురి శరీరాలను తాకి పొడిపొడి అయిపోయాయి. ఇకచెట్లు, రాళ్ళు కానరాక, వారుఇద్దరును చేతులతోడనే ముష్టియుద్ధం చేయటానికి తారసిల్లారు.

**ఉ. ఒండొరుఁ బట్టుచుం దిగుచు చొండొరుఁ బాయుచు వ్రేయుచున్ మహో**
**ద్దండత నొండొరుం దొలఁగఁ దాఁకుచు నీఁగుచు లోఁగుచుం జలం**
**బొండొరు మీఱు చొండొరుల యుద్ధతి సైఁపక వీఁకఁ బోరి రా**
**ఖండలభానుసూను లవిఖండిత చండభుజాప్రచండతన్. 383**

**ప్రతిపదార్థం:** ఆఖండల, భానుసూనులు= దేవేంద్రుడి కొడుకు- వాలియున్నూ, సూర్యుడి కొడుకు- సుగ్రీవుడున్నూ; ఒండు+ఒరున్= ఒకరిని ఒకరు; పట్టుచున్= పరిగ్రహిస్తూ; తిగుచుచున్= లాగుతూ; ఒండు+ఒరున్= ఒకరిని ఒకరు; పాయుచున్= దూరంగా జరుగుతూ (తొలగుతూ); వ్రేయుచున్= కొట్టుతూ; మహా+ఉద్దండతన్= మిక్కిలి భీకరంగా; ఒండు+ఒరున్= ఒకరినొకరు; తొలఁగన్+తాఁకుచున్= దూరంగా పోయేటట్లుగా, మార్కొంటూ; ఈఁగుచున్= తొలగిస్తూ; లోఁగుచు= లొంగుతూ, చలంబు= పట్టుదలతో; ఒండు+ఒరు= ఒకరిని ఒకరు; మీఱుచున్= అతిక్రమిస్తూ; ఒండు+ ఒరుల+ ఉద్ధతిన్= ఒకరియొక్క అతిశయాన్ని ఇంకొకరు; సైఁపక= ఓర్వక; వీఁకన్= ఉత్సాహంతో; అవి, ఖండిత, చండ, భుజా, ప్రచండతన్= పరిపూర్ణమైన పరాక్రమంయొక్క వేడిమితో; పోరిరి= పోరాడారు.

**తాత్పర్యం:** దేవేంద్రుడి కొడుకైన వాలియున్నూ సూర్యుడికొడుకైన సుగ్రీవుడున్నూ పరస్పరం భీకరంగా పోరాటం కొనసాగించారు. ఒకరినొకరు ఒకసారి పట్టుకొనేవారు. ఒకసారి ఒకరికొకరు లాగుకొనేవారు ఒకసారి తొలగిపోయేవారు, మరొకసారి కొట్టుకొనేవారు. ఒకసారి ఒకరినొకరు దూరంగా త్రోసివేసికొనేవారు. ఒకసారి ఒకరికొకరు లొంగిపోయేవారు,

మరొకసారి ప్రక్కకు నెట్టుకొనేవారు. ఈ రీతిగా ఒకరిని ఒకరు మీరుతూ ఉత్సాహంతో పరిపూర్ణపరాక్రమప్రాభవాలు ప్రదర్శిస్తూ ఒకరికొకరు ఏమాత్రం తీసిపోకుండా వాలిసుగ్రీవులు ఘోరయుద్ధం చేశారు.

**శా.** **దేహోత్సాహ మెలర్ప నుద్ధతమదాంధీభూతులై యాహవో**
**త్సాహవ్యగ్రులు విగ్రహంబు మిగులన్ సంరంభశుంభద్గతిన్**
**బాహాబాహిఁ బెనంగ నప్పు డమరెం బ్రౌఢద్విపద్వంద్వహే**
**లాహస్తద్వయగాఢకర్షణరణోల్లాసంబు విస్పష్టమై.** **384**

**ప్రతిపదార్థం:** దేహ+ఉత్సాహము+ఎలర్పన్= శరీరాలలోని పొంగారేశక్తి అతిశయించగా; ఉద్ధత, మద+అంధీభూతులు+ఐ= గర్వంతో కూడిన మదంచేత కన్నులు కానరానివారై; ఆహవ+ఉత్సాహ, వ్యగ్రులు= పోరాటంలో పొంగులువారే శక్తితో తొందరపడే వారై; విగ్రహంబు= శత్రుత్వం; మిగులన్= అతిశయించగా; సంరంభ శుంభద్గతిన్= తొట్రుపాటుతో కూడిన వేగిరపాటుతో; బాహాబాహిన్= చేతులు చేతులతో కలిపి; పెనంగన్= పోరాటం సలుపగా; అప్పుడు= ఆ సమయంలో; ప్రౌఢ; ద్విప, ద్వంద్వ, హేలా, హస్త, ద్వయ, గాఢ, కర్షణ, రణ+ఉల్లాసంబు= ముదిరిన (మదించిన) ఏనుగులజంట వినోదంగా చేసే రెండు తొండాల తీవ్రమైన పెనగులాటవలె ఒప్పుతూఉన్న యుద్ధంలోని సంతోషశోభ; విస్పష్టము+ఐ= బాగా కనిపించేదై; అమరెన్= ఏర్పడింది.

**తాత్పర్యం:** వాలిసుగ్రీవులు ఇరువురు బలమైన దేహాలు కలవారు. వారిశరీరంలోని ఉత్సాహంతో వారు ఇరువురు కన్నుమిన్నుగానక యుద్ధంమీది అభిలాషతో ఏర్పడిన తొందరపాటుతో చేతులు చేతులు కలిపి ఘోరయుద్ధాన్ని చేశారు. వారిరువురి ద్వంద్వయుద్ధం రెండు మదించిన ఏనుగులు తొండం తొండం కలిపి గాఢంగా లాగుతూ పెనగుతూ పట్టువీడక చేసే పోరాటాన్ని స్ఫురింపచేసింది.

**వ.** **మఱియు నన్యోన్యదంతనఖముఖవిఖండితశరీరులై హరివీరులు రుధిరధారలం దడిసి పుష్పితంబు లగు నశోకంబులుం బోలె నొప్పి చలంబులు మెఱయం బెనంగునెడం దుల్యబలరూపవిక్రములై యున్న యయ్యన్నదమ్ముల నిరువుర నేర్పడ లక్షింపనేరక లక్ష్మణాగ్రజుండు విలక్ష్యహృదయుండై వీక్షించుచున్న నాంజనేయుండు రాఘవునకు నభిజ్ఞానార్థంబుగా నొక్కపల్లవదామంబు సుగ్రీవునఱుతం బెట్టఁ దదనంతరంబ రాఘవుం డమోఘబాణంబు దొడిగి వాలియురంబు వగుల నేసినం, బడి యవ్వానరుండు దశరథనందను నిందించుచుఁ బ్రాణవియోగంబు నొందె; నిత్తెఱంగున.** **385**

**ప్రతిపదార్థం:** మఱియున్= వెండియు; హరివీరులు= వానరవీరులు; అన్యోన్య, దంత, నఖ, ముఖ, విఖండిత, శరీరులు+ఐ= ఒకరినొకరు దంతములయొక్క, గోళ్ళయొక్క మొనలచే బాగుగా చీరబడిన దేహాలు కలవారై; రుధిరధారలన్= నెత్తురు జాలులతో; తడిసి= ఆర్ద్రమయి; పుష్పితంబులు+అగు= పూచినట్టి, అశోకంబులున్+పోలెన్= అశోకవృక్షాలవలె; ఒప్పి= శోభిల్లి; చలంబులు= స్పర్ధలు; మెఱయన్= ప్రకాశించగా; పెనంగు+ఎడన్= పోరాడేటప్పుడు; తుల్య, బల, రూప, విక్రములు+ఐ= సమానమైన శక్తి, ఆకార, శౌర్యాలు కలవారు అయి; ఉన్న= ఉన్నటువంటి; ఆ+అన్నదమ్ములన్; ఇరువురన్= ఇద్దరియందు; ఏర్పడన్= భేదం తెలిసేటట్లు; లక్షింపనేరక= గురిపెట్టలేక; లక్ష్మణ+అగ్రజుండు= లక్ష్మణుడిఅన్న (శ్రీరాముడు); విలక్ష్యహృదయుండు+ఐ= చెదరిన గురిగల డెందం కలవాడై; వీక్షించుచున్+ఉన్నన్= చూస్తుండగా; ఆంజనేయుండు=

హనుమంతుడు; రాఘవునకున్= రాముడికి; అభిజ్ఞాన+అర్థంబుగాన్= గుర్తుగా ఉండటంకొొరకై; ఒక్క= ఒక; పల్లవదామంబున్= చిగురుటాకులదండను; సుగ్రీవు+అఱుతన్+పెట్టన్= సుగ్రీవుడి మెడయందు వేయగా; తత్+అనంతరంబు+అ= అటు పిమ్మట వెంటనే; రాఘవుండు= రాముడు; అమోఘబాణంబు= మొక్కవోని అమ్ము; తొడిగి= వింట సంధించి; వాలి+ఉరంబు= వాలియొక్క రొమ్ము; పగులన్+ఏసినన్= బ్రద్దలయ్యేటట్లుగా కొట్టగా; పడి= నేలపైకూలి; ఆ+వానరుండు= ఆ కోతి - వాలి; దశరథనందనున్= దశరథుడి కుమారుడైన శ్రీరాముడిని; నిందించుచున్= అధిక్షేపిస్తూ; ప్రాణవియోగంబున్+ఒందెన్= అసువులు వీడాడు, మరణించాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా.

**తాత్పర్యం:** వెండియును ఆ కపివీరులు వాలిసుగ్రీవులు ఇరువురున్నూ ఒకరినొకరు పండ్లతో, గోళ్ళతో పీడించుకొంటూ నెత్తుటిజాలులతో తడిసి పూచిన అశోకవృక్షాలవలె శోభిల్లారు. ఆ విధంగా వారు స్పర్ధతో పోరాడుతుండగా, ఆ అన్నదమ్ములు సమానరూపాలతో, సమానపరాక్రమంతో ఉండటంచేత వారిద్దరిలో ఎవరెవరో భేదం తెలియటానికి వీలులేకపోయింది. అందుచేత శ్రీరాముడు బాణాన్ని గురిపెట్టి సంధించలేక, వారిరువురిపోరాటాన్ని తిలకిస్తూ ఉండిపోయాడు. రాముడి అవస్థ గుర్తించి ఆంజనేయుడు వడిగా ఒకచిగురుటాకులదండను సుగ్రీవుడికంఠంలో వేశాడు. వెనువెంటనే శ్రీరాముడు గురిపెట్టి అమోఘబాణాన్ని వింటినుండి విడిచాడు. ఆ బాణం వాలిరొమ్మును భేదించింది. వాలి నేలపై వ్రాలి, దశరథమహారాజుపుత్రు డైన శ్రీరాముడు అట్టి అకృత్యం చేయటం పాడిగాదని నిందిస్తూ అసువులు వదిలాడు. ఈ విధంగా.

**విశేషం:** అలం: ఉపమ. రుధిరధారలతో నొప్పారిన వాలిసుగ్రీవులు పూచిన అశోకవృక్షాలవలె శోభిల్లారు.

**ఆ. వాలిఁ జంపి యతనివనిత సుగ్రీవుని । వశము సేసి నిఖిలవనచరేంద్ర**
**పదవియందు నెమ్మిఁ బట్టంబుఁ గట్టె వి । స్ఫారయశుఁడు రామభద్రుఁ డెలమి. 386**

**ప్రతిపదార్థం:** వాలిన్= వాలిని; చంపి= సంహరించి; రామభద్రుఁడు= శ్రీరాముడు; వి, స్ఫార, యశుఁడు= బాగా విస్తరించిన కీర్తి కలవాడు; ఎలమిన్= సంతోషంతో; అతనివనితన్= వాలిభార్యను; సుగ్రీవునివశము+చేసి= సుగ్రీవుడి అధీనంకావించి; నిఖిల, వనచర+ఇంద్ర, పదవి+అందున్= సమస్తమైన కోతులకు రేడు అయిన పదవిలో; నెమ్మిన్= ప్రీతితో; పట్టంబున్+కట్టెన్= పట్టాభిషేకం చేశాడు.

**తాత్పర్యం:** శ్రీరాముడు వాలిని సంహరించి, సమస్త మైన కోతులకు రాజుగా సుగ్రీవుడికి పట్టాభిషేకం చేశాడు. ఆ విధంగా శ్రీరాముడు గొప్పకీర్తిని ఆర్జించాడు. మఱియును వాలిభార్యయైన తారను శ్రీరాముడు సుగ్రీవుడి వశం చేశాడు.

**విశేషం:** తార వాలిభార్య । ఒక యుద్ధంలో వాలి చచ్చిపోయాడని తలంచటంచేత సుగ్రీవుడు కిష్కింధకు రాజయినాడు. అప్పుడు తార సుగ్రీవుని చేరింది. వాలి సుగ్రీవుని జయించి తన భార్యయైన తారను తీసుకుపోయాడు. రాముడు వాలిని సంహరించిన పిమ్మట తార మరల సుగ్రీవుని చేరింది. రుమ సుగ్రీవుడు వివాహమాడిన భార్య.

**వ. ఆ వనచరుండును రామునకుఁ గృతాంజలియై 'దేవా! యీఘర్మసమయశేషంబును ఘనసమయంబునుం గడపి మఱి సీతాన్వేషణంబునకు నుత్సహించుట లెస్స' యని యయ్యిరువురకును మాల్యవత్కూటంబున నివాసంబు గావించి తానును గిష్కింధాపురంబున నుండె; నంత. 387**

**ప్రతిపదార్థం:** ఆ వనచరుండును= ఆ వానరుడును, (ఆ సుగ్రీవుడును;) రామునకున్= శ్రీరాముడికి; కృత+అంజలి+ఐ= ఘటించిన అంజలికలవాడై, నమస్కరించినవాడు అయి; దేవా!= ప్రభూ!; ఈ ఘర్మసమయశేషంబును= ఈ వేసవికాలంలో మిగిలిన కాలాన్నీ; ఘనసమయంబునున్= వర్షాకాలాన్నీ; కడపి= పుచ్చి; మఱి= పిదప; సీతా+అన్వేషణంబునకున్= సీతను వెదకటానికి; ఉత్సహించుట= పూనటం; లెస్స= మంచిది; అని= అని వచించి; ఆ+ఇరువురకును= ఇద్దరకును, ఆరామలక్ష్మణులకు; మాల్యవత్+కూటంబునన్= మాల్యవంతం అనే కొండకొమ్మున(సమతలాన); నివాసంబు= ఉనికి; కావించి= ఏర్పరచి; తానును= సుగ్రీవుడును; కిష్కింధాపురంబునన్= కిష్కింధ అనే నగరంలో; ఉండెన్= నివసించాడు; అంతన్= అటు పిమ్మట.

**తాత్పర్యం:** ఆ వనచరు డైన సుగ్రీవుడు శ్రీరాముడికి నమస్కరించి ఇట్లన్నాడు - 'దేవా! ఈ మండువేసవికాలం మిగులు ఎంతయో లేదు. ఇక వచ్చేది వానకాలం. అది ప్రయాణానికి అనువైన సమయం కాదు. వర్షాకాలం గడచిన వెనువెంటనే కపులను సీతను వెదకటంకొర్కై పంపటం మంచిది' అని పల్కిన అనంతరం సుగ్రీవుడు రామలక్ష్మణులకు మాల్యవంతం మీద విడిది యేర్పరచి తాను రాజధానిఅయిన కిష్కింధానగరంలో నివసిస్తూ ఉన్నాడు. అంతట.

**మ.** **ఉరుఘర్మౌఘవిఘాతసంవిహితవిశ్వోల్లాసమై సంచల**
**త్సరసాంభోదనినాదతూర్యరవమై చంచద్బలాకాగరు**
**ద్భరలీలానవచామరస్ఫురణమై పర్జన్యసామ్రాజ్యమొ**
**ప్పె రమామందిరమై యుదగ్రశిఖినీపింఛాతపత్రంబులన్.** **388**

**ప్రతిపదార్థం:** పర్జన్యసామ్రాజ్యము= మేఘాలయొక్క విస్తారమైన ఏలుబడి; ఉరు, ఘర్మ+ఓఘ, విఘాత, సంవిహిత, విశ్వ+ఉల్లాసము+ఐ= మిక్కుటమైన చెమటవెల్లువలు లేకుండ చేయుటంచేత జగత్తుకు సంతోషం కలిగించేదై; సంచలత్+సరస+అంభస్+ద, నినాద, తూర్యరవము+ఐ= కదలేవి నీటితో కూడినవి అయిన మేఘాల గర్జనలనే బూరలధ్వనితో కూడినదై; చంచత్+బలాకా, గరుత్+భర, లీలా, నవ, చామర, స్ఫురణము+ఐ= విహరించే బెగ్గురుపక్షుల యొక్క అతిశయించిన రెక్కల విలాసముల వలన క్రొత్త చామరాలనే (చమరీమృగంయొక్క వెంట్రుకలతో చేయబడిన వీవనలను) తలపింప చేసేదై; ఉదగ్ర, శిఖినీపింఛ+ఆతపత్రంబులన్= గొప్పనెమలిపింఛాలనే గొడుగులతో; రమామందిరము+ఐ= లక్ష్మీనిలయమై; ఒప్పెన్= శోభిల్లింది.

**తాత్పర్యం:** మిక్కుటాలైన చెమటవెల్లువలను ఇంకింపచేయటంచేత జగత్తుకు సంతోషం కలిగించేదై, కదలాడే మేఘాలగర్జనలు అనే తూర్యనినాదాలు కలదై, బెగ్గురుపక్షుల రెక్కలు అనే చామరాలు కలదై, నెమలిపింఛా లనే గొడుగులు కలదై, లక్ష్మీనిలయమై పర్జన్యసామ్రాజ్యం శోభిల్లింది.

**విశేషం:** (1) అలం: రూపకం. (2) ఈ పద్యం ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరబిరుదాన్ని సార్థకం చేసే హృదయంగమకల్పన. ఇదివర్షాకాల వర్ణనం. వర్షఋతువులో కానవచ్చేవి కదలియాడే మబ్బులు; మేఘగర్జనలు బెగ్గురుపక్షులరెక్కల అతిశయం, పురివిప్పి ఆడే నెమళ్లు, జగత్తు ఆనందంలో ఓలలాడుతున్నట్లుగా సిరికళలతో శోభిల్లుతాయి. వర్షఋతువు పర్జన్యసామ్రాజ్యంగా వర్ణించబడింది. సామ్రాజ్యలాంఛనాలు విశ్వోల్లాసం, తూర్యరావాలు, ఛత్రచామరాలు- అన్నీ సమకూరాయి.

**వ.** **ఆ సమయంబున నక్కడ.** **389**

**తాత్పర్యం:** అదేకాలంలో లంకలోని అశోకవనంలో.

**క. దానవనాయకు చెఱఁ బడి । జానకి యురిఁ బడిన హరిణశాబమ పోలెన్**
**మానిని సంతత భర్తృ । ధ్యానవివశ యగుచు నుండెఁ దాపం బెసఁగన్. 390**

**ప్రతిపదార్థం:** జానకి= జనకుడి కూతురు (సీత); దానవనాయకుచెఱన్+పడి= రాక్షసనేత అయిన రావణుడిచేత బంధించబడి; ఉరిన్+పడిన= కంఠానికి అడ్డంగా తగుల్కొన్న ముడిలో పడిన (చావునకు ఆ విధంగా సుస్థిరమైన); హరిణశాబము+అ, పోలెన్= లేడిపిల్లవలెనే; మానిని= అభిమానం కల ఆడుది- సీత; సంతత, భర్తృ, ధ్యాన, వివశ+అగుచున్= ఎల్లప్పుడును భర్తను (శ్రీరాముడిని) గూర్చి ఆలోచించటంలోనే ఉండటంచేత వశంతప్పినదై; తాపంబు+ఎసఁగన్= బాధ అధికం కాగా; ఉండెన్= ఉన్నది.

**తాత్పర్యం:** సీతాదేవి రావణాసురుడిచెరలో ఉరిత్రాడుముడిలో చిక్కుకొన్న లేడిపిల్లవలె మిక్కిలి కష్టాలను అనుభవిస్తూ, ఎల్లప్పుడున్నూ తనపతి అయిన శ్రీరాముడిని స్మరించుకొంటూ తెలివితప్పి పడి ఉండింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అమ్మగువ కాపున్న దనుజాంగనలు త్ర్యక్షియు లలాటాక్షియుఁ ద్రిస్తనియు నేకపాదయు దీర్ఘజిహ్వయు నజిహ్వయుఁ ద్రిజటయు నేకలోచనయు మొదలయిన వారు పెక్కండ్రు వికృతాకారంబులతోడ నయ్యబలం బరివేష్టించి యహర్నిశంబును నుఱక యదల్చువారును బెలుచం దిట్టువారును ఖరోష్ట్రనిస్వనంబులు సెలంగ వెఱపించువారును ద్రిభువనాధిపతియైన మన దశగ్రీవునొల్లని యీ దుష్టమానుషిఁబట్టి చెండి కండలు దిందు మనువారునునై యున్న నయ్యుగ్మలి గళద్బాష్పయు గద్గదకంఠియు నగుచు నారాక్షసస్త్రీల కిట్లనియె.391**

**ప్రతిపదార్థం:** ఆ+మగువ= ఆ ఆడుది(సీత); కాపు+ఉన్న= కావలి కాస్తున్న; దనుజ+అంగనలు= రాక్షసస్త్రీలు; త్ర్యక్షియున్= త్ర్యక్షిఅనే ఆమెయు; లలాట+అక్షియున్= లలాటాక్షి అనే ఆమెయు; త్రిస్తనియున్= త్రిస్తని యనే ఆమెయు; ఏకపాదయున్= ఏకపాద అనేదియు; దీర్ఘజిహ్వయున్= దీర్ఘజిహ్వ అనేదియు; అజిహ్వయున్= అజిహ్వఅనేదియు; త్రిజటయున్= త్రిజట అనేదియును; ఏకలోచనయున్= ఏకలోచన అనేదియును; మొదలు+అయినవారు= మున్నగువారు; పెక్కండ్రు= పెక్కుమంది; వికృత+ఆకారంబులతోడన్= వికార మైన రూపాలతో; ఆ+అబలన్= ఆ వనితను - సీతాదేవిని; పరివేష్టించి= చుట్టుముట్టి; అహర్నిశంబును= పగలును రాత్రియును; ఉఱక= నిష్కారణంగా; అదల్చువారును= భయపెట్టేవారును; పెలుచన్= ఎక్కువగా; తిట్టువారును= దూషించేవారును; ఖర+ఉష్ట్ర నిస్వనంబులన్= గాడిదల యొక్కయు, ఒంటెలయొక్కయు, అరుపులు, చెలంగన్=ఒప్పేటట్లుగా, వెఱపించువారును= భయపెట్టేవారును, త్రి, భువన+అధిపతి+ఐన= మూడు లోకాలను ప్రభువు అయిన, మన, దశగ్రీవున్= దశకంఠుడిని,-రావణుడిని; ఒల్లని= అంగీకరించని; ఈ, దుష్ట, మానుషిన్= ఈ చెడుమనుజస్త్రీని, సీతను; పట్టి= పట్టుకొని; చెండి= ఖండించి; కండలు= శరీరంలోనిమాంసపు ముద్దలు, తిందుము= భుజిస్తాం; అనువారునున్, ఐ+ఉన్నన్= అయిఉండగా; ఆ+ఉగ్మలి= ఆ వనిత- ఆ సీత; గళత్+బాష్పయున్= జారునటువంటి కన్నీరు కలిగినట్టిదియును; గద్గద, కంఠియును= డగ్గుత్తిక పడిన గొంతుక కలదియు; అగుచున్= ఔతూ; ఆ, రాక్షసస్త్రీలకున్= ఆ రక్కసి మగువలకు; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** వికృతాలైన రూపాలుకలవారు త్ర్యక్షి, లలాటాక్షి, త్రిస్తని, ఏకపాద, దీర్ఘజిహ్వా, అజిహ్వా, త్రిజట, ఏకలోచన మున్నగువారు, సార్థకనామధేయలు సీతాదేవికి కావలి కాస్తున్నారు. పగలు రేయి ఆమెను అదలిస్తున్నారు. నిష్కారణంగా బాధిస్తున్నారు. పలుసారులు సీతను తిట్టుతూ గాడిదలవలె లొట్టిపిట్టల(ఒంటెల) వలె అరుస్తూ ఆమెను భయపెట్టసాగారు. 'ఈ నీచురాలు ఈ మానవస్త్రీ మూడులోకాలకు ప్రభువైన రావణుడిని కాదన్నది. ఈమె శరీరంలోని మాంసపుముద్దలు ఖండించి భుజిస్తాం' అంటూ ఆమెను బెదిరించసాగారు. సీత డగ్గుత్తిక వడిన గొంతుకతో ఆ రక్కసి వనితలతో ఇట్లా పలికింది.

**విశేషం:** అశోకవనిలో సీతను చుట్టుముట్టి కావలి కాచిన రక్కసి మగువలపేర్లు అనుశీలించదగినవి. వారు వికృతాకారలు - కాబట్టి సార్థకనామధేయలు అని ఎంచవచ్చును; త్ర్యక్షి= మూడు కన్నులు కలది; లలాటాక్షి= నొసటియందు నేత్రం కలది; త్రిస్తని= మూడుగుబ్బలు గలది; ఏకపాద= ఒక కాలు కలది; దీర్ఘజిహ్వా= పొడుగుపాటి నాలుక కలది; అజిహ్వా= నాలుక లేనిది; త్రిజట= మూడు జడలు గలది; ఏకలోచన= ఒకేకన్ను కలది.

**తే.** **'అమ్మలార! మీవలసినయట్ల చేయుఁ । డింక నేటికిఁ దడయంగఁ? నేను రాముఁ**
**దప్ప నొండొకపురుషుఁ జిత్తమునఁ దలఁప । నింత నిజము; నాకును జీవితేచ్ఛ లేదు'.** **392**

**ప్రతిపదార్థం:** అమ్మలార!= ఓతల్లులార! (తల్లితో సమానలైనవారా!); మీవలసిన+అట్లు+చేయుఁడు= మీకు తోచినట్లు చేయండి; ఇంకన్+ఏటికిన్+తడయంగన్?= ఇక ఆలస్యం చేయటం ఎందుకు?; ఏను= నేను; రామున్+తప్పన్= రాముడిని తప్ప; ఒండు+ఒక, పురుషున్= మరొక మగవాడిని; చిత్తమునన్= మనస్సులో; తలఁపన్= స్మరించను; ఇంత= ఇది అంతయు; నిజము= సత్యం; నాకును= నాకు సయితం; జీవిత+ఇచ్ఛ= బ్రదుకు కోరిక; లేదు= లేదు.

**తాత్పర్యం:** 'ఓ తల్లులారా! మీకు నన్ను చంపవలెనని ఉన్నది. నాకుకూడ బ్రదుకవలెననే కోరిక లేదు. మీరు నన్ను మీకు తోచినట్లు చేయండి. నేను శ్రీరాముడిని తప్ప మనసులో వేరొకడిని కోరను'.

**వ.** **అనిన నజ్జానకితెగువ రావణున కెఱింగింపఁ గొందఱు సనిరి; మఱియు సంతతప్రియవాదినియు ధర్మజ్ఞయు నైన త్రిజట యను రక్కసి రామాంగనం జేరంజని యి ట్లనియె.** **393**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; ఆ+జానకి= ఆసీత(యొక్క); తెగువ= సాహసం; రావణునకున్= రావణుడికి; ఎఱింగింపన్= తెలియచెప్పటానికి; కొందఱు= కొంతమంది (రాక్షస స్త్రీలు); చనిరి= వెళ్ళారు; మఱియున్= అంతేకాక; సంతతప్రియవాదినియున్= ఎల్లప్పుడును ప్రీతి కొలిపే మాటలు పలికేదిన్నీ; ధర్మజ్ఞయున్= ధర్మం తెలిసినదిన్నీ; ఐన= అయిన; త్రిజట, అను= త్రిజట అనే పేరు కల; రక్కసి= రాక్షసి; రామ+అంగనన్+చేరన్+చని= రాముడిభార్య అయిన సీత వద్దకు వెళ్ళి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** సీతాదేవి చావుకు తెగించిన సంగతి రావణుడికి తెలియచెప్పటానికి కొందరు రాక్షస స్త్రీలు అతడివద్దకు వెళ్ళారు. అంతట, ఎల్లప్పుడు మృదువైన మంచిమాటలు మాటాడే త్రిజట అనేరాక్షస స్త్రీ, శ్రీరాముడిభార్య అయిన సీతను సమీపించి ఇట్లా పలికింది.

త్రిజట తన స్వప్నవృత్తాంతము సీతతోఁ జెప్పుట (సం. 3-264-53)

**సీ. 'అమ్మ! నీ కెంతయు హర్షంబుగా నొక । వార్త నే నెఱిఁగింతు వనజవదన!**
**నామాట నిజముగా నమ్ముము వినవె! య । విన్ధ్యుఁడు నా నొక్కవృద్ధదైత్యుఁ**
**డనఘుండు రామహితాన్వేషి యై నీకు । నాశ్వాస మొనరింప నబల! నన్ను**
**బనిచెను; విను, నిన్నుఁ బాసిన పిదప ల । క్ష్మణుఁడును దాను సేమమునఁ గలసి**

**ఆ. యఖిలవానరేంద్రుఁ డైన సుగ్రీవుతోఁ । జెలిమి సేసి, యిపుడు శీఘ్రమునన**
**వీరవరుఁడు నిన్ను విడిపించు పనికినై । యొదవి యుత్సహించి యున్నవాఁడు. 394**

**ప్రతిపదార్థం:** అమ్మ!= తల్లీ! (తల్లివంటిదానా); వనజ వదన!= పద్మంవంటి మొగం కలదానా, ఓ సీతాదేవీ!; నీకున్+ఎంతయున్, హర్షంబుగాన్= నీకు మిక్కిలి సంతసం కలిగించేటట్లు; ఒక వార్తన్= ఒక సమాచారాన్ని; ఏన్= నేను; ఎఱిఁగింతున్= తెలుపుతాను; నామాట= నాపలుకు; నిజముగాన్= సత్యం అని; నమ్ముము= విశ్వసించుము; వినవె= ఆలకించుము; అవిన్ధ్యుఁడు; నాన్= అనగా; ఒక్క, వృద్ధ, దైత్యుఁడు= ఒక ముసలి రక్కసుడు; అనఘుండు= పుణ్యాత్ముడు; రామ, హిత+అన్వేషి= శ్రీరాముడి మేలు కోరేవాడు; ఐ= అయి; అబల= ఓవనితా!- సీతా!; నీకున్= నీకు; ఆశ్వాసము+ఒనరింపన్= ఊరట కలిగించటానికై; నన్నున్= నన్ను; పనిచెను= నియోగించాడు; విను= ఆలకించుము; నిన్నున్+పాసిన, పిదపన్= నీ నుండి వేరుపడిన పిదప; లక్ష్మణుఁడును+తాను= లక్ష్మణుడును తానును (శ్రీరాముడును); సేమమునన్+కలసి= క్షేమంగా కూడుకొని; అఖిల, వానర+ఇంద్రుఁడు+ఐన= ఎల్ల కోతులకు రాజు అయిన; సుగ్రీవుతోన్= సుగ్రీవుడితో; చెలిమి+చేసి= స్నేహం ఏర్పరచుకొని; ఇపుడు= ఈ సమయంలో; శీఘ్రమునన్+అ= వేగంగా; వీర, వరుఁడు= శూరులలో శ్రేష్ఠుడు అయినవాడు- శ్రీరాముడు; నిన్నున్= ఓసీతా నిన్ను; విడిపించు పనికిన్+ఐ= రావణునిచెరనుండి విడిపించే కార్యంకొరకు; ఒదవి= పూని; ఉత్సహించి+ఉన్నవాఁడు= ఉద్యుక్తుడై ఉన్నాడు.

**తాత్పర్యం:** 'తల్లివంటిదానా! పద్మంవంటి ముఖం కల సీతాదేవీ! నేను నీకు ఒక శుభవార్త తెలుపుతాను. సావధానంగా వినుము. నాపలుకులు సత్యాలు. నామాట నమ్ముము. అవిన్ధ్యుడు అనే ఒక ముదుసలిరక్కసుడు శ్రీరాముడి మేలుగోరేవాడు నీతో ఈమాటలు చెప్పి నిన్ను ఊరడించుమని నన్ను వేడాడు. అలనాడు నిన్ను ఎడబాసిన పిమ్మట లక్ష్మణుడు శ్రీరాముడు క్షేమంగా కలిసికొన్నారు. పిదప వారు వానరరాజు అయిన సుగ్రీవుడితో స్నేహం చేశారు. ఇపుడు శీఘ్రంగా దండెత్తి ఇచటికి వచ్చి రావణుడిచెరనుండి నిన్ను విడిపించటానికై వస్తున్నారు.

**వ. రావణునకు రంభానిమిత్తం బయిన నలకూబరు శాపంబుగలదు గావున నీయందు బలాత్కారంబు సేయరాదు; నీకు వీనివలని భయంబు వలదు; మఱి యిద్దురాత్మునకుం జేటు దెలుపునట్టి దుస్స్వప్నంబు గలిగె; నది యాకర్ణింపుము. 395**

**ప్రతిపదార్థం:** రావణునకున్; రంభా, నిమిత్తంబు+అయిన= రంభకారణంగా కల; నలకూబరుశాపంబు= నలకూబరుడు ఇచ్చిన శాపం; కలదు= ఉన్నది; కావునన్= కాబట్టి; నీయందున్= నీ విషయంలో; బలాత్కారంబు= బలిమితో పీడించటం, భోగించటం; చేయరాదు= చేయజాలడు; నీకున్= నీకు; వీనివలన= ఇతడి వలన (రావణుడి వలన); భయంబు= భీతి; వలదు= పొందనక్కరలేదు; మఱి= ఇంక; ఈ+దురాత్మునకున్= ఈ చెడ్డ ఆత్మకలవాడికి (రావణుడికి); చేటు= కీడు; తెలుపు+అట్టి= సూచించేటి; దుస్స్వప్నము= చెడుకల; కలిగెన్= ఏర్పడింది; అది= ఆ కలను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** రావణుడు నిన్ను బలిమితో పీడించి సంభోగించనేరడు. దానికి ఒక కారణం ఉన్నది. రంభను బలాత్కరించి భోగించటంచేత నలకూబరుడు రావణుడిని శపించాడు. ఇక నీకు రావణుడి వలని భయం అనవసరం. ఇక ఆ దురాత్ముడైన రావణుడికి కీడు మూడింది. దానిని తెలిపే స్వప్నం నాకు వచ్చింది. ఆ కలను వివరించి చెప్పుతాను; వినుము.

**విశేషం:** 1. నలకూబరుడు కుబేరుడి కొడుకు. రంభ స్వర్గలోకంలో వేశ్య. నలకూబరుడి ప్రేయసి. ఒకసారి రావణుడు రంభను బలాత్కరించి సంభోగించాడు. నలకూబరుడు కోపించి, ఇకమీద రావణుడు ఏ వనితనైనా బలాత్కారంగా సంభోగిస్తే అతడి శిరస్సులు పగిలి చచ్చేటట్లు శాపం పెట్టాడు.

**క.** **ఖరములఁ బూనిన రథమున । విరిసిన వెండ్రుకలు వెంట వ్రేలఁగ దశకం**
**ధరుఁడు బహుళతైలాప్లుత । శరీరుఁడై దక్షిణంబు సనఁ గలఁ గంటిన్.** **396**

**ప్రతిపదార్థం:** దశకంధరుఁడు= పదికంఠాలు కలవాడు - రావణుడు; ఖరములన్+పూనిన, రథమునన్= గాడిదలను పూన్చిన తేరుపై; విరిసిన= చెదరిన; వెండ్రుకలు= రోమాలు; వెంటన్= వెనుకగా; వ్రేలఁగన్= వ్రేలాడగా; బహుళ, తైల+ఆప్లుత, శరీరుఁడు+ఐ= మిక్కుటమైన నూనెతో ముంచబడిన దేహం కలవాడై; దక్షిణంబు+చనన్= దక్షిణపుదిక్కుగా ఏగుతున్నట్లు; కలన్+కంటిన్= స్వప్నాన్ని కన్నాను.

**తాత్పర్యం:** గాడిదలు లాగుతున్న అరదాన్ని ఎక్కి, జారుతున్న వెంట్రుకలతో, నూనెతో తడుపబడిన దేహం కలవాడై పదితలలు కల రావణుడు దక్షిణదిక్కువైపు వెళ్లుతున్నట్లు నాకు స్వప్నంలో కనబడ్డాడు.

**విశేషం:** 1. దక్షిణదిక్కుకు పాలకుడు యముడు. 2. గాడిదలు గుఱ్ఱాలకుబదులు రథాన్ని లాగటం అపశకునం.

**తే.** **అతని చుట్టును గుంభకర్ణాదు లెల్ల । నరుణమాల్యానులేపనులై వికీర్ణ**
**పతితకేశులై నగ్నులై పరఁగఁ బ్రేత । పతిదిశకు నేఁగు గతి గానఁబడియె నాకు.** **397**

**ప్రతిపదార్థం:** అతని చుట్టును= రావణుడికి అన్నివైపులను; కుంభకర్ణ+ఆదులు+ఎల్లన్= కుంభకర్ణుడు మున్నగువారు అందరును; అరుణ, మాల్య+అనులేపనులు+ఐ= ఎఱ్ఱనిపూలదండలతో, ఎఱ్ఱనిమైపూతలతో కూడినవారై; వికీర్ణ, పతిత, కేశులు+ఐ= చెదరి క్రిందికి పడినజుట్టు కలవారయి; నగ్నులు+ఐ= దిగంబరులై; పరఁగన్= ఒప్పగా; ప్రేతపతిదిశకున్= యముడి దిక్కునకు- దక్షిణదిశకు; ఏఁగు, గతిన్= వెడలుతున్న రీతి; నాకున్= నాకు; కానఁబడియెన్= గోచరించింది.

**తాత్పర్యం:** ఆ రావణుడి చుట్టూ, కుంభకర్ణుడు మొదలైన రాక్షసులు అందరును ఎఱ్ఱనిపువ్వులు ఎఱ్ఱనిమైపూతలు కలవారై, విరబోసిన జుట్టుముడులు జారిపోయి, వస్త్రాలు లేకుండ యముడిదిశకు వెడలుతున్నట్లు నాకు కన్పించారు.

**చ.** **చారుసితోష్ణ వారణలసత్సితమాల్యసితాంగరాగుఁడై**
**ధీరగుణోత్తరుం డధికధీనిలయుండు విభీషణుండు వి**
**స్ఫారసితాద్రిశృంగమున భవ్యుఁడు మంత్రిచతుష్టయాన్వితుం**
**డై రమణీయలక్ష్మిఁ బొలుపారఁగ నేఁ గలగంటి నుగ్మలీ!** **398**

**ప్రతిపదార్థం:** ఉగ్మలీ!= ఓకాంతా! సీతాదేవీ! చారు, సిత+ఉష్ణ, వారణ, లసత్+సితమాల్య, సిత+అంగరాగుఁడు+ఐ= మనోజ్ఞమైన, తెల్లని ఛత్రమున్నూ, వెలుగొందే తెల్లనిపూలదండలున్నూ, తెల్లనిమైపూతలున్నూ కలవాడై; ధీర, గుణ+ఉత్తరుండు= చలించని ధైర్యము మున్నగుమంచిగుణాలచేత గొప్పవాడు అయి; అధిక, ధీ, నిలయుండు= మిక్కిలి తెలివితేటలకు నెలవు అయినవాడు; విభీషణుండు= విభీషణుడు (రావణుడి తమ్ముడు); భవ్యుఁడు= సాత్త్వికుడు; విస్ఫార, సిత+అద్రి, శృంగమునన్= ప్రకాశించే తెల్లనికొండకొమ్మునందు; మంత్రి; చతుష్టయ+అన్వితుండు+ఐ= మంత్రులు నలువురితో కూడిఉన్నవాడై; రమణీయలక్ష్మిన్= అందమైనశోభతో; పొలుపారఁగన్= విలసిల్లగా; నేన్= నేను; కల+కంటిన్= కల కన్నాను.

**తాత్పర్యం:** మనోజ్ఞమైన తెల్లని గొడుగును ధరించి, తెల్లనిపువ్వులను ముడిచి, తెల్లని మైపూత వహించి, ధైర్యంఅను మంచిగుణంతో గొప్పవాడై తెలివితేటలకు నెలవు అయిన విభీషణుడు తెల్లనికొండకొమ్మున తననలుగురు మంత్రులతోపాటు మిక్కుటమైనశోభతో విలసిల్లుతూండటం నేను స్వప్నంలో చూచాను.

**విశేషం:** తెలుపురంగు స్వచ్ఛతకు గుర్తు. రావణాదులు ఎర్రనిపూలు, ఎర్రనిమైపూతలు వహించటం, ప్రతియోగంగా విభీషణుడు తెలిపువ్వులు తెలుపుమైపూతలు వహించటం గమనించతగింది. పూర్వకాలంలో మరణదండన విధించబడినవారల మెడలో ఎర్రనిపూలదండలు వేయటం కద్దు.

**చ.** **తన సిత కీర్తి విశ్వవసుధా గగనాంతరపూరితంబుగా**
**ఘనభుజుఁ డున్నతద్విరదకంధరసుస్థితుఁడై ముదంబుతో**
**ననుజుఁడు దాను రాఘవకులాగ్రణి సన్మధుసిక్తపాయసం**
**బొనర భుజింపఁ గంటి వికచోత్పలలోచన! నిక్కమింతయున్.** **399**

**ప్రతిపదార్థం:** వికచ+ఉత్పల, లోచన!= వికసించిన కలువలవంటి కన్నులు కలదానా- ఓ సీతాదేవీ!; అనుజుఁడున్= తమ్ముడును; తాను= తాను; రాఘవ, కుల+అగ్రణి= రఘువుయొక్కకులంలో పుట్టినవారిలో శ్రేష్ఠుడు- శ్రీరాముడు; తన, సిత, కీర్తి= తనదైన తెల్లని యశస్సు; విశ్వవసుధా, గగన+అంతర, పూరితంబుగాన్= సమస్త మైన నేలకు, నింగికి కల మధ్యభాగాన్ని అంతటిని నింపుతుండగా; ఘనభుజుఁడు= గొప్పభుజాలు కలవాడు, అధికమైన శౌర్యంకలవాడు; ఉన్నత, ద్విరద, కంధర, సుస్థితుఁడు+ఐ= ఎత్తైన ఏనుగు మెడపై హాయిగా కూర్చున్నవాడై; ముదంబుతోన్= సంతోషంతో; సత్+మధు, సిక్త, పాయసంబు= మంచితేనెతో తడిసిన పరమాన్నం; ఒనరన్= ఒప్పిదంగా; భుజింపన్= తినుచుండటం; కంటిన్= చూచాను; ఇంతయున్= ఈ స్వప్న మంతయూ; నిక్కము= నిజం.

**తాత్పర్యం:** చెంగలువరేకులవంటి కనులు కల ఓ సీతాదేవీ! నాకు శ్రీరాముడు కలలో కన్పించాడు. తన తెల్లనియశస్సు భూమ్యాకాశాల మధ్యభాగాన్ని అంతటిని నింపగా, మహాపరాక్రమశాలి అయిన శ్రీరాముడు ఎత్తైన ఏనుగుమెడపై తమ్ముడు లక్ష్మణుడితో కలిసి కూర్చొని సంతోషంతో తేనెతో కూడిన పాయసాన్ని ఆరగిస్తున్నట్లు కల వచ్చింది. నాకు వచ్చిన కల నిజం (నిజమౌతుంది).

**విశేషం:** కీర్తి తెల్లగా ఉంటుంది. ఇది కవిసమయం.

**క.** **పులిచేత వ్రేటువడి మైఁ । గలయఁగ నెత్తురులు గ్రమ్మఁగా నేడ్చుచు ని**
**మ్ముల నుత్తరాభిముఖి వై । కలుషితగతి నరుగ నిన్నుఁ గనుఁగొంటిఁ గలన్.** **400**

**ప్రతిపదార్థం:** పులిచేతన్= వ్యాఘ్రంచేత; వ్రేటు+పడి= దెబ్బవేయబడి; మైన్+కలయఁగన్= శరీరంలో కలిసేటట్లుగా; నెత్తురులు= రక్తాలు; క్రమ్మఁగాన్= ఆవరించగా; ఏడ్చుచున్= ఆక్రోశిస్తూ; ఇమ్ములన్= యథేచ్ఛగా; ఉత్తర+అభిముఖివి+ఐ= ఉత్తరదిక్కుకు మొగం పెట్టినదానివై; కలుషితగతిన్= తొట్రుపడే నడకతో; అరుగు= వెడలే; నిన్నున్= ఓ సీతాదేవీ నిన్ను; కలన్= స్వప్నంలో; కనుఁగొంటిన్= చూచాను.

**తాత్పర్యం:** పెద్దపులిచేత కొట్టబడి శరీరంనిండా నెత్తురులు జాలువారుతుండగా శోకిస్తూ నీవు యథేచ్ఛగా ఉత్తరదిశవైపుకు తొట్రుపాటుతో కూడిన నడకతో పోవటం నేను నా స్వప్నంలో చూచాను.

**క. నా కల నిక్కల యయ్యెడు । శోకింపకు మమ్మ యింక సుందరి! పుణ్య**
**శ్లోకు జితలోకు నతులవి । వేకుం బ్రియుఁ బొందఁగలుగు వేగమ నీకున్'. 401**

**ప్రతిపదార్థం:** సుందరి!= (అందగత్తె వైన) ఓ సీతాదేవీ!; నా కల= నాకు వచ్చిన స్వప్నం; నిక్కల+అయ్యెడున్= నిజం అయ్యే కల కాగలదు (నిక్కము+కల= నిక్కల); శోకింపకుమమ్మ= దుఃఖించకుము; ఇంకన్= ఇకమీద; పుణ్యశ్లోకున్= పుణ్యం కలిగించే కీర్తికలవాడిని; జితలోకున్= జయించబడిన లోకం కలవాడిని (లోకవిజేతను); అ,తుల, వివేకున్= సాటిలేని విచక్షణాజ్ఞానం కలవాడిని; ప్రియున్= భర్తను; వేగము+అ= శీఘ్రంగా; నీకున్= నీకు; పొందన్+కలుగున్= పొందటానికి వీలు కలుగుతుంది.

**తాత్పర్యం:** అందగత్తె వైన ఓ సీతాదేవీ! నా కల నిజం కా గలదు. తల్లీ! ఇక దుఃఖించకుము. గొప్పయశస్సు నార్జించిన మహానుభావుడు, గొప్పపరాక్రమవంతుడు అయిన నీభర్తను నీవు శీఘ్రంగా పొందగలవు'.

**ఆ. అనినఁ ద్రిజటపలుకు లవి నిక్కములు గాఁగ । వగచి సీత గొంత వనట దక్కి**
**యాసతోడ నుండె; నట దశవదనుండు । సీతఁ దలఁచి వివశచిత్తుఁ డగుచు. 402**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; త్రిజట పలుకులు= త్రిజట చెప్పిన మాటలు; అవి= అవి అన్నియును; నిక్కములు+కాఁగన్= నిజాలుగా; వగచి= భావించి; సీత= జానకి; కొంత= కొంచెం; వనట+తక్కి= విచారం మాని; ఆసతోడన్= ఆశతో; ఉండెన్= ఉండింది; అటన్= అక్కడ; దశవదనుండు= పదిమొగాలు కలవాడు, రావణుడు; సీతన్+తలఁచి= సీతను స్మరించి; వి, వశ, చిత్తుఁడు+అగుచున్= వశం తప్పిన మనస్సు కలవాడు ఔతూ.

**తాత్పర్యం:** త్రిజట చెప్పిన పలుకులు విని, అవి నిజాలు కావచ్చునని ఆశతో సీత కొంత ఊరటచెంది ఉండింది. అట రావణుడు సీతను స్మరించి వశం తప్పిన మనస్సుకలవా డయ్యాడు.

**వ. తాను దేవదానవ గంధర్వాది భూతవర్గంబుల నెల్ల జయించియుం గందర్పదర్పంబు వారింప నోపక యాక్షణంబ దివ్యమాల్యాంబరాభరణ భూషితుండై సంచారశీలం బైన కల్పపాదపంబునుంబోలె నొప్పియుఁ దనయొప్పుఁ బితృవనంబునందలి వటభూరుహంబుసొంపునుంబోలె నతిభీషణం బగుచుండ నశోకవనమధ్యంబు సొత్తెంచి రోహిణీసమీపంబునకు వచ్చు శనైశ్చరుండునుంబోలె జానకిం జేరం జనుదెంచి ప్రణయపూర్వకంబుగా నిట్లనియె. 403**

**ప్రతిపదార్థం:** తాను= తాను (రావణుడు); దేవ, దానవ, గంధర్వ+ఆది, భూత, వర్గంబులన్= వేల్పులు రాక్షసులు గంధర్వులు మున్నగునట్టి చేతనాచేతనజాతులను; ఎల్లన్= అన్నింటిని; జయించియున్= గెలిచియున్నా; కందర్ప, దర్పంబు= మన్మథుడియొక్క విజృంభణం; వారింపన్+ఓపక= అడ్డగింపజాలక; ఆ+క్షణంబు+అ= ఆ నిముసంలోనే; దివ్య, మాల్య+అంబర+ ఆభరణ, భూషితుండు+ఐ= దేవతామహిమగల పూవులు, వస్త్రాలు, భూషణాలచేత అలంకరించబడిన వాడై; సంచార శీలంబు+ఐన= నడచునట్టి స్వభావంగల; కల్ప, పాదపంబునున్+పోలెన్= కల్పవృక్షంవలె; ఒప్పియున్= శోభిల్లికూడ; తన+ఒప్పున్= తనశోభను, పితృవనంబు నందలి= శ్మశానంలోని; వటభూరుహంబు, సొంపునున్+పోలెన్= మర్రిచెట్టుయొక్క సొగసువలె; అతిభీషణంబు= మిక్కిలి భయంకరం; అగుచున్+ఉండన్= ఔతుండగా; అశోకవనమధ్యంబు+చొత్తెంచి= అశోకవనంయొక్క మధ్యభాగాన్ని చేరి; రోహిణీ, సమీపంబునకున్= రోహిణీనక్షత్రం దగ్గరకు; వచ్చు= అరుగుదెంచే; శనైశ్చరుండునున్+పోలెన్= శనిగ్రహం వలె; జానకిన్= సీతను; చేరన్+చనుదెంచి= చేరడానికి వచ్చి; ప్రణయ పూర్వకంబుగాన్= ప్రేమ తొణికిసలాడేటట్లుగా; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** రావణుడు వేల్పులు రాక్షసులు గంధర్వులు మున్నగు భూతజాతులను అన్నింటినీ గెలిచినవాడే అయినను మన్మథుడిని గెలువజాలకపోయాడు. ఇక సీతాదేవియొక్క అనురాగాన్ని చూరగొనటానికై రావణుడు దివ్యపుష్పాలు ముడిచి మంచివస్త్రాలను ఆభరణాలను ధరించి, నడుస్తున్న కల్పవృక్షంవలె అశోకవనానికి వచ్చాడు. కాని, ఆతడు శ్మశానంలో విస్తరించిన మర్రిచెట్టువలెనే భాసించి మిక్కిలి భయంకరంగా కన్పించాడు. రావణుడు అశోకవనంలో ఉన్న సీతాదేవివద్దకు రావటం రోహిణీనక్షత్రం సమీపానికి శనిగ్రహం చేరుతున్నట్లు కన్పించింది. ఆ రీతిగా రావణుడు సీతదరి చేరి అనురాగం తొణికిసలాడేటట్లుగా ఇట్లా పలికాడు.

**విశేషం:** 1. రావణుడు జంగమకల్పవృక్షంవలె చనుదెంచాడు అన్నప్పుడు. అలంకారం ఉత్ప్రేక్ష. కల్పవృక్షము- కదలునట్టిదికాదు. ఒకవేళ కదలితే ఎట్లుంటుందో అట్లా ఉన్నాడని ఊహించుకొనవలెను కాబట్టి ఉత్ప్రేక్ష. 2. కల్పవృక్షం స్వర్గంలో నందనవనంలోని చెట్టు. కోరిన కోరికల నిచ్చే మహిమ కలది. 3. వటవృక్షంవోలె అనుచో అలంకారం ఉపమ. 4. అట్లే శని రోహిణీ నక్షత్రాన్ని చేరినట్లు అనుచో అలంకారం ఉపమ. రోహిణీనక్షత్రాన్ని శనిగ్రహం చేరినప్పుడు లోకంలో పెక్కు అరిష్టాలు సంభవిస్తాయని జ్యోతిష్కులు చెప్తుతారు.

**క. 'ఏల మదిరాక్షి! వలవని । జాలింబడి నవసెదవు లసద్భూషణ లీ**
**లాలంకృతవై ననుఁ గృప । నేలికొనం గదవె వేయు నేటికి నింకన్. 404**

**ప్రతిపదార్థం:** మదిర+అక్షి!= మత్తెక్కించే నేత్రాలు కలదాన- ఓసీతాదేవీ! ఏల= ఎందుకు; వలవని= కూడని; జాలిన్+పడి= దుఃఖంలో పడి; నవసెదవు= వెతచెందుతావు; లసత్+భూషణ+అలంకృతవు+ఐ= ప్రకాశించే ఆభరణాలను సింగారించుకొనినదానివై; ననున్= నన్ను (రావణుడనైన నన్ను); కృపన్= దయతో; ఏలికొనన్+కదవె= పాలించుకొనవే; ఇంకన్= ఇక; వేయున్+ఏటికిన్?= వేలకొలది మాటలు ఎందుకు?

**తాత్పర్యం:** మత్తెక్కించే కన్నులు గల ఓ సీతాదేవీ! నీ కనుచూపులు చాలు. నేను మరులుగొని ఉన్నాను గదా! ఇటు నాపై దయచూపుము. ఎందుకు నీవు ఈరీతిగా కూడనిదుఃఖాన పడి కృశిస్తున్నావు? వెలుగొందే ఆభరణాలు ధరించి నన్ను దయతో ఏలుకొనుము. వేలకొలదిమాటలు మాటాడి నేను అధికప్రసంగం చేయదలచుకోలేదు.

**చ. అనిమిష యక్ష రాక్షస వియచ్చర కిన్నర పన్నగాసురాం**
**గనలఁ గరంబు చిత్తమునఁ గైకొన కే ననురాగలీలమై**
**నిను మది నాదరించు టిది నీదగుభాగ్యము గాదె? యింతయున్**
**వనిత! యెఱుంగ వైతి; గరువంపువిచారము లేల నీయెడన్. 405**

**ప్రతిపదార్థం:** వనిత!= మగువా! ఓసీతాదేవీ!; అనిమిష. యక్ష, రాక్షస, వియత్+చర; కిన్నర, పన్నగ+అసుర+అంగనలన్= వేల్పులకు, యక్షులకు, కిన్నరులకు, పాములకు, అసురులకు చెందిన ఆడువారిని; కరంబు= మిక్కిలిగా; చిత్తమునన్= మనస్సులో; కైకొనక= స్వీకరించక; ఏన్= నేను; అనురాగలీలమైన్= ప్రేమతో నిండిన కేళిచొప్పున; నినున్= నిన్ను; మదిన్= మనస్సులో; ఆదరించుట= ప్రేమించటం; ఇది= ఇట్టి ప్రేమ; నీదు+అగు= నీది అయిన; భాగ్యము+కాదె= అదృష్టమే కదా?; ఇంతయున్= ఇది (అంతయు నీ అదృష్టయోగమే అని); ఎఱుంగవు+ఐతి= తెలిసికొనలేకపోయావు; గరువంపు విచారములు= గర్వంతో కూడిన ఆలోచనలు; ఈ+ఎడన్= ఈపట్టున; ఏల= ఎందుకు?

**తాత్పర్యం:** ఓ సీతాదేవీ! నేను దేవతలను యక్షులను గంధర్వులను కిన్నరులను పన్నగులను అందరను జయించినవాడను కదా! ఆయా జాతులలోని సుందరాంగులు ఎందరు లేరు? వారు అందరు నా అధీనంలో ఉన్నవారే అయినను వారిని ఎవ్వరిని వరించక నేను అనురాగంతో నిన్ను కోరటం నిజంగా నీకు పట్టిన గొప్ప అదృష్టయోగం సుమా! ఆ సంగతి నీవు గుర్తించలేదు. అనవసరమైన దుఃఖంలో మునిగి ఉన్నావు. గర్వంతో కూడిన ఆలోచనలు చేయటం ఈ పట్టున భావ్యం కాదు.

**విశేషం:** 1. కిన్నరులు - అశ్వముఖం నరశరీరంకల దేవజాతివారు. 2. అనిమిషులు - రెప్పపాటు లేనివారు- వేల్పులు. 3. రాక్షసులు, అసురులు దైత్యదానవులు. దితిసంతతి దనుసంతతి అని రక్కసులలో రెండు తెగలు. ఈ పద్యంలో రాక్షస అసుర పదాలు రెండూ వాడబడినవి.

**ఉ. రాముఁ డనంగఁ బేర్మియును రాజ్యముఁ గోల్పడి కానలోన దుః**
**ఖామయ మగ్నుఁ డైన యొకయల్పమనుష్యుఁడు వానిపైఁ గడుం**
**బ్రేముడి సేయుచున్ వగపుపెల్లునఁ జిత్తము దల్లడిల్లఁగా**
**నీ మెయి నుండు నీయునికి యేసుఖ మండ్రు లతాంగి చెప్పుమా! 406**

**ప్రతిపదార్థం:** లతా+అంగి!= తీగవంటి సుకుమార మైన శరీరం కలదానా!; ఓసీతాదేవీ!; రాముఁడు+అనంగన్= రాముడు అనగా; పేర్మియును= గొప్పతనాన్ని; రాజ్యమున్= రాజ్యపరిపాలనమును; కోల్పడి= పోగొట్టుకొని; కానలోనన్= అడవిలో; దుఃఖ+ఆమయ, మగ్నుఁడు+ఐన= ఆవేదన అనే రోగంలో మునిగినవాడు అయిన; ఒక= ఒకానొక; అల్పమనుష్యుఁడు= తక్కువ అయిన మానవుడు; వానిపైన్= అతనిపై, ఆ రాముడిపై; కడున్= మిక్కిలి; ప్రేముడి+చేయుచున్= అనురాగం చూపుతూ; వగపు పెల్లునన్= విచారంయొక్క అతిశయంతో, గొప్పదుఃఖంతో; చిత్తము= మనస్సు; తల్లడిల్లఁగాన్= ఆందోళన చెందగా; ఈ మెయిన్= ఈ రీతిగా; ఉండు= ఉన్నటువంటి; నీ+ఉనికి= నీ బ్రదుకు; ఏసుఖము= ఎట్టి సౌఖ్యంతో కూడింది; అండ్రు= అని చెప్పుతారు; చెప్పుమా= వచించుమా.

**తాత్పర్యం:** తీగవలె సుకుమారమైన శరీరంగల సీతాదేవీ! రాముడు ఎవడు? గొప్పతనమును, రాజ్యాన్ని గోలుపోయి అడవులలో తిరుగాడుతూ దుఃఖం అనే రోగంలో మునిగిన ఒక అల్పమానవుడు. అట్టి రాముడిపై నీవు ప్రేమ వహించి నీ మనస్సును దుఃఖంతో తల్లడిల్లేటట్లు చేస్తున్నావు. ఇది ఎటువంటి సుఖం? ఎవరు దీనిని సుఖమని చెప్పుతారు? నీవే చెప్పుము.

**విశేషం:** ఉ.వి. ఆంధ్రమహాభారత సంశోధిత ముద్రణ ప్రతిలో- "పేర్మియును రాజ్యము" అనే పాఠం ఉన్నది. (పేర్మియుమ- అనే అచ్చుతప్పుతో ఉన్న పాఠాన్ని సరిచేసుకోవాలి). "పేర్మి యువరాజ్యము' - అన్నది పాఠాంతరంగా గుర్తించబడింది. రాముడరణ్యావాసదీక్ష పూనే సమయంలో అతడు త్యాగంచేసింది యౌవరాజ్యాభిషేకమే కాబట్టి 'పేర్మి యువరాజ్యము' అనే పాఠాన్నే ఈ ప్రతిలో గ్రహించటమైనది.

**వ. ఏను సకలలోకేశ్వరుండ; నాకుం గింకరులై పదునాలుగుకోట్లు నిశాచరభటులును, నిరువది యెనిమిదికోట్లు రాక్షసులును, నెనుబదియాఱుకోట్లు యక్షులును వర్తిల్లుదురు; నిఖిలధనాధ్యక్షుండయిన యక్షేశ్వరుండు నాయగ్రజుండు; బ్రహ్మసమానుం డగు విశ్రవసుండు మదీయజనకుండు; గుబేరునకు వినోదపాత్రంబు లైన గంధర్వాప్సరోగణంబులు నన్ను సేవించుఁ; బంచమలోకపాలుం డని నన్నుఁ ద్రిభువనంబులుఁ గీర్తించు; భక్ష్యభోజ్యాది వస్తువులును సురేశ్వరగృహంబునం దెట్లట్లనాగృహంబున నక్షయంబు; లిట్టినావిభవం బింతటికిని మదీయజీవితంబునకు నధీశ్వరివై సుఖంబున భోగింపు' మనిన విని, వైదేహి క్రోధశోకవ్యాకులహృదయ యగుచు వానిదెసం జూడక యొక్కతృణాంకురం బుపలక్షించి యి ట్లనియె.407**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; సకల, లోక+ఈశ్వరుండన్= సమస్తభువనాలకు అధినేతనైన పరిపాలకుడను; నాకున్= నాకు; కింకరులు+ఐ= సేవకులు అయి; పదునాలుగుకోట్లు నిశాచరభటులును= పదునాలుగుకోట్లమంది రాత్రించరులు- రాక్షసులును; ఇరువది+ఎనిమిదికోట్లు రాక్షసులును= ఇరువది ఎనిమిదికోట్లు రక్కసులును; ఎనుబది ఆఱుకోట్లు, యక్షులును= ఎనుబది ఆరుకోట్ల జక్కులును; వర్తిల్లుదురు= పనిచేస్తారు; నిఖిల, ధన+అధ్యక్షుండు+అయిన= సమస్తమైన ధనానికి అధిపతి అయిన; యక్షేశ్వరుండు= (యక్ష+ఈశ్వరుండు=) యక్షులయొక్క ప్రభువు- కుబేరుడు; నా+అగ్రజుండు= నా అన్న; బ్రహ్మసమానుండు+అగు= బ్రహ్మదేవుడితో తుల్యుడు అయిన; విశ్రవసుండు; మదీయ, జనకుండు= నా తండ్రి; కుబేరునకున్; వినోదపాత్రంబులు+ఐన= వేడుకను ఒనగూర్చేవి అయిన; గంధర్వ= గంధర్వుల కన్నెలు; అప్సరోగణంబులు= వేలుపుకన్నెల సముదాయాలు; నన్నున్= నన్ను; సేవించుచున్= కొలుస్తూ; పంచమ లోకపాలుండు+అని= అయిదవ లోకపాలకుడు అని; నన్నున్= నన్ను; త్రి, భువనంబులున్= మూడులోకాలున్నూ; కీర్తించున్= కొనియాడుతాయి; భక్ష్యభోజ్య+ఆది వస్తువులును= తినుబండారాలు మున్నగునవి; సుర+ఈశ్వర, గృహంబునందున్= దేవేంద్రుడి ఇంటిలో; ఎట్లు+అట్లు+అ= ఏయేవిధాలుగా ఉంటాయో అట్లా; నా గృహంబునన్= నా ఇంటిలో; అక్షయంబులు= తరుగనట్టివి; ఇట్టి= ఇటువంటి; నా విభవంబు= నా సంపద; ఇంతటికిని= సర్వస్వానికి; మదీయ, జీవితంబునకున్= నా బ్రదుకుకు; అధి+ఈశ్వరివి+ఐ= ఏలికసానివై; సుఖంబునన్= సౌఖ్యంతో; భోగింపుము= అనుభవించుము; అనినన్= అని (రావణుడు చెప్పగా); విని= ఆలకించి; వైదేహి= విదేహరాజుకూతురు సీతాదేవి; క్రోధ, శోక, వ్యాకుల, హృదయ,+అగుచున్= కోపంచేత, దుఃఖంచేత, కలత చెందిన డెందం కలది ఔతూ; వానిదెసన్= అతడి (రావణుడి) వైపు; చూడక= వీక్షించక; ఒక్క= ఒక; తృణ+అంకురంబు= గడ్డిపరక; ఉపలక్షించి= అన్యాపదేశంగా నిలిపి- అనగా రావణుడికి బదులుగా ఉద్దేశించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** 'నేను ఎవరో నీకు తెలియునా? నేను సకలభువనాలకు సార్వభౌముడిని. నాకు సేవకులుగా పదునాలుగుకోట్లమంది దైత్యులు, ఇరువదియెనిమిదికోట్లమంది దానవులు; ఎనుబదిఆరుకోట్లమంది యక్షులు ఉన్నారు. సమస్తమైన ధనానికి అధిపతి అయిన యక్షులప్రభువు కుబేరుడు నా అన్న. బ్రహ్మతో తుల్యుడు అయిన విశ్రవసుడు నా తండ్రి. కుబేరుడికి వినోదం కల్పించే గంధర్వకన్యలు అప్సరసలు నన్ను కొలుస్తూ ఉంటారు. మూడులోకాలు నన్ను 'పంచమలోకపాలకుడు' అని మన్నిస్తాయి. దేవేంద్రుడి ఇంటిలో ఉన్నట్లే నాగృహంలోనూ తినుబండారాలు పుష్కలంగా ఉంటాయి. ఇవి నా సిరిసంపదలు. ఇట్టి నా ఐశ్వర్యానికే కాక నా జీవితానికి నీవు ఏలికసానివి కమ్ము. సమస్తసౌఖ్యాలు అనుభవించుము' అని రావణుడు చెప్పగా విని సీతాదేవి ఆతడి ముఖం చూడనొల్లక, మిక్కుటమైన కోపంచేత దుఃఖంచేత పీడించబడిన హృదయం కలదై, ఒక పచ్చగడ్డిపరకను రావణుడికి బదులుగా ఉద్దేశించి ఇట్లా పలికింది.

**విశేషం:** 1. భక్ష్యాలు= తినుబండారాలు. ఇవి 5 విధాలు. 1. భక్ష్యం 2. భోజ్యం 3. లేహ్యం 4. చోష్యం 5. పానీయం- ఉపలక్షణం ఇంకొక దానిని ఉద్దేశించి చెప్పింది. ఇచట తృణాంకురము (రావణుడి స్థానంలో) ఉపలక్షించబడింది.

**సీ.** **'అకట! పరాంగన, నబలఁ, బతివ్రతఁ, । బరికింపఁగా మర్త్యభామ నేను,**
**రాక్షసుండవు నీవు; రాగంబు మది నించు । కయు లేని నాదు సంగమమునందుఁ**
**గలిగెడు నట్టి సౌఖ్యం బెంత? యదియును । గాక యాద్యుం డైన కమలగర్భు**
**పౌత్త్రుఁడ వని లోకపాలతుల్యుఁడ వని । హరసఖుం డైన ధనాధినాథు**

**ఆ.** **భ్రాత వని భవత్ప్రభావంబు సెప్పితి; । విట్టి నీవు ధర్మ వెఱిఁగి దురిత**
**వర్తనంబు విడువవలదె? సిగ్గేది యి । ప్పగిదిఁ బ్రల్లదములు వలుకఁ దగునె?'** **408**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; పర+అంగనన్= ఒరుని భార్యను; అబలన్= బలంలేనిదానను (కోమలిని అని భావం); పతివ్రతన్= భర్తయందే అనురక్తి కలిగినదానను; పరికింపఁగాన్= అరయగా; ఏను= నేను; మర్త్యభామను= మనుష్యస్త్రీని; నీవు= ఈవు; రాక్షసుండవు= రక్కసుడవు; మదిన్= చిత్తంలో; రాగంబు= ప్రేమ; ఇంచుకయున్ లేని= ఏమాత్రమున్నూ లేని; నాదు, సంగమము నందున్= నాపొందులో; కలిగెడు+అట్టి= ఏర్పడునట్టి; సౌఖ్యంబు= సుఖం; ఎంత= ఏమాత్రమైనది?; అదియును+కాక= అంతమాత్రమేగాక; ఆద్యుండు+ఐన= మొదటివాడు అయిన (సృష్టికి ఆద్యుడు అయిన); కమలగర్భు, పౌత్త్రుఁడన్= బ్రహ్మదేవుడి మనుమడిని; అని= అంటూ; లోకపాలతుల్యుఁడన్+అని= దిక్పాలకులతో సమానమైనవాడను అని; హరసఖుండు+ఐన= శివుడి మిత్రుడు అయిన; ధన+అధినాథు, భ్రాతన్= కుబేరుడిసోదరుడను; అని= అనుచూ; భవత్+ప్రతాపంబు= నీదైన మహిమ; చెప్పితివి= వచించావు; ఇట్టి నీవు= ఇటువంటి ప్రతాపం కల నీవు; ధర్మువు+ఎఱిఁగి= ధర్మాన్ని తెలిసికొని; దురిత, వర్తనంబు= చెడునడవడి; విడువన్+వలదె= వీడవలెను కదా; సిగ్గేది(సిగ్గు+ఏది)= సిగ్గువీడి; ఈరీతిగా; ప్రల్లదములు= పారుష్యాలు (కఠినమైన మాటలు); పలుకన్= తగునె?= వచించటం భావ్యమా? (భావ్యం కాదుకదా);

**తాత్పర్యం:** 'అయ్యో, రావణా! నాకు ఎంతటి దురవస్థ ఏర్పడింది. నేను ఒరుని భార్యను. కోమలిని, భర్తయందే అనురాగం కలిగి భర్తనే దైవంగా భావిస్తున్నదానను. నీవా రాక్షసుడవు. నీయందు ఏమాత్రం అనురాగం లేని నాపొందు నీకు ఏవిధంగానూ ఎట్టిసుఖం ఈయజాలదు కదా. అదియునుంగాక, నీవు బ్రహ్మదేవుడి మనుమడవు

అని, దిక్పాలకులతో సమానుడను అనీ, పరమశివుడిమిత్రుడు ధనపతి అయిన కుబేరుడిసోదరుడను అని గొప్పలు చెప్పుకొంటున్నావు. మఱి అంతటి గొప్పవాడికి ధర్మం తెలియాలి. చెడునడవడి వదలిపెట్టాలి. అంతే కాని ఈ రీతిగా నోటికి వచ్చినట్లు కండకావరంతో ప్రల్లదాలు ప్రేలవచ్చునా? నీ ప్రవర్తన ఎంతమాత్రం బాగా లేదు'.

**విశేషం:** కమలగర్భుఁడు= బ్రహ్మదేవుడు. విష్ణుమూర్తి నాభికమలంనుండి ఉద్భవించినగాథ సుప్రసిద్ధం.

**వ. అని పలికి జానకి యుత్తరీయసంవృతవదనయై యతికరుణంబుగా నేడ్చిన నద్దురాత్ముండు వెండియుఁ గొన్ని దుర్వచనంబులు పచరించి యనంతరంబ యంతర్ధానంబు నొందె; నప్పాలఁతియు నెప్పటియట్ల రాక్షసీరక్షిత యై యుండె నని మార్కండేయుండు ధర్మరాజునకు నిర్దేశించిన తెఱఁగు వైశంపాయనోక్తం బైన యాఖ్యానంబు విఖ్యాతమాధుర్య మనోహరంబుగా. 409**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; జానకి= సీత; ఉత్తరీయ సంవృత వదన+ఐ= పైవస్త్రంచేత కప్పబడిన మొగం కలది అయి; అతి కరుణంబుగాన్= మిక్కిలి జాలిగా; ఏడ్చినన్= ఆక్రోశించగా; ఆ+దురాత్ముండు= ఆ చెడ్డ ఆత్మ కలవాడు- రావణుడు; వెండియున్= మఱియును; కొన్ని= కొన్ని; దుర్వచనంబులు= చెడు పలుకులు; పచరించి= పలికి; అనంతరంబు+అ= వెనువెంటనే; అంతర్ధానంబున్+ఒందెన్= కనుపించకుండా పోయాడు; ఆ+పాలఁతియున్= ఆ వనితయు- సీతాదేవియు; ఎప్పటి+అట్ల= యథాప్రకారంగా, ఇదివరకు వలెనే; రాక్షసీ రక్షిత+ఐ= రాక్షసస్త్రీలచేత కావలి కాయబడిందై; ఉండెన్= ఉండింది; అని= అని చెప్పి; మార్కండేయుండు; ధర్మరాజునకు; నిర్దేశించిన= తెలియచెప్పిన; తెఱఁగు= తీరు; వైశంపాయన+ఉక్తంబు+ఐన= వైశంపాయనుడిచేత చెప్పబడిన; ఆఖ్యానంబు= పెద్ద కథ; విఖ్యాత, మాధుర్య, మనస్+హరంబుగా= సుప్రసిద్ధమై, తియ్యనిదై, మనస్సును ఆహ్లాదపరిచేదిగా.

**తాత్పర్యం:** అని చెప్పి సీత ఉత్తరీయంతో ముఖం కప్పుకొని మిక్కిలి దీనంగా ఏడువగా, ఆ దుర్మార్గుడైన రావణుడు ఇంకా కొన్ని దుర్భాషలాడి వెళ్లిపోయాడు. సీత ఎప్పటివలెనే రాక్షస స్త్రీ రక్షితయై ఉన్నది అని మార్కండేయ మహర్షి ధర్మరాజుతో చెప్పినట్లు వైశంపాయనుడు విఖ్యాతంగానూ, మధురంగానూ, మనోహరంగానూ చెప్పాడు.

## ఆశ్వాసాంతము

**క. విమలక్షాత్ర గుణోన్నత! విమలాదిత్యాత్మజన్మ! విలసత్కమలా**
**రమణీ కరకమలోజ్జ్వల । విమలాంబుజరేణు రాగ విలసిత వక్షా! 410**

**ప్రతిపదార్థం:** విమల, క్షాత్ర, గుణ+ఉన్నత!= స్వచ్ఛమైన క్షత్రియ లక్షణాలు కలిగి ఉండటంచేత గొప్పవాడా!, నిర్మలమైన పరాక్రమం, మంచి గుణాలు, కలిగిన గొప్పవాడా!, విమలాదిత్య+ఆత్మజన్మ!= విమలాదిత్యుడి కుమారా!; విలసత్, కమలా, రమణీ, కరకమల+ఉత్+జ్వల!= శోభిల్లునట్టి లక్ష్మీదేవియొక్క పద్మాలవంటి చేతులచేత ప్రకాశించేవాడా, లక్ష్మీప్రదమైన హస్తాలు కలవాడా!; విమల+అంబుజ రేణురాగ విలసితవక్షా!= స్వచ్ఛమైన తామరపుప్పొడియొక్క ఎఱుపు చేత శోభిల్లే వక్షం కలవాడా!

**తాత్పర్యం:** స్వచ్ఛమైన పరాక్రమం మంచిగుణాలతో శోభిల్లే శీలం కలవాడా! విమలాదిత్యుడి కుమారుడా! లక్ష్మీదేవియొక్క పద్మాలవంటి చేతులచేత ప్రకాశించేవాడా! స్వచ్ఛమైన తామరపుప్పొడి ఎఱుపుచేత శోభిల్లే వక్షం కలవాడా! ఓ రాజరాజనరేంద్రా! అవధరింపుము! ఈ ఆంధ్ర మహాభారత కృతిని.

**విశేషం:** విలసత్కమలాకర కమలోజ్జ్వలుఁడు - లక్ష్మీపాణిగ్రహణం చేసినవాడు విష్ణువు. అట్లే విమలాంబుజరేణురాగ విలసిత వక్షుఁడు విష్ణుమూర్తి. నావిష్ణుః పృథివీపతిః- రాజు విష్ణ్వంశసంభూతుడు. అందుచేత అర్థాంతర స్ఫూర్తిచేత రాజరాజనరేంద్రుడు విష్ణుదేవుడితో సమానుడు అని కవిహృదయం.

**వనమయూరము.**

> **భూసురకదంబ సురభూరుహ! వికాసో । ద్భాసిత కృపారసవిపాక! సుగుణైకో**
> **ల్లాస! హరహార మృగలాంఛన మృణాళీ । హాసినవకీర్తి విసరాకలితలోకా!** **411**

**ప్రతిపదార్థం:** భూసురకదంబసురభూరుహ!= బ్రాహ్మణుల సమూహాలకు కల్పవృక్షంవంటివాడా!; వికాస+ఉత్+భాసిత, కృపా, రసవిపాక!= వికసించటంచేత ప్రకాశించేటటువంటి - అనగా ఎప్పటికప్పుడు అతిశయించేటటువంటి దయారసంయొక్క పరిపక్వత కలవాడా!; సుగుణ+ఏక+ఉల్లాస! - మంచి గుణాలచేత ముఖ్యంగా సంతోషాన్ని కలిగించే వాడా!; హర,హార, మృగలాంఛన!, మృణాళీ, హాసి, నవకీర్తి విసర+ఆకలితలోకా= శివుడిని, ముత్యాల పేరును చంద్రుని తామరతూటిని పరిహసించే క్రొత్తకీర్తిరాశితో అంతటా నిండిన లోకం గలవాడా.

**తాత్పర్యం:** బ్రాహ్మణసమూహాలు కోరిన కోరికలు కల్పవృక్షంవలె తీర్చేవాడా! పరిపక్వమై ఎల్లప్పుడూ స్రవించే దయారసం కలవాడా! సద్గుణాలచేత ముఖ్యంగా సంతోషం కలిగించేవాడా!; శివుడిని, ముత్యాలపేరును, చంద్రుడిని, తామరతూండ్లను తెల్లదనంలో పరిహసించే స్వచ్ఛమైన కీర్తితో జగత్తును నింపినవాడా!

**విశేషం:** 1. కీర్తి తెల్లగా ఉంటుంది. ఇది కవిసమయం. అట్లే శివుడు, ముత్యాలసరం,చంద్రుడు, తామరతూడు తెలుపురంగులో భాసిస్తాయి. 2. కల్పవక్షం కోరిన కోరికలను తీరుస్తుంది. అది నందనవనవృక్షవిశేషం. కల్పవృక్షాలు అయిదు 1. మందారం 2. పారిజాతం 3. సంతానం 4. కల్పం 5. హరిచందనం 3. ఆశ్వాసాంత పద్యాలు- కృతిపతి అయిన రాజరాజనరేంద్రుడి సంబోధనలు. కాని, ఈ ఆరవ ఆశ్వాసం వ్రాసింది ఎఱ్ఱన మహాకవి అనే అంశం ఏడవ ఆశ్వాసం చివర సుస్పష్టంగా చెప్పబడింది. నాలుగవ ఆశ్వాసం 142వ పద్యంనుండి ఎఱ్ఱన వ్రాసినట్లు అన్ని తాళపత్రగ్రంథాలలోను సుస్పష్టంగా పేర్కొనబడింది. నన్నయ మరణించిన పిదప సుమారు రెండు శతాబ్దులు గడచిన పిమ్మట ఎఱ్ఱన మహాకవి ఆరణ్యపర్వశేషాన్ని నన్నయభట్టు పేరుమీదనే పూరించాడు. 3. ఈ వృత్త పాదంలో వరుసగా భ, జ, స, న, గగ- గణాలుంటాయి, 9వ అక్షరం యతి స్థానం, ప్రాసనియమం ఉన్నది.

**గద్యము.**

> **ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబునందు దుర్యోధను ప్రాయోపవేశంబును, బాతాళగతు లయిన దానవు లతని నాశ్వాసించుటయు, వైష్ణవయాగ ప్రవర్తనంబును, బాండవులు గ్రమ్మఱఁ గామ్యకవనంబున కరుగుటయు, వ్రీహిద్రోణాఖ్యానంబును, ద్రౌపదీహరణంబును; జయద్రథు భంగంబును, రామాయణ కథా ప్రవృత్తియు, నందు రామరావణుల జననంబును, రాఘవవనప్రస్థానంబును, సీతాపహరణంబును, సుగ్రీవమిత్రత్వంబును, వాలివధయును, త్రిజటాస్వప్నకథనంబును, రావణ దుష్టవచనంబులు నన్నది షష్ఠాశ్వాసము.** **412**

**తాత్పర్యం:** ఇది- ఉత్తమకవులందరిచేత కీర్తించబడిన నన్నయభట్టారకుడిచేత రచించబడిన శ్రీమహాభారతంలోని ఆరణ్యపర్వంలోని షష్ఠాశ్వాసం. ఇందులో దుర్యోధనుడి ప్రాయోపవేశం, పాతాళంలోని రాక్షసులు దుర్యోధనుడిని ప్రోత్సహించటం, దుర్యోధనుడు వైష్ణవయాగం చేయటం, పాండవులు మరల కామ్యకవనానికి చేరటం, వ్రీహిద్రోణోపాఖ్యానం, ద్రౌపదిని చెరపట్టటం, జయద్రథుడి పరాభవం, రామాయణకథ, అందులో రామరావణుల జననవృత్తాంతం, శ్రీరాముడు అడవికి పోవటం, సీతను రావణుడు అపహరించటం, శ్రీరాముడు సుగ్రీవుడితో స్నేహం చేయటం, వాలిని శ్రీరాముడుసంహరించటం, త్రిజట తనస్వప్నాన్ని సీతాదేవికి చెప్పటం, రావణుడి పరుష వాక్యాలు- అనే అంశాలు ఉన్నాయి.

**-: ఆరణ్యపర్వంలో ఆరవఆశ్వాసం సమాప్తం :-**



శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము -సప్తమాశ్వాసము

**శ్రీకర సోమాన్వయ ర । త్నాకర హిమధామ! ధార్మికాంచిత వినయో**
**త్సేక! భువనైకవీర మ । హాకావ్యరస ప్రయోజనారూఢమతీ!** **1**

**ప్రతిపదార్థం:** శ్రీకర, సోమ+అన్వయ, రత్న+ఆకర, హిమధామ!= శోభాయమానమైన చంద్రవంశం అనే సముద్రానికి చంద్రుడివంటివాడా!; ధార్మిక+అంచిత, వినయ+ఉత్సేక!= ధర్మపరాయణులచేత పూజింపబడిన వినయాతిశయం కలవాడా!; భువన+ఏకవీర!= లోకంలో ముఖ్యమైన వీరుడా!; మహా, కావ్య, రసప్రయోజన+ఆరూఢ, మతీ!= గొప్ప సాహితీకృతులలోని రసాల ప్రయోజనమునందు ప్రసిద్ధమైన బుద్ధి గలవాడా!; అనగా మహాకావ్యాల ఉపరంజన ఉపదేశతత్త్వాన్ని ఆకళించుకొన్న సహృదయుడా! అని భావం.

**తాత్పర్యం:** శ్రీకరమైన చంద్రవంశం అనే సముద్రానికి చంద్రుడివంటివాడా! ధర్మాన్ని ఆచరించేవారి చేత ఆదరింపబడిన వినయాతిశయం కలవాడా! లోకంలో పేరెన్నిక కన్న మహావీరుడా! మహాకావ్యాలలోని రసాస్వాదనాన్ని, ఉపయోగాన్ని నెమ్మనంలో పొందుపరచుకొన్న మనస్సుగలవాడా! ఓ రాజరాజ నరేంద్రా!

**విశేషం:** (1) రాజరాజనరేంద్రుడు చాళుక్యరాజు. చాళుక్యులు చంద్రవంశజులు. చంద్రోదయానికి సముద్రం ఉప్పొంగుతుంది. అందుచేత రాజరాజనరేంద్రుడి ఉద్భవంచేత చాళుక్యవంశం ఉప్పొంగింది. (2) చాళుక్యవంశం రత్నాకరం. రత్నాలకు ఆకరమైనది సముద్రం. అనగా చాళుక్యవంశంలో రత్నాలవంటి రాజులు ఉద్భవించారని ధ్వని. (3) 'రసము' అనగా కావ్యపఠనంవలన సహృదయుడికి కలిగే ఆనందతన్మయత్వం. ఈ ఆనందం బ్రహ్మానంద సహోదరం, విగళితవేద్యాంతరం, సద్యఃపరనిర్వృతి అని ఆలంకారికులు అభివర్ణించారు. రాజరాజనరేంద్రుడు 'మహాకావ్య రస ప్రయోజనా రూఢమతి'. అనగా కావ్యశిల్పంలోని లోతుపాతులను సహృదయతతో అనుశీలించగల విద్వాంసుడు అని తాత్పర్యం. నన్నయభట్టుమహాకవి పేరుమీద ఈ సంబోధనలు కూర్చింది ఎఱ్ఱనమహాకవి. రాజరాజనరేంద్రుడికి సుమారు రెండువందల సంవత్సరాల పిదప వర్ధిల్లినవాడు. అనగా ఆంధ్రమహాభారత కృతిపతిగా రాజరాజనరేంద్రుడు సాహితీప్రపంచంలో అమరుడుగా మాననీయుడైన సహృదయసమ్రాట్టుగా ఎఱ్ఱనకాలంలోకూడా సుగృహీత నామధేయుడుగా ఉన్నాడన్నమాట.

### రాముఁడు లక్ష్మణుని సుగ్రీవునొద్దకుఁ బంపుట (సం. 3-266-4)

వ. **అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె; నట్లు పరమ తపోనిలయుండయిన మార్కండేయుండు పాండవులతో మఱియు నిట్లనియె; నంతమాల్యవత్కందరమందిరుండైన దశరథాగ్ర నందనుండు నవకందళిత సుందరంబులును జనకనందినీవియోగదుస్సహంబులు నగు ఘనసమయదివసంబుల నెట్టకేనియుం గడపి, నిరతిశయసాంద్రచంద్రాతప స్నపనశీతలసమీర వాహ్యమాన వినిద్రకుముదకేదారసౌరభ్య నిర్భరంబులు నతిదీర్ఘయామంబులు నైన శారదయామినులు సైఁపనోపక యొక్కనాఁడు దమ్మునిం జూచి యి ట్లనియె.** **2**

**ప్రతిపదార్థం:** ఆ+కథకుండు= ఆ కథను చెప్పేవాడు (ఉగ్రశ్రవసుడు అనే సూతుడు); శౌనక+ఆది, మహా, మునులకున్= శౌనకుడు మున్నగు గొప్ప ఋషులకు; చెప్పెన్= చెప్పాడు; అట్లు= ఆ రీతిగా; పరమ, తపస్+నిలయుండు+అయిన= గొప్ప తపస్సుకు నెలవు అయినవాడు అయిన; మార్కండేయుండు= మృకండుని కొడుకు; పాండవులతోన్= పాండునందనులతో; మఱియున్= వెండియు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అంతన్= అటు పిమ్మట; మాల్యవత్+కందర+మందిరుండు+ఐన= మాల్యవంతం అనే పర్వతంయొక్క గుహను ఇల్లుగా చేసికొన్నవాడైన; దశరథ+అగ్ర, నందనుండు= దశరథుడి పెద్దకొడుకు- శ్రీరాముడు; నవ, కందళిత, సుందరంబులును= క్రొంగ్రొత్త మొలకలచేత అందంగా ఉన్నవియున్నూ; జనక, నందినీ, వియోగ, దుస్సహంబులున్= సీతాదేవినుండి కలిగిన యెడబాటుచేత ఓర్వజాలనివియునూ; అగు= అయిన; ఘనసమయ దివసంబులన్= వర్షాకాలపు దినాలను; ఎట్టకేనియున్+కడపి= ఏదోవిధంగా పుచ్చి; నిరతిశయ, సాంద్ర, చంద్ర+ఆతప, స్నపన, శీతల, సమీర వాహ్యమాన, వినిద్ర, కుముద, కేదార, సౌరభ్య, నిర్భరంబులును= మిక్కిలి దట్టమైన నెఱవెన్నెలలో స్నానం చేయించబడటం చేత చల్లనైన గాలులచేత మోయబడుచున్న వైన వికసించిన కలువపాదులనుండి వెలువడే పరిమళాలచేత నిండినవైన అతి దీర్ఘ, యామంబులున్+ఐన= మిక్కుటంగా పొడవైన జాములు కలిగిన; శారద యామినులు= శరత్కాలానికి చెందిన రాత్రులు; సైఁపన్+ఓపక= తాళజాలక; ఒక్కనాఁడు= ఒకరోజు; తమ్మునిన్+చూచి= తమ్ముడిని (లక్ష్మణుడిని) కాంచి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** మహాభారతకథను చెప్పే సూతుడు శ్రోతలైన శౌనకుడు మున్నగు మహర్షులకు చెప్పాడు: ఆవిధంగా మార్కండేయుడు మరలా మరలా ఇట్లా చెప్పాడు: మాల్యవత్ పర్వతగుహలో నివాసం ఏర్పరచుకొన్న శ్రీరాముడు వర్షాకాలాన్ని ఎంతో కష్టంతో ఏదోవిధంగా నెట్టాడు. వర్షఋతువులో రోజులు, జనకతనయ అయిన సీతాదేవి లేకపోవటంచేత భరించరానివే అయినా, క్రొంగ్రొత్త మొలకలు కన్నుల పండువుగా విస్తరిల్లటంచేత ఆ రాముడు ఎట్లో కాలక్షేపం చేయగలిగాడు. కాని, శరత్కాలంలో ఏర్పడిన రాత్రులను తాళలేకపోయాడు. శరదృతువులో రేలప్రొద్దులు ఎక్కువ. నెరవెన్నెలలు కాస్తాయి. ఆ నెరవెన్నెలలో స్నానం చేయించటంచేత చల్లనైన కలువ పుప్పొడితావులు గుబాళించే పిల్లగాలులు విహరిస్తూ ఉంటాయి. అందుచేత రాముడు సీతావిరహబాధను ఓర్వజాలక, తమ్ముడు అయిన లక్ష్మణుడితో ఇట్లా పలికాడు.

**విశేషం:** (1) అలం: అనుప్రాసం. బిందుపూర్వక దకారప్రయోగ పౌనఃపున్యం అనుశీలిందగింది. (2) చంద్రుడు కుముదబాంధవుడు. కలువలు వెన్నెలరేలలో శోభిల్లుతాయి. అందుకు శరదృతువులో కలువల శోభ, పరిమళాలు ఇంకను అధికం. నాయికానాయకులవిరహానికీ శరదృతువులోని నెఱవెన్నెలలకూ తెలుగుకవులు హృదయంగమమైన అవినాభావసంబంధాన్ని నెలకొల్పి అభివర్ణించారు.

**సీ.** **'చూచితే లక్ష్మణ! సుగ్రీవు కొఱగామి । యమ్మెయిఁ దనపగ యడఁచి మనము**
**కపిరాజ్య మిచ్చినఁ గైకొని యింద్రియ । సుఖముల నెంతయుఁ జొక్కి నేఁడు**
**మనదిక్కుదలఁపఁడు; మనతోడఁ బల్కిన । సమయంబుఁ జెల్లింపఁ జనదె తనకు?**
**గడుఁ గృతఘ్నత సేసెఁ గపికులాధముఁడు; నీ । వనఘ! కిష్కింధకు నరుగు మిపుడ;**

**ఆ.** **యద్దురాత్ముఁ గృపణు నాత్మీయ కార్య త । త్పరుని నధికరాగపరవశాత్ముఁ**
**దొడరి వాలి చనిన త్రోవన యనిచి రః । మ్మేల తడయ మనకు నింక నిచట?** 3

**ప్రతిపదార్థం:** లక్ష్మణ!= ఓ లక్ష్మణా!; చూచితి+ఏ= అరసితివికదా; సుగ్రీవు= సుగ్రీవుని; కొఱగామి= పనికిరానితనం; ఆ+మెయిన్= ఆ రీతిగా; తన పగ= తన శత్రుత్వాన్ని; అడఁచి= నశింపజేసి; మనము= మనం (నీవును+నేనును); కపిరాజ్యము= కోతులపై ప్రభుత్వం; ఇచ్చినన్= ఇవ్వగా; కైకొని= తీసికొని; ఇంద్రియ సుఖములన్= విషయ భోగాలతో; ఎంతయున్= మిక్కుటంగా; చొక్కి= పరవశించి; నేఁడు= ఈ ప్రొద్దు; మనదిక్కు+తలఁపఁడు= మనవైపు చూడటం లేదు; మనతోడన్= మనతో; పల్కిన= వచించిన; సమయంబున్= ప్రతిజ్ఞను (ఒడంబడికను); తనకున్= తనకు (సుగ్రీవుడికి); చెల్లింపన్+చనదె= నెరవేర్చవలదా!; కపికుల+అధముండు= కోతుల జాతిలో తక్కువవాడు; కడున్= మిక్కిలి; కృతఘ్నుత+చేసెన్= చేసిన మేలును మరచినవాడు అయినాడు; అనఘ!= పాపం లేనివాడా!; నీవు= ఓ లక్ష్మణా!; ఇపుడు+అ= ఈ క్షణంలోనే; కిష్కింధకున్= (సుగ్రీవుడి రాజధాని అయిన) కిష్కింధకు; అరుగుము= పొమ్ము; ఆ+దురాత్మున్= ఆ చెడ్డ ఆత్మ కలవాడిని; కృపణున్= ఆ కుత్సితుడిని; ఆత్మీయ, కార్య, తత్పరునిన్= తన పనియందు మాత్రమే నిష్ఠ కలవాడిని, స్వార్థపరుడిని; అధికరాగ పరవశ+ఆత్మున్= మిక్కుటమైన కామంతో వశం తప్పిన మనస్సు కలవాడిని; తొడరి= పూని; వాలి చనిన త్రోవన్+అ= వాలి వెళ్లిన మార్గంలోనే; అనిచి, రమ్ము= పంపించి తిరిగి ఇచటకు వచ్చేది; ఇంకన్= ఇకమీద; మనకున్= మనకు; ఇచటన్= ఇక్కడ; తడయన్+ఏల?= ఆలసించటం ఎందుకు?

**తాత్పర్యం:** పుణ్యాత్ముడవైన ఓ లక్ష్మణా! చూచావు కదా ఆ సుగ్రీవు స్వభావం. వీడు ఎందుకూ పనికిరాని వాడుగా కనబడుతున్నాడు. ఈతడి శత్రువును సంహరించి మనం ఈతడిని కపిరాజ్యానికి అధిపతిని చేశాం. ఇతడు భోగలాలసుడై కాలం గడిపేస్తూ మనకు చేసిన వాగ్దానాలను మరిచిపోయాడు. ఇంతటి కృతఘ్నుతయా? నీవు ఇపుడే కిష్కింధకు బయలుదేరిపోయి, కోతిజాతిలో నీచుడైన ఆ సుగ్రీవుడిని అలనాడు వాలిని నేను సంహరించినట్లే సంహరించి తిరిగి రమ్ము. ఇంక ఇక్కడ ఆలస్యం చేయటం మనకు భావ్యం కాదు.

**ఆ.** **నీవు సనకమున్న నెఱితోడ మన కార్య । మునకుఁ దగిన యత్నములు ఘటించి**
**యుండెనేని వాని నొండేమియుం జేయ । వలదు; తోడితె మ్మవార్యశౌర్య!' 4**

**ప్రతిపదార్థం:** అవార్యశౌర్య!= వారించటానికి వీలులేని పరాక్రమం కలవాడా, లక్ష్మణా! నీవు+చనక, మున్ను+అ= నీవు (కిష్కంధకు) వెళ్ళటానికి ముందే; నెఱితోడన్= న్యాయంతో; మన, కార్యమునకున్= మన పనికి; తగిన= ఉచితమైన; యత్నములు= సన్నాహాలు; ఘటించి+ఉండెన్+ఏని= చేసి ఉన్నట్లయితే; వానిన్= (సుగ్రీవుడిని); అతడిని; ఒండు+ఏమియున్= ఇంకేమియును; చేయన్వలదు= చేయవద్దు; తోడితెమ్ము= నీ వెంట పెట్టుకొని తీసికొని రమ్ము.

**తాత్పర్యం:** అప్రతిహతమైన పరాక్రమం గల ఓ లక్ష్మణా! ఒకవేళ నీవు కిష్కింధకు వెళ్ళటానికి ముందే సుగ్రీవుడు మనకు చేసిన వాగ్దానాలమేరకు సీతాన్వేషణకై సన్నాహాలు చేసి ఉంటే అతడిజోలికి పోవద్దు. అతడిని నీ వెంట పెట్టుకొని ఇక్కడకు తీసికొని రమ్ము.'

**చ.** **అనుడుఁ దదాజ్ఞఁ బూని యతఁ డాతతకార్ముకహస్తుఁడై రయం**
**బునఁ జనియెం గపీశ్వరునిప్రోలికి; వాఁడును సంభ్రమంబుతో**
**ననుఁగులుఁ దాను రాజసుతు నర్థి నెదుర్కొని మ్రొక్కి యర్ఘ్యపూ**
**జన మొనరించుడున్, విభునిశాసన మాతఁడు సెప్పె వానికిన్. 5**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని (శ్రీరాముడు) చెప్పగా; తద్+ఆజ్ఞన్+పూని= అతడి అనుశాసనాన్ని వహించి; అతఁడు= లక్ష్మణుడు; ఆతత, కార్ముక, హస్తుఁడు+ఐ= పెనువిల్లు చేతిలో ధరించినవాడై; కపి+ఈశ్వరుని ప్రోలికిన్= కోతులరాజైన

సుగ్రీవుడి నగరానికి; రయంబునన్= వేగంగా; చనియెన్= వెళ్ళాడు; వాఁడును=అతడును= (సుగ్రీవుడును); సంభ్రమంబుతోన్= తత్తరపాటుతో; అనుఁగులున్+తానున్= ఆప్తులున్నూ, తానున్నూ; రాజసుతున్= రాచబిడ్డను (లక్ష్మణుడిని); అర్థిన్= ప్రీతితో; ఎదుర్కొని= స్వాగతం చెప్పి; మ్రొక్కి= నమస్కరించి; అర్ఘ్య, పూజనము= తగిన అర్చన; ఒనరించుడున్= చేయగా; ఆతఁడు= లక్ష్మణుడు; వానికిన్= అతడికి (సుగ్రీవుడికి); విభుని శాసనము= రాజుగారి ఆజ్ఞ (శ్రీరాముడి ఆనతి); చెప్పెన్= వినిపించాడు.

**తాత్పర్యం:** లక్ష్మణుడు శ్రీరాముడిఆజ్ఞమేరకు, అల్లెత్రాటిని అమర్చిన విల్లు చేతబూని వేగంగా కపిరాజధాని కిష్కింధకు వెళ్ళాడు. లక్ష్మణుడు ఎక్కుపెట్టటానికి సిద్ధం చేసిన ధనుస్సును చేతపట్టుకొని వచ్చే వార్తను విని, సుగ్రీవుడు, తొట్రుపాటుతో ఎదురేగి రాజపుత్రుడికి స్వాగతమర్యాదలు చేసి నమస్కరించాడు. లక్ష్మణుడు సార్వభౌముడైన శ్రీరాముడిఆజ్ఞను సుగ్రీవుడికి తెలిపాడు.

**వ. చెప్పిన విని భయకంపితగాత్రుం డగుచుఁ గమలమిత్త్రపుత్త్రుండు సుమిత్త్రాపుత్త్రున కిట్లనియె; 'నయ్యా! యే నేల కృతఘ్నుండ నగుదు? జానకి నన్వేషించుటకునై బలవంతులు బుద్ధిమంతులు నగువానరుల ననేకుల నలుదెసలకుం బనిచితి; వారును సకలవనశైలసాగరనగరగ్రామనదీసహితం బైన భూచక్రంబునం దెల్ల రోసి, యొక్కమాసంబులోనం గ్రమ్మఱివచ్చువారై సమయంబు సేసిపోయి; రింక నైదుదినంబులు గొఱంత; యింతియ; యటమీఁద వైదేహివార్త గొనుచు దేవరం గొలువవచ్చువాఁడనై యున్నవాఁడ' ననినం బ్రీతుండై లక్ష్మణుండు. 6**

**ప్రతిపదార్థం:** చెప్పినన్, విని= (లక్ష్మణుడు) చెప్పగా విని; భయకంపితగాత్రుండు+అగుచున్= భీతిచేత గజగజలాడిన దేహం కలవాడు ఔతూ; కమలమిత్ర పుత్త్రుండు= సూర్యుడి కుమారుడు- సుగ్రీవుడు; సుమిత్త్రా పుత్త్రునకున్= లక్ష్మణుడికి (సుమిత్ర కొడుకుకు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అయ్యా!= ఆర్యా!; ఏను= నేను (సుగ్రీవుడను); ఏల= ఎందుకు; కృతఘ్నుండన్+అగుదున్= చేసిన మేలు మరచినవాడను ఔతాను? జానకిన్= సీతను; అన్వేషించుటకున్+ఐ= వెదకటానికై; బలవంతులు= శక్తి కలవారు; బుద్ధిమంతులు= తెలివితేటలు కలవారు, అగు= అయిన; వానరులన్+అనేకులన్= కోతులను పెక్కుమందిని; నలుదెసలకున్= నాలుగు దిక్కులకు; పనిచితిన్= పంపాను; వారును= వారు (ఆ కోతులును); సకల, వన, శైల, సాగర, నగర, గ్రామ, నదీ సహితంబు+ఐన= సమస్తమైన అడవులతో, కొండలతో, సముద్రాలతో, పట్టణాలతో, పల్లెలతో, ఏరులతో కూడుకొనిన; భూచక్రంబు+అందున్+ఎల్లన్= భూవలయంలో అన్నిచోటులలోను; రోసి= వెదకి; ఒక్క, మాసంబులోనన్= ఒక నెలలోపలనే; క్రమ్మఱి= తిరిగి; వచ్చువారు+ఐ= అరుదెంచేవారై; సమయంబు+చేసి+పోయిరి= ప్రతిజ్ఞ చేసి వెళ్ళారు; ఇంకన్= ఇకమీద; ఐదు దినంబులు= ఐదు రోజులు మాత్రమే; కొఱంత= మిగులు ఉన్నది; ఇంతియ= ఇంత మాత్రమే (గడువు మిగిలి ఉన్నది); అటమీఁదన్= ఆపైన; వైదేహి వార్త= సీత ఉనికిని గూర్చిన సమాచారం; కొనుచున్= గ్రహించుచూ; దేవరన్= అధినాథుడైన రాముడిని; కొలువన్‌వచ్చువాఁడను+ఐ= సేవించటానికి వచ్చేవాడినై; ఉన్నవాఁడన్= ఉన్నాను; అనినన్= అని చెప్పగా; లక్ష్మణుండు= లక్ష్మణుడు; ప్రీతుండు+ఐ= సంతృప్తి చెందినవాడై.

**తాత్పర్యం:** శ్రీరాముడి ఆదేశాన్ని లక్ష్మణుడినోటినుండి విని, భయంతో సుగ్రీవుడు గజగజ వణికాడు. అతడు లక్ష్మణుడితో 'అయ్యా! నేను చేసినమేలు మరచేటంతటి నీచుడను కాను. సీతాదేవిని వెదకటంకొరకై దేహబలం మాత్రమే గాక బుద్ధిబలంకూడ కలిగిన వానరులను ఏరి నాలుగు దిక్కులకు పంపించాను. వారు ఈ భూమండలాన్ని అంతటిని, అడవులు, కొండలు, సముద్రాలు, పట్టణాలు, పల్లెలు, నదులు అన్నింటిని గాలించి ఒకనెలలో తిరిగి

రాగలమని ప్రతిజ్ఞ చేసి వెళ్ళారు. ఇంక ఆగడువు ముగియటానికి అయిదురోజులుమాత్రమే వ్యవధి ఉన్నది. ఇది ఇంతవరకు జరిగిన పని. నేను ప్రమత్తుడను కాను. సీతాదేవిఉనికినిగూర్చిన సమాచారం సేకరించిన పిదపనే దేవరవారి సందర్శనం చేయటం మంచిది అని ఇంతవరకు ఆగి ఉన్నాను' అని పలికాడు. సుగ్రీవుడు చెప్పిన సమాధానానికి లక్ష్మణుడు సంతృప్తి చెందాడు.

**క. వానిం దోడ్కొని చని యా । భూనాథునిఁ గానుపించి పొందుగఁ దత్కా**
**ర్యానుష్ఠానవిశేషము । దా నెఱిఁగించుటయు విభుఁడు దద్దయు నలరెన్. 7**

**ప్రతిపదార్థం:** వానిన్= అతడిని (సుగ్రీవుడిని); తోడ్కొని= వెంటపెట్టుకొని; (లక్ష్మణుడు); చని= వెళ్ళి; ఆ, భూనాథునిన్= ఆ రాజును, (ఆ శ్రీరాముడిని); కానుపించి= సందర్శనం చేయించి; పొందుగన్= తగినట్లుగా; తద్+కార్య+అనుష్ఠాన, విశేషము= అప్పుడు జరిగిన కర్తవ్యం ఏవిధంగా నెరవేర్చబడిందో ఆ విశేషం; తాన్=తాను; ఎఱిఁగించుటయున్= తెలుపగా; విభుఁడు= అధిపతి- శ్రీరాముడు; తద్దయున్= మిక్కుటంగా; అలరెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** లక్ష్మణుడు సుగ్రీవుడిని వెంటబెట్టుకొని వెడలి ఆ రామరాజుకు చూపించి, అప్పుడు కిష్కింధలో కర్తవ్యాలు నెరవేర్చబడినవిధాన్ని సవిస్తరంగా తెలిపాడు. శ్రీరాముడు మిక్కిలి సంతోషించాడు.

**వ. పదంపడి కొన్ని దివసంబులకుఁ బూర్వపశ్చిమోత్తరదిక్కులకుం జనిన వనచరు లరుగుదెంచి రాఘవుం గని 'దేవా! సకలసాగరమేఖలావలయితం బైన భూవలయంబంతయు వెదకితిమి; దేవిం బొడగాన' మని చెప్పిన నతండు దుఃఖితుండయి, దక్షిణదిశకుఁబోయిన వానరులవలన వైదేహితెఱం గెఱుంగుదు నను నాసం జేసి ప్రాణంబులు ధరియించి యుండె; నంత వెండియు నొక్కమాసంబు సెల్లినఁ గొందఱువనచరులు పఱతెంచి సుగ్రీవుం గని యి ట్లనిరి. 8**

**ప్రతిపదార్థం:** పదంపడి= అటు పిమ్మట; కొన్ని దివసంబులకున్= కొన్ని రోజులకు; పూర్వ, పశ్చిమ+ఉత్తర దిక్కులకున్= తూరుపు పడమర ఉత్తర దిశలకు; చనిన= వెళ్ళిన; వనచరులు= కోతులు; అరుదెంచి= వచ్చి; రాఘవున్+కని= శ్రీరాముడిని చూచి; దేవా!= ప్రభూ!; సకల, సాగర, మేఖలా, వలయితంబు+ఐన= సమస్తమైన సముద్రాలు అనే మొలనూలుతో చుట్టుకొనబడిన; భూ, వలయంబు+అంతయున్= భూమి చక్రాన్ని అంతటిని; వెదకితిమి= అన్వేషించాం; దేవిన్= (సీతా)దేవిని; పొడగానము= చూడలేదు; అని చెప్పినన్= అని నివేదించగా; అతండు= అతడు (శ్రీరాముడు); దుఃఖితుండు+అయి= ఆవేదన పొందినవాడయి; దక్షిణదిశకున్= దక్షిణదిశకు; పోయిన= వెళ్ళిన; వానరులవలనన్= కోతులనుండి; వైదేహి, తెఱంగు= సీత ఉన్న తీరుతెన్నులు; ఎఱుంగుదున్= తెలిసికొనగలను; అను= అనే; ఆసన్+చేసి= ఆశతో; ప్రాణంబులు, ధరియించి= అసువులు వహించి; ఉండెన్= జీవించాడు; అంతన్= అటు పిదప; వెండియున్= మరల; ఒక్కమాసంబు+చెల్లినన్= నెలదినాలు గడవగా; కొందఱు, వనచరులు= కొంతమంది కోతులు; పఱతెంచి= అరుగుదెంచి; సుగ్రీవున్+కని= సుగ్రీవుడిని కాంచి; ఇట్లు+అనిరి= ఈ విధంగా వచించారు.

**తాత్పర్యం:** పిదప, కొన్నినాళ్లకు తూరుపు పడమర ఉత్తర దిశలకు వెడలిన కోతులు తిరిగి వచ్చి, శ్రీరాముడిని సందర్శించి ఇట్లు పలికారు: 'దేవా సమస్తమైన సముద్రాలచేత చుట్టబడిన భూమండలాన్ని అంతటిని గాలించాం కాని ఎక్కడా సీతాదేవి మాకు కన్పించలేదు' అని నివేదించగా ఆ మాటలు విని శ్రీరాముడు మిక్కుటంగా దుఃఖించాడు. ఇక దక్షిణ దిక్కుకు ఏగిన కోతులవలన సీతనుగూర్చిన సమాచారం అందగల దనే ఆశతో అతడు

బ్రదికి ఉన్నాడు. అంతట ఒక నెలరోజులు గడచిన పిమ్మట కొంతమంది వానరులు వచ్చి సుగ్రీవుడిని సందర్శించి ఈ విధంగా పలికారు.

**సీ.** **'నీవును వాలియు నేఁడును నాఁడునుఁ । బ్రియమునఁ బాటించు పెద్దతోఁట**
**మధువనం బదె నేఁడు మనయంగదుండును । హనుమంతుఁడును మొదలైనవారు**
**బలువిడిఁ జూఱాడి ఫలము లానెదరు త । ద్రక్షకు లగు మమ్ము రయము మీఱ**
**భంగించి' రనవుడు భానునందనుఁ డాత్మ । 'నంగదప్రముఖులు యామ్యదిశకుఁ**

**తే.** **జనినవారలు గావున జనకపుత్త్రిఁ । గనిన యుబ్బిది గాఁబోలుఁ గాక; యిట్లు**
**సేయ వెఱవరె? పతికార్యసిద్ధి సలుపు । జనుల కీ చన వెందును జనున కాదె!'** **9**

**ప్రతిపదార్థం:** నీవును= ఓ సుగ్రీవా! నీవును; వాలియున్= వాలియు; నేఁడును= ఇప్పుడును; నాఁడును= అప్పుడును; ప్రియమునన్= ప్రీతితో; పాటించు= పరిపాలించే; పెద్దతోఁట= గొప్ప ఉద్యానవనం; మధువనంబు= 'మధువనం' అనే పేరు కలది; అది+ఎ= అదియె; నేఁడు= ఈప్రొద్దు; మన+అంగదుండును= మన అంగదుడు (వాలికొడుకు యువరాజు); హనుమంతుఁడును మొదలు+ఐనవారు= హనుమ మున్నగువారు; బలువిడిన్= బలంకొలది; చూఱాడి= కొల్లగొట్టి; ఫలములు+ ఆనెదరు= పండ్లు తింటున్నారు; తత్+రక్షకులు= ఆ వనాన్ని కాపాడేవారలం; అగు= అయిన; మమ్మున్= మమ్ము; రయముమీఱన్= వేగం అతిశయించగా; భంగించిరి= అవమానించారు; అనవుడున్= అని చెప్పగా; భానునందనుఁడు= సుగ్రీవుడు; ఆత్మన్= మనస్సులో; అంగద ప్రముఖులు= అంగదుడు మున్నగువారు; యామ్యదిశకున్= దక్షిణదిక్కుకు; చనినవారలు= వెళ్లినవారు; కావునన్= కాబట్టి; జనకపుత్త్రిన్= సీతాదేవిని; కనిన+ఉబ్బు= చూచిన ఉత్సాహం; ఇది= (ఈ చేష్ట- మధువన విధ్వంసం); కాఁబోలున్= అయిఉండవచ్చును; కాక= అట్లుకాకపోతే; ఇట్లు+చేయన్+వెఱవరు+ఎ= ఈ విధంగా చేయటానికి భయపడరా?; పతి. కార్యసిద్ధి, సలుపు= రాజుగారి పనులను జయప్రదంగా నిర్వహించే; జనులకున్= మనుజులకు; ఈ చనవు= ఈ స్వాతంత్ర్యం; ఎందును+చనును+అ+కాదె!= ఎక్కడనైన చెల్లుబడి ఔతుంటుంది కదా!

**తాత్పర్యం:** ఓ సుగ్రీవమహారాజా! ఇప్పుడు నీవును, అప్పుడు వాలియు, మధువనం అనే ఉద్యానాన్ని మిక్కిలి ప్రీతితో పోషించి పెంచారు. అంతటి సుప్రసిద్ధమైన మన పెద్దతోటకు ఈనాడు ఎంతటిదుస్స్థితి దాపురించింది! యువరాజు అంగదుడు, హనుమంతుడు మున్నగువారు చేరి, స్వేచ్ఛగా విహరించి పండ్లు అన్నిటిని తెగదిన్నారు. ఆ తోటకాపరులమైన మేము అడ్డగించగా మమ్మల్ని అవమానించారు. వారి ఆనందాలకు అంతు లేదు' అని చెప్పారు. 'సీతను వెదకటానికై వారు దక్షిణదిక్కుకు వెళ్ళారు; వారు సీతాదేవిని సందర్శించి ఉంటారు. అందుచేతనే వీరికి ఈ మితిమీరిన ఉత్సాహం ఏర్పడింది. లేకపోతే ఈవిధంగా క్రమశిక్షణను ఉల్లంఘించి స్వేచ్ఛగా ప్రవర్తించి ఉండరు. రాజుగారు చేయుమనిన పనిని జయప్రదంగా నిర్వహించేవారికి ఇట్టి చనవు ఏర్పడటం సహజమే కదా!' అని సుగ్రీవుడు మనస్సులో భావించాడు.

**విశేషం:** (1) రామాయణంలో మధువనవిధ్వంసం ఒక మనోహర ఘట్టం. మనోధర్మవిశ్లేషణకు ఉపకరించే ముఖ్యసన్నివేశం. "సుగ్రీవాజ్ఞ" సుప్రసిద్ధ మైనది. సుగ్రీవుడు చండశాసనుడు. క్రమశిక్షణ ఉల్లంఘించటం ఎంతమాత్రం సైపడు. ఆ విషయం అంగదుడికి, హనుమంతుడు మున్నగువారికి తెలిసిందే. అయినా ఆ వానరులు మితిమీరి మధువనంలో అట్లా ప్రవర్తించటం ఎట్లా సంభవించింది? ఆ ప్రశ్నకు సమాధానం ఈ పద్యంలో ఉన్నది. రాజకార్యంలో అసాధారణవిజయం సాధించినవారికి

అట్టి 'ఉబ్బు' కలుగుతుందని చండశాసనుడైన సుగ్రీవుడు గుర్తించాడు. మిక్కుటమైన క్రమశిక్షణలో బంధించబడి ఉండేవారికి తగినతరుణం లభిస్తే ఆటవిడుపుగా ఇటువంటి 'ఉబ్బు' ఏర్పడటం కద్దు.

**వ. అని యూహించి తత్ప్రకారంబు రఘుపతికిం జెప్పె; నంత. 10**

**తాత్పర్యం:** అని భావించి, తా నూహిస్తున్నపద్ధతిని రాముడికి నివేదించాడు. ఆపైన.

**ఉ. తేనెలు గ్రోలి క్రోలి కడుఁదియ్యని కమ్మనిపండు లింపు సొం**
**పానఁగ నాని యాని పరపందిన నీడలు మెచ్చి మెచ్చి మం**
**దానిలశైత్యసౌరభసమగ్రతకుం గడుఁ జొక్కి చొక్కి యు**
**ద్యానమునందు మారుతసుతప్రముఖుల్ విహరించి తృప్తులై. 11**

**ప్రతిపదార్థం:** మారుతసుత ప్రముఖుల్= వాయునందనుడైన హనుమంతుడు మున్నగువారు; తేనెలు= మధువులు; క్రోలిక్రోలి= మరీ మరీ ఆస్వాదించి; కడున్= మిక్కిలి; తియ్యని= మధురాలు అయిన; కమ్మని= రుచికరాలు అయిన; పండులు= ఫలాలు; ఇంపుసొంపు+ఆనఁగన్= కోరికలు సొగసులు శోభిల్లగా; ఆని+ఆని= ఆరగించి ఆరగించి; పరపు+అందిన= దట్టమైన; నీడలు= చాయలు; మెచ్చి+మెచ్చి= బాగా ఉన్నాయని పలుసారులు తలపోసి; మంద+అనిల, శైత్య, సౌరభ, సమగ్రతకున్= పిల్లగాలుల చల్లదనాల పరిమళాల నిండుదనానికి; కడున్= మిక్కిలిగ; చొక్కి+చొక్కి= సంతృప్తి చెంది చెంది; ఉద్యానము నందున్= పెంపుడు తోటలో; తృప్తులు+ఐ= సంతృప్తిని చెందినవారై; విహరించి= విచ్చలవిడిగా తిరుగాడి.

**తాత్పర్యం:** అట- వాయునందనుడైన హనుమంతుడు మున్నగువారు ఆ మధువనంలో విహరిస్తూ తేనెలు కడుపార త్రాగారు. తియ్యని కమ్మని ఫలాలు అమితంగా ఆరగించారు. దట్టమైన చెట్లనీడల్లో మెచ్చుకొంటూ విశ్రమించారు. పిల్లగాలుల చల్లదనాన్ని అనుభవించారు. పరిమళాలను ఆఘ్రాణించారు. ఆనందంలో తేలియాడారు.

**విశేషం:** (1) జీవితాలను పణంగా ఒడ్డి ఘనకార్యాన్ని - సీతాదేవి సందర్శనాన్ని - సాధించిన వానరులకు అది అవశ్యం అనుభవించదగిన ఆటవిడుపు. (2) సుగ్రీవుడు క్రమశిక్షణతో కూడుకొన్న పరిపాలనకు పేరువడినవాడు. పరిపాలనలోని ముఖ్యాంశాలు 1. క్రమశిక్షణ 2. పరేంగిత జ్ఞానం. 3. పట్టువిడుపులు. ఈ మూడున్నూ సుగ్రీవుడిశీలంలో కన్పిస్తున్నవి. మధువనంలో హద్దుమీరిన హనుమంతుడు మున్నగువారు కావలివారి దృష్టిలో దండనార్హులే. అయినా సుగ్రీవుడు పట్టువిడుపుల అదనెరిగిన పరిపాలనాదక్షుడు. కావున వారిని క్షమించాడు. పరేంగితజ్ఞానం పరిపాలనలోని ముఖ్యాంశం. ఇతరులమనస్సును గుర్తించే ఇంగితం పాలకులకు ఉండవలె. సుగ్రీవుడు వానరుల చర్యవలన వారు విజయం సాధించినవారని సీతాదేవి ఉనికిపట్టుల నెరిగి వచ్చారని వెంటనే గుర్తించగలిగాడు.

**వ. అందఱుం గూడుకొని చని సుగ్రీవలక్ష్మణసహితుండై యున్న జననాథుం గని దండప్రణామంబులు సేసినం గాకుత్స్థకులప్రదీపకుండు వారల ముఖవర్ణవిశేషంబు లుపలక్షించి సీతం గనినవార కా నిశ్చయించె; నప్పు డత్యంతమతిమంతుం డయిన హనుమంతుండు రాఘవునకుఁ గృతాంజలి యై యిట్లనియె. 12**

**ప్రతిపదార్థం:** అందఱున్= వానరులు అందరునూ; కూడుకొని= కలిసికొని; చని= వెడలి; సుగ్రీవ లక్ష్మణ సహితుండు+ఐ= సుగ్రీవుడితో లక్ష్మణుడితో కూడుకొని; ఉన్న= ఉన్నట్టి; జననాథున్= రాజును (శ్రీరాముడిని); కని= సందర్శించి; దండ, ప్రణామంబులు+చేసినన్= నేలమీదికి వాలి నమస్కృతులు చేయగా; కాకుత్స్థ, కుల, ప్రదీపకుండు= కాకుత్స్థ వంశాన్ని

ప్రకాశింపజేసేవాడు శ్రీరాముడు; వారల, ముఖ, వర్ణ, విశేషంబులు+ఉపలక్షించి= ఆ వానరులయొక్క మొగాల రంగురూపురేకలు గమనించి; సీతన్= సీతను; కనినవారు+అ+కాన్= చూచినట్టివారలే అని; నిశ్చయించెన్= నిర్ణయించుకొన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; అతి+అంత, మతిమంతుండు+అయిన= మిక్కిలి మేధ కలిగినవాడైన; హనుమంతుండు= ఆంజనేయుడు; రాఘవునకున్= శ్రీరాముడికి; కృత+అంజలి+ఐ= చేసిన నమస్కారం కలవాడై, నమస్కరించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** వానరు లందరు కలిసి మధువనం వీడి, సుగ్రీవుడితో, లక్ష్మణుడితో కూడిఉన్న శ్రీరాముడి సన్నిధానానికి వచ్చి, సవినయంగా నేలకొరిగి నమస్కరించి నిలిచారు. శ్రీరాముడు వానరులమొగాలలోని కవళికలుబట్టి వారు సీతాదేవిని సందర్శించారని నిశ్చయించాడు. అప్పుడు వానరు లందరిలో మేధావి అయిన హనుమంతుడు రాముడితో ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** వానరులు పెదవులు విప్పకుండగానే శ్రీరాముడు ఇంగితజ్ఞుడైన ఉత్తమ పరిపాలకుడు కాబట్టి, వారు సీతను సందర్శించారని మొగాలు చూచియే నిశ్చయించగలిగాడు.

**క. 'దేవిఁ బొడగంటి నేను ధ । రావల్లభ! శైలసరిదరణ్యనగరపా**
**రావారకలిత మగు వసు । ధా వలయము వెదకి వెదకి దక్షిణపుదిశన్. 13**

**ప్రతిపదార్థం:** ధరావల్లభ!= భూపతివైన ఓ శ్రీరామా!; ఏను= నేను; దేవిన్= సీతాదేవిని; శైల, సరిత్+అరణ్య, నగర, పారావార, కలితము+అగు= కొండలతో, నదులతో, అడవులతో, పట్టణాలతో, సముద్రాలతో కూడినది అయిన; వసుధావలయమున్= భూమండలాన్ని; వెదకి వెదకి= మరీ మరీ వెదకి; దక్షిణపుదిశన్= దక్షిణపు దిక్కున; పొడగంటిన్= చూచాను.

**తాత్పర్యం:** 'భూమికి అధిపతి వైన ఓ శ్రీరామప్రభూ! ఎట్టకేలకు నేను సీతాదేవిని సందర్శించాను. పెక్కు కొండలతో నదులతో అడవులతో పట్టణాలతో కూడిన ఈ సువిశాలభూమండలాన్ని అంతటిని అన్వేషించి అన్వేషించి, చివరకు దక్షిణదిక్కున దేవిని కాంచగల్గాను.

### హనుమంతుఁడు రామునితో సీతం జూచిన వృత్తాంతంబు సెప్పుట (సం. 3-266-38)

**తే. అవధరింపుము దేవ! మే మందఱము న । నేకముఖమునఁ దొలి తొలి యిందు నందు**
**నరయుచును బోయి యొక్కెడ నతివిశాల । మైన భూవివరముఁ గంటి మద్భుతముగ. 14**

**ప్రతిపదార్థం:** దేవ!= ప్రభూ!; అవధరింపుము= దయచేసి వీనులొగ్గి వినుము; మేము+అందఱమున్= మేము (వానరులం) అందరమున్నూ; అనేక ముఖమునన్= పెక్కుముఖాల అంటే (పెక్కు కండ్లు పెక్కు మొగాలు చేసికొని); తొలి తొలి= మొదట మొదట; ఇందున్+అందున్= ఇచట అచట అంటే అన్ని తావులలో; అరయుచును= చూస్తూ; పోయి= పయనించి; ఒక్క+యెడన్= ఒకానొక చోట; అతివిశాలము+ఐన= మిక్కిలి విస్తారం అయిన; భూవివరమున్= నేల సొరంగాన్ని; అద్భుతముగన్= అచ్చెరువు కలిగేటట్లుగా; కంటిమి= చూచాం.

**తాత్పర్యం:** ప్రభూ! శ్రీరామచంద్రా! దయచేసి నా మాటలు సావధానుడవై ఆలకింపుము. మేము పడిన శ్రమ నీకు విన్నవిస్తేకాని మాకు తృప్తి కలుగదుకదా! వానరులం మేము అందరం ఒడలెల్ల కళ్ళు చేసికొని ఇచట అచట అన్వేషిస్తూ పయనించి ఒకచోట అచ్చెరువు కలిగించే ఒకపెద్ద విస్తారమైన నేలసొరంగాన్ని చూచాం.

**వ. కని దానిం బ్రవేశించి, నిరంతరతిమిరసంవృతంబును, బహుకీటసంకులంబును నైన మార్గంబున ననేకయోజనంబులు సనునెడ ముందట నర్కప్రకాశం బైన పురంబు గానంబడియె; నందొక్కతాపసాంగన యుండి మమ్ము నాదరించి, తనపేరు ప్రభావతి యనియును, నప్పురంబు మయునిపురం బనియునుం జెప్పి, మధురంబు లయిన భక్ష్యభోజ్యంబు లొసంగినం దృప్తులమై తదుపదిష్టమార్గంబున మహీవివరంబు నిర్గమించి సహ్యదర్దురశైలంబులు గడచి మలయశైలశిఖరం బెక్కి. 15**

**ప్రతిపదార్థం:** కని= చూచి; దానిన్= ఆ సొరంగాన్ని; ప్రవేశించి= చొచ్చి; నిరంతర, తిమిర, సంవృతంబును= ఎల్లప్పుడూ చీకటితో నిండినదిన్నీ; బహుకీట సంకులంబును+ఐన, మార్గంబునన్= పెక్కుపురుగులచేత దట్టంగా క్రిక్కిరిసిన త్రోవలో; అనేక యోజనంబులు= పెక్కు ఆమడలు; చను+ఎడన్= వెళ్లుతున్నపుడు; ముందటన్= కనులకు ఎదురుగా; అర్క, ప్రకాశంబు+ఐన= సూర్యరశ్మికలదానివలె వెలుగొందుతున్న; పురంబు= పట్టణం; కానంబడియెన్= కనుపించింది; అందున్= ఆ పురంలో; ఒక్క= ఒక; తాపస+అంగన= తపస్విని అయిన వనిత; ఉండి= నివసిస్తూ ఉండి; మమ్మున్= మమ్మల్ని (వానరులను); ఆదరించి= గౌరవించి; తనపేరు; ప్రభావతి+అనియును; ఆ+పురంబు= ఆపట్టణం: మయుని పురంబు= మయునియొక్క నగరం; అనియునున్= అనిన్నీ; చెప్పి; మధురంబులు+అయిన= తియ్యనివి అయిన; భక్ష్యభోజ్యంబులు= తినుబండములు పెక్కు రకాలు; ఒసంగినన్= ఇవ్వగా; తృప్తులము+ఐ= సంప్రీతి చెందినవారమై; తద్+ఉపదిష్ట, మార్గంబునన్= ఆమెచేత చెప్పబడిన మార్గంలో; మహీ, వివరంబు= నేల సొరంగం; నిర్గమించి= వెలువడి; సహ్యదర్దురశైలంబులు= సహ్యం దర్దురం అనే పర్వతాలను; కడచి= దాటి; మలయ, శైల, శిఖరంబున్= మలయపర్వతపు కొమ్మును; ఎక్కి= అధిరోహించి.

**తాత్పర్యం:** అచ్చెరువుగొలిపే ఆ నేలసొరంగాన్ని ప్రవేశించాం. అది చీకటితో నిండినట్టిది. పెక్కు క్రిమికీటకాలచేత క్రిక్కిరిసిన దారిలో పెక్కు ఆమడలు పయనించి, చివరకు ఒక నగరాన్ని చేరాం. ఆ నగరం సూర్యరశ్మి వలె ధగధగలాడుతున్నది. ఆ పట్టణంలో ఒక తాపసాంగన మాకు కన్పించింది. ఆమె మమ్మల్ని ఆదరించి తన పేరు ప్రభావతి అనిన్నీ, ఆపట్టణం మయుడిపట్టణమనిన్నీ చెప్పి మాకు తియ్యనితినుబండములు వడ్డించి మంచి విందు భోజనం సమకూర్చింది. మేము ఆమె పెట్టిన విందును ఆరగించి సంతృప్తి చెందినవారమై ఆమెసూచనలను పాటించి ఆ నేలసొరంగం దాటాం. పిదప సహ్యపర్వతాలను దర్దుర పర్వతశ్రేణులను దాటి చివరకు మలయపర్వతపు కొమ్ము చేరి నిలిచాం.

**విశేషం:** (I) మయుడు పురాణసుప్రసిద్ధుడైన శిల్పి. (ii) భక్ష్యాలు ఐదువిధాలు. 1. భక్ష్యం 2. భోజ్యం 3. లేహ్యం 4. చోష్యం 5. పానీయం (iii) సహ్యశైలం- పడమటిదిక్కున ఉండే కొండలు, పడమటి కనుమలు. మలయశైలం దక్షిణదిక్కున ఉండే పర్వతం. దక్షిణభారత ద్వీపకల్పంలో అటు పడమటి కనుమలు ఇటు తూర్పుకనుమలు దక్షిణాన ఒకచోట కలుస్తాయి. అక్కడ ఉన్న కొండలను మలయపర్వతశ్రేణులు అని ప్రాచీన భారతీయ సాహిత్యంలో నిర్దేశించబడింది.

**స్రగ్ధర. లీలం గల్లోలమాలోల్లిఖితగగనమై, లీననానాకుళీర
వ్యాలోగ్రగ్రాహమీనావకుల నెసఁగి, దుర్వారవారోఘగంభీ
రాలంఘ్యప్రౌఢవేగం బగుచు బహుతరాయామవిస్తారమై బి
ట్టాలోకింపంగ నుగ్రం బగు జలనిధి నంతంతటం గంటి మంతన్. 16**

**ప్రతిపదార్థం:** అంతన్= పిదప; అంత+అంతటన్= అల్లంత దూరంలో; లీలన్= హొయలుగా; కల్లోల, మాలా+ఉత్+లిఖిత గగనము+ఐ= కెరటాల వరుసలచేత స్పృశించబడినట్టి ఆకాశం కలదై (ఆకాశాన్ని అంటుతున్నట్లున్న ఎత్తయిన అలల

వరుసలు కలదై; లీన= మునిగిఉన్న; నానా, కుళీర, వ్యాళ+ఉగ్ర, గ్రాహ, మీన+ఆవళులన్= పెక్కు విధాలైన ఎండ్రులచేతను క్రూరమైనవి భయంకరమైనవి అయిన మొసళ్ళచేతను చేపలచేతను; ఎసఁగి= విజృంభించి; దుర్వార, వాః+ఓఘ, గంభీర+అలంఘ్య, ప్రౌఢ, వేగంబు+అగుచున్= వారించటానికి వీలులేని నీటిప్రవాహంచేత లోతై దాటటానికి శక్యంకానట్టిది, మిక్కిలి వేగం కలిగినది; బహుతర+ఆయామ, విస్తారము+ఐ= మిక్కిలి పొడవు వెడల్పు కలిగినట్టిదై; బిట్టు+ఆలోకింపంగన్= మిక్కిలి పరికించి చూడగా; ఉగ్రంబు+అగు= భయంకరం అయిన; జలనిధిన్= సముద్రాన్ని; కంటిమి= చూచాం.

**తాత్పర్యం:** అంతట, అల్లంత దూరాన సముద్రం మాకు కనిపించింది. ఆకడలికెరటాలు ఆకసాన్ని తాకుతున్నాయి. పెక్కు ఎండ్రకాయలు, భయంకరాలైన మొసళ్లు, చేపలు వేగంగా సుడులుతిరుగుతూ దాటటానికి శక్యంకాని ఆ సముద్రపు నీటివెల్లువలో లోతులోతులలో నివసిస్తున్నాయి. ఆ జలధి మిక్కిలి నిడివికలిగి దరిదాపులు లేకుండా భయంకరమై కన్పట్టింది.

**విశేషం:** స్రగ్ధరావృత్తంలోని ప్రతిపాదంలోనూ వరుసగా మ, ర, భ, న, య, య, య, అనే గణాలుంటాయి. 8, 15 అక్షరాలతో యతిమైత్రి, ప్రాస నియమం ఉన్నది.

**క. కని, యిది రత్నాకర; మి । వ్వననిధిసీమమునఁ గల్గు వసుమతిలోనన్**
**జనకసుత వెదకి కానమ; । చన దివ్వారాశి దాఁటి చన నెవ్వరికిన్. 17**

**ప్రతిపదార్థం:** కని= చూచి; ఇది= ఈ కనుపిస్తున్నది; రత్న+ఆకరము= రతనాలకు నెలవయింది- సముద్రం; ఈ+వననిధి, సీమమునన్= ఈ సముద్రానికి సంబంధించిన ప్రదేశంలో; కల్గు= ఉండే; వసుమతిలోనన్= భూమిలో; జనకసుత= జనకుడికూతురు సీతను; వెదకి= అన్వేషించి; కానము+అ= చూడలేకపోయాం; ఈ వారాశి= ఈ సముద్రాన్ని; దాఁటి= అతిక్రమించి; చనన్= వెళ్ళటానికి; ఎవ్వరికిన్= ఎవరికైనను; చనదు= వీలులేదు.

**తాత్పర్యం:** ఇది సముద్రం. ఈ సముద్రంలో ఉన్నప్రదేశాలను అన్నింటిని వెదికాం గాని సీతను చూడలేకపోయాము. ఇక ఈ సముద్రాన్ని దాటి వెళ్ళటానికి ఎవరికిని శక్యం కాదు.

**ఉ. 'భూమితనూజఁ గాన మని పోయి రఘూద్వహుతోడఁ జెప్పి, య**
**బ్భూమిపుచిత్త మాతురతఁ బొందఁగఁ జేయుటకంటెఁ, జూడఁగా**
**నీమెయిఁ జావు మేలు; మన కేల విచారము లింక?'నంచు నం**
**దేము గడంగి యందఱము నేకతమం బగు నిశ్చయంబుతోన్. 18**

**ప్రతిపదార్థం:** భూమితనూజన్= భూమికి కూతురు అయిన సీతాదేవిని; కానము+అని, = చూడలేము అని, పోయి= వెళ్లి; రఘు+ఉద్వహుతోడన్= రఘువుయొక్క వంశంలో పుట్టిన గొప్పవాడితో- శ్రీరాముడితో; చెప్పి; ఆ+భూమిపు, చిత్తము= ఆ రాజు మనస్సును, శ్రీరాముడి మనస్సును; ఆతురతన్+పొందఁగన్+చేయుకంటెన్= వేగిరపాటుతో కూడిన ఆవేదన చెందేటట్లుగా చేయటం కంటె; చూడఁగాన్= అరయగా; ఈమెయిన్= ఈ పార్శ్వమున-ఇక్కడ; చావు= మరణం; మేలు= మంచిది; మనకున్+ఏల, విచారములు+ఇంకన్+అంచున్= మనకు ఇంక వేరే ఆలోచనలు ఎందుకు అని తలపోస్తూ; అందున్= ఆ సముద్రతీరంలో; ఏము+అందఱమున్= మేం అందరమున్నూ; ఏకతమంబు+అగు= ఏకగ్రీవమైన; నిశ్చయంబుతోన్= నిర్ణయంతో; కడంగి= పూని.

**తాత్పర్యం:** 'సీతాదేవికొరకై వెదకి వెదకి వేసారాం. ఆమె ఎచట ఉన్నదో తెలిసికొనలేకపోయాం, అని చెప్పి రఘువంశశ్రేష్ఠుడైన శ్రీరామచంద్రమూర్తి మనస్సుకు వ్యాకులత కలిగించటంకంటె, మనమందరం ఇక్కడే గుమిగూడి మరణించటం మేలు' అనే నిర్ణయానికి ఏకగ్రీవంగా వచ్చాం. ఏమైనా మరణించటానికే నిశ్చయించుకున్నవారలం కాబట్టి ఇక తర్జనభర్జనలు మనకు అనవసరం.

**వ. అనశనవ్రతంబు సంకల్పించి నియతచిత్తుల మై యుండి 'రాఘవుకార్యార్థంబై తెగిన జటాయువు గృతార్థుం డయ్యెఁ; మనము నట్టి పుణ్యలోకంబు వడయుద' మని పలుకుచున్నయెడ. 19**

**ప్రతిపదార్థం:** అనశనవ్రతంబు= తిండిమాని మరణించే వ్రతదీక్ష; సంకల్పించి= మనస్సులో నిర్ణయించుకొని; నియతచిత్తులము+ఐ+ఉండి= నిగ్రహించబడిన మనస్సులు కలవారమై ఉండి; రాఘవుకార్య+అర్థంబు+ఐ= శ్రీరాముడి పనికొరకై; తెగిన= మరణించిన; జటాయువు= జటాయువు (అనే పేరుకల పక్షి); కృత+అర్థుండు= ధన్యుడు; అయ్యెన్= అయ్యాడు; మనమున్= మనంగూడ; అట్టి= ఆ జటాయువు చేరినట్టి; పుణ్యలోకంబు= స్వర్గం; పడయుదము= పొందుదాం; అని పలుకుచున్+ఉన్న+ఎడన్= అని మాట్లాడుతున్న సమయంలో. (మీది పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** అని ప్రాయోపవేశదీక్షతో మరణించటానికి మనస్సులలో నిర్ణయించుకొని, శ్రీరాముడిపనికొరకై జటాయువు చనిపోయి ధన్యుడయ్యాడుకదా! అట్లే మనంకూడ అట్టి పుణ్యాన్ని ఆర్జించి మరణానంతరం ఉత్తమగతికి పోదాం- అని మాట్లాడుతున్న సమయంలో.

**క. గిరిశృంగతుంగవిగ్రహుఁ । డురుతరసత్త్వుఁడు విహంగమోత్తముఁ డం దొ**
**క్కరుఁ డొయ్యన మా యున్నెడ । కరుదుగఁ జనుదెంచి విగళితాశ్రుం డగుచున్. 20**

**ప్రతిపదార్థం:** గిరి, శృంగ, తుంగ విగ్రహుఁడు= కొండశిఖరంవలె ఎత్తయిన ఆకృతి కలవాడు; ఉరుతరసత్త్వుఁడు= మిక్కిలి గొప్పబలం కలవాడు; విహంగమ+ఉత్తముఁడు= పక్షులలో శ్రేష్ఠుడు; అందున్= అచట; ఒక్కరుఁడు= ఒంటరిగా ఒక్కడుగా ఉన్నవాడు; ఒయ్యనన్= తిన్నగా; మా+ఉన్న+ఎడకున్= మేము ఉన్నచోటికి; అరుదుగన్= ఆశ్చర్యకరముగా; చనుదెంచి= వచ్చి; విగళిత+అశ్రుండు+అగుచున్= జారిన కన్నీరు కలవాడు ఔతూ.

**తాత్పర్యం:** అప్పుడు పెద్దకొండశిఖరంవంటి రూపం కలవాడు మిక్కుటమైన బలం కలవాడు ఒకగొప్పపక్కిరేడు ఒంటరిగా ఆశ్చర్యకరముగా మేం ఉన్నచోటికి వచ్చి కన్నీరుకారుస్తూ, (ఇట్లా పలికాడు).

**సీ. 'అయ్యలార! జటాయు వని పల్కెదరు మీర । లెవ్వరు? సెప్పరే! యేను వాని**
**కగ్రజుండ; ననూరునాత్మజన్ముల మేము; । సంపాతి నాపేరు; సమ్మదమున**
**నేనును దమ్ముఁడు నినమండలమునకుఁ । జనువేడ్క నొకనాఁడు చదల నెగసి**
**చనఁ జనఁ దీవ్రాంశుసంతాపమునఁ జేసి । కమరె నా ఱెక్కలు; గమర వయ్యెఁ**

**తే. ననుజుపక్షమ్ముఁ; లే నిమ్మహాచలమున । నాఁటఁగోలె నెచ్చటికిఁ జనంగ నేర**
**కున్నవాఁడ; నాతమ్ముఁ డెట్లున్నవాఁడొ? । యెఱుఁగ నెఱిఁగింపరే నాకు నిష్ట మెసఁగ.' 21**

**ప్రతిపదార్థం:** అయ్యలు+ఆర!= ఆర్యులారా!; జటాయువు+అని= జటాయువు అని; (మీరు); పల్కెదరు= అంటారు. మీరలు= మీరు; ఎవ్వరు?= ఎవ్వరు?; చెప్పరే?= తెలియచెప్పరా?; ఏను= నేను; వానికిన్= అతడికి (అ జటాయువుకు);

అగ్రజుండన్= ముందుపుట్టినవాడను, అన్నను; ఏము= మేము; అనూరు+ఆత్మజన్ముల‌ము= అనూరుడి కొడుకులం; నాపేరు= నా నామం; సంపాతి; సమ్మదమునన్= సంతోషంతో; ఏనును= నేనును; తమ్ముఁడున్= అనుజుడు అయిన జటాయువున్నూ; ఇనమండలమునకున్= సూర్యమండలానికి; చను, వేడ్కన్= వెళ్లాలనే సంబరంతో; ఒకనాఁడు= ఒకరోజు; చదలన్+ఎగసి= ఆకసానికి ఎగిరి; చనన్+చనన్= వెడలగా, వెడలగా; తీవ్ర+అంశు, సంతాపమునన్+చేసి= సూర్యుడియొక్క వేడిమివలన; నాఱెక్కలు= నాపక్షాలు; కమరెన్= మాడినవి; అనుజు, పక్షమ్ములు= నాతమ్ముడి రెక్కలు (జటాయువు రెక్కలు); కమరవు+అయ్యెన్= మాడిపోలేదు; ఏను= నేను; ఈ+మహా+అచలమునన్= ఈ పెద్దకొండమీద; నాఁటన్+కోలెన్= ఆనాటి నుండి; ఎచ్చటికిన్+చనంగన్‌నేరక+ఉన్నవాఁడన్= ఎగిరి ఎక్కడికీ వెళ్ళటానికి శక్తిలేనివాడనై ఉన్నాను; నాకున్+ఇష్టము+ఎసఁగన్= నాకు ప్రీతి అతిశయించేటట్లుగా; నాతమ్ముఁడు; ఎట్లు+ఉన్నవాఁడు+ఒ= ఏవిధంగా ఉన్నాడో; ఎఱిఁగింపరే= దయచేసి తెలుపరా?.

**తాత్పర్యం:** ఓ పూజ్యులారా! మీమాటలలో నాకు జటాయువు అనే పేరు విన్పించింది. మీరు ఎవరు? దయచేసి తెలపండి. నేను జటాయువుకు అన్నను. నేనూ జటాయువూ అనూరుడి కొడుకులం. నాపేరు 'సంపాతి'. ఒకనాడు మాచిన్నతనంలో నేనూ నాతమ్ముడూ వేడుకతో సూర్యమండలానికి వెళ్లవలెనని ఆకాశాన ఎత్తుగా ఎగురసాగాం. కొంతసేపటికి నా రెక్కలు సూర్యుడివేడిమికి మాడిపోయాయి. కాని, నాతమ్ముడు జటాయువు రెక్కలు మాత్రం మాడిపోలేదు. అతడిబలం అట్టిది. ఆనాటినుండి నేటివరకు, రెక్కలు లేని పక్షినై నేను ఈ కొండమీదనే పడిఉన్నాను. నాతమ్ముడైన జటాయువు యొక్క యోగక్షేమాలు దయచేసి మీరు నాకు తెలిపితే సంతసంతో వింటాను.

**విశేషం:** అనూరుడు సూర్యుడిసారథి. తొడలు లేనివాడు. గరుత్మంతుడి అన్న.

**వ. అనిన నే మతనికి భవదీయవృత్తాంతంబును, రావణుండు దేవిం గొనిపోవుటయుఁ, దదర్థంబై రావణునితో జటాయువు సమరంబు సేసి యీల్గుటయుఁ జెప్పిన విని దుఃఖితుండై సంపాతి యస్మదీయ ప్రవర్తనం బేర్పడ నడిగి మా కిట్లనియె. 22**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఏము= మేము; అతనికిన్= ఆ సంపాతికి; భవదీయవృత్తాంతంబును= నీయొక్క సంగతిని; రావణుండు= రావణుడు; దేవిన్= (సీతా)దేవిని; కొనిపోవుటయున్= అపహరించటమున్నూ; తద్+అర్థంబు+ఐ= ఆమెకొరకై; రావణునితోన్; జటాయువు; సమరంబు+చేసి= యుద్ధం చేసి; ఈల్గుటయున్= మరణించటమున్నూ; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; దుఃఖితుండు+ఐ= శోకించినవాడై; సంపాతి= జటాయువు అన్న; అస్మదీయ ప్రవర్తనంబు= మా నడవడి; ఏర్పడన్+అడిగి= తెలిసేటట్లుగా ప్రశ్నించి; మాకున్+ఇట్లు+అనియెన్= మాతో ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని సంపాతి మమ్మల్ని ప్రార్థించాడు. అంతట మేము అతడికి మీ సమాచారాన్ని, రావణుడు సీతాదేవిని అపహరించటమున్నూ, ఆ సీతకొరకై జటాయువు రావణుడితో యుద్ధం చేసి మరణించటమున్నూ చెప్పాం. ఆతడు తమ్ముడిమరణవార్త విని మిక్కుటంగా శోకించి, మావిషయాలనుగూర్చి ప్రశ్నించి తెలిసికొని ఈ విధంగా చెప్పాడు.

**ఉ. 'రావణు నే నెఱుంగుదుఁ; బరాక్రమదుస్సహుఁ డన్నిశాచరుం;**
**దీవనరాశిమధ్యమున నిచ్చటికిన్ శతయోజనంబులన్**

**భూవిదితంబు లంక యను ప్రోలు తదీయనివాస; మచ్చటన్**
**భూవరుదేవిఁ గాన నగుఁ బొం; డరయుండు కృతప్రయత్నులై.' 23**

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; రావణున్= రావణుడిని; ఎఱుంగుదున్= తెలియుదును; ఆ+నిశాచరుండు= ఆ రాక్షసుడు; పరాక్రమదుస్సహుఁడు= శౌర్యంచేత సహించరానివాడు- గొప్పశౌర్యం కలవాడు; ఈవనరాశిమధ్యమునన్= ఈ సముద్ర మధ్యంలో; ఇచ్చటికిన్= ఈ స్థలానికి; శతయోజనంబులన్= నూరామడలదూరంలో; భూవిదితంబు= భూమిలో ప్రసిద్ధమైనది; లంక+అను, ప్రోలు= లంక అనే పట్టణం; తదీయనివాసము= ఆతనియొక్క నెలవు; అచ్చటన్= ఆస్థలంలో (ఆలంకలో); భూవరుదేవిన్= రాజుగారి భార్యను (సీతాదేవిని); కానన్+అగున్= చూడవచ్చును; పొండు= వెళ్ళండి; కృతప్రయత్నులు+ఐ= చేయబడిన యత్నం కలవారై (ప్రయత్నపరులై); అరయుండు= (సీతను) వెదకండి.

**తాత్పర్యం:** 'రావణుడిని నేను ఎఱుగుదును. ఆతడు గొప్పపరాక్రమం కలవాడు. అతడిని ఓడించటం సులభం కాదు. ఆ రాక్షసుడు ఈ సముద్రమధ్యంలో లంక అనే సుప్రసిద్ధపట్టణంలో నివసిస్తూ ఉంటాడు. మీరు ప్రయత్నం చేసి అక్కడికి వెళ్ళండి. అక్కడ శ్రీరాముడిభార్య సీత మీకు కనిపిస్తుంది'.

**క. అని యతఁడు సనిన నందఱ । ముసు సాగరతరణకార్యమునకు నుపాయం**
**బొనరఁ దలపోయునెడ నే । నని యుత్సాహంబు సేయఁ డయ్యె నొకండున్. 24**

**ప్రతిపదార్థం:** అని= అని వచించి; అతఁడు= సంపాతి; చనినన్= వెళ్ళగా; అందఱమును= (వానరులం) అందరమున్నూ; సాగర, తరణ, కార్యమునకున్= సముద్రాన్ని దాటటం అనే పనికి; ఉపాయంబు= వెరవు; ఒనరన్= ఒప్పిదంగా; తలపోయు+ఎడన్= ఆలోచించే సమయంలో; ఒకండున్= ఒక్కడు కూడ; ఏను+అని= నేను (చేస్తాను) అని; ఉత్సాహంబు+చేయఁడు+అయ్యెన్= ఉత్సహింపడయ్యెను, ముందుకు రాలేదని భావం.

**తాత్పర్యం:** లంకాపట్టణానికి పొమ్మని సంపాతి చెప్పాడు కాని, మావానరులలో ఒకడికి కూడ సముద్రం దాటే ఉపాయం తట్టలేదు. ఒక్కడును తాను ఆ పనికి పూనుకొనటానికి ఉత్సాహం చూపలేదు.

**మ. జననాథోత్తమ! యేను బూని భవదాజ్ఞాలీల చెల్వంబు మ**
**జ్జనకుం డైన సమీరదేవుకృపయున్ సత్త్వోన్నతుం జేయఁగా**
**ఘనవాస్తుంగతరంగసంగతమహాగ్రాహోరగాత్యుగ్రద**
**ర్శనమై పేర్చు పయోధి దాఁటితి జనాశ్చర్యైకసంపాదినై. 25**

**ప్రతిపదార్థం:** జననాథ+ఉత్తమ!= రాజులలో శ్రేష్ఠుడవైన వాడా (రామచంద్రా!); ఏను= నేను; పూని= కడగి; భవత్+ఆజ్ఞా, లీల, చెల్వంబున్= నీయొక్క ఆనతి అనే విలాసపు తీరు; మత్+జనకుండు+ఐన= నాతండ్రి అయిన; సమీర, దేవు, కృపయున్= వాయుదేవుడి దయయూ; సత్త్వ+ఉన్నతున్+చేయఁగాన్= బలంచేత గొప్పవాడినిగా చేయగా; ఘన, వాః+తుంగ, తరంగ, సంగత, మహా+గ్రాహ+ఉరగ+అతి+ఉగ్ర, దర్శనము+ఐ= అధికమయిన నీటిలోని ఎత్తైన కెరటాలచేత కూడి గొప్పవైన మొసళ్ళతో పాములతో కూడి భయంకరంగా కన్పించి; పేర్చు= అతిశయించే; పయోధిన్= సముద్రాన్ని; జన+ఆశ్చర్య+ ఏకసంపాదిన్+ఐ= ప్రజలకు పరమాశ్చర్యము కలిగించువాడనై; దాఁటితిన్= దాటాను.

**తాత్పర్యం:** రాజులలో గొప్పవాడ వైన రామా! నీ ఆజ్ఞ నెరవేర్చటంలోని సొగసు, నాతండ్రి అయిన వాయుదేవుడి దయ నాకు బలం చేకూర్చాయి. ఆ ప్రోత్సాహంతో పొంగారినశక్తితో, నేను ఎత్తయిన నీటికెరటాలతో కూడింది,

భయంకరమైన మొసళ్ళతోపాములతో చూడటానికి వెరపుకలిగించేది అయిన సముద్రాన్ని దాటాను. అది లోకులకు అచ్చెరువు గొలిపే సన్నివేశమే.

**ఉ. ఆ లవణాబ్ధిమధ్యమునయందుఁ ద్రికూటనగంబుమీఁద ను
త్తాలవిశాలహేమమణిధామసముజ్జ్వల మైన లంక యన్
ప్రో లొగిఁ గంటి; నెంతయు నపూర్వము దద్విభవంబు; దేవ! య
చ్చో లలితాంగి నారయుచుఁ జొచ్చి యనేకవిధంబులం దగన్. 26**

**ప్రతిపదార్థం:** దేవ!= ఓప్రభూ!; ఆ, లవణ+అబ్ధి, మధ్యమున+అందున్= ఆఉప్పుసముద్రంయొక్క నడిమిభాగంలో; త్రికూట, నగంబుమీఁదన్= త్రికూటంఅనే పేరు గల పర్వతంపై; ఉత్+తాల, విశాల, హేమ, మణి, ధామ, సమ్+ఉత్+జ్వలము+ఐన= మిక్కిలి ఎత్తైన, విస్తీర్ణంతో కూడిన, బంగారు మణులు చెక్కబడిన స్థలాలతో మిక్కుటంగా ప్రకాశించే; లంక+అన్+ప్రోలు= లంకఅనేపట్టణం; ఒగిన్= ఒప్పిదంగా; కంటిన్= చూచాను; తద్+విభవంబు= ఆపట్టణంయొక్క ఐశ్వర్యం; ఎంతయున్+ అపూర్వము= ఎంతయో గొప్పది; అచ్చోన్= ఆచోట; లలిత+అంగిన్= సుకుమార మైన దేహం కల దానిని-సీతను; ఆరయుచున్= వెదకుతూ; చొచ్చి= ప్రవేశించి; అనేకవిధంబులన్= పెక్కురీతులుగా; తగన్= సముచితంగా.

**తాత్పర్యం:** ఆఉప్పుసముద్రంమధ్య మూడుశిఖరాలతో ఒప్పారే ఒకపెద్దకొండమీద ఉన్న లంకాపట్టణాన్ని చూచాను. ఆ పట్టణపు సంపద ఇంక ఎక్కడా ఎప్పుడూ కానరానట్టిది. అక్కడ విశాలమైనవి కనకరత్నమయాలైనవి అయిన ఎత్తయినమేడలు విలసిల్లుతున్నాయి. ప్రభూ! వర్ణనాతీతం ఆ లంకాపురివైభవం. అచ్చట సీతాదేవిని వెదకుతూ పలుతావుల తిరుగాడాను.

**వ. అరసి యొక్కెడ రావణాంతఃపురం బైన యశోకవనంబునందు. 27**

**తాత్పర్యం:** వెదకి, ఒకచోట, రావణాసురుడి లోపలినగరిలో ఉన్న అశోకవనంలో.

**సీ. కన్నీరు జడిగొని క్రమ్మఁ బ్రాఁ కెక్కిన । కమ్రకపోలభాగములు గలిగి
యవశమై యొఱఁగిన యంగవల్లిక పొంత । నున్న భూమీరుహం బూఁత గాఁగ
వెడలు నిట్టూర్పులవేఁడిమిఁ బగిలిన । యధరపల్లవము గారాకుఁ బోలఁ
దలఁపులసందడి దందడించిన తాల్మి । గదిరి శిరఃకంపగతుల బెరయ**

**ఆ. నున్న పుణ్యమూర్తి నుత్తమసౌందర్య । నవనతాస్య నార్త యైన దానిఁ
గని విదేహతనయఁ గా నెఱింగితి నేను । హా! రఘుప్రవీర! యనుచు నడల. 28**

**ప్రతిపదార్థం:** కన్నీరు= కంటినీరు; జడి+కొని, క్రమ్మన్= వెల్లువగా స్రవించటంచేత; ప్రాఁకు+ఎక్కిన= పాచి పట్టిన; కమ్ర, కపోల, భాగములు= అందమైన చెక్కిళ్లు; కలిగి; అవశము+ఐ= వశం తప్పినదై; ఒఱఁగిన= వాలిన; అంగవల్లిక= తీగవంటిదేహం; పొంతన్+ఉన్న= సమీపంలో కల; భూమీరుహంబు= చెట్టు; ఊఁత+కాఁగన్= ఆధారం కాగా; వెడలు= బయటకు వచ్చే; నిడు+ఊర్పుల, వేఁడిమిన్= నిడివి అయిన నిశ్వాసాల తాపంచేత; పగిలిన= బ్రద్దలైన; అధరపల్లవము= చిగురుటాకువంటి పెదవి; కారాకున్= కారు+ఆకున్+పోలన్= పండుటాకువలె ఉండగా; తలఁపులసందడి= ఆలోచనల సమ్మర్దంచేత; దందడించినతాల్మి= కలత చెందిన ఓర్పు; కదిరి= ఏర్పడి; శిరస్+కంప, గతులన్= తల అట్టిటు ఊచుతూ ఉండటంచేత;

బెరయన్= అలముకొనగా; ఉన్న+పుణ్యమూర్తిన్= పుణ్యం ఆకృతి ధరించినట్లుగా కనిపించినదానిని; ఉత్తమ, సౌందర్యన్= మంచి సొగసు కలదానిని; అవనత+ఆస్యన్= వంచిన మొగం కలదానిని (ముఖం వంచుకొని ఉన్నదానిని); ఆర్త+ఐనదానిన్= దీనురాలిని; కని= చూచి; ఏను= నేను; విదేహతనయన్+కాన్= విదేహరాజపుత్రి అయిన సీతగా; హా!రఘుప్రవీర!= అయ్యో, ఓ రఘువంశంలోని గొప్పవీరుడా!; అనుచున్= అని అంటూ; అడలన్= ఏడ్చుచుండటంచేత; ఎఱింగితిన్= తెలిసికొన్నాను.

**తాత్పర్యం:** వెదకి వెదకి రావణుడి అంతఃపురంలో ఉన్న అశోకవనం చేరాను. అక్కడ కన్నీరు కారటంచేత పాచిపట్టి మలినమైన చెక్కిళ్ళు కలదానిని, వశం తప్పిన దేహాన్ని సమీపంలో ఉన్న చెట్టుకు ఆసరాగా చేర్చినదానిని, వెడలుతున్న వేడినిట్టూర్పులవలన పగిలి పండుటాకునుబోలిన పెదవి కలదానిని, హృదయంలోని ఆవేదనచేత తరచు తల ఆడిస్తున్న దానిని. సహజమైన సౌందర్యం కలదానిని, శోకంచేత తలవంచుకొని ఉన్నదానిని, 'హా!రఘువీర!' అని దుఃఖిస్తున్న దానిని- వైదేహి అయిన సీతాదేవిగా గుర్తించాను.

**క. వినయమున దేవిఁ జేరం । జని యభివాదనము సేసి 'జానకి రఘునం**
**దనుదూత నేను మారుత । తనయుఁడ వానరుఁడ నిన్నుఁ దడవ నిచటికిన్. 29**

**ప్రతిపదార్థం:** వినయమునన్= అణకువతో; దేవిన్= (సీతా)దేవిని; చేరన్+చని= సమీపించి; అభివాదనము+చేసి= నమస్కరించి; జానకి!= జనకుని కూతురవు అయిన ఓసీతా! ఏను= నేను; రఘునందనుదూతన్= రాముడి రాయబారిని; మారుత, తనయుఁడన్= వాయుదేవుడి కొడకును; వానరుఁడన్= కోతిని; నిన్నున్= నిన్ను, తడవన్= అన్వేషించటంకొరకై; ఇచటికిన్= ఈస్థలానికి.

**తాత్పర్యం:** అణకువతో సీతాదేవిదగ్గరకు వెళ్లి, నమస్కారం చేసి, 'జనకమహారాజుకూతుర వైన ఓసీతా!', నేను శ్రీరాముడిదూతను వాయుపుత్రుడను, వానరుడను; నిన్ను వెదకటానికై (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అరుగుదెంచితి; రామలక్ష్మణు లత్యంతకుశలంబున నున్నవారు; వానరేశ్వరుం డయిన సుగ్రీవుండు వారితో సఖ్యంబు సేసి, తత్కార్యంబు దీర్పం బూనె; నింక మసలక నీహృదయేశ్వరుండు సనుదెంచు; నూఅడిల్లుము.30**

**ప్రతిపదార్థం:** అరుగుదెంచితిన్= వచ్చాను; రామలక్ష్మణులు= రాముడును లక్ష్మణుడును; అత్యంతకుశలంబునన్+ఉన్నవారు= మిక్కిలి క్షేమంగా ఉన్నారు; వానర+ఈశ్వరుండు+అయిన= కోతులకు రాజు అయిన; సుగ్రీవుండు; వారితోన్= రామలక్ష్మణులతో; సఖ్యంబు+చేసి= మైత్రినెరపి; తద్+కార్యంబు= వారిపని; తీర్పన్+పూనెన్= నెరవేర్చటానికి పూనుకొన్నాడు; ఇంకన్= ఇకమీద; మసలక= తడయక; నీహృదయ+ఈశ్వరుండు= నీభర్త శ్రీరాముడు; చనుదెంచున్= వస్తాడు; ఊఅడిల్లుము= తేరుకొమ్ము.

**తాత్పర్యం:** వచ్చాను; రామలక్ష్మణులు క్షేమంగా ఉన్నారు. కోతులరాజయిన సుగ్రీవుడితో వారు మైత్రి చేశారు. సుగ్రీవుడు రామలక్ష్మణులకు సాయం చేయటానికీ, వారికార్యం నెరవేర్చటానికీ ప్రతిజ్ఞ చేశాడు. ఇంక జాగుచేయక నీభర్త అయిన శ్రీరాముడు రాగలడు. నీవు ఊరడిల్లుము.

**క. 'రక్కసుఁడఁ గాను జుమ్మీ! । నిక్కము వానరుఁడ నేను; నీమదిలోనం**
**దక్కు మనుమాన' మనవుఁడు । నొక్కింత దలంచికొని సముత్సుక యగుచున్. 31**

**ప్రతిపదార్థం:** రక్కసుఁడన్= రాక్షసుఁడను; కాను+చుమ్మీ= కానుసుమా; నిక్కము= సత్యం; ఏను= నేను; వానరుఁడన్= కోతిని; నీమదిలోనన్= నీమనస్సులో; అనుమానము= సందేహం; తక్కుము= వీడుము; అనవుడున్= అని చెప్పగా; ఒక్క+ఇంత= కొంచెం; తలంచికొని= యోచించి; (సీత); సముత్సుక+అగుచున్= మంచి ఉత్సాహంతో కూడినది అయి.

**తాత్పర్యం:** 'నేను రాక్షసుడను కాను సుమీ; నేను నిజంగా వానరుఁడను; నీమనస్సులో సందేహం పెట్టుకొనకుము' అని నేను విన్నవించాను. సీతాదేవి కొంత యోచన చేసి ఉత్సాహంతో కూడినది అయింది.

**వ. అద్దేవి నా కిట్లనియె; 'నన్నా! ని న్నెఱింగితి; నది యెట్లనిన రామహితాన్వేషి యగువాఁ డవింధ్యుం డను వృద్ధరాక్షసుండు మున్న యింతయుం ద్రిజటచేత నా కెఱింగించె; నతని పలుకులు దప్పవు; రాఘవుండు సుగ్రీవసహాయుం డయి యునికి గలిగెం గావున నింకఁ దడయక యవ్వీరవరుం దోడ్కొని వచ్చి నాకుం బ్రియంబు సేయుము; నీకుఁ గార్యసిద్ధి యయ్యెడు; మరుగు' మని తనశిరోభూషణం బయిన యీ రత్నంబు మీకు నభిజ్ఞానార్థంబుగా నాచేతి కిచ్చి, మఱియుఁ జిత్రకూటచరితం బైన కృతకవాయసకథయునుం జెప్పి వీడ్కొల్పిన, నేను లంకాపురదాహంబుసేసి, యిట దేవర కింతయు విన్నవింపవచ్చితి' నని చెప్పి హనుమంతుండు జానకి హృదయంబు మూర్తిమంతం బైన పగిది నున్న యమ్మహామణి రాజచూడామణికి సమర్పించిన. 32**

**ప్రతిపదార్థం:** ఆ+దేవి= సీతాదేవి; నాకున్+ఇట్లు+అనియెన్= నాతో ఈవిధంగా చెప్పింది; అన్నా!= ప్రియమైన సోదరా!; నిన్నున్+ఎఱింగితిన్= నిన్ను గుర్తించాను; అది; ఎట్లు+అనినన్; రామ, హిత+అన్వేషి+అగు, వాఁడు= శ్రీరాముడిమేలును వెదకేవాడు అయిన; అవింధ్యుండు+అను= అవింధ్యుడు అనేపేరు కల; వృద్ధరాక్షసుండు= ముసలివాడయిన రక్కసుండు; మున్ను+అ= ఇంతకు ముందే; ఇంతయున్= ఈ విషయం మొత్తం; త్రిజటచేతన్= త్రిజట అనేపేరుగల ఆమెచేత; నాకున్+ఎఱింగించెన్= నాకు తెలియజేశాడు; అతనిపలుకులు= ఆ అవింధ్యుని మాటలు; తప్పవు= అసత్యాలు కావు; రాఘవుండు= శ్రీరాముడు; సుగ్రీవసహాయుండు+అయి= సుగ్రీవుడియొక్క తోడ్పాటు కలవాడయి; ఉనికి+కలిగెన్+కావునన్= ఉండటం ఏర్పడింది కాబట్టి; ఇంకన్= ఇకపై; తడయక= ఆలసించక; ఆ+వీరవరున్= శూరులలో శ్రేష్ఠుడు అయిన శ్రీరాముడిని; తోడ్కొనివచ్చి= వెంటబెట్టుకొని ఏగుదెంచి; నాకున్= నాకు; ప్రియంబు+చేయుము= సంతృప్తి కలిగించుము; నీకున్= నీకు; కార్యసిద్ధి+అయ్యెఁడున్= పని జయప్రదం కాగలదు; అరుగుము= వెళ్ళుము; అని= అని పలికి; తనశిరస్+భూషణంబు+అయిన= తనతలకు ఆభరణంగా ఉన్న; ఈ రత్నంబు= ఇదిగో ఈ కనుపిస్తున్న ఈ మణి; మీకున్= మీకు; అభిజ్ఞాన+అర్థంబుగాన్ = గుర్తు కొరకై; నాచేతికిన్+ఇచ్చి= నా చేతికి ఒసగి; మఱియున్= ఇంకను; చిత్రకూటచరితంబు+ఐన= చిత్రకూటం కడ జరిగిన; కృతక, వాయస, కథయునున్+చెప్పి= మాయకాకి వృత్తాంతాన్ని కూడా వచించి; వీడ్కొల్పినన్= వెళ్ళటానికి సెలవు దయచేయగా; ఏను= నేను; లంకాపుర, దాహంబు+చేసి= లంకాపట్టణాన్ని కాల్చి; ఇట= ఇచట; దేవరకున్= ప్రభువుకు; ఇంతయు= ఈవిషయాన్ని సవిస్తరంగా; విన్నవింపన్‌వచ్చితిన్= నివేదించటానికి వచ్చాను; అని చెప్పి= అని వచించి; హనుమంతుండు= ఆంజనేయుడు; జానకిహృదయంబు= సీత మనసు; మూర్తిమంతంబు+ఐన, పగిదిన్+ఉన్న= రూపం గైకొని కన్పించినట్లుగా ఉన్న; ఆ+మహామణిన్= ఆ గొప్ప మాణిక్యాన్ని; రాజచూడామణికిన్= రాజులలో శ్రేష్ఠుడు అయినవాడికి, శ్రీరాముడికి (చూడామణి= శిరోరత్నం= (శ్రేష్ఠవాచకం); సమర్పించినన్= వినయంతో ఇవ్వగా.

**తాత్పర్యం:** సీతాదేవి నాతో ఈ విధంగా చెప్పింది. 'ప్రియమైన అన్నా! నిన్ను గుర్తించాను. రాక్షసులు కామరూపులు. వానరవేషధారి అయి ఎవరో రాక్షసుడు ఈ విధంగా నన్ను మోసగించటానికే వచ్చినట్లు నేను భావించవచ్చును గాని నీవు రావటానికి ముందే, శ్రీరాముడిపై అభిమానం గల ఒకముసలిరక్కసుడు త్రిజటచేత శ్రీరాముడు సుగ్రీవుడితో మైత్రి నెరపినట్లు నాకు తెలియజేసిఉన్నాడు. అతడి మాటలు అబద్ధాలు కావు. ఇప్పుడు శ్రీరామదూతగా నీవు వచ్చావుకదా! ఆ మాట ఋజువు అయింది. ఇక ఆలస్యం కాకుండ సుగ్రీవుడి తోడ్పాటుతో వీరులలోశ్రేష్ఠుడు

అయిన శ్రీరాముడిని ఇటకు తోడ్కొని వచ్చి నాకు సంప్రీతిని కలిగించుము. నీకార్యం జయప్రదం కాగలదు. వెళ్ళుము' అని వచించి, గుర్తుకొరకై తన తలమీద ధరించే మాణిక్యాన్ని ఇదుగో దీనిని-నాచేతికి ఇచ్చింది. అంతేకాక, చిత్రకూటపర్వతంమీద మీరు ఉన్నప్పుడు జరిగిన మాయకాకి వృత్తాంతాన్ని కూడ నాకు చెప్పి నేను బయలుదేరటానికి సెలవు నిచ్చి దీవించి పంపింది. నేను లంకాపట్టణాన్ని కాల్చి, ఇట దేవరకు సీతాదేవి యోగక్షేమాలు చెప్పటానికై వచ్చాను' అని చెప్పి ఆంజనేయుడు ఆమణిని రాజశ్రేష్ఠుడైన శ్రీరాముడికి సమర్పించాడు. ఆ మణి కేవలం ఒకమణిగా మాత్రమే కాక సీతాదేవిహృదయమే ఆ మణిరూపం తాల్చిందా అన్నట్లు భాసించింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**ఆ.** **అమ్మనోజ్ఞరత్న మక్కునఁ గదియించి । పులక లెగయఁ గొంతప్రొద్దు విభుఁడు**
**జానకీకుచాగ్రసంగమసుప్తుఁ డై । నట్ల యుండె ముకుళితాక్షుఁ డగుచు.** **33**

**ప్రతిపదార్థం:** విభుఁడు= రాజు- రాముడు; ఆ, మనోజ్ఞ, రత్నమున్= అందమైన ఆ రతనాన్ని; అక్కునన్= గుండెకు; కదియించి= చేర్చి; పులకలు+ఎగయన్= గగుర్పాటు విస్తరించగా; కొంతప్రొద్దు= కొంతసేపు; ముకుళిత+అక్షుఁడు+ఐ= మూసిన కనులు కలవాడై; జానకీ, కుచ+అగ్ర, సంగమసుప్తుఁడు+ఐనట్లు+అ= సీతాదేవి చనుమొనల కలయిక గలిగి నిదురించిన వాడు అయినట్లుగనే; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** మనోహరమైన ఆచూడామణిని గుండెకు హత్తుకొని శ్రీరాముడు కొంతసేపు కన్నులు మూసికొనినవాడై పులకరిస్తూ సీతాదేవి వక్షంపై సుఖంగా నిదురించినవాడు అయినట్లు ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ.** **ఇట్లు రాఘవుండు సీతావృత్తాంతంబు విని తత్సమాగమకుతూహలవ్యగ్రుండై, సుగ్రీవుం జూచి 'దండయాత్ర కాయితంబు సేయు' మనినఁ 'బ్రసాదం' బని యతండు నలుదిక్కులం గల వానరనాయకులం బిలువం బంచిన.** **34**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; రాఘవుండు= శ్రీరాముడు; సీతావృత్తాంతంబు, విని= సీతయొక్కసంగతి ఆలకించి; తద్+సమ్+ఆగమ, కుతూహల, వ్యగ్రుండు+ఐ= ఆమెయొక్క కలయికయందు ఏర్పడిన కోరికయందు ఆసక్తి గలవాడయి; సుగ్రీవున్+చూచి= సుగ్రీవుడిని కాంచి; దండయాత్రకున్= విరోధులపై సేనలను నడిపే పయనానికి; ఆయితంబు+ చేయుము+ అనినన్= సన్నాహాలు చేయుము అని చెప్పగా; ప్రసాదంబు+అని= తమదయచొప్పున ఇచ్చిన ఆజ్ఞప్రకారం నడుపుతాను అని పలికి; అతండు= సుగ్రీవుడు; నలుదిక్కులన్= నాలుగు దెసలలో; కల= ఉన్నట్టి; వానర, నాయకులన్= కోతినేతలను; పిలువన్+పంచినన్= రమ్మని పిలవటానికి ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా హనుమంతుడివలన శ్రీరాముడు సీతాదేవి వృత్తాంతాన్ని విని, ఆమెతోడి కలయిక కొరకై ఆతురత చెందే హృదయం కలవాడై, సుగ్రీవుడిని చూచి 'రావణుడిపై దండెత్తటానికి తగిన సన్నాహాలను చేయు' మని అన్నాడు. సుగ్రీవుడు రాముడిఆజ్ఞను శిరసావహించి, నాలుగుదిక్కులలో ఉన్న వానరనాయకులను కిష్కింధకు రావలెనని ఆజ్ఞాపిస్తూ భటులను పంపాడు.

## వానరవీరులు నానాదేశంబులనుండి సుగ్రీవునొద్దకు వచ్చుట (సం. 3-267-1)

**క.** **శతకోటిద్వయహరిపరి। వృతులై చనుదెంచి రతులవీరులు ధీరో**
**ద్ధతులు గజుఁడు గవయుఁడు వి। శ్రుతముగ రఘుపతికిఁ దోడు సూపిరి గడఁకన్.** **35**

**ప్రతిపదార్థం:** అతుల, వీరులు= సాటిలేని పరాక్రమం కలవారు; చనుదెంచిరి= వచ్చారు; ధీర+ఉద్ధతులు= ధీరులు, ఔద్ధత్యం కలవారూ అయిన; గజుఁడు= గజుడు అనేపేరు కలవాడు; గవయుఁడు= గవయుడు అనే పేరుకలవాడు; విశ్రుతముగన్= అందరకు తెలిసేటట్లుగ; శత, కోటి, ద్వయ, హరి, పరివృతులు+ఐ= రెండువందలకోట్ల కోతులతో కూడుకొన్న వారయి; కడఁకన్= పూనికతో; రఘుపతికిన్= శ్రీరాముడికి; తోడు+చూపిరి= సహాయాన్ని ప్రకటించారు.

**తాత్పర్యం:** సాటిలేనివీరులు వచ్చారు. శత్రువులను దర్పంతో ఎదుర్కొనటానికి ఉత్సహించే శూరులు గజుడు గవయుడు అనేవారు; రెండువందలకోట్లమంది కోతులతో కూడినవారై శ్రీరాముడికి తోడుపడటానికై వచ్చారు.

**క.** **అఱువదికోటులు గపివరు। లుఱక జగత్త్రయముఁ బెలుచ నువ్వెత్తు గొనం**
**దఱిగొన్నయట్లు నడవఁగ। నెఱసి కుముదుఁ డరుగుదెంచి నృపవరుఁ గనియెన్.** **36**

**ప్రతిపదార్థం:** కుముదుఁడు= కుముదుడు (అనే వానరవీరుడు); అఱువది, కోటులు, కపివరులు= అరువదికోట్లమంది శ్రేష్ఠులైన కోతులు; ఉఱక= లక్ష్యం లేకుండా; జగత్+త్రయమున్= మూడులోకాలను; పెలుచన్= మిక్కుటంగా; ఉవ్వెత్తుగొనన్= ఆక్రమించటానికి; తఱిగొన్న+అట్లు= అవకాశాన్ని పొందినట్లు; నడవగన్ నెఱసి= నడిపించటంలో నేర్పు కలిగి; అరుగుదెంచి= వచ్చి; నృపవరున్= రాజశ్రేష్ఠుడిని - శ్రీరాముడిని; కనియెన్= సందర్శించాడు.

**తాత్పర్యం:** కుముదుడు అనే వానరవీరుడు, అరువదికోట్లమంది కోతులతో మూడులోకాలు దద్దరిల్లిపోయేటట్లుగా దండువిడిసి శ్రీరామచంద్రుడిని సందర్శించాడు.

**ఉ.** **కోటిసహస్రసేన తనుఁ గొల్వఁగ వానరకోటి కెల్లఁ దా**
**మేటి మహాబలుండు నిరమిత్త్రుఁడు మిత్త్రసహాయుఁడై తగన్**
**వీటికి నుబ్బుగాఁ జటులవేగసముచ్ఛ్రితపుచ్ఛగుచ్ఛవి**
**స్ఫోటితదిగ్విభాగుఁ డగుచుం జనుదెంచె సుషేణుఁ డత్తఱిన్.** **37**

**ప్రతిపదార్థం:** సుషేణుఁడు= సుషేణుడు (అనే పేరు కల వానరయోధుడు); ఆ+తఱిన్= ఆతరుణంలో; కోటి, సహస్ర, సేన= వేయికోట్లసైన్యం; తనున్= తనను; కొల్వఁగన్= ఆరాధించగా; వానరకోటికిన్+ఎల్లన్= కోతులగుంపులకు అన్నింటికి; తాన్= తాను; మేటి= అధికుడు; మహా, బలుండు= గొప్పబలం కలవాడు; నిరమిత్త్రుఁడు= శత్రువులు లేనివాడు; మిత్త్ర సహాయుఁడు+ఐ= స్నేహితుల సాయంతో కూడినవాడై, అనగా మిత్త్రులతో పాటుగా; తగన్= సముచితంగా; వీటికిన్= దండుకు; ఉబ్బుగాన్= ఉత్సాహం పొంగులు వారేటట్లుగా; చటుల, వేగ, సమ్+ఉత్+శ్రిత, పుచ్ఛ, గుచ్ఛ, విస్ఫోటిత, దిక్+విభాగుఁడు+అగుచున్= మిక్కుటమైన రయంతో బాగుగా ఎత్తబడిన తోకల సముదాయంతో ఛేదించబడిన దెసల విభాగాలు కలవాడు ఔతూ; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** వేయికోట్లమంది వానరభటులు తనను కొలువగా సుషేణుడు కిష్కింధానగరానికి విచ్చేశాడు. అతడు మహాబలవంతుడు. శత్రువులు లేనివాడు. మిత్రులతో గూడినవాడై వానరసేనకు ఉత్సాహజనకంగా వేగాతిశయంతో పైకెత్తిన తోకల తాకిడికి దిక్కుల విభాగాలను ఛేదిస్తూ వచ్చాడు.

**క. గణుతింపరాని వానర । గణములతో దధిముఖుండు కాకుత్స్థకులా**
**గ్రణికిఁ బ్రియంబుగ వచ్చె ధ । రణి భాగము వాహినీచరణదళితముగన్. 38**

**ప్రతిపదార్థం:** గణుతింపన్‌రాని= లెక్కకు మించిన; వానర గణములతోన్= కోతుల గుంపులతో; దధిముఖుండు= దధిముఖుడు (అనే పేరు కలవాడు); కాకుత్స్థ, కుల+అగ్రణికిన్= కకుత్స్థునివంశంలో శ్రేష్ఠుడు అయినవాడికి- శ్రీరాముడికి; ప్రియంబుగన్= ప్రీతి కలిగించేటట్లుగా; ధరణి భాగము= భూప్రదేశం; వాహినీ, చరణ, దళితముగన్= సేనలయొక్క కాళ్లచేత చీల్చబడినదికాగా; వచ్చెన్= అరుదెంచాడు.

**తాత్పర్యం:** లెక్కకు మించిన కోతులగుంపులతో దధిముఖుడు అనే వానరనేత, శ్రీరాముడికి ప్రీతి కలిగించేటట్లుగా భూమిభాగం దద్దరిల్లేటట్లు సేనల నడిపించుకొంటూ వచ్చి చేరాడు.

**ఆ. శతసహస్రకోటిసంఖ్యల యెలువులు । గొలువ జలదనీలఘోరమూర్తి**
**జాంబవంతుఁ డతులసత్త్వుఁ డేతెంచె నా । భూపవరునికార్యమునకుఁ బూని. 39**

**ప్రతిపదార్థం:** అతుల, సత్త్వుఁడు= సాటిలేని బలం కలవాడు; జలద, నీల, ఘోర, మూర్తి= మేఘం వలె నల్లని భయంకరమైన ఆకారం కలవాడు; జాంబవంతుఁడు= జాంబవంతుడు (అనే ఎలుగు రేడు); శత, సహస్ర, కోటి,+ఎలువులు= వందవేలకోటి భల్లూకాలు; కొలువన్= సేవిస్తుండగా; ఆ భూపవరుని కార్యమునకున్= ఆ రాజుయొక్క (శ్రీరాముడియొక్క) పనికి; పూని= పూనుకొని; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** జాంబవంతుడు ఎలుగురేడు, సాటిలేని బలం కలవాడు, నల్లనిమేఘంవలె భయంకరమైన రూపం కలవాడు; వందవేయికోట్లభల్లూకసేనతో శ్రీరాముడిపనిని నెరవేర్చటానికి వచ్చాడు.

**వ. మఱియు, ననేకు లనేకసహస్రసంఖ్యల బలంబులతోడం జనుదెంచి; రిట్లు గూడిన కపివీరులు వివిధాకారు లపారబలశౌర్యసారు లతిఘోరంబుగాఁ బేర్చి నిగుడుచు, మగుడుచుం, దాఁటుచుఁ బాఱుచుం, దిరుగుచు, సురుఁగుచు, మలయుచుఁ, బొలయుచు, మత్తిల్లి గిరిగుహలయందును దరువనంబులయందును, సరి దుపాంతంబులయందును నానందంబున విహరించుచుండిరి; తదనంతరంబ. 40**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; అనేకులు= పెక్కుమంది; అనేక, సహస్ర, సంఖ్యల= పెక్కువేల లెక్కగల; బలంబులతోడన్= సేనలతో; చనుదెంచిరి= వచ్చారు; ఇట్లు= ఈ రీతిగా; కూడిన= చేరిన; కపి వీరులు= కోతుల యోధులు; వివిధ+ఆకారులు= పెక్కు ఆకృతులు కలవారు; అపార, బల, శౌర్యసారులు= మితిమీరిన శక్తియొక్క, పరాక్రమంయొక్క నిగ్గు కలవారు; అతిఘోరంబుగాన్= మిక్కిలి భయంకరంగా; పేర్చి= అతిశయించి; నిగుడుచున్= ముందుకుసాగుతూ; మగుడుచున్= వెనుకకు తిరుగుతూ; తాఁటుచున్= సమీపిస్తూ; పాఱుచున్= పరుగెత్తుతూ; తిరుగుచున్= నడయాడుతూ; సురుఁగుచున్= అదృశ్యమౌతూ; మలయుచున్= మలుపులు తిరుగుతూ; పొలయుచున్= సంచరిస్తూ; మత్తిల్లి= గర్వించి; గిరి గుహలయందునున్= కొండబిలాలలోను; తరువనంబుల+అందును= చెట్లతోటల లోను; సరిత్+ఉపాంతంబుల+అందును= నదుల గట్టులమీదను; ఆనందంబునన్= సంతసంతో; విహరించుచున్+ఉండిరి= వేడుకతో తిరుగుతున్నారు; తత్+అనంతరంబు+అ= ఆ పిదప.

**తాత్పర్యం:** ఇంకను వేనకువేలు కోతులగుంపులతో వానరనాయకులు పెక్కుమంది కిష్కింధకు వచ్చారు. ఆ విధంగా గుమిగూడిన కోతులు పెక్కు ఆకారాలు గల వీరులు; గొప్పపరాక్రమం కలవారు; భయంకరంగా విహరించారు. ఎటు చూచినా కోతులమూక. చెట్లతోటలలో కొండగుహలలో గంతులు వేస్తూ విచ్చలవిడిగా తిరుగాడుతూ విర్రవీగుతూ ఒండొరులను తారసిల్లుతూ మత్తిల్లి ఆ వానరవీరులు సంచరిస్తూ ఉన్నారు. అప్పుడు.

**మ. ప్రభ నొప్పారి యనుంగుఁదమ్ముఁడు మహాభాగుండు సౌమిత్రి వీ**
**తభయుండై కొలువం గపీంద్రబలసంతానంబుతో నుద్ధతిన్**
**శుభలగ్నంబున రాఘవుండు గదలెన్ సుగ్రీవసాహాయ్యసం**
**ప్రభవోత్సాహ మెలర్ప దర్పితరిపుప్రాలేయతిగ్మాంశుఁ డై. 41**

**ప్రతిపదార్థం:** రాఘవుండు= శ్రీరాముడు; ప్రభన్= కాంతితో; ఒప్పారి= విలసిల్లి; అనుంగు+తమ్ముఁడు= ప్రియమైన అనుజుడు లక్ష్మణుడు; మహాభాగుండు= గొప్పవాడు; సౌమిత్రి=సుమిత్ర కొడుకు; వీత భయుండు+ఐ= పోయిన భయం కలవాడై; కొలువన్= సేవించగా; కపి+ఇంద్ర, బల, సంతానంబుతోన్= వానర శ్రేష్ఠులతో కూడిన సేనల సమూహాలతో; ఉద్ధతిన్= దర్పంతో; శుభలగ్నంబునన్= మంచి ముహూర్తంలో; సుగ్రీవ, సాహాయ్య సంప్రభవ+ఉత్సాహము= సుగ్రీవుడియొక్క తోడ్పాటు వలన ఉద్భవించిన ఉత్సాహం; ఎలర్పన్= అతిశయించగా; దర్పిత= గర్వించిన; రిపు, ప్రాలేయ తిగ్మ+అంశుఁడు+ఐ= శత్రువులు అనే మంచుకు చండకిరణాలు కల సూర్యుడివంటివాడై; కదలెన్= సాగాడు (దండయాత్రకు ఉపక్రమించాడు).

**తాత్పర్యం:** సుమిత్రకొడుకు అయిన లక్ష్మణుడు దేదీప్యమానంగా వెలుగొందుతూ తనను అనుసరించగా, సుగ్రీవుడి సాయం కల్గించిన ఉత్సాహంతో వానర సేనలతోపాటు దర్పంతో కూడినవాడయి శ్రీరాముడు శుభముహూర్తంలో దండయాత్రకు బయలుదేరాడు. అప్పుడు శ్రీరాముడు శత్రువు లనే మంచును సులువుగా ఛేదించగల సూర్యుడై భాసించాడు.

**విశేషం:** అలం: రూపకం. శత్రు విచ్ఛేదకుడైన శ్రీరాముడికీ, మంచును ఛేదించే సూర్యుడికీ అభేదాధ్యవసాయం కల్పించబడింది.

**ఉ. ఆ హరివీరవాహినుల కన్నిటికిన్ మొగమై మరుత్సుతుం**
**డాహవదోహళుం డమరె నంగద నీల నలాది వీరు లు**
**త్సాహము మీఱ నయ్యయి దెసం దగు కావలి యై సమగ్ర స**
**న్నాహమహోగ్రతం జనిరి నాకవిరోధివధాభిలాషులై. 42**

**ప్రతిపదార్థం:** ఆ, హరి, వీర, వాహినులకున్+అన్నిటికిన్= ఆ కోతుల యోధుల సేనలు సమస్తానికి; మొగము+ఐ= ముందు ఉన్నవాడై; మరుత్+సుతుండు= వాయునందనుడు- హనుమంతుడు; ఆహవదోహలుండు= యుద్ధంలో ఉత్సాహం కలవాడు; అమరెన్= ఒప్పాడు; అంగద, నీల, నల+ఆది వీరులు= అంగదుడు, నీలుడు, నలుడు మున్నగు శూరులు; ఉత్సాహము మీఱన్= ఉత్సాహం అతిశయించగా; అయ్యయి దెసన్= ఆయా వైపుల; తగు= సముచితమైన; కావలి+ఐ= రక్షణకు అమరియుండిన వారై; సమగ్ర, సన్నాహ, మహా+ఉగ్రతన్= పరిపూర్ణమైన ప్రయత్నాలు చేసి మిక్కిలి భయంకరంగా; నాక, విరోధి, వధ+అభిలాషులు+ఐ= స్వర్గ శత్రువు అనగా రాక్షసుడైన (రావణాసురుడిని) సంహరించవలె ననే కోరిక కలవారై; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** యుద్ధం చేయటంలో మిక్కుటమైన ఉత్సాహం కలవాడైన వాయునందనుడు ఆ కోతుల సేనలకు అన్నిటికీ మార్గదర్శకుడై నాయకత్వం వహించి ముందున్నాడు. అంగదుడు నీలుడు నలుడు మున్నగు యోధులు ఆయావైపుల సేనలకు రక్షణ కల్పిస్తూ భయాన్ని కలిగించే రూపాలతో స్వర్గవిరోధి అయిన రావణాసురుడిని సంహరించే కోరికతో దండు వెడలారు.

**వ. ఇట్లు నడచి యెడనెడం బ్రభూతవన్యఫలజలాశయంబు లగు ప్రదేశంబుల విడియుచుం గపిసైన్యంబు గతిపయదినంబులకు దక్షిణోదధితీరంబు సేరి రెండగు వారాశియుంబోలె ఘూర్ణిల్లుచుండె; నంత రాఘవుండు రవితనయుం జూచి యి ట్లనియె. 43**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నడచి= (దండెత్తి) వెళ్లి; ఎడన్+ఎడన్= అక్కడ అక్కడ; ప్రభూత, వన్య, ఫల, జల+ఆశయంబులు+అగు= గొప్ప అడవిపండ్లు, చెరువులు కల; ప్రదేశంబులన్= స్థలాలలో; విడియుచున్= తాత్కాలికంగా ఆగుతూ; కపిసైన్యంబు= కోతుల సేన; కతిపయ దినంబులకున్= కొన్ని రోజులకు; దక్షిణ+ఉదధి, తీరంబు= దక్షిణదిశలో ఉన్న సముద్రపు గట్టు; చేరి= సమీపించి రెండు+అగు= రెండవది అయిన; వారాశియున్+పోలెన్= సముద్రం వలె; ఘూర్ణిల్లుచుండెన్= తిరుగుళ్ళుపడుతూ గొప్ప ధ్వనిని చేస్తూ ఉండింది; అంతన్= పిదప; రాఘవుండు= శ్రీరాముడు; రవి తనయున్+చూచి= సుగ్రీవుడిని చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** కపిసైన్యం ఈ రీతిగా సాగి, అడవిపండ్లు, చెరువులు ఎక్కువగా గల స్థలంలో తాత్కాలికంగా ఆగుతూ కొన్నిదినాలకు దక్షిణసముద్రతీరాన్ని చేరి తిరుగుళ్ళుపడుతూ పెద్దధ్వని చేస్తూ, రెండవ సముద్రమా అన్నట్లు ఉండింది. అంతట, సేనలు ముందుకు వెళ్ళటానికి వీలు లేకుండటం చూచి శ్రీరాముడు సుగ్రీవుడితో ఇట్లా పలికాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. 'మనబలమును నతిబహుళము । వననిధియును దుస్తరంబు వానరవర! యి**
**వ్వననిధిఁ గడచు నుపాయము । మన కొక్కటి నిశ్చయింపుమా తగుభంగిన్.' 44**

**ప్రతిపదార్థం:** వానరవర!= కోతులలో శ్రేష్ఠుడా!,; మన బలమునున్= మన సేనయూ; అతి బహుళము= మిక్కిలి విస్తృతమైనది; వననిధియును= ఇక సముద్రమందుమా; దుస్తరంబు= దాట రానిది; ఈ+వననిధిన్= ఈ సముద్రాన్ని; కడచు+ఉపాయము= దాటే మార్గం; మనకున్+ఒక్కటి= మనకున్ వీలైనది ఒకటి (ఒక ఉపాయం); తగు భంగిన్= సముచితంగా; నిశ్చయింపునూ= నిర్ణయించవలసినది.

**తాత్పర్యం:** 'కోతులలో శ్రేష్ఠుడ వైన ఓ సుగ్రీవా! మనసేన అపరిమితం. ఈ సముద్రమా దాటరానిది. ఈ సముద్రాన్ని దాటటానికి మనకు వీలు చాలు గల ఉపాయాన్ని నీవే నిర్ణయించవలసిఉన్నది.

**తే. అని విచారించునెడ కొంద అధిపుఁ జూచి । 'జడధి బలితంపుఁ దెప్పలఁ గడత' మనిరి;**
**'ఘనపుఁ గలముల సమకట్టి గడత' మనిరి । కొంద; అంతయు విని రఘునందనుండు. 45**

**ప్రతిపదార్థం:** అని= అని; విచారించు+ఎడన్= ఆలోచించేటప్పుడు; కొందఱు= కొంతమంది; అధిపున్+చూచి= శ్రీరాముడిని కాంచి; జడధిన్= సముద్రాన్ని; బలితంపు+తెప్పలన్= పెద్ద కట్టుమానులతో; కడతము= దాటుదాం; అనిరి= అని చెప్పారు;

కొందఱు= కొంతమంది; ఘనము+కలములన్= పెద్ద పడవలను; సమకట్టి= నిర్మించి; కడతము+అనిరి= దాటుదాం అని పలికారు; రఘునందనుండు= శ్రీరాముడు; అంతయున్= (వారు అందరు చెప్పింది) సర్వమును; విని= ఆలకించి.

**తాత్పర్యం:** అని ఆలోచించే సమయంలో శ్రీరాముడిని చూచి కొందరు 'తెప్పలు కట్టి సముద్రాన్ని దాటుదాం' అని చెప్పారు. మరికొందరు 'పడవలు నిర్మించి సముద్రాన్ని దాటుదాం' అని పల్కారు. అందరు చెప్పిన మాటలు విని శ్రీరాముడు.

**సీ. అల్లన నగుచు నిట్లనియె: 'మీ చెప్పుటల్ । దగిన యుపాయంబు లగున; యయిన**
**నగణితం బైన యీ హరిసైన్యముల కెల్లఁ । గలములుఁ దెప్పలు వలయునన్ని**
**సమకట్టు టరయ నశక్యంబు; శతయోజ । నంబుల పరపైన యంబురాశిఁ**
**గలములఁ దెప్పలఁ గడచుచో రిపుకోటి । యెడరునఁ బైఁబడి పొడువకున్నె?**

**ఆ. యదియుఁగాక యల్పులగు వణిగ్జనముల । యోజ శూరతతికిఁ దేజ మగునె?**
**కాన నాదుమతము గా దివ్విధంబు; నా । మనసు నిశ్చయంబు వినుఁడు మీరు. 46**

**ప్రతిపదార్థం:** అల్లన నగుచున్= మెల్లగా నవ్వుతూ-చిరునవ్వు నవ్వుతూ; ఇట్లు+అనియెన్; మీ చెప్పుటల్= మీరు చెప్పేమాటలు; తగిన= సరిపోయే; ఉపాయంబులు+అగును+అ= వెరవులు అయినవే; అయినన్= కాని; అగణితంబు+ఐన= లెక్కకు మీరిన; ఈ హరి సైన్యములకున్+ఎల్లన్= ఈ కోతులసేనలన్నింటికిని; కలములున్= పడవలు; తెప్పలు= కట్టుమ్రానులు; వలయు+అన్ని= కావలసినన్ని; సమకట్టుట= నిర్మించటం; అరయన్= యోచించగా; అశక్యంబు= సాధ్యం కానిది; శతయోజనంబుల= వంద ఆమడల; పరపు+ఐన= విస్తీర్ణం కల; అంబురాశిన్= సముద్రాన్ని; కలములన్= పడవలతో; తెప్పలన్= కట్టుమ్రానులతో; కడచుచోన్= దాటేటప్పుడు; రిపుకోటి= శత్రు సమూహం; ఎడరునన్= సందుచూచి; పైన్+పడి= మీద పడి; పొడువక+ఉన్నె?= హింసించదా?; అదియున్+కాక= అంత మాత్రమే కాక; అల్పులు+అగు= తక్కువవారైన; వణిక్+జనముల+ఓజ= వర్తకం చేసే ప్రజల మాదిరిగా ప్రవర్తించటం; శూర, తతికిన్= వీరుల సముదాయానికి; తేజము+అగునె= వర్చస్సు ఔతుందా? (అది ప్రకాశించే పద్ధతి కాదు); కానన్= కావున; నాదు, మతము= నా అభిప్రాయం; ఈ+విధంబు= (తెప్పలపై పడవలపై సముద్రాన్ని దాటటం); కాదు= కాదు; నా మనసు నిశ్చయంబు= నా హృదయంలోని నిర్ణయం; మీరు= (ఓ వానరులారా) మీరు; వినుఁడు= ఆలకించండి.

**తాత్పర్యం:** మందహాసం చేస్తూ శ్రీరాముడు ఈ విధంగా: 'మీరు చెప్పిన మాటలుకూడా తగిన ఉపాయాలే కాని అవి నాకు అంతగా ఇష్టాలు కావు. ఏలన, మన సైన్యమూ, లెక్కకు మించిది. ఇంతటి సేనకు సరిపోయే తెప్పలు, పడవలు సమకూర్చటం సాధ్యం కాదు. సముద్రమా వందఆమడలకు మించిన విస్తీర్ణం కలది. మనం పడవలమీద తెప్పలమీద ఇంత విస్తీర్ణం గల సముద్రాన్ని దాటుతున్నంతసేపు శత్రుసమూహాలు కనులు అప్పగించి ఊరక చూస్తూ ఉంటాయా? అవకాశంచూచి మనమీద పడి హింసించరా? అంతేకాక మనం వీరులం. సముద్రాన్ని దాటేది శత్రుసంహారానికి గాని వర్తకవ్యాపారం చేయటానికి కాదు. బలపరాక్రమాలు ప్రదర్శించి మనం వీరులుగా మెలగవలెను గాని వర్తకులమాదిరి ప్రవర్తించరాదు. నా మనసులోనిమాట చెప్పుతాను వినండి.

**చ. వ్రతము ధరించి నిష్ఠ నుపవాసవిధిం గొలుతున్ సముద్రు; నా**
**కితఁడు ప్రసన్నుఁడై తెరువు నిచ్చుట యంతయుఁ గల్గెనేని మే;**

**లితరునిఁగా ననుం దలఁచెనేని నమానుషరోషవేగదీ**
**పితశరవహ్ని నిజ్జలముఁ బీల్చెదఁ బ్రేల్చెద నొక్క వ్రేల్మిడిన్.' 47**

**ప్రతిపదార్థం:** వ్రతము ధరించి= నోము పట్టి; నిష్ఠన్= దీక్షతో; ఉపవాస విధిన్= ఆహారాన్ని విసర్జించే విధానంతో; సముద్రున్= సముద్రుడిని; కొలుతున్= ఆరాధిస్తాను; ఇతఁడు= ఈ సముద్రుడు; నాకున్= నాకు; ప్రసన్నుఁడు+ఐ= ఆదరం కలవాడై; తెరువున్+ఇచ్చుట+అంతయున్+కల్గెన్+ఏనిన్= దారిని ఇవ్వడం పూర్తిగా జరిగితే; మేలు= మంచిది; ననున్= నన్ను; ఇతరునిన్+కాన్= సామాన్య మానవునిగా (అనగా తనకు అభిమానపాత్రుడు కానివాడినిగా); తలంచెన్+ఏనిన్= తలపోస్తే; అమానుష, రోష, వేగ, దీపిత, శర, వహ్నిన్= మనుజులకు అతీతమైన కోపంయొక్క రయంచేత ప్రజ్వలింప చేయబడిన బాణాలు అనే అగ్నిచేత; ఈ+జలమున్= ఈ సముద్రజలాలను; పీల్చెదన్= ఇంకింప చేస్తాను; ఒక్క వ్రేల్మిడిన్= ఒక్క చిటికెలో; ప్రేల్చెదన్= సెగచేత ఉడికేటట్లు చేస్తాను.

**తాత్పర్యం:** నేను ఆహారం విసర్జించి ఉపవాసవ్రతంతో సముద్రుడిని ఆరాధిస్తాను. ఇది సౌమ్యపద్ధతి. సముద్రుడు సంతృప్తి చెంది నాకు ప్రసన్నుడై, దారి ఇస్తే శుభం. లేదా నాపై అభిమానం చూపకుంటే సాత్త్విక పద్ధతిని విడనాడి రాజసపద్ధతి వహించి నా బాణాగ్నితో జలాలను ఇంకింప జేస్తాను, సాగరుణ్ణి తుకతుక ఉడికింప జేస్తాను.

### రాముఁడు దర్భశయనుండై సముద్రుం బ్రార్థించుట (సం. 3-267-30)

**వ. అని పలికి దశరథాగ్రసూనుండు దానును దమ్ముండును నుపవసించి దర్భశయను లై జలధీంద్రు నుపాసించి యున్నంత సముద్రుండు సకలజలచరప్రకరపరివారుండై రాఘవునకుం బొడసూపి 'యయ్యా! నీవలనఁ బ్రీతుండ నైతి; నీ కెయ్యది ప్రియంబు సేయుదుఁ? జెప్పు 'మనిన నతండు' నాకు లంకపై నరుగం దెరు విచ్చునది; యీనినాఁడు సూర్యనిభంబులైన మదీయదివ్యాస్త్రంబుల నిన్ను శోషింపం జేయుదు' ననిన విని సరిత్పతి రఘుపతి కి ట్లనియె. 48**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని వచించి; దశరథ+అగ్ర సూనుండు= దశరథుడియొక్క పెద్దకొడుకు శ్రీరాముడు; తానును= తానున్నూ; తమ్ముండును= లక్ష్మణుడున్నూ; ఉపవసించి= నిరాహార దీక్షను పూని; దర్భశయనులు+ఐ= దర్భలమీద పండుకొనిన వారై; జలధి+ఇంద్రున్= సముద్రశ్రేష్ఠుడిని; ఉపాసించి+ఉన్నంతన్= ఆరాధన చేసి ఉన్నమీదట; సముద్రుండు= సముద్రుడు; సకల, జలచర, ప్రకర, పరివారుండు+ఐ= సమస్తమైన నీటిలో తిరుగాడు జంతువుల సముదాయాలను తనకు అనుచరులుగా చేసికొనినవాడై; రాఘవునకున్= శ్రీరాముడికి; పొడసూపి= కనుపించి; అయ్యా= ఆర్యా; నీ వలనన్= నీ యందు; ప్రీతుండన్+ఐతి= ప్రీతి కలిగినవాడను అయినాను; నీకున్+ఏ+అది= నీకున్ ఏది; ప్రియంబు= ఇష్టం; చేయుదున్= చేయగలను; చెప్పుము= వచించుము; అనినన్= అని వచించగా; అతండు= శ్రీరాముడు; నాకున్= నాకు; లంకపైన్+అరుగన్= లంకపై దండెత్తటానికి; తెరువు+ఇచ్చునది= దారి ఇమ్ము; ఈని నాఁడు= ఇవ్వని సమయంలో; సూర్య, నిభంబులు+ఐన= సూర్యుడితో సమానాలు అయిన; మదీయ, దివ్య+అస్త్రంబులన్= నావైన దేవతామహిమ గల ఆయుధాలచేత; నిన్నున్= (ఓ సముద్రుడా) నిన్ను; శోషింపన్+చేయుదున్= ఎండించగలను; అనినన్= అని (రాముడు) చెప్పగా; విని= ఆలకించి; సరిత్+పతి= నదులకు భర్త అయిన సముద్రుడు; రఘుపతికిన్= శ్రీరాముడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి, దశరథుడి పెద్దకొడుకు శ్రీరాముడును అతడి తమ్ముడు లక్ష్మణుడును నిరాహారదీక్ష పూని దర్భలపై పండుకొని సముద్రుడిని ఆరాధించారు. శ్రీరామలక్ష్మణులవ్రతమును మెచ్చి సముద్రుడు తన

జలచరపరివారంతో ప్రత్యక్షమై రాముడితో ఇట్లా చెప్పాడు. 'ఆర్యా! నీవు నన్ను ప్రీతుడిని చేశావు. నీకు ఇష్టమైనది చెప్పుము చేయగలను' అని పల్కగా అంతట శ్రీరాముడు సముద్రుడితో తనకు లంకా పట్టణంపై దండెత్తటానికి దారి నిమ్మని అర్థించి, అట్లా దారిని ఇవ్వనిచో తాను సూర్యసమానా లయిన తన దివ్యాస్త్రాలను ప్రయోగించి సముద్రజలాల నింకింప జేస్తా నని చెప్పాడు. అంతటఁ నదులకుభర్త అయిన సముద్రుడు రఘుపతి అయిన శ్రీరాముడితో ఇట్లా పలికాడు.

**సీ. 'జననాథ! నీ కార్యమునకు నే విఘ్నంబు । గావింప నోడుదు నే విధమున;**
**వినుము! నా వాక్యంబు; జను లెల్ల నెఱుఁగ నీ । కిత్తఱి నేఁ దెరు విత్తునేని**
**నిల నెల్లవాఁడును విలసిత దివ్యాస్త్ర । బలమున సాధింపఁ దలఁచు నన్ను;**
**మీయందుఁ గపివీరుఁ డాయతమతి విశ్వ । కర్మసూనుఁడు శిల్పికర్మవిదుఁడు**

**ఆ. నలుఁడు నాఁగ నొకఁడు గలఁడు; వాఁ డొలసి నా । యందుఁ దరులు గిరులు నొంద వైవ**
**నవి ధరింతు నేను; దివిరి నీ కది సేతు । వుగఁ గడంక నరిగి పగఱ గెలుము.' 49**

**ప్రతిపదార్థం:** జననాథ!= ఓ రాజా, శ్రీరామా!; నీ కార్యమునకున్= నీ పనికి; ఏన్= నేను; ఏ విధమునన్= ఏ రీతిగా నయినా; విఘ్నంబున్= అడ్డు; కావింపన్= చేయటానికి; ఓడుదున్= జంకుతాను; నా వాక్యంబు= నా మాట; వినుము= ఆలకింపుము; జనులు+ఎల్లన్= ప్రజలందరు; ఎఱుఁగన్= తెలిసేటట్లుగా; నీకున్= నీకు; ఈ+తఱిన్= ఈ సమయంలో; ఏన్= నేను; తెరువున్= మార్గాన్ని; ఇత్తున్+ఏనిన్= ఇచ్చినట్లయితే; ఇలన్= భూమిమీద; ఎల్లవాఁడును= ప్రతి ఒక్కడున్నూ; విలసిత, దివ్య+అస్త్ర, బలమునన్= శోభిల్లునట్టి దేవతా మహిమ గల ఆయుధాలచేత; నన్నున్= నన్ను; సాధింపన్+తలఁచున్= లోబరచుకొనటానికి తలపోస్తాడు; మీ+అందున్= మీలో; కపివీరుఁడు= కోతులలో యోధుడు; ఆయతమతి= మేధావి; విశ్వకర్మ సూనుఁడు= విశ్వకర్మయొక్క కొడుకు; శిల్పి కర్మ విదుఁడు= రాతి కట్టడాలకు సంబంధించిన కళ తెలిసినవాడు; నలుఁడు, నాఁగన్= నలుడు అనగా; ఒకఁడు= ఒకడు; కలఁడు= ఉన్నాడు; వాఁడు= అతడు, ఆ నలుడు; ఒలసి= పూనుకొని; నాయందున్= నాలో (సముద్రంలో); తరులు= చెట్లు; గిరులు= పర్వతాలు; ఒందన్, వైవన్= పోలునట్లుగా వేసినచో; అవి= ఆ తరులు గిరులు; ఏను= నేను; ధరింతున్= వహిస్తాను; తివిరి= పూని; నీకున్= నీకు; అది= అయ్యది (ఆ తరువులు కొండలు); సేతువుగన్= వారధికాగా; కడంకన్= పూనికతో; అరిగి= వెళ్ళి; పగఱన్= శత్రువులను; గెలుము= జయించుము.

**తాత్పర్యం:** 'జనులకు ప్రభువైన ఓ శ్రీరామా! ఏ విధముగానూ నీ పనికి నేను అంతరాయం కలిగించజాలను సుమీ. అయినను - ముందు నా విన్నపాన్ని ఆలకించుము. ఈనాఁడు ప్రజలు అందరికి తెలిసేటట్లుగా, నీకు నేను దారిని ఇస్తే ఇక అందరు కూడా నన్ను దివ్యాస్త్రాలు ప్రయోగించి వశంచేసికొన చూస్తారు. అది మంచిది కాదు. అంతకంటె మంచి ఉపాయాన్ని మీకు సూచిస్తాను. మీ సేనలలో నలుడు అనే పేరు గల శిల్పకళావేత్త ఉన్నాడు. అతడు విశ్వకర్మయొక్క కొడుకు. అతడు నాయందు చెట్లు చేమలను కొండలను వేస్తే నేను వాటిని భరించగలను. అది మీకు వారధిగా ఉపకరించగలదు. అప్పుడు ఆ వారిధిపై మీరు పయనించి శత్రువులను గెలవండి'.

**వ. అని యతని నొడంబఱిచి సముద్రుండు సనుటయు, నమ్మహీపతి నలు రావించి సేతుబంధనంబు సేయ నియోగించిన, ననేకవానరసహస్రంబులు నలుదిక్కులకుఁ బఱచి గిరిశిఖరంబులుఁ దరునికరంబులు విఱిచి తెచ్చియిచ్చుచుండ నన్నలుండు మున్నీటి యందు శతయోజనాయామంబును దశయోజనవిస్తారంబునుంగా నతిదృఢం బగు సేతుబంధనంబు నిర్మించె నయ్యవసరంబున. 50**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; అతనిన్= అతడిని, ఆ రాముడిని; ఒడంబఱిచి= అంగీకరింప జేసి; సముద్రుండు= సముద్రుడు; చనుటయున్= వెడలుటయున్నూ; ఆ+మహీపతి= ఆ రాజు - శ్రీరాముడు; నలున్= నలుడిని; రావించి= పిలిపించి; సేతుబంధనంబు+చేయన్= వారధి కట్టటానికి; నియోగించినన్= నియమించగా; అనేక, వానర, సహస్రంబులు= పెక్కువేల కోతులు; నలుదిక్కులకున్= నాలుగు దెసలకు; పఱచి= వేగంగా వెడలి; గిరి శిఖరంబులు= కొండల పై భాగాలు; తరునికరంబులు= చెట్ల సముదాయాలు; విఱిచి తెచ్చి= ముక్కలు చేసి తెచ్చి; ఇచ్చుచున్+ఉండన్= ఇస్తూ ఉండగా; ఆ+నలుండు; మున్నీటియందున్= సముద్రంలో; శతయోజన+ఆయామంబును= వంద ఆమడల పొడుగును; దశయోజన విస్తారంబునుంగాన్= పది ఆమడల వెడల్పును కలిగినదిగా; అతి దృఢంబు+అగు= మిక్కిలి గట్టిదైన; సేతుబంధనంబు= వారధి; నిర్మించెన్= కట్టాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని రాముడిని అంగీకరింపజేసి సముద్రుడు వెళ్ళాడు. శ్రీరాముడు నలుడిని పిలిపించి వారధి కట్టటానికి నియమించాడు. పెక్కువేల కోతివీరులు నాలుగుదిక్కులకు వేగంగా వెళ్ళి పర్వతశిఖరాలను, చెట్ల సముదాయాలను తెచ్చి ఇస్తూ ఉండగా, నలుడు వంద ఆమడల పొడుగు, పది ఆమడల వెడల్పుగల గట్టిదైన వారధిని నిర్మించాడు. ఆ సమయంలో.

**ఆ. అన్నతోడ నలిగి యాప్తులుఁ దాను వి । భీషణుండు వినయభూషణుండు**
**నెమ్మి నరుగుదెంచి నృపశిరోమణి రాము । శరణుఁ జొచ్చె భక్తిభరితుఁ డగుచు. 51**

**ప్రతిపదార్థం:** వినయ భూషణుండు= అణకువయే ఆభరణంగా కలవాడు; విభీషణుండు; అన్నతోడన్+అలిగి= అగ్రజుడిపై (రావణుడిపై) కోపించి; ఆప్తులున్+తానున్= మిక్కిలి చేరువగా ఉండే మిత్రులున్నూ తాను; నెమ్మిన్= సంప్రీతితో; అరుగుదెంచి= వచ్చి; నృప, శిరస్+మణిన్= రాజులలో శ్రేష్ఠుడిని; రామున్= శ్రీరాముడిని; భక్తి, భరితుఁడు+అగుచున్= భక్తితో నిండినవాడు అగుచు; శరణున్+చొచ్చెన్= శరణువేడాడు, ఆశ్రయాన్ని అర్థించాడు.

**తాత్పర్యం:** వినయశీలుడైన విభీషణుడు అన్న అయిన రావణుడిపై ఆగ్రహించి, తన హృదయానికి సన్నిహితులైన మిత్రులతో పాటుగ సంప్రీతితో అరుదెంచి శ్రీరాముడిని శరణుజొచ్చాడు.

**క. ఆ రాక్షసవృషభుని యా । కారము నింగితముఁ జూచి కాకుత్స్థకులో**
**ద్ధారుఁ డతని నతిధార్మికుఁ । గా రూపించి ముద మొప్పఁ గైకొనియెఁ దగన్. 52**

**ప్రతిపదార్థం:** ఆ రాక్షస వృషభుని ఆకారమున్= ఆ రక్కసులలో శ్రేష్ఠుడు అయినవాని (విభీషణుడియొక్క) రూపం; ఇంగితమున్+చూచి= మనసులోని భావం తెలిపే ముఖరేఖలు మున్నగునవి గమనించి; కాకుత్స్థ, కుల+ఉద్ధారుఁడు= కాకుత్స్థవంశాన్ని ఉద్ధరించేవాడు, శ్రీరాముడు; అతనిన్= విభీషణుడిని; అతి ధార్మికుఁగాన్= మిక్కిలి ధర్మనిష్ఠుడిగా; రూపించి= నిర్ధారణ చేసి; తగన్= తగినవిధంగా; ముదము+ఒప్పన్= సంతోషం శోభిల్లేటట్లుగా; కైకొనియెన్= స్వీకరించాడు.

**తాత్పర్యం:** రాక్షసనాయకుడైన విభీషణుడి రూపరేఖాముఖవైఖరులను పరిశీలించి కాకుత్స్థవంశాన్ని ఉద్ధరించే శ్రీరాముడు అతడిని ధార్మికులలో గొప్పవా డని నిశ్చయించి అతడికి అభయప్రదానం చేశాడు.

**విశేషం:** (1) రాక్షసవృషభుఁడు - వృషభశబ్దం శ్రేష్ఠవాచకం. "కవివృషభులు మహాకావ్య మనియు"- అని నన్నయ ప్రయోగం- ఆదిపర్వ పీఠికలోనిది ఇట స్మరించాలి. (2) ఇంగితమును బట్టి- రూప రేఖా ముఖ విలాసాలను బట్టి శీలాన్ని నిర్ణయించేశక్తి

పరిపాలకులకు ఉంటుంది. వాల్మీకి రామాయణంలో ఈ సన్నివేశం విపులంగా అభివర్ణితం, విభీషణుడు శత్రువర్గంలోని వాడు. అతడికి ఆశ్రయమివ్వటం మంచిది కాదని శ్రీరాముడికి ఆప్తులు చెప్పినట్లు మూలంలో ఉన్నది. ఎఱ్ఱన- నన్నయతిక్కనలవలెనే మూలాన్ని పలుతావుల సంక్షేపించాడు. అట్టితావులలో ఇది ఒకటి.

**ఉ. వానికి దానవేంద్రువిభవంబు సమస్తము నిచ్చువాఁడు గాఁ**
**బూని ప్రతిజ్ఞ సేసి కృతపుణ్యుఁడు లక్ష్మణుతోడి చెల్మియున్**
**వానికి నిచ్చెఁజెచ్చెర నవారితవానరసైన్యయుక్తుఁడై**
**వానిఁ బురస్కరించుకొని వారిధి దాఁటె మహోగ్రలీలతోన్. 53**

**ప్రతిపదార్థం:** వానికిన్= అతడికి (విభీషణుడికి); దానవ+ఇంద్రు, విభవంబు= రాక్షసరాజు (రావణుడియొక్క) సంపద; సమస్తమున్= అంతయున్నూ; ఇచ్చువాఁడు+కాన్= ఒసగునట్టివాడుగా; పూని= కడగి; (శ్రీరాముడు); ప్రతిజ్ఞ+చేసి= శపథం చేసి; కృతపుణ్యుఁడు= సుకృతం చేసినవాడు (ఆ శ్రీరాముడు); లక్ష్మణుతోడి చెల్మియున్= లక్ష్మణుడితోడి మైత్రిని; వానికిన్= అతడికి (విభీషణుడికి); చెచ్చెరన్= శీఘ్రంగా; ఇచ్చెన్= అనుగ్రహించాడు; అవారిత, వానర, సైన్యయుక్తుఁడు+ఐ= అడ్డగించటానికి వీలులేనట్టి కోతులసేనతో కూడినవాడయి (శ్రీరాముడు); వానిన్= అతడిని (విభీషణుడిని); పురస్కరించుకొని= ముందిడుకొని; మహా+ఉగ్ర, లీలన్= మిక్కుటమైన భయంకర రీతితో; వారిధిన్= సముద్రాన్ని; దాఁటెన్= తరించాడు.

**తాత్పర్యం:** శ్రీరాముడు విభీషణుడికి రావణుడిసామ్రాజ్యసంపద నంతటిని కట్టబెట్టుతానని పూనికతో శపథం చేశాడు. విభీషణుడికి లక్ష్మణుడికి మైత్రి కల్పించాడు. అప్రతిహతమైన వానరసేనలతోపాటు విభీషణుడిని మార్గ దర్శకుడిగా నిలిపి భయంకరయుద్ధసన్నాహాలతో సేతుమార్గాన సముద్రాన్ని దాటాడు.

**వ. ఇట్లు సేతుమార్గంబున సాగరరోత్తరణం బాచరించి త్రికూటపర్వతం బెక్కిలంకానగరంబు చుట్టును శిబిరంబులు సంఘటింపం బంచిన. 54**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; సేతుమార్గంబునన్= వారధి తెరువున; సాగర+ఉత్తరణంబు= సముద్రాన్ని దాటటం; ఆచరించి= చేసి; త్రికూట పర్వతంబు= త్రికూటం అనే పేరుకల కొండను; ఎక్కి= అధిరోహించి; లంకానగరంబు చుట్టును= లంకాపట్టణానికి నలువైపులను; శిబిరంబులు= స్కంధావారాలు, భటుల విడిదులు; సంఘటింపన్+పంచినన్= నిర్మించటానికి ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా వారధిపై పయనించి సముద్రాన్ని దాటి త్రికూటపర్వతాన్ని అధిరోహించి శ్రీరాముడు లంకాపట్టణానికి నలువైపుల వానరసేనలకై స్కంధావారాలు నిర్మించటానికి ఆజ్ఞ ఇచ్చాడు.

**క. తాలైలాగరు సాల ర । సాల తమాలామ్ర నింబ జంబూ జంబీ**
**రాలంకృత లంకావన । జాలంబుల విడిసె వృక్షచరసైన్యంబుల్. 55**

**ప్రతిపదార్థం:** తాల+ఏలా+అగరు, సాల, రసాల, తమాల+ఆమ్ర, నింబ, జంబూ, జంబీర+అలంకృత, లంకా వనజాలంబులన్= తాడిచెట్లు, ఏలకిలతలు, చందనం వంటి ద్రవ్యాన్ని ఇచ్చే చెట్లు, మద్దిచెట్లు, తియ్యమామిడిచెట్లు, చీకటిచెట్లు, మామిడిచెట్లు, వేపచెట్లు; నేరేడుచెట్లు, నిమ్మచెట్లతో అలంకరించబడిన లంకాపట్టణం చుట్టూ ఉండే అడవుల సముదాయాలలో; వృక్షచర సైన్యంబుల్= వానర సేనలు; విడిసెన్= తాత్కాలిక నివాసాలను ఏర్పరచుకొన్నాయి.

**తాత్పర్యం:** వానరసైన్యాలు లంకాపట్టణంచుట్టూ ఉన్న అడవులలో శిబిరాలను నిర్మించుకొన్నాయి. తాడిచెట్లు, ఏలకులతీగెలు, మద్దిచెట్లు, తియ్యమామిడిచెట్లు, చీకటిచెట్లు, మామిడిచెట్లు, వేపచెట్లు, నేరేడుచెట్లు, నిమ్మచెట్లు ఆ అడవులలో అందంగా ఎదిగిఉన్నాయి.

**విశేషం:** వానరులు 'వృక్షచరులు' కదా. లంకాపట్టణంచుట్టూ దట్టమైన చెట్లు పెరిగిన అడవులు ఉండటం వానరులకు సుఖదాయకం.

**వ. తదనంతరంబ రావణచారులైన శుకసారణు లనువారలు వానరాకారంబులు దాల్చి శిబిరంబునఁ గ్రుమ్మరుచున్న నెఱింగి, విభీషణుం డా రాక్షసులం బట్టించి రామునకు సమర్పించిన, నతండు వారికి నిజసైన్యం బంతయుం జూప నియోగించి విడిచి పుచ్చినఁ, జని యయ్యిరువురు నమరవైరిం గని కపిసైన్యంబు దుర్జయం బనియును, రామలక్ష్మణుల తేజోమూర్తివిశేషంబులును నెఱింగించిన, నతండు దాని సరకు సేయక సమరంబునకు మోహరించి. 56**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట; రావణచారులు+ఐన= రావణుడి రహస్యదూతలు అయిన; శుక, సారణులు= శుకుడు, సారణుడు అనేవారు; వానర+ఆకారంబులు+తాల్చి= కోతుల రూపాలు ధరించి; శిబిరంబునన్= స్కంధావారంలో; క్రుమ్మరుచున్+ఉన్న= తిరుగాడుతుండగా; విభీషణుండు; ఎఱిఁగి= తెలిసికొని; ఆ రాక్షసులన్= ఆ రక్కసులను (గూఢచారులు అయిన శుక సారణులను); పట్టించి= బంధించి; రామునకున్= శ్రీరాముడికి; సమర్పించినన్= ఇవ్వగా; అతండు= అతడు- శ్రీరాముడు; వారికిన్= శుక సారణులకు; నిజసైన్యంబు= తమయొక్క సేనను; అంతయున్= సమస్తమున్నూ; చూపన్= చూపించటానికి; నియోగించి= ఏర్పాటుచేసి; విడిచి పుచ్చినన్= వదలిపెట్టగా; చని= వెడలి; ఆ+ఇరువురును= శుక సారణులు; అమరవైరిన్+కని= దేవతల విరోధిని రావణుడిని దర్శించి; కపిసైన్యంబు= కోతులసేన; దుర్జయంబు= గెలువరానిది; అనియును= అని వచించుటయును; రామలక్ష్మణుల తేజస్+మూర్తి, విశేషంబులును= రాముడియొక్కయు లక్ష్మణుడియొక్కయు వర్చస్సు ఆకారరేఖలయొక్క వివరాలను; ఎఱింగించినన్= తెలుపగా; అతండు= రావణుడు; దానిన్= దానిని (శుక సారణుల నివేదనను); సరకు+చేయక= లక్ష్యపెట్టక; సమరంబునకున్= యుద్ధానికి; మోహరించి= సన్నాహాలు చేసి.

**తాత్పర్యం:** శుకసారణులు అనే పేర్లు కల రావణుడిగూఢచారులు వానర సైన్య శిబిరంలో వానరాకారాలు తాల్చి తిరుగాడసాగారు. అది గుర్తించి విభీషణుడు వారిని రాముడికి అప్పగించాడు. రాముడు వారలకు తనసైన్యాన్ని చూపించటానికి నియోగించి, వారలను బంధముక్తులను చేసి పంపించాడు. శుకసారణులు రావణుడిని చేరి వానరసైన్యం జయించటానికి అలవికానిదనిన్నీ, రామలక్ష్మణులు అతిలోకవీరులు మహాతేజస్వులు అనిన్నీ చెప్పారు. కాని, ఆతడు వారలమాటలు సరకుచేయక యుద్ధసన్నాహాలలో నిమగ్నుడయ్యాడు.

**సీ. బద్ధశిలాయంత్రబహుళమై యుత్తాలి । తాట్టాలకాభీలమై యుదగ్ర**
**కేతుపతాకాప్రకీర్ణమై తోమర । ముద్గరాలాతక ముసల శూల**
**శర శతఘ్నీముఖ సాధనోపేతమై । యుగ్రవిగ్రహాధీరయోధవీర**
**సంకులంబై హయస్యందనవేదండ । చండమై సముదిత సప్తసాల**

**ఆ. మై యలంఘ్యపరిఖమై తృణకాష్ఠజ । లాది వస్తుభరిత మైన లంక**
**కధికరక్షc జేసి యప్రమాదంబున । నుండె రిపుజిగీష నుదితబలుcడు. 57**

**ప్రతిపదార్థం:** బద్ధ శిలాయంత్ర బహుళము+ఐ= ఏర్పరచబడిన రాళ్ల రువ్వేమరలు పెక్కులు కలిగినట్టిదై; ఉత్తాలిత+అట్టాలక+ఆ భీలము+ఐ= ఎత్తైన మేడలతో భయాన్ని కల్పించేదై; ఉదగ్ర, కేతు, పతాకా ప్రకీర్ణము+ఐ= పొడవైన టెక్కెములతో జెండాలతో వ్యాపించినదై; తోమర, ముద్గర+అలాతక, ముసల, శూల, శర, శతఘ్ని, ముఖ సాధన+ఉపేతము+ఐ= చిల్లకోలలు, సమ్మెటలు, కొరవులు, రోకళ్లు, ఈటెలు, బాణాలు, నూరుమందిని (పెక్కుమందిని) చంపు గుండ్లను ప్రసారంచేసే మరలు మున్నగు పరికరాలతో కూడినట్టిదై; ఉగ్ర, విగ్రహ, ధీర, యోధ, వీర సంకులంబు+ఐ= భయంకరమైన యుద్ధాలు చేయటంలో చిత్త స్థైర్యం కలిగినవారితో, భటులతో, పరాక్రమం కలిగినవారితో దట్టమైనదై; హయ, స్యందన, వేదండ, చండము+ఐ= గుర్రాలతో, రథాలతో, ఏనుగులతో భయంకరమై; సమ్+ఉదిత, సప్తసాలము+ఐ= బాగా ఏర్పడిన ఏడు ప్రాకారాలు కలదై; అలంఘ్య పరిఖము+ఐ= దాటటానికి శక్యంగాని అగడ్త కలదై; తృణ, కాష్ఠ, జల+ఆది, వస్తు, భరితము+ఐన= గడ్డి, కట్టెలు, నీరు మున్నగు వస్తువులతో నిండినట్టిదైన; లంకకున్= లంక అనే పట్టణానికి; అధిక రక్షన్+చేసి= మిక్కుటమైన కాపుదల కల్పించి; రిపు జిగీషన్= శత్రువులను గెలువవలె ననే కోరికతో; ఉదిత బలుcడు= ఏర్పడిన బలం కలవాడు - రావణుడు; అ ప్రమాదంబునన్+ఉండెన్= ఏమరుపాటు లేకుండ ఉన్నాడు.

**తాత్పర్యం:** బలవంతుడైన రావణుడు లంకానగరానికి మిక్కుటమైన రక్షణ కల్పించి ఏమరుపాటు లేకుండా సర్వయుద్ధసన్నాహాలను జాగరూకతతో ఒనరించాడు. లంకాపట్టణంలో పెక్కుశిలాయంత్రాలు అమరి ఉన్నాయి. అది మిక్కిలి ఎత్తైన సౌధాలతో, జెండాలతో, జెండాలు అమర్చడానికి నిర్మించబడిన స్తంభాలతో కూడిఉండింది. వివిధాలైన ఆయుధాలు-చిల్లకోలలు, సమ్మెటలు, ఈటెలు, కొరవులు, బాణాలు, శతఘ్నులు మున్నగు పరికరాలతో కూడినట్టిది. యుద్ధంచేయటంలో భయంకరమైన శక్తిసామర్థ్యాలు కల భటులతో క్రిక్కిరిసినట్టిది, గుఱ్ఱాలు రథాలు ఏనుగులతో భయంకరమైనది, ఏడు ప్రాకారాలతో సురక్షితమైనది, దాటటానికి శక్యంగాని అగడ్త గలది. గడ్డి కట్టెలు నీరు మున్నగు వస్తువులు సమృద్ధంగా కలిగినట్టిది.

**విశేషం:** ఇది లంకాపట్టణ వర్ణనం. ఆ లంకాపురి ఏ త్రేతాయుగంనాటిదో కదా. అప్పుడు లంకాపట్టణం ఎట్లా ఉండెనో ఏమో కాని, ఈ పద్యంలోని అభివర్ణన- ఎట్టిన సమకాలీన దుర్గాలను మనస్సులో పెట్టుకొని వ్రాశాడని ఎంచవచ్చును. శిలాయంత్రాలు, సప్తప్రాకారాలు, చతురంగ బలాలు, శతఘ్నులు మొదలైన ఆయుధాలు తృణకాష్ఠ జలసమృద్ధి ఎట్టినకాలంనాటి తెలుగుకోటలకు సంబంధించినవే. తిక్కనగారి నిర్వచనోత్తర రామాయణంలోని అయోధ్యాపురవర్ణనం చూడండి. ఇందులో తిక్కనఅనుసరణ గమనించదగింది.

**వ. ఇట రాఘవుండును సుగ్రీవసహితుండై యుండి యంగదుం జూచి 'నీవు రావణుపాలికిం జని యతనికిం దగినతెఱంగున బుద్ధిగాc జెప్పి, జానకి విడుచుట మే లని చెప్పు' మని పనిచినం బని పూని యవ్వీరుండు.58**

**ప్రతిపదార్థం:** ఇట= ఇచట ఇంతవరకు లంకాపురం, రావణుడికి సంబంధించిన కథ చెప్పబడింది. ఇప్పుడు ఇచట రాముడి వృత్తాంతం చెప్పబడబోతున్నది; రాఘవుండును= శ్రీరాముడును; సుగ్రీవ సహితుండు+ఐ= సుగ్రీవుడితో కూడినట్టివాడై; ఉండి= ఉండి; అంగదున్+చూచి= అంగదుడిని చూచి; నీవు= ఓ అంగదా నీవు; రావణు, పాలికిన్+చని= రావణుడి కడకు వెళ్ళి; అతనికిన్; తగిన, తెఱంగునన్= ఉచితమైన రీతిలో; బుద్ధిగాన్+చెప్పి= హితవు వచించి; జానకిన్= సీతను; విడుచుట= వదలిపెట్టటం; మేలు+అని= మంచిది అని; చెప్పుము= వచించుము; అని= అని వచించి; పంచినన్= నియోగించగా; పని+పూని= కర్తవ్యం నిర్వహించటానికి పూనుకొని; ఆ+వీరుండు= (ఆ అంగదుడు).

**తాత్పర్యం:** అచట లంకాపురికి రావణుడు రక్షణ కల్పిస్తుండగా ఇచట, శ్రీరాముడు వారధికడ సుగ్రీవుడితో కూడి ఉండి, వానరయువరాజు అయిన అంగదుడిని పిలిచి 'ఓ అంగదా! నీవు రావణుడికడకు రాయబారివై వెళ్ళి, ఆతడికి, సీతను వదలిపెట్టటం మంచిది అని హితవు బోధించుము. సమయానుకూలంగా నీవు రావణుడితో మాటాడుము' అని చెప్పాడు. అంగదుడు రాముడిఆజ్ఞను నెరవేర్చదలచాడు.

**శా.** **లంకాద్వారము దుర్నివార గమనోల్లాసంబునం జొచ్చి ని**
**శ్శంకుండై సురశత్రుసైనికసహస్రంబుల్ దనుం జూచి యా**
**శంకం బొందఁగ లీలమైఁ జని సుహృత్సంఘంబు గొల్వన్ నిరా**
**తంకుండై కొలు వున్న దైత్యుఁ గని యుద్యన్మూర్తియై యిట్లనున్.** **59**

**ప్రతిపదార్థం:** లంకాద్వారము= లంకాపట్టణంయొక్క వాకిలి; దుర్నివార, గమన+ఉల్లాసంబునన్= వారించటానికి శక్యంగాని ప్రయాణంయొక్క విజృంభణం చేత; చొచ్చి= ప్రవేశించి; నిశ్శంకుండు+ఐ= ఎట్టి జంకుగొంకులు లేనట్టివాడై; సుర, శత్రు, సైనిక, సహస్రంబుల్= దేవతలకు విరోధులైన రాక్షసభటులు వేనకు వేలమంది; తనున్+చూచి= తనను గాంచి; ఆశంకన్+పొందఁగన్= భయాన్ని చెందగా; లీలమైన్= వినోదంగా; చని= వెళ్లి; సుహృత్+సంఘంబు= మిత్రుల సముదాయం; కొల్వన్= సేవించగా; నిరాతంకుండు+ఐ= అడ్డు లేనివాడై; కొలువు+ఉన్న= సభను తీర్చిఉన్న; దైత్యున్= రాక్షసుడిని (రావణుడిని); కని= చూచి; ఉద్యత్+మూర్తి+ఐ= ప్రకాశిస్తున్న ఆకారం కలవాడై; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంగదుడు - లంకాపట్టణంలో మిక్కుటమైన ఉత్సాహంతో ప్రవేశించాడు. దేదీప్యమానమైన ఆతడి తేజస్సు చూచి రాక్షసభటులు భయం పొందారు. అప్పుడు రావణుడు మిత్రులు తనను సేవించగా కొలువు తీర్చి ఉన్నాడు. అంగదుడు కొలువుకూటం చేరి రావణుడితో ధైర్యంగా ఇట్లా చెప్పాడు.

**విశేషం:** (1) అంగదుడిపాత్ర వాల్మీకిరామాయణంలో విశిష్టంగా చిత్రించబడింది. అంగదుడు వాలికొడుకు, యువరాజు, ఉత్సాహవంతుడు. ఎఱ్ఱన ఒక్కసమాసంలో 'ఉద్యన్మూర్తి' అని అంగదుడివ్యక్తిత్వాన్ని సంక్షేపంగా చిత్రించాడు. అంతేకాక-శ్రీరాముడు అతడికి యథోచితంగా మాటాడే అవకాశం ఇచ్చి ఉన్నాడు కాబట్టి అతడు సర్వతంత్రస్వతంత్రప్రతిపత్తి కల రాయబారి గాని కేవలం ఒక దూత కాదు.

### అంగదు రాయబారము (సం. 3-267-54)

**క.** **'ఇనకులతిలకుఁడు బాణా । సనవిద్యాగురుఁడు రామచంద్రుఁడు నీతో**
**నను నిట్లను మని పనిచెను; వినుము తదీయోక్తిభంగి విస్పష్టముగన్.** **60**

**ప్రతిపదార్థం:** ఇన, కుల, తిలకుఁడు= సూర్యవంశంలో శ్రేష్ఠమైనవాడు; బాణ+ఆసన, విద్యా, గురుఁడు= విలువిద్యలో ఆరితేరి ఇతరులకు మేలుబంతి అయిన గొప్పవాడు; రామచంద్రుఁడు= శ్రీరాముడు; నీతోన్= (ఓ రావణా) నీతో; ననున్= నన్ను; ఇట్లు= ఈ రీతిగా; అనుము+అని= వచింపుము అని; పనిచెను= నియోగించాడు; తదీయ+ఉక్తి, భంగి= ఆతడియొక్క అనగా ఆ శ్రీరామచంద్రుడియొక్క మాటలవైఖరి; విస్పష్టముగన్= తేటతెల్లంగా; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** 'సూర్యవంశంలో జన్మించిన రాజులలో శ్రేష్ఠుడు, విలువిద్యలో ఘనుడు అయిన శ్రీరాముడు నీతో నన్ను ఈ మాటలు చెప్పుమని పుత్తెంచాడు. ఆ శ్రీరాముడిపలుకులు తేటతెల్లంగా నీకు చెప్పుతాను. సావధానంగా ఆలకించుము.

**సీ. అనపరాధులఁ గాననాంతరమున నున్న। పేదతాపసులఁ జంపితి పలువుర**
**నమరుల యాలువుటాండ్రను జెఱవట్టి। యఖిలలోకములకు నలఁత సేసి;**
**తిదియెల్ల నొక తల; యేపుమీఱఁగ నన్నుఁ। జెనకుట యొక తల; సెప్ప నేల?**
**బలిమి యొప్పఁగ మంచి బంటవై వెడలుము। కయ్యంబునకు; నట్లు గాక యున్న**

**ఆ. శరణుఁ జొచ్చి నాకు జానకి నొప్పింపు; మొండు వెంట బ్రతికి యుండఁ దీఱ;**
**దస్మదీయశితశరాశీవిషంబుల। కెరయ నీదుప్రాణ మింత నిజము. 61**

**ప్రతిపదార్థం:** అనపరాధులన్= నేరము లేవియు చేయని వారిని; కానన+అంతరమునన్+ఉన్న= అడవిలో ఉన్న; పేద తాపసులన్= సాధువులై తపస్సు చేసికొనే ఋషులను; పలువురన్= పెక్కుమందిని; చంపితి(వి)= సంహరించావు; అమరుల+ఈలువు+ఆండ్రను= దేవతలయొక్క పతివ్రత లైన స్త్రీలను; చెఱ+పట్టి= బంధించి; అఖిల లోకములకున్= అన్ని భువనాలకు; అలఁత+చేసితి= అపచారం చేశావు; ఇది+ఎల్లన్= ఇది అంతయున్నూ; ఒక, తల= ఒక యెత్తు; ఏపు మీఱఁగన్= అతిశయించేటట్లుగా; నన్నున్= నన్ను (రాముడిని); చెనకుట= ఎదిరించటం; ఒక తల= ఒక యెత్తు; చెప్పన్+ఏల= వచించటం ఎందుకు; బలిమి+ఒప్పఁగన్= పరాక్రమం శోభిల్లేటట్లుగా; మంచి బంటవు+ఐ= గొప్ప వీరుడవు ఐ; కయ్యంబునకున్= యుద్ధానికి; వెడలుము= వెళ్ళుము (రమ్ము); అట్ల+కాక+ఉన్నన్= ఆ రీతిగా కాకపోతే; శరణున్+చొచ్చి= రక్షణ వేడుకొని, ఆశ్రయించి; నాకున్= నాకు (రాముడికి); జానకిన్= సీతను; ఒప్పింపుము= అప్పగించుము, ఒండు వెంటన్= ఇంకొక రీతిగా అయితే; బ్రతికి+ఉండన్+తీఱదు= జీవించిఉండటానికి (నీకు) ఆస్కారం లేదు; అస్మదీయ, శిత, శర+ఆశీ విషంబులకున్= నాయొక్క వాడిబాణాలు అనే పాములకు; నీదు, ప్రాణము= నీదైన అసువులు; ఎర+అ= బలి కావలసిందే; ఇంత= ఈ రీతిగా జరగటం; నిజము= సత్యం.

**తాత్పర్యం:** ఓ రావణా! నిర్దోషులు మహానుభావులు సాత్త్వికులు అయి ఆడవులలో తపస్సు చేసికొనే ఋషులను నీవు నిర్దాక్షిణ్యంగా సంహరించావు. పతివ్రతలైన దేవతాస్త్రీలను బంధించి అఖిలభువనాలకు అపచారం చేసి ఉన్నావు. నీవు చేసిన అపరాధాలు అన్నీ ఒక యెత్తు; నాయెడ చేసినతప్పు ఒక యెత్తు అని వేరుగా చెప్ప నవసరం లేదు. పరాక్రమం కలవాడవనే గర్వం నీ కుంటే నాతో యుద్ధానికి తలపడుము. లేదా నన్ను శరణు వేడుము, సీతను నాకు ఒప్పగించుము. మరొక విధంగా అయితే నీవు జీవించి ఉండటం కుదరదు. నా బాణాలు అనే త్రాచుపాములకు నీ ప్రాణాలు బలి కావలసిందే. జాగ్రత్త. ఇది నిజం.

**క. మనుజుండ నైన నా తెఱఁ। గనుమానము వాయఁ జూడు మాహవభూమిన్;**
**విను, రాక్షసులను నామం। బును నడఁపక యేను రిత్త వోనిచ్చెదనే?' 62**

**ప్రతిపదార్థం:** ఆహవ భూమిన్= రణరంగంలో; మనుజుండన్+ఐన= మనుష్యుడను అయిన; నా తెఱఁగు= నా రీతి; అనుమానము+పాయన్+చూడుము= సందేహం పోయేటట్లుగా అరయుము; విను= ఆలకింపుము; రాక్షసులు+అను= రక్కసులు అనెడి; నామంబును= పేరును; అడఁపక= నశింపజేయక; ఏను= నేను; రిత్త+పోనిచ్చెదనే?= వ్యర్థంగా వదలి పెట్టుతానా?

**తాత్పర్యం:** ఓ రావణా! నీకు మనుజజాతిపై తక్కువచూపు ఉన్నది. రణరంగంలో మనుజజాతికి చెందిన నాబలం ఎటువంటిదో సందేహానికి ఆస్కారం లేకుండా నీవు చూస్తావు సుమీ! నా ప్రతిజ్ఞ వినుము. రాక్షసులు అనే పేరును సయితం నేను నాశనం చేయకుండ వదలిపెట్టను. ఇవి రిత్తమాటలు కావు.'

**వ. అని పలుకుచున్న యంగదు పరుషభాషణంబులకు రోషించిన యసురపతి కన్నెఱింగి నలువురు రక్కసులు గ్రక్కున నవ్వాలి నందనుం బొదివి పట్టిన బిట్టెగసి హర్మ్యశిఖరంబు పైకి దాఁటుటయుఁ, దదాక్షేపవేగంబున నన్నిశాచరులు ధరణీతలంబున జర్జరిత శరీరు లై పడిరి; హరివీరుం డచ్చటినుండి శిబిర మధ్యంబునకు లంఘించి భూనాథునకుఁ దన పోయివచ్చిన తెఱంగు విన్నవించెం; దదనంతరంబ రాఘవు ననుమతంబున.63**

**ప్రతిపదార్థం:** అని పలుకుచున్న= అని అంటున్న; అంగదు, పరుష, భాషణంబులకున్= అంగదుడి కఠినమైనమాటలకు; రోషించిన= కోపం చెందిన; అసురపతి, కన్ను+ఎఱింగి= రక్కసులప్రభువు అయిన రావణుడి అభిప్రాయం తెలిసి; నలువురు, రక్కసులు= నల్గురు రాక్షసులు; గ్రక్కునన్= శీఘ్రంగా; ఆ+వాలి, నందనున్= వాలికొడుకు అయిన ఆ అంగదుడిని; పొదివిపట్టినన్= క్రమ్ముకొని పట్టగా, (అంగదుడు); బిట్టు+ఎగసి= బాగా పైకెగిరి; హర్మ్యశిఖరంబుపైకిన్= మేడకొసభాగం పైకి; దాఁటుటయున్= కుప్పించుటయున్నూ; తద్+ఆక్షేప వేగంబునన్= ఆ త్రోపుడులో ఏర్పడిన రయంవలన; ఆ+నిశాచరులు= ఆ నలువురు రక్కసులు; ధరణీతలంబునన్= భూప్రదేశంపై; జర్జరిత శరీరులు+ఐ= ముక్కలుగా చీలిన దేహాలు కలవారై; పడిరి= నేలపై కూలారు; హరివీరుండు= కోతుల వీరుడు; అచ్చటినుండి= రావణుడి కొలువుకూటంనుండి; శిబిరమధ్యంబునకున్= (కోతులు నిర్మించిన) స్కంధావారాల నడిమి ప్రదేశానికి; లంఘించి= దూకి; భూనాథునకున్= రాజుకు (శ్రీరాముడికి); తన, పోయివచ్చిన, తెఱంగు= తాను వెళ్లి వచ్చిన రీతిని; విన్నవించెన్= నివేదించాడు; తత్+ అనంతరంబు+అ= అటుపిమ్మట; రాఘవు+అనుమతంబునన్= శ్రీరాముడి అనుజ్ఞచేత.

**తాత్పర్యం:** అంగదుడిమాటలకు రావణుడికి కోపం వచ్చింది. అతడి కన్ను లెఱ్ఱబారాయి. ఆ రావణుడి మనోభావాన్ని గుర్తించి నలుగురు రాక్షసభటులు అంగదుడిని చుట్టుముట్టి బంధించబోయారు. కాని, అంగదుడు మిక్కుటమైన వేగంతో ఒక్కసారి మేడచివరిభాగంపైకి ఎగిరిపోయాడు. ఆ త్రోపుడులో ఏర్పడిన వేగంచొప్పున ఆ నలుగురు రాక్షసభటులు చీలినదేహాలు కలవారై నేలమీద పడిపోయారు. అంగదుడు అంతట అచ్చటినుండి ఆకసంపైకి లంఘించి ఆ వానరశిబిరాలమధ్యకు దూకి, శ్రీరాముడికి తాను నిర్వహించిన రాయబారాన్నిగూర్చి నివేదించాడు. పిదప శ్రీరాముడి ఆజ్ఞచొప్పున.

**మత్తకోకిలము.**

**తాలసాలశిలాగ్రహస్తు లుదగ్రగోత్రమహీధరో**
**త్తాలదేహు లనేకవర్ణులు దారితాఖిలదిఙ్ముఖా**
**భీలవాలశిఖాగ్రు లుగ్రగభీరసత్త్వులు వానరుల్**
**గాలకల్పులు పేర్చి సంతనకట్టి రాహవకేళికిన్. 64**

**ప్రతిపదార్థం:** తాల, సాల, శిలా+అగ్ర, హస్తులు= తాడిచెట్లు, మద్దిచెట్లు, వాడియైన రాళ్లు చేతులలో పూనినవారు; ఉదగ్ర, గోత్ర, మహీధర+ఉత్తాల, దేహులు= భయంకరాలైన కులపర్వతాలవలె పొడుగైన శరీరాలు కలవారు; అనేక, వర్ణులు= పెక్కురంగులు కల దేహాలు కలవారు; దారిత+అఖిల, దిక్+ముఖ+ఆభీల, వాల, శిఖా+అగ్రులు= చీల్చబడిన అన్నిదిక్కుల మొగాలలో విస్తరిల్లిన తోకల కొసలు కలవారు; ఉగ్ర, గభీర, సత్త్వులు= భయంకరం గంభీరం అయిన బలం కలవారు; వానరుల్= కోతులు; కాల, కల్పులు= యముడితో సమానులు; పేర్చి= విజృంభించి; ఆహవకేళికిన్= యుద్ధం అనే ఆటకు; సంతనకట్టిరి= సన్నాహాలు చేశారు.

**తాత్పర్యం:** తాడిచెట్లు మద్దిచెట్లు పదునైనరాళ్లు చేతబూనిన వారై, కులపర్వతాలవలె ఎత్తైన శరీరాలతో భయంకరులై, పెక్కురంగులు కల దేహాలు కలవారై, అన్ని దిక్కులభాగాలను ఎత్తిన తమతోకలకుచ్చులతో ఆక్రమించినవారై, వెరపు కొలిపే బలపరాక్రమాలు కలవారై యముడితో సమానులు అయిన వానరులు యుద్ధం అనే ఆటకు సన్నాహాలను ఒనరించారు.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడండి - ఆరణ్యపర్వం 4.267 విశేషాంశం.

**క. పరువడి మొత్తములై బం । ధురఘోషం బెసఁగఁ బొంగి తోఁతెంచు హరీ**
**శ్వర బలమునందు ఘనసా । గరవీచి వికాసరేఖ గానఁగ నయ్యెన్. 65**

**ప్రతిపదార్థం:** పరువడి మొత్తములు+ఐ= ఒక క్రమం ప్రకారంగా గుమిగూడినట్టివై; బంధురఘోషంబు= కలకల నినాదం; ఎసఁగన్= అతిశయించగా; పొంగి= ఉత్సాహించి; తోఁతెంచు= నడిచే; హరి+ఈశ్వర, బలమునందున్= వానరనాయకుల సైన్యంలో; ఘన, సాగర, వీచి వికాసరేఖ= గొప్ప సముద్రపుటలలయందు గోచరించు సౌందర్యం; కానఁగన్+అయ్యెన్= కన్పించింది.

**తాత్పర్యం:** ఆ వానరసేనలు ఒక క్రమపద్ధతిలో కూడిన వరుసలలో కదలుతూ, కలకల నినాదాలతో పొంగులు వారుతున్నప్పుడు, గొప్ప సముద్రంలోని అలల మాదిరిగా కన్పించాయి.

**విశేషం:** అలం: ఉపమ. ఉపమానం సాగరవీచివికాసరేఖ. ఉపమేయం హరీశ్వరబలం.

**మత్తకోకిలము.**

**కోటఁ బన్నిన ఘోరదానవకోటిఁ జుల్కనఁ దోలి య**
**క్కోట నల్గడలన్ మహోగ్రతఁ గూలఁ ద్రోచి సమున్న మ**
**త్కూటతోరణయంత్ర కేతన గోపురాట్టకసంహతుల్**
**వీటతాటము సేసి రక్కపివీరు లొక్కట మాత్రలోన్. 66**

**ప్రతిపదార్థం:** కోటన్= దుర్గంలో (లంకాదుర్గంలో); పన్నిన= యుద్ధానికి సంసిద్ధంగా ఉన్న; ఘోర దానవకోటిన్= భయంకరులు అయిన రక్కసుల సమూహాన్ని; చుల్కనన్= సులువుగా; తోలి= నెట్టివేసి; ఆ+కోటన్= ఆ దుర్గాన్ని; నల్గడలన్= నాలుగు దెసలను; మహా+ఉగ్రతన్= మిక్కిలి ఘోరంగా; కూలన్+త్రోచి= పడగొట్టి; సమ్+ఉన్నమత్, కూట, తోరణ, యంత్ర, కేతన, గోపుర+అట్టక, సంహతుల్= నిట్టనిటారుగా నిర్మించబడిన పురద్వారానికి ముందు అర్ధవలయాకారంలో ఏర్పరచబడిన కట్టడానికి సంబంధించిన మరలు, జెండాలు గోపురాలు మేడలు మున్నగునవి; ఆ+కపివీరులు= ఆ వానర వీరులు; ఒక్కటన్= ఒక్కుమ్మడిగా; మాత్రలోన్= త్రుటిలో; వీటతాటము+చేసిరి= తారుమారు చేశారు.

**తాత్పర్యం:** ఆ కపివీరులు లంకాపురంకోటముందు యుద్ధానికి సంసిద్ధంగా ఉన్న భయంకరులైన రాక్షసులను సులువుగా పారద్రోలారు. ఆ కోట నలువైపులను కూలద్రోశారు. అందులో మిక్కిలి ఎత్తుగా అమర్చబడిన పురద్వారతోరణం జెండాలు, గోపురాలు, మేడలు మున్నగువాటిని ఒక్కసారిగా త్రుటిమాత్రలో ధ్వంసంచేశారు.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడండి - అరణ్య 4-267 విశేషాంశం.

**వ. మఱియుఁ బ్రాకారంబుపై నున్న గదాపరిఘకుంత ప్రముఖంబులు గైకొని లంకామధ్యంబున వైవం దొడంగిన నాబాలవృద్ధం బగు పౌరలోకంబుహాహాకారవ్యాకులంబై కలంగంబడియె; నంత రావణచోదితు లైన దానవులు నానాకోటిసహస్రసంఖ్య లరిగి యెక్క డెక్కడ యని తలపడి కపిసముదయంబులం దోలి యెప్పటియట్ల ప్రాకారంబుం గైకొని నిల్చి; రప్పుడు. 67**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; ప్రాకారంబుపైన+ఉన్న= చుట్టుగోడపై ఉన్న; గదా, పరిఘ, కుంత, ప్రముఖంబులు= గదలు, ఇనుపకట్ల గుదియలు, ఈటెలు మున్నగునవి; కైకొని= గ్రహించి; లంకామధ్యంబునన్= లంకాపట్టణం నడిమి ప్రదేశంలో; వైవన్+తొడంగినన్= విసరసాగగా; ఆబాల వృద్ధంబు+అగు= చిన్నపిల్లలనుండి పెద్దలవరకూ కల; పౌరలోకంబు= పురజనుల సమూహం; హాహాకారవ్యాకులంబు+ఐ= కుయ్యో మొర్రో అనే ఆర్తనాదాలతో కలతచెందినది అయి; కలంగన్+పడియెన్= కలతచెందింది; అంతన్= పిదప; రావణచోదితులు+ఐన= రావణుడిచేత ప్రేరేపించబడిన; దానవులు= రాక్షసులు; నానాకోటి సహస్రసంఖ్యలు= పెక్కుకోట్లవేలమంది; అరిగి= వెడలి; ఎక్కడ+ఎక్కడ, అని, తలపడి= (శత్రువులు) ఎక్కడ ఎక్కడ ఉన్నారు అని ముట్టడించి; కపి సముదయంబులన్= కోతుల మూకలను; తోలి= తరిమి; ఎప్పటి+అట్లు+అ= యథాప్రకారంగా; ప్రాకారంబున్= చుట్టుగోడను; కైకొని= ఆక్రమించి; నిల్చిరి= నిలబడ్డారు; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** వానరులు లంకాపట్టణప్రాకారంమీద నున్న ఆయుధాలు - గదలు, ఇనుపకట్ల గుదియలు, ఈటెలు మున్నగువాటిని సంగ్రహించి నగరంలోకి విసరసాగారు. అప్పుడు లంకాపౌరులు పిన్నలు పెద్దలు హాహాకారాలతో రోదించారు. ఆ హాహాకారాలను విని రావణుడు కోట్లకొలది రాక్షసభటులను పంపాడు. వారు ప్రాకారాన్ని చేరి, శత్రువులు ఎక్కడ ఎక్కడ ఉన్నా రని వెదకి వానరులను పారద్రోలారు. లంకాదుర్గప్రాకారాలు యథాపూర్వం రక్కసుల వశమయ్యాయి.

**క. మును మర్కటబలములచే । ననయంబును గపిలవర్ణమైనది మగుడన్**
**దనుజబలసంవృతంబై । ఘనపటలచ్ఛాయఁ గోట కర మొప్పారెన్. 68**

**ప్రతిపదార్థం:** మును= అంతకుపూర్వం; మర్కటబలములచేన్= కోతులసేనలచేత; అనయంబును= మిక్కిలి; కపిలవర్ణము+ ఐనది= గోరోజనపు రంగుగా కన్పించినట్టి; కోట= (లంకాపుర) దుర్గం; మగుడన్= తిరిగి; దనుజబల సంవృతంబు+ఐ= రాక్షససేనలచేత చుట్టుకొనబడినట్టిదై; ఘనపటల+ఛాయన్= మబ్బుదొంతరల రంగుతో; కరమున్= మిక్కిలి; ఒప్పారెన్= శోభిల్లింది.

**తాత్పర్యం:** లంకాపురదుర్గం అంతకుముందు కోతులచేత ఆక్రమించబడిఉండి గోరోజనం వంటి రంగుతో భాసించింది. తదుపరి దానిని రాక్షససేనలు ఆక్రమించటంచేత మబ్బురంగుతో శోభిల్లింది.

**క. వనచరసేనలు దెరలిన । నినవంశోత్తములు నృపతు లిద్దఱుఁ గయ్యు**
**మ్మునకుఁ గడంగుటఁ గ్రమ్మఱ । గొనకొని కపిసేన యెల్లఁ గోటకుఁ గవిసెన్. 69**

**ప్రతిపదార్థం:** వనచర, సేనలు= కోతుల సైన్యాలు; తెరలినన్= వెనుకకు తిరిగిరాగా; ఇనవంశ+ఉత్తములు= సూర్యవంశానికి చెందిన శ్రేష్ఠులు; నృపతులు= రాజులు; ఇద్దఱున్= ఇరువురును; కయ్యమ్మునకున్= యుద్ధానికి; కడంగుటన్= పూనటంచేత;

క్రమ్మఱన్= మరల; గొనకొని= ఉద్యమించి; కపిసేన= కోతులసైన్యం; ఎల్లన్= అంతయును; కోటకున్= దుర్గాన్ని (లంకా దుర్గాన్ని); కవిసెన్= ముట్టడించింది.

**తాత్పర్యం:** వానరసేనలు వెనుదిరిగి రావటం చూచి, సూర్యవంశంలో ఉద్భవించిన గొప్పవీరులు రామలక్ష్మణులు ఇరువురున్నూ యుద్ధానికి ఉపక్రమించారు. అంతట వానరసేనలు మరల గుమికూడి లంకాదుర్గాన్ని ముట్టడించాయి.

**వ. ఇట్లు గవిసినం బ్రాకారరక్షకులైన రాక్షసవీరులు వారలం జేరనీక శిలాశూలపరశుతోమరాలాతశరకుంత ప్రముఖంబులు ప్రయోగించినం గయికొనక వనచరులు వృక్షశిలాప్రకరంబులు పఱఁగించుచుం గడంగి ప్రాకారంబుఁబ్రాఁకుటయు నయ్యిరుదెఱంగులవారికిం గేశాకేశి యగు సమరం బయ్యెఁ; బదంపడి రావణుండు వనుపఁ బర్వతుండును బ్రఘసుండును ఖరుండును గ్రోధవశుండును బ్రరుజుండును నను రాక్షసు లేవురు ననేకరాక్షసపిశాచసేనాపరివృతు లయి పురంబు వెలువడి మాయ గావించి యదృశ్యాకారులై కపిసైన్యంబు నొప్పింపం దొడంగినం గని. 70**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కవిసినన్= దండెత్తగా; ప్రాకార, రక్షకులు+ఐన= చుట్టుగోడను కాపుగాస్తున్న; రాక్షసవీరులు= రక్కసులలో యోధులు; వారలన్= వారలను, కపివీరులను; చేరనీక= దరికి రానీక; శిలా, శూల, పరశు, తోమర+అలాత, శర, కుంత, ప్రముఖంబులు= రాళ్ళు, బల్లేలు, గండ్రగొడ్డళ్ళు, చిల్లకోలలు, కొరవులు, బాణాలు, ఈటెలు మున్నగునవి; ప్రయోగించినన్= వేయగా; కయికొనక= సరకుచేయక; వనచరులు= వానరులు; వృక్ష, శిలా, ప్రకరంబులు= చెట్ల రాళ్ల సముదయాలు; పఱఁగించుచున్= ప్రయోగిస్తూ; కడంగి= పూని; ప్రాకారంబున్= చుట్టుగోడను; ప్రాఁకుటయున్= ఎక్కుటయు (మెల్లగా కష్టంగా ఎక్కటం); ఆ+ఇరు+తెఱంగులవారికిన్= ఆ రెండు పక్షాలవారికి; కేశాకేశి, అగు సమరంబు+అయ్యెన్= జుట్టు జుట్టు పట్టుకొనే యుద్ధం జరిగింది (పోటాపోటీలుగా యుద్ధం జరిగిందని భావం); పదంపడి= పిమ్మట; రావణుండు+ పనుపన్= రావణుడు పంపగా; పర్వతుండును, ప్రఘసుండును, ఖరుండును, క్రోధవశుండును, ప్రరుజుండును; అను రాక్షసులు+ఏవురు= అనే రక్కసులు అయిదుగురు; అనేక, రాక్షస, పిశాచ, సేనా, పరివృతులు+అయి= పెక్కు రక్కసులయొక్కయు భూతాలయొక్కయు సేనలతో కూడుకొనినవారై; పురంబు= నగరం; వెలువడి= బయటకువచ్చి; మాయ+కావించి= మాయను ప్రయోగించి; అదృశ్య+ఆకారులై= కనిపించని దేహాలు కలవారై; కపిసైన్యంబున్= వానరసేనను; నొప్పింపన్+తొడంగినన్= బాధింపపూనుకోగా; కని= చూచి.

**తాత్పర్యం:** వానరవీరులు మరల విజృంభించి రక్కసులను చుట్టుముట్టారు. చుట్టుగోడను రక్షిస్తున్న రాక్షసవీరులు వానరసేనలను అడ్డగించి, వారిపై రాళ్లు రువ్వారు. బల్లేలు విసరారు. గండ్రగొడ్డళ్లు, చిల్లకోలలు, కొరవులు, బాణాలు, ఈటెలు మున్నగు ఆయుధాలను ప్రయోగించారు. కాని, వానరులు లెక్కసేయక, తాము చెట్లు, రాళ్లు రాక్షసులపై ప్రయోగించి, ప్రాకారం మీదికి ప్రాకసాగారు. ఇరుపక్షాలకు జుట్టు జుట్టు పట్టుకొని యుద్ధం చేసే అవకాశం ఏర్పడింది. అంతట రావణుడు- పర్వతుడు, ప్రఘసుడు, ఖరుడు, క్రోధవశుడు, ప్రరుజుడు అనే పేర్లు కల అయిదుగురు రాక్షసవీరులను పంపాడు. వారు లంకాపట్టణం బయటికి వచ్చి, పెక్కు రాక్షసులను భూతాలను తమతోపాటుగా యుద్ధానికి పురికొల్పి, వానరులతో మాయాయుద్ధానికి పూని వారిని బాధింపసాగారు. దానిని గమనించి.

**ఉ. దారుణవిక్రముండు రిపుదర్పవిభేది మహాస్త్రవేది మా**
**యారణకోవిదుండు గడు నల్గి విభీషణుఁ డేఁగుదెంచి య**

**వీరుల మాయయుం జలము వ్రేల్మిడిలోఁ గుదియించి వీరకే**
**ళీరసికుండు వారి నవలీలమెయిం దునుమాడె నందఱన్. 71**

**ప్రతిపదార్థం:** దారుణ విక్రముండు= భయంకరమైన శౌర్యం కలవాడు; రిపు, దర్పవిభేది= శత్రువుల గర్వాన్ని అణచేవాడు; మహా+అస్త్ర, వేది= మంత్రమహిమ కల గొప్ప ఆయుధాలను తెలిసిన వాడు; మాయా, రణ, కోవిదుండు= మాయాయుద్ధంలో విశారదుడు; వీరకేళీ రసికుండు= పరాక్రమ మనే ఆటలో అభిరుచి కలవాడు అయిన విభీషణుఁడు; కడున్= మిక్కిలి; అల్గి= కోపించి; ఏఁగుదెంచి= వచ్చి, (యుద్ధభూమికి వచ్చి); ఆ+వీరుల, మాయయున్= ఆ వీరుల మాయ (లేనిదిఉన్నట్లు భ్రాంతి గొలిపే మహిమ); చలము= మాత్సర్యం; వ్రేల్మిడిలోన్= క్షణమాత్రంలో; కుదియించి= అణచివేసి; వారిన్= వారిని (ఆ రాక్షసులను); అందఱన్= అంతమందిని; అవలీలమెయిన్= సులువుగా; తునుమాడెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** భీకరమైన పరాక్రమం కలవాడు, శత్రువుల గర్వాన్ని భేదించేవాడు, మంత్రమహిమ గల ఆయుధాలను ప్రయోగించటంలో నేర్పు కలవాడు, మాయాయుద్ధం తెలిసినవాడు, ఆహవదోహలుడు అయిన విభీషణుడు కోపం వహించి ఆ రాక్షసవీరులను ఎదుర్కొని వారి మదాన్ని అణగించి, అంతమందినీ ఒక చిటికలో సంహరించాడు.

**విశేషం:** రాక్షసులు మాయాయుద్ధం చేయటంలో నేర్పరులు, వానరులు అట్టియుద్ధం చేయటంలో నేర్పరులు కారుగదా. విభీషణుడు రాక్షసుడే కాబట్టి - అతడు రాక్షసులను మాయాయుద్ధంలో గెలువగలిగాడు.

**క. ఆతని శరపాతంబుల । చేతం గడు నొచ్చి దైత్యసేన సగము ధా**
**త్రీతలపతితం బయ్యెఁ; వి । భీతిఁ బఱచి పురము సొచ్చెఁ బెఱసగము వెసన్. 72**

**ప్రతిపదార్థం:** ఆతని శరపాతంబుల చేతన్= ఆ విభీషణుడియొక్క బాణాలు పడటంచేత; కడున్= మిక్కుటంగా; నొచ్చి= బాధపొంది; దైత్యసేన= రక్కసులసైన్యం; సగము= అర్ధం; ధాత్రీ తల పతితంబు+అయ్యెన్= నేలమీదకు ఒరిగిపోయింది; పెఱసగము= మిగిలిన (సేన) అర్ధం; విభీతిన్+పఱచి= మిక్కిలి భయంతో పారిపోయి, వెసన్= శీఘ్రంగా; పురము+చొచ్చెన్= నగరంలోకి చేరింది.

**తాత్పర్యం:** విభీషణుడిబాణాలకు నొచ్చి, రాక్షససైన్యం సగభాగం నేలమీద ఒరిగిపోయింది. మిగిలిన సగం రాక్షససైన్యం భయంతో రణరంగం వీడి పారిపోయి లంకానగరంలోకి పోయి దాగింది.

**క. అది యెల్ల విని దశాననుఁ । డుదితక్రోధుఁ డయి మంత్రియుతముగ వెడలెన్**
**మదగజ ఘోటక సైనిక । పదభర భగ్నావనీ విభాగుం డగుచున్. 73**

**ప్రతిపదార్థం:** అది+ఎల్లన్= దానిని అంతా (సగంసేన రణరంగంలో కూలటం, పెరసగం పారిపోవటం); విని= ఆలకించి; దశ+ఆననుఁడు= పది తలలు కలవాడు- రావణుడు; ఉదితక్రోధుఁడు+అయి= జనించిన కోపం కలవా డయి; మద, గజ, ఘోటక, సైనిక, పద, భర, భగ్న+అవనీ, విభాగుండు+అగుచున్= మదించిన ఏనుగులయొక్కయు, గుఱ్ఱాలయొక్కయు, భటులయొక్కయు, అడుగుల బరువుచేత బ్రద్దలయిన భూప్రదేశం కలవాడు అయి; మంత్రియుతముగన్= మంత్రులతో కూడుకొని; వెడలెన్= బయలుదేరాడు.

**తాత్పర్యం:** రాక్షససేనలు చావగా మిగిలినవి రణరంగంనుండి పారిపోయిన విషయమంతా విని, రావణుడు మంత్రులతో కూడుకొని తనసేనల తాకిడికి, మదించిన ఏనుగుల గుఱ్ఱాల భటుల పాదాల బరువుకు భూమి బ్రద్దలుకాగా రణరంగానికి బయలుదేరాడు.

**వ. ఇట్లు వెడలి, యభేద్యం బగు నౌశనసవ్యూహంబు సంఘటించి వనచరబలంబుపయి నడచినం గని, రాఘవుండును బార్హస్పత్యవ్యూహంబు దీర్చి పేర్చి యెదురుకొనియె; నా సేనలు రెండు నకాండక్షుభిత సాగరయుగళంబు తెఱంగు దోఁప నొండొంటిం గవిసె; నప్పుడు రాముండు రావణుం దలపడియె, లక్ష్మణుం డింద్రజిత్తును, సుగ్రీవుండు విరూపాక్షునిఁ, దారుండు నిఖర్వటుం దాకి; రిట్లిరువాఁగునకును దేవాసురులకుం బోలె నాభీలసమరం బయ్యెఁ; నందు. 74**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వెడలి= బయలుదేరి; అభేద్యంబు+అగు= భేదించటానికి శక్యంగాని, ఔశనసవ్యూహంబు= శుక్రుడికి సంబంధించిన మొగ్గరం; సంఘటించి= ఏర్పరచి; వనచరబలంబుపయిన్= కోతులమూకపయి; నడచినన్= దండెత్తగా; కని= ఆరసి; రాఘవుండును= శ్రీరాముడును; బార్హస్పత్య వ్యూహంబు= బృహస్పతికి సంబంధించిన మొగ్గరం; తీర్చి= సంఘటించి; పేర్చి= అతిశయించి; ఎదురుకొనియెన్= మార్కొన్నాడు; ఆ సేనలు రెండును= ఆ రెండు సైన్యాలున్నూ (రాక్షసవానరసేనలు); అకాండ, క్షుభిత, సాగర, యుగళంబు, తెఱంగు= అకాలంలో కలత చెందిన రెండు సముద్రాల రీతి; తోఁపన్= స్ఫురించగా; ఒండు+ఒంటిన్= ఒకదాని నొకటి; కవిసెన్= ఎదుర్కొన్నాయి; అప్పుడు= ఆసమయంలో; రాముండు= శ్రీరాముడు; రావణున్= రావణుడిని; తలపడియెన్= ఎదుర్కొన్నాడు; లక్ష్మణుండు; ఇంద్రజిత్తును; సుగ్రీవుండు, విరూపాక్షునిన్= విరూపాక్షుడు అనే రాక్షసుడిని (రావణుడి మంత్రిని); తారుండు; నిఖర్వటున్= నిఖర్వటుడిని; తాకిరి= ఎదుర్కొన్నారు; ఇట్లు= ఈ రీతిగా; ఇరు వాఁగునకును= రెండు పక్షాలకున్నూ; దేవ+అసురులకున్+పోలెన్= దేవతలకూ రాక్షసులకూ వలె; ఆభీల, సమరంబు+అయ్యెన్= భయంకరమైన యుద్ధం జరిగింది; అందున్= (ఆ యుద్ధంలో).

**తాత్పర్యం:** ఈ రీతిగా బయలుదేరి రావణుడు శుక్రుడిచేత చెప్పబడిన మొగ్గరాన్ని ఏర్పరచి వానరసేనలపైకి దండెత్తాడు. శ్రీరాముడు ఆ రాక్షససేనలను ఎదుర్కొనటానికి అనువుగా బృహస్పతిచేత చెప్పబడిన మొగ్గరాన్ని ఏర్పరచి ఎదుర్కొన్నాడు. ఆ రెండుసైన్యాలున్నూ (రాక్షస వానరసేనలు) సమయంగాని సమయంలో కలతచెందిన రెండుసముద్రాలవలె తోచి ఒకదాని నొకటి ఢీకొన్నాయి. ఆ యుద్ధంలో రాముడు రావణుడిని ఎదుర్కొన్నాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తును మార్కొన్నాడు. సుగ్రీవుడు విరూపాక్షుని, తారుడు నిఖర్వటుని ఎదుర్కొన్నారు. ఈ విధంగా రెండు పక్షాలకున్నూ వేల్పులకు రక్కసులకువలె భయంకరమైన యుద్ధం జరిగింది.

**విశేషం:** (1) అలం: ఉపమ. రామరావణ సేనలయుద్ధం దేవాసురసంగ్రామంతో పోల్చబడింది. (2) ఔశనస వ్యూహము: ఉశనుడు= శుక్రుడు. శుక్రుడు రాక్షసుల కులగురువు. శుక్రాచార్యుడు రూపొందించిన యుద్ధవ్యూహం. బార్హస్పత్యవ్యూహము - బృహస్పతికి సంబంధించినది. బృహస్పతి దేవతల కులగురువు. (3) సముద్రాలు ప్రళయకాలంలో క్షోభిస్తాయి. అకాలంలో చెలరేగిన సముద్రాలవలె రెండు సేనలు విజృంభించాయి. (4) ఇరుపక్షాలలోని వీరులు తమ తమ అంతస్తులకు తగిన ప్రతివీరులను ఎదుర్కొనటం సమస్కంధులయిన, వారిని మార్కొనటం గమనింపదగిన అంశం. (5) ఇంద్రజిత్తు: ఇంద్రుడిని జయించినవాడు కనుక అతడికి ఆ సార్థకనామం ఏర్పడింది. అతడు రావణుడి కొడుకు.

**క. సౌమిత్రి నిశితవిశిఖ। స్తోమంబుల నసురపతిసుతుం బొదివిన సం**
**గ్రామమునకుఁ దొలఁగక యతఁ। డామనుజోత్తముని ముంచె నాశుగవృష్టిన్. 75**

**ప్రతిపదార్థం:** సౌమిత్రి= సుమిత్రకొడుకు - లక్ష్మణుడు; నిశితవిశిఖ, స్తోమంబులన్= వాడి అయిన బాణాల సమూహంచేత; అసురపతిసుతున్= రాక్షసరాజుయొక్క కొడుకును ఇంద్రజిత్తును; పొదివినన్= ఆక్రమించగా; అతఁడు= ఆ ఇంద్రజిత్తు;

సంగ్రామమునకున్= యుద్ధాన్ని; తొలఁగక= వదలి వెళ్ళక; ఆ మనుజ+ఉత్తమునిన్= ఆ మనుష్యులలో శ్రేష్ఠుడిని, లక్ష్మణుడిని; ఆశుగ వృష్టిన్= అమ్ములవానలో; ముంచెన్= ముంచాడు.

**తాత్పర్యం:** లక్ష్మణుడు వాడిఅయిన బాణాలతో రావణుడికొడుకైన ఇంద్రజిత్తుని కప్పివేశాడు. ఇంద్రజిత్తు యుద్ధంనుండి తొలగక, లక్ష్మణుడిని అమ్ములవానలో ముంచాడు.

**ఉత్సాహము**

> **అమరవైరివిభుఁడు దశరథాగ్రసుతుఁడు నేపునన్**
> **సమరసత్ప్రతాపకోప జాజ్వలచ్ఛరీరులై**
> **తుములబాణపటలవృష్టిఁ దొప్పదోఁగి యిర్వురుం**
> **దమక మేది తమక తమక తనిసి రాహవంబునన్. 76**

**ప్రతిపదార్థం:** అమరవైరివిభుఁడు= వేల్పులకు శత్రువైన రాక్షసులకు రాజు- రావణుడు; దశరథ+అగ్ర, సుతుఁడున్= దశరథుడియొక్క పెద్దకొడుకు- రాముడున్నూ; ఏపునన్= విజృంభణతో; సమర, సత్+ప్రతాప, కోప, జాజ్వలత్+శరీరులు+ఐ= యుద్ధంలో ఏర్పడే గొప్పపరాక్రమంవలన జనించే ఆగ్రహంచేత మండిపోయే దేహాలు కలవారై; తుముల బాణపటలవృష్టిన్= దట్టమైన అమ్ముల దొంతరల వానచేత; తొప్పదోఁగి= (నిండిన దొన్నెలై) బాగా తడసిపోయి; ఇర్వురున్= ఇద్దరును (రామ రావణులు); తమకము+ఏది= వేగం తగ్గిపోయి; తమక తమక= తమకు తామే; ఆహవంబునన్= యుద్ధంలో; తనిసిరి= తృప్తిపొందారు.

**తాత్పర్యం:** వేల్పులకు శత్రువులైన రాక్షసులకు రాజు రావణుడున్నూ, దశరథుడి పెద్దకొడుకు శ్రీరాముడున్నూ యుద్ధంలో ఏర్పడే పరాక్రమకోపంచేత మండేదేహాలు కలవారు ఔతూ దట్టమైన అమ్ములజడివానలో తడిసిపోయి, తమంతట తామే యుద్ధంలో తృప్తిపొందారు.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడండి. అరణ్య 6.318 విశేషాంశం.

**వ. తదనంతరంబ. 77**

**తాత్పర్యం:** అటు పిమ్మట.

> **క. ఆ రావణుండు నిజదో । స్సారమునకు రాముబాహుసారం బతి దు**
> **ర్వారంబగు టేర్పడఁ గని । వీరారంభంబు కడఁక విడిచి రయమునన్. 78**

**ప్రతిపదార్థం:** ఆ రావణుండు= ఆ రావణుడు; నిజదోః+సారమునకున్= తనయొక్క బాహుబలానికి; రాముబాహుసారంబు= శ్రీరాముడియొక్క భుజపరాక్రమం; అతిదుర్వారంబు+అగుట= మిక్కుటంగా వారించ శక్యం కానిది కావటం; ఏర్పడన్+కని= స్పష్టంగా గమనించి; వీర+ఆరంభంబు+కడఁకన్= పరాక్రమంతో కూడిన ప్రయత్నం; విడిచి= వదలిపెట్టి; రయమునన్= వేగంగా.

**తాత్పర్యం:** అటు పిమ్మట ఆ రావణుడు తన బాహుబలంతో శ్రీరాముడిపరాక్రమం ఆపటం మిక్కిలి కష్టమని స్పష్టంగా తెలిసికొని, శౌర్యంతో కూడిన కృషిని వదలిపెట్టి, వేగంగా. (మీది పద్యంతో అన్వయం)

**క. మగిడి నగరంబు సొచ్చిన । బెగడి నిశాచరబలంబు పెల్లగిలుటయున్**
**విగతభయుండు ప్రహస్తుఁడు । దగఁ గోల్తల సేసె నత్యుదగ్ర స్ఫురణన్. 79**

**ప్రతిపదార్థం:** మగిడి= వెనుదిరిగి; నగరంబు= పట్టణం (లంకాపురి); చొచ్చినన్= ప్రవేశించగా; నిశాచరబలంబు= రాక్షసులసేన; బెగడి= ధైర్యం కోలుపోయి భీతినిచెంది; పెల్లగిలుటయున్= ఉన్నచోటు వీడి పారిపోగా; విగతభయుండు= పోయిన భీతి కలవాడు, భయంలేని వీరుడు; ప్రహస్తుఁడు= ప్రహస్తుడు (అనేరాక్షసుడు); తగన్= సముచితంగా; అతి+ఉదగ్ర, స్ఫురణన్= మిక్కిలి భయంకరమైన స్థితి తోచేటట్లుగా; కోల్తల+చేసెన్= యుద్ధంలో శత్రువు నెదిరించే సన్నాహం చేశాడు.

**తాత్పర్యం:** రావణుడు యుద్ధంలో శ్రీరాముడి ధాటికి ఓర్వలేక, రణరంగం వీడి లంకానగరంలోకి మగిడి వెళ్ళాడు. రాక్షససేనలు భీతితో ఉన్నచోటు వదలి పారిపోసాగాయి. అయినను, భయం చెందక వీరుడైన ప్రహస్తుడు మిక్కుటమైన భయంకరత్వం వెల్లివిరిసేటట్లుగా, తగినరీతిని యుద్ధంలో నిలిచి శత్రువును మార్కొనటానికి సన్నాహంచేశాడు.

**ఉ. ఆతనిఁ గాంచి తద్బలము లన్నియుఁ గ్రమ్మఱ నాహవోత్సవ**
**స్ఫీతములై కడంగుటయుఁ బేర్చి విభీషణుఁ డుగ్రవానర**
**వ్రాతసమన్వితంబుగ నవారణ మార్కొనినన్ మహారణం**
**బాతతమయ్యె సైన్యనివహంబులు రెంటికి నద్భుతంబుగన్. 80**

**ప్రతిపదార్థం:** ఆతనిన్= ఆతడిని (ఆ ప్రహస్తుడిని); కాంచి= చూచి; తత్+బలములు+అన్నియున్= ఆ సేనలు అన్నియున్నూ; క్రమ్మఱన్= మరల; ఆహవ+ఉత్సవ+స్ఫీతములు+ఐ= యుద్ధం అనే పండుగలో అతిశయించినట్టివై; కడంగుటయున్= పూనిక వహించుటయు; పేర్చి= అతిశయించి; విభీషణుఁడు; ఉగ్ర, వానర, వ్రాత, సమన్వితంబుగన్= భయంకరాలైన కోతులమూకలతో కూడిన వాడయి; అవారణ= అప్రతిహతంగా, అడ్డులేకుంగా; మార్కొనినన్= కవియగా; మహారణంబు= గొప్పయుద్ధం; సైన్యనివహంబులు= సేనాసమూహాలు; రెంటికిన్= రెండుపక్షాలకు; అద్భుతంబుగన్= ఆశ్చర్యకరంగా; ఆతతము+అయ్యెన్= పొడిగించబడింది.

**తాత్పర్యం:** కోల్తల చేసిన ప్రహస్తుడిని కాంచి, ఆ రాక్షససేనలన్నీ తిరిగి యుద్ధం చేయటానికి ఉత్సాహంతో ఉపక్రమించాయి. అప్పుడు విభీషణుడు భయంకరమైన వానరసేనాసమూహాలను చేర్చుకొని ఆ రాక్షససేనలను అప్రతిహతంగా ఎదుర్కొన్నాడు. విభీషణ నాయకత్వంలో ఉన్న వానరసేనలకును ప్రహస్తుడినాయకత్వంలో ఉన్న రాక్షససేనలకును అద్భుతమైనపోరాటం చాలసేపు జరిగింది.

**విశేషం:** (1) రావణుడు రణరంగంనుండి నిష్క్రమించాడు. శ్రీరాము డిక ఏమి చేస్తూ ఉన్నాడు? అనే ప్రశ్న ఉదయించ వచ్చును. యుద్ధం చేసే వీరులు సమస్కంధులతోనే తలపడటం పరిపాటి. రావణుడు అలసి సొలసి యుద్ధం వీడవలసి వచ్చింది. శ్రీరాముడుకూడా అలసట చెంది ఉన్నాడు కదా. ఇక ప్రహస్తుడు కోల్తలసేయగా అతడిని ఎదుర్కొనటం విభీషణుడు తన కర్తవ్యంగా భావించి అతడితో మార్కొన్నాడు.

**వ. అంత. 81**

**తాత్పర్యం:** పిమ్మట.

## ప్రహస్త ధూమ్రాక్షుల యుద్ధము (సం. 3-270-1)

**మ. కృతహస్తుండు ప్రహస్తుఁ డాహవకళాకేళీవిదగ్ధుండు ద**
**ర్పితుఁడై తాఁకె విభీషణుం గడఁకమైఁ బెంపారి వారిద్దఱున్**
**శితశల్యోగ్రమయూరపత్త్రవిశిఖశ్రేణీశతచ్ఛన్నులై**
**ధృతి నొప్పారిరి చిత్రవారిధరపంక్తిచ్ఛన్న శైలాకృతిన్. 82**

**ప్రతిపదార్థం:** కృతహస్తుండు= చేయి తిరిగినవాడు; ప్రహస్తుఁడు; ఆహవ, కళా, కేళీ, విదగ్ధుండు= యుద్ధ విద్యాక్రీడలో నేర్పరి; దర్పితుఁడు+ఐ= గర్వం చెందినవాడై; విభీషణున్= విభీషణుడిని; తాఁకెన్= మార్కొన్నాడు; కడఁకమైన్= పూనికతో; పెంపు+ఆరి= అతిశయం నిండి; వారు+ఇద్దఱున్= వారు ఇరువురునూ, ప్రహస్తుడును విభీషణుడును; శిత, శల్య+ఉగ్ర, మయూర, పత్త్ర, విశిఖ, శ్రేణీ, శత+ఛన్నులు+ఐ= వాడి అయిన ఎముకలవలె భయంకరాలై, నెమలి ఈకలతో పొదుగబడిన అమ్ముల వరుసలు వందలచే కప్పబడిన వారయి; చిత్ర, వారిధరపంక్తి+ఛన్న, శైల+ఆకృతిన్= పెక్కు రంగులు గల మబ్బులవరుసలతో కప్పబడిన కొండలరూపంలో; ధృతిన్= ధైర్యంతో; ఒప్పారిరి= శోభిల్లారు.

**తాత్పర్యం:** యుద్ధంచేయటం ఒక కళ. ఒక ఆట. ఆ కళాకేళిలో నేర్పు కలవాడు ఆరితేరినవాడు అయిన ప్రహస్తుడు పూనికతో విభీషణుడిని ఎదుర్కొన్నాడు. విభీషణుడూ ప్రహస్తుడూ ఒకరి నొకరు మించి మార్కొనుచూ వాడి అయిన ఎముకలవలె భయంకరాలై, నెమలి ఈకలతో పొదుగబడిన బాణాల పరంపరలచేత కప్పబడుతున్నవారై యుద్ధంచేశారు. ఆ యుద్ధంలో వారు ఇరువురూ ధైర్యంతో నిలిచి పోరాడుతూ రంగురంగుల మబ్బులచేత ఆవరించబడిన కొండలవలె భాసించారు.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. కదిసి ప్రహస్తుఁ డార్చి పరిఘంబు రయంబున నెత్తి భీకరో**
**న్మద కరిహస్త తాడనము మాడ్కి దలిర్పఁగ వ్రేసె నీసుమై**
**నదయత రావణానుజుని నాతఁడు వ్రేటున కించుకంతయుం**
**గదలక హేమకూటగిరికైవడి నిల్చి యుదీర్ణకోపుఁడై. 83**

**ప్రతిపదార్థం:** కదిసి= కలియబడి; ప్రహస్తుఁడు; ఆర్చి= పెనుకేక పెట్టి (సింహనాదం చేసి); పరిఘంబు= ఇనుపకట్ల గుదియను; రయంబునన్= వేగంగా; ఎత్తి= పైకెత్తి పట్టుకొని; భీకర+ఉత్+మద, కరి, హస్త, తాడనము, మాడ్కిన్= భయంకర మైన ఏనుగు తొండంతో కొట్టేటట్లుగా; తలిర్పఁగన్= శోభిల్లగా; ఈసుమైన్= ఈర్ష్యతో; అదయతన్= నిష్ఠురంగా; రావణ+అనుజునిన్= రావణుడితమ్ముడైన విభీషణుడిని; వ్రేసెన్= కొట్టాడు; ఆతఁడు= అతడు (విభీషణుడు); వ్రేటునకున్= దెబ్బకు; ఇంచుక+అంతయున్= ఏమాత్రమున్నూ; కదలక= చలించక; హేమకూటగిరి కైవడిన్= హేమకూట పర్వతంవలె; ఉదీర్ణ కోపుఁడు+ఐ= గొప్పదైన క్రోధంకలవాడై; నిల్చి= నిలబడి.

**తాత్పర్యం:** కలబడి ప్రహస్తుడు సింహనాదం చేసి ఇనుపకట్లగుదియను వేగంగా పైకెత్తి ఏనుగు తొండంతో కొట్టినట్లుగా ఈర్ష్యతో నిష్ఠురంగా విభీషణుడిపై విసరికొట్టాడు. విభీషణుడు ఆ దెబ్బకు ఎంతమాత్రమూ జంకక హేమకూటపర్వతంవలె ధైర్యంతో కదలక నిలబడి, గొప్పక్రోధం కలవాడై.

**మ. శతఘంటాపరిభూషితంబును జగత్సంహారఘోరానలో**
**త్థిత కీలాసదృశంబునై మెఱయు శక్తిం బూన్చి మంత్రించి యు**
**ద్ధతతేజుండు ప్రహస్తు వైచిన వెసం దత్క్రూరసంపాత పా**
**టితవక్షుం డయి కూలె వాఁడు శతకోటిచ్ఛిన్నశైలాకృతిన్. 84**

**ప్రతిపదార్థం:** శత, ఘంటా, పరిభూషితంబును= నూరుగంటలచేత అలంకరించబడినట్టిదియున్నూ; జగత్+సంహార+ఘోర+అనల+ఉత్థిత, కీలా, సదృశంబున్+ఐ= లోకాన్నంతటిని సంహరించే భయంకరమైన అగ్నియొక్క పైకిలేచిన జ్వాలలతో సమానమై; మెఱయు= వెలుగొందే; శక్తిన్= శక్తి అనే ఆయుధాన్ని; పూన్చి= సంధించి; మంత్రించి= మంత్రం జపించి; ఉద్ధతతేజుండు= గర్వంతో కూడిన వర్చస్సు కలవాడు- విభీషణుడు; ప్రహస్తున్= ప్రహస్తుడిని; వైచినన్= కొట్టగా; వెసన్= శీఘ్రంగా; తద్+క్రూర, సంపాత, పాటిత, వక్షుండు+అయి= ఆ నిష్ఠురమైన తాకిడిచేత బ్రద్దలుకొట్టబడిన రొమ్ము కలవాడుఅయి; శతకోటి+ఛిన్న, శైల+ఆకృతిన్= వజ్రాయుధంచేత ముక్కలు చేయబడిన కొండవలె; వాఁడు= ప్రహస్తుడు; కూలెన్= నేలపై పడ్డాడు.

**తాత్పర్యం:** విభీషణుడు నూరు చిరుగంటలతో అలంకరించబడినదిన్నీ, ప్రళయకాలంలో జగత్తును సంహరించే భయంకరమైన అగ్నిజ్వాలలతో సదృశమై వెలుగొందేదిన్నీ అయిన- 'శక్తి' అనే ఆయుధాన్ని మంత్రాలు జపించి ప్రహస్తునిపై ప్రయోగించాడు. ఆ దెబ్బకు రొమ్ము బ్రద్దలు కాగా ప్రహస్తుడు, వజ్రాయుధంచేత ముక్కలు చేయబడిన కొండవలె నేలపై ఒరిగాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు ప్రహస్తుండు పడినం దత్సైన్యంబులు విముఖంబు లగుటయు, ధూమ్రాక్షుండు రోషతామ్రాక్షుం డగుచు నతినిబిడబలాహకానీకభీకరంబై కాఱుకొనుచున్న నిశాచరచక్రంబుతో నురలం బఱతెంచినం జలించి బలీముఖబలంబులు దుర్బలంబులై తొలంగినం జూచి యాంజనేయుం డజయ్యుండై నిల్చినం బెల్చన యెప్పటియట్ల యూథపతులుం గూడుకొని; రప్పుడు. 85**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ప్రహస్తుండు; పడినన్= కూలిపోగా (చనిపోగా); తద్+సైన్యంబులు= అతడిసేనలు; విముఖంబులు+అగుటయున్= వెనుదిరిగి పారిపోవటమున్నూ; ధూమ్రాక్షుండు; రోష, తామ్ర+అక్షుండు+అగుచున్= కోపంచేత ఎర్ర నయిన కనులు కలవాడు ఔతూ; అతి, నిబిడ, బలాహక+అనీక, భీకరంబు+ఐ= మిక్కిలి దట్టమైన మబ్బుల సమూహంవలె భయంకరమై; కాఱుకొనుచున్న= దట్టంగా మూగికొనిన; నిశాచరచక్రంబుతోన్= రాక్షసులదండుతో; ఉరలన్= అతిశయించిన వేగంతో; పఱతెంచినన్= రాగా; చలించి= చెదరి; బలీముఖబలంబులు= వానరసేనలు; దుర్బలంబులు+ఐ= శక్తిని కోలుపోయినట్టివై; తొలంగినన్= తప్పుకొనగా; చూచి= గమనించి; ఆంజనేయుండు= హనుమంతుడు; అజయ్యుండు+ఐ= గెలువశక్యంకానివాడై; నిల్చినన్= నిలబడగా; పెల్చన= ఆటోపంతో; ఎప్పటి+అట్ల= యథాప్రకారం; యూథపతులున్= సేనాపతులును; కూడుకొనిరి= కలిసిరి; ఆప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా వీరుడైన ప్రహస్తుండు మరణించటంచేత ఆతడి సైన్యాలు వెనుదిరిగి పారిపోయాయి; అందుచేత ధూమ్రాక్షుడు కోపంతో జేవురించిన కన్నులు కలవాడు ఔతూ, దట్టమైనమబ్బుల సమూహాలవలె భయంకరంగా గుమిగూడుకొన్న రాక్షసులదండుతో పైకొన వచ్చాడు. అప్పుడు వానరసేనలు చలించి బలాన్ని

కోలుపోయి తారాడటం చూచి హనుమంతుడు గెలువశక్యం కాని పరాక్రమంతో ముందుకు వచ్చాడు. అంతట ఆటోపంతో యథాప్రకారం వానర సేనాపతులును కలుసుకొన్నారు. ఆ సమయంలో.

**సీ. అనిలతనూజ ధూమ్రాక్ష రక్షిత సైన్య । యుగ్మంబునకు నయ్యె నుగ్రసమర;**
**మందు నిష్ఠురచరణాఘాతముల డొల్లు । నరదంబులును, శిలాహతులఁ దూలి**
**యొఱలు నేనుంగులు, నుత్తాలతరుహతిఁ । ద్రెళ్లు ఘోటకములు, దీవ్రనఖర**
**దంతక్షతంబుల దళితాంగులై నేలఁ । బడి తన్నికొను వీరభటులు నగుచు**

**ఆ. నధిక శౌర్యసారులగు కపివీరుల । చేత నొచ్చి దైత్యసేన భీతిఁ**
**బఱచెఁ గొంత, బెండువడి యుండెఁ గొంత, ధూ । మ్రాక్షువెనుక కొదిఁగె నంతఁ గొంత. 86**

**ప్రతిపదార్థం:** అనిలతనూజ, ధూమ్రాక్ష, రక్షిత, సైన్య, యుగ్మంబునకున్= వాయునందనుడు అయిన హనుమంతుడిచేతను, ధూమ్రాక్షుడిచేతను కాపాడబడే సేనలు రెండింటికిని; ఉగ్రసమరము= ఘోరయుద్ధం; అయ్యెన్= జరిగింది; అందున్= ఆ యుద్ధంలో; నిష్ఠుర, చరణ+ఆఘాతములన్= కఠినమైన కాళ్ల దెబ్బలచేత; డొల్లు= నేలమీద పొరలే; అరదంబులును= తేరులును; శిలా+ఆహతులన్= రాళ్లదెబ్బలచేత; తూలి= తూలిపోయి; ఒఱలు= ధ్వనిచేస్తూ పడిపోయే; ఏనుంగులున్= ఏనుగులును; ఉత్తాలతరుహతిన్= పొడుగుపాటి చెట్లదెబ్బలచేత; త్రెళ్లు= చనిపోయే; ఘోటకములున్= గుర్రాలు; తీవ్ర, నఖర, దంత, క్షతంబులన్= వాడియైన గోళ్లయొక్క పళ్లయొక్క కాట్లచేత; దళిత+అంగులు+ఐ= ఛేదించబడిన శరీరాలు కలవారై; నేలన్+పడి= భూమిమీదకు వ్రాలి; తన్నికొను= కంపించే; వీరభటులున్= పరాక్రమంగల యోధులను; అగుచున్= అగుచు; అధిక, శౌర్యసారులు+అగు= మిక్కుటమైన పరాక్రమంయొక్క నిగ్గు గల; కపివీరులచేతన్= వానరయోధులచేత; నొచ్చి= బాధించబడి; దైత్యసేన= రాక్షసులసైన్యం; కొంత= కొంతభాగం; భీతిన్= భయంతో; పఱచెన్= పారిపోయింది; కొంత= సేనలో కొంతభాగం; బెండు+పడి+ఉండెన్= నీరుగారిపోయి బలహీనమయింది; కొంత= సేనలో కొంతభాగం; ధూమ్రాక్షు వెనుకకున్= ధూమ్రాక్షుడి వెనుకకు; ఒదిఁగెన్= కుంచించుకుపోయి నక్కింది.

**తాత్పర్యం:** వాయునందనుడైన హనుమంతుడిసేనకున్నూ ధూమ్రాక్షుడి సైన్యానికిన్నీ ఘోరమైనసంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో వానరసేనదే పైచేయి అయింది. కోతిమూకలధాటికి రాక్షససేన తాళలేకపోయింది. వానరవీరుల బలమైన పాదాల దెబ్బలకు రాక్షసులసైన్యంలో రథాలు దొర్లాయి. రాళ్ల దెబ్బలకు ఏనుగులు బాధభరించలేక ఘీంకృతులతో నేలకు ఒరిగిపడ్డాయి. పొడుగాటి చెట్ల దెబ్బల చేత గుర్రాలు చచ్చాయి. వాడియైన గోళ్లతో రక్కి దంతాలతో కొరికి వానరులు రాక్షసులను బాధించగా వారు తన్నుకొంటూ భూమిపై బడి దొరలి మరణించారు. రాక్షససేనలో కొంతభాగం పారిపోయింది. కొంతభాగం సత్తువలేక నీరసించిపోయింది. కొంతభాగం భీతితో సేనాపతిఅయిన ధూమ్రాక్షుడి మరుగుచేరి నక్కిఉండింది.

**మహాస్రగ్ధర**

**కని ధూమ్రాక్షుండు విశ్వ । గ్రసన రయలసత్కాల మేఘంబ పోలెన్**
**ఘన గర్జాఘోష మొప్పం । గడఁగి శరశతాకల్పితాసారదుర్ద**
**ర్శన వీరారంభుఁడైనన్ । సకల హరిచమూసంఘమున్ విహ్వలంబై**
**చనెఁ దూలెం గూలె లావుం । జలమును జెదరన్ సంగడిన్ విచ్చె నొచ్చెన్. 87**

**ప్రతిపదార్థం:** కని= చూచి (రాక్షససేన దైన్యాన్ని గమనించి); ధూమ్రాక్షుండు; విశ్వగ్రసన రయలసత్+కాల, మేఘంబు+అ, పోలెన్= జగత్తును సంహరించే వేగంతో వెలుగొందే నల్లని మబ్బేయిది అనునట్లుగా; ఘనగర్జాఘోషము+ఒప్పన్= మేఘం చేసే గంభీరనాదం శోభిల్లగా; కడఁగి= పూని; శర, శత+ఆకల్పిత+ఆసార, దుర్దర్శన, వీర+ఆరంభుఁడు+ఐనన్= వందలకొలది బాణాలచేత ఏర్పరచబడిన జడివానచేత చూడశక్యంకాని పరాక్రమంయొక్క ప్రయత్నం కలవాడు కావటంచేత; సకల, హరి, చమూ, సంఘమున్= సమస్తమైన వానరసేనాసమూహం; విహ్వలంబు+ఐ= దైన్యం చెందినట్టిది అయి; చనెన్= పారిపోయింది; తూలెన్= నేలవ్రాలింది; కూలెన్= మరణించింది; లావున్= బలం; చలమును= మాత్సర్యమూ; చెదరన్= విడిపోగా, సంగడిన్‌విచ్చెన్= నెయ్యంవీడింది; నొచ్చెన్= బాధపడింది.

**తాత్పర్యం:** రాక్షససేనలు దైన్యంచెందటం గమనించి ధూమ్రాక్షుడు ప్రళయకాలంలోని నల్లని మేఘంవలె గర్జిస్తూ వేలకొలది బాణాలు ప్రయోగించి తేరిచూడరాని పరాక్రమం ప్రదర్శించటంచేత వానరసైన్యాలు దీనావస్థకు లోనయి నేలకూలాయి. మాత్సర్యం వీడి పారిపోయాయి. తోడివారి నెయ్యాన్ని వీడి చెదరిపోయాయి. నొచ్చాయి.

**విశేషం:** (1) ఇది మహాస్రగ్ధరావృత్తం. నాలుగుపాదాలతో ప్రతిపాదంలో - స,త,త,న,స,ర,ర,గ, గణాలు : ప్రాసనియతి ఉన్నది. 1,9,16 అక్షరాలకు యతి చెల్లుతుంది. ప్రాసయతి చెల్లదు. (2) అలం : ఉపమ.

**తే.** **అతనియుద్ధతి సైఁపక యనిలసూనుఁ । డనిలవేగుఁడై పఱతెంచి యార్చి తాఁకెఁ**
**బ్రధన మయ్యిద్దఱకు నుగ్రభంగి నమర । పతికిఁ బ్రహ్లాదునకుఁ బోలెఁ బ్రకట మయ్యె. 88**

**ప్రతిపదార్థం:** అతని+ఉద్ధతిన్= అతడి విజృంభణం (ధూమ్రాక్షుడియొక్క అతిశయం); సైఁపక= సహించలేక; అనిల సూనుఁడు= వాయుపుత్రుండు- హనుమంతుడు; అనిలవేగుఁడు+ఐ= గాలివంటి శీఘ్రగమనం కలవాడై; పఱతెంచి= అరుగుదెంచి; ఆర్చి= (సింహనాదంచేసి) పెనుకేక పెట్టి; తాఁకెన్= కవిశాడు; ఆ+ఇద్దఱకును= ఆ ఇరువురికిని; అమరపతికిన్= దేవేంద్రుడికిని; ప్రహ్లాదునకున్+పోలెన్= ప్రహ్లాదుడికిని వలె; ప్రధనము= యుద్ధం; ఉగ్రభంగిన్= భయంకరమైన రీతిగా; ప్రకటము+అయ్యెన్= ప్రసిద్ధమయింది. (కన్పించింది).

**తాత్పర్యం:** ధూమ్రాక్షుడి విజృంభణాన్ని సైరించలేక, వాయుసుతు డైన హనుమంతుడు వాయువేగంతో వచ్చి అక్కడ వ్రాలాడు. సింహనాదం చేసి పయి కురికిన ఆంజనేయుడికిన్నీ, ధూమ్రాక్షుడికిన్నీ అలనాడు ప్రహ్లాదుడికీ, దేవేంద్రుడికీ జరిగినట్లుగా ఘోరయుద్ధం జరిగింది.

**విశేషం:** (1) ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు. హిరణ్యకశిపుడు అనే రాక్షసుడికొడుకు. అతడు దేవేంద్రుడిని యుద్ధంలో ఓడించాడు. (2) అలం: ఉపమ.

**క.** **పరిఘంబులు గదలును బె । క్కరుదుగ రక్కసుఁడు వైచె నమ్మారుతిపై**
**నురుగండశైలములు ఘన । తరువులు హరివరుఁడు గురిసె దానవుమీఁదన్. 89**

**ప్రతిపదార్థం:** రక్కసుఁడు= రాక్షసుడు, ధూమ్రాక్షుడు; ఆ+మారుతిపైన్= ఆ హనుమంతుడిపై; పరిఘంబులు= ఇనుపకట్లగుదియలు; గదలును= గుదియలును; పెక్కు= అనేకాలు; అరుదుగన్= ఆశ్చర్యకరంగా; వైచెన్= విసరాడు; హరివరుఁడు= వానరశ్రేష్ఠుడు- హనుమంతుడు; ఉరుగండశైలములు= గొప్పరాళ్లు గల పర్వతాలు; ఘనతరువులు= గొప్పవృక్షాలు; దానవుమీఁదన్= రాక్షసుడిపై, ధూమ్రాక్షుడిపై; కురిసెన్= వర్షించాడు.

**తాత్పర్యం:** ఇనుపకట్లగుదియలు, గుదియలు పెక్కులు అచ్చెరువు గొలిపేటట్లుగా రాక్షసుడైన ధూమ్రాక్షుడు వాయునందను డైన హనుమంతుడిపై విసిరాడు. వానరశ్రేష్ఠు డైన ఆంజనేయుడు రాక్షసుడైన ధూమ్రాక్షుడిపై పెనుకొండలు, పెద్దపెద్దచెట్లను విసరాడు. ఈ విధంగా హనుమంతుడికి ధూమ్రాక్షుడికి మధ్య ద్వంద్వయుద్ధం కొంతసేపు జరిగింది.

**విశేషం:** రాక్షసుల ఆయుధాలు వానరుల పరికరాలకంటె నాగరకాలు.

**ఉ.** **ఇబ్భంగిం బెనంకువ సెల్లుచుండఁ గొండొక సేపునకు.** **90**

**తాత్పర్యం:** ఈ రీతిగా యుద్ధం సాగుతూ ఉండగా కొంతసేపటికి.

**స్రగ్ధర.**

**లంకాలుంటాకుఁ డుద్య । ల్లఘుతరగమనోల్లాసియై డాసి వీఁకం**
**బొంకం బేపారఁ జంచ । ద్భుజరచిత మహాభూరుహం బెత్తి వైచెం**
**గింకన్ ధూమ్రాక్షు; వాఁడుం । గెడసెను వదనోద్గీర్ణకీలాలధారా**
**పంకప్రాగ్భాగమగ్నా । పఘనవిఘటితప్రాణుఁడై యాహవోర్విన్.** **91**

**ప్రతిపదార్థం:** లంకాలుంటాకుఁడు= లంకను దోచుకొనేవాడు - హనుమంతుడు; ఉద్యత్+లఘుతర, గమన+ఉల్లాసి+ఐ= శోభిల్లుతున్న లగువైన నడకలో వేడుక కలవాడై; డాసి= సమీపించి; వీఁకన్= ఉత్సాహంతో; పొంకంబు+ఏపు+ఆరన్= నిండుతనం అతిశయించగా; చంచత్+భుజ, రచిత, మహా, భూరుహంబు= చలిస్తున్న భుజాలందు పెట్టబడిన గొప్పమ్రాను; కింకన్= కోపంచొప్పున; ధూమ్రాక్షున్= ధూమ్రాక్షుడిపైని; ఎత్తి వైచెన్= పైకెత్తి విసరాడు; వాడున్= అతడును - ఆ ధూమ్రాక్షుడున్నూ; వదన+ఉద్గీర్ణ, కీలాల, ధారా, పంక, ప్రాక్+భాగ, మగ్న+అపఘన, విఘటితప్రాణుఁడు+ఐ= మొగంనుండి ఉవ్వెత్తుగా స్రవించిన నెత్తురుధారలచేత ఏర్పడిన బురదలో మునుముందు మునిగిన శరీరం నుండి పోయినఅసువులు కలవాడై; ఆహవ+ఉర్విన్= యుద్ధభూమిలో; కెడసెను= మరణించాడు.

**తాత్పర్యం:** లంకను విధ్వంసం చేసిన హనుమంతుడు లాఘవమైన గమనంతో ధూమ్రాక్షుడిని సమీపించి తనవిశాలభుజస్కంధాలపై మోసికొని వచ్చిన పెద్దవృక్షాన్ని గురి చూచి నిండారినఉత్సాహంతో అతడిమీదకి విసరి వేశాడు. ఆ దెబ్బకు ఆ ధూమ్రాక్షుడు తట్టుకొనలేక మొగంనుండి నెత్తురు కారుతుండగా ఆ నెత్తుటి బురదలో ముందరి భాగం మునిగిపోయిన శరీరంనుండి ప్రాణాలు కోలుపోయి యుద్ధభూమిపై కూలాడు.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడండి. ఆరణ్య. 7.16 విశేషాంశం.

**వ.** **ఇత్తెఱంగున ధూమ్రాక్షుండు తెగినఁ గపిసైనికు లార్చి హనుమంతుని ననేకభంగులం బ్రస్తుతించుచు రజనిచరులం గనుకనిం దోలినం దూలి యందఱుం బఱచి పురంబు సొచ్చిదనుజేంద్రునకుం బ్రహస్తధూమ్రాక్షుల మరణప్రకారంబు లెఱింగించినఁ, బ్రకటబాష్పనిశ్వాసవివర్ణవదనుం డగుచుఁ బంక్తివదనుండు.** **92**

**ప్రతిపదార్థం:** ఇత్తెఱంగునన్= ఈ రీతిగా; ధూమ్రాక్షుండు; తెగినన్= మరణించగా; కపిసైనికులు= వానరభటులు; ఆర్చి= సింహనాదం చేసి (పెనుకేక వేసి); హనుమంతునిన్= ఆంజనేయుడిని; అనేకభంగులన్= అనేకరీతుల; ప్రస్తుతించుచున్= పొగడుతూ; రజనిచరులన్= రాక్షసులను; కనుకనిన్= సంభ్రమంతో; తోలినన్= చెదరగొట్టగా; తూలి= వంగపడి; అందఱున్= అందరును; పఱచి= పారిపోయి; పురంబు+చొచ్చి= (యుద్ధభూమిని వదలి) (లంకా) నగరం ప్రవేశించి; దనుజ+ఇంద్రునకున్= రాక్షసరాజుకు- రావణుడికి; ప్రహస్త, ధూమ్రాక్షుల మరణ ప్రకారంబులు= ప్రహస్త ధూమ్రాక్షుల చావునుగూర్చిన విధానాలను; ఎఱింగించినన్= తెలుపగా; ప్రకట, బాష్ప, నిశ్వాస, వివర్ణ, వదనుండు+అగుచున్= వెల్లడి అయిన కన్నీరు నిట్టూరుపులతో పాలిపోయిన మొగం కలవాడు ఔతూ; పంక్తివదనుండు= పదితలలు కల రావణుడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా ధూమ్రాక్షుడు మరణించగా, వానరవీరులు సింహనాదాలు చేసి ఆంజనేయుడిని బహురీతుల పొగడి రాక్షసులను తోలారు. అంతట ఆ రాక్షసులు అందరు యుద్ధభూమిని వదలి, లంకాపురంలోకి వెళ్లి ప్రహస్తుడు ధూమ్రాక్షుడు మరణించిన వృత్తాంతాల నెరిగించారు. అప్పుడు రావణుడు కన్నీరు కారుస్తూ వేడినిట్టూరుపులు వదలాడు.

**క. 'కలవా రెల్లను మడిసిరి; । కలిగియు లేఁడయ్యెఁ గుంభకర్ణుఁడు; వీనిం**
**దెలుపుదునొ? యేను గొడుకుం । జల మెడపక రిపులతోడ సరిఁ బెనఁగుదుమో?' 93**

**ప్రతిపదార్థం:** కలవారు+ఎల్లన్= ఉన్నవారు అందరున్నూ; మడిసిరి= మరణించారు; కుంభకర్ణుఁడు; కలిగియున్= ఉండికూడా; లేఁడు+అయ్యెన్= లేనట్టివాడే అయినాడు; ఏనున్= నేనును; కొడుకున్= తనయుడును- ఇంద్రజిత్తును; చలము+ఎడపక= మాత్సర్యాన్ని వీడక; రిపులతోడన్= శత్రువులతోడ; సరిన్+పెనఁగుదుమో?= సమానంగా యుద్ధం చేసేమా? వీనిన్= కుంభకర్ణుడిని; తెలుపుదునా?= మేలుకొలిపేదా?

**తాత్పర్యం:** 'ఉన్నవారందరు మరణించారు; కుంభకర్ణుడు ఉండికూడ లేనట్టివాడే అయ్యాడు. వీడిని ఇప్పుడు మేలుకొలిపేదా? లేదా - నేనూ నా సుతుడైన ఇంద్రజిత్తున్నూ కలిసి శత్రువులను ఎదిరించి పోరాడుదుమా?'

**వ. అని వితర్కించి యప్పటికిఁ గుంభకర్ణప్రబోధంబు గార్యంబుగా నిశ్చయించి, తదీయశయ్యాగృహంబునకుం జని వానిం దెలుపం బరిజనంబులం బనిచిన. 94**

**ప్రతిపదార్థం:** అని, వితర్కిరించి= అని తర్జనభర్జనలు చేసి యోచించి; అప్పటికిన్= ఆ సమయానికి; కుంభకర్ణ, ప్రబోధంబు= కుంభకర్ణుడిని మేలుకొల్పటం; కార్యంబుగాన్= కర్తవ్యంగా; నిశ్చయించి= నిర్ణయించి; తదీయశయ్యాగృహంబునకున్+చని= ఆతడియొక్క (కుంభకర్ణుడియొక్క) పడకటింటికి వెళ్లి; వానిన్+తెలుపన్= అతడిని మేలుకొలుపటానికై; పరిజనంబులన్= సేవకులను; పనిచినన్= నియోగించగా.

**తాత్పర్యం:** అని రావణుడు యోచించి, ఇక ఆ సమయానికి కుంభకర్ణుడిని మేలుకొల్పటమే కర్తవ్యమని నిశ్చయించి, కుంభకర్ణుడిపడకటింటికి వెళ్లి ఆతడిని మేలుకొల్పటానికై సేవకులను నియోగించాడు.

**సీ. భేరీమృదంగగంభీరనాదంబులుఁ । గాహళఘంటికాకలకలములు,**
**దారుణసింహనాదంబులు నొనరింపఁ । గడుఁ బెద్దవడికి నంగము గదల్చి**

**యొదిఁగిలి కను విచ్చి హూ యని బిట్టావు । లించి కొండొక దేఱి లేచి నీల్గి**
**కలయఁ జూచుటయును గట్టెదురున యున్న । యన్న నవ్వుచుఁ దన యనుఁగుదమ్ముఁ**

**ఆ. జూచి యనియె 'నిట్టి చోద్యంపునిద్రలుఁ । గలవె? యేరికిని జగంబులోన?**
**నెవ్వ రేమి యైరొ యెఱుఁగవు, ధన్యుఁడ; । వీవు మనకు నైన యెడరు వినవె? 95**

**ప్రతిపదార్థం:** భేరీ, మృదంగ, గంభీర, నాదంబులు= దుందుభులు, మద్దెలలనుండి వెలువడే గంభీరమైన ధ్వనులు; కాహళ, ఘంటికా కలకలములు= బూరాలనుండి చిరుగంటలనుండి వెలువడే కలకలరావాలు; దారుణ సింహనాదంబులు= భయంకరాలైన సింహ గర్జనలను పోలిన ధ్వనులు; ఒనరింపన్= చేయగా; కడున్= మిక్కిలి; పెద్దవడికిన్= చాలసేపటికి; అంగము= శరీరం; కదల్చి= చలింపజేసి; ఒదిఁగిలి= ప్రక్కకు కొంచెం తిరిగి; కనువిచ్చి= కనులు తెఱచి; హూ+అని; బిట్టు+ఆవులించి= పెద్దపెట్టున ఆవులించి; కొండొక+తేఱి= కొంత తెలివి తెచ్చుకొని; లేచి= మేలుకొని; నీల్గి=ఒడలు విరుచుకొని; కలయన్+ చూచుటయును= చుట్టుపట్ల చూడగా; కడు+ఎదురున= ఎట్టయెదుట; ఉన్న= ఉన్నటువంటి; అన్న= అగ్రజుడు రావణుడు; నవ్వుచున్=హసిస్తూ; తన+అనుఁగు+తమ్మున్= తన ప్రియమైన అనుజుడిని; చూచి; అనియెన్; ఇట్టి= ఈ విధమైన; చోద్యంపు నిద్రలు= అచ్చెరువు కలిగించే నిద్దురలు; ఏరికిని= ఎవరికైనను; జగంబులోనన్= లోకంలో; కలవె= ఉన్నాయా; ఎవ్వరు= ఎవరు; ఏమి+ఐరొ= ఏమయిపోయారో; ఎఱుఁగవు= తెలియజాలవు; ధన్యుఁడవు= చరితార్థుడవు; ఈవు= నీవు; మనకున్+ఐన= మనకు దాపురించిన; ఎడరు= ఆపద; వినవె= ఆలకించవా?

**తాత్పర్యం:** కుంభకర్ణుడు గాఢనిద్రలో ఉన్నాడు. ఆతడిని నిద్రనుండి మేలుకొల్పటానికై దుందుభులు మ్రోగించారు, మద్దెలలు వాయించారు. బూరాలు ఊదారు. చిరుగంటల కలకలధ్వనులు వినిపించారు. భయంకరమైన సింహనాదాలు చేశారు. అంతట కొంతసేపటికి శరీరం కదల్చి కుంభకర్ణుడు ప్రక్కకు ఒదిగి, మెల్లమెల్లగా కనులు విప్పి, హూ- అని పెద్దపెట్టున ఆవులించి, కొంతవరకు మేలుకొని ఒడలు విరుచుకొని నలుప్రక్కలు చూచి, తన ఎట్టయెదుట నిలిచిఉన్న అన్న రావణుడిపై దృష్టి సారించాడు. అంతట రావణుడు తన అనుగుతమ్ముడితో ఇట్లా పలికాడు: 'ప్రియమైన తమ్ముడా! కుంభకర్ణా! లోకంలో ఇటువంటి వింతనిద్దుర లున్నాయా?! నీవు నిదురలో మునిగి ఉన్నావు, ఎవరికి ఏమి జరిగిందో నీవు పట్టించుకొనటం లేదు. ఒక విధంగా నీవు ధన్యుడవు, హాయిగా ఏ కష్టాలెరుగక గాఢనిద్రలో ఉన్నావు. మనకు దాపురించిన ఆపదగూర్చి నీకు ఏ మాత్రమైనా తెలియునా?'

**వ. దశరథ నందనుం డయిన రాముండు నాచేత నపహృతభార్యుండై కలుషించి యనేకవానరయూథంబులం గూర్చికొని వచ్చి వనధి బంధించి మనవీటిపై విడిసి, మమ్మెల్లను నేలకుం గోలకుం దెచ్చుచున్నవాఁడు; ప్రహస్తాది వీరులు వానిచేతం బెక్కండ్రు సిక్కిరి; నీవ కాక వాని జయింప నన్యుండు శక్తుండు గాఁడు; కావున లెమ్ము; గ్రక్కునం బగతుపై నడచి, పొడిచి, గెలువుము; దూషణానుజులు వజ్రవేగ ప్రమాథులు నీకుం దోడ్పడియెద' రనిన 'నట్ల కాక' యని కుంభకర్ణుండు విహితపరికరబంధుండై సమరసన్నద్ధులయిన పరిజనంబుల తోడం గూడి వెల్వడి నడతెంచిన. 96**

**ప్రతిపదార్థం:** దశరథనందనుండు+అయిన= దశరథుడికొడుకు అయిన; రాముండు; నాచేతన్= నావలన; అపహృతభార్యుండు+ ఐ= అపహరించబడిన భార్య కలవాడై; కలుషించి= కోపించి; అనేక, వానర, యూథంబులన్= పెక్కుకోతుల మూకలను; కూర్చికొని= కలుపుకొని; వచ్చి= అరుగుదెంచి; వనధి, బంధించి= సముద్రాన్ని లోబరచుకొని (వారధి నిర్మించి దాటి);

మనవీటిపైన్= మన నగరంపై (లంకాపురిపై); విడిసి= శిబిరాలు నిర్మించి; మమ్మున్+ఎల్లను= మా అందరిని; నేలకున్+కోలకున్+తెచ్చుచున్నవాఁడు= బాణాలకు గురి కావించి భూమిపాలు చేస్తున్నాడు; ప్రహస్త+ఆది, వీరులు= ప్రహస్తుడు మున్నగు యోధులు; పెక్కండ్రు= పలువురు; వానిచేతన్= అతడిచేత= శ్రీరాముడిచేత; చిక్కిరి= లోబడ్డారు (చనిపోయారు); నీవు+అ, కాక= నీవు మాత్రమే తప్ప; వానిన్= అతడిని- శ్రీరాముడిని; జయింపన్= గెలవటానికి; అన్యుండు= ఇతరుడు; శక్తుండు+కాఁడు= సమర్థుడు కాడు; కావునన్= కాబట్టి; లెమ్ము= నిలబడుము (బయలుదేరుటకు సంసిద్ధుడవు కమ్ము); గ్రక్కునన్= వేగంగా; పగతుపైన్= శత్రువుపై; నడచి= దండెత్తి; పొడిచి= పోరాడి; గెలువుము= జయింపుము; దూషణానుజులు= దూషణుడిసోదరులు; వజ్రవేగప్రమాథులు= వజ్రవేగుడు, ప్రమాథుడు అనేవారు; నీకున్= నీకు; తోడ్పడియెదరు= సాయం చేస్తారు; అనినన్= అని (రావణుడు) పలుకగా; అట్లు+ఆ+కాక+అని= అటులే జరుగుగాక అని చెప్పి; కుంభకర్ణుండు; విహితపరికరబంధుండు+ఐ= కావలసిన పనిముట్లను సమకూర్చుకొన్నవాడై; సమరసన్నద్ధులు+అయిన= యుద్ధప్రయత్నాలను చేసినవారైన, పరిజనంబులతోడన్= భటులతో; కూడి= కలసి; వెల్వడి= (శయనగృహం) నుండి బయలు దేరి; నడతెంచినన్= రాగా.

**తాత్పర్యం:** దశరథమహారాజుకొడుకైన శ్రీరాముడిభార్యను నేను అపహరించాను; శ్రీరాముడు ఆగ్రహించి పెక్కువానర సమూహాలను సమకూర్చుకొని పయనించి వచ్చి, వారధి నిర్మించి సముద్రం దాటి లంకాపురి చేరి ఇక్కడ శిబిరాలను నిర్మించి ఉన్నాడు. ఆతడితో యుద్ధానికి తలపడక తప్పలేదు. ప్రహస్తుడు మున్నగు యోధులు రణరంగంలో మరణించారు. ఇక నీవే మాకు శరణ్యం. ఇంకొకడు శ్రీరాముడిని గెలువజాలడు. కావున నీవు వేగంగా బయలుదేరుము. లేచి శత్రువుపై విజృంభించి పోరాడుము. దూషణుడి తమ్ములు - వజ్రవేగుడు ప్రమాథుడు నీకు బాసటగా నిలువగలరు' అని రావణుడు చెప్పాడు. కుంభకర్ణుడు అంతట కావలసిన ఆయుధాలను తీసికొని, యుద్ధానికి సంసిద్ధులై ఉన్న భటులతో కూడి రణరంగానికి బయలుదేరాడు.

## కుంభకర్ణుండు యుద్ధము సేయుట (సం. 3-271-1)

**లయగ్రాహి.**

> **దారుణదవానల శిఖారుణ శిరోరుహు, గ । భీరఘనకర్బురశరీరుఁ, బటురోష**
> **క్రూరనయనాంతగళితోరుతరవహ్నికణ । ఘోరముఖు, దంతవలయారభసదంశో**
> **ద్గారి రుధిరాధరు, నుదారభుజసారణ వి । దూరితదిగంతుఁ, బదభారవినమద్భూ**
> **భారుఁ, బ్రిజగద్విజయభూరిబలు, నద్దనుజ । వీరుఁ గని రచ్చెరువు గూరఁ గపివీరుల్.** **97**

**ప్రతిపదార్థం:** కపివీరుల్= వానరశ్రేష్ఠులు; దారుణ, దవ+అనల, శిఖా+అరుణ, (శిరస్+రుహ) శిరోరుహున్= భయంకరమైన కారుచిచ్చు జ్వాలలవలె ఎర్రవారిన తలవెంట్రుకలు కలవాడిని; గభీరఘన, కర్బుర, శరీరున్= దట్టమైన మబ్బురంగు గల దేహం కలవాడిని; పటు, రోష, క్రూర, నయన+అంత, గళిత+ఉరుతర, వహ్ని, కణ, ఘోర, ముఖున్= మిక్కుటమైన కోపంచేత నిష్ఠురమైన కన్నుల కొనలనుండి జారే పెద్దఅగ్గిరవ్వలు కల భయంకరమైన మొగం కలవాడిని; దంతవలయ+ఆరభస, దంశ+ఉద్గారి, రుధిర+అధరున్= పండ్లవరుసను పటపట వేగంగా కొరకటంచేత కారెడి నెత్తురుతో కూడిన పెదవులు కలవాడిని; ఉదార, భుజ, సారణ, విదూరిత, దిగంతున్= గొప్పభుజాలు చాపటంచేత మిక్కిలి దూరంగా చేయబడిన దెసలకొసలు కలవాడిని; పదభారవినమత్+భూభారున్= కాళ్లబరువుచేత వంగచున్న భూమియొక్క బరువు కలవాడిని; త్రిజగత్+విజయ, భూరిబలున్= మూడులోకాలను గెలువగల గొప్పబలం కలవాడిని; ఆ+దనుజవీరున్= ఆ రాక్షసయోధుడిని; అచ్చెరువు+కూరన్= ఆశ్చర్యం ఒనగూడగా; కనిరి= చూచారు.

**తాత్పర్యం:** వానరశ్రేష్ఠులు రాక్షసయోధుడైన ఆ కుంభకర్ణుడిని చూచి మిక్కుటమైన అచ్చెరువు పొందారు. ఆ కుంభకర్ణుడు వికారమైన రూపం కలవాడు. ఆతడి తలవెంద్రుకలు కార్చిచ్చుశిఖలవలె ఎర్రగా ఉన్నాయి. ఆతడి శరీరం ముదురుమబ్బురంగుతో నిండిఉన్నది. మిక్కుటమైన కోపంచేత అగ్నివిస్ఫులింగాలు క్రక్కేకనులు కల మొగం అతడిది! పండ్లచుట్టుకట్టునుండి పటపటకొరకుటచేత కారే నెత్తురుతో గూడిన పెదవులు అతడివి. నిడివి అయిన చేతులు చాపి నడవటంచేత అతడు దెసలకొసలను దూరంచేస్తూ ఉన్నాడు. తన కాళ్లబరువుచేత క్రుంగిన భూమిపై నడిచేవాడు అతడు. మూడులోకాలను గెలువజాలిన బలంకలవాడుగా కుంభకర్ణుడు కోతిమూకలకు కన్పించాడు.

**విశేషం:** ఇది లయగ్రాహి వృత్తం. ప్రతిపాదంలోను, భ, జ, స, స, భ, జ, స, న, భ, య గణాలుంటాయి. మూడుచోట్ల ప్రాసయతి కన్పిస్తుంది. వేరువిధంగా ఈ పద్యాన్ని ప్రస్తరించవచ్చును. ప్రతిపాదాన్ని పంచమాత్రలతో గూడిన గణాలు ఏడు+గగము అనగా ఈ పద్యం మొత్తం పదునారు ఖండికలు చేసి (5+5) + (5+5)॥ + (5+5) +(5+5)॥ + (5+5) + (5+5)॥+(5+5) +2+2 మాత్రలు గల ఖండికలుగా విభజించి 16 ఖండికలకు ప్రాసంమాత్రం ఘటించిన ఝంపె తాళానికి అనువైనపాట కాగలదు. నన్నయ మూడు, తిక్కన నాలుగు లయగ్రాహివృత్తాలను రచించారు. ఎఱ్ఱాప్రెగ్గడ లయగ్రాహి నొక్కదానినే రచించాడు.

**క. రక్కసుఁడును దనమదిలో । నక్కపివీరులను జీరికైనఁ గొనక పే**
**రుక్కున రఘుకులవీరుల । దిక్కునకుం గవియుదెంచెఁ దీవ్రస్ఫురణన్. 98**

**ప్రతిపదార్థం:** రక్కసుఁడును= రాక్షసుడును- కుంభకర్ణుడును కూడ; తనమదిలోన్= తనచిత్తంలో; ఆ+కపివీరులను= ఆ వానరయోధులను; చీరికి+ఐనన్+కొనక= ఏమాత్రం లక్ష్యం చేయక; పేరు+ఉక్కున్= మిక్కుటమైన బలంతో; రఘుకులవీరుల, దిక్కునకున్= రఘువంశంలో జన్మించిన యోధులు (రామలక్ష్మణులు) ఉన్నదెసకు; తీవ్రస్ఫురణన్= మిక్కుటమైన వేగంతో; కవియుదెంచెన్= మార్కొనటానికి బయలుదేరాడు.

**తాత్పర్యం:** ఆ రాక్షసుడైన కుంభకర్ణుడు తన మనస్సులో వానరయోధులను ఎంతమాత్రం లక్ష్యపెట్టక, మిక్కుటమైన బలదర్పంతో రఘుకులవీరులైన శ్రీరామలక్ష్మణులు ఉన్నదెసగా అమితవేగంగా దూసుకొని పోసాగాడు.

**విశేషం:** పై పద్యాలలో ఎఱ్ఱన మహాకవి సహృదయుల మనోనేత్రాలకు సుస్పష్టంగా కన్పించేటట్లు కుంభకర్ణుడి రూపాన్ని చిత్రించాడు.

ఎఱ్ఱన కవితాశిల్పాన్ని $\frac{\text{నన్నయ + తిక్కన}}{2}$ +వర్ణనాభినివేశంగా ప్రస్తరించవచ్చును.

**మ. వడి నడ్డం బరికట్టె నెట్టన హరివ్రాతంబు పెన్మ్రాఁకులం**
**బిడుగుల్వోని మహోద్ధతాశ్మముల నాభీలంబుగా దైత్యు బి**
**ట్టడువన్ వైవఁగఁజొచ్చెఁ గొందఱు బలంబారంగ వే డాసి దం**
**దడి తత్కాయము సించి రుగ్రనఖదంతన్యాససంక్రీడలన్. 99**

**ప్రతిపదార్థం:** హరివ్రాతంబు= కోతులమూక; వడిన్= వేగంగా; నెట్టన= వారించటానికి వీలులేకుండా; అడ్డంబు+అరికట్టెన్= అడ్డు కల్పించింది; దైత్యు= రాక్షసుడిని; బిట్టు+అడువన్= బాగా అణచటానికై; పెన్, మ్రాఁకులన్= పెద్ద వృక్షాలతో; పిడుగుల్+పోని పిడుగులను పోలునట్టి; మహా+ఉద్ధత+అశ్మములన్= మిక్కిలి భీకరాలైన రాళ్ళను; వైవఁగన్+చొచ్చెన్= వేయసాగింది; కొందఱు= కొంతమంది వానరులు; బలంబు+ఆరంగన్= శక్తి నిండారగా; వే డాసి= వేగంగా దరి చేరి; దందడి= తరుచుగా; ఉగ్ర, నఖ, దంతన్యాస, సంక్రీడలన్= భయంకరమైన గోళ్ళచేత బరకుట, పళ్ళతో కొరుకుట అనే ఆటలతో; తత్+కాయము= ఆతడి యొక్క (కుంభకర్ణుడియొక్క) దేహం; చించిరి= ఛేదించారు.

**తాత్పర్యం:** కోతులమూకలు కుంభకర్ణుడివేగాన్ని అడ్డగించి అరికట్టడానికై పెనుమ్రాకులను వేశారు. గొప్పవైన పెద్దరాళ్ళను ఆ రాక్షసుడిని అణచటానికై వేశారు. కొందరు వానరులు తమబలాన్నంతటిని వెచ్చించి గోళ్ళతో గీరి దంతాలతో కొరికి కుంభకర్ణుడిదేహాన్ని ఛేదించారు.

**ఉ. కన్నుల నిద్ర దేఱఁగ నకంపితుఁ డై యతఁ డెంత సేసినం**
**దన్ను నెఱుంగ కొక్కమొగిఁ దత్కపిసైన్యచయంబుఁ బోర బే**
**రన్నన మ్రింగఁ జొచ్చె విలయాగమసంభృతదర్పరోషవే**
**గోన్నతలీలఁ గాలుఁడు జనోత్కరమున్ గ్రసియించుచాడ్పునన్. 100**

**ప్రతిపదార్థం:** కన్నులన్= నేత్రాలలో; నిద్ర= నిద్దుర; తేఱఁగన్= తేలిపోవగా; అకంపితుఁడు+ఐ= చలించనివాడయి; అతఁడు= కుంభకర్ణుడు; ఎంత చేసినన్= (ఇతరులు) (కపివీరులు) ఎంత చేసినప్పటికీ, ఎంతటి అడ్డంకులు కల్పించినప్పటికీ; తన్నున్+ఎఱుంగక= తనకు ఏమాత్రం తెలియక అనగా తనకు జరిగిన దేమీ గణించక; ఒక్కమొగిన్= ఒక వరుసలో; తత్+కపి, సైన్య, చయంబున్= ఆ వానరసేనా సమూహాన్ని; పోరన్= యుద్ధంలో; పేరు+అన్ననన్= పెనుపారవశ్యంతో; విలయ+ఆగమ, సంభృత, దర్ప, రోష, వేగ+ఉన్నత, లీలన్= ప్రళయకాలంలో వచ్చి నిండిన గర్వం కోపంయొక్క వేగంచేత ఏర్పడిన రీతిలో; కాలుఁడు= యముడు; జన+ఉత్కరమున్= జీవుల సమూహాన్ని; గ్రసియించుచాడ్పునన్= తినేటట్లుగా; మ్రింగన్+చొచ్చెన్= కబళింపసాగాడు.

**తాత్పర్యం:** కుంభకర్ణుడి కన్నులు నిద్దుర తేరాయి. కపిసేనలు ఏమి చేసినా సరకుగొనక అతడు విజృంభించి యుద్ధంచేయసాగాడు. అతడు తనకు ఎదురైన కోతిమూకలను ప్రళయకాలంలో యముడు రోషంతో నిండిన గర్వంతో జీవుల సమూహాలను తినివేసేటట్లు మ్రింగివేయసాగాడు.

**వ. ఇట్లు బల చండబల వజ్రబాహులు లోనుగాఁ బెక్కండ్ర యూథపతులను బహుసహస్రసంఖ్యల వానరయూథంబును మ్రింగియు గొదగొని వచ్చుచున్న యన్నిశాచరుని మార్కొన నోడి తారప్రముఖు లైన బలీముఖులు నలువంకలం జెదరి పఱచిన. 101**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; బల= బలుడు; చండబల= చండబలుడు; వజ్రబాహులు= వజ్రబాహుడు; లోనుగాన్= మొదలుగా; పెక్కండ్ర= పెక్కుమంది; యూథపతులను= సేనాధిపతులను; బహుసహస్రసంఖ్యల= పెక్కువేలమంది; వానర, యూథంబును= వానరసేనను; మ్రింగియున్= కబళించికూడా; గొదగొని వచ్చుచున్న= తరుగక పెరిగి పైపైకి వస్తూ ఉన్న; ఆ+నిశాచరునిన్= ఆ రాక్షసుడిని- ఆ కుంభకర్ణుడిని; మార్కొనన్+ఓడి= ఎదిరింపజాలక; తారప్రముఖులు+ఐన= తారుడు మున్నగునట్టి; బలీముఖులు= కోతులు; నలువంకలన్= నలువైపులకు; చెదరి= కలఁగి, ఉన్నచోటువదలి; పఱచినన్= పారిపోగా.

**తాత్పర్యం:** ఈ విధంగా బలుడు, చండబలుడు, వజ్రబాహుడు మున్నగు సేనాధిపతులను, పెక్కుమంది వేలకొలది వానరసైనికులను కుంభకర్ణుడు కబళించాడు. అంతమందిని పొట్టను పెట్టుకొని కూడ ఆగకుండా మీదకు వచ్చిపడుతున్న ఆ రాక్షసుడి ధాటికి ఓర్వజాలక తారుడు మున్నగు సేనాధిపతులు చెదరి నలుదిక్కులకు పారిపోయారు.

**మ. కని సుగ్రీవుఁడు బిట్టదల్చుచును వేగంబార దైత్యేంద్రు మా**
**ర్కొని సాలంబున వాని యౌఁదలఁ గడున్ ఘోరంబుగాఁ బూన్చి వ్రే**
**సిన నా వ్రేటున నిద్రదేఱి కడఁకం జేదోయి సారించి య**
**మ్మనుజాశుండు గపీంద్రుఁ బట్టె రభసోన్మాదంబుమై నార్చుచున్. 102**

**ప్రతిపదార్థం:** కని= అరసి (వానరులను భక్షిస్తూ విజృంభించి వచ్చే కుంభకర్ణుడిని చూచి); సుగ్రీవుఁడు= సుగ్రీవుడు; బిట్టు+అదల్చుచును= మిక్కుటంగా బెదరిస్తూ; వేగంబు+ఆరన్= రయ మొప్పారగా; దైత్య+ఇంద్రున్= రాక్షసులలో శ్రేష్ఠుడిని, కుంభకర్ణుడిని; మార్కొని= ఎదిరించి; సాలంబునన్= మద్దిచెట్టుతో; వాని+ఔఁదలన్= వాడితలమీద; కడున్= మిక్కిలి; ఘోరంబుగాన్= భయంకరంగా; పూన్చి= గురిపెట్టి; వ్రేసినన్= కొట్టగా; ఆ వ్రేటునన్= ఆ దెబ్బకు; నిద్ర+తేఱి= నిదుర వీడి; కడఁకన్= పూనికతో; చేదోయి= చేతులజంట; సారించి= ముందుకు చాచి; ఆ+మనుజ+ఆశుండు= ఆ మానవభక్షకుడు; రభస+ఉన్మాదంబుమైన్= వేగంతో కూడిన పిచ్చి ఆవేశంతో; ఆర్చుచున్= పెనుకేక పెట్టుతూ, సింహనాదం చేస్తూ; కపి+ఇంద్రున్= వానరశ్రేష్ఠుడిని, సుగ్రీవుడిని; పట్టెన్= గ్రహించాడు.

**తాత్పర్యం:** వానరులను భక్షిస్తూ విజృంభించి వస్తున్న కుంభకర్ణుడిని చూచి, సుగ్రీవుడు ఒక పెద్దమద్దిచెట్టును పట్టుకొని గురిచూచి అతడి నెత్తిపై మోదాడు. ఆ దెబ్బకు నిద్దురమైకం తొలగి, రాక్షసుడైన ఆ కుంభకర్ణుడు రెండుచేతులు చాచి సింహనాదం చేస్తూ వానరరాజైన సుగ్రీవుడిని పట్టుకొన్నాడు.

**క. పట్టువడిన సుగ్రీవునిఁ । గట్టెదురం గాంచి యధికకలుషిత మతియై**
**దట్టుఁడు లక్ష్మణుఁ డసురన్ । బిట్టేసెన్ బిడుగుఁ బోని పృథుబాణమునన్. 103**

**ప్రతిపదార్థం:** దట్టుఁడు= దిట్టతనం కలవాడు; లక్ష్మణుఁడు; పట్టు+పడిన= (కుంభకర్ణుడిచేత) గ్రహించబడిన; సుగ్రీవునిన్= సుగ్రీవుడిని; కడు+ఎదురన్= ఎదురుబొదురుగా; కాంచి= చూచి; అధిక, కలుషిత, మతి+ఐ= మిక్కుటంగా కోపించిన బుద్ధి కలవాడై; అసురన్= రక్కసుడిని, కుంభకర్ణుడిని; పిడుగున్+పోని= పిడుగును పోలెడి; పృథుబాణమునన్= గొప్ప అమ్ముతో; బిట్టు+ఏసెన్= గాటంగా కొట్టాడు.

**తాత్పర్యం:** కుంభకర్ణుడిచేత పట్టుబడిన సుగ్రీవుడిని, తన కనులతో చూచిన లక్ష్మణుడు కోపంతో కలతచెందిన మనస్సుకలవాడై, పిడుగును పోలెడి గొప్పబాణంతో కుంభకర్ణుడిని గట్టిగా కొట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ. ఉరమాడి యాశరం బుచ్చిపోవుటయును, । గడు నొచ్చి యా కుంభకర్ణుఁ డలిగి,**
**వెస వాలితమ్ముని విడిచి తోరపుశిలఁ । గొనుచు నుక్కున రాముకూర్మితమ్ము**

**దెసఁ బాఱుతెంచిన, ధీరుండు సౌమిత్రి । భల్లయుగ్మమునఁ దద్బాహు యుగము**
**నఱక, మాయాబలోన్నతుఁడు దైత్యుఁడు చతు । ర్బాహుఁడై తోఁచిన, భానుకులుఁడు**

**ఆ. చేతు లెల్లఁ దునిమె శితభల్లములఁ; వాఁడు । మఱియనేకహస్తమస్తకాంఘ్రి**
**భాగుఁ డైనఁ గినిసి బ్రహ్మాస్త్ర మేసినఁ । గూలె నసుర కొండ గూలినట్లు. 104**

**ప్రతిపదార్థం:** ఆ శరంబు= ఆ బాణం; ఉరము+ఆడి= వక్షాన్ని కొట్టి; ఉచ్చిపోవుటయును= వెలుపలికి వెడలిపోగా; కడున్= మిక్కిలి; నొచ్చి= బాధ చెంది; ఆ+కుంభకర్ణుఁడు; అలిగి= ఆగ్రహం చెంది; వెసన్= శీఘ్రంగా; వాలితమ్మునిన్= వాలిఅనుజుడిని సుగ్రీవుడిని; విడిచి= వదలి; తోరపుశిలన్= పెద్దరాతిని; కొనుచున్= తీసికొంటూ; ఉక్కునన్= బలంతో; రాము, కూర్మితమ్ముదెసన్= రాముడి అనుగుతమ్ముడి దిక్కుగా, లక్ష్మణుడి వైపుగా; పాఱుతెంచినన్= వడిగా రాగా; ధీరుండు= ధైర్యం కలవాడు; సౌమిత్రి= సుమిత్రకొడుకు- లక్ష్మణుడు; భల్లయుగ్మమునన్= రెండు అమ్ములతో; తత్+బాహుయుగమున్= ఆ కుంభకర్ణుడియొక్క రెండుచేతులను, నఱకన్= ఖండించగా; మాయా, బల+ఉన్నతుఁడు= మాయ శక్తిచేత గొప్పవాడు; దైత్యుఁడు= రాక్షసుడు- కుంభకర్ణుడు; చతుః+బాహుఁడు+ఐ= నాలుగుచేతులు కలవాడై; తోఁచినన్= కనుపించగా; భానుకులుఁడు= సూర్యవంశానికి చెందినవాడు, లక్ష్మణుడు; శిత, భల్లములన్= వాడిఅమ్ములతో; చేతులు+ఎల్లన్= చేతులనన్నిటిని; తునిమెన్= ఖండించాడు; వాఁడు= అతడు (ఆ కుంభకర్ణుడు); మఱి= వెండియును; అనేక హస్తమస్తక+అంఘ్రి భాగుఁడు+ఐనన్= పెక్కుచేతులు తలలు కాళ్లు కలవాడు కాగా; కినిసి= (లక్ష్మణుడు) కోపించి; బ్రహ్మ+అస్త్రము= బ్రహ్మకు సంబంధించిన మంత్రబాణం; ఏసినన్= ప్రయోగించగా; అసుర= రక్కసుడు (కుంభకర్ణుడు); కొండ= పర్వతం; కూలినట్లు= పడిపోయినట్లుగా; కూలెన్= పడిపోయాడు.

**తాత్పర్యం:** ఆ బాణం కుంభకర్ణుడివక్షాన్ని ఛేదించింది. అతడు మిక్కిలి బాధపడి, కోపించి, వెంటనే తాను పట్టుకొని ఉన్న సుగ్రీవుడిని వదలిపెట్టి, ఒక పెద్దబండరాతిని చేతబూని లక్ష్మణుడు ఉన్నవైపు పురోగమించాడు. ధీరుడైన లక్ష్మణుడు రెండు వాడిబాణాలు ప్రయోగించి కుంభకర్ణుడి రెండుచేతులను నరికాడు. కాని, మాయాబలం గల ఆ రక్కసుడు కుంభకర్ణుడు నాలుగుచేతులు కలవాడుగా కన్పించాడు. లక్ష్మణుడు ఆ నాలుగుచేతులను ఖండించాడు కాని మరల ఆ కుంభకర్ణుడు పెక్కుచేతులతో పెక్కుతలలతో పెక్కుకాళ్లతో కన్పించాడు. అంత లక్ష్మణుడు కోపించి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. కుంభకర్ణు డంతట కొండ కూలినట్లు నేలపై పడ్డాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు కుంభకర్ణుండు దెగటారినం జూచి దూషణానుజులు వజ్రవేగుండును, బ్రమాథియు రాఘవానుజుం దలపడి నిబిడబాణౌఘనిర్మగ్నుం జేయుటయు, నతండును వారి నతిబహుళశరజాలంబులం బొదివినఁ గయ్యం బొక్క ముహూర్తంబు చూపఱకు రోమహర్షణంబై చెల్లెఁ; దదనంతరంబ. 105**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; కుంభకర్ణుండు; తెగటారినన్= మరణించగా; చూచి; దూషణ+అనుజులు= దూషణుడి తమ్ములు; వజ్రవేగుండును; ప్రమాథియు; రాఘవ+అనుజున్= రాముడి తమ్ముడిని, లక్ష్మణుడిని; తలపడి= మార్కొని; నిబిడ, బాణ+ఓఘ, నిర్మగ్నున్+చేయుటయున్= దట్టమైన అమ్ములు అనే ప్రవాహంలో మునిగినవాడిగా ఒనరించటమున్నూ; అతండును= లక్ష్మణుడుకూడా; వారిన్= వారిని (వజ్రవేగుడిని, ప్రమాథిని); అతి బహుళశరజాలంబులన్= మిక్కిలి యెక్కువ బాణసమూహాలచేత; పొదివినన్= క్రమ్మగా; కయ్యంబు= యుద్ధం; ఒక్క ముహూర్తంబు= ఒక క్షణకాలం; చూపఱకున్= చూచేవారికి, రోమహర్షణము+ఐ= గగుర్పాటు కలిగించేదై; చెల్లెన్= జరిగింది; తత్+అనంతరంబు+అ= అటు పిమ్మట.

**తాత్పర్యం:** ఈ రీతిగా కుంభకర్ణుడు మరణించటం చూచి, దూషణుడితమ్ములు వజ్రవేగుడు ప్రమాథి అనేవారు శ్రీరాముడి తమ్ముడైన లక్ష్మణుడిని ఎదుర్కొని, అతడిని దట్టమైన అమ్ములప్రవాహంలో ముంచివేశారు. లక్ష్మణుడుకూడా ఆ వజ్రవేగ ప్రమాథి సోదరులపై లెక్కకు మిక్కిలి బాణసమూహాలను ప్రయోగించాడు. అప్పుడు ఒకక్షణకాలం ఆ యుద్ధం చూచేవారికి గగురుపాటు కలిగించింది. అటు పిమ్మట.

**చ.** **అనిలసుతుండు నీలుఁడు రయం బెసఁగం బఱతెంచి యమ్మహా**
**దనుజులమీఁద నేపున నుదగ్రనగాగ్రయుగంబుఁ బూన్చి వై**
**చినఁ గడు రూపఱం జదిసి చెప్పఁగఁ జూపఁగ లేక పోయి ర**
**ద్దనుజులు వానరోత్కరముఁ దద్దయు నుబ్బున నార్చె నత్తరిన్.** **106**

**ప్రతిపదార్థం:** అనిలసుతుండు= వాయుపుత్రుడు హనుమంతుడు; నీలుఁడు= నీలుడు; రయంబు+ఎసఁగన్= వేగం అతిశయించగా; పఱతెంచి= అరుగుదెంచి; ఆ+మహాదనుజులమీఁదన్= ఆ గొప్పరాక్షసులపై; ఏపునన్= బలంకొలది; ఉదగ్ర, నగ+అగ్ర, యుగంబున్= గొప్పకొండ శిఖరాలను రెండింటిని; పూన్చి= పొసగి; వైచినన్= విసరగా; కడున్= మిక్కుటంగా; రూపు+అఱన్= ఆకృతి నశించేటట్లుగా; చదిసి= అణగారిపోయి; ఆ+దనుజులు= ఆ రాక్షసులు (వజ్రవేగుడును ప్రమాథియు); చెప్పఁగన్+చూపఁగన్+లేకపోయిరి= చెప్పటానికి కాని చూపటానికి గాని వీలుకాకపోయారు; వానర+ఉత్కరమున్= కోతులసమూహం; ఆ+తరిన్= ఆ సమయంలో; తద్దయున్= మిక్కిలి; ఉబ్బునన్= ఉత్సాహంతో; ఆర్చెన్= సింహనాదం చేసింది.

**తాత్పర్యం:** హనుమంతుడున్నూ నీలుడున్నూ వేగంగా అక్కడికి వచ్చి, ఆ వజ్రవేగుడిపై ప్రమాథిపై రెండు పెద్దకొండ శిఖరాలు విసరివైచారు. ఆ రాక్షసులు ఇద్దరు నామరూపాలు లేకుండా ఆ కొండశిఖరాలతాకిడికి అణగారిపోయారు. ఆ విధంగా ఆ రాక్షసులు హతమారటం చూచి కోతిమూకలు ఉత్సాహంతో సింహనాదాలు చేశాయి.

**క.** **ఆకులపడి నలుదెసలం । గాకులక్రియఁ జెదరి కడు వెగడుపడి రక్షో**
**నీకములు లంక యెనిమిది । వాకిళ్లను దూఱెఁ బౌరవర్గము దలఁకన్.** **107**

**ప్రతిపదార్థం:** ఆకులపడి= కలతచెంది; నలుదెసలన్= నాలుగుదిక్కులలో; కాకులక్రియన్= కాకులవలె; చెదరి= ఇటునటు పోయి; కడున్= మిక్కిలి; వెగడు, పడి= దైన్యం చెంది; రక్షస్+అనీకములు= (రక్షోనీకములు) రక్కసులసేనలు; లంక+ఎనిమిది, వాకిళ్ళను= లంకానగరంలో ఉన్న ఎనిమిది ద్వారాలను; పౌరవర్గము= పట్టణంలో నివసించేవారి సమూహాలు; తలఁకన్= భీతిచెందేటట్లుగా; తూఱెన్= తొందరగా ప్రవేశించాయి.

**తాత్పర్యం:** రాక్షసులసేనలు కలతచెంది నాలుగుదిక్కులకు కాకులవలె చెదరి పారిపోయాయి, లంకాపట్టణంలో ఎనిమిదిమూలల గల ద్వారాలలో దూరారు. ఆ విధంగా ఓడిపోయిన సేనలు చిందరవందరై యుద్ధభూమిని వదలి పట్టణంలోకి పారిపోయిరావటం కాంచి లంకాపట్టణవాసులు భీతిల్లారు.

**క.** **అంతఁ దనకూర్మితమ్ముం । డంతకుఁ గూడుటయు, దూషణానుజమృతి వృ**
**త్తాంతంబును విని యెంతయు । వంతఁ దలరి యఱచెఁ బంక్తివదనుఁ డవశుఁడై.** **108**

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట; పంక్తివదనుఁడు= పదితలలు కలవాడు రావణుడు; తన, కూర్మి, తమ్ముండు= తనకు ప్రియమైన అనుజుడు కుంభకర్ణుడు; అంతకున్+కూడుటయున్= యముడిని చేరుటయు, (మరణించుటయున్నూ) దూషణ+అనుజ, మృతి, వృత్తాంతంబును= దూషణుడితమ్ములయొక్క మరణాన్ని, గూర్చిన సంగతియును; విని; ఎంతయున్ వంతన్= మిక్కుటమైన దుఃఖంతో; తలరి= చలించి; అవశుఁడు+ఐ= తనమీద తనకు అదుపు తప్పినవాడై, దీనుడై; అఱచెన్= రోదించాడు.

**తాత్పర్యం:** అంతట తనతమ్ముడు, తనకు ప్రియమైనవాడు, మహాబలిశాలి అయిన కుంభకర్ణుడు యమలోకాన్ని చేరటమున్నూ, దూషణుడితమ్ములు నామరూపాలు లేకుండ రణరంగానికి బలికావటమున్నూ విని, రావణుడు మిక్కుటమైన దుఃఖంలో మునిగి బిగ్గరగా విలపించాడు.

**వ. అయ్యవసరంబున నాముక్తకవచుండును, నాబద్ధతూణీరుండును, బ్రచండకోదండుండును, గృపాణబాణాసనాది వివిధ సాధనోపేత సన్నిహిత స్యందనుండును, బురందర హృదయ సాగర మందరుండును నైన మేఘనాదుండు తండ్రిం జేరం జనుదెంచి, వినయంబున నిట్లనియె. 109**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఆముక్త కవచుండును= ధరించిన తనుత్రాణం కలవాడున్నూ; ఆబద్ధ తూణీరుండును= అమరించబడిన అమ్ములపొది కలవాడున్నూ; ప్రచండకోదండుండును= మిక్కిలి తీవ్రమైన విల్లు కలవాడున్నూ; కృపాణ, బాణ+ఆసన+ఆది, వివిధ, సాధన+ఉపేత, సన్నిహిత, స్యందనుండును= కత్తులు, ధనుస్సులు మున్నగు వేరువేరు పరికరాలతో కూడిన దగ్గరగా ఉన్న రథం కలవాడున్నూ; పురందర, హృదయ, సాగర, మందరుండును= దేవేంద్రుడి మనస్సు అనే సముద్రాన్ని తరచునట్టి మందరపర్వతంవంటి వాడున్నూ; ఐన= ఐనట్టి; మేఘనాదుండు= ఇంద్రజిత్తు; తండ్రిన్= రావణుడిని; చేరన్+చనుదెంచి= చేరవచ్చి, సమీపించి; వినయంబునన్= వినయంతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో కవచాన్ని ధరించిన వాడున్నూ, అమ్ములపొది సమకూర్చుకొన్నవాడున్నూ, గొప్పవిల్లు చేబూనినవాడున్నూ, కత్తులు బాణాలు ధనుస్సులు పలురకా లైన పరికరాలతోకూడిన రథం దగ్గరగా ఉన్నవాడున్నూ, దేవేంద్రుడి హృదయ మనే సముద్రాన్ని మందరపర్వతంవలె మథించినవాడున్నూ అయిన మేఘనాదుడు తనతండ్రి అయిన రావణుడిని సమీపించి ఈ విధంగా పలికాడు.

**చ. 'వగవఁగ నేల దైత్యకులవల్లభ! యేఁ గలుగంగ నెమ్మెయిన్**
**జగముల నీదుశత్రులకు శౌర్యము సెల్లునె? వృత్రవైరిలో**
**నగు సురకోటి యే పడఁచి యప్రతిమోన్నతి నున్న నీకుఁ గ్రోఁ**
**తి గముల నోర్చు టెంతపని దేవ! ననున్ గృపఁ బంపు మాజికిన్. 110**

**ప్రతిపదార్థం:** దైత్యకులవల్లభ!= రాక్షసవంశానికి భర్త అయినవాడా, ఓ రావణా!; వగవఁగన్+ఏల= దుఃఖించటం ఎందుకు?; ఏ+మెయిన్= ఏ విధముగా నైనను; ఏన్= నేను; కలుగంగన్= ఉండగా; ఏ+మెయిన్= ఏవిధముగానైనను; జగములన్= లోకాలలో; నీదు+శత్రులకున్= నీయొక్క విరోధులకు; శౌర్యముచెల్లునె= పరాక్రమం రాణిస్తుందా; వృత్రవైరి= దేవేంద్రుడు (వృత్రాసురుడికి శత్రువు); లోనగు= మున్నగు; సురకోటి+ఏపు+అడఁచి= దేవతల సమూహాల విజృంభణం అణచి; అప్రతిమ+ఉన్నతిన్+ఉన్న= సాటిలేని గొప్పతనంతో భాసిస్తున్న; నీకున్= నీకు; క్రోతిగములన్= కోతిమూకలను; ఓర్చుట+ఎంత, పని?=

ఓడించటం ఎంతటి కార్యం? (సులువైన పని); దేవ= ప్రభూ!; ననున్= నన్ను; కృపన్= దయతో; ఆజికిన్= యుద్ధానికి; పంపుము= పుత్తెంచుము.

**తాత్పర్యం:** 'ఓ రాక్షసవంశవల్లభా! నీవు దుఃఖించ' నవసరం లేదు. నేను ఉండగా ఏ విధంగా కూడ లోకాలలో నీ విరోధుల పరాక్రమం రాణించదు. వృత్రుడిని చంపిన దేవేంద్రుడు మున్నగు వేల్పుల ఉక్కడగించి సాటిలేని శౌర్యంతో వెలుగొందుతున్న నీకు ఈ వానరసమూహాన్ని హతమార్చటం మిక్కిలి సులువైన పని. ప్రభూ! నన్ను దయతో రణరంగానికి పంపుము. నేను శత్రువులను జయించగలను.

**ఉ. కూడిన కొండమ్రుచ్చులను గ్రోఁతుల నుగ్రత ముట్టి కిన్కఁ జెం**
**డాడెద; నుజ్జ్వలోగ్రవివిధాంబకచుంబితదిఙ్ముఖుండ నై**
**యాడెద వీరనృత్యము; రయంబునఁ బార్థివసూను లిద్దఱం**
**గ్రీడయపోలెఁ గిట్టి పెడకేలుగఁ గట్టెదఁ, బట్టి తెచ్చెదన్.' 111**

**ప్రతిపదార్థం:** కూడిన= చేరిన; కొండమ్రుచ్చులను= కొండలలో తిరుగాడే ముదురుకోతులను; క్రోఁతులన్= వానరులను; ఉగ్రతన్= భయంకరంగా; ముట్టి= కదిసి; కిన్కన్= కోపంతో, చెండాడెదన్= ఖండిస్తాను; ఉత్+జ్వల+ఉగ్ర, వివిధ+అంబక, చుంబిత, దిక్+ముఖుండను+ఐ= దేదీప్యమానంగా ప్రకాశించి భయంకరాలుగా కన్పట్టే పలురకాలైన బాణాలచేత ముద్దుపెట్టుకొనబడిన దిక్కులయొక్క మొగాలు కలవాడనై; వీరనృత్యము= వీరులు యుద్ధం చేస్తూ కావించే తాండవం; ఆడెదన్= చేస్తాను; రయంబునన్= వేగంగా; పార్థివసూనులు+ఇద్దఱన్= రాజపుత్రులు ఇరువురిని, రామలక్ష్మణులు ఇరువురిని; క్రీడ+అ, పోలెన్= ఆట ఆడే రీతిగానే (అవలీలగా); కిట్టి= సమీపించి; పెడకేలుగన్= చేతులు విరిచి, కుడిచేయి ఎడమభాగాన ఎడమచేయి కుడిభాగాన చేర్చి; కట్టెదన్= బంధిస్తాను; పట్టి= బంధించి; తెచ్చెదన్= తీసికొని వస్తాను.

**తాత్పర్యం:** చేరి గుమిగూడి వచ్చిన కోతులను కొండముచ్చులను భయంకరంగా కదిసి కోపంతో చీల్చి చెండాడుతాను; పెక్కురకాలైన బాణాల పరంపరలను అన్నిదిక్కులకు దేదీప్యమానంగా ప్రసరింపజేసే వీరవిహారం చేస్తాను; రాజకుమారుల నిద్దరను రామలక్ష్మణులను వినోదలీలావిలాసంగా యుద్ధంలో జయించి బంధించి పెడకేలు కట్టి నీముందర తెచ్చి పెట్టగలను. ఇది నా ప్రతిజ్ఞ.'

**వ. అనినఁ దెలివొంది మందోదరీసుందరుండు ప్రియనందనున కి ట్లనియె. 112**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (ఇంద్రజిత్తు వచించగా); తెలివి+ఒంది= తెలివొంది; తేరుకొని; మందోదరీ, సుందరుండు= మందోదరికి అందమైనవాడు, మందోదరి భర్త - రావణుడు; ప్రియనందనునకున్= అనుగుసుతునకు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా వచించాడు.

**తాత్పర్యం:** అని ఇంద్రజిత్తు ప్రోత్సాహవచనాలు చెప్పగా విని తెప్పరిలి ధైర్యం తెచ్చుకొనినవాడై, మండోదరిభర్త అయిన రావణుడు ప్రేమపాత్రుడైన తన తనయుడు ఇంద్రజిత్తుతో ఈ విధంగా పల్కాడు.

**సీ. 'నీ పరాక్రమలీల నిక్కమే నెఱుఁగనే। పుత్త్ర! నీ భుజబలస్ఫురణమునన**
**కాదె నా కిట్టి విఖ్యాతియు సిరియును। గలిగె; గీర్వాణసంఘంబుతోడఁ**

**గూడ నయ్యింద్రునిఁ గొనివచ్చి నా బంటుఁ । గా నొనరింపవే గర్వ మెసఁగ;**

**మాయావిదుండవు మహితదివ్యాస్త్రవి । శారదుండవు నీవు; సంగరమునఁ**

**ఆ. బగతు రెల్ల వెఱఁగుపడఁగ దృశ్యాదృశ్య । దుర్నిరూపభంగిఁ దొడరి చిక్కు**

**వఱుచు నీ మహోగ్రబాణ పాతంబులు । దశరథాత్మజులకుఁ దరమె యోర్వ? 113**

**ప్రతిపదార్థం:** పుత్ర!= ఓ కుమార! ఇంద్రజిత్తూ!; నీ పరాక్రమలీల= నీయొక్క శౌర్యం అనే ఆట; నిక్కము= నిజం; ఏను= నేను; ఎఱుఁగన్+ఏ?= తెలియనా? (నాకు తెలియదా - తెలుసు అని భావం); నీ భుజ బలస్ఫురణమునన్+అ= నీ భుజశక్తి; ప్రకటనంవలననే; కాదు+ఎ= కాదా; ఇట్టి= ఇటువంటి; విఖ్యాతియున్= కీర్తియు; సిరియును= సంపదయున్నూ; కలిగెన్= నాకు లభించాయి; గర్వము+ఎసఁగన్= దర్పం అతిశయించగా; గీర్వాణ సంఘంబుతోడన్= వేల్పులసముదాయంతో, కూడన్= సయితంగా; ఆ+ఇంద్రునిన్; కొనివచ్చి= తీసికొనివచ్చి; నాబంటుగాన్= నా సేవకుడిగా; ఒనరింపవే= చేయలేదా; నీవు= నీవు; మాయావిదుండవు= మాయ (ఉన్నదానిని లేనట్లుగా, లేనిదానిని ఉన్నట్లుగా భ్రాంతిగొలిపే మహిమ) తెలిసినవాడవు; మహిత, దివ్య+అస్త్రవిశారదుండవు= గొప్పవైన మంత్రబాణాలనుగూర్చి తెలిసినవాడవు; సంగరమునన్= యుద్ధంలో; పగతురు+ఎల్లన్= శత్రువులు అందరు; వెఱఁగుపడఁగన్= భీతితో నిశ్చేష్టులుకాగా; దృశ్య+అదృశ్య, దుర్నిరూపభంగిన్= కనుపించి, కనుపించకుండగా (ఎక్కడున్నది) నిరూపించటానికి వీలులేని విధంగా; తొడరి= పూని; చిక్కు+పఱుచు= కష్టంకలిగించే; నీ, మహా+ఉగ్ర, బాణపాతంబులు= నీయొక్క గొప్పవైన భయంకరమైన అమ్ముల ప్రయోగాలు; దశరథ+ఆత్మజులకున్= దశరథుడి కుమారులకున్= రామలక్ష్మణులకు; ఓర్వన్+తరము+ఎ= సహించటానికి శక్యం ఔతుందా? (శక్యం కాదు).

**తాత్పర్యం:** ఓ కుమారా! నీవు ఎంతటి పరాక్రమవంతుడవో నే నెరుగుదును. నాకు వచ్చిన కీర్తిప్రఖ్యాతులకు నీవే కారణం. వేల్పుల సముదాయాన్ని, ఇంద్రుడిని, జయించి నీవు ఆతడిని నా సేవకుడిగా చేశావు. నీ దర్పం గొప్పది. నీవు మాయావిదుడవు. యుద్ధంలో శత్రువులను భ్రాంతిలో ముంచగలవు. కనుపిస్తూనే క్షణంలో అదృశ్యం కాగలవు. నీవు ఎచ్చట ఉన్నది శత్రువులు గుర్తించలేరు. భయంకరాలయిన నీ బాణప్రయోగాలకు దశరథుడి కుమారులు రామలక్ష్మణులు తట్టుకోలేరు.

**ఆ. నిఖిలశత్రుచయము నిశ్శేషముగఁ జంపి । యనఘ! సమరనిహతు లైన యస్మ**

**దీయ జనులఋణము దీర్పుము; మసలక । పోయి రమ్ము; పోరఁ బొడిచి గెలుము’. 114**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! నిఖిలశత్రుచయమున్= సమస్తమైన శత్రువుల సమూహాన్ని; నిశ్శేషముగన్= మిగులకుండగా; చంపి= సంహరించి; సమరనిహతులు+ఐన= యుద్ధంలో చనిపోయిన; అస్మదీయజనుల ఋణము= నా వారలయొక్క అప్పు; తీర్పుము= చెల్లించుము; మసలక= తడయక; పోయిరమ్ము= వెళ్లిరమ్ము; పోరన్+పొడిచి= చౌరవగా యుద్ధంచేసి; గెలుము= జయించుము.

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్ముడా! శత్రువులలో ఒక్కరు మిగులకుండ అందరిని సంహరించి లోగడ యుద్ధంలో మరణించిన నావారిఋణం తీర్చుము నాయనా!. పోయిరమ్ము!, యుద్ధం చేసి శత్రువులను జయించుము.’

**వ. అని కౌఁగిలించుకొని వీడుకొల్పిన నింద్రజిత్తు సత్వరుండై యరదం బెక్కి లంకాపురంబు వెలువడినం గని వనచరానీకంబు లార్చుచు నెదురు నడచుటయు, నతండు వారి నించుకయు సరకుగొనక కరతలం బెత్తి లక్ష్మణునిం బిలిచిన. 115**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసి; వీడుకొల్పినన్= మర్యాదగా సెలవు ఇచ్చి పంపగా; ఇంద్రజిత్తు= ఇంద్రజిత్తు; సత్వరుండు+ఐ= వేగం కలవాడై; అరదంబు+ఎక్కి= రథాన్ని అధిరోహించి; లంకాపురంబు= లంకానగరం; వెలువడినన్= వెలుపలికి రాగా; కని= అరసి; వనచర+అనీకంబులు= వానరసేనలు; ఆర్చుచున్= సింహనాదాలు చేస్తూ; ఎదురునడచుటయున్= మార్కొనుటయు; అతండు= అతడు - ఇంద్రజిత్తు; వారిన్= వారిని (క్రోతిమూకలను); ఇంచుకయున్= ఏ మాత్రమున్నూ; సరకుకొనక= లక్ష్యపెట్టక; కరతలంబున్+ఎత్తి= చేయిని సాచి; లక్ష్మణునిన్= లక్ష్మణుడిని; పిలిచినన్= ఆహ్వానించగా.

**తాత్పర్యం:** అని చెప్పి, రావణుడు ఇంద్రజిత్తును వీడ్కొలిపాడు. ఇంద్రజిత్తు వేగంగా రథాన్ని అధిరోహించి, లంకాపట్టణంనుండి వెలువడి యుద్ధభూమిని చేరాడు. ఇంద్రజిత్తుఆగమనాన్ని కాంచి వానరసేనలు అతడిని మార్కొన్నాయి కాని, ఆతడు వారిని లెక్కసేయక, చేయెత్తి లక్ష్మణుడిని యుద్ధానికి ఆహ్వానించాడు.

### ఇంద్రజిత్తు లక్ష్మణునితోడ యుద్ధము సేయుట (సం. 3-272-8)

**క. విని యాతండును మౌర్వీ । నినదంబున గగనధారుణీమధ్యం బె**
**ల్లను మ్రోయ మత్తగజముం । గనిన మృగేంద్రుండపోలెఁ గడఁగెం బెలుచన్. 116**

**ప్రతిపదార్థం:** విని= ఆలకించి; ఆతండును= అతడుకూడా (లక్ష్మణుడుకూడా); మౌర్వీ, నినదంబునన్= వింటియొక్క అల్లెత్రాటిధ్వనిచేత; గగన, ధారుణీమధ్యంబు+ఎల్లను= ఆకసానికీ భూమికీ మధ్య నుండే ప్రదేశం అంతయు; మ్రోయన్= ప్రతిధ్వనించగా; మత్తగజమున్= మదించిన యేనుగును; కనిన= అరసిన; మృగ+ఇంద్రుండు+అ, పోలెన్= సింహమే అనేటట్లుగా; పెలుచన్= ఆటోపంతో; కడఁగెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** లక్ష్మణుడు ఇంద్రజిత్తు పిలుపును ఆలకించి, తన అల్లెత్రాటిమ్రోత భూమ్యాకాశాల మధ్య నున్న ప్రదేశమంతా ప్రతిధ్వనించేటట్లుగా చేస్తూ - మదించిన ఏనుగును చూచి లంఘించే సింహమే అన్నట్లు - ఆటోపంతో అతనిపై విజృంభించాడు.

**వ. అంత. 117**

**తాత్పర్యం:** అప్పుడు.

**ఉ. జైత్రులు గోత్రభూమిధరసారులు సాగరధీరు లుల్లస**
**చ్చిత్ర ధనుఃకళావిదు లజేయులు భూరిజయార్థు లప్డు సౌ**
**మిత్రియు మేఘనాదుఁడు నమిత్రవిభేదులు దాఁకి రార్చి లో**
**కత్రయ భీకరప్రధనకౌతుక వేగిత చిత్తవృత్తులై. 118**

**ప్రతిపదార్థం:** సౌమిత్రియున్= సుమిత్రకొడుకు లక్ష్మణుడును; మేఘనాదుఁడున్= ఇంద్రజిత్తూ; అమిత్రవిభేదులు= శత్రువులను చీల్చి చెండాడేవారు; జైత్రులు= జయశీలం కలవారు; గోత్రభూమిధరసారులు= కులపర్వతాలయొక్క నిగ్గు కలవారు; సాగరధీరులు= సముద్రం వంటి ధైర్యంకలవారు; ఉత్+లసత్+చిత్ర, ధనుస్+కళా, విదులు= ప్రకాశమానమైన ఆశ్చర్యకరమైన విలువిద్య నెరిగినవారు; అజేయులు= గెలువశక్యం కానివారు; భూరి, జయ+అర్థులు= గొప్పగెలుపును కోరేవారు; అప్డు=

అపుడు; లోక, త్రయ, భీకర, ప్రధన, కౌతుక వేగిత, చిత్తవృత్తులు+ఐ= మూడుజగత్తులకు భయంకరమైన యుద్ధం చేయటంలో వేడుకచే తొందరింపబడిన మనస్సులయొక్క వ్యాపారాలు కలవారై; ఆర్చి= సింహనాదాలు చేసి; తాఁకిరి= (ఒండొరులను) మార్కొన్నారు.

**తాత్పర్యం:** ఆ సమయంలో గెలుపుపొందే నేర్పుకలవారు, కులపర్వతాలయొక్క నిగ్గు గలవారు, సముద్ర ధీరులు, అచ్చెరువుకొలిపే, విలువిద్యలో ఆరితేరినవారు, గెలువశక్యం కానివారు, గొప్పవిజయాలను సాధింపకోరేవారు, శత్రుసంహారులు అయిన సుమిత్రకొడుకు లక్ష్మణుడున్నూ మేఘనాదుడు అయిన ఇంద్రజిత్తున్నూ మూడులోకాలు భీతి చెందే భయంకర యుద్ధంలో వేడుకతో కూడిన వేగం కల మనఃప్రవృత్తి కలవారై సింహనాదాలు చేస్తూ ఒండొరులను ఎదుర్కొన్నారు.

**విశేషం:** భూభారం వహించే కులపర్వతాలు ఏడు. అవి; 1. మహేంద్రం 2. మలయం 3. గంధమాదనం 4. వింధ్యం 5. సహ్యం 6. శుక్తిమంతం 7. పారియాత్రం.

**క. మచ్చరము మీఱ నొండొరుఁ । జిచ్చఱ పిడుగులను బోని శితవిశిఖములం**
**జెచ్చెర నొంపఁగ విలు నే । ర్పచ్చటఁ దుల్యంబు లయ్యె నయ్యిరువురకున్. 119**

**ప్రతిపదార్థం:** మచ్చరముమీఱన్= ఈసు అతిశయింపగా; ఒండొరున్= ఒకరినొకరు; చిచ్చు+అఱపిడుగులను+పోని= అగ్నిని వెదజల్లుతూ మండెడి పిడుగులను పోలిన; శితవిశిఖములన్= వాడి అయిన బాణాలచేత; చెచ్చెరన్= వేగంగా; నొంపఁగన్= నొచ్చేటట్లు చేయగా; ఆ+ఇరువురకున్= ఆఇద్దరికీ; విలునేర్పు= ధనువు నందలి కౌశలం; అచ్చటన్= ఆ యుద్ధభూమిలో; తుల్యంబులు= సమానాలు; అయ్యెన్= అయినది.

**తాత్పర్యం:** ఇంద్రజిత్తూ లక్ష్మణుడూ మాత్సర్యంతో ఒకరినొకరు చిచ్చఱపిడుగులవంటి బాణాలతో వేగంమీర పోరాటం కొనసాగించగా; విలువిద్యలో వారు ఇరువురును సమస్కంధులుగా కన్పించారు.

**విశేషం:** తుల్యంబయయ్యె అని పాఠాంతరం.

**క. తనకంటె నపుడు రావణ । తనయుం డని మీఱఁ జూచుఁ, దా నాతనికం**
**టెను మున్న రాఘవానుజుఁ । డనుపమశరలీల నతిశయంబుగ మెఱయున్. 120**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో; తనకంటెన్= తనకంటె (లక్ష్మణుడికంటె); రావణతనయుండు= రావణుడికుమారుడు, ఇంద్రజిత్తు; అనిన్= యుద్ధంలో; మీఱన్+చూచున్= అతిశయించటానికి యత్నిస్తాడు; తాన్= తాను (లక్ష్మణుడు); ఆతనికంటెను= ఇంద్రజిత్తుకంటెను; మున్ను+అ= ముందుగా; రాఘవ+అనుజుఁడు= లక్ష్మణుడు; అనుపమ, శర, లీలన్= సాటిలేని బాణప్రయోగం అనే క్రీడలో; అతిశయంబుగన్= మిక్కుటంగా; మెఱయున్= వెలుగొందుతాడు.

**తాత్పర్యం:** సాటిలేని బాణప్రయోగంలో లక్ష్మణుడికంటె ఇంద్రజిత్తు మించటానికి యత్నించేవాడు; ఇంద్రజిత్తుకంటె ముందే లక్ష్మణుడు అతిశయించి తనమేటితనాన్ని ప్రదర్శించేవాడు.

**క. అంతఁ బటుతోమరంబుల । నెంతయు వెస నృపతనూజు నింద్రజి వైవన్**
**సంతతశరముల నన్నిటి । నింతింతలు శకలములుగ నేసె నతండున్. 121**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; పటుతోమరంబులన్= గొప్పవైన చిల్లకోలలను; ఎంతయున్= మిక్కిలి; వెసన్= శీఘ్రంగా; నృపతనూజున్= రాజపుత్రుడిని - లక్ష్మణుడిని; ఇంద్రజి= ఇంద్రజిత్తు; వైవన్= వేయగా; అతండున్= అతడును (లక్ష్మణుడు); సంతతశరములన్= ఎడతెగని బాణాలచేత; అన్నిటిన్= అన్నిటిని (ఆ తోమరాలను అన్నిటిని); ఇంత+ఇంతలు= చిన్నిచిన్ని; శకలములుగన్= ముక్కలుముక్కలయ్యేటట్లుగా; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** అప్పుడు గొప్పవైన చిల్లకోలలను మిక్కుటమైన వేగంతో లక్ష్మణుడిపైకి ఇంద్రజిత్తు విసరాడు. లక్ష్మణుడు ఎడతెగని బాణపరంపరలు ప్రయోగించి ఆ తోమరాలను అన్నిటిని చిన్నచిన్న ముక్కలుముక్కలుగా ఖండించాడు.

**వ. అట్టియెడ నంగదుండు గడంగి లక్ష్మణునకుం దలకడచి యమందవేగంబున మందోదరీనందనుం గదిసి ఘనమహీరుహంబునఁ దన్మస్తకంబు వ్రేసినఁ, జలింపక నిలింపవైరి నిశితప్రాసంబు వాసవపౌత్త్రుం జంప నెత్తుటయు, లక్ష్మణుండు దానిం దునియ నేసిన, నయ్యసురయు గదాదండంబుఁదీర్చి యంగదువక్షంబు వ్రేసినం, దొలంగక చెలంగి వాలిసూనుండు సాలవృక్షంబున నా రాక్షసురథంబు రథ్యసారథి సహితంబుగాఁ జదియనడిచె; నట్లు విరథుండయి యచ్చోటన యంతర్ధానంబు నొంది గగనగతుండయ్యెఁ; బదంపడి. 122**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ తరుణంలో; అంగదుండు= వాలికొడుకు, వానరయువరాజు; కడంగి= పూని; లక్ష్మణునకున్; తలకడచి= లక్ష్మణుడిని అతిక్రమించి ఉరికి; అమంద, వేగంబునన్= మిక్కుటమైన వేగంతో; మందోదరీనందనున్= మందోదరికొడుకు - ఇంద్రజిత్తును; కదిసి= మార్కొని; ఘన, మహీరుహంబునన్= పెనుమ్రాకుతో; తత్+మస్తకంబున్= ఆతడియొక్క - ఇంద్రజిత్తుయొక్క శిరమును; వ్రేసినన్= కొట్టగా; చలింపక= కంపించక; నిలింపవైరి= వేల్పులవిరోధి - ఇంద్రజిత్తు; నిశిత, ప్రాసంబు= వాడిఅయినఈటెను; వాసవపౌత్త్రున్= అంగదుడిని (దేవేంద్రుడి మనుమడిని); చంపన్= సంహరించటానికి; ఎత్తుటయును= పూనుటయున్నూ; లక్ష్మణుండు; దానిన్= దానిని; తునియన్+ఏసినన్= బాణం ప్రయోగించి ఖండించగా; ఆ+అసురయున్= ఆ రాక్షసుడును, ఆ ఇంద్రజిత్తును; గదాదండంబున్= గుదియను; తీర్చి= సవరించి; అంగదువక్షంబు= అంగదుడియొక్క రొమ్ము; వ్రేసినన్= కొట్టగా; తొలంగక= తప్పుకొనక; చెలంగి= విజృంభించి; వాలిసూనుండు= అంగదుడు (వాలికొడుకు); సాల, వృక్షంబునన్= మద్దిచెట్టుతో; ఆ రాక్షసురథంబు= ఆ రక్కసుడియొక్క, ఇంద్రజిత్తుయొక్క అరదం; రథ్యసారథి సహితంబుగాన్= గుర్రాలు సూతుడితో సహా; చదియన్+అడిచెన్= పచ్చడి అయ్యేటట్లు కొట్టాడు; అట్లు= ఆ రీతిగా; విరథుండు+అయి= తేరు కోల్పోయినవాడు అయి; (ఇంద్రజిత్తు); ఆ చోటన్+అ= ఆస్థలంలోనే; అంతర్ధానంబున్+ ఒంది= అదృశ్యమై; గగన, గతుండు+అయ్యెన్= ఆకాశసీమకు వెళ్ళినవాడు అయినాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో వాలికొడుకు వానరయువరాజు అంగదుడు వేగంగా లక్ష్మణుడిని అతిక్రమించి దూకి మండోదరికొడుకు అయిన ఇంద్రజిత్తును మార్కొని, ఆతడితలను ఒకపెద్దమ్రానుతో కొట్టాడు. ఆ దెబ్బకు తట్టుకొని వేల్పులవిరోధి అయిన ఇంద్రజిత్తు ఒక వాడిఅయిన ఈటెతో అంగదుడిని సంహరించపూనుకొన్నాడు. అంతలో లక్ష్మణుడు ఆ ఈటెను తన బాణంతో ఖండించాడు. అప్పుడు ఇంద్రజిత్తు గదాదండంతో అంగదుడి రొమ్ముపై కొట్టాడు. అంగదుడును ఆ దెబ్బకు తట్టుకొని మద్దిచెట్టు గొని ఇంద్రజిత్తు రథాన్ని, సారథిని పచ్చడిఅయ్యేటట్లుగా మోదాడు. ఆ విధంగా రథాన్ని కోలుపోయిన ఇంద్రజిత్తు అచ్చటికచ్చటే అదృశ్యమై అకసానికి ఎగిరిపోయాడు. పిమ్మట.

క. **'ఎవ్వలన నుఱుకునో యతఁ । డెవ్వరి నెటు సేయునొక్కొయిం' దనుచుఁ గడున్**
**నివ్వెఱపడి కపిసేనలు । గ్రొవ్వుసెడం బంక్తివదనుకొడు కుద్ధతుఁడై.** **123**

**ప్రతిపదార్థం:** ఏ+వలనన్= ఏవైపునకు; ఉఱుకును+ఓ= దూకునో; అతఁడు= వాడు, ఇంద్రజిత్తు; ఎవ్వరిన్= ఎవరిని; ఎటు+చేయున్+ఒక్కొ= ఏమిచేయునో కదా; ఇందున్= ఇచట; అనుచున్= అని యోచిస్తూ; కడున్= మిక్కిలి; నివ్వెఱపడి= అచ్చెరువొంది; కపిసేనలు= వానరసైన్యాలు; క్రొవ్వు+చెడన్= దర్పం గోల్పడగా; పంక్తివదను, కొడుకు= పదితలల వాడి పుత్రుడు, రావణుడికొడుకు ఇంద్రజిత్తు; ఉద్ధతుఁడు+ఐ= గర్వంతో విజృంభించిన వాడై.

**తాత్పర్యం:** 'అదృశ్యుడై ఆకాశానికి ఎగిరిన ఇంద్రజిత్తు ఎక్కడ ఏ వైపు దూకుతాడో! ఏవిధంగా ప్రవర్తిస్తాడో ఎవరిమీద పడతాడో' అని వానరసేనలు అచ్చెరువుతో భీతిల్లాయి. రావణుడికొడుకు ఇంద్రజిత్తు గర్వంతో విజృంభించినవాడై.

చ. **ఉఱుముచు నంత్యకాలచలితోగ్రబలాహకలీల దోఁపఁగాఁ**
**దఱచగు ఘోరపుంబిడుగుతండము వోని శరప్రతాన ము**
**క్కఱఁ దొరఁగించుచుం గపిబలావళిఁ ద్రుంచి కలంచె నేపునన్**
**నెఱఁకులు నొంచి బాణమయనీరధి ముంచె రఘుప్రవీరులన్.** **124**

**ప్రతిపదార్థం:** ఉఱుముచున్= గర్జిస్తూ; అంత్య, కాల, చలిత+ఉగ్ర, బలాహక, లీల+తోఁపఁగాన్= ప్రళయసమయంలో తిరుగాడే భయంకరమైన మేఘంమాదిరి కన్పట్టగా; తఱచు+అగు= దట్టమైన; ఘోరము+పిడుగు, తండము+పోని= భయంకరాలైన పిడుగులసముదాయాన్ని పోలే; శరప్రతానమున్= బాణాల సమూహాన్ని; ఉక్కు+అఱన్= బలం అణగిపోయేటట్లుగా; తొరఁగించుచున్= వర్షిస్తూ; కపి, బల+ఆవళిన్= వానరసేనా సమూహాలను; త్రుంచి= ఖండించి; ఏపునన్= దర్పంతో; కలంచెన్= కలతచెందించాడు; రఘుప్రవీరులన్= రఘువంశంలో జనించిన గొప్పవీరులను; (రామలక్ష్మణులను); నెఱఁకులు+నొంచి= ఆయువుపట్టులు నొచ్చేటట్లుగా చేసి; బాణమయనీరధిన్= శర సముద్రంలో; ముంచెన్= మునిగేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** ఇంద్రజిత్తు ప్రళయకాలంలోని భయంకరమేఘంమాదిరిగా గర్జిస్తూ చిచ్చఱపిడుగుల సముదాయాలను పోలినబాణజాలాలను బలం జారిపోయేటట్లుగా కపిసేనలపై కురిపించి దర్పంతో కలత నొందించాడు. రామలక్ష్మణులను ఆయువుపట్టులు నొచ్చేటట్లుగా శర సముద్రంలో మునిగేటట్లు చేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

క. **మాయాధికు నంతర్హిత । కాయుఁ బురందరవిరోధిఁ గాకుత్స్థులు క్రో**
**ధాయత్తు లగుచు నేసిరి । ధీయుక్తులు శబ్దభేదిదివ్యాస్త్రములన్.** **125**

**ప్రతిపదార్థం:** మాయ+అధికున్= కపటమహిమచేత గొప్పతనం కలవాడిని; అంతర్హితకాయున్= కనిపించని దేహం కలవాడిని; పురందరవిరోధిన్= దేవేంద్రుడి శత్రువును - ఇంద్రజిత్తును; ధీయుక్తులు= బుద్ధిబలంతో కూడినవారు; కాకుత్స్థులు= కకుత్స్థవంశంలో జన్మించినవారు, శ్రీరాముడును లక్ష్మణుడును; క్రోధ+ఆయత్తులు+అగుచున్= ఆగ్రహంతో సన్నద్ధులు ఔతూ; శబ్ద, భేది, దివ్య+అస్త్రములన్= శబ్దాన్ని అనుసరించి ఛేదించే దేవతామహిమ గల మంత్రబాణాలతో; ఏసిరి= కొట్టారు.

**తాత్పర్యం:** అదృశ్యమైన దేహం కలవాడు ఇంద్రజిత్తు. అతడు కపటయుద్ధంలో ఆరితేరినవాడు. ఇక అతడిని బాణాలతో కొట్టటం ఎట్లా? బుద్ధికుశలత కల కాకుత్స్థులు కంటికి కనుపించని ఇంద్రజిత్తును శబ్దభేదిబాణాలు ప్రయోగించి కొట్టారు.

**విశేషం:** శబ్దభేది బాణాలంటే - లక్ష్యం అదృశ్యమై ఉన్నప్పటికి కేవలం చప్పుడునుబట్టి లక్ష్యం ఉన్నతావు నెరిగి ప్రయోగించే అమ్ములు. ఇట్టిశక్తి మేటి విలుకాండ్రలో కొంతమందికి మాత్రమే ఉంటుంది. అట్టిశక్తి నార్జించిన భారతవీరులలో అర్జునుడు పేర్కొనదగినవాడు.

**వ.** **వానికి నలిగి సుగ్రీవాది వానరులు వృక్షశిలాప్రకరంబులు గైకొని యాకసంబున కెగసిన నద్దానవుండు వారి నందఱ వెఱచఱవ నేయుటయుఁజేవ సెడి మగుడి పుడమి కెఱఁగిరి; వాఁడంత నిలువక వాఁడి తూపులు వఱపి రామలక్ష్మణులఁ గరంబు నొప్పించినం జెయ్యేది యయ్యన్నయుం దమ్ముండును గపిబలంబు లడల ధరణీతలంబునకు నొరగి విలయకాలపతితు లైన సూర్యేందుల చందంబున నున్నంగని సింహనాదంబుసేసి.** **126**

**ప్రతిపదార్థం:** వానికిన్= అతడికి (ఇంద్రజిత్తుకు); అలిగి= ఆగ్రహం చెంది; సుగ్రీవ+ఆది, వానరులు= సుగ్రీవుడు మొదలగు కోతులు; వృక్ష, శిలా, ప్రకరంబులు= చెట్లు, రాళ్ల సమూహాలు; కైకొని= చేతబట్టి; ఆకసంబునకున్= ఆ గగనానికి; ఎగసినన్= ఎగిరి వెళ్ళగా; ఆ, దానవుండు= ఆ రాక్షసుడు - ఇంద్రజిత్తు; వారిన్+అందఱన్= వారలను అందరిని - ఆ సుగ్రీవాదులను; వెఱచఱవన్= భయపడేట్టు; ఏయుటయున్= బాణాలతో కొట్టటమున్నూ; చేవ+చెడి= ఉక్కు తఱిగి; మగుడి= తిరిగి; పుడమికిన్= భూమికి, ఎఱఁగిరి= కూలిరి; వాఁడు= అతడు (ఇంద్రజిత్తు); అంతన్= అంతటితో; నిలువక= ఆలసించక; వాఁడితూపులు= వాడిఅయిన బాణాలు; పఱపి= ప్రయోగించి; రామలక్ష్మణులన్= శ్రీరాముడిని మరియు లక్ష్మణుడిని; కరంబు= మిక్కిలి; నొప్పించినన్= బాధించగా; చెయ్యేది= చేయ్యి+ఏది= చేష్టలు తొలగి; ఆ+అన్నయును, తమ్ముండును= (రామలక్ష్మణులు); కపిబలంబులు= వానరసేనలు; అడలన్= భయంచెందగా; ధరణీతలంబునకున్= భూమి భాగానికి; ఒరగి= వ్రాలి; విలయకాల పతితులు= ప్రళయసమయంలో (భూమిపై) పడిపోయిన; సూర్య+ఇందుల= సూర్యుడు చంద్రుడు; చందంబునన్= మాదిరిగా; ఉన్నన్= ఉండగా; (ఇంద్రజిత్తు); కని= అరసి; సింహనాదంబు+చేసి= సింహంవలె గర్జించి. (క్రిందిపద్యముతో అన్వయం)

**తాత్పర్యం:** ఇంద్రజిత్తుపై కోపించి, సుగ్రీవుడు మున్నగు వానరవీరులు పెద్దరాళ్ళ గుంపును, చెట్లసమూహాలను పట్టుకొని ఆకసానికి ఎగిరి వెళ్ళారుకాని ఆ రాక్షసుడు వారందరూ భయపడేటట్లుగా వాడిబాణాలను ప్రయోగించాడు. వారు అందరూ తిరిగి నేలపై కూలారు. అంతట ఇంద్రజిత్తు నిశితబాణాలు ప్రయోగించి శ్రీరాముడిని లక్ష్మణుడిని నొప్పించాడు. రామలక్ష్మణులు చేష్టలు దక్కి మూర్ఛిల్లి నేలపై వ్రాలారు. వానరసేనలు భీతిల్లి గజగజలాడాయి. అప్పుడు నేలపై బడిన రామలక్ష్మణులు ప్రళయకాలంలో భూమిపై పడిన సూర్యచంద్రులవలె భాసించారు. ఆ దృశ్యాన్ని కాంచి, విజయదర్పంచేత ఇంద్రజిత్తు సింహనాదం చేశాడు.

**విశేషం:** కవిత్రయంనాటి తెలుగుబాసకు నేటికాలపు తెలుగుబాసకు అక్కడక్కడ ఈషద్భేదాలు కానబడతాయి. ముఖ్యంగా- కారకంలో (విభక్తిప్రత్యయాల ప్రయోగంలో). 'వానికి నలిగి' అనేది ప్రాచీనప్రయోగం. నేడు మనం అతడిపై అలిగి, అతనిపై ఆగ్రహించి అని అంటాం.

**మ. పరమోదాత్తులఁ బార్థివోత్తముల శుంభద్విక్రమారంభులన్**
**సురసంకాశులఁ గోసలప్రభుల నస్తోకప్రభోద్దాములన్**
**వరలాభోన్నతుఁ డన్నిశాచరుఁడు గర్వం బొప్ప దుర్వార ని**
**ర్భర' నాగాస్త్రములం దదాహవమహిన్ బంధించె నయ్యిద్దఱన్. 127**

**ప్రతిపదార్థం:** వరలాభ+ఉన్నతుఁడు= వరాలను పొందటంచేత గొప్పతనం కలవాడు; ఆ+నిశాచరుఁడు= ఆ రక్కసుడు - ఆ ఇంద్రజిత్తు; గర్వంబు+ఒప్పన్= దర్పం శోభిల్లేటట్లుగా; పరమ+ఉదాత్తులన్= మిక్కిలి గొప్పవారిని; పార్థివ+ఉత్తములన్= రాజులలో శ్రేష్ఠులను; శుంభత్+విక్రమ+ఆరంభులన్= దేదీప్యమానమైన పరాక్రమంతో కూడిన పురుషకారం కలవారిని; సుర, సంకాశులన్= దేవతలతో సమానులను; కోసలప్రభులన్= కోసల రాజ్యానికి అధినేతలను; అస్తోక, ప్రభా+ఉద్దాములన్= మిక్కుటమైన తేజస్సుతో గంభీరమైన ఆకృతులు కలవారిని; ఆ+ఇద్దఱన్= ఆ ఇరువురను, శ్రీరాముడిని లక్ష్మణుడిని (రామలక్ష్మణులను); దుర్వార, నిర్భర, నాగ+అస్త్రములన్= వారించటానికి శక్యం కాని భరించటానికి వీలులేనంత తీవ్రా లైన పాములకు సంబంధించిన మంత్రబాణాలచేత; తత్+ఆహవమహిన్= ఆ యుద్ధభూమిలో; బంధించెన్= కట్టివేశాడు.

**తాత్పర్యం:** మిక్కిలిగొప్పవారు, రాజన్యులలో శ్రేష్ఠులు, దేదీప్యమానమైన శౌర్యం అనే తేజస్సుతో వెలుగొందేవారు, వేల్పులతో సమానులు, కోసలదేశానికి అధిపతులు, మిక్కుటమైన వర్చస్సుతో విరాజిల్లేవారు అగు రామలక్ష్మణులను, వరాలు పొందటంచేత మహిమను ఆర్జించినవాడు అయిన ఇంద్రజిత్తు ఆయుద్ధభూమిలో విజృంభించి, వారించటానికి వీలులేని 'నాగాస్త్రాలు' ప్రయోగించి బంధించాడు.

**వ. తదవసరంబున సుగ్రీవసుషేణ జాంబవత్ప్రముఖు లైన కపివీరులు రామలక్ష్మణు లున్నయెడకుం జనుదెంచి, యెయ్యదియునుం జేయునది నేరక దుఃఖితు లగుచుండ నవ్విభీషణుండు వారి నాశ్వాసించి, బ్రహ్మాస్త్ర ప్రయోగంబున నారాజకుమారులకు బంధమోక్షంబు గావించె; సుగ్రీవుండు విశల్యకరణి యను నౌషధంబున వారల విశల్యదేహులఁ జేసె; నిట్లు ప్రబుద్ధులై రాఘవులు గ్రమ్మఱఁ గయ్యంబునకుం గడంగి; రప్పుడు రావణానుజుండు రామునకుఁ గృతాంజలి యై యి ట్లనియె. 128**

**ప్రతిపదార్థం:** తత్+అవసరంబునన్= ఆ సమయంలో; సుగ్రీవ, సుషేణ, జాంబవత్+ప్రముఖులు+ఐన= సుగ్రీవుడు, సుషేణుడు, జాంబవంతుడు మున్నగునాయకులు అయిన; కపివీరులు= వానరయోధులు; రామలక్ష్మణులు= రాముడును లక్ష్మణుడును; ఉన్న+ఎడకున్= ఉన్నస్థలానికి; చనుదెంచి= వచ్చి; ఎయ్యదియునున్= ఏ+అదియునున్= దేనిని కూడా; చేయునది నేరక= చేయదగింది తెలియజాలక; దుఃఖితులు+అగుచుండన్= శోకిస్తున్నవారు ఔతూఉండగా, ఆ+విభీషణుండు; వారిన్= వారిని (ఆ కపివీరులను); ఆశ్వాసించి= ఓదార్చి; బ్రహ్మాస్త్ర (బ్రహ్మ+అస్త్ర) ప్రయోగంబునన్= బ్రహ్మకు సంబంధించిన మంత్రమహిమ కల బాణాన్ని ఉపయోగించి; ఆ రాజకుమారులకున్= ఆ రాజపుత్రులకు, రామలక్ష్మణులకు; బంధమోక్షంబు+కావించెన్= (నాగపాశాలయొక్క) బంధంనుండి విముక్తిని కల్పించాడు; సుగ్రీవుండు; విశల్యకరణి= విశల్యకరణి అనేపేరుకల; ఔషధంబునన్= మందుచేత; వారలన్= వారిని (రామలక్ష్మణులను); విశల్యదేహులన్= బాధకలిగించే పదార్థాలు తొలగిన శరీరాలు కలవారినిగా; చేసెన్= కావించాడు; ఇట్లు= ఈ రీతిగా; ప్రబుద్ధులు+ఐ= స్పృహను కాంచి, తెలివిని పొందినవారై; రాఘవులు= రఘువంశజులు రామలక్ష్మణులు; క్రమ్మఱన్= మరల; కయ్యంబునకున్= యుద్ధానికి; కడంగిరి= పూనుకొన్నారు; అప్పుడు= ఆ సమయంలో; రావణ+అనుజుండు= రావణుడితమ్ముడు విభీషణుడు; రామునకున్; కృత+అంజలి+ఐ= నమస్కరించినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో సుగ్రీవుడు, సుషేణుడు, జాంబవంతుడు మున్నగు వానరనాయకులు మూర్ఛిల్లిన రామలక్ష్మణులవద్దకు వచ్చి చేసేదిలేక దుఃఖించసాగారు. అంత, విభీషణుడు అక్కడికి వచ్చి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి రామలక్ష్మణులను నాగపాశాలనుండి బంధవిముక్తులను కావించాడు. సుగ్రీవుడు విశల్యకరణి అనే ఔషధంతో రామలక్ష్మణుల దేహాలనుండి బాధ కలిగించే పదార్థాలను తొలగించాడు. ఈ విధంగా మూర్ఛనుండి తేరి, తెలివినొందిన రాముడును లక్ష్మణుడును మరల యుద్ధం చేయటానికి ఉద్యుక్తులయ్యారు. అప్పుడు రావణుడి తమ్ముడు అయిన విభీషణుడు శ్రీరాముడికి నమస్కరించి ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** 'విశల్యకరణి'- ములుకులు తీసివేసేది. శల్యం అనగా శరీరాన్ని నొప్పించే ముల్లు వంటి పదార్థం. విశల్యకరణి- దేహంలోని రక్తాన్ని శుద్ధి చేసే ఔషధం. ఇది గుడూచి తిప్పతీగ అని కొందరు, దంతినేపాళం అని కొందరు చెప్పుతున్నారు. భారతదేశాన మిక్కిలి ప్రాచీనకాలంలో శరీరంలో నాటిన ములుకులను నెట్టి ఆగాయాలను మాన్చే ఔషధాలు ఉన్నట్లు మనకు వాఙ్మయసాక్ష్యం ఇట లభిస్తున్నది. కరణులు నాలుగు : 1. విశల్యకరణి 2. సంధానకరణి 3. సౌవర్ణకరణి 4. సంజీవకరణి.

**సీ.** **'నరనాథ! కిన్నరనాథుని పనుపున । శ్వేతుండు నాఁగఁ బ్రసిద్ధుఁ డైన**
**గుహ్యకుఁ డిదె మీకుఁ గొనివచ్చె దివ్యతో । యంబు; లీ జలముల నంబుజాక్ష!**
**నయనపద్మక్షాళనము సేయుఁ; డిప్పు డ । దృశ్యభూతము లెల్లఁ దెల్లముగను**
**గానఁగఁ బడు' నన్నఁ గైకొని రాఘవుం । డనుజసహాయసమన్వితముగ**

**ఆ.** **నట్లు చేసి, కనియె నంబరమధ్య సం । చారుఁ గృతవిపక్షసంప్రహారు**
**నింద్రజాలశీలు నింద్రవిద్రావణు । రావణాగ్రతనయు రహితవినయు.** **129**

**ప్రతిపదార్థం:** నరనాథ!= రాజా, శ్రీరామా!; కిన్నరనాథుని పనుపునన్= కిన్నరుల రాజుయొక్క ఆజ్ఞచేత, కుబేరుడి ఆజ్ఞచొప్పున; శ్వేతుండు+నాఁగన్= శ్వేతుడు అనగా; ప్రసిద్ధుఁడు+ఐన= యశస్సు నార్జించినవాడు అయిన; గుహ్యకుఁడు= వేల్పుజాతివాడు; దివ్యతోయంబులు= దేవతామహిమ కల నీళ్ళు; మీకున్= మీకొరకు; కొనివచ్చెన్= తీసికొనివచ్చాడు; అంబుజ+అక్ష!= పద్మాలవంటి కన్నులు కలవాడా! శ్రీరామచంద్రా! ఇది+ఎ= (ఇదె) ఇదుగో; ఈ జలములన్= ఈ నీళ్లతో; నయనపద్మక్షాళనము= పద్మాలవంటి కన్నులను కడుగుకొనటం; చేయుఁడు= చేయండి; ఇప్పుడు= ఈ సమయంలో; అదృశ్యభూతములు+ఎల్లన్= కానుపించని జడపదార్థాలు అన్నియున్నూ; తెల్లముగను= సుస్పష్టంగా; కానఁగఁబడున్= కన్పిస్తాయి; అన్నన్= అని పలుకగా; రాఘవుండు= శ్రీరాముడు; కైకొని= (ఆ దివ్యజలాలను) స్వీకరించి; అనుజ, సహాయ, సమన్వితముగన్= తమ్ముని సహాయంతో సాయము చేసే సహవ్రతులతోపాటుగా; అట్లు+అ+చేసి= ఆ విధంగానే చేసి (నయనప్రక్షాళనం చేసి); అంబరమధ్యసంచారున్= ఆకసం మధ్య తిరుగుతున్న వాడిని; కృతవిపక్ష సంప్రహారున్= శత్రువులను సంహరించినవాడిని; ఇంద్రజాలశీలున్= కనికట్టుకళలో చేయి తిరిగినవాడిని; ఇంద్రవిద్రావణున్= దేవేంద్రుడిని నీరసింపచేసినవాడిని; రావణ+అగ్ర, తనయున్= రావణుడియొక్క పెద్దకొడుకును; రహితవినయున్= అణకువ లేనివాడిని, దర్పం కలవాడిని - ఇంద్రజిత్తును; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** 'శ్రీరామా! కుబేరుడు పంపగా శ్వేతుడనే దేవజాతివాడు మీకొరకు దివ్యజలాలను తెచ్చాడు. అంబుజాక్ష! వాటిని మీకనుదమ్ములకు రాసుకొంటే చాలు అదృశ్యంగా ఉండే సమస్త పదార్థాలుకూడా కంటికి సుస్పష్టంగా కనపడతాయి. కాబట్టి వాటిని స్వీకరించండి' అని విభీషణుడు అన్నాడు. శ్రీరాముడు తన తమ్ముడి సహాయంతో ఆవిధంగా ఆచరించాడు. దానితో ఆకాశం మధ్యలో తిరుగుతున్నవాడు, శత్రువులపై దెబ్బతీసే నిపుణుడు,

మాయాజాలప్రవీణుడు, ఇంద్ర విజేత, వినయరహితుడు, రావణుని పెద్ద కొడుకు అయిన ఇంద్రజిత్తును స్పష్టంగా చూడగలిగాడు.

**వ. ఆ రక్కసుండునుందన చేసిన పౌరుషంబు ప్రతిహతంబగుటకు విస్మయం బంది, మగుడి హోమకార్యంబునకుం బోవం దొడంగిన నెఱింగి, విభీషణుండు లక్ష్మణుం జూచి' యన్నీచునకు హోమసమాప్తి యయ్యె నేని నెవ్వరికిం గెలువ నశక్యంబు; వీని వెన్నడిం దగిలి తెగటార్పు' మనిన నతండు. 130**

**ప్రతిపదార్థం:** ఆ, రక్కసుండునున్= ఆ రాక్షసుడున్నూ, (ఇంద్రజిత్తున్నూ); తన చేసిన= తాను ఒనర్చిన; పౌరుషంబు= పురుషకారం, పురుషయత్నం; ప్రతిహతంబు+అగుటకున్= వ్యర్థం కావటానికి; విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; మగుడి= మరల; హోమకార్యంబునకున్= అభిచారహోమం సల్పటానికి; పోవన్+తొడంగినన్= వెడలటానికి ఉద్యమించగా; విభీషణుండు; ఎఱింగి= తెలిసికొని; లక్ష్మణున్+చూచి= లక్ష్మణుడినిచూచి; ఆ+నీచునకున్= ఆ దుష్టుడికి; హోమ, సమాప్తి+అయ్యెన్+ఏనిన్= వేల్చుట పూర్తి అయితే; ఎవ్వరికిన్= ఎవరికైనా; గెలువన్= జయించటం; అశక్యంబు= సాధ్యం కాదు; వీనిన్= ఇతడిని (ఇంద్రజిత్తును); వెన్నడిన్+తగిలి= వెంటబడి పూని (వెన్నడి వెన్నాడి రూపాంతరం); తెగటార్పుము= సంహరించుము; అనినన్= అని (విభీషణుడు) చెప్పగా; అతండు= లక్ష్మణుడు.

**తాత్పర్యం:** ఆ ఇంద్రజిత్తు తన పురుషకారమంతా వ్యర్థంకావటంచేత ఆశ్చర్యపడి తిరిగి అభిచారహోమం చేయటానికి ఉద్యమించాడు. ఆ విషయం తెలిసికొని, విభీషణుడు లక్ష్మణుడితో ఇట్లా చెప్పాడు. 'ఓ లక్ష్మణా! ఈ నీచుడైన ఇంద్రజిత్తు మరల అభిచారహోమాన్ని నెరవేరిస్తే ఇతడిని ఎవ్వరూ జయించనలవికాదు. కాబట్టి ఈతడిని వెన్నంటి సంహరించుము'- అని చెప్పగా అంతట లక్ష్మణుడు.

**ఆ. ఆర్చి వెనుకఁ దగిలి యశనికల్పము లైన । శరము లేయుటయు, నిశాటవరుఁడు**
**గినిసి వడి నెదిర్చి కీలించె లక్ష్మణు । నంగకముల నుజ్జ్వలాంబకములు. 131**

**ప్రతిపదార్థం:** ఆర్చి= పెద్దకేక వేసి, సింహనాదం చేసి; వెనుకన్+తగిలి= వెన్నంటి వెడలి; అశనికల్పములు+ఐన= పిడుగులతో సమానా లయిన; శరములు= బాణాలు; ఏయుటయున్= ప్రయోగించుటయున్నూ; నిశాటవరుఁడు= రాక్షసశ్రేష్ఠుడు, ఇంద్రజిత్తు; కినిసి= ఆగ్రహించి; వడిన్= వేగంగా; ఎదిర్చి= మార్కొని; లక్ష్మణు+అంగకములన్= లక్ష్మణుడి అవయవాలయందు; ఉత్+జ్వల+అంబకములు= వెలుగొందేబాణాలు; కీలించెన్= నాటెను.

**తాత్పర్యం:** లక్ష్మణుడు సింహనాదం చేసి ఇంద్రజిత్తును వెన్నాడి చిచ్చరపిడుగులను పోలిన బాణాలను ప్రయోగించాడు. ఆ రాక్షసుడైన ఇంద్రజిత్తు ఆగ్రహించి వేగంగా లక్ష్మణుడిని మార్కొని అతడి అవయవాలలో ప్రకాశమానాలైన బాణాలు నాటాడు.

**వ. ఇట్లు దలపడి యవ్వీరు లిరువురు నిశాచరవనచరబలంబులు రణం బుడిగి వెఱఁగుపడి తమపోరు సూచుచుండ నుద్దండవేదండ యుగళంబు పోలిక నాభీలశార్దూలద్వయంబు కరణి నసహ్యసింహ యమళంబు కైవడి నతిఘోరయుద్ధంబు సేయం దొడంగి; రంత. 132**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా, తలపడి= మార్కొని; అవ్వీరులు= ఇరువురున్= ఇద్దరు (లక్ష్మణుడున్నూ, ఇంద్రజిత్తున్నూ); నిశాచర, వనచర, బలంబులు= రాక్షసులయొక్కయు వానరులయొక్కయు సేనలు; రణంబు+ఉడిగి= యుద్ధాన్ని విరమించి;

వెఱఁగుపడి= ఆశ్చర్యంపొంది; తమపోరు= తమయుద్ధం; చూచుచుండన్= దర్శిస్తూ ఉండగా; ఉద్దండ, వేదండ యుగళంబు, పోలికన్= రెండు గొప్ప ఏనుగులవలె; ఆభీల, శార్దూల, ద్వయంబు, కరణిన్= భయంకరమైన రెండు పెద్దపులుల వలె; అసహ్య, సింహ, యమళంబు, క్రైవడిన్= సహింపరాని రెండు సింహాలవలె; అతిఘోరయుద్ధంబు= మిక్కిలి భయంకరమైన పోరాటం; చేయన్+తొడంగిరి= చేయసాగారు; అంతన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా మార్కొని ఆ ఇరువురు వీరులున్నూ (ఇంద్రజిత్తు, లక్ష్మణుడు) రాక్షససేనలు, వానరసేనలు పోరాటం చేయటం మాని తమయుద్ధాన్ని దర్శిస్తూండగా రెండు గొప్ప ఏనుగులవలె, రెండు భయంకరాలైన పెద్దపులులవలె, రెండు సహింపరాని సింహాలవలె మిక్కిలి భయంకరంగా పోరాడారు. అప్పుడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **వడి నొక్కపెట్ట లక్ష్మణుఁ । డడరించె నిశాతశరము లా రక్కసుపైఁ**
**గడఁగి యతఁడు నాతనిపై । నెడపక నాటించెఁ గలయ నెనిమిది యమ్ముల్.** **133**

**ప్రతిపదార్థం:** లక్ష్మణుఁడు; వడిన్= వేగంగా; ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; నిశాతశరములు= వాడిబాణాలు; ఆ, రక్కసుపైన్= ఆ రాక్షసుడిమీద, ఇంద్రజిత్తుమీద; అడరించెన్= ప్రయోగించాడు; అతఁడు= ఇంద్రజిత్తు; కడఁగి= పూని; ఆతనిపైన్= అతనిమీద, లక్ష్మణుడిపై; ఎడపక= వ్యవధి లేకుండగా; ఎనిమిదిఅమ్ములన్= ఎనిమిదిబాణాలను; కలయన్= అంతటా బాగుగా; నాటించెన్= గ్రుచ్చుకొనేటట్లుగ చేశాడు.

**తాత్పర్యం:** లక్ష్మణుడు ఇంద్రజిత్తుపై వేగంగా ఒకేసారి వాడిఅమ్ములు పెక్కు ప్రయోగించాడు. ఆ ఇంద్రజిత్తు సయితం ఆ లక్ష్మణుడిపై ఎనిమిదిఅమ్ములను వ్యవధిలేకుండా శరీరమంతటా నాటేటట్లు ప్రయోగించాడు.

**ఆ.** **వాఁడితూపు లొడల వడి నాటుటయు నొచ్చి । తోన కలుషరోషధూమకేతుఁ**
**డతిశయిల్ల రాఘవానుజుం డురుచాప । శింజినీరవంబు సెలఁగఁ గవిసి.** **134**

**ప్రతిపదార్థం:** వాఁడితూపులు= వాడిగల బాణాలు; ఒడలన్= శరీరంలో; వడిన్= వేగంగా; నాటుటయున్= గ్రుచ్చుకొనటంచేత; నొచ్చి= బాధపడి; తోన= వెంటనే; కలుష, రోష, ధూమకేతుఁడు= కలకబారిన కోపం అనే అగ్ని; అతిశయిల్లన్= పెంపొంద; రాఘవ+అనుజుండు= శ్రీరాముడి తమ్ముడు; ఉరుచాపశింజినీరవంబు= గొప్పధనుస్సుయొక్క అల్లెత్రాటి ధ్వని; చెలఁగన్= అతిశయిల్లగా; కవిసి= మార్కొని.

**తాత్పర్యం:** ఇంద్రజిత్తు ప్రయోగించిన వాడిబాణాలు తనశరీరాన నాటుకొనటంచేత, నొచ్చి వెంటనే కలకబారిన కోపం అనే అగ్నితో కూడినవాడూ ఔతూ, విజృంభించి శ్రీరాముడితమ్ముడు లక్ష్మణుడు తన గొప్పధనుస్సుయొక్క అల్లెత్రాటి ధ్వని విస్తరించగా ఇంద్రజిత్తును మార్కొని.

### ఇంద్రజిత్తు లక్ష్మణునిచేతఁ జచ్చుట (సం. 3-273-22)

**మ.** **శితభల్లద్వితయంబునం గడువెసం జేదోయి ఖండించి ఖం**
**డితగోత్రాచలతుంగశృంగశతకోటిస్ఫారఘోరానల**

**ద్యుతిసాంద్రం బగు శాతభల్ల మొకటం ద్రుంచెం గనత్కుండలా**
**న్వితమై యొప్పు నిశాచరేంద్రుశిరమున్ వీరక్రియాదక్షుఁడై. 135**

**ప్రతిపదార్థం:** శితభల్లద్వితయంబునన్= వాడియైన రెండు అమ్ములతో; కడున్= మిక్కిలి; వెసన్= శీఘ్రంగా; చేదోయి= రెండుచేతులను (ఇంద్రజిత్తుయొక్క చేతులజంటను); ఖండించి= తునిమి; ఖండిత, గోత్ర+అచల, తుంగ, శృంగ, శతకోటి, స్ఫార, ఘోర+అనల, ద్యుతి, సాంద్రంబు+అగు= ఖండించబడిన కులపర్వతంయొక్క ఎత్తైనశిఖరం గల వజ్రాయుధంయొక్క వ్యాప్తిచెందిన భయంకరమైన అగ్నిజ్వాలల కాంతిచే దట్టమైనది అయిన; శాతభల్లము+ఒకటన్= ఒక వాడి అయిన యీటెఅమ్ముచేత; కనత్+కుండల+అన్వితము+ఐ ఒప్పు= ప్రకాశమానమైన (చెవి) దుద్దులతో కూడి శోభిల్లునట్టి; నిశాచర+ఇంద్రు, శిరమున్= రాక్షసశ్రేష్ఠుడైన ఇంద్రజిత్తుయొక్క తలను; వీర, క్రియా, దక్షుఁడు+ఐ= పరాక్రమం భాసించే కృత్యంలో నేర్పుకలవాడై; త్రుంచెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** లక్ష్మణుడు వాడియైన రెండుభల్లాలు ప్రయోగించి మిక్కిలివేగంగా ఇంద్రజిత్తు రెండుచేతులను ఖండించాడు. వెనువెంటనే ఖండించబడిన కులపర్వతశిఖరం గల వజ్రాయుధంయొక్క, వ్యాప్తిచెందిన భయంకరమైన అగ్నిజ్వాలల వెలుగుతో నిగ్గుదేలిన వాడిభల్లం ప్రయోగించి ప్రకాశమానమైన కుండలాలతోశోభిల్లే ఇంద్రజిత్తు శిరస్సును పరాక్రమదక్షుడై లక్ష్మణుడు నరికాడు.

**ఆ. భగ్నశాఖ మైన పాదపంబును బోలె । నిట్లు సంగరమున నింద్రజిత్తు**
**పడినఁ జూచి దైత్యబలములు భయమంది । పఱచెఁ; జెలఁగి యార్చెఁ బ్లవగబలము. 136**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా, ఇంద్రజిత్తు= మేఘనాదుడు; సంగరమునన్= యుద్ధంలో; భగ్నశాఖము+ఐన= ఖండించబడిన కొమ్మలు కలది అయిన; పాదపంబును+పోలెన్= చెట్టువలె; పడినన్= కూలగా; చూచి= కనుగొని; దైత్యబలములు= రాక్షసులసేనలు; భయము+అంది= భీతిల్లి; పఱచెన్= పారిపోయాయి; ప్లవగబలము= వానరసైన్యం; చెలఁగి= అతిశయించి; ఆర్చెన్= సింహనాదం చేసింది.

**తాత్పర్యం:** ఈ రీతిగా ఇంద్రజిత్తు యుద్ధభూమిపై కొమ్మలు నరుకబడిన వృక్షంవలె కూలగా, కనులార, కాంచిన రాక్షససేనలు భీతిల్లి పారిపోయాయి. వానరసైన్యాలు సింహనాదాలు చేశాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. తనయునిమరణం బేర్పడ । విని దశకంధరుఁడు శోకవివశుం డై బో**
**రన బాష్పము లొలుకఁగ హా! । యనుచుం బదినోళ్ళుఁ దెఱచి యఱచెం బెలుచన్. 137**

**ప్రతిపదార్థం:** దశకంధరుఁడు= పదికంఠాలు కలవాడు- రావణుడు; తనయుని మరణంబు= కొడుకుయొక్క చావు (ఇంద్రజిత్తుమరణవార్త); ఏర్పడన్ విని= వివరంగా ఆలకించి; శోకవివశుండు+ఐ= దుఃఖంచేత వశం తప్పినవాడై; బోరన= వేగంగా; బాష్పములు= కన్నీటిబిందువులు; ఒలుకఁగన్= కారగా; 'హా'+అనుచున్= అయ్యో యని దైన్యంతో; పదినోళ్ళు= పది నోరులు తెఱచి= విప్పి; పెలుచన్= గట్టిగా; అఱచెన్= విలపించాడు.

**తాత్పర్యం:** తనకొడుకుమృతివార్త వివరంగా విని, రావణుడు దుఃఖం పెల్లుబికి వశంతప్పినవాడై వేగంగా కన్నీటిబిందువులు కారగా దైన్యంతో హాహాకారాలు చేస్తూ పదినోళ్లు తెరచి బిగ్గరగా విలపించాడు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. కన్నులనుండి బాష్పబిందువులు వేగంగా స్రవించటం, శరీరం వశంతప్పటం, హాహాకారాలు చేయటం, 'పదినోళ్లు' తెరచి బిగ్గరగా ఏడవటం స్వభావసిద్ధాలు; సహజాలు.

**క. శోకంబు సైఁప లేక య । శోకవనంబునకు నరిగి సురశత్రుఁడు రో**
**షాకులుఁడై జానకిఁ బు । ణ్యాకారం జంపఁ జంద్రహాసము వెఱికెన్. 138**

**ప్రతిపదార్థం:** (రావణుడు); శోకంబు= దుఃఖం; సైఁపలేక= భరించజాలక; అశోకవనంబునకున్= అశోకవృక్షాలు ఎక్కువగా కల తోటకు; అరిగి= వెడలి; సురశత్రుఁడు= వేలుపుల విరోధి, రావణుడు; రోష+ఆకులుఁడు+ఐ= కోపంచేత కలత చెందినవాడై; పుణ్య+ఆకారన్= మూర్తీభవించిన సుకృతాన్ని అంటే పుణ్యమే మానవఆకారం తాల్చిందా అన్నట్లు ఉన్నదానిని; జానకిన్= జనకుడిపుత్రిక అయిన సీతను, చంపన్= సంహరించటంకొరకై; చంద్రహాసము= చంద్రహాసం అనే పేరు గల తన కత్తిని; వెఱికెన్= (ఒరనుండి) పైకి లాగాడు.

**తాత్పర్యం:** రావణుడు పుత్రశోకాన్ని భరింపలేక వెనువెంటనే అశోకవనానికి వెళ్ళాడు. పుణ్యమే మానవస్త్రీ శరీరాన్ని తాల్చి కనుపిస్తున్నదా అనునట్లు అక్కడ ఉన్న సీతను కోపంచేత కలతచెందిన మనస్సుకలవాడై రావణుడు సంహరింప తలపోసి, ఒరనుండి తనకత్తి అయిన చంద్రహాసాన్ని పైకి లాగాడు.

**విశేషం:** (1) రావణుడి కత్తిపేరు 'చంద్రహాసం'. (2) సీతపై ఏర్పడిన కసి రావణుడికి పుత్రశోకంచేత ఇనుమడించింది. అందుచేత ఆతడు సీతను సంహరింప తలపోశాడు. ఆడుదానిని చంపటం వీరమర్యాద కాదు. అయినను రావణుడు అపుడు క్షణికోద్రేకానికి లోనయ్యాడు.

**వ. అప్పుడు వయోవినయవృద్ధుం డయిన యవింధ్యుం డతని వారించి, యిట్లనియె. 139**

**తాత్పర్యం:** అప్పుడు వయసులోను, వినయంలోను పెద్దవాడు, వినయపరుడు అయిన అవింధ్యుడు రావణుడిని ఆ పనినుండి మాన్పించి ఇట్లా అన్నాడు.

**చ. 'ఇది తగునే దశానన! మహేంద్రుఁడు లోనగు దేవతాతతిం**
**గదనములో జయించి త్రిజగంబులఁ బేర్కొనియున్న నీకు ని**
**మ్ముదిత వధింతు నంట గడుమోసము గాదొకొ! యోపుదేని నే**
**పొదవఁగ రాఘవున్ గెలువు; ముగ్ధలిఁ జంపినఁ బెంపు గల్గునే?' 140**

**ప్రతిపదార్థం:** దశ+ఆనన!= పదిమొగాలు కలవాడా! ఓ రావణా!; ఇది= ఈ స్త్రీహత్యాప్రయత్నం; తగునే= నీకు భావ్యమైనట్టిదా; మహా+ఇంద్రుఁడు= దేవేంద్రుడు; లోనగు= మున్నగు; దేవతా+తతిన్= వేల్పులసముదాయాన్ని; కదనములోన్= యుద్ధంలో; జయించి= గెలిచి; త్రి, జగంబులన్= మూడులోకాలలోను; పేర్+కొని+ఉన్న, నీకున్= యశస్సు నార్జించి ఉన్న నీకున్; ఈ+ముదితన్= ఈ ఆడుదానిని- సీతను; వధింతున్+అంట= చంపెదను అనటం; కడున్= మిక్కిలి; మోసముకాదు+ఒకొ!= వంచనకాదా! (వంచన చేయుటమే అగును); ఓపుదు+ఏనిన్= సామర్థ్యం ఉంటే; ఏపు+ఒదవఁగన్= అతిశయం శోభిల్లేటట్లుగా; రాఘవున్= రఘువంశజుడైన శ్రీరాముడిని; గెలువుము; ఉగ్మలిన్= ఆడుదానిని; చంపినన్= చంపివేస్తే; పెంపు= గొప్పతనం; కల్గునే= ఏర్పడుతుందా? (ఏర్పడదు).

**తాత్పర్యం:** 'పదిమొగాలు కల రావణా! ఇట్టి స్త్రీహత్యాప్రయత్నం నీవంటి మహావీరుడికి తగిన కృత్యం కాదు; నీవు దేవేంద్రుడు మున్నగు వేల్పుల సముదాయాన్ని యుద్ధంలో జయించినవాడవు. గొప్పకీర్తి ఆర్జించినవాడవు. ఈ విధంగా ఆడుదానిని అబలను వధించటం వంచన అనిపించుకొంటుంది. నీకు శక్తిసామర్థ్యాలు ఉంటే రఘువంశజుడైన శ్రీరాముడిని జయించుము. ఆడుదానిని సంహరించినంతమాత్రాన నీకు అభ్యుదయం చేకూరదు సుమా!'

**వ. అనినం దద్వచనంబుల నుపశమితక్రోధుండై దోషాచరేశ్వరుండు సమరసన్నాహం బమర రథం బెక్కిమిక్కిలి బీరంబు సొంపార నఖిలసేనాసహితంబుగాఁ బురంబు వెల్వడి నడతెంచె; నంత. 141**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అవింధ్యుడు చెప్పగా; తత్+వచనంబులన్= ఆతడియొక్క మాటలచేత; ఉపశమితక్రోధుండు+ఐ= చల్లారిన కోపం కలవాడై; దోషాచర+ఈశ్వరుండు= నిశాచరప్రభువు, రావణుడు; సమరసన్నాహంబుఅమరన్= యుద్ధంకొరకు చేసే ప్రయత్నం శోభిల్లగా; రథంబు+ఎక్కి= తేరును అధిరోహించి; మిక్కిలి= గొప్ప; బీరంబు, సొంపు+ఆరన్= దర్పంయొక్క శోభ విలసిల్లేటట్లుగా; అఖిలసేనా సహితంబుగాన్= సమస్తమైన సేనలతో కూడినవాడై; పురంబు= (లంకా) పట్టణం; వెల్వడి= వెలుపలకు వచ్చి; నడతెంచెన్= యుద్ధానికి వెళ్ళాడు; అంతన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని అవింధ్యుడు పలుకగా ఆతని మాటలవలన రావణుడికోపం ఉపశమించింది. రావణుడు యుద్ధప్రయత్నాలు చేసి సాధనాలు సమకూర్చుకొని రథాన్ని ఎక్కి మిక్కుటమైన డాబు, దర్పం, శోభిల్లేటట్లుగా సమస్తసైన్య సమేతుడై లంకాపురంనుండి నిష్క్రమించి, యుద్ధరంగానికి వెళ్ళాడు. ఆ సమయంలో.

**శా. సుగ్రీవాదిసమస్తవానరులుఁ బ్రస్ఫూర్జన్మహావిగ్రహ**
**వ్యగ్రాకారతఁ బేర్చి భూరుహశిలావ్రాతంబులం దాల్చి వా**
**లాగ్రవ్యాచలనంబు లొప్ప దశకంఠాగ్రేసరోదగ్ర దై**
**త్యగ్రామంబు నెదిర్చినన్ సమర మత్యంతోగ్ర మయ్యెన్ వడిన్. 142**

**ప్రతిపదార్థం:** సుగ్రీవ+ఆది, సమస్తవానరులున్= సుగ్రీవుడు మున్నగు కోతులు అందరున్నూ; ప్ర, స్ఫూర్జత్+మహా, విగ్రహ, వ్యగ్ర+ఆకారతన్= మిక్కుటంగా వెలుగొందే గొప్ప యుద్ధమందు వేగిరపడే ఆకారాలతో; పేర్చి= అతిశయించి; భూరుహ, శిలా, వ్రాతంబులన్= చెట్ల రాళ్ల సముదాయాలను; తాల్చి= ధరించి; వాల+అగ్ర, వి+ఆ చలనంబులు= తోకల చివరిభాగాలను బాగా చలింపచేయటాలు; ఒప్పన్= శోభిల్లగా; దశకంఠ+అగ్రేసర+ఉదగ్ర, దైత్య, గ్రామంబున్= రావణుడికి ముందు నడతెంచే భయంకరరాక్షస సమూహాన్ని; ఎదిర్చినన్= మార్కొనగా; వడిన్= శీఘ్రంగా, సమరము= యుద్ధం; అత్యంత+ఉగ్రము+అయ్యెన్= మిక్కిలి భయంకరం అయింది.

**తాత్పర్యం:** సుగ్రీవుడు మున్నగు ఎల్లవానరులు గొప్పయుద్ధం కోసం వేగిరపడే ఆకారాలతో విజృంభించి చెట్లు రాళ్ళు పూని, తోకలు త్రిప్పుతూ రావణుడికి ముందు నడచి వచ్చిన రాక్షససేనలను ఎదుర్కొనగా సంగ్రామం మిక్కిలి భయంకరం అయింది.

**వ. ఆ సమయంబున నఖిలమాయాకుశలుం డైన దశముఖుండు మాయ గావించిన. 143**

**తాత్పర్యం:** అప్పుడు మాయలన్నింటిలో నిపుణుడైన రావణుడు మాయను ప్రదర్శించగా.

క. **ఆ రావణుదేహంబున । ఘోరగదాశక్తిఖడ్గ కోదండధరుల్**
**వీరులు సహస్రసంఖ్యల । వారలు జనియించి రసురవరు లుద్ధతులై. 144**

**ప్రతిపదార్థం:** ఆ రావణుదేహంబునన్= ఆ రావణుడియొక్క శరీరంలో; ఘోర, గదా, శక్తి, ఖడ్గ, కోదండ, ధరుల్= భయంకరమైన గదలు, శక్తులు, కత్తులు, ధనుస్సులు ధరించినవారు; వీరులు= యోధులు; సహస్రసంఖ్యలవారలు= వేలకొలది; అసురవరులు= రాక్షసశ్రేష్ఠులు; ఉద్ధతులు+ఐ= గర్వించినవారై; జనియించిరి= ఉద్భవించారు.

**తాత్పర్యం:** ఆ రావణుడి శరీరంనుండి వేనకువేలు రాక్షసయోధులు భయంకరమైన గదలు శక్తులు కత్తులు ధనుస్సులు మున్నగునవి చేతపట్టినవారై గర్వంతో అతిశయించినవారు ఉద్భవించారు.

వ. **వారి నందఱఁ గౌసల్యానందనుండు సాంద్రశరజాలంబుల నవలీలం దునిమి తూఁటాడిన నమ్మేటి రక్కసుండు మఱియు నొక్కమాయ ప్రయోగించి రామలక్ష్మణ ప్రతిరూపంబు లనేకంబు లుత్పాదించుటయు, నయ్యన్నయుం దమ్ముండును వెఱఁగు పడియునుం జిడిముడివడక యమ్మాయారూపంబు లన్నియుం దునిమి, తదనంతరంబ. 145**

**ప్రతిపదార్థం:** వారిన్అందఱన్= ఆ ఆయుధవిశేషధారులను అందరిని; కౌసల్యానందనుండు= కౌసల్యకొడుకు- శ్రీరాముడు; సాంద్రశరజాలంబులన్= దట్టమైన అమ్ములసముదాయాలచేత; అవలీలన్= సులువుగా; తునిమితూఁటాడినన్= ముక్కలు ముక్కలు చేయగా; ఆ+మేటి రక్కసుండు= ఆ గొప్ప రాక్షసుడు- రావణుడు; మఱియున్= వెండియును; ఒక్కమాయ= ఒక కాపట్యం; ప్రయోగించి= ఉపయోగించి; రామలక్ష్మణ ప్రతిరూపంబులు= రాముడిని లక్ష్మణుడిని పోలిన రూపాలను; అనేకములు= పెక్కు; ఉత్పాదించుటయున్= పుట్టించగా; ఆ+అన్నయున్= ఆ అన్నయును (రాముడును); తమ్ముండును= అనుజుడును (లక్ష్మణుడును); వెఱగుపడియునున్= అచ్చెరువు నందినప్పటికీ; చిడిముడిపడక= కలత చెందక; ఆ+మాయారూపంబులు+అన్నియున్= ఆ కృతకాలైన ఆకృతులను అన్నింటిని; తునిమి= ఖండించి; తత్+అనంతరంబు+అ= అటుపిమ్మట.

**తాత్పర్యం:** ఆ విధంగా ఆయుధవిశేషాలను ధరించి ఉద్భవించిన మాయారాక్షసులనందరిని కౌసల్యకొడుకు శ్రీరాముడు ముక్కలుముక్కలుగా చేయగా, ఆ గొప్పరాక్షసుడైన రావణుడు వెండియు ఒకమాయ కల్పించి, రామలక్ష్మణులవలెనే కన్పించే పెక్కుమందిని సృజించాడు. రామలక్ష్మణులు రావణుడి కాపట్యానికి అచ్చెరువునందినా కలతచెందక, ఆ మాయారూపాలను ఖండించారు. అటుపిమ్మట.

చ. **అభినవభానుబింబరుచిరాకృతియున్ హరియుక్తమున్ మహా**
**రభసదురాసదంబును విరాజితకేతన వైజయంతికా**
**ప్రభయును నైన తేరు సురపాలకుపంపునఁ జేసి రాఘవ**
**ప్రభునకుఁ దెచ్చి మాతలి సభక్తికుఁడై ప్రియమొప్ప నిట్లనున్. 146**

**ప్రతిపదార్థం:** అభినవ, భాను, బింబ, రుచిర+ఆకృతియున్= అప్పుడే ఉదయిస్తున్న సూర్యబింబంవలె వెలుగొందే రూపం కలిగినట్టిదియును; హరియుక్తమున్= గుర్రాలు పూన్చబడినట్టిదిన్నీ; మహా, రభస, దురాసదంబును= మిక్కుటమైన వేగంలో అతిక్రమించరానట్టిదిన్నీ; విరాజిత, కేతన, వైజయంతికా, ప్రభయునున్= వెలుగొందే జెండా- వైజయింతిక యొక్క కాంతులు

కలిగినట్టిదిన్నీ; ఐన= ఐనట్టి; తేరు= రథం; సుర, పాలకు, పంపునన్+చేసి= స్వర్గప్రభువు అయిన దేవేంద్రుడి ఆజ్ఞచొప్పున; మాతలి= దేవేంద్రుడి రథసారథి అయిన మాతలి అనే పేరు కలవాడు; రాఘవప్రభునకున్= రఘువంశానికి చెందిన రాజుకు-శ్రీరాముడికి; తెచ్చి= తీసికొనివచ్చి; సభక్తికుఁడు+ఐ= భక్తితో కూడినవాడై; ప్రియము+ఒప్పన్= ప్రీతిశోభిల్లేట్లుగా; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఉదయించే సూర్యబింబంవలె ధగద్ధగాయమానంగా వెలుగొందేదిగా, గుర్రాలు పూన్చబడిందీ, అన్నిరథాలకంటె వేగంగా పోగలిగిన శక్తి గలదీ; 'వైజయంతి' అనేపేరు కల పతాకకాంతులతో విరాజిల్లేదీ, అయిన ఆ రథాన్ని దేవేంద్రుడి ఆజ్ఞచొప్పున మాతలి తెచ్చి, శ్రీరాముడికి భక్తితో నమస్కరించి ఇట్లా పలికాడు.

**విశేషం:** (1) దేవేంద్రుడు శ్రీరామునికి తనరథాన్ని పంపించాడు. కారణం సుగమం. రావణుడు దేవేంద్రుడిశత్రువు. శత్రువుయొక్క శత్రువును పరమమిత్రుడిగా పరిగణించటం రాజనీతి. శ్రీరాముడి విజయంలో పాలుపంచుకోదగినవాడు దేవేంద్రుడు. (2) ఇంతకుముందు కుబేరుడు గుహ్యకుడిని తనదూతగా పంపి శ్రీరాముడికి 'దివ్యతోయములను' బహూకరించాడు. చూడుడు-పద్యసంఖ్య 129 సీసం. కుబేరుడికి రావణుడు శత్రువు. రావణుడికి శత్రువు అయిన శ్రీరాముడు కుబేరునికి మిత్రుడు కదా!.

**మ. 'ధరణీనాథ! సురేంద్రుతే రిది; మహాదైత్యేంద్రులం దొల్లి యీ**
**యరదం బెక్కి యనేకులం దునిమె జంభారాతి ఘోరాజి; నీ**
**యరదం బెక్కివధింపు నీవును మదీయస్ఫార సారథ్య ని**
**ర్భరభంగిన్ దశకంధరుం ద్రిభువనీభంగోన్నమత్కంధరున్.' 147**

**ప్రతిపదార్థం:** ధరణీనాథ!= రాజా, శ్రీరామచంద్రా!; ఇది= ఈ రథం; సుర+ఇంద్రు, తేరు= దేవేంద్రుడి అరదం; మహాదైత్య+ఇంద్రులన్= గొప్ప రాక్షసశ్రేష్ఠులను; తొల్లి= పూర్వకాలంలో; ఈ అరదంబు+ఎక్కి= ఈ రథాన్ని అధిరోహించి; అనేకులన్= పెక్కుమందిని; ఘోర+ఆజిన్= భయంకరమైన యుద్ధంలో; జంభ+అరాతి= (జంభుడు అనే రాక్షసుడికి విరోధి) దేవేంద్రుడు; తునిమెన్= ఖండించాడు; ఈ అరదంబు= ఈ రథాన్ని; ఎక్కి= అధిరోహించి; నీవును= ఓ రామా! నీవును; మదీయ, స్ఫార, సారథ్య, నిర్భర, భంగిన్= నాదైన విస్తరించిన రథంనడుపు నేర్పుయొక్క సమగ్రమైన రీతిచేత; దశకంధరున్= పదికంఠాలు కలవాడిని; త్రిభువనీభంగ+ఉన్నమత్+కంధరున్= మూడులోకాలయొక్క భంజనం చేత గర్వించిన కంఠాలు కలవాడిని; వధింపు= సంహరించుము.

**తాత్పర్యం:** 'రాజా! శ్రీరామా! ఇది దేవేంద్రుడి రథం. పూర్వకాలంలో ఈ రథాన్ని అధిరోహించి. భయంకరమైన ఈ యుద్ధంలో జంభుడి విరోధి అయిన దేవేంద్రుడు గొప్పరాక్షసవీరులను పెక్కుమందిని సంహరించాడు. నీవుకూడా దేవేంద్రుడి రథాన్ని అధిరోహించి నేను అప్రతిమానచాతుర్యంతో తేరునడపుతుండగా మూడులోకాలను ఓడించిన దర్పంచేత తలనెత్తుకొని తిరుగాడే రావణుడిని సంహరించుము.'

**మ. అనినన్ మాతలి నాదరించి యరదం బా రాఘవుం డెక్కియు**
**క్కున మీఁటెన్ రిపుకోటిమీఁద విలసత్కోదండమౌర్వీమహా**
**స్వనభిన్నాఖిలదిగ్విభాగుఁ డగుచున్ శాతాస్త్రధారాభిషే**
**చనపూతప్రతిపక్షసైన్యుఁ డగుచున్ సంరంభదుర్వారతన్. 148**

**ప్రతిపదార్థం:** అనినన్= అని(మాతలి) చెప్పగా; ఆ రాఘవుండు= ఆ రాముడు; మాతలిన్= మాతలిని; ఆదరించి= గౌరవించి; అరదంబున్= రథాన్ని; ఎక్కి= అధిరోహించి; రిపుకోటిమీఁదన్= శత్రుసమూహంపై; విలసత్+కోదండ, మౌర్వీ, మహా, స్వన, భిన్న+అఖిల, దిక్+విభాగుఁడు+అగుచున్= శోభిల్లే వింటి అల్లెత్రాటియొక్క గొప్పశబ్దంచేత చీల్చబడిన అన్నిదెసల విభాగాలు కలవాడు ఔతూ, తనవింటిఅల్లెత్రాటిమ్రోతచే దిక్కులు అన్నిటిని చిల్లులు పడేటట్లు చేసినవా డౌతూ; శాత+అస్త్ర, ధారా+అభిషేచన, పూత, ప్రతిపక్ష, సైన్యుఁడు+అగుచున్= వాడి అయిన మంత్రబాణవర్షంయొక్క తడుపుచేత పవిత్రాలైన విరోధిసేనలు కలవాడు ఔతూ; సంరంభ, దుర్వారతన్= ఉద్రేకం యొక్క వారింప శక్యంగామిచేత; ఉక్కునన్ మీఱెన్= బలంతో విజృంభించాడు.

**తాత్పర్యం:** ఆ మాటలు విని శ్రీరాముడు మాతలిని అభినందించాడు. పిదప శ్రీరాముడు ఆ రథాన్ని అధిరోహించాడు. శత్రుసమూహాలపై విజృంభించి తనవింటి అల్లెత్రాటి మ్రోతతో దెసలకొసలు చిల్లులుపడేటట్లు చేశాడు. ఆపజాలని ఉద్రేకంతో శత్రుసైన్యాలపై శరపరంపరలు వర్షించి ఆ వర్షధారలచేత వారిని పవిత్రులు అయ్యేటట్లుగా చేశాడు.

**ఉ.** **అత్తఱి రావణుండు విలయానలదుస్సహమూర్తియై నరేం**
**ద్రోత్తముమీఁదఁ దేరు గడు నుగ్రగతిం బఱపించి సంతతో**
**ద్వృత్తశరప్రవాహపరివీతదిశాముఖుఁ డైనఁ జూచి పే**
**రుత్తలమంది రాతనిసముద్ధతికిన్ దివినుండి నిర్జరుల్.** **149**

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= ఆ తరుణంలో; రావణుండు; విలయ+అనల, దుస్సహ, మూర్తి+ఐ= ప్రళయకాలంలోని అగ్నివలె సహించటానికి శక్యంకాని ఆకారం కలవాడై; నర+ఇంద్ర+ఉత్తముమీఁదన్= నరులలో శ్రేష్ఠుడు ఐన శ్రీరాముడిపై; తేరు= రథం; కడున్= మిక్కిలి; ఉగ్రగతిన్= భయంకరంగా; పఱపించి= నడిపించి; సంతత+ఉత్+వృత్త, శర, ప్రవాహ, పరివీత, దిశా, ముఖుఁడు+ఐనన్= ఎల్లప్పుడు గర్వించిన అతిశయించిన అమ్ములవెల్లువచేత చుట్టబడిన దెసల మొగాలు కలవాడు కాగా; ఎగతెగని, అతిశయించిన అమ్ముల వెల్లువచే చుట్టబడిన దిఙ్ముఖాలు కలవాడుకాగా, చూచి= అరసి; దివినుండి= స్వర్గంనుండి; నిర్జరుల్= దేవతలు; ఆతని సమ్+ఉద్ధతికిన్= రావణుడియొక్క మిక్కుటమైన విజృంభణకు; పేరు+ఉత్తలము+అందిరి= గొప్పతత్తరపాటును చెందారు.

**తాత్పర్యం:** ఆ రణంలో రావణుడు విజృంభించాడు. అతడు ప్రళయకాలంలోని అగ్నివంటి ఆకారంతో తేజరిల్లాడు. తన రథాన్ని భయంకరవేగంతో నరోత్తము డైన శ్రీరాముడిపైకి నడిపించాడు. అతిశయించే పైకెగిరే వెల్లువవలె అమ్ముల పరంపరలు ప్రయోగించి దిఙ్ముఖాలను కప్పాడు. దివినుండి రావణుడి విజృంభణం గమనించిన దేవతలు మిక్కుటమైన ఆతురతను ఆవేదనను అనుభవించారు.

**వ.** **ఇట్లు దలపడి రామరావణు లతిఘోరంబుగాఁ బోరం దొడంగి; రంతఁ బంక్తివదనుండు నిబిడజ్వాలాకరాళం బగు శూలంబు రాఘవుమీఁదం బ్రయోగించిన, నతండును నడుమన దానిఁ దునియలు సేసిన, నీసునం బెరిఁగి సురవైరి మఱియునుం దరతరంబ శతసహస్రసంఖ్యల శూలంబులు భిండివాలంబులుఁ దోమరంబులు శరంబులుం బఱఁగించి యంబరంబెల్ల నస్త్రమయంబుఁ గావించిన నఖిలభూతంబులును హాహాకారవ్యాకులంబు లయ్యె; నసురసైన్యంబున భేరీప్రముఖతూర్యనినదంబులు సింహనాదంబులు సెలంగెఁ; గొండొకసేపునకు రావణప్రయుక్తం బయిన శస్త్రాస్త్రదహనం బంతయు నిరంతరవిశిఖధారాసారంబునం గబళించి రామజలధరంబు గంభీరసారంబునం బొదలుటయు సకలప్లవంగసముదయంబును బ్రహర్ష కోలాహలబహుళం బయ్యెఁ; బదంపడి.** **150**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; తలపడి= మార్కొని; రామరావణులు= రాముడును రావణుడును; అతిఘోరంబుగాన్= మిక్కిలి భయంకరంగా; పోరన్+తొడంగిరి= యుద్ధం చేయసాగారు; అంతన్= ఆ సమయంలో; పంక్తివదనుండు= రావణుడు; నిబిడ, జ్వాలా, కరాళంబు+అగు= దట్టమైన అగ్నిశిఖలచేత భయానకమైనది అయిన; శూలంబు= ఈటె; రాఘవుమీఁదన్= శ్రీరాముడిపయి; ప్రయోగించినన్= వేయగా; అతండును= శ్రీరాముడును; దానిన్= ఆ శూలాన్ని; నడుమన= మార్గమధ్యంలోనే; తునియలు, చేసినన్= ముక్కలుగా ఖండించగా; ఈసునన్= మాత్సర్యంతో; పెరిఁగి= అతిశయించి; సురవైరి= వేల్పులవిరోధి రావణుడు; మఱియునున్= వెండియును; తరతరంబు+అ= వరుసవరుసలుగా, పరంపరలుగా; శతసహస్రసంఖ్యలన్= వందలు వేలకొలదిగా, లెక్కకు మిక్కిలిగా, శూలంబులు= ఈటెలు; భిండివాలంబులున్= నాళికాస్త్రాలును (వడిసెలవలె ఉండే ఆయుధవిశేషాలు); తోమరములున్= చిల్లకోలలును; శరంబులున్= అమ్ములును; పఱఁగించి= ప్రయోగించి; అంబరంబు+ఎల్లన్= ఆకసం అంతటిని; అస్త్రమయంబున్+కావించినన్= అస్త్రాలతో నిండేటట్లు చేసిన; అఖిలభూతంబులును= సమస్తభూతాలును; హాహాకారవ్యాకులంబులు= హాహాకారాలు చేస్తూ కలతచెందినవి; అయ్యెన్= అయ్యాయి; అసురసైన్యంబునన్= రాక్షసులసేనలో; భేరీప్రముఖతూర్యనినదంబులు= దుందుభి మున్నగు పటహాల చప్పుడులు; సింహనాదంబులు; చెలంగెన్= ధ్వనించాయి; కొండొకసేపునకున్= కొంతతడవుకు; రావణప్రయుక్తంబు+అయిన= రావణుడిచేత ప్రయోగించబడిన; శస్త్ర+అస్త్ర, దహనంబు+ అంతయున్= శస్త్రాలయొక్కయు, మంత్రమహిమగల అస్త్రాలయొక్కయు అగ్ని సమస్తమున్నూ; నిరంతర, విశిఖ, ధారాసారంబునన్= ఎడతెగక కురిసే బాణవర్షాలవెల్లువచేత; కబళించి= మ్రింగి; రామజలధరంబు= రాముడు అనే మేఘం; గంభీరసారంబునన్= మిక్కిలి విక్రమంతో; పొదలుటయున్= అతిశయించిందికాగా; సకల, ప్లవంగ, సముదయంబును= సమస్త మైన వానరసమూహాలును; ప్రహర్ష, కోలాహల, బహుళంబు+అయ్యెన్= మిక్కుటమైన సంతోషంతో కూడిన పెద్దకలకలంతో నిండింది అయింది. పదంపడి= అటు పిమ్మట.

**తాత్పర్యం:** ఈ విధంగా మార్కొనిన రాముడికి రావణుడికి భయంకరమైన యుద్ధం జరిగింది. రావణుడు దట్టమైన అగ్నిశిఖలచేత ఆవరించబడిన శూలాన్ని రాముడిపై విసరగా, రాముడు దానిని మార్గమధ్యంలోనే ముక్కలు ముక్కలుగా ఖండించాడు. అంతట మాత్సర్యంతో అతిశయించి రావణుడు ఆగకుండా వరుసగా కొన్నివందలవేలు శూలాలు, నాళికాస్త్రాలు, చిల్లకోలలు, బాణాలు ప్రయోగించి ఆకసాన్ని అంతటిని శస్త్రాలతో అస్త్రాలతో కప్పాడు. అప్పుడు అఖిలభూతాలున్నూ కలతచెంది హాహాకారాలు చేశాయి. రావణుడి పరాక్రమాన్ని కాంచి రాక్షససేనలు దుందుభులు పటహాలు మున్నగు వాద్యాలను మ్రోగించి తమ సంతోషాన్ని ప్రకటించాయి; సింహనాదాలు చేశాయి. కొంతసేపటికి, రావణుడు ప్రయోగించిన అస్త్రశస్త్రాలకు సంబంధించిన కార్చిచ్చునంతటినీ తన సంతతబాణపరంపరల వృష్టిచే చల్లార్చి రాముడు అనే మేఘుడు అవక్ర విక్రమంతో అతిశయించాడు. అంతట శ్రీరామునిఅత్యద్భుత పరాక్రమ చాకచక్యానికి మిక్కుటమైన ఆనందాన్ని చెందిన వానరసేనల కోలాహలం మిన్నుముట్టింది. ఆ పిమ్మట.

**విశేషం:** (1) అలం: రూపకం. రాముడికి మేఘానికి, రావణబాణాలపరంపరకు అగ్నికి, రామబాణాలకూ మేఘవృష్టికి అభేదాధ్యవసాయం నిరూపించబడింది. 'గంభీరసంరంభంబునన్' - అనే పాఠం కొన్ని ప్రతులలో ఉన్నది.

### శ్రీరాముఁడు రావణాసురుని సంహరించుట (సం. 3-274-24)

**సీ.** **కమనీయకనకపుంఖప్రభాభాసియుఁ । దీక్ష్ణముఖంబును దివిజయక్ష**
**మునిసిద్ధసాధ్యసమ్మోదావహంబు నై । విలసిల్లు బాణ మవ్వీరవరుఁడు**

గైకొని బ్రహ్మాస్త్రకలితమంత్రాభియు । క్తంబుగా నొనరించి కార్ముకమున
సంధించి జగములు జయపెట్టఁ జెచ్చెరఁ । దివిచి యేయుటయును దీవ్రభంగిఁ

ఆ. గడఁగి యాశరంబు గల్పాంతవహ్నియ । పోలెఁ బంక్తికంఠుఁ బొదివి నీఱు
గా నొనర్చె సూతఘన రథరథ్య స । మన్వితముగ నొక్కమాత్రలోన. 151

**ప్రతిపదార్థం:** ఆ+వీరవరుఁడు= వీరులలో శ్రేష్ఠుడు అయిన ఆ శ్రీరాముడు; కమనీయ, కనక, పుంఖ, ప్రభా, భాసియున్= అందమైన బంగారుపింజలకాంతిచేత ప్రకాశించేదియున్నూ; తీక్ష్ణముఖంబును= వాడి అయిన ముందుకొన కలిగినదియున్నూ; దివిజ, యక్ష, ముని, సిద్ధ, సాధ్య, సమ్మోద+ఆవహంబును+ఐ= వేల్పులకు, జక్కులకు, ఋషులకు, వేల్పులజాతికి చెందిన సిద్ధులకును సాధ్యులకును మిక్కుటంగా సంతసాన్ని చేకూర్చేదిన్నీ+అయి; విలసిల్లు= శోభిల్లు; బాణము= అమ్ము; కైకొని= చేతబూని; బ్రహ్మ+అస్త్ర, కలిత, మంత్ర+అభియుక్తంబుగాన్= బ్రహ్మకు సంబంధించిన మంత్రమహిమతో కూడిఉండేటట్లుగా; ఒనరించి= చేసి; కార్ముకమునన్= ధనుస్సును; సంధించి= ఎక్కుపెట్టి; జగములు= లోకాలు; జయ+పెట్టన్= జయజయధ్వానాలు సలుపగా; చెచ్చెరన్= వేగంగా; తివిచి= అల్లెత్రాటిని వెనుకకు లాగి; ఏయుటయును= ప్రయోగించటంచేత; తీవ్రభంగిన్= త్వరితరీతిగా; కడఁగి= పూని; ఆ శరంబు= ఆ బాణం; కల్ప+అంత, వహ్ని+అ+పోలెన్= ప్రళయసమయంలోని అగ్నివలె; పంక్తికంఠున్= పదికంఠాలు కలవాడిని, రావణుడిని; పొదివి= క్రమ్మి; సూత, ఘనరథరథ్య, సమన్వితముగన్= సారథితో గొప్పతేరితో అశ్వాలతోపాటుగా; ఒక్కమాత్రలోనన్= ఒక్కక్షణంలోనే; నీఱుగాన్= బూదిఅయ్యేటట్లుగా; ఒనర్చెన్= చేసింది.

**తాత్పర్యం:** శ్రీరాముడు బ్రహ్మాస్త్రాన్ని సంధించి ఒక్కత్రుటిలో రావణుడిని బుగ్గిచేశాడు. అందమైన బంగారుపింజలచేత దేదీప్యమానంగా ప్రకాశించేది, వాడిఅయిన కొన గలిగింది, వేల్పులజాతివారైన సిద్ధులు, సాధ్యులు, యక్షులు, ఋషులు సంతోషించేది అయిన అమ్మును వీరవరుడు అయిన శ్రీరాముడు బ్రహ్మాస్త్రమంత్రంతో జోడించి, వింటికి తొడిగి అల్లెత్రాటిని వెనుకకు లాగి వేగంగా ప్రయోగించాడు. ఆ బాణం ప్రళయకాలంలోని అగ్నివలె దశకంఠుడైన రావణుడిని క్రమ్మి, సారథి, రథం అశ్వాలతోపాటుగా ఒక్కక్షణంలో అతడిని బుగ్గికావించింది. జగములన్నీ జయజయధ్వానాలు చేశాయి.

**విశేషం:** అలం: ఉపమ.

వ. అప్పు డంబరంబున దివ్యతూర్యనాదంబులు సెలంగం గలంగి యసురు లెల్లఁ దొలంగిరి; గంధర్వగానంబులు నప్సరోనర్తనంబులుఁబ్రవర్తిల్లె; నింద్రాదిదేవోత్తము లన్నరదేవోత్తముం బ్రస్తుతించుచుం బ్రమోదంబు నొందిరి.152

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; అంబరంబునన్= ఆకసంలో; దివ్యతూర్యనాదంబులు= దేవతలకు సంబంధించిన పటహాలు మున్నగు వాద్యధ్వనులు; చెలంగన్= అతిశయించగా; అసురులు= రాక్షసులు; కలంగి= కలతచెంది; ఎల్లన్= అందరు; తొలంగిరి= అచటినుండి దూరంగా వెళ్ళారు; గంధర్వగానంబులున్= గంధర్వుల సంగీతాలు; అప్సరస్+నర్తనంబులున్= దేవకన్యల నృత్యాలు; ప్రవర్తిల్లెన్= జరిగాయి; ఇంద్ర+ఆది, దేవ+ఉత్తములు= ఇంద్రుడు మున్నగు వేలుపుపెద్దలు; ఆ నర, దేవ+ఉత్తమున్= ఆ మనుజాధిపులలో శ్రేష్ఠుడిని, శ్రీరాముడిని; ప్రస్తుతించుచున్= పొగడుతూ; ప్రమోదంబున్+ఒందిరి= సంతోషం అనుభవించారు.

**తాత్పర్యం:** రావణుడు మరణించిన సమయంలో ఆకసాన దేవదుందుభులు మంగళతూర్యరావాలు చెలరేగాయి. రాక్షసులు ఖిన్ను లయి యుద్ధభూమిని వీడి వెడలిపోయారు. గంధర్వులు గానం చేశారు. అప్సరసలు నాట్యం

చేశారు. ఇంద్రుడు మున్నగు వేలుపుదొరలు నరనాథులలో శ్రేష్ఠుడు అయిన శ్రీరాముడిని పొగడుతూ ఆనందం పొందారు.

**క. ఏకోత్సవంబు లయ్యెఁ ద్రి। లోకంబులు నఖిలలోకలుంటాకుఁడు ఘో**
**రాకారుఁడు దశవదనుఁడు। గాకుత్స్థనిశాతశరముఖంబునఁ బడినన్. 153**

**ప్రతిపదార్థం:** అఖిల, లోక, లుంటాకుఁడు= సమస్తలోకాలను దోచుకొన్నవాఁడు; ఘోర+ఆకారుఁడు= భయానకమైన రూపం కలవాఁడు; దశవదనుఁడు= రావణుడు; కాకుత్స్థ, నిశాత, శర, ముఖంబునన్= కకుత్స్థవంశజుడియొక్క; (శ్రీరాముడియొక్క) వాడి బాణంవాత; పడినన్= పడటంచేత అనగా శ్రీరాముడిచేత రావణుడు సంహరించబడటంచేత; త్రిలోకంబులు= మూడుజగత్తులు; ఏక+ఉత్సవంబులు+అయ్యెన్= ఒకేసారి పండుగ జరుపుకొనేవి అయ్యాయి.

**తాత్పర్యం:** అఖిలలోక కంటకుడు అయిన రావణుడు శ్రీరాముడిచేత సంహరించబడటంచేత, మూడులోకాలూ సంతోషించి, ఒకేసారి పండుగ జరుపుకొన్నాయి.

**ఉ. అంత ననంతకీర్తి శరణాగతరక్షణశాలి రాఘవుం**
**డెంతయు వేడ్కతోడ నసురేంద్రపదంబున నవ్విభీషణున్**
**సంతతపుణ్యుఁ బుణ్యజనసంతతివర్ధనుఁ గట్టెఁ బట్ట మ**
**త్యంతదయాంతరంగుఁడు గృతాహితభంగుఁడు దానుఁ దమ్ముఁడున్. 154**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ సమయంలో; అనంతకీర్తి= అనంతమైన అనగా విస్తారమైన యశస్సు కలవాడు; శరణ+ఆగత, రక్షణశాలి= అభయం కోరి ఆశ్రయించినవారిని కాపాడడంచే ఒప్పే; అత్యంత దయా+అంతరంగుఁడు= మిక్కుటమైన కృపతో నిండిన హృదయం కలవాడు; కృత+అహిత, భంగుఁడు= శత్రువులకు అవమానం చేసేవాడు. రాఘవుండు= శ్రీరాముడు; తానున్= తాను (శ్రీరాముడు); తమ్ముఁడున్= అనుజుడును; ఎంతయున్= మిక్కుటమైన; వేడ్కతోడన్= సంతోషంతో; అసుర+ఇంద్రపదంబునన్= రాక్షసరాజు పదవిలో; ఆ+విభీషణున్; సంతతపుణ్యున్= ఎల్లప్పుడున్నూ సుకృతం చేసేవాడిని; పుణ్య, జన, సంతతి, వర్ధనున్= రాక్షస సముదాయాన్ని అభివృద్ధిచేసేవాడిని; పట్టము+కట్టెన్= పట్టాభిషేక సింహాసనంపై ఆసీనుడిని చేసి పట్టంకట్టాడు.

**తాత్పర్యం:** అంతట, విస్తారమైన కీర్తిని ఆర్జించినవాడు, శరణు వేడినవారిని కాపాడడంచేత ఒప్పేవాడు, దయ నిండిన హృదయం కలవాడు, శత్రువులను నిర్జించేవాడు అయిన శ్రీరాముడు తన తమ్ముడితో కూడి, మిక్కిలి సంతోషంతో లంకాపట్టణానికి రాజుగా, రాక్షసులకు ప్రభువుగా పుణ్యాత్ముడూ, రాక్షస సమూహాన్ని పెంపొందించే వాడూ అయిన విభీషణుడికి పట్టం కట్టాడు.

**విశేషం:** రాజ్యారంభసూచకం పట్టాభిషేకం. అది రాజు సింహాసనాన్ని అధిష్ఠించేసమయం. పట్టం అనగా రాజలాంఛన మైన పట్టు నూలు. దానిని కట్టటం, పుణ్యనదులతీర్థం శిరస్సున చల్లటం (అభిషేకించటం) పట్టాభిషేకం లేక పట్టంకట్టటం.

**వ. తదనంతరంబ యవింధ్యుండు విభీషణసహితుండై జానకి నుచితయానంబున నునిచికొని రామదేవు పాలికిం దెచ్చి 'దేవా! దేవిం బరిగ్రహింపు' మని విన్నవించిన నతండు. 155**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట; అవింధ్యుండు= అవింధ్యుడు (సీతాదేవిని రావణుడు సంహరించకుండగ కాపాడిన ముసలి రక్కసుడు); విభీషణసహితుండు+ఐ= విభీషణుడితో కూడినవాడయి; జానకిన్= సీతను; ఉచితయానంబునన్= తగినవాహనంలో; ఉనిచికొని= (ఆసీననుచేసి) ఉంచి; రామదేవుపాలికిన్= శ్రీరామచంద్రునియొద్దకు; తెచ్చి= తీసికొని వచ్చి; దేవా!= ప్రభూ!; దేవిన్= దేవిని; పరిగ్రహింపుము= కైకొనుము; అని= అని చెప్పి; విన్నవించినన్= వినయంగా ప్రార్థించగా; అతండు= అతడు- శ్రీరాముడు.

**తాత్పర్యం:** అటుపిమ్మట అవింధ్యుడు విభీషణుడితోపాటు సీతాదేవిని సగౌరవంగా సముచితవాహనంమీద ఉంచి శ్రీరామదేవుడికడకు తీసికొని వచ్చి, 'దేవా! దేవిని పరిగ్రహించుము' అని సగౌరవంగా విన్నవించాడు.

**చ. అతిమలినాంగి జీర్ణమలినాంబరధారిణి సంతతాశ్రుపం**
**కితవిలసత్కపోలఁ బరికీర్ణజటాయితకేశభార నా**
**యతఘనదుఃఖదూషితఁ బ్రియాంగనఁ గన్గొని యప్రియాత్ముఁడై**
**నుతచరితుండు దద్దయు మనోవ్యథ సేయుచు నింతి కిట్లనున్. 156**

**ప్రతిపదార్థం:** అతిమలిన+అంగి= మిక్కిలి మాసిన శరీరం కలదానిని; జీర్ణ, మలిన+అంబర, ధారిణి= చినిగినట్టి మాసినట్టి బట్టలు ధరించినదానిని; సంతత+అశ్రు, పంకిత, విలసత్+కపోలన్= ఎల్లప్పుడూ స్రవించిన కన్నీటిచేత మలినపడినప్పటికీ, శోభిల్లుతున్న చెక్కిళ్ళు కలదానిని; పరికీర్ణజటాయిత కేశభారన్= ఇటునటు చెదరి జడలుకట్టిన జుట్టుముడి కలదానిని; ఆయతఘనదుఃఖ దూషితన్= మిక్కిలి గొప్పది అయిన శోకంచేత బాధించబడినదానిని; ప్రియ+అంగనన్= భార్యను; కన్గొని= చూచి; అప్రియ+ఆత్ముఁడు+ఐ= కఠినమైన మనస్సు కలవాడై; నుతచరితుండు= ప్రస్తుతించబడిన నడవడి కలవాడు శ్రీరాముడు; తద్దయున్= మిక్కుటంగా; మనోవ్యథ= మనస్+వ్యథ= చిత్తానికిబాధ; చేయుచున్= కలిగిస్తూ; ఇంతికిన్= భామకు, సీతకు; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** మిక్కుటంగా మాసిన శరీరం కలదానిని, చినిగిపోయినట్టి మాసినట్టి వస్త్రం తాల్చినదానిని; ఎల్లప్పుడును కన్నీరు కార్చటంచేత చెక్కిళ్లపై ఏర్పడిన చారికలు కలదానిని, చిక్కువడి జడలుగా అల్లుకొనిన జుట్టుముడి కలదానిని; చిరకాలం దుఃఖభారంచేత వేగినదానిని, తనకు ప్రియమైన భార్యయైన సీతాదేవిని చూచి, ప్రస్తుతించబడిన నడవడి కలవాడైన శ్రీరాముడు కఠినాత్ముడై ఆమెకు మిక్కుట మైన చిత్తతాపం కలిగించే రీతిలో ఈవిధంగా పలికాడు.

**విశేషం:** స్థూలదృష్టికి ఈ పద్యంలో పరస్పరవ్యాఘాతాలైన కొన్ని అంశాలు కన్పించవచ్చును. శ్రీరాముడు నుతచరితుడుకదా; సీతాదేవిస్వరూపమే ఆమె పాతివ్రత్యానికి నిర్వికల్పమైన సాక్ష్యంగదా; ఇక శ్రీరాముడు ప్రియాంగనతో అప్రియవాక్యాలు ఎందుకు పల్కాడు? సమాధానంకొరకు తరువాతి పద్యాలు అనుశీలించవచ్చును.

**సీ. 'అధికదుష్టాచారుఁ డైన దశాననుఁ । డింతకాలము తనయింటఁ బెట్టి**
**కొనియున్న నిన్నుఁ గైకొనిన నస్మచ్చరి । త్రమునకుఁ దొడరదే ధర్మహాని?**
**పరిభవంబునకునై ప్రతికారముగ వైరిఁ । గూల్చితిఁ గాని నీకొఱకుఁ గాదు;**
**మెలఁత! నీ చరితంబు మేలైనఁ గీడైనఁ । గానిమ్ము, నిన్ను నిక్కముగ నొల్లఁ;**

ఆ. బరఁగఁ గుక్కవాతఁ బడిన హవ్యముభంగి । యయ్యె నీ తెఱంగు నరయ నిపుడు;
గాన యిచటఁ దడయఁ గాదు; చెచ్చెర నీకు । నిష్టమయిన యెడకు నేఁగు మతివ!' 157

**ప్రతిపదార్థం:** అతివ!= వనితా! ఓ సీతా! అధిక, దుష్ట+ఆచారుఁడు+ఐన= మిక్కిలి చెడ్డప్రవర్తన కలవాడైన; దశ+ఆననుఁడు= పదిమొగాలు కలవాడు- రావణుడు; ఇంతకాలము; తన+ఇంటన్= తన గృహంలో; పెట్టికొని+ఉన్న= పెట్టుకొని ఉంచిన; నిన్నున్= ఓ సీతా! నిన్ను; కైకొనినన్= స్వీకరిస్తే; అస్మత్+చరిత్రమునకున్= నా నడవడికి; ధర్మహాని= ధర్మానికి కీడు; తొడరదే?= ఏర్పడదా (ఏర్పడుతుంది); పరిభవంబునకున్+ఐ= (నాకు జరిగిన) అవమానానికి; ప్రతికారముగన్= మారుచేతగా; వైరిన్= శత్రువును; కూల్చితిన్= సంహరించాను; కాని= కాని; నీ కొఱకున్+కాదు= నీకోసమై కాదు; మెలఁత!= ఓ వనితా! (సీతా); నీ చరితంబు= నీ నడవడి; మేలు+ఐనన్= మంచిది అయిననూ; కీడు+ఐనన్= చెడుది అయినను; కానిమ్ము= కావచ్చును కాని; నిన్నున్= నిన్ను; నిక్కముగన్= నిజంగా; ఒల్లన్= అంగీకరించను (పరిగ్రహించజాలను); పరఁగన్= ఒప్పిదంగా; కుక్కవాతన్= కుక్క నోటిలో; పడిన= పడిన; హవ్యముభంగిన్= హోమద్రవ్యం వలె; ఇపుడు= ఈ సమయంలో; నీతెఱంగు= నీ విధం; అయ్యెన్= అయింది; కాన= కావున; ఇచటన్= ఈ స్థలంలో; తడయన్+కాదు= ఆలస్యంచేయటం మంచిది కాదు; నీకున్= నీకు; ఇష్టము+అయిన, ఎడకున్= ఇచ్చవచ్చినస్థలానికి; చెచ్చెరన్= వేగంగా; ఏగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** 'ఓ సీతాదేవీ! మిక్కిలి చెడునడవడి గల రావణుడిగృహంలో నీవు ఉన్నావు. అందుచేత నేను నిన్ను పరిగ్రహించజాలను. నిన్ను నేను స్వీకరిస్తే నా నడవడికి కళంకం ఏర్పడుతుంది. ధర్మానికి కీడు కలుగుతుంది. శత్రువైన రావణాసురుడిని సంహరించటం నాకు జరిగిన పరాభవాన్ని మాపుకొనటానికే కాని నీ కొరకు కాదు. నీ ప్రవర్తన మంచిదే కావచ్చును; మరి చెడ్డదే కావచ్చును. ఏదైనా, నేను నిన్ను అంగీకరింపజాలను. ఇది నిజం. కుక్కముట్టుకొనిన హోమద్రవ్యంవలె అయింది నీ సంగతి. అందుచేత ఇంక నీవు ఇక్కడ తడయరాదు. నీ ఇచ్చవచ్చిన స్థలానికి పొమ్ము.'

ఆ. అనినఁ జెవులఁ గొఱవి గొని చూఁడినట్లైనఁ । దాల్మి పెల్లగిల్లఁ దరళనయన
మొదలు నఱక నొఱగు కదళిచందంబున । నెలఁత దల్లడమున నేల వ్రాలె. 158

**ప్రతిపదార్థం:** అనినన్= అని శ్రీరాముడు పలుకగా; చెవులన్= చెవులలో; కొఱవి= మండేకట్టె; కొని= కైకొని; చూఁడినట్లు+ఐనన్= కాల్చినట్లుగా కాగా; తాల్మి= ఓర్పు; పెల్లగిల్లన్= పెరికివేసినట్లుగా తొలగగా; తరళనయన= కన్నీటితో చలిస్తున్న కన్నులుకల; మొదలు= మూలం (ప్రకాండంలో మొదటిభాగం); నఱకన్= ఖండించగా; ఒఱగు= వ్రాలే; కదళిచందంబునన్= అరటిచెట్టు మాదిరిగా; నెలఁత= వనిత - సీత; తల్లడమునన్= ఆరాటంతో; నేలన్= భూమిపై; వ్రాలెన్= కూలింది.

**తాత్పర్యం:** శ్రీరాముడు ఆరీతిగా నిష్ఠురవచనాలు పలుకగా సీతాదేవికి చెవులలో కొఱవికొని గ్రుచ్చినట్లు అనిపించింది. ఆమె ఓర్పును కోలుపోయి, కన్నీరు కారుస్తూ, మొదలు నరకిన అరటిచెట్టువలె తత్తరపాటుతో నేలపై వ్రాలిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ.

క. వెఱఁగుపడి హర్షరాగము । తఱిఁగిన వెలువెల్లనై వదనములు వ్రాలం
దెఱఁగేది తిచ్చపడి ర । త్తఱిఁ దత్పరిజనము లెల్లఁ దద్దయు వంతన్. 159

**ప్రతిపదార్థం:** అత్తఱిన్= ఆతరుణంలో; తత్+పరిజనములు+ఎల్లన్= ఆతని పరిజనులందరును; తద్దయు వంతన్= మిక్కుటమైన ఆవేదనతో; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; హర్షరాగము= సంతోషంయొక్క ఎఱుపురంగు; తఱిఁగినన్= తగ్గిపోగా; వెలువెల్లనై= పాలిపోయి తెల్లబడి; వదనములు= మొగాలు; వ్రాలన్= ఒరగగా; తెఱఁగు+ఏది= ఏం చేయాలో తోచక; ఱిచ్చపడిరి= కొయ్యబారారు.

**తాత్పర్యం:** ఆ తరుణంలో అచ్చటిసైనికులు అందరును, రాముడిమాటలు విని అచ్చెరువుపొంది, సంతోషవర్ణం తరిగి, మొగాలు వెలవెలబోయి, ఏంచేయాలో తోచక మిక్కుటమైన ఆవేదనతో కొయ్యబారారు.

**విశేషం:** అలం: స్వభావోక్తి.

**తే. పడఁతి యల్లన మఱికొంతవడికిఁ దెలిసి । యలసమూర్తియై దందడి నశ్రు లురులఁ**
**గేలు ముకుళించి వసుమతీపాలుఁ జూచి । యెలుఁగు గుత్తుకఁ దగులంగ నిట్టు లనియె. 160**

**ప్రతిపదార్థం:** పడఁతి= వనిత - సీతాదేవి; అల్లనన్= మెలమెల్లగా; మఱి, కొంత, వడికిన్= మఱికొంతసేపటికి; తెలిసి= స్పృహ వచ్చి; అలసమూర్తి+ఐ= కదలజాలని శరీరంతో; దందడిన్= వేగంగా; అశ్రులు= కన్నీటిబిందువులు; ఉరులన్= వేగంగా స్రవింపగా; కేలు= చేయి; ముకుళించి= జోడించి; వసుమతీపాలున్= రాజును - శ్రీరాముడిని; చూచి= కాంచి; ఎలుఁగు= స్వరం; కుత్తుకన్+తగులంగన్= కంఠంలోపలి భాగాన్ని తాకగా (డగ్గుత్తికవడ); ఇట్టులు+అనియెన్= ఈవిధంగా పలికింది.

**తాత్పర్యం:** సీతాదేవి కొంతసేపటికి స్పృహ తెచ్చుకొని, కదలజాలని శరీరంతో కన్నీటిబిందువులు జారుతుండగా చేతులు జోడించి ప్రభువు అయిన శ్రీరామచంద్రుడితో డగ్గుత్తికవడిన స్వరంతో ఈవిధంగా పలికింది.

**విశేషం:** స్వభావోక్తి.

**క. 'నినుఁ గీడు వొరయకుండఁగ, । జనులకు నా నిక్క మెక్క జననాయక! యే**
**ననలంబుఁ జొచ్చి వెడలెదఁ; । గనుగొను; మిచ్చనవు నాకుఁ గరుణింపు దగన్. 161**

**ప్రతిపదార్థం:** జననాయక!= ప్రజలకు ఏలికవైన వాడా, శ్రీరామా!; నినున్= నిన్ను; కీడు+పొరయకుండఁగన్= హాని చుట్టుకొనకుండా; జనులకున్= ప్రజలకు; నానిక్కము+ఎక్కన్= నాగురించిన సత్యం తెలిసేటట్లుగా; ఏన్= నేను; అనలంబున్= అగ్నిలో; చొచ్చి= ప్రవేశించి; వెడలెదన్= వెళ్ళుతాను; కనుఁగొనుము= చూడుము; ఇచ్చనవు= (ఈ+చనవు) ఈ కోరిక; తగన్= ఒప్పిదంగా; నాకున్= నాకు; కరుణింపు= దయతో ప్రసాదించుము.

**తాత్పర్యం:** 'ప్రజలకు ప్రభువైన ఓ రామా! ధర్మహాని నిన్ను చెందకుండగా, ప్రజలకు నాదైన సత్యం తేటతెల్లం అయ్యేటట్లు నేను అగ్నిప్రవేశం చేస్తాను. దయచేసి ఈ కోరికను నాకు ప్రసాదించుము.

**విశేషం:** 'అనలంబున్ చొచ్చి వెడలెదను; కనుగొనుము' అని సీత పలికిన మాటలు సార్థకాలు. వెడలెదను- అంటే వెళ్ళుతానని ఒక అర్థం, అంటే చనిపోతాను అని తాత్పర్యం. వెడలెదను- అంటే అగ్నినుండి తిరిగివస్తాను, బ్రతికి బయటపడతాను- అని మరొక అర్థం. అలాగే కనుగొనుము: చూడుము, అనిన్నీ, పరీక్షించుము అనిన్నీ అర్థా లేర్పడతాయి.

అంతేకాదు, శ్రీరాముడికి అపకీర్తి రాకుండా సీత అగ్నిలో ప్రవేశిస్తుందనీ, ఆమె పాతివ్రత్యం నిరూపించుకొనేటట్లుగా అగ్నినుండి నిరపాయంగా తిరిగివస్తుందనీ భావం ఏర్పడుతున్నది. సీతాదేవి మాటలు సత్యమైనవని, అబద్ధాలు కావని ఈ వాక్యచమత్కృతి సార్థక్యం.

**ఉ. నాదగుబుద్ధి నీదు చరణస్మరణంబ యొనర్చుఁ గాని యొం**
**దేదియు నెన్నఁడుం దలఁప; దిట్టిద; యొండొకచందమైన ని**
**మ్మేదినియుం గృశానుఁడు సమీరుఁడు శీతకరుండు నర్కుఁడుం**
**గా దన కీక్షణంబ ననుఁ గాల్పరె; వేల్పులు చెట్ట సైతురే?' 162**

**ప్రతిపదార్థం:** నాది+అగుబుద్ధి= నా చిత్తం; నీదు= నీయొక్క; చరణస్మరణంబు+అ= పాదాలను తలపోయటం మాత్రమే; ఒనర్చున్+కాని= చేస్తుందికాని; ఒండు+ఏదియున్= ఇంకదేనిని; ఎన్నఁడున్= ఏ సమయంలోనూ; తలఁపదు= స్మరించదు; ఇట్టిది+అ= ఇదియే సుమా; ఒండు+ఒక, చందము+ఐనన్= ఇంకొక విధంగా జరిగితే; ఈ+మేదినియున్= ఈ భూమి; కృశానుఁడున్= అగ్నిదేవుడు; సమీరుఁడున్= వాయుదేవుడును; శీతకరుండున్= చంద్రుడును; అర్కుఁడున్= సూర్యుడును; కాదు+అనక= అంగీకరించక; ననున్= నన్ను; కాల్పరె= కాల్పరె, దహించివేయరా? (దహించివేయగలరు); వేల్పులు= దేవతలు; చెట్ట= చెడ్డతనాన్ని; సైతురే= ఓర్చెదరా? (ఓర్వరు).

**తాత్పర్యం:** నామనస్సు ఎల్లప్పుడును నీ పాదాలను స్మరించేదే కాని వేరొండువిధం కాదు. నాకు వేరొక స్మరణమే లేదు. ఈ మాటకు పంచభూతాలు సాక్షులు. వేరొక చందమైనట్లయితే ఈ భూదేవి, అగ్నిదేవుడు, వాయుదేవుడు, చంద్రుడు, సూర్యుడు నన్ను ఈక్షణంలో దహించివేస్తారు. దేవతలు చెడుగును సైరింపరు కదా!'

**విశేషం:** (1) అలం: అర్థాంతరన్యాసం. (2) ఈ పద్యాన్ని వ్రాసింది ఎఱ్ఱనమహాకవి. ఆతడు తాను అరణ్యపర్వశేషాన్ని నన్నయపేరుమీదనే' తత్కవితారీతియుకొంతదోప' వ్రాశా నన్నట్లు చెప్పుకొన్నాడు. అందుచేత అతడు బుద్ధిపూర్వకంగానే నన్నయను అనుకరించాడు. ఇట్టి అనుకరణ సుస్పష్టంగా ఈ పద్యంలో చూడవచ్చును. నలోపాఖ్యానంలో ఇట్టి సన్నివేశంలో నలుడు దమయంతిశీలాన్ని శంకించినప్పుడు దమయంతి చెప్పిన సమాధానం- నన్నయవ్రాసిన పద్యం ఉదాహరించనగును. (చూడండి. "ఏనతి పాపభావమును నెగ్గు దలంపక" - అనే పద్యం. ఆరణ్య. 2.215)

**వ. అని పలుకుటయు నప్పుడు పృథివ్యాదిభూతంబు లెలుంగులు సెలంగ నెల్లవారును వినం దమదమ నామంబు లెఱింగించి యి ట్లనిరి. 163**

**ప్రతిపదార్థం:** అని, పలుకుటయున్= అని సీత చెప్పగా; అప్పుడు= ఆ సమయంలో; పృథివీ+ఆది భూతంబులు= భూమి మున్నగు భూతాలు; ఎలుంగులు+చెలంగన్= కంఠస్వరాలు ధ్వనించగా; ఎల్లవారును= అందరును; వినన్= ఆలకించగా; తమతమనామంబులు= తమతమపేర్లు; ఎఱింగించి= తెలిపి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తాత్పర్యం:** సీతాదేవి ఆ విధంగా పంచభూతాలను సాక్ష్యాలుగా పేర్కొని చెప్పగా, భూమి మున్నగు పంచభూతాలు తమతమనామాలు చెప్పి, అందరును ఆలకించగా ఈ విధంగా వచించాయి.

**విశేషం:** పంచభూతాలు 1. భూమి 2. ఆకాశం 3. నీరు 4. వాయువు 5. అగ్ని.

**క. 'విను ముత్తమురాలు సుమీ । జననాయక! జనకతనయ; సందేహపడం**
**బనిలేదు మాకుఁ దెల్లము; । జనులకు మము మొఱఁగరాదు సకలక్రియలన్. 164**

**ప్రతిపదార్థం:** జననాయక!= ప్రజలకు నాయకుడవైన ప్రభూ!; వినుము= ఆలకించుము; జనకతనయ= జనకుడికూతురు సీతాదేవి; ఉత్తమురాలు+చుమీ= మంచి ఇల్లాలు సుమా; సందేహము+పడన్= అనుమానించవలసిన; పని లేదు= అవసరం లేదు; మాకున్= పంచభూతాల మయిన మాకు; తెల్లము= సుస్పష్టం; జనులకున్= ప్రజలకు; మమున్= మమ్ము; సకలక్రియలన్= అన్నివ్యాపారాలలో; మొఱఁగరాదు= మోసంచేయటానికి వీలు లేదు. (సందేహపడు= పడ్వాది సంధి)

**తాత్పర్యం:** 'ఓ జననాయకా! శ్రీరామా! మా మాట ఆలకింపుము. పంచభూతాల మైన మాకు సమస్తవ్యాపారాలు తేటతెల్లాలు. ప్రజలు మమ్మ మోసగించలేరు. జనకుడికూతురు సీతాదేవి ఉత్తమురాలు. మహాపతివ్రత. ఇందులో సందేహానికి ఎట్టితావునూ లేదు.'

**వ. అనిన యనంతరంబ సకలసురముని గణసహితంబుగాఁ బితామహుండు సనుదెంచి రాఘవుచేత సత్కృతుం డై యిట్లనియె: 'నయ్యా! నీవు సకలభూతదుస్సహుండైన రావణుం బరిమార్చి లోకహితంబు సేసితివి; వినుము! నలకూబరుశాపంబునంజేసి దశగ్రీవునకుఁ బరస్త్రీలయందు బలాత్కారంబు సెల్లదు; గావున నీధర్మపత్నియం దొక్క దురితంబును బొరయదు; నీవు నిర్విచారుండ వై యిప్పతివ్రతం బరిగ్రహించి నెమ్మదిఁ బురంబున కరుగు' మని పలికి, యతనికిఁ బ్రియంబుగాఁ దత్సమరనిహతు లైన వానరులఁ బ్రాప్తజీవులం జేసి పరమేష్ఠి సనియెఁ; బురందరసారథియును దాశరథి వీడ్కొని హరిసహస్రయుక్తం బైన రథంబు గొని నాకలోకంబున కరిగె; నంత. 165**

**ప్రతిపదార్థం:** అనిన+అనంతరంబు+అ= అని పంచభూతాలు చెప్పిన పిమ్మట; సకల, సుర, ముని, గణ, సహితంబుగాన్= అందరు వేల్పులు ఋషులతో కూడినవాడుగా; పితామహుండు= బ్రహ్మదేవుడు; చనుదెంచి= వచ్చి; రాఘవుచేతన్= శ్రీరాముడిచేత; సత్కృతుండు+ఐ= సమ్మానించబడినవాడయి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు; అయ్యా!= ఆర్యా!; నీవు= ఓ శ్రీరామా! నీవు; సకలభూతదుస్సహుండు+ఐన= అన్నిభూతాలకున్నూ సహించరానివాడయిన; రావణున్= రావణుడిని; పరిమార్చి= సంహరించి; లోకహితంబు+చేసితివి= జగత్తుకు శ్రేయస్సు కలిగించావు; వినుము= ఆలకింపుము; నలకూబరుశాపంబునన్+చేసి= నలకూబరుడు ఇచ్చిన శాపంచేత; దశగ్రీవునకున్= రావణుడికి; పరస్త్రీలయందున్= తన భార్యలు కాని వనితలయందు; బలాత్కారంబు+చెల్లదు= బలవంతం చేసి సంభోగించటం సాధ్యపడదు; కావునన్= కాబట్టి; నీధర్మపత్నియందున్= అగ్నిసాక్షిగా వివాహమాడిన నీభార్యయందు; ఒక్కదురితంబును= ఒక్కపాపంకూడా; పొరయదు= సంక్రమించదు; నీవు= నీవు; నిర్విచారుండవు+ఐ= దుఃఖం లేనివాడవు అయి; ఈ+పతివ్రతన్= భర్తయందుమాత్రమే అనురాగం కల నిర్మలచరితను; పరిగ్రహించి= స్వీకరించి; నెమ్మదిన్= (నెఱ+మదిన్) నిండుమనస్సుతో; పురంబునకున్= (అయోధ్యా) పట్టణానికి; అరుగుము= వెడలుము; అని పలికి= అని చెప్పి; అతనికిన్= శ్రీరాముడికి; ప్రియంబుగాన్= ప్రీతిగా; తద్+సమర, నిహతులు+ఐన= ఆ యుద్ధంలో చంపబడిన; వానరులన్= కోతులను; ప్రాప్తజీవులన్+చేసి= పొందబడిన ప్రాణాలు కలవారినిగా చేసి, బ్రదికించి; పరమేష్ఠి= బ్రహ్మదేవుడు; చనియెన్= వెళ్ళాడు; పురందరసారథియును= దేవేంద్రుడిసారథి మాతలియు; దాశరథిన్, వీడ్కొని= దశరథుడి కుమారుడైన శ్రీరాముడివద్ద సెలవు గైకొని; హరిసహస్రయుక్తంబు+ఐన= వేయిగుఱ్ఱాలు పూన్చిన; రథంబు+కొని= తేరును తీసికొని; నాకలోకంబునకున్= స్వర్గలోకానికి; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= తరువాత.

**తాత్పర్యం:** అని పంచభూతాలు సీతాదేవి మహాపతివ్రత అని సాక్ష్యం చెప్పిన పిమ్మట, బ్రహ్మదేవుడు వేల్పులు, మునులు మున్నగువారలతోపాటు అరుగుదెంచి శ్రీరాముడిచేత సమ్మానించబడి ఈ విధంగా పలికాడు: 'ఆర్యా! నీవు సకలభూతకంటకుడైన రావణుడిని సంహరించి విశ్వశ్రేయస్సును ఒనగూర్చావు. ఆలకించుము. నలకూబరుడియొక్క శాపంవలన రావణుడు పరస్త్రీలను బలాత్కారంగా మానభంగం చేయజాలడు. నీధర్మపత్నియందు ఎట్టిదోషం లేదు. నీవు ఎట్టి సంకోచాలు లేకుండ ఆమెతోపాటు నీ రాజధానియైన అయోధ్యానగరానికి ఏగుము. సీతాదేవి పరమపతివ్రతాశిరోమణి' అని పల్కి, అనంతరం బ్రహ్మదేవుడు శ్రీరాముడికి ప్రీతిగా ఆయుద్ధంలో సంహరించబడిన వానరుల నందరిని బ్రదికించి వెళ్ళాడు. దేవేంద్రుడి సారథి అయిన మాతలి, వేయిగుర్రాలు పూన్చినరథాన్ని తీసికొని, శ్రీరాముడివద్ద సెలవుతీసికొని స్వర్గలోకానికి వెళ్ళాడు. ఆ సమయంలో.

**విశేషం:** (1) నలకూబరశాపం: నలకూబరుడు ధనపతిఅయిన కుబేరుడికొడుకు. కుబేరుడు రావణుడి సోదరుడు. రంభనలకూబరుడికి ప్రేయసి. ఒకనాడు రావణుడు రంభను కామించి బలాత్కారంగా ఆమెను సంభోగించాడు. నలకూబరుడు ఆగ్రహించి, ఇక రావణుడు పరస్త్రీలను బలాత్కరించి మానభంగం చేయ బూనుకొంటే తల పగిలి చస్తాడుగాక' అని శపించాడు. (2) బ్రహ్మదేవుడు శ్రీరాముడితో చెప్పినమాట: సీత- పతివ్రత. ఆమె రావణసమాగమానికి ఇచ్చగింపదు. ఇక రావణుడు ఆమెను బలాత్కారం చేయటానికి వీలులేదు. అందుచేత సీతాశీలాన్ని గూర్చి రాముడు శంకించ నవసరం లేదు. (3) శ్రీరాముడు సీతాశీలాన్ని శంకించలేదు. జగదేకవీరు డైన తనయొక్కభార్య సీత శంకాతీతంగా ఉండవలెనని ఆతడి కోరిక. చరిత్రలో జగద్వీరుడుగా సుప్రసిద్ధుడైన సీజరు తన భార్య విషయమై తా నామెను శంకించటం విషయాంతరమనియు "సీజరుభార్య శంకాతీతురాలుగా" ఉండాలని చెప్పెనట! సీజరు కాలం క్రీస్తుపూర్వం సుమారునలుబది వత్సరాలు. ఆతడు రామాయణకథ బహుశః విని ఉండవచ్చును. లేక అది జగదేకవీరుల మనస్తత్వం కావచ్చును. సీతయెడ శ్రీరాముడి నిష్ఠురప్రవర్తన, కఠినవాక్యాలు పురుషసామాన్యసామ్రాజ్యవాదానికి లేదా పురుషాధిక్యసమాజవాదానికి నిదర్శనంగా కాక, జగదేకవీరుడి మనస్తత్త్వంగా గ్రహించటం న్యాయం.

**మ.** **అవిరోధంబుగ జానకీసహితుఁడై యాబద్ధరత్నప్రభా**
**నవపుష్పంబగు పుష్పకం బను విమానం బెక్కి యర్కాన్వయ**
**ప్రవరుం డిమ్ముల నేఁగె సమ్మదభరప్రాగ్భాగవారాకర**
**ప్లవమానుం డగుచుం బురంబునకుఁ బ్రాప్తశ్రీవిశేషోన్నతిన్.** **166**

**ప్రతిపదార్థం:** అవిరోధంబుగన్= శత్రువులు లేనివాడై; జానకీసహితుఁడు+ఐ= జనకమహారాజు కూతురు అయిన సీతాదేవిని కూడినవాడై; ఆబద్ధరత్నప్రభానవపుష్పంబు+అగు= బాగుగా చెక్కబడినమణుల కాంతులతో ప్రకాశిస్తున్న క్రొత్తపూవులు కలిగినట్టిది అగు; పుష్పకంబు+అను= పుష్పకం అనే పేరు కల; విమానంబు+ఎక్కి= విమానాన్ని అధిరోహించి; అర్క+అన్వయ, ప్రవరుండు= సూర్యవంశంలో ఉద్భవించినశ్రేష్ఠుడు; సమ్మద, భర, ప్రాక్+భాగ, వారాకర, ప్లవమానుండు+అగుచున్= సంతోష తన్మయత్వంతో, అతిశయించిన సముద్రాన్ని దాటినవాడు ఔతూ; ప్రాప్త, శ్రీవిశేష+ఉన్నతిన్= లభించిన ఐశ్వర్యంయొక్క గొప్పఅభ్యుదయంతో; పురంబునకున్= అయోధ్యానగరానికి; ఇమ్ములన్+ఏఁగెన్= సంప్రీతితో వెళ్ళాడు.

**తాత్పర్యం:** శత్రుసంహారం చేసినపిదప శ్రీరాముడు సీతాసమేతంగా అయోధ్యానగరానికి వెళ్ళాడు. వారు పుష్పకం అనే విమానం ఎక్కి వెళ్ళారు. ఆ పుష్పకం రతనాలతో పొదగబడినక్రొత్తపుష్పాలు గలిగినట్టిది. సూర్యవంశపురాజులలో శ్రేష్ఠుడు అయిన శ్రీరామచంద్రుడు పొంగారు సంతోషంతో విస్తారమైన సముద్రాన్ని దాటినవాడై తనకు లభించిన శ్రీవిశేషంతో అతిశయించినవాడై అయోధ్యా నగరానికి వెళ్ళాడు.

**విశేషం:** (1) 'శ్రీ' అనే శబ్దానికి సంస్కృతంలో సంపద, కాంతి, లక్ష్మి, శోభ, అలంకరణం, కీర్తి మున్నగు నానార్థాలు ఉన్నాయి. శ్రీరాముడు శ్రీవిశేషోన్నతుడు, అన్నిఅర్థాలతో అనుశీలించాలి. (2) పుష్పకవిమానం: సారథి లేకుండానే ఆకసంలో నడుస్తుంది! సంకల్పమాత్రాన గమ్యాన్ని పసికట్టి చేరేది! ఎంతమంది ఎక్కినా ఇంకను ఒకరికి చోటు ఉండేది! ఏవంవిధగుణగరిష్ఠమైన విమానం రామాయణ పాఠకులకు చిరపరిచితం. ఇరువదియవశతాబ్దికి పూర్వం విమానయానం సాధ్యమని విశ్వసించినవారే అరుదు. 'అకాలప్రళయం సృష్టించగల' అస్త్రాలు, సారథి లేకుండ పయనించగల విమానాలు ప్రాచీనభారతీయవాఙ్మయానికి సుపరిచితాలు.

**వ. ఇ ట్లరిగి భరతాదిబంధుజనంబులు నఖిలపరిజనంబులు నభినందింప వసిష్ఠవామదేవవిహితం బయిన యభిషేకశోభనంబు వహించి రాముండు సుగ్రీవవిభీషణాది సుహృజ్జనంబులం బ్రకటబహుమానవిశేషంబుల నాదరించి వీడ్కొలిపి, యభిమతభోగంబుల నిరంతరత్యాగంబులఁ బ్రభూతయాగంబులఁ బ్రసిద్ధుం డయి బహుసహస్రసంవత్సరంబులు వసుమతీరక్షణం బొనర్చె; నిది రాఘవుచరిత్రంబు. 167**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; అరిగి= ప్రయాణం చేసి; భరత+ఆది, బంధుజనంబులున్= భరతుడు మున్నగు చుట్టపక్కాలు; అఖిలపరిజనంబులున్= అందరు సేవకులును; అభినందింపన్= సంతోషం ప్రకటించగా; వసిష్ఠ, వామదేవ, విహితంబు+అయిన= వసిష్ఠుడిచేత, వామదేవుడిచేత ఏర్పాటుచేయబడిన; అభిషేకశోభనంబు= పవిత్రజలాలు తలపై పోసి స్నానం చేయించటం; అనేపండుగ; వహించి= మోసి; రాముండు; సుగ్రీవ, విభీషణ+ఆది= సుగ్రీవుడు, విభీషణుడు మొదలైన; సుహృత్+జనంబులన్= మిత్రులైనవారిని; ప్రకట, బహుమాన, విశేషంబులన్= సుప్రసిద్ధాలైన గొప్పబహుమతులచేత; ఆదరించి= గౌరవించి; వీడ్కొలిపి= సగౌరవంగా సాగనంపి; అభిమతభోగంబులన్= ఇష్టమైన సౌఖ్యాలతో; నిరంతరత్యాగంబులన్= సంతతదానాలతో; ప్రభూత, యాగంబులన్= గొప్పయజ్ఞాలతో; ప్రసిద్ధుండు+అయి= కీర్తిని ఆర్జించినవాడయి; బహుసహస్రసంవత్సరంబులు= పెక్కువేలఏండ్లు; వసుమతీరక్షణంబు= భూమిని కాపాడటం; ఒనర్చెన్= చేశాడు. ఇది= ఇది; రాఘవుచరిత్రంబు= శ్రీరాముడి జీవితకథ.

**తాత్పర్యం:** 'పుష్పక' విమానంలో పయనించి శ్రీరాముడు అయోధ్యానగరం చేరాడు. భరతుడు మున్నగు బంధువులు సంతోషాన్ని ప్రకటించారు. వసిష్ఠుడు వామదేవుడు శుభలగ్నం నిర్ణయించి పట్టాభిషేకంలో పౌరోహిత్యాన్ని నెరపారు. శ్రీరాముడు సుగ్రీవుడు, విభీషణుడు మున్నగు మిత్రులకు బహిరంగంగా కానుకలు పంచిపెట్టి, ధన్యవాదాలు తెలిపి, వారిని సగౌరవంగా సాగనంపాడు. పిదప శ్రీరాముడు పెక్కువేలసంవత్సరాలు భూమిపై శాంతిభద్రతలు నెలకొలిపి, భోగాలను అనుభవించి, త్యాగపూరితాలైన దానాలు చేసి, పెక్కు యాగాలు ఒనరించి కీర్తిని ఆర్జించాడు. ఇది శ్రీరాముడి జీవితచరిత్ర.

**విశేషం:** (1) భోగాలు ఎనిమిది. 1. గృహం 2. శయ్య 3. వస్త్రం 4. ఆభరణం 5. స్త్రీ 6. పుష్పం 7. గంధం 8. తాంబూలం. (2) రామరాజ్యం= భోగం+త్యాగం+యాగం+శాంతిభద్రతలు.

**ఉ. వారక యిట్లు పూని వనవాసనిరంతర దుఃఖమున్ మహా**
**వైరికృతాపకారదురవస్థయు నోర్చి శుభంబు నొందఁడే**
**యారఘురాముఁ డట్లు వసుధాధిప! నీవును దుఃఖ మింతయున్**
**సైరణ నోర్చి పొందెదవు సర్వమహీవలయాధిరాజ్యమున్. 168**

**ప్రతిపదార్థం:** వసుధా+అధిప!= రాజా, ఓ ధర్మరాజా!; ఇట్లు= ఈవిధంగా; వనవాసనిరంతరదుఃఖమున్= అరణ్యాలలో ఎల్లప్పుడును నివసించటంచేత సంక్రమించిన ఆవేదనను; వారక= తప్పక; పూని= భరించి; మహా వైరి, కృత+అపకార, దురవస్థయున్= గొప్ప శత్రువులచేత చేయబడిన కీడువలన ప్రాప్తించిన చెడ్డస్థితిని; ఓర్చి= సైరించి; ఆ రఘురాముఁడు= రఘువంశంలో జనించిన ఆ శ్రీరాముడు; శుభంబున్+ఒందఁడే= మేలును పొందడా; (పొందెను); అట్లు= అదేవిధంగా; నీవును= నీవుసయితం; దుఃఖము= పరితాపం; ఇంతయున్= ఇంతటిని; సైరణన్+ఓర్చి= ఓర్పుతో భరించి; సర్వ, మహీ, వలయ+అధిరాజ్యమున్= సమస్తమైన భూమండలంలో వ్యాపించిన సామ్రాజ్యాన్ని; పొందెదవు= సంపాదించగలవు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆలకించితివిగదా శ్రీరాముడిచరిత్ర. శ్రీరాముడు ఆ విధంగా అరణ్యంలో ఎల్లప్పుడు నివసించటంవలన ఏర్పడిన ఆవేదనను అనుభవించి, శత్రువులు చేసిన అపకారాలు సైరించి, చిట్టచివరకు శుభాన్ని పొందాడు. అదేవిధంగా నీవుకూడా ఈ వనవాసదుఃఖాన్ని గడచి భూమండలమంతటా విస్తరించియున్న సామ్రాజ్యాన్ని పొంది సర్వసౌఖ్యాలను అనుభవించగలవు.

**వ.** **అని చెప్పిన విని యుధిష్ఠిరుండు రాముని పరాక్రమవిశేషంబు గొనియాడి, 'జానకి పాతివ్రత్యమహిమ యింత యొప్పునే!' యని పలికి, 'మునీంద్రా!, పతిభక్తితాత్పర్యంబున నఖిలదుఃఖంబులు నోర్చి శుభంబు నొందిన పుణ్యసతిచరిత్రంబు వినవలతుం జెప్పవే!' యనిన నతనికి మార్కండేయుండు 'సావిత్రి యను రాజపుత్త్రిచరిత్రంబు విను; మది నీ ప్రశ్నంబునకు నుత్తరం బగు' నని యిట్లనియె.** **169**

**ప్రతిపదార్థం:** అని చెప్పినన్= అని వచించగా; విని= ఆలకించి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; రాముని పరాక్రమవిశేషంబు= రాముడియొక్క శౌర్యాతిశయాన్ని; కొనియాడి= ప్రస్తుతించి; జానకిపాతివ్రత్యమహిమ= సీతపాతివ్రత్యంయొక్క గొప్పతనం; ఇంత+ఒప్పునే= ఇంతశోభిల్లునట్టిదిగదా; అని పలికి= అని వచించి; ముని+ఇంద్రా!= ఋషులలో శ్రేష్ఠుడవైనవాడా!, ఓ మార్కండేయా!; పతిభక్తి తాత్పర్యంబునన్= భర్తయందలి పూజ్యభావంలో తత్పరత గలిగిన; అఖిలదుఃఖంబులున్= అన్నికష్టాలను; ఓర్చి= సైరించి; శుభంబున్= మేలును; ఒందిన= పొందిన; పుణ్యసతి చరిత్రంబు= పుణ్యాత్మురాలికథ: వినవలతున్= ఆలకింప కోరుతాను; చెప్పవే= దయచేసి వచింపుము; అనినన్= అని అడుగగా; అతనికిన్= ధర్మరాజుకు; మార్కండేయుండు; సావిత్రి+అను= సావిత్రి అనే; రాజపుత్త్రిచరిత్రంబు= రాజకుమారిగాథ; వినుము= ఆలకించుము; అది= సావిత్రిగాథ; నీ ప్రశ్నంబునకున్= నీవు అడిగినదానికి; ఉత్తరంబు= సమాధానం; అగును= కాగలదు; అని= అని చెప్పి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా పలికాడు.

**తాత్పర్యం:** మార్కండేయుడు చెప్పిన రామాయణకథ విని, ధర్మరాజు శ్రీరాముడి పరాక్రమాన్ని, సీతాదేవి పాతివ్రత్యగరిమను మెచ్చుకొని, 'మునీంద్రా, మార్కండేయమహర్షీ! పతిభక్తితో అన్నికష్టాలను ఓర్చి, చివరకు శుభాన్ని పొందిన పుణ్యసతి చరిత్ర వినవలె నని ఉన్నది. దయచేసి చెప్పుము' అని ప్రార్థించాడు. మార్కండేయుడు 'ధర్మరాజా!, నీ ప్రశ్నకు సరిఅయిన సమాధానం సావిత్రిగాథ. ఆ రాజపుత్రిచరిత్ర చెప్పుతాను వినుము' అని ఈ విధంగా ఆ కథ చెప్పాడు.

**విశేషం:** (1) ధర్మరాజు అట్టికథలను వినగోరటంలో కల ఆంతర్యం సుగమం. అట్టి పతివ్రతలగాథలు ద్రౌపదికి ఊరట కలిగిస్తాయి. మార్కండేయుడు ధర్మరాజు మనస్తత్త్వాన్ని కనిపెట్టి సావిత్రికథను చెప్పాడు. రామాయణగాథలో కథానాయకుడు శ్రీరాముడు. సావిత్రిగాథలో నాయిక సావిత్రి. నాయకపాత్ర సత్యవంతుడిభూమిక గౌణం.

మార్కండేయుఁడు ధర్మరాజునకు సావిత్ర్యుపాఖ్యానంబు సెప్పుట (సం. 3-277-5)

**సీ.** **కలఁడు మద్రేశుండు ఘనుఁ డశ్వపతి యను । ధరణీశుఁ; డతఁడు సంతానకాంక్ష**
**నెంతయు ధృతిఁ బదునెనిమిది యేఁడులు । సావిత్రిఁ గొల్చె; నజ్జనవిభునకు**
**నద్దేవి ప్రత్యక్షమై 'వర మడుగుము' । నావుడు నతఁడు వినమ్రుఁ డగుచు**
**'నాత్మజుఁ గోరెద' ననవుడుఁ 'గన్నియ । పుట్టు నీ' కనియె నా భువనమాత;**

**తే.** **యనుడు 'దేవి! భవత్కృప నస్మదీయ । వాంఛితము సఫలంబు గా వలదె?' యని నృ**
**పోత్తముఁడు విన్నవించె; నయ్యోగమూర్తి । గాఢకారుణ్యవికచహృత్కమల యగుచు.** **170**

**ప్రతిపదార్థం:** మద్రేశుండు= మద్రదేశానికి ప్రభువు; ఘనుఁడు= గొప్పవాడు; అశ్వపతి+అను, ధరణీశుఁడు= అశ్వపతి అనేరాజు; కలఁడు= ఉన్నాడు; అతఁడు= (ఆ అశ్వపతి); సంతానకాంక్షన్= బిడ్డలు కలుగవలె ననే కోరికతో; ఎంతయున్= మిక్కుటమైన; ధృతిన్= నిష్ఠతో; పదునెనిమిది+ఏఁడులు= పదునెనిమిది సంవత్సరాలు సావిత్రిన్= సావిత్రీదేవిని; కొల్చెన్= ఆరాధించాడు; ఆ+జనవిభునకున్= ఆ రాజుకు; అశ్వపతికి; ఆ+దేవి= సావిత్రి; ప్రత్యక్షము+ఐ= సాక్షాత్కరించి; వరము+ అడుగుము= వరాన్ని కోరుకొనుము; నావుడున్= అని చెప్పగా; అతఁడు= అశ్వపతి; వినమ్రుఁడు+అగుచున్= భక్తితో వంగినవాడు ఔతూ; ఆత్మజున్= పుత్రుడిని; కోరెదన్= వాంఛిస్తాను; అనవుడున్= అని చెప్పగా; ఆ భువనమాత= ఆ జగన్మాత- సావిత్రి; కన్నియ+పుట్టున్= కన్యక ఉద్భవిస్తుంది; నీకున్= నీకు; అనియెన్= అని చెప్పింది; అనుడున్= అనిచెప్పగా; దేవి!= ఓ సావిత్రీదేవీ!; భవత్+కృపన్= నీయొక్క దయవలన; అస్మదీయవాంఛితము= నా కోరిక; సఫలంబు+కావలదె= తీరవలెను కదా; అని; నృప+ఉత్తముఁడు= రాజులలో శ్రేష్ఠుడు - అశ్వపతి; విన్నవించెన్= నివేదించాడు; ఆ+యోగమూర్తి= సావిత్రి; గాఢ, కారుణ్య, వికచ, హృత్+కమల+అగుచున్= దట్టమైన దయతో వికసించిన పద్మంవంటి హృదయం కలది అగుచు.

**తాత్పర్యం:** అశ్వపతి అనే పేరుగలవాడు మద్రదేశాన్ని పరిపాలించే ప్రభువు అతడు గొప్పవాడు. ఆయన బిడ్డలకొరకు మిక్కుటమైన నిష్ఠతో పదునెనిమిదేండ్లు సావిత్రీదేవిని ఉపాసించాడు. ఆ రాజుకు సావిత్రి ప్రత్యక్షమై ఆతడిని వరం కోరుకొమ్మని అడిగింది. అతడు భక్తితో వినతుడై, 'దేవీ! నాకు కొడుకును ప్రసాదింపుము' అని ప్రార్థించాడు. అప్పుడు ఆ లోకమాత, 'నాయనా! నీకు కూతురు కలుగుతుంది' అని చెప్పింది. అంతట అశ్వపతి, 'అంబా! నీవు ప్రత్యక్షమైతివికదా; దేవీ! ఇక నాకోరిక ఈడేరవలెను కదా' అని విన్నవించాడు. అంత ఆ యోగమూర్తి అయిన సావిత్రీదేవి మిక్కుటమైన దయతో వికసించిన హృదయపద్మం కలదై.

**విశేషం:** సావిత్రి - యోగమూర్తి, జగన్మాత అని ఈ పద్యంలో చెప్పబడింది. అష్టాంగయోగం సుప్రసిద్ధం. 1. యమం 2. నియమం 3. ప్రాణాయామం 4. ప్రత్యాహారం 5. ధ్యానం 6. ధారణ 7. మననం 8. సమాధి. ఇరువదిఏడుయోగాలు చెప్పబడినవి. అందు ఈ పద్యంలో వాడబడిన "ధృతి" ఉన్నది. 1. విష్కంభం 2. ప్రీతి 3. ఆయుష్మత్తు 4. సౌభాగ్యం 5. శోభనం 6. అతిగండం 7. సుకర్మం 8. 'ధృతి' 9. శూలం 10. గండం 11. వృద్ధి 12. ధ్రువం 13. వ్యాఘాతం 14. హర్షణం 15. వజ్రం 16. సిద్ధి 17. వ్యతీపాతం 18. వరీయస్సు 19. పరిఘ 20. శివం 21. సిద్ధం 22. సాధ్యం 23. శుభం 24. శుభ్రం 25. బ్రహ్మం 26. ఐంద్రం 27. వైధృతి. సావిత్రి అంటే నిఘంటువులోని అర్థాలు సరస్వతి, పార్వతి, ఇచట సావిత్రి బ్రహ్మను పేర్కొనటంచేత అశ్వపతి ఉపాసించిన దేవి సరస్వతి అని భావించవచ్చును.

**వ. 'ఏను నీమనోరథంబుతెఱంగు మున్న చతుర్ముఖున కెఱింగించిన నతండు గన్నియఁగా నిర్దేశించె; నద్దేవునియానతి యమోఘంబు; విను మక్కన్నియ కారణంబున నీకు నొక్కవిధంబునం బిదపఁ బుత్త్రశతలాభంబు నగు; సంతసిల్లు' మని యనుగ్రహించి యద్దేవి యంతర్ధానంబు నొందె; నశ్వపతియును సావిత్రీప్రసాదంబున నిజధర్మపత్ని యయిన మాళవియందు సావిత్రి యను కూఁతుం గని, యక్కన్నియ నతిగౌరవంబునం బెనిచె నంత. 171**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నీ మనోరథంబు+తెఱంగు= నీ కోరికయొక్క తీరు; మున్ను+అ= ఇంతకుముందే; చతుర్ముఖునకున్= నాలుగు మోములు గల దేవరయైన బ్రహ్మదేవుడికి; ఎఱింగించినన్= తెలుపగా; అతండు= బ్రహ్మదేవుడు; కన్నియఁగాన్= కూతురుగా; నిర్దేశించెన్= నిర్ణయించాడు; ఆ+దేవుని+ఆనతి= ఆ బ్రహ్మదేవుడి ఆజ్ఞ; అమోఘంబు= వ్యర్థంకాదు; వినుము= ఆలకింపుము; అక్కన్నియ+కారణంబునన్= ఆ కన్యక హేతువుగా; నీకున్= నీకు; ఒక్కవిధంబునన్= ఒకానొక మార్గంలో; పిదపన్= పిమ్మట; పుత్త్ర, శత, లాభంబున్+అగున్= నూరుగురుపుత్రులు పుట్టుతారు; సంతసిల్లుము= సంతోషించుము; అని= అని చెప్పి; అనుగ్రహించి= కరుణించి; ఆ+దేవి= సావిత్రి; అంతర్ధానంబున్+ఒందెన్= అదృశ్యం అయింది; అశ్వపతియును= అశ్వపతియును; సావిత్రీప్రసాదంబునన్= సావిత్రీదేవి దయవలన; నిజధర్మపత్ని+అయిన= తనభార్య అయిన; మాళవియందున్= మాళవి అనే పేరు కల ఆమెయందు; సావిత్రి+అను, కూఁతున్+కని= సావిత్రి అనే కూతురును పొంది; ఆ+కన్నియన్= ఆ కన్యకను; అతిగౌరవంబునన్= మిక్కుటమైన శ్రద్ధతోకూడిన గారాబంతో; పెనిచెన్= పోషించాడు; అంతన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** 'నేను నీకోరిక తీరు నెఱిగి ఇంతకుముందే బ్రహ్మదేవుడితో సంప్రదించాను. ఆయన కన్నియగా నిర్ణయించాడు. ఆ దేవుడి నిర్ణయానికి తిరుగులేదు. అయినా ఆలకించుము. నీకు తొలుత కన్యక ఉద్భవించినా పిదప, ఆమెకారణంగానే ఒకానొక సన్నివేశం సంప్రాప్తించి నీకు నూరుగురు సుతులు లభించగలరు. సంతోషించుము' అని అనుగ్రహించి ఆ దేవి అదృశ్యమైంది. పిదప అశ్వపతిధర్మపత్ని మాళవి గర్భం ధరించి సావిత్రి అనే కూతురిని కన్నది. తలిదండ్రులు సావిత్రిని మిక్కుటమైన శ్రద్ధతో గూడిన గారాబంతో పెంచారు. అంతట.

**క. ఆ వనజాక్షి పరిస్ఫుట । యౌవనయై సిద్ధసాధ్యయక్షామరక**
**న్యావలిఁ దన సౌందర్య । శ్రీవిలసనరేఖ నపహసించుచు నొప్పెన్. 172**

**ప్రతిపదార్థం:** ఆ వనజ+అక్షి= ఆ పద్మాలవంటి కనులు కలది; పరిస్ఫుట యౌవన+ఐ= తేటతెల్లమయిన యౌవనం కలదిఅయి; సిద్ధ, సాధ్య, యక్ష+అమర, కన్యా+ఆవలిన్= సిద్ధులు, సాధ్యులు, యక్షులు, దేవతలలోని కన్యకల సముదాయాన్ని; తన సౌందర్య శ్రీవిలసనరేఖన్= తన అందచందాల సొంపువంపులతో; అపహసించుచున్= పరిహసిస్తూ- అనగా అతిక్రమిస్తూ; ఒప్పెన్= శోభిల్లింది.

**తాత్పర్యం:** పద్మాలవంటి కన్నులు కల ఆ సావిత్రి తేటతెల్లమయిన జవ్వనం కలదై, తన అందచందాల సొంపు పెంపువంపులతో వేల్పులజాతికి చెందిన కన్యకలను, సిద్ధసాధ్య యక్షకన్యకలను అందరినీ అతిక్రమించింది.

**తే. 'కోరి జనపతి దనకూర్మికూఁతుఁ జూచి । గుణవయోరూపముల ననుకూలుఁ డైన**
**భర్త నెమ్మెయి దీనికిఁ బడయువాఁడ । నొక్కొ!' యని యెందుఁ దడవుచునుండె నెలమి. 173**

**ప్రతిపదార్థం:** కోరి= కాంక్షించి; జనపతి= రాజు - అశ్వపతి; తనకూర్మి, కూఁతున్= తన అనుగుపుత్రికను; చూచి= అరసి; గుణ, వయస్+రూపములన్= గుణాలలోను, వయస్సులోను అందమయిన ఆకారంలోను; అనుకూలుడు+ఐన= పొత్తు కుదిరినవాడైన; భర్తన్= పతిని; ఏ+మెయిన్= ఏ రీతిగా; దీనికిన్= ఈమెకు; పడయువాఁడన్+ఒక్కొ= సంపాదించగలవాడనో; అని= అని తలపోసి; ఎందున్= ఏవిధంగా నైనా; ఎలమిన్= ఉత్సాహంతో; తడవుచున్+ఉండెన్= వెదకుచుండినాడు.

**తాత్పర్యం:** అశ్వపతి అల్లారుముద్దుగా అందచందాలతో పెరిగి పెద్దది ఔతున్న కూతురును చూచి 'ఇంతటి సౌందర్యవతికి గుణగణాలు, వయస్సు, రూపం- ఈ మూడింటిలో చక్కగా పొత్తు కుదిరే వరుడిని ఎక్కడ ఏవిధంగా సంపాదించగలనా?' అని ఆలోచిస్తూ అన్వేషిస్తూ ఉన్నాడు.

**వ. అదియును సాళ్వపతి యైన ద్యుమత్సేనుకొడుకు సత్యవంతుండు రూపవంతుం డనియును గుణవంతుం డనియును విని వానియందుఁ జిత్తంబు దగిలి యున్నను సిగ్గుపెంపున నెవ్వరికి నెఱింగింపకుండె; నంత నొక్కనాఁడు మద్రపతికడకు నారదుం డరుగుదెంచిన నతం డమ్మహామునిని నుచితసపర్యాపరితోషితుం జేసి సద్గోష్ఠీవిశేషంబులు సలుపుచున్నయెడ. 174**

**ప్రతిపదార్థం:** అదియును= ఆమెయును- సావిత్రియు; సాళ్వపతి+ఐన= సాళ్వదేశపురాజు అయిన; ద్యుమత్సేనుకొడుకు= ద్యుమత్సేనుడు అనేవాడిపుత్రుడు; సత్యవంతుండు= సత్యవంతుడు అనే పేరు కలవాడు; రూపవంతుండు+అనియును= అందం కలవా డనియు; గుణవంతుండు= మంచి గుణగణాలు కలవాడు అనియును; విని= ఆలకించి; వానియందున్= అతడియందు- సత్యవంతుడియందు; చిత్తంబు= మనస్సు; తగిలి= లగ్నమై; ఉన్నను= ఉన్నప్పటికీ; సిగ్గుపెంపునన్= లజ్జ అతిశయించటంచేత; ఎవ్వరికిన్= ఎవరికిని; ఎఱింగింపకుండెన్= తెలుపకుండా ఉండింది; అంతన్= పిమ్మట; ఒక్కనాఁడు= ఒకరోజున; మద్రపతికడకున్= మద్రదేశపు రాజుదగ్గరకు- అశ్వపతిదగ్గరకు; నారదుండు= నారదమహర్షి; అరుగుదెంచినన్= విచ్చేయగా; అతండు= అశ్వపతి; ఆ+మహామునిన్= ఆ గొప్పఋషిని; ఉచిత, సపర్యా, పరితోషితున్+చేసి= తగిన సేవలు చేయటంచేత మిగుల సంతోషం చెందిన వాడినిగా చేసి; సత్+గోష్ఠీ, విశేషంబులు= మంచి సంభాషణగరిమతో గూడినటువంటి గొప్పచర్చలు; సలుపుచున్న+ఎడన్= చేస్తున్న తరుణంలో.

**తాత్పర్యం:** సావిత్రి సాళ్వదేశాధీశుడైన ద్యుమత్సేనుడికొడుకు సత్యవంతుడినిగూర్చి విన్నది. అతడు అందగాడనీ, మంచిగుణాలు గలవాడనీ తెలిసి అతడిని ప్రేమించింది. కాని, అతిశయమైన లజ్జతో ఆ విషయాన్ని ఎవ్వరికీ తెలుపలేదు. అప్పుడు ఒకనాడు త్రిలోకసంచారి అయిన నారదుడు మద్రపతి అయిన అశ్వపతివద్దకు అరుదెంచాడు. అశ్వపతి ఆ మహర్షిని అతిథిమర్యాదలతో అలరించి మంచిగోష్ఠి సంభాషణలో వివిధవిషయాలు చర్చించసాగాడు. ఆ తరుణంలో.

**క. నెచ్చెలులు దన్నుఁ గొలువఁగఁ । బచ్చవిలుతుకలిమి యెల్లఁ బద్మానన యై**
**యచ్చుపడినట్లు మెఱయుచు । నచ్చటి కేతెంచె భూవరాత్మజ నెమ్మిన్. 175**

**ప్రతిపదార్థం:** నెచ్చెలులు= అనుగు సకియలు (నెఱ+చెలి= నెచ్చెలి); తన్నున్= తనను (సావిత్రిని); కొలువఁగన్= సేవించగా; పచ్చవిలుతుకలిమి+ఎల్లన్= మన్మథుడియొక్క సిరి అంతయు; పద్మ+ఆనన+ఐ= పద్మంవంటి ముఖం కలిగినట్టిది (సావిత్రి) అయి; అచ్చుపడినట్లు= గండరువును తీర్చిదిద్దినట్లు; భూవర+ఆత్మజ= అశ్వపతికూతురు సావిత్రి; మెఱయుచున్= తేజస్సుతో శోభిల్లుతూ; నెమ్మిన్= ప్రీతితో; అచ్చటికిన్= ఆ స్థలానికి; ఏతెంచెన్= వచ్చింది.

**ప్రతిపదార్థం:** లోక+ఈశ!= మహారాజా!; ప్రాకట, తపస్+బలంబునన్= వ్యక్తమైన తపస్సుయొక్క మహిమచేత; ఆకలితవిలోచనుండవు+ఐ= కూడిన కనులు కలవాడవై; ఉన్న= ఉన్నటువంటి; నినున్= నిన్ను, ఓ ద్యుమత్సేనా; చూడన్+కంటిమి= చూడగలిగాం; మాభాగ్యమునన్= మాఅదృష్టంచేత; మాకన్నులు= మానేత్రాలు; చల్లన+అయ్యెన్= చల్లబడ్డాయి.

**తాత్పర్యం:** లోకానికి అధిపతి వైన ఓ ద్యుమత్సేనమహారాజా! నీ తపోమహిమ గొప్పది. నీ తపశ్శక్తివలన నీకు దృష్టి లభించింది. కన్నులు లభించిన నిన్ను మేము చూడగలగటం మా అదృష్టం. మా కన్నులు చల్లబడ్డాయి.'

**వ. అనినం బ్రహృష్టహృదయుండై ద్యుమత్సేనుండు నాక్షణంబ తదాశ్రమవాసు లయిన మునుల నామంత్రణంబు సేసి, కొడుకుం దానును గజారూఢుఁడై బహుళచతురంగసేనాసంకులగమనంబునం బురంబునకుఁ జని సకలమహీరాజ్యంబునుగైకొని, చిత్రాశ్వునకుం బ్రథితయౌవరాజ్యపట్టం బొసంగి పరమైశ్వర్యధుర్యుం డయ్యెఁ; నిత్తెఱంగున. 278**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన; ద్యుమత్సేనుండు= ద్యుమత్సేనుడు; ప్రహృష్టహృదయుండు+ఐ= సంతోషం చెందిన డెందం కలవాడై; ఆ క్షణంబు+అ= ఆ క్షణంలోనే; తద్+ఆశ్రమవాసులు+అయిన= ఆ ఆశ్రమంలో నివసించేవారు అయిన; మునులన్= ఋషులను; ఆమంత్రణంబు+చేసి= వీడ్కొని; కొడుకున్= పుత్రుడును, సత్యవంతుడును; తానును= తాను; గజ+ఆరూఢుఁడు+ఐ= ఏనుగును అధిరోహించినవాడై; బహుళ, చతురంగ, సేనా, సంకుల, గమనంబునన్= విరివిఅయిన నాలుగు దళాల సేనల కోలాహలంతో కూడిన ప్రయాణంచేత; పురంబునకున్= పట్టణానికి, రాజధానికి; చని= వెడలి; సకలమహీరాజ్యంబును= సమస్తమైన భూమిప్రభుత్వాన్ని; కైకొని= స్వీకరించి; చిత్రాశ్వునకున్= సత్యవంతుడికి; ప్రథిత, యౌవరాజ్యపట్టంబు= పేరు కెక్కిన యువరాజపదవి; ఒసంగి= ఇచ్చి; పరమ+ఐశ్వర్య+ధుర్యుండు= గొప్ప సంపద వహించినవాడు; అయ్యెన్= అయ్యాడు; ఈ+తెఱంగునన్= ఈరీతిగా.

**తాత్పర్యం:** అని చెప్పగా, సంతుష్టి చెందిన హృదయం కలవాడై, ఆక్షణంలోనే ద్యుమత్సేనుడు ఆ ఆశ్రమంలోని ఋషులకు సగౌరవంగా వీడ్కోలుచెప్పి తానూ సత్యవంతుడూ ఏనుగునెక్కి విస్తరించిన నాలుగుదళాలతో కూడిన సేనలకోలాహలంతో ప్రయాణం చేసి రాజధాని నగరానికి చేరి పట్టాభిషిక్తుడయ్యాడు. సత్యవంతుడు యువరాజు అయ్యాడు. ఈ విధంగా ద్యుమత్సేనుడు గొప్పఐశ్వర్యాన్ని వహించాడు. ఈ విధంగా.

**క. తన మగని నత్తమామల । జననీజనకులను దన్ను సకలంబును దా**
**ఘనముగ సముద్ధరించెను । జనవర! సావిత్రిధర్మచరితము కంటే! 279**

**ప్రతిపదార్థం:** జనవర!= రాజా, ఓ ధర్మరాజా! తనమగనిన్= తనభర్తను; అత్తమామలన్= అత్తను మామను; జననీజనకులను= తల్లిని తండ్రిని; తన్నున్= తనను; సకలంబును= సమస్తాన్నీ; తాన్= తాను; ఘనముగన్= గొప్పగా; సమ్+ఉద్ధరించెను= అభ్యుదయం కలిగేటట్లు చేసింది; సావిత్రిధర్మచరితము= సావిత్రిజీవితకథ ధర్మంతో నిండినట్టిది; కంటే!= అరసితివి కదా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! తనభర్తను, అత్తమామలను, తలిదండ్రులను, తనను, సమస్తాన్నీ ఉద్ధరించిన సావిత్రి జీవితచరిత్ర ధర్మంతో కూడినట్టిది అనుశీలించావు కదా!

**తే. ఆ పతివ్రత యట్ల యీ యాజ్ఞసేని । పరమకల్యాణకర్మసంభావనీయ**
**యధిప! మిమ్మును మీయఖిలాన్వయంబు । నుద్ధరించు మహాభాగ్యయుక్తిఁ జేసి. 280**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా, ఓ ధర్మరాజా! ఆ పతివ్రత+అట్లు+అ= ఆ పతివ్రతవలెనే, ఆసావిత్రివలెనే; ఈ+యాజ్ఞసేని= ఈ ద్రౌపది; పరమకల్యాణకర్మసంభావనీయ= గొప్పశుభాల నొనగూర్చేపనులచేత మన్నించదగినట్టిది; మిమ్మును= మిమ్మలను (పంచపాండవులను); మీ+అఖిల+అన్వయంబున్= మీవంశాన్ని అంతటిని; మహాభాగ్యయుక్తిన్+చేసి= గొప్పదైన అదృష్టం కూడివచ్చేటట్లు చేసి; ఉద్ధరించున్= పెంపొందిస్తుంది.

**తాత్పర్యం:** ఓధర్మరాజా! ఆ పతివ్రత అయిన సావిత్రివలెనే ఈ ద్రౌపది కూడ గొప్పశుభాల నొనగూర్చుపనులను చేసి గౌరవించబడి మిమ్మలనూ మీవంశాన్నీ ఉద్ధరించగలదు. అట్టి అదృష్టయోగం మీకు ఏర్పడగలదు.

**క.** **అని చెప్పి పాండుతనయుల । ననఘుల వీడ్కొని మునీంద్రుఁ డనుపమతేజో**
**ఘనుఁ డగు మార్కండేయుఁడు । దన యాశ్రమమునకు నరిగెఁ దద్దయు నెమ్మిన్.** **281**

**ప్రతిపదార్థం:** ముని+ఇంద్రుఁడు= ఋషులలో శ్రేష్ఠుడు; అనుపమ, తేజస్+ఘనుఁడు+అగు= సాటిలేని వర్చస్సు కల గొప్పవాడు అగు; మార్కండేయుఁడు= మృకండునికొడుకు; తద్దయున్+నెమ్మిన్= మిక్కుటమైన ప్రేమతో; అనిచెప్పి= అని వచించి; పాండుతనయులన్= పాండవులను; అనఘులన్= పాపరహితులను; వీడ్కొని= వీడి; తన ఆశ్రమమునకున్= తన ఆశ్రమానికి; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** సావిత్రికథను చెప్పి, సాటిలేనితేజస్వి మునిశ్రేష్ఠుడైన మార్కండేయుడు మిక్కుటమైన ప్రేమతో పాండవులను వీడ్కొని తన ఆశ్రమానికి వెళ్ళాడు.

సూర్యుఁడు బ్రాహ్మణవేషంబునఁ గర్ణునకు హితంబు సెప్పుట (సం. 3-284-4)

**వ.** **అని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనుతో 'మునీంద్రా! యింద్రుండు గర్ణుకవచకుండలంబు లెవ్విధంబున నపహరించెం జెప్పవే' యని యడిగిన నతం డి ట్లనియె.** **282**

**ప్రతిపదార్థం:** అని చెప్పిన విని; జనమేజయుండు; వైశయంపాయనుతోన్; ముని+ఇంద్రా!= ఋషులలో శ్రేష్ఠుడా!; ఇంద్రుండు; కర్ణు, కవచకుండలంబులు= కర్ణుడియొక్క కవచాన్ని, కుండలాలను; ఏ+విధంబునన్; అపహరించెన్= మోసం చేసి తీసికొన్నాడు; చెప్పవే= వచింపుమా; అని అడిగినన్= అని ప్రశ్నించగా; అతండు= అతడు (వైశంపాయనుడు); ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పిన ఆలకించి జనమేజయుడు వైశంపాయనుడితో 'మునిశ్రేష్ఠుడా! ఇంద్రుడు, కర్ణుడికవచకుండలాలను ఏవిధంగా అపహరించాడు? దయచేసి ఆ కథ చెప్పుము' అని అడిగాడు. వైశంపాయనుడు జనమేజయుడికి ఇట్లా చెప్పాడు.

**సీ.** **వనమున నప్పాండుతనయు లుండఁగ నందు । వరుసఁ బండ్రెం డగు వత్సరంబు**
**కడపట నింద్రుఁడు గడఁగి పాండవహిత । కారియై కర్ణుని కవచకుండ**
**లములు మాయాప్రయోగమున హరింపంగఁ । దలఁచిన నాతని తలఁ పెఱింగి**
**జలజాప్తుఁ డొకనాఁడు వెలయ రాధేయున । కది యెల్ల నెఱిఁగింతు నని తలంచి**

**ఆ. లోకనుతుఁడు బ్రాహ్మణాకార మొప్పంగ । నతనియున్నయెడకు నరుగుదెంచి**
**యేకతంబ యున్న యా కర్ణుతోడ న । భీష్టభంగి దోఁప నిట్టు లనియె. 283**

**ప్రతిపదార్థం:** ఆ+పాండుతనయులు= ఆ పాండవులు; వనమునన్= అరణ్యంలో; ఉండఁగన్= నివసిస్తున్నప్పుడు; అందున్= అందు; వరుసన్= క్రమసంఖ్యలో; పండ్రెండు+అగు= పండ్రెండవది అయిన; వత్సరంబు కడపటన్= సంవత్సరం చివర; ఇంద్రుఁడు= వేలుపుదొర; కడఁగి= పూని; పాండవ, హిత, కారి+ఐ= పాండవులకు మేలు చేయగోరేవాడై; కర్ణుని, కవచ, కుండలములు= కర్ణుడియొక్క కవచాన్ని కుండలాలను; మాయాప్రయోగమునన్= కపటంచేత; హరింపంగన్= అపహరించుటకు; తలఁచినన్= యోచించగా; ఆతనితలఁపు= దేవేంద్రుడి ఆలోచన; ఎఱింగి= తెలిసికొని; జలజ+ఆప్తుఁడు= సూర్యుడు (పద్మాలకు హితుడు); ఒకనాఁడు= ఒకదినాన; వెలయన్= ఒప్పిదంగా; రాధేయునకున్= రాధకొడుకైన కర్ణుడికి; అది+ఎల్లన్= దేవేంద్రుడి కుట్ర నంతటిని; ఎఱిఁగింతున్= తెలుపుతాను; అని తలంచి= అని ఆలోచించి; లోకనుతుఁడు= జగత్తుచే ప్రస్తుతింపబడేవాడు - సూర్యుడు; బ్రాహ్మణ+ఆకారము= విప్రవేషం; ఒప్పంగన్= శోభిల్లేటట్లుగా; అతని+ఉన్న+ఎడకున్= అతడు (కర్ణుడు) ఉన్న చోటికి; అరుగుదెంచి; వచ్చి; ఏకతంబు+అ= ఒంటరిగా; ఉన్న= ఉన్నటువంటి; ఆ కర్ణుతోడన్= ఆకర్ణుడితో; అభీష్టభంగి= ప్రియమైన విధం; తోఁపన్= ప్రస్ఫుటమయ్యేటట్లుగా; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** పాండవుల అరణ్యావాసంలో పండ్రెండవయేడు పూర్తికానున్న సమయంలో, ఇంద్రుడు పాండవులకు మేలు చేయగోరి కర్ణుడికవచకుండలాలను అపహరించాలని తలపోశాడు. ఇంద్రుడిఅభిప్రాయాన్ని తెలిసికొని, లోకబాంధవు డైన సూర్యుడు కర్ణుడికి ఆ విషయం తెలపాలని భావించి బ్రాహ్మణవేషం తాల్చి, కర్ణుడు ఏకాంతంగా ఉన్నచోటికి వచ్చి ఈ రీతిగా పలికాడు.

**క. 'ఓకర్ణ! సుజనవినుత గు । ణాకల్ప! భవద్ధితార్థమై యొకకార్యం**
**బేకతమ చెప్ప వచ్చితిఁ । బ్రాకటముగ వినుము నాదు పలుకులు ప్రీతిన్. 284**

**ప్రతిపదార్థం:** ఓకర్ణ!= ఓకర్ణుడా!; సుజనవినుత= మంచివారిచేత పొగడబడిన; గుణ+ఆకల్ప!= మంచిగుణాలు ఆభరణాలుగా కలవాడా!; భవత్+హిత+అర్థము+ఐ= నీయొక్క మేలుకొరకై; ఒక కార్యంబు= ఒక కర్తవ్యం; ఏకతము+అ= రహస్యంగా; చెప్పన్ వచ్చితిన్= చెప్పటంకొరకు వచ్చాను; నా+పలుకులు= నామాటలు; ప్రీతిన్= సంతోషంతో; ప్రాకటముగన్= బాగా నీకు వ్యక్తం అయ్యేటట్లుగా; వినుము= ఆలకింపుము.

**తాత్పర్యం:** 'ఓకర్ణా! నీమేలు కోరేవాడినై నీతో ఒక ఆంతరంగికవిషయం ముచ్చటించటంకొరకు అరుగుదెంచాను. నా మాటలు సావధానంగా ఆలకించుము.

**వ. పాండవపక్షపాతియై పాకశాసనుండు భవదీయంబు లైన కవచకుండలంబులు హరియింపంగోరి, నీవు బ్రాహ్మణప్రియుండ వనియును బ్రాహ్మణు లడిగిన నెయ్యదియైనను వంచనసేయ కొసంగుదు వనియును నెఱుంగుం గావునఁ, గపటబ్రాహ్మణుండై వచ్చి యడుగం గలవాఁడు; నీవును గవచకుండలంబు లీవలవదు; రత్నకాంచనప్రముఖంబు లయిన పదార్థంబులు సూపియుం బ్రార్థించియు మఱియు నెవ్విధంబున నైనం గడపి పుచ్చవలయు; నట్లుగాక వీని నతని కిచ్చితేని మృత్యువశంబునం బొందఁగలవాఁడవు. 285**

**ప్రతిపదార్థం:** పాండవపక్షపాతి+ఐ= పాండునందనులయెడ విశేషమైన అభిమానం కలవాడై; పాకశాసనుండు= ఇంద్రుడు; భవదీయంబులు+ఐన= నీవైన; కవచకుండలంబులు= కవచాన్ని కుండలాలను; హరియింపన్+కోరి= కపటంగా సంగ్రహించదలచి;

నీవు= నీవు; బ్రాహ్మణప్రియుండవు+అనియును= విప్రులయెడ ప్రీతికలవాడవు అని; బ్రాహ్మణులు+అడిగినన్= విప్రులు అర్థిస్తే; ఏ+అదిఐనను= ఏది అయినప్పటికిని; వంచన+చేయక+ఒసంగుదువు+అనియును= మోసంచేయక చిత్తశుద్ధితో ఇస్తావు అనిన్నీ; ఎఱుంగున్+కావునన్= తెలియును కాబట్టి; కపట, బ్రాహ్మణుండు+ఐ= మాయావిప్రుడై; వచ్చి= అరుగుదెంచి; అడుగన్+కలవాఁడు= అర్థించగలవాడు; నీవును= నీవును; కవచకుండలంబులు= కవచాన్ని కుండలాలను; ఈవలవదు= ఇవ్వవద్దు; రత్న, కాంచన, ప్రముఖంబులు+అయిన= మణులు బంగారం మొదలైనవి; పదార్థంబులు= వస్తువులు; చూపియున్= ప్రదర్శించియు; ప్రార్థించియున్= వేడియు; మఱియున్= వెండియు; ఏ+విధంబునన్+ఐనన్= ఏరీతిగా నయినా; కడపి పుచ్చన్వలయున్= సమాధానపరచి పంపివేయాలి; అట్లు+కాక= ఆవిధంగా చేయక; వీనిన్= వీటిని (కవచకుండలాలను); అతనికిన్= వేషధారి అయిన విప్రుడికి, ఇంద్రుడికి; ఇచ్చితి(వి)+ఏనిన్= ఇచ్చావా; మృత్యు, వశంబునన్+పొందన్+కలవాఁడవు= మృత్యువుకు లోబడి ఉండేవాడవు ఔతావు (మరణిస్తావు).

**తాత్పర్యం:** పాండవులయెడ విశేషమైన అభిమానం గల దేవేంద్రుడు నీ కవచాన్ని కుండలాలను మోసం చేసి హరించగలడు. నీవు బ్రాహ్మణులయందు భక్తికలవాడవనీ; బ్రాహ్మణులు ఏది కోరినా వెనుదీయక చిత్తశుద్ధితో దానం చేస్తావనీ దేవేంద్రుడికి తెలియును కాబట్టి ఆతడు నీవద్దకు వేషధారిఅయిన విప్రుడుగా వస్తాడు. అతడికి నీవు నీకవచకుండలాల నీయవద్దు. మణులు బంగారం మున్నగునవి చూపించి ఆతడిని మభ్యపెట్టుము. ఏదోవిధంగా అతడిని బ్రతిమలాడి తప్పించుకొనుము. అంతేకాని నీ కవచకుండలాలను ఆతనికి ఇచ్చావా, నీవు మృత్యుముఖంలో దూరినట్లే సుమా, జాగ్రత్త!

**చ.** **అమృతమయంబు సుమ్వే సుగుణాకర! యిమ్మహనీయవస్తుయు**
**గ్మము; నివి యుండు నేనిఁ ద్రిజగంబులయందు నశేషశత్రులో**
**కమునకు నీవు వధ్యుఁడవు గావు, నిరంతరసౌఖ్యసాంద్రమో**
**దమున వెలుంగు; దే నిది హితంబుగఁ జెప్పితి మోసపోకుమీ!'** **286**

**ప్రతిపదార్థం:** సుగుణ+ఆకర!= మంచిగుణాలకు నెలవైనవాడా, ఓకర్ణా!; ఈ+మహనీయవస్తుయుగ్మమున్= గొప్పవైన ఈ రెండు వస్తువులును (కవచకుండలాలు); అమృతమయంబు+చుమ్వే= అమృతంతో నిండినట్టివి సుమా; ఇవి= ఇవి (ఈ కవచకుండలాలు); ఉండున్+ఏనిన్= ఉంటే; త్రిజగంబుల+అందున్= మూడులోకాలలో; అశేష, శత్రు, లోకమునకున్= సమస్తమైన విరోధులసమూహానికి; నీవు= నీవు; వధ్యుఁడవు+కావు= చంపదగినవాడవు కావు; నిరంతర, సౌఖ్య, సాంద్ర, మోదమునన్= ఎల్లప్పుడూ అనుభవించే భోగాలచేత దట్టమైన సంతోషంతో; వెలుంగుదు= ప్రకాశిస్తావు; ఏన్= నేను; ఇది= ఈ మాట; హితంబుగన్= నీమేలును కోరి; చెప్పితిన్= వచించాను; మోసపోకుమీ= వంచనకు లోనుగాబోకుమా.

**తాత్పర్యం:** మంచిగుణాలకు నెలవైనవాడా, ఓకర్ణా!, నీకవచకుండలాలు గొప్పవస్తువులు, అమృతమయాలు! ఇవి ఉంటే, మూడులోకాలలోను శత్రుసమూహం నిన్ను చంపజాలదు. సహజకవచకుండలాలతో కూడిఉంటే నీవు ఎప్పుడూ సుఖశాంతులతో కూడిన సంతోషంతో వెలుగొందుతూ ఉంటావు. నీశ్రేయస్సు కోరి ఈ విషయం నేను నీకు చెప్తున్నాను. జాగ్రత్త. మోసపోవద్దు!'

**క.** **అనిన విని సూతతనయుఁడు । వినయంబున నిట్టు లనియె 'విప్రాకారం**
**బున వచ్చిన వేల్పవు నీ । వనఘా! యెవ్వఁడవు? నాకు నానతి యీవే.'** **287**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (విప్రుడు చెప్పగా); విని= ఆలకించి; సూతతనయుఁడు= సూతుడికొడుకు - కర్ణుడు; వినయంబునన్= అణకువతో; ఇట్టులు+అనియెన్= ఈవిధంగా పలికాడు; 'అనఘా!= పాపరహితుడవైనవాడా (పుణ్యపురుషుడా!); విప్ర+ఆకారంబునన్= బ్రాహ్మణవేషం తాల్చి; వచ్చిన= అరుగుదెంచిన; వేల్పవు= దేవతవు; నీవు= నీవు; ఎవ్వఁడవు?= ఎవడవు; నాకున్= నాకు; ఆనతి= అనుజ్ఞ; ఈవే= దయచేసి ఇమ్ము.

**తాత్పర్యం:** అని ఆ విప్రుడు వచించాడు; అంతట సూతుడికొడుకు కర్ణుడు అణకువతో ఇట్లా పలికాడు. 'పాపరహితుడా! నీవు సామాన్యబ్రాహ్మణుడవు కావు. నీవు దేవతామూర్తివి. అసలు నీవు ఏ వేల్పవో దయచేసి నాకు తెలుప ప్రార్థిస్తున్నాను.'

**క. అనుడు నతఁ 'డేను సూర్యుఁడ । మనమున నీయందుఁ గలుగు మక్కువఁ గర్జం**
**బొనరఁగ నుపదేశింపఁగఁ । జనుదెంచితి' ననిన నతఁడు సంభ్రమ మొప్పన్. 288**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని (కర్ణుడు) పల్కగా,; అతఁడు= ఆ వేషధారివిప్రుడు; 'ఏను= నేను; సూర్యుఁడన్= సూర్యుడను; మనమునన్= చిత్తంలో; నీయందున్+కలుగు, మక్కువన్= నీయందు ఉన్న ప్రేమచొప్పున; కర్జంబు= కర్తవ్యం; ఒనరఁగన్= ఒప్పిదంగా; ఉపదేశింపఁగన్= యోగ్యతతో కూడిన మాటలతో చెప్పటానికై; చనుదెంచితిన్= వచ్చాను; అనినన్= అని (సూర్యుడు) చెప్పగా; అతఁడు= అతడు, కర్ణుడు; సంభ్రమము= తత్తరపాటు; ఒప్పన్= శోభిల్లగా.

**తాత్పర్యం:** అని కర్ణుడు పల్కగా సూర్యుడు ఇట్లా బదులు పలికాడు: 'నేను సూర్యుడను సుమా! మనస్సులో నీమీద గల మిక్కిలి మక్కువచొప్పున నీకు కర్తవ్యాన్ని ఉపదేశించటానికై నీవద్దకు వచ్చాను.'ఆమాటలు విని కర్ణుడు తత్తరపాటుతో.

**వ. అభివందనంబు సేసి, 'దేవా! దేవరవు నాకత్యంతహితుండ వగుటంజేసి కృతార్థుండనైతి; నింకొక్క విన్నపంబు సేసెద నవధరింపుము. 289**

**ప్రతిపదార్థం:** అభివందనంబు+చేసి= వినయంతో నమస్కరించి; 'దేవా!= ప్రభూ!; దేవరవు= దైవమవు; నాకున్= నాకు; అత్యంత, హితుండవు+అగుటన్+చేసి= మిక్కుటంగా నాశ్రేయస్సును కోరేవాడవు కాబట్టి; కృతార్థుండను+ఐతిన్= ధన్యుఁడనయ్యాను; ఇంకన్+ఒక్క= ఇంకొక; విన్నపంబు= మనవి; చేసెదన్= చేస్తాను; అవధరింపుము= దయచేసి వినుము.

**తాత్పర్యం:** కర్ణుడు నమస్కరించి ఇట్లా అన్నాడు. 'దేవా, నీవు వేల్పువు. నామీద అపారమైన కరుణ కలిగి ఉండటంచేతనే నాశ్రేయస్సును కోరేవాడ వగుటచేతనే నావద్దకు వచ్చావు. నేను ధన్యుడను. ఇంకొక విన్నపం ఉన్నది. దయచేసి సావధానంగా ఆలకించుము.

**ఉ. భూసురకోటి వేఁడుటయుఁ బోఁడిగ ప్రాణము లైన నీగి నా**
**బాస; దినేశ! లోకమునఁ బ్రస్ఫుట మింతయు; నట్లు గాకయున్**
**వాసవుఁ డట్టె! న న్నడుగవచ్చుఁ బ్రియంపడి నాకు నొక్క బ్రాఁ**
**తే సురలోకవందిత! మదిం గవచంబును గుండలంబులున్. 290**

**ప్రతిపదార్థం:** దిన+ఈశ= ఓ సూర్యభగవానుడా; భూసురకోటి= బ్రాహ్మణసమూహం; వేఁడుటయున్= ప్రార్థించటమున్నూ; పోఁడిగన్= మనోహరంగా; ప్రాణములు+ఐనన్= అసువుల నైనను; ఈగి= దానం చేయటం; నాబాస= నాశపథం; లోకమునన్=

జగత్తులో; ఇంతయున్= ఈవిషయం అంతయును; ప్రస్ఫుటము= తేటతెల్లం అయినట్టిది అందరికీ తెలిసినదే; అట్లు+కాకయున్= అంతమాత్రమే కాక; వాసవుఁడు+అట్టె= ఇంద్రుడు అంతటివాడే; నన్నున్= నన్ను; అడుగవచ్చున్= ప్రార్థించటానికై వస్తే; ప్రియంపడి= ప్రీతితో; సురలోకవందిత!= వేల్పులసమూహాలచేత నమస్కరించబడేవాడా!; ఓసూర్యభగవానుడా!; మదిన్= నాచిత్తంలో; కవచంబును కుండలంబులున్= కవచం కుండలాలున్నూ; నాకున్= నాకు; ఒక్క= ఒక; బ్రాఁతి+ఏ= (బ్రాఁతే) ఆసక్తి వీడలేని ప్రియమా? కాదు).

**తాత్పర్యం:** వేల్పులసమూహాలచేత ఆరాధించబడే ఓ సూర్యభగవానుడా!, బ్రాహ్మణులు అర్థిస్తే వెనుదీయక మనోహరఫణితిలో నా అసువులను సయితం సమర్పించగలను. ఇది నా ప్రతిజ్ఞ! ఈ విషయం లోకాని కంతటికి తేటతెల్లమే. అంతేకాక దేవేంద్రుడంతటివాడు వేడుకతో నావద్దకు 'దేహి' అని ప్రార్థించటానికే వస్తే, ఇక కుచకుండలాలు ప్రియములా? అవి నాకు తృణప్రాయాలు.

**క. జగముల నెల్లను నిండిన । పొగడిత గడు వెలితి సేసి, పొల్లయొడలికై**
**తగవే జన్మవ్రత మిటు । దిగవిడువఁగ నేఁడు నాకుఁ ద్రిభువనదీపా! 291**

**ప్రతిపదార్థం:** త్రిభువనదీపా!= మూడులోకాలను వెలుగొందజేసేవాడా, ఓ సూర్యదేవుడా!; జగములన్+ఎల్లను= అన్ని లోకాలలోను; నిండిన= సంపూర్ణంగా వ్యాపించిన; పొగడిత= ప్రశస్తి; కడున్= మిక్కిలి; వెలితి+చేసి= కొఱతకలిగించి; పొల్ల+ఒడలికిన్+ఐ= వ్యర్థమైన (శాశ్వతంకాని) శరీరంకొరకై; జన్మవ్రతము= యావజ్జీవితం దీక్షతో పరిపాలించేనోము; ఇటు= ఈరీతిగా; దిగవిడువఁగన్= త్రోసిపుచ్చటం; నేఁడు= ఈసమయంలో; నాకున్= నాకున్; తగవు+ఏ= పాడి అగునా (కాదు గదా).

**తాత్పర్యం:** మూడులోకాలను వెలుగొందజేసే ఓ సూర్యదేవా! అన్నిలోకాలలో వ్యాపించిన సత్కీర్తికి కొఱత కలిగించి, ఏమాత్రం విలువలేని ఈ పొల్లశరీరంకొరకై యావజ్జీవితం దీక్షతో పరిపాలించే నోమును నేడు నేను విడవటం పాడికాదు కదా.

**విశేషం:** (1) 'పొల్లఒడలికై' తనదానవ్రతాన్ని విడువజాలనని కర్ణుడు సూర్యభగవానుడితో ఖండితంగా ప్రకటించాడు. ఈవాక్యం కర్ణుడిశీలానికి గీటురాయి. (2) ఈఘట్టంలో ఎఱ్ఱన వ్రాసిన పద్యాలు సూక్ష్మదృష్టితో అనుశీలిస్తే పోతనమహాకవికి ఒజ్జబంతులైనవి. పోతన చిత్రించిన బలిచక్రవర్తి శీలం గమనించదగింది.

**మ. మతిఁ గుంతీసుతపక్షపాతి యగుచున్ మాయాస్వరూపంబుతో**
**జితదైత్యుండు శతక్రతుండు నను భిక్షింపంగ నేతెంచు న**
**ట్టి తెఱంగైనఁ దదీయకీర్తియ చుమీ డిందుం; ద్రిలోకీసము**
**న్నతమై యొప్పు మదీయకీర్తి; యిదిసూ నాపుణ్య మెబ్బంగులన్. 292**

**ప్రతిపదార్థం:** జితదైత్యుండు= రాక్షసులను జయించినవాడు; శతక్రతుండు= వందయజ్ఞాలను చేసినవాడు, దేవేంద్రుడు; మతిన్= చిత్తంలో; కుంతీసుతపక్షపాతి+అగుచున్= పాండవులయెడ అభిమానం కలవాడు ఔతూ, మాయాస్వరూపంబుతోన్= కపటవేషధారణతో; ననున్= నన్ను; భిక్షింపంగన్= యాచించటానికై; ఏతెంచునట్టి= అరుదెంచే; తెఱంగు+ఐనన్= రీతిఏర్పడితే; తదీయకీర్తి+అ= దేవేంద్రుడియొక్క యశస్సే; డిందున్= క్రిందిదౌతుంది; చుమీ= సుమా; మదీయకీర్తి= నాయశస్సు; త్రిలోకీ, సమ్+ఉన్నతము+ఐ= మూడులోకాలలో పైకి ఎక్కినదై; ఒప్పున్= శోభిల్లుతుంది; ఏ+భంగులన్= ఎన్నివిధాలుగా చూచినా; ఇది= (ఈ విధంగా దేవేంద్రుడు నాకడకు యాచకుడై రావటం); నాపుణ్యము= నాసుకృతం; చూ= సుమ్ము.

**తాత్పర్యం:** రాక్షసులను జయించినవాడు, నూరుయజ్ఞాలను చేసినవాడు అయిన దేవేంద్రుడు చిత్తంలో పాండవులయెడ పొడిదప్పిన అభిమానంతో మారువేషం తాల్చి నాకడకు యాచకుడై రావటమా? రానిమ్ము. అది ఆతనికీర్తికి మాత్రమే లోటు. అప్పుడు నాకీర్తి మూడులోకాలలో ఉన్నతంగా వెలుగొందుతుంది. ఏవిధంగా చూచినా ఇది నాసుకృతవిశేషమేకదా!

**ఆ. కీర్తి విడువఁజాలఁ; గీర్తితో మెలఁగంగఁ । జావు వచ్చెనేనిఁ జత్తుఁ; గాని**
**జగములోన నెల్ల 'సడికంటెఁ జావు మే'। లనఁగఁ బరఁగు మాట యనఘ! వినవె? 293**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా, ఓ సూర్యుడా!; కీర్తిన్= యశస్సును; విడువన్+చాలన్= వదలిపెట్టజాలను; కీర్తితోన్= యశస్సుతో; మెలఁగంగన్= ప్రవర్తిల్లగా; చావు, వచ్చెన్+ఏనిన్= మరణం సంప్రాప్తించినప్పటికి; చత్తున్= చస్తాను; కాని= అంతేకాని; జగములోనన్+ఎల్లన్= లోకంలో అంతటా; సడికంటెన్= అపకీర్తికంటే; చావు= మరణం; మేలు= మంచిది; అనఁగన్+పరఁగుమాట= అనెడి సుభాషితం; వినవె= ఆలకించవా.

**తాత్పర్యం:** పుణ్యాత్ముడ వైన ఓసూర్యభగవానుడా! నేను యశస్సును విడనాడజాలను. పేరుప్రతిష్ఠలతో బ్రతికేటప్పుడు మరణం ప్రాప్తించినా నాకు సమ్మతమే. లోకంలో 'అపకీర్తికంటె మరణమే మేలు' అనే సుభాషితాన్ని వినలేదా?

**ఉ. 'కీర్తియ యిచ్చుఁ బుణ్యగతిఁ; గీర్తియ తల్లియుఁబోలెఁ బ్రోచు; స**
**త్కీర్తియ యాయువున్ సిరియుఁ; గీర్తివిహీనుఁడచూ శవంబు; దు**
**ష్కీర్తను నెల్లచేటులును గిట్టి హరించు' ననండె తొల్లి భ**
**క్తార్తిహరుండు నాఁబరఁగు నంబుజసూతి జగద్ధితంబుగన్. 294**

**ప్రతిపదార్థం:** కీర్తి+అ= యశస్సు మాత్రమే; పుణ్యగతిన్= సుకృతలోకాన్ని; ఇచ్చున్= ప్రసాదిస్తుంది; కీర్తి+అ= యశస్సుమాత్రమే; తల్లియున్+పోలెన్= జననివలె; ప్రోచున్= కాపాడుతుంది; సత్+కీర్తి+అ= మంచియశస్సే; ఆయువున్= ఆయుర్దాయం; సిరియున్= సంపదయున్నూ; కీర్తివిహీనుఁడు+అ= కీర్తి లేనివాడే; శవంబు= పీనుగు; చూ= చుమ్ము, సుమా; తొల్లి= పూర్వం; దుష్కీర్తనున్= చెడ్డకీర్తి కలవాడిని; ఎల్ల, చేటులును= అన్నికీడులును; కిట్టి= సమీపించి; హరించున్= నశింపచేస్తాయి; (అని); భక్త+ఆర్తి, హరుండు= భక్తుల దైన్యాన్ని హరించేవాడు; నాన్= అనగా; పరఁగు= ఒప్పు; అంబుజసూతి= బ్రహ్మదేవుడు; జగత్+హితంబుగన్= జగత్తుకు శ్రేయస్సు కలిగేటట్లుగా; అనండు+ఎ= అనలేదా.

**తాత్పర్యం:** 'కీర్తియే పుణ్యగతిని ప్రసాదిస్తుంది. కీర్తియే కన్నతల్లివలె కాపాడుతుంది. మంచికీర్తియే ఆయువు. కీర్తియే సంపద. కీర్తిలేనివాడు పీనుగే. అపయశస్సు కలవాడిని అన్నికీడులు ఆవహించి నశింపజేస్తా' యని పూర్వం భక్తుల దైన్యాన్ని పోగొట్టేవాడైన, బ్రహ్మదేవుడు ప్రవచించి ఉన్నాడుగదా. అది జగత్తుకు శ్రేయస్సుకలిగించే సుభాషితం.

**సీ. విప్రులు గడు నర్థి వేఁడినఁ గలిమిలోఁ । బొచ్చెంబు సేయక యిచ్చు టొకటి,**
**బలితంపుఁబగతురఁ బరిమార్చు టొక్కటి, । దండియై యనిఁ జచ్చు టొండె నొకటి,**
**శరణాగతుని నెట్టి శత్రువు నైనను । గరుణించి చంపక కాచు టొకటి,**
**భామినీద్విజవృద్ధబాలాతురుల కైన । యాపద చెచ్చెరఁ బాపు టొకటి**

**ఆ. యనఁగ నివి వ్రతంబులై చెల్లు నాకు; నిం । దొకటి తప్పెనేని వికలకీర్తి**
**నగుదుఁ; గాన నిత్తు నఖిలమ్ము నెఱుఁగ నా । ఖండలునకుఁ గవచకుండలములు.' 295**

**ప్రతిపదార్థం:** విప్రులు= బ్రాహ్మణులు; కడున్= మిక్కిలి, అర్థిన్= కోరికతో; వేఁడినన్= ప్రార్థించగా; కలిమిలోన్= (ఉన్న) సంపదలో; పొచ్చెంబు+చేయక= తక్కువచేయక; ఇచ్చుట= దానంచేయటం; ఒకటి= ఒకటి; బలితంపు+పగతురన్= బలవంతు లైన శత్రువులను; పరిమార్చుట= సంహరించటం; ఒక్కటి= ఒకటి; అనిన్= యుద్ధంలో; దండి+ఐ= మేటిఅయి; చచ్చుట+ఒండెన్= మరణించటం కాని; ఒకటి= ఒకటి; శరణ+ఆగతునిన్= రక్షణ కోరి ఆశ్రయించినవాడిని; ఎట్టిశత్రువున్+ఐనను= ఎటువంటి విరోధిని అయినప్పటికిని; కరుణించి= దయచూపి; చంపక= సంహరించక; కాచుట= రక్షించటం; ఒకటి= ఒకటి; భామినీ, ద్విజ, వృద్ధ, బాల+ఆతురులకున్+ఐన= స్త్రీలకు బ్రాహ్మణులకు ముసలివారికి పిన్నలకు దీనులకు దాపురించిన; ఆపద= కష్టం; చెచ్చెరన్= శీఘ్రంగా; పాపుట= పోగొట్టటం; ఒకటి= ఒకటి; అనఁగన్= అనునట్టివి; ఇవి= పైనచెప్పినట్టివి; వ్రతంబులు+ఐ= నోములు అయి; నాకున్= నాకు; చెల్లున్= ఏర్పడినవి. ఇందున్= ఈ నోములలో; ఒకటి= ఒక్కటి అయినా; తప్పెనేనిన్= జరగకుండా తప్పితే; వికల, కీర్తిన్+అగుదున్= చెడినయశస్సు కలవాడనౌతాను; కానన్= కావున; అఖిలమ్మున్+ఎఱుఁగన్= అంతయును తెలియగా; ఆఖండలునకున్= దేవేంద్రుడికి; కవచకుండలములు= కవచాన్ని కుండలాలను; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** ఇవి నేను పాటించే వ్రతాలు (ప్రతిజ్ఞలు). బ్రాహ్మణులు కోరి నన్నడిగితే నా కున్న సంపదలో తక్కువ చేయకుండా దానం చేయటం ఒకటి. బలవంతులైన శత్రువులను సంహరించటం మరొకటి. లేదా యుద్ధంలో వీరుడుగా మరణించటం ఇంకొకటి. పగవాడైనా శరణువేడితే చంపకుండా దయతో రక్షించటం మరింకొక్కటి. ఆడవారు కాని, బ్రాహ్మణులు కాని, ముసలివారు కాని, చిన్నవారు కాని, దీనులు కాని ఆపదలో చిక్కుకుంటే వారి ఆపదలను తొలగించటం మరొక్కటి. వీటిలో ఏ ఒక్కటి తప్పినా ముక్కలు చెక్కలైన కీర్తి కలవాడనౌతాను. కాబట్టి, ఇవన్నీ స్పష్టమయ్యేటట్లు ఇంద్రుడికి నాకవచకుండలాలను ఇచ్చివేస్తాను.'

**వ. అనినఁ గర్ణునకు సూర్యుం డిట్లనియె. 296**

**తాత్పర్యం:** అనగా సూర్యుడు కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**క. 'కడు నెయ్యురు హితముగఁ జె । ప్పెడు పలుకులు వినవు; గరము బేలవు; నీ వె**
**క్కడ? బుద్ధితెరువు లెక్కడ? చెడక వినుము నీకుఁ దెలియఁ జెప్పెదఁ గర్ణా! 297**

**ప్రతిపదార్థం:** కర్ణా!= ఓకర్ణా!; కడున్= మిక్కిలి; నెయ్యురు= మిత్రులు; హితముగన్= శ్రేయస్సు కలిగేటట్లుగా; చెప్పెడుపలుకులు= చెప్పేమాటలు; వినవు= వినిపించుకోవు; కరము= మిక్కిలి; బేలవు= అమాయకుడవు; నీవు+ఎక్కడ?= నీవు ఎక్కడ; బుద్ధి తెరువులు= తెలివితో గూడిన తీరుతెన్నులు; ఎక్కడ?= ఎక్కడ; నీకున్= నీకు; తెలియన్+చెప్పెదన్= తెలిసేటట్లుగా వచిస్తాను; చెడక= చెడిపోకుండ; వినుము= నేను చెప్పినట్లు నడచుకొమ్ము.

**తాత్పర్యం:** ఓ కర్ణ! నీ శ్రేయోభిలాషులు నీహితం కోరి చెప్పేమాటలు నీవు వినవు. నీవు మిక్కిలి అమాయకుడవు. నీవు ఎక్కడ? తెలివితేటలతో కూడిన తీరుతెన్నులు ఎక్కడ? నీకు నేను బాగుపడేమార్గం చెప్పుతున్నాను. నేను చెప్పినట్లు నడచుకొనుము. నీకు మేలు కలుగుతుంది.

**క. తనకుఁ దనయులకు సతులకు । జననీజనకులకు బంధుజనులకుఁ గీడొం**
**దని తెరువునఁ గీర్తి గనినఁ । జనుఁగా కందఱును జెడుయశం బేమిటికిన్? 298**

**ప్రతిపదార్థం:** తనకున్= తనకును; తనయులకున్= పుత్రులకు; సతులకున్= భార్యలకు; జననీజనకులకున్= తలిదండ్రులకు; బంధు, జనులకున్= చుట్టాలకును; కీడు+ఒందని, తెరువునన్= హాని కలుగని మార్గాన; కీర్తి+కనినన్= యశస్సును ఆర్జిస్తే; చనున్+గాక= ఒప్పుతుంది కాని; అందఱును= ఎల్లరును; చెడు= కీడు పొందు; యశంబు= కీర్తి; ఏమిటికిన్?= ఎందుకు?

**తాత్పర్యం:** తనకూ, తనపుత్రులకూ, తనభార్యలకూ, తనతలిదండ్రులకూ, చుట్టాలకూ; హాని కలుగనిమార్గంలో, యశస్సు నార్జించటం భావ్యమౌతుంది కాని అందరికి కీడు గలిగించే కీర్తి ఎందుకు?

**ఉ. కావున నీవు ప్రాణములు గావుము; కీర్తి యటుండనిమ్ము; నీ**
**జీవిత మున్నఁ గీర్తి మఱి చేరదె; కీర్తి యనంగ నొక్కఁ డే**
**లా? వనితల్ దనూభవులు లక్ష్ములు బంధులు సార్వభౌమతే**
**జోవిభవంబు నిమ్మడరఁ జొప్పడుఁ బ్రాణ మొకండు గల్గినన్. 299**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఈవు= నీవు; ప్రాణములు= అసువులు; కావుము= రక్షించుకొనుము; కీర్తి+అటు+ఉండన్, ఇమ్ము= యశస్సును, అటువైపు ఉండనిమ్ము; నీజీవితము+ఉన్నన్= నీవు బ్రదికి ఉంటే; కీర్తి= యశస్సు; మఱి= మరల; చేరదు+ఎ= దగ్గరకు రాదా?; కీర్తి= యశస్సు; అనంగన్= అనగా; ఒక్కఁడు= ఒకటి మాత్రమే; ఏలా= ఎందుకు?; వనితల్= పడతులు; తనూభవులు= సంతానము; లక్ష్ములు= సంపదలు; బంధులు= చుట్టాలు; సార్వభౌమ, తేజస్+విభవంబున్= చక్రవర్తిత్వంవలన చేకూరే దేదీప్యమాన మైన కాంతి సంపదను, ఇమ్ము+అడరన్= ఇంపుశోభిల్లేటట్లుగా; ప్రాణము+ఒకండు= జీవం ఒకటి; కల్గినన్= ఉంటేనే; చొప్పడున్= అమరుతాయి.

**తాత్పర్యం:** కావున నీప్రథమకర్తవ్యం నీఅసువులను కాపాడుకొనటం. అసలు నీవు బ్రదికి ఉంటే నిన్ను కీర్తి చేరుతుంది. ఒక్కకీర్తిమాత్రమే చేరటం ఏమిటి? భార్యలు బిడ్డలు సంపదలు చుట్టాలు చక్రవర్తిత్వతేజస్సు ఎన్నిఅయినప్పటికి ప్రాణము లున్నప్పుడే ఇంపుపెంపులు శోభిల్లుతాయి.

**క. మృతుఁ డైన నరుఁడు వెస భ । స్మితుఁడై చనుఁగాక, కీర్తిమేలిమి గనునే?**
**మృతదేహంబునకు నలం । కృతిఁ జేసినయట్ల మృతునికీర్తి తలంపన్. 300**

**ప్రతిపదార్థం:** మృతుఁడు+ఐనన్= మరణం చెందితే నరుఁడు= మనుజుడు; వెసన్= శీఘ్రంగా; భస్మితుఁడు+ఐ= బూడిదగా మారినవాడై; చనున్+కాక= పోవునేకాని; కీర్తి= యశస్సుయొక్క; మేలిమి+కనును+ఏ= గొప్పతనాన్ని పొందుతాడా; మృతునికీర్తి= మరణించినవాడియశస్సు; తలంపన్= యోచన చేయగా; మృతదేహంబునకున్= మరణించిన శరీరానికి, పీనుగుఒడలికి; అలంకృతి+చేసిన+అట్లు+అ= అలంకారం చేసినట్లే సుమా.

**తాత్పర్యం:** మరణించినపిదప మానవుడు బూడిదగా మారిపోతాడు. మరి యశస్సు యొక్క గొప్పతనాన్ని స్వయంగా చూడలేడు. పొందలేడు. ఆలోచిస్తే, మరణించిన వాడి యశస్సు చచ్చినవాడి కళేబరానికి చేసిన అలంకారంవంటిదే సుమా!

**విశేషం:** అలం: ఉపమ.

**వ. నీవు నాకు నత్యంతభక్తుండ వగుటంజేసి భక్తజనరక్షణంబు గర్తవ్యం బగుట ని ట్లన్నియుం జెప్పవలసె; మఱియు దేవనిర్మితం బైన రహస్యం బొక్కటి గలదు; దాననసేసి నీయందు నాకు వాత్సల్యంబు**

**మిగిలియుండు; నది యిప్పు డేను జెప్పఁ; బిదపఁ దనయంతన యెఱుఁగంబడు; నీకు నర్జుననకుం దెగని పగయై యుండు; మీకుఁ గయ్యంబు నయ్యెడు; నందు నీవు సహజకవచకుండలమండితుండ వగుటంజేసి యర్జునున కజేయుండ వయ్యెద; వట్లుంగాక వీనిం గోలుపోయితివేని యెంతయు దెప్పరం బగు' ననినం గర్ణుం డిట్లనియె; 301**

**ప్రతిపదార్థం:** నీవు= ఓకర్ణా; నాకున్= నాకు; అత్యంతభక్తుండవు= మిక్కిలి భక్తుడవు; అగుటన్+చేసి= కావటంచేత; భక్తజనరక్షణంబు= భక్తులను కాపాడటం; కర్తవ్యంబు+అగుటన్= చేయవలసిన ధర్మం కావున; ఇట్లు= ఈ రీతిగా; అన్నియున్= సమస్తమైన అంశాలను; చెప్పవలసెన్= వచించవలసివచ్చింది; మఱియున్= అంతమాత్రమే కాక; దేవనిర్మితంబు+ఐన= దేవతలచేత ఏర్పరచబడిన; రహస్యంబు+ఒక్కటి= గూఢవిషయం ఒకటి; కలదు= ఉన్నది; దానన్+అ+చేసి= దానిమూలాన (ఆ రహస్యం కారణంగా); నీయందున్= నీమీద; నాకున్= నాకు; వాత్సల్యంబు= అనురాగం; మిగిలి+ఉండున్= మిక్కుటంగా ఉంటుంది; అది= ఆరహస్యం; ఇప్పుడు= ఈసమయంలో; ఏను= నేను; చెప్పన్= వచించను; పిదపన్= పిమ్మట; తన+అంతన్+అ= దాని అంతట అదే; ఎఱుఁగన్+పడున్= వెల్లడిఔతుంది; నీకున్= నీకును; అర్జుననకున్; తెగని= తీరని; పగ+ఐ+ఉండున్= శత్రుత్వం ఏర్పడిఉంటుంది; మీకున్= మీఇరువురకు (నీకును అర్జునుడికిని); కయ్యంబున్= యుద్ధమును; అయ్యెడున్= జరుగుతుంది; అందున్= ఆయుద్ధంలో; ఈవు= నీవు; సహజ, కవచ, కుండల, మండితుండవు, అగుటన్+చేసి= ప్రకృతిసిద్ధంగా ఏర్పడిన కవచకుండలాలతో వెలుగొందేవాడవు అగుటచేత; అర్జుననకున్; అజేయుండవు+అయ్యెదవు= గెలువశక్యంగాని వాడవు ఔతావు; అట్లున్+కాక= ఆ విధంగా కాక; వీనిన్ ఈసహజ కవచకుండలాలను; కోలుపోయితివి+ఏనిన్= పోగొట్టుకొన్నావా; ఎంతయున్= మిక్కుటమయిన; దెప్పరంబు+అగున్= ఆపద ఏర్పడుతుంది; అనినన్= అని (సూర్యుడు) చెప్పగా; కర్ణుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నీవు నాకు గొప్పభక్తుడవు. భక్తులను కాపాడటం అవశ్యం నిర్వహించవలసిన ధర్మంగదా! అందుచేత నీకు అన్నిఅంశాలు వివరించి చెప్పవలసి వచ్చింది. అంతమాత్రమేకాక ఇందు ఒక దేవరహస్యం ఇమిడి ఉన్నది. ఆ రహస్యాన్ని ఇప్పుడు నీకు నేను చెప్పను. కాని అది దానంతట అదియే వెల్లడి కాగలదు. నీకున్నూ అర్జునుడికిన్నీ తీరనిపగ ఏర్పడి ఉంటుంది. మీకు యుద్ధం జరిగితీరుతుంది. ఆ యుద్ధంలో నీకు ప్రకృతిసిద్ధంగా లభించిన కవచకుండలాలు ఉండటంచేత నీవు అర్జునుడికి గెలువశక్యంగానివాడవు కాగలవు. అట్లుకాక నీవు కవచకుండలాలను కోలుపోతే నీకు మిక్కుటమైన ఆపద ఏర్పడుతుంది' అని సూర్యుడు చెప్పగా కర్ణుడు ఈవిధంగా సమాధాన మిచ్చాడు.

**మ.** **'కరుణామూర్తివి నీవు సంతతము భక్తశ్రీసమాధానత**
**త్పరచిత్తుండవు గావునం గడఁగి నాపై మక్కువం బద్మినీ**
**వర! మే లానతి యిచ్చి తింకొకటి దేవా! నిన్నుఁ బ్రార్థించెదం;**
**గరుణన్ నా ప్రతికూలదుర్లపిత వాక్యంబుల్ సహింపం దగున్. 302**

**ప్రతిపదార్థం:** దేవా!= ప్రభూ!; పద్మినీవర!= తామరతీగకు వల్లభుడవైనవాడా, ఓ సూర్యభగవానుడా!; కరుణామూర్తివి= దయయే ఆకారంగా రూపొందినవాడవు; నీవు= నీవు; సంతతమున్= ఎల్లప్పుడును; భక్తశ్రీ సమాధాన, తద్+పర, చిత్తుండవు= నిన్ను ఆరాధించేవారికి శోభ కూర్చటంలోనే నిమగ్నమైన మనస్సు కలవాడవు; కావునన్= కాబట్టి; కడఁగి= పూనిక వహించి; నాపైన్= నామీద; మక్కువన్= వాత్సల్యం చొప్పున; మేలు= శ్రేయం; ఆనతి+ఇచ్చితి(వి)= దయతో చెప్పావు; ఇంకన్+ఒకటి=

ఇక ఒకటి; నిన్నున్= నిన్ను; ప్రార్థించెదన్= కోరెదను; కరుణన్= దయతో; నాప్రతికూల, దుర్లపిత, వాక్యంబుల్= నేను చెప్పే ఎదురుమాటలు చెడ్డవి; సహింపన్+తగున్= ఓర్చుకొన తగును.

**తాత్పర్యం:** దేవా! పద్మినీవల్లభా! ఓ సూర్యభగవానుడా! నీవు మూర్తీభవించిన దయవు. ఎల్లప్పుడు భక్తుల మేలు కోరి వారికి శోభ చేకూర్చటంలోనే నిమగ్నమయిన మనస్సు కలవాడవు. నామీద వాత్సల్యం చొప్పున నాశ్రేయస్సునుగూర్చి నీవు దయతో హితోపదేశం చేశావు. అయినను నిన్ను ఇంకొకటి అర్థిస్తున్నాను. నీమాటకు ఎదురుచెప్పే నా దుర్భాషల్ని మన్నించ వేడికోలు.

**క. అనృతమున కెంత వెఱతును । విను మంతకునకును నంత వెఱవ; మును వహిం**
**చినవ్రతము విడిచి దుర్గతిఁ । జనఁ జాలుదు నయ్య! నన్నుఁ జనునే మాన్పన్? 303**

**ప్రతిపదార్థం:** అనృతమునకున్= అసత్యానికి; ఎంత వెఱతును= ఎంతగా భయపడతానో; వినుము= అవధరించుము; అంతకునకునున్= యముడికికూడ; అంత వెఱవన్= అంతగా భయపడను; మును= ఇంతకుముందు; వహించిన వ్రతమున్= పూనిన నోమును విడిచి; దుర్గతిన్= చెడుమార్గంలో; చనన్+చాలుదునయ్య= నడువగలుగుదునా? (నడువలేను సుమా); నన్నున్= నన్ను; మాన్పన్+చనునే (ఆ వ్రతమునుండి); ఆపటం భావ్యమా? (భావ్యం కాదు);

**తాత్పర్యం:** దేవా! అవధరింపుము. అసత్యానికి భయపడినట్లుగా, నేను యముడికి కూడా భయపడను. ముందు పూనిన నోమును విడిచి ఇపుడు చెడుమార్గంలో నడువజాలను. నన్ను సద్వ్రతంనుండి మరల్చటం పాడికాదు.

**వ. అర్జునుండు దుర్జయుం డని చూడవలవదు, నీవును మదీయంబు లగు దివ్యాస్త్రంబు లెఱుంగుదు; జామదగ్న్యుండును ద్రోణుండును నాకు నొసంగినదివ్యాస్త్రంబు లల్పంబులు గావు, గావున నవశ్యంబును సమరంబున నమరరాజనందనుం దెగటార్పనోపుదు; నీ వింక నొండు దలంపక నాకు ననుజ్ఞ యి' మ్మనిన నొక్కింత విచారించి యాదేవుండు రాధేయున కి ట్లనియె. 304**

**ప్రతిపదార్థం:** అర్జునుండు= అర్జునుడు; దుర్జయుండు+అని= గెలువరానివాడని; చూడన్వలవదు= తలపోయవద్దు; నీవును= నీవుకూడా; మదీయంబులు+అగు= నావైన; దివ్య+అస్త్రంబులు= దేవతామహిమ గల ఆయుధాలు; ఎఱుంగుదు(వు)= తెలియుదువు; జామదగ్న్యుండును= జమదగ్నికొడుకు పరశురాముడున్నూ; ద్రోణుండును= ద్రోణుడున్నూ; నాకున్+ఒసంగిన= నాకు ఇచ్చిన; దివ్య+అస్త్రంబులు= దేవతామహిమ కల బాణాలు; అల్పంబులు+కావు= తక్కువైనవి కావు; కావునన్= కాబట్టి; అవశ్యంబును= తప్పనిసరిగా; సమరంబునన్= యుద్ధంలో; అమరరాజనందనున్= దేవేంద్రుడికుమారుడిని-అర్జునుడిని; తెగటార్పన్+ఓపుదున్= సంహరించ జాలుదును; నీవు= నీవు; ఇంకన్= ఇక మీద; ఒండు+తలంపక= వేరొకటి ఆలోచించక; నాకున్= నాకు; అనుజ్ఞ+ఇమ్ము= ఆనతి దయచేయుము; అనినన్= అని (కర్ణుడు) వచించగా; ఒక్క+ఇంత= ఒకకొంత (తడవు); విచారించి= ఆలోచించి; ఆ దేవుండు= ఆ దేవుడు, సూర్యభగవానుడు; రాధేయునకున్= రాధకొడుకుకు - కర్ణునికి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఓ సూర్యదేవా! అర్జునుడు గెలువరానివాడని నిర్ణయించకుము. నా వద్దనున్న దివ్యాస్త్రాలను గూర్చి నీకు కూడా తెలియును. పరశురాముడు ద్రోణుడు నాకు ఇచ్చిన దివ్యాస్త్రాలు తక్కువ అయినవి కావు. కావున యుద్ధంలో నేను అర్జునుడిని సంహరించటం తథ్యం. నీవు వేరే ఆలోచనలు చేయక నన్ను ఆశీర్వదించుము' అని కర్ణుడు అన్నాడు. సూర్యుడు కొంతతడవు యోచించి కర్ణుడికి ఈవిధంగా చెప్పాడు.

సూర్యుఁడు గర్ణునితో నింద్రుచే శక్తిఁ గైకొను మని సెప్పుట (సం. 3-286-14)

**తే.** **'ఎల్లభంగుల నిశ్చయం బిదియ యేని । వత్స! విను మింక నొక్కటి; వాసవునకుఁ**
**గలదు దారుణంబును నమోఘంబు నైన । శక్తి; యది నీకు నడుగుము సవినయముగ.** **305**

**ప్రతిపదార్థం:** వత్స!= నాయనా కర్ణ!; ఎల్ల, భంగులన్= అన్నివిధాల; నిశ్చయంబు= నిర్ణయం; ఇది+అ= ఇదియే; ఏని= అయితే; ఇంకన్= ఇంక; ఒక్కటి= ఒకమాట; వినుము= ఆలకించుము; దారుణంబును= భయంకరమైనదిన్నీ; అమోఘంబును= బీరువోవనట్టిదిన్నీ; ఐన= ఐన; శక్తి= శక్తి అనే ఆయుధవిశేషం; వాసవునకున్= దేవేంద్రుడికి; కలదు= ఉన్నది; సవినయముగన్= నమ్రతతో; అది= ఆ శక్తి; నీకున్= నీకు (ఇమ్మని); అడుగుము= కోరుము.

**తాత్పర్యం:** 'నాయనా, కర్ణా! దేవేంద్రుడు అడిగితే కవచకుండలాలను దానం చేయటమే నీ కృతనిశ్చయం అయితే, ఇంకొక మాట చెప్పుతాను. వినుము. దేవేంద్రుడికడ తిరుగులేని భయంకరమైన ఆయుధవిశేషం ఒకటి ఉన్నది. దానిపేరు శక్తి. నీవు వినమ్రంగా ఆ శక్తిని అడిగి తీసికొనుము.

**క.** **తొలి తొలి బలసూదనుచేఁ । జెలువుగ నాదివ్యశక్తి చేకుఱఁ గొని కుం**
**డలములుఁ గవచంబును మఱి । యలఘుమతీ! యిమ్ము భద్ర మగు నిట్లయినన్.** **306**

**ప్రతిపదార్థం:** అలఘుమతీ!= గొప్పబుద్ధి కలవాడా, కర్ణా!; తొలి తొలి= మొట్టమొదట; బలసూదనుచేన్= దేవేంద్రుడిచేతినుండి; చెలువుగన్= పొలుపుగ; ఆ దివ్యశక్తి= ఆ దివ్యమైన ఆయుధవిశేషం; చేకుఱన్+కొని= చేకూరేటట్లుగా పరిగ్రహించి; మఱి= పిదప; కుండలములు= కుండలాలు; కవచము= తనుత్రాణం; ఇమ్ము= ఒసంగుము; ఇట్లు+అయినన్= ఈ రీతిగా జరిగితే (శక్తిని నీవు గైకొంటే); భద్రము+అగున్= (నీకు) మేలు కలుగుతుంది.

**తాత్పర్యం:** మేధావి అయిన ఓ కర్ణా! మెట్టమొదట ఆయుధవిశేషమైన ఆ దివ్యశక్తిని పరిగ్రహించి, పిదప నీకవచాన్ని కుండలాలను దేవేంద్రుడికి ఇమ్ము. అప్పుడు నీకు భద్రమౌతుంది.

**ఉ.** **వైరులఁ జంపి చంపి వెస వచ్చుఁ గరంబున కాజిలోన న**
**ద్దారుణశక్తి వాసవుఁడు దానన తొల్లి సహస్రసంఖ్యలం**
**గ్రూరసురారిసంఘములఁ గూల్చె; మహాభుజ! నీకు నెమ్మి నా**
**ఘోరపు సాధనంబు దొరకొన్న నవశ్యము గెల్తు వైరులన్.'** **307**

**ప్రతిపదార్థం:** మహా+భుజ!= గొప్పపరాక్రమం కలవాడా!; ఆ+దారుణశక్తి= ఆ ఘోర 'శక్తి'; వైరులన్= శత్రువులను; చంపి, చంపి= పలుమారులు సంహరించి; వెసన్= శీఘ్రంగా; ఆజిలోనన్= యుద్ధంలో; కరంబునకున్= చేతికి; వచ్చున్= అరుదెంచును; వాసవుఁడు= దేవేంద్రుడు; తొల్లి= పూర్వం; దానన్+అ= దానివలననే, ఆశక్తి అనే ఆయుధవిశేషంచేతనే; క్రూర, సుర+అరి, సంఘములన్= భయంకరులైన రాక్షసుల సమూహాలను; సహస్రసంఖ్యలన్= వేనకు వేలు; కూల్చెన్= సంహరించాడు; నీకున్= నీకు; ఆఘోరము+సాధనంబు= ఆ భయంకరమైన ఆయుధం; నెమ్మిన్= ఒప్పిదంగా; దొరకొన్నన్= లభించితే; వైరులన్= శత్రువులను; అవశ్యం= తప్పకుండా; గెల్తు(వు)= జయించగలవు.

**తాత్పర్యం:** ఆ భయంకరమైన ఆయుధవిశేషం 'శక్తి' యుద్ధంలో శత్రువులను పలుమారులు సంహరించి శీఘ్రంగా మరల మరల చేతికి చేరుతూ ఉంటుంది; ఆ ఆయుధంచేత పూర్వం వేనకువేలమంది భయంకరరాక్షసులను

దేవేంద్రుడు సంహరించి ఉన్నాడు. పరాక్రమవంతుడ వైన ఓకర్ణా! నీకు ఆ భయంకరమైన ఆయుధం 'శక్తి' లభిస్తే శత్రువులను సులువుగా జయించగలవు'.

**వ. అని చెప్పి కమలహితుం డంతర్హితుం డయ్యెః కర్ణుండును వాసవురాక కెదురుసూచుచుండెః ననిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 308**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వచించి; కమలహితుండు= సూర్యుడు; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యుడు అయ్యాడు; కర్ణుండును; వాసవురాకకున్= దేవేంద్రుడి ఆగమనానికి; ఎదురుచూచుచున్+ఉండెన్= నిరీక్షిస్తూ ఉన్నాడు; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; జనమేజయుండు; వైశంపాయనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చెప్పి సూర్యుడు అంతర్ధానం చెందాడు. కర్ణుడు దేవేంద్రుడిరాకకై నిరీక్షిస్తూ ఉన్నాడు - అని చెప్పగా విని జనమేజయుడు వైశంపాయనుడితో ఈ విధంగా అన్నాడు.

**మధురాక్కర**

**'కలదు దేవగుహ్యం బని కమలబాంధవుఁడు గర్ణుఁ**
**బలికె నని చెప్పిః తది యెద్ది? బలియుఁ డా సూతజుండు**
**లలితకవచంబు మణికుండలములు నెమ్మెయిఁ బడసె?**
**వెలయ నివ్విధమంతయు వివరింపవలయు నాకు.' 309**

**ప్రతిపదార్థం:** కమలబాంధవుఁడు= సూర్యుడు; దేహగుహ్యంబు= దేవతలకు సంబంధించిన రహస్యం; కలదు= ఉన్నది; అని= అంటూ; కర్ణున్= కర్ణుడితో; పలికెన్= చెప్పాడు; అని చెప్పితి(వి)= అని చెప్పావు; అది= (ఆ దేవరహస్యం); ఎద్ది= ఏది?; బలియుఁడు= బలవంతుడు; ఆ సూతజుండు= ఆ సూతుడికొడుకు-కర్ణుడు; లలితకవచంబు= మనోహరమైన తనుత్రాణం; మణికుండలములున్= మణులతో పొదగబడిన చెవిపోగులు; ఏ+మెయిన్= ఏరీతిగా; పడసెన్?= పొందాడు?; ఈ+విధము+అంతయున్= ఈరీతి సమస్తం; వెలయన్= ప్రస్ఫుటం అయ్యేటట్లుగా; నాకున్= నాకు; వివరింపన్వలయున్= విస్తరించి తెలుపవలెను.

**తాత్పర్యం:** ఏదో దేవరహస్యం కలదని కర్ణుడితో సూర్యుడు చెప్పి ఉన్నాడని నీవు చెప్పావు. ఆ రహస్యం ఏది? బలవంతుడైన ఆ సూతసుతుడు కర్ణుడు ఆ కవచకుండలాలను ఏవిధంగా సంపాదించాడు? ఈ విషయాలను తేటతెల్లంగా నాకు తెలుపగోరుతాను.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడు. ఆరణ్యం: 6-352 విశేషాంశం.

**వ. అనిన వైశంపాయనుం 'డదియంతయుం జెప్పెద విను' మని యిట్లనియెఁ; దొల్లి కుంతిభోజు నింటికి దుర్వాసుం డతిథియై వచ్చి వానిచేత సత్కృతుండై 'నాకు నీయింటఁ గొంతకాలంబు వసియింప నిష్టం బైనది; నాయున్నంత కాలంబును నీవును నీయనుచరులును నిర్వ్యాజం బగు భక్తి సేయవలయు; ని ట్లోపుదే?' యనుటయు నొడంబడి యతండు దన కూఁతుం బృథ యను కన్యం బిలిచి యమ్మహామునిం జూపి.310**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (జనమేజయుడు) పల్కగా; వైశంపాయనుండు; అది= (ఆకథ); అంతయున్= సమస్తం; (ఆ దేవరహస్యగాథను); చెప్పెదన్= తెలుపుతాను; వినుము= ఆలకించుము; అని= అని వచించి; ఇట్లు+అనియెన్; తొల్లి= పూర్వం; కుంతిభోజు+ఇంటికిన్= కుంతిభోజుడి గృహానికి; దుర్వాసుండు; అతిథి+ఐ= అతిథియై వచ్చి= అరుగుదెంచి; వానిచేతన్= కుంతిభోజుడిచేత; సత్కృతుండు+ఐ= సమ్మానించబడినవాడై; నాకున్= నాకు; నీయింటన్= ఓ కుంతిభోజమహారాజా నీ గృహంలో; కొంతకాలంబు= కొన్నినాళ్లు; వసియింపన్= నివసించాలని; ఇష్టంబు+ఐనది= కోరిక కలిగింది; నా+ఉన్న+అంత, కాలంబును= నేను ఉన్న సమయంమేరకు; నీవును= నీవున్నూ; నీ+అనుచరులును= నీ సేవకులున్నూ; నిర్వ్యాజంబు+అగు= సహజమైన (ఎట్టికారణాలు లేకుండగా); భక్తి+చేయవలయున్= పూజ్యభావం చూపాలి; ఇట్లు+ఓపుదు(వు)+ఏ?= ఈరీతిగా నీవు చేయగలవా?; అనుటయున్= అని అనగానే; అతండు= అతడు, కుంతిభోజుడు; ఒడంబడి= అంగీకరించి; తనకూఁతున్= తన పుత్రికను; పృథ+అను, కన్యన్= పృథ అనే పేరుకల పెండ్లికానిది అయిన లేత జవరాలను; పిలిచి= దగ్గరకు రప్పించి; ఆ, మహా+మునిన్+చూపి= ఆ మహానుభావుడిని చూపి.

**తాత్పర్యం:** అని జనమేజయుడు అడుగగా- వైశంపాయనుడు, 'దాని నంతటిని సవిస్తరంగా చెప్పగలను; ఆలకించుము' అని ఈ విధంగా పలికాడు: పూర్వం కుంతిభోజుడిగృహానికి దుర్వాసమహర్షి అతిథిగా ఏతెంచాడు. కుంతిభోజుడు ఆ మునిని పూజించాడు. దుర్వాసుడు, 'ఓమహారాజా! నాకు నీ గృహంలో కొన్నినాళ్లు నివసించవలెనని కోరిక కలిగింది. నేను ఉన్నంతకాలం నీవున్నూ నీ సేవకులున్నూ ఎట్టి ప్రతిఫలాన్ని ఆశించకుండా సహనంతో నాకు పరిచర్య చేయగలరా? చెప్పుము' అని అడిగాడు. అందుకు కుంతిభోజుడు సమ్మతించి, తన పుత్రిక, పెండ్లికాని బాలను పృథ అనే కన్యకను పిలిచి ఆ మహామునిని చూపి ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** (1) కుంతిభోజుడు పృథను పెంచుకొనిన యాదవభూపతి. (2) అతిథి- తిథివారనక్షత్రాలు లేకుండ పయనించే బాటసారి అని మొట్టమొదటి అర్థం. తదుపరి- అతిథి అనగా స్వాగతసత్కారాలను కోరి గృహస్థులను చేరే బాటసారి - అనే అర్థం ఏర్పడింది. గృహస్థుల ఆహ్వానంచొప్పున వచ్చినవాడు 'అతిథి' అని - ఆహ్వానం లేకుండ వచ్చేవాడు 'అభ్యాగతుడు' అనే వివక్ష ఏర్పడింది. భారతీయసంస్కృతిలో గృహస్థులకు అతిథిపూజ, అభ్యాగతసేవ ప్రాముఖ్యాన్ని వహించాయి. "అతిథిదేవోభవ" - "అభ్యాగతఃస్వయంవిష్ణుః" అనే సుభాషితాలు ప్రాచీన భారతీయసంస్కృతిలో అభ్యాగతులకు అతిథులకు గల ప్రాముఖ్యాన్ని వెల్లడిస్తున్నవి. (3) దుర్వాసుడు- శీఘ్రకోపనుడుగా పౌరాణికవాఙ్మయంలో సుప్రసిద్ధుడైన ఋషివరేణ్యుడు.

**ఉ.** **'దేవసమానుఁ డీ ధరణిదేవుఁడు; వేడుక మద్గృహంబునం**
**దా వసియింపఁ గోరుటయు, దానికి నేనును నియ్యకొంటి, నిం**
**దీవరనేత్ర! నీవుఁ గడుధీరవు, సద్వినయోపచారసం**
**భావితవృత్త; వట్లగుట భక్తి భజింపుము బ్రాహ్మణోత్తమున్.** **311**

**ప్రతిపదార్థం:** ఇందీవరనేత్ర!= నల్లకలువల వంటి కన్నులు కలదానా, ఓపృథాకుమారీ!; ఈ ధరణిదేవుఁడు= ఈబ్రాహ్మణుఁడు; దేవసమానుఁడు= దేవతలతో సమానుడు; వేడుకన్= ప్రీతితో; మత్+గృహంబునన్= మనయింటిలో; తాన్= తాను; వసియింపన్+కోరుటయున్= ఉండవలెనని ఆశించటం; దానికిన్= అందుకు; నేనునున్= నేనున్నూ; ఇయ్యకొంటిన్= సమ్మతించాను; నీవున్= నీవు; కడున్= మిక్కిలి; ధీరవు= ధైర్యవంతురాలవు; సత్+వినయ+ఉపచార, సంభావితవృత్తవు= మంచి నమ్రతతో కూడిన పరిచర్య చేయటానికి ఆలోచించే శీలం కలదానవు; అట్లు+అగుటన్= అందుచేత; భక్తిన్= పూజ్యభావంతో; బ్రాహ్మణ+ఉత్తమున్= విప్రులలో శ్రేష్ఠుడు అయినవాడిని, దుర్వాసుడిని; భజింపుము= సేవించుము.

**తాత్పర్యం:** ఈ బ్రాహ్మణుడు దేవతలతో సరితూగకలవాడు. ప్రీతితో మనగృహంలో నివసించటానికై కోరాడు. నేను గూడ సమ్మతించాను. నల్లకలువలవంటి నేత్రాలు గలదానా! ఓపృథాకుమారీ!; నీవు మిక్కిలి ధైర్యవంతురాలవు. అణకువతో పరిచర్యచేయగల అభిరుచి అభినివేశం కలదానవు. విప్రులలో శ్రేష్ఠుడైన ఈ దుర్వాసమహర్షినిసేవించుము.

**క. ఇతఁ డెత్తఱి నెయ్యది స । మ్మతిఁ గోరిన నది ఘటించి మచ్చిక నిడి తో**
**షితుఁ జేయు మిమ్మహాత్ముని । మతి యలుగక యుండవలయు మానిని! యెపుడున్. 312**

**ప్రతిపదార్థం:** మానిని!= అభిమానం కలదానా, ఓపృథాకుమారీ!; ఇతఁడు= ఈ దుర్వాసుడు; ఏతఱిన్= ఏవేళను; ఎయ్యది= (ఏ+అది)= దేనిని; కోరినన్= వాంఛిస్తే; అది= ఆ కోరిక; ఘటించి= సమకూర్చి; మచ్చికన్+ఇడి= ప్రీతితో ఒసంగి; తోషితున్+చేయుము= సంతృప్తి నందినవాడినిగా చేయుము; ఈ+మహా+ఆత్ముని, మతి= ఈమహానుభావుడియొక్క మనస్సు; ఎపుడున్= ఎప్పుడును, అలుగక ఉండన్‌వలయున్= కోపం చెందక ఉండవలయును.

**తాత్పర్యం:** ఓ పృథాకుమారీ! ఈ మహానుభావుడు, ఏ సమయంలో ఏ కోరిక కోరితే ఆ కోరికను వెంటనే తీర్చుము. సదా ఆతడు సంతృప్తి చెంది ఉండేటట్లుగా చూడుము. ఆతడు కోపించకూడదు సుమా.

**ఆ. వినుము విప్రవరులు వెడవెడఁ గినిసిరే । నియును ధరణి యెల్ల నీఱు సేయఁ**
**జాలుదురు తపఃప్రశస్తులు దుర్వార । తేజు లెందు నధికధీరమతులు. 313**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకింపుము; తపఃప్రశస్తులు= (తపస్+ప్రశస్తులు=) తపస్సుచేయటంచేత గొప్పవారు; దుర్వార, తేజులు= వారించుటకు శక్యం కాని తేజస్సు కలవారు; ఎందున్= ఎచటనైనను; అధిక, ధీరమతులు= మిక్కుటమైన ధైర్యంతో కూడిన బుద్ధికలవారు అగు, విప్రవరులు= బ్రాహ్మణోత్తములు; వెడవెడన్= కొంచెముగా నైనా; కినిసిరి+ఏనియును= కోపగిస్తే చాలు; ధరణి+ఎల్లన్= భూమిని అంతటిని; నీఱు+చేయన్+చాలుదురు= బూడిద చేయ జాలుదురు;

**తాత్పర్యం:** సావధానంగా ఆలకించుము. లేశమాత్రమైనా విప్రవరులు ఆగ్రహంచెందితే ఈభూగోళం సమస్తాన్ని బూడిదచేయగలశక్తి కలవారు. వారు తపస్సు చేయటంచేత గొప్పవారు; వారించటానికి వీలులేని తేజస్సు కలవారు; మిక్కుటమైన ధైర్యంతో కూడిన తెలివితేటలు కలవారు.

**క. భూదేవపరాభవమునఁ । గాదే వాతాపిదండక ప్రభృతులు పెం**
**పేది చెడిరి; భూదేవస । మాదరమునఁ గాదె బ్రదికినవి యిజ్జగముల్. 314**

**ప్రతిపదార్థం:** భూదేవపరాభవమునన్+కాదు+ఏ= బ్రాహ్మణులను అవమానించటంచేతనే కదా; వాతాపి, దండక, ప్రభృతులు= వాతాపి, దండకుడు మున్నగువారు; పెంపు+ఏది= ఔన్నత్యం తరిగి; చెడిరి= నశించారు; ఈ+జగముల్= ఈ లోకాలు; భూదేవ, సమ్+ఆదరమునన్+కాదె= బ్రాహ్మణులను బాగా ఆదరించటంచేతనే కదా; బ్రదికినవి= జీవించాయి.

**తాత్పర్యం:** బ్రాహ్మణులను అవమానించటంచేతనే కదా వాతాపి దండకుడు మున్నగువారు తమఔన్నత్యాన్ని కోలుపోయి నశించారు. బ్రాహ్మణులను ఆదరించటంచేతనేకదా ఈ లోకాలు బ్రదికాయి.

**విశేషం:** (1) అగస్త్యమహాముని ఇల్వలుడి ఆతిథ్యం స్వీకరించి అతడు 'వాతాపి' అనే తన తమ్ముడిని చంపి నరమాంసాన్ని వడ్డించగా, గ్రహించి వాతాపిని జీర్ణంచేసికొన్నాడు. ఇల్వలుడు తమ్ముడిని సంహరించి నరమాంసాన్ని తెలియని అతిథులకు

వడ్డించి వారు ఆరగించిన పిదప 'వాతాపీ'! రమ్ము' అని పిలిచేవాడట. అతిథిపొట్ట చీల్చుకొని పునరుజ్జీవితుడై వాతాపి బయల్వెడలేవాడట. పిదవ ఇరువురు అన్నదమ్ములును - అతిథిమాంసాన్ని కమ్మగా భుజించేవారట. ఈ పన్నాగం అగస్త్యమహర్షిదగ్గర పారలేదు.

**సీ.** **పసిబిడ్డ వయ్యును బడఁతి! నీ వెంతయు । గుణవంతురాలవు గురులయందుఁ**
**బెద్దలయందును బృథివీసురులయందుఁ । గడుభక్తి సేయుదు కమలనయన!**
**బంధులుఁ జెలులు సంబంధిజనంబులుఁ । బురమువారలు నంతిపురమువారుఁ**
**బూఁబోఁడి! నిను నెమ్మిఁ బొగడనివారు లే; । రేమని వర్ణింతు నేను నిన్ను?**

**తే.** **యదుకులంబునఁ బుట్టి యత్యంతసౌఖ్య । మమరఁ బెరిఁగితి నాపుత్త్రి వై, త్రిలోక**
**సుందరము రూపు, ప్రాయంబు సొంపు, నిట్టి । దిచ్చరిత్రంబు సతులకు నెందుఁ గలదు? 315**

**ప్రతిపదార్థం:** పడఁతి= ఓపృథా దేవీ!; నీవు= నీవు; పసిబిడ్డవు+అయ్యును= చిన్నపిల్లవు అయినను; ఎంతయున్= మిక్కిలి; గుణవంతురాలవు= మంచిగుణాలు కలిగినదానవు; కమలనయన!= పద్మాలవంటి కన్నులు కలదానా, పృథాకుమారీ!; గురుల, అందున్= ఒజ్జలపట్ల; పెద్దల, అందును= వయసుమళ్ళినవారిపట్లను; పృథివీసురుల, అందున్= బ్రాహ్మణులపట్ల; కడున్= మిక్కిలి; భక్తి+చేయుదు(వు)= పూజ్యభావాన్ని చూపుతావు; పూఁబోఁడి= పువ్వువలె మనోహరమైన దేహంకలదానా!; బంధులున్= చుట్టాలూ; చెలులున్= సఖులూ; సంబంధిజనంబులున్= కావలసినవారును; పురమువారలున్= పౌరులూ, అంతిపురమువారున్= అంతఃపురంలోనివారున్నూ; నినున్= నిన్ను; నెమ్మిన్= అనురాగంతో; పొగడనివారు= ప్రశంసించనివారు; లేరు= లేరు; ఏను= నేను; నిన్నున్= నిన్ను; ఏమి+అని, వర్ణింతున్= నిన్ను ఏవిధంగా పొగడగలను; యదుకులంబునన్= యాదవవంశంలో పుట్టి= ఉద్భవించి; అత్యంతసౌఖ్యము= గొప్పభోగం; అమరన్= విలసిల్లగా; నాపుత్త్రివి+ఐ= నా కూతురువై; పెరిఁగితి(వి)= అభివృద్ధి చెందావు; రూపు= నీ రూపము; ప్రాయంబు= వయసు; సొంపు= శోభ; త్రిలోకసుందరము= మూడులోకాలలోను సుందరమైనది; ఇట్టిది= ఇటువంటిదైన; ఈ+చరిత్రంబు= ఈ నడవడిక; సతులకున్= ఆడువారికి; ఎందున్= ఎక్కడ; కలదు?= ఉన్నది?

**తాత్పర్యం:** ఓ పృథాకుమారీ! నీవు వయసున చిన్నపిల్లవే కాని, గొప్పగుణాలు కలదానవు. ఒజ్జలయందు పెద్దలయందు బ్రాహ్మణులయందు మిక్కిలిపూజ్యభావం చూపుతుంటావు. పద్మాలవంటికన్నులుకలదానా! చుట్టాలు నెచ్చెలులు పరిజనాలు నగరంలోనివారు, నగరిలోపలివారు నిన్ను ప్రశంసించనివారు లేరు. పూవువలె సుకుమారమైన శరీరం కలదానా!, నేను నిన్ను ఏరీతిగా అభినందించగలను? యాదవవంశంలో జన్మించి నాపుత్రికవై నీవు సకలభోగభాగ్యాలతోనూ పెరిగావు. త్రిలోకసుందరమైనది నీరూపం. లేజవ్వనపు సొగసుతో ఒయ్యార మొలికెడి ఇట్టిచరిత్ర ఆడుపిల్లలలో ఎచట కన్పిస్తుంది?

**విశేషం:** నీ చరిత్రంబు సతులకు నెందుగలదు? - అకాడమీ ప్రతిలోని ఈ పాదంలో యతి భంగం జరిగింది, అందుచేత తెలుగు విశ్వవిద్యాలయం ప్రతిలోను, రామా అండ్ కో వారి ప్రతిలోను ఉన్న "ఇచ్చరిత్రంబు సతులకు నెందుగలదు?" అనే పాఠం స్వీకరించబడింది.

**వ.** **నీగౌరవం బంతయు నెఱింగి కాదె వహ్నిసమానుండైన యీ మహాముని నారాధించుటకు నీయందు భారం బెక్కించెద; నీవును దర్పంబును నహంకారంబును దూరంబున నిడి యిప్పుణ్యపురుషుం బరితుష్టుం జేసి కృతార్థతం బొందు' మనిన నక్కన్య యి ట్లనియె. 316**

**ప్రతిపదార్థం:** నీగౌరవంబు+అంతయున్= నీగొప్పతనాన్ని సమస్తమున్నూ; ఎఱింగి+కాదు+ఎ= తెలిసియే కదా; వహ్ని, సమానుండు+ఐన= నిప్పుతో తుల్యుడైన; ఈ మహామునిన్= ఈ మహర్షిని; ఆరాధించుటకున్= అర్చించటానికి, సపర్యచేయటానికి; నీయందున్= నీమీద; భారంబు= బరువు; ఎక్కించెదన్= మోపెదను; నీవును= నీవున్నూ; దర్పంబును= గర్వంబును; అహంకారంబును= స్వాతిశయాన్ని; దూరంబునన్+ఇడి= దవ్వుల పెట్టి; ఈ+పుణ్య, పురుషున్+పరితుష్టున్+చేసి= ఈ పుణ్యాత్ముడిని సంతోషించిన వాడినిగా ఒనర్చి; కృతార్థతన్+పొందుము= ధన్యత్వాన్ని అనుభవించుము; అనినన్= అని (కుంతిభోజుడు) చెప్పగా; ఆ+కన్య= పృథాకుమారి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'ఓపృథాకుమారీ! నీకు నీగొప్పతనం చాకచక్యాలు అనుభవామ్రేడితాలు. అందుచేతనే నిప్పుతో తుల్యుడైన ఈ మహర్షిని అర్చించి శుశ్రూషసల్పటానికై నిన్ను ఎన్నికచేసి ఆ భారాన్నంతటినీ నీపై మోపాను. నీవు గర్వాన్నీ స్వాతిశయాన్నీ సంపూర్ణంగా విడనాడి ఈ మహానుభావు డైన దుర్వాసుడిని సంతోషింపచేసి నీవు ధన్యురాలవు కమ్ము' అని కుంతిభోజుడు చెప్పగా ఆ కన్య పృథాకుమారి ఇట్లా బదులు పలికింది.

**ఉ. 'కోరుదు నేను విప్రతతిఁ గొల్వఁగ నెప్పుడు నాత్మలోన; నా**
**కోరినకోర్కి నేఁడు దలకూడె; నరేశ్వర! యట్లుఁ గాక నీ**
**కోరినయట్టి యవ్విధము గోరి యొనర్చుట నాదుభాగ్యసం**
**భారము గాదె! యూఱడుము భారము నాపయిఁ బెట్టి నెమ్మదిన్.' 317**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= రాజా, ఓకుంతిభోజమహారాజా!; విప్రతతిన్= బ్రాహ్మణుల సమూహాన్ని; కొల్వఁగన్= సేవచేయటానికి; ఎప్పుడున్= ఎల్లప్పుడును; ఆత్మలోనన్= మనస్సులో; ఏను= నేను; కోరుదున్= ఆకాంక్షిస్తాను; నాకోరినకోర్కి= నేను కోరినట్టికోరిక; నేఁడు= ఈ రోజున; తలకూడెన్= సమకూరింది; అట్లున్+కాక= అట్లుకానిచో; నీకోరిన+అట్టి= నీవు అభిలషించిన; ఆ+విధము= ఆ రీతి; కోరి= మనసుపడి; ఒనర్చుట= చేయటం, నా+భాగ్య సంభారము+కాదు+ఎ= నాయొక్క అదృష్టయోగ భారంకాదా; భారమున్= బరువును, నాపయిన్+పెట్టి= నామీద మోపి; నెమ్మదిన్= (నెఱ+మదిన్=) నిండుచిత్తంతో; ఊఱడుము= విశ్రాంతి నందుము.

**తాత్పర్యం:** 'ఓ కుంతిభోజమహారాజా! బ్రాహ్మణులకు పరిచర్యచేయవలెనని ఎల్లప్పుడూ నేను నామదిలో ఉవ్విళ్ళూరుతుంటాను. ఈ నాటికి నాచిరకాలవాంఛ ఈడేరింది. అట్లుగాకపోయినా నీవు అభిలషించిన రీతిగా పూని అట్టిపనిని నెరవేర్చగలగటం నా అదృష్టయోగం కదా! బరువు నామీద మోపి, తండ్రీ! నీవూ ఊరటచెందుము'.

**వ. అనిన సంతసిల్లి కుంతిభోజుండు దుర్వాసున కక్కన్నియం జూపి యి ట్లనియె. 318**

**తాత్పర్యం:** అనగా విని కుంతిభోజుడు సంతోషించి, దుర్వాసుడికి ఆ కన్యను చూపి ఇట్లా అన్నాడు.

**క. 'ఈ పిన్నది నాకూఁతురు। తాపసజనముఖ్య! మిమ్ముఁ దాఁ గొలువంగా**
**నోపుదు నని పూనెం బసి। పాపసుఁడీ! కినుక లేక పని గొనవలయున్. 319**

**ప్రతిపదార్థం:** ఈ పిన్నది= ఈ చిన్నది; నాకూఁతురు= నా పుత్రిక; తాపసజనముఖ్యా= ఋషులలో శ్రేష్ఠుడా! ఓ దుర్వాస మహర్షీ; తాన్= తనంతట తాను; మిమ్మున్= మిమ్ము; కొలువంగాన్+ఓపుదున్+అని= సేవించజాలుదు నని; పూనెన్= పూనుకొన్నది; పసిపాప+చుఁడీ= ఈమె మిక్కిలి చిన్నపిల్ల సుమా; కినుక లేక= కోపం లేకుండా; పని, కొనవలయున్= సేవ చేయించుకొనవలెను.

**తాత్పర్యం:** 'ఋషివరేణ్యులలో ముఖ్యుడవైన దుర్వాసమహామునీ! ఈ కన్యక కడుపసిబిడ్డ; నాకూతురు. ఈమె తనంతట తానై తమకు పరిచర్య చేయగలనని ముందుకు వచ్చింది. తాము కరుణతో కినుక లేకుండా ఆమె సపర్యల నందుకొన ప్రార్థన.

**కుంతి దుర్వాసునకుఁ బరిచర్య సేయుట (సం. 3-288-12)**

**చ. ఎఱుఁగక తప్పుగా మెలఁగె నేనియు దానికి సైఁచి నేరుపుల్**
**గఱపి ప్రియంబుతోఁ గొలువు గైకొనఁగాఁ దగు మీకు; బాలురుం**
**దెఱవలు వృద్ధులుం దమకుఁ దెల్లము దప్పులు సేసిరేనియున్**
**మఱతురుగాని యల్గరు సమగ్రశమాన్వితు లైన తాపసుల్. 320**

**ప్రతిపదార్థం:** ఎఱుఁగక= తెలియక; తప్పుగాన్= దోషంగా; మెలఁగెన్+ఏనియున్= ప్రవర్తించినప్పటికి; దానికిన్ సైఁచి= అందుకు సహించి; నేరుపుల్; కఱపి= సమర్థతలను బోధించి; ప్రియంబుతోన్= ప్రీతితో; కొలువు+కైకొనన్+కాన్= సేవలు స్వీకరించటం; మీకున్= మీకు; తగున్= ఒప్పుతుంది; బాలురున్= చిన్నపిల్లలును; తెఱవలున్= ఆడువారును, వృద్ధులున్= ముసలివారు; తమకున్+తెల్లము= తమకు తెలిసిన విషయమే కదా!; తప్పులు= దోషాలు; చేసిరి+ఏనియున్= సలిపినప్పటికిని; సమగ్ర, శమ+అన్వితులు+ఐన, తాపసుల్= పరిపూర్ణమైన శాంతంతో కూడిన మహర్షులు; మఱతురు+కాని= విస్మరిస్తారుకాని; అల్గరు= కోపించరు.

**తాత్పర్యం:** తెలియక మాఅమ్మాయి ఈ పృథాకుమారి చిన్నతనంచేత కొన్ని తప్పులు చేయవచ్చును. ఆమెను తాము క్షమించి ఆమెకు చాకచక్యంనేర్పు బోధించి ప్రీతితో సపర్యలు స్వీకరించగలరని నా విన్నపం. బాలురు ఆడువారు ముసలివారు తప్పులు చేయటం తమకు తెలిసినదే కదా! అయినను ఆతప్పులను పరిపూర్ణమైన శాంత స్వభావం కల తమవంటి తాపసులు విస్మరిస్తారు కాని కోపగించుకొనరు.

**వ. అని యప్పగించి యప్పార్థివేంద్రుండు మునీంద్రునకుఁ జంద్రికాధవళం బైన సౌధంబునందు శయనాసనప్రముఖోపకరణంబులు నభిమతాహారసాధనద్రవ్యంబులు నాయితంబులు సేయించి, తాను సంతసంబున నూఱడియుండె; నంత. 321**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; అప్పగించి= ఒప్పచెప్పి; ఆ+పార్థివ+ఇంద్రుండు= ఆ రాజశ్రేష్ఠుడు, కుంతిభోజుడు; ముని+ ఇంద్రునకున్= మునులలో శ్రేష్ఠుడు దుర్వాసుడికి; చంద్రికాధవళంబు+ఐన= వెన్నెలవలె తెల్లనిది అయిన; సౌధంబునందున్= మేడలో; శయన+ఆసన, ప్రముఖ+ఉపకరణంబులున్= పరుపులు, గద్దెలు మున్నగు సాధనాలును; అభిమత+ఆహార, సాధన, ద్రవ్యంబులున్= కావలసిన భోజన సదుపాయాలును వస్తువులును; ఆయితంబులు+చేయించి= సమకూర్చి; తాను= తాను (కుంతిభోజుడు); సంతసంబునన్= సంతోషంతో; ఊఱడి+ఉండెన్= విశ్రమించి ఉన్నాడు; అంతన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని చెప్పి కుంతిని అప్పగించి కుంతిభోజుడు దుర్వాసుడికి వెన్నెలవలె తెల్లనిది ఆయినమేడ విడిదిగా ఏర్పాటు చేశాడు. ఆమేడలో పరుపులు కుర్చీలు మున్నగు సాధనాలను, కావలసిన భోజనసదుపాయాలను, వస్తుసామగ్రినీ సమకూర్చి తాను విశ్రాంతిగా ఉన్నాడు.

క. **భావించి నాఁడునాఁటికి । వేవిధముల మిగుల భక్తివినయంబులతో**
**దేవోపచారముల భూ । దేవోత్తముఁ గొల్చెఁ గుంతిదేవి నియతయై.** **322**

**ప్రతిపదార్థం:** కుంతిదేవి= పృథాకుమారి; భావించి= చిత్తశుద్ధితో; నాఁడునాఁటికిన్= దినదినానికీ; వే+విధములన్= వేయిరీతుల; మిగుల= అతిశయించిన; భక్తి, వినయంబులతోన్= పూజ్యభావంతో, అణకువతో; దేవ+ఉపచారముల= వేలుపులకు తగిన పరిచర్యలతో; నియత+ఐ= దీక్షకలిగినట్టిదై; భూ, దేవ+ఉత్తమున్= బ్రాహ్మణశ్రేష్ఠుడిని, దుర్వాసుడిని; కొల్చెన్= సేవించింది.

**తాత్పర్యం:** కుంతీదేవి చిత్తశుద్ధితో రోజురోజుకు అనేక విధాలుగా భక్తి వినయాలతో వేలుపులకు తగిన పరిచర్యలతో దీక్షపూని ఆ బ్రాహ్మణోత్తముడైన దుర్వాసమహర్షిని సేవించింది.

సీ. **అతఁడును దద్భావ మరయంగ మదిఁ గోరి । రూపించి యొకమఱి రేప వత్తు**
**నని పోయి నడురేయి నర్థితోఁ జనుదెంచు, । రేయి వచ్చెద నని రేప వచ్చు;**
**నే ప్రొద్దు వచ్చిన నింతి యప్పుడు క్రొత్త । లుగ భక్ష్యభోజ్యాదు లొగి నమర్చి;**
**నెయ్యదిఁ గోరిన నిచ్చకురాఁ బెట్టు; । నలయదు మదినైన నలుగ దెపుడు;**

ఆ. **ననుదినంబు నధిపుఁ డాత్మజఁ బిలిచి త । ద్వర్తనంబు లడుగ వనజముఖియుఁ**
**దాను గొలుచుతెఱఁగుఁ దాపసవరునిచం । దమును జెప్పుచుండుఁ దండ్రి యలర.** **323**

**ప్రతిపదార్థం:** అతఁడును= వాఁడును (దుర్వాసుడును); తత్+భావము= ఆమెతలపు, పృథాకుమారిమనస్సు; అరయంగన్= తెలిసికొనటానికై; మదిన్= ఎడదలో; కోరి= అభిలషించి; రూపించి= నిర్ధారణ చేసికొని; ఒకమఱి= ఒకసారి; రేప= ఉదయమే; వత్తున్= వస్తాను; అనిపోయి= అని చెప్పి వెడలి; నడురేయిన్= అర్ధరాత్రి; అర్థితోన్= ప్రీతితో; చనుదెంచున్= వస్తాడు; రేయి= రాతిరి; వచ్చెదన్+అని= వస్తాను అని చెప్పి; రేప= ప్రాతఃకాలం; వచ్చున్= వస్తాడు; ఏప్రొద్దు= ఏసమయంలో (దుర్వాసుడు); వచ్చినన్= చనుదెంచినప్పటికి; ఇంతి= పడతి, కుంతి; అప్పుడు+అ= ఆ సమయంలోనే; క్రొత్తలుగన్= క్రొత్తక్రొత్తగా, తాజాగా; భక్ష్య, భోజ్య+ఆదులు= తినుబండారాలు; ఒగిన్= ఒప్పిదంగా; అమర్చి= సమకూర్చి; ఎయ్యదిన్= (ఏ+అదిన్)= దేనిని; కోరినన్= అభిలషించినా; ఇచ్చకున్, రాన్+పెట్టున్= (అతడి) ఇష్టానికి సరిపోయేటట్లే సమకూరుస్తుంది; అలయదు= అలసట చెందదు; మదిన్+ఐనన్= మనస్సులోకూడా; ఎపుడున్= ఏసమయంలో; అలుగదు= కోపగించదు; అనుదినంబున్= ప్రతిరోజూ; అధిపుఁడు= రాజు, కుంతిభోజుడు; ఆత్మజన్= కూతురిని, కుంతిని; పిలిచి= రప్పించి; తత్+వర్తనంబులు= ఆతడియొక్క చర్యలు; అడుగన్= ప్రశ్నించగా; వనజముఖియున్= పద్మంవంటి మొగం కలిగింది, కుంతియును; తాను= తాను; కొలుచు, తెఱఁగున్= సేవించేతీరును; తాపసవరునిచందమును= మునిశ్రేష్ఠుడైన దుర్వాసుడితీరును; తండ్రి= జనకుడు, కుంతిభోజుడు; అలరన్= సంతోషించేటట్లుగా, చెప్పుచుండున్= చెప్తుతూఉంటుంది.

**తాత్పర్యం:** దుర్వాసుడు ఒక విచిత్రవ్యక్తి. అతడు తనమనస్సులో ఆ పృథాకుమారి ఓర్పును పరీక్షించవలెనని తలపోసి, ఆమె ఆలోచనలు తెలిసికొన కోరి, ఒకసారి 'ఉదయమే వస్తాను' అని చెప్పి అర్ధరాత్రి వస్తాడు. 'అర్ధరాత్రి వస్తా'నని చెప్పి ప్రాతఃకాలానికే వస్తాడు. దుర్వాసమహర్షి ఏ సమయంలో వచ్చినా కుంతి ఆ సమయంలోనే అప్పటి కప్పుడే చేసిన భక్ష్యభోజ్యాలను సమకూరుస్తూ ఉండేది. ఏది కోరినా, ఆతడు కోరినప్రకారంగానే ఏర్పాటు చేసేది. అలసట చెందేది కాదు. మనసులో లోలోపల కూడ కోపం పొందెడిది కాదు. ప్రతిరోజూ కుంతిభోజుడు కూతురైన పృథను పిలిచి దుర్వాసుడి ప్రవర్తనను గూర్చి అడుగుతూ ఉండేవాడు. ఆమె తాను చేసే శుశ్రూషనుగూర్చి దుర్వాసోమహర్షి ప్రవర్తించే తీరు గూర్చి వినోదంగా వివరించి చెప్పేది. కుంతిభోజుడు విని సంతోషిస్తూ ఉండేవాడు.

**విశేషం:** (1) భక్ష్యాలు తినుబండారాలు: పంచభక్ష్యాలు సుప్రసిద్ధాలు. 1. భక్ష్యం 2. భోజ్యం 3. లేహ్యం 4. చోష్యం 5. పానీయం. (2) దుర్వాసుడిశీలచిత్రణం - ప్రపంచంలో వింతప్రవర్తన కలవారు కొంతమంది ఉండవచ్చు. వారికి వారి వింతప్రవర్తన వింతగా కన్పించదు. కాని దుర్వాసుడిపాత్ర వేరు. ఆతడు బుద్ధిపూర్వకంగా ఇతరులను పరీక్షించేకొరకై వింతనడవడి పూనటం విశేషం.

**వ. అంత నొక్కసంవత్సరంబు పరిపూర్ణం బయినఁ బ్రీతుండై దుర్వాసుండు కుంతిం జూచి 'నీచేసిన యారాధనంబునకు మెచ్చితి; నభిమతంబు లిచ్చెద నడుగు' మనిన నమ్మానిని గృతాంజలియై 'మీరు నావలనం బ్రసన్ను లైతిరి; దీనికి మాతండ్రియుం గరం బలరు; నింతియ చాలు; నొం డేల?' యనిన నతం 'డట్లేని నిది యొక్కమంత్రంబు గైకొనుము; దీనంజేసి యెయ్యేని వేల్పునాహ్వానంబు సేసెద వవ్వేల్పు సనుదెంచి నీవశంబున నుండు' ననిన 'నొండన వెఱచి కుంతియుం 'బ్రసాదం' బనియె; నమ్మునీంద్రుండు దాని కమ్మంత్రంబు విధియుక్తంబుగా నుపదేశించి నిజేచ్ఛం జనియెఁ; నంతఁ గొంతకాలంబునకు. 324**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; ఒక్కసంవత్సరంబు= ఒకయేడు; పరిపూర్ణంబు+అయినన్= నిండగా; ప్రీతుండు+ఐ= సంతృప్తి చెందినవా డయి; దుర్వాసుండు; కుంతిన్+చూచి= పృథను చూచి; 'నీచేసిన= నీవు ఒనర్చిన; ఆరాధనంబునకున్= అర్చనసేవకు; మెచ్చితిన్= సంతోషపూర్వకంగా నీసామర్థ్యాన్ని గుర్తించాను; అభిమతంబులు+ఇచ్చెదన్= కోరినవరాలు ఇస్తాను; అడుగుము= వేడుము; అనినన్= అని (దుర్వాసుడు) చెప్పగా; ఆ+మానిని= పృథాకుమారి; కృత+అంజలి+ఐ= చేసిననమస్కారం కలదిఅయి, 'మీరు= మీరు, నీవు (గౌరవపూర్వకమైన బహువచనం) ఓ దుర్వాసమహర్షీ!; నావలనన్= నాయెడ; ప్రసన్నులు+ఐతిరి= సంతోషించినవారు అయినారు; దీనికిన్= ఈ రీతిగా మీరు సంతోషించినందుకు; మాతండ్రియున్= మా జనకుడును (కుంతిభోజుడును); కరంబు= మిక్కిలి; అలరున్= సంతోషిస్తాడు; ఇంతియ చాలున్= ఈ మాత్రమే సరిపోతుంది; ఒండు+ఏల?= వేరు ఒకటి ఎందుకు?'; అనినన్= అని చెప్పగా; అతండు= దుర్వాసుడు; అట్లు+ఏనిన్= అటుల అయితే (ఏవరాన్నీ నీవు కోరదలచకపోతే); ఇది+ఒక్క, మంత్రంబు= ఇదిగో ఇది ఒకమంత్రం; కైకొనుము= స్వీకరించుము; దీనన్+చేసి= దీనిచేత; ఎయ్యేనివేల్పున్= ఏదేవతనైతే; ఆహ్వానంబు+చేసెదవు= పిలుస్తావో; ఆ+వేలుపు= ఆదేవత; చనుదెంచి= వచ్చి; నీవశంబునన్= నీ అధీనంలో; ఉండున్= ఉంటాడు; అనినన్= అని చెప్పగా; ఒండు+అనన్= మారుపలకటానికి; వెఱచి= భయపడి; కుంతియున్= పృథయును; ప్రసాదంబు+అనియెన్= (నీ) అనుగ్రహం (సిద్ధించింది) అని వచించింది; ఆ+ముని+ఇంద్రుండు= ఆ ఋషివరేణ్యుడు, దుర్వాసుడు; దానికిన్= ఆమెకు (పృథాకుమారికి); ఆ+ మంత్రంబు= ఆ మంత్రం; విధియుక్తంబుగాన్= శాస్త్రంలో చెప్పబడినరీతిగా; ఉపదేశించి= చెప్పినేర్పి; నిజ+ఇచ్ఛన్= తన ఇచ్చవచ్చినట్లుగా; చనియెన్= వెళ్ళాడు; అంతన్= పిదప; కొంతకాలంబునకున్= కొన్నినాళ్లకు.

**తాత్పర్యం:** ఆ విధంగా ఒకసంవత్సరకాలం గడచింది. కుంతి చేసిన శుశ్రూషకు సంతసించి దుర్వాసుడు ఆమెతో 'నీవు చేసిన అర్చనకు నేను మెచ్చాను; నీవు కోరిన వరాలు ఇస్తాను కోరుకొనుము' అని అన్నాడు. అంత కుంతి దుర్వాసుడికి నమస్కరించి, 'మహానుభావులు మీరు నావలన సంతోషించారు. మీసంతోషంతోపాటు మాజనకుడు కుంతిభోజుడి సంతోషంకూడా నాకు లభిస్తుంది. ఇంక వేరేవరం నాకెందుకు?' అని వినయంగా సమాధానం చెప్పింది. ఆమె మృదుమధురవాక్కులకు దుర్వాసుడు సంతోషించి, 'సరే నీవు వరాన్ని కోరుకొనకపోతే, నేనే నీకు ఒక గొప్పవరం అనుగ్రహిస్తున్నాను. నీకు ఒక మంత్రాన్ని ఉపదేశిస్తాను. నీవు ఈ మంత్రాన్ని ఉపాసించి, ఏ వేలుపును ఆహ్వానిస్తే ఆవేలుపు నీకడకు వచ్చి నీకు వశుడు కాగలడు' అని చెప్పాడు. కుంతి మారుమాట చెప్పజాలక, 'మహాప్రసాదం' అని మునికి ధన్యవాదాలు సమర్పించింది. దుర్వాసుడు కుంతికి ఆ మంత్రాన్ని శాస్త్రం విధించినప్రకారం ఉపదేశించి, తన ఇచ్చవచ్చినచోటికి పోయాడు. పిదప కొన్నినాళ్లకు.

మ. 'మదిఁ గారుణ్యము సేసి విప్రవరుఁ డీ మంత్రంబు నా కిచ్చెఁ; నే
నిది యేచందము చూతు' నంచు నొకనాఁ డిచ్ఛన్ ఋతుస్నాత యై
సుదతీరత్నము పూర్వశైలతటిపై శోభిల్లు తిగ్మాంశుఁ జూ
చి దళత్పద్మము మాడ్కి నుల్లసితమై చిత్తంబు రాగిల్లఁగన్. 325

**ప్రతిపదార్థం:** విప్రవరుఁడు= బ్రాహ్మణోత్తముడు దుర్వాసుడు; మదిన్= చిత్తంలో; కారుణ్యము+చేసి= కృప వహించి; ఈ మంత్రంబు= ఈ మంత్రం; నాకున్+ఇచ్చెన్= నాకు ఇచ్చాడు; ఏను= నేను; ఇది= ఈ మంత్రం; ఏచందము+ఒ= ఏభంగిదో; చూతున్= చూస్తాను; అంచున్= అని తలపోస్తూ; ఒకనాఁడు= ఒకరోజున; ఇచ్ఛన్= కోరికతో; ఋతుస్నాత+ఐ= ముట్టుస్నానం చేసినదై; సుదతీరత్నము= ఆడువారిలో రత్నంవంటిది, పృథాకుమారి; పూర్వ, శైల, తటిపైన్= తూర్పుకొండప్రదేశంమీద; శోభిల్లు= విలసిల్లే; తిగ్మ+అంశున్= సూర్యుడిని; చూచి= కాంచి; దళత్+పద్మము, మాడ్కిన్= విచ్చుకొంటున్న తామరపువ్వు వలె; ఉత్+లసితము+ఐ= బాగా విప్పారినదై; చిత్తంబు= మనస్సు; రాగిల్లఁగన్= అనురాగం అంకురించగా.

**తాత్పర్యం:** 'మనస్సులో దయ కలిగిన బ్రాహ్మణోత్తము డైన దుర్వాసుడు ఈ మంత్రాన్ని నాకు ప్రసాదించాడు కదా! దీనిప్రభావం ఎటువంటిదో పరీక్షిస్తానుగాక' అని తలపోసి, కోరికతో కుంతి, ఋతుస్నాత అయి ఒకనాడు, తూర్పుకొండచరియమీద విలసిల్లే సూర్యుడిని చూచి, వికసిస్తున్న తామరపువ్వువలె తన మనస్సులో అనురాగం విస్తరిల్లగా.

**విశేషం:** అలం: ఉపమ. ఇట కుంతిచిత్తం వికసిస్తున్న తామరపువ్వుతో పోల్చబడింది. సూర్యోదయానికి తామరమొగ్గ వికసిస్తుంది. తామరపువ్వు ఎర్రగా ఉంటుంది; అనురాగం ఎర్రగా ఉండటం కవిసమయం. కుంతి కన్యక. తామరపువ్వు - విచ్చుతున్నమొగ్గ. అనగా మొగ్గ కాదు, ప్రపుల్లపుష్పం కాదు. కన్యక అయిన కుంతిచిత్తంకూడా అట్టిదే కదా.

వ. సహజకుండల కవచాభిరామంబైన తదీయమూర్తివిభవంబున కోటువడి 'దేవా! భవత్సమానసుందరుం డగు నందనుం గరుణింపవే' యని మనంబునం గోరుచు మంత్రోచ్చారణంబు చేసినఁ, బ్రభాకరుండును నిజయోగబలంబున మూర్త్యంతరంబు ధరియించి కుంతిపాలికిం జనుదెంచి మధురస్వరంబున. 326

**ప్రతిపదార్థం:** సహజ, కుండల, కవచ+అభిరామంబు+ఐన= ప్రకృతిసిద్ధంగా ఏర్పడిన చెవిపోగులతో, తనుత్రాణంతో అందంగా ఉన్న; తదీయమూర్తి విభవంబునకున్= ఆతని (ఆ సూర్యుడియొక్క) ఆకృతిసంపదకు; ఓటు+పడి= లొంగిపోయి; 'దేవా!= దేవరా!; భవత్+సమాన, సుందరుండు+అగు= నీతో సరిపోలే అందగాడు అయిన; నందనున్= కుమారుడిని; కరుణింపవే?= దయతో ప్రసాదించవా?; అని= అని; మనంబునన్= ఎదలో; కోరుచున్= అభిలషిస్తూ; మంత్ర+ఉచ్చారణంబు+చేసినన్= మంత్రాన్ని జపించగా; ప్రభాకరుండును= సూర్యుడును; నిజయోగబలంబునన్= తన 'యోగ' శక్తిచేత; మూర్తి+అంతరంబు= ఇంకొకఆకారం; ధరియించి= వహించి; కుంతిపాలికిన్= పృథాకుమారివద్దకు; చనుదెంచి= వచ్చి; మధురస్వరంబునన్= తియ్యని కంఠధ్వనితో.

**తాత్పర్యం:** ప్రకృతిసిద్ధంగా ఏర్పడిఉన్న కుండలాలతో కవచంతో మనోహరంగా ఉన్న సూర్యుడిఆకృతిని దేదీప్యమానమైన తేజస్సును పరికించి, అతడియందు మనస్సును లగ్నం చేసి 'దేవరా! నీవంటి సుందరరూపుడైన కుమారుడిని నాకు దయతో అనుగ్రహించుము' - అని తనయెదలో తలపోసి పృథాకుమారి మంత్రాన్ని జపించింది. సూర్యుడు తనయోగబలంతో మరొకరూపం ధరించి కుంతివద్దకు వచ్చి తియ్యని కంఠస్వరంతో.

**విశేషం:** (1) మంత్రం - ఉచ్చాటన వలన అతిలోకమహిమ ప్రాప్తింపజేసే అక్షరసంపుటం. (2) యోగబలం - యోగంవలన ఇంద్రియాతీతశక్తులు లభిస్తాయి. దేవతలకు అట్టిశక్తి సహజం. అన్యథారూపప్రతిపాదనం యోగమహిమలలో ఒకటి.

**తే.** **'అబల! నీమంత్రబలమున నరుగుదెంచి । నాఁడ; నీవాఁడ నైతి; మనఃప్రియంబు**
**నీకు నెయ్యది యొనరింతు; నిజము చెపుమ!' । యనినఁ బడఁతి యిట్లనుఁ గమలాప్తుతోడ.** **327**

**ప్రతిపదార్థం:** అబల!= పడతీ! ఓ పృథాకుమారీ!; నీ మంత్రబలమునన్= నీవు జపించిన మంత్రంయొక్క శక్తివలన; అరుగుదెంచినాఁడన్= వచ్చాను; నీవాఁడన్+ఐతిన్= నీకు లోబడినవాడను అయినాను; మనఃప్రియంబు= మనస్+ప్రియంబు= మనస్సుకు ప్రీతినిచ్చేది; నీకున్= నీకు; ఎయ్యది= (ఏ+అది=) ఏది; ఒనరింతున్= చేయగలను; నిజము= సత్యం; చెపుము+అ= వచించుము' అనినన్= అని(సూర్యుడు చెప్పగా); పడఁతి= వనిత, కుంతి; కమల+ఆప్తుతోడన్= సూర్యుడితో; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నది.

**తాత్పర్యం:** 'ఓ కుంతీకుమారీ! నేను నీమంత్రశక్తిచేత ఆకర్షించబడి ఇక్కడికి వచ్చాను. ఇక నేను నీవాడను. నీ మనస్సుకు ఏది ప్రియమవుతుందో చెప్పుము. నీకోరిక తీరుస్తాను' అని చెప్పగా, కుంతి కమలాప్తుడైన సూర్యుడి కిట్లా సమాధానం చెప్పింది.

**తే.** **'కార్య మొక్కటియును లేదు; కౌతుకమున । నేను మంత్రంబు నొడివితి; నింతమాత్రఁ**
**జేసి నీకు నిచ్చటికి విచ్చేయ నేల? । దివికి నరుగుము క్రమ్మఱ దేవ! నీవు.'** **328**

**ప్రతిపదార్థం:** దేవ!= దేవరా!; కార్యము= కర్తవ్యం, చేయవలసినపని; ఒక్కటియును లేదు= ఒకటికూడ లేదు; కౌతుకమునన్= వేడుకతో; ఏను= నేను; మంత్రంబున్, నొడివితిన్= మంత్రాన్ని ఉచ్చరించాను; ఇంతమాత్రన్+చేసి= ఇంతమాత్రంచేతనే; నీకున్= ఓసూర్యా, నీకు; ఇచ్చటికిన్= ఈ చోటికి; విచ్చేయన్+ఏల= రావటం ఎందుకు?; నీవు= నీవు; క్రమ్మఱన్= మరల; దివికిన్= ఆకాశానికి; అరుగుము= తిరిగివెళ్ళుము.

**తాత్పర్యం:** 'ఓ సూర్యదేవా! ఇక్కడ నీవు నెరవేర్చవలసిన కర్తవ్యం ఒక్కటికూడా లేదు. ఏదో వేడుకకొరకు మంత్రాన్ని జపించాను. ఇంతమాత్రానికే నీవు విచ్చేయవలెనా? స్వామీ! దయచేసి నీవు ఆకాశానికి తిరిగిపొమ్ము.'

**వ.** **అనిన దానికి సూర్యుం డిట్లనియె.** **329**

**తాత్పర్యం:** అని అనగా కుంతీదేవితో సూర్యుడు ఈవిధంగా అన్నాడు.

**ఉ.** **'క్రమ్మఱి పోక తప్పెడినె? కామిని! యేమని మున్ను నీవు చి**
**త్తమ్మునఁ గోరి? తద్విధము దప్పక యిప్పుడుఁ బల్కరాదె? తే**
**జమ్మున మత్సమానుఁ గవచస్ఫుటకుండలమండితాంగు స**
**త్సమ్మతుఁ బుత్త్రుఁ గోరవె నిజమ్ముగ నావలనం దలోదరీ!** **330**

**ప్రతిపదార్థం:** కామిని!= వనితా, కుంతీ!; క్రమ్మఱి పోక, తప్పెడిన్+ఎ?= తిరిగివెళ్లక తప్పుతుందా? (ఎప్పుడో ఒకప్పుడు తిరిగి వెళ్లవలసినవాడనే కదా); నీవు= నీవు; మున్ను= ఇంతకుముందు; చిత్తమ్మునన్= మనస్సులో; ఏమి+అని= ఏది అనుకొని; కోరితి(వి)= అభిలషించావో; ఆ+విధము= ఆరీతి; తప్పక= అతిక్రమించక; ఇప్పుడు= ఈ సమయంలో; పల్కన్‌రాదు+ఎ=

వచించకూడదా; తల+ఉదరీ= సన్నని నడుముకల కుంతీ! తేజమ్మునన్= ప్రకాశంలో; మత్+సమానున్= నాతో సరిపోలేవాడిని; కవచ, స్ఫుట, కుండలమండిత+అంగున్= తనుత్రాణంతో వెలుగొందే కుండలాలతో అలంకృతమైన శరీరంకలవాడిని; సత్+సమ్మతున్= మంచివారు మెచ్చుకొనేవాడిని; పుత్త్రున్= కొడుకును; నిజమ్ముగన్= సత్యంగా; నావలనన్= నామూలాన; కోరవె= అభిలషించవా (చెప్పుము).

**తాత్పర్యం:** ఓ కుంతీ! ఎప్పుడో ఒకప్పుడు నేను వచ్చినదారినిబట్టి మరలివెళ్లక తప్పదు కాని, నీవు ఆహ్వానించావు కాబట్టే వచ్చాను. ఇంతకుముందు నీవు నీచిత్తంలో ఏమని అభిలషించావో ఇప్పుడు ఆ మాట తప్పక చెప్పుము. సన్నని నడుము కలదానా! తేజస్సులో నాతో పోలేవాడిని, సహజకవచకుండలాలతో శోభిల్లే శరీరం కలవాడిని పుత్రుడిని నావలన పొందవలెనని నీవు అభిలషించావు కదా! ఈ నిజం నీకు తెలియదా?.

**వ. కావున నిప్పుడు మదీయసమాగమంబున కొడంబడుము; నీకోరినయట్టి తనయుండు జనియించు; నిట్లు సేయనినాఁడు నిన్నును భవజ్జననీజనకులను భస్మంబు సేయుదు; మఱియు నీదైనశీలవృత్తంబు లెఱుంగక మంత్రంబు గర్వంబునంజేసి నీ కుపదేశించిన తాపసు నీక్షణంబ నిర్దహింతు; నిదె యంబరంబుననుండి యింద్రాదిసురవరులు నీకతమ్మునఁ జిక్కువడియున్న నన్నుం జూచి నవ్వుచున్నవా; రిదె సూడుము దివ్యదృష్టి యిచ్చితి' ననినం జూచి కుంతిభోజనందన డెందంబున నమందలజ్జావివశ యగుచు దినేశ్వరున కిట్లనియె.331**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఇప్పుడు= ఈ సమయంలో మదీయ సమాగమంబునకున్= నాతోడిపొందుకు; ఒడంబడుము= సమ్మతించుము; నీకోరిన+అట్టి, తనయుండు= నీవు అభిలషించినటువంటి కొడుకు; జనియించున్= ఉద్భవిస్తాడు; ఇట్లు= ఈ రీతిగా; చేయనినాఁడు= చేయకున్నవేళ; నిన్నును= నిన్నును; భవత్+జననీజనకులను= నీతలిదండ్రులను; భస్మంబు+చేయుదున్= బూడిద చేస్తాను; మఱియున్= వెండియు; నీది+ఐన= నీదైన; శీలవృత్తంబులు= స్వభావమూ, నడవడీ ఎఱుంగక= తెలియకుండగనే; మంత్రంబు= మంత్రాన్ని; గర్వంబునన్+చేసి= దర్పంచేత; నీకున్= నీకు; ఉపదేశించిన= నేర్పిన; తాపసున్= తపస్విని; ఈక్షణంబు+అ= ఈ త్రుటిలోనే; నిర్దహింతున్= కాల్చివేస్తాను; ఇదె= ఇదిగో; అంబరంబునన్= ఆకసంలో; ఉండి= ఉండి; ఇంద్ర+ఆది, సురవరులు= ఇంద్రుడు మున్నగు వేలుపుదొరలు; నీకతమ్మునన్= నీకారణంగా; చిక్కు+పడి+ఉన్న= దురవస్థకు లోనయి ఉన్న; నన్నున్+చూచి= నన్ను అరసి; నవ్వుచున్నవారు= పరిహసిస్తున్నారు; ఇది+ఎ+చూడుము= ఇదిగో కనుగొనుము; దివ్య, దృష్టి+ఇచ్చితిన్= దేవతామహిమ కల చూపు ప్రసాదించాను; అనినన్= అని (సూర్యుడు) చెప్పగా; కుంతిభోజనందన= కుంతిభోజుడికూతురు - పృథ; చూచి= పరికించి; డెందంబునన్= హృదయంలో; అమందలజ్జా, వివశ+అగుచున్= మిక్కుట మైన సిగ్గుకు లోనయినది ఔతూ; దిన+ఈశ్వరునకున్= సూర్యుడితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కావున నీవు ఇప్పుడు నాతోడిపొందుకు అంగీకరించుము. నీకోరికమేరకు మహాతేజస్వి అయిన పుత్రుడు నీకు పుడతాడు. నీవు నన్ను ఒల్లనినాడు, నిన్నూ నీతలిదండ్రులనూ బూడిద చేస్తాను. అంతేకాక నీయోగ్యత నెరుగకుండా నీశీలాన్నీ నడవడికనూ అనుశీలించకుండా నీకు ఇట్టి మంత్రాన్ని ఉపదేశించిన మహర్షిని ఈ క్షణమే దహించివేస్తాను. నేను నీమూలాన నవ్వులపాలు కావలసివచ్చింది. ఇదిగో చూడుము. నీకు దివ్యదృష్టిని ప్రసాదిస్తున్నాను. ఆకసంలో నిలిచి ఇంద్రుడు మున్నగు వేలుపుదొరలు నా దురవస్థను కాంచి పరిహసిస్తున్నారు! అని సూర్యుడు పలికాడు. కుంతి దృష్టి సారించి ఆ దృశాన్ని దర్శించి, తనహృదయంలో మిక్కుటమైన సిగ్గు చెంది సూర్యుడితో ఇట్లా చెప్పింది.

**విశేషం:** (1) దుర్వాసుడు ఇచ్చిన మంత్రంయొక్కబలం ఋజువైంది. సూర్యభగవానుడు కుంతికి ప్రత్యక్షమైనాడు. (2) అంతేకాక సూర్యుడిమహిమవలన కుంతికి దివ్యదృష్టి లభించింది. కన్యకఅయిన కుంతికి సూర్యుడిపై గల గౌరవం ఇనుమడించింది. (3) ఇక కుంతి చెప్పే అడ్డుమాటలు సూర్యుడికి పరోక్షప్రోత్సాహకాలే అయ్యాయి.

**క. 'నను నిచ్చుటకుం గర్తలు । జననియు జనకుండుఁ గాక, చనునే నాకున్**
**వనితాధర్మము విడువఁగ; । నసఘా! యిట్లయిన వంశహానియుఁ గాదే? 332**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! ఓ సూర్యదేవా!; ననున్= నన్ను; ఇచ్చుటకున్= కన్యాదానం చేయటానికి; కర్తలు= బాధ్యులు; జననియున్, జనకుండున్+కాక= తల్లియు దండ్రియును కాబట్టి; నాకున్= నాకు; వనితాధర్మము= ఆడుదాని ధర్మం; విడువఁగన్= వదలిపెట్టగా; చనున్+ఏ= భావ్యమా; ఇట్లు+అయినన్= ఈ విధంగా జరిగితే (వనితాధర్మం విడిచి తలిదండ్రులకు తెలియకుండా నీతో సంగమించటం జరిగితే); వంశహానియున్+కాదు+ఏ= కులానికి కీడు కాదా? (వంశానికి హాని ఏర్పడుతుందికదా).

**తాత్పర్యం:** పుణ్యాత్ముడ వైన ఓ సూర్యదేవా! నన్ను నీ కివ్వటానికి అర్హులు నాతలిదండ్రులు. ఇది వనితాధర్మం. జననీజనకులను కాదని వనితాధర్మం మీరి స్వచ్ఛందంగా నేను నీపొందు నంగీకరిస్తే దానివలన వంశహాని కాదా?

**ఆ. మంత్రబల మెఱుంగ; మదిఁ గోరి తప్పు సే । సితి మహాత్మ!; దీనిఁ జెట్ట గాఁగ**
**నవధరింప కెట్టు లైన నాబాల్యంబుఁ । గరుణ సైఁపవలయుఁ గమలమిత్త్ర!.' 333**

**ప్రతిపదార్థం:** కమలమిత్త్ర!= కమలాలకు హితుడవైనవాడా! ఓ సూర్యదేవా!; మంత్ర, బలము= మంత్రశక్తి; ఎఱుంగన్= తెలిసికొన; మదిన్= మనసులో; కోరి= కాంక్షించి; మహా+ఆత్మ!= మహానుభావుడవైన సూర్యదేవా!; తప్పు+చేసితిన్= అపరాధం చేశాను; దీనిన్= ఈ అపరాధాన్ని (తెలియక చేసిన తప్పును); చెట్ట+కాఁగన్= చెడ్డదిగా; అవధరింపక= భావించక; ఎట్టులు+ఐనన్= ఏదో విధంగా; నాబాల్యంబున్= నా చిన్నతనాన్ని; కరుణన్= దయతో; సైఁపన్‌వలయున్= క్షమించవలెను.

**తాత్పర్యం:** మహానుభావుడవైన ఓసూర్యదేవా! మంత్రానికి ఎట్టి మహిమ ఉన్నదో పరీక్షించటంకొరకు నేను ఈ అపరాధాన్ని చేశాను. తెలియక చెసిన తప్పును నేరంగా పరిగణించక, ఓ కమలమిత్ర! నా చిన్నతనపుచేష్టను దయచేసి క్షమించుము.

**వ. అని మఱియు ననేకప్రకారంబుల దివాకరు ననునయించి యెట్లునుం గ్రమ్మఱింపనేరక దనకారణంబునఁ గులంబునకును గురుజనంబులకును నపాయం బగు ననియుం దలపోసి భయంబు మిగులఁ దెగువసేసి యతని కిట్లనియె. 334**

**ప్రతిపదార్థం:** అని= అని వచించి; మఱియున్= వెండియును; అనేకప్రకారంబులన్= పెక్కువిధాల; దివాకరున్= సూర్యుడిని; అనునయించి= బుజ్జగించి; ఎట్లునున్= ఏవిధంగాకూడా; క్రమ్మఱింపన్+నేరక= వెనుకకు మరలింపజాలక; తన, కారణంబునన్= తనమూలాన; కులంబునకును= వంశానికిన్నీ; గురుజనంబులకును= పెద్దలకున్నూ; అపాయంబు+అగున్+అనియున్= కీడు కలుగుతుంది అనిన్నీ; తలపోసి= ఆలోచించి; భయంబు, మిగులన్= భీతి అతిశయించగా; తెగువ+చేసి= సాహసించి; అతనికిన్= వాడికి (సూర్యుడికి); ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కుంతీకుమారి ఆవిధంగా చెప్పింది. మరీమరీ పెక్కువిధాల సూర్యుడిని బ్రతిమలాడింది. అన్నివిధాలా ప్రయత్నించికూడా ఆతడిని వెనుకకు మళ్ళించజాలకపోయింది. తనమూలాన తలిదండ్రులకూ గురువులకూ వంశానికీ హాని కలుగుతుందని విచారించింది. మిక్కిలి భయపడింది. చివరకు సాహసించి ఆమె సూర్యుడితో ఇట్లా అన్నది.

**చ. 'ముదము దలిర్ప బంధుజనముల్ గురువర్గముఁ గూడి రూఢి నొ**
**ప్పిదముగ ధర్మమార్గమునఁ బెండిలిసేయఁగఁ బిమ్మటన్ సము**
**న్మదరసకేళిలీలకుఁ గ్రమంబగుఁగాక కులంబు శీలమున్**
**వదలి వధూజనంబులకు వచ్చునె యిమ్మెయి వేడ్క సల్పఁగన్? 335**

**ప్రతిపదార్థం:** వధూజనంబులకున్= కన్యకలకు; ముదము= సంతోషం; తలిర్పన్= చిగురించగా; బంధుజనముల్= చుట్టాలు; గురువర్గమున్= పెద్దలసమూహం; కూడి= చేరి; రూఢిన్= నిశ్చయించినరీతిగా; ఒప్పిదముగన్= విలసిల్లేటట్లుగా; ధర్మమార్గమునన్= ధర్మపథంలో (అగ్నిసాక్షిగా వేదోక్తమంత్రాలతో); పెండిలి+చేయఁగన్= వివాహం చేయగా; పిమ్మటన్= తరువాత; సమ్+ఉత్+మద, రసకేళిలీలకున్= మిక్కుటంగా మత్తెక్కిన శృంగార క్రీడా విలాసానికి; క్రమంబు+అగున్+కాక= సక్రమం అవుతుంది గాని; కులంబు= వంశం; శీలమున్= మంచిప్రవర్తనం; వదలి= విడిచిపెట్టి; ఈ+మెయిన్= ఈరీతిగా; వేడ్క, సల్పఁగన్+వచ్చును+ఎ= వేడుక చేయటం భావ్యమా?

**తాత్పర్యం:** సంతోషం చిగురించేటట్లుగా, చుట్టాలు తలిదండ్రులు పెద్దలు చేరి నిర్ణయించినవిధంగా ధర్మమార్గంలో వైదికమంత్రాలతో అగ్నిసాక్షిగా వివాహం జరిగిన తరువాత కన్యకలు శృంగారకేళీవిలాసాలలో తేలియాడ తగునుకాని, వంశాన్నీ శీలాన్నీ వదలి ఈవిధంగా వేడుక తీర్చుకొనటం ఎంతమాత్రం భావ్యం కాదు.

**క. బంధుమతి నైన నను ని । ర్బంధముమెయి ధర్మబాహ్యపథమున నలినీ**
**బాంధవ! యిటు సేయుటయు న । మంధరభవదీయకీర్తి మలినము గాదే. 336**

**ప్రతిపదార్థం:** నలినీబాంధవ!= పద్మాలకు బంధువు అయినవాడా, ఓ సూర్యదేవా!; బంధుమతిన్+ఐన= బంధువులు కలదాననైన; ననున్= నన్ను; నిర్బంధము, మెయిన్= బలవంతంచొప్పున; ధర్మబాహ్యపథమునన్= ధర్మానికి వెలియైన మార్గంలో; ఇటు+చేయుటయున్= ఈవిధంగా చేయటమున్నూ; అమంథర, భవదీయకీర్తి= వంకర కాని (తిన్నని) నీయశస్సు; మలినము+కాదు+ఏ= కలుషితం కాదా.

**తాత్పర్యం:** కమలాలకు బంధువైన ఓసూర్యదేవా! నేను నాబంధువులయెడ కూరిమి కలదానను; బలవంతంగా నీవు నన్ను ఈ విధంగా ధర్మానికి వెలిఅయిన మార్గానికి చేర్చటం తగదు. నీది తిన్ననిదైన యశస్సు. ఈవిధంగా చేస్తే నీ కీర్తి కలుషితం కాగలదు సుమా!.

**చ. జగములయందు ధర్మువును సత్యము నీయవి గావె దేవ! యే**
**తగవులు నీ యెఱుంగని విధంబులె? యిట్టిది నీదు బుద్ధికిం**
**దగ వగునేని మార్పలుకుదాననె? యే మగుఁగాక నీకు నిం**
**పగుతెఱఁ గాచరింపు; మట యావల నయ్యెడు నింద కోర్చెదన్'. 337**

**ప్రతిపదార్థం:** దేవ!= ఓ సూర్యదేవా!; జగములు+అందున్= లోకాలలో; ధర్మువును= ధర్మమును; సత్యము= నిజం; నీ+అవి+కావు+ఎ= నీవి కావా (నీవే); ఏతగవులున్= ఏధర్మాలు; నీ+ఎఱుంగని, విధంబులు+ఎ= నీకు తెలియని రీతులా; ఇట్టిది= జననీజనకులకు తెలియకుండ నీసమాగమం పొందటం; నీదు బుద్ధికిన్= నీచిత్తానికి; తగవు+అగున్+ఏనిన్= ధర్మం అయితే; మారు+పలుకుదానను+ఎ?= ఎదురుమాట చెప్పగలనా; ఏమి+అగున్+కాక= ఏమి జరిగితే అది జరుగుతుందిగాక; నీకున్= నీకు; ఇంపు+అగు= ప్రీతికలిగే; తెఱఁగు= తీరు; ఆచరింపుము= చేయుము; అట ఆవలన్= అటు పిమ్మట; అయ్యెడు= ఏర్పడే; నిందకున్= అపవాదానికి; ఓర్చెదన్= సహిస్తాను.

**తాత్పర్యం:** ఓ సూర్యదేవా! లోకాలలో ధర్మం, సత్యం, నీవే కదా! ఏధర్మాలు అయినా నీకు తెలియనివి కావుకదా! తలిదండ్రులకు తెలియకుండా నీసమాగమాన్ని పొందటం నీమనస్సుకు ధర్మం అని తోస్తే, నీయిష్టానుసారం చేయుము; ఇక ఆ పిదప వచ్చే నిందను నేనే సహిస్తాను.

**సీ.** **అనుటయు నద్దేవుఁ డయ్యిందుముఖిఁ జూచి । 'తల్లిదండ్రులును బాంధవజనంబు**
**కారు నిన్నీగికిఁ గర్తలు; విను నీవ । యొడయురాలవు నీకు నుజ్జ్వలాంగి!**
**కామంబు లెల్లను గామించి పొందుట । నయ్యెఁ గన్యాశబ్ద మట్లుగాక**
**యాత్మతంత్రత్వంబునందు నీ కెగ్గు లే; । దే నేల నడతు ధర్మేతరంబు?**

**ఆ.** **మత్సమాగమమున మదిరాక్షి! నీదు క । న్యావ్రతంబుఁ జెడదు; నందనుండు**
**నధికతేజుఁ డుదయ మగు; నిన్ను నొక్కనిం । దయును బొందకుండుఁ; దథ్య మబల!** **338**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని కుంతివచించుటయున్నూ; ఆ+దేవుఁడు= సూర్యుడు; ఆ+ఇందుముఖిన్= చంద్రుడివంటిమొగం కలిగినదానిని, కుంతిని; చూచి= అరసి; ఉజ్జ్వల+అంగి!= లావణ్యం వెల్లివిరిసే శరీరం కలదానా! కుంతీ!; తల్లిదండ్రులును= జననీజనకులును; బాంధవజనంబు= చుట్టాలును; నిన్నున్= నిన్ను; ఈగికిన్= దానం చేయటానికి; కర్తలుకారు= ఒడయులు కారు (స్వాములు కారు); విను= ఆలకించుము; నీకున్= నీకు; ఈవు+అ= నీవే; ఒడయురాలవు= స్వామినివి; కామంబులు+ ఎల్లను= కోరికలను అన్నింటిని; కామించి= అభిలషించి; పొందుటన్= అనుభవించటంచేత; కన్యాశబ్దము= కన్య అనే పదం; అయ్యెన్= ఏర్పడింది; అట్లున్+కాక= అంతమాత్రమే కాక; ఆత్మతంత్రత్వంబునందున్= తన సొంతవ్యవహారాలను నడపుటలో; నీకున్= నీకు; ఎగ్గు= కీడు; లేదు= ఉండదు; ఏను= నేను; ధర్మ+ఇతరంబు= ధర్మం కంటె ఇతరమైన దానిని (అధర్మాన్ని) ఏల నడతున్?= ఎందుకు ఆచరిస్తాను?; మదిర+అక్షి!= మత్తెక్కించే నేత్రాలు కల మగువా! కుంతీ!; మత్+సమాగమమునన్= నా పొందుచేత; నీదు, కన్యావ్రతంబు= నీకన్యా నియమం; చెడదు= భగ్నం కాదు; నందనుండున్= కొడుకును; అధిక తేజుఁడు= మిక్కుటమైన ప్రకాశం కలవాడు; ఉదయము+అగున్= జన్మిస్తాడు; అబల= పడతీ! కుంతీ!; నిన్నున్= నిన్ను; ఒక్కనిందయును= ఒక్క అపవాదుకూడా; పొందక+ఉండున్= చేరకుండా ఉంటుంది; తథ్యము= ఇది నిజం.

**తాత్పర్యం:** అని కుంతి పలికింది. అంతట సూర్యుడు ఆ చంద్రవదన అయిన కుంతిని చూచి ఇట్లా అన్నాడు: 'లావణ్యం వెల్లివిరిసే శరీరం కల కుంతీ! ఆలకించుము. తల్లిదండ్రులు చుట్టాలు నిన్ను దానంగా సమర్పించటానికి కర్తలు కారు. నీశరీరానికి నీవే యజమానురాలవు. అసలు కన్య అనే శబ్దానికి అర్థం కోరికలను కోరి ఈడేర్చుకొనేది అనేగదా! అంతేకాక- ఎవరికి సంబంధించిన ఆంతరంగిక వ్యవహారం వారే నిర్వహించుకొనటంలో ఎట్టి ఎగ్గు ఎవరికి లేదు. నేను అధర్మాన్ని ఏల ఆచరిస్తాను? నాసమాగమంవలన నీకన్యావ్రతానికి భంగం కలుగదు. మత్తెక్కించే కన్నులు గల కుంతీ! నీకు మహాతేజస్వి అయిన కుమారుడు ఉద్భవిస్తాడు. నీకు ఎట్టి అపవాదమూ రాదు. ఇదిసత్యం.

**విశేషం:** (1) తనను కుంతి రహస్యంగా పొందటం తప్పు కాదని కొన్నిఉపపత్తులతో చెప్పాడు సూర్యుడు. అవి ఏమంటే- 1. తలిదండ్రులకు చుట్టాలకు కన్యకను దానంచేయటానికి అధికారం లేదు. 2. కన్యక అయిన వధువుకే వరుడిని ఎన్నుకొనే అధికారం సహజసిద్ధంగా ఉన్నది. 3. సమాగమం కన్యక ఆంతరంగిక వ్యవహారం. 4. సూర్యసమాగమంవలన కుంతికన్యావ్రతానికి భంగ మేర్పడదు. పై ఉపపత్తులు చెప్పింది సూర్యభగవానుడు. కన్యకకు ఆత్మతంత్రత్వంలో స్వాతంత్ర్యం ఉన్నదనే వాదానికి కుంతియే పూర్వపక్షాలు నెలకొల్పి ఉంచింది. అది వాదోపవాదాలకు సమయం కాదు. జరిగినకథను యథాతథంగా వ్యాసుడు వ్రాశాడు.

### కుంతి సూర్యునివరంబున గర్భంబు దాల్చి కర్ణుం గాంచుట (సం. 3-292-1)

**వ.** **అని యొడంబఱిచి సూర్యుండు దత్సమాగమంబునం బ్రీతుండై దానికి గర్భాధానంబు సేసి గగనంబున కరిగె; నంతం బూర్వపక్షంబునందుఁ జంద్రుండునుం బోలె గర్భంబు గ్రమంబునఁ బ్రవర్ధనంబు నొందుచు నభివ్యక్తంబయ్యునుబ్రభాకరునిమహిమం జేసి లోకవిదితంబుగాకుండెఁ; దత్ప్రకారంబు దాదికూఁతు రొక్కతియ యెఱుంగు; నిట్లు వర్తిల్లుచుం బది యగు మాసంబున నొక్కనాఁటి నిశాసమయంబునం గన్యాంతఃపురంబునందు.** **339**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; ఒడంబఱిచి= అంగీకరింపజేసి; సూర్యుండు= సూర్యుడు; తద్+సమాగమంబునన్= ఆమె కలయిక వలన; ప్రీతుండు+ఐ= మిక్కుటంగా తృప్తిని చెందినవాడై; దానికిన్= ఆమెకు, కుంతికి; గర్భ+ఆధానంబు+చేసి= కడుపు ఉంచుట చేసి; గగనంబునకున్= ఆకాశానికి; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= అటుపిమ్మట; పూర్వపక్షంబునందున్= శుక్లపక్షంలో; చంద్రుండునున్+పోలెన్= చంద్రుడివలె; గర్భంబు= కడుపు (లోనిపిండం); క్రమంబునన్= నానాటికి; ప్రవర్ధనంబున్+ ఒందుచున్= అభివృద్ధిని చెందుతూ; అభివ్యక్తంబు+అయ్యును= ప్రస్ఫుటమైనప్పటికి; ప్రభాకరుని, మహిమన్+చేసి= సూర్యుడి ప్రభావంచేత; లోక, విదితంబు+కాక+ఉండెన్= లోకంలోని జనులకు తెలియకుండింది; తద్+ప్రకారంబు= ఆవిధం; దాదికూఁతురు= దాది యొక్క కూతురు, ఒక్కతి+అ= ఒక్కతె మాత్రమే; ఎఱుంగున్= తెలియును; ఇట్లు= ఈ విధంగా; వర్తిల్లుచున్= ప్రవర్తిస్తూ; పదియగుమాసంబునన్= పదవ నెలలో; ఒక్కనాఁటి= ఒక రోజుయొక్క; నిశాసమయంబునన్= రాత్రికాలంలో; కన్యా+అంతఃపురంబునందున్= కన్నెలు ఉండే రాచనగరి లోపలిప్రదేశంలో.

**తాత్పర్యం:** అని చెప్పి, కుంతిని సమ్మతింపజేసి, సూర్యుడు ఆమె సమాగమంతో తృప్తిచెందినవాడై. ఆమెకు గర్భం ఆవిర్భవిల్లేటట్లు చేసి ఆకసానికి వెళ్ళాడు. అంతట శుక్లపక్షంలోని చంద్రుడివలె, కుంతిగర్భం దినదినప్రవర్ధమాన మయింది; కాని, సూర్యుడిప్రభావంవలన లోకులకు మాత్రం ఆమె గర్భం అభివ్యక్తం కాకుండా ఉండింది. ఆ విషయం ఒక దాది కూతురికి తప్ప ఇతరులకు ఎవ్వరికీ తెలియదు. ఈ విధంగా కుంతిగర్భం విలసిల్లి పదవనెలలో ఒకనాఁడు రాత్రివేళ కన్నెలఅంతిపురంలో.

**విశేషం:** (1) పూర్వపక్షము= శుక్లపక్షం. అమావాస్య మరునాడు పాడ్యమినుండి పూర్ణిమవరకు.

**ఆ.** **కొడుకుఁ గనియె సహజకుండలకవచాభి । రాము విమలకమలకోమలాక్షు**
**దీర్ఘబాహుఁ జారుదృఢదేహుఁ దరుణార్క । తేజుఁ గుంతిభోజరాజపుత్త్రి.** **340**

**ప్రతిపదార్థం:** కుంతిభోజరాజపుత్త్రి= కుంతిభోజరాజుయొక్క కూతురు; కొడుకున్= పుత్రుని; సహజకుండలకవచ+అభిరామున్= ప్రకృతిసిద్ధంగా ఏర్పడిన చెవిపోగులు తనుత్రాణంచేత సుందరంగా ఉన్నవాడిని; విమల, కమల కోమల+అక్షున్= నిర్మలాలు,

సుకుమారాలు అయిన కమలాలవంటి కనులు కలవాడిని; దీర్ఘబాహున్= పొడుగైన చేతులు కలవాడిని; చారుదృఢదేహున్= అందమైన బలిష్ఠమైన శరీరం కలవాడిని; తరుణ+అర్క, తేజున్= బాల సూర్యుడివంటి తేజస్సు కలవాడిని; కనియెన్= ప్రసవించింది.

**తాత్పర్యం:** కుంతిభోజుడి కూతురు కుంతి కుమారుడిని ప్రసవించింది. ఆ కుమారుడు ప్రకృతిసిద్ధమైన చెవిపోగులు తనుత్రాణం కల ప్రియదర్శనుడు, సుకుమారమయిన కమలాలవంటి కన్నులు కలవాడు, ఆజానుబాహుడు. అందమైన దృఢమైన శరీరం కలవాడు. తరుణసూర్యతేజస్వి.

**వ. ఇట్లు జనియించిన యర్భకుం జూచి లోకాపవాదభయంబునకుం దలరి యాక్షణంబ యొక్క మంజూషలోన నబ్బాలకుం బదిలంబుగా నిడి దాని నతిదృఢంబుగాఁ దెప్పం బంధించి సఖియునుం దానును గొని పురసమీపగతంబైన యశ్వనదీప్రవాహంబున విడిచి కుంతి యెంతయు సంతాపంబున నిట్లని విలాపంబు సేసె. 341**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; జనియించిన= పుట్టిన; అర్భకున్+చూచి= శిశువును కాంచి; లోక+అపవాద, భయంబునకున్= లోకులవలన ఏర్పడే నిందకు భయపడి; తలరి= కలతచెంది; ఆక్షణంబు+అ= వెంటనే; ఒక్క= ఒక; మంజూషలోన్= పెట్టెలో; ఆ+బాలకున్= ఆ మగబిడ్డను; పదిలంబుగాన్+ఇడి= భద్రంగా ఉంచి; దానిన్= ఆ మంజూషను; అతిదృఢంబుగాన్= మిక్కిలిగట్టిగా; తెప్పన్= నీటిమీద మునగకుండా తేలియాడే నలుచదరపు పడవమీద; బంధించి= కట్టి; సఖియునున్+తానును+ కొని= చెలికత్తెయును తాను తీసికొని వెళ్లి; పురసమీపగతంబు+ఐన= నగరానికి చేరువగా ఉన్న; అశ్వనదీ ప్రవాహంబునన్= అశ్వం అనే పేరు కల నది వెల్లువలో; విడిచి= వదలిపెట్టి; కుంతి= కుంతి; ఎంతయున్= మిక్కుటమైన; సంతాపంబునన్= దుఃఖంతో; ఇట్లు+అని= ఈ రీతిగా తలపోసి; విలాపంబు+చేసెన్= శోకించింది.

**తాత్పర్యం:** ఈ విధంగా ఉద్భవించిన మగబిడ్డను చూచి, లోకంలో ఏర్పడే అపనిందకు భయపడి ఆక్షణంలోనే కుంతి తన చెలికత్తెతో కలిసి ఆ శిశువును ఒక చక్కనిపెట్టెలో భద్రంగా ఉంచి ఆ పెట్టెను ఒకతెప్పపై పెట్టి గట్టిగా త్రాళ్లతో కట్టి నగరానికి దగ్గరగా ప్రవహిస్తున్న అశ్వనదిలో విడిచి పెట్టింది. కన్నబిడ్డను నదిలో విడిచిపెట్టివచ్చి కుంతి మిక్కుటమైన ఆవేదనతో ఈ విధంగా దుఃఖించింది.

**ఆ. 'కొడుక! నిన్నుఁ గాంచు కొఱఁత నోములె కాని । పెంచి గారవించి పేర్మి నీదు
ప్రోపుఁ గుడువఁ గాంచు పుణ్యంబు దుదిముట్ట । నేల చేయనైతి నేను గుఱ్ఱ! 342**

**ప్రతిపదార్థం:** కొడుక!= ఓపుత్రకా!; నిన్నున్= నిన్ను; కాంచు= ప్రసవించే; కొఱఁతనోములు+ఎ+కాని= లోపభూయిష్ఠమైన వ్రతాలే కాని; పెంచి= అభివృద్ధిచేసి; గారవించి= మన్నించి; పేర్మిన్= ప్రీతితో; నీ+ప్రోపున్= నీ సంరక్షణను; కుడువన్+కాంచు= అనుభవించే; పుణ్యంబు; తుదిముట్టన్= సంపూర్ణంగా; కుఱ్ఱ!= (నా) అనుగుశిశువా!; ఏను= నేను; ఏలచేయన్+ఐతిన్= ఏల చేయలేకపోయాను!

**తాత్పర్యం:** 'ఓ నా చిన్నశిశువా! నేను నోచిన నోములు తక్కువవి. నిన్ను నేను కన్నానే కాని, పెంచి పెద్ద చేసి, నీసంరక్షణ అనుభవించే సుకృతం నాకు సంపూర్ణంగా లేదు కదా!. ఎంతటి దురదృష్టవంతురాలను నేను.

**మ.** **నెఱయం బున్నమచందురుం జెనయు నీ నెమ్మోమునం దియ్యనై**
**చిఱునవ్వొప్పఁగఁ జూడనీక, పులకల్ చెన్నొంద నిన్ గ్రుచ్చి య**
**క్కఱదీఱం బోరి నక్కునం గరము వేడ్కం జేర్ప నీ కిమ్మెయిన్**
**వఱుతం ద్రోవఁగఁ జేసెనే యకట! దైవం; బెందుఁ జొత్తున్ సుతా!** **343**

**ప్రతిపదార్థం:** సుతా= ఓకొడుకా!; నెఱయన్= నిండుదనం ఒప్పారగా; పున్నమచందురున్= పూర్ణిమనాటి చంద్రుడిని; చెనయు= పోలెడి; నీ+నెఱ+మోమునన్= నీనిండుమొగంలో; తియ్యన+ఐ= మధురమై; చిఱు, నవ్వు+ఒప్పఁగన్= మందహాసం చిందులాడగా; చూడనీక= కాంచనీయక; పులకల్= గగురుపాటు; చెన్నొందన్= శోభిల్లగా; నిన్= నిన్ను; గ్రుచ్చి= పొదివి; అక్కఱ+తీఱన్= తృప్తి తీరేవరకు; పొరిన్= వరుసగా; అక్కునన్= హృదయానికి; కరము= మిక్కిలి; వేడ్కన్= ప్రీతితో; చేర్పనీక= హత్తుకోనీకుండ; దైవంబు= విధి; ఈ+మెయిన్= ఈవిధంగా; వఱుతన్= వరదలో; త్రోవఁగన్+చేసెను+ఏ= పడవేసేటట్లుగా చేశాడా?; అకట= అయ్యో; ఎందున్+చొత్తున్= ఎందులో పడేది? (నేనీ దుఃఖం భరించలేను అని తాత్పర్యం).

**తాత్పర్యం:** ఓ కొడుకా! నీమొగం పున్నమచంద్రుడివలె ఉన్నదికదా. నీనెమ్మోముమీద మృదుమధురమైన మందహాసాలు చిందులాడటం నిండుగా చూడనీక, గగురుపొడిచిన ఒడలితో నిన్ను గుండెకు హత్తుకొని తనివితీరేటట్లు ముద్దాడనీక అయ్యో, ఈవిధంగా దైవం నిన్ను వరదపాలు చేసేటట్లుగా చేశాడు గదా! నేను ఎక్కడికి పోయేది?

**సీ.** **ఏపుణ్యసతికి నీ వింక నందనుఁడ వై । యెక్కడఁ బడియెదో యే నెఱుంగ;**
**నే పుణ్యురాలొకో యెప్పుడు నినుఁ బుత్త్రుఁ । గాఁ గాంచుటకు మేలికలను గాంచు;**
**లలిఁ బాంసుకేళి నల్లన నడయాడుచు । నవ్యక్తమధురవాక్యామృతంబు**
**వీనులఁ గురియుచు వెడఁదకన్నులఁ బిన్న । నవ్వును శుభలక్షణములు నమరఁ**

**ఆ.** **దేజరిల్లు నిన్నుఁ దెఱవ యెవ్వత యొక్కొ । యడర గ్రుచ్చి యురమునందుఁ జేర్చి**
**వేడ్క మిగుల వేనవేలభంగులఁ గొని । యాడి నగుచు ముద్దులాడుఁ గొడుక!** **344**

**ప్రతిపదార్థం:** ఏపుణ్యసతికిన్= సుకృతం చేసుకొనిన ఏవనితకు; ఈవు= నీవు; ఇంకన్= ఇకమీద; నందనుఁడవు+ఐ= పుత్రుడవు అయి; ఎక్కడన్= ఏస్థలంలో; పడియెదు+ఓ= చేరెదవో; ఏను= నేను; ఎఱుంగన్= తెలియజాలనుకదా; ఏపుణ్యురాలు+ ఒకో= సుకృతం చేసికొనిన ఏఇల్లాలో కదా; ఎప్పుడున్= ఎల్లప్పుడును; నినున్= నిన్ను; పుత్త్రుకాన్= కొడుకుగా; కాంచుటకున్= చూడటానికి; మేలికలను= మంచి స్వప్నాన్ని; కాంచున్= పొందుతుంది; లలిన్= ప్రేమతో; పాంసుకేళిన్= దుమ్ములో ఆడుకొంటూఉండగా; అల్లన= మెల్లగా; నడయాడుచున్= తప్పటడుగులు వేస్తూ; అవ్యక్త, మధుర, వాక్య+అమృతంబు= తియ్యనైన జిలిబిలి పలుకులు అనే అమృతం; వీనులన్= చెవులయందు; కురియుచున్= వర్షిస్తూ; వెడఁదకన్నులన్= విశాలాలైన నేత్రాలలో; పిన్ననవ్వును= చిన్ననగవున్నూ; శుభలక్షణములున్= మంచిచిహ్నాలున్నూ; అమరన్= విలసిల్లగా; తేజరిల్లు= వెలుగొందే; నిన్నున్= నిన్ను; తెఱవ+ఎవ్వత+ఒక్కొ= వనిత యెవ్వతెయో; అడరగ్రుచ్చి= గట్టిగా పొదివి; ఉరమునందున్+చేర్చి= కౌగిలించుకొని; వేడ్కమిగులన్= ప్రీతిఅతిశయించగా; వేనవేలభంగులన్= పెక్కుపెక్కురీతుల; కొనియాడి= ఉగ్గడించి; నగుచున్= నవ్వుతూ, ముద్దులు+ఆడున్= ముద్దులు పెట్టుకొంటుందో.

**తాత్పర్యం:** నాచిట్టితండ్రీ! నీవు ఇంక ఏపుణ్యాత్మురాలికి కొడుకువై సంతోషపెడతావోకదా! ఎక్కడికి చేరుతావో నాకు తెలియదు కదా. ఏపుణ్యసతి కాంచిన మధురస్వప్నాలు నిజమై నీవు ఆమెకు దక్కుతావో కదా! దుమ్ములో

ఆడుకొనేటప్పుడు తప్పటడుగులు వేస్తూ తియ్యనైన జిలిబిలిమాటలు పలుకుతూ చెవులలో అమృతం కురిసే నిన్ను, పెద్దపెద్దకనులలో చిన్నచిన్న నవ్వులు వెలార్చేనిన్ను, శుభలక్షణాలతో మిలమిల వెలుగొందేనిన్ను, ఏఅమ్మ కౌగిలించుకొని గుండెకు హత్తుకొని వేడుకమీరగా పలుమారులు ముద్దులు పెట్టుకొని మురిసిపోతూ నవ్వుకొని ఆనందిస్తుందో కదా! అయ్యో! నాకు ఆ అదృష్టం లేకపోయెనే.

**ఉ. లాలితయౌవనోజ్జ్వలవిలాసములం దిలకించు సుందరా**
**భీలవిచేష్టితం బమర భీమవనోద్భవసింహరేఖమై**
**వాలవె యింక నీ వెలమి వామవిలోచన లంగజన్మలీ**
**లాలసలై విపక్షులు భయాలసులై ధృతి యేది చూడఁగన్. 345**

**ప్రతిపదార్థం:** లాలితయౌవన+ఉజ్జ్వలవిలాసములన్= మనోహరమైన యౌవనమునందలి ప్రకాశించే విలాసములతో; తిలకించు= ప్రకాశించే; సుందర+ఆభీల విచేష్టితంబు= అందమైనదీ, భయంకరమైనదీ అయిన చేష్ట, అమరన్= ఒప్పగా; భీమ-వన+ఉద్భవ-సింహ-రేఖము+ఐ= భయంకరమైన అడవిలో పుట్టకగల సింహముయొక్క చొప్పుతో; వామ-విలోచనలు= సుందరములైన కన్నులు గలవారు (స్త్రీలు); అంగజన్మ లీలా+అలసలు+ఐ= మన్మథవిలాసం చేత సోమరులయి, విపక్షులు= శత్రువులు; భయ+అలసులు+ఐ= భయముచే సోమరులయి, ధృతి= ధైర్యము; ఏది= కోలుపోయి; చూడఁగన్= చూడగా, ఇంకన్= ఇకముందు; నీవు; ఎలమిన్= సంతోషంతో, వాలవే= మీఱవా (మీఱుతావని భావం).

**తాత్పర్యం:** యౌవనంలో ఉజ్జ్వలమైన విలాసంతో ప్రకాశించి, సుందరమూ, భయంకరమూ అయిన చేష్ట ఒప్పగా, వెఱపుగొలిపే వనంలో ఉద్భవించిన సింహంయొక్క చొప్పుచేత, సుందరాంగులు మన్మథవిలాసం చేతనూ, శత్రువులు భయంతోనూ సోమరులయి, నిరుత్సాహులై చూస్తుండగా ఇక నీవు ప్రీతితో మీఱుదువు కదా!

**విశేషం:** యౌవనం వచ్చినప్పుడు కర్ణుడు సుందరుడూ, భయంకరుడూ అవుతాడు. అతని సౌందర్యానికి స్త్రీలు మన్మథావేశానికి లోనయి అలసలవుతారు. శత్రువులు అతని భయంకర రూపానికి ధైర్యం వీడిన నిరుత్సాహులు అవుతారని క్రమాన్వయం. “హిమవద్వన సంభూతం సింహం కేసరిణం యథా” అని మూలము.

**ఆ. ఎచట నున్న నైన నెల్లప్పుడును నిన్నుఁ। గన్నులారఁ జూడఁగాంచుఁ గాన**
**తనయ! నిన్నుఁ గనిన తపనుండు గడుధన్యుఁ। డయ్యెఁ; మందభాగ్య నైతి నేను. 346**

**ప్రతిపదార్థం:** తనయ!= ఓకుమారా!; ఎచటన్+ఉన్నన్+ఐనన్= నీవు ఎక్కడ ఉన్నప్పటికిని; ఎల్లప్పుడును= నిరంతరం; నిన్నున్= నిన్ను; కన్నులు+ఆరన్= కనులనిండుగా; చూడన్+కాంచున్+కాన= దర్శించగలుగుతాడు కాబట్టి; నిన్నున్= నిన్ను; కనిన= కన్న; తపనుండు= సూర్యుడు; కడున్= మిక్కిలి; ధన్యుఁడు+అయ్యెన్= చరితార్థుడు అయ్యాడు; ఏను= నేను; మందభాగ్యన్+ఐతిన్= దురదృష్టవంతురాలను అయినాను.

**తాత్పర్యం:** ఓ కుమారా! నీవు ఎచ్చట ఉన్నా నిను కన్నతండ్రి సూర్యుడు కనులార నిను కాంచగలడు కావున అతడు ధన్యుడే. ఇక, నిన్ను చూడనోచని దానను; నిను గన్నతల్లిని నేనే కేవలం నిర్భాగ్యురాలను.

**చ. ఇనుఁ డఱచేత మాటువడు టెన్నఁడుఁ గల్గునె? నిన్ను నెమ్మి నేఁ**
**గనియెదఁ గాక యింక నొకకాలమునం దయినం దనూజ! నీ**
**వినుతశరీరభావమును వీనుల సన్మణికుండలంబులున్**
**ఘనతరవజ్రవర్మముఁ బ్రకాశత నొందక యుండనేర్చునే? 347**

**ప్రతిపదార్థం:** తనూజ!= ఓకుమారకా!; ఇనుఁడు= సూర్యుడు; అఱచేతన్= హస్తతలాన; మాటు+పడుట= మరుగుపడటం; ఎన్నఁడున్= ఎపుడైనను; కల్గును+ఎ?= సంభవించేనా; నిన్నున్= నిన్ను; ఓకుమారా నిన్ను; నెమ్మిన్= అనురాగంతో; ఏన్= నేను; ఇంకన్= ఇకముందు; ఒకకాలమునందున్+అయినన్= కొన్నినాళ్లు కడచిన పిదపనైనా; కనియెదన్+కాక= చూస్తానుగాక; నీవినుతశరీరభావమును= ప్రస్తుతింపబడే నీ అంగసౌష్ఠవం; వీనులయొక్క= చెవుల; సత్+మణి, కుండలంబులున్= మంచి రత్నాల వంటి చెవిపోగులున్నూ; ఘనతర వజ్రవర్మమున్= గొప్పదైన వజ్ర కవచమున్నూ; ప్రకాశతన్+ఒందక+ఉండన్‌నేర్చునే= వెలుగొందక ఉండగలవా!

**తాత్పర్యం:** ఓ కుమారకా! సూర్యుడు ఎన్నడూ అరచేయి అడ్డుపెట్టినంత మాత్రాన కన్పించకుండా పోతాడా? కొన్నినాళ్లు గడచినపిదప ప్రేమతో నేను నిన్ను దర్శించగలనుగాక. ఎట్లాగంటే ప్రస్తుతింపబడే నీశరీరసౌష్ఠవం, చెవులకు వెలుగొందే మణులవంటి పోగులు, వజ్రకాంతులు గలిగి గొప్పదైన సహజకవచం, స్వయంప్రకాశమానాలై అందరికీ నీయునికిపట్టులు ప్రస్ఫుట మొనరిస్తాయి కదా!

**విశేషం:** ఇంతకుముందు- సూర్యుడు ధన్యుడు, ఆతడు తన కుమారుడు ఎక్కడ ఉన్నా కనులార గాంచగలడనీ తానే అదృష్టవిహీనను అనీ కుంతి దుఃఖించింది. ఇప్పుడు ఆమె ఊరట చెందుతున్నది. ఆ బాలకుడు ఎక్కడ ఉన్నా కుంతి ఆతడి సహజ కవచకుండలాలు స్వయంప్రకాశమానాలు కనుక, కొంతకాలం గడచినపిమ్మట నైనా గుర్తించి కన్నతల్లిగా తాను సంతసించగలను అని చెప్తున్నది. అలం: అర్థాంతరన్యాసం.

**చ. దివి భువి నంతరిక్షమున దిక్కుల గాడ్పున నగ్నియందు న**
**ర్ణవములయందు ఘోరవిపినంబులయందును నీకు నెప్పుడున్**
**శివ మగుఁగాక! దిక్పతులు సిద్ధులు సాధ్యులు రుద్రు లాశ్వినుల్**
**భువనము లర్కచంద్రులును బుత్త్రక! నిన్ గృపఁ గాచుచుండెడున్.' 348**

**ప్రతిపదార్థం:** పుత్త్రక!= నా చిట్టినాయనా!; దివిన్= స్వర్గంలో; భువిన్= భూలోకంలోను; అంతరిక్షమునన్= ఆకాశంలో; దిక్కులన్= దిశలలో; గాడ్పునన్= గాలిలోను; అగ్నియందున్= నిప్పులోను; అర్ణవములయందున్= సముద్రాలలో; ఘోర, విపినంబులయందును= భయంకరమైన అడవులలోనూ; నీకున్= నీకు; ఎప్పుడున్= సతతం; శివము+అగున్+కాక= శుభం కలుగును గాక; దిక్+పతులు= దిక్కులను పాలించేవారు; సిద్ధులున్, సాధ్యులున్= వేల్పులజాతులలోని సిద్ధులు, సాధ్యులును; రుద్రులున్= రుద్రులును; ఆశ్వినుల్= ఆశ్వినులు= (వేలుపువెజ్జులు); భువనములు= జగములు; అర్కచంద్రులును= సూర్యుడున్నూ చంద్రుడున్నూ; నిన్= నిన్ను; కృపన్= దయతో; కాచుచుండెడున్= రక్షిస్తూ ఉంటారుగాక!

**తాత్పర్యం:** ఓ నాచిట్టినాయనా!, నిన్ను కాపాడవలసిన కన్నతల్లిని నే నిప్పుడు నిర్దాక్షిణ్యంగా వదలివేయవలసి వచ్చింది. అయినను కన్నతల్లిగా నిన్ను దీవిస్తున్నాను. స్వర్గంలో భూలోకంలో ఆకాశంలో అన్నిదిక్కులలో గాలిలో,

నిప్పులో, సముద్రాలలో, భయంకరమైన అడవులలో, నీకు ఎప్పుడూ శుభం కలగాలి! దిక్పాలకులు, సిద్ధులు, సాధ్యులు, రుద్రులు, వేల్పువెజ్జులు, అశ్వినీదేవతలు, జగాలు, సూర్యచంద్రులు నిన్ను దయతో రక్షిస్తారు కాక.'

**విశేషం:** దిక్కులు - అష్టదిక్కులు. 1. తూర్పు 2. అగ్నిమూల 3. దక్షిణం 4. నిరృతిమూల 5. పడమర 6. వాయవ్యమూల 7. ఉత్తరం 8. ఈశాన్యం. దిక్పాలకులు: అష్టదిక్పాలకులు 1. ఇంద్రుడు 2. అగ్ని 3. యముడు 4. నిరృతి 5. వరుణుడు 6. వాయువు 7. కుబేరుడు 8. ఈశానుడు. రుద్రులు: ఏకాదశరుద్రులు. 1. అజుడు 2. ఏకపాదుడు 3. అహిర్బుధ్న్యుడు 4. విరూపాక్షుడు 5. సురేశ్వరుడు 6. జయంతుడు 7. బహురూపుడు 8. త్ర్యంబకుడు 9. అపరాజితుడు 10. వైవస్వతుడు 11. హరుడు.

**వ. అని యేడ్చుచుం గుంతి యచ్చటం దడయ వెఱచి గూఢప్రకారంబునఁ గన్యాంతఃపురంబునకు వచ్చి యెప్పటి యట్ల వర్తిల్లుచుండె; నట మంజూషయు నశ్వనదీవేగంబునఁ జర్మణ్వతికిం జని, యందుండి యమునాగత మయ్యెఁ; నట చని భాగీరథిం బడి సూతవిషయంబునం బంపానగరంబు చేరువ నరుగుచుండె; నా సమయంబున. 349**

**ప్రతిపదార్థం:** అని= అని (దీవించి); ఏడ్చుచున్= విలపిస్తూ; కుంతి= కుంతి; అచ్చటన్= ఆస్థలంలో; తడయన్= ఆలసించటానికి; వెఱచి= భయపడి; గూఢప్రకారంబునన్= రహస్యవిధానాన; కన్యా+అంతఃపురంబునకున్= కన్నియలు ఉండే అంతిపురికి; వచ్చి; ఎప్పటి+అట్లు+అ= ఇదివరకు మాదిరిగనే; వర్తిల్లుచున్+ఉండెన్= వ్యవహరిస్తూఉంది; అట= అచట (ఆ అశ్వనదిలో); మంజూషయున్= పెట్టెయు; అశ్వనదీవేగంబునన్= అశ్వనదీ ప్రవాహం యొక్క వేగంవలన; చర్మణ్వతికిన్= చర్మణ్వతి యనే నదిని చేరి; అందున్+ఉండి= చర్మణ్వతి నుండి; యమునాగతము+అయ్యెన్= యమునానదిని చెందింది అయ్యింది; అట చని= ఆయముననుండి వెళ్ళి; భాగీరథిన్+పడి= గంగలో చేరి; సూతవిషయంబునన్= సూతదేశంలో; పంపానగరంబు చేరువన్= పంప అనే పేరు కల పట్టణానికి సమీపాన; అరుగుచుండెన్= పోతూ ఉన్నది. ఆ సమయంబునన్= అప్పుడు.

**తాత్పర్యం:** కుంతి తనకుమారుడిని దీవించి విలపించింది. ఆస్థలంలో ఆలసించటం మంచిది కాదని భయపడి ఆమె అంతిపురానికి చేరి ఎప్పటివలె జీవితం సాగిస్తూ ఉన్నది. అట శిశువుతోకూడిన పెట్టె అశ్వనదీప్రవాహవేగంవలన చర్మణ్వతీనదిలోకి చేరింది. చర్మణ్వతినుండి యమునానదికి చేరింది. యమునునుండి గంగానదిని చేరి సూతదేశంలోని పంపానగరసమీపానికి వస్తున్న సమయంలో.

**విశేషం:** (1) గంగానదికి యమునానది ఉపనది. అట్లే యమునలో వచ్చి పడుతుంది చర్మణ్వతి. చర్మణ్వతిలో కలుస్తుంది అశ్వనది. (2) విధివిలాసం విచిత్రమైనది. అశ్వనదీతీరంలోని రాజపుత్రి కుంతి పాండురాజును వివాహమాడి "గంగాతీరంలోని హస్తినాపురి చేరింది. ఆమెపుత్రుడున్నూ అంతకుముందే హస్తినాపురాన్ని చేరాడు.

**సీ. ధృతరాష్ట్రసఖుఁ డైన యతిరథుం డనుసూతుఁ । డతివయుఁ దానును నతివిభూతి**
**గంగలోఁ జలకేళిసంగతుండై యుండి । తుంగతరంగానుషంగవశతఁ**
**జనుదెంచు మంజూషఁ గని కడువేడుకఁ । దనపరిజనములఁ బనిచి పట్టి**
**తెప్పించి ధీయుక్తి యొప్ప నేకతమున । నప్పెట్టెఁ దెఱచి తా నప్పు డందు**

**ఆ. వినుతహేమకవచుఁ గనకకుండలధరు । ననుపమానతేజు ఘనుఁ గుమారుఁ**
**గని మనంబులోన ననయంబు విస్మయం । బొనర గ్రుచ్చి యెత్తికొని ముదమున. 350**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రసఖుఁడు+ఐన= ధృతరాష్ట్రుడికి మిత్రుడు అయిన; అతిరథుండు+అను సూతుఁడు= అతిరథుడు అనేపేరు కల సూతుడు; అతివయున్= వనితయు, భార్యయు; తానునున్= తానును; అతి, విభూతిన్= మిక్కుటమైన విభవంతో; గంగలోన్= గంగానదిలో; జలకేళి= జలక్రీడలో; సంగతుండు+ఐ= కూడినవాడై; ఉండి= ఉండి; తుంగతరంగ+ అనుషంగవశతన్= ఎత్తైన కెరటాలతో కూడియుండటంచేత; చనుదెంచు= వస్తున్న; మంజూషన్= పేటికను; కని= అరసి; కడువేడుకన్= మిక్కుటమైన ఆసక్తితో; తన, పరిజనములన్= తనసేవకులను; పనిచి= ఆజ్ఞాపించి; పట్టి తెప్పించి= అందుకొని తనకడకు తెప్పించి; ధీయుక్తి+ఒప్పన్= బుద్ధికుశలత ఏర్పడేటట్లుగా; ఏకతమునన్= రహస్యంగా; ఆ+పెట్టెన్= ఆపెట్టెను; తెఱచి= విప్పి; తాన్= తాను; అప్పుడు= ఆసమయంలో; అందున్= ఆపెట్టెలో; వినుతహేమకవచున్= ప్రస్తుతించబడే బంగారు మైమరువు కలవాడిని; కనక, కుండల, ధరున్= పసిడి చెవిపోగులు ధరించినవాడిని; అనుపమానతేజున్= సాటిలేనిప్రకాశం కలవాడిని; ఘనున్= గొప్పవాడిని; కుమారున్= బాలకుడిని; కని= అరసి; మనంబులోనన్= చిత్తంలో; అనయంబున్= మిక్కుటంగా; విస్మయంబు+ఒనరన్= ఆశ్చర్యం కలుగగా; ముదమునన్= సంతోషంతో; గ్రుచ్చి ఎత్తికొని= పట్టి ఎత్తుకొని.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడిమిత్రుడు అయిన అతిరథుడు అనే సూతుడు గంగలో వైభవోపేతంగా తనభార్యతో కలసి జలక్రీడలు ఆడుతున్నాడు. అప్పుడు కెరటాలతూగులో తేలియాడుతూ ఒక తెప్పపై నున్న మంజూష కన్పించింది. సూతుడు తన సేవకులను పంపించి ఆపెట్టెను తెప్పించాడు. రహస్యంగా పెట్టెను తెరచి చూచాడు. అందులో అచ్చెరువు గొలుపుతూ బంగారు కవచంతో పసిడికుండలాలతో మెరసిపోతున్న మగబిడ్డడిని చూచి సంతోష తన్మయత్వంతో పట్టి ఎత్తుకొన్నాడు.

**విశేషం:** సూతుడు: క్షత్రియుడికి బ్రాహ్మణస్త్రీయందు జన్మించినవాడు. వైశ్యునకు క్షత్రియస్త్రీయందు జన్మించినవాడు. వీరు ఒక ప్రత్యేక కులంగా ఏర్పడ్డారు. వీరిలో రథాలు నడపటం కొందరకు వృత్తి అయింది. కొందరకు పురాణాలు చెప్పే వృత్తి ఏర్పడింది.

**వ. తన జీవితేశ్వరి యైన రాధం జూచి యిట్లనియె. 351**

**తాత్పర్యం:** తన ధర్మపత్ని అయిన రాధను చూచి ఈవిధంగా అన్నాడు.

**క. 'అనపత్యుల మగు మనకును । మనపాలిటివేలు పిక్కుమారుని నిచ్చెన్**
**వనజాక్షి! వీఁడు మానుష । జనితుఁడు గాఁ; డరయ దేవసంభవుఁడు సుమీ!' 352**

**ప్రతిపదార్థం:** వనజ+అక్షి!= పద్మాలవంటి కన్నులు కలదానా!; మనపాలిటివేలుపు= మనలను కాపాడే దేవుడు; అనపత్యులము+ అగు, మనకును= సంతానవంతులం కాని మనకు; ఈ+కుమారునిన్= ఈబాలకుడిని; ఇచ్చెన్= అనుగ్రహించాడు; వీఁడు= ఈబాలకుడు; మానుషసంభవుఁడు+కాడు= మనుజజాతికి పుట్టినవాడు కాడు, అరయన్= పరిశీలించగా; దేవసంభవుఁడు= దేవతకు జన్మించినవాడు; సుమీ= సుమా.

**తాత్పర్యం:** సూతుడు తనధర్మపత్నిఅయిన రాధతో ఈవిధంగా పలికాడు: 'పద్మాలవంటి కన్నులు కలదానా! మనకు సంతానం లేదుకదా. మనలను రక్షించే దేవుడు అనుగ్రహించి ఈ బాలకుడిని మనకు ప్రసాదించాడు. చూడుము ఇతడి అతిలోకతేజస్సు. ఈ బాలుడు మనుష్యులకు జన్మించినవాడు కాజాలడు. ఇతడు నిశ్చయంగా దైవాంశసంభూతుడు సుమీ!'

**క. అని దానిచేతి కిచ్చినఁ । గొని యురమున నదిమి కొనియెఁ గొడుకు నతివ; య**
**వ్వనితకుఁ బాలెంత తెఱం । గునఁ జన్నులు సేఁపె నపుడు గూరిమిపేర్మిన్. 353**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; దానిచేతికిన్= ఆమె చేతికి, రాధకు; ఇచ్చినన్= అందించగా; (రాధ); కొని= గ్రహించి (ఆశిశువును పట్టుకొని); ఉరమునన్= వక్షమున; అతివ (రాధ); కొడుకున్= బాలకుడిని; అదిమికొనియెన్= హత్తుకొన్నది; ఆ+వనితకున్= రాధకు; అపుడు= ఆసమయంలో; కూరిమిపేర్మిన్= ప్రేమాతిశయంచొప్పున; బాలెంత, తెఱంగునన్= బాలెంతరాలికివలె; చన్నులు+చేఁపెన్= చన్నుల నుండి పాలుకారాయి.

**తాత్పర్యం:** సూతుడు ఆ పసిబిడ్డను తనభార్య రాధచేతికి అందించాడు. ఆమెయు కుమారుడిని మిక్కుటమైన ప్రేమతో పుచ్చుకొని తన గుండెకు హత్తుకొన్నది. అప్పుడు బాలెంతరాలికి వలెనే ఆమెకు చన్నులు చేపాయి.

**వ. ఇ ట్లాదంపతులు ప్రమోదసంపద సొంపారఁ గుమారుం గొని నిజమందిరంబున కరిగి యాత్మీయకులోచితంబు లగు జాతకర్మ సంస్కారంబొనరించి సహజకుండలాలంకృతకర్ణుం డగుటం జేసి కర్ణుం డను నామకరణంబు సేసి; రంత. 354**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈరీతిగా; ఆదంపతులు= ఆ భార్యాభర్తలు (రాధ అతిరథుడు); ప్రమోదసంపద= ఆనందం అనే ఐశ్వర్యం; సొంపారన్= శోభిల్లగా; కుమారున్+కొని= బాలకుడిని పరిగ్రహించి; నిజమందిరంబునకున్+అరిగి= తమ ఇంటికి వెళ్ళి; ఆత్మీయ కుల+ఉచితంబులు+అగు= తమ కులానికి అనువైన; జాతకర్మసంస్కారంబు= పుట్టినపుడు చేసే సంస్కారం; ఒనరించి= చేసి; సహజ, కుండల+అలంకృతకర్ణుండు= ప్రకృతిసిద్ధమైన కుండలాలతో అలంకరించబడిన చెవులు కలవాడు; అగుటన్+చేసి= కావటంచేత; కర్ణుండు= కర్ణుడు; అను= అనునట్టి; నామకరణంబు+చేసిరి= పేరు పెట్టారు.

**తాత్పర్యం:** ఈ రీతిగా ఆసూతదంపతులు (అతిరథుడు రాధయును) ఆనందతన్మయత్వంతో ఆబాలకుడిని పరిగ్రహించి తమగృహాన్ని చేరి, తమకులానికి సంప్రదాయాలకు అనుగుణంగా ఆశిశువుకు పుట్టినప్పుడే చేసే సంస్కారం చేసి, సహజమైన కుండలాలు కల కర్ణములు కలవాడు కావున కర్ణుడు అని పేరుపెట్టారు.

**క. వసువర్మధరుఁడు గావున । వసుసేనుం డనెడుపేరు వాని కిడిరి పెం**
**పెసఁగఁగ భూసురు; లాది । త్యసుతుం డిబ్భంగి సూతతనయుం డయ్యెన్. 355**

**ప్రతిపదార్థం:** వసు, వర్మధరుఁడు= పసిడికవచం ధరించి పుట్టినవాడు; కావునన్= కాబట్టి; వసుసేనుండు; అనెడుపేరు= అనే నామధేయం; భూసురులు= బ్రాహ్మణులు; పెంపు+ఎసఁగఁగన్= పేర్మి అతిశయించగా; వానికిన్= ఆ శిశువుకు; ఇడిరి= ఇచ్చారు, పెట్టారు; ఈ+భంగిన్= ఈ రీతిగా; ఆదిత్యసుతుండు= సూర్యుడికొడుకు; సూతతనయుండు+అయ్యెన్= సూతుడికొడుకు అయ్యాడు.

**తాత్పర్యం:** పసిడిమైమరువుతో పుట్టినవాడు కావున ఆ మగబిడ్డకు బ్రాహ్మణులు 'వసుసేనుడు' అనే నామధేయాన్ని కల్పించారు. ఈ రీతిగా సూర్యుడికొడుకు సూతసుతుడు అయ్యాడు.

**వ. తద్వృత్తాంతంబంతయుఁ గుంతి తన యాప్తచారులవలన విని, శిథిలీకృతసంతాపయై యుండె; నతిరథుండును గ్రమంబున సంప్రాప్తయౌవనుం డయిన కొడుకుం దోడ్కొనివచ్చి ద్రోణాచార్యులయొద్ద నస్త్ర**

**శిక్ష సేయంబెట్టె; నా సూతసూనుండు మఱియుఁ గృపాచార్యులవలనను జామదగ్న్యువలనను, వివిధాస్త్రలాభంబు నొంది, క్రమంబున దుర్యోధనుతోడ బద్ధసఖ్యుండై యతనికిఁ బ్రియంబు సేయం దివిరి దివిజరాజనందనుతో మచ్చరించుచుఁ బాండవుల కప్రియంబు సేయుచుండె. 356**

**ప్రతిపదార్థం:** తద్+వృత్తాంతంబు+అంతయున్= కర్ణుడిసంగతి అంతా; కుంతి= పృథ; తన+ఆప్త, చారులవలనన్= తనకు ఆంతరంగికు లైన గూఢభటులవలన; విని= ఆలకించి; శిథిలీకృతసంతాప+ఐ+ఉండెన్= సడలిన ఆవేదన కలిగినదై ఉండింది; అతిరథుండును; క్రమంబునన్= కాలక్రమాన; సంప్రాప్తయౌవనుండు+అయిన= ప్రాప్తించిన జవ్వనం కలవాడయిన; కొడుకున్= కుమారుడిని; తోడ్కొనివచ్చి= తీసికొని అరుదెంచి; ద్రోణ+ఆచార్యుల+ఒద్దన్= ద్రోణుడు అనేపేరు కల గొప్పగురువుకడ; అస్త్రశిక్ష+చేయన్+పెట్టెన్= అస్త్రవిద్య నేర్చుకొనటానికి ఉంచాడు; ఆ సూతసూనుండు= ఆ సూతుడికొడుకు కర్ణుడు; మఱియున్= వెండియు; కృప+ఆచార్యులవలనను= కృపుడు అనే గురువువలనను; జామదగ్న్యువలనను= జమదగ్నికుమారుడైన పరశురాముడి వలనను; వివిధ+అస్త్రలాభంబున్+ఒంది= పెక్కుమంత్రమహిమలు కల ఆయుధాలను సంపాదించి; క్రమంబునన్= కాలక్రమంగా; దుర్యోధనుతోడన్; బద్ధసఖ్యుండు+ఐ= గాటంగా ఏర్పడిన స్నేహం కలవాడై; అతనికిన్= దుర్యోధనుడికి; ప్రియంబు= ప్రీతి; చేయన్+తివిరి= చేయబూని; దివిజ+రాజనందనుతోన్= దేవేంద్రసుతుడైన అర్జునుడితో; మచ్చరించుచున్= స్పర్థవహిస్తూ; పాండవులకున్; అప్రియంబు+చేయుచున్+ఉండెన్= అపకారం చేస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ వృత్తాంతాన్ని అంతా కుంతి తన ఆంతరంగిక గూఢచారులవలన తెలిసికొని ఆవేదన ఉడిగి ఊరడిల్లింది. అతిరథుడు తనకొడుకు యుక్తవయస్కుడు కాగానే ద్రోణాచార్యుడివద్ద అస్త్రవిద్యను అభ్యసించటానికి ఏర్పరచాడు. సూతసుతుడుగా విఖ్యాతి చెందిన కర్ణుడు ద్రోణాచార్యులకడ మాత్రమే కాక, కృపాచార్యులయొద్దను జమదగ్నికుమారుడైన పరశురాముడికడకూడా విలువిద్య నేర్చి, గొప్పఅస్త్రాలను సంపాదించాడు. కర్ణుడికి కాలక్రమంగా దుర్యోధనుడితో ప్రగాఢమైన స్నేహం ఏర్పడింది. ఆ మైత్రివలన అతడు పాండునందనులకు విరోధి అయి, వారికి అపకారాలు చేయ సమకట్టాడు.

**ఉ. ఆతని యస్త్రవీర్యము, సమంచితకుండల వజ్రవర్మవి**
**ఖ్యాతియు, నాత్మలోఁ దలఁచి కౌరవనాయక! ధర్మసూనుఁడున్**
**భీతమనస్కుఁడై, యతఁ డభేద్యబలుం డని సంతతంబు ధై**
**ర్యాతిశయంబు డించి హృదయవ్యథఁ బొందుచు నుండెఁ గానలోన్. 357**

**ప్రతిపదార్థం:** కౌరవనాయక!= ఓ జనమేజయ మహారాజా!; ఆతని+అస్త్రవీర్యము= కర్ణునియొక్క అస్త్రాలకు సంబంధించిన పరాక్రమము; సమ్+అంచిత, కుండల, వజ్రవర్మ, విఖ్యాతియున్= చక్కగా ప్రకృతిసిద్ధంగా అమరిఉన్న చెవిపోగులు, వజ్రం వంటి తనుత్రాణాన్నిగూర్చిన కీర్తిని; ఆత్మలోన్= మనస్సులో; తలఁచి= తలపోసి; ధర్మసూనుఁడున్= ధర్మపుత్రుడును; భీతమనస్కుఁడు+ఐ= భయం చెందిన మనస్సు కలవాడై; అతఁడు= కర్ణుఁడు; అభేద్యబలుండు+అని= భేదించటానికి వీలులేని బలం కలవాడని; సంతతంబు= ఎల్లప్పుడును; ధైర్య+అతిశయంబు= ధైర్యంయొక్క పెంపు; డించి= క్రిందకు పడవైచి; కానలోన్= అరణ్యంలో; హృదయవ్యథన్= ఎదలో ఆవేదనను; పొందుచున్+ఉండెన్= అనుభవిస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** కురువంశానికి నాయకుడైనవాడా, ఓ జనమేజయమహారాజా! కర్ణుడి అస్త్రవిద్యాపాటవాన్ని ఆతడిసహజ కవచకుండలాల కీర్తిని మనస్సులో తలచుకొని అరణ్యవాసంలో ఉన్న ధర్మనందనుడు ధైర్యం కోలుపోయి ఎదలో మిక్కిలి ఆవేదనను అనుభవిస్తూ ఉండేవాడు.

**వ. అయ్యుధిష్ఠిరునకుఁ బ్రియం బాచరింపంగోరి కర్ణుకవచకుండలంబులు కొనుటకై పురందరుం డొక్కనాఁడు బ్రాహ్మణరూపంబునం జని, మధ్యాహ్నసమయంబునఁ గర్ణుండు సూర్యోపాస్తి సేయుచుండి బ్రాహ్మణుల కభీష్టధనంబు లిచ్చుతఱి నతనిం గని, 'భిక్షాం దేహి' యనుటయుఁ గర్ణుం డతని కిట్లనియె. 358**

**ప్రతిపదార్థం:** ఆ+యుధిష్ఠిరునకున్= ఆ ధర్మనందనుడికి; ప్రియంబు+ఆచరింపన్+కోరి= ప్రీతిని ఘటించ సంకల్పించి; కర్ణుకవచకుండలంబులు= కర్ణుడియొక్క కవచాన్నీ కుండలాలనూ; కొనుటకున్+ఐ= గ్రహించటానికై; పురందరుండు= దేవేంద్రుడు; ఒక్కనాఁడు= ఒకరోజున; బ్రాహ్మణరూపంబునన్+చని= విప్రుని ఆకారంలో వెళ్ళి; మధ్యాహ్నసమయంబునన్= పట్టపగటివేళ; కర్ణుండు; సూర్య+ఉపాస్తి+చేయుచున్+ఉండి= సూర్యుడికి ఆరాధన సలుపుతూ ఉండి; బ్రాహ్మణులకున్= విప్రులకు; అభీష్ట, ధనంబులు= కోరినద్రవ్యాలు; ఇచ్చుతఱిన్= ఒసంగేతరుణంలో; అతనిన్+కని= వాడిని (కర్ణుడిని) చూచి; "భిక్షాం దేహి" = బిచ్చాన్ని ఇమ్ము; అనుటయున్= అని అనగానే; కర్ణుండు; అతనికిన్= విప్రవేషంలో వచ్చిన దేవేంద్రుడికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కర్ణు డంటే భయపడుతున్న ధర్మనందనుడికి సంప్రీతి కలిగించటానికై, కర్ణుడికవచకుండలాలను గ్రహించతలపోసి దేవేంద్రుడు ఒకనాడు విప్రవేషధారి అయి ఏతెంచాడు. అది పట్టపగలు. ఆ మధ్యాహ్నసమయంలో కర్ణుడు సూర్యోపాసన చేస్తూ ఉన్నాడు. అక్కడ గుమిగూడిన బ్రాహ్మణులకందరికీ కోరిన ద్రవ్యాల నతడు ఒసగుతూ ఉన్నాడు. దేవేంద్రుడు ఆ సమయంలో, 'భిక్షాం దేహి' (బిచ్చము పెట్టుము) అని అడిగాడు. అతడితో కర్ణుడు ఈ విధంగా అన్నాడు.

**చ. 'అలసవిలాసలాలసరసాన్విత లైన నితంబినీజనుల్**
**వలసిన, భూరివిస్ఫురితవస్తుసమగ్రము లైన గ్రామముల్**
**వలసిన, నుల్లసన్మణిసువర్ణవిభూషణగోధనావళుల్**
**వలసినఁ గోరు మిచ్చెద ధ్రువంబుగ' నావుడు నాతఁ డిట్లనున్. 359**

**ప్రతిపదార్థం:** అలస, విలాస, లాలస, రస+అన్వితలు= సుకుమారమైన విలాసమునందు మిగుల అనురక్తలైన శృంగారవతులు; ఐన; నితంబినీ-జనుల్= స్త్రీలు (నితంబిని-పెద్ద నితంబము పిఱుందు గలది స్త్రీ); వలసినన్= కావలసినా, భూరి, విస్ఫురితవస్తు, సమగ్రములు= అధికంగాఒప్పే పంటలు, వస్తువులు అనువానిచే నిండినవి; ఐన, గ్రామముల్= ఊరులు, వలసినన్= కావలసినా, ఉల్లసత్+మణి, సువర్ణ, విభూషణ, గోధన+ఆవళుల్= ప్రకాశిస్తున్న మణులతో బంగారముతో కూడిన నగలూ, గోధనముల వరుసలు; వలసినన్= కావలసినా, కోరుము; ధ్రువంబుగన్= నిశ్చయంగా ఇచ్చెదన్; నావుడున్= అనినంతనే; ఆతఁడు= కపట విప్రుడైన ఇంద్రుడు; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** మృదువైన విలాసంతో కూడియున్న శృంగారవతులైన యువతులు కావలసినా, అధికమైనా పంటలతోనూ, ప్రకాశించే రత్నాలతో వస్తువులతోనూ నిండిన గ్రామాలు కావలసినా, బంగారంతోనూ కూడిన నగలూ, గోధనాలూ కావలసినా తప్పక ఇస్తాను, కోరుకో అని కర్ణుడనగా విప్రవేషంలో ఉన్న ఇంద్రుడు ఈ రీతిగా పలికాడు.

**క. విను మివి యెయ్యవియును నా । కు నభీష్టము గావు; నీదు కుండలములు నీ**
**వినుతకవచంబు నిచ్చినఁ । గొనియెద; ని మ్మొపుదేని గుణరత్ననిధీ!. 360**

**ప్రతిపదార్థం:** గుణరత్ననిధీ!= మంచిగుణాలు అనే రత్నాలకు నెలవైనవాడా! సుగుణసముద్రుడా!; వినుము= ఆలకింపుము; ఇవి; ఏ+అవియును= ఇవి ఏవీకూడా; నాకున్; అభీష్టము+కావు= ఇష్టాలు కావు, నీదు+కుండలములు= నీ కర్ణభూషణములు;

నీ వినుత, కవచంబున్= కీర్తించబడిన నీమైతొడవును; ఇచ్చినన్= ఇస్తే; కొనియెదన్= స్వీకరిస్తాను; ఓపుదు(వు)+ఏనిన్= శక్తిఉంటే; ఇమ్ము= ఒసగుము.

**తాత్పర్యం:** అవధరింపుము. సుగుణరత్నాకరా! కర్ణ! నీవు చెప్పినవి ఏవియు (అన్నులమిన్నలు, అగ్రహారాలు, సువర్ణమణిభూషణగోధనరాసులు మున్నగునవి) నాకు ఇష్టాలు కావు. నీకు ఇష్టమైతే నీ చెవిపోగులనూ సుప్రసిద్ధమైన నీకవచాన్నీ దానంచేయుము గ్రహిస్తాను.

**చ. అనవుడుఁ గర్ణుఁ డిట్లనియె 'నక్కట! యేను విశిష్టవస్తువుల్**
**గొనకొని యిత్తు నాఁగ నిటు గోరెదు నీవు దలంప నప్రయో**
**జన మగు వాని భూమిసురసత్తమ! యెంతయు బేల వైతి; ము**
**న్ననయఁగ నిట్టి వెవ్వరును నెవ్వరి వేఁడిరె యిజ్జగంబులన్? 361**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (విప్రవేషధారి) చెప్పగా; కర్ణుఁడు, ఇట్లు+అనియెన్= ఈరీతిగా చెప్పాడు; అక్కట!= అయ్యో!; ఏను= నేను; విశిష్టవస్తువుల్= విశేషప్రాముఖ్యంగల పదార్థాలు; గొనకొని+ఇత్తున్= పూని (ఇష్టంతో) ఇస్తానని; నాఁగన్= అనగా; భూమిసురసత్తమ!= బ్రాహ్మణులలో శ్రేష్ఠుడా!; ఇటు= ఈ రీతిగా; నీవు= నీవు; తలంపన్= ఆలోచించగా; అప్రయోజనము+ అగువానిన్= లాభం లేని వాటిని; కోరెదు= కోరెదు(వు)= కోరుతున్నావు; ఎంతయున్= మిక్కిలి; బేలవు= అమాయకుడవు; ఐతి(వి)= అయినావు; మున్ను= పూర్వం; ఎనయఁగన్= ఒప్పిదంగా; ఇట్టివి= ఇట్టికోరికలు; ఎవ్వరును= ఎవరైనా; ఈ+జగమ్ములన్= ఈలోకాలలో; ఎవ్వరిన్= ఎవరినైనా; వేఁడిరె?= అడిగారా?

**తాత్పర్యం:** అనిన కర్ణు డీవిధంగా అన్నాడు: 'అయ్యో, ఓ బ్రాహ్మణోత్తమా! నేను నీకు విశేషమైన ప్రాముఖ్యం గల వస్తువులను ఇస్తా నని చెప్పానుకదా! నీవు అమాయకుడివలె కన్పిస్తున్నావు. నీవు ఈ ఉపయోగంలేని వస్తువులను ఎందుకు కోరుకొంటున్నావు? నీవలె ఇంతకుముందు ఎవరైనా ఎవరినైనా జగత్తులో ఇటువంటివాటిని కోరినవారు ఉన్నారా? (నీకోర్కె అపూర్వం అని భావం).

**క. కుండలములుఁ గవచము న । ట్లుండఁగ ని మ్మనఘ! వేఁడు మొండు ధనంబుల్;**
**నిండింతు నీమనోరథ । మొండేమియు ననకు మింక నూర్జితచరితా!.' 362**

**ప్రతిపదార్థం:** ఊర్జితచరితా!= గొప్ప శీలం కలవాడా!; అనఘా!= పాపరహితుడవైనవాడా! ఓ బ్రాహ్మణోత్తమా!; కుండలములున్= చెవిదుద్దులును; కవచమున్= తనుత్రాణాన్ని; అట్లు+ఉండఁగనిమ్ము= అటులనే ఉండనిమ్ము; ఒండు ధనంబుల్= వేరుద్రవ్యాలను; వేఁడుము= కోరుకొనుము; నీమనోరథమున్= నీకోరికను; నిండింతున్= పరిపూర్ణం చేస్తాను, ఈడేర్చగలను; ఇంకన్+ఒండు+ ఏమియున్+అనకుము= దయచేసి ఇక మారుమాట పలుకవద్దు.

**తాత్పర్యం:** గొప్పశీలం కల బ్రాహ్మణోత్తమా! నీవు పుణ్యాత్ముడవు. నీకు నిరుపయోగాలైన కవచకుండలాల మాట దయచేసి ఎత్తకుము. వేరుద్రవ్యాలను కోరుకొమ్ము. నీకోరిక పరిపూర్ణంగా తీరేటట్లు చేయగలను. ఇక నామాటకు ఎదురుమాట చెప్పవద్దు'.

**వ. అనిన నతం డెవ్విధంబున నొడంబడక కవచకుండలంబులయంద బద్ధాభిలాషుం డయి పలికినఁ, గర్ణుం డతనిం బ్రార్థించియుఁబూజించియు ననేకమణికనకాది ద్రవ్యంబులు నివేదించియు నెట్లును నొడంబఱుపనేరక యి ట్లనియె. 363**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (కర్ణుఁడు) చెప్పగా; ఏ+విధంబునన్= ఏరీతిగా నయినను; ఒడంబడక= అంగీకరించక; కవచకుండలంబులయందున్+అ= కవచకుండలాలయందుమాత్రమే; బద్ధ+అభిలాషుండు+అయి= స్థిరంగా లగ్నమైన కోరిక కలవాడు అయి; అతండు; పలికినన్; కర్ణుండు; అతనిన్= (విప్రవేషధారిని); ప్రార్థించియున్= వేడికొనినా; పూజించియును= అర్చించినా; అనేక, మణి, కనక+ఆది, ద్రవ్యంబులు= పెక్కురత్నాలు బంగారాలు మున్నగు పదార్థాలు; నివేదించియున్= ఇవ్వచూపినా; ఎట్లునున్= ఏవిధంగానూ; ఒడంబఱుపనేరక= అతడిని అంగీకరింపజేయజాలక; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడు చెప్పినమాటలకు విప్రవేషధారి సమ్మతించక తనకు కవచకుండలాలే కావా లని మొండిపట్టు పట్టాడు. కర్ణుడు ఆ విప్రవేషధారిని వేడికొన్నాడు. అతడికి పూజలు చేశాడు. పెక్కురత్నాలు బంగారాలు మున్నగుపదార్థాలను ఇవ్వజూపాడు. కాని, ఆ విప్రవేషధారి తనపట్టుదల వీడలేదు. అప్పుడు కర్ణుడు ఆ విప్రవేషధారితో ఇట్లా అన్నాడు.

**తే. 'సహజములు నాకు నిక్కవచంబుఁ గుండ । లములు నివి లేకయున్న నే సమరభూమిఁ**
**గడిఁది శత్రులచేత భంగంబు వచ్చుఁ । గాన యీఁజాల నయ్యెద వీని నేను. 364**

**ప్రతిపదార్థం:** నాకున్; ఈ+కవచంబున్; కుండలములున్= ఈ కవచం, పోగులు; సహజములు= పుట్టుకతోవచ్చినవి; ఇవి= ఈకవచకుండలాలు; లేకయున్నన్= లేనిచో; ఏ సమరభూమిన్= ఏ యుద్ధరంగంలోనైనా; కడిఁది, శత్రులచేతన్= గొప్పవిరోధులచేత; భంగంబు= పరాజయం; వచ్చున్= కలుగును; కాన= కావున; వీనిన్= వీటిని, ఈ కవచకుండలాలను; ఏను= నేను; ఈన్+చాలన్+అయ్యెదన్= ఈయజాలనివాడనౌతున్నాను.

**తాత్పర్యం:** ఈకవచకుండలాలు నాకు పుట్టుకతోనే ఉన్నవి కాని నేను సంపాదించి పెట్టుకొన్నవి కావు. ఈ కవచకుండలాలు లేకపోతే ఏ యుద్ధభూమిలోనైనా బలవంతులైన విరోధులు దాపురించినపుడు నాకు పరాజయం కలుగుతుంది. కావున ఈ కవచకుండలాలను నేను ఇవ్వలేను.

**విశేషం:** (1) దానం చేయవలసింది స్వార్జితమైన తనసొత్తుమాత్రమే. కవచకుండలాలు కర్ణుడిస్వార్జితాలు కావు. అంతేకాక, ఇవి అతడికి ప్రాణసమానాలు. ఈపద్యంవలన కర్ణుడికి తన కవచకుండలాల విలువ తెలిసినట్లు తేలుతున్నది. ఇది తెలియక చేసే దానం కాదు. ఈపద్యంలోని స్వారస్యం గుర్తించతగింది. (2) 'ఏ సమరభూమిఁగడిఁది శత్రులచేత భంగంబువచ్చు' - అనే ఈ పాఠానికి 'నే సమరభూమిఁగడిఁది భంగంబు వడుదు' - అనే పాఠాంతరం వావిళ్ళప్రతిలో కానవస్తున్నది.

**క. నానాజనపదబహుళము । నానాధనయుతము నైన నారాజ్యము స**
**మ్మానంబున నిచ్చెదఁ గొన । వే ననుఁ గారింప కింక విప్రవరేణ్యా!' 365**

**ప్రతిపదార్థం:** విప్రవరేణ్యా!= ఓబ్రాహ్మణోత్తమా!; నానా, జనపదబహుళము= పెక్కుగ్రామాలతో విస్తరించినట్టిది; నానాధనయుతమున్= పెక్కువిధాలైన ద్రవ్యాలతో కూడినది; ఐన; నారాజ్యము= నారాజ్యం; అంగదేశం; సమ్మానంబునన్= గౌరవపూర్వకంగా; ఇచ్చెదన్= సమర్పిస్తాను; ఇంకన్= ఇక; ననున్= నన్ను; కారింపక= వేధించకుండ; కొనవే= స్వీకరించుమా.

**తాత్పర్యం:** ఓ బ్రాహ్మణోత్తమా!, పెక్కుగ్రామాలతో విస్తరించినట్టిది, పెక్కుద్రవ్యసంపదలతో కూడినట్టిది అయిన నారాజ్యం అంగదేశం. దానిని నీకు బహుమానంగా సమర్పిస్తాను. దయతో స్వీకరించుము. ఇక నన్ను వేధించవద్దు'.

**వ. అనియును నతనియందు సుముఖత్వంబు గానక కానీనుండు దరహసితాననుం డగుచుఁ గృతకభూసురు నుపలక్షించి యి ట్లనియె. 366**

**ప్రతిపదార్థం:** అనియును= అని చెప్పికూడా; అతనియందున్= ఆ విప్రుడిలో; సుముఖత్వంబు= సమ్మతించిన పోకడ; కానక= చూడక; కానీనుండు= కన్యాపుత్రుడు కర్ణుడు; దరహసిత+ఆననుండు= చిరునవ్వుతో కూడిన మొగం కలవాడు; అగుచున్= ఔతూ; కృతకభూసురున్= కపటవిప్రుడిని; ఉపలక్షించి= చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పినప్పటికిని, ఆ బ్రాహ్మణుడియందు సమ్మతించిన జాడ కానుపించకపోవటం చూచి, కన్యకకు జనించినవాడైన కర్ణుడు చిరునవ్వుతో కూడిన మొగం కలవాడూ ఔతూ ఇట్లా అన్నాడు.

**విశేషం:** కర్ణుడు 'దరహసితవదనుడు' అయ్యాడు. దానికి కారణం ఆ బ్రాహ్మణుడు కపటవేషధారి అని కర్ణుడు గుర్తించటమే. కర్ణుడిముఖాన విరిసిన దరహాసముద్రకు అంతరార్థం తరువాతిపద్యంలో సుస్పష్టం.

**చ. 'ఎఱిఁగితి నిన్ను నేను; విబుధేంద్రుఁడ వీవు; జగత్త్రయంబు గ్ర**
**చ్ఛఱ భవదీయరక్షణమునంద వెలుంగుచునుండు; నట్టి ని**
**న్నుఱవుగ నేను వేఁడుకొన యుక్తుఁడఁగాక, మొఱఁగి నన్ను న**
**క్కఱ పడి నీవు వేఁడు టిది కర్జమె నిర్జితదైత్య! చెప్పుమా! 367**

**ప్రతిపదార్థం:** నిర్జితదైత్య!= రాక్షసులను జయించినవాడా! ఓదేవేంద్రా!; నేను; నిన్నున్ ఎఱిఁగితి= నిన్ను గుర్తించాను; ఈవు= నీవు; విబుధ+ఇంద్రుఁడవు= దేవతలకు అధినేత వైనవాడవు; జగత్+త్రయంబు= మూడులోకాలు; క్రచ్చఱన్= (క్రచ్చ+అఱన్) నిష్కల్మషంగా; భవదీయరక్షణమునందున్+అ= నీయొక్క కాపుదలయందే; వెలుంగుచున్+ఉండున్= శోభిల్లుతుంటాయి; అట్టి= అటువంటి; నిన్నున్; ఉఱవుగన్= ఒప్పిదంగా; ఏను= నేను; వేడుకొనన్= ప్రార్థించటానికి; యుక్తుఁడన్+కాక= అర్హుడను గాని; మొఱఁగి= వంచించి; నన్నున్; అక్కఱ+పడి= అవసరపడి; సవ్యాజంగా; నీవు (ఓఇంద్రుడా! నీవు); వేడుట= అర్థించటం; ఇది; కర్జము+ఎ?= (కర్జమె)? చేయదగిన కృత్యమా?; చెప్పుము+అ= దయచేసి వచించుము.

**తాత్పర్యం:** రాక్షసులను జయించిన ఓ దేవేంద్రా! నేను నిన్ను గుర్తుపట్టగలిగాను సుమా! మూడులోకాలు నీసంరక్షణలో శోభిల్లుతున్నాయికదా! అట్టి నిన్ను నేను వేడుటలో అర్థముంటుంది గాని నీవే నన్ను ఏదో వ్యాజంతో యాచించటమా? అంతేకాక నన్ను నీవు మారువేషంలో వచ్చి వంచించటం చేయవలసిన కృత్యమా? దయచేసి నీవే చెప్పుము.

**విశేషం:** (1) కర్ణుడు కపటవిప్రుడిని దేవేంద్రుడిగా గుర్తించాడుకదా! 'నీవు బ్రాహ్మణుడవు కావు. వంచకుడవు. నేను నీకు ఎట్టిదానాన్ని చేయను' అని కర్ణుడు అనలేదు. దేవేంద్రుడు వంచకుఁడే అయినను, కర్ణుడు తనదానవ్రతాన్ని మాత్రం విడనాడ దలచ లేదు. (2) దానానికి అంతరాత్మ త్యాగం అని మహాభారతసందేశం. సక్తుప్రస్థనిగాథ ఉదాహరణం. ధర్మరాజు అశ్వమేధయాగంలోని దానాలు గాని షోడశమహారాజులు యజ్ఞాలలో చేసినదానాలు గాని ఆధ్యాత్మికదృష్టిలో అచ్చమైన దానాలు కావని ముంగిసరూపం ధరించిన జమదగ్ని మహాముని వివరించి ఉన్నాడు. అచ్చమైన దానంలో ఆత్మార్పణ అమరిఉంటుంది.

కర్ణుడి కవచకుండలప్రదానంలో త్యాగయోగంతో కూడిన ఆత్మార్పణం అమరిఉన్నది. ఆసంగతి దేవేంద్రుడికి తెలియును. కర్ణుడు దానవ్రతాన్ని విడనాడడు అనే విశ్వాసం దేవేంద్రుడికి ఉన్నది.

**తే. అనిన నింద్రుఁ డిట్లనియె 'మీయయ్య పద్మ । హితుఁడు మున్నింతయును జెప్పె నిష్ట మెసఁగ**
**గాన నెఱిఁగితి నీ; వింకఁ గడప నేల । యనఘ! మాబోఁటులకుఁ బ్రియమైన పనికి'. 368**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (కర్ణుడు) చెప్పగా; ఇంద్రుఁడు= వేల్పులరేడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అనఘ!= పుణ్యాత్ముడా!; మీ+అయ్య= మీతండ్రి; పద్మహితుఁడు= సూర్యుడు; ఇష్టము+ఎసఁగన్= ప్రీతి అతిశయించగా; మున్ను= మునుపు; ఇంతయున్= ఈ విషయాన్ని అంతటిని; చెప్పెన్= వచించిఉన్నాడు; కానన్= కావున; నీవు; ఎఱిఁగితి(వి)= తెలిసికొన్నావు; ఇంకన్= ఇకమీద; మాబోఁటులకున్= మావంటివారికి; ప్రియము+ఐన, పనికిన్= ఇష్టమయిన కార్యానికి; కడపన్+ఏల= ఇయ్యక పొమ్మంటావెందుకు?

**తాత్పర్యం:** కర్ణుడితో ఇంద్రుడు ఈ రీతిగా వచించాడు: 'పుణ్యాత్ముడవైన ఓకర్ణా! నీతండ్రి అయిన సూర్యుడు మున్ను నీమీదిప్రేమతో ఈ విషయాన్ని అంతటిని చెప్పిఉన్నాడు కాబట్టి నీవు నన్ను గుర్తించగలిగితివి సరే. ఇక మాబోటివారికి ఇష్టమైనకార్యం నెరవేర్చకుండా నీవు పొమ్మంటావెందుకు?

**వ. అనిన రాధేయుండు 'దేవా యట్లయిన నిఖిలశత్రుఘాతిని యయిన నీయమోఘశక్తి నాకుం గృప సేసి కవచకుండలంబులు గొను' మనినం బాకశాసనుం డి ట్లనియె. 369**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (దేవేంద్రుడు) చెప్పగా; రాధేయుండు= కర్ణుడు; దేవా= దేవరా! ఓ దేవేంద్రా!; అట్లుఅయినన్; నిఖిల, శత్రు ఘాతిని అయిన= సమస్తశత్రువులను సంహరించేది అయిన; నీ+అమోఘ, శక్తి= ఎన్నడు బీరువోనట్టి "శక్తి" అనే ఆయుధం; నాకున్= నాకు; కృప+చేసి= అనుగ్రహించి; కవచకుండలంబులు= తనుత్రాణాన్ని, కర్ణభూషణాలను; కొనుము= స్వీకరించుము; అనినన్= అని చెప్పగా; పాకశాసనుండు= దేవేంద్రుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా కర్ణుడు ఇట్లా అడిగాడు: 'దేవేంద్రా! అట్లే అయితే సమస్త శత్రువులను చంపగలిగిన తిరుగులేని శక్తి అనే నీ ఆయుధాన్ని నాకు దయచేసి ఇచ్చి, నా కవచకుండలాలను తీసికొమ్ము' అనగా ఇంద్రుడు ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఇచ్చెద శక్తి నీకు; విను మేర్పడ; నాజి మదీయశత్రులం**
**గ్రచ్చఱఁ జంపి చంపి యది గ్రమ్మఱ చేతికి వచ్చుచుండు; నీ**
**కిచ్చుట యట్లు గాదు; భువి నెందును దుర్జయుఁ డైన నీరిపుం**
**జెచ్చెరఁ దున్మ నొక్కరుని; చేకుఱ నన్ను భజించుఁ గ్రమ్మఱన్. 370**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; శక్తిన్= శక్తి అనే ఆయుధవిశేషాన్ని; ఇచ్చెదన్= ఇస్తాను; ఏర్పడన్+వినుము= సావధానంగా ఆలకించుము; ఆజిన్= యుద్ధంలో; మదీయశత్రులన్= నావిరోధులను; క్రచ్చఱన్= (క్రచ్చు+అఱన్=) శీఘ్రంగా (నిరవశేషంగా); చంపి, చంపి= పూర్తిగా సంహరించి; అది= ఆ "శక్తి"; క్రమ్మఱ= మరల; చేతికిన్ వచ్చుచుండున్= నాచేతికి చేరుతూ ఉంటుంది; నీకున్+ఇచ్చుట= నీకు ఇవ్వటం; అట్లు+కాదు= ఆ విధంగా కాదు; భువిన్= భూలోకంలో; ఎందును= ఎచ్చటను; దుర్జయుఁడు+ఐన= గెలువ నలవిగాని; నీ రిపున్= నీశత్రువును; చెచ్చెరన్= శీఘ్రంగా; ఒక్కరుని= ఒకరినిమాత్రమే; తున్మన్= సంహరిస్తుంది; క్రమ్మఱన్= మరల; చేకుఱన్= లభించేటట్టు; నన్నున్= నన్ను; భజించున్= పొందుతుంది.

**తాత్పర్యం:** 'నీకు నాఆయుధవిశేషం 'శక్తి' ని ఇస్తాను. కాని, నేను విధించే నియమాన్ని సావధానంగా వినుము. యుద్ధంలో నా 'శక్తి' శత్రువులను శీఘ్రంగా సంహరించి మరల నాచేతికి వస్తూ ఉంటుంది. ఇప్పుడు నేను నీకు ఇచ్చే శక్తి భూలోకంలో గెలువశక్యం గాని నీశత్రువును ఒకరిని మాత్రమే చంపి, తిరిగి నావద్దకు వచ్చి చేరి నన్ను సేవిస్తుంది.

**వ.** **ఇట్టిది సమయంబుగాఁ బరిగ్రహింపు' మనినఁ గర్ణుండు 'నాకుం గల పగతుండును నొక్కరుండ; వాని వధియించుటయ మదీయమనోరథం' బనుటయుఁ బురందరుండు దరహసితవదనుం డై.** **371**

**ప్రతిపదార్థం:** ఇట్టిది= ఇటువంటిది; సమయంబుగాన్= నియమముగా; ('శక్తి'); పరిగ్రహింపుము= స్వీకరించుము; అనినన్= అని (దేవేంద్రుడు) పలుకగా; కర్ణుండు; నాకున్+కల= నాకు ఉన్న; పగతుండును= విరోధియున్నూ; ఒక్కరుండు+అ= ఒక్కడు మాత్రమే; వానిన్= అతడిని, ఆశత్రువును; వధియించుట+అ= సంహరించుట మాత్రమే; మదీయ, మనోరథంబు= నా కోరిక; అనుటయున్= అని చెప్పగా; పురందరుండు= దేవేంద్రుడు; దరహసితవదనుండు+ఐ= చిరునవ్వుతో కూడిన మొగం కలవాడై.

**తాత్పర్యం:** ఈ నియమానికి అంగీకరించి నీవు నా 'శక్తి'ని పరిగ్రహించుము' అని దేవేంద్రుడు చెప్పాడు. కర్ణుడును 'నాకు గల శత్రువు ఒక్కడే. ఆతడిని సంహరించటమే నాకోరిక. అందుచేత నీవు నిర్ణయించిన నియమానికి అంగీకరిస్తున్నాను' అని అన్నాడు. దేవేంద్రుడు కర్ణుడిపలుకులు ఆలకించి చిరునవ్వుతో కూడిన మొగం కలవాడై.

**ఉ.** **'నీ యభిలాష మేను మది నిక్క మెఱుంగుదు; నుగ్రశౌర్యతే**
**జోయుతుఁ బార్థు నోర్తు నని చూచెదు; నీ కది యేల తీరు రా**
**ధేయ! దయావిధేయుఁడు విధేయజగత్త్రయుఁ డవ్యయుండు నా**
**రాయణుఁ డమ్మహాత్మునకు రక్షకుఁ; డేరికి వాఁడు సాధ్యుఁడే?'** **372**

**ప్రతిపదార్థం:** రాధేయ= ఓకర్ణా!; నీ+అభిలాషము= నీ కోరిక; ఏను= నేను; మదిన్= చిత్తంలో; నిక్కము= నిజంగా; ఎఱుంగుదున్= తెలియుదును; ఉగ్ర, శౌర్య, తేజోయుతున్= (తేజస్+యుతు) భయంకరమైన వర్చస్సుతో కూడినవాడిని; పార్థున్= అర్జునుడిని; ఓర్తున్= జయింతును; అని చూచెదు= అని ఆలోచిస్తావు; నీకున్; అది= అర్జునుడినిజయించటం; ఏల, తీరున్= ఎందుకు నెరవేరుతుంది?; దయావిధేయుఁడు= కరుణకు లోబడినవాడు, కృపామూర్తి; విధేయ, జగత్+త్రయుఁడు= లోబడిన మూడులోకాలు కలవాడు; అవ్యయుండు= అక్షరుడు; నారాయణుఁడు= శ్రీకృష్ణుడు; ఆ+మహా+ఆత్మునకున్= ఆ మహనీయుడికి, అర్జునుడికి; రక్షకుఁడు= కాపాడేవాడు; వాఁడు= అతడు, అర్జునుడు; ఏరికిన్= ఎవరికైనను; సాధ్యుఁడు+ఏ= సాధించదగినవాడా? (ఎవరును అర్జునుడిని జయించజాలరు.)

**తాత్పర్యం:** ఓకర్ణా! నీకోరికలోని ఆంతర్యం నామనస్సులో తెలిసికొన్నాను. భయంకరమైన శౌర్యం గల అర్జునుడిని యుద్ధంలో జయించవలెనని నీ ఉబలాటం కాని, నీకోరిక ఈడేరేది కాదు. మూడులోకాలున్నూ అవ్యయుడైన నారాయణదేవుడికి విధేయాలు. ఆ దేవుడు కృపారసమూర్తి. అతడు శ్రీకృష్ణుడు- అర్జునుడిని కాపాడేవాడు. కనుక, అర్జునుడు ఎవరికిన్నీ సాధ్యుడు కాడు. నీవు అర్జునుడిని గెలువజాలవు.'

**వ.** **అనినం దపననందనుం 'డది యట్లుండెె; సహజం బైన కవచం బొలిచి యిచ్చిన మదీయదేహంబు వికృతం బగు; నిది యే మని యవధరించె?' దనిన నింద్రుండు 'నీ శరీరంబు భవజ్జనకుం డైన యరుణకిరణువర్ణం**

**బెట్టి దట్టిదీప్తిం జెలువొందు' నని పలికి వానికి నమోఘశక్తి యొసంగి 'దీని నాపత్కాలంబునం దక్కం బెఱయప్పుడు ప్రయోగించిన నీ కపాయంబగు' నని చెప్పెఁ; దదనంతరంబ యవ్వీరుండు కవచ కుండలంబులం బుచ్చి యతని కిచ్చె. 373**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (దేవేంద్రుడు చెప్పగా); తపననందనుండు= సూర్యపుత్రుడైన కర్ణుడు; అది= అది(నీమాట); అట్లు+ఉండెన్= ఆరీతిగా ఉండనిమ్ము; సహజంబు+అయిన= పుట్టుకతో ఏర్పడిన; కవచంబు= తనుత్రాణం; ఒలిచి ఇచ్చినన్= ఒలిచి ఇస్తే; మదీయదేహంబు= నాశరీరం; వికృతంబు+అగున్= వికారం కాగలదు; ఇది= ఈ విషయం; ఏమి+అని= ఏమని; అవధరించెదు= ఆలోచిస్తావు'; అనినన్= అని అడుగగా; ఇంద్రుండు; 'నీశరీరంబు= నీదేహం; భవత్+జనకుండు+ఐన= నీతండ్రిఅయిన; అరుణకిరణువర్ణంబు= ఎర్రని కిరణాలు కలవాడైన సూర్యుడిరంగు; ఎట్టిది+అ= ఎట్టిదో; అట్టి= అటువంటి; దీప్తిన్= ప్రకాశంతో; చెలువు+ఒందున్= శోభను పొందుతుంది; అని పలికి= అని వచించి; వానికిన్= అతడికి, కర్ణుడికి; అమోఘశక్తిన్= వ్యర్థంకాని- 'శక్తి' - అనే ఆయుధ విశేషాన్ని; ఒసంగి= ఇచ్చి; దీనిన్= దీనిని; ఆపత్+కాలంబునన్+తక్కన్= ఆపద ఏర్పడిన సమయంలో తప్ప; పెఱ+అప్పుడు= వేరేసమయంలో; ప్రయోగించినన్= ఉపయోగిస్తే; నీకున్= ఓకర్ణా! నీకు; అపాయంబు+అగును= కీడుకలుగుతుంది; అని చెప్పెన్= అని వచించాడు; తత్+అనంతరంబు+అ= అటు పిమ్మట; ఆ+ వీరుండు= కర్ణుడు; కవచకుండలంబులన్+పుచ్చి= కవచకుండలాలను వెలికి తీసి; అతనికిన్= దేవేంద్రుడికి; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** అని దేవేంద్రుడు చెప్పగా కర్ణుడు. 'దానికేమిగాని ఇప్పుడు కవచం ఒలిచి నీకు ఇస్తే నాశరీరం వికార మౌతుందికదా! దీనికి నీవేమి ఆలోచించావు' అనిన, ఇంద్రుడు, 'నీశరీరం నీజనకుడైన సూర్యుడి తేజస్సుతో, బాలార్కసమానమైన రంగుతో భాసిల్లుతుంది' అని పలికి అతడికి తన ఆయుధవిశేషమైన 'శక్తి'ని ఇచ్చి, దీనిని కష్టసమయంలో మాత్రమే ప్రయోగింప దగును. కానిచో నీకే ప్రమాదం ఏర్పడగలదు' అని హెచ్చరించాడు. అంత వీరుడైన కర్ణుడు తనకవచకుండలాలను వెలికి తీసి దేవేంద్రుడికి ఇచ్చాడు.

**చ. అలఘునిశాతశస్త్రమున నంగము లెల్లను నిర్వికారుఁ డై
యొలువఁ దొడంగినట్టియెడ హో యని కిన్నర యక్ష సిద్ధ సా
ధ్యులు దివినుండి యార్చుచును దూర్యరవంబు సెలంగ నద్భుతం
బెలయఁగఁ బుష్పవృష్టిఁ గురియించిరి కర్ణునిపైఁ బ్రియంబునన్. 374**

**ప్రతిపదార్థం:** అలఘు, నిశాత, శస్త్రమునన్= గొప్ప వాడి అయిన ఆయుధంతో; అంగములు+ఎల్లను= అవయవాల నన్నిటిని; నిర్వికారుఁడు+ఐ= వికారము లేనివాడై (ధైర్యంతో చలించని చిత్తం కలవాడై); ఒలువన్+తొడంగినట్టి+ఎడన్= పైచర్మం ఒలుచుటకు పూనినట్టి సమయంలో; 'హో' అని= ఓహో, భళీ, భళీ - (ఎంతటి గొప్పదానం) అని; కిన్నర, యక్ష, సిద్ధ, సాధ్యులు= కిన్నరులు యక్షులు సిద్ధులు సాధ్యులు; దివినుండి= స్వర్గంనుండి; ఆర్చుచును= ఉద్ఘోషిస్తూనే; తూర్యరవంబు+ చెలంగన్= మంగళప్రదాలైన జంత్రవాద్యాల నాదం ధ్వనించగా; అద్భుతంబు= ఆశ్చర్యం; ఎలయఁగన్= అతిశయించగా; ప్రియంబునన్= ప్రీతితో; కర్ణునిపైన్= కర్ణుడిమీద; పుష్పవృష్టి= పూలవాన; కురియించిరి= వర్షించారు.

**తాత్పర్యం:** తనసహజకవచకుండలాలను దేవేంద్రుడికి అర్పించటానికై, గొప్ప పదను గలిగిన ఆయుధంతో కర్ణుడు తన అవయవాల నన్నింటి పైచర్మం ఒలువసాగాడు. అప్పుడు ఆ అద్భుతదృశ్యాన్ని తిలకించి వేలుపుతెగలవారు -

యక్షులు కిన్నరులు సిద్ధులు సాధ్యులు ఆకసంలో చేరి - 'ఓహో, ఎంతటి ఈవి, ఏమి త్యాగం' - అని ఉద్ఘోషిస్తూ దుందుభులు మంగళతూర్యాలు మ్రోగించి ప్రీతితో కర్ణుడిపై పూలవాన కురిపించారు.

**విశేషం:** (1) నభమున దేవదుందుభులు మ్రోగటం! దివినుండి భువికి పుష్పవృష్టి కురియటం! అతిశయోక్తిగా అలంకారవిశేషంగా అసంగతాలైన అసత్యకల్పనలుగా ఆధునికులు కొందరు విమర్శించవచ్చు. కామక్రోధలోభ మోహమదమాత్సర్యగ్రస్తులు అయిన మానవులు నివసించేది ఈభూలోకం. ఈమానవులలోగూడ దేవతలు సయితం ఆశ్చర్యచకితులై పరవశించి సంగీత తాళలయలతో నర్తించి మెచ్చదగినట్టి అతిలోకమైన ఘనకార్యం అప్పుడపుడు చేసేవారు ఉండవచ్చును. అట్టి అద్భుతసన్నివేశాలు అనిమిషులు "అహో నేత్ర నిర్వాణమ్'' అని చూడదగిన దృశ్యాలను అభివర్ణించటానికి భాషకు శక్తిచాలదు. అది శబ్దాలంకార విశేషభాషలకు అగమ్యం. సహృదయహృదయైక వేద్యం. (2) ఇచట 'రసము' - వీరము. వీరరసం దయావీరం, ధర్మవీరం, దానవీరం అని ప్రాచీనులు మూడువిభాగాలు చేశారు. వీరరసానికి స్థాయిభావం ఉత్సాహం. లోకోత్తర కార్యనిర్వహణంలో ఏర్పడే స్థిరసంకల్పానికి ఆలంకారికులు ఉత్సాహం అని వ్యపదేశంచేశారు. (3) కర్ణుడిభారతం అనే సుభాషితం తెలుగునేలలో సుప్రసిద్ధం. మహాభారతగాథకు కర్ణుడే ప్రధాననాయకుడుగా భావించేవారు ఉన్నారు. ఈ ఘట్టంలో కథానాయకుడు కర్ణుడు అనటం నిర్వివాదం. (4) కర్ణుడికిని- దుర్యోధనుడికిని కవిత్రయభారతంలో జరుగవలసిన న్యాయం జరుగలేదని విమర్శించేవారు కొందరు ఉన్నారు. నభమున దేవదుందుభులు మ్రోగటం - దివినుండి భువిపైన పుష్పవృష్టి కురియటం - ఎఱ్ఱన కర్ణుడిపట్ల (ఆరణ్యపర్వంలో), తిక్కన దుర్యోధనుడిపట్ల (శల్యపర్వంలో) హృదయంగమంగా అభివర్ణించటం చిరస్మరణీయం.

**వ. ఇట్లు సూతపుత్త్రుని వికృతగాత్రుం జేసి వాసవుండు ప్రమోదవికాసభాసితుం డగుచు నిజలోకంబున కరిగెఁ; దద్వృత్తాంతం బంతయు విని కౌంతేయు లత్యంతసంతోషంబునం బొదలిరి; గాంధారేయులు దుఃఖవిదారితహృదయ లయి; రని యిట్లు కవచకుండలాభిహరణంబు సవిస్తరంబుగాఁ జెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 375**

**ప్రతిపదార్థం:** వాసవుండు= దేవేంద్రుడు; ఇట్లు= ఈవిధంగా; సూతపుత్త్రుని= కర్ణుడిని; వికృత, గాత్రున్+చేసి= వికారమయిన శరీరం కలవాడినిగా చేసి; ప్రమోద, వికాస, భాసితుండు+అగుచున్= సంతోషంతో వికసించిన ఆకారం కలవాడు ఔతూ; నిజలోకంబునకున్= తనస్వర్గలోకానికి; అరిగెన్= వెళ్ళాడు; తత్+వృత్తాంతంబు= ఆ కథ; అంతయున్+విని= సంపూర్ణంగా ఆలకించి; కౌంతేయులు= పాండవులు; అత్యంత సంతోషంబునన్= మిక్కుటమైన ఆనందంతో; పొదలిరి= వర్ధిల్లారు; గాంధారేయులు= గాంధారికొడుకులు కౌరవులు; దుఃఖ, విదారిత, హృదయులు+అయిరి= ఆవేదనచేత చీల్చబడిన డెందాలు కలవారు అయ్యారు; అని= అని; ఇట్లు= ఈవిధంగా; కవచ, కుండల+అభిహరణంబు= కవచాన్ని కుండలాలను అపహరించటం; సవిస్తరంబుగాన్= విరివిగా (సాంగోపాంగసమృద్ధంగా); చెప్పినన్= వచించగా; విని= ఆలకించి; జనమేజయుండు; వైశంపాయనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడి కవచకుండలాలు గొని అతడిని వికృతశరీరుడిగా చేసి, సంతోషంతో ప్రకాశించేవాడయి దేవేంద్రుడు తన స్వర్గలోకానికి చేరాడు. ఆ వృత్తాంతం విని పాండవులు ఆనందించారు. కౌరవులు దుఃఖించారు. ఇట్లు కవచకుండలాలను దేవేంద్రుడు అపహరించినకథను సవిస్తరంగా ఆలకించి జనమేజయమహారాజు వైశంపాయనమహర్షితో ఇట్లా అన్నాడు.

**క. 'అనయము దుస్తర మగు న । వ్వనవాసము నిస్తరించి ద్వాదశవర్షం<br>బున కడపట నేమి విధం । బొనరించిరి మత్పితామహులు మునినాథా!' 376**

**ప్రతిపదార్థం:** మునినాథా!= ఓ వైశంపాయనమహర్షీ!; అనయము= అత్యంతం; దుస్తరము+అగు= దాటటానికి కష్టం అయిన; ఆ+వనవాసము= ఆ అరణ్యంలో నివసించటం; నిస్తరించి= దాటి; ద్వాదశవర్షంబున+కడపటన్= పంౘ్రెండవ సంవత్సరంయొక్క చివర; మత్+పితామహులు= నాతాతలు; ఏమి, విధంబు+ఒనరించిరి= ఏరీతిగా ప్రవర్తించారు.

**తాత్పర్యం:** 'దాటుటకు మిక్కిలి కష్టమయిన వనవాసాన్ని పంౘ్రెండేండ్లు చేసి, పంౘ్రెండవయేటికడపట ఏవిధంగా మా తాతలు ప్రవర్తించారో వైశంపాయనమహర్షీ! దయచేసి తెలుపుము.'

**వ. అనిన నమ్మహీపతికి నమ్మహీదేవుం డిట్లనియె; నట్లు మార్కండేయువలనఁ బుణ్యకథలు విని పాండవు లనంతరంబ క్రమ్మఱి ద్వైతవనంబునకుం జని, యం దొక్కనాఁడు సుఖాసీనుం డయి యున్న ధర్మరాజుపాలికి నొకబ్రాహ్మణుండు సంభ్రమంబునఁ జనుదెంచి యిట్లనియె. 377**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పల్కగా; ఆ+మహీపతికిన్= ఆమహారాజుకు, జనమేజయుడికి; ఆ+మహీదేవుండు= ఆ బ్రాహ్మణుడు; వైశంపాయనుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అట్లు= ఆరీతిగా; మార్కండేయువలనన్= మార్కండేయమహర్షినుండి; పుణ్యకథలు= సుకృతం చేకూర్చే గాథలు; విని= ఆలకించి; పాండవులు= పాండునందనులు; అనంతరంబు+అ= పిదప; క్రమ్మఱి= మరలి; ద్వైతవనంబునకున్+చని= ద్వైతం అనే పేరు గల అడవికి వెళ్ళి; అందున్= ఆ అడవిలో; ఒక్కనాఁడు= ఒకరోజున; సుఖ+ఆసీనుండు+అయి+ఉన్న= హాయిగా కూర్చునిఉన్న; ధర్మరాజుపాలికిన్= ధర్మనందనుడి దగ్గరకు; ఒక బ్రాహ్మణుండు= ఒక విప్రుడు; సంభ్రమంబునన్= తత్తరపాటుతో; చనుదెంచి= అరుదెంచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పల్కగా జనమేజయమహారాజుకు వైశంపాయనమహర్షి ఈవిధంగా చెప్పాడు: 'ఆవిధంగా మార్కండేయమహర్షివలన పెక్కుపుణ్యకథలు ఆలకించి విశ్రాంతినొంది పాండవులు మరల ద్వైతవనానికి తిరిగివచ్చారు. ఆ ద్వైతవనంలో, సుఖంగా కూర్చొని ఉన్న ధర్మనందనుడికడకు ఒక విప్రుడు తత్తరపాటుతో అరుదెంచి ఇట్లా అన్నాడు.'

**విశేషం:** రాజకుమారులు మహారాజులు భోగలాలసులై అంతఃపురసౌధాంతరాలలో నివసించవచ్చును. అయినను వారు కాంచనవజ్రపంజరంలో స్వచ్ఛందంగా బంధితులు. రాజప్రాసాదం ఒక గొప్ప కారాగారం కావచ్చును. ఇక- అరణ్యావాసం సువిశాల విశ్వవిద్యాలయం కావచ్చును. అక్కడ ఎప్పుడూ ఎదిగే మనస్సుతో ప్రకృతి సౌందర్యచిద్విలాసం అనుభవామ్రేడిత మౌతూండగా విజ్ఞానార్జన చేయవచ్చును. ప్రకృతిని మించిన పాఠశాల లేదు. విపద్దశను మించిన విశ్వవిద్యాలయం లేదు. పాండవులు పంౘ్రెండేళ్ళు నిరంతరజిజ్ఞాసువులై, అరణ్యవిశ్వవిద్యాలయంలో అంతేవాసులైనారు. అక్కడ ఉపన్యాసకులు మార్కండేయాదిమహర్షులు. ధర్మరాజు ఆదర్శవిద్యార్థిగా వనవాసాన్ని జ్ఞానులసన్నిధిలో గడిపాడు. విద్యాభ్యాసంచివర జరుగవలసింది విద్యాపరీక్ష. అవి యక్షప్రశ్నలు. అది ఆదర్శ ప్రశ్నపత్రం. ఆ ప్రశ్నలకు సదుత్తరాలిచ్చి, ధర్మరాజు విజ్ఞానపట్టభద్రుడయ్యాడు.

### ధర్మరాజు బ్రాహ్మణుని యరణిఁ దెచ్చుటకుఁ బోవుట (సం. 3-295-7)

**క. 'తరుశాఖఁ దగిల్చిన నా। యరణి యొకమృగంబు వచ్చి యతిరయమున న**
**త్తరువును నొరసి కొనంగా। ధరణీశ్వర! తగిలెఁ జువ్వె తచ్ఛృంగమునన్. 378**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= రాజా, ఓధర్మరాజా!; తరుశాఖన్= చెట్టుకొమ్మకు; తగిల్చిన= వ్రేలాడదీసిన; నా అరణి= నిప్పుకొయ్య; ఒకమృగంబు= ఒక లేడి; వచ్చి= చేరి; అతిరయమునన్= మిక్కిలి వేగంగా; ఆ+తరువును= ఆ చెట్టును; ఒరసికొనంగాన్= రాపిడి చేయగా; తద్+శృంగమునన్= ఆ లేడికొమ్మునందు; తగిలెన్+చుమ్మీ= అంటుకొనిపోయింది సుమా!

**తాత్పర్యం:** 'భూమికి అధిపతివైన ఓ ధర్మరాజా! నా అరణిని ఒక చెట్టుకొమ్మకు వ్రేలాడగట్టాను. అంతలో ఒకలేడి వచ్చి, వేగంగా ఆ చెట్టును ఒరసికొన్నది. నాఅరణి ఆ లేడి కొమ్ముకు తగుల్కొన్నది. ఆలేడి పరుగు లంకించుకొని పారిపోయింది.

**విశేషం:** (1) అరణి= అగ్నిని చేకూర్చేసాధన విశేషం. త్రచ్చి అగ్గి పుట్టించేకొయ్య. శ్రోత్రియవిప్రులు పూర్వకాలంలో అరణిని త్రచ్చి నిప్పు పుట్టించి నిత్యవిధులు నెరవేర్చేవారు. 'అరణి' లేకపోతే వైదికవిప్రుల దినచర్య స్తంభించినట్లే.

**క. దానిఁ గొని పఱచె నమ్మృగ । మానతరిపులోక! నాకు నయ్యరణిఁ దగం**
**గా నిపుడు దేరఁ బనుపవె । భూనుత! నిత్యవిధిలోపమునఁ జనకుండన్.' 379**

**ప్రతిపదార్థం:** ఆనత రిపులోక!= నమస్కారం చేసిన శత్రుసమూహం కలవాడా, ఓధర్మరాజా!; భూనుత!= భూమిలోని ప్రజలచేత పొగడబడినవాడా, ఓధర్మనందనా!; దానిన్= దానిని, ఆ అరణిని; కొని= పరిగ్రహించి; ఆ+మృగము= ఆలేడి; పఱచెన్= పరుగెత్తింది; నాకున్= నాకు; ఆ+అరణిన్= ఆ అరణిని; తగంగాన్= ఒప్పిదంగా; ఇపుడు= ఈసమయంలో; నిత్య, విధి= ప్రతిదినం నెరవేర్చవలసిన వైదికనియమం; లోపమునన్= లోపంతో; చనకుండన్= పోకుండా; తేరన్+పనుపవె= తెచ్చుటకు నియోగించవా.

**తాత్పర్యం:** శత్రువులచేత నమస్కరించబడినవాడా! భూజనులచేత ప్రశంసించబడినవాడా, ఓ ధర్మరాజా! ఆ అరణిని తీసికొని ఆలేడి పారిపోయింది. నా నిత్యానుష్ఠానానికి అరణి అవసరంకదా. అందుచేత నా అరణిని తేవటానికి నియోగించుము.'

**చ. అనవుడు నా క్షణంబ మనుజాధిపుఁ డుద్ధతచాపహస్తుఁడై**
**యనుజులుఁ దాను నెంతయు రయంబున నాహరిణేంద్రుపజ్జఁ గై**
**కొని చని కూడముట్టి మెఱుఁగుల్ నిగుడం బటుసాయకంబు లే**
**సిన నొకయమ్ము నమ్మృగము సెందద చేరద యద్భుతంబుగన్. 380**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (బ్రాహ్మణుడు) చెప్పగా; మనుజ+అధిపుఁడు= రాజు, ధర్మనందనుడు; ఆ క్షణంబు+అ= ఆ క్షణంలోనే; ఉద్ధత, చాప, హస్తుఁడు+ఐ= పెద్దదైన విల్లు చేత పూనినవాడై; అనుజులు+తాను= తమ్ములు తానును; ఎంతయున్= మిక్కుటమైన; రయంబునన్= వేగంతో; ఆ హరిణ+ఇంద్రు, పజ్జన్= ఆ శ్రేష్ఠమైన లేడి పరుగెత్తేచోటుకు సమీపాన; కైకొని చని= కూడి వెళ్లి; కూడముట్టి= పొదివి; మెఱుగుల్, నిగుడన్= వెలుగులు చిందేటట్లుగా; పటుసాయకంబులు= తీవ్ర బాణాలు; ఏసినన్= ప్రయోగించగా; ఒక+అమ్మున్= ఒక బాణం అయినను; అద్భుతంబుగన్= అచ్చెరువు కొలిపేటట్లుగా; ఆ+మృగమున్= ఆ లేడిని; చెందదు+అ= తగులదు; చేరదు+అ= తాకనే తాకదు.

**తాత్పర్యం:** అని బ్రాహ్మణుడు పలుకగానే ధర్మనందనుడు, విల్లును ధరించి విజృంభించి, తానును తమ్ములును ఆ శ్రేష్ఠమైన లేడిని వెంబడించి పొదువచూచి మెఱపుబాణాలు ప్రయోగించారు. కాని, ఆశ్చర్యకరంగా ఒక్కబాణం అయినా ఆ లేడిని చేరలేదు. తాకనే లేదు.

**వ. అదియును వారి నతిదూరంబుగా నెలయించికొని చని యొక్కఘోరవిపినంబున నదృశ్యంబైనఁ, బ్రయత్నంబు విఫలం బగుటకు విషాదంబు నందుచు నయ్యేవురు నతిశ్రాంతులై శీతలచ్ఛాయం బగు నొక్కవటమహీరుహంబు క్రింద విశ్రమించి; రప్పుడు నకులుండు ధర్మనందనున కి ట్లనియె. 381**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ లేడికూడా; వారిన్= పాండవులను; అతిదూరంబుగాన్= మిక్కిలి దవ్వులకు; ఎలయించుకొని= రప్పించుకొని; చని= వెడలి; ఒక్క= ఒక; ఘోరవిపినంబునన్= భయంకరమైన అడవిలో; అదృశ్యంబు+ఐనన్= కన్పించక పోగా; ప్రయత్నంబు= ఆ పెద్ద పూనిక; విఫలంబు+అగుటకున్= వ్యర్థం కావటానికి; విషాదంబున్+అందుచున్= విచారపడుతూ; ఆ+ఏవురున్= ఆ ఐదుగురును; అతిశ్రాంతులు+ఐ= మిక్కిలి డస్సినవారై; శీతల+ఛాయంబు+అగు= చల్లని నీడ కలిగినట్టిది అయిన; ఒక్క= ఒక; వట, మహీరుహంబు, క్రిందన్= మఱ్ఱిచెట్టు క్రింద; విశ్రమించిరి= సేదతీర్చుకొన్నారు; అప్పుడు= ఆ సమయంలో; నకులుండు; ధర్మనందనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ లేడి పాండవులను దవుదవ్వులకు కొనిపోయి ఒక భయంకరమైన అడవిలో కన్పించకుండా మాయమయిపోయింది. పాండవులు తమప్రయత్నం వ్యర్థమయినందుకు వ్యథ చెందారు. ఆ లేడి వెంటబడి బహుదూరం తిరగటం చేత బడలిన పాండవులు ఒక పెద్దమఱ్ఱిచెట్టునీడను చేరి విశ్రమించారు. అప్పుడు నకులుడు ధర్మనందనుడితో ఈ విధంగా చెప్పాడు.

**క. 'కులశీలోన్నతియు విని । శ్చలకరుణారతియు ధర్మసంగ్రహమతియుం**
**గల మనకు నివ్విధంబున । నలజడి వచ్చుటకు మూల మది యెయ్యదియో!' 382**

**ప్రతిపదార్థం:** కుల+శీల+ఉన్నతియున్= మంచివంశం, మంచినడవడి; వినిశ్చల, కరుణా, రతియున్= చలించని దయయందే ఇష్టం; ధర్మసంగ్రహమతియున్= ధర్మాన్ని సమకూర్చే బుద్ధియును; కల= ఉన్నట్టి; మనకున్= మనకు; ఈ+విధంబునన్= ఈరీతిగా; అలజడి= కలత; వచ్చుటకున్= దాపురించటానికి; మూలము= కారణం; అది= అది; ఎయ్యదియో= (ఏ+అది+ఓ)= ఏది అయి ఉంటుందో కదా.

**తాత్పర్యం:** 'మంచివంశంలో పుట్టి మంచిప్రవర్తన అలవరచుకొని, చలించని దయావ్రతాన్నే పాటిస్తూ ధర్మాన్ని సమకూర్చుకొనే బుద్ధికలిగి ఉన్నతులం అయిన మనకు ఈ రీతిగా ఆపద ప్రాప్తించటానికి కారణం ఏదై ఉండవచ్చును?'

**విశేషం:** (1) మంచివారికి ఆపదలు ఎందుకు వస్తాయి? యుగయుగాంతరాలనుండి మేధావులు ఈ ప్రశ్న వేస్తూనే ఉన్నారు. సముచితసమాధానాలకొరకై అన్వేషిస్తూనే ఉన్నారు. ఈ అన్వేషణ భూమికపై ప్రపంచంలోని వివిధభాషలలో ఈ విషయంపై ఆసక్తికరమైన వాఙ్మయం వేదాంతం ఏర్పడింది. పైప్రశ్నకు అనుబంధంగా ఇంకొకప్రశ్న కూడ ఏర్పడింది. (2) పురుషకారం గొప్పదా? దైవం గొప్పదా? మొదటి ప్రశ్నకు ప్రాచీనభారతదేశం చెప్పిన సమాధానాలలో పేర్కొనదగింది 'కర్మ' సిద్ధాంతం. నకులుడి ప్రశ్నకు ధర్మరాజు కర్మసిద్ధాంతాన్నే వివరించాడు. ఇక- రెండవప్రశ్నకు రెండు సమాధానాలు ఏర్పడ్డాయి. ఒకటి ఆస్తికత్వం. అంతా దైవలీల. రెండవది నాస్తికత్వం. ఇది ఇంతే. ఏమియు లేదు. మహాభారతంలో పలుతావులలో ముఖ్యంగా శాంతిపర్వంలో ఈ విషయంపై విపులచర్చలు ఉన్నాయి. ధర్మరాజు కర్మసిద్ధాంతాన్ని నమ్మిన ఆస్తికుడు. అతడితమ్ములకు ద్రౌపదికిని ఆతనిపై వ్యక్తిగతమైన గౌరవప్రపత్తులు ఉన్నవికాని అతడివేదాంతంపై దృఢవిశ్వాసం ఉన్నవారు కారు. ధర్మరాజుకంటె

భీముడు అర్జునుడు కొంతమేరకు నకులసహదేవులు యుద్ధవిద్యలో కుశలులు. అయితే కేవలం ధర్మరాజుకు వారు విధేయులు. ఆతని పెద్దరికానికి కారణం కేవలం వయస్సుమాత్రమే కాదు; ధర్మరాజు వేదాంతి, జ్ఞాని, అనుష్ఠానవేదాంతి, జిజ్ఞాసువు. అందుచేత అతడితమ్ములు తమ లౌకికశక్తిసామర్థ్యాలను మరచిపోయి అన్నగారిని ఆరాధించారు. ఇట - భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు సాగించే చర్చలనుబట్టి వారు గ్రుడ్డిగా అన్నగారిని అనుసరించలేదనిన్నీ, మంచి చెడుగులను క్షుణ్ణంగా చర్చించియే అనుష్ఠానవేదాంతి అయిన ధర్మరాజును అనుసరించిన బుద్ధికుశలులు అనిన్నీ తేలుతుంది. (3) ఈ పద్యం యొక్క పూర్వార్ధానికి' బలశౌర్య ధైర్యములు నిశ్చల కరుణారతియు నధిక సత్య ప్రౌఢిం' అనే పాఠభేదం కొన్ని ప్రతులలో కనపడుతున్నది.

**వ. అనిన నమ్మహాప్రాజ్ఞుండతని కిట్లనియె. 383**

**తాత్పర్యం:** అనగా, గొప్పవివేకం కలవాడైన ధర్మరాజు నకులుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'వినుము సుఖమునకు దుఃఖం । బునకుం గారణము దనదుపూర్వకృతం బై**
**చను కర్మమ; కారణ మిది । యని యన్యము గలుగనేర దం దొక్కటియున్. 384**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; సుఖమునకున్= ప్రియమైన అనుభూతికి; దుఃఖంబునకున్= ఆవేదనకు; కారణము= హేతువు; తనదు, పూర్వకృతంబు+ఐ= తాను పూర్వంచేసినట్టిదై; చను= ఒప్పు; కర్మము+అ= కర్మయే; అందు= ఆ సుఖ దుఃఖానుభూతిలో; అన్యము+ఒక్కటియున్= వేరు ఏదియును ఒకటి (కర్మం కాక మరి ఏదిన్నీ); కారణము= హేతువు; ఇది= ఇది; అని= చెప్పటానికి; కలుగన్‌నేరదు= ఏర్పడదు.

**తాత్పర్యం:** 'ఆలకించుము. సుఖం దుఃఖం దాపురించటానికి కారణం తనపూర్వకర్మయే. కర్మ కాక వేరొక కారణం ఏది చెప్పినా అది కుదరదు'.

**విశేషం:** సుఖదుఃఖాలు ఎట్లా ప్రాప్తిస్తున్నాయి? అనే ప్రశ్నకు కర్మసిద్ధాంతం సముచితసమాధానం. సరే, ఈ సిద్ధాంతాన్ని ఒకవేళ సమ్మతించకపోతే వేరొకసిద్ధాంతం సహేతుకంగా ఈ సమస్యకు సమాధానం చెప్పలేదు- అని ధర్మరాజు చెప్పాడు. దేవుడిని సాక్షీభూతుడిగా సుదూరాన నిల్పి కేవలం హేతువాదంచేతనే సుఖదుఃఖానుభూతిని సమర్థించేసిద్ధాంతం 'కర్మ' వాదం. ప్రాచీనభారతదేశంలో నాస్తికదర్శనాలుగా జైనబౌద్ధాలుసయితం కర్మవాదాన్ని అంగీకరించటం గమనింపదగిన అంశం.

**వ. అనుటయు భీమసేనుండు నకులున కి ట్లనియె. 385**

**తాత్పర్యం:** అని ధర్మరాజు చెప్పగా భీముడు నకులుడితో ఈ విధంగా అన్నాడు.

**ఆ. 'ప్రాతికామి వోయి పాంచాలిఁ గొలువులో । పలికిఁ దెచ్చి నపుడ యలుక యెసఁగ**
**నాంబికేయసుతుల నందఱఁ దునుమక । యునికి నిట్టియెడరు మనకుఁ బుట్టె'. 386**

**ప్రతిపదార్థం:** ప్రాతికామి+పోయి= ప్రాతికామి (దుర్యోధనుడిసేవకుడు)పోయి; పాంచాలిన్= ద్రౌపదిని; కొలువులోపలికిన్= రాజసభలోకి; తెచ్చినపుడు+అ= తీసికొనివచ్చినప్పుడే; అలుక+ఎసఁగన్= కోపం విజృంభించగా; ఆంబికేయసుతులన్= ధృతరాష్ట్రుడి కుమారులను; అందఱన్; తునుమక+ఉనికిన్= సంహరించక పోవటంచేతనే; ఇట్టి+ఎడరు= ఇటువంటి ఆపద; మనకున్+పుట్టెన్= మనకు సంభవించింది.

**తాత్పర్యం:** 'ఆనాడు కొలువుకూటానికి ప్రాతికామి ద్రౌపదిని పిలుచుకొని వచ్చినపుడే ఆగ్రహాతిరేకంతో ఆ ధృతరాష్ట్రుడికొడుకులను అందరిని సంహరించకపోవటంచేతనే ఇప్పుడు ఈ విధమైన దుఃఖం మనకు దాపురించింది.

**విశేషం:** భీముడు ఈ మాటలు ధర్మరాజుతో కాక, నకులుడితో చెప్పాడు. అసలు ప్రశ్న వేసింది నకులుడే కదా, అయినను ఇది ధర్మరాజుపై ఎత్తిపొడుపే.

**చ. అనవుడు నర్జునుం డనియె 'నాసభ సూతసుతుండు పేర్చి ప**
**ల్కిన పటువాక్యముల్ వినియుఁ గిన్కకుఁ బూనక యేఁ దొలంగి కా**
**ననమున కిట్లు కాతరజనంబులచాడ్పున నేఁగుదెంచుటన్**
**మనకు దురంతదుఃఖములు మానక పైకొని వచ్చెఁ దమ్ముఁడా!' 387**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (భీమసేనుడు) చెప్పగా; అర్జునుండు= అర్జునుడు; అనియెన్= వచించాడు; తమ్ముఁడా= సోదరా! నకులుడా!; ఆ సభన్= ఆ కొలువుకూటంలో; సూతసుతుండు= కర్ణుడు; పేర్చి= అతిశయించి; పల్కిన= వచించిన; పటువాక్యముల్= పరుషవచనాలు; వినియున్= వినినప్పటికీ; కిన్కకున్+పూనక= ఆగ్రహం చెందక; ఏన్= నేను; తొలంగి= తప్పుకొని; కాననమునకున్= అడవికి; ఇట్లు= ఈవిధంగా; కాతరజనంబుల చాడ్పునన్= భీతిచెందినవారి విధంగా; ఏఁగుదెంచుటన్= రావటంవలన; మనకున్= మనకు; దురంతదుఃఖములు= అంతం లేని కష్టాలు; మానక= ఆగక; పైకొని వచ్చెన్= దాపురించాయి.

**తాత్పర్యం:** భీముడు ఆ విధంగా చెప్పగా అర్జునుడు ఈ విధంగా వచించాడు: తమ్ముడా! నకులా! 'అలనాడు ఆ కొలువుకూటంలో సూతుడికొడుకు కర్ణుడు పలికిన పరుషవచనాలు ఆలకించికూడా ఆగ్రహించక పిరికివారలవలె నేను అడవులకు ఈ విధంగా అరుదెంచటంచేత మనకు అంతం లేని కష్టాలు దాపురించాయి.

**విశేషం:** అర్జునుడు ధర్మరాజు వేదాంతాన్ని ఖండించి భీమసేనుడిని సమర్థించాడు.

**వ. అనిన యనంతరంబ సహదేవుం డిట్లనియె. 388**

**తాత్పర్యం:** అనిన తరువాత సహదేవుడు నకులుడితో ఈ విధంగా అన్నాడు.

**ఆ. 'దుష్టశీలుఁ డైన దుర్ద్యూతపరుని గాం । ధారుఁ బట్టి యేను దడయ కపుడ**
**తునుమకునికి నిట్టి దుర్దశ పాలైతి । మనఘ! మనము కాననాంతరమున. 389**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడ వైన నకులుడా!; దుష్టశీలుఁడు+ఐన= చెడ్డస్వభావం కలవాడు అయిన; దుర్ద్యూతపరునిన్= చెడ్డజూదం ఆడేవాడిని; గాంధారున్= గాంధారరాజసుతుడైన శకునిని; పట్టి= గ్రహించి; ఏను= నేను; తడయక+అపుడు+అ= ఆలసించక ఆసమయంలోనే; తునుమక+ఉనికిన్= సంహరించక పోవటంచేత; మనము= మనము; కానన+అంతరమునన్= అడవియందు; ఇట్టి= ఇటువంటి; దుర్దశ= చెడుఅవస్థ; పాలు+ఐతిమి= పాల్పడ్డాం.

**తాత్పర్యం:** 'చెడునడవడి కలవాడు, మాయజూదం ఆడేవాడు అయిన ఆగాంధారరాజసుతుడు శకునిని ఆనాడే అక్కడే సంహరించకపోవటంచేతనే మనం ఈనాడు ఈ అడవులలో ఇడుమలు కుడువవలసి వచ్చింది.'

**విశేషం:** (1) తమ్ములు అందరును తాత్త్వికంగా ధర్మరాజుకు విముఖులే. అయినను ఆచరణలో ఆయనకు విధేయులే. (2) ధర్మరాజు తమ్ముల వాదోపవాదాలను పట్టించుకొనలేదు. అంతేగాక ఆ చర్చను మొదలుపెట్టిన నకులుడిని అచటినుండి పొమ్మని ఆజ్ఞాపించి వేరుపనికి నియమించాడు.

**వ. అని యి ట్లందఱు నన్ని తెఱంగులఁ బలుకుచుండ నజాతశత్రుండు నకులుం జూచి 'భవదీయసోదరు లత్యంత పిపాసితు లైన వారు; నీ విమ్మహీరుహం బెక్కిజలంబు లున్నయెడ యరయు' మనిన నతండును నవ్వనస్పతి సమారోహణంబు సేసి దెసలు కలయం బరికించి 'దూరంబున సలిలంబు లున్న' వని యన్న కెఱింగించిన, నతం 'డట్లేని నీవు పోయి జలపానంబు సేసి మాకును జలంబులు గొనిర'మ్మని పనుచుటయు, మాద్రేయుండు వృక్షావతీర్ణుం డయి రయంబునం జని ముందట నతిమనోహరం బగు తటాకంబుఁ గని జలంబులు ద్రావంబోయిన నొక్కయశరీరభూతం బిట్లనియె. 390**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; ఇట్లు= ఈ రీతిగా; అందఱును= అందరు (భీముడు, అర్జునుడు, సహదేవుడు); అన్ని, తెఱంగులన్= అన్నివిధాల; పలుకుచుండన్= మాట్లాడుతూ ఉండగా; అజాతశత్రుండు= శత్రువులు లేనివాడు- ధర్మరాజు; నకులున్+చూచి= నకులుడిని అరసి; 'భవదీయసోదరులు= నీ అన్నదమ్ములు; అత్యంత, పిపాసితులు= మిక్కిలి దాహం చెందినవారు; ఐనారు= అయ్యారు; నీవు= ఈవు; ఈ+మహీరుహంబు+ఎక్కి= ఈ చెట్టును అధిరోహించి; జలంబులు= నీళ్ళు; ఉన్న+ఎడ+అరయుము= ఉన్నచోటు చూడుము; అనినన్= అని (ధర్మరాజు) చెప్పగా; అతండును= అతడును (నకులుడును); ఆ+వనస్పతి= ఆచెట్టును; సమ్+ఆరోహణంబు+చేసి= పైభాగానికి ఎక్కి; దెసలు= దిక్కులు; కలయన్+పరికించి= నలుగడలు అరసి; దూరంబునన్= దవ్వుల; సలిలంబులు= నీళ్ళు; ఉన్నవి+అని= కలవు అని; అన్నకున్= అగ్రజునకు, ధర్మరాజుకు; ఎఱింగించినన్= తెలుపగా; అతండు= అతడు- ధర్మరాజు; అట్లు+ఏనిన్= అటులైతే; నీవు= నీవు; పోయి= వెడలి; జలపానంబు+చేసి= నీళ్లుత్రాగి; మాకును= మాకు కూడ; జలంబులు= నీళ్ళు; కొని= గ్రహించి; రమ్ము= అరుగుదెంచుము; అని= అని; పనుచుటయున్= నియమించుటయున్నూ; మాద్రేయుండు= మాద్రికొడుకు నకులుడు; వృక్ష+అవతీర్ణుండు+అయి= చెట్టుపైనుండి క్రిందికి దిగినవాడయి; రయంబునన్= వేగంగా; చని= వెడలి; ముందటన్= తన కన్నులఎదుట; అతి, మనస్+హరంబు+అగు= (అతిమనోహరం బగు=) మిక్కిలి రమణీయంగా ఉన్న; తటాకంబున్= చెరువును; కని= చూచి; జలంబులు= నీళ్లు, త్రావంబోయినన్= త్రాగటానికి పూనగా; ఒక్క= ఒక; అశరీరభూతంబు= శరీరం లేని ఒకప్రాణి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** ఈ రీతిగా తమ్ములు అందరు తమకు తోచినట్లు మాట్లాడుతూ ఉండగా, అజాతశత్రువు అయిన ధర్మరాజు నకులుడిని చూచి, 'నీఅన్నదమ్ములు దప్పిగొని ఉన్నారు. ఈ చెట్టుపై కెక్కి నీరు ఉన్నచోటును గుర్తించుము' అని చెప్పాడు. నకులుడు ఆచెట్టుపైభాగానికి ఎక్కి, నలుదెసల దృష్టిసారించి 'దవ్వుల నీళ్లు ఉన్నాయి' అని అన్న ధర్మరాజుకు తెలిపాడు. అంతట ధర్మజుడు నకులుడిని అక్కడకు వెళ్ళి 'నీవు నీళ్లు త్రావి, సోదరులకు నీళ్ళు తె'మ్మని ఆజ్ఞాపించాడు. నకులుడు అన్న ఆజ్ఞాపించినట్లు చెట్టుక్రిందికి దిగి, వేగంగా వెడలి తనముందట ఒకరమణీయతటాకాన్ని చూచి, అందలి జలాలు త్రాగటానికి సమకట్టాడు. అంతట శరీరం లేని ఒకభూతం ఈ విధంగా పలికింది.

నకులాదులు యక్షుని నిరాకరించి నీరు ద్రావి మూర్ఛితు లగుట (సం. 3-296-12)

**క. 'ఓ యన్న! యీ తటాకము । నాయది; నీ వీ జలము గొనఁగ వలతేనిన్**
**నా యడిగిన ప్రశ్నములకు । ధీయుత! యుత్తరము లిమ్ము తేటపడంగన్.' 391**

**ప్రతిపదార్థం:** ఓ+అన్న!= నాయనా, ప్రియసహోదరా!; ధీయుత!= బుద్ధిమంతుడవైనవాడా!; ఈ తటాకము= ఈ చెరువు; నా+అది= నాది; నీవు= ఈవు; ఈ జలము= ఈ నీరు; కొనఁగన్‌వలతు(వు)+ఏనిన్= త్రాగతలచినట్లయితే; నా+అడిగిన, ప్రశ్నములకున్= నేను అడిగేప్రశ్నలకు; తేటపడంగన్= స్పష్టంగా తెలిసేటట్లుగా; ఉత్తరములు= సమాధానాలు; ఇమ్ము= ఒసగుము.

**తాత్పర్యం:** 'అన్నా ఈ చెరువు నాది. నీవు ఈ చెరువులోని నీటిని త్రాగాలని అనుకొంటే, బుద్ధిమంతుడవై నేను అడిగేప్రశ్నలకు సమాధానాలు ఇమ్ము.'

**విశేషం:** ఈ పద్యంలో ఉన్న రెండు సంబోధనలు- 'ఓయన్న'- 'ధీయుత' అనే ప్రయోగాలలోని స్వారస్యం భావింపతగింది. ఈ మాటలు పలికినది ఒక అశరీరభూతం. అన్న- అనే పదంలో ప్రేమ మరియు గౌరవభావం మిళితమై ఉన్నవి. ధీయుత- అనే శబ్దంవలన ఈ ప్రశ్నలు సాధారణ ప్రశ్నలు కావని, వీటికి మేధావులు కొందరుమాత్రమే సముచితసమాధానాలు చెప్పగలరు- అనే ధ్వని ఇమిడి ఉన్నది.

**క. అనుటయు నవ్వాక్యముదెస । ననాదరము చేసి నకులుఁ డక్కొలనం ది**
**య్యని నీరు ద్రావి నిశ్చే । తనుఁడై యాక్షణమ పడియెఁ దత్తీరమునన్. 392**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని (అశరీరభూతం) వచించుటయున్నూ; ఆ+వాక్యముదెసన్= ఆ వచనంపట్ల; అనాదరము+చేసి= చులకన చేసి; నకులుఁడు; ఆ+కొలనన్= ఆ చెరువునందు; తియ్యని= మధురమైన; నీరు= జలం; త్రావి= గ్రోలి; నిశ్చేత నుఁడు+ఐ= చైతన్యం లేనివాడై; ఆక్షణము+అ= ఆ త్రుటియందే; తద్+తీరమునన్= ఆ కొలనుగట్టుమీద; పడియెన్= కూలినాడు.

**తాత్పర్యం:** అశరీరభూతం చేసిన హెచ్చరికను చులకనచేసి నకులుడు ఆ చెరువులో ఉన్న తియ్యనినీరు గ్రోలి వెంటనే ఆ తటాకంఒడ్డున చైతన్యం లేకుండా కూలిపోయాడు.

**వ. అట ధర్మపుత్త్రుండు సహదేవుం గనుంగొని 'నకులుండు జలంబులకుం జని తడసె; నీ వరిగి యతనిం దోడ్కొని జలంబులు గొనుచు ర'మ్మనిన నక్కుమారుం డతి శీఘ్రగమనంబునంబోయి యాపద్మాకరతీరంబునం బడియున్న యన్నతెఱంగుఁ జూచి విస్మయశోకవ్యాకులహృదయుం డగుచు, 'నిది యేమి నిమిత్తంబున నయ్యెనో!' యని యూహించుచుఁబెల్లడరు తృష్ణాభరంబు సహింప నోపక జలంబులదెస నాసఁ జేసి కొలనికి డిగ్గిన నెప్పటిభూతం బి ట్లనియె. 393**

**ప్రతిపదార్థం:** అట= అక్కడ (అడవిలో ధర్మరాజు ఉన్నచోట); ధర్మపుత్త్రుండు= ధర్మనందనుడు; సహదేవున్= సహదేవుడిని; కనుంగొని= చూచి; నకులుండు; జలంబులకున్+చని= నీళ్లకొరకైవెళ్లి; తడసెన్= ఆలసించాడు; నీవు+అరిగి= నీవు వెడలి; అతనిన్= వాడిని, నకులుడిని; తోడ్కొని= వెంటబెట్టుకొని; జలంబులు+కొనుచున్= నీళ్ళుతీసికొని; రమ్ము= అరుదెమ్ము;

అనినన్= అని (ధర్మరాజు) చెప్పగా; ఆ+కుమారుండు= సహదేవుడు; అతి, శీఘ్రగమనంబునన్+పోయి= మిక్కిలివేగంగా పయనించి వెళ్ళి; ఆ పద్మాకరతీరంబునన్= ఆ కొలనుగట్టున, పడి+ఉన్న= కూలిపోయిఉన్న; అన్న+తెఱంగున్+చూచి= అన్నతీరునుచూచి (నకులుడు విగతజీవుడై పడియుండటం కాంచి); విస్మయ, శోక, వ్యాకుల, హృదయుండు+అగుచున్= ఆశ్చర్యం, దుఃఖం కలవరపాటుతో కూడిన ఎద కలవాడు ఔతూ; ఇది= ఈ విధంగా పడిఉండటం; ఏమి నిమిత్తంబునన్= ఏమి కారణంచేత; అయ్యెను+ఓ= సంభవించెనో; అని ఊహించుచున్= అని తలపోస్తూ; పెల్లు+అడరు= మిక్కుటంగా అతిశయించే; తృష్ణాభరంబు= డప్పికబరువు (తీవ్రత); సహింపన్+ఓపక= తాళజాలక; జలంబులదెసన్= నీళ్ళవైపు; ఆసన్+చేసి= కోరికతో; కొలనికిన్= చెరువులోకి; డిగ్గినన్= దిగగా; ఎప్పటిభూతంబు= ఇదివరకు (హెచ్చరించిన) భూతం; ఇట్లుఅనియెన్.

**తాత్పర్యం:** అట అడవిలో ధర్మనందనుడు సహదేవుడిని చూచి, 'నకులుడు నీళ్ళు తేవటానికై వెళ్ళి చాల సేపయింది. నీవు వెళ్లి నకులుడిని వెంటబెట్టుకొని నీళ్ళు కొనితెమ్ము' అని చెప్పాడు. సహదేవుడు మిక్కిలి వేగంగా పయనించి, వెళ్లి ఆ కొలనుకడ పడిఉన్న అన్న నకులుడిని చూచి అచ్చెరువు, దుఃఖం, ఆకులపాటు క్రమ్ముకొనిన మనస్సు కలవాడు ఔతూ, ఏకారణాన ఇట్లా జరిగిందో అని యోచిస్తూ, దప్పిక మిక్కుటం కావటంచేత తట్టుకొనలేక నీరు త్రాగటంకొరకై ఆ కొలనులోకి దిగాడు. అశరీరభూతం వెనుకటివలెనే ఇట్లా పలికింది.

**ఆ. 'అనఘ! యీజలాశయము నాయధీనంబు; । సాహసంబుఁజేసి చనదు చొరఁగ;**
**నాదు ప్రశ్నములకు నలి నుత్తరము లిచ్చి । వారిఁ గొనుము నీకు వలసినట్లు'. 394**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; ఈ జల+ఆశయము= ఈ తటాకం; నా+అధీనంబు= నాకు వశమై ఉన్నట్టిది; సాహసంబున్+చేసి= తెగువ చేసి; చొరఁగన్= ప్రవేశించగా; చనదు= కూడదు; నాదుప్రశ్నములకున్= నేను అడిగేప్రశ్నలకు; నలిన్= యోగ్యంగా, ఒప్పిదంగా; ఉత్తరములు+ఇచ్చి= సమాధానాలు చెప్పి; నీకున్= నీకు; వలసినట్లు= కావలసినట్లు; వారిన్+కొనుము= నీటిని తీసికొనుము.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! ఈ కొలను నావశంలో ఉన్నది. నీవు తెగువ చేసి ఇందులో ప్రవేశించకూడదు. నేను అడిగే ప్రశ్నలకు సముచితసమాధానాలు ఇచ్చి పిదప నీవలసినట్లుగా నీరు త్రాగవచ్చును.'

**క. అనిన నది యాదరింపక । ఘనుఁ డాసలిలములు ద్రావి గ్రక్కున విష మె**
**క్కినవిధమునఁ బరవశుఁడై । ఘనసాలమహీరుహంబు కైవడిఁ బడియెన్. 395**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (అశరీరభూతం) వచించగా; ఘనుఁడు= గొప్పవాడు (సహదేవుడు); అది= ఆ హెచ్చరిక; ఆదరింపక= లెక్కపెట్టక; ఆసలిలములు= ఆ నీళ్ళు, త్రావి= త్రాగి; గ్రక్కునన్= శీఘ్రంగా; విషము= విసం; ఎక్కిన, విధమునన్= వ్యాపించిన తీరుగా; పరవశుఁడు+ఐ= స్పృహ కోల్పోయిన వాడై; ఘన, సాల, మహీరుహము, కైవడిన్= పెద్దమద్దిచెట్టు మాదిరిగా; పడియెన్= కూలాడు.

**తాత్పర్యం:** అశరీరభూతం చేసిన హెచ్చరికను సరకుచేయక, గొప్పవాడైన సహదేవుడు ఆ నీటిని త్రాగి, వెంటనే విషం శరీరాన్ని ఆవరించిన తీరుగా స్పృహను కోల్పోయి పెద్దమద్దిచెట్టు నేలపై పడిన తీరుగా కూలిపోయాడు.

**సీ. అంత నంతకసూనుఁ డంతరంగంబున । సంతాప మెసఁగ వాసవతనూజుఁ**
**గనుఁగొని 'యన్న! నీ యనుగుఁదమ్ములు వోయి । కడుఁ దడవయ్యెఁ; నిక్కాననమున**

**నెయ్యది వుట్టెనో? చయ్యన నీ వేఁగి । వారిని దోడ్కొని వారిఁ గొనుచుఁ**
**జనుదెమ్ము' నావుడు ఘనభుజుం డధికర । యంబున నరిగి జలాశయంబు**

**ఆ. తీరభూమిఁ బడిన వారి నవారిత । మహితశౌర్యధనుల మాద్రిసుతులఁ**
**జూచి, విస్మయైకగోచరుఁడై సవ్య । సాచి యుల్లమున విషాద మడర. 396**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆసమయంలో; అంతకసూనుఁడు= ధర్మనందనుడు; అంతరంగంబునన్= హృదయంలో; సంతాపము= దుఃఖం; ఎసఁగన్= అతిశయించగా; వాసవతనూజున్= అర్జునుడిని (దేవేంద్రుడి పుత్రుడిని); కనుఁగొని= అరసి; అన్న!= నాయనా!; నీ+అనుఁగు+తమ్ములు= ప్రియమైన నీ అనుజులు; పోయి= వెడలి; కడున్= మిక్కిలి; తడవు+అయ్యెన్= ఆలస్యం అయింది; ఈ+కాననమునన్= ఈఅడవియందు; ఏ+అది; పుట్టెను+ఓ= ఏమి సంభవించెనో; నీవు= నీవు; చయ్యనన్= శీఘ్రంగా; ఏఁగి= వెడలి; వారిని= నీతమ్ములను; తోడ్కొని= వెంటబెట్టుకొని; వారిన్+కొనుచున్= నీటిని కైకొని; చనుదెమ్ము= అరుగుదెంచుము; నావుడున్= అని (ధర్మరాజు) చెప్పగా; ఘనభుజుండు= గొప్పభుజాలు కలవాడు, పరాక్రమోపేతుడు, అర్జునుడు; అధిక, రయంబునన్= మిక్కుటమైన వేగంతో; అరిగి= వెడలి; జల+ఆశయంబు+తీర, భూమిన్= నీటికొలనుగట్టుమీది ప్రదేశంలో; పడినవారిన్= కూలినవారిని; అవారిత= వారింపశక్యముగాని; మహితశౌర్యధనులన్= గొప్ప శౌర్యమే సంపదగా కలవారిని; మాద్రిసుతులన్= మాద్రియొక్క కొడుకులను, నకులసహదేవులను; సవ్యసాచి= అర్జునుడు; చూచి= అరసి; విస్మయ+ఏక, గోచరుఁడు+ఐ= అచ్చెరువుతో మాత్రమే కూడినవాడై; ఉల్లమునన్= హృదయంలో; విషాదము= ఆవేదన; అడరన్= వ్యాపించగా. (మీది పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అంతట ధర్మనందనుడు హృదయంలో ఆవేదన అతిశయించగా, అర్జునుడిని గాంచి, 'నాయనా! నీకు ప్రియమైన తమ్ములు నకులసహదేవులు ఇరువురూ వెళ్ళి చాలసేపు అయింది. ఈ అరణ్యంలో ఏ ఆపద సంభవించిందో! నీవు శీఘ్రంగా వెళ్ళి వారిని వెంటబెట్టుకొని రమ్ము. వచ్చేటప్పుడు నీళ్ళను కూడా తెమ్ము' అని చెప్పాడు. అర్జునుఁడంత మిక్కుటమైన వేగంతో వెళ్ళి, ఆ కొలనుగట్టుపై పడిఉన్న మాద్రితనయులు నకులసహదేవులను చూచి ఆశ్చర్యచకితుడయ్యాడు. అతడి హృదయంలో దుఃఖం క్రమ్ముకొన్నది.

**క. నాలుఁగుదిక్కులు గనుఁగొని । యాలో నెవ్వరిని గాన కత్యంతపిపా**
**సాలసుఁడై సలిలంబులు । గ్రోలఁగ సమకట్టి యొయ్యఁ గొలనికి డాసెన్. 397**

**ప్రతిపదార్థం:** నాలుఁగుదిక్కులు= నాలుగు దెసలు; కనుఁగొని= చూచి; ఆలోన్= ఆనాలుగుదిక్కులలో; ఎవ్వరిని= ఎవ్వరినీ; కానక= చూడక; అత్యంత, పిపాసా+అలసుఁడు+ఐ= మిక్కుటమైన దాహంచేత డస్సినవాడై; సలిలంబులు= నీళ్ళు; క్రోలఁగన్= త్రావగా; సమకట్టి= పూని; ఒయ్యన్= తిన్నగా; కొలనికిన్= తటాకానికి; డాసెన్= సమీపించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు నాలుగు దిక్కులా పరికించి చూచాడు. అతడికి ఎచ్చటా ఎవ్వరూ కన్పించలేదు. అంత, మిక్కుటంగా దాహం అవుతూ ఉండటంతో డస్సినవాడయి, అతడు నీరు త్రాగటానికై, తిన్నగా చెరువును సమీపించాడు.

**వ. డాయుటయు నయ్యశరీరభూతం బి ట్లనియె. 398**

**తాత్పర్యం:** సమీపించగానే ఆ శరీరంలేనిభూతం అర్జునుడితో ఇట్లా అన్నది.

**మ. 'బలిమిం జొచ్చిన నెట్టివారికయినం బ్రాణంబుపై వచ్చు; నీ**
**సలిలావాసము మత్పరిగ్రహము; తృష్ణాఖేదమారం జలం**
**బులు ద్రావన్ వలతేనిఁ బ్రశ్నములకుం బొం దొందఁగా నుత్తరం**
**బులు నా కి' మ్మనుడున్ మనంబునఁ బృథాపుత్త్రుండు సక్రోధుఁడై. 399**

**ప్రతిపదార్థం:** ఈసలిల+ఆవాసము= ఈ చెరువు; మత్+పరిగ్రహము= నాచే గ్రహించబడినట్టిది; బలిమిన్+చొచ్చినన్= దర్పంతో ప్రవేశిస్తే; ఎట్టివారికిన్+అయినన్= ఎటువంటివారికి అయినా; ప్రాణంబుపైన్+వచ్చున్= ప్రాణసంకటం కాగలదు; తృష్ణాఖేదము= దాహంచేత ఏర్పడిన పరితాపం; ఆరన్= చల్లారగా; జలంబులు= నీళ్ళు; త్రావన్= త్రాగటానికి; వలతు(వు)+ఏనిన్= కోరెదవేని; ప్రశ్నములకున్= నేను అడిగే ప్రశ్నలకు; పొందు+ఒందఁగాన్= సామరస్యం చేకూరేటట్లుగా; ఉత్తరంబులు= సమాధానాలు; నాకున్= నాకు; ఇమ్ము= ఒసగుము; అనుడున్= అని (అశరీరభూతం) చెప్పగా; పృథాపుత్త్రుండు= కుంతీకుమారుడు, అర్జునుడు; మనంబునన్= చిత్తంలో; సక్రోధుఁడు+ఐ= కోపంతో కూడినవాడై.

**తాత్పర్యం:** 'ఈ కొలను నాది. ఎట్టివారైనాసరే దర్పంతో ఈకొలను ప్రవేశిస్తే వారి ప్రాణాలకు ముప్పు వాటిల్లటం తథ్యం. దాహం తీర్చుకొనేవారు ఈ నీళ్ళు త్రాగదలిస్తే నా ప్రశ్నలకు సరిపోయే సమాధానాలు చెప్పవలెను. నీవును నా ప్రశ్నలకు సమాధానం ఒసఁగకుండా నీళ్ళు క్రోలటానికి వీలు లేదు' అని అదృశ్యభూతం పలికింది. ఆ మాటలు ఆలకించిన అర్జునుడు మనసులో మిక్కుటమైన కోపం కలవాడై.

**ఉ. 'మ్రుచ్చిలి నిల్చి దుర్వచనముల్ పచరించినఁ జెల్లనిత్తునే?**
**చెచ్చెర నీయెలుం గడఁగఁ జేసెద నిప్పుడు సూడు' మంచు వి**
**వ్వచ్చుఁడు శబ్దభేదిశరవర్గముఁ దద్వచనంబుచక్కటిం**
**గ్రచ్చఱ నించె మౌర్వీరవకంపితసర్వదిగంతరాళుఁడై. 400**

**ప్రతిపదార్థం:** మ్రుచ్చిలి నిల్చి= దొంగతనంగా (దొంగవలె కన్పించకుండ) నిల్చి; దుర్వచనముల్= చెడుమాటలు; పచరించినన్= వెల్లడిస్తే; చెల్లనిత్తును+ఏ= సాగనిత్తునా; చెచ్చెరన్= శీఘ్రంగా; నీ+ఎలుంగు= నీకంఠస్వరం; అడఁగన్+చేసెదన్= నశించేటట్లు చేస్తాను; ఇప్పుడు= ఈ సమయంలోనే; చూడుము= అరయుము; అంచున్= అని అంటూ; వివ్వచ్చుఁడు= అర్జునుడు; శబ్ద, భేది, శర, వర్గమున్= ధ్వనినిబట్టి లక్ష్యాన్ని ఛేదించే అమ్ములగుంపును; తద్+వచనంబు+చక్కటిన్= ఆ (అశరీరభూతం) యొక్క వాక్కువెలువడినచోటికి; మౌర్వీ, రవ, కంపిత, సర్వ, దిక్+అంతరాళుఁడు+ఐ= అల్లెత్రాటిధ్వనిచేత వణకించబడిన సమస్తదిక్కుల మధ్యభాగం కలవాడై; క్రచ్చఱన్= శీఘ్రంగా; నించెన్= నిండించాడు.

**తాత్పర్యం:** 'దొంగవలె మాటున దాగి చెడుమాటలు వెల్లడించిన నిన్ను నేను సైరింపజాలను. శీఘ్రంగా నీకంఠస్వరాన్ని మాటుపెట్టగలను. జాగ్రత్త. ఇప్పుడే. కాచుకొనుము' అని హెచ్చరించి అర్జునుడు అశరీరభూతంనుండి మాటలు వెలువడిన చోటికి శబ్దాన్నిబట్టి లక్ష్యాన్నికొట్టే అమ్ముల సముదాయం తన అల్లెత్రాటిమ్రోతకు దిగ్దిగంతాలు కంపించగా నింపాడు.

**ఆ. ఇట్టు లేయుటయును నెప్పటివాక్యంబు । మఱియు వినఁగఁబడిన మఘవసూనుఁ**
**డలసి కొలనుఁ జొచ్చి యంబుపానము చేసి । యిలకు నొఱగె వివశహృదయుఁ డగుచు. 401**

**ప్రతిపదార్థం:** మఘవసూనుఁడు= దేవేంద్రుడికొడుకు, అర్జునుడు; ఇట్టులు= ఈ విధంగా; ఏయుటయున్= బాణాలు ప్రయోగించుటయును; ఎప్పటి వాక్యంబు= మునుపటి (వినపడిన) మాటకూర్పు; మఱియున్= వెండియు; వినఁగఁబడినన్= విన్పించగా; అలసి= డస్సి; కొలనున్+చొచ్చి= చెరువులోకి దిగి; అంబుపానము, చేసి= నీరు త్రాగి; వివశహృదయుఁడు+అగుచున్= వశం తప్పిన ఎద కలవాడు ఔతూ; ఇలకున్= నేలకు; ఒఱగెన్= కూలాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఇట్లా శబ్దభేదిబాణాలు ప్రయోగించినప్పటికీ, యథాప్రకారం అశరీరభూతం మరల ఆ వాక్యాలే పలికింది. దేవేంద్రుడికుమారుడైన అర్జునుడు, అలసిపోయి ఆ చెరువులో ప్రవేశించి నీరు త్రాగి, వశం తప్పిన డెందం కలవాడై నేలకు ఒరిగాడు.

**వ.** **తదనంతరంబ యుధిష్ఠిరుండు భీమసేను నాలోకించి 'కవలును గవ్వడియును నింతదడయుటకు నిమిత్తం బెయ్యదియో నీ వరుగు' మనినం గిమ్మీరవైరి మారుతజవంబున నమ్మువ్వురుఁ జనిన చొప్పునం జని పద్మాకరకూలంబున నిద్రాపరవశులుం బోలెఁ బడియున్న తమ్ములం గని దుఃఖితుండై.** **402**

**ప్రతిపదార్థం:** తదనంతరంబు+అ= అటు పిమ్మట; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; భీమసేనున్= భీముడిని; ఆలోకించి= చూచి; కవలును= నకులసహదేవులును; కవ+వడి= కవ్వడియును= సవ్యసాచియును; ఇంత= ఇంతసేపు; తడయుటకున్= ఆలసించటానికి; నిమిత్తంబు= హేతువు; ఎయ్యది+ఓ= ఏదియో; నీవు= నీవు; అరుగుము= వెడలుము; అనినన్= అని (ధర్మరాజు) చెప్పగా; కిమ్మీరవైరి= భీముడు (కిమ్మీరుడు అనే రాక్షసుడికి శత్రువు); మారుతజవంబునన్= వాయువేగాన; ఆ+మువ్వురున్= ఆ ముగ్గురును; చనినచొప్పునన్= వెళ్లిన మార్గంలో; చని= వెళ్లి; పద్మ+ఆకరకూలంబునన్= కొలనుగట్టున; నిద్రాపరవశులున్+పోలెన్= నిదురమైకంలో మునిగినవారివలె; పడి+ఉన్న= నేలపై పడిఉన్న; తమ్ములన్= అనుజులను; కని= అరసి; దుఃఖితుఁడు+ఐ= శోకం చెందినవాడై.

**తాత్పర్యం:** అటుపిమ్మట, ధర్మరాజు భీముడిని చూచి, 'నకులసహదేవులున్నూ అర్జునుడున్నూ ఇంతఆలస్యం చేయటానికి కారణ మేమై ఉంటుందో; నీవు వెళ్లుము' అని చెప్పాడు. అంత కిమ్మీరుడిశత్రువు అయిన భీముడు వాయువేగంతో ఆ మువ్వురుతమ్ములు వెళ్ళినమార్గాన్నిబట్టి వెళ్లి ఆ కొలనుగట్టుపై నిదురమైకంలో ఉన్నవారివలె పడిఉన్న నకులసహదేవులను అర్జునుడిని చూచి మిక్కిలి దుఃఖించాడు.

**తరలము**

**'ఇది మనుష్యకృతంబు గాదు సురేంద్ర కిన్నర పన్నగ**
**త్రిదశనిర్మిత మైన కర్మము; దీని నింతయు నేర్పడం**
**బిదపఁ జూచెదఁగాక' యంచును భీతిదూరుఁడు నీరువ**
**ట్టొదవఁ దత్సలిలాశయంబు సముత్సుకుం డయి చొచ్చినన్.** **403**

**ప్రతిపదార్థం:** ఇది= ఇది (నకులసహదేవులు; అర్జునుడు నేలగూలటం); మనుష్య, కృతంబు+కాదు= మనుజులచేత చేయబడిన పని కాదు; సుర+ఇంద్ర, కిన్నర, పన్నగ, త్రిదశ, నిర్మితము+ఐన= దేవేంద్రుడు, కిన్నరులు, పన్నగులు అయిన దేవతలచేత చేయబడినట్టిది అయిన; కర్మము= పని; దీనిన్= ఈ విషయాన్ని; ఇంతయున్= సమగ్రంగా; ఏర్పడన్= సుస్పష్టంగా; పిదపన్= తరువాత; చూచెదన్+కాక= చూస్తానులే; అంచును= అని తలపోస్తూ; భీతిదూరుఁడు= భయానికి దూరంగా ఉండేవాడు, ధైర్యవంతుడు, భీముడు; నీరు+వట్టు+ఒదవన్= దాహం ఏర్పడగా; తద్+సలిల+ఆశయంబున్= ఆనీటికొలనును; సమ్+ఉత్సుకుండు+అయి= కోరిక కలవాడై; చొచ్చినన్= ప్రవేశించగా.

**తాత్పర్యం:** 'ఇది మనుష్యులు చేసిన పని కాజాలదు. దేవేంద్రుడో కిన్నరులో పన్నగులో త్రిదశులో ఈ పనిని చేసిఉండవలె. ఈ విషయాన్ని తరువాత పరిశీలిస్తానుగాక' అని తలపోస్తూ ధైర్యవంతుడైన భీముడు, దాహంచొప్పున ఆ నీటికొలనులోకి దిగాడు.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడు: ఆరణ్య. 4.402 విశేషాంశం.

**వ. అంతరిక్షగోచరం బైన వచనం బిట్లని వినంబడియె: 'నయ్యా! నీ వి ట్లేల సాహసంబు సేసెద; విక్కొలను మత్పూర్వపరిగ్రహంబు; నీ వోపుదేని నా యడిగిన యర్థంబులకు నుత్తరంబు లిచ్చి జలంబులు ద్రావు' మనిన నప్పలుకులు గైకొనక వృకోదరుండు నిపీతసలిలుండై యచ్చోటన మూర్ఛితుండై పడియె; నిట బాండవాగ్రజుండు. 404**

**ప్రతిపదార్థం:** అంతరిక్షగోచరంబు+ఐన= ఆకసంనుండి వ్యక్తమైన; వచనంబు= పలుకు; ఇట్లు+అని= ఈ విధంగా; వినంబడియెన్= విన్పించింది; అయ్యా!= ఆర్యా!; నీవు= నీవు; ఇట్లు+ఏల= ఈ విధంగా ఎందుకు; సాహసంబు+చేసెదవు= తెగువ చూపిస్తావు; ఈ+కొలను; మత్+పూర్వపరిగ్రహంబు= నాచేత లోగడ గైకొనబడింది; నీవు= నీవు; ఓపుదు+ఏనిన్= చేతనైతే; నా అడిగిన= నేను ప్రశ్నించిన; అర్థంబులకున్= ప్రశ్నలకు (భావాలకు); ఉత్తరంబులు+ఇచ్చి= సమాధానాలు చెప్పి; జలంబులు= నీళ్ళు; త్రావుము= క్రోలుము; అనినన్= అని చెప్పగా; ఆ+పలుకులు= ఆ మాటలు; కైకొనక= స్వీకరించక (లెక్కసేయక); వృకోదరుండు= భీముడు; నిపీతసలిలుండు+ఐ= బాగా త్రాగబడిన నీళ్ళుకలవాడై (బాగా నీరుత్రాగి); ఆ+చోటన్+అ= ఆ స్థలంలోనే; మూర్ఛితుండు+ఐ= స్పృహతప్పినవాడయి; పడియెన్= పడిపోయాడు; ఇట= ఇక్కడ (అరణ్యంలో); పాండవ+అగ్రజుండు= పాండవులలో మొదటపుట్టినవాడు ధర్మనందనుడు.

**తాత్పర్యం:** అంత ఆకాశంనుండి శబ్దం విన్పించింది. 'అయ్యా! నీవు ఎందుకు ఇట్టి సాహసానికి పూనుకొంటున్నావు? ఈ కొలను పూర్వమే నాచేత పరిగ్రహించబడింది. నీకు శక్తి ఉంటే నేను అడిగే ప్రశ్నలకు సముచితసమాధానాలు చెప్పి, ఆ పిమ్మట ఈ కొలనునీరు త్రాగుము.' ఆ మాటలు సరకుగొనక, భీముడు నీటిని గ్రోలి స్పృహతప్పి అక్కడే పడిపోయాడు. ఇక అరణ్యంలో అట నున్న ధర్మరాజు.

**క. తమ్ములు నలువురు నొక్కట । నమ్మెయి మసలుటకు నాత్మ నత్యంతవిషా**
**ద మ్మొలయ సముత్థితుఁ డై । క్రమ్మఱ నమ్మార్గ మపుడు గైకొని నడచెన్. 405**

**ప్రతిపదార్థం:** తమ్ములు= అనుజులు; నలువురున్= నలుగురున్నూ; ఒక్కటన్= ఒకేరీతిగా; ఆ+మెయిన్= ఆవిధంగా; మసలుటకున్= ఆలసించటానికి; ఆత్మన్= మనస్సులో; అత్యంతవిషాదమ్ము= మిక్కుటమయిన పరితాపం; ఒలయన్= కలుగగా; సమ్+ఉత్థితుఁడు+ఐ= లేచినవాడై; క్రమ్మఱన్= మరల; ఆ+మార్గము= ఆ దారి (తమ్ములు వెడలినదారి); అపుడు= ఆ సమయంలో; కైకొని= స్వీకరించి; నడచెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ధర్మజుడు తన నలుగురుతమ్ములూ ఒకేరీతిగా ఆలసించటంచేత మనస్సులో మిక్కిలి పరితపిస్తూ, లేచి వారు లోగడ వెడలిన దారినిబట్టి నడవసాగాడు.

**సీ. అపగత జనశబ్దమై, యనభివ్యక్త । మార్గమై, యవిరళదుర్గశైల**
**తరుగుల్మవల్లీవితానమై, గజసింహ । శరభ శార్దూల సూకర లులాయ**

బహుళమై, బహువిధపక్షికోలాహల । భయదమై, కడుఁ బరపైన యడవి
ననుజుల వెదకుచు ననఘుండు సని కాంచెఁ । గమలాకరంబుతీరమునఁ బడిన

ఆ. వారిఁ బూరువంశవరుల భీమార్జున । యముల నమితబలుల విమలమతులఁ
బ్రళయపతితలోకపాలసంకాశుల । భూరిపుణ్యధనుల వీరవరుల. **406**

**ప్రతిపదార్థం:** అనఘుండు= పాపరహితుడు, ధర్మనందనుడు; అపగతజనశబ్దము+ఐ= ప్రజల ధ్వనిలేనిదై, జనసంచారంలేనిదై; న+అభివ్యక్తమార్గము+ఐ= కన్పించని దారికలదై; అవిరళ, దుర్గ, శైల, తరుగుల్మవల్లీవితానము+ఐ= దట్టమైన నడవటానికి వీలులేని కొండలతో చెట్లతో పొదలతో తీగెలసముదాయంతో కూడుకొనిఉన్నదై; గజ, సింహ, శరభ, శార్దూల, సూకర, లులాయ బహుళము+ఐ= ఏనుగులతో సింహాలతో మీగండ్లమెకాలతో అడవిపందులతో కారెనుపోతులతో దట్టమైనదై; బహువిధపక్షి కోలాహలభయదము+ఐ= పెక్కురకాలైన పిట్టల కలకలనాదంచేత భీతిగొలిపేదై; కడున్= మిక్కిలి; పరపు+ఐన, అడవిలోన్= విరివి అయిన అడవిలో; అనుజులన్= తమ్ములను; వెదకుచున్= అన్వేషిస్తూ; చని= వెడలి; కమల+ఆకరంబు తీరమునన్= కొలనుగట్టుపైన; పడినవారిన్= కూలిఉన్నవారిని; పూరువంశవరులన్= పురుమహారాజుయొక్క వంశంలో జన్మించినవారిలో శ్రేష్ఠులను; భీమ+అర్జున, యములన్= భీముడిని, అర్జునుడిని, (కవలను) నకులసహదేవులను; అమితబలులన్= గొప్పబలం కలవారిని; విమలమతులన్= నిష్కల్మషమైన బుద్ధి కలవారిని; ప్రళయపతితలోకపాలసంకాశులన్= ప్రళయకాలంలో పడిపోయిన దిక్పాలకులతో సమానులను; భూరిపుణ్యధనులన్= ఎక్కువసుకృతం ధనంగా కలవారిని; వీరవరులన్= శూరులలో శ్రేష్ఠులను; కాంచెన్= చూచాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అడవిలో నడవసాగాడు. ఆ అడవిలో నరసంచారశబ్దం విన్పించటం లేదు; దారితెన్నులు కానరావటం లేదు; ఎచ్చట చూచినా నడవటానికి వీలులేని రాళ్ళు రప్పలు కొండలు కోనలు చెట్లు పొదలు తీగెలు దట్టంగా అడ్డుతగులుతున్నాయి; ఏనుగులు సింహాలు మీగండ్లమెకాలు పెద్దపులులు పందులు కారెనుపోతులు తిరుగాడుతున్నాయి. పెక్కురకాలైన పక్షుల కలకలారావాలు భయంకరంగా విన్పిస్తున్నాయి. ఆ దట్టమైన అడవిలో పుణ్యాత్ముడైన ధర్మరాజు తనతమ్ములను అన్వేషిస్తూ వెడలి ఆ కొలనును చేరాడు. ఆ కొలనుగట్టుమీద స్పృహవీడి పడిఉన్న తమ్ములను - భీముడిని, అర్జునుడిని, నకులసహదేవులను పూరువంశంలో జన్మించినవారిలో శ్రేష్ఠులను, మిక్కుటమైన బలం కలవారిని, నిర్మలమైన బుద్ధికలవారిని, గొప్పపుణ్యాన్ని ఆర్జించిన మహావీరులను ధర్మరాజు చూచాడు. వారు ప్రళయకాలంలో పడిఉండే దిక్పాలకులవలె ఆ చెరువుగట్టుపై కూలిపోయి కన్పించారు.

**విశేషం:** అలం: ఉపమ.

మ. కని డెందంబునఁ దల్లడం బడర దీర్ఘశ్వాస వైవర్ణ్యముల్
దనుకం దాల్మి చలింప విస్మయపరీతస్వాంతుఁడై శోకబా
ష్పనిరుద్ధాకులలోచనుం డగుచు మూర్ఛల్ పైకొనం గొంతసే
పు నరేంద్రోత్తముఁ డుండెఁ జిత్రమున రూపుంబోలెఁ దా నచ్చటన్. **407**

**ప్రతిపదార్థం:** కని= చూచి; డెందంబునన్= హృదయంలో; తల్లడంబు+అడరన్= సంతాపం అతిశయించగా; దీర్ఘశ్వాసవైవర్ణ్యముల్= నిట్టూరుపులు పాలిపోవటాలు; తనుకన్= క్రమ్ముకొనగా; తాల్మి= ఓర్పు; చలింపన్= కదలిపోగా; విస్మయపరీతస్వాంతుఁడు+

ఐ= ఆశ్చర్యంతో చుట్టుకొనబడినమనస్సు కలవాడై; శోకబాష్పనిరుద్ధ+ఆకుల, లోచనుండు+అగుచున్= దుఃఖంవలన వెలువడిన కంటినీటిచేత అడ్డగించబడి కలతచెందిన కన్నులు కలవాడు ఔతూ; మూర్ఛల్= స్పృహతప్పటాలు; పైకొనన్= వ్యాపించగా; కొంత+సేపు= కొంతతడవు; నర+ఇంద్ర+ఉత్తముఁడు= రాజులలో శ్రేష్ఠుడు; చిత్రమున+రూపున్+పోలెన్= బొమ్మలో గీయబడిన ఆకృతివలె; తాన్= తాను; అచ్చటన్= ఆకొలను దరిని; ఉండెన్= (నిలబడి) ఉన్నాడు.

**తాత్పర్యం:** స్పృహ కోలుపోయి ఆ కొలనుగట్టుపై పడిఉన్న తమ్ములను చూచి ధర్మరాజు కొయ్యబారిపోయి కదలక మెదలక చిత్రంలో గీయబడిన ఆకారంవలె అక్కడ కొంతతడవు నిలబడిపోయాడు. ఆదృశ్యాన్ని చూచేసరికి ధర్మరాజు చిత్తం తల్లడిల్లింది. అతడిమొగం పాలిపోయింది. వేడినిట్టూరుపులు బయల్వెడలాయి. ఆశ్చర్యచకితుడవటంచేత అతడిఓర్పు మాయమైపోయింది. దుఃఖపరితాపంచొప్పున వెలువడిన కంటినీరువలన ఆతడి దృష్టి మాసిపోయింది. మూర్ఛలు క్రమ్ముకొన్నాయి.

**విశేషం:** (1) అలం: స్వభావోక్తి, ఉపమ. (2) ఈపద్యంలో ఎఱ్ఱనపై తిక్కనకవితాశిల్పప్రభావముద్ర ఆంగికసాత్త్వికానుభావవర్ణనలో ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

**వ. పదంపడి డెందంబున ధృతి పొందుపఱుచుకొని యతం డన్నలువుర నుపలక్షించి నలుదెసలుం బరికించి యాత్మగతంబున. 408**

**ప్రతిపదార్థం:** పదంపడి= పిమ్మట; అతండు= అతడు ధర్మనందనుండు; డెందంబునన్= హృదయంలో; ధృతి= ధైర్యం; పొందుపఱుచుకొని= కూడగట్టుకొని; ఆ+నలువురన్= ఆ నలుగురిని (భీముడిని, అర్జునుడిని, నకులుడిని, సహదేవుడిని); ఉపలక్షించి= చూచి; నలుదెసలున్= నాలుగుదిక్కులను; పరికించి= చూచి; ఆత్మగతంబునన్= తనలో తాను.

**తాత్పర్యం:** పిమ్మట కొంతతడవుకు ధర్మరాజు తేరుకొన్నాడు. అతడు తనహృదయంలో ధైర్యాన్నికూడగట్టుకొన్నాడు. కొలనుగట్టుపై పడిఉన్న తమ్ములు భీముడిని అర్జునుడిని నకులుడిని సహదేవుడిని క్రమంగా తేరిపార చూచాడు. నలుదిక్కులను పరీక్షించి చూచి, తనలో తాను (ఆలోచించసాగాడు).

**తే. 'ఒరులు వచ్చిన చొప్పు లే; దరిగినట్టి । చొప్పు లేదు; పెనంగిన చొప్పు లేదు;**
**ఘనభుజుల యంగకంబులు గనుఁగొనంగ । నక్షతము; లేల యొక్కొ యి ట్లయిరి వీరు? 409**

**ప్రతిపదార్థం:** ఒరులు= ఇతరులు; వచ్చిన= అరుగుదెంచిన; చొప్పు= తీరు; లేదు= లేదు; అరిగినట్టిచొప్పు= వెడలినతీరు; లేదు= లేదు; పెనంగినచొప్పు= పోరు సల్పిన తీరు; లేదు= లేదు; ఘనభుజుల అంగకంబులు= వీరుల అవయవాలు; కనుఁగొనంగన్= చూడగా; అక్షతములు= గాయాలు లేనట్టివి; ఏలయొక్కొ= ఎందుచేతనో; వీరు= భీమార్జున నకులసహదేవులు; ఇట్లు+అయిరి= ఈ విధంగా అయినారు.

**తాత్పర్యం:** 'ఆహా! ఏ మిది చోద్యం!! ఇక్కడకు ఇతరులు ఎవ్వరూ వచ్చిన జాడలు లేవు. ఇటనుండి ఇతరులు ఎవరూ వెళ్ళిన అడుగుజాడలు కన్పించవు. భీముడు అర్జునుడు నకులసహదేవులు సామాన్యులు కారు. మహావీరులు కదా; సులువుగా ఇతరులకు లొంగేవారు కారు. పోనీ, పోరాటం జరిగిందా అంటే, జరిగినట్లే లేదు. పోనీ, వీరి అవయవాలపై గాయాలు ఏవీ కానరావు. ఎందుకో వీరు ఈ విధంగా నేలకూలారు ఏమీ పాలుపోవటం లేదు.

**విశేషం:** సంశోధిత ప్రతిలోని నాలుగవ పాదంలో గణభంగమయింది- 'అక్షతంబు లేలకో యి ట్లయిరి వీరు'. అందుచేత వావిళ్ళ ప్రతిలోని 'అక్షతము లేలయొక్కొ యిట్లయిరి వీరు' అనే పాఠం స్వీకరించబడింది.

**ఉ. క్రూరుఁడు ధార్తరాష్ట్రుఁ డతికుత్సితుఁ; డెంతయుఁ బాపబుద్ధి గాం**
**ధారుఁడు పెక్కుమాయలకుఁ దావల; మక్కట! యద్దురాత్మకుల్**
**వారక యెద్దియేని యొకవంచనమై యిటు సేసిరొక్కొ! యె**
**వ్వారలు నాత్మ నమ్ముదురె వక్రవిచారులఁ బాపకర్ములన్. 410**

**ప్రతిపదార్థం:** ధార్తరాష్ట్రుఁడు= ధృతరాష్ట్రుడికొడుకు దుర్యోధనుడు; క్రూరుఁడు= కఠినుడు; అతికుత్సితుఁడు= మిక్కిలికుటిలమైన బుద్ధి కలవాడు; గాంధారుఁడు= గాంధారరాజపుత్రుడు, శకుని; ఎంతయున్= మిక్కిలి; పాపబుద్ధి= పాపమైన బుద్ధి కలవాడు; పెక్కుమాయలకున్= పలురకాల మోసాలకు; తావలము= నెలవు; అక్కట!= అయ్యో!; ఆ+దురాత్మకుల్= ఆ చెడు ఆత్మ కలవారు (దుర్యోధనుడు, శకుని); వారక= ఆగక; ఎద్ది+ఏని= ఏదిఐన; ఒకవంచనమైన్= ఒకమోసంతో; ఇటు= ఈ విధంగా; చేసిరి+ఒక్కొ!= చేసిరా ఏమి!; వక్రవిచారులన్= వంకరఆలోచనలు గలవారిని; పాపకర్ములన్= దుష్టకార్యాలు గలవారిని; ఏ+వారలున్= ఎవరుగాని; ఆత్మన్= మనస్సులో; నమ్ముదురె?= విశ్వసిస్తారా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడికుమారుడు ఆ దుర్యోధనుడు క్రూరుడు, కుటిలుడు. ఆతడికి సాయం చేసేవాడు గాంధారరాజ పుత్రుడు శకుని. పేరుకెక్కిన మాయావి. పెక్కుమోసాలకు నెలవు. అక్కట! ఆ దురాత్ములు ఏదైన కుట్ర పన్ని ఈ విధంగా చేశారా? చెడుబుద్ధికలవారిని ఎవరైనా తమమనస్సులలో విశ్వసిస్తారా?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క. వదనంబుల తెలివియుఁ గర । పదరుచియుం జెడదు; వీరు పడుటకుఁ గత మీ**
**యుదకము విషదుష్ట మనియు । మదిఁ దలఁపం బోల; దేమి మాయయొ యెఱుఁగన్. 411**

**ప్రతిపదార్థం:** వదనంబుల= మొగాలయొక్క; తెలివియున్= ప్రసన్నతయును; కరపదరుచియున్= చేతులుకాళ్ళయొక్క కాంతియు; చెడదు= పాడు కాలేదు; వీరు+పడుటకున్= వీరు కూలటానికి; కతము= కారణం; ఈ ఉదకము= ఈ నీరు; విషదుష్టము= విసం చేత చెడిపోయింది; అనియున్= అనియును; మదిన్= చిత్తంలో; తలఁపన్+పోలదు= ఊహించటానికి వీలు లేదు; ఏమిమాయ+ఒ= ఇది ఏమి మోసమో; ఎఱుఁగన్= తెలియజాలను.

**తాత్పర్యం:** వీరిమొగాలు ప్రసన్నంగా ఉన్నాయి. వీరి చేతులు కాళ్ళు కాంతి చెడలేదు. వీరు ఈ రీతిగా కూలటానికి కారణం ఈ కొలనునీరు విషపూరితమని ఊహచేయటానికికూడా వీలులేదు. మఱి ఇదేమి మాయయో నా ఊహకు అంతు చిక్కటం లేదు.

**చ. పుడమియు సర్వసంపదలుఁ బొల్పఱ వైరుల పాలుసేసి యీ**
**యడవికి వచ్చి భీకరమృగావలిపొందున నున్న వీరి వె**
**న్నడికొని యిట్లు సేసెనె యనాథులఁబోలె విధాతృఁ; డింక నె**
**క్కడఁ జనువాఁడ? నేది గడగాఁ దరియింతు దురంతదుఃఖమున్? 412**

**ప్రతిపదార్థం:** పుడమియున్= భూమియు, సర్వసంపదలున్= సమస్తమైన ఐశ్వర్యాలు; పొల్పు+అఱన్= శోభ నశించగా; వైరులపాలు= శత్రువులఅధీనం; చేసి= ఒనర్చి; ఈ+అడవికిన్= ఈ అరణ్యానికి; వచ్చి= అరుదెంచి; భీకర, మృగ+ ఆవలి+ పొందునన్+ఉన్న= భయంకరమైన జంతువులను చేరి ఉన్న; వీరిన్= వీరిని (భీమార్జున నకులసహదేవులను); వెన్నడికొని= వెంటాడి; విధాతృ(డు= బ్రహ్మదేవుడు; ఇట్లు= ఈవిధంగా; అనాథులన్+పోలెన్= దిక్కులేనివారిని పోలేటట్లుగా; చేసెనె= ఒనర్చెనుకదా; ఇంకన్= ఇకమీద; ఎక్కడన్= ఎచటకు; చనువా(డన్= వెడలగలను; దురంతదుఃఖమున్= అంతం లేని శోకాన్ని; ఏది= ఏది; కడగాన్= దిక్కుగా, ఆధారంగా; తరియింతున్= దాటగలను.

**తాత్పర్యం:** సమస్తమైన భూరాజ్యం ఐశ్వర్యాలు శోభ నశించగా శత్రువుల అధీనంచేసి ఈ అరణ్యానికి వచ్చి, భయంకరమృగాలను చేరి నివసిస్తున్న వీరిని (భీమార్జున నకులసహదేవులను) వెంబడించి బ్రహ్మదేవుడు ఈ రీతిగా దిక్కుమాలినవారివలె చేసెనుగదా. నే నింక ఎక్కడికి పోగలను? నాకు దిక్కెవరు? అంతం లేని ఈ పరితాపాన్ని ఎట్లా తరించగలను?

**సీ. పుత్త్రులు దుఃఖార్తిఁ బొగులుట కనిశంబుఁ । బొక్కచునున్న యప్పుణ్యచరిత**
**మాతల్లి పాండునిమహిషి నా కెదురుగా । వచ్చి కౌఁగిటఁజేర్చి 'వత్స! నాఁడు**
**నీతమ్ముఁగుఱ్ఱలు నీవును నడవుల । కరిగితి, రిప్పు డయ్యనుజు లెందుఁ**
**జనిరి? నీ వొకడవ చనుదెంచి; తిది యేమి?' । యనిన నాయమతోడ నప్పు డేమి**

**ఆ. యనఁగ నేర్చువాఁడ? నాచార్యవిదుర శాం । తనవకృపులు నను ముదంబుతోడఁ**
**గుశల మడిగి రేని఼ గుశల మే మనువాఁడ? । నెందుఁ దలఁగరాని యెడరు దగిలె.' 413**

**ప్రతిపదార్థం:** పుత్త్రులు= తన కొడుకులు; దుఃఖ+ఆర్తిన్= శోకదైన్యంతో; పొగులుటకున్= బాధపడటానికి; అనిశంబున్= ఎల్లప్పుడును; పొక్కుచున్+ఉన్న= ఆవేదన అనుభవిస్తున్న; ఆ+పుణ్యచరిత= మంచిశీలం కలది; మాతల్లి= మాఅమ్మ; పాండుని, మహిషి= పాండురాజు దేవేరి; నాకున్= నాకు; ఎదురుగాన్= వచ్చి= స్వాగతంచెప్పుతూ అరుదెంచి; కౌఁగిటన్+చేర్చి= ఆలింగనం ఒనర్చి; వత్స!= నాయనా!; నాఁడు= ఆ రోజున; నీతమ్ము+కుఱ్ఱలున్= కుఱ్ఱలు అయిన నీ తమ్ములును; నీవును= నీవును; అడవులకున్= అరణ్యాలకు; అరిగితిరి= వెళ్ళారు; ఇప్పుడు= నేఁడు; ఆ+అనుజులు= ఆ తమ్ములు (భీమార్జుననకులసహదేవులు); ఎందున్= ఎచటికి; చనిరి?= వెళ్ళారు?; నీవు= నీవు; ఒకడవు+అ= ఒక్కడవే; చనుదెంచితి(వి)= వచ్చావు; ఇది+ఏమి?= (ఈ విధంగా తమ్ములు లేకుండా రావటం ఏమి); అనినన్= అని అడుగగా; ఆయమతోడన్= ఆమెతో (కుంతీదేవితో); అప్పుడు= ఆ సమయంలో; ఏమి+అనఁగన్= ఏమి చెప్పటానికి; నేర్చువాఁడన్= సమర్థుడను; ఆచార్య, విదుర, శాంతనవ, కృపులు= ద్రోణుడు, విదురుడు, భీష్ముడు, కృపుడు; ననున్= నన్ను; ముదంబుతోడన్= సంతోషంతో; కుశలము+అడిగిరి+ఏని= యోగక్షేమాలనుగూర్చి ప్రశ్నిస్తే; కుశలము+ఏమి+అనువాఁడన్= క్షేమాన్నిగూర్చి అడిగినప్రశ్నకు బదులు ఏమని చెప్పగలను; ఎందున్= ఏవిధంగానూ; తలఁగన్‌రాని= తప్పించుకొనటానికి వీలులేని; ఎడరు= ఆపద; తగిలెన్= సంభవించింది.

**తాత్పర్యం:** తనకొడుకులు శోకంచేత పరితపించి దైన్యాన్ని అనుభవించటానికి ఎల్లప్పుడు తాను ఆవేదన చెందే తల్లి కుంతీదేవి, పాండురాజు దేవేరి, పుణ్యాత్మురాలు. ఆమె నాకు సంతోషంతో స్వాగతం చెప్పుతూ వచ్చి నన్ను ఆలింగనం చేసికొని 'నాయనా! ఆనాడు నీవూ నీ తమ్ములూ కలిసి అరణ్యాలకు వెడలితిరికదా! ఈనాడు నీవు ఒంటరిగా వచ్చావేమి? నీతమ్ములు ఏమైనారు? వారు ఎక్కడికి వెళ్ళారు?' అని ప్రశ్నిస్తే నేను ఏమని సమాధానం

చెప్పగలను? ద్రోణాచార్యులు, పితామహుడు భీష్ముడు, మహానుభావుడు విదురుడు, గురువు కృపుడు నన్ను చూడగానే నాయోగక్షేమాలనుగూర్చి ప్రశ్నిస్తారుకదా! నేనుమాత్రం క్షేమంగా తిరిగి వచ్చాను అని ఎట్లా బదులు పలుకగలను? ఏవిధంగానైననూ తీరని ఆపద సంప్రాప్తించిందికదా!'

**వ. అని పెక్కుతెఱంగుల వగచి యా ధర్మజుండు దప్పి కోర్వక నీళ్ళు ద్రావుటకై సరోవరంబులోనికి డిగ్గుటయు నెప్పటియట్ల యశరీరభూతం బిట్లనియె. 414**

**ప్రతిపదార్థం:** అని; పెక్కుతెఱంగులన్= పలురీతుల, వగచి= దుఃఖించి; ఆ, ధర్మజుండు; దప్పికిన్= దాహానికి; ఓర్వక= తాళజాలక; నీళ్లు; త్రావుటకున్+ఐ; సరోవరంబులోనికిన్= కొలనులోకి; డిగ్గుటయున్= దిగగా; ఎప్పటి+అట్లు+అ లోగడమాదిరిగానే; అశరీర, భూతంబు= దేహం లేని ప్రాణి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలువిధాల దుఃఖించి ధర్మరాజు దాహానికి తాళజాలక ఆ కొలనులోకి దిగాడు. ఆతడిని వారిస్తూ ఇదివరకు మాదిరిగానే శరీరంలేనిభూతం ఇట్లా పలికింది.

**మ. 'విను మే నొక్క బకంబ; నిక్కొలను పృథ్వీనాథ! నాసొమ్ము; నీ
యనుజుల్ మద్వచనంబుఁ గైకొనక తోయాస్వాదులై యివ్విధం
బునఁ బ్రాణచ్యుతిఁ బొంది; రీవును గడున్ మోహంబునన్ సాహసం
బునకుం జొచ్చిన నట్ల యయ్యెడు సుమీ! మున్ముట్ట వారించితిన్. 415**

**ప్రతిపదార్థం:** పృథ్వీనాథ!= భూపతీ! ఓధర్మరాజా!; ఏను= నేను; ఒక్క= ఒక; బకంబు+అన్= కొంగను; ఈ+కొలను= ఈసరోవరం; నాసొమ్ము= నాఆస్తి; నీ+అనుజుల్= నీతమ్ములు; మత్+వచనంబున్= నామాట; కైకొనక= లెక్కచేయకుండా; తోయ+ఆస్వాదులు+ఐ= నీరు త్రాగినవారై; ఈ+విధంబునన్= ఈ విధంగా; ప్రాణచ్యుతిన్+పొందిరి= అసువులను కోల్పోయారు; ఈవును= నీవును; కడున్= మిక్కుటమైన; మోహంబునన్= భ్రాంతితో; సాహసంబునకున్+చొచ్చినన్= తెగువకు పూనితే; అట్లు+అ (అట్ల)= ఆవిధంగానే; అయ్యెడు+సుమీ= ఔతుంది సుమా జాగ్రత్త; మున్+ముట్ట= మునుముందుగనే; వారించితిన్= అడ్డుచెప్పి హెచ్చరించాను.

**తాత్పర్యం:** 'ఓ ధర్మనందనా! నేను ఒకకొంగను. ఈ సరోవరం నా ఆస్తి. నీ తమ్ములు నేను చేసిన హెచ్చరిక పాటించకుండా ఇందులోని నీళ్ళు త్రాగి ఈ విధంగా ప్రాణాలను కోల్పోయారు. నీవుకూడ మిక్కుటమైన భ్రాంతిచొప్పున తెగువకు పూని ఇందలినీళ్ళను త్రాగితే నీతమ్ములకు పట్టిన దుర్గతియే నీకుకూడ దాపురించగలదు. జాగ్రత్త. మునుముందుగా నేను నీకు ఈ హెచ్చరిక చేస్తున్నాను.

**క. ఏ నడిగిన యర్థములకు । భూనుత! యుత్తరము లిచ్చి పొలుపొందఁ బయః
పానంబు సేయు' మనవుడు । నా నిర్మలచరితుఁ డంబరాభిముఖుండై. 416**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అడిగిన= కోరిన; అర్థములకున్= విషయములకు (ప్రశ్నలకు); భూనుత! భూమియందలిజనులచేత కీర్తించబడినవాడా, ఓధర్మనందనా!; ఉత్తరములు+ఇచ్చి= సమాధానాల నొసగి; పొలుపు+ఒందన్= శోభిల్లేటట్లుగా, పయః పానంబు (పయస్+పానమ్ము)చేయుము= నీళ్ళు త్రాగుము; అనవుడున్= అని (అశరీరభూతం) చెప్పుటచేత; ఆ నిర్మల, చరితుఁడు= ఆ స్వచ్ఛమైన శీలం కలవాడు, ఆ ధర్మనందనుడు; అంబర+అభిముఖుండు+ఐ= ఆకసంవైపు మొగం సారించినవాడై.

**తాత్పర్యం:** 'భూజనులచేత ప్రశంసించబడినవాడా, ఓధర్మరాజా! నేను కోరిన ప్రశ్నలకు సరిఅయిన సమాధానాలు చెప్పి, పిదప ఒప్పిదంగా ఈ సరోవరంలోని నీరు త్రాగుము'- అని అశరీరభూతం అన్నది. అంతట నిర్మలమైనశీలం గలవాడైన ఆ ధర్మరాజు ఆకాశంవైపు తనమొగాన్ని త్రిప్పి.

**విశేషం:** 'నిన్ను భూజనులు ప్రశంసిస్తున్నారు. ఆ నీ కీర్తి ఎంతవరకు సమంజసమైనదో నేను నిన్ను పరీక్షింప దలచాను.'- అని అశరీరభూతం చెప్పింది. అంతట ఆ నిర్మలశీలుడు ఇట్లా బదులు పలికాడు. కీర్తికి తోడు జ్ఞానం, జ్ఞానానికితోడూ సౌశీల్యం ఉండాలి. కీర్తిజ్ఞానసౌశీల్యాలకు ముయ్యేలగుట్ట ధర్మరాజు.

**వ. 'అయ్యా! నీవు బకరూపధరుండ వైన రుద్రుండవో, పావకుండవో, పవనుండవో! యట్లు గానినాఁడు కులపర్వతప్రతిము లయిన నాతమ్ములం బడఁద్రోచునట్టిబలంబు పులుఁగుల కెందునుం గలుగదు. దేవాసురగంధర్వయక్షాదులకు దుర్జయులైన యవ్వీరుల నిట్లు సేసి నీవు గాని వాఁడవ పోలెం దొలంగియున్నవాఁడవు; నాకు నద్భుతభయకౌతుకంబు లొక్కటం బొడమెడు; నీ వెవ్వండవు? నీతలంపెయ్యది? చెప్పి నాహృదయవేదన నపనయింపవే' యనిన నదృశ్యభూతంబు. 417**

**ప్రతిపదార్థం:** అయ్యా!= ఆర్యా!; నీవు= ఈవు; బకరూపధరుండవు= కొంగరూపంలో ఉన్న; రుద్రుండవు+ఓ= శివుడవో; పావకుండవు+ఓ= అగ్నిదేవుడవో; పవనుండవు+ఓ= వాయుదేవుడవో; అట్లు+కాని, నాఁడు= ఆవిధంగా కాకపోతే; కుల, పర్వత, ప్రతిములు= కులపర్వతాలతో సమానులు; అయిన= అయినట్టి; నా తమ్ములన్; పడన్+త్రోచునట్టి= కూల్చునట్టి; బలంబు= శక్తి; పులుఁగులకున్= పక్షులకు; ఎందునున్= ఎచ్చటను; కలుగదు= ఉండదు; దేవ+అసుర, గంధర్వ, యక్ష+ఆదులకున్= దేవతలకు, రాక్షసులకు, గంధర్వులకు; యక్షులు మున్నగువారికి; దుర్జయులు+ఐన= గెలువ అలవికానివారు అయిన; ఆ+వీరులను= భీమార్జున నకులసహదేవులను; ఇట్లు+చేసి= ఈవిధంగా ఒనర్చి; నీవు= ఈవు; కానివాఁడవు+అ+పోలెన్= తనకు సంబంధం లేనివాడుగనే; తొలంగి+ఉన్నవాఁడవు= ప్రక్కకు తప్పుకొని ఉన్నావు; నాకున్= నాకు; అద్భుత, భయ, కౌతుకంబులు= ఆశ్చర్యం భీతి వేడుక; ఒక్కటన్= ఒక్కసారిగా; పొడమెడున్= ఏర్పడినవి; నీవు; ఎవ్వండవు?= ఎవరవు?; నీతలంపు+ఎయ్యది?= నీఊహ ఎటువంటిది, నీవు ఏమి చేయ సంకల్పించావు?; చెప్పి= వచించి; నాహృదయవేదనన్= నా ఎదలోని సంతాపాన్ని; అపనయింపవే= దయచేసి పోగొట్టవా; అనినన్= అని (ధర్మరాజు) పలుకగా; అదృశ్యభూతంబు= కనిపించని ప్రాణి; (ఇట్లు+అనియెన్= ఈ విధంగా బదులు పలికింది.)

**తాత్పర్యం:** 'అయ్యా! నీవు కొంగవు కాజాలవు. కొంగరూపం ధరించిన శివుడవో, అగ్నిదేవుడవో, వాయుదేవుడవో. అట్లాకాకపోతే వీరులలో వీరాధివీరులు కులపర్వత సమానులు అయిన నాతమ్ములను (భీమార్జుననకులసహదేవులను) నేలగూల్చగల బలం పక్షులకు ఎన్నడూ కలుగనేరదు. దేవతలకు, రాక్షసులకు గంధర్వులకు యక్షులకు నాతమ్ములు గెలువ నలవిగానివారు. అట్టివీరులను ఈ విధంగా నేలపై పడవేయగలిగినవాడవు నీ వెవరవు? నాకు భయం, ఆశ్చర్యం, వేడుక నా ఎదలో ముప్పిరికొన్నవి. నీ వెవరవు? నీవు ఏమి చేయ సంకల్పించావు? దయచేసి నాకు చెప్పుము'- అనిన అదృశ్యభూతం ఈవిధంగా బదులు పలికింది.

**విశేషం:** (1) అలం: ఉపమ. (2) ధైర్యస్థైర్యాలకు వీరులను పర్వతాలతో పోల్చటం పరిపాటి. పర్వతాలలో కులపర్వతాలు గొప్పవి. ఆదిశేషుడు మున్నగువారు భూభారాన్ని వహించేవారు. కులపర్వతాలు భూమిని వహిస్తునట్లు పౌరాణికకథనం.

**ఆ. 'కౌరవేంద్ర! బకముఁ గాను నే; విను మొక్క । యక్షవరుఁడ; నిచట నస్మదీయ**
**నికృతిఁ జేసి పడిరి నీతమ్ము లందఱు' । ననుచు నాక్షణంబ యతని యెదుర. 418**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కౌరవులకు అధిపతివైనవాడా!; వినుము= ఆలకించుము; నేన్= నేను; బకమన్+కాను= కొంగను కాను; ఒక్క= ఒక; యక్షవరుఁడన్= యక్షులలో శ్రేష్ఠుడను; ఇచటన్= ఈ స్థలంలో; అస్మదీయనికృతిన్+చేసి= నా వంచనచేత; నీతమ్ములు+అందఱున్= నీ అనుజులు అందరును (భీమార్జుననకులసహదేవులు); పడిరి= కూలారు; అనుచున్= అని పలుకుతూ; ఆ క్షణంబు+అ= ఆ క్షణంలోనే; అతని+ఎదురన్= అతని ఎదుట, ఆ ధర్మరాజుముందు.

**తాత్పర్యం:** 'కౌరవనాయకుడ వైన ఓ ధర్మరాజా! నేను కొంగను కాను. ఒక యక్షనాయకుడను. నీ తమ్ములు నన్ను అవమానించి ఈ స్థలంలో కుప్పకూలారు' అని వచించి ఆ క్షణంలోనే ధర్మరాజుముందు (ఆ యక్షుడు ప్రత్యక్షమయ్యాడు).

**మ. నిలిచెం దాళసముచ్ఛ్రితాంగుఁడు మహానిర్ఘోషసంతర్జితా**
**ఖిలభూతప్రకరుండు దీర్ఘవిపులగ్రీవుండు దంష్ట్రాసము**
**జ్జ్వలవక్త్రుండు విరూపలోచనుఁడు తీవ్రస్ఫారతేజోఘనుం**
**డలఘుం డా సరసీతటాంతమున నయ్యక్షుండు ఘోరాకృతిన్. 419**

**ప్రతిపదార్థం:** ఆ+యక్షుండు= ఆ యక్షుడు; తాళసముచ్ఛ్రితాంగుఁడు= తాళ+సమ్+ఉచ్ఛ్రిత+అంగుఁడు= తాడిచెట్టువలె నిట్టనిటారుగా నిలిచిన శరీరం కలవాడు; మహా, నిర్ఘోష+సంతర్జిత+అఖిల, భూత, ప్రకరుండు= గొప్పమ్రోతచేత మిక్కిలి అదల్పబడిన ప్రాణిసమూహం కలవాడు; దీర్ఘ, విపుల, గ్రీవుండు= పొడుగైన పెద్దకంఠం కలవాడు; దంష్ట్రా, సమ్+ఉత్+జ్వల, వక్త్రుండు= కోరపండ్లచేత ప్రకాశించే నోరుకలవాడు; విరూపలోచనుడు= భీతిగొలిపే కన్నులు గలవాడు; తీవ్ర, స్ఫార+తేజస్+ఘనుండు= దేదీప్యమానంగా ప్రకాశించే వర్చస్సు కలగొప్పవాడు; అలఘుండు= గొప్పవాడు (అతికాయుడు); ఆసరసీతట+అంతమునన్= ఆ కొలనుగట్టుచివర; ఘోర+ఆకృతిన్= భయంకరరూపంతో; నిలిచెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** ఆ యక్షుడు భయంకరస్వరూపంతో ఆ సరోవరతటంచివర నిలబడ్డాడు. అతడు తాడిచెట్టువలె నిట్టనిటారుగా ఉన్న ఎత్తైనశరీరం కలవాడు. ఆతడు అక్కడికి చేరి నిలిచినప్పుడు ఏర్పడిన ధ్వనికి భూతాలు అన్నియు అదిరిపోయాయి. అతడికంఠం పొడుగైనది, విశాలమైనది. ఆతనినోటిలోని కోరలు ప్రకాశిస్తూ కన్పిస్తున్నాయి. దేదీప్యమానమైన వర్చస్సుతో అతడిశరీరం మిరుమిట్లు గొల్పుతున్నది.

**వ. ఇట్లు నిలిచి కౌంతేయాగ్రజున కి ట్లనియె. 420**

**తాత్పర్యం:** ఈ విధంగా నిలువబడి ఆ యక్షుడు ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు.

**క. 'నాయనుమతి లేకుండఁగ । నీయుదకము ద్రావిరేని యెవ్వా రైనన్**
**ధీయుత! చత్తురు; నీ వటు । సేయవు సమ్యగ్విచారశీలుఁడ వగుటన్. 421**

**ప్రతిపదార్థం:** ధీయుత!= బుద్ధిమంతుడా!, ఓధర్మరాజా!; నా+అనుమతి= నా అనుజ్ఞ; లేకుండఁగన్= లేకుండగా; ఈ+ఉదకము= ఈ నీరు త్రావిరి+ఏని= త్రాగారా; ఏ+వారు+ఐనన్= ఎవరు అయినా; చత్తురు= మరణిస్తారు; సమ్యక్+విచార, శీలుఁడవు+అగుటన్= సరిఅయిన యోచనచేసే స్వభావం కలవాడవు కావటంచేత; నీవు; అటు+చేయవు= ఆ విధంగా చేయవు.

**తాత్పర్యం:** 'బుద్ధిమంతుడవైన ఓ ధర్మరాజా! నా అనుమతి లేకుండా ఈ సరోవరంలోని నీళ్ళు త్రాగినవారు ఎంతటిగొప్పవారయినా మరణించగలరు. నీవు సరిఅయిన యోచన చేసేవాడవు కాబట్టి ఆ రీతిగా చేయలేదు.

**వ. కావున మదీయంబులగుప్రశ్నంబుల కుత్తరంబుసెప్పు మనిన నతండు 'మహాత్మా! నీ చిత్తంబునకు వచ్చునట్లుగాఁ జెప్పనాబోఁటివానికి శక్యం బగునే? యైనను నా నేర్చువిధంబునఁజెప్పెద నడుగు' మనిన నయ్యక్షుం డి ట్లనియె. 422**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి, ఈ కారణంచేత; మదీయంబులు+అగు= నావైన; ప్రశ్నంబులకున్= ప్రశ్నలకు; ఉత్తరంబు= సమాధానం; చెప్పుము= వచింపుము; అనినన్= అని (యక్షుడు) చెప్పగా; అతండు= అతడు (ధర్మనందనుడు); మహా+ఆత్మా!= గొప్పఆత్మకలవాడా, ఓయక్షా!; నీచిత్తంబునకున్= నీమనస్సుకు; వచ్చునట్లుగాన్= తేటతెల్లమయి హత్తుకొనేటట్లుగా; చెప్పన్= (సమాధానము) వచించటం; నాబోఁటివానికిన్= నావంటివానికి; శక్యంబు= సాధ్యం; అగును+ఏ= అగునా, (సాధ్యం కాకపోవచ్చును); ఐనను= అయినప్పటికిని; నా నేర్చువిధంబునన్= నాకు తెలిసినమేరకు; చెప్పెదన్= వచించగలను; అడుగుము= ప్రశ్నించుము; అనినన్= అని చెప్పగా; ఆ+యక్షుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'కావున నేను వేసేప్రశ్నలకు నీవు సముచితసమాధానాలు చెప్పాలి' అని యక్షుడు అన్నాడు. అప్పుడు ధర్మనందనుడు 'మహాత్మా! యక్షుడా! నీవు అడిగేప్రశ్నలకు నేను సమాధానాలు చెప్పగలనా? నే నెంతటివాడను? నాజ్ఞానం ఎంతటిది? అయినను, నాకు తెలిసినమేరకు సమాధానాలు చెప్పగలను. దయచేసి అడుగుము' అని విన్నవించాడు. అంత యక్షుడు ఇట్లా ప్రశ్నించాడు.

**విశేషం:** మహాభారతంలో తరతరాల మేధావులను ఉర్రూతలూగించిన ఘట్టాలలో ఎన్నదగింది యక్షప్రశ్నల ఘట్టం. ఈ ప్రశ్నపరంపర అడిగినది యక్షరూపాన ఉన్న యమధర్మరాజు. సమాధానాలు చెప్పినవాడు - ధర్మనందనుడు. ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పేఅధికారం ధర్మరాజుకు ఏవిధంగా వచ్చింది? ధర్మరాజు పండ్రెండేండ్లు అరణ్యావిశ్వవిద్యాలయంలో జిజ్ఞాసువుగా విద్యాభ్యాసం చేసినవాడు. యక్షప్రశ్నలఘట్టం అతడికి స్నాతకపరీక్ష. పరీక్షాధికారి సాక్షాత్తు యమధర్మరాజే. పండ్రెండేండ్లనుండి ధర్మరాజు మహర్షులకు వేసిన ప్రశ్నపరంపరలకు అంతు లేదు కదా! సమాధానం చెప్పే వంతు ఇప్పుడు ధర్మరాజుకు వచ్చింది. ఇది అతడికి అసిధారావ్రతం. అతడితమ్ములప్రాణాలు ఆతడి సమాధానాలలో ఇమిడి ఉన్నాయి. అంతేకాక యక్షప్రశ్నపరంపరలో రెండు స్వారస్యాలు ఉన్నాయి. అవి అన్నీ చిక్కుముడుల ప్రశ్నలు. అడిగిన యక్షుడికి సముచిత సమాధానాలు తెలియును. ఇవి జిజ్ఞాసువు అడిగిన ప్రశ్నలు కావు. పరీక్షాధికారి ప్రాగల్భ్యంతో వేసిన ఆదర్శప్రశ్నలు. ఆదర్శప్రశ్నలకు ఆదర్శసమాధానాలు ఇందులో ఉన్నాయి. విశ్వసాహితీజగత్తులో- 'యక్షప్రశ్నలు' నిరుపమానాలు.

### ధర్మరాజు యక్షప్రశ్నముల కుత్తరంబు లిచ్చుట (సం. 3-297-26)

**క. 'దినకరు నెయ్యది నడపును? । దినకరు నెవ్వారు గొలిచి తిరుగుదు? రద్దే**
**వుని యస్తమించు టేమిట? । నసఘ! తదాధారభూత మది యెద్దియొకో'? 423**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవయిన ఓ ధర్మరాజా!; దినకరున్= సూర్యుడిని; ఏ+అది= ఏది; నడపును= నడుపుతుంది?; దినకరున్= సూర్యుడిని; ఏ+వారు= ఎవ్వరు; కొలిచి= సేవించి; తిరుగుదురు?= సంచరిస్తారు?; ఆ+దేవుని= ఆ దేవుని యొక్క; అస్తమించుట= క్రుంకుట; ఏమిటన్= దేనిచేత?; తత్+ఆధారభూతము= ఆ సూర్యుడికి ప్రాపు; అది+ఎద్ది+ఒకో?= అది ఏది ఔతుంది?

**తాత్పర్యం:** సూర్యుడిని నడిపేది ఏది? సూర్యుడిని సేవించి తిరిగేవారు ఎవరు? సూర్యుడు దేనివలన అస్తమిస్తాడు? సూర్యుడికి ఆధారమయినది ఏది?

**తే. అనిన ధర్మజుఁ డిట్లను; 'నబ్జహితుని । నడపు బ్రహ్మంబు; సురకోటి నడచు కొలిచి;**
**ధర్మువున నస్తమితుఁ డగుఁ దపనుఁ; డమ్మ । హాత్మునకు సత్య మాధార మండ్రు బుధులు.' 424**

**ప్రతిపదార్థం:** అనినన్= అని యక్షుడు ప్రశ్నించగా; ధర్మజుడు; ఇట్లు+అనున్; అబ్జహితునిన్= సూర్యుడిని; బ్రహ్మంబు= బ్రహ్మము; నడపున్= నడపుతాడు; కొలిచి= సేవించి; సురకోటి= వేల్పులసమూహము; నడచున్= నడుస్తుంది; తపనుఁడు= సూర్యుడు; ధర్మువునన్= ధర్మంచేతను; అస్తమితుఁడు+అగున్= అస్తమిస్తాడు; ఆ+మహా+ఆత్మునకున్= సూర్యుడికి; సత్యము= సత్యం (నిజం); ఆధారము= ప్రాపు; (అని) బుధులు= పెద్దలు; అంద్రు= చెప్పుతారు.

**తాత్పర్యం:** యక్షునకు ధర్మరాజు ఇట్లా సమాధానం చెప్పాడు: 'సూర్యుడిని బ్రహ్మం నడుపుతుంది. సూర్యుడిని సేవించి తిరిగేవారు వేల్పులు. సూర్యుడు ధర్మంచేత అస్తమిస్తాడు. ఆ మహాత్ముడికి ఆధారం సత్యం అని పెద్ద లంటారు.'

**విశేషం:** ఇచట 'బ్రహ్మం' 'ధర్మువు', 'సత్యము' అనే పదాలకు ఉపనిషత్ప్రోక్తమైన అర్థాలనే గ్రహించాలి.

**వ. అనిన విని యక్షుం డి ట్లనియె. 425**

**తాత్పర్యం:** అనగా విని యక్షుడు మరల ఈ విధంగా అన్నాడు.

**క. 'ఏమిట శ్రోత్రియుఁ డనఁ జను? । నేమిటఁ గడుమహిమ వడయు నిమ్ముగఁ బురుషుం?**
**డేమిట సహాయయుతుఁ డగు? । నేమిట నగు బుద్ధిమంతుఁ? డేర్పడఁ జెపుమా!' 426**

**ప్రతిపదార్థం:** ఏమిటన్= దేనిచేత; శ్రోత్రియుఁడు= సంప్రదాయజ్ఞుడయిన వేదవిదుడు; అనన్+చనున్= అనదగును; ఏమిటన్= దేనిచేత; కడుమహిమ= మిక్కుటమైనగొప్పతనాన్ని; పురుషుండు= మనుజుడు; ఇమ్ముగన్= ఒప్పిదంగా; పడయున్?= పొందుతాడు?; ఏమిటన్= దేనిచేత; సహాయయుతుఁడు+అగున్?= సాయం కలవాడు ఔతాడు?; ఏమిటన్= దేనిచేత; బుద్ధిమంతుఁడు= బుద్ధికలిగినవాఁడు; అగున్= ఔతాడు?; ఏర్పడన్= తేటతెల్లంగా; చెపుము+ఆ= తప్పక చెప్పుము.

**తాత్పర్యం:** 'దేనివలన శ్రోత్రియుడు ఔతాడు? దేనివలన పురుషుడు గొప్పమహిమను ఒప్పిదంగా పడయగలుగుతాడు? దేనివలన సాయం పొందినవాడు ఔతాడు? దేనివలన బుద్ధిమంతుడు ఔతాడు? తేటతెల్లంగా సమాధానాలు చెప్పుము.'

**వ. అనిన నతం డి ట్లనియె. 427**

**తాత్పర్యం:** అని అడుగగా ధర్మరాజు ఇట్లా సమాధానం చెప్పాడు.

**క. 'శ్రుతమువలన శ్రోత్రియుఁ డగు; । నతులతపోయుక్తిఁ గడుమహత్త్వము వడయున్;**
**ధృతిచే సహాయయుతుఁ డగు; । నతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్.' 428**

**ప్రతిపదార్థం:** శ్రుతమువలనన్= వేదం అభ్యసించటంవలన; శ్రోత్రియుఁడు= సనాతనసంప్రదాయజ్ఞుడు; అగున్= ఔతాడు; అతుల, తపస్+యుక్తిన్= మిక్కుటమైన తపస్సుచేయటంవలన; కడు= గొప్ప; మహత్త్వము= ప్రభావం; పడయున్= సంపాదిస్తాడు; ధృతిచేన్= ధైర్యంచేత; సహాయయుతుఁడు= సాయంపొందినవాడు; అగున్= ఔతాడు; బుధసేవన్= జ్ఞానులపరిచర్యవలన; అతిశయముగన్= మిక్కుటంగా; బుద్ధిమంతుఁడు+అగున్= బుద్ధికలిగినవాడు ఔతాడు.

**తాత్పర్యం:** 'వేదాభ్యాసంవలన శ్రోత్రియుడు కాగలుగుతాడు. నిరుపమానమైన తపస్సువలన గొప్పప్రభావం సిద్ధిస్తుంది. ధైర్యంవలన సాయం పొందుతాడు. పెద్దలపరిచర్యవలన బుద్ధిమంతుడు ఔతాడు.'

**వ. అని చెప్పిన నప్పార్థివోత్తమునకు నప్పురుషుండు వెండియు ని ట్లనియె. 429**

**తాత్పర్యం:** అని బదులు చెప్పిన ధర్మరాజుకు యక్షుడు మరల ఈ విధంగా అన్నాడు.

**తే. 'ఏమి కతమున భూదేవుఁ డెసఁగు దేవ । భావమున? నాతనికి సాధుభావ మెవ్వి**
**ధమున నగు? నసాధుత్వ మెద్దానఁ జెందు? మానుషుం డగు నాతఁ డేదానఁ? జెపుమ.' 430**

**ప్రతిపదార్థం:** ఏమి కతమునన్= ఏకారణంచేత; భూదేవుఁడు= బ్రాహ్మణుడు; దేవభావమునన్= దివ్యభావంతో; ఎసఁగున్= అతిశయిస్తాడు?; ఆతనికిన్= బ్రాహ్మణుడికి; సాధుభావము= నిర్మలస్థితి; ఏ+విధమునన్+అగున్?= ఏవిధంగా సంభవిస్తుంది?; అసాధుత్వము= మాలిన్యం; ఏ+దానన్= దేనివలన; చెందున్= కలుగుతుంది? ఆతఁడు= బ్రాహ్మణుడు; ఏదానన్= దేనివలన; మానుషుండు= మానవుడు, మర్త్యుడు; అగున్?= ఔతాడు?; చెపుము+అ= దయచేసి వచింపుము.

**తాత్పర్యం:** 'దేనివలన బ్రాహ్మణుడు దివ్యత్వాన్ని సాధిస్తాడు? బ్రాహ్మణుడికి నిర్మలత్వం ఎట్లేర్పడుతుంది? మాలిన్యం ఎట్లా దాపురిస్తుంది? దేనివలన బ్రాహ్మణుడు మర్త్యుడు ఔతాడు?'

**చ. అనవుడు ధర్మజుం డనియె 'నధ్యయనంబున దేవభావముం**
**గను నవనీసుపర్వుఁ; డధికవ్రతశీలత సాధుభావ మా**
**తనికి; విశిష్టవృత్తి దిగఁద్రావి యసాధు వనంగ నుండు; శౌ**
**చనియతి లేక మృత్యుభయసంగతి నాతఁడు మానుషుం డగున్.' 431**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (యక్షుడు) ప్రశ్నించగా; ధర్మజుండు= ధర్మనందనుడు; అనియెన్= ఇట్లా అన్నాడు; అవనీసుపర్వుఁడు= బ్రాహ్మణుడు; అధ్యయనంబునన్= చదువువలన, వేదపఠనంవలన; దేవభావమున్+కనున్= దివ్యత్వం అందుకొంటాడు; అధికవ్రతశీలతన్= మిక్కుటమైన నిష్ఠవలన; సాధుభావము= నిర్మలత్వం; ఆతనికిన్= బ్రాహ్మణుడికి (ప్రాప్తిస్తుంది); విశిష్టవృత్తిన్= సద్వర్తనాన్ని; దిగన్+త్రావి= పోవిడిచి; అసాధువు+అనంగన్+ఉండున్= కలుషితుడు అనేటట్లుగా ఉంటాడు; ఆతఁడు= విప్రుడు; శౌచనియతి లేక= శుచిత్వనియమాలను పాటించక; మృత్యుభయసంగతిన్= మరణభీతితో కూడి మానుషుండు+అగున్= మర్త్యుడు ఔతాడు.

**తాత్పర్యం:** యక్షుడిప్రశ్నలకు ధర్మరాజు ఇట్లా సమాధానాలు చెప్పాడు. 'విప్రుడు వేదపఠనంవలన దివ్యత్వం ఆర్జిస్తాడు. మిక్కుటమైన నిష్ఠవలన సాధుభావం ఆర్జిస్తాడు. ఎన్నదగిన సౌశీల్యాన్ని విడనాడి అసాధువు ఔతాడు. శుచిత్వాన్ని వీడి మృత్యుభయం చెంది మర్త్యుడు ఔతాడు'.

**విశేషం:** (1) బ్రాహ్మణుడికి సాధుభావ మెప్విధంగా ఔతుంది? దేనివలన కలుగుతుంది? అనే ప్రశ్నలకు ఈ పద్యంలో సమాధానం చెప్పబడింది. ఎవడు బ్రాహ్మణుడు? అనే చర్చ ప్రాచీనసాహిత్యంలో పలుతావుల కన్పిస్తుంది. మహాభారతంలోనూ ఈ చర్చ పలుతావుల ప్రాముఖ్యం వహించించి. ధమ్మపదంలో ఎవడు బ్రాహ్మణుడు? అనే ప్రశ్నకు విపుల సమాధానం ఉన్నది. అందలి సారాంశం - కులంచేత కాని గోత్రంచేతకాని బ్రాహ్మణుడు కాజాల డనిన్నీ సౌశీల్యంవలన మాత్రమే బ్రాహ్మణత్వం సిద్ధిస్తుందనీ అందులో చెప్పబడింది. మహాభారతంలోని యక్షప్రశ్నలఘట్టంలోకూడా బ్రాహ్మణుడికి సాధుభావం సిద్ధించటం అనగా బ్రాహ్మణుడికి బ్రాహ్మణత్వం సిద్ధించటం అధికవ్రతశీలతవలన శీలానుష్ఠానంవలననే అని చెప్పబడింది. అట్లే, బ్రాహ్మణుడు - 'విశిష్టవృత్తి' దిగద్రావిన అసాధువు అయి బ్రాహ్మణత్వాన్ని కోలుపోతాడని ధర్మరాజు ప్రవచనం. (2) శుచిత్వం= శౌచనియతి అనగా కేవలం శారీరకమైన శుచిత్వం మాత్రమే కాదు. అందులో మానసికపారిశుద్ధ్యం ఇమిడి ఉన్నది. శుచిత్వం అనగా మనోవాక్కాయకర్మలలో పారిశుద్ధ్యం గలిగి ఉండటం.

**క. నావుడు నతఁ డాతనితో। 'జీవన్మృతుఁ డెట్టివాఁడు? సెప్పు' మనుటయున్**
**'దేవాతిథిపితృభృత్యజ। నావళులకు నిడక కుడుచునతఁ' డని చెప్పెన్. 432**

**ప్రతిపదార్థం:** నావుడున్= అని (ధర్మరాజు) చెప్పగా; అతడు= యక్షుడు ఆతనితోన్= ధర్మరాజుతో; జీవత్+మృతుఁడు= జీవిస్తూకూడా మరణించినవాడితో సమానుడు; ఎట్టివాఁడు?= ఎటువంటివాడు?; చెప్పుము= వచించుము; అనుటయున్= అని అడుగగా; దేవ+అతిథి, పితృ, భృత్యజన+ఆవళులకున్= దేవతలకు, అతిథులకు, పితరులకు, సేవకులు మున్నగువారికి అందరికి; ఇడక= పెట్టక; కుడుచు+అతఁడు= భోజనం చేసేవాడు; అని చెప్పెన్= అని సమాధానం చెప్పాడు.

**తాత్పర్యం:** 'జీవన్మృతుడు ఎవడు?' అని యక్షుడు ప్రశ్నించాడు. 'దేవతలకు పితృదేవతలకు అతిథులకు సేవకులు మున్నగువారికి పెట్టకుండా తాను భోజనం చేసేవాడు బ్రదికిఉండగనే మరణించినవాడితో సమానుడు' అని ధర్మరాజు సమాధానం ఇచ్చాడు.

**చ. విని మగుడంగ వాఁడు పృథివీపతిఁజూచి 'ధరిత్రికంటె వ్రేఁ**
**గనఁ జనుదాని, నాకసముకంటెఁ గడుం బొడవైనదాని, గా**
**డ్పునకును నెక్కుడై జవము పొంపిరివోయెడు దానిఁ, బూరికం**
**టెను దఱచైన దానిని, ఘటింపఁగఁ జెప్పుము నాకు' నావుడున్. 433**

**ప్రతిపదార్థం:** విని= ఆలకించి; మగుడంగన్= మరల; వాఁడు= యక్షుఁడు; పృథివీపతిన్+చూచి= భూపతిని కాంచి, ధర్మరాజును చూచి; ధరిత్రికంటెన్= భూమికంటె; వ్రేఁగు+అనన్+చనుదానిన్= బరువైనది అని చెప్పదగిన దానిని; ఆకసముకంటెన్= ఆకాశంకంటెను; కడున్= మిక్కిలి; పొడవు+ఐనదానిన్= నిడివి కలదానిని; గాడ్పునకును= గాలికిని; ఎక్కుడు+ఐ= అధికం అయి; జవము= వేగం; పొంపిరి, పోయెడుదానిన్= అతిశయించే దానిని; పూరికంటెను= గడ్డికంటె; తఱచు+ఐనదానిని= విరివి అయిన దానిని; ఘటింపఁగన్= సరిగా కుదిరేటట్లు; నాకున్= నాకు; చెప్పుము= వచించుము; నావుడున్= అని (యక్షుడు) చెప్పగా.

**తాత్పర్యం:** యక్షుడు మరల ధర్మరాజును ప్రశ్నించాడు. 'భూమికంటె బరువు అయినది ఏది? ఆకసంకంటెకూడ నిడివి కలది ఏది? గాలికంటె వేగంగా పోగలిగింది ఏది? గడ్డికంటె విరివిగా పెరిగేది ఏది? చెప్పుము'.

**వ. అమ్మనుజోత్తముం డయ్యక్షోత్తమున కి ట్లనియె. 434**

**తాత్పర్యం:** మానవులలో మేటివాడైన ఆ ధర్మరాజు ఉత్తముడైన ఆ యక్షుడితో ఇట్లా పలికాడు.

**ఆ. 'తల్లి వ్రేగు సువ్వె ధరణికంటెను; నాక । సంబుకంటెఁ బొడవు జనకుఁ డరయ;**
**గాడ్పుకంటె మనసు కడుశీఘ్రగతి; తృణో । త్కరముకంటెఁ జింత గరము తఱచు'. 435**

**ప్రతిపదార్థం:** తల్లి= జనని; ధరణికంటెను= భూమికంటె; వ్రేఁగు+చువ్వె= బరువు సుమా; జనకుఁడు= తండ్రి; ఆకసంబుకంటెన్= ఆకాశం కంటెను; అరయన్= పరిశీలించిచూడగా; పొడవు= నిడివి; గాడ్పుకంటెన్= గాలికంటె; మనసు= చిత్తం; కడున్= మిక్కిలి; శీఘ్రగతి= వేగగమనం కలది; చింత= వగపు; తృణ+ఉత్కరముకంటెన్= గడ్డిసముదాయంకంటె; తఱచు= విరివి అయింది.

**తాత్పర్యం:** 'భూమికంటె బరువైనది కన్నతల్లి. ఆకసంకంటె పొడవు తండ్రి. గాలికంటె వేగగమనంకలది మనస్సు. తృణసమూహంకంటె విరివి ఐనది చింత'.

**వ. అనిన నంబరచరుండు మఱియు నిట్లనియె. 436**

**తాత్పర్యం:** అనగా విని ఖేచరుడైన యక్షుడు మళ్ళీ ఇట్లా అడిగాడు.

**తే. 'మొనసి నిద్రించియును గన్ను మూయ దెద్ది? । పుట్టియును జేతనత్వంబుఁ బొరయ దెద్ది?**
**యరయ రూపు గల్గియు హృదయంబు లేని । దెద్ది? వేగంబుకతమున నెద్ది వొదలు?' 437**

**ప్రతిపదార్థం:** మొనసి= పూని; నిద్రించియును= నిదురించికూడా; ఎద్ది= ఏది; కన్ను= నేత్రం; మూయదు= ముకుళించదు; పుట్టియును= జన్మించికూడా; చేతనత్వంబున్= చైతన్యాన్ని; పొరయదు= వహించదు; ఎద్ది= ఏది; అరయన్= పరిశీలించగా; రూపు+కల్గియున్= ఆకృతి ఉండికూడ; హృదయంబు= డెందం; లేనిది= లేనట్టిది; ఎద్ది= ఏది?; వేగంబుకతమునన్= రయంచేత; ఎద్ది= ఏది; పొదలున్= అతిశయిస్తుంది.

**తాత్పర్యం:** 'నిదురించికూడా కన్నుమూయనిది ఏది? జన్మించికూడా చైతన్యం లేనిది ఏది? రూపంఉండికూడా డెందం లేనిది ఏది? వేగంచేత అతిశయించేది ఏది?'

**తే. అనినఁ 'గన్ను మూయదు సుప్తమయ్యు మీను; । పుట్టియును గ్రుడ్డు చేతనఁ బొరయకుండు;**
**హృదయరహితంబు రారూప; మేఱు రయము । కతన వర్ధిల్లు' నని చెప్పెఁ గౌరవుండు. 438**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (యక్షుడు) అడుగగా; మీను= చేప; సుప్తము+అయ్యున్= నిదురచెందికూడా; కన్ను= నేత్రాన్ని; మూయదు; పుట్టియును= జన్మించికూడా; గ్రుడ్డు= అండం; చేతనన్+పొరయక+ఉండున్= చైతన్యం కలుగకుండా ఉంటుంది; రారూపము= రాతిరూపం; హృదయరహితంబు= గుండె లేనిది; ఏఱు= నది; రయముకతనన్= వేగంచేత; వర్ధిల్లున్= అతిశయిస్తుంది; అని= అంచు; కౌరవుండు= ధర్మరాజు; చెప్పెన్= వచించాడు.

**తాత్పర్యం:** 'యక్షుడికి ధర్మరాజు ఇట్లా చెప్పాడు: 'చేప నిదురించికూడా నేత్రాలు మూయదు. గ్రుడ్డు జన్మించికూడా ప్రాణం లేనిదే. రాయి రూపం కలిగికూడా గుండె లేనిది. ఏఱు వేగంవలన వర్ధిల్లుతుంది అని ధర్మరాజు చెప్పాడు'.

**వ. చెప్పిన, నయ్యక్షుం డతనితోఁ 'దెరువు నడచువానికి, రోగార్తునకు, గృహస్థునకు, మృతిఁ బొందినవానికి నెవ్వరు సుట్టంబు?' లనిన నప్పుడమిఱేఁ 'డన్నలువురకుం గ్రమంబున సార్థంబును, వైద్యుండును, సద్భార్యయుఁ, గృతంబైనధర్మంబును బరమమిత్త్రు' లని నిర్దేశించుటయు; నయ్యక్షుండు పాండవేయున కిట్లనియె.439**

**ప్రతిపదార్థం:** చెప్పినన్= ధర్మరాజు (చెప్పగా); ఆ+యక్షుండు; అతనితోన్= ధర్మరాజుతో; తెరువు నడచువానికిన్= బాటసారికిన్నీ; రోగ+ఆర్తునకున్= జబ్బుచేసినవాడికి; గృహస్థునకున్= గృహమేధికి; మృతిన్+పొందినవానికిన్= మరణించినవాడికి; ఎవ్వరు= ఎవరు; చుట్టంబులు= బంధువులు; అనినన్= అని (యక్షుడు) అడుగగా; ఆ+పుడమిఱేఁడు= ఆరాజు, ధర్మనందనుడు; ఆ+నలువురకున్= ఆ నల్గురకును; క్రమంబునన్= వరుసగా; సార్థంబును= వర్తకజనసమూహమూ, వైద్యుండును= వెజ్జును; సద్భార్యయున్= మంచిఇల్లాలును; కృతంబు+ఐన= చేసిన; ధర్మంబును= ధర్మమున్నూ; పరమమిత్త్రులు= గొప్పస్నేహితులు; అని= అని; నిర్దేశించుటయున్= సమాధానం చెప్పటమున్నూ; ఆ+యక్షుండు; పాండవేయునకున్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** యక్షుడు వేసిన ప్రశ్నలు: 'బాటసారికి, రోగికి, గృహస్థుడికి, మరణించినవాడికి చుట్టాలు ఎవ్వరు?' ధర్మరాజు చెప్పిన సమాధానం. (క్రమంగా) 'సార్థం, వైద్యుడు, మంచిభార్య, చేసినధర్మం.' అంత యక్షుడు ధర్మనందనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** (1) అలం: క్రమాలంకారం (2) సార్థము. పూర్వకాలంలో ఒకప్రదేశంనుండి మరియొక ప్రదేశానికి వివిధ పదార్థాలతో వర్తకులగుంపులు పోతూఉండేవి. అందులో ఒంటెలు మున్నగు జంతువాహనాలు, ఆయుధపాణులు అయిన భటులు, మార్గదర్శకులు అనుభవజ్ఞులు అయిన వృద్ధులు, పలువురు ఉండేవారు. సార్థములు అప్పుడప్పుడుమాత్రమే పయనించేవి. అదృష్టవశాన బాటసారికి సార్థం తెరువున కలియవచ్చును. (3) ధర్మాన్నిగూర్చిన చర్చ మహాభారతంలో పలుతావుల కాననగును. ధర్మం అనగా ఇచట నప్పెడి అర్థం - బ్రతికిఉండగా చేసినకర్మ. సుకృతం. అట్టిసుకృతం ధర్మనిర్వహణంలోనే ఏర్పడుతుంది. ధర్మానికి సుప్రసిద్ధమైన నిర్వచనం. "ధృతిః క్షమా దమోఽస్తేయం । శౌచ మింద్రియనిగ్రహః; ధీ ర్విద్యా సత్య మక్రోధో । దశకం ధర్మలక్షణమ్" - మనుస్మృతి 6-92.

**క. 'ఎయ్యది ధర్మువునకుఁ గుదు । రెయ్యది యాశ్రయము గీర్తి కిమ్మగు మార్గం**
**బెయ్యది సురలోకమునకు । నెయ్యది సుఖమునకు నిక్క యేర్పడఁ జెపుమా!' 440**

**ప్రతిపదార్థం:** ధర్మువునకున్= ధర్మానికి; కుదురు= పాదు; ఏ+అది= ఏది; కీర్తికిన్= యశస్సుకు; ఆశ్రయము= ఆధారం; ఏ+అది= ఏది; సురలోకమునకున్= స్వర్గానికి; ఇమ్ము+అగు= సరియైన; మార్గంబు; ఏ+అది= ఏది; సుఖమునకున్+ఇక్క= సౌఖ్యానికి (తృప్తి నిచ్చే అనుభూతికి) నెలవు; ఏ+అది?= ఏది?; ఏర్పడన్= సుస్పష్టంగా; చెపుము+ఆ= వచింపుము.

**తాత్పర్యం:** 'ధర్మానికి కుదురు ఏది? కీర్తికి ఆధారం ఏది? స్వర్గానికి సరియైన మార్గం ఏది? సుఖానికి నెలవు ఏది? తేటతెల్లంగా వివరింపుము.'

**వ. అని యడుగుటయు. 441**

**తాత్పర్యం:** అని అడగగానే.

**క. 'అమరఁగ దాక్షిణ్యము ధ । ర్మమునకుఁ గుదు రండ్రు; కీర్తిమహిమ నెలవు దా**
**నము; సత్యము సురపురిమా । ర్గము; శీలము సంశ్రయంబు సుఖముల కెల్లన్'. 442**

**ప్రతిపదార్థం:** అమరఁగన్= ఒప్పిదంగా; దాక్షిణ్యము= కారుణ్యం; ధర్మమునకున్; కుదురు= పాదు; అండ్రు= అంటారు; దానము= ఈవి; కీర్తిమహిమ= కీర్తియొక్క గొప్పతనానికి; నెలవు= చోటు; సత్యము= నిజం; సురపురిమార్గము= స్వర్గపట్టణానికి బాట; సుఖములకున్+ఎల్లన్= అన్నిసౌఖ్యాలకు; సంశ్రయంబు= ఆటపట్టు; శీలము= సత్ప్రవర్తనం.

**తాత్పర్యం:** 'దాక్షిణ్యం ధర్మానికి కుదురు; దానం కీర్తికి ఆధారం; సత్యం స్వర్గానికి మార్గం; శీలం సమస్తసుఖాలకు నెలవు'.

**వ. అని యుధిష్ఠిరుం డెఱింగించిన వెండియు. 443**

**తాత్పర్యం:** అని ధర్మరాజు తెలుపగా మరల.

**చ. 'నరునకు నాత్మ యెవ్వఁడు? ఘనంబుగ దైవిక మైన చుట్ట మె**
**వ్వ? రతనికిం దదీయ మగు వర్తన మేమిట నిర్వహించు? భూ**
**వర! యతఁ డేమి పూని యనవద్యతఁ బొందు? నెఱుంగఁ జెప్పు మీ**
**వరుదుగ' నన్న నక్కురుకులాగ్రణి యాతనితోడ ని ట్లనున్. 444**

**ప్రతిపదార్థం:** ఓభూపతీ! ధర్మరాజా!; నరునకున్= మనుజుడికి; ఆత్మ= ఆత్మ(జీవుడు); ఎవ్వఁడు?= ఎవడు?; అతనికిన్= మనుజుడికి; ఘనంబుగన్= గొప్పగా; దైవికము+ఐన, చుట్టము= అదృష్టవశాన ఏర్పడే బంధువు; ఎవ్వరు?= ఎవరు?; తదీయము+అగు= అతడికి సంబంధించిన; వర్తనము= బ్రదుకు; ఏమిటన్= దేనివలన; నిర్వహించున్= జరుపును?; భూవర!= ఓరాజా!; అతఁడు= మనుజుడు; ఏమి, పూని= దేనిని వహించి; అనవద్యతన్+పొందున్= మంచితనాన్ని పొందుతాడు; ఈవు= నీవు; అరుదుగన్= అసాధారణ ఫణితిలో; ఎఱుంగన్+చెప్పుము= తేటతెల్లంగా వచింపుము; అన్నన్= అని (యక్షుడు) పలుకగా; ఆ+కురు, కుల+అగ్రణి= కౌరవంశంలోని గొప్పవాడు ధర్మరాజు; ఆతనితోడన్= యక్షుడితోడ; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** 'నరుడికి ఆత్మ ఎవ్వరు? అతడికి దైవికంగా ఏర్పడే చుట్టం ఎవ్వరు? అతడు బ్రదుకు నెట్లా నిర్వహిస్తాడు? అతడు ఏవిధంగా మంచితనాన్ని పొందుతాడు? పైప్రశ్నలకు అరుదైన రీతిలో సముచిత సమాధానాలు తేటతెల్లంగా చెప్పుము' అనగా యక్షుడికి ధర్మరాజు ఇట్లా చెప్పాడు.

**తే. 'ఆత్మజుఁడు సువ్వె పురుషున కాత్మ యయ్యెఁ । నాతనికి భార్య దైవిక మైన చుట్ట;**
**మతని జీవిక పర్జన్యుకతనఁ జెల్లు; । నతఁడు దానముఁ గొనియాడి యతిశయిల్లు'. 445**

**ప్రతిపదార్థం:** పురుషునకున్= నరుడికి; ఆత్మ= ఆత్మ; ఆత్మజుఁడు+చువ్వె= కొడుకుసుమా; అయ్యెన్= అయ్యాడు; ఆతనికిన్= నరుడికి; భార్య= పెండ్లం; దైవికము+ఐన= దైవం చేకూర్చిన; చుట్టము= బంధువు; అతనిజీవిక= నరుడి బ్రదుకుతెరువు; పర్జన్యునికతనన్= మేఘుడిమూలాన; చెల్లున్= జరుగును; అతఁడు= నరుడు; దానమున్= ఈవిని; కొనియాడి= చేసి; అతిశయిల్లున్= గొప్పతనం ఆర్జిస్తాడు.

**తాత్పర్యం:** నరుడికి ఆత్మ - పుత్త్రుడు. అతడికి దైవికమైన చుట్టం - భార్య. అతడికి బ్రదుకు ప్రసాదించేది - మేఘుడు. అతడికి గొప్పతనం చేకూర్చేది - దానం.

**విశేషం:** ఇవి యక్షప్రశ్నలు. ప్రశ్నలు వేయటంలో ఒక ఒడుపు ఉన్నది. సమాధానాలు అరుదైనవి కావలెననే నియమం ఉన్నది. అందుచేత ఇచట వాడబడిన పదాలకు రూఢ్యర్థం వాచ్యార్థం చాలదు. అట్లని సుదూరమైన అర్థం చెప్పరాదు. పలుసారులు సమాధానాలు తేటతెల్లముగా ఉండవలెనని యక్షుడు అనుశాసనం వెలయించిఉన్నాడుగదా! (1) ఆత్మ అనగా సారం అని అంతరార్థం. ఆత్మకు అమరత్వ మున్నది. అందుచేత నరుడికి ఆత్మ - ఆత్మజుడు. (2)భార్యాభర్తల అనుబంధం విచిత్రమైనది. అడవిలోని ఉసిరి - అంబుధిలోని ఉప్పు ఒకచోట చేరి ఊరుగాయ అయినట్లు దాంపత్య మేర్పడుతుంది. అది దైవికంగా ఏర్పడే బంధుత్వం. (3) మానవుడి బ్రదుకుతెరువు స్థూలదృష్టికి బహుమార్గదృష్టమే అయినను కోటివిద్యలు తుదకు కూటికొరకే. కూడు లభింపజేసేవాడు మేఘుడు. (4) మానవుడు అతిశయిల్లేది త్యాగంతో, త్యాగంతో కూడిన దానంవలననే.

**చ.** **అనవుడు 'మేటిధర్మ మగునట్టిది యెయ్యది? యేది యెప్పుడున్**
**గనియఁగఁ బండియుండు? నెసకంబున నెయ్యది నిగ్రహించినం**
**దనరుఁ బ్రమోదసిద్ధి? నియతంబుగ నెవ్వరితోడి సంధి యెం**
**దును వికలంబు గాదు? పరితోష మెలర్ప నుపన్యసింపుమా!'** **446**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (ధర్మరాజు) చెప్పగా; మేటి= గొప్ప; ధర్మము+అగు+అట్టిది= ధర్మం అని చెప్పతగింది; ఏ+అది= ఏది?; ఏది= ఏది; ఎప్పుడున్= ఎల్లప్పుడు; కనియఁగన్= పరిపక్వంగా; పండియుండున్= ఫలిస్తుంది; ఎసకంబునన్= పూనికతో; ఏ+అది= దేనిని; నిగ్రహించినన్= అదుపులో ఉంచితే; ప్రమోదసిద్ధి= సంతోషం కలగటం; తనరున్= విలసిల్లుతుంది; నియతంబుగన్= నియమానుసారంగా; ఎవ్వరితోడి= ఎవరితోడి; సంధి= పొత్తు; ఎందును= ఎచ్చటను; వికలంబు+కాదు= వ్యర్థం కాదు; పరితోషము+ఎలర్పన్= ప్రీతి అతిశయించగా; ఉపన్యసింపుము+ఆ= వక్కాణించుము.

**తాత్పర్యం:** అని ధర్మరాజు యక్షుడికి చెప్పాడు. మరల యక్షుడు ధర్మరాజును ఈరీతిగా ప్రశ్నించాడు: 'ధర్మాలన్నిటిలోను గొప్పదైన ధర్మం ఏది? ఏది సతతం పరిపూర్ణంగా ఫలితాన్ని చేకూరుస్తుంది? ఏది వదలిపెట్టితే సంతోషం చేకూరుతుంది? ఎవరితోడి పొత్తు ఎప్పుడూ చెడదు? ఈవిషయాలను ఆనందం చేకూరేటట్లు వక్కాణించుము' అని యక్షుడు ధర్మజుడిని కోరాడు.

**వ.** **అని దివ్యుండు పలికిన నా దివ్యబోధనుం డిట్లనియె.** **447**

**ప్రతిపదార్థం:** అని= అని; దివ్యుండు= యక్షుడు; పలికినన్= అడుగగా; ఆ దివ్యబోధనుండు= దివ్యమైన జ్ఞానం కలవాడు, ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** యక్షుడితో ధర్మరాజు ఈ రీతిగా పలికాడు.

**ఆ.** **'విను మహింస మేటి యనఁజను ధర్మంబు; । యాగకర్మ మెపుడు నమరఁ బండి**
**యుండు; మనసుక్రొవ్వు ఖండింపఁగా మోద । మెసఁగు; సుజనసంధి యెడల దెందు'.** **448**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; అహింస= (భూతదయ) సకలప్రాణికోటికి ఎట్టిహాని చేయకపోవటం; మేటి= గొప్పది; అనన్+చను= అనదగిన; ధర్మంబు= ధర్మం; అమరన్= ఒప్పిదంగా; యాగకర్మము= యజ్ఞం చేయటం; ఎపుడున్= సంతతం;

పండి+ఉండున్= పంటను చేకూరుస్తుంది; మనసు క్రొవ్వు= చిత్తంలోని క్రొవ్వు - గర్వం, అహంభావం; ఖండింపఁగాన్= నిర్మూలించగా; మోదము= సంతోషం; ఎసఁగున్= పెంపొందుతుంది; సుజనసంధి= సజ్జనులతోడిపొత్తు; ఎందున్= ఎచటను; ఎడలదు= భగ్నం కాదు.

**తాత్పర్యం:** 'ఆలకించుము. అహింస అన్నిధర్మాలలోను మేటిధర్మం. యజ్ఞం ఎల్లప్పుడు పంటనిచ్చేకార్యం. అహంభావం పోతే సంతోషం కలుగుతుంది. సజ్జనసహవాసం ఎప్పుడూ భగ్నం కాదు.

**తే. అనిన నతఁడు 'లోకమున కెయ్యదియ దిక్కు? । జలము నన్నంబు నెద్దాన సంభవించు?**
**విష మనంగ నెయ్యది? శ్రాద్ధవిధికి నెద్ది । సమయ?' మనిన నిట్లని చెప్పె జనవిభుండు. 449**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (ధర్మరాజు) చెప్పగా; అతఁడు= యక్షుడు; లోకమునకున్= జగత్తుకు; దిక్కు= సాయమయ్యే ఆధారం; ఏ+అదియ= ఏది; జలము= నీరు; అన్నంబు= ఆహారం; ఎద్దానన్= (ఏ+దానన్) దేనిమూలాన; సంభవించున్= ఏర్పడుతాయి; విషము+అనంగన్+ఎయ్యది;= విసం అంటే ఏది?; శ్రాద్ధవిధికిన్= పితృతర్పణకర్మకు; సమయము+ఎద్ది= ఉచితకాలం ఏది; అనినన్= అని (యక్షుడు) అడుగగా; జనవిభుండు= రాజు, ధర్మరాజు; ఇట్లు+అని= ఈ విధంగా; చెప్పెన్= వచించాడు.

**తాత్పర్యం:** అని ధర్మనందనుడు చెప్పగా యక్షుడు తిరిగి ఈవిధంగా ప్రశ్నించాడు. 'లోకంలోని ప్రజలను ఆదుకొని సాయంచేసేవారు ఎవరు? దేనివలన నీరు, అన్నం లభిస్తాయి? విషం అనగా ఏమిటి? పితృతర్పణాలకు అనుకూలమైన కాలం ఏది?'

**తే. 'సజ్జనులు దిక్కు సూవె యీ సర్వమునకు; । నభము ధరణియు జలము నన్నమ్ము నుద్భ**
**వించు నెలవులు; విష మగు విప్రధనము; । లనఘ! శ్రాద్ధకాలము బ్రాహ్మణాగమంబు'. 450**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా, ఓయక్షుడా!; ఈ సర్వమునకున్= ఈ సమస్తానికి; సత్+జనులు= సజ్జనులు= మంచివారు; దిక్కు+చూవె= దిక్కు సుమా!; జలమున్+అన్నమ్మున్= నీటిని, అన్నాన్నీ; నభము= ఆకాశం; ధరణియున్= భూమియును; ఉద్భవించు= పుట్టించే; నెలవులు= స్థానాలు; విప్రధనములు= బ్రాహ్మణులసొత్తులు; విషము+అగున్= విసం కాగలదు; బ్రాహ్మణ+ఆగమంబు= విప్రుల రాక; శ్రాద్ధకాలము= పితృతర్పణానికి ఉచితసమయం.

**తాత్పర్యం:** 'ఈ సృష్టి సమస్తానికి దిక్కు అయినవారు సజ్జనులు. ఆకాశం నీటికి, భూమి అన్నానికి పుట్టే నెలవులు. విప్రధనం విషం ఔతుంది. బ్రాహ్మణులరాక పితృతర్పణాలకు అనువైనకాలం'.

**వ. అని తెలిపిన, నయ్యక్షుండు ధర్మనందనుతో 'మనుజుం డెయ్యది పరిత్యజించి సర్వజనప్రియుండును, నిశ్శోకుండును, నర్థవంతుండును, సుఖియును నగు?' ననిన నమ్మహీపతి యి ట్లనియె. 451**

**ప్రతిపదార్థం:** అని తెలిపినన్= అని (ధర్మరాజు)వివరించి చెప్పగా; ఆ+యక్షుండు; ధర్మనందనుతోన్= ధర్మరాజుతో; ఎయ్యది= ఏది; పరిత్యజించి= వదలిపెట్టి; మనుజుండు= నరుడు; సర్వజనప్రియుండును= అందరికి ఇష్టమైనవాడును; నిశ్శోకుండును= దుఃఖం లేనివాడును; అర్థవంతుండును= సంపన్నుడును; సుఖియునున్= సౌఖ్యం కలవాడును; అగున్= కాగలడు; అనినన్= అని అడుగగా; ఆ+మహీపతి= ధర్మరాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ యక్షుడు ధర్మనందనుడిని ఈ రీతిగా ప్రశ్నించాడు.'దేనిని వదలిపెట్టితే మానవుడు సర్వజనాలకు ఇష్టుడు ఔతాడు? నిశ్శోకుడు ఔతాడు? సంపన్నుడు ఔతాడు? సౌఖ్యం కలవాడు ఔతాడు?'

**తే. 'సర్వజనసమ్మతుం డగు గర్వ ముడిగి; క్రోధ మడఁచి శోకమునకుఁ గుదురు కాఁడు;**
**వినవె యర్థాఢ్యుఁ డగు లోభ మొనర విడిచి; । తృష్ణ వర్జించి సౌఖ్యంబుతెరువుఁ గాంచు'. 452**

**ప్రతిపదార్థం:** వినవె= ఆలకింపుము; గర్వము+ఉడిగి= స్వాతిశయాన్ని విడనాడి; సర్వ, జన, సమ్మతుండు= అందరు ప్రజలకు ఇష్టుడు; అగున్= కాగలడు; క్రోధము+అడఁచి= ఆగ్రహాన్ని అణచిపెట్టి; శోకమునకున్= దుఃఖానికి; కుదురు+కాఁడు= పాలుగాడు; లోభము+ఒనరన్, విడిచి= పిసినారితనం ఒప్పిదంగా విడనాడితే; అర్థ+ఆఢ్యుఁడు= ధనం కలవాడు; అగున్= కాగలడు; తృష్ణ= ఆశ; వర్జించి= విడనాడి; సౌఖ్యంబుతెరువున్= సుఖాన్ని పొందేమార్గాన్ని; కాంచున్= చేరుతాడు.

**తాత్పర్యం:** 'గర్వం విడనాడితే అందరికి ఇష్టుడు కాగలడు. కోపం విడనాడితే శోకం పాలు కాడు. లోభం వదలిపెట్టితే సంపన్నుడు ఔతాడు. తృష్ణ వర్జిస్తే సుఖవంతుడు ఔతాడు.'

**వ. అనిన యనంతరంబ యద్దివ్యుం డతనితోఁ 'బురుషశబ్ద వాచ్యుం డెట్టివాఁడు? మఱి సర్వధని యగు వాఁ డెవ్వండు? నిశ్చయింపు' మనినఁ బాండవజ్యేష్ఠుం డిట్లనియె. 453**

**ప్రతిపదార్థం:** అనిన+అనంతరంబు+అ= అని (ధర్మరాజు) చెప్పిన పిదప; ఆ+దివ్యుండు= ఆ దివ్యుడు; ఆ యక్షుడు; అతనితోన్= ధర్మరాజుతో; 'పురుష' శబ్దవాచ్యుండు= 'పురుషుడు' అని చెప్పదగినవాడు; ఎట్టివాఁడు?= ఏలక్షణాలు కలవాడు?; మఱి= ఇంకా; సర్వధని= సర్వ సంపదలు కలవాడు; అగువాఁడు= అయినవాడు; ఎవ్వండు?= ఎవ్వడు?; నిశ్చయింపుము= నిర్ణయించి చెప్పుము; అనినన్= అని (యక్షుడు) పలుకగా; పాండవజ్యేష్ఠుండు= పాండవాగ్రజుడు, ధర్మరాజు, ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అంతట దివ్యుడైన యక్షుడు మరల ప్రశ్నించాడు. 'పురుషుడు అని అనదగినవాడు ఎవ్వడు? సర్వధని- సకలసంపదలు కలవాడు ఎవడు?' ధర్మరాజు ఈ రీతిగా బదులు పలికాడు.

**క. 'దివి ముట్టి ధరణియంతట । నివిడి మెఱయుచుండు నెవ్వనియశోరమ య**
**ట్టి విశిష్టచరిత్రుఁడు, య । క్షవరా! పురుషుండు నాఁ బ్రకాశత నొందున్. 454**

**ప్రతిపదార్థం:** యక్షవరా!= యక్షులలో శ్రేష్ఠుడ వైనవాడా!; ధరణి= భూమి; అంతటన్= అంతటను; నివిడి= వ్యాపించి; దివి, ముట్టి= ఆకసాన్ని స్పృశించి; ఎవ్వని యశస్+రమ= ఎవ్వనియశోరమ= ఎవడికీర్తివైభవం; మెఱయుచున్+ఉండున్= దేదీప్యమానంగా మిరుమిట్లు కొలుపుతూ ఉంటుందో; అట్టి= అటువంటి; విశిష్టచరిత్రుఁడు= పేర్కొనదగిన ప్రవర్తన కలవాడు; పురుషుండు= పురుషుడు; నాన్= అనగా; ప్రకాశతన్+ఒందున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** 'భూమ్యాకాశాలను ఆవరించి ఎవ్వడి కీర్తివైభవం మిరుమిట్లు కొలుపుతూ విస్తరిస్తుందో అట్టి మహానుభావుడే పురుషశబ్దంతో పిలువదగినవాడు.

**ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్లగు సౌఖ్యదుః । ఖములు భూతభావికార్యములును**
**నెవ్వనికి సమంబు లివి సర్వధనియనఁ । బరఁగుఁ జువ్వె యట్టి భవ్యుఁ డనఘ!' 455**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా! ఓయక్షుడా!; ప్రియమున్= ఇష్టమైనదిన్నీ; అప్రియంబున్= ఇష్టం కానిదిన్నీ; పెల్లు+అగు= మిక్కుటమైన; సౌఖ్యదుఃఖములు= శుభాలూ ఆవేదనలూ; భూత, భావికార్యములును= జరిగినవి జరుగబోయే పనులును; ఎవ్వనికిన్= ఎవరికి; ఇవి= ఇవి; సమంబులు= తుల్యాలో; అట్టి, భవ్యుఁడు= అటువంటి మహానుభావుడు; సర్వధని అనన్+పరఁగున్+చువ్వె= సర్వధని అని అనబడతాడు సుమా!

**తాత్పర్యం:** 'ప్రియం, అప్రియం, సుఖం, దుఃఖం, జరిగినకార్యాలు, జరుగబోయేకార్యాలు ఎవనికి సమానములో అట్టి మహానుభావుడు సర్వధని అని చెప్పవచ్చును.'

**వ.** **అని వివరించిన విని యుధిష్ఠిరుదెసఁబ్రసాదమధురం బైన యాలోకనంబు నిగుడ నయ్యక్షవరుండు 'మహాత్మా! మదీయంబు లైన ప్రశ్నంబు లన్నింటికి సదుత్తరంబు లిచ్చితి; నీవలనం బ్రీతుండ నైతి; నీతమ్ములయం దొక్కరుని ప్రాణంబు లిచ్చెద నడుగు' మనిన నతండు.** **456**

**ప్రతిపదార్థం:** అని వివరించినన్= అని (ధర్మరాజు) వివరించిచెప్పగా; విని= (యక్షుడు) ఆలకించి; యుధిష్ఠిరుదెసన్= ధర్మరాజువైపు; ప్రసాదమధురంబు+ఐన= అనుగ్రహంతో మిళితమయి తియ్యనైన; ఆలోకనంబు= చూపు; నిగుడన్= వ్యాపించగా; ఆ+యక్షవరుండు= యక్షులలో శ్రేష్ఠుడు అయినవాడు; మహాత్మా!= ఓధర్మరాజా!; మదీయంబులు+ఐనప్రశ్నంబులు+అన్నింటికిన్= నాయొక్క ప్రశ్నలకు అన్నింటికిని; సత్+ఉత్తరంబులు= మంచిసమాధానాలు; ఇచ్చితి(వి)= ఇచ్చావు; నీవలనన్= నీవలన; ప్రీతుండన్+ఐతిన్= సంతృప్తిచెందినవాడను అయినాను; నీతమ్ములయందున్= నీఅనుజులలో; ఒక్కరుని= ఒకనియొక్క; ప్రాణంబులు= అసువులు; ఇచ్చెదన్= ఇస్తాను; అడుగుము= కోరుకొమ్ము; అనినన్ (అని యక్షుడు) చెప్పగా; అతండు= ధర్మరాజు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు వివరించి చెప్పాడు. అంతట ఆ యక్షుడు ధర్మరాజుపై అనుగ్రహపూరితాలైన తియ్యని చూడ్కులు సారించి ఇట్లన్నాడు: 'మహాత్మా! ధర్మరాజా! నేను నిన్ను అడిగిన ప్రశ్నలకు గడుసుదనంతో మాత్రమే గాక మంచి సమాధానాలను చక్కగా చెప్పావు. నేను సంతృప్తి చెందాను. నీతమ్ములలో ఒకడి ప్రాణాలను ఇస్తాను కోరుకొమ్ము' అనగా ధర్మరాజు (ఇట్లా బదులు పలికాడు).

**సీ.** **'శ్యామాంగు నారక్తజలరుహనేత్రు సా । లప్రాంశు నున్నతలలితబాహు**
**నకులుని బ్రదికింపు' నావుడు యక్షుండు । 'భీమఫల్గును లతిభీమబలులు**
**ప్రియులు నీ కెంతయుఁ బృథివీశ! వీరిలో । నొకనిఁ గోరక యిట్లు నకులుఁ గోరి?'**
**తనుడు ధర్మాత్మజుం డనియెను 'మాతండ్రి । యగు పాండువిభునకు మగువ లిరువు:**

**ఆ.** **రందు గొంతికొడుకు లైన ముప్పురిలోన । నేను బ్రదికినాఁడ; నింక మాద్రి**
**తనయు లిరువురందుఁ దగ నొక్కరుం డిప్డు । బ్రదుకవలదె? చెపుమ పాడితెఱఁగు.** **457**

**ప్రతిపదార్థం:** శ్యామ+అంగున్= నల్లనైన దేహం కలవాడిని; ఆరక్తజలరుహనేత్రున్= మిక్కుటమైన ఎఱుపురంగు గల పద్మాలవంటి కన్నులు కలవాడిని, చెంగల్వసోయగంకల కన్నులు కలవాడిని; సాలప్రాంశున్= మద్దిచెట్టువలె పొడవైనవాడిని; ఉన్నత, లలిత, బాహున్= ఎత్తైనవి, సుకుమారమైనవి అయిన చేతులు కలవాడిని, ఆజానుబాహుడిని; నకులునిన్= నకులుడిని; బ్రదికింపు= పునరుజ్జీవితుని గావింపుము; నావుడున్= అని(ధర్మరాజు) చెప్పగా; యక్షుండు= యక్షుడు; పృథివీ+ఈశ!= భూపతీ, ఓ ధర్మరాజా!; భీమఫల్గునులు= భీముడును అర్జునుడును; అతిభీమబలులు= మిక్కిలి భయంకరమైన బలం

కలవారు; నీకున్= నీకు; ఎంతయున్= మిక్కిలి; ప్రియులు= ప్రీతిపాత్రులు; వీరిలోన్= భీమార్జునులలో; ఒకనిన్= ఒకరిని; కోరక= అర్థించక (బ్రదికించుమనికోరక); ఇట్లు= ఈ విధంగా; నకులున్= నకులుడిని; కోరితి(వి)= కోరావు; అనుడున్= అని యక్షుడు అనగా; ధర్మ+ఆత్మజుండు+అనియెన్= ధర్మనందనుడు చెప్పాడు; మాతండ్రి= మాజనకుడు; పాండువిభునకున్= పాండురాజుకు; మగువలు= వనితలు, భార్యలు; ఇరువురు= ఇద్దరు; అందున్= వారిలో; గొంతికొడుకులు= కుంతీదేవికుమారులు; ఐన= అయినట్టి; ముప్పురిలోనన్= ముప్వురిలో; ఏను= నేను; బ్రదికినాఁడన్= జీవించాను; ఇంకన్= ఇక మరి; మాద్రి తనయులు= మాద్రికొడుకులు; ఇరువురందున్= ఇద్దరిలో; తగన్= ఒప్పిదంగా; ఒక్కరుండు= ఒకఁడు; ఇప్డు= ఇపుడు; బ్రదుకన్వలదు+ఎ= జీవించవలదా; పాడితెఱఁగు= ధర్మంయొక్కతీరు; చెపుము+అ= దయచేసి నీవే వచింపుము.

**తాత్పర్యం:** 'శ్యామలశరీరుడు, చెంగలువసోయగం చిందే కన్నులు కలవాడు ఆజానుబాహువు' మద్దిచెట్టును పోలిన నిడివి కలవాడు ఉన్నతములు లలితములు అయిన బాహువులు కలవాడు, అయిన నకులుడిని బ్రదికించుము' అని ధర్మరాజు యక్షుడిని అర్థించాడు. అంతట యక్షుడు 'మహారాజా! ధర్మజా! నీకోరిక నాకు అర్థం కాలేదు. భీముడు అర్జునుడు సుప్రసిద్ధులైన లోకోత్తరవీరులు. నీకు ప్రీతిపాత్రులు. వీరిలో ఒకరిని బ్రదికించుమని కోరక, ఈ నకులుడిని బ్రదికించుమని కోరావు ఎందుకు?' అని ఆశ్చర్యం ప్రకటించాడు. ధర్మజుడు ఇట్లా బదులు పలికాడు. 'మాతండ్రి పాండుప్రభువుకు ఇద్దరు భార్యలు. కుంతి, మాద్రి. కుంతీసుతులలో పెద్దవాడను నేను బ్రదికిఉన్నానుకదా! ఇక, మాద్రీతనయులలో ఒక్కడు బ్రదుకువలెనుకదా! నీవు ధర్మంతీరు నెఱిగి దయతో వచించుము.

**విశేషం:** యక్షుడిపరీక్ష - ప్రశ్నలు వేయటంతో ముగియలేదు. ఆపరీక్షలో ధర్మరాజు జ్ఞానిగా, మేధావిగా, వేదాంతిగా ఉత్తీర్ణుడైనాడు. ఇప్పుడు - యక్షుడు అడిగిన చివరిప్రశ్నకు చెప్పిన సమాధానంతో ధర్మరాజు జ్ఞానాన్ని ఆచరణంలోకి అనువదించే అనుష్ఠానవేదాంతిగా వెలుగొందుతున్నాడు.

**ఆ. ధర్మనందనుండు ధర్మాత్ముఁ డని యెప్డుఁ । దగిలి జగము నన్నుఁ బొగడుచుండు;**
**నట్టి యేను ధర్మహానికి నోర్వఁజు । మ్మెంత వచ్చెనేని; యింత నిజము'. 458**

**ప్రతిపదార్థం:** ధర్మనందనుండు= ధర్మరాజు; ధర్మ+ఆత్ముఁడు= ధర్మంతో కూడిన ఆత్మ కలవాడు; అని= అనుచు; ఎప్డున్= ఎల్లప్పుడున్నూ; తగిలి= ప్రియమార; జగము= లోకం (ప్రజలు); నన్నున్= నన్ను; పొగడుచుండున్= ప్రశంసిస్తూ ఉంటుంది; అట్టి= అటువంటి, లోకంచేత ధర్మాత్ముడని కీర్తించబడునట్టి; ఏను= నేను; ఎంతవచ్చెన్+ఏని= ఎట్టి ఆపద దాపురించినా; ధర్మహానికిన్= ధర్మనాశనానికి; ఓర్వన్+చుమ్ము= ఓర్వజాలను సుమీ; ఇంత= ఇది అంతా; నిజము= సత్యం.

**తాత్పర్యం:** ధర్మనందనుడు ధర్మాత్ముడు అని లోకం నన్ను ప్రీతితో ప్రశంసిస్తూ ఉంటుంది. అట్టి ప్రశంసలకు పాత్రుడనైన నేను ఎట్టి ఆపద దాపురించినా! సరే. ధర్మహానికి ఒడిగట్టజాలను, ఇది నిజం'.

**వ. అనిన నతండు 'నీదైన ధర్మజ్ఞతకు మెచ్చితి; నీతమ్ములందఱు లబ్ధజీవితు లయ్యెద' రనిన నాక్షణంబ విగతక్షుత్పిపాసులై యన్నలువురు నిద్రవోయి మేల్కనిన తెఱంగున సముత్థితు లైనం జూచి, విస్మితుండై ధర్మపుత్త్రుం డి ట్లనియె. 459**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (ధర్మరాజు) వచించగా; అతండు= అతడు (యక్షుడు); నీదు+ఐన= నీయొక్క; ధర్మజ్ఞతకున్= ధర్మపరిజ్ఞానానికి; మెచ్చితిన్= నీయందు గౌరవం పెంచుకొన్నాను; నీతమ్ములు+అందఱున్= నీఅనుజులు అందరును; లబ్ధ,

జీవితులు+అయ్యెదరు= పొందబడిన జీవితాలు కలవారు ఔతారు. తిరిగి బ్రదుకుతారు; అనినన్= అని చెప్పగా; ఆక్షణంబు+అ= ఆత్రుటిలోనే; విగత, క్షుత్+పిపాసులు+ఐ= తీరిన ఆకలి దప్పికలు కలవారలై; ఆ+నలువురున్= ఆ నలుగురున్నూ (భీమార్జున నకులసహదేవులు); నిద్రపోయి= నిద్రించి; మేల్కనిన, తెఱంగునన్= మేలుకొన్నట్లు; సమ్+ఉత్థితులు+ఐనన్= చక్కగా లేచినవారుకాగా; చూచి= అరసి; విస్మితుండు+ఐ= మిక్కిలి ఆశ్చర్యం పొందినవాడై; ధర్మపుత్త్రుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ మాటలు విని యక్షుడు 'ధర్మజా! నీ ధర్మజ్ఞానానికి మెచ్చాను. నీ తమ్ములందరూ బ్రతుకుతారు గాక!' అని అన్నాడు. వెంటనే భీమార్జున నకుల సహదేవులు నలుగురూ ఆకలిదప్పులు లేనివారై నిద్రనుండి మేల్కొన్నట్లు లేచారు. వారిని చూచి ధర్మరాజు ఆశ్చర్యపడి ఇట్లా అన్నాడు.

**చ.** **'నిను నొక యక్షమాత్రుఁ డని నెమ్మది నమ్మఁగ నేర నయ్యెదన్.**
**జననుత! నీవు నిక్కముగ శక్రుఁడవో, యలకాధిపుండవో,**
**యనలుఁడవో, సమీరుఁడవొ, యట్లనుగాక జగన్నుతుండు మ**
**జ్జనకుఁడు నైన ధర్ముఁడవొ? సత్కృపఁ జెప్పుము నాకు' నావుడున్.** **460**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; ఒక= ఒకానొక; యక్షమాత్రుఁడు+అని= యక్షుడు మాత్రమే అని; నెఱ+మదిన్= నెమ్మదిన్= నిండుమనస్సున; నమ్మగనేరను+అయ్యెదన్= విశ్వసింపజాలక ఉన్నాను; జననుత!= ప్రజలచేత ప్రశంసించబడేవాడా!; నీవు= నీవు, నిక్కముగన్= నిజంగా; శక్రుఁడవు+ఓ= ఇంద్రుడవో; అలకా+అధిపుండవు+ఓ= అలకాపురి రాజధానిగా కలవాడివో, కుబేరుడవో; అనలుఁడవు+ఓ= అగ్నిదేవుడవో; సమీరుఁడవు+ఒ= వాయుదేవుడవో; అట్లనుగాక= ఆరీతిగా కాక; జగత్+నుతుండున్= లోకంచేత పొగడబడేవాడున్నూ; మత్+జనకుఁడున్= (మజ్జనకుఁడు=) నా తండ్రిన్నీ; ఐన= ఐనట్టి; ధర్ముఁడవు+ఒ= యమధర్మరాజువో; సత్+కృపన్= చక్కనిదయతో; నాకున్= నాకు; చెప్పుము= వచింపుము; నావుడున్= అని (ధర్మరాజు) అనగా.

**తాత్పర్యం:** ప్రజలచేత ప్రశంసించబడేవాడా! నిన్ను, ఎవరో సామాన్యుడైన యక్షుడుగా పరిగణించజాలను. నీవు ఎవరో మహానుభావుడవనే నమ్మకం నాకు ఏర్పడింది. నిజంగా నీవు దేవేంద్రుడవో, అలకాధిపుడు అయిన కుబేరుడవో, అగ్నిదేవుడవో, వాయుదేవుడవో అయి ఉండాలి. ఒకవేళ అట్లాకాకపోతే జగత్తులచేత ప్రశంసించబడే నాజనకుడు ధర్మదేవతవే అయి యుండాలి. దయచేసి నీవు ఎవరవో నాకు నిజం చెప్పుమని వేడుతున్నాను, అని ధర్మరాజు పలుకగా.

**వ.** **అమ్మహాత్ముండు మందస్మితాననుండై.** **461**

**తాత్పర్యం:** మహానుభావుడైన ఆ యక్షుడు చిరునవ్వుతోకూడిన మొగం కలవాడై.

**మత్తకోకిలము**

**'ఏను ధర్ముఁడఁ జువ్వె రాజకులేంద్ర! సత్యము శౌచమున్**
**దానముం దపమున్ శమంబును దాంతియున్ యశముం బరి**
**జ్ఞానయుక్తియు నాదుమూర్తులు; సమ్మదంబున నిష్టు మ**
**త్సూను నుత్తమధార్మికున్ నినుఁ జూచు వేడుక వచ్చితిన్.** **462**

**ప్రతిపదార్థం:** రాజ+కుల+ఇంద్ర!= రాజుల సమూహాలలో శ్రేష్ఠుడా!; ఏను= నేను; ధర్ముఁడన్+చువ్వె= నేను యమధర్మరాజును సుమా; సత్యము= నిజం; శౌచమున్= నిర్మలత్వం; దానమున్= ఈగియున్నూ; తపమున్= తపస్సు; శమంబును= కామక్రోధాదులు లేని శాంతం; దాంతియున్= ఇంద్రియనిగ్రహమున్నూ; యశమున్= కీర్తియు; పరిజ్ఞాన, యుక్తియున్= వివేకంతో కూడిఉండటం; నాదు, మూర్తులు= నా ఆకారాలు; సమ్మదంబునన్= సంతోషంతో; ఇప్డు= ఇపుడు; ఈ సమయంలో; మత్+సూనున్= నా సుతుడిని; ఉత్తమధార్మికున్= గొప్పధర్మం కలవాడిని; నినున్= నిన్ను; చూచువేడుకన్= చూచే కోరికతో; వచ్చితిన్= వచ్చాను.

**తాత్పర్యం:** 'రాజులసమూహాలలో శ్రేష్ఠుడ వైన ఓధర్మరాజా! నేను యమధర్మరాజును సుమా! నాకుమారుడవు, పరమధర్మమూర్తివి అయిన నిన్ను చూచే వేడుకతో ఇప్పుడు వచ్చాను. సత్యం, శౌచం, దానం, తపస్సు, శమం, దమం, కీర్తి, వివేకం నా మూర్తులు.

**విశేషం:** ఈ పద్యంలో ధర్మస్వరూపం సంగ్రహంగానూ సమగ్రంగానూ నిర్వచించబడింది. మహాభారతం అంతా ఈ పద్యానికి విపులవ్యాఖ్యానమే. 'సత్యం వద' - 'సత్యమేవ జయతే' ఇవి శ్రుతివాక్యాలు. సత్యమే సౌందర్యం. సత్యమే పరబ్రహ్మస్వరూపం. ఏప్రలోభంవలన కాని ఏస్వార్థయోచనవలన కాని సత్యవ్రతానికి భంగం కలుగరాదు. శౌచం అన్నమాటకు శారీరకపరిశుభ్రత మాత్రమే అర్థం కాదు. శౌచం బాహ్యశౌచం మాత్రమేకాక ఆభ్యంతర శౌచం, మనోవాక్కాయ కర్మలలో పారిశుద్ధ్యాన్ని పాటించటంగా ఎన్నబడుతుంది. అట్లే - దానం, తపస్సు, శమం, దమం, కీర్తి, వివేకం అనేపదాలను విశాలమైన అర్థంలో స్వీకరించాలి. మహాభారతంలోని ఉపాఖ్యానాలు ఈ అంశాలను హృదయంగమంగా ఉల్లేఖించేవే. వృత్త లక్షణానికి చూడు. ఆరణ్య: 4.267 విశేషాంశం.

**వ. న న్నాశ్రయించిన జనంబులు దుర్గతిం బొరయరు గావున నభిమతంబు లైన వరంబు లిచ్చెద' నడుగు మనినఁ బాండవాగ్రజుండు సంభ్రమభక్తిపరుం డగుచు దండప్రణామంబు సేసి, యద్దేవోత్తముం బ్రస్తుతించి, 'దేవా! మదీయాశ్రమవాసుండైన భూసురవరు నరణి యొక్కహరిణంబుచేత నపహృతంబయ్యెఁ; నతనికిం గర్మలోపంబు గాకుండ నయ్యరణిం గరుణింపవే' యనినఁ బ్రీతచిత్తుం డగుచు ధర్మదేవుండు. 463**

**ప్రతిపదార్థం:** నన్నున్= నన్ను (ధర్మువును); ఆశ్రయించిన= ఆధారం చేసికొనిన; జనంబులు= మనుజులు; దుర్గతిన్= చెడుస్థితిని; పొరయరు= పొందరు; కావునన్= కాబట్టి; అభిమతంబులు+ఐన= ఇష్టాలైన; వరంబులు= వరాలు; ఇచ్చెదన్= ఇస్తాను; అడుగుము= కోరుము; అనినన్= అని (యముడు) చెప్పగా; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; సంభ్రమ, భక్తిపరుండు+ అగుచున్= తత్తరపాటుతో కూడిన పూజ్యభావం కలవాడు ఔతూ; దండప్రణామంబు+చేసి= భుజాలు భూమికి సోకేటట్లుగా నమస్కరించి; ఆ+దేవ+ఉత్తమున్= ఆ దేవతలలో శ్రేష్ఠుడైనవాడిని, యముడిని; ప్రస్తుతించి= కీర్తించి; దేవా!= దేవరా!; మదీయ+ఆశ్రమ, వాసుండు+ఐన= నా ఆశ్రమంలో నివసించేవాడు అయిన; భూసుర, వరు+అరణి= బ్రాహ్మణోత్తముడి అగ్గికొయ్య; ఒక్క, హరిణంబు+చేతన్; ఒకలేడిచేత; అపహృతంబు+అయ్యెన్= అపహరించబడింది; అతనికిన్= వానికి (ఆ బ్రాహ్మణుడికి); కర్మలోపంబు= అనుష్ఠానంలోని లోటు; కాక+ఉండన్= ఏర్పడకుండగా; ఆ+అరణిన్= ఆ అరణిని; కరుణింపవే= దయచేసి ప్రసాదించుము; అనినన్= అని (ధర్మరాజు) పలుకగా; ప్రీతచిత్తుండు+అగుచున్= సంతృప్తి చెందిన మనస్సు కలవాడు ఔతూ; ధర్మదేవుండు= యమధర్మరాజు.

**తాత్పర్యం:** నన్ను ఆధారంగా చేసికొనిన మనుజులు దుర్గతిని పొందరు. నీవు నన్ను ఆశ్రయించితివి. కావున నీవు కోరే వరాలను ఇస్తాను. కోరుకొనుము' అని యముడు వచించాడు. ధర్మరాజు తత్తరపాటుతో కూడిన పూజ్యభావంతో

తనభుజాలు భూమికి సోకేటట్లుగా ధర్మదేవుడికి నమస్కరించి, అతడిని కీర్తించి, 'దేవా! నా ఆశ్రమంలో నివసిస్తున్న బ్రాహ్మణోత్తముడి అరణిని ఒకలేడి హరించింది. ఆతడి నిత్యానుష్ఠానానికి భంగం కలుగకుండ దయచేసి ఆ అరణిని ప్రసాదించుము' అని ప్రార్థించాడు. ఆ ధర్మదేవుడు సంతృప్తిచెందినవాడయి.

**క. 'విను మేను నీమనోగతి । యనఘా! యెఱుఁగంగ వేఁడి యరణీహరణం**
**బొనరించితి; మృగ మెక్కడి?' । దని యమ్మహనీయవస్తు వతనికి నిచ్చెన్. 464**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా, ఓ ధర్మరాజా!; వినుము= ఆలకించుము; ఏను= నేను; నీమనోగతి= (నీమనస్+గతి) నీచిత్తప్రవృత్తి; ఎఱుఁగంగన్‌వేఁడి= తెలిసికొనగోరి; అరణీహరణంబు= అరణిని హరించటం; ఒనరించితిన్= చేశాను; మృగము= లేడి; ఎక్కడిది?= ఎచటిది?; అని= అని వచించి; ఆ+మహనీయవస్తువు= ఆ గొప్ప పదార్థాన్ని; అతనికిన్= వానికి (ధర్మరాజుకు); ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** 'పాపరహితుడ వైన ఓ ధర్మరాజా! నేను నీమానసికప్రవృత్తిని తెలిసికొనగోరి, ఆ అరణిని అపహరించాను. అంతే. లేడి ఎక్కడిది? నేనే అట్లా లేడిరూపం ధరించాను. ఇదిగో! అరణిని తీసికొమ్ము'అని వచించి యముడు ఆ మహనీయవస్తువైన అరణిని ధర్మరాజుకు తిరిగిఇచ్చాడు.

**వ. ఇచ్చి మఱియు నిట్లనియె; 'పదుమూఁడవయేఁడు సనుదెంచె; నింక మీ రజ్ఞాతవాసంబు సలుపవలయు; నందు మీ రెవ్వ రెక్కడ నేరూపంబునం జరియింపం గోరిన నయ్యైరూపంబు లలవడియెడు; నె ట్లున్నను మి మ్మెవ్వరు నెఱుంగకుండు నట్లుగా వరం బిచ్చితి; నింకనొం డెయ్యదివలసిన నడుగు' మనిన నమ్మనుజేశ్వరుం డి ట్లనియె. 465**

**ప్రతిపదార్థం:** ఇచ్చి= (అరణిని) ఒసగి; మఱియున్= వెండియును; ఇట్లు+అనియెన్= ఈ విధంగాచెప్పాడు; పదు మూఁడు+అవ+ఏఁడు= పదమూడవ వత్సరం; చనుదెంచెన్= వచ్చింది; ఇంకన్= ఇక; మీరు= పాండవులు అయిన మీరు; అజ్ఞాతవాసంబు= ఒరులకు తెలియబడకుండ నివసించటం; సలుపన్‌వలయున్= చేయాలి; అందున్= ఆ అజ్ఞాతవాసంలో; మీరు+ఎవ్వరు= మీ పాండవులలో ఎవరు ఎవరు; ఎక్కడన్= ఏస్థలంలో; ఏరూపంబునన్= ఏఆకారంలో; చరియింపన్+కోరినన్= ప్రవర్తింప తలిస్తే; అయ్యై= ఆయా; రూపంబులు= ఆకారాలు; అలవడియెడున్= ఏర్పడుతాయి గాక; ఎట్లు+ఉన్నను= ఏవిధంగా ఉన్నప్పటికీ; మిమ్మున్= (మీ పాండవులను); ఎవ్వరున్= ఎవరును; ఎఱుంగక+ఉండు+అట్లుగాన్= తెలియలేనివిధంగా; వరంబు; ఇచ్చితిన్= ప్రసాదించాను; ఇంకన్= మఱియును; ఒండు+ఎయ్యది= ఇంక ఒకటి ఏదైన; వలసినన్= అవసరమైన కోరిక; అడుగుము= అర్థించుము; అనినన్= అని (యముడు) వచించగా; ఆ+మనుజ+ఈశ్వరుండు= ఆ మానవులకు ప్రభువు ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** యముడు అరణిని ధర్మరాజుకు ఇచ్చి మరియు ఇట్లా వచించాడు. 'మీకు పండ్రెండేండ్ల అరణ్యావాసం ముగిసింది. పదుమూడవ సంవత్సరం అరుగుదెంచింది. ఇక మీరు మారువేషాలలో శత్రువులకు తెలియకుండా అజ్ఞాతవాసం పూర్తిచేయవలసి ఉన్నది. ఆ అజ్ఞాతవాసంలో మీరు ఏయేరూపాలు ధరించవలె నని కోరితే ఆయారూపాలు మీఅందరికీ అలవడగలవు. మిమ్ము ఇతరులు ఎవ్వరూ గుర్తించకుండేటట్లు మీకు వరం ప్రసాదించాను. మఱియు ఇంకొక వరం అడుగుము'. ఆ మాటలువిని ధర్మరాజు యముడితో ఇట్లా పలికాడు.

**మత్తకోకిలము**

> **'ఆదిదేవుఁడ వైన నీవు దయామతిం బొడసూపి న**
> **న్నాదరించుటఁ జేసి ధన్యుఁడ నైతి; నింతకు నెక్కు డొం**
> **డేది కల్గునె? యైన నామది యెల్లనాఁడును గ్రోధ మో**
> **హాదులం బెడఁ బాసి ధర్మువునంద నెక్కొనఁ జేయవే!' 466**

**ప్రతిపదార్థం:** ఆది, దేవుఁడవు+అయిన= మొదటి వేల్పువు అయిన; నీవు= నీవు; దయామతిన్= కరుణతోకూడిన బుద్ధితో; పొడ+చూపి= ప్రత్యక్షమై; నన్నున్; ఆదరించుటన్+చేసి= సంప్రీతితో మన్నించటంచేత; ధన్యుడన్+ఐతిన్= చరితార్థుడ నయినాను; ఇంతకున్= నీవు ప్రత్యక్షమైకరుణతో నన్నాదరించటంకంటె; ఎక్కుడు= అధికమైనది; ఒండు= వేరు; ఏది= ఏదైనా; కల్గును+ఎ= సంభవిస్తుందా?; ఐనన్= అయినను; నా మది= నామనస్సు; ఎల్ల, నాఁడును= ఎల్ల వేళలలోనూ; క్రోధ, మోహ+ఆదులన్= కోపం, అజ్ఞానం (భ్రమ) మొదలైనవాటిని; పెడన్+పాసి= పెడమొగం పెట్టి దూరమై; ధర్మువునందున్+అ= ధర్మంలో మాత్రమే; నెక్కొనన్+చేయవే= లగ్నం అయ్యేటట్లుగా చేయుము.

**తాత్పర్యం:** 'దేవతలలో ప్రథముడ వయిన నీవు కరుణించి నాకు ప్రత్యక్షమై నన్ను మన్నించటంచేత నా జన్మ ధన్యమైనది. ఇంతకంటె వేరే భాగ్యయోగం నేను కోరుకొనదగింది ఏమున్నది? ఐనను నాచిత్తం ఎల్లవేళల ధర్మము నందే లగ్నమై ఉండేటట్లు దయచేసి వరం ప్రసాదించుము. నామనస్సు ఇక కోపతాపాలకు మద మాత్సర్యాదులకు అజ్ఞానానికి లోనుగాకుండ చేయుము'.

**విశేషం:** వృత్త లక్షణానికి చూడు. ఆరణ్య: 4.267 విశేషాంశం.

**వ. అనిన నద్దేవుం డతనికి నవ్వరం బొసంగి యంతర్హితుం డయ్యెఁ; గౌంతేయులు గ్రమ్మఱి నిజాశ్రమంబున కరిగి, ధరణీదేవునకు నరణీప్రదానంబు సేసి, తత్ప్రయుక్తాశీర్వాదంబులు గైకొని, పరమానందంబునం బొంది రని యిట్లు పాండుతనయుల వనవాసప్రకారంబు సవిస్తరమధురంబుగా నుపన్యసించి. 467**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (ధర్మరాజు) చెప్పగా; ఆ+దేవుండు= ఆ దేవుడు, యముడు; అతనికిన్= ధర్మరాజుకు; ఆ, వరంబు+ఒసంగి= ఆ వరాన్ని ఇచ్చి; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యుడు అయ్యాడు; కౌంతేయులు= కుంతీనందనులు, పాండవులు; క్రమ్మఱి= తిరిగి; నిజ+ఆశ్రమంబునకున్= తమ ఆశ్రమానికి; అరిగి= వెళ్ళి; ధరణీదేవునకున్= బ్రాహ్మణుడికి; అరణీప్రదానంబు+చేసి= అరణిని ఇచ్చి; తద్+ప్రయుక్త+ఆశీః+వాదంబులు= ఆ బ్రాహ్మణుడిచేత ఇవ్వబడిన దీవెనలు; కైకొని= గ్రహించి; పరమ+ఆనందంబునన్+పొందిరి= గొప్పసంతోషాన్ని అనుభవించారు; అని= అని; ఇట్లు= ఈ రీతిగా; పాండుతనయుల వనవాసప్రకారంబు= పాండవులు అరణ్యంలో నివసించిన విధం; సవిస్తర, మధురంబుగాన్= వివరాలతో కూడినట్లుగానూ, తియ్యగానూ; ఉపన్యసించి= వచించి.

**తాత్పర్యం:** అని ధర్మరాజు వచించాడు. యమధర్మరాజు యుధిష్ఠిరుడికి ఆ వరం అనుగ్రహించి అదృశ్యుడయ్యాడు. అంత పాండవులు తమ ఆశ్రమానికి తిరిగివెళ్ళి అరణిని ఆ బ్రాహ్మణుడికి సమర్పించారు. ఆ బ్రాహ్మణుడు పాండవులను ఆశీర్వదించాడు. పాండవులు గొప్ప ఆనందాన్ని పొందారు. అని పాండవుల వనవాసకథను, సాంగోపాంగంగా వివరాలన్నిటితో తియ్యతియ్యని మాటలతో చెప్పి.

